# శ్రీ హర్షనైషధము

(ప్రథమ భాగము-టీకాతాత్పర్య సహితము)



వ్యాఖ్యాత

శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రి, ఎం. ఏ.

ప్రిన్సిపాలు, వైదిక సంస్కృత కళాశాల, నెల్లూరు




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవనము, సైఫాబాదు, హైదరాబాదు-4

# తొలి పలుకు......

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి చేపట్టిన గ్రంథప్రచురణ కార్యక్రమములో సంస్కృత గ్రంథాలుకూడ ఒక భాగము. ఆంధ్ర విద్వాంసులు, కవులు సంస్కృతీకరించిన తెలుగు గ్రంథాలు కొన్ని యిప్పటివరకు అకాడమి పక్షాన ప్రకటితమైనవి. ఇందులో శ్రీ యస్. టి. జి. వరదాచార్యులవారు సంస్కృతీకరించిన ఏడు శతకాల సంపుటము. శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు పరివర్తించిన "కళాపూర్ణోదయము", శ్రీ కుంటిమద్ది శేషశర్మగారు అనువదించిన "మనుచరిత్ర" చేరియున్నవి.

అకాడమి పక్షాన సంస్కృతములో కొన్ని స్వతంత్ర రచనలు **కూడ** ప్రకటించనైనవి. వీనిలో డా. బి. రామరాజుగారి సంపాదకత్వమున శ్రీ కృష్ణరాయలు వ్రాసిన జాంబవతీ పరిణయము, అభినవ కాళిదాసు, వెల్లాల ఉమామహేశ్వరుడు రచించిన శృంగారశేఖర భాణము, సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి ఆంధ్రదేశ హాస్యకథలు యిప్పటివరకు అచ్చయిన పుస్తకాలు. త్వరలోనే యీ వరుసలో మధురవాణి విరచిత రామాయణసార తిలకము డా. బి. రామరాజుగారి సంపాదకత్వమున వెలువడనున్నది. కాకతి రుద్రదేవుడు వ్రాసిన ఉషారాగోదయ నాటిక భవిష్యత్తులో అకాడమి పక్షాన ప్రకటితము కానున్నది.

అకాడమి పక్షాన తెలుగు - సంస్కృత నిఘంటువు డా. రామచంద్రుడు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగార్ల సంపాదకత్వమున ప్రకటితమైనది. ఈ వరుసలోనే శ్రీహర్షుని నైషధమును టీకాతాత్పర్య సహితముగా ప్రకటించవలెనని అకాడమి సంస్కృత సలహాసంఘము నిశ్చయించి యీ కార్యము శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రిగారికి అప్ప

గించినది. ఈ సంపుటమున నైషధములోని మొదటి మూడు సర్గలు మాత్రమే చేరియున్నవి. త్వరలోనే రెండవ భాగముకూడ ప్రకటితము కాగలదు.

ఈ పనిని చక్కగా నిర్వహించిన శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రి గారికి అకాడమి పక్షాన కృతజ్ఞతా వందనములు.

ఈ గ్రంథ ముద్రణమును పర్యవేక్షించిన ఉస్మానియా విశ్వ విద్యాలయ సంస్కృత శాఖాధ్యక్షులు డా. బి. ఆర్. శాస్త్రిగారికి అనేక ధన్యవాదాలు.

ఆంధ్ర పాఠకలోకానికి యీ గ్రంథము ఆదరపాత్రము కాగల దని విశ్వసించుచున్నాను.

హైదరాబాదు
1-7-71

దేవులపల్లి రామానుజరావు,
కార్యదర్శి

# శ్రీహర్ష నైషధము

## (ప్రథమ సర్గ)

శ్లో॥ నిపీయ యస్య క్షితిరక్షిణః కథా
స్తథాద్రియన్తే న బుధాస్సుధామపి।
నలస్సితచ్ఛత్రితకీర్తిమణ్డల
స్స రాశిరాసీన్మహసాం మహోజ్జ్వలః॥ ౧

ప॥ వి॥ నిపీయ । యస్య । క్షితిరక్షిణః । కథాః ।
తథా । ఆద్రియన్తే । న । బుధాః । సుధామ్ । అపి ।
నలః । సితచ్ఛత్రితకీర్తిమణ్డలః ।
సః । రాశిః । ఆసీత్ । మహసామ్ । మహోజ్జ్వలః ।

టీక॥ యస్య = ఏ. క్షితిరక్షిణః = భూపాలకుడగు నలుని యొక్క. కథామ్ = కథను నిపీయ = చక్కగా ఆస్వాదించి. బుధాః = పండితులు, దేవతలు. సుధామపి = అమృతమును సైతము. తథా = ఆ నలకధను ఆస్వాదించునట్లు, నాద్రియన్తే = ఆదరించుటలేదు. సితచ్ఛత్రిత = శ్వేతచ్ఛత్రముగ చేయఁబడిన కీర్తి మండలః = యశోమండలముగల. మహసామ్ = తేజస్సులకు. రాశిః = రాశియైన సూర్యునివలె నొప్పుచు. మహోజ్జ్వలః = మహః = ఉత్సవములచే. ఉజ్జ్వలః = ప్రకాశించువాడగు. సః = ఆ. నలః = నలుఁడు. ఆసీత్ = ఉండెను.

ఇచ్చట నలుని యందు తేజోరాశిత్వమును కీర్తిమండలమునందు శ్వేతచ్ఛత్రత్వమును ఆరోపించుటవలన రూపకాలంకారమును, నలకధకు అమృతము కంటెను ఆధిక్యము చెప్పుటవలన వ్యతిరేకాలంకారము నేర్పడుచున్నవి. ఈ రెంటికిని సంసృష్టి. ఈసర్గయందు వంశస్థవృత్తము. జగణ తగణములు, జగణ రగణములు ప్రతిపాదమున క్రమముగనున్నచో వంశస్థవృత్తమగును.

భావము :

నలమహారాజుయొక్క కథను చక్కగా నాస్వాదించిన బుధులు అమృతమునుగూడ నాదరించరు ఆ నలుడు శ్వేతచ్ఛత్రముగఁ జేయఁబడిన కీర్తిపుంజముగలవాడై తేజోరాశియగు సూర్యునివలె ప్రతాపముతో ప్రకాశించుచు ఉత్సవములచే నుజ్జ్వలుడై వెలుగుచుండెను.

సమాసములు :

క్షితిరక్షిణః :- రక్షతీతి = రక్షీ. క్షితేః రక్షీ = క్షితిరక్షీ తస్య క్షితిరక్షిణః

సితచ్ఛత్రిత కీర్తిమణ్డలః:- సితం చ తత్ ఛత్రం చ = సితచ్ఛత్రమ్. సితం ఛత్రం కృతం = సితచ్ఛత్రితమ్. కీర్తేఃమణ్డలమ్ = కీర్తిమండలమ్. సితచ్ఛత్రితం కీర్తిమణ్డలం యస్య సః = సితచ్ఛత్రిత కీర్తిమణ్డలః

మహోజ్జ్వలః ; మహైః ఉజ్జ్వలః = మహోజ్జ్వలః

శ్లో॥ రసైః కథా యస్య సుధావధీరిణీ
నలస్స భూజానిరభూద్గుణాద్భుతః।
సువర్ణదండైక సితాతపత్రిత
జ్వలత్ప్రతాపావళి కీర్తిమణ్డలః॥ ౨

ప॥ వి॥ రసైః । కథా।యస్య । సుధావధీరిణీ । నలః।సః । భూజానిః । అభూత్। గుణాద్భుతః। సువర్ణదండైక సితాతపత్రితజ్వలత్ప్రతాపావళికీర్తిమణ్డలః।

టీక॥ యస్య = ఏ నలునియొక్క. కథా = కథ. రసైః = రుచులచే. సుధావధీరిణీ = అమృతమునుసైతము ధిక్కరించుచున్నదో. భూజానిః = భూమిని జాయగగల్గిన అనగా భూపతియగు. సః = ఆ నలుడు. గుణైః = శౌర్యాదిగుణములచే. అద్భుతః = లోకోత్తరుడై. సువర్ణదండైక సితాతపత్రితజ్వలత్ప్రతాపావళి కీర్తిమణ్డలః:- సువర్ణదండ = క్రమముగా బంగారుదండముగను. ఏకసితాతిపత్రిత = అద్వితీయమగు తెల్లని గొడుగుగనుఁజేయబడిన జ్వలత్ ప్రతాపావళి = ప్రకాశించెడిప్రతాపరాశియు కీర్తిమండలః = యశస్సమూహముగల్గినవాడై. అభూత్ = ఉండెను.

ఇచ్చట ప్రతాపావళియందు సువర్ణదండత్వమును కీర్తిమణ్డలమందు ఏకసితాతపత్రత్వము ఆరోపింపబడుటవలన రూపకమును, నలకధ యమృతమునుసైతము ధిక్కరించుచున్నదనుటచే వ్యతిరేకమును ఏర్పడి రెండలంకారములకును సంసృష్టి ఇచ్చట కీర్తియందు శ్వేతచ్ఛత్రమును ఆరోపించుట పూర్వశ్లోకమందు చెప్పబడినదే మఱల నిట చెప్పుట పునరుక్తికాజాలదు. ఏలయనగా ఆ ఛత్రమునకు సువర్ణదండత్వ వైశిష్ట్యమట చెప్పింపబడుటవలనను, నలునకు లోకోత్తరగుణత్వము చెప్పఁబడుటవలనను, పునరుక్తిదోషము పరిహరింపబడినది.

భావము :

ఆ నలభూపాలుని కధ రుచులచే అమృతమును ధిక్కరించుచున్నది. అట్టి నలభూపాలుడు తన ప్రతాపమును సువర్ణదండముగను, తన కీర్తి మండలమును శ్వేతచ్ఛత్రముగను చేసికొనినవాడై, శౌర్య ధైర్యాదిగుణములచే లోకోత్తరుడై వెలసియున్నాడు.

శ్లో॥ పవిత్రమత్రాతనుతే జగద్యుగే
స్మృతా రసక్షాలనయేవ యత్కథా।
కధం న సా మద్గిరమావిలామపి
స్వసేవినీమేవ పవిత్రయిష్యతి॥ 3

ప॥ వి॥ పవిత్రమ్, అత్ర । ఆతనుతే । జగత్ । యుగే,
స్మృతా । రసక్షాలయా । ఇవ । యత్కథా।
కధమ్ । న । సా । మద్గిరమ్ । ఆవిలామ్ । అపి ।
స్వసేవినీమ్ । ఏవ । పవిత్రయిష్యతి ।

టీక॥ అత్ర యుగే = ఈ కలియుగమందు. యస్య = ఏ నలునియొక్క. స్మృతా = స్మరింపబడినదై. జగత్ = లోకమును. రసక్షాలనయాఇవ = నీటిలో కడుగుటచేతనోయన్నట్లు. పవిత్రమ్ = శుద్ధముగ. ఆతనుతే = చేయుచున్నది. సా = అట్టి నలకధ. ఆవిలామపి = మలినయైనను. స్వసేవినీమేవ = తననే సేవించుచున్నదానిని, కధమ్ = ఎట్లు. న పవిత్రయిష్యతి = పవిత్రము చేయదు. తప్పక పవిత్రము చేయునని యర్థము.

స్మరించినంతమాత్రమున పవిత్రముచేయు నలకథ తన్నే సేవించు నప్పుడు ఎట్లు పవిత్రముచేయునని చెప్పుటచే నిచ్చట అర్థాపత్త్యలంకారము—

సమాసములు :

రసక్షాలనయా:—రసేన క్షాళనా = రసక్షాలనా = తయా = రసక్షాళనయా.

స్వసేవినీమ్:— స్వస్య సేవినీ = స్వసేవినీ = తామ్, స్వసేవినీమ్

భావము :

ఈ కలియుగమునందు నలకథ స్మరించినంతమాత్రముననే నీటితోకడిగిన విధముగ ప్రవిత్రముచేయుచున్నది. "కర్కోటకస్య నాగస్య దమయన్త్యా నలస్య చ। ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్॥" అని నలకథాస్మరణము పాపహరమని చెప్పఁబడినది. ఇట్టి నలకథ నలునిగూర్చి వర్ణించుచున్నది. ఈ కావ్యమందు నలునికే యన్వయించుచున్నదిగాన తప్పక కవియగు నన్ను ఎట్లు పవిత్రపరచదు. తప్పక పవిత్రపరచునని భావము.

శ్లో॥ అధీతిబోధాచరణప్రచారణై ః
దశాశ్చతస్రః ప్రణయన్నుపాధిభిః।
చతుర్దశత్వం కృతవాన్ కుతః స్వయం
న వేద్మి విద్యాసు చతుర్దశస్వయం॥ ४

ప॥ వి॥ అధీతి బోధాచరణ ప్రచారణైః-దశాః। చతస్రః-ప్రణయన్। ఉపాధిభిః। చతుర్దశత్వమ్। కృతవాన్-కుతః। స్వయమ్-న। వేద్మి-విద్యాసు। చతుర్దశసు। అయమ్.

టీక॥ అయమ్ = ఈ. నలః = నలుడు. చతుర్దశసు = పదునాలుగైన. విద్యాసు = విద్యలయందు. అధీతి = గురుముఖ శ్రవణరూపమయిన. అధ్యయనమును, బోధ = అర్థజ్ఞానము. ఆచరణ = తెలియఁబడిన అర్థమును అనుష్ఠించుట. ప్రచారణ = శిష్యులకు బోధించుట అను. ఉపాధిభిః = ధర్మములచే. చతస్రః = నాలుగైన. దశాః = దశలను. ప్రణయన్ = పొందించుచు. స్వయం = తాను. చతుర్దశత్వమ్ = నాలుగు దశలను కలిగి యుండుటను. పదునాల్గు సంఖ్యను గల్గి. కుతః = ఏల. కృతవాన్ = చేసెను. న వేద్మి = తెలియక యున్నాను.

చతుర్దశ విద్యలలో అనగా పదునాలుగు విద్యలలో చతుర్దశత్వమును, నాలుగుచే గుణితమగు పదునాలుగు సంఖ్యను అనగా నేబది యాఱుగ నుండుట, చేయుట విరుద్ధము. పదునాలుగును ఏబది యాఱుగచేయు ట్లాఘ్యమగుట కన నిట విరోధము భాసించుచున్నది. అందువలన విరోధాభాసాలంకారము. చతుర్దశత్వ శబ్దమునకు నాలుగు అవస్థలను కల్గియుండునట్లు చేయుట యను నర్థము చెప్పుటచే విరోధ పరిహారము.

సమాసము:

అధీతిబోధాచరణప్రచారణైః అధీతిశ్చ-బోధశ్చ-ఆచరణంచ-ప్రచారణంచ-అధీతిబోధాచరణాని. తైః అధీతి...ప్రచారణైః

చతుర్దశత్వం ;-చతస్రః దశాః యాసాం తాః = చతుర్దశాః చతుర్దశానాం. భావః = చతుర్దశత్వం.

చతుర్దశ :-చతుర్భి : సంకలితాః చతుర్దశ తాసు = చతుర్దశసు.

భావము :

ఆ నలమహారాజు విద్యను అభ్యసించుట, గ్రహించుట-నేర్చిన విషయముల ననుష్ఠించుట శిష్యులకు బోధించుట యను నాల్గు దశలతో చతుర్దశ విద్యల యందును చతుర్దశత్వమును అనగా నాల్గు దశలను కలిగి యుండుటను కల్పించెను. చతుర్దశ విద్యల యందు అనగా పదునాలుగు విద్యల యందు చతుర్దశత్వమనగా నాలుగుచే పెంచబడుటవలన సిద్ధమగు షట్పంచాశత్త్వమును, అనగా ఏబది యాఱుగ నుండుటను కల్పించెనని విరోధాభాసము-నాలుగు అవస్థలను కల్పించెనని చెప్పుట వలన విరోధ పరిహారము. పదునాలుగు విద్యలలో నొక్కొక్క విద్యకు అధీతి బోధాచరణ ప్రచారములను కల్పించెననుట భావార్థము.

షడంగములు-చతుర్వేదములు. మీమాంస, న్యాయశాస్త్రము, ధర్మశాస్త్రము, పురాణములు-చతుర్దశ విద్యాస్థానములు.

శ్లో॥ అముష్య విద్యా రసనాగ్రనర్తకీ
త్రయీవ నీతాంగగుణేన విస్తరమ్।
అగాహతాష్టాదశతాం జిగీషయా
నవద్వయద్వీపపృథగ్జయశ్రియామ్॥ ౫

ప॥ వి॥ అముష్య। విద్యా। రసనాగ్రనర్తకీ । త్రయీ। ఇవ-నీతా । అఙ్గగుణేన । విస్తరమ్।అగాహత।అష్టాదశతామ్।జిగీషయా।నవద్వయద్వీప పృథగ్జయ శ్రియామ్.

టీక॥ అముష్య = ఈ నలునియొక్క. రసనాగ్రనర్తకీ = నాలుక కొనయందు నృత్యమాడు. విద్యా = పూర్వోక్తమయిన విద్యయు పాకవిద్యయు. త్రయీవ = ఋగ్యజుస్సామములను మూడువేదముల వలె. అంగగుణేన = పూర్వోక్తములగు శిక్షాది షడంగముల యొక్కయు. మధురామ్ల లవణకటు కషాయ తిక్త భేదములతో నొప్పెడి షడ్రసముల యొక్కయు గుణేన = ఆవృత్తిచే. అఙ్గగుణేన = శరీర సామర్థ్యము చేతను, వ్యుత్పత్తి విశేషము చేతను. విస్తరమ్ = వృద్ధిని. నీతా = పొందింపబడినదై. నవద్వయద్వీపపృథగ్జయశ్రియామ్ = నవద్వయ = పదునెనిమిది సంఖ్యగల. ద్వీప = దీవులయందు,. పృథగ్ జయ శ్రియామ్ = ప్రత్యేకముగానున్న జయశ్రీల యొక్క జిగీషయా = జయించు కోరికచే. అష్టాదశతామ్ = పదునెనిమిది సంఖ్యను కల్గియుండుటను. అగాహత = పొందినది.

విద్యను త్రయితో పోల్చుటవలన ఉపమాలంకారము. అష్టాదశ ద్వీపము లలోని జయలక్ష్మిని గెలువఁగోరిక అష్టాదశత్వమునకు హేతువుకాదు. కావున దానివి హేతువుగా చెప్పుట వలన హేతూత్ప్రేక్షల సంసృష్టి.

సమాసములు :

రసనాగ్ర నర్తకీ = రసనాయాః అగ్రమ్ రసనాగ్రమ్-రసనాగ్రే నర్తకీ = రసనాగ్ర నర్తకీ.

నవద్వయ ద్వీపపృథగ్జయశ్రియామ్ :— నవానాం ద్వయం నవద్వయం నవద్వయంద్వీపాః, నవద్వయద్వీపాః జయస్యశ్రియః జయశ్రియఃపృథగ్ జయశ్రియః = పృథగ్జయశ్రియః. నవద్వయద్వీపేషు పృథగ్ జయశ్రియః, తాసామ్ = నవద్వయ...శ్రియాం.

భావము :

ఈ నలుని జిహ్వాగ్రమునందు నృత్యమాడు విద్య ఋగ్యజుస్సామ రూపములుగ భిన్నమయిన త్రయివలె, మధురామ్ల లవణ కటుకషాయ తిక్తభేదములచే నాఱయిన యంగములతో-శిక్షాది షడంగములతోను విస్తరించినదై పదునెనిమిది ద్వీపములలోని జయశ్రీలను జయింపగోరికతోడనో యన్నట్లు పదునెనిమిది విధములైనది. ఇచ్చట రసనాగ్ర సంబంధముచే పాకవిద్య సూచితము. అంగగుణముచే విస్తరించుటను చెప్పుట వలన శిరస్సు మున్నగు అంగ గుణములతో గూడిన నర్తకీ లక్షణము గూడ నిట సూచితము. పూర్వశ్లోకము నందు చతుర్దశ విద్యలను పేర్కొనెను. ఇచ్చట పూర్వోక్తములగు షడంగములు, చతుర్వేదములు, మీమాంస, న్యాయశాస్త్రము పురాణము, ధర్మశాస్త్రము, అను పదునాలుగింటికిని- ఆయుర్వేద, ధనుర్వేద, గాంధర్వ, అర్థశాస్త్రములను చేర్చుట వలన అష్టాదశవిద్యాస్థానముల యందు పండితుడని సూచితము.

శ్లో॥ దిగీశబృందాంశవిభూతి రీశితా
దిశాం స కామప్రసభావరోధినీమ్।
బభార శాస్త్రాణి దృశం ద్వయాధికాం
నిజత్రినేత్రావతరత్వబోధికామ్॥ ౬

ప॥ వి॥ దిగీశబృందాంశవిభూతిః । ఈశితా ।
దిశామ్ । సః । కామప్రసభావరోధినీమ్ ।
బభార । శాస్త్రాణి । దృశమ్ । ద్వయాధి కామ్ ।
నిజత్రినేత్రావతరత్వబోధికామ్ ।

టీక॥ దిగీశబృందాంశవిభూతిః = దిగీశ = దిక్పాలకులైన ఇంద్రాదుల యొక్క. బృంద = సమూహము యొక్క. అంశ = అంశములచేత. విభూతిః =

వ్యుత్పత్తి కలిగిన. దిశామ్ = దిక్కులకు. ఈశితా = ప్రభువైన సః = ఆ నలుడు. శాస్త్రాణి = శాస్త్రములను.కామ ప్రసభావరోధినీమ్.కామ = ఇచ్ఛను. మన్మథుని, ప్రసభ = బలము వలన. అవరోధినీమ్ = అడ్డగించెడి. నిజ...భోధికామ్. నిజ = తనదైన. త్రినేత్రావతరత్వ = ఈశ్వరాంశ సంభవమును. భోధికామ్ = సూచించెడి. ద్వయాధికామ్ = మూడవదైన. దృశమ్ = నేత్రముగ భభార = భరించెను.

దిశామ్ అని బహువచనము చెప్పుటచేత- సమస్త దిక్కులకు ఆధిపత్యమును సూచించుచు, ఇంద్రాదులకంటె ఆధిక్యము గమ్యమగుచున్నది. కావున వ్యతిరేకాలంకారము ఇచ్చట సూచితము. దృశం శాస్త్రాణి అని శాస్త్రములను నేత్రములతో రూపణము చేయుటవలన వ్యస్తరూపకము,

సమాసములు :

దిగీశబృందాంశవిభూతి :-దిశామ్. ఈశాః దిగీశాః దిగీశానాం, బృన్దమ్, దిగీశబృందమ్ వృందానాం అంశాః బృందాశాః, అంశేభ్యః, విభూతిః, యస్య సః దిగీశ బృందాంశవిభూతిః.

కామప్రసభాసరోవధినీమ్:-ప్రశభేన అవరోధినీ, ప్రసభావరోధినీ కామస్య ప్రసభారోధినీ, కామప్రసభావరోధినీ, తాంకామ ప్రసభావరోధినీమ్,

ద్వయాధికాం:- ద్వయాత్ అధికా ద్వయాధికా, తాం, ద్వయాధికామ్.

నిజత్రినేత్రా వతరత్వబోధికామ్:- నిజంచ, తత్, త్రినేత్రావతరత్వంచ నిజత్రి నేత్రావతరత్వమ్, నిజత్రినేత్రావతరత్వస్య భోధికా నిజత్రినేత్రావతరత్వభోధికా, తామ్, నిజత్రినేత్రా వతరత్వ భోధికామ్.

**భావము:**

ఆ నలమహారాజు ఇంద్రాది దిక్పాలకులయొక్క అంశములనుండి సంభవించినవాడై, సమస్త దిక్కులకు పాలకుడై వారిని మించియుండెను. అతడు స్వేచ్ఛగా మన్మథుని నిరోధించునదియు, తనకు ముక్కంటి అంశమునుండి

జన్మమును సూచించునదియునగు శాస్త్రములనెడి మూడవదృష్టి కలిగియుండెను. అతడు మూడవదృష్టిని కలిగియుండుటవలననే శివుని మూడవదృష్టితో నిగ్రహింపబడిన మన్మధుని నిగ్రహింపకలిగియుండెను. మరియు ఆ మూడవదృష్టిలో, దృష్టి శాస్త్రములే యగుటవలన ఇతడు స్వేచ్ఛకు తావుఇవ్వక శాస్త్రోక్తవిధానముతో పరిపాలనచేయుచుండెను. అష్టదిక్పాలకులయొక్క అంశలతో రాజు అవతరించునని శాస్త్రములు వక్కాణించుచున్నవి ఎట్లన :- "అష్టాభిర్ లోకపాలానాం మాత్రాభిర్ నిర్మితో నృపః"॥.

శ్లో॥ పదైశ్చతుర్భిస్సుకృతే స్థిరీకృతే
కృతేఽమునా కే న తపః ప్రపేదిరే ।
భువం యదేకాంఘ్రికనిష్ఠయా స్పృశ-
న్దధావధర్మోఽపి కృశ స్తపస్వితామ్॥ ౭

ప॥ వి॥ పదైః। చతుర్భిః। సుకృతే। స్థిరీకృతే।
కృతే। అమునా। కే। న। తపః। ప్రపేదిరే।
భువమ్। యత్। ఏకాంఘ్రికనిష్ఠయా। స్పృశన్।
దధౌ। అధర్మః। అపి। కృశః। తపస్వితామ్।

టీక॥ అమునా = ఆ నలునిచే. కృతే = కృతయుగమునందు. సుకృతే = ధర్మము. చతుర్భిః = నాలుగైన. పదైః = పాదములచే. స్థిరీకృతే సతి = స్థిరముచేయబడగా. కే = ఏజనులు. తపః = చాంద్రాయణాది తపమును. న ప్రపేదిరే = అనుష్ఠించలేదు. యత్ = ఏలయనగా. అధర్మోపి = అధర్మముకూడ. కృశః = దుర్బలమైనదై. ఏకాంఘ్రికనిష్టయా = ఏక = ఒకటైన. అంఘ్రికనిష్ఠయా = పాదముయొక్క చిటికినవ్రేలితో. భువమ్ = భూమిని. స్పృశన్ = తాకుచు. తపస్వితామ్ = తపస్విగానుండుటను. దధౌ = ధరించెను.

ఈ నలుని పరిపాలనవలన అధర్మముకూడ ధర్మమునందు ఆసక్తికలదై తపము చేసినపుడు ఇంక ఇతరులనుగురించి ధర్మవిషయమున చెప్పనవసరము లేదని సిద్ధించుటవలన ఇచ్చట అర్థాపత్త్యలంకారము. అధర్మముకూడ ధార్మికమైనదని విరోధాలంకారము. ఈ రెంటికిని సంసృష్టి.

**సమాసములు:**

స్థిరీకృతే :– అస్థిరః, స్థిరః సంపద్యమానః కృతః స్థిరీకృతః తస్మిన్ స్థిరీకృతే.

ఏకాంఘ్రికనిష్ఠయా;– అంఘ్రేః కనిష్ఠా అంఘ్రికనిష్ఠా, ఏకా చ సా అంఘ్రికనిష్ఠా చ, ఏకాంఘ్రి కనిష్ఠా తయా ఏకాంఘ్రి కనిష్ఠయా.

**భావము :**

ధర్మము వృషభరూపమై నాలుగు యుగములలోను నాలుగు పాదములలో యిమిడియుండునని స్మృతులు చెప్పుచున్నవి. కృతయుగమునందు, ఈ నలుడు నాలుగు పాదములలోను ధర్మమును స్థిరముగా నిలిపెను. అందువలన అధర్మమునకు తావు నలుని పరిపాలనయందు లేదు. కావున జనులందరును చాంద్రాయణాదివ్రతములను ఆచరించుచు తపస్సంపన్నులుగ నుండిరి. ఇంతేల! అధర్మమునకు తావులేనందువలన పాదముయొక్క చిటికినవ్రేలిని ఆశ్రయించి కృశించుచు అదికూడ తపస్సుచేసినదని భావము. అధర్మమే తపస్సు చేయునపుడు ఇతరులు తప్పక తపస్సు చేయగలరని చెప్పకయే సిద్ధించుచున్నది. ఇట్లు నాలుగు పాదములలోను ధర్మముతో కూడియున్నందువలన నలుని పరిపాలన ధర్మభూయిష్ఠముగ నున్నదని సిద్ధించుచున్నది.

శ్లో॥ యదస్య యాత్రాసు బలోద్ధతం రజ
స్స్ఫురత్ప్రతాపానలధూమమంజిమ।
తదేవ గత్వా పతితం సుధాంబుధౌ
దధాతి పంకీభవదఙ్కతాం విధౌ॥ ౮

ప॥ వి॥ యత్ । అస్య। యాత్రాసు । బలోద్ధతం । రజః । స్ఫురత్ ప్రతాపానల ధూమమంజిమ । తత్ । ఏవ । గత్వా । పతితం । సుధాంబుధౌ । దధాతి । పంకీభవత్ । అంకతామ్ । విధౌ॥

టీక॥ అస్య = ఈ నలునియొక్క. యాత్రాసు = యాత్రలయందు. బలోద్ధతమ్ = బల = సైన్యముచే. ఉద్ధతం = పైకి లేవబడిన. స్ఫురత్ . . .

మంజిమ, స్ఫురత్ = ప్రకాశించు. ప్రతాపానల = ప్రతాపమనెడి అగ్ని యొక్క. ధూమ = పొగయొక్క. మంజిమ = మంజిమఅనెడి సౌందర్యము కలిగిన. యత్ = ఏ, రజః = ధూళికలదో. తదేవ = అదియే. గత్వా = పోయి. సుధాంబుధౌ = పాలసముద్రమునందు. పతితం సత్ = పడినది అగుచు. పంకీభవత్ = బురదగా నయినదై. విధౌ = చంద్రుని యందు. అంకతామ్ = కళంకము అగుటను. దధాతి = ధరించుచున్నది.

ఇచ్చట ప్రతాపాగ్ని యొక్క ధూమ సౌందర్యము సముద్రమును పొంది చంద్రునియందు కళంకమైనదని వర్ణించుట వలన రూపకముతో సంసృష్టమైన గమ్యోత్ప్రేక్ష, ఇచ్చట ప్రతాపమును అగ్నిగను, దాని ధూమ మంజిమ మంజుత్వముగను రూపించుట వలన రూపకము. పంకముగాని ఆ మంజిమను, పంకమయినట్లు చెప్పి కళంకముగ ఉత్ప్రేక్షించుట వలన ఉత్ప్రేక్ష యగుచున్నది. ఈ రెంటికిని ఇచ్చట సంసృష్టి ఏర్పడినది.

సమాసములు :

బలోద్ధతమ్ :— బలేన ఉద్ధతం, బలోద్ధతమ్

స్ఫురత్ ప్రతాపాపల ధూమమంజిమ :— ప్రతాపఏవవ అనలః ప్రతాపానలః, స్ఫురంశ్చాసౌ ప్రతాపానలశ్చ స్ఫురత్ ప్రతాపానలః, అనలస్య ధూమః అనలధూమః, ధూమస్య మంజిమా, ధూమమంజిమా.

సుధాంబుధౌ:— సుధాయాః అంబుధిః సుధాంబుధిః తస్మిన్ సుధాంబుధౌ

పంకీభవత్:— అపంకః పంకః భవన్ పంకీభవత్.

భావము :

ఈ నలుని దండయాత్రల యందు దండుచే చెలరేగ గొట్టబడినదియు, ఆ నలుని ప్రతాపాగ్ని ధూమము యొక్క సౌందర్యమును ధరించినదియు నగు ధూళి క్షీరసాగరమునందు పడినదై బురదై చంద్రునియందు కళంకముగనైనది.

శ్లో॥ స్ఫురద్ధను ర్నిస్స్వనతద్ఘనాశుగ
ప్రగల్భవృష్టి వ్యయితస్య సంగరే।
నిజస్య తేజశ్శిఖినః పరశ్శతా
వితేను రింగాలమివాయశః పరే॥

ప॥ వి॥ స్ఫురద్ధనుర్నిస్వనతద్ఘనాశుగప్రగల్భవృష్టివ్యయితస్య । సంగరే నిజస్య । తేజశ్శిఖినః । పరశ్శతాః । వితేనుః । ఇంగాలమ్ । ఇవ । అయశః । పరే ।

టీక॥ సంగరే = యుద్ధమునందు. పరశ్శతాః = అసంఖ్యాకులైన. పరే = శత్రువులు. స్ఫురత్...వ్యయితస్య. స్ఫురత్ = ప్రకాశించు. ధనుః = తన ధనస్సును. నిస్వన = శబ్దమున్ను. అనునవియే ఇంద్రధనుస్సుగను. మేఘగర్జనములును కలిగిన. తత్ = ఆ నలుడనెడి. ఘన = మేఘముల యొక్క. ఆశుగ = బాణములయొక్క. ప్రగల్భవృష్టి = గొప్పవృష్టి యనెడి. ఆశుగ = గాలిచే ప్రగల్భవృష్టి = గొప్ప వృష్టిచే. వ్యయితస్య = చల్లార్పబడిన. నిజస్య = తనదగు. తేజశ్శిఖినః = ప్రతాపాగ్నికి. ఇంగాలమివ = బొగ్గు అనునట్లు. అయశః = అపకీర్తిని. వితేనుః = చేసిరి.

ఇచ్చట ఇంగాలమివ అని అపయశస్సు బొగ్గుగా ఉత్ప్రేక్షింపబడినది. కావున ఉత్ప్రేక్ష. నలుని ధనుస్సును ఇంద్ర ధనుస్సుగను, దాని ధ్వనిని మేఘ ధ్వనిగను, నలుని మేఘముగను, అతని బాణ వృష్టిని వాయువృష్టిగను ప్రతాపమును అగ్నిగను రూపించుట వలన రూపకము. ఈ రూపకోత్ప్రేక్షలకు ఇచ్చట సంకరము.

సమాసములు :

స్ఫురత్, . . ,వ్యయితస్య.

ధనుశ్చ నిస్వనశ్చ ధనుర్నిస్వనౌ, స్ఫురన్తౌ ధనుర్నిశ్వనౌ యస్య సః స్ఫురద్ధనుర్నిస్వనః, సఏవ ఘనః తద్ఘనః నిస్వనశ్చాసౌ తద్ఘనశ్చ స్ఫురద్ధనుర్నిస్వనతద్ఘనః, ఘనస్య ఆశుగాః, ఘనాశుగాః తేషాంప్రగల్భ వృష్టిః, ఆశుగప్రగల్భవృష్టిః వృష్ట్యా వ్యయితః, స్ఫురత్.. వ్యయితః తస్య...స్ఫురత్...వ్యయితస్య..

తేజశ్శిఖిన :— తేజ ఏవ శిఖీ, తేజశ్శిఖీ, తస్య తేజశ్శిఖినః.

భావము :

తన ధనస్సును దాని ధ్వనిని, ఇంద్ర ధనస్సుగను, గర్జితముగను కల్గిన ఆ నలుడనెడి మేఘము నుండి విడువబడిన బాణ వర్షము అనెడి వాయు వృష్టిచే యుద్ధమునందు చల్లార్చబడిన ప్రతాపాగ్ని కలిగిన అసంఖ్యాకులగు శత్రువులు తమ ప్రతాపాగ్నికి తమ అపకీర్తిని బొగ్గుగ చేసిరి. అపయశస్సు నల్లగా నుండుట వలన దానిని కవి ఇచ్చట బొగ్గుగ ఉత్ప్రేక్షించినాడు. అనగా ఇతడు శత్రువులు లేక పరిపాలించెనని భావము.

శ్లో॥ అనల్పదగ్ధారిపురానలోజ్జ్వలై
ర్నిజ ప్రతాపై ర్వలయం జ్వలద్భువః।
ప్రదక్షిణీకృత్య జయాయ సృష్టయా
రరాజ నీరాజనయా స రాజఘః॥ ౧౦

వ॥ వి॥ అనల్పదగ్ధారిపురానలోజ్జ్వలైః । నిజప్రతాపైః। వలయమ్ । జ్వలత్ । భువః । ప్రదక్షిణీకృత్య । జయాయ । సృష్టయా । రరాజ । నీరాజనయా । సః । రాజఘః.

టీక॥ రాజఘః = రాజులను సంహరించెడి: సః = ఆ నలుడు అనల్ప... ఉజ్జ్వలైః అనల్ప = అధికముగ. ధగ్ధ = తగులబెట్టబడిన. అరిపుర = శత్రు పట్టణములయొక్క. అనల = అగ్నులవలె. ఉజ్జ్వలైః = ప్రకాశించెడి. నిజప్రతాపైః = తన ప్రతాపములనెడి. జయాయ = జయము నకై. సృష్టయా = కల్పితమైన. నీరాజనయా = ఆరతిచే. జ్వలత్ = ప్రకాశించెడి. భువః = భూమియొక్క. వలయం = చక్రమును. ప్రదక్షిణీకృత్య = ప్రదక్షిణముచేసి, రరాజ = ప్రకాశించెను.

ఇచ్చట జ్జ్వలత్ ప్రతాపాగ్ని కలిగిన నలుడు, దిగ్విజయ యాత్రయందు తూర్పు మున్నగు దిక్కుల నుండి ప్రదక్షిణముగ భూమండలమును చుట్టుచు తన ప్రతాపమనెడి నీరాజనముచే, భూదేవతకు ఆరతి ఇచ్చుచున్నాడో యనునట్లు ప్రకాశించుచున్నాడు. కాన ఇచ్చట గమ్యోత్ప్రేక్ష. ప్రతాపమును అగ్నిగ రూపించుట చేతను, ఇచ్చట ఏకదేశవృత్తి రూపకము.ఈ రూపకోత్ప్రేక్షకులకు ఇచ్చట సంకరము.

సమాసములు :

అనల్ప...ఉజ్జ్వలై = అనల్పం. దగ్ధాని అనల్ప దగ్ధాని. అరీణాం పురాణి అరిపురాణి. అనల్పదగ్ధాని అరిపురాణి యైస్తే అనల్పదగ్ధారిపురాః, అనలవదుజ్జ్వలాః అనలోజ్జ్వలాః, అనల్పదగ్ధాశ్చ అరిపురానలోజ్జ్వలాశ్చ, తైః, అనల్ప.. ఉజ్జ్వలైః.

నిజప్రతాపైః :—నిజాశ్చ తే ప్రతాపాశ్చ నిజప్రతాపాః తైః, నిజప్రతాపైః

రాజఘః :—రాజ్ఞః హన్తీతి రాజఘః.

భావము :

శత్రుసంహారియగు ఆ నలుడు అధికముగ శత్రుపట్టణములను దహించినదియు, అగ్నివలె ప్రకాశమానములునగు తన ప్రతాపములనెడి జయనీరాజనచే వెలుగుచున్న భూమండలాన్ని, తూర్పు మున్నగు దిక్కులవరుసతో ప్రదక్షిణము గావించి, దిగ్విజయయాత్రయందు భూమండలమును పరిభ్రమించుచు, శత్రుపట్టణములను తన ప్రతాపాగ్నిచే దహించు విధానము భూదేవతకు హారతి ఒసంగినట్లుగ ప్రకాశించెను.

శ్లో॥ నివారితాస్తేన మహీతలేఽఖిలే
నిరీతిభావం గమితేఽతివృష్టయః।
న తత్యజుర్నూన మనన్యసంశ్రయాః
ప్రతీప భూపాలమృగీదృశాం దృశః॥ ౧౧

ప॥ వి॥ నివారితాః। తేన। మహీతలే। అఖిలే। నిరీతిభావమ్। గమితే। అతివృష్టయః। న। తత్యజుః। నూనమ్। అనన్యసంశ్రయాః। ప్రతీపభూపాలమృగీదృశామ్। దృశః।

టీక॥ తేన = ఆ నలునిచే. నిరీతిభావమ్ = ఈతిబాధ లేకుండుటను. గమితే = పొందింపబడిన. అఖిలే = సమస్తమైన. మహీతలే = భూమియందు. నివారితాః = తొలగింపబడినప్పటికిన్ని. అతివృష్టయః = అతివృష్టులు.

అనన్యసంశ్రయాః = మరియొక ఆశ్రయములు లేనివై. ప్రతీపభూపాల మృగీదృశాం = ప్రతీపభూపాల = శత్రురాజులయొక్క. మృగీదృశామ్ = స్త్రీలయొక్క. దృశః నేత్రములను. న తత్యజుః = విడువలేదు. నూనమ్ = నిశ్చయము.

శత్రుస్త్రీలనేత్రములు అతివృష్టులకు ఆశ్రయములుకావు = ఆశ్రయములు కాని శత్రుస్త్రీ నేత్రములను ఆశ్రయముగ చేసి ఉత్ప్రేక్షించుటచేతను. నూనశబ్ద ప్రయోగముచేతను ఇచ్చట వాచ్యోత్ప్రేక్ష.

సమాసములు ;

నిర్గతాః ఈతయః యస్మాత్ తత్ నిరీతి: నిరీతేః భావః, నిరీతిభావ। తం నిరీతిభావమ్.

అనన్యసంశ్రయాః :— అన్యః సంశ్రయః యేషాం తే, అన్యసంశ్రయా: అన్యసంశ్రయాః నభవన్తీతి, అనన్యసంశ్రయా:

ప్రతీప...దృశాం :— ప్రతీపాశ్చతే భూపాలాశ్చ, ప్రతీపభూపాలాః, ప్రతీపభూపాలానాం మృగీదృశః ప్రతీపభూపాలమృగీదృశః తాసాం ప్రతీప...దృశామ్.

భావము :

ఆ నలుడు సమస్త భూమండలమునందును అనావృష్టి మున్నగు ఈతి భాధలను లేకుండ చేసినప్పటికిన్ని అతివృష్టి అనబడు ఈతిబాధ వేఱొక ఆశ్ర యములేనిదై నలునే శరణుపొంది అతని శత్రుస్త్రీలయొక్క నేత్రమును విడువ కనే యుండెను. అనగా శత్రువులను సంహరించుటవలన అతని స్త్రీలు ఎల్లప్పుడు ఏడ్చుచున్నారు. "శ్లో॥ అతివృష్టిరనావృష్టి ర్మూషకాశ్శలభాశ్శుకాః అత్యా సన్నాశ్చ రాజాన షడేతా ఈతయ: స్మృతాః" అని ఆరువిధములుగా ఈతిభాధలు చెప్పబడియున్నవి.

శ్లో॥ సితాంశువర్ణై ర్వయతి స్మ తద్గుణై
ర్మహాసివేమ్నస్సహ కృత్వరీ బహుమ్।
దిగఙ్గనాఙ్గావరణం రణాఙ్గణే
యశఃపటం తద్భటచాతురీ తురీ॥ ౧౨

ప॥ వి॥ సితాంశువర్ణైః। వయతి। స్మ। తద్గుణైః। మహాసివేమ్నః। స్సహకృత్వరీ। బహుమ్। దిగఙ్గనాఙ్గావరణమ్। రణాఙ్గణే। యశఃపటమ్। తద్భటచాతురీ। తురీ।

ఒక॥ మహాసివేమ్నః, మహాసిః = గొప్పఖడ్గమనెడి. వేమ్నః = నేతకొయ్యకు సహకృత్వరీ = సహాయముచేయు. తద్భటచాతురీ = తద్భట = తన భటులయొక్క. చాతురీ = నేర్పుఅనెడి. తురీ = నేత సాధనము. సితాంశువర్ణైః. సితాంశు = చంద్రునియొక్క. వర్ణైః = కాంతివంటి కాంతి కలిగిన. సిత = తెల్లనైన. అంశు = అవయవములయొక్క. వర్ణైః = కారణభూతములైన వర్ణములుకలిగిన. తద్గుణైః = ఆ నలునియొక్క. శౌర్యధైర్యాదిగుణములనెడి దారములచే. దిగఙ్గనాఙ్గావరణమ్ = దిగఙ్గనా = దిక్కులనెడి స్త్రీలయొక్క. అఙ్గావరణమ్ = శరీరమునకు ఆచ్ఛాదమైన. బహుమ్ = పెద్దదైన. పటమ్ = వస్త్రమును. వయతి స్మ = అల్లుచుండెను.

తద్గుణైః అనునెడ అతని గుణములనెడి దారములచేతనను అర్థమునుబట్టి శ్లిష్టరూపకము, మహాసివేమ్నః, అనునెడ మహాఖడ్గమనెడి అల్లికకొయ్యను అనునర్థమునుబట్టియు యశః పటమనెడి కీర్తియనెడి వస్త్రము అను అర్థమును బట్టియు రూపకాలంకారము. అశ్లేష తద్భటచాతురుని తురిగ చెప్పుటవలన రూపకము.

సమాసము :

(1) సితాః, అంశవః యస్య సః సితాంశుః, సితాంశోః వర్ణ ఇవ వర్ణః యేషాం తే సితాంశువర్ణాః.

(2) తస్య గుణాః తద్గుణాః, తైః, తద్గుణైః.

(3) మహాసిరేవ వేమా మహాసివేమా తస్య మహాసివేమ్నః.

(4) దిగఙ్గనాఙ్గావరణం : దిశఏవ అంగనాః, తాసామావరణం దిగఙ్గనాఙ్గావరణమ్.

(5) యశః పటం : యశ ఏవ పటః తం యశః పటం.

(6) తద్భటచాతురీతురీ : తస్య భటాః తద్భటాః, తద్భటానాం చాతురీ, తద్భటచాతురీ, చాతురీ ఏవ తురీ చాతురీతురీ.

భావము :

అతని ఖడ్గము అనెడి నేత కొయ్యకు అతని భటులయొక్క నేర్పు అనెడి నేత సాధనము సహకరించుచున్నదై, చంద్రుని వంటి వర్ణములు కలదియు తెల్లని దారముల యందలి వర్ణములను కారణములుగా కలిగినవియు నగు ఆ నలుని యొక్క శౌర్యధైర్యాది గుణములనెడి దారములచే దిక్కాంతల యొక్క శరీరచ్ఛాదనమైన విశాలమగు యశోవస్త్రమును అల్లుచున్నది.

శ్లో॥ ప్రతీపభూపైరివ కిం తతో భియా
విరుద్ధధర్మైరపి భేత్తృతోజ్ఝితా ।
అమిత్రజిన్మిత్రజిదోజసా స య
ద్విచారదృక్ చారదృగప్యవర్తత॥ ౧౩

ప॥ వి॥ ప్రతీపభూపైః। ఇవ। కిమ్। తతః। భియా। విరుద్ధధర్మైః। అపి। భేత్తృతా। ఉజ్ఝితా। అమిత్రజిత్। మిత్రజిత్। ఓజసా। సః। యత్। విచారదృక్। చారదృక్। అపి। అవర్తత।

టీ॥ ప్రతీప భూపైరివ = శత్రురాజులచేత వలె. విరుద్ధధర్మైరపి = ఒకచో టనుండ నటువంటి ధర్మములచేత. తతః = ఆ నలుని నుండి. భియా = భయముచే. భేత్తృతా = తమ తమ అధికరణములకు భేదకములుగ నుండుట అను స్వభావమును. ఉజ్ఝితా కిం = విడువబడినదా ఏమి. యత్ = ఏల యనగా. సః = ఆ నలుడు. ఓజసా = తేజస్సుచే. మిత్రజిదపి = సూర్యుని జయించిన వాడైనప్పటికిన్ని. అమిత్రజిత్ =

మిత్రులను జయించిన వాడు కాడు శత్రువులను జయించిన వాడుగ నున్నాడు. చారదృక్ = గూఢచారులను నేత్రము కలిగిన వాడు అయి నప్పటికిన్ని. విచారదృక్ = చారదృక్ కాని వాడుగను. విచారమును ఆలోచనతో చూచువాడును. అపర్తత = ఉండెను.

ఇచ్చట అమిత్రజిత్తును మిత్రజిత్తుగను, చారదృక్కును విచార దృక్కుగను చెప్పుటచే విరోధాభాసాలంకారము. దాని ననుసరించి, విరుద్ధ ధర్మ ములకు భేదకత్వము లేదనుట ఉత్ప్రేక్షింపబడినది. ఆ ఉత్ప్రేక్ష శత్రురాజులచేత వలెననెడి ఉపమచే అనుప్రాణితము- కావున ఇచ్చట విరోధాభాస,ఉత్ప్రేక్ష, ఉపమాలంకారముల సంకరము.

సమాసములు :

ప్రతీపభూపైః : ప్రతిపాశ్చ తే. భూపాశ్చ' ప్రతీప భూపాః, తైః ప్రతీప భూపైః.

విరుద్ధధర్మైః : విరుద్ధాశ్చ తే, ధర్మాశ్చ, విరుద్ధధర్మాః తైః విరుద్ధ ధర్మైః.

అమిత్రాణి జయతీతి : అమిత్రజిత్, మిత్రం జయతీతి, మిత్రజిత్.

విచారయుక్తా దృక్ : యస్యసః విచారదృక్.

చారదృక్ : చారాః దృశః యస్య సః చారదృక్.

లేదా :

విచారేణ పశ్యతీతి విచారదృక్ చారేణ పశ్యతీతి చారదృక్.

భావము :

నలుని భయము వలన శత్రురాజులు భేదకత్వము అనెడి స్వభావము వదలినట్లు విరుద్ధ ధర్మములు కూడ తమ భేదకత్వమనెడి ధర్మములను వదలి నవా అనునట్లున్నది. ఏల యనగా ఆ నలుడు తేజస్సుచే మిత్రుని (సూర్యుని) జయించియు అమిత్రులను (శత్రువులను) జయించినవాడు అగుచున్నాడు. అందు వలన అతని యందు మిత్రజిత్త్వము, అమిత్ర జిత్త్వము, అనెడి విరుద్ధ ధర్మములు అతని యందున్న వాయెను. మిత్రజిత్త్వమనగా సూర్యుని జయించు టయు అమిత్రజిత్త్వమనగా శత్రువులను జయించుటయు అను అర్థము చెప్పుటచే

ఆ విరోధము పరిహరింపబడినది. అదే విధముగ చార నేత్రుడు అయిన (గూఢ చారులతో చూచువాడయినను) విచారదృక్, చారులతో చూడని వాడుగను(ఆలో చనతో చూచువాడుగను) నుండెను. ఇచ్చట ఆ నలుని యందు చారదృక్త్వము విచారదృక్త్వము అనెడి ధర్మములుండవలసినవి ఆయెను. అయినను చారదృక్ త్వమన, చారులతో చూచుటయు, విచారదృక్త్వము అన, విచారణతో చూచు టయు నను అర్థము చెప్పుట వలన విరోధ పరిహారము.

శ్లో॥ తదోజస స్తద్యశసస్స్థితావిమౌ
వృథేతి చిత్తే కురుతే యదా యదా।
తనోతి భానోః పరివేషకైతవా
త్తదా విధిః కుండలనాం విధోరపి॥ ౧౪

ప॥ వి॥ తదోజసః। తద్యశసః। స్థితౌ। ఇమౌ। వృథా। ఇతి। చిత్తే। కురుతే। యదా। యదా। తనోతి। భానోః। పరివేష కైతవాత్। తదా। విధిః। కుండలనాం। విధోః। అపి।

టీక॥ తదోజసః = అతని ప్రతాపమునకు, తద్యశసః = అతని కీర్తికిని. స్థితౌ = స్థితి. సత్యాం = ఉండగ. ఇమౌ = ఈ సూర్య చంద్రులు. వృథా = వ్యర్థులు. ఇతి = అని. యదా యదా = ఎప్పుడు, ఎప్పుడు. చిత్తే = మనస్సునందు. కురుతే = తలంచుచున్నాడో. తదా తదా = అప్పు డప్పుడు. పరివేషకైతవాత్ = వలయముయొక్క నెపము వలన. విధిః = బ్రహ్మ. భానోః = సూర్యునకు. విధోరపి = చంద్రునకును. కుండ లనాం = కుండల రేఖను. తనోతి = చేయుచున్నాడు.

పరివేష నెపముచే సూర్య చంద్రులకు కుండలీకరణము ఉత్ప్రే క్షింపబడినది. కాన ఇచ్చట సాపహ్నవోత్ప్రేక్ష గమ్యము.

భావము :

ఆ నలుని యొక్క ప్రతాపము యశస్సు ఉన్నప్పుడు సూర్య చంద్రులు వ్యర్థమని బ్రహ్మ ఎప్పుడు ఎప్పుడు, భావించునో అప్పుడప్పుడు సూర్యునకును చంద్రునకును ఆ పరివేషమనెడి నెపముతో అనావశ్యకతను సూచించు

కుండల రేఖను గీయుచున్నాడు. వ్రాయసకాడు వ్రాతలో అనవసరమైన వానికి కుండలీకరణ మిచ్చుచున్నాడు. ఆ విధముగనే నలుని ప్రతాపముచే సూర్యుడును నలుని కీర్తిచే చంద్రుడును గతార్థులని విధి భావించినప్పుడు వారిద్దరికిని పరివేషమనెడి నెపముతో కుండలీకరణము ఇచ్చుచున్నాడు.

శ్లో॥ అయం దరిద్రో భవితేతి వైధసీం
లిపిం లలాటేఽర్థిజనస్య జాగ్రతీం ।
మృషా న చక్రేఽల్పితకల్పపాదపః
ప్రణీయ దారిద్ర్యదరిద్రతాం నలః॥ ౧౫

ప॥ వి॥ అయం । దరిద్రః । భవితా । ఇతి । వైధసీం । లిపిం । లలాటే । అర్థిజనస్య । జాగ్రతీం । మృషా । న । చక్రే । అల్పితకల్పపాదపః । ప్రణీయ । దారిద్ర్యదరిద్రతామ్ । నలః.

టీక॥ అల్పితకల్పపాదపః = తన త్యాగముచే స్వల్పముగ చేయబడిన కల్పవృక్షముగల. నలః = నలుడు. అర్థిజనస్య = యాచక జనముయొక్క. లలాటే = నొసట. జాగ్రతీం = ప్రకాశించెడి. అయం = ఈ మనుష్యుడు. దరిద్రః = దరిద్రుడుగ. భవితా = కాగలడు. ఇతి = అనెడి. వైధసీం = బ్రహ్మ సంబంధమైన. లిపిం = వ్రాతను. దారిద్ర్యదరిద్రతాం = దారిద్ర్యమునకు. దారిద్ర్యమును అనగా దారిద్ర్యము లేకుండుటను. ప్రణీయ = కల్పించి. మృషా = అసత్యముగ. న చక్రే = చేయలేదు.

బ్రహ్మ లిపిని వేరుగా చేయుటకు, ఇందు సంబంధము లేకపోయినప్పటికిన్ని, సంబంధము చెప్పబడుట వలన అతిశయోక్తి.

సమాసములు :

(1) అల్పితకల్పపాదపః:- కల్ప ఇతి పాదపః కల్పపాదపః అల్పితః కల్పపాదపః యేన సః అల్పితకల్పపాదపః.

(2) దారిద్ర్య దరిద్రతాం:- దారిద్ర్యస్య దరిద్రతా దారిద్ర్యదరిద్రతా, తాం, దారిద్ర్యదరిద్రతామ్.

**భావము :**

ఈ కల్ప వృక్షమును స్వల్పముగా చేసిన నలమహారాజు వీడు దరిద్రుడు కాగలడని యాచకుల నొసట వ్రాసిన బ్రహ్మలిపిని దారిద్ర్యమునకు నొసంగుటచే అనగా దారిద్ర్యమును తొలగించుటచే ఆ బ్రహ్మలిపిని సత్యముగ చేసెను. దారిద్ర్యము ఏర్పడుటయే బ్రహ్మ యొక్క ఉద్దేశ్యము. ఆ దారిద్ర్యమును దారిద్ర్యమునకు నొసంగుటచే బ్రహ్మలిపిని సత్యముగా చేసిన వాడాయెను. ఇట్లు ఇతని రాజ్యమునందు ప్రజలు దారిద్ర్య బాధ లేకుండ సుఖించుచుండిరి.

శ్లో॥ విభజ్య మేరుర్న యదర్థిసాత్కృతో
న సింధురుత్సర్గజలవ్యయైర్మరుః ।
అమాని తత్తేన నిజాయశోయుగం
ద్విఫాలబద్ధాశ్చికురాశ్శిరస్స్థితమ్ ॥ ౧౬

ప॥వి॥ విభజ్య । మేరుః । న । యత్ । అర్థిసాత్కృతః న । సింధుః । ఉత్సర్గజలవ్యయైః । మరుః । అమాని । తత్ । తేన । నిజాయశోయుగమ్ । ద్విఫాల బద్ధాః । చికురాః । శిరస్థితమ్ ।

టీక॥ మేరుః = బంగారుకొండ. విభజ్య = విభజింపబడి. అర్థిసాత్ = యాచకులకు అధీనముగను. సింధుః = సముద్రము ఉత్సర్గజలవ్యయైః = దానజల వినియోగములచే. మరుః = నీరులేని ప్రదేశముగను. న కృత ఇతి చ యత్ = చేయబడలేదనునదియు నేదికలదో. తేన = ఆనలునిచే. తత్ = ఆ, నిజం = తనదగు. అయశోయుగం = అపకీర్తుల జంట. ద్విఫాలబద్ధాః = ద్విఫాల = శిరస్సునకు రెండు వైపుల. బద్ధాః = కట్టబడిన. చికురాః = వెంట్రుకలుగ. సత్ = ఉన్నదై. శిరఃస్థితం = తలయందున్నదిగ. అమాని = తలంపబడినది.

నల్లదనమును పురస్కరించుకొని వెంట్రుకలను అపకీర్తులుగా రూపించుటవలన నిట రూపకాలంకారము.

**సమాసములు:**

అర్థిసాత్:— అర్థినామధీనః = అర్థిసాత్

ఉత్సర్గ జలవ్యయైః— ఉత్సర్గస్య జలం = ఉత్సర్గజలం, జలస్య వ్యయః ఉత్సర్గజలవ్యయః, తైః, ఉత్సర్గ జలవ్యయైః.

నిజాయశోయుగం:— న యశసీ = అయశసీ, అయశసోఃయుగం = అయశోయుగం, నిజం చ తత్ అయశోయుగం చ = నిజాయశోయుగమ్ ॥

ద్విఫాలబద్ధాః :— ద్వౌ చ తౌ ఫాలౌ చ = ద్విఫాలౌ = ద్విఫాలయోః బద్ధాః = ద్విఫాల బద్ధాః

భావము ;—

ఆ నలుడు మేరుపర్వతమును భాగములు చేసి, యాచకులకు స్వాధీనము గావింపకుండుటవలనను దానముకై సముద్ర జలమును వినియోగించి దానిని నీరు లేని మరు ప్రదేశముగ చేయక పోవుటవలనను, ఏర్పడిన అపకీర్తులు రెండును తలకు ఇరువైపుల వెంట్రుకలుగ నేర్పడినవై తన తల యందున్నట్లు ఆ నలునిచే భావింపఁబడినది.

శ్లో॥ అజస్రమభ్యాసముపేయుషా సమం
ముదైవ దేవః కవినా బుధేన చ ।
దధౌ పటీయాన్సమయన్నయన్నయం
దినేశ్వర శ్రీరుదయం దినే దినే ॥ ౧౭

ప॥వి॥ అజస్రమ్ । అభ్యాసమ్ । ఉపేయుషా । సమమ్ । ముధా । ఏవ । దేవః । కవినా । బుధేన । చ । దధౌ । పటీయాన్ । సమయమ్ । నయన్ । అయమ్ । దినేశ్వరశ్రీః । ఉదయమ్ । దినే దినే ।

టీక॥ దినేశ్వరశ్రీః = దినేశ్వర = సూర్యుని యొక్క శ్రీః = కాంతి వంటి కాంతి కల్గిన పటీయాన్ = సమర్థుడైన అయమ్ = ఈ దేవః = నలమహారాజు, (సూర్య పక్షమున) దేవుడు. అజస్రమ్ = ఎల్లప్పుడు. ముదా = సన్మానమువలన నేర్పడు సంతోషముతో. అభ్యాసమ్ = సమీపమును. ఉపేయుషా = పొందుచున్న. కవినా = కవులచేతను (శుక్రుని చేతను) బుధేన చ = పండితులచేతను. (బుధుని చేతను) సమయమ్ = కాలమును.

నయన్ = గడపుచు. దినేదినే = ప్రతి దినమునందును ఉదయమ్ = అభివృద్ధిని (ఉదయించుటను) దధౌ = ధరించెను.

"దినేశ్వర శ్రీః" :– అనునెడ రాజునందు సూర్యుని లక్ష్మిని ఆరోపించుటవలన నిదర్శనాలంకారము. దేవ-కవి-బుధ-ఉదయ శబ్దములు రెండు అర్థములు కలిగినవై సూర్యపరమగు నర్థము నొసంగుటవలన శ్లేషాలంకారమును, ఈ రెంటికిని సంకరము నిటకలదు.

సమాసములు :

దినేశ్వరశ్రీః :– దినస్య ఈశ్వరః దినేశ్వరః దినేశ్వరస్య శ్రీరివ శ్రీః యస్య సః దినేశ్వరశ్రీః ॥

భావము :–

సూర్యుని శోభవంటి శోభగల యీ నలుఁడు, ఎల్లప్పుడును తన యొద్దకు సన్మానాదులచే సంతోషించి విచ్చేయు కవులతోడను, పండితులతోడను కూడినవాడై కాలమును గడుపుచు నభివృద్ధి నొందుచుండెను.

సూర్య భగవానుడు, తన సమీపమున సంచరించు బుధ శుక్రులతో కూడినవాడై ప్రతి దినము నుదయించుచుండెను. జ్యోతిశ్శాస్త్రము ననుసరించి సూర్యునకు బుధ శుక్రు లెల్లప్పుడును సన్నిహితులై యుందురు.

శ్లో॥ అధోవిధానాత్కమల ప్రవాళయో
శ్శిరస్సు ధానాదఖిలక్షమాభుజామ్ ।
పురేదమూర్ధ్వం భవితీతి వేధసా
పదం కిమస్యాంకితమూర్ధ్వరేఖయా ॥ ౧౮

ప॥వి॥ అధః । విధానాత్ । కమలప్రవాళయోః । శిరస్సు । ధానాత్ । అఖిలక్షమాభుజామ్ । పురా । ఇదమ్ । ఊర్ధ్వమ్ । భవితా । ఇతి । వేధసా । పదమ్ । కిమ్ । అస్య । అంకితమ్ । ఊర్ధ్వరేఖయా ।

టీక॥ కమల ప్రవాళయోః కమల = పద్మమును. ప్రవాళ = చిగురుటాకును. అధోవిధానాత్ = తిరస్కరించుటవలనను. అఖిలక్షమాభుజామ్ = సమస్త భూపాలుర యొక్క. శిరస్సు = తలలయందు. ధానాత్ =

ఉంచుటవలనను. ఇదమ్ = ఈ. అస్య = ఈ నలునియొక్క. పదమ్ = పాదము. ఊర్ధ్వమ్ = ఉత్కృష్టముగను, పై నున్న దిగను. పురా భవతీతి = కాగలదని యెంచి. వేధసా = బ్రహ్మచే. ఊర్ధ్వరేఖయా = ఊర్ధ్వ రేఖచే అంకితం కిమ్ = గుర్తింపబడినదా ఏమి?

ఇచ్చట కమల ప్రవాళమును తిరస్కరించుటవలన సౌందర్యాతిశయోక్తియు, సమస్త రాజుల తలపై నుంచుటవలన శౌర్యాతిశయోక్తియు "ఊర్ధ్వ రేఖచే గుర్తింపబడినదా ఏమి?" యని చెప్పుటవలన ఉత్ప్రేక్షయు నలంకారములు.

ఊర్ధ్వరేఖ అనునది సాముద్రిక శాస్త్రమునఁ జెప్పఁబడిన ఒక రేఖ. ఈ రేఖగల పాదము సర్వోత్తమమని సాముద్రికులు చెప్పుచున్నారు.

సమాసములు :-

కమల ప్రవాళయోః :- కమలంచ-ప్రవాళంచ - కమలప్రవాళే - తయోః కమల ప్రవాళయోః

అఖిలక్షమాభుజామ్ :- అఖిలాశ్చతే క్షమాభుజశ్చ - అఖిలక్షమాభుజః తేషాం = అఖిలక్షమాభుజామ్.

**భావము :-**

ఈ నలుని పాదము కమలమును, చిగురుటాకును తిరస్కరించుటవలనను సమస్త భూపాలుర శిరస్సుల యందుండుటవలనను, రానున్న కాలమున ఈ పాదము ఉన్నత స్థలముల యందుండ గలదని బ్రహ్మ భావించి యీ పాదమును ఊర్ధ్వ రేఖతో గుర్తించెనా యేమి యనితోచుచున్నది. సౌందర్య శౌర్యములతో నీ పాదము సర్వశ్రేష్ఠముగ నుండగలందులకు బ్రహ్మ ఊర్ధ్వ రేఖ నిందుంచెను.

శ్లో॥ జగజ్జయం తేన చ కోశమక్షయం
ప్రణీతవాఞ్శైశవ శేషవానయమ్ ।
సఖా రతీశస్య ఋతుర్యథా వనం
వపుస్తథాలింగ దథాస్య యౌవనమ్ ॥ ౧౯

ప॥వి॥ జగజ్జయమ్ । తేన । చ । కోశమ్ । అక్షయమ్ । ప్రణీతవాన్ । శైశవ శేషవాన్ । అయమ్ । సఖా । రతీశస్య । ఋతుః । యథా । వనమ్ । వపుః । తథా । ఆలింగత్ । అథ । అస్య । యౌవనమ్ ।

టీక॥ అయమ్ = ఈ నలుడు. శైశవశేషవాన్ = కొలఁదిగ మిగిలిన బాల్యావస్థ గలవాడుగనే, జగజ్జయమ్ = ప్రపంచ విజయమును. తేన = ప్రపంచ విజయముచే. అక్షయమ్ = తఱుగని. కోశమ్ = ద్రవ్యరాశిని. ప్రణీతవాన్ = సమకూర్చెను. అథ = పిదప. రతీశస్య = మన్మథునకు సఖా = చెలికాఁడగు. ఋతుః = ఋతువైన. వసంతః = వసంతుడు, వనం యథా = అరణ్యమునెట్లో. తథా = అట్లు. యౌవనం = జవ్వనము. అస్య = ఇతని యొక్క. వపుః = శరీరమును. ఆలింగత్ = కౌగిలించెను.

ఇచ్చట వసంతుఁడు వనమును కౌగిలించినట్లు యౌవన మీతని కౌగిలించి నదని యథా తథా శబ్దములతో వర్ణించుటవలన ఉపమాలంకారము.

సమాసము :-

జగజ్జయమ్ :- జగతాం జయః - జగజ్జయః, తం జగజ్జయమ్.
శైశవశేషవాన్ :- శిశోర్భావః - శైశవం, శైశవస్య శేషః - శైశవ శేషః, శైశవశేషః అస్య అస్తీతి = శైశవ శేషవాన్.

భావము :-

కొంత బాల్యదశ మిగిలి యుండగనే, ప్రపంచ విజయమును, సంపాదించినవాడై, తఱుగని ధనరాశిని చేకూర్చుకొనెను. తర్వాత మన్మథుని చెలికాఁడగు వసంతుడు వనములను కౌగిలించునట్లు యౌవన మితనిని కౌగిలించినది. అనగా బాల్యము తొలగి యౌవనము వచ్చినదని యభిప్రాయము.

శ్లో॥ అధారి పద్మేషు తదంఘ్రిణా ఘృణా
క్వ తచ్ఛయచ్ఛాయలవోఽపి పల్లవే।
తదాస్యదాస్యేఽపి గతోఽధికారితాం
న శారదః పార్వికశర్వరీశ్వరః ॥ ౨౦

ప॥వి॥ అధారి। పద్మేషు । తదంఘ్రిణా । ఘృణా । క్వ । తచ్ఛయచ్ఛాయాలవః । అపి । పల్లవే । తదాస్యదాస్యే । అపి । గతః । అధికారితామ్ । న । శారదః । పార్వికశర్వరీశ్వరః ।

టీక॥ తదంఘ్రిణా = ఆనలుని పాదముచే. పద్మేషు = కమలముల విషయమున. ఘృణా = ఏవగింపు. అధారి = ధరింపబడినది. పల్లవే = చిగురుటాకునందు. తచ్ఛయచ్ఛాయలవః అపి = తత్ = ఆ నలుని యొక్క. శయ = అఱచేతియొక్క. ఛాయ = కాంతి యొక్క. లవః అపి = లేశమైనను. క్వ = ఎక్కడ. శారదః = శరదృతువునందలి. పార్వికశర్వరీశ్వరః = పున్నమనాటి చంద్రుఁడు, తదాస్య దాస్యేఽపి, తత్ = ఆ నలుని యొక్క. ఆస్య = ముఖము యొక్క. దాస్యేఽపి = సేవయందును. అధికారితాం = అధికారము కల్గియుండుటను. న గతః = పొందలేదు.

ఇట్లు పద్మములయందు నలుని పాదమునకు, జుగుప్స సంబంధము లేకపోయినట్లు, జుగుప్స యొక్క సంబంధము చెప్పుటవలన సంబంధాతిశయోక్తి. అట్లే పల్లవమునందు అతని అఱచేతి కాంతిలేశ సంబంధమున్నను సంబంధము లేదని చెప్పుటవలను, అట్లే చంద్రునకు అతని ఆస్య దాస్య సంబంధమున్నను లేదని చెప్పుటవలనను సంబంధాశయోక్తి.

సమాసములు :-

తదంఘ్రిణా :- తస్య-అంఘ్రిః తదంఘ్రిః. తేన తదంఘ్రిణా.

తచ్ఛయచ్ఛాయలవః :- తస్య-శయః తచ్ఛయః. తచ్ఛయస్య ఛాయా తచ్ఛయచ్ఛాయా. తచ్ఛయచ్ఛాయస్య లవః తచ్ఛయచ్ఛాయలవః ।

తదాస్యదాస్యే :- తస్య ఆస్యం తదాస్యం. తదాస్యస్య దాస్యం తదాస్యదాస్యం, తస్మిన్, తదాస్యదాస్యే.

పార్వికశర్వరీశ్వరః :- పర్వణి భవః = పార్వికః, శర్వర్యాః ఈశ్వరః = శర్వరీశ్వరః। పార్వికశ్చాసౌ శర్వరీశ్వరశ్చ = పార్వికశర్వరీశ్వరః.

భావము :-

ఆ నలుని పాదము పద్మముల యందు ఏవగింపును కల్గియుండినది. అతని అఱచేతి కాంతి లేశము గూడ చిగుఱుటాకుల యందు లేకపోయినది.

శరత్కాలపు పున్నమ చంద్రుడు అతని మోమునకు దాస్యము చేయునధికార మును గూడ గోల్పోయెను. అనగా అతని పాదములును హస్తములును ముఖ మును సాటిలేనివని యభిప్రాయము.

శ్లో॥ కిమస్య రోమ్ణాం కపటేన కోటిభిః
విధిర్న లేఖాభిరజీగణద్ గుణాన్ ।
న రోమకూపౌఘమిషాజ్జగత్కృతా
కృతాశ్చ కిం దూషణశూన్యబిందవః ॥ ౨౧

ప॥వి॥ కిమ్ । అస్య । రోమ్ణామ్ । కపటేన । కోటిభిః । విధిః । న । రేఖాభిః । అజీగణత్ । గుణాన్ । న । రోమకూపౌఘమిషాత్ । జగత్కృతా । కృతాః । చ । కిం । దూషణ శూన్య బిందవః ।

టీక॥ విధిః = బ్రహ్మ. అస్య = ఈ నలుని యొక్క. గుణాన్ = గుణము లను. రోమ్ణామ్ = రోమముల యొక్క. మిషేణ = నెపముచే. కోటిభిః = కోటి సంఖ్యగల. రేఖాభిః = గీతలచే. నాజీగణత్ కిమ్ = లెక్కించ లేదా ఏమి? జగత్కృతా = బ్రహ్మచే. రోమకూపౌఘ మిషాత్ = రోమ కూపములనెడి నెపముచే. దూషణ శూన్య బిందవః = దూషణ = దోష ముల యొక్క. శూన్య = లేమికి. బిందవః = జ్ఞాపకపు గుండ్రని గీత లుగ. న కృతాః కిమ్ = చేయఁబడలేదా ఏమి?

ఇచ్చట రోమ్ణాం కపటేన అని రోమముల నెపము చేతనను నెడ కపట శబ్దము చేతను "రోమ కూపౌఘ మిషాత్" అని రోమ కూపముల యొక్క సమూహము యొక్క నెపము చేత ననునెడ మిష శబ్దము చేతను, రోమముల యొక్కయు, రోమ కూపముల యొక్కయు నైసర్గిక రూపములను మఱుగు పరచి వాని యందు గుణములను లెక్కించు రేఖల రూపమును, దోషములేదని సూచించు బిందువుల రూపమును ఉత్ప్రేక్షించుటవలన అపహ్నవములతోఁ గూడిన ఉత్ప్రేక్షలకు నిట సంసృష్టి-

సమాసములు !

రోమకూపౌఘమిషాత్ : రోమ్ణాం, కూపాః రోమ కూపాః, రోమ

కూపానామోఘః = రోమకూపౌఘః ఓఘస్య మిషః తస్మాత్ = రోమ కూపౌఘమిషాత్ ।

జగత్కృతా : జగత్ కరోతీతి = జగత్కృత్. తేన. జగత్కృతా.
దూషణశూన్యబిందవః : దూషణస్య శూన్యం = దూషణ శూన్యం దూషణశూన్యస్య బిందవః దూషణ శూన్య బిందవః.

భావము:

బ్రహ్మ నలుని గుణములను అతని రోమములను నెపముతో నున్న కోటి రేఖలతో నెంచుచున్నాడు. మరియు నా బ్రహ్మ నలుని శరీరమందలి రోమ కూపముల నెపముతో నలునియందు నేలాటి దోషములు లేవని సూచించు బిందువులను ఉంచినాడు. అనగా నలుని గుణములు అసంఖ్యాకములని యతని రోమ రేఖలు సూచించుచున్నవి. అతని రోమ కూపములును, బిందువులు ఆనలుని యందేలాటి దోషములు లేవని సూచించుచున్నవి.

శ్లో॥ అముష్య దోర్భ్యామరిదుర్గలుణ్ఠనే
ధ్రువం గృహీతార్గలదీర్ఘపీనతా।
ఉరశ్శ్రియా తత్ర చ గోపురస్ఫుర
త్కవాటదుర్ధర్షతిరః ప్రసారితా॥ ౨౨

ప॥ వి॥ అముష్య । దోర్భ్యామ్ । అరిదుర్గలుంఠనే । ధ్రువమ్ । గృహీతా । అర్గల దీర్ఘపీనతా । ఉరశ్శ్రియా । తత్ర । చ । గోపురస్ఫురత్కవాట దుర్ధర్ష తిరః ప్రసారితా ।

టీక॥ అముష్య = ఈ నలుని యొక్క. దోర్భ్యామ్ = భుజములచే. అరిదుర్గ లుణ్ఠనే = శత్రుదుర్గములను పడగొట్టు విషయమున. అర్గళదీర్ఘపీనతా = అర్గల = కోటగడియల యొక్క. దీర్ఘపీనతా = పొడుగు తనము లావుతనము. గృహీతా = గ్రహించబడినది. ధ్రువం = నిశ్చయము. కించ = మఱియు. అముష్య = ఇతనియొక్క. ఉరః శ్రియా = వక్షఃస్థల లక్ష్మిచే తత్ర = ఆ శత్రు దుర్గములను పడగొట్టు విషయమున. గోపుర స్ఫురత్ కవాట దుర్ధర్ష తిరః ప్రసారితా = గోపుర = నగర ద్వారముల

యందు. స్ఫురత్ = ప్రకాశించు. కవాట = తలుపుల యొక్క. దుర్ధర్ష = తిరస్కరింప సాధ్యముకానట్టి. తిరఃప్రసారితా = అడ్డముగా వ్యాపించు వైశాల్యము. గృహీతా = గ్రహింపఁబడినది. ధ్రువం = నిశ్చయము.

బాహువుల యందు అర్గలదీర్ఘ పీనత్వ గ్రహణము లేకపోయిన ఉన్నట్లు చెప్పట చేతను, వక్షఃస్థలమునందు కవాట దుర్ధర్షతిరః ప్రసారితాశ్రీగుణము లేకపోయినను ఉన్నట్లు చెప్పుటచే నిట ఉత్ప్రేక్షాలంకారములు- ఆ రెంటికినిట సంసృష్టి.

సమాసములు :

(1) అరిదుర్గలుణ్ఠనే : అరీణాం దుర్గాణి, అరిదుర్గాణి అరిదుర్గాణాం లుణ్ఠనమ్ అరిదుర్గలుణ్ఠనమ్ తస్మిన్ అరిదుర్గలుణ్ఠనే.

(2) అర్గలదీర్ఘపీనతా : దీర్ఘాని చ తాని పీనానిచ దీర్ఘపీనాని దీర్ఘపీనానాం భావః దీర్ఘపీనతా, అర్గలానాం, దీర్ఘపీనతా అర్గలదీర్ఘ పీనతా।

(3) ఉరఃశ్రియా : ఉరసః శ్రీః ఉరశ్శ్రీః తయా ఉరఃశ్రియా.

(4) గోపుర...ప్రసారితా : గోపురేషు స్ఫురన్తి, గోపురస్ఫురన్తి స్ఫురన్తి చ తాని, కవాటాని చ, గోపురస్ఫురత్ కవాటాని, దుర్ధర్షాణి చ తాని, తిరః ప్రసారీణి చ, దుర్ధర్షతిరఃప్రసారీణి, ప్రసారిణాం భావః ప్రసారితా. గోపుర స్ఫురత్ కవాటానాం దుర్ధర్షతిరః ప్రసారితా, గోపుర...ప్రసారితా.

భావము :

ఈ నలునియొక్క భుజములు శత్రుదుర్గములను బడగొట్టు విషయమున కోట గడియలయొక్క పొడవును లావును కల్గియుండినవి. అట్లే ఇతని వక్షస్థలము నగర ద్వారముల యందలి తలుపుల యొక్క దృఢత్వమును వైశాల్యమును వహించి యుండినవి. అనగా ఇతని భుజములు, దీర్ఘపీనములుగ వక్షస్థలము దృఢ విశాలముగను ఉండెనని భావము.

శ్లో॥ స్వకేళిలేశస్మితనిర్జితేందునో
నిజాంశదృక్తర్జిత పద్మసంపదః ।
అతద్ద్వయీజిత్వరసుందరాంతరే
న తన్ముఖస్య ప్రతిమా చరాచరే॥ ౨౩

ప॥ ని॥ స్వకేళిలేశస్మితనిర్జితేందునః । నిజాంశదృక్తర్జితపద్మసంపదః ।
అతద్ద్వయీజిత్వరసుందరాంతరే । న । తన్ముఖస్య । ప్రతిమా :
చరాచరే ।

టీక॥ స్వకేళి...ఇందునః. స్వకేళిలేశ = తన విలాసము యొక్క అంశమైన స్మిత = నవ్వుచే.నిర్జిత = జయింపబడిన.ఇందునః = చంద్రుడుగలదియు నిజాంశ...సంపదః. నిజాంశ = తన అవయవమగు. దృక్ = నేత్రముచే, తర్జిత = బెదరింపబడిన. పద్మసంపదః = కమలముల యొక్క శోభ కలిగినదియు నగు. తన్ముఖస్య = ఆ నలుని ముఖమునకు. అతద్ద్వయీ...రాంతరే = ఆ చంద్రుని పద్మము అను రెంటిని జయించగల సుందరమగు మరి యొక వస్తువులేని. చరాచరే = ప్రపంచమునందు. ప్రతిమా = ఉపమానము. న = లేదు.

ఇచ్చట నలుని ముఖమునందలి ఉపమాన రాహిత్యమునకు చంద్రారవింద విజయము హేతువు అగుటవలన పదార్థ హేతువైన కావ్యలింగాలంకారము.

సమాసము -

స్వకేళి...ఇందునః. స్వస్య కేళిః స్వకేళిః. స్వకేళేః లేశః స్వకేళిలేశః. లేశ ఏవ స్మితం లేశస్మితం. లేశస్మితేన నిర్జితః ఇందుః యేన తత్. స్వకేళి ...ఇందుః. తస్య స్వకేళి ఇందునః.

(2) నిజాంశ...సంపదః :- నిజశ్చాసౌ అంశశ్చ నిజాంశః నిజాంశ ఏవ దృక్ నిజాంశదృక్, పద్మస్య సంపదః పద్మసంపదః పద్మసంపదః, దృశా తర్జితాః దృక్ తర్జితాః. తర్జితాః పద్మసంపదః యేన తత్, నిజాంశ...సంపదః

(3) అతద్ద్వయీ...సుందరాంతరే:- తయోః ద్వయీ తద్ద్వయీ తద్ద్వయ్యాః జిత్వరం తద్ద్వయీ జిత్వరమ్, అన్యత్ సుందరం సుందరాంతరం. జిత్వరం చ తత్ సుందరాంతరం చ, తద్ద్వయీ జిత్వర సుందరాంతరం, అవిద్యమానం, తద్ద్వయీ జిత్వరసుందరాంతరం యస్మిన్, తత్, అతద్ద్వయీ జిత్వర సుందరాంతర తస్మిన్ అతద్ద్వయీ...సుందరాంతరే

(4) తన్ముఖస్య :-తస్య ముఖం తన్ముఖం. తస్య తన్ముఖస్య

(5) చరాచరే:- చరం చ తత్ అచరం చ. చరాచరం తస్మిన్ చరాచరే

భావము :-

తన విలాసలేశమైన నవ్వుచే చంద్రుని జయించినదియు. తన అవయవమగుటచే పద్మశోభను బెదిరించినదియు నగు ఆ నలుని ముఖమునకు ఆ చంద్రుని పద్మమును ఓడింపగల సుందర వస్తువులేని ఈ ప్రపంచమున ఉపమానమే లేక పోయినది.

శ్లో॥ సరోరుహం తస్య దృశైవ నిర్జితం
జితాఃస్మితేనైవ విధోరపి శ్రియః ।
కుతః పరం భవ్యమహో మహీయసీ
తదాననస్యోపమితౌ దరిద్రతా ॥ ౨౪

ప॥వి॥ సరోరుహమ్ । తస్య । దృశా । ఏవ । నిర్జితమ్ । జితాః । స్మితేన । ఏవ। విధోః । అపి । శ్రియః । కుతః । పరమ్ । భవ్యమ్। అహో । మహీయసీ । తదాననస్య । ఉపమితౌ । దరిద్రతా ।

టీక॥ తస్య = ఆ నలుని యొక్క. దృశైవ = కంటి చేతనే సరోరుహమ్ = తామర పుష్పము. నిర్జితమ్ = జయింపబడినది. స్మితేనైవ = మందహాసము చేతనే. విధోః = చంద్రుని యొక్క. శ్రియోపి = కాంతులున్ను. జితాః = ఓడింపబడినవి. పరమ్ = వీనికంటె వేరైన భవ్యమ్ = అందమైన వస్తువు. కుతః = ఎక్కడ వున్నది. తదాననస్య = అతని ముఖమునకు. ఉపమితౌ = ఉపమాన విషయమున. దరిద్రతా = లేమి. మహీయసీ = గొప్పదిగ ఏర్పడినది.

ఇచ్చట చంద్రారవింద విజయ రూపమైన వాక్యార్థము ఉపమాన దారిద్ర్య హేతువు కాన వాక్యార్థ హేతుకమగు కావ్యలింగాలంకారము.

భావము:

అతని నేత్రము చేత తామర పుష్పము జయింపబడినది. ఆ నలుని యొక్క మందహాసముచే చంద్రుని కాంతులు ఓడింపబడినవి. ఈ రెంటి కంటె అందమైన వస్తువు ప్రపంచమున లేదు కదా! కావున అతని ముఖమునకు ఉపమానమే లభించుటలేదు.

శ్లో॥ స్వవాలభారస్య తదుత్తమాంగజై
స్స్వయం చమర్యేవ తులాభిలాషిణః ।
అనాగసే శంసతి బాలచాపలం
పునఃపునః పుచ్ఛవిలోలనచ్ఛలాత్ ॥ ౨౫

ప॥వి॥ స్వవాలభారస్య । తదుత్తమాంగజైః । స్వయమ్ । చమరీ । ఏవ । తులాభిలాషిణః । అనాగసే । శంసతి । బాలచాపలం । పునః పునః । పుచ్ఛ విలోలనచ్ఛలాత్-

టీక॥ చమరీ = చమరీ మృగము. స్వయమేవ = తానే, తదుత్తమాంగజైః = నలుని తల వెంట్రుకలతో. తులాభిలాషిణః = సామ్యమును కోరెడి. స్వవాల భారస్య = తన వెంట్రుకల సమూహామునకు. అనాగసే = గొప్ప వారితో సామ్యమును కోరుటవలన ఏర్పడెడి అపరాధము తొలగుటకై. పునః పునః = మరల మరల పుచ్ఛ విలోలనచ్ఛలాత్ = తోకను విదలించుట యనెడి వ్యాజమువలన. వాలచాపలమ్ = రోమములను కదలించుటను, బాలచాపలమ్ = బాల్యపు చాపల్యమును. శంసతి = చెప్పుచున్నది.

ఇచ్చట తోకను విదిలించుటను ఛల శబ్దము చేత మరుగు బరచి, వకార బకారములకు అభేదమును అధ్యవసాయము చేసి బాలచాపల్యమును ఆరోపించుటవలన అపహ్నవాలంకారము.

సమాసములు :

(1) స్వవాలభారస్య : స్వస్య వాలః స్వవాలః స్వవాలస్య భారః, తస్య, స్వవాలభారస్య.

(2) తదుత్త మాంగజైః : తస్య ఉత్తమాంగం తదుత్తమాంగం. తదుత్తమాంగాత్, జాయంతే ఇతి తదుత్తమాంగజాః. తైః తదుత్తమాంగజైః

(3) తులాభిలాషిణః ; తులాయాః : అభిలాషి, తులాభిలాషి తస్య తులాభిలాషిణః

(4) అనాగసే : ఆగసః అభావః, అనాగః, తస్మై అనాగసే

వాలచాపలమ్ : వాలస్య చాపలమ్ తత్ = వాలచాపలమ్
బాలస్య చాపలమ్ : బాలచాపలమ్ తత్ = బాలచాపలమ్.
పుచ్ఛవిలోలనచ్ఛలాత్ : పుచ్ఛస్య విలోలనమ్ = పుచ్ఛవిలోలనమ్, పుచ్ఛవిలోలనస్య ఛలమ్ = పుచ్ఛవిలోలనచ్ఛలమ్. తస్మాత్ = పుచ్ఛ విలోలనచ్ఛలాత్.

భావము :

చమరీ మృగముయొక్క వెంట్రుకలు నలుని కురులతో సామ్యమపేక్షించి యపరాధము గావించినవి. తక్కువ శ్రేణికి జెందినవానితో సామ్యముఁ గోరుట గొప్ప యపరాధముగదా! కావున చమరీమృగ మా యపరాధమునుఁ దొలగింపఁ జేసికొనుటకై తన వాల చాపలమును (వెంట్రుకల చాపలమను నపరాధమును) బాలచాపలమని తన తోకను జాడించుటయను నెపముతోఁ జెప్పుచుండినది బాల్యమందలి చేష్టలు క్షమింపఁ దగినవిగదా. "వాలచాపలమ్మ"నునెడ వకార బకారముల యొక్క యభేదమును బురస్కరించి, వాలచాపలమును బాలచాపలముతో నభిన్నము గావించుటవలన నీ యర్థము సిద్ధించినది.

శ్లో॥ మహీభృతస్తస్య చ మన్మథశ్రియా
నిజస్య చిత్తస్య చ తం ప్రతీచ్ఛయా ।
ద్విధా నృపే తత్ర జగత్త్రయీభువాం
నతభ్రువాం మన్మథవిభ్రమోఽభవత్ ॥ ౨౬

ప॥ వి॥ మహీభృతః । తస్య । చ । మన్మథశ్రియా । నిజస్య । చిత్తస్య । చ । తం । ప్రతి । ఇచ్ఛయా । ద్విధా । నృపే । తత్ర । జగత్త్రయీభువాం । నతభ్రువాం । మన్మథవిభ్రమః । అభవత్ ।

టీ॥ తస్య = ఆ. మహీభృతః = నలమహారాజుయొక్క. మన్మథశ్రియా = మన్మథుని వంటి సౌందర్యముచేతను. నిజస్య = తనయగు. చిత్తస్య = మనస్సుయొక్క. తం ప్రతి = ఆ నలుని గూర్చి ఇచ్ఛయా చ = అనురాగము చేతను. తత్ర నృపే = ఆ నలమహారాజు విషయమున. జగత్త్రయీభువాం = ముల్లోకములలోనున్న. నతభ్రువాం = స్త్రీలకు. ద్విధా =

రెండువిధములుగ అనగా సౌందర్యము వలన మన్మథ భ్రాన్తియు తమ కతనిపైఁ గల్గిన యనురాగము వలన మన్మథ వికారము నను రెండు విధములుగ. మన్మథ విభ్రమః = మన్మథ వికారము, **అభవత్** = **ఆయెను.**

ఇచ్చట నలసౌందర్యమునకు, విశ్వ వనితల యిచ్ఛకును, శ్లిష్ట పదములచే సమకూర్పఁ బడిన విభ్రమద్వయముతో క్రమముగ సంబంధ ముండుట వలన శ్లేష సంకీర్ణమగు యథా సంఖ్యాలంకారము.

**సమాసములు :**

మన్మథశ్రియా : మన్మథస్యేవ శ్రీః = మన్మథశ్రీః తయా. మన్మథశ్రియా.
జగత్త్రియీభువాం : జగతాం త్రయీ = జగత్త్రియీ జగత్త్రియ్యాం, భవన్తీతి జగత్త్రియీభువః = తాసాం జగత్త్రియీభువాం.
మన్మథ విభ్రమః : మన్మథ ఇతి విభ్రమః - మన్మథ విభ్రమః మన్మథస్య విభ్రమః = మన్మథ విభ్రమః.

**భావము:**

ముజ్జగములలోని స్త్రీలకు యా నలుని మన్మథ శోభచేతను, నలుని పొందవలయుననెడి యనురాగము చేతను, నా నలుని విషయమున మన్మథుడను భ్రాన్తియు మన్మథ వికారము నని రెండు విధములు గల మన్మథ విభ్రమ మేర్పడినది. అనగా నలుఁడు మన్మథునివలే సుందరుఁడుగ నుండుటవలన నతనిపై మన్మథుడను భ్రమ ఏర్పడినది. ఆతనిపైఁ గామము వలన మన్మథ వికార మేర్పడినదని యాశయము.

శ్లో॥ నిమీలనభ్రంశజుషా దృశా భృశం
నిపీయ తం యస్త్రిదశీభిరార్జితః ।
అమూస్తదభ్యాసభరం వివృణ్వతే
నిమేష నిస్స్వైర ధునాపి లోచనైః ॥ — ౨౭

ప॥ వి॥ నిమీలనభ్రంశజుషా । దృశా । భృశం । నిపీయ । తం । యః ।

త్రిదశీభిః । ఆర్జితః । అమూః । తదభ్యాసభరం । వివృణ్వతే । నిమేష నిస్స్వైః । అధునా । అపి । లోచనైః.

టీక॥ త్రిదశీభిః = దేవతాస్త్రీలచే. నిమీలనభ్రంశజుషా = ఱెప్పపాట్లులేని. దృశా = దృష్టిచే. తం = ఆ నలుని. భృశం = గాఢముగ. నిపీయ = పానముచేసి. (చూచి) యః = ఏ. అభ్యాస భరః = అలవాటు భారము అర్జితః = సంపాదింపఁబడినదో. అమూః = ఈ దేవతాస్త్రీలు. తం = ఆ అభ్యాసభరం = ఆ అలవాటులోని అతిశయమును. నిమేషనిస్స్వైః = ఱెప్పపాట్లులేని లోచనైః = నేత్రములచే. అధునాఽపి = ఇప్పటికిని వివృణ్వతే = ప్రకటించుచున్నారు.

దేవతా స్త్రీలకు ఱెప్పపాట్లు లేక యుండుట స్వభావ సిద్ధము. ప్రస్తుత మా ఱెప్పపాట్లు లేని స్థితి, నలుని ఱెప్పలు వాల్చక చూచుటవలని యభ్యాసముచే నేర్పడినవని యిట నుత్ప్రేక్షితము. వ్యంజక ప్రయోజనము లేనందువలన నిది యిట గమ్యము.

సమాసములు :

నిమీలన భ్రంశజుషా : నిమీలనానాంభ్రంశః = నిమీలనభ్రంశః. నిమీలన భ్రంశంజుషతీతి = నిమీలనభ్రంశజుట్. తయా = నిమీలనభ్రంశజుషా.
అభ్యాస భరమ్ : అభ్యాసస్య భరః = అభ్యాసభరః. తమ్ = అభ్యాసభరం
నిమేష నిస్స్వైః : నిర్గతం స్వం యేభ్యస్తాని = నిస్స్వాని. నిమేషైః నిస్స్వాని = నిమేష నిస్స్వాని. తైః = నిమేషనిస్స్వైః.

భావము ;—

దేవతాస్త్రీలు ఱెప్పపాట్లులేని దృష్టితో నా నలునిఁ జూచి సంపాదించిన యభ్యాసము నిప్పటికిని యుంచుకొని ఱెప్పపాట్లు లేక చూచుట కా యలవాటును నేటికిని ప్రకటించుచున్నారు సహజముగ దేవతలు ఱెప్పపాట్లు లేనివారైనను నవి సహజముగాక నలుని ఱెప్పపాట్లు లేక చూచుట వలన నలవడినవని కవి కల్పన.

శ్లో॥ అద స్తదాకర్ణి ఫలాఢ్య జీవితం
దృశోర్ద్వయం న స్తదవీక్షి చాఫలం।
ఇతి స్మ చక్షుశ్శ్రవసాం ప్రియా నలే
స్తువన్తి నిందంతి హృదా తదాత్మనః ॥ ౨౮

ప॥ వి॥ అదః । తదాకర్ణి । ఫలాఢ్యజీవితం । దృశోః । ద్వయం । నః । తదవీక్షి । చ । అఫలం । ఇతి । స్మ । చక్షుశ్శ్రవసాం । ప్రియాః । నలే । స్తువన్తి । నిందన్తి । హృదా । తదా । ఆత్మనః.

టీక॥ చక్షుశ్శ్రవసాం = సర్పములయొక్క. ప్రియాః = ప్రియురాండ్రు. అదః = ఈ. నః = మాయొక్క. దృశోః = నేత్రములయొక్క, ద్వయం = జంట. తదాకర్ణిసత్ = ఆ నలుని విన్నదై. ఫలాఢ్య జీవితం = సఫల జీవితము గలదిగను, తదవీక్షి = ఆ నలుని చూడనిదై. అఫలం చ = నిష్ఫలమునైనది. ఇతి = ఈ విధముగ. నలే = నలుని విషయమందు. తదా = ఆ నలుని ప్రసక్తి వచ్చినపుడు. ఆత్మనః = తమ్ము. హృదా — చిత్తముచే. స్తువన్తి స్మ = స్తుతిచేయుచుండినవి. నిందన్తి స్మ = నిందించుచు నుండినవి.

ఇచ్చట నిందాస్తుతి సంబంధము లేకపోయినను ఆ సంబంధము చెప్పఁబడినందువలన అతిశయోక్తి.

సమాసములు :-

(1) తదాకర్ణి : తం ఆకర్ణయతీతి తదాకర్ణి.
(2) ఫలాఢ్య జీవితం : ఫలేన ఆఢ్యం ఫలాఢ్యం. ఫలాఢ్యం జీవితం యస్య తత్ ఫలాఢ్య జీవితం.
(3) తదవీక్షి : వీక్షత ఇతి = వీక్షి, తస్య అవీక్షి = తదవీక్షి
(4) అఫలం : అవిద్యమానం ఫలం యస్య తత్ అఫలం
(5) చక్షుఃశ్రవసాం : చక్షూం ష్యేవ, శ్రవాంసి యేషాం తే చక్షుఃశ్రవసః తేషాం చక్షుశ్శ్రవసాం

భావము :-

నాగకాంతలు నలుని వినుటవలన తమ నేత్రద్వయము సఫలమయిన దనియు, కాని అదేసమయమున నలుని చూడలేకపోయినందువలన నిష్ఫలమైన దనియు భావించి నలుని ప్రసక్తి వచ్చినప్పుడు తమ్ములను హృదయముతో స్తుతి చేసుకొనుచు నున్నవి, నిందించుకొనుచున్నవి. సర్పములకు కనులే చెవులు, అవి వినుచున్నపుడు చూడఁజాలవు, చూచునపుడు వినఁజాలవు. నలునిఁగూర్చి వినునపుడు నలుని చూడలేకపోవుచున్నవి. అందువలన నలునిఁగురించి వినగలిగి నందులకు తమ్ముఁగొని యాడుకొనుచున్నవి. కాని అదే సమయమున నతనిఁ జూడలేకపోయినందులకు తమ్ములను నిందించుకొనుచున్నవి.

శ్లో॥ విలోకయంతీభిరజస్రభావనా
బలాదముం నేత్రనిమీలనేష్వపి।
అలంభి మర్త్యాభిరముష్య దర్శనే
న విఘ్నలేశోఽపి నిమేషనిర్మితః॥ ౨౯

ప॥ వి॥ విలోకయంతీభిః । అజస్రభావనాబలాత్ । అముం । నేత్రనిమీలనేషు । అపి । అలంభి । మర్త్యాభిః । అముష్య । దర్శనే । న । విఘ్నలేశః। అపి । నిమేషనిర్మితః ।

టీక॥ అజస్ర...బలాత్, అజస్ర = నిరంతరము, భావనా = ధ్యానముయొక్క, బలాత్ = ప్రభావమువలన, అముం = ఈ నలుని, నేత్రనిమీలనేష్వపి = కనులుమూసిన సమయమందుకూడ, విలోకయంతీభిః = చూచుచున్న, మర్త్యాభిః = మనుష్య స్త్రీలచే, అముష్య = ఈ నలునియొక్క, దర్శనే = దర్శనమందు, నిమేషనిర్మితః = కనురెప్పపాటుచే నేర్పడిన, విఘ్నలేశోఽపి = విఘ్నము యొక్క లేశముఁగూడ, నాలంభి = పొందఁబడలేదు.

ఇచ్చట మనుష్యులకు అన్నిదశలలోను దర్శనసంబంధము లేకపోయినను అది యున్నట్లు చెప్పుటవలన అతిశయోక్త్యలంకారము.

సమాసములు :-

(1) అజస్రభావనాబలాత్: అజస్రం భావనా, అజస్రభావనా, భావనాయాః బలం భావనాబలం, తస్మాత్, భావనాబలాత్.

(2) నేత్రనిమీలనేషు: నేత్రాణాం నిమీలనాని నేత్రనిమీలనాని· తేషు, నేత్రనిమీలనేషు.

(3) విఘ్నలేశః: విఘ్నస్య లేశః విఘ్నలేశః.

(4) నిమేషనిర్మితః: నిమేషైః నిర్మితః నిమేషనిర్మితః

భావము :-

ఎల్లప్పుడు నలుని భావన చేయుచుండుటవలన ఈ నలుని తమ కనులు మూత(బడినదశయందుకూడ మానవస్త్రీలు చూచుచుండిరి. అందువలన వారికి నలుని చూచుటలో తెప్పపాట్లవలన స్వల్పమైన విఘ్నముకూడ లేకయుండినది. ఎల్లప్పుడు భావనచేయుచుండుటవలన వారికి స్వప్నాదిదశలయందు నిర్నిమేష ముగ నలుని(జూచుట కవకాశముండినది.

శ్లో॥ న కా నిశి స్వప్నగతం దదర్శ తం
జగాద గోత్రస్ఖలితే చ కా న తం।
తదాత్మతాధ్యాతధవా రతే చ కా
చకార కా న స్వమనోభవోద్భవమ్॥ ౩౦

వ॥ వి॥ న। కా । నిశి । స్వప్నగతం । దదర్శ । తం। జగాద । గోత్రస్ఖలితే । చ। కా । న । తం । దదాత్మతాధ్యాతధవా । రతే । చ। కా । చకార । కా। న । స్వమనోభవోద్భవమ్।

టీక॥ కా = ఏస్త్రీ. నిశి = రాత్రియందు. స్వప్నగతం = కలయందులభించిన. తం = ఆ నలుని, నదదర్శ = చూడలేదు. గోత్రస్ఖలితే = పేరు వ్యత్యస్త మయినపుడు. తం = అతనిని. కా = ఎవతె. న జగాద = పిలువలేదు. రతే చ = క్రీడయందు. కా = ఎవతె. తదా...ధదా. తదాత్మతా = నలుని రూపముగ కల్గినట్లుగ. ధ్యాత = భావింప(బడిన. ధవా = భర్తకలదై.

స్వస్య = తనయొక్క, మనోభవోద్భవమ్ = కామోద్రేకమును, న చకార = చేయలేదు,

ఇచట నలుని దర్శనాదులకు సంబంధము లేకపోయినను సంబంధము చెప్పుటవలన నతిశయోక్త్యలంకారము.

సమాసము -

(1) స్వప్నగతం : స్వప్నం గతః, స్వప్నగతః, తం, స్వప్నగతం.
(2) గోత్రస్ఖలితే : గోత్రస్య స్ఖలితమ్, గోత్రస్ఖలితం, తస్మిన్ గోత్రస్ఖలితే.
(3) తదాత్మతాధ్యాతధవా : తస్య ఆత్మా తదాత్మా, తదాత్మనః భావః, తదాత్మతా, తదాత్మతయా ధ్యాతః ధవః, యస్యాస్సా తదాత్మతాధ్యాతధవా
(4) మనోభవోద్భవమ్ : మనోభవస్య ఉద్భవః, మనోభవోద్భవః తం మనోభవోద్భవమ్.

భావము :-

ఏస్త్రీ స్వప్నమునందు లభించిన నలుని చూడకయున్నది. ఎవతె పేరు చెప్పునపుడు పొరబాటుగ నలునిపేరు చెప్పలేదు. ఎవతె రతికాలమునందు నలుని రూపముతో తన భర్తను భావించి కామోద్రేకము నొందలేదు. అనగా అందఱు నన్నియు చేసిరని భావము. కామాంధులు ఏమిచేయరు? అన్నియుఁ జేయగలరు.

శ్లో॥ శ్రియాస్య యోగ్యాహమితి స్వమీక్షితుం
కరే తమాలోక్య సురూపయా ధృతః ।
విహాయ భైమీమపదర్పయా కయా
న దర్పణశ్శ్వాసమలీమసః కృతః ॥ 31

ప॥ వి॥ శ్రియా । అస్య । యోగ్యా । అహమ్ ఇతి । స్వమ్ ఈక్షితుం । కరే । తమ్ । ఆలోక్య । సురూపయా - ధృతః । విహాయ । భైమీమ్ అపదర్పయా । కయా । న । దర్పణః । శ్శ్వాసమలీమసః । కృతః ।

టీక॥ తం = ఆ నలుని. ఆలోక్య = చూచి. శ్రియా = సౌందర్యముచే. అహం నేను. అస్య = ఇతనికి. యోగ్యా = తగినదానను. ఇతి = అని. స్వం తన్ను. ఈక్షితుం = చూచుటకు. కరే = చేతియందు. ధృతః = ధరింపబడిన. దర్పణః = అద్దము సురూపయా = సౌందర్యవతియు, (నేను ఇతనికి తగనని తెలిసికొనినదియు) (అందువలననే) అపదర్పయా = గర్వము తొలగిన, కయా = ఏస్త్రీచే భైమీం = దమయంతిని. విహాయ = వదలి. శ్వాసమలీమసః = నిట్టూర్పులచే మలినమయినదిగ. న కృతః = చేయబడలేదు.

ఇచ్చట స్త్రీల కెవ్వరికిని యిట్టి కార్యముతో సంబంధము లేక పోయినను, దాని సంబంధము చెప్పుటవలన నతిశయోక్తి.

సమాసములు :

(1) అపదర్పయా : అపగతః, దర్పః యస్యాః సా, అపదర్పా తయా అపదర్పయా,

(2) శ్వాసమలీమసః : శ్వాసైః మలీమసః శ్వాసమలీమసః

భావము :

ఆ నలునిచూచి యందములో తా నతనికి దగినదానినా ? యని చూచుట కద్దము చేతనెత్తుకొనిన సౌందర్యవతి సైతము తాను యోగ్యముకాదని తలంచి గర్వముతొలగినదై దమయంతితప్ప మఱి యేస్త్రీ ఆ యద్దమును నిట్టూర్పులచే మలినము చేయలేదు ? దమయంతితప్ప మఱి యేస్త్రీయైనను నద్దమును చూచి నచో తాను నలునకు తగనిదాననని యే గ్రహించును. కావున అతి సౌందర్యవతులుకూడ అద్దమును చూచుకొనుటచే దమ వికాసమును తెలిసికొని నలుని, ఆపేక్షించినందులకు సిగ్గు పొందుచుండిరి.

శ్లో॥ యథోహ్యమానః ఖలు భోగభోజినా
ప్రసహ్య వైరోచనిజస్య పత్తనం।
విదర్భజాయా మదనస్తథా మనో
నలావరుద్ధం వయసైవ వేశితః ॥ 32

ప॥ వి॥ యథా । ఊహ్యమానః । ఖలు । భోగభోజినా । ప్రసహ్య । వైరోచనిజస్య । పత్తనం । విదర్భజాయాః । మదనః । తథా । మనః । నలావరుద్ధం । వయసా । ఏవ । వేశితః ।

టీక॥ మదనః = మన్మథుడు (ప్రద్యుమ్నావతారమందు) భోగభోజినా = సర్పములను తినెడి, గరుడుని. వయసా = పక్షియగు, గురుడునిచే ఊహ్యమానః = మోయబడుచున్నవాడై. అనలావరుద్ధం = అగ్నిచేచుట్టబడిన- వైరోచనిజస్య = బాణాసురునియొక్క, పత్తనం = పట్టణమును. ప్రసహ్య = బలవంతముగ. యథా = ఎట్లు. ప్రవేశితః = ప్రవేశపెట్టఁబడెనో. తథా = అట్లు అద్య = ఇప్పుడు. నలావరుద్ధం = నలునిచే ఆక్రమింపబడిన, విదర్భజాయాః = దమయంతియొక్క, మనః = మనస్సును. భోగభోజినా = సుఖము ననుభవించెడి. వయసా = యౌవనముచేతనే. ఊహ్యమానః = ఊహింపబడుచున్నవాడై, వేశితః = ప్రవేశపెట్టఁబడెను.

ఇచ్చట "యథోహ్యమానః" "మనోనలావరుద్ధం" అను చోట శబ్దశ్లేష, "భోగభోజినా" "వయసా" ఇత్యాది స్థలములయందు అర్థశ్లేష శ్లిష్టవిశేషణములతో నిఁట నుపమాలంకారము. అవి "వయసా" అనునెడ, వయస్సునకును, పక్షికిని చేసిన, అభేదాధ్యవసాయమును మూలముగా కలిగినయతిశయోక్తిచేనను ప్రాణితమైనది, దానితో దీనికి సంకరము.

సమాసములు:

(1) భోగభోజినా : భోగస్యభోజీ, భోగభోజీ, తేన, భోగభోజినా
(2) వైరోచనిజస్య : విరోచనస్య అపత్యం పుమాన్ వైరోచినిః వైరోచనేః జాయతే ఇతి. వైరోచనిజః, తస్య, వైరోచనిజస్య
(3) అనలావరుద్ధం : అనలేన అవరుద్ధం అనలావరుద్ధం.
(4) నలావరుద్ధం ; నలేన అవరుద్ధం నలావరుద్ధం.

భావము :-

ప్రద్యుమ్నావతారమందు మన్మథుడు సర్పములను భక్షించెడి గరుడుని పైనెక్కి యగ్నిచేఁ పరివేష్టింపఁబడిన బాణాసురుని పట్టణమునుఁ ప్రవేశించినట్లు

నలునిచే నాక్రమింపబడిన దమయంతియొక్క మనస్సునందు సుఖము ననుభవింపఁజేయు యౌవన వయస్సుచేత నా మన్మథుఁడు ప్రవేశపెట్టఁబడెను.

శ్లో॥ నృపేఽనురూపే నిజరూపసంపదాం
దిదేశ తస్మిన్ బహుశః శ్రుతిం గతే।
విశిష్య సా భీమనరేంద్రనందనా
మనోభవాజ్ఞైకవశంవదం మనః॥ 33

ప॥ వి॥ నృపే। అనురూపే। నిజరూపసంపదాం। దిదేశ। తస్మిన్, బహుశః శ్రుతిం। గతే। విశిష్య। సా। భీమనరేంద్రనందనా। మనోభవాజ్ఞైక వశంవదం। మనః।

టీక॥ సా = ఆ. భీమనరేంద్రనందనా = దమయంతి. నిజరూపసంపదాం = తన సౌందర్య సంపదలకు. అనురూపే = తగినటువంటి. బహుశః = పెక్కుమందినుండి. శ్రుతిం = చెవిని. గతే = పొందిన. అనురూపే = తగిన. తస్మిన్ = ఆ నృపే = రాజునందు. మనః...మదం. మనోభవ మన్మధునియొక్క. ఆజ్ఞైక = ఆజ్ఞకే. వశంవదం = స్వాధీనమైన. మనః మనస్సును. విశిష్య = విశేషించి దిదేశ = ఇచ్చెను.

సమాసములు :

(1) నిజరూపసంపదాం ; నిజం చ తత్ రూపం చ నిజరూపం నిజ రూపస్య సంపదః నిజరూపసంపదః తాసాం. నిజరూపసంపదాం.

(2) భీమనరేంద్రనందనా : భీమ ఇతి నరేంద్రః. భీమనరేంద్రః. భీమ నరేంద్రస్య నందనా, భీమ నరేంద్రనందనా

(3) మనః...వదం : ఆజ్ఞాచ సా. ఏకాచ. ఆజ్ఞైకా. మనోభవస్యఆజ్ఞైకా మనోభవాజ్ఞైకా. ఏకస్యాః వశంవదం = మనోభవాజ్ఞైక వశంవదం.

భావము:

ఆ దమయంతి తన సౌందర్య సంపదకుఁ దగినవాడును పెక్కుమంది నుండి వినఁబడినవాఁడునునగు, నలునియందు మన్మథుని యాజ్ఞకు లోఁబడిన

తన మనస్సునుంచెను. ఇచ్చట మనస్సంగమనెడి మన్మథావస్థ వర్ణింపబడినది. నలుని గుణములను వినగనే యతనియందు నీమె మనస్సు లగ్నమైనది.

శ్లో॥ ఉపాసనామేత్య పితుః స్మ రజ్యతే
దినేదినే సాఽవసరేషు వందినామ్ ।
పఠత్సు తేషు ప్రతిభూపతీనలం
వినిద్రరోమాఽజని శృణ్వతీ నలమ్ ॥ ౩౪

ప॥ వి॥ ఉపసానామ్-ఏత్య । పితుః । స్మ । రజ్యతే । దినే-దినే । సా । అవసరేషు వందినామ్ । పఠత్సు । తేషు । ప్రతిభూపతీన్ । అలం । వినిద్రరోమా । అజని । శృణ్వతీ । నలమ్ ।

టీక॥ సా = ఆ దమయంతి. దినేదినే = ప్రతిదినమందును. వందినాం = స్తుతిపాఠకులయొక్క. అవసరేషు = సమయములయందు. పితుః = తండ్రియొక్క. ఉపాసనాం = సేవను. ఏత్య = పొంది. తేషు = ఆ స్తుతిపాఠకులు. భూపతీన్ ప్రతి = రాజులనుగుఱించి (స్తుతిం = స్తుతిని) పఠత్సుసత్సు = చదువుచుండగ. నలం = నలుని. శృణ్వతీ = వినుచు. అలం = మిక్కిలి. రజ్యతేస్మ = రంజిల్లుచుండెను. (కావుననే) వినిద్ర రోమా = పైకిలేచిన పులకములుకలదిగ. అజని = ఆయెను.

సమాసములు:

వినిద్రరోమా : వినిద్రాణి, రోమాణి, యస్యాస్సా వినిద్రరోమా.

భావము :

ఆ దమయంతి ప్రతిదినమును స్తుతి పాఠకుల సమయములయందు, తండ్రిసేవను పొంది, యా స్తుతిపాఠకులు రాజులను గుఱించి స్తుతిచేయునపుడు నలునిఁగూర్చి మిక్కిలి యనురక్తురా లగుచుండెను. కావుననే ఆమెకు శరీరమునఁ బులకాంకురము లేర్పడుచుండినవి.

ఇందువలన నిచ్చట రోమాంచములచే నలునియందు ఆమెకు శ్రవణ జన్యాఽనురాగము వ్యక్తమగుచున్నది.

శ్లో॥ కథానుషంగేషు మిథస్సఖీముఖా
త్తృణేఽపి తన్వ్యా నలనామని శ్రుతే।
ద్రుతం విధూయాన్యదభూయతానయా
ముదా తదాకర్ణనసజ్జకర్ణయా ॥ ౩౫

ప॥ వి॥ కథానుషంగేషు। మిథః। సఖీముఖాత్। తృణే। అపి। తన్వ్యా। నలనామని। శ్రుతే। ద్రుతం। విధూయ। అన్యత్। అభూయత। అనయా। ముదా। తదాకర్ణన సజ్జకర్ణయా.

టీక మిథః = అన్యోన్యము లేదా రహస్యమునందు. కథానుషంగేషు = విశ్వాస పూరితములైన గోష్ఠిప్రసంగములయందు. సఖీముఖాత్ = చెలికత్తె ముఖమునుండి. నలనామని = నలమను పేరుగల. తృణేపి = గడ్డిపోచయైనను. శ్రుతే సతి = వినఁబడగా. అనయా = ఈ దమయంతిచే. ద్రుతం శీఘ్రముగా. అన్యత్ = ఇతర కార్యమును. విధూయ = నిరాకరించి. ముదా = సంతోషముతో. తదాకర్ణన సజ్జకర్ణయా = తదకర్ణన = దానిని వినుటయందు. సజ్జ = సిద్ధమైన. కర్ణయా = చెవిగలదిగ. అభూయత = ఉండుట.

గడ్డిపోచపై ప్రయోగింపబడిన నల శబ్దము సైతము మీమెకు నలుని జ్ఞాపకము పఱచుటవలన నలునియందు నీమెకున్న యనురాగము వ్యక్తపడుచున్నది కావున నిచ్చట రాగాతిశయోక్తి.

సమాసములు :

(1) కథానుషంగేషు:— కథానాం, అనుషంగాః కథానుషంగాః తేషు కథానుషంగేషు.

(2) సఖీముఖాత్;— సఖ్యాః ముఖం, సఖీముఖం, తస్మాత్. సఖీముఖాత్

(3) నలనామని:— నల ఇతి నామ యస్య తత్ నలనామ, తస్మిన్ నలనామని.

(4) తదాకర్ణన సజ్జ కర్ణయా:— తస్య ఆకర్ణనం, తదాకర్ణనం, సజ్జౌ కర్ణౌ యస్యాః సా, సజ్జకర్ణా, తదాకర్ణనే, సజ్జకర్ణా, తదాకర్ణన సజ్జకర్ణా, తయా = తదాకర్ణన సజ్జకర్ణయా.

భావము :

రహస్యమున విశ్వాస పూర్వకమైన సంభాషణలలో చెలికత్తె యెవరైనను నలమనెడి గడ్డిని గుఱించి, నలశబ్దమును ప్రయోగించినను దమయంతి యితర కార్యములను వదలివేసి సంతోషముతో నలశబ్దమును వినుటయందే చెవియొగ్గియుండెడిది, ఇందువలన ఈమెకు నలునియందున్నటువంటి రాగాతిశయము వెల్లడియగుచున్నది, ఇదియును శ్రవణాను రాగమునకుదాహరణము.

శ్లో॥ స్మరాత్పరాసోరనిమేషలోచనాత్
బిభేమి తద్భిన్నముదాహరేతి సా।
జనేన యూనస్స్తువతా తదాస్పదే
నిదర్శనం నైషధమభ్యషేచయత్॥ ౩౬

ప॥ వి॥ స్మరాత్। పరాసోః। అనిమేషలోచనాత్। బిభేమి। తద్భిన్నమ్। ఉదాహర। ఇతి। సా। జనేన। యూనః। స్తువతా। తదాస్పదే। నిదర్శనం। నైషధమ్। అభ్యషేచయత్।

టీ॥ పరాసోః = మరణించిన (కావుననే) అనిమేషలోచనాత్ = నిశ్చల నేత్రములుఁ కలిగిన, స్మరాత్ = మన్మథదేవుని నుండి. బిభేమి = భయపడుచున్నాను. తద్భిన్నం = అతనికంటె భిన్నమైన వానిని, ఉదాహర = చెప్పుము. ఇతి = ఇట్లు, సా = ఆదమయంతి. యూనః = యువకులను, స్తువతా = స్తుతిచేసెడి. జనేన = జనముచే. తదాస్పదే = ఆమన్మథుని స్థానమునందు. నిదర్శనం = దృష్టాంతముగ. నైషధం = నిషధదేశపు రాజైన నలుని. అభ్యషేచయత్ = అభిషేకము చేయించెను.

మన్మథుని స్థానమున అతనికి సాటియైన నలుని కభిషేకము జేయుటను దమయంతి హర్షముతో వినుచున్నది, కావున నిచ్చటఁగూడ రాగాతిశయోక్తి.

సమాసములు :

(1) పరాసోః- పరాః అసవః యస్య సః పరాసుః తస్మాత్ = పరాసోః
(2) అనిమేషలోచనాత్:- అవిద్యమానాః నిమేషాః యయోః తే అని

మేషే అనిమేషే లోచనే యస్యసః అనిమేషలోచనః తస్మాత్ = అనిమేషలోచనాత్.

(3) నైషధం:- నిషధానాం, రాజా, నైషధః తమ్ = నైషధమ్.

(4) తదాస్పదే:- తస్య ఆస్పదం, తదాస్పదం, తస్మిన్ తదాస్పదే.

భావము :-

మన్మథుఁడు చిరకాలమందగాండ్రకు సమానముగా నుండెను. కాని యతడు శివుని తృతీయ నేత్రముచే దగ్ధుడై ప్రాణములు గోల్పోయి కనులను మూయకయుండెను. మఱియు నాతఁడు దేవజాతికిఁ జెందుటవలనను ఱెప్పపాట్లు లేనందువలన కనులనుఁ దెఱచియేయుండుట సంభవించినది. అట్లు ప్రాణములు గోల్పోయి వికృతముగఁ గన్నులు దెఱచి ప్రేక్షకులకు భయముగొల్పు మన్మథుని యందగాండ్రకుదృష్టాంతముగఁ జెప్పుటకంటె నతనికంటె భిన్నమైన వానిని దృష్టాంతముగఁ బెట్టఁదలచినదై దమయంతి; దృష్టాంతముగ నుంచఁ దగిన యువకులనుఁ గొందఱినిఁ బొగడుచున్న జనముచే నందగాండ్రకు నలుఁడు దృష్టాంతముగా నుండనర్హుఁడనిచెప్పి నలుని, నా స్థానమం దభిషిక్తునిఁగావింపఁ జేసెను. అనగా నలుఁడు మన్మథుని మించిన సౌందర్యముగలవాడని యాగమము.

శ్లో॥ నలస్యపృష్టా నిషధాగతా గుణా
మిషేణ దూతద్విజవంది చారణా।
నిపీయ తత్కీర్తికథా మథానయా
చిరాయ తస్థేఽభిమనాయమానయా॥ ౩౭

ప॥ వి॥ నలస్య। పృష్టాః। నిషధాగతాః। గుణాన్। మిషేణ। దూతద్విజవంది చారణాః। నిపీయ। తత్కీర్తి కథామ్। అథ। అనయా। చిరాయ। తస్థే। అభిమనాయమానయా।

టీక॥ నిషధాగతాః = నిషధదేశమునుండి వచ్చిన దూత...చారణాః, దూత = సమాచారము తెచ్చువారును, ద్విజ = బ్రాహ్మణులును, వంది = స్తుతి పాఠకులును, చారణాః = దేశద్రిమ్మరులు. మిషేణ = ఏదియోయొక

సాకుతో. నలస్య = నలుని యొక్క, గుణాన్ = గుణములను గుఱించి, పృష్టాః = అడుగఁబడినవారై. అథ = పిదప. అనయా = ఈదమయంతిచే. తత్కీర్తికథాం = కీర్తియొక్క కథను. నిపీయ = విని. చిరాయ = చాలకాలమువరకు అభిమనాయమానయా = సంతోషించినదిగ, తస్థే = ఉండుట.

ఇచ్చట దూతాదులవలన నాయక గుణకీర్తన రూపమైన ప్రలాప మనెడి భావము వర్ణితము.

సమాసములు :

(1) నిషధాగతాః- నిషధేభ్యః ఆగతాః, నిషధాగతాః

(2) దూత...చారణః- దూతాశ్చ, ద్విజాశ్చ, వందినశ్చ చారణాశ్చ దూతద్విజవందిచారణాః

(3) తత్కీర్తికథాం- తస్య కీర్తిః తత్కీర్తిః, తత్కీర్తేః కథా తత్కీర్తి కథా, తాం, తత్కీర్తికథాం.

(4) అభిమనాయ మానయాః- అభిమనాః, భవతీతి, అభిమనాయమానా, తయా, అభిమనాయమానయా.

భావము:

నిషధదేశము నుండి వచ్చిన దూతలను, బ్రాహ్మణులను స్తుతిపాఠకులను దేశద్రిమ్మరులను నేదియోయొక సాకుతో నలుని గుణములను గుఱించి ప్రశ్నింపగ; వారు చెప్పెడి నలుని కీర్తి కథనువిని చాలకాలము వరకును దమయంతి ప్రహృష్ట హృదయురాలుగ నుండినది.

శ్లో॥ ప్రియం ప్రియాం చ త్రిజగజ్జయిశ్రియౌ
లిఖాధిలీలాగృహభిత్తి కావపి।
ఇతి స్మ సా కారువరేణ లేఖితం
నలస్య చ స్వస్య చ సఖ్యమీక్షతే॥ ౩౮

ప॥ వి॥ ప్రియం। ప్రియాం। చ। త్రిజగజ్జయశ్రియౌ। లిఖ। అధిలీలాగృహభిత్తి। కౌ। అపి। ఇతి। స్మ। సా। కారువరేణ। లేఖితం। నలస్య। చ। స్వస్య। చ। సఖ్యమ్। ఈక్షతే।

టీక॥ సా = ఆదమయన్తి, త్రిజగజ్జయశ్రియౌ = త్రిజగత్ = మూడులోకములను, జయి = జయించెడి, శ్రియౌ = శోభగల్గిన. కౌఅపి = ఎవరినైనను. ప్రియం = ప్రియుని, ప్రియాం = ప్రియురాలిని, అనగా నాయికా నాయకులను, అధిలీలా గృహభిత్తి = కేళీగృహముయొక్క గోడపై, లిఖ = వ్రాయుము, ఇతి = అని (నియమించి) కారువరేణ = శిల్పి శ్రేష్ఠునిచే, లేఖితం = వ్రాయింపఁబడిన, నలస్య చ = నలునకును, స్వస్య చ = తనకును. సఖ్యం = సాహచర్యమును, ఈక్షతే = చూచుచున్నది.

ఇచ్చట చిత్రాదులవలన గుణకీర్తన రూపమైన ప్రలాపమను రత్యనుభావము.

సమాసము:-

త్రిజగజ్జయిశ్రియౌ:- త్రీణి జగన్తి సమాహృతాని త్రిజగత్। త్రిజగతః జయినీ = త్రిజగజ్జయినీ = త్రిజగజ్జయినీ-శ్రీః యయోస్తౌ = త్రిజగజ్జయి శ్రియౌ.

అధిలీలాగృహభిత్తి:-లీలాయాః గృహం = లీలాగృహం. లీలాగృహస్య భిత్తిః లీలాగృహభిత్తిః లీలాగృహభిత్తేః అధి లీలాగృహభిత్తి.

కౌ: కా చ కశ్చ = కౌ.

భావము :

ఆ దమయంతి, చిత్రకారుని పిలిచి ముల్లోకములను జయించెడి సౌందర్యముగల నాయికా నాయకులను తననివాస గృహము యొక్క గోడపై వ్రాయుమనిచెప్పి, చిత్రకారుడు దానిని వ్రాసిన పిదప నాప్రియా ప్రియులలో నలదమయన్తుల సాక్షాత్ సాహచర్యమును భావనచేయుచు కాలము గడపుచుండినది.

శ్లో॥ మనోరథేన స్వపతీకృతం నలం
నిశి క్వ సా స్మ స్వపతీ న పశ్యతి ।
అదృష్టమప్యర్థమదృష్టవైభవాత్
కరోతి సుప్తిర్జనదర్శనాతిథిమ్ ॥ 39

ప॥ వి॥ మనోరథేన। స్వపతీకృతం। నలం। నిశి। క్వ। సా। స్మ। స్వపతీ। న। పశ్యతి। అదృష్టమ్। అపి। అర్థమ్—అదృష్టవైభవాత్। కరోతి। సుప్తిః। జనదర్శనాతిథిమ్॥

టీక ॥ సా = ఆ దమయన్తి. మనోరథేన = సంకల్పముచే. స్వపతీకృతం = తన భర్తగజేయఁబడిన. నలం = నలుని. క్వ నిశి = ఏరాత్రియందు. స్వపతీ = నిద్రించుచు, న పశ్యతిస్మ = చూచుటలేదు. సుప్తిః = నిదుర. అదృష్టం = మూందెన్నడుచూడఁబడని. అర్థమపి = వస్తువునుగూడ. అదృష్ట వైభవాత్ = ధర్మాధర్మములశక్తిచే. జనదర్శనాతిథిం = జనులదృష్టి గోచరమును. కరోతి = చేయుచున్నది.

ఇచ్చట నలుని స్వప్నమున చూచుటయను విశేషార్థము. "నిద్ర, ముందుఁజూడఁబడని విషయములను ధర్మాధర్మముల సామర్థ్యముచే కను బఱచునను సామాన్యార్థముచే సమర్థింపఁబడుటవలన నర్థాన్తరన్యాసము.

సమాసములు :

స్వపతీకృతం : అపతిః పతిః సంపద్యమానః కృతః = పతీకృతః. = స్వస్యాః పతీకృతః = స్వపతీకృతః తం = స్వపతీకృతం

అదృష్టవైభవాత్ : అదృష్టయోః వైభవం అదృష్టవైభవం తస్మాత్ అదృష్టవైభవాత్.

జనదర్శనాతిథిమ్ : జనానాం దర్శనం = జనదర్శనం. జనదర్శనస్య అతిథిః = జనదర్శనాతిథిః తం

భావము :

ఆ దమయన్తి తన సంకల్పముచే భర్తగా చేసుకొనబడిన ఆనలుని నిద్రించుచును స్వప్నమున చూడగలిగినది ఏల యనగా నిదుర ధర్మాధర్మ

ముల మహిమవలన ముందెన్నడును చూడని విషయములను దృష్టిపథమునకు స్వప్నమునందు తేఁగలదు. కావున దమయన్తి నలుని ముందెన్నడును జూడక యున్నను, తన యదృష్టబలమువలన నిదురయందు జూడగల్గినది.

శ్లో॥ నిమీలితాదక్షియుగాచ్చ నిద్రయా
హృదో౽పి బాహ్యేంద్రియమౌనముద్రితాత్ ।
అదర్శి సంగోప్య కదాప్యవీక్షితో
రహస్యమస్యాస్స మహన్మహీపతిః ॥ ४०

ప॥ వి॥ నిమీలితాత్। అక్షియుగాత్। చ। నిద్రయా। హృదః। అపి। బాహ్యేంద్రియమౌనముద్రితాత్। అదర్శి। సంగోప్య। కదా। అపి। అవీక్షితః। రహస్యమ్। అస్యాః। సః। మహత్। మహీపతిః॥

టీక ॥ నిద్రయా = నిద్రచే. నిమీలితాత్ = ముకుళితమయిన అక్షియుగాచ్చ = కన్నుజంటనుండియు. బాహ్యేంద్రియమౌనముద్రితాత్ = బాహ్యేంద్రియ = కన్నుమున్నగు, బాహ్యేంద్రియములయొక్క. మౌన = వ్యాపార రాహిత్యముచే. ముద్రితాత్ = నిరోధింపఁబడిన మనసః అపి = హృదయమునుండియు. సంగోప్య = మఱుగుఁబఱచి. కదా = పి = ఎప్పుడును. అవీక్షితః = చూడఁబడని. మహత్ = గొప్పదైన. రహస్యం = మిక్కిలి గోప్యమైనవస్తువగు. సః = ఆ మహీపతిః = నలమహారాజు. అస్యాః = ఈ దమయన్తిక. అదర్శి = చూపఁబడెను.

సమాసములు :

అక్షియుగాత్ : అక్ష్ణోఃయుగం = అక్షియుగం, తస్మాత్ = అక్షియుగాత్.
బాహ్యేంద్రియమౌనముద్రితాత్ : బహిః భవాని = బాహ్యాని బాహ్యాని చ తాని. ఇంద్రియాణి చ = బాహ్యేంద్రియాణి బాహ్యేంద్రియాణాం మౌనం బాహ్యేంద్రియమౌనం మౌనేన ముద్రితం = బా_ముద్రితం తస్మాత్ బాహ్యేంద్రియమౌనముద్రితాత్.

అవీక్షితః : న_వీక్షితః = అవీక్షితః

మహీపతిః ; మహ్యాః పతిః మహీపతిః

భావము :

నిద్రచే కనులు మూయఁబడి యుండగా చక్షురాది బాహ్యేంద్రియములు వ్యాపారమునుండి తొలగుటచే మనస్సు నిరుద్ధముకాగా నెప్పుడును చూడఁబడని మిక్కిలి గోప్యమయిన నలుఁడను రహస్యవస్తువు ఈ దమయన్తికి చూపఁబడెను. చక్షురాది బాహ్యేంద్రియములకును, మనస్సునకును తెలియకయే నిద్ర అతి రహస్య వస్తువైన నలుని దమయన్తికి చూపెను. ఏవిధముగా నొక చెలికత్తె యొకనాయికకు నొక నాయకుని రహస్యముగా చూపునో, అట్లే నిద్రయను చెలికత్తె నలుని దమయన్తికి రహస్యముగఁగనుఁబఱచెనని తాత్పర్యము.

శ్లో ॥ అహో అహోభిర్మహిమా హిమాగమే
ప్యభిప్రపేదే ప్రతి తాం స్మరార్దితామ్ ।
తపర్తుపూర్తావపి మేదసాం భరాః
విభావరీభిర్బిభరాంబభూవిరే ॥ ౪౧

ప॥ వి॥ అహో। అహోభిః। మహిమా। హిమాగమే। అపి। అభిప్రపేదే। ప్రతి। తాం। స్మరార్దితాం। తపర్తుపూర్తౌ। అపి। మేదసాం। భరాః। విభావరీభిః। బిభరాంబభూవిరే॥

టీక ॥ హిమాగమే = పి = హేమన్తమందును, స్మరార్దితాం = స్మర = మన్మథునిచే. అర్దితాం = పీడింపఁబడిన. తాంప్రతి = దమయన్తినిగుఱించి. అహోభిః = దినములచే. మహిమా = అభివృద్ధి. అభిప్రపేదే = పొందఁబడినది. తథా = అట్లే. తపర్తుపూర్తౌఅపి = గ్రీష్మఋతువుయొక్క యవసానమందును విభావరీభిః = రాత్రులచే. మేదసాం = మాంసముల యొక్క. భరాః = రాసులు, అనగా రాత్రికాలపు పెరుగుదల. బిభరాంబభూవిరే = భరింపఁబడినవి. అహో = ఆశ్చర్యము.

హేమన్తమందు పగళ్ళు తక్కువగను, రాత్రు లెక్కువగను నుండును. అట్లే గ్రీష్మఋతువునందు పగళ్ళెక్కువగను రాత్రులు తక్కువగను నుండును. ఇచ్చట దానికి విరుద్ధముగ చెప్పుటవలన నాశ్చర్యము. విరహుల దృష్టిలో నీవైపరీత్యము కనఁబడును కాన విరోధపరిహారము,

సమాసము :

హిమాగమే ; హిమస్య ఆగమః = హిమాగమః = తస్మిత్ హిమాగమే.
స్మరార్దితాం : స్మరేణ అర్దితా స్మరార్దితా తాం స్మరార్దితామ్.
తపర్తుపూర్తౌ : తపర్తోః పూర్తిః తపర్తుపూర్తిః తస్యాం తపర్తు పూర్తౌ ॥

భావము :

కామపీడితు రాలగు దమయన్తికి హేమన్తము నందు పగళ్ళు పొడుగైనవి. గ్రీష్మఋతువు నందు రాత్రులు దీర్ఘములైనవి. వస్తుస్థితిలో హేమంతమున పగళ్ళు తక్కువగను గ్రీష్మఋతువు నందు పగళ్ళు హెచ్చుగను నుండును. కాని కామార్తయగు దమయన్తికి నిరంతరము చింతా జాగరముచే నివి విపరీతములైనవి.

శ్లో॥ స్వకాంతి కీర్తివ్రజ మౌక్తిక స్రజః
శ్రయంత మన్తర్ఘట నాగుణశ్రియమ్ ।
కదాచిదస్యా యువధైర్య లోపినం
నలోఽపి లోకాదశృణో ద్గుణోత్కరమ్ ॥ ౪౨

ప॥వి॥ స్వకాంతి కీర్తి వ్రజ మౌక్తిక స్రజః। శ్రయంతం। అన్తర్ఘట నాగుణ శ్రియం। కదాచిత్। అస్యాః। యువ ధైర్య లోపినం। నలః। అపి। లోకాత్। అశృణోత్। గుణోత్కరమ్।

టీక॥ నలోఽపి = నలుడును, స్వ . . స్రజః, స్వ = తనదైన, కాంతి = సౌందర్యముచే నేర్పడిన, కీర్తి = కీర్తుల యొక్క, వ్రజ = సమూహమనెడి. మౌక్తికస్రజః = ముత్తెపు హారమునకు. అంతః = లోపల. ఘటనా = కూర్పున కుపయుక్తమైన. గుణశ్రియం — దారముయొక్క శోభను. శ్రయంతం = పొందు చున్నదియు. యువధైర్య లోపినం = యువకుల ధైర్యమును హరించెడి. అస్యాః = ఈ దమయంతియొక్క, గుణోత్కరం = సౌందర్యాది గుణ సమూహమును, కదాచిత్ = ఒకప్పుడు, లోకాత్ = ఆగంతుక జనమువలన, అశృణోత్ = వినెను,

ఇచ్చుట కీర్తివ్రజమును, ముత్తెములగను, దమయన్తి గుణ సమూహమును ముత్తెపు సరములనుఁ గ్రుచ్చెడి దారముగను, రూపించుట వలన రూపకాలంకారము.

సమాసములు :

స్వ....స్రజః, స్వస్య కాంతి :- స్వకాంతిః, కీర్తేః వ్రజః కీర్తివ్రజః స్వకాంతేః కీర్తి వ్రజః,స్వ కాంతి కీర్తివ్రజః మౌక్తికానాం స్రక్, మౌక్తి కస్రక్, స్వకాంతి కీర్తివ్రజ ఏవమౌక్తికస్రక్, స్వకాంతికీర్తివ్రజ మౌక్తికస్రక్,తస్యాః స్వ....స్రజః

అంతర్ఘటనానురూపమ్:- అంతః-ఘటనా అంతర్ఘటనా, అంతర్ఘ టనాయాః, గుణః అంతః- - -గుణః గుణస్య శ్రీః, అంతర్ఘటనా గుణశ్రీః తాం అంతః-శ్రియమ్

యువధైర్యలోపినం:- యూనాం- ధైర్యం = యువధైర్యం, యువధైర్య స్యలోపీ = యువధైర్యలోపీ, తం = యువధైర్య లోపినం

గుణోత్కరం;- గుణానాం-ఉత్కరః గుణోత్కరః, తం, గుణోత్కరం

భావము :

ఈః శ్లోకమందు నలునకేర్పడిన శ్రవణాను రాగమును కవి వర్ణించు చున్నాడు. నలుఁడును తన సౌంద్యము వలన సంపాదితమగు కీర్తి పుంజమనెడి ముత్తెపు సరమునుఁ గూర్చుట కుపయుక్తమగు సూత్ర సమూహముగా నయి నదియు, యువకుల ధైర్యము హరించు నదియునగు దమయంతి గుణరాశిని, యాదృచ్ఛికముగ తన కడకు వచ్చెడి జనము వలన నొకప్పుడు వినెను-అనగా నలుని సౌందర్యము వలని కీర్తిరాశి ముత్తెములు కాగా, దమయంతి గుణములు దారములై యా ముత్తెములను సరములుగా కూర్చుట కుపయుక్తము లైనవి.

శ్లో॥ తమేవలబ్ధ్వాఽవసరం తతః స్మరః
శరీరశోభా జయజాత మత్సరః ॥
అమోఘశక్త్యా నిజయేవ మూర్త్యా
తయా వినిర్జేతుమియేష నైషధమ్ ॥ ४३

ప॥ వి॥ తమ్ । ఏవ । లబ్ధ్వా । అవసరం । తతః । స్మరః । శరీర శోభాజయ జాత మత్సరః । అమోఘ శక్త్యా । నిజయా । ఇవ । మూర్తయా । తయా । వినిర్జేతుమ్ । ఇయేష । నైషధమ్.

టీక॥ తతః = ఆ దమయంతి గుణములను వినిన పిదప. శరీరశోభా జయ జాత మత్సరః. శరీరశోభా = దేహసౌందర్యము యొక్క. జయేన = జయముచే. జాతమత్సరః = ఉత్పన్నమగు. అసూయ కల్గిన. స్మరః = మన్మథుఁడు. తమేవ అవసరం = ఆయవకాశమునే. లబ్ధ్వా = పొంది. మూర్తయా = శరీరముఁ దాల్చిన. నిజయా = తనఁదగు. అమోఘశక్త్యా ఇవ = కుంటువోని శక్తియో యనఁదగిన. తయా = ఆ దమయంతిచే. నైషధం = నలుని. వినిర్జేతుం = జయించుటకు ఇయేష కోరెను.

ఇచ్చట దమయంతిని- తనయమోఘ శక్తియో యనినట్లు చెప్పుట వలన ఉత్ప్రేక్ష శత్రువు లెప్పుడును రంధ్రాన్వేషులు కాన మన్మధుడును నిట రంధ్రాన్వేషియై యవకాశము నుపయోగించు కొనుటకు నిచ్ఛగించెను.

సమాసములు :

శరీర శోభాజయ జాత మత్సరః :- శరీరస్య శోభా = శరీరశోభా; శరీర శోభయాః జయః, శరీర శోభాజయః, జయేన జాతః-జయజాతః, శరీర —జాతః మత్సరః యస్య సః = శరీర—మత్సరః

అమోఘశక్త్యాః:- న మోఘా = అమోఘా, అమోఘా చ సా శక్తిశ్చ = అమోఘశక్తిః = తయా. అమోఘశక్త్యా.

నైషధమ్ :- నిషధానాం రాజా నైషధః, తం, నైషధం.

భావము :-

నలునకు దమయంతి యందు రాగోదయమిట వర్ణింపఁబడుచున్నది. నలుని సౌందర్యముపై నీర్ష్యవహించిన మన్మథుడు, దమయంతీ గుణ శ్రవణము నవకాశముగఁ జేసికొని, శరీరము దాల్చిన తన శక్తియో యని చెప్పదగిన యా దమయంతి యనెఁడి సాధనముతో నా నలుని జయించుట కిచ్ఛగించెను. అనగా నలునకు దమయంతిపై ననురాగముద్భవిల్లినదని భావము.

శ్లో॥ అకారి తేన శ్రవణాతిథిర్గుణః
క్ష్మాభుజా భీమనృపాత్మజాశ్రయః ।
తదుచ్చధైర్యవ్యయసంహితేషుణా
స్మరేణ చ స్వాత్మశరాసనాశ్రయః ౪౪

ప॥ వి॥ అకారి । తేన । శ్రవణాతిథిః । గుణః । క్ష్మాభుజా । భీమనృపాత్మజాశ్రయః । తదుచ్చధైర్య వ్యయ సంహితేషుణా । స్మరేణ । చ । స్వాత్మ శరాసనాశ్రయః ।

టీ॥ తేన = ఆ. క్ష్మాభుజా = నలమహారాజుచే. భీమ నృపాత్మజాశ్రయః దమయంతి యే యాశ్రయముగాఁ గల్గిన. గుణః = సౌందర్యాది గుణము. శ్రవణాతిథిః = శ్రవణ విషయముగ. అకారి = చేయబడినది. తదుచ్చ ధైర్య వ్యయ సంహితేషుణా. తత్ = ఆ నలునియొక్క. ఉచ్చధైర్య = ఉన్నత ధైర్యము యొక్క. వ్యయ = నాశనమునకై. సంహిత = సంధింపఁబడిన. ఇషుణా = బాణము కల్గిన. స్మరేణ చ = మన్మథుని చేతను. గుణః = అల్లెత్రాడు. స్వాత్మశరాస నాశ్రయః = స్వాత్మ = తనడగు. శరాసన = ధనుస్సు. ఆశ్రయః = ఆశ్రయము గలదిగ. అకారి = చేయబడినది.

ఇందు "దమయంతీ గుణమును నలుడు శ్రవణ విషయముగాఁ జేసుకొనె"సను పూర్వ వాక్యార్థము; అల్లె త్రాటిని ధనస్సుపై నారోపించెనను నుత్తర వాక్యార్థమునకు హేతువైనందు వలన వాక్యార్థ హేతుకమగు కావ్య లింగాలంకారము.

సమాసములు :-

శ్రవణాతిథిః :- శ్రవణయోరతిథిః = శ్రవణాతిథిః.

భీమనృపాత్మ జాశ్రయః ;- భీమ ఇతి నృపః = భీమనృపః. భీమనృపస్య ఆత్మజా = భీమనృపాత్మజా. భీమనృపాత్మ జాయాః ఆశ్రయః = భీమ.. శ్రయః

తదుచ్చధైర్యవ్యయ సంహితేషుణా :- ఉచ్చంచ తత్ ధైర్యం చ ఉచ్చ ధైర్యం. తస్య, ఉచ్చధైర్యం; తదుచ్చధైర్యం, ధైర్యస్య వ్యయః

తదుచ్ఛధైర్యవ్యయః. వ్యయే సంహితః ఇషుః యేన సః తదుచ్ఛ..సంహితేషుః. తేన తదుచ్ఛ. . .సంహితేషుణా.

స్వాత్మశరాసనాశ్రయః :- స్వఏవ ఆత్మా స్వాత్మా. స్వాత్మనః శరాసనం. స్వాత్మశరాసనం. స్వాత్మశరాసనం ఆశ్రయః యస్య సః స్వాత్మశరాసనాశ్రయః

భావము :–

ఆ నలునిచే దమయంతి యందలి గుణము చెవికి తేఁబడగనే, నలుని ధైర్యమును నాశము చేయుటకై బాణ సంధానము చేసిన మన్మధునిచే గుణము (అల్లెత్రాడు) వింటిపై నారోపింపఁబడినది. అనగా దమ యంతి గుణములను నలుడు వినగనే యతనికి గొప్ప మన్మథోద్రేకము కల్గినదని యాశయము. అనగా దమయంతి యొక్క సౌందర్యాది గుణమును, నలుడు చెవికిఁ దెచ్చుకొనగనే మన్మధుఁడును, తన వింటిపైకి నల్లె త్రాడను గుణమును దెచ్చెను.

శ్లో॥ అముష్య ధీరస్య జయాయ సాహసీ
తదా ఖలు జ్యాం విశిఖైస్సనాథయన్ ।
నిమజ్జయామాస యశాంసి సంశయే
స్మరస్త్రిలోకీ విజయార్జితాన్యపి॥ ४३

ప॥ వి॥ అముష్య । ధీరస్య । జయాయ । సాహసీ । తదా । ఖలు । జ్యాం । విశిఖైః । సనాథయన్ । నిమజ్జయామాస । యశాంసి । సంశయే । స్మరః । త్రిలోకీవిజయార్జితాని । అపి ।

టీక॥ స్మరః = మన్మథుడు. సాహసీ = సాహసముగలవాడై. ధీరస్య = ధీరుఁడయిన. అముష్య = ఈ నలుని యొక్క. జయాయ = జయమునకై. జ్యాం = అల్లెత్రాటిని విశిఖైః = బాణములతో. సనాథయన్ = సంధించుచు. తదా = ఆ సమయమున. త్రిలోకీవిజయార్జితాని = త్రిలోకీ = ముల్లోకములను. విజయ = జయించుటచేత. అర్జితాని = సంపాదింపఁబడిన. యశాంస్యపి = కీర్తులను సైతము. సంశయే = సందేహమందు. నిమజ్జయా మాస ఖలు = ముంచివైచెను.

అనుచితమగు కార్యములను తలపెట్టినప్పుడు కార్యము సిద్ధింపక పోవుటయేగాక మూలముననకే ముప్పువాటిల్లును. కావున నల్పవిజయము నకు సాహసించిన మన్మధుడు తాను ముల్లోకములను జయించుట వలన గల్గిన తన కీర్తులను సంశయమున ముంచుకొనుట సంభవించినది.

వాస్తవమున మన్మథునకు పై సంశయ సంబంధము లేక పోయి నను సంశయ సంబంధము చెప్పఁబడి నందు వలన సంబంధాతిశ యోక్తి.

సమాసములు:

సాహసీ సాహసం అస్య అస్తీతి = సాససీ.
త్రిలోకీవిజయార్జితాని :- త్రయాణాం, లోకానాం సమాహారః త్రిలోకీ = త్రిలోక్యాః విజయః = త్రిలోకీవిజయః త్రిలోకీ విజయేన. ఆర్జితాని = త్రిలోకీవిజయార్జితాని. తాని త్రిలోకీవిజయార్జితాని.

భావము:

సాహసము గల్గిన మన్మథుడు జయింపనలవికాని నలుని జయించుటకై యముల్కలో నల్లె త్రాటిని గూర్చి తాను ముల్లోకములను జయించుటచే నార్జిం చిన యశస్సులన్నింటిని సంశయమున ముంచుకొనెను-అనగా నలుని జయించు టకు సాహసించి జయించలేని స్థితియందుఁబడి తన పూర్వ ప్రతిష్ఠను. నలుని జయింపగలనో లేదో యనెడి సంశయమున ముంచుకొనెను. అనగా జయింప లేక పోయెనని యాశయము.

శ్లో॥ అనేన భైమీం ఘటయిష్యత స్తథా
విధేరవంధ్యేచ్ఛతయా వ్యలాసి తత్ ।
అభేది తత్తాదృగనంగమార్గణైః
యదస్య పౌష్పైరపి ధైర్యకంచుకమ్॥ ౪౬

ప॥ వి॥ అనేన । భైమీం । ఘటయిష్యతః । తథా । విధేః । అవంధ్యేచ్ఛతయా । వ్యలాసి । తత్ । అభేది । తత్ । తాదృక్ । అనంగమార్గణైః । యత్, అస్య । పౌష్పైః । అపి । ధైర్యకంచుకం।

టీక॥ అనేన = ఈ నలునితో. భైమీం = దమయంతిని. ఘటయిష్యతః సంధాన పఱచెడి. విధేః = బ్రహ్మకు అవంధ్యేచ్ఛతయా = అవంధ్య = విఫలముకాని. ఇచ్ఛతయా = ఇచ్ఛకల్గి యుండుటచేత. తత్ = అది. తథా = ఆ విధముగా. వ్యలాసి = విలసించినది (ఏవిధముగానన). యత్ = ఎందు వలన. తత్ = ప్రసిద్ధ మయిన. తాదృక్ = అంతటి దుర్భేద్యమైన అస్య = ఈ నలునియొక్క. ధైర్యకంచుకం = ధైర్య. మనెడి కవచము పౌష్పైః = పుష్పమయములైన. అనంగమార్గణైరపి = మన్మథ బాణములచేతను. అనగా శరీరములేనివాడు ప్రయోగించిన బాణముల చేతను. అభేది = భేదింపఁ బడినది.

ఇచ్చట పుష్పములచే మన్మథుడు కవచమును భేదించుట విరోధము. అది విధి విలాసముచే నాభాపించుచున్నది గాన విరోధాభాసాలంకారము. ఆ విరోధాభాసము ధైర్య కంచుకమను రూపకముచే నుత్థాపితముగాన నారెంటికిని అంగాంగి భావ ప్రయుక్తమగు సంకరము.

సమాసములు :

భీమస్య అపత్యం స్త్రీ భైమీ, తాం, భైమీమ్.
అవంధ్యేచ్ఛతయా :- న వంధ్యా = అవంధ్యా-ఇచ్ఛా యస్య సః. అవంధ్యేచ్ఛస్య భావః అవంధ్యేచ్ఛతా. తయా = అవంధ్యేచ్ఛతయా.
అనంగమార్గణైః :- అనంగస్య మార్గణాః అనంగ మార్గణాః తైః
అనంగమార్గణైః-అవిద్యమానమ్, అంగం యస్య సః = అనంగః, అనంగస్య మార్గణాః, తైః, అనంగమార్గణైః-
పౌష్పైః :- పుష్పస్య వికారాః పౌష్పాః, తైః = పౌష్పైః
ధైర్యకంచుకమ్ :- ధీరస్య భావః ధైర్యం. ధైర్యమేవ కంచుకమ్ = ధైర్యకంచుకః = తం, ధైర్య కంచుకమ్

భావము :-

దైవ సహాయముండుట వలన నిట పువ్వు విలుతునికిఁ గూడ విజయమని చెప్పబడినది. నలునితో దమయన్తిని కలుపవలయుననెడి దైవసంకల్పముండుట వలన నంతటి దుర్భేద్యమగు నలుని ధైర్య కంచుకమును గూడ

మన్మథుకు తన పూల బాణముల తోడనే, భేదించి నలునికి దమయంతిపై రాగోదయము నేర్పఱచెను. దైవాను కూల్యమున్నప్పుడేది యసాధ్యమగును.

శ్లో॥ కిమన్యదద్యాపి యదస్త్రతాపితః
పితామహో వారిజమాశ్రయత్యహో।
స్మరం తనుచ్ఛాయతయా తమాత్మనః
శశాక శంకే న న లంఘితుం నలః॥ ౪౭

ప॥ వి॥ కిమ్ । అన్యత్ । అద్య । అపి । యదస్త్రతాపితః । పితామహః । వారిజం। ఆశ్రయతి । అహో । స్మరం । తనుచ్ఛాయతయా । తమ్ । ఆత్మనః । శశాక । శంకే । సః । న । లంఘితుం । నలః ।

టీక॥ అన్యత్ = మఱియొకటి కిం = ఏమి. ఉచ్యతే = చెప్పబడు చున్నది పితామహః = బ్రహ్మ. యదస్త్రతాపికః = యత్ = ఏ మన్మధునియొక్క అస్త్ర = బాణములతో. తాపితః = సంతాపము, బొందింపబడినవాడై. అద్యాఽపి = ఇప్పటికిని, వారిజం = తామరపూవును ఆశ్రయతి = ఆశ్రయించుచున్నాడు. అహో = ఆశ్చర్యము.తం = ఆ బ్రహ్మను సంతాపపఱచెడి. స్మరం = మన్మధుని. సః = ఆ. నలః = నలుడు. ఆత్మనః = తన యొక్క (నలుని యొక్క) తనుచ్ఛాయతయా = శరీరకాంతి వంటి కాంతి గల్గియుండుటచేత (తన శరీరపు నీడగ నుండుటచేత) లంఘితుం = తిరస్కరించుటకును (దాటుటకును) న శశాక = శక్తుడు కాలేదు. ఇతి = అని. శంకే = ఆలోచించుచున్నాను.

ఇచ్చట మన్మథుఁడు నలుని కాంతి వంటి కాంతి గలవాడని చెప్పుటచే మన్మధుని మించిన సౌందర్యము కలవాడని సూచికము. "తనుచ్ఛాయతయా"- అని "శరీరపు నీడ యగుటచేత"నని యర్థము చెప్పుటచే తన శరీరపు నీడను తాను లంఘింపలేక పోయెననెడి యిర్థము సిద్ధమైనది. లోకమున ఎవఁడును తన నీడను తాను లంఘింపలేఁడు. తాను ఎంతదవ్వు నడచినను తన నీడ వచ్చుచునే యుండును కాని యా నీడను దాటి పోలేడు. మన్మథుని నలుని నీడగఁ జెప్పుట వలన నతనిని నలుఁడు లంఘింపలేక పోయెననెడి సారస్యమిట సిద్ధించుచున్నది. ఇచ్చట మన్మథు నతిక్రమించుటకు బ్రహ్మగూడ సమర్థుడు కానప్పుడు

నలుఁడెట్లు సమర్థుఁడగునను నర్థము సిద్ధించుట వలన నర్థాపత్త్యలంకారము. తనుచ్ఛాయలకు రెంటికిని ఔపమ్యముఁ జెప్పుటవలన నుపమాలంకారము. ఈ ఛాయలకు రెంటికి న భేదాధ్యవసాయముఁ జేయుట వలన నతిశయోక్త్యలంకారము. ఈ మూడలంకారములను నాధారముగఁ జేసికొని, లంఘింప శక్యము కానందులకు తనుచ్ఛాయత్వమును హేతువుగఁ జెప్పుట వలన నుత్ప్రేక్ష. 'శంకే' యను వ్యంజితమునుఁ బ్రయోగించుట వలన నది వాచ్యము. ఈ యుత్ప్రేక్ష పై మూటితోఁడను సంకీర్ణము గాన వీని కన్నింటికినిఁట సంకరము.

సమాసములు :

యదస్త్ర తాపితః యస్య అస్త్రాణి, యదస్త్రాణి యదస్త్రైః తాపితః = యదస్త్రతాపితః

తనుచ్ఛాయతయా :. తనోఃఛాయేవ ఛాయా యస్య సః = తనుచ్ఛాయః, తనుచ్ఛాయస్య భావః = తనుచ్ఛాయతా, తయా = తనుచ్ఛాయతయా, లేదా

తనోః ఛాయా = తనుచ్ఛాయమ్. తనుచ్ఛాయస్య భావః = తనుచ్ఛాయతా తయా తనుచ్ఛాయతయా

భావము :- ఇఁక నేమి చెప్పగలము-బ్రహ్మయు నా మన్మథుని బాణములచేఁ దావమునొంది యిప్పటికిని (జలజమైన) పద్మము నాశ్రయించుచున్నాఁడు. అట్లు బ్రహ్మనుఁదపింపఁ జేసిన మన్మథుఁడు తన శరీరచ్ఛాయగ నుండుటచే నఁలుడ తనిని లంఘింప లేక యుండెను. శరీరచ్ఛాయగ నుండుట యనగా శరీరముయొక్క నీడగ నుండుట కాన తన శరీరపు నీడను తా నెన్నటికిని దాటలేడు. గదా. శరీర చ్ఛాయ నుండుట యనగా శరీర సౌందర్యము వంటి సౌందర్యము గల్గి యుండుట యను నర్థాంతరము నందును నిట్లే సమన్వయము,

శ్లో॥ ఉరోభువా కుంభయుగేన జృంభితం
నవోపహారేణ వయస్కృతేన కిమ్ ।
త్రపాసరిద్దుర్గమపి ప్రతీర్యసా
నలస్య తన్వీ హృదయం దివేశ యత్ ౪౫

వ॥ వి॥ ఉరోభువా।కుంభయుగేన।జృంభితం।నవోపహారేణ-వయస్కృతేన । కిం । త్రపాస రిద్దుర్గం । అపి । ప్రతీర్య । సా । నలస్య । తన్వీ । హృదయం। వివేశ । యత్.

టీక॥ సా = ఆ భీమరాజసుతయగు. తన్వీ = సుందరియైన దమయంతి త్రపాసరి దుర్గమపి = త్రపాసరిత్ = లజ్జరూపమైనది యను. దుర్గం = దుర్గమును. ప్రతీర్య = = దాటి. నలస్య = నలునియొక్క హృదయం = మనస్సును. వివేశ ఇతి యత్ = ప్రవేశించెననునది ఏది కలదో, అది. వయస్కృ తేన = వయస్సుచేఁ జేయబడిన. నవోపహారేణ = నూతనముగ నిర్మిత మగు. ఉరోభువా = రొమ్మున జన్మించిన. కుంభయుగేన = కుచ కుంభముల జంటచే. జృంభితం కిం = విజృంభణమా ఏమి.

ఇచ్చట ఉపమేయములగు కుచములను ఉదాహరింపక కుంభ యుగముతో వానికి నభేదాధ్యవసాయముఁ జేయుట వలన నతిశయోక్తి, "జృంభణమా ఏమి" అను నెడ ఉత్ప్రేక్ష దానికి పైనఁ జెప్పిన యతిశ యోక్తి మూలము. ఈ రెంటికిని సంకరము.

దమయంతి యొక్క కుచకుంభముల విభ్రమమును వినుట వలన నలుఁడు సిగ్గును వదలి యామెయందు తనచిత్తమును లగ్నము జేసెనని చెప్పుటచే నిట మనస్సంగమమను మన్మథావస్థ చెప్పబడినది.

సమాసములు :

ఉరోభువా :- ఉరసి భవతీతి ఉరోభు తేన ఉరోభువా.

కుంభయుగేన :- కుంభయోః యుగం, కుంభయుగం. తేన కుంభయుగేన.
నవోపహారేణ :- నవశ్చాసౌ, ఉపహారశ్చ, నవోపహారః తేనః నవోప హారేణ.

వయస్కృతేన :- వయసా కృతః, వయస్కృతః, తేన వయస్కృతేన.
త్రపాసరిద్దుర్గమ్ :- త్రపైవ సరిత్ = త్రపాసరిత్, త్రపాసరి దేవదుర్గం = త్రపాసరిద్దుర్గం = త్రపాసరిద్దుర్గం. తత్, త్రపా...దుర్గమ్

భావము :-

దమయంతి నలుని లజ్జయనెడి యగాధమగు నదీ దుర్గమును గూడ నధిగమించి యతని హృదయమును సులభముగ ప్రవేశించినదను విషయము సాధారణమయినదిగాదు. అది యౌవనముచే నూతన నిర్మాణము నొంది బొమ్మనందావిర్భవించిన కుంభముల జంట యొక్క విజృంభణమువలన నేర్పడిన విజయమేగాని మఱొండుగాదు. కుండలను కట్టుకొని నదీప్రవాహములను సులభముగా తరించునట్లు దమయంతి తనబొమ్మనందు యౌవనముచే నూతనముగా నేర్పడిన కుండలవంటి స్తనముల జంటను నాధారముగావించికొని నలుని సిగ్గనెడి నదీదుర్గమునుదాటి యాతని హృదయరాజ్యమును పట్టుకొనినది. నలుడింత కాలము లజ్జాధీనుడై యుండెను. ఇప్పుడు లజ్జనుగూడ సడలింపజేసికొని దమయంతిని తనహృదయమందిడుకొనెను-ఆమెయొక్క కుచకుంభముల విలాసమును వినగనే యతనికి ఆమె యందనురక్తి వర్ధిల్లి యాతని చిత్తమామెయందు నిరంతర మాసక్తమైయుండెను.

శ్లో॥ అపహ్నువానస్య జనాయ యన్నిజా
మధీరతామస్య కృతం మనోభువా ।
అబోధి తజ్జాగరదుఃఖ సాక్షిణీ
నిశా చ శయ్యా చ శశాంకకోమలా ॥ ౪౯

ప॥ వి॥ అపహ్నువానస్య। జనాయ। యత్। నిజామ్। అధీరతామ్। అస్య। కృతం। మనోభువా। అబోధి। తత్। జాగరదుఃఖసాక్షిణీ। నిశా। చ। శయ్యా। చ। శశాంకకోమలా.

టీక॥ నిజాం = తనదైన. అధీరతాం = చాపల్యమున జనాయ = ప్రజలకొఱకు అపహ్నువానస్య = మఱుగుపఱుచుచున్న. అస్య = ఈ నలునికి. మనోభువా = మన్మధునిచే. కృతం = చేయఁబడిన. జాగరణప్రలాపాదిక మేదిగలదో. తత్ = దానినంతటిని. జాగరదుఃఖసాక్షిణీ = ఆనలుని జాగరణదుఃఖములను నేరుగ చూచుచున్న శశాంకకోమలా = చంద్రునిచే మృదువైన, నిశా = రాత్రియు. శశాంకకోమలా = చంద్రునివలె మృదువైన, శయ్యా చ = పడకయు. అబోధి = తెలిసికొనినది

రాత్రులలో పడకయందు మేల్కొనియుండుటవలన రాత్రియు, పడకయు. నాతని జాగరణ దుఃఖమునకు సాక్షిత్వమును వహించినవి. ఇందునలన ఇతనికి దమయంతిపై గల్గిన యుత్కటానురాగము ద్యోతితము.

సమాసములు:

అధీరతామ్: ధీరస్య భావః ధీరతా నధీరతా = అధీరతా = తామ్. అధీరతామ్.
జాగరదుఃఖసాక్షిణీ : జాగరస్య = దుఃఖమ్ = జాగరదుఃఖమ్ జాగర దుఃఖస్య సాక్షిణీ = జాగరదుఃఖసాక్షిణీ

భావము :

నలుడు దమయంతి విషయమున మన్మధుని వలన తనకుగల్గిన చాపల్యమును జనులకుదెలియనట్లు మఱుగుపఱచుకొను చున్నను, రాత్రులయందు సెజ్జపైబరుండి నపుడా చాపల్యము మిక్కుటమగుట వలన దానిని రాత్రియు. శయ్యయు చక్కగ గమనించి తెలుసుకొనగల్గినది. ప్రకృతి గంభీరుడగు నలుడు తనకు మన్మధుని వలన కల్గిన సకల వికారము జనమునకు తెలియనీయక గుప్తముచేయగల్గెననియు నచేతనములగు నిశయు శయ్యయు దెలిసుకొనగల్గి యుండెననియు కవితాత్పర్యము. ఇందు నలుని గాంభీర్యము సాటిలేనిదని సిద్ధించు చున్నది.

శ్లో॥ స్మరోపతప్తోపి భృశం న స ప్రభుః
విదర్భరాజం తనయామయాచత।
త్యజంత్యసూఞ్శర్మ చ మానినో వరం
త్యజంతి నత్వేకమయాచితవ్రతమ్॥ ౫౦

ప॥ వి॥ స్మరోపతప్తః। అపి। భృశం। న। సః। ప్రభుః। విదర్భరాజం। తనయామ్ అయాచత। త్యజంతి। అసూన్। శర్మ। చ। మానినః। వరం। త్యజంతి। న। తు। ఏకమ్। అయాచితవ్రతమ్.

టీక॥ ప్రభుః = ప్రభువును. సమర్ధుడునైన. సః = అనలుడు భృశం = మిక్కిలి. స్మరోపతప్తోపి = మన్మధునిచే బాధింపబడి నప్పటికిని,

విదర్భరాజం = భీమరాజును తనయాం = కుమార్తెయైన దమయంతిని గూర్చి. నా = యాచతి = యాచింపలేదు. తాథా హి = అదియెట్లన. మానినః = మానవంతులు అసూన్ = ప్రాణములు. శర్మ చ = సుఖమును. త్యజంతి = వదలిపెట్టుచున్నారు. వరం = శ్రేష్ఠమయిన. ఏకం = సాటిలేని. అయాచితవ్రతంతు ఒకరిని యాచించరాదను వ్రతమును న త్యజంతి = విడువరు.

మానవంతులకు యాచన, కంటెం ప్రాణత్యాగమే శ్రేష్ఠమయినది. కావుననే నలుఁడు దమయంతికై. భీమరాజును యాచించలేదు. నలుడు దమయంతిని యాచించ లేదను "విశేషార్థమును" మానవంతులు ప్రాణమును సైతము వదలెదరుగాని దానికంటెను శ్రేష్ఠమయిన అయాచిత వ్రతమును వదలరను సామాన్యముచే రమర్థించుట వలన. సామాన్యార్థముచే విశేషార్థ సమర్థన రూపమగు నర్థాంతరన్యాసాలంకారము.

సమాసము:-

స్మరోపతప్తః : స్మరేణ = ఉపతప్తః స్మరోపతప్తః.
విదర్భరాజం: విదర్భాణాం రాజా విదర్భరాజః తం విదర్భరాజమ్
అయాచితవ్రతమ్: అవిద్యమానం యాచితం యస్మిన్ తత్. అయాచితమ్. అయాచితం చ తత్ వ్రతం చ = అయాచితవ్రతమ్.

భావము:

నలుడెంత మన్మధుని వలన సంతాపము పొందినను ప్రభువైన తాను విదర్భరాజగు భీముని తనకుమార్తె నీయమని యాచించలేదు. మానవంతులు ప్రాణమునైన వదలెదరుగాని "యొకరిని యాచించరాదను" నయాచిత వ్రతమును మాత్రము వదలి పెట్టరు. నలుడును దమయంతికై యాచింపక తన యయాచిత వ్రతమును నిలుపుకొనెను.

శ్లో॥ మృషావిషాదాభినయాదయం క్వచి
జ్జుగోప నిశ్వాసతతిం వియోగజామ్।
విలేపనస్యాధికచంద్రభాగతా
విభావనాచ్చాపలలాప పాండుతామ్॥ 51

ప॥ వి॥ మృషావిషాదాభినయాత్ । అయం । క్వచిత్ । జుగోప । నిశ్వాసతతిం । వియోగజామ్ । విలేపనస్య । అధికచంద్రభాగతావిభావనాత్ । చ । అపలలాప । పాండుతామ్ ।

టీక॥ అయం = ఈ నలుడు. వియోగజామ్ = దమయంతి వియోగమువలనఁ గల్గిన. నిశ్వాసతతిమ్ = నిట్టూర్పుల సమూహమును. క్వచిత్ = ఏదియో యొక విషయమునందు. మృషావిషాదాభినయాత్ = మృషావిషాద = అసత్యపుదుఃఖముయొక్క, అభినయమువలన. జుగోప = కప్పిపుచ్చెను. పాండుతాం = (వియోగము దుఃఖముచే శరీరమందేర్పడిన) తెల్లఁదనమును. విలేపనస్య = చందనాది విలేపనద్రవ్యములకు. అధికచంద్రభాగతావిభావనాత్ః, అధికచంద్రభాగతా = అధికమయిన కర్పూరపుభాగముకలియుటయొక్క. విభావనాచ్చ = ఆరోపణవలనను. అపలలాప = మఱుగుబఱచెను.

ఇందు ప్రత్యక్షముగ విరహజన్యములుగఁ గానవచ్చు నిట్టూర్పులను, శరీరములోని తెల్లఁదనమును, విరహజన్యములుగానట్లుచేసి దుఃఖజన్యములుగను. కర్పూరమధికముగ చందనమునఁ గలియుటచే నేర్పడినట్లు నారోపించుటవలన, నపహ్నవాలంకారము.

సమాసము :

మృషావిషాదాభినయాత్ః :

మృషా, విషాదః = మృషావిషాదః, మృషావిషాదస్య అభినయః = మృషావిషాదాభినయః.

నిశ్వాసతతిమ్:— నిశ్వాసానాం తతిః = నిశ్వాసతతిః, తాం, నిశ్వాసతతిమ్.

వియోగజామ్:— వియోగాత్ జాయత ఇతి వియోగజా = తాం = వియోగజామ్.

అధికచంద్రభాగతా విభావనాత్:— చంద్రస్య భాగః = చంద్రభాగః అధికః చంద్రభాగః యస్మిన్ తత్ అధికచంద్రభాగమ్। అధికచంద్రభాగస్య భావః. అధికచంద్రభాగతా. అధికచంద్రభాగతాయాః విభావనం =

అధికచంద్రభాగతా విభావనమ్. తస్మాత్, అ ధిక చం ద్ర భా గ తా విభావనాత్॥

పాండుతామ్:— పాండునః భావః = పాండుతా. తామ్, పాండుతామ్.

**భావము :**

ఈ నలుఁడు దమయంతీవియోగవేదనచే తనకేర్పడు నిట్టూర్పుల పరంపర నితరులకు తెలియనీయకుండుటకై, యేదియోయొక వస్తువుయొక్క మిషచే, దుఃఖమభినయించి కప్పిపుచ్చెడివాడు. వియోగబాధవలన శరీరమందేర్పడిన తెల్లఁదనమును. చందనమునందు కర్పూర మెక్కువ కలసినందువలన శరీరము తెల్లఁబడినదని చెప్పి గప్పిపుచ్చెడివాడు. సహజముగ ధీరోదాత్తుఁడగు నలునికీ యాకారగోపనము లెంతయో తగియున్నవి.

శ్లో॥ శశాక నిహ్నోతుమయే న తత్ప్రియా
మయం బభాషే యదలీకవీక్షితామ్ ।
సమాజ ఏవాలపితాసు వైణికై
ర్ముమూర్ఛ యత్పంచమమూర్ఛనాస్వపి॥ ౫౩

ప॥ వి॥ శశాక । నిహ్నోతుమ్ । అయే । న । తత్ । ప్రియామ్ । అయం । బభాషే । యత్ । అలీకవీక్షితామ్ । సమాజే । ఏవ । ఆలపితాసు । వైణికైః । ముమూర్ఛ । యత్ । పంచమమూర్ఛనాసు । అపి ।

టీక॥ అయం = ఈ నలుఁడు. అ లీ క వీ క్షి తాం = భ్రాంతిచే చూడఁబడిన ప్రియాం = ప్రియురాలగు, దమయంతిని. బభాషే ఇతి యత్ = భాషించెననునది యేదిగలదో. సమాజే ఏవ = సభయందే. వైణికైః = వీణాకోవిదులచే. ఆలపితాసు = ఉచ్చరింపఁబడిన. పంచమ మూర్ఛనాస్వపి = పంచమస్వరముయొక్క. ఆరోహణాఽవరోహణములయందును. ముమూర్ఛ ఇతి యత్ = మూర్ఛిల్లెననునది యేదిగలదో. తత్ = ఆ రెంటిని. నిహ్నోతుం = మఱుగుపఱచుటకు. న శశాక = శక్తుఁడుకాలేదు. అయే = అయ్యో ?

ఇచ్చట భ్రాంతిచేఁ గనబడిన దమయంతితో మాట్లాడుటవలనను, వైణికులు పంచమస్వరమున నాలాపము చేసినపుడు మూర్ఛిల్లుటవలనను,

నలునియందు, లజ్జాత్యాగము, ఉన్మాదము-మూర్ఛయను మన్మథావస్థలు మూడును సూచితములు.

సమాసములు:-

అలీకవీక్షితాం;- అలీకేన వీక్షితా, అలీక వీక్షితా। తాం । అలీకవీక్షితామ్.
పంచమమూర్ఛనాసు:- పంచమస్య మూర్ఛనాః. పంచమమూర్ఛనాః తాసు, పంచమమూర్ఛనాసు.

భావము :

ఈ నలుఁడు నిరంతరము దమయంతిని చింతించుచుండుటవలన భ్రమచే నామె కనఁబడుచుండినది. అప్పుడామెతో నితడు మాట్లాడుచుండెను. దీనిని నతఁడు మఱుగుజేసికొనలేకపోయెను. వైణికులు పంచమస్వరముచే గానము చేయుచుండగా ఆ స్వరారోహణాఽవరోహణములఁ గప్పిపుచ్చుటకు శక్తుఁడు కాకపోయెను. దీనివలన నతనికి దమయంతిపై నుత్కటానురాగమేర్పడి తత్ప్రయుక్తములగు మన్మథావస్థలుఁగూడఁ బొడసూపినదని సూచితము. ఇందు పంచమస్వరము కోకిలస్వరమై విరహుల కుద్దీపకమగుచున్నది.
ఈ శ్లోకమున కర్థాంతరము:-

అయం = ఈ నలుఁడు. అలీకవీక్షితాం, అలీక = మోహముచే వీక్షితాం = చూడఁబడిన. ప్రియాం = ప్రియురాలినిగూర్చి. యత్ = ఏదియో యొకటి. బభాషే = మాట్లాడెనో. తత్ = దానిని. అయేన = దైవముచే. నిహ్నోతుం = మఱుగుపఱచుటకు. శశాక = శక్తుఁడాయెను. వైణికైః = వీణాకోవిదులచే. పంచమమూర్ఛనాసు, పంచమ = పంచమ రాగముయొక్క. మూర్ఛనాసు = ఆరోహణాఽవరోహణములు. ఆలపితాసు = ఆలాపముఁజేయఁబడగా. ముమూర్ఛ ఇతి యత్ = మూర్ఛిల్లెనను నదేది కలదో. తదపి = దానిని. అయేన = ఆలాపమువలని సుఖ పారవశ్యపు వ్యాజముచే. నిహ్నోతుం = మఱుగుపఱచుటకు. శశాక = శక్తుఁడాయెను. ప్రియాం ప్రతి = ప్రియురాలగు దమయంతినిఁగూర్చి. అయే ఓ దమయంతీ ! (ఇతి = అని) యత్ = దేనిని. బభుషే = పల్కెనో. తత్ = దానినిసైతము. నిహ్నోతుం = మఱుగుపఱచుకొను

టకు. న శశాక ! = శక్తుఁడుకాలేదా (అనగా దానినిఁగూడ మఱుగుపఱచుటకు శక్తుఁడాయెనని యర్థము) లేదా వైణికైః = వైణికులచే. పంచమ మూర్ఛనాసు = పంచమస్వరాలాపములు చేయఁదొడగగనే. సమాజః ఏవ = సభయే మూర్ఛనొందినది. (అందువలన నలుఁడు దమయంతిని సంబోధించుట వినువారు లేకపోయిరి) లేదా యత్కించిద్భాషే = ఏదియో కొద్ది మాట్లాడినవిషయము. అయే = మన్మధునికొఱకు (ఇః అనగా మన్మధుఁడు) నిహ్నోతుం = మఱుగుపఱచుటకు. న శశాక = శక్తుఁడుకాలేదు. సమాజమునకుమాత్రమే మఱుగుజేయ గల్గెను.

శ్లో॥ అవాప సాఽపత్రపతాం మహీపతి
ర్జితేంద్రియాణాం ధురి కీర్తితస్థితిః ।
అసంవరే శంబరవైరి విక్రమే
క్రమేణ తత్ర స్ఫుటతాముపేయుషి ॥ ౫౩

ప॥వి॥ అవాప। సాపత్రపతాం। మహీపతిః। జితేంద్రియాణాం। ధురి। కీర్తితస్థితిః। అసంవరే। శంబరవైరి విక్రమే। క్రమేణ। తత్ర। స్ఫుటతామ్। ఉపేయుషి।

టీక॥ జితేంద్రియాణాం = ఇంద్రియముల నిగ్రహించిన వారియొక్క, ధురి = ముందట, కీర్తితస్థితః = కొనియాఁడబడిన స్థితిగల్గిన, మహీపతిః = నలమహారాజు, అసంవరే = కప్పిపుచ్చుట కశక్యమైన, శంబరవైరి = మన్మధునియొక్క, విక్రమే = పరాక్రమము. తత్ర = ఆసమాజమందు, క్రమేణ = క్రమముగా, స్ఫుటతాం = వెల్లడి యగుటను, ఉపేయుషి సతి = పొందగా, సాఽపత్రతాం = లజ్జతోఁ గూడి యుండుటను, అవాప = పొందెను.

సమాసములు :

సాపత్రపతాం :— అపత్రపయా సహ వర్తత ఇతి = సాపత్రపః। సాఽపత్రపస్య భావః = సాపత్రపతా।తామ్ = సాపత్రతామ్।
జితేంద్రియాణాం:—జితాని ఇంద్రియాణి యైస్తే జితేంద్రియాః । తేషాం । జితేంద్రియాణాం ।

కీర్తితస్థితిః :—కీర్తితా। స్థితిః యేన సః కీర్తితస్థితిః॥
అసంవరే:—సంవరీతుం శక్యః, సంవరః న, సంవరః = అసంపరః
తస్మిన్, అసంవరే

శంబరవైరివిక్రమే:—శంబరస్య వైరీ = శంబరవైరీ, శంబరవైరిణః
విక్రమః = శంబరవైరివిక్రమః । తస్మిన్ = శంబరవైరివిక్రమే,

భావము :-

చక్షురాదీంద్రియములను నిగ్రహించిన వారిలో ప్రథమగణ్యుఁడగు నలమహారాజు కప్పిపుచ్చుటకు సాధ్యముగాని మన్మథుని యుపద్రవము తనయందు క్రమముగా, స్పష్టపడు చుండగా, ధైర్యముఁ గోల్పోయి సిగ్గుఁబడ సాగెను. ధైర్యశాలురకు ధైర్యము భంగమగుటయే సిగ్గునకు కారణమగుచున్నది.

శ్లో॥ అలం నలం రోద్ధుమిదం కిలాభవన్
గుణం వివేకప్రముఖా న చాపలమ్
స్మరస్స రత్యామనిరుద్ధమేవ య
త్సృజత్యయం సర్గనిసర్గ ఈదృశః ౫౪

ప॥వి॥ అలం। నలం। రోద్ధుం। ఇదం। కిల। అభవన్। గుణాః। వివేకప్రభవాః
న । చాపలమ్। స్మరః। స్మ। రత్యామ్। అనిరుద్ధమ్। ఏవ। యత్। సృజతి।
అయం। సర్గనిసర్గః। ఈదృశః ।

టీక॥ వివేకప్రముఖాః, వివేక = యుక్తాఽయుక్తవిచారము. ప్రముఖాః =
మొదలయిన గుణాః = గుణములు నలం = నలుని ఇదం = ఈ
చాపలమ్ = స్త్రీలోలత్వమను చాపల్యాబుద్ధిని రోద్ధుం = వారించుటకు
నాలం = శక్తముగాలేదు. తథాహి = అదియుక్తమే ఏలయనగా,
స్మరః = మన్మథుడు(కామము) రత్యాం = అనురాగము సంభవించి నపుడు
(రతీదేవియందు) అనిరుద్ధమేవ = పరతంత్రునిగ (అనిరుద్ధుండను
కుమారుని)సృజతి = చేయుచున్నది (పుట్టించుచున్నాడు.) ఇతి యత్ =
అనునదేది గలదో ఆందువలన అయం = ఈ, సర్గనిసర్గః = సృష్టిస్వ
భావము, ఈదృశః = ఇటువంటిదేగదా.

ఇచ్చట మన్మథుని రాగము వారింప సాధ్యముగాదని సమస్త సృష్టి సాధారణ్యముచెప్పి నలుని చాపలముగూడ వారింప శక్యముగా లేదని చెప్పుటవలన, సామాన్య విషయముచే విశేష విషయమును సమర్థించుటయను నర్థాంతర న్యాసాలంకారము.

సమాసములు:

వివేకప్రముఖాః = వివేకః ప్రముఖః యేషాం తే = వివేక ప్రముఖాః
సర్గనిసర్గః సర్గస్య నిసర్గః = సర్గనిసర్గః॥

భావము:

నలునికియుక్తాఽ యుక్త విచారణయనెడి వివేకము మున్నగు గుణము లెన్నియున్నను. అవి యేవియు నతనిని స్త్రీ చాపలము నుండి వారింపలేక పోయినవి. అది యుక్తమే. ఏలయనగా కామము, మనుష్యునకు రాగమేర్పడినపు డతనినిఁ బరవశుఁ గావించుచున్నది. ఇది సృష్టియొక్క స్వభావము. కావున నలునికి దమయంతిపై నేర్పడిన రాగమాతనిని పరతంత్రుఁ గావించుటవలన నతని యందున్న వివేకాది గుణములేవియు నాతనిని ఆస్త్రీ చాపలము నుండి యడ్డగింప జాలక పోయినవి. రతి మన్మథులకు అనిరుద్ధుఁడను పుత్రుఁడు కల్గెనను విషయమిట ధ్వనించుచున్నది.

శ్లో॥ అనంగచిహ్నం స వినా శశాక నో
యదాసితుం సంసది యత్నవానపి
క్షణం తదారామవిహారకైతవాత్
నిషేవితుం దేశమియేష నైషధః॥ ౫౫

ప॥ వి॥ అనంగచిహ్నం। సః। వినా। శశాక। నో। యదా। ఆసితుం। సంసది। యత్నవాన్। అపి। క్షణం। తదా। ఆరామవిహారకైతవాత్। నిషేవితుం। దేశమ్। ఇయేష। నైషధః।

టీక॥ నైషధః = నలుఁడు యత్నవానపి = ప్రయత్నముగల వాడైనను, అనంగచిహ్నం = మన్మథ చిహ్నమగు మూర్ఛను, ప్రలాపము మున్నగు వానిని వినా = విడచి సంసది = సమాజమందు క్షణమపి = క్షణకాలమై

నను ఆసితుం = ఉండుటకు యదా = ఎప్పుడు నశశాక = శక్తుఁడు కాలేదో, తదా = అప్పుడు, ఆరామవిహారకైతవాత్ = ఆరామ = ఉద్యానమందలి విహారకైతవాత్ = విహరించుటయను వ్యాజమువలన దేశం = ఉద్యానమును నిషేవితుం = సేవించుటకు ఇయేష = కోరెను.

ఈ నలుని మనోరథము సిద్ధించుటకు సాధనమగు హంస సంవాదమునకు వనవిహారము కారణము కాగలదు. అదియిందు సూచితము, ఇందు చాపలమను వ్యభిచారి భావము చెప్పఁబడినది. "చాపలంత్వనవస్థానం రాగద్వేషాది సంభవమ్" అను లక్షణము ననుసరించి యెందును నిలకడ లేకయుండుట చాపలమనబడును.

సమాసములు:

అనంగచిహ్నమ్: అనంగస్య చిహ్నమ్। అనంగచిహ్నమ్ తత్ = అనంగచిహ్నం।

ఆరామవిహారకైతవాత్ : ఆరామే విహారః। ఆరామవిహారః విహార ఏవ కైతవం। ఆరామవిహారకైతవమ్। తస్మాత్। ఆరామవిహారకైతవాత్.

నైషధః ; నిషధానాం రాజా = నైషధః

భావము:

నలునకు దినములు గడచినకొలది వలరాజు చిహ్నములగుమూర్ఛ ప్రలాపములు మిక్కుటములగుచుండినవి. అతడెంత ప్రయత్నించినను సభలయందు గూడనవి వెల్లడియగు చుండుటవలన నతడు సభలయందుండలేకపోయెను. అట్టి పరిస్థితియందు ఉద్యానమున విహరించుటను నెపముగావించుకొని, అందుఁగాలము గడవుటకై యిచ్ఛగించెను.

శ్లో॥ అథ శ్రియా భర్త్సితమత్స్యకేతనః
స్వయం వయస్యైస్స్వరహస్యవేదిభిః
పురోపకంఠోపవనం కిలేక్షితా
దిదేశ యానాయ నిదేశకారిణః ౨౬

వ॥ వి॥ అథ। శ్రియా। భర్త్సితమత్స్యకేతనః। సమం। వయస్యైః। స్వరహస్య వేదిభిః। పురోపకంఠోపవనం। కిల। ఈక్షితా। దిదేశ। యానాయ। నిదేశకారిణః।

టీక॥ అథ = ఉద్యానముఁజూడ నిచ్ఛగించిన పిదప శ్రియా = సౌందర్యముచే, భర్త్సితమత్స్యకేతనః, భర్త్సిత = బెదరింపఁబడిన మత్స్యకేతన: = (మీనమును ధ్వజమందుగల) మన్మధుడుఁ గల్గి సః = ఆనలుఁడు స్వరహస్యవేదిభిః; స్వ = తనయొక్క రహస్య = రహస్యమును వేదిభిః = తెలిసిన వయస్యైస్సమం = స్నేహితులతోఁగూడ పురోపకంఠోపవనం పుర = నగరము యొక్క ఉపకంఠ = సమీపమందలి వనం = ఉద్యానమును ఈక్షితా కిల = చూచెఁడివాఁడుగ నిదేశకారిణః = ఆజ్ఞనుఁ చేయునట్టి కింకరులను యానాయ = వాహనములనుఁ దెచ్చుట కొఱకు దిదేశ = అజ్ఞాపించెను.

సమాసములు:

భర్త్సితమత్స్యకేతనః: మత్స్యః కేతనే యస్య సః మత్స్యకేతనః. భర్త్సితః మత్స్యకేతన: యేన సః = భర్త్సిత మత్స్యకేతనః

స్వరహస్యవేదిభిః : స్వస్య రహస్యం = స్వరహస్యం స్వరహస్యం విదంతీతి = స్వరహస్య వేదినః = తైః = స్వరహస్య వేదిభిః

పురోపకంఠోపనమ్; పురస్య ఉపకంఠం = పురోపకంఠమ్ పురోపకంఠే ఉపవనమ్ = పురోపకంఠోపవనమ్ = తత్ = పురోపకంఠోపవనమ్.

నిదేశకారిణః : నిదేశం కుర్వంతీతి = నిదేశకారిణః॥

భావము:

సౌందర్యముచే మన్మథుని సైతము తిరస్కరించు నానలమహారాజు తనకు దమయంతిపై నేర్పడిన యనురాగ రహస్యములనుఁ దెలిపిన చెలికాండ్రనుఁ దోడఁబెట్టికొని, పట్టణమునకు సమీపమందున్న యుద్యానమునుఁ జూడగోరినవానివలె నటించుచు కింకరులను రథ తురగాది వాహనములను సిద్ధపఱచుట కాజ్ఞాపించెను.

శ్లో॥ అమీ తత స్తస్య విభూషితం సితం
జవేఽపి మానేఽపి చ పౌరుషాధికమ్ ।
ఉపాహరన్నశ్వమజస్రచంచలైః
ఖురాంచలైః క్షోదితమందురోదరమ్॥ ౫౭

ప॥ వి॥ అమీ । తతః । తస్య । విభూషితం । సితం । జవే । అపి । మానే । అపి । చ । పౌరుషాధికమ్ । ఉపాహరన్ । అశ్వమ్ । అజస్రచంచలైః । ఖురాంచలైః । క్షోధితమందురోదరమ్ ।

టీక॥ తతః = అట్లు ఆజ్ఞాపించిన పిదప. అమీ = ఆ కింకరులు. తస్య = ఆ నలునికి. విభూషితం = అలంకరింపఁబడినదియు. జవేఽపి = వేగమందును. మానేఽపి = పొడుగు వెడల్పు మొదలగు కొలతయందును పౌరుషాధికమ్. పౌరుష = పురుషుని గమన వేగము కంటెను.(పురుషుని శరీర ప్రమాణము కంటెను) అధికం = అధికమైనదియు. అజస్ర చంచలైః అజస్ర = ఎల్లప్పుడును. చంచలైః = కదలుచున్న. ఖురాంచలైః ఖుర = గిట్టల యొక్క. అంచలైః = అంచులచే. క్షోధితమందురోదరమ్. క్షోదిత = నలగఁగొట్టఁబడిన. మందుర = గుఱ్ఱపుశాల యొక్క. ఉదరం = నడిమి భాగము గలదియునగు సితం = తెల్లని. అశ్వం = గుఱ్ఱమును. ఉపాహరన్ = తెచ్చిరి.

సమాసములు :

పౌరుషాధికమ్ :- పురుషస్య ఇదం పౌరుషమ్, పౌరుషాత్ అధికః = పౌరుషాధికః, తం, పౌరుషాధికమ్.

అజస్ర చంచలైః :- అజస్రం-చంచలాః, అజస్రచంచలాః తైః అజస్ర చంచలైః.

ఖురాంచలైః :- ఖురాణాం-అంచలాః = ఖురాంచలాః తైః = ఖురాంచలైః.

క్షోదితమందు రోదరమ్ :- మందురాయాః ఉదరః = మందురోదరః క్షోదితః మందురోదరః యేన సః = క్షోదితమందు రోదరః తమ్. క్షోదిత మందురోదరమ్.

భావము :

ఆజ్ఞాపించిన వెంటనే కింకరులు, నలునకై, అలంకరింపఁబడినదియు, వేగమందును. పొడవు వెడల్పు కొలతలయందు మానసగమన వేగమును, మానవ శరీర ప్రమాణములను మించినదియు, నెల్లప్పుడును కదలుచున్న గిట్టల కొనలచే నాలయము యొక్క మధ్యభాగమును నలగఁగొట్టుచున్నదియునగు తెల్లని గుఱ్ఱమును గొనితెచ్చిరి.

శ్లో॥ అథాఽంతరేణాఽవటుగామినాఽధ్వనా
నిశీథినీనాథమహస్సహోదరైః।
నిగాళగాద్దేవమణేరివోత్థితై
ర్విరాజితం కేసరకేశరశ్మిభిః॥ ౫౭

ప॥ వి॥ అథ। అంతరేణ। అవటుగామినా। అధ్వనా। నిశీథినీ నాథమహస్సహోదరైః। నిగాళగాత్। దేవమణేః। ఇవ। ఉత్థితైః। విరాజితం। కేసరకేశ రశ్మిభిః।

టీక॥ అథ = గుఱ్ఱమును తెచ్చిన తర్వాత. అంతరేణ = లోన నున్నటు వంటిదియు. అవటుగామినా = ముచ్చెనగుంటను తాకునదియు నగు. అధ్వనా = మార్గముచే, నిగాళగాత్ = కంఠ ప్రదేశమునుఁ బొందిన. దేవమణేః = దేవమణియను సుడినుండి (దివ్యమాణిక్యము నుండి) ఉత్థితైరవ = పైకి వ్యాపించినవో యమనట్లుండునవియునగు. నిశీథినీ నాథ మహస్సహోదరైః = చంద్ర కిరణములతో సమానములునునగు కేసర కేశరశ్మిభిః. కేసరకేశ = గుఱ్ఱపు జూలు వెంట్రుకలనెడి. రశ్మిభిః కిరణములచే విరాజితం = ప్రకాశించినవియునగు హయం = గుఱ్ఱమును. సః = ఆనలుడు. ఆవరోహ = ఎక్కెను. (అని ఏడవ శ్లోకములోని కర్తృ కర్మ క్రియలతో నన్వయము-కాననిట్టిది కులకమని చెప్పబడును)

నిశీథినీ నాథ మహస్సహోదరైః యని చంద్ర కిరణములతో సమానములుగ. గుఱ్ఱపు జూలును చెప్పుట వలన ఉపమాలంకారము.

కేసర కేశరశ్మిభిః-యని కేసర కేశములే కిరణములని చెప్పుట వలన రూపకాలంకారము.

సమాసములు :

అవటుగామినా :- అవటుంగచ్ఛతీతి = అవటుగామీ. తేన = అవటుగామినా.

నిశీథినీ నాథమహస్సహోదరైః :- నిశీథిన్యాఃనాథః నిశీథినీనాథః నిశీథినీనాథస్య మహాంసి = నిశీథినీనాథమహాంసి। నిశీథినీ నాథమహోభిః సహోదరాః = నిశీథినీనాథమహస్సహోదరాః = తైః నిశీథినీనాథమహస్సహోదరైః.

నిగాళగాత్ :- నిగాళం గచ్ఛతీతి = నిగాళగః. తస్మాత్ నిగాళగాత్.

కేసర కేశరశ్మిభిః :- కేసరా ఏవ కేశాః = కేసరకేశాః। కేసర కేశా ఏవ రశ్మయః. కేసరకేశ రశ్మయః, తైః కేసరకేశరశ్మిభిః.

భావము :

లోభాగమున ముచ్చెనగుంట నంటిన మార్గమున మెడపైన నేర్పడిన దేవమణి యను సుడి నుండి పైకి వ్యాపించినదియు చంద్రుని కాంతితో సమానములు నగు జూలు వెంట్రుక లనెడి కిరణములతో ప్రకాశించు గుఱ్ఱమును నలు డెక్కెను.

శ్లో॥ అజస్రభూమీతటకుట్టనోద్గతై
రుపాస్యమానం చరణేషు రేణుభిః।
రయప్రకర్షాధ్యయనార్థమాగతై
ర్జనస్య చేతోభిరివాణిమాంకితైః॥ ౫౯

వ॥ ని॥ అజస్రభూమీతటకుట్టనోద్గతైః । ఉపాస్యమానం । చరణేషు । రేణుభిః । రయప్రకర్షాధ్యయ నార్థమ్ । ఆగతైః । జనస్య । చేతోభిః । ఇవ । అణిమాంకితైః.

టీక॥ అజస్రభూమీతట కుట్టనోద్గతైః; అజస్ర = విరామములేని భూమీతట. కుట్టన = భూతలమును కొట్టుటచే. ఉద్గతైః = పైకిలేచినవియు. రయప్రకర్షాధ్యయనార్థమ్. రయప్రకర్ష = వేగాధిక్యమును. అధ్యయనార్థం

= నేర్చుకొనుటకు. ఆగతైః = వచ్చినట్టి. అణిమాంకితైః = అణుత్వముతోఁ గూడిన. జనస్య = జనము యొక్క చేతోభిరివ = మనస్సులో యనునట్లున్న రేణుభిః = ధూళులతోఁ చరణేషు = పాదములయందు ఉపాస్యమాన = సేవింపఁబడుచున్న (హయం = గుఱ్ఱమును. సః = ఆ నలుఁడు. ఆరురోహ = ఎక్కెను)

తార్కిక మతమునందు మనస్సు అణువని సిద్ధాంతము. కావున అణు పరిమాణము గల ధూళులుగ నవి యుత్ప్రేక్షింపఁబడినవి. కాన నుత్ప్రేక్షాలంకారము.

సమాసములు :

అజస్ర భూమీ తటకుట్ట నోద్గతైః:- భూమ్యాః తటాని = భూమీ తటాని. భూమీతటేషు కుట్టనాని = భూమీతటకుట్టనాని. అజస్రాణి చ తాని భూమీ తటకుట్టనాని చ అజస్రభూమీతటకుట్టనాని అజస్రభూమీతటకుట్టనై రుద్గతాః = అజస్రభూమీ తటకుట్ట నోద్గతాః = తైః అజస్రభూమీతట కుట్టనోద్గతైః.

రయప్రకర్షాధ్యయనార్థమ్ :- రయస్య ప్రకర్షః = రయప్రకర్షః. రయప్రకర్షస్య అధ్యయనం రయప్రకర్షాధ్యయనమ్. రయప్రకర్షాధ్యయనాయ, రయప్రకర్షాధ్యయనార్థమ్,

అణిమాంకితైః :- అణిమ్నా- అంకితాని = అణిమాంకితాని తైః అణిమాంకితైః.

భావము :-

ఆ గుఱ్ఱము తెంపులేక భూతలమును గిట్టలచే నలగగొట్టుచుఁ బరుగెత్తు చుండుటవలన పైకిలేచిన ధూళులు, అణువులుగ నుండుటవలన, వేగమందు శిక్షణపొందుటకై వఱతెంచిన జనులమనస్సులో యనునట్లున్నవి. అట్టిమనస్సులో యనఁదగు ధూళులతో సేవింపఁబడుచున్న గుఱ్ఱమును నలుడెక్కెను. తార్కిక మతమున మనస్సు అణురూపము. కాన నణురూపములగు ధూళులను మనస్సులుగా భావించుట యేర్పడినది. అన్ని వేగములను మించినది మనోవేగముకాగా నిచట, అశ్వవేగము మనోవేగమునుఁగూడ మించినది. కావున మనస్సు లశ్వముకడ వేగము నేర్చుకొనునట్లు వర్ణించుట సంభావించినది. మనోవేగమును

గూడ మించి యశ్వము పరుగిడుచున్నదని యుద్దేశము. పాదములవద్ధ శిష్యులు విద్యనేర్చుకొనుట లోకసిద్ధము. అట్లే ధూళీపటలము గుఱ్ఱపు పాదములనుండి రేగి దాని పాదములకడ వేగమును నేర్చుకొనుటకువచ్చిన మనస్సులుగ నుత్ప్రేక్షించుట చాల సముచితము ప్రాచీన గురుశిష్యభావములు చక్కగఁ జిత్రింపఁబడినవి. నిరంతరము ముజ్జగములనుఁ దిరిగెడి సూర్యుని రథమువెంటఁ బరుగిడుచు, యాజ్ఞవల్క్యుఁడు సూర్యునికడ విద్యనేర్చిన సందర్భముప్రకృతమునకు సరిపడుచున్నది

శ్లో॥ చలాఽచలప్రోథతయా మహీభృతే
స్వవేగదర్పానివ వక్తుముత్సుకమ్ ।
అలం గిరా వేద కిలాయమాశయం
స్వయం హయస్యేతి చ మౌనమాస్థితమ్ ౬౦

ప॥ వి॥ చలాఽచలప్రోథతయా। మహీభృతే । స్వవేగదర్పాన్ । ఇవ । వక్తుం । ఉత్సుకమ్ । అలం । గిరా । వేద । కిల। అయమ్। ఆశయం । స్వయం। హయస్య । ఇతి । చ । మౌనమ్ । ఆస్థితమ్ ।

టీక॥ చలాఽచలప్రోథతయా, చలాఽచల = చలించియు చలించకయునున్న- అనగా కొంచము అదురుచున్న ముట్టెగల్గియుండుటచే. మహీభృతే = నలమహారాజునకు. స్వవేగదర్పాన్, స్వ = తనదైన వేగవేగము = యొక్క. దర్పాన్ = ఆధిక్యములను. వక్తుం = చెప్పుటకు ఉత్సుకమివస్థితం = ప్రయత్నించుచునట్లుండునదియు. గిరా = మాటచే. అలం = చాలునని అయం = ఈ నలుఁడు. స్వయం = తాను. హయస్య = గుఱ్ఱముయొక్క ఆశయం = అభిప్రాయమును. వేదకిల = తెలుసుకొనుచున్నాడుగదా ఇతి = అని. మౌనం = చెప్పకయుండుటను. ఆస్థితమ్ = పొందిన. హయం = గుఱ్ఱమును. నలః = నలుఁడు. అరురోహ = ఎక్కెను.

నలుడు అశ్వశాస్త్రమునందు పండితుఁడని ప్రసిద్ధి అశ్వము యొక్క ముట్టెలోని కదలికను, కదలమినిఁ బురస్కరించుకొని, అది నలమహారాజుకు తన వేగాతిశయమును చెప్పనున్నట్లును, తర్వాత కొంతతడవు ఆలోచించుకొని, నలుడు అశ్వశాస్త్రవేదిగాన నతడు తన

వేగాతిశయమును స్వయముగఁ దెలిసికొనియే యున్నాడుగదా యింక చెప్పనవసరమేమియున్నది యని మౌనమువహించినట్లునుఁ గానవచ్చుచున్నది. కావుననే "చలాఽచలప్రోథతయా" యని గుఱ్ఱపుముట్టెను చలముగను, అచలముగను చెప్పుట యేర్పడినది. అది స్వభావముగనే కదలియు కదలక యుండుటవలన, కదలినపుడు మాట్లాడ నున్నట్లును, కదలనపుడు మాట్లాడనవసరము లేదని తలంచినట్లును వర్ణించుట కవకాశ మేర్పడినది కాన నిఁట నుత్ప్రేక్ష.

సమాసములు :-

చలాఽచలప్రోథతయా:—చలం చ తత్ అచలం చ = చలాచలం చలాఽచలం ప్రోథంయస్య సః = చలాఽచలప్రోథః, చలాఽచలప్రోథస్య భావః = చలాఽచలప్రోథతా, తయా, చలాఽచలప్రోథతయా।
స్వవేగదర్పాన్:—స్వస్య వేగః = స్వవేగః = స్వవేగస్య దర్పాః, స్వవేగదర్పాః, తాన్ = స్వవేగదర్పాన్.

భావము:-

గుఱ్ఱము పరుగిడునపుడు సహజముగ దాని ముట్టె కదలియు కదలకయు నుండును. ప్రస్తుతము నలాశ్వము పరుగిడునపుడు దానిముట్టె యా విధముగ కదలియు కదలక యుండుటవలన కదలినపుడది తన గమనవేగాధిక్యమును నలుని కెఱింగించనున్నట్లును, కదలనపుడు తన వేగమును నలునకు చెప్పనేమెందులకు? అతడు అశ్వశాస్త్రమునందు ప్రవీణుఁడగుటవలన తానే అశ్వహృదయమును తెలిసికొనియుండఁగలడని భావించినట్లును కానవచ్చుచున్నది

"చలాచలప్రోథతయా" అనునెడ "చలాచల" శబ్దము 'చరిచలిపతివదీనాం ద్విర్వచనమాక్చాభ్యాసస్యేత్యా' ది విధి ననుసరించి 'అత్యంతం చలమ్ చలాచలమ్మ'ను నర్థమున కనుగుణముగ వ్యుత్పాదింపఁబడియున్నది. కొన్ని వ్యాఖ్యానములయందు 'స్ఫురమాణార్థకము'గను వివరింపఁబడియున్నది. కాని యీ యాంధ్ర టీకయందుఁ 'గొంతకాలము చలించునవియు, కొంతకాలము చలింపనవియు' నను నర్థము కవిహృదయముగ భావించి వ్రాయఁబడియున్నది. చలించుదశయందు మాట్లాడుట కుద్యుక్తమైనట్లును, చలింపనిదశయందు మాట్లా

డక మౌనమువహించినట్లును యథాక్రమముగ నన్వయముఁ జెప్పుటకువలను గలుగుచున్నది. కావుననే శ్లోకమందు "వక్తుముత్సుకమ్" అను విశేషణము చలనదశయందును, "మౌనమాస్థితమ్" అను విశేషణము చలనరహితదశ యందునుఁ గ్రమముగ నన్వయింపఁజేయుటకై కవిప్రయుక్తములని తోచు చున్నది. అట్లుగాక, 'అత్యంతచలము'లను నర్థము ననుసరించినచో, 'వక్తు ముత్సుకమ్' అను వచనౌత్సుక్యదశలోను. 'మౌనమాస్థితమ్' అను మౌనావలం బనదశలోను నత్యంత చాంచల్యమే యేర్పడుటవలన భేదము కానరాదు. అందు' వలన న్యూనత యేర్పడుచున్నది.

శ్లో॥ మహారథస్యాధ్వని చక్రవర్తినః
పరానపేక్షోద్వహనాద్యశస్సితమ్।
రదావదాతాంశుమిషాదనీదృశాం
హసంతమంతర్బలమర్వతాం రవేః ॥ ౬౧

ప॥ వి॥ మహారథస్య । అధ్వని । చక్రవర్తినః । పరాఽనపేక్షోద్వహనాత్ । యశస్సితం । రదావదాతాంశుమిషాత్ । అనీదృశాం । హసంతం । అంతర్బలమ్ । అర్వతాం । రవేః ।

టీక॥ మహారథస్య = మహారథుని లక్షణములుగలవాఁడును. (గొప్ప రథము యొక్క) చక్రవర్తినః = చక్ర = రాష్ట్రమును, వర్తినః = పాలించు వాఁడును. అనగా సార్వభౌముఁడును. (ఒకచక్రముచే రథమును నడుపుకొనువాడును) అధ్వని - మార్గమందు. పరానపేక్షోద్వహనాత్ పరానపేక్ష = ఇతరాపేక్షలేక. ఉద్వహనాత్ = రథమును మోయుట వలన. అనగా = ఇతరసహాయము లేకయే రథమును లాగుటవలన. యశస్సితం, యశఃసితం = కీర్తిచే తెల్లఁబడినదియు (అతఏవ కావుననే) అనీదృశామ్ = ఇట్టి కీర్తిలేని. రవేః = సూర్యునియొక్క. అర్వతామ్ = గుఱ్ఱములయొక్క. అంతర్బలం = లోపలిబలమును. రదావదాతాంశు మిషాత్, రద = దంతములయొక్క. అవదాత = తెల్లని. అంశు = కిరణములయొక్క. మిషాత్ = నెపమువలన. హసంతమివ స్థితమ్ = నవ్వుచున్నదో యనునట్లున్న. హయం = గుఱ్ఱమును, నలః = నలుఁడు. ఆరురోహ = ఎక్కెను.

మహారథుఁడనగా—తన్ను, సారథిని, గుఱ్ఱములను రక్షించుచు నెవడు యుద్ధముచేయుచుండునో యతఁడు మహారథుఁడు— 'ఆత్మానం సారథిం చాశ్వాన్,రక్షన్ యుద్ధ్యేతయో నరః। స మహారథసంజ్ఞః స్యాదిత్యాహుర్నీతికోవిదాః' అని మహారథలక్షణము నలుడు చక్రవర్తులుగఁ బ్రసిద్ధులైన, హరిశ్చంద్ర, నల, పురుకుత్స, పురూరవస్, సగర, కార్తవీర్యులను నారుగురులో నొక్కఁడు. 'హరిశ్చంద్రో నలో రాజా పురుకుత్సం పురూరవాః సగరః కార్తవీర్యశ్చ షడేతే చక్రవర్తినః" అని షట్చక్రవర్తులు పరిగణింపఁబడియున్నారు.

'చక్రవర్తినః' యని సూర్యుఁడు ఏకచక్రముచే రథమును నడిపించుకొనుటయు, నా రథమునకు 'సప్తయుంజతి రథ మేకచక్రమ్' అను శ్రుతిననుసరించి యేడుగుఱ్ఱములు లాగుటయు, నిట ననేకచక్రములుగల యీ మహారథము నొకగుఱ్ఱముమాత్రమే లాగుటయు ననువిషయములు శ్లేషమహిమచే సూచితము. 'రదావదాతాంశుమిషాత్' అని మిషశబ్దముచే కిరణములయందు అసత్యత్వమును కల్పించి- 'హసంతమివస్థితం' అని హాసమును ఉత్ప్రేక్షించుటవలన అపహ్నవాలంకారముతోఁగూడిన యుత్ప్రేక్షాలంకారము. వ్యంజకములగు "మన్యే—శంకే" ఇత్యాదిశబ్దములు ప్రయోగించినందువలన నిది గమ్యము.

సమాసములు :

మాహారథస్య:— మహాన్। రథః యస్య సః = మాహారథః = తస్య మాహారథస్య, మహాంశ్చాసౌరథశ్చ = మహారథః = తస్య మహారథస్య

చక్రవర్తినః:- చక్రం వర్తయతీతి = చక్రవర్తీ = తస్య, చక్రవర్తినః, చక్రేణ, వర్తయతీతి = చక్రవర్తీ తస్య = చక్రవర్తినః,

రదావదాతాంశుమిషాత్:— అవదాతాశ్చతే అంశవశ్చ = అవదాతాంశవః, రదానామవదాతాంశవః = రదావదాతాంశవః, రదావదాతాంశవ ఏవ మిషః = రదావదాతాంశుమిషః తస్మాత్ రదావదాతాంశుమిషాత్

అనీదృశామ్:— న ఈదృశః = అనీదృశః, తేషాం అనీదృశామ్.

అంతర్బలమ్:— అంతఃబలమ్ = అంతర్బలమ్ తత్ = అంతర్బలమ్

పరానపేక్షోద్వహనాత్:— అవిద్యమానా అపేక్షా యస్మిన్ తత్ = అనపే

క్షమ్ పరేషామనపేక్షమ్ పరానపేక్షం చ తత్, ఉద్వహనం చ = పరాన పేక్షో ద్వహనం తస్మాత్ పరానపేక్షోద్వహనాత్

భావము :

ఆయశ్వము మహారథ లక్షణములతో నొప్పారు వాఁడును, షట్చక్రవర్తు లలో నొక్కఁడుగ ప్రసిద్ధి కెక్కిన వాడుననగు నలుని యొక్క యనేకచక్రము లతోఁ గూడిన మహారథము నితరాపేక్ష లేక లాగుచుండుట వలన, నొకచక్రమే గల్గిన సూర్య రథమును లాగుచున్న యేడు గుఱ్ఱములలోని శక్తిని తన దంత కాంతుల నెపముచే పరిహసించు చున్నదో యనునట్లు కానవచ్చు చున్నది. అంతటి నలుని మహారథమును తానొక్కటియే లాగుచుండ, నొంటి చక్రము గల సూర్య రధమును నేడుగుఱ్ఱములు లాగుట నలాశ్వమునకు పరిహాస నీయమైనదని భావము. అట్టి గుఱ్ఱమును నలుడెక్కెను.

శ్లో॥ సితత్విషశ్చం చలతాముపేయుషో
మిషేణ పుచ్ఛస్య చ కేసరస్య చ।
స్ఫుటాం చలచ్చామరయుగ్మచిహ్నకై
రనిహ్నువానం నిజవాజిరాజతామ్॥ ౬౨

ప॥వి॥ సితత్విషః। చంచలతామ్। ఉపేయుషః। మిషేణ। పుచ్ఛస్య। చ। కేసరస్య। చ। స్ఫుటాం। చలచ్చామరయుగ్మచిహ్నకైః। అనిహ్నువానం। నిజవాజి రాజతామ్।

టీక॥ సితత్విషః; సిత = తెల్లని, త్విషః = కాంతిగల్గినదియు, చంచలతాం = కదలికను, ఉపేయుషః = పొందుచున్నదియునగు, పుచ్ఛస్య = తోక యొక్కయు, కేసరస్య చ = జూలుయొక్కయు మిషేణ = నెపముచే చల చ్చామరయుగ్మచిహ్నకైః, చలత్ = కదలుచున్న చామరయుగ్మ = వింజామరల జంటయొక్క చిహ్నకైః = గుర్తులతో స్ఫుటాం = స్పష్ట మైన, నిజవాజిరాజతాం = నిజ = తనదగు వాజిరాజతాం = అశ్వముల యొక్క ప్రభుత్వమును, అనిహ్నువానం = ప్రకటించుచున్న (హయం = గుఱ్ఱమును నలః = నలుఁడు ఆరురోహ = ఎక్కెను)

ఇచ్చట "మిషేణ" యని మిషశబ్దముచే, పుచ్ఛమందలి పుచ్ఛత్వ మును, కేసరముల యందలి కేసరత్వమును మఱుగుపఱచి వానియందు చామర యుగ్మత్వము నారోపించుట వలన నపహ్నవముతోఁ గూడిన యుత్ప్రేక్ష.

సమాసములు :

సితత్విట్ = సితా + త్విట్ యస్య సః, సితత్విట్, తస్య = సితత్విషః.
చలచ్చామరయుగ్మచిహ్నకైః:- చామరయోః, యుగ్మం, చామరయుగ్మం, చలచ్చ చామరయుగ్మం చ = చలచ్చామరయుగ్మం, చలచ్చామరయుగ్మ మేవ చిహ్నకాని, తైః చలచ్చామరయుగ్మ చిహ్నకైః.

అనిహ్నువానమ్:- న, నిహ్నువానః, = అనిహ్నువానః, తమ్ = అని హ్నువానమ్

నిజవాజిరాజతామ్:- వాజినామ్, రాజా వాజిరాజః వాజిరాజస్య భావః, వాజి రాజతా, నిజా చ సా వాజిరాజతా = నిజవాజిరాజతా, తామ్, నిజవాజిరాజతామ్.

భావము :

రాజులకు నిఱుపార్శ్వముల యందును వింజామరములున్నట్లే యశ్వ రాజమునకు తెల్లని కాంతిగల్గినదై కదలికతో నొప్పెడి తోకయు, జూలును రెండు వింజామరములు కాగా, వానితో తన యశ్వరాజ పదవి నీ యశ్వము ప్రక టించుకొనుచున్నది. అట్టి యశ్వమును నలుఁడధిరోహించెను.

శ్లో॥ అపి ద్విజిహ్వాభ్యవహారపౌరుషే
ముఖానుషక్తాయతవల్గువల్గయా ।
ఉపేయివాంసం ప్రతిమల్లతాం రయ
స్మయే జితస్య ప్రసభం గరుత్మతః ॥ ౬౩

ప॥ వి॥ అపి । ద్విజిహ్వాభ్యవహారపౌరుషే। ముఖానుషక్తాయతవల్గువల్గయా। ఉపేయివాంసం । ప్రతిమల్లతాం । రయస్మయే । జితస్య । ప్రసభం । గరుత్మతః ।

టీక॥ రయస్మయే. రయ = వేగము వలని. స్మయే = అహంకారమందు. ప్రసభం = బలవంతముగ. జితస్య = ఓడింపఁబడిన, గరుత్మతః = గరుడునకు. ముఖానుషక్తాయతవల్గు వల్గయా. ముఖ = ముఖమందు అనుషక్త = తగిలింపఁబడిన. ఆయత = పొడవైన.వల్గు = అందమైన. వల్గయా = ముక్కుత్రాటిచే, ద్విజిహ్వాభ్యావహారపౌషేఽపి. ద్విజిహ్వా = సర్పముల యొక్క అభ్యవహార = భక్షణమందలి పౌరుషేఽపి = ప్రయత్నమందును ప్రతిమల్లతాం = ప్రతి భటుఁడుగ నుండుటను. ఉపేయివాంసమ్ _ పొంచుచున్న దోయనునట్లున్న (హయం = గుఱ్ఱము ను నలః = నలుఁడు ఆరురోహ = ఎక్కెను)

"ప్రతిమల్లతాముపేయివాంసమ్" అను ప్రతిభటత్వమును పొందుచున్నదో యనునట్లు చెప్పుట వలన నుత్ప్రేక్ష. ఇవాది వ్యంజకము లేనందు వలన నది గమ్యము "ముఖానుషక్తాయత వల్గువల్గయా యనునెడ, నోటికిఁ దగిలింపఁబడిన పొడవగు ముక్కుత్రాటి నెపముచే, యని ముక్కుత్రాటి యందు వల్గత్వమును మఱుగు పఱచి సర్పత్వము నారోపించుట వలన నపహ్నవము-మిషాది శబ్దములు లేనందు వలన నిదియు గమ్యము.

సమాసములు :-

ద్విజిహ్వాభ్యవహారపౌరుషే: ద్వే జిహ్వా యేషాం తే ద్విజిహ్వాః, ద్విజిహ్వానామభ్యవహారః = ద్విజహ్వాభ్యవహారః, ద్విజిహ్వాభ్యవహారే పౌరుషమ్ ద్విజిహ్వాభ్యవహారపౌరుషమ్ తత్ = ద్విజిహ్వాభ్యవహార

పౌరుషమ్

ముఖానుషక్తాయతవల్గువల్గయా : ముఖే అనుషక్తా ముఖానుషక్తా, ఆయతా చ సా వల్గుశ్చ = ఆయతవల్గుః ఆయత వల్గశ్చా సౌ వల్గాచ ఆయత వల్గువల్గా, ముఖానుషక్తాచ సా ఆయతవల్గువల్గా చ = ముఖానుషక్తాయత వల్గువల్గా. తయా, ముఖానుషక్తాయత వల్గువల్గయా ॥

రయస్మయే:- రయస్య స్మయః = రయస్మయః తస్మిన్ = రయస్మయే_

భావము :-

వేగమునందు గరుత్మంతు నోడించిన యీ యశ్వము తన నోటికిఁ దగిలింపఁబడిన పొడవగు ముక్కు(త్రాటినెపముచే సర్పభక్షణ పౌరుషమందును గరుత్మంతునితోఁ బోటిఁజేయుచున్నట్లుగానఁబడుచున్నది. అట్టి యశ్వమును నలుఁడధిరోహించెను.

శ్లో॥ స సింధుజం, సీతమహస్సహోదరం
హరంతముచ్చైశ్శ్రవసః శ్రియం హయమ్।
జితాఖిలక్ష్మాభృదనల్పలోచన
స్తమారురోహ క్షితిపాకశాసనః ॥ ౬౪

ప॥ వి॥ సః । సింధుజం । శీతమహస్సహోదరమ్ । హరంతమ్ । ఉచ్చైః శ్రవసః । శ్రియం । హయం । జితాఖిలక్ష్మాభృత్ । అనల్పలోచనః । తమ్ । ఆరురోహ । క్షితిపాకశాసనః.

టీ॥క॥ జితాఖిలక్ష్మాభృత్; జిత = జయింపఁబడిన, అఖిలక్ష్మాభృత్ = సమస్త భూపాలురుఁగలవాడును, (సమస్తపర్వతములుగలవాఁడును) అనల్పలోచనః; అనల్ప = విశాలమైన, లోచనః = నేత్రములుగలవాఁడును, అనల్ప = అధికసంఖ్యాకములైన, లోచనః = నేత్రములుగలవాఁడును. (అనగా, సహస్రాక్షుఁడును)నగు సః = ఆ క్షితిపాకశాసనః = భూమికింద్రుఁడును (దేవేంద్రుఁడును) నగు నలమహారాజు, సింధుజం = సింధుదేశమునందుఁ బుట్టినదియు, (సముద్రమందుఁబుట్టినదియు) శీతమహస్సహోదరం; శీతమహః = చల్లని కాంతిగల చంద్రునితో, సహోదరం = సమానమైనదియు, (శీతమహః = చంద్రునికి, సహోదరం = తోఁబుట్టువును) ఉచ్చైఃశ్రవసః = ఉచ్చైఃశ్రవమను గుఱ్ఱముయొక్క, శ్రియం = శోభను, హరంతమ్ = హరించునదియు. (ఉచ్చైఃశ్రవముతో సమానమైనదియునగు) తం = ఆ, హయం = గుఱ్ఱమును, ఆరురోహ = ఎక్కెను.

శ్లేషచే నలాశ్వమునకుఉచ్చైః శ్రవముతో సామ్యముఁ దేఁబడినది. కాన నిఁట నుపమాలంకారము. అది శ్లేషతో సంకీర్ణము, "క్షితి

పాకశాసనః," అని నలుని భూమికి నింద్రుఁడని చెప్పుట యతిశ యోక్త్యలంకారము.

**సమాసములు :**

సింధుజమ్:- సింధౌ జాయత ఇతి సింధుజః, తమ్ = సింధుజమ్

శీతమహస్సహోదరమ్: శీతం మహః యస్మ సః శీతమహాః, శీతమహసా సహోదరః శీతమహస్సహోదరః, (శీతమహసః సహోదరః. శీతమహ స్సహోదరః) తం = శీతమహస్సహోదరమ్.

జితాఖిలక్ష్మాభృత్: క్ష్మాం బిభ్రతీతి = క్ష్మాభృతః, అఖిలాశ్చ తే క్ష్మాభృతశ్చ అఖిలక్ష్మాభృతః-జితాః, అఖిలక్ష్మాభృతఃయేన సః = జితాఖిలక్ష్మాత్.

అనల్పలోచనః : అనల్పే లోచనే యస్య సః = అనల్పలోచనః- (అన ల్పాని-లోచనాని యస్య సః = అనల్పలోచనః)

క్షితిపాకశాసనః : క్షితేః పాకశాసనః = క్షితిపాకశాసనః.

**భావము :**

సమస్త రాజులను జయించిన వాఁడును, విశాలలోచనములుకలవాడును (సమస్త పర్వతములను జయించిన వాడును, బహులోచనములు గలవాడునై) భూమి కింద్రుఁడుగ వెలయుచు సింధుదేశమునఁ బుట్టినదియు, చంద్రునితో సమానమైనదియు, (సాగరమున జన్మించినదియు చంద్రునికి తోఁబుట్టువుగ వెలసినదియు) నగు నుచ్చైఃశ్రవము శోభను హరించుటచేఁ దానికి సమానముగ నున్న తన గుఱ్ఱము నారోహించెను.

శ్లో॥ నిజా మయూఖా ఇవ తిగ్మదీధితిం
స్ఫుటారవిందాంకితపాణిపంకజమ్।
తమశ్వవారా జవనాశ్వయాయినం
ప్రకాశరూపా మనుజేశమన్వయుః॥ - ౫

ప॥ వి॥ నిజాః । మయూఖా :। ఇవ । తిగ్మదీధితిమ్ । స్ఫుటారవిందాంకితపాణి పంకజమ్ । తమ్। అశ్వవారాః । జవనాశ్వయాయినం । ప్రకాశరూపాః । మనుజేశమ్ । అన్వయుః ।

టీక॥ నిజాః = తనకు సంబంధించినవారును. ప్రకాశరూపాః = ఉజ్జ్వలమైన రూపముకలవారును భాస్వరమగు రూపముగల వారును నగు అశ్వవారాః = గుఱ్ఱపు రౌతులు, స్ఫుటారవిందాంకితపాణిపంకజమ్; స్ఫుట = స్పష్టములైన. అరవింద = పద్మరేఖలచే, అంకిత = గుర్తింపబడిన, పాణిపంకజమ్ = తామర పుష్పమువంటి హస్తములుగలవాడును,(స్ఫుట = వికసించిన. అరవింద = తామర పుష్పములతో, అంకిత = గూడిన పాణిపంకజమ్ = పద్మమువంటి హస్తములు గలవాడును) జవనాశ్వయాయినమ్, జవన = వేగముగల, అశ్వ = గుఱ్ఱముతో,(గుఱ్ఱములతో) యాయినం = పోవుచున్న. మనుజేశం = రాజైన నలుని. తిగ్మదీధితిమ్ = సూర్యుని, మయూఖా ఇవ — కిరణమువలె, అన్వయుః = వెంబడించిరి.

ఇచ్చట నలుని శ్లిష్టవిశేషణములతో సూర్యునితో పోల్చినందు వలన—శ్లేష సంకీర్ణమగు నుపమ.

సమాసములు :

తిగ్మదీధితిమ్:- తిగ్మాః—దీధితయః యస్య సః = తిగ్మదీధితిః. తమ్ = తిస్మ దీధితిమ్—

స్ఫుటారవిందాంకిత పాణిపంకజమ్;- స్ఫుటాని చ తాని అరవిందాని చ = స్ఫుటారవిందాని స్ఫుటారవిందైః అంకితే = స్ఫుటారవిందాంకితే. పాణీ పంకజే ఇవ = పాణిపంకజే, స్ఫుటారవిందాంకితే, పాణిపంకజే యస్య సః = స్ఫుటారవిందాంకితపాణిపంకజః = తం స్ఫుటారవిందాంకితపాణిపంకజమ్.

అశ్వవారాః :— అశ్వాన్ వారయంతీతి = అశ్వవారాః.

జవనాశ్వయాయినమ్ :— జవనశ్చాసౌ అశ్వశ్చ = జననాశ్వః జవనాశ్వేన యాతీతి జవనాశ్వయాయీ = తం, జవనాశ్వయాయినమ్—జవనాశ్చ తే, అశ్వాశ్చ = జవవాశ్వాః జవనాశ్వైః యాతీతి = జవనాశ్వయాయీ తం = జవనాశ్వయాయినమ్.

ప్రకాశరూపాః :— ప్రకాశః రూపం యేషాం తే ప్రకాశరూపాః—

మనుజేశమ్:— మనుజానామీశః = మనుజేశః = తం = మనుజేశమ్.

భావము:

ఇందు సూర్యుని, కిరణములు వెంబడించినట్లు నలుని అశ్వారోహులు వెంబడించిరని శ్లేషచే చెప్పఁబడు చున్నది. ఉజ్వలమైన ఆకారముగల తన రౌతులు; స్పష్టముగఁ గానవచ్చెడి పద్మరేఖలతో నంకితములగు హస్తములుగల్గి వేగము గల గుఱ్ఱముపై స్వారిచేయుచున్న నలమహారాజును; వెలుగు రూపముగఁ బ్రకాశించుచున్న కిరణములు: వికసిత పద్మములను హస్తములయందు ధరించినవాడై పెక్కుగుఱ్ఱములపై వెడలుచున్న సూర్యుని వెంబడించినట్లు వెంబడించిరి. నలుఁడిట నొక గుఱ్ఱముపై సవారి చేయుచుండును. సూర్యుడు సప్తాశ్వములపై స్వారిచేయుచుండును. సూర్యునిచేత వికసితములగు తామర పుష్పము లుండును-నలునిచేత స్పష్టముగ కానవచ్చెడి సాముద్రిక శాస్త్ర ప్రసిద్ధములగు పద్మరేఖలుండును. సూర్యుని, భాస్వరరూపములగు కిరణములు వెంబడించును. నలుని చక్కగ నలంకరించుకొని యుజ్జ్వల రూపులై వెలయు భటులు వెంబడింతురు. ఇట్లు రెండర్థములును శ్లేషచే నిందిమిడియున్నవి.

శ్లో॥ చలన్నలంకృత్య మహారయం హయం
స వాహవాహోచితవేషపేశలః।
ప్రమోదనిష్పందతరాక్షిపక్ష్మభి
ర్వ్యలోకి లోకైర్నగరాలయైర్నలః॥ ౬౬

ప॥ వి॥ చలన్ । అలంకృత్య । మహారయం । హయం । సః । వాహవాహోచిత వేషపేశలః। ప్రమోదనిష్పందతరాక్షిపక్ష్మభిః। వ్యలోకి। లోకైః । నగరాలయైః । నలః ।

టీక॥ వాహవాహోచిత వేషపేశలః; వాహవాహ = గుఱ్ఱపుసవారికి, ఉచిత = తగిన, వేష = అలంకారముచే. పేశలః = రమ్యమయిన వాడైన సః = ఆ నలుఁడు, మహారయం = గొప్ప వేగముగల. హయం = గుఱ్ఱమును, అలంకృత్య = భూషించి (అనగా తా నధిరోహించుటచే భూషించు అని యర్థము) చలన్ = వెళ్లుచు, ప్రమోదనిష్పందతరాక్షిపక్ష్మభిః ప్రమోద = సంతోషముతో, నిష్పందతర మిగుల నిశ్చలములగు, అక్షి పక్ష్మభిః = కండ్లరెప్పలుగల, నగరాలయైః = నగరవాసులగు, జనైః = జనులచే వ్యలోకి = చూడబడెను.

చలన్నలం, మహారయం, హయం, ఇత్యాదిశబ్ద పునరుక్తిచే నిట వృత్త్యనుప్రాసాలంకారము.

సమాసములు:

మహారయ :— మహాన్, రయః యస్య సః = మహారయః, తం = మహారయమ్,

వాహవాహోచితవేషపేశలః :— వాహస్య — వాహః = వాహవాహః వాహవాహస్య ఉచితః = వాహవాహోచితః, వాహవాహోచితశ్చాసౌ వేషశ్చ = వాహవాహోచితవేషః, వాహవాహోచిత వేషేణ పేశలః = వాహవాహోచిత వేషపేశలః।

ప్రమోదనిష్పందతరాక్షిపక్ష్మభిః :— అతిశయేన నిష్పందాని = నిష్పందతరాణి, ప్రమోదేన నిష్పందతరాణి: ప్రమోదనిష్పందతరాణి, ప్రమోదనిష్పందతరాణి — అక్ష్ణా పక్ష్మాణి = అక్షిపక్ష్మాణి, ప్రమోద నిష్పందతరాణి—అక్షిపక్ష్మాణి యేషాం తే, ప్రమోదనిష్పందతరాక్షి పక్ష్మ సః,

నగరాలయైః ;— నగరమ్. ఆలయః యేషాం తే = నగరాలయాః, తైః = నగరాలయైః

**భావము :**

గుఱ్ఱపు సవారికి దగిన వేషము ధరించుటచే మిగుల నందముగఁ గాన వచ్చు నా నలమహారాజు, గొప్పవేగముతోఁ బోఁగల్గిన యాగుఱ్ఱమును తానధిరోహించుటచేతనే యలంకరించి, పోసాగెను. ఆదృశ్యమును పరమహర్షముతో రెప్పలల్లార్చక పౌరులందఱును గాంచిరి. ఇట్లు నలుని యశ్వారోహణము పౌరుల కందఱికిని మిక్కిలి హర్షదాయకముగ నుండినది.

శ్లో॥ క్షణాదథైష క్షణదాపతిప్రభః
ప్రభంజనాధ్యేయజవేన వాజినా।
సహైవ తాభిర్జన దృష్టివృష్టిభి
ర్బహిఃపురోఽభూత్ పురుహూతపౌరుషః॥ ౬౭

ప॥ వి॥ క్షణాత్ । అథ । ఏషః । క్షణదాపతిప్రభః । ప్రభంజనాధ్యేయజవేన । వాజినా । సహ । ఏవ । తాభిః । జనదృష్టివృష్టిభిః । బహిః । పురః । అభూత్ । పురుహూత పౌరుషః॥

టీక॥ అథ = పిదప, క్షణదాపతిప్రభః: క్షణదాపతి = చంద్రునియొక్క, ప్రభః కాంతివంటి కాంతిగల్గిన, పురుహూత పౌరుషః = ఇంద్రుని పరాక్రమము వంటి పరాక్రమము గల్గిన, ఏషః = ఈ నలుఁడు ప్రభంజ నాధ్యేయ జవేన. ప్రభంజన = వాయువుచే, అధ్యేయ = నేర్వఁతగిన, జవేన = వేగ ముగల, వాజినా = గుఱ్ఱముతో, క్షణాత్ = క్షణము కాలమునుండి; తాభిః = ముందుఁ జెప్పబడిన జనదృష్టివృష్టిభిః, జన = పౌరుల యొక్క, దృష్టివృష్టిభిః = చూపుల వర్షములతో, పురః = పట్టణము నుండి. బహిః = వెలుపలనున్న వాఁడుగ। అభూత్ = ఆయెను.

మొదట పట్టణమందు తనపైన నేర్పడిన జనదృష్టి క్షణము కాలములోనే పట్టణము వెలుపలఁ జూడబడెననుటచే నిట వేగాతిశయోక్తి.

సమాసములు:-

క్షణదాపతి ప్రభః ।. క్షణదాయాః పతిః = క్షణదాపతిః, క్షణదాపతేః ప్రభా ఇవ ప్రభా యస్యసః = క్షణదాపతిప్రభః

ప్రభంజనాధ్యేయజవేన : ప్రభంజనేన అధ్యేయః = ప్రభంజనాధ్యేయః, ప్రభంజనాధ్యేయః జవః యస్య సః = ప్రభంజనాధ్యేయజవః, తేన ప్రభంజనాధ్యేయజవేన.

జనదృష్టివృష్టిభిః- జనానాం దృష్టయః = జనదృష్టయః, జనదృష్టయ ఏవ వృష్టయః = జనదృష్టివృష్టయః. తాభిః = జనదృష్టివృష్టిభిః

పురుహూతపౌరుషః:-పురుహూతస్య పౌరుషమివ పౌరుషం యస్య.సః = పురుహూతపౌరుషః.

భావము:-

చంద్రుని వంటికాంతియు. నింద్రునివంటి పౌరుషముగల యానలుఁడు వాయువుగూడ నేర్చుకోతగిన యంతటి వేగముగల గుఱ్ఱముతో, జనులు తనపై

దృష్టులను వర్షించుచుండ నట్టి దృష్టి వర్షములతో క్షణకాలమున నగరము వెలుపలికి చేరెను. తొలుత నగరమునఁ జూడఁబడిన నలుడు, క్షణకాలమున నగరము వెలుపలఁ జూడఁబడెను కాన నాతని యశ్వవేగము వాయువేగమునుఁగూడ మించినది.

శ్లో॥ తతః ప్రతీచ్ఛ ప్రహరేతి భాషిణీ
పరస్పరోల్లాసితశల్యపల్లవే।
మృషామృధం సాదిబలే కుతూహలా
న్నలస్య నాసీరగతే వితేనతుః॥ ౬౯

ప॥వి॥ తతః । ప్రతీచ్ఛ । ప్రహర । ఇతి । భాషిణీ । పరస్పరోల్లాసిత శల్యపల్లవే । మృషామృధం । సాదిబలే । కుతూహలాత్ । నలస్య । నాసీరగతే । వితేనతుః.

టీ॥క॥ తతః = పురమునుండి వెలుపలికి వచ్చిన పిదప, ప్రతీచ్ఛ = పట్టుకొనుము, ప్రహర = కొట్టుము ఇతి = అని, భాషిణీ = మాట్లాడునవియు, పరస్పరోల్లాసిత శల్యపల్లవే, పరస్పర - ఒండొరులపైన. ఉల్లాసిత = విసరఁబడిన-శల్యపల్లవే = తోమరాయుధములు గలవియునగు.నలస్య = నలునియొక్క. నాసీరగతే = సేనకుముందున్న. సాదిబలే = గుఱ్ఱపు దండున కుతూహలాత్ = వినోదమును ద్దేశించుట వలన, మృషామృధం = కృత్రిమయుద్ధమును, వితేనతుః = చేసినవి.

సమాసములు :

పరస్పరోల్లాసిత శల్యపల్లవే :- పరస్పరయోరుల్లాసితాని, పరస్పరోల్లాసితాని, శల్యానాం పల్లవాని = శల్యపల్లవాని, పరస్పరోల్లాసితాని, శల్యపల్లవాని యాభ్యాం తే = పరస్పరోల్లాసిత శల్యపల్లవే.

మృషామృధమ్ :- మృషా మృధం = మృషామృధమ్ = తత్ = మృషామృధమ్॥.

నాసీరగతే :- నాసీరం గతే = నాసీరగతే.

భావము:

నలుఁడు నగరమునకు వెలుపలికిరాగానే యతని సేనకు ముందున్న యశ్వసైనికులు "పట్టుకొనుము" "కొట్టుము" అని మాట్లాడుచు నొండొరు

లపై బల్లెములు మున్నగు నాయుధముల కొనలను విసరుచు వినోదమునకై కృత్రిమయుద్ధమును సలిపిరి.

శ్లో॥ ప్రయాతుమస్మాక మియం కియత్పదం
ధరా తదంభోధిరపిస్థలాయతామ్ ।
ఇతీవ వాహై ర్నిజవేగదర్పితైః
పయోధిరోధక్ష మముద్ధతం రజః ॥

ప॥ వి॥ ప్రయాతుమ్ । అస్మాకమ్ ।ఇయం। కియత్ ।పదం ।ధరా ।తత్। అంభోధిః, అపి । స్థలాయతామ్ । ఇతి । ఇవ । వాహైః । నిజవేగదర్పితైః । పయోధిరోధక్షమమ్ । ఉద్ధతం । రజః ।

టీ॥క॥ ఇయం = ఈ (సముద్ర వ్యతిరిక్తమైన) ధరా = భూమి అస్మాకం = మనకు ప్రయాతుం = ప్రయాణము గావించుటకు కియత్ = ఎంత పదమ్ = స్థానము తత్ = అందువలన అంభోధిరపి = సముద్రముగూడ స్థలాయతాం = నేలవలె నాచరించుగాత ఇతీవ = అని భావించునట్లు నిజవేగ దర్పితైః।నిజవేగ = తమవేగముచే దర్పితైః = గర్వించిన వాహైః = గుర్రములచే పయోధిరోధక్షమం పయోధి = సముద్రమును సైతమును కప్పివేయుటకు క్షమం = చాలినంత రజః = ధూళి ఉద్ధతం = రేపఁబడినది.

ధూళిని రేపుటకు "సముద్రము గూడనేలగ నాచరించునుగాత యని తలంచుట హేతువుగాదుగాన దానిని హేతువుగఁ జెప్పుటవలన హేతూత్ప్రేక్షాలంకారము.

సముద్రమును కప్పునంతటి ధూళి రేపలేక పోయినను, వానిని రేపినట్లు చెప్పుటవలన అతిశయోక్త్యలంకారము.

సమాసములు :

నిజవేగ దర్పితైః :— నిజశ్చాసౌ. వేగశ్చ = నిజవేగః—నిజవేగేన దర్పితాః, నిజవేగదర్పితాః = తైః = నిజవేగదర్పితైః.

పయోధిరోధక్షమమ్ :— పయోధేః రోధః = పయోధిరోధః

భావము :

తమ వేగముచే గర్వించిన నలాశ్వములు సముద్రమును మినహాయించినచో మిగిలు భూమి ఎంత్రమాత్రము? దానిని, దాటిపోవుట కెంత కాలము పట్టును కావున నీభూమి మన ప్రయాణమునకుఁజాలదుగాన సముద్రము గూడ భూమిగ మార్చబడినచో మనకు చాలవచ్చు నను నభిప్రాయముతో సముద్రమునుఁ గూడఁ గప్పి స్థలముగమార్చగలిగిన ధూళి యా గుఱ్ఱము లచే రేపబడినది.

శ్లో॥ హరేర్యదక్రామి పదైకకేన ఖం
పదైశ్చతుర్భిః క్రమణేఽపి తస్య నః।
త్రపా హరీణామితి నమ్రితాననై
ర్న్యవర్తి తై రర్ధనభః కృతక్రమైః॥ ౭౦

ప॥ వి॥ హరేః । యత్ । అక్రామి । పదా । ఏకకేన । ఖం । పదైః । చతుర్భిః । క్రమణే । అపి । తస్య । నః । త్రపా । హరీణామ్ । ఇతి । నమ్రితాననైః । న్యవర్తి । తైః । అర్ధనభఃకృతక్రమైః।

టీ॥క॥ యత్ = ఏ ఖం = ఆకసము,హరేః = విష్ణువుయొక్క ఏకకేన = ఒక్క టియేయైన పదా = పాదముచే అక్రామి = ఆక్రమింపఁబడినది. అనగా లంఘింపఁబడినది,చతుర్భిః = నాలుగైన,పదైః = పాదములచే తస్య = ఆయాకసముయొక్క క్రమణే = లంఘించుట కృతేసతి = చేయఁబడి నచో హరీణాం = అశ్వములైన (విష్ణువులైన) నః = మనకు త్రపా ఇతి = లజ్జయని తలంచినట్లుగ, నమ్రితాననైః = వంచఁబడిన తలలుగల తైః = ఆయశ్వములచే, అర్ధనభః కృతక్రమైః; అర్ధనభః = ఆకాశ మధ్యమందు కృతక్రమైః = లంఘనముచేసిన వానిచే, న్యవర్తి = మర లుట (సంభవించినది)

నమ్రితాననత్వమునకు. నభోమధ్యమందు లంఘించి ఆగుట కును లజ్జ హేతువుగాకపోయినను హేతువుగఁజెప్పుటవలన నిట హేతూత్ప్రేక్ష వ్యంజకములగు, ఇవాదిశబ్దములు లేనందులన నది గమ్యము అర్ధనభః కృతక్రమణము జెప్పుటనలన, అశ్వములు గంతు

లతో పరుగిడుచున్నవనియు నందువలననే యవి యాకాశమును లంఘించుట సంభవమనియు సూచితము.

**సమాసములు :**

నమ్రితాననైః:- నమ్రితాని ఆననాని యేషాం తే= నమ్రితాననాః తైః. నమ్రితాననైః.

అర్ధనభఃకృతక్రమైః :- అర్ధంచ తత్ నభశ్చ అర్ధనభః అర్ధనభసి కృతాః అర్ధనభఃకృతాః అర్ధనభఃకృతాఃక్రమాః యేషాంతే, అర్ధనభఃకృతక్రమాః, తైః అర్ధనభఃకృతక్రమైః.

**భావము :-**

వామనావతారమునందు విష్ణువు ఒకపాదముచే నాకసము నాక్రమించినట్లు పురాణగాథ. కాన హరిశబ్దవాచ్యుఁడగు విష్ణు వొక పాదముచే నాక్రమించిన యాకసమును హరిశబ్దవాచ్యములగు నశ్వములు నాలుగుపాదములచే నాక్రమించుట లజ్జాకరమని భావించినట్లుగా, తలలువంచుకొని ఆకాశమధ్యమునుండియే మఱలినవి. ప్లుతగతితోపోయెడి యశ్వము నభోమధ్యము నంటుచు మఱల భూమికి దిగుచు వెళ్లుట స్వభావము. ఆకాశమధ్యమునకుపోయి, లజ్జ కలుగగా తల వంచుకొని మఱలినట్లిట నా స్వభావము భావింపఁబడుచున్నది.

శ్లో॥ చమూచరా స్తస్య నృపస్య సాదినో
జినోక్తిషు శ్రాద్ధతయేవ సైంధవాః
విహారదేశం తమ వాప్యమండలీ
మకారయన్భూరితురంగమానపి॥ ౭౧

ప॥ వి॥ చమూచరాః । తస్య । నృపస్య । సాదినః । జినోక్తిషు । శ్రాద్ధతయా । ఇవ । సైంధవాః । విహారదేశం । తమ్ । అవాప్య । మండలీమ్ । అకారయన్ । భూరితురంగమాన్ । అపి

టీక॥ తస్య = ఆ, నృపస్య = నలునియొక్క, చమూచరాః; చమూ = సేనయందు, చరా: = సంచరించునట్టి, సైంధవాః = సింధుదేశమందుఁ బుట్టిన గుఱ్ఱములకు సంబంధించిన, సాదినః = గుఱ్ఱపు రౌతులు,

జినోక్తిషు = జైనసిద్ధాంతములయందు, శ్రాద్ధతయేవ = శ్రద్ధగల్గియుం డుటచేతనో యనునట్లు, తం = ఆ. విహారభూమిం = విహరించునట్టి దేశము, అవాప్య = పొంది, తురంగమాన్ = గుఱ్ఱములను, భూరి = ఎక్కువగా, మండలీమపి = వర్తులముగ తిరుగుటను, (మండలాస నమును) అకారయన్ = చేయించిరి.

మండలీకరణమునకు, జైనసిద్ధాంతములయందు, శ్రద్ధ హేతువు కాకపోయినను, దానిని హేతువుగఁజెప్పుటవలన హేతూత్ప్రేక్ష. జైన బౌద్ధమతములయందు మండలాకారముగఁ గూర్చొని కర్మానుష్ఠానము జేయుట ప్రసిద్ధము. వారి నివాసస్థలములు విహారములని చెప్పఁబడును.

సమాసములు:

చమూచరా : చమూషు చరంతీతి = చమూచరాః.
జినోక్తిషు : జినస్య ఉక్తయః = జినోక్తయః తాసు జినోక్తిషు.
సైంధవాః : సింధుషు భవాః = సైంధవాః = సైంధవాః.

భావము ;—

ఆ నలుని సేనయందు సంచరించుచు, సింధుదేశమున జన్మించిన గుఱ్ఱము లకు సంబంధించిన రౌతులు, ఆ గుఱ్ఱములను వర్తులాకారముగ నిలఁబెట్టి, జైన దర్శనమునందు శ్రద్ధగల్గినట్లు, విహారదేశములయందు మండలాకరణముతో ద్రిప్పిరి జైన బౌద్ధమతములయందు విహారములయందు. ఆ మతస్థులు మండలా కారముగఁ గూర్చొని కర్మానుష్ఠానములుగావింతురు. ఆ విధముగనే గుఱ్ఱములచే మండలస్థితినిఁ చేయించి యా మతమందు తమకున్న శ్రద్ధను ప్రకటించు చున్నారా యనునట్లు రౌతులు వర్తించిరి. మండలీకరణముతో నశ్వవిన్యాసము గావించిరనుట తాత్పర్యము.

శ్లో॥ ద్విషద్భిరేవాస్య విలంఘితా దిశో
యశోభిరేవాబ్ధిరకారి గోష్పదమ్।
ఇతీవ ధారామవధీర్యమండలీ
క్రియాశ్రియా మండి తురంగమైఃస్థలీ॥ ౭౨

ప॥ వి॥ ద్విషద్భిః । ఏవ। అస్య। విలంఘితాః । దిశః । యశోభిః । ఏవ । అబ్ధిః।
అకారి । గోష్పదమ్ । ఇతి । ఇవ । ధారామ్ । అవధీర్య । మండలీ
క్రియాశ్రియా । అమండి । తురంగమైః । స్థలీ ।

టీ॥క॥ అస్య = ఈ నలునియొక్క ద్విషద్భిరేవ = శత్రువుల చేతనే దిశః =
దిక్కులు విలంఘితాః = దాటఁబడినవి అస్య = ఇతనియొక్క యశోభి
రేవ = కీర్తులచేతనే అబ్ధిః = సముద్రము' గోష్పదం = గోవుపాదపు
పరిమితి గలదిగ. కృతః = చేయఁబడినది. ఇతీవ = ఇట్లు భావించినట్లు.
తురంగమైః = గుర్రములచే ధారాం = ధారాగతులను నైదింటిని. అవ
ధీర్య = తిరస్కరించి, మండలీక్రియాశ్రియా మండలీక్రియా = సగము
దుముకఁటమున్నగు మండలీకరణ క్రియయొక్క శ్రియా = లక్ష్మిచే,
స్థలీ = ఆ యకృత్రిమమగు భూమి అమండి = భూషింపఁబడినది.

వి॥ "ఇతీవధారామవధీర్య" ఇత్యాదిగ ధారాగతులను తిరస్క
రించుటకు శత్రుకృతమగు దిగ్లంఘనము. యశఃకృతమగు సాగర
గోష్పదీకరణము హేతువులు గాకపోయినను, వానిని హేతువులఁగఁ
జెప్పుటవలన హేతూత్ప్రేక్ష.

"ఆస్కందితం, ధౌరితకం, రేచితం, వల్గితం, ప్లుతమ్, గత
యోఽమూః పంచ ధారాః" అని అయిదు విధములగు ధారాగతులు గుర్ర
ముల కుండునని ప్రసిద్ధి.

సమాసములు :

గోష్పదమ్:- గోః పదమ్ = గోష్పదమ్।
మండలీ క్రియాశ్రియా :- మండల్యాః క్రియా, మండలీక్రియా, మండలీ
క్రియాయాః శ్రీః = మండలీక్రియాశ్రీః. తయా = మండలీక్రియా
శ్రియా॥

భావము :

నలునిచేఁ దఱుమబడిన శత్రువులు నానాదిక్కులకు వెళ్ళిపోయిరి కాన
నాదిక్కులకు తామువెళ్లుట ప్రతిష్ఠాకరముగాదు. నలుని యశస్సులచే సముద్ర
ములు గప్పఁబడి గోవుపాద మంతటిదిగఁ జేయఁబడినవి. కాన నట్టిసముద్రము

లకు వెళ్లుటయు ప్రతిష్ఠాకరముగాదు. ఏలయనగా ఒకరుచేసిన పనినే మఱియొక రును జేసినచో నది లోకమున మెచ్చఁబడదు. ప్రస్తుతము నలుదిక్కులకు శత్రువులు వెళ్లుట వలన, మఱల తాము వెళ్ళుటలో విలువయుండదు. అట్లే నలుసముద్రములను గీర్తియలము కొనినందువలన నచటికితాము వెళ్లుటయు మెప్పునుబడయదు.కాన దిక్కులును సముద్రములును నొరులచే దాయంబడినందువలన వానిని మఱల తాము దాటునియ్య కొనక గుఱ్ఱములన్నియు నొకచో నిలబడి తమయాస్కంతాది ధారాగతులను వదలి మండలీకరణములతో, నా బీటిభూమిని శోభావంతము గావించినవి. ఇందు నలునిశత్రువులు నలుదిక్కులకు తఱుమఁబడిరనియు నలునికీర్తి సముద్రముల గ్రమ్ముకొనిన దనియుఁ జెప్పుటవలన నలుని ప్రతాప కీర్తుల యాధిక్యము ధ్వనితము.

శ్లో॥ అచీకరచ్చారుహయేన యా భ్రమీ
ర్నిజాతపత్రస్య తలస్థలే నలః,।
మరుత్కిమద్యాఽపి న తాసు శిక్షతే
వితత్య వాత్యామయచక్రచంక్రమాన్॥ ౭౩

వ॥ వి॥ అచీకరత్। చారు। హయేన। యాః। భ్రమీః। నిజాతపత్రస్య। తలస్థలే। నలః। మరుత్। కిమ్। అద్య। అపి। న। తాసు। శిక్షతే। వితత్య। వాత్యామయచక్రచంక్రమాన్.

టీక॥ నలః = నలుడు. చారు = చక్కగా. హయే = గుఱ్ఱముచే. నిజాతపత్రస్య నిజ = తనదగు ఆతపత్రస్య = గొడుగునకు. తలస్థలే = అడుగుభాగమునందు. యాః = ఏ. భ్రమీః = మండలగతులను. అచీకరత్ = చేయించెనో. తాసు = ఆ మండలక్రియలందు. మరుత్ = వాయువు అద్యాపి = ఇప్పటికిని. వాత్యామయచక్రచంక్రమాన్; వాత్యామయ = వాత సమూహ భ్రమరూపములైన. చక్రచంక్రమాన్ = మండలగతులను. వితత్య = అధికముగ. న శిక్షతే కిమ్ = నేర్చుటలేదా ఏమి ?

"న శిక్షతే కిం" నేర్చుటలేదా ఏమి యని చెప్పుటవలన, అప్రసక్తమగు గతిశిక్షణకు ప్రసక్తత్వ ముత్ప్రేక్షింపఁబడినది గాన నుత్ప్రేక్ష. వాయువునకుఁగూడ సంభావితములుగాని గతులనుఁ జేయించెనని సూచితము.

సమాసములు :–

నిజాతపత్రస్య : నిజం చ తత్ ఆతపత్రం చ నిజాతపత్రమ్, తస్య = నిజాతపత్రస్య.

తలస్థలే : తలమేవ స్థలమ్ తలస్థలమ్, తస్మిన్ తలస్థలే.

వాత్యామయచక్రచంక్రమాన్ :

వాతానాం సమూహః = వాత్యాః. వాత్యానాం వికారాః = వాత్యామయాః. చక్రస్య చంక్రమాః = చక్రచంక్రమాః. వాత్యామయాశ్చ తే చక్రచంక్రమాశ్చ = వాత్యామయచక్రచంక్రమాః = తాన్ వాత్యామయచక్రచంక్రమాన్.

భావము :

నలుడు తన గొడుగుక్రింద నా హయముచే చక్కఁగాఁ గొన్ని మండలగతులనుఁ జేయించెను అట్టి మండలగతుల విషయమున వాయువు శిక్షణను విశేషముగ పొందినట్లు లేదు. ఒకవేళ పొందియున్నచో నా వాయువు సైత మట్టి సుడిగాడ్పుగతులనే చూపునుగదా. కాన వాయువునకుఁగూడ నభ్యస్తముగాని మండలగతులను నలుఁడు తన యశ్వముచేఁ జేయించుటవలన వాయువును మించిన గతివిశేషము లశ్వములకున్నవని సిద్ధించినది.

శ్లో॥ వివేశ గత్వా స విలాసకాననం
తతః క్షణాత్క్షోణిపతిర్ధృతీచ్ఛయా ।
ప్రవాళరాగచ్ఛురితం సుషుప్సయా
హరిర్ఘనచ్ఛాయమివాంభసాం నిధిమ్॥ ౭౪

ప॥ వి॥ వివేశ । గత్వా । సః । విలాసకాననం । తతః । క్షణాత్ । క్షోణిపతిః । ధృతీచ్ఛయా । ప్రవాళరాగచ్ఛురితం । సుషుప్సయా । హరిః । ఘనచ్ఛాయమ్ । ఇవ । అంభసాం । నిధిమ్.

టీక॥ తతః = తర్వాత, సః = ఆ క్షోణిపతిః = ప్రభువైన నలుఁడు, క్షణాత్ = క్షణ కాలమున, గత్వా = వెళ్లి, ధృతీచ్ఛయా; ధృతి = సంతోషము నందలి, ఇచ్ఛయా = కోరికచే, ప్రవాళరాగచ్ఛురితమ్; ప్రవాళ = చిగురుటాకుల యొక్కయు, (పవడముల యొక్కయు) రాగ = ఎఱ్ఱఁదనముచే

చ్ఛురితం = వ్యాప్తమైనదియు (పూయఁబడి నదియు) ఘనచ్ఛాయం = దట్టమైన నీడఁగలదియు (మేఘకాంతిగలదియు)నగు విలాసకాననం = క్రీడావనమును, (వకార బకారముల కభేదముండుటవలన బిలాసకాననం: బిలాసక = సర్పముల యొక్క ఆననం = జీవనసాధనమును) సుష ప్సయా = నిదురింపవలయునని కోరికచే, హరిః = విష్ణువు అంభసాం, నిధిమివ = ఉదకములకు నిధియగు సముద్రమును వలె, వివేశ = ప్రవే శించెను.

"అంభసాం నిధిమివ వివేశ" యని విష్ణువు సముద్రమును వలె నలుఁడు విలాస వనమును ప్రవేశించెనని చెప్పుట వలన నుపమాలం కారము. అది శ్లేషతో ననుప్రాణితము.

సమాసములు :

విలాసకాననమ్ : విలాసస్య కాననమ్ = విలాస కాననమ్, తత్ = విలాస కాననమ్.

బిలాస కాననమ్ : బిలే-ఆసతే ఇతి = బిలాసకాః, బిలాసకానామ్' అన నమ్ = బిలాస కాననమ్ - తత్ - బిలాసకాననమ్.

క్షోణిపతిః : క్షోణ్యాః పతిః = క్షోణిపతిః.

ధృతీచ్ఛయా : ధృత్యామిచ్ఛా = ధృతీచ్ఛా = తయా ధృతీచ్ఛయా.

ప్రవాళరాగచ్ఛురితమ్ : ప్రవాళానాం రాగః, ప్రవాళరాగః, ప్రవాళ రాగేణ చ్ఛురితమ్ = తత్ = ప్రవాళరాగచ్ఛురితమ్.

ఘనచ్ఛాయమ్ : ఘనా చ్ఛాయా యస్మిన్ తత్ = ఘనచ్ఛాయం = తత్ = ఘనచ్ఛాయమ్, ఘనానాం ఛాయా యస్మిన్ సః = ఘనచ్ఛాయః = తం = ఘనచ్ఛాయమ్.

భావము :

శ్రీ మహా విష్ణువు పవడంపు గాంతులతో నుపలిప్తమై మేఘకాంతితో నొప్పుచు, సర్పములకు నివాస భూమియై, జీవనము గల్పించు సముద్రమును, నిదురింపఁ బ్రవేశించిన విధముగ నలమహారాజు సుఖమును కాంక్షించి చిగుర్చు

టాకులఁ గాంతులతో, బూయఁబడినదియు, దట్టమైన నీడగలదియునగు నుద్యాన మునుఁ బ్రవేశించెను.

శ్లో॥ వనాంతపర్యంతముపేత్య సస్పృహం
క్రమేణ తస్మిన్నవతీర్ణదృక్పథే ।
న్యవర్తి దృష్టిప్రకరైః పురౌకసా
మనువ్రజద్బంధుసమాజబంధుభిః॥ ౭౫

ప॥ వి॥ వనాంతపర్యంతమ్ । ఉపేత్య । సస్పృహం । క్రమేణ । తస్మిన్ । అవతీర్ణ దృక్పథే । న్యవర్తి । దృష్టిప్రకరైః । పురౌకసామ్ । అను వ్రజద్ బంధు సమాజ బంధుభిః।

టీక॥ అనువ్రజద్బంధుసమాజబంధుభిః; అనువ్రజత్ = స్నేహము వలన వెంబడించుచున్న, బంధు సమాజ = చుట్టముల సంఘముతో, బంధుభిః = సమానములగు, పురౌకసాం = నగరవాసుల యొక్క దృష్టిప్రకరైః, = దృష్టి సమూహములచే, వనాంత పర్యంతం; వనాంత = అడవి యంచు యొక్క, పర్యంతం = అవధిని, వనాంత = జల ప్రాంతము యొక్క, పర్యంతం = అవధిని, సస్పృహం = అభిలాష యుక్తముగ, ఉపేత్య = వెళ్లి, క్రమేణ = క్రమముగా, తస్మిన్ = ఆ నలుఁడు అవతీర్ణ దృక్పథే; అవతీర్ణ = అతిక్రమింపఁ బడిన దృక్పథే = నేత్ర విషయము కాగా, న్యవర్తి = మఱలుట (దృష్టి సమూహములు మఱలినవి యని యర్థము)

"అనువ్రజద్బంధుసమాజబంధుభిః" - అని బంధు సమాజముతో సమానముగ దృష్టులు చెప్పఁ బడుటవలన నిట నుపమాలంకారము "ఆవనాంతాదోదకాంతాత్ ప్రియం పాంథమనువ్రజేత్" అని వనాంతము వఱకును, నీటి వఱకును, ప్రియమైన బాటసారిని ప్రయాణ కాలమం దనుసరింపవలయునని శాస్త్రముండుటవలన, నిట నలుని వెంట వచ్చు బంధువుల దృష్టి సమూహము నలుని యుద్యానవనము వఱకును వెంబడించి సాగనంపినవి.

సమాసములు:-

వనాంతం : వనస్య అంతః = వనాంతః వనాంతస్య పర్యంతః = వనాంత పర్యంతః, తం, వనాంతపర్యంతమ్.

సస్పృహమ్ : స్పృహయా సహితం యథా తథా = సస్పృహమ్.

అవతీర్ణ దృక్పథే : దృశోః పంథా = దృక్పథః, అవతీర్ణః = దృక్పథః యేన సః = అవతీర్ణ దృక్పథః = తస్మిన్ = అవతీర్ణ దృక్పథే.

దృష్టి ప్రకరైః : దృష్టీనాం ప్రకరాః = దృష్టి ప్రకరాః, తైః = దృష్టి ప్రకరైః.

పురౌకసామ్: పురం-ఓకః యేషాం తే, పురౌకసః, తేషాం, పురౌకసామ్.

అనుప్రజద్బంధుసమాజబంధుభిః : బంధూనాం సమాజః = బంధు సమాజః, అనుప్రజంశ్చాసౌ బంధుసమాజశ్చ = అనుప్రజద్బంధు సమాజః, అనువ్రజద్బంధు సమాజేన బంధవః = అనుప్రజద్బంధు సమాజబంధవః = తైః, అనుప్రజద్బంధుసమాజబంధుభిః.

భావము :

నలుఁడు విలాస వనమున కేగునపుడు పౌరుల యొక్క చూడ్కుల సమూహములు, వెంబడించి సాగనంపు బంధువులతో సమానములై యా నలుని ఉద్యానవనము వఱకును సాగనంపి (నీటి పట్టు వఱకును సాగనంపి) యతడు దృష్టి విషయమును దాటిపోగనే యా పౌరుల చూడ్కులు మఱలి వచ్చినవి. తమ యింటి నుండి బంధువులు ప్రయాణ మగునపుడు వారిని నీటిపట్టు వఱకును సాగనంపి తిరిగి వచ్చుట ధర్మము గాన నాధర్మమిట పౌరదృష్టులచే నిర్వహింపఁ బడినది.

శ్లో॥ తతః ప్రసూనే చ ఫలే చ మంజుళే
స సమ్ముఖీనాంగుళినా జనాధిపః।
నివేద్యమానం వనపాల పాణినా
వ్యలోకయత్కాననరామణీయకమ్॥ ౭౭

ప. వి. తతః । ప్రసూనే । చ । ఫలే । చ । మంజుళే । సః । సమ్ముఖీనాంగుళినా।జనాధిపః । నివేద్యమానం । వనపాలపాణినా । వ్యలోకయత్ । కానన రామణీయకమ్ ।

అర్థము:- తతః = వనమును బ్రవేశించిన తర్వాత. సః = ఆ జనాధిపః = నలమహారాజు. మంజులే = మనోహరమైన. ప్రసూనే = పుష్పవిషయమందును ఫలే చ = ఫలవిషయమునందును. సమ్ముఖీనాంగుళినా; సమ్ముఖీన = ఎదుటనున్న వస్తువును బ్రదర్శించెడి. అంగుళినా = వ్రేలు గల వనపాలపాణినా. వనపాల = తోటమాలియొక్క. పాణినా = చేతిచే. నివేద్యమానం = చూపబడుచున్న, కాననరామణీయకం = ఉద్యాన సౌందర్యమును. వ్యలోకయత్ = చూచెను.

ఇచ్చట నలునకు ఉద్యాన సౌందర్యమును వ్రేలిపెట్టి తోటమాలి చూపుట స్వాభావికముగాన, స్వభావోక్తి.

సమాసములు :

సమ్ముఖీనాంగుళినా :- సమ్ముఖస్య దర్శినీ = సమ్ముఖీనా, సమ్ముఖీనా, అంగుళిః యస్య సః = సమ్ముఖీనాంగుళిః తేన = సమ్ముఖీనాంగుళినా.

వనపాలపాణినా:- వనం పాలయతీతి = వనపాలః వనపాలస్య పాణిః = తేన వనపాలపాణినా.

కాననరామణీయకమ్ :- రమణీయస్య భావః = రామణీయకమ్, కాననస్య రామణీయకమ్ = కాననరామణీయకమ్.

భావము:-

నలుఁడు ద్యానమును ప్రవేశించిన తర్వాత తోటమాలి, యా నలునకా యుద్యానములోని పుష్పములను, ఫలములను వ్రేలితో నిర్దేశించి చూపుచుండగా తానా యుద్యానము యొక్క సౌందర్యమునుఁ జూచెను.

శ్లో॥ ఫలాని, పుష్పాణి, చ పల్లవే కరే
వయోతిపాతోద్గతవాతవేపితే।
స్థితైస్సమాదాయ మహర్షివార్థకా
ద్వనే తదాతిథ్యమశిక్షి శాఖిభిః॥ ౭౭

ప, వి. ఫలాని । పుష్పాణి । చ । పల్లవే । కరే । వయోతిపాతోద్గతవాతవేపితే । స్థితైః । సమాదాయ । మహర్షి వార్థకాత్ । వనే । తదాతిథ్యమ్ । అశిక్షి । శాఖిభిః ।

టీక॥ వయోఽతి పాతోద్గతవాత వేపితే, వయః = పక్షుల యొక్క, (బాల్య వయస్సు యొక్క) అతిపాత = ఎగురుటచే (అతిక్రమణచే) ఉద్గత = సంభవించిన, వాత = గాలిచే, (వాత దోషముచే) వేపితే = కదలింపఁబడిన (వణికింపఁబడిన) పల్లవే = చిగురుటాకనెడి, కరే = చేతియందు (చిగురువంటి హస్తమందు) ఫలాని = పండ్లను, పుష్పాణి = పూలను సమాధాయ = ఉంచుకొని, స్థితైః = ఉన్నటువంటి, వనే = ఉద్యానమందలి, శాఖిభిః = వృక్షములచే (వేదశాఖల నధ్యయనము గావించినవారిచే) తదాతిథ్యమ్; తత్ = ఆ నలునికైన, ఆతిధ్యం = అతిధి సత్కారము, మహర్షివార్ధకాత్ = వృద్ధులయిన మహర్షి సంఘము నుండి అశిక్షి = నేర్పఁబడినది.

"తదాతిథ్యం శాఖభి రశిక్షి" యని, "యా నలునికై యాతిథ్యము వృక్షములచే నేర్పబడినదా యేమి" యని చెప్పుటవలన నిటనుత్ప్రేక్షాలంకారము. ఇవాది వ్యంజకములు లేనందువలన నది గమ్యము. అదియు నిందలి రూపకశ్లేషలచేనుత్థాపితమై వానితో సాంకర్యమందుటవలన నాయలంకారముల కిందు సంకరము.

**సమాసములు :**

వయోఽతి పాతోద్గతవాతవేపితే : వయసామతిపాతః, వయోఽతిపాతః, వయోతిపాతేన ఉద్గతః, వయోతిపాతోద్గతః, వయోఽతిపాతోద్గతశ్చాసౌ వాతశ్చ, వయోతిపాతోద్గతవాతః, వయోతిపాతోద్గతవాతేన, వేపితః = వయోతి పాతోద్గతవాతవేపితః, తస్మిన్, వయోతి పాతోద్గతవాత వేపితే.

మహర్షి వార్ధకాత్ : వృద్ధానాం సమూహః వార్ధకమ్ మహర్షీణాం వార్ధకమ్, మహర్షి వార్ధకమ్, తస్మాత్, మహర్షి వార్ధకాత్.

తదాతిథ్యమ్ : తస్య ఆతిధ్యమ్ = తదాతిధ్యమ్.

**భావము:-**

ఆవనమందలి వృక్షములు పక్షు లెగిరిపోవుటవలన నేర్పడిన గాలికిఁ గదలిన చిగురుఁ జేతియందు, ఫలములనుఁ బుష్పములను నుంచుకొనినవై, ఆ నలునికిఁ జేయఁనగు నాతిథ్యమును, వనమందలి వృద్ధులగు ఋషుల సంఘమున నేర్చుకొనినవో యనునట్లుండినవి.

ఆ వనమందలి వేదాధ్యయన సంపన్నులు వయస్సు గడచుటచే నేర్పడిన వాత దోషముచే వణకుచున్న హస్తములయందు ఫల పుష్పముల నుంచుకొని నలునికిఁ జేయఁదగు నాతిథ్యమును వృద్ధులగు మహర్షుల సంఘమునుండి నేర్చుకొనిరోయన్నట్లుండిరని శ్లేషచే నేర్పడు నర్థాంతరమునకు తాత్పర్యము.

శ్లో॥ వినిద్ర పత్రాళి గతాళికైతవా
న్మృగాంక చూడామణి వర్జనార్జితమ్ ।
దధానమాశాసు చరిష్ణు దుర్యశ
స్స కౌతుకీ తత్ర దదర్శ కైతకమ్॥ ౭౮

ప॥ వి॥ వినిద్ర పత్రాళిగతాళికైతవాత్ । మృగాంక చూడామణి వర్జనార్జితమ్। దధానమ్ । ఆశాసు । చరిష్ణు । దుర్యశః । సః । కౌతుకీ । తత్ర । దదర్శ। కైతకమ్.

టీక॥ వినిద్ర పత్రాళిగతాళి కైతవాత్, వినిద్ర = వికసించిన, పత్ర = ఆకుల యొక్క, అళి = వరుసను, గత = పొందిన, అళి = తుమ్మెదలయొక్క కైతవాత్ = నెపమువలన, ఆశాసు = దిక్కులయందు, చరిష్ణు = సంచరించు స్వభావముగల, దుర్యశః = అపకీర్తిని, దధానం = ధరించుచున్న కైతకం = మొగలి పూవును, తత్ర = ఆవనమందు, కౌతుకీ(సన్) = కుతూహలముగలవాడై, సః = ఆ నలుఁడు, దదర్శ = చూచెను.

"వినిద్ర పత్రాళి గతాళి కైతవాత్" అనునెడ, కైతవ శబ్దముచేఁ దుమ్మెదలయందలి యళిత్వమును మఱుగు పఱచి యందు నపకీర్తిత్వము నారోపించుటవలన పహ్నవాలంకారము. శివుఁడు మొగలి పూవునకు శాప మొసంగుటవలన నది యతని పూజకు నిషిద్ధమై యా బహిష్కరణము వలన నపకీర్తినిఁ బొందినది.

సమాసములు :

వినిద్ర పత్రాళి గతాళి కైతవాత్ : వినిద్రాణి చ, తాని పత్రాణి చ, వినిద్ర పత్రాణి, వినిద్ర పత్రాణామాళయః వినిద్ర పత్రాళయః, వినిద్ర పత్రాళీః గతాః = వినిద్ర పత్రాళిగతాః, వినిద్ర పత్రాళి గతాశ్చ తాః అళయశ్చ, వినిద్ర పత్రాళి గతాళయః, వినిద్ర పత్రాళి గతాళీనాం, కైతవమ్,

వినిద్ర పత్రాళి గతాళి కైతవమ్ = తస్మాత్ వినిద్ర పత్రాళి గతాళి కైత వాత్.

మృగాంక చూడామణి వర్జనార్జితమ్ : మృగాంకః చూడామణిః యస్యః = మృగాంకచూడామణిః మృగాంక చూడామణినా వర్జనం, మృగాంక చూడామణి వర్జనమ్, మృగాంక చూడామణి వర్జనేన ఆర్జితం, మృగాంక చూడామణి వర్జనార్జితమ్, తత్ = మృగాంక చూడామణి వర్జనార్జితమ్.

దుర్యశః : దుష్టం చ తత్ యశశ్చ = దుర్యశః, తత్ = దుర్యశః.

కౌతుకీ : కౌతుకమస్య అస్తీతి = కౌతుకీ.

కైతకమ్ : కేతక్యాః కుసుమం = కైతకమ్.

**భావము :-**

ఆ యుద్యానమునందు పూచిన పూరేకులపై వ్రాలి యున్న తుమ్మెదలను నెపముతో పరమ శివుడు తన్ను పరిహరించుటవలని పాపముచే నేర్పడిన యప కీర్తిని ధరించుచున్న నలుఁడు గాంచెను. పరమ శివుడు మొగలి పూవునకు శాపము నొసంగుట చేనది యతని పూజకు నిషిద్ధమని పురాణ ప్రసిద్ధి అప కీర్తి నలుపుగ నుండటంవలన తుమ్మెదలపైనవి యారోపింపఁ బడినవి. కాన తుమ్మెదలా మొగలి పూవులపై వ్రాలి నపుడు ఆ పూలు శివుడు వర్జించుటచే సంప్రాప్తమైన యపకీర్తిని ధరించునట్లున్నవి.

శ్లో॥ వియోగభాజాం హృది కంటకైః కటు
ర్నిధీయసే కర్ణిశరస్స్మరేణ యత్ ।
తతో దురాకర్షతయా తదంతకృ
ద్విగీయసే మన్మథ దేహదాహినా॥ ౭౯

ప. వి, వియోగభాజాం । హృది । కంటకైః । కటుః । నిధీయసే । కర్ణిశరః । స్మరేణ । యత్ । తతః । దురాకర్షతయా । తదంతకృత్ । విగీయసే । మన్మథదేహదాహినా ।

టీక॥ హే కైతక = ఓ మొగలిపూవూ! యత్ = ఏందు వలన. స్మరేణ = మన్మ థునిచే, వియోగభాజాం = విరహులయొక్క. హృది = హృదయమందు.

కంటకైః = తన ముండ్లచే. కటుః = తీక్ష్ణమైన కర్ణి. శరః = కర్ణము లతోఁ గూడిన బాణముగ నిధీయసే = ప్రయోగింపఁబడుచున్నావో. తతః = అట్లు కర్ణిశర మగుట వలననే, దురాకర్షతయా = లాగుట కశక్య మగుట వలన, తదంతకృత్. తత్ = ఆ వియోగులకు. అంతకృత్ = హంతకమగుచు. మన్మథ దేహదాహినా = మన్మధుని దేహమును దగ్ధము గావించిన పరమేశ్వరునిచే. విగీయసే = నిందింపఁబడుచున్నావు.

ఇందు కైతకమునందు కర్ణిశరత్వమునారోపించుట వలన రూపకాలంకారము. ఈశ్వరుడు మొగలిపూవును నిందించుటకు. వియోగులనధిహింసించుట కారణము కాకపోయినను, దానిని కారణముగఁ జెప్పుటవలన నుత్ప్రేక్షాలంకారము. వ్యంజకమును చెప్పనందు వలన నది గమ్యము అది పైరూపకాలంకారముచేనుత్థాపితము గాననారెంటికిని సంకరము.

సమాసములు :-

వియోగభాజామ్ :- వియోగం భజంతీతి = వియోగభాజః. తేషాం = వియోగ భాజామ్.

కర్ణిశరః :- కర్ణీ చాసౌ శరశ్చ = కర్ణిశరః.

దురాకర్షతయా :- ఆక్రష్టుమశక్యః = దురాకర్షః. దురాకర్షస్య భావః = దురాకర్షతా, తయా, దురాకర్షతయా.

తదంతకృత్:- తేషామంతః = తదంతః. తదంతం కరోతీతి = తదంత కృత్

మన్మథదేహదాహినా :- మన్మధస్య దేహః = మన్మథదేహః. మన్మధ దేహస్య దాహీ = మన్మథదేహదాహీ. తేన = మన్మథదేహదాహినా.

భావము:

ఓ మొగలిపువ్వా! నీవు ముండ్లతో తీక్ష్ణమై యిరువైపుల కర్ణముగల బాణముగ నేర్పడి, మన్మధునిచే వియోగులహృదయములయందు నాటఁబడు చున్నావు తర్వాతనాహృదయములనుండి లాగుటకశక్యమగుటవలన నీవా వియోగులకు మారకమగుచున్నావు ఇట్లు పరమశివునకు ద్వేషింపఁదగిన మన్మధునకు

నీవు సాధనమగుటవలననే యాతనివలన నీవు నిందింపఁబడుచున్నావు కానిమఱి యొక కారణము వలనగాదు.

శ్లో॥ త్వదగ్రసూచీసచివస్స కామినో
ర్మనోభవస్సీవ్యతి దుర్యశఃపటౌ।
స్ఫుటం చ పత్రైః కరపత్రమూర్తిభిః
వియోగిహృద్దారుణి దారణాయతే॥ ౮౦

ప. వి. త్వదగ్రసూచీసచివః । సః । కామినోః । మనోభవః । సీవ్యతి । దుర్యశఃపటౌ । స్ఫుటం । చ । పత్రైః । కరపత్రమూర్తిభిః । వియోగిహృద్దారుణి । దారణాయతే ।

టీక॥ త్వదగ్రసూచీ సచివః, త్వత్ = నీ యొక్క. అగ్ర = కొనలనెడి. సూచీ=సూదులను. సచివః = సహకారముగాగల్గిన. సః = ఆ ప్రసిద్ధమైన. మనోభవః = మన్మధుఁడు. కామినోః = కామినీ కాముకులకు దుర్యశఃపటౌ; దుర్యశః = ధీరత్వము లేనివారను సపకీర్తి రూపములగు పటౌ = వస్త్రములను, సీవ్యతి = కుట్టుచున్నాఁడు (కించ = మఱియు) కరపత్ర మూర్తిభిః = అంపపుటాకారము గల్గిన. పత్రైః = నీ యాకులచే వియోగిహృద్ధారుణి: వియోగి = విరహులయొక్క. హృత్ = హృదయమనెడి. దారుణి = కొయ్యయందు దారణాయతే = ఛేదించువాఁడుగ నాచరించుచున్నాడు. స్ఫుటం = స్పష్టము,

"దుర్యశఃపటౌ" అని యపకీర్తిని వస్త్రములుగఁ రూపించుబవలన రూపకాలంకారము. వియోగహృద్దారుణి యని వియోగుల హృదయమును కొయ్యతో రూపించుటవలన మఱియొక రూపకాలంకారము. దారణాయతే యని మన్మధుని ఛేదకుని వలెఁ జెప్పుట వలన ఉపమాలంకారము. అది 'వియోగిహృద్దారుణి యనునెడ హృదయ దారువను రూపకముతో ననుప్రాణితము.

ఖలు :

త్వదగ్రసూచీ సచివః :- తవ అగ్రాణి = త్వదగ్రాణి. త్వదగ్రాణ్యేవ
ాచ్యః. తదగ్రసూచ్యః, త్వదగ్రసూచ్యః నచివాఃయస్య సః = త్వదగ్ర
ాచీసచివః.

ామినోః :- కామీ చ, కామినీ చ = కామినౌ. తయోః—కామినోః.

ునోభవః :- మనసి—భవతీతి = మనోభవః.

ుర్యశఃపటౌ:- దుష్టేచ తే యశసీ చ = దుర్యశసీ. దుర్యశసీ ఏవ పటౌ
ుర్యశకఃపటౌ. తౌ = దుర్యశఃపటౌ.

రపత్ర మూర్తిభిః :- కరపత్రస్య మూర్తి రివ మూర్తిః. యేషాం తే.
రపత్ర మూర్తయః తైఃకరపత్రమూర్తిభిః

ియోగి హృద్దారుణి :- వియోగినాం హృదయమ్ = వియోగి హృద
యమ్, వియోగిహృదయమేవ దారు = వియోగి హృద్దారు = తస్మిన్
ియోగి హృద్దారుణి

ారణాయతే :- దారణ ఇవ ఆచరతీతి = దారణాయతే.

:

. మొగలిపువ్వా!మన్మథుఁడు నీకొనలనెడి సూదులలో కామునకును
ాలికిని నపకీర్తియనెడి వస్త్రమును గుట్టుచున్నాడు.అంపమువలె నుండు.
కులచే విరహుల హృదయమనెడి కొయ్యను నరకువాఁడుగ నామన్మథు
ంచున్నాఁడు. ఇది స్పష్టము.

శ్లో॥ ధనుర్మధుస్విన్న కరోఽతిభీమజా
పరం పరాగై స్తవ ధూళిహా స్తయన్।
ప్రసూనధన్వా శరసాత్కరోతి మా
మితి క్రుధాక్రుశ్యత తేన కైతకమ్॥ ౮౧

ప. వి. ధనుర్మధుస్విన్నకరః। అతిభీమజాపరం। పరాగైః।తవ। ధూళిహస్తయన్ ప్రసూనధన్వా । శరసాత్। కరోతి । మామ్। ఇతి । క్రుధా । అక్రుశ్యత । తేన । కైతకమ్॥

టీక॥ హేకైతక = ఓ కేతక పుష్పమా! ప్రసూన ధన్వా = పుష్పములను ధనస్సునందు కలిగిన మన్మథుడు, మధుస్విన్న కరః = మధు = మకరందముచే. స్విన్న = తడిపిన. కరః = చేయికలవాడై. తవ = నీ యొక్క, పరాగైః = పుప్పొడిచే. ధూళిహస్తయన్ = మాటి మాటికి. ధూళిని చేతికిఁ బట్టించుకొనిన వానిగఁ దన్నుఁ జేసికొనుచు అతిభీమజాపరం. అతి = మిక్కిలి. భీమజా = దమయంతియందు. పరం = ఆసక్తినిఁ బొందిన. మాం = నన్ను. శరసాత్ = బాణములకు వశముగ కరోతి = చేయుచున్నాడు. ఇతి = ఈ మూడుశ్లోకములయందును చెప్పిన రీతిగ. తేన = ఆరాజుచే. క్రుధా = కోపముతో. కైతకం = మొగలిపూవు అక్రుశ్యత = ఆక్రోశింపఁబడెను.

సమాసములు :

ధనుర్మధు స్విన్నకరః : ధనుషః – మధు = ధనుర్మధు, ధనుర్మధునా స్విన్నౌ = ధనుర్మధు స్విన్నౌ, ధనుర్మధు స్విన్నౌ కరౌ యస్య సః ధనుర్మధు స్విన్నకరః.

అతిభీమజాపరం : భీమాత్ జాయత ఇతి = భీమజా, భీమజాయాం పరః = అతి భీమ జాపరః, అత్యంతం భీమజా పరః = అతి భీమజా పరః తమ్ = అతి భీమజా పరమ్.

ధూళి హస్తయన్ : ధూళిభిః ఉద్వాసిత హస్తమాత్మానం కరోతీతి, ధూళి హస్తయన్.

ప్రసూనధన్వా : ప్రసూనాని ధనుషి యస్య సః ప్రసూనధన్వా. లేదా – ప్రసూనం ధనుః యస్య సః = ప్రసూనధన్వా.

శరసాత్ : శరాణామధీనః = శరసాత్ – తం – శరసాత్.

కైతకమ్ : కేతక్యాః పుష్పమ్ = కైతకమ్.

**భావము :**

ఓ కేతకీ పుష్పమా ! పూవిల్తుఁడగు మన్మధుఁడు, తన పూవిల్లు నుండి స్రవించెడి మకరందముతోఁ దడిసిన హస్తములు గలవాడై, నీ పుప్పొడులను తన చేతికిఁ బట్టించుకొనిన వాడై, ధనస్సును జారనీక గట్టిగఁ బట్టుకొని, దమయంతిపై మిక్కిలి యాసక్తిఁ జెందిన నన్ను బాణములకుఁ లక్ష్యము గావించు కొనుచున్నాడు. నీ పుప్పొడి లేనిచో వతని చేతినుండి విల్లు జారిపోవుట వలన నతఁడు నన్నేమి చేయఁగలడని యీ విధముగ రాజు కోపముతో మొగలి పూవు పైఁ దన యాక్రోశమును వెల్లడిఁ జేసెను.

శ్లో॥ విదర్భ సుభ్రూస్తన తుంగతాప్తయే
ఘటానివాఽపశ్యదలం తపస్యతః ।
ఫలాని ధూమస్య ధయానధోముఖాన్
స దాడిమే దోహదధూపిని ద్రుమే॥ ౮౨

ప॥ వి॥ విదర్భ సుభ్రూ స్తన తుంగ తాప్తయే । ఘటాన్ । ఇవ । అపశ్యత్ । అలం । తపస్యతః । ఫలాని । ధూమస్య । ధయాన్ । అధోముఖాన్ । సః। దాడిమే । దోహద ధూపిని । ద్రుమే.

టీక॥ సః = ఆ నలుఁడు, దోహదధూపిని; దోహద = అకాలమున వృక్షములు పుష్పించుటకు సాధనమైన, సంస్కార రూపమైన ధూపముగల, దాడిమే ద్రుమే = దాడిమ వృక్షమందు, ఫలాని = పండ్లను, విదర్భ సుభ్రూస్తన తుంగ తాప్తయే; విదర్భ సుభ్రూ = విదర్భ దేశపు సుందరియగు దమయంతియొక్క, స్తన = స్తనములయొక్క, తుంగ తా = ఔన్నత్యము యొక్క, ఆప్తయే = ప్రాప్తికై, అలం = మిక్కిలి, తపస్యతః = తపస్సు జేయునవియును, ధూమస్య = ధూమమును, ధయాన్ = పానము చేయునవియును, అధోముఖాన్ = ముఖమును క్రిందికి వాల్చినవియునగు ఘటానివ = కుండలనువలె, అపశ్యత్ = చూచెను.

" ఘటానివ " యని దాడిమపండ్లను కుండలుగ నుత్ప్రేక్షించుట వలన నుత్ప్రేక్షాలంకారము — వృక్షములకును, లతలకును, నకాలమున,

పుష్ప ఫలముల నొసంగునట్లు చేసెడి సంస్కారము దోహద మనఁబడు నని శబ్దార్ణవమునఁ జెప్పఁబడినది. అదెట్లన—

"తరుగుల్మ లతాదీనామకాలే కుశలైః కృతం ।

పుష్పాద్యుత్పాదకం ద్రవ్యం దోహదం స్యాత్తు తత్క్రియా।"

మఱియు, మేక పొలసు నీటితో దడుపుచు, మేక వెంట్రుకలతోడను, మేక పొలసుతోఁడను పొగవేయుట దాడిమచెట్లు ఫలించుటకు శ్రేష్ఠమైన దోహదమని చెప్పఁబడియున్నది. అదెట్లన—

"మేషా మిషాంబు సంసేకస్తత్కేశా మిష ధూపనమ్ ।

శ్రేయానయం ప్రయోగో హి దాడిమీఫల వృద్ధయే". అని।

మఱియు దాడిమచెట్లు పెద్ద పండ్లను నిండుగఁ గాయుటకును విశేష దోహద క్రియలు శాస్త్రములయందుఁ జెప్పఁబడియున్నవి.

**సమాసములు:**

విదర్భ సుభ్రూ స్తనతుంగ తాప్తయే : విదర్భాణాం సుభ్రూః, విదర్భ సుభ్రూః, విద్భ సుభ్రువః స్తనౌ = విదర్భ సుభ్రూస్తనౌ. విదర్భ సుభ్రూ స్తనయోః తుంగతా, విదర్భ సుభ్రూ స్తన తుంగతా, విదర్భ సుభ్రూ స్తన తుంగ తాయాః, ఆప్తిః. విదర్భ సుభ్రూ స్తన తుంగతాప్తిః, తస్యై = విదర్భ సుభ్రూ స్తన తుంగతాప్తయే.

అధోముఖాన్: అధః ముఖం యేషాం తే = అధోముఖాః, తాన్ = అధో ముఖాన్.

దోహద ధూపిని : దోహదస్య ధూపః = దోహద ధూపః, దోహద ధూపః, అస్య అస్తేతి = దోహద ధూపీ, తస్మిన్ = దోహద ధూపిని.

**భావము :**

ఆ నలుఁడు దోహద ధూపముగల దాడిమీ వృక్షమందలి ఫలములనుఁ జూచి యవి దమయంతి దేవియొక్క స్తనముల యౌన్నత్యము పొందుటకై తల క్రిఁదులై ధూపమును పానము గావించుచుఁ దపస్సు చేయుచున్న కుండలో యని భావించెను.

శ్లో॥ వియోగినీ మైక్షత దాడిమీమసౌ
ప్రియాస్మృతే స్స్పష్టముదీత కంటకామ్ ।
ఫల స్తనస్థాన విదీర్ణరాగి హృ
ద్విశచ్ఛుకాస్య స్మరకింశుకాశుగామ్॥ ౮౩

ప॥ వి॥ వియోగినీమ్ । ఐక్షత । దాడిమీమ్ । అసౌ । ప్రియాస్మృతేః । స్పష్టమ్ । ఉదీతకంటకామ్ । ఫల స్తనస్థాన విదీర్ణ రాగి హృద్విశచ్ఛు కాస్యస్మరకిం శుకాశుగామ్.

టీక॥ అసౌ = ఈ నలుఁడు, ప్రియస్మృతేః = ప్రియుని స్మరించుట వలన, స్పష్టం = స్ఫుటముగ, ఉదీతకంటకామ్ = ఉదీత = ఉద్భవించిన కంట కాం = తన శరీరమందలి ముళ్లనెడి రోమాంచములు గలదియు, ఫల స్తన-స్థాన విదీర్ణరాగి హృద్విశచ్ఛు కాస్యస్మరకిం శుకాశుగామ్, ఫల = ఫలములనెడి స్తన = స్తనములను, స్థాన = స్థానమందు, విదీర్ణ = చీల్చ బడినదియు, రాగి = రక్తవర్ణముగలదియు (అనురాగము గలదియు)నగు హృత్ = హృదయమందు, విశత్ = ప్రవేశించుచున్న, శుకాస్య = చిలుక ముక్కనెడి, స్మర = మన్మధునియొక్క, కింశుక = మోదుగమొగ్గయను ఆశుగామ్ = బాణము గల్గిన, దాడిమీం = దాడిమయనెడి, వియోగినీం = విరహిణిని (వి = పక్షుల యొక్క యోగినీం = సంబంధముగల దానిని) ఐక్షత = చూచినది.

"దాడిమీం, వియోగినీమ్" అని, దాడిమ యనెడి "విరహిణిని" అని రూపించుటవలన రూపకాలంకారము.

"శుకాస్య స్మరకింశుకా శుగామ్" అని చిలుక ముక్కును, మన్మ థుని మోదుగ పూవనెడి యమ్ముగఁ జెప్పుటవలనను రూపకాలంకారము.

"ఉదీత కంటకామ్" అని, ఉద్భవించిన ముళ్లనెడి లోమాంచ ములు గల్గినట్లు చెప్పుటవల్ల శ్లిష్ట రూపకము.

"రాగి హృత్" అని, ఎఱ్ఱదనము గలదియు, ననురాగము గల దియునని చెప్పుటవలన శ్లేష.

సమాసములు :-

వియోగినీమ్ : వియోగః అస్యాః అస్తీతి = వియోగినీ, తాం = వియోగినీం, వీనాం యోగః = వియోగః, వియోగః అస్యాః అస్తీతి వియోగినీ తాం = వియోగినీమ్.

ప్రియస్మృతేః : ప్రియస్య స్మృతిః = ప్రియస్మృతిః, తస్యాః ప్రియస్మృతేః.

ఉదీత కంటకామ్ : కంటకా ఏవ కంటకాః = కంటకాః, ఉదీతాః కంటకాః యస్యాం సా ఉదీత కంటకా తామ్ = ఉదీత కంటకామ్.

ఫల స్తనస్థాన విదీర్ణరాగి హృద్విశచ్ఛుకాస్యస్మరకింశుకాశుగామ్ : ఫలే ఏవ స్తనౌ = ఫలస్తనౌ, ఫల స్తనా వేవ స్థానం; ఫల స్తనస్థానం, ఫల స్తనస్థానే విదీర్ణం, ఫల స్తనస్థాన విదీర్ణం రాగః అస్యాఽస్తీతి = రాగి, రాగి చ తత్ హృచ్ఛ = రాగి హృత్, ఫల స్తనస్థాన విదీర్ణం చ తత్ రాగి హృచ్ఛ = ఫల స్తనస్థాన విదీర్ణ రాగిహృత్, ఫల స్తనస్థానవిదీర్ణ రాగిహృది విశత్ = ఫల స్తన — హృద్విశత్, శుకస్య ఆస్యం = శుకాస్యమ్ హృద్విశచ్ఛ తత్ శుకాస్యం చ = ఫల స్తన - - -శుకాస్యమ్, కింశుక మేవ ఆశుగః = కింశుకాశుగః స్మరస్య కింశుకాశుగః, స్మరకింశుకాశుగః, ఫల...శుకాస్య మేవ స్మరకింశుకాశుగః, యస్యాస్సా = ఫల స్తనస్థాన విదీర్ణరాగి హృద్వి శచ్ఛుకాస్య స్మరకింశుకాశుగా, తామ్ ఫల స్తనస్థాన విదీర్ణరాగి హృద్విశచ్ఛుకాస్య స్తనకింశుకాశుగామ్.

భావము :-

నలుడా యుద్యానమందలి దాడిమను విరహిణిగ భావించుచున్నాడు ఆ దాడిమ ప్రియుని స్మరించుట వలనఁబొడమిన రోమాంచములుగ గానవచ్చు తనముళ్ళతో నిండిన దైతన ఫలము లనెడి స్తనముల యందు తొలి వేయుటచేఁ జిందిన నెత్తుట నెట్టబారిన అనురాగముల హృదయమునఁ జొచ్చుకొనిన చిలుక ముక్కనెడి, మన్మథుని మోదుగపూవు బాణము గల్గిన విరహిణిగఁ (పక్షులతోఁ గూడినవిగ) గాంచెను. ఆ దాడిమ ఖండలి ముళ్లు పులకములవలె గానవచ్చుచున్నది.

దాని ఫలములనెడి స్తనములను చిలుకలు తమ ముక్కులచేఁ బొడుచుటవలన ఆ ఫలరసము స్రవించి హృదయమునకంటినది. ఎట్లనిన యా రసముచే నా హృదయము రాగముగలదైనది. అనురాగముగలదైనదని ధ్వని: ఫలరస మెఱ్ఱగనుండుట వలన నెత్తురుగగూడ భావింపఁబడినది. అట్టి రక్తమగు హృదయమున చొచ్చుకొనిన చిలుకముక్కు మన్మథుని బాణమగు మోదుగమొగ్గగ భావింపఁబడినది. ఇట్టి రోమాంచములనఁదగు కంటకములతోడను, ఫలములనఁదగు స్తనములకడ చీల్చి యందుండి స్రవించిన రసరక్తముతోఁ గమ్మిన హృదయమునుఁ జొచ్చుకొనిన మన్మథుని మోదుగమొగ్గయమ్మనదగు చిలుకముక్కుతోడను నొప్పిన దాడిమను విరహిణిగ నలుఁడు గాంచెను.

శ్లో॥ స్మరార్ధచంద్రేషునిభే క్రశీయసాం
స్ఫుటం పలాశేఽర్ధజుషాం పలాశనాత్ ।
స వృంతమాలోకత ఖండమన్వితం
వియోగిహృత్ఖండిని కాలఖండజమ్॥ ౮౪

వ॥ వి॥ స్మరార్ధచంద్రేషునిభే । క్రశీయసాం । స్ఫుటం । పలాశే । అర్ధజుషాం । పలాశనాత్ । సః । వృంతం । ఆలోకత । ఖండం । అన్వితం । వియోగి హృత్ఖండిని । కాలఖండజం ।

టీక॥ సః = ఆ నలుడు స్మరార్ధచంద్రేషునిభే, స్మర = మన్మథునియొక్క. అర్ధచంద్ర = అర్ధచంద్రాకారమగు ఇషు = బాణముతో. నిభే = సమానమైనదియు వియోగిహృత్ఖండిని; వియోగి = విరహులయొక్క. హృత్ = హృదయములను. ఖండిని = భేదించునదియు. క్రశీయసామ్ = విరహముచే మిక్కిలి కృశించిన అధ్వజుషామ్ = బాటసారులయొక్క. పలాశనాత్; పల = మాంసమును. అశనాత్ = తినుటవలన. స్ఫుటం = స్పష్టముగ. పలాశే = పలాశమను సార్ధకనామముగలదియునగు మోదుగ మొగ్గయందు అన్వితం = అతికియున్న. వృంతం = తొడిమెను. కాల ఖండజం = యకృత్తనెడి యవయవమునుండి యుద్భవించిన ఖండం =

"వృంతం కాలఖండజమ్" అని మోదుగతొడిమెను యకృత్ఖండముగఁ జెప్పుటవలన నిట వ్యస్తరూపకము యకృత్తు మనుష్యశరీరమున కుడిభాగముననుండు నల్లని మాంసఖండము. "పలాశనాత్ పలాశ" మ్మని బాటసారుల మాంసమును తినుటచే పలాశమను సార్థకనామమేర్ప డినదని నిర్వచనమిచ్చుటవలన నిరుక్తాలంకారము.

సమాసములు :

స్మరార్ధచంద్రేషునిభే. ఇషవః అర్ధచంద్రా ఇవ = అర్ధచంద్రేషవః = స్మరస్య అర్ధచంద్రేషవః = స్మరార్ధచంద్రేషవః. స్మరార్ధచంద్రేషుభిః సదృశమ్ స్మరార్ధచంద్రేషునిభమ్: తస్మిన్: తస్మిన్ = స్మరార్ధచంద్రేషునిభే—

పలాశే :- పలమశ్నాతీతి = పలాశః. తస్మిన్ పలాశే.

అధ్వజుషామ్:- అధ్వానం జుషన్తీతి = అధ్వజుషః = తేషామ్. అధ్వజుషామ్.

పలాశనాత్:- పలస్య అశనమ్ = పలాశనమ్ తస్మాత్ పలాశనాత్॥

వియోగిహృత్ఖండిని:- వియోగినాం హృంది = వియోగిహృంది. వియోగిహృదాంఖండి = వియోగిహృత్ఖండి తస్మిన్ వియోగిహృత్ఖండిని.

కాలఖండజే:- కాలఖండాత్ జాయత ఇతి = కాలఖండజమ్ తస్మిన్ = కాలఖండజే.

భావము :

నలుఁడు మోదుగపూవును జూచి భావించిన విధమిందు వర్ణింపఁబడినది. ఆ మోదుగపూవు మన్మథుని యర్ధచంద్రాకారపు బాణము వలె నుండి విరహముచే కృశించిన బాటసారుల మాంసమును భక్షించుట వలన, పలాశమని సార్థక నామమును వహించినది. అట్టి మోదుగపూవునకు వెనుకనతికియున్న తొడిమను అది వియోగహృదయములను భేదించి వారి మాంసమును భక్షించుట వలన నతికిన యకృత్తుయొక్క ముక్కగా నలుఁడు భావించెను.

శ్లో॥ నవా లతా గంధవహేన చుంబితా
కరంబితాంగీ మకరందశీకరైః।
దృశా నృపేణ స్మితశోభికుట్మలా
దరాదరాభ్యాం దరకమ్పినీ పపే॥ రా॥

ప॥ వి॥ నవా । లతా । గంధవహేన । చుంచితా । కరంబితాంగీ । మకరందశీకరైః।
దృశా । నృపేణ। స్మితశోభికుట్మలా । దరాదరాభ్యాం । దరకంపినీ। పపే ।

టీక॥ గంధవహేన = వాయువుచే, చుంబితా = తాకఁబడినదియు (గంధవహేన = చందనముపూసికొనిన పురుషునిచే. చుంచితా = వీక్షింపఁబడినదియు) మకరందశీకరైః: మకరంద = పుష్పరసముయొక్క. శీకరైః = బిందువులచే కరంబితాంగీ; కరంబిత = మిశితమైన. అంగీ = శరీరముగలదియు (కరంబిత = తడిసిన. అంగీ = శరీరముగలదియు) స్మితశోభికుట్మలా; స్మిత = వికసించుటచే. శోభి = శోభించు. కుట్మలా = మొగ్గలుగలదియు (స్మిత = చిఱునవ్వుచే. శోభి = ప్రకాశించు. కుట్మలా = మొగ్గలవంటి దంతములుగలదియు) దరకంపినీ; దర = కొంచము. కంపినీ = కదలుచున్న దియు. (దర = భయముచే. కంపినీ = వణకుగలదియునగు) నవా = నూతనమైన. లతా = తీగె, (తీగెవంటి కాంత) నృపేణ = రాజుచే. దరాదరాభ్యాం; దర = భయముతోఁడను. ఆదర = ఆశతోఁడను. పపే = చక్కగా చూడఁబడినది.

ఇచ్చట ప్రస్తుత లతావిశేషణముల సామ్యముచే నప్రస్తుతమగు నాయికావృత్తాంతము ప్రతీయమానమగుటవలన సమాసోక్త్యలంకారము.

సమాసములు :

గంధవహేన:- గంధం వహతీతి = గంధవహః తేన = గంధవహేన.
కరంబితాంగీ:- కరంబితమ్ అంగం యస్యాస్సా = కరంబితాంగీ

మకరందశీకరైః:- మకరందస్య శీకరాః = మకరందశీకరాః తైః = మకరందశీకరైః.

స్మితశోభికుట్మలా:- స్మితేన శోభీని = స్మితశోభీని, స్మితశోభీని కుట్మలానియస్యాస్సా = స్మితశోభికుట్మలా.

దరాఽదరాభ్యామ్:- దరశ్చ అదరశ్చ = దరాదరౌ. తాభ్యాం = దరాదరాభ్యామ్.

దరకంపినీ:- దరం కంపినీ = దరకంపినీ. దరేణ = కంపినీ = దరకంపినీ.

భావము ;

గాలిచే తాకఁబడినదియు, మకరందబిందువులచేఁ దడిసినదియు, వికాసముచే శోభించు మొగ్గలుగలది కొంచముకదలుచున్నదియునగు నవలతను నలుఁడు భయాదరములతోడ జూచెను.

శరీరమునకు గంధము పూసికొనిన పురుషుని చే వీక్షింపఁబడినదియు శరీరమందలి స్వేదబిందువులచే తడిసినదియు చిఱునగవుచే శోభించు మొగ్గలవంటి దంతములుగలదియు, భయముచేఁ గంపించునట్టి యొక నూతనమగు కాంత చూఁడఁబడినది.

శ్లో॥ విచిన్వతీః పాంథపతంగహింసనై
రపుణ్యకర్మాణ్యళికజ్జలచ్ఛలాత్।
వ్యలోకయచ్చంపకకోరకావళీ
స్స శంబరారేర్బలిదీపికా ఇవ॥ ౮౬

ప॥ వి॥ విచిన్వతీః । పాంథపతంగహింసనైః। అపుణ్యకర్మాణి। అళికజ్జలచ్ఛలాత్। వ్యలోకయత్। చంపకకోరకావళీః । సః । శంబరారేః । బలిదీపికాః । ఇవ। పాంథపతంగహింసనైః, పాంథ = బాటసారులనెడి. పతంగ = పక్షుల యొక్క. హింసనైః = వధలచేత. అపుణ్యకర్మాణి = పాపకర్మములను. అళికజ్జలచ్ఛలాత్; అళికజ్జల = కాటుకలవంటి తుమ్మెదలయొక్క. ఛలాత్ = నెపమువలన. విచిన్వతీః = సంపాదించునట్టి. చంపకకోరకావళీః; చంపక = సంపెంగచెట్లయొక్క, కోరకావళీః = మొగ్గల వరు

సలను. శంబరారేః = మన్మథునియొక్క. బలిదీపికా ఇవ = పూజార్థపుదీపములోయనునట్లు. సః = ఆ నలుఁడు వ్యలోకయత్ = చూచెను.

"అళికజ్జలచ్ఛలాత్" అని 'కాటుకల వంటి తుమ్మెదల నెపముతో పాపకర్మములను వహించునట్లు' చెప్పుటవలన, అళికజ్జలములయందు. అళికజ్జలత్వమును, నిషేధించి పాపకర్మత్వము నారోపించుటవలన అపహ్నవాలంకారము.

"బలిదీపికాఇవ" యని సంపెంగ మొగ్గలను పూజాదీపములో యనునట్లున్నవని చెప్పుటవలన, ఉత్ప్రేక్షాలంకారము.

సమాసములు :

పాంథపతంగహింసనైః- పథి గచ్ఛంతీతి పాంథాః, పాంథా ఏవ పతంగాః, పాంథ పతంగాః పాంథ పతంగానాం హింసనాని = పాంథ పతంగహింసనాని. తైః = పాంథ పతంగ హింసనైః

అపుణ్యకర్మాణి: పుణ్యస్య కర్మాణి = పుణ్య కర్మాణి, న పుణ్య కర్మాణి అపుణ్య కర్మాణి, తాని = అపుణ్యకర్మాణి.

అళికజ్జలచ్ఛలాత్: అళయః కజ్జలానీవ = అళికజ్జలాని, అళికజ్జలాన్యేవ చ్ఛలమ్ = అళికజ్జ లచ్ఛలం, తస్మాత్ = అళికజ్జలచ్ఛలాత్.

చంపక కోరకావళీః చంపకస్య కోరకాః = చంపకకోరకాః, చంపక కోరకాణామ్— ఆవళయః, చంపకకోరకావళయః = తాః = చంపక కోరకావళీః.

బలిదీపికా: బలేః దీపికాః, బలిదీపికా: తాః = బలిదీపికాః ॥

భావము :

ఆ యుద్యానమందు సంపెంగ మొగ్గలపై కాటుకవంటి నల్లని తుమ్మెదలు వ్రాలియున్నవి. పక్షులవలె దీనులగు బాటసారులకు విరహవేదన నుద్దీపింపఁజేసి వారినందఱిని హింసించుటవలన సంప్రాప్తములగు పాపకర్మములను చేర్చి పెట్టుకొనుచున్నవిగ నాసంపెంగమొగ్గలు తుమ్మెదలు వ్రాలుటవలన కానవచ్చున్నవి. మఱియు నా సంపెంగమొగ్గలు కామోద్దీపకములగుట వలన

మన్మథుని పూజకై యుంచఁబడిన దీపము లోయనునట్లు కనఁబడుచున్నవి. పాపములు నలుపురంగు గల్గి యుండునని కవిసమయముగాన నల్లని తుమ్మెదలు పాపములుగా భావింపఁబడినవి. మొగ్గలను, పూజాదీపములుగఁ జెప్పుటవలన, నా మొగ్గలపై వ్రాలిన తుమ్మెదలను, ఆ దీపపు మసిగ చెప్పుటకై కాటుకతోఁ బోల్చెను. అట్టి సంపెంగ పూలను నలుఁడు గాంచెను.

శ్లో॥ అమన్యతాసౌ కుసుమేషుగర్భజం
పరాగమంధంకరణం వియోగినామ్।
స్మరేణ ముక్తేషు పురా పురారయే
తదంగభస్మేవ శరేషు సంగతమ్॥ ౯౭

ప॥ వి॥ అమన్యత। అసౌ। కుసుమేషుగర్భజం। పరాగం। అంధంకరణం। వియోగినాం। స్మరేణ। ముక్తేషు। పురా। పురారయే। తదంగభస్మ। ఇవ। శరేషు। సంగతమ్।

టీక॥ అసౌ = ఈనలుడు, కుసుమేషు గర్భజమ్. కుసుమ = పుష్పములను, ఇషు = బాణములయొక్క అనగా మన్మథ బాణముల యొక్క గర్భజమ్ = లోపలనుండిఁ గల్గినదియు, వియోగినాం = విరహులకు, అంధంకరణం = గుడ్డితనముఁ గావించునదియునగు పరాగం = ధూళిని, పురా = పూర్వము, పురారయే = శివునికై స్మరేణ = మన్మథునిచే ముక్తేషు = విడునఁబడిన, శరేషు = బాణములయందు, సంగతం = తగుల్కొనిన, తదంగభస్మేవ = తత్ = ఆశివునియొక్క, అంగ = శరీరమందలి భస్మేవ = భస్మమోయనునట్లు అమన్యత = తలంచెను.

వి. "తదంగభస్మేవ" యని, పుష్పబాణముల యందలి పుప్పొడిని శివుని శరీరమందలి భస్మమో యనునట్లు చెప్పుట వలననుత్ప్రేక్షాలంకారము. పూర్వము మన్మథుఁడు శివునిపైఁ బ్రయోగించిన బాణములివియె యని యభిప్రాయము. లేని చో నీబాణములకు భస్మమంటుట కవకాశము లేదు.

**సమాసములు :**

కుసుమేషుగర్భజమ్:- కుసుమాన్యేవ ఇషవః = కుసుమేషవః, కుసుమేషూణాంగర్భః = కుసుమేషుగర్భాత్‌జాయత ఇతి = కుసుమేషుగర్భజః తం, కుసుమేషుగర్భజమ్.

అంధంకిరణమ్:- అనంధాః, అంధాః = క్రియంతే అనే నేతి = అంధంకిరణః, తం = అంధంకరణమ్.

తదంగభస్మ:- తస్య అంగం = తదంగం, తదంగస్య భస్మ = తదంగభస్మ = తత్ = తదంగభస్మ.

**భావము :**

ఆ యుద్యానమందు కామబాణములగు పుష్పముల నుండి ధూళి రాలుచున్నది. అది వియోగుల నేత్రములలోఁ బడి వారినంధులనుఁగావించుచున్నది. అట్టి పుప్పొడిని నలుఁడు, పూర్వము మన్మథుఁడు శివునిపై ప్రయోగించిన, బాణములకుఁ ఒగుల్కొనిన, యాశివునిమేన, బూసి కొనిన భస్మముగఁదలంచెను. అప్పుడు శివునిపైఁ బ్రయోగించిన పుష్పబాణములే యుద్యానమునందిప్పుడు పుప్పొడిని వెదఁజల్లుచున్నవి.

శ్లో॥ పికాద్వనే శృణ్వతి భృంగహుంకృతై
ర్దశాముదంచత్కరుణం వియోగినామ్।
అనాస్థయా సూనకరప్రసారిణీం
దదర్శ దూనఃస్థలపద్మినీం నలః॥ ౮౮

ప॥ వి॥ పికాత్। వనే। శృణ్వతి। భృంగహుంకృతైః। దశామ్। ఉదంచత్‌కరుణం। వియోగినామ్। అనాస్థయా। సూనకరప్రసారిణీం। దదర్శ। దూనః। స్థలపద్మినీం। నలః।

టీ॥ వనే = ఉద్యానము. పికాత్ = కోకిల నుండి భృంగహుంకృతైః; భృంగ = తుమ్మెదల యొక్క హుంకృతైః = హుంకారములతో, వియోగినాం = విరహులయొక్క దశాం = అవస్థను, ఉదంచత్ కరుణమ్; ఉదంచత్

= ఉదయించిన కరుణం = కనికరము గలుగునట్లుగా, ఉదంచత్ = విక సించిన కరుణం = కరుణవృక్షము గలుగునట్లుగా, శృణ్వతి సతి = వినుచుండగా, అనాస్థయా = వినుటకాసక్తి లేకుండుటచే, సూనకర ప్రసారిణీమ్, సూన = పుష్పమను, కరం = చేతిని ప్రసారిణీం = చాపుచున్న, స్థలపద్మినీం = మెట్టుతామరను నలః = నలుఁడు, దూనః = సంతాపము జెందినవాడై దదర్శ = చూచెను.

వి. "సూనకరప్రసారిణీమ్" అని పుష్పమనెడి చేతినిఁ జాపుచున్నదో యనునట్లు చెప్పుటవలన నుత్ప్రేక్షాలంకారము. వ్యంజకములగు ఇవాదిశబ్దములనుఁ బ్రయోగించనందువలన నదియిట గమ్యము— కోకిలలు కూయునపుడు కరుణ వృక్షములు వికసించుననని 'ఉదంచత్కరుణ' మనునెడ శ్లేష యాశ్రయింపఁబడినది.

సమాసములు :

భృంగహుంకృతైః:— భృంగాణాం హుంకృతాని = భృంగహుంకృతాని, తైః = భృంగహుంకృతైః ॥

ఉదంచత్కరుణమ్:— ఉదంచతీ కరుణా యస్మిన్ కర్మణి తత్యథా భవతి తథా = ఉదంచత్ కరుణమ్.

అనాస్థయా:— న అస్థా = అనాస్థా, తయా, అనాస్థయా.

సూనకరప్రసారిణీమ్:— సూనమేవ కరః = సూనకరః సూనకరస్య ప్రసారిణీ = సూనకరప్రసారిణీ = తాం సూనకరప్రసారిణీమ్.

స్థలపద్మినీం:— స్థలస్య పద్మినీ = స్థలపద్మినీ తాం = స్థలపద్మినీమ్.

భావము :

ఆ యుద్యానమందు కోకిలలు కూయుచున్నవి. తుమ్మెదలు హుంకారములు చేయుచున్నవి మెట్టదామర గాలికిఁగదలుచున్నది. ఈ సందర్భమిట్లు వర్ణింపంబడినది తుమ్మెదల హుంకారముచే వియోగులకు విరహబాధ యుద్దీపితమైనదని కోకిల చెప్పుచుండగా నాయుద్యానవనము మిక్కిలి కరుణతో వినుచున్నది.

ఆ వనమున కంచెను నెక్కివ కరుణగల్గిన మెట్టదామర యీ వియోగుల దుఃఖ గాథలను వినుటకు కూడ సహించనిదై గాలికిఁగదలుచుండుట వలన కాడతో గూడిన తన పుష్పమను హస్తముతో, ఆ వియోగుల దురవస్థనుఁ జెప్పవద్దని వారించునట్లుండినది. అట్టి మెట్టదామరను పరమదయానిధి యగు నలుఁడు దుఃఖ సంతప్తుడై కాంచెను.

శ్లో॥ రసాలసాలస్సమదృశ్యతామునా
స్ఫురద్ద్విరేఫారవరోషహుంకృతిః।
సమీరలోలైర్ముకుళైర్వియోగినే
జనాయ దిత్సన్నివ తర్జనాభయమ్ ॥

ప॥ వి॥ రసాలసాలః। సమదృశ్యత। అమునా। స్ఫురద్ద్వి రేఫారవరోషహుం కృతిః। సమీరలోలైః। ముకుళైః। వియోగినే। జనాయ। దిత్సన్। ఇవ। తర్జనాభయమ్।

టీక॥ అమునా = ఈ నలునిచే, స్ఫురద్ద్విరేఫారవరోషహుంకృతిః, స్ఫురత్ = ప్రకాశించుచున్న ద్విరేఫ = తుమ్మెదల యొక్క, ఆరవ = ఝుం కారమనెడి, రోష = రోష ముతోఁగూడిన, హుంకృతిః = హుంకారము గల్గినదియు, సమీరలోలైః; సమీర = గాలికి, లోలైః = కదలుచున్న ముకుళైః = మొగ్గలచే, (మొగ్గలనెడి వ్రేళ్ళచే) వియోగినే = విరహము గల్గిన జనాయ = జనమునకై తర్జనాభయం = బెదరించుటవలని, భయ మును, దిత్సన్నివ = ఈయఁగోరుచున్నదో యనునట్లున్న, రసాల సాలః = మామిడిచెట్టు, సమదృశ్యత = చూడఁబడినది.

'తర్జనాభయందిత్సన్నివ' = అని, మామిడిచెట్టు గాలికిఁగదలు తన మొగ్గలచే బెదిరించుచున్నదో యనునట్లు చెప్పుటవలన ఉత్ప్రేక్షా లంకారము– "స్ఫురద్ద్విరేఫారవరోషహుంకృతిః" అని తుమ్మెదల ఝుంకారమును రోషఝుంకారముగ రూపించినందువలన రూపకము. ఈ రూపకముచే నాయుత్ప్రేక్ష యుత్థాపితమైనది– ఆ రూపకోత్ప్రేక్షలకిట సంకరము.

**సమాసములు :**

రసాలసాలః- రసాల ఇతి సాలః = రసాలసాలః ॥

స్ఫురద్ద్విరేఫారవరోషహుంకృతిః- ద్విరేఫాణామారవః = ద్విరేఫారవః, రోషస్యహుంకృతిః = రోషహుంకృతిః, ద్విరేఫాణాంరవరోషహుంకృతిఃద్విరేఫారవరోషహుంకృతిః, స్ఫురన్తీ-ద్విరేఫారవరోషహుంకృతిః యస్య సః = స్ఫురద్ద్విరేఫారవరోషహుంకృతిః

సమీరలోలైః = సమీరేణ లోలాః = సమీరలోలాః, తైః = సమీరలైః ॥

తర్జనాభయమ్:- తర్జనాయాః భయమ్ = తర్జనాభయమ్-తత్ = తర్జనాభయమ్-

దిత్సన్:- దాతుమిచ్ఛన్ = దిత్సన్.

**భావము:-**

ఆ యుద్యానమునందు, తుమ్మెదల ఝుంకారమను, రోషహుంకారముతో గూడిన మామిడిచెట్టును గాలికిఁ గదలుచున్న మొగ్గలనెడి వ్రేళ్ళచే విరహులను బెదరించుచున్నటుగ నలుఁడు గాంచెను. మామిడిచెట్లు తుమ్మెద రొదలు మామిడి మొగ్గలు మన్మథోద్దీపకములు గాన నీసన్నివేశము పైవర్ణనకు సరిపడినది.

శ్లో॥ దినే దినే త్వం తనురేధి రేఽధికం
పునఃపునర్మూర్ఛ చ మృత్యుమృచ్ఛ చ।
ఇతీవ పాంథం శపతః పికాన్ ద్విజాన్
సఖేదమైక్షిష్ట స లోహితేక్షణాన్ ॥ ౬౦

ప॥ వి॥ దినే । దినే । త్వం । తనుః । ఏధి । రే । అధికం । పునః । పునః । మూర్ఛ । చ । మృత్యుం । ఋచ్ఛ । చ । ఇతి । ఇవ । పాంథం । శపతః । పికాన్ । ద్విజాన్ । సఖేదమ్ । ఐక్షిష్ట । సః । లోహితేక్షణాన్.

టీక॥ రే = ఓరీ, (పాంథ = బాటసారీ) త్వం = నీవు దినేదినే = ప్రతిదినమందును అధికం = మిక్కిలి తనుః = కృశించినవాఁడుగ ఏధి = కమ్ము

పునఃపునః = మాటిమాటికి మూర్ఛ చ = మూర్ఛను( బొందుము మృత్యుం = మరణమును ఋచ్ఛ చ = పొందుము. ఇతి = అని. పాంథం = బాటసారిని. శపతః = శపించుచున్నవో యనునట్లున్న. లోహితేక్షణన్; లోహిత = ఎఱ్ఱనైన, ఈక్షణాన్ = దృష్టులుగల్గిన పికాన్ = కోకిలను, ద్విజాన్ = పక్షులను, (బ్రాహ్మణులను) సః = ఆనలు(డు సఖేదం = కష్టముతో ఐక్షిష్ట = చూచెను.

"పాంథం శపత ఇవ" యని బాటసారిని శపించుచున్నవోయను నట్లుగ కోకిలను, జెప్పుటవలన ఉత్ప్రేక్షాలంకారము, వ్యంజకమును( బ్రయోగించనందువలన నది గమ్యము.

**సమాసములు:**

**లోహితేక్షణాన్:-** లోహితే—ఈక్షణే యేషాం తే = **లోహితేక్షణాః** తాన్ = **లోహితేక్షణాన్.**

**భావము :**

"ఓరి బాటసారీ; నీవు ప్రతిదినము మిక్కిలి కృశించుము. మఱల మఱల మూర్ఛిల్లుము. మరణించుము." అని నిత్యము త్రోవనడిచెడి విరహియగు బాటసారిని శపించుచున్న యెఱ్ఱటి నేత్రములుగల కోకిలలను (రోషముతో నెఱ్ఱని కండ్లుగల వానిని) (బ్రాహ్మణులను అనిధ్వని) విరహబాధననుభవించుచున్న నలు(డు ద్విజశాపమన్వయించునను భయముతో( గూడినవాడై చూచెను.

శ్లో॥ అళిస్రజా కుట్మలముచ్చశేఖరం
నిపీయ చాంపేయమధీరయా దృశా ।
స ధూమకేతుం విపదే వియోగినా
ముదీతమాశంకితవానశంకత ॥ ౬౧

ప॥ వి॥ అళిస్రజా । కుట్మలం । ఉచ్చశేఖరం । నిపీయ । చాంపేయం । అధీరయా । దృశా । సః । ధూమకేతుం । విపదే । వియోగినాం । ఉదీతం । ఆశంకితవాన్ । అశంకత ।

టీక॥ అళిస్రజా = తుమ్మెదల పంక్తిచే, ఉచ్చశేఖరం = ఉన్నతమగు శిరోభూషణముగలవాఁడును, చాంపేయం = సంపంగె చెట్టునకు సంబంధించిన కుట్మలం = మొగ్గను, అధీరయా = ధైర్యములేని దృశా = దృష్టిచే నిపీయ = చక్కఁగఁ జూచి, ఆశంకితవాన్ = అనిష్టమునొకదానిని సందేహించినవాడై సః = ఆ నలుఁడు, వియోగినాం = విరహులకు విపదే = ఆపదకై, ఉదీతం = ఉదయించిన, ధూమకేతుం = తోకచుక్కఁగా అశంకత = ఊహించెను.

"ధూమకేతు మశంకత" అని తుమ్మెదలతోఁ గూడిన సంపెంగ మొగ్గను ధూమకేతువుగ నూహించెననుటవలన నుత్ప్రేక్షాలంకారము— 'న షట్పదో గంధఫలీ మజిఘ్రత్' అని తుమ్మెదలు చంపక పుష్పములను మూర్కొనవని ప్రసిద్ధి కాననిట తుమ్మెదల పంక్తి చంపక పుష్పముపై నుండెననుట యెట్లు సరిపడునని శంకింపరాదు. తుమ్మెదలు చంపక పుష్పములను మూర్కొనవనుట లేదు. అవి మూర్కొనును కాని మూర్కొనిన క్షణమున మరణింపగలవు. అందువలన మూర్కొనవనెడి వాడుక యేర్పడినదని కొందఱు చెప్పుదురు. కాని యిట్టిస్థలములలో చాంపేయ మనగా నాగకేసరమని చెప్పవచ్చును. 'చాంపేయః కేసరో నాగకేసరః కాంచనాహ్వయః' అని యమరమున చాంపేయ శబ్దమునకు నాగకేసరమనియునర్థముగలదు.

సమాసములు:

అళిస్రజా:_ అళీనాం స్రక్ = అళిస్రక్ = తయా = అళిస్రజా.

ఉచ్చశేఖరం:_ ఉచ్చః శేఖరః యస్య తత్ = ఉచ్చశేఖరం తత్ = ఉచ్చశేఖరమ్.

చాంపేయమ్:_ చంపకస్య వికారః చాంపేయమ్, తత్ చాంపేయమ్.

అధీరయా:_ న ధీరా = అధీరా, తయా = అధీరయా.

భావము:

తుమ్మెదల బారు, పైన వ్రాలినందు వలన దానినున్నతమగు శిరోభూషణముగనుంచుకొనిన, సంపెంగ మొగ్గను మిక్కిలి భయముతో చూచి యానలుఁడ

నిష్టమొకటి రానున్నదని సందేహించినవాడై యా సంపెంగమొగ్గను, విరహుల కొపదలనుఁ దెచ్చిపెట్టిడి ధూమకేతువని యూహించెను.

శ్లో॥ గళత్పరాగం భ్రమిభంగిభిః పత
త్ప్రసక్తభృంగావళినాగకేసరమ్।
స మారనారాచనిఘర్షణస్ఖల
జ్జ్వలత్కణం శాణమివ వ్యలోకయత్॥ ౯౨

ప॥ వి॥ గళత్పరాగం। భ్రమిభంగిభిః। పతత్। ప్రసక్త భృంగావళి। నాగ కేసరం। సః। మారనారాచ నిఘర్షణ స్ఖలజ్జ్వలత్కణం। శాణమ్। ఇవ। వ్యలోకయత్।

టీక॥ సః = ఆ నలుఁడు, గళత్పరాగం; గళత్ = రాలుచున్న పరాగం = ధూళిగలదియు. భ్రమిభంగిభిః; భ్రమి = గుండ్రముగ తిరుగుటలోని. భంగిభిః = విధములతో (ఉపలక్షితం = గుర్తింప బడినదియు) పతత్ = పడుచున్నదియు. ప్రసక్తభృంగావళి; ప్రసక్త = వ్రాలియున్న. భృంగావళి = తుమ్మెదలబారుగలదియునగు. నాగకేసరం = నాగకేసర పుష్పమును మారనారాచనిఘర్షణస్ఖలజ్జ్వలత్కణమ్; మార = మన్మథుని యొక్క. నారాచ = బాణముల. నిఘర్షణ = సానఁబెట్టుటవలన. స్ఖలత్ రాలుచున్నవియు. జ్వలత్ = మండుచున్నవియునగు. కణం = నిప్పుకణి కలుగల. శాణమివ = సాననువలె వ్యలోకయత్ = చూచెను.

"నాగకేసరం శాణమివ"యని, నాగకేసరపుష్పము మన్మథబాణములకుఁ బదనుఁబెట్టెడి సానయో యనునట్లు చూచుటవలననిఁట నుత్ప్రేక్షాలంకారము.

సమాసములు :-

గళత్పరాగమ్:- గళంతః పరాగాః యస్మాత్తత్ = గళత్పరాగమ్.

భ్రమిభంగిభిః:- భ్రమీణాం భంగయః = భ్రమిభంగయః, తాభిః = భ్రమిభంగిభిః

ప్రసక్తభృంగావళి:- భృంగానామావళిః భృంగావళిః ప్రసక్తా = భృంగావళిః యస్మిన్ తత్ ప్రసక్తభృంగావళి, తత్ ప్రసక్తభృంగావళి

మారనారాచ నిఘర్షణసలజ్జ్వలత్కణమ్:- మారస్య నారాచాః = మార నారాచానాం నిఘర్షణం, మారనారాచనిఘర్షణం, మారనారాచనిఘర్షణేన స్ఖలంతః = మారనారాచనిఘర్షణస్ఖలంతః మారనారాచనిఘర్షణస్ఖలంతశ్చ తే జ్వలంతశ్చ = మారనారాచనిఘర్షణస్ఖలజ్జ్వలంతః, మారనారాచ నిఘర్షణస్ఖలజ్జ్వలంతః కణాః యస్మిన్ సః మారనారాచనిఘర్షణస్ఖలజ్జ్వల త్కణః = తం మారనారాచనిఘర్షణస్ఖలజ్జ్వలత్కణమ్.

**భావము :**

ధూళిని రాల్చుచు, గుండ్రముగ భ్రమించు విధములుగల్గినదై, పడుచున్న తుమ్మెదల బారులతో గూడిన నాగకేసరపుష్పమును మన్మథుని బాణములకు పదనుఁజేయునపుడు రాలుచు, మండుచున్న నిప్పుకణికలుగల సానయని యా నలుఁడు భావించెను. ఇందునల్లని తుమ్మెదల బారు సానవంటినాగకేసరముపై వ్రాలి యున్నప్పుడవి సానబెట్టునపుడు చెదరుచున్న నిప్పుకణికలుగ భావింపఁ బడినవి. నిప్పుకణికలు చల్లారగనే నల్లఁబడుట ప్రసిద్ధము. కావున తుమ్మె దలతో వానికి పోలిక సరిపడినది.

శ్లో॥ తదంగముద్దిశ్య సుగంధి పాతుకాః,
శిలీముఖాళీః కుసుమాద్గుణస్పృశః।
స్వచాపదుర్నిర్గతమార్గణభ్రమా
త్స్మరస్స్వనంతీరవలోక్య లజ్జితః ॥ ౯౬

ప॥ వి॥ తదంగమ్ । ఉద్దిశ్య । సుగంధి । పాతుకాః । శిలీముఖాళీః । కుసుమాత్। గుణస్పృశః । స్వచాపదుర్నిర్గతమార్గణభ్రమాత్ । స్మరః । స్వనంతీః । అవలోక్య । లజ్జితః.

టీక॥ సుగంధి = పరిమళముగల. తదంగం = నలుని యొక్క శరీరమును. ఉద్దిశ్య = గురిఁజేసికొని, గుణస్పృశః; గుణ = గంధాదిగుణమును. (అల్లెత్రాటిని, స్పృశః = తాకునటువంటి) కుసుమాత్ = పుష్పమునుండి. పాతుకాః = పరుగిడునట్టి. స్వనంతీః = శబ్దించుచున్న. శిలీముఖాళీః : శిలీముఖ = తుమ్మెదలయొక్క. ఆళీః = బారులను. (శిలీముఖ = బాణ ములయొక్క. ఆళీః = వరుసలను) అవలోక్య = చూచి. స్మరః =

మన్మథుఁడు స్వచాపదుర్నిర్గతమార్గణభ్రమాత్. స్వ = తనయొక్క. చాప = వింటినుండి దుర్నిర్గత = క్రమము తప్పివెల్వడినమార్గణబాణముల యొక్క. భ్రమాత్ = భ్రమవలన. లజ్జితః = సిగ్గుపడెను. (నూనం = నిశ్చయము)

ఇచ్చట 'స్వచాపదుర్నిర్గతమార్గణభ్రమాత్' అని శబ్దించు శిలీముఖములయందు తన బాణములని మన్మథునికి భ్రాంతి యేర్పడుట వలన భ్రాంతిమదలంకారము.

'శిలీముఖ' శబ్దమునకు బాణములనియు, తుమ్మెదలనియు శ్లేషచేనర్థద్వయముండుటవలన ఆశ్లేషచే భ్రాంతిమదలంకారము స్థాపితము.

"అవలోక్య లజ్జితః" శబ్దించు శిలీముఖములనుఁ దనబాణములని భ్రాంతిజెంది మన్మథుడు సిగ్గుపడెనో యనునట్లుండెనని చెప్పుటవలన నుత్ప్రేక్షాలంకారము. అది పై భ్రాంతిమదలంకారముచే నుత్థాపితముగాన నిందు భ్రాంతిమత్—శ్లేషోత్ప్రేక్షలకు సంకరము.

క్రమము తప్పి వెల్వడు బాణములు శబ్దించునని ప్రసిద్ధి గాన నట్టి శబ్దించు శిలీముఖములను మన్మథుడు తన బాణములని భ్రాంతి పడెను.

సమాసములు :

తదంగమ్:— తస్య అంగమ్ = తదంగమ్. తత్ = తదంగమ్.

సుగంధి:— శోభనః గంధః యస్య తత్ = సుగంధి

శిలీముఖాళీః:— శల్యం ముఖే యేషాం తే = శిలీముఖాః శిలీముఖానామాళయః = శిలీముఖాళయః తాః శిలీముఖాళీః.

గుణస్పృశః:— గుణం స్పృశన్తీతి = గుణస్పృశః

స్వచాపదుర్నిర్గతమార్గణభ్రమాత్:— స్వస్య చాపః = స్వచాపః స్వచాపాత్ దుర్నిర్గతాః = స్వచాపదుర్నిర్గతాః స్వచాపదుర్నిర్గతాశ్చ తే మార్గణాశ్చ = స్వచాపదుర్నిర్గతమార్గణాః. స్వచాపదుర్నిర్గతమార్గణానాం భ్రమః = స్వచాపదుర్నిర్గతమార్గణభ్రమః తస్మాత్ = స్వచాపదుర్నిర్గతమార్గణభ్రమాత్.

**భావము:-**

మంచి పరిమళముగల నలుని శరీరమును గుఱిపెట్టుకొని, పరిమళములు గల్గిన (మన్మథుని యల్లె త్రాటిలో గూర్పఁబడిన) పుష్పములనుండి తుమ్మెదల బారులు (బాణపంక్తులు) శబ్దించుచు పరుగులిడుచున్నవి. వానిని గాంచి మన్మథుఁడు తన పూరిల్లునుండి వెల్వడిన బాణములు క్రమము తప్పి నడచినందువలన శబ్దించుచున్నవో యని భ్రాంతి పడి సిగ్గు పడెనో యనునట్లుండెను. ఇది **నిశ్చయము.**

శ్లో॥ మరుల్లసత్పల్లవకంటకైః క్షతం
సముచ్చరచ్చందనసారసౌరభమ్ ।
స వారనారీకుచసంచితోపమం
దదర్శ మాలూరఫలం పచేళిమమ్॥ ౯౪

వి॥ ప॥ మరుల్లసత్పల్లవకంటకైః । క్షతం । సముచ్చరచ్చందనసారసౌరభం । సః । వారనారీకుచసంచితోపమం । దదర్శ । మాలూరఫలం । పచేళిమమ్॥

టీక॥ మరుల్లసత్పల్లవకంటకైః; మరుత్ = గాలిచే. లసత్ = చలించునట్టి. పల్లవ = చిగుళ్లయొక్క. కంటకైః = ముండ్లచే క్షతం = గాయపఱుపబడినదియు, (లసత్ = ప్రకాశించు. పల్లవ = విటులయొక్క. కంటకైః = గోళ్లచే. క్షతం = గాయపఱుపఁబడినదియు) సముచ్చరచ్చందనసారసౌరభమ్; సముచ్చరత్ = చుట్టును వ్యాపించుచున్న. చందనసార = చందనముయొక్క సారము వంటి. సౌరభం = పరిమళముగలదియు. (చందనసారముయొక్క పరిమళముగలదియు) వారనారీకుచసంచితోపమ్ వారనారీ = వేశ్యాస్త్రీలయొక్క. కుచ = స్తనములతో. సంచిత = సంపాదింపఁబడిన ఉపమం = సామ్యముగలదియును, పచేళిమం = తనంతట పండినదియునగు మాలూరఫలం = మారేడుపండును. దదర్శ = చూచెను.

"చందనసారసౌరభం":- అని బిల్వఫలము పక్షమున చందన సారము వంటి పరిమళము గలది యు" నని చెప్పుట వలన నుపమాలంకారము.

వారనారీకుచసంచితోపమ్:- అని వేశ్యాస్తనముల తో సంపాదింపఁబడిన సామ్యము గల దని చెప్పుట వలన నుపమాలంకారము.

సమాసములు:-

మరుల్లసత్పల్లవకంటకైః:- మరుతా లసంతః మరుల్లసంతః మరుల్లసంత శ్చ తే పల్లవాశ్చ మరుల్లసత్పల్లవాః మరుల్లసత్పల్లవానాం కంటకాః = మరుల్లసత్పల్లవకంటకాః = తైః = మరుల్లసత్పల్లవకంటకైః.
సముచ్చరచ్చందనసారసౌరభమ్:- సముచ్చరంశ్చాసౌ చందనసారశ్చ = సముచ్చరచ్చందనసారఃచందనస్యసారః = చందనసారః సముచ్చరచ్చం దనసారస్య సౌరభమివ సౌరభం యస్య తత్ = సముచ్చరచ్చందనసార సౌరభమ్. తత్ = సముచ్చరచ్చందనసారసౌరభమ్.

భావము :

ఆ యుద్యానమందు గాలికి కదలు చిగుళ్లలోని ముళ్లచే గాట్లుపడిన దియు చందనసారమువంటి మరిమళము గల్గినదియు విటులవలన నఖక్షత ములు పొందినదియు, చుట్టును వ్యాపించిన చందనసారముయొక్క పరిమళము గలదియు వేశ్య యొక్క స్తనములతో పోలిక కల్గిన తనంతపండిన మాతేడు పండును నలుఁడు జూచెను.

శ్లో॥ యువద్వయీచిత్తనిమజ్జనోచిత
ప్రసూనశూన్యేతరగర్భగహ్వరమ్।
స్మరేషుధీకృత్య ధియా భయాంధయా
స పాటలాయాః స్తబకం ప్రకంపితః॥ ౬౨

ప॥ వి॥ యువద్వయీచిత్తనిమజ్జనోచితప్రసూనశూన్యేతరగర్భగహ్వరమ్ । స్మరేషుధీకృత్య । ధియా । భయాంధయా।సః । పాటలాయాః । స్తబకం। ప్రకంపితః।

టీక॥ యువద్వయీచిత్తనిమజ్జనోచితప్రసూనశూన్యేతరగర్భగహ్వరమ్; యువ యువతీయువకుల.ద్వయీ = జంటయొక్కచిత్త = మనస్సులను నిమజ్జన = ముంచుటయందు ఉచిత = సమర్థములగు ప్రసూన = పుష్పములతో శూన్యేతర = నిండిన గర్భగహ్వరమ్ = లోపలియవకాశముకల్గిన; పాట

లాయాః = పాటలవృక్షము యొక్క; స్తబకం = పూగుత్తిని భయాంధయా; భయ = భయముచే; అంధయా = మూఢమైన. ధియా = బుద్ధిచే; స్మరేషుధీకృత్య; స్మర = మన్మధుని యొక్క ఇషుధీకృత్య = అంబు పొది యని భావించి, సః = అనలుఁడు; చకంపే = వణకెను:

స్మరేషుధీకృత్య అని, పాటలవృక్షము యొక్క పూగుత్తియందు మన్మథుని యంబులపొది యను భ్రాంతి యేర్పడి నందువలన భ్రాంతి మదలంకారము.

**సమాసములు :**

యువద్వయీ చిత్తనిమజ్జనోచిత ప్రసూనశూన్యేతర గర్భగహ్వరమ్:— యువా చ యువతిశ్చ = యువానౌ, యూనోః ద్వయీ యువద్వయీ; యువద్వయ్యాః చిత్తే = యువద్వయీచిత్తే; యువద్వయీచిత్తయోః నిమజ్జనం = యువద్వయీచిత్తనిమజ్జనం యువద్వయీచిత్తనిమజ్జనే ఉచితాని; యువద్వయీచిత్తనిమజ్జనోచితాని; యువద్వయీచిత్తనిమజ్జనోచితాని చ తాని ప్రసూనాని చ యువద్వయీచిత్తనిమజ్జనోచితప్రసూనాని శూన్యాత్ ఇతరం శూన్యేతరం యువద్వయీచిత్తనిమజ్జనోచితప్రసూనైః శూన్యేతరం = యువద్వయీచిత్తనిమజ్జనోచితప్రసూనశూన్యేతరం. గర్భస్య గహ్వరం = గర్భగహ్వరం: యువద్వయీచిత్తనిమజ్జనోచితప్రసూనశూన్యేతరంగర్భగహ్వరం యస్య సః = యువద్వయీచిత్తనిమజ్జనోచిత ప్రసూనశూన్యేతరగర్భగహ్వరః తం, యువద్వయీచిత్తనిమజ్జనోచితప్రసూనశూన్యేతరగర్భగహ్వరమ్-

స్మరేషుధీకృత్య:— ఇషవః ధీయంతే అస్మిన్నితి ఇషుధిః స్మరస్య ఇషుధిః = స్మరేషుధిః అస్మరేషుధిం స్మరేషుధిం సంపద్యమానం కృత్వా = స్మరేషుధీకృత్య.
భయాంధయా:- భయేన అంధా = భయాంధా = తయా; భయాంధయా.

**భావము :**

ఆయుద్యానమందు పాటలవృక్షము యొక్క పూగుత్తి యువతీయువకుల మనస్సులను ముంచెడి పూలతో లోన నిండియుండగా దానినినలుడు భయమువలన

మూఢత్వమొందిన బుద్ధిచే, మన్మథుని యంబులపొదియని తలంచి మిక్కిలి కంపించెను. దమయంతీవిరహముచే బాధపడు నలునకు మతి చెడినందువలన పూగుత్తియందంబులపొది యను భ్రాంతి యేర్పడుట సహజము.

శ్లో॥ మునిద్రుమః కోరకితశ్శితిద్యుతి
ర్వనేఽమునాఽమన్యత సింహికాసుతః।
తమిస్రపక్షత్రుటికూటభక్షితం
కలాకలాపం కిల వైధవం వమన్ ॥ ౯౭

ప॥ వి॥ మునిద్రుమః। కోరకితః। శితిద్యుతిః। వనే। అమునా। అమన్యత। సింహికాసుతః। తమిస్రపక్షత్రుటికూటభక్షితం। కలాకలాపం।కిల। వైధవం। వమన్ ।

టీక॥ అమునా = ఈ నలునిచే; వనే = ఉద్యానమందు; కోరకితః = మొగ్గలు తొడిగిన; శితిద్యుతిః = (ఆకుల యందు) నల్లనికాంతిగల్గిన; మునిద్రుమః = అగస్త్యవృక్షము (అవిశిచెట్టు) తమిస్రపక్షత్రుటికూటభక్షితం: తమిస్రపక్ష = కృష్ణపక్షమందు; త్రుటి = క్షయములయొక్క కూట = నెపముచే: భక్షితం = భక్షింపబడిన; వైధవం = చంద్రసంబధమైన కలాకలాపం = కళలసమూహమును; వమన్ = వెలుపలికిఁగ్రక్కు-చున్న సింహికాసుతః = రాహువుగ. అమన్యత = తలంపబడెను.

ఇచ్చట అగస్త్యవృక్షము కోరకితత్వ శితిద్యుతిత్వ ధర్మములచే చంద్రకళలను వెడలఁగ్రక్కు-చున్న రాహువుగ తలంపఁబడినట్లు చెప్పుటవలన ఉత్ప్రేక్షాలంకారము."త్రుటికూటభక్షితమ్"అని కళాక్షయమును నెపముగఁజెప్పి కూటశబ్దముచే క్షయమందు భక్షణమునారోపించుటవలన నపహ్నవాలంకారము ఈయపహ్నవాకాలంకారముచే బైనయుత్ప్రేక్ష ఉత్థాపితమయినది కాన నారెంటికిని సంకరము.

సమాసములు:

శితిద్యుతిః :— శితిః ద్యుతిః యస్య సః శితిద్యుతిః।
సింహికాసుతః:— సింహికాయాః సుతః = సింహికాసుతః

తమిస్రపక్షత్రుటికూటభక్షితమ్:- తమిస్రస్య పక్షః తమిస్రపక్షః తమిస్రపక్షే త్రుటయః తమిస్రపక్షత్రుటయః, తమిస్రపక్షత్రుటయఏవకూటం తమిస్రపక్షత్రుటికూటం। తమిస్రపక్షత్రుటికూటేన భక్షితః । తమిస్రపక్షత్రుటికూటభక్షితః తం తమిస్రపక్షత్రుటికూటభక్షితమ్.

కలాకలాపమ్:- కలానాం కలాపః = కలాకలాపః తం, కలాకలాపమ్

వైధవం:- విధోరయం, వైధవః, తం వైధవమ్.

భావము ;

ఆ యుద్యానమందు మొగ్గలు వేసిన నల్లని యాకులుగల అవిశచెట్టు కృష్ణపక్షమందు కళలు క్షయించుట యను నెపముతో, భక్షింపఁబడిన చంద్రకళలను వమనము జేయుచున్న రాహువే మోయని భావింపఁబడినది. అవిశచెట్టు నల్లగనుండుటవలన నది రాహువుగను దాని యందలి మొగ్గలు తెల్లగనుండుటవలన చంద్రకళలుగను దలంపఁబడినది.

శ్లో॥ పురో హఠాక్షిప్తతుషారపాండర
చ్ఛదావృతేర్వీరుధి బద్ధవిభ్రమాః।
మిలన్నిమీలం విదధుర్విలోకితా
నభస్వతస్తం కుసుమేషుకేలయః॥ ౯౭

ప॥ వి॥ పురః। హఠాక్షిప్తతుషారపాండరచ్ఛదావృతేః। వీరుధి। బద్ధవిభ్రమాః। మిలన్నిమీలం। విదధుః। విలోకితాః।నభస్వతః। తం। కుసుమేషుకేలయః

టీక॥ పురః = ఎదుట, హఠాక్షిప్తతుషారపాండరచ్ఛదావృతేః, హఠ = తటాలున, ఆక్షిప్త = లాగఁబడిన తుషార = మంచుచే, పాండర = తెల్లని. ఛద = అకుల యొక్క. ఆవృతేః = ఆవరణముగల, (తుషార = మంచువలె పాండర = తెల్లని, చ్ఛద = ఆచ్ఛాదించు వస్త్రముయొక్క ఆవృతేః = ఆవరణముగల) నభస్వతః = వాయువుయొక్క, వీరుధి = తీగెయందు, బద్ధవిభ్రమాః = సంబద్ధమైన విలాసములు గల కుసుమేషుకేలయః, కుసుమేషు = పూఁబాణములుగల. మన్మథుని యొక్క కేలయః = కామక్రీడలు, విలోకితాః = చూడఁబడినవై తం = ఆనలుని మిలన్నిమీలం, మిలత్ = సంభవించిన, నిమీలం = కనులమూతగలవానినిగ, విదధుః = చేసినవి.

ఇచ్చట ప్రస్తుతమగు వాయువృత్తాంతము వలన నప్రస్తుతమగు కాముకవృత్తాంతము స్ఫురించుచున్నది।గాన సమాసోక్త్యలంకారము "నేక్షేతార్కం న నగ్నాం స్త్రీం న చ సంసక్తమైథునామ్" అని శాస్త్రము ననుసరించి ధీరోదాత్తుఁడగు నలుఁడు ఆవరణము దొలగిన స్త్రీని దలపించుచున్న యా తీగెను చూచుట యధర్మమని కనులుమూసెను. మఱియు నగ్నమయిన స్త్రీని చూచుట కామోద్దీపకమగుటవలనను కనులు మూసెను. కాని సహజగంభీరుఁడగు నలుడు నిగ్రహశక్తి గల్గియుండుట వలన నతని కనులమూతకిది కారణమనుటకంటెను ధర్మభంగ భీతియే కారణమనుట యుచితము.

సమాసములు :

హఠాత్క్షిప్తతుషారపాండరచ్ఛదావృతేః:— హఠాత్ ఆక్షిప్తా = హఠాత్క్షిప్తా, తుషారేణ పాండరః (తుషారవత్ పాండరః) = తుషారపాండరః, తుషారపాండరశ్చాసౌ ఛదశ్చ = తుషారపాండరచ్ఛదః తుషారపాండరచ్ఛదస్య ఆవృతిః. తుషారపాండరచ్ఛదావృతిః హఠాత్క్షిప్తా తుషారపాండరచ్ఛదావృతిఃయేన సః హఠాత్క్షిప్త తుషారపాండరచ్ఛదావృతిః తస్య హఠాత్క్షిప్తతుషారపాండరచ్ఛదావృతేః॥

బద్ధవిభ్రమాః: —బద్ధాః విభ్రమాః యాసు తాః, బద్ధవిభ్రమాః తాః = బద్ధవిభ్రమాః

మిలన్నిమీలమ్:— మిలంతీ నిమీలా యస్య సః మిలన్నిమీలః తం మిలన్నిమీలమ్,

కుసుమేషుకేలయః:— కుసుమాని ఇషవః యస్య సఃకుసుమేషుః, కుసుమేషోః కేలయః, కుసుమేషుకేలయః

భావము:

నలుని యెదుట గాలికి ఆకులు రాలి మంచుచే దెల్లగ గానవచ్చుచు నావరణముఁదొలిగినదై దిసమొలయగు స్త్రీని దలపించు తీగెపైవిలాసబద్ధములగు వాయువుయొక్క మన్మథక్రీడలు నలుని కన్నుమూయించినవి. వివస్త్రయగు స్త్రీయందు వాయువుయొక్క కామక్రీడలు దీపకములై విరహియగు తనను

మిక్కిలి దుఃఖమును తెచ్చిపెట్టునవెడి భీతియు వివస్త్రయగు స్త్రీని(జూచుటధర్మ క్షంగమనెడి భీతియు కనులు మూసికొనుటకు కారణములు.

శ్లో॥ గతా యదుత్సంగతలే విశాలతాం
ద్రుమాః శిరోభిః ఫలగౌరవేణ తామ్।
కథం స ధాత్రీమతిమాత్రనామితై
ర్న వందమానానభినందతి స్మ తాన్॥ ౬౦

ప॥ వి॥ గతాః। యదుత్సంగతలే । విశాలతాం । ద్రుమాః । శిరోభిః । ఫలగౌరవేణ । తామ్ । కథం । సః। ధాత్రీమ్ । అతిమాత్రనామితైః । న।వందమానాన్ । అభినందతి । స్మ। తాన్ ।

టీక॥ ద్రుమాః = వృక్షములు, యదుత్సంగతలే. యత్ = ఏభూమియొక్క (ఏదాదియొక్క), ఉత్సంగతలే = పైప్రదేశమునందు, (ఒడియందు) విశాలతాం = వృద్ధిని, గతాః = పొందినవో, తాం = అభూమిని. (ఆ,దాదిని) ఫలగౌరవేణ = ఫలభారముచేత. (పుణ్యాధిక్యముచేత), అతిమాత్రనామితైః, అతిమాత్ర = మిక్కిలియధికముగ, నామితైః = వంచ(బడిన, శిరోభిః = కొనలచేతను (శిరస్సులచేతను) వందమానాన్ = తాకుచున్న (నమస్కరించుచున్న), తాన్ = ఆవృక్షమలను. సః = ఆనలు(డు, కథం = ఎట్లు, నాభినందతిస్మ = అభినందించ(డు, తప్పక అభినందించును.

ఇచ్చట విశేషణబలముచే ప్రస్తుత ద్రుమవృత్తాంతము వలన నప్రస్తుతమగు తల్లిని నమస్కరించుకుమారుని వృత్తాంతముస్ఫురించు చున్నది గాన, సమాసోక్త్యలంకారము

**సమాసములు :-**

యదుత్సంగతలే:- యస్యాః ఉత్సంగః, యదుత్సంగః యదుత్సంగస్య తలం = యదుత్సంగతలం, తస్మిన్, యదుత్సంగతలే।
ఫలగౌరవేణ:- ఫలానాం గౌరవమ్ = ఫలగౌరవం = తేన ఫలగౌరవేణ
ఫలస్యగౌరవం = ఫలగౌరవం, తేన = ఫలగౌరవేణ

అతిమాత్రనామితైః:- మాత్రామతిక్రాంతమతిమాత్రం = అతిమాత్రం నామితాని = అతిమాత్రనామితాని తైః = అతిమాత్రనామితైః॥

భావము:-

ఆ యుద్యానమందలి వృక్షములు భూమి యొక్క పై భాగమందుఁబెరిగినవై ఫలభారముచే మిక్కిలి వంగిన కొనలచే నాభూమిని స్పృశించుచు దాదియొడి పైనుండి చక్కగా వర్ధిల్లి, పుణ్యాధిక్యముచే తలలు వాల్చి, నమస్కరించు సంతానములనుఁదలపించుచున్నవి. అట్టి వృక్షములను నలుఁడేల యభినందించఁడు తప్పక అభినందింపగలఁడు।

శ్లో॥ నృపాయ తస్మై హిమితం వనానిలైః
సుధీకృతం పుష్పరసైరహర్మహః ।
వినిర్మితం కైతకరేణుభిస్సితం
వియోగినేఽదత్త న కౌముదీ ముదః॥ ౯౮

ప॥ వి॥ నృపాయ । తస్మై । హిమితం । వనానిలైః । సుధీకృతం ।పుష్పరసైః। అహర్మహః । వినిర్మితం । కైతకరేణుభిః । సితమ్। వియోగినే। అదత్త । న। కౌముదీ । ముదః॥

టీక॥ వనానిలైః = ఉద్యానవనమందలి గాడ్పులచే, హిమితం = చల్లఁబఱుచబడినదియు, పుష్పరసైః = వనమందలి గాలిచేఁదేబడిన పూలరసములతో సుధీకృతం = అమృతముగఁజేయబడినదియు, కైతకరేణుభిః, కైతక = మొగలి పూలయొక్క రేణుభిః = ధూళులచే సితం = తెల్లనిదిగ వినిర్మితం = చేయబడిన, అహర్మహః = అహః = పగటియొక్క, మహః = వెలుగనెడి, కౌముదీ = వెన్నెల, వియోగినే = విరహము గల్గిన, తస్మై = ఆ నృపాయ = రాజునకు, ముదః = సంతోషములను నాదత్త = ఈయలేదు.

"అహర్మహః కౌముదీ" అని "పగటి వెలుగనెడి వెన్నెల"అని చెప్పుటవలన వ్యస్తరూపకము.

**సమాసములు :**

పుష్పరసైః:- పుష్పాణాం రసాః = పుష్పరసాఃతైః = పుష్పరసైః
అహర్మహాః:- అహ్నః మహాః = అహర్మహాః

కైతకరేణుభిః:- కేతక్యాః కుసుమం = కైతకం, కైతకస్య రేణవః = కైతకరేణవః = తైః కైతకరేణుభిః

**భావము:-**

ఆయుద్యానమందలి యెండ ఆ వన వాయువులచే జల్లబడు పఁబడిన మకరందములతో నమృతముఁగఁజేయబడి మొగలి పుప్పొడులతో తెల్లబడుచఁబడి వెన్నెలగాఁజేయబడినది కాని యది విరహబాధఁజెందిన యా నలునకు సంతోషము గల్గించలేదు.

శ్లో॥ వియోగభాజోఽపి నృపస్య పశ్యతా
తదేవ సాక్షాదమృతాంశుమాననమ్।
పికేన రోషారుణచక్షుషా ముహుః
కుహూరుతాఽఽహూయత చంద్రవైరిణీ॥ ౧౦౦

**ప॥ వి॥** వియోగభాజః । అపి । నృపస్య । పశ్యతా , తత్ । ఏవ । సాక్షాత్ । అమృతాంశుం । ఆననం । పికేన । రోషారుణచక్షుషా । ముహుః । కుహూః। ఉత । ఆహూయత । చంద్రవైరిణీ ॥

**టీక॥** వియోగభాజోఽపి = విరహము పొందినవాఁడైనను, నృపస్య = నలమహారాజు యొక్క తత్ = ఆ, ఆననమేవ = ముఖమనెడి సాక్షాత్ = ప్రత్యక్షమైన అమృంతాంశుం = చంద్రుని,పశ్యతా = చూచుచున్నదియు, (కావుననే) రోషారుణచక్షుషా, రోష = ఇంకను చంద్రత్వమును వదలలేదనెడి కోపముచే అరుణ = ఎఱ్ఱని చక్షుషా = కనులుగల పికేన = కోకిలచే చంద్రవైరిణీ = చంద్రునికి శత్రువైన కుహూః = తనకూతయనెడి కుహువుఅనగా అమావాస్య, ముహుః = పలుమాఱు ఆహూయత ఉత = పిలువఁబడినదో యనునట్లుండినది.

"కుహూః" అని కోకిలధ్వనియగు కుహూవునే అమావాస్య యను కుహూవుతో రూపింపబడినది కాన శ్లిష్టరూపకము.

"కుహూరాహూయత ఉత" కుహూవు పిలువఁబడినదో యనునట్లుండి నదని చెప్పుటవలన ఉత్ప్రేక్షాలంకారము ఇది ముందుఁజెప్పబడిన రూపకము నపేక్షించినదిగాన దానితో దీనికి సంకరము.

**సమాసములు :**

వియోగభాజః:- వియోగం భజతీతి = వియోగభాక్ = తస్య వియోగ భాజః

రోషారుణచక్షుషా:- రోషేణ అరుణే = రోషారుణే, రోషారుణే చక్షుషీ యస్య సః రోషారుణచక్షుః తేన = రోషారుణచక్షుషా

చంద్రవైరిణీ:- = చంద్రస్య వైరిణీ = చంద్రవైరిణీ

**భావము :**

విరహబాధననుభవించుచున్నను, నలుని ముఖమును ప్రత్యక్షచంద్రునితో సమాన కాంతిగలదిగఁజూచుచున్న కోకిల సహజముగ కనులెఱ్ఱగనున్నను ఇంకను నలుని ముఖము చంద్రత్వమును వీడలేదని రోషముతో కనులెఱ్ఱఁజేసి కొని కుహూవను తన పలుకుతో, కుహూవని చెప్పఁబడు నమావాస్యను, పిలుచు చున్నదో యనునట్లుండినది, అమావాస్య చంద్రునికి శత్రువుగాన నా యమావాస్య వచ్చినచో నలముఖ చంద్రునకు కాంతి తఱుగును. దాని వలన విరహులను బాధించుటయే పనిగాఁగల్గిన కోకిల కిష్టసిద్ధియగును.

శ్లో॥ అశోకమర్థాన్వితనామతాశయా
గతాన్ శరణ్యం గృహశోచినోఽధ్వగాన్।
అమన్యతావంతమివైష పల్లవైః
ప్రతీష్టకామజ్వలదస్త్రజాలకమ్॥ ౧౦౧

ప॥ వి॥ అశోకమ్। అర్థాన్వితనామతాశయా। ఆగతాన్। శరణ్యం। గృహశోచినః। అధ్వగాన్। అమన్యత। అవంతమ్। ఇవ। ఏషః। పల్లవైః। ప్రతీష్టకామజ్వలదస్త్రజాలకమ్।

టీక ॥ ఏషః = ఈ నలుఁడు పల్లవైః = చిగుళ్లచే, ప్రతీష్టకామజ్వలదస్త్రజాల కమ్ ప్రతీష్ట = ప్రతిగ్రహింపఁడి మఱుగుపఱచఁబడిన కామ = మన్మధుని యొక్క జ్వలదస్త్ర = జ్వలించు నాయుధములనెడి జాలకం = లేత మొగ్గలగుత్తులుగల అశోకం = అశోకవృక్షమును అర్ధాన్వితనామతాశయా; అర్ధ = శోకము లేనిదను నర్ధముతో అన్విత = కూడిన నామతా = పేరుగల్గియుండుటలోని ఆశయా = అభిలాషతో శరణ్యం = రక్షించుటయందు శక్తిగల్గినదని (మత్వా = తలంచి) ఆగతాన్ = వచ్చినటువంటి గృహశోచినః, గృహ = భార్యలనుగుఱించి శోచినః = దుఃఖించు అధ్వగాన్ = బాటసారులను అవంతమివ = రక్షించుచున్నదో యనునట్లు అమన్యత = తలంచెను.

"అశోకమర్ధాన్వితనామతాశయా" యని శోకము లేనిది యశోకమని సార్ధకనామముగ నిర్వచనముచేయుట వలననిరుక్త్యలంకారము. "అమన్యతావంతమివ" యని యశోకవృక్షము బాటసారులను రక్షించుచున్నదో యనునట్లు తలంపఁబడిన దని చెప్పుటవలన నుత్ప్రేక్షాలంకారము.

సమాసములు :

అశోకమ్:- అవిద్యమానఃశోకః యస్య సః = అశోకః తం. అశోకమ్

అర్ధాన్వితనామతాశయా:- అర్ధేన అన్వితం=అర్ధాన్వితం, అర్ధాన్వితం, నామ యస్య సః, అర్ధాన్వితనామా. అర్ధాన్వితనామ్నః భావః = అర్ధాన్వితనామతా, అర్ధాన్విత నామతాయామాశా. అర్ధాన్వితనామతాశా, తయా = అర్ధాన్విత నామతాశయా

శరణ్యమ్:- శరణే సాధుః = శరణ్యః ; తం = శరణ్యమ్

గృహశోచిన = గృహాన్ శోచంతీతి = గృహశోచినః తాన్ గృహశోభివః

అధ్వగాన్:- = అధ్వని గచ్ఛంతీతి = అధ్వగాః = తాన్ = అధ్వగాన్

ప్రతీష్ణకామజ్వలదస్త్రజాలకమ్:- జ్వలంతి చ తాని అస్త్రాణి చ = జ్వలదస్త్రాణి = కామస్య జ్వలదస్త్రాణి = కామజ్వలదస్త్రాణి కామజ్వలదస్త్రాణ్యేవ జాలకాని = కామజ్వలదస్త్రజాలకాని, ప్రతీష్టాని-కామజ్వల

దప్రజాలకాని యేన సః = ప్రతిష్ఠకామజ్వలదప్రజాలకః, తమ్ = ప్రతిష్ఠకామజ్వాల దప్రజాలకమ్।

**భావము :**

మండుచున్న మన్మథాస్త్రములనెడి లేత మొగ్గల గుత్తులను చిగురుటాకులతో మఱుగుపఱచుకొని యశోకవృక్షమాయుద్యానమందున్నది. అట్లు చిగురుటాకులలో నామన్మథాస్త్రములను మఱుగుఁబరచనిచో, విరాహులు వానినిఁజూచినంత మాత్రముననే మరణింతురు. అట్టి యశోకవృక్షము తమ శోకమును బోగొట్టుటచే నశోకమని సార్థకనామము వహించునని యభిలాషచే, ప్రియురాండ్రఁగూర్చి దుఃఖించుచు శరణుఁబొందిన బాటసారుల నాయశోకము పైనఁజెప్పిన విధముగా రక్షించుచున్నదో యనునట్లు గానవచ్చుచున్నది. జ్వలించుమన్మథాస్త్రములనుఁజిగుళ్లలో నాయశోకము కప్పిపుచ్చి యాబాటసారులను మరణభయమునుండి తప్పించుటయు రక్షణయే యగుచున్నది.

శ్లో॥ విలాసవాపీతటవీచివాదనా
త్పికాళిగీతేశ్శిఖిలాస్యలాఘవాత్।
వనేఽపితౌర్యత్రికమారరాధ తం
క్వభోగమాప్నోతి న భాగ్యభాగ్జనః॥ ౧౦౨

ప॥ వి॥ విలాసవాపీతటవీచివాదనాత్ । పికాళిగీతేః । శిఖిలాస్యలాఘవాత్ । వనే। అపి। తౌర్యత్రికమ్ । ఆరరాధ । తం।క్వ । భోగమ్ । ఆప్నోతి । న భాగ్యభాక్ । జనః ॥

టీక॥ విలాసవాపీతట వీచివాదనాత్, విలాసవాపీ = విహారపు నడబావి యొక్క తట = గట్టునందలి వీచి = అలలయొక్క వాదనాత్ = వాయించడమువలనను. పికాళిగీతేః, పిక = కోకిలయొక్కయు, అళి = తుమ్మెదల యొక్కయు గీతేః = గానమువలనను, శిఖిలాస్యలాఘవాత్, శిఖి = నెమలియొక్క లాస్య = నృత్యమందలి లాఘవాత్ = నైపుణ్యము వలన వనేఽపి = అడవియందును, తం = అనలుని, తౌర్యత్రికం = నృత్త-గీత-వాద్యములు, మూడును ఆరరాధ = ఆరాధించెను. భాగ్యభాక్ = భాగ్యముగల, జనః = జనము, క్వ = ఎక్కడ భోగం = సుఖమును, నాఽఽప్నోతి = పొందదు.

"క్వ భోగమాప్నోతి న భాగ్యభాక్ జనః" అని భాగ్యవంతు డెక్కడ సుఖమనుభవించడను సామాన్యవిషయముచే తౌర్యత్రికము నలుని సేవించుటయను విశేషార్థము సమర్థింపఁబడినదిగాన నిటనర్థాంతరన్యాసము॥

సమాసములు :

విలాసవాపీతటవీచివాదనాత్:- విలాసస్య వాపీ = విలాసవాపీ, విలాసవాప్యాః, తటం = విలాసవాపీతటం, వీచీనాం వాదనం = వీచివాదనం, విలాసవాపీతటే వీచివాదనం = విలాసవాపీతటవీచివాదనం, తస్మాత్ = విలాసవాపీతటవీచివాదనాత్॥

పికాళిగీతేః:- పికాశ్చ, అళయశ్చ = పికాళయః, పికాళీనాంగీతిః = పికాళిగీతిః, తస్యాః పికాళిగీతేః॥

శిఖిలాస్యలాఘవాత్:- లాస్యానాం లాఘవం = లాస్యలాఘవం, శిఖినాం లాస్యలాఘవం = శిఖిలాస్యలాఘవం, తస్మాత్ = శిఖిలాస్యలాఘవాత్॥

తౌర్యత్రికం:- తౌర్యాణాం త్రికం, తౌర్యత్రికం,

భాగ్యభాక్:- భాగ్యం భజతీతి = భాగ్యభాక్

భావము :

ఆ యుద్యానవనమునందు విలాసపు నడబావిలోని యలలుగట్టునకు గొట్టుట వలన వాద్యము, కోయిలలు తుమ్మెదలు చేసెడి, కుహూఝుంకారములచే గానము నెమళ్ళు నేర్పుతోనాడుట వలన నాట్యము అనునీ తౌర్యత్రికము నలుని వనమందును సేవించినవి భాగ్యవంతుడెందు సుఖముననుభవించడు? అంతటను సుఖముననుభవింపఁగలడు. నలుడట్టిభాగ్యశాలిగాన నడవియందుననతడు తౌర్యత్రికము సేవించుటవలన సుఖమనుభవించెను.

శ్లో॥ తదర్ధమధ్యాప్య జనేన తద్వనే
శుకా విసృష్టాః పటవ స్తమస్తువన్।
స్వరామృతేనోపజగుశ్చ శారికా
స్తథైవ తత్పౌరుషగాయినీకృతాః। ౧౦౩

ప॥ వి॥ తదర్థమ్ । అధ్యాప్య । జనేన । తద్వనే । శుకాః । విస్పష్టాః । పటవః । తమ్ । అస్తువన్ । స్వరామృతేన । ఉపజగుః । చ । శారికాః । తథా । ఏవ । తత్పౌరుషగాయినీకృతాః।

టీక॥ జనేన = సేవకజనముచే, తదర్థం = నలుని ప్రీతికై అధ్యాప్య = స్తుతులను చదివించి తద్వనే = ఆ యుద్యానమందు. విసృష్టాః = విడువఁబడిన, పటవః = స్పష్టమగు వాక్కుగల శుకాః = చిలుకలు, తం = ఆనలుని, అస్తువన్ = స్తుతించినవి తథైవ = అట్లే తత్పౌరుషగాయినీకృతాః, తత్ = ఆనలుని యొక్క పౌరుష = పరాక్రమమునకు గాయినీకృతాః = గాయకురాండ్రుగఁ జేయఁబడిన, శారికాః = గోరువంకలు, స్వరామృతేన = మధురమైన స్వరముతో, ఉపజగుశ్చ = గానముఁ జేసినవి,

సమాసములు :-

తదర్థమ్:- తస్మై = తదర్థమ్

తద్వనే = తచ్చ తత్ వనం చ = తద్వనంతస్మిన్ = తద్వనే

స్వరామృతేన:- స్వరః అమృతమివ = స్వరామృతమ్, తేన = స్వరామృతేన।

తత్పౌరుషగాయినీకృతాః:- పురుషస్య కర్మ = పౌరుషం తస్య పౌరుషం = తత్పౌరుషం తత్పౌరుషస్య గాయిన్యః = తత్పౌరుషగాయిన్యః, అతత్పురుషగాయిన్యః తత్పౌరుషగాయిన్యః కృతాః, తత్పౌరుషగాయినీకృతాః॥

భావము :

ఆ యుద్యానవనమందలి సేవకజనము నలమహారాజు యొక్క ప్రీతికై చిలుకలకు స్తుతులునేర్పి వనమందు వదలి పెట్టియుండిరి, ఆ చిలుకలు రాజు రాగనే, స్ఫుటవచనములతో నాతనిని స్తుతిఁజేసినవి. ఆవిధముగనే, యానలుని పరాక్రమమును గానముఁజేయునవిగ శిక్షణయీయఁబడిన గోరువంకలు, అమృతమువంటి మధురస్వరముతో రాజునుఁగాంచి, గానములు జేసినవి.

శ్లో॥ ఇతీష్టగంధాఢ్యమటన్నసౌ వనం
పికోపగీతోఽపి శుకస్తుతోఽపి చ।
అవిందతామోదభరం బహిః పరం
విదర్భసుభ్రూవిరహేణ నాంతరమ్ ॥ ౧౦౪

ప॥ వి॥ ఇతి। ఇష్టగంధాఢ్యమ్ । అటన్ । అసౌ । వనం । పికోపగీతః । అపి । శుకస్తుతః । అపి । చ । అవిందత।ఆమోదభరం।బహిః।పరం। విదర్భసుభ్రూవిరహేణ । న। అంతరమ్ ।

టీక॥ ఇతి = ఇట్లు, ఇష్టగంధాఢ్యం. ఇష్టగంధ = సుగంధముతో, ఆఢ్యం = నిండిన, వనం = ఉద్యానమును అటన్ = తిరుగుచున్న అసౌ = ఈ నలుఁడు పికోపగీతోఽపి = పికః కోకిలలచే ఉపగీతోపి = గానముచేయఁబడినవాడైనప్పటికిని, శుకస్తుతోఽపి చ; శుక = చిలుకలచే,స్తుతోఽపి చ = స్తుతింపఁబడినవాడైనప్పటికిని, పరం = కేవలము, బహిః = వెలుపల. ఆమోదభరం = పరిమళభారమును, అవిందత = అనుభవించెను. విదర్భసుభ్రూవిరహేణ; విదర్భసుభ్రూ = విదర్భదేశపు సుందరియగు దమయంతియొక్క, విరహేణ = వియోగముచే, అంతరం = అంతరంగమునకు సంబంధించిన, ఆమోదభరం = ఆనందాతిశయమును, నాఽవిందత = అనుభవింపలేదు.

సమాసములు:

ఇష్టగంధాఢ్యం:- ఇష్టగంధేన ఆఢ్యమ్, ఇష్టగంధాఢ్యమ్ తత్. ఇష్టగంధాఢ్యమ్.

పికోపగీతః;- పికైరుపగీతః = పికోపగీతః

శుకస్తుతః:- శుకైః స్తుతః = శుకస్తుతః

ఆమోదభరం:- ఆమోదస్య భరః = ఆమోదభరః, తం ఆమోదభరమ్
విదర్భసుభ్రూవిరహేణ:- విదర్భాణాం సుభ్రూః, విదర్భసుభ్రూః. విదర్భసుభ్రువః విరహః, విదర్భసుభ్రూవిరహః, తేన విదర్భసుభ్రూవిరహేణ.

ఆంతరమ్:- అంతరే భవః = ఆంతరః, తం = ఆంతరమ్.

భావము:-

ఈ విధముగ నలుడు మంచి పరిమళముతో నిండిన యా యుద్యాన మందు సంచరించుచు, కోయిలలు గానముఁజేసినను, చిలుకలు స్తుతిఁజేసినను కేవలము పరిమళముల ననుభవించుటవలన, బాహ్యమైన ఆమోదము ననుభవిం చెను. కాని, దమయంతీవిరహముచే మానసికమగు నామోదముననుభవింప లేక పోయెను. మఱియు నా యుద్యానములోని యుద్దీపకములగు కోకిల నాదముల తోఁడను, తుమ్మెదల ఝుంకారములతోఁడను, పూచిన మొగలిపొదలతోఁడను చిగిర్చిన యశోకములవలనను, దమయంతీవిరహదుఃఖితుఁడగు నలునకు బాధ యినుమడించినది.

శ్లో॥ కరేణ మీనం నిజకేతనం దధత్
ద్రుమాలవాలాంబునివేశశంకయా ।
వ్యతర్కి సర్వర్తుఘనే వనే మధుం
స మిత్రమత్రానుసరన్నివ స్మరః॥ ౧౦౫

ప॥ వి॥ కరేణ । మీనం । నిజకేతనం । దధత్ । ద్రుమాలవాలాంబునివేశశంకయా । వ్యతర్కి । సర్వర్తుఘనే । వనే । మధుం । సః । మిత్రమ్ । అత్ర । అనుసరన్ । ఇవ । స్మరః.

టీక॥ సః = ఆ నలుఁడు, నిజకేతనం; నిజ = తనదగు. కేతనం = ధ్వజము లోని చిహ్నమగు, మీనం = చేపను, ద్రుమాలవాలాంబునివేశశంకయా; ద్రుమ = చెట్లయొక్క, ఆలవాల = పాదులలోని, అంబు = నీటిలో, నివేశ = ప్రవేశించుననను, శంకయా = భయముచే, కరేణ = చేతితో, దధత్ = (మత్స్యరేఖలను నెపముచే) ధరించుచు, సర్వర్తుఘనే; సర్వర్తు = సమస్తఋతువులచే, ఘనే = నిండిన, అత్ర = ఈ, వనే = ఉద్యానమందు, మిత్రం = స్నేహితుఁడగు, మధుం = వసంతుని, అను సరన్ = వెంబడించుచున్న, స్మర ఇవ = మన్మధుఁడువలె, వ్యతర్కి = ఊహింపఁబడెను.

'స్మర ఇవ వ్యతర్కి' అని నలుఁడు మన్మథుఁడుగ నూహింపఁబడె నని చెప్పుట వలన నుత్ప్రేక్షాలంకారము

**సమాసములు:**

నిజకేతనం:- నిజం చ తత్ కేతనం చ = నిజకేతనం, తత్ = నిజ కేతనమ్.

ద్రుమాలవాలాంబునివేశశంకయా:- ద్రుమాణామాలవాలాః = ద్రుమాల వాలాః, ద్రుమాలవాలానామంబూని = ద్రుమాలవాలాంబూని. ద్రుమాల వాలాంబుషు నివేశః, ద్రుమాలవాలాంబునివేశః, ద్రుమాలవాలాంబుని వేశాత్. శంకా = ద్రుమాలవాలాంబునివేశశంకా. తయా ద్రుమాలవాలాం బునివేశశంకయా.

సర్వర్తుఘనే:- సర్వే చ తే ఋతవశ్చ = సర్వర్తవఃసర్వర్తుభిః ఘనం = సర్వర్తుఘనం = తస్మిన్ = సర్వర్తుఘనే.

**భావము:-**

ఆ యుద్యానమందు హస్తమున మత్స్యరేఖఁతో నొప్పి విహరించుచున్న యా నలుఁడు తన ధ్వజచిహ్నమగు మీనము క్రిందఁబడి చెట్ల పాదులలోని నీట మునుగునను భయముతో దానిని చేతఁబెట్టుకొని, సమస్తఋతువులతో సమృద్ధమగు నా వనమందు తన చెలికాడను మధువును వెంబడించు మన్మథుడో యనునట్లు జనులచే నూహింపఁబడెను.

శ్లో॥ లతాబలాలాస్యకలాగురుస్తరు
ప్రసూనగంధోత్కరపశ్యతోహరః ।
అసేవతాముం మధుగంధవారిణి
ప్రణీతలీలాప్లవనో వనానిలః॥ ౧౦౬

ప॥ వి॥ లతాబలాలాస్యకలాగురుః । తరుప్రసూనగంధోత్కరపశ్యతోహరః । అసేవత । అముం । మధుగంధవారిణి । ప్రణీతలీలాప్లవనః ।వనానిలః।

టీక॥ లతాఽబలాలాస్యకలాగురుః; లతా = తీగెలనెడు, అబలా = స్త్రీలకు, లాస్యకలా = మధురనృత్యవిద్యయందు, గురుః = ఉపదేష్టయు. తరు ప్రసూనగంధోత్కరపశ్యతోహరః: తరు = వృక్షములయొక్క, ప్రసూన = పుష్పములలోని, గంధోత్కర = పరిమళాతిశయమునకు, పశ్యతో హరః = ప్రత్యక్షచోరు డును, మధుగంధవారిణి; మధు = మకరందమును

గంధవారిణి = తావినీటియందు, ప్రణీతలీలాప్లవనః ప్రణీత = చేయఁ బడిన లీలాప్లవనః = విలాసపు జలకేళులు గల, వనానిలః = వనవాయువు అముం = ఈ నలుని, అసేవత = సేవించినది,

"లతాబలాలాస్యగురుః" అని చెప్పుటవలన వాయువు నందలి మందగతియు, "తరుప్రసూనగంధోత్కరపశ్యతోహరః" యని చెప్పుటవలన వాయువునందలి పరిమళాతిశయము ద్యోతితములు.

"ప్రణీతలీలాప్లవనః" అని చెప్పుట వలన వాయువునందలి శైత్యము సూచితమైనది శైత్య-సౌరభములు గల మంద మారుతము నలుని సేవించినది. గుణవంతుడగు సేవకుడే యజమానుని రంజిల్లఁ జేయును.

"లతాబలాలాస్యగురుః" అని లతలను, అబలలతో రూపించుట వలన రూపకము.

సమాసములు :

లతాబలాలాస్యగురు :- లతా ఏవ అబలా : లతాబలాః, లతాబలానాం లాస్యం, లతాబలాలాస్యం, లతాబలాలాస్యే గురుః, లతాబలాలాస్యగురుః తం, లతాబలాలాస్యగురుం-

తరుప్రసూనగంధోత్కర పశ్యతోహరః :- తరూణాం ప్రసూనాని, తరుప్రసూనాని, తరుప్రసూనేషు గంధాః తరుప్రసూనగంధానాముత్కరః = తరుప్రసూనగంధోత్కరః పశ్యతః హరః = పశ్యతో హరః తరుప్రసూనగంధోత్కరస్య పశ్యతోహరః, తరుప్రసూనగంధోత్కర పశ్యతోహరః.

మధుగంధవారిణి :- గంధస్య వారి = గంధవారి మధ్వేవ, గంధవారి = మధుగంధవారి, తస్మిన్, మధుగంధవారిణి.

ప్రణీతలీలాప్లవనః :- లీలయా ప్లవనమ్, లీలాప్లవనం ప్రణీతం లీలాప్లవనంయేన సః = ప్రణీతలీలాప్లవనః.

వనానిలః:- వనస్య అనిలః = వనానిలః.

**భావము :**

ఆయుద్యానమందు, వనవాయువు, తీగెలనెడి స్త్రీలకు, మధుర నృత్యమును నేర్పుటకు గురువై, పూలనెత్తావికిఁ బ్రత్యక్షచోరుడై మకరందమను గంధోదకమున విలాసపుజలకములాడిన వాడై మాంద్యమును పరిమళమును చల్లఁదనమును వహించి యానలుని సేవించెను.

శ్లో॥ అథ స్వమాదాయ భయేన మంథనా
చ్చిరత్నరత్నాధికముచ్చితం చిరాత్।
నిలీయ తస్మిన్నివసన్నపాంనిధి
ర్వనే తటాకో దదృశేఽవనీభుజా॥ ౧౦౭

వ॥ వి॥ అథ । స్వమ్ । ఆదాయ । భయేన । మంథనాత్ । చిరత్నరత్నాధికమ్ । ఉచ్చితం । చిరాత్ । నిలీయ । తస్మిన్ । నివసన్ । అపాంనిధిః । వనే । తటాకః । దదృశే . అవనీభుజా ।

టీక॥ అథ = వనము చూచిన పిదప. మంథనాత్ = చిలుకుట వలని. భయేన = భయముచే. చిరాత్ = చాల కాలము నుండి, ఉచ్చితం = సంపాదింపఁబడిన, చిరత్నరత్నాధికమ్; చిరత్న = ప్రాచీనములగు, రత్న = రత్నములతో అధికం = నిండిన, స్వం = ధనమును, ఆదాయ = తీసికొని, తస్మిన్ = ఆ, వనే = వనమందు. నిలీయ = దాగికొని నివసన్ = నివసించుచున్న, అపాంనిధిరివ = సముద్రమోయనునట్లు, తటాకః = కొలను, అవనీభుజా = నలమహారాజు చే, దదృశే = చూపఁబడినది.

"నిలీయ నివసన్నపాంనిధిరివ" యని, తటాకమును, ఆ వనమందు దాగిన సముద్రమోయని చెప్పుటవలన నుత్ప్రేక్ష

**సమాసములు :**

చిరత్నరత్నాధికమ్ :- చిరత్నాని చ తాని రత్నాని చ = చిరత్నరత్నాని, చిరత్నరత్నైరధికమ్ = చిరత్నరత్నాధికమ్. అథవా చిరత్నరత్నాని— అధికాని యస్మిన్ తత్ = చిరత్నరత్నాధికం, తత్ = చిరత్నరత్నాధికమ్.
అవనీభుజా :- అవన్యాః భుక్ = అవనీభుక్ = తేన = అవనీభుజా.

భావము :

ఆ యుద్యానమునుఁ జూచిన నలమహారాజందలి కొలనుఁ జూచెను. మఱల దేవాసురులు తన్నుఁ జిలుకుదురేమో యని భయముతో, సముద్రుఁడు తాను చిరకాలమునుండి సంపాదించుకొనిన, ప్రాచీన రత్నములతో నిండిన తన సర్వస్వమును తీసి కొనివచ్చి ఆ వనమందొక మూల దాగి నివసించుచున్నాడో యను నట్లుగ నా కొలను నలమహారాజుచేఁ భావింపఁబడినది. ఇట్లు జెప్పుటవలన ఆ తటాకము విశాలమై వివిధరత్నములకు నాకరమై సముద్రమునుఁ దలపించు చున్నదని సూచితము.

శ్లో॥ పయోనిలీనాభ్రముకాముకావళీ
రదాననంతోరగపుచ్ఛసచ్ఛవీన్।
జలార్ధరుద్ధస్య తటాంతభూభిదో
మృణాళజాలస్య నిభాద్బభార యః॥ ౧౦౮

ప॥ వి॥ పయోనిలీనాభ్రముకాముకావళీరదాన్ ।అనంతోరగ పుచ్ఛసచ్ఛవీన్।జలార్ధ రుద్ధస్య । తటాంతభూభిదః । మృణాళజాలస్య । నిభాత్ । బభార ।యః,

టీక॥ యః = ఏ తటాకము. జలార్ధరుద్ధస్య; జల = నీటిచే, అర్ధరుద్ధస్య = సగము మూయఁబడిన, తటాంతభూభిదః; తటాంత = గట్టునొద్ద- భూ = భూమిని. భిదః = పెల్లగించుకొనిన. మృణాళజాలస్య, మృణాళ = తామరతూండ్ల యొక్క జాల = సమూహముయొక్క, నిభాత్ = నెపము వలన, అనంతోరగ పుచ్ఛసచ్ఛవీన్; అనంత = ఆదిశేషు డను ఉరగ = సర్పముయొక్క, పుచ్ఛ = తోకతో, సచ్ఛవీన్ = సమానమగు ధవళకాంతులుగల పయోని లీనాభ్రము కాముకావళీరదాన్; పయః = ఉదకమందు, నిలీన = దాగిన, అభ్రముకాముకావళీ అభ్రము = అభ్రము ననెడి యాడయేనుగకు కాముకావళీ = ప్రియులైన ఐరావతముల పంక్తియొక్క, రదాన్ = దంతములను, బభార = వహించెను.

"పయోని లీనాభ్రముకాము కావళీరదాన్" అని తటాకమందు "అభ్రముకాము కావళీ" యని పెక్కు ఐరావతములనుఁ జెప్పుట

వలన సముద్రమందొక ఐరావతమే యుండుటచే దానికంటెనిందాధిక్యము సిద్ధించుట వలన వ్యతిరేకాలంకారము.

సమాసము :

పయోనిలీనాభ్రముకాముకావళీరదాన్ :- పయసి నిలీనాః = పయోనిలీనా, అభ్రమోః కాముకాః అభ్రముకాముకాః, అభ్రముకాముకానామావళయః అభ్రముకాముకావళయశ్చ పయోనిలీనాశ్చ తాః అభ్రముకాముకావళయశ్చ పయోనిలీనాభ్రము కాముకావళయః. పయోనిలీనాభ్రము కాముకావళీనాం రదాః పయోనిలీనాభ్రము కాముకావళీరదాః తాన్ = పయోనిలీనాభ్రము కాముకావళీరదాన్.

అనంతోరగ పుచ్ఛసచ్ఛవీన్ :- అనంత ఇతి ఉరగః, అనంతోరగః, అనంతోరగస్య పుచ్ఛః, అనంతోరగపుచ్ఛః, సమానా ఛ్ఛవిః యోషాం తే = సచ్ఛవయః, అనంతోరగేణ సచ్ఛవయః, అనంతోరగ సచ్ఛవయః, తాన్ అనంతోరగ పుచ్ఛసచ్ఛవీన్.

జలార్ధరుద్ధస్య :- అర్ధే రుద్ధం = అర్ధరుద్ధం, జలేన అర్ధరుద్ధమ్ = జలార్ధరుద్ధమ్తస్య జలార్ధరుద్ధస్య.

తటాంతభూభిదః :- తటస్య అంతః = తటాంతః, తటాంతే భూః, తటాంతభూః తటాంతభువం భినత్తీతి = తటాంతభూభిత్, తస్య = తటాంత భూభిదః.

మృణాలజాలస్య :- మృణాలానాం జాలం = మృణాలజాలమ్, తస్య = మృణాలజాలస్య.

భావము :

ఆ తటాకము, నీటియందు సగము మునిగి గట్టును భేదించు తామర తూండ్ల సమూహమను నెపముచే నాదిశేషుని తోకతో సమానమగు ధవళకాంతి గల్గిన నీట మునిగిన ఐరావతములను దంతముల వహించినదిగ గానవచ్చినది. సముద్ర మందొక యైరావతముండగా నీ తటాకమందు ఐరావతములు పెక్కు లున్నవని సిద్ధించుట వలన సముద్రమున కంటెను తటాకమునకు నాధిక్యము సిద్ధించినది.

శ్లో॥ తటాంతవిశ్రాంతతురంగమచ్ఛటా
స్ఫుటానుబింబోదయచుంబనేన యః ।
బభౌ చలద్వీచికశాంతశాతనై
స్సహస్రముచ్చైశ్శ్రవసామివ శ్రయన్॥ ౧౦౯

ప॥ వి॥ తటాంతవిశ్రాంత తురంగమచ్ఛటాస్ఫుటానుబింబోదయ చుంబనేన । యః । బభౌ । చలత్ । వీచికశాంత శాతనైః । సహస్రమ్ । ఉచ్చైశ్శ్రవసామ్ । ఇవ । శ్రయన్ ।

టీక॥ యః = ఏతటాకము, తటాంత విశ్రాంతతురంగమచ్ఛటాస్ఫుటానుబింబోదయచుంబనేన; తటాంత = కొలని గట్టునకు సమీపమునందు విశ్రాంత = విశ్రమించిన తురంగమచ్ఛటా = నలుఁడు తెచ్చిన గుఱ్ఱముల సమూహమునకు, స్ఫుట = స్పష్టముగా, అనుబింబ = ప్రతిబింబము యొక్క ఉదయ = ఆవిర్భావము యొక్క చుంబనేన = వ్యాప్తిచే, వీచికశాంత శాతనైః; వీచి = అలలనెడి, కశా = కొరడాలయొక్క, అంత = కొన యొక్క, శాతనైః = దెబ్బలచే, చలత్ = కదలుచున్న ఉచ్చైః శ్రవసాం = ఉచ్చైశ్శ్రవముల యొక్క సహస్రం = వేయిని, శ్రయన్నివ = కల్గియున్నదో యనునట్లు దదృశే = చూడఁబడినది.

"సహస్రం శ్రయన్నివ" యని ఉచ్చైశ్శ్రవముల వేయినిగల్గినదో యనునట్లు చెప్పుటచే నుత్ప్రేక్షాలంకారము.

సమాసములు :

తటాంత విశ్రాంత తురంగ మచ్ఛటాస్ఫుటానుబింబోదయచుంబనేన :- తటస్య అంతః, = తటాంతః తటాంతే విశ్రాంతా, తటాంత విశ్రాంతా, తురంగమాణాం ఛటా = తురంగమచ్ఛటా, తటాంతవిశ్రాంతా చ సా తురంగమచ్ఛటా చ = తటాంతవిశ్రాంత తురంగమచ్ఛటా స్ఫుటమనుబింబః = స్ఫుటానుబింబః, స్ఫుటానుబింబస్య. ఉదయః స్ఫుటానుబింబోదయః, తటాంతవిశ్రాంత తురంగమచ్ఛటా స్ఫుటాను

బింబోదయ్య చుంబనమ్ తటాంతవిశ్రాంతతురంగమచ్ఛటాస్ఫుటాను
బింబోదయ చుంబనం తేన తటాంత విశ్రాంత తురంగమచ్ఛటాస్ఫుటాను
బింబోదయ చుంబనేన—

వీచికశాంతశాతనైః :— వీచయ ఏవ కశాః — వీచికశాః, వీచిక
శానామంతః వీచికశాంతః వీచికశాంతస్య శాతనాని వీచికశాంతశాతనాని,
తైః వీచికశాంతశాతనైః.

భావము :

ఆ యుద్యానమునకు నలుఁడు తనతోఁ గొన్ని గుఱ్ఱములనుఁ గొని
పోయి తటాకము గట్టున కట్టివేసెను. ఆ గట్టునఁ గట్టవేయ బడిన గుఱ్ఱముల
ప్రతిబింబము లాతటాకజలమందు కానవచ్చుచున్నవి. ఆ తటాకమందలి యలలా
ప్రతిబింబములనుఁదాకుటవలన, కొరడాలతో వానిని కొట్టి నట్లున్నవి. ఇట్లు
గుఱ్ఱముల ప్రతిబింబములచే వేలకొలది గుఱ్ఱము లాతటాకమందున్నట్లు గాన
వచ్చుచున్నవి. సముద్రమందొక యుచ్చైశ్శ్రవమను గుఱ్ఱముండగా నిందు సహస్ర
సంఖ్యాకములగు నుచ్చైశ్శ్రవములు గానవచ్చుచున్నవని చెప్పుట వలన సము
ద్రము కంటె నాధిక్యము తటాకమునకు సిద్ధించినది.

శ్లో॥ సితాంబుజానాం నివహస్య యశ్ఛలా
ద్బభావళిశ్యామలితోదరశ్రియాం ।
తమస్సమచ్ఛాయకళంకసంకులం
కులం సుధాంశోర్బహుళం వహన్ బహు॥ ౧౧౦

ప॥ వి॥ సితాంబుజానాం । నివహస్య । యః । ఛలాత్ । బభౌ । అళిశ్యామలితో
దర శ్రియాం । తమస్సమచ్ఛాయకళంకసంకులం । కులం । సుధాంశోః ।
బహుళం । వహన్ । బహు

టీక॥ యః — ఏతటాకము; అళిశ్యామలితోదరశ్రియాం అళి — తుమ్మెదలచే
శ్యామలిత — నలుపుగావింపఁబడిన ఉదర — మధ్యభాగమందలి శ్రియాం
— శోభగల్గిన, సితాంబుజానాం — తెల్లదామరలయొక్క, నివహస్య —
సమూహముయొక్క ఛలాత్ — నెపమువలన, తమస్సమచ్ఛాయకళంక
సంకులమ్, తమః — చీకటితో, సమచ్ఛాయ — సమానకాంతిగల, కళంక

= కళంకములతో. సంకులం = కూడిన, బహుళం = సంపూర్ణమగు, బహు = అనేకమైన, సుధాంశోః = చంద్రునియొక్క, కులం = వంశమును, వహన్ = వహించునదిగ, బభౌ = ప్రకాశించెను,

"సితాంబుజానాం నివహస్య ఛలాత్" సుధాంశోః కులం వహన్నివ -యని ఛలశబ్దముచే తెల్లదామరలయందు సితాంబుజత్వమును నిషేధించి చంద్రత్వమునారోపించుటవలన అపహ్నవము. వహన్నివయని వహించుచున్నదో యనునట్లు చెప్పుటవలన నుత్ప్రేక్షయు నలంకారములు సముద్రమందొక చంద్రుడుండగా నిందు పెక్కుచంద్రులుండు నట్లు చెప్పుటవలన వ్యతిరేకాలంకారము-

సమాసములు :

సితాంబుజానాం : = సితాని చ తాని, అంబుజాని చ = సితాంబుజాని- తేషాం సితాంబుజానాం.

అళిశ్యామలితోదరశ్రియామ్ :- అళిభిఃశ్యామలితా = అళిశ్యామలితా; ఉదరస్య శ్రీః ఉదరశ్రీః, అళిశ్యామలితా ఉదరశ్రీః యేషాం తాని = అళిశ్యామలితోదరశ్రీణి = తేషాం అళిశ్యామలితోదరశ్రియామ్-

భావము :

ఆ తటాకమందు తుమ్మెదలువాలుటచే నల్లబారిన మధ్యభాగముగల తెల్లదామరలు గలవు. తుమ్మెదలు వాలుట వలన, నల్లని కళంకములు వాని కేర్పడినట్లు గానవచ్చుచున్నవి, అట్టి నల్లని కళంకములు గల తెల్లదామరపూవుల నెపముతో తటాకము పెక్కుపూర్ణచంద్రులను గల్గినట్లు కానవచ్చుచున్నది. ఆ సముద్రమందొక్క చంద్రుడుండును నిట పెక్కు చంద్రులుండునట్లు చెప్పుట వలన వ్యతిరేకాలంకారము.

శ్లో॥ రథాంగభాజా కమలానుషంగిణా
శిలీముఖస్తోమసఖేన శార్ఙ్గిణా ।
సరోజినీస్తంబకదంబకైతవా
న్మృణాళశేషాహిభువాన్వయాయి యః॥ ౧౧౧

ప॥ వి॥ రథాంగభాజా । కమలానుషంగిణా । శిలీముఖస్తోమసఖేన।శార్ఙ్గిణా । సరోజినీ స్తంబకదంబకైతవాత్ । మృణాళశేషాహిభువా । అన్వయాయి । యః ।

టీక॥ యః = ఏ, తటాకః = తటాకము, రథాంగభాజా; రథాంగ = చక్రవాకమును, (చక్రాయుధమును) భాజా = పొందినవాఁడును కమలానుషంగిణా = కమల = కమలముల చేతను, కమలా = లక్ష్మితోడను, అనుషంగిణా = సంబంధించినదియు, శిలీముఖస్తోమసఖేన; శిలీముఖ = తుమ్మెదలయొక్క, స్తోమ = సమూహముతో, సఖేన = సహితము, శిలీముఖస్తోమ = తుమ్మెదలసమూహముతో, సఖేన = సమానవర్ణము గలవాఁడును. మృణాళశేషాహిభువా; మృణాళశేషాహి — ఆదిశేషుని వంటి తామరకాడలకు, భువా = స్థానమైనదియు, మృణాళ = తామరకాడవంటి, శేషాహి = ఆదిశేషునియందు, భువా = ఆసీనమైయుండువాఁడునునగు, శార్ఙ్గిణా = శ్రీవిష్ణువుచే, సరోజినీస్తంబకదంబకైతవాత్; సరోజినీ = తామరల యొక్క, స్తంబ = గుల్మములయొక్క, కైతవాత్ = వ్యాజమువలన, అన్వయాయి = అనుసరింపఁబడెను, అనగా నధిష్ఠింపఁబడెను.

సరోజినీస్తంబకదంబకైతవాత్- అని కైతవశబ్దముచే సరోజినీస్తంబమందు స్తంబత్వమును నిషేధించి యందు శార్ఙ్గిత్వమను ధర్మమారోపింపఁబడి నందువలన నపహ్నవము.

సమాసములు:-

రథాంగభాజా: రథస్య అంగం రథాంగమ్, రథాంగం. భజతీతి = రథాంగభాక్ తేన రథాంగభాజా.

కమలానుషంగిణా ; కమలైః అనుషంగీ = కమలానుషంగీ. తేన = కమలానుషంగిణా. కమలయా అనుషంగీ = కమలానుషంగీ = తేన. కమలానుషంగిణా.

శిలీముఖస్తోమసఖేన: శిలీముఖానాం స్తోమః. శిలీముఖస్తోమః శిలీముఖస్తోమస్యసఖా = శిలీముఖస్తోమసఖః తేన = శిలీముఖస్తోమసఖేన.

శార్ఙ్గిణా: శృఙ్గస్య వికారః = శార్ఙ్గం, శార్ఙ్గమస్య అస్తీతి = శార్ఙ్గీ = తేన = శార్ఙ్గిణా.

సరోజినీ స్తంబకదంబకైతవాత్: సరోజినీనాం స్తంబాః = సరోజినీ స్తంబాః, సరోజీనా స్తంబానాం కదంబః = సరోజినీస్తంబకదంబః, సరోజినీ స్తంబకదంబస్య కైతవమ్ సరోజినీస్తంబకదంబకైతవమ్ తస్మాత్, సరోజినీ స్తంబకదంబకైతవాత్.

మృణాళశేషాహిభువా: శేష ఇతి అహిః, శేషాహిః, మృణాళం శేషాహిరివ = మృణాళశేషాహిః మృణాళశేషాహేః భూః = మృణాళశేషాహిభూః తేన = మృణాళశేషాహిభువా మృణాళమివ శేషాహిః = మృణాళశేషాహిః, మృణాళశేషాహిఃభూః యస్య సః = మృణాళశేహిభూః = తేన, మృణాళశేషాహిభువా.

భావము :

చక్రవాకములతోఁడను, కమలములతోఁడను, తుమ్మెదల పిండుతోడను కూడినదియు, శేషసర్పమువంటి తామరకాడలకు స్థానమయిన యీ తటాకము తామరకాడల నెపమున, చక్రాయుధమును ధరించినవాఁడును, కమలాసనాథుడును, తుమ్మెదలపిండువంటి నీలదేహము గలవాఁడును, తామరతూండ్ల వలె ధవళమైన శేషశయ్యపై నధిష్ఠించువాఁడు నగు శ్రీమహావిష్ణువు చే నన్ని విధముల ననుసరింపఁబడినది.

శ్లో॥ తరంగిణీరంకజుషస్స్వవల్లభా
స్తరంగరేఖా బిభరాంబభూవ యః ।
దరోద్గతైః కోకనదౌఘ కోరకై
ర్ధృతప్రవాళాంకురసంచయశ్చ యః॥ ౧౧౨

ప॥ వి॥ తరంగిణీః । అంజుషః । స్వవల్లభాః । తరంగరేఖాః । ఇవ । బిభరాంబభూవ । యః । దరోద్గతైః । కోకనదౌఘకోరకైః । ధృతప్రవాళాంకుర సంచయః । చ । యః ॥

టీక॥ (కించ = మఱియు) యః = ఏతటాకము, అంకభాజః; అంక = సమీపమును, భాజః = పొందినవియు, (అంక = ఒడిని, భాజః = పొందిన

వియు) తరంగరేఖాః = అలలపంక్తులను; స్వవల్లభాః = తనకుఁ బ్రియు రాండ్రైన, తరంగిణీః = నదులను, బిభరాంబభూవ = భరించెను, కించ = మరియు, యః = ఏతటాకము, దరోద్గతైః = కొంచెము వికసించిన. కోకనదౌఘకోరకైః: కోకనద = చెంగలువల, ఓఘ = తండము యొక్క, కోరకైః = మొగ్గలచే, ధృతప్రవాళాంకురసంచయః; ధృత = ధరింపఁబడిన, ప్రవాళాంకుర = పవడపు చిగుళ్ల యొక్క, సంచయః = సమూహము గలదియునాయెను.

"తరంగరేఖా : స్వవల్లభా స్తరంగిణీః" యని తరంగపంక్తులను. తన ప్రియురాండ్రగు నదులతో రూపించుటవలన, వ్యస్తరూపకము. "కోకనదౌఘకోరకైః ధృతప్రవాళాంకురసంచయః" యని చెంగలువల తండములను పగడపుమొలకలుగ రూపించుటవలన రూపకాలంకారము.

సమాసములు :

తరంగిణీః:- తరంగాః ఆసు సంతీతి = తరంగిణ్యః = తాః తరంగిణీ

అంకజుషః :- అంక జుషంతీతిఅంకజుషః = తాః = అంకజుషః.

స్వవల్లభాః :- స్వస్య వల్లభాః = స్వవల్లభాః, తాః = స్వవల్లభాః.

తరగరేఖాః:- తరంగాణాం రేఖాః = తరంగరేఖాః తరంగరేఖాః తరంగ రేఖాః.

దరోద్గతైః : దరముద్గతాః = దరోద్గతాః, తైఃదరోద్గతైః

కోకనదౌఘకోరకైః : కోకనదానామోఘః కోకనదౌఘః, కోకనదౌఘస్య కోరకాః = కోకనదౌఘకోరకాః, తైః = కోకనదౌఘకోరకైః.

ధృతప్రవాళాంకురసంచయః: ప్రవాళానామంకురాః = ప్రవాళాంకురాః, ప్రవాళాంకురాణాం సంచయః, ప్రవాళాంకురసంచయః, ధృతః ప్రవాళాంకురసంచయః యేన సః = ధృతప్రవాళాంకురసంచయః.

భావము :

ఈ తటాకము తన యందుద్భవించిన తరంగపంక్తులను, తనకు ప్రియురాండ్రగు నదులుగ భరించెను. తనయందు కొంచెము వికసించిన చెంగలువ మొగ్గలను పగడపు మొలకలుగ ధరించెను. కావున సముద్రము వలె నీ తటా

కము నదులకు భర్తగను పగడపు మొలకలను ధరించిన వాడనియు నిందుమూల మున సిద్ధించినది.

శ్లో॥ మహీయసః పంకజమండలస్య య

శ్ఛలేన గౌరస్య చ మేచకస్య చ।

నలేన మేనే సలిలే నిలీనయో

స్త్విషం విముంచన్నివ విధుకాలకూటయోః ౧౧౩

వ॥ వి॥ మహీయసః। పంకజమండలస్య। యః। ఛలేన। గౌరస్య। చ। మేచకస్య। చ। నలేన। మేనే। సలిలే। నిలీనయోః। త్విషం। విముంచన్। విధుకాలకూటయోః।

టీక॥ యః = ఏ తటాకము, మహీయసః = మిగులపెద్దదియు, గౌరస్య = తెల్లనిదియు, మేచకస్య చ = నల్లనిదియునగు, పంకజమండలస్య = తామరపూల షండముయొక్క, ఛలేన = నెపముచే, సలిలే = జలమందు, నిలీనయోః = దాగిన, విధుకాలకూటయోపి; విధు = తెల్లని చంద్రుని యొక్కయు, కాలకూటయోః = నల్లని హాలహలముయొక్కయు, త్విషం = కాంతిని, విముంచన్నివ = విడుచుచున్నదో యనునట్లు, నలేన = నలునిచే, మేనే = తలపఁబడినవి.

"పంకజమండలస్య ఛలేన" యని తామరపూలషండము యొక్క నెపముచే, చంద్రుని యొక్కయు, హాలహలముయొక్కయు కాంతిని విడచుచున్నట్లు జెప్పుట వలన అపహ్నవముతోఁ గూడిన యుత్ప్రేక్షా లంకారము.

సమాసములు:

మహీయసః : అతిశయేన మహత్ = మహీయః, తస్య = మహీయసః.
పంకజమండలస్య: పంకజయోః మండలమ్ = పంకజమండలమ్, తస్య పంకజమండలస్య.

విధుకాలకూటయోః : విధుశ్చ కాలకూటశ్చ = విధుకాలకూటౌ = తయోః = విధుకాలకూటయోః.

భావము :

ఆ తటాకమందు తెల్లనివియు నల్లనివియు నగు, తామరపూల షండము మహత్తరమైనది నెలకొని యున్నది. ఆ తామరపూల షండము నెపమున నీ తటాకము, చంద్రహాలాహలములను వహించి, వాని కాంతులను వదలుచున్నదో యను నట్లున్నది. ఇట్లు చంద్రహాలాహలములను వహించుట వలన దీనికి సముద్రధర్మము సిద్ధించినది.

శ్లో॥ చలీకృతా యత్ర తరంగరింగణై
రబాలశైవాలలతాపరంపరాః ।
ధ్రువం దధుర్బాడబహవ్యవాడధ
స్స్థితిప్రరోహత్తమభూమధూమతామ్ ॥ ౧౧౪

ప॥ వి॥ చలీకృతాః । యత్ర । తరంగరింగణైః । అబాలశైవాలలతాపరంపరాః । ధ్రువం । దధుః । బాడబహవ్యవాడధస్స్థితి ప్రరోహత్తమభూమధూమతామ్.

టీక॥ యత్ర = ఏతటాకమందు, తరంగరింగణైః, తరంగ = అలలయొక్క. రింగణైః = కదలికలచే, చలీకృతాః = కదలింపఁబడిన, అబాలశైవాలలతాపరంపరాః. అబాల = కఠినమైన శైవాలలతా = నాచుఁదీగెల యొక్క. పరంపరాః = పంక్తులు, బాడబహవ్యవాడధస్స్థితి ప్రరోహత్తమభూమధూమతామ్: బాడబహవ్యవాట్ = బడబాగ్నియొక్క అధఃస్థితి = అడుగున నునికిచే ప్రరోహత్తమ = మిక్కుటముగ వెలుపలికిఁ బ్రసరించు, భూమ = ఆధిక్యము తోగూడిన, ధూమతాం = పొగగానుండుటను దధుః = ధరించినవి. ధ్రువం = నిశ్చయము.

అబాలశైవాలలతాః బాడబహవ్యవాడధస్స్థితి ప్రరోహత్తమభూమధూమతాః దధుః ధ్రువత్-అని, కఠినములగు నాచుతీగెలు అడుగుభాగమందున్న బడబాగ్నియొక్క ధూమములైనవని చెప్పుట వలన నిట నుత్ప్రేక్షాలంకారము- 'ధ్రువ' శబ్దము దానికి వ్యంజకము.

సమాసములు :

చలీకృతాః ; అచలాః చలాః సంపద్యమానాః కృతాః = చలీకృతాః, తాః చలీకృతాః.

అబాలశైవాలలతాపరంపరాః : న బాలాః = అబాలాః, శైవాలా ఏవ లతాః శైవాలలతాః శైవాలలతానాం పరమ్పరాః = శైవాలలతాపరంపరాః అబాలాశ్చ తాః శైవాలలతాపరంపరాశ్చ = అబాలశైవాలలతాపరంపరాః తాః = అబాలశైవాలలతాపరమ్పరాః.

బాడబహవ్యవాడధస్థితి ప్రరోహత్తమ ధూమధూమతామ్ : హవ్యం వహతీతి = హవ్యవాట్, బాడబ ఇతి హవ్యవాట్ = బాడబహవ్యవాట్, బాడబహవ్యవాహః అధఃస్థితిః = బాడబహవ్యవాడధఃస్థితిః, అతిశయేన ప్రరోహన్ ప్రరోహత్తమః, బాడబహవ్యవాడధస్థిత్యా, ప్రరోహత్తమః = బాడబహవ్యవాడధస్థితిప్రరోమత్తమః బాడబహవ్యవాడధఃస్థితి ప్రరోహత్తమః ధూమా యస్య సః, బాడబహవ్యవాడధః స్థితిప్రరోహత్తమ ధూమా, బాడబహవ్యవాడధస్థితి ప్రరోహత్తమ ధూమా చాసౌధూమశ్చ = బాడబహవ్యవాడధఃస్థితి ప్రరోహత్తమధూమధూమః బాడబహవ్యవాడధస్థితి ప్రరోహత్తమ ధూమధూమస్య భావః = బాడబహవ్యవాడధస్థితి ప్రరోహత్తమధూమధూమతా, తాం, బాడబహవ్యవాడధఃస్థితి ప్రరోహత్తమ ధూమధూమతామ్—

భావము :

ఆ తటాకమందలయి కదలుట వలననందలి నాచు తీగెల వరుసలు గూడ కదలుచున్నవి. అవి లోనన్నున్న బడబాగ్ని నుండి వెలుపలికి వచ్చిన మిక్కుటమగు ధూమపరంపరగ భావింపఁబడినవి ఇందు వలన సముద్రధర్మమగు బడబాగ్ని తటాకమునకును సిద్ధమైనది.

శ్లో॥ ప్రకామమాదిత్యమవాప్య కంటకైః
కరంబితామోదభరం వివృణ్వతీ ।
ధృతస్ఫుటశ్రీగృహవిగ్రహా దివా
సరోజినీ యత్ప్రభవాప్సరాయితా॥ ౧౧౫

ప॥ వి॥ ప్రకామమ్ । ఆదిత్యమ్ । అవాప్య । కంటకైః । కరంబితామోదభరం। వివృణ్వతీ । ధృతస్ఫుటశ్రీ గృహవిగ్రహా । దివా । సరోజనీ । యత్ప్రభవా । అప్సరాయితా ।

టీక॥ ఆదిత్యం = సూర్యుని, అవాప్య = పొంది, ప్రకామం = మిక్కిలి కంటకైః = కాడయందున్న ముండ్లచే; కరంబితా = వ్యాప్తమైనదై, (ఆదిత్యం = అదితికుమారుడైన ఇంద్రుని, అవాప్య = పొంది,కంటకైః = పులకములచే. కరంబితా = నిండినదై) ఆమోదభరం = పరిమళ సంపదను, (ఆనందసంపదను,) వివృణ్వతీ = వెల్లడించుచున్నదియు, దివా = పగటియందు, ధృతస్ఫుటశ్రీగృహవిగ్రహా, ధృత = ధరించఁ బడిన, స్ఫుట = వికసించిన, శ్రీగృహ = పద్మములతోఁగూడిన, విగ్రహా = స్వరూపముగలిగినదియుఁ దివా = స్వర్గముచే, ధృతస్ఫుటశ్రీ గృహవిగ్రహా; ధృత = ధరించబడిన స్ఫుటశ్రీగృహ, స్ఫుట = స్పష్ట ముగఁ బ్రకాశించు శ్రీ = శోభకు గృహ = స్థానమైన, విగ్రహా = దేహము గలదియు, అనగా స్వర్గవాసినియు యత్ప్రభవా యత్ = ఏతటాకము ప్రభవా = జన్మస్థానముగాఁగల్గిన సరోజినీ = పుష్పముతోఁ గూడిన తామర కాడ, అప్సరాయితా = అప్సరసవలె నాచరించినది.

ఇచ్చట విశేషణములన్నియు శ్లిష్టములు గాన శ్లిష్టవిశేషణము లతోఁ గూడిన ఉపమాలంకారము సరోజినికిని అప్సరకునుపమానోప మేయభావము.

సమాసములు :

ఆదిత్యం : అదితేః ఆపత్యం పుమాన్, ఆదిత్యః = తం, ఆదిత్యమ్–
ఆమోదభరమ్ : ఆమోదస్య భరః = ఆమోదభరః తం, ఆమోదభరం.

ధృతస్ఫుటశ్రీగృహవిగ్రహా : శ్రియః గృహాణి = శ్రీగృహాణి, స్ఫుటాని చ తాని శ్రీగృహాణి చ = స్ఫుటశ్రీగృహాణి, ధృతాని, స్ఫుట శ్రీగృహాణి, ధృతాని, స్ఫుటశ్రీగృహాణి యేన సః ధృతస్ఫుటశ్రీగృహః ధృతస్ఫుటశ్రీగృహః, విగ్రహః యస్యాస్సా = ధృతస్ఫుటశ్రీగృహ విగ్రహా॥

స్ఫుటా చ సా శ్రీశ్చ = స్ఫుటశ్రీ ; స్ఫుటశ్రియః గృహం, స్ఫుటశ్రీ గృహం స్ఫుటశ్రీగృహమేవ విగ్రహః స్ఫుటశ్రీగృహవిగ్రహః, ధృతః –స్ఫుటశ్రీగృహవిగ్రహః యస్యా స్సా = ధృతస్ఫుటశ్రీ గృహ విగ్రహా –

"యత్రప్రభవా" యః–ప్రభవః యస్యాస్సా = యత్రప్రభవా.
"అప్సరాయితా" అప్సరా ఇవ ఆచరితా = అప్సరాయితా–

భావము :

సూర్యునిఁ బొంది కాడయందు ముళ్ళచే నిండినదై, పరిమళసంపదను వెల్లడిఁజేయుచు పగటియందు వికసించిన పద్మములనుఁ దాల్చినదై శోభించుచు నా తటాకమందు జన్మించిన పద్మిని, ఇంద్రునిఁబొంది, పులకములతో నిండిన దై యానందసంపదను వెల్లడిఁజేయుచు, నుజ్జ్వలముగ శోభించు శరీరముగల యప్సరవలె నాచరించినది. ఆ తటాకమునందు జన్మించిన పద్మిని సముద్ర మందు జన్మించిన యప్సరసఁను బోలినట్లు చెప్పుట వలన సముద్రధర్మము తటాకమునకును సిద్ధమైనది.

శ్లో॥ యదంబుపూరప్రతిబింబితాయతి
ర్మరుత్తరంగై స్తరళ స్తటద్రుమః ।
నిమజ్జ్య మైనాకమహీభృతస్సత
స్తతాన పక్షాన్ ధువతస్సపక్షతామ్॥ ౧౧౬

ప॥ వి॥ యదంబుపూరప్రతిబింబితాయతిః । మరుత్తరంగైః । తరళః । తట ద్రుమః । నిమజ్జ్య । మైనాకమహీభృతః । సతః । తతాన । పక్షాన్ । ధువతః । సపక్షతామ్ ।

టీక॥ యదంబుపూర ప్రతిబింబితాయతిః; యత్ = ఏ అంబుపూర = జలప్రవాహమందు, ప్రతిబింబిత = ప్రతిఫలించిన, ఆయతిః = పొడవు గలదియు, మరుత్తరంగైః = గాలి కెరటములచే తరళః = చంచలమైన తటద్రుమః = గట్టునందలి చెట్టు, నిమజ్య = నీట మునిగి, సతః = ఉన్నటువంటి పక్షాన్ = ఱెక్కలను ధువతః = విదిలించుచున్న, మైనాకమహీభృతః మైనాకపర్వతమునకు సపక్షతాం = సమానస్థితిని, (ఱెక్కలుగల్గియుండుటను) తతాన = చేసెను.

తటద్రుమః సపక్షతాం తతాన యని నీట ప్రతిఫలించిన గట్టులోని వృక్షమునకు, మైనాకపర్వతముతో సామ్యముఁ జెప్పుట వలన నుపమాలంకారము.

సమాసములు :

యదంబుపూరప్రతిబింబితాయతిః : యస్య అంబుపూరః = యదంబుపూరః యదంబుపూరే ప్రతిబింబితా = యదంబుపూర ప్రతిబింబితా, యదంబుపూర ప్రతిబింబితా ఆయతిః యస్య సః = యదంబుపూర ప్రతిబింబితాయతిః

మరుత్తరంగైః : మరుతస్తరంగాః మరుత్తరంగాః తైః మరుత్తరంగైః
తటద్రుమః : తటే ద్రుమః = తటద్రుమః

మైనాకమహీభృతః : మైనాక ఇతి మహీభృత్ = మైనాకమహీభృత్, తస్య = మైనాకమహీభృతః.

సపక్షతామ్ ; పక్షైః సహ వర్తత ఇతి = సపక్షః, సపక్షస్య భావః = సపక్షతా, తాం, సపక్షతామ్

భావము :

ఆ తటాక తీరమందలి వృక్షము, దాని యందు ప్రతిబింబించినదై గాలి చేనలల వలన కదలుచు సముద్రమధ్యమున మునిగి ఱెక్కలను విదలించుచున్న మైనాకపర్వతమునకు సమానస్థితిని వహించి యుండెను. ఇట్లు సముద్రమధ్యమున మునిగి యున్న మైనాకమునకు సమానముగ నీ తటాక మందును మఱియొక పర్వతముండుట వలన దీనికి సముద్రధర్మము సిద్ధించినది.

శ్లో॥ పయోధిలక్ష్మీముషి కేళిపల్వలే
రిరంసుహంసీకలనాదసాదరం ।
స తత్ర చిత్రం విహరంతమంతికే
హిరణ్మయం హంసమబోధి నైషధః ॥ ౧౧౭

ప॥ వి॥ పయోధిలక్ష్మీముషి । కేళిపల్వలే । రిరంసుహంసీకలనాదసాదరం । సః । తత్ర । చిత్రం । విహరంతం । అంతికే । హిరణ్మయం । హంసం । అబోధి । నైషధః ।

టీక॥ నైషధః = నిషధదేశప్రభువగు నలుఁడు పయోధి లక్ష్మీముషి: పయోధి = సముద్రము యొక్క లక్ష్మీ = శోభను, ముషి = హరించుచున్న, తత్ర = ఆ కేళిపల్వలే = క్రీడాతటాకమందు రిరంసుహంసీ కలనాద సాదరం రిరంసు = రమింపఁగోరుచున్న, హంసీ = ఆడహంసలయొక్క కలనాద = మధురధ్వనుల యందు, సాదరం = ఆసక్తి గలదియు, అంతికే = సమీపమందు, విహరంతం = విహరించుచున్న హిర ణ్మయం = సువర్ణమయమైన, (అతఏవ = కావుననే) చిత్రమ్ = ఆశ్చర్యకరమైన, హంసం = హంసను, అబోధి = తెలిసికొనెను.

సమాసములు :

పయోధిలక్ష్మీ ముషి :— పయోధేః లక్ష్మీ పయోధిలక్ష్మీః, పయోధిలక్ష్మీం ముష్ణాతీతి = పయోధిలక్ష్మీముట్, తస్మిన్ = పయోధిలక్ష్మీముషి.

కేళిపల్వలే :— కేళేః పల్వలమ్ = కేళిపల్వలమ్, తస్మిన్ కేళిపల్వలే.

రిరంసుహంసీకలనాదసాదరమ్ :— రంతుమిచ్ఛవః, రిరంసవః; రిరంస వశ్చ తాః హంస్యశ్చ = రిరంసుహంస్యః, రిరంసుహంసీనాం కలనాదః, రిరంసుహంసీకలనాదః, ఆదరేణ సహ వర్తత ఇతి = సాదరః రిరం సుహంసీకలనాదే సాదరః రిరంసుహంసీకలనాదసాదరః, తం, రిరంసు హంసీకలనాదసాదరమ్.

హిరణ్మయం :— హిరణ్యస్య వికారః = హిరణ్మయః తం హిరణ్మయం.
నైషధః :— నిషధానాం రాజా = నైషధః.

భావము:-

సముద్రశోభను హరించెడి యా క్రీడాసరము గట్టునందు, రమింపఁగోరిన పెంటిహంసలు మధురనాదముల యందాదరము గల్గి, సమీపమున విహరించు చున్న స్వర్ణమయమగు హంస నొకదానిని నలుఁడు గాంచెను.

శ్లో॥ ప్రియాసు బాలాసు రతిక్షమాసు చ
ద్విపత్రితం పల్లవితం చ బిభ్రతమ్ ।
స్మరార్జితం రాగమహీరుహాంకురం
మిషేణ చంచ్వోశ్చరణద్వయస్య చ॥ ౧౧౮

ప॥ వి॥ ప్రియాసు। బాలాసు । రతిక్షమాసు । చ । ద్విపత్రితం । పల్లవితం । చ । బిభ్రతమ్ । స్మరార్జితం । రాగమహీరుహాంకురం । మిషేణ । చంచ్వోః । చరణద్వయస్య । చ ।

టీక॥ బాలాసు = రతికిఁ దాళలేని వారై సన్నిహితమైన యౌవనము గలవారును, రతిక్షమాసు = రతికి తాళిన యువతులునను. నిఱు తెలుంగులగు ప్రియాసు = ప్రియురాండ్ర విషయమున, (క్రమాత్ = క్రమముగ) చంచ్వోః = ముక్కులజంట యొక్కయు, చరణద్వయస్య = పాదముల జంటయొక్కయు, మిషేణ = నెపముచే, ద్విపత్రితం = రెండు ఆకులు తొడిగనదియు, పల్లవితం = చిగిర్చినదియు, స్మరార్జితం స్మర = మన్మథునిచే, అర్జితం = మొలపింపఁబడిన, రాగమహీరుహాంకురం: రాగ = రతి యనెడి మహీరుహ = వృక్షమునకు, అంకురం = మొలకను బిభ్రతం = ధరించుచున్న హంస = హంసను. నైషధః = నలమహారాజు, అబోధి = చూచెను- (అని పూర్వశ్లోకముతో నన్వయము)

ఒకని యందలి రాగము, మఱియొకతి యందుండుటకు వలను గాదు గాన, "ప్రియాసు" అనునది విషయసప్తమి యేగాని, అధికరణ సప్తమి కానేరదు, అధికరణ సప్తమిగఁ జేసిన వ్యాఖ్యానమిట సరిపడదు.

చంచుపుటము మిషనే ద్విపత్రితమగు రాగము బాలికల విషయీకరించియు; చరణముల నెపమున చిగిర్చిన రాగము యువతుల విషయీకరించియు, చెప్పఁబడినది -

మొదట మొలకలు రెండాకులు తొడిగి పిదప జిగురు వేయును. కాన మొదట ద్విపత్రితమనియు దర్వాత పల్లవితమనియు జెప్పఁబడినది.

"రాగమహీరుహాంకురమ్" అని, రాగమనెడి మహీరుహమునకు అంకురమనుట వలన, రూపకాలంకారము.

"మిషేణ చంచ్వోః చరణద్వయస్య చ" అని ముక్కుల మిష చేతను, పాదముల మిషచేతనునని, ముక్కులయందును పాదముల యందును, చంచుత్వమును, పాదత్వమును నిషేధించి యందు ద్విపత్రితత్వమును పల్లవితత్వము నారోపించుటవలన, నపహ్నవాలంకారము ఆ యపహ్నవాలంకారముతో రూపకమనుప్రాణితముకాన నారెంటికిని సంకరము. బాహ్యమైనరాగమునకును, ఆంతరంగికమగు రాగమునకును భేదమున్నను దానికభేదమిటఁ జెప్పుటవలన భేదాతిశయోక్తి.

చంచువు యొక్కయు చరణముల యొక్కయు నెపముచే నాంతరంగిక మైన రాగము వెలుపలనంకురించినదో యని యుత్ప్రేక్షాలంకారమభేదాతిశయోక్తిచే ధ్వనించుటవలన నలంకారముచే నలంకారధ్వని.

సమాసములు :

రతిక్షమాసు :_ రతేః క్షమాః = రతిక్షమాః, తాసు = రతిక్షమాసు,

ద్విపత్రితమ్ :_ ద్వే పత్రే అస్య సంజాతే ఇతి ద్విపత్రితః, తం, ద్విపత్రితమ్

పల్లవితమ్ :_ పల్లవః అస్య సంజాత ఇతి పల్లవితః, తం, పల్లవితమ్_

స్మరార్జితమ్ :_ స్మరేణ అర్జితః. స్మరార్జితః తం స్మరార్జితమ్_

రాగమహీరుహాంకురమ్ :_ రాగ ఏవ మహీరుహః = రాగమహీరుహః, రాగమహీరుహస్య అంకురః = రాగమహీరుహాంకురః, తం రాగమహీరుహాంకురమ్,

చరణద్వయస్య :_ చరణయోః ద్వయం, చరణద్వయం,

భావము :

ఆ హంసకు ముక్కు, రెండు పుటములుగ చీలియున్నది. కాలి వ్రేళ్లు సందులు గల్గి విస్తరించి యున్నవి. అందువలన నాహంస ఆసన్నయౌవనము గల బాలల విషయమునందును, రతికి తాళఁగల యువతుల విషయమందును చీలిన ముక్కు నెపమున, రెండాకులు తొడిగినదియు, విస్తరించిన కాలివ్రేళ్ల నెపమున చిగిర్చినదియు నై మన్మథునిచే మొలపింపఁబడిన, రాగమను వృక్షము యొక్క మొలకను ధరించుచున్న దో యనునట్లుండినది.

శ్లో॥ మహీమహేంద్రస్తమవేక్ష్య స క్షణం
శకుంతమేకాంతమనోదినోదినమ్ ।
ప్రియావియోగాద్విధురోఽపి నిర్భరం
కుతూహలాక్రాంతమనా మనాగభూత్॥ ౧౧౫

ప॥ వి॥ మహీమహేంద్రః । తమ్ । అవేక్ష్య । సః । క్షణం । శకుంతమ్ । ఏకాంతమనోవినోదినమ్ । ప్రియావియోగాత్ । విధురః । అపి । నిర్భరం । కుతూహలాలక్రాంతమనాః । మనాక్ । అభూత్ ।

టీక॥ మహీమహేంద్రః మహీ = భూమికి, మహేంద్రః = ఇంద్రుడైన సః ఆ నలుఁడు, ఏకాంతమనోవినోదినమ్, ఏకాంత = మిక్కిలిగ, మనః = మనస్సును, వినోదినం = వినోదపఱచుచున్న, శకుంతం = పక్షియైన హంసను, క్షణం = క్షణకాలము, అవేక్ష్య = చూచి, ప్రియావియోగాత్ ప్రియా = ప్రియురాలైన దమయంతి యొక్క, వియోగాత్ = విరహము వలన నిర్భరం = మిక్కిలి, విధురోఽపి = దుర్దశ పొందిన వాడైనను మనాక్ = కొంచెము, కుతూహలాక్రాంతమనాః, కుతూహల = ఉత్కంఠతో, ఆక్రాంత = ఆక్రమింపఁబడిన మనాః = మనస్సు గలవాఁడుగ అభూత్ = ఆయెను.

సమాసములు :

మహీమహేంద్రః :- మహ్యాః మహేంద్రః = మహీమహేంద్రః.
ఏకాంతమనోవినోదినమ్ :- మనసః వినోదీ = మనోవినోదీ, ఏకాంతం మనోవినోదీ = ఏకాంతమనోవినోదీ = తమ్ = ఏకాంతమనోవినోదినం.

ప్రియావియోగాత్ :- ప్రియాయాః వియోగః = ప్రియావియోగః తస్మాత్ ప్రియావియోగాత్॥

కుతూహలాక్రాంతమనాః ;- కుతూహలేన ఆక్రాంతం = కుతూహలాక్రాంతం. కుతూహలాక్రాంతం మనః యస్య సః = కుతూహలాక్రాంత మనాః.

భావము :

భూమికి దేవేంద్రుఁడైన ఆ నలమహారాజు మనస్సును మిక్కిలి వినోద పఱచుచున్న యా పక్షిని క్షణకాలము జూచి యొక వైపు ప్రియురాలి వియోగ బాధననుభవించుచు నిరుత్సాహుఁడై యున్నను నొక విధమగు కుతూహలముఁ బొంది దానినిఁ బట్టుకొనుట కుపక్రమించెను.

శ్లో॥ అవశ్యభవ్యేష్వనవగ్రహాగ్రహా
యయా దిశా ధావతి వేధసః స్పృహా।
తృణేన వాత్యేవ తయానుగమ్యతే
జనస్య చిత్తేన భృశావశాత్మనా॥ ౧౨౦

ప॥ వి॥ అవశ్యభవ్యేషు। అనవగ్రహాగ్రహా। యయా। దిశా। ధావతి। వేధసః। స్పృహా। తృణేన। వాత్యా। ఇవ। తయా। అనుగమ్యతే। జనస్య। చిత్తేన। భృశావశాత్మనా।

టీక॥ అవశ్యభవ్యేషు। అవశ్య = మనకు వశ్యముగానివై తప్పకుండ. భవ్యేషు = జరుగఁగల విషయముల యందు. అనవగ్రహాగ్రహా; అనవగ్రహా = ప్రతిబంధనిర్బంధములు లేని, వేధసః = బ్రహ్మయొక్క, స్పృహా = ఇచ్ఛ, యయా = ఏ, దిశా = దిక్కుతో, ధావతి = పరుగిడుచున్నదో, తయా = ఆ దిక్కుతోడనే, భృశాఽవశాత్మనా:భృశ = మిక్కిలి, అవశ = పరాధీనమైన, ఆత్మనా = స్వభావము గల, జనస్య = జనము యొక్క, చిత్తేన = మనస్సుచే, తృణేన = గడ్డిపోచచే, వాత్యేవ = వాతసమూహము వలె, అనుగమ్యతే = వెంబడింపఁబడుచున్నది.

సమాసము :

అవశ్యభవ్యేషు:- వశే భవం = వశ్యం న వశ్యం అవశ్యం అవశ్యం, భవ్యాని = అవశ్యభవ్యాని = తేషు = అవశ్యభవ్యేషు.

అనవగ్రహగ్రహా: అవగ్రహశ్చ గ్రహశ్చ అవగ్రహగ్రహౌ, అవిద్యమానౌ అవగ్రహగ్రహౌ యస్యాః సా, అనవగ్రహగ్రహా.

వాత్యా వాతానాం సమూహః వాత్యా.

భావము :

భూమికి మహేంద్రుఁడుగను, ధీరోదాత్తుడుగను, వాసికెక్కిన నలమహారాజునకు హంసను పట్టవలయునను చపలమేల యేర్పడినదను విషయ..టసమర్థింపఁబడుచున్నది. మనవశము దప్పి తప్పక జరుగఁగల కార్యములలో ప్రతిబంధనిర్బంధములు లేని యీశ్వరేచ్ఛ యేత్రోవయందుఁబోవునో, ఆ త్రోవయందే మిగుల పరాధీనమగు మనుష్యుని చిత్తముగూడ గడ్డిపోచ, గాలివెంటఁబడి పోవునట్లు వెళ్లుచుండును. కావున నవశ్యము జరుగ వలసిన విషయముల యందు జంతువున కెట్టి స్వాతంత్ర్యమును లేదు. భగవంతుని యిచ్ఛయే జంతువులనుఁ బ్రేరేపించుచుండును. కాన నలమహారాజెంత ధీరోదాత్తుడైనను, భగవదిచ్ఛ నెదుర్కొని స్వతంత్రముగ తన భవిష్యద్విషయములను దాను నిర్ణయించుకొనుట కతని కధికారము లేదు. కాననిట నంతటి వానియందును భగవదిచ్ఛచే హంసను పట్టుకొనుటకై యల్పవిషయచాపల్యము కలుగక తప్పినది గాదు. కావున నదిదైవాయత్తము.

శ్లో॥ అథావలంబ్య క్షణమేకపాదికాం
తదా నిద్రావుపపల్వలం ఖగః।
స తిర్యగావర్జితకంధరః శిరః
పిధాయ పక్షేణ రతిక్లమాలసః ॥ ౧_౨౧

ప॥ వి॥ అథ । అవలంబ్య । క్షణం । ఏకపాదికాం । తదా । నిద్రౌ । ఉపపల్వలం । ఖగః । సః । తిర్యగావర్జితకంధరః । శిరః । పిధాయ । పక్షేణ । రతిక్లమాలసః ।

టీక॥ అథ = నలుని దృష్టి పడిన పిదప, రతిక్లమాలసః; రతి = సంభోగము వలని, క్లమ = శ్రమముతో, అలసః = మాంద్యము వహించిన, సః = ఆ, ఖగః = హంస, తదా = నలునకు కుతూహలము గల్గినప్పుడే, క్షణం = క్షణకాలము, ఏకపాదికాం = ఒంటి పాదముతోనునికిని, అవలంబ్య = అవలంబించి, తిర్యగావర్జితకంధరః; తిర్యక్ = అడ్డముగ, ఆవర్జిత = వాల్పఁబడిన, కంధరః = మెడ గల్గినదై, పక్షేణ = ఱెక్కతో, శిరః = తలను, పిధాయ = కప్పికొని, ఉపపల్వలం = తటాకమునకు సమీపమున, నిదద్రౌ = నిద్రించెను.

ఏకపాదికామవలంబ్య తిర్యగావర్జితకంధరః, పక్షేణ పిధాయ శిరః అని హంస యొక్క స్వభావస్థితిని వర్ణించుట వలన స్వభావోక్త్యలంకారము.

సమాసములు :-

ఏకపాదికాం : ఏకః పాదః యస్యాం సా = ఏకపాదికా, తాం, ఏకపాదికామ్.

ఉపపల్వలం: పల్వలస్య సమీపే = ఉపపల్వలమ్.

తిర్యగావర్జితకంధరః : తిర్యక్ ఆవర్జితా = తిర్యగావర్జితా తిర్యగావర్జితా కంధరా యస్య సః = తిర్యగావర్జితకంధరః.

రతిక్లమాలసః : రతేః క్లమః = రతిక్లమః రతిక్లమేన అలసః = రతిక్లమాలసః।

భావము :

నలుని దృష్టి యా పక్షిపైఁబడిన వెంటనే, సంభోగముచే నలసిన యా హంస యప్పుడే క్షణకాలమొక్క కాలిపై నిలచి మెడను వంచి, ఱెక్కలతో తలను గప్పికొని నిద్రించినది,

శ్లో॥ సనాళమాత్మా నన్విర్జితప్రభం
హ్రియా నతం కాంచనమంబుజన్మ కిమ్।
అబుద్ధ తం విద్రుమదండమండితం
స పీతమంభః ప్రభుచామరం చ కిమ్? ౧౨౨

**పు. వి॥** సనాళమ్ । ఆత్మాననసిర్జిత ప్రభం। హ్రియా। నతం। కాంచనమ్ । అంబుజన్మ । కిమ్ । అబుద్ధ । తం । నిద్రుమమదండమండితం। సః । పీతమ్। అంభః ప్రభుచామరం । చ । కిమ్.

**టీక॥** సః = ఆ నలుఁడు, తం = ఆ నిద్రించు హంసను, ఆత్మాననసిర్జిత ప్రభం; ఆత్మ = తనయొక్క, ఆనన = ముఖముచే, నిర్జిత = జయింపఁ బడిన, ప్రభం = కాంతిగల్గినదై, అతఏవ = కావుననే, హ్రియా = సిగ్గుచే, నతం = వంగిన, సనాళం = కాడతోఁ గూడిన, కాంచనం = బంగారు వన్నెగల్గిన, అంబుజన్మ కిం ? = తామరసపుష్పమాయేమి ? (లేదా) విద్రుమదండమండితం; విద్రుమదండ = పగడపు గఱ్ఱలచే, మండితం = అలంకరింపబడిన, పీతం = పసుపు వన్నె గల్గిన, అంభః ప్రభుచామరం చ కిం? = అంభ ప్రభు = ఉదకములకురాజైన వరుణుని యొక్క, చామరం చ కిమ్? = వింజామరయాయేమి? (ఇతి = అని) అబుద్ధ = భావించెను.

"అంబుజన్మ కిం ? అంభః ప్రభుచామరం చ కిమ్?" అని నిద్రించుచున్న యా హంసను, తామరసపుష్పమా ? లేక వరుణచామరమా? యని ఉత్ప్రేక్షించుటవలన నుత్ప్రేక్షాలంకారము

**సమాసములు :**

సనాళమ్ : నాళేన సహితమ్ = సనాళమ్.

ఆత్మాననసిర్జిత ప్రభమ్: ఆత్మనః ఆననమ్, ఆత్మాననం, ఆత్మాననేన, నిర్జితా ఆత్మాననసిర్జితా, ఆత్మాననసిర్జితా ప్రభా యస్యతత్, ఆత్మాననసిర్జిత ప్రభం

విద్రుమదడమండితం: విద్రుమస్య దండః విద్రుమదండః = విద్రుమ దండేన మండితం = విద్రుమదండమండితం.

అంభః ప్రభుచామరం: అంభసాం ప్రభుః = అంభః ప్రభుః, అంభః ప్రభోః చామరం; అంభః ప్రభుచామరమ్.

భావము:-

అట్లు నిద్రించుచున్న యా హంసను నలుఁడు జూచి ఇది తన మోముచే నోడించఁబడినదై సిగ్గుచే తలవంచు కొనిన బంగారు తామరస పుష్పమా? లేక పగడపుకట్టులచే నలంకరింపబడిన పసుపుపచ్చనిదైన, జలాధిపతియగు వరుణుని చామరమా? అని యుత్ప్రేక్షించెను.

శ్లో॥ కృతావరోహస్య హయాదుపానహౌ
తతః పదే రేజతురస్యబిభ్రతీ।
తయోః ప్రవాళై ర్వనయోస్తథాంబుజై
ర్నియోద్ధుకామే కిము బద్ధవర్మణీ॥ ౧-౭౩

ప॥ వి॥ కృతావరోహస్య । హయాత్ । ఉపానహౌ । తతః । పదే । రేజతుః। అస్య। బిభ్రతీ । తయోః । ప్రవాళైః । వనయోః । తథా । అంబుజైః । నియోద్ధుకామే । కిమ్ । ఉ । బద్ధవర్మణీ ।

టీక॥ తతః = ఆ హంస నిద్రించిన పిదప, హయాత్ = గుఱ్ఱమునుండి, కృతావరోహస్య = కృత = చేయబడిన, అవరోహస్య = దిగడముగల్గిన, అస్య = ఇతనియొక్క ఉపానహౌ = పాదరక్షలను, బిభ్రతీ = ధరించుచున్న, పదే = పాదములు, తయోః = ప్రస్తుతములైన వనయోః = వనమందును, జలమందునున్నటువంటి; ప్రవాళైః = చిగుళ్లతోడను, తథా = అట్లే, అంబుజైశ్చ = తామరసపుష్పములతోఁడను, నియోద్ధుకామే యుద్ధముచేయఁగోరినవై బద్ధవర్మణీ కిము = బద్ధ = బంధించుకొనఁబడిన వర్మణీ కిము = కవచములు గల్గినవోయని రేజతుః = ప్రకాశించినవి

"పదే బద్ధవర్మణీ కిము'' అని పాదములు కవచబంధము చేసికొనినవా ఏమి యని భావించుట వలన నుత్ప్రేక్షాలంకారము.

సమాసములు :

"కృతావరోహస్య" :- కృతః అవరోహః యేన సః = కృతావరోహః తస్య కృతావరోహస్య.

"నియోద్ధుకామే" నియోద్ధుం కామః యయోస్తే నియోద్ధుకామే.

బద్ధవర్మణీ :- బద్ధే వర్మణీ యాభ్యాం తే = బద్ధవర్మణీ.

భావము :-

ఆ హంస నిద్రించిన పిదప గుబ్బమునుండి దిగిన యా నలుని పాద రక్షలతోఁగూడిన పాదములు రెండును, వనమందున్నటువంటి, చిగుళ్లతోఁడను; జలమందున్నటు వంటి పద్మముల తోఁడను యుద్ధమాడగోరి, పాదములకు కవచములను ధరించినవో యనుసట్లు గానవచ్చినవి, అనగా అతనిపాదములు చిగుళ్లను పద్మములనుఁ బోలి యున్నవని యభిప్రాయము.

శ్లో॥ విధాయ మూర్తిం కపటేన వామనీం
స్వయం బలిధ్వంసివిడంబనీమయమ్ ।
ఉపేతపార్శ్వశ్చరణేన మౌనినా
నృపః పతంగం సమధత్త పాణినా॥ ౧_౨౪

ప॥ వి॥ విధాయ । మూర్తిం । కపటేన । వామనీం । స్వయం : బలిధ్వంస విడంబనీమ్ । అయమ్ । ఉపేతపార్శ్వః । చరణేన । మౌనినా । నృపః। పతంగం । సమధత్త । పాణినా।

టీక॥ అయం = ఈ నలుఁడు, స్వయం = తనంతటనే, కపటేన = కపటముతో, వామనీం = కుఱుచనైన, బలిధ్వంసివిడంబనీం బలిధ్వంసి = బలిచక్రవర్తిని నాశము గావిఁచిన వామనుననుకరించునట్టి, మూర్తిం = శరీరమును, విధాయ = కావించి, మౌనినా = నిశ్శబ్దమైన, చరణేన = పాదముచే, ఉపేతపార్శ్వః- ఉపేత = పొందిన, పార్శ్వః = హంస యొక్క సమీపదేశము గలవాడై, పాణినా = చేతిచే, పతంగం = పక్షిని సమధత్త = పట్టుకొనెను.

ఇందు నలుఁడు హంసను పట్టునట్టి స్వభావము వర్ణింపఁబడినది గాన స్వభావోక్త్యలంకారము.

సమాసములు :-

బల్విధంసివిడంబనీమ్ :- బలినః ధ్వంసీ బలిధ్వంసీ బలిధ్వంసినః విడంబినీ = బలిధ్వంసి విడంబినీ తాం బలిధ్వంసివిడంబినీమ్.

ఉపేతపార్శ్వః :— ఉపేతః పార్శ్వః యేన సః = ఉపేతపార్శ్వః,
మౌనినా :— మునేః కర్మ = మౌనమస్యాఽ స్తీతి = మౌనీ = తేన =
మౌనినా.

భావము :

ఈ నలుఁడు కపటముతో, వామనావతారమున, బలిని నిగ్రహించిన విష్ణువు యొక్క పొట్టి దేహముగ తన దేహమును కుఱుచబఱచి, చప్పుడు లేక హంసవద్దకుఁబోయి తన చేతితో దానినిఁబట్టుకొనెను.

శ్లో॥ తదాత్తమాత్మానమవేత్య సంభ్రమాత్
పునః పునః ప్రాయసదుత్ప్లవాయ సః ।
గతో విరుత్యోడ్డయనే నిరాశతాం
కరౌ నిరోద్ధుర్దశతి స్మ కేవలమ్॥ ౧-౨౫

ప॥ వి॥ తదాత్తమ్।ఆత్మానమ్ । అవేత్య । సంభ్రమాత్।పునః। పునః। ప్రాయసత్ ॥ ఉత్ప్లవాయ । సః । గతః । విరుత్య । ఉడ్డయనే । నిరాశతాం । కరౌ నిరోద్ధుః । దశతి । స్మ కేవలమ్ ।

టీక॥ సః = ఆ హంస ఆత్మానం = తనను, తదాత్తం; తత్ = ఆ నలునిచే ఆత్తం = పట్టుఁబడినదిగా, అవేత్య = తెలిసికొని, ఉత్ప్లవాయ = పైకెగిరి పోవుటకు, పునః పునః = మాటిమాటికి, ప్రాయసత్ = ప్రయత్నించెను. ఉడ్డయనే = ఎగిరిపోవుటయందు, నిరాశతాం = ఆశలేమిని, గతః = పొందినదై, విరుత్య = గట్టిగఁగూతవేసి నిరోద్ధుః = తనను పట్టుకొనిన యానలమహారాజుయొక్క కరౌ కేవలం = హస్తములు మాత్రము, దశతిస్మ = గ్రుచ్చుచుండెను.

ఇచ్చట నలునిచేఁబట్టుపడిన హంస తప్పించుకొని పోవుటకు చేసిన ప్రయత్నములు, అవి విఫలమైన పిదప నతని చేతినే తన ముక్కుతో గ్రుచ్చుచున్నవిధమును, ఆ హంసయొక్క స్వభావమునుఁ జెప్పుచున్నవి. గాన స్వభావోక్త్యలంకారము.

సమాసములు :-

తదాత్తమ్ :- తేన ఆత్తః = తదాత్తః తం = తదాత్తమ్.
నిరాశతామ్ :- నిర్గతా ఆశా యస్మాత్సః = నిరాశః, నిరాశస్య భావః = నిరాశతా, తాం = నిరాశతామ్.

భావము :

నిద్రించుచున్న యా హంస నలుఁడు తననుఁ బట్టుకొనెనని గ్రహించి యెగిరి పోవుటకు పలుమాఱు ప్రయత్నించినది. కాని అది సాధ్యము కానందు వలన దాని యందు నిరాశఁజేసికొని నలుని చేతులను దనముక్కుచేఁ బొడుచు చుండెను.

శ్లో॥ ససంభ్రమోత్పాతి పతత్కులాకులం
సరః ప్రపద్యోత్కతయానుకంపితాం ।
తమూర్మిలోలైః పతగగ్రహాన్నృపం
న్యవారయద్వారిరుహైః కరైరివ॥ ౧౨౬

ప॥ వి॥ సః-సంభ్రమోత్పాతి పతత్కులాకులం । సరః । ప్రపద్య । ఉత్కతయా । అనుకంపితామ్ । తమ్ । ఊర్మిలోలైః । పతగగ్రహాత్ । నృపం । న్యవారయత్ । వారిరుహైః । కరైః । ఇవ ।

టీక॥ ససంభ్రమోత్పాతిపతత్కులాకులం, ససంభ్రమ = తత్తరపాటుతోఁ గూడినవిగ, ఉత్పాతి = ఎగురుచున్న- పతత్కుల = పక్షిసంఘముచే, ఆకులం = కలతనొందిన, సరః = తటాకము, ఉత్కతయా = వికారముఁజెందిన మనస్సుగల్గియుండుటచే, అనుకంపితాం = దయాళుత్వమును, ప్రపద్య = పొంది. తం = ఆన్నృపం = నలమహారాజును ఊర్మిలోలైః. ఊర్మి = అలలచే, లోలైః = కదలుచున్నవారిరుహైః = తామరసపుష్పములను, కరైః = చేతులతో, పతగగ్రహాత్ = పతగ పక్షియొక్క, గ్రహాత్ = గ్రహణమునుండి న్యవారయదివ = నివారించెనో యనునట్లుండెను.

"వారిరుహైః కరైః," యని తామరసపుష్పములను హస్తములతో రూపించుట వలన వ్యస్తరూపకము.

"నృపం న్యవారయదిత" యని రాజును వారించెనో యనునట్లుం డెనని చెప్పుటవలన ఉత్ప్రేక్ష.

సమాసములు :

ససంభ్రమోత్పాతిపతత్కులాకులమ్ :— సంభ్రమేణ సహితం యథా తథా = ససంభ్రమం, ససంభ్రమముత్పాతి, ససంభ్రమోత్పాతి పతతాం కులం = పతత్కులం, ససంభ్రమోత్పాతి—పతత్కులం యస్య తత్ = ససంభ్రమోత్పాతి పతత్కులమ్ = తత్ = ససంభ్రమోత్పాతిపతత్కులమ్.
అనుకంపితామ్ :— అనుకంపః—అస్య అస్తీతి = అనుకంపి. అనుకంపినః భావః. అనుకంపితా, తాం, అనుకంపితాం.
ఊర్మిలోలైః :— ఊర్మిభిః లోలాః, ఊర్మిలోలాః, తైః, ఊర్మిలోలైః
పతగగ్రహాత్ః పతగస్య గ్రహః = పతగగ్రహః తస్మాత్ పతగగ్రహాత్.

భావము :

ఆ హంసను నలమహారాజు పట్టగనే, అందలి సోదరపక్షులన్నియు నెగిరినవి. దానిచే కలతఁబొందిన యాతటాకము, దయవహించి, అలల కల్లోలాపు తామరసపుష్పములను హస్తములతో రాజును హంసను పట్టనీయక వారించెను.

శ్లో॥ పతత్రిణా తద్రుచిరేణ వంచితం
శ్రియః ప్రయాంత్యాః ప్రవిహాయ పల్వలమ్ ।
చలత్పదాంభోరుహనూపురోపమా
చుకూజ కూలే కలహంసమండలీ॥ ౧౨౭

ప॥ వి॥ పతత్రిణా । తత్ । రుచిరేణ । వంచితమ్ । శ్రియః । ప్రయాంత్యాః । ప్రవిహాయ । పల్వలమ్ । చలత్పదాంభోరుహనూపురోపమా । చుకూజ । కూలే । కలహంసమండలీ ।

టీః॥ రుచిరేణ = అందమైన, పతత్రిణా = హంసచే, వంచితం = పోగొట్టుకొనుటచే రహితమైన, తత్ = ఆ పల్వలం = తటాకమును, ప్రవిహాయ = వదలి ప్రయాంత్యాః = వెళ్లుచున్న శ్రియః = తటాకశోభయగు లక్ష్మి

యొక్క, చలత్పదాంభోరుహనూపురోపమా; చలత్ = కదలుచున్న, పదాంభోరుహ = తామరసపుష్పములవంటి పాదములయందలి నూపుర = అందెలతో, ఉపమా = సామ్యముగల్గిన కలహంస మండలీ = కలహంసల గుంపు కూలే = గట్టునందు, చుకూజ = కూతలు బెట్టినది.

ప్రయాంత్యాః శ్రియః యని సరస్సును వదలి పెట్టిపోవుచున్న సరశ్శోభకు లక్ష్మితో నభేదము నధ్యవసించి కూయుచున్న కలహంసల గుంపుపై నూపురత్వమను ధర్మముత్ప్రేక్షింపఁబడినది గాన నుత్ప్రేక్షాలంకారము.

సమాసములు :-

చలత్పదాంభోరుహనూపురోపమా పదే అంభోరుహే ఇవ = పదాంభోరుహే పదాంభోరుహయోః నూపురౌ, పదాంభోరుహనూపురౌ, చలంతౌ చ తౌ పదాంభోరుహనూపురౌ చ చలత్పదాంభోరుహనూపురౌ, చలత్పదాంభోరుహనూపురాభ్యా ముపమా యస్యాస్సా = చలత్పదాంభోరుహనూపురోపమా.

కలహంసమండలీ :- కలహంసానాం మండలీ = కలహంసమండలీ.

భావము :

ఆతటాకమునుండి యాయందమగు హంస తొలగిపోగనే యందలి కలహంసల గుంపు తమసోదరపక్షికై కూతలు వేయసాగినవని. హంస తొలగిపోవుటచే ఖిన్నురాలైన తటాకలక్ష్మి యా తటాకమును వీడిపోవుచున్నప్పుడామె యొక్క కాలి యందెల మ్రోతయే మో యని భావింపఁబడినది. అందెల మ్రోతను హంసలకూతలతో పోల్చుట కవిసమయము.

శ్లో॥ న వాసయోగ్యా వసుధేయమీదృశ
స్త్వమంగ యస్యాః పతిరుజ్ఝితస్థితిః ।
ఇతి ప్రహాయ క్షితిమాశ్రితా నభః
ఖగా స్తమాచుక్రుశురార్తవైః ఖలు॥ ౧౨౨

ప॥ వి॥ న । వాసయోగ్యా । వసుధా । ఇయమ్ । ఈదృశః । త్వమ్ । అంగ।
యస్యాః । పతిః । ఉజ్ఝితస్థితిః । ఇతి । ప్రహాయ । క్షితిం । ఆశ్రితా ।
నభః । ఖగాః తమ్ । ఆచుక్రుశుః । ఆరవైః । ఖలు ।

టీక॥ ఇయం = ఈ, వసుధా = భూమి, న వాసయోగ్యా = వాసయోగ్యము
గాదు (కుతః = ఏలయనగా) అంగ = ఓ నలమహారాజా, యస్యాః =
ఏభూమికి, ఉజ్ఝితస్థితిః, ఉజ్ఝిత = విడువఁబడిన స్థితిః = మర్యాదగల్గిన,
ఈదృశః = ఇటువంటి (ఘాతుకుడవగు) త్వం = నీవు, పతిః = పాల
కుడవైతివి, ఇతి = ఇట్లు, ఖగాః = పక్షులు, క్షితిం = భూమిని,
ప్రహాయ = వదలి, నభః శ్రితాః = ఆకసమునాశ్రయించినవై, తం =
ఆనలునిగూర్చి, ఆరవైః = బిగ్గరకూతలచే ఆచుక్రుశుః ఖలు = ఆక్రో
శమును వెళ్లబుచ్చినట్లుండినవి.

"ఆరవైరాచుక్రుశుః" అని హంసల కూజిత ధ్వనుల నాక్రోశ
ముగనుత్ప్రేక్షించుటవలన నుత్ప్రేక్షాలంకారము.

సమాసములు :

వాసయోగ్యా :— వాసస్య యోగ్యా = వాసయోగ్యా.

ఉజ్ఝితస్థితిః :— ఉజ్ఝితా-స్థితిః యేన సః ఉజ్ఝితస్థితిః

భావము :

ఓ నలమహారాజా! ఈ భూమికిఁ బ్రభువగు నీవు మర్యాదను వదలి
యింతటి ఘాతుకడవైతివి గాననీభూమి మాకు వాసయోగ్యముకాదని హంసలు
భూమిని వదలి యాకసమునకెగిరి బిగ్గరగా నానలునిపై దమ యాక్రోశమును
వెళ్లబుచ్చుకొన్నట్లు ధ్వనులు జేసినవి

శ్లో॥ న జాతరూపచ్ఛదజాతరూపతా
ద్విజస్య దృష్టేయమితి స్తువన్ ముహుః ।
అవాది తేనాథ స మానసౌకసా
జనాధినాథః కరపంజరస్పృశా॥ ౧౩౯

ప॥ వి॥ న । జాతరూపచ్ఛదజాతరూపతా । ద్విజస్య । దృష్టా । ఇయం । ఇతి । స్తువన్ । ముహుః । అవాది । తేన । అథ । మానసౌకసా । జనాధినాథః । కరపంజరస్పృశా।

టీక॥ ఇయం = ఇటువంటి జాతరూపచ్ఛదజాతరూపతా; జాతరూప = సువర్ణమయములగు చ్ఛద = రెక్కలతో జాత = జన్మించిన రూపతా = రూపము గల్గియుండుట, ద్విజస్య = పక్షికి న దృష్టా = ఎప్పుడును చూడఁబడలేదు. ఇతి = ఇట్లు ముహుః = పలుమాఱు స్తువన్ = కొనియాడుచున్న సః = ఆ జనాధినాథః = నలమహారాజు, అథ = తర్వాత కరపంజరస్పృశా! కరపంజర = పంజరమువంటి చేతిని, స్పృశా = తాకుచున్న తేన = ఆ మానసౌకసా = (మానససరస్సునందు నివసించు జాతికిఁజెందిన) హంసచే, అవాది = చెప్పఁబడెను.

సమాసములు :

జాతరూపచ్ఛదజాతరూపతా :— జాతరూపమయాశ్చతే చ్ఛదాశ్చ = జాతరూపచ్ఛదాః జాతరూపచ్ఛదైః జాతం, జాతరూపచ్ఛదజాతం, జాతరూపచ్ఛదజాతం రూపం యస్య సః జాతరూపచ్ఛదజాతరూపః జాతరూపచ్ఛదజాతరూపస్య భావః జాతారూపచ్ఛదజాతరూపతా.

మానసౌకసా :— మానసమ్, ఓకః యస్య సః = మానసౌకాః, తేన = మానసౌకసా.

జనాధినాథః :— జనానామధినాథః = జనాధినాథః కరౌ పంజర మివ = కరపంజరం, కరపంజరం స్పృశతీతి = కరపంజరస్పృక్, తేన = కరపంజరస్పృశా

భావము :

ఈ విధముగ బంగారు రెక్కలతో నుత్పన్నమైన సౌందర్యము పక్షికిఁ గానరాదు. బంగారు హంసలెచ్చటను గనఁబడవు: అని పలుమాఱు పొగడుచున్న నలమహారాజు తన చేతనున్న యా హంసచే చెప్పబడెను.

శ్లో॥ ధిగస్తు తృష్ణాతరళం భవన్మన
స్సమీక్ష్య పక్షాన్మమ హేమజన్మనః ।
తవార్ణవస్యేవ తుషారశీకరై
ర్భవేదమీభిః కమలోదయః కియాన్॥ ౧౩౦

ప॥ వి॥ ధిక్ । అస్తు । తృష్ణాతరళం । భవన్మనః । సమీక్ష్య । పక్షాన్। మమ। హేమజన్మనః । తవ । అర్ణవస్య । ఇవ । తుషారశీకరైః । భవేత్ । అమీభిః । కమలోదయః । కియాన్ ।

టీక॥ హేమజన్మనః, హేమ = బంగారు నుండి జన్మనః = పుట్టుక గలిగిన, మమ = నాయొక్క పక్షాన్ = ఱెక్కలను సమీక్ష్య = చూచితృష్ణాతరళం; తృష్ణా = ఆశచే తరళం = చంచలమైన, భవన్మనః = నీ మనస్సును గూర్చి ధిక్ = నింద, అస్తు = అగుగాత, తుషారశీకరైః = మంచు బిందువులచే అర్ణవస్యేవ = సముద్రమునకువలె తవ = నీకు, అమీభిః = ఈః ఱెక్కలచే, కియాన్ = ఎంతటి, కమలోదయః; కమలా = లక్ష్మి యొక్క ఉదయః = వృద్ధి కమల = జలముయొక్క ఉదయః = వృద్ధి భవేత్ = అగును.

సమాసములు :

"తృష్ణాతరళమ్" తృష్ణయా-తరళమ్ తృష్ణాతరళమ్

"హేమజన్మనః" హేమ్నః జన్మ యస్య సః = హేమజన్మా = తస్య = హేమజన్మనః.

తుషారశీకరైః :- తుషారాణాం శీకరాః, తుషారశీకరాః, తైః తుషారశీకరైః .

కమలోదయః :- కమలాయాః ఉదయః = కమలోదయః, కమలస్య ఉదయః కమలోదయః,

భావము :

నాయొక్క బంగారు ఱెక్కలను జూచి యాశచే జపలమయిన నీ మనస్సు నింద్యమైనది.మంచు బొట్టులతో సముద్రమునకు జలసమృద్ధి యెంత మాత్రమేర్పడునో, అంత మాత్రమే నీకును నా బంగారు ఱెక్కలతో, లక్ష్మి సమృద్ధి యేర్పడును. అనగా నీకేలాటి సంపదలు దీని వలన చేకూరవని యాశయము,

శ్లో॥ న కేవలం ప్రాణివధో వధో మమ
త్వదీక్షణాద్విశ్వసితాంతరాత్మనః ।
విగర్హితం ధర్మధనై ర్నిబర్హణం
విశిష్య విశ్వాసజుషాం ద్విషామపి ౧౩౧

వ॥ వి॥ న। కేవలం। ప్రాణివధః। వధః। మమ। త్వదీక్షణాత్। విశ్వసితాంత రాత్మనః। విగర్హితం। ధర్మధనైః। నిబర్హణం। విశిష్య। విశ్వాసజుషాం। ద్విషామ్। అపి।

టీక॥ హే నృప = నలమహారాజా। త్వదీక్షణాత్ = నిన్ను చూచుట వలననే, విశ్వసితాంతరాత్మనః; విశ్వసిత = నమ్మకము పొందిన, అంతరాత్మనః మనస్సుగల్గిన, మమ = నాయొక్క, వధః = హింస, కేవలం = కేవలము, ప్రాణివధః = ప్రాణులను వధించుట మాత్రమే, న = కాదు (కింతు = యేదేమనగా) విశ్వాసజుషాం = విశ్వాసమును బొందిన ద్విషామపి = శత్రువులను సైతము, నిబర్హణం = హింసించుట, ధర్మధనైః = ధర్మమే ధనముగా గల్గిన మన్వాదులచే, విశిష్య = విశేషించి, విగర్హితం = నిందింపబడినది.

సమాసములు :

ప్రాణివధః : ప్రాణినాం వధః = ప్రాణి వధః

త్వదీక్షణాత్: తవ ఈక్షణం = త్వదీక్షణం, తస్మాత్, త్వదీక్షణాత్

విశ్వసితాంతరాత్మనః : విశ్వసితః అంతరాత్మాయస్య సః, విశ్వసితాంత రాత్మా తస్య విశ్వసితాంతరాత్మనః

ధర్మధనైః : ధర్మః ధనం యేషాం తే, ధర్మధనాః, తైః, ధర్మధనైః

విశ్వాసజుషామ్: విశ్వాసం జుషంతీతి = విశ్వాసజుషః తేషాం = విశ్వాసజుషామ్.

భావము :

ఓ రాజా! నీ మూర్తిని దర్శించుట వలన నేను ఘనవిశ్వాసమందితిని. అటువంటి నన్ను వధించుట కేవలము ప్రాణిహింసయే గాదు మఱేమన విశ్వాస

ఘాతపాతకము గూడ సంభవించును. విశ్వాసము బొందిన శత్రువులనుఁగూడ హింసించుట మిక్కిలి యధర్మమని ధర్మధనులగు మన్వాదులచే నిందింపఁ బడి యున్నది గాన, నన్ను హింసించుటలో, విశ్వాసఘాతదోషము గూడ నీకు సంప్రాప్తించును.

శ్లో॥ పదే పదే సంతి భటా రణోద్భటాః
న తేషు హింసారస ఏష పూర్యతే ।
ధిగీదృశం తే నృపతేః కువిక్రమం
కృపాశ్రయే యః కృపణే పతత్రిణి ॥ ౧౩౨

ప॥ వి॥ పదే । పదే । సంతి । భటాః । రణోద్భటాః । న । తేషు । హింసారసః । ఏషః । పూర్యతే । ధిక్ । ఈదృశం । తే । నృపతేః । కువిక్రమం । కృపాశ్రయే । యః । కృపణే । పతత్రిణి.

టీక॥ రణోద్భటాః; రణ = యుద్ధమందు, ఉద్భటాః = ఎదురు లేని, భటాః యోధులు, పదే పదే = అడుగడునందును అనగా నంతట, సంతి = = కలరు, ఏషః = ఈ, హింసారసః = హింసించుటకభిలాష, తేషు = వారియందు, న పూర్యతే (కిం)? = పూరింపఁబడుట లేదేమి? నృపతేః = మహారాజైన, తే = నీయొక్క, ఈ దృశం = చంపఁదగని వారిని చంప వలయుననెడి. కువిక్రమం = కుత్సితమైన పరాక్రమమునుఁ గూర్చి, ధిక్ = నింద యుక్తము, యః = ఏ కుత్సితమగు పరాక్రమము, కృపాశ్రయే = కనికరింపఁదగిన, కృపణే = దీనమైన, పతత్రిణి = పక్షి యందు (క్రమతే = అడుగుపెట్టు చున్నది)

సమాసము లు :

రణోద్భటాః : రణేషు ఉద్భటాః రణోద్భటాః.

హింసారసః ; హింసాయాం రసః = హింసారసః.

నృపతేః : నృణాం పతిః = నృపతిః, తస్య = నృపతేః.

కువిక్రమమ్ : కుత్సితశ్చాసౌ విక్రమశ్చ = కువిక్రమః, తం = కువిక్రమమ్.

కృపాశ్రయే: కృపాయాః ఆశ్రయః కృపాశ్రయః తస్మిన్ = కృపాశ్రయే.

భావము :

ఓ రాజా! యుద్ధమందు ప్రచండముగఁ బోరాడు యోధులీభూమి యందంత టను గలరు. ఈ హింసాభిలాషను నీవు వారియందేలఁ బూర్తి సేసికొనరాదు మహారాజైన నీ కుత్సితపరాక్రమము మిక్కిలి నింద్యమైనది ఏల యనగా నీ యీ పరాక్రమము కనికరింపఁదగిన నావంటి దీనమగు పక్షిపైననే గానవచ్చు చున్నది గాని యట్టి యోధులపైనఁగానవచ్చుట లేదు.

శ్లో॥ ఫలేన మూలేన చ వారిభూరుహాం
మునేరివేత్థం మమ యస్య వృత్తయః ।
త్వయాఽద్య తస్మిన్నపి దండధారిణా
కథం న పత్యా ధరణీ ఘృణీయతే॥ ౧౩౩

ప॥ ని॥ ఫలేన। మూలేన। చ। వారిభూరుహాం। మునేః। ఇవ। ఇత్థం। మమ। యస్య। వృత్తయః। త్వయా। అద్య। తస్మిన్। అపి। దండధారిణా। కథం। న। పత్యా। ధరణీ। ఘృణీయతే।

టీక॥ యస్య = ఏ మమ = నాకు, మునేరివ = మునికివలె వారిభూరుహాం = తటాకములయందు మొలచిన తామర లనెడి వారిరుహములయొక్కయు భూమిపై మొలచినవృక్షములు మున్నగు భూరుహములయొక్కయు మూలేన = కందములతోడను, ఫలేన = ఫలములతోఁడను, ఇత్థం = ఈ, కనఁబడు విధమున. వృత్తయః = బ్రతుకు తెఱువులు, తస్మిన్నపి = అట్టి నిరపరాధుని యందును, దండధారిణా = దండనము విధించు చున్న పత్యా = పాలకుఁడవైన. త్వయా = నీవనుకారణముచే అద్య = ఇప్పుడు ధరణీ - భూదేవి కథం = ఎట్లు న ఘృణీయతే = ఏవగించదు.

సమాసములు:

వారిభూరుహాం : వారిణః భూః = వారిభూః, వారిభువి రోహంతీతి వారి భూరుహాః,

వారి చ భూశ్చ = వారిభువౌ, వారిభువోః రోహంతీతి = వారిభూరుహమ్ భూరుతేషాం, వారిభూరుహామ్.

దండధారిణా : దండం ధరతీతి = దండధారీ తేన = దండధారిణా॥

భావము :

ఓరాజా! తటాకములందు మొలచిన తామరతీగల యొక్కయు, నీటి యందును నేలయందును మొలచిన వృక్షముల యొక్కయు ఫలమూలములచే ముని జీవనముఁజేయునట్లు నేనును జీవనము జేయుచున్నాను. అట్లు కందమూల ఫలములతో మునివృత్తి గడుపు నావంటి నిరపరాధియందును దండమును విధించు నీవంటి పాలకుడు సంభవించుట యను కారణముచే నీభూదేవి యేల యేవగింపు జెందదు తప్పక చెందగలదని యాశయము.

శ్లో॥ ఇతీదృశై స్తం విరచయ్య వాఙ్మయై
స్సచిత్రవైలక్ష్యకృపం నృపం ఖగః ।
దయాసముద్రే స తదాశయేఽతిథీ
చకార కారుణ్యరసాపగా గిరః ॥ ౧౩౪

ప॥ వి॥ ఇతి । ఈదృశైః । తం । విరచయ్య । వాఙ్మయైః । సచిత్రవైలక్ష్య కృపం । నృపం । ఖగః । దయాసముద్రే । సః । తదాశయే। అతిథీచకార। కారుణ్యరసాపగాః । గిరః ।

టీక॥ ఇతి = ఇట్లు సః — ఆ ఖగః = పక్షి; తం = ఆ నృపం = నలమహా రాజును, ఈదృశైః = ఇటువంటి నిందోపాలంభములతోఁ గూడిన వాఙ్మయైః = వాగ్వికారములైన మాటలతో, సచిత్రవైలక్ష్యకృపం; పక్షిమాట్లాడుట వలని యాశ్చర్యము, తనతప్పుఉద్ఘాటింపఁబడినటు వలని లజ్జ, పరుల బాధను తొలగింప వలయుననెడి దయ యనునీమూడింటితోఁ గూడిన, వానినిగ, విరచయ్య = చేసి, దయాసముద్రే = దయకు సముద్ర మైన తదాశయే, తత్ = అతనియొక్క ఆశయే = చిత్తమందు గిరః = వాక్కులనెడి కారుణ్యరసాపగాః; కారుణ్యరస = కరుణారసప్రవాహాము తోఁగూడిన ఆపగాః = నదులను, అతిథీచకార = ప్రవేశము బొందునట్లు చేసెను.

"గిరః = కారుణ్యరసాపగాః" అని వాక్కులను కారుణారసమయ ములగు నదులుగ నిరూపించుట వలన రూపకాలంకారము.

వాఙ్మయైః వాచాం వికారాః = వాఙ్మయాని తైః = వాఙ్మయైః

సచిత్రవైలక్ష్యకృపమ్:- చిత్రం చ వైలక్ష్యం చ = కృపాః చ = చిత్రవై లక్ష్యకృపాః = చిత్రవైలక్ష్యకృపాభిః సహ వర్తత ఇతి = సచిత్రవై లక్ష్యకృపః = తం సచిత్రవైలక్ష్యకృపమ్

దయాసముద్రే = దయాయాః సముద్రః = దయాసముద్రః తస్మిన్ = దయా ముద్రే

తదాశయే, తస్య ఆశయః = తదాశయః తస్మిన్ = తదాశయే.

కారుణ్యరసాపగాః :- కారుణ్యమేవ రసః = కారుణ్యరసః, అ పాం సమూహః ఆపం, ఆ పేన గచ్ఛంతీతి = ఆపగాః కారుణ్యరసస్య ఆపగాః కారుణ్యరసాపగాః తాః = కారుణ్యరసాపగాః

**భావము :**

ఈ విధముగ హంస యిట్టి నిందావచనములతో నా నలునకు, పక్షియై తాను మాట్లాడినందుల కాశ్చర్యమును, నతడు జేసినతప్పులను బయటపెట్టినందు లకు సిగ్గును తన బాధచూపుట చేక నికరమును గల్గించినది. పిదప దయాసముద్ర మయిన నలుని చిత్తమందు తన మాటలనెడి కరుణారసనదుల బ్రవహింప జేసినది

శ్లో॥ మదేకపుత్రా జననీ జరాతురా
నవప్రసూతిర్వరటా తపస్వినీ।
గతిస్తయోరేష జనస్తమర్దయ
న్నహో! విధే! త్వాం కరుణా రుణద్ధి నో ॥ ౧౩౫

ప॥ వి॥ మదేకపుత్రా । జననీ । జరాతురా । నవప్రసూతిః । వరటా । తపస్వినీ । గతిః । త యోః । ఏషః । జనః । తమ్ । అర్దయన్ । అహో । విధే । త్వాం । కరుణా రుణద్ధి । నో ।

టీక॥ జననీ = తల్లి మదేకపుత్రా; మత్ = నేనొక్కడనే పుత్రుడుగ గల్గినది జరాతురా; జరా = ముసలితనముచే, ఆతురా = బాధపడునది. వరటా =

నాభార్య నవప్రసూతి; నవ = క్రొత్తదైన. ప్రసూతిః = ప్రసవముగలది. తపస్వినీ = దీనురాలు, ఏషః = ఈ, జనః = జనము అనగా హంస తయోః = ఆ తల్లికిని, భార్యకును. గతిః = శరణ్యము. తం = అట్టి వంటిజనమును, అర్దయన్ = పీడించుచున్న విధే = దైవమా! త్వాం = నిన్ను కరుణా = దయ, నోరుణద్ధి = అడ్డగించుటలేదా ఏమి ఆహా! = అయ్యో!

సమాసములు :-

మదేకపుత్రా! ఏకశ్చాసౌ పుత్రశ్చ = ఏకపుత్రః, అహమేవ ఏకపుత్రః, యస్యాస్సా = మదేకపుత్రా.

జరాతురా: జరయా ఆతురా = జరాతురా
నవప్రసూతిః; నవా ప్రసూతిః యాస్యాస్సా = నవప్రసూతిః

భావము :

నా తల్లికినేనొక్కడనే కుమారుడను. నేను నశించినచో నామెకు మఱి యొక బిడ్డలేదు. అది గాక యామె ముసలితనముచే బాధ పడుచు నశక్తురాలై నది. నా భార్య యిటీవలనే బిడ్డనుగనిన పచ్చిబాలింత. కావుననామెయు శక్తిలేని దీనురాలు. ఇచ్చట నున్న నేను వారిఱువురికిని గతియైయున్నాను. అట్టినన్ను పీడించునోదైవమా! నిన్ను కరుణ యడ్డగించుటలేదా! ఇది యెంత శోచనీయము.

శ్లో॥ ముహూర్తమాత్రం భవనిందయా దయా
సఖా స్సఖాయః స్రవదశ్రవో మమ।
నివృత్తిమేష్యంతి పరం దురుత్తర
స్త్వయైవ మాతస్సుతశోకసాగరః ॥ ౧౩౬

వ॥ వి॥ ముహూర్తమాత్రం । భవనిందయా । దయాసఖాః । సఖాయః । స్రవదశ్రవః । మమ । నివృత్తిం । ఏష్యంతి । పరం । దురుత్తరః । త్వయా । ఏవ । మాతః । సుతశోకసాగరః ।

టీక॥ హేమాతః = ఓతల్లీ, మమ = నాయొక్క సఖాయః = స్నేహితులు. ధయాసఖాః = దయతోఁగూడినవారై, (అతఏవ = కావుననే) స్రవదశ్రవః; స్రవత్ = స్రవించుచున్న అశ్రవః = కన్నీళ్లుగలవారై ముహూర్తమాత్రం = ముహూర్తకాలముమాత్రము, భవనిందయా, భవ = సంసారము యొక్క నిందయా = నిందచే నివృత్తిం = దుఃఖవిరామమును ఏష్యంతి = పొందగలరు. కింతు = కాని. త్వయైవ = నీచేతనే సుతశోకసాగరః. సుతశోక = పుత్రశోకమను సాగరః = సముద్రము పరం = మిక్కిలి దురుత్తరః = తరింపసాధ్యముకాదు.

సమాసములు :

ముహూర్తమాత్రం ముహూర్తఏవ = ముహూర్తమాత్రమ్ = తత్ = ముహూర్తమాత్రమ్

భవనిందయా: భవస్య నిందా = భవనిందా, తయా భవనిందయా
దయాసఖాః: దయాయాః సఖాః = దయాసఖాః

స్రవదశ్రవః: స్రవంతి అశ్రూణి = యేషాం తే స్రవదశ్రవః

దురుత్తరః: దుఃఖేన ఉత్తరీతుం శక్యః = దురుత్తరః
సుతశోకసాగరః: శోక ఏవ సాగరః = శోకసాగరః సుతస్య శోకసాగరః = సుతశోకసాగరః

భావము :

ఓతల్లీ, నా చెలికాండ్రు దయగలవారై కన్నీళ్లు, గార్చుచు, ముహూర్తకాలము సంసారమును నిందించి దుఃఖనివృత్తినఁబొందగలరు. కాని నీకుమాత్రము పుత్రశోకమను సముద్రముతరింప సాధ్యము గాదు.

శ్లో॥ మదర్థసందేశమృణాళమంథరః
ప్రియః కియద్దూర ఇతి త్వయోదితే।
విలోకయంత్యా రుదతోఽథ పక్షిణః
ప్రియే స కీదృగ్భవితా తవ క్షణః॥ ౧౩౭

ప॥ వి॥ మదర్థసందేశమృణాళమంథరః । ప్రియః । కియద్దూరే । ఇతి । త్వయా । ఉదితే । విలోకయంత్యాః । రుదతః । అథ । పక్షిణః । ప్రియే । సః । కీదృక్ । భవితా । తవ । క్షణః ।

టీక॥ హేప్రియే = ఓప్రియురాలా. మదర్థసందేశమృణాళమంథరః; మదర్థ = నా కొఱకైన సందేశ = సమాచారమును మృణాళ = తామర తూండ్లను మంథరః = పంపుటలోనాలస్యము చేయుచున్న ప్రియః = ప్రియుఁడు కియద్దూరే = ఎంతదూరమందు వర్తతే = ఉన్నాడు ఇతి = అని, త్వయా = నీచే. ఉదితే సతి = ప్రశ్నింపఁబడగా, అథ = తర్వాత రుదతః = (భర్త గతించెనను ననిష్ట విషయమును చెప్పుటకు శక్తిలేక) కన్నీళ్ళు కార్చుచున్న పక్షిణః = ఇచ్చటనుండి వెళ్ళిన పక్షులను, విలోకయంత్యాః = చూచుచున్న తవ = నీకు సః = ఆ క్షణః = కాలము కీదృక్ = ఎట్టిదిగ భవితా = ఉండగలదు.

సమాసములు:

మదర్థసందేశమృణాళమంథరః :- మహ్యామిమే = మదర్థే, సందేశశ్చ మృణాళం చ = సందేశమృణాళే మదర్థే చ తే సందేశమృణాళే చ = మదర్థసందేశమృణాళే మదర్థసందేశమృణాళయోః మంథరః = మదర్థ సందేశమృణాళమంథరః

కియద్దూరే :- కియచ్చ తత్ దూరం చ = కియద్దూరం, తస్మిన్ = కియ ద్దూరే.

భావము :

ఓ ప్రియురాలా! నాకొఱకు సమాచారమును తామరతూండ్లను పంపుటలో నాలస్యము చేయుచున్న నా ప్రియు డెంతదూరమందున్నాడని నీవు ప్రశ్నించిన వెంటనే, నీ భర్త గతించెనని యశుభము నీకు చెప్పుటకు శక్తి లేని వై కన్నీళ్లను గార్చుచున్న పక్షులను నీవు చూచెడి యా క్షణకాలము నీ కెట్లుండగలదో? అది నీకు పిడుగువంటి దిగ నుండగలదు.

శ్లో॥ కథం విధాతర్మయి పాణిపంకజాత్
తవ ప్రియాశైత్యమృదుత్వశిల్పినః ।
వియోక్ష్యసే వల్లభయేతి నిర్గతా
లిపిర్లలాటంతపనిష్ఠురాక్షరా॥ ౧౩౮

వ. వి. కథం । విధాతః । మయి । పాణిపంకజాత్ । తవ । ప్రియాశైత్యమృదుత్వశిల్పినః । వియోక్ష్యసే । వల్లభయా । ఇతి । నిర్గతా । లిపిః । లలాటంతపనిష్ఠురాక్షరా।

టీక॥ హే విధాతః = ఓ బ్రహ్మదేవుఁడా, ప్రియాయాః = నా ప్రియురాలికి, శైత్య మృదుత్వ శిల్పినః; శైత్య = శరీరమునకుజల్లదనమును, మృదుత్వ = మెత్తఁదనమును, శిల్పినః = నిర్మించునట్టి, తవ = నీ యొక్క పాణి పంకజాత్, = తామరసపుష్పము వలె మెత్తనిదియునుఁ. జల్లనిదియునగు పాణేః = హస్తమునుండి మయి = నా విషయమందు, వల్లభయా = ప్రియురాలిచే, వియోక్ష్యసే = విడువఁబడెదవు, ఇతి = అని లలాటంతప నిష్ఠురాక్షరా; లలాటంతపం = నొసటి నిందపింపఁ జేయునట్టి నిష్ఠుర = కర్ణకఠోరములగు, అక్షరా = అక్షరములు గల, లిపిః = అక్షరరచన, కథం = ఎట్లు నిర్గతా = వెల్వడినవి.

శైత్యమృదుత్వ శిల్పినః పాణిపంకజాత్ లలాటంతపనిష్ఠురాక్షరా లిపిర్నిర్గతా అని, బ్రహ్మయొక్క చల్లని హస్తమునుండి, లలాటమునుఁ గాల్చెడి, కఠినాక్షరవచన యెట్లు వచ్చినదని చెప్పుటచే, విషమాలంకారము. కారణమునకు విరుద్ధమైన కార్యముఁ బుట్టినచో, విషమము, ఇచ్చట చల్లదనము మెత్తదనము నొసంగు బ్రహ్మహస్తము నుండి కఠినమయిన లలాటలిపి వచ్చిన దనుటచే విషమాలంకారము.

సమాసములు :

పాణిపంకజాత్ :_ పాణిః పంకజమివ = పాణిపంకజమ్ తస్మాత్ = పాణిపంకజాత్.

ప్రియాశైత్యమృదుత్వశిల్పినః :- శైత్యం చ మృదుత్వం చ = శైత్య మృదుత్వే ప్రియాయాః శైత్యమృదుత్వే = ప్రియాశైత్యమృదుత్వే, ప్రియాశైత్యమృదు త్వయోః శిల్పం = ప్రియాశైత్యమృదు త్వశిల్పమ్ ప్రియాశైత్యమృదుత్వశిల్పమస్య అస్తీతి = ప్రియాశైత్యమృదుత్వ శిల్పి = తస్మాత్ = ప్రియాశైత్యమృదుత్వశిల్పినః

లలాటంతపనిష్ఠురాక్షరా :- లలాటంతపంతీతి = లలాటంతపాని, నిష్ఠు రాని చ తాని అక్షరాణి చ = నిష్ఠురాక్షరాణి లలాటంతపానినిష్ఠురాక్షరాణి యస్యాం సా, లలాటంతపనిష్ఠురాక్షరా.

**భావము :**

ఓ విధాతా! ప్రియురాలి శరీరమునకుఁ జల్లదనమును మెత్తఁదనమును సృజించెడి నీ హస్తకమలము నుండి నా విషయమున ప్రియురాలితో వియోగము బొందగలవనెడి నొసటిని కాల్చెడి కఠినాక్షరములు గల లిపి యెట్లు వెల్వడినది! చల్లదనమునొసంగెడి చేతినుండి యిట్టి కఠినమగు లిపి వచ్చుట చాల విరుద్ధము.

శ్లో॥ అపి స్వయూథ్యైరశనిక్షతోపమం
మమాఽద్య వృత్తాంతమిమంబతోదితా।
ముఖాని లోలాక్షి దిశామసంశయం
దశాపి శూన్యాని విలోకయిష్యసి॥ ౧౩౯

ప. వి. అపి। స్వయూథ్యైః। అశనిక్షతోపమం। మమ। అద్య। వృత్తాంతమ్। ఇమం। బత। ఉదితా। ముఖాని। లోలాక్షి। దిశామ్। అసంశయం। దశ। అపి। శూన్యాని। విలోకయిష్యసి।

టీక॥ అపి = ఇంకను, అద్య = ఇప్పుడు, స్వయూథ్యైః, స్వ = తనయొక్క, యూథ్యైః = గుంపునందుండెడి హంసలచే, అశనిక్షతోపమం; అశని పిడుగు యొక్క, క్షత = దెబ్బచే, ఉపమం = సమానమైన, మమ = నాయొక్క, ఇమం = ఈ వృత్తాంతం = సమాచారమునుఁగూర్చి, ఉదితా సతీ = చెప్పఁబడినదానవై, హే లోలాక్షి! = ఓ చంచలాక్షీ! దశాఽపి = పదియునైన, దిశాం = దిక్కులయొక్క ముఖాని = ముఖములను

శూన్యాని = శూన్యములుగ అనగా రక్షకరహితములుగ విలోకయిష్యసి = చూడగలవు, అసంశయం = సంశయములేదు బత = కష్టము.

సమాసములు ;

స్వయూథ్యైః :— యూథే భవాః = యూథ్యాః. స్వస్య యూథ్యాః = స్వయూథ్యాః తైః, స్వయూథ్యైః

**అశనిక్షతోపమమ్** :— అశనేః క్షతం = అశనిక్షతం, అశనిక్షతము ఉపమా యస్య సః = అశనిక్షతోపమః. తమ్, అశనిక్షతోపమమ్,

**లోలాక్షి** :— లోలే అక్షిణీ యస్యాః సా లోలాక్షీ, తస్యాః సంబుద్ధిః హే లోలాక్షి-

**అసంశయం** :— న విద్యతే సంశయః యస్మిన్ కర్మణి తత్ యథా భవతి తథా = అసంశయమ్-

భావము :

ఓ ప్రియురాలా ఈదినము నా గుంపునందలి హంసలు, పిడుగు దెబ్బతో సమానమైన నా యీసమాచారమును నీకుజెప్పినచో చంచలాక్షివైన నీవు దశదిశాముఖములను, రక్షకరహితములుగఁ జూడఁగలవు. ఇందు సంశయము లేదు

శ్లో॥ మమైవ శోకేన విదీర్ణవక్షసా
త్వయా విచిత్రాంగి! విపద్యతే యది ।
తదస్మి దైవేన హతోఽపి హా హత
స్స్ఫుటం యతస్తే శిశవః పరాసవః॥ ౧౪౦

**ప. వి.** మమ । ఏవ । శోకేన ; విదీర్ణవక్షసా । త్వయా । విచిత్రాంగి । విపద్యతే । యది । తత్ । అస్మి । దైవేన । హతః । అపి । హా । హతః । స్ఫుటం । యతః । తే । శిశవః । పరాసవః ।

**టీక॥** హే విచిత్రాంగి = వివిధవర్ణములతోఁగూడిన శరీరము గలదానా! మమ = నన్ను విషయీకరించిన శోకేనైవ = దుఃఖముచేతనే విదీర్ణవక్షసా = విదీర్ణ = చీలిన వక్షసా = హృదయముగల్గిన, త్వయా = నీచే, విప

ద్యతే యది = మరణింపఁబడినచో, తత్ = అప్పుడు, దైవేన = దైవముచే, హతోఽపి = చంపఁబడినను, స్ఫుటం = స్పష్టముగా పునః = మఱల, హతః = చంపఁబడినవాడనుగ, అస్మి = అగుచున్నాను. యతః = ఏల యనగా, తే = నీయొక్క, శిశవః = బిడ్డలు. పరాసవః = మరణించిరి.

సమాసములు :

విదీర్ణ వక్షసా :– విదీర్ణం–వక్షః యస్యాస్సా = విదీర్ణవక్షాః తయా = విదీర్ణ వక్షసా.

విచిత్రాంగి:–విచిత్రం అంగం యస్స్యాస్సా = విచిత్రాంగీ; తస్యాస్సంబుద్ధిః = హే విచిత్రాంగి.

పరాసవః :– పరాః–అసవః యేషాం తే = పరాసవః.

భావము :

ఓ వింతరంగులతో మెఱయు శరీరము గల ప్రియురాలా! నా యాపద విని యాదుఃఖముతో హృదయము భగ్నమై నీవును మరణింతువేని అప్పుడు దైవముచేనొకతడవ జంపఁబడిన నేను మఱలను చంపఁబడెదను- ఏలయనగా నీవు నా యాపద, విని మరణించిన పిదప, పోషణ చేసెడి తల్లి లేనందువలన శిశువులు గూడ మరణింతురు. శిశువుల మరణమును భావించుటచే నాకు మరణ దుఃఖము రెట్టింపుకాఁగలదు.

శ్లో॥ తవాఽపి హా హా విరహాత్క్షుధాకులాః
కులాయకూలేషు విలుఠ్య తేషు తే।
చిరేణ లబ్ధా బహుభిర్మనోరథై
ర్గతాః క్షణేనాస్ఫుటితేక్షణా మమ॥ ౧౪౧

ప. వి. తవ । అపి । హాహా । విరహాత్ । క్షుధా । ఆకులాః । కులాయకూలేషు । విలుఠ్య । తేషు । తే । చిరేణ । లబ్ధాః । బహుభిః । మనోరథైః । గతాః । క్షణేన । అస్ఫుటితేక్షణాః । మమ ।

టీక॥ హే ప్రియే = ఓ ప్రియురాలా! బహుభిః = పెక్కైన మనోరథైః = కోరికలచే, చిరేణ = చాల కాలమునకు లబ్ధాః = పొందఁబడినటువంటి, అస్ఫుటితేక్షణాః; అస్ఫుటిత = ఇప్పటికిని. తెరువని ఈక్షణాః = కనులుగల్గిన మమ = నాకును, తే = నీకును. శిశవః = బిడ్డలు, పితరాత్ = తల్లి దండ్రుల వియోగము వలన క్షుధాకులాః = ఆకలిచే పీడింపఁబడినవారై తేషు = ఆ కులాయకూలేషు కులాయ = గూండ్ల యొక్క కూలేషు = లోపలి భాగములయందు, విలుఠ్య = పొరలి, క్షణేన = క్షణకాలముచే, గతాః = గతించినవారుగ (భవంతి = అగుచున్నారు) హాహా = (అయ్యయ్యో) కష్టము.

సమాసములు :

కులాయానాం కూలాని = కులాయకూలాని తేషు-కులాయకూలేషు.

అస్ఫుటితేక్షణా :- స్ఫుటితాని ఈక్షణాని యేషాం తే స్ఫుటితేక్షణాః న స్ఫుటితే క్షణాః = అస్ఫుటితేక్షణాః

భావము :

ఓ ప్రియురాలా! పెక్కు మనోరథములతో, చిరకాలమునకు సంప్రాప్తించిన వారై యిప్పటికిని కనులు తెఱవలేని మనబిడ్డలు మన ఎడబాపుచే నాకలి వలన బాధలకు గుఱియై ఆ గూండ్ల యందే యిటునటు పొరలి మరణింతురు. అయ్యో! ఎంతకష్టదశ,

శ్లో॥ సుతాః కమాహూయ చిరాయ చుంకృతై
ర్విధాయ కంప్రాణి ముఖాని కం ప్రతి।
కథాసు శిష్యధ్వమితి ప్రమీల్య స
స్రుతస్య సేకాద్బుబుధే నృపాశ్రుణః॥ ౧౪౨

ప॥ వి॥ సుతాః। కమ్। ఆహూయ। చిరాయ। చుంకృతైః। విధాయ। కంప్రాణి। ముఖాని। కం। ప్రతి। కథాసు। శిష్యధ్వమ్। ఇతి। ప్రమీల్య। సః। స్రుతస్య। సేకాత్। బుబుధే। నృపాశ్రుణః॥

టీక॥ హే సుతాః = ఓపుత్రులారా! చుంకృతైః = చుంకారధ్వనులతో, చిరాయ = చాలాకాలము కమపి = ఎవరినైనను ఆహూయ = పిలచి,

కమపి ప్రతి = ఎవరినైనను ద్దేశించి, ముఖాని = చంచువులను, కంప్రాణి = కంపముతోఁగూడిన విగ విధాయ = చేసి, కథామాత్ర శేషాః = కథ మాత్ర మేమిగిలినవారు గాఁగలరు అనగా మరణించుఁడు ఇతి = ఇట్లు చెప్పి, ప్రమీల్య = మూర్ఛిల్లి సః = ఆహంస ప్రుతస్య = దయచే ప్రవహించుచున్న, నృపాశ్రుణః నృప = నలమహారాజుయొక్క అశ్రుణః = కన్నీటియొక్క సేకాత్ = తడుపుటవలన బుబుధే = మేల్కొనెను.

"చుంకృతైః ముఖాని కంప్రాణి" ఇత్యాదిగ పక్షిస్వభావము చిత్రింపఁబడినదిగాన స్వభావోక్త్యలంకారము.

సమాసములు :

నృపాశ్రుణః నృపస్య అశ్రు = నృపాశ్రు తస్య = నృపాశ్రుణః

భావము :

"ఓబిడ్డలారా! చుంకారములతో, నెవరినైననుఁబిలిచి, ఏవరినైననుద్దే శించి మీముఖములను ముక్కులను ఆడించి, మీరు తల్లిదండ్రులు లేనందు వలన మరణింపుడు" అని యా హంస చెప్పినవెంటనే మూర్ఛిల్లినది. వెంటనే దయాహృదయుఁడగు నలమహారాజు యొక్క కన్నీటిబిందువులు పైన రాలుటచే, మూర్ఛదొలగి మేల్కొనినది,

శ్లో॥ ఇత్థమముం విలపంతమముంచ
దీనదయాళుతయాఽవనిపాలః ।
రూపమదర్శి ధృతోఽసి యదర్థం
గచ్ఛ యథేచ్ఛ మథేత్యభిధాయ॥ ౪౩౧

ప॥ వి॥ ఇత్థమ్ । అముం । విలపంతం । అముంచత్ । దీనదయాళు తయా । అవనిపాలః । రూపం। అదర్శి। ధృతః। అసి । యదర్థం । గచ్ఛ। యథేచ్ఛం। అథ ।ఇతి । అభిధాయ।

టీక॥ ఇత్థం = ఇట్లు విలపంతం = విలపించుచున్న, అముం = ఆహంసను అవనిపాలః = నలమహారాజు, దీనదయాళుతయా; దీన = దీనులయందు దయాళుతయా = దయగల్గి యుండుటచే, రూపం = నీయపూర్వమగు నాకృతి, అదర్శి = చూడఁబడినది యదర్థం = ఏరూపదర్శనమునకై

ధృతో౽సి = పట్టుకొనఁబడితివో అథ = పిదప యథేచ్ఛం = ఇచ్ఛ వచ్చిన విధముగ గచ్ఛ = పొమ్ము ఇతి = ఇట్లు అభిధాయ = చెప్పి **అముంచత్** = విడిచిపెట్టెను.

సర్గ ముగియునప్పుడు భిన్నవృత్తములు వాడవలెయునను కావ్య లక్షణమునను సరించి యీశ్లోకమునుండి భిన్నవృత్తములు ప్రయోగింపఁబడినవి. ఇచ్చట ప్రతిపాదమందును వరుసగా మూడు భగణములు, చివర రెండు గురువులు చెప్పుటవలన నిది దోధకవృత్తము

సమాసములు :

దీనదయాళుతయా, దీనేషు, దయాళుః = దీనదయాళుః, దీనదయాళోః భావః దీనదయాళుతా. తయా, దీనదయాళుతయా

శ్లో॥ ఆనందజాశ్రుభిరనుస్రియమాణమార్గాన్
ప్రాక్శోకనిర్గమితనేత్రపయః ప్రవాహాన్ ।
చక్రే స చక్రనిభచంక్రమణచ్ఛలేన
నీరాజనాం జనయతాం నిజబాంధవానామ్ ॥ ౧౪౪

ప॥ వి॥ ఆనందజాశ్రుభిః, అనుస్రియమాణమార్గాన్। ప్రాక్। శోకనిర్గమిత నేత్రపయః ప్రవాహాన్ । చక్రే । సః । చక్రనిభచంక్రమణచ్ఛలేన। నీరాజనాం । విదధతాం । నిజబాంధవానామ్।

టీక॥ సః = ఆ హంస, చక్రనిభచంక్రమణచ్ఛలేన; చక్రనిభ = మండలాకారమైన, చంక్రమణ = తిరుగుట యొక్క ఛలేన = నెపముచే, నీరాజనాం = హారతిని జనయతాం = చేయుచున్న నిజబాంధవానాం = బంధువులకు ప్రాక్ = తన్ను రాజు విడిపించుటకుముందు శోకనిర్గమిత నేత్రపయః ప్రవాహాన్; శోక = దుఃఖముచే, నిర్గమిత = వెడలింపఁబడిన నేత్రపయః = కన్నీటియొక్క ప్రవాహాన్ = ప్రవాహములను ఆనందజాశ్రుభిః; ఆనందజ = సంతోషమువలనఁగల్గిన, అశ్రుభిః = కన్నీళ్ళతో, అనుస్రియమాణమార్గాన్, అనుస్రియమాణ = అనుసరింపఁబడుచున్నమార్గాన్ = త్రోవలు గలవిగ చక్రే = చేసెను.

ఇచ్చట బంధవిముక్తమైన పక్షులు మఱల తమ సోదరపక్షుల కూటమియందు సంచరించునట్టి స్వభావము ఛలశబ్దముచే మఱుగుచేయఁబడి దానియందు "నీరాజనాం జనయతా నిజబాంధవానామ్" అని నీరాజనత్వ ధర్మము నారోపించుటవలన నపహ్నవాలంకారమున చమత్కారహేతువుగను, మంగళాచరణరూపముగనునుండుటకు సర్గకు చివర ఆనందశబ్దప్రయోగముఁజేయబడినది।

ఇచ్చటఁ బ్రతిపాదమునందును తగణ-భగణ-జగణజగణ-గ-ములున్నవిగాన వసంతతిలకావృత్తము,

సమాసములు :-

ఆనందజాశ్రుభిః :- ఆనందాజ్జాయంత ఇతి = ఆనందజాని, ఆనందజాని చ తాని అశ్రూణి చ = ఆనందజాశ్రూణి, తైః ఆనందజాశ్రుభిః

అనుస్రియమాణమార్గాన్ :- అనుస్రియమాణఃమార్గః- మార్గాః, తాన్. అనుస్రియమాణమార్గాన్-

శోకనిర్గమితనేత్రపయః ప్రవాహాన్ :- శోకేన-నిర్గమితాని = శోకనిర్గమితాని నేత్రయోః పయాంసి నేత్రపయాంసి శోకనిర్గమితాని చ తాని నేత్రపయాంసి చ = శోకనిర్గమితనేత్రపయాంసి, శోకనిర్గమితనేత్రపయసాం ప్రవాహాః = శోకనిర్గమితనేత్రపయః ప్రవాహాఃతాన్ = శోకనిర్గమితనేత్రపయః ప్రవాహాన్,

చక్రనిభచంక్రమణచ్ఛలేన :- చక్రేణ సదృశం = చక్రనిభం చక్రనిభం చ తత్ చక్రమణం చ = చక్రనిభచంక్రమణంచక్రనిభచంక్రమణమేవ ఛలమ్ = చక్రనిభచంక్రమణచ్ఛలమ్, తేన, చక్రనిభచంక్రమణచ్ఛలేన, నిజబాంధవానాం నిజాశ్చ తే బాంధవాశ్చ = నిజబాంధవాః, తేషాం నిజబాంధవానామ్.

భావము:-

ఆ హంస నలమహారాజునుండి విముక్తిబొందగనే దాని బంధువులగు హంసలు దానిఁజుట్టునుఁ చేరి చుట్టు తిరగడమను నెపమున దానికి హారతిఁ బట్టినవి. దానికి పూర్వము తనబంధువులకు దుఃఖముచే వెల్వడిన కన్నీటివెల్లు

వలను ఆనందబాష్పప్రవాహములు గలియునట్లు చేసెను. అనగా బంధవిముక్తి బొందినందువలన హంస బంధువులందఱును నానందభరితులైరని యాశయము.

శ్లో॥ శ్రీహర్షం కవిరాజరాజిమకుటాలంకారహీరస్సుతం
శ్రీహీరస్సుషువే జితేంద్రియచయం మామల్లదేవీ చ యం।
తచ్చింతామణిమంత్రచింతనఫలే శృంగారభంగ్యా మహా
కావ్యే చారుణి నైషధీయచరితే సర్గోఽయమాదిర్గతః॥ ౧౪౫

ప. వి. శ్రీహర్షం । కవిరాజరాజిమకుటాలంకారహీరః । సుతం । శ్రీహీరః । సుషువే । జితేంద్రియచయం । మామల్లదేవీ । చ । యం । తచ్చింతామణి మంత్రచింతనఫలే । శృంగారభంగ్యా । మహాకావ్యే । చారుణి । నైషధీయ చరితే । సర్గః । అయమ్ । ఆదిః । గతః ।

టీక॥ కవిరాజరాజిమకుటాలంకారహీరః: కవిరాజ = కవిశ్రేష్ఠుల యొక్క, రాజి = శ్రేణి, యొక్క మకుట = కిరీటములకు, అలంకార = భూషణమైన, హీరః = వజ్రమణి, యగు, శ్రీహీరః = శ్రీహీరుడను కవి శ్రేష్ఠుఁడు, జితేంద్రియచయం: జిత = జయింపఁబడిన ఇంద్రియచయం ఇంద్రియ సమూహములుగల శ్రీహర్షం = శ్రీహర్షుడను నామముగల యం = ఏ, సుతం = కుమారుని సుషువే = పుట్టించెనో, మామల్లదేవీ చ = మామల్లదేవియను తల్లియు సుషువే = కనెనో, తచ్చింతామణి మంత్రచింతన ఫలే; తత్ = ఆశ్రీహర్షుని యొక్క చింతామణి మంత్ర = చింతామణి మంత్రము యొక్క చింతన = ఉపాసనకు ఫలే = ఫలము శృంగారభంగ్యా = శృంగారరసవృత్తిచే, చారుణి = రమ్యమైన, నైషధీయచరితే = నైషధీయ = నిషధదేశములకు రాజైన నలునికి సంబంధించిన, చరితే = చరిత్రమున, నలచరితమను నామముగల మహా కావ్యే = మహాకావ్య లక్షణములుగల కావ్యమందు, అయం = ఈ, ఆదిః = ప్రథమసర్గ గతః = సమాప్తము.

సమాసములు :

కవిరాజరాజిమకుటాలంకారహీరః :– కవీనాంరాజానః = కవిరాజాః, కవి రాజానాం రాజిః = కవిరాజరాజిః, కవిరాజరాజేః మకుటాని = కవిరాజ

రాజిమకుటాని కవిరాజరాజి మకుటేష్వలంకారః, కవిరాజరాజిమకుటాలంకారః కవిరాజరాజిమకుటాలంకారశ్చాసౌ హీరశ్చ = కవిరాజరాజిమకుటాలంకారహీరః.

జితేంద్రియచయమ్ :– ఇంద్రియాణాం చయః = ఇంద్రియ చయః, జితః ఇంద్రియచయః యేన సః–జితేంద్రియచయః, తం, జితేంద్రియచయమ్.
తచ్చింతామణి మంత్రచింతనఫలే :– చింతామణిరితి మంత్రః = చింతామణిమంత్రః చింతామణి మంత్రస్య చింతనం = చింతామణి మంత్ర చింతనం, చింతామణిమంత్రచింతనస్య ఫలం = చింతామణిమంత్ర చింతనఫలం, తస్మిన్ = చింతామణి మంత్రచింతన ఫలే.

శృంగారభంగ్యా :– శృంగారస్య–భంగిః = శృంగారభంగిః, తయా, శృంగార భంగ్యా.

భావము :

కవిరాజశ్రేణి మకుటములలో నలంకారమైన వజ్రమణియగు శ్రీహీరుఁడును మామల్లదేవియు– జితేంద్రియుఁడైన శ్రీహర్షుని కనిరి. ఆశ్రీహర్షుని చింతామణిమంత్రోపాసనకు ఫలముగా రచింపఁబడిన శృంగారరసబంధురమైన నైషధీయచరితమునందు ప్రథమసర్గ సమాప్తము

ఇతి

శ్రీమదాత్రేయగోత్ర శ్రీ మదుడాలి నృసింహశాస్త్రి తనూజ
విక్రమసింహపురీ వేద సంస్కృత కలాశాలా ప్రాధానోపాధ్యాయ

శ్రీసుబ్బరామశాస్త్రి
విరచితమగు
నైషధాంధ్ర వ్యాఖ్యానమునకు
ప్రథమసర్గ
సమాప్తము.

# శ్రీ హార్ష నైషధము

## ద్వితీయ సర్గ

శ్లో॥ అధిగత్య జగత్యధీశ్వరాదథ
ముక్తిం పురుషోత్తమాత్తతః।
వచసామపి గోచరో న యః
సతమానందమవిందత ద్విజః॥ ౧

౧. అధిగత్య । జగత్యధీశ్వరాత్ । అథ । ముక్తిం । పురుషోత్తమాత్ । తతః। వచసామ్ । అపి । గోచరః । న । యః । సః । తమ్ । ఆనందమ్ । అవిందత । ద్విజః ।

। అథ = విముక్తిని(బొందిన పిదప, సః = ఆ, ద్విజః = పక్షి (విప్రుడు) జగత్యధీశ్వరాత్, జగత్ = భూమికి, అధీశ్వరాత్ = ప్రభువైన( జగతీ = లోకములకు, అధీశ్వరాత్ = పాలకు(డవైన పురుషోత్తమాత్ = పురుషశ్రేష్ఠుడైన (విష్ణువైన) తతః = ముందు(జెప్ప(బడిన నలమహారాజు నుండి( తతః = ప్రసిద్ధు(డగు భగవానునుండియు) ముక్తిం = విడుదలను (మోక్షమును) అధిగత్య = పొంది, యః = ఏ ఆనందము, వచసామపి = మాటలకును, న గోచరః = విషయము గాదో, అనగా మాటల(చేతను(జెప్పసాధ్యముగాదో. తమ్ = అట్టి. ఆనందం = ఆనందమును. అవిందత = పొందెను.

ఇచ్చట పదశక్తి యగు నభిధ ప్రకృతార్థమగు హంస వృత్తాంతమును( జెప్పి విరమించినది గాన నప్రకృతార్థము జెప్పసమర్థముగాదు. కానని(టునుభయశ్లేష సంభవించదు. ఇతరశ్లేషభేదములను చెప్పుటకవకాశములేనందువలనను. ముఖ్యార్థబాధలేనిది లక్షణావృత్తి సంభవించవందువలనను నిచ్చట, శ్రీమహావిష్ణువవలన విప్రు(డు మహానందము నందెనను నర్థాంతరప్రతీతిధ్వనియేగాని, శ్లేషకా(జాలదు.

ఈ సర్గ యందొకవందశ్లోకములవఱకును వియోగినీవృత్తము. విషమపాదములయందు, సగణ-జగణ-జగణ-గురువులు, సమపాదముల యందు, సగణ-భగణ-రగణ-లఘు-గురువులు గల్గియుండుట వియోగినీ వృత్తలక్షణము-

సమాసములు :

జగిత్యధీశ్వరాత్ :- జగత్యాః అధీశ్వరః, = జగత్యధీశ్వరః తస్మాత్ జగత్యధీశ్వరాత్ -జగతీనామధీశ్వరః = జగత్పధీశ్వరః తస్మాత్ జగత్యధీశ్వరాత్-

పురుషోత్తమాత్ :- పురుషాణాముత్తమః = పురుషోత్తమః = తస్మాత్ పురుషోత్తమాత్.

ద్విజః :- ద్విః జాయత ఇతి = ద్విజః-

భావము :

నలునివలన విడుదల పొందిన పిదప నా హంస- భూపతియును, పురుష శ్రేష్ఠుఁడు నగు నా నలమహారాజు వలని ముక్తిచే, మాటలచే వర్ణింప శక్యము గాని మహానందమును, లోకాధిపతియును పురుషోత్తముడును నగు శ్రీ మహా విష్ణువువలన మోక్షముఁబొంది వాక్కులకతీతమగు మహానందమును ద్విజుని వలెఁబడసెను.

శ్లో॥ అధునీత ఖగస్సనైకధా
తనుముత్ఫుల్లతనూరుహీకృతాం।
కరయంత్రణదంతురాంతరే
వ్యలిఖచ్చంచుపుటేన పక్షతీ॥ ౨

ప. వి. అధునీత । ఖగః । సః । నైకధా । తనుమ్ । ఉత్ఫుల్లతనూరుహీకృతాం । కరయంత్రణదంతురాంతరే । వ్యలిఖత్ । చంచుపుటేన । పక్షతీ ।

టీక॥ సః = ఆ, ఖగః = హంస ఉత్ఫుల్లతనూరుహీకృతామ్; ఉత్ఫుల్ల = పైకి రేగిన, తనూరుహీకృతాం = ఈకలున్నగు వెంట్రుకలదిగఁజేయఁ

బడిన తనుం = శరీరమును, నైకధా = పలుమాఱులు, అధునీత = విదిలించెను, (కించ = మఱియు) కరయంత్రణదంతురాంతరే, కరయంత్రణ = నలుని హస్తములయందు నలుగుటచే, దంతుర = మిట్టపల్లములైన అంతరే = మధ్యదేశముగల పక్షతీ = ఱెక్కల మూలలను, చంచుపుటేన = ముక్కుపుటముచే, వ్యలిఖత్ = గోకి చక్కజేసికొనెను.

ఇచ్చట 'తను మధునీత' చంచుపుటేన వ్యలిఖత్ అని దేహమును కొనుట, ముక్కుతోగోకుకొనుట మున్నగు పక్షుల స్వభావమును( జెప్పుచున్నదిగాన స్వభావోక్త్యలంకారము.

**సమాసములు :**

నైకధా = న ఏకధా = నైకధా

ఉత్ఫుల్లతనూరుహీకృతామ్ :- ఉత్ఫుల్లాని-తనూరుహాణి యస్యాస్సా, ఉత్ఫుల్లతనూరుహా. అనుత్ఫుల్లతనూరుహా, ఉత్ఫుల్లతనూరుహా సంపద్యమానా కృతాఉత్ఫుల్లతనూరుహీకృతా తాం ఉత్ఫుల్లతనూరుహీకృతామ్

కరయంత్రణదంతురాంతరే :- కరాభ్యాం యంత్రణం = కరయంత్రణం కరయంత్రణేన దంతురం కరయంత్రణదంతురమ్. కరయంత్రణదంతురమ్ అంతరం యయోస్తే = కరయంత్రణదంతురాంతరే, తే కరయంత్రణదంతురాంతిరే-

చంచుపుటేన :- చంచ్వోః పుటః = చంచుపుటః, తేన = చంచుపుటేన.

**భావము :**

ఆ హంస రాజుచేతనలిగినందువలన పైకి రేగిన యీకలు గల తన శరీరమును చాల మాఱులు విదిలించినది. ఆ రాజుచేతనలిగి మిట్టపల్లములైన, తన ఱెక్కలమూలలను, తన ముక్కుచే సరిజేసికొనెను.

శ్లో॥ అయమేకతమేన పక్షతే
రధిమధ్యోర్ధ్వగజంఘమంఘ్రిణా।
స్ఖలనక్షణ ఏవ శిశ్రియే ద్రుత
కండూయితమౌళిరాలయమ్॥

ప. వి. అయమ్ । ఏకతమేన । పక్షతేః । అధిమధ్యోర్ధ్వగజంఘమ్ । అంఘ్రిణా । స్ఖలనక్షణే । ఏవ । శిశ్రియే । ద్రుతకండూయితమౌళిః । ఆలయమ్ ।

టీక॥ అయం = ఈ హంస, స్ఖలనక్షణ ఏవ = విడుపుబొందిన సమయమందే ఏకతమేన = ఒకటియేయైన, అంఘ్రిణా = పాదముచే, పక్షతేః = తెక్కలమూల యొక్క, అధిమధ్యోర్ధ్వగజంఘం; అధిమధ్య = మధ్య భాగమందు ఊర్ధ్వగ = పైకిబోయిన, జంఘం = మోకాలు గల్గునట్లుగా, ద్రుతకండూయితమౌళిః; ద్రుత = శీఘ్రముగ, కండూయిత = గోకుకొనబడిన, మౌళిః = తలగలదై, ఆలయం = తననివాసస్థలమును శిశ్రియే = ఆశ్రయించెను,

ఏకతమేన అంఘ్రిణా, అధిమధ్యోర్ధ్వగజంఘం ఒంటికాలితో తల గోకుకొనుట మున్నగు పక్షిస్వభావములు వర్ణింపబడినది కాన స్వభావోక్త్యలంకారము.

**సమాసములు :-**

అధిమధ్యోర్ధ్వగజంఘమ్ :- మధ్యేఅధిమధ్యం, ఊర్ధ్వంగచ్ఛతీతి = ఊర్ధ్వగా అధిమధ్యం, ఊర్ధ్వగా అధిమధ్యోర్ధగా అధిమధ్యోర్ధ్వగా, జంఘా యస్మిన్‌కర్మణితత్‌యధాభవతితధా, అధిమధ్యోర్ధ్వగజంఘమ్-

స్ఖలనక్షణే :- స్ఖలనస్య క్షణః = స్ఖలనక్షణః, తస్మిన్ = స్ఖలనక్షణే,

ద్రుతకండూయితమౌళిః :- ద్రుతంకండూయితా = ద్రుతకండూయితా, ద్రుతకండూయితా మౌళిః యస్య సః, ద్రుంతకండూయితమౌళిః.

**భావము :**

ఈ హంస నలునివలన విముక్తి పొందిన క్షణమందే, ఒకపాదముచే తెక్కల మూల యొక్క మధ్యభాగము నుండి పైకి జానిపిన మోకాలుతో తొందరగ తలను గోకికొనుచు తన నివాసస్థలమునకు వెళ్లినది.

శ్లో॥ స గరుద్వనదుర్గదర్గ్రిహాన్,
కటుకీటాన్ దశతః సతః క్వచిత్ ।
నునుదే తను కండు పండితః
పటుచంచూపుటకోటికుట్టనైః॥ ४

ప. వి. సః । గరుద్వన దుర్గ దుర్గ్రిహాన్ । కటు । కీటాన్ । దళతః । సతః । క్వచిత్ । నునుదే । తనుకండు । పండితః । పటుచంచూపుట కోటికుట్టనైః ।

టీక॥ పండితః = నేర్పరియగు, సః = ఆ హంస గరుద్వన దుర్గదుర్గ్రిహాన్; గరుత్ = తెక్కలనెడి, వనదుర్గ = అరణ్యదుర్గమందు, దుర్గ్రిహాన్ = పట్టుకొనుటకు సాధ్యము గానిదియు, కటు = తీక్ష్ణముగా, దళతః = కుట్టుచున్నవియు, క్వచిత్ = ఎక్కడనో ఒక చోట. సతః = ఉన్నవియునగు కీటాన్ = పురుగులను, పటుచంచూపుటకోటికుట్టనైః = దృఢమైన, చంచూపుట = ముక్కుయొక్క, కోటి = కొనయొక్క కుట్టనైః = దెబ్బలచే, తను కండు (యథాతథా); తను = స్వల్పమయిన కండు = దురదగలిగినట్లుగ నునుదే = నివారించుకొనెను

"కీటాన్ దళతః, పటుచంచూపుటకోటినైః" అని ముక్కు కొనల దెబ్బలచే పురుగులను తినుట మున్నగు పక్షి స్వభావమును చెప్పుట వలన స్వభావోక్త్యలంకారము.

సమాసములు :

గరుద్వనదుర్గదుర్గ్రిహాన్ :- వనస్య దుర్గం = వనదుర్గం గరుత ఏవ వన దుర్గం = గరుద్వన దుర్గమ్, దుఃఖేన గ్రహీతుం శక్యాః దుర్గ్రిహాః గరుద్వన దుర్గే దుర్గ్రిహాః = గరుద్వన దుర్గదుర్గ్రిహాః, తాన్ = గరుద్వన దుర్గదుర్గ్రిహాన్,

పటుచంచూపుట కోటికుట్టనైః :- చంచ్వాఃపుటః = చంచూపుటః చంచూపుటస్య కోటిః = చంచూపుటకోటిః, పట్వీ చ సా చంచూపుటకోటిశ్చ = పటుచంచూ పుటకోటిః. పటుచంచూపుట కోట్యా కుట్టనాని = పటుచంచూపుటకోటికుట్టనాని తైః = పటుచంచూపుటకోటికుట్టనైః.

భావము :

నేర్పరియగు నా హంస తెక్కలనెడి వనదుర్గమందు దాగి పట్ట సాధ్యము కానివై చురుకుగ కుట్టుచు నెక్కడనో ఒక చోట నుండిన, పురుగులను వాడియగు తనముక్కు కొనల దెబ్బలచే వారించుచు దురద తగ్గించుకొనెను.

శ్లో॥ అయమేత్య తటాకనీడజై
ర్లఘు పర్యవ్రియ తాథ శంకితైః।
ఉదడీయత వైకృతాత్కర
గ్రహ జాదస్య వికస్వరస్వరైః॥

ప, వి. అయమ్, ఏత్య । తటాకనీడజైః । లఘు। పర్యవ్రియత । అథ । శంకితైః।
ఉదడీయత । వైకృతాత్ । కరగ్రహజాత్ । అస్య । వికస్వరస్వరైః।

టీ:॥ అయం = ఈ హంస, తటాకనీడజైః తటాక = కొలనియొక్క
నీడజైః = పక్షులతో, లఘు = శీఘ్రముగ ఏత్య = వచ్చి పర్యవ్రియత
= చుట్టఁబడినది, అథ = చుట్టఁబడిన తర్వాత అస్య = ఈ హంసకు,
కరగ్రహజాత్ = నలుని హస్తముచే పట్టుకొనుట వలన గల్గిన, వైకృ
తాత్ = తెక్కలు నలుగుట మున్నగు వికారము వలన, శంకితైః =
భయము నొందినవై వికస్వరస్వరైః = పెద్ద ఎలుగులతో ఉదడీయత
= పైకెగురుట (సంభవించినది)

ఇచ్చట నలుని వలన విమోచనముఁ బొందిన హంసను "లఘు
పర్యవ్రియత" ఉదడీయత' యని, సోదర పక్షులు చుట్టుమూగినవి,
భయముతో మింటి కెగసినవి" యని పక్షి స్వభావములనుఁ జిత్రించుట
వలన స్వభావోక్తి.

సమాసములు :

తటాకనీడజైః :- నీడే జాయంత ఇతి = నీడజాః, తటాకస్య నీడజాః
= తటాకనీడజాః తైః = తటాకనీడజైః

కరగ్రహజాత్ :- కరాభ్యాం గ్రహః = కరగ్రహః, కరగ్రహాత్
జాయత ఇతి = కరగ్రహజం, తస్మాత్ కరగ్రహజాత్.

వికస్వరస్వరైః :- వికస్వరాశ్చతే స్వరాశ్చ = వికస్వరస్వరాః, తైః,
వికస్వరస్వరైః.

భావము :

ఈ హంసను తటాకమందలి యితర హంసలు వెంటనే చుట్టుముట్టినవి.
చుట్టుముట్టిన పిదప దీని శరీరము నలుని చేత నలుగుట వలన గల్గిన మార్పునుఁ
జూచి యవి బిగ్గరగ కూయుచూ మింటికెగిసి పోయినవి.

శ్లో॥ దధతో బహుశైవలక్ష్మతాం
ధృతరుద్రాక్షమధువ్రతం ఖగః।
న నలస్య యయౌ కరం పున
స్సరసః కోకనదభ్రమాదివ॥

ప. వి. దధతః । బహుశైవలక్ష్మతాం । ధృతరుద్రాక్షమధువ్రతం । ఖగః । సః । నళస్య । యయౌ । కరం । పునః । సరసః । కోకనదభ్రమాత్ । ఇవ ।

టీక॥ అథ = పిదప సః = ఆ ఖగః = పక్షి, అనగా హంస, బహుశైవలక్ష్మతాం, బహు = అధికమైన శైవల = నాచుతోఁ గూడిన క్ష్మతాం = భూమినిఁ గల్గియుండుటను దధతః = ధరించుచున్న సరసః = తటాకమునుండి బహుశైవ లక్ష్మతాం; బహు = పెక్కైన శైవ = శివభక్తుని యొక్క లక్ష్మతాం = చిహ్నములు గల్గియుండుటను, దధతః = ధరించుచున్న నలస్య = నలునియొక్క ధృత రుద్రాక్ష మధువ్రతమ్: ధృత = ధరింపబడిన. రుద్రాక్షమధువ్రతమ్ = తుమ్మెదలవంటి రుద్రాక్షలు గల కరం = హస్తమును, కోకనదభ్రమాదివ: కోకనద = చెంగలువలనెడి భ్రమాదివ = భ్రమవలననో యనునట్లు, పునః = మరల, యయౌ = పొందెను.

"బహుశైవ లక్ష్మతాం" అని నాచుతో కూడిన భూమిని గల్గియుండుట. శివభక్త లక్షణములు గల్గియుండుట యను రెండర్థములనుఁ బట్టి శబ్దశ్లేష.

"రుద్రాక్షమధువ్రతమ్" అని రుద్రాక్షలను తుమ్మెదలవలెఁ జెప్పుట వలన, ఉపమాలంకారము.

"కోకనదభ్రమాదివ" యని నలుని హస్తమును చెంగలువయను భ్రమతోయనునట్లు భ్రాంతిమదుత్ప్రేక్షాలంకారము.

ఇచ్చట శబ్దశ్లేషతో నుపమాలంకార మను ప్రాణితము. ఆ యుపమాలంకారముతోఁ బైయుత్ప్రేక్ష సాపేక్షము. ఈ యలంకారముల కన్నింటికి నిట సంకరము.

సమాసములు ;

బహుశైవలక్ష్మతామ్ :- బహవః శైవలాః యస్యాం సా, బహుశైవలా బహుశైవలా క్ష్మా యస్మిన్ తత్ = బహుశైవలక్ష్మం, బహుశైవలక్ష్మస్య భావః, బహుశైవలక్ష్మతా, తాం, బహుశైవలక్ష్మతాం

శివస్య ఇమాని శైవాని. శైవాని చ తాని లక్ష్మాణి చ శైవలక్ష్మాణి, బహూని శైవలక్ష్మాణి యస్యసః = బహుశైవలక్ష్మా బహుశైవలక్ష్మణః భావ: = బహుశైవలక్ష్మతా, తాం, బహుశైవలక్ష్మతామ్,

ధృతరుద్రాక్షమధువ్రతమ్ :- రుద్రాక్షాణి మధువ్రతా ఇవ = రుద్రాక్ష మధువ్రతాః, ధృతాః రుద్రాక్షమధువ్రతా: యేన సః, ధృతరుద్రాక్ష మధు వ్రతః. తం-ధృతరుద్రాక్ష మధువ్రతమ్.

కోకనదభ్రమాత్ :- కోకనదస్య భ్రమః=కోకనదభ్రమః = తస్మాత్ =కోకనదభ్రమాత్।

భావము :

ఆ హంస, నలునివద్ద విముక్తిబొంది యథాప్రకారము తటాకము చేరినది. తర్వాత నధికముగ నాచు(బట్టిన యడుగు భాగముగల యా తటాకము నుండి, పెక్కు శివభక్త లక్షణములు ధరించిన, తుమ్మెదలవంటి రుద్రాక్షములు గల యా నలుని హస్తమును చెంగలువ యను భ్రమతో మరల( బొందినది. తటాకమున, బహుశైవ లక్ష్మత (నాచుతో(గూడిన భూమి) యున్నట్లు నలుని యందును బహుశైవలక్ష్మత (పెక్కు శివభక్త లక్షణములు గల్గియుండుట) కలదు. అతనిచేత తుమ్మెదలవంటి రుద్రాక్షము లుండి యది చెంగలువవలె గానవచ్చుచుండినది. అందువలన హంస తటాక ధర్మములనే దాల్చిన నలుని హస్తమును( బొందెను.

శ్లో॥ పతగశ్చిరకాలలాలనా
దతి విస్రంభమవాపితో ను కిమ్।
అతులం విదధే కుతూహలం
భుజమేతస్య భజన్ మహీభుజః॥

ప. వి  పతగః। చిరకాల లాలనాత్ । అతివిస్రంభమ్ । ఆవాపితః। ను । కిమ్ ।అతులం । విదధే । కుతూహలం । భుజమ్ । ఏతస్య । భజన్ । మహీభుజః ।

టీక॥  పతగః = హంస చిరకాలలాలనాత్; చిరకాల = చాలకాలము లాలనాత్ లాలించుట వలన, అతివిస్రంభం = మిక్కిలి విశ్వాసమును, ఆవాపితోను కిమ్ = పొందింపఁబడినదాయేమి, (కించ = మఱియు) ఏతస్య = ఈ, మహీభుజః = రాజుయొక్క భుజం = భుజమును భజన్ = పొందుచు, అతులం = సాటిలేని కుతూహలం = కౌతుకమును విదధే = చేసినది.

"విస్రంభమవాపితోను" అని విశ్వాసమును బొందింపఁబడినదాయేమియని చెప్పుట వలన నుత్ప్రేక్షాలంకారము. చిరకాల లాలనాత్ అని కాల, లాల శబ్దములలోని లకారములకు, అతులం-కుతూహలం అని. లల-వర్ణములకును; భుజం భజన్, మహీభుజః, భకార జకారములకును ఆవృత్తియుండుటవలన వృత్త్యనుప్రాసము - ఈయుత్ప్రేక్షా-వృత్త్యనుప్రాసముల కిట సంసృష్టి.

సమాసములు :

చిరకాలలాలనాత్ :- చిరకాలం లాలనం = చిరకాల లాలనం, తస్మాత్ = చిరకాలలాలనాత్-

అతివిస్రంభం :- అత్యంతం విస్రంభః = అతివిస్రంభః తం అతివిస్రంభమ్.

అతులం :- అవిద్యమానా తులా యస్య సః = అతులః = తం, అతులమ్.

భావము :

ఈ హంసను నలమహారాజు చాలకాలము చేత నుంచుకొని తడవి తడవి లాలించుట వలన నదియాతనియందు మిక్కిలి విశ్వాసముఁ బొందిన వాయేమి లేని యెడల తాను గానెట్లతని చేతిలోనికిఁ బోగలదు. ఈ నలమహారాజు భుజముఁ బొంది సాటిలేని కుతూహలము నది కన్పఱచినది.

శ్లో॥ నృపమాన సమిష్ట మానస
స్సనిమజ్జత్కుతు కామృతోర్మిషు।
అవలంబిత కర్ణ శష్కులీ
కలశీకం రచయన్నవోచత॥ ౮

ప. వి నృపమానసమ్ । ఇష్టమానసః । సః । నిమజ్జత్ । కుతుకామృతోర్మిషు । అవలంబితకర్ణ శష్కులీకలశీకం । రచయన్ । అవోచత ।

టీక॥ ఇష్టమానసః, ఇష్ట = ప్రియమైన, మానసః = మానససరస్సుగల, సః = ఆ రాజహంస, కుతుకామృతోర్మిషు; కుతుక = సంతోషమనెడి, అమృతోర్మిషు = అమృతపు తరంగములయందు; నిమజ్జత్ = మునిగిన, నృపమానసం = నలుని చిత్తమును, అవలంబిత కర్ణశష్కులీ కలశీకం: అవలంబిత = పట్టుకొనఁబడిన, కర్ణశష్కులీ = చక్కిలముల వంటి చెవుల నెడి కలశీకం = కుండలు గలదిగ రచయన్ = చేయుచు, అవోచత = పలికెను,

కుతుకామృతోర్మిషు అని హర్షమును అమృతముతో రూపించుటవలన రూపకము.

"అవలంబితకర్ణశష్కులీకలశీకం ।" అని కర్ణములను చక్కిలములతోఁ పోల్చుటవలన ఉపమ, కర్ణశష్కులిని కలశముతో రూపించుటవలన రూపకము-ఇట్లు ఉపమారూపకములకిందు సంసృష్టి-

సమాసములు :

నృపమానసమ్ :- నృపస్య మానసమ్ నృపమానసమ్, తత్ = నృపమానసమ్.

ఇష్టమానసః :- ఇష్టం మానసం యస్య సః = ఇష్టమానసః
కుతుకామృతోర్మిషు :- కుతుకమేవ అమృతం, కుతుకామృతం, కుతుకామృతస్య ఊర్మయః, తాః, కుతుకామృతోర్మిషు-

అవలంబిత కర్ణశష్కులీకలశీకం :- కర్ణౌ శష్కుల్యాలివ = కర్ణశష్కుల్యౌ, కర్ణశష్కుల్యావేవ కలశ్యౌ = అవలంబితే, కర్ణశష్కులీ కలశ్యౌ, యేన తత్ = అవలంబిత కర్ణశష్కులీకలశీకమ్-

భావము :

మానససరోవరము నందిచ్చగల్గిన యారాజహంస సంతోషామృత తరంగములయందు మునిగిపోయిన నలునిమనస్సును, చక్కిలమువలె గుండ్రములైన కర్ణములను కలశములచే నిలబెట్టి యనగా నతనిని సావధానచిత్తునిగావించి చెప్పఁదొడగెను. నీటమునుగు మనిషి జలప్రవాహమున మునుగక దానిని దాటుటకు కుండలనుపయోగించును. అవ్విధముగనే యిందును, సంతోషసాగరమున మునిగెడి నలుని మనస్సు కర్ణములనెడి కలశములనుఁ బట్టుకొనినది. అనగా కర్ణములను కలశములుగా మనస్సు చేసికొనిన దనుటకు, మనస్సు ఇతరములగు నింద్రియములను వదలి శ్రవణేంద్రియమందే, లగ్నమై, హంసచెప్పునట్టి విషయములను చెవియొగ్గి వినుటకు సంసిద్ధమయినదని యాశయము.

శ్లో॥ మృగయా నవిగీయతే నృపై
రపి ధర్మాగమమర్మపారగైః।
స్మరసుందర! మాం యదత్యజ
స్తవధర్మస్సదయోదయోజ్జ్వలః॥ ౬

ప. వి. మృగయా। న। విగీయతే। నృపైః। అపి। ధర్మాగమమర్మపారగైః। స్మరసుందర, మాం। యత్। అత్యజః। తవ। ధర్మః। సః। దయోదయోజ్జ్వలః।

టీక॥ ధర్మాగమమర్మపారగైరపి, ధర్మాగమ = ధర్మశాస్త్రములయందలి, మర్మ = రహస్యములయొక్క, పారగైరపి = అవలిగట్టును, టొందిన వారునైన నృపైః = రాజులచే, మృగయా = వేట, న విగీయతే = నిందింపఁబడుటలేదు. (తథాపి = అయినను) హే స్మరసుందర! = ఓ మన్మధునివలె సుందరుఁడవైన నలమహారాజా! మాం = నన్ను అత్యజ ఇతియత్ = విడిచితివనునదియేదిగలదో, సః = ఆ త్యాగము తవ = నీయొక్క దయోదయోజ్జ్వలః, దయోదయ = దయ యుదయించుటవలన. ఉజ్జ్వలః = నిర్మలమైన, ధర్మః = ధర్మము,

సమాసములు :

ధర్మాగమమర్మపారగైః :- ధర్మస్య ఆగమాః, ధర్మాగమాః ధర్మాగమానాం మర్మాణి, ధర్మాగమమర్మాణి. ధర్మాగమమర్మసు పారగాః ధర్మాగమమర్మపారగాః, తైః, ధర్మాగమమర్మపారగైః.

స్మరసుందర :- స్మర ఇవ సుందరః, స్మరసుందరః తస్య సంబుద్ధిః = హేస్మరసుందర !

దయోదయోజ్జ్వలః :- దయాయా = ఉదయః. దయోదయః, దయోదయేన ఉజ్జ్వలః = దయోదయోజ్జ్వలః.

భావము :

ధర్మశాస్త్రరహస్యవేత్తలగు రాజులు సైతము వేటను నిందించలేదు. కావున సుక్షత్రియుడవగు నీకు వేట ధర్మము, కాన నీవు నన్నుపట్టుట నీవు చేయవలసిన నీ ధర్మమగు వేటయగుచున్నది. కావున నీవు నీ ధర్మమునుఁ జేయబూనితివి. అందువలన నిదింపనవసరము లేదు గదా కాని, మన్మథునివలె సుందర దేహుఁడవగు నీ దర్శనము చేతనే నీ ధర్మ హృదయము గోచరించు చున్నది. నీవు నన్ను పట్టుకొనియు మరల నన్ను విడచుటయనునది నీ కృపామహిమచే నిర్మలమైన ధర్మము కాన నిట్టి ధర్మపరుడవగు నిన్ను మరలఁ బొందుట కుత్సాహముగల్గినది, ఇట్టి ధర్మమూర్తి వైన నీవు ఆకారముతోడనే సుందరుఁడవుగాదు మతే మన, ధర్మముతోఁడను సుందరుఁడవు.

శ్లో॥ అబలస్వకులాశినో ఝషాన్
నిజనీడ ద్రుమపీడినః ఖగాన్।
అనవద్యతృణాదినోమృగా
న్మృగయాఽఘాయ న భూభృతాంఘ్నతాం॥ ౧౦

ప. వి అబలస్వకులాశినః । ఝషాన్ । నిజనీడ ద్రుమపీడినః । ఖగాన్ । అనవద్యతృణాదినః । మృగాన్ । మృగయా । అఘాయ । న । భూభృతాం । ఘ్నతాం।

టీక॥ అబల = దుర్బలమైన స్వకుల = తనకులమునందుఁ బుట్టిన వానిని, ఘాతినః = చంపుచున్న ఝషాన్ = చేపలను నిజనీడ ద్రుమపీడినః, నిజ తమదైన నీడ = గూండ్లకు ఆశ్రయమైన ద్రుమ = వృక్షములను, పీడినః = తెట్టవేయుట పండ్లను తినుటమున్నగు వానితో పీడించుచున్న ఖగాన్ = పక్షులను, అనవద్యతృణాదినః, అనవద్య = నిరపరాధములగు తృణ = గడ్డిపోచలను, అదినః = తినుచున్న మృగాన్ = మృగములను. ఘ్నతాం = చంపుచున్న భూభృతాం = రాజులకు మృగయా = వేట అఘాయ = పాపము కొఱకు న = కాదు,

సమాసములు :

అబలస్వకులాశినః :- అవిద్యమానం బలం యస్య తత్-అబలం, స్వస్య కులం = స్వకులం, అబలం చ తత్ స్వకులం చ = అబలస్వకులం, అబల స్వకులమశ్నంతీతి = అబలస్వకులాశినః తాన్, అబలస్వకులాశినః. నిజనీడద్రుమ పీడినః :- నిజానిచ తాని నీడాని చ = నిజనీడాని, నీడా నాం ద్రుమాః నిజనీడద్రుమాః, నిజనీడద్రుమం పీడయంతీతి = నిజనీడ ద్రుమపీడినః = తాన్ నిజనీడద్రుమపీడినః.

అనవద్యతృణాదినః :- న విద్యతే అవద్యం యేషాం తాని = అనవద్యాని, అనవద్యాని చ తాని తృణానిచ = అనవద్యతృణాని. అనవద్యతృణాన్యదం తీతి = అనవద్యతృణాదినః, తాన్ అనవద్యతృణాదినః-

భావము :-

బలహీనమైన తనకులమును తినుచున్న చేపలను, తమ గూండ్ల చెట్లను తెట్టలు వేయుట మున్నగు పనులతో మలినపఱచు పక్షులను, నిరపరాధములైన గడ్డి పోచలనుఁ దిని హింసించెడి మృగములను చంపుచున్నటువంటి రాజులకు వేట పాపముగాదు. కావ నేను గూడ నట్టి పక్షి జాతికిఁ జెందితినిగాన, నన్ను నీవు పట్టుకొనుట యధర్మము గాదు. క్షత్రియ ధర్మమునే నీవు పాటించితివి. పైగా నన్ను చంపక వదలి పెట్టి నీ దయార్ద్ర హృదయమునుఁ బ్రకటించితివి.

శ్లో॥ యదవాదిషమప్రియం తవ ।
ప్రియమాధాయ నునుత్సురస్మి తత్ ।
కృతమాతప సంజ్వరం తరో
రభివర్ష్యాఽమృతమంశు మానివ ॥ ౧౧

ప. వి యత్ । అవాదిషమ్ । అప్రియం । తవ । ప్రియమ్ । ఆధాయ । నునుత్సుః । అస్మి । తత్ । కృతమ్ । ఆతపసంజ్వరం । తరోః । అభివర్ష్య । అమృతమ్ । అంశుమాన్ । ఇవ ।

టీక॥ తవ = నీకు యత్ = ఏ అప్రియం = అనిష్టమును అవాదిషమ్ = పలికితినో, ప్రియమ్ = ఇష్టమయిన విషయమును, ఆధాయ = చేసి తత్ = ఆ అనిష్టమును తరోః = వృక్షమునకు, కృతం = చేయఁబడిన, ఆతపసంజ్వరం = ఎండవేడిమిని. అమృతం = జలమును, అభివర్ష్య = వర్షించి అంశుమానివ = సూర్యుఁడువలె నునుత్సుః = పోఁగొట్టఁగోరిన వాడనుగ, అస్మి అగుచున్నాను.

సమాసములు :-

నునుత్సుః :- నోత్తుమిచ్ఛుః = నునుత్సుః-

ఆతపసంజ్వరః :- ఆతపస్య సంజ్వరః, ఆతపసంజ్వరః = తం ఆతపసంజ్వరమ్-

అంశుమాన్ :- అంశవః అస్య సంతీతి = అంశుమాన్

భావము :

ఓ రాజా ! నీవు నన్నుఁ బట్టినపుడు తొందరఁబడి నీ విషయమున కఠినముగ మాట్లాడి నీకప్రియముగావించితిని. సూర్యుడు చెట్టును తన యెండచే కాల్చి తర్వాత వర్షమను నమృతముతోఁ జల్లఁబఱచి దానికి మేలు జేయునట్లు నేనును నీకు ప్రియమైన కార్యము గావించి, తొలుతనేఁ జేసిన యపచారమునుఁ దొలగించుకొనఁగోరుచున్నాను,

శ్లో॥ ఉపనమ్రమయాచితం హితం
పరిహర్తుం న తవాపి సాంప్రతం।
కరకల్పజనాంతరాద్విధే
శ్శుచితః ప్రాపి స హి ప్రతిగ్రహః॥ ౧౨

ప. వి. ఉపనమ్రమ్। అయాచితం। హితం। పరిహర్తుం। న। తవ। అపి। సాంప్రతమ్। కరకల్పజనాంతరాత్। విధేః। శుచితః। ప్రాపి। సః। హి। ప్రతిగ్రహః.

టీక॥ అయాచితం = యాచింపఁబడనిదై ఉపనమ్రమం = తనయంతట లభించిన, హితం = ఇహపరలోకముల కుపకరించునట్టి విషయము. తవాఽపి = నీకును పరిహర్తుం = వలదని చెప్పుటకు న సాంప్రతం = యుక్తము గాదు. హి = ఏలయనగా, సః = ఆ ప్రతిగ్రహః = గ్రహింపఁబడు వస్తువు కరకల్పజనాంతరాత్ = కరకల్ప = హస్తమునకు బదులుగా నేర్పడిన జనాంతరాత్ = మఱియొకవ్యక్తిగల, శుచితః = పవిత్రమైన విధేః = దైవమువలన ప్రాపి = పొందఁబడినది,

సమాసములు :

అయాచితమ్: నయాచితమ్ = అయాచితమ్, తత్ = అయాచితమ్.

కరకల్పజనాంతరాత్: కరేణ ఈషత్సదృశం = కరకల్పం, అన్యఃజనః జనాంతరం = కరకల్పం చ తత్ జనాంతరంచ = కరకల్పజనాంతరం, తస్మాత్ = కరకల్పజనాంతరాత్.

భావము :

ఓ రాజా! యాచింపక తనంతట తానుగ నుపలబ్ధమైనదై, ఇహపర లోకములలో నుపకరించునట్టి వస్తువును, వలదని పరిహరించుట నీకును యుక్తముగాదు. ఏల యనగా- ఆగ్రహింపఁబడు వస్తువు తనకు హస్తముగ మనుష్యులను నాపకార్థము నియమించుకొనిన పవిత్రమగు దైవమునుండియే లభించుచున్నది. కాన దైవమే దాత. నేను కేవలము ఆ దైవమునకుసాధనము. కావున నీకు అ ధనములను యాచించుటవలని లోపములేదు.

శ్లో॥ పతగేన మయా జగత్పతే
దుపకృత్యై తవ కిం ప్రభూయతే।
ఇతి వేద్మి న తుత్యజంతి మాం
తదపి ప్రత్యుపకర్తుమార్తయః॥ ౧౩

ప। వి। పతగేన। మయా। జగత్పతేః। ఉపకృత్యై। తవ। కిం। ప్రభూయతే। ఇతి। వేద్మి। న। తు। త్యజంతి। మా। తత్। అపి। ప్రత్యుపకర్తుమ్। ఆర్తయః.

టీక॥ పతగేన = పక్షిమాత్రమైన, మయా = నాచే, జగత్పతేః = సార్వభౌముడవైన, తవ = నీయొక్క, ఉపకృత్యై = ఉపకారముకొఱకు, ప్రభూయతే కిం = శక్యమగునా ఏమి? ఇతి = అని, వేద్మి = తెలిసికొనుచున్నాను, తదపి = అయినను, ఆర్తయః = (నీవు తొలగించిన) నా బాధలు, మాం = నన్ను, ప్రత్యుపకర్తుం = ప్రత్యుపకారము చేయుటకు. న త్యజంతి = విడుచుటలేదు.

సమాసములు :

జగత్పతేః : జగతాం, పతిః = జగత్పతిః = తస్య జగత్పతేః,

**భావము :**

పక్షిమాత్రమైన నేను సార్వభౌముడవైన నీకేమి యుపకారముఁజేయగలనను సంగతి నాకునుఁ దెలుసును. కాని, నీవు దయతో నా బాధలనుఁ దొలగించితివి అవి యిప్పు దేవిధముగనైనను నీకుఁ బ్రత్యుపకారము గావించి కృతజ్ఞతను వెల్లడించుటకు నను పురికొల్పుచున్నవి. కాన, పక్షియైన నేను, మహోపకారము గావించిన నీకు మహోపకారము గావించగలను.

శ్లో॥ అవిరాదుపకర్తురాచరే
దథవాత్మౌపయికీము పక్రియామ్।
పృథురిత్థమథాణురస్తు సా
న విశేషే విదుషా మిహ గ్రహః॥ ౧౪

ప। వి। అచిరాత్ । ఉపకర్తుః । ఆచరేత్ । అథవా । ఆత్మౌపయికీమ్ । ఉపక్రియాం । పృథుః । ఇత్థమ్ । అథ । అణుః । అస్తు । సా । న । విశేషే। విదుషామ్ । ఇహ । గ్రహః ।

టీక॥ అథవా = లేదా, ఉపకర్తుః = ఉపకారముచేయువానికి, అచిరాత్ = శీఘ్రముగా, ఆత్మౌపయికీం = ఆత్మ = తనసంబంధముగల, ఔపయికీం = ఉపాయసాధ్యమైన, ఉపక్రియాం = ఉపకారము. ఆచరేత్ = ఆచరింపవలయును, ఇత్థం = ఇట్లు ఆచరించుపక్షమున, సా = ఉపకారము, పృథుః = పెద్దదిగాని, అణుః = స్వల్పముగాని, అస్తు = కానిమ్ము, విదుషాం = వివేకవంతులకు, ఇహ = ఈ, విశేషే = కొద్ది గొప్ప యను భేదమందు గ్రహః = పట్టుదల, న = లేదు.

సమాసములు:

ఆత్మౌపయికీ: ఉపాయ ఏవ = ఔపయికః, ఆత్మన ఔపయికః, ఆత్మౌపయికః. ఆత్మౌపయికాత్, ఆగతా = ఆత్మౌపయికీ, తాం = ఆత్మౌపయికీం.

భావము :

ఓ రాజా! ఉపకారము చేసినవానికి, తనకు సాధ్యమైన ప్రత్యుపకారమును దాను వెంటనే చేయవలయును. ఆ యుపకారము కొంచమైనను, గొప్పదైనను సరియే. దాని కొద్దిగొప్పలవిషయమున విద్వాంసులకు పట్టుదల యెప్పటికిని యుండదు.

శ్లో॥ భవితా న విచారచారుచే
త్తదపి శ్రవ్యమిదం మదీరితమ్।
ఖగవాగియమిత్యతోఽపి కిం,
న ముదం దాస్యతి కీరగీరివ॥ ౧౫

ప। వి। భవితా । న । విచారచారు । చేత్ । తత్ । అపి । శ్రవ్యమ్ । ఇదం । మదీరితం । ఖగవాక్ । ఇయమ్ । ఇతి । అతః । అపి । కిం । న । ముదం । దాస్యతి । కీరగీః । ఇవ।

టీక॥ ఇదం = ఇప్పుడు నేను చెప్పగల, మదీరితం = నామాట, విచారచారుః విచార = విమర్శయందు. చారు = రమ్యమయినదిగ, న భవితా చేత్ = కానియెడల, తదపి = అట్లయినను, శ్రవ్యమ్ = వినఁదగినది, ఇయం = ఇది, ఖగవాక్ = పక్షిమాట, ఇత్యతోఽపి = ఈ కారణమువలనను, కీరగిరివ = చిలుకపలుకులువలె, ముదం = సంతోషమును, న దాస్యతి కిమ్ ఈయఁజాలదా ?

సమాసములు :

విచారచారు: విచారేచారు = విచారచారు.
మదీరితమ్: మమ ఈరితమ్ = మదీరితమ్.
ఖగవాక్: ఖగస్య వాక్ = ఖగవాక్.
కీరగీః : కీరస్య గీః = కీరగీః

భావము :

ఓ రాజా! నాపలుకులు, విమర్శించినపుడు రమ్యములు గాకపోయినను తప్పక వినఁదగినవి. ఏలయనగా చిలుకపలుకులవలె పక్షివచనములు వినుట కింపుగ నుండగలవు. కాన నెట్టిప్రయోజనము లేకపోయినను వినోదముకొఱకైనను వినవచ్చును.

శ్లో॥ స జయత్యరిసార్థసార్థకీ
కృతనామా కిల భీమభూపతిః ।
యమవాప్య విదర్భభూః ప్రభుం
హసతి ద్యామపి శక్రభర్తృకామ్॥ ౧౬

ప। వి। సః। జయతి । అరిసార్థసార్థకీకృతనామా । కిల । భీమభూపతిః । యమ్ । అవాప్య । విదర్భభూః । ప్రభుం । హసతి । ద్యామ్ । అపి । శక్రభర్తృకామ్ ।

టీక॥ అరిసార్థసార్థకీకృతనామా; అరిసార్థ = శత్రుసమూహమందు, సార్థకీకృత = అర్థవంతముగఁజేయఁబడిన, నామా = నామధేయముగల్గిన, సః = ఆ, భీమభూపతిః = భీమరాజు, జయతి కిల = సర్వాతిశాయిగ

నున్నాఁడు, విదర్భభూః = విదర్భదేశము, యం = ఎవని, ప్రభుం = రాజుగ, అవాప్య = పొంది, శక్రభర్తృకాం = ఇంద్రుఁడు ప్రభువుగాగల, ద్యామపి = స్వర్గమును సైతము, హసతి = పరిహసించుచున్నది.

ఇచ్చట 'విదర్భభూఃద్యాం హసతి' యని విదర్భదేశము స్వర్గమును పరిహసించుచున్నదని స్వర్గపరిహాససంబంధము లేకపోయినను, స్వర్గపరిహాససంబంధము చెప్పినందువలన, సంబంధాతిశయోక్తి.

సమాసములు :

**అరిసార్థసార్థకీకృతనామా:** అరీణాం సార్థాః = అరిసార్థాః, అర్థేన సహ వర్తత ఇతి = సార్థకం అసార్థకం సార్థకం సద్యోద్యమానం కృతం = సార్థకీకృతం అరిసార్థేషు సార్థకీకృతం నామ యస్య సః = అరిసార్థసార్థకీకృతనామా.

భీమభూపతిః : బిభ్యత్యస్మాదితి = భీమః, భీమ ఇతి భూపతిః = భీమభూపతిః

విదర్భభూః: విదర్భాణాంభూః = విదర్భభూః

శక్రభర్తృకామ్: శక్రఃభర్తా యస్యాసా = శక్రభర్తృకా, తాం, శక్రభర్తృకామ్.

భావము :

ఓ రాజా! శత్రువులకు భయంకరుఁడగుటవలన భీముఁడనుఁ బేరుపొందిన రాజొకఁడు తక్కినరాజుల నందఱిని మించియున్నాఁడు. అతనిని రాజుగాఁబడసిన విదర్భదేశము, ఇంద్రుని రాజుగాఁబడసిన స్వర్గమునుఁగూడఁ బరిహసించుచున్నది.

శ్లో॥ దమనాదమనాక్ప్రసేదుష
స్తనయాం తథ్యగిర స్తపోధనాత్।
వరమాప స దిష్టవిష్టప
త్రితయానన్యస దృగ్గుణోదయామ్॥ ౧౭

ప. వి. దమనాత్ । అమనాక్ । ప్రసేదుషః । తనయాం। తథ్యగిరః । తపోధనాత్।
వరమ్ : ఆప । సః । దిష్టవిష్టపత్రితయానన్యసదృగ్గుణోదయామ్ ।

టీక॥ సః = ఆ భీమభూపతిః = భీమరాజు, అమనాక్ = అధికముగ, ప్రసేదుషః = ప్రసన్నుడైన, దమనాత్ = దమనుఁడనుఁ బేరుగల, తథ్యగిరః = సత్యవచనముగల, తపోధనాత్ = ఋషినుండి, దిష్టవిష్ట పత్రితయానన్య సదృగ్గుణోదయామ్; దిష్ట = కాలముల యొక్కయు, విష్టప = లోకముల యొక్కయు, త్రితయ = మూటిలోను, అనన్యసదృక్ = ఇతరులకు సాటిలేని, గుణోదయామ్ = గుణాతిశయముగల, తనయాం = కుమార్తెను, వరమ్ = వరముగ, ఆప = పొందెను.

సమాసములు :

తథ్యగిరః:— తథ్యా—గీఃయస్య సః = తథ్యగీః = తస్మాత్ = తథ్యగిరః -
తపోధనాత్:— తప ఏవ ధనం యస్య సః = తపోధనః తస్మాత్ తపోధనాత్.

దిష్టవిష్టపత్రితయానన్య సదృగ్గుణోదయామ్ :— దిష్టాని, చ, విష్టపాని చ = దిష్టవిష్టపాని, త్రయాణాం సమూహః = త్రితయం, దిష్టవిష్టపానాం త్రితయం, దిష్టవిష్ట పత్రితియమ్, అన్యః సదృక్ = యస్య సః = అన్యసదృగ్, అన్యసదృక్ న భవతీతి = అనన్యసదృక్, గుణస్య ఉదయః = గుణోదయః, అనన్యసదృక్ గుణోదయః యస్యాసా అనన్యసదృగ్గుణోదయా, దిష్టవిష్టపత్రితయే, అనన్యసదృగ్గుణోదయా, తామ్, అనన్యసదృగ్గుణోదయామ్.

భావము :

ఆ భీమరాజు, తప యుపాసనచే, మిక్కిలి ప్రసన్నుడైన సత్యవాక్కుగల దమనమహర్షి వలన మూడు కాలములలోను మూడులోకముల యందును సాటిలేని గుణములు గల కుమార్తెను వరముగా బడసెను.

శ్లో॥ భువనత్రయ సుభ్రువామ సౌ
దమయంతీ కమనీయతామదమ్ ।
ఉదియాయ యత స్తనుశ్రియా
దమయంతీతి తతోఽభిధాం దధే॥ ౧౮

ప. వి. భువనత్రయ సుభ్రువామ్ । అసౌ । దమయంతీ । కమనీయతామదమ్ । ఉదియాయ । యతః । తనుశ్రియా । దమయంతీ । ఇతి । తతః । అభిధాం । దధే।

టీక॥ అసౌ— ఈ ఋషిప్రసాదమునఁ బొందఁబడిన కుమార్తె యతః — ఎందువలన, తనుశ్రియా — తన శరీర సౌందర్యముచే భువనత్రయ సుభ్రువాం; భువనత్రయ — ముజ్జగములలోని, సుభ్రువాం — సుందరులయొక్క కమనీయతామదం — కమనీయతా — రామణీయకమువలని, మదం — గర్వమును దమయంతీ — నశింపఁజేయుచు, ఉదియాయ — జన్మించినదో. తతః — అందువలననే, దమయంతీ ఇతి — దమయంతియను, అభిదాం — పేరును, దధే — దాల్చెను.

"కమనీయతాం దమయంతీతి" యని సౌందర్యమదమును నశింపఁజేయుట వలన దమయంతియని పేరు పొందినట్లు దమయంతీ శబ్దమును నిర్వచించుట వలన, నిరుక్త్యలంకారము.

సమాసములు :

భువనత్రయ సుభ్రువామ్;— భువనానాం త్రయం, భువనత్రయమ్, శోభనే భ్రువౌ యాసాం తాః — సుభ్రువః భువనత్రయే సుభ్రువః — భువనత్రయసుభ్రువః, తాసాం, భువనత్రయసుభ్రువామ్.

దమయంతీ :— దమయతీతి — దమయంతీ.

కమనీయతామదమ్ :— కమనీయతాయాః మదః — కమనీయతామదః — తమ్, కమనీయతామదమ్.

తనుశ్రియా :— తనోః శ్రీః — తనుశ్రీః — తయా తనుశ్రియా.

భావము :

దమనఋషి ప్రసాదమున లబ్ధమయిన, ఈ దమయంతి, ముజ్జగములలోని సౌందర్యవతుల సౌందర్యగర్వమును తన సౌందర్యముచే నశింపఁజేయుట వలన, దమయంతి యను పేరు వడసినది.

శ్లో॥ శ్రియమేవ పరం ధరాధిపా
ద్గుణసింధోరుదితామవేహి తామ్।
వ్యవధావపి వా విధోః కళాం
మృడచూడానిలయాం న వేద కః॥ ౧౫

ప. వి. శ్రియమ్ । ఏవ । పరం । ధరాధిపాత్ । గుణసింధోః । ఉదితామ్ । అవేహి తామ్ । వ్యవధౌ । అపి । వా । విధోః । కళాం । మృడచూడానిలయాం । న । వేద । కః ।

టీక॥ హే నృప = ఓరాజా తాం = ఆ దమయంతిని గుణసింధోః = గుణసముద్రుడైన ధరాధిపాత్ = భూమికిఁ బ్రభువైన భీమనృపతినుండి, ఉదితాం = పుట్టిన శ్రియమేవ = సాక్షాల్లక్ష్మినిగా, పరం = నిశ్చయముగ అవేహి = తెలిసికొనుము. వ్యవధావపి = చంద్రునికి తన కళతో దూరమున్నను, మృడచూడానిలయాం, మృడ = శివునియొక్క చూడా = = శిఖయే నిలయాం = నివాసస్థలముగ గల్గిన విధోః = చంద్రుని కళను కోవా = ఎవ్వఁడు న వేద = తెలిసికొనుటలేదు.

శివుని శిరమందలి కళ చంద్ర సంబంధము లేక పోయినను చంద్రకళయైనట్లు, భీమభవన మందు జన్మించి సముద్ర సంబంధము లేనిదైనను దమయంతి లక్ష్మియే యని యిచ్చట సౌందర్యాతిశయోక్తి.

ఇచ్చట లక్ష్మికిని కళకును, రెండు వాక్యములలో రాజును శివునిఁ బేర్కొని వానిని బింబ ప్రతిబింబ భావముచే సామాన్య ధర్మముగ నిర్దేశించుట వలన దృష్టాంతాలంకారము.

సమాసములు ;

ధరాధిపాత్ :– ధరాయాః అధిపః = ధరాధిపః = తస్మాత్ = ధరాధిపాత్

గుణసింధోః :– గుణానాం సింధుః = గుణసింధుః = తస్మాత్ = గుణసింధోః,

మృడచూడానిలయాం :- మృడస్య - చూడా = మృడచూడా మృడచూడైవ నిలయః యస్యాస్సా = మృడచూడానిలయా = తాం = మృడచూడానిలయాం.

భావము :

ఓరాజా! గుణసముద్రుఁడైన ఆ భీమప్రభువు నుండి జన్మించిన లక్ష్మినిగా నా దమయంతిని తెలిసికొనుము. చంద్రుని సంబంధము లేక శివుని జటాజూటము నలంకరించిన కళను చంద్రకళయని యెవరు తెలుసుకొనరు ! అట్లే సముద్ర సంబంధము లేక భీమనృపతి గృహమునందీమె జన్మించినను, నీమె నిజముగా లక్ష్మియే యని భావింపవలయును.

శ్లో॥ చికురప్రకరాజయంతి తే
విదుషీ మూర్ధని సా బిభర్తి యాన్ ।
పశునాఽప్య పురస్కృతేనత
త్తులనామిచ్ఛతు చామరేణ కః॥ ౨౦

వ. వి. చికురప్రకరాః । జయంతి । తే । విదుషీ మూర్ధని । సా । బిభర్తి ।యాన్। పశునా । అపి । అపురస్కృతేన । తత్తులనామ్ । ఇచ్ఛతు। చామరేణ । కః।

టీక॥ తే = ఆ చికురప్రకరాః = నెరుల మొత్తములు జయంతి = జయించుచున్నవి, అన్నింటిని మించియున్నవని యర్థము యా = ఏనెరులను, విదుషీ = విశేషజ్ఞురాలైన సా = ఆదమయంతి మూర్ధని = తలపై బిభర్తి = తాల్చుచున్నదో (అతఏవ = కావుననే) పశునాపి = తిర్యగ్జంతువైన చమరీమృగముచేతను, అపురస్కృతేన = ముందుంచు కొనఁబడని, (ఆదరింపఁబడని) చామరేణ = చమరీ మృగముయొక్క తోకతో, తత్తులనాం; తత్ = ఆ నెరులయొక్క తులనాం = సామ్యమును, కః = ఎవ్వఁడు ఇచ్ఛతు = కోరును.

ఇచ్చట 'అపురస్కృతేన' యని పురస్కరించుకొనఁబడక పోవుట యను పదార్థము, సామ్యమును నిషేధించుటకు హేతువుగఁ జెప్పఁబడుట వలన నిట పదార్థహేతుకమగు కావ్యలింగాలంకారము.

సమాసములు :

చికురప్రకరాః :- చికురాణాం ప్రకరాః = చికురప్రకరాః

అపురస్కృతేన :- న పురస్కృతః = అపురస్కృతః = తేన = అపురస్కృతేన.

తత్తులనామ్ :- తేషాం తులనా = తత్తులనా = తాం = తత్తులనామ్.

భావము :

విదుషీమణియగు దమయంతి తలపైని నెరులు సర్వవిధములుగను విజయమునంది యన్నింటి నతిశయించి యున్నవి. పశువైన చమరీ మృగము గూడ ముందుంచుకొనక నిర్లక్ష్యముగావించిన దాని తోకతో, నా దమయంతి నెరులకు సామ్యమెవ్వఁడును గోరఁడు.

శ్లో॥ స్వదృశోర్జనయంతి సాన్త్వనాం
ఖురకండూయనకైతవాన్మృగాః ।
జితయోరుదయత్ప్రమీలయో
స్తదఖర్వేక్షణశోభయా భయాత్॥ ౨౧

ప. వి. స్వదృశోః । జనయంతి । సాన్త్వనాం । ఖురకండూయనకైతవాత్ । మృగాః । జితయోః । ఉదయత్ప్రమీలయోః । తదఖర్వేక్షణ శోభయా । భయాత్ ।

టీక॥ మృగాః = జింకలు, తదఖర్వేక్షణ శోభయా: తత్ = ఆ దమయంతి యొక్క అఖర్వ = పొడవైన, ఈక్షణ = నేత్రములయొక్క శోభయా = సౌందర్యముచే, జితయోః = జయింపఁబడినవై (అతఏవ = ఇందువలననే) భయాత్ = భయమువలన, ఉదయత్ప్రమీలయోః: ఉదయాత్ = సంభవించిన ప్రమీలయోః = కనుమోడ్పుఁ గల్గిన, స్వదృశోః = తన నేత్రములకు, ఖురకండూయన కైతవాత్; ఖుర = గిట్టలచే కండూయన = గోకుటయొక్క కైతవాత్ = నెపము వలన, సాంత్వనాం = ఓదార్పును జనయంతి = కల్గించుచున్నవి.

ఇచ్చట "ఖురకండూనాయనకైతవాత్" అను కైతవశబ్దముచే కండూయనత్వమును నిషేధించి యందు సాంత్వనాత్వము నారోపించుట వలన అపహ్నవాలంకారము.

సమాసములు :

స్వదృశోః:- స్వేషాం దృశౌ, స్వదృశౌ, తయోః స్వదృశోః.

ఖురకండూయనకైతవాత్ :- ఖురైః కండూయనం = ఖురకండూయనం, ఖురకండూయనమేవ కైతవం = ఖురకండూయనకైతవమ్, తస్మాత్ ఖురకండూయనకైతవాత్.

ఉదయత్ప్రమీలయోః :, ఉదయన్-ప్రమీలః యయో స్తే = ఉదయత్ప్రమీలే. తయోః = ఉదయత్ప్రమీలయోః.

తదక్ష్వేక్షణశోభయా :- అక్ష్వే చ తే ఈక్షణే చ అక్ష్వేక్షణే తయోః అక్ష్వేక్షణే = తదక్ష్వేక్షణే, తదక్ష్వేక్షయోః శోభా = తదక్ష్వేక్షణశోభా, తయా తదక్ష్వేక్షణశోభయా.

భావము :

ఆ దమయంతియొక్క విశాల నేత్రముల సౌందర్యముచే తమ నేత్రములకు ఓటమి యేర్పడుటవలన నవి మూసుకొనినవి. అట్టి తమ నేత్రములను మృగములు గిట్టంతో గోకుచు నోడిపోయిన యా నేత్రములను గోకుట యను నెపముతో నోదార్చుచున్నవి. లోకమునం దోడిపోయినవారు భయముతో కనుల మూసి కొందురు వారిని తమ యాప్తజనులు, చేతులతో స్పృశించుట మున్నగు వానితో భయముం దొలగించి యోదార్చుట ప్రసిద్ధి. అవ్విధముగనే మృగములిట భయముచే మూయబడిన తమ నేత్రముల నోదార్చినవి.

శ్లో॥ అపి లోకయుగం దృశావపి
శ్రుతదృష్టా రమణీ గుణా అపి।
శ్రుతిగామితయా దమస్వసు
ర్వ్యతిభాతే సుతరాం ధరాపతే॥ ౨౨

ప। వి। అపి । లోకయుగం । దృశౌ । అపి । శ్రుతదృష్టాః । రమణీగుణాః । అపి । శ్రుతిగామితయా । దమస్వసుః । వ్యతిభాతే । సుతరాం । ధరాపతే।

టీక॥ హే ధరాపతే! = ఓ నలమహారాజా, దమస్వసుః = దముని చెల్లెలైన దమయంతియొక్క, లోక యుగమపి = తల్లిదండ్రుల కులములు రెండును, శ్రుతిగామితయా = వేదములయందు ప్రసిద్ధమగుటచేత, సుతరాం = మిక్కిలి, వ్యతిభాతే = ఒకటినొకటి మించి ప్రకాశించుచున్నది, (తథా = అట్లు), దృశావపి = నేత్రములు రెండును, శ్రుతిగామితయా, = కర్ణములను బొందుటచేత అనగా కర్ణాంత విశ్రాంతములగుటచేత, వ్యతిభాతే = ఒండొంటినిమించి ప్రకాశించుచున్నది, (తథా = అట్లే) శ్రుతదృష్టాః; శ్రుత = వేదములయందు ప్రసిద్ధములును, దృష్టాః = లోక ప్రసిద్ధములునగు రమణీగుణాః = కులస్త్రీ ధర్మములును, శ్రుతిగామితయా = జనశ్రుతిం బొందుటవలన, సుతరాం = మిక్కిలి, వ్యతిభాతే = ఒండొంటినిమించి ప్రకాశించుచున్నవి.

ఇచ్చట లోక యుగమునకును, నేత్రములకును, రమణీ గుణములకును 'శ్రుతిగామిత్వ' మను నేక ధర్మాన్వయముచే సామ్యము సిద్ధమగుటవలన తుల్యయోగితా లంకారము. ఆ మూడు నిటం బ్రకృతములగుటవలన, ప్రకృత విషయమగు తుల్యయోగిత.

సమాసములు :

లోకయుగమ్:- లోకయోః యుగం = లోకయుగమ్.

శ్రుతదృష్టాః :- శ్రుతాశ్చ తే దృష్టాశ్చ = శ్రుతదృష్టాః.

రమణీగుణాః :- రమణ్యాః గుణాః = రమణీగుణాః, రమణీనాం గుణాః = రమణీగుణాః.

శ్రుతిగామితయా:- శ్రుతిం గచ్ఛతీతి = శ్రుతిగామి = శ్రుతిగామినః, భావః = శ్రుతిగామితా, తయా శ్రుతిగామితయా.

శ్రుతీ గచ్ఛత ఇతి = శ్రుతిగామినీ, శ్రుతిగామిన్యోః భావః = శ్రుతిగామితా = తయా, శ్రుతిగామితయా.

దమస్వసుః :- దమస్య స్వసా = దమస్వసా తస్యాః = దమస్వసుః.

ధరాపతే :- ధరాయాః పతిః = ధరాపతిః తస్య సంబుద్ధిః (హే) ధరాపతే

భావము :

ఓ నలమహారాజా! ఆ దమయంతియొక్క తల్లిదండ్రుల కులములు రెండును శ్రుతిగాములు, అనగా వేదప్రసిద్ధములు. ఆమె నేత్రములు రెండును శ్రుతిగాములు. అనగాపొడవులై కర్ణాంత విశ్రాంతములు, ఆ రమణి గుణములు గూడ శ్రుతిగాములు, అనగా ప్రసిద్ధ స్త్రీ ధర్మము లగుటవలన జనుల చెవులకు సోకినవి. ఇట్లా దమయంతియొక్క లోకయుగము, నేత్రయుగము స్త్రీ ధర్మములు మూడును శ్రుతిగాములై యొండొంటినిమించి ప్రకాశించుచున్నవి.

శ్లో॥ నలిన మ్మలినం వివృణ్వతీ
పృషతీమ స్పృశతీ తదీక్షణే ।
అపి ఖంజనమం జనాంచితే
విదధాతే రుచిగర్వదుర్విధమ్॥ ౨౩

ప। వి। నలినం । మలినం । వివృణ్వతీ । పృషతీమ్ । అస్పృశతీ । తదీక్షణే । అపి । ఖంజనమ్ । అంజనాంచితే । విదధాతే । రుచిగర్వ దుర్విధమ్।

టీక॥ నలినం = పద్మమును, మలినం = అసుందరముగ, వివృణ్వతీ = వ్యాఖ్యానించునవియు, పృషతీం = ఆడజింకను, అస్పృశతీ = సమానత్వము లేనందువలన ముట్టనవియు నగు, తదీక్షణే = ఆమె నేత్రములు, అంజనాంచితే, అంజన = కాటుకచే, అంచితే = అలంకరింపఁబడినవై ఖంజనం = కాటుకపిట్టను, రుచిగర్వ దుర్విధమ్; రుచిగర్వ = సౌందర్యగర్వమున, దుర్విధం = శూన్యమయినదిగ విదధాతే = చేయుచున్నవి.

ఇచ్చట నేత్రములకు పద్మాది మలినీకరణాది సంబంధము లేకపోయినను నది యున్నట్లు వర్ణించినందువలన సంబంధాతిశయోక్త్యలంకారము. ఆ సంబంధాతిశయోక్తిచే నేత్రములకు పద్మాది సామ్యము సిద్ధించుటవలన. సంబంధాతిశయోక్త్యలంకారముచే నుపమాలంకార ధ్వని.

సమాసములు :-

అస్పృశతీ:- న స్పృశతీ = అస్పృశతీ.
తదీక్షణే:- తస్యాః ఈక్షణే = తదీక్షణే.
అంజనాంచితే:- అంజనేన అంచితే = అంజనాంచితే.
రుచిగర్వదుర్విధమ్:- రుచేః గర్వః = రుచిగర్వః, రుచిగర్వే దుర్విధః = రుచిగర్వ దుర్విధః, తం = రుచిగర్వ దుర్విధమ్.

భావము :

ఆ దమయంతి కనులు, పద్మము మలినమని వ్యాఖ్యానము చేయుచున్నవి. అవి ఆడుజింక సమానముగానందువలన దూరమునుండియే పరిహరించుచున్నవి. మఱియు నవి కాటుకపిట్టను పట్టియున్న సౌందర్య గర్వమును౭ దొలగించుచున్నవి. ఇట్లు చెప్పుటవలన దమయంతి కనులు, పద్మములను, ఆడుజింకల కనులను కాటుకపిట్టను౭ బోలి యున్నవని యభిప్రాయము.

శ్లో॥ అధరం కిల బింబనామకం
ఫల మస్మాదితి భవ్యమన్వయమ్।
లభతేఽధరబింబ మిత్యదః
పదమస్యా రదనచ్ఛదం వదత్॥ ౨౪

ప। వి। అధరం । కిల । బింబనామకం । ఫలమ్ । అస్మాత్ । ఇతి । భవ్యమ్ । అన్వయం । లభతే । అధరబింబమ్ । ఇతి । అదః । పదమ్ । అస్యాః । రదనచ్ఛదం । వదత్.

టీక॥ అధరబింబమ్ = దొండపండువంటి పెదవి యను నర్థముగల, అదః = ఈ పదం = పదము, అస్యాః = ఈ దమయంతియొక్క, రదనచ్ఛదం = పెదవిని, అభిదధత్ = చెప్పుచు, బింబనామకం = బింబమను, అనగా దొండపండను పేరుగల, ఫలం = ఫలము; అస్మాత్ = ఈ దమయంతి యొక్క పెదవికంటె, అధరం కిల = తక్కువైనదిగదా, ఇతి = అని, భవ్యం = యోగ్యమైన, అన్వయం = అన్వయమును, లభతే = పొందుచున్నది.

ఇచ్చట దమయంతియొక్క యధరమునకు బింబఫలమును దక్కువగఁజేయు సంబంధము లేకపోయినను సంబంధము జెప్పుటవలన సంబంధాతిశయోక్తి. అందువలన నీమె పెదవి దొండపండును బోలి యున్నదను నుపమ ధ్వనించుటవలన నలంకారముచే నలంకారధ్వని.

**సమాసములు :**

బింబనామకమ్:– బింబమితి నామ యస్య తత్ = బింబనామకమ్.
అధరబింబమ్:– అధరః బింబమివ = అధరబింబమ్.

**భావము :**

దొండపండువంటి యధరమను నర్థము నొసంగు నధరబింబపదము స్త్రీలపెదవులయందుఁ బ్రయోగింపఁ బడుచుండినది. అది స్త్రీలపెదవి దొండపండుతో సమాన మను నర్థ మిచ్చుచు, పెదవికి ప్రాముఖ్య మొసంగక దొండపండునకే ప్రాముఖ్య మొసంగుచుండినది. అందువలన నా యధరబింబపదము నకు సరియైన వ్యుత్పత్తిపదార్థసంబంధము లేక యుండినవి. ప్రస్తుత మా యధరబింబపదము దమయంతి పెదవిపైఁ బ్రయుక్తమై. దొండపండు దీనికంటె తక్కువ యను యోగ్యమగు వ్యుత్పత్తిపదార్థసంబంధము గల్గి యొప్పినది. అధరబింబశబ్దమును, ఇంత వఱకును అధరః బింబమివ (పెదవి దొండపండువంటిదను) నుపమితసమాసముచే స్త్రీలపెదవులు దొండపండువంటి వను నర్థ మిచ్చుచుండినది. కాని యాయర్థము సరియైనది కాదు. ఏల యనగా నందు పెదవి యుపమేయమై యుపమానమైన దొండపండుకంటెను దక్కువ కావలసి వచ్చినది. కాని దమయంతి జన్మించగనే "అధరం, బింబమస్మాత్" అని దొండపండు (బింబము) ఈ దమయంతిపెదవికంటెను, తక్కువ యైనది (అధరం) అను నర్థముతో నామె పెదవిపైఁ బ్రయోగింపఁబడి సరియైన వ్యుత్పత్తి నంద గల్గినది. అనగా దమయంతి పెదవివలన దొండపండు ఆధర మైనది, తక్కువ యైన దను నర్థ మప్పు డా శబ్దమున కేర్పడినది. ఇందు వలన దమయంతి పెదవి దొండపండును బోలిన దను నర్థము సిద్ధమై నదని యాశయము.

శ్లో॥ హృతసారమివేందుమండలం
దమయంతీవదనాయ వేధసా ।
కృతమధ్యబిలం విలోక్యతే
ధృతగంభీరఖనీఖనీలిమ॥ ౨౫

ప. వి. హృతసారమ్ । ఇవ । ఇందుమండలం । దమయంతీవదనాయ । వేధసా।
కృతమధ్యబిలం । విలోక్యతే । ధృతగంభీరఖనీఖనీలిమ ।

టీక॥ ఇందుమండలం = చంద్రమండలము, దమయంతీవదనాయ = దమయంతిముఖమును నిర్మించుటకై, వేధసా = బ్రహ్మచే, హృతసారమివ; హృత = గ్రహింపఁబడిన, సారమివ = సారమైన మధ్యభాగమును గల్గినదో యనునట్లున్నది (కుతః = ఏల యనగా) కృతమధ్యబిలం; కృత = చేయఁబడిన, మధ్యబిలం = మధ్యభాగమందలి రంధ్రముగల్గిన. ధృతగంభీరఖనీఖనీలిమ; ధృత = ధరింపఁబడిన, గంభీరఖనీఖనీలిమ; గంభీర = లోతైన, ఖనీ = రంధ్రమందలి, ఖ = ఆకాశముయొక్క, నీలిమ = నలుపు, విలోక్యతే = చూడఁబడుచున్నది.

ఇచ్చట చంద్రమండల మందలి కళంకమున కళంకత్వమును మఱుగుపఱచి దానియందు ఖనీలిమను ఆరోపించుటవలన నపహ్నవాలంకారము. అది 'కృతమధ్యబిల' మ్మను పదార్థమును హేతువుగాగల కావ్యలింగాలంకారముచే ననుప్రాణితమైనది. ఆకావ్యలింగాలంకార మూలకము 'హృతసారమివ' యను నుత్ప్రేక్ష. ఈమూటికి నిందు సంకరము. ఈ మూటిచే దమయంతీముఖము చంద్రమండలసదృశ మను నుపమాలంకారము ధ్వనించుటవలన నలంకారమూలకాలంకారధ్వని.

సమాసములు :

హృతసారమ్ :_ హృతః సారః యస్మాత్తత్ = హృతసారమ్.

ఇందుమండలమ్ : _ ఇందోః మండలమ్ = ఇందుమండలమ్.

దమయంతీవదనాయ : _ దమయంత్యాః వదనం = దమయంతీవదనం; తస్మై = దమయంతీవదనాయ.

కృతమధ్యబిలం :_ మధ్యే బిలం = మధ్యబిలం, కృతం మధ్య బిలం యస్మింస్తత్ = కృతమధ్యబిలమ్.

ధృతగంభీరఖనీఖనీలిమ:_ గంభీరా చ సా ఖనీ చ = గంభీరఖనీ. గంభీరఖన్యాః ఖం = గంభీరఖనీఖం, గంభీరఖనీఖస్య నీలిమా = గంభీరఖనీఖనీలిమా, ధృతః గంభీరఖనీఖనీలిమా యస్మింస్తత్ = ధృతగంభీరఖనీఖనీలిమ.

భావము :

బ్రహ్మ దమయంతీముఖమును సృజించుటకై చంద్రమండలమధ్య భాగ మందలి సారమును గ్రహించెనా యని భావింపఁబడుచున్నది. కావుననే యా సారమును గ్రహించుటవలనఁ జేయఁబడిన రంధ్రము వెనుక నీలా కాశము కానవచ్చుచున్నది. చంద్రమండల మందలి కళంకము వాస్తవమున కళంకము కాదు. అది సారమును గ్రహించుటవలన నేర్పడిన రంధ్రము. దాని వెనుక నున్న నీలాకాశమే యందు నల్లగాఁ గానబడుచున్నది.

శ్లో॥ ధృతలాంఛనగోమయాంచనం
విధుమాలేపనపాండరం విధిః ।
భ్రమయత్యుచితం విదర్భజా
ననీరాజనవర్ధమానకమ్॥ ౨౭

ప. వి. ధృతలాంఛనగోమయాంచనం । విధుమ్ । ఆలేపనపాండరం । విధిః । భ్రమయతి । ఉచితం । విదర్భజాననీరాజనవర్ధమానకమ్ ।

టీక॥ విధిః = బ్రహ్మ, ధృతలాంఛనగోమయాంచనమ్; ధృత = ధరింపఁ బడిన, లాంఛన = కళంక మనెడి, గోమయాంచనం = గోమయసం బంధముగలదియు, ఆలేపనపాండరమ్: ఆలేపన = తనయందలి కాంతిసుదచే, పాండరమ్ = తెల్లనివాడును నగు విధుం = చంద్రుని, విదర్భజాననీరాజనవర్ధమానకమ్: విదర్భజా = దమయంతియొక్క ఆనన = ముఖమునకు, నీరాజన = ఆరతి యొసంగెడు, వర్ధమానకం = తట్టగా, భ్రమయతి = త్రిప్పుచున్నాడు, ఉచితమ్ = (ఇది) తగినది.

ఇచ్చట చంద్రుని హారతి తట్టగను, అతని కళంకమును గోమ యముగను జెప్పుటవలన సావయవరూపకము.

సమాసములు :

ధృతలాంఛనగోమయాంచనమ్:- లాంఛనమేవ గోమయమ్ = లాంఛన గోమయమ్, లాంఛనగోమయస్య అంచనమ్, లాంఛనగోమయాంచ నమ్ ధృతం లాంఛనగోమయాంచనం యేన సః = ధృతలాంఛనగోమ యాంచనః, తం ధృతలాంఛనగోమయాంచనమ్.

ఆలేపనపాండరమ్ :— ఆలేపనేన పాండరః = ఆలేపనపాండరః, తమ్ = ఆలేపనపాండరమ్.

విదర్భజాననీరాజనవర్ధమానకమ్ :— విదర్భేషు జాయత ఇతి = విదర్భజా, విదర్భజాయాః ఆననమ్, విదర్భజాననం, నీరాజనస్య వర్ధమానకః = నీరాజనవర్ధమానకః, విదర్భజాననస్య నీరాజనవర్ధమానకః, విదర్భజాననీరాజనవర్ధమానకః, తం = విదర్భజాననీరాజనవర్ధమానకమ్.

భావము :

బ్రహ్మ కళంక మను గోమయముతోఁడను, కాంతిపుంజ మను దీపకలికతోడను గూడిన చంద్రుఁ డను తట్టను, దమయంతిమోమునకు నీరాజన మొసంగునట్టి తట్టగా చుట్టుచున్నాడు. గోమయము నుంచి నీరాజన మొసంగుట దేశాచారము.

శ్లో॥ సుషమావిషయే పరీక్షణే
నిఖిలం పద్మమభాజి తన్ముఖాత్ ।
అధునాఽపి న భంగలక్షణం
సలిలోన్మజ్జనముజ్ఝతి స్ఫుటమ్॥ ౨౭

ప. వి. సుషమావిషయే । పరీక్షణే । నిఖిలం । పద్మమ్ । అభాజి । తన్ముఖాత్ । అధునా । అపి । న । భంగలక్షణం । సలిలోన్మజ్జనమ్ । ఉజ్ఝతి । స్ఫుటమ్ ।

టీక॥ సుషమావిషయే; సుషమా = సౌందర్యపరమావధి యను, విషయే = విషయమందు, పరీక్షణే (సతి) = పరీక్షచేయఁబడగా, నిఖిలం = సమస్తమైన, పద్మం = పద్మములజాతి, తన్ముఖాత్ = ఆమెముఖమువలన, అభాజి = భంగము నొందినది, స్ఫుటమ్ = స్పష్టము (అత ఏవ = ఇందువలననే) అధునాఽపి = ఇప్పటికిని, భంగలక్షణం = పరాజయ చిహ్న మగు, సలిలోన్మజ్జనం, సలిల = నీటినుండి, ఉన్మజ్జనం = తేలియుండుటను నోజ్ఝతి = విడుచుటలేదు.

ఇచ్చట ఉన్మజ్జనక్రియను నిమిత్తీకరించి పరాజయ ముత్ప్రే క్షింపఁబడినది కాన నుత్ప్రేక్షాలంకారము.

సమాసములు :

సుషమావిషయే :— సుషమైవ విషయః = సుషమావిషయః, తస్మిన్ = సుషమావిషయే.

తన్ముఖాత్ :— తస్యాః ముఖం = తన్ముఖం, తస్మాత్ = తన్ముఖాత్.

భంగలక్షణమ్ :— భంగస్య లక్షణమ్ = భంగలక్షణమ్, తత్ = భంగ లక్షణమ్.

సలిలోన్మజ్జనమ్ :— సలిలాదున్మజ్జనమ్ = సలిలోన్మజ్జనమ్-తత్ = సలి లోన్మజ్జనమ్.

భావము :

ఆ దమయంతీముఖమును, పద్మముల నుంచుకొని పరమసౌందర్య మెందున్న దని పరీక్షింపగా నది దమయంతి ముఖమునందే యుండినది. పద్మముల యందు లేక పోయినది. అందువలన దమయంతి ముఖము జయించినది. పద్మము లోడిపోయినవి. ఆ యోటమికి చిహ్నముగా పద్మము లిప్పటికి నీటియందు తేలియే యున్నవి.

శ్లో॥ ధనుషీ రతిపంచబాణయో
రుదితే విశ్వజయాయ తద్భ్రువౌ ।
నళికే న తదుచ్చనాసికే
త్వయి నాళీకవిముక్తికామయోః॥ ౨౧

ప వి. ధనుషీ । రతిపంచబాణయోః । ఉదితే । విశ్వజయాయ । తద్భ్రువౌ । నళికే । న । తదుచ్చనాసికే । త్వయి । నాళీకవిముక్తికామయోః ।

టీః॥ తద్భ్రువౌ; తత్ = ఆ దమయంతి కనుబొమలు, విశ్వజయాయ = ప్రపంచవిజయమునకై, ఉదితే = ఆవిర్భవించిన, రతిపంచబాణయోః = రతీమన్మథులయొక్క, ధనుషీ = జంటవిల్లులా, (కించ = మఱియు) తదుచ్ఛనాసికే; తత్ = ఆ దమయంతియొక్క ఉచ్చనాసికే = ఉన్నతము

లయిన ముక్కుపుటములు, త్వయి = నీపై, నాళీకవిముక్తికామయోః;
నాళీక = బాణమును, విముక్తి = విడచుటకు, కామయోః = కోరికగల
రతీమన్మథులయొక్క, నళికే న = దోనెవిల్లులు కావా ?

ఆ దమయంతికనుబొమలు, ధనుస్సులా యనియు, ఆమె ముక్కుపుటములు దోనెవిల్లులా యని యుత్ప్రేక్షించుటవలన నిందు త్ప్రేక్షాలంకారము. వ్యంజకములను ప్రయోగించనందువలన నది గమ్యము,

సమాసములు :

రతిపంచబాణయో :- పంచ బాణాః యస్య సః = పంచబాణః, రతిశ్చ పంచబాణశ్చ = రతిపంచబాణౌ, తయోః = రతిపంచబాణయోః.

విశ్వజయాయ:- విశ్వస్య జయః = విశ్వజయః, తస్మై = విశ్వజయాయ
తద్భ్రువౌ :- తస్యాః భ్రువౌ = తద్భ్రువౌ,
తదుచ్చనాసికే:- ఉచ్చే చ తే నాసికే చ = ఉచ్చనాసికే, తస్యాః ఉచ్చ నాసికే = తదుచ్చనాసికే,
నాళీకవిముక్తికామయోః :- నాళీకానాం విముక్తిః = నాళీకవిముక్తిః నాళీకవిముక్తిం కామయేతే ఇతి = నాళీకవిముక్తికామౌ, తయోః = నాళీక విముక్తి కామయోః.

భావము :

ఆ దమయంతికనుబొమలు రెండును విల్లులవలె వంపుతిరిగి యుండుట వలన నవి ప్రపంచవిజయమునకై జన్మించిన రతిమన్మథుల విల్లులా యేమి: యనియు ఆ దమయంతియొక్క యెత్తైన ముక్కుపుటములు, నీపై బాణ ప్రయోగము చేయఁగోరిన యా దంపతులయొక్క దోనెవిల్లులు కావా? యనియు నిఁట నుత్ప్రేక్షింపఁబడినవి.

శ్లో॥ సదృశీ తవ శూర సా పరం
జలదుర్గస్థమృణాళజిద్భుజా ।
అపి మిత్రజుషాం సరోరుహాం
గృహయాళుః కరలీలయా శ్రియమ్॥ ౨౯

ప. వి. సదృశీ । తవ । శూర । సా । పరం । జలదుర్గస్థమృణాలజిద్భుజా । అపి । మిత్రజుషాం । సరోరుహాం । గృహయాళుః । కరలీలయా । శ్రియమ్.

టీ ॥ హేశూర = ఓ శూరుఁడా । జలదుర్గస్థమృణాళజిద్భుజా; జలదుర్గస్థ = నీటిదుర్గములయందు, అనగా అగడ్తలయందున్న, మృణాళ = తామర తూండ్లను, జిత్ = జయించునట్టి, భుజా = భుజములుగలదియు, మిత్ర జుషాం = సూర్యుని సేవించుచున్న (స్నేహితులను సేవించుచున్న), సరోరుహాం = తామరపూవులయొక్క, శ్రియః = శోభలను, (సంపద లను) కరలీలయా = భుజవిలాసముచేతను, (భుజవ్యాపారముచేతను- బలిగ్రహణముచేతను) గృహయాళుః = పట్టునటువంటి, సా = ఆ దమయంతి, తవ = నీకు, పరం = మిక్కిలి, సదృశీ = తగినది.

ఆ దమయంతి నీకు సదృశమైనదని దమయంతికిని నలునకు నుప మానోపమేయభావమును శ్లిష్టవిశేషణములతోఁ జెప్పినందువలన నుప మాలంకారము.

సమాసములు :

జలదుర్గస్థమృణాళజిద్భుజా:- దుఃఖేన గంతుం శక్యం = దుర్గం, జలస్య దుర్గం = జలదుర్గమ్, జలదుర్గే తిష్ఠంతీతి = జలదుర్గస్థాని జలదుర్గస్థాని చ తాని మృణాళాని చ = జలదుర్గస్థమృణాళాని, జలదుర్గస్థ మృణాళాని జయత ఇతి = జలదుర్గస్థమృణాళజితౌ, జలదుర్గస్థమృణాళజితౌ భుజౌ యస్యాస్సా = జలదుర్గస్థమృణాళజిద్భుజా.

మిత్రజుషాం:-మిత్రం జుషంతీతి = మిత్రజుంషి, తేషాం = మిత్రజుషామ్. కరలీలయా:- కరయోః లీలా = కరలీలా, తయా = కరలీలయా, కరస్య లీలా = కరలీలా, తయా = కరలీలయా.

భావము :

ఓ శూరుఁడా! నీవు దుర్గములయందలి శత్రువులను జయించెడి భుజము లతో వెలయునట్లు, జలదుర్గములయందున్న తామరతూండ్లనెడి శత్రువులను జయించిన భుజములతో నా దమయంతి యొప్పియున్నది. నీవు సహాయసంపన్ను లైన సామంతుల సిరిని కప్పముగ గ్రహించినట్లు దమయంతియు సూర్యుని

సేవించుచు నాతనిని సహాయము గావించుకొనిన పద్మముల లక్ష్మిని తన భుజ విలాసములతో గ్రహించుచున్నది. ఇట్లన్నివిధముల శూరుడవైన నీకు దమయంతియు శూరురాలై సాటిగ నున్నది. కాన నామె నీకు భార్య యగుటకుఁ దగినది,

శ్లో॥ వయసీ శిశుతాతదుత్తరే
సుదృశి స్వాభివిధిం విధిత్సనీ ।
విధినాఽపి న రోమరేఖయా
కృతసీమ్నీ ప్రవిభజ్య రజ్యతః॥ ౩౦

ప వి. వయసీ । శిశుతాతదుత్తరే । సుదృశి । స్వాభివిధిం । విధిత్సనీ । విధినా । అపి । న । రోమరేఖయా । కృతసీమ్నీ । ప్రవిభజ్య। రజ్యతః.

టీక॥ సుదృశి = దమయంతియందు స్వాభివిధిం; స్వ = తమయొక్క, అభివిధిం = వ్యాప్తిని, విధిత్సనీ = చేయఁగోరుచున్న, శిశుతాతదుత్తరే; శిశుతా = శైశవవయస్సు, తదుత్తరే = దానితర్వాత నున్న యౌవనమనుఁ వయసీ = వయస్సులు, విధినా = ఆ వయస్సుల కెల్లలనుఁదెలిసికొనిన బ్రహ్మచే. రోమరేఖయా = (ఎల్లకు గుఱుతైన) రోమపంక్తిచే, ప్రవిభజ్య = విభజింపఁబడి కృతసీమ్నీ అపి; కృత = చేయఁబడిన, సీమ్నీఅపి = ఎల్లలుగల్గిన దైనను, న రజ్యతః = సంతోషించుటలేదు.

ప్రస్తుతములగు వయోవిశేషణముల సామ్యమువలన నప్రస్తుతమగు వివాదవిషయము స్ఫురించుటవలన సమాసోక్త్యలంకారము.

సమాసములు :

శిశుతాతదుత్తరే:- శిశోః భావః = శిశుతా; తస్యాః ఉత్తరం = తదుత్తమ్; శిశుతాచ ఉదుత్తరంచ = శిశుతాతదుత్తరే.
సుదృశి:- శోభనే దృశౌ యస్యాస్సా = సుదృక్, తస్యాం = సుదృశి.
స్వాభివిధిం:- స్వేషామభివిధిః = స్వాభివిధిః, తం = స్వాభివిధిమ్
విధిత్సనీ:- విధాతుమిచ్ఛత ఇతి = విధిత్సనీ.
రోమరేఖయా:- రోమ్ణాం రేఖా = రోమరేఖా, తయా = రోమరేఖయా.
కృతసీమ్నీ:- కృతే సీమానౌ యయోస్తే = కృతసీమ్నీ.

భావము :

ఆ దమయంతి శరీరమం దొకవైపు శైశవము మఱియొకవైపు యౌవనము వ్యాపించి యందలి స్థానము లాక్రమించుటకై పోటీపడుచుండినవి. ఆ వయస్సు లుండవలసిన దేశకాలములను వాని యెల్లలనుఁ జక్కఁగఁ దెలిసిన బ్రహ్మ నాగారుగీతచే భాగించి దానిదాని స్థలములను దానికి దాని కిచ్చి వివాదమును బరిష్కరించినను నా వయస్సులు సంతృప్తిపడలేదు. ఈ వయస్సు లన్నియు నేను ముందు నేను ముందని తొందరపడి యన్నియు నామెశరీరము నందు సంధించినవి.

శ్లో॥ అపి తద్వపుషి ప్రసర్పతో
ర్గమితే కాంతిఝరైరగాధతామ్।
స్మరయౌవనయోః ఖలు ద్వయోః
ప్లవకుంభౌ భవతః కుచావుభౌ॥ ౩౧

ప. వి. అపి । తద్వపుషి । ప్రసర్పతోః । గమితే । కాంతిఝరైః । అగాధతాం । స్మరయౌవనయోః । ఖలు । ద్వయోః । ప్లవకుంభౌ । భవతః । కుచౌ । ఉభౌ ।

టీక॥ కాంతిఝరైః = సౌందర్యప్రవాహములచే, అగాధతాం = (మిక్కిలి లోతుగ నుండుటచే) దిగుట కశక్యముగ నుండుటను, గమితే = పొందింప బడిన, తద్వపుషి = ఆ దమయంతిశరీరమందు, ప్రసర్పతోః = ప్రసరించుచున్న, స్మరయౌవనయోః = మన్మథునకును యౌవనమునకును, ద్వయోరపి = రెండింటికిని, ఉభౌ = రెండైన, కుచౌ = ఆ దమయంతీ స్తనములు, ప్లవకుంభౌ; ప్లవ = నీటిపై మునగకుండఁ దేలియుండుటకు, కుంభౌ = కుండలుగ, భవతః ఖలు = అగుచున్నవి గదా.

ఇచ్చట దమయంతీకుచములను స్మరయౌవనములకు ప్లవకుంభములుగ నుత్ప్రేక్షించుటవలన నుత్ప్రేక్షాలంకారము. వ్యంజకములు లేనందువలన నది గమ్యము. ఆ యుత్ప్రేక్షవలన దమయంతీ స్తనముల లోని వృద్ధి ధ్వనించుచున్నది. కాన నలంకారముచే వస్తుధ్వని.

సమాసములు :-

తద్వపుషి:— తస్యాః వపుః = తద్వపుః, తస్మిన్ = తద్వపుషి.

కాంతిఝరైః:—కాంతీనాం ఝరాః = కాంతిఝరాః, తైః = కాంతిఝరైః.

అగాధతామ్:- అవిద్యమానా గాధా యస్మిం స్తత్ = అగాధమ్, అగాధస్య భావః = అగాధతా, తామ్ = అగాధతామ్.

స్మరయౌవనయోః:— స్మరశ్చ యౌవనంచ = స్మరయౌవనే, తయోః = స్మరయౌవనయోః.

ప్లవకుంభౌ:— ప్లవస్య కుంభౌ = ప్లవకుంభౌ.

భావము :

ఆ దమయంతియొడలియందు సౌందర్యప్రవాహములు పాఱుచుండుట వలన నా ప్రవాహములచే నాపెమేను లోతైనది. అందువలన నాపెశరీరమందు సంచరించు మన్మథుఁడును యౌవనమును నా లోతైన ప్రవాహమున మునిగిపోకుండ( దేలుచుండుటకు నా దమయంతీ స్తనములు రెండును రెండు కుండలుగ నేర్పడినవి. దమయంతిమేన స్మరయౌవనములు వ్యాపించుటవలన నా పె స్తనము లధికముగ నభివృద్ధి జెందిన వని యభిప్రాయము.

శ్లో॥ కలశే నిజహేతుదండజః
కిము చక్రభ్రమకారితాగుణః ।
స తదుచ్చకుచౌ భవన్ ప్రభా
ఝరచక్రభ్రమమాతనోతి యత్॥ ౩౨

ప. వి. కలశే । నిజహేతుదండజః । కిమ్ । ఉ । చక్రభ్రమకారితాగుణః । సః । తదుచ్చకుచౌ । భవన్ । ప్రభాఝరచక్రభ్రమమ్ । ఆతనోతి । యత్ ।

టీక॥ నిజహేతుదండజః; నిజ = తనదైన, హేతు = నిమిత్తకారణ మగు, దండ = కఱ్ఱవలన, జః = గల్గిన, చక్రభ్రమకారితాగుణః; చక్రభ్రమ = కులాలచక్రమును త్రిప్పుటను, కారితా = చేయుట యను, గుణః = ధర్మము, కలశే = దండజన్య మయిన ఘటమందు, కిము (సంక్రాంతః) = సంక్రమించినదా ఏమి, యత్ = ఏలయనగా, సః = ఆకుండ, తదుచ్చ

కుచౌ; తత్ = ఆ దమయంతియొక్క, ఉచ్చకుచౌ; ఉన్నత స్తనములుగ భవన్ = అగుచు, ప్రభాయు చక్రభ్రమమ్; ప్రభాయుర = కాంతిప్రవాహ మందు. చక్రభ్రమం = చక్రవాకభ్రమను (కులాలచక్రభ్రమణమును) ఆతనోతి = చేయుచున్నది.

గుణశబ్దమునకు వాచ్య మయిన ధర్మమునకును ప్రతీయమానమగు రూపాదికిని, చక్రభ్రమశబ్దమునకు వాచ్య మయిన చక్రభ్రమణమునకును ప్రతీయమాన మగు చక్రవాకభ్రమమునకును నభేదాధ్యవసాయముచే కుచకలశముల కభేదాతిశయోక్తి యుత్థాపితము. ఆ యభేదాతిశయోక్తిచే యురచక్రభ్రమణక్రియను నిమిత్తీకరించికొనిన, కుచరూప మగు కలశ కార్యమందు చక్రభ్రమకారిత్వ మను నిమిత్తకారణమందలి గుణము సంక్రమించినదా యని చెప్పుటచే నుత్ప్రేక్షాలంకారము.

తార్కికమతమునందు సమవాయికారణ మసమవాయికారణము, నిమిత్తకారణ మని కారణము త్రివిధము. అందు సమవాయికారణగుణ ములు మాత్రమే కార్యమందు సంక్రమించును గాని, అసమవాయికారణ నిమిత్తకారణగతగుణములు కార్యమందు సంక్రమించవు. కావుననే నిమిత్తకారణగతగుణము కార్యభూతకుచకలశమందు సంక్రమించినదో యని యుత్ప్రేక్షించుట కవకాశ మేర్పడినది.

సమాసములు ;

నిజహేతుదండజః:- నిజశ్చాసౌ హేతుశ్చ = నిజహేతుః, నిజహేతుశ్చాసౌ దండశ్చ = నిజహేతుదండః, నిజహేతుదండాత్ జాయత ఇతి = నిజహేతుదండజః.

చక్రభ్రమకారితాగుణః :- చక్రస్య భ్రమః = చక్రభ్రమః, చక్రభ్రమం కరోతీతి = చక్రభ్రమకారీ, చక్రభ్రమకారిణః భావః = చక్రభ్రమకారితా చక్రభ్రమకారితైవ గుణః = చక్రభ్రమకారితాగుణః

తదుచ్చకుచౌ :- ఉచ్చౌ చ తౌ కుచౌ చ = ఉచ్చకుచౌ, తస్యాః ఉచ్చకుచౌ = తదుచ్చకుచౌ.

ప్రభాఝరచక్రభ్రమమ్ – ప్రభైవ ఝరః = ప్రభాఝరః, చక్రమితి భ్రమః = చక్రభ్రమః, ప్రభాఝరే చక్రభ్రమః = ప్రభాఝరచక్రభ్రమః, తం = ప్రభాఝరచక్రభ్రమమ్.

భావము :

ఘటమందు దానికి నిమిత్తకారణ మయిన దండముచేఁ గల్గిన చక్రమును భ్రమింపఁజేయుట యను గుణము సంక్రమించినదా? ఘటమునకు దండము నిమిత్తకారణము. ఆ దండము కులాలచక్రమును ద్రిప్పుటవలన ఘటమును బుట్టించుచున్నది. కావున నా దండమందు చక్రభ్రమను గల్గించెడి ధర్మము గలదు. నిమిత్తకారణ మగు దండమందలి యీ గుణము కార్య మయిన ఘటమందు వస్తుస్థితిలో సంక్రమింప నవకాశము లేదు కాని యిఁట సంక్రమించినదా! యని భావింపవలసియున్నది. ఏల యనగా ఆదండజన్య మగు ఘటము దమయంతి కుచములుగఁ బరిణమించినదై యామెశరీరమందలి కాంతిప్రవాహమందు చక్రభ్రమమును (చక్రవాకములకు భ్రమమును)గల్గించుచున్నది. ప్రవాహమందు చక్రవాకపక్షుల యునికిగా ప్రసిద్ధముగాన నిఁటమునాచక్రభ్రమమున కవకాశ యేర్పడినది.

శ్లో॥ భజతే ఖలు షణ్ముఖం శిఖీ
చికురైర్నిర్మితబర్హగర్హణః ।
అపి జంభరిపుం దమస్వసు
ర్జితకుంభః కుచశోభయేభరాట్॥ 33

ప. వి. భజతే । ఖలు । షణ్ముఖం । శిఖీ । చికురైః । నిర్మితబర్హగర్హణః । అపి, జంభరిపుం । దమస్వసుః । జితకుంభః । కుచశోభయా । ఇభరాట్.

టీక॥ దమస్వసుః = దముని చెల్లెలైన దమయంతియొక్క, చికురైః = కురులచే నిర్మితబర్హగర్హణః: నిర్మిత = నిర్మింపఁబడిన, బర్హ = పింఛము యొక్క, గర్హణః = తిరస్కారము గలిగిన, శిఖీ = నెమలి, షణ్ముఖం = కుమారస్వామిని, భజతే ఖలు = సేవించుచున్నదిగదా, (తథా = అట్లే) కుచశోభయా = స్తనములకాంతిచే, జితకుంభః = జయింపఁబడిన కుంభ

స్థలముగల, ఇభరాడపి = గజరాజగు నైరావతము కూడ, జంభరిపుం = ఇంద్రుని. భజతే = సేవించుచున్నది.

ఇచట నెమలి కుమారస్వామి నాశ్రయించుటకు పింఛనింద యను పదార్థము, ఐరావత నింద్రు నాశ్రయించుటకు జితకుంభస్థలత్వ మను పదార్థమును హేతువుగఁ జెప్పుటవలన పదార్థహేతుకము లగు కావ్యలింగాలంకారములు కుమారస్వామి నాశ్రయించుటలో జితబర్హత్వసంబంధము నింద్రు నాశ్రయించుటలో జితకుంభత్వసంబంధము లేకపోయినను తత్సంబంధములు చెప్పుటవలన నతిశయోక్త్యలంకారము.

సమాసములు :

నిర్మితబర్హగర్హణః :— బర్హస్య గర్హణం = బర్హగర్హణం, నిర్మితం బర్హగర్హణం యస్య సః = నిర్మితబర్హగర్హణః.
దమస్వసుః :— దమస్య స్వసా = దమస్వసా, తస్యాః = దమస్వసుః.
జితకుంభః :— జితః కుంభః యస్య సః = జితకుంభః.
కుచశోభయా :— కుచయోః శోభా = కుచశోభా, తయా = కుచశోభయా.
ఇభరాట్ :— ఇభానాం రాట్ = ఇభరాట్.

భావము :

ఆ దమయంతికురులచే తనపింఛ మోడింపఁబడుటవలన నెమలి తనరక్షణకు కుమారస్వామి నాశ్రయించినది. ఆమెయొక్క స్తనములశోభతో తనకుంభస్థల మోడిపోయినందువలన గజరాజైన యైరావత మింద్రు నాశ్రయించినది. లోకమునందు పరాజయ మందినవారు రక్షణకై బలవంతుల నాశ్రయించుట ప్రసిద్ధము.

శ్లో॥ ఉదరం నతమధ్యపృష్ఠతా
స్ఫుటదంగుష్ఠపదేన ముష్టినా ।
చతురంగుళిమధ్యనిర్గత
త్రివళిభ్రాజి కృతం దమస్వసుః॥ ౩౪

ప. వి. ఉదరం। నతమధ్యపృష్ఠతాస్ఫుటదంగుష్ఠపదేన। ముష్టినా। చతురంగుళి
మధ్యనిర్గతత్రివళిభ్రాజి। కృతం। దమస్వసుః।

టీక॥ దమస్వసుః (దముని చెల్లెలైన) దమయంతి యొక్క, ఉదరం = ఉదరము, నతమధ్యపృష్ఠతాస్ఫుటదంగుష్ఠపదేన; నత = లోతైన, మధ్య = మధ్యప్రదేశము గల్గిన, పృష్ఠతా = వెనుకవైపు గల్గియుండుటచే, స్ఫుటత్ = (గట్టిగాఁ బట్టుకొనుటవలన) స్ఫుటముగ నున్న, అంగుష్ఠపద = బొటనవ్రేలుంచఁబడిన స్థానము గల్గిన, ముష్టినా = పిడికిఁచే, చతురంగుళిమధ్యనిర్గతత్రివళిభ్రాజి; చతురంగుళి = నాలుగు చేతివ్రేళ్ల యొక్క మధ్యసందుల నుండి, నిర్గత = వెల్వడిన, త్రివళి = మూడు మడతలచే, భ్రాజి = ప్రకాశించునదిగ, కృతం = చేయఁబడినది.

ఇచ్చట స్వభావసిద్ధముగ దమయంతియొక్క యుదరముపై వళిత్రయము గానఁబడుచున్నది. కాని అది పిడికిలి యందలి నాలుగువ్రేళ్ల రంధ్రముల నుండి వెలుపలికి వచ్చిన మడత లని చెప్పుటవలన నుత్ప్రేక్షాలంకారము వ్యంజకములు లేనందువలన నది గమ్యము.

సమాసములు :

నతమధ్యపృష్ఠతాస్ఫుటదంగుష్ఠపదేన :_ నతః మధ్యః యస్య తత్ = నతమధ్యం, నతమధ్యం పృష్ఠం యస్య తత్ = నతమధ్యపృష్ఠమ్, నతమధ్యపృష్ఠస్య భావః = నతమధ్యపృష్ఠతా, నతమధ్యపృష్ఠతయా స్ఫుటత్ = నతమధ్యపృష్ఠతాస్ఫుటత్, అంగుష్ఠస్య పదం = అంగుష్ఠపదం, నతమధ్యపృష్ఠతాస్ఫుటత్ అంగుష్ఠపదం యస్య సః = నతమధ్యపృష్ఠతాస్ఫుటదంగుష్ఠపదః. తేన = నతమధ్యపృష్ఠతాస్ఫుటదంగుష్ఠపదేన.

భావము :

ఆ దమయంతినడుము నొక కుతూహలముగల వ్యక్తి, అనగా బ్రహ్మ తన పిడికిలితో పట్టి దాని పరిమితినిఁ దీసికొనఁగోరెను. ఆ వ్యక్తి యీవిధముగ పట్టుటవలన నతని బొటనవ్రేలు నడుముపైనను తక్కిన నాలుగువ్రేళ్లు నామె యుదరముపైన నానినవి. ఆ నాలుగువ్రేళ్ల రంధ్రములనుండి మూడు మడతలు వెలుపలికి వచ్చినవి. అవియే యీనాడు త్రివళిగా నున్నది. ఆమెనడుము పిడి

కిలిలో నిమిడినందువలన నామె కృశమధ్య యని సిద్ధించుచున్నది. అంగుళిమధ్య రంధ్రములనుండి వెల్వడిన చర్మపుమడతలే త్రివళులనుటవలన నామెతలోదరి యనియు సిద్ధించుచున్నది.

శ్లో॥ ఉదరం పరిమాతి ముష్టినా
కుతుకీ కోఽపి దమస్వసుః కిము।
ధృతతచ్చతురంగుళీవ య
ద్వళిభిర్భాతి సహేమకాంచిభిః॥ ౭౫

ప. వి. ఉదరం । పరిమాతి । ముష్టినా । కుతుకీ । కః । అపి । దమస్వసుః । కిమ్ । ఉ । ధృతతచ్చతురంగుళి । ఇవ । యత్ । వళిభిః । భాతి । సహేమకాంచిభిః ।

టీ॥ కోఽపి = ఒకానొక, కుతుకీ = కుతూహలముగల వ్యక్తి (బ్రహ్మ), దమస్వసుః = దమయంతియొక్క, ఉదరం = ఉదరమును, ముష్టినా = పిడికిలిచే, పరిమాతి కిము = కొలచుచున్నాడా యేమి, యత్ = ఏలయనగా, సహేమకాంచిభిః = బంగారుమొలనూలుతోఁగూడి నాలుగైన, వళిభిః = త్రివళులచే, ధృతతచ్చతురంగుళీవ; ధృత = ధరింపబడిన, తచ్చతురంగుళి; తత్ = ఆ కొలచునట్టి విధియొక్క. చతురంగుళీవ = నాలుగు వ్రేళ్లతోఁగూడినదో యనునట్లు, భాతి = ప్రకాశించుచున్నది.

ధృతతచ్చతురంగుళీవ యని, బంగారుమొలనూలుగల్గిన యామె వళిత్రయము పిడికిలిలోని నాలుగువ్రేళ్లనుండి వెల్వడిన మడతలో యని చెప్పుటవలన నుత్ప్రేక్షాలంకారము.

అట్లే, "ఉదరం పరిమాతి కిము" దమయంతి యుదరమునుఁ బిడికిలిచేఁ గొలుచుచున్నాఁడా? యని చెప్పుటవలన నుత్ప్రేక్షాలంకారము. రెండవయుత్ప్రేక్ష మొదటి యుత్ప్రేక్షకు కారణమై రెండును నంగాంగిభావము నొందుటవలన నిట సంకరము.

సమాసములు :-

ధృతతచ్చతురంగుళి:- చతసృణామంగుళీనాం, సమాహారః = చతురంగుళి, తస్య చతురంగుళి = తచ్చతురంగుళి, ధృతం తచ్చతురంగుళి యేన తత్ = ధృతతచ్చతురంగుళి.

సహేమకాంచిభిః : హేమకాంచ్యా సహవర్తంత ఇతి = సహేమ కాంచయః, తాభిః = సహేమకాంచిభిః.

భావము :

కుతూహలముగల బ్రహ్మవంటి మహానుభావుడు పరీక్షకొఱకై తన పిడికిలితో దమయంతియుదరమును గొలుచుచున్నాడా యని తోచుచున్నది. ఏల యనగా బంగారుమొలనూలుతోఁగూడిన త్రివళులుగల యామెనడుము ఆ కొలచునట్టి విధియొక్క నాలుగువ్రేళ్లతోఁగూడినదిగ కానవచ్చుచున్నది. ఆతని పిడికిలిలో నడు మిమిడినపుడు ఆతని నాల్గువ్రేళ్ల సందులనుండి మూడుమడత లైన త్రివళులు వెల్వడును. బంగరునూలు జుట్టఁబడుటవలన నదియొక వళిగను గానఁబడును. ఇట్లు చెప్పుటవలన నామెనడుము ముష్టిగ్రాహ్యమని తెలుచున్నది. పూర్వశ్లోకమునందు మూడువళులుమాత్రమే నాలుగువ్రేళ్లనుండి వెల్వడిన వని చెప్పఁబడెను. ఇందు బంగారుమొలనూలుతోఁగూడిన మూడువళులు నాలుగు వ్రేళ్లనుండి వెల్వడిన వని యుత్ప్రేక్షింపఁబడినది.

శ్లో॥ పృథువర్తులతన్నితంబకృ
న్మిహిరస్యందనశిల్పశిక్షయా ।
విధిరేకకచక్రచారిణం
కిము నిర్మిత్సతి మాన్మథం రథమ్॥ ౩౬

ప వి. పృథువర్తులతన్నితంబకృత్ । మిహిరస్యందనశిల్పశిక్షయా । విధిః । ఏకకచక్రచారిణం। కిమ్ । ఉ। నిర్మిత్సతి । మాన్మథం । రథమ్ ।

టీక॥ పృథువర్తులతన్నితంబకృత్; పృథు = విశాలమును, వర్తుల = గుండ్రముసైన, తత్ = ఆ దమయంతియొక్క, నితంబ = కటిపశ్చాద్భాగమును, కృత్ = చేయునట్టి, విధిః = బ్రహ్మ మిహిరస్యందనశిల్పశిక్షయా; మిహిర = సూర్యునియొక్క, స్యందన = రథముయొక్క, శిల్ప = నిర్మాణమందలి, శిక్షయా = అభ్యాసముచే, ఏకకచక్రచారిణమ్; ఏకక = కేవలమొకటి యైన, చక్ర = చక్రముతో, చారిణమ్ = సంచరించు, మాన్మథం = మన్మధునికి సంబంధించిన, రథం = రథమును, నిర్మిత్సతి కిము = నిర్మింపఁగోరుచున్నాడా యేమి?

'రథం కిము నిర్మిత్సతి' యని, రథమును నిర్మింపఁగోరుచున్నాఁడా యని భావించుటవలన నుత్ప్రేక్షాలంకారము.

**సమాసములు :**

పృథువర్తులతన్నితంబకృత్:- పృథుశ్చాసౌ వర్తులశ్చ = పృథువర్తులః, తస్యాః నితంబః = తన్నితంబః, పృథువర్తులశ్చాసౌ తన్నితంబశ్చ = పృథువర్తులతన్నితంబః, పృథువర్తులతన్నితంబం కరోతీతి = పృథువర్తులతన్నితంబకృత్.

మిహిరస్యందనశిల్పశిక్షయా:- మిహిరస్య స్యందనః = మిహిరస్యందనః, మిహిరస్యందనస్యశిల్పం = మిహిరస్యందనశిల్పమ్, మిహిరస్యందనశిల్పే శిక్షా = మిహిరస్యందనశిల్పశిక్షా, తయా = మిహిరస్యందనశిల్పశిక్షయా.
ఏకకచక్రచారిణమ్:- ఏకమేవ = ఏకకం, ఏకకం చ తత్ చక్రం చ ఏకకచక్రమ్. ఏకకచక్రేణచరతీతి = ఏకకచక్రచారీ, తం = ఏకకచక్రచారిణమ్.
మాన్మథమ్:- మన్మథస్య అయం = మాన్మథః, తం = మాన్మథమ్.

**భావము :**

విశాలమును గుండ్రము నైన దమయంతీనితంబమును సృజించిన బ్రహ్మ, తాను పూర్వము సూర్యరథనిర్మాణమందలి యభ్యాసముచే, మన్మథునకు సైత మొక చక్రముతోడనే సంచరించురథమును నిర్మింపఁ దలచినాఁడా యని భావింపబడుచున్నది. సూర్యరథ మొక్కచక్రముతోడనే నిర్మింపఁబడినది. అవ్విధముగనే దమయంతియొక్క విశాలవర్తులనితంబమునే చక్రముగఁ గావించి దానితో నడచునట్టి యేకచక్రరథమును మన్మథున కు బ్రహ్మ నిర్మింప గోరినాఁడా యని భావింపబడుచున్నది.

శ్లో॥ తరుమూరుయుగేన సుందరీ
కిము రంభాం పరిణాహినా పరమ్ ।
తరుణీమపి జిష్ణురేవ తాం
ధనదాపత్యతపఃఫలస్తనీమ్॥ ౩౭

ప. వి. తరుమ్ । ఊరుయుగేన । సుందరీ । కిమ్ । ఉ । రంభాం । పరిణాహినా । పరమ్ । తరుణీమ్ । అపి । జిష్ణుః । ఏవ । తాం । ధనదాపత్య తపః ఫల స్తనీమ్ ।

టీక॥ సుందరీ = అందగత్తె యగు దమయంతి, పరిణాహినా = విశాలమైన, ఊరుయుగేన = తొడలజంటచే, రంభాం తరుం పరం = అరటిచెట్టును మాత్రమే, జిష్ణుః కిము = జయింపఁగోరినదా। (కింతు = మఱేమనగా) ధనదాపత్యతపఃఫలస్తనీమ్; ధనద = కుబేరునియొక్క, అపత్య = కుమారుఁడైన నలకూబరునియొక్క, తపః = తపమునకు, ఫలస్తనీమ్ = ఫలములైన కుచములుగలదియో యనఁదగిన, తాం = ఆరంభ యను, తరుణీమపి = యువతిని సైతము, జిష్ణురేవ = జయింపఁ గోరినదే.

సమాసములు :

ఊరుయుగేన :- ఊర్వోః యుగం = ఊరుయుగం, తేన = ఊరుయుగేన. ధనదాపత్యతపఃఫలస్తనీమ్ :- ధనదస్య అపత్యం = ధనదాపత్యమ్, ధనదాపత్యస్య తపః = ధనదాపత్యతపః, ధనదాపత్యతపసః ఫలే = ధనదాపత్యతపఃఫలే, ధనదాపత్యతపఃఫలే ఏవ స్తనౌయస్యాస్సా = ధనదాపత్యతపఃఫలస్తనీ, తామ్ = ధనదాపత్యతపఃఫలస్తనీమ్.

భావము :

సుందరి యగు దమయంతి విశాల మగు తనతొడలజంటచే రంభావృక్షమును మాత్రమే జయించుట లేదు. మఱేమన, కుబేరునికుమారుఁ డగు నలకూబరునితపఃఫలము లైన స్తనములతో విలసిల్లు రంభను గూఁడ జయింపఁ గోరినది. ఆమె యూరువులు రంభావృక్ష మయిన యరటిచెట్ల వలెను, రంభ యను నప్సరసయొక్క యూరువుల వలెను విలసిల్లుచున్న వని యాశయము.

శ్లో॥ జలజే రవిసేవయేవ యే
పదమేతత్పదతామవాపతుః ।
ధ్రువమేత్య రుతస్సహాంసకీ
కురుతస్తే విధిపత్రదంపతీ॥ ౩౮

ప. వి. జలజే। రవిసేవయా । ఇవ । యే । పదమ్ । ఏతత్పదతామ్ । అవాపతుః ।
ధ్రువమ్ । ఏత్య । రుతః। సహంసకీకురుతః । తే । విధిపత్త్రదంపతీ ।

టీక॥ యే జలజే = ఏ రెండు పద్మములు, రవిసేవయేవ = సూర్యోపాసన చేతనో యనునట్లు, ఏతత్పదతామ్; ఏతత్ = ఈదమయంతియొక్క, పదతాం = కాలియడుగుగ నుండుట యను,పదం = ప్రతిష్ఠను,అవాపతుః = పొందినవో, తే = ఆ పద్మములను, విధిపత్త్రదంపతీ; విధి = బ్రహ్మకు పత్త్ర = వాహనహంసరూపము లైన, దంపతీ = భార్యాభర్తలు, ఏత్య = వచ్చి, రుతః = కూతవలన, సహంసకీకురుతః = అందెలతో గూడినవిగను, హంసలతోఁ గూడినవిగను చేయుచున్నవి, ధ్రువమ్ = నిశ్చయము.

ఇచ్చట పద్మములు దమయంతిచరణము లయినవో యని చెప్పుట వలనను, అట్టి పాదములను విధివాహనహంసదంపతులు సహంసకములుగఁ జేసినవో యని చెప్పుటవలనను, ఉత్ప్రేక్షాలంకారము వ్యంజక మగు ధ్రువశబ్దమును బ్రయోగించుటవలన నదివాచ్యము.

సమాసములు :

రవిసేవయా :— రవయే సేవా = రవిసేవా, తయా = రవిసేవయా.
ఏతత్పదతాం :— ఏతస్యాః పదే = ఏతత్పదే, ఏతత్పదయోః భావః = ఏతత్పదతా, తామ్ = ఏతత్పదతామ్.

సహంసకీకురుతః :— హంసకాభ్యాం సహవర్తేతే ఇతి = సహంసకే. అసహంసకే సహంసకే సంపద్యమానే కురుత ఇతి = సహంసకీకురుతః.

విధిపత్త్రిదంపతీ:— విధేః పత్త్రే = విధిపత్త్రే, విధిపత్త్రే ఏవ దమ్పతీ = విధిపత్త్రిదమ్పతీ.

భావము :

రెండు పద్మములు సూర్యోపాసనచేతనో యనునట్లాదమయంతిపాదము లై యామె పాదములుగ నగుట యను ప్రతిష్ఠను సంపాదించినవి. అట్టి పద్మ

ములను వెంటిని, బ్రహ్మవాహనము లగు హంసదంపతులు సమీపించి ప్రియ మయిన తమకూజితములతో నాచరణరూపములుగ వెలసిన పద్మములను సహంసకములుగ ననగా, కాలియందెలతోఁ గూడినవిగను, హంసలతోఁ గూడిన విగనుఁ జేయుచున్నవి. సూర్యోపాసనచే దివ్యత్వమును బొందిన యా పద్మములను విధివాహనము లగు దివ్యహంసలు సమీపించి వానిని సహంసకములుగఁ గావించిన వని యాశయము.

శ్లో॥ శ్రితపుణ్యసరస్సరిత్కథం
న సమాధిక్షపితాఖిలక్షపమ్ ।
జలజం గతిమేతు మంజులాం
దమయంతీపదనామ్ని జన్మని॥ ౩౯

ప వి. శ్రితపుణ్యసరస్సరిత్ । కథం । న । సమాధిక్షపితాఖిలక్షపమ్ । జలజం । గతిమ్ । ఏతు । మంజులాం । దమయంతీపదనామ్ని । జన్మని ।

టీక॥ శ్రితపుణ్యసరస్సరిత్; శ్రిత = ఆశ్రయింపబడిన, పుణ్య = పవిత్రము లగు, సరః = కొలంకులు, సరిత్ = నదులు గలదియు, సమాధిక్షపితాఖిలక్షపమ్; సమాధి = ధ్యానముచే (కనుల మోడ్పుచే) క్షపిత = నాశము చేయఁబడిన, అఖిలక్షపం = సకలరాత్రులు గలదియు నగు, జలజం = పద్మము, దమయంతీపదనామ్ని; దమయంతీపద = దమయంతిపాద మను, నామ్ని = పేరుగల, జన్మని = జన్మమందు, మంజులాం = మనోహర మగు, గతిం = గమనమును (దశను) కథం = ఎట్లు, నైతు = పొందదు.

సమాసములు :—

శ్రితపుణ్యసరస్సరిత్:—సరాంసి చ సరితశ్చ = సరస్సరితః, పుణ్యాశ్చ తాః సరస్సరితశ్చ = పుణ్యసరస్సరితః, శ్రితాః పుణ్యసరస్సరితః యేన తత్ = శ్రితపుణ్యసరస్సరిత్.

సమాధిక్షపితాఖిలక్షపమ్ ;— అఖిలాశ్చ తాః క్షపాశ్చ = అఖిలక్షపాః, సమాధినా క్షపితాః = సమాధిక్షపితాః, సమాధిక్షపితాః. అఖిలక్షపాః యేన తత్ = సమాధిక్షపితాఖిలక్షపమ్.

దమయంతీపదనామ్ని :— దమయంత్యాః పదం = దమయంతీపదం, దమయంతీపదమితి నామ యస్య తత్ = దమయంతీపదనామ, తస్మిన్ = దమయంతీపదనామ్ని.

**భావము :**

పవిత్రము లయిన మానసాదిసరోవరములను, గంగాదినదులను సేవించి ధ్యానముచే సకలరాత్రులనుఁ గడపినదియు నగు పద్మము, దమయంతీపాద ప్రాప్తిరూప మయిన జన్మమునం దుత్తమగతిని, ఉత్తమ దశనుఁ బొందును గాత.

శ్లో॥ సరసీః పరిశీలితుం మయా
గమికర్మీకృతనైకనీవృతా ।
అతిథిత్వమనాయి సా దృశో
స్సదసత్సంశయగోచరోదరీ॥ ౪౦

ప. వి. సరసీః । పరిశీలితుం । మయా । గమికర్మీకృతనైకనీవృతా । అతిథిత్వమ్ । అనాయి । సా । దృశోః । సదసత్సంశయగోచరోదరీ ।

టీక॥ సరసీః = కొలంకులను, పరిశీలితుం = పరిశీలనము గావించుటకై, గమికర్మీకృతనైకనీవృతా; గమి = గమనమునకు, కర్మీకృత = కర్మలుగఁ జేయఁబడిన, నైక = పెక్కైన, నీవృతా = గ్రామములు గల, మయా = నాచేత, సదసత్సంశయగోచరోదరీ: సదసత్ = ఉన్నదా లేదా యను సంశయ = సందేహమునకు, గోచర = విషయమైన, ఉదరీ = ఉదరము గల్గిన, సా = ఆ దమయంతి, దృశోః = నేత్రములకు, అతిథిత్వమ్ = విషయ మగుటను, అనాయి = పొందింపఁబడినది.

**సమాసములు:**

గమికర్మీకృతనైకనీవృతా :— గమేః కర్మాణి, = గమికర్మాణి, అగమికర్మాణి, గమికర్మాణి కృతాః = గమికర్మీకృతాః, న ఏకే = నైకే. నితరాం వర్తంతే జనా యేష్వితి = నీవృతః, నైకేచ తే నీవృతశ్చ = నైకనీవృతః, గమికర్మీకృతాః నైకనీవృతః యేన సః, గమికర్మీకృతనైకనీవృత్, తేన = గమికర్మీకృతనైకనీవృతా.

అతిథిత్వమ్ :— అతిథేర్భావః = అతిథిత్వమ్, తత్ = అతిథిత్వమ్.
సదసత్సంశయగోచరోదరీ :— సచ్చ, అసచ్చ సదసదీ, సదసదోః సంశయః = సదసత్సంశయః, సదసత్సంశయస్య గోచరః = సదసత్సంశయగోచరః, సదసత్సంశయగోచరః ఉదరం యస్యాస్సా = సదసత్సంశయగోచరోదరీ.

భావము :

నేను కొలంకులను పరిశీలించి యందు విహరించుటకై పెక్కుజనపదములకు వెళ్లితిని. అప్పుడు కలదా లేదా యని సందేహింపదగిన యుదరము గల్గిన కృశోదరి యగు దమయంతి నాకంటికిఁ గనఁబడినది. అందువలన దమయంతిని నేను తెలిసికొనఁగల్గితిని.

శ్లో॥ అవధృత్య దివోఽపి యౌవతై
ర్న సహాధీతవతీమిమామహమ్ ।
కతమస్తు విధాతురాశయే
పతిరస్యా వసతీత్యచింతయమ్॥ ४౧

ప. వి. అవధృత్య । దివః ॥ అపి । యౌవతైః । న। సహాధీతవతీమ్ । ఇమామ్ అహమ్ । కతమః । తు । విధాతుః । ఆశయే । పతిః । అస్యాః । వసతి । ఇతి । అచింతయమ్ ।

టీక॥ అహం = నేను, ఇమాం = ఈ దమయంతిని, దివః = స్వర్గమునకు సంబంధించిన, యౌవతైరపి = యువతుల సమూహములతోడను, నసహాఽధీతవతీం = సాటిలేని దానినిగ, అవధృత్య = నిశ్చయించి. విధాతుః = బ్రహ్మయొక్క, ఆశయే = హృదయమందు, అస్యాః = ఈమెకు, కతమస్తు = ఎవ్వడో, వసతీతి = నివసించుచున్నాడని, (తదైవ) = అప్పుడే, అచింతయమ్ = ఆలోచించితిని.

సమాసములు :

యౌవతైః:—యువతీనాం సమూహాః = యౌవతాని, తైః = యౌవతైః.
నసహాధీతవతీమ్ ;— న సహ అధీతవతీ = నసహాధీతవతీ, తాం = నసహాధీతవతీమ్.

**భావము :**

నే నామెను చూడగనే యామె స్వర్గలోకములోని యువతుల మించిన సౌందర్యముగలది యని నిశ్చయించుకొని వెంటనే బ్రహ్మ హృదయమునందీ మెకు భర్తకాగలవాఁడెవ్వఁడో నివసించుచున్నాఁడని యాలోచించితిని.

శ్లో॥ అనురూపమమున్నిరూపయ
న్నథ సర్వేష్వపి పూర్వపక్షతామ్ ।
యువసు వ్యపనేతుమక్షమ స్త్వయి
సిద్ధాంతధియం న్యవేశయమ్॥ ౪౨

ప. వి. అనురూపమ్ । అముం । నిరూపయన్ । అథ।సర్వేషు । అపి ।పూర్వపక్షతామ్ । యువసు । వ్యపనేతుమ్ । అక్షమః । త్వయి । సిద్ధాంతధియం । న్యవేశయమ్ ।

టీక॥ అథ = తర్వాత అనురూపం = యోగ్యమైన, అముం = అటువంటి నిన్ను, నిరూపయన్ = ఈ దమయంతికి భర్తగా నాలోచించుచు, సర్వేషు = సకలులైన, యువస్వపి = యువకులయందును, పూర్వపక్షతాం = దూషింపదగిన పక్షముగల్గియుండుటను, వ్యపనేతుం = తొలగించుటకు, అక్షమః = అసమర్థుఁడనై, త్వయి = నీయందు, సిద్ధాంతధియం = నీవే యామెకు తగిన భర్తవను సిద్ధాంతబుద్ధిని, న్యవేశయమ్ = ఉంచితిని.

**సమాసములు :**

పూర్వపక్షతామ్ :— పూర్వశ్చాసౌ పక్షశ్చ = పూర్వపక్షః, పూర్వపక్షస్య భావః = పూర్వపక్షతా, తాం = పూర్వపక్షతామ్.

అక్షమః :— న విద్యతే క్షమా యస్మిన్ సః = అక్షమః.

సిద్ధాంతధియమ్:— సిద్ధాంతస్య ధీః = సిద్ధాంతధీః, తాం = సిద్ధాంతధియమ్.

**భావము :**

ఆ దమయంతికిఁ దగిన వరునిగ నిన్ను భావించుచు, తక్కిన యువకులనర్హులని తలంచి నీవే యామెకుఁ దగినభర్త వని నీయందు సిద్ధాంతము గావించుకొంటిని. ఇదియే బ్రహ్మకు నుద్దేశ్యము.

శ్లో॥ అనయా తవ రూపసీమయా
కృతసంస్కారవిబోధనస్య మే ।
చిరమప్యవలోకితాద్య సా
స్మృతిమారూఢవతీ శుచిస్మితా॥ ౪౨

ప, వి. అనయా । తవ । రూపసీమయా । కృతసంస్కారవిబోధనస్య । మే । చిరమ్ । అపి । అవలోకితా । అద్య । సా । స్మృతిమ్ । ఆరూఢవతీ । శుచిస్మితా ।

టీక॥ చిరం = చాలకాలము, అవలోకితా౽పి = చూడఁబడినప్పటికిని, సా = ఆ, శుచిస్మితా = పరిశుభ్ర మగు నవ్వుగల యా దమయంతి, అద్య = ఇప్పుడు, అనయా = ఈ, తవ = నీయొక్క, రూపసీమయా = సౌందర్య పరమావధిచే, కృతసంస్కారవిబోధనస్య: కృత = చేయఁబడిన, సంస్కారవిబోధనస్య = సంస్కారప్రబోధము గల, మే = నాకు, స్మృతిం = స్మరణమును, ఆరూఢవతీ = పొందినది.

సమాసములు :

రూపసీమయా :– రూపస్య సీమా = రూపసీమా, తయా = రూపసీమయా
కృతసంస్కారవిబోధనస్య :– సంస్కారస్య విబోధనం = సంస్కారవిబోధనమ్ కృతం సంస్కారవిబోధనం యస్య సః = కృతసంస్కారవిబోధనః, తస్య = కృతసంస్కారవిబోధనస్య.
శుచిస్మితా :– శుచి స్మితం యస్యాస్సా = శుచిస్మితా.

భావము :

ఆ సుందరి యగు దమయంతిని చిరకాలము జూచితిని. అట్లు చూచినను నా కప్పు డామెకు దగిన భర్త యెవడని స్ఫురించలేదు. కాని యిప్పుడు నిన్ను జూచినందువలన నామెకు నీవు తగిన భర్తవని సిద్ధాంతముఁ జేసికొంటిని. ఏల యనగా నీ సౌందర్యమును జూడగనే నాకా దమయంతి సౌందర్యము స్మృతికి వచ్చినది. మీ యిరువురి సౌందర్యములు సమానముగ నుండుటవలన నొకదానినిఁ జూడగనే యది స్మృతికి వచ్చుట సహజము. కాన నా సుందరికి సుందరుఁడ వైన నీవు తగిన భర్తవు.

శ్లో॥ త్వయి వీర విరాజతే పరం
దమయంతీకిలికించితం కిల।
తరుణీస్తన ఏవ దీప్యతే
మణిహారావళిరామణీయకమ్॥ ४४

ప. వి. త్వయి । వీర । విరాజతే । పరం । దమయంతీకిలికించితమ్ । కిల । తరుణీ స్తనే । ఏవ । దీప్యతే । మణిహారావళిరామణీయకమ్ ।

టీక॥ హేవీర। = ఓ వీరుఁడా, దమయంతీకిలికించితమ్; దమయంతీ = దమయంతియొక్క కిలికించితం = క్రోధాఽశ్రుహర్షభీత్యాదుల సంకర రూప మైన శృంగారచేష్ట, త్వయి పరం = నీయందే, విరాజతే కిల = ప్రకాశించుచున్నది. (హి = ఏల యనగా) మణిహారావళిరామణీయకమ్; మణిహారావళి = ముత్యాలహారములపంక్తియొక్క, రామణీయకం = సొంపు, తరుణీస్తనే ఏవ = యువతి యొక్క స్తనమునందే, దీప్యతే = ప్రకాశించును.

ఇచ్చట హారకిలికించితముల కుపమానోపమేయభావ మేర్పడినది. ఆ యుపమానోపమేయములకు భిన్నవాక్యములలో, స్తననృపులతో బింబప్రతిబింబభావముచే సమానధర్మత్వముఁ జెప్పుటవలన నీఁట దృష్టాంతాలంకారము.

సమాసములు :

దమయంతీకిలికించితమ్ :- దమయంత్యాః కిలికించితమ్ = దమయంతీకిలికించితమ్.

తరుణీ స్తనే :- తరుణ్యాః స్తనః = తరుణీ స్తనః. తస్మిన్ = తరుణీ స్తనే.

మణిహారావళిరామణీయకమ్ :- మణిమయాశ్చ తే హారాశ్చ = మణి హారాః, మణిహారాణామావళయః, మణిహారావళయః, మణిహారావళీనాం రామణీయకమ్ = మణిహారావళిరామణీయకమ్.

భావము :

ఓ వీరుఁడా! క్రోధహర్షాదిసంకరరూపమైన కిలికించిత మను దమయంతియందలి శృంగారచేష్ట నీయందే ప్రకాశించును కాని, యితరుల యందది

ప్రకాశించదు. ఏల యనగా ముత్యాల సరుల సోయగములు యువతి స్తనమందే ప్రకాశించును గాని మఱొందుచోట నవి ప్రకాశింపవు. కాన నా దమయంతికి నీవే తగిన వరుఁడవు.

శ్లో॥ తవ రూపమిదం తయా వినా
విఫలం పుష్పమివావకేశినః ।
ఇయమృద్ధధనా వృథాఽవనిః
స్వవనీ సంప్రవదత్పికాఽపి కా॥ ৪౫

వ. వి. తవ । రూపమ్ । ఇదం । తయా । వినా । విఫలం । పుష్పమ్ ।ఇవ । అవకేశినః । ఇయమ్ । ఋద్ధధనా । వృథా । అవనిః । స్వవనీ। సంప్రవదత్పికా । అపి । కా ।

టీక॥ హేవీర ! = ఓ వీరుఁడా! తవ = నీ యొక్క, ఇదం = ఈ, రూపం = సౌందర్యము, తయా వినా = ఆ దమయంతి లేక, అవకేశినః = గొడ్డు చెట్టు యొక్క, పుష్పమివ = పూవువలె, విఫలం = నిష్ఫలము, ఋద్ధధనా = సమృద్ధ మయిన ధనముగల, ఇయం = ఈ, అవనిః = భూమి, వృథా = నిరర్థకము, సంప్రవదత్పికా: సంప్రవదత్ = కూయుచున్న, పికా = కోకిలలు గల, స్వవన్యపి = తన యుద్యానము కూడ, కా = తుచ్ఛమైనది, అనఁగా నిరర్థకము.

ఇచ్చట నలునిరూపము, నలుఁడు పాలించెడి భూమి, అతని యుద్యానము నీ మూఁడును "తయా వినా" యని దమయంతి లేనిచో రమ్యములు గావు నిరర్థకము లని చెప్పుటవలన, వినోక్త్యలంకారము. ఆ వినోక్తి "అవకేశినః పుష్పమివ" గొడ్డుచెట్టుపూవువలె నను నుపమతో సంసృష్టి నందినది.

సమాసములు :

ఋద్ధధనా:- ఋద్ధం ధనం యస్యాస్సా = ఋద్ధధనా.
స్వవనీ:- స్వస్య వనీ = స్వవనీ.
సంప్రవదత్పికా:- సంప్రవదంతః పికాః యస్యాం సా = సంప్రవదత్పికా.

భావము :

ఓ వీరా! దమయంతి నీకు లేనిచో, నీ యందము, గొడ్డుచెట్టుపూవువలె విఫలము. సంపూర్ణధనసంపత్తిగల యీ భూమియు నీకు వ్యర్థము. నిరంతరము కోకిలగానములతో మనోహర మగు నీ యుద్యానము నిరర్థకము. కావున దమయంతీయోగ మున్నప్పుడే యివి యన్నియు సార్థకము లగును.

శ్లో॥ అనయాఽమరకామ్యమానయా
సహయోగస్సులభస్తు న త్వయా ।
ఘనసంవృతయాంబుదాగమే
కుముదేనేవ నిశాకరత్విషా ॥ ౪౬

ప. వి. అనయా । అమరకామ్యమానయా । సహయోగః । సులభః । తు । న । త్వయా । ఘనసంవృతయా । అంబుదాగమే । కుముదేన । ఇవ । నిశాకరత్విషా ।

టీక॥ హే వీర! = ఓ వీరుడా! అమరకామ్యమానయా; అమర = దేవతలచే, కామ్యమానయా = కోరఁబడుచున్న, అనయా = ఈ దమయంతితోటి, సహయోగః = సాహచర్యము, అంబుదాగమే = వర్షాకాలమునందు, ఘనసంవృతయా = మేఘములచే నావరింపఁబడిన, నిశాకరత్విషా = చంద్రకాంతితో, సహయోగః = సంబంధము, కుముదేనేవ = కలువతో నట్లు, త్వయా = నీచేత, న సులభః = సుఖముగఁ బొందసాధ్య మైనది కాదు.

ఇచ్చట "కుముదేనేవ" యని కలువతోడ నలుఁడు పోల్చఁబడుట వలన నుపమాలంకారము. దమయంతీసహయోగము దుర్లభ మగుటకు నమరకామ్యమానత్వ మను పదార్థము హేతు వగుటవలన పదార్థహేతుక కావ్యలింగాలంకారము ఉపమాలంకారము తత్సాపేక్షము గాన, దానితో దీనికి సంకరము.

సమాసములు :

అమరకామ్యమానయా:— అమరైః కామ్యమానా = అమరకామ్యమానా, తయా = అమరకామ్యమానయా.

సహయోగః:- సహ యోగః = సహయోగః

సులభః :- సుఖేన లబ్ధుం శక్యః = సులభః.

ఘనసంవృతయా:- ఘనైః సంవృతా = ఘనసంవృతా, తయా = ఘనసంవృతయా.

అంబుదాగమే:- అంబుదానామాగమః = అంబుదాగమః, తస్మిన్ = అంబుదాగమే.

భావము :

ఓ వీరా! ఈ దమయంతిని దేవతలు సైతమభిలషించుచున్నారు. కావున వర్షర్తువునందు, మబ్బుక్రమ్మిన చంద్రకాంతితో కలువకు సహయోగ మెట్లు దుర్లభమో యట్లే నీకును దమయంతితో సంబంధము దుర్లభము. అనగా నది సులభ మైనది కాదు.

శ్లో॥ తదహం విదధే తథా తథా
దమయంత్యాస్సవిధే తవ స్తవమ్ ।
హృదయే నిహిత స్తయా భవా
నపి సేంద్రేణ యథాపనీయతే ॥ ౪౭

ప. వి. తత్ । అహం । విదధే । తథా । తథా । దమయంత్యాః । సవిధే । తవ । స్తవమ్ । హృదయే । నిహితః । తయా । భవాన్ । అపి । న । ఇంద్రేణ । యథా । అపనీయతే ।

టీక॥ తత్ = అందువలన ననగా—దమయంతీసంబంధము దుర్లభ మగుటవలన, అహం = నేను, దమయంత్యాః = దమయంతియొక్క, సవిధే = ఎదుట, తథా తథా = ఆయా విధములుగ, తవ = నీయొక్క, స్తవం = స్తుతిని, విదధే = చేయఁగలను, యథా = ఏవిధముగ ననగా, తయా = ఆమెచే, హృదయే = మనస్సునందు, నిహితః = ఉంచుకొనఁబడిన, భవాన్ = నీవు, ఇంద్రేణాపి = ఇంద్రునిచేతను, నాపనీయతే = తొలగింపశక్యము గావో.

భావము :

ఆ దమయంతి సులభ కాదు. కావున నేను నిన్నుగూర్చి యామెయెదుట చక్కగాఁ బొగడఁగలను. ఆ పొగడ్తలవలన నీవామె హృదయమునం దెట్లు నాటుకొనిపోగలవో యట్లు చేయగలను. అప్పు డింద్రుఁడుగూడ నిన్నామె హృదయమునుండి తొలగింపఁజాలడు.

శ్లో॥ తవ సమ్మతిమత్ర కేవలా
మధిగంతుం ధిగిదం నివేదితమ్ ।
బ్రువతే హి ఫలేన సాధవో
న తు కంఠేన నిజోపయోగితామ్॥ ౪౭

ప. వి. తవ । సమ్మతిమ్ । అత్ర । కేవలామ్ । అధిగంతుం । ధిగ్ । ఇదం । నివేదితమ్ । బ్రువతే । హి । ఫలేన । సాధవః । న । తు । కంఠేన । నిజోపయోగితామ్ ।

టీక॥ అత్ర = ఈ కార్యమువిషయమున, కేవలాం = ముఖ్య మయిన, తవ = నీయొక్క, సమ్మతిం = అనుమతిని, అధిగంతుం = పొందుటకు, ఇదం = ఈ, నివేదితం = విషయనివేదనమును గూర్చి, ధిక్ = దూషణము తగినది, హి = ఏల యనగా, సాధవః = సాధువులు, నిజోపయోగితాం = తమ యుపకారిస్వభావమును, ఫలేన = కార్యముచే, బ్రువతే = చెప్పుచున్నారు, కంఠేన = వచనముతో, న బ్రువతే = చెప్పరు.

ఇచ్చట "నివేదితం ధిక్" అని విశేషవిషయ మైన వచనమును ధిక్కరించి దానిని 'బ్రువతే హి ఫలేన సాధవః' ఇత్యాదిగ ఫలముతో సాధువులు పలుకుదురు మాటతోఁ గా దని' సామాన్యార్థముచే సమర్థించుట వలన నర్థాంతరన్యాసాలంకారము.

సమాసములు:-

నిజోపయోగితామ్:- ఉపయోగః ఏషామ స్తీతి = ఉపయోగినః, ఉపయోగినాం భావః = ఉపయోగితా, నిజా చ సా ఉపయోగితా చ = నిజోపయోగితా, తాం = నిజోపయోగితామ్.

భావము :-

ఓ నలమహారాజా! దమయంతీవిషయమున నీ యనుమతిని (బొందుటకు మాత్రమే యింతవఱకును సంభాషించితిని. ఇట్లు మాట్లాడుట చాల యనుచితము. ఏల యనగా, కార్యమును సాధించి, దానితోఁ మాట్లాడుటయే సాధువుల లక్షణము. కాని కేవలము మాటలతో నుపకారమును జేయఁగల మని వెల్లడిచేయుట కాదు. కావున నీవీవిషయమున సమ్మతించినచో నీ కార్యము సాధింపఁగలను.

శ్లో॥ తదిదం విశదం వచోఽమృతం
పరిపీయాఽభ్యుదితం ద్విజాధిపాత్।
అతితృప్తతయా వినిర్మమే
సతదుద్గారమివ స్మితం సితమ్॥ ౮౦

ప. వి తత్। ఇదం। విశదం। వచోఽమృతం। పరిపీయ। అభ్యుదితం। ద్విజాధిపాత్। అతితృప్తతయా। వినిర్మమే। సః। తదుద్గారమ్। ఇవ। స్మితం। సితమ్

టీక॥ సః = ఆ నలుఁడు, ద్విజాధిపాత్ = హంసవలనను, (చంద్రునుండియు) అభ్యుదితం = చెప్పఁబడిన, (సంభవించిన) విశదం = స్పష్టమైన. (ప్రసన్ననిర్మలమైన), తత్ = ముందుఁజెప్పఁబడిన, ఇదం = ఈ, వచోఽమృతం = వచన మనెడి యమృతమును,పరిపీయ = విని(పానము గావించి) (అత ఏవ = ఇందువలననే), అతితృప్తతయా = మిక్కిలి తృప్తిఁజెందియుండుటచే,తదుద్గారమివ ; తత్ = ఆ యమృతముయొక్క, ఉద్గారమివ = తృప్తిసూచక మగు త్రేపునువలె, సితం = తెల్లని, స్మితం = చిఱునగవును, వినిర్మమే = ప్రకటించెను.

నవ్వు తెల్లగ నుండుటవలన నది యమృతపానము వలని త్రేపుగా నుత్ప్రేక్షింపఁబడినది కాన నుత్ప్రేక్ష.

సమాసములు:-

వచోఽమృతమ్:- వచ ఏవ అమృతమ్ = వచోఽమృతమ్, తత్ = వచోఽమృతమ్.

ద్విజాధిపాత్ :- ద్విజానామధిపః = ద్విజాధిపః, తస్మాత్ = ద్విజాధిపాత్,
అతితృప్తతయా :- అత్యంతం తృప్తః = అతితృప్తః. అతితృప్తస్య భావః = అతితృప్తతా, తయా = అతితృప్తతయా.

తదుద్గారమ్ :- తస్య ఉద్గారః = తదుద్గారః, తమ్ = తదుద్గారమ్.

భావము:-

ఆ నలుఁడు పక్షిరాజగు హంసవలన (చంద్రునివలన) నేర్పడినదియు, స్ఫుటమును నిర్మలము నగు వాగమృతము విని(పానము గావించి)మిక్కిలి తృప్తి జెందుటచే నా యమృతమువలని త్రేపుగా భావింపఁబడు చిఱునవ్వును బ్రకటించెను.

శ్లో॥ పరిమృజ్య భుజాగ్రజన్మనా
పతగం కోకనదేన నైషధః ।
మృదు తస్య ముదేఽకిరద్గిరః
ప్రియవాదామృతకూపకంఠజాః॥ ౭౦

ప. వి పరిమృజ్య। భుజాగ్రజన్మనా। పతగం। కోకనదేన। నైషధః । మృదు। తస్య। ముదే। అకిరత్। గిరః। ప్రియవాదామృతకూపకంఠజాః.

టీక॥ నైషధః = నిషధదేశపురాజగు నలమహారాజు, భుజాగ్రజన్మనా; భుజాగ్ర = బాహువులకు చివర, జన్మనా = ఉద్భవించిన, కోకనదేన = ఎఱ్ఱకలువవంటి చేతితో, పతగం = హంసను, పరిమృజ్య = నిమిరి, తస్య = ఆహంసయొక్క, ముదే = సంతోషముకొఱకు, ప్రియవాదామృతకూపకంఠజాః ; ప్రియ = ఇష్టము లైన, వాదామృత = వాదము లనెడి యమృతములకు, కూప = నిధి యైన. కంఠ = వాగింద్రియమునుండి, జాః = పుట్టినటువంటి. గిరః = వచనములను, మృదు = మెత్తగా. అకిరత్ = చల్లెను.

భుజాగ్రజన్మనా కోకనదేన యని భుజాగ్రమం దుద్భవించిన యెఱ్ఱ కలువచేత నని చెప్పెను గాని హస్త మనెడి ఎఱ్ఱకలువచేత నని చెప్ప నందువలన నుపమేయ మగు హస్త మనుపాత్తమై యుపమాన మైన యెఱ్ఱ కలువమాత్రమే యుపాత్తమయినందువలన నతిశయోక్త్యలంకారము.

అం దుపమేయ మగు హ స్తమునకు నుపమాన మగు నెఱ్ఱకలువకును నభేదము చెప్పుటవలన నభేదాతిశయోక్తి. అది 'ప్రియవాదామృతకూప కంఠజాః' అని ప్రియవాక్కుల నమృతముతో రూపించుటవలన నేర్పడినరూపకముతోఁ గూడియున్నందువలన నారెంటికి నిఁట సంసృష్టి।

సమాసములు :

భుజాగ్రజన్మనా:- భుజస్య అగ్రం = భుజాగ్రం, భుజాగ్రే జన్మ యస్య తత్ = భుజాగ్రజన్మ, తేన = భుజాగ్రజన్మనా.

ప్రియవాదామృతకూపకంఠజాః:- ప్రియాశ్చ తే వాదాశ్చ = ప్రియవాదాః, ప్రియవాదా ఏవ అమృతాని = ప్రియవాదామృతాని, ప్రియవాదామృతానాం కూపః = ప్రియవాదామృతకూపః, ప్రియవాదామృతకూపశ్చాసౌ కంఠశ్చ = ప్రియవాదామృతకూపకంఠః; ప్రియవాదామృతకూపకంఠాత్ జాయంత ఇతి = ప్రియవాదామృతకూపకంఠజా ; తాః = ప్రియవాదామృతకూప కంఠజాః

భావము :

అనలమహారాజు తనహస్తమను చెంగలువచే నాహంసను నిమిరి దానిని సంతోషపఱచుటకై ప్రియవచనామృతములకు గని యగు తనకంఠమునం దుద్భవించిన వచనములను వెదజల్లెను. అనగా దానిశరీరమును నిమిరి ప్రియవచనములతో దానిని సంతోషపఱుపసాగెను.

శ్లో॥ న తులావిషయే తవాకృతి
ర్న వచోవర్త్మని తే సుశీలతా।
త్వదుదాహరణాకృతౌ గుణా
ఇతి సాముద్రికసారముద్రణా॥ ౫౧

ప వి. న । తులావిషయే । తవ । ఆకృతిః । న । వచోవర్త్మని। తే । సుశీలతా। త్వదుదాహరణా । ఆకృతౌ । గుణాః । ఇతి। సాముద్రికసారముద్రణా ।

టీక॥ (హేహంస = ఓహంసా) తవ = నీయొక్క, ఆకృతిః = ఆకారము, తులావిషయే = సాదృశ్యవిషయమునందు, న = ఉండదు (అనగా సాటి

లేనిది), తే = నీయొక్క, సుశీలతా = మంచినడవడిక, వచోవర్త్మని = వాక్కుల మార్గమునందు. న = లేదు (అనగా చెప్ప శక్యము గాదు) (అత ఏవ = ఇందువలననే) ఆకృతౌ = ఆకారమందు, గుణాః = గుణము లను, సాముద్రికసారముద్రణా: సాముద్రిక = సాముద్రికశాస్త్ర వేత్తలయొక్క, సార = సిద్ధాంతములకు. ముద్రణా = ప్రతిపాదన, త్వదు దాహరణా = ని న్నుదాహరణముగా గల్గినది.

సాముద్రికశాస్త్రసిద్ధాంతములకు నీ వుదాహరణ మను నుత్తర వాక్యార్థమునకు నీయాకారము సాటిలేనిది, నీసౌశీల్యము చెప్ప శక్యము గానిది, అని పూర్వవాక్యార్థమును హేతువుగఁ జెప్పుటవలన. వాక్యార్థ హేతుకకావ్యలింగాలంకారము.

సమాసములు :-

తులావిషయే:- తులాయాః విషయః = తులావిషయః, తస్మిన్ = తులావిషయే.

సుశీలతా:- శోభనం శీలం యస్య సః = సుశీలః, సుశీలస్య భావః = సుశీలతా.

త్వదుదాహరణా :- త్వమ్ ఉదాహరణం యస్యాస్సా = త్వదుదాహరణా.

సాముద్రికసారముద్రణా :- సారస్య ముద్రణా = సారముద్రణా, సాముద్రికాణాం సారముద్రణా = సాముద్రికసారముద్రణా.

భావము :

ఓహంసా ! నీయాకారము సాటిలేనిది, నీసౌశీల్యము వర్ణింప శక్యము కానిది. "యత్రాకృతి స్తత్ర గుణాః" అని యెందాకృతి గలదో యందే గుణము లుండు నను సాముద్రికశాస్త్రసిద్ధాంతములకు నీవు తగిన యుదాహరణము.

శ్లో॥ న సువర్ణమయీ తనుః పరం
నను కిం వాగపి తావకీ తథా।
న పరం పథి పక్షపాతితాఽ
నవలంబే కిము మాదృశేఽపి సా॥ ౫౨

ప. వి. న । సువర్ణమయీ । తనుః । పరం । నను । కిం । వాక్ । అపి । తావకీ । తథా । న । పరం । పథి । పక్షపాతితా । అనవలంబే । కిమ్ । ఉ । మాదృశే । అపి । సా ।

టీక॥ నను హంస = ఓహంసా, తావకీ = నీదైన, తనుః పరం = శరీరము మాత్రమే,సువర్ణ మయీ = సువర్ణమయము కాదు,కింతు = మఱే మనగా, వాగపి = నీపలుకుగూడ,తథా = అట్లు సువర్ణమయ మైనది, అనగా మంచి వర్ణములతోఁగూడినది, అనవలంబే = నిరాధార మైన, పథి పరం = మార్గ మైన ఆకాశమందే, పక్షపాతితా = పక్షపాతము గల్గియుండుట (ఱెక్కలను విసరుట) న = లేదు, కిము = మఱే మనగా, అనవలంబే = నిరాధార మైన, మాదృశేఽపి = నావంటివానియందును, సా = ఆపక్షపాతము గల్గియుండుట(స్నేహము గల్గియుండుట నీకుఁగలదు).

ఇచ్చట తనువును వాక్కును 'సువర్ణమయీ' యని సువర్ణమయ ముగఁజెప్పుటవలన శబ్దశ్లేష, మార్గమందును నాయందును 'పక్షపాతితా' యని పక్షపాతము గల్గియుండుటను జెప్పుటవలన నుభయశ్లేష యని సజాతీయము లగు నీరెండుశ్లేషలకును సంసృష్టి. వీనివలన, తనువాక్కులకును, పథినలులకును సామ్యము ప్రతీయమాన మగుటవలన నుపమాలంకారము ధ్వనించుటచే నలంకారముతో నలంకారధ్వని.

సమాసములు ;

సువర్ణమయీ :- సువర్ణస్య వికారః = సువర్ణమయీ; శోభనాశ్చ తే వర్ణాశ్చ = సువర్ణాః, సువర్ణానాం వికారః = సువర్ణమయీ.

తావకీ:- తవ ఇయం = తావకీ ;

పక్షపాతితా :- పతతీతి = పాతీ, పక్షాభ్యాం పాతీ = పక్షపాతీ, పక్షపాతినః భావః = పక్షపాతితా, పక్షే పాతః పక్షపాతః, పక్షపాతః అస్యాస్తీతి = పక్షపాతీ పక్షపాతినః భావః = పక్షపాతితా.

అనవలంబే:- అవిద్యమానః అవలంబః యస్య సః = అనవలంబః, తస్మిన్ = అనవలంబే

భావము :

ఓ హంసా! నీ శరీరము మాత్రమే సువర్ణమయము గాదు. మఱేమనగా నీ వాక్కులు సైతము సద్వర్ణ ఘటితములై నందువలన సువర్ణమయములు. నీకు నిరాధార మగు నాకసమునందే ఱెక్కలు విసరుట యను పక్షపాతము లేదు, మఱే మనగా నిరాధార మగు నావంటివానివిషయమునందును స్నేహముగల్గియుండుట యను పక్షపాతము గలదు.

శ్లో॥ భృశతాపభృతా మయా భవా
న్మరుదాసాది తుషారసారవాన్।
ధనినామితరస్సతాం పున
ర్గుణవత్సన్నిధిరేవ సన్నిధిః॥ ౫౩

ప. వి. భృశతాపభృతా। మయా। భవాన్। మరుత్। ఆసాది। తుషారసారవాన్। ధనినామ్। ఇతరః। సతాం। పునః। గుణవత్సన్నిధిః। ఏవ। సన్నిధిః।

టీక॥ భృశతాపభృతా; భృశ = అధిక మైన, తాప = సంతాపమును, భృతా = భరించుచున్న, మయా = నాచే, భవాన్ = నీవు, తుషారసారవాన్ = తుంపురులచే నుత్కృష్ట మగు, మరుత్సన్ = గాలి యగుచు, ఆసాది = పొందఁబడితివి, హి = ఎట్లనగా, ధనినాం = ధనవంతు లయిన కుబే రుఁడు మున్నగువారికి, ఇతరః = పద్మశంఖాదికమే, సన్నిధిః = శ్రేష్ఠ మయిన నిధి యగును, సతాం = విద్వాంసులకో, గుణవత్సన్నిధిరేవ; గుణవత్ = గుణవంతులయొక్క, సన్నిధిరేవ = సాన్నిధ్యమే, సన్నిధిః = గొప్ప నిధి.

ఇచ్చట ఉపమానోపమేయము లగు నిధి హంసలకు వాక్యద్వయ మున బింబప్రతిబింబభావముచే, గుణవత్సన్నిధి — మరుత్తులతో సమాన ధర్మత్వముఁ జెప్పుటవలన దృష్టాంతాలంకారము.

సమాసములు;—

భృశతాపభృతా ;— భృశం తాపః = భృశతాపః, భృశతాపం బిభర్తీతి = భృశతాపభృత్, తేన = భృశతాపభృతా.

తుషారసారవాన్ :— తుషారాణాం సారః = తుషారసారః, తుషారసారః అస్య అస్తీతి = తుషారసారవాన్.

గుణవత్సన్నిధిః :— గుణః ఏషామస్తీతి = గుణవంతః, గుణవతాం సన్నిధిః = గుణవత్సన్నిధిః.

సన్నిధిః —: సంశ్చాసౌ నిధిశ్చ = సన్నిధిః.

**భావము :**

ఓ హంసా! మిక్కిలి సంతాప మనుభవించుచున్న నేను, తుంపరలతోఁ జల్లనైన వాయువుగ నిన్ను బొందితిని. లోకమున కుబేరునివంటి ధనికులకు శంఖ పద్మాదినిధులే సన్నిధులు, కాని, ధనాపేక్ష లేని జ్ఞానులకు నీవంటి గుణవంతుల సాన్నిధ్యమే మహానిధి యగుచున్నది. నీసాన్నిధ్యముచే నాసంతాప మణంగఁగల దని భావింతును.

శ్లో॥ శతశశ్శ్రుతిమాగతైవ సా
త్రిజగన్మోహమహౌషధిర్మమ।
అధునా తవ శంసితేన తు
స్వదృశైవాభిహితామవైమి తామ్॥ ౫౪

ప. వి. శతశః । శ్రుతిమ్ । ఆగతా । ఏవ । సా। త్రిజగన్మోహమహౌషధిః । మమ । అధునా । తవ । శంసితేన । తు। స్వదృశా । ఏవ । అభిహితామ్ । అవైమి । తామ్।

టీక॥ త్రిజగన్మోహమహౌషధిః; త్రిజగత్ = ముల్లోకములను, మోహ = మోహింపఁ జేయుటయందు, మహా = గొప్పదైన. ఓషధిః = మూలిక యగు, సా = ఆ దమయంతి, శతశః = వందమారులు, మమ = నా యొక్క, శ్రుతిం = చెవిని గూర్చి, ఆగతైవ = వచ్చినదే, అధునా = ఇప్పుడు, తవ = నీయొక్క. శంసితేన తు = వచనముచేతనో, స్వదృశైవ = నాకంటిచేతనే, అభిహితామ్ = బోధింపఁబడిన దానినిగ, తాం = ఆ దమయంతిని, అవైమి = తెలిసికొనుచున్నాను.

"త్రిజగన్మోహమహౌషధిః" అని దమయంతిని మూలికగఁ జెప్పుటవలన రూపకాలంకారము.

సమాసములు:—

త్రిజగన్మోహమహౌషధిః :— త్రిజగతో మోహః, = త్రిజగన్మోహః, మహతీ చ సా ఓషధిశ్చ = మహౌషధిః, త్రిజగన్మోహస్య మహౌషధిః = త్రిజగన్మోహమహౌషధిః.

స్వదృశా ;— స్వస్య దృక్ = స్వదృక్, తయా = స్వదృశా.

భావము :

మూడు లోకములను మోహింపఁజేయు మహామూలిక యగు నాదమయంతి పెక్కుమాఱులు నా చెవికి వచ్చియున్నది. కాని యిప్పుడు నీ వామెను గుఱించి చెప్పుటవలన నిజముగ నాకనులతోడనే యామెను జూచినట్లు భావించుచున్నాను. ఆప్తవచనము ప్రమాణము గాఁబట్టి యాప్తుఁడ వైన నీవు చెప్పుటవలన దమయంతీప్రత్యక్షమే యయినదిగ భావింతును.

శ్లో॥ అఖిలం విదుషామనావిలం
సుహృదా చ స్వహృదా చ పశ్యతామ్ ।
సవిధేఽపి నసూక్ష్మసాక్షిణీ
వదనాలంకృతిమాత్రమక్షిణీ॥ ౨౨

ప. వి. అఖిలం । విదుషామ్ । అనావిలం । సుహృదా । చ । స్వహృదా । చ । పశ్యతామ్ । సవిధే । అపి । నసూక్ష్మసాక్షిణీ । వదనాలంకృతిమాత్రమ్ । అక్షిణీ ।

టీక॥ సుహృదా = ఆప్తునిచేతను, స్వహృదా చ = తమహృదయముచేతను, అఖిలం = సమస్తమైన యర్థమును, అనావిలం = పరిశుద్ధముగను సందేహరహితముగను, పశ్యతాం = చూచుచున్న, విదుషాం = వివేకవంతులకు, సవిధేఽపి = సమక్షమందును, నసూక్ష్మసాక్షిణీ = సూక్ష్మవిషయములను జూపింపఁజాలని, అక్షిణీ = కన్నులు రెండును, వదనాలంకృతిమాత్రమ్ = ముఖమున కలంకారములే యగును (కాని సూక్ష్మవిషయములను జూపజాలినవి కావు).

సమాసములు :

అనావిలమ్ :— న ఆవిలః = అనావిలః, తమ్ = అనావిలమ్.
స్వహృదా :— స్వస్య హృత్ = స్వహృత్, తేన = స్వహృదా.
నసూక్ష్మసాక్షిణీ :— సూక్ష్మస్య సాక్షిణీ = సూక్ష్మసాక్షిణీ, న సూక్ష్మ సాక్షిణీ = నసూక్ష్మసాక్షిణీ.
వదనాలంకృతిమాత్రమ్ :— వదనస్య అలంకృతిః = వదనాలంకృతిః, వదనాలంకృరేవ = వదనాలంకృతిమాత్రమ్.

భావము :

ఓ హంసా! ఆప్తునిచేతను తనహృదయముచేతను సమస్తవిషయములను నిస్సంశయముగను, విపర్యాసరహితముగను వివేకవంతులు తెలిసికొనగలరు. ఎదుట నున్నను సూక్ష్మవిషయములను తెలిసికొనఁజాలని యీ కన్నులు వారి ముఖమున కలంకారములే కాని సూక్ష్మవిషయములను గ్రహింపఁ దోడ్పడవు కావున నాప్తుఁడ వయిన నీవు చెప్పెడివిషయములు మిక్కిలి విశ్వసనీయములు.

శ్లో॥ అమితం మధు తత్కథా మమ
శ్రవణప్రాహుణికీకృతా జనైః।
మదనానలబోధనే భవే
త్ఖగ ధాయ్యా ధిగధైర్యధారిణః॥ ౫౬

ప వి. అమితం। మధు, తత్కథా। మమ। శ్రవణప్రాహుణికీకృతా। జనైః।
మదనానలబోధనే। భవేత్। ఖగ। ధాయ్యా। ధిక్। అధైర్యధారిణః।

టీ॥ హే ఖగ = ఓహంసా, జనైః = జనములచే, మమ = నాయొక్క, శ్రవణప్రాహుణికీకృతా; శ్రవణ = చెవులకు, ప్రాహుణికీకృతా = అతిథిగాఁ జేయబడిన, అనగా విషయముగాఁ జేయబడిన, అమితం = పరిమితము గాని, మధు = తేనెవలె మధురమైన, తత్కథా = ఆదమయంతీగుణవర్ణనము కథ, అధైర్యధారిణః = ధైర్యము దొలగిన, మమ = నాకు, మద

నానలబోధనే: మదనానల = మన్మథాగ్నిని, బోధనే = రగిలించుట యందు, ధాయ్యా = అగ్నిని బక్కగాఁ బ్రజ్వలింపఁజేయు సామిధేని యనుఋక్కుగా, భవేత్ = అగును. ధిక్ = ఇది మిక్కిలి నిందింపదగిన విషయము.

ఇచ్చట దమయంతీకథ ప్రస్తుత మైన మన్మథాగ్నియొక్క ప్రజ్వలన యను కార్యమునకై ధాయ్య యను సామిధేని ఋక్కుగా పరిణమించినది. కాన పరిణామాలంకారము.

సమాసములు :_

తత్కథా :_ తస్యాః కథా = తత్కథా.

శ్రవణప్రాహుణికీకృతా :_ న ప్రాహుణికా = అప్రాహుణికా, అప్రాహుణికా ప్రాహుణికా సంపద్యమానా కృతా = ప్రాహుణికీకృతా. శ్రవణయోః ప్రాహుణికీకృతా = శ్రవణప్రాహుణికీకృతా.

మదనానలబోధనే :_ మదన ఏవ అనలః = మదనానలః, మదనానలస్య బోధనం = మదనానలబోధనం, తస్మిన్ = మదనానలబోధనే.

అధైర్యధారిణః :_ ధీరస్య భావః = ధైర్యం, ధైర్యం ధారయతీతి = ధైర్యధారీ, న ధైర్యధారీ = అధైర్యధారీ, తస్య = అధైర్యధారిణః.

భావము :

ఓహంసా! విదర్భదేశమునుండి వచ్చిన జనులు తేనెవలె మధుర మయిన దమయంతీకథను నాకు వినిపించిరి. కాని యాకథ ధైర్యమును గోల్పోయిన నాకు మన్మథాగ్నిని రగిలించు సామిధేని యను ఋక్కుగా మాఱి నన్ను మిక్కిలి బాధించుచున్నది. ఇది చాల కష్ట మయిన విషయము. వేదమున సామిధేను లను పేరుగల ఋక్కులు గలవు. అవి హోమమునకు ముం దగ్నిని బక్కగఁ బ్రజ్వలింపఁజేయుటకుఁ బఠింపఁబడును. ఆ సామిధేనులకు ధాయ్యా లనియుఁ బేరు గలదు.

శ్లో॥ విషమో మలయాహిమండలీ
విషతాపూత్కారమయో మయోహితః।
బత కాలకళత్రదిగ్భవః
పవనస్తద్విరహానలైధసా॥ ౩౭

ప. వి. విషమః। మలయాహిమండలీవిషఫూత్కారమయః । మయా । ఊహితః। బత । కాలకళత్రదిగ్భవః । పవనః । తద్విరహానలైధసా ।

టీక॥ విషమః = ప్రతికూలమైనదియు, కాలకళత్రదిగ్భవః = యమునికళత్ర మనఁదగు దక్షిణదిక్కునందుఁ గల్గిన, పవనః = వాయువు (దక్షిణపుగాలి), తద్విరహానలైధసా, తత్ = ఆదమయంతి యొక్క, విరహానల = విరహాగ్నికి, ఏధసా = కట్టెయైన, మయా = నాచే, మలయాహిమండలీవిషఫూత్కారమయః; మలయ = మలయ పర్వతమందలి, అహిమండలీ = సర్పసమూహములయొక్క, విషఫూత్కారమయః = విషశ్వాసమయముగ, అనగా విషపునిట్టూర్పుల వికారముగ, ఊహితః = ఊహింపబడినది, బత = కష్టము.

"విరహానలైధసా" అని విరహాగ్నికి నలుఁడు తనను కట్టెగ రూపించినందువలన రూపకాలంకారము. మలయమారుతము మలయసర్పముల విషపునిట్టూర్పులుగ నూహింపబడుటవలన నుత్ప్రేక్షాలంకారము. పై రెంటికి నిట సంకరము.

సమాసములు :

మలయాహిమండలీవిషఫూత్కారమయః :_ అహీనాం మండలీ = అహిమండలీ, మలయే అహిమండలీ = మలయాహిమండలీ, విషస్య ఫూత్కారః = విషఫూత్కారః, మలయాహిమండల్యాః విషఫూత్కారః = మలయాహిమండలీవిషఫూత్కారః, మలయాహిమండలీవిషఫూత్కారస్య, వికారః = మలయాహిమండలీవిషఫూత్కారమయః.

కాలకళత్రదిగ్భవః :_ కాలస్య కళత్రం = కాలకళత్రమ్, కాలకళత్రం చాసౌ దిక్చ = కాలకళత్రదిక్, కాలకళత్రదిశి భవతీతి = కాలకళత్రదిగ్భవః.

విరహానలైధసా :_ విరహస్య అనలః = విరహానలః, విరహానలస్య ఏధః = విరహానలైధః, తేన = విరహానలైధసా.

భావము :

దమయంతీవిరహాగ్ని కింధన మైన నేను యమునిదిక్కునందుఁ బుట్టుటచేతనే ప్రాణహర మగు దక్షిణపుగాలిని మలయపర్వతమందలి సర్పసంఘముల విషపుఁబుట్టువుఁగ నూహించితిని.

శ్లో॥ ప్రతిమాసమసౌ నిశాకరః
ఖగ సంగచ్ఛతి యద్దినాధిపమ్ ।
కిము తీవ్రతరై స్తతః కరై
ర్మమ దాహాయ స ధైర్యతస్కరైః॥ ౫౮

ప. వి. ప్రతిమాసమ్ । అసౌ । నిశాకరః । ఖగ । సంగచ్ఛతి । యత్ । దినాధిపమ్ । కిమ్ । ఉ । తీవ్రతరైః । తతః । కరైః । మమ । దాహాయ । సః । ధైర్యతస్కరైః ।

టీక॥ హేఖగ! = ఓహంసా, అసౌ = ఆ, నిశాకరః = చంద్రుఁడు, ప్రతిమాసం = ప్రతిమాసము, (అమావాస్యయందు), దినాధిపం = సూర్యుని, సంగచ్ఛతీతి యత్ = కలియుచున్నాఁ డనుట యేది కలదో, తతః = ఆ కలియుటవలన, సః = ఆచంద్రుఁడు, తీవ్రతరైః = మిగుల తీవ్రము లైన, (కావుననే), ధైర్యతస్కరైః = ధైర్యము నపహరించెడి, కరైః = (సూర్యునియొద్దనుండి కొనితెచ్చిన). కిరణములచే, మమ = నా యొక్క, దాహాయ = తాపముకొఱకు, సంగచ్ఛతి కిము = కలియుచున్నాఁడా యేమి.

ఇచ్చట చంద్రుఁడు సూర్యునితో కలియుటకు దాహము ఫలము కాకపోయినను దానిని ఫలముగ భావించుట వలన ఫలోత్ప్రేక్ష.

సమాసములు:

ప్రతిమాసమ్ :— మాసి మాసి = ప్రతిమాసమ్.
దినాధిపమ్ :— దినస్య అధిపః = దినాధిపః, తం = దినాధిపమ్.
తీవ్రతరైః :— అత్యంతం తీవ్రాః = తీవ్రతరాః, తైః = తీవ్రతరైః.

ధైర్యతస్కరైః :— ధీరస్య భావః = ధైర్యమ్, ధైర్యస్య తస్కరాః = ధైర్యతస్కరాః, తైః = ధైర్యతస్కరైః,

**భావము :**

ఓ హంసా! ఆ చంద్రుఁడు ప్రతిమాసము అమావాస్యనాడు సూర్యునితోఁ గలియును. సూర్యచంద్రుల సంగమమే యమావాస్య. తన కిరణములకు వేడిమి లేనందువలన చంద్రుఁడా సూర్యునియొద్దనుండి నా ధైర్యము నపహరించెడి తీక్ష్ణము లగు కిరణములను దెచ్చి నన్ను దపింపఁచేయుటకై యాసూర్యునితోఁ గలియుచున్నాఁడా యేమి యని నేను భావింతును.

శ్లో॥ కుసుమాని యది స్మరేషవో
న తు వజ్రం విషవల్లిజాని తత్।
హృదయం యదమూముహన్నమూ
ర్మమ యచ్చాతితరామతీతపన్॥ ౫౫

ప. వి. కుసుమాని । యది । స్మరేషవః । న । తు । వజ్రం । విషవల్లిజాని । తత్ । హృదయం । యత్ । అమూముహన్ । అమూః । మమ । యత్। చ । అతితరామ్ । అతీతపన్ ।

టీక॥ స్మరేషవః = మన్మథబాణములు, కుసుమాని = పుష్పములే, వజ్రమ్ = పిడుగు మాత్రము, న యది = కానిచో, తత్ = అప్పుడు, విషవల్లిజాని = విషలతలయందు పుట్టినవి, యత్ = ఏల యనగా, అమూః = ఆ మన్మథబాణములు. మమ = నాయొక్క, హృదయం = హృదయమును, అమూముహన్ = మోహింపఁజేసినవి, యత్ = ఎందువలన, అతితరాం = మిక్కిలి, అతీతపంశ్చ = తపించునట్లును జేసినవి.

పుష్పములయందు, మోహింపఁజేయుట,తపింపజేయుట మున్నగు విషకార్యము లుండుటవలన విషలతాభవములుగ నుత్ప్రేక్షింపఁబడినవి. కాన నుత్ప్రేక్షాలంకారము.

సమాసములు :

స్మరేషవః = స్మరస్య ఇషవః = స్మరేషవః.

విషవల్లిజాని :- విషస్య వల్లిః = విషవల్లిః = విషవల్లేః జాయంత ఇతి = విషవల్లిజాని.

భావము :

మన్మథునిబాణములు పుష్పములే కాని పిడుగులు కావు.అయినచో వెంటనే మరణమును గల్గింపవలసియున్నవి.కాని యాపుష్పబాణములు విషలతలవలనఁ బుట్టినవి. కావుననే విషము గల్గిన వై నాహృదయమును మోహింపఁజేయు చున్నవి మిక్కిలి తపించునట్లును జేయుచున్నవి.

శ్లో॥ తదిహానవధౌ నిమజ్జతో
మమ కందర్పశరాధినీరధౌ।
భవ పోత ఇవావలంబనం
విధినాకస్మికసృష్టసన్నిధిః॥ ౬౦

ప. వి. తత్ । ఇహ । అనవధౌ । నిమజ్జతః । మమ । కందర్పశరాధినీరధౌ । భవ । పోతః । ఇవ । అవలంబనం । విధినా । ఆకస్మికసృష్టసన్నిధిః.

టీక॥ తత్ = అందువలన, ఇహ = ఈ, అనవధౌ = పారము లేనటువంటి, కందర్పశరాధినీరధౌ, కందర్పశర = మన్మథబాణములవలని, ఆధి = మనోవ్యాధి యను, నీరధౌ = సముద్రమందు, నిమజ్జతః = మునుగు చున్న, మమ = నాకు, విధినా = దైవముచే, ఆకస్మికసృష్టసన్నిధిః, ఆకస్మిక = ఆకస్మికముగ, సృష్ట = కల్పింపఁబడిన, సన్నిధిః = సన్నిధానము గల్గిన, త్వం = నీవు, పోత ఇవ = ఓడవలె, అవలంబనం = ఆధారము. భవ = కమ్ము.

సమాసములు :

అనవధౌ :- అవిద్యమానః అవధిః యస్య సః = అనవధిః, తస్మిన్ = అనవధౌ.

కందర్పశరాధినీరధౌ :- కందర్పస్య శరాః = కందర్పశరాః, కందర్ప శరైః ఆధిః = కందర్పశరాధిః, కందర్పశరాధిరేవ నీరధిః = కందర్ప శరాధినీరధిః, తస్మిన్ = కందర్పశరాధినీరధౌ.

ఆకస్మికసృష్టసన్నిధిః :- అకస్మాద్భవం = ఆకస్మికం, ఆకస్మికం సృష్టః = ఆకస్మికసృష్టః, ఆకస్మికసృష్టః సన్నిధిః యస్య సః = ఆకస్మికసృష్టసన్నిధిః

భావము :

కావున నీయపార మగు మన్మథబాణములవలనఁ గల్గిన యీమనస్తాప మను సాగరమందు మునుగుచున్న నాకు దైవముచే నాకస్మికముగఁ బంపఁబడిన నీవు ఓడవలె నాధారముగ నుండుము.

శ్లో॥ అథ వా భవతః ప్రవర్తనా
న కథం పిష్టమియం పినష్టి నః।
స్వత ఏవ సతాం పరార్థతా
గ్రహణానాం హి యథా యథార్థతా॥ ౬౧

ప. వి. అథ । వా । భవతః । ప్రవర్తనా । న । కథం । పిష్టమ్ । ఇయం । పినష్టి । నః । స్వతః । ఏవ । సతాం । పరార్థతా । గ్రహణానాం । హి । యథా । యథార్థతా ।

టీక॥ అథ వా = లేదా, ఇయం = ఈ, నః = మాయొక్క, ప్రవర్తనా = ప్రేరణ, కథం = ఎట్లు, పిష్టం = పిసుకఁబడినదానిని, న పినష్టి = పిసుకుట లేదు, హి = ఏల యనగా, గ్రహణానాం = జ్ఞానములకు, యథార్థతా = ప్రామాణ్యము, యథా = ఎట్లు, స్వత ఏవ = స్వయముగ గ్రాహ్య మగునో, తథా = అట్లే, సతాం = సత్పురుషులకు, పరార్థతా = పరప్రయోజనమునకై ప్రవృత్తి, స్వత ఏవ = స్వయముగనే కలుగు చున్నది.

'గ్రహణానాం హి యథా యథార్థతా' అని జ్ఞానములకు ప్రామాణ్యమువలె 'సతాం పరార్థతా స్వత ఏవ' అని సత్పురుషులకు పరప్రయో

జనమందు ప్రవృత్తి స్వయముగనే యుండు నని జ్ఞానములకును సత్పురుషులకును ఉపమానోపమేయభావము చెప్పుటవలన నుపమాలంకారము. 'స్వత ఏవ సతాంపరార్థతా' ఇత్యాదిసామాన్యార్థముచే "నిన్ను ప్రేరేపించుట పిష్టపేషణమను" పూర్వార్థమందలి విశేషార్థము సమర్థింపఁబడుట వలన నర్థాంతరన్యాసాలంకారము. ఈ రెండలంకారములకు సంసృష్టి.

సమాసములు :

పరార్థతా :- పరః అర్థః యేషాం తే = పరార్థాః, పరార్థానాం భావః = పరార్థతా.

భావము :

ఓహంసా! నిన్ను మఱల మాకార్యమునకై ప్రేరణజేయుట పిష్టపేషణము గదా! పిసికి పక్వము జేయఁబడిన పిండిని పిసుకుట యెట్లు వ్యర్థమో మాయెడ స్వయముగనే శ్రద్ధాసక్తులు గల నిన్ను మఱల ప్రేరణజేయుట గూడ నట్లు వ్యర్థము గదా! ఏల యనగా మీమాంసకమతమునందు జ్ఞానములు స్వయం ప్రమాణములుగనే యుద్భవించును. కావున జ్ఞానములయందుఁ బ్రామాణ్యము నైయాయికమతమునందువలె పరాధీనము కాదు. అవ్విధముగనే సత్పురుషులకు పరోపకారపరాయణత్వము స్వయముగనే యుండును. కాన నీవంటి సజ్జనులు మాయెడ స్వతస్సిద్ధముగనే యుపకారముఁ జేయ సంకల్పించియుందురు. కాన మఱల దానిని తమవంటి సత్పురుషులకు హెచ్చరించుట పిష్టపేషణ మను పునరుక్తివంటిది.

శ్లో॥ తవ వర్త్మని వర్తతాం శివం
పునరస్తు త్వరితం సమాగమః।
అధిసాధయ సాధయేప్సితం
స్మరణీయాస్సమయే వయం వయః॥ ౬౨

ప. వి. తవ । వర్త్మని । వర్తతాం । శివం । పునః । అస్తు । త్వరితం । సమాగమః । అధిసాధయ । సాధయ । ఈప్సితం । స్మరణీయాః । సమయే । వయం । వయః.

టీక॥ హేవయః = ఓహంసా ! తవ = నీయొక్క వర్త్మని = మార్గమందు, శివం = మంగళము, వర్తతాం = ఉండును గాత, త్వరితం = శీఘ్రముగా, పునః = మఱల, సమాగమః = కలయిక, అస్తు = అగును గాత, అధిసాధయ = వెళ్లుము, ఈప్సితం = ఇష్టమును, సాధయ = సాధించుము, సమయే = కార్యసమయమందు, వయం = మేము, స్మరణీయాః = స్మరింపఁదగినవారము.

సమాసములు :

స్మరణీయాః = స్మర్తుం యోగ్యాః = స్మరణీయాః.

భావము :

ఓహంసా! నీకు మార్గమందు మంగళ ముండును గాత! శీఘ్రములో మనకు మఱల సమాగమమగును గాత. వెళ్లుము, ఇష్టమును సాధించుము. కార్య సమయమందు మమ్ములను మఱువకుము. మాయందే యాసక్తి గల్గి కార్యమును నిర్వహించుము.

శ్లో॥ ఇతి తం స విసృజ్య ధైర్యవాన్
నృపతిస్సూనృతవాగ్ బృహస్పతిః।
అవిశద్వనవేశ్మ విస్మిత
శ్రృతిలగ్నైః కలహంసశంసితైః॥ ౭౩

ప. వి. ఇతి । తం । సః । విసృజ్య ధైర్యవాన్ । నృపతిః । సూనృతవాగ్బృహస్పతిః । అవిశత్ । వనవేశ్మ । విస్మితః । శ్రుతిలగ్నైః । కలహంసశంసితైః.

టీక॥ ధైర్యవాన్ = ధైర్యవంతుఁడును, సూనృతవాగ్బృహస్పతిః; సూనృతవాక్ = సత్యప్రియవచనములయందు, బృహస్పతిః = దేవగురువైన, సః = ఆ, నృపతిః = నలమహారాజు, ఇతి = ఈ విధముగ, తం = హంసను, విసృజ్య = వదలి, శ్రుతిలగ్నైః = చెవులయందుఁ బడినటువంటి, కలహంసశంసితైః = కలహంసధ్వనులచే, విస్మితస్సన్

= ఆశ్చర్యము జెందినవాఁడై, వనవేశ్మ = ఉద్యానవనమందలి విహార సౌధమును, అవిశత్ = ప్రవేశించెను.

సమాసములు :

ధైర్యవాన్:- ధైర్యమస్య అస్తీతి = ధైర్యవాన్.
సూనృతవాగ్బృహస్పతిః:- సూనృతాశ్చ తాః వాచశ్చ = సూనృతవాచః· సూనృతవాక్షు బృహస్పతిః = సూనృతవాగ్బృహస్పతిః.
వనవేశ్మ :-వనే వేశ్మ = వనవేశ్మ, తత్ = వనవేశ్మ
శ్రుతిలగ్నైః:- శ్రుత్యోర్లగ్నాని = శ్రుతిలగ్నాని, తైః = శ్రుతిలగ్నైః.
కలహంసశంసితైః :- కలహంసానాం శంసితాని = కలహంసశంసితాని, తైః = కలహంసశంసితైః

భావము :

ఉపాయ మొకటి లభించినందువలన ధైర్యము వహించినవాఁడును,సత్య ప్రియసంభాషణములయందు బృహస్పతివంటివాడు నగు నానలమహారాజి ట్లాహంసను వదలిపెట్టి కలహంసనాదములు చెవుల సోకుచుండగా విస్మయ మందినవాఁడై యాయుద్యానమందలి విహారభవనముఁ జొచ్చెను.

శ్లో॥ అథ భీమసుతావలోకనైః
స్సఫలం కర్తుమహస్తదేవ సః।
క్షితిమండలమండనాయితం
నగరం కుండినమండజో యయౌ॥ ౨౪

ప వి. అథ। భీమసుతావలోకనైః। సఫలం। కర్తుమ్। అహః। తత్। ఏవ। సః। క్షితిమండలమండనాయితం। నగరం। కుండినమ్। అండజః। యయౌ-

టీక॥ అథ = పిదప, సః = ఆ, అండజః = పక్షియైన హంస, తత్ = ఆ, అహరేవ = దినమునే, భీమసుతావలోకనైః, భీమసుతా = దమయంతి యొక్క, అవలోకనైః = దర్శనములతో, సఫలం = ప్రయోజనవంత

ముగ,కర్తుం = చేయుటకు క్షితిమండలమండనాయితమ్; క్షితిమండల = భూమండలమునకు, మండనాయితమ్ = అలంకార మైన, కుండినం = కుండిన మను, నగరం = పట్టణమును గూర్చి, యయౌ = వెళ్లెను.

సమాసములు :

భీమసుతావలోకనైః :- భీమస్య సుతా = భీమసుతా, భీమసుతాయాః అవలోకనాని = భీమసుతావలోకనాని, తైః = భీమసుతావలోకనైః.

క్షితిమండలమండనాయితమ్ :- క్షితేః మండలమ్ = క్షితిమండలమ్, మండనమివ ఆచరితమ్ = మండనాయితమ్, క్షితిమండలస్య మండనాయి తమ్ = క్షితిమండలమండనాయితమ్.

భావము :

ఆ హంస దమయంతీదర్శనములచే నాదినమును సార్థకపఱచుటకై భూమి కంతటికి నలంకార మైన కుండిననగరమునకుఁ బయనమాయెను.

శ్లో॥ ప్రథమం పథి లోచనాతిథిం
పథికప్రార్థితసిద్ధిశంసినమ్।
కలశం జలసంభృతం పురః
కలహంసః కలయాంబభూవ సః॥ ౬౫

ప. వి. ప్రథమం। పథి। లోచనాతిథిం। పథికప్రార్థితసిద్ధిశంసినమ్। కలశం। జలసంభృతం। పురః। కలహంసః। కలయాంబభూవ। సః।

టీక॥ సః = ఆ, కలహంసః = కలహంస, ప్రథమం = మొదట, పథి = మార్గమందు, లోచనాతిథిమ్ = నేత్రములకుఁ బ్రియ మైనదియు, పథికప్రార్థితసిద్ధిశంసినమ్; పథిక = ప్రయాణికులచే, ప్రార్థిత = కోరఁ బడినవిషయముయొక్క, సిద్ధి = సిద్ధిని, శంసినమ్ = సూచించునదియు, జలసంభృతం = నీటితో నిండినదియు నగు, కలశం = కుంభమును, పురః = ఎదుట, కలయాంబభూవ = చూచెను.

సమాసములు :

లోచనాతిథిమ్:- లోచనయోరతిథిః = లోచనాతిథిః, తం = లోచనాతిథిమ్.
పథికప్రార్థితసిద్ధిశంసినమ్ :- పథికైః ప్రార్థితః = పథికప్రార్థితః,

పథికప్రార్థితస్య సిద్ధిః = పథికప్రార్థితసిద్ధిః, పథికప్రార్థితసిద్ధేః శంసీ = పథికప్రార్థితసిద్ధిశంసీ, తం = పథికప్రార్థితసిద్ధిశంసినమ్,

జలసంభృతమ్ :- జలేన సంభృతః = జలసంభృతః, తం = జలసంభృతమ్.

**భావము :**

ఆకలహంస బయలుదేరగనే మొదట కనులకు ప్రియమై, ప్రయాణికుల యిష్టసిద్ధిసూచకమైన, నీళ్ళతో నిండిన కుండ నెదుటఁ గాంచెను.

శ్లో॥ అవలంబ్య దిదృక్షయాంబరే
క్షణమాశ్చర్యరసాలసం గతమ్ ।
స విలాసవనేఽవనీభుజః
ఫలమైక్షిష్ట రసాలసంగతమ్॥ ౬౬

ప. వి. అవలంబ్య । దిదృక్షయా । అంబరే । క్షణమ్ । ఆశ్చర్యరసాలసం । గతమ్ । సః । విలాసవనే । అవనీభుజః । ఫలమ్ । ఐక్షిష్ట । రసాలసంగతమ్ ।

టీక॥ సః = ఆహంస, దిదృక్షయా = పోవలసిన త్రోవను చూడవలయు ననుగోరికచే, అంబరే = ఆకసమందు, క్షణం = క్షణకాలము, ఆశ్చర్యరసాలసమ్: ఆశ్చర్యరస = అద్భుతరసముతో, అలసం = మందమైన, గతం = నడకను, అవలంబ్య = అవలంబించి, అవనీభుజః = రాజైనలునియొక్క, విలాసవనే = ఉద్యానమునందు, రసాలసంగతమ్; రసాల = మామిడిచెట్టుతో, సంగతం = సంబద్ధమయిన, ఫలం = పండును, ఐక్షిష్ట = చూచెను.

**సమాసములు :**

ఆశ్చర్యరసాలసం :- ఆశ్చర్యమితి రసః = ఆశ్చర్యరసః, ఆశ్చర్యరసేన అలసమ్ = ఆశ్చర్యరసాలసమ్.

రసాలసంగతమ్ :- రసాలేన సంగతః = రసాలసంగతః; తం = రసాలసంగతమ్.

భావము :

ఆహంస పోవలసిన మార్గమును జూడఁగోరినదై యాయావస్తువులఁ జూచుటచే నేర్పడిన యాశ్చర్యరసముతో మందగమనమును బొంది నలుని యొక్క విలాసవనమందలి మామిడిచెట్టునందున్న ఫలమును జూచెను

శ్లో॥ నభసః కలభైరుపాశ్రితం
జలదైర్భూరితరక్షుపన్నగమ్ ।
స దదర్శ పతంగపుంగవో
విటపచ్ఛన్నతరక్షుపం నగమ్ ॥ ౮౭

ప. వి. నభసః । కలభైః । ఉపాశ్రితం । జలదైః । భూరితరక్షుపన్నగమ్ । సః । దదర్శ । పతంగపుంగవః । విటపచ్ఛన్నతరక్షుపం । నగమ్ ।

టీక॥ పతంగపుంగవః = పక్షిశ్రేష్ఠ మయిన హంస, నభసః = ఆకాశమునకు సంబంధించిన, కలభైః = ఏనుఁగగున్నలుగనున్న, జలదైః = మేఘములతో, ఉపాశ్రితం = వ్యాపింపఁబడినది, భూరితరక్షుపన్నగమ్: భూరి = అధిక మైన, తరక్షు = క్రూరమృగములును, పన్నగం = సర్పములును గల్గినదియు, విటపచ్ఛన్నతరక్షుపమ్; విటప = కొమ్మలతో, చ్ఛన్నతర = మిక్కిలి కప్పఁబడిన, క్షుపం = రెమ్మలుగల్గినదియు నగు, నగం = పర్వతమును, దదర్శ = చూచెను

సమాసములు :

భూరితరక్షుపన్నగమ్ :— తరక్షవశ్చ పన్నగాశ్చ = తరక్షుపన్నగాః, భూరయః తరక్షుపన్నగాః యస్మిన్ సః = భూరితరక్షుపన్నగః, తం = భూరితరక్షుపన్నగమ్.

పతంగపుంగవః:— పుమాన్ గౌః = పుంగవః, పతంగః పుంగవ ఇవ = పతంగపుంగవః.

విటపచ్ఛన్నతరక్షుపమ్ :— అత్యంతం ఛన్నాః = ఛన్నతరాః, విటపైః ఛన్నతరాః = విటపచ్ఛన్నతరాః, విటపచ్ఛన్నతరాః క్షుపాః యస్మిన్ సః = విటపచ్ఛన్నతరక్షుపః; తం = విటపచ్ఛన్నతరక్షుపమ్.

భావము:-

ఆపక్షిశ్రేష్ఠము గగనసంచారు లగు నేనుఁగుగున్నలతో సమానము లైన మేఘములతోఁ గూడినదియు, పెక్కు క్రూరమృగములు సర్పములు గల్గినదియు, కొమ్మలతోఁ గప్పబడిన తెమ్మలు గలదియు నగు నొకపర్వతముఁ గాంచెను.

శ్లో॥ స యయౌ ధుతపక్షతిః క్షణం
క్షణమూర్ధ్వాయనదుర్విభావనః ।
వితతీకృతనిశ్చలచ్ఛదః
క్షణమాలోకకదత్తకౌతుకః॥ ౭౮

ప. వి సః । యయౌ । ధుతపక్షతిః । క్షణం । క్షణమ్ । ఊర్ధ్వాయనదుర్విభావనః । వితతీకృతనిశ్చలచ్ఛదః । క్షణమ్ । ఆలోకకదత్తకౌతుకః.

టీక॥ సః = ఆహంస, క్షణం = క్షణకాలము, ధుతపక్షతిః, ధుత = విదిలింపఁబడిన, పక్షతిః = ఱెక్కలమూలములు గలదియు, క్షణం = క్షణకాలము, ఊర్ధ్వాయనదుర్విభావనః, ఊర్ధ్వాయన = ఊర్ధ్వగమనముచే, దుర్విభావనః = చూడ శక్యముగాని దై, క్షణం = క్షణకాలము, వితతీకృతనిశ్చలచ్ఛదః, వితతీకృత = విస్తారము గావింపబడిన, నిశ్చలచ్ఛదః = నిశ్చలము లగు ఱెక్కలు గల దై, ఆలోకకదత్తకౌతుకః, ఆలోకక = చూపరులకు, దత్త = ఈయబడిన, కౌతుకః = కుతూహలము గల దై, యయౌ = వెళ్లినది.

ఇచ్చట నాకాశమున హంస లెగిరిపోవు నపు డేర్పడు స్వభావస్థితులు వర్ణింపబడినవి. కాన స్వభావోక్త్యలంకారము.

సమాసములు :-

ధుతపక్షతిః :- ధుతే పక్షతీ యస్య సః = ధుతపక్షతిః.

ఊర్ధ్వాయనదుర్విభావనః :- ఊర్ధ్వమయనం = ఊర్ధ్వాయనమ్, దుఃఖేన విభాయితుం శక్యః = దుర్విభావనః, ఊర్ధ్వాయనేన దుర్విభావనః = ఊర్ధ్వాయనదుర్విభావనః,

వితతీకృతనిశ్చలచ్ఛదః :- నిశ్చలౌ చ తౌ ఛదౌ చ = నిశ్చలచ్ఛదౌ, అవితతౌ వితతౌ సంపద్యమానౌ కృతౌ = వితతీకృతౌ, వితతీకృతౌ నిశ్చలచ్ఛదౌ యస్య సః = వితతీకృతనిశ్చలచ్ఛదః.

ఆలోకకదత్తకౌతుకః :- ఆలోకయంతీతి = ఆలోకకాః, దత్తం కౌతుకం యేన సః, దత్తకౌతుకః, ఆలోకకేభ్యః దత్తకౌతుకః = ఆలోకకదత్త కౌతుకః.

భావము :

ఆ హంస క్షణకాలము ఱెక్కలు విదలించికొనియు క్షణకాల మాకసమున చాలఁ బైకి బోవుచు కంటి కగఁబడని దై క్షణకాలము ఱెక్కలను గదలనీయక పఱచుచున్నదియు నై చూపఱులకుఁ గుతూహల మొసంగుచు నెగిరిపోయినది.

శ్లో॥ తనుదీధితిధారయా రయా
ద్గతయా లోకవిలోకనామసౌ।
ఛదహేమ కషన్నివాలస
త్కషపాషాణనిభే నభస్స్థలే ॥ ౬౯

ప వి. తనుదీధితిధారయా । రయాత్ । గతయా । లోకవిలోకనామ్ । అసౌ। ఛదహేమ । కషన్ । ఇవ । అలసత్ । కషపాషాణనిభే । నభస్స్థలే ।

టీక॥ అసౌ = ఈ హంస, రయాత్ = వేగమువలన. (ఉత్పన్నయా = పుట్టినటువంటి). లోకవిలోకనామ్; లోక = పరీక్షకజనముయొక్కయు, ప్రేక్షకజనముయొక్కయు, విలోకనామ్ = దృష్టిని, గతయా = పొందిన, తనుదీధితిధారయా; తను = శరీరముయొక్క, దీధితి = కాంతియొక్క, ధారయా = రేఖచేతను, తను = సూక్ష్మ మైన దీధితిరేఖయా = ఒరిపిడి గీతచే, కషపాషాణనిభే: కషపాషాణ = ఒరిపిడి ఱాయితో, నిభే = సమాన మయిన, నభస్స్థలే = ఆకసమందు, ఛదహేమ = తనఱెక్కల బంగారమును, కషన్నివ = ఱాచుచున్నదో యనునట్లు, అలసత్ = ప్రకాశించెను.

ఇచ్చట "కషపాషాణనిభే నభస్స్థలే" అని యొరిపిడిఱాయివలె నాకాశమును జెప్పుటవలన నుపమాలంకారము.

"ఛదహేమ కషన్నివ" యని తన ఱెక్కల బంగారమును (పరీక్షకై) ఱాచుచున్నదో యని చెప్పుటవలన నుత్ప్రేక్షాలంకారము.

**సమాసములు :**

తనుదీధితిధారయా:- తనోః దీధితిః = తనుదీధితిః, తనుదీధితేః ధారా = తనుదీధితిధారా, తయా = తనుదీధితిధారయా; దీధితేః ధారా = దీధితిధారా, తన్వీ చ సా దీధితిధారా చ = తనుదీధితిధారా, తయా = తనుదీధితిధారయా.

లోకవిలోకనామ్:- లోకస్య విలోకనా = లోకవిలోకనా, తామ్ = లోకవిలోకనామ్.

ఛదహేమ:- ఛదస్య హేమ = ఛదహేమ, తత్ = ఛదహేమ.

కషపాషాణనిభే - కషస్య పాషాణః = కషపాషాణః, కషపాషాణేన సదృశం = కషపాషాణనిభమ్, తస్మిన్ = కషపాషాణనిభే.

నభస్థలే:- నభసః స్థలం = నభస్థలమ్. తస్మిన్ = నభస్థలే

**భావము :-**

ఈ హంస గగనమార్గమున వేగముగ నెగిరిపోవుచున్నది. అప్పుడు దాని శరీరమందలి కాంతిరేఖ సూక్ష్మ మగు బంగారుగీతగ జనులకు గానఁబడుచుండినది. ఆసువర్ణరేఖను బట్టి యాహంస తనరెక్కలలోని బంగారము నాకస మను నొరిపిడిఱాయిపై ఱాచుచున్నదో యనునట్లు కానఁబడినది. దానివలననాపసిడిగీతను జూచుచున్న జను లాపసిడివన్నెను పరీక్షింపఁగోరి చూచుచున్న వర్ణపరీక్షకులుగను భావింపఁబడిరి.

శ్లో॥ వినమద్భిరధఃస్థితైః ఖగై
ర్ఝడితి శ్యేననిపాతశంకిభిః।
స నిరైక్షి దృశైకయోపరి
స్వదరూంకారిపతత్రిపద్ధతిః॥ ౭౦

ప. వి. వినమద్భిః। అధస్థితైః। ఖగైః। ఝడితి। శ్యేననిపాతశంకిభిః। సః। నిరైక్షి। దృశా। ఏకయా। ఉపరి। స్వదరూంకారిపతత్రిపద్ధతిః.

టీక॥ స్యదఝూంకారిపతత్రిపద్ధతిః; స్యద = వేగముచే, ఝూంకారి = "ఝూమ్" అని శబ్దముజేయుచున్న, పతత్రిపద్ధతిః; పతత్రి = హంసయొక్క, పద్ధతిః = మార్గముగల్గిన, సః = ఆ హంస, శ్యేననిపాతశంకిభిః, శ్యేన = డేగయొక్క, = నిపాత = క్రిందికి దిగుటను, శంకిభిః = సందేహించుచున్న, (అత ఏవ = ఇందువలననే) వినమద్భిః = (శరీరము సంకుచితము గావించి) దాగుకొనుచున్న, అధఃస్థితైః = దిగువ నున్న, ఖగైః = పక్షులచే, ద్రాక్ = శీఘ్రముగా, ఏకయా = ఒకటి యగు, దృశా = దృష్టిచే, ఉపరి = పైన నిరైక్షి = చూడఁబడినది.

హంసను డేగ యని భావించి దిగువ నున్న పక్షులు భయపడి యొదిగి దాగుకొనుచు నొంటిదృష్టితోఁ బైనఁ బోవుచున్న హంసను చూచినట్లు చెప్పుట భయపడిన పక్షులస్వభావమును జెప్పుట. కాన నిఁట స్వభావోక్త్యలంకారము.

సమాసములు:-

శ్యేననిపాతశంకిభిః:- శ్యేనస్య నిపాతః = శ్యేననిపాతః, శ్యేననిపాతం శంకంత ఇతి = శ్యేననిపాతశంకినః, తైః = శ్యేననిపాతశంకిభిః.

స్యదఝూంకారిపతత్రిపద్ధతిః:- స్యదస్య ఝూంకారః = స్యదఝూంకారః, స్యదఝూంకారః అస్య అస్తీతి = స్యదఝూంకారీ. స్యదఝూంకారీ చాసౌ పతత్రీ చ = స్యదఝూంకారిపతత్రీ, స్యదఝూంకారిపతత్రిణః పద్ధతిః యస్య సః = స్యదఝూంకారిపతత్రిపద్ధతిః.

భావము :

ఆ హంస వేగముగా నాకాశముపై నెగిరి పోవుచున్నప్పుడు ఝూంకార ధ్వని వినబడుచుండగా, ఆధ్వనిని డేగ దిగివచ్చునపు డేర్పడు ధ్వనిగా భావించి క్రింద నున్న పక్షు లొక్కకంటితోఁ బైన నెగిరి పోవుచున్న యాహంసను జూచినవి. డేగలు సాధారణముగ క్రింద సంచరించు పక్షులను దన్నుకొని పోవును. కానఁ దమ్ముఁ దన్నుకొనిపోవుటకు డేగ దిగివచ్చుచున్నదో యనెడి భయముతో నొదిగి యొంటికంటఁ బైన నెగిరిపోవు హంసను జూచిన వని యాశయము.

శ్లో॥ దదృశే న జనేన యన్నసౌ
భువి తచ్ఛాయమవేక్ష్య తత్క్షణాత్।
దివి దిక్షు వితీర్ణచక్షుషా
పృథువేగద్రుతముక్తదృక్పథః॥ ౭౧

ప వి. దదృశే । న । జనేన । యన్ । అసౌ। భువి । తచ్ఛాయమ్ । అవేక్ష్య।తత్క్షణాత్।దివి । దిక్షు । వితీర్ణచక్షుషా । పృథువేగద్రుతముక్తదృక్పథః.

టీక॥ యన్ = వెళ్ళుచున్న, అసౌ = ఆ హంస, భువి = భూమియందు, తచ్ఛాయం, తత్ = ఆ హంసయొక్క, ఛాయం = నీడను, అవేక్ష్య = చూచి, తత్క్షణాత్ = ఆక్షణమునుండి, దివి = ఆకాశమందును, దిక్షు = దిక్కులయందును, వితీర్ణచక్షుషా; వితీర్ణ = ఉంచఁబడిన. చక్షుషా = దృష్టిగల, జనేన = జనముచే, పృథువేగద్రుతముక్తదృక్పథః, పృథువేగ = అధిక వేగముచే, ద్రుత = శీఘ్రముగా, ముక్త = విడువఁబడిన, దృక్పథః = నేత్రమార్గముగల దైన దదృశే = చూడబడలేదు.

సమాసములు :

తచ్ఛాయమ్:- తస్య ఛాయా = తచ్ఛాయమ్, తత్ = తచ్ఛాయమ్.
తత్క్షణాత్:- స చాసౌ క్షణశ్చ = తత్క్షణః, తస్మాత్ = తత్క్షణాత్.
వితీర్ణచక్షుషా:- వితీర్ణం చక్షుః యేన సః = వితీర్ణచక్షూః, తేన = వితీర్ణచక్షుషా.

పృథువేగద్రుతముక్తదృక్పథః:- పృథుశ్చాసౌ వేగశ్చ = పృథువేగః, ముక్తశ్చాసౌ దృక్పథశ్చ = ముక్తదృక్పథః, ద్రుతం ముక్తదృక్పథః = ద్రుతముక్తదృక్పథః, పృథువేగేన ద్రుతముక్తదృక్పథః యస్య సః = పృథువేగద్రుతముక్తదృక్పథః.

భావము :

భూమియందలి జను లాకాశమం దెగిరిపోవుచున్న యీ హంసయొక్క నీడను భూమిపైఁ గాంచి వెంటనే యాకసమునకును దిక్కులకును తాము తమ దృష్టిని మరల్చునంతకాలములోపలనే యాహంస వేగముగఁ బోవుచుండుట

వలన వీరిదృష్టిమార్గము నతిక్రమించి పోవుచుండినది. అనగా జనులు భూమిపై నీడను జూచి వెంటనే పైకి దృష్టిని మరల్చినప్పటికిని యా హంస వీరిదృష్టిని దాటిపోయిన దని యాశయము.

శ్లో॥ న వనం పథి శిశ్రియేఽమునా
క్వచిదప్యుచ్చతరద్రుచారుతమ్।
న సగోత్రజమన్వవాది వా
గతివేగప్రసరద్రుచా రుతమ్॥ ౭౨

ప. వి. న । వనం । పథి । శిశ్రియే । అమునా । క్వ । చిత్ । అపి । ఉచ్చతరద్రుచారుతమ్ । న । సగోత్రజమ్ । అన్వవాది । వా । గతివేగప్రసరద్రుచా । రుతమ్.

టీక॥ గతివేగప్రసరద్రుచా; గతివేగ = గమనవేగముచే, ప్రసరత్ = ప్రసరించుచున్న, రుచా = కాంతిగల, అమునా = ఈ హంసచే, పథి = మార్గమందు, క్వ చిదపి = ఎచ్చటను, ఉచ్చతరద్రుచారుతమ్; ఉచ్చతర = మిక్కిలి యెత్తైన, ద్రు = వృక్షములయొక్క, చారుతమ్ = సౌందర్యముగల్గిన, వనం = అడవి, న శిశ్రియే = ఆశ్రయింపఁబడలేదు, సగోత్రజం; సగోత్ర = బంధువులవలన, జం = కల్గిన, రుతం వా = కూత యైనను, నాన్వవాది = అనువదింపఁబడలేదు.

సమాసములు :

ఉచ్చతరద్రుచారుతమ్:- అత్యంతముచ్చాః = ఉచ్చతరాః, ఉచ్చతరాశ్చ తే ద్రవశ్చ = ఉచ్చతరద్రవః, ఉచ్చతరద్రూణాం చారుతా యస్మిన్ తత్ = ఉచ్చతరద్రుచారుతమ్, తత్ = ఉచ్చతరద్రుచారుతమ్.

సగోత్రజమ్:- సమానం గోత్రం యస్య సః = సగోత్రః, సగోత్రాత్ జాయత ఇతి = సగోత్రజమ్.

గతివేగప్రసరద్రుచా:- గతేః వేగః = గతివేగః, గతివేగేన ప్రసరంతీ = గతివేగప్రసరంతీ, గతివేగప్రసరంతీ చ సా రుక్చ = గతివేగప్రసరద్రుక్, తయా = గతివేగప్రసరద్రుచా.

భావము :

తన గమనవేగముతో కాంతిని ప్రసరింపఁజేయుచు నాకసముపై నెగిరి పోవుచున్న యీ హంస యున్నతవృక్షములతో శోభించునట్టి యరణ్యామం దెక్కడను మార్గమునందు విశ్రాంతిఁ దీసికొనలేదు; తనకు సజాతీయము లైన హంసలధ్వనులనుగూడ ననువదించలేదు. కేవలము మిత్రకార్యము నిర్వహించుటలో నాసక్తి కల్గి వెడలుచున్నది.

శ్లో॥ అథ భీమభుజేన పాలితా
నగరీ మంజురసౌ ధరాజితా।
పతగస్య జగామ దృక్పథం
హరశైలోపమసౌధరాజితా॥ 23

ప. వి. అథ। భీమభుజేన। పాలితా। నగరీ। మంజుః। అసౌ। ధరాజితా। పతగస్య। జగామ। దృక్పథం। హరశైలోపమసౌధరాజితా.

టీక॥ ధరాజితా = భూమిని జయించిన, భీమభుజేన = భీమనృపాలుని భుజముచే, పాలితా = పాలింపఁబడిన దై, హిమశైలోపమసౌధరాజితా; హిమశైల = కైలాసపర్వతముతో, ఉపమ = సమానము లైన, సౌధ = మేడలతో, రాజితా = ప్రకాశించునదియు, మంజుః = సుందర మగు, అసౌ = పూర్వము జెప్పఁబడిన, నగరీ = కుండిననగరము, పతగస్య = హంస యొక్క, దృక్పథం = నేత్రమార్గమును, జగామ = పొందినది.

ఇచ్చట 'హరశైలోపమసౌధరాజితా' అని కైలాసముతో సమానములుగ సౌధములను బోల్చినందువలన నుపమాలంకారము. దానితో భీమభుజేనేత్యాదియమకానుప్రాసము సంసృష్టి నొందినది.

సమాసములు :

భీమభుజేన:- భీమస్య భుజః = భీమభుజః, తేన = భీమభుజేన.

దృక్పథమ్:- దృశోః పంథాః = దృక్పథః, తం = దృక్పథమ్.

హరశైలోపమసౌధరాజితా:- హరస్య శైలః = హరశైలః, హరశై

లేన ఉపమా యేషాం తే = హరశైలోపమాః, హరశైలోపమాశ్చ తే సౌధాశ్చ = హరశైలోపమసౌధాః, హరశైలోపమసౌధైః రాజితా = హరశైలోపమసౌధరాజితా.

భావము :

ఇట్లు గగనతలముపై నెగసి పోవుచున్న హంస కొంతదవ్వు బోగనే భూమండలమును జయించిన భీమనృపాలుని భుజములచే పరిపాలింపఁబడుచు వెండికొండ వలె తెల్లని మేడలతో మెఱయుచున్న మనోహర మగు కుండిననగరమును జూచినది.

శ్లో॥ దయితం ప్రతి యత్ర సంతతం
రతిహాసా ఇవ రేజిరే భువః।
స్ఫటికోపలవిగ్రహాః గృహాః
శశభృద్భిత్తనిరంకభిత్తయః॥ ౭౪

వ. వి. దయితం । ప్రతి । యత్ర । సంతతం । రతిహాసాః । ఇవ । రేజిరే, భువః । స్ఫటికోపలవిగ్రహాః । గృహాః । శశభృద్భిత్తనిరంకభిత్తయః ।

టీక॥ యత్ర = ఏ కుండిననగరమందు, స్ఫటికోపలవిగ్రహాః; స్ఫటికోపల = స్ఫటికరత్నమయములైన, విగ్రహాః = శరీరములుగలవియు, శశభృద్భిత్తనిరంకభిత్తయః; శశభృత్‌భిత్త = చంద్రకాంతశిలాఖండములతో నిర్మింపఁబడిన, నిరంక = కళంకరహితము లైన, భిత్తయః = గోడలు గల, గృహాః = గృహములు, దయితం ప్రతి = భర్త యైన భీమరాజును గూర్చి, సంతతం = ఎల్లప్పుడు, భువః = భూమి యను నాయికయొక్క, రతిహాసా ఇవ = క్రీడాహాసములవలె, రేజుః = ప్రకాశించినవి.

స్ఫటికోపలవిగ్రహాః గృహాః 'రతిహాసా ఇవ రేజిరే' యని స్ఫటికమణిమయగృహములు భూనాయికయొక్క రతిహాసములుగ నుత్ప్రేక్షింపఁబడినవి కాన నుత్ప్రేక్షాలంకారము.

సమాసములు :

రతిహాసాః:- రతేః హాసాః = రతిహాసాః.

స్ఫటికోపలవిగ్రహాః:- స్ఫటికా ఇతి ఉపలాః = స్ఫటికోపలాః,

స్ఫటికోపలాః విగ్రహాః యేషాం తే = స్ఫటికోపలవిగ్రహాః.
శశభృత్భిత్తినిరంకభిత్తయః :- శశం బిభ్రతీతి = శశభృతః, శశభృతాం భిత్తాని = శశభృత్భిత్తాని, నిర్గతః అంకః యేభ్యస్తాని = నిరంకాని, నిరంకాని చ తాని భిత్తాని చ = భిత్తనిరంకాని, శశభృతాం భిత్తనిరంకాని = శశభృత్భిత్తనిరంకాని, శశభృత్భిత్తనిరంకైః భిత్తయః యేషాం తే = శశభృత్భిత్తనిరంకభిత్తయః; యద్వా - శశభృతాం భిత్తాని శశభృత్భిత్తాని, నిరంకాశ్చ తాః భిత్తయశ్చ = నిరంకభిత్తయః, శశభృత్భిత్తైః నిరంకభిత్తయః యేషు తే = శశభృద్భిత్తనిరంకభిత్తయః.

భావము :

ఆ కుండిననగరమందు స్ఫటికమణిమయములైనవియు, స్వచ్ఛములైన చంద్రకాంతశిలాఖండములచే నిర్మింపఁబడిన గోడలు గలవియు నగు గృహములు మిక్కిలి తెల్లగా నుండుటవలన భూకాంత తనప్రియుఁడగు భీమరాజుపైఁ గనఁబఱచు వలపునగవువలెఁ బ్రకాశించినవి.

శ్లో॥ నృపనీలమణీగృహత్విషా
ముపధేర్యత్ర భయేన భాస్వతః।
శరణాప్తమువాస వాసరే౽
ప్యసదావృత్త్యుదయత్తమం తమః॥ 84

వ. వి. నృపనీలమణీగృహత్విషామ్ । ఉపధేః । యత్ర । భయేన । భాస్వతః । శరణాప్తమ్ । ఉవాస । వాసరే । అపి । అసదావృత్తి । ఉదయత్తమం । తమః ।

టీక॥ యత్ర = ఏకుండిననగరమందు, తమః = చీకటి, భాస్వతః = సూర్యుని వలని, భయేన = భయముచే, నృపనీలమణీగృహత్విషామ్; నృప = భీమరాజుయొక్క, నీలమణీ = ఇంద్రనీలమణిమయములైన, గృహ = గృహములయొక్క, త్విషాం = కాంతులయొక్క, ఉపధేః = నెపమువలన, శరణాప్తం, శరణ = గృహమును, రక్షకుని, ఆప్తం = పొందినదియు, వాసరే = పగటియందును, అసదా

వృత్తి = పునరావృత్తి లేనివిగను, ఉదయత్తమం = మిక్కిలి యుదయ ముగలదిగను, ఉవాస = నివసించెను.

ఇచ్చట నింద్రనీలమణిమయము లగు గృహములన్యాయముచే చీకటి నిరంతరవాసము గావించిన దని చెప్పుట వలన నపహ్నవాలంకారము.

సమాసములు :

నృపనీలమణీగృహత్విషామ్ :- నీలాశ్చ తాః మణ్యశ్చ = నీలమణ్యః, నీలమణీమయాశ్చ తే గృహాశ్చ = నీలమణీగృహాః. నృపస్య నీలమణీగృహాః = నృపనీలమణీగృహాః, నృపనీలమణీ గృహాణాం త్విషః = నృపనీలమణీగృహత్విషః, తాసాం = నృపనీలమణీ గృహత్విషామ్.

అసదావృత్తి :- న సతీ = అసతీ, అసతీ ఆవృత్తిః యస్య తత్ = అసదావృత్తి.

ఉదయత్తమం :- అత్యంతముదయత్ = ఉదయత్తమమ్.

భావము :

ఆకుండిననగరమం దింద్రనీలమణిమయము లగు గృహముల నీలపు కాంతుల నెపముచే చీకటి సూర్యునిభయమువలన శరణుఁ బొందిన దై పగటి యందును పునరావృత్తి లేని వసతిని బొందియుండినది.

శ్లో॥ సితదీప్రమణిప్రకల్పితే
యదగారే హసదంకరోదసి ।
నిఖిలాన్నిశి పూర్ణిమా తిథీ
నుపతస్థేఽతిథిరేకికా తిథిః॥ ౭౬

ప, వి సితదీప్రమణిప్రకల్పితే । యదగారే । హసదంకరోదసి । నిఖిలాన్ । నిశి । పూర్ణిమా । తిథీన్ । ఉపతస్థే । అతిథిః । ఏకికా । తిథిః.

టీ॥ సితదీప్రమణిప్రకల్పితే; సిత = తెల్లనివియు, దీప్ర = ప్రకాశించునవియు నగు,మణి = రత్నములచే, ప్రకల్పితే = నిర్మింపబడిన, హసదంకరో

దసి, హసత్ = ప్రకాశించు, అంకరోదసి = ఒడియందలి భూమ్యాకాశ
ములు గల, యదగారే = ఏకుండిననగరగృహములందు, నిశి = రాత్రు
లందు, నిఖిలాన్ = సమస్తము లైన, తిథీన్ = తిథులను గూర్చి, ఏకికా
= ఒక్కటే యైన, పూర్ణిమా = పున్నమ యను, తిథిః = తిథి, అతిథిః
= అతిథిగా, ఉపతస్థే = సంభవించినది

తిథి అతిథి యైన దని చెప్పుటవలన విరోధాభాసము, తెల్లని
రత్నపుకాంతులవలన నన్నిరాత్రులు పున్నమరాత్రులుగనే యున్న వని
చెప్పుటవలన నభేదాతిశయోక్తి.

సమాసములు :

సితదీప్రమణిప్రకల్పితే :— సితాశ్చ తే దీప్రాశ్చ = సితదీప్రాః, సిత
దీప్రాశ్చ తే మణయశ్చ = సితదీప్రమణయః, సితదీప్రమణిభిః ప్రకల్పి
తమ్, సితదీప్రమణిప్రకల్పితమ్, తస్మిన్ = సితదీప్రమణిప్రకల్పితే.

యదగారే :— యస్య అగారమ్ = యదగారమ్, తస్మిన్ = యదగారే.

హసదంకరోదసి :— అంకే రోదసీ = అంకరోదసీ, హసతీ అంకరోదసీ
యస్మిన్ తత్ = హసదంకరోదః, తస్మిన్ = హసదంకరోదసి.

ఏకికా :— ఏకైవ = ఏకికా.

భావము :

ఆకుండిననగరమందలి గృహములు తెల్లని స్ఫటికమణులచే నిర్మింపఁ
బడిన వై యెల్లప్పుడు ప్రకాశించుచున్నవి. అందువలన నాగృహములు భూమ్యా
కాశములకు వ్యాపించిన వై భూమ్యాకాశములను తమయొడిలో నుంచుకొన్న
విగ మెఱయుచున్నవి. అట్టి ప్రకాశవంతము లైన గృహములయం దన్ని
రాత్రులును పున్నమరాత్రులుగనే యుండినవి

శ్లో॥ సుదతీజనమజ్జనార్పితైః
ఘుసృణైర్యత్ర కషాయితాశయా ।
న నిశాఽఖిలయాఽపి వాపికా
ప్రససాద గ్రహిలేవ మానినీ॥ ౭౭

ప. వి. సుదతీజనమజ్జనార్పితైః । ఘుసృణైః । యత్ర । కషాయితాశయా । న । నిశా । అఖిలయా । అపి । వాపికా । ప్రససాద । గ్రహిలా । ఇవ । మానినీ।

టీక॥ యత్ర = ఏకుండిననగరమందు, సుదతీజనమజ్జనార్పితైః; సుదతీజన = సుందరస్త్రీలయొక్క, మజ్జన = జలకములచే, అర్పితైః = ఉంచబడిన, ఘుసృణైః = కుంకుమములతో, కషాయితాశయా; కషాయిత = పరిమళము గలదిగఁ జేయఁబడిన, ఆశయా = మధ్యభాగముగల, కషాయిత (భోగచిహ్నములచే కలుషితము గావింపఁబడిన), ఆశయా = హృదయముగల) వాపికా = నడబావి (నాయిక), గ్రహిలా = పట్టుదల గల, అనగా దీర్ఘరోషము గల, మానినీవ = మానవతి యగు నాయికవలె, అఖిలయా = సమగ్రమైన, నిశయా ఽపి = రాత్రిచేతను.(అనగా రాత్రి యంతయు నూఱడించుటచేత నని యర్థము) నప్రససాద = తేరలేదు- ఊఱడిల్లలేదు)

వాపిక మానినివలె ప్రసన్నము కాలే దని చెప్పుట వలన నుపమాలంకారము. అది కషాయితాశయా "ప్రససాద" అను శ్లేషచే ననుప్రాణితము.

సమాసములు :

సుదతీజనమజ్జనార్పితైః:- శోభనాః దంతాః యాసాం తాః = సుదత్యః సుదత్య ఏవ జనాః = సుదతీజనాః, సుదతీజనానాం మజ్జనాని = సుదతీజనమజ్జనాని, సుదతీజనమజ్జనైః అర్పితాని = సుదతీజనమజ్జనార్పితాని, తైః = సుదతీజనమజ్జనార్పితైః.

కషాయితాశయా:- కషాయః అస్య సంజాత ఇతి = కషాయితః, కషాయితః ఆశయః యస్యాస్సా = కషాయితాశయా.

వాపికా:- వాప్యేవ = వాపికా.

గ్రహిలా:- గ్రహః అస్యాః అస్తీతి = గ్రహిలా.

మానినీ:- మానః అస్యాః అస్తీతి = మానినీ.

భావము :

ఆ నగరమందలి సుందరస్త్రీలు నడబావియందు జలకము లాడినపుడు వారిశరీరమున కలఁదికొనిన కుంకుమలేపములు కఱగి బావి యంతయు కలుషిత

మగుచు ప్రియుని నాయికాంతరసంగమమును తెలిసికొని కోపించిన నాయికవలె రాత్రి యంతయు ప్రసన్నము గాకపోయినది. రాత్రి యంతయు నాయకు డెంత యూఱడించినను మానవతి యగు నాయిక యెట్లు ప్రసాదమును (ఊఱటను) పొందదో, అట్లే యీ నడభావియు ప్రసాదమును (తేటదనమును) పొందలేదు. ఆ నగరస్త్రీల శరీరమందలి కుంకుమలేపము లెంత మిక్కుటములో దీనివల ద్యోతితము.

శ్లో॥ క్షణనీరవయా యయా నిశి
శ్రితవప్రావళియోగపట్టయా।
మణివేశ్మమయం స్మ నిర్మలం
కిమపి జ్యోతిరబాహ్యమీక్ష్యతే॥ ౭౮

ప వి. క్షణనీరవయా । యయా । నిశి । శ్రితవప్రావళియోగపట్టయా । మణివేశ్మమయం । స్మ । నిర్మలం । కిమ్ । అపి । జ్యోతిః । అబాహ్యమ్ । ఈక్ష్యతే.

టీక॥ నిశి = అర్ధరాత్రియందు, క్షణనీరవయా; క్షణ = క్షణకాలము, నీరవయా = (జనపక్షమున) జనులు నిదురించుటవలన నిశ్శబ్ద మైనదియు, (యోగినీపక్షమున) ధ్యానముచే నిశ్శబ్ద మైనదియు. శ్రితవప్రావళియోగపట్టయా; శ్రిత = ఆశ్రయింపఁబడిన, వప్రావళియోగపట్టయా = యోపగట్టవంటి ప్రాకారపంక్తి గలదియు, ప్రాకారపంక్తివంటి యోగపట్ట గలదియు నగు, యయా = ఏ కుండిననగరిచే, మణివేశ్మమయం = రత్నగృహరూప మైన, నిర్మలం = శుభ్ర మైన, అబాహ్యం = అంతరంగిక మైన, కిమపి = వాఙ్మనస్సులకు విషయము కాని, జ్యోతిః = కాంతి (ఆత్మజ్యోతి), ఈక్ష్యతే స్మ = చూడఁబడుచుండినది.

ఇచ్చట ప్రస్తుత నగరవృత్తాంతముచే నప్రస్తుత మగు యోగినీ వృత్తాంతము స్ఫురించుచున్నది. కాన సమాసోక్త్యలంకారము.

సమాసములు :

క్షణనీరవయా:- నిర్గతః రవః యస్యాస్సా = నీరవా, క్షణం నీరవా = క్షణనీరవా, తయా = క్షణనీరవయా.

శ్రితవప్రావళియోగపట్టయా:- వప్రాణామావళిః = వప్రావళిః; వప్రావళిః యోగపట్టేవ, వప్రావళిరివ యోగపట్టా = వప్రావళియోగపట్టా. శ్రితా వప్రావళియోగపట్టా యయా సా = శ్రితవప్రావళియోగపట్టా, తయా = శ్రితవప్రావళియోగపట్టయా.

మణివేశ్మమయమ్:- మణిమయం చ తత్ వేశ్మ చ = మణివేశ్మ, మణివేశ్మనః వికారః = మణివేశ్మమయమ్.

నిర్మలమ్:- నిర్గతం మలం యస్మాత్తత్ = నిర్మలమ్.

అబాహ్యమ్:- బహిర్భవమ్ = బాహ్యమ్. న బాహ్యమ్ = అబాహ్యమ్.

భావము :

అర్ధరాత్రియందు జను లందఱు నిద్రించినపుడు క్షణకాల మా కుండిన నగరి నిశ్శబ్ద మైయుండును. ఆనగరి యోగపట్టవంటి ప్రాకారపంక్తిచేఁ బరివేష్టింపఁబడి, ప్రాకారమువంటి యోగపట్టను ధరించిన యోగినిని స్ఫురింపఁ జేయుచు నిశ్శబ్దరాత్రియందు యోగపట్టను శరీరము చుట్టును బంధించుకొని యింద్రియముల నాత్మాభిముఖము గావించుకొని యోగిని యాంతరంగిక మైన యాత్మజ్యోతిని వీక్షించునట్లు మణిసౌధమయ మగు జ్యోతిని వీక్షించుచున్నది. యోగులు ధ్యానదశయందు నిశ్చలత్వమేర్పడుటకై శరీరము చుట్టును యోగపట్టను బంధించుకొనెదరు. అవ్విధముగనే ప్రాకారపంక్తి కుండిననగరికి యోగపట్టవలె నున్నది.

శ్లో॥ విలలాస జలాశయోదరే
క్వచన ద్యౌరనుబింబితేవ యా।
పరిఖాకపటస్ఫుటస్ఫురత్
ప్రతిబింబానవలంబితాంబుని॥ ౭౫

ప. వి. విలలాస। జలాశయోదరే। క్వ। చన। ద్యౌః। అనుబింబితా। ఇవ। యా। పరిఖాకపటస్ఫుటస్ఫురత్ప్రతిబింబానవలంబితాంబుని.

టీక॥ యా = ఏ కుండిననగరము, పరిఖాకపటస్ఫుటస్ఫురత్ప్రతిబింబానవలంబితాంబుని; పరిఖా = అగడ్త యను, కపట = మిషచే, స్ఫుట = స్పష్టముగ, స్ఫురత్ = ప్రకాశించు, ప్రతిబింబ = ప్రతిబింబముచే, అనవలం

విత = మధ్యభాగమున గ్రహింపఁబడని, అంబుని = ఉదకముగల, క్వచన = ఒకానొక, జలాశయోదరే; జలాశయ = కొలనియొక్క, ఉదరే = మధ్యభాగమందు, అనుబింబితా = ప్రతిఫలించిన, ద్యౌరివ = స్వర్గము వలె, విజలాస = ప్రకాశించినది.

చుట్టును అగడ్త గల్గి మధ్య నున్న కుండిననగరము మధ్యభాగ మందు స్వర్గము ప్రతిబింబించి యంచులలో ప్రతిబింబ మంటనందువలన నుదకముకనఁబడు నొకానొక కొలనుగా నుత్ప్రేక్షింపఁబడినది. కాన నుత్ప్రేక్షాలంకారము.

సమాసములు :

జలాశయోదరే:– జలానామాశయః = జలాశయః, జలాశయస్య ఉదరం = జలాశయోదరమ్, తస్మిన్ = జలాశయోదరే.

పరిఖాకపటస్ఫుటస్ఫురత్ప్రతిబింబానవలంబితాంబుని ;– పరిఖైవ కపటః = పరిఖాకపటః, స్ఫుటం స్ఫురన్ = స్ఫుటస్ఫురన్, స్ఫుటస్ఫురంశ్చాసౌ ప్రతిబింబశ్చ = స్ఫుటస్ఫురత్ప్రతిబింబః, స్ఫుటస్ఫురత్ప్రతిబింబేన అనవలంబితం = స్ఫుటస్ఫురత్ప్రతిబింబానవలంబితం, స్ఫుటస్ఫురత్ప్రతిబింబానవలంబితం చ తత్ అంబు చ = స్ఫుటస్ఫురత్ప్రతిబింబానవలంబితాంబు, పరిఖాకపటేన స్ఫుటస్ఫురత్ప్రతిబింబానవలంబితాంబు యస్మిన్ తత్ = పరిఖాకపటస్ఫుటస్ఫురత్ప్రతిబింబానవలంబితాంబు, తస్మిన్ = పరిఖాకపటస్ఫుటస్ఫురత్ ప్రతిబింబానవలంబితాంబుని.

భావము :

చుట్టును నగడ్త గల యాకుండిననగరము ఒకానొక కొలనిమధ్యభాగమున ప్రతిబింబించిన స్వర్గమువలె శోభించినది. కుండిననగర మున్న ప్రదేశ మంతయు నొకకొలనువలె భావింపవలయును. ఆకొలనిమధ్యభాగమున స్వర్గముయొక్క ప్రతిబింబమే కుండిననగర మనియు, దానియంచులలో స్వర్గముయొక్క ప్రతిబింబ మంటనందువలన నాభాగముమాత్ర మగడ్తగను గానవచ్చుచున్నదే కాని వాస్తవస్థితిలో నది స్వర్గప్రతిబింబముతోఁ గూడిన కొలనుమాత్రమే. ఇట్లు భావించుటవలన కుండిననగరమునందు స్వర్గవైభవ మున్నదని యభిప్రాయము ద్యోతితము.

శ్లో॥ వ్రజతే దివి యద్గృహావళీ
చలచేలాంచలదండతాడనాః ।
వ్యతరన్నరుణాయ విశ్రమం
సృజతే హేళిహయాళికాలనామ్॥ ౮౦

ప. వి. వ్రజతే । దివి । యద్గృహావళీచలచేలాంచలదండతాడనాః । వ్యతరన్ । అరుణాయ । విశ్రమం । సృజతే । హేళిహయాళికాలనామ్ ।

టీక॥ యద్గృహావళీచలచేలాంచలదండతాడనాః; యత్ = ఏకుండినపగరమండలి, గృహావళీ = గృహపంక్తుల పైభాగములయందు, చల = కదలుచున్న, చేల = ధ్వజములయొక్క, అంచల = కొనలనెడి, దండతాడనాః = జాటికఱ్ఱదెబ్బలు, దివి = ఆకాశమందు, వ్రజతే = వెళ్లుచున్న, హేళిహయాళికాలనామ్; హేళి = సూర్యునియొక్క, హయాళి = అశ్వపంక్తికి, కాలనామ్ = తోలుటను, సృజతే = చేయుచున్న, అరుణాయ = అరుణుని కొఱకు, విశ్రమం = విశ్రాంతిని, వ్యతరన్ = ఇచ్చినవి.

ఇచ్చట సూర్యుని యశ్వములకు సౌధపతాకముల యంచులు కొరడాదెబ్బల నిచ్చు సంబంధము లేకపోయినను,ఆసబంధ మున్నట్లు చెప్పుటవలన సంబంధాతిశయోక్త్యలంకారము.దానిచే గృహములు సూర్య మండలము నంటియున్న వను వస్తువు ధ్వనించుటవలన నలంకారముచే వస్తుధ్వని.

సమాసములు :

యద్గృహావళీచలచేలాంచలదండతాడనాః :— యస్యాం గృహాః = యద్గృహాః, యద్గృహాణామావళ్యః = యద్గృహావళ్యః, చేలానామంచలాః = చేలాంచలాః, చలాశ్చ తే చేలాంచలాశ్చ = చలచేలాంచలాః, యద్గృహావళీనాం చలచేలాంచలాః, = యద్గృహావళీచలచేలాంచలాః, యద్గృహావళీచలచేలాంచలా ఏవ దండాః = యద్గృహావళీచలచేలాంచలదండాః. యద్గృహావళీచలచేలాంచలదండైః తాడనాః = యద్గృహావళీచలచేలాంచలదండతాడనాః.

హేళిహయాళికాలనామ్ :— హేళేః హయాః = హేళిహయాః, హేళిహయానామాళయః = హేళిహయాళయః, హేళిహయాళీనాం కాలనా = హేళిహయాళికాలనా, తామ్ = హేళిహయాళికాలనామ్.

భావము :

కుండిననగరమందలి మేడలపైని పెక్కేముల చలించునంచుల దెబ్బలు మింట సూర్యాశ్వములను దోలుచున్న యరుణునికి విశ్రాంతి నిచ్చినవి. ఆ పెక్కేములు సూర్యమార్గమువఱకును వ్యాపించియుండుటవలన గాలిచేఁ గదలుచున్న యా పెక్కేముల యంచులవలని దెబ్బలు సూర్యునిగుఱ్ఱములకుఁ దగులుటవలన నవి యరుణుని కొరడాదెబ్బల యవసరము లేకయే పరుగిడుచుండినవి. అందువలనఁ గొంతకాలము సూర్యరథసారథి యగు నరుణునికి విశ్రాంతి లభించినది. ఆనగరమందలి సౌధములు గగనపర్యంతము వ్యాపించి యున్న వనుట ముఖ్యాశయము.

శ్లో॥ క్షితిగర్భధరాంబరాలయై
స్తలమధ్యోపరిపూరిణాం పృథక్ ।
జగతాం ఖలు యాఽఖిలాద్భుతాఽ
జని సారై ర్నిజచిహ్నధారిభిః॥ ౮౧

ప. వి. క్షితిగర్భధరాంబరాలయైః । తలమధ్యోపరిపూరిణామ్ । పృథక్ । జగతాం । ఖలు । యా । అఖిలా । అద్భుతా । అజని । సారైః । నిజచిహ్నధారిభిః.

టీక॥ తలమధ్యోపరిపూరిణామ్; తల = అడుగుభాగమును, మధ్య = భూమిని, ఉపరి = పైభాగమును, పూరిణామ్ = నింపుచున్న, జగతాం = పాతాళ భూమి స్వర్గలోకములకు, పృథక్ = ప్రత్యేకముగ, నిజచిహ్నధారిభిః; నిజ = తమ వైన, చిహ్న = గుఱ్ఱు లగు నిధి అన్నపాన ప్రస్పంద నాదులను. ధారిభిః = ధరించుచున్నటువంటి, సారైః = ఉత్కృష్టపదార్థములతో. క్షితిగర్భధరాంబరాలయైః క్షితిగర్భ = భూగర్భమునందలి, ధరా = భూమియందలి, అంబర = ఆకాశమందలి, ఆలయైః = గృహములచే, (అనగా భూగర్భమునుండి మూడంతస్థులమేడలచే) యా =

ఏకుండినసగరము, అఖిలా = సమగ్ర మైనది, అద్భుతా = ఆశ్చర్య కరముగా, అజని = అయినది.

క్షితిగర్భధరాంబరాలయములకు తలమధ్యోపరిపూరకములకును వాని చిహ్నములకును యథాక్రమముగ నన్వయ మేర్పడినది. కాన యథాసంఖ్యాలంకారము.

సమాసములు :

క్షితిగర్భధరాంబరాలయైః:- క్షితేః గర్భః = క్షితిగర్భః, క్షితిగర్భశ్చ ధరా చ అంబరం చ = క్షితిగర్భధరాంబరాణి, క్షితిగర్భధరాంబరాణా మాలయాః = క్షితిగర్భధరాంబరాలయాః, తైః = క్షితిగర్భధరాంబ రాలయైః.

తలమధ్యోపరిపూరిణామ్:- తలం చ మధ్యం చ ఉపరి చ = తలమధ్యో పరి, తలమధ్యోపరి పూరయంతీతి = తలమధ్యోపరిపూరిణీ, తేషాం = తలమధ్యోపరిపూరిణామ్.

నిజచిహ్నధారిభిః:- నిజాని చ తాని చిహ్నాని చ = నిజచిహ్నాని, నిజ చిహ్నాని ధారయంతీతి = నిజచిహ్నధారిణః, తైః = నిజచిహ్నధారిభిః.

భావము :

ఆకుండిననగరమందు భూమియడుగుభాగమును, భూమిపైభాగమును ఆకసమును నింపుచు మూడులోకములును, ప్రతిగృహమునందు నున్నవి. ఆ మూడులోకము లగు పాతాళ—భూ—స్వర్గములలోని సారభూతము లగుపదార్థములు నిధ్యన్నపానస్రక్చందనాదులు. అందు పాతాళముయొక్క చిహ్నము నిధివర్గము, భూమియొక్క చిహ్నము అన్నపానాదికము, స్వర్గలోకముయొక్క చిహ్నము స్రక్చందనాదికము. ఇటువంటి ఆయాలోకముల సారభూతపదార్థములతో భూగర్భ గృహ భూపృష్ఠగృహ అంబరగృహములు, (అనగా, భూగర్భమునుండి మూ డంతస్తుల మేడలు) నింపబడియున్నవి. అట్టిగృహములచే నాపట్టణ మంతయు నొకయద్భుతముగా నుండినది.

శ్లో॥ దధదంబుదనీలకంఠతాం
వహదత్యచ్ఛసుధో జ్జ్వలం వపుః।
కథమృచ్ఛతు యత్ర నామ న
క్షితిభృన్మందిరమిందుమౌళితామ్॥ ౧౨

ప. వి దధత్ । అంబుదనీలకంఠతామ్ । వహత్ । అత్యచ్ఛసుధోజ్జ్వలం । వపుః । కథమ్ । ఋచ్ఛతు । యత్ర । నామ । న । క్షితిభృన్మందిరమ్ । ఇందుమౌళితామ్ ।

టీక॥ యత్ర = ఏ పట్టణమందు, అంబుదనీలకంఠతాం; అంబుద = మేఘముల చేతను, మేఘములవలెను, నీలకంఠతాం, నీల = నల్లని, కంఠతాం = శిఖరసమీపమును, కంఠమును కల్గియుండుటను, దధత్ = ధరించునదియు, అత్యచ్ఛసుధోజ్జ్వలం; అత్యచ్ఛ = మిక్కిలి స్వచ్ఛమయిన, సుధా = సున్నముతో, అమృతమువలెను, ఉజ్జ్వలం = ప్రకాశించునట్టి, వపుః = శరీరమును, వహత్ = వహించునదియు నగు. క్షితిభృన్మందిరమ్; క్షితిభృత్ = భూభర్త యగు భీమసేనుని, మందిరమ్ = భవనము, ఇందు మౌళితాం = చంద్రమండలవ్యాప్త మగు శిఖరము గల్గియుండుటను, (చంద్రశేఖరత్వమును) కథం నామ = ఎట్లు, నఋచ్ఛతు = పొందదు.

శ్లిష్టవిశేషణవిశేష్యములు ప్రకృతార్థమును చెప్పుటచేతనే పర్యవసితము లైనందువలన నిట నీశ్వరరూపార్థప్రతీతి ధ్వని యగుచున్నది.

సమాసములు :

అంబుదనీలకంఠతామ్:- నీలశ్చాసౌ కంఠశ్చ = నీలకంఠః. అంబుదైః నీలకంఠః యస్య తత్ = అంబుదనీలకంఠమ్. అంబుదనీలకంఠస్య భావః = అంబుదనీలకంఠతా, తాం = అంబుదనీలకంఠతాం; అంబుదవత్ నీల కంఠః యస్య సః = అంబుదనీలకంఠః. అంబుదనీలకంఠస్య భావః = అంబుదనీలకంఠతా, తాం = అంబుదనీలకంఠతామ్.

అత్యచ్ఛసుధోజ్జ్వలమ్ :- అత్యంతమచ్ఛా = అత్యచ్ఛా. అత్యచ్ఛా చ సా సుధా చ = అత్యచ్ఛసుధా, అత్యచ్ఛసుధయా ఉజ్జ్వలం = అత్యచ్ఛసుధో

జ్జ్వలమ్, తత్ = అత్యచ్ఛసుధోజ్జ్వలమ్; అత్యచ్ఛసుధావత్ ఉజ్జ్వలమ్ = అత్యచ్ఛసుధోజ్జ్వలమ్, తత్ అత్యచ్ఛసుధోజ్జ్వలమ్.

క్షితిభృన్మందిరమ్ :- క్షితిభృతః మందిరమ్ = క్షితిభృన్మందిరమ్, తత్ = క్షితిభృన్మందిరమ్.

ఇందుమౌళితామ్ :- ఇందుః మౌళౌ యస్య తత్ = ఇందుమౌళి, ఇందుమౌళినః భావః = ఇందుమౌళితా, తాం = ఇందుమౌళితామ్; ఇందుః మౌళౌ యస్య సః = ఇందుమౌళిః, ఇందుమౌళేః భావః = ఇందుమౌళితా, తామ్ = ఇందుమౌళితామ్.

భావము :

ఆ నగరియందలి రాజభవనము మేఘసంచారముచే నల్లనైన కంఠ ప్రదేశము గల్గి మిక్కిలి తెల్లని సున్నపు పూతచే ధవళ మయిన దై గగనమును స్పృశించుటచే చంద్రుని శిఖరమున నిడికొని చంద్రమౌళి యై (శివుడై) మేఘమువలె నల్లని కంఠమును మిక్కిలి స్వచ్ఛమైన యమృతము వంటి దేహకాంతియు గల్గిన చంద్రశేఖరుఁ డగు శివునితో సామ్యము వహించి చంద్రమౌళిత్వము నేల పొందుదు. తప్పక పొందఁగల దని యాశయము రాజ భవనమున కంతటి యౌన్నత్యము తగినది. నీలకంఠుఁ డగు శివుడు చంద్ర మౌళి యై సర్వేశ్వరుఁ డయినట్లు, నీలకంఠ మగు నారాజభవనము కూడ చంద్రమౌళిత్వమును వహించి సర్వభవనరాజ మయిన దని సారాంశము.

శ్లో॥ బహురూపకసాలభంజికా
ముఖచంద్రేషు కళంకరంకవః।
యదనేకకసౌధకంధరా
హరిభిః కుక్షిగతీకృతా ఇవ॥ 63

ప. వి. బహురూపకసాలభంజికాముఖచంద్రేషు । కళంకరంకవః । యదనేక కసౌధకంధరాహరిభిః । కుక్షిగతీకృతాః । ఇవ ।

టీక॥ బహురూపకసాలభంజికాముఖచంద్రేషు: బహురూపక = మిక్కిలి సౌందర్యముగల, సాలభంజికా = బొమ్మలయొక్క, ముఖచంద్రేషు = ముఖచంద్రులయందు, కలంకరంకవః; కలంక = కలంకము లను,

రంకవః = జింకలు, యదనేకకసౌధకంధరాహరిభిః; యత్ = ఏ నగర మందలి, అనేకక = అనేకము లైన, సౌధ = మేడలయందలి, కంధరా = కంఠప్రదేశమందలి, హరిభిః = సింహములచే, కుక్షిగతీకృతా ఇవ = పొట్ట బెట్టుకొనఁబడినవో యనున ట్లుండినవి.

సాలభంజికల ముఖచంద్రులయందు కళంకభూతము లైన జింకలు కానరా నందువలన, అందలి జింకలు సౌధాగ్రములపై నున్న సింహ ప్రతిమలచే పొట్టఁబెట్టుకొనఁబడినవో యన్నట్లు భావింపఁబడుటవలన నిట నుత్ప్రేక్షాలంకారము.

**సమాసములు :**

బహురూపకసాలభంజికాముఖచంద్రేషు:- బహు రూపం యాసాం తాః = బహురూపకాః, బహురూపకాశ్చ తాః సాలభంజికాశ్చ = బహురూపక సాలభంజికాః, బహురూపకసాలభంజికానాం ముఖచంద్రాః = బహు రూపకసాలభంజికాముఖచంద్రాః, తేషు = బహురూపకసాలభంజికా ముఖచంద్రేషు.

కలంకరంకవః:- కలంకా ఏవ రంకవః = కలంకరంకవః.

యదనేకకసౌధకంధరాహరిభిః :- అనేకకాశ్చ తే సౌధాశ్చ = అనేక కసౌధాః, యస్యాః అనేకకసౌధాః = యదనేకకసౌధాః యదనేకకసౌధా నాం కంధరాః = యదనేకకసౌధకంధరాః, యదనేకకసౌధకంధరాసు హరయః = యదనేకకసౌధకంధరాహరయః, తైః = యదనేకకసౌధ కంధరాహరిభిః.

కుక్షిగతీకృతా:- కుక్షౌ గతాః = కుక్షిగతాః, అకుక్షిగతాః కుక్షిగతాః సమ్ప ద్యమానాః కృతాః = కుక్షిగతీకృతాః.

**భావము :**

ఆ నగరమందలి బొమ్మలు మిక్కిలి సౌందర్యవంతము లై ప్రకాశించు చున్నవి. ఆ బొమ్మల ముఖచంద్రులలో కళంకము లైన జింకలు కానరావు. ఆ జింకలు, ఆ మేడల పై భాగములయందలి సింహప్రతిమలచే భక్షింపఁబడినవో యను నట్లు గానవచ్చుచున్నవి. లేనిచో నా బొమ్మల ముఖచంద్రులు నిష్కలంకు

లగుటకు కారణ మేమి యున్నది? కావున భవనాగ్రములపైని సింహప్రతిమలు భవనములందలి సాలభంజికల ముఖచంద్రులలోని కళంకహరిణములను భక్షించినవి.

శ్లో॥ బలిసద్మదివం స తథ్యవా
గుపరి స్మాహ దివోఽపి నారదః।
అధరాఽథ కృతా యయేవ సా
విపరీతాఽజని భూమిభూషయా॥ ౮౪

ప. వి. బలిసద్మదివం । సః । తథ్యవాక్ । ఉపరి । స్మ । అహ । దివః । అపి । నారదః । అధరా । అథ । కృతా । యయా । ఇవ । సా । విపరీతా । అజని । భూమిభూషయా.

టీక॥ సః = ప్రసిద్ధుఁడైన, తథ్యవాక్ = సత్యవచనముగల్గిన, నారదః = నారదమహర్షి, బలిసద్మదివమ్; బలిసద్మ = బలిచక్రవర్తిస్థాన మయిన, దివం = స్వర్గమును, (అనగా పాతాళస్వర్గమును) దివోఽపి = మేరు స్వర్గముకంటెను, ఉపరి = పైభాగమున నుండినదిగను, ఉత్కృష్టము గను, ఆహ స్మ = చెప్పుచుండెను, అథ = ఇప్పుడు, భూమిభూషయా = భూమికి నలంకార మైన, యయా = ఏ కుండిననగరిచే, అధరా = తక్కువ యైనదిగను. దిగువ నున్నదిగను. కృతేవ = చేయఁబడినదో యన్నట్లున్నది. సా = ఆ బలినివాసస్థాన మగు స్వర్గము, విపరీతా = నారదవచనమునకు విపరీతముగ, అజని = ఏర్పడినది.

స్వర్గముకంటెను నున్నతస్థానమం దున్న బలిస్వర్గము కుండిన నగరముచే దిగువ నున్నదిగఁ జేయఁబడినదో యనునట్లున్న దని చెప్పుటచే నిట నుత్ప్రేక్షాలంకారము.

సమాసములు :

బలిసద్మదివమ్:- బలేః సద్మ = బలిసద్మ, బలిసద్మైవ ద్యౌః = బలిసద్మద్యౌః. తాం = బలిసద్మదివమ్,

తథ్యవాక్:- తథ్యా వాక్ యస్య సః = తథ్యవాక్.

భూమిభూషయా:- భూమేః భూషా = భూమిభూషా, తయా = భూమి భూషయా.

భావము :

సత్యవాక్కుగల నారదమహర్షి బలిస్వర్గము మేరుస్వర్గముకంటె నుత్కృష్ట మనియు నున్నత మైన దనియు చెప్పెను. కాని యా బలిస్వర్గము కూడ కుండిననగరముకంటెను నికృష్ట మై క్రిందికి దించఁబడినది కాన నా నారద మహర్షివచన మీ విషయమున విపరీతము గావింపఁబడినది. అనగా కుండిన నగరము మేరుస్వర్గము బలిస్వర్గమును మించిన యౌన్నత్యవైభవములతో విల సిల్లుచున్న దని యాశయము.

"స్వర్గాదప్యతిరమణీయాని పాతాళాని" యని విష్ణుపురాణమున నారద వచనము ననుసరించి బలిస్వర్గము మేరుస్వర్గముకంటె నుత్కృష్ట మని యిటఁ జెప్పఁబడినది.

శ్లో॥ ప్రతిహట్టపథే ఘరట్టజాత్
పథికాహ్వానదసక్తుసౌరభే।
కలహాన్న ఘనాన్ యదుత్థితా
దధునాప్యుజ్ఝతి ఘర్ఘరస్వరః॥ రా౫

ప. వి ప్రతిహట్టపథే । ఘరట్టజాత్ । పథికాహ్వానదసక్తుసౌరభే । కలహాత్ । న । ఘనాన్ । యదుత్థితాత్ । అధునా । అపి । ఉజ్ఝతి । ఘర్ఘరస్వరః.

టీక॥ పథికాహ్వానదసక్తుసౌరభే; పథిక = బాటసారులకు, ఆహ్వానద = పిలుపు నిచ్చునట్టి, సక్తు = పేలాలయొక్క, సౌరభే = పరిమళముగల, ప్రతి హట్టపథే = ఒక్కొక్క అంగడివీధియందును, ఘరట్టజాత్ = తిరుగలి వలన నేర్పడిన, యదుత్థితాత్ = ఏ నగరమం దేర్పడిన, కలహాత్ = కలహమువలనఁ గల్గిన, ఘర్ఘరస్వరః = ఘర ఘరధ్వని, ఘనాన్ = మేఘములను, అధునాఽపి = ఇప్పటికిని, నోజ్ఝతి = విడుచుటలేదు.

ఇచ్చట మేఘములకు తిరుగళ్లతోటి కలహసంబంధము లేక పోయినను సంబంధము జెప్పుటవలన నతిశయోక్త్యలంకారము. ఘర్ఘర

ధ్వనికి తిరుగళ్లతోటి కలహము హేతువుగా భావింపఁబడుటవలన నుత్ప్రేక్ష. వ్యంజక ప్రయోగము లేనందువలన నది గమ్యము. అతిశయోక్త్యుత్ప్రేక్షల కిట సంకరము.

సమాసములు:

ప్రతిహట్టపథే:- హట్టే హట్టే = ప్రతిహట్టమ్, ప్రతిహట్టం పంథాః = ప్రతిహట్టపథః, తస్మిన్ = ప్రతిహట్టపథే.

ఘరట్టజాత్:- ఘరట్టాత్ జాయత ఇతి = ఘరట్టజః, తస్మాత్ = ఘరట్టజాత్.

పథికాహ్వానదసక్తుసౌరభే:- పథి భవాః = పథికాః, పథికానామాహ్వానం = పథికాహ్వానం, పథికాహ్వానం దదాతీతి = పథికాహ్వానదం, సక్తూనాం సౌరభం = సక్తుసౌరభమ్, పథికాహ్వానదం సక్తుసౌరభం యస్మిన్ సః = పథికాహ్వానదసౌరభః, తస్మిన్ = పథికాహ్వానదసక్తుసౌరభే.

యదుత్థితాత్:- యస్యాః ఉత్థితః = యదుత్థితః, తస్మాత్ = యదుత్థితాత్.

ఘర్ఘరస్వరః:- ఘర్ఘర ఇతి స్వరః = ఘర్ఘరస్వరః.

భావము;

ప్రతి యంగడివీధియందును పేలాలవాసనలు బాటసారుల నాకర్షించు చుండును. మేఘములకును తిరుగళ్లకును గల్గిన ఘరఘరధ్వనులతోటి కలహము వలన నిప్పటికిని ఆధ్వనిని మేఘములు విడుచుటలేదు. ఆ యంగడివీధులయందంతట తిరుగళ్లు ధాన్యములను విసరుటచే నా ధ్వనులతో నంగళ్లు నిండియున్నవనియు, నా ధ్వనులనే మేఘములు నేర్చుకొనిన వనియు నభిప్రాయము.

శ్లో॥ వరణః కనకస్య మానినీం
దివమంకాదమరాద్రిరాగతామ్।
ఘనరత్నకవాటపక్షతిః
పరిరభ్యానునయన్నువాస యామ్॥ ౧౬

ప. వి. వరణః। కనకస్య। మానినీం। దివమ్। అంకాత్। అమరాద్రిః। ఆగతాం। ఘనరత్నకవాటపక్షతిః। పరిరభ్య। అనునయన్। ఉవాస। యామ్।

టీక॥ కనకస్య = బంగారమునకు సంబంధించిన, వరణః = ప్రాకార మను, అమరాద్రిః = మేరువు, యాం = కుండిననగరి యను, మానినీం = మానవతిని, అనగా కోపముగల దానిని, (అత ఏవ = కావుననే) అంకాత్ = తన యొడినుండి, ఆగతాం = భూలోకమును బొందిన, దివం = అమరావతిని, ఘనరత్నకవాటపక్షతిః; ఘన = ఘట్టితనము గల, రత్న కవాట = రత్నమయము లైన తలుపు లను, పక్షతీ = తెక్కల మూల ప్రదేశములు గలదై, పరిరభ్య = కౌగలించుకొని, అనునయన్ = ఊఱడించుచు, ఉవాస = నివసించెను.

ఈ కుండిననగరి ఏదియో యొకకారణముతో భూమికి వచ్చిన యమరావతి యనియు, దానిని చుట్టియున్న కనకప్రాకారము మేరు పర్వత మనియు నుత్ప్రేక్ష యిట వ్యక్త మగుచున్నది.

సమాసములు:

మానినీం:- మానః అస్యాః అస్తీతి = మానినీ, తాం = మానినీమ్.
అమరాద్రిః:- అమరాణామద్రిః = అమరాద్రిః.
ఘనరత్నకవాటపక్షతిః:-రత్నమయే చ తే కవాటే చ = రత్నకవాటే, ఘనే చ తే రత్నకవాటే చ = ఘనరత్నకవాటే, ఘనరత్నకవాటే ఏవ పక్షతీ యస్య సః = ఘనరత్నకవాటపక్షతిః.

భావము :

సువర్ణప్రాకార మనుమేరుపర్వతము కుండిననగరి యను మానవతి యగు నొడినుండి భూలోకమునకు వచ్చిన యమరావతిని ఘన మయిన తన రత్నపు తలుపు లను తెక్కల మొదళ్లతో కౌగిలించికొని యాకోపన యగు యమరావతి ననునయించుచుండెను. ఆకుండిననగరియొక్క సువర్ణప్రాకారములు మేరుపర్వతముగను, ఆకుండిననగరి కోపించి తనభర్తయొడినుండి భూమికి వచ్చిన యమరావతిగను నుత్ప్రేక్షింపఁబడినది.

శ్లో॥ అనలైః పరివేషమేత్య యా
జ్వలదర్కోపలవప్రజన్మభిః ।
ఉదయం లయమంతరా రవే
రవహద్బాణపురీపరార్ధ్యతామ్॥ ౮౩

ప. వి. అనలైః । పరివేషమ్ । ఏత్య । యా । జ్వలదర్కోపలవప్రజన్మభిః । ఉదయం। లయమ్। అంతరా। రవేః । అవహత్ । బాణపురీపరార్థ్యతామ్ ।

టీక॥ యా = ఏకుండినగరి, రవేః = సూర్యునియొక్క, ఉదయం = ఉదయమునకును, లయం చ = అస్తమయమునకును, అంతరా = మధ్యకాలమునందు, జ్వలదర్కోపలవప్రజన్మభిః; జ్వలత్ = సూర్యకిరణసంబంధముచే ప్రజ్వలించుచున్న, అర్కోపల = సూర్యకాంతమణిమయము లగు, వప్ర = ప్రాకారములనుండి. జన్మభిః = ఉత్పన్నము లైన. అనలైః = అగ్నులచే, పరివేషం = వలయమును. ఏత్య = పొంది. బాణపురీపరార్థ్యతాం; బాణపురీ = బాణాసురనగరముయొక్క, పరార్థ్యతాం = ఉత్కర్షను, అవహత్ = వహించినది.

ప్రాకారమందలి సూర్యకాంతమణులనుండి యేర్పడిన యగ్నులచే పరివేష్టింపఁబడిన కుండిననగరమందు బాణాసురపట్టణోత్కర్ష నారోపించుటవలన నన్యధర్మము నన్యమం దారోపించుట యను నిదర్శనాలంకారము.

సమాసములు :

జ్వలదర్కోపలవప్రజన్మభిః :— అర్కస్య ఉపలాః = అర్కోపలాః, జ్వలన్తశ్చ తే అర్కోపలాశ్చ = జ్వలదర్కోపలాః, జ్వలదర్కోపలమయాశ్చ తే వప్రాశ్చ = జ్వలదర్కోపలవప్రాః, జ్వలదర్కోపలవప్రేభ్యః జన్మ యేషాం తే = జ్వలదర్కోపలవప్రజన్మానః, తైః = జ్వలదర్కోపలవప్రజన్మభిః.

బాణపురీపరార్థ్యతామ్ :— బాణస్య పురీ = బాణపురీ, పరార్థ్యస్య భావః = పరార్థ్యతా, బాణపుర్యాః పరార్థ్యతా = బాణపురీపరార్థ్యతా, తాం = బాణపురీపరార్థ్యతామ్.

భావము :

ఆకుండిననగరమునకు చుట్టును సూర్యకాంతిమణిమయప్రాకారములు గలవు. ఆప్రాకారములందలి సూర్యకాంతమణుల నుండి సూర్యుని యుదయాస్తమయకాలముల మధ్యకాలమందు వెడలునట్టి యగ్నిజ్వాలలచే నా పట్టణము బాణ

పురియొక్క ప్రాశస్త్యమును వహించినది. బాణునిపట్టణమున చుట్టును నగ్నిప్రాకారము గలదు. అవ్విధముగనే యాపట్టణమునకును ప్రాకారముల యందలి సూర్యకాంతమణులనుండి వెల్వడు నగ్నిజ్వాల లగ్నిప్రాకారమువలె నుండినవి.

శ్లో॥ బహుకంబుమణిర్వరాటికా
గణనాటత్కరకర్కటోత్కరః ।
హిమవాలుకయాఽచ్ఛవాలుకః
పటు దధ్వాన యదాపణార్ణవః॥ ౮౮

ప. వి. బహుకంబుమణిః । వరాటికాగణనాటత్కరకర్కటోత్కరః । హిమవాలుకయా । అచ్ఛవాలుకః । పటు । దధ్వాన । యదాపణార్ణవః.

టీక॥ బహుకంబుమణిః; బహు = అనేకములైన, కంబు = శంఖములు, మణిః = రత్నములును గలదియు, వరాటికాగణనాటత్కరకర్కటోత్కరః; వరాటికా = గవ్వలయొక్క, గణనా = లెక్కించుటకై, అటత్ = సంచరించు. కర = చేతు లను. కర్కట = ఎండ్రకాయలయొక్క. ఉత్కరః = సమూహము గలదియు, హిమవాలుకయా = కర్పూరముచే, అచ్ఛవాలుకః = నిర్మలమైన యిసుకగల్గిన, యదాపణార్ణవః; యత్ = ఏనగరమందలి, ఆపణార్ణవః = అంగడివీధి యను సముద్రము, పటు = గట్టిగా, దధ్వాన = ధ్వనించినది.

ఇచ్చట నంగడివీధి సముద్రముగ రూపించుటచే రూపకాలంకారము.

సమాసములు :

బహుకంబుమణిః:- కంబవశ్చ మణయశ్చ = కంబుమణయః, బహవః కంబుమణయః యస్మిన్ సః = బహుకంబుమణిః.

వరాటికాగణనాటత్కరకర్కటోత్కరః:- వరాటికానాం గణనా = వరాటికాగణనా, వరాటికాగణనాయై అటంతః = వరాటికాగణనాటంతః; వరాటికాగణనాటంతశ్చ తే కరాశ్చ = వరాటికాగణనాటత్కరాః, వరాటికాగణనాటత్కరా ఏవ కర్కటాః = వరాటికాగణనాటత్కరకర్కటాః,

వరాటికాగణనాటత్కరకర్కటానాముత్కరః యస్మిన్ సః = వరాటికాగణనాటత్కరకర్కటోత్కరః.

భావము :

ఆకుండినగరమందలి యంగడివీధులయందు పెక్కు శంఖములు మణులను రాసులుగాఁ బోసియున్నారు. గవ్వలు రాసులుగా బోయఁబడియున్నవి. వానిని చేతులలో నెంచుటవలన నాచేతులు గవ్వలను గదలించు ధ్వనినిబట్టి యవి ఎండ్రకాయలుగాఁ గన్పట్టుచున్నవి. మఱియొకవైపు కర్పూరము కుప్పలుగా పోయఁబడియున్నవి. అవి యిసుకగా గన్పట్టుచున్నవి. వీనితో నాయంగడివీధు లను సముద్రము ధ్వనించినది.

శ్లో॥ యదగారఘటాట్టకుట్టిమ
స్రవదిందూపలతుందిలాపయా ।
ముముచే న పతివ్రతౌచితీ
ప్రతిచంద్రోదయమభ్రగంగయా॥ ౮౯

ప. వి. యదగారఘటాట్టకుట్టిమస్రవదిందూపలతుందిలాపయా । ముముచే । న । పతివ్రతౌచితీ । ప్రతిచంద్రోదయమ్ । అభ్రగంగయా.

టీక॥ యదగారఘటాట్టకుట్టిమస్రవదిందూపలతుందిలాపయా; యత్ = ఏనగరమందలి, అగార = గృహములయొక్క, ఘటా = వరుసలయొక్క, అట్ట = పైభాగములయందలి, కుట్టిమ = నిబద్ధభూములయందు, స్రవత్ = స్రవించుచున్న, ఇందూపల = చంద్రకాంతమణులచే, తుందిల = వర్ధిల్లిన, ఆపయా = ఉదకముగల్గిన, అభ్రగంగయా = ఆకాశగంగచే, పతివ్రతౌచితీ = పతివ్రతల ధర్మము, న ముముచే = విడువబడలేదు.

ఇచ్చట నాకాశగంగకు చంద్రకాంతశిలాజలములతో నభివృద్ధి సంబంధము లేకపోయినను నభివృద్ధి చెప్పినందువలన నతిశయోక్త్యలంకారము.

పతివ్రతాధర్మము పోషింపబడినట్లు భావించినందువలన నుత్ప్రేక్షాలంకారము. గమకము లేనందువలన నది గమ్యము. అతిశయోక్తితో నుత్ప్రేక్షకు సంకరము.

సమాసములు :

యదగారఘటాట్టకుట్టిమస్రవదిందూపలతుందిలాపయా :— యస్యా మగారాణి = యదగారాణి, యదగారాణాం ఘటాః = యదగారఘటాః, యదగారఘటాసు అట్టాని = యదగారఘటాట్టాని, యదగారఘటాట్టేషు కుట్టిమాః = యదగారఘటాట్టకుట్టిమాః, ఇందోరుపలాః = ఇందూపలాః, స్రవంతశ్చ తే ఇందూపలాశ్చ = స్రవదిందూపలాః, యదగారఘటాట్టకుట్టిమేషు స్రవదిందూపలాః = యదగారఘటాట్టకుట్టిమస్రవదిందూపలాః, యదగారఘటాట్టకుట్టిమస్రవదిందూపలైః స్తుందిలాని = యదగారఘటాట్టకుట్టిమస్రవదిందూపలతుందిలాని, యదగారఘటాట్టకుట్టిమస్రవదిందూపతుందిలాని ఆపాని యస్యాం సా = యదగారఘటాట్టకుట్టిమస్రవదిందూపలతుందిలాపా, తయా = యదగారఘటాట్టకుట్టిమస్రవదిందూపలతుందిలాపయా.

పతివ్రతౌచితీ :— పత్యా వ్రతం యస్యాస్సా = ప్రతివ్రతా, పతివ్రతాయాః ఔచితీ = పతివ్రతౌచితీ.

అభ్రగంగయా :— అభ్రస్య గంగా = అభ్రగంగా, తయా = అభ్రగంగయా.

భావము :

ప్రతిచంద్రోదయమందును ఆకుండిననగరమందలి భవనముల పైభాగములయందలి చంద్రకాంతశిలానిబద్ధభూములనుండి స్రవించు నుదకములచే నాకాశగంగ ప్రవృద్ధ మగుచున్నది. ప్రతిచంద్రోదయమందును సముద్రుడు కూడ నుప్పొంగుచుండును. కాన భర్త యగు సముద్రుని యభివృద్ధికాలమున భార్యయగు నాకాశగంగయు నభివృద్ధి జెందిన దై భర్త యభివృద్ధి నందినపుడు భార్యయు నభివృద్ధి నొందుట భర్త యభివృద్ధి నందనపుడు తాను నభివృద్ధిని గాంక్షింపకుండుట యను పతివ్రతాధర్మము పరిపాలించినది. ఆకుండిననగరమందలి భవనము లాకాశగంగను మించిన యౌన్నత్యము గల్గియున్న వనుట యిట ముఖ్యాశయము.

శ్లో॥ రుచయోఽస్తమితస్య భాస్వతః
స్ఖలితా యత్ర నిరాలయాః ఖలు ।
అనుసాయమభుర్విలేపనా
పణకాశ్మీరజపణ్యవీథయః॥ ౯౦

ప. వి. రుచయః। అస్తమితస్య । భాస్వతః। స్ఖలితాః । యత్ర। నిరాలయాః। ఖలు। అనుసాయమ్ । అభుః । విలేపనాపణకాశ్మీరజపణ్యవీథయః ।

టీక॥ యత్ర = ఏకుండినసగరియందు. అనుసాయం = ప్రతిసాయంకాలము, విలేపనాఽఽపణకాశ్మీరజపణ్యవీథయః. విలేపనాఽఽపణ = సుగంధ ద్రవ్యము లమ్మునట్టి యంగళ్లయందలి, కాశ్మీరజ = కుంకుమపూలనెడి, పణ్య = విక్రయింపఁదగిన ద్రవ్యములయొక్క, వీథయః = పంక్తులు, అస్తమితస్య = అస్తమించిన, భాస్వతః = సూర్యునికి సంబంధించిన వై, స్ఖలితాః = పడిపోయిన, (అత ఏవ = ఇందు వలననే,) నిరాలయాః = ఆశ్రయము లేని, రుచయః = కాంతులుగ, అభుః ఖలు = ప్రకాశించినవి గదా.

కుంకుమపుష్పము సాయంకాలపుసూర్యుని కాంతిని వహించినందువలన క్రిందఁ బడినట్లు భావింపఁబడిన సూర్యకాంతు లంగళ్ల నాశ్రయించినవో యని చెప్పుటవలన నుత్ప్రేక్షాలంకారము. వ్యంజకము:ను ప్రయోగించనందువలన నది గమ్యము.

సమాసములు :

నిరాలయాః :- నిర్గతాః ఆలయాః యేషాం తే = నిరాలయాః.

అనుసాయమ్:- సాయం సాయం = అనుసాయమ్.

విలేపనాపణకాశ్మీరజపణ్యవీథయః:- విలేపనానామాపణాః = విలేపనాపణాః, విలేపనాపణేషు కాశ్మీరజాని = విలేపనాపణకాశ్మీరజాని, విలేపనాపణకాశ్మీరజాన్యేవ పణ్యాని = విలేపనాపణకాశ్మీరజపణ్యాని, విలేపనాపణకాశ్మీరజపణ్యానాం వీథయః = విలేపనాపణకాశ్మీరజపణ్యవీథయః

భావము :

ఆ కుండినసగరమందలి యంగళ్ళయందు కుంకుమపుష్పము మున్నగు విలేపనద్రవ్యములు వరుసలు తీర్చి యుంచఁబడియున్నవి. అవి సాయంకాల

మందలి సూర్యుని యరుణకిరణములను బోలియున్నవి. కావున సూర్యుఁ డస్త మించునపు డాయస్తమయమువలని కలతలోఁ గొన్ని కిరణములు జారిపోగా నవి యాశ్రయము లేక యీయంగళ్ళలోని కుంకుమాదివిలేపనద్రవ్యములుగ భాసించినవి. వాస్తవముగ నవి విలేపనద్రవ్యములు కావు. కేవలము సూర్యుని నుండి జారిన యరుణకిరణములుగ భావింపఁబడుచున్నవి.

శ్లో॥ వితతం వణిజాపణేఽఖిలం
పణితుం యత్ర జనేన వీక్ష్యతే।
మునినేవ మృకండుసూనునా
జగతీవస్తు పురోదరే హరేః॥ ౬౧

ప. వి వితతం । వణిజా। ఆపణే । అఖిలం । పణితుం। యత్ర । జనేన । వీక్ష్యతే మునినా । ఇవ। మృకండుసూనునా। జగతీవస్తు । పురా । ఉదరే । హరేః।

టీక॥ యత్ర = ఏనగరమందు, వణిజా = వైశ్యజనముచే, పణితుం = వ్యాపారముచేయుటకై, ఆపణే = అంగడివీధియందు, వితతం = పఱువఁబడిన, అఖిలం = సమస్తమైన, జగతీవస్తు = ప్రపంచమందలి పదార్థసమూహము. పురా = పూర్వము, హరేః = విష్ణువుయొక్క, ఉదరే = గర్భమునందు. మునినా = మునియగు, మృకండుసూనునేవ = మృకండుమహర్షిపుత్రుడైన మార్కండేయునిచేత వలె, జనేన = జనముచేః వీక్ష్యతే = చూడఁబడుచున్నది.

విష్ణుగర్భమున సమస్తపదార్థములను మార్కండేయముని చూచిన విధముగ జను లాయంగళ్ళయందు, సమస్తవస్తువులను జూచి రని చెప్పుటవలన నుపమాలంకారము.

సమాసములు :

మృకండుసూనునా:- మృకండోః సూనుః = మృకండుసూనుః, తేన = మృకండుసూనునా.

జగతీవస్తు:- జగతీనాం వస్తు = జగతీవస్తు.

భావము :

ఆ కుండిననగరమందు వైశ్యులు వ్యాపారార్థము సమస్తవస్తువుల నంగళ్ళ యందుఁ బఱచుకొనియున్నారు. మార్కండేయమహర్షి విష్ణువుయొక్క యుదర మందు సమస్తపదార్థములను జూచిన ట్లానగరమందలి జన మందలియంగళ్ళ యందు సమస్తపదార్థములను జూచుచున్నారు. ఒకప్పుడు మార్కండేయ మహర్షి హరియొక్క యుదరమును బ్రవేశించి యందు సమస్తప్రపంచమును గాంచె నని గాథ యనుసంధేయము.

శ్లో॥ సమమేణమదైర్యదాపణే
తులయన్ సౌరభలోభనిశ్చలమ్।
పణితా న జనారవైరవై
దపి కూజంతమలిం మలీమసమ్॥ ౫౨

వ. వి. సమమ్ । ఏణమదైః । యదాపణే । తులయన్ । సౌరభలోభనిశ్చలమ్ । పణితా । న । జనారవైః । అవైత్ । అపి । కూజంతమ్ । అలిం । మలీమసమ్ ।

టీక॥ యదాపణే = ఏనగరముయొక్క యంగడివీధియందు, సౌరభలోభనిశ్చలమ్; సౌరభ = పరిమళమందలి, లోభ = ఆశచే, నిశ్చలం = చలనము లేని, మలీమసం = నల్లని. అళిం = తుమ్మెదను. ఏణమదైస్సమం = కస్తూరితోడ, తులయన్ = తూచుచున్న, పణితా = వ్యాపారి, (అనగా విక్రేత), కూజంతమపి = కూయుచున్న దైనను, జనారవైః = జనుల ధ్వనులచే, నాఽవైత్ = తెలిసికొనలేదు.

ఇచ్చట తుమ్మెదకును కస్తూరికిని నైల్యగుణముచే నైక్యముఁ జెప్పబడినది. కాన సామాన్యాలంకారము. ఈసామాన్యాలంకారమునుండి తుమ్మెదను కస్తూరిగా భ్రాంతిచెందుట స్ఫురించును గాన భ్రాంతిమద లంకారము వ్యంగ్యము. ఇక్కడ నిశ్చలమైన తుమ్మెద ధ్వనించుచున్న దను విషయము సరిపడదు. అది కేవలము కవిప్రౌఢవాదకల్పితము.

సమాసములు :

ఏణమదైః:- ఏణస్య మదాః = ఏణమదాః, తైః = ఏణమదైః.
సౌరభలోభనిశ్చలమ్:- సురభేర్భావః = సౌరభమ్, సౌరభే లోభః = సౌరభలోభః, సౌరభలోభేన నిశ్చలమ్ = సౌరభలోభనిశ్చలమ్.
జనారవైః:- జనానామారవాః = జనారవాః, తైః = జనారవైః.

భావము :

ఆ నగరమందలియంగళ్ళలోఁ గస్తూరిసమృద్ధిగ విక్రయింపఁబడుచున్నది. ఒకవర్తకుఁడు కస్తూరిపైఁ దుమ్మెద వ్రాలి దానిపరిమళమును నిశ్చలముగ గ్రహించుచు రొదఁజేయుచున్నను నందలి జనుల శబ్దమువలన కస్తూరీవర్ణముతో మిళితమైన యాతుమ్మెదను గ్రహింపకయే దానితోడఁ గస్తూరిని దూచుచున్నాడు. అందు తుమ్మెద వ్రాలియున్నవిషయ మతఁడు గ్రహించలేదు.

శ్లో॥ రవికాంతమయేన సేతునా
సకలాహర్జ్వలనాహితోష్మణా।
శిశిరే నిశి గచ్ఛతాం పురా
చరణౌ యత్ర దునోతి నో హిమమ్॥ ౭౩

ప. వి. రవికాంతమయేన । సేతునా । సకలాహర్జ్వలనాహితోష్మణా । శిశిరే । నిశి । గచ్ఛతాం । పురా । చరణౌ । యత్ర । దునోతి । నో । హిమమ్ ।

టీక॥ యత్ర = ఏకుండినగరమందు, సకలాహర్జ్వలనాహితోష్మణా; సకలాహః = దిన మంతయు. జ్వలన = మండుటచే. ఆహిత = ఉంచఁబడిన, ఊష్మణా = వేడిగల్గిన, రవికాంతమయేన = సూర్యకాంతమణిమయమైన. సేతునా = సేతువుచే. (అనగా సేతువుతో సమాన మగు మార్గముచే), గచ్ఛతాం = సంచరించుచున్న వారియొక్క, చరణౌ = పాదములను. శిశిరే = శిశిరర్తువునందు, నిశి = రాత్రియందు. హిమం = మంచు, పురా నో దునోతి = పీడించలేదు.

ఇచ్చట సేతువునకు వేడితోటి సంబంధము లేకపోయినను సంబంధము జెప్పుటవలన నతిశయోక్త్యలంకారము

సమాసములు:-

రవికాంతమయేన :- రవేః కాంతాః = రవికాంతాః, రవికాంతానాం వికారః = రవికాంతమయః, తేన = రవికాంతమయేన.

సకలాహర్జ్వలనాహితోష్మణా :- సకలం చ తత్ అహశ్చ = సకలాహః, సకలాహ్నా జ్వలనం = సకలాహర్జ్వలనం, సకలాహర్జ్వలనేన ఆహితమ్ = సకలాహర్జ్వలనాహితమ్, సకలాహర్జ్వలనాహితం ఊష్మ యస్మిన్ సః = సకలాహర్జ్వలనాహితోష్మా, తేన = సకలాహర్జ్వలనాహితోష్మణా.

భావము :

ఆనగరమందు మార్గములు సూర్యకాంతమణులతో నిర్మింపఁబడియున్నవి. పగ లంతయు సూర్యునికాంతితో నవి జ్వలించుటవలన మిక్కుటమగు వేడి యామార్గములయందు నిలిచియుండుటవలన రాత్రియందు నడచువారిపాదములను శిశిరఋతువునందలి మంచు బాధపెట్టుటలేదు.

శ్లో॥ విధుదీధితిజేన యత్పథం
పయసా నైషధశీలశీతలమ్।
శశికాంతమయం తపాగమే
కలితీవ్ర స్తపతి స్మ నాఽఽతపః॥ ౯౪

ప. వి. విధుదీధితిజేన। యత్పథం। పయసా। నైషధశీలశీతలమ్। శశికాంతమయం। తపాగమే। కలితీవ్రః। తపతి। స్మ। న। ఆతపః।

టీక॥ విధుదీధితిజేన; విధుదీధితి = చంద్రకాంతివలన, జేన = కల్గిన, పయసా = ఉదకముచే, నైషధశీలశీతలమ్: నైషధ = నలునియొక్క, శీల = స్వభావమువలె శీతలం = చల్లని. శశికాంతమయం = చంద్రకాంతమణిమయమైన, యత్పథం = ఏనగరమార్గమును, కలితీవ్రః = కలికాలమువలె తీక్ష్ణమైన, ఆతపః = ఎండ, తపాగమే = గ్రీష్మఋతువునందు, న తపతి స్మ = కాల్చలేదు.

ఇచ్చట నగరవీధులకు చంద్రకాంతమణిసంబంధము లేకపోయి నను,ఆసంబంధము చెప్పినందువలన నతిశయోక్త్యలంకారము. నైషధ శీలశీతల మని చంద్రకాంత మణిమార్గమును వర్ణించుటవలన నుపమాలంకారము. ఆయతిశయోక్తి యుపమాలంకారమునకు మూలము కాన దానితో దీనికి సాంకర్యము.

సమాసములు :

విధుదీధితిజేన :- విధోః దీధితయః = విధుదీధితయః, విధుదీధితిభ్యః జాయత ఇతి = విధుదీధితిజం, తేన = విధుదీధితిజేన.

నైషధశీలశీతలమ్ :- నిషధానాం రాజా = నైషధః, నైషధస్య శీలం = నైషధశీలం, నైషధశీలమివ శీతలం = నైషధశీలశీతలమ్, తత్ = నైషధ శీలశీతలమ్.

శశికాంతమయమ్ :- శశినః కాంతాః = శశికాంతాః, శశికాంతానాం వికారః = శశికాంతమయః, తమ్ = శశికాంతమయమ్.

తపాగమే :- తపస్య ఆగమః = తపాగమః, తస్మిన్ = తపాగమే.

కలితీవ్రః :- కలిరివ తీవ్రః = కలితీవ్రః.

భావము :

ఆ నగరమందు కొన్ని వీధులు చంద్రకాంతమణులతో నిర్మింపఁబడి నవి. ఆ చంద్రకాంతశిలామార్గములపై చంద్రకిరణములవలని జలము పాఱుట వలన నవి నలుని చల్లనిస్వభావమువలెఁ జల్లగా నుండి, గ్రీష్మఋతువునందు కలికాలమువలె నెండ కాయుచున్నను నాత్రోవల నది కాల్చుటలేదు. నలునికథ కలినాశకము గాన నాకలితీవ్ర మైన యెండ యానలుని నగరమం దెట్టి బాధను గల్గించలేదు.

శ్లో॥ పరిఖావలయచ్ఛలేన యా
న పరేషాం గ్రహణస్య గోచరా ।
ఫణిభాషితభాష్యఫక్కికా

వ. వి. పరిఖావలయచ్ఛలేన । యా । న । పరేషాం । గ్రహణస్య । గోచరా । ఫణిభాషితభాష్యఫక్కికా । విషమా । కుండలనామ్ । అవాపితా ।

టీక॥ పరిఖావలయచ్ఛలేన; పరిఖా = అగడ్త యను, వలయ = వలయము యొక్క, ఛలేన = నెపముచే, కుండలనాం = కుండలీకరణమును, అవాపితా = పొందింపఁబడిన, పరేషాం = శత్రువులయొక్క, గ్రహణస్య = ఆక్రమణమునకును, జ్ఞానమునకును, న గోచరా = విషయము కాని, యా = ఏకుండిననగరి, విషమా = గ్రహింప సాధ్యముకాని, ఫణిభాషిత భాష్యఫక్కికా; ఫణీ = పతంజలిమహర్షిచే, భాషిత = చెప్పఁబడిన, భాష్య = మహాభాష్యమందలి, ఫక్కికా = కుండలీగ్రంథమువలె, (అభవత్ = అయినది.

కుండిననగరము మహాభాష్యమందలి కుండలీకృతగంథముగ భావింపఁబడుటవలన నిట నుత్ప్రేక్షాలంకారము.

"పరిఖావలయచ్ఛలేన" యని ఛలశబ్దముచే పరిఖావలయమందు పరిఖావలయత్వ మపహ్నవింపఁబడినందువలన నపహ్నవాలంకారము. ఆయపహ్నవాలంకారముతో నుత్ప్రేక్ష కలసినందువలన సాపహ్నవోత్ప్రేక్ష. వ్యంజకప్రయోగము లేనందువలన నాయుత్ప్రేక్ష యిఁట గమ్యము.

సమాసములు :

పరిఖావలయచ్ఛలేన :- పరిఖైవ వలయః = పరిఖావలయః, పరిఖావలయ ఇతి ఛలం = పరిఖావలయచ్ఛలం, తేన = పరిఖావలయచ్ఛలేన.
ఫణిభాషితభాష్యఫక్కికా:- ఫణినా భాషితం = ఫణిభాషితమ్, ఫణిభాషితం చ తత్ భాష్యం చ = ఫణిభాషితభాష్యమ్, ఫణిభాషితభాష్యస్య ఫక్కికా = ఫణిభాషితభాష్యఫక్కికా.

భావము :

వలయాకారపుఁ గడ్తతోఁ జుట్టఁబడియున్న యాకుండిననగరి శత్రువులకుఁ జొరరానిదిగను, నితరులకుఁ దెలిసికొన సాధ్యముకానందువలన నగడ్త

యను వలయాకారపు రేఖలతో కుండలీకరణము చేయఁబడి యెవ్వరికిని గ్రహింప సాధ్యము కానందువలన కుండలీకృత మైన మహాభాష్యమందలి కుండలీ గ్రంథమువలె నుండినది.

శ్లో॥ ముఖపాణిపదాక్ష్ణి పంకజై
రచితాంగేష్వపరేషు చంపకైః ।
స్వయమాదిత యత్ర భీమజా
స్మరపూజాకుసుమస్రజః శ్రియమ్॥ ౯౬

ప వి. ముఖపాణిపదాక్ష్ణి । పంకజైః । రచితా । అంగేషు । అపరేషు । చంపకైః। స్వయమ్। ఆదిత । యత్ర । భీమజా । స్మరపూజాకుసుమస్రజః । శ్రియమ్।

టీక॥ ముఖపాణిపదాక్ష్ణి; ముఖ = ముఖమందును, పాణి = హస్తముల యందు, పద = అడుగులయందును, అక్ష్ణి = నేత్రములయందును, పంకజైః = తామరపుష్పములచే, రచితా = సృజింపబడినదియు, అప రేషు = ఇతరము లయిన యంగములయందు, చంపకైః = సంపెంగ పూలతో, రచితా = సృజింపఁబడినదియు నగు, భీమజా = దమయంతి, స్వయం = తాను, స్మరపూజాకుసుమస్రజః; స్మరపూజా = మన్మథపూజ కవసర మైన, కుసుమస్రజః = పుష్పమాలయొక్క, శ్రియం = శోభను, ఆదిత = పొందినది.

పుష్పమాలశోభను దమయంతి వహించిన దని చెప్పుటచే నన్య ధర్మమున కన్యమం దారోపణచే నేర్పడిన నిదర్శనాలంకారము.

ఆమెయొక్క ముఖాద్యంగములను పద్మాదులతో నభిన్నములుగఁ జెప్పుటవలన నభేదాతిశయోక్త్యలంకారము, ఈయతిశయోక్తిచేఁ బై నిద ర్శన యుత్థాపితము గాన నీరెంటికి నిట సంకరము.

సమాసములు:

ముఖపాణిపదాక్ష్ణి :- ముఖం చ పాణీ చ పదే చ అక్షిణీ చ ఏషాం సమా హారః = ముఖపాణిపదాక్షి, తస్మిన్ = ముఖపాణిపదాక్ష్ణి.
స్మరపూజాకుసుమస్రజః:- స్మరస్య పూజా = స్మరపూజా, స్మరపూజాయాః కుసుమస్రక్ = స్మరపూజాకుసుమస్రక్, తస్యాః = స్మరపూజాకుసుమ స్రజః.

భావము :

ఆ దమయంతి ముఖమునందును, హస్తములయందును, పాదములయందును, పద్మములచేతను, ఇతరాంగములయందు చంపకపుష్పములచేతను సృజింపఁబడిన దై మన్మథపూజకు వలసిన పుష్పమాలయొక్క శోభను వహించినది.

శ్లో॥ జఘనస్తనభారగౌరవాత్
వియదాలంబ్య విహర్తుమక్షమాః।
ధ్రువమప్సరసోఽవతీర్య యాం
శతమధ్యాసత తత్సఖీజనః॥ ౯౭

ప. వి. జఘనస్తనభారగౌరవాత్ । వియత్ । ఆలంబ్య । విహర్తుమ్ । అక్షమాః। ధ్రువమ్। అప్సరసః। అవతీర్య। యాం। శతమ్। అధ్యాసత । తత్సఖీజనః.

టీక॥ జఘనస్తనభారగౌరవాత్; జఘన = పిఱుదలయొక్కయు, స్తన = స్తనములయొక్కయు, భారగౌరవాత్ = భారమువలన, వియత్ = ఆకాశమును, ఆలంబ్య = ఆధారము గావించుకొని, విహర్తుం = విహరించుటకు, అక్షమాః = అసమర్థురాండ్రైన, శతం = నూఱుగురు, అప్సరసః = అచ్చరలు, అవతీర్య = స్వర్గమునుండి దిగి, తత్సఖీజనః = ఆమెకు చెలికత్తెలై, యాం = ఏ దమయంతిని, అధ్యాసత = ఆశ్రయించి యుపాసనఁజేసిరి, ధ్రువం = నిశ్చయము.

ఇచ్చట దమయంతిచెలికత్తెలను స్వర్గమునుండి దిగివచ్చిన యచ్చరలుగ భావించినందువలన నుత్ప్రేక్షాలంకారము. "ధ్రువమ్" అను వ్యంజకమును బ్రయోగించినందువలన నది వాచ్యము.

సమాసములు :

జఘనస్తనభారగౌరవాత్:- జఘనాని చ స్తనౌ చ ఏషాం సమాహారః = జఘనస్తనమ్, జఘనస్తనస్య భారః = జఘనస్తనభారః, గురోః భావః = గౌరవమ్, జఘనస్తనభారే గౌరవమ్ = జఘనస్తనభారగౌరవం, తస్మాత్ = జఘనస్తనభారగౌరవాత్.
అక్షమాః:- న క్షమాః = అక్షమాః.

తత్సఖీజనః:- సఖ్య ఏవ జనః = సఖీజనః, తస్యాః సఖీజనః = తత్స ఖీజనః.

భావము :

మూరుగు రప్సరసలు జఘనములయొక్కయు, స్తనములయొక్కయు భారమువలన నాకాశమందు విహరించుటకు శక్తిలేనివారై భూలోకమునందలి కుండిననగరముఁ జేరి యా దమయంతికిఁ జెలికత్తెలై యామెను సేవించు చుండిరి. ఆమెచెలికత్తె లచ్చరలను మించిన సౌందర్యవతు లనుట ముఖ్యాశయము.

శ్లో॥ స్థితిశాలిసమస్తవర్ణతాం
న కథం చిత్రమయీ బిభర్తు యా।
స్వరభేదముపైతు యా కథం
కలితానల్పముఖారవా న వా॥ ౭౦

ప, వి స్థితిశాలిసమస్తవర్ణతాం । న। కథం । చిత్రమయీ । బిభర్తు । యా । స్వరభేదమ్ । ఉపైతు । యా । కథం । కలితానల్పముఖారవా । న । వా।

టీక॥ చిత్రమయీ = ఆశ్చర్యముతో నిండినదియు, చిత్తరువులతో నిండినదియు నగు, యా = ఏ కుండిననగరము,స్థితిశాలిసమస్తవర్ణతాం; స్థితి = మర్యాద తోడను, స్థిరత్వముచేతను, శాలి = ప్రకాశించు, సమస్తవర్ణతాం = సమస్తము లయిన బ్రాహ్మణాదివర్ణములుగల్గియుండుటను,శుక్లనీలాదిసమ స్తవర్ణములుగల్గియుండుటను,కథం = ఎట్లు,న బిభర్తు = భరించదు. అనగా తప్పక భరించును. కలితానల్పముఖారవా; కలిత = చేయఁబడిన, అనల్ప = పెక్కైన, ముఖ = ముఖములయొక్క, ఆరవా = శబ్దముగలదియు. కలిత = చేయఁబడిన, అనల్పముఖ = పెక్కుముఖములుగల, బ్రహ్మ, శివ, కుమారస్వాములయొక్క, ఆరవా = శబ్దముగలదై, స్వరభేదం = ధ్వనిభేదమును, స్వర్గముతో నభేదమును, కథం = ఎట్లు, నోపైతు = పొందదు, తప్పక పొందఁగలదు.

ఇచ్చట బ్రాహ్మణాదివర్ణములకును, శుక్లాదివర్ణములకును సంబం ధించిన వృత్తాంతములును, పెక్కుముఖములవలని ధ్వనులును, పెక్కు

ముఖములు గల బ్రహ్మాదిదేవతల ధ్వనులును, రెండును బ్రకృతము లగుటవలన ప్రకృతశ్లేషాలంకారము. ఇందు పూర్వార్ధమున నొకశబ్దముచే రెండర్థములు వచ్చుటవలన నర్థశ్లేషయు నుత్తరార్ధమున రెండు శబ్దములవలన రెండర్థములు వచ్చుటవలన శబ్దశ్లేషయు నేర్పడినవి.

శ్లో॥ స్వరుచాఽరుణయా పతాకయా
దినమర్కేణ సమీయుషోత్తృషః।
లిలిహుర్బహుధా సుధాకరం
నిశి మాణిక్యమయా యదాలయాః॥ కా

వ, వి. స్వరుచా। అరుణయా। పతాకయా। దినమ్। అర్కేణ। సమీయుషా, ఉత్తృషః। లిలిహుః। బహుధా। సుధాకరం। నిశి। మాణిక్యమయాః। యదాలయాః.

టీక॥ మాణిక్యమయాః = పద్మరాగమణిమయము లైన, యదాలయాః = ఏ నగరమందలి గృహములు, దినం = పగటియందు, సమీయుషా = కలిగినటువంటి, అర్కేణ = సూర్యునిచే, ఉత్తృషః = దాహము పొందిన వై, స్వరుచా = తమకాంతులచే, అరుణయా = ఎఱ్ఱదనముఁ బొందిన, పతాకయా = పెక్కెముచే, (అనగా నాలుకవలె నెఱ్ఱనైన ధ్వజముచేత నని యర్థము) సుధాకరం = చంద్రుని, బహుధా = పెక్కుమాఱులు, లిలిహుః = ఆస్వాదించినవి.

ఇచ్చట నెత్తైన పతాకలు చంద్రమండలమును స్పృశింపకపోయినను స్పృశించినట్లు చెప్పుటవలన నతిశయోక్తి. ఎత్తుగా నెగురుచున్న పతాకలు దాహమువలన చంద్రమండలమును పిపాసను తీర్చుకొనుటకై యాస్వాదించుచున్నవో యనునట్లు భావింపఁబడినందువలన నుత్ప్రేక్షాలంకారము. వ్యంజకము బ్రయోగించనందువలన నది గమ్యము. పద్మరాగమణిమయభవనముల కాంతులు పతాకయందు సంక్రమించుటవలన నెఱ్ఱనైనట్లు వర్ణించుటవలన తద్గుణాలంకారము. ఈ తద్గుణము చేతనే యుత్ప్రేక్షాలంకార ముత్థాపితము. కాన నారెంటికిని సంకరము.

సమాసములు :

స్వరుచా:- స్వస్య రుక్ = స్వరుక్, తయా = స్వరుచా,
ఉత్తృషః:- ఉత్పన్నా తృట్ యాసాం తాః = ఉత్తృషః,
మాణిక్యమయాః:- మాణిక్యానాం వికారాః = మాణిక్యమయాః.
యదాలయాః:- యస్యామాలయాః = యదాలయాః.

భావము :

ఆ నగరమందలి పద్మరాగమణిమయగృహములు తమ కాంతిసంపర్కముచే నెఱ్ఱబారిన పతాకములు సూర్యకిరణముల వేడిమికి తమకు దాహ మేర్పడి నందువలననో యనునట్లు రాత్రులయందు చల్లని చంద్రమండలము నాస్వాదించినవి.

శ్లో॥ లిలిహే స్వరుచా పతాకయా
నిశి జిహ్వానిభయా సుధాకరమ్।
శ్రితమర్కకరైః పిపాసు య
న్నృపసద్మామలపద్మరాగజమ్॥ ౧౦౦

ప. వి. లిలిహే । స్వరుచా । పతాకయా । నిశి । జిహ్వానిభయా । సుధాకరమ్ । శ్రితమ్ । అర్కకరైః । పిపాసు । యన్ నృపసద్మ । అమలపద్మ రాగజమ్.

టీక॥ అమలపద్మరాగజమ్; అమల = నిర్మల మైన, పద్మరాగజమ్ = పద్మరాగ మణులవలనఁ గల్గిన, యన్నృపసద్మ; యత్ = ఏ కుండిననగరమందలి, నృపసద్మ = రాజభవనము, అర్కకరైః = సూర్యకిరణములచే, శ్రితమ్ = వ్యాప్తమైన దై (అత ఏవ = ఇందువలననే) పిపాసు = దప్పి కొనిన దై, స్వరుచా = తనకాంతితో లిప్త మైన, జిహ్వానిభయా = నాలుకతో సమాన మైన, పతాకయా = ధ్వజముచే, సుధాకరం = చంద్రుని, నిశి = రాత్రులందు, లిలిహే = ఆస్వాదించినవి.

"స్వరుచా పతాకయా" అని తన కాంతితో 'లిప్త మైన పతాకతో' అని చెప్పుటవలన తద్గుణాలంకారము.

"జిహ్వానిభయా పతాకయా" యని పతాకను జిహ్వతో సమానముగఁ జెప్పినందువలన నుపమాలంకారము. తద్గుణాలంకారమునకును నుపమకును సంకరము.

సమాసములు :-

స్వరుచా:- స్వస్యాః రుక్ యస్యాం సా = స్వరుక్, తయా = స్వరుచా.
జిహ్వానిభయా:-జిహ్వాయా నిభా = జిహ్వానిభా, తయా = జిహ్వానిభయా.
అర్కకరైః:- అర్కస్య కరాః = అర్కకరాః, తైః = అర్కకరైః
పిపాసు:- పాతుమిచ్ఛు = పిపాసు.
యన్నృపసద్మ:- నృపస్య సద్మ = నృపసద్మ, యస్యాః నృపసద్మ = యన్నృపసద్మ.
అమలపద్మరాగజమ్:- అమలాశ్చ తే పద్మరాగాశ్చ = అమలపద్మరాగాః, అమలపద్మరాగేభ్యః జాయత ఇతి = అమలపద్మరాగజమ్

భావము :

ఆ నగరమందు నిర్మల మగు పద్మరాగమణులచే నిర్మింపఁబడిన రాజభవనము సూర్యకిరణములచేఁ దాపముఁ జెంది దప్పికొనినదై తమపద్మరాగమణుల కాంతి నెఱ్ఱబారి నాలుకవలె నున్న పతాకతో రాత్రి చంద్రు నాస్వాదించినది.

శ్లో॥ అమృతద్యుతిలక్ష్మ పీతయా
మిళితం యద్వలభీపతాకయా।
వలయాయిత శేషశాయిన
స్సఖితామాదిత పీతవాససః॥ ౧౦౧

ప. వి. అమృతద్యుతిలక్ష్మ । పీతయా । మిళితం। యద్వలభీపతాకయా । వలయాయిత శేషశాయినః । సఖితామ్ । ఆదిత । పీతవాససః.

టీక॥ పీతయా = పసుపుపచ్చని, యద్వలభీపతాకయా; యత్ = ఏనగరమునందలి, వలభీ = కూటాగారముపైని, పతాకయా = ధ్వజముచే, మిలితం = కలిసిన, అమృతద్యుతిలక్ష్మ, అమృతద్యుతి, = చంద్రునియందలి

లక్ష్మ = కళంకము, వలయాయిత శేషశాయినః; వలయాయిత = వలయాకారమైన, శేష = ఆదిశేషునిపై, శాయినః = శయనించుచున్న, పీతవాససః = పీతాంబరుడైన విష్ణువునకు. సఖితాం = సాదృశ్యమును, ఆదిత = గ్రహించెను.

వసుపుపచ్చని పతాకతో మిళిత మైన చంద్రకళంకము. వలయాకారపు టాదిశేషునిపై శయనించు పీతాంబరుఁడగు విష్ణువుతో సదృశమని చెప్పుటవలన నుపమాలంకారము.

సమాసములు :

అమృతద్యుతిలక్ష్మ:- అమృతమయీ ద్యుతిః యస్య సః = అమృతద్యుతిః, అమృతద్యుతేః లక్ష్మ = అమృతద్యుతిలక్ష్మ.
యద్వలభీపతాకయా:- యస్యాం వలభీ = యద్వలభీ, యద్వలభ్యాం పతాకా = యద్వలభీపతాకా, తయా = యద్వలభీపతాకయా.
వలయాయిత శేషశాయినః:- వలయ ఇవ ఆచరితః = వలయాయితః, వలయాయితశ్చాసౌ శేషశ్చ = వలయాయిత శేషః, వలయాయిత శేషే శేత ఇతి = వలయాయిత శేషశాయీ, తస్య = వలయాయిత శేషశాయినః.
పీతవాససః:- పీతం వాసః యస్య సః = పీతవాసాః, తస్య = పీతవాససః.

భావము :

ఆ కుండిననగరమందలి భవనముల కూటాగారములపైని పతాకలచే చంద్రునిలోని కళంకము స్పృశింపఁబడుటవలన నాకళంకము వలయాకారమైన యాదిశేషునిపైఁ బవ్వళించిన పీతాంబరధారి యగు విష్ణుని సాదృశ్యమును వహించినవి.

శ్లో॥ అశ్రాంతశ్రుతిపాఠపూతరసనావిర్భూతభూరిస్తవాః
జిహ్మబ్రహ్మముఖౌఘవిఘ్నితనవస్వర్గక్రియాకేళినా।
పూర్వం గాధిసుతేన సామిఘటితా ముక్తా ను మందాకినీ
యత్ప్రాసాదదుకూలవల్లిరనిలాందోలైరఖేలద్దివి॥ ౧౦౨

ప వి. అశ్రాంతశ్రుతిపాఠపూతరసనావిర్భూతభూరిస్తవాఃజిహ్మబ్రహ్మముఖౌఘ విఘ్నితనవస్వర్గక్రియాకేళినా। పూర్వం। గాధిసుతేన। సామిఘటితా।

ముక్తా । ను । మందాకినీ । యత్ప్రాసాదదుకూలవల్లిః । అనిలాందోలైః । అఖేలత్ । దివి ।

టీక॥ యత్ప్రాసాదదుకూలవల్లిః: యత్ = ఏకుండినసగరమందలి, ప్రాసాద = మేడలయందలి, దుకూలవల్లిః = పట్టువస్త్రపుపతాక, అశ్రాంతశ్రుతిపాఠపూతరసనావిర్భూతభూరిస్తవాఽజిహ్మబ్రహ్మముఖౌఘవిఘ్నితనవస్వర్గక్రియాకేళినా: అశ్రాంత = నిరంతరము, శ్రుతిపాఠ = వేదపాఠముచే, పూత = పవిత్రమైన, రసనా = నాలుకలనుండి, ఆవిర్భూత = వెల్వడిన, భూరి = అనేకములైన, స్తవ = స్తోత్రములయందు, అజిహ్మ = కుంటువోని, బ్రహ్మ = బ్రహ్మయొక్క, ముఖ = ముఖముల యొక్క, ఓఘ = సమూహముచే, విఘ్నిత = విఘ్నముగా వింపఁబడిన, నవస్వర్గ = నూతనస్వర్గము యొక్క, క్రియాకేళినా = సృష్టిలీలగల్గిన, గాధిసుతేన = విశ్వామిత్రునిచే, పూర్వం = బ్రహ్మప్రార్థనకంటె మునుపు సామి = సగపాలు, ఘటితా = నిర్మింపఁబడినదియు, ముక్తా = వెనుక విడువబడినదియు నగు. మందాకినీ ను = ఆకాశగంగ యేమో యను నట్లు, అనిలాందోలైః = గాలియొక్క కదలికలచే. దివి = ఆకసమందు. అఖేలత్ = ఎగిరినది.

ఇచ్చట ప్రాసాదదుకూలవల్లి యాకాశగంగయో యనునట్లు ఉత్ప్రేక్షింపఁబడినది. కాన నుత్ప్రేక్షాలంకారము.

సమాసములు :

అశ్రాంతశ్రుతిపాఠపూతరసనావిర్భూతభూరిస్తవాఽజిహ్మబ్రహ్మముఖౌఘవిఘ్నితనవస్వర్గక్రియాకేళినా:- అశ్రాంతం శ్రుతిపాఠః = అశ్రాంతశ్రుతిపాఠః, అశ్రాంతశ్రుతిపాఠేన పూతాః = అశ్రాంతశ్రుతిపాఠపూతాః, అశ్రాంతశ్రుతిపాఠపూతశ్చ తా రసనాశ్చ = అశ్రాంతశ్రుతిపాఠపూతరసనాః, అశ్రాంతశ్రుతిపాఠపూతరసనాభ్యః ఆవిర్భూతాః = అశ్రాంతశ్రుతిపాఠపూతరసనావిర్భూతాః, అశ్రాంతశ్రుతిపాఠపూతరసనావిర్భూతాశ్చ తే భూరిస్తవాశ్చ = అశ్రాంతశ్రుతిపాఠపూతరసనావిర్భూతభూరిస్తవాః. బ్రహ్మణః ముఖాని = బ్రహ్మముఖాని, బ్రహ్మముఖానామోఘాః. బ్రహ్మముఖౌఘాః, అశ్రాంతశ్రుతిపాఠపూతరసనావిర్భూతభూరిస్తవేషు అజిహ్మాః

= అక్రాంత శ్రుతిపాఠపూతరసనా విర్భూతభూరి స్తవాజిహ్మాః, అక్రాంత శ్రుతిపాఠపూతరసనావిర్భూతభూరి స్తవాజిహ్మాశ్చ తే బ్రహ్మముఖౌఘాశ్చ = అక్రాంత శ్రుతిపాఠపూతరసనావిర్భూతభూరి స్తవాజిహ్మబ్రహ్మముఖౌఘాః, అక్రాంత శ్రుతిపాఠపూతరసనావిర్భూతభూరి స్తవాఽజిహ్మబ్రహ్మముఖౌఘైః విఘ్నితా = అక్రాంత శ్రుతిపాఠపూతరసనావిర్భూతభూరి స్తవాఽజిహ్మబ్రహ్మముఖౌఘవిఘ్నితా, నవశ్చాసౌ స్వర్గశ్చ = నవస్వర్గః, నవస్వర్గస్య క్రియా = నవస్వర్గక్రియా, నవస్వర్గక్రియైవ కేళిః = నవస్వర్గక్రియాకేళిః, అక్రాంత శ్రుతిపాఠ పూతరసనావిర్భూతభూరి స్తవాఽజిహ్మ బ్రహ్మముఖౌఘవిఘ్నితా నవస్వర్గక్రియాకేళిః యస్య సః = అక్రాంత శ్రుతిపాఠపూతరసనావిర్భూతభూరి స్తవాఽజిహ్మ బ్రహ్మముఖౌఘవిఘ్నిత నవస్వర్గక్రియాకేళిః. తేన = అక్రాంత శ్రుతిపాఠపూతరసనావిర్భూత భూరి స్తవాఽజిహ్మబ్రహ్మముఖౌఘవిఘ్నితనవస్వర్గక్రియాకేళినా.

గాధిసుతేన:- గాధేః సుతః = గాధిసుతః, తేన = గాధిసుతేన.

యత్ప్రాసాదదుకూలవల్లిః:- యస్యాం ప్రాసాదాః = యత్ప్రాసాదాః, యత్ప్రాసాదేషు దుకూలం వల్లిరివ = యత్ప్రాసాదదుకూలవల్లిః.

అనిలాందోళైః: అనిలస్య ఆందోళాః = అనిలాందోళాః, తైః = అనిలాందోళైః.

భావము :

ఆ కుండిననగరమందలి మేడలపై పట్టువస్త్రపుపతాక, నూతనస్వర్గ సృష్టికిఁ బూనిన విశ్వామిత్రమహర్షిని నాయుద్యమమునుండి విరమింపఁజేయుటకు నిరంతరవేదపాఠముచే పవిత్ర మయిన నాలుకలుగల తన నలుమోములనుండి పెక్కుస్తోత్రములను బ్రహ్మ వెల్వరించెను. ఆ బ్రహ్మప్రార్థనవలన విశ్వామిత్ర మహర్షి నూతనస్వర్గసృష్టినుండి విరమించెను ఆయన నూతనసృష్టి కుపక్రమించి నపుడు సగపాలు నూతన మగు నాకాశగంగను సృజించి విడిచిపెట్టెను. ఆయాకాశ గంగ యేమైన నీభవనములపై దుకూలపతాకగా నిలిచియున్నదా యని యిఁట నుత్ప్రేక్షింపఁబడినది

శ్లో॥ యదతివిమలనీలవేశ్మరశ్మి
భ్రమరితభాశ్శుచిసౌధవప్రవల్లిః।
అలభత శమనస్వసుః శిశుత్వం
దివసకరాంకతలే చలా లుఠన్తీ॥ ౧౦౩

ప. వి. యదతివిమలనీలవేశ్మరశ్మిభ్రమరితభాః । శుచిసౌధవప్రవల్లిః । అలభత । శమనస్వసుః । శిశుత్వం । దివసకరాంకతలే । చలా । లుఠన్తీ.

టీక॥ యదతివిమలనీలవేశ్మరశ్మిభ్రమరితభాః; యత్ = ఏకుండినగరియొక్క, అతివిమల = మిక్కిలి నిర్మలము లైన, నీల = ఇంద్రనీలమణిమయము లగు, వేశ్మ = గృహములయొక్క, రశ్మి = కిరణములచే, భ్రమరిత = భ్రమరములతోఁ గూడినదిగాఁ జేయఁబడిన, భాః = కాంతి గల్గిన, శుచిసౌధవప్రవల్లిః; శుచి = స్వభావముతో దెల్ల నైన, సౌధ = మేడలపైని, వప్ర = వప్ర మనెడి, వల్లిః = పతాక, దివసకరాంకతలే; దివసకర = సూర్యునియొక్క, అంకతలే = సమీపమందును - ఒడియందును, చలా = కదలుచు, లుఠంతీ = పొరలుచున్న దైన. శమనస్వసుః = యముని చెల్లె లైన యమునయొక్క, శిశుత్వం = శైశవమును, అలభత = పొందినది.

ఇంద్రనీలమణిమయగృహములపైన నా యింద్రనీలమణికాంతులచే నీల మైన వప్రవల్లి యమునయొక్క శైశవమును వహించిన దని చెప్పుటవలన నిదర్శనాలంకారము. ఇంద్రనీలమణిమయగృహముల యొక్క నైల్య మాగృహములపైని వప్రముల కంటిన దని చెప్పుట వలనఁ దద్గుణాలంకారము. ఆ మేడలపైని వప్రమును పతాకవల్లిగా రూపించుటవలన రూపకాలంకారము. కావున పై నిదర్శనాలంకారము రూపకతద్గుణములతో సంకీర్ణ మైనందువలన నామూటికి నిఁట సంకరము.

సమాసములు ;

యదతివిమలనీలవేశ్మరశ్మిభ్రమరితభాః;- విమలాశ్చ తే నీలాశ్చ = విమలనీలాః, అత్యంతం విమలనీలాః = అతివిమలనీలాః, అతివిమలనీలమయాని చ తాని వేశ్మాని చ = అతివిమలనీలవేశ్మాని, యస్యామతివిమలనీలవేశ్మాని = యదతివిమలనీలవేశ్మాని, యదతివిమలనీలవేశ్మనాం

రశ్మయః = యదతివిమలనీలవేశ్మరశ్మయః, యదతివిమలనీలవేశ్మరశ్మిభిః భ్రమరితా = యదతివిమలనీలవేశ్మరశ్మిభ్రమరితా, యదతివిమలనీలవేశ్మ రశ్మిభ్రమరితా భాః యస్యాస్సా = యదతివిమలవేశ్మరశ్మిభ్రమరితభాః.

సౌధవస్త్రవల్లిః:- సౌధానాం వస్త్రం = సౌధవస్త్రం, సౌధవస్త్రమేవ వల్లిః = సౌధవస్త్రవల్లిః.

శమనస్వసుః:- శమనస్య స్వసా = శమనస్వసా, తస్యాః = శమనస్వసుః.

దివసకరాంకతలే:- దివసకరస్య అంకతలమ్ = దివసకరాంకతలమ్, తస్మిన్ = దివసకరాంకతలే.

**భావము :**

ఆ నగరమం దింద్రనీలమణిమయము లగు భవనములపైఁ గట్టిన తెల్లని వస్త్రపతాక లా యింద్రనీలమణికాంతుల నంటి తుమ్మెదలతోఁ గూడిన తీగవలెఁ గానవచ్చుచు, సూర్యుని స్పృశించు మేడలపై నుండుటవలన సూర్యుని యొడిలో నుండి పొరలుచున్న బాలయమునయొక్క శైశవమును దాల్చినవిగ నుండినవి. సూర్యుఁడు యమునకుఁ దండ్రి గానఁ దండ్రియొడియందు బిడ్డ యైన బాలయమున పొరలుచుండుట సహజము.

శ్లో॥ స్వప్రాణేశ్వరనర్మహర్మ్యకటకాతిథ్యగ్రహోయోత్సుకం
పాథోదం నిజకేళిసౌధశిఖరాదారుహ్య యత్కామినీ ।
సాక్షాదప్సరసో విమానకలితవ్యోమాన ఏవాఽభవ
ద్యన్న ప్రాప నిమేషమభ్రతరసా యాంతీ రసాదధ్వని॥ ౧౦౪

వ. వి. స్వప్రాణేశ్వరనర్మహర్మ్యకటకాతిథ్యగ్రహోయ । ఉత్సుకం । పాథోదం । నిజకేళిసౌధశిఖరాత్ । ఆరుహ్య । యత్కామినీ । సాక్షాత్ । అప్సరసః । విమానకలితవ్యోమానః । ఏవ । అభవత్ । యత్ । న । ప్రాప । నిమేషమ్ । అభ్రతరసా । యాంతీ । రసాత్ । అధ్వని ।

టీక॥ యత్కామినీ; యత్ = ఏకుండిననగరమందలి, కామినీ = కాంత, విమానకలితవ్యోమానః; విమాన = విమానముచే, కలిత = లంఘింపఁబడిన, వ్యోమానః = ఆకాశము గల్గిన, సాక్షాత్ = ప్రత్యక్ష మైన, అప్సరసః =

అచ్చరగనే. అభవత్ = అయెను, యత్ = ఏల యనగా, నిజకేళిసౌధ శిఖరాత్; నిజ = తన దైన, కేళిసౌధ = క్రీడాభవనముయొక్క, శిఖరాత్ = అగ్రభాగమునుండి, స్వప్రాణేశ్వరనర్మహర్మ్యకటకాతిథ్యగ్రహాయ; స్వప్రాణేశ్వర = తనప్రాణనాథునియొక్క, నర్మహర్మ్య = క్రీడాభవనముయొక్క, కటకాత్ = పైభాగమునుండి, ఆతిథ్య = అతిథిసత్కారమును, విశ్రాంతిని, గ్రహాయ = పుచ్చుకొనుటకై, ఉత్సుకం = ఉద్యమించి వెళ్లుచున్న, పాథోదం = మేఘమును, ఆరుహ్య = ఎక్కి, రసాత్ = రాగముతో, యాంతీ = వెళ్లుచున్నదై, అధ్వని = మార్గమందు, అభ్రతరసా = మేఘవేగముచే, నిమేషం = రెప్పపాటును, న ప్రాప = పొందలేదు.

ఇచ్చట నగరాంగనకును, అమరాంగనకును భేదమున్నను రెప్పపాటు లేనందువలనను, మేఘము నెక్కుటవలనను, గగనయానము చేసినందువలనను నభేదము చెప్పుటవలన నభేదాతిశయోక్త్యలంకారము.

సమాసములు :

స్వప్రాణేశ్వరనర్మహర్మ్యకటకాతిథ్యగ్రహాయ :- ప్రాణస్య ఈశ్వరః = ప్రాణేశ్వరః, స్వస్య ప్రాణేశ్వరః = స్వప్రాణేశ్వరః, నర్మణః హర్మ్యం = నర్మహర్మ్యం, స్వప్రాణేశ్వరస్య నర్మహర్మ్యం = స్వప్రాణేశ్వరనర్మహర్మ్యం, స్వప్రాణేశ్వరనర్మహర్మ్యస్య కటకః = స్వప్రాణేశ్వరనర్మహర్మ్యకటకః, స్వప్రాణేశ్వరనర్మహర్మ్యకటకాత్ ఆతిథ్యమ్ = స్వప్రాణేశ్వరనర్మహర్మ్యకటకాతిథ్యం, స్వప్రాణేశ్వరనర్మహర్మ్యకటకాతిథ్యస్య గ్రహః = స్వప్రాణేశ్వరనర్మహర్మ్యకటకాతిథ్యగ్రహః, తస్మై = స్వప్రాణేశ్వరనర్మహర్మ్యకటకాతిథ్యగ్రహాయ.

నిజకేళిసౌధశిఖరాత్ :- కేళేః సౌధః = కేళిసౌధః, నిజశ్చాసౌ కేళిసౌధశ్చ = నిజకేళిసౌధః, నిజకేళిసౌధస్య శిఖరం = నిజకేళిసౌధశిఖరమ్, తస్మాత్ = నిజకేళిసౌధశిఖరాత్.

యత్కామినీ :- యస్యాః కామినీ = యత్కామినీ.

విమానకలితవ్యోమానః :- విమానేన కలితమ్ = విమానకలితమ్, విమానకలితం వ్యోమ యాసాం తాః = విమానకలితవ్యోమానః.

అభ్రతరసా :- అభ్రస్య తరః = అభ్రతరః, తేన = అభ్రతరసా.

భావము :

ఆకుండిననగరమందలి కామిని తన ప్రాణనాథుని మేడపైన విశ్రాంతి పుచ్చుకొనుటకై తన విలాసభవనాగ్రమునుండి మేఘము నెక్కి వెళ్లుచు మేఘవేగమున ఱెప్పలను మూయలేదు. అందువలన నాకాంత సాక్షాత్తుగ నచ్చరయే యైనది ఏలయనగా నప్సరసలు దేవతాస్త్రీలు గాన వారు నిమేషరహితలు, అనగా ఱెప్పపాటు లేనివారు. ఈకుండిననగరకామినియు మేఘముపై ప్రాణనాథు నింటికి పోవుతఱి త్రోవలో మేఘముయొక్క వేగమువలన ఱెప్పలను మూయనందువలన నాయచ్చరతో సామ్యము వచ్చి యచ్చర యైనది. ఱెప్పపాటు లేకయుండుట, మేఘారోహణము, గగనయాన మను నీధర్మములవలన నామెకు సాక్షాదప్సరస్త్వము సిద్ధించినది.

శ్లో॥ వైదర్భీకేళిశైలే మరకతశిఖరాదుత్థితై రంశుదర్భైః
బ్రహ్మాండాఘాతభగ్నస్యదజమదతయా హ్రీధృతావాఙ్ముఖత్వైః।
కస్యా నోత్తానగాయా దివి సురసురభేరాస్యదేశం గతాగ్రై
ర్యద్గోగ్రాసప్రదానవ్రతసుకృతమవిశ్రాంతముజ్జృంభతే స్మ॥౧౦॥

వ. వి. వైదర్భీకేళిశైలే। మరకతశిఖరాత్। ఉత్థితైః। అంశుదర్భైః। బ్రహ్మాండాఘాతభగ్నస్యదజమదతయా। హ్రీధృతాఽవాఙ్ముఖత్వైః। కస్యాః। న। ఉత్తానగాయాః। దివి। సురసురభేః। ఆస్యదేశం। గతాగ్రైః। యద్గోగ్రాసప్రదానవ్రతసుకృతమ్। అవిశ్రాంతమ్। ఉజ్జృంభతే। స్మ।

టీక॥ వైదర్భీకేళిశైలే; వైదర్భీ = దమయంతియొక్క, కేళిశైలే = క్రీడాపర్వతమందు, మరకతశిఖరాత్, మరకత = మరకతమణిమయ మైన, శిఖరాత్ = శిఖరమునుండి, ఉత్థితైః = పైకి లేచినవియు, బ్రహ్మాండాఘాతభగ్నస్యదజమదతయా; బ్రహ్మాండ = బ్రహ్మాండముయొక్క, ఆఘాత = దెబ్బచే, భగ్న = భంగము నొందిన, స్యదజ = వేగమువలని మదతయా = గర్వము గల్గియుండుటచే, హ్రీధృతావాఙ్ముఖత్వైః; హ్రీ = సిగ్గుచే, ధృత = ధరింపఁబడిన, అవాఙ్ముఖత్వైః = అధోముఖత్వము గల్గినవియు, (అత ఏవ = ఇందువలననే), దివి = స్వర్గమందు, ఉత్తానగాయాః = వెల్లకిలఁబడి యూర్ధ్వముఖము గల్గిన, కస్యాః = ఒకనొక,

సురసురభేః = దేవతలగోవుయొక్క, ఆస్యదేశం = ముఖప్రదేశమును, గతాగ్రైః; గత = పొందిన, అగ్రైః = అగ్రభాగములు గలవియు నగు, అంశుదర్భైః = మరకతకిరణము లనెడి దర్భములచే, యద్గోగ్రాస ప్రదానవ్రతసుకృతమ్: యత్ = ఏనగరమందలి, గోగ్రాస = గోవుల కాహారముయొక్క, ప్రదానవ్రత = ఇచ్చుట యను వ్రతమువలని, సుకృతం = పుణ్యము, అవిశ్రాంతం = ఎల్లప్పుడు,నోజ్జృంభతే స్మ = వర్ధిల్లకపోయినది. తప్పక వర్ధిల్లినది.

ఇచ్చట నత్యుత్తమాలంకార మని కొందఱు చెప్పుదురు. మరకత కిరణము లను దర్భలకు బ్రహ్మాండాఘాతసంబంధము లేకపోయినను, ఆ సంబంధము జెప్పుటవలన నతిశయోక్త్యలంకారము.

సమాసములు :

వైదర్భీకేళిశైలే:- కేళేః శైలః = కేళిశైలః, వైదర్భ్యాః కేళిశైలః = వైదర్భీకేళిశైలః = తస్మిన్, వైదర్భీకేళిశైలే

మరకతశిఖరాత్:- మరకతమయం చ తత్ శిఖరం చ = మరకతశిఖరం, తస్మాత్ = మరకతశిఖరాత్.

అంశుదర్భైః:- అంశవ ఏవ దర్భాః = అంశుదర్భాః, తైః = అంశుదర్భైః.

బ్రహ్మాండాఘాతభగ్నస్యదజమదతయా:- బ్రహ్మాండస్య ఆఘాతః = బ్రహ్మాండాఘాతః, బ్రహ్మాండాఘాతేన భగ్నః = బ్రహ్మాండాఘాతభగ్నః, స్యదాత్ జాయత ఇతి = స్యదజః. స్యదజశ్చాసౌ మదశ్చ = స్యదజమదః, బ్రహ్మాండాఘాతభగ్నః స్యదజమదః యేషాం తే = బ్రహ్మాండాఘాత భగ్నస్యదజమదాః, బ్రహ్మాండాఘాతభగ్నస్యదజమదానాం భావః = బ్రహ్మాండాఘాతభగ్నస్యదజమదతా, తయా = బ్రహ్మాండాఘాతభగ్న స్యదజమదతయా.

హ్రీధృతాఽవాఙ్ముఖత్వైః:- అవాక్ ముఖం యేషాం తే = అవాఙ్ముఖాః, అవాఙ్ముఖానాం భావః = అవాఙ్ముఖత్వం, హ్రియా ధృతం = హ్రీధృతం, హ్రీధృతమ్ అవాఙ్ముఖత్వం యేషాం తే = హ్రీధృతాఽవాఙ్ముఖత్వాః, తైః = హ్రీధృతాఽవాఙ్ముఖత్వైః.

ఉత్తానగాయాః:- ఉత్తానం గచ్ఛతీతి = ఉత్తానగా, తస్యాః = ఉత్తానగాయాః.

సురసురభేః:- సురాణాం సురభిః = సురసురభిః, తస్యాః సురసురభేః.

ఆస్యదేశమ్:- ఆస్యస్య దేశః = ఆస్యదేశః తం = ఆస్యదేశమ్.

గతాగ్రైః:- గతాని అగ్రాణి యేషాం తే = గతాగ్రాః, తైః = గతాగ్రైః.
యద్గోగ్రాసప్రదానవ్రతసుకృతమ్:, గవే గ్రాసః = గోగ్రాసః గోగ్రాసస్య ప్రదానమ్ = గోగ్రాసప్రదానమ్, గోగ్రాసప్రదానమేవ వ్రతమ్ = గోగ్రాసప్రదానవ్రతం, గోగ్రాసప్రదానవ్రతస్య సుకృతమ్ = గోగ్రాసప్రదానవ్రతసుకృతమ్, యస్యాం గోగ్రాసప్రదానవ్రతసుకృతమ్, యద్గోగ్రాసప్రదానవ్రతసుకృతమ్.

భావము :

ఆ కుండినసగరమందు దమయంతీక్రీడాశైలముయొక్క మరకతమణిమయము లగు శిఖరములనుండి వెల్వడిన కిరణము లనెడు దర్భములు బ్రహ్మాండములకుఁ బోయి దానితో ఢీకొని దానిదెబ్బవలన తిరుగుముఖము పెట్టుకొని సిగ్గుచే తలలు వంచినవై తిరిగివచ్చుచు స్వర్గమున ఊర్ధ్వముఖములై సంచరించుచున్న దేవతాగోవునోటఁ బడుచున్నవి. ఇట్లు కిరణదర్భము లెల్లప్పుడును బైకి బ్రహ్మాండమువఱకు వ్యాపించి బ్రహ్మాండముతోటి యాఘాతముచే తిరిగి వచ్చుచు మార్గమధ్యమున స్వర్గమున ఉత్తానముఖములై తిరుగు దేవగోవులనోటఁ బడుట వాడుక యైపోయినందువలన బ్రతిదినమును కుండిననగరమందు గోగ్రాసప్రదానమనెడి వ్రతమువలని పుణ్యము వర్ధిల్లుచుండినది. దేవలోకములోని గోవులు ఉత్తానములై ఊర్ధ్వముఖములుగ నుండునని "ఉత్తానా వై దేవగవో వహంతి" యను శ్రుతి చెప్పుచున్నది.

శ్లో॥ విధుకరపరిరంభాదాత్తనిష్యందపూర్ణైః
శశిదృషదుపక్లప్తైరాలవాలైస్తరూణామ్।
విఫలితజలసేకప్రక్రియాగౌరవేణ
వ్యరచి స హృతచిత్తస్తత్ర భైమీవనేన॥ ౧౦౬

ప. వి విధుకరపరిరంభాత్ । ఆత్తనిష్యందపూర్ణైః । శశిదృషదుపక్లప్తైః । ఆలవాలైః । తరూణామ్ । విఫలితజలసేకప్రక్రియాగౌరవేణ । వ్యరచి । సః । హృతచిత్తః । తత్ర । భైమీవనేన.

టీక॥ తత్ర = ఆ కుండిననగరమందు, శశిదృషదుపక్లప్తైః; శశిదృషత్ = చంద్రకాంతమణులచే, ఉపక్లప్తైః = నిర్మింపఁబడినదియు, (అత ఏవ = ఇందువలననే) విధుకరపరిరంభాత్; విధుకర = చంద్రకిరణముల యొక్క, పరిరంభాత్ = సంపర్కమువలన, ఆత్తనిష్యందపూర్ణైః; ఆత్త = పొందఁబడిన, నిష్యంద = జలస్రావములచే, పూర్ణైః = నిండిన, తరూణాం = చెట్లయొక్క, ఆలవాలైః = పాదులచే, విఫలితజలసేకప్రక్రియాగౌరవేణ; విఫలిత = వ్యర్థము గావింపఁబడిన, జలసేకప్రక్రియా = జలసేచనప్రకారమందలి, గౌరవేణ = భారము గల్గిన, భైమీవనేన = దమయంతీవనముచే, సః = ఆ, హంసః = హంసము, హృతచిత్తః; హృత = హరింపఁబడిన, చిత్తః = మనస్సు గల్గినదిగ, వ్యరచి = చేయఁబడినది.

ఇచ్చట చెట్లపాదులకు చంద్రకాంతమణులనుండి జలస్రావసంబంధము లేకపోయినను, అది కలదని చెప్పుటవలన నతిశయోక్త్యలంకారము

సమాసములు:-

విధుకరపరిరంభాత్:- విధోః కరాః = విధుకరాః, విధుకరాణాం పరిరంభః విధుకరపరిరంభః, తస్మాత్ = విధుకరపరిరంభాత్.

ఆత్తనిష్యంద పూర్ణైః:- ఆత్తాశ్చ తే నిష్యందాశ్చ = ఆత్తనిష్యందాః, ఆత్తనిష్యందైః పూర్ణాః = ఆత్తనిష్యందపూర్ణాః, తైః = ఆత్తనిష్యందపూర్ణైః.

శశిదృషదుపక్లప్తైః:- శశినః దృషదః = శశిదృషదః, శశిదృషద్భిరుపక్లప్తాః = శశిదృషదుపక్లప్తాః, తైః = శశిదృషదుపక్లప్తైః.

విఫలితజలసేకప్రక్రియాగౌరవేణ:- జలస్య సేకః = జలసేకః, జలసేకస్య ప్రక్రియా = జలసేకప్రక్రియా, జలసేకప్రక్రియాయాం గౌరవం,

= జలసేకప్రక్రియాగౌరవమ్, విఫలితం జలసేకప్రక్రియాగౌరవం యస్మిన్ తత్ = విఫలితజలసేకప్రక్రియాగౌరవం, తేన = విఫలితజల సేకప్రక్రియాగౌరవేణ.

హృతచిత్తః:- హృతం చిత్తం యస్య సః = హృతచిత్తః.

భైమీవనేన:- భీమస్య అపత్యం స్త్రీ = భైమీ, భైమ్యాః వనమ్ = భైమీ వనం, తేన = భైమీవనేన.

భావము :

ఆ కుండిననగరమందు దమయంతీవనమందు హంస దిగిన దై చంద్ర కాంతమణులచేఁ గట్టఁబడిన చెట్లపాదులలో చంద్రకిరణసంబంధముచే స్రవించు జలములు నిండియుండుటవలన నా చెట్లకు నీళ్లుపోయుట వ్యర్థ మగుటచే నీళ్లు పోయు నవసరము లేకయే పెరుగుచున్న యా వనమును జూచి మిక్కిలి యాక ర్షింపఁబడిన దై యాశ్చర్యము నొందినది.

శ్లో॥ అథ కనకపతత్ర స్తత్ర తాం రాజపుత్రీం
సదసి సదృశభాసాం విస్ఫురంతీం సఖీనామ్।
ఉడుపరిషది మధ్యస్థాయిశీతాంశులేఖా
నుకరణపటులక్ష్మీమక్షిలక్షీచకార॥ ౧౦౭

ప. వి. అథ । కనకపతత్రః । తత్ర । తాం । రాజపుత్రీం । సదసి । సదృశ భాసాం । విస్ఫురంతీం । సఖీనామ్ । ఉడుపరిషది । మధ్యస్థాయిశీతాంశు లేఖానుకరణపటులక్ష్మీమ్ । అక్షిలక్ష్మీచకార.

టీక॥ అథ = వనదర్శనమునకు పిదప, కనకపతత్రః = స్వర్ణమయ మగు నా హంస, తత్ర = ఆ వనమందు, సదృశభాసాం; సదృశ = తనకు సమాన మైన, భాసాం = సౌందర్యములు గల, సఖీనాం = చెలికత్తెలయొక్క, సదసి = సభయందు, విస్ఫురంతీం = విశేషముగఁ బ్రకాశించుచున్నట్టి దియు, ఉడుపరిషది = నక్షత్రసంఘమునందు, మధ్యస్థాయిశీతాంశులేఖాను కరణపటులక్ష్మీం; మధ్యస్థాయి = నడుమ నున్నట్టి, శీతాంశు = చంద్రుని యొక్క, లేఖా = కళయొక్క. అనుకరణ = అనుకరణమందు, పటు = శక్తివంత మైన, లక్ష్మీం = శోభగల, తాం = ఆ, రాజపుత్రీం = భీమ

రాజపుత్రిక యైన దమయంతిని, అక్షిలక్షీచకార = కంటికిఁ గుఱిచేసి కొనెను. అనగా దర్శించెను.

మధ్యస్థాయిశీతాంశులేఖానుకరణపటులక్ష్మిగ దమయంతిని జెప్పుట వలన నుపమాలంకారము.

సమాసములు :

కనకపత్రః:- కనకమయాని పత్రాణి యస్య సః = కనకపత్రః.

రాజపుత్రీమ్:- రాజ్ఞః పుత్రీ = రాజపుత్రీ, తాం = రాజపుత్రీమ్.

సదృశభాసామ్:- సదృశీ భాః యాసాం తాః = సదృశభాసః, తాసాం = సదృశభాసామ్

ఉడుపరిషది:- ఉడూనాం పరిషత్ = ఉడుపరిషత్. తస్యామ్ = ఉడుపరిషది.

మధ్యస్థాయిశీతాంశులేఖానుకరణపటులక్ష్మీమ్:- మధ్యే తిష్ఠతీతి = మధ్యస్థాయినీ, శీతాంశోః లేఖా = శీతాంశులేఖా, మధ్యస్థాయినీ చాసౌ శీతాంశులేఖా చ = మధ్యస్థాయిశీతాంశులేఖా, మధ్యస్థాయిశీతాంశులేఖాయాః అనుకరణమ్ = మధ్యస్థాయిశీతాంశులేఖానుకరణమ్, మధ్యస్థాయిశీతాంశులేఖానుకరణే పట్వీ = మధ్యస్థాయిశీతాంశులేఖానుకరణ పట్వీ. మధ్యస్థాయిశీతాంశులేఖానుకరణపట్వీ లక్ష్మీః యస్యాః సా = మధ్యస్థాయిశీతాంశులేఖానుకరణపటులక్ష్మీః, తాం = మధ్యస్థాయిశీతాంశులేఖానుకరణపటులక్ష్మీమ్.

అక్షిలక్షీచకార:- అక్ష్ణోః లక్షీచకార = అక్షిలక్షీచకార.

భావము :

బంగారుఱెక్కలు గలహంస యావనమందు తనతో సాటియందము గల చెలికత్తెల నడుమఁ గూర్చొని నక్షత్రముల మధ్య చంద్రరేఖవలె శోభించుచున్న యా రాజకుమారి యైన దమయంతిని జూచినది.

శ్లో॥ భ్రమణరయవికీర్ణస్వర్ణభాసా ఖగేన
క్వచన పతనయోగ్యం దేశమన్విష్యతాఽధః।
ముఖవిధుమదసీయం సేవితుం లంబమానః
శశిపరిధిరివోచ్చైర్మండలస్తేన తేనే॥ ౧౦౫

ప. వి భ్రమణరయవికీర్ణస్వర్ణభాసా । ఖగేన । క్వ । చన । పతనయోగ్యం । దేశమ్ । అన్విష్యతా । అధః । ముఖవిధుమ్ । అదసీయం । సేవితుం । లంబమానః । శశిపరిధిః । ఇవ । ఉచ్చైః । మండలః । తేన । తేనే ।

టీక॥ అధః = భూమిపై, క్వచన = ఒకానొకచోట, పతనయోగ్యం = వాలుటకు తగిన, దేశం = స్థానమును, అన్విష్యతా = వెదకుచున్న (అత ఏవ = ఇందువలననే) భ్రమణరయవికీర్ణస్వర్ణభాసా; భ్రమణ = చుట్టుటవలని, రయ = వేగమువలన, వికీర్ణ = వ్యాపించిన, స్వర్ణభాసా = బంగారుకాంతి గల్గిన, ఖగేన = హంసచే, అదసీయం = ఆమెకు సంబంధించిన, ముఖవిధుం = ముఖచంద్రుని, సేవితుం = సేవించుటకు, లంబమానః = దిగువకు జారుచున్నదై, శశిపరిధిరివ = చంద్రపరివేషమువలె, ఉచ్చైః = పైన, మండలః = మండలము, తేన = ఆ హంసచే, తేనే = చేయఁబడినది.

ఆకాశమున హంస దిగునపుడు చేసిన వలయమును దమయంతీ ముఖసేవకై దిగు చంద్రపరివేషముగ వర్ణించుటవలన నుత్ప్రేక్షాలంకారము.

ఆకాశమునుండి హంస భూమిపై వ్రాలుటకు గావించిన భ్రమణములు హంసస్వభావమును దెలుపును గాన స్వభావోక్తి, ఈ యుత్ప్రేక్షా - స్వభావోక్తుల కిట సంకరము.

సమాసములు :

భ్రమణరయవికీర్ణస్వర్ణభాసా:- భ్రమణస్య రయః = భ్రమణరయః, స్వర్ణస్య భాః = స్వర్ణభాః, భ్రమణరయేన వికీర్ణా = భ్రమణరయవికీర్ణా, భ్రమణరయవికీర్ణా స్వర్ణభాః యస్య సః = భ్రమణరయవికీర్ణస్వర్ణభాః, తేన = భ్రమణరయవికీర్ణస్వర్ణభాసా.

పతనయోగ్యమ్:- పతనస్య యోగ్యః = పతనయోగ్యః. తం = పతనయోగ్యమ్.

ముఖవిధుం:- ముఖం విధురివ = ముఖవిధుః, తం = ముఖవిధుమ్.

అదసీయమ్:- అముష్యాః అయమ్ = అదసీయః, తం = అదసీయమ్.

శశిపరిధిః:- శశినః పరిధిః = శశిపరిధిః.

భావము :

ఈ హంస భూమిపై వ్రాలుటకుఁ దగిన ప్రదేశమును వెదకుచు నాకాశమున మండలాకారముగఁ దిరుగుచుండినది. అట్లు తిరుగుటవలని వేగముచేనా హంసయొక్క శరీరస్వర్ణకాంతి నలువైపుల వ్యాపించుచుండినది. అట్లు హంస యాకాశమున చేయు మండలాకారపు భ్రమణమువలన స్వర్ణకాంతి చుట్టును విరజిమ్ముటవలన నేర్పడిన పరిధి చంద్రపరివేషమువలెఁ గానవచ్చుచు, దమయంతీముఖసేవకై చంద్రపరివేషము భూమికిఁ దిగుచున్నదో యనునట్లు తోచుచుండినది.

శ్లో॥ అనుభవతి శచీత్థం సా ఘృతాచీముఖాభిః
న సహ సహచరీభిర్నందనానందముచ్చైః ।
ఇతి మతిరుదయాసీత్పక్షిణః ప్రేక్ష్య భైమీం
విపినభువి సఖీభిస్సార్ధమాబద్ధఖేలామ్॥ ౧౦౬

ప. వి. అనుభవతి । శచీ । ఇత్థం । ఘృతాచీముఖాభిః । న । సహ । సహచరీభిః । నందనానందమ్ । ఉచ్చైః । ఇతి । మతిః । ఉదయాసీత్ । పక్షిణః । ప్రేక్ష్య । భైమీమ్ । విపినభువి । సఖీభిః । సార్ధమ్ । ఆబద్ధఖేలామ్.

టీక॥ విపినభువి = వనభూమియందు. సఖీభిఃసార్ధం = చెలికత్తెలతోకూడ, ఆబద్ధఖేలామ్; ఆబద్ధ = అనుబద్ధమైన, ఖేలాం = క్రీడలు గల్గిన, భైమీం = దమయంతిని, ప్రేక్ష్య = చూచి, పక్షిణః = హంసకు, సా = ఆప్రసిద్ధమయిన, శచీ = శచీదేవి, ఘృతాచీముఖాభిః = ఘృతాచి మున్నగు నటువంటి, సహచరీభిస్సహ = చెలికత్తెలతోడ, ఇత్థం = ఈ విధముగా, ఉచ్చైః = ఉత్కృష్టమైన. నందనానందం = నందనవన సౌఖ్యమును, నానుభవతీతి = అనుభవించ దను, మతిః = బుద్ధి, ఉదయాసీత్ = ఉదయించినది.

సమాసములు :-

ఘృతాచీముఖాభిః:- ఘృతాచీ ముఖే యాసాం తాః = ఘృతాచీముఖాః, తాభిః = ఘృతాచీముఖాభిః.

సహచరీభిః:- సహ చరంతీతి = సహచర్యః, తాభిః = సహచరీభిః.

నందనానందమ్:- నందనస్య ఆనందః = నందనానందః, తం = నందనానందమ్

విపినభువి:- విపినస్య భూః = విపినభూః, తస్యాం = విపినభువి.

ఆబద్ధఖేలామ్:- ఆబద్ధః ఖేలః యయా సా = ఆబద్ధఖేలా, తామ్ = ఆబద్ధఖేలామ్.

భావము :

వనభూమియందుఁ జెలికత్తెలతోఁ గలసి యాట లాడుకొనుచున్న దమయంతిని జూచి, ఇంద్రుని భార్య యగు శచీదేవి, ఘృతాచి మున్నగు చెలికత్తెలతో నందనవనమునం దింతటిసుఖము ననుభవించుట లే దనెడి తలంపు హంసకు గల్గినది.

శ్లో॥ శ్రీహర్షం కవిరాజరాజిమకుటాలంకారహీరస్సుతం
శ్రీహీరస్సుషువే జితేంద్రియచయం మామల్లదేవీ చ యమ్।
ద్వైతీయీకతయా మితోఽయమగమత్ తస్య ప్రబంధే మహా
కావ్యే చారుణి నైషధీయచరితే సర్గో నిసర్గోజ్జ్వలః॥ ౧౧౦

ప. వి శ్రీహర్షం । కవిరాజరాజిమకుటాలంకారహీరః । సుతం । శ్రీహీరః । సుషువే । జితేంద్రియచయమ్ । మామల్లదేవీ । చ । యమ్ । ద్వైతీయీకతయా । మితః । అయమ్ । అగమత్ । తస్య । ప్రబంధే । మహాకావ్యే । చారుణి । నైషధీయచరితే । సర్గః । నిసర్గోజ్జ్వలః.

టీక॥ కవిరాజరాజిమకుటాలంకారహీరః; కవిరాజ = కవిశ్రేష్ఠులయొక్క, రాజి = పంక్తికి, మకుట = కిరీటములలో, అలంకార = భూషణమైన, హీరః = వజ్రమణి యగు, శ్రీహీరః = శ్రీహీరుఁడు, జితేంద్రియచయం; జిత = జయింపఁబడిన, ఇంద్రియచయం = ఇంద్రియవర్గము

గల్గిన, యం = ఏ శ్రీహర్షుని. సుషువే = పుట్టించెనో. మామల్లదేవీ చ = మామల్లదేవియు, యం = ఎవనిని, సుషువే = కనెనో, తస్య = అతనియొక్క. ప్రబంధే = ప్రబంధ మయిన, చారుణి = అంద మైన, నైషధీయచరితే = నైషధీయచరిత్ర మను, మహాకావ్యే = మహాకావ్య మందు, ద్వైతీయీకతయా = రెండవదిగ, మితః = గణింపఁబడిన, నిసర్గోజ్జ్వలః: నిసర్గ = స్వభావముతోడనే, ఉజ్జ్వలః = ప్రకాశవంత మైన, అయం = ఈ, సర్గః = సర్గ, అగాత్ = కడచినది.

సమాసములు :

ద్వైతీయీకతయా:- ద్వితీయ ఏవ = ద్వైతీయీకః, ద్వైతీయీకస్య భావః = ద్వైతీయీకతా, తయా = ద్వైతీయీకతయా.

ఇట్లు

శ్రీమదాపస్తంబసూత్రాత్రేగోత్ర ఉడాలి నృసింహశాస్త్రి

తనూజ ఉడాలి సుబ్బరామశాస్త్రి విరచిత

నైషధీయచరితాంధ్రవ్యాఖ్యానమునందు

ద్వితీయసర్గ సమాప్తము.

# శ్రీహర్షనైషధము

## తృతీయసర్గ

శ్లో॥ ఆకుంచితాభ్యామథ పక్షతిభ్యాం
నభోవిభాగాత్తరసావతీర్య।
నివేశదేశాతతధూతపక్షః
పపాత భూమావుపభైమి హంసః॥ ౧

వ. వి. ఆకుంచితాభ్యామ్ । అథ । పక్షతిభ్యాం । నభోవిభాగాత్ । తరసా । అవతీర్య । నివేశదేశాతతధూతపక్షః । పపాత । భూమౌ । ఉపభైమి । హంసః ।

టీక॥ అథ = ఆహంస యాకాశమందు చుట్లు తిరిగినపిదప, ఆకుంచితాభ్యాం = ముడుచుకొనఁబడిన, పక్షతిభ్యాం = అెక్కలమొదళ్ళచే, నభోవిభాగాత్ = ఆకాశదేశమునుండి, తరసా = వేగముతో, అవతీర్య = దిగి, నివేశదేశాతతధూతపక్షః: నివేశదేశ = దిగెడిప్రదేశమున, ఆతత = పఱువఁబడిన. ధూత = విదలించుకొనఁబడిన, పక్షః = అెక్కలుగలదై, ఉపభైమి = దమయంతియెదుట, భూమౌ = భూమియందు, పపాత = వాలినది.

ఇచ్చట నాకాశమునుండి భూమికి దిగునపుడు అెక్కలు ముడుచుకొనుట మున్నగు హంసలస్వభావము వర్ణింపఁబడినది. కాన స్వభావోక్త్యలంకారము.

సమాసములు :

నభోవిభాగాత్:- నభసః విభాగః నభోవిభాగః, తస్మాత్ = నభోవిభాగాత్.
నివేశదేశాతతధూతపక్షః:- నివేశస్య దేశః = నివేశదేశః, నివేశదేశే ఆతతౌ = నివేశదేశాతతౌ, నివేశదేశాతతౌ చ తౌ ధూతౌ చ = నివేశ

దేశాతతధూతౌ, నివేశదేశాతతధూతౌ పక్షౌ యస్య సః = నివేశదేశాతత ధూతపక్షః॥

ఉపభైమి:- భైమ్యాః సమీపే = ఉపభైమి.

భావము:-

ఆకాశమందుండి చుట్లు తిరిగినపిదప నాహంస తనఱెక్కల మొదళ్ళను ముడుచుకొని యాకసమునుండి వెంటనే దిగి, దిగినచోట తనఱెక్కలను తెఱచుకొని విదలించుకొని దమయంతి యెదుట వాలినది.

శ్లో॥ ఆకస్మికః పక్షపుటాహతాయాః
క్షితే స్తదా యః స్వన ఉచ్చచార।
ద్రాగన్యవిన్యస్తదృశః స తస్యాః
సంభ్రాంతమంతఃకరణం చకార॥ ౨

ప. వి. ఆకస్మికః । పక్షపుటాహతాయాః । క్షితేః । తదా । యః। స్వనః।ఉచ్చచార। ద్రాక్ । అన్యవిన్యస్తదృశః । సః । తస్యాః । సంభ్రాంతమ్ । అంతః కరణం । చకార.

టీక॥ తదా = ఆపక్షి భూమియందు వాలినపుడు, పక్షపుటాహతాయాః; పక్షపుట = ఱెక్కలజంటచే, ఆహతాయాః = కొట్టఁబడిన, క్షితేః = భూమినుండి. ఆకస్మికః = అకారణముగ, యః = ఏ, స్వనః = శబ్దము, ఉచ్చచార = ఉద్భవించినదో, సః = ఆశబ్దము, అన్యవిన్యస్తదృశః, అన్య = ఇతర విషయములయందు, విన్యస్త = ఉంచబడిన, దృశః = దృష్టి గల్గిన, తస్యాః = ఆదమయంతియొక్క, అంతఃకరణం = చిత్తమును, ద్రాక్ = వెంటనే, సంభ్రాంతమ్ = తత్తరపాటుతోఁ గూడినదిగ, చకార = చేసినది.

పక్షపుటములతో భూమిని హంస కొట్టుట దానిస్వభావము. కాన నిట స్వభావోక్త్యలంకారము.

సమాసములు :-

ఆకస్మికః:- అకస్మాత్ భవతీతి = ఆకస్మికః.

పక్షపుటాహతాయాః:- పక్షయోః పుటః — పక్షపుటః, పక్షపుటేన ఆహతా = పక్షపుటాహతా, తస్యాః = పక్షపుటాహతాయాః.

అన్యవిన్యస్తదృశః:- అన్యస్మిన్ విన్యస్తే = అన్యవిన్యస్తే, అన్యవిన్యస్తే దృశౌ యస్యాస్సా = అన్యవిన్యస్తదృక్, తస్యాః = అన్యవిన్యస్తదృశః.

భావము :

ఆహంస భూమికి దిగినవెంటనే తనఱెక్కలతో భూమిని కొట్టుటవలన నుద్భవించిన యాకస్మికధ్వని విషయాంతరమందు లగ్నమగు దృష్టిగల యాదమయంతిచిత్తమును సంభ్రమింపఁజేసినది.

శ్లో॥ నేత్రాణి వైదర్భసుతాసఖీనాం
విముక్తతత్తద్విషయగ్రహాణి।
ప్రాపుస్తమేకం నిరుపాఖ్యరూపం
బ్రహ్మేవ చేతాంసి యతవ్రతానామ్॥ 3

ప వి. నేత్రాణి । వైదర్భసుతాసఖీనాం । విముక్తతత్తద్విషయగ్రహాణి। ప్రాపుః। తమ్ । ఏకం । నిరుపాఖ్యరూపం । బ్రహ్మ । ఇవ । చేతాంసి । యతవ్రతానామ్

టీక॥ వైదర్భసుతాసఖీనామ్; వైదర్భసుతా = దమయంతియొక్క, సఖీనాం = చెలికత్తెలయొక్క, నేత్రాణి = కన్నులు, విముక్తతత్తద్విషయగ్రహాణి; విముక్త = విడువఁబడిన, తత్తద్విషయ = ఆయావిషయములయొక్క, గ్రహాణి = జ్ఞానములుగలవై, (విముక్త = విడువఁబడిన, తత్తద్విషయ = రూపరసాదివిషయములయొక్క, గ్రహాణి = సంసర్గములు గలవై,) ఏకం = ఒక్కటియైన, (రెండవది లేని,) నిరుపాఖ్యరూపం = నిరుపాఖ్య = నిర్వచింప శక్యము కాని, రూపం = ఆకారము గల్గిన, (స్వరూపము గల్గిన,) తం = ఆముంగిట నున్నహంసను, ("తత్త్వమసి" యను

నెడ తత్పదార్థ మైనదానిని.) యతవ్రతానాం = యోగులయొక్క, చేతాంసి = మనస్సులు, బ్రహ్మేవ = పరమాత్మను వలె, ప్రాపుః = పొందినవి.

ఇచ్చట హంసను పరమాత్మతోడను, సఖుల యింద్రియములను యోగిహృదయములతోడను బాహ్యవిషయములను రూపాదివిషయముల తోడను బోల్చుటవలన నుపమాలంకారము. అది శ్లేషానుప్రాణితము.

సమాసములు:

వైదర్భసుతాసఖీనామ్;విదర్భాణాం రాజా = వైదర్భః, వైదర్భస్య సుతా = వైదర్భసుతా, వైదర్భసుతాయాఃసఖ్యః = వైదర్భసుతాసఖ్యః, తాసాం = వైదర్భసుతాసఖీనామ్.

విముక్తతద్విషయగ్రహాణి:- తే చ తే చ విషయాః = తత్తద్విషయాః, తత్తద్విషయాణాం గ్రహాః = తత్తద్విషయగ్రహాః, విముక్తాః తత్త ద్విషయగ్రహాః యైస్తాని = విముక్తతత్తద్విషయగ్రహాణి.

నిరుపాఖ్యరూపమ్:- నిర్గతా ఉపాఖ్యా యస్య తత్ = నిరుపాఖ్యమ్, నిరుపాఖ్యం రూపం యస్య సః = నిరుపాఖ్యరూపః, తమ్ = నిరుపాఖ్య రూపమ్; నిరుపాఖ్యం రూపం యస్య తత్ = నిరుపాఖ్యరూపమ్, తత్ = నిరుపాఖ్యరూపమ్.

యతవ్రతానామ్:- యతం వ్రతం యేషాం తే = యతవ్రతాః, తేషాం = యతవ్రతానామ్.

భావము :

ఆహంస భూమిపై వ్రాలినపుడు దమయంతిచెలికత్తెల దృష్టులు ఇతర విషయములయందు లగ్నములై యుండినవి. ఆదృష్టులు హంస వ్రాలినపు డుద్భవించిన చప్పుడుచే నావిషయములను వీడినవై విషయసంగములను బరిత్యజించిన యోగుల చిత్తము లనిర్వచనీయ మైన స్వరూపము గల బ్రహ్మను బొందినట్లు నిర్వచింప శక్యము గాని యాకారము గల హంసను బొందినవి. అనగా చెలులు తమదృష్టులను విషయాంతరములనుండి మరల్చి హంసాభిముఖములుగ గావించి రని భావము.

శ్లో॥ హంసం తనౌ సన్నిహితం చరంతం
మునేర్మనోవృత్తిరివ స్వికాయామ్।
గ్రహీతుకామాదరిణా శయేన
యత్నాదసౌ నిశ్చలతాం జగాహే॥ ౪

ప వి. హంసం । తనౌ । సన్నిహితం । చరంతం । మునేః । మనోవృత్తిః । ఇవ । స్వికాయామ్ । గ్రహీతుకామా । అదరిణా । (ఆదరిణా) । శయేన । (ఆశయేన) । యత్నాత్ । అసౌ । నిశ్చలతాం । జగాహే ।

టీక॥ అసౌ = ఈ దమయంతి, మునేః = మునియొక్క, మనోవృత్తిరివ = చిత్తవృత్తివలె, స్వికాయాం = తన దైన, తనౌ = శరీరసమీపమందు [శరీరములోపల] సన్నిహితమ్ = ఉన్నదియు, (ఆవిర్భవించినదియు అనగా ప్రత్యక్ష మైనదియు) చరంతం = తిరుగుచున్నదియు. లేదా దేని నైనను భక్షించుచున్నదియు. (ఉనికి గలదియు) నగు, హంసం = హంసను, (పరమాత్మను) అదరిణా = భయము లేని, శయేన = హస్తముచే, (ఆదరిణా = సాదరమైన, ఆశయేన = చిత్తముచే, గ్రహీతుకామా = పట్టఁగోరిక గలదై, [ప్రత్యక్షముఁ జేసికొన గోరినదై,) యత్నాత్ = ప్రయత్నమువలన, నిశ్చలతాం = నిశ్చలము లైన యంగములను గల్గియుండుటను, జగాహే = పొందినది.

ఇచ్చట దమయంతి మునిమనోవృత్తితోఁ బోల్చఁబడుటవలన నుపమాలంకారము. అది శ్లిష్టపదముల నుపజీవించినది. కాన శ్లేషానుప్రాణితము

సమాసములు:

గ్రహీతుకామా:- గ్రహీతుం కామః యస్యాస్సా = గ్రహీతుకామా.
అదరిణా:- దరః అస్య అస్తీతి = దరీ, న దరీ = అదరీ, తేన = అదరిణా,
ఆదరిణా:- ఆదరః అస్య అస్తీతి = ఆదరీ, తేన = ఆదరిణా.

భావము :

ఇచ్చట దమయంతి హంసను పట్టువిధము యోగిచిత్తవృత్తి పరమాత్మను సాక్షాత్కరించుటతోఁ బోల్చఁబడినది. ఆ దమయంతి తన శరీరముకడనుండి

యిటు నటు దిరుగుచు, భూమిపై పడియున్న ధాన్యకణాదులను భక్షించుచు నున్న యాహంసను నిర్భయ మైన తనహస్తముతోఁ బట్టఁగోరిక గలదై, యోగిచిత్తవృత్తి తనశరీరమందు నెలకొనిన పరమాత్మను సాదర మగు నభిప్రాయముతో దర్శింపఁ గోరినవిధముగ ప్రయత్నముతో నిశ్చలాంగి యైనది. యోగిమనోవృత్తియు పరమాత్మదర్శనమునకై నిశ్చల మగుచున్నది. నిశ్చల మగు మనోవృత్తి యున్నప్పుడే పరమాత్మదర్శనము గలుగును. శరీరాంగములను నిశ్చలములుగఁ జేసికొనిననే హంసను బట్టుకొనుటకు వలనుపడును.

శ్లో॥ తామింగితైరప్యనుమాయ మాయా
మయం న ధైర్యాద్వియదుత్పపాత।
తత్పాణిమాత్మోపరిపాతుకం తు
మోఘం వితేనే ప్లుతిలాఘవేన॥

ప వి. తామ్ । ఇంగితైః । అపి । అనుమాయ । మాయామ్ । అయం । న । ధైర్యాత్ । వియత్ । ఉత్పపాత । తత్పాణిమ్ । ఆత్మోపరిపాతుకం । తు । మోఘం । వితేనే । ప్లుతిలాఘవేన.

టీక॥ అయం = ఈ హంస, తాం = ఆ దమయంతి తన్ను పట్టుకొనుటకై కావించిన, మాయాం = కపటమును, ఇంగితైః = చేష్టలచే, అనుమాయాపి = ఊహించియు, ధైర్యాత్ = ధైర్యమును బొంది, వియత్ = ఆకాశమును గూర్చి, న ఉత్పపాత = ఎగురలేదు. ఆత్మోపరిపాతుకం; ఆత్మోపరి = తనపై, పాతుకం = పడనున్న, తత్పాణిం తు = ఆ దమయంతీహస్తమునో; ప్లుతిలాఘవేన; ప్లుతి = గంతులువేయుటలోని లాఘవేన = నేర్పుచే, మోఘం = వ్యర్థముగ, వితేనే = చేసెను.

సమాసములు :

తత్పాణిమ్:- తస్యాః పాణిః = తత్పాణిః, తమ్ = తత్పాణిమ్.

ఆత్మోపరిపాతుకమ్:- ఆత్మనః ఉపరి = ఆత్మోపరి, పతతీతి = పాతుకః, ఆత్మోపరి పాతుకః = ఆత్మోపరిపాతుకః, తమ్ = ఆత్మోపరిపాతుకమ్.

ప్లుతిలాఘవేన:- లఘోర్భావః = లాఘవమ్, ప్లుత్యాం లాఘవమ్ = ప్లుతిలాఘవమ్, తేన = ప్లుతిలాఘవేన.

భావము :

ఆ దమయంతి హంసను పట్టుకొనుటకై పన్నిన మాయను ఆమె యింగితములచే నాహంస గ్రహించియు ధైర్యముఁ బూని యాస్థలము వదలి యెగిరిపోలేదు ఆ దమయంతి తన్ను బట్టుటకై తనపైఁ జాచిన చేతిని గంతులు వేయుటలోని తన నేర్పుతో వ్యర్థము గావించిన దై యామెచేతికి దొఱకక తప్పించుకొనినది.

శ్లో॥ వ్యర్థీకృతం పత్రరథేన తేన
తథాఽవసాయ వ్యవసాయమస్యాః।
పరస్పరామర్పితహస్తతాళం
తత్కాలమాలీభిరహస్యతాలమ్॥ ౭

ప. వి. వ్యర్థీకృతం। పత్రరథేన। తేన। తథా। అవసాయ। వ్యవసాయమ్। అస్యాః। పరస్పరామ్। అర్పితహస్తతాళమ్। తత్కాలమ్। ఆలీభిః = అహస్యత। అలమ్.

టీక॥ అస్యాః = ఈదమయంతియొక్క, వ్యవసాయం = హంసను పట్టఁగోరిన ప్రయత్నమును, తేన = ఆ, పత్రరథేన = హంసచే, తథా = ఆ ప్రకారము, వ్యర్థీకృతమ్ = విఫలము గావింపఁబడినదానినిగ, అవసాయ = నిశ్చయించుకొని, తత్కాలమ్ = ఆకాలమున, పరస్పరాం = ఒండొరులయందు, అర్పితహస్తతాళమ్; అర్పిత = ఉంచబడిన, హస్తతాళమ్ = చేతుల చప్పట్లు గలుగునట్లుగా, ఆలీభిః = చెలికత్తెలచే, అలం = మిక్కిలి, అహస్యత = నవ్వుట (జరిగినది).

సమాసములు :

వ్యర్థీకృతమ్:- అవ్యర్థః వ్యర్థః సంపద్యమానః కృతః = వ్యర్థీకృతః, తం = వ్యర్థీకృతమ్.

అర్పితహ స్తతాళమ్:- హ స్తయోః తాళః = హ స్తతాళః. అర్పితః హ స్త తాళః యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = అర్పితహ స్తతాళమ్.
తత్కాలమ్:- స చాసౌ కాలశ్చ = తత్కాలః, తమ్ = తత్కాలమ్.
యద్వా-స ఏవ కాలః యస్య = తత్కాలమ్.

భావము :

హంసను పట్ట నెంచిన దమయంతియొక్క ప్రయత్నము వ్యర్థ మయిన దని తెలిసికొని యా సమయమునం దామె చెలిక త్తెలు చేతులఁ జప్పట్లు కొట్టుచు మిక్కిలి పరిహసించిరి.

శ్లో॥ ఉచ్చాటనీయః కరతాళికానాం
దానాదిదానీం భవతీభిరేషః।
యాఽన్వేతి మాం ద్రుహ్యతి మహ్యమేవ
సాఽత్రేత్యుపాలంభి తయాఽఽళివర్గః॥ ౭

ప. వి. ఉచ్చాటనీయః । కరతాళికానాం । దానాత్ । ఇదానీం । భవతీభిః । ఏషః । యా । అన్వేతి । మాం । ద్రుహ్యతి । మహ్యమ్ । ఏవ । సా । అత్ర । ఇతి । ఉపాలంభి । తయా । ఆళివర్గః.

టీక॥ (హే సఖ్యః = ఓ చెలిక త్తెలారా!) భవతీభిః = మీచే, ఏషః = ఈహంస, కరతాళికానాం = చేతులచప్పట్లయొక్క, దానాత్ = దానమువలన, ఉచ్చాటనీయః కిమ్ = తఱుమవలసినదియా యేమి? అత్ర = ఈ చెలిక త్తెల మధ్య, యా = ఎవ్వతె, మాం = నన్ను, అన్వేతి = అనుసరించుచున్నదో, సా = ఆమె, మహ్యమేవ = నాకై, ద్రుహ్యతి = ద్రోహముఁ జేయుచున్నది, ఇతి = ఇట్లు, తయా = ఆ దమయంతిచే, ఆళివర్గః = చెలులసంఘము, ఉపాలంభి = నిందింపఁబడినది.

సమాసములు :

కరతాళికానామ్ :- కరైె స్తాళికాః = కరతాళికాః, తసాం = కరతాళికానామ్
ఆళివర్గః :- ఆళీనాం వర్గః = ఆళివర్గః.

భావము :

"(ఓచెలులారా) మీరు చేతులు తట్టి యీహంసను తఱుమవలసి యున్నదా! ఈచెలికత్తెలలో నెవ్వతె నాకనుకూల మైనదో ఆపెయే నాకు ద్రోహము చేయుచున్నది" యని దమయంతి తనచెలికత్తెలను నిందించిన దై వారిని తనతో రానీయక వారించినది.

శ్లో॥ ధృతాల్పకోపా హసితే సఖీనాం
ఛాయేవ భాస్వంతమభిప్రయాతుః ।
శ్యామాఽథ హంసస్య కరానవాప్తే
ర్మందాక్షలక్ష్యా లగతి స్మ పశ్చాత్॥

ప. వి: ధృతాల్పకోపా । హసితే । సఖీనాం । ఛాయా । ఇవ । భాస్వంతమ్ । అభిప్రయాతుః । శ్యామా । అథ । హంసస్య । కరానవాప్తేః । మందాక్షలక్ష్యా । లగతి । స్మ । పశ్చాత్ ।

టీక॥ అథ = తర్వాత, సఖీనాం = చెలికత్తెలయొక్క, హసితే = నవ్వునందు. ధృతాల్పకోపా, ధృత = ధరింపఁబడిన, అల్పకోపా = కొద్ది కోపము గల దై, భాస్వంతం = సూర్యుని గూర్చి, అభిప్రయాతుః = ఎదుట బోవుచున్న వానియొక్క, ఛాయేవ = నీడవలె, శ్యామా = నడిజవ్వనమునం దున్నదై (నల్లని దై). హంసస్య = హంసయొక్క, కరానవాప్తేః = హస్తప్రాప్తి లేనందువలన, మందాక్షలక్ష్యా; మందాక్ష = సిగ్గుచే, లక్ష్యా ఉపలక్షింపఁదగిన దై, అనగా సిగ్గునొందిన దై; హంసస్య = సూర్యుని యొక్క, కరానవాప్తేః = కిరణస్పర్శము లేనందువలన, మందాక్షలక్ష్యా; మందాక్ష = దుర్బల దృష్టులచే, లక్ష్యా = (గ్రహింప సాధ్య మైన దై,) పశ్చాత్ = వెనుక, లగతి స్మ = (పట్టగల ననెడి యాశచే), వెళ్లు చుండినది.

ఇచ్చట దమయంతి సూర్యాభిముఖముగ నడచువానియొక్క నీడతో శ్లిష్టశబ్దసామ్యముచేఁ బోల్చబడినది. కాన శ్లేషోత్థాపిత మగు నుపమాలంకారము.

సమాసములు :

ధృతాల్పకోపా:- అల్పశ్చాసౌ కోపశ్చ = అల్పకోపః, ధృతః అల్పకోపః యయా సా = ధృతాల్పకోపా.

కరానవాప్తేః :- న అవాప్తిః = అనవాప్తిః, కరభ్యామనవాప్తిః = కరానవాప్తిః, తస్యాః = కరానవాప్తేః: న అవాప్తిః = అనవాప్తిః, కరాణమనవాప్తిః = కరానవాప్తిః, తస్యాః = కరానవాప్తేః.

మందాక్షలక్ష్యా :- లక్షితుం యోగ్యా = లక్ష్యా, మందాక్షేన లక్ష్యా = మందాక్షలక్ష్యా; లక్షితుం యోగ్యా = లక్ష్యా, మందాక్షైః లక్ష్యా = మందాక్షలక్ష్యా.

భావము :

ఆదమయంతి చెలికత్తెల నవ్వుపైనఁ గొలదియలుక వహించినదై సూర్యుని కెదురేగువాని నీడవలె శ్యామయై (నడిజవ్వనమునందున్నదై) నల్లనిదై హంస చేతికి దొఱకనందున సిగ్గు జెందినదై (సూర్యకిరణములు సోకనందువలన మందమైన దృష్టికే గోచరము కాగల్గినదై) దాని వెనుక వెళ్లుచుండినది,

శ్లో॥ శస్తా న హంసాభిముఖీ తవేయం
యాత్రేతి తాభిశ్ఛలహాస్యమానా ।
సాఽఽహ స్మ నైవాఽశకునీ భవేన్మే
భావిప్రియావేదక ఏష హంసః॥

ప. వి, శస్తా । న । హంసాభిముఖీ । తవ । ఇయం। యాత్రా । ఇతి । తాభిః । ఛలహాస్యమానా । సా । ఆహ । స్మ । న । ఏవ । అశకునీభవేత్ । మే । భావిప్రియావేదకః। ఏషః । హంసః.

టీక॥ తవ = నీయొక్క, ఇయం = ఈః, హంసాభిముఖీ = హంసకునెదురైన, (సూర్యునకు నెదురైన) యాత్రా = ప్రయాణము, న శస్తా = మంచిది కాదు; ఇతి = ఇట్లు, తాభిః = ఆచెలికత్తెలచే, ఛలహాస్యమానా; ఛల = వ్యాజవచనముచే, హాస్యమానా = పరిహసింపఁబడుచున్నదై, భావిప్రియావేదకః; భావి = జరుగఁబోవు, ప్రియ = శుభములను, ఆవేదకః

= తెలుపునట్టి, ఏషః = ఈ. హంసః = హంస, మే = నాకు, నాఽ శకునీ భవేదేవ = అపశకునము కానేరదు, మఱే మనగా–శకునమే కాగలదు. అనగా పక్షియే కాగలదు కాని సూర్యు(డు కాజాలదు ఇతి = అని, ఆహ స్మ = చెప్పుచుండినది.

ఇచ్చట హంసశబ్దముచే హంసను సూర్యుని శ్లేషభంగితో బోధించుట వలన నిట సూర్యపర మగు నర్థము వ్యంగ్యము.

సమాసములు :

హంసాభిముఖీ - హంసస్య అభిముఖీ = హంసాభిముఖీ.
ఛలహాస్యమానా :– ఛలేన హాస్యమానా = ఛలహాస్యమానా.
అశకునీభవేత్ :– అనశకునః అశకునః సంపద్యమానః భవేత్ = అశకునీభవేత్.

భావిప్రియావేదకః– భావి చ తత్ ప్రియం చ = భావిప్రియం, భావిప్రియస్య ఆవేదకః = భావిప్రియావేదకః.

భావము :

ఓదమయంతీ "హంసాభిముఖముగ (సూర్యాభిముఖముగ) నీవు చేయునట్టి ప్రయాణము శ్రేష్ఠ మైనది కాదు. హంసాభిముఖ మగు, (సూర్యాభిముఖ మగు) ప్రయాణమువలన శ్రమసంతాపములు గల్గును.మఱియు నా ప్రయాణము శాస్త్రనిషిద్ధము". అని చెలికత్తెలు వ్యాజోక్తిచే నామెను పరిహసించుచుండిరి. అప్పుడామె "ఈహంస (సూర్యు(డు గాదు) నాకు జరుగనున్న శుభములను సూచించునట్టి భద్రపక్షి కావున నిది అపశకునమే కానేరదు. మఱే మనగా శకునమే (పక్షియే) అగును కాని సూర్యుడు కాదు. సూర్యాభిముఖ మగు యాత్రయే ధర్మశాస్త్రనిషిద్ధము కాని హంసపక్ష్యభిముఖ మగు యాత్ర ధర్మశాస్త్రనిషిద్ధము కాదని చెప్పుచుండినది.

శ్లో॥ హంసోఽప్యసౌ హంసగతేః సుదత్యాః
పురః పురశ్చారు చలన్ బభాసే ।
వైలక్ష్యహేతోర్గతిమేతదీయా
మగ్రేఽనుకృత్యోపహసన్నివోచ్చైః॥ ౧౦

వ, వి. హంసః । అపి । అసౌ । హంసగతేః । సుదత్యాః । పురః। పురః । చారు । చలన్ । బభాసే । వైలక్ష్యహేతోః । గతిమ్ । ఏతదీయామ్। అగ్రే । అను కృత్య । ఉపహసన్ । ఇవ । ఉచ్చైః ।

టీక॥ అసౌ = ఈ, హంసోఽపి = హంసయు, హంసగతేః = హంసనడక వంటి నడక గల్గిన, సుదత్యాః = మంచి పలువరుస గల్గిన దమయంతి యొక్క, పురఃపురః = ఎదుట నెదుట, అగ్రే = సమీపమున, చారు = చక్కగా, చలన్ = తిరుగుచు, వైలక్ష్యహేతోః = అయ్యో! ఈహంస గూడ న న్ననుకరించుచున్న దని దమయంతి కాశ్చర్యము కల్గుటకై, ఏతదీయాం = దమయంతికి సంబంధించిన, గతిం = నడకను, అనుకృత్య = అనుకరించి, ఉచ్చైః = అధికముగా, ఉపహసన్నివ = పరిహసించు చున్నదో యనునట్లు, బభాసే = ప్రకాశించెను.

ఆహంస దమయంతిముంగిట తిరుగుటకు పరిహసించుట కార ణము కాకపోయినను కారణముగ చెప్పుటవలన నుత్ప్రేక్షాలంకారము. ఉత్ప్రేక్షావ్యంజక మగు నివశబ్దము ప్రయోగింపఁబడుటవలన నిది గమ్యము.

సమాసములు :

హంసగతేః :— హంసస్య గతిరివ గతిర్యస్యాస్సా = హంసగతిః, తస్యాః = హంసగతేః.

వైలక్ష్యహేతోః :— విలక్ష్యస్య భావః = వైలక్ష్యమ్. వైలక్ష్యమేవ హేతుః = వైలక్ష్యహేతుః, తస్మాత్ = వైలక్ష్యహేతోః.

ఏతదీయామ్ :— ఏతస్య ఇయమ్ = ఏతదీయా, తామ్ = ఏతదీయామ్,

భావము :

ఆహంసయు హంసవలె నడక గలిగిన యాదమయంతియెదుట చక్కగా నడచుచు నామెయెదుటనే యామెకాశ్చర్యము గలుగుటకై యామె నడక ననుకరిం చుచు పరిహసించుచున్నదో యనునట్లు తిరుగుచు శోభించినది.

శ్లో॥ పదే పదే భావిని భావినీ తం
యథా కరప్రాప్యమవైతి నూనమ్ ।
తథా సఖేలం చలతా లతాసు
ప్రతార్య తేనాచకృషే కృశాంగీ॥ ౧౧

ప. వి. పదే। పదే। భావిని। భావినీ। తం। యథా। కరప్రాప్యమ్। అవైతి। నూనం। తథా । సఖేలం । చలతా। లతాసు ।ప్రతార్య । తేన । ఆచకృషే । కృశాంగీ।

టీక॥ భావినీ = హంసను పట్టుటనే మనస్సునందు భావించుచున్న, కృశాంగీ = దమయంతి, భావిని = ఉంచఁబోవు, పదే పదే = అడు గడుగునందును, తం = ఆ హంసను, యథా = ఏవిధముగా, కరప్రాప్యం = చేతఁ బట్ట శక్య మయినదిగ, నూనం = నిశ్చయముగ, అవైతి = తెలుసుకొను చున్నదో, తథా = ఆవిధముగనే, సఖేలం = ఆటతోఁ కూడినట్లుగా, చలతా = నడచుచున్న, తేన = ఆ హంసచే, ప్రతార్య = మోసగింపఁబడి, లతాసు = తీగలమధ్యయందు, ఆచకృషే = లాగఁబడినది.

సమాసములు :

భావినీ:- భావయతీతి = భావినీ.

కరప్రాప్యమ్:- ప్రాప్తుం యోగ్యః = ప్రాప్యః, కరేణ ప్రాప్యః = కర ప్రాప్యః, తం = కరప్రాప్యమ్.

సఖేలం:- ఖేలేన సహితం యథా తథా = సఖేలమ్.

కృశాంగీ:- కృశమ్ అంగం యస్యాస్సా = కృశాంగీ.

భావము :

హంసను పట్టుకొనుటనే భావన చేయుచున్న యా దమయంతి యడు గడుగునందును హంసను బట్టగల నని యేవిధముగా నిశ్చయించుకొనుచుండినదో యావిధముగనే యా హంస యాట లాడుచు నా దమయంతిని వంచించి తీగల లోనికి లాగికొని పోయిన దై యేకాంతస్థలమున దాగినది.

శ్లో॥ రుషా నిషిద్ధాలిజనాం యదైనాం
ఛాయాద్వితీయాం కలయాంచకార।
తదా శ్రమాంభఃకణభూషితాంగీం
స కీరవన్మానుషవాగవాదీత్॥ ౧౨

ప. వి. రుషా। నిషిద్ధాలిజనాం। యదా। ఏనాం। ఛాయాద్వితీయాం। కలయాంచకార। తదా। శ్రమాంభఃకణభూషితాంగీం। సః। కీరవత్। మానుషవాక్। అవాదీత్.

టీక॥ రుషా = రోషముచే, నిషిద్ధాలిజనాం; నిషిద్ధ = నిషేధింపఁబడిన, ఆలిజనాం = చెలులు గలిగినదిగను, ఛాయాద్వితీయాం; ఛాయా = తననీడనే, ద్వితీయాం = తనకు రెండవదిగఁ గలదానినిగ, యదా = ఎప్పుడు, కలయాంచకార = తెలిసికొనినదో, తదా = అప్పుడు, శ్రమాంభఃకణభూషితాంగీం; శ్రమాంభఃకణ = చెమటబొట్టులచే, భూషిత = అలంకృతమగు, అంగీం = శరీరము గల దమయంతిని, సః = ఆ హంస, కీరవత్ = చిలుకవలె, మానుషవాక్ = మనుష్యుల మాట గల్గినదై, అవాదీత్ = పలికినది.

సమాసములు:

నిషిద్ధాళిజనామ్:- ఆళయ ఏవ జనాః = ఆళిజనాః, నిషిద్ధాః ఆళిజనాః యయా సా = నిషిద్ధాళిజనా, తాం = నిషిద్ధాళిజనామ్.

ఛాయాద్వితీయామ్:- ఛాయా ద్వితీయా యస్యాస్సా = ఛాయాద్వితీయా, తామ్ = ఛాయాద్వితీయామ్.

శ్రమాంభఃకణభూషితాంగీమ్:- శ్రమస్య అంభః = శ్రమాంభః, శ్రమాంభసః కణాః = శ్రమాంభఃకణాః, శ్రమాంభఃకణైః భూషితం అంగం యస్యాస్సా = శ్రమాంభఃకణభూషితాంగీ, తాం = శ్రమాంభః-ణభూషితాంగీమ్.

కీరవత్:- కీర ఇవ = కీరవత్.

మానుషవాక్:- మనుష్యస్య వాగివ వాక్ యస్య సః = మానుషవాక్.

భావము :

ఆ దమయంతి రోషముచే తన సఖీజనమును నిషేధించినదై తననీడ యొక్కటియే రెండవదిగ గల్గినదై చెమటబొట్లతో నలంకరింపఁబడిన శరీరము

కలదై యెప్పు డుండెనో యప్పు డాహంస చిలుకవలె మనుష్యవాక్కు గల దై యా దమయంతితోఁ బలికెను.

శ్లో॥ అయే కియద్యావదుపైషి దూరం
వ్యర్థం పరిశ్రామ్యసి వా కిమర్థమ్।
ఉదేతి తే భీరపి కిన్ను బాలే
విలోకయన్త్యా న ఘనా వనాళీః॥ ౧౩

ప వి. అయే । కియత్ । యావత్ । ఉపైషి । వ్యర్థం । పరిశ్రామ్యసి । వా । కిమర్థమ్ । ఉదేతి । తే । భీః । అపి । కిం । ను । బాలే । విలోకయంత్యాః । న । ఘనాః । వనాళీః ।

టీక॥ అయే = ఓ దమయంతీ, వ్యర్థం = నిరర్థకముగా, కియత్ = ఎంత దూరము, యావదుపైషి = పోఁగలవు, కిమర్థమ్ = ఎందులకు, పరిశ్రామ్యసి వా = శ్రమపడుచున్నావు? ఘనాః = దట్టము లైన, వనాళీః = వనపంక్తులను, విలోకయంత్యాః = చూచుచున్న, తే = నీకు, భీరపి = భయ మైనను, నోదేతి = ఉదయించుటలేదా।

సమాసములు :

వనాళీః:- వనానామాళయః = వనాళయః, తాః = వనాళీః.

భావము :

ఓ దమయంతీ ! వ్యర్థముగా నీ వెంతదూరము పోఁగలవు. ఎందులకు వ్యర్థముగ పరిశ్రమపడుచున్నావు? ఈ దట్టము లగు నరణ్యములను చూచుచున్న నీకు భయము కలుగుటలేదా? కావున ఆగుము. అని హంస దమయంతితోఁ బలికెను.

శ్లో॥ వృథాఽర్పయంతీమపథే పదం త్వాం
మరుల్లలత్పల్లవ పాణికంపైః।
ఆలీవ పశ్య ప్రతిషేధతీయం
కపోతహుంకారగిరా వనాళీః॥ ౧౪

ప. వి. వృథా । అర్పయంతీమ్ । అపథే । పదం । త్వాం । మరుల్లలత్పల్లవపాణికంపైః । ఆలీ । ఇవ । పశ్య । ప్రతిషేధతి । ఇయం । కపోతహుంకారగిరా । వనాళిః ।

టీక॥ వృథా = వ్యర్థముగ, అపథే = అమార్గమందును, అకృత్యమందును, పదం = పాదమును, ఉద్దేశమును, అర్పయంతీం = ఉంచుచున్న, త్వాం = నిన్ను, మరుల్లలత్పల్లవపాణికంపైః; మరుత్ = గాలిచే, లలత్ = కదలుచున్న, పల్లవపాణి = చిగురుటాకు లను హస్తములయొక్క, కంపైః = కదలికలచేతను, కపోతహుంకారగిరా; కపోత = పావురముల యొక్క, హుంకారగిరా = హుంకారధ్వనిచేతను, ఇయం = ఈ, వనాళిః = వనపంక్తి, ఆలీవ = చెలికత్తెవలె, ప్రతిషేధతి = నిషేధించుచున్నది, పశ్య = చూడుము.

ఇచ్చట వనపంక్తి చెలికత్తెతోఁ బోల్చబడినది. కావున నుపమాలంకారము. అది "పల్లవపాణి" యను రూపకముతో సంకీర్ణము.

సమాసములు;-

అపథే:- న పంథాః = అపథమ్, తస్మిన్ = అపథే,

మరుల్లలత్పల్లవపాణికంపైః:- మరుతా లలంతః = మరుల్లలంతః, మరుల్లలంతశ్చ తే పల్లవాశ్చ = మరుల్లలత్పల్లవాః, మరుల్లలత్పల్లవా ఏవ పాణిః = మరుల్లలత్పల్లవపాణిః, మరుల్లలత్పల్లవపాణేః కంపాః = మరుల్లలత్పల్లవపాణికంపాః, తైః = మరుల్లలత్పల్లవపాణికంపైః. కపోతహుంకారగిరా:-కపోతస్య హుంకారః = కపోతహుంకారః, కపోతహుంకార ఏవ గీః = కపోతహుంకారగీః, తయా = కపోతహుంకారగిరా.

వనాలిః:- వనానామాలిః = వనాలిః.

భావము :

"అమార్గమందు నకృత్యమందును" నడుగుపెట్టిన నిన్ను గాలికిఁ గదలుచున్న చిగురుటాకు లను హస్తముల కదలికలచేతను, పావురముల హుంకార

నాదములచేతను వనపంక్తి యను చెలికత్తె వారించుచున్నది. కావున నీ విఁక నాగుట మంచిది." అని హంస దమయంతితోఁ బలికెను.

శ్లో॥ ధార్యః కథంకారమహం భవత్యా
వియద్విహారీ వసుధైకగత్యా।
అహో శిశుత్వం తవ ఖండితం న
స్మరస్య సఖ్యా వయసాఽప్యనేన॥ ౧౩॥

ప. వి. ధార్యః। కథంకారమ్। అహం। భవత్యా। వియద్విహారీ। వసుధైకగత్యా। అహో। శిశుత్వం। తవ। ఖండితం। న। స్మరస్య। సఖ్యా। వయసా। అపి। అనేన.

టీక॥ వసుధైకగత్యా; వసుధా = భూమియందే, ఏకగత్యా = కేవలసంచారము గల్గిన, భవత్యా = నీచే, వియద్విహారీ = గగనసంచారి యగు నేను, కథంకారం = ఎట్లు, ధార్యః = పట్ట సాధ్య మగుదును, అనేన = ఈ, స్మరస్య = మన్మథునకు, సఖ్యా = మిత్ర మైన, వయసాఽపి = వయస్సు చేతను, తవ = నీయొక్క, శిశుత్వం = చిన్నతనము, న ఖండితమ్ = తొలగింపఁబడలేదు, అహో = ఆశ్చర్యము.

ఇచ్చట పట్టుటకు సాధ్యము కాదను నధార్యత్వమునకు, వసుధాగతియు వియద్విహారమును హేతువులుగఁ జెప్పఁబడుటవలన పదార్థహేతుకకావ్యలింగాలంకారము.

శైశవము ఖండింపఁబడక యుండుటకును "నధార్యత్వ" విశిష్ట వాక్యార్థము హేతువు గాన నిదియు కావ్యలింగము. కాన సజాతీయాలంకార సంకరము.

సమాసములు:

ధార్యః:- ధారయితుం శక్యః = ధార్యః.
వియద్విహారీ:- విహారః అస్య అస్తీతి = విహారీ, వియతి విహారీ = వియద్విహారీ.
వసుధైకగత్యా:- ఏకస్యాం గతిః = ఏకగతిః, వసుధాయామేకగతిః యస్యాస్సా = వసుధైకగతిః, తయా = వసుధైకగత్యా.
శిశుత్వమ్:- శిశోర్భావః = శిశుత్వమ్.

భావము :

ఓ దమయంతీ! భూసంచారిణి వగు నీవెట్లు గగనసంచారి యగు నన్నుఁ బట్టగలవు? మన్మథుని నేస్త మగు యౌవనముచేతను నీ శైశవము తొలగలేదు. ఇది మిక్కిలి యాశ్చర్యకరము.

శ్లో॥ సహస్రపత్త్రాసనపత్త్రహంస
వంశస్య పత్త్రాణి పతత్త్రిణః స్మః।
అస్మాదృశాం చాటురసామృతాని
స్వర్లోకలోకేతరదుర్లభాని॥ ౧౭

ప. వి. సహస్రపత్త్రాసనపత్త్రహంసవంశస్య। పత్త్రాణి। పతత్త్రిణః। స్మః। అస్మాదృశాం। చాటురసామృతాని। స్వర్లోకలోకేతరదుర్లభాని.

టీక॥ సహస్రపత్త్రాసనపత్త్రహంసవంశస్య; సహస్రపత్త్ర = కమలమే, ఆసన = ఆసనముగా గల్గిన బ్రహ్మయొక్క. పత్త్ర = వాహనము లైన, హంస = హంసలయొక్క, వంశస్య = కులముయొక్కయు, [వెదురు యొక్కయు] పత్త్రాణి = వాహనము లైన, [ఆకులైన] పతత్త్రిణః = పక్షులముగ, స్మః = ఉన్నారము, అస్మాదృశాం = మావంటివారియొక్క, చాటురసామృతాని; చాటు = సుభాషితములయందలి, రస = శృంగారాది రసము లనెడు, అమృతాని = అమృతములు, స్వర్లోకలోకేతరదుర్లభాని; స్వర్లోక = స్వర్గమునందలి, లోక = జనులకంటె, ఇతర = ఇతరు లైన వారిచే, దుర్లభాని = పొంద సాధ్యముకానివి.

సమాసములు :

సహస్రపత్త్రాసనపత్త్రహంసవంశస్య:- సహస్రపత్త్రం ఆసనం యస్య సః = సహస్రపత్త్రాసనః. సహస్రపత్త్రాసనస్య పత్త్రహంసాః = సహస్రపత్త్రాసనపత్త్రహంసాః; సహస్రపత్త్రాసనపత్త్రహంసానాం వంశః = సహస్రపత్త్రాసనపత్త్రహంసవంశః. తస్య = సహస్రపత్త్రాసనపత్త్రహంసవంశస్య.

అస్మాదృశామ్ - అస్మానివ పశ్యంతీతి = అస్మాదృశః, తేషామ్ = అస్మాదృశామ్.

చాటురసామృతాని:- చాటుషు రసాః = చాటురసాః, చాటురసేషు అమృతాని = చాటురసామృతాని.

స్వర్లోకలోకేతరదుర్లభాని:- స్వ ఏవ లోకః = స్వర్లోకః. స్వర్లోకే లోకాః = స్వర్లోకలోకాః, స్వర్లోకలోకేభ్యః ఇతరే = స్వర్లోకలోకేతరే, దుఃఖేన లబ్ధుం శక్యాని దుర్లభాని, స్వర్లోకలోకేతరైః దుర్లభాని = స్వర్లోకలోకేతరదుర్లభాని.

భావము :

ఓ దమయంతీ! మేము బ్రహ్మవాహనము లగు హంసలవంశస్థులము. మా చమత్కారవచనములయందలి శృంగారాదిరసములు స్వర్లోకవాసులకంటె నితరు లగు జనులకు దుర్లభములు.

శ్లో॥ స్వర్గాపగాహేమమృణాళినీనాం
నాలామృణాలాగ్రభుజో భజామః।
అన్నానురూపాం తనురూపబుద్ధిం
కార్యం నిదానాద్ధి గుణానధీతే॥ ౧౮

ప. వి. స్వర్గాపగాహేమమృణాళినీనాం । నాలామృణాలాగ్రభుజః । భజామః । అన్నానురూపాం । తనురూపబుద్ధిం। కార్యం। నిదానాత్ । హి । గుణాన్। అధీతే ।

టీక॥ స్వర్గాపగాహేమమృణాళినీనాం: స్వర్గాపగా = గంగానదియందలి, హేమమృణాళినీనాం = బంగారుతమ్మితీగలయొక్క, నాలామృణాలాగ్రభుజః; నాలా = కాడలయొక్కయు. మృణాల = గడ్డలయొక్కయు, అగ్ర = కొనలను. భుజః = తినెడివార మై, అన్నానురూపాం; అన్న = ఆహారమునకు, అనురూపాం = తగిన, తనురూపబుద్ధిం: తను = శరీరముయొక్కయు, రూప = సౌందర్యముయొక్కయు, బుద్ధిం = వృద్ధిని, భజామః = పొందుచున్నారము, తథాహి = అది యెట్లనగా, కార్యం =

ఉద్భవించెడి ద్రవ్యము- నిదానాత్ = మూలకారణమునుండి, గుణాన్ = గుణములను, అధీతే = పొందుచున్నది.

ఇచ్చట "కార్యం నిదానాద్ధి గుణానధీతే" యని కార్యము కారణము వలన గుణములను బొందు నను సామాన్యవచనముచే బంగారుతమ్మి కాడలు బంగారుతమ్మిగడ్డలు మున్నగువానిని భుజించుటవలన వాని కను గుణముగ బంగారుతెక్కలు మున్నగు శరీరరూపవృద్ధి కల్గిన దను విశేషము సమర్థింపఁబడుటవలన నర్థాంతరన్యాసాలంకారము.

సమాసములు ;

స్వర్గాపగాహేమమృణాళినీనామ్:- స్వర్గస్య అపగా = స్వర్గాపగా, హేమ మయాశ్చ తాః మృణాళిన్యశ్చ = హేమమృణాళిన్యః, స్వర్గాపగాయాః హేమమృణాళిన్యః = స్వర్గాపగాహేమమృణాళిన్యః, తాసాం = స్వర్గాపగాహేమమృణాళినీనామ్.

నాలామృణాలాగ్రభుజః:- నాలాశ్చ మృణాలాని చ = నాలామృణాలాని, నాలామృణాలానామగ్రాణి = నాలామృణాలాగ్రాణి, నాలామృణాలాగ్రాణాం భుజః = నాలామృణాలాగ్రభుజః.

అన్నానురూపామ్:- అన్నస్య అనురూపా = అన్నానురూపా, తామ్ = అన్నానురూపామ్.

తనురూపబుద్ధిమ్ :- తనుశ్చ రూపం చ = తనురూపే, తనురూపయోః బుద్ధిః = తనురూపబుద్ధిః, తామ్ = తనురూపబుద్ధిమ్.

భావము :

మేము స్వర్గంగయందలి బంగరు తామర తీగెలయొక్క కాడల కొనలను, గడ్డల కొనలను తినుచు నాయాహారమునకుఁ దగిన శరీరవృద్ధిని, సౌందర్య వృద్ధిని బొందుచున్నాము. ఉద్భవించునట్టి ద్రవ్యములు తమ తమ కారణముల నుండి రూపరసాదిగుణములను బొందును, కారణ మైన బంగారుతామరతీగెల కాడలు గడ్డలు కార్య మైన మాశరీరములకు వృద్ధిని కాంతిని గల్గించినవి.

శ్లో॥ ధాతుర్నియోగాదిహ నైషధీయం
లీలాసరస్సేవితుమాగతేషు ।
హైమేషు హంసేష్వహమేక ఏవ
భ్రమామి భూలోకవిలోకనోత్కః॥ ౧౮

ప. వి ధాతుః । నియోగాత్ । ఇహ । నైషధీయం । లీలాసరః । సేవితుమ్ । ఆగతేషు । హైమేషు । హంసేషు । అహమ్ । ఏకః । ఏవ । భ్రమామి । భూలోకవిలోకనోత్కః ।

టీక॥ ధాతుః = బ్రహ్మయొక్క, నియోగాత్ = ఆజ్ఞవలన, ఇహ = ఈభూలోకమందు, నైషధీయం = నలునికి సంబంధించిన, లీలాసరః = క్రీడాసరస్సును, సేవితుం = సేవించుటకు, ఆగతేషు = వచ్చిన, హైమేషు = బంగరు వన్నె గల, హంసేషు = హంసలయందు, అహం = నేను, ఏక ఏవ = ఒక్కడనే, భూలోకవిలోకనోత్కః; భూలోక = భూలోకమును, విలోకన = చూచుటయందు, ఉత్కః = కోరికగలవాడనై, భ్రమామి = సంచరించుచున్నాను.

సమాసములు :

నైషధీయమ్ :- నిషధానాం రాజా = నైషధః, నైషధస్య ఇదం = నైషధీయమ్, తత్ = నైషధీయమ్.

లీలాసరః :- లీలార్థం సరః = లీలాసరః, తత్ = లీలాసరః.

భూలోకవిలోకనోత్కః :- భూరితి లోకః = భూలోకః, భూలోకస్య విలోకనం = భూలోకవిలోకనం. భూలోకవిలోకనే ఉత్కః :- భూలోకవిలోకనోత్కః.

భావము :

బ్రహ్మనియోగము ననుసరించి భూలోకమందలి నలుని విలాససరస్సును జూచుటకై వచ్చిన బంగారపుహంసలలో నే నొక్కడను మాత్రము మిగిలి భూలోకమును దర్శింపఁ గోరిక గల్గి సంచరించుచున్నాను.

శ్లో॥ విధేః కదాచిత్ భ్రమణీవిలాసే
శ్రమాతురేభ్యస్స్వమహత్తరేభ్యః ।
స్కంధస్య విశ్రాంతిమదాం తదాది
శ్రామ్యామి నాఽవిశ్రమవిశ్వగోఽపి॥ ౧౯

ప. వి. విధేః । కదాచిత్ । భ్రమణీవిలాసే । శ్రమాతురేభ్యః । స్వమహత్తరేభ్యః। స్కంధస్య । విశ్రాంతిమ్ । అదాం । తదాది । శ్రామ్యామి । న । అవిశ్రమ విశ్వగః । అపి ।

టీక ॥ కదాచిత్ = ఒకప్పుడు, విధేః = బ్రహ్మకు, భ్రమణీవిలాసే, భ్రమణీ = లోకములను జుట్టవలయు నను, విలాసే = వినోదమందు, శ్రమాతురేభ్యః = శ్రమచే బాధపడుచున్న, స్వమహత్తరేభ్యః; స్వ = తనకుల మందలి, మహత్తరేభ్యః = మిక్కిలి పెద్దలకొఱకు, స్కంధస్య = (వారి) భుజశిఖరమునకు, విశ్రాంతిం = విశ్రాంతిని, అదామ్ = ఇచ్చితిని, తదాది = అదిమొదలు, అవిశ్రమవిశ్వగోఽపిః అవిశ్రమ = విశ్రాంతి లేక, విశ్వగోఽపి = ప్రపంచమునఁ తిరుగుచున్నను, న శ్రామ్యామి = శ్రమపడుట లేదు.

సమాసములు :

భ్రమణీవిలాసే :- భ్రమణీనాం విలాసః = భ్రమణీవిలాసః, తస్మిన్ భ్రమణీవిలాసే,
శ్రమాతురేభ్యః :- శ్రమేణ ఆతురాః = శ్రమాతురాః; తేభ్యః = శ్రమాతురేభ్యః.
స్వమహత్తరేభ్యః :- అత్యంతం మహాంతః = మహత్తరాః, స్వస్మాత్ మహత్తరాః = స్వమహత్తరాః, తేభ్యః = స్వమహత్తరేభ్యః.
తదాది :- తత్ ఆదిః యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = తదాది.
అవిశ్రమవిశ్వగః:- న విశ్రమః యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = అవిశ్రమమ్, విశ్వం గచ్ఛతీతి = విశ్వగః, అవిశ్రమం విశ్వగః = అవిశ్రమవిశ్వగః.

భావము :

ఒకనాడు బ్రహ్మ లోకములను జుట్టుటకై యుత్సాహము నొంద నాకంటెను పెద్దవి యగు హంసలతనిని మోయుటలో శ్రమ జెందగా నేను వానికి విశ్రాంతి నొసంగి యా బ్రహ్మను మోయుచు నిర్విరామముగఁ బ్రపంచమును జుట్టుచున్నప్పటికిని యెట్టి పరిశ్రమను బొందక యున్నాను.

శ్లో॥ బంధాయ దివ్యే న తిరశ్చి కశ్చి
త్పాశాదిరాసాదితపౌరుషస్స్యాత్ ।
ఏకం వినా మాదృశి తన్నరస్య
స్వర్భోగభాగ్యం విరలోదయస్య॥ ౨౦

ప. వి బంధాయ । దివ్యే । న । తిరశ్చి । కశ్చిత్ । పాశాదిః । ఆసాదితపౌరుషః। స్యాత్ । ఏకం । వినా । మాదృశి । తత్ । నరస్య । స్వర్భోగభాగ్యం । విరలోదయస్య.

టీక॥ మాదృశి = నావంటి, దివ్యే = దేవలోకసంబంధము గల, తిరశ్చి = తిర్యగ్జంతువువిషయమున, విరలోదయస్య = అరుదైన జన్మము గల. నరస్య = మనుష్యునకు, విరలోదయస్య: విర = రేఫము దొలగుట గల్గి, లోదయస్య = లకార మేర్పడుట గల్గిన నలునకు.) ఏకం = ఒక్కటియైన, తత్ = ఆప్రసిద్ధ మగు, స్వర్భోగభాగ్యమ్; స్వర్భోగ = స్వర్గసుఖము నొసంగెడి, భాగ్యం = అదృష్టమును, వినా = విడచి, కశ్చిత్ = ఒక, పాశాదిః = బంధనసాధనము, బంధాయ = బందించుటకు,ఆసాదిత పౌరుషః, ఆసాదిత = పొందింపఁబడిన, పౌరుషః = పౌరుషము గలదిగ. న స్యాత్ = కానేరదు.

సమాసములు :

దివ్యే :- దివి భవః = దివ్యః, తస్మిన్ = దివ్యే.
పాశాదిః :- పాశః ఆదిర్యస్య సః = పాశాదిః.
ఆసాదితపౌరుషః :- పురుషస్య కర్మ = పౌరుషమ్, ఆసాదితం పౌరుషం యస్య సః = ఆసాదితపౌరుషః.
స్వర్భోగభాగ్యమ్ :- స్వః భోగః = స్వర్భోగః, స్వర్భోగస్య భాగ్యమ్ = స్వర్భోగభాగ్యమ్,
విరలోదయస్య :- విరలః ఉదయః యస్య సః = విరలోదయః, తస్య = విరలోదయస్య; విగతః రః యస్మిన్ సః విరః, లస్య ఉదయః యస్మిన్ సః = లోదయః, విరశ్చాసౌ లోదయశ్చ = విరలోదయః, తస్య = విరలోదయస్య.

భావము :

అరుదైన జన్మము గల నరునియొక్క అనగా విరలజన్మము గల నరునియొక్క (నరశబ్దమున రేఫము తొలగి లకార మేర్పడిన నలశబ్దవాచ్యుని యొక్క) స్వర్గసుఖము నొసంగెడి యదృష్టమును మించి తక్కిన బంధనసాధనము లగు పాశాదులు దివ్యజంతు వగు నన్ను బంధించుటకు శక్తిమంతములు కావు. అనగా నన్ను బంధించుటకు స్వర్గసుఖాదృష్టము గల్గిన రేఫస్థానమున లకార మేర్పడిన నామము గల నరునకు (నలునకు) మాత్రమే శక్తి యుండును గాని తదితరుల కట్టిశక్తి యుండ దని శబ్దధర్మముచే విరలోదయశబ్దమువలన హంస దమయంతికి నలనామమును సూచించుచున్నది. మావంటి దివ్యపక్షులతో సంబంధము స్వర్గసుఖసాధన మగు నదృష్టముచేఁ గల్గును. కాని మఱియొకవిధముగఁ గలుగదు, మఱియు మావంటి దివ్యజన్మములతోటి సంబంధమే స్వర్గము. కాని దీనిని మించిన మఱొక స్వర్గ మేల యున్నది. నలుఁడు నన్ను బంధించుట మున్నగు వానిచే నట్టి యదృష్టము గలవాఁడు.

శ్లో॥ ఇష్టేన పూర్తేన నలస్య వశ్యా
స్స్వర్భోగమత్రాఽపి సృజన్త్యమర్త్యాః ।
మహీరుహా దోహదసేకశక్తే
రాకాలికం కోరకముద్గిరంతి॥ ౨౧

ప. వి. ఇష్టేన । పూర్తేన । నలస్య । వశ్యాః । స్వర్భోగమ్ । అత్ర । అపి । సృజంతి । అమర్త్యాః । మహీరుహాః । దోహదసేకశక్తేః । ఆకాలికం । కోరకమ్ । ఉద్గిరంతి ।

టీక॥ ఇష్టేన = యాగముచేతను, పూర్తేన = తటాకాది నిర్మాణాదికముచేతను, వశ్యాః = లోఁబడినటువంటి, అమర్త్యాః = దేవతలు, నలస్య = నలునికి, అత్రాపి = ఈ భూలోకమందును, స్వర్భోగం = స్వర్గసుఖమును, సృజంతి = కల్పించుచున్నారు. మహీరుహాః = వృక్షములు . దోహద సేకశక్తేః; దోహద = అకాలమున పుష్పింపఁజేయు ద్రవ్యముయొక్కయు, సేక = జలసేచనముయొక్కయు, శక్తేః = సామర్థ్యమువలన, ఆకాలికం = అకాలమందలి, కోరకం = మొగ్గను, ఉద్గిరంతి = వెళ్ళఁగ్రక్కుచున్నవి.

దేవతలు భూలోకమునందు నలునకు స్వర్గసుఖమును గల్పించుట యను నుపమేయవాక్యార్థము. దోహదసేకశక్తివలన వృక్షములకాలమున మొగ్గలు దొడుగు నను నుపమానవాక్యార్థముతో బింబప్రతిబింబభావము నొందినందువలన దృష్టాంతాలంకారము.

సమాసములు :-

వశ్యాః:- వశే భవాః = వశ్యాః.

స్వర్భోగమ్:- స్వః భోగః = స్వర్భోగః, తం స్వర్భోగమ్.

దోహదసేకశక్తేః:- దోహదశ్చ సేకశ్చ = దోహదసేకౌ, దోహదసేకయోః శక్తిః = దోహదసేకశక్తిః, తస్యాః = దోహదసేకశక్తేః.

అకాలికమ్:- సమాన కాలౌ ఆద్యంతౌ అస్యేతి = అకాలికః. తమ్ = అకాలికమ్.

భావము :

నలుడు యాగములను సల్పుటచేతను, తటాకాదులను నిర్మించుటచేతను దేవతలతనికి వశ్యులై యున్నారు. కావున భూలోకమందును నతనికి దేవతలు స్వర్గసౌఖ్యము నొసంగగలరు. అదెట్లనగా- వృక్షములు దోహదద్రవ్యముల చేతను నీరుపోయుటచేతను నకాలమందు మొగ్గలు వేయుచున్నవి గదా. కావున యాగాదిధర్మకార్యములప్రభావమువలన స్వర్గలోకమునందు బొందదగిన సౌఖ్యములను దేవతలు భూలోకమునందే నలునకు గల్పింపగలరు. అందులో నబ్బురము లేదు.

శ్లో॥ సువర్ణశైలాదవతీర్య తూర్ణం
స్వర్వాహినీవారికణావకీర్ణైః।
తం వీజయామః స్మరకేళికాలే
పక్షైర్నృపం చామరబద్ధసఖ్యైః॥ — 3-2

ప. వి. సువర్ణశైలాత్। అవతీర్య। తూర్ణం। స్వర్వాహినీవారికణావకీర్ణైః।
తం। వీజయామః। స్మరకేళికాలే। పక్షైః। నృపం। చామరబద్ధసఖ్యైః।

టీక॥ సువర్ణశైలాత్ = బంగారుకొండనుండి, తూర్ణం = శీఘ్రముగ. అవతీర్య = దిగి, స్వర్వాహినీవారికణావకీర్ణైః; స్వర్వాహినీ = ఆకాశగంగ యొక్క, వారికణ = నీటితుంపరలచే, అవకీర్ణైః = వ్యాప్తము లయిన, చామరబద్ధసఖ్యైః; చామర = వింజామరలతో, బద్ధ = కట్టఁబడిన, సఖ్యైః = సామ్యముఁ గల్గిన, పక్షైః = ఱెక్కలచే, స్మరకేళికాలే = సురతికాలమందు, తం = ఆనలుని, వీజయామః = వీచుచున్నారము.

సమాసములు :

సువర్ణశైలాత్:- సువర్ణమయశ్చాసౌ శైలశ్చ = సువర్ణశైలః, తస్మాత్ = సువర్ణశైలాత్.

స్వర్వాహినీవారికణావకీర్ణైః:- స్వః వాహినీ = స్వర్వాహినీ, స్వర్వాహిన్యాః వారికణాః = స్వర్వాహినీవారికణాః, స్వర్వాహినీవారికణైరవకీర్ణాః = స్వర్వాహినీవారికణావకీర్ణాః, తైః = స్వర్వాహినీవారికణావకీర్ణైః.

స్మరకేళికాలే:- స్మరస్య కేళిః = స్మరకేళిః, స్మరకేళేః కాలః = స్మరకేళికాలః, తస్మిన్ = స్మరకేళికాలే.

చామరబద్ధసఖ్యైః:- చామరేషు బద్ధం = చామరబద్ధం, చామరబద్ధం సఖ్యం యేషాం తే = చామబద్ధసఖ్యాః, తైః = చామరబద్ధసఖ్యైః.

భావము :

మేము మేరుపర్వతమునుండి దిగి యాకాశగంగయందుఁ గ్రుంకులిడి యందలి నీటితుంపరలచేఁ దడిసి చామరములతో సమానము లగు మాఱెక్కలచే సురతకాలమం దానలునికి వీచెదము.

శ్లో॥ క్రియేత చేత్ సాధువిభక్తిచింతా
వ్యక్తిస్తదా సా ప్రథమాభిధేయా।
యా స్వౌజసాం సాధయితుం విలాసై
స్తావత్క్షమానామపదం బహు స్యాత్॥ ౮౩

ప. వి. క్రియేత। చేత్। సాధువిభక్తిచింతా। వ్యక్తిః। తదా। సా। ప్రథమాభిధేయా। యా। స్వౌజసాం। సాధయితుం। విలాసైః। తావత్। క్షమా। అనామపదం। బహు। స్యాత్.

టీక॥ సాధువిభక్తిచింతా; సాధు = సజ్జనులయొక్క, విభక్తి = విభాగమును గూర్చిన, చింతా = ఆలోచన, క్రియేత చేత్ = చేయఁబడినచో, సా = నలుఁ డను పేరుగల, వ్యక్తిః = వ్యక్తి. ప్రథమాభిధేయా; ప్రథమ = తొలుత, అభిధేయా = చెప్పఁదగినది, యా = ఏవ్యక్తి, స్వౌజసాం; స్వ = తనవి యైన, ఓజసాం = పరాక్రమములయొక్క, విలాసైః = వ్యాప్తులచే. తావత్ = అంతటి, బహు = ఎక్కువైన, అనామపదమ్; అనామ = లొంగనటువంటి శత్రువులయొక్క, పదం = రాష్ట్రమును. సాధయితుం = స్వాధీనపఱుచుకొనుటకు, క్షమా = శక్తి గలదిగ, స్యాత్ = కాఁగలదు; సాధు = చక్కఁగా. విభక్తిచింతా = సప్తవిభక్తుల చింత, క్రియేత చేత్ = చేయఁబడినయెడల, సా = ఆ, ప్రథమా = మొదటి దైన, వ్యక్తిః = విభక్తి, అభిధేయా = విచారింపదగినది, యా = ఏప్రథమావిభక్తి, స్వౌజసాం; సు ఔ జస్ అను ప్రత్యయములయొక్క, విలాసైః = విస్తారములచే, తావత్ = అంతటి, బహు = అనేక మగు, నామపదం = సుబంతపదమును, సాధయితుం = ఉద్భవింపఁజేయుటకు. క్షమా = శక్తము కాఁగలదు.

ఇచ్చట అభిధావృత్తి ప్రకృతనలవృత్తాంతమాత్రనియంత్రిత మయినందువలనను, అన్వయానుపపత్తి లేనందువలన లక్షణావృత్తి సంభవింపనందువలనను నప్రకృతవిభక్త్యర్థప్రతీతి ధ్వని యగుచున్నది.

సమాసములు:

సాధువిభక్తిచింతా:- సాధూనాం విభక్తిః = సాధువిభక్తిః, సాధువిభక్తేః చింతా = సాధువిభక్తిచింతా.

ప్రథమాభిధేయా:- అభిధాతుం యోగ్యా = అభిధేయా ప్రథమమభిధేయా = ప్రథమాభిధేయా.

స్వౌజసామ్:- స్వస్య ఓజాంసి = స్వౌజాంసి, తేషాం = స్వౌజసామ్.

అనామపదమ్:- నాస్తి నామో యేషాం తే = అనామాః, అనామానాం పదమ్ = అనామపదమ్, తత్ = అనామపదమ్.

విభక్తిచింతా:- విభక్తీనాం చింతా = విభక్తిచింతా.

స్వౌజసామ్:- సుశ్చ ఔశ్చ జస్ చ = స్వౌజసః, తేషామ్ = స్వౌజసామ్.

నామపదమ్:- నామ ఇతి పదమ్ = నామపదమ్, తత్ = నామపదమ్.

**భావము :**

సజ్జనుల విభాగము నాలోచించునపు డానలుఁడను వ్యక్తి మొదటఁ జెప్పఁదగినవాడు. ఏల యనగా; అతడు తన పరాక్రమములను వ్యాపింపఁజేసి తనకు లోఁబడకయున్న శత్రురాష్ట్రముల సాధింప సమర్థుఁడుగ నుండెను. విభక్తులను గూర్చి యాలోచించినపుడు ప్రథమావిభక్తి విచారింపఁదగినదై యుండును. ఏల యనగా నావిభక్తి సు ఔ జస్ ప్రత్యయముల విస్తరణముచే సుబంతపదములను సాధింప సమర్థమై యుండునది.

శ్లో॥ రాజా స యజ్వా విబుధవ్రజత్రా
కృత్వాఽధ్వరాజ్యోపమయైవ రాజ్యమ్ ।
భుంక్తే శ్రితశ్రోత్రియసాత్కృతశ్రీః
పూర్వం త్వహో శేషమశేషమన్త్యమ్॥ ౨౪

ప. వి. రాజా । సః । యజ్వా । విబుధవ్రజత్రా । కృత్వా । అధ్వరాజ్యోపమయా । ఏవ । రాజ్యం । భుంక్తే । శ్రితశ్రోత్రియసాత్కృతశ్రీః । పూర్వం । తు । అహో । శేషమ్ । అశేషమ్ । అన్త్యమ్ ।

టీక॥ యజ్వా = శాస్త్రప్రకారము యాగము ననుష్ఠించినవాఁడును, శ్రితశ్రోత్రియసాత్కృతశ్రీః: శ్రిత = ఆశ్రయించిన, శ్రోత్రియ = వైదికులకు, అనగా వేదాధ్యయనముఁ గావించినవారికి, సాత్కృత = స్వాధీనము గావింపఁబడిన, శ్రీః = సంపదలు గలవాఁడును, రాజా = రంజకుఁడు నగు, సః = ఆ నలుఁడు, అధ్వరాజ్యోపమయైవ: అధ్వర = యాగములయందలి, ఆజ్య = నేతితోటి, ఉపమయైవ = పోలికతోడనే, రాజ్యం = రాజ్యమును, విబుధవ్రజత్రా; విబుధ = దేవతలయొక్కయు, పండితులయొక్కయు, వ్రజత్రా = సంఘమునకు స్వాధీనము, కృత్వా = కావించి, పూర్వం = మొదటఁ జెప్పఁబడిన యాగమందలి నేతిని, శేషం = హుతశేషమును, అనగా హోమముఁ జేయగా మిగిలిన దానిని,

భుంక్తే = భుజించుచున్నాడు, అంత్యం = వెనుకఁ జెప్పఁబడిన రాజ్యమును, అశేషం = అఖండముగ, భుంక్తే = భుజించుచున్నాడు. (పాలించుచున్నాఁడు) అహో = ఆశ్చర్యము.

ఇచ్చట "పూర్వం త్వహో శేషమశేషమన్త్యమ్" అని పూర్వ భాగమును శేష మనియు నంత్యభాగమును శేషము కాదనియు చెప్పుట వలన విరోధస్ఫూర్తి యున్నది. కాన విరోధాభాసాలంకారము - శేష మనగా ఆజ్యశేష మనియు అశేష మనగా నఖండ మనియు నర్థముఁ జెప్పుటవలన విరోధపరిహారము.

సమాసములు :

రాజా :- రంజయతీతి = రాజా.

యజ్వా :- యజతీతి = యజ్వా.

విబుధవ్రజత్రా :- విబుధానాం వ్రజః = విబుధవ్రజః, విబుధవ్రజస్య ఆధీనం = విబుధవ్రజత్రా.

అధ్వరాజ్యోపమయా :- అధ్వరే ఆజ్యం = అధ్వరాజ్యం, అధ్వరాజ్యేన ఉపమా = అధ్వరాజ్యోపమా, తయా = అధ్వరాజ్యోపమయా.

శ్రితశ్రోత్రియ సాత్కృతశ్రీః :- శ్రితాశ్చ తే శ్రోత్రియాశ్చ = శ్రిత శ్రోత్రియాః, శ్రితశ్రోత్రియానామధీనా కృతా = శ్రితశ్రోత్రియసాత్కృతా, శ్రితశ్రోత్రియసాత్కృతా శ్రీః యేన సః = శ్రితశ్రోత్రియసాత్కృతశ్రీః.

భావము :-

అనలమహారాజు తన్నాశ్రయించిన వేదాధ్యేతలకు తనసంపదలను స్వాధీనము గావించెను. తర్వాత యాగమందలి యాజ్యమును బోలె రాజ్యమును దేవతలకును విద్వాంసులకును స్వాధీనము గావించెను. అందుఁ దొలుతఁ జెప్పఁబడిన యాజ్యములో శేషమును తర్వాతఁ జెప్పఁబడిన రాజ్యమునందు నశేషమును భుజించుచున్నాడు. అనగా నాజ్యమునందు హోమముఁజేయగా మిగిలిన యాజ్యమును, రాజ్యమునందు నఖండరాజ్యము ననుభవించుచున్నాడని యాశయము. కాన పూర్వపు టాజ్యములోని మిగిలిన భాగమునకు శేషత్వము కడపట జెప్పఁబడిన రాజ్యమున కశేషత్వము నవిరుద్ధము.

శ్లో॥ దారిద్ర్యదారిద్రవిణౌఘవర్షై
రమోఘమేఘవ్రతమర్థిసార్థే।
సంతుష్టమిష్టాని తమిష్టదేవం
నాథంతి కే నామ న లోకనాథమ్॥ ౧౫

ప వి. దారిద్ర్యదారిద్రవిణౌఘవర్షైః। అమోఘమేఘవ్రతమ్। అర్థిసార్థే। సంతుష్టమ్। ఇష్టాని। తమ్। ఇష్టదేవం। నాథంతి। కే। నామ। న। లోకనాథమ్।

టీక॥ దారిద్ర్యదారిద్రవిణౌఘవర్షైః; దారిద్ర్య = పేదరికమును, దారి = ఖండించునట్టి, ద్రవిణౌఘ = ధనరాశియొక్క, వర్షైః = వర్షములచే, అర్థిసార్థే = యాచకసంఘవిషయమున, అమోఘమేఘవ్రతమ్, అమోఘ = వ్యర్థము కాని, మేఘవ్రతం = మేఘముయొక్క వ్రతమును, అనగా ధనరాశిని వర్షించుట యను వ్రతమును ధరించిన, సంతుష్టం = దానములచే హర్షముఁ జెందిన, ఇష్టదేవం = యజ్ఞములచే నారాధింప బడిన దేవతలు గల, తం = ఆ, లోకనాథం = లోకరక్షకుఁ డగు నలుని, కే నామ = ఎవ్వరు, ఇష్టాని = ఇష్టములను, న నాథంతి = యాచించుట లేదు,

సమాసములు :-

దారిద్ర్యదారిద్రవిణౌఘవర్షైః :- దరిద్రస్య భావః = దారిద్ర్యం, దారిద్ర్యం దారయతీతి = దారిద్ర్యదారీ, ద్రవిణానామోఘః = ద్రవిణౌఘః, దారిద్ర్యదారీ చాసౌ ద్రవిణౌఘశ్చ = దారిద్ర్యదారిద్రవిణౌఘః, దారిద్ర్యదారిద్రవిణౌఘస్య వర్షాణి = దారిద్ర్యదారిద్రవిణౌఘవర్షాణి, తైః = దారిద్ర్యదారిద్రవిణౌఘవర్షైః,

అమోఘమేఘవ్రతమ్ :- న మోఘం = అమోఘం, మేఘస్య వ్రతమ్ = మేఘవ్రతమ్, అమోఘం మేఘవ్రతం యస్య సః = అమోఘమేఘవ్రతః. తమ్ = అమోఘమేఘవ్రతమ్.

అర్థిసార్థే :- అర్థినాం సార్థః = అర్థిసార్థః. తస్మిన్ = అర్థిసార్థే.

ఇష్టదేవమ్ :— ఇష్టాః దేవాః యేన సః = ఇష్టదేవః, తమ్ = ఇష్ట దేవమ్.

**లోకనాథమ్** :— **లోకస్య నాథః** = **లోకనాథః**, తమ్ = లోకనాథమ్.

భావము :

దారిద్ర్యమును నిర్మూలించెడి ధనరాసులను వర్షించుటచే యాచకసంఘ విషయమునం దమోఘ మగు మేఘవ్రతమును బూనినవాఁడును, యజ్ఞములచే దేవతల నారాధించినవాఁడును, దానములచే హర్షించినవాఁడును నగు నాలోకరక్ష కుఁడగు నలుని బ్రపంచమం దెవ్వరు దేనిని యాచింపరు. అందఱును తమకు కావలసిన విషయములకై యతనిని యాచించువారే యని యాశయము.

శ్లో॥ అస్మత్కిల శ్రోత్రసుధాం విధాయ
రంభా చిరం భామతులాం నలస్య ।
తత్రానురక్తా తమనాప్య భేజే
తన్నామగంధాన్నలకూబరం సా॥ ౨౬

ప. వి. అస్మత్ । కిల । శ్రోత్రసుధాం । విధాయ । రంభా । చిరం । భాం । అతులాం । నలస్య । తత్ర । అనురక్తా । తం । అనాప్య । భేజే । తన్నామగంధాత్ । నలకూబరం । సా ।

టీక॥ సా = ఆప్రసిద్ధురాలైన, రంభా = రంభ, నలస్య = నలునియొక్క, అతులాం = సాటిలేని. భాం = సౌందర్యమును, అస్మత్ = నావలన, శ్రోత్రసుధాం = కర్ణామృతముగ, విధాయ = చేసికొని, తత్ర = ఆనలుని యందు, అనురక్తా = అనురాగముకల్గిన దై, తం = ఆనలుని, అనాప్య పొందలేక, తన్నామగంధాత్; తన్నామ = అతని నామమందలి, గంధాత్ = "నల" యను స్పర్శముండుటవలన, నలకూబరం = కుబేరునికుమారుఁడైన నలకూబరుని, భేజే కిల = పొందెనుగదా.

సమాసములు :

శ్రోత్రసుధామ్ :— శ్రోత్రయోః సుధా = శ్రోత్రసుధా, తాం = శ్రోత్ర సుధామ్.

అతులామ్ :- అవిద్యమానా తులా యస్యాస్సా = అతులా, తామ్ = అతులామ్.

తన్నామగంధాత్ ;- తస్య నామ = తన్నామ, తన్నామ్నః గంధః = తన్నామగంధః, తస్మాత్ = తన్నామగంధాత్.

భావము :

అప్రసిద్ధసౌందర్యనిధి యగు రంభ నలునియొక్క సాటిలేని సౌందర్యమును నావలన విని యానలునియం దనురక్తురా లై యాతనిని బొందజాలక యాతనినామములోని "నల"శబ్దసంస్పర్శ యుండుటవలన కుబేరుని కుమారుఁ డగు నలకూబరుని వరించినది. కావున నలునిసౌందర్యము రంభాదులకును సువభోగ్యము కాలేదు.

శ్లో॥ స్వర్లోకమస్మాభిరితః ప్రయాతైః
కేళీషు తద్గానగుణాన్నిపీయ ।
హా హేతి గాయన్ యదశోచి తేన
నామ్నైవ హాహా హరిగాయనోఽభూత్॥ ౨౭

ప వి. స్వర్లోకమ్ । అస్మాభిః । ఇతః । ప్రయాతైః । కేళీషు । తద్గానగుణాన్ । నిపీయ । హా । హా । ఇతి । గాయన్ । యత్ । అశోచి । తేన । నామ్నా । ఏవ । హాహా । హరిగాయనః । అభూత్ ।

టీక॥ కేళీషు = వినోదక్రీడలయందు, తద్గానగుణాన్ ; తత్ = ఆనలునియొక్క, గానగుణాన్ = గానమందలి గుణములను, నిపీయ = అనుభవించి, ఇతః = ఇక్కడనుండి, స్వర్లోకం = స్వర్గలోకమును గూర్చి, ప్రయాతైః = వెళ్ళిన, అస్మాభిః = మాచే, హరిగాయనః = ఇంద్రునియొద్ద గాయకుఁ డగు గంధర్వుఁడు, గాయన్ = పాడుచు, యత్ = ఎందువలన, హాహా ఇతి = హాహా యని, అశోచి = దుఃఖింపఁబడెనో, తేనైవ = ఆకారణముచేతనే, నామ్నా = పేరుచే, హాహా = హాహా యని, అభూత్ = ఆయెను.

ఇచ్చట నింద్రగాయకుఁ డగు గంధర్వుని గూర్చి దుఃఖనిమిత్త సంబంధము లేకపోయినను దుఃఖనిమిత్తసంబంధము చెప్పుటవలన

నతిశయోక్త్యలంకారము. ఆయలంకారమువలన నలుని గానవిద్య గంధర్వులను గూడ నతిశయించిన దను వస్తువు వ్యంగ్య మగును గాన నలంకారముచే వస్తుధ్వని.

సమాసములు :

స్వర్లోకమ్ :— స్వః ఇతి లోకః = స్వర్లోకః, తమ్ = స్వర్లోకమ్.
తద్గానగుణాన్ :— తస్య గానం = తద్గానం, తద్గానే గుణాః = తద్గానగుణాః, తాన్ = తద్గానగుణాన్.
హరిగాయనః ;— హరేః గాయనః = హరిగాయనః.

భావము :

వినోదసభలయందు నలుని గానమందలి స్వారస్యము ననుభవించి భూలోకమునుండి స్వర్గలోకమునకుఁ బోయిన మేము దేవేంద్రుని సభ యందు గానముచేయు గంధర్వునిఁ జూచి (హాహా) యని యస్వారస్యమును వెళ్లఁబెట్టుచు దుఃఖించితిమి. కాన నాటినుండి యింద్రగాయకుఁ డగు గంధర్వుఁడు "హాహా" యను నామము నొందెను. అనగా నలునిగానము వినిన మాకు స్వర్గములోని దేవేంద్రుని సభయందలి ప్రధానగాయకుఁ డగు గంధర్వుని గానముపై రోత బుట్టినది అందువలన నతఁడు గానము చేయునపుడు హాహాధ్వనులచే మావిసుగును వెల్లడిఁజేయగా నదియే వానికి నాటినుండి పేరైన దని యాశయము.

శ్లో॥ శృణ్వన్ సదార స్తదుదారభావం
హృష్యన్ముహుర్లోమ పులోమజాయాః।
పుణ్యేన నాఽఽలోకత నాకపాలః
ప్రమోదబాష్పావృతనేత్రమాలః॥ ౨౮

ప. వి. శృణ్వన్ । సదారః । తదుదారభావం । హృష్యత్ । ముహుః । లోమ । పులోమజాయాః । పుణ్యేన । న । ఆలోకత । నాకపాలః । ప్రమోద బాష్పావృతనేత్రమాలః।

టీక॥ నాకపాలః = ఇంద్రుఁడు, సదారః = భార్యతోఁ గూడినవాఁడై, తస్య = ఆ నలునియొక్క, ఉదారభావం = ఔదార్యమును, శృణ్వన్ = వినుచు, (కావుననే) ప్రమోదబాష్పావృతనేత్రమాలః; ప్రమోదబాష్ప = ఆనంద

బాష్పములతో, ఆవృత = కప్పఁబడిన, నేత్రమాలః = నయనపంక్తి గల వాడై, పులోమజాయాః = శచీదేవియొక్క, ముహుః = పలుమాఱు, హృష్యత్ = నలునిపై ననురాగమువలన నిక్కఁబొడుచుకొనిన, లోమ = రోమాంచమును-అనగా గగుర్పాటును, పుణ్యేన = ఆమెయొక్క భాగ్యముచే, నాఽఽలోకత = చూడలేదు.

సమాసములు:

సదారః:- దారైస్సహ వర్తత ఇతి = సదారః.

తదుదారభావమ్:- ఉదారస్య భావః = ఉదారభావః, తస్య ఉదారభావః = తదుదారభావః, తం = తదుదారభావమ్

ప్రమోదబాష్పావృతనేత్రమాలః:- ప్రమోదస్య బాష్పాః = ప్రమోద బాష్పాః, నేత్రాణాం మాలా = నేత్రమాలా, ప్రమోదబాష్పావృతా నేత్ర మాలా యస్య సః = ప్రమోదబాష్పావృతనేత్రమాలః.

భావము:

దేవేంద్రుఁడు తనభార్య యగు శచీదేవితోడఁ గూర్చొని నలుని త్యాగ శీలమును వినుచు నానందబాష్పములచే నావరింపఁబడిన నేత్రపంక్తుని గలవాఁడై యుండెను. ఈవిధముగ నతఁడు కనులు కప్పఁబడినవాడుగ నుండుట శచీదేవి యొక్క యదృష్టముగ నిందు భావింపఁబడినది. ఏల యనగా నలుని త్యాగశీలా దులను వినుటచే శచీదేవిశరీరమునందు పులకము లేర్పడినవి. ఆ పులకములను దేవేంద్రుఁడు చూచినచో నామెకు నలునియం దనురాగ మేర్పడినదా యని సంశయము కలిగెడిది. కాని యానందబాష్పములచే దేవేంద్రుని కన్నులు కప్పఁ బడుటవలన నతనికి జూచుట కవకాశము లేకపోవుటవలన సంశయింపఁబడు ప్రమాదము శచీదేవికిఁ దప్పిపోయినది. అది యామెయదృష్టము.

శ్లో॥ సాఽపీశ్వరే శృణ్వతి తద్గుణౌఘాన్
ప్రసహ్య చేతోహరతోఽర్ధశంభుః।
అభూదపర్ణాంగుళిరుద్ధకర్ణా
కథా న కండూయనకైతవేన?॥

౨౯

ప. వి సా । అపి । ఈశ్వరే । శృణ్వతి । తద్గుణౌఘాన్ । ప్రసహ్య । చేతో హరతః । అర్ధశంభుః । అభూత్ । అపర్ణా । అంగుళిరుద్ధకర్ణా । కదా । న । కండూయనకైతవేన ।

టీక॥ ఈశ్వరే = శివుఁడు, ప్రసహ్య = బలవంతముగ, చేతోహరతః; చేతః = మనస్సును, హరతః = హరించుచున్న, తద్గుణౌఘాన్ = ఆ నలుని యొక్క గుణసమూహములను, శృణ్వతి సతి = వినుచుండఁగా, సా = ఆ ప్రసిద్ధమైన, అర్ధశంభుః = శివుని యర్ధాంగి యగు, అపర్ణాఽపి = పార్వతియు, కదా = ఎప్పుడు, కండూయనకైతవేన; ండూయన = గోకుకొనుట యను, కైతవేన = మిషచే, అంగులిరుద్ధకర్ణా; అంగుళి = వ్రేళ్ళతో, రుద్ధ = మూయఁబడిన, కర్ణా = చెవిగలదిగ, నాఽభూత్ = కాలేదు?

సమాసములు :

తద్గుణౌఘాన్:- తస్య గుణాః = తద్గుణాః, తద్గుణానామోఘాః = తద్గుణౌఘాః, తాన్ = తద్గుణౌఘాన్.
చేతోహరతః:- చేతః హరన్తీతి = చేతోహరంతః, తాన్ = చేతోహరతః.
అర్ధశంభుః:- అర్ధం శంభోః = అర్ధశంభుః.
అంగులిరుద్ధకర్ణా:- అంగులిభిః రుద్ధః = అంగులిరుద్ధః, అంగులిరుద్ధః కర్ణః యస్యాస్సా = అంగులిరుద్ధకర్ణా.
కండూయనకైతవేన:- కండూయనమేవ కైతవమ్ = కండూయనకైతవమ్, తేన = కండూయనకైతవేన.

భావము :

శివుడు బలవంతముగ మనస్సును హరించు నలునిగుణములను వినుచుండగా నా ప్రసిద్ధురాలగు నర్ధశంభువైన పార్వతి యా నలునిగుణములు తన చిత్తము నపహరించి తనయందు వికృతిని గల్గించు నను భయముతో నాగుణములు తనచెవిలో పడకుండుటకై యేనాడు చెవిని గోకుకొనుట యను నెపముతో మూసికొనలేదు? తప్పక చెవిని మూసికొనినది, లేనిచో నామెకుఁ జిత్తచలనమేర్పడెడిది.

శ్లో॥ అలం సజన్ ధర్మవిధౌ విధాతా
రుణద్ధి మౌనస్య మిషేణ వాణీమ్।
తత్కంఠమాలింగ్య రసస్య తృప్తాం
న వేద తాం వేదజడస్స వక్రామ్॥ ౩౦

ప. వి. అలం । సజన్ । ధర్మవిధౌ । విధాతా । రుణద్ధి । మౌనస్య । మిషేణ । వాణీమ్ । తత్కంఠమ్ । ఆలింగ్య । రసస్య । తృప్తాం । న । వేద । తాం । వేదజడః । సః । వక్రామ్ ।

టీక॥ విధాతా = బ్రహ్మ, అలం = మిక్కిలి, ధర్మవిధౌ = ధర్మాచరణమందు, సజన్ = ఆసక్తుఁడగుచు, వాణీం = తనపత్ని యగు సరస్వతిని, వర్ణస్వరూపిణిని, మౌనస్య = వాఙ్నియమన మను వ్రతముయొక్క, మిషేణ = నెపముచే, రుణద్ధి = వారించుచున్నాఁడు, కింతు = కాని, వేదజడః = వేదాభ్యాసముచే జడత్వము నొందిన, (ఛాందసుడైన) సః = ఆ బ్రహ్మ, తత్కంఠమ్ = ఆతనికంఠమును, ఆలింగ్య = కౌగలించుకొని, (తత్కంఠమ్ = ఆతనిముఖమును, ఆలింగ్య = ఆశ్రయించి) రసస్య = ఆతనియందలి యనురాగమునకు–(శృంగారాదినవరసములకు) తృప్తాం = సంతోషించిన, (పోషణముఁబొందిన) వక్రాం = ప్రతికూలముగ సంచరించుదానిని, (వక్రోక్త్యలంకారముతో యుక్తమైనదానిని.) న వేద = తెలిసికొనలేదు.

ఇచ్చట ప్రకృతసరస్వతీదేవివృత్తాంతముచే నప్రకృత మగు వర్ణాత్మక వాణీవృత్తాంతము ప్రతీయమానము గాన ధ్వని.

సమాసములు :

ధర్మవిధౌ:- ధర్మస్య విధిః = ధర్మవిధిః, తస్మిన్ = ధర్మవిధౌ.
తత్కంఠమ్:- తస్య కంఠః = తత్కంఠః, తం = తత్కంఠమ్.
వేదజడః:- వేదేన జడః = వేదజడః.

భావము :

బ్రహ్మ ధర్మాచరణమందాసక్తి గలవాడై తన ధర్మపత్ని యగు సరస్వతీదేవిని (వాక్కును) మౌన మనెడి నెపముతో నలకథలను విననీయక

యుద్ధగించుచున్నాఁడు. కాని వేదజడుఁడైన యా బ్రహ్మ నలునికంఠమును గౌగలించుకొని (నలుని ముఖము నాశ్రయించి) యనురాగముచే తృప్తిఁ జెందినదియు (శృంగారాదిరసవర్గముచేఁ బోషణము నొందినదియు) నై, ప్రతికూల వర్తనము గల యా సరస్వతిని (వక్రోక్త్యలంకారనిర్భర మగు వాక్కును)తెలిసికొనలేకపోయెను. ఆ నలుఁడు శృంగారాదిరసభరిత మగు సాహిత్యమునందు సమర్థుఁ డని యాశయము.

శ్లో॥ శ్రియ స్తదాలింగనభూర్న భూతా
వ్రతక్షతిః కాఽపి పతివ్రతాయాః ।
సమ స్తభూతాత్మతయా న భూతం
తద్భర్తురీర్ష్యాకలుషాణునాఽపి॥ 31

ప. వి. శ్రియః । తదాలింగనభూః । న । భూతా । వ్రతక్షతిః । కా । అపి । పతివ్రతాయాః । సమస్తభూతాత్మతయా । న । భూతం । తద్భర్తుః । ఈర్ష్యాకలుషాణునా । అపి ।

టీక॥ పతివ్రతాయాః = పతివ్రత యైన, శ్రియః = లక్ష్మికి, తద్భర్తుః = ఆమె భర్త యగు విష్ణువునకు, సమస్తభూతాత్మతయా; సమస్తభూత = సర్వప్రాణులకును, ఆత్మతయా = ఆత్మగా నుండుటచే, తదాలింగనభూః; తత్ = ఆనలుని, ఆలింగన = కౌగలించుటచే, భూః = ఏర్పడిన, కాఽపి = ఎవ్విధ మైనదియు, వ్రతక్షతిః = వ్రతభంగము-పాతివ్రత్యభంగము. న భూతా = కలుగలేదు, (అత ఏవ = ఇందువలననే) తద్భర్తుః = ఆలక్ష్మికి భర్త యగు విష్ణువునకు, ఈర్ష్యాకలుషాణునాఽపి; ఈర్ష్యా = అసూయచేత నేర్పడు, కలుష = మాలిన్యముయొక్క, అణునాఽపి = లేశముచేతను, న భూతమ్ = లేదనుట.

ఇచ్చట శచీ సరస్వతీ లక్ష్ములకుఁ జిత్తచాంచల్యమును వర్ణించుటలో నలసౌందర్యాతిశయప్రకటనమందు తాత్పర్య మగుటవలనను,చిత్తచాంచల్యప్రకటనలో తాత్పర్యము లేనందువలనను ననౌచిత్యదోషము లేదు.

సమాసములు :

తదాలింగనభూః :— తస్య ఆలింగనమ్ = తదాలింగనమ్, తదాలింగనేన భవతీతి = తదాలింగనభూః.
వ్రతక్షతిః :— వ్రతస్య క్షతిః = వ్రతక్షతిః,
పతివ్రతాయాః :— పత్యౌ వ్రతం యస్యాస్సా = పతివ్రతా, తస్యాః = పతివ్రతాయాః.
సమస్తభూతాత్మతయా:— సమస్తాని చ తాని భూతాని చ = సమస్తభూతాని, సమస్తభూతానామాత్మా = సమస్తభూతాత్మా, సమస్తభూతాత్మనో భావః = సమస్తభూతాత్మతా, తయా = సమస్తభూతాత్మతయా.
తద్భర్తుః:— తస్యాః భర్తా = తద్భర్తా, తస్య = తద్భర్తుః.
ఈర్ష్యాకలుషాణునా :— ఈర్ష్యాయాః కలుషమ్ = ఈర్ష్యాకలుషమ్, ఈర్ష్యాకలుషస్య అణుః = ఈర్ష్యాకలుషాణుః, తేన = ఈర్ష్యాకలుషాణునా.

భావము:—

శ్రీదేవి యానలుని గౌగలించుకొని యాతని శరీరమునకు శోభాతిశయమును గల్గించుటచే నామె కేలాటి పాతివ్రత్యభంగము నేర్పడలేదు ఏల యనగా నామె భర్త యగు విష్ణువు సమస్తప్రాణికోటికి నాత్మ యై యుండుటచే నలుఁడును విష్ణురూపుఁ డగుటవలన నలుని గౌగలించుకొనినను, విష్ణువునే కౌగలించుకొనిన ట్లగుచున్నది. కావుననే యామె భర్త యగు విష్ణువునకు తనధర్మపత్ని యగు లక్ష్మి నలుని యాలింగనముఁ జేసికొనుటవలన నిసుమంతయు నసూయ కలుగలేదు. నలుని శరీరము శోభాతిశయముతోఁ గూడియున్న దని తాత్పర్యము.

శ్లో॥ ధిక్ తం విధేః పాణిమజాతలజ్జం
నిర్మాతి యః పర్వణి పూర్ణమిందుమ్ ।
మన్యే స విజ్ఞః స్మృతతన్ముఖశ్రీః
కృతార్ధమౌజ్ఝద్భవమూర్ధ్ని యస్తమ్॥ ౩౭

ప. వి. ధిక్ । తం । విధేః । పాణిమ్ । అజాతలజ్జమ్ । నిర్మాతి । యః । పర్వణి। పూర్ణమ్। ఇందుం । మన్యే । సః । విజ్ఞః । స్మృతతన్ముఖశ్రీః। కృతార్ధమ్। ఔజ్ఝత్। భవమూర్ధ్ని । యః । తమ్ ।

టీక॥ తమ్ = ఆప్రసిద్ధ మగు, అజాతలజ్జమ్: అజాత = ఉద్భవించని, లజ్జా = సిగ్గు గల్గిన, విధేః = బ్రహ్మయొక్క, పాణిం = హస్తము మదే శించి, ధిక్ = "ఛీ" యను నింద తగినది, యః = ఏహస్తము, స్మృత తన్ముఖ శ్రీకపిః స్మృత = స్మరింపఁబడిన, తన్ముఖ = ఆనలుని ముఖము యొక్క, శ్రీరపి = సౌందర్యము గలది యైనను, పర్వణి = ప్రతి పూర్ణిమయందును, పూర్ణం = కళలతో పూర్ణ మైన, ఇందుం = చంద్రుని, నిర్మాతి = నిర్మించుచున్నది. సః = చెప్పఁబడు ఆహస్తము, విజ్ఞః = వివేకము గలదిగ, మన్యే = తలంతును, యః = ఏహస్తము, స్మృతతన్ముఖశ్రీః; స్మృత = స్మరింపఁబడిన. తన్ముఖశ్రీః = ఆనలుని ముఖసౌందర్యము గల దై, తం = ఆచంద్రుని, కృతార్ధమ్, కృత = నిర్మింపఁబడిన, అర్ధం = కొంతభాగము గలవానినే. భవమూర్ధ్ని = శివునితలపై, ఔజ్ఝత్ = వదలెను.

సమాసములు :

అజాతలజ్జమ్ :- న జాతా = అజాతా, అజాతా లజ్జా యస్య సః = అజాత లజ్జః తమ్ = అజాతలజ్జమ్.
స్మృతతన్ముఖశ్రీః :- తస్య ముఖమ్ = తన్ముఖమ్, తన్ముఖస్య = శ్రీః తన్ముఖశ్రీః, స్మృతా తన్ముఖశ్రీః యేన సః = స్మృతతన్ముఖశ్రీః.
కృతార్ధమ్ :- కృతః అర్ధః యస్య సః = కృతార్ధః, తమ్ = కృతార్ధమ్.
భవమూర్ధ్ని :- భవస్య మూర్ధా = భవమూర్ధా, తస్మిన్ = భవమూర్ధ్ని.

భావము :

ప్రతిపూర్ణిమయందు పూర్ణచంద్రుని సృజించు బ్రహ్మహస్తము మిక్కిలి నిందింపఁదగినదియు, సిగ్గులేనిదియు నగుచున్నది; ఏల యనగా నది నలునిముఖ సౌందర్యము తెలిసియు చంద్రుని సౌందర్య మంతటిది కాదని గ్రహించియు, మాటిమాటికి పున్నమలయందు బూర్ణచంద్రుని సృజించుచున్నది. కాని నలుని ముఖసౌందర్యమును జ్ఞప్తికి దెచ్చుకొని కొంతభాగము మాత్రమే సృజింపఁబడిన యాచంద్రుని శివుని తలపై విడిచిన హస్తముమాత్రము వివేకవంత మని భావింతును. నలునిముఖము మిక్కిలి యందముతోఁ గూడిన దనుట ముఖ్యాశయము.

శ్లో॥ నిలీయతే హ్రీవిధురః స్వజైత్రం
శ్రుత్వా విధుస్తస్య ముఖం ముఖాన్నః ।
సూరే సముద్రస్య కదాఽపి పూరే
కదాచిదభ్రభ్రమదభ్రగర్భే॥ ౭౩

ప. వి. నిలీయతే । హ్రీవిధురః । స్వజైత్రం । శ్రుత్వా । విధుః । తస్య । ముఖం । ముఖాత్ । నః । సూరే । సముద్రస్య । కదా । అపి । పూరే । కదాచిత్ । అభ్రభ్రమదభ్రగర్భే।

టీక॥ విధుః = చంద్రుఁడు, స్వజైత్రం = తన్ను జయించు స్వభావము గల, తస్య = ఆ నలునియొక్క, ముఖం = మోమును, నః = మాయొక్క, ముఖాత్ = ముఖమునుండి, శ్రుత్వా = విని, హ్రీవిధురః; హ్రీ = లజ్జచే, విధురః = దుఃఖితుఁడై, కదాపి = ఒకప్పుడు (అమావాస్యలయందు), సూరే = సూర్యునియందును, కదాపి = ఒకానొకప్పుడు, సముద్రస్య = కడలియొక్క, పూరే = ప్రవాహమందును, కదాచిత్ = ఒకానొకప్పుడు, అభ్రభ్రమదభ్రగర్భే; అభ్ర = ఆకాశమందు, భ్రమత్ = తిరుగుచున్న, అభ్ర = మేఘములయొక్క, గర్భే = ఉదరమందును, నిలీయతే = దాగుకొనుచున్నాఁడు.

ఇచ్చట సూర్యునియందును, సముద్రప్రవాహమునందును, మేఘములమధ్యమందు చంద్రుఁడు దాగుట స్వాభావిక మైనను నలుని ముఖ సౌందర్యముచే నోడి సిగ్గుజెందుట యను హేతువుచే దాగినట్లు భావించుటవలన నిట నుత్ప్రేక్షాలంకారము. వ్యంజక ప్రయోగము లేనందువలన నది గమ్యము.

సమాసములు :

హ్రీవిధురః :- హ్రియా విధురః = హ్రీవిధురః.

స్వజైత్రమ్ :- జయతీతి = జైత్రం, స్వస్య జైత్రం = స్వజైత్రం, తత్ = స్వజైత్రమ్.

అభ్రభ్రమదభ్రగర్భే :- అభ్రే భ్రమంతి = అభ్రభ్రమంతి, అభ్రభ్రమంతి చ తాని అభ్రాణి = అభ్రభ్రమదభ్రాణి, అభ్రభ్రమదభ్రాణాం గర్భః = అభ్రభ్రమదభ్రగర్భః, తస్మిన్ = అభ్రభ్రమదభ్రగర్భే.

భావము :

చంద్రుఁడు, నలునిముఖము సౌందర్యమున తన్ను జయించు నని మావ లన విని సిగ్గుచే దుఃఖించినవాఁడై యొకప్పుడు- అనగా నమావాస్యలయందు సూర్యునియందును నొకప్పుడు సముద్రప్రవాహములయందును నొకప్పుడు మింటఁ దిరిగెడి మేఘముల మధ్యను దాగుకొనుచున్నాఁడు.లోకమునం దోడిన వారు తమముఖములను బయటికిఁ జూపక కొంతకాలము పొదలయం దుండుట ప్రసిద్ధము గదా. అమావాస్యలయందు చంద్రుడు సూర్యునితోఁ గలియుటయు సముద్రమం దతఁడు జన్మించుటయుఁ బ్రసిద్ధములు.

శ్లో॥ సంజ్ఞాప్య నః స్వధ్వజభృత్యవర్గా
న్దైత్యారిరత్యబ్జనలాస్యనుత్యై ।
తత్సంకుచన్నాభిసరోజపీతా
ద్ధాతుర్విలజ్జం రమతే రమాయామ్॥ ౩౪

ప. వి. సంజ్ఞాప్య । నః । స్వధ్వజభృత్యవర్గాన్ । దైత్యారిః । అత్యబ్జనలాస్య నుత్యై । తత్సంకుచన్నాభిసరోజపీతాత్ । ధాతుః । విలజ్జం । రమతే । రమాయామ్.

టీక॥ దైత్యారిః = విష్ణువు, స్వధ్వజభృత్యవర్గాన్; స్వధ్వజ = తనటెక్క మగు గరుఁడునియొక్క, భృత్యవర్గాన్ = సేవకుల మైన, నః = మమ్ము లను, అత్యబ్జనలాస్యనుత్యై; అత్యబ్జ = పద్మమును మించిన, నలాస్య = నలుని ముఖముయొక్క, నుత్యై = స్తుతికొఱకు, సంజ్ఞాప్య = ఆదేశించి, తత్సంకుచన్నాభిసరోజపీతాత్; తత్ = ఆ స్తుతిచే, సంకుచత్ = ముకుళించుచున్న, నాభిసరోజ = నాభికమలముచే, పీతాత్ = పానము చేయబడుటవలన మఱుగుపడిన, ధాతుః = బ్రహ్మవలన, విలజ్జం = లజ్జాసాధనము లేకుండ, రమాయాం = లక్ష్మియందు, రమతే = క్రీడించు చున్నాఁడు.

ఇచ్చట బ్రహ్మ మఱుగుపడుటవలన విష్ణువు లక్ష్మితో రమించు సంబంధము లేకపోయినను నాసంబంధ మున్నట్లు చెప్పుటచే నతిశయో క్త్యలంకారము.

సమాసములు:-

స్వధ్వజభృత్యవర్గాన్:- స్వస్య ధ్వజః = స్వధ్వజః, స్వధ్వజస్య భృత్యాః = స్వధ్వజభృత్యాః, స్వధ్వజభృత్యానాం వర్గాః = స్వధ్వజభృత్యవర్గాః. తాన్ = స్వధ్వజభృత్యవర్గాన్.

దైత్యారిః:- దైత్యానామరిః = దైత్యారిః.

అత్యబ్జనలాస్యనుత్యై:- అతిక్రాంతమబ్జం = అత్యబ్జం, నలస్య ఆస్యమ్ = నలాస్యమ్, అత్యబ్జం చ తత్ నలాస్యం చ = అత్యబ్జనలాస్యమ్, అత్యబ్జనలాస్యస్య నుతిః = అత్యబ్జనలాస్యనుతిః. తస్యై = అత్యబ్జనలాస్యనుత్యై.

తత్సంకుచన్నాభిసరోజపీతాత్:- తయా సంకోచతీతి = తత్సంకుచత్, నాభేః సరోజమ్ = నాభిసరోజమ్, తత్సంకుచత్ చ తత్ నాభిసరోజం చ = తత్సంకుచన్నాభిసరోజమ్, తత్సంకుచన్నాభిసరోజేన పీతః = తత్సంకుచన్నాభిసరోజపీతః, తస్మాత్ = తత్సంకుచన్నాభిసరోజపీతాత్.

విలజ్జమ్:- విగతా లజ్జా యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = విలజ్జమ్.

భావము :

విష్ణువు తనధ్వజమైన పక్షిరాజగు గరుత్మంతుని సేవకులైన మమ్మలను పద్మాతిశాయి యగు నలముఖమును నుతింప నాదేశింపగా నతని నాభికమలము ముడుచుకొనిపోయినది. అందువలన నానాభికమలమందలి బ్రహ్మ మఱుగుపడెను. దానివలన విష్ణువునకు లక్ష్మితో నేకాంతస్థితి లభించినది. ఆ యవకాశమును బురస్కరించుకొని విష్ణువు లక్ష్మితో లజ్జాభీతి లేక రమించుచుండెను. ఇచ్చట గరుత్మంతుని సేవకులగు హంసలు నలుని ముఖమును నుతింపఁ దొడగగనే కమలము సిగ్గుఁజెంది ముడుచుకొనిపోవుట యేర్పడినదని యాశయము.

శ్లో॥ రేఖాభిరాస్యే గణనాదివాస్య
ద్వాత్రింశతా దంతమయీభిరంతః ।
చతుర్దశాఽష్టాదశ చాత్ర విద్యా
ద్వేధాఽపి సంతీతి శశంస వేధాః॥ 32

ప. వి. రేఖాభిః । ఆస్యే । గణనాత్ । ఇవ । అస్య । ద్వాత్రింశతా । దంతమయీభిః । అంతః । చతుర్దశ। అష్టాదశ । చ । అత్ర। విద్యాః । ద్వేధా। అపి । సంతి । ఇతి । శశంస । వేధాః.

టీక॥ అస్య = ఈ నలునియొక్క, ఆస్యే = ముఖమందు, దంతమయీభిః = దంతరూపములైన, ద్వాత్రింశతా = ముప్పదిరెండైన, రేఖాభిః = రేఖలచే, గణనాత్ = లెక్కించుటవలన, చతుర్దశ = పదునాలుగును, అష్టాదశ చ = పదునెనిమిదియు నగు, విద్యాః = విద్యలు, ద్వేధాఽపి = రెండు విధములుగను, అంతః = లోపల, సంతి = ఉన్నవి, ఇతి = అని, వేధాః = బ్రహ్మ, శశంసేవ = ప్రశంసించెనో యనునట్లుండినది.

ముప్పదిరెండు దంతరేఖలు చతుర్దశవిద్యలకును. అష్టాదశవిద్యలకును పరిగణనహేతువు కాకపోయినను పరిగణనహేతువుగఁ జెప్పఁబడుటవలన నుత్ప్రేక్షాలంకారము.వ్యంజక మగు నివశబ్దము ప్రయుక్తముగాన నది వాచ్యము.

శిక్ష, వ్యాకరణము. ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పమను నారంగములు; ఋక్-యజు-సామాఽథర్వము లను నాలుగు వేదములు; మీమాంస, న్యాయవిస్తరము, పురాణము, ధర్మశాస్త్ర మను నాలుగు విద్యలు కలసి చతుర్దశ విద్య లని యొకమతము.

పై చతుర్దశవిద్యలతో నాయుర్వేద-ధనుర్వేద-గాంధర్వాఽర్థశాస్త్రము లను నాలుగును కల్పినచో నష్టాదశ విద్య లనియు మఱియొక మతము.

సమాసములు:-

ద్వాత్రింశతా:- ద్వాభ్యాం సంకలితాః త్రింశత్ = ద్వాత్రింశత్, తాభిః = ద్వాత్రింశతా.

దంతమయీభిః:- దంతానాం వికారాః = దంతమయ్యః, తాభిః = దంతమయీభిః.

చతుర్దశ:- చతస్రుభిః సంకలితాః దశ = చతుర్దశ.

అష్టాదశ:- అష్టభిస్సంకలితాః దశ = అష్టాదశ.

భావము :

ఈ నలుని ముఖమునందు ముప్పదిరెండు దంతములు గలవు. ఒక మతము ననుసరించి పదునాలు గైన విద్యలు నలునియందున్నవనియు, మఱిక మతము ననుసరించి పదునెనిమి దైన విద్యలు, నలునియందున్నవనియు బ్రహ్మ లెక్కించిన గీతలుగ నాముప్పదిరెండు దంతములు కానవచ్చుచుండినవి. పదునాలుగును బదునెనిమిదియుఁ గలిసినచో ముప్పదిరెం డగును గదా; కావున నారెండు సంఖ్యలను సూచించుటయే ముప్పదిరెండుదంతముల సంఖ్యకుఁ బ్రయోజన మని భావము.

శ్లో॥ శ్రియౌ నరేంద్రస్య నిరీక్ష్య తస్య
స్మరామరేంద్రావపి న స్మరామః ।
వాసేన సమ్యక్ క్షమయోశ్చ తస్మిన్
బుద్ధౌ న దధ్మః ఖలు శేషబుద్ధౌ॥ ౩౬

వ. వి. శ్రియౌ । నరేంద్రస్య । నిరీక్ష్య । తస్య । స్మరామరేంద్రౌ । న । స్మరామః । వాసేన । సమ్యక్ । క్షమయోః । చ । తస్మిన్ । బుద్ధౌ । న దధ్మః । ఖలు । శేషబుద్ధౌ,

టీక॥ తస్య = ఆనలమహారాజుయొక్క, శ్రియౌ = సౌందర్యమును, సంపదను, నిరీక్ష్య = చూచి, స్మరామరేంద్రావపి; స్మర = మన్మథుని, అమరేంద్రావపి = దేవేంద్రునికూడ, న స్మరామః = స్మరింపము; (కిం చ = మఱియు) తస్మిన్ = ఆ నలమహారాజునందు, క్షమయోః = భూమికిని, ఓర్పునకును. సమ్యక్ = చక్కగా, వాసేన = ఉనికియుండుటచే, శేషబుద్ధౌ; శేష = ఆదిశేషుని, బుద్ధౌ = బుద్ధభగవానుని, బుద్ధౌ = బుద్ధియందు, న దధ్మః = ధరింపము.

ఇచ్చట రెండు శ్రీలును, రెండు క్షమలును బ్రకృతములు గాన, కేవలప్రకృతగోచర మగు శ్లేషాలంకారము. దీనివలన సౌందర్యాది గుణములచే నలుఁడు మన్మథుని ఇంద్రుని, ఆదిశేషుని, బుద్ధదేవుని మించినవాఁ డను వ్యతిరేకాలంకారము వ్యంగ్యము. సౌందర్యసంపదలకు

క్రమముగ మన్మథ-దేవేంద్రులతోడను, క్షితిక్షమలకుఁ గ్రమముగ నాదిశేష బుద్ధదేవులతోడను నన్వయ ముండుటవలన యథాసంఖ్యాలంకారము. శ్లేషయథాసంఖ్యముల కిట సంకరము.

సమాసములు :

శ్రియౌ:- శ్రీశ్చ శ్రీశ్చ, శ్రియౌ, తే = శ్రియౌ.
స్మరామరేంద్రౌ:- అమరాణామింద్రః = అమరేంద్రః, స్మరశ్చ, అమరేంద్రశ్చ = స్మరామరేంద్రౌ, తౌ = స్మరామరేంద్రౌ.
క్షమయోః- క్షమా చ క్షమా చ = క్షమే, తయోః = క్షమయోః.
శేషబుద్ధౌ:- శేషశ్చ బుద్ధశ్చ = శేషబుద్ధౌ, తౌ = శేషబుద్ధౌ.

భావము :

ఆ నలమహారాజుయొక్క సౌందర్యమును జూచి మన్మథుని సంపదను జూచి దేవేంద్రుని మనము లెక్కించము. అట్లే యాతని భూభరణశక్తిని గాంచి భూమిని మోయు నాదిశేషుని, ఆతని సహనశక్తిని గాంచి బుద్ధభగవానుని లెక్కించము సౌందర్యాదిగుణములచే నా నలుఁడు మన్మథాదులను మించి యున్నాడు.

శ్లో॥ వినా పతత్రం వినతాతనూజై
స్సమీరణై రీక్షణలక్షణీయైః।
మనోభిరాసీదనణుప్రమాణై
ర్న నిర్జితా దిక్కతమా తదశ్వైః॥ 32

ప వి. వినా । పతత్రం । వినతాతనూజైః । సమీరణైః । ఈక్షణలక్షణీయైః । మనోభిః । ఆసీత్ । అనణుప్రమాణైః । న । నిర్జితా । దిక్ । కతమా । తదశ్వైః.

టీక॥ పతత్రం వినా (స్థితైః) = రెక్కలు లేకయున్న, వినతాతనూజైః; వినతా = వినతాదేవియొక్క, తనూజైః = కుమారు లయినవియు, (అనగా రెక్కలు లేని గరుత్మంతు లైనవియును,) ఈక్షణలక్షణీయైః; ఈక్షణ = నయనములచే, లక్షణీయైః = చూడఁదగిన, సమీరణైః = వాయువు లైనవియును, అనణుప్రమాణైః = అణుప్రమాణము లేని,

మనోభిః = మనస్సులైనవియును నగు, తదశ్వైః = ఆ నలుని గుఱ్ఱము లచే, కతిమా దిక్ = ఏ దిక్కు, న నిర్జితా = లంఘింపఁబడలేదు?

ఇచ్చట నలాశ్వములకు గరుత్మంతులతోడను, వాయువులతోడను, మనస్సులతోడను నభేదరూపణముఁ జేయుటవలన రూపకాలంకారము. పతత్రాదుల లేమిని చెప్పుటవలన న్యూనాభేదరూపకము.

సమాసములు :

వినతాతనూజైః:- వినతాయాః తనూజాః = వినతాతనూజాః, తైః = వినతాతనూజైః. ఈక్షణలక్షణీయైః:- లక్షితుం శక్యాః = లక్షణీయాః, ఈక్షణైః లక్షణీయాః = ఈక్షణలక్షణీయాః, తైః = ఈక్షణలక్షణీయైః. అనణుప్రమాణైః:- అణు ప్రమాణం యేషాం తాని = అణుప్రమాణాని, న అణుప్రమాణాని = అనణుప్రమాణాని, తైః = అనణుప్రమాణైః. తదశ్వైః:- తస్య అశ్వాః = తదశ్వాః, తైః = తదశ్వైః.

భావము :

నలుని గుఱ్ఱములు వేగమునందు ఱెక్కలులేని గరుత్మంతులుగను, కనులచే చూడఁదగిన వాయువులుగను, అణుప్రమాణము లేని మనస్సులుగ నుండినవై యేదిక్కు నవి లంఘింపలేదు. అనగా నవి సమస్తదిక్కులను లంఘించినవి. గరుత్మంతుఁడు, వాయువు, మనస్సు వేగమున సాటిలేనివి. కాని నలాశ్వములు వేగములో వానితో సాటియై యన్ని దిక్కులను లంఘించినవి.

శ్లో॥ సంగ్రామభూమీషు భవత్యరీణా
మస్త్రైర్నదీమాతృకతాం గతాసు।
తద్బాణధారాపవనాశనానాం
రాజవ్రజీయైరసుభిస్సుభిక్షమ్॥ ౩౯

ప. వి. సంగ్రామభూమీషు। భవతి। అరీణామ్। అస్త్రైః। నదీమాతృకతాం। గతాసు। తద్బాణధారాపవనాశనానాం। రాజవ్రజీయైః। అసుభిః। సుభిక్షమ్।

టీక॥ అరీణాం = శత్రువులయొక్క, అస్రైః = రక్తములచే, నదీమాతృకతామ్ = నదులనే తల్లిగాఁ గల్గియుండుటను (అనగా నదీజలములచేఁ బండు సస్యము లను గల్గియుండుటను) గతాసు = పొందినట్టి, సంగ్రామ భూమీషు = యుద్ధభూములయందు, తద్బాణధారాపవనాశనానాం; తత్ = ఆ నలుని యొక్క, బాణధారా = శరపరంపర లనెడి, పవనాశనానాం = గాలిని భుజించెడి సర్పములకు, రాజవ్రజీయైః = రాజసంఘమునకు సంబంధించిన, అసుభిః = ప్రాణవాయువులచే, సుభిక్షమ్ = కఱవు లేకయుండుట, (అనగా నాహారసమృద్ధి) భవతి = అగుచున్నది.

ఇచ్చట సంగ్రామభూములను సస్యక్షేత్రములుగను, రక్తప్రవాహములను నదీప్రవాహములుగను, శరపరంపరలను సర్పములుగను రూపించుటవలన రూపకాలంకారము.

సమాసములు :

సంగ్రామభూమీషు:- సంగ్రామస్య భూమ్యః = సంగ్రామభూమ్యః, తాసు = సంగ్రామభూమీషు.

నదీమాతృకతామ్:- నద్యేవ మాతా యాసాం తాః = నదీమాతృకాః, నదీమాతృకాణాం భావః = నదీమాతృకతా, తాం = నదీమాతృకతాం.

తద్బాణధారాపవనాశనానామ్:- తస్య బాణాః = తద్బాణాః, తద్బాణానాం ధారాః = తద్బాణధారాః, పవనః అశనం యేషాం తే = పవనాశనాః, తద్బాణధారా ఏవ పవనాశనాః = తద్బాణధారాపవనాశనాః, తేషాం = తద్బాణధారాపవనాశనానామ్.

రాజవ్రజీయైః:-రాజ్ఞాం వ్రజాః = రాజవ్రజాః, రాజవ్రజానా మిమే = రాజవ్రజీయాః, తైః = రాజవ్రజీయైః.

సుభిక్షమ్:- భిక్షాణాం సమృద్ధిః = సుభిక్షమ్.

భావము :

శత్రువులయొక్క రక్తప్రవాహములచే నదీమాతృకములుగా నైన యుద్ధభూములయందు నలుని శరపరంపర లనెడి సర్పములకు రాజసమూహముల ప్రాణములచే నాహారసమృద్ధి యేర్పడినది.

శ్లో॥ యశో యదస్యాజని సంయుగేషు
కండూలభావం భజతా భుజేన।
హేతోర్గుణాదేవ దిగాపగాళీ
కూలంకషత్వవ్యసనం తదీయమ్॥ ౩౮

ప. వి. యశః । యత్ । అస్య । అజని। సంయుగేషు । కండూలభావం । భజతా। భుజేన । హేతోః । గుణాత్ । ఏవ । దిగాపగాళీకూలంకషత్వవ్యసనం । తదీయమ్.

టీక॥ సంయుగేషు = యుద్ధములయందు, కండూలభావం = దురదను, భజతా = పొందుచున్న, అస్య = ఈ నలునియొక్క, భుజేన = భుజముచే, యత్ = ఏ, యశః = కీర్తి, అజని = పుట్టింపఁబడినదో, తదీయం = ఆ కీర్తికి సంబంధించిన, దిగాపగాళీకూలంకషత్వవ్యసనమ్; దిగాపగాళీ = దిక్కు లనెడు నదులయొక్క, కూలంకషత్వ = గట్టుల నొరయుట యను విషయమున, వ్యసనం = ఆసక్తి, హేతోః = కారణ మైన, భుజస్య = భుజములయొక్క, గుణాదేవ = గుణములవలన, అనగా దురద యను గుణమువలన (ఆగతమ్ = వచ్చినది.)

దిగాపగాళీకూలంకషత్వవ్యసనమునకు నలభుజగతకండూతి కారణము కాకపోయినను కారణముగ నుత్ప్రేక్షింపఁబడుటవలన నుత్ప్రేక్షాలంకారము. వ్యంజకప్రయోగము లేనందువలన నిది గమ్యము.

సమాసములు :-

కండూలభావం:- కండూం లాతీతి = కండూలః, కండూలస్య భావః = = కండూలభావః, తం = కండూలభావమ్.

దిగాపగాళీకూలంకషత్వవ్యసనమ్:-దిశామాపగాః = దిగాపగాః, దిగాపగానామాళీ = దిగాపగాళీ, కూలం కషతీతి = కూలంకషం, దిగాపగాళ్యాః కూలంకషం = దిగాపగాళీకూలంకషం, దిగాపగాళీకూలంకషస్య భావః = దిగాపగాళీకూలంకషత్వమ్.

తదీయమ్ = తస్య ఇదమ్ = తదీయమ్.

భావము :

యుద్ధములయందు శత్రువుల జయించవలయునను గండూతి గల్గిన యీ నలునిభుజములనే సంపాదింపఁబడిన యశస్సు దిక్కు లనెడి నదుల గట్టు నొరయుచున్నది. అట్లు గట్టు నొరయుటలో నా యశస్సున కాసక్తి గల్గుటకు కారణము హేతుగుణములు కార్యమందు సంక్రమించుస్వభావమే. యశస్సునకు కారణమైనది కండూతితోఁ గూడిన భుజములు. కావున కారణము లయిన భుజముల యందున్న కండూతి (దురద) యను గుణము కార్యమైన యశస్సునందు సంక్రమించినది.

శ్లో॥ యది త్రిలోకీ గణనాపరా స్యాత్
తస్యాస్సమాప్తిర్యది నాయుషః స్యాత్।
పారేపరార్ధం గణితం యది స్యాత్
గణేయనిశ్శేషగుణోఽపి స స్యాత్॥ ౪౦

ప. వి। యది । త్రిలోకీ । గణనాపరా । స్యాత్ । తస్యాః । సమాప్తిః । యది । న। ఆయుషః । స్యాత్ । పారేపరార్ధం । గణితం । యది । స్యాత్ । గణేయనిశ్శేషగుణః । అపి । సః । స్యాత్ ।

టీక॥ త్రిలోకీ = మూఁడులోకములు, గణనాపరా = నలగుణములను లెక్కించుటకు నాసక్తి గలదిగ, స్యాద్యది = అయినచో, తస్యాః = ఆమూడు లోకములయొక్క, ఆయుషః = ఆయువునకు, సమాప్తిః = పరిపూర్తి, న స్యాద్యది = కానిచో, పారేపరార్ధమ్ = కడపటి సంఖ్య యగు పరార్ధమున కావలివైపువఁకును, గణితం యది స్యాత్ = లెక్కింపబడినచో, (తదా = అప్పుడు) సోఽపి = ఆనలుఁడును, గణేయనిశ్శేషగుణః; గణేయ = లెక్కింపదగిన, నిశ్శేష = సమస్తమైన, గుణః = గుణము కలవాఁడుగ, స్యాత్ = అగును.

ఇచ్చట నలగుణములకు గణేయత్వసంబంధము లేకపోయినను గణేయత్వసంబంధము చెప్పఁబడుటవలన నతిశయోక్త్యలంకారము.

సమాసములు :

త్రిలోకీ :– త్రయాణాం లోకానాం సమాహారః = త్రిలోకీ.

గణనాపరా :– గణనాయాం పరా = గణనాపరా.

పారేపరార్ధమ్ :– పరార్ధస్య పారే = పారేపరార్ధమ్.

గణేయనిఃశేషగుణః :– గణితుం శక్యాః = గణేయాః, నిర్గతః శేషః యేభ్యస్తే = నిశ్శేషాః, నిశ్శేషాశ్చ తే గుణాశ్చ = నిశ్శేషగుణాః, గణేయాః నిశ్శేషగుణాఃయస్య సః = గణేయనిశ్శేషగుణః.

భావము :

అనలమహారాజుయొక్క గుణములు పెక్కులు. అవి లెక్కింప సాధ్యములు గావు ఒకవేళ లెక్కింపఁ దలచినచో మూడులోకములలోని ప్రజ అందఱును లెక్కింపఁబూనవలయును. వారి కాయుస్సు పూర్తిఁజెందరాదు. అనగా వారు మరణము లేనివారై యుండవలయును. వారును సంఖ్యలకు పరమావధి యగు పరార్ధమును మించి యెంచవలయును. అట్లు చేయగల్గినచో నలునిగుణములను నిశ్శేషముగ లెక్కింపవచ్చును. అనగా నలునియందు దయాదాక్షిణ్యాదిగుణములు పెక్కులు గల వని యాశయము.

శ్లో॥ అవారితద్వారతయా తిరశ్చా
మంతఃపురే తస్య నివిశ్య రాజ్ఞః ।
గతేషు రమ్యేష్వధికం విశేష
మధ్యాపయామః పరమాణుమధ్యాః॥ ౪౧

ప. వి. అవారితద్వారతయా । తిరశ్చామ్ । అంతఃపురే । తస్య । నివిశ్య । రాజ్ఞః । గతేషు । రమ్యేషు । అధికం । విశేషమ్ । అధ్యాపయామః । పరమాణు మధ్యాః ।

టీ॥ తిరశ్చామ్ = తిర్యగ్జంతువు లైన మావంటి పక్షులకు, అవారితద్వారతయా: అవారిత = అడ్డగింపఁబడని, ద్వారతయా = ద్వారము దలి ప్రవేశము కల్గియుండుటచే, తస్య = ఆ నలమహారాజుయొక్క, అంతఃపురే = అంతఃపురమందు, నివిశ్య = ఉండి, పరమాణుమధ్యాః: పరమాణు =

మిక్కిలి సన్నమైన, మధ్యాః = నడుములు గల్గిన స్త్రీలను. రమ్యేషు = అందము లైన, గతేషు = నడకలయందు, అధికం = అధిక మైన, విశేషం = విశేషమును. అధ్యాపయామః = నేర్పింతుము.

సమాసములు :

అవారితద్వారతయా :— న వారితం = అవారితం, అవారితం ద్వారం యేషాం తే = అవారితద్వారాః, అవారితద్వారాణాం భావః = అవారితద్వారతా, తయా = అవారితద్వారతయా.

పరమాణుమధ్యాః :— పరో మా యస్మాత్తత్ = పరమం, పరమం చ తత్ అణు చ = పరమాణు, పరమాణు మధ్యం యాసాం తాః = పరమాణుమధ్యాః, తాః = పరమాణుమధ్యాః.

భావము :

ఇంతియ కాదు. మాకు నలుని యంతఃపుర స్త్రీలతోడను బరిచయమున్నది. ఏల యనగా మేము తిర్యగ్జంతువుల మగుటవలన మా కంతఃపురమందు ప్రవేశమున కెట్టి నిషేధము లేదు. అందువలన మేము నలునియంతిపురమునం దుండి సన్ననినడుములు గల యందలి స్త్రీలకు నందము లైన నడకలయందలి యపూర్వము లగు విశేషములను నేర్పించుచుందుము.

శ్లో॥ పీయూషధారాఽనధరాభిరంత
స్తాసాం రసోదన్వతి మజ్జయామః ।
రంభాదిసౌభాగ్యరహఃకథాభిః
కావ్యేన కావ్యం సృజతాఽఽదృతాభిః॥ ౪౨

ప. వి. పీయూషధారాఽనధరాభిః । అంతః । తాసాం । రసోదన్వతి । మజ్జయామః । రంభాదిసౌభాగ్యరహఃకథాభిః । కావ్యేన । కావ్యం । సృజతా । ఆదృతాభిః ।

టీక॥ పీయూషధారాఽనధరాభిః; పీయూషధారా = అమృతధారలకంటె. అనధరాభిః = తక్కువ కానివియును కావ్యం = కావ్యమును, సృజతా = రచించుచున్న, కావ్యేన = శుక్రునిచే. ఆదృతాభిః = ఆదరింపఁబడినవియును, రంభాదిసౌభాగ్యరహఃకథాభిః; రంభాది = రంభమున్నగు నప్స

రస్త్రీల, సౌభాగ్య = పతిప్రేమసంబంధ నేర్పడు, రహఃకథాభిః = రహస్య వృత్తాంతవర్ణనలతో, తాసాం = ఆస్త్రీలయొక్క, అంతః = హృదయము, రసోదన్వతి = శృంగార రసమయసాగరమునందు, మజ్జయామః = ముంచెదము.

**సమాసములు :**

పీయూషధారాఽనధరాభిః :— పీయూషస్య ధారాః = పీయూషధారాః, న అధరాః = అనధరాః, పీయూషధారాభ్యః అనధరాః = పీయూషధారానధరాః, తాభిః = పీయూషధారాఽనధరాభిః.

రసోదన్వతి :— రసానాముదన్వాన్ = రసోదన్వాన్, తస్మిన్ = రసోదన్వతి

రంభాదిసౌభాగ్యరహఃకథాభిః :— రంభా ఆదిః యాసాం తాః = రంభాదయః, రంభాదీనాం సౌభాగ్యం = రంభాదిసౌభాగ్యం, రహసి కథాః = రహఃకథాః, రంభాదిసౌభాగ్యస్య రహఃకథాః = రంభాదిసౌభాగ్యరహఃకథాః, తాభిః = రంభాదిసౌభాగ్యరహఃకథాభిః.

కావ్యేన :— కవేరపత్యం పుమాన్ = కావ్యః, తేన = కావ్యేన.

కావ్యమ్ :— కవేః కర్మ = కావ్యమ్, తత్ = కావ్యమ్.

**భావము :**

మేము సలిపి యంతఃపురస్త్రీల సమృతంపుధారల కేమాత్రము తీసిపోనివియు, కావ్యమును రచించు కవిపుత్రుఁడగు శుక్రునిచేతను నాదరింపఁబడినవియు, రంభ మున్నగు నచ్చరలకుఁ దమ తమ ప్రియులతో నేర్పడిన రహస్యపు వలపులను వర్ణించునవియు నగు కథలచే శృంగారరససముద్రముల యందు ముంచుచు నానందపఱచుచుందుము.

శ్లో॥ కాభిర్న తత్రాభినవస్మరాజ్ఞా
విశ్వాసనిక్షేపవణిక్ క్రియేఽహమ్ ।
జిహ్రేతి యన్నైవ కుతోఽపి తిర్య
క్కశ్చిత్తిరశ్చస్త్రపతే న తేన॥ ४३

ప. వి. కాభిః। న। తత్ర । అభినవస్మరాజ్ఞావిశ్వాసనిక్షేపవణిక్। క్రియే । అహమ్। జిహ్రేతి । యత్ । న । ఏవ । కుతః । అపి । తిర్యక్ । కః । చిత్ । తిరశ్చః । త్రపతే । న। తేన ।

టీక॥ (కించ = మఱియు) యత్ = ఎందువలన, తిర్యక్ = తిర్యగ్జంతువులకుఁ జెందిన పక్షి, కుతోఽపి = ఏజనమునుండియు, న జిహ్రేతి = సిగ్గుపడదో, తిరశ్చోఽపి = తిర్యగ్జంతువువలన, కశ్చిత్ = ఏ జనమును, న త్రపతే = సిగ్గుపడదో, తేన = ఆకారణముచే, తత్ర = ఆ యంతఃపురమందలి, కాభిః = ఏస్త్రీలచే, అభినవస్మరాజ్ఞావిశ్వాసనిక్షేపవణిక్; అభినవ = అపూర్వ మైన, స్మరాజ్ఞా = రతిరహస్యవృత్తాంత మను, విశ్వాసనిక్షేప; విశ్వాస = నమ్మకముతో, నిక్షేప = రక్షింపఁదగిన ధనమునకు, వణిక్ = రక్షకుఁ డగు వైశ్యుఁడుగ, అహం = నేను, న క్రియే = చేయఁబడలేదు?

సమాసములు :

అభినవస్మరాజ్ఞావిశ్వాసనిక్షేపవణిక్:-స్మరస్య ఆజ్ఞా = స్మరాజ్ఞా, అభినవా చ సా స్మరాజ్ఞా చ = అభినవస్మరాజ్ఞా, విశ్వాసేన రక్ష్యః నిక్షేపః = విశ్వాసనిక్షేపః, అభినవస్మరాజ్ఞైవ విశ్వాసనిక్షేపః = అభినవస్మరాజ్ఞా విశ్వాసనిక్షేపః, అభినవస్మరాజ్ఞావిశ్వాసనిక్షేపస్య వణిక్ = అభినవ స్మరాజ్ఞావిశ్వాసనిక్షేపవణిక్.

భావము ;

లోకమునఁ దిర్యగ్జంతు వగు నావంటి పక్షి యెవనివలనను సిగ్గుపడదు. అట్లే యేజనమును దిర్యగ్జంతువువలన సిగ్గుపడదు. కావున నిది నాకంతఃపుర స్త్రీల పరిచయమునకు మిగుల నుపయోగపడినది. అందువలన నంతఃపురము నందలి స్త్రీలు తమకు సంబంధించిన రతిరహస్యవృత్తాన్తములను నాయొద్ద నెట్టి సంకోచము లేక చెప్పఁగల్గెడివారు. కావుననే నేను వారిచే తమరతిరహస్య వృత్తాంతము లనెడి గోప్యము లగు ధనములకు కుదువలకు వైశ్యునివలె రక్షకుఁడుగఁ జేయబడి వారికి మిక్కిలి విశ్వాసపాత్రుఁడుగ నుంటిని.

శ్లో॥ వార్తా చ సాఽసత్యపి నాన్యమేతి
యోగాదరంధ్రే హృది యాం నిరుంధే।
విరించినానాననవాదధౌత
సమాధిశాస్త్రశ్రుతిపూర్ణకర్ణః॥ ౪౪

ప. వి. వార్తా । చ । సా । అసతీ । అపి । న । అన్యమ్ । ఏతి । యోగాత్ । అరంధ్రే । హృది । యాం । నిరుంధే । విరించినానాననవాదధౌతసమాధిశాస్త్రశ్రుతిపూర్ణకర్ణః.

టీక॥ విరించినానాననవాదధౌతసమాధిశాస్త్రశ్రుతిపూర్ణకర్ణః; విరించి = బ్రహ్మయొక్క, నానా = పెక్కులైన, ఆనన = ముఖములతోటి, వాద = వ్యాఖ్యానములచే. ధౌత = పరిశుద్ధముగాఁ జేయఁబడిన, సమాధిశాస్త్ర = యోగశాస్త్రముయొక్క, శ్రుతి = శ్రవణముచే, పూర్ణ = నిండిన, కర్ణః = చెవులుగల, (అహం = నేను) యోగాత్ = చిత్తవృత్తినిరోధమను యోగమువలన, అరంధ్రే = అవకాశము లేని, హృది = హృదయమందు, యాం = ఏ వార్తను, నిరుంధే = అడ్డగించుచున్నానో, సా = ఆ, వార్తా చ = లోకవృత్తాంతముకూడ, అసత్యపి = వినోదముకొఱకుఁ జెప్పఁబడుటచే నసత్యమయినను, అన్యం = మఱియొక పురుషుని, నైతి = పొందదు.

ఇచ్చట లోకవార్తానిరోధమునకు విరించినానాననవాదధౌతసమాధిశాస్త్రశ్రుతిపూర్ణకర్ణత్వము హేతువు గాన పదార్థహేతుకకావ్యలింగాలంకారము.

సమాసములు :

అసతీ:- న సతీ = అసతీ.

అరంధ్రే:- అవిద్యమానం రంధ్రం యస్మిన్ తత్ = అరంధ్రమ్, తస్మిన్ = అరంధ్రే.

విరించినానాననవాదధౌతసమాధిశాస్త్రశ్రుతిపూర్ణకర్ణః:- నానావిధాని చ తాని ఆననాని చ = నానాననాని, విరించేః నానాననాని = విరించినానాననాని,

విరించినాననైః వాదః = విరించినాననవాదః, విరించినాననవాదేన ధౌతం = విరించినాననవాదధౌతం, సమాధేః శాస్త్రమ్ = సమాధిశాస్త్రమ్, విరించినాననవాదధౌతం చ తత్ సమాధిశాస్త్రం చ = విరించినాననవాదధౌతసమాధిశాస్త్రం, విరించినాననవాదధౌతసమాధిశాస్త్రస్య శ్రుతిః = విరించినాననవాదధౌతసమాధిశాస్త్రశ్రుతిః, విరించినాననవాదధౌతసమాధిశాస్త్రశ్రుత్యా పూర్ణౌ = విరించినాననవాదధౌతసమాధిశాస్త్రశ్రుతిపూర్ణౌ, విరించినాననవాదధౌతసమాధిశాస్త్రశ్రుతిపూర్ణౌ కర్ణౌ యస్య సః = విరించినాననవాదధౌతసమాధిశాస్త్రశ్రుతిపూర్ణకర్ణః.

భావము :

నేను బ్రహ్మయొక్క నానాముఖములవలని వ్యాఖ్యానముచేఁ బరిశుద్ధమై వెలసిన యోగశాస్త్రమును చక్కఁగా వినినవాఁడను. కావుననే వినోదమునకై యొరులచేఁ జెప్పఁబడిన యసత్యమగు లోకవృత్తాంతమును గూడ నొరుల చెవులకు సోకనీయక నా యోగాభ్యాసపటిమవలన నెట్టియవకాశము లేని నా హృదయమునఁ గాపాడఁగలను. కావున నాతోఁ జెప్పిన వినోదవిషయమే యిట్టి కట్టుదిట్టములతోఁ గాపాడఁబడినపుడు సత్యవిషయ మెట్లు గాపాడఁబడునో వేఱుగఁ జెప్పనవసరము లేదు. కావున నేను మిగుల విశ్వాసపాత్రుఁడను.

శ్లో॥ నలాశ్రయేణ త్రిదివోపభోగం
తవాఽనవాప్యం లభతే బతాన్యా।
కుముద్వతీవేందుపరిగ్రహేణ
జ్యోత్స్నోత్సవం దుర్లభమంబుజిన్యాః॥ ౪౫

ప. వి. నలాశ్రయేణ । త్రిదివోపభోగం । తవ । అనవాప్యం । లభతే । బత । అన్యా । కుముద్వతీ । ఇవ । ఇందుపరిగ్రహేణ । జ్యోత్స్నోత్సవం । దుర్లభమ్ । అంబుజిన్యాః ।

టీక॥ తవ = నీకు, అనవాప్యం = పొంద శక్యముగాని, త్రిదివోపభోగమ్; త్రిదివ = స్వర్గముయొక్క, ఉపభోగం = అనుభవమును, అనగా స్వర్గతుల్యభోగమును, అంబుజిన్యాః = తామరతీగెకు, దుర్లభం = పొంద శక్యముగాని, జ్యోత్స్నోత్సవం = చంద్రికాభోగమును, ఇందు

పరిగ్రహేణ = చంద్రుని పరిగ్రహించుటవలన, కుముద్వతీవ = కలువ తీగెవలె, నలాశ్రయేణ = నలుని పరిగ్రహించుటచే, అన్యా = మఱి యొకతె, లభతే = పొందుచున్నది. బత = కష్టము.

దమయంతీ తదన్యలకు అంబుజినీకుముద్వతులతో నౌపమ్య ముండుటవలన నుపమాలంకారము.

సమాసములు :

నలాశ్రయేణ:- నల ఏవ ఆశ్రయః = నలాశ్రయః, తేన = నలాశ్రయేణ.
త్రిదివోపభోగమ్:- త్రిదివస్య ఉపభోగః = త్రిదివోపభోగః, తమ్ = త్రిదివోపభోగమ్.

అనవాప్యమ్;- అవాప్తుం శక్యః = అవాప్యః, న అవాప్యః = అనవాప్యః, తమ్ = అనవాప్యమ్.

కుముద్వతీ:- కుముదమస్యాః అస్తీతి = కుముద్వతీ.

ఇందుపరిగ్రహేణ:- ఇందోః పరిగ్రహః = ఇందుపరిగ్రహః, తేన = ఇందుపరిగ్రహేణ.

జ్యోత్స్నోత్సవమ్:- జ్యోత్స్నాయాః ఉత్సవః = జ్యోత్స్నోత్సవః, తమ్ = జ్యోత్స్నోత్సవమ్.

అంబుజిన్యాః:- అంబుజమస్యాః అస్తీతి = అంబుజనీ. తస్యాః = అంబుజిన్యాః.

భావము :

చంద్రపరిగ్రహము లేనందువలన పద్మినికి చంద్రికోత్సవము దుర్లభము. చంద్రపరిగ్రహము కల్గినందువలన కలువకుఁ జంద్రికోత్సవము సులభ మగుచున్నది. ఇట్లు పద్మినికి దుర్లభ మైన చంద్రికోత్సవము చంద్రపరిగ్రహముచే కుముదినికి లభించినట్లు, నీకు నలపరిగ్రహము లేనందువలన దుర్లభ మైన స్వర్గ సదృశభోగమును నలపరిగ్రహముచే మఱియొకతె యనుభవించును. నీవంటివారి కది దుర్లభ మగుట మిక్కిలి కష్ట మయిన విషయము.

శ్లో॥ తన్నైషధానూఢతయా దురాపం
శర్మ త్వయాఽస్మత్కృతచాటుజన్మ।
రసాలవల్ల్యా మధుపానువిద్ధం
సౌభాగ్యమప్రాప్తవసంతయేవ॥ ౪౬

ప. వి. తత్ । నైషధానూఢతయా । దురాపం । శర్మ । త్వయా । అస్మత్కృత చాటుజన్మ । రసాలవల్ల్యా । మధుపానువిద్ధమ్ । సౌభాగ్యమ్ । అప్రాప్తవ సంతయా । ఇవ ।

టీక॥ (కించ = మఱియు) తత్ = ప్రసిద్ధ మైన, అస్మత్కృతచాటుజన్మ; అస్మత్ = మాచే, కృత = చేయఁబడిన, చాటు = ప్రియవచనములనుండి, జన్మ = ఉత్పత్తిగల్గిన, శర్మ = సుఖము, త్వయా = నీచేత, అప్రాప్తవ సంతయా; అప్రాప్త = పొందఁబడని, వసంతయా = వసంతఋతువు గల్గిన, రసాలవల్ల్యా = మామిడితీగచే, మధుపానువిద్ధమ్; మధుప = తుమ్మెదలచే, అనువిద్ధం = అనుసరింపఁబడిన, సౌభాగ్యమివ = సౌందర్యమువలె, నైషధాఽనూఢతయా; నైషధ = నలునిచే, అనూఢ తయా = వివాహమాడఁబడనందుచే, దురాపమ్ = దుర్లభ మైనది.

అప్రాప్తవసంత యగు రసాలవల్లికిని నైషధానూఢదమయంతికి నుపమానోపమేయభావముఁ జెప్పుటవలన నుపమాలంకారము.

సమాసములు :

నైషధానూఢతయా:- నిషధానాం రాజా = నైషధః, న ఊఢా = అనూఢా, అనూఢాయాః భావః = అనూఢతా, నైషధేన అనూఢతా = నైషధా నూఢతా, తయా = నైషధానూఢతయా.

దురాపమ్:- దుఃఖేన ఆప్తుం శక్యమ్ = దురాపమ్.

అస్మత్కృతచాటుజన్మ:- అస్మాభిః కృతాని = అస్మత్కృతాని, అస్మ త్కృతాని చ తాని చాటూని చ = అస్మత్కృతచాటూని, అస్మత్కృత చాటుభ్యః జన్మ యస్య తత్ = అస్మత్కృతచాటుజన్మ.

రసాలవల్ల్యాః:- రసాల ఏవ వల్లీ = రసాలవల్లీ, తయా = రసాలవల్ల్యా.

**మధుపానువిద్ధమ్:**- మధు పిబంతీతి = మధుపాః, మధుపైరనువిద్ధమ్ = మధుపానువిద్ధమ్.

**అప్రాప్తవసంతయా:**- న ప్రాప్తః అప్రాప్తః, అప్రాప్తః వసంతః యయా సా = అప్రాప్తవసంతా, తయా = అప్రాప్తవసంతయా.

**భావము :**

వసంత ఋతువును బొందని సహకారలతకు తుమ్మెదలతోఁ గూడిన సౌందర్య మెట్లు దుర్లభమో అట్లే నీకును నలుని పరిణయమాడనందుచే మేము చెప్పిన ప్రియవచనములనుండి యేర్పడిన సుఖము దుర్లభము. మామిడి తీగెలపై వసంతము రానంతవరకును తుమ్మెదలు వాలుటచే నేర్పడు శోభ దుర్లభము. అట్లే నలుని పెండ్లియాడనంతవరకును మేము చెప్పిన స్వర్గతుల్య సౌఖ్యము నీకు లభింపదు. కావున నలుని బరిణయమాడుటకు నీవు ప్రయత్నింపవలయును.

శ్లో॥ తస్యైవ వా యాస్యసి కిం న హస్తం
దృష్టం విధేః కేన మనః ప్రవిశ్య।
అజాతపాణిగ్రహణాఽసి తావ
ద్రూపస్వరూపాతిశయాశ్రయశ్చ॥ ४२

ప. వి. తస్య । ఏవ । వా । యాస్యసి । కిం । న । హస్తం । దృష్టం । విధేః । కేన । మనః । ప్రవిశ్య । అజాతపాణిగ్రహణా । అసి । తావత్ । రూపస్వరూపాతిశయాశ్రయః । చ ।

టీక॥ యద్వా = లేదా, తస్యైవ = ఆ నలునియొక్కయే, హస్తం = చేతిని, కిం న యాస్యసి = ఏల పొందవు? కేన = ఎవనిచే, విధేః = బ్రహ్మ యొక్క, మనః = మనస్సు, ప్రవిశ్య = ప్రవేశించి, దృష్టం = చూడఁబడినది, (కుతః = ఎందువలన ననగా) తావత్ = ఇంతవరకును, అజాత పాణిగ్రహణా; అజాత = నెరవేరని, పాణిగ్రహణా = వివాహము కలదిగ, అసి = అగుచున్నావు, రూపస్వరూపాతిశయాశ్రయశ్చ; రూప = సౌందర్యమును, స్వరూప = స్వభావము నను నీరెంటియొక్క, అతిశయ = ఆధిక్యమునకు, ఆశ్రయశ్చ = ఆశ్రయ మయినదానవు.

సమాసములు :

అజాతపాణిగ్రహణా:- న జాతమ్ = అజాతమ్, పాణౌ గ్రహణమ్ = పాణిగ్రహణమ్, అజాతం పాణిగ్రహణం యస్యాస్సా = అజాత పాణిగ్రహణా.

రూపస్వరూపాతిశయాశ్రయః:- రూపం చ స్వరూపం చ = రూప స్వరూపే, రూపస్వరూపయోరతిశయః = రూపస్వరూపాతిశయః, రూప స్వరూపాతిశయస్య ఆశ్రయః = రూపస్వరూపాతిశయాశ్రయః.

భావము :

లేదా నీవా నలుని హస్తమున కేల బోవు? తప్పక పోఁగల వనియే తోచుచున్నది. బ్రహ్మహృదయమును బ్రవేశించి జరుగఁగల విషయము నెవ డెఱింగెను? అనగా దైవానుకూల్యము కూడ నీ విషయమం దుండవచ్చును. మఱియు నీకింతవఱకును పెండ్లి కాలేదు గదా. సౌందర్యస్వభావములకు నీయం దేమి తక్కువ. అన్నియు సమగ్రముగ నీయం దొనఁగూడియున్నవి. కావున నీ వతనిచేతియందుఁ బడగలవు.

శ్లో॥ నిశా శశాంకం శివయా గిరీశం
శ్రియా హరిం యోజయతః ప్రతీతః।
విధేరపి స్వారసికః ప్రయాసః
పరస్పరం యోగ్యసమాగమాయ॥ ౪౧

ప. వి. నిశా । శశాంకం । శివయా । గిరీశం । శ్రియా । హరిం । యోజయతః । ప్రతీతః । విధేః । అపి । స్వారసికః । ప్రయాసః । పరస్పరం । యోగ్యసమాగమాయ ।

టీక॥ నిశా = రాత్రితో, శశాంకం = చంద్రుని, శివయా = పార్వతితో, గిరీశం = శివుని, శ్రియా = లక్ష్మితో, హరిం చ = విష్ణువును, యోజయతః = కూర్చుచున్న, విధేః = బ్రహ్మయొక్క, ప్రయాసోఽపి = ప్రయత్నమును, పరస్పరం = ఒండొరులకు, యోగ్యసమాగమాయ =

అనురూపుల కలయికకై, స్వారసికః = స్వాభావికముగ నేర్పడినదిగ, ప్రతీతః = తెలియఁబడినది.

సమాసములు :

స్వారసికః:- స్వరసేన ప్రవృత్తః = స్వారసికః.
యోగ్యసమాగమాయ:- యోగ్యయోస్సమాగమః = యోగ్యసమాగమః, తస్మై = యోగ్యసమాగమాయ.

భావము :

అనురూపు లగు వధూవరులను గలుపుటలో ప్రయత్నము స్వభావసిద్ధ ముగనే యుండు నని ప్రసిద్ధము. ఏల యనగా— ఆ బ్రహ్మ రాత్రితో చంద్రుని, పార్వతితో శివుని, లక్ష్మితో విష్ణువును గలిపి యున్నాడు. ఈ దృష్టాంతములవలన బ్రహ్మకు ననురూపులను గలుపుటలో స్వాభావిక మయిన ప్రయత్న ముండు నని తెలియుచున్నది. కావున నవ్విధముగనే నీతో నలునిఁ గూర్చు నని తోచుచున్నది.

శ్లో॥ వేలాతిగస్త్రైణగుణాబ్ధివేణీ
న యోగయోగ్యాఽసి నలేతరేణ।
సన్దృర్భ్యతే దర్భగుణేన మల్లీ
మాలా న మృద్వీ భృశకర్కశేన॥ ४८

ప. వి. వేలాతిగస్త్రైణగుణాబ్ధివేణీ । న । యోగయోగ్యా । అసి । నలేతరేణ । సన్దృర్భ్యతే । దర్భగుణేన । మల్లీమాలా । న। మృద్వీ । భృశకర్కశేన ।

టీక॥ వేలాతిగస్త్రైణగుణాబ్ధివేణీ: వేలా = హద్దును, అతిగ = మించినటు వంటి, (అనగా నెల్లలేని) స్త్రైణ = స్త్రీలకు సంబంధించిన, గుణ = గుణము లనెడు, అబ్ధి = సముద్రముయొక్క, వేణీ = ప్రవాహ మైన, [త్వం = నీవు] నలేతరేణ = నలునికంటె భిన్న మగు వానితో, యోగ యోగ్యా = సంబంధమున కర్హురాలుగ, నాఽసి = కావు. [తథా హి = అది యట్లే యగును, ఏల యనగా] మృద్వీ = మృదు వైన, మల్లీ మాలా = మల్లెపూలదండ, భృశకర్కశేన = మిక్కిలి కఠిన మైన, దర్భగుణేన = దర్భమయ మైన దారముతో, న సందృర్భ్యతే = కట్టఁ బడదు.

ఇచ్చట దమయంతీ నలేతరులకు, మల్లీమాలా—దర్భగుణములతో బింబప్రతిబింబభావమున సామ్యము సంపాదించుటవలన దృష్టాంతాలంకారము. అది యుభయవాక్యార్థములయందును నఙ్ క్రియార్థగోచర మగుట వలన వ్యతిరేకముఖ మగు దృష్టాంతాలంకారము.

సమాసములు :-

వేలాతిగస్త్రైణగుణాబ్ధివేణీ:- వేలామతిగచ్ఛంతీతి = వేలాతిగాః, స్త్రీణామిమే = స్త్రైణాః, స్త్రైణాశ్చ తే గుణాశ్చ = స్త్రైణగుణాః, వేలాతిగాశ్చ తే స్త్రైణగుణాశ్చ = వేలాతిగస్త్రైణగుణాః, వేలాతిగస్త్రైణగుణా ఏవ అబ్ధిః = వేలాతిగస్త్రైణగుణాబ్ధిః, వేలాతిగస్త్రైణగుణాబ్ధేః వేణీ = వేలాతిగస్త్రైణగుణాబ్ధివేణీ.

యోగయోగ్యా:- యోగస్య యోగ్యా = యోగయోగ్యా.

దర్భగుణేన:- దర్భమయశ్చాసౌ గుణశ్చ = దర్భగుణః, తేన = దర్భగుణేన.

మల్లీమాలా:- మల్లీనాం మాలా = మల్లీమాలా.

భృశకర్కశేన:- భృశం కర్కశః = భృశకర్కశః, తేన = భృశకర్కశేన.

భావము :

నీ వెల్లలేని స్త్రీగుణము లను సముద్రమునకు ప్రవాహ మైనదానవు. కావున నీవంటి కన్యకు నలునికంటె భిన్న మయినవాఁ డెవ్వఁడును వివాహమున కర్హుఁడు గాడు. కావున నీవు నలుని వివాహమాడుట యుక్తము. లోకమున మల్లెదండలను మిగుల కఠిన మయిన దర్భలదారముతో నెవ్వరును కట్టరు. మృదువైన మల్లెదండకు మృదువైన దార మెట్లు తగునో యట్లే నీవంటి గుణవంతురాలికి నలునివంటి గుణవంతుడే యర్హుఁడు.

శ్లో॥ విధిం వధూసృష్టిమపృచ్ఛమేవ
తద్యానయుగ్యో నలకేళియోగ్యామ్।
త్వన్నామవర్ణా ఇవ కర్ణపీతా
మయాఽస్య సంక్రీడతి చక్రచక్రే॥ ౨౦

ప. వి.విధిం। వధూసృష్టిమ్। అపృచ్ఛమ్।ఏవ। తద్యానయుగ్యః। నలకేళియోగ్యామ్। త్వన్నామవర్ణాః । ఇవ । కర్ణపీతాః । మయా । అస్య । సంక్రీడతి । చక్రచక్రే ।

టీక॥ [కించ = మఱియు] విధిం = బ్రహ్మను, నలకేళియోగ్యామ్; నల = నలునియొక్క, కేళి = క్రీడకు. యోగ్యాం = తగిన, వధూసృష్టిం = స్త్రీ సృష్టిని గూర్చి, తద్యానయుగ్యః; తత్ = ఆ బ్రహ్మయొక్క, యాన = రథమునకు, యుగ్యః = ఈడ్చునట్టి జంతువుగ, అహం = నేను, అపృచ్ఛమేవ = అడిగినాడను, మయా = నాచే, అస్య = అతని రథము యొక్క, చక్రచక్రే; చక్ర = చక్రములయొక్క, చక్రే = సమూహము, సంక్రీడతి సతి = శబ్దించుచుండగా, త్వన్నామవర్ణాః; త్వత్ = నీయొక్క, నామ = పేరునందలి, వర్ణాః = అక్షరములు, కర్ణపీతా ఇవ = చెవులచే వినఁబడినవిగ నుండినవి.

సమాసములు :

వధూసృష్టిమ్:- వధ్వాః సృష్టిః = వధూసృష్టిః, తామ్ = వధూసృష్టిమ్.
తద్యానయుగ్యః:- తస్య యానమ్ = తద్యానమ్, యుగం వహతీతి = యుగ్యః, తద్యానస్య యుగ్యః = తద్యానయుగ్యః.

నలకేలియోగ్యామ్:- నలస్య కేలిః = నలకేలిః, నలకేలేః యోగ్యా = నలకేలియోగ్యా, తాం = నలకేలియోగ్యామ్.

త్వన్నామవర్ణాః:- తవ నామ = త్వన్నామ, త్వన్నామ్నః వర్ణాః = త్వన్నామవర్ణాః.
కర్ణపీతాః:- కర్ణాభ్యాం పీతాః = కర్ణపీతాః.

భావము :

నేను బ్రహ్మకు రథమును లాగువాఁడనుగఁ బరిచితుఁడనై నలునికేలికిఁ దగిన స్త్రీసృష్టినిఁ గూర్చి యడిగితిని. అతని రథచక్రములు శబ్దించుచుండగా 'దమయంతి' యను నీపేరునందలి యక్షరములనే బ్రహ్మ పలికినట్లుగ నేను వింటిని. కావున నిన్ను నలునకుఁ దగిన వధువుగ బ్రహ్మ సృజించెను.

శ్లో॥ అన్యేన పత్యా త్వయి యోజితాయాం
విజ్ఞత్వకీర్త్యా గతజన్మనో వా।
జనాపవాదార్ణవముత్తరీతుం
**విధా విధాతుః కతమా తరీ స్యాత్॥** ౫౧

ప. వి. అన్యేన । పత్యా । త్వయి । యోజితాయాం । విజ్ఞత్వకీర్త్యా । గతజన్మనః। వా । జనాపవాదార్ణవమ్ । ఉత్తరీతుం । విధా । విధాతుః । కతమా । తరీ। స్యాత్।

టీక॥ (కించ = మఱియు) అన్యేన = నలునికంటె నితరుఁడైన, పత్యా = భర్తతో, త్వయి = నీవు, యోజితాయాం సత్యాం = కూర్చఁబడినదానవు కాగా, విజ్ఞత్వకీర్త్యాః విజ్ఞత్వ = వివేకవంతుఁ డను భావమువలన నేర్పడిన, కీర్త్యా = యశస్సుచే, గతజన్మనః; గత = గతించిన, జన్మనః = జన్మముగల, విధాతుర్వా = బ్రహ్మకుఁ గూడ, జనాపవాదార్ణవమ్; జన = జనులయొక్క, అపవాద = అపవాద మను, అర్ణవం = సముద్రమును, ఉత్తరీతుం = దాటుటకు, కతమా విధా = ఏవిధమయిన, తరీ = ఓడ, స్యాత్ = ఉండును.

సమాసములు :

విజ్ఞత్వకీర్త్యాః- విజ్ఞస్య భావః = విజ్ఞత్వమ్. విజ్ఞత్వేన కీర్తిః = విజ్ఞత్వకీర్తిః, తయా, విజ్ఞత్వకీర్త్యా.
గతజన్మనః- గతం జన్మ యస్య సః = గతజన్మా, తస్య = గతజన్మనః.

జనాపవాదార్ణవమ్:- జనానామపవాదః = జనాపవాదః, జనాపవాద ఏవ అర్ణవః = జనాపవాదార్ణవః, తమ్ = జనాపవాదార్ణవమ్.

భావము :

నిన్నొకవేళ బ్రహ్మ నలునికంటె భిన్న మయిన భర్తతోఁ గూర్చినచో చిరకాలము విజ్ఞానవంతుఁ డను కీర్తితో జన్మము గడుపుకొనుచున్న యతడు తప్పక జనాపవాదమునకు గుఱి కాఁగలడు. అతని కీ జనాపవాద మను సముద్ర

మును తరించుటకు నెవ్విధ మైన యోడ లభించును? అనగా నెవ్విధ మైన యోడయు లభింపదు. జనాపవాదసాగరమున నతఁడు తప్పక మునుగవలసియే యుండును. కాన నీకు నలేతరుఁ డెవ్వఁడును భర్త కాఁజాలడు.

శ్లో॥ ఆస్తాం తదప్రస్తుతచింతయాఽలం
మయాఽసి తన్వి శ్రమితాఽతివేలమ్।
సోఽహం తదాగః పరిమార్ష్టుకామ
స్తవేప్సితం కిం విదధేఽభిధేహి॥ ౨౭

ప. వి. ఆస్తాం। తత్। అప్రస్తుతచింతయా। అలం। మయా। అసి। తన్వి। శ్రమితా। అతివేలమ్। సః। అహం। తత్। ఆగః। పరిమార్ష్టుకామః। తవ। ఈప్సితం। కిం। విదధే। అభిధేహి।

టీక॥ తత్ = ఆ ముందుఁ జెప్పఁబడిన విషయము, ఆస్తామ్ = ఉండనిమ్ము, అప్రస్తుతచింతయా = అప్రకృతవిషయము నాలోచించుటతో, అలం = చాలును, [కింతు = కాని] హేతన్వి = ఓకృశాంగీ, మయా = నాచే, అతివేలమ్ = మిక్కిలి, శ్రమితా = కష్టము నొందింపఁబడినదానవుగ, అసి = అగుచున్నావు, తత్ = ఆ శ్రమను బెట్టుట యను, ఆగః = అపరాధమును, పరిమార్ష్టుకామః = పోగొట్టుకొనఁ గోరిన, సోఽహం = అట్టి నేను, తవ = నీయొక్క, ఈప్సితమ్ = ఇష్టమును, కిం = దేనిని, విదధే = చేయుదును, అభిధేహి = చెప్పుము.

సమాసములు :

అప్రస్తుతచింతయా:- న ప్రస్తుతమ్ = అప్రస్తుతమ్, అప్రస్తుతస్య చింతా = అప్రస్తుతచింతా, తయా, అప్రస్తుతచింతయా.

అతివేలమ్:- వేలమతిక్రాంతం యథా తథా = అతివేలమ్.

పరిమార్ష్టుకామః:- పరిమార్ష్టుం కామః యస్య సః = పరిమార్ష్టుకామః.

భావము :

ఆవిషయ మిఁక నుండనిమ్ము. అప్రస్తుత మగు నావిషయములను గూర్చి యాలోచింపఁ బనిలేదు. ప్రస్తుతవిషయముల నాలోచించుకొనెదము. కృశాంగి వైన

నీవు నావలనఁ జాల శ్రమ పరుచఁబడితివి. నే నాయపరాధముఁ దొలగించుకొను టకై నీ కేదైనను బ్రియముఁ జేయనెంచుచున్నాను. దేనిఁ జేయఁగోరుదువో తెలుపుము.

శ్లో॥ ఇతీరయిత్వా విరరామ పత్రీ
స రాజపుత్రీహృదయం బుభుత్సుః ।
హ్రదే గభీరే హృది చావగాఢే
శంసంతి కార్యావతరం హి సంతః॥ ౫౩

ప. వి. ఇతి । ఈరయిత్వా । విరరామ । పత్రీ । సః । రాజపుత్రీహృదయం । బుభుత్సుః । హ్రదే । గభీరే । హృది । చ । అవగాఢే । శంసంతి । కార్యావతరం । హి । సంతః ।

టీక॥ సః = అ, పత్రీ = హంస, ఇతి = ఇట్లు, ఈరయిత్వా = చెప్పి, రాజపుత్రీహృదయం; రాజపుత్రీ = భీమనరేంద్రుని పుత్రిక యగు దమయంతి యొక్క, హృదయం = చిత్తమును, బుభుత్సుః = తెలిసికొనఁ గోరినదై, విరరామ = ఊరక యుండెను. (తథాహి = అది యట్లే కాఁదగును, ఏలయనగా) సంతః = కార్యముఁ దెలిసిన సత్పురుషులు, గభీరే = లోతైన, హృది = హృదయము, హ్రదే = కొలను, అవగాఢే = ప్రవేశించి చూడఁ బడినది కాగా, కార్యావతరం; కార్య = స్నానాదికార్యముల యొక్కయు, కర్తవ్య మైన రహస్యవచనము యొక్కయు,) అవతరం = అవతరణమును (ప్రస్తావనను,) శంసంతి = చెప్పుదురు.

సత్పురుషులు హృదయము, హ్రదము ప్రవేశించి చూడఁబడినపుడే కార్యావతరమును చెప్పుదు రను సామాన్యార్థముచే రాజపుత్రీ హృదయమును దెలియఁ గోరి హంస మాట్లాడుట విరమించె నను విశేషము సమర్థింపఁబడుటవలన నిట నర్థాంతరన్యాసాలంకారము.

సమాసములు :

రాజపుత్రీహృదయమ్:— రాజ్ఞః పుత్రీ = రాజపుత్రీ, రాజపుత్ర్యాః హృదయమ్ = రాజపుత్రీహృదయమ్, తత్ = రాజపుత్రీహృదయమ్.

బుభుత్సుః :— బోద్ధుమిచ్ఛుః = బుభుత్సుః.
కార్యావతరమ్ :— కార్యస్య అవతరః = కార్యావతరః, తమ్ = కార్యావతరమ్.

భావము :

ఇవ్విధముగ హంస దమయంతికిఁ జెప్పి యామె హృదయమును దెలియఁ గోరి మఱల మాట్లాడక యూరక యుండినది, కార్యజ్ఞులు గంభీర మైనదియు (లోతైనదియు,) నగు హృదయమును [జలాశయమును,] తెలిసికొనక [ప్రవేశింపక,] కార్యప్రస్తావమును [స్నానాదికార్యారంభమునుఁ] జేయరు. కావున హంస దమయంతీ హృదయమును దెలిసికొనునంతవరకును నలప్రస్తావముఁ జేయకయుండినది.

శ్లో॥ కించిత్తిరశ్చీనవిలోలమౌలి
ర్విచింత్య వాచం మనసా ముహూర్తమ్।
పతత్రిణం సా పృథివీంద్రపుత్రీ
జగాద వక్త్రేణ తృణీకృతేందుః॥ ౫౪

ప. వి. కించిత్। తిరశ్చీనవిలోలమౌలిః। విచింత్య। వాచం। మనసా। ముహూర్తమ్। పతత్రిణం। సా। పృథివీంద్రపుత్రీ। జగాద। వక్త్రేణ। తృణీకృతేందుః।

టీక॥ కించిత్తిరశ్చీనవిలోలమౌలిః; కించిత్ = కొంచము, తిరశ్చీన = స్వభావముచే నడ్డముగా నుంచఁబడినదియు, విలోల = నలిగినదియు నగు, మౌళిః = తలపైని వెంట్రుకలముడి గల దై, వక్త్రేణ = ముఖముచే, తృణీకృతేందుః; తృణీకృత = తిరస్కరింపఁబడిన, ఇందుః = చంద్రుడుగల, పృథివీంద్రపుత్రీ = పృథివీంద్ర = భీమనరపాలునియొక్క, పుత్రీ = కుమార్తె యగు దమయంతి, ముహూర్తం = కొంతకాలము, మనసా = మనస్సుచే, వాచం = చెప్పఁ దగిన విషయమును, విచింత్య = ఆలోచించి. పతత్రిణం = పక్షినిఁ గూర్చి, జగాద = పలికెను.

సమాసములు :-

కించిత్తిరశ్చీనవిలోలమౌలిః :- కించిత్ తిరశ్చీనా = కించిత్తిరశ్చీనా, విలోలా చ సా మౌలిశ్చ = విలోలమౌలిః, కించిత్తిరశ్చీనా విలోలమౌలిః యస్యాస్సా = కించిత్తిరశ్చీనవిలోలమౌలిః.

పృథివీంద్రపుత్రీ :- పృథివ్యాః ఇంద్రః = పృథివీంద్రః, పృథివీంద్రస్య పుత్రీ = పృథివీంద్రపుత్రీ.

తృణీకృతేందుః :- అతృణం తృణం సమ్పద్యమానః కృతః = తృణీకృతః, తృణీకృతః ఇందుః యేన సః = తృణీకృతేందుః.

భావము :

ఆహంస మాట్లాడి యూరక యుండగనే యాదమయంతి కొంచెము కాలము తల నడ్డముగా వాల్చి నలిగిన జడముడిగలదై ముహూర్తకాలము హంసకుఁ జెప్పదలచిన విషయమును గూర్చి యాలోచించి చెప్పినది. అత్తటి పరిశ్రమచే నలిగిన తలముడి గలిగి తలవాల్చి యాలోచనచేయుచున్న యాదమయంతి మోము చంద్రు నతిశయించి మిక్కిలి రమణీయముగ నుండినది.

శ్లో॥ ధిక్చాపలే వత్సిమవత్సలత్వం
యత్ప్రేరణాదుత్తరళీభవన్త్యా।
సమీరసంగాదివ నీరభంగ్యా
మయా తటస్థస్త్వముపద్రుతోఽసి॥ ౫౫

ప. వి. ధిక్ । చాపలే । వత్సిమవత్సలత్వం। యత్ప్రేరణాత్। ఉత్తరళీభవంత్యా । సమీరభంగాత్ । ఇవ । నీరభంగ్యా । మయా । తటస్థః । త్వమ్ । ఉపద్రుతః । అసి ।

టీక॥ చాపలే = చపలకార్యమందు, వత్సిమవత్సలత్వం; వత్సిమ = బాల్యమువలనఁ గలిగిన, వత్సలత్వం = ఆసక్తిని గూర్చి. ధిక్ = ఛీ యని నిందించుట యుక్తము [ఏల యనగా], యత్ప్రేరణాత్; యత్ = ఏచాపలాసక్తియొక్క, ప్రేరణాత్ = ప్రేరణమువలన, ఉత్తరళీభవంత్యా = చంచలమైన, మయా = నాచేత, సమీరభంగాత్ = గాలిదెబ్బవలన, ఉత్త

రళీభవంత్యా = ఇటు నటు కదలుచున్న, నీరభంగ్యేవ = నీటియలచేత వలె, తటస్థః = ఉదాసీన మైనదియు [గట్టునందుండునదియు నగు.] త్వం = నీవు, ఉపద్రుతః = ఉపద్రవము చేయఁబడినవాఁడవుగ, అసి = అగుచున్నావు.

బాల్యాసక్తిప్రయుక్తచాపలప్రేరిత యగు దమయంతికి సమీర భంగప్రయుక్తనీరభంగికిని; తటస్థహంసకును తటస్థవృక్షమునకు నౌప మ్యము జెప్పుటవలన నుపమాలంకారము.

సమాసములు:

చాపలే :– చపలస్య కర్మ = చాపలమ్, తస్మిన్ = చాపలే.

వత్సిమవత్సలత్వమ్ :– వత్సస్య భావః = వత్సిమా, వత్సలస్య భావః = వత్సలత్వమ్, వత్సిమ్నా వత్సలత్వమ్ = వత్సిమవత్సలత్వమ్.

యత్ప్రేరణాన్ ;– యస్య ప్రేరణమ్ = యత్ప్రేరణమ్; తస్మాత్ = యత్ప్రేరణాత్.

ఉత్తరలీభవంత్యా :– అనుత్తరలా ఉత్తరలా భవంతీ = ఉత్తరలీ భవంతీ, తయా = ఉత్తరలీభవంత్యా.

సమీరభంగాత్ ;– సమీరస్య భంగః, సమీరభంగః, తస్మాత్ = సమీర భంగాత్.

నీరభంగ్యా :– నీరస్య భంగిః = నీరభంగిః. తయా = నీరభంగ్యా.

తటస్థః :– తటే తిష్ఠతీతి = తటస్థః.

భావము :

దమయంతి హంసను గూర్చి యిట్లు చెప్పుచున్నది–హంసను పట్టుట మున్నగుకార్యములు చాపలములు. బాల్యమువలన వానియం దాసక్తి యేర్పడు చున్నది. అట్టి యాసక్తి మిక్కిలి గర్హింపఁదగినది. ఏల యనగా–ఆచాపలాసక్తి వలన నేను ప్రేరితురాలనై, గాలితాకిడివలన నిటు నటు కదలుచున్న నీటియలలచే తటస్థ మైన వృక్షము బాధింపఁబడినట్లు తటస్థుఁడ వైన నీవు బాధింపఁబడి తివి. అలలతాకిడిచే తటస్థ మైన [గట్టునందున్న] వృక్షము పడిపోవుట సహ జము. అట్లే తటస్థ మైన [ఉదాసీనుఁడ వైన] నీవును బాధింపఁబడితివి. కాన దానిని సహింపఁ గోరితి నని యాశయము,

శ్లో॥ ఆదర్శతాం స్వచ్ఛతయా ప్రయాసి
సతాం స తావత్ఖలు దర్శనీయః ।
ఆగః పురస్కుర్వతి సాఽఽగసీం మాం
యస్యాఽఽత్మనీదం ప్రతిబింబితం తే॥ ౫౬

ప వి. ఆదర్శతాం । స్వచ్ఛతయా । ప్రయాసి । సతాం । సః । తావత్ । ఖలు । దర్శనీయః । ఆగః । పురస్కుర్వతి । సాఽఽగసీం । మాం । యస్య । ఆత్మని । ఇదం । ప్రతిబింబితం । తే ।

టీక॥ స్వచ్ఛతయా = నిర్మలముగ నుండుటచే, ఆదర్శతాం = అద్దముగ నుండుటను, ప్రయాసి = పొందుచున్నావు, [కుతః = ఏల యనగా] యస్య = ఏస్వచ్ఛమైన, తే = నీకు సంబంధించిన, సాగసీం = అపరాధముతోఁగూడిన, మాం = నన్ను, పురస్కుర్వతి = పూజించుచున్నటువంటి, (ఎదుట నుంచుకొనుచున్నటువంటి) ఆత్మని = బుద్ధియందును, (స్వరూప మందును,) ఇదం = నాకు సంబంధించినదైన, ఆగః = అపరాధము, ప్రతిబింబితం = ప్రతిఫలించినది, సః = ఆయర్థము. సతాం = సత్పురుషులకు, తావత్ = మొదట, దర్శనీయః = దర్శింపఁదగినది.

ఇచ్చట హంస యాదర్శ మయిన దని చెప్పుటవలన రూపకాలంకారము.

తెల్లవారగనే తొలుత గోరోచనమును, చందనమును, బంగారును, మృదంగమును, అద్దమును, మణిని గురువును, అగ్నిని, సూర్యునిఁ జూచుట శ్రేయస్కర మను శాస్త్రము ననుసరించి యిచ్చట స్వచ్ఛతాదిగుణములచే నద్దముగా వర్ణిత మగు హంసను జూచుట భావి శుభాశంసక మని సూచితము.

సమాసములు :-

ఆదర్శతామ్ :- ఆదృశ్యతే పురోగతవస్తురూపమస్మిన్నితి = ఆదర్శః, ఆదర్శస్య భావః = ఆదర్శతా, తామ్ = ఆదర్శతామ్.

సాఽఽగసీమ్ :- ఆగసా సహ వర్తత ఇతి = సాగాః, తాం = సాఽఽగసీమ్.

భావము :

ఓ హంసా! స్వచ్ఛత్వ మను గుణము నీయం దుండుటవలన నీయందు నెదుట నున్న వస్తువులు ప్రతిఫలించును. కాన నద్దముగ నీ వైతివి. అపరాధిని యగు నన్ను నీవు ముం దుంచుకొనుటవలన నాయపరాధము నీయందు ప్రతిబిం బించినది. అద్దమున నెదుట నున్న వస్తువులు వానిధర్మములు ప్రతిబింబించుట సహజము కదా. కాన నీయపరాధ మెద్దియును లేదు. నాయపరాధమే నీయెడ సంక్రమించినది. అద్దము వలె పరమపరిశుద్ధ మైనదానవు. తెల్లవారగనే తొలుత దర్శింపఁదగిన వస్తువులలో నద్దము కూడ నొక్కటిగఁ బేర్కొనఁబడినది. కాన నట్టియద్ద మైన నీవు ప్రథమదర్శనీయుఁడ వై పూజ్యుఁ డగుచున్నావు.

శ్లో॥ అనార్యమప్యాచరితం కుమార్యా
భవాన్ మమ క్షామ్యతు సౌమ్య తావత్।
హంసోఽపి దేవాంశతయాఽసి వంద్యః
శ్రీవత్సలక్ష్మేవ హి మత్స్యమూర్తిః॥ ౫౭

ప వి. అనార్యమ్। అపి। ఆచరితం। కుమార్యాః। భవాన్। మమ। క్షామ్యతు। సౌమ్య। తావత్। హంసః। అపి। దేవాంశతయా। అసి। వంద్యః। శ్రీవత్సలక్ష్మా। ఇవ। హి। మత్స్యమూర్తిః।

టీక॥ హేసౌమ్య = ఓసౌమ్యుఁడా! భవాన్ = పూజ్యుఁడ వైన నీవు, కుమార్యాః = బాలిక యగు, మమ = నాయొక్క, అనార్యం = దుష్ట మైన, ఆచరితం = నడవడికను- అనగా నిన్నుపద్రవపఱచుట యను చేష్టితమును, క్షామ్యతు = క్షమింపుము. హంసోఽపి = హంసపక్షి యైనను, (త్వం = నీవు) దేవాంశతయా = భగవదంశముగ నుండుటచే, మత్స్యమూర్తిః = మత్స్యశరీరము గల్గియున్నను, శ్రీవత్సలక్ష్మేవ = (శ్రీవత్స మను చిహ్నమును ధరించిన) విష్ణువువలె, వంద్యః = నమస్కరింపఁదగినవాఁడవుగ, అసి = అగుదువు.

ఇచ్చ తిర్యగ్జంతు వైన హంసకు మత్స్యమూర్తి యగు విష్ణువుతో సామ్యము చెప్పుటవలన నుపమాలంకారము.

సమాసములు :

అనార్యమ్ :- న ఆర్యం = అనార్యం, తత్ = అనార్యమ్.

దేవాంశతయా :- దేవస్య అంశః = దేవాంశః, దేవాంశస్య భావః = దేవాంశతా, తయా = దేవాంశతయా.

శ్రీవత్సలక్ష్మ :- శ్రీవత్స ఇతి లక్ష్మ యస్య సః = శ్రీవత్సలక్ష్మ.

మత్స్యమూర్తిః :- మత్స్యః మూర్తిః యస్య సః = మత్స్యమూర్తిః.

భావము :

ఓసౌమ్యుఁడా! పూజ్యుడ వైన నీవు బాలిక యగు నాయొక్క తుంటరినడవడికను క్షమింపుము. అజ్ఞానముచే నిన్ను బాధించితిని. హంస వైన నీవు పక్షి వైనను భగవదంశ మగుటచే నెల్లప్పుడు నమస్కరింపఁ దగినవాఁడవు. ఏల యనగా, మత్స్యమూర్తి యైనను శ్రీమహావిష్ణువు లోకమునకు వంద్యుడే యగుచున్నాడు.

శ్లో॥ మత్ప్రీతిమాధిత్ససి కాం త్వదీక్షా
ముదం మదక్ష్ణోరపి యాతిశేతామ్ ।
నిజామృతైర్లోచనసేచనాద్వా
పృథక్కిమిందుః సృజతి ప్రజానామ్॥ ౫౮

ప. వి. మత్ప్రీతిమ్ । ఆధిత్ససి । కాం । త్వదీక్షాముదమ్ । మదక్ష్ణోః । అపి । యా । అతిశేతామ్ । నిజామృతైః । లోచనసేచనాత్ । వా । పృథక్ । కిమ్ । ఇందుః । సృజతి । ప్రజానామ్ ।

టీక॥ కాం = ఏ, మత్ప్రీతిం = నా కిష్ట మయిన విషయమును, ఆధిత్ససి = చేయఁగోరుచున్నావు, యా = ఏప్రీతివిషయ మైన కార్యము, మదక్ష్ణోః = నాకన్నులకు, త్వదీక్షాముదం = నిన్నుఁ జూచు సంతోషమును, అతిశేతామ్ = మించును. ఇందుః = చంద్రుఁడు, ప్రజానాం = జనులకు, నిజామృతైః; నిజ = తనయందలి, అమృతైః = అమృతములచే, లోచనసేచనాత్ = నేత్రములను దడుపుటకంటె. పృథక్ = వేఱుగా, కిం వా = ఏమి, సృజతి = చేయుచున్నాఁడు.

ఇచ్చట హంసదర్శనజన్యనేత్రానందమునకును చంద్రదర్శన జన్యనేత్రానందమునకును బింబప్రతిబింబభావముచే సామ్యము జెప్పుట వలన దృష్టాంతాలంకారము.

సమాసములు :

మత్ప్రీతిమ్ :- మమ ప్రీతిః = మత్ప్రీతిః, తామ్ = మత్ప్రీతిమ్.

త్వదీక్షాముదమ్ :-తవ ఈక్షా = త్వదీక్షా, త్వదీక్షాయాః ముత్ = త్వదీక్షా ముత్, తామ్ = త్వదీక్షాముదమ్.

మదక్ష్ణోః :- మమ అక్షిణీ = మదక్షిణీ, తయోః = మదక్ష్ణోః.

నిజామృతైః :- నిజాని చ తాని అమృతాని చ = నిజామృతాని, తైః = నిజామృతైః.

లోచనసేచనాత్ :- లోచనయోః సేచనమ్ = లోచనసేచనమ్, తస్మాత్ = లోచనసేచనాత్.

భావము :

ఓహంసా! నీవు నాకుఁ బ్రీతిగొల్పు పనిని దేనిని చేయఁ గోరుచున్నావు, అప్రియ మైన కార్యము నానేత్రములకు నిన్నుజూచుచుండుటచేఁ గల్గు నానంద మును గూడ మించియుండును?నాకు నిన్నుజూచుటవలనఁ గల్గు సంతోషమును మించినది మఱియొండు లేదు గదా. చంద్రుఁడు తన యమృతధారలచే ప్రజల నేత్రములకుఁ జలువ నొసంగుటకంటె మఱొకటి యమి చేయఁగలఁడు.అట్లే నీవును నీదర్శనానందమును మించిన మఱియొక యిష్టమును దేనినిఁ చేయుదువు. దానిని మించిన ప్రియ మైన వస్తు వేదియు నాకు లేదని యాశయము.

శ్లో॥ మనస్తు యం నోజ్ఝతి జాతు యాతు
మనోరథః కంఠపథం కథం సః ।
కా నామ బాలా ద్విజరాజపాణి
గ్రహాభిలాషం కథయేదభిజ్ఞా॥

ప. వి. మనః । తు । యం । న । ఉజ్ఝతి । జాతు । యాతు । మనోరథః । కంఠ పథం । కథం । సః । కా । నామ । బాలా । ద్విజరాజపాణిగ్రహాభిలాషం । కథయేత్ । అభిజ్ఞా ।

టీక॥ మనః = నామనస్సు, యం = ఏమనోరథమును, జాతు = ఒకప్పుడును, నోజ్ఝతి = విడువదో, సః = ఆ, మనోరథః = కోరిక, కంఠపథమ్ = వాఙ్మార్గమును (సమీపభూమిని) కథం = ఎట్లు, యాతు = పొందును. కుతః = ఏల యనగా, అభిజ్ఞా = వివేకముగల, కా నామ బాలా = ఏ తొయ్యలి, ద్విజరాజపాణిగ్రహాభిలాషమ్; ద్విజరాజ = చంద్రునియొక్క, పాణిగ్రహ = చేతితో గ్రహణము నందలి, అభిలాషం = కోరికను, (ద్విజ = ఓపక్షీ! రాజపాణిగ్రహాభిలాషమ్, రాజ = రాజైన నలుని యొక్క, పాణిగ్రహ = పాణిగ్రహణ మందలి, అభిలాషమ్ = కోరికను) కథయేత్ = చెప్పును.

మనస్సు మనోరథమును బట్టుకొనినందువలన నది వెలుపలికి వచ్చుట దుష్కర మను వాక్యార్థమునకును; ఏవివేకవతి చంద్రుని జేత బట్ట నెంచు నను వాక్యార్థమునకును బింబప్రతిబింబభావాపన్న మగు నౌపమ్య ముండుటవలన దృష్టాంతాలంకారము.

సమాసములు :

కంఠపథమ్ :- కంఠస్య పంథాః = కంఠపథః, తమ్ = కంఠపథమ్.

ద్విజరాజపాణిగ్రహాభిలాషమ్ :- ద్విజానాం రాజా = ద్విజరాజః, పాణినా గ్రహః = పాణిగ్రహః, ద్విజరాజస్య ప్రాణిగ్రహః = ద్విజరాజపాణిగ్రహః, ద్విజరాజపాణిగ్రహే అభిలాషః = ద్విజరాజపాణిగ్రహాభిలాషః, తమ్ = ద్విజరాజపాణిగ్రహాభిలాషమ్.

భావము ;

నలునిఁ బరిణయ మాడవలయు నను కోరికను మనస్సు పట్టియుంచినది. కావున నాకోరిక మనస్సును వీడి కంఠమునొద్దకు వచ్చుటకే సాధ్యము కాక యున్నది. లోన బంధింపఁబడిన వస్తువు వెలుపలికి రాజాలదు గదా!కావున నల విషయక మనోరథముఁ జెప్పఁజాలకున్నాను. లోకమున వివేకము గల యే స్త్రీ చంద్రునిఁ జేతితోఁ బట్టగల నని చెప్పును. (ఏబాలిక రాజును వివాహమాడఁగల నని చెప్పఁగలదు) కావున చంద్రునిఁ జేతఁ బట్టుట యెంత కష్టమో నలుని బరిణయమాడుటయు నంత కష్ట మయినది.

శ్లో॥ వాచం తదీయాం పరిపీయ మృద్వీం
మృద్వీకయా తుల్యరసాం స హంసః।
తత్యాజ తోషం పరపుష్టఘుష్టే
ఘృణాం చ వీణాక్వణితే వితేనే॥ ౬౦

ప. వి. వాచం । తదీయాం । పరిపీయ । మృద్వీం । మృద్వీకయా । తుల్యరసాం। సః । హంసః । తత్యాజ । తోషం । పరపుష్టఘుష్టే । ఘృణాం । చ । వీణాక్వణితే । వితేనే ।

టీక॥ సః = ఆ, హంసః = హంస, మృద్వీకయా = ద్రాక్షతో, తుల్యరసాం = సమాన మగు రుచిగల, మృద్వీం = మధురాక్షరములతోఁ గూడిన, తదీయాం = ఆదమయంతికి సంబంధించిన, వాచం = వాక్కును, పరిపీయ = మిక్కిలి శ్రద్ధతో నాఁకించి, పరపుష్టఘుష్టే; పరపుష్ట = కోకిల యొక్క, ఘుష్టే = కూతయందు, తోషం = సంతోషమును, తత్యాజ = వదలిపెట్టెను, వీణాక్వణితే = వీణానాదమందు, ఘృణాం చ = ఏవగింపును, వితేనే = చేసెను.

సమాసములు :

తదీయామ్ :- తస్యాః ఇయం = తదీయా, తామ్ = తదీయామ్.

తుల్యరసామ్ :- తుల్యః రసః యస్యాస్సా = తుల్యరసా, తామ్ = తుల్యరసామ్.

పరపుష్టఘుష్టే:- పరైః పుష్టాః = పరపుష్టాః, పరపుష్టానాం ఘుష్టమ్ = పరపుష్టఘుష్టమ్, తస్మిన్ = పరపుష్టఘుష్టే.

వీణాక్వణితే :- వీణాయాః క్వణితమ్ = వీణాక్వణితమ్, తస్మిన్ = వీణాక్వణితే.

భావము :

ఆహంస ద్రాక్షవలె మధుర మైన దమయంతిపలుకును మిక్కిలి శ్రద్ధతో నాలకించిన దై కోకిల కూజితమందు సంతోషమును వదలుకొనినది. వీణానాదమందు విరక్తి నొందినది; ఆమెపలుకులు కోకిలకూజితమును వీణానాదమును మించి మధుర మైయుండినవి.

శ్లో॥ మందాక్షమందాక్షరముద్రముక్త్వా
తస్యాం సమాకుంచితవాచి హంసః।
తచ్ఛంసితే కించన సంశయాలు
ర్గిరా ముఖాంభోజమయం యుయోజ॥ ౬౧

ప. వి. మందాక్షమందాక్షరముద్రమ్ । ఉక్త్వా । తస్యాం । సమాకుంచితవాచి । హంసః । తచ్ఛంసితే । కిం । చన । సంశయాలుః । గిరా ।ముఖాంభోజమ్। అయం । యుయోజ ।

టీక॥ తస్యాం = ఆ దమయంతి, మందాక్షమందాక్షరముద్రమ్: మందాక్ష = సిగ్గుచే, మందాక్షరముద్రం; మంద = సందేహము గొల్పు, అక్షర ముద్రం = అక్షరవిన్యాసము గలుగునట్లుగా, సమాకుంచితవాచి సత్యాం; సమకుంచిత = ఉపసంహరింపఁబడిన, వాచి = వాక్కుగలదిగ. సత్యాం = కాగా, అయం = ఈ హంస, తచ్ఛంసితే; తత్ = ఆదమయంతి యొక్క, శంసితే = వచనమందు, కించన = కొంచెము, సంశయాలుః = సందేహించుచున్నదై, ముఖాంభోజం = పద్మమువంటి తన ముఖమును, గిరా = వాక్కుతో. యుయోజ = కూర్చినది, అనగా మాట్లాడిన దని యర్థము.

సమాసములు :

మందాక్షమందాక్షరముద్రమ్ :- మందాక్షేన మందా = మందాక్షమందా, అక్షరాణాం ముద్రా = అక్షరముద్రా, మందాక్షమందా అక్షరముద్రా యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = మందాక్షమందాక్షరముద్రమ్.

సమాకుంచితవాచి :- సమాకుంచితా వాక్ యయా సా = సమాకుంచితవాక్, తస్యాం = సమాకుంచితవాచి.

తచ్ఛంసితే :- తస్యాః శంసితమ్ = తచ్ఛంసితమ్, తస్మిన్ = తచ్ఛంసితే.

ముఖాంభోజమ్ :- ముఖమంభోజమివ = ముఖాంభోజమ్. తత్ = ముఖాంభోజమ్.

భావము :

ఆదమయంతి సిగ్గుతో స్పష్టములు గాని పలుకులు గొన్ని పలికి యుప సంహరించుకొనగా నాహంస యాపెపలుకును గొంచెము సంశయించుచుఁ దాను పలుకఁదొడగెను.

శ్లో॥ కరేణ వాంఛేవ విధుం విధర్తుం
యమిత్థమాత్థాఽఽదరిణీ తమర్థమ్।
పాతుం శ్రుతిభ్యామపి నాధికుర్వే
వర్ణం శ్రుతేర్వర్ణ ఇవాంతిమః కిమ్॥ ౭౨

ప. వి. కరేణ । వాంఛా । ఇవ । విధుం । విధర్తుం । యమ్ । ఇత్థమ్। ఆత్థ । ఆద రిణీ । తమ్ । అర్థమ్ । పాతుం । శ్రుతిభ్యామ్ । అపి । న । అధికుర్వే । వర్ణం । శ్రుతేః । వర్ణః । ఇవ । అంతిమః ।కిమ్.

టీక॥ (హే భైమి! = ఓదమయంతీ,) కరేణ = హస్తముచే, విధుం = చంద్రుని విధర్తుం = పట్టుటకు, వాంఛేవ = కోరికవలె, యం = ఏ, అర్థం = విషయమును, ఇత్థమ్ = "ద్విజరాజ పాణిగ్రహాభిలాష" మిత్యాదిగ, ఆద రిణీ = ఆదరముగల్గిన దానవై, ఆత్థ = పలుకుచున్నావో, తమర్థమ్ = ఆవిషయమును, అంతిమః = కడపటి దైన, వర్ణః = శూద్రవర్ణము, శ్రుతేః = వేదముయొక్క, వర్ణమివ = అక్షరమును వలె, శ్రుతిభ్యాం = చెవులతో, పాతుమపి = వినుట కైనను, నాధికుర్వే కిమ్ = అధికారము గల్గియుండనా యేమి?

భావము :

ఓదమయంతీ! చేతితో చంద్రునిఁ బట్టుకోరిక వంటి దని చెప్పుచు "ద్విజ రాజపాణిగ్రహాభిలాషమ్" అని సంధిగ్ధముగ మిగుల శ్రద్ధతో నీవు పలికిన విషయమును, వేదాక్షరమును శూద్రునివలె వినుటకు నే నధికారిని గానా? అట్లగుచో నావిషయ మును స్పష్టముగ వివరింపవలసినది.

శ్లో॥ అర్థాప్యతే వా కిమియద్భవత్యా
చిత్తైకపద్యామపి వర్తతే యః।
యత్రాంధకారః ఖలు చేతసోఽపి
జిహ్మేతరైర్బ్రహ్మ తదప్యవాప్యమ్॥ ౭౩

ప. వి. అర్థ్యతే । వా । కిమ్ । ఇయత్ । భవత్యా । చిత్తైకపద్యామ్ । అపి । వర్తతే । యః । యత్ర । అంధకారః । ఖలు । చేతసః । అపి । జిహ్మేతరైః । బ్రహ్మ । తత్ । అపి । అవాప్యమ్ ।

టీక॥ హేభైమి = ఓదమయంతీ! భవత్యా = నీచే, ఇయత్ = ఇంతవరకును, కిం వా అర్థ్యతే = ఏల ద్విజరాజపాణిగ్రహము వలె దుర్లభ మని చెప్పఁబడుచున్నది, యః = ఏయర్థము, చిత్తైకపద్యామపి = మనస్సనెడి యొంటికాలితో సంచరింప శక్య మగు మార్గమందును, వర్తతే = కలదు, యత్ర = ఏబ్రహ్మవిషయమునందు, చేతసోఽపి = మనస్సునకును, అంధకారః = చీకటియో, తదపి = ఆబ్రహ్మయు, జిహ్మేతరైః = కుటిలస్వభావము లేని సాధువులచే, అవాప్యమ్ = పొందశక్య మైనది.

మనస్సునకుఁ గానరాని బ్రహ్మయే సాధుశీలురచే పొంద శక్య మైనప్పుడు మనస్సునందే యున్న యా నలమహారాజనెడి యర్థము పొంద శక్య మగు నని చెప్పనేల యని కైముతికన్యాయముచే నర్థప్రాప్తియున్నందువలన నిచ్చట నర్థాపత్త్యలంకారము.

సమాసములు:

చిత్తైకపద్యామ్;–ఏకః పాదః యస్యాం సా = ఏకపదీ, చిత్తమేవ ఏకపదీ = చిత్తైకపదీ, తస్యాం = చిత్తైకపద్యామ్.

జిహ్మేతరైః :– జిహ్మాత్ ఇతరే = జిహ్మేతరే, తైః = జిహ్మేతరైః,

అవాప్యమ్ :– అవాప్తుం శక్యమవాప్యమ్.

భావము :

ఓదమయంతీ! ద్విజరాజపాణిగ్రహణమువలె నలుఁ డనెడి యర్థము దుర్లభ మని యేల చెప్పెదవు? ఒకపాదముచే సంచరింపఁ దగిన మార్గమువలె నితరులకు చొరరాని మనోమార్గమునం దాయర్థ మున్నదిగదా! "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" ఇత్యాది శ్రుతివచనముల ననుసరించి బ్రహ్మము మనస్సునకును గోచరము గాదు; అట్టి మనోగోచరము గాని బ్రహ్మయు సాధువులకు సులభముగ గోచర మగుచున్నది. అట్టితఱి చిత్తభూమియం దున్న యర్థము గోచరించుట లేదనుట తగదు అది యింకను సులభము, కావున నలుఁడు నీహృదయమం దున్నాఁడు. కాన నతడు నీకు మిక్కిలి సులభుఁడు, అతఁడు దుర్లభుఁ డని నీవు భావింపవలదు.

శ్లో॥ ఈశాణిమైశ్వర్యవివర్తమధ్యే
లోకేశలోకేశయలోకమధ్యే।
తిర్యంచమప్యంచ మృషానభిజ్ఞ
రసజ్ఞతోపజ్ఞసమజ్ఞమజ్ఞమ్॥ ౭౪

ప. వి. ఈశాణిమైశ్వర్యవివర్తమధ్యే । లోకేశలోకేశయలోకమధ్యే। తిర్యంచమ్। అపి । అంచ । మృషానభిజ్ఞరసజ్ఞతోపజ్ఞసమజ్ఞమ్ । అజ్ఞమ్ ।

టీక॥ ఈశాణిమైశ్వర్యవివర్తమధ్యే; ఈశ = శివునియొక్క, అణిమా = అణిమ యనఁబడు, ఐశ్వర్య = విభూతికి, వివర్త = రూపాంతర మగు, మధ్యే నడుముగలదానా, (అనగా నోకృశోదరీ!) లోకేశలోకేశయలోకమధ్యే! లోకేశ = బ్రహ్మయొక్క, లోకేశయ = లోకమునందు నివసించు, లోక = జనములయొక్క, మధ్యే = మధ్యమునందు, అజ్ఞం = జ్ఞానము లేనట్టి, తిర్యంచమ్ = పక్షియైన (మాం = నన్ను) మృషానభిజ్ఞరసజ్ఞతోపజ్ఞసమజ్ఞమ్; మృషా = అసత్యమును, అనభిజ్ఞ = తెలియనట్టి, రసజ్ఞతా = నాలుక గల్గియుండుటయొక్క ఉపజ్ఞ = మొదటి జ్ఞానమువలని, సమజ్ఞం = కీర్తి గల్గిన వానినిగ, అంచ = తెలిసికొనుము.

సమాసములు :

ఈశాణిమైశ్వర్యవివర్తమధ్యే:- అణిమేత్యైశ్వర్యం = అణిమైశ్వర్యమ్, ఈశస్య అణిమైశ్వర్యమ్ = ఈశాణిమైశ్వర్యమ్, ఈశాణిమైశ్వర్యస్య వివర్తః = ఈశాణిమైశ్వర్యవివర్తః, ఈశాణిమైశ్వర్యవివర్తః మధ్యః = యస్యాస్సా = ఈశాణిమైశ్వర్యవివర్తమధ్యా, తస్యాస్సంబుద్ధిః = ఈశాణిమైశ్వర్యవివర్తమధ్యే.

లోకేశలోకేశయలోకమధ్యే:- లోకస్య ఈశః = లోకేశః; లోకేశస్య లోకః = లోకేశలోకః, లోకేశలోకే శేరత ఇతి = లోకేశలోకేశయాః, లోకేశలోకేశయాశ్చ తే లోకాశ్చ = లోకేశలోకేశయలోకాః, లోకేశలోకేశయలోకానాం మధ్యః = లోకేశలోకేశయలోకమధ్యః, తస్మిన్ = లోకేశలోకేశయలోకమధ్యే.

మృషానభిజ్ఞరసజ్ఞతోపజ్ఞసమజ్ఞమ్:- మృషా అనభిజ్ఞా = మృషానభిజ్ఞా, మృషానభిజ్ఞా రసజ్ఞా యస్య సః = మృషానభిజ్ఞరసజ్ఞః, మృషానభిజ్ఞ

రసజ్ఞస్య భావః = మృషానభిజ్ఞరసజ్ఞతా, మృషానభిజ్ఞరసజ్ఞతాయాః ఉపజ్ఞా = మృషానభిజ్ఞరసజ్ఞతోపజ్ఞమ్, మృషానభిజ్ఞరసజ్ఞతోపజ్ఞేన సమజ్ఞా యస్య సః = మృషానభిజ్ఞరసజ్ఞతోపజ్ఞసమజ్ఞః, తమ్ = మృషానభిజ్ఞరసజ్ఞతోపజ్ఞసమజ్ఞమ్.

అజ్ఞమ్:- జానాతీతి = జ్ఞః, న జ్ఞః = అజ్ఞః,తమ్ = అజ్ఞమ్.

భావము :

శివుని యష్టవిభూతులలో నొక్కటైన యణిమ యను విభూతి మిక్కిలి సూక్ష్మమైనది. అట్టి యణిమకు రూపాంతర మగు మధ్యప్రదేశముగల యోదమయంతీ! అనగా సన్నని కౌను గల యోదమయంతీ! బ్రహ్మలోకమందు నివసించు జనుల మధ్య పక్షిగ నున్న నన్నసత్యము తెలియని జిహ్వ గల్గినట్లుగా మొట్టమొదటఁ బ్రపంచమున వెల్లడి యైన కీర్తితో నొప్పిన వానినిగఁ దెలిసికొనుము. అనగా బ్రహ్మలోకమందలి ప్రజలలో నసత్యముఁ జెప్పనివాఁడుగఁ దొలుత నేను ప్రతిష్ఠను బొందితిని. కాన నే నసత్యవాదిని కాను. నేను చెప్పునది యంతయు సత్య మని గ్రహించుము.

శ్లో॥ మధ్యే శ్రుతీనాం ప్రతివేశినీనాం
సరస్వతీ వాసవతీ ముఖే నః।
హ్రియేవ తాభ్యశ్చలతీయమద్ధా
పథాన్న సంసర్గగుణేన బద్ధా॥ ౬౨

ప. వి. మధ్యే । శ్రుతీనాం । ప్రతివేశినీనాం । సరస్వతీ । వాసవతీ । ముఖే। నః । హ్రియా । ఇవ । తాభ్యః । చలతి । ఇయమ్ । అద్ధాపథాత్ । న । సంసర్గగుణేన । బద్ధా ।

టీక॥ (కించ = మఱియు) ప్రతివేశినీనాం = ప్రక్క నున్న. శ్రుతీనాం = వేదములకు, మధ్యే = మధ్యభాగమునందు, వాసవతీ = నివాసము గల్గిన, ఇయం = ఈ, నః = మాయొక్క, ముఖే = ముఖమం దున్న, సరస్వతీ = వాక్కు, సంసర్గగుణేన = సంబంధ మను నుత్తమధర్మముచేతను, దారముచేతను, బద్ధా (సతీ) = కట్టఁబడిన దై, తాభ్యః = ఆశ్రుతుల

వలన, హ్రియేవ = సిగ్గుచేతనో యనునట్లు, అద్ధాపథాత్ = సత్యమార్గ
మునుండి, న చలతి = కదలదు.

సమాసములు :

అద్ధాపథాత్:- అద్ధా పంథాః = అద్ధాపథః, తస్మాత్ = అద్ధాపథాత్.
సంసర్గగుణేన:- సంసర్గ ఇతి గుణః = సంసర్గగుణః, తేన = సంసర్గ
గుణేన.

భావము :

ప్రక్క నున్న శ్రుతులమధ్య మానోట నున్న సరస్వతి వసించుచున్నది. మేము బ్రహ్మలోకమునం దుండుటవలన శ్రుతులు మాకు సన్నిహితములు. కావున మానోట నున్న సరస్వతికిని నవి సన్నిహితములు. కావున పరమపవిత్రము లగు శ్రుతుల సహవాసగుణముచే (త్రాటిచే) నాసరస్వతి బంధింపఁబడిన దై యాశ్రుతులవలని లజ్జచేతనో యనున ట్లెప్పుడును సత్యమార్గమునుండి చలింపదు. కావున మావాక్కులు సత్యముగనే యుండును.

శ్లో॥ పర్యంకతాపన్నసరస్వదంకాం
లంకాపురీమప్యభిలాషి చిత్తమ్।
కుత్రాఽపి చేద్వస్తుని తే ప్రయాతి
తదప్యవేహి స్వశయే శయాలు॥ ౭౭

ప. వి. పర్యంకతాపన్నసరస్వదంకాం । లంకాపురీమ్ । అపి। అభిలాషి । చిత్తమ్। కుత్ర । అపి । చేత్ । వస్తుని । తే । ప్రయాతి । తత్ । అపి । అవేహి । స్వశయే । శయాలు ।

టీక॥ కుత్రాపి = ఏద్వీపాంతరమందు నున్నట్టి దైన, వస్తుని = వస్తువునందు అభిలాషి = కోరిక గల్గిన, తే = నీయొక్క, చిత్తం = మనస్సు, పర్యంకతాపన్నసరస్వదంకామ్, పర్యంకతా = శయనించుటకుఁ దగిన మంచముగ నుండుటను, ఆపన్న = పొందిన, సరస్వత్ = సముద్రమును, అంకాం = చిహ్నముగా గల్గిన, లంకాపురీమపి = లంకాపట్టణమును గూడ, ప్రయాతి చేత్ = పొందినచో, తదపి = ఆసముద్రమధ్యమం దున్నట్టి యానగరమును గూడ, స్వశయే = తన దగు నరచేతియందు, శయాలు = ఉన్నదిగ, అవేహి = తెలిసికొనుము.

సమాసములు:

పర్యంకతాపన్నసరస్వదంకామ్:- పర్యంకస్య భావః = పర్యంకతా, పర్యంకతామాపన్నః = పర్యంకతాపన్నః, పర్యంకతాపన్నశ్చాసౌ సరస్వాంశ్చ = పర్యంకతాపన్నసరస్వాన్, పర్యంకతాపన్నసరస్వాన్ అంకః యస్యాస్సా = పర్యంకతాపన్నసరస్వదంకా, తామ్ = పర్యంకతాపన్నసరస్వదంకామ్.

అభిలాషి:- అభిలాషః అస్య అస్తీతి = అభిలాషి.

స్వాశయే:- స్వస్య శయః = స్వాశయః, తస్మిన్ = స్వాశయే.

భావము :

ఓదమయంతీ! నీమనస్సు ద్వీపాంతరములయందున్న వస్తువును, గోరినను బొందఁగలదు. సముద్రముచేఁ జుట్టఁబడిన దై యాసముద్రమును మంచము గావించు కొనిన లంకానగరమును గోరినచో నాలంకానగరము నీయరచేతియం దున్న దనియే భావింపుము. అట్టి సముద్రదుర్గస్థ మయిన లంకానగరము గూడ నీకు సులభము.

శ్లో॥ ఇతీరితా పత్రరథేన తేన
ప్రీణా చ హృష్టా చ బభాణ భైమీ।
చేతో న లం కామయతే మదీయం
నాన్యత్ర కుత్రాఽపి చ సాభిలాషమ్॥ ౬౭

ప. వి. ఇతి । ఈరితా । పత్రరథేన । హ్రీణా । చ । హృష్టా । చ । బభాణ । భైమీ । చేతః । న । లంకామ్ । అయతే । మదీయం । న । అన్యత్ర । కుత్ర । అపి । చ । సాభిలాషమ్.

టీక॥ తేన = ఆ, పత్రరథేన = హంసచే, ఇతి = ఈవిధముగా, ఈరితా = చెప్పఁబడిన, భైమీ = దమయంతి, హ్రీణా = సిగ్గుఁ జెందినదై, హృష్టా చ = సంతోషించినదియు నై, బభాణ = పలికినది, మదీయం = నాదైన, చేతః = మనస్సు, లంకాం = లంకానగరమును, నాఽయతే = పొందుట లేదు, (నలం = నలుని, కామయతే = కోరుచున్నది,) అన్యత్ర

= మఱియొకచోట, కుత్రాఽపి = ఎచ్చటను, సాభిలాషమ్ = అభిలాష గలదిగ, న = లేదు.

సమాసములు:

సాభిలాషమ్:- అభిలాషేణ సహ వర్తత ఇతి సాభిలాషమ్.

భావము:

ఈవిధముగా హంసచేఁ జెప్పఁబడిన దమయంతి తానే తన మనస్సునం దున్న విషయమును జెప్పుటకు సంకోచము గల్గుటవలన సిగ్గుఁ జెందిన దై నలునిఁ బరిణయ మాడుటకు సంతోషించిన దై నామనస్సు లంకను బొందుట లేదు, మఱేమన నలుని గోరుచున్నది యని "చేతో న లంకామయతే మదీయ" మ్మని"నలం-కామయతే-న-లంకామ్-అయతే-" యని శ్లేషభంగిమతోఁ జెప్పుచు దానికంటె భిన్నమైన విషయము నభిలషించుట లేదని పలికినది.

శ్లో॥ విచింత్య బాలాజనశీలశైలం
లజ్జానదీమజ్జదనంగనాగమ్।
ఆచష్ట విస్పష్టమభాషమాణా
మేనాం స చక్రాంగపతంగశక్రః॥ ౬౮

ప. వి. విచింత్య । బాలాజనశీలశైలం । లజ్జానదీమజ్జదనంగనాగమ్ । ఆచష్ట । విస్పష్టమ్ । అభాషమాణామ్ । ఏనాం । సః । చక్రాంగపతంగశక్రః ।

టీక॥ విస్పష్టం = స్పష్టముగా, అభాషమాణాం = మాట్లాడకున్నటువంటి. (అనగా శ్లేషవచనములచే సందిగ్ధముగ మాట్లాడుచున్నటువంటి)ఏనాం = ఈదమయంతిని. సః = ఆ, చక్రాంగపతంగశక్రః, చక్రాంగపతంగ = హంసపక్షులకు, శక్రః = ఇంద్రునివంటి దైన హంస, బాలాజనశీల శైలమ్, బాలాజన = ముగ్ధస్త్రీజనముయొక్క, శీల = నడవడిక యను, శైలం = పర్వతమును, లజ్జానదీమజ్జదనంగనాగమ్; లజ్జ = సిగ్గనెడి, నదీ = నదియందు. మజ్జత్ = మునుగుచున్న, అనంగనాగమ్ = మన్మథ గజము గలదిగ, విచింత్య = ఆలోచించి, ఆచష్ట = పలికినది.

ఇచ్చట "ఉదయద్యౌవనా ముగ్ధా లజ్జావిజితమన్మథా" యనెడి ముగ్ధాలక్షణము దమయంతియందు సమన్వయింపఁబడినది.

సమాసములు :

బాలాజనశీలశైలమ్:- బాలా ఏవ జనాః = బాలాజనాః, బాలాజనానాం శీలమ్ = బాలాజనశీలమ్. బాలాజనశీలమేవ శైలః = బాలాజనశీలశైలః, తం = బాలాజనశీలశైలమ్.

లజ్జానదీమజ్జదనంగనాగమ్ :- లజ్జైవ నదీ = లజ్జానదీ, లజ్జానద్యాం మజ్జన్ = లజ్జానదీమజ్జన్, అనంగ ఏవ నాగః = అనంగనాగః, లజ్జానదీ మజ్జంశ్చాసౌ అనంగనాగశ్చ = లజ్జానదీమజ్జదనంగనాగః, తమ్ = లజ్జానదీమజ్జదనంగనాగమ్.

అభాషమాణా:- న భాషమాణా = అభాషమాణా, తాం = అభాషమాణామ్.

చక్రాంగపతంగశక్రః:- చక్రాంగా ఇతి పతంగాః = చక్రాంగపతంగాః, చక్రాంగపతంగానాం శక్రః = చక్రాంగపతంగశక్రః.

భావము;-

ఆ దమయంతి శ్లేషభంగిమలతో మాట్లాడుటవలన నామె యాశయము సందిగ్ధముగనే యుండినది. ఆమె ముగ్ధ యగుటవలన నామెశీలము పర్వతము వలె దుర్భేద్యము. దానికి తోడుగ మన్మథగజము గూడ నామెలజ్జాభావముచే విజితుఁడై యామెలజ్జ యను నదియందు మునిగిపోయెను. కావున ముగుదల యొక్క యిట్టి శీలమును హంస పర్యాలోచించి పలికినది.

శ్లో॥ నృపేణ పాణిగ్రహణే స్పృహేతి
నలం మనః కామయతే మమేతి।
ఆశ్లేషి న శ్లేషకవేర్భవత్యాః
శ్లోకద్వయార్థస్సుధియా మయా కిమ్॥ ౬౯

ప. వి. నృపేణ । పాణిగ్రహణే । స్పృహా । ఇతి । నలం । మనః । కామయతే । మమ । ఇతి । ఆశ్లేషి । న । శ్లేషకవేః । భవత్యాః । శ్లోకద్వయార్థః । సుధియా । మయా । కిమ్ ।

టీక॥ శ్లేషకవేః = శ్లేషభంగిమతో మాట్లాడునట్టి, (అనగా ననేకార్థము లగు శబ్దములను ప్రయోగించుచున్న) భవత్యాః = నీకు, నృపేణ = నలమహారాజుతో, పాణిగ్రహణే = వివాహమాడుట యందు, స్పృహేతి =

కోరిక యని, మమ = నాయొక్క, మనః = మనస్సు, నలం = నలుని, కామయతే ఇతి = కోరుచున్నదని, శ్లోకద్వయార్థః: "ద్విజరాజపాణిగ్రహేత్యాది" ఘటితశ్లోకముయొక్కయు, "చేతో న లంకామయతే" ఇత్యాది ఘటితశ్లోకముయొక్కయు, (అనగా "మనస్తు యం నోజ్ఝతి" (59) "ఇతీరితా పత్రరథేన" (67) యను రెండుశ్లోకములయొక్కయు నర్థము) సుధియా = పండితుఁడ నైన, మయా = నాచే, నాఽఽశ్లేషి కిమ్ = గ్రహింపఁబడలేదా ఏమి?

సమాసములు :-

నృపేణ:- నౄన్ పాతీతి = నృపః, తేన = నృపేణ.

పాణిగ్రహణే:- పాణేః గ్రహణమ్ = పాణిగ్రహణమ్, తస్మిన్ = పాణిగ్రహణే.

శ్లేషకవేః:- శ్లేషస్య కవిః = శ్లేషకవిః, తస్య = శ్లేషకవేః.

శ్లోకద్వయార్థః:- శ్లోకయోః ద్వయమ్ = శ్లోకద్వయమ్, శ్లోకద్వయస్య అర్థః = శ్లోకద్వయార్థః.

సుధియా:- శోభనా ధీః యస్య సః = సుధీః, తేన = సుధియా.

భావము:-

ఓ దమయంతీ! నీవు శ్లేషకవివి. ఏల యనగా, "కా నామ బాలా ద్విజరాజపాణిగ్రహాభిలాష" మను శ్లోకభావముచే రాజునందుఁ గోరికను బ్రకటించితివి. తర్వాత 'చేతో న లంకామయతే' యను శ్లోకభావముచే చిత్తము నలుని కోరుచున్న దని యొక యర్థమును వెల్లడించితివి. తర్వాత "ద్విజరాజ!" యను సంబోధనాంతవిభాగముచే "న లంకామ్ - అయతే" యను విభాగముచేతను తద్భిన్నార్థములను బ్రకటించితివి. కాన శ్లేషకవి యగు నీవు తలఁబెట్టిన యా రెండుశ్లోకముల యర్థమును విద్వాంసుడ నైన నేను గ్రహింపలేకపోలేదు. శ్లిష్టపదములతో గూఢము గావింపఁబడిన నీయాశయమును నేను గ్రహించితిని.

శ్లో॥ త్వచ్చేతసః స్థైర్యవిపర్యయం తు
సంభావ్య భావ్యస్మి తదజ్ఞ ఏవ।
లక్ష్యే హి బాలాహృది లోలశీలే
దరాపరాద్ధేషురపి స్మరః స్యాత్॥ ౭౦

ప. వి. త్వచ్చేతసః । స్థైర్యవిపర్యయం । తు । సంభావ్య । భావీ । అస్మి । తదజ్ఞః । ఏవ । లక్ష్యే । హి । బాలాహృది । లోలశీలే । దరాపరాద్ధేషుః । అపి । స్మరః । స్యాత్ ।

టీక॥ కింతు = అయినచో, త్వచ్చేతసః = నీ చిత్తముయొక్క, స్థైర్య విపర్యయమ్; = అస్థిరత్వమును, సంభావ్య = సందేహించి, తదజ్ఞః = ఆ శ్లోకద్వయార్థమును దెలియనివాడనుగ, భావీ = కాఁబోవుచు, అస్మి = ఉన్నాను, హి = ఏల యనఁగా, లోలశీలే = చంచలస్వభావము గల్గిన, బాలాహృది = ముగ్ధ యగు స్త్రీయొక్క హృదయ మను, లక్ష్యే = గుఱియందు, స్మరోఽపి = మన్మథుఁడును, దరాపరాద్ధేషుః; దర = కొంచెము, అపరాద్ధ = తప్పిపోయిన, ఇషుః = బాణము గలవాఁడుగ, స్యాత్ = అగును.

పై రెండు శ్లోకార్థములు నాకుఁ దెలిసిన వైనను నీ చిత్తముయొక్క చాంచల్యమును శంకించి తెలియనివాఁడనుగనే యున్నాదను అను విశేషార్థమును చంచలస్వభావము గల స్త్రీహృదయమందు మన్మథుఁడును గుఱితప్పు నను సామాన్యార్థముచే సమర్థించుటవలన నర్థాంతర న్యాసాలంకారము.

సమాసములు;-

త్వచ్చేతసః:- తవ చేతః = త్వచ్చేతః, తస్య = త్వచ్చేతసః.

స్థైర్యవిపర్యయం:- స్థిరస్య భావః = స్థైర్యమ్, స్థైర్యస్య విపర్యయః = స్థైర్యవిపర్యయః, తమ్ = స్థైర్యవిపర్యయమ్.

బాలాహృది:- బాలాయాః హృత్ = బాలాహృత్, తస్మిన్ = బాలాహృది.

లోలశీలే:- లోలం శీలం యస్య తత్ = లోలశీలమ్, తస్మిన్ = లోలశీలే.

దరాపరాద్ధేషుః:- దరమపరాద్ధః = దరాపరాద్ధః. దరాపరాద్ధః ఇషు యస్య సః = దరాపరాద్ధేషుః.

భావము:-

నాకు వాస్తవములో పై రెండుశ్లోకముల యర్థము తెలియును. దాని యర్థముల ననుసరించి నీవు నలుని వరింతు వని గ్రహింపవలసియున్నది. కాని ముగ్ధ యగు నీ హృదయము చంచలము. కాన నొకక్షణమునం దున్నట్టి యుద్దేశ్యము మఱి యొకక్షణమం దుండుట యరుదు. కావున శ్లోకార్థములు తెలిసియు, నీ చిత్త చాంచల్యముఁ బురస్కరించుకొని యా శ్లోకార్థములను దెలియఁజేయవలసినవాఁడనుగనే యున్నాఁడను. మిక్కిలి చంచల మైన ముగ్ధాహృదయమును గుఱిపెట్టికొని మన్మథుఁడు బాణప్రయోగము జేసినను నది యా హృదయమును దాకక కొంచెము తప్పిపడుచున్నది. కాన నేను మాత్ర మెట్లు నీ యాశయమును దృఢముగఁ దెలిసికొనఁగలను.

శ్లో॥ మహీమహేంద్రః కిల నైషధేందు
స్తద్బోధనీయః కథమిత్థమేవ।
ప్రయోజనం సాంశయికం ప్రతీదృక్
పృథగ్జనేనేవ స మద్విధేన॥ ౭౧

ప. వి మహీమహేంద్రః । కిల । నైషధేందుః । తత్ । బోధనీయః । కథమ్ । ఇత్థమ్ । ఏవ । ప్రయోజనం । సాంశయికం । ప్రతి । ఈదృక్ । పృథక్ జనేన । ఇవ । సః । మద్విధేన ।

టీక॥ నైషధేందుః = నలచంద్రుఁడు, మహీమహేంద్రః ఖలు = భూమికి దేవేంద్రుఁడు గదా, తత్ = అందువలన, సః = ఆ నలుఁడు, పృథగ్జనేనేవ = సాధారణజనముచేతవలె, మద్విధేన = నావంటి విద్వాంసునిచే, ఈదృక్ = ఇట్టి, సాంశయికం = సందేహగ్రస్త మైన, ప్రయోజనం ప్రతి = కార్యముఁ గూర్చి, ఇత్థమేవ = ఇట్లు సందిగ్ధముగ, కథం = ఎట్లు, బోధనీయః = బోధింపఁ దగినవాఁడు.

సమాసములు:-

మహీమహేంద్రః:- మహ్యాః మహేంద్రః = మహీమహేంద్రః.
నైషధేందుః:- నిషధానాం రాజా = నైషధః, నైషధః ఇందురివ = నైషధేందుః.

సాంశయికం:- సంశయస్య విషయః = సాంశయికః, తమ్ = సాంశ యికమ్.

మద్విధేన:- అహం విధా యస్య సః = మద్విధః, తేన = మద్విధేన.

భావము:-

నలమహారాజు భూమికి దేవేంద్రుఁడు. ఇట్లు సందేహగ్రస్తమైన విషయమును సామాన్యజనమువలె నావంటి విద్వాంసుఁడాతని కెట్లు బోధింపఁగలఁడు ఇంతవరకును నీవు మనస్సును విప్పి నీ కోరికను జెప్పకయుంటివి. కావున నావంటి విజ్ఞులు ప్రయత్నించుటకుఁ దగినవిధముగ నీవు నీ నిశ్చితాశయమును వెల్లడిపఱుచవలయును.

శ్లో॥ పితుర్నియోగేన నిజేచ్ఛయా వా
యువానమన్యం యది వా వృణీషే।
త్వదర్థమర్థిత్వకృతిప్రతీతిః
కీదృఙ్మయి స్యాన్నిషధేశ్వరస్య॥ ౬౨

ప. వి. పితుః । నియోగేన । నిజేచ్ఛయా । వా । యువానమ్ । అన్యం । యది। వా । వృణీషే , త్వదర్థమ్ । అర్థిత్వకృతిప్రతీతిః । కీదృక్ । మయి । స్యాత్ । నిషధేశ్వరస్య ।

టీక ॥ పితుః = తండ్రియొక్క, నియోగేన = ఆజ్ఞచే గాని. నిజేచ్ఛయా = స్వేచ్ఛచేత గాని, అన్యం = నలునికంటె భిన్న మయిన, యువానం = యువకుని, యది వృణీషే = వరించినచో, తదా = అప్పుడు, నిషధేశ్వరస్య = నిషధదేశప్రభు వగు నలునకు, మయి = నా విషయమునందు, త్వదర్థం = నీకై, అర్థిత్వకృతిప్రతీతిః; అర్థిత్వ = యాచకత్వమును, కృతి = పొందుటయందలి, ప్రతీతిః = విశ్వాసము, కీదృక్ = ఏవిదముగా, స్యాత్ = ఉండగలదు.

సమాసములు :-

నిజేచ్ఛయా:- నిజా చ సా ఇచ్ఛా చ = నిజేచ్ఛా, తయా = నిజేచ్ఛయా.

అర్థిత్వకృతిప్రతీతిః :- అర్థినః భావః = అర్థిత్వం, అర్థిత్వస్య కృతిః = అర్థిత్వకృతిః, అర్థిత్వకృతౌ ప్రతీతిః = అర్థిత్వకృతిప్రతీతిః.
నిషధేశ్వరస్య :- నిషధానామీశ్వరః = నిషధేశ్వరః, తస్య = నిషధేశ్వరస్య.

భావము :-

ఓ దమయంతీ! నీవు తండ్రియాజ్ఞచేతనో లేదా స్వేచ్ఛతోడనో నలుని కంటె భిన్నమయిన మఱియొక యువకుని నొకవేళ వరించినచో నీవిషయమున నలునివంటి మహారాజునకు దౌత్యము వహించిన నాయం దెట్టి విశ్వాసముండ గలదు? అనగా నెట్టి విశ్వాసము నుండజాలదు. కావున నీవు తొలుత నిశ్చితాశయము గల్గి వర్తింపవలయును.

శ్లో॥ త్వయాఽపి కిం శంకితవిక్రియేఽస్మి
న్నధిక్రియే వా విషయే విధాతుమ్।
ఇతః పృథక్ ప్రార్థయసే తు యద్యత్
కుర్వే తదుర్వీపతిపుత్రి సర్వమ్॥ 23

ప. వి. త్వయా । అపి। శంకితవిక్రియే। అస్మిన్ । అధిక్రియే । వా। విషయే । విధాతుమ్ । ఇతః । పృథక్ । ప్రార్థయసే । తు । యత్ । యత్ । కుర్వే । తత్ । ఉర్వీపతిపుత్రి । సర్వమ్ ।

టీ॥ హే ఉర్వీపతిపుత్రి = ఓ భీమనరపాలుని పుత్రికా! త్వయాఽపి వా = నీచేతనైనను, కిం = దేనిని, విధాతుం = చేయుటకు, శంకితవిక్రియే; శంకిత = సందేహింపఁబడిన, విక్రియే = విపర్యయము గల్గిన, అస్మిన్ = ఈ, విషయే = రాజపాణిగ్రహణవిషయమునందు, [అహం = నేను,] అధిక్రియే = నియోగింపఁబడుదును? కింతు = కాని, ఇతః = దీనికంటె, పృథక్ = వేఱుగా, యత్ యత్ = దేనిని దేనిని, ప్రార్థయసే = కోరుదువో, తత్ = అట్టి, సర్వమ్ = సకలమును, కుర్వే = చేయుదును.

సమాసములు :-

శంకితవిక్రియే :- శంకితా విక్రియా యస్మిన్ సః = శంకితవిక్రియః, తస్మిన్ = శంకితవిక్రియే.

ఉర్వీపతిపుత్రి:- ఉర్వ్యాః పతిః = ఉర్వీపతిః, ఉర్వీపతేః పుత్రీ = ఉర్వీపతిపుత్రీ, తస్యాస్సంబుద్ధిః = ఉర్వీపతిపుత్రి!

భావము :-

ఓ దమయంతీ! నీ వొకవేళ నీ హృదయమందలి రహస్యమును జెప్ప నొల్లకపోయినచో మఱియొక కార్యమును దేనిని చెప్పినను నా వాగ్దానమును నిలుపుకొనుటకై చేయఁగలను. సందిగ్ధమైన రాజపాణిగ్రహణవిషయమునం దేమి చేయుటకు నీవు నన్ను నియమించెదవు? నీవును సందిగ్ధమగు నిట్టి విషయమునందు నన్ను నియమింప వనియే భావించుచున్నాను.

శ్లో॥ శ్రవఃప్రవిష్టా ఇవ తద్గిరస్తా
విధూయ వైమత్యధుతేన మూర్ధ్నా।
ఊచే హ్రియా విశ్లథితానురోధా
పునర్ధరిత్రీపురుహూతపుత్రీ॥ ౭౪

ప.వి. శ్రవఃప్రవిష్టా। ఇవ। తద్గిరః। తాః। విధూయ। వైమత్యధుతేన। మూర్ధ్నా। ఊచే। హ్రియా। విశ్లథితానురోధా। పునః। ధరిత్రీపురుహూతపుత్రీ।

టీక॥ ధరిత్రీపురుహూతపుత్రీ; ధరిత్రీపురుహూత = భూమికి దేవేంద్రుఁడగు భీమ నృపాలునియొక్క. పుత్రీ = కుమార్తెయగు దమయంతి, శ్రవః ప్రవిష్టా ఇవ = చెవులయందుఁ బ్రవేశించినవో యను నట్లున్న, తద్గిరః = హంసవచనములను. వైమత్యధుతేన; వైమత్య = అసమ్మతిచే, ధుతేన = విదిలింపఁబడిన. మూర్ధ్నా = తలచే, విధూయ = నిషేధించి. హ్రియా = సిగ్గుచే, విశ్లథితానురోధా; విశ్లథిత = సడలింపబడిన, అనురోధా = బెట్టుగలదై, పునరపి = మఱల, ఊచే = పలికినది,

సమాసములు :-

శ్రవఃప్రవిష్టాః :- శ్రవసోః ప్రవిష్టాః = శ్రవఃప్రవిష్టాః, తాః = శ్రవఃప్రవిష్టాః.
తద్గిరః = తస్య గిరః = తద్గిరః, తాః = తద్గిరః.

వై మత్యధుతేన :— విమతేర్భావః = వై మత్యమ్, వై మత్యేన ధుతమ్ = వై మత్యధుతమ్, తేన = వై మత్యధుతేన.

విశ్లథితానురోధా :- విశ్లథితః అనురోధః యస్యాస్సా = విశ్లథితాను రోధా.

ధరిత్రీపురుహూతపుత్రీ :— ధరిత్ర్యాః పురుహూతః = ధరిత్రీపురుహూ తః, ధరిత్రీపురుహూతస్య పుత్రీ = ధరిత్రీపురుహూతపుత్రీ.

భావము :

ఆ హంస నుడివిన మాటలు చెవిసోకినవో లేవో వెంటనే యాదమ యంతి యసమ్మతితోఁ దలను విదిలించి యాహంసను మాట్లాడనీక నిరోధించి నది. ఆహంస పన్నిన మాటలనేర్పుచే దమయంతి తన కిఁక నలునిప్రాప్తి యుండ దేమో యని సందేహించి తన సిగ్గును బెట్టును వదలిపెట్టుకొని తనమన స్సున దాగియున్న నలాభిలాషను వెల్లడిచేయుటకై పలుకఁదొడగినది.

శ్లో॥ మదన్యదానం ప్రతి కల్పనా యా
వేద స్త్వదీయే హృది తావదేషా।
నిశోఽపి సోమేతరకాంతశంకా
మోంకారమగ్రేసరమస్య కుర్యాః॥ ౭౫

ప వి. మదన్యదానం । ప్రతి । కల్పనా । యా। వేదః । త్వదీయే । హృది । తావత్ । ఏషా । నిశః । అపి । సోమేతరకాంతశంకామ్ । ఓంకారమ్। అగ్రేసరమ్ । అస్య । కుర్యాః.

టీక ॥ మదన్యదానంప్రతి; మత్ = నాకు, అన్యదానం ప్రతి = ఇతరులకు దానము చేయుటను గూర్చి, యా = ఏ, కల్పనా = ఊహ గలదో, ఏషా = ఇది, త్వదీయే = నీదైన, హృది = మనస్సునందు, వేదః = వేద మనుట, తావత్ = సత్యమే, నిశోఽపి = రాత్రికిని, సోమేతరకాంతశంకామ్; సోమేతర = చంద్రునికంటె నితర మైన, కాంత = ప్రియునియొక్క, శంకాం = సందేహమును, అస్య = ఈ వేదమునకు, అగ్రేసరం = ముందు నడచునట్టి, ఓంకారం = ప్రణవముగా, కుర్యాః = చేయుము.

ఇచ్చట మదన్యదానకల్పన వేదముతోడను రాత్రికి సోమేతర కాంతకల్పనను ఓంకారముతోడను రూపించుటవలన రూపకాలంకారము.

సమాసములు :

మదన్యదానమ్ :- అన్యస్మై దానమ్ = అన్యదానమ్, మమ అన్య దానమ్ = మదన్యదానమ్.

సోమేతరకాంతశంకామ్ :- సోమాత్ ఇతరః = సోమేతరః, సోమేత రశ్చాసౌ కాంతశ్చ = సోమేతరకాంతః, సోమేతరకాంతస్య శంకా = సోమేతరకాంతశంకా, తామ్ = సోమేతరకాంతశంకామ్.

అగ్రేసరమ్ :- అగ్రే సరతీతి = అగ్రేసరః, తమ్ = అగ్రేసరమ్.

భావము :

ఓహంసా! నన్నితరులకు దానముఁజేయుటను గూర్చి నీవు చేయునట్టి యూహ సత్యముగ వేదమే. నీయూహ యను నీవేదమునకు తొలుత నుంచఁ దగిన యోంకారముగ రాత్రికి చంద్రునికంటె భిన్న మగు కాంతునితోటి సంబంధ కల్పన నుంచవలసినది. వేదప్రారంభము ఓంకారముతో జరుగును. అట్లే నన్నొరుల కిత్తు రనెడి కల్పన యను వేదమునకు. రాత్రికిఁ జంద్రేతరకాంతకల్పన ఓంకార మగుచున్నది. రాత్రికి చంద్రునికంటె నితరుఁ డైనవానిని గాంతునిఁ గల్పించుట యెంతటి యసంభవమో నాకును నలునికంటె భిన్న మైనవానిని గాంతునిఁ గావించుటయు నంతటి అసంభవము. కావున నేను నలునికంటె నితరుని వరించను.

శ్లో॥ సరోజినీమానసరాగవృత్తే
రనర్హసంపర్కమతర్కయిత్వా।
మదన్యపాణిగ్రహశంకితేయ
మహో మహీయస్తవ సాహసిక్యమ్॥ ౭౮

ప. వి. సరోజినీమానసరాగవృత్తేః । అనర్హసంపర్కమ్ । అతర్కయిత్వా । మదన్యపాణిగ్రహశంకితా । ఇయమ్ । అహో । మహీయః। తవ। సాహసిక్యమ్ ।

టీక॥ సరోజినీమానసరాగవృత్తేః; సరోజినీ=తామరపూవుయొక్క, మానస రాగ = మనస్సునందలి యనురాగముయొక్క, వృత్తేః = స్థితికిని, (తామరపూవులోపల నున్న యెఱ్ఱఁదనమునకును) అనర్కసంపర్కమ్; అనర్క=సూర్యభిన్నమైనవానియొక్క, సంపర్కమ్ = సంబంధమును, అతర్కయిత్వా = ఆలోచింపక, తవ=నీకు, ఇయం=ఈ, మదన్యపాణిగ్రహశంకితా: మత్ = నాకు, అన్య = ఇతరులయొక్క, పాణిగ్రహ = పరిణయమును గూర్చి, శంకితా = సందేహము గల్గియుండుట, మహీయః = మిక్కిలి గొప్ప దైన, సాహసిక్యమ్ = సాహసకృత్యము, అహో =ఆశ్చర్యము.

సరోజినీమానసరాగవృత్తికి సూర్యేతరసంసర్గము నాలోచింపక యుండుటకును; దమయంతికి నలేతరపాణిగ్రహశంకకును బింబప్రతిబింబభావముచే నౌపమ్యముఁ జెప్పుటవలన దృష్టాంతాలంకారము.

సమాసములు ;

సరోజినీమానసరాగవృత్తేః ;- మానసస్య రాగవృత్తిః= మానసరాగవృత్తిః, సరోజిన్యాః మానసరాగవృత్తిః=సరోజినీమానసరాగవృత్తిః, తస్యాః= సరోజినీ మానసరాగవృత్తేః.

అనర్కసంపర్కమ్ ;- న అర్కః=అనర్కః, అనర్కస్య సంపర్కః =అనర్కసంపర్కః, తమ్ =అనర్కసంపర్కమ్.

మదన్యపాణిగ్రహశంకితా;- అన్యస్య పాణిగ్రహః=అన్యపాణిగ్రహః, మమ అన్యపాణిగ్రహః=మదన్యపాణిగ్రహః, మదన్యపాణిగ్రహస్య శంకీ=మదన్యపాణిగ్రహశంకీ, మదన్యపాణిగ్రహశంకినః భావః= మదన్యపాణిగ్రహశంకితా.

మహీయః :- అత్యంతం మహత్ =మహీయః,

సాహసిక్యమ్ :- సాహసమస్యాఽస్తీతి = సాహసీ, సాహస్యేవ = సాహసికః, సాహసికస్య భావః=సాహసిక్యమ్.

భావము :

ఓహంసా నేను నలునికంటె నితరునిఁ బరిణయమాడఁగల నని నీకు సందేహ మున్నది.కాని యిది గొప్ప సాహస మయిన విషయము. తామరపూవు

**లో**ని రాగమునకును (ఎఱ్ఱదనమునకును) సూర్యసంసర్గమే కారణము. సూర్యే తరసంపర్కము కారణము కానేరదు నీకు నాయెడ నేర్పడిన సంశయము తామర **లో**ని యెఱ్ఱదనమునకు సూర్యేతరసంపర్కము కారణ మగునా కాదా యని యాలోచింపమితో సమానము. కావున నాకు నలేతరపాణిగ్రహమునందుఁ గోరిక లేదు.

శ్లో॥ సాధు త్వయాఽతర్కి తదేకమేవ
స్వేనానలం యత్కిల సంశ్రయిష్యే।
వినాఽమునా స్వాత్మని తు ప్రహర్తుం
మృషాగిరం త్వాం నృపతౌ న కర్తుమ్॥ ౭౭

ప. వి. సాధు। త్వయా। అతర్కి। తత్। ఏకమ్। ఏవ। స్వేన। అనలం। యత్। కిల। సంశ్రయిష్యే। వినా। అమునా। స్వాత్మని। తు। ప్రహర్తుం। మృషాగిరం। త్వాం। నృపతౌ। న। కర్తుమ్।

టీక॥ కింతు = మతే మనగా, స్వేన = స్వేచ్ఛచే, అనలం = నలునికంటె భిన్న మయినవానిని, (అగ్నిని) సంశ్రయిష్యే = పొందఁగల నని, యత్ = ఏది, త్వయా = నీచే, అతర్కి = ఊహింపఁబడినదో, తత్ = అది, ఏకమేవ = ఒక్కటియే, సాధు = చక్కగా, అతర్కి = ఆలోచింపఁబడినది, కింతు = కాని, అమునా = ఈ నలునిచే, వినా = లేక, స్వాత్మని = స్వవిషయమున, ప్రహర్తుం = హింసించు కొనుటకు, అనలం (= నలభిన్నుని) అగ్నిని, సంశ్రయిష్యే = ఆశ్రయింపగలను. నృపతౌ = నలుని విషయమునందు, త్వాం = నిన్ను, మృషాగిరం = అసత్య వాక్కుగలవానినిగ, కర్తుం = చేయుటకు, న = కాదు.

సమాసములు:

అనలమ్ :- న నలః = అనలః, తమ్ = అనలమ్.
స్వాత్మని :- స్వస్య ఆత్మా = స్వాత్మా, తస్మిన్ = స్వాత్మని.
మృషాగిరమ్ :- మృషా గీః యస్య సః = మృషాగీః, తమ్ = మృషా గిరమ్.

భావము :

నేను అనలుని నలభిన్నునిఁ (అగ్నిని) బొందఁగల నని నీవు తర్కిం చిన విషయము వాస్తవ మైనదే, ఏల యనగా నలుఁడు లభ్యము గానపుడు నేను అనలుని = అగ్నినిఁ బ్రవేశించి యాత్మహత్యను జేసికొనక తప్పదు. నీకు నలునియొద్ద నసత్యవచనత్వదోష మాపాదింపవలయు నను నుద్దేశ్యముతో ననలప్రవేశముఁ జేయుటలేదు. మఱే మనగా నలుఁడే నాకు శరణము. అతడు శరణము గానప్పుడు మరణమే శరణ్యము. నీవు అతని యిష్టమును నెఱవేర్తు నని చేసిన వాగ్దానము భంగ మైనను సహింపవలసినది. కాని నిన్ను నలుని విషయమున నసత్యవాదిగఁ జేయుట నాతలంపు కాదు.

శ్లో॥ మద్విప్రలభ్యం పునరాహ యస్త్వాం
తర్కస్స కిం తత్ఫలవాచి మూకః।
అశక్యశంకవ్యభిచారహేతు
ర్వాణీ న వేదా యది సంతు కే తు॥ ౭౮

వ. వి. మద్విప్రలభ్యం । పునః । ఆహ । యః । త్వాం । తర్కః । సః । కిం । తత్ఫలవాచి । మూకః । అశక్యశం కవ్యభిచారహేతుః। వాణీ। న ।వేదాః। యది । సంతు । కే । తు ।

టీక॥ యః = ఏ, తర్కః = ఊహ, త్వాం = నిన్ను, మద్విప్రలభ్యం = నాచే వంచింపఁదగినవానినిగ, ఆహ = చెప్పుచున్నదో, సః = ఆతర్కము, తత్ఫలవాచి; తత్ = ఆతర్కముయొక్క, ఫల = ఫలమును, వాచి = చెప్పుటయందు, మూకః కిం = మూగ యైనదా (అనగా శక్తిలేనిదా యేమి ?) అశక్యశంకివ్యభిచారహేతుః; అశక్యశంక = శంకింప సాధ్యము గాని, వ్యభిచారహేతుః = వంచింపఁ గోరిక గల్గిన, వాణీ = వాక్యము, న వేదా యది = ప్రమాణము గానిచో, (తర్హి = అప్పుడు) కే తు = ఏవి, వేదాస్సంతు = ప్రమాణము లగుచున్నవి.

సమాసములు :

మద్విప్రలభ్యమ్ :- విప్రలబ్ధుం యోగ్యః = విప్రలభ్యః, మయా విప్ర లభ్యః = మద్విప్రలభ్యః, తమ్ = మద్విప్రలభ్యమ్.

ఫలవాచి ;- ఫలస్య వాక్ = ఫలవాక్, తస్యాం = ఫలవాచి,
అశక్యశంకవ్యభిచారహేతుః ;- న శక్యా = అశక్యా, అశక్యా శంకా యస్మిన్ సః = అశక్యశంకః, వ్యభిచారస్య హేతుః = వ్యభిచార హేతుః, అశక్యశంకః వ్యభిచారహేతుః యస్యాస్సా = అశక్యశంకవ్యభిచార హేతుః.

భావము:-

నీవు నలునితో రాయబారము చేసిన పిదప ఒకవేళ నే నతని నొల్లక మఱి యొకరినిఁ బ్రేమించినచో నిన్ను వంచించిన ట్లగు నని సూచించితివి. కాని దానికిఁ బ్రసక్తి లేదు నేను నిన్ను మోసగింతు నేమో యని నీవు గావించిన యూహ అట్టి మోసమునకు ఫలము నేల చెప్పదు. నేను నిన్ను మోసగించుటచేఁ బొందు ఫల మేమియును లేదు. మోస ముండు నని శంకించుటకు వీలులేని మాటయే ప్రమాణము గానప్పుడు ప్రపంచమున మఱి యెవ్వి ప్రమాణములు కాగలవు. కావున నీవు నామాటను శంకించుట తగదు.

శ్లో॥ అనైషధాయైవ జుహోతి కిం మాం
తాతః కృశానౌ న శరీరశేషామ్।
ఈష్టే తనూజన్మతనో స్తథాఽపి
మత్ప్రాణనాథ స్తు నలస్స ఏవ॥ ౭౫

ప. వి అనైషధాయ। ఏవ। జుహోతి। కిం। మాం। తాతః। కృశానౌ। న। శరీరశేషామ్। ఈష్టే। తనూజన్మతనోః। తథా। అపి। మత్ప్రాణనాథః। తు। నలః। సః। ఏవ।

టీక॥ తాతః = నాతండ్రి, మాం = నన్ను, అనైషధాయైవ = నలునికంటె భిన్నుఁ డైనవానికి, జుహోతి కిమ్ = దానముఁ జేయునా ఏమి? తదా = అట్లు దానముఁ జేయునప్పుడు, శరీరశేషాం = శరీరమే మిగిలిన, (అనగా మరణించిన నన్ను) కృశానౌ = అగ్నియందు, న జుహోతి కిమ్ = హుతముఁ జేయఁడా యేమి? సః = ఆతండ్రి, తనూజన్మతనోః; తనూజన్మ = కుమార్తెయొక్క, తనోః = శరీరమునకు, ఈష్టే = పాలకుఁ డగుచున్నాఁడు, తథాపి = శరీరమునకుఁ దండ్రి స్వామి యైనను,

మత్ప్రాణనాథస్తు = నా ప్రాణములకు రక్షకుఁడు, సః = ఆ, నల ఏవ = నలమహారాజే (అగుచున్నాఁడు).

సమాసములు:-

అనైషధాయ:- నిషధానాం రాజా = నైషధః, న నైషధః = అనైషధః, తస్మై = అనైషధాయ.

శరీరశేషామ్:- శరీరం శేషః యస్యాస్సా = శరీరశేషా, తాం = శరీరశేషామ్.

తనూజన్మతనోః:-తన్వాం జన్మ యస్య సః = తనూజన్మా, తనూజన్మనః తనుః = తనూజన్మతనుః, తస్యాః = తనూజన్మతనోః.

మత్ప్రాణనాథః:- మమ ప్రాణాః = మత్ప్రాణాః, మత్ప్రాణానాం నాథః = మత్ప్రాణనాథః.

భావము:-

నాతండ్రి నలునికంటె నితరునకు నన్ను దానముజేయునా? ఒకవేళ అట్లు దానముచేయుపక్షమునం దాతఁడు మృతిచెందిన నాయొక్క శరీరము నగ్ని యందు దగ్ధముఁ గావింపఁడా! తప్పక గావించవలసినదే. ఏల యనగా నాతండ్రి నా శరీరమునకు స్వామి. కాని నా ప్రాణములకు నలుఁడే నాథుఁడు. ప్రాణములకుఁ దండ్రి కారణము గాఁడు. కాన నీవు నామాటయందు విశ్వాసము నుంచవలయును.

శ్లో॥ తదేకదాసీత్వపదాదుదగ్రే
మదీప్సితే సాధు విధిత్సతా తే।
అహేళినా కిం నళినీ విధత్తే
సుధాకరేణాఽపి సుధాకరేణ॥ ౮౦

ప. వి. తదేకదాసీత్వపదాత్। ఉదగ్రే। మదీప్సితే। సాధు। విధిత్సతా। తే। అహేళినా। కిం। నళినీ। విధత్తే। సుధాకరేణ। అపి। సుధాకరేణ।

టీక॥ తదేకదాసీత్వపదాత్; తదేక = ఆ నలుని కొఱకునికే, దాసీత్వ = దాసిగా నుండుట యను, పదాత్ = అధికారమునకంటె, ఉదగ్రే = అధిక మైన,

మదీప్సితే = నా కోరిక యగు పత్నీత్వవిషయమునందు, తే = నీకు, విధిత్సుతా = చేయుటకుఁ గోరిక, సాధు = యుక్తము, నళినీ = తామర పూవు, సుధాకరేణాఽపి = అమృతకిరణుఁడైనను, అహేళినా = సూర్యభిన్నుఁడైన, సుధాకరేణ = చంద్రునితో, కిం = దేనిని, విధత్తే = చేయుచున్నది.

ఇచ్చట దమయంతీనలవాక్యార్థమునకును, నళినీహేళివాక్యార్థమునకును బింబప్రతిబింబభావముచే నౌపమ్యముఁ జెప్పుటవలన దృష్టాంతాలంకారము.

సమాసములు:-

తదేకదాసీత్వపదాత్:- సః ఏకః = తదేకః, దాస్యాః భావః = దాసీత్వం, తదేకస్య దాసీత్వమ్ = తదేకదాసీత్వమ్, తదేకదాసీత్వమేవ పదమ్ = తదేకదాసీత్వపదం, తస్మాత్ = తదేకదాసీత్వపదాత్.

మదీప్సితే:- మమ ఈప్సితమ్ = మదీప్సితమ్, తస్మిన్ = మదీప్సితే.

విధిత్సుతా:- విధాతుమిచ్ఛుః = విధిత్సుః, విధిత్సోః భావః = విధిత్సుతా.

అహేళినా:- న హేళిః = అహేళిః, తేన = అహేళినా.

సుధాకరేణ:- సుధామయాః కరాః యస్య సః = సుధాకరః, తేన = సుధాకరేణ.

భావము:-

ఓ హంసా! ఆ నలునికి దాసిగా నుండుటకంటె నించుక యధికమైనట్టి పత్నీత్వ మను విషయమును నీవు చేయ గోరుట మంచిది. అట్లు చేసినచో నా మనోరథమును బూరించినట్లే యగును. తామరపూవు చంద్రుఁ డమృతకిరణుఁడని భావించి యతనిని ప్రేమించుట లేదు. ఏల యనఁగా నతఁ డమృతకిరణుఁడే గాని సూర్యుఁడు గాఁడు. సూర్యుఁడైనప్పుడే పద్మము వికసించును. సూర్యభిన్నుఁ డయిన చంద్రునితో పద్మిని కెట్లు ప్రయోజనము లేదో యట్లే నాకును నలేతరునితోఁ బ్రయోజనము లేదు. కావున నిక్కముగా నలుని నేను వరింతును.

శ్లో॥ తదేకలుబ్ధే హృది మేఽస్తి లబ్ధుం
చింతా న చింతామణిమప్యనర్ఘమ్।
విత్తే మమైకస్సకలత్రిలోకీ
సారో నిధిః పద్మముఖస్స ఏవ॥ ౬౧

ప. వి. తదేకలుబ్ధే। హృది। మే। అస్తి। లబ్ధుం। చింతా। న। చింతామణిమ్। అపి। అనర్ఘమ్। విత్తే। మమ। ఏకః। సకలత్రిలోకీసారః। నిధిః। పద్మముఖః। సః। ఏవ,

టీక॥ (కించ = మఱియు) తదేకలుబ్ధే; తదేక = ఆనలునియందే, లుబ్ధే = ఆశగల్గిన, మే = నాయొక్క, హృది = హృదయమందు, అనర్ఘం = వెలలేని, చింతామణిమపి = చింతామణిని గూడ, లబ్ధుం = పొందుటకు, చింతా = విచారము, నాస్తి = లేదు, (తథా = అట్లే) విత్తే = ధనవిషయమందును, మమ = నాకు, సకలత్రిలోకీసారః = సమస్తములైన మూఁడు లోకములయందును శ్రేష్ఠుఁడైన, పద్మముఖః = పద్మమువంటి ముఖము గల్గిన, స ఏవ = ఆనలుఁడే, (పద్మముఖః = పద్మము మొదలైన, నిధిశ్చ = నిధియు).

సమాసములు:-

తదేకలుబ్ధే:- సః ఏకః = తదేకః, తదేకస్మిన్ లుబ్ధమ్ = తదేకలుబ్ధమ్, తస్మిన్ = తదేకలుబ్ధే.

అనర్ఘమ్:- అవిద్యమానః అర్ఘః యస్య సః = అనర్ఘః, తమ్ = అనర్ఘమ్.

సకలత్రిలోకీసారః:- త్రయాణాం లోకానాం సమాహారః = త్రిలోకీ, సకలా చ సా త్రిలోకీ చ = సకలత్రిలోకీ. సకలత్రిలోక్యాః సారః = సకలత్రిలోకీసారః.

పద్మముఖః:- పద్మమివ ముఖం యస్య సః = పద్మముఖః; లేదా పద్మః ముఖే యస్య సః = పద్మముఖః

భావము:-

నా హృదయ మానలునియందే యాసక్తి గల్గియున్నది. కాన నమూల్యమగు చింతామణిరత్నమును గూడఁ బొందుటకు నా కుద్దేశములేదు. ద్రవ్యవిష

యమునందుఁ గూడఁ బద్మముఖు డగు నానలుఁ డొక్కఁడే సమస్తము లగు మూడులోకములలోను పద్మాదినిధిగ నాకున్నాఁడు. కావున నానలుని వదలి మఱి యేవస్తువును నేను కోరఁదలచలేదు.

శ్లో॥ శ్రుతశ్చ దృష్టశ్చ హరిత్సు మోహా
ద్ధ్యాతశ్చ నీరంధ్రితబుద్ధిధారమ్।
మమాద్య తత్ప్రాప్తిరసువ్యయో వా
హస్తే తవాఽఽస్తే ద్వయమేవ శేషః॥ ౮౨

ప. వి. శ్రుతః । చ । దృష్టః । చ । హరిత్సు । మోహాత్ । ధ్యాతః । చ । నీరంధ్రితబుద్ధిధారమ్ । మమ । అద్య । తత్ప్రాప్తిః । అసువ్యయః । వా । హస్తే । తవ । ఆస్తే । ద్వయమ్ । ఏవ । శేషః ।

టీక॥ (కిం బహునా = పెక్కుమాటలచే నేమి ప్రయోజనము) సః = అనలుఁడు, శ్రుతశ్చ = (దూతలవలనను, ద్విజులవలనను, స్తుతిపాఠకులవలనను, గాయకులవలనను) వినఁబడియున్నాఁడు, మోహాత్ = భ్రాంతివలన, హరిత్సు = దిక్కులయందు, దృష్టశ్చ = చూడఁబడియున్నాఁడు, (తథా = అట్లే,) నీరంధ్రితబుద్ధిధారమ్; నీరంధ్రిత = త్రెంపులేని, బుద్ధిధారమ్ = బుద్ధిప్రవాహము గలుగునట్లుగా, ధ్యాతశ్చ = చింతింపఁబడియు నున్నాడు; మమ = నాకు, అద్య = ఇప్పుడు, తత్ప్రాప్తిః = నలప్రాప్తియో, అసువ్యయో వా = ప్రాణత్యాగమో, ద్వయమేవ = రెండే (రెంటిలో నొక్కటియే) శేషః = మిగిలియున్నది. (స చ = అదియు) తవ = నీయొక్క, హస్తే = హస్తమందు, ఆస్తే = ఉన్నది.

ఇచ్చట 'తత్త్వమసి' యను మహావాక్యఘటక మగు తచ్ఛబ్దార్థమును శ్రవణ మనన నిదిధ్యాసనములు జేసిన వ్యక్తికి బ్రహ్మప్రాప్తి రూప మగు మోక్షము గుర్వధీన మను నర్థాంతరప్రతీతి ధ్వని యగుచున్నది.

సమాసములు:

నీరంధ్రితబుద్ధిధారమ్:- బుద్ధేః ధారా = బుద్ధిధారా, నీరంధ్రితా బుద్ధిధారా యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = నీరంధ్రితబుద్ధిధారమ్.

తత్ప్రాప్తిః :- తస్య ప్రాప్తిః = తత్ప్రాప్తిః.

అసువ్యయః :- అసూనాం వ్యయః = అసువ్యయః.

భావము:

పెక్కుమాట లేల? నే నా నలమహారాజును గూర్చి దూత ద్విజ వందిముఖములచే వింటిని. ఆతనియందలి మోహమువలన నన్నిదిక్కులయందును నతనిని జూచితిని. అనన్యబుద్ధితో నతనిని పెక్కుమాఱులు ధ్యానించితిని. ప్రకృతము నా కతనిప్రాప్తియో ప్రాణత్యాగమో తప్పదు. ఈరెంటిలో నేది యైనను నీచేతియందే యున్నది. సాధకుఁడు 'తత్త్వమసీతి' మహావాక్యార్థోపదేశమును గురుముఖమువలనఁ బడసి, తచ్ఛబ్దార్థమును శ్రవణ మనన నిదిధ్యాసనములు గావించి మోక్షముఁ బడయుట గుర్వధీన మను విషయము ధ్వనింపఁబడినది.

శ్లో॥ సంచీయతామాశ్రుతపాలనోత్థం
మత్ప్రాణవిశ్రాణనజం చ పుణ్యమ్।
నివార్యతామార్య వృథా విశంకా
భద్రేఽపి ముద్రేయమయే భృశం కా॥ ౮౩

ప. వి. సంచీయతామ్ । ఆశ్రుతపాలనోత్థమ్ । మత్ప్రాణవిశ్రాణనజం । చ । పుణ్యమ్ । నివార్యతామ్ । ఆర్య । వృథా । విశంకా । భద్రే । అపి । ముద్రా । ఇయమ్ । అయే । భృశం । కా ।

టీక॥ (హేహంస = ఓహంసా) ఆశ్రుతపాలనోత్థమ్; ఆశ్రుత = ప్రతిజ్ఞ గావింపఁబడిన విషయమును, పాలన = కాపాడుటవలన, ఉత్థమ్ = ఉద్భవించిన, మత్ప్రాణవిశ్రాణనజమ్; మత్ప్రాణ = నాప్రాణములను, విశ్రాణన = దానము చేయుటవలన, జం = కల్గిన, పుణ్యం = పుణ్యము, సంచీయతాం = సంపాదింపఁబడుఁగాత, హేఆర్య = ఓపూజ్యుఁడా, వృథా = వ్యర్థ మైన, విశంకా = సందేహము, నివార్యతామ్ = వారింపఁబడుమ గాత, అయే = ఓయీ, భద్రేఽపి = ముందుఁ జెప్పఁబడిన పుణ్యరూపవిషయమందును, భృశం = మిక్కిలి, కా = ఏమి, ఇయం = ఈ, ముద్రా = ఉపేక్ష; (అనగా మంచివిషయమం దౌదాసీన్యము తగదని యర్థము).

సమాసములు:

ఆశ్రితపాలనోత్థమ్:- ఆశ్రితస్య పాలనం = ఆశ్రితపాలనమ్, ఆశ్రిత పాలనాత్ ఉత్థా యస్య తత్ = ఆశ్రితపాలనోత్థమ్.

మత్ప్రాణవిశ్రాణనజమ్:- మమ ప్రాణాః = మత్ప్రాణాః, మత్ప్రాణా నాం విశ్రాణనమ్ = మత్ప్రాణవిశ్రాణనమ్. మత్ప్రాణవిశ్రాణనాత్ జాయతే ఇతి = మత్ప్రాణవిశ్రాణనజమ్.

భావము:

ఓహంసా! నీవు ప్రతిజ్ఞను కాపాడుకొని నాకుఁ బ్రాణదానముఁ గావించుటవలని పుణ్యమును సంపాదింపుము. ఓపూజ్యుఁడా! వ్యర్థమయిన సంశయమును వదలిపెట్టుము. పుణ్యరూపమైన శ్రేయస్సు విషయమునందిట్టి యౌదాసీన్యము నీకుఁ దగదు. కావున నాకు నలప్రాప్తి యగుటకుఁ ద్వరితముగఁ బ్రయత్నింపుము.

శ్లో॥ అలం విలంఘ్య ప్రియ విజ్ఞ యాచ్ఞాం
కృత్వాఽపి వామ్యం వివిధం విధేయే।
యశఃపథాదాశ్రవతాపదోత్థాత్
ఖలు స్ఖలిత్వాస్తఖలోక్తిఖేలాత్॥ ౮౪

ప. వి. అలం । విలంఘ్య । ప్రియ । విజ్ఞ । యాచ్ఞాం । కృత్వా । అపి । వామ్యం । వివిధం । విధేయే । యశఃపథాత్ । ఆశ్రవతాపదోత్థాత్ । ఖలు । స్ఖలిత్వా । అస్తఖలోక్తిఖేలాత్ ।

టీక॥ హేప్రియ = ఓప్రీతినిఁ గొల్పువాఁడా! విజ్ఞ = విశేషముఁ దెలిసినవాఁడా, యాచ్ఞాం = మా ప్రార్థనను, విలంఘ్య = అతిక్రమించి, అలం = చాలును, విధేయే = లోఁబడిన జనమునందు, వివిధం = నానావిధమైన, వామ్యం = వక్రత్వమును, కృత్వాఽపి = చేసియు, అలం = చాలును, ఆశ్రవతాపదోత్థాత్ = ఆశ్రవతా = వాగ్దానమును నిలఁబెట్టుకొనుట యను, పద = స్థానమునుండి, ఉత్థాత్ = ఉత్పన్నమైనదియు, అస్తఖలోక్తిఖేలాత్; అస్త = నిరసింపఁబడిన, ఖలోక్తి = అసత్యాలాపమను, ఖేలాత్ =

వినోదము గల్గిన, యశఃపథాత్ = కీర్తిమార్గమునుండి, స్ఖలిత్వా ఖలు = జారుటవలదు.

పాదప్రారంభమున "అలం" మున్నగు నిపాతములను ప్రయోగింపఁగూడదు. కాని యానిపాతము ఉద్వేగజనకము లైనప్పుడే యానిషేధము. కావున నిషేధార్థకము లగు 'అలం, ఖలు' నిపాతముల నిఁట నుపయోగించుటయందు దోషములేదు.

సమాసములు:

యశఃపథాత్:— యశసః పంథాః = యశఃపథః, తస్మాత్ = యశఃపథాత్.

ఆశ్రవతాపదోత్థాత్:—ఆశ్రవస్య భావః = ఆశ్రవతా, ఆశ్రవతాయాః పదం = ఆశ్రవతాపదం, ఆశ్రవతాపదాత్ ఉత్థా యస్య సః, ఆశ్రవతాపదోత్థః, తస్మాత్ = ఆశ్రవతాపదోత్థాత్.

అస్తఖలోక్తిఖేలాత్:— ఖలానాముక్తిః = ఖలోక్తిః, ఖలోక్తిరేవ ఖేలః = ఖలోక్తిఖేలః, అస్తః ఖలోక్తిఖేలః యేన సః = అస్తఖలోక్తిఖేలః, తస్మాత్ = అస్తఖలోక్తిఖేలాత్.

భావము:

ఓప్రియ మైన హంసా! విజ్ఞుఁడ వైన నీవు నాయీప్రార్థనను భంగపఱుపకుము. వినీత మైన నావంటివారివిషయమున వక్ర మైన మార్గము నవలంబింప వలదు. అసత్యసంభాషణాదులతోఁ గూడిన వినోదవికారములకు దూర మై ప్రతిజ్ఞానిర్వహణమువలనం గలుగు నట్టి యశోమార్గమునుండి తప్పవలదు.

శ్లో॥ స్వాజీవమప్యార్తముదే దదద్భ్య
స్తవ త్రపా నేదృశబద్ధముష్టేః।
మహ్యం మదీయాన్యదసూనదితో్స
ర్ధర్మః కరాద్భ్రశ్యతి కీర్తిధౌతః॥ రాజ

ప. వి. స్వాజీవమ్ । అపి । ఆర్తముదే । దదద్భ్యః । తవ । త్రపా । న । ఈదృశబద్ధముష్టేః । మహ్యం । మదీయాన్ । యత్ । అసూన్ । అదితో్సః । ధర్మః । కరాత్ । భ్రశ్యతి । కీర్తిధౌతః ।

టీ॥ హే హంస = ఓహంసా! ఈదృశబద్ధముష్టేః; ఈదృశ = ఇటువంటి, బద్ధముష్టేః = పిడికిలిని వదలని (అనగా లుబ్ధుఁడైన) తవ = నీకు, ఆర్తముదే; ఆర్త = దీనులయొక్క, ముదే = సంతోషముకొఱకు, స్వజీవమపి = తమప్రాణమును సైతము, దదద్భ్యః = ఇచ్చుచున్నట్టి జీమూతవాహనాదులవలన, త్రపా = సిగ్గు, న = లేదా, యత్ = ఏల యనగా, మదీయాన్ = నాయవి యైన, అసూన్ = ప్రాణములను, మహ్యం = నాకు, అదిత్సోః = ఈయఁ గోరని, తవ = నీకు, కీర్తిధౌతః; కీర్తి = కీర్తిచే, ధౌతః = శుభ్ర మైన, ధర్మః = ధర్మము, కరాత్ = చేతినుండి భ్రశ్యతి = పడిపోవును.

సమాసములు :

స్వజీవమ్ :- స్వస్య జీవః = స్వజీవః, తమ్ = స్వజీవమ్.

ఆర్తముదే :- ఆర్తనాం ముత్ = ఆర్తముత్, తస్యై = ఆర్తముదే,

ఈదృశబద్ధముష్టేః :- బద్ధా ముష్టిః యస్య సః = బద్ధముష్టిః, ఈదృశశ్చాసౌ బద్ధముష్టిశ్చ = ఈదృశబద్ధముష్టిః, తస్య = ఈదృశబద్ధముష్టేః.

మదీయాన్ : మమ ఇమే = మదీయాః, తాన్ = మదీయాన్.

అదిత్సోః :- దాతుమిచ్ఛుః = దిత్సుః, న దిత్సుః = అదిత్సుః, తస్య = అదిత్సోః.

కీర్తిధౌతః :- కీర్త్యా ధౌతః = కీర్తిధౌతః.

భావము :

ఓ హంసా! ఇంత పిడికిలిని వదలని లుబ్ధుఁడ వైన నీకు ప్రాణములను సైతము దీనుల కర్పించి వారి నుద్ధరించు జీమూతవాహనాదులవలన సిగ్గు కలుగ లేదా? నలమహారాజు నాకు ప్రాణములవంటివాఁడు. అతనికి నా విషయముఁ జెప్పి యొప్పించి యతనిని నాకు వశ్యుని గావించినచో నీవు నాకు ప్రాణముల నిచ్చినట్లే యగును. కావున నీ వతనికి నా విషయముఁ జెప్పి నన్ను వివాహ మాడునట్లు జేసినచో నేను జీవింతును, లేదా నేను ప్రాణములను విడుతును. కావున నీవు నలుని నా విషయమందు సమ్మతపరచినచో నా ప్రాణముల నీవు నా కిచ్చినవాఁడవు కాగలవు.

శ్లో॥ దత్వాఽఽత్మజీవం త్వయి జీవదేఽపి
శుద్ధ్యామి జీవాధికదే తు కేన।
విధేహి తన్మాం త్వదృణేష్వశోద్ధు
మముద్రదారిద్ర్యసముద్రమగ్నామ్॥ ౮౬

ప. వి.దత్వా । ఆత్మజీవం । త్వయి । జీవదే । అపి । శుద్ధ్యామి । జీవాధికదే । తు। కేన । విధేహి । తత్। మాం। త్వదృణేషు। అశోద్ధుమ్ । అముద్ర దారిద్ర్యసముద్రమగ్నామ్ ।

టీక॥ జీవదే = ప్రాణము నొసంగెడి, త్వయి = నీవిషయమందు, ఆత్మ జీవం = నా ప్రాణమును, దత్వాఽపి = ఇచ్చియు, శుద్ధ్యామి = ఋణము దీర్చి శుద్ధినిఁ బొందఁగలను, కింతు = కాని, జీవాధికదే; జీవ = ప్రాణమునకంటెను, అధిక = అతిశయించిన వస్తువును (నలుని), దే = ఇచ్చునట్టి, త్వయి = నీవిషయమున, కేన = దేనిచే, శుద్ధ్యామి = ఋణవిముక్తి చే శుద్ధినిఁ బొందఁగలను, తత్ = అందువలన, మాం = నన్ను, త్వదృణేషు = నీఋణములయందు, అశోద్ధుం = ఋణవిముక్తిఁ జేయలేక యుండుటకు, అముద్రదారిద్ర్యసముద్రమగ్నామ్; అముద్ర = అపరిమితమైన, దారిద్ర్య = పేదరికమను, సముద్ర = సాగరమందు, మగ్నాం = మునిగినదానినిగ, విధేహి = చేయుము.

సమాసములు :

ఆత్మజీవమ్ :- ఆత్మనః జీవః = ఆత్మజీవః, తమ్ = ఆత్మజీవమ్.
జీవదే :- జీవం దదాతీతి = జీవదః, తస్మిన్ = జీవదే.
జీవాధికదే :- జీవాత్ అధికః = జీవాధికః, జీవాధికం దదాతీతి = జీవాధికదః, తస్మిన్ = జీవాధికదే.

త్వదృణేషు :- తవ ఋణాని = త్వదృణాని, తేషు = త్వదృణేషు.
అముద్రదారిద్ర్యసముద్రమగ్నామ్ :- దరిద్రస్య భావః = దారిద్ర్యం, అవిద్యమానా ముద్రా యస్య తత్ = అముద్రం, అముద్రం చ తత్ దారిద్ర్యం చ = అముద్రదారిద్ర్యమ్, అముద్రదారిద్ర్యమేవ సముద్రః = అముద్రదారిద్ర్యసముద్రః, అముద్రదారిద్ర్యసముద్రే మగ్నా =

అముద్రదారిద్ర్యసముద్రమగ్నా, తామ్ = అముద్రదారిద్ర్యసముద్రమగ్నామ్.

భావము ;

ఓ హంసా ! ప్రాణ మిచ్చునట్టి నీకు మరల నా ప్రాణ మొసంగి ఋణ విముక్తి పొందవచ్చును. కాని ప్రాణమునకంటెను మిగుల నధికుఁడైన నల మహారాజు నొసంగిన నీయొక్క ఋణము నే నెట్లు తీర్చి శుద్ధిఁ బొందఁగలను? ఇది యేవిధముగను శక్యము కాదని తోచుచున్నది. నే నీవిధముగనే నీఋణములయందు శుద్ధి పొందకయుండవలసి యున్నది. అట్లు నీ ఋణములను తీర్చుటకు శక్యముగాని యపరిమిత మగు దారిద్ర్యసముద్రమునందు నన్ను ముంచివేయుము. అనగా నలుని నాకు జతపఱచి యందువలన నన్ను నీకు ఋణగ్రస్తురాల గావించి దానిని తీర్చలేనంతటి దారిద్ర్యసాగరమునందు ముంచివేయుము. నీవు నలుని నాకుఁ గూర్చుట మహోపకారము. దానికి నే నెంతనో ఋణపడవలసి యుండును అట్టి ఋణమును తీర్చుట మిక్కిలి కష్టతరము.

శ్లో॥ క్రీణీష్వ మజ్జీవితమేవ పణ్యా
మన్యన్న చేద్వస్తు తదస్తు పుణ్యమ్।
జీవేశదాతర్యది తే న దాతుం
యశోఽపి తావత్ప్రభవామి గాతుమ్॥ ౨౦

ప. వి. క్రీణీష్వ । మజ్జీవితమ్ । ఏవ । పణ్యమ్ । అన్యత్ । న । చేత్ । వస్తు । తత్ । అస్తు । పుణ్యమ్ । జీవేశదాతః । యది । తే । న । దాతుం । యశః । అపి । తావత్ । ప్రభవామి । గాతుమ్।

టీక॥ హేజీవేశదాతః = ప్రాణనాథుని దానముఁ జేసిన యో హంసా। మజ్జీవితమేవ = నా జీవితమే యను, పణ్యం = అమ్మఁదగిన వస్తువును, క్రీణీష్వ = కొనుము, అన్యత్ = మఱియొకటి దీనికి తుల్యమైన, వస్తు = వస్తువు, నాఽస్తి చేత్ = లేనిచో, తత్ = అప్పుడు, పుణ్యం = సుకృతము, అస్తు = ఉండనిమ్ము, (కించ = మఱియు), తే = నీకు, దాతుం = దేనినైన నిచ్చుటకు, న ప్రభవామి = శక్తురాలను గానిచో,

తావత్ = అప్పుడు, యశోఽపి = నీ కీర్తిని గాని, గాతుం = గానము చేయుటకు, ప్రభవామి = శక్తురాల నగుదును.

సమాసములు ;

మజ్జీవితమ్ :– మమ జీవితమ్ = మజ్జీవితమ్.

జీవేశదాతుః :– జీవస్య ఈశః = జీవేశః. జీవేశస్య దాతా = జీవేశదాతా, తస్య = జీవేశదాతుః.

భావము :

ప్రాణనాథుని దానము జేయునట్టి యో హంసా ! నా జీవితమునే నీవు కొనుము. నీవు చేయునట్టి యుపకారమునకు సమానవస్తువే లేనిచో నప్పుడు పుణ్యము నీ కుండును. నీ యుపకారమునకుఁ దగిన ప్రత్యుపకారముఁ జేయలేక పోయినచో గడపటికి నీకీర్తి నైనను గానముఁ జేయగలను. అట్టి ప్రసిద్ధికొఱ కైనను నుపకరింపుము.

శ్లో॥ వరాటికోపక్రియయాఽపి లభ్యా
న్నేభ్యాః కృతజ్ఞానథ వాఽఽద్రియంతే।
ప్రాణైః పణైః స్వం నిపుణం భణంతః
క్రీణంతి తానేవ తు హంత సంతః॥ ౧౩౧

ప. వి. వరాటికోపక్రియయా । అపి , లభ్యాన్ । న । ఇభ్యాః । కృతజ్ఞాన్ , అథ । వా । ఆద్రియంతే । ప్రాణైః । పణైః । స్వం । నిపుణం । భణంతః । క్రీణంతి । తాన్ । ఏవ । తు । హంత । సంతః ।

టీక॥ అథ వా = లేదా, వరాటికోపక్రియయాఽపి; వరాటికా = గవ్వెత్తు, ఉపక్రియయాఽపి = ఉపకారము చేతను, లభ్యాన్ = పొందదగిన, కృతజ్ఞాన్ = ఉపకారస్మృతి గలవారిని, ఇభ్యాః = ధనికులు, నాఽఽద్రియంతే = ఆదరించరు, సంతస్తు = సజ్జనులో, స్వమ్ = తమ్ము, నిపుణం = సమర్థముగ, భణంతః – చెప్పుచున్నవారై, తానేవ = ఆ కృతజ్ఞులనే, ప్రాణైః = ప్రాణము లనెడి, పణైః = మూల్యములచే, క్రీణంతి = కొనుచున్నారు, హంత = సంతోషము.

సమాసములు :

వరాటికోపక్రియయా :- వరాటి కాపరిమితా ఉపక్రియా = వరాటికోపక్రియా, తయా = వరాటికోపక్రియయా.

కృతజ్ఞాన్ :- కృతం జానంతీతి = కృతజ్ఞాః, తాన్ = కృతజ్ఞాన్.

భావము :

లోకమున గవ్వెత్తు నుపకారమును గావించినప్పటికిని కృతజ్ఞతను బ్రకటించెడి జనులను ధనికులు చక్కగ నాదరించరు. కాని సజ్జను లట్టి కృతజ్ఞులను గూర్చి చతురముగ మాట్లాడుచు తమ ప్రాణము లొడ్డి యైనను వారిని దగ్గరకుఁ జేరదీయుచున్నారు. కావున ధనములతో నేమి ప్రయోజనము? సజ్జనుడవైన నీవును కృతజ్ఞురాల నైన నన్ను దగ్గరఁ జేర్చుకొని యుపకరింప వేడుదును.

శ్లో॥ స భూభృదష్టావపి లోకపాలా
స్తైర్మే తదేకాగ్రధియః ప్రసేదే।
న హీతరస్మాద్ఘటతే యదేత్య
స్వయం తదాప్తిప్రతిభూర్మమాభూః॥ ౮౫

ప. వి. సః । భూభృత్ । అష్టౌ । అపి । లోకపాలాః । తైః । మే । తదేకాగ్రధియః । ప్రసేదే । న । హి । ఇతరస్మాత్ । ఘటతే । యత్ । ఏత్య । స్వయం । తదాప్తిప్రతిభూః । మమ । అభూః ।

టీక॥ (కించ = మఱియు,) సః = ఆ, భూభృత్ = రాజైన నలుఁడు, అష్టావపి = ఎనిమిదియు నైన, లోకపాలాః = ఇంద్రాదిలోకపాలుర స్వరూపుఁడు, (అత ఏవ = కావుననే,) తదేకాగ్రధియః; తత్ = అతనియందు, ఏకాగ్ర = మిక్కిలి యాసక్తమైన, ధియః = బుద్ధి గల్గిన, మే = నాకు తైః = ఆ లోకపాలురచే, ప్రసేదే = ప్రసన్న మగుట (సంభవించినది). ఇతరస్మాత్ = మఱియొక విధముగా, (త్వం = నీవు) స్వయం = తనంతట, ఏత్య = వచ్చి, మమ = నాకు, తదాప్తిప్రతిభూః; తత్ = ఆ నలునియొక్క, ఆప్తి = ప్రాప్తికి, ప్రతిభూః = ప్రతినిధిగ, (సంధాయకుఁడవుగా), అభూరితి యత్ = అయితి వనున దేది కలదో తత్ = అది, న ఘటతే హి = సరిపడదు.

సమాసములు :

తదేకాగ్రధియః :- ఏకమ్ అగ్రం యస్యాస్సా = ఏకాగ్రా, తస్మిన్నే కాగ్రా = తదేకాగ్రా, తదేకాగ్రా ధీః యస్యాః సా, తదేకాగ్రధీః, తస్యాః = తదేకాగ్రధియః.

తదాప్తిప్రతిభూః :- తస్య ఆప్తిః = తదాప్తిః, తదాప్తేః ప్రతిభూః = తదాప్తిప్రతిభూః.

**భావము :**

ఆ నలమహారాజు ఇంద్రాద్యష్టదిక్పాలుర యంశమున సంభవించినవాడు. "అష్టాభిర్లోకపాలానాం మాత్రాభిర్నిర్మితో నృపః" యను స్మృతివచనము ననుసరించి రాజు ఇంద్రాదిదిక్పాలుర యంశముచే సృజింపబడు నని తెలియుచున్నది. కావుననే నలుని నిరంతరము ధ్యానముచేయుచున్న నాకు లోకపాలు రందఱును ప్రసన్నులై యుందురు. నలుని ధ్యానము జేసినప్పటికి నానలుఁడు లోకపాలుర యంశములచే సంభూతుఁ డగుటవలన వారి నందఱిని ధ్యానము జేసినట్లే యగుచున్నది. కాన నా నలుని ధ్యానించుటచే వారందఱును ధ్యానింపఁబడినవారై నా విషయమునఁ ప్రసన్నులైరి. లేనిచో నీవు వచ్చి యీవిధముగ నాకు నలప్రాప్తికి సాధన మగుట దుర్లభము. ఆ లోకపాలుర యనుగ్రహముచేతనే నీ కీ విధమైన బుద్ధి యేర్పడి నాకు సహకరింప విచ్చేసితివి.

శ్లో॥ అకాండమేవాఽఽత్మభువాఽఽర్జితస్య
భూత్వాఽపి మూలం మయి వీరణస్య ।
భవాన్న మే కిం నళదత్వమేత్య
కర్తా హృదశ్చందనలేపకృత్యమ్॥ ౯౦

ప. వి. అకాండమ్ । ఏవ । ఆత్మభువా । ఆర్జితస్య । భూత్వా । అపి । మూలమ్। మయి । వీరణస్య । భవాన్ । న। మే । కిం । నళదత్వమ్ । ఏత్య । కర్తా। హృదః । చందనలేపకృత్యమ్।

టీక॥ హే హంస = ఓ హంసా ! విః = పక్షివైన, భవాన్ = నీవు, అకాండమేవ = అసమయమునందే, (ఆకస్మికముగ) ఆత్మభువా = కామునిచే,

మయి = నా విషయమున, ఆర్జితస్య = కల్పింపఁబడిన, రణస్య = బాణ ప్రహారములతోఁ గూడిన యుద్ధమునకు, మూలం = మూలముగా, భూత్వాఽపి = అయినప్పటికిని, (అకాండ = కాద లేక, ఆత్మభువా = బ్రహ్మచే, ఆర్జితస్య = సృజింపఁబడిన, వీరణస్య = తృణవిశేషమునకు, మూలం = వేరుగ, భూత్వా = ఏర్పడి) నలదత్వం = నలమహారాజును లభింపఁజేయుటను, (వట్టివేరుగ నుండుటను) ఏత్య = పొంది, హృదః = చిత్తమునకు, (వక్షస్థలమునకు,) చందనలేపకృత్యమ్ = చందనమును బూయుటవలని జల్లదనమును, (చందనలేపమును,) కర్తా న కిం = చేయవా యేమి ?

"వీరణస్య" యను నెడ విః రణస్య యను విభాగము ననుసరించియు "వీరణ" యని యవిభక్తదశ ననుసరించియు శబ్దశ్లేష. అవ్విధముగనే "అకాండమ్" అను నెడ "నలదత్వ" మను నెడ నర్థశ్లేష. "నలదత్వమేత్య" యని ప్రకృత మగు నలదాతకును నప్రకృత మగు నుశీరమునకును అభేదము నధ్యవసించి హంసయందు నారోపిత మగు నుశీరత్వము ప్రకృత మగు హంసయొక్క తాదాత్మ్యముచే చందనలేపకృత్య మను ప్రకృతకార్యమున కుపయోగి యగుటవలన నిఁట పరిణామాలంకారము. ఆరోపింపబడునది ప్రకృతక్రియోపయోగి యగుచో పరిణామాలంకారము. అది ప్రకృతశ్లేషప్రతిభచే నుత్థాపితము గాన నాశ్లేషతో దీనికి సంకరము.

భావము :

ఓ హంసా ! నీవు ఆకస్మికముగ మన్మథుడు నా విషయమునందు గావించిన శరప్రహారములతో గూడిన యుద్ధమునకు నుద్దీపకుఁడుగ మూల మైనప్పటికిని (శాఖాదులు లేక బ్రహ్మ సృజించినట్టి వీరణ మను దృణమునకు వేరై) నలుని లభింపఁచేయుటవలన నలదత్వమును (వట్టివేరుగ నుండుటను) పొంది, నా హృదయమునకు చందనలేపమువలని ప్రయోజన మగు జల్లదనమును గల్గించవా ! నా వక్షస్థలమునకు జందన మల్దవా ! వట్టివేరు చందనమున మిశ్రిత మయి నప్పుడు చల్లదన మతిశయించును. కాన వట్టివేరుగ నున్న నీవు చందనలేపమున కర్తగా నుండి దాని ప్రయోజన మగు జల్లదనముఁ గల్పింప సమర్థుడవు గావా ?

శ్లో॥ అలం విలంబ్య త్వరితుం హి వేలా
కార్యే కిల స్థైర్యసహే విచారః।
గూరూపదేశం ప్రతిభేవ తీక్ష్ణ
ప్రతీక్షతే జాతు న కాలమార్తిః॥ ౯౧

ప. వి. అలం । విలంబ్య । త్వరితుం । హి । వేలా । కార్యే । కిల । స్థైర్య సహే । విచారః । గురూపదేశం । ప్రతిభా । ఇవ । తీక్ష్ణ । ప్రతీక్షతే। జాతు । న। కాలమ్ । ఆర్తిః.

టీక॥ (హే హంస = ఓ హంసా,) విలంబ్య = ఆలస్యము గావించి, అలం = చాలును, త్వరితుం = త్వరపడుటకు. వేలా హి = సమయము గదా, స్థైర్యసహే = ఆలస్యమును సహించునట్టి, కార్యే = పనియందు, విచారః కిల = విమర్శ యుండును, తీక్ష్ణ = నిశితమైన, ప్రతిభా = ప్రజ్ఞ, గురూపదేశమివ = గురువుయొక్క యుపదేశమును వలె, ఆర్తిః = బాధ; జాతు = ఒకప్పుడును, కాలం = కాలమును, న ప్రతీక్షతే = ఎదురు చూడదు.

పూర్వార్ధమున "కార్యే కిల స్థైర్యసహే విచారః" యను సామాన్యార్థముచే "అలం విలంబ్య త్వరితుం హి వేలా" యను విశేషార్థము సమర్థింపఁబడుటవలన నర్థాంతరన్యాసాలంకారము. ఉత్తరార్ధమున "గురూపదేశం ప్రతిభా" యను దానితో, "కాలమార్తిః" యనుదానికి "ఇవ" శబ్దముచే నౌపమ్యముఁ జెప్పుటవలన నుపమాలంకారము - ఈ రెండలంకారములకు నిట సంసృష్టి.

సమాసములు;-

స్థైర్యసహే:- స్థైర్యం సహత ఇతి = స్థైర్యసహమ్, తస్మిన్ = స్థైర్యసహే.
గురూపదేశమ్:- గురోః ఉపదేశః = గురూపదేశః, తం = గురూపదేశమ్.

భావము:-

ఓ హంసా! నీవు ఆలస్యముఁ జేయవలదు. ఇది త్వరపడుటకు సమయము. ఆలస్యముఁ జేయఁదగిన విషయమందు విమర్శ తగును. ఈ కార్య

మందు విచారము తగదు. తీక్ష్ణ మైన ప్రతిభ గురూపదేశమునకై తొందర పడును. కాన గురూపదేశమున కాలస్య మేర్పడినచోఁ బ్రతిభ దాని నెదురుఁ జూడదు. అవ్విధముగనే బాధ యొకప్పుడును కాలమును సహింపదు. కావున నీవు వెంటనే కార్యమునకుఁ బూనుకొనవలయును.

శ్లో॥ అభ్యర్థనీయస్స గతేన రాజా
త్వయా న శుద్ధాంతగతో మదర్థమ్।
ప్రియాఽస్యదాక్షిణ్యబలా
త్కృతో హి తదోదయేదన్యవధూనిషేధః॥ ౯౨

ప. వి అభ్యర్థనీయః । సః । గతేన । రాజా । త్వయా । న । శుద్ధాంతగతః । మదర్థమ్ । ప్రియాస్యదాక్షిణ్యబలాత్కృతః । హి । తదా । ఉదయేత్ । అన్యవధూనిషేధః ।

టీక॥ గతేన = ఇచ్చటనుండి వెళ్ళిన, త్వయా = నీచే, సః = ఆ, రాజా = నలమహారాజు, శుద్ధాంతగతః = అంతఃపురమునం దున్నవాఁడై, మదర్థం = నాకొఱకు, న అభ్యర్థనీయః = ప్రార్థింపఁ దగదు, హి = ఏల యనగా, తదా = ఆకాలమందు, ప్రియాఽఽస్యదాక్షిణ్యబలాత్కృతః; ప్రియా = ప్రియురాం(డ్ర)యొక్క, ఆస్యదాక్షిణ్య = ముఖదాక్షిణ్యముచే, బలాత్కృతః = బలవంతము జేసైన, అన్యవధూనిషేధః; అన్యవధూ = ఇతర స్త్రీలయొక్క, నిషేధః = నిషేధము, ఉదయేత్ = కలుగ వచ్చును.

సమాసములు:-

అభ్యర్థనీయః:- అభ్యర్థయితుం యోగ్యః = అభ్యర్థనీయః.

శుద్ధాంతగతః:- శుద్ధాంతం గతః = శుద్ధాంతగతః.

మదర్థమ్:- మహ్యామ్ = మదర్థమ్.

ప్రియాస్యదాక్షిణ్యబలాత్కృతః:- ప్రియాణామాస్యాని = ప్రియాస్యాని. ప్రియాస్యానాం దాక్షిణ్యం = ప్రియాస్యదాక్షిణ్యం, ప్రియాస్యదాక్షిణ్యేన బలాత్కృతః = ప్రియాస్యదాక్షిణ్యబలాత్కృతః.

అన్యవధూనిషేధః:- అన్యా చ సా వధూశ్చ = అన్యవధూః. అన్యవధ్వాః నిషేధః = అన్యవధూనిషేధః.

భావము:-

నీ విచ్చటనుండి వెళ్ళి యంతఃపురమం దున్నప్పు డారాజును నాకై ప్రార్థింపవలదు. ఏల యనగా నంతఃపురమందలి ప్రియురాండ్రముఖదాక్షిణ్యముచే బలవంతపఱుచఁబడినవాఁడై వారియెదుట మఱియొకస్త్రీనిఁ బరిగ్రహించు విషయము నతఁడు త్రోసివేయవచ్చును కాన నావిషయమును సరియైన సందర్భమునం దతనికిఁ దెలుపవలయును.

శ్లో॥ శుద్ధాంతసంభోగనితాంతతృప్తే
న నైషధే కార్యమిదం నిగాద్యమ్।
అపాం హి తృప్తాయ న వారిధారా
స్వాదుస్సుగంధిస్స్వదతే తుషారా॥ ౯౩

ప.వి. శుద్ధాంతసంభోగనితాంతతృప్తే। న। నైషధే। కార్యమ్। ఇదం। నిగాద్యమ్। అపాం। హి। తృప్తాయ। న। వారిధారా। స్వాదుః। సుగంధిః। స్వదతే। తుషారా।

టీక॥ (కించ = మఱియు) శుద్ధాంతసంభోగనితాంతతృప్తే; శుద్ధాంత = అంతఃపురస్త్రీలతోటి, సంభోగ = సంభోగముచే, నితాంత = మిక్కిలి, తృప్తే = తృప్తిఁజెందియున్న, నైషధే = నలునివిషయమున, ఇదం = ఈ కార్యము, న నిగాద్యమ్ = చెప్పఁదగదు. హి = ఏల యనగా, అపాం = ఉదకములకు, తృప్తాయ = తృప్తిఁ బొందినవానికి, స్వాదుః = మధురమైన, సుగంధిః = పరిమళముగలదైన, తుషారా = చల్లని, వారిధారా = ఉదకధార, న స్వదతే = రుచించదు

సంభోగతృప్తుఁ డయిన నలుని వాక్యార్థమునకును నుదకతృప్తుఁ డయిన పిపాసుని వాక్యార్థమునకును బింబప్రతిబింబభావముచే నౌపమ్యము జెప్పుటవలన దృష్టాంతాలంకారము.

సమాసములు:-

శుద్ధాంతసంభోగనితాంతతృప్తే:-శుద్ధాంతే సంభోగః = శుద్ధాంతసంభోగః, నితాంతం తృప్తః = నితాంతతృప్తః, శుద్ధాంతసంభోగే నితాంతతృప్తః

= శుద్ధాంతసంభోగనితాంతతృప్తః, తస్మిన్ = శుద్ధాంతసంభోగనితాంత తృప్తే.

నైషధే:- నిషధానాం రాజా - నైషధః, తస్మిన్ = నైషధే.

వారిధారా:- వారీణాం ధారా = వారిధారా.

సుగంధిః:- శోభనః గంధః యస్యాస్సా = సుగంధిః.

భావము:-

అంతఃపురస్త్రీలసంభోగముచేఁ దనివిఁదీరిన నలునియొద్ద నావిషయమును జెప్పవలదు. ఏల యనగా, దాహము తీరునట్లు నీరుఁ గ్రోలినవారికి రుచియుఁ బరిమళమును చల్లఁదనమును గల నీరుగూడ రుచింపదు.

శ్లో॥ విజ్ఞాపనీయా న గిరో మదర్థాః
క్రుధా కదుష్ణే హృది నైషధస్య।
పిత్తేన దూనే రసనే సితాఽపి
తిక్తాయతే హంసకులావతంస॥ ౯౪

ప. వి. విజ్ఞాపనీయాః । న । గిరః । మదర్థాః । క్రుధా । కదుష్ణే । హృది । నైషధస్య । పిత్తేన । దూనే । రసనే । సితా । అపి । తిక్తాయతే । హంసకులావతంస ।

టీక ॥ హేహంసకులావతంస! = ఓ హంసల వంశమునకు భూషణ మైనవాఁడా! నైషధస్య = నలునియొక్క, హృది = మనస్సు. క్రుధా = కోపముచే, కదుష్ణే సతి = కొంచెము వేడి కల్గి యుండఁగా, మదర్థాః = నాకొఱకు నైన, గిరః = మాటలు, న విజ్ఞాపనీయాః = విన్నవింపఁ దగవు. (హి = అది యెట్లనగా,) పిత్తేన = పిత్తదోషముచే, దూనే = దూషింపఁబడిన, రసనే = రసనేంద్రియమునందు (నాలుకయందు), సితాఽపి = చక్కెరయు, తిక్తాయతే = చేదుగా నాచరించును.

ఇచ్చట కదుష్ణనలహృదయమునకును పిత్తదూనరసనకును బింబ ప్రతిబింబభావముచే నౌపమ్య మున్నది కాన దృష్టాంతాలంకారము.

సమాసములు:-

విజ్ఞాపనీయాః:- విజ్ఞాపయితుం యోగ్యాః = విజ్ఞాపనీయాః.
మదర్థాః:- మహ్యమిమే = మదర్థాః.
కదుష్ణే:- ఈషదుష్ణమ్ = కదుష్ణమ్, తస్మిన్ = కదుష్ణే.
నైషధస్య:- నిషధానాం రాజా = నైషధః, తస్య = నైషధస్య.
తిక్తాయతే:- తిక్తా ఇవ ఆచరతే = తిక్తాయతే.
హంసకులావతంస:- హంసానాం కులమ్ = హంసకులమ్, హంస కులస్య అవతంసః = హంసకులావతంసః తస్య సంబుద్ధిః = హే హంస కులావతంస.

భావము:-

హంసల వంశమున కంతటికిని భూషణ మైన యో హంసా! నలుని హృదయము కోపముచే వేడి యై యున్నప్పుడు నావిషయమును జెప్పవలదు. ఏల యనగా చక్కెర తియ్యగ నున్నను పైత్యదోషముచేఁ జెడిన నాలుక పైన చేదుగనే కనుపట్టును. కావున నతఁడు కోపించియున్నప్పుడు నీమాట లాతనికి రుచింపక నన్నుఁ దిరస్కరింపవచ్చును.

శ్లో॥ ధరాతురాసాహి మదర్థయాచ్ఞా
కార్యా న కార్యాంతరచుంబిచిత్తే।
తదాఽర్థితస్యానవబోధనిద్రా
బిభర్త్యవజ్ఞాచరణస్య ముద్రామ్॥ ౯౨

ప. వి. ధరాతురాసాహి । మదర్థయాచ్ఞా । కార్యా । న । కార్యాంతరచుంబిచిత్తే । తదా । అర్థితస్య । అనవబోధనిద్రా । బిభర్తి । అవజ్ఞాచరణస్య । ముద్రామ్।

టీక॥ ధరాతురాసాహి; ధరా = భూమికి, తురాసాహి = ఇంద్రుఁడైన నలుఁడు, కార్యాంతరచుంబిచిత్తే సతి; కార్యాంతర = ఇతరకార్యములచే, చుంబి = స్పృశింపఁబడిన, చిత్తే సతి = మనస్సుకలిగి యుండగా, మదర్థయాచ్ఞా: మదర్థ = నా ప్రయోజనమున కైన, యాచ్ఞా = యాచన, న కార్యా = చేయఁదగదు, హి = ఏల యనగా, తదా = ఇతరవిషయాసక్తి గల్గి నపుడు, అర్థితస్య = యాచింపఁబడిన యా నలునియొక్క, అనవబోధ

నిద్రా: అనవబోధ = విషయము తెలియక యుండుట యను, నిద్రా = నిద్రయే, అవజ్ఞాచరణస్య = నిరాకరించుటకు, ముద్రాం = చిహ్న మగు టను, బిభర్తి = ధరించుచున్నది.

సమాసములు :

ధరాతురాసాహి:- తుర సాహయతీతి = తురాషాట్, ధరాయాః తురాషాట్ = ధరాతురాషాట్, తస్మిన్ = ధరాతు రాసాహి.

మదర్థయాఞ్చా :- మమ అర్థః యస్యాం సా = మదర్థా, మదర్థా చ సా యాచా చ = మదర్థయాఞ్చా.

కార్యాంతరచుంబిచిత్తే :- అన్యత్ కార్యం = కార్యాంతరమ్, కార్యాంతరే చుంబి = కార్యాంతరచుంబి, కార్యాంతరచుంబి చిత్తం యస్య సః = కార్యాంతరచుంబిచిత్తః, తస్మిన్ = కార్యాంతరచుంబిచిత్తే.

అనవబోధనిద్రా :- న అవబోధః = అనవబోధః, అనవబోధ ఏవ నిద్రా = అనవబోధనిద్రా.

అవజ్ఞాచరణస్య :- అవజ్ఞాయాః ఆచరణమ్ = అవజ్ఞాచరణమ్, తస్య = అవజ్ఞాచరణస్య.

భావము :-

భూలోకదేవేంద్రుఁ డగు నలుఁడు కార్యాంతరాసక్తుఁ డై యున్నప్పుడు నా కార్యమును గూర్చి యాతనిని నీవు ప్రార్థింపవలదు. అట్లు నీ వతని నర్థించి నచో నాత డావిషయమును గమనింపకపోవుట యను నిద్రలో నుండి నా ప్రార్థనను నిరాకరింపవచ్చును.

శ్లో॥ విజ్ఞేన విజ్ఞాప్యమిదం నరేంద్రే
తస్మాత్త్వయాఽస్మిన్ సమయం సమీక్ష్య।
ఆత్యంతికాసిద్ధివిలంబసిద్ధ్యోః
కార్యస్య కార్యస్య శుభా విభాతి॥ ౯౮

ప. వి. విజ్ఞేన । విజ్ఞాప్యమ్ । ఇదం । నరేంద్రే । తస్మాత్ । త్వయా । అస్మిన్ । సమయం । సమీక్ష్య ఆత్యంతికాసిద్ధివిలంబసిద్ధ్యోః । కార్యస్య । కా । అర్యస్య । శుభా । విభాతి ।

టీక॥ తస్మాత్ = ఆకారణమువలన, విజ్ఞేన = వివేకి యగు, త్వయా = నీచే, సమయం = కాలమును, సమీక్ష్య = చూచి, ఇదం = ఈకార్యము. అస్మిన్ = ఈ నలుని విషయమున, విజ్ఞాప్యం = విన్నవింపఁదగినది, హేహంస = ఓ హంసా, కార్యస్య = కార్యమునకు, ఆత్యంతికాసిద్ధి విలంబసిద్ధ్యోః; ఆత్యంతికాసిద్ధి = అత్యంతము లేకపోవుటకును, విలంబసిద్ధి = ఆలస్యముగ సిద్ధించుటకును మధ్యలో, ఆర్యస్య = వివేకివైన, తే = నీకు, కా = ఎయ్యది, శుభా = మంచిదిగా, విభాతి = స్ఫురించుచున్నది.

సమాసములు :

విజ్ఞేన :- విజానాతీతి = విజ్ఞః, తేన = విజ్ఞేన.

విజ్ఞాప్యమ్ :- విజ్ఞాపయితుం యోగ్యమ్ = విజ్ఞాప్యమ్.

నరేంద్రే :- నరాణామింద్రః = నరేంద్రః, తస్మిన్ = నరేంద్రే

ఆత్యంతికాసిద్ధివిలంబసిద్ధ్యోః :- అత్యంత ఏవ = ఆత్యంతికః, న సిద్ధిః = అసిద్ధిః, ఆత్యంతికా చ సా అసిద్ధిశ్చ = ఆత్యంతికాసిద్ధిః, విలంబేన సిద్ధిః = విలంబసిద్ధిః, ఆత్యంతికాసిద్ధిశ్చ విలంబసిద్ధిశ్చ = ఆత్యంతికాసిద్ధివిలంబసిద్ధీ, తయోః. ఆత్యంతికాసిద్ధివిలంబసిద్ధ్యోః.

భావము :

ఆకారణమువలన వివేకవంతుఁడవైన నీవు సరియగు సమయమును గమనించి యీ కార్యమును రాజునకు నివేదింపవలయును. ఇందు పనికి నాలస్యమేర్పడు నని భావింపవలదు. పని యన్నివిధముల నెరవేరకపోవుటకంటె నాలస్యమైనను బని జరుగుట మనకు ముఖ్యము. తొందరపడినచో కార్యమునకే భంగము వాటిలవచ్చును. కార్యభంగ-కార్యాలస్యములలో నెయ్యది మేలని తోచుచున్నది? కావున కార్యము నెఱవేరుట కవసరమైన ప్రతీక్ష యనివార్యమే.

శ్లో॥ ఇత్యుక్తవత్యా యదలోపి లజ్జా
సాఽనౌచితీ చేతసి నశ్చకాస్తు ।
స్మరస్తు సాక్షీ తదదోషతాయా
మున్మాద్య యస్తత్తదవీవదత్తామ్॥ ౯౭

ప. వి. ఇతి । ఉక్తవత్యా । యత్ । అలోపి । లజ్జా । సా । అనౌచితీ । చేతసి । నః । చకాస్తు । స్మరః । తు । సాక్షీ । తదదోషతాయామ్ । ఉన్మాద్య । యః । తత్ । తత్ । అవీవదత్ । తామ్ ।

టీక॥ ఇతి = ఇట్లు, ఉక్తవత్యా = చెప్పిన, తయా = ఆ దమయంతిచే, లజ్జా = సిగ్గు, అలోపీతి యత్ = విడిచిపెట్టఁబడిన దనుట యేది కలదో, సా = ఆ, అనౌచితీ = అనౌచిత్యము, కథం = ఎట్లు, నః = వినెడి మా యొక్క, చేతసి = మనస్సునందు, చకాస్తు = ప్రకాశించును? కింతు = కాని, తదదోషతాయాం; తత్ = ఆ సిగ్గును వదలుటలోని, అదోషతాయాం = నిర్దుష్టత్వమునకు, స్మరః = మన్మథుఁడు, సాక్షీ = ప్రమాణము, యః = ఏమన్మథుఁడు, తాం = ఆ దమయంతిని, ఉన్మాద్య = ఉన్మత్తురాలను గావించి, తత్తత్ = ఆయా యనుచిత విషయములను, అవీవదత్ = పలికించెను.

సమాసములు :

ఉచితస్య భావః = ఔచితీ, న ఔచితీ = అనౌచితీ.

తదదోషతాయామ్ :- దోషస్య భావః = దోషతా, తస్య అదోషతా = తదదోషతా, తస్యామ్ = తదదోషతాయామ్.

భావము :

ఈ విధముగ హంసతో దమయంతి పలుకుటవలన నామెకు లజ్జాత్యాగము వలని యనౌచిత్యమునకు మన్మథుఁడే సాక్షి యగుచున్నాడు. ఏల యనగా నా మన్మథుఁ డాదమయంతి నున్మత్తురాలను గావించి పెక్కువిధము లైన యనుచితవచనములను మాట్లాడింపఁ జేసెను. కావున నీ యనౌచిత్యము స్మరుని వలన నేర్పడినదే కాని దమయంతిస్వభావముచే నేర్పడ లేదు. కాన ననౌచిత్యమునకుఁ బ్రసక్తి లేదు.

శ్లో॥ ఉన్మత్తమాసాద్య హరః స్మరశ్చ
ద్వావప్యసీమాం ముదముద్వహేతే ।
పూర్వః స్మరస్పర్థితయా ప్రసూనం
నూనం ద్వితీయో విరహాధిదూనమ్ ॥ ౯౪

ప.వి. ఉన్మత్తమ్ । ఆసాద్య । హరః । స్మరః । చ । ద్వౌ । అపి । అసీమామ్ । ముదమ్ । ఉద్వహేతే । పూర్వః । స్మరస్పర్ధితయా । ప్రసూనం । నూనం । ద్వితీయః । విరహాధిదూనమ్।

టీక॥ హరః = శివుఁడును, స్మరశ్చ = మన్మథుఁడును, ద్వావపి = ఇఱువురును, ఉన్మత్తమ్ = ఉమ్మెత్తను, ఉన్మత్తుని, ఆసాద్య = పొంది, అసీమాం = ఎల్లలేని, ముదం = సంతోషమును, ఉద్వహేతే అనుభవించుచున్నారు, కింతు = కాని, తత్ర = వారిలో, పూర్వః = ముందుఁ జెప్పఁబడిన శివుఁడు, స్మరస్పర్ధితయా = మన్మథునకు శత్రువుగ నుండుటచే, ప్రసూనం = ఉమ్మెత్తపూవును (గ్రహించుచున్నాడు,) నూనం = నిశ్చయము. ద్వితీయస్తు = రెండవవాడైన మన్మథుడు, విరహాధిదూనమ్; విరహాధి = విరహసంతాపముచే, దూనం = సంతాపము జెందుచున్న యున్మత్తుని (గ్రహించుచున్నాఁడు).

ఇచ్చట హరస్మరుల కభేదాధ్యవసాయముచే సమానధర్మత్వమేర్పడినది. విశేషణములు శ్లిష్టములుగ నుండుటవలనను, ప్రకృతాఽప్రకృత గోచరముగ నుండుటవలనను నిచట నుభయశ్లేష. ఆశ్లేష వలన హరునివలె స్మరుఁడును నున్మత్తప్రియుఁ డను నుపమాలంకారధ్వని.

సమాసములు :

అసీమామ్ :– న సీమా యస్యాస్సా = అసీమా, తాం = అసీమామ్.
స్మరస్పర్ధితయా = స్మరస్య స్పర్ధీ = స్మరస్పర్ధీ, స్మరస్పర్ధినః భావః = స్మరస్పర్ధితా, తయా స్మరస్పర్ధితయా.
విరహాధిదూనమ్ :– విరహస్య ఆధిః = విరహాధిః, విరహాధినా దూనః = విరహాధిదూనః, తమ్ = విరహాధిదూనమ్.

భావము :

శివుఁడును మన్మథుఁడు నిఱువురు నున్మత్తు నాశ్రయించి యపరిమితమగు నానందము ననుభవించుచున్నారు. అందు శివుడు – ఉన్మత్తు ననగా– ఉమ్మెతచెట్టును, మన్మథుఁడు ఉన్మత్తు ననగా విరహబాధచే నున్మాదము

బొందినవానిని బట్టుకొనుచున్నా రనియాశయము. కావున శివునికివలె మన్మథునకు నున్మత్తుఁ డిష్టుడు కాన మన్మథుఁ డెల్లప్పుడు నున్మత్తులతో నాటలాడుచుండుటవలననే ప్రకృతము న న్నున్మత్తను గానించి యాట్లాడుచున్నాడు.

శ్లో॥ తథాభిధాత్రీమథరాజపుత్రీం
నిర్ణీయ తాం నైషధబద్ధరాగామ్।
అమోచి చంచూపుటమౌనముద్రా
విహాయసా తేన విహస్య భూయః॥ ౯౯

ప. వి తథా। అభిధాత్రీమ్। అథ। రాజపుత్రీం। నిర్ణీయ। తాం। నైషధబద్ధరాగామ్। అమోచి। చంచూపుటమౌనముద్రా। విహాయసా। తేన। విహస్య। భూయః।

టీక॥ అథ = పిదప; తథా = అట్లు, అభిధాత్రీం = చెప్పుచున్న, తాం = ఆ, రాజపుత్రీం = రాకుమార్తెను, నైషధబద్ధరాగామ్; నైషధ = నలునియందు, బద్ధ = అనుబద్ధ మైన, రాగామ్ = అనురాగము గలదిగ, నిర్ణీయ = నిశ్చయించి, తేన = ఆ. విహాయసా = పక్షిచే, విహస్య = నవ్వి, భూయః = మరల, చంచూపుటమౌనముద్రా; చంచూపుట = ముక్కుల పుటములయొక్క, మౌనముద్రా = మాటలాడక యుండుట, అమోచి = విడువబడినది.

సమాసములు :

రాజపుత్రీం :- రాజ్ఞః పుత్రీ = రాజపుత్రీ, తాం = రాజపుత్రీమ్.

నైషధబద్ధరాగామ్ :- నిషధానాం రాజా = నైషధః, బద్ధః రాగః యస్యాస్సా = బద్ధరాగా, నైషధే బద్ధరాగా = నైషధబద్ధరాగా, తాం = నైషధబద్ధరాగామ్.

చంచూపుటమౌనముద్రా :- చంచ్వోః పుటౌ = చంచూపుటౌ, చంచూపుటయోర్మౌనమ్ = చంచూపుటమౌనమ్, చంచూపుటమౌనమేవ ముద్రా = చంచూపుటమౌనముద్రా, తాం = చంచూపుటమౌనముద్రామ్.

భావము :

అవ్విధముగ మాట్లాడుచున్న రాకుమార్తెను నలుని యందనురక్తురాలుగ నిర్ణయించి యాహంస నవ్వి మరల మాట్లాడుటకై తన ముక్కుల పుటములను తెరచినది,

శ్లో॥ ఇదం యది క్ష్మాపతిపుత్రి తత్త్వం
పశ్యామి తన్న స్వవిధేయమస్మిన్।
త్వాముచ్చకైస్తాపయతా నృపం చ
పంచేషుణైవాఽజని యోజనేయమ్॥ ౧౦౦

ప. వి. ఇదం । యది । క్ష్మాపతిపుత్రి । తత్త్వం । పశ్యామి । తత్ । న। స్వవిధేయమ్ । అస్మిన్ । త్వామ్ । ఉచ్చకైః । తాపయతా । నృపం । చ । పంచేషుణా । ఏవ । అజని । యోజనా । ఇయమ్।

టీక॥ హే క్ష్మాపతిపుత్రి! = ఓ రాజపుత్రీ! ఇదం = నీవు చెప్పిన యీ విషయము, తత్త్వం యది = సత్యమే యైనచో, అస్మిన్ = ఈ విషయమందు, స్వవిధేయమ్ = నా కర్తవ్యమును, న పశ్యామి = కాంచుటలేదు, కింతు = కాని, త్వాం = నిన్ను, నృపం చ = రాజును, ఉచ్చకైః = మిక్కిలి, తాపయతా = సంతాపపఱచుచున్న, పంచేషుణైవ = మన్మథుని చేతనే, ఇయం = ఈ, యోజనా = మీ యిరువురి కలయిక, అజని = ఏర్పడినది.

సమాసములు :

క్ష్మాపతిపుత్రి ;— క్ష్మాయాః పతిః = క్ష్మాపతిః, క్ష్మాపతేః పుత్రీ = క్ష్మాపతిపుత్రీ, తస్యాస్సంబుద్ధిః = హేక్ష్మాపతిపుత్రి.

స్వవిధేయమ్ :— విధాతుం యోగ్యం = విధేయమ్, స్వస్య విధేయమ్ = స్వవిధేయమ్, తత్ = స్వవిధేయమ్.

పంచేషుణా :— పంచ ఇషవః యస్య సః = పంచేషుః, తేన పంచేషుణా.

భావము ;

ఓ రాజపుత్రీ! నీవు చెప్పిన దంతయు సత్యమైనచో నిఁక నీ విషయమందు నా కర్తవ్య మెద్దియును లేదు. నిన్ను నలుని మిక్కుటముగ సంతాపము గావించుచున్న మన్మథుఁడే మీ యిరువురి కలయికకుఁ గారణము.

శ్లో॥ త్వద్బద్ధబుద్ధేర్బహిరింద్రియాణాం
తస్యోపవాసవ్రతినాం తపోభిః।
త్వామద్య లబ్ధ్వాఽమృతతృప్తిభాజాం
స్వం దేవభూయం చరితార్థమస్తు॥ ౧౦౧

ప. వి. త్వద్బద్ధబుద్ధేః। బహిరింద్రియాణాం। తస్య। ఉపవాసవ్రతినాం। తపోభిః। త్వామ్। అద్య। లబ్ధ్వా। అమృతతృప్తిభాజాం। స్వం। దేవ భూయం, చరితార్థమ్। అస్తు।

టీక॥ (కింతు = కాని) త్వద్బద్ధబుద్ధేః, త్వత్ = నీయందు, బద్ధ = ఆసక్తమైన, బుద్ధేః = చిత్తము గల్గిన, తస్య = ఆ నలునియొక్క, ఉపవాస వ్రతినాం = ఉపవాసవ్రతములతోఁ గూడిన, తపోభిః = తపములచే, అద్య = ఇప్పుడు, త్వాం = నిన్ను, లబ్ధ్వా = పొంది, అనగా నావలనఁ బొందినట్లుగ విశ్చయించుకొని, అమృత = అమృతముచేఁ గల్గిన, తృప్తి = తృప్తిని, భాజాం = పొందిన, బహిరింద్రియాణాం = బహిరింద్రియములకు, స్వం = తమదైన, దేవభూయమ్ = ఇంద్రియత్వము, దేవత్వము, చరితార్థమ్ = సఫలముగ, అస్తు = అగును గాత.

ఇచ్చట నింద్రియ పరమైన యర్థముచే నభిధావృత్తి నిరుద్ధమైనందువలన దేవపర మగు నర్థప్రతీతి ధ్వని యగుచున్నది.

సమాసములు :

త్వద్బద్ధబుద్ధే :- బద్ధా బుద్ధిః యస్య సః = బద్ధబుద్ధిః. త్వయి బద్ధ బుద్ధిః = త్వద్బద్ధబుద్ధిః, తస్య = త్వద్బద్ధబుద్ధేః.

బహిరింద్రియాణామ్ :- బహిర్భవానీంద్రియాణి = బహిరింద్రియాణి, తేషాం = బహిరింద్రియాణామ్.

ఉపవాసవ్రతినామ్ :- ఉపవాసాశ్చ వ్రతాని చ = ఉపవాసవ్రతాని, ఉప వాసవ్రతాన్యేషాం సంతీతి = ఉపవాసవ్రతీని. తేషామ్, ఉపవాసవ్రతి నామ్.

అమృతతృప్తిభాజామ్ :- అమృతస్య తృప్తిః = అమృతతృప్తిః, అమృతతృప్తిం, భజంతీతి = అమృతతృప్తి భాంజి, తేషాం = అమృత తృప్తిభాజామ్.

దేవభూయమ్ ;- దేవస్య భావః = దేవభూయమ్,

చరితార్థమ్ :- చరితః అర్థః యేన తత్ = చరితార్థమ్.

భావము :

నీ ధ్యానమందే యాసక్తి గల యా నలుని యింద్రియములు విషయాంతరములను వదలిపెట్టినవై యుపవాసవ్రతములు మున్నగు తపములచే నిన్ను నేటికి నావలనఁ బ్రత్యక్షము గావించుకొని యమృతపానముచే నేర్పడు తృప్తి ననుభవించుచు తమ యింద్రియత్వమును(దేవత్వమును) సఫలపఱచుకొనుగాత.

శ్లో॥ తుల్యాఽఽవయోర్మూర్తిరభూన్మదీయా
దగ్ధా పరం సాఽస్య న తాప్యతేఽపి।
ఇత్యభ్యసూయన్నివ దేహతాపం
తస్యాతనుస్త్వద్విరహాద్విధత్తే॥ ౧౦౨

ప. వి. తుల్యా । ఆవయోః । మూర్తిః । అభూత్ । మదీయా । దగ్ధా । పరం । సా । అస్య । న । తాప్యతే । అపి । ఇతి । అభ్యసూయన్ । ఇవ । దేహతాపం । తస్య । అతనుః । త్వద్విరహాత్ । విధత్తే ।

టీక॥ ఆవయోః = మన యిరువురికిని, మూర్తిః = శరీరము, తుల్యా = సమానముగ, అభూత్ = ఉండినది, మదీయా = నాదైన, సా పరం = ఆ శరీరము మాత్రము, దగ్ధా = కాల్చఁబడినది, అస్య = ఈ నలుని యొక్క, సా తు = శరీరమో, న తాప్యతేఽపి = తాపమునుఁ గూడఁ బొందింపఁబడలేదు, ఇతి = ఈకారణమువలన, అభ్యసూయన్నివ = అసూయఁబడుచున్నాడో యనునట్లు, అతనుః = మన్మథుఁడు, త్వద్విరహాత్ = నీ విరహ మను నవకాశమును బుచ్చుకొని, తస్య = ఆ నలునకు దేహతాపం = శరీరతాపమును, విధత్తే = చేయుచున్నాఁడు.

సమాసములు:

మదీయా:- మమ ఇయమ్ = మదీయా.

దేహతాపమ్:- దేహస్య తాపః = దేహతాపః, తమ్ = దేహతా. మ్.

భావము:-

నలునకును నాకును శరీరము సమానము. కాని నాశరీరము భస్మము చేయఁబడినది. నలునిశరీరమునకు తాపము గూడఁ గలుగలేదను నసూయతోడనో యనునట్లు మన్మథుఁడు నీ విరహముఁ బురస్కరించుకొని యానలునకు మిక్కిలి శరీరసంతాపమును గల్గించుచున్నాఁడు. కావున నలునిఁ బరిణయమాడ వలయునను నీకోరిక సిద్ధిమార్గమునం దున్నది.

శ్లో॥ లిపిం దృశా భిత్తివిభూషణం త్వాం
నృపః పిబన్నాదరనిర్నిమేషః।
చక్షుర్జలైరార్జితమాత్మచక్షూ
రాగం స ధత్తే రచితం త్వయా ను॥ ౧౦౩

ప. వి. లిపిం। దృశా। భిత్తివిభూణం। త్వాం। నృపః। పిబన్। ఆదరనిర్నిమేషః। చక్షుర్జలైః। ఆర్జితమ్। ఆత్మచక్షూరాగం। సః। ధత్తే। రచితం। త్వయా। ను।

టీక॥ హేభైమి = ఓ దమయంతీ! సః = ఆ, నృపః = రాజైన నలుఁడు, భిత్తివిభూషణం = గోడపైనియలంకార మగు,లిపిం = చిత్రమయ మైన,త్వాం = నిన్ను,ఆదరనిర్నిమేషః; ఆదర = ఆదరముచే, నిర్నిమేషః = ఱెప్పపాట్లు లేనివాఁడై, దృశా = నేత్రముచే, పిబన్ = చూచుచు, చక్షుర్జలైః = (ఱెప్పపాట్లు లేక చూచుచుటచే నేర్పడిన) కన్నీళ్లచే, ఆర్జితం = సంపాదింపఁబడినదియో, త్వయా ను = నీచేతఁ గాని, రచితం = కల్పింపఁబడినదియో యగు, ఆత్మచక్షూరాగమ్; ఆత్మ = తనయొక్క, చక్షూరాగం = నేత్రములలోని యెఱ్ఱదనమును (అనురాగమును) ధత్తే = ధరించుచున్నాఁడు.

సమాసములు :-

భిత్తివిభూషణమ్:- భిత్తేః విభూషణమ్ = భిత్తివిభూషణమ్, తత్ = భిత్తివిభూషణమ్.

ఆదరనిర్నిమేషః:- నిర్గతాః నిమేషాః యస్య సః = నిర్నిమేషః, ఆదరేణ నిర్నిమేషః = ఆదరనిర్నిమేషః.

చక్షుర్జలైః:- చక్షుషోః జలాని = చక్షుర్జలాని, తైః = చక్షుర్జలైః.
ఆత్మచక్షూరాగమ్:- ఆత్మనః చక్షుషీ = ఆత్మచక్షుషీ, ఆత్మచక్షుషోః రాగః = ఆత్మచక్షూరాగః, తమ్ = ఆత్మచక్షూరాగమ్.

భావము :

ఓ దమయంతీ! గోడపైన నలంకారముగ వ్రాయఁబడిన నీ చిత్రమును శ్రద్ధతోఁ జూచుటవలన నలునినేత్రములలో నీళ్లు క్రమ్ముచున్నవి. ఆ కన్నీళ్ళచే నాతని నేత్రము లెఱ్ఱఁబడుచున్నవి. ఈ యెఱ్ఱఁదనమునకు కారణము కన్నీళ్లో లేక నీవో తెలియుట లేదు. ఇది చక్షుఃప్రీతి యనెడి మన్మథావస్థ.

శ్లో॥ పాతుర్దృశాఽలేఖ్యమయీం నృపస్య
త్వామాదరాదస్తనిమీలయాస్తి।
మమేదమిత్యశ్రుణి నేత్రవృత్తేః
ప్రీతేర్నిమేషచ్ఛిదయా వివాదః॥ ౧౦౪

ప. వి. పాతుః । దృశా । ఆలేఖ్యమయీం । నృపస్య । త్వామ్ । ఆదరాత్ । అస్తనిమీలయా । అస్తి । మమ । ఇదమ్ । ఇతి । అశ్రుణి । నేత్రవృత్తేః । ప్రీతేః । నిమేషచ్ఛిదయా । వివాదః ।

టీక॥ అస్తనిమీలయా; అస్త = తొలగిన, నిమీలయా = నిమేషములు గల్గిన, దృశా = దృష్టిచే, ఆలేఖ్యమయీం = చిత్రమయ మైన, త్వాం = నిన్ను, ఆదరాత్ = ఆసక్తివలన, పాతుః = చూచుచున్న, నృపస్య = నలమహారాజుయొక్క, నేత్రవృత్తేః = నయనవ్యాపారమునకును, ప్రీతేః = చక్షుఃప్రీతికిని, నిమేషచ్ఛిదయా; నిమేష = తెప్పపాట్లయొక్క ఛిదయా = విచ్ఛేదముతో, (నేత్రవృత్త్యా = నయనవ్యాపారముతో) అశ్రుణి = కన్నీటివిషయమునందు, ఇదం = ఈ కన్నీరు, మమ = నావలనఁ గల్గినది, ఈ కన్నీరు నావలనఁ గల్గినది, ఇతి = అని, వివాదః = కలహము, అస్తి = ఉన్నది.

పూర్వశ్లోకమునందు చెప్పిన "చక్షుఃప్రీతి" యను మన్మథావస్థను మఱియొకవిధమున నిందు చెప్పుచున్నాడు.

సమాసములు :

ఆలేఖ్యమయీమ్:- ఆలేఖ్యస్య వికారః = ఆలేఖ్యమయీ, తామ్ = ఆలేఖ్యమయీమ్.

అస్తనిమీలయా:- అస్తా నిమీలా యస్యాస్సా = అస్తనిమీలా, తయా = అస్తనిమీలయా.

నేత్రవృత్తేః:- నేత్రయోర్వృత్తిః = నేత్రవృత్తిః, తస్యాః = నేత్రవృత్తేః.

నిమేషచ్ఛిదయా:- నిమేషాణాం ఛ్ఛిదా = నిమేషచ్ఛిదా, తయా = నిమేషచ్ఛిదయా.

భావము:

రెప్పపాట్లు లేక చిత్రగత యగు నిన్ను మిగుల నాదరముతో చూచుచున్న నలునియొక్క నేత్రవ్యాపారమునకును, చక్షుఃప్రీతికిని, రెప్పపాట్లతో కన్నీటివిషయమున వివాద మేర్పడినది. ఆ కన్నీరు నావలనగల్గిన దని నయన వ్యాపారము చెప్పగా, నావలనఁ గల్గినదని చక్షుఃప్రీతియుఁ జెప్పుచున్నది. అట్లే నిమేషచ్ఛేదము గూడ నీ కన్నీరు నావలనఁ బొడమిన దని వివాదపడినది. ఇట్లు కన్నీటివిషయమున చక్షుఃప్రీతి మున్నగువానికి పరస్పరవివాద మేర్పడినది. అనగా గాఢ మైన చక్షుఃప్రీతి యేర్పడిన దని యాశయము.

శ్లో॥ త్వం హృద్గతా భైమి బహిర్గతాఽపి
ప్రాణాయితా నాసి కయాఽస్య గత్యా।
న చిత్తమాక్రామతి తత్ర చిత్ర
మేతన్మనో యద్భవదేకవృత్తి॥ ౧౦౩

ప. వి. త్వం । హృద్గతా । భైమి । బహిర్గతా । అపి । ప్రాణాయితా । న । అసి । కయా । అస్య । గత్యా । న । చిత్తమ్ । ఆక్రామతి । తత్ర । చిత్రమ్ । ఏతత్ । మనః । యత్ । భవదేకవృత్తి ।

టీక॥ హే భైమి! = ఓ దమయంతీ! త్వం = నీవు, బహిర్గతాఽపి = బయట నున్నను, హృద్గతా = మనస్సునందు సున్నావు, అస్య = ఈ నలునకు,

కయా = ఏ, గత్యా = ప్రకారముచే, ప్రాణాయితా = ప్రాణమువలె నాచరించుదానవుగా, నాసి = కావు? (యతః = ఏల యనగా, ప్రాణోఽపి = ప్రాణము గూడ, నాసికయా = ముక్కునుండి, ఆస్యగత్యా = ముఖమార్గముచే, (ఉచ్ఛ్వాస నిశ్వాసరూపముచే) బహిర్గత మైనను నంతర్గత మై యున్న దని శబ్దశ్లేష). తత్ర = ఆ ప్రాణముగ నాచరించు విషయమునందు, చిత్రమ్ = ఆశ్చర్యరసము, చిత్తమ్ = మనస్సును, నాక్రామతి = ఆక్రమించుట లేదు, (కుతః = ఏల యనగా) యత్ = ఎందువలన, ఏతత్ = ఈ, మనః = నలుని మనస్సు, భవదేకవృత్తి; భవదేక = నీయందే, వృత్తి = ఉనికి గల్గినది, లేదా, భవత్ = నీవే, ఏకా = ముఖ్యమైన, వృత్తి = జీవిక గలదిగ నున్నది.

బహిర్గతాఽపి హృద్గతా యనునెడ విరోధాభాసాలంకారము. నాసికయాఽఽస్య గత్యా యనునెడ శబ్దశ్లేష. విరోధాభాసశబ్దశ్లేషల కిట సంకరము.

సమాసములు:

హృద్గతా:— హృత్ గతా = హృద్గతా.

బహిర్గతా:— బహిః గతా = బహిర్గతా.

ప్రాణాయితా:— ప్రాణ ఇవ ఆచరితా = ప్రాణాయితా.

భవదేకవృత్తి:— భవత్యేవ = భవదేకా, భవదేకస్యాం వృత్తిః యస్య తత్ = భవదేకవృత్తి; లేదా ఏకా చ సా వృత్తిశ్చ = ఏకవృత్తిః, భవతీ = ఏకవృత్తిః యస్య తత్ = భవదేకవృత్తి

భావము:

ఓ దమయంతీ! నీవు బయట నున్నను లోపల నున్నదానవే. ఆనలునకు నీవు ప్రాణముగ నేల యుండవు? కాని నీవు ప్రాణ మైనను నాశ్చర్యము గలుగుట లేదు. ఏల యనగా నాతని చిత్తముగూడ నీయందే యున్నది. లేదా యాతని చిత్తమునకు నీవే జీవికవు. కావున జీవిత మైనది ప్రాణ మగుటలో నాశ్చర్యము లేదు. ఏల యనగా— ప్రాణాధారమే జీవితము.

శ్లో॥ అజస్రమారోహసి దూరాదీర్ఘాం
సంకల్పసోపానతతిం తదీయామ్।
శ్వాసాన్స వర్షత్యధికం పునర్య
ద్ధ్యానాత్తవ త్వన్మయతాం తదాప్య॥ ౧౦౬

ప. వి అజస్రమ్ । ఆరోహసి। దూరదీర్ఘాం। సంకల్పసోపానతతిం । తదీయామ్। శ్వాసాన్ । సః । వర్షతి । అధికం । పునః । యత్ । ధ్యానాత్ । తవ। త్వన్మయతాం । తత్ । ఆప్య ।

టీక॥ దూరదీర్ఘామ్ = మిక్కిలి విశాల మైన, తదీయాం = ఆనలునికి సంబంధించిన, సంకల్పసోపానతతిమ్; సంకల్ప = మనోరథము లను, సోపాన మెట్లయొక్క, తతిం = పంక్తిని, అజస్రం = ఎల్లప్పుడు, ఆరోహసి ఎక్కుచున్నావు, శ్వాసాన్ పునః = నిట్టూర్పులనో, సః = ఆ నలుఁడు, అధికం = అధికముగా, వర్షతీతి యత్ = వర్షించుచున్నాఁ డనుట యేది కలదో, తత్ = ఆ శ్వాసవర్షము, తవ = నీయొక్క, ధ్యానాత్ = ధ్యానమువలన, త్వన్మయతాం = నీ స్వరూపముగ నుండుటను, ఆప్య = పొంది, నూనం = నిశ్చయము.

కారణ మగు సోపానారోహణము దమయంతియందును, కార్య మైన శ్వాసవర్షణము నలుని యందును జెప్పుటవలన కార్యకారణము లకు వైయధికరణ్య మేర్పడినది. కాన నసంగత్యలంకారము.

"ధ్యానాత్తవ త్వన్మయతాం తదాప్య" అనునెడ నలునకు దమయంతీ తాదాత్మ్య ముత్ప్రేక్షితము. ఆ యుత్ప్రేక్షకు నీ యసంగత్యలంకారము మూలము. ఈ యసంగత్యుత్ప్రేక్షల కిఁట సంకరము.

భావము :

ఓ దమయంతీ! నీవు నలునికి సంబంధించిన మనోరథసోపానములను గడు విశాలము లైనవాని నెక్కుచుండగా నలుడు నిట్టూర్పులు విడుచుచున్నాడు. అతడు నిరంతరము నిన్ను ధ్యానించుటచే నీ రూపమును బొందియున్నాడు. కనుక నీవు విడువవలసిన నిట్టూర్పుల నాతడు వదలుట సరిపడి యున్నది. లేనిచో మెట్లెక్కువారొకరు, శ్వాసములను విడుచువారు మరియొక్కరుగా నుండుట సరిపడదు గదా.

శ్లో॥ హృత్తస్య యాం మంత్రయతే రహస్త్వాం
తాం వ్యక్తమామంత్రయతే ముఖం యత్।
తద్వైరిపుష్పాయుధమిత్రచంద్ర
సఖ్యౌచితీ సా ఖలు తన్ముఖస్య॥ ౧౦౭

ప. వి. హృత్ । తస్య । యాం । మంత్రయతే । రహః । త్వామ్ । తాం । వ్యక్తమ్ । ఆమంత్రయతే । ముఖం । యత్ । తద్వైరిపుష్పాయుధమిత్రచంద్రసఖ్యౌచితీ । సా । ఖలు । తన్ముఖస్య ।

టీక॥ తస్య = ఆ నలునియొక్క, హృత్ = హృదయము, యాం = ఏ, త్వాం = నిన్నుగూర్చి, రహః = రహస్యమున, మంత్రయతే = సంభాషించుచున్నదో, తాం = అట్టి, త్వాం = నిన్ను, ముఖం = ముఖము అనగా నోరు, వ్యక్తం = బహిరంగముగ, ఆమంత్రయతే = సంభాషించుచున్నది, సా = ఆ రహస్యప్రకటనము, తద్వైరిపుష్పాయుధమిత్రచంద్రసఖ్యౌచితీ ఖలు; తత్ = అ నలునికి, వైరి = శత్రు వైన, పుష్పాయుధ = మన్మథునకు, మిత్ర = మిత్రుఁడైన, చంద్ర = చంద్రునితోటి సఖ్య = చెలిమికి, ఔచితీ ఖలు = ఔచిత్యముగదా.

ఇచ్చట ముఖము గావించిన రహస్యప్రకటనమునకు చెప్పఁబడిన వైరము హేతువు గాకపోయినను దానిని హేతువుగ జెప్పుటవలన నుత్ప్రేక్ష. వ్యంజకప్రయోగము లేనందువలన నది యిట గమ్యము.

సమాసములు :

తద్వైరిపుష్పాయుధమిత్రచంద్రసఖ్యౌచితీ :- తస్య వైరీ = తద్వైరీ, పుష్పమాయుధః యస్య సః = పుష్పాయుధః, తద్వైరీ చాసౌ పుష్పాయుధశ్చ = తద్వైరిపుష్పాయుధః, తద్వైరిపుష్పాయుధస్య మిత్రమ్ = తద్వైరిపుష్పాయుధమిత్రమ్. తద్వైరిపుష్పాయుధమిత్రం చాసౌ చంద్రశ్చ = తద్వైరిపుష్పాయుధమిత్రచంద్రః, తద్వైరిపుష్పాయుధమిత్రచంద్రేణ సఖ్యమ్ = తద్వైరిపుష్పాయుధమిత్రచంద్రసఖ్యమ్, తద్వైరిపుష్పాయుధమిత్రచంద్రసఖ్యస్య ఔచితీ = తద్వైరిపుష్పాయుధమిత్రచంద్ర సఖ్యౌచితీ.

భావము :

అతని హృదయము రహస్యమునందు నీతో మాట్లాడుచుండగా నతని ముఖము నీతో బహిరంగమున మాట్లాడుచు రహస్య భేదనము గావించుచున్నది. కాని యిది యుచితమే. ఏల యనగా నలునకు శత్రువు మన్మథుఁడు. ఆతనికి మిత్రుఁడు చంద్రుఁడు. ఆతనికి మిత్రము ముఖము. కాన వైరిమిత్రమిత్రము వైరియే గదా. కాన ముఖము వైరముతో రహస్యప్రకటనము గావించినది. అది దానికిఁ దగినదే.

శ్లో॥ స్థితస్య రాత్రావధిశయ్య శయ్యాం
మోహే మన స్తస్య నిమజ్జయంతీ।
ఆలింగ్య యా చుంబతి లోచనే సా
నిద్రాఽధునా న త్వదృతేఽంగనా వా॥ ౧౦౮

వ. వి. స్థితస్య । రాత్రౌ । అధిశయ్య । శయ్యాం । మోహే । మనః । తస్య । నిమజ్జయంతీ । ఆలింగ్య । యా । చుంబతి । లోచనే । సా । నిద్రా । అధునా । న । త్వదృతే । అంగనా । వా ।

టీక॥ రాత్రౌ = రాత్రియందు, శయ్యాం = పడకను, అధిశయ్య = అధిష్ఠించి, స్థితస్య = ఉన్నటువంటి, తస్య = ఆ నలునియొక్క, మనః = మనస్సును, మోహే = సుఖమువలని పరవశత్వమునందు, నిమజ్జయంతీ సతీ = ముంచుచున్న, యా = ఏనిద్ర, ఆలింగ్య = కౌగలించుకొని, లోచనే = నేత్రములను, చుంబతి = ముద్దిడుకొనుచున్నదో, సా = ఆ నిద్రా = నిద్ర, త్వదృతే = నీవు లేక, అనగా నీ విరహామువలన, అధునా = ఇప్పుడు, న = లేదు, త్వదృతే = నీకంటె భిన్న మయిన, అంగనా వా = వనిత గాని, న = లేదు.

ఇచ్చట నిద్రానిషేధమువలన జాగర మను మన్మథావస్థయు, అన్యస్త్రీనిషేధమువలన నరతి యను మన్మథావస్థయుఁ జెప్పఁ బడినవి.

మఱియు నిట ప్రకృతము లగు నిద్రకును స్త్రీకిని ఆలింగనాది ధర్మసామ్యమును బురస్కరించుకొని యౌపమ్యము కానవచ్చుచున్నది. కాన కేవలప్రకృతవిషయక మగు తుల్యయోగితాలంకారము.

భావము :

ఏ నిద్ర రాత్రియందు పడకపైఁ బరుండియున్న యీ నలునియొక్క మనస్సును సుఖపారవశ్యమునందు ముంచుచు నతనిఁ గౌగలించుకొని కన్నుల ముద్దిడుకొనుచున్నదో యట్టి నిద్ర నీ విరహమువలన నాతనికి వచ్చుటలేదు. మఱియు నింకొక స్త్రీయు నతని కిప్పుడు లేదు.

శ్లో॥ స్మరేణ నిస్తక్ష్య వృథైవ బాణై
ర్లావణ్యశేషాం కృశతామనాయి।
అనంగతామప్యయమాప్యమానః
స్పర్ధాం న సార్ధం విజహాతి తేన॥ ౧౦౮

ప. వి. స్మరేణ। నిస్తక్ష్య। వృథా। ఏవ। బాణైః। లావణ్యశేషాం। కృశతామ్। అనాయి। అనంగతామ్। అపి। అయమ్। ఆప్యమానః। స్పర్ధాం। న। సార్ధం। విజహాతి। తేన।

టీక॥ అయం = ఈ నలుఁడు, స్మరేణ = మన్మథునిచే, నిస్తక్ష్య = చెక్కబడి, వృథైవ = వ్యర్థముగనే, లావణ్యశేషాం = సౌందర్యమే శేషముగ గల్గిన, కృశతాం = చిక్కిపోవుటను, అనాయి = పొందింపఁబడెను, అనంగతాం = ఈవిధముగ కృశాంగత్వమును (మన్మథత్వమును), ఆప్యమానోఽపి = పొందింపఁబడుచున్నప్పటికిని. తేన సార్ధం = ఆ మన్మథునితో, స్పర్ధాం = తగవును. న జహాతి = విడుచుటలేదు.

ఇచ్చట మన్మథుఁడు చెక్కి నలుని కృశాంగుని గావించె ననుట వలన "కార్శ్య" మను మన్మథావస్థ వర్ణింపఁబడినది.

మఱియు శరీరము కృశించినను సౌందర్యము తగ్గలే దని చెప్పుటవలన కారణ ముండియు కార్యము సంభవించలే దను విశేషోక్త్యలంకారము.

సమాసములు :-

లావణ్యశేషామ్ :- లావణ్యం శేషః యస్యాస్సా = లావణ్యశేషా, తాం = లావణ్యశేషామ్.

అనంగతామ్ :— ఈషదంగం యస్య సః = అనంగః, అనంగస్య భావః = అనంగతా, తామ్ = అనంగతామ్.

అనంగతామ్ :— అవిద్యమానమంగం యస్య సః = అనంగః, అనంగస్య భావః = అనంగతా, తామ్ = అనంగతామ్.

భావము :

మన్మథుఁడు తన బాణములచేఁ జెక్కి వ్యర్థముగ నలుని సౌందర్య శేషునిఁ గావించెను. ఎంతఁ జెక్కినను శరీరము కృశించినది కాని సౌందర్యము తగ్గలేదు? ఆ నలుని జెక్కుటచే నంగములను గృశింపఁ జేసి యనంగునిఁ గావించినప్పటికిని యా నలుఁడు మన్మథునితో స్పర్ధ వీడలేదు. అంగము కృశించినను స్పర్ధకు మూలమైన సౌందర్యము కృశించనందువలన నంగమును జెక్కుట వ్యర్థమైన దని యాశయము.

శ్లో॥ త్వత్ప్రాపకాత్త్రస్యతి నైనసోఽపి
త్వయ్యేష దాస్యేపి న లజ్జతే యత్।
స్మరేణ బాణైరతితక్ష్య తీక్ష్ణై
ర్లూనస్స్వభావోఽపి కియాన్ కిమస్య॥ ౧౧౦

ప. వి. త్వత్ప్రాపకాత్ । త్రస్యతి । న । ఏనసః । అపి । త్వయి । ఏషః । దాస్యే । అపి । న । లజ్జతే । యత్ । స్మరేణ । బాణైః । అతితక్ష్య । తీక్ష్ణైః । లూనః । స్వభావః । అపి । కియాన్ । కిమ్ । అస్య ।

టీక॥ స్మరేణ = మన్మథునిచే, తీక్ష్ణైః = వాడియైన, బాణైః = బాణములచే, (శరీరమ్ = శరీరము) అతితక్ష్య = మిక్కిలి చెక్కఁబడి, అస్య = ఈ నలునియొక్క, స్వభావోఽపి = శీలముగూడను, కియాన్ = కొంచెము, లూనః కిమ్ = చెక్కఁబడినదా యేమి? యత్ = ఏల యనగా, త్వత్ప్రాపకాత్ = నిను బొందించెడి, ఏనసోఽపి = పాపము నుండియు, న త్రస్యతి = భయపడుట లేదు, ఏషః = ఈనలుఁడు, త్వయి = నీయెడ, దాస్యేఽపి = దాస్యము విషయమునందును, న లజ్జతే = సిగ్గుపడుటలేదు.

సమాసములు :

త్వత్త్రాపకాత్ :- తవ త్రాపకమ్ = త్వత్త్రాపకం, తస్మాత్ = త్వత్త్రాపకాత్.

భావము :

మన్మథుఁడు తన వాడియైన బాణములచే శరీరమును జెక్కుచు దానితోఁ బాటు నలుని పాపభీతిమున్నగు శీలమునుగూడ చెక్కివేసెనా? ఏల యనగా నానలుఁడు నిన్ను బొందుటకై యెంతపాపము నైనను చేయుటకు వెనుదీయుటలేదు. మఱియు నీకు దాస్యమువహించుటకును సిగ్గుపడుటలేదు.

శ్లో॥ స్మారం జ్వరం ఘోరమపత్రపిష్ణోః
స్నిగ్ధాగదంకారచయే చికిత్సౌ।
నిదానమౌనాదవిశద్విశాలా
సాంక్రామికీ తస్య రుజేవ లజ్జా॥ ౧౧౧

ప. వి. స్మారం । జ్వరం । ఘోరమ్ । అపత్రపిష్ణోః । స్నిగ్ధాగదంకారచయే । చికిత్సౌ । నిదానమౌనాత్ । అవిశత్ । విశాలా। సాంక్రామికీ।తస్య ।రుజా। ఇవ । లజ్జా.

టీక॥ ఘోరం = భయంకరమైన, స్మారం = మన్మథునికి సంబంధించిన, జ్వరం = జ్వరమును గూర్చి, చికిత్సౌ = చికిత్సఁజేయునట్టి, స్నిగ్ధాగదంకారచయే; స్నిగ్ధ = ప్రియమైన, అగదంకార = వైద్యులయొక్క, చయే = సంఘమందు, నిదానమౌనాత్; నిదాన = రోగకారణమును గూర్చి, మౌనాత్ = చెప్పనందువలన, అపత్రపిష్ణోః = లజ్జాశీలుఁ డగు, తస్య = ఆ నలునకు, విశాలా = గొప్పదైన, లజ్జా = సిగ్గు, సాంక్రామికీ = ఒకరినుండి యొకరికి సంక్రమించునట్టి, రుజేవ = వ్యాధివలె, అవిశత్ = ప్రవేశించినది.

"అక్షిరోగోహ్యపస్మారః క్షయః కుష్ఠం మసూరికా దర్శనాత్ స్పర్శనాత్ దానాత్ సంక్రామంతి నరాన్నరమ్" అను వైద్యశాస్త్రము ననుసరించి నేత్రరోగము, మూర్ఛ, క్షయ,కుష్ఠము, మసూచి మున్నగు

వ్యాధులు దర్శనాదులచే నొకనినుండి మఱియొకనికి సంక్రమించు చుండును. కాన లజ్జయు నట్టిసాంక్రామికరోగమువలె భావింపఁబడినది.

సమాసములు :

స్మారమ్ :- స్మరస్య అయం = స్మారః, తమ్ = స్మారమ్.
అపత్రపిష్ణోః :- అపత్రపా శీలం యస్య సః = అపత్రపిష్ణుః, తస్య = అపత్రపిష్ణోః.
స్నిగ్ధాగదంకారచయే :- అగదస్య కారాః = అగదంకారాః, స్నిగ్ధాశ్చ తే అగదంకారాశ్చ = స్నిగ్ధాగదంకారాః స్నిగ్ధాగదంకారాణాం చయః = స్నిగ్ధాగదంకారచయః, తస్మిన్ = స్నిగ్ధాగదంకారచయే.
నిదానమౌనాత్ :- నిదానే మౌనమ్ = నిదానమౌనమ్, తస్మాత్ = నిదాన మౌనాత్.

సాంక్రామికీ :- సంక్రమః ప్రయోజనమస్యాస్సా = సాంక్రామికీ.

భావము :

ఈఘోరమైన మన్మథజ్వరమునకుఁ జికిత్స చేయగల ప్రియమైన వైద్యసంఘ ముండియు, రోగకారణమును జెప్పనందువలన, మిగుల లజ్జాశీలుఁ డగు నీ నలమహారాజునకు గొప్ప లజ్జ యంటువ్యాధివలెఁ బ్రవేశించినది.

శ్లో॥ బిభేతి రుష్టాఽసి కిలేత్యకస్మాత్
స త్వాం కిలోపేత్య హసత్యకాండే ।
యాంతీమివ త్వామనుయాత్యహేతో
రుక్తస్త్వయేవ ప్రతివక్తి మోఘమ్॥ ౧౧౨

ప. వి. బిభేతి । రుష్టా । అసి । కిల । ఇతి । అకస్మాత్ । సః । త్వాం । కిల । ఉపేత్య । హసతి । అకాండే । యాంతీమ్ । ఇవ । త్వామ్ । అనుయాతి । అహేతోః । ఉక్తః । త్వయా । ఇవ । ప్రతివక్తి । మోఘమ్ ।

టీక। సః = ఆనలుఁడు, అకస్మాత్ = ఆకస్మికముగ, రుష్టాఽసి కిలేతి = కోపముఁ జెందితివా యని, బిభేతి = భయపడును; అకాండే = అకాల మందు, త్వామ్ = నిన్ను, ఉపేత్య కిల = పొందెనో యని, హసతి =

నవ్వుచున్నాఁడు, అహేతోః = ఆకస్మికముగ, యాంతీమివ = వెళ్లు
చున్నావో యనునట్లున్న, త్వాం = నిన్ను. అనుయాతి = వెంబడించు
చున్నాడు, త్వయా = నీచేత, ఉక్త ఇవ = చెప్పఁబడినాడో యనునట్లు,
మోఘం = విషయము లేకయే (వ్యర్థముగా) ప్రతివక్తి = బదులు
చెప్పుచున్నాఁడు.

"ఉన్మాదశ్చిత్తవిభ్రమః" యను లక్షణలక్షిత మైన యున్మాదా
వస్థ వర్ణితము.

భావము :

ఆ నలుఁడు నీవలన నున్మాదావస్థకు లోఁబడినవాఁడై యాకస్మికముగ
నీవు కోపపడితివా యని భయపడును; ఆకస్మికముగ నిన్ను బడసినట్లు భ్రాంతి
పడి నవ్వును; అకారణముగా నీవు వెళ్లుచున్నావో యని భావించి వెంటఁ
బడును; నీవు తన్ను బిలిచినట్లు భావించి బదులు చెప్పును. ఇవి యంతయు నాతని
యున్మాదకృత్యములు.

శ్లో॥ భవద్వియోగాభిదురార్తిధారా
యమస్వసుర్మజ్జతి నిశ్శరణ్యః ।
మూర్చామయద్వీపమహాంధ్యపంకే
హా హా మహీభృద్భటకుంజరోఽయమ్॥ ౧౧౩

ప వి. భవద్వియోగాభిదురార్తిధారాయమస్వసుః । మజ్జతి । నిశ్శరణ్యః । మూ
ర్చామయద్వీపమహాంధ్యపంకే । హా । హా । మహీభృద్భటకుంజరః ।
అయమ్ ।

టీక॥ భవద్వియోగాభిదురార్తిధారాయమస్వసుః; భవత్ = నీయొక్క, వియోగ
= విరహమువలని, అభిదుర = అవిచ్ఛిన్న మైన, ఆర్తిధారా = దుఃఖ
పరంపర లను, యమస్వసుః = యమునానదియొక్క, మూర్చామయ
ద్వీపమహాంధ్యపంకే మూర్చామయ = మూర్ఛావస్థారూప మైన, ద్వీప =
దీవియందలి, మహాంధ్య = మహామోహ మను, పంకే = బురదయందు,
అయం = ఈ, మహీభృత్భటకుంజరః; మహీభృత్భట = రాజవీరు
డను, కుంజరః = గజము, నిశ్శరణ్యః = రక్షకుఁడు లేనివాడై, మజ్జతి
= మునుగుచున్నాడు; హా హా = కష్టము.

ఇచ్చట నార్తిధారను యమునతో రూపించుట వలన రూపకాలం కారము.

ఆర్తిధార యనగా దుఃఖపరంపర. అది కవి సమయము ననుసరించి యంధకారమువలె నుండునుగాన నల్లనియమునతో రూపింపఁబడినది. కాన రూపకము.

"మహీభృద్భటకుంజరః" అను నెడ రాజవీరుఁడగు నలుఁడు కుంజరముగా రూపింపఁబడుటవలనను రూపకము ఇందు మూర్ఛావస్థ వర్ణితము.

శ్లో॥ సవ్యాపసవ్యత్యజనాద్ద్విరుక్తైః
పంచేషుబాణైః పృథగర్జితాసు।
దశాసు శేషా ఖలు తద్దశా యా
తయా నభః పుష్ప్యతు కోరకేణ॥ ౧౧౪

ప వి. సవ్యాపసవ్యత్యజనాత్। ద్విరుక్తైః। పంచేషుబాణైః। పృథక్। అర్జితాసు। దశాసు। శేషా। ఖలు। తద్దశా। యా। తయా। నభః। పుష్ప్యతు। కోరకేణ।

టీక॥ సవ్యాపసవ్యత్యజనాత్; సవ్య = ఎడమచేతినుండియు, అపసవ్య = కుడిచేతినుండియు, త్యజనాత్ = విడుచుటవలన, ద్విరుక్తైః = రెండింతలైన—అనగా పది యైన. పంచేషుబాణైః; పంచేషు = అయిదు బాణములుగల మన్మథునియొక్క, బాణైః = అమ్ములచే, పృథక్ = ప్రత్యేకముగా, అర్జితాసు = పుట్టింపఁబడిన, దశాసు = అవస్థలయందు. అనగా—చక్షుః ప్రీతి—మనస్సంగ—సంకల్ప—జాగర — కృశతా — అరతి—లజ్జాత్యాగ ఉన్మాద—మూర్ఛలతోఁ గూడిన దశలయందు. శేషా = మిగిలిన, యా - ఏ. తద్దశా ఖలు = చెప్పఁదగని యా దశమదశ యనునదేది కలదో, తయా = ఆదశ యను, కోరకేణ = మొగ్గచే, నభః = ఆకాశము, పుష్ప్యతు = పుష్పించును గాత.

ఇచ్చట మన్మథదశలలో దశమదశ యమంగళకర మైనది. కాననది యిట ప్రస్తావిత మై నిషేధింపఁబడినది.

సమాసములు :-

సవ్యాపసవ్యత్యజనాత్ :- సవ్యశ్చ – అపసవ్యశ్చ = సవ్యాపసవ్యౌ, సవ్యాపసవ్యాభ్యాం త్యజనమ్ = సవ్యాపసవ్యత్యజనమ్, తస్మాత్ = సవ్యాపసవ్యత్యజనాత్.

ద్విరుక్తైః :- ద్విః ఉక్తాః = ద్విరుక్తాః, తైః = ద్విరుక్తైః.

పంచేషుబాణైః :- పంచ ఇషవః యస్య సః = పంచేషుః, పంచేషోః బాణాః = పంచేషుబాణాః, తైః = పంచేషుబాణైః.

భావము:-

ఆమన్మథుఁడు పంచబాణుఁ డగుటవలన నతఁడు, ఎడమచేతితోడను, కుడిచేతితోడను బాణములను వదలుటచే నవి రెండింతలై పది యైనవి. ఇట్లు మన్మథుని పదిబాణములచే నలునకు పది మన్మథావస్థలు కల్పింపఁబడినవి. ఆ పది మన్మథావస్థలలోను కడపటి యవస్థ యమంగళకర మైనది. కాన నాదశ యను మొగ్గచే నాకాశము పుష్పించును గాత. అనగా నాకడపటిదశ దశమదశ ఆకాశపుష్పముతో సమాన మై యసంభవ మగు గాత. కాన నట్టి దశకు నలుఁడు గురికాక రక్షింపఁబడును గాత.

శ్లో॥ త్వయి స్మరాధేస్సతతాఽస్మి తేన
ప్రస్థాపితో భూమిభృతాఽస్మి తేన।
ఆగత్య భూతస్సఫలో భవత్యా
భావప్రతీత్యా గుణలోభవత్యాః॥ ౧౧౫

వ.వి. త్వయి । స్మరాధేః । సతతా । అస్మి । తేన । ప్రస్థాపితః । భూమిభృతా। అస్మితేన । ఆగత్య । భూతః । సఫలః । భవత్యాః । భావప్రతీత్యా। గుణలోభవత్యాః ।

టీక॥ (అహమపి = నేనును) త్వయి = నీ విషయమునందు, స్మరాధేః = కామదుఃఖమువలన, సతతా = ఎల్లప్పుడును, అస్మితేన = దుఃఖించునట్టి, తేన = ఆ, భూమిభృతా = నలమహారాజుచే, ప్రస్థాపితోఽస్మి = ప్రయాణము జేయింపఁబడితిని, ఆగత్య = నీకడకు వచ్చి, గుణలో

భవత్యాః = గుణములయం దాదరముగల్గిన, భవత్యాః = నీయొక్క, భావప్రతీత్యా = భావము తెలియుటచే, సఫలః = కార్యసిద్ధి గలవాఁడనుగ, భూతః = అయితిని.

సమాసములు:-

స్మరాధేః :- స్మరస్య ఆధిః = స్మరాధిః, తస్మాత్ = స్మరాధేః.

సఫలః :- ఫలేన సహ వర్తత ఇతి = సఫలః.

భావప్రతీత్యా :- భావస్య ప్రతీతిః = భావప్రతీతిః, తయా = భావప్రతీత్యా.

గుణలోభవత్యాః :- గుణేషు లోభః = గుణలోభః, గుణలోభః అస్యాః అస్తీతి = గుణలోభవతీ, తస్యాః = గుణలోభవత్యాః.

భావము:-

నీవిషయమునం దెల్లప్పుడును మన్మథునివలని పీడచే నిత్యదుఃఖితుఁడైన యానలుఁడు పంపగా నేను నీకడకు వచ్చితిని. గుణములను గ్రహించు నీయొక్క భావము గ్రహించి సఫలుఁడనైతిని. నలుఁడు దేనికై నీకడకు నన్ను బంపెనో యాకార్యము నీవలన సిద్ధించినది.

శ్లో॥ ధన్యాఽసి వైదర్భి గుణైరుదారై
ర్యయా సమాకృష్యత నైషధోఽపి।
ఇతః స్తుతిః కా ఖలు చంద్రికాయా
యదబ్ధిమప్యుత్తరళీకరోతి॥ ౧౧౬

వ.వి. ధన్యా। అసి। వైదర్భి। గుణైః। ఉదారైః। యయా। సమాకృష్యత। నైషధః। అపి। ఇతః। స్తుతిః। కా। ఖలు। చంద్రికాయాః। యత్। అబ్ధిమ్। అపి। ఉత్తరళీకరోతి।

టీక॥ హేవైదర్భి! = ఓదమయంతీ! (వైదర్భరీతి), ధన్యాఽసి = ధన్యురాలవైతివి, యయా = ఏనీచేత, ఉదారైః = ఉత్కృష్టము లగు, గుణైః = సౌందర్యాదిగుణములచేత, (శ్లేషప్రసాదాది గుణములచే)-(బంధసాధనము లగుత్రాళ్ళచే), నైషధోఽపి = నలుఁడు గూడ, సమాకృష్యత = చక్కగా స్వాధీనపఱచుకొనఁబడెను; చంద్రికాయాః = వెన్నెలకు,

**అబ్ధిమపి** = గంభీరుఁడైన సముద్రుని గూడ, **ఉత్తరళీకరోతీతి యత్** = కలత పెట్టుట యనునది యేది గలదో, **ఇతః** = దీనికంటె (నధికముగా) **స్తుతిః** = వర్ణన, **కా ఖలు** = ఏమి యగును.

ఇచ్చట దమయంతీనలులకు చంద్రికా సముద్రములతో బింబ ప్రతిబింబభావముచే నౌపమ్యము చెప్పుటవలన దృష్టాంతాలంకారము.

సమాసములు:

**ఉత్తరళీకరోతి:**—అనుత్తరళము త్తరళం సంపద్యమానం కరోతి = ఉత్తరళీకరోతి.

భావము:

ఓదమయంతీ! నీగుణము లుత్కృష్టములు, ఆగుణములచే మహాగంభీరుఁడగు **నలమహారాజు** నీపైపున కాకర్షింపఁబడెను. వెన్నెల గంభీరమైన సముద్రమును కలతపఱచుటలో నేమి యతిశయ మున్నది? ఏమియు లేదు.

శ్లో॥ నలేన భాయాః శశినా నిశేవ
త్వయా స భాయాన్నిశయా శశీవ।
పునః పునస్తద్యుగయుగ్విధాతా
స్వభ్యాసమాస్తే ను యువాం యుయుక్షుః॥ ౧౧౭

ప.వి. నలేన। **భాయాః**। శశినా। నిశా। ఇవ। త్వయా। సః। **భాయాత్**। **నిశయా**। శశీ। ఇవ। పునః। పునః। తద్యుగయుక్। విధాతా। స్వభ్యాసమ్। ఆస్తే। ను। యువాం। యుయుక్షుః।

టీక॥ శశినా = చంద్రునిచే, నిశేవ = రాత్రివలె, [త్వం = నీవు], **భాయాః** = ప్రకాశింపుము; సోఽపి = ఆనలుఁడును, నిశయా = రాత్రిచే, శశీవ = చంద్రుండువలె **భాయాత్** = ప్రకాశించును, పునః పునః = మాటి మాటికి, తద్యుగయుక్, తత్ = ఆరాత్రిచంద్రులయొక్క, యుగ = జంటను, యుక్ = కూర్చునట్టియు, యువాం = మిమ్ముల నిద్దఱిని, యుయుక్షుః = కూర్పఁబోవునట్టియు, విధాతా = బ్రహ్మ, స్వభ్యాసం = అభ్యాసాతిశయ మందు, ఆస్తే ను = కలఁడా యేమి.

నలదమయంతులకు శశినిశలతోడను దమయంతీనలులకు నిశాశశులతోడను నౌపమ్యముఁ జెప్పుటవలన నుపమాలంకారము. నలునితో దమయంతియు దమయంతితో నలుఁడును బ్రకాశింతు రని చెప్పుట వలన నన్యోన్యాలంకారము. అది పైనఁ జెప్పఁబడిన యుపమాద్వయముచే ననుప్రాణితము గాన వానితో దీనికి సంకరము.

నిశాచంద్రుల యోజనయందలి యభ్యాసము దమయంతీనలుల యోజనార్థము గాక పోయినను, తదర్థ మనుట యుత్ప్రేక్ష. ఈ యుత్ప్రేక్ష కా యలంకారముల సంకరముతో సంకరము.

సమాసములు:-

తద్యుగయుక్ :- తయోః యుగమ్ = తద్యుగమ్, తద్యుగం యునక్తీతి = తద్యుగయుక్.

స్వభ్యాసమ్ :- అభ్యాసస్య సమృద్ధిః = స్వభ్యాసమ్.

యుయుక్షుః :- యోక్తుమిచ్ఛుః = యుయుక్షుః.

భావము ;

ఓదమయంతీ! చంద్రునిచే రాత్రివలె నీవు నలునిచేతఁ బ్రకాశింపుము. రాత్రిచేఁ జంద్రుఁడువలె నీచే నా నలుఁడు ప్రకాశించును. మాటిమాటికిని నిశాచంద్రులను గలుపునట్టి బ్రహ్మ మీయిద్దఱిని గలుపుటకై మంచి యభ్యాసము నిప్పటికిని జేసికొనుచున్నాఁడా ఏమి యని తోచుచున్నది. కానిచో మాటిమాటికిని నిశాచంద్రుల నతఁడు కలుపుచుండుటకుఁ బ్రయోజన మేమి యుండును?

శ్లో॥ స్తనద్వయే తన్వి పరం తవైవ
పృథౌ యది ప్రాప్స్యతి నైషధస్య।
అనల్పవైదగ్ధ్యవివర్ధినీనాం
పత్త్రావళీనాం రచనా సమాప్తిమ్॥ ౧౧౮

ప.వి. స్తనద్వయే। తన్వి। పరం। తవ। ఏవ। పృథౌ। యది। ప్రాప్స్యతి। నైషధస్య। అనల్పవైదగ్ధ్యవివర్ధినీనాం। పత్త్రావళీనాం। రచనా। సమాప్తిమ్।

టీక॥ (కించ = మఱియు) నైషధస్య = నలునియొక్క. అనల్పవైదగ్ధ్యవివర్ధినీనాం; అనల్ప = అధికమైన, వైదగ్ధ్య = నేర్పును, వివర్ధినీనాం = వర్ధిల్లఁజేయునట్టి, పత్రావళీనాం = మకరికాదిపత్రావళులయొక్క, రచనా = నిర్మాణము, సమాప్తిం = సంపూర్ణత్వమును, ప్రాప్స్యతి యది = పొందగల్గినచో, హేతన్వి = ఓసుందరీ! పృథౌ = విశాలమైన, తవైవ = నీదియే యైన, స్తనద్వయే పరం = చనుదోయియందే పొందగలుగును.

సమాసములు :-

స్తనద్వయే :- స్తనయోః ద్వయమ్ = స్తనద్వయమ్, తస్మిన్ = స్తనద్వయే.

నైషధస్య :- నిషధానాం రాజా = నైషధః, తస్య = నైషధస్య.

అనల్పవైదగ్ధ్యవివర్ధినీనామ్ :- న అల్పమ్ = అనల్పమ్, విదగ్ధస్య భావః = వైదగ్ధ్యమ్, అనల్పం చ తత్ వైదగ్ధ్యం చ = అనల్పవైదగ్ధ్యమ్, అనల్పవైదగ్ధ్యం వివర్ధయంతీతి = అనల్పవైదగ్ధ్యవివర్ధిన్యః, తాసామ్ = అనల్పవైదగ్ధ్యవివర్ధినీనామ్,

పత్రావళీనామ్ :- పత్రానామావళ్యః = పత్రావళ్యః. తాసాం = పత్రావళీనామ్

భావము :

నలమహారాజు మకరికాదిపత్రరచనలు జేయుటయందుఁ గడునేర్పరి. అతని యా నేర్పు పరిపూర్ణతఁ జెందవలయు ననినచో నతఁడు నీ చనుగవపై యామకరికాది పత్రరచన గావించవలయును. అప్పుడే యాతని పత్రావళీరచనా కౌశలము పరిపూర్ణత నొందఁగలదు.

శ్లో॥ ఏకస్సుధాంశుర్న కథంచన స్యా
తృప్తిక్షమ స్త్వన్నయనద్వయస్య ।
త్వల్లోచనా సేచనక స్తదస్తు
నలాస్యశీతద్యుతిసద్వితీయః॥ ౧౧౯

ప. వి. ఏకః । సుధాంశుః । న । కథం । చన । స్యాత్ । తృప్తిక్షమః । త్వన్నయనద్వయస్య । త్వల్లోచనాసేచనకః । తత్ । అస్తు । నలాస్యశీతద్యుతిసద్వితీయః ।

టీక॥ ఏకః = ఒక, సుధాంశుః = చంద్రుఁడు, త్వన్నయనద్వయస్య = నీరెండు నేత్రములకును, కథంచన = ఏవిధముగనైనను, తృప్తిక్షమః; తృప్తి = తృప్తిపఱచుటయందు, క్షమః = తగినవాఁడుగ, నస్యాత్ = కానేరడు, తత్ = అందువలన, నలాస్యశీతద్యుతిసద్వితీయః, నలాస్య = నలునిముఖమనెడు, శీతద్యుతి = చంద్రునితో, సద్వితీయః = రెండవదానితో గూడినవాడై, త్వల్లోచనాసేచనకః; త్వల్లోచన = నీ నేత్రములకు, ఆసేచనకః = అనంతతృప్తిని గల్గించువాఁడుగ, అస్తు = ఉండును గాత.

సమాసములు:

సుధాంశుః :- సుధామయాః అంశవః యస్య సః = సుధాంశుః.

నయనద్వయస్య :- నయనయోః ద్వయమ్ = నయనద్వయమ్, తస్య = నయనద్వయస్య.

త్వల్లోచనాసేచనకః :- తవ లోచనే = త్వల్లోచనే, త్వల్లోచనయోరాసేచనకః = త్వల్లోచనాసేచనకః.

నలాస్యశీతద్యుతిసద్వితీయః:- నలస్య ఆస్యమ్ = నలాస్యమ్, శీతా ద్యుతిః యస్య సః = శీతద్యుతిః, నలాస్యమేవ శీతద్యుతిః = నలాస్యశీతద్యుతిః, ద్వితీయేన సహవర్తత ఇతి = సద్వితీయః, నలాస్యశీతద్యుతినా సద్వితీయః = నలాస్య శీతద్యుతిసద్వితీయః

భావము:-

ఓ దమయంతీ! నీకనుఁగవకు నొకచంద్రుఁ డెవ్విధముగను సంతోషమును గల్గింపలేడు. కావున నలముఖచంద్రుని రెండవచంద్రునిగాఁ జేసికొని సుధాంశువు నీ నేత్రములకు రెంటికి ననంత మగు నానంద మొసంగు గాత.

శ్లో॥ అహో తపఃకల్పతరుర్నలీయ
స్త్వత్పాణిజాగ్రస్ఫురదంకురశ్రీః ।
త్వద్భ్రూయుగం యస్య ఖలు ద్విపత్రీ
తవాధరో రజ్యతి యత్ప్రలంబః॥ ౧౨౦

ప. వి. అహో । తపఃకల్పతరుః । నలీయః । త్వత్పాణిజాగ్రస్ఫురదంకురశ్రీః ।
త్వద్భ్రూయుగం । యస్య । ఖలు । ద్విపత్రీ । తవ । అధరః । రజ్యతి ।
యత్కలంబః.

టీక॥ నలీయః = నలునికి సంబంధించిన, తపఃకల్పతరుః = తపస్సనెడి కల్ప వృక్షము, త్వత్పాణిజాగ్రస్ఫురదంకురశ్రీః; త్వత్ = నీయొక్క, పాణిజ = గోళ్లయొక్క, అగ్ర = కొనలచేత, స్ఫురత్ = ప్రకాశించు, అంకురశ్రీః = మొలకల శోభగలది, యస్య = ఏకల్పవృక్షమునకు, త్వద్భ్రూయుగమ్ = నీకనుబొమల జంటయే, ద్విపత్రీ = మొదట నేర్పడు రెండాకులు, తవ = నీయొక్క, అధరః = క్రిందిపెదవి, యత్కలంబః, యత్ = ఏనలతపఃకల్పవృక్షమునకు, కలంబః = చిగురుజొంపము, అహో = ఆశ్చర్యము.

సమాసములు ;

తపఃకల్పతరుః :- తప ఏవ కల్పతరుః = తపఃకల్పతరుః.

నలీయః :- నలస్య అయం = నలీయః

త్వత్పాణిజాగ్రస్ఫురదంకురశ్రీః :- పాణౌ జాయంత ఇతి = పాణిజాః, తవ పాణిజాః = త్వత్పాణిజాః. త్వత్పాణిజానామగ్రాణి = త్వత్పాణిజాగ్రాణి, అంకురాణాం శ్రీః = అంకురశ్రీః, త్వత్పాణిజాగ్రైః స్ఫురంతీ అంకురశ్రీః యస్య సః = త్వత్పాణిజాగ్రస్ఫురదంకురశ్రీః.

త్వద్భ్రూయుగమ్ :- భ్రువోర్యుగమ్ = భ్రూయుగమ్, తవ భ్రూయుగమ్ = త్వద్భ్రూయుగమ్.

ద్విపత్రీ :- ద్వయోః పత్రయోస్సమాహారః = ద్విపత్రీ.

యత్కలంబః :- యస్య కలంబః = యత్కలంబః.

భావము :-

నలుని తపఃకల్పవృక్షమునకు నీ నఖాగ్రములే యంకురములు, నీ కనుబొమల జంటయే తొలుత నేర్పడు రెండాకులు, నీయధరమే చిగురు జొంపము, వీనిచే నాతపఃకల్పవృక్షము తనయంతట నెఱ్ఱనై వెలయుచున్నది.

శ్లో॥ యస్తే నవః పల్లవితః కరాభ్యాం
స్మితేన యః కోరకితస్తవాఽఽస్తే।
అంగ్రమ్రదిమ్నా తవ పుష్పితో యః
స్తనశ్రియా యః ఫలితస్తవైవ॥ ౧౨౧

ప. వి. యః। తే। నవః। పల్లవితః। కరాభ్యాం। స్మితేన। యః। కోరకితః। తవ। ఆస్తే। అంగమ్రదిమ్నా। తవ। పుష్పితః। యః। స్తనశ్రియా। యః। ఫలితః। తవ। ఏవ।

టీక॥ యః = ఏ, నవః = నూతనమైన కల్పవృక్షము, తే = నీయొక్క, కరాభ్యాం = చేతులచే, పల్లవితః = చిగురించినదో, యః = ఏకల్పవృక్షము, తవ = నీయొక్క, స్మితేన = చిఱునగవుచే, కోరకితః = మొగ్గలు దొడిగినదై, ఆస్తే = ఉన్నదో, యః = ఏ కల్పవృక్షము, తవ = నీయొక్క, అంగమ్రదిమ్నా; అంగ = శరీరముయొక్క, మ్రది మ్నా = మెత్తదనముచే, పుష్పితః = పుష్పములఁ దొడిగినదో, యః = ఏకల్పవృక్షము, తవైవ = నీయొక్కయే, స్తనశ్రియా = చనుదోయి చెన్నుచే, ఫలితః = ఫలములను దొడిగినదో.

పూర్వశ్లోకమందును నీశ్లోకమందును నలతపస్సునందు కల్పవృక్షత్వమును దమయంతీనఖాదులయందు కల్పవృక్షావయవత్వమును రూపించుటవలన సావయవరూపకాలంకారము. అవయవి యగు కల్పవృక్షము అవయవము లగు దమయంతీనఖాగ్రాదులు భిన్నదేశస్థితిగల్గియుండుట వలన నసంగత్యలంకారము.కార్యకారణములకు భిన్నదేశత్వమును జెప్పినచో నసంగతి యని దాని లక్షణము ఇచ్చట నవయవి యగు నలతపః కల్పవృక్షమునకును, అవయవము లగు నఖాంకురాదులకును కార్యకారణ భావము.

సమాసములు:-

పల్లవితః:- పల్లవాః అస్య సంజాతా ఇతి = పల్లవితః.
కోరకితః:- కోరకాః అస్య సంజాతా ఇతి = కోరకితః.
పుష్పితః:- పుష్పాణి అస్య సంజాతానీతి పుష్పితః

స్తనశ్రియా:– స్తనయోః శ్రీః = స్తనశ్రీః, తయా = స్తనశ్రియా.
ఫలితః:– ఫలాన్యస్య సంజాతానీతి = ఫలితః.

భావము:–

ఆ నలతపఃకల్పవృక్షము నీ చేతులచేఁ జిగురించినది. అది నీ చిఱునగవుచే మొగ్గలు దొడిగినది. అది నీశరీరమార్దవముచే పుష్పములఁ దొడిగినది. నీ చనుదోయిచెన్నుచే నా వృక్షము ఫలములను దొడిగినది.

శ్లో॥ కంసీకృతాసీత్ఖలు మండలీందో
స్సంసక్తరశ్మిప్రకరా స్మరేణ।
తులా చ నారాచలతా నిజైవ
మిథోఽనురాగస్య సమీకృతౌ వామ్॥ ౧౨౨

ప. వి. కంసీకృతా । ఆసీత్ । ఖలు । మండలీ । ఇందోః । సంసక్తరశ్మిప్రకరా । స్మరేణ । తులా । చ । నారాచలతా । నిజా । ఏవ । మిథోఽనురాగస్య । సమీకృతౌ । వామ్ ।

టీక॥ స్మరేణ = మన్మథునిచే, వాం = మీ యిఱువురిలో, మిథోఽనురాగస్య = ఒండొరుల యనురాగముయొక్క, సమీకృతౌ = సమానము గావించుట యందు, సంసక్తరశ్మిప్రకరా; సంసక్త = సమకూర్పఁబడిన, రశ్మి = కిరణము లనెడి దారములయొక్క, ప్రకరా = సమూహముగల్గిన, ఇందోః = చంద్రునియొక్క, మండలీ = వర్తులమైన మండలము, కంసీకృతా = తూచుట కుపయోగపడు లోహపాత్రముగఁ జేయఁబడినది, నిజా = తనదైన, నారాచలతైవ = తీగెవలెఁ బొడుగైన బాణలత, తులా చ = త్రాసుకు నడ్డముగ నుండెడి కఱ్ఱగను, (కృతా = చేయఁబడినది).

ఇచ్చట నిందుమండలి మున్నగువానియందు లోహపాత్రత్వాది ధర్మములను రూపించుటచేతనే మన్మథునియందు తోలనకర్తృత్వము సిద్ధించుచున్నది. కాన నేకదేశవివర్తిరూపకము.

సమాసములు :–

కంసీకృతా:– అకంసః కంసః సంపద్యమానా కృతా = కంసీకృతా.

సంసక్తరశ్మిప్రకరా:- రశ్మీనాం ప్రకరాః = రశ్మిప్రకరాః, సంసక్తాః రశ్మిప్రకరాః యస్యాం సా = సంసక్తరశ్మిప్రకరా.

నారాచలతా:- నారాచ ఏవ లతా = నారాచలతా.

మిథోఽనురాగస్య:- మిథః అనురాగః = మిథోఽనురాగః, తస్య = మిథోఽనురాగస్య.

భావము:-

మన్మథుఁడు మీ యిఱువురి యనురాగములను సమములఁ గావించుటకై కిరణము లను దారములతోఁ గూర్పఁబడిన చంద్రమండలమును లోహపాత్రగా జేసెను. తన సన్నని బాణమును తక్కెడకుఁ గట్టెకి యడ్డకొయ్యను గావించెను. ఈ విధముగాఁ జంద్రుని లోహపుఁదట్టగను, తనబాణమును దులాదండముగను గావించి మీ యిఱువురి ప్రేమను మన్మథుఁడు తూచి సమములు గావింపఁ బ్రయత్నించెను.

శ్లో॥ సత్త్వప్రసుతస్వేదమధూత్థసాంద్రే
తత్పాణిపద్మే మదనోత్సవేషు।
లగ్నోత్థితాస్త్వత్కుచపత్రరేఖా
స్తన్నిర్గతాస్తం ప్రవిశంతు భూయః॥ ౧_౨౩

వ. వి. సత్త్వప్రసుతస్వేదమధూత్థసాంద్రే। తత్పాణిపద్మే। మదనోత్సవేషు। లగ్నోత్థితాః। త్వత్కుచపత్రరేఖాః। తన్నిర్గతాః। తం। ప్రవిశంతు। భూయః।

టీక॥ (కించ = మఱియు), మదనోత్సవేషు = మన్మథోత్సవములయందు, సత్త్వప్రసుతస్వేదమధూత్థసాంద్రే: సత్త్వ = మనోవికారముచే, ప్రసుత = స్రవించిన, స్వేద = చెమట యను, మధూత్థ = తేనెపెరచే, లేదా మైనముచే, సాంద్రే = నీరంధ్ర మైన, తత్పాణిపద్మే: తత్ = ఆ నలుని యొక్క, పాణిపద్మే = పద్మమువంటి హస్తమునందు, లగ్నోత్థితాః; లగ్న = సంక్రమించినవై, ఉత్థితాః = పైకి లేచినవియు, తన్నిర్గతాః: తత్ = ఆ నలుని పాణిపద్మమునుండి, నిర్గతాః = వెలువడిన, త్వత్కుచ

పత్రరేఖాః; త్వత్ = నీయొక్క, కుచపత్రరేఖాః = స్తనములయందలి మకరికాదిపత్రరేఖలు, భూయః = మరల, తం = ఆ పద్మమువంటి హస్తమును ప్రవిశంతు = ప్రవేశించును గాత.

సమాసములు ;

సత్త్వస్రుతస్వేదమధూత్థసాంద్రే :- సత్త్వేన స్రుతః = సత్త్వస్రుతః సత్త్వస్రుతశ్చాసౌ స్వేదశ్చ = సత్త్వస్రుతస్వేదః, సత్త్వస్రుతస్వేద ఏవ మధూత్థమ్ = సత్త్వస్రుతస్వేదమధూత్థమ్, సత్త్వస్రుతస్వేద మధూత్థేన సాంద్రమ్ = సత్త్వస్రుతస్వేదమధూత్థసాంద్రమ్,

తత్పాణిపద్మే:- పాణిః పద్మమివ = పాణిపద్మమ్, తస్య పాణిపద్మమ్ = తత్పాణిపద్మమ్ తస్మిన్ = తత్పాణిపద్మే.

మదనోత్సవేషు:- మదనస్య ఉత్సవాః = మదనోత్సవాః, తేషు = మదనోత్సవేషు.

లగ్నోత్థితాః:- లగ్నాశ్చ తే ఉత్థితాశ్చ = లగ్నోత్థితాః.

త్వత్కుచపత్రరేఖాః:- కుచయోః పత్రాణి = కుచపత్రాణి, తవ కుచ పత్రాణి = త్వత్కుచపత్రాణి, త్వత్కుచపత్రాణ్యేవ రేఖాః = త్వత్కుచపత్రరేఖాః.

తన్నిర్గతాః:- తస్మాత్ నిర్గతాః = తన్నిర్గతాః.

భావము :-

మఱియు మన్మథోత్సవములయందు ననగా సురతక్రీడలయందు సత్త్వమను మనోవికారమువలన నుద్భవించు చెమట యను మైనముచే సందు లేక పూయఁ బడిన నలుని పాణిపద్మమందు నీ స్తనతలమునుండి యతికినవియు నలునిచే తొలుత వ్రాయఁబడినవియు నగు మకరికాదిపత్రరేఖలు మరల నా నలునిహస్త మునే పొందును గాత. నలునిచే దమయంతీస్తనతటములపై మకరికాదిపత్ర రచనలు చేయఁబడియున్నవి. సురతకాలమునందు శరీరమున స్వేద మేర్పడుట వలన నా స్వేదముచే నలునిహస్తము సందులేక మైనపుపూత వేయఁబడిన ట్లుండును. సురతకాలమున నలునికరస్పర్శచే దమయంతీ స్తనమండలముపైని పత్రరేఖలు నలునిచేతి కంటుకొనును. తొలుత నా మకరరేఖలు నలునిహస్తముచే రచింపఁబడినవై యుండును. అవి మరల నలునిహస్తమునే సురతకేళివశమునఁ

బొందుచుండును. కారణమున కార్యమునకు లయము గాన నలునిహస్తమునుండి వెల్వడిన మకరికాదిరేఖలు మరల నలునిహస్తమునే పొందుట సంభవించును. ఈ విధముగ మకరికాదిరేఖలు నలుహస్తమునే పొందును గాక యని హంస యిట దీవించుచున్నది.

శ్లో॥ బంధాఢ్యనానారతమల్లయుద్ధ
ప్రమోదితైః కేళివనే మరుద్భిః।
ప్రసూనవృష్టిం పునరుక్తముక్తాం
ప్రతీచ్ఛతం భైమి యువాం యువానౌ॥ ౧౨౪

ప. వి. బంధాఢ్యనానారతమల్లయుద్ధప్రమోదితైః । కేళివనే । మరుద్భిః । ప్రసూనవృష్టిం । పునరుక్తముక్తాం । ప్రతీచ్ఛతం । భైమి । యువాం । యువానౌ ।

టీక॥ (కించ = మరియు) హేభైమి = ఓ దమయంతీ, బంధాఢ్యనానారతమల్లయుద్ధ ప్రమోదితైః; బంధ = కామశాస్త్రప్రసిద్ధము లగు వివిధ బంధములచే, ఆఢ్య = సమగ్ర మైన, నానారత = నానావిధసురత రూప మైన, మల్లయుద్ధ = వీరరణమున, ప్రమోదితైః = పరిమళము గల (సంతోషముగల), కేళివనే = ఉద్యానమునందలి, మరుద్భిః = వాయువులచే (దేవతలచేత), పునరుక్తముక్తాం; పునరుక్త = దట్టముగా, ముక్తాం = విడువఁబడిన, ప్రసూనవృష్టిం = పుష్పవర్షమును, యువానౌ = యువతియు యువకుఁడు నగు, యువాం = మీ రిరువురు, ప్రతీచ్ఛతం = పుచ్చుకొనుదురు గాక.

సమాసములు:-

బంధాఢ్యనానారతమల్లయుద్ధప్రమోదితైః :- బంధైరాఢ్యం = బంధాఢ్యం, నానావిధం చ తత్ రతం చ = నానారతమ్, బంధాఢ్యం చ తత్ నానారతం చ = బంధాఢ్యనానారతమ్, బంధాఢ్యనానారతమేవ మల్లయుద్ధమ్ = బంధాఢ్యనానారతమల్లయుద్ధమ్, బంధాఢ్యనానారతమల్లయుద్ధేన ప్రమోదితాః, బంధాఢ్యనానారతమల్లయుద్ధప్రమోదితాః, తైః = బంధాఢ్యనానారతమల్లయుద్ధప్రమోదితైః

కేళివనే :– కేళేః వనమ్ = కేళివనమ్, తస్మిన్ = కేళివనే.

ప్రసూనవృష్టిమ్ :– ప్రసూనాం వృష్టిః = ప్రసూనవృష్టిః, తామ్ = ప్రసూనవృష్టిమ్

పునరుక్తముక్తామ్ :– పునః ఉక్తమ్ = పునరుక్తమ్, పునరుక్తం యథా తథా ముక్తా = పునరుక్తముక్తా, తామ్ = పునరుక్తముక్తామ్.

భైమి :– భీమస్య అపత్యం స్త్రీ = భైమీ, తస్యాః సంబుద్ధిః = హేభైమి.

యువానౌ :– యువా చ యువతిశ్చ = యువానౌ.

భావము :–

కామశాస్త్రమందు వ్యానతాదికరణము లను బంధములు, ఉత్తానకాదు లను నానాసురతములుఁ జెప్పఁబడియున్నవి. ఆ బంధములతో నిండిన నానాసుర తరూప మైన మల్లయుద్ధముచే నుద్యానవనమందలి వాయువులు తావి నొందును (దేవతలు హర్షము నొందెదరు). యుద్ధములయందు విజయము నొందినవారిపై దేవతలు పుష్పవర్షమును గురిపింతురు. అవ్విధముగనే యీ సురతయుద్ధమునఁ బెనగులాడి విజయ మందిన యువకు లగు మీ రిరువురును కేళివనమందలి వాయువులచే (దేవతలచే) దట్టముగఁ గురిపించెడి పుష్పవర్షమును గ్రహింతురు గాత.

శ్లో॥ అన్యోన్యసంగమవశాదధునా విభాతాం
తస్యాపి తేఽపి మనసీ వికసద్విలాసే ।
స్రష్టుం పునర్మనసిజస్య తనుం ప్రవృత్త
మాదావివ ద్వ్యణుకకృత్పరమాణుయుగ్మమ్॥౧౨౩

ప. వి అన్యోన్యసంగమవశాత్ । అధునా । విభాతామ్ । తస్య । అపి । తే । అపి । మనసీ । వికసద్విలాసే । స్రష్టుం । పునః । మనసిజస్య । తనుం । ప్రవృత్తమ్ । ఆదౌ । ఇవ । ద్వ్యణుకకృత్ । పరమాణుయుగ్మమ్ ।

టీక॥ (కించ = మఱియు) అధునా = ఇప్పుడు, అన్యోన్యసంగమవశాత్; అన్యోన్య = ఒండొరులయొక్క, సంగమ = కలయికయందలి, వశాత్ = పరతంత్రతవలన, వికసద్విలాసే; వికసత్ = వర్ధిల్లుచున్న, విలాసే

= ఉల్లాసముగల, తస్యాపి = అతనియొక్కయు, తేఽపి = నీ యొక్కయు, మనసీ = మనస్సులు రెండును, మనసిజస్య = మన్మథుని యొక్క, తనుం = శరీరమును, పునః = మరల, స్రష్టుం = సృజింప ుటకు, ప్రవృత్తం = ఉద్యుక్తమైనదియు, (కావుననే) ఆదౌ = మొదట, ద్వ్యణుకకృత్, ద్వ్యణుక = (రెండు పరమాణువులచేఁబుట్టిన) ద్వ్యణు కమును, కృత్ = జేయునట్టి, పరమాణుయుగ్మమివ = పరమాణువుల జంటయో యనునట్లు, విభాతామ్ = ప్రకాశించును గాత.

ఈశ్వరేచ్ఛచే రెండు పరమాణువుల కలయికచే ద్వ్యణుకాదిక్రమ ముగఁ బ్రపంచసృష్టి యేర్పడు నని తార్కికమతము. ఆ మతమునందు మనస్సు పరమాణుస్వరూపము గాన నలదమయంతుల మనస్సులు రెం డును రెండు పరమాణువులై మనసిజుఁ డగు మన్మథుని శరీరమును సృజించుటకు ద్వ్యణుకమును నిర్మించును. దానివలన మన్మథుఁడు (కామము) జనన మొంది విజృంభించు నని యుద్దేశము.

సమాసములు :-

అన్యోన్యసంగమవశాత్ :- అన్యోన్యయోస్సంగమః = అన్యోన్యసంగమః, అన్యోన్యసంగమస్య వశః = అన్యోన్యసంగమవశః, తస్మాత్ = అన్యోన్యసంగమవశాత్.

వికసద్విలాసే :- వికసన్ విలాసః యయోస్తే = వికసద్విలాసే.

మనసిజస్య :- మనసి జాయత ఇతి = మనసిజః, తస్య = మనసిజస్య.

ద్వ్యణుకకృత్ :- ద్వౌ అణూ యస్య తత్ = ద్వ్యణుకమ్ ద్వ్యణుకం కరోతీతి = ద్వ్యణుకకృత్.

పరమాణుయుగ్మమ్ :- పరమశ్చాసౌ అణుశ్చ = పరమాణుః, పర మాణ్వోః యుగ్మమ్ = పరమాణుయుగ్మమ్.

భావము :

నలుఁడును నీవును నొండొరులతో కలియుటవలన మిగుల నుల్లాసము నొందిన మీ యిరువురి మనస్సులు, మనస్సునఁ బుట్టునట్టి మన్మథునియొక్క శరీరమును సృజించుటకు నుద్యుక్తములై దానికి మూలమైన ద్వ్యణుకమును సృజించు బరమాణువుల జంటగ బ్రకాశించును గాత.

శ్లో॥ కామః కౌసుమచాపదుర్జయమముం జేతుం నృపం త్వాం ధను
ర్వల్లీమవ్రణవంశజామధిగుణామాసాద్య మాద్యత్యసౌ।
గ్రీవాలంకృతిపట్టసూత్రలతయా పృష్ఠే కియల్లంబయా
భ్రాజిష్ణుం కషరేఖయేవ నివసత్సిందూరసౌందర్యయా॥ ౧౨౬

ప. వి. కామః । కౌసుమచాపదుర్జయమ్ । అముం । జేతుం । నృపం । త్వాం । ధను ర్వల్లీమ్ । అవ్రణవంశజామ్ । అధిగుణామ్ । ఆసాద్య । మాద్యతి । అసౌ । గ్రీవాలంకృతిపట్టసూత్రలతయా । పృష్ఠే । కియల్లంబయా । భ్రాజిష్ణుం । కషరేఖయా । ఇవ । నివసత్సిందూరసౌందర్యయా ।

టీక॥ అసౌ = నలుని జయింపఁ గోరినట్టి యీ, కామః = మన్మథుఁడు, కౌసుమచాపదుర్జయమ్; కౌసుమచాప = పుష్పధనుస్సుచే, దుర్జయమ్ = జయింప సాధ్యము కాని, అముం = ఈ, నృపం = నలుని, జేతుం = జయించుటకు, అవ్రణవంశజామ్; అవ్రణవంశ = మంచివంశమునందు, అవ్రణ = పురుగుకొట్టనట్టి, వంశ = వెదురునందు, జాం = పుట్టినట్టి, అధిగుణామ్ = అధిక మైన సౌందర్య మను గుణము గల్గిన, (ఎక్కుపెట్టబడిన యల్లెత్రాడుగల్గిన), నివసత్సిందూరసౌందర్యయా; నివసత్ = అనువర్తించుచున్న, సిందూర = అ.కఃరదశలో నాళములవలన విసర బడిన సిందూరముయొక్క, సౌందర్యయా = సౌందర్యముగల, కష రేఖయా = కాలాంతరమందు సిందూరము సంక్రమించినదా లేదా యను పరీక్షకొఱకుఁ జేయఁబడిన యొరిపిడిగీతయో యనునట్లున్నదై, పృష్ఠే = మెడవెనుక, కియత్ = కొంచెముగా, లంబయా = వ్రేలాడుచున్న, గ్రీవాలంకృతిపట్టసూత్రలతయా; గ్రీవా = కంఠమునకు, అలంకృతి = అలంకరణ మైన, పట్టసూత్రలతయా = పట్టుదారపు తీగెచే, భ్రాజిష్ణుం = ప్రకాశించుచున్న, త్వాం = నిన్నునెడి, ధనుర్వల్లీం = ధనుర్లతను, ఆసాద్య = పొంది. మాద్యతి = సంతోషించుచున్నాఁడు.

త్వామేవ ధనుర్వల్లీమ్— అను నెడ రూపకము.

గ్రీవాలంకృతిపట్టసూత్రలతను కషరేఖయో యని భావించుట వలన నుత్ప్రేక్ష.

"అవ్రణవంశజామ్-అధిగుణామ్" అనునెడ శ్లేష. శ్లేషోత్ప్రేక్షలతో రూపకమునకు సంకరము.

సమాసములు :

కౌసుమచాపమ్ ;- కుసుమస్య అయం = కౌసుమః, కౌసుమః చాపః యస్య సః = కౌసుమచాపః. తం = కౌసుమచాపమ్.

దుర్జయమ్ :- దుఃఖేన జేతుం శక్యః = దుర్జయః, తమ్ = దుర్జయమ్.

ధనుర్వల్లీమ్ ;- ధనురేవ వల్లీ = ధనుర్వల్లీ, తామ్ = ధనుర్వల్లీమ్.

అవ్రణవంశజామ్ :- న వ్రణః యస్మిన్ సః = అవ్రణః, అవ్రణశ్చాసౌ వంశశ్చ = అవ్రణవంశః, అవ్రణవంశాత్ జాయత ఇతి = అవ్రణవంశజా, తామ్ = అవ్రణవంశజామ్.

అధిగుణామ్ :- అధికృతః గుణః యస్యాం సా = అధిగుణా, తామ్ = అధిగుణామ్.

గ్రీవాలంకృతిపట్టసూత్రలతయా :- గ్రీవాయాః అలంకృతిః = గ్రీవాలంకృతిః, పట్టమయం చ తత్ సూత్రం చ = పట్టసూత్రమ్, పట్టసూత్రమేవ లతా = పట్టసూత్రలతా, గ్రీవాలంకృతిశ్చాసౌ పట్టసూత్రలతా చ = గ్రీవాలంకృతిపట్టసూత్రలతా, తయా = గ్రీవాలంకృతిపట్టసూత్రలతయా.

కియల్లంబయా:- కియత్ యథా తథా లంబా = కియల్లంబా, తయా = కియల్లంబయా.

కషరేఖయా:- కషస్య రేఖా = కషరేఖా, తయా = కషరేఖయా.

నివసత్సిందూరసౌందర్యయా:- సిందూరస్య సౌందర్యమ్ = సిందూరసౌందర్యమ్, నివసత్ సిందూరసౌందర్యం యస్యాస్సా = నివసత్సిందూరసౌందర్యా, తయా = నివసత్సిందూరసౌందర్యయా.

భావము :

మన్మథుఁడు తనపూవిల్లుచే జయింపసాధ్యముకాని యీ నటుని జయించుటకు సద్వంశమునందుఁ బుట్టిన (పుఱుగుగొట్టని వెదురునందుఁ బుట్టిన) గుణవంతురాలైన (ఎక్కుపెట్టఁబడిన యల్లెత్రాడుగల) అంకురదశలో వెదురుమొక్కలలోని కంటుకొనెడు సిందూరపు సౌందర్యము గల్గి కాలాంతరమున నా సిందూరపు వ్యాప్తిని పరిశీలించుటకుఁ గావింపఁబడిన యొరిపిడిగీఁటగా నూహింపఁదగిన దై

మెడవెనుక (వ్రేలాడు కంఠాలంకరణ మగు పట్టుదారపు కుచ్చులతో శోభించు నిన్నే, తీగెవిల్లుగాఁ జేసికొని మిగుల హర్షించుచున్నాఁడు. వింటికిఁ దగిన వెదురుకఱ్ఱను బరీక్షించుటకై బంగారు నొరసి పరీక్షించునట్లు దానిని గూడ నొరసి పరీక్షించి సిందూరము రాలినచో నది చక్కఁగాఁ బండినట్లు నిర్ణయింతురు. అప్పుడు దానిని వింటి కుపయోగింతురు.

శ్లో॥ త్వద్గుచ్ఛావళిమౌక్తికాని గుళికాస్తం రాజహంసం విభో
ర్వేధ్యం విద్ధి మనోభువః స్వమపి తాం మంజుం ధనుర్మంజరీమ్।
యన్నిత్యాంకనివాసలాలితతమజ్యాభుజ్యమానం లస
న్నాభీమధ్యబిలా విలాసమఖిలం రోమాళిరాలంబతే॥ ౧౨౭

ప. వి. త్వద్గుచ్ఛావళిమౌక్తికాని। గుళికాః। తం। రాజహంసమ్। విభోః। వేధ్యం। విద్ధి। మనోభువః। స్వమ్। అపి। తామ్। మంజుం। ధనుర్మంజరీమ్। యన్నిత్యాంకనివాసలాలితతమజ్యాభుజ్యమానం। లసన్నాభీమధ్యబిలా। విలాసమ్। అఖిలమ్। రోమాళిః। ఆలంబతే।

టీక॥ విభోః = వ్యాపకుఁడగు, మనోభువః = మన్మథుఁడను (లక్ష్యవేద్ధుః = గుఱిగొట్టువానికి,) త్వద్గుచ్ఛావళిమౌక్తికాని; త్వత్ = నీయొక్క, గుచ్ఛావళి = ముత్యాలహారములలో నొకటి యగు హారముయొక్క, మౌక్తికాని = ముత్యములు, గుళికాః = గుండ్లుగను, తం = ఆ, రాజహంసమ్ = రాజశ్రేష్ఠ దగు నలుఁడనెడి కలహంసను, వేధ్యం = కొట్టఁ దగిన గుఱిగను, స్వమపి = తనను, తామ్ = చెప్పఁబోవునట్టి, మంజుం = మనోహర మైన, ధనుర్మంజరీమ్ = ధనుర్లతగను, విద్ధి = తెలిసికొనుము, యన్నిత్యాంకనివాసలాలితతమజ్యాభుజ్యమానం; యత్ = ఏ ధనుర్లతయొక్క, నిత్య = నిరంతరము, అంక = ఒడియందు, నివాస = నివాసముచే, లాలితతమ = మిగుల లాలింపఁబడిన, జ్యా = వింటినారిచే, భుజ్యమానం = అనుభవింపఁబడుచున్నటువంటి, అఖిలం = సమస్త మైన, విలాసం = శోభను – అనగా నల్లెత్రాడుపలె నుండుటను, లసన్నాభీమధ్యబిలా; లసత్ = ప్రకాశించుచున్న, నాభీ = పొక్కిలి యను, మధ్యబిలా = గుండ్లు బెట్టెడి గుంతగల్గిన, రోమాళిః = రోమపంక్తి, ఆలంబతే = పొందుచున్నది.

ఇచ్చట ముత్యములు మన్నగువానియందు గుళికాద్యవయవత్వము రూపింపఁబడుటవలన,అవయవి యగు కామునియందు వేధకత్వరూపణము గమ్య మగును. కాన నేకదేశవివర్తిసావయవరూపకము.

సమాసములు :

త్వద్గుచ్ఛావళిమౌక్తికాని:- తవ గుచ్ఛావళిః = త్వద్గుచ్ఛావళిః, త్వద్గుచ్ఛావళేః మౌక్తికాని = త్వద్గుచ్ఛావళిమౌక్తికాని.

రాజహంసమ్:- రాజ్ఞాం హంసః = రాజహంసః, తమ్ = రాజహంసమ్. హంసానాం రాజా = రాజహంసః తమ్ = రాజహంసమ్

వేధితుం యోగ్యః = వేధ్యః, తమ్ = వేధ్యమ్.

ధనుర్మంజరీమ్ = ధనురేవ మంజరీ = ధనుర్మంజరీ, తామ్ = ధనుర్మంజరీమ్.

యన్నిత్యాంకనివాసలాలితతమజ్యాభుజ్యమానమ్:- అంకే నివాసః = అంకనివాసః, నిత్యం అంకనివాసః = నిత్యాంకనివాసః, యస్యాః నిత్యాంకనివాసః = యన్నిత్యాంకనివాసః, అత్యంతం లాలితా = లాలితతమా, యన్నిత్యాంకనివాసేన లాలితతమా = యన్నిత్యాంకనివాసలాలితతమా, యన్నిత్యాంకనివాసలాలితతమా చ సా జ్యా చ = యన్నిత్యాంకనివాసలాలితతమజ్యా, యన్నిత్యాంకనివాసలాలితతమజ్యయా భుజ్యమానః = యన్నిత్యాంకనివాసలాలితతమజ్యాభుజ్యమానః, తమ్ = యన్నిత్యాంకనివాసలాలితతమజ్యాభుజ్యమానమ్.

లసన్నాభీమధ్యబిలా:- లసంతీ చ సా నాభీ చ = లసన్నాభీ, మధ్యే బిలం = మధ్యబిలమ్, లసన్నాభ్యేవ మధ్యబిలం యస్యాస్సా = లసన్నాభీమధ్యబిలా.

రోమాళిః:- రోమ్ణామాళిః = రోమాళిః.

భావము:-

గుఱిగొట్టెడి మన్మథునకు నీ ముత్యాలసరమందలి ముత్యములే గుండ్లనియు, రాజశ్రేష్ఠుఁ డగు నలుడే గుఱి యైన రాజహంస యనియు, నీవు మన్మథుని ధనుర్లత యనియు నిరంతరము నీయొద్ద నివసించి లాలింపఁబడుచున్నదై, పొక్కిలి యనెడి గుండ్లు పెట్టెడి స్థానము గల్గిన నీ నూగారు వింటి

నారిగను దెలియుము. ఇట్లు మన్మథుఁడు నిన్నాయుధముగఁ జేసికొని నలునిఁ గొట్టును.

శ్లో॥ పుష్పేషుశ్చికురేషు తే శరచయం స్వం ఫాలమూలే ధనూ
రౌద్రే చక్షుషి యజ్జితస్తనుమనుభ్రాష్ట్రిం చ యశ్చిక్షిపే।
నిర్విద్యాశ్రయదాశ్రమం స వితనుస్త్వాం తజ్జయాయాధునా
పత్త్రాళిస్త్వదురోజశైలనిలయా తత్పర్ణశాలాయతే॥ ౧౨౨

ప. వి. పుష్పేషుః। చికురేషు। తే। శరచయం। స్వం। ఫాలమూలే। ధనుః। రౌద్రే। చక్షుషి। యజ్జితః। తనుమ్। అనుభ్రాష్టం। చ। యః। చిక్షిపే। నిర్విద్య। అశ్రయత్। ఆశ్రమం। సః। వితనుః। త్వాం। తజ్జయాయ। అధునా। పత్త్రాళిః। త్వదురోజశైలనిలయా। తత్పర్ణశాలాయతే।

టీ॥ యః = ఏ, పుష్పేషుః = పూవిలుతుఁడు, యజ్జితః; యత్ = ఏ నలునిచే, జితః = జయింప బడినవాఁడై, నిర్విద్య = ఈర్ష్యచే జీవిత నిష్ఫలత్వబుద్ధినిఁబొంది, తే = నీయొక్క, చికురేషు = కురులయందు, స్వం = తనదైన, శరచయం = బాణసమూహమైనపుష్పరాశిని, ఫాలమూలే = నొసటిమూలమునందు, ధనుః = చాపమును, రౌద్రే = రుద్రసంబంధము గల, చక్షుషి = నేత్రమను, అనుభ్రాష్ట్రిం = మంగలమందు, తనుం = శరీరమును, చిక్షిపే = పడవేసెనో, సః = ఆమన్మథుఁడు, వితనుః = శరీరము లేనివాఁడై, అధునా = ఇప్పుడు, తజ్జయాయ = ఆనలుని జయించుటకొఱకు, త్వాం = నీవనెడి, ఆశ్రమం = ఆశ్రమమును, ఆశ్రయత్ = ఆశ్రయించెను. త్వదురోజశైలనిలయా; త్వత్ = నీయొక్క, ఉరోజ = స్తనము లనెడి, శైల = పర్వతములను, నిలయా = ఆశ్రయముగాఁ గల్గిన, పత్త్రాళిః = మకరికాదిపత్త్రసమూహము, (పర్ణసమూహము), తత్పర్ణశాలాయతే; తత్ = అతనికి, పర్ణశాలాయతే = పర్ణశాలవలె నాచరించుచున్నది.

ఇచ్చట నుపమానము లగు శరచాపాదు లుపాత్తము లై యుపమేయము లగు పుష్పభ్రూలతాదు లనుపాత్తము లై నిగీర్ణము లైనందు...

వలన వానితో నభేదాధ్యవసాయము గావించి నందు వలన భేదమునం దభేదాతిశయోక్త్యలంకారము.

"తత్పర్ణశాలాయతే" యనునెడ నుపమాలంకారము. ఆయుపమాలంకారముచే, "త్వామాశ్రమమ్" అను రూపకాలంకార ముత్థాపితము.

"కామః...నిర్విద్యాశ్రయదాశ్రమమ్మ" నునెడ గమ్యోత్ప్రేక్ష. పైనఁజెప్పిన యలంకారములతో దీనికి సంకరము.

సమాసములు :-

పుష్పేషుః :- పుష్పాణి ఇషవః యస్య సః = పుష్పేషుః.
శరచయమ్ ;- శరణాం చయః = శరచయః, తమ్ = శరచయమ్.
ఫాలమూలే ;- ఫాలస్య మూలమ్ = ఫాలమూలమ్, తస్మిన్ = ఫాలమూలే.
అనుభ్రాష్టమ్ :- భ్రాష్ట్రి = అనుభ్రాష్ట్రిమ్.
వితనుః :- విగతా తనుః యస్య సః = వితనుః,
తజ్జయాయ :- తస్య జయః = తజ్జయః, తస్మై = తజ్జయాయ.
పత్రాళిః :- పత్రాణామాళిః = పత్రాళిః.
త్వదురోజశైలనిలయా :- తవ ఉరోజౌ = త్వదురోజౌ, త్వదురోజావేవ శైలౌ = త్వదురోజశైలౌ, త్వదురోజశైలౌ నిలయౌ యస్యాః సా = త్వదురోజశైలనిలయా.
తత్పర్ణశాలాయతే :- తస్య పర్ణశాలా = తత్పర్ణశాలా, తత్పర్ణశాలా ఇవ ఆచరతి = తత్పర్ణశాలాయతే.

భావము :-

మన్మథుఁడు నలునిచే నోడింపఁబడినవాఁడై యసూయచేఁ దనజీవితము వ్యర్థ మని భావించి విరక్తుఁడై తపముఁ గావించుట కాశ్రమమును బ్రవేశించెను. అతఁడు విరక్తుఁడు కాగనే నీకురులయందు తన బాణములైన పుష్పములను నీ నొసటిమూలమందు తన ధనస్సును (కనుబొమలను) రుద్రునకు సంబంధించి మండుచున్న మంగల మనెడి మూఁడవ కంటియందు తనశరీరమును బడద్రోసి తాను శరీరరహితుఁడై యానలుని జయించుటకొఱకై నీవనెడి యాశ్రమమును బ్రవేశించెను. అతనికి నీ స్తనతటములపై వ్రాయబడిన మకరికాది పత్రములు పర్ణశాల యై యుండినది.

శ్లో॥ ఇత్యాలపత్యథ పతత్రిణి తత్ర భైమీం
సఖ్యశ్చిరాత్తదనుసంధిపరాః పరీయుః ।
శర్మాఽస్తు తే విసృజ మామితి సోఽప్యుదీర్య
వేగాజ్జగామ నిషధాధిపరాజధానీమ్॥ ౧౨౫

ప. వి. ఇతి । ఆలపతి । అథ । పతత్రిణి । తత్ర । భైమీమ్ । సఖ్యః । చిరాత్ । తదనుసంధిపరాః । పరీయుః । శర్మ । అస్తు । తే । విసృజ । మామ్ । ఇతి । సః । అపి । ఉదీర్య । వేగాత్ । జగామ । నిషధాధిపరాజధానీమ్

టీక॥ తత్ర = ఆ, పతత్రిణి = హంస, భైమీం = దమయంతిని గూర్చి, ఇతి = ఇట్లు, ఆలపతి = పలుకుచుండగా, అథ = తర్వాత, చిరాత్ = చాలకాలమునుండి, తదనుసంధిపరాః; తత్ = ఆదమయంతిని, అను సంధి = వెదకుటయందు, పరాః = ఆసక్తిగల్గిన, సఖ్యః = చెలికత్తెలు, పరీయుః = ఆమెను జుట్టిరి, సోఽపి = ఆ హంసయు, తే = నీకు, శర్మ = సుఖము, అస్తు = కలుగును గాత, మాం = నన్ను, విసృజ = విడువుము, ఇతి = అని, ఉదీర్య = చెప్పి, వేగాత్ = వేగముగా, నిషధాధిపరాజధానీమ్, నిషధాధిప = నిషధదేశపురాజైన నలునియొక్క, రాజధానీమ్ = ప్రధాననగరమును గూర్చి, జగామ = వెళ్లెను.

సమాసములు:

భైమీమ్ :- భీమస్య అపత్యం స్త్రీ = భైమీ, తామ్ = భైమీమ్.

తదనుసంధిపరాః :- తస్యాః అనుసంధిః = తదనుసంధిః, తదనుసంధౌ పరాః = తదనుసంధిపరాః.

నిషధాధిపరాజధానీమ్ :- నిషధానామధిపః = నిషధాధిపః, రాజానః ధీయంతే అస్యామితి = రాజధానీ, నిషధాధిపస్య రాజధానీ = నిషధాధిప రాజధానీ, తామ్ = నిషధాధిపరాజధానీమ్.

భావము:

ఈవిధముగా దమయంతితో హంస పలుకుచుండగా చాలకాలమునుండి దమయంతిని వెదకుచున్న చెలికత్తెలు చుట్టుకొనిరి, అప్పుడు హంస దమయంతిని గూర్చి నీకు శుభమగు గాత, నన్ను విడిచిపెట్టుమని పలికి వేగముగా నలుని రాజధానిని గూర్చి పయనము గావించెను.

శ్లో॥ చేతోజన్మశరప్రసూనమధుభిర్వ్యామిశ్రతామాశ్రయత్
ప్రేయోదూతపతంగపుంగవగవీహైయంగవీనం రసాత్।
స్వాదం స్వాదమసీమ మృష్టసురభి ప్రాప్తాఽపి తృప్తిం న సా
తాపం ప్రాప నితాంతమంతరతులామానర్ఛ మూర్ఛామపి॥ ౧౩౦

ప వి. చేతోజన్మశరప్రసూనమధుభిః । వ్యామిశ్రతామ్ । ఆశ్రయత్ । ప్రేయోదూతపతంగపుంగవగవీహైయంగవీనం । రసాత్ । స్వాదంస్వాదమ్ । అసీమ । మృష్టసురభి । ప్రాప్తా । అపి । తృప్తిం । న । సా । తాపం । ప్రాప । నితాంతమ్ । అంతః । అతులామ్ । ఆనర్ఛ । మూర్ఛామ్ । అపి ।

టీ॥ సా = ఆదమయంతి, చేతోజన్మశరప్రసూనమధుభిః; చేతోజన్మ = మన్మథునియొక్క, శర = బాణము లైన, ప్రసూన = పుష్పముల యొక్క, మధుభిః — రసములచేతను, తేనెలచేతను, అతులాం = సాటి లేని, వ్యామిశ్రతామ్ = మేళనమును, ఆశ్రయత్ = పొందిన (తేనెతోఁ గలసిన) అసీమ = అపరిమిత మైన, మృష్టసురభి; మృష్ట = పరిశుద్ధ మైన, (కపటములేని) సురభి = శ్రావ్య మైనదియు (పరిమళయుక్త మును) న గు, ప్రేయోదూతపతంగపుంగవగవీహైయంగవీనమ్: ప్రేయః = ప్రియు డైన నలునియొక్క, దూత = సందేశహరుఁ డగు, పతంగపుంగవ = పక్షిశ్రేష్ఠముయొక్క, గవీ = మాట యను, హైయం గవీనమ్ = ముందుదినమునాటి యావుపాలవలన నుత్పన్న మగు నేతిని, రసాత్ = రాగమువలన, స్వాదంస్వాదమ్ = మాటిమాటికి రుచి జూచి, అంతఃతృప్తిం = లోన తనివిని, ప్రాప్తాఽపి = పొందియు. నితాంతం = మిక్కిలి, తాపమ్ = సంతాపమును. న ప్రాప = పొందలేదు, మూర్ఛామపి = మూర్ఛను గూడ, నానర్ఛ = పొందలేదు.

"గవీహైయంగవీన" మ్మనునెడ హంసవచనములను నవ్య గోఘృతముతో నభిన్నముగ రూపించుటవలన రూపకము.

మధు మిశ్రమమైన ఘృతము విష మని శాస్త్రమున్నను నట్టి విషపానము గావించియు తాపమును మూర్ఛను బొందలేదని చెప్పుట వలన విరోధాలంకారము. ఈ విరోధాలంకారము పూర్వోక్తమగు రూప కముచే నుత్థాపితము ఈ రెంటికిని సంకరము.

సమాసములు:-

చేతోజన్మశరప్రసూనమధుభిః :- చేతసి జన్మ యస్య సః = చేతోజన్మా, చేతోజన్మనః శరాః = చేతోజన్మశరాః, చేతోజన్మశరా ఏవ ప్రసూనాని = చేతోజన్మశరప్రసూనాని, చేతోజన్మశరప్రసూనానాం మధూని = చేతోజన్మశరప్రసూనమధూని, తైః = చేతోజన్మశరప్రసూనమధుభిః.

ప్రేయోదూతపతంగపుంగవగవీహైయంగవీనమ్ :- ప్రేయసః దూతః = ప్రేయోదూతః, పుమాన్ గౌః = పుంగవః, పతంగేషు పుంగవః = పతంగపుంగవః, ప్రేయోదూతశ్చాసౌ పతంగపుంగవశ్చ = ప్రేయోదూతపతంగపుంగవః, ప్రేయోదూతపతంగపుంగవస్య గౌః = ప్రేయోదూతపతంగపుంగవగవీ, హ్యః గోదోహోద్భవం ఘృతమ్ = హైయగవీనమ్, ప్రేయోదూతపతంగపుంగవగవ్యేవ హైయంగవీనమ్ = ప్రేయోదూతపతంగపుంగవగవీహైయంగవీనమ్, తత్ = ప్రేయోదూతపతంగపుంగవగవీహైయంగవీనమ్.

అసీమ :- అవిద్యమానా సీమా యస్య తత్ = అసీమ, తత్ = అసీమ.

మృష్టసురభి :- మృష్టం చ తత్ సురభి చ = మృష్టసురభి, తత్ = మృష్టసురభి.

అతులామ్ :- అవిద్యమానా తులా యస్యాస్సా = అతులా, తామ్ = అతులామ్.

భావము :

ఆ దమయంతి మన్మథునిబాణము లగు పుష్పములనుండి స్రవించు మకరంద మను తేనెతో మిశ్రిత మైనట్టి ప్రియుఁ డగు నలుఁడు పంపిన హంసవచన మను నేతినిఁ బానముచేసి లోన మిక్కిలి తృప్తిని బొందినది. కాని మధుమిశ్రఘృతము విషమైనను, నా విషమును బానము చేయుటవలన నెట్టి తాపమును మూర్ఛను బొందలేదు. తేనె నేతితో కలసినచో విష మగును. అట్టి విషమును బానముఁజేసియు దమయంతి తాపమూర్ఛలఁ బొందకుండుట యాశ్చర్యకరము.

శ్లో॥ తస్యా దృశో వియతి బంధుమనుప్రజంత్యా
స్తద్బాష్పవారి నచిరాదవధిర్బభూవ।
పార్శ్వేఽపి విప్రచకృషే తదనేన దృష్టే
రారాదపి వ్యవదధే న తు చిత్తవృత్తేః॥ ౧౩౧

ప. వి. తస్యాః । దృశః । వియతి । బంధుమ్ । అనువ్రజంత్యాః । తద్బాష్ప వారి । నచిరాత్ । అవధిః । బభూవ । పార్శ్వే । అపి । విప్రచకృషే । తత్ । అనేన । దృష్టేః । ఆరాత్ । అపి । వ్యవదధే । న । తు । చిత్త వృత్తేః ।

టీక॥ వియతి = ఆకాశమందు, బంధుం = బంధువును, అనువ్రజంత్యాః = వెంబడించుచున్న, తస్యాః = ఆ దమయంతియొక్క, దృశః = దృష్టికి, తద్బాష్పవారి; తత్ = ఆ దమయంతియొక్క. బాష్పవారి = కన్నీరు (బంధువియోగజన్య మైనది), నచిరాత్ = కొంతకాలము, అవధిః = ఎల్లగా, బభూవ = అయెను. తత్ = అట్లు కన్నీరు వచ్చుట వలన, అనేన = ఈ హంసచే, పార్శ్వేఽపి = ప్రక్కయందును (సమీపమందును, విప్రచకృషే = దూరమున నుండినట్లాయెను. చిత్తవృత్తేస్తు = మనోవృత్తికి, ఆరాదపి = దూరస్థితియందును, న వ్యవదధే = దూరస్థితి లేకయుండెను.

ఇచ్చట సమీపస్థ మైన హంస కన్నీటివలన దూరస్థముగను దూరస్థ మైనను చిత్తవృత్తికి సమీపస్థముగను చెప్పుటవలన విరోధాభాసాలంకారము.

సమాసములు :

తద్బాష్పవారి :- తస్యాః బాష్పవారి = తద్బాష్పవారి.
చిత్తవృత్తేః :- చిత్తస్య వృత్తిః = చిత్తవృత్తిః, తస్యాః = చిత్త వృత్తేః.

భావము :

ఆ హంస మింటి కెగయగనే దమయంతిదృష్టి బంధువును సాగనంపునపుడాప్తులు వెంటఁబోవువిధముగ నా హంసను వెంజడించి పోసాగినది. కాని బంధుజనవియోగముచే నేర్పడిన కన్నీరు వెంటవెళ్ళి వదలిపెట్టుస్థలమున కెల్లగా నుండినది. "ఓదకాంతాత్ ప్రియం పాంథమనువ్రజేత్త"ను శాస్త్రము ననుసరించి బంధుజనము ప్రయాణము జేయు నప్పుడు జలము కనబడునంత వరకు వెంటవెళ్ళుట సంప్రదాయము. ఆ హంసను వెంబడించి పోవు దృష్టికి కన్నీరే యవధి యైనది. కన్నీరు క్రమ్మగనే దృష్టి ముందు పోజాలదు. కావున

హంస సమీపమునం దున్నను కన్నీటివలన దూరస్థముగఁ గనఁబడుచుండినది. అయ్యది దూరస్థమైన పిదప మనోవృత్తికి మాత్రము సన్నిహితముగనే యుండెను. అనగా నాప్తమైన హంస తన్ను విడువగనే దమయంతికి దుఃఖము కలిగిన దని యాశయము.

శ్లో॥ అస్తిత్వం కార్యసిద్ధేః స్ఫుటమథ కథయన్ పక్షయోః కంపభేదై
రాఖ్యాతా వృత్తమేతన్నిషధనరపతౌ సర్వమేకః ప్రతస్థే।
కాంతారే నిర్గతాఽసి ప్రియసఖి పదవీ విస్మృతా కిన్ను ముగ్ధే
మారోదీరేహి యామేత్యుపహృతవచసో నిన్యురన్యాం వయస్యాః॥

ప. వి. అస్తిత్వం । కార్యసిద్ధేః । స్ఫుటమ్ । అథ । కథయన్ । పక్షయోః । కంప భేదైః । ఆఖ్యాతా । వృత్తమ్ । ఏతత్ । నిషధనరపతౌ । సర్వమ్ । ఏకః । ప్రతస్థే । కాంతారే । నిర్గతా । అసి । ప్రియసఖి । పదవీ । విస్మృతా । కిం । ను । ముగ్ధే । మా । రోదీః । ఏహి । యామ । ఇతి । ఉపహృత వచసః । నిన్యుః । అన్యాం । వయస్యాః ।

టీక॥ ఏకః = (హంస-దమయంతులలో) నొక్కటైన హంస, పక్షయోః = ఱెక్కలయొక్క, కంపభేదైః = కదలికలలోని విశేషములచే, కార్య సిద్ధేః = కార్యసాఫల్యమునకు, అస్తిత్వం = స్థితిని, స్ఫుటం = స్పష్ట ముగా, కథయన్ = సూచించుచు, వృత్తం = జరిగిన, ఏతత్ = ఈ విషయమును, సర్వం = సమస్తమును, నిషధనరపతౌ = నలమహారాజు విషయమున, ఆఖ్యాతా = చెప్పఁగలదై, ప్రతస్థే = బయలుదేరినది; అన్యాం = వారిద్దరిలో మఱియొకతె యైన దమయంతిని, వయస్యాః = చెలికత్తెలు, హేప్రియసఖి = ఓ ప్రియమైన చెలీ, ముగ్ధే = ముగుదా! (అమాయకురాలా!), కాంతారే = అడవియందు, నిర్గతా = వెడలినదాన వుగ, అసి = అగుచున్నావు, పదవీ = త్రోవ, విస్మృతా కిన్ను = మఱువఁబడినదా యేమి? మా రోదీః = ఏడవకుము, ఏహి = రమ్ము, యామ = వెళ్ళుదము, ఇతి = అని, ఉపహృతవచసః; ఉపహృత = ఒసంగఁబడిన, వచసః = మాటలు గలవారై, నిన్యుః = కొనిపోయిరి.

సమాసములు :

అస్తిత్వమ్ :- అస్తే ర్భావః = అస్తిత్వం, తత్ = అస్తిత్వమ్.
కార్యసిద్ధేః :- కార్యస్య సిద్ధిః = కార్యసిద్ధిః, తస్యాః = కార్యసిద్ధేః.
ప్రియసఖి :- ప్రియా చ సా సఖీ చ = ప్రియసఖీ, తస్యాః సంబుద్ధిః = హే ప్రియసఖి
ఉపహృతవచసః :- ఉపహృతాని వచాంసి యాభిస్తాః = ఉపహృత వచసః.

వయస్యాః ;- వయసా తుల్యాః = వయస్యాః.

భావము :

ఈ విధముగ హంసదమయంతులు నొండొరుల వీడ్కొనిరి. వారిలో హంస తనఱెక్కల కదలికలతోడనే కార్యము సఫల మగు నని సూచించుచు దమయంతితో జరిగిన విషయము నంతయు నలమహారాజున కెరింగించుట కై బయలుదేరెను. పిదప దమయంతిని చెలులు సమీపించి "ఓ ప్రియసఖీ! అడవి నేల చొచ్చితివి. త్రోవను మఱచితివా! ఏడవకుము, రమ్ము-ఇంటికి వెళ్లుదమని యోదార్చుచు తమవెంట పిలుచుకొని వచ్చిరి.

శ్లో॥ సరసి నృపమపశ్యద్యత్ర తత్తీరభాజః
స్మరతరళమశోకానోకహస్యోపమూలమ్ ।
కిసలయదళతల్పమ్లాపినం ప్రాప తం స
జ్వలదసమశరేషుస్పర్ధి పుష్పర్ధిమాశేః॥ ౧౩౩

ప. వి. సరసి । నృపమ్ । అపశ్యత్ । యత్ర । తత్తీరభాజః । స్మరతరళమ్ । అశోకానోకహస్య । ఉపమూలమ్ । కిసలయదళతల్పమ్లాపినం । ప్రాప । తం । సః । జ్వలదసమశరేషుస్పర్ధిపుష్పర్ధిమాశేః ।

టీక॥ సః = ఆ హంస, యత్ర = ఏ కొలనియందు, నృపమ్ = రాజును, అపశ్యత్ = చూచెనో, తత్తీరభాజః; తత్ = ఆ కొలనుయొక్క, తీర = గట్టును, భాజః = పొందిన, జ్వలదసమశరేషుస్పర్ధిపుష్పర్ధిమాశేః; జ్వలత్ = మండుచున్న, అసమశర = మన్మథునియొక్క, ఇషు = బాణ

ములతో, స్పర్ధి = సమానము లగు, పుష్ప = పుష్పముల యొక్క, ఋద్ధి = వృద్ధియే, మౌళేః = శిఖరముగా౯ గల్గిన, అశోకానోకహస్య = అశోక వృక్షముయొక్క, ఉపమూలమ్ = మొదలునకు సమీపమున, స్మరతర ళమ్; స్మర = మన్మథునిచే, తరళం = చంచలమైన, కిసలయదళతల్ప మ్లాపినమ్; కిసలయదళ = చిగురుటాకులయొక్క, తల్ప = పడకను, మ్లాపినం = కదులునట్లు చేయుచున్న, తమ్ = ఆ, నృపం = నలమహా రాజును, ప్రాప = పొందినది.

సమాసములు:—

తత్తీరభాజః :— తస్య తీరమ్ = తత్తీరమ్, తత్తీరం భజతీతి = తత్తీర భాక్, తస్య = తత్తీరభాజః.

స్మరతరళమ్:— స్మరేణ తరళః = స్మరతరళః. తమ్ = స్మరతరళమ్.

అశోకానోకహస్య:— అశోక ఇతి అనోకహః = అశోకానోకహః తస్య = అశోకానోకహస్య.

ఉపమూలమ్:— మూలస్య సమీపే = ఉపమూలమ్.

కిసలయదళతల్పమ్లాపినమ్:— కిసలయాని చ తాని దళాని చ = కిసలయ దళాని, కిసలయదళాన్యేవ తల్పమ్ = కిసలయదళతల్పమ్, కిసలయదళ తల్పం మ్లాపయతీతి కిసలయదళతల్పమ్లాపీ, తమ్ = కిసలయదళ తల్పమ్లాపినమ్.

జ్వలదసమశరేషుస్పర్ధిపుష్పర్ధిమౌళేః:— అసమాః శరాః యస్య సః = అసమశరః, అసమశరస్య ఇషవః = అసమశరేషవః, జ్వలంతశ్చ తే అసమశరేషవశ్చ = జ్వలదసమశరేషవః, జ్వలదసమశరేషుభిః స్పర్ధినీ = జ్వలదసమశరేషుస్పర్ధినీ, పుష్పాణాం ఋద్ధిః = పుష్పర్ధిః, జ్వలదస మశరేషుస్పర్ధినీ చ సా పుష్పర్ధిశ్చ = జ్వలదసమశరేషుస్పర్ధిపుష్పర్ధిః, జ్వలదసమశరేషుస్పర్ధిపుష్పర్ధిః మౌళిః యస్య సః = జ్వలదసమశరేషు స్పర్ధిపుష్పర్ధిమౌళిః, తస్య = జ్వలదసమశరేషుస్పర్ధిపుష్పర్ధిమౌళేః.

భావము:

ఆ హంస యాకసమున౯ బయనము గావించి తొలుత తాను నలమహా రాజును గాంచిన కొలనిగట్టున మొలచిన దై మన్మథునియొక్క జ్వలించు

బాణములతో సమాన మగు పుష్పసంపత్తి గల్గిన యశోకవృక్షముక్రింద చిగురు పాన్పుపైఁ బరుండి దానిని దనవిరహతాపముచే, వాడునట్లు చేయుచు కామ చాంచల్యము నొందిన నలమహారాజును గాంచెను.

శ్లో॥ పరవతి దమయంతి త్వాం న కించిద్వదామి
ద్రుతముపనమ కిం మామాహ సా శంస హంస।
ఇతి వదతి నలేఽసౌ తచ్ఛశంసోపనమ్రః
ప్రియమను సుకృతాం చ స్వస్పృహాయా విలంబః॥ ౧౩౪

ప. వి. పరవతి । దమయంతి । త్వాం । న । కిం । చిత్ । వదామి । ద్రుతమ్ । ఉపనమ । కిం । మామ్ । ఆహ । సా । శంస । హంస । ఇతి । వదతి । నలే । అసౌ । తత్ । శశంస । ఉపనమ్రః । ప్రియమ్ । అను । సుకృతాం । చ । స్వస్పృహాయాః । విలంబః ।

టీక॥ పరవతి = పరాధీన మగు, దమయంతి = ఓ దమయంతీ! త్వాం = నిన్ను గూర్చి, కించిత్ కొంచెము గూడ, న వదామి = చెప్పను, (కించ = మఱియు) హేహంస = ఓ హంసా, ద్రుతం = శీఘ్రముగ, ఉపనమ = రమ్ము, సా = ఆ దమయంతి, మాం = నన్ను గూర్చి, కిమ్ = దేనిని, ఆహ = పలుకుచున్నది, శంస = చెప్పుము, ఇతి = ఇట్లు నలే = నలమహారాజు, వదతి = చెప్పుచుండగా, అసౌ = ఈ హంస, ఉపనమ్రః = సమీపమును బొంది, తత్ = దాని నంతయు, శశంస = చెప్పెను, సుకృతామ్ = పుణ్యవంతులకు, ప్రియమను = ఇష్టమైన వస్తువును గురించి, స్వస్పృహాయాః = తమకోరికకే, విలంబః = ఆలస్యము.

"హంస నలునకు కార్యసిద్ధినిఁ జెప్పె ననుట" విశేషార్థము "సాధువులు కోరుటలోనే యాలస్యము గాని, కోరినచో కార్యసిద్ధికిఁ దడవు జరుగ"దను సామాన్యార్థముచే సమర్థింపఁబడుటవలన నర్థాంతర న్యాసాలంకారము.

సమాసములు:

పరవతి:_ పరః అస్యాః అస్తీతి = పరవతీ, తస్యాస్సంబుద్ధిః = హేపరవతి!

భావము:_

"ఓ పరతంత్ర మయిన దమయంతీ! నిన్ను నేను నిందించను. ఓ హంసా! శీఘ్రముగ దిగిరమ్ము. ఆ దమయంతి నన్ను గూర్చి నీతో నేమి చెప్పినది. దానిని జెప్పుము." అని నలుఁడు హంసను జూడకయే భ్రాంతితో హంసను సంబోధించి పలుకుచుండగా నట్టితరుణమున వాస్తవముగనే యీహంస యతని ముంగిట దిగి దమయంతీవృత్తాంతము నంతయును జెప్పెను. సాధువు లేవిషయమును గూడ సాధారణముగాఁ గోరరు. వారు దేని నైనను గోరుట లోనే యాలస్యము. కాని వారు గోరినచో కార్యసిద్ధిలో నాలస్య మేర్పడదు.

శ్లో॥ కథితమపి నరేంద్రశ్శంసయామాస హంసం
కిమితి కిమితి పృచ్ఛన్ భాషితం స ప్రియాయాః।
అధిగతమతివేలానందమార్ద్వీకమత్తః
స్వయమపి శతకృత్వస్తత్తథాన్వాచచక్షే॥ ౧౩౫

ప. వి. కథితమ్ । అపి । నరేంద్రః । శంసయామాస । హంసం । కిమ్ । ఇతి కిమ్ । ఇతి । పృచ్ఛన్ । భాషితం । సః । ప్రియాయాః । అధిగతమ్ అతివేలానందమార్ద్వీకమత్తః । స్వయమ్ । అపి । శతకృత్వః । తత్ । తత్ । తథా । అన్వాచచక్షే ।

టీక॥ సః = ఆ, నరేంద్రః = నలమహారాజు, కథితమపి = తనకు హంసచే చెప్పఁబడినను, ప్రియాయాః = ప్రియురా లగు దమయంతియొక్క. భాషితం = మాటను, కిమితి, కిమితి = ఏమి యేమి యని, పృచ్ఛన్ = అడుగుచు, హంసం = హంసను, శంసయామాస = మరల మరల చెప్పించుచుండెను, (కించ = మఱియు), అతివేలానందమార్ద్వీకమత్తః; అతివేల = పారము లేని, ఆనంద = సంతోష మను, మార్ద్వీక = ద్రాక్షామద్యముచే, మత్తః = మదించినవాఁడై, అధిగతం = చక్కగా

గ్రహింపఁబడిన, తత్ = ఆ హంస చెప్పిన విషయమును, స్వయమ పి = తానును, శతకృత్వః = పెక్కుమాఱులు, తథా = ఆ హంస చెప్పిన విధముగనే, అన్వాచచక్షే = అనువదించుచుండెను.

సమాసములు ;

నరేంద్రః :- నరాణామింద్రః = నరేంద్రః.

అతివేలానందమార్ద్వీకమత్తః :- వేలామతిక్రాంతః = అతివేలః, అతివేలశ్చాసౌ ఆనందశ్చ = అతివేలానందః, మృద్వీకాయాః వికారః = మార్ద్వీకమ్, అతివేలానంద ఏవ మార్ద్వీకమ్ = అతివేలానందమార్ద్వీకమ్, అతివేలానందమార్ద్వీకేన మత్తః = అతివేలానందమార్ద్వీకమత్తః.

భావము :

ఆ నలమహారాజు హంస తనకుఁ జెప్పిన ప్రియురాలివిషయమునే మాటి మాటికి నడుగుచు నా హంసచే మఱల మఱల చెప్పించుచుండెను. మఱియు నపార మగు నానంద మను ద్రాక్షపండ్లమద్యముచే మదముఁ జెందినవాడై హంస చెప్పుటవలన తాను చక్కగా గ్రహించిన దమయంతీవృత్తాంతమును దాను గూడ బెక్కుమాఱులు హంస చెప్పిన విధముగనే పలుకుచుండెను.

శ్లో॥ శ్రీహర్షం కవిరాజరాజిమకుటాలంకారహీరస్సుతం
శ్రీహీరస్సుషువే జితేంద్రియచయం మామల్లదేవీ చ యమ్
తార్తీయీకతయా మితోఽయమగమత్తస్య ప్రబంధే మహా
కావ్యే చారుణి నైషధీయచరితే సర్గో నిసర్గోజ్జ్వలః॥ ౧౩౬

ప. వి. శ్రీహర్షం। కవిరాజరాజిమకుటాలంకారహీరః। సుతం। శ్రీహీరః। సుషువే। జితేంద్రియచయం। మామల్లదేవీ। చ। యమ్। తార్తీయీకతయా। మితః। అయమ్। అగమత్। తస్య। ప్రబంధే। మహాకావ్యే। చారుణి। నైషధీయచరితే। సర్గః। నిసర్గోజ్జ్వలః।

టీక॥ కవిరాజరాజిమకుటాలంకారహీరః; కవిరాజ = కవిశ్రేష్ఠుల, రాజి = పరంపరయొక్క, మకుట = మకుటములకు, అలంకార = భూషణమైన,

హీరః = వజ్రమణి యగు, శ్రీహీరః = శ్రీహీరుఁడను విద్వాంసుఁడు, జితేంద్రియచయం; జిత = జయింపఁబడిన, ఇంద్రియ = చక్షురాదీంద్రియములయొక్క, చయం = సమూహము గల్గిన, శ్రీహర్షమ్ = శ్రీహర్షుఁ డను నామము గల్గిన, యం = ఏ, సుతం = కుమారుని, సుషువే = పుట్టించెనో, మామల్ల దేవీ చ = మామల్ల దేవి యనుతల్లియు, యం = ఏ, సుతం = కుమారుని, సుషువే = కనెనో, తస్య = అతవియొక్క, ప్రబంధే = ప్రకృష్టబంధము గల్గిన, చారుణి = చమత్కృతి సముల్లసిత మైన, నైషధీయచరితే; నైషధీయ = నలునకు సంబంధించిన, చరితే = చరిత్రయైన, అనగా నైషధీయమను నామము గల, మహాకావ్యే = మహాకావ్యమందు, తార్తీయీకతయా = మూడవదిగ, మితః = లెక్కింపఁబడిన, నిసర్గోజ్జ్వలః; నిసర్గ = స్వభావముచే, ఉజ్జ్వలః = ప్రకాశమాన మగు, సర్గః = సర్గ, అగమత్ = సమాప్తిని బొందినది.

సమాసములు :

కవిరాజరాజిమకుటాలంకారహీరః :- కవీనాం రాజానః = కవిరాజాః, కవిరాజానాం రాజిః = కవిరాజరాజిః, కవిరాజరాజేః మకుటాని = కవిరాజరాజిమకుటాని, కవిరాజరాజిమకుటానామలంకారః = కవిరాజరాజిమకుటాలంకారః. కవిరాజరాజిమకుటాలంకారశ్చాసౌ హీరశ్చ = కవిరాజరాజిమకుటాలంకారహీరః.

జితేంద్రియచయమ్ - ఇంద్రియాణాం చయః = ఇంద్రియచయః, జితః ఇంద్రియచయః యేన సః = జితేంద్రియచయః, తమ్ = జితేంద్రియచయమ్.

తార్తీయీకతయా :- తృతీయ ఏవ తార్తీయీకః, తార్తీయీకస్య భావః = తార్తీయీకతా, తయా = తార్తీయీకతయా.

నైషధీయచరితే ;- నిషధానాం రాజా = నైషధః, నైషధస్య ఇదమ్ = నైషధీయమ్. నైషధీయం చ తత్ చరితం చ = నైషధీయచరితమ్, తస్మిన్ = నైషధీయచరితే

నిసర్గోజ్జ్వలః :- నిసర్గేణ ఉజ్జ్వలః = నిసర్గోజ్జ్వలః.

భావము :

కవిరాజుల శ్రేణికి మౌళిభూషణ మగు వజ్రమణి యైన శ్రీహీరుఁ డను విద్వాంసుడును, మామల్లదేవియు నింద్రియనిగ్రహము గావించిన శీలవంతు లైన శ్రీహర్షు డను పుత్రుని కనిరి. అతని ప్రబంధ మగు మహాకావ్య మైన నైషధీయ చరితమునందు మూడవదిగ లెక్కింపఁబడిన స్వభావసుందర మగు నీ సర్గ సమాప్తి నొందినది.

ఇట్లు

శ్రీ మదాపస్తంబసూత్రాఽఽత్రేయగోత్ర

శ్రీ మదుడాలి నృసింహశాస్త్రి

తనూజ

శ్రీ విక్రమసింహపురీవేదసంస్కృతకలాశాలాప్రధానోపాధ్యాయ

సుబ్బరామశాస్త్రి విరచిత

నైషధీయచరితాంధ్రవ్యాఖ్యానమున

తృతీయసర్గ సమాప్తము

# శ్రీ హర్ష నైషధము

## (ద్వితీయభాగము - టీకాతాత్పర్య సహితము)

వ్యాఖ్యాత

శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రి, ఎం. ఏ.

ప్రిన్సిపాలు, వైదిక సంస్కృతకళాశాల, నెల్లూరు






ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

కళాభవనము, సైఫాబాదు, హైదరాబాదు-500 004.

# తొ లి ప లు కు

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి చేపట్టిన గ్రంథప్రచురణ కార్యక్రమ ములో సంస్కృత గ్రంథాలుకూడ ఒక భాగము. ఆంధ్ర విద్వాంసులు, కవులు సంస్కృతీకరించిన తెలుగు గ్రంథాలు కొన్ని యిప్పటివరకు అకాడమి పక్షాన ప్రకటితమైనవి. ఇందులో శ్రీ యస్. టి. జి. వరదాచార్యులుగారు సంస్కృతీక రించిన ఏడు తెలుగు శతకాల సంపుటము, శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు పరివర్తించిన కళాపూర్ణోదయము, శ్రీ కుంటిమద్ది శేషశర్మగారు అనువదించిన మనుచరిత్ర యిందులో చేరిఉన్నవి.

అకాడమి పక్షాన సంస్కృతములో కొన్ని స్వతంత్ర రచనలు కూడ ప్రకటించనైనవి. వీనిలో డా. బి. రామరాజుగారి సంపాదకత్వమున శ్రీ కృష్ణ రాయలు వ్రాసిన జాంబవతీ పరిణయము, అభినవకాళిదాసు, వెల్లాల ఉమామహే శ్వరుడు రచించిన శృంగారశేఖరభాణము, శ్రీరామాయణసారతిలకము, సన్ని ధానం సూర్యనారాయణశాస్త్రిగారి ఆంధ్రదేశహాస్యకథలు, ఇప్పటివరకు అచ్చయిన పుస్తకాలు.

అకాడమీ పక్షాన తెలుగుసంస్కృత-నిఘంటువు డా. పుల్లెల శ్రీ రామ చంద్రుడు శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగార్ల సంపాదకత్వమున ప్రకటిత మైనది. ఈ వరుసలోనే శ్రీ హర్షుని నైషధమును టీకాతాత్పర్య సహితముగా ప్రకటింపవలెనని అకాడమి సంస్కృత సలహాసంఘము నిశ్చయించి యీ కార్య క్రమము శ్రీఉడాలి సుబ్బరామశాస్త్రిగారికి అప్పగించినది. మొదటి సంపుటములో మూడు సర్గలు మాత్రమే చేరియున్నవి. ప్రస్తుతము రెండవ సంపుటము ప్రక టితమైనది.

ఈ పనిని చక్కగా నిర్వహించిన శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రిగారికి అకాడమీ పక్షాన కృతజ్ఞతావందనములు.

ఈ గ్రంథముద్రణమును పర్యవేక్షించిన ఉస్మానియా విశ్వవిద్యాలయ రీడరు డా. పుల్లెల శ్రీరామచంద్రుడుగారికి ధన్యవాదాలు.

ఆంధ్రపాఠకలోకానికి యీ గ్రంథము ఆదరపాత్రము కాగలదని విశ్వసించుచున్నాను.

హైదరాబాదు
ఆగస్టు 1976

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# శ్రీ హర్ష నైషధము

## (చతుర్థసర్గ)

శ్లో॥ అథ నలస్య గుణం గుణ మాత్మభూః
సురభి తస్య యశః కుసుమంధనుః।
శ్రుతి పథోపగతం సుమన స్తయా
తమిషుమాశు విధాయ జిగాయతామ్॥ ౧

ప॥వి॥ అథ। నలస్య। గుణమ్। గుణమ్। ఆత్మభూః । సురభి । తస్య । యశః కుసుమమ్ । ధనుః । శ్రుతిపథోపగతం । సుమన స్తయా । తమ్। ఇషుమ్ । ఆశు । విధాయ । జిగాయ। తామ్ ।

టీక॥ అథ = దమయంతి ప్రియుని సందేశము వినినపిదప, ఆత్మభూః = మన్మథుఁడు. నలస్య = నలుని యొక్క, గుణం = శౌర్యధైర్యాదిరూపమైన గుణమును, గుణమ్ = అల్లెత్రాడుఁగ, విధాయ = చేసి, సురభి = పరిమళముగల్గి మనోహరమైన, తస్య = ఆ నలునియొక్క, యశః కుసుమం = కీర్తియనెడి పుష్పమును, ధనుః = విల్లుగ, విధాయ = చేసి, సుమన స్తయా = మంచి మనస్సుగలవాడుగను, పుష్పముగను. శ్రుతిపథోపగతం = శ్రుతిపథ = కర్ణమార్గమును, గతం = పొందినవాడును, శ్రుతిపథ = కర్ణదేశమును, గతం = పొందిన, తం = ఆనలుని, ఇషుం = బాణముగ, విధాయ = చేసి, తాం = ఆ దమయంతిని, జిగాయ = జయించెను.

వి॥ ఈ సర్గయందలి శ్లోకములు ద్రుతవిలంబిత వృత్తమున నున్నవి. ప్రతి పాదమునందును, నగణ-భగణ-భగణ- రగణములు వచ్చినచో ద్రుతవిలంబితము. ఇచ్చట నలుని గుణమును అల్లెత్రాడుగను, అతని యశస్సు అనెడి పుష్పమును ధనస్సుగను, ఆ నలుని బాణముగను చెప్పుటచే రూపకాలంకారము.

**సమాసములు :**

ఆత్మభూః- ఆత్మనః భవతీతి = ఆత్మభూః. యశఃకుసుమమ్ = యశఃఏవకుసుమం యశఃకుసుమమ్. తత్ = యశః కుసుమమ్.

*శ్రుతిపథోపగతమ్*: శ్రుత్యోః పంథాః = శ్రుతిపథః, శ్రుతేః పంథాః = శ్రుతిపథః; శ్రుతిపథంఉపగతః = శ్రుతిపథోపగతః, తమ్ = శ్రుతిపథోపగతమ్,

*సుమనస్తయా* : శోభనం మనః యస్యసః = సుమనాః, సుమనసః భావః = సుమనస్తా, తయా = సుమనస్తయా.

**భావము :**

ఇందు దమయంతీ స్వయంవరమునకు నుపోద్ఘాతముగ దమయంతి కేర్పడిన మన్మథావస్థలను కవి వర్ణించుచున్నాడు. దమయంతీ ప్రియుడగు నలుని సందేశమును వినిన పిదప మన్మథుడు నలుని గుణములనల్లె త్రాడుగను నలుని కీర్తియనెడి పుష్పమును, తన పూవిల్లుగను, (మంచి మనస్సునుఁ గల్గియుండుట చేత సుమనస్సుడుగను) పుష్పముగను దమయంతిచే వినఁబడిన వాడును (కర్ణమువఱకు లాగఁబడిన వాడునునగు) నా నలుని బాణముగనుఁ గావించి దానితో నా దమయంతిని జయించెను. ఇచ్చట నలుని బాణముగ చేసికొనుట వలన నతడు దమయంతీ కర్ణ పథమునుఁ బొందుటచే, కర్ణమువఱకు బాణము వలె లాగఁబడినట్లు వర్ణింపఁబడినాడు. వింట బాణమునుఁ బ్రయోగించునపుడా బాణము కర్ణాంతము లాగఁబడుట ప్రసిద్ధము గదా. ఆ విషయమే యిట "శ్రుతిపథోపగతమ్" అను విశేషణముచే సూచితము. మన్మథుఁడు పూవిల్తుడుగాన నిచ్చట నలుని యశః కుసుమము మన్మథుని ధనస్సుగ రూపింపఁబడినది. అట్లే మన్మథుడు పుష్పబాణుఁడుగాన మంచి మనస్సు గల్గియుండుటచే సుమనస్సు-సుమనస్కుఁడు నైననలుడు శ్లేషమహిమచే నిట పుష్పముగ రూపింపఁబడి యామన్మథునకు బాణముగ రూపింపఁబడినాడు-ఇట్లు పూవిల్తుడగు మన్మథునకు నలుని యశస్సు పూవిల్లుగను, పుష్పబాణుడగు మన్మథునకు సుమనస్సుగ నుండు నలుఁడు పుష్పబాణముగను నుండుట సరిపడినవి. నలుని గుణము లల్లె త్రాడగుటవలన పూవిల్తుని యాయుధములకు నలుఁడు, నలుని గుణములు నలుని కీర్తి సమగ్రోపకరణములైనందువలన నట్టి మన్మథ బాణము దమయంతికి మిక్కిలి మోహహేతువైనవని భావము. ॥౧॥

శ్లో॥ యదతనుజ్వరభాక్తనుతే స్మ సా
ప్రియకథాసరసీరసమజ్జనమ్।
సపది తస్యచిరాంతరతాపినీ
పరిణతి ర్విషమా సమపద్యత॥ ౨

ప॥వి॥ యత్। అతనుజ్వరభాక్। తనుతే। స్మ। సా। ప్రియకథా సరసీ రసమజ్జనమ్। సపది। తస్య। చిరాంత రతాపినీ। పరిణతిః। విషమా। సమపద్యత.

టీక॥ సా = ఆదమయంతి, అతను జ్వరభాక్; అతనుజ్వర = మన్మథ జ్వరమును, అధికమైన జ్వరమును, భాక్ = పొందినదై, ప్రియకథా, సరసీ రస మజ్జనమ్, ప్రియకథా = ప్రియుఁడగు నలుని కథయను, సరసీ = కొలని యందలి, రస = రాగమందును, నీటియందును, మజ్జనమ్ = ఆసక్తిని, మునుగుటను, తనుతేస్మ ఇతియత్ = చేయుచుండెననుట యేది గలదో; తస్య = ఆ మజ్జనమునకు సపది = వెంటనే: చిరాంతర తాపినీ చిర = చిరకాలము, అంతర = ఆంతరంగమును, తాపినీ = తపింపఁజేయునట్టి, విషమా = వైషమ్యమునుఁ బొందిన, పరిణతిః = పరిణామము, సమపద్యత = ఏర్పడినది.

వి॥ "చక్షుః ప్రీతిర్మనః సంగస్సంకల్పో థ ప్రలాపితా।
జాగరః కార్శ్యమరతిర్లజ్జా త్యాగోథ సంజ్వరః
ఉన్మాదో మూర్ఛనం చైవ మరణం చరమం విదుః"

అని పంద్రెండు మన్మథా వస్థలలో తొమ్మిదవ మన్మథావస్థయగు "సంజ్వర" మిట దమయంతికి వర్ణితము.

ఇచ్చట జ్వరతాపము శమించుటకై కొలనినీట మునుగుట జ్వరాతిశమునకు కారణమై యనర్థమునుఁ గల్గించునుఁ గాన ననర్థ ఫలకమగు విషమాలంకార భేదము.

సమాసములు :

*అతను జ్వరభాక్* : అవిద్యమానా, తనుఃయస్యసః అతనుః; అతనోః జ్వరః = అతను జ్వరః, అతను జ్వరం భజతీతి = అతను జ్వరభాక్

అతనుశ్చాసౌ జ్వరశ్చ = అతను జ్వరః. అతను జ్వరం భజతీతి = అతను-జ్వరభాక్.

ప్రియకథా సరసీరసమజ్జనమ్ : ప్రియస్య కథా = ప్రియకథా, ప్రియ కథైవ సరసీ = ప్రియకథా సరసీ. ప్రియకథా సరస్యాం రసః = ప్రియకథా సరసీరసః. ప్రియకథా సరసీరసే మజ్జనమ్ = ప్రియకథా సరసీరస మజ్జనమ్, తత్ = ప్రియకథా సరసీరస మజ్జనమ్.

చిరాంతరతాపినీ : అంతరం తాపయతీతి = అంతరతాపినీ; చిరమ్, అంతర తాపినీ = చిరాంతరతాపినీ.

**భావము :**

ఆ దమయంతి నల సందేశమును వినినది మొదలు మన్మథ జ్వరము చేతను-మిక్కుటమగు జ్వరముచేతను బాధనొందుచు, ఆ జ్వరతాపమును ఓకార్చుకొనుటకై ప్రియుడగు నలుని కథయనెడి నీటిమడుగున మునుగఁ దొడగినది. అట్లు జ్వరతాపముచే నీట మునుగుట గొప్ప దోషము. అందు వలన నా జ్వరము మిక్కుటముగఁ బ్రకోపించి యనర్థదాయకముగఁబరిణమించినడి. జ్వర బాధ గలవారికి స్నానాదులు నిషిద్ధములు గదా ॥౨॥

శ్లో॥ ధ్రువమధీతవతీయమధీరతాం
దయితదూతపతద్గతివేగతః।
స్థితివిరోధకరీం ద్వ్యణుకోదరీ
తదుదితః స హి యో యదనంతరః॥ ౩

ప॥వి॥ ధ్రువమ్। అధీతవతీ। ఇయమ్।అధీరతామ్। దయితదూతపతద్గతి వేగతః। స్థితివిరోధ కరీం। ద్వ్యణుకోదరీ। తదుదితః। సః। హి। యః। యద నంతరః.

టీక॥ ద్వ్యణుకోదరీ = ద్వ్యణుకమువలె సూక్ష్మమైన నడుముగల, ఇయమ్ = ఈ దమయంతి, స్థితి విరోధకరీం; స్థితి = మర్యాదకు, నిలకడకు, విరోధ కరీం = విరోధముఁజేయునట్టి, అధీరతాం = చాపల్యమును, అనగా నొక చోట నిలకడలేని స్థితిని, దయితదూత పతద్గతి వేగతః; దయిత = ప్రియుడగు నలునియొక్క, దూత = దూతయైన, పతత్ = పక్షియగు

హంసయొక్క, గతి = గమనమందలి, వేగతః = వేగమువలన, అధీతవతీ = నేర్చినది, ధ్రువమ్ = నిశ్చయము, హి = ఏలయనగా, యః = ఏ విషయము, యదనన్తరః = దేనికి సన్నిహితమో, సః = అది, తదుదితః దానివలనఁ గల్గినదగును.

వి॥ "ద్వ్యణుకోదరీ'' యని యుదరము ద్వ్యణుకముతోఁ బోల్చఁబడినది. వైశేషిక దర్శనము ననుసరించి ద్వ్యణుకము రెండు పరమాణువులచే నుత్పన్నమగుచున్నది. గవాక్షమునుండి ప్రసరించిన సూర్యకిరణములలోఁ గానవచ్చు ధూళికణములలో నాఱవభాగము పరమాణువని చెప్పఁబడు చున్నది. అది నిత్యము. దానివలన నుత్పన్నమగు ద్వ్యణుకమ నిత్యము. కాననిత్యమగు దమయంతి నడుము దానితోఁ బోల్చబడినది. దమయంతియెడ వర్ణితమగు చాంచల్యము. "చాపలంత్వన వస్థానం రాగద్వేషాది సంభవమ్'' అను లక్షణము ననుసరించి యిట సంచారి భావము.

దమయంతి యందలి చాంచల్యము హంసవేగ జన్యము కాకపోయినను తజ్జన్యముగనుత్ప్రేక్షించుటవలన నుత్ప్రేక్షాలంకారము. దానికి "ధ్రువమ్'' అని వ్యంజకమునుఁ బ్రయోగించుట వలన నది వాచ్యము.

ఒక దాని వేగమునుండి మఱియొక దానియందు వేగమెట్లుకల్గునని సంశయము రాగా, నది "తదుతితః సహియో యదనంతరః'' యనెడి సామాన్యార్థము చే నేది దేనికి సమీపమునందుండు నోయదిదానిచే నుత్పన్నమగునని సమర్థించుట వలన నర్థాంతర న్యాసాలంకారము. పైనఁ జెప్పిన యుత్ప్రేక్షాలంకారమునకు ను నర్థాంతర న్యాసాలంకారమునకు నిట సంకరము.

## సమాసములు:

అధీరతామ్: ధీరస్యభావః ధీరతా, న ధీరతా అధీరతా, తామ్ = అధీరతామ్.

*దయితదూత పతద్గతివేగతః:* దయితస్యదూతః = దయితదూతః, దయితదూతశ్చాసౌపతంశ్చ = దయితదూతపతన్. దయితదూత పతతః గతిః = దయితదూతపతద్గతిః. దయితదూతపతద్గతేఃవేగః దయితదూతపతద్గతి వేగః, తస్మాత్ = దయితదూత పతద్గతివేగతః.

*స్థితివిరోధకరీమ్:* స్థితేః విరోధః = స్థితివిరోధః, స్థితివిరోధం కరోతీతి = స్థితివిరోధకరీ, తాం = స్థితివిరోధకర్రీమ్ –

*ద్వ్యణుకోదరీ:* ద్వావణూయస్మిన్‌తత్ = ద్వ్యణుకమ్, ద్వ్యణుకమివ ఉదరం యస్యాస్సా = ద్వ్యణుకోదరీ.

*తదుదితః:* తస్మాత్ ఉదితః = తదుదితః

*యదనంతరః:* అవిద్యమానమ్ అంతరం = యస్య సః = అనంతరః, యస్మాదనంతరః = యదనంతరః

**భావము :**

సన్నని నెన్నడుము గల యా దమయంతి స్త్రీ మర్యాదను, నిలకడను తొలగించెడి యస్థిరత్వ మనఁబడుచాపలము నొంది యుండినది. ఈ యస్థిరత్వ మును నామె, ప్రియుని దూంతయగు హంసయొక్క గమన వేగమునుండి నేర్చిన దనుట తథ్యము. ఏలయనగా ఏదిదేనికి దగ్గరనుండునో యది దాని నుండి గుణములనందుచున్నది. కాన దమయంతికి హంస దగ్గరనుండి దౌత్యము జరిపి నందువలన హంస వేగమును దమయంతి నేర్చియుండునని భావము-॥3॥

శ్లో॥ అతితమాం సమపాది జడాశయం
స్మితలవ స్మరణేఽపి తదాననమ్।
అజని పంగురపాంగనిజాంగణ
భ్రమికణేఽపి తదీక్షణఖంజనః॥ 4

ప॥వి॥ అతితమామ్। సమపాది। జడాశయం। స్మితలవస్మరణే। అపి। తదాననమ్। అజని। పంగుః। అపాంగ నిజాంగణభ్రమికణే। అపి। తదీక్షణ ఖంజనః.

టీక॥ తదాననమ్; తత్ = ఆ దమయంతియొక్క, ఆననం = ముఖము, స్మితలవస్మరణేఽపి; స్మితలవ = చిఱునగవులో లేశమైనను, స్మరణేఽపి = స్మరించుటయందును, అతితమామ్ = మిక్కిలి, జడాశయం = మూఢమైన చిత్తముగలదిగ, సమపాది = చేయఁబడినది, తదీక్షణ ఖంజనః;

*తత్* = ఆ దమయంతియొక్క, *ఈక్షణఖంజనః* = నేత్రమనెడి కాటుక పిట్ట, అపాంగ నిజాంగణభ్రమికణేఽపి; అపాం = కటాక్షమనెడి, నిజాంగణ = తనముంగిట, భ్రమికణేఽపి = భ్రమణలేశమందును, అనగా కొలదిపాటి సంచారమందును, పంగుః = శక్తిలేని దిగ, అజని = ఏర్పడినది.

## సమాసములు :

*జడాశయమ్* - జడః-ఆశయః యస్యతత్ = జడాశయమ్.

*స్మితలవస్మరణే :* స్మితస్య లవః = స్మితలవః. స్మితలవస్య స్మరణమ్ = స్మితలవస్మరణమ్. తస్మిన్ = స్మితలవస్మరణే.

*తదాననమ్ :* తస్యాః ఆననమ్ = తదాననమ్.

*అపాంగనిజాంగణ భ్రమికణే :* నిజంచతత్ అంగణంచ = నిజాంగణం, అపాంగ ఏవ నిజాంగణమ్ = అపాంగనిజాంగణమ్. అపాంగ నిజాంగణే భ్రమిః = అపాంగ నిజాంగణభ్రమిః, అపాంగనిజాంగణభ్రమేః కణః అపాంగ నిజాంగణభ్రమికణః, తస్మిన్ = అపాంగ నిజాంగణభ్రమికణే।

*తదీక్షణఖంజనః :* తస్యాః ఈక్షణమ్ తదీక్షణమ్. తదీక్షణమేవ ఖంజనః = తదీక్షణ ఖంజనః.

## భావము :

ఆ దమయంతి మోము, దాని పూర్వపు చిఱునగవులోని లేశమునుఁ గూడ స్మరించుటలో సమర్థముగా లేదు. ఆమె నయనమనెడి కాటుకపిట్ట యామె కటాక్షమనెడి ముంగిట కొలదిగ సంచరించుటకు శక్తముగా లేదు.

శ్లో॥ కిము తదంతరుభౌ భిషజౌ దివః
స్మరనలౌ విశతః స్మ విగాహితుమ్।
తదభికేన చికిత్సితుమాశు తామ్
మఖభుజామధిపేన నియోజితౌ॥ ౫

ప॥వి॥ కిమ్। ఉ। తదంతః। ఉభౌ॥ భిషజౌ। దివః। స్మరనలౌ। విశతః। స్మ।

విగాహితుమ్। తదభికేన। చికిత్సితుమ్। ఆశు। తాం। మఖభుజామ్। అధి
పేన। నియోజితౌ।

టీక॥ తదభికేన, తత్ = ఆ దమయంతికి, అభికేన = కాముకుఁడగు, మఖ
భుజాం = దేవతలకు, అధిపేన = ప్రభువగు దేవేంద్రునిచే. తాం = ఆ
దమయంతిని, ఆశు = శీఘ్రముగా, చికిత్సితుం = చికిత్సచేయుటకు,
జితౌ = నియమింపఁబడిన ఉభౌ = ఇద్దఱగు, దివః = స్వర్గముయొక్క,
భిషజౌ = వైద్యులైన యశ్వినులు, స్మరనలౌ = మన్మథుఁడుగను, నలుఁ
డుగనునై, విగాహితుం = రోగకారణమును నిశ్చయించుటకు, తదం
తః = దమయంతియొక్క యంతరంగమును, విశతః స్మ కిము = ప్రవే
శించిరాయేమి.

వి॥ ఇచ్చట మన్మథుని నలుని, ఆశ్వినులాయేమియని యుత్ప్రేక్షించుటవలన
నుత్ప్రేక్ష. దీనివలన నలుని సౌందర్యము మన్మథాశ్వి దేవతల సౌందర్య
ముతో సమానమయినదను వస్తువుధ్వనించుచున్నది.

ఇచ్చట నలుడు మన్మథునితోడ దమయంతీ హృదయమునుఁ బ్రవేశించి
నట్లు చెప్పుటలో దమయంతికి నలచింత యేర్పడినదని సిద్ధించుచున్నది కాననిఁట
"ధ్యానం చింతేప్సితాఽనాప్తేః శూన్యతాశ్వాసతాపకృత్" యను లక్షణము
ననుసరించి చింతయను సంచారిభావము వర్ణితము.

## సమాసములు :

*తదంతః* : తస్యాః అంతః = తదంతః.
*స్మరనలౌ* : స్మరశ్చ నలశ్చ = స్మరనలౌ.
*తదభికేన* : తస్యాః అభికః = తదభికః, తేన = తదభికేన.
*మఖభుజామ్* : మఖే భుంజత ఇతి = మఖభుజః, తేషాం మఖభుజామ్.

## భావము :

దమయంతిని కామించెడి దేవేంద్రుడు ఆమెకు చికిత్స చేయుటకై పంపఁ
బడిన స్వర్గలోక వైద్యులగు నశ్వినులు, మన్మఁథుడుగను, నలుఁడుగను
నేర్పడి రోగకారణమునుఁ దెలిసికొనుటకై యామెయొక్క యంతరంగమునుఁ
బ్రవేశించి యుండిరా యేమి? ॥8॥

శ్లో॥ కుసుమచాపజతాపసమాకులమ్
కమలకోమలమైక్ష్యత తన్ముఖమ్।
అహరహర్వహదభ్యధికాధికామ్।
రవిరుచిగ్లపితస్య విధోర్విధామ్॥ ౬

పు॥వి॥ కుసుమచాపజతాప సమాకులమ్। కమలకోమలమ్। ఐక్ష్యత। తన్ముఖమ్। అహః।అహః।వహత్। అభ్యధికాధికాం।రవిరుచిగ్లపితస్య। విధోః। విధామ్।

టీక॥ కుసుమచాపజ తాపసమాకులమ్; కుసుమచాపజ = పూవిల్తుని వలనఁ గల్గిన, తాప = సంతాపముచే, సమాకులమ్ = కలత నొందినదై, (అతఏవ = కావుననే) అహరహః = ప్రతిదినము, అభ్యధికాధికామ్ = మిక్కిలి యధికమైన. రవిరుచిగ్లపితస్య = రవిరుచి = సూర్యకిరణములచే, గ్లపితస్య = కాంతి దొలగినదిగఁ జేయబడిన, విధోః = చంద్రుని యొక్క, విధాం = విధమును, వహత్ = వహించుచున్నదిగ, కమల కోమలం = కమలమువలె కోమలమైన, తన్ముఖం = ఆ దమయంతి మోము, ఐక్ష్యత = (చెలిక త్తెలచే) చూడఁబడినది.

వి॥ ఇచ్చట సూర్యకిరణములచే కాంతి తఱిగిన చంద్రుని దశను దమయంతి మోమునందు ఆరోపించుట వలన నిదర్శనాలంకారము.

సమాసములు :

*కుసుమచాపజతాపసమాకులమ్ :* కుసుమం-చాపఃయస్యసః = కుసుమ చాపః, కుసుమచాపాత్-జాయత ఇతి = కుసుమ చాపజః, కుసుమచాపజశ్చాసౌ తాపశ్చ = కుసుమ చాపజతాపః, కుసుమ చాపజతాపేన సమాకులమ్ = కుసుమ చాపజ తాప సమాకులమ్.

*కమలకోమలమ్ :* కమలమివ కోమలమ్ = కమల కోమలమ్ :

*అభ్యధికాధికామ్ :* అత్యంత మభ్యధికా = అభ్యధికాధికా, **తామ్, అభ్యధి కాధికామ్.**

రవిరుచిగ్లపితస్య: రవేఃరుచయః = రవిరు చయః. రవిరుచిభిః గ్లపితః = రవిరుచి గ్లపితః. తస్య = రవి రుచిగ్ల పితస్య.

**భావము:**

ఆ దమయంతియొక్క కమలమువంటి కోమలమైన ముఖము మన్మథుని వలని తాపముచే కలత నొందినదై ప్రతి దినము సూర్యకిరణములచే శోభ గోల్పోయినట్టి చంద్రుని దశను వహించియుండినది. ॥౬॥

శ్లో॥ తరుణతా తపనద్యుతి నిర్మిత
ప్రథిమ తత్కుచకుంభయుగం తథా।
అనలసంగతి తాపముపైతు నో
కుసుమచాపకులాల విలాసజమ్॥ ౭

ప॥వి॥ తరుణతా తపనద్యుతి నిర్మిత ప్రథిమ। తత్కుచ కుంభయుగం। తథా। అనలసంగతి తాపమ్। ఉపైతు। నో। కుసుమచాపకులాల విలాసజమ్।

టీక॥ తత్కుచ కుంభయుగమ్; తత్ = ఆ దమయంతియొక్క, కుచకుంభ యుగమ్ = స్తనములనెడి కుండల జంట, తరుణ తాతపన ద్యుతి నిర్మిత ప్రథిమ. తరుణతా = యౌవనమను, తపనద్యుతి = సూర్యునికాంతియగు నెండచే, నిర్మిత = నిర్మింపబడిన, ప్రథిమ = కాఠిన్యము గలదై, కుసుమ చాపకులాల విలాసజమ్-కుసుమ చాప = మన్మథుడనెడి, కులాల = కుమ్మరియొక్క, విలాసజం = వ్యాపారమువలనఁగల్గిన, అనలసంగతి తాపమ్, అనలసంగతి = నలసాంగత్యము లేకపోవుటయను (అనల సంగతి = అగ్ని సంయోగముచే) తాపమ్ = వేడిని (కాల్పును) ఉపైతు నో = పొందక యుండునా!

వి॥ "అనల సంగతి తాపమ్"। అనునెడ అనల సంగతి శబ్దముచే నలసం సంగత్యభావము అనల సంగతిగ (అగ్ని సంయోగముగా) చెప్పఁ బడుటవలన శ్లిష్టరూపకము.

తారుణ్యమును-తపనద్యుతిగను, కుచములను కుంభయుగముగను, కుసుమచాపుని కులాలునిగను రూపించువలన రూపకాలంకారము।

సమాసములు :

*తరుణతాతపనద్యుతినిర్మితమ్రదఢిమ:* తరుణస్యభావః = తరుణతా, తపనస్యద్యుతిః = తపనద్యుతిః, తరుణతైవ తపనద్యుతిః = తరుణతాతపనద్యుతిః, తరుణతాతపనద్యుత్యానిర్మితః తరుణతాతపనద్యుతి నిర్మితః, తరుణతాతపనద్యుతినిర్మితః మ్రదఢిమాయస్యతత్, తరుణతాతపన ద్యుతి నిర్మితమ్రదఢిమ.

*తత్కుచకుంభయుగమ్:* కుచౌకుంభావివ = కుచకుంభౌ; తస్యాఃకుచకుంభౌ = తత్కుచకుంభౌ, తత్కుచకుంభయోః యుగమ్ = తత్కుచకుంభయుగమ్.

*అనలసంగతితాపమ్:* నలస్యసంగతిః = నలసంగతి; నలసంగతేరభావః = అనలసంగతిః, అనలసంగత్యాతాపః = అనలసంగతితాపః, తమ్ = అనలసంగతితాపమ్.

*కుసుమచాప కులాల విలాసజమ్:* కుసుమం-చాపః యస్యసః = కుసుమచాపః, కుసుమచాపఏవకులాలః, కుసుమచాపకులాలః, కుసుమచాపకులాలస్య విలాసః, కుసుమచాపకులాలవిలాసః, కుసుమచాప కులాల విలాసాత్ జాతః = కుసుమచాప కులాల విలాసజః, తమ్ = కుసుమచాపకులాలవిలాసజమ్.

భావము :

ఆ దమయంతియొక్క స్తనములనెడి కుండలజత యామె యౌవనమనెడి ఎండలో నెండి గట్టిపడినదై మన్మథుఁడనెడు కుమ్మరియొక్క వ్యాపారముచే నేర్పడిన యనలసంగతి యనెడునలుని సాంగత్యములేక పోవుటయను నగ్నిసంగతిచే అనగా నగ్ని సంయోగముచే వేడిమిని-కాల్పును-పొందక యుండునా? తప్పక పొందునని యాశయము. ఇచ్చట దమయంతి చనుదోయి యను కుండలజతను మన్మథుఁడు నిర్మించి, యారెంటిని యామె యౌవనమను నెండలో గట్టిపఱచి నల సాంగత్యా భావమనెడి యనల సంగతివలని తాపమును అనగా అగ్నిసంయోగమువలని కాల్పును పొందించున్నాను. ఇచ్చట అనలసంగతి యనగా నలసాంగత్యా భావము. అదియే అనల సంగతిగా అనగా అగ్ని సంయోగముగా వర్ణితము—॥2॥

శ్లో॥ అధృతయద్విరహోష్మణి మజ్జితం
మనసిజేన తదూరుయుగం తదా।

స్పృశతి తత్కదనం కదలీతరు
ర్యది మరుజ్వల దూషర దూషితః॥ ౮

ప॥వి॥ అధృత । యత్ । విరహోష్మణి । మజ్జితం । మనసిజేన । తదూరు యుగం । తదా । స్పృశతి । తత్కదనం । కదలీతరుః । యది । మరు జ్వలదూషర దూషితః.

తదా = అప్పుడు యద్ = ఎందువలన, తదూరుయుగమ్; తత్ = ఆ దమ యంతియొక్క, ఊరుయుగమ్ = తొడలజంట, మనసిజేన = మన్మథు నిచే, విరహోష్మణి = విరహపు వేడిమియందు, మజ్జితమ్ = ముంచఁబడి నదిగ, అధృత = ధరింపఁబడినదో, (తత్ అందువలన) కదలీతరుః = అరటిచెట్టు, మరుజ్వలదూషరదూషితః; మరు = చవిటినేలయందు, జ్వలత్ = మండుచున్న ఊషర = చవుడుతో, దూషితః యది = దూషింపఁబడినచో, తత్కదనం తత్ = ఆ తొడల జంటతో, కదనం = సామ్యమును, స్పృశతి = పొందుచున్నది.

వి॥ ఇచ్చట ఉపమానమైన అరటిచెట్టును ఊరుయుగమునకు నుపమేయ ముగఁ జెప్పుటవలన ప్రతీపాలంకారము.

సమాసములు :

*విరహోష్మణి :* విరహస్య ఊష్మా = విరహోష్మా, తస్మిన్ = విర హోష్మణి.

*తదూరుయుగమ్ :* ఊర్వోః యుగమ్ = ఊరుయుగమ్. తస్యాః ఊరుయు గమ్ = తదూరుయుగమ్.

*తత్కదనమ్ :* తేన కదనం = తత్కదనం, తత్ = తత్కదనమ్.

*కదలీతరుః :* కదలీ ఇతి తరుః = కదలీతరుః.

*మరుజ్వల దూషరదూషితః :* మరౌ జ్వలతీతి = మరుజ్వలన్, మరుజ్వలం శ్చాసౌ ఊషరశ్చ = మరుజ్వలదూషరః. మరుజ్వలదూషరేణ దూషితః = మరు జ్వలదూషరదూషితః.

**భావము :**

ఆ దమయంతి విరహబాధ ననుభవించు నపుడు, మన్మథుడు ఆమె యొక్క తొడలను రెంటిని విరహాగ్ని తాపమునందుంచెను. అట్టి తరి, ఎడారి లోని యరటిచెట్టు చవిటినేల యందలి వేడిమిదే కమలిపోయినచో నాచెట్టు దమయంతియొక్క తొడలతో సామ్యమునుఁ బొందఁదగియుండును. ॥౮॥

శ్లో॥ స్మరశరాహతి నిర్మిత సంజ్వరం
కరయుగం హసతి స్మ దమస్వసుః।
అనపిధానపతత్తపనాతపం
తపనిపీత సరస్సర సీరుహమ్ ॥౯॥

ప॥వి॥ స్మరశరాహతి నిర్మితసంజ్వరం। కరయుగం। హసతి। స్మ। దమస్వసుః। అనపిధానపతత్తపనాతపమ్। తపని పీత సరస్సరసీరుహమ్।

టీక॥ స్మరశరాహతి నిర్మిత సంజ్వరమ్; స్మర = మన్మథునియొక్క, శరాహతి = బాణముల దెబ్బచే, నిర్మిత = కల్గించఁబడిన, సంజ్వరం = తాపము గల్గిన, దమస్వసుః = దమయంతియొక్క, కరయుగమ్ = చేతులజంట, అనపిధానపతత్తప నాతపమ్; అనపిధాన = ఆచ్ఛాదనములేక పోవుటచే, పతత్ = ప్రవేశించుచున్న, తపనాతపం = ఎండగల్గిన. తపనిపీత సరస్ససీరుహమ్; తప = గ్రీష్మముచే, నిపీత = పానముజేయఁబడి ఎండిపోయిన, సరః = కొలనిలోని, సరసీరుహమ్ = పద్మమును, హసతి స్మ = పరిహసించుచుండినది.

వి॥ 'హసతీర్ష్యత్యసూయతి'' యని దండి సాదృశ్యార్థమున[illegible] హాసక్రియను పఠించుటవలన నిటఁ 'పద్మమును పరిహసించుట'' పద్మముతో సామ్యమునుఁ బొందుటలో పర్యవసించును. కాన పద్మములతో దమయంతి హస్తములకు సామ్యము సిద్ధించినందువలన నిట నుపమాలంకారము.

**సమాసము :**

*స్మరశరాహతి నిర్మిత సంజ్వరమ్ :* స్మరస్యశరాః = స్మరశరాః. స్మరశరాణామాహతిః = స్మరశరాహతిః. స్మరశరా హత్యానిర్మితః = స్మరశరాహతి

నిర్మితః. స్మరశరాహతి నిర్మితః సంజ్వరః యస్యతత్ = స్మరశరాహతి నిర్మిత సంజ్వరం, తత్ = స్మరశరాహతి నిర్మిత సంజ్వరం।

దమస్వసుః : దమస్యస్వసా = దమస్వసా, తస్యాః దమస్వసుః.

అనపిధానపతత్తపనాతపమ్ : నఅపిధానమ్ = అనపిధానమ్. అనపిధానేన పతన్ = అనపిధాన పతన్, తపనస్య ఆతపః = తపనాతపః, అనపిధానపతన్—తపనాతపః యస్మిన్‌తత్ = అనపిధానపత్తతపనాతపమ్.

తపనిపీత సరస్స రసీరుహమ్ : తపెన నిపీతమ్ = తపనిపీతమ్, తపనిపీతం చతత్ సరశ్చ = తపనిపీతసరః, తవని పీతసరసి సరసీరుహమ్ = తపనిపీతసరస్సరసీరుహమ్.

భావము :

మన్మథ బాణములదెబ్బచేఁ దాపము బొందిన దమయంతి యొక్కఁ చేదోయి, యాచ్ఛాదనము లేనందువలన సూర్యాతప ప్రసారము గల్గిన, గ్రీష్మమున నెండిపోయిన కొలనిలోని పద్మమును పరిహసించుచుండినది. అనగా నాపద్మముతో సామ్యము నొంది యుండినది. ॥౯॥

శ్లో॥ మదనతాపభరేణ విదీర్య నో
యదుదపాతి హృదా దమసస్వసుః।
నిబిడపీనకుచద్వయయంత్రణా
తమపరాధమధాత్ ప్రతిబధ్నతీ॥ ౧౦

ప॥వి॥ మదనతాప భరేణ। విదీర్య। నో। యత్। ఉదపాతి। దమసస్వసుః। నిబిడ పీనకుచ ద్వయయంత్రణా। తమ్। అపరాధమ్। అధాత్। ప్రతిబధ్నతీ।

టీక. దమస్వసుః = దమయంతియొక్క, హృదా = హృదయముచే, మదనతాప భరేణ; మదనతాప = మన్మథతాపముయొక్క, భరేణ = ఆధిక్యముచే, విదీర్య = చీల్చుకొని, నోఉదపాతి ఇతియత్ = వెలుపలికి దుముకలేదనుట యేది గలదో, తమ్ = ఆ, అపరాధం = నేరమును. ప్రతిబధ్నతీ = అడగించుచున్న. నిబిడపీనకుచద్వయ యంత్రణా = నిబిడ = సందులేని,

పీన = బలిసిన, కుచద్వయ = చనుదోయి యొక్క, యంత్రణా = బంధము, అధాత్ = వహించినది.

వి॥ అతితాపమునందును, దమయంతియొక్క హృదయము పగులక పోవుటకు, ఆమెయొక్క ఆయుశ్శేషము వాస్తవికమగు కారణము. కాని యిట చనుదోయి యా హృదయమును బగులనీయక పట్టుకొనుట హేతువుగఁ జెప్పబడినదిగాన నిఁట నుత్ప్రేక్ష. వ్యంజకములనుఁ బ్రయోగింపనందు వలన నది యిఁట గమ్యము.

సమాసములు :

*మదనతాపభరేణ :* మదనస్య తాపః = మదన తాపః, మదన తాపస్య భరః = మదనతాపభరః = తేన = మదన తాపభరేణః

*దమస్వసుః :* దమస్యస్వసా = దమస్వసా, తస్యాః = దమస్వసుః

*నిబిడ పీనకుచద్వయ యంత్రణా :* నిబిడౌచ తౌపీనౌచ = నిబిడపీనౌ; నిబిడపీనౌ చ తౌ కుచౌ చ = నిబిడపీనకుచౌ; నిబిడపీనకుచయోః ద్వయమ్ = నిబిడ పీనకుచ ద్వయమ్; నిబిడ పీడకుచద్వయేన యంత్రణా = నిబిడ పీనకుచ ద్వయయంత్రణా.

భావము :

దమయంతికి మన్మథుని తాపభారము మిక్కుటముగ నున్నను, ఆమె హృదయము ఆ తాపము వలన పిగిలి బయటపడలేదు. అట్లు బయట పడక పోవడమను నపరాధమును, ఆమె హృదయమును, బిగులనీక పట్టుకొనిన, బలిసిన బిగి చనుదోయి వలని బంధము వహించినది. బిగువుగ చనుదోయి హృదయమును బంధింపకయున్నచో నా హృదయమెప్పుడో మన్మథ తాపభారమున పిగిలి వ్రయ్యలై వెలుపలపడి యుండెడిది. చనుదోయి యామె హృదయమును వ్రయ్యలు కానీయక రక్షించినది. దీనిచే దమయంతి చనుదోయియొక్క యతిశయము వ్యక్తమైనది. ॥౧౦॥

శ్లో॥ నివిశతే యది శూకశిఖా పదే
సృజతి సా కియతీ మివ న వ్యథామ్।

మృదుతనోర్వితనోతు కథం న తా
మవని భృత్తునివిశ్య హృది స్థితః ॥ ౧౧

ప॥వి॥ నివిశతే। యది। శూకశిఖా। పదే। సృజతి। సా। కియతీమ్। ఇవ।
న। వ్యథాం। మృదుతనోః। వితనోతు। కథం। న। తామ్। అవనిభృత్।
తు। నివిశ్య। హృది। స్థితః।

టీక॥ శూకశిఖా, శూక = ముల్లుయొక్క, శిఖా = కొన, పదే = పాదమందు, నివి
శతే యది = ప్రవేశించినచో, సా = ఆముంటికొన, కియతీమివ = ఎటు
వంటి, వ్యథాం = బాధను, న సృజతి = కల్పించదు. (గొప్పబాధనే కల్గిం
చును) (సః = ఆ) అవనిభృత్తు = భూమినిభరించు నలుఁడు కాని (పర్వ
తముగాని) హృది = హృదయమందు, నివిశ్య = ప్రవేశించి, స్థితస్సన్ =
ఉన్నవాడై (ఉన్నదై) మృదుతనోః = మెత్తనిశరీరముగల దమయం
తికి, తాం = ఆ బాధను కథం = ఎట్లు, న వితనోతు = కల్గించదు? (కల్గిం
చదు?) తప్పక కల్గించును.

వి॥ ఇచ్చట చిన్నముల్లు గుచ్చుకొనిన మాత్రముననే బాధను తాళజాలని
దమయంతి, తన మనస్సు నందు భూమిని భరించెడి నలుఁడు (పర్వ
తము) ప్రవేశించినచో ఆ బాధను నెట్లు తాళఁగల్గుననెడి కైముతిక
న్యాయముచేత నర్థాపత్త్యలంకారము.

## సమాసములు :

శూకశిఖా : శూకస్యశిఖా = శూకశిఖా

మృదుతనోః : మృద్వీతనుః యస్యాః సా మృదుతనుః, తస్యాః = మృదు
తనోః.

అవనిభృత్ : అవనిం బిభర్తీతి = అవనిభృత్.

## భావము :

చిన్నముల్లు గ్రుచ్చుకొనిన మాత్రమునకే, తాళఁజాలని దమయంతి; తన
హృదయమునందు భూభారమును వహించుటచేత ("అవనిభృత్తు",) (పర్వ

**తము)** నలుఁడున్నచో దానివలని బాధను నెట్లు సహింపగల్గును. సహింపఁజాలదు. చిన్నవస్తువునే భరించలేని వారు పెద్ద వస్తువునెట్లు భరింతురు. కాన దమయంతి తన హృదయమందు నలుని భరింపలేక పోయినది.॥౧౧॥

**శ్లో॥** మనసి సంతమివ ప్రియమీక్షితుం
నయనయోః స్పృహయాంతరుపేతయోః ।
గ్రహణశక్తిర భూదిదమీయయో
రపి న సమ్ముఖవాస్తుని వస్తుని॥ ౧౨

**ప॥వి॥** మనసి। సంతమ్। ఇవ। ప్రియమ్। ఈక్షితుం।నయనయోః। స్పృహయా। అంతః । ఉపేతయోః। గ్రహణశక్తిః। అభూత్। ఇదమీయయోః। అపి। న। సమ్ముఖవాస్తుని। వస్తుని.

**టీక॥** మనసి = హృదయమందు, సంతం = ఉన్నట్టి ప్రియం = కాంతుని, ఈక్షితుం = చూచుటకు, స్పృహయా = ఆశతో, అంతః = లోనికి, ఉపేతయోః = ప్రవేశించినటువంటి,ఇదమీయయోః = ఈమెకు సంబంధించిన, నయనయోః = నేత్రములకు, సమ్ముఖవాస్తుని, సమ్ముఖ = ఎదుట, వాస్తుని = స్థితిగల్గిన, వస్తున్యపి = వస్తువునందును, గ్రహణశక్తిః = గ్రహించుశక్తి, నాఽభూత్ = ఉండలేదు.

**వి॥** ఇచ్చట నేత్రములకు నెదుటనున్న వస్తువులు కానరాక పోవుటకు, నలుని యందాసక్తియే నిమిత్తముకాని, నేత్రములులోనికిఁ బ్రవేశించుట నిమిత్తముకాదు, కాన నిమిత్తముకాని దానిని నిమిత్తముగఁ జెప్పుటవలన నిమిత్తోత్ప్రేక్ష. ఇది యిచ్చట గమ్యము. మఱియు దమయంతీ చిత్తము నలునియందాసక్తమగునట్లు చెప్పుటవలన చింతయనెడి సంచారిభావము.

## సమాసములు :

*గ్రహణశక్తిః :* గ్రహణేశక్తిః = గ్రహణశక్తిః.

***ఇదమీయయోః :*** అస్యాః ఇమే = ఇదమీయే. తయోః = ఇదమీయయోః.

*సమ్ముఖవాస్తుని :* సమ్ముఖే వాస్తు యస్య తత్ = సమ్ముఖవాస్తు, **తస్మిన్** = సమ్ముఖవాస్తుని.

**భావము :**

దమయంతీ నయనములు, హృదయమందున్న నలునిఁ జూచుటకై యాశతో లోనికిఁ బ్రవేశించినవి. అందువలన నా నేత్రములకు నెదుట వస్తువులున్నను కానరాక పోయినవి. ఇట్లు నలునియందు దమయంతి చిత్తము లగ్నమగుటవలన నామె నలుని చింతతో వెతఁ జెందుచుండినది. ॥౧౨॥

శ్లో॥ హృది దమస్వసురశ్రుఝరప్లుతే
ప్రతిఫలద్విరహాత్తముఖానతేః ।
హృదయభాజమరాజత చుంబితుం
నలముపేత్య కిలాఽఽగమితంముఖమ్॥ ౧౩

ప॥వి॥ హృది । దమస్వసుః । అశ్రుఝరప్లుతే । ప్రతిఫలత్ । విరహాత్తముఖానతేః । హృదయభాజమ్ । అరాజత । చుంబితుం । నలమ్ । ఉపేత్య। కిల । ఆగమితం । ముఖమ్.

టీక॥ విరహాత్తముఖానతేః; విరహ = నలుని వియోగముచే, ఆత్త = పొందఁబడిన, ముఖ = మోముయొక్క, ఆనతేః = వాల్పుగల్గిన, అనగా ముఖము వంచుకొనిన, దమస్వసుః = దముని చెల్లెలైన దమయంతియొక్క, ముఖం = మోము, అశ్రుఝరప్లుతే; అశ్రుఝర = కన్నీటివెల్లువచే, ప్లుతే = తడిసిన, హృది = హృదయముపై, (వక్షఃస్థలముపై) ప్రతిఫలత్ = ప్రతిబింబించినదై, హృదయభాజం = హృదయమందున్న, నలం = నలుని, చుంబితుం = ముద్దుపెట్టుకొనుటకు, ఉపేత్య = వెళ్లి, ఆగమితం కిల = తిరిగివచ్చినదా యనునట్లు, అరాజత = ప్రకాశించినది.

వి॥ "ఆగమితంకిల" అనునెడ "కిల" శబ్దము సంభావనార్థకమై, దమయంతి యురమున ప్రవహించిన కన్నీటిజాలునఁ బ్రతిబింబించిన ముఖము హృదయమందున్న నలుని ముద్దిడుకొనుటకై పోయి తిరిగివచ్చినదా యను సంభావనను వ్యక్తపఱచుటచే నుత్ప్రేక్షాలంకారము.

**సమాసములు :**

దమస్వసుః : దమస్యస్వసా = దమస్వసా, తస్యాః దమస్వసుః.

**అశ్రుఝరప్లుతే:** అశ్రూణాం ఝరః = అశ్రుఝరః. అశ్రుఝరేణప్లుతం = అశ్రుఝరప్లుతమ్. తస్మిన్ = అశ్రుఝరప్లుతే.

**విరహార్తముఖానతేః :** విరహేణ ఆర్తా = విరహార్తా. ముఖస్యఆనతిః ముఖానతిః. విరహార్తా ముఖానతిః యస్యాస్సావిరహార్తముఖానతిః. తస్యాః = విరహార్తముఖానతేః ॥

**హృదయభాజమ్ :** హృదయం భజతీతి = హృదయభాక్. తం-హృదయ భాజమ్.

భావము :

నలవియోగ దుఃఖముచే దమయంతి మోము వంగిపోయినది. విరహ దుఃఖముచే నేర్పడిన కన్నీటిజాలున తడిసిన బొమ్మపై నామె మోము ప్రతి బింబించినది. అదిచూడ ఆమె ముఖము హృదయమందున్న నలుని ముద్దిడు కొనుటకై లోనికిఁబోయి తిరిగివచ్చినదా! యనునట్లు కానవచ్చుచుండినది॥౧౩॥

శ్లో॥ సుహృదమగ్ని ముదఞ్చయితుం స్మరం
మనసి గంధవహేన మృగీదృశః।
అకలి నిఃశ్వసితేన వినిర్గమా
నుమిత నిహ్నుత వేశనమాయితా॥ ౧౪

ప॥ వి॥ సుహృదమ్ । అగ్నిమ్ । ఉదంచయితుం । స్మరం । మనసి । గంధ వహేన । మృగీదృశః । అకలి । నిఃశ్వసితేన । వినిర్గమానుమితనిహ్నుతవేశనమాయితా.

టీక॥ గంధవహేన = గాలిచే, సుహృదం = మిత్రుఁడైనట్టియు,మృగీదృశః = దమయంతియొక్క, మనసి = మనస్సునందు, (స్థితం) = ఉన్నట్టి స్మరం = మన్మథుడను, అగ్నిమ్ = అగ్నిని, ఉదంచయితుం = జ్వాలింపఁ జేయుటకు, నిఃశ్వసితేన = నిట్టూర్పు అనుగాలి నెపమున, వినిర్గమ... మాయితా; వినిర్గమ = వెలుపలికి వచ్చుటచే, అనుమిత = ఊహింపఁబడి నదియు, నిహ్నుత = కప్పిపుచ్చఁబడినదియునగు, వేశన = లోపలఁప్రవే

శించుటయందలి, మాయితా = వంచన, అకలి = పొందఁబడినది. (నూనం = నిశ్చయము.)

వి॥ నిప్పురగిల్చువాడు గుట్టుగాఁబోయి నిప్పునంటించి బహిరంగముగ వెలుపలికి వచ్చును. అట్లే అగ్నికి మిత్రుఁడైనగాలి నిట్టూర్పునెపముచే లోనఁ బ్రవేశించి యచ్చటనున్న మన్మథుఁడనెడి యగ్నినిరగిల్చి వెలుపలికివచ్చె ననిచెప్పుటవలన నిట నుత్ప్రేక్ష. దమయంతి నిట్టూర్పులనుఁ గాంచినచో, వాయువు నిట్టూర్పు వ్యాజముచే లోనఁబ్రవేశించి మన్మథాగ్నిని జ్వలింపఁజేసి వెలుపలికి వచ్చెనా; యని భావింపఁబడుటవలన నుత్ప్రేక్ష.

## సమాసములు :

*గంధవహేన :* గంధం వహతీతి గంధవహః. తేన = గంధవహేన.

*మృగీదృశః :* మృగ్యాః దృశావివ దృశౌ యస్యాః సా = మృగీదృక్. తస్యాః = మృగీదృశః.

*వినిర్గమానుమిత నిహ్నుతవేశనమాయితా :* అనుమితంచతత్ నిహ్నుతంచ = అనుమిత నిహ్నుతం. వినిర్గమేన అనుమిత నిహ్నుతం = వినిర్గమానుమిత నిహ్నుతం. వినిర్గమాను మితనిహ్నుతంచ తత్వేశనం చ = వినిర్గమానుమిత నిహ్నుతవేశనం. మాయాఅస్యఅస్తీతి = మాయీ. మాయినోభావః = మాయితా. వినిర్గమానుమిత నిహ్నుతవేశనే మాయితా = వినిర్గమానుమిత నిహ్నుతవేశన మాయితా.

## భావము :

వాయువు దమయంతీహృదయమందున్న తన మిత్రుఁడైన మన్మథుఁడనెడి యగ్నిని రగిల్చుటకై లోనఁబ్రవేశించెను. ఇది గుట్టుగా జరిగినది. కాని తర్వాత నా వాయువు నిట్టూర్పుల నెపముతో నందఱికిని తెలియునట్లు వెలుపలికి వచ్చెను. ఇట్లుచేయుటచే నామెకు సంతాపమతిశయిల్లినది. సాధారణముగ విరహుల చిత్తములయందు మన్మథాగ్నిని మలయానిలాదులు రగిల్చుట లోకప్రసిద్ధముగదా. మలయానిలము విరహులకు మన్మథబాధను వర్ధిల్లఁ జేయుటయు ప్రసిద్ధము. ఇట్లు దమయంతి హృదయమునందు వాయువు గుట్టుగా

స్మరాగ్నిని రగిల్చి వెలుపలికి ప్రకటముగ వెల్వడడము, ఇంటికి గుట్టుగ నిప్పు పెట్టి ప్రకటముగ వెలుపలికివచ్చెడి యాతతాయి వృత్తాంతమునుఁ దోపించు చున్నది. ఇట్లు మన్మథాగ్నిని గుట్టుగ రగిల్చి ప్రకటముగ వెలుపలికి వచ్చుటచే వాయువునందు మాయావిత్వ మేర్పడినది. ఈ విధముగ మన్మథునికి, మలయ మారుతము, తోడగుటవలన దమయంతికి విరహసంతాపము మిక్కిలి హెచ్చిన దని యాశయము॥ ౧౩॥

శ్లో॥ విరహ పాండిమరాగ తమోమషీ
శితిమ తన్నిజ పీతిమవర్ణకైః।
దశదిశః ఖలు తద్దృగకల్పయ
ల్లిపికరీ నలరూపక చిత్రితాః॥ ౧౪

ప॥వి॥ విరహ పాండిమరాగ తమోమషీశితిమ తన్నిజ పీతిమవర్ణకైః । దశ । దిశః । ఖలు । తద్దృక్ । అకల్పయత్ । లిపికరీ । నలరూపక చిత్రితాః.

టీక॥ తద్దృక్; తత్ = ఆదమయంతియొక్క, దృక్ = దృష్టియనెడి; లిపికరీ = చిత్రకారిణి, విరహ.....వర్ణకైః, విరహ = వియోగముచేనేర్పడిన, పాం = డిమ = తెల్లఁదనము; రాగ = అనురాగమనెడి, (రాగ) ఎఱ్ఱఁదనము, తమః = మోహమనెడి, మషీ = మసియొక్క, శితిమ = నల్లఁదనము, తత్ = ఆ దమయంతి యొక్క, నిజ = తనదైన, పీతిమ = పచ్చఁదనము; అనగా బంగారువన్నెయను రంగులచే, అనగా-తెలుపు-ఎఱుపు-నలుపు-పసుపు వన్నెలచే। అనగా శుక్ల-రక్త-నీల-పీత-వర్ణములనెడి చిత్ర సాధనములచే, దశ = పదియైన, దిశః = దిక్కులనెడి, (భిత్తీః = గోడలను) నలరూపక చిత్రితాః; నల = నలునియొక్క రూపక = ఆకృతులచే, చిత్రితాః = చిత్రింపఁబడినవిగ, అకల్పయత్ = కల్పించెను.

**సమాసములు :**

విరహపాండిమ రాగతమోమషీ శితిమతన్నిజ పీతిమవర్ణకై : విరహేణ పాండిమా = విరహ పాండిమా. రాగఏవరాగః = రాగః. తమఏవమషీ = తమోమషీ. తమోమష్యాః శితిమా = తమోమషీ శితిమా. తస్యాః నిజ

పీతిమా = తన్నిజపీతిమా, విరహపాండిమాచ, రాగశ్చ, తమోమషీశితిమాచ, తన్నిజపీతిమాచ = విరహపాండిమరాగ తమోమషీ శితిమ తన్నిజ పీతిమానః. విరహపాండిమరాగతమోమషీ శితిమ తన్నిజపీతిమాన ఏవ వర్ణకాః = విరహ......వర్ణకాః, తైః = విరహ.........వర్ణకైః॥

తద్దృక్ : తస్యాః దృక్ = తద్దృక్. లిపికరీ = లిపింకరోతీతి = లిపికరీ.

*నలరూపకచిత్రితాః* : నలస్య రూపకాణి = నలరూపకాణి. నలరూపకాణి చిత్రాణి ఆసాం సంజాతానీతి = నలరూపక చిత్రితాః. తాః = నల రూపక చిత్రితాః.

భావము :

దమయంతి దృష్టియనెడి చిత్రకారురాలు దమయంతికి విరహముచేఁ గల్గిన తెలుపు వర్ణమును, ఆమెకు నలుని యందేర్పడిన యనురాగమనెడి రక్త వర్ణమును, నామెకు నలుని చింతచే నేర్పడిన మోహాంధకారమనెడి చీకటిలోని నలుపు వన్నెను, ఆమెకు స్వతస్సిద్ధముగ శరీరమందున్న బంగారువంటి పసిమి వన్నెను రంగులుగా తీసికొని పదిదిక్కులనెడి గోడలపై, నలునియాకారములను చిత్తరవులుగా చిత్రించినది. ఎల్లప్పుడును నలుని, హృదయమున చింతనచేయుట వలన దమయంతికి అన్ని దిక్కులలోను భ్రాంతికల్పితుఁడై నలుఁడు కానవచ్చుచుండెనని యాశయము. ॥౧౫॥

శ్లో॥ స్మరకృతిం హృదయస్య ముహుర్దశాం
బహువదన్నివ నిఃశ్వసితానిలః।
వ్యధిత వాససి కమ్పమదఃశ్రితే
త్రసతి కః సతి నాఽఽశ్రయబాధనే॥ ౧౬

ప॥వి॥ స్మరకృతిం । హృదయస్య । ముహుః । దశాం । బహు । వదన్ । ఇవ । నిఃశ్వసితా నిలః । వ్యధిత । వాససి । కమ్పమ్ । అదఃశ్రితే । త్రసతి । కః । సతి । న । ఆశ్రయ బాధనే ।

**టీక॥** నిఃశ్వసితా నిలః = నిట్టూర్పుగాలి, స్మరకృతిం = మన్మథుని సృష్టియైన, హృదయస్య = హృదయమను ప్రాణియొక్క, దశాం = అవస్థను, బహు = పెక్కుమాఱులు, వదన్నివ = చెప్పుచున్నాడోయనునట్లు, అదః శ్రితే; అదః = ఈ హృదయమును (వక్షఃస్థలమును) శ్రితే = కప్పుటచే నాశ్రితమయిన, వాససి = వస్త్రమునందు, కంపం = వణకును, దానికి కారణమైన భయమును, వ్యధిత = కల్గించెను, ఆశ్రయ బాధనేసతి = ఆశ్రయమునకు బాధ ఏర్పడినచో, కః = ఎవ్వడు, నత్రసతి = భయపడడు? అందఱును భయపడెదరు.

**వి॥** "త్రసతికః సతినాశ్రయ బాధనే" అని "ఆశ్రయమునకు బాధ ఏర్పడినచో నెవరు భయపడరు" అను సామాన్య వచనముచే హృదయ కంపనమువలన, దానికి నాశ్రితమగు వస్త్రమునకు కంపనము వచ్చినదను విశేషార్థమును సమర్థించుట వలన అర్థాంతర న్యాసాలంకారము.

"బహువదన్నివ నిఃశ్వసితానిలః" అని నిట్టూర్పులచే సహజముగ నేర్పడిన వస్త్ర కంపనమును, హృదయవ్యథను నిట్టూర్పు వాయువు చెప్పుచున్నదోయన్నట్లు వర్ణించుటవలన నిటనుత్ప్రేక్ష. ఇవశబ్ద ప్రయోగము చేయుటచే నది వాచ్యము.

**సమాసములు :**

*స్మరకృతిమ్ :* స్మరస్యకృతిః = స్మరకృతిః, తాం, స్మరకృతిమ్.

*నిఃశ్వసితానిలః :* నిఃశ్వసితమేవ అనిలః = నిఃశ్వసితానిలః.

*అదఃశ్రితే :* అదఃశ్రితమ్ = అదఃశ్రితమ్. తస్మిన్ = అదఃశ్రితే.

*ఆశ్రయబాధనే :* ఆశ్రయస్య బాధనం = ఆశ్రయ బాధనం. తస్మిన్ = ఆశ్రయబాధనే.

**భావము :**

నిట్టూర్పు వాయువు ఆ దమయంతియొక్క హృదయమను ప్రాణికి మన్మథుఁడు సృజించిన యవస్థను పలుమాఱు చెప్పుచున్నాడో యనునట్లు, ఆ హృదయముపై కప్పిన వస్త్రముపై కదలికను, దానికి మూలమైన భయమును

కల్పించుచుండెను. దమయంతీ హృదయముపై కప్పిన వస్త్రము, ఆమె నిట్టూర్పులచే కదలుచుండెను. దానిఁజూడ ఆమె హృదయమునకు మన్మథుడు కల్పించిన దశను హృదయ భాగమునుండి వెల్వడుచున్న నిట్టూర్పు వాయువు గ్రహించి దానిని పలుమాఱులు చెప్పుచున్నట్లుగా నుండెను. సహజముగా నిట్టూర్పులచే ఱొమ్ముపై కప్పిన వస్త్రము కదలుచుండును గదా! దీనివలన విరహబాధచే దమయంతికి నిట్టూర్పులు మిక్కుటముగా వచ్చుచుండెనని తెలియుచున్నది. ॥౧౬॥

శ్లో॥ కరపదాననలోచననామభిః
శతదళైః సుతనోర్విరహజ్వరే।
రవిమహో బహుపీతచరం చిరా
దనిశతాపమిషాదుదసృజ్యత॥ ౧౭

ప॥వి॥ కరపదాననలోచననామభిః । శతదళైః । సుతనోః।విరహజ్వరే । రవిమహః। బహు పీతచరం । చిరాత్ । అనిశతాపమి షాత్ । ఉదసృతజ్య.

టీక॥ కరపదాననలోచననామభిః, కర = హస్తములు, పద = పాదములు,ఆనన = ముఖము, లోచన = కన్నులు నను పేని, నామభిః పేరులుగల,అనగా, దమయంతియొక్క హస్తపాదాది రూపముగా పరిణమించుట వలన నా పేరులను వహించినట్టి, శతదళైః = పద్మములచే, చిరాత్ = చాల కాలము నుండి, పీతచరం = ప్రీతితో తొలుతనే పానము చేయఁబడిన, బహు = అధికమైన, రవిమహః = సూర్యకాంతి, సుతనోః = దమయంతియొక్క, విరహజ్వరే = విరహతాపమందు, అనిశతాపమిషాత్; అనిశతాప = నిరంతర సంతాపమనెడి, మిషాత్ = నెపమువలన, ఉదసృజ్యత = వెళ్లగ్రక్కఁబడినది. (నూనం = నిశ్చయము).

వి॥ ఇచ్చట పద్మములకును, దమయంతియొక్క కరచరణాదులకును భేదమున్నను నామ మాత్ర భేదమని చెప్పి వానికి నభేదము చెప్పుట వలన నభేదాతిశయోక్తి. దమయంతికి మన్మథ బాధచే సంతాపము కల్గుట సహజము. కాని యిఁట నామెయొక్క కరచరణాది నామములు దాల్చిన పద్మములచే పూర్వము ప్రీతితో పానము చేయఁబడిన సూర్యకాంతులను

ఆకరచరణాదులు వెళ్లగ్రక్కుచున్నట్లున్నవనియు దానికి విరహ తాప మనునది మిషయనియుఁ జెప్పుటవలన వాస్తవములో పూర్వము పానము చేసిన సూర్యకాంతిని వమనము చేయకపోయినను, వమనము చేసినట్లు చెప్పుటచే నిఁట నుత్ప్రేక్షాలంకారము. వానికి-కరచరణాదులకు పద్మ ములతో నభేదము చెప్పుటచే నేర్పడిన యభేదాతిశయోక్తి మూలము. "అనిశతాపమిషాత్" అని మిషశబ్ద-ప్రయోగముచేసి, మన్మథతాప మును అపహ్నవము చేయుటవలన నపహ్నవాలంకారము. ఈయపహ్న వాలంకారముచే, నభేదాతిశయోక్తి మూలకమగు నుత్ప్రేక్ష అను ప్రాణితము.

## సమాసములు :

*కరపదాననలోచననామభిః :* కరౌ, పదే, ఆసనం, లోచనే, ఇతి నామాని యేషాంతాని = కరపదాననలోచన నామాని. తైః = కరపదాననలోచన నామభిః.

*సుతనోః :* శోభనా-తనుః యస్యాస్సా సుతనుః తస్యాః = సుతనోః.

*విరహజ్వరే :* విరహస్యజ్వరః = విరహజ్వరః, తస్మిన్ = విరహజ్వరే.

*రవిమహః :* రవేఃమహః = రవిమహః.

*పీతచరమ్ :* పూర్వం పీతం = పీతచరమ్.

*అనిశతాపమిషాత్ :* అనిశంతాపః = అనిశతాపః. అనిశతాపఏవ మిషః = అనిశతాపమిషః. తస్మాత్ = అనిశతాపమిషాత్.

## భావము :

దమయంతీ కరచరణాదులు విరహజ్వరముచే సంతాపమును వెళ్లగ్రక్కు చున్నవి. కాని అది సంతాపమును వెళ్లగ్రక్కుట కాదు. మరేమనగా-ఆమె యొక్క కరచరణాదులుగా పరిణమించుటచే యా నామములు ధరించిన పద్మ ములు పూర్వము సూర్యకాంతిని అపేక్షతో నమితముగ పానము గావించినవి, అట్లు పానము చేసిన సూర్యకాంతినే పద్మములతో నభిన్నములైన యా యవ యవములు ప్రకృతము వెళ్లఁగ్రక్కినవే కాని యది మదనజ్వర సంతాపము గాదు.

దమయంతియొక్క కరచరణాదులు పద్మములతో తుల్యములనియు నామె శరీర మందలి మదనజ్వరము మిక్కుటమనియు నాశయము. ॥౧౭॥

శ్లో॥ ఉదయతి స్మ తదద్భుత మాలిభి
ర్ధరణిభృద్భువి తత్ర విమృశ్య యత్।
అనుమితో౽పి చ బాష్పనిరీక్షణా
ద్వ్యభిచచార న తాపక రోనలః॥ ౧౮

ప॥వి॥ ఉదయతి । స్మ । తత్ । అద్భుతమ్ । ఆలిభిః । ధరణిభృద్భువి । తత్ర । విమృశ్య । యత్ । అనుమితః । అపి । చ । బాష్పనిరీక్షణాత్ । వ్యభిచచార । న । తాపకరః । నలః । (అనలః).

టీక॥ ఆలిభిః = చెలికత్తెలచే, తత్ర = ఆ ధర ణిభృద్భువి; ధరణిభృత్ = భూమిని భరించెడి భీమరాజు నుండి, భువి = ఉద్భవించిన దమయంతి యందును, ధరణిభృత్ = పర్వతముయొక్క, భువి = భూమి యందును, విమృశ్య = వ్యాప్తినినిశ్చయించి, బాష్పనిరీక్షణాత్; బాష్ప = కన్నీరనెడి లింగమును, నిరీక్షణాత్ = చూచుటవలన, బాష్ప = ధూమమనెడి లింగ మును, నిరీక్షణాత్ = చూచుటవలన, అనుమితో౽పి = ఊహింపఁబడినను, లింగాభాసముచే నిశ్చయింపఁబడినను, తాపకరః = సంతాపము గల్గించు, నలః = నలమహారాజు, (అనలః = అగ్ని)న వ్యభిచచార ఇతి యత్ = తప్పలేదు, అనగా నియమముగ నుండెననునది యేదిగలదో, తత్ = ఆ, అద్భుతం = ఆశ్చర్యము, ఉదయతిస్మ = ఉదయించినది.

వి॥ ధూమముచే అనలుని ఊహించుట యుక్తము. కాని ఇచ్చట నలుని ఊహించుట యేర్పడినది. కాన విరోధము. ఏలయనగా. ధూమమునకు వ్యాప్తి అనలునితోనే గాని, నలునితోఁగాదు. కాని యిఁట బాష్పశబ్దము నకు ధూమమెట్లు అర్థమో యట్లే కన్నీరనియు నర్థముగలదు. కాన దమ యన్తీ బాష్పములచే నామెకు సంతాపముఁ గల్గించు నలుఁడు ఊహింప బడెనని చెప్పుటవలన నా విరోధమునకుపరిహారముగాన, విరోధాభాసము. శ్లోకములోని కడపటి పాదములో-"తాపకరో నలః" అనునెడ "తాప కరః అనలః" అనియు, "తాపకరః నలః" అనియు విభాగముచేయుట

వలన పై విరోధ - పరిహారములు సంభవించినవి. పై విరోధాభాసాలం కారము "ధరణిభృద్భువి" అను నర్థశ్లేషను, 'తాపకరోనలః' అనుశబ్ద శ్లేషను నాశ్రయించినది.

## సమాసములు :

*ధరణిభృద్భువి :* ధరణింబిభర్తీతి ధరణిభృత్, ధరణిభృతః భవ తీతి = ధరణిభృద్భూః. తస్యాం ధరణి భృద్భువి.

*ధరణింబిభర్తీతి :* ధరణిభృత్ధరణిభృతఃభూః = ధరణిభృద్భూః, తస్యాం, ధరణి భృద్భువి. (అని పక్షాంతరము నందు)

*బాష్పనిరీక్షణాత్ :* బాష్పస్య నిరీక్షణం బాష్పనిరీక్షణం. తస్మాత్ = బాష్పనిరీక్షణాత్.

*తాపకరః :* తాపంకరోతీతి = తాపకరః.

## భావము :

చెలికత్తెలు దమయంతియొక్క బాష్ప దర్శనముచే నామెకు సంతాప కరుడైన నలుని ఊహించిరను విషయమును ననుమాన విధానమున కవి చమత్క రించి చెప్పుచున్నాడు దమయంతి భీమరాజు కుమార్తె యగుటవలన "ధరణీ భృద్భూః" అని చెప్పబడుచున్నది. "ధరణీభృత్"-అనగా పర్వతమగుట వలన, "ధరణిభృద్భూః" అనగ పర్వత భూమియు చెప్పఁబడును. పర్వతభూమి యందు బాష్పదర్శనముచే (ధూమ దర్శనముచే) అనలుడు (అగ్ని) ఊహింపఁ బడుట న్యాయము. కాని యిచ్చట నలుడు అనగా, అనలభిన్నుడైన నలుఁడు ఊహింపఁబడుట విరుద్ధము, అద్భుతము. కాని బాష్పశబ్దమునకు"కన్నీరు"అని యర్థము చెప్పుకొనినచో "ధరణిభృద్భువ" యగు దమయంతియందు సంతాప కరుఁడైన నలుఁడు ఊహింపఁబడుటలో విరోధము లేదు. ఇట్లే బాష్పముచే (కన్నీ టిచే) అనలుని అగ్నిని ఊహించుటయు విరుద్ధము. బాష్పశబ్దమునకు ధూమ మను నర్థము చెప్పుకొనుటవలన విరోధమునకు పరిహారము. ఏలయనగా ధూమ దర్శనముచే ననలుని నూహించుట యవిరుద్ధము. కాన దమయంతి కన్నీటినిఁ

గాంచి చెలికత్తెలు ఆమె యొక్క సంతాపము నలుని చింతవలన గల్గినదిగ నూహించిరని యాశయము. ॥౧౮॥

శ్లో॥ హృది విదర్భభువం ప్రహరన్ శరై
రతిపతిర్నిషధాధిపతేః కృతే।
కృతతదంతరగ స్వదృఢవ్యథః
ఫలదనీతి రమూర్ఛదలం ఖలు॥ ౧౯

ప॥వి హృది । విదర్భభువం । ప్రహరన్ । శరైః । రతిపతిః । నిషధాధిపతేః । కృతే । కృతతదంతరగస్వదృఢవ్యథః । ఫలదనీతిః । అమూర్ఛత్ । అలం । ఖలు.

టీక॥ నిషధాధిపతేః కృతే = నలుని కొఱకు, అనగా నలునికొట్టుటకొఱకు, విదర్భభువం = దమయంతిని, శరైః = బాణములచే, హృది = హృదయమందు, ప్రహరన్ = కొట్టుచున్న, రతిపతిః = మన్మథుఁడు, కృతతదంతరగ స్వదృఢవ్యథః; కృత = చేయఁబడిన, తదంతరగ = ఆమెయంతరంగమందున్నటువంటి, స్వ = తనకు (మన్మథునకు) ధృఢ = ధృఢమైన, వ్యథః = బాధగల్గినవాఁడై, ఫలదనీతిః = ఫలత్ = ఫలించిన, అనీతిః = తన దుర్నీతికలవాఁడై, అలం = మిక్కిలి, అమూర్ఛత్ ఖలు = విజయముఁజెందెను (మోహముఁ జెందెను).

వి॥ ఇచ్చట మన్మథుఁడు తన విరోధియగు నలునకు హృదయమున ఆశ్రయమిచ్చుటచే దమయంతిని బాణములచే కొట్టెను. మన్మథుఁడు గూడ నామె హృదయమునందే యున్నాడు. దమయంతిని బాణములచే గొట్టుటవలన, దమయంతి హృదయమందున్న నలునికి దెబ్బలు తగులుట వలనను, తన విరోధియగు నలునికి ఆశ్రయమిచ్చుట వలనఁ దనకు శత్రువైన దమయంతికి దెబ్బలు తగులుటవలనను, మన్మథుఁడు విజయము పొందెను. కాని ఆ సమయమందే తనకును దమయంతీ హృదయము ఆశ్రయముగాన దమయంతిని తాను బాణములచేఁ గొట్టినపుడు, ఆమె హృదయమందున్న నలునితోఁ బాటు తానును దెబ్బలు తినినవాడై మోహమునుఁ గూడ పొందెనో యని చెప్పుటవలన నిట నుత్ప్రేక్ష.

వ్యంజకములగు ఇవాది శబ్దములను బ్రయోగించనందువలన నదిగమ్యము. ''అమూర్ఛత్'' అనునెడ శ్లేషచే మోహార్థమును జెప్పుటవలన మోహసంబంధము లేనిచోట మోహసంబంధము జెప్పుటవలన నతిశయోక్తి భేదము. ఈ యతిశయోక్తి చేత నా యుత్ప్రేక్షయుత్థాపితముకాన దానితో దీనికి సంకరము.

ఒకరినిఁ గొట్టుటకై ప్రయత్నించిన మన్మథునకు తన్ను గూడఁ గొట్టుకొనుట యను ననర్థము వాటిల్లుట వలన విషమాలంకారము.

## సమాసములు :

విదర్భేషు భవతీతి = విదర్భభూః. తాం = విదర్భభువమ్.

*రతిపతిః :* రతేః పతిః = రతిపతిః.

*నిషధాధిపతేః :* నిషధానామధిపతిః = నిషధాధిపతిః, తస్య = నిషధాధిపతేః.

*కృతతదంతరగ స్వదృఢవ్యథః :* తస్యాః అంతరం = తదంతరమ్. తదంతరం గచ్ఛతీతి = తదంతరగః, తదంతరగశ్చాஉసౌ స్వశ్చ = తదంతర దృఢా చసావ్యథాచ = దృఢవ్యథా. తదంతర గస్వస్య దృఢవ్యథా = తదంతరగ స్వదృఢవ్యథా. కృతాతదంతరగ స్వదృఢవ్యథాయేనసః = కృత తదంతరగస్వ దృఢవ్యథః.

*ఫలదనీతిః :* న నీతిః = అనీతిః. ఫలంతీ అనీతిః యస్యసః = ఫలదనీతిః.

## భావము :

తనకు పరిపంథియైన నలుఁడెల్లప్పుడును దమయంతియొక్క హృదయమందుండుట వలన మన్మథుఁడు దమయంతిని బాణముచేఁ గొట్టసాగెను. మఱియు తన హృదయమున స్థానమొసంగుట వలన నామెయు శత్రువుతో సమానమైనది. కాన నామెకునుఁ బ్రహారము లవసరమే. కాని యీ విధముగా మన్మథుని దుర్నీతి ఫలించినను, అతఁడు గూడ "మనసిజుఁడై'' దమయంతీ హృదయమందే యుండుటవలన నలునికై దమయంతిని తానుకొట్టిన బాణపు దెబ్బలు తనకును తగిలినందువలన, నతనికి నా దెబ్బల వలన మోహము కలి

గెను. ఇట్లు వర్ణించుటచే, దమయంతికి మన్మథ బాధచే నలునిపై మోహము ప్రబలినదను సారాంశ మేర్పడుచున్నది. ॥౧౯॥

శ్లో॥ విధురమాని తయా యది భానుమాన్
కథ మహో స తు తద్ధృదయంతథా।
అపి వియోగభరాస్ఫుట నస్ఫుటీ
కృతదృషత్త్వమ జిజ్వలదంశుభిః॥ ౨౦

ప॥వి॥ విధుః । అమాని । తయా । యది । భానుమాన్ । కథమ్ । అహో । సః । తు । తద్ధృదయమ్ । తథా । అపి । వియోగభరాఽస్ఫుట నస్ఫుటీకృత దృషత్త్వమ్ । అజిజ్వలత్ । అంశుభిః ।

టీక॥ తయా = ఆ దమయంతిచే, విధుః = చంద్రుఁడు, భానుమాన్ = సూర్యుఁడుగా, అమాని యది = తలంపఁబడినచో, (విరహిణికి అది ఆశ్చర్యము గాదు) (కింతు = కాని) సః = సూర్యుడుగా భావింపబడిన చంద్రుడు, వియోగభరాస్ఫుటనస్ఫుటీకృత దృషత్త్వమ్; వియోగభర = విరహమను భారముచేతను, అస్ఫుటన = పగలకుండుటచేత, స్ఫుటీకృత = స్పష్టముగావింపఁబడిన, దృషత్త్వం = సూర్యకాంత శిలాత్వముగల, తద్ధృదయమపి = ఆదమయంతియొక్క హృదయమునుగూడ, కథం = ఎట్లు, తథా = సూర్యునివలె, అంశుభిః = తన తేజస్సులతో, అజిజ్వలత్ = జ్వలింపఁజేయుచుండెను. అహో = ఆశ్చర్యము.

సమాసములు :

భానుమాన్ = భానవఃఅస్యసంతీతి = భానుమాన్. తద్ధృదయమ్ = తస్యాః హృదయమ్ = తద్ధృదయమ్.

వియోగభరాఽస్ఫుటన స్ఫుటీకృత దృషత్త్వమ్:

వియోగ ఏవభరః = వియోగభరః. వియోగభరేణ అస్ఫుటనం = వియోగభరాఽస్ఫుటనమ్. వియోగభరాఽస్ఫుటనేన స్ఫుటీ కృతమ్ వియోగభరాఽస్ఫుటన స్ఫుటీకృతమ్. దృషదః భావః = దృషత్త్వమ్. వియోగ భరా

స్ఫుట నస్ఫుటీకృతం దృష్టత్వం యస్యతత్ = వియోగ భరాస్ఫుటనస్ఫుటీ కృతదృష్టత్వమ్.

**భావము :**

ఎల్లప్పుడు నల విరహమువలన బాధపడు తనకు, సంతాపము గల్గించుట వలన విరహిణియైన దమయంతి, చంద్రుని సూర్యునిగ భావించుటలో ఆశ్చ ర్యము లేదు. కాని సూర్యుడుగా భావింపఁబడిన యా చంద్రుడు; వియోగ భారముచేతఁ గూడ పిగిలిపోక యుండుటచే సూర్యకాంత శిలగా భావింపఁబడిన యామె హృదయమును తన తేజస్సులచే జ్వలింపఁ జేయుచుండెను. ఇది మిక్కిలి యాశ్చర్యకరము. లోకమున సూర్యుని కాంతులవలన, సూర్యకాంత శిలలు జ్వలించుట సహజము. కాని యిచ్చట దమయంతీ హృదయమనెడు సూర్య కాంతశిల చంద్రుని కాంతులతో జ్వలించుచుండెను. ఇది మిక్కిలి యాశ్చర్య కరము. వియోగబాధననుభవించుచున్న దమయంతీ హృదయమును చంద్రుడు తన వెన్నెలచే మిక్కిలి బాధ పెట్టెనని యాశయము. ॥౨౦॥

శ్లో॥ హృదయదత్త సరోరుహయా తయా
క్వ సదృగస్తు వియోగనిమగ్నయా।
ప్రియధనుః పరిరభ్య హృదారతిః
కిమనుమర్తు మశేత చితార్చిషి॥ ౨౧

ప॥వి॥ హృదయదత్త సరోరుహయా । తయా । క్వ । సదృక్ । అస్తు । వియోగనిమగ్నయా । ప్రియధనుః । పరిరభ్య । హృదా । రతిః । కిమ్ । అనుమర్తుమ్ । అశేత । చితార్చిషి.

టీక॥ వియోగనిమగ్నయా; వియోగ = విరహాగ్నియందు, నిమగ్నయా = మునిగిన (కావుననే) హృదయదత్త సరోరు హయా; హృదయ = వక్షఃస్థల ముపై, దత్త = ఉంచఁబడిన, సరోరుహయా = పద్మము గల్గిన, తయా = దమయంతితో, సదృక్ = సమానమైన, స్త్రీ, క్వ = ఎచ్చట, అస్తు = ఉండును. (యద్వా = లేదా) రతిః = రతీదేవి, (మన్మథుని భార్య) ప్రియస్య = తన ప్రియుఁడైన మన్మథునియొక్క, ధనుః = పుష్ప

ధనుస్సును హృదా = హృదయముచే పరిరభ్య = కౌగలించుకొని, అనుమర్తుం = భర్తను వెంబడించి మరణించుటకు, చితార్చిషి = చితాగ్నియందు (శ్మశానాగ్నియందు). అశేతకిమ్ = శయనించినదా ఏమి.

వి॥ విరహాగ్నియందు శయనించి ఱొమ్మున పద్మములనుంచుకొని యున్న యా దమయంతి, ప్రియుడైన మన్మథుని పుష్పధనుస్సును కౌగలించుకొని యతని ననుగమించుటకై చితాగ్నియందు శయనించిన రతీదేవియా యని చెప్పుటవలన నిచ్చట నుత్ప్రేక్ష.

## సమాసములు :

*హృదయదత్త సరోరుహయా :* హృదయే దత్తాని = హృదయ దత్తాని. హృదయ దత్తాని, సరోరహాణి యస్యాస్సా. హృదయదత్త సరోరుహా, తయా హృదయదత్త సరోరుహయా.

*సదృక్ :* సమానా దృశ్యత ఇతి = సదృక్.

*వియోగ నిమగ్నయా :* వియోగే నిమగ్నా = వియోగ నిమగ్నా, తయా = వియోగ నిమగ్నయా.

*ప్రియధనుః :* ప్రియస్యధనుః = ప్రియధనుః. తత్ = ప్రియధనుః.

*చితార్చిషి :* చితాయాః అర్చిః = చితార్చిః. తస్మిన్ = చితార్చిషి.

## భావము :

ఆ దమయంతి విరహాగ్నియందు మునిగి తాపము సహింపలేక, తన హృదయముపై తామరపూలను ధరించినది. అట్టి దశలోనున్న యామెకు సాటియైన వారెవరుః ఎవరునులేరు. లేదా, భర్తయైన మన్మథుఁడు దగ్ధముకాగా, ఆతని పూవిల్లునుఁ గౌగలించుకొని యతనిననుగమించుట కుద్యుక్తురాలై చితాగ్నియందు శయనించిన రతీదేవియా యనియైనను నామె చెప్పదగియున్నది. ఈ దమయంతి విరహాగ్నియందు మునిగి తామరపూలను, తన యురమునఁ దాల్చినది. రతీదేవియు పుష్పధనుస్సునుఁ గౌగలించుకొని చితాగ్నియందు శయ

నించినది. కాన నీ దమయంతికి నా రతీదేవి సాటియైనదని చెప్పవచ్చును. దమయంతీ సౌందర్యము రతీ సౌందర్యము నతిశయించియున్నదని దీనిచే సూచితము. ॥౨౩॥

శ్లో॥ అనలభావమియం స్వనివాసినో
న విరహస్య రహస్యమబుద్ధ్యత।
ప్రశమనాయ విధాయ తృణాన్యసూ-
జ్జ్వలతి తత్ర యదుజ్ఝితుమైహత॥ ౨౨

ప॥వి॥ అనలభావమ్ । ఇయం । స్వనివాసినః । న । విరహస్య । రహస్యమ్ । అబుద్ధ్యత । ప్రశమనాయ । విధాయ । తృణాని । అసూన్ । జ్వలతి । తత్ర । యత్ । ఉజ్ఝితుమ్ । ఐహత ।

టీక॥ ఇయం = ఈ దమయంతి, స్వనివాసినః; స్వ = తన యందు, నివాసినః = ఉన్నటువంటి, విరహస్య = నలవియోగముయొక్క, రహస్యం = జమ్మిచెట్టులో నగ్నివలె గుప్తమైన, అనల భావం = అగ్నిత్వమును, (నలుని రాహిత్యమును) నాఽబుద్ధ్యత = తెలిసికొనలేదు. యత్ = ఎందువలన, తత్ర = ఆ విరహాగ్ని, జ్వలతి సతి = మండు చుండగా, ప్రశమనాయ = దానిని చల్లార్చుటకు, అసూన్ = ప్రాణములను, తృణాని = గడ్డిపోచలుగా, విధాయ = చేసి, ఉజ్ఝితుం = వదలిపెట్టుటకు (పడవేయుటకు) ఐహత = కోరినది.

వి॥ అగ్నిని చల్లార్చుటకు గడ్డిపోచలు వేయుట సరిపడదు కాన విషమాలంకారభేదము.

సమాసములు :

అనలభావమ్ : 1. అవిద్యమానః నలః యస్మిన్ సః = అనలః. అనలస్య భావః = అనలభావః. తమ్ = అనలభావమ్.

2. అనలస్యభావః. అనలభావః = తమ్ = అనలభావమ్.

స్వనివాసినః: నివాసః అస్య అస్తీతి = నివాసీ, స్వస్మిన్నివాసీ = స్వనివాసీ. తస్య = స్వనివాసినః.

భావము :

ఈ దమయంతి తన యందున్న నలవియోగమనెడి విరహముయొక్క రహస్యమునుఁ దెలిసికొనలేదు. ఆ రహస్య మీమెయందు జమ్మిచెట్టునందగ్ని వలె నిగూఢమైనది. అదెట్లనగా-ఈమె యందలి నలవిరహము, నలరాహిత్యమై యనలమైనది. అనలమనగా నగ్నిగదా! జమ్మిచెట్టునందును, అగ్ని గూఢముగ నుండునని ప్రసిద్ధి. అట్లే యామెయందలి నలవిరహము, అగ్నియై వెలుంగు చుండినది. కాని యామె తన యందలి నలవిరహమును నలవియోగముగ భావించినది గాని యనలరూపమగు నగ్నిగ గ్రహించలేదు. ఇట్లు తనయందు మండుచున్నట్టి యా యనలమును (అగ్నిని) చల్లార్చుటకు, తన ప్రాణములను తృణములుగఁజేసి (వానిని వదలుటకు) యాయగ్ని యందు పడవేయుటకు నిచ్చగించినది. మండెడి యగ్నిలోఁ దృణములు వేయుటవలన మంట చల్లారదు కాన నామె, తన ప్రాణములను తృణీకరించి (నిర్లక్ష్యముగావించి) ప్రాణపరి త్యాగమునకు సిద్ధమైనదని యాశయము ॥౨౨॥

శ్లో॥ ప్రకృతి రేతు గుణస్స న యోషితాం
కథమిమాం హృదయం మృదు నామ యత్।
తదిషుభిః కుసుమైరపి ధున్వతా
సువివృతం విబుధేన మనోభువా॥ ౨౩

ప॥వి॥ ప్రకృతిః । ఏతు । గుణః । సః । న । యోషితాం । కథమ్ । ఇమాం।
హృదయం । మృదు । నామ । యత్। తత్।ఇషుభిః । కుసుమైః । అపి ।
ధున్వతా । సువివృతం । విబుధేన । మనోభువా.

టీక॥ యోషితాం=స్త్రీలయొక్క, హృదయం=మనస్సు, మృదు నామ ఇతి యత్=మెత్తనిదని ప్రసిద్ధి ఏది గలదో, సః=ఆ ప్రకృతి సిద్ధమైన, గుణః=గుణము, (మెత్తఁదనము) ఇమాం=ఈ దమయంతిని, కథం=ఎట్లు, నైతు=పొందదు (తప్పక పొందును). (కుతః=ఏలయనగా) తత్=ఆ మెత్తఁదనమనెడి గుణము, కుసుమైః=పుష్పములనెడి, ఇషుభి రపి=బాణములచేతను, ధున్వతా=కంపింపఁజేసెడి (భయపెట్టుచెడి)

విబుధేన = దేవుఁడైన (విద్వాంసుడైన) మనోభువా = మన్మథునిచే, సువివృతం = చక్కగా వివరింపఁబడినది.

సమాసములు :

సువివృతమ్ : సుష్ఠువివృతమ్ = సువివృతమ్.

మనోభువా : మనసి భవతీతి మనోభూః. తేన = మనోభువా.

భావము :

స్త్రీల హృదయము మెత్తనిదనెడి ప్రసిద్ధి గలదు. ఆ ప్రసిద్ధిచే నేర్పడిన యా మెత్తని గుణము, స్త్రీయైన దమయంతికి మాత్రమేల యుండదు. తప్పక యుండవలసినదే. ఈ విషయమును పండితుఁడైన మన్మథుడే వివరించి యున్నాడు. ఎట్లనగా - సాధారణముగా బాణములు లోహముతో చేయఁబడి మిక్కిలి పదనుగల్గి ప్రయోగించి నంత మాత్రముననే ఎక్కువ బాధనుఁ గల్గించును. కాని స్త్రీల హృదయము సుకుమారమని యెఱింగిన వాడై మన్మథుఁడు దమయంతిపై మెత్తని పుష్పబాణములనే ప్రయోగించి, తన విజ్ఞతను వెల్లడి జేసికొనెను. దమయంతీ హృదయము పుష్పముల కంటెను సుకుమార మని సారాంశము. ॥౨౩॥

శ్లో॥ రిపుతరా భవనాదవినిర్యతీం
విధురుచిర్గృహజాలబిలైర్ను తామ్।
ఇతరథాత్మనివారణ శఙ్కయా
జ్వలయితుం బిసవేషధరాఽవిశత్॥ ౨౪

ప॥వి॥ రిపుతరా । భవనాత్ । అవినిర్యతీం । విధురుచిః । గృహజాలబిలైః । ను । తామ్ । ఇతరథా । ఆత్మనివారణ శఙ్కయా । జ్వలయితుం । బిసవేషధరా । అవిశత్.

టీక॥ రిపుతరా = మిక్కిలి ద్వేషించెడి, విధురుచిః = చంద్రకాంతి, భవనాత్ = గృహము నుండి, అవినిర్యతీం = వెలుపలికిరానటువంటి, తాం = ఆ దమయంతిని, జ్వలయితుం = సంతాపపఱచుటకు, ఇతరథా =

మఱియొక విధముగా - అనగా స్వస్వరూపమున, (ప్రవేశే = ప్రవేశించినచో), ఆత్మ నివారణ శంకయా; ఆత్మ = చంద్రకాంతియైన తనకు, నివారణ శంకయా = నిషేధ మేర్పడు ననుభయముతో, బిస వేషధరాః; బిస = తామరతూండ్ల యొక్క, వేష = వేషమును, ధరా = ధరించినదై, గృహజాలబిలైః; గృహజాల = ఇంటిగవాక్షములయొక్క, బిలైః = రంధ్రములతో, అవిశన్ను = ప్రవేశించినదా ఏమిః

వి॥ విరహసంతాపముతో బాధపడెడి దమయంతికి శిశిరోపచారములకై తేఁబడిన తామరతూండ్లు నిరంతరము గృహము లోపలనే యుండి వెలుపలికి రాని దమయంతిని బాధించుటకై గవాక్షరంధ్రముల నుండి గుట్టుగా లోపలఁ బ్రవేశించిన చంద్రకిరణములాః యని చెప్పుట వలన నుత్ప్రేక్ష.

## సమాసములు :

రిపుతరా : అత్యంతంరిపుః = రిపుతరా.

అవినిర్యతీమ్ : న వినిర్యతీ = అవినిర్యతీ, తామ్ = అవినిర్యతీమ్।.

విధురుచిః : విధోఃరుచిః = విధురుచిః.

గృహజాలబిలై : గృహస్య జాలాని = గృహజాలాని. గృహజాలానాం బిలాని = గృహజాల బిలాని. తైః = గృహజాలబిలైః.

ఆత్మనివారణశంకయా : ఆత్మనః నివారణమ్ = ఆత్మనివారణమ్. ఆత్మనివారణాత్ శంకా = ఆత్మనివారణశంకా. తయా = ఆత్మనివారణశంకయా.

బిసవేషధరా : బిసానాం వేషః = బిసవేషః. బిసవేషం ధారయతీతి = బిసవేషధరా.

## భావము :

ఆ దమయంతికి చంద్రకాంతి మిక్కిలి శత్రువు, ఏ విధముగనైనను, ఆమెను బాధించుట కది కనిపెట్టి యుండినది. దమయంతి రాజభవనము నుండి వెలుపలికి వచ్చినచో ఆమెను బాధించుటకు చంద్రకాంతికి వీలు పడియుండెడిది. కాని యామె వెలుపలికిరాక లోననే యుండుటవలన, చంద్రకాంతి గుట్టుగా

గవాక్షరంధ్రములనుండి లోపలికిఁ బ్రవేశించి శిశిరోపచారములకై తెచ్చిన తామరతూండ్లయొక్క రూపమును వహించి యుండినది. వియోగ బాధ ననుభవించుచున్న దమయంతికి శిశిరోపచారములకై తామరతూండ్లు తేఁబడినవి. అవి దమయంతిని బాధించుటకై గుట్టుగా లోనఁ బ్రవేశించిన చంద్రకిరణములవలె కానవచ్చు చుండినవి. విరహ బాధను వృద్ధిచేసెడి చంద్ర కిరణము ప్రవేశించుటకు వలనుపడని, గృహ మధ్యభాగమున దమయంతి యుండి, శిశిరోపచారములనుఁ బొందుచున్నదని సారాంశము. ॥౨౪॥

శ్లో॥ హృది విదర్భభువోఽశ్రుభృతి స్ఫుటం
వినమదాస్యతయా ప్రతిబింబితమ్।
ముఖదృగోష్ఠమరోపి మనోభువా
తదుపమా కుసుమాన్యఖిలాః శరాః॥ ౨౫

ప॥వి॥ హృది। విదర్భభువః। అశ్రుభృతి। స్ఫుటం। వినమదాస్యతయా। ప్రతిబింబితం। ముఖదృగోష్ఠమ్। అరోపి। మనోభువా। తదుపమాకుసుమాని। అఖిలాః। శరాః.

టీక॥ విదర్భభువః = దమయంతికి, వినమదాస్యతయా; వినమత్ = వంగిన, ఆస్యతయా = ముఖము కలుగుటచే, అశ్రుభృతి = కన్నీళ్లను ధరించిన, హృది = వక్షఃస్థలమునందు, స్ఫుటం = స్పష్టముగా, ప్రతిబింబితం = ప్రతిఫలించిన, ముఖదృగోష్ఠమ్ = ముఖ = మోము, దృక్ = కన్నులు, ఓష్ఠం = పెదవులు అనునీయైదును, మనోభువా = మన్మథునిచే, తదుపమాకుసుమాని; తత్ = ఆ ముఖాదులకు, ఉపమాకుసుమాని = ఉపమాన పుష్పములగు పద్మము, కలువల జంట, వేగిపూలజంటయను, అఖిలాఃశరాః = తనకున్న సమస్త బాణములుగా, ననగా పంచబాణములుగా, అరోపి = ఎక్కుపెట్టఁబడినది.

వి॥ దమయంతియొక్క వక్షఃస్థలముపైనఁ జారిన, కన్నీటిపై ప్రతిఫలించిన యామె మోము, కన్నులు, పెదవులను నీయైదు అవయవములును, వానికుపమాన పుష్పములగు పద్మము, కలువలజంట వేగిపూలజంట యను పంచబాణములుగ, మన్మథునిచే నాటఁబడినవా యని యుత్ప్రేక్ష.

## సమాసములు :

విదర్భభువః: విదర్భేషు భవతీతి = విదర్భభూః. తస్యాః = విదర్భభువః.

వినమదాస్యతయా : వినమత్ ఆస్యం యస్యాస్సా = వినమదాస్యా. వినమదాస్యాయాః భావః = వినమదాస్యతా. తయా = వినమదాస్యతయా.

ముఖదృగోష్ఠమ్ : ముఖం చ, దృశౌ చ, ఓష్ఠౌ చ = ముఖదృగోష్ఠమ్.

అశ్రుభృత్ : అశ్రూణి బిభర్తీతి = అశ్రుభృత్. తస్మిన్ = అశ్రుభృతి.

మనోభువా : మనసః భవతీతి = మనోభూః. తేన = మనోభువా.

తదుపమాకుసుమాని : ఉపమాభూతాని కుసుమాని = ఉపమాకుసుమాని. తస్య ఉపమాకుసుమాని = తదుపమాకుసుమాని.

## భావము :

మన్మథ వేదనచే దమయంతి తలవంచుకొని కన్నీరు కార్చుచుండెను. అట్లు కారిన కన్నీరు ఆమె వక్షఃస్థలముపైనఁ బడగా, ఆ నీటియందు ఆమె యొక్క మోము, నేత్రములు, పెదవులు ప్రతిఫలించినవి. అట్లు ప్రతిఫలించిన ముఖాదులు, పంచబాణుఁడగు మన్మథుఁడు ఆమె రొమ్ముపైన నాటిన, పద్మము, కలువలజంట, వేగిపూల జంటయను నా యవయవములకు నుపమానములైనట్టి యైదుపుష్పబాణములా యని భావింపఁబడినవి. ఆమె ముఖము పద్మమువలెను, ఆమె కనులు కలువల వలెను, ఆమె పెదవులు వేగిపూల వలెను నున్నవని తాత్పర్యము ॥౨౫॥

శ్లో॥ విరహపాండుకపోలతలే విధుః
వ్యధిత భీమభువః ప్రతిబింబితః।
అనుపలక్ష్యసితాంశుతయా ముఖం
నిజసఖం సుఖమంకమృగార్పణాత్॥ ౨౬

ప॥వి॥ విరహపాండు కపోలతలే । విధుః। వ్యధిత। భీమభువః। ప్రతిబింబితః । అనుపలక్ష్యసి తాంశుతయా । ముఖం । నిజసఖం । సుఖమ్ । అంకమృగార్పణాత్.

టీక॥ విధుః = చంద్రుడు, భీమభువః = దమయంతియొక్క, విరహపాండుక పోలతలే; విరహ = వియోగముచే, పాండు = తెల్లనైన, కపోలతలే = కణతలయందు, ప్రతిబింబితః = ప్రతిఫలించినవాడై, అనుపలక్ష్య సితాంశుతయా; అనుపలక్ష్య = కంటికికానరాని, సితాంశుతయా = తెల్లని కిరణములు గలిగియుండుటచే, సుఖం = సులభముగా, అంకమృగా ర్పణాత్; అంకమృగ = నల్లని కళంకమైనమృగమును, అర్పణాత్ = సమర్పించుట వలన, ముఖం = దమయంతీ ముఖమును, నిజసఖం = తనకు సమానమైనదిగ, వ్యధిత = చేసెను.

వి॥ ఇచ్చట చంద్రుడు కపోలములతో సమాన వర్ణము కల్గినట్లు వర్ణించుటచే, సామాన్యాలంకారము. "గుణ సామ్యముచే నొకవస్తువు మఱియొక వస్తువుతో నైక్యము పొందినచో సామాన్యాలంకారము."

## సమాసములు :

*విరహపాండుకపోలతలే :* విరహేణ పాండు = విరహపాండు. కపోల యోస్తలం = కపోలతలమ్. విరహపాండు చతత్ కపోలతలంచ = విరహపాండు కపోలతలమ్. తస్మిన్ = విరహపాండు కపోలతలే.

*భీమభువః :* భీమాత్ భవతీతి = భీమభూః. తస్యాః భీమభువః.

*అనుపలక్ష్యసితాంశుతయా :* ఉపలక్షితుమశక్యాః = అనుపలక్ష్యాః. సితాశ్చతే అంశవశ్చ = సితాంశవః. అనుపలక్ష్యాః సితాంశవః యస్యసః = అను పలక్ష్య సితాంశుః. అనుపలక్ష్య సితాంశోః భావః. అనుపలక్ష్య సితాంశుతా. తయా = అనుపలక్ష్య సితాంశుతయా.

*అఙ్కమృగార్పణాత్ :* అఙ్కశ్చా సౌ మృగశ్చ = అఙ్కమృగః. అఙ్క మృగస్య అర్పణమ్ = అఙ్కమృగార్పణం. తస్మాత్ = అఙ్కమృగార్పణాత్.

## భావము :

దమయంతియొక్క కణతలు విరహముచే తెల్లనై యుండినవి. చంద్రుడు తెల్లని కిరణములచే తెల్లనై యుండెను. కణతలకును చంద్రునకు సమాన వర్ణముం

డుటచే రెంటికిని, భేదము తెలియ శక్యముగాక యుండినది. అందువలన, చంద్రుఁడు దానియందు ప్రతిఫలించి నల్లని కళంకమగు జింకను సుఖముగా దానియందు ప్రవేశపెట్టి, తనకు దమయంతీ ముఖమును సమానము గావించెను. దోషముకలవారు, తమ దోషమును, దోషములేని వస్తువునందు సంక్రమింపఁజేసి దానిని తమతో సమానముఁ గావించుకొనెదరు. అట్లే చంద్రుడు కళంకము లేని దమయంతీ ముఖము నందు తన కళంకమును సంక్రమింపఁజేసి, దానిని తనతో సమానముఁగావించుకొనెను. దమయంతిమోములో చంద్రునికి వైర మున్నను, తాను కళంకరూపమైన జింకను దమయంతిమోమునకు బహూక రించి, దానితో మైత్రి సలిపెనని కొందఱు వ్యాఖ్యానింతురు. ॥౨౬॥

శ్లో॥ విరహతాపిని చందనపాంసుభిః
వపుషి సార్పితపాండిమమండనా।
విషధరాభబిసాభరణా దధే
రతిపతిం ప్రతి శంభువిభీషికామ్॥ ౨౭

ప॥వి॥ విరహతాపిని । చందనపాంసుభిః । వపుషి । సా । అర్పితపాండిమ మండనా । విషధరాభబిసాభరణా । దధే । రతిపతిం । ప్రతి । శంభు విభీషికామ్.

టీక. సా = ఆదమయంతి, విరహతాపిని = విరహసంతాపముగల, వపుషి = శరీరమందు, చందనపాంసుభిః = (భస్మమువలెతెల్లనైన) చందన రేణు వులచే, అర్పితపాండిమమండనా; అర్పిత = సమర్పింపఁబడిన, పాం డిమ = తెల్లదనమును, మండనా = అలంకారముగాఁగల్గినదై, విషధరాభ బిసాభరణా; విషధరాభ = శేషసర్పమువంటి, బిస = తామరతూండ్లను, ఆభరణా = ఆభరణముగఁగలదై, రతిపతింప్రతి = మన్మథునిఁగూర్చి, శంభువిభీషికాం = శివుడే యీమెయను విశేషభయోత్పాదకత్వమును, దధే = ధరించెను. (నూనం = నిశ్చయము).

వి॥ చందనరేణువులచేఁ దెల్లఁదనమునుఁదాల్చిన శరీరముచేతను, శేషసర్ప మునుఁ బోలిన బిసాభరణములతోఁడను ఈ దమయంతి శివుడే యను భయమును మన్మథునకుఁ గల్గించుటవలన నామె శివుడేయను సంభావ

నచే నిట ఉత్ప్రేక్ష. వ్యంజకములనుఁ బ్రయోగించనందువలన నదిగమ్యము.

**సమాసములు :**

*విరహతాపిని:* విరహేణతాపః = విరహతాపః. విరహతాపః అస్మిన్ అస్తీతి = విరహతాపి. తస్మిన్ = విరహతాపిని.

*చందనపాంసుభిః :* చందనస్య పాంసవః = చందనపాంసవః, తైః = చందనపాంసుభిః.

*అర్పితపాండిమమండనా:* అర్పితశ్చాసౌపాండిమాచ = అర్పితపాండిమా. అర్పితపాండిమైవ మండనం యస్యాస్సా = అర్పితపాండిమ మండనా.

*విషధరాభబిసాభరణా :* విషధరస్య ఆభేద ఆభా యస్యతత్ = విషధరాభమ్. విషధరాభం చ తత్ బిసం చ విషధరాభబిసమ్ = విషధరాభబిసమ్ ఆభరణం యస్యాస్సా = విషధరాభబిసాభరణా.

*శంభువిభీషికామ్ :* విశేషేణ భీషయతీతి విభీషికా, శంభురితివిభీషికా = శంభువిభీషికా. తామ్ = శంభు విభీషికామ్.

**భావము :**

ఆ దమయంతికి విరహతాపము వలన శరీరమందు చందన రేణువులనుఁ బట్టించుటచే శరీరమందు తెల్లఁదనము వ్యాపించి యది శరీరమున కలంకారముగ నుండినది. మఱియు సంతాపము తగ్గుటకై భుజములు మున్నగు నవయవములకు శేషసర్పమువంటి తామరతూఁడ్లను ధరించినది. భస్మపుపూతవంటి చందన చూర్ణమును శరీరమునకుఁ బట్టించు కొనుటవలన, శేషసర్పము వంటి తామరతూండ్లనుఁ జుట్టుకొనుట వలనను నా దమయంతి, మన్మథునకు శివుడనెడి భయమునుఁ గొల్పుచుండినది. శివుని శరీరమునకు భస్మపు పూతయు నాగాభరణములు ప్రసిద్ధములు గదా. ॥౨౮॥

శ్లో॥ వినిహితం పరితాపిని చందనం
హృది తయా భృతబుద్బుదమాబభౌ।
ఉపనమన్ సుహృదం హృదయేశయం
విధురి వాంకగతోడుపరిగ్రహః॥ ౨౯

**ప॥వి॥** వినిహితం । పరితాపిని । చందనం । హృది । తయా । ధృతబుద్బు దం । ఆబభౌ । ఉపనమన్ । సుహృదం । హృదయేశయం । విధుః । ఇవ । అంకగతోడు పరిగ్రహః.

**టీక॥** తయా = ఆ దమయంతిచే, పరితాపిని = విరహతాపముగల, హృది = వక్షఃస్థలమునందు, వినిహితం = ఉంచఁబడినదై, ధృతబుద్బుదం = ధరించఁబడిన బుడకలుగల, చందనం = చందనము, సుహృదం = చెలికాడైన, హృదయేశయం = మన్మథుని, ఉపసమన్ = సమీపించుచున్న, అంకగతోడుపరిగ్రహః; అంకగత = సమీపమందున్న, ఉడుపరిగ్రహః = తారలనెడిభార్యలుగల, విధురివ = చంద్రుడో యనునట్లు, ఆబభౌ = ప్రకాశించెను.

వి॥ దమయంతి హృదయమున ఉంచఁబడిన చందనము తాపముచే నుడికి చుట్టు బుడకలతోఁ గూడి యుండగా నది మిత్రుడైన మన్మథుని తారకా పరివారముతోఁ గూడి చూడవచ్చిన చంద్రుఁడో యని చెప్పఁ దగియున్న దని వర్ణించుట వలన నుత్ప్రేక్ష.

## సమాసములు :

ధృతబుద్బుదం : ధృతాః బుద్బుదాః యస్మిన్ తత్ = ధృతబుద్బుదమ్.

హృదయేశయం : హృదయే శేతే ఇతి హృదయేశయః. తమ్ = హృదయేశయమ్.

*అంగకతోడుపరిగ్రహః* : అంకంగతాని = అంకగతాని. అంకగతాని చతాని ఉడూని = అంకగతోడూని. అంకగ తోడూని పరిగ్రహాః యస్యసః, అంకగతోడు పరిగ్రహః.

## భావము :

ఆ దమయంతి సంతాపముగల తన హృదయముపై చందనపు ముద్దను పెట్టుకొనినది. అది వేడికి చక్కగా నుడికి చుట్టు బుడకలు పెట్టినది. అది

చూడ-చంద్రుడు తారకాపరివారముతోఁ గూడి హృదయమందున్న మిత్రుఁడగు మన్మథునిఁ జూడవచ్చెనా యనునట్లుండెను. ॥౨౮॥.

శ్లో॥ స్మరహుతాశనదీపితయా తయా
బహు ముహుః సరసం సరసీరుహమ్।
శ్రయితుమర్ధ పథే కృతమంతరా
శ్వసిత నిర్మితమర్మర ముజ్ఝితమ్॥ ౨౯

ప॥వి॥ స్మరహుతాశన దీపితయా । తయా । బహు । ముహుః । సరసీరుహమ్ । శ్రయితుమ్ । అర్ధపథే । కృతమ్ । అంతరా । శ్వసిత నిర్మితమర్మరమ్ ।ఉజ్ఝితమ్.

టీక॥ స్మరహుతాశన దీపితయా; స్మర = మన్మథుఁడను, హుతాశన = అగ్నిచే, దీపితయా = పరితాపముఁ బొందింపఁబడిన, తయా = ఆ దమయంతిచే, బహు = మిక్కిలి, సరసం = తడిసిన, సరసీరుహం = పద్మము, ముహుః = పలుమాఱు, శ్రయితుం = సేవించుటకు, అర్ధపథే = సగము త్రోవయందు, కృతం = తేఁబడినదై, అంతరా = మధ్యమార్గమున, శ్వసిత నిర్మిత మర్మరమ్; శ్వసిత = నిట్టూర్పులచే, నిర్మిత = చేయఁబడిన, మర్మరం = మర్మరధ్వనిగలదిగ, ఉజ్ఝితం = విడువఁబడినది.

వి॥ దమయంతీ తాపమునడంచుటకై తడిసిన తామర పూలు తెచ్చుచుండగా, నామె వేడినిట్టూర్పులచే నవి త్రోవ నడుమలోనే యెండిపోయి మర్మర ధ్వనులు గావించెనని చెప్పుటలో, అట్లు ఎండిపోవుటకు సంబధము లేకపోయినను సంబంధముఁ జెప్పుటచే, సంబంధాతిశయోక్తి.

సమాసములు :

స్మరహుతాశనదీపితయా : స్మరఏవ హుతాశనః, = స్మరహుతాశనః. స్మరహుతాశనేన దీపితా = స్మరహుతాశనదీపితా. తయా = స్మరహుతాశన దీపితయా.

సరసమ్ : రసేన సహితం = సరసమ్.

అర్ధపథే : అర్ధంపథః = అర్ధపథః. తస్మిన్ = అర్ధపథే.

శ్వసితనిర్మితమర్మరమ్ : శ్వసితేననిర్మితమ్. శ్వసితనిర్మితమ్, శ్వసిత నిర్మితం మర్మరం యస్యతత్ = శ్వసితనిర్మిత మర్మరమ్.

**భావము :**

మన్మథాగ్నిచే, దమయంతి సంతాపము మెండుకాగా, అప్పుడే కోసిన తడియారని తామరపూవునుఁ దెప్పించినది. కాని యా తామరపూవు, ఆమె వేడి నిట్టూర్పులచే వెంచిపోయి మర్మరధ్వనినిఁ జేయసాగినది. అందువలన నా తామరపూవును పారవైచెను. ఇందువలన దమయంతియొక్క నిట్టూర్పులు మన్మథాగ్నిచే మిక్కిలి వేడిమినిఁ బొందినవని యాశయ మేర్పడు చున్నది. ॥౨౯॥

శ్లో॥ ప్రియకరగ్రహమేవమవాప్స్యతి
స్తనయుగం తవ తామ్యతి కిం న్వితి।
జగదతుర్నిహితే హృది నీరజే
దవథు కుడ్మలనేన పథుస్తనీమ్॥ ౩౦

ప॥వి॥ ప్రియకరగ్రహమ్ । ఏవమ్ । అవాప్స్యతి । స్తనయుగం । తవ । తామ్యతి । కిం । ను । ఇతి । జగదతుః । నిహితే । హృది । నీరజే । దవథుకుడ్మలనేన । పృథుస్తనీమ్.

టీ॥ హృది = వక్షఃస్థలమునందు, నిహితే = ఉంచఁబడిన, నీరజే = రెండు పద్మములు, దవథుకుడ్మలనేన; దవథు = తాపముచే, కుడ్మలనేన = ముడుచుకొనిపోవుటచేత, పృథుస్తనీం = గొప్ప స్తనములు గల్గిన దమయంతినిఁ గూర్చి, తవ = నీ యొక్క, స్తనయుగం = చనుదోయి, ఏవం = ఈ పద్మములు ముడుచుకొనిన విధముగా, ప్రియకరగ్రహమ్; ప్రియ = ప్రియునియొక్క, కరగ్రహం = చేతిచే గ్రహణమును (మర్ధనమును), అవాప్స్యతి = పొందఁగలదు, కిన్ను = ఏల, తామ్యతీతి = కష్టపడుచున్నదని, జగదతుః = చెప్పినవో యని నట్లుండినవి. (నూనం = నిశ్చయము).

వి॥ దమయంతి వక్షః స్థలమునందుంచఁబడిన పద్మములు రెండును తాపముచే మొగ్గలవలె ముడుచుకొని పోవుట చూడనవి దమయంతిని గూర్చి "నీ చను దోయి ప్రియుని చేతులలో పడి యీ విధముగా, నలిగి ముడుచుకొనునని చెప్పినదో" యన్నట్లున్నదని వర్ణించుటచే నిఁట నుత్ప్రేక్ష.

## సమాసములు :

*ప్రియకరగ్రహమ్ :* ప్రియస్యకరః = ప్రియకరః. ప్రియకరేణ గ్రహః = ప్రియకరగ్రహః. తమ్ = ప్రియకరగ్రహమ్.

*స్తనయుగమ్ :* స్తనయోః యుగమ్ = స్తనయుగమ్.

*దవథుకుడ్మలనేన :* దవథునా కుడ్మలనం = దవథుకుడ్మలనమ్, తేన = దవథు కుడ్మలనేన.

*పృథు స్తనీమ్ :* పృథూ స్తనౌ యస్యాస్సా = పృథు స్తనీ. తాం = పృథు స్తనీమ్.

## భావము :

స్మరుని తాపముచే బాధపడుచున్న దమయంతియొక్క వక్షఃస్థలమునందు రెండు తామరపూవులుంచఁబడినవి. అవి ఉంచిన వెంటనే యామె విరహతాపముచేత కమలి ముడుచుకొని పోదొడగినవి. అప్పుడారెండు పూవులును, దమయంతినిఁ గూర్చి "నీ చనుదోయిఁగూడ నీ విధముగనే ప్రియునిచే గ్రహింపఁబడి మర్దితమై, తాపమునకు ముడుచుకొని పోయిన మావంటి తామర పూవులవలెనే, మొగ్గబారును. కాన నవి ఏల బాధపడుచున్నవి" అని చెప్పినట్లు కానవచ్చు చుండినవి. దమయంతీ తాపాతిశయముచే దానికి శిశిరోపచారముగ నుంచఁబడిన పద్మము లామె శరీరతాపముచే కమలి మొగ్గబారిసందువలన, నామె సంతాపమెంత మిక్కుటమో దీనిచే సూచితము. ॥30॥

శ్లో॥ త్వదితరో న హృదాఽపి మయా ధృతః
పతిరితీవ నలం హృదయేశయమ్।

స్మరహవిర్భుజి బోధయతి స్మ సా
విరహపాండుతయా నిజశుద్ధతామ్॥ ३०

ప॥వి॥ త్వదితరః । న । హృదా । అపి । మయా । ధృతః । పతిః । ఇతి । ఇవ । నలం । హృదయేశయమ్ । స్మరహవిర్భుజి । బోధయతి । స్మ । సా । విరహపాండుతయా । నిజశుద్ధతామ్.

టీక॥ సా = ఆ దమయంతి, హృదయేశయం = హృదయమందున్నటువంటి, నలం = నలుని, త్వదితరః = నీకంటె నితరుఁడుఁలేదా సమానుఁడు, మయా = నాచే, హృదాఽపి = మనస్సుచేతను, నధృతః = చింతింపఁబడ లేదు; ఇతి = అని, నిజశుద్ధతామ్ = తన పరిశుద్ధిని, పాండువర్ణమును, విరహపాండుతయా; విరహ = వియోగమువలని, పాండుతయా = తెల్లఁదనమునువ్యాజముచే, స్మరహవిర్భుజి = మన్మథుఁడనెడి యగ్నిహోత్రమందు. బోధయతిస్మేవ = బోధించుచుండెనో యనునట్లుండెను.

వి॥ సీతాదేవి యగ్నిప్రవేశముచేసి తన శుద్ధిని శ్రీరామచంద్రునకు బోధించిన విధముగా, దమయంతి మదనాగ్నియందు మునింగి తన శుద్ధిని నలునకు బోధించెనో యను నట్లుండెనని చెప్పుటవలన నిట నుత్ప్రేక్ష. ఇవ శబ్దప్రయోగముచే నది వాచ్యము.

సమాసములు :

త్వదితరః : త్వత్ ఇతరః = త్వదితరః.

హృదయేశయమ్ : హృదయే శేతే ఇతి = హృదయేశయః. తమ్ = హృదయేశయమ్.

స్మరహవిర్భుజి : స్మరఏవహవిర్భుక్ = స్మరహవిర్భుక్, తస్మిన్ = స్మరహవిర్భుజి.

విరహపాండుతయా : పాండోః భావః = పాండుతా. విరహేణ పాండుతా = విరహపాండుతా. తయా = విరహపాండుతయా.

నిజశుద్ధతామ్ : శుద్ధాయాః భావః = శుద్ధతా. నిజా చ సా శుద్ధతాచ = నిజశుద్ధతా. తామ్ = నిజశుద్ధతామ్.

భావము :

మన్మథాగ్ని యందు మునింగి విరహముచేఁ దెల్లబారిన దమయంతి తన హృదయమందున్న నలునిఁగూర్చి నీ కంటె నితరుఁడైన వానిని గాని నీకు సమానమైన వానినిఁ గాని నేను భర్తగా మనస్సులోఁ గూడఁ జింతింపలేదు; అని తనశుద్ధిని, అగ్ని ప్రవేశముచే తన శుద్ధిని సీతాదేవి శ్రీరామ చంద్రునికిఁ జెప్పినటు నలునకుఁ జెప్పుచున్నట్లు కానవచ్చినది. ॥౩౦॥

శ్లో॥ విరహతప్తతదంగనివేశితా
కమలినీ నిమిషద్దలముష్టిభిః।
కిమపనేతు మచేష్టత కిం పరా
భవితుమై హత తద్దవథుం పృథుమ్॥ ౩౧

ప॥వి॥ విరహతప్త తదంగ నివేశితా । కమలినీ । నిమిషద్దలముష్టిభిః । కిమ్। అపనేతుమ్ । అచేష్టత । కిం । పరాభవితుమ్ । ఐహత । తద్దవథుం । పృథుమ్.

టీక॥ విరహతప్త తదంగ నివేశితా; విరహ = వియోగముచే, తప్త = తాపము చెందిన, తదంగ = ఆ దమయంతీశరీరమందు, నివేశితా = ఉంచఁబడిన, కమలినీ = తామరతీగె, నిమిషద్దలము ష్టిభిః; నిమిషత్ = ముడుచు కొనిపోవుచున్న, దళ = పత్రములు(రేకులు)అను, ముష్టిభిః = పిడికిళ్లచే, పృథుం = అధికమైన, తద్దవథుం; తత్ = ఆ దమయంతియొక్క, దవ థుం = తాపమును, అపనేతుం = తొలగించుటకు, అచేష్టతకిమ్ = తొడం గెనా? పరాభవితుం = తిరస్కరించుటకు, ఐహత కిమ్ = కోరినదా? యనునట్లుండినది.

వి॥ దమయంతియొక్క తాపమును శమియింపఁ బూనిన తామరలత, తానే, ఆమె శరీరతాపముచే కమలిపోవుటచే నసర్థమునుఁ బొందుట వలన విషమాలంకారము.

కమలి ముడుచుకొని పోవుచున్న తామర పూరేకులు దమయంతి యొక్క తాపమును తొలగించుటకు బూనినట్లున్నవా యనియు, తిరస్క

రింపఁ బూనినట్లున్నవా యనియు చెప్పుటవలన, ఉత్ప్రేక్ష. ఇది విషమాలంకారముచే నుత్థాపితము.

## సమాసములు .

*విరహతప్తతదంగనివేశితా* : విరహేణతప్తం విరహతప్తమ్. విరహతప్తం చ తత్ తదంగంచ విరహతప్తతదంగం.విరహతప్తతదంగే నివేశితా = విరహతప్తతదంగనివేశితా.

*నిమిషద్దలముష్టిభిః* నిమిషంతిచతానిదళానిచ = నిమిషద్దళాని. నిమిషద్దళాన్యేవముష్టయః = నిమిషద్దలముష్టయః. తాభిః = నిమిషద్దలముష్టిభిః.

*తద్దవథుమ్* : తస్యాః దవథుః = తద్దవథుః. తామ్ = తద్దవథుమ్.

## భావము :

విరహతాపముగల యాదమయంతి శరీరముపై నుంచఁబడిన తామరతీగె వెంటనే కమలిముడుచుకొని పోవనారంభించినది. అదిచూడ; ముడుచుకొనిపోవుచున్న దళములనెడి పిడికిళ్లచే తాపముసుఁదొలగింపఁ బూనెనాయనియు తిరస్కరింపఁబూనెనా యనియు కానవచ్చినది. ॥౩౨॥

శ్లో॥ ఇయమనంగశరావలిపన్నగ
క్షతవిసారివియోగవిషాఽవశా ।
శశికలేవ ఖరాంశుకరార్దితా
కరుణనీరనిధౌ నిదధౌ న కమ్॥ ౩౩

ప॥వి॥ ఇయమ్ । అనంగశరావళిపన్నగక్షతవిసారివియోగవిషాఽవశా । శశికలా । ఇవ । ఖరాంశు కరార్దితా। కరుణనీరనిధౌ । నిదధౌ । న।కమ్.

టీక॥ ఇయం = ఈ దమయంతి, అనంగ శరావళి పన్నగక్షతవిసారి వియోగవిషాఽవశా; అనంగ = మన్మథునియొక్క, శరావళి = బాణపంక్తియను, పన్నగ = సర్పములచేతనేర్పడిన, క్షత = కాటుచేత, విసారి = వ్యాపించుచున్న, వియోగ = విరహమనెడి, విష = విషముచేత, అవశా = స్వాధీనముతప్పినదై, ఖరాంశుకరార్దితా; ఖరాంశు = తీక్ష్ణకిరణములుకలసూర్యుని యొక్క, కర = కిరణములచే, అర్దితా = పీడింపఁబడిన, శశికలేవ = చంద్రకళవలె, కమ్ = ఎవనిని, కరుణనీర నిధౌ = దుఃఖసాగరమున, ననిదధౌ = ఉంచలేదు? తప్పక యుంచినది.

వి॥ మన్మథ బాణములను సర్పములుగను వియోగమును విషముగను, రూపించుటవలనను దుఃఖమును సాగరముగ రూపించుటవలనను రూపకము. చంద్రకళవలె దమయంతినిఁ బోల్చుటచేతనుపమ. ఈ రూపకమునకును, ఉపమకును నంగాంగి భావకలనచే సంకరము.

## సమాసములు:

*అనంగశరావళి పన్నగక్షతవిసారి వియోగవిషావశా :* అవిద్యమానమ్ అంగం యస్యసః = అనంగః. అనంగస్యశరాః = అనంగశరాః. అనంగశరాణాం ఆవళిః = అనంగశరావళిః. అనంగశరావళి రేవ పన్నగాః = అనంగ శరావళిపన్నగాః. అనంగశరావళి పన్నగానాం క్షతమ్ = అనంగ శరావళి పన్నగక్షతమ్. అనంగ శరావళి పన్నగక్షతేన విసారి = అనంగ శరావళి పన్నగక్షత విసారి. వియోగ ఏవవిషమ్ = వియోగవిషమ్. అనంగశరావళి పన్నక్షతవిసారి చతత్ వియోగవిషంచ = అనంగశరావళి పన్నగక్షత విసారి వియోగవిషమ్. అనంగశరావళి పన్నగక్షత విసారి వియోగవిషేణ అవశా = అనంగశరావళి పన్నగక్షత విసారివియోగవిషావశా.

*శశికలా :* శశినః కలా = శశికలా.

*ఖరాంశు కరార్దితా :* ఖరాః అంశవః యస్యసః = ఖరాంశుః. ఖరాంశోః కరాః = ఖరాంశుకరాః. ఖరాంశుకరై రర్దితా = ఖరాంశుకరార్దితా.

*కరుణనీరనిధౌ :* కరుణ ఏవనీరమ్ = కరుణనీరం. కరుణనీరస్యనిధిః = కరుణనీరనిధిః. తస్మిన్ = కరుణ నీరనిధౌ.

## భావము :

ఈ దమయంతి మన్మథ బాణములనెడి సర్పములచేఁ గఱువబడినది. దానివలన వియోగమనెడి విషము వ్యాపించుటచే స్వాధీనత లేకపోయినది. అందువలన నామె తీవ్రమైన సూర్యకిరణములచే పీడింపఁబడిన చంద్రకళవలె దుఃఖసాగరమున నెవ్వరిని ముంచదు? అట్టి దశలోనున్న దమయంతిని చూచువారు తప్పక దుఃఖసాగరమున మునగఁగలరు. అనగా రానురాను ఆమెకు వియోగభారము తీవ్రమగుచుండినదని యాశయము. ॥33॥

శ్లో॥ జ్వలతి మన్మథవేదనయా నిజే
హృది తయార్ద్రమృణాలలతార్పితా।
స్వజయినోస్త్రపయా సవిధస్థయో
ర్మలినతామభజద్భుజయోర్భృశమ్॥ ౩౪

ప॥వి॥ జ్వలతి । మన్మథ వేదనయా । నిజే । హృది । తయా । ఆర్ద్రమృణాల లతా । అర్పితా । స్వజయినోః । త్రపయా । సవిధస్థయోః । మలిన తామ్ । అభజత్ । భుజయోః । భృశమ్.

టీక॥ తయా = ఆ దమయంతిచే, మన్మథ వేదనయా = మన్మథజ్వరముచేఁ గల్గిన శోకముచే, జ్వలతి = జ్వలించుచున్న, నిజే = తనదైన, హృది = హృదయమందు అనగా వక్షఃస్థలమందు, అర్పితా = ఉంచఁబడిన, ఆర్ద్ర మృణాలలతా; ఆర్ద్ర = తడిసిన; మృణాలలతా = తామరతీగె, స్వజయి నోః = తన్ను జయించెడి, భుజయోః = దమయంతియొక్క బాహువులు, సవిధస్థయోః సతోః = సమీపము నందుండంగా, త్రపయా (ఇవ) = సిగ్గుచేతనో యనునట్లు, భృశం = మిక్కిలి, మలినతాం = మాలిన్య మును, అభజత్ = పొందినది.

వి॥ విరహజ్వరముచే మిక్కిలి వేడిగానుండెడి, దమయంతి వక్షఃస్థలముపైనఁ బెట్టఁబడిన తామరతీగె సమీపమందున్న యామె భుజములనుఁ జూచి సిగ్గుపడినదా యనునట్లు రంగుతఱిగి మాలిన్యమునుఁ బొందినది అని వర్ణించుటచే నిటనుత్ప్రేక్ష. అది గమ్యము. భుజములను చూచి సిగ్గు పడినదా యనుట వలన నిది యేర్పడినది.

సమాసములు :

మన్మథవేదనయా: మన్మథస్యవేదనా = మన్మథ వేదనా. తయా = మన్మథవేదనయా.

ఆర్ద్రమృణాలలతా : ఆర్ద్రంచ తత్ మృణాలంచ = ఆర్ద్రమృణాలమ్. ఆర్ద్రమృణాలమేవ లతా = ఆర్ద్రమృణాలలతా.

స్వాజయినోః: స్వస్యాః జయినౌ = స్వజయినౌ. తయోః = స్వజయినోః.

స్థవిధస్థయోః: సవిధే తిష్ఠత ఇతి = సవిధస్థౌ. తయోః = సవిధస్థయోః.

భావము :

ఆ దమయంతి విరహతాపము శమించుటకై తన వక్షఃస్థలముపైన పచ్చి తామర తీగెలనుంచుకొనినది. కాని అవి, తమ్ములను జయింపగల యా దమయంతియొక్క బాహువులు సమీపమందుండగా, వానిని జూచి సిగ్గుపడినవా యనునట్లు వాడి వైవర్ణ్యమునుఁ బొందినవి. సిగ్గుపడిన వారు రంగుతఱిగి మాలిన్యమునుఁ బొందుట సహజము గదా. వాస్తవస్థితిలో నా తామరతీగెలు, ఆ దమయంతి యొక్క విరహతాపాతిశయముచే వాడి వైవర్ణ్యమునుఁ బొందినవే గాని, యామె బాహువులు ప్రక్క నుండుటవలన వైవర్ణ్యముఁ బొందలేదు. కాని పై విధముగ నుత్ప్రేక్షించెను. దీనివలన దమయంతియొక్క విరహతాపము మిక్కుటమైనదని సిద్ధించినది. ॥౩౪॥

శ్లో॥ పికరుతశ్రుతికంపిని శైవలం
హృది తయా నిహితం విచలద్బభౌ।
సతతతద్గతహృచ్ఛయకేతునా
హతమివ స్వతనూఘనఘర్షిణా॥ ౩౫

ప॥వి॥ పికరుతశ్రుతికంపిని । శైవలం । హృది । తయా । నిహితం । విచలత్। బభౌ । సతతతద్గతహృచ్ఛయకేతునా । హతమ్ । ఇవ । స్వతనూఘనఘర్షిణా.

టీక. పికరుతిశ్రుతి కంపిని; పికరుతి = కోయిలకూతను, శ్రుతి = వినుటచే, కంపిని = వణకుచున్న, హృది = వక్షఃస్థలమందు, నిహితం = ఉంచఁబడిన, విచలత్ = కదలుచున్న, శైవలం = నాచు, స్వతనూఘనఘర్షిణా; స్వతనూ = నాచుశరీరముతోఁడ, ఘనఘర్షిణా; ఘన = మిక్కుటి, ఘర్షిణా సంఘర్షణనుఁబొందుచున్న, సతతతద్గత హృచ్ఛయకెతునా; సతత = ఎల్లప్పుడు, తద్గత = ఆమెయందున్న, హృచ్ఛయకేతునా; హృచ్ఛయ =

మన్మథునియొక్క, కేతునా = ధ్వజమైన మత్స్యముతో, హతమివ = కొట్ట బడినదిగా, బభౌ = ప్రకాశించినది.

వి॥ కోకిలకూతల వలన కంపము గల్గిన దమయంతి వక్షఃస్థలముపై నాచును పెట్టగా నది, యా కంపమువలన కదలుచుండగా, ఆమె హృదయమందున్న మన్మథుని ధ్వజమైన చేపతో సంఘర్షణపడుటవలన కదలినట్లు చెప్పుటచే ఉత్ప్రేక్ష. నాచు, చేప రెండును జలచరములు కాన వీనికి సంఘర్షణ సహజము.

## సమాసములు :

పికరుతిశ్రుతికంపిని : పికస్యరుతిః = పికరుతిః. పికరుతేఃశ్రుతిః = పికరుతిశ్రుతిః. పికరుతిశ్రుత్యాకంపః = పికరుతిశ్రుతికంపః. పికరుతిశ్రుతికంపః అస్యఅస్తీతి = పికరుతిశ్రుతికంపి. తస్మిన్ = పికరుతిశ్రుతికంపిని.

సతతతద్గతహృచ్ఛయకేతునా: తాంగతః = తద్గతః. సతతం తద్గతః = సతతతద్గతః.సతతతద్గతశ్చాసౌహృచ్ఛయశ్చ = సతతతద్గతహృచ్ఛయః.సతతతద్గతహృచ్ఛయస్యకేతుః = సతతతద్గతహృచ్ఛయకేతుః. తేన = సతతతద్గతహృచ్ఛయ కేతునా.

స్వతనూఘనఘర్షిణా: ఘనం ఘర్షతీతి = ఘనఘర్షీ. స్వస్యతనూః = స్వతనూః. స్వతన్వాఘనఘర్షీ = స్వతనూఘనఘర్షీ. తేన = స్వతనూఘనఘర్షిణా.

## భావము :

కోయిలకూతను వినుటచే భయమునొంది కంపించెడి యా దమయంతి వక్షఃస్థలమున నీటిలోని నాచుపెట్టఁబడినది. ఆ నాచు హృదయకంపముచే కదలుచుండినది. అదిచూడ, జలమునందుఁబుట్టుటచే, తన (నాచు)దేహముతో సంఘర్షణముఁబడెడి హృదయమందున్న మన్మథుని చిహ్నమగు చేపతోనా నాచుకొట్టఁబడెనా యను నట్లుండినది. నాచును చేపయు జలమునందుగదా పుట్టినవి. కాననవి పరస్పర వైరముగల్గి యుండును. అందువలన నామెహృదయమందున్న మన్మథుని ధ్వజమైన చేపకొట్టుటవలన నామెహృదయముపైనున్న నాచుకదలుచున్నదా యనునట్లుండినది. వాస్తవములో నాచు హృదయస్పందముచేఁ గదలినదిగాని చేపకొట్టుటవలనఁ గదలినది గాదు. ॥౩౫॥

శ్లో॥ న ఖలు మోహవశేన తదాననం
నలమనః శశికాంత మబోధి తత్।
ఇతరథాఽభ్యుదయే శశిన స్తతః
కథమసుస్రువదశ్రుమయం పయః॥ ౩౬

ప॥వి॥ న । ఖలు । మోహనశేన । తదాననం । నలమనః । శశికాంతమ్ । అబోధి । తత్ । ఇతరథా । అభ్యుదయే । శశినః । తతః । కథమ్ । అసుస్రువత్ । అశ్రుమయం । పయః.

టీక॥ నలమనః = నలుని మనస్సు, మోహవశేన = విరహమువలన నేర్పడిన యజ్ఞాన బలముచే, తదాననం = దమయంతి మోమును, శశికాంతమ్ = చంద్రునివలె నందనమైనదిగను, చంద్రకాంతముగను, నాఽబోధిఖలు = తెలుసుకొనలేదా యేమి? అనగా చక్కగా తెలుసుకొని యున్నది. ఇతరథా = లేని పక్షమున, శశినః = చంద్రుని యొక్క, అభ్యుదయే = ఉదయమునందు, తతః = ఆ దమయంతి మోమునుండి, అశ్రుమయం = కన్నీటిరూపము ననండు, పయః = ఉదకము, కథమ్ = ఎట్లు, అసుస్రువత్ = స్రవించినది.

## సమాసములు :

నలమనః : నలస్యమనః నలమనః.

తదాననమ్ : తస్యాః ఆననం తదాననం. తత్ = తదాననం.
శశికాంతమ్: శశీప కాంతం = శశికాంతమ్. తత్ = శశికాంతమ్.

## భావము :

నలుని మనస్సు విరహమోహముచే దమయంతి మోమును చంద్రకాంతమని తెలుసుకొనినది. ఇది సత్యము. అట్లు కానిచో, చంద్రోయమందు, ఆమె ముఖమునుండి కన్నీరనెడి యుదకమెట్లు స్రవించును. చంద్రుడు ఉదయించినపుడు చంద్రకాంత శిలలు నీటిని స్రవించును. దమయంతి మోము చంద్రకాంతమని (చంద్ర సుందరమని) భావించుట వలననే చంద్రోదయమున నామె వదనము నుండి నీరు స్రవించుచున్నది. అనగా చంద్రుడు దయించిన వెంటనే విరహతాపమున నామె దుఃఖించుటవలన కనుగవనుండి నీరు స్రవించినదని భావము. ॥౩౬॥

శ్లో॥ రతిపతేర్విజయాస్త్ర మిషుర్యథా
జయతి భీమసుతాఽపి తథైవ సా।
స్వవిశిఖానివ పంచతయా తతో
నియత మైహత యోజయితుం స తామ్॥ ౩౭

ప॥వి॥ రతిపతేః । విజయాస్త్రమ్ । ఇషుః । యథా । జయతి । భీమసుతా । అపి । తథా । ఏవ । సా । స్వవిశిఖాన్ । ఇవ । పంచతయా । తతః । నియతమ్ । ఐహత । యోజయితుం । సః । తామ్.

టీక॥ రతిపతేః = మన్మథునకు, యథా = ఎట్లు, ఇషుః = బాణము, విజయాస్త్రమ్; విజయ = విజయమునకు సాధనమైన, అస్త్రమ్ = ఆయుధమై, జయతి = జయించుచున్నదో, తథైవ = అట్లే, సా = ఆ, భీమసుతాఽపి = దమయంతియు (విజయాస్త్రముగా) జయతి = జయించుచున్నది. తతః = అందువలన, సః = ఆ మన్మథుఁడు, స్వవిశిఖానివ; స్వ = తనయొక్క, విశిఖానివ = బాణములవలె, తాం = ఆ దమయంతిని, పంచతయా = ఐదవ సంఖ్యను పూరించుటతో, (మరణముతో), యోజయితుం = కూర్చుటకు, ఐహత = కోరెను. నియతమ్ = సత్యము.

వి॥ ధమయంతిని తనబాణమువలె ''పంచత్వమును బొందింప కోరెనో''యని చెప్పుటవలన నుత్ప్రేక్ష. మన్మథుని బాణమెట్లు విజయాస్త్రమో యట్లే దమయంతియు విజయాస్త్రమని చెప్పుటవలన నుపమ. ఈ రెంటికిని సంకరము.

## సమాసములు :

**రతిపతేః** : రతేఃపతిః = రతిపతిః. తస్య = రతిపతేః.

**భీమసుతా** : భీమస్యసుతా = భీమసుతా.

**స్వవిశిఖాన్** : స్వస్యవిశిఖాః = స్వవిశిఖాః. తాన్ = స్వవిశిఖాన్.

**పంచతయా** : పంచానాం భావః = పంచతా. తయా = పంచతయా.

**భావము :**

మన్మథునిబాణ మేవిధముగా జయించి విజయాస్త్రమైనదో, అటే దమయంతియు విజయాస్త్రమైనదై జయించుచున్నది. ఆ మన్మథుడు తన యెదుబాణములలో నా దమయంతినిఁజేర్చి యామెకు పంచత్వమును (మరణమును) సమకూర్చుటకు కోరేనా యనునట్లుండెను. పంచత్వమనగా మరణము, (ఐదవ సంఖ్య). దమయంతి తన సౌందర్యముచేసలుని నాకర్షించి మన్మథునికి బాణము వలె పనిచేయఁగలదు. ఆమెను మన్మథుఁడు తన పంచబాణములలో నిముడ్చుకొనుటవలన నామెయైదవ బాణమగుటవలన పంచత్వము సిద్ధించును. కాని ప్రకృతము విరహబాధవలన నామెకు నైదవబాణమగుటయను పంచత్వము సిద్ధించుట కంటె మరణమనెడి పంచత్వము సిద్ధించునా యనునట్లున్నది. అనగా నామెకు మన్మథబాధ, తీవ్రమైనదవి సారాంశము. ॥౩౨॥

**శ్లో॥** శశిమయం దహనాస్త్రముదిత్వరం
మనసిజస్య విమృశ్య వియోగినీ ।
ఝడితి వారుణమశ్రుమిషాదసౌ
తదుచితం ప్రతిశస్త్రముపాదదే॥ ౩౩

**ప॥వి॥** శశిమయం । దహనాస్త్రమ్ । ఉదిత్వరమ్ । మనసిజస్య । విమృశ్య । వియోగినీ । ఝడితి । వారుణమ్ । అశ్రుమిషాత్ । అసౌ । తదుచితం । ప్రతిశస్త్రమ్ । ఉపాదదే.

**టీక॥** వియోగినీ = విరహిణియగు దమయంతి, ఉదిత్వరం = ఉదయించెడి, శశిమయం = చంద్రమయమైన, దహనాస్త్రమ్ = ఆగ్నేయాస్త్రమును, విమృశ్య = ఆలోచించి, ఝడితి = వెంటనే, అశ్రుమిషాత్ = కన్నీటి నెపమువలన, వారుణమ్ = వరుణునిదేవతగాఁగల, తదుచితమ్; తత్ = ఆగ్నేయాస్త్రమునకు, ఉచితమ్ = తగిన ప్రతీకారముఁజేయగల్గిన, ప్రతిశస్త్రమ్ = ఏఱుగుదైన ఆయుధమును, ఉపాదదే = ప్రయోగించెను.

**వి॥** కన్నీటినెపమున వారుణాస్త్రమును ప్రయోగించుచున్నదో యనునట్లు దుఃఖించెడి దమయంతిని నుత్ప్రేక్షించుట వలన నుత్ప్రేక్షాలంకారము.

"అశ్రుమిషాత్" అని, మిషశబ్దమునుఁ బ్రయోగించుట వలన నపహ్నవాలంకారము. ఆయపహ్నవముతో నీయుత్ప్రేక్ష కూడి యున్నందు వలన సాపహ్నవోత్ప్రేక్ష.

సమాసములు :

శశిమయమ్ : శశినః వికారః = శశిమయమ్. తత్ = శశిమయమ్.

దహనాస్త్రమ్ : దహనస్య అస్త్రమ్ = దహనాస్త్రమ్. తత్ = దహనాస్త్రమ్.

ఉదిత్వరమ్ : ఉదేతీతి = ఉదిత్వరమ్. తత్ = ఉదిత్వరమ్.

మనసిజస్య : మనసిజాయత ఇతి = మనసిజః. తస్య = మనసిజస్య.

వియోగినీ : వియోగః అస్యాః అస్తీతి = వియోగినీ.

వారుణమ్ : వరుణః దేవతా అస్యేతి = వారుణమ్. తత్ = వారుణమ్.

అశ్రుమిషాత్ : అశ్రూణాం మిషః = అశ్రుమిషః. తస్మాత్ = అశ్రుమిషాత్.

తదుచితమ్ : తస్య ఉచితమ్ = తదుచితమ్.

ప్రతిశస్త్రమ్ : ప్రతివిధాయకం శస్త్రమ్ = ప్రతిశస్త్రమ్.

భావము :

దమయంతి యుదయించు చంద్రుని ఆగ్నేయాస్త్రముగా భావించి వెంటనే తన వియోగ బాధచే నేర్పడు కన్నీళ్ల నెపముచే, వారుణాస్త్రమును ప్రయోగించినది. ఆగ్నేయాస్త్రముచే నగ్ని యేర్పడును. వారుణాస్త్రముచే జల మేర్పడును. కాన ఆగ్నేయాస్త్రము నెదుర్కొనుటకు వారుణాస్త్రము తగినది కాన, తన కన్నీరనెడి వారుణాస్త్రమును ఆమె ప్రయోగించినది. చంద్రోదయమువలన విరహులకు బాధ, యతిశయించును గదా? కావున దమయంతి ఆ బాధాతిశయముచే దుఃఖమువలన కన్నీరు కార్చినదని సారాంశము. ॥౩౮॥

శ్లో॥ అతనునా నవమంబుదమాంబుదం
సుతను రస్త్రముదస్తమవేక్ష్య సా।

ఉచితమాయత నిఃశ్వసితచ్ఛలా
చ్ఛ్వసనమస్త్రముదంచదముం ప్రతి॥ ౩౯

ప॥వి॥ అతనునా । నవమ్ । అంబుదమ్ । ఆంబుదమ్ । సుతనుః । అస్త్రమ్ । ఉద స్తమ్ । అవేక్ష్య । సా । ఉచితమ్ । ఆయతనిః శ్వసితచ్ఛలాత్ । శ్వసనమ్ । అస్త్రమ్ । అముఞ్చత్ । అముం । ప్రతి.

టీక॥ సా = ఆ, సుతనుః = అందమైన దేహముగల దమయంతి, నవం = నూతన మైన, అంబుందమ్ = మేఘమనెడి, అతనునా = మన్మథునిచే, ఉద స్తమ్ = విసరఁబడిన, ఆంబుదమ్ = మేఘసంబంధియైన, అస్త్రమ్ = ఆయుధ మును, అనగా పర్జన్యాస్త్రమును. అవేక్ష్య = చూచి, ఆయతనిఃశ్వసితచ్ఛ లాత్; అయత = దీర్ఘమైన, నిఃశ్వసితచ్ఛలాత్ = నిట్టూర్పు నెపముచే, అముం ప్రతి = ఈ పర్జన్యాస్త్రము నుద్దేశించి, ఉచితం = తగిన ప్రతీ కారము చేయఁగల, శ్వసనం = నిట్టూర్పుఅనెడి, అస్త్రం = వాయవ్యాస్త్ర మును, అముంచత్ = వదలి పెట్టెను.

వి॥ నిట్టూర్పు నెపముచే మేఘములనెడి పర్జన్యాస్త్రముపై, వాయవ్యాస్త్రమును ఆమె ప్రయోగించెనా యని యుత్ప్రేక్షించుట వలన ఉత్ప్రేక్షాలంకారము. "ఆయతనిః శ్వసితచ్ఛలాత్" దీర్ఘనిశ్వాస వ్యాజమువలన వాయవ్యాస్త్ర మును వదలెనని వ్యాజ శబ్ద ప్రయోగముచేయుటవలన సపహ్నవాలం కారము. ఈ యపహ్నవముతో నుత్ప్రేక్ష కూడినందువలన సాఽపహ్న వోత్ప్రేక్ష.

సమాసములు :

అతనునా : అవిద్యమానా తనుః యస్యసః = అతనుః. తేన = అతనునా.

అంబుదం : అంబు దదాతీతి = అంబుదః. తమ్ = అంబుదమ్.

ఆంబుదం : అంబుదస్య సంబంధి = ఆంబుదమ్. తత్ = ఆంబుదం.

సుతనుః : శోభనాతనుః యస్యాఃసా = సుతనుః.

ఆయతనిఃశ్వసితచ్ఛలాత్ : ఆయతంచతత్ నిఃశ్వసితంచ = ఆయత నిఃశ్వసితమ్. ఆయత నిఃశ్వసితస్యఛలమ్. ఆయతనిఃశ్వసితచ్ఛలం, తస్మాత్ = ఆయతనిఃశ్వసితచ్ఛలాత్.

భావము :

మన్మథుఁడు క్రొత్త మేఘపు దెబ్బ, పర్జన్యాస్త్రమును దమయంతిపైఁ బ్రయోగించెను. దానిని చూచి దమయంతి దీర్ఘమైన నిట్టూర్పు నెపమున వాయవ్యాస్త్రమును, దాని నెదుర్కొనుటకై ప్రయోగించెను. పర్జన్యాస్త్రము మేఘములను సృజించును. అవి ముఖ్యముగా విరహులకు కామోద్దీపకములు. కాని వానినెగిరి పోవునట్లు చేయుటకు వాయవ్యాస్త్రమును, ఆమె ప్రయోగించినది. ఆ వాయవ్యాస్త్రమేమనగా, ఆమె నిట్టూర్పులే. వాయవ్యాస్త్ర ప్రయోగముచే తీవ్రములైన గాడ్పులు పుట్టును. ఆ గాడ్పులచే మేఘములు దూరముగఁ గొట్టుకొని పోవును. ఆమెకు విరహ బాధచే తీవ్రమైన ఆయాసము నిట్టూర్పులు కల్గుచున్నవని సారాంశము. ॥౩౯॥

శ్లో॥ రతిపతిప్రహితానిలహేతితాం
ప్రతియతీ సుదతీ మలయానిలే।
తదురుతాపభయాత్తు మృణాళికా
మయమియం భుజగాస్త్రమివాదిత॥ ౪౦

ప॥వి॥ రతిపతిప్రహితానిలహేతితాం । ప్రతియతీ । సుదతీ । మలయానిలే । తదురు తాపభయాత్త మృణాళికామయమ్। ఇయం। భుజ గాస్త్రమ్। ఇవ। ఆదిత ।

టీక॥ సుదతీ = మంచిదంతముగల దమయంతి, మలయానిలే = మలయమారుతవిషయమందు, రతిపతి ప్రహితా నిలహేతితామ్; రతిపతి = మన్మథునిచే, ప్రహిత = పంపఁబడిన, అనిల = వాయుదేవతాకమైన, హేతితామ్ = అస్త్రముగనుండుటను, ప్రతియతీ = తెలుసుకొనుచున్నదై, తదురుతాపభయాత్త మృణాళికామయమ్; తత్ = ఆ యస్త్రముచేతఁ గల్గిన, ఉరుతాప = అధిక సంతాపమువలని, భయ = భయముచే, ఆత్త = పొందబడిన, మృణాళికామయం = తామరతూండ్ల రూపముగల్గిన, భుజగాస్త్రమ్ = నాగాస్త్రమును, ఆదితఇవ = పొందినదోయనునట్లుండెను.

వి॥ మలయమారుతమును మన్మథుఁడు పంపిన వాయవ్యాస్త్రముగ భావించి, దానివలనితాపమును శమింపఁజేయుటకు దమయంతి తామర తూండ్ల

రూపమునందున్న నాగాస్త్రమును ధరించినదా యని చెప్పుటవలన నుత్ప్రేక్ష. సర్పములకు గాలి యాహారము గాన, మలయానిలమనెడి వాయవ్యాస్త్రమును, తామర తూండ్లనెడి నాగాస్త్రములు ఎదుర్కొనఁ గలవని వానిని దమయంతి దాల్చినదో యనునట్లుండెను.

## సమాసములు :

*రతిపతి ప్రహితా నిలహేతితామ్ :* రతేః పతిః = రతిపతిః. రతిపతినా ప్రహితః = రతిపతిప్రహితః. రతిపతి ప్రహితశ్చాసౌ అనిలశ్చ = రతిపతి ప్రహితానిలః. రతిపతిప్రహితానిల శ్చాసౌ హేతిశ్చ = రతిపతిప్రహితానిల హేతిః. రతిపతి ప్రహితానిల హేతేర్భావః = రతిపతి ప్రహితానిల హేతితా. తామ్ = రతిపతి ప్రహితానిలహేతితామ్.

*మలయానిలే :* మలయస్య అనిలః = మలయానిలః. తస్మిన్ = మలయానిలే.

*తదురుతాపభయాత్తమృణాళికామయమ్ :* ఉరుశ్చాసౌ తాపశ్చ = ఉరుతాపః. తేన ఉరుతాపః = తదురుతాపః. తదురుతాపాత్ భయమ్ = తదురు తాప భయమ్. తదురుతాపభయేన ఆత్తాః = తదురుతాపభయాత్తాః. తదురుతాపభయాత్తాశ్చతాః మృణాళికాశ్చ = తదురుతాపభయాత్తమృణాళికాః. తదురు తాపభయాత్త మృణాళికానాం వికారః = తదురుతాపభయాత్త మృణాళికా మయమ్. తత్ = తదురుతాపభయాత్త మృణాళికామయమ్.

*భుజగాస్త్రమ్ :* భుజగా ఇతిఅస్త్రమ్ = భుజగాస్త్రమ్. తత్ = భుజగాస్త్రమ్.

## భావము :

దమయంతి, మన్మథుఁడు పంపిన మలయమారుతమును వాయవ్యాస్త్రముగ భావించినది. దానివలన గల్గెడి తాపమునుఁ బోగొట్టు కొనుటకై శరీరమున తామరతూండ్లనుఁ జుట్టుకొనినది. అది చూడ; వాయవ్యాస్త్రమునకు విరుగుడుగా నాగాస్త్రమును ఆమె ధరించినదా యను నట్లుండినది. వాయవ్యాస్త్రము గాలిగాన, సర్పములుగాలిమేతరులు గాన, నాగాస్త్రము వాయవ్యాస్త్రమునకు విరుగుడు. కాన

దాని నెదుర్కొనుటకు నాగాస్త్రమునుఁ బ్రయోగించినది. మలయమారుతము వలన దమయంతికి తాపభారమెక్కువై తామరతూండ్లను ధరించినదని సారాంశము. ॥౪౦॥

శ్లో॥ వ్యధిత తద్ధృది శల్యమివ ద్వయమ్
విరహితాం చ తథాపి చ జీవితమ్।
కిమథ తత్రనిహత్య నిఖాతవాన్
రతిపతిః స్తనబిల్వయుగేన తత్॥ ౪౧

ప॥వి॥ వ్యధిత । తద్ధృది । శల్యమ్ । ఇవ । ద్వయమ్ । విరహితాం । చ । తథా । అపి । చ । జీవితమ్ । కిమ్ । అథ । తత్ర । నిహత్య। నిఖాతవాన్ । రతిపతిః । స్తనబిల్వయుగేన । తత్.

టీక॥ రతిపతిః = మన్మథుఁడు, తద్ధృదిః తత్ = ఆ దమయంతియొక్క, హృది = హృదయమందు, విరహితామ్ = విరహిణిగనుండుట, తథాపి = విరహిణిగనున్నను, జీవితంచ = బ్రతికియుండుట అను; ద్వయం = రెండైన, శల్యమ్ = మేకును, వ్యధిత = నాటెను. అథ = అట్లు నాటిన పిదప, తత్ = ఆ రెండు మేకులను, స్తనబిల్వయుగేన; స్తన = స్తనములనెడి, బిల్వయుగేన = మారేడు పండ్లజంటచే, తత్ర = ఆ హృదయమందు, నిహత్య = కూరి, నిఖాతవాన్ కిం = గట్టిపఱచి,నాటినాడావిమి.

వి॥ దమయంతి విరహిణిగానుండుట (అయినను) ఆమె జీవించుట అను నీ రెంటిని రెండు మేకులుగా నామె హృదయమందునాటెనాః యనుట వలన నుత్ప్రేక్ష. ఆ నాటిన మేకులు చక్కగా బిగిసికొనుటకై, ఆమె స్తనము లనెడి బిల్వఫలముల జంటను, ఆ మేకుల ప్రక్కకూరెనాః యనుటవలన నిక్కడ గూడ నుత్ప్రేక్ష.

**సమాసములు:**

తద్ధృది : తస్యాః హృత్ = తద్ధృత్. తస్మిన్ = తద్ధృది.

విరహితాం : విరహః అస్యాః అస్తీతి = విరహిణీ. విరహిణ్యాః భావః = విరహితా. తామ్ = విరహితామ్.

రతిపతిః : రతేఃపతిః = రతిపతిః.

స్తనబిల్వయుగేన : స్తనౌ ఏవ బిల్వే = స్తనబిల్వే. స్తన బిల్వయోః యుగమ్ = స్తనబిల్వయుగమ్. తేన = స్తనబిల్వయుగేన.

భావము :

మన్మథుఁడు దమయంతియొక్క హృదయమున రెండు మేకులు నాటినాడు. అందొకటి యామె విరహిణియై యుండుట; రెండవది ఆమె విరహిణియై యున్నను జీవించియుండుట. విరహిణియై మన్మథబాధననుభవించుచు బ్రతుకుటయే యరుదు. అట్లు బ్రతికి యున్నను బాధననుభవించుటయే గాని వేఱొక సుఖము లేదు. ఇట్లు మన్మథుడుఁ నాటియున్న మేకులను గట్టి పరచుటకు, ఆ దమయంతియొక్క స్తనములనెడి మారేడి పండ్ల జతను, మేకులు ప్రక్కన నాటినాడా ఏమి? అట్లైనచో నామె యొక్క విరహబాధయెంత తీవ్రముగా నుండినదో యూహింపవచ్చును. లోకమున జనులు గుంజను నాటి యది గట్టిగా నుండుటకు దాని ప్రక్కన జాతిముక్కల నెట్లు కూరెదరో, యట్లే యిచ్చట మన్మథుఁడు పైనఁజెప్పిన రెండు మేకులకు స్తనములనెడి రెండు మారేడుపండ్లను కూరెనని భావము. ॥౪౧॥

శ్లో॥ అతిశరవ్యయతా మదనేన తాం
నిఖిలపుష్పమయస్వశరవ్యయాత్।
స్ఫుటమకారి ఫలాన్యపి ముంచతా
తదురసి స్తనతాలయుగార్పణా॥ ౪౨

ప॥వి॥ అతిశరవ్యయతా । మదనేన । తాం । నిఖిలపుష్పమయస్వశర వ్యయాత్। స్ఫుటమ్ । అకారి । ఫలాని । అపి । ముంచతా । తదురసి । స్తనతాల యుగార్పణా.

టీక॥ తాం = ఆ దమయంతిని, అతితరాం = మిక్కిలి, శరవ్యయతా = గురి చేయుచున్న, (అతఏవ = కావుననే) నిఖిల పుష్పమయస్వశరవ్యయాత్ః

నిఖిల = సమస్తమైన, పుష్పమయ = పుష్పరూపములైన, స్వశర = తన బాణములయొక్క, వ్యయాత్ = వ్యయమువలన, ఫలాన్యపి = ఫలములను గూడ, ముంచతా = ప్రయోగించుచున్న, మదనేన = మన్మథునిచే, తదురసి = ఆమె వక్షఃస్థలమునందు, స్తనతాలయుగార్పణా; స్తన = స్తనములనెడి, తాలయుగ = తాటిపండ్లజంటను, అర్పణా = ప్రయోగించుట, అకారి = చేయఁబడినది. స్ఫుటం = స్పష్టము.

వి॥ ఇచ్చట దమయంతీ స్తనములు మన్మథుఁడు తనకు బుష్పబాణములు వ్యయమై పోయినంచువలన నామెపైఁ బ్రయోగించిన తాటిపండ్లా? యని సంభావనఁ జేయుటవలన నుత్ప్రేక్షాలంకారము.

సమాసములు :

అతిశరవ్యయతా : శరవ్యం కరోతీతి = శరవ్యయన్. అత్యంతం శరవ్యయన్ = అతిశరవ్యయన్. తేన = అతిశరవ్యయతా.

నిఖిలపుష్పమయస్వశరవ్యయాత్: పుష్పాణాం వికారః = పుష్పమయాః. స్వస్యశరాః = స్వశరాః. పుష్పమయాశ్చ తే స్వశరాశ్చ = పుష్పమయస్వశరాః. నిఖిలాశ్చతే పుష్పమయస్వశరాశ్చ = నిఖిలపుష్పమయస్వశరాః. నిఖిలపుష్పమయస్వశరాణాం వ్యయః = నిఖిలపుష్పమయస్వశరవ్యయః. తస్మాత్ = నిఖిలపుష్పమయ స్వశరవ్యయాత్.

తదురసి : తస్యాః ఉరః = తదురః. తస్మిన్ = తదురసి

స్తనతాళయుగార్పణా : స్తనౌతాళేఇవ = స్తనతాళే. స్తనతాళయోః యుగమ్ = స్తనతాళయుగమ్. స్తనతాళయుగస్య అర్పణా = స్తనతాళయుగార్పణా.

భావము :

మన్మథుఁడు దమయంతిని తన బాణములకు గుఱిచేసి వేధించుచుండెను. ఆ బాణములు పుష్పములే. ఆ పుష్పబాణములు పూర్తిగా వ్యయమగునంతవరకు వానినిఁ బ్రయోగించుచుండెను. అవి పూర్తిగా వ్యయముకాగనే యతనికి నామెపై ప్రయోగించుటకు తాటిపండ్లుపయోగపడినవి. అందువలన దమయంతియొక్క

వక్షఃస్థలము నందున్న చనుదోయి యాతడు ప్రయోగించిన తాటిపండ్లుగా భావింపఁబడినది. లోకమున విలుకాండ్రు తమవద్ద నున్న బాణములు వ్యయమైన వెంటనే ఱాళ్లు మున్నగువానినిఁ బ్రయోగించుట ప్రసిద్ధము. ఇచ్చట పుష్ప బాణములు వ్యయము కాగనే, వాని తర్వాత ఫలములు పుష్పముల స్థానమ లంకరించినవి. అందువలన తాళఫలములనతఁడు వాడఁజొచ్చెను. అనగా దమ యంతి చనుదోయి తాటిపండ్లవలె నురువుగా నున్నవని యాశయము. ॥౪౨॥

శ్లో॥ అథ ముహుర్బహునిందితచంద్రయా
స్తుతవిధుంతుదయా చ తయా ముహుః ।
పతితయా స్మర తాపమయే గదే
నిజగదేఽశ్రువిమిశ్రముఖీ సఖీ॥ ౪౩

ప॥వి॥ అథ । ముహుః । బహునిందితచంద్రయా । స్తుతవిధుంతుదయా । చ । తయా । ముహుః । పతితయా । స్మరతాపమయే । గదే । నిజగదే । అశ్రువిమిశ్రముఖీ । సఖీ.

టీక॥ అథ = పిదప, స్మరతాపమయే = మన్మథజ్వరరూపమైన, గదే = రోగ మందు, పతితయా = పడియున్న, (అతఏవ = కావుననే) ముహుః = పలుమారులు, బహునిందితచంద్రయా; బహు = అధికముగా, నిందిత = నిందింపఁబడిన, చంద్రయా = చంద్రుఁడుగల్గినదియు, ముహుః = పలు మాఱులు, స్తుతవిధుంతుదయాచ ; స్తుత = పొగడఁబడిన, విధుంతు దయాచ = రాహువును గల్గినదియునగు, తయా = ఆ దమయంతిచే, అశ్రువిమిశ్రముఖీ; అశ్రు = కన్నీటితో, విమిశ్ర = కలసిన, ముఖీ = ముఖముగల, సఖీ = చెలికత్తె, నిజగదే = చెప్పఁబడినది.

సమాసములు :

*బహునిందిత చంద్రయా:* బహు నిందితః = బహునిందితః. బహునిం దితః చంద్రః యయాసా = బహునిందిత చంద్రా; తయా = బహునిం దిత చంద్రయా.

స్తుతవిధుంతుదయా : విధుంతుదతీతి = విధుంతుదః. స్తుతః విధుంతుదః యయా సా = స్తుతవిధుంతుదా. తయా = స్తుతవిధుంతుదయా.

స్మరతాపమయే: స్మరస్యతాపః = స్మరతాపః. స్మరతాపస్యవికారః = స్మరతాపమయః. తస్మిన్ = స్మరతాపమయే.

అశ్రువిమిశ్రముఖీ: అశ్రుభిః విమిశ్రమ్ = అశ్రువిమిశ్రం. అశ్రువిమిశ్రం ముఖం. యస్యాస్సా = అశ్రువిమిశ్రముఖీ.

**భావము :**

ఆ దమయంతి మన్మథ జ్వరముచే బాధపడుచు ఆ మన్మథ జ్వరమునకు ఉద్దీపకుడైన చంద్రుని పలుమారు నిందించుచుండినది. అట్లు తన్ను బాధించుటచే శత్రువైన చంద్రుని మ్రింగెడి రాహువును పలుమారు పొగడుచుండినది. ఇట్టి యవస్థ ననుభవించుచు నా దమయంతి, తన దురవస్థకు దురపిల్లెడి చెలికత్తెను గూర్చి చెప్పదొడగినది. లోకమున బాధపడువారు బాధించెడి వ్యక్తిని నిందింతురు. ఆ బాధించెడి వ్యక్తికి హాని గొల్పువానిని పొగడెదరు. ఆ న్యాయమిట సరిపడినది. ॥౪౩॥

శ్లో॥ నరసురాబ్జభువామివ యావతా
భవతి యస్య యుగం యదనేహసా।
విరహిణా మపి తద్రతవద్వ్యవ
క్షణమితం న కథం గణితాగమే॥ ౪౪

ప॥వి॥ నరసురాబ్జభువామ్ । ఇవ । యావతా । భవతి । యస్య । యుగం । యత్ । అనేహసా । విరహిణామ్ । అపి । తత్। రతవద్వ్యవక్షణమితం । న । కథం । గణితాగమే.

టీక॥ నరసురాబ్జ భువామివ, నర = మనుష్యులకును, సుర = దేవతలకును, అబ్జభువామ్ = బ్రహ్మకును, ఇవ = వలె, యావతా = ఎంతటి, అనేహసా = కాలముచే, యస్య = ఏ ప్రాణికి, యత్ = ఏది, యుగం = యుగముగా, భవతి = అగుచున్నదో, (తత్ = అది, గణితాఽగమే = జ్యోతి

శాస్త్రమునందు వక్తవ్యం = చెప్పవలయును)(తర్హి = అట్లేయగుచో),విర హిణాం = విరహులకు, తత్ = ఆ యుగము, కథం = ఎట్లు, రతవద్యువ క్షణమితం; రతవత్ = రతికల్గిన (వియోగములేని), యువ = యువకుల యొక్క, క్షణ = క్షణకాలముతో, మితం = గణింపబడినదిగ, న = కాలేదు.

## సమాసములు :

*నరసురాబ్జభువామ్ :* అబ్జేభవతీతి = అబ్జభూః. నరాశ్చ సురాశ్చ అబ్జభూశ్చ = నరసురాబ్జభువః. తేషాం = నరసురాబ్జభువామ్.

*విరహిణామ్:* విరహః ఏషామ స్తీతి = విరహిణః. తేషాం = విరహిణామ్.

*రతవద్యువక్షణమితమ్ :* రతం ఏషామ స్తీతి = రతవంతః. రతవంతశ్చ తే యువానశ్చ = రతవద్యువానః. రతవద్యూనాం క్షణః = రతవద్యువక్షణః. రతవద్యువక్షణేన మితమ్ = రతవద్యువక్షణమితమ్.

*గణితాగమే:* గణితమితిఆగమః = గణితాగమః.తస్మిన్ = గణితాగమే.

## భావము :

మానవులకును దేవతలకును బ్రహ్మకును కాలమును గణించి యుగములను కల్పించియున్నారు. ఆ విధముగనే ప్రతి జంతువునకును ఎంత కాలముతో నొక యుగమేర్పడునో దానిని గూడ గణితశాస్త్రము చెప్పవలయును. ఏల యనగా విరహులకు ఒక యుగమైనచో నది విరహము లేని యువకులకు క్షణమని గణింపవలయును గదా. వియోగము లేనివారికి క్షణముగ గడిచెడి కాలము వియోగులకు అనగా రతిసౌఖ్యమనుభవింపగల యవకాశము లేనివారికి యుగమగుచున్నది. దీనిని మానవాది యుగమువలె విరహియుగమని గణితశాస్త్రము నిర్వచించుట యుచితము. అనగా విరహి జనమునకు బాధవలన క్షణములు యుగములుగఁ గడచునని సారాంశము. ॥౪౪॥

శ్లో॥ జనురధత్త సతీ స్మరతాపితా
హిమవతో న తు తన్మహిమాదృతా।

జ్వలతి ఫాలతలే లిఖితః సతీ
విరహ ఏవ హరస్య న లోచనమ్॥ ౪౫

ప॥వి॥ జనుః । అధత్త । సతీ । స్మరతాపితా । హిమవతః । న । తు । తన్మహిమాదృతా । జ్వలతి । ఫాలతలే । లిఖితః । సతీవిరహః । ఏవ । హరస్య । న । లోచనమ్.

టీక॥ సతీ = శివునితొంటి భార్యయగు సతీదేవి, అనగా దక్షపుత్రిక, స్మరతాపితా; స్మర = విరహమువలని కామాగ్నిచే, తాపితా = తాపముపొందింపఁబడినదై, హిమవతః = హిమవంతునివలన, జనుః = జన్మమును, అధత్త = ధరించినది. (కాని) తన్మహిమాదృతాతు; తత్ = ఆ హిమవంతుని యొక్క, మహిమ = గొప్పతనమును, ఆదృతాతు = ఆదరించినదిగ మాత్రము, న = కాదు.హరస్య = శివునియొక్క,ఫాలతలే = నొసట, లిఖితః = బ్రహ్మచే వ్రాయబడిన, సతీవిరహ ఏవ = సతీదేవితో నేర్పడిన విరహమే, జ్వలతి = జ్వలించుచున్నది. లోచనమ్ = నేత్రమో, న జ్వలతి = జ్వలించుట లేదు.

వి॥ సతీదేవి హిమవంతునికి కుమార్తెగాఁ బుట్టుటకు హేతువు శివునితో నేర్పడిన విరహతాపశాంతియేగాని హిమాద్రి మహిమగాదనుచు, హేతువుగాని విరహ తాపమును హేతువుగ చెప్పుటవలన హేతూత్ప్రేక్ష. శివుని నొసట జ్వలించుచున్నది నేత్రము కాదు. అది సతీ విరహాగ్ని యని యపహ్నవించి విరహాగ్నిత్వమును ఆరోపించుటవలన నపహ్నవాలంకారము.

సమాసములు :

స్మరతాపితా : స్మరేణ తాపితా = స్మరతాపితా.

హిమవతః : హిమమస్య అస్తీతి = హిమవాన్. తస్య = హిమవతః.

తన్మహిమాదృతా : తస్య మహిమా = తన్మహిమా. తన్మహిమా ఆదృతః యయా సా = తన్మహిమాదృతా.

ఫాలతలే : ఫాలస్య తలమ్ = ఫాలతలమ్. తస్మిన్ = ఫాలతలే.

సతీవిరహః: సత్యా విరహః = సతీవిరహః.

భావము :

శివునికి మొదటి భార్యగ నుండిన సతీదేవి దక్ష ప్రజాపతి కుమార్తె. ఆమె తన తండ్రియగు దక్షుడు తన భర్తయైన శివుని యాగమునకు పిలువక అవమానపరిచినందులకు నగ్నిలో దేహ త్యాగముచేసి, మఱు జన్మమున హిమవంతుని కుమార్తెగ జన్మించినది. ఇట్లు ఆమె హిమవంతుని కుమార్తెగ జన్మించుటకు హేతువు హిమవంతుని మహిమ నాదరించుట గాదు. మరేమనగా హిమవంతుడు చల్లని మంచుకొండ కాన నతని యందు జన్మించినచో, తనకు శివుని వలని విరహతాపము శమించునను తలంపే. అనగా నామెకు భవుని విరహము చేత నేర్పడిన తాపమెంతటిదో యని గ్రహింపవలయును. మఱియు నా శివుని నొసట ప్రకాశించుచున్నది మూడవ నేత్రమని యందఱు చెప్పుదురు. కాని యది సరికాదు. అది సతీదేవి యొక్క విరహాగ్ని. అనగా సతీదేవి, శివుని ఎడబాపువలని సంతాపాగ్నిని జల్లార్చుకొనుటకై మంచుకొండకు కూతురుగ జన్మించవలసి వచ్చినది. శివుని సతీవిరహముచే గల్గిన సంతాపాగ్ని యారకయే యతని నొసట వెలుగుచున్నది. కావున ప్రపంచమున విరహతాపాగ్ని దుఃసహమని యభిప్రాయము. ॥౪౫॥

శ్లో॥ దహనజా న పృథుర్దవథువ్యథా
విరహజైవ పృథుర్యది నేదృశమ్।
దహనమాశు విశంతి కథం స్త్రియః
ప్రియమపాసుముపాసితు ముద్ధురాః॥ ౪౬

ప॥వి॥ దహనజా । న । పృథుః । దవథువ్యథా । విరహజా । ఏవ । పృథుః। యది । న । ఈదృశమ్ । దహనమ్। ఆశు। విశంతి । కథం। స్త్రియః । ప్రియమ్। అపాసుమ్। ఉపాసితుమ్ । ఉద్ధురాః.

టీక॥ దహన జా = అగ్నిదాహము వలన కల్గిన, దవథువ్యథా: దవథు = తాపమనెడి, వ్యథా = దుఃఖము, పృథుః = అధికము, న = కాదు. (కింతు = మరేమనగా) విరహజైవ = విరహమువలన కల్గినదియే పృథుః = అధి

కము. ఈదృశం = ఇట్టిది, న యది = కానిచో, స్త్రియః = స్త్రీలు, అపాసుం; అప = తొలగిన, అసుం = ప్రాణములుగల (మరణించిన), ప్రియం = ప్రియుని, ఉపాసితుం = పొందుటకు, ఉద్ధురాః = అడ్డులేని వారై లేదా ఉల్లాసముగల వారై, కథమ్ = ఎట్లు, ఆశు = శీఘ్రముగా, దహనం = అగ్నిని, విశంతి = ప్రవేశించుచున్నారు.

వి॥ స్త్రీలు అగ్నిని ప్రవేశించుట యను కార్యముచే విరహాగ్ని యధికమను కారణము సమర్థింపఁబడినదిగాన నర్థాంతరన్యాసాలంకారము.

## సమాసములు :

*దహనజా :* దహనాత్ జాయత ఇతి = దహనజా.

*దవథువ్యథా :* దవథురేవ వ్యథా = దవథువ్యథా.

*విరహజా :* విరహాత్ జాయత ఇతి = విరహజా.

*ఉద్ధురాః :* ఉత్కృష్టా ధూః యాసాం తాః = ఉద్ధురాః.

## భావము :

విరహ బాధకంటె నగ్నిదాహము వలని బాధ ఎక్కువ కాదు. ఏల యనగా పతిగతించినపుడు స్త్రీలు పతివిరహమును సహింపలేక యతనితో నగ్నిప్రవేశము చేయుచున్నారు. కాన నగ్ని బాధకంటె విరహబాధయే యెక్కువయని యాశయము. ॥౪౬॥

శ్లో॥ హృది లుఠంతి కలా నితరామమూ
ర్విరహిణీవధపంకకలంకితాః।
కుముద సఖ్యకృతస్తు బహిష్కృతాః
సఖి! విలోకయ దుర్వినయం విధోః॥ ౪౭

ప॥వి॥ హృది । లుఠంతి । కలాః । నితరామ్ । అమూః । విరహిణీ వధపంక కలంకి తాః । కుముద సఖ్యకృతః । తు । బహిష్కృతాః । సఖి । విలోకయ । దుర్వినయం । విధోః.

టీక॥ విరహిణీ వధపంక కలంకితాః; విరహిణీ = విరహిణులను, వధ = చం
పుట వలని, పంక = పాపముచే, కలంకితాః = కళంకముఁ బొందిన,
అమూః = ఈ, కళాః = కళలు, హృది = లోపల, నితరాం = మిక్కిలి,
లుఠంతి = క్రీడించుచున్నవి. కుముదసఖ్యకృతః; కుముద = కలువలతో,
సఖ్య = చెలిమిని, కృతః = చేయునట్టి, తాస్తు = శుద్ధమైన కళలో,
బహిష్కృతాః = బహిష్కరింపఁబడినవి. అనగా దూరముగ నుంచఁ
బడినవి. సఖి = చెలీ!, విధోః = చంద్రుని యొక్క దుర్వినయం =
దౌర్జన్యమును, విలోకయ = చూడుము.

సమాసములు :

*విరహిణీవధ పంకకలంకితాః :* విరహః అసామ స్తీతి = విరహిణ్యః,
విరహిణీనాం వధః = విరహిణీవధః. విరహిణీవధాత్ పంకః = విరహిణీవధ
పంకః. విరహిణీ వధపంకేన కలంకితాః = విరహిణీ వధపంకకళంకితాః.

*కుముదసఖ్యాకృతః :* కుముదైః సఖ్యం = కుముదసఖ్యం. కుముదసఖ్యం
కుర్వంతీతి = కుముదసఖ్యకృతః.

భావము:

ఓ చెలీ! చంద్రునియందు రెండు విధములైన కళలున్నవి. అందు ఒక
తెగకుఁ జెందిన కళలు, విరహిణులను చంపుటవలన పాపముచే నల్లఁబడి
చంద్రుని లోపల క్రీడించుచున్నది. వానికి చంద్రుఁడు తన హృదయమునందుఁ
దావొసంగి వానికి నుల్లాసముఁ గల్పించుచున్నాడు. కలువలను వికసింపఁజేసి
వానితోఁ జెలిమిచేసి పాపరహితములైన శుద్ధములగు కళలు మాత్రము లోపల
నుంచుకొనఁబడక వెలుపల నుంచఁబడి బహిష్కరింపఁబడినవి. చంద్రుని
యొక్క దౌర్జన్యమునుఁ జూడుము. లోకమున పాపముఁ జేసిన వారిని బహిష్క-
రింతురు. పుణ్యముఁ జేసిన వారినిఁ జెంతఁ జేర్చుకొందురు. కాని యిట పాప
ముగావించిన కళలను చంద్రుఁడు లోన ధరించి పాపము చేయని శుద్ధములైన
కళలను మాత్రము బహిష్కరించియున్నాడు. ఏమి వైపరీత్యము! ॥౪౭॥

శ్లో॥ అయి విధుం పరిపృచ్ఛ గురోః కుతః
స్ఫుటమశిక్ష్యత దాహవదాన్యతా ।

గ్లపితశంభుగళాద్గరళా_త్త్వయా
కిముదధౌ జడ! వా బడబానలాత్॥ ౪౦

ప॥వి॥ అయి । విధుం । పరిపృచ్ఛ । గురోః । కుతః । స్ఫుటమ్ । అశిక్ష్యత। దాహవదాన్యతా । గ్లపితశంభుగళాత్ । గరళాత్ । త్వయా । కిమ్ । ఉదధౌ । జడ । వా । బడబానలాత్.

టీక॥ అయిసఖి = ఓచెలీ! విధుం = చంద్రుని, పరిపృచ్ఛ = అడుగుము. హేజడ! = ఓ మూఢుడా, త్వయా = నీచే, దాహవదాన్యతా; దాహ = దాహముయొక్క, వదాన్యతా = దాతృత్వము అనగా దహించుట యను స్వభాము, గ్లపితశంభుగళాత్; గ్లపిత = శోషింపఁజేయఁబడిన, శంభుగళాత్ = శివునికంఠముగల్గిన, గరళాత్ = హాలాహలవిషమునుండియా, ఉదధౌ = సముద్రమందున్న, బడబానలాద్వా = బడబానలమునుండియా? కుతః = దేనినుండి, అశిక్ష్యత = నేర్వఁబడినది.

## సమాసములు :

*దాహవదాన్యతా:* వదాన్యస్య భావః = వదాన్యతా. దాహే వదాన్యతా = దాహవదాన్యతా.

*గ్లపితశంభుగళాత్ :* శంభోః గళః = శంభుగళః. గ్లపితఃశంభుగళః యేన సః = గ్లపితశంభుగళః. తస్మాత్ = గ్లపితశంభుగళాత్.

*బడబానలాత్:* బడబా ఇతి అనలః = బడబానలః.తస్మాత్ = బడబానలాత్.

## భావము :

చెలీ! చంద్రుని అడుగుము- ఓ మూఢుడా! నీవు విరహులను దహింపఁజేయు స్వభావమును శివుని కంఠమును శోషింపఁ జేసిన హాలాహలమునుండి నేర్చితివా ? లేదా సముద్రమందలి బడబాగ్ని నుండి నేర్చితివా ? దేనినుండి నేర్చితివో చెప్పుము. అనగా చంద్రుడు శివుని శిరమందుండుటవలన శివునితోడను సముద్రమునఁ బుట్టుటవలన సముద్రముతోఁడను నతనికి సంబంధముకలదు. కాని శివుని కంఠమునందలి హాలాహల సంబంధము వలనగాని, సముద్రమందలి బడబాగ్ని సంబంధము వలనగాని దాహకత్వమును నేర్చు నవకాశము గలదని భావించి యిట్లు ప్రశ్నించుట యేర్పడినది. ॥౪౦॥

శ్లో॥ అయమయోగివధూవధపాతకైః
భ్రమిమవాప్య దివః ఖలు పాత్యతే।
శితినిశాదృషది స్ఫుటదుత్పతత్
కణగణాధికతారకితాంబరః॥

౭౫

ప॥వి॥ అయమ్ । అయోగివధూవధపాతకైః । భ్రమిమ్ । అవాప్య । దివః । ఖలు । పాత్యతే । శితినిశాదృషది । స్ఫుటదుత్పతత్కణగణాధిక తారకితాంబరః.

టీక॥ అయం = ఈచంద్రుఁడు, అయోగివధూవధపాతకైః; అయోగివధూ = వియోగిస్త్రీలయొక్క, వధ = హత్యచేనేర్పడిన, పాతకైః = పాపములచే, భ్రమిం = భ్రమణమును, అవాప్య = పొందింపఁబడి, శితినిశాదృషది; శితినిశా = కృష్ణపక్షరాత్రియనెడి, దృషది = శిలయందు, స్ఫుటదుత్పతత్కణగణాధిక తారకితాంబరః; స్ఫుటత్ = చిట్లుచున్నటువంటివియు, ఉత్పతత్ = పైకెగురుచున్న, కణ = తునుకలయొక్క, గణ = సమూహముచే, అధిక = అధికముగా, తారకిత = నక్షత్రములతోఁగూడినదిగఁ జేయఁబడిన, అంబరః = ఆకసముగల్గినవాఁడై, దివః = స్వర్గమునుండి, (అంతరిక్షమునుండి) పాత్యతేఖలు = త్రోయఁబడుచున్నాఁడు గదా.

వి॥ కృష్ణపక్షరాత్రిని శిలతోరూపించుటవలన తాద్రూప్యరూపకము. విరహిణులను బాధించుటవలన పాపియగు చంద్రుడు కృష్ణరాత్రియను శిలపైఁ ద్రోయఁబడుటవలన నతఁడు పగలి ముక్కలు పైకెగిరి యాకసమున నక్షత్రములైనవో యని యుత్ప్రేక్షించుటవలన నుత్ప్రేక్షాలంకారము.

## సమాసములు :

*అయోగివధూవధపాతకైః :* న యోగః = అయోగః. అయోగః ఆసామస్తీతి = అయోగిన్యః. అయోగిన్యశ్చ తాః వధ్వశ్చ = అయోగివధ్వః. అయోగివధూనాం వధః = అయోగివధూవధః. అయోగివధూవధేన పాతకాని = అయోగివధూవధపాతకాని. తైః = అయోగివధూవధపాతకైః.

*శితినిశాదృషది :* శితినిశైవ దృషత్ = శితినిశాదృషత్. తస్యాం = శితినిశాదృషది.

స్ఫుటదుత్పతత్ కణగణాధికతారకితాంబరః : స్ఫుటంతశ్చ తే ఉత్ప తంతశ్చ = స్ఫుటదుత్పతంతః. స్ఫుటదుత్పతంతశ్చ తే కణాశ్చ = స్ఫుటదుత్ప తత్కణాః. స్ఫుటదుత్పతత్కణానాం గణాః = స్ఫుటదుత్పతత్కణగణాః. తారకాః అస్య సంజాతా ఇతి = తారకితమ్. స్ఫుటదుత్పతత్కణగణైః అధికం తారకితమ్ స్ఫుటదుత్పతత్కణగణాధికతారకితమ్. స్ఫుటదుత్పతత్కణగణాధికతారకితమ్ అంబరంయేన సః = స్ఫుటదుత్పతత్కణగణాధికతారకితాంబరః.

భావము :

లోకమున పాపముచేసిన వారిని, నగరమునఁ ద్రిప్పి బండపైనఁబడవైచి చంపుదురు. అట్లే చంద్రుఁడు విరహిణులనుఁ జంపి పాపియాయెను. అతడు భూభ్రమణమనెడి నగర భ్రమణమునుఁ జేయును. అట్లు భ్రమణముఁజేసిన యా చంద్రుఁడు కృష్ణపక్షరాత్రియనెడి బండపైఁ ద్రోయఁబడుటవలనబగలి తునుకలు పైకిలేచినవి. ఆ తునుకలే నక్షత్రములై మింట నంటు కొనివవి. ॥౭౯॥

శ్లో॥ త్వమభిధేహి విధుం సఖి! మద్గిరా
కిమిదమీదృగధిక్రియతే త్వయా ।
న గణితం యదిజన్మ పయోనిధౌ
హరశిరఃస్థితిభూరపి విస్మృతా॥ ౫౦

ప॥వి॥ త్వమ్ । అభిధేహి । విధుం । సఖి । మద్గిరా। కిమ్। ఇదమ్। ఈదృక్। అధిక్రియతే । త్వయా । న । గణితం । యది । జన్మ । పయోనిధౌ । హరశిరః స్థితిభూః । అపి । విస్మృతా.

టీక॥ హేసఖి = ఓచెలీ! త్వం = నీవు, మద్గిరా = నామాటతో, విధుం = చంద్రుని, అభిధేహి = చెప్పుము. త్వయా = నీవంటిమహాత్మునిచే, కిమ్ = ఎందులకు, ఇదం = ఈ, ఈదృక్ = ఇటువంటిస్త్రీహత్యయనెడి కార్యము, అధిక్రియతే = చేయఁబడుచున్నది. పయోనిధౌ = సముద్రమందు, జన్మ = పుట్టుక, న గణితం యది = గణింపఁబడనిచో, (మాఽస్తు = వద్దు.) హరశిరఃస్థితిభూరపి; హరశిరః = శివునిశిరస్సనెడి, స్థితిభూరపి = నివాసభూమియు, విస్మృతా = మఱువఁబడినదా?

సమాసములు :

హరశిరఃస్థితిభూః : హరస్య శిరః = హరశిరః. హరశిర ఏవ స్థితిభూః = హరశిరఃస్థితిభూః.

భావము :

ఓ చెలీ చంద్రునితో నేను చెప్పినట్లు చెప్పుము. ఓచంద్రా! మహనీయుఁడవైన నీ వెందుల కిట్టి స్త్రీవధ యను పాపమునకు సమకట్టితివి? నీవు సముద్రమందు జన్మించుటవలన నుత్తమకులమున పుట్టినవాఁడవు. దానిని గణించితివా? ఒకవేళ దానిని లెక్కింపక పోయినచో పోనిమ్ము. కాని శివుని శిరస్సనెడి పవిత్ర భూమిలో నీకు నివాసముగదా! దానినిగూడ మఱచితివా? ఉత్తమ వంశమునఁ బుట్టి యుత్తముల సహవాసము గల నీవంటివాడిట్టి స్త్రీవధపాతకమునకు సమకట్టుట తగునా? ॥౫౦॥

శ్లో॥ నిపతతాఽపి న మందరభూభృతా
త్వముదధౌ శశలాంఛన! చూర్ణితః।
అపి మునేర్జఠరార్చిషి జీర్ణతాం
బత గతోఽసి న పీతపయోనిధేః॥ ౫౧

ప॥వి॥ నిపతతా । అపి । న । మందరభూభృతా । త్వమ్ । ఉదధౌ । శశలాంఛన । చూర్ణితః । అపి । మునేః । జఠరార్చిషి । జీర్ణతాం । బత । గతః । అసి । న । పీతపయోనిధేః.

టీక॥ హేశశలాంఛన = కుందేటి మచ్చగల ఓచంద్రా! త్వమ్ = నీవు, (మథనకాలమున) ఉదధౌ = సముద్రమందు, నిపతతా = పడుచున్న, మందరభూభృతాఽపి = మందరపర్వతముచేతఁగూడ, న చూర్ణితః = పొడిగావింపఁబడలేదు. పీతపయోనిధేః; పీత = పానముచేయఁబడిన, పయోనిధేః = సముద్రము గల్గిన, మునేః = అగస్త్యమహర్షియొక్క, జఠరార్చిష్యపి = జఠరాగ్నియందుఁగూడ, జీర్ణతాం = జీర్ణమగుటను, న గతోఽసి = పొందక పోతివి. బత = అయ్యో!

**సమాసములు :**

*మందరభూభృతా:* మందర ఇతి భూభృత్ = మందరభూభృత్. తేన = మందరభూభృతా.

*ఉదధౌ :* ఉదకాని ధీయంతే అస్మిన్ ఇతి = ఉదధిః. తస్మిన్ = ఉదధౌ.

*శశలాంఛన:* శశః లాంఛనం యస్యసః = శశలాంఛనః. తస్య సంబుద్ధిః = హే శశలాంఛన!

*జఠరార్చిషి :* జఠరస్య అర్చిః = జఠరార్చిః. తస్మిన్ = జఠరార్చిషి.

*పీతపయోనిధేః:* పీతః పయోనిధిః యేన సః = పీతపయోనిధిః. తస్య = పీతపయోనిధేః.

**భావము :**

కుందేటిమచ్చచేఁ గళంకితమైన ఓ చంద్రా! నిన్ను సముద్రమును చిలుకుటకై త్రోయఁబడిన మందరపర్వతము చూర్ణముగావింప లేదు. అట్లు చూర్ణముగావించియున్నచో, నేడు నీబెడద యుండదు గదా! అట్లేసముద్రమ ను పానము గావించిన యగస్త్యమహర్షి యొక్క జఠరాగ్నిలో నీవు జీర్ణముకాకపోతివే! అట్లు నీవు జీర్ణమైపోయియున్నచో నేడు నీ వలని బాధ తప్పియుండెడిది. కాని అట్లు జరుగక పోయినదే! అయ్యో! మా దురదృష్టము. ॥౨౦॥

శ్లో॥ కిమసుభిర్గ్లపితైర్జడ! మన్యసే
మయి నిమజ్జతు భీమసుతామనః।
మమ కిల శ్రుతిమాహ తదర్థికాం
నలముఖేందుపరాం విబుధస్మరః॥ ౨౧

ప॥వి॥ కిమ్ । అసుభిః । గ్లపితైః । జడ । మన్యసే । మయి । నిమజ్జతు । భీమసుతామనః । మమ । కిల । శ్రుతిమ్ । ఆహ । తదర్థికాం । నలముఖేందు పరాం । విబుధస్మరః.

టీక॥ హేజడ! = ఓ మూఢా! గ్లపితైః = శోషింపఁబడుటచే తొలగింపఁబడిన, అసుభిః = ప్రాణములచే, అనగా తన మరణముచే, భీమసుతామనః,

భీమసుతా = దమయంతియొక్క, మనః = మనస్సు, మయి = నాయందు (చంద్రునియందు) నిమజ్జతు = లయించును, ఇతి = అని, మన్య సేకిమ్ = తలంతువా ఏమి. (అది వ్యర్థమైన కోరిక). తదర్థికాం; తత్ = మృతుల మనస్సు చంద్రునిఁ బొందునను, అర్థికాం = అర్థము కల్గిన, శ్రుతిం = వేదమును, విబుధస్మరః; విబుధ = వేల్పును, పండితుఁడునైన, స్మరః = మన్మథుఁడు, నలముఖేందుపరాం; నల = నలునియొక్క, ముఖేందు = ముఖచంద్రుఁడు, పరాం = ముఖ్యార్థముగఁ గలదిగ, మమ = నాకు, ఆహ కిల = చెప్పుచున్నాఁడు గదా.

వి॥ దమయంతి విరహ బాధచే మృతిఁ జెందినచో నామె మనస్సు చంద్రుని లోనికిఁ బోవునను శ్రుతి ననుసరించి దమయంతీ హృదయమును తనలోఁ బ్రవేశ పెట్టుకొనుటకై యామెనుఁ జంపుటకు చంద్రుఁడు ఉద్దేశించునట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష. మృతిఁ జెందినవాని మనస్సు చంద్రునిఁ జేరునని – ''యత్రాఽస్య పురుషస్యాగ్నిం వాగప్యేతి వాతం ప్రాణశ్చక్షురాదిత్యం మనశ్చంద్రం దిశః శ్రోత్రం పృథివీం శరీరమాకాశమాత్మౌషధీర్లోమాని వనస్పతీన్ కేశా అప్సు రోహితం చ రేతశ్చ నిధీయతే'' యిత్యాదిశ్రుతి చెప్పుచున్నది.

## సమాసములు :

*భీమసుతామనః :* భీమస్య సుతా = భీమసుతా. భీమసుతాయాః మనః = = భీమసుతామనః.

*తదర్థికాం :* సః అర్థః యస్యాస్సా = తదర్థికా. తామ్ = తదర్థికాం.

*నలముఖేందుపరామ్ :* ముఖమిందురివ = ముఖేందుః. నలస్య ముఖేందుః = నలముఖేందుః. నలముఖేందుః పరః యస్యాస్సా = నలముఖేందుపరా. తామ్ = నలముఖేందుపరామ్.

*విబుధస్మరః :* విబుధశ్చాసౌ స్మరశ్చ = విబుధస్మరః.

## భావము :

ఓ జడుఁడైన చంద్రుఁడా! నన్ను బాధించుటచే నా ప్రాణములను తొలగించి నన్ను నీవు చంపఁ నుద్దేశించియున్నావు. అట్లు నన్ను చంపినచో,

"మృతుని మనస్సు చంద్రుని బొందును" అని శ్రుతిననుసరించి నా మనస్సునిన్నుఁ బొందునని వృథాభిమానముఁ గల్గియున్నావు. కాని "మృతుని మనస్సు చంద్రుని చేరును" అను శ్రుతియొక్క యర్థము వేఱు. శ్రుతిలోని చంద్రశబ్దమునకు నలుని ముఖచంద్రుఁడను నర్థమును మన్మథపండితుఁడు వచించుచున్నాఁడు. ఒకవేళ నీవు పెట్టెడి బాధలవలన నేను మరణించినను నా మనస్సు నిన్నుఁ బొందదు. అది నలుని ముఖచంద్రునే పొందును. కావున వృథాభిమానము వదలిపెట్టుము. అనగా తాను మరణించినను, తన హృదయము నలునియందే లీనమగును. అనగా పరలోకమునఁ గూడ నలుఁడే తనకు భర్త కాఁగలఁడని సారాంశము. ॥౭౨॥

శ్లో॥ ముఖరయస్వ యశోనవడిండిమం
జలనిధేః కులముజ్జ్వలయాఽధునా।
అపి గృహాణ వధూవధపౌరుషం
హరిణలాంఛన! ముంచ కదర్థనామ్॥ ౭౩

ప॥వి॥ ముఖరయస్వ । యశోనవడిండిమం । జలనిధేః । కులమ్ । ఉజ్జ్వలయ । అధునా । అపి । గృహాణ । వధూవధపౌరుషం । హరిణలాంఛన । ముంచ । కదర్థనామ్.

టీక॥ హేహరిణలాంఛన = ఓ లేడి మచ్చగల్గిన చంద్రా! యశోనవడిండిమం: యశః = కీర్తికి, నవడిండిమం = ప్రకాశపరచునట్టి, నూతనమగు డిండిమ వాద్యమును, ముఖరయస్వ = వాయించుము. అధునా = ఇప్పుడు, జలనిధేః = నీకు జనకుఁడైన సముద్రుని యొక్క, కులం = వంశమును, ఉజ్జ్వలయ = ప్రకాశపఱచుము. వధూవధపౌరుషమపి; వధూ = స్త్రీల యొక్క, వధ = హత్యకు కావలసిన, పౌరుషమపి = పౌరుషమునుఁగూడ, గృహాణ = స్వీకరించుము. (కింతు = కాని,) కదర్థనామ్ = పీడించుటను, ముంచ = వదలిపెట్టుము.

వి॥ స్త్రీ వధ యనిష్టమగుటవలన నది విధింపఁదగినది కాకపోయినను విధింపఁబడినది గాన నిచ్చట విధ్యాభాసము "విషంభుఙ్క్ష్వ" మున్నగు విధులవలె ఇది నిషేధపరము కాన నిష్టనిషేధాభాస రూపమైన ఆక్షేపాలంకారము.

## సమాసములు :

*యశోనవడిండిమమ్ :* నవశ్చాసౌ డిండిమశ్చ = నవడిండిమః. యశసః నవడిండిమః = యశోనవడిండిమః. తమ్ = యశోనవడిండిమమ్.

*వధూవధపౌరుషమ్ :* వధూనాం వధః = వధూవధః. పురుషస్య కర్మ = పౌరుషమ్. వధూవధే పౌరుషమ్ = వధూవధ పౌరుషమ్.

*హరిణలాంఛన :* హరిణః లాంఛనం యస్య సః హరిణలాంఛనః. తస్య సంబుద్ధిః = హే హరిణలాంఛన.

*కదర్థనా:* కుత్సితః అర్థః = కదర్థః. కదర్థస్య కరణా = కదర్థనా. తాం = కదర్థనామ్.

## భావము :

లేడిమచ్చగల యో చంద్రా! స్త్రీలను వధించుటవలన నేర్పడిన నీ కీర్తిని వెల్లడించేయునట్టి తప్పెటను వాయించుకొనుము. నీ తండ్రియగు సముద్రుని వంశమును ప్రకాశపఱచుకొనుము. స్త్రీలను చంపుటకైన పౌరుషమును స్వీకరింపుము. కాని పీడించుటను మాత్రము మానుము. పీడించుటకంటె చంపుటయే శ్రేష్ఠమని యాశయము. ॥౩౩॥

శ్లో॥ నిశి శశిన్భజ కైతవ భానుతా
మసతి భాస్వతి తాపయ పాప మామ్।
అహమహన్యవలోకయితాస్మి తే
పునరహర్పతినిర్ధుతదర్పతామ్॥ ౩౪

ప॥వి॥ నిశి । శశిన్ । భజ । కైతవభానుతామ్ । అసతి । భాస్వతి । తాపయ । పాప । మామ్ । అహమ్ । అహని । అవలోకయితాస్మి । తే । పునః । అహర్పతి నిర్ధుత దర్పతామ్.

టీక॥ హేశశిన్ = ఓ చంద్రా, పాప = క్రూరుడా! నిశి = రాత్రియందు, భాస్వతి = సూర్యుడు, అసతి = లేక యుండగా, కైతవభానుతాం = కపట సూర్యత్వమును, భజ = పొందుము. మాం = నన్ను, తాపయ = తపింపజేయుము. (కింతు = కాని) అహం పునః = నేనో, అహని =

పగటియందు, తే = నీకు, అహర్పతి నిర్ధుత దర్పతామ్; అహర్పతి = సూర్యునిచేత, నిర్ధుత = తొలగింపఁబడిన, దర్పతాం = గర్వమునుఁ గల్గి యుండుటను, అవలోకయితాస్మి = చూడఁబోవుచున్నాను.

## సమాసములు :

కైతవభానుతామ్ : కితవస్య భావః = కైతవమ్. కైతవేనభానుః = కైతవభానుః. కైతవభానోః భావః = కైతవభానుతా. తామ్ = కైతవభానుతామ్.

అహర్పతినిర్ధుతదర్పతామ్ : అహ్నాం పతిః = అహర్పతిః. అహర్పతినా నిర్ధుతః = అహర్పతి నిర్ధుతః. అహర్పతి నిర్ధుతః దర్పః యస్య సః = అహర్పతి నిర్ధుతదర్పః. అహర్పతి నిర్ధుతదర్పస్య భావః = అహర్పతి నిర్ధుతదర్పతా. తామ్ = అహర్పతి నిర్ధుతదర్పతామ్.

## భావము :

ఓ చంద్రుఁడా! రాత్రియందు కృత్రిమ సూర్యుఁడవుకమ్ము. సూర్యుఁడు లేని యా రాత్రియంచు నన్ను తపింపజేయుము. పగటి యందు సూర్యునిచే గర్వము దొలగిన నిన్ను నేను జూడఁగలను. ॥౩౪॥

శ్లో॥ శశకలంక భయంకర మాదృశామ్
జ్వలసి యన్నిశి భూతపతిం శ్రితః।
తదమృతస్య తవేదృశభూతతా
ద్భుతకరీ పరమూర్ధ విధూననీ॥ ౩౫

ప॥వి॥ శశకలంక । భయంకర । మాదృశామ్ । జ్వలసి । యత్ । నిశి । భూతపతిం । శ్రితః । తత్ । అమృతస్య। తవ । ఈదృశభూతతా। అద్భుతకరీ । పరమూర్ధవిధూననీ.

టీక॥ హే శశకలంక! = ఓ కుందేటి మచ్చగల చంద్రా! మాదృశాం = మా వంటి విరహిణులకు, భయంకర = భయంకరమైనవాఁడా! యత్ = ఎందు వలన, భూతపతిం = శివుని, (పిశాచపతిని), శ్రితస్సన్ = ఆశ్రయించిన వాఁడవై, నిశి = రాత్రియందు. జ్వలసి = జ్వలించుచున్నావో, తత్ =

అందువలన, అమృతస్య = అమృతమయమైన,(మృతుఁడు కానటువంటి) తవ = నీకు, పరమూర్ధవిధూననీ; పర = ప్రేక్షకులయొక్క,(తన యావేశముగల వారి యొక్క) మూర్ధ = తలను, విధూననీ = ఆశ్చర్యముచే, నూపునట్లు చేసెడి (అవేశముచే నూపునట్లుచేసెడి) ఈ దృశభూతతా; ఈదృశ = ఇట్టి, భూతతా = స్థితి (పిశాచత్వము)అద్భుతకరీ = ఆశ్చర్య కరమైనది.

సమాసములు :

*శశకలంక:* శశః కలంకః యస్య సః = శశకలంకః. తస్యసంబుద్ధిః = హేశశకలంక.

*భయంకర :* భయంకరోతీతి = భయంకరః. తస్యసంబుద్ధిః = హేభయంకర.

*భూతపతిం :* భూతానాం పతిః = భూతపతిః. తమ్ = భూతపతిమ్.

*అమృతస్య :* న మృతః = అమృతః. తస్య = అమృతస్య.

*ఈదృశభూతతా :* ఈదృశశ్చాసౌ భూతశ్చ ఈదృశభూతః, ఈ దృశ భూతస్య భావః = ఈ దృశభూతతా.

*పరమూర్ధవిధూననీ :* పరేషాంమూర్ధాని = పరమూర్ధాని. పరమూర్ధ్నాం విధూననీ = పరమూర్ధవిధూననీ.

*అద్భుతకరీ :* అద్భుతం కరోతీతి = అద్భుతకరీ.

భావము :

ఓయ్! లేడిమచ్చను దాల్చిన చంద్రుఁడా! నీవు మావంటివారలకు భయంకరుఁడవు. నీవు శివుని ఆశ్రయించి (పిశాచపతిని ఆశ్రయించి) రాత్రి జ్వలింతువు. నీవు సహజముగా నమృతస్వరూపుఁడవై చల్లని వాఁడవు. మఱియు నమృతుఁడవు. అనగా మృతిఁజెందక జీవించిన వాఁడవు. కాని నీవు నిన్నుఁ జూచెడి ప్రేక్షకులను ఆశ్చర్యముచే, తలను ఆడింతువు. మఱియు నీవు మృతుఁడవు కాకపోయినను పిశాచమువలె నితరుల తల నాడింతువు. లోకమున మృతు

లైన వారు, పిశాచములై యితరుల నావేశించి వారి తలల నాడించుట ప్రసిద్ధము. నీవు బ్రతికియు ఈ విధమైన పిశాచముగ నుండుట యచ్చెరువుగ నున్నది. శివుని శిరస్సునందుండి యమృతమయుఁడవై చల్లగనుండవలసిన నీకు దహించు స్వభావము మిక్కిలి ఆశ్చర్యకరము. బ్రతికిన వాఁడు ఈ విధముగ కొఱివి దయ్యమగుట యాశ్చర్యమని ధ్వని. ॥౨౩॥

శ్లో॥ శ్రవణపూరతమాలదళాంకురం
శశికురంగముఖే సఖి! నిక్షిప।
కిమపి తుందిలితః స్థగయత్వముం
సపది తేన తదుచ్ఛ్వసిమి క్షణమ్॥ ౨౪

ప॥వి॥ శ్రవణపూరతమాలదళాంకురం । శశికురంగముఖే । సఖి । నిక్షిప ।
కిమ్ । అపి । తుందిలితః । స్థగయతు । అముం। సపది। తేన। తత్ ।
ఉచ్ఛ్వసిమి । క్షణమ్.

టీక॥ హేసఖి = ఓ చెలీ! శ్రవణపూరతమాల దళాంకురం; శ్రవణపూర = కర్ణభూషణమైన, తమాల = తమాలవృక్షముయొక్క, దళాంకురం = చిగురాకును, శశికురంగముఖే; శశి = చంద్రునియొక్క, కురంగ = జింకయొక్క, ముఖే = నోట, నిక్షిప = ఉంచుము. తేన = ఆ చిగురాకుచే, సపది = వెంటనే, కిమపి = కొంచమైనను, తుందిలితః = బలసినదై, అముం = ఈచంద్రుని, స్థగయతు = కప్పును. తత్ = అట్లు కప్పుటవలన, క్షణం = కొంతకాలము, ఉచ్ఛ్వసిమి = చంద్రుని బాధలేక జీవింతును.

సమాసములు :

*శ్రవణపూర తమాలదళాంకురం :* శ్రవణయోః పూరః = శ్రవణపూరః. తమాలస్య దళం = తమాలదళమ్. తమాలదళమేవఅంకురః = తమాలదళాంకురః. శ్రవణపూరశ్చాసౌ తమాలదళాంకురశ్చ = శ్రవణపూరతమాలదళాంకురః. తం = శ్రవణపూరతమాలదళాంకురం.

*శశికురంగముఖే :* శశినః కురంగః = శశికురంగః. శశికురంగస్య ముఖమ్ = శశికురంగముఖం. తస్మిన్ = శశికురంగముఖే.

**భావము :**

ఓ చెలీ! చెవులయందున్న తమాలపుఁ జిగురును చంద్రుని లేడినోట నుంచుము. ఆ చిగురాకును తినుటచే వెంటనే కొంచెము బలసినదై యా చంద్రుని మఱుగుపఱచును. దానివలన కొంచెము నాకు బాధ తొలగును. ॥౨౬॥

శ్లో॥ అసమయే మతిరున్మిషతి ధ్రువం
కరగతైవ గతా యదియం కుహూః।
పునరుపైతి నిరుద్ధ్య నివాస్యతే
సఖి! ముఖం న విధోః పునరీక్ష్యతే॥ ౨౭

ప॥వి॥ అసమయే । మతిః । ఉన్మిషతి । ధ్రువమ్ । కరగతా । ఏవ । గతా । యత్ । ఇయం । కుహూః । పునః । ఉపైతి । నిరుద్ధ్య । నివాస్యతే । సఖి । ముఖం । న । విధోః । పునః । ఈక్ష్యతే.

టీక॥ హేసఖి = ఓ చెలీ!, అసమయే = అకాలమందు, మతిః = బుద్ధి, (పనిచేయవలయుననెడి బుద్ధి), ఉన్మిషతి = పుట్టుచున్నది. ధ్రువమ్ = ఇదిసత్యము. యత్ = ఎందువలన ఇయం = ఈ, కుహూః = అమావాస్య, కరగతైవ = చేత నున్నదిగనే (హస్త నక్షత్రమందున్నదిగనే), గతా = పోయినదో. (తత్ = అది, ఆస్తామ్ = ఉండనిమ్ము). పునః = మఱల, ఉపైతి (యది) = వచ్చినచో, నిరుద్ధ్య = అడ్డగింపఁబడి, నివాస్యతే = నిలుపఁబడును. (అందువలన), విధోః = చంద్రునియొక్క, ముఖం = మోము, పునః = మఱల. నేక్ష్యతే = చూడఁబడదు.

**సమాసములు :**

***అసమయే :*** న సమయః = అసమయః. తస్మిన్ = అసమయే.

***కరగతా :*** కరం గతా = కరగతా.

**భావము :**

ఓ చెలీ! అకాలమునందు పనులు చేయుటకు బుద్ధి పుట్టును. ఏలయనగా— చంద్రుని హరించెడి యమావాస్య సమీపములోనే పోయినది. అప్పుడు తెలిసి

యున్నచో నా యమావాస్యచే చంద్రుని హరింపఁజేసియుందును. ఇఁక మఱల నా యమావాస్య వచ్చినచో దానిని అడ్డగించి నిలిపి వేయగలను. ఇఁక చంద్రుని ముఖమునుఁ జూడను. పాపుల ముఖమునుఁ జూడరాదు గదా. ॥౨౭॥

శ్లో॥ అయి మమైష చకోరశిశుర్మునే
ర్వ్రజతి సింధుపిబస్య న శిష్యతామ్।
అశితుమబ్ధిమధీతవతోఽస్య వా
శశికరాః పిబతః కతి శీకరాః॥ ౨౮

ప॥వి॥ అయి । మమ । ఏషః । చకోరశిశుః । మునేః । వ్రజతి । సింధుపిబస్య । న । శిష్యతామ్ । అశితుమ్ । అబ్ధిమ్ । అధీతవతః । అస్య । వా । శశికరాః । పిబతః । కతి । శీకరాః.

టీక॥ అయి సఖి = ఓ చెలీ!, ఏషః = ఈ, మమ = నాయొక్క, చకోరశిశుః = బాలచకోరము, సింధుపిబస్య = సముద్రమునుఁ బానముఁ గావించిన, మునేః = అగస్త్యునకు, శిష్యతాం = శిష్యుఁడుగ నుండుటను, నవ్రజతి = పొందదాయేమి? అబ్ధిం = సముద్రమును, అశితుం = పానము చేయుటకు, అధీతవతః = అభ్యాసము గావించిన (కావుననే), పిబతః = సముద్రమునుఁ బానముగావించుటకు ప్రయత్నించిన, అస్య = ఈ చకోరమునకు శశికరాః = చంద్రకిరణములు, కతి = ఎన్ని, శీకరాః = బిందువులు.

వి॥ అన్నములో విషమునుఁ బరీక్షించుటకై రాజభవనములలో చకోరపక్షులను పెంచుచుండెడి వారు. "చకోరస్య విరజ్యేతే నయనే విషదర్శనాత్" అని కామందకుని వచనముననుసరించి, విషమునుఁజూడగనే, చకోరపక్షులకు నేత్రము లెఱ్ఱబారును. అందుచలన విషమును తెలుసుకొనెడివారు. దమయంతియు దానికై చకోరమునుఁ బెంచుకొనుచున్నది.

సముద్రమునే చకోరశిశువు పానముగావించియున్నచో చంద్రకిరణములు దానికి ఎన్ని బిందువులు కాగలవు అని చెప్పుటవలన సముద్రమునే పానము గావించినపుడు అందున్న చంద్రుఁడు గూడ పానము చేయఁబడియే యుండునను నర్థము" దండాపూప" న్యాయమున సిద్ధించినది గాన నిట నర్థాపత్త్యలంకారము.

సమాసములు :

చకోరశిశుః : చకోరస్య శిశుః = చకోరశిశుః.

సింధుపిబస్య : సింధుం పిబతీతి = సింధుపిబః. తస్య = సింధుపిబస్య.

శశికరాః : శశినః కరాః = శశికరాః.

భావము :

నేను పెంచుకొనిన బాలచకోరము, సముద్రమును బానముఁగావించిన యగస్త్యమహర్షికి నేల శిష్యుఁడు గారాదు. అట్లు శిష్యుఁడుగానున్నచో సముద్రమును బానముఁజేయునపుడే చంద్రునిఁగూడఁ బానము చేసి యుండును గదా! ఇది యసాధ్యమైన పని కాదు. ఏలయనగా సముద్రపానమును నేర్చుకొని దానిని పానము చేయగల్గినప్పుడు ఆ సముద్రమందలి చంద్రుని పానము గావించుట యసాధ్యమా? దండమునే ఎలుకలు తినిపోయినప్పుడు, దండమందలి వడలను ఎలుకలు తినకయుండునా? అట్లే సముద్రమునే పానము చేయగల్గిన చకోరము సముద్రమందలి చంద్రునిఁ బానము చేయలేక పోవునా? తప్పక చంద్రునిఁ బానము చేయగల్గియుండెడిది. ॥౨౮॥

శ్లో॥ కురు కరే గురుమేకమయోఘనం
బహిరితో ముకురం చ కురుష్వ మే।
విశతి తత్ర యదైవ విధు సదా
సఖి సుఖాదహితం జహి తం ద్రుతమ్॥ ౨౯

ప॥వి॥ కురు । కరే । గురుమ్ । ఏకమ్ । అయోఘనం । బహిః । ఇతః । ముకురం । చ । కురుష్వ । మే । విశతి । తత్ర । యదా । ఏవ । విధుః । తదా । సఖి । సుఖాత్ । అహితం । జహి । తం । ద్రుతమ్.

టీక॥ హేసఖి = ఓ చెలీ!, ఏకం = ఒక, గురుం = గొప్పదైన, అయోఘనం = కాల్చిన యినుపముద్ద తట్టుటవలన నేర్పడిన గుదియను, కరే = చేతి యందు, కురు = ఉంచుకొనుము. ఇతః = ఈ ఇంటికి వెలుపల, మే = నాయొక్క, ముకురంచ = అద్దమునుగూడ, కురుష్వ = ఉంచుకొనుము.

తత్ర = ఆ అద్దమునందు, యదైవ = ఎప్పుడు, విధుః = చంద్రుడు, విశతి = ప్రతిఫలించునో, తదైవ = అప్పుడే, సుఖాత్ = సుఖముగా, అహితం = శత్రువైన, తం = ఆచంద్రుని, ద్రుతం = శీఘ్రముగా, జహి = చంపుము.

వి॥ ఇచ్చట చంద్రుని కొట్టుట మున్నగు ప్రతాపములు మేఘ సందేశాదుల వలె మన్మథుని వలన నేర్పడిన ఉన్మాద వికారములుగా భావింపవల యును.

సమాసములు:

అయోఘనమ్ : అయోమయః ఘనః = అయోఘనః. తమ్ = అయో ఘనమ్.

అహితమ్ : న హితః = అహితః. తం = అహితమ్.

భావము :

ఓ చెలీ! పెద్దదైన యినుపగుదియనుచేత నుంచుకొనుము. ఇంటికి వెలుపల నాయద్దమునుగూడచేత నుంచుకొనుము. ఎప్పుడు చంద్రుఁడు ఆయద్దమును ప్రవేశించునో, అప్పుడే సుఖముగా నాశత్రువును ఆ గుదియతో చంపుము. అని విరహ బాధలనుభవించుచున్న దమయంతి కామోన్మాదమున చెలికత్తెతో చెప్పుచున్నది. ॥౨౯॥

శ్లో॥ ఉదర ఏవ ధృతః కిముద్వనతా
న విషమో బడబానలవత్ విధుః।
విషవదుజ్ఝిత మప్యమునా న స
స్మరహరః కిమముం బుభుజే విభుః॥ ౩౦

ప॥వి॥ ఉదరే । ఏవ । ధృతః । కిమ్ । ఉదన్వతా । న । విషమః । బడబానలవత్। విధుః । విషవత్। ఉజ్ఝితమ్ । అపి । అమునా। న। సః। స్మరహరః । కిమ్ । అముం । బుభుజే । విభుః.

టీక॥ విషమః = క్రూరకృత్యముగల్గిన, విధుః = చంద్రుడు, ఉదన్వతా = సముద్రముచే, బడబానలవత్ = బడబాగ్నివలె, ఉదరేఏవ = గర్భము

నందే, కిం = ఏల, న ధృతః = ధరింపఁబడలేదు. (అథవా = లేదా) అమునా = ఈ సముద్రముచే, ఉజ్ఝితమపి = విడువబడినదైనను, అముం = ఈ, విధుం = చంద్రుని, విభుః = సమర్థుడైన, సః = ఆ, స్మరహరః = శివుఁడు, విషవత్ = విషమువలె, కిం = ఏల, నబుభుజే = భక్షింపలేదు.

## సమాసములు :

*బడబానలవత్ :* బడబానలేన తుల్యం = బడబానలవత్.

*విషవత్ :* విషేణ తుల్యం = విషవత్.

## భావము :

ఆ క్రూర కృత్యము గల్గిన చంద్రుని, సముద్రుఁడు బడబాగ్నిని తన కడుపునందు దాచుకొన్నట్లు దాచుకొనియుండినను నేను జీవింపఁగల్గియుందును. లేదా సముద్రునిచే విడువఁబడిన యా చంద్రుని శివుఁడు విషమును మ్రింగినట్లు మ్రింగియున్నను నేను జీవింపఁగల్గియుందునని దమయంతి తనకు విరహ సంతాపమును వర్ధిల్లఁజేసెడి చంద్రుని దూషించుచున్నది. ॥౮౦॥

శ్లో॥ అసితమేకసురాశితమప్యభూ
న్న పునరేష పునర్విశదం విషమ్।
అపి నిపీయ సురైర్జనితక్షయం
స్వయముదేతి పునర్నవ మార్ణవమ్॥ ౮౧

ప॥వి॥ అసితమ్ । ఏకసురాశితమ్ । అపి । అభూత్ । న । పునః । ఏషః । పునః । విశదం । విషమ్ । అపి । నిపీయ । సురైః । జనితక్షయం । స్వయం । ఉదేతి । పునః । నవమ్ । ఆర్ణవమ్.

టీక॥ ఆర్ణవమ్ = సముద్రమునందు జన్మించిన, అసితం = నల్లని, విషం = కాలకూటమనెడి విషము, ఏకసురాశితమపి; ఏకసుర = ఒక్క వేల్పుచే అనగా శివునిచే, అశితమపి = భక్షింపఁబడియు, పునః = మఱల, నాఽభూత్ = జన్మించలేదు. ఏషః = ఈ చంద్రుడనెడి, ఆర్ణవమ్ = సముద్ర

మందు జన్మించిన, విశదం = తెల్లని, విషంపునః = విషమో, సురైః = పెక్కు వేల్పులచే, నిపీయ = పానముచేయఁబడి, జనితక్షయమపి; జనిత = కల్గింపఁబడిన, క్షయమపి = నాశముకల్గినదైనను, నవం = నూతనమై, పునః = మఱల, స్వయం = ఆరూపముతోడనే, ఉదేతి = పుట్టుచున్నది.

వి॥ ''ప్రథమాంపిబతేవహ్నిః'' ఇత్యాది శాస్త్రముననుసరించి చంద్రకళలను అగ్ని మున్నగు దేవతలు పాడ్యమినుండి అమావాస్యవఱకు పానము చేయుదురని శ్రుతి చెప్పుచున్నది.

**సమాసములు :**

*అసితమ్ :* న సితమ్ = అసితమ్.

*ఏకసురాశితమ్ :* ఏకశ్చాసౌ సురశ్చ = ఏకసురః. ఏకసురేణ అశితమ్ = ఏకసురాశితమ్.

*జనితక్షయమ్ :* జనితఃక్షయః యస్య తత్ = జనితక్షయమ్.

*ఆర్ణవమ్ :* అర్ణవే భవమ్ = ఆర్ణవమ్.

**భావము :**

సముద్రమందు నుద్భవించిన నల్లని కాలకూట విషము ఒక్క వేల్పైన పరమశివునిచే భక్షింపఁబడినదై మఱల పుట్టలేదు. కాని తెల్లని యీచంద్రుఁడను విషమో పెక్కండ్రు వేల్పులు గ్రోలినను మాటిమాటికి నుద్భవించుచునే యున్నది. చంద్రకళలను అగ్ని మున్నగు దేవతలు ఒకరి వెనుక నొకరు కృష్ణపక్షమున పాడ్యమి నుండి అమావాస్యవఱకును భక్షింతురు. ఇట్లు చంద్రుడు భక్షింపఁబడినను మఱల శుక్లపక్ష ప్రతి పత్తునుండి జన్మించుచునే యుండును. కాని హాలాహల విషము చంద్రునివలె సముద్రమందు జన్మించియు పరమ శివునిచే నొక్కమాఱే భక్షింపఁబడి మఱల పుట్టలేదు. అది నల్లని విషము. తీవ్రమైనది. కాని యా విషము మఱల పుట్టలేక పోయినది. చంద్రుఁడనెడి యీ తెల్లవిషముగూడ నా సముద్రమందు పుట్టియు మాటిమాటికి దేవతలచే భక్షింపఁబడియు మఱల మఱల పుట్టుచునే యున్నది. కాన నిది చాల తీవ్రమైన విషము. ॥౬౧॥

శ్లో॥ విరహివర్గవధవ్యసనాకులం
కలయ పాపమశేషకలం విధుమ్।
సురనిపీతసుధాక మపాపకం
గ్రహవిదో విపరీతకథాః కథమ్॥ ౬౨

ప॥వి॥ విరహివర్గవధ వ్యసనాకులం । కలయ । పాపమ్ । అశేషకలం ।
విధుమ్ । సురనిపీతసుధాకం । అపాపకం। గ్రహవిదః। విపరీతకథాః ।
కథమ్.

టీక॥ (హే సఖి = ఓ చెలీ!), విరహివర్గవధవ్యసనాకులమ్; విరహివర్గ =
వియోగివర్గమును, వధ = చంపుటయందలి, వ్యసన = ఆసక్తితో,
ఆకులం = సంభ్రమముఁ జెందిన, అశేషకళం = సమగ్రమైన
కళలుగల, విధుం = చంద్రుని, పాపం = క్రూరునిగ, విద్ధి = ఎరుం
గుము. సురనిపీతసుధాకం; సుర = దేవతలచే, నిపీత = పానముఁజేయఁ
బడిన, సుధాకం = అమృతముగలవానిని, అపాపకం = సౌమ్యునిగ,
కలయ = భావింపుము. (కింతు = కాని) గ్రహవిదః = జ్యోతిష్కులు,
కథం = ఎట్లు, విపరీత కథాః = విపరీతమైన వచనములను, అనగా శుక్ల
పక్ష చంద్రుఁడు సౌమ్యుఁడు, కృష్ణపక్ష చంద్రుఁడు క్రూరుఁడని వచన
ములను గల్గియున్నారు.

వి॥ జ్యోతిషశాస్త్రజ్ఞులు "క్షీణేంద్వర్కార్కి-భూపుత్రాః పాపా స్తత్సంయుతో
బుధః। పూర్ణచంద్ర బుధాఽఽచార్య శుక్రాస్తేస్యుః శుభగ్రహాః" అని
క్షీణచంద్రుఁడు, సూర్యుఁడు, శనైశ్చరుఁడు, కుజుఁడు క్రూరగ్రహ
ములు, మఱియు పాపులతోఁ గూడిన బుధుఁడును క్రూరగ్రహము.
పూర్ణచంద్రుఁడు బుధుఁడు బృహస్పతి శుక్రుఁడు సౌమ్యగ్రహములని
చెప్పుదురు.

## సమాసములు :

*విరహివర్గవధవ్యసనాకులమ్* : విరహః ఏషామ స్తీతి = విరహిణః.
విరహిణాం వర్గః = విరహివర్గః విరహివర్గస్య వధః = విరహివర్గవధః. విరహి

వర్గవధే వ్యసనం = విరహివర్గవధవ్యసనం. విరహివర్గవధవ్యసనేన **ఆకులః** = విరహివర్గవధవ్యసనాకులః; తమ్ = విరహివర్గవధవ్యసనాకులమ్.

*అశేషకళమ్ :* అవిద్యమానః శేషః యాసాం తాః = అశేషాః. **అశేషాః** కళాః యస్య సః = అశేషకళః. తమ్ = అశేషకళమ్.

*సురనిపీతసుధాకమ్ :* సురైః నిపీతా = సురనిపీతా. **సురనిపీతా** సుధా యస్య సః = సురనిపీతసుధాకః. తమ్ = సురనిపీతసుధాకమ్.

**అపాపకమ్ :** నపాపః = అపాపః. అపాప ఏవ = అపాపకః. **తమ్** = అపాపకమ్.

*గ్రహవిదః :* గ్రహాన్ విదంతీతి = గ్రహవిదః.

*విపరీతకథాః :* విపరీతాః కథాః యేషాం తే విపరీతకథాః.

భావము :

(ఓ చెలీ) సంపూర్ణకళలుగల్గి, విరహులను బాధించుచున్న చంద్రుని క్రూర గ్రహముగను; దేవతలు పానము చేయుటచే కళలనుఁ గోల్పోయిన క్షీణ చంద్రుని, సౌమ్యగ్రహముగను భావించుము. కాని జ్యోతిషశాస్త్రజ్ఞులు దీనికి విపరీతముగ ఏల చెప్పుచున్నారో తెలియదు. వారు క్షీణచంద్రుని క్రూరగ్రహముగను, పూర్ణచంద్రుని సౌమ్యగ్రహముగనుఁ జెప్పుచున్నారు. ఇది అనుభవ విరుద్ధము. ఏలయనగా పూర్ణచంద్రుఁడే విరహులను బాధించుచున్నాఁడు. కాని క్షీణ చంద్రుఁడు విరహులను బాధించుటలేదు. ॥౬౨॥

శ్లో॥ విరహిభిర్బహుమానమవాపి య
స్సబహుళః ఖలు పక్ష ఇహాఽజని।
తదమితి స్సకలైరపి యత్ర తై
ర్వ్యరచి సా చ తిథిః కిమమా కృతా॥ ౬౩

ప॥వి॥ విరహిభిః । బహుమానమ్ । అవాపి । యః । సః । బహుళః । ఖలు । పక్షః । ఇహ । అజని । తదమితిః । సకలైః । అపి । యత్ర । తైః । వ్యరచి । సా । చ । తిథిః । కిమ్ । అమా । కృతా.

టీక॥ యః = ఏ, పక్షః = పక్షము (కృష్ణపక్షము), విరహిభిః = వియోగులచే, బహుమానం = సత్కారమును, అవాపి = పొందింపఁబడినదో, సః = ఆ పక్షము అనగా బహుమానము పొందింపఁబడిన పక్షము, బహుళః = బహుళపక్షముగ, అనగా క్షీణచంద్రుని కల్గియుండుటచే విరహబాధ తగ్గుటవలన, విరహులచే, బహుమానము పొందిన పక్షముగ, ఇహ = ఈ లోకమందు, అజని = అయినదా ఏమి? (కించ = మఱియు), యత్ర = ఏతిథియందు (అమావాస్యయందు), సకలైరపి = సకలురైన, తైః = ఆ విరహులచే, తదమితిః; తత్ = అ బహుమానమునకు, అమితిః = పరిమితి లేక యుండుట, వ్యరచి = చేయఁబడినదో, సా = ఆ, తిథిః = తిథి, అమా = అమితి యని అనగా అపరిమితియని అనగా చంద్రుడే కానరానందువలన విరహులవలని బహుమానము అపరిమితమగుట వలన అపరిమితమను నర్థముగల అమగా, (అమావాస్యగా), కృతాకిం = చేయఁబడినదా ఏమి.

వి॥ బహుళశబ్దమును అమాశబ్దమునుఁ దీసికొని కవి చమత్కరించుచున్నాడు. బహుళపక్షములోని బహుళ శబ్దమునకు నలుపని యర్థము. కాని యిచ్చట "బహూని లాతీతి బహుళః" అను వ్యుత్పత్తి ననుసరించి బహుమానమును గ్రహించునది యను నర్థము కల్పింపఁబడుచున్నది. కృష్ణపక్షమును విరహులు బహూకరించుట వలన నా పక్షము బహూకృతమగు పక్షము అనగా "బహుమానము పొందిన పక్షమని" యర్థము. ఏలయనగా కృష్ణపక్షమున చంద్రుఁడు క్షీణించుటచే నతని వలని యుపద్రవము తగ్గియుండుటవలన విరహులు అ పక్షమును బహూకరింతురు. బహుశబ్దమునకు బహుమాన పర్యంతమర్థమును గ్రహించి, "బహుంలాతీతి బహుళః" యనియు వ్యుత్పత్తి చెప్పఁదగును 'అమా' యను నవ్యయము సహభావమును బోధించును. సూర్యచంద్రులకు సహభావ మమావాస్య యందుండుటవలన నది "అమా" యనియు చెప్పఁబడును. కాని యిట నా యర్థము చెప్పదగదు. మఱేమనగా అమా యనగా అపరిమితి. "అమా = అపరిమితిః బహుమానస్య అస్యామ్" అను వ్యుత్పత్తిచే అపరిమిత బహుమానము కలది యను నర్థము కల్పింపఁబడుచున్నది. విరహులు కృష్ణపక్ష తిథులలో అమావాస్యకు అపరిమిత బహుమానము

చేయుదురు. ఏలయనగా అమావాస్య తిథియందు చంద్రుఁడు కానరాడు. తమ్ములను వేధించెడి చంద్రుఁడు కానరాక పోవుటవలన, ఆ తిథికి విరహులు ప్రత్యేక బహూమానము నిత్తురు. అది అపరిమితమగుట వలన ఆ తిథికి అమాయని పేరు వచ్చినది. ''మా'' యనగా పరిమితి. అది లేనిది అమా యగుచున్నది. కాని సూర్యచంద్రుల సహభావమువలన ''అమా'' యని పేరు చెల్లదు. విరహులచే బహుమానము పొందక పోయినను పొందింపబడినట్లు బహుళశబ్ద వ్యుత్పత్తి ననుసరించి చెప్పుట వలన నుత్ప్రేక్ష. అట్లే, అమ, అపరిమితార్థము కాకపోయి నను, అపరిమితార్థకముగా చెప్పుటవలన నిదియు నుత్ప్రేక్ష.

## సమాసములు :

విరహిభిః : విరహః ఏషామ స్తీతి = విరహిణః = తైః = విరహిభిః.

బహుళః : బహూన్ లాతీతి = బహుళః. బహుమానం లాతీతి = బహుళః.

తదమితిః : తస్య అమితిః యస్యాంసా = తదమితిః.

అమా : న మా (మితిః) బహుమానస్య యస్యామితి = అమా. లేదా అమా (అనయోః) అస్యాం అస్తీతి = అమా.

## భావము :

కృష్ణపక్షమున చంద్రకళలు క్షీణించుటచే, విరహులకు చంద్రుని వలని యుపద్రవము తగ్గుచున్నది. కాన ఆ పక్షమును, విరహులు బహూకరించుట వలన దానికి బహుళపక్షమని పేరు ఏర్పడినది. కాని బహుళ పక్షమనగా నల్లనిపక్షమని యర్థమును పురస్కరించుకొని యా పేరు ఏర్పడలేదు. అట్లే యా కృష్ణపక్షతిథులలో, చంద్రుఁడు కాన రానందువలన అమావాస్యయందు విరహులకు చంద్రుని బాధయే లేకుండుటవలన ఆ తిథికి విరహులు అపరిమితమైన బహుమానముగావిండుట వలన నా తిథికి ''అమ'' యను పేరేర్పడినది. అమ యనగా పరిమితి లేనిదని యర్థము. కాని సూర్యచంద్రులు కలసి వసించుటచే ''అమ'' యని పేరు చెప్పుటతగదు. ॥౬౩॥

శ్లో॥ స్వరిపుతీక్ష్ణ సుదర్శనవిభ్రమాత్
కిము విధుం గ్రసతే న విధుంతుదః।
నిపతితం వదనే కథమన్యథా
బలికరంభనిభం నిజముజ్ఝతి॥ ౬౪

ప॥వి॥ స్వరిపు తీక్ష్ణ సుదర్శన విభ్రమాత్ । కిమ్ । ఉ । విధుం। గ్రసతే। న। విధుంతుదః । నిపతితం । వదనే। కథమ్। అన్యథా। బలికరంభనిభం । నిజమ్ । ఉజ్ఝతి ।

టీక॥ విధుంతుదః = రాహువు. విధుం = చంద్రుని, స్వరిపుతీక్ష్ణ సుదర్శన విభ్రమాత్; స్వ = తనయొక్క, రిపు = శత్రువైన విష్ణువుయొక్క, తీక్ష్ణ = వాడియైన, సుదర్శన = సుదర్శనచక్రమను, విభ్రమాత్ = భ్రాంతివలన, నగ్రసతేకిము = మ్రింగుటలేదా యేమి. అన్యథా = అట్లు కానిచో, వదనే = నోటియందు, నిపతితం = పడిపోయిన, నిజం = తనకు స్వాధీనమైన, బలికరంభనిభమ్: బలి = నివేదన కుద్దేశింపఁబడిన, కరంభ = పెరుగు కలిపిన పేలపిండితో, నిభం = సమానమైన చంద్రుని, (ఏవం = ఇట్లు), కథమ్ = ఏవిధముగా, ఉజ్ఝతి = వదలిపెట్టును.

## సమాసములు :

*స్వరిపు తీక్ష్ణ సుదర్శన విభ్రమాత్ :* స్వస్యరిపుః = స్వరిపుః. తీక్ష్ణంచ తత్ సుదర్శనంచ = తీక్ష్ణ సుదర్శనం. స్వరిపోఃతీక్ష్ణ సుదర్శనం = స్వరిపు తీక్ష్ణ సుదర్శనమ్. స్వరిపుతీక్ష్ణ సుదర్శనమితి విభ్రమః = స్వరిపు తీక్ష్ణసుదర్శన విభ్రమః; తస్మాత్ = స్వరిపుతీక్ష్ణసుదర్శన విభ్రమాత్.

*విధుంతుదః :* విధుం తుదతీతి = విధుంతుదః.

*బలికరంభ నిభమ్ :* బలిశ్చాసౌ కరంభశ్చ = బలికరంభః. బలికరంభేణ సదృశః = బలికరంభనిభః. తమ్ = బలికరంభనిభమ్.

## భావము :

రాహువు చంద్రుని వాడియగు సుదర్శన చక్రమనెడి భ్రాంతితో మ్రింగి వేసి వదలిపెట్టుచుండును. అట్లు కానిచో; పెరుగుతో కలిపిన పేలపిండివలె

నున్న చంద్రునిఁ భక్షింపక వదలిపెట్టునా? అట్లుకాక భక్షించియే యున్నచో, సుదర్శనచక్రమువలె వాడి యంచులుగల యీ చంద్రునిచే రాహువు దవుడలు తెగి గాయపడియుండెడివి. అట్లు తెగునను భ్రాంతి చేతనే రాహువు చంద్రుని భక్షింపక, మ్రింగి వదలి పెట్టుచున్నాడు. ॥౬౪॥

శ్లో॥ వదనగర్భగతం న నిజేచ్ఛయా
శశినముజ్ఝతి రాహురసంశయమ్।
అశిత ఏవ గళత్యయమత్యయం
సఖి వినా గళనాలబిలాధ్వనా॥ ౬౫

ప॥వి॥ వదనగర్భగతం। న। నిజేచ్ఛయా। శశినమ్। ఉజ్ఝతి। రాహుః। అసంశయమ్। అశితః। ఏవ। గళతి। అయమ్। అత్యయం। సఖి। వినా। గళనాలబిలాధ్వనా।

టీక॥ హేసఖి = ఓచెలీ, రాహుః = రాహువు, వదనగర్భగతం; వదనగర్భ = నోటిలోనికి, గతం = పొందిన, శశినం = చంద్రుని, నిజేచ్ఛయా = స్వేచ్ఛతో, నోజ్ఝతి = విడచుట లేదు. అసంశయం = సందేహము లేదు. కింతు = కాని, అయం = ఈ, శశీ = చంద్రుఁడు, అశిత ఏవసన్ = మ్రింగఁబడిన వాఁడేయగుచు, అత్యయం వినా = కష్టములేక, గలనాళబిలాధ్వనా; గలనాళ = కంఠనాళముయొక్క, బిల = లోపలిరంధ్రమనెడి, అధ్వనా = మార్గముచే, గళతి = వెలువడు చున్నాఁడు.

వి॥ రాహువు శిరోమాత్రముగ నుండుటచే, మ్రింగఁబడిన చంద్రుఁడు వెంటనే కంఠనాళము నుండి వెలుపలికి వచ్చుటచే నా చంద్రునికి జఠరాగ్ని సంబంధము కలుగకపోవుట వలన రాహు గర్భమున జీర్ణమగుట లేదు. కావున నీ పాపియైన చంద్రుఁడు నశింపక మఱల మఱల నుదయించుచున్నాఁడా! యని చెప్పుట వలన నిట నుత్ప్రేక్ష.

## సమాసములు:

వదనగర్భగతమ్ : వదనస్య గర్భః = వదనగర్భః. వదన గర్భం గతః = వదన గర్భగతః. తమ్ = వదన గర్భగతమ్.

*నిజేచ్ఛయా :* నిజా ఇచ్ఛా = నిజేచ్ఛా తయా = నిజేచ్ఛయా.

*అసంశయమ్ :* సంశయస్య అభావః = అసంశయమ్.

*గలనాళబిలాధ్వనా:* గళస్య నాళః = గలనాళః. గళనాళస్య బిలమ్ = గళనాళబిలమ్. గళనాళబిలమేవ అధ్వా = గలనాళబిలాధ్వా. తేన = గళనాళ బిలాధ్వనా.

**భావము :**

ఓ చెలీ! విష్ణువు తాను అమృతమును పంచునపుడు దేవతల పంక్తిలో కూర్చుండిన రాక్షసుని తన చక్రాయుధముతో ఖండింపగా నాతని శిరము రాహువుగను, తక్కిన శరీరము కేతువుగను నైనవి. రాహువు చంద్రుని మ్రింగినపుడా చంద్రుఁడు రాహువు కంఠనాళ మార్గమున నిరపాయముగ వెలుపలికే వచ్చును. కాని యారాహువు జఠరాగ్నియందు జీర్ణము కానేరడు. ఏల యనగా రాహువనగా కేవలము శిరము. అతనికి ఉదరము లేదు. ఉదరము లేనందువలన జఠరాగ్నిలో చంద్రుఁడు జీర్ణమగుట కవకాశము లేదు. ఈవిధముగా చంద్రుఁడు తప్పించుకొని మాటి మాటికిని ఉదయించుచున్నాఁడు ॥౬౪॥

శ్లో॥ ఋజుదృశః కథయంతి పురావిదః
మధుభిదం కిల రాహుశిరశ్ఛిదమ్।
విరహిమూర్ధభిదం నిగదంతి న
క్వను శశీ యది తజ్జఠరానలః॥ ॥౬౬॥

ప॥వి॥ ఋజుదృశః । కథయంతి । పురావిదః । మధుభిదం । కిల । రాహుశిరశ్ఛిదం । విరహిమూర్ధభిదం । నిగదంతి । న । క్వ । ను । శశీ । యది । తజ్జఠరానలః.

టీక॥ ఋజుదృశః = సరళదృష్టిగల అనగా కనఁబడిన వస్తువును కనఁబడిన విధముగనే చూచెడి, పూరావిదః = పురాణములను తెలిసికొనిన ప్రాచీనులు, మధుభిదం = విష్ణువును, రాహుశిరశ్ఛిదం = రాహువు శిరస్సును ఛేదించిన వానినిగ, కథయంతి కిల = చెప్పుచున్నారు గదా. విరహిమూర్ధభిదం; విరహి = వియోగులయొక్క, మూర్ధ = తలను, భిదం = భేదించెడి

వానినిగ, ననిగదంతి = చెప్పరు! (కుతః = ఏలయనగా) తజ్జఠరానలః;
తత్ = ఆ రాహువునకు, జఠరా నలః = జఠరాగ్ని, యది అస్తి =
ఉన్నచో, శశీ = చంద్రుఁడు, క్వను = ఎక్కడ ఉండఁగలడు.

**సమాసములు:**

*ఋజుదృశః :* ఋజు పశ్యంతీతి = ఋజుదృశః.

*పురావిదః :* పురా విదంతీతి = పురావిదః.

*మధుభిదం :* మధుం భినత్తీతి = మధుభిత్. తం = మధుభిదమ్.

*రాహుశిరశ్ఛిదమ్ :* రాహోఃశిరః = రాహుశిరః. రాహుశిరఃఛినత్తీతి =
రాహుశిరశ్చిత్; తమ్ = రాహుశిరశ్ఛిదమ్.

*విరహిమూర్ధభిదం :* విరహిణాం మూర్ధానః = విరహిమూర్ధానః.విరహి
మూర్ధ్నః భినత్తీతి = విరహిమూర్ధభిత్. తమ్ = విరహిమూర్ధభిదమ్.

*తజ్జఠరానలః :* తస్య జఠరః = తజ్జఠరః; తజ్జఠరస్యఅనలః = తజ్జఠరానలః.

**భావము :**

కపటదృష్టిలేక సరళదృష్టిగల్గి, లోతుపాతులు గ్రహించని మన ప్రాచీనులు విష్ణువును రాహుశిరశ్ఛేత్త యని చెప్పుచున్నారు. కాని విరహిశిరశ్ఛేదకునిగఁ జెప్పఁగూడదా! వాస్తవముగ నట్లే చెప్పవలయును. ఆరాహువునకు జఠరాగ్ని యున్నచో చంద్రుఁడెక్కడ నుంతగలడు. రాహువు యొక్క శిరమును ఖండించి వానికి ఉదరము లేకుండ జేయుటచే నా రాహువునకు జఠరాగ్నిని లేకుండఁ జేసెను. అందువలన నా రాహువు చంద్రుని మ్రింగినను, తనకు జఠరాగ్ని లేనందువలన వానిని జీర్ణించుకొన లేకపోవుటచే, విరహులను జంపెడి యా చంద్రుని బ్రతికించుటవలన నా విష్ణువును, రాహు శిరశ్ఛేదకుఁడనుటకంటె విరహిశిరశ్ఛేదకుఁడనుట యుక్తము. ॥౬౬॥

శ్లో॥ స్మరసఖౌ రుచిభిః స్మరవైరిణా
మఖమృగస్య యథా దళితం శిరః।
సపది సందధతుర్భిషజౌ దివః
సఖి! తథా తమసోఽపి కరోతు కః॥ ౬౭

ప॥వి॥ స్మరసఖౌ । రుచిభిః । స్మరవైరిణా । మఖమృగస్య । యథా । దళితం । శిరః। సపది । సందధతుః । భిషజౌ। దివః। సఖి । తథా। తమసః । అపి । కరోతు । కః.

టీక॥ రుచిభిః = శరీరకాంతులతో, స్మరస ఖౌ; స్మర = మన్మథునకు, సఖౌ = సమానులైన వారును, (మన్మథునకు మిత్రులునగు), దివః = స్వర్గముయొక్క, భిషజౌ = వైద్యులైన యశ్వినులనుదేవతలు, స్మరవైరిణా = శివునిచే, దళితం = ఖండింపఁబడిన, మఖమృగస్య = యజ్ఞమనెడిమృగముయొక్క, శిరః = శిరస్సును, యథా = ఎట్లు, సపది = వెంటనే, సందధతుః = జోడించిరో, తథా = అట్లు, హేసఖి = ఓ చెలీ!, కః = ఎవఁడు, తమసోఽపి = రాహువునకు కూఁడ, కరోతు = చేయును.

వి॥ శివునివలన భయపడి యజ్ఞము మృగరూపమున పరుగిడినట్లు దాని శిరస్సును శివుడు ఖండించినట్లు పురాణ ప్రసిద్ధి. అశ్వినులు ఖండింపఁబడిన యా యజ్ఞ మృగముయొక్క శిరస్సును మఱల జోడించిరని ''తతోవై తౌ యజ్ఞస్యశిరః ప్రత్యధత్తామ్'' అనుశ్రుతి చెప్పుచున్నది.

**సమాసములు :**

*స్మరసఖౌ :* స్మరస్య సఖాయౌ = స్మరసఖౌ.

*స్మరవైరిణా :* స్మరస్య వైరీ = స్మరవైరీ. తేన = స్మరవైరిణా.

*మఖమృగస్య :* మఖఏవ మృగః = మఖమృగః. తస్య = మఖమృగస్య.

**భావము :**

పూర్వము శివునివలన భయపడి యజ్ఞము మృగరూపమున పరుగిడిపోగా శివుఁడు దాని వెంట నంటి దాని తలను ఖండించెను. అప్పుడు స్వర్గలోకపు వైద్యులయిన అశ్వినులు ఆ తలను మఱల జోడించి యా మృగమును బ్రతికించిరి. అట్లే యీ రాహువునకును తలను శరీరముతో జోడింపగల వారెవరున్నారు. వాస్తవములో నెవ్వరును లేరు. అప్పుడు మన్మథునకు శివుఁడు వైరియగుట వలన, అశ్వినులు మన్మథునకు సౌందర్యమున సమానులై మిత్రు

లగుటవలన, తమ మిత్రునకు వైరియగు శివుఁడు ఖండించిన మృగము తలను జోడించి శివునిపై వైరనిర్యాతనముగావించిరి. ఇప్పుడో మన్మథుఁడు విరహులకు శత్రువు. కాన అతని మిత్రులైన అశ్వినులు, రాహువు తలను అతికించి, యాతని యుదరమందలి జఠరాగ్నితో చంద్రుని జీర్ణింపఁజేయఁదోడ్పడెదరా! వాస్తవములో తోడ్పడరు.ఏలయనగా మన్మథుఁడు విరహులకు శత్రువు. తన మిత్రుఁడైన మన్మథుని శత్రువులకుపయోగకరమైన పనిని అశ్వినులెట్టు చేయగలరు? చేయరని భావము. ౹౹౬౭౹౹

శ్లో౹౹ నలవిమస్తకితస్య రణే రిపో
ర్మిళతి కిం న కబంధగళేన వా।
మృతిభియా భృశముత్పతతస్తమో
గ్రహశిరస్తదసృగ్ధృఢబంధనమ్౹౹ ౬౮

ప౹౹వి౹౹ నలవిమస్తకితస్య । రణే । రిపోః । మిళతి । కిం । న । కబంధగళేన। వా । మృతిభియా । భృశమ్ । ఉత్పతతః । తమోగ్రహశిరః । తదసృగ్ధృఢ బంధనమ్.

టీక౹౹ రణే = యుద్ధమందు, నలవిమస్తకితస్య; నల = నలునిచే, విమస్తకితస్య = తల తీయఁబడిన, (తథాపి = అయినను) మృతిభియా = మరణభయముచే, భృశమ్ = మిక్కిలి, ఉత్పతతః = పైకినెగురుచున్న, రిపోః = శత్రువుయొక్క, కబంధగళేన; కబంధ = మొండెముయొక్క, గళేన = కంఠముచే; తమోగ్రహశిరః; తమోగ్రహ = రాహుగ్రహము యొక్క, శిరః = తల, తదసృగ్ధృఢబంధనమ్; తదసృక్ = ఆకంఠము యొక్క రక్తముతో, దృఢబంధనం సత్ = ధృఢమైన సంయోగము గలదై, కిం = ఏల, న మిలతి = అతకదు.

## సమాసములు :

నలవిమస్తకితస్య: విగతః మస్తకః అస్యసంజాత ఇతి = విమస్తకితః, నలేన విమస్తకితః = నలవిమస్తకితః. తస్య = నలవిమస్తకితస్య.

*కబంధగళేన :* కబంధస్య గళః = కబంధగళః. తేన = కబంధగళేన.

మృతిభియా : మృతేః భీః = మృతిభీః. తయా = మృతిభియా.

తమోగ్రహశిరః : తమ ఇతి గ్రహః = తమోగ్రహః. తమోగ్రహస్య శిరః = తమోగ్రహశిరః.

తదసృగ్దృఢబంధనమ్ : తస్య అసృక్ = తదసృక్. దృఢం చ తత్ బంధనం చ = దృఢబంధనమ్. తదసృజా దృఢబంధనమ్ = తదసృక్ దృఢ బంధనమ్.

**భావము :**

యుద్ధమున నలునిచే తల తొలగింపఁబడిన శత్రువు మరణ భయముచే మింట నెగురుచుండును. ఆశత్రువు మొండెమునకున్న కంఠము రక్తమును కార్చుచుండును. రాహుగ్రహముయొక్క తలను, ఆ మొండెమునకున్న కంఠముయొక్క రక్తముతోడ నా కంఠమునకు గట్టిగ నతికించినచో, రాహువునకు తలకు దిగువనున్న శరీరభాగ మేర్పడును. అట్లు శరీర మేర్పడుటచే రాహువు మ్రింగిన చంద్రుఁడు ఉదరమున జఠరాగ్నిలో జీర్ణమై, మఱల పుటక యుండును. ॥౬౮॥

శ్లో॥ సఖి జరాం పరిపృచ్ఛ తమశ్శిరః
సమమసౌ దధతాఽపి కబంధతామ్।
మగధరాజవపుర్దలయుగ్మవత్
కిమితి న ప్రతిసీవ్యతి కేతునా॥ ౬౯

ప॥వి॥ సఖి । జరాం । పరిపృచ్ఛ । తమశ్శిరః । సమమ్ । అసౌ । దధతా । అపి । కబంధతామ్ । మగధరాజవపుర్దలయుగ్మవత్ । కిమ్ । ఇతి । న । ప్రతిసీవ్యతి । కేతునా.

టీక॥ హే సఖి = ఓ చెలీ! జరాం = జరయను రాక్షసిని, పరిపృచ్ఛ = అడుగుము. అసౌ = ఈ జర, కబంధతామ్ = తలలేనిశరీరమును, దధతా = ధరించుచున్న, కేతునాఽపిసమమ్ = కేతువుతోనుఁగూడ, తమశ్శిరః = రాహువుయొక్క శిరస్సును, మగధరాజ వపుర్దల యుగ్మవత్; మగధ రాజ = మగధదేశపురాజైన జరాసంధునియొక్క, వపుర్దల యుగ్మవత్;

వపుర్దల = శరీరపుటర్ధభాగములయొక్క, యుగ్మవత్ = జంటనువలె, కిమితి = ఎందులకని, న ప్రతిసీవ్యతి = కుట్టియతకు వేయదు?.

**సమాసములు :**

*తమశ్శిరః :* తమసః శిరః = తమశ్శిరః.

*మగధరాజవపుర్దళయుగ్మవత్ :* మగధానాం రాజా = మగధరాజః. వపుషఃదళే = వపుర్దళే. వపుర్దళయోః యుగ్మం = వపుర్దళయుగ్మమ్. మగధరాజస్య వపుర్దళయుగ్మం = మగధరాజవపుర్దళయుగ్మమ్. మగధరాజవపుర్దళయుగ్మమివ = మగధరాజవపుర్దళయుగ్మవత్.

భావము :

ఓ చెలీ! జరయను రాక్షసి నడుగుము. ఆ రాక్షసి, మగధ రాజుయొక్క శరీరపు టర్ధభాగములను జోడించి యాతనిని జీవింపఁజేసినది. అందువలన మగధ రాజునకు జరాసంధుడను నామము గల్గినది. ఆ రాక్షసి, యా విధముగనే, తలలేని కేతుగ్రహముయొక్క శరీరముతో రాహువుయొక్క తలను ఏల యతికించరాదు? అట్లతికించినచో శరీరమంతయు నేర్పడుటవలన, రాహువు చంద్రుని మ్రింగినచో, ఆ చంద్రుడు రాహు జఠరాగ్నియందు జీర్ణమై మఱల నుదయింపఁడు గదా! ॥౬౯॥

శ్లో॥ వద విధుంతుదమాళి మదీరితై-
స్త్యజసి కిం ద్విజరాజధియా రిపుమ్।
కిము దివం పునరేతి యదీదృశః
పతిత ఏష నిషేవ్య హి వారుణీమ్॥ ౭౦

ప॥వి॥ వద । విధుంతుదమ్ । ఆళి । మదీరితైః । త్యజసి । కిమ్ । ద్విజరాజధియా । రిపుమ్ । కిమ్ । ఉ । దివం । పునః । ఏతి । యత్ । ఈదృశః । పతితః । ఏషః । నిషేవ్య । హి । వారుణీమ్.

టీక॥ హే ఆళి! = ఓ చెలీ!, మదీరితైః = నాయొక్క వచనములతో, విధుంతుదం = రాహువునుఁగూర్చి, వద = చెప్పుము. రిపుం = శత్రువును,

(ఇచ్చట చంద్రుని), ద్విజరాజధియా ; ద్విజరాజ = చంద్రుఁడను (బ్రాహ్మణ శ్రేష్ఠుఁడను), ధియా = బుద్ధిచే, త్యజసికిం = విడచి పెట్టెదవాయేమి? యత్ = ఏలయనగా, ఏషః = ఈ చంద్రుఁడు, వారుణీం = పడమటి దిక్కును (మద్యమును), నిషేవ్య = పొంది, (పానముగావించి), పతితః = (పడిపోయినాఁడు, అస్తమించినాఁడు) పతనముఁ బొందిఁనాడు, (పాతకి యైనాఁడు). ఈ దృశః = ఇట్లు పతితుఁడైన వాఁడు, పునః = మఱల, దివం = ఆకాశమును (స్వర్గమును) ఏతి కిము = పొందునా?.

## సమాసములు :

విధుంతుదమ్ : విధుం తుదతీతి = విధుంతుదః. తమ్ = విధుంతుదమ్.

ద్విజరాజధియా : ద్విజానాంరాజా = ద్విజరాజః. ద్విజరాజస్య ధీః = ద్విజరాజధీః. తయా = ద్విజరాజధియా.

మదీరితైః : మమ ఈరితాని = మధీరితాని. తైః = మదీరితైః.

వారుణీమ్ : వరుణస్య ఇయం = వారుణీ. తాం = వారుణీం.

## భావము :

ఓ చెలీ! నా మాటలను రాహువునకుఁ జెప్పుము. ఓ రాహువా! శత్రువైన చంద్రుఁడు ద్విజరాజు (బ్రాహ్మణశ్రేష్ఠుఁడు) అను బుద్ధితో విడచి పెట్టకుము. ఏలయనగా ఈచంద్రుఁడు (ఈ బ్రాహ్మణుఁడు) వారుణిని = (పడమటి దిక్కును) (మద్యమును) సేవించుటచే పతితుఁడైనాడు. అనగా చంద్రుఁడు పడమటి దిక్కును పొందిఁయస్తాచలమందు పతనమును = అస్తమయమునుఁ బొందినాఁడు. బ్రాహ్మణపక్షమునమద్యమును బ్రాహ్మణుఁడు సేవించిపతితుఁడైఁనాఁడు. అనగా, పాతకియైనాఁడు. కావున నిట్లు పతనమును = అస్తమయమును పొందిన చంద్రునకు మఱల వెంటనే యాకాశమును పొందనవకాశము లేదు గదా! అట్లే మద్యపానముచే పతనమునుఁ పొందిన బ్రాహ్మణునకు స్వర్గప్రాప్తియు లేదుగదా. ద్విజరాజ శబ్దము శ్లేషతో చంద్రుని, బ్రాహ్మణోత్తముని జెప్పుచున్నది. చంద్రునకు ద్విజరాజనెడి పేరుండుటవలన నా చంద్రుని బ్రాహ్మణోత్తముఁడని భావించి రాహువు వానిని మ్రింగక వదలిపెట్టునేమో యని చమత్కృతి చేయఁ

బడినది. బ్రాహ్మణోత్తముని వధించరాదుగాన, చంద్రునికి ద్విజనాజను పేరుం డుటవలన, వానిని బ్రాహ్మణోత్తముఁడను బుద్ధితో రాహువు మ్రింగక విడచి పెట్టునేమో? చంద్రపక్షమున ఆ ద్విజరాజు అనగా చంద్రుఁడు వారుణిని అనగా పడమటి దిక్కును పొందుటచే పతితుఁడైనాఁడు అనగా అస్తాచలమునఁ గ్రుంకినాఁడు. బ్రాహ్మణపక్షమున ఆ ద్విజరాజు అనగా బ్రాహ్మణోత్తముఁడు వారుణిని అనగా మద్యమును సేవించుటచే పతితుఁడైనాఁడు. అనగా పతనముఁ బొంది పాతకియైనాఁడు. కాన నిట్లు పతితుఁడైన=అస్త పర్వతమునఁ గ్రుంకిన ద్విజరాజునకు=చంద్రునకు మఱల వెంటనే దివమున=ఆకాశమున ప్రాప్తి యుండదు. అట్లేపతితుఁడైన=పాతకము బొందిన ద్విజరాజునకు=బ్రాహ్మణో త్తమునకు దివమున=స్వర్గమున ప్రాప్తి యుండదు. అస్తాచలమునఁ గ్రుంకిన చంద్రుఁడు మఱల వెంటనే యాకసమునుఁ బొందలేదు గదా. అట్లే మద్య పానముచే పతితుఁడైన బ్రాహ్మణుఁడు స్వర్గమునుఁ బొందలేడు గదా. ॥౨౦॥

శ్లో॥ దహతి కంఠమయం ఖలు తే న కిం
గరుడవద్ద్విజవాసనయోజ్ఝితః।
ప్రకృతిరస్య విధుంతుద దాహికా
మయి నిరాగసి కా వద విప్రతా॥ ౨౧

ప॥వి॥ దహతి । కంఠమ్ । అయం । ఖలు । తేన । కిం । గరుడవత్ । ద్విజ వాసనయా । ఉజ్ఝితః । ప్రకృతిః । అస్య । విధుంతుద । దాహికా । మయి । నిరాగసి । కా । వద । విప్రతా.

టీక॥ హే విధుంతుద!=ఓ రాహువా! అయం=ఈ, విధుః=చంద్రుఁడు, ద్విజవాసనయా=ద్విజత్వ ధర్మసామ్యముచే, గరుడవత్=గరుడునికి వలె, తే=నీయొక్క, కంఠమ్=కంఠమును, దహతిఖలు=దహించును గదా, తేన=ఆ దాహముచే, (విధుః=చంద్రుఁడు), ఉజ్ఝితః కిమ్= విడువఁబడెనా ఏమి? అస్య=చంద్రునకు, విప్రతా=బ్రాహ్మణత్వము కా=ఏమి? వద=చెప్పుము. (అస్య=ఈ చంద్రునకు), ప్రకృతిః= స్వభావము, నిరాగసి=అపరాధములేని, మయి=నాయెడ, దాహికా= దహింపఁజేయునట్టిది.

వి॥ పూర్వము తండ్రి పనుపునమ్లేచ్ఛులను భక్షించుటకుఁ గడంగిన గరుత్మంతుని కంఠమున, భ్రష్టబ్రాహ్మణుఁడు లగ్నమై యాతని కంఠమును దహింపగా, నతనిని వెంటనే గరుడుఁడు కక్కివైచెనని పురాణ గాథ ఇట నను సంధేయము. మాఘకవియు "విప్రంపురా పతగరాడివ నిర్జగార" యని పేర్కొనెను.

సమాసములు :

*గరుడవత్ :* గరుడస్య ఇవ = గరుడవత్.

*ద్విజవాసనయా :* ద్విజస్యవాసనా = ద్విజవాసనా. తయా = ద్విజవాసనయా.

*(హే) విధుంతుద :* విధుం తుదతీతి = విధుంతుదః. తస్య సంబుద్ధిః = (హే) విధుంతుద.

*నిరాగసి :* నిర్గతమ్ ఆగః యస్యాస్సా = నిరాగాః. తస్యాం = నిరాగసి.

*విప్రతా :* విప్రస్య భావః = విప్రతా.

భావము :

ఓ రాహువా! ద్విజత్వమను ధర్మమును గల్గియుండుటచే నీ పీతనిని మ్రింగునపుడు గరుడుని కంఠమును భ్రష్టద్విజుఁడు దహించినట్లు నీ కంఠమును దహించుటవలన నీతనిని నీవు విడచి పెట్టితివా. కాని వాస్తవములో నీ చంద్రునకు విప్రత్వమెక్కడ నున్నది. ఈ చంద్రుని ప్రకృతి నిరపరాధురాలైన నావంటి స్త్రీని దహించునట్టిది. కాన స్త్రీ ఘాతకుఁడగు నీ చంద్రునికి బ్రాహ్మణత్వమెట్లేర్పడును. కావున నీవు భక్షించుటలో దోషమేమియు లేదు. పూర్వము తండ్రియాజ్ఞచే గరుత్మంతుఁడుమ్లేచ్ఛులను భక్షించుచుండగా, నా మ్లేచ్ఛులలో భ్రష్టబ్రాహ్మణుఁడొకడుండి యీతని కుత్తుకఁజొచ్చి మంట పెట్టగా నా భ్రష్టుని గరుత్మంతుఁడు భక్షింపక కక్కివేసెను. ఆ విధముగా చంద్రుని ద్విజత్వసామ్యముతో, నీవు మ్రింగునపుడు నీ కుత్తుకలో మంటఁ బెట్టెనా యని యుపమానము పురాణమునుండి గ్రహింపఁబడినది. ॥౭౦॥.

శ్లో॥ సకలయా కలయా కిల దంష్ట్రియా
సమవధాయ యమాయ వినిర్మితః।

విరహిణీగణచ్చర్వణసాధనం
విధురతో ద్విజరాజ ఇతి శ్రుతః॥ ౭౨

ప॥వి॥ సకలయా । కలయా । కిల । దంష్ట్రియా । సమవధాయ । యమాయ. వినిర్మితః । విరహిణీగణచర్వణ సాధనం । విధుః । అతః । ద్విజరాజః॥ ఇతి । శ్రుతః.

టీక॥ విధుః = చంద్రుఁడు, సకలయా = సమస్తములైన, కలయా = కళలనెడి, దంష్ట్రియా = కోఱలచే, యమాయ = యముని కొఱకు, సమవధాయ = చక్కఁగ మెలకువ వహించి, విరహిణీ గణచర్వణ సాధనమ్; విరహిణీ గణ = వియోగినుల సంఘమును, చర్వణ = భక్షించుటకు, సాధనం = సాధనముగాఁ, బ్రహ్మణా = (బహ్మచే), వినిర్మితఃకిల = నిర్మింపఁబడెను గదా. అతః = ఇందువలన, అనగా ప్రత్యేకమైన కోఱగా నుండుటవలన, ద్విజరాజ ఇతి = ద్విజరాజని, (శ్రేష్ఠమైన కోఱయని) శ్రుతః = వినఁబడుచున్నాఁడు.

## సమాసములు :

*విరహిణీగణచర్వణసాధనమ్ :* విరహః ఆసామ స్తీతి = విరహిణ్యః. విరహిణీనాం గణః = విరహిణీగణః. విరహిణీగణస్య చర్వణమ్ = విరహిణీ గణ చర్వణమ్. విరహిణీ గణచర్వణస్య సాధనమ్ = విరహిణీగణచర్వణ సాధనమ్.

*ద్విజరాజః :* ద్విజానాం రాజా = ద్విజరాజః.

## భావము :

వస్తుస్థితియందు చంద్రునకు ద్విజత్వమనగా విప్రత్వములేదు. బ్రహ్మ సమస్తకళలనెడి కోఱలతో యమునకు విరహిణులను భక్షించుటకు సాధనముగా చంద్రుఁడనెడి సాధనమును సృజించెను. చంద్రుని కళలొక్కొకటియు నొక్కొక్క కోఱ. ఆ కోఱలన్నింటినిఁ గలిపినచో, చంద్రుఁడనెడి పెద్దకోఱ యేర్పడు చున్నది. ఆ కోఱలన్నియు దంతములగుటవలన ద్విజములనియు చెప్పఁబడును. ఆ ద్విజములలో నీతఁడు పెద్దకాన ద్విజరాజని వ్యవహారమేర్పడినదే గాని,ద్విజుఁ

డన విప్రుఁడని భావించి ద్విజరాజని-విప్రోత్తముఁడని భావింపరాదు. కాన నాతని భక్షింపక వదలి పెట్టరాదు. ॥౭౨॥

శ్లో॥ స్మరముఖం హరనేత్రహుతాశనా
జ్జ్వలదిదం విధినా చకృషే విధుః।
బహువిధేన వియోగివధేన వా
శశమిషాదథ కాలికయాంకితః॥ ౭౩

ప॥వి॥ స్మరముఖం । హరనేత్రహు తాశనాత్ । జ్వలత్ । ఇదం । విధినా । చకృషే । విధుః । బహువిధేన । వియోగివధేన । వా । శశమిషాత్ । అథ । కాలికయా । అంకితః.

టీక॥ విధుః = చంద్రుఁడను, ఇదం = ఈ, స్మరముఖం = మన్మథుని మోము, జ్వలత్ = మండుచునే, విధినా = దైవముచే, హరనేత్రహుతాశనాత్; హర = శివునియొక్క, నేత్రహుతాశనాత్ = నయనాగ్నినుండి, అథ చకృషే = లాగఁబడినదా ఏమి? అథవా = లేదా, బహువిధేన = పెక్కు విధముగల, వియోగివధేన = విరహులవధచే, (యత్ = ఏ, ఏనః = పాపముగలదో, తేనైవ = దానివలన నేర్పడిన) కాలికయా = నలుపుతో, శశమిషాత్ = కుందేటి నెపమువలన, అంకితః = గుర్తింపఁబడినదా ఏమి.

వి॥ చంద్రుఁడనెడి మన్మథముఖము శివుని నేత్రాగ్నినుండి దైవము లాగి వేయుటవలన, అప్పటి నేత్రాగ్ని దాహమువలన నేర్పడిన నలుపుమచ్చ చంద్రునియందు కుందేటి నెపమున భాసించుచున్నదా, లేక చంద్రుఁడు విరహులను బాధించుటవలన నేర్పడిన పాపము ఆ చంద్రునియందు కుందేటి నెపమున భాసించుచున్నదా! యని శశకళంకమును మఱుగు పరచి దానియందు, దాహకాలిమను, పాపకాలిమను ఆరోపించి యుత్ప్రే క్షించుట వలన, అపహ్నవాలంకారముతోఁగూడిన యుత్ప్రేక్ష.

## సమాసములు :

*స్మరముఖమ్ :* స్మరస్య ముఖమ్ = స్మరముఖమ్.

*హరనేత్రహుతాశనాత్:* హరస్య నేత్రమ్ = హరనేత్రమ్. హరనేత్రస్య

హుతాశనః = హరనేత్రహుతాశనః. తస్మాత్ = హరనేత్రహుతాశనాత్.

బహువిధేన : బహ్వ్యః విధాః యస్య సః = బహువిధః. తేన = బహువిధేన.

వియోగివధేన : వియోగినాం వధః = వియోగివధః. తేన = వియోగివధేన.

శశమిషాత్ : శశఏవమిషః = శశమిషః. తస్మాత్ = శశమిషాత్.

భావము :

చంద్రుని యందలి కళంకము రెండు దోషములుగ వర్ణింపఁబడుచున్నది. చంద్రుఁడనెడి మన్మథముఖమును, శివుని నేత్రాగ్నినుండి దైవము వెలుపలికి తీయగానాయగ్నియందు కాలుటచే నేర్పడిన నలుపు మచ్చ యతనియందు కుందేటి నెపమున భాసించుచున్నదా; లేదా విరహులను హింసించుటవలన సంభవించిన పాపమునల్లని మచ్చయై ఆ కుందేటి నెపమున నతనియందు భాసించుచున్నదా! యని చంద్రకళంకమందు రెండు వికల్పములు చేయఁబడినవి. శివుని నేత్రాగ్నియందు మన్మథుఁడు దగ్ధమైనది ప్రసిద్ధము. మన్మథుఁడు దగ్ధమగుచుండగా నతని ముఖము పూర్తిగా దగ్ధము కాక మునుపే దైవము దానిని వెలికి తీయగా,ఆముఖమే చంద్రుఁడని కవి కల్పన. మన్మథుని ముఖము రామణీయకమునుబట్టి యిట్టి కల్పన.॥౨౩॥

శ్లో॥ ఇతి విధోర్వివిధోక్తివిగర్హణం
వ్యవహితస్య వృథేతి విమృశ్య సా।
అతితరాం దధతీ విరహజ్వరం
హృదయభాజముపాలభత స్మరమ్॥ ౨౪

ప॥వి॥ ఇతి । విధోః । వివిధోక్తి విగర్హణం । వ్యవహితస్య । వృథా । ఇతి । విమృశ్య । సా । అతితరాం । దధతీ । విరహజ్వరమ్ । హృదయభాజమ్ । ఉపాలభత । స్మరమ్.

టీక॥ అతితరామ్ = అత్యధికముగా, విరహజ్వరం = వియోగ తాపమును, దధతీ = వహించుచున్న, సా = ఆదమయంతి, ఇతి = వెనుక వర్ణింపఁబడిన

విధముగ, వ్యవహితస్య = దూరమందున్న, విధోః = చంద్రునికి, వివిధోక్తి విగర్హణమ్; వివిధోక్తి = పలురకములైన వచనములతో, విగర్హణమ్ = నింద, వృథా ఇతి = వ్యర్థమని, విమృశ్య = విచారించి, హృదయభాజమ్ = తన హృదయమందున్న అనగా సమీపమందున్న, స్మరమ్ = మన్మథుని, ఉపాలభత = నిందించినది.

సమాసములు :

*వివిధోక్తివిగర్హణమ్ :* వివిధాశ్చ తాః ఉక్తయశ్చ = వివిధోక్తయః. వివిధోక్తిభిః విగర్హణమ్ = వివిధోక్తి విగర్హణమ్.

*విరహజ్వరమ్ :* విరహస్య జ్వరః = విరహజ్వరః. తమ్ = విరహజ్వరమ్.

*హృదయభాజమ్ :* హృదయం భజతీతి = హృదయభాక్. తమ్ = హృదయభాజమ్.

భావము:

ప్రబలమైన విరహజ్వరమునకు గుఱియై పరితపించుచున్న యా దమయంతి, ఎచ్చటనో, యాకసమున దూరముగ నున్న చంద్రుని పెక్కు విధములుగ నిందించుట వ్యర్థము. ఈ నింద యతనికి తెలియసాధ్యములేదని భావించి తనకు దగ్గఱ తన హృదయము నందే యున్న మన్మథుని నిందించుటకుం బూనినది. ॥౨౪॥

శ్లో॥ హృదయమాశ్రయసే బత మామకం
జ్వలయసీత్థమనంగ తదేవ కిమ్।
స్వయమపి క్షణదగ్ధనిజేంధనః
క్వ భవితాసి హతాశ హుతాశవత్॥ ౨౫

ప॥వి॥ హృదయమ్ । ఆశ్రయసే । బత । మామకం । జ్వలయసి । ఇత్థమ్ । అనంగ । తత్ । ఏవ । కిమ్ । స్వయమ్ । అపి । క్షణదగ్ధనిజేంధనః। క్వ । భవితాసి । హతాశ । హుతాశవత్.

టీక॥ హే అనంగ = ఓ మన్మథా!, మామకం = నాదైన, హృదయమ్ = మనస్సును, ఆశ్రయసే = ఆశ్రయించుచున్నావు. తదేవ = దానినే, ఇత్థం = ఈ విధముగా, కిం జ్వలయసి = ఏల దహింతువు?, బత = అయ్యో!, హతాశ = స్వాభిలాషను భంగపఱచు కొనువాఁడా!, స్వయమపి = స్వయముగ నీవును, హుతాశవత్ = అగ్నివలె, క్షణదగ్ధ నిజేంధనః; క్షణ = క్షణ కాలమున, దగ్ధ = కాల్చుకొనఁబడిన, నిజ = తనకు సంబంధించిన, ఇంధనః = హృదయమనెడి యింధనము, (కట్టెలనెడి యింధనము) గలవాఁడవై, క్వ = ఎచ్చట, భవితాసి = ఉండఁగలవు.

## సమాసములు :

**మామకమ్ :** మమ ఇదం = మామకం. తత్ = మామకమ్.

(హే) **అనంగ :** అవిద్యమానమంగం యస్య సః = అనంగః. తస్య సంబుద్ధిః = హే అనంగ.

**క్షణదగ్ధనిజేంధనః:** క్షణం దగ్ధమ్ = క్షణదగ్ధమ్. నిజమ్ ఇంధనమ్ = నిజేంధనమ్. క్షణదగ్ధం నిజేంధనమ్ యస్యసః = క్షణదగ్ధనిజేంధనః.

(హే) **హతాశ:** హతా ఆశా యస్య సః = హతాశః. తస్య సంబుద్ధిః = హేహతాశ.

**హుతాశవత్ :** హుతమశ్నాతీతి = హుతాశః. హుతాశ ఇవ = హుతాశవత్.

## భావము :

ఓ మన్మథా! నీవు నా హృదయమందే యున్నావు. దానినే దహించుచున్నావు. ఇది తగునా! ఏది నీకు ఆశ్రయమో దానిని నీవు దహించుకొనవచ్చునా! కావుననే నీవు హతాశుఁడవు. అనగా నీవు నీ యభిలషితమును భంగపఱచుకొనువాఁడవు. అగ్ని తనకు ఆశ్రయమైన కట్టెలు మున్నగు నింధనములను దహించి నిరాశ్రయుఁడై నశించును. అట్లే నీవును నీకు ఆశ్రయమైన నా హృదయమును దగ్ధము కావించి నిరాశ్రయుఁడవు కాగలవు. ఒకరిని హింసించుటకుఁ బూని తనకు గల్గెడి నాశమును నీవు గ్రహింపలేక యున్నావు. మన్మ

ఘుఁడు మనస్సునందు జన్మించిన వాఁడు గాన నతనికి దమయంతి హృదయము గూడ ఆశ్రయమైనది. ॥౭౫॥

శ్లో॥ పురభిదా గమిత స్త్వమదృశ్యతాం
త్రినయనత్వపరిప్లుతిశంకయా।
స్మర నిరైక్ష్యత కస్య చ నాపి న
త్వయి కిమక్షిగతే నయనై స్త్రిభిః॥ ౭౬

ప॥వి॥ పురభిదా । గమితః । త్వమ్ । అదృశ్యతామ్ । త్రినయత్వపరిప్లుతి శంకయా । స్మర । నిరైక్ష్యత । కస్య । చన । అపి । న । త్వయి । కిమ్ । అక్షిగతే । నయనైః । త్రిభిః.

టీక॥ హేస్మర = ఓ మన్మథా! త్వమ్ = నీవు, (అక్షిగతః = కంటఁబడిన వాఁడవై (శత్రువై), పురభిదా = శివునిచే, త్రినయనత్వ పరిప్లుతిశంకయా; త్రినయనత్వ = మూడుకన్నులుగల్గియుండుటకు, పరిప్లుతి = వైయర్థ్యము (అతివ్యాప్తి) కలుగునను, శంకయా = భయముచే, అదృశ్యతాం = నాశమును, గమితః = పొందెంపఁబడితివి. కింతు = కాని, కస్యచనాఽపి = ఎవనికిని, అక్షిగతే = కంటఁబడిన (ద్వేషింపఁదగిన), త్వయి = నీయందు, త్రిభిః = మూడైన, నయనైః = నేత్రములతో, కిం = ఏల, ననిరైక్ష్యత = చూడ బడక పోవుట (ఏర్పడును).

వి॥ "త్వయినిరైక్ష్యత'' అనుచోట స్మరుఁడు కర్మయైనను, ఆతనిని ఆధారముగఁజేసికొనుటవలన నతనియందు కర్మత్వమవివక్షితమైనందువలన ధాతువునకు నకర్మకత్వము సిద్ధించినది. అందువలన భావార్థమున నది ప్రయుక్తము. "ప్రసిద్ధేర వివక్షాతః కర్మణోఽకర్మికా క్రియా'' యని చెప్పిన విధముగ కర్మను వివక్షింపనందు వలనను ధాతువున కకర్మత్వము సిద్ధించును.

## సమాసములు :

*పురభిదా :* పురాణి భినత్తీతి = పురభిత్. తేన = పురభిదా.

అదృశ్యతామ్ : ద్రష్టుంయోగ్యః = దృశ్యః. న దృశ్యః = అదృశ్యః. అదృశ్యస్య భావః = అదృశ్యతా. తామ్ = అదృశ్యతామ్.

త్రినయనత్వపరిప్లుతిశంకయా : త్రీణి నయనాని యస్య సః = త్రినయనః. త్రినయనస్య భావః = త్రినయనత్వం. త్రినయనత్వస్య పరిప్లుతిః = త్రినయనత్వ పరిప్లుతిః. త్రినయనత్వపరిప్లుతేఃశంకా = త్రినయనత్వపరిప్లుతిశంకా. తయా = త్రినయనత్వపరిప్లుతిశంకయా.

అక్షిగతే : అక్షి గతః = అక్షిగతః. తస్మిన్ = అక్షిగతే.

భావము :

మన్మథా! శివుఁడు తన మూడవనేత్రము వ్యర్థమగుననుభయముచేతను, తన మూడవ నేత్రమితరులకు సంక్రమించుననుభయముచేతను, శత్రువైన నిన్ను నదృశ్యుని గావించెను. తానట్లు నిన్ను అదృశ్యునిఁ గావించనిచో, అందరికిని ద్వేష్యుఁడవైన నిన్నుఁ జూచి, వారు తమ మూడవకన్నునుఁ దెఱచియుండవలసి యుండెడి. అనగా నిన్నుగాంచి క్రోధము చెందవలసి యుండెడివారు. మూడవ కన్నును తెఱచుట యనగా, కోపపడుట యనియు లోకమున వాడుక యున్నది. అటు శివుఁడా మన్మథుని అదృశ్యునిఁ జేయుటవలననే, యితరుల మూఁడు నేత్రములచే నతఁడు చూడఁబడలేదు గదా? కానిచో నితరుల మూఁడు నేత్రములచే చూడబడి యుండెడివాఁడు. ఇందు మూఁడు నేత్రములలో మూడవనేత్రము క్రోధదృష్టియని గ్రహింపవలయును. మఱియు నీవు ప్రత్యక్షమైనచో జనులు కామాంధులై కోపదృష్టితో కలసి వారికున్న మూఁడు నేత్రములును వ్యర్థములు కావలసి యుండెడివి యనియు సూచితము. ॥౭౬॥

శ్లో॥ సహచరోఽసి రతేరితి విశ్రుతి
స్త్వయి వసత్యపి మే న రతిః కుతః।
అథ న సంప్రతి సంగతిరస్తి వా
మనుమృతా న భవంతమియం కిల॥ ॥౭౭॥

ప॥వి॥ సహచరః । అసి । రతేః । ఇతి । విశ్రుతిః । త్వయి । వసతి । అపి । మే । న । రతిః । కుతః । అథ । న । సంప్రతి । సంగతిః । అస్తి । వామ్ । అనుమృతా । న । భవంతమ్ । ఇయం । కిల.

టీక॥ హే స్మర = ఓ మన్మథా!, రతేః = రతీదేవికి (సంతుష్టికి), సహచరః = తోడ నుండెడి వాఁడవని, విశ్రుతిః = ప్రసిద్ధి. త్వయి = నీవు, వసతి సత్యపి = నా హృదయమందున్నను, మే = నాకు, రతిః = సంతోషము (రతీదేవి), కుతః = ఎందువలన, న = లేదు. అథవా = లేదా, సంప్రతి = ఇప్పుడు, వామ్ = మీకిద్దఱికిని, సంగతిః = సహవాసము, నాస్తి = లేదు. (ఏలయనగా) ఇయం = ఈరతి, భవంతం = నిన్ను, నానుమృతాకిల = అనుసరించిమృతిఁ జెందలేదు గదా.

వి॥ ప్రీతి స్వరూపమైన రతికిని, రతీదేవికిని అభేదాధ్యవసాయముఁ జేయుట వలన అభేదాతియోక్త్యలంకారము.

## సమాసములు :

సహచరః : సహ చరతీతి = సహచరః.

## భావము :

ఓ మన్మథా! నీవు రతికిని, (సంతోషమునకును రతీదేవికిని) సహచరుఁడవని ప్రసిద్ధినొంది యున్నావు. అయినను, నీవు మనస్సునందు జన్మించినందువలన నా హృదయమందెల్లప్పుడు నెలకొనియు, నీ సహచరియైన రతి (సంతోషము) నా కేల కలుగుట లేదు? లేదా, రతికిని నీకును, ప్రస్తుతము సంబంధము లేదా! ఇది వాస్తవమే. ఏలయనగా రతీదేవి నీతో నను మరణముఁ జెందలేదుగదా! కావున మీకిద్దరికిని సాహచర్యము లేదు. అందువలన నాకును రతి (సంతోషము) లేదు. ॥౨౨॥

శ్లో॥ రతివియుక్తమనాత్మపరజ్ఞ కిం
స్వమివ మామపి తాపితవానసి।
కథమతాపభృతస్తవ సంగమా
దితరథా హృదయం మమ దహ్యతే॥ ౨౩

ప॥వి॥ రతివియుక్తమ్। అనాత్మపరజ్ఞ । కిం । స్వమ్ । ఇవ । మామ్। అపి । తాపితవాన్ । అసి । కథమ్ । అతాపభృతః । తవ । సంగమాత్ । ఇతరథా । హృదయం । మమ । దహ్యతే.

టీక॥ అనాత్మపరజ్ఞ = తనను, ఇతరులను తెలియఁజాలని, అనగా నందజిని హింసించెడి, (మార = మన్మథా!), మామివ = నన్నువలె, రతివియుక్తమ్ = రతీదేవిచే వియోగముఁ బొందిన, స్వమపి = తననుఁగూడ, తాపితవానసి కిమ్ = తాపముఁబొందించితివా యేమి? ఇతరథా = అట్లు కానిచో, అతాపభృతః = తాపములేనటువంటి, తవ = నీయొక్క, సంగమాత్ = సంబంధమువలన, మమ = నాయొక్క, హృదయం = హృదయము, కథం = ఎట్లు, దహ్యతే = దహింపఁబడుచున్నది.

వి॥ నన్నువలె నిన్నుఁగూఁడ తపింపఁజేసుకొంటివా? యని చెప్పుటలో నుత్ప్రేక్ష.

సమాసములు :

రతివియుక్తమ్ : రత్యా వియుక్తః = రతివియుక్తః. తమ్ = రతివియుకమ్.

హే అనాత్మపరజ్ఞ : ఆత్మా చ పరశ్చ = ఆత్మపరౌ. ఆత్మపరౌ జానాతీతి = ఆత్మపరజ్ఞః. ఆత్మపరజ్ఞో న భవతీతి = అనాత్మపరజ్ఞః. తస్యసంబుద్ధిః = హే అనాత్మపరజ్ఞ.

అతాపభృతః : తాపం బిభర్తీతి = తాపభృత్. న తాపభృత్ = అతాపభృత్. తస్య = అతాపభృతః.

భావము :

తన్నుఁ గూర్చిగాని, పరులనుఁ గూర్చిగాని తెలియని, అనగా "ఇది తనది, ఇది పరులది'' యనెడి వివేకము విచక్షణలేక, యందజిని హింసించెడి మారా! ప్రియవియుక్తురాలనైన నన్నెట్లు తపింపఁజేసితివో, యట్లే రతీ వియోగమునొందిన నిన్నుఁ గూడ తపింపఁజేసికొంటివా? అట్లు కానిచో, నీ స్పర్శ వలన అనగా నీవు నా హృదయమందుండుటవలన నాకింతటి తాప మెట్లేర్పడును? కాన నీవును రతీ వియోగముచే తప్తుఁడవై నన్నుఁ దపింపఁజేయుచున్నావు. ॥౭౮॥

శ్లో॥ అనుమమార న మార కథం ను సా
రతిరితి ప్రథితాఽపి పతివ్రతా।

ఇయదనాథవధూవధపాతకీ
దయితయాఽపి తయాసి కిముజ్ఝితః॥ ౭౬

ప॥వి॥ అనుమమార । న । మార । కథం । ను । సా । రతిః । ఇతి । ప్రథితా । అపి । పతివ్రతా । ఇయదనాథవధూవధపాతకీ । దయితయా । అపి । తయా । అసి । కిమ్ । ఉజ్ఝితః.

టీక॥ హేమార = హింసించెడి యోమన్మథా!, పతివ్రతాఇతి = పతివ్రతయని, ప్రథితాఽపి = ప్రసిద్ధిఁ బొందియు, సా = ఆ, రతిః = రతీదేవి, కథంను = ఎట్లు, నఅనుమమార = నీతోననుమరణముఁ బొందలేదు? (అథవా = లేదా) ఇయదనాథవధూవధపాతకీ; ఇయత్ = ఇంతటి సంఖ్యగల, అనాథ వధూ = అనాథలైనవిరహిణులగు స్త్రీలయొక్క, వధ = వధచే, పాతకీ = పాతకమును వహించిన, (త్వం = నీవు), దయితయాఽపి = ప్రియు రాలిచేతను, ఉజ్ఝితః కిమ్ = విడువఁబడితివా యేమి?.

సమాసములు :

*పతివ్రతా :* పత్యౌవ్రతంయస్యాః సా = పతివ్రతా.

***ఇయదనాథవధూవధపాతకీ :*** అనాథాశ్చతాః వధ్వః = అనాథవధ్వః. అనాథవధూనాం వధాః = అనాథ వధూవధాః. ఇయంతశ్చతే అనాథవధూ వధాశ్చ = ఇయదనాథవధూవధాః. ఇయదనాథవధూవధైః పాతకః = ఇయద నాథవధూవధపాతకః. ఇయదనాథవధూవధ పాతకః అస్యఅస్తీతి = ఇయద నాథవధూవధపాతకీ.

భావము :

ఓ మన్మథా! నీ ప్రియురాలైన రతీదేవి పతివ్రతగాఁ బ్రసిద్ధిఁ జెందినది. కాని యామె యేల నీతో ననుమరణముఁ బొందలేదు. లెక్కింప శక్యముగాని వియోగినులగు ననాథ స్త్రీలను వధించుటవలన బాతకమును వహించిన నిన్ను నీ ప్రియురాలు గూడ వదలివేసి యుండునేమో!. ॥౭౬॥

శ్లో॥ సుగత ఏవ విజత్య జితేంద్రియ
స్త్వదురు కీర్తితనుం యదనాశయత్।

తవతనూమవశిష్టవతీం తత
స్సమితి భూతమయీమహరద్ధరః॥ ॥౭౦॥

ప॥వి॥ సుగతః । ఏవ । విజిత్య । జితేంద్రియః । త్వదురుకీర్తితనుం । యత్ । అనాశయత్ । తవ । తనూమ్ । అవశిష్టవతీం । తతః । సమితి । భూతమయీమ్ । అహరత్ । హరః.

టీక॥ జితేంద్రియః = ఇంద్రియములను జయించి వశీకరించుకొనిన, సుగత ఏవ = బుద్ధుఁడే, త్వదురు కీర్తితనుమ్; త్వత్ = నీ యొక్క, ఉరు = గొప్పదైన, కీర్తితనుం = కీర్తియనెడి శరీరమును, యత్ = ఎందువలన, అనాశయత్ = నాశముగావించెనో, తతః = ఆ కారణమువలన, అవశిష్ట వతీం = మిగిలియున్న, భూతమయీం = పృథివ్యాది పంచభూత వికారమైన, తవ = నీయొక్క, తనూం = శరీరమును, హరః = శివుఁడు, సమితి = యుద్ధమునందు, అహరత్ = సంహరించెను.

సమాసములు :

*జితేంద్రియః:* జితాని ఇంద్రియాణి యేన సః = జితేంద్రియః.

*త్వదురుకీర్తితనుమ్:* ఉర్వీచసాకీర్తిశ్చ ఉరుకీర్తిః.ఉరుకీర్తిరేవ తనుః = ఉరుకీర్తితనుః. తవ ఉరుకీర్తితనుః = త్వదురు కీర్తితనుః. తామ్ = త్వదురు కీర్తితనుం.

*భూతమయీమ్ :* భూతానాం వికారః = భూతమయీ. తామ్ = భూత మయీమ్.

భావము :

ఇంద్రియము లను వశీకరించుకొనిన బుద్ధుఁడు తన కాంతయందలి యనురాగమును వీడి సన్న్యాసియై నిన్నుదరిఁజేరనీయక, నీ కీర్తిశరీరమును నాశము గావించెను. అతనియందు నీ యాటలు సాగలేదు. అతని వైరాగ్యము నకు నీవలన నెట్టిధముగను భంగము వాటిల్లలేదు. కాన నీ విధముగ నీ కీర్తి శరీరము నశింపగా, మిలిగినది. నీ పాంచభౌతికమైన శరీరము. దీనిని శివుఁడు నీతోటి యుద్ధమున భస్మము గావించెను. ఆ బుద్ధుఁడు నీ కీర్తి శరీరమును

నాశముగావింపక యున్నచో, నీ భౌతిక శరీరమును నాశము చేయుట, హరునకు కూడ నసాధ్యమై యుండెడిది. కీర్తి తొలగిన పిదప మిగిలిన శరీరము భూతమయమనుటవలన- పైశాచికమనియు సూచితము. ఇట్లు కీర్తి శరీరమును, భౌతిక శరీరమును నశించియు, నీవు సిగ్గులేక మమ్ములను నిర్దయతో హింసించుచున్నందులకు మాకు నాశ్చర్యమై యున్నది. ॥౮౦॥

శ్లో॥ ఫలమలభ్యత యత్కుసుమైస్త్వయా
విషమనేత్రమనంగ! నిగృహ్ణతా।
అహహ నీతిరవాప్తభయా తతో
న కుసుమైరపి విగ్రహమిచ్ఛతి॥ ౮౧

ప॥వి॥ ఫలమ్ । అలభ్యత । యత్ । కుసుమైః । త్వయా। విషమనేత్రమ్ । అనంగ । నిగృహ్ణతా । అహహ । నీతిః । అవాప్తభయా । తతః । న । కుసుమైః । అపి । విగ్రహమ్ । ఇచ్ఛతి.

టీక॥ హే అనంగ! = ఓ మన్మథా! (ఓ శరీరములేని వాడా!), విషమనేత్రం = బేసి కన్నులుగల అనగా ముక్కంటియైన శివుని, (సహింప సాధ్యము కాని నాయకుని), కుసుమైః = పూలచే, నిగృహ్ణతా = కొట్టినటువంటి, త్వయా = నీచే, యత్ = ఏ, ఫలమ్ = మరణరూపమైన ఫలము, అలభ్యత = పొందఁబడినదో, తతః = అందువలన, అవాప్తభయా = భీతిఁజెందిన, నీతిః = ''ఇతర సాధనములచేతనైనను శత్రువుపైఁ బగతీర్చుకొనవలయును'' అనునీతి, కుసుమైరపి = పూలతోడను, విగ్రహం = యుద్ధమును, నేచ్ఛతి = కోరుటలేదు.

**సమాసములు :**

విషమనేత్రమ్ : విషమంనేత్రం యస్య సః = విషమనేత్రః. తమ్ = విషమనేత్రమ్.

విషమశ్చాసౌ నేత్రశ్చ = విషమనేత్రః. తమ్ = విషమనేత్రమ్.

(హే) అనంగ : అవిద్యమానమంగం యస్య సః = అనంగః. తస్య సంబుద్ధిః = హే అనంగ.

అవాప్తభయా : అవాప్తం భయం యయాసా ఆవాప్తభయా.

**భావము :**

శరీరములేని యో మన్మథా! నీవు ముక్కంటిని పూలచేఁ గొట్టుచు మరణరూపమైన ఫలమునుఁ బొందితివి. దానితో "ఏ సాధనములచేతనైనను శత్రువుపైఁ బగిను దీర్చుకొనవలయుననెడి" నీతి, భీతిఁ జెందినదై పూలతోడను యుద్ధముఁ జేయుట కిష్టపడలేదు. ఇది యబ్బురమైనది. పూలతోడనే యుద్ధముఁ జేయనొల్లనపుడిఁక నితర సాధనములగు వాడి యమ్ములు మున్నగు వానితో యుద్ధముఁ జేయనొల్లదని చెప్పనవసరము లేదు. కావున నీవు పూలను సైతము మామీద వదలుటకు భయపడు చున్నావు. అనంగ! యనుటవలన- శరీరములేని నీవు శరీరము గల్గిన, విషమనేత్రునితో అనగా అలవికాని నాయకునితోఁ గయ్యమునకు దిగుట నీ మౌర్ఖ్యమును వెల్లడిఁజేయుచున్నదని సూచితము. నేత్ర శబ్దమునకు నాయకుఁడనియు నర్థము. ॥౮౧॥

శ్లో॥ అపి ధయన్నితరామరవత్సుధాం
త్రినయనాత్కథమాపిథ తాం దశామ్।
భణ రతేరధరస్య రసాదరా
దమృతమాత్తఘృణః ఖలు నా పిబః॥ ౮౨

ప॥వి॥ అపి । ధయన్ । ఇతరామరవత్ । సుధామ్ । త్రినయనాత్ । కథమ్ । ఆపిథ । తాం । దశామ్ । భణ । రతేః । అధరస్య । రసాదరాత్ । అమృతమ్ । ఆత్తఘృణః । ఖలు । న । అపిబః.

టీక॥ (హేస్మర = ఓ మన్మథా!), ఇతరామరవత్ = ఇతర దేవతలవలె, సుధాం = అమృతమును, ధయన్నపి = త్రాగుచును, త్రినయనాత్ = ముక్కంటియగు శివునివలన, తాం = ఆ, దశాం = మరణదశను, కథం = ఎట్లు, ఆపిథ = పొందితివి. భణ = చెప్పుము. అథవా = లేదా, రతేః = రతీదేవియొక్క, అధరస్య = పెదవియొక్క, రసాదరాత్; రస = రుచియందలి, ఆదరాత్ = ఆసక్తివలన, ఆత్తఘృణః; = అమృతము మీద వెగటును పొందినవాడవై, అమృతం = అమృతమును, నాఽపిబః ఖలు = త్రాగలేదు గదా!.

సమాసములు :

ఇతరాఽమరవత్ : ఇతరే చ తే అమరాశ్చ = ఇతరామరాః. ఇతరామరాఇవ = ఇతరామరవత్.

త్రినయనాత్ : త్రీణి నయనాని యస్య సః = త్రినయనః. తస్మాత్ = త్రినయనాత్.

రసాఽఽధరాత్ : రసే ఆదరః = రసాఽఽదరః. తస్మాత్ = రసాదరాత్.

ఆత్తఘృణః : ఆత్తా ఘృణా యేన సః = ఆత్తఘృణః.

భావము :

ఓ మన్మథా! నీవు ఇతర దేవతల వలెనే యమృతమునుఁ ద్రాగియు, నెట్లు మరణించితివి! చెప్పుము. లేదా నీవు నీ ప్రియురాలగు రతీదేవి యొక్క యధరరసమునందాసక్తి గల్గి యమృతము సేవగించుకొని దానిని పానము చేయ లేదా? అట్లు కానిచో నమృతమునుఁ ద్రాగిన దేవతలందఱు జీవించియుండగా నీ వొక్కఁడ వెట్లు మరణింతువు?. ॥౮౨॥

శ్లో॥ భువనమోహనజేన కిమేనసా
తవ పరేత బభూవ పిశాచతా।
యదధునా విరహాధిమలీమసా
మభిభవన్భ్రమసి స్మర మద్విధామ్॥ ౮౩

ప॥వి॥ భువనమోహనజేన । కిమ్ । ఏనసా । తవ । పరేత । బభూవ । పిశాచతా । యత్ । అధునా । విరహాధిమలీమసామ్ । అభిభవన్। భ్రమసి। స్మర । మద్విధామ్.

టీక॥ హే పరేత! = ఓ మృతుఁడా!, తవ = నీయొక్క, భువనమోహనజేన; భువన = లోకములను, మోహనజేన = చైతన్యము లేనివిగఁ జేయుట వలనఁ గల్గిన, ఏనసా = పాపముచే, పిశాచతా = పిశాచమగుట, బభూవ కిం = ఏర్పడినదా ఏమి? హే స్మర = ఓస్మరుఁడా, యత్ = ఎందు

వలన, అధునా = ఇప్పుడు, విరహాధిమలీమసామ్; విరహాఽఽధి = విరహమువలని పీడచే, మలీమసాం = మాలిన్యముబొందిన, మద్విధామ్ = నావంటి దీనురాలను, అభిభవన్ = పీడించుచు, భ్రమసి = తిరుగుచున్నావు.

## సమాసములు:

*భువనమోహనజేన:* భువనానాం మోహనమ్ = భువనమోహనం. భువనమోహనాత్ జాయత ఇతి = భువనమోహనజమ్. తేన = భువనమోహనజేన.

(హే) *పరేత:* పరమ్ ఇతః = పరేతః. తస్య సంబుద్ధిః = హేపరేత.

*పిశాచతా :* పిశాచస్య భావః = పిశాచతా.

*విరహాధిమలీమసామ్ :* విరహస్య = ఆధిః = విరహాధిః. విరహాధినా మలీమసా = విరహాధిమలీమసా. తామ్ = విరహాధిమలీమసామ్.

*మద్విధామ్ :* అహం విధా యస్యాస్సా మద్విధా. తామ్ మద్విధామ్.

## భావము :

మరణించిన యో మన్మథా! లోకములకు చైతన్యము లేకుండఁ జేయుట వలని పాపముచే నీవు పిశాచమైతివా! ఏలయనగా, వియోగపీడచే మలినమైన నావంటి యబలను వేధించుచు తిరుగుచున్నావు. లోకమున మరణించిన వారికి పాప విశేషముచే పిశాచత్వము వచ్చును. అట్టి పిశాశములు శుద్ధిలేని వారిని పట్టుకొని వేధించుచుండునను సంశయమిట సూచితము. ॥౭౩॥

శ్లో॥ బత దదాసి న మృత్యుమపి స్మర
స్ఖలతి తే కృపయా న ధనుః కరాత్।
అథ మృతోఽసి మృతేన చ ముచ్యతే
న కిల ముష్టిరురీకృతబంధనః॥ ౭౪

ప॥వి॥ బత । దదాసి । న । మృత్యుమ్ । అపి । స్మర । స్ఖలతి । తే । కృపయా । న । ధనుః । కరాత్ । అథ । మృతః । అసి । మృతేన । చ । ముచ్యతే । న । కిల । ముష్టిః । ఉరీకృతబంధనః.

టీక॥ హేస్మర = ఓ మన్మథా!, మృత్యుమపి = మరణమును(గూడ, నదదాసి = ఈయవు. (అథవా = లేదా) కృపయా = దయచే, (అకృపయా = క్రూరత్వముచే), తవ = నీయొక్క, కరాత్ = హస్తమునుండి, ధనురపి = విల్లుగూడ, నస్ఖలతి = పడిపోదు. అథమృతోఽసి = ఒకవేళ నీవు మరణించియున్నచో, మృతేనచ = మరణించిన వానిచే, ఉరీకృత బంధనః; ఉరీకృత = అంగీకరింప(బడిన, బంధనః = పట్టుగల్గిన, అనగా గట్టిపట్టుగల్గిన, ముష్టిః = పిడికిలి, న ముచ్యతే కిం = విడువ(బడదు గదా! బత = కష్టము.

సమాసములు :

*ఉరీకృతబంధనః:* ఉరీకృతం బంధనం యస్యసః = ఉరీకృతబంధనః.

భావము :

ఓ మన్మథా! నీవు మేలుచేయవు పోనిమ్ము మృత్యువునైన నీయవు. మృత్యువు నిచ్చినచో ఈ బాధ తొలగును గదా! మాయెడ దయతోనైనను నీ చేత నున్న విల్లు పడిపోదు. ఇది చాల కష్టమైన విషయము. నీవు మృతు(డవు. కాన నీకు దయయెక్కడ? మృతులు చైతన్యములేని వారు గాన వారికి దయ గలుగదు. కావుననే చేతనున్న విల్లుగూడా పడిపోదు. లేదా నీకు కృప యెక్కడిది. నీయందు క్రూరత్వమే అనుభవసిద్ధము కాన, నందువలన నీచేతనున్న విల్లు పడిపోదు. ఆ విల్లు పడిపోయినచో, అందుండి బాణములు పై(బడవు. ఒక వేళ నీవు మరణించియున్నచో నప్పుడైనను నీ చేతి పట్టు గట్టిది. ఏలయనగా మరణించిన వారి పిడికిలి పట్టు గట్టిది. కాన నప్పుడుగూడ నీ గట్టి పిడికిలి నుండి విల్లు పడిపోదు. కాన నీవు మరణించినను నీవలని బాధ తప్పదు. నీవు మరణించినను నీ కాఠిన్యము తగ్గలేదు. లోభి జీవించియున్నను అతడు గట్టి పిడికిలి గల్గి దానము చేయడు. ఇక నతడు మరణించిన నతని పిడికిలి ఇంకను గట్టి పడును. నీవును ఆలోభికి సముడవని సూచితము. ॥౮౪॥

శ్లో॥ దృగపహత్యపమృత్యువిరూపతా
శ్శమయతే పరనిర్జర సేవితా।

అతిశయాంధ్యవపుఃక్షతిపాండుతా
స్స్మర భవంతి భవంత ముపాసితుః॥ రా॥

ప॥వి॥ దృగపహత్యపమృత్యువిరూపతాః । శమయతే । పరనిర్జర సేవితా । అతిశయాంధ్యవపుః క్షతిపాండుతాః । స్మర । భవంతి । భవంతమ్ । ఉపాసితుః.

టీక॥ హేస్మర = ఓ మన్మథా! పరనిర్జర సేవితా; పరనిర్జర = నీ కంటె వేఱు దేవతలను, సేవితా = ఉపాసించువాఁడు, దృగపహత్యపమృత్యువిరూపతాః, దృగపహతి = గ్రుడ్డితనమును, అపమృత్యు = అకాల మరణమును, విరూపతాః = అంగవైరూప్యమును, శమయతే = పోగొట్టుకొనుచున్నాడు. భవంతం = నిన్ను, ఉపాసితుః = ఉపాసన చేయువానికి, అతిశయాంధ్యవపుఃక్షతిపాండుతాః; అతిశయాంధ్య = అధికమైన గ్రుడ్డితనము, వపుఃక్షతి = దేహబాధ, పాండుతాః = శరీరవర్ణము తగ్గి పాలిపోవుట మున్నగునవి, భవంతి = కలుగుచున్నవి.

వి॥ హితప్రాప్తికై గావించిన మన్మథోపాసనకు గ్రుడ్డితనము మున్నగునసర్థప్రాప్తికల్గినట్లు వర్ణించుటవలన నిచ్చట విషమాలంకారము.

## సమాసములు :

*దృగపహత్యపమృత్యువిరూపతాః :* దృశోరపహతిః = దృగపహతిః. వికృతం రూపం యస్యసః = విరూపః. విరూపస్య భావః = విరూపతా. దృగపహతిశ్చ, అపమృత్యుశ్చ, విరూపతా చ = దృగపహత్యపమృత్యు విరూపతాః. తాః = దృగపహత్యపమృత్యు విరూపతాః.

*పరనిర్జరసేవితా :* పరే చ తే నిర్జరాశ్చ = పరనిర్జరాః. పరనిర్జరాణాం సేవితా = పరనిర్జర సేవితా.

*అతిశయాంధ్యవపుఃక్షతిపాండుతాః:* అంధస్య భావః = ఆంధ్యమ్. వపుషః క్షతిః = వపుఃక్షతిః. పాండోః భావః = పాండుతా. అతిశయేన ఆంధ్యమ్ = అతిశయాంధ్యమ్. (అతిశయేన) వపుఃక్షతిః = అతిశయవపుఃక్షతిః, (అతిశయేన)

పాండుతా = అతిశయపాండుతా. (అతిశయేన ఆంధ్యంచ, వపుఃక్షతిశ్చ, పాండుతాచ, అతిశయాంధ్య వపుఃక్షతిపాండుతాః,). తాః = అతిశయాంధ్యవపుఃక్షతిపాండుతాః.

భావము :

ఓ మన్మథా! నీ కంటె నితర దేవతలనుపాసించు జనము, గ్రుడ్డి తనమును అపమృత్యువును, శరీరమందు వికృతరూపము మున్నగు వానిని శమింపఁ జేసుకొనుచున్నది. కాని నిన్ను కొలిచెడి జనము మిక్కుటమైన గ్రుడ్డితనమును (విరహాతిశయము వలని యజ్ఞానమును) శరీరమునకు దౌర్బల్యమును, (విరహాతిశయమువలని యంగగ్లానిని) పాండు రోగమును (విరహాతిశయముచే పాలిపోవుటను బొందుచున్నది. ఇతర దేవతలనుపాసించు వారికి గ్రుడ్డితనము మున్నగు రోగములు శమించుచుండగా, నిన్ననుపాసించెడి నీ భక్తులకు దానికి విపరీతముగా, అధికమైన గ్రుడ్డితనము మున్నగు రోగములు గలుగుచున్నవి. కావున నీయొక్క దేవతాత్వము మిగుల నుపహాసయోగ్యమై యున్నది. ॥౮౨॥

శ్లో॥ స్మర నృశంస తమ స్త్వమతో విధి
స్సుమనసః కృతవాన్ భవదాయుధమ్।
యది ధనుర్దృఢమాశుగమాయసం
తవ సృజేత్ప్రళయం త్రిజగద్వ్రజేత్॥ ౮౩

ప॥వి॥ స్మర । నృశంసతమః । త్వమ్ । అతః । విధిః । సుమనసః । కృతవాన్ । భవదాయుధమ్ । యది । ధనుః । దృఢమ్ । ఆశుగమ్ । ఆయసమ్ । తవ । సృజేత్ । ప్రళయం । త్రిజగత్ । వ్రజేత్.

టీక॥ (హే స్మర = ఓ మన్మథా), త్వం = నీవు, నృశంసతమః = అతిక్రూరుఁడవు, అతః = ఇందువలన, విధిః = బ్రహ్మ, సుమనసః = పుష్పములను (మంచి మనస్సు గలవారిని), భవదాయుధమ్ = నీకు ఆయుధముగా, కృతవాన్ = చేసెను. తవ = నీకు, దృఢం = దృఢమైన, ధనుః = ధనుస్సును, ఆయసమ్ = లోహమయమైన, ఆశుగం = బాణ

మును, సృజేద్యది = సృజించియున్నచో, త్రిజగత్ = మూడు లోకముల సమూహము, ప్రళయం = వినాశమును, వ్రజేత్ = పొందెడిది.

**సమాసములు :**

నృశంసతమః: నౄన్ శంసతీతి = నృశంసః. అత్యంతం నృశంసః = నృశంసతమః.

సుమనసః : శోభనం మనః యాసాం తాః = సుమనసః. తాః = సుమనసః.

*భవదాయుధమ్ :* భవతః ఆయుధః = భవదాయుధః. తమ్ = భవదాయుధమ్.

*ఆయసమ్ :* అయసః వికారః = ఆయసః. తమ్ = ఆయసమ్.

*త్రిజగత్ :* త్రయాణాం జగతాం సమాహారః = త్రిజగత్.

**భావము :**

ఓ మన్మథా! నీవు చాల క్రూరుఁడవని గ్రహించియే బ్రహ్మ నీకు పుష్పములను ఆయుధముగాఁ జేసెను. నీకు దృఢమైన ధనుస్సును లోహమయమైన బాణమును సృజించియున్నచో మూడులోకములు ప్రళయమునుఁ బొందెడివి. సుమనసః అని యాయుధమును చెప్పుటవలన, నీవు క్రూరహృదయుండవు కాన నీకు ఆయుధమును సుమనస్సులను-పుష్పములను-అనగా మంచి మనస్సుగల వానిని చేసెనని సూచితము. ॥౨౬॥

శ్లో॥ స్మరరిపోరివ రోపశిఖీ పురాం
దహతు తే జగతామపి మా త్రయమ్।
ఇతి విధి స్త్వదిషూన్ కుసుమాని కిమ్
మధుభిరంతరసించదనిర్వృతః॥ ౨౭

ప॥వి॥ స్మరరిపోః । ఇవ । రోపశిఖీ । పురాం । దహతు । తే । జగతామ్ । అపి । మా । త్రయమ్ । ఇతి। విధిః । త్వదిషూన్ । కుసుమాని । కిం। మధుభిః । అంతః । అసించత్ । అనిర్వృతః.

టీక॥ స్మరరిపోః = మన్మథుఁడవైన నీయొక్క శత్రువగు హరునియొక్క, రోపశిఖీ = బాణాగ్ని, పురాం = పట్టణముల యొక్క, త్రయమివ = మూఁటినివలె, తవ = నీయొక్క, రోపశిఖీ = బాణాగ్ని, జగతాం = లోకములయొక్క, త్రయం = మూఁటిని, మాదహతు = దహింపరాదు, ఇతి = అని, (మత్వా = తలంచి), విధిః = బ్రహ్మ, అనిర్వృతః = తృప్తిఁ జెందనివాఁడై, త్వదిషూన్ = నీ బాణములగు, కుసుమాని = పుష్పములను, మధుభిః = మకరందములచే, అంతః = లోపల, అసించత్ కిమ్ = తడిపెనా యేమి.

వి॥ ఇచ్చట బ్రహ్మ మకరందములచే, మన్మథ బాణములగు పుష్పములను తడుపక పోయినను తడిపెనా యనుటవలన నుత్ప్రేక్ష.

సమాసములు:

*స్మరరిపోః :* స్మరస్య రిపుః = స్మర రిపుః. తస్య = స్మరరిపోః.

*రోపశిఖీ :* రోపస్య శిఖీ = రోపశిఖీ.

*త్వదిషూన్ :* తవ ఇషవః = త్వదిషవః. తాన్ = త్వదిషూన్.

భావము :

ఓ మన్మథా! నీ శత్రువైన హరుని బాణాగ్ని మూఁడు పట్టణముల నెట్లు దహించినదో, అట్లే నీ బాణాగ్ని మూఁడు లోకములను దహింపరాదని తలంచి, బ్రహ్మ నీబాణములైన పుష్పములను మకరందములతో లోపల తడిపెను. నీబాణములు పుష్పములు కాన, నవి దహింపక పోయినను బ్రహ్మకు నమ్మక మేర్పడక పోవుటవలన నా పుష్పములు దహింపకుండుటకై వానిలోపల మకరందము నింపి వానిదాహకశక్తినిఁ దగ్గించెను. అట్లు మకరందములచేఁ దడుపక పోయినచోఁ బాపియైన నిన్ను దహనకృత్యమునుండి యెవ్వఁడాపఁగలడు. కాన బ్రహ్మ యుక్తము చేసెను. ॥౮౭॥

శ్లో॥ విధిరనంగమభేద్యమవేక్ష్య తే
జనమనః ఖలు లక్ష్యమకల్పయత్।

అపి స వ్రజమదాస్యత చేత్తదా
త్వదిషుభిర్వ్యదళిష్యదసావపి॥ ౮౨

ప॥వి॥ విధిః । అనంగమ్ । అభేద్యమ్ । అవేక్ష్య । తే । జనమనః । ఖలు । లక్ష్యమ్। అకల్పయత్। అపి। సః। వ్రజమ్। అదాస్యత । చేత్ । తదా । త్వదిషుభిః । వ్యదళిష్యత్ । అసౌ । అపి.

టీక॥ (హేస్మర = ఓ మన్మథా), విధిః = బ్రహ్మ, అనంగం = అవయవరహితమైనదియు, (కావుననే) అభేద్యం = భేధింపశక్యముగాని దానినిగ, అవేక్ష్య = నిశ్చయించి, జనమనః = జనుల మనస్సును, తే = నీకు, లక్ష్యం = గుఱిగా, అకల్పయత్ = చేసెను. (అట్లుగాక) సః = ఆ విధి, వ్రజమపి = వ్రజమును సైతము, అదాస్యతచేత్ = గుఱిగానిచ్చియున్నచో, తదా = అప్పుడు, త్వదిషుభిః = నీ బాణములచే, అసౌఅపి = ఈ వ్రజముగూడ, వ్యదళిష్యత్ = తునకలై పోయెడిది.

వి॥ జనుల మనస్సును గుఱిగ నుంచుటలో నదియవయవరహితమగుట హేతువు కాకపోయినను, దానిని హేతువుగ చెప్పుటవలన హేతూత్ప్రేక్ష. మనస్సు నిత్యము పరమాణురూపమగుట వలన నది, యవయవరహిత ద్రవ్యము.

## సమాసములు :

*అనంగమ్ :* అవిద్యమానమ్ అంగమ్ యస్య తత్ = అనంగమ్. తత్ = అనంగమ్.

*జనమనః:* జనానాం మనః = జనమనః. తత్ = జనమనః.

## భావము :

ఓ మన్మథా? బ్రహ్మ చక్కగా నాలోచించి, యవయవము లేనందువలన ఛేదింప సాధ్యము కానట్టి జనుల మనస్సును నీ బాణములకు గుఱిగాం బెట్టెను. మనస్సు నిత్యము నిరవయవమని శాస్త్ర సిద్ధాంతము. కాన నవయవము లేని యా మనస్సును నీబాణము లెట్లు తాకును? కాన బ్రహ్మ యుక్తము గావించెను. ఒకవేళ బ్రహ్మ, దేనికి పగులనటువంటి వ్రజమును నీకు గుఱి కావించినను నదియు, నీ బాణముల దెబ్బకు వ్రయ్యలయ్యేడిదే. ॥౮౨॥

శ్లో॥ అపి విధిః కుసుమాని తవాశుగాన్
స్మర విధాయ న నిర్వృతిమాప్తవాన్।
అదిత పంచ హి తే స నియమ్య తాన్
తదపి తైర్బత జర్ఝరితం జగత్॥ లా

ప॥వి॥ అపి । విధిః । కుసుమాని । తవ । అశుగాన్ । స్మర । విధాయ । న । నిర్వృతిమ్ । ఆప్తవాన్ । అదిత । పంచ । హి । తే । సః । నియమ్య । తాన్ । తత్ । అపి । తైః । బత । జర్ఝరితం । జగత్.

టీక॥ హేస్మర = ఓ మన్మథా!, విధిః = దైవము, కుసుమాని = పుష్పములను, తవ = నీయొక్క, ఆశుగాన్ = బాణములుగ, విధాయ = చేసి, నిర్వృతిం = తృప్తిని, అపిన ఆప్తవాన్ = పొందలేదా?, హి = ఏలయనగా, సః = తృప్తిపొందని ఆ బ్రహ్మ, తానపి = ఆ పుష్పబాణములను సైతము; నియమ్య = నియమము గావించి, తే = నీకు, పంచ = అయిదు బాణములనే, అదిత = ఇచ్చెను. తదపి = ఆయినను, తైః = ఆ యయిదు బాణముల చేతనే, జగత్ = ప్రపంచము, జర్ఝరితమ్ = శిథిలమై పోయినది, బత = కష్టము.

వి॥ పూలను బాణములుగ చేసినను, అయిదు బాణములుగ వానిని నియమించుటలో బ్రహ్మకు కలిగిన యసంతృప్తి హేతువు కాకపోయినను, హేతువుగఁ జెప్పుటవలన నిఁట హేతూత్ప్రేక్ష.

**భావము :**

ఓ మన్మథా! బ్రహ్మ పూలను నీకు బాణములుగఁ జేసియు సంతోషమును తృప్తినిఁ బొందలేదాయని తోచుచున్నది. ఏలయనగా నా బ్రహ్మ పుష్పములను బాణములుగఁ జేయుటతోఁబాటు, ఆ బాణములను నైదుగ నియమించి నిన్ను పంచబాణునిఁ గావించెను. అట్లు బ్రహ్మ బాణములను అయిదుగ నియమించినను, ఆ అయిదు బాణములుచేతనే ప్రపంచము శిథిలమై పోయినది. ఇట్లు ప్రపంచ నియామకుఁడగు బ్రహ్మయే విఫలుఁడైనప్పుడు మఱెవ్వఁడు ఆ మన్మథుని నియమింపఁగలడు. అయిదు బాణములను మించి యా మన్మథునకు బాణ

ము ననుమతించియున్నచో, నతడు ప్రపంచమును ధ్వంసముచేయునని భయపడి బ్రహ్మయతనికి నైదు బాణములనే నియమించెను. అట్లయినను నా మన్మథుఁడు ప్రపంచమును నాశముఁజేయుచునే యున్నాఁడు. కాన బ్రహ్మ ప్రయత్నము విఫలమైనది, ॥౮౯॥

శ్లో॥ ఉపహరంతి న కస్య సుపర్వణః
సుమనసః కతి పంచ సురద్రుమాః।
తవ తు హీనతయా పృథగేకికాం
ధిగియతాఽపి న తేఽంగ విదారణమ్॥ ౯౦

ప॥వి॥ ఉపహరంతి । న । కస్య । సుపర్వణః । సుమనసః । కతి । పంచ । సురద్రుమాః । తవ । తు । హీనతయా । పృథగ్ । ఏకికాం । ధిక్ । ఇయతా । అపి । న । తే అంగవిదారణమ్.

టీక॥ హేస్మర = ఓ మన్మథా!, పంచ = అయిదైన, సురద్రుమాః = మందారము, పారిజాతము, సంతానము. కల్పవృక్షము, హరిచందనము, అని చెప్పఁబడుదేవతావృక్షములు, కస్య = ఏ, సుపర్వణః = వేల్పునకు, కతి = ఎన్ని, సుమనసః = పుష్పములను, నోపహరంతి = కానుకగానర్పించుట లేదు. (పెక్కు పుష్పముల నర్పించుచున్నవి). తవతు = నీకో, హీనతయా = (అంగరాహిత్యముచే నేర్పడిన లోపము చేతను), నీచత్వము చేతను, పృథక్ = ప్రత్యేకంగా. ఏకికామ్ = ఒక్కొక్క పుష్పవ్యక్తిని, అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక - నీలోత్పలము అని చెప్పఁబడు నొక్కొక్క పుష్పవ్యక్తిని కానుకగా సమర్పించుచున్నవి. (కావుననే నీకు పంచబాణత్వమేర్పడినది) ఇయతాఽపి = ఇంతటి యవమానము చేతను, తే = నీకు, అంగవిదారణమ్ = శరీరమునకు ఆపద, అనగా ప్రాణత్యాగము, న = లేదు, ధిక్ = నీచము.

సమాసములు :

*అంగవిదారణమ్ :* అంగస్య విదారణమ్ = అంగవిదారణమ్.

**భావము :**

ఓ మన్మథా! మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము, అని చెప్పబడు నైదు దేవతావృక్షములు దేవతల కందరికిని పెక్కు పుష్పములను బహూకరించుచున్నవి. కాని నీకు మాత్రము లెక్క పెట్టి నట్లుగా నొక్కొక్క పూవు చొప్పున, అరవిందముఁ అశోకము, చూతము, నవ మల్లిక, నీలోత్పలము, అని చెప్పబడు నయిదు పుష్పములను మాత్రమర్పించు చున్నవి. కావుననే నీవు పంచబాణుఁడవు. అంగహీనత వలనను, విరహులను వేధించుటవలనను నీచుఁడవైన నీకిది తగినది. ఇంతటి యవమాన మేర్పడినను, నీ శరీరమున కింకను నెట్టి హాని కలుగలేదే! మానవంతులిట్టి తరుణమున ప్రాణ త్యాగము చేయరా. ॥౯౦॥

శ్లో॥ కుసుమమప్యతిదుర్నయకారి తే
కిము వితీర్య ధనుర్విధిరగ్రహీత్।
కిమకృతైష యదేక తదాస్పదే
ద్వయమభూదధునా హి నలభ్రువోః॥ ౯౧

ప॥వి॥ కుసుమమ్ । అపి । అతిదుర్నయకారి । తే । కిమ్ । ఉ । వితీర్య । ధనుః । విధిః । అగ్రహీత్ । కిమ్ । అకృత । ఏషః । యత్ । ఏక తదాస్పదే । ద్వయమ్ । అభూత్ । అధునా । హి । నలభ్రువోః.

టీక॥ విధిః = బ్రహ్మ, కుసుమమపి = పూవైనను, అతిదుర్నయకారి; అతి = మిక్కిలి, దుర్నయ = అవినీతిని, కారి = చేయునట్టి, ధనుః = ధనుస్సు నుగా, వితీర్య = ఇచ్చి, అగ్రహీత్ కిము = తీసుకొనినాఁడా యేమి? కింతు = కాని, ఏషః = ఈ బ్రహ్మ, కిమ్ = దేనిని, అకృత = చేసెను? (కుతః = ఏలయనగా), యత్ = ఎందువలన, ఏతదాస్పదే = ఈ ధనుస్సుయొక్క స్థానమందు, అధునా = ఇప్పుడు, నలభ్రువోః = నలుని కనుబొమ్మల యొక్క, ద్వయం = రెండు, అభూత్ హి = ఏర్పడినది గదా.

వి॥ పుష్పధనుస్సును మఱల వెనుకకుఁ తీసికొనుటలో నవినీతికారిత్వము హేతువు కాక పోయినను హేతువుగా జెప్పుటవలన హేతూత్ప్రేక్ష.

సమాసములు :

అతిదుర్నయకారి : దుర్నయం కరోతీతి = దుర్నయకారి. అత్యంతం దుర్నయకారి = అతిదుర్నయకారి. తత్ = అతిదుర్నయకారి.

తదాస్పదే : తస్య ఆస్పదం = తదాస్పదం. తస్మిన్ = తదాస్పదే.

నలభ్రువోః : నలస్య భ్రువౌ = నలభ్రువౌ. తయోః = నలభ్రువోః.

భావము :

బ్రహ్మ పుష్పము దుర్బలమైనదనియు నది హాని చేయదని భావించి దానిని విల్లుగా నీకొసంగెను. అది పుష్పమైనను, విరహులకు మిక్కిలి యనర్థము గల్గించుటవలన దానిని బ్రహ్మ నీయొద్ద నుండి మరల తీసికొనెను. కాని ఆ బ్రహ్మ చేసినదేమిటి? ఆ పూవిల్లు స్థానమున నలుని కనుబొమ్మలు రెండు నేర్పడినవి. అనగా, ఒక విల్లు పోయి రెండు విల్లు లేర్పడినవి. ముల్లును తీసి చీలను గుచ్చిన విధముగ నున్నది. ఒక్క వింటినే యోర్వలేనపుడు రెండు విల్లుల నెట్లు ఓర్వశక్యము. ॥౮౦॥

శ్లో॥ షడృతవః కృపయా స్వకమేకకం
కుసుమ మక్రమనందితనందనాః।
దదతి షడ్భవతే కురుతే భవాన్
ధనురివైకమిషూనివ పంచ తైః॥ ౮౧

ప॥వి॥ షట్ । ఋతవః । కృపయా । స్వకమ్ । ఏకకం । కుసుమమ్ । అక్రమనందిత నందనాః । దదతి । షట్ । భవతే । కురుతే । భవాన్ । ధనుః । ఇవ । ఏకమ్ । ఇషూన్ । ఇవ । పంచ । తైః.

టీక॥ అక్రమనందితనందనాః; అక్రమ = క్రమములేక, ఏకకాలమున, నందిత = వర్ధిల్లఁజేయఁబడిన, నందనాః = నందనవనము గల్గిన, షట్ = ఆరు, ఋతవః = వసంతాది ఋతువులు, కృపయా = దయచే, స్వకం = తమదైన, ఏకైకం = ఒక్కొక్క, కుసుమం = పుష్పమును

(దదానాః = ఇచ్చుచున్నవై, మిళిత్వా = కలసి) షట్ = ఆఱు పుష్పము లను, భవతే = నీ కొఱకు, దదతి = ఇచ్చుచున్నవి. తైః = ఆ యాఱు పుష్పములతో, ఏకం = ఒక పుష్పమును, ధనురివ = ధనుస్సువలెను, పంచ = అయిదు పుష్పములను, ఇషూనివ = బాణముల వలెను, భవాన్ = నీవు, కురుతే = చేయుచున్నావు.

సమాసములు :

అక్రమనందితనదనాః : అవిద్యమానః క్రమః యస్మిన్ కర్మణి తత్ యథా భవతి తథా = అక్రమమ్. అక్రమం నందితం నందనం యైస్తే = అక్రమనందితనందనాః.

భావము :

ఓ మన్మథా! వసంతాది ఋతువులాఱును, ఒక సమయమందే స్వర్గ మందలి నందనోద్యానమును వికసింపఁజేసి యొక్కొక్క ఋతువు నొక్కొక్క పూవును నీకుదయతో నిచ్చుచున్నవి. అట్లు నీకు లభించిన యాఱు పుష్పము లలో నొక పుష్పమును, విల్లుగను తక్కిన యైదు పుష్పములను బాణములుగ నీవు గావించుకొనుచున్నావు. ఈ పుష్పములను సైతము వసంతాది ఋతువులు నీ యెడ ప్రీతితో నీయ లేదు. కేవలము దయతో నిచ్చినవి. దయతో పలువురొసంగిన స్వల్పభిక్షమును దరిద్రుఁడెట్టు విభజించుకొని, గొప్ప కార్యములను చేయవలయునని గొంతెమ కోర్కె లను కోరుచుండునో, అట్లే దరిద్రుఁడవైన నీవు వసంతాది ఋతువులు దయతో నొసంగిన యాఱు పుష్పములలో నొకటి వింటికనియు యైదు బాణముల కనియు విభజించుకొని దీనితో నీ పనినిఁ జేయవలయునని గాలిమేడలు కట్టు కొనుచున్నావు. అతి దరిద్రుఁడవై, భిక్షచే సంపాదించుకొనిన సాధనములతో విరహులను హింసించు నీకు లజ్జయైనను లేదా! ॥౯–౨॥

శ్లో॥ యదతనుస్త్వమిదం జగతే హితం
క్వ స మునిస్తవ యస్సహతే క్షతీః।
విశిఖమాత్రవణం పరిపూర్య చే
దవిచలద్భుజముజ్ఝితుమీశిషే॥ ౯–౩

ప॥వి॥ యత్ । అతనుః । త్వమ్ । ఇదం । జగతే । హితం । క్వ । సః । మునిః । తవ । యః । సహతే । క్షతీః । విశిఖమ్ । ఆశ్రవణం । పరిపూర్య । చేత్ । అవిచలద్భుజమ్ । ఉజ్ఝితుం । ఈశిషే.

టీక॥ హేమార = ఓ మన్మథా!, త్వమ్ = నీవు, అతనుః = శరీరము లేనివాఁడవు, ఇతియత్ = అనునది ఏది గలదో, (తత్ = అది) జగతే = ప్రపంచమునకు, హితమ్ = మేలైనది. (హి = ఏలయనగా) విశిఖం = బాణమును, అవిచలద్భుజం = వణకులేని హస్తము గల్గినట్లుగా, ఆశ్రవణం = చెవివరకు, పరిపూర్య = పూరించి లాగి, ఉజ్ఝితుం = విడచుటకు, ఈశిషేచేత్ = శక్తివంతుడవైనచో, తవ = నీయొక్క, క్షతీః = గాయములను, యః = ఎవ్వడు, సహతే = ఓర్చునో, సః = అట్టి, మునిః = ఋషి, క్వ = ఎక్కడ.

సమాసములు :

అతనుః : అవిద్యమానా తనుః యస్య సః = అతనుః.
ఆశ్రవణమ్ : శ్రవణమభివ్యాప్య = ఆశ్రవణమ్.
అవిచలద్భుజమ్ : నవిచలంతౌ = అవిచలంతౌ. అవిచలంతౌ. భుజౌ యస్మిన్ కర్మణి తత్ యథాభవతి తథా అవిచలద్భుజమ్.

భావము :

ఓ మన్మథా! నీవు శరీరములేని వాఁడవగుట వలన లోకమునకు మేలు గల్గినది. నీవు సాధారణమైన విలుకాని వలె, శరీరమును గూడఁ గల్గి వణకు లేని భుజములతో, ధనుస్సును లాగి బాణమును విడువగల్గి యున్నచో, దాని వలనఁ గలిగెడు గాయములను ఓర్చెడి ముని యెవ్వడు? మునివంటి వాఁడే యా దెబ్బలను ఓర్చలేనపుడు, సాధారణ జనమెట్లు దానిని ఓర్చగలిగి యుండును. ఇంద్రియ నిగ్రహము గల్గిన మునియే నీ పూలయమ్ముల దెబ్బలను ఓర్చలేక పోయినపుడు, సామాన్య జనము దానిని ఓర్చగలదా! జితేంద్రియులను సైతము చలింపఁజేయు నీ దెబ్బల నితరులు సహింపలేరని యాశయము. ॥౯౩॥

శ్లో॥ సహ తయా స్మర భస్మ ఝుడిత్యభూః
పశుపతిం ప్రతి యామిషుమగ్రహీః।

ధ్రువమభూదధునా వితనోశ్శర
స్తవ పికస్వర ఏవ స పంచమః॥ ౯౪

ప॥వి॥ సహ । తయా । స్మర। భస్మ । ఝడితి । అభూః । పశుపతిం । ప్రతి। యామ్ । ఇషుమ్ । అగ్రహీః । ధ్రువమ్ । అభూత్ । అధునా । వితనోః । శరః । తవ। పికస్వరః । ఏవ । సః । పంచమః.

టీక॥ (హేస్మర = ఓ మన్మథా!) పశుపతిం ప్రతి = శివుని(గూర్చి, యామ్ = ఏ, ఇషుం = బాణమును, అగ్రహీః = పట్టుకొంటివో, తయాసహ = ఆ బాణముతోడనే, ఝడితి = వెంటనే, భస్మ = బూడిదగా, అభూః = అయితివి. అధునా = ఇప్పుడు, వితనోః = శరీరములేని, తవ = నీకు, పికస్వరఏవ = కోయిల కూతయే, సః = దగ్ధమైన, పంచమః = అయిదవదైన, శరః = బాణముగ, అభూత్ = ఆయెను. ధ్రువమ్ = నిశ్చయము.

వి॥ కోకిల స్వరము బాణము చేసెడి పనిని చేయుటవలన బాణముగ నుత్ప్రేక్షింప(బడినందువలన నుత్ప్రేక్ష. వ్యంజకమగు ధ్రువశబ్దము ప్రయోగింప(బడుటవలన నది వాచ్యము.

## సమాసములు :

పశుపతిమ్ : పశూనాం పతిః = పశుపతిః. తమ్ = పశుపతిమ్.

వితనోః : విగతా తనుః యస్య సః = వితనుః. తస్య = వితనోః.

పికస్వరః : పికస్య స్వరః = పికస్వరః.

## భావము :

ఓ మన్మథా! శివుని గుఱిపెట్టి యే బాణమును నీవు ప్రయోగించితివో, ఆ బాణముతోడనే, నీవు దగ్ధమైపోయి, బూడిదవైతివి. ఇప్పుడు శరీరములేని నీకు కోకిల స్వరమే, భస్మమైపోయిన పంచమబాణమైనది. నీ పంచమ బాణమే, కోకిలకు స్వరమైనందువలన, దానిని పంచమ స్వరముగ( జెప్పుచున్నారు. ॥౯౪॥

శ్లో॥ స్మర సమం దురితై రఫలీకృతో
భగవతోఽపి భవద్దహన శ్రమః।
సురహితాయ హుతాత్మతనుః పున
ర్నను జనుర్దివి తత్క్షణ మాపిథ॥ ౯౦

ప॥వి॥ స్మర । సమం । దురితైః । అఫలీకృతః । భగవతః । అపి । భవద్ద హనశ్రమః । సురహితాయ। హుతాత్మతనుః । పునః । నను । జనుః । దివి । తత్క్షణమ్ । అపిథ.

టీక॥ హేస్మర = ఓ మన్మథా! భగవతోఽపి = శివునికిని, దురితైస్సమం = నీ పాపములతోడ, భవద్దహనశ్రమః = నిన్ను దహించుట వలని శ్రమ, అఫలీకృతః = వ్యర్థమైనది. సురహితాయ = దేవతల హితము, కొఱకు, హుతాత్మతనుః; హుత = శివుని క్రోధాగ్ని యందు త్యాగముఁ జేయఁ బడిన, ఆత్మ = తనదైన, తనుః = శరీరము గలవాఁడవై, తత్క్షణమ్ = ఆ క్షణముననే, దివి = స్వర్గమున, పునః జనుః = మఱల జన్మమును, అపిథనను = పొందితివి గదా. 'స్మర సః మద్దురితైః' అను పాఠములో హేస్మర = ఓ మన్మథా!, సః = ఆ, భగతోఽపి = హరునికిని, భవద్ద హనశ్రమః; భవద్దహన = నిన్ను దహించుటలోని, శ్రమః = పరిశ్రమ, మద్దురితైః = నా పాపములతో, అఫలీకృతః = వ్యర్థము చేయఁబడినది, అని యన్వయించుకొనవలయును.

## సమాసములు :

మద్దురితైః : మమ దురితాని = మద్దురితాని. తైః = మద్దురితైః.

అఫలీకృతః : అవిద్యమానం ఫలం యస్య సః = అఫలః. అనఫలః అఫలః సంపద్యమానః కృతః = అఫలీకృతః.

భవద్దహనశ్రమః : భవతః దహనం = భవద్దహనం. భవద్దహనేన శ్రమః = భవద్దహనశ్రమః.

సురహితాయ: సురేభ్యఃహితం = సురహితమ్. తస్మై = సురహితాయ.

హుతాత్మతనుః : ఆత్మనః తనుః = ఆత్మతనుః. హుతా ఆత్మతనుః యస్య సః = హుతాత్మతనుః.

తత్క్షణమ్ : స చా ఽసౌ క్షణశ్చ = తత్క్షణః. తమ్ = తత్క్షణమ్.

భావము :

ఓ మన్మథా! నీవు హరుని కోపాగ్నిలో నీ పాపములతోఁబాటు దహించి పోతివి. అందువలన నీ పాపములు గూడ దహించిపోయి నీవు పాపవిముక్తుఁడ వైతివి. నీవు దేవతల హితమునకై నీ దేహమును శివుని కోపాగ్నియందు పరిత్యజించితివి. దీని వలన పుణ్యము లభించినది. పైనఁ జెప్పిన ప్రకారము పాపములు తొలగి పోయినవి. ఇట్లు పాపములు తొలగి నీవు పుణ్యమును సంపాదించుటచే, దేవతల యనుగ్రహమువలన, మఱల నీవు జన్మమెత్తితివి. నీ వీ విధముగా మఱల జన్మమెత్తుటవలన, శివుఁడు నిన్ను దహనముచేసి తుద ముట్టించుటకై తీసికొనిన పరిశ్రమ వ్యర్థమైనది. లేదా నీవు హరుని కోపాగ్నిలో దహించి పోయినను నా పాపములచే నన్ను బాధించుటకు మఱల జన్మించితివి. పూర్వము దేవతలు కుమారస్వామి జన్మమునకై మన్మథునిఁ బురికొల్ప శివునికి పార్వతియందు కామము గలుగుటకై పుష్పబాణమునుఁ బ్రయోగించిన విషయము పురాణప్రసిద్ధము. ॥౯౩॥

శ్లో॥ విరహిణో విముఖస్య విధూదయే
శమన దిక్పవనస్స న దక్షిణః।
సుమనసో నమయన్నటనౌ ధను
స్తవ తు బాహురసౌ యది దక్షిణః॥ ౯౪

ప॥వి॥ విరహిణః । విముఖస్య । విధూదయే । శమనదిక్పవనః । సః । న । దక్షిణః । సుమనసః । నమయన్ । అటనౌ । ధనుః । తవ । తు । బాహుః । అసౌ । యది। దక్షిణః.

టీక॥ హేమార = ఓ మన్మథా! తవ = నీయొక్క, అసౌ = ఈ, బాహుః = భుజము, విధూదయే యది = చంద్రోదయమనెడి సహాయము లభించగా,

సుమనసః = పుష్పమనెడి, ధనుః = విల్లును, అటనౌ = దాని కొనయందు, నమయన్ = వంచుచు, దక్షిణః = విరహులను కొట్టుటలో సమర్థమగును. (కుడి హస్తమగును). (తదా = అప్పుడు), విముఖస్య = కలతఁజెందిన ముఖము గల్గిన, చంద్రోదయమునకు విముఖమైన, విరహిణః = వియోగి జనమునకు, సః = ఆ, దక్షిణః = దక్షిణమని ప్రసిద్ధిఁ జెందిన, శమన దిక్పవనః = యముని దిక్కునఁ బుట్టిన గాలి, దక్షిణః = దాక్షిణ్యము గల్గినదియు, కుడిదియు, న = కాదు.

వి॥ చంద్రోదయకాలమున, విముఖమైన విరహిజనమునకు, యముని దిక్కున బుట్టిన గాలి దక్షిమైనను దక్షిణము గాదనుటలో విరోధాభాసాలంకారము. దక్షిణముగాదనుటకు సుఖకరముకాదని యర్థము చెప్పుట వలన విరోధ పరిహారము. లేదా విముఖ శబ్దమునకు పడమటి వైపునకుఁ ద్రిప్పిన ముఖముగల వ్యక్తియని యర్థము చెప్పినచో నప్పుడు ఆ వ్యక్తికి దక్షిణము దక్షిణముగాదు గదా.

## సమాసములు :

*విరహిణః :* విరహః అస్య అస్తీతి = విరహీ. తస్య = విరహిణః.

*విముఖస్య:* విపరీతం ముఖం యస్య సః = విముఖః. తస్య = విముఖస్య.

*విధూదయే :* విధోః ఉదయః = విధూదయః. తస్మిన్ = విధూదయే.

*శమనదిక్పవనః :* శమనస్య దిక్ = శమనదిక్. శమనదిశః పవనః = శమనదిక్పవనః.

## భావము:

ఓ మన్మథా! చంద్రోదయము సహాయపడినపుడు నీభుజము, పూవింటిని దాని కొనయందు వంచుచు చంద్రోదయమునకు విముఖులును, (పడమటి దిక్కునకు మళ్లిన వారును) నగు విరహి జనమును కొట్టుటలో సమర్థమగుచున్నది. దక్షిణమునగుచున్నది. అనగా కుడిదిగా నగుచున్నది. మఱియు చంద్రోదయమునకువిముఖమైన (పడమటి వైపునకు ముఖమును మళ్లించిన) విరహిజనము

నకు యముని దిక్కులో నుద్భవించిన గాలి యనగా దక్షిణ మారుతము దక్షిణము అనగా సుఖకరము కాలేదు. దక్షిణమున నుద్భవించినదియు కాలేదు. పడమటి దిక్కునకు ముఖము త్రిప్పినచో దక్షిణ దిక్కు ఎడమ వైపునకు వచ్చును గదా. కాన దక్షిణము = దక్షిణము, కుడిదిగా కానేరదు. నీ భుజము ఏ విధముగా పూవింటి కోనలను వంచునో, అట్లే మలయానిలము గూడ పూలను కదలించును. కాన మలయానిలము దక్షిణమగుచోనదియు పూవులనెడి వింటిని కందలించి నీకు భుజమే యగును. కాన, మొదట విరహ దుఃఖము, పిదప చంద్రోదయము, అటు పిమ్మట మలయానిలము విరహిజనమునకు దుఃఖకరము లైనవి. చంద్రోదయ కాలమున నీవు పూవింటి కొనలను కదలించుటలో దక్షతగల వాఁడవేగాని, విరహులయెడ దాక్షిణ్యముగల వాఁడవు గావు. అట్లే దక్షిణమారుతములు విరహులయెఁడ దాక్షిణ్యముతో సుఖము గల్గించెడి దక్షిణ మారుతములు గావు. ॥౯౬॥

శ్లో॥ కిము భవంతముమాపతిరేకకం
మదముదాంధ మయోగిజనాంతకమ్।
యదజయత్తత ఏవ న గీయతే
స భగవాన్ మదనాంధకమృత్యుజిత్॥ ౯౭

ప॥వి॥ కిమ్ । ఉ। భవంతమ్ । ఉమాపతిః। ఏకకం । మదముదా । అంధమ్ । అయోగిజనాంతకమ్ । యత్ । అజయత్। తతః। ఏవ । న। గీయతే। సః । భగవాన్ । మదనాంధకమృత్యుజిత్.

టీక॥ హే మదన = ఓ మన్మథా, ఉమాపతిః = పార్వతీ పతియగు శివుఁడు, మదముదా = గర్వ ప్రయుక్తమైన హర్షముతో, లేదా, గర్వహర్షములతో, అంధమ్ = కాముకుల నంధులనుఁ గావించుటచే నంధకుఁడైన వానిని గను, అయోగి జనాంతకమ్; అయోగి జన = వియోగిజనమునకు, అంతకమ్ = వినాశకునిగను అనగా మృత్యువును గను, ఏకకమ్ = ఏకాకియైన, భవంతమేవ = నిన్నే, అజయత్ ఇతియత్ = జయించెనను నది యేది గలదో, తతఏవ = అందువలననే, సః = ఆ, భగవాన్ = పూజ్యుఁడైన, ఉమాపతిః = శివుఁడు, మదనాంధక మృత్యుజిత్;

మదన = మన్మథుని, అంధక = అంధకాసురుని, మృత్యు = మృత్యువైన యముని, జిత్ = జయించిన వాఁడుగ, గీయతే కిము = చెప్పఁబడుచున్నాఁడా యేమిః.

వి॥ మన్మథ అంధక - మృత్యువులకు భేదమున్నను భేదము లేదని వర్ణించుట వలన అభేదాతిశయోక్తి.

## సమాసములు :

*ఉమాపతిః :* ఉమాయాః పతిః = ఉమాపతిః.

*ఏకకమ్ :* ఏక ఏవ = ఏకకః. తమ్ = ఏకకమ్.

*మదముదా :* మదస్య ముత్ = మదముత్. తయా = మదముదా. లేదా మదశ్చముచ్చ అనయోః సమాహారః = మదముత్. తయా = మదముదా.

*అంధమ్ :* అంధయతీతి = అంధః. తమ్ = అంధమ్.

*అయోగిజనాంతకమ్ :* న యోగః = అయోగః. అయోగః ఏషామస్తీతి = అయోగినః. అయోగినశ్చ తే జనాశ్చ = అయోగిజనాః. అయోగిజనానామంతకః = అయోగిజనాంతకః. తమ్ = అయోగిజనాంతకమ్.

*మదనాంధకమృత్యుజిత్ :* మదనశ్చ, అంధకశ్చ, మృత్యుశ్చ = మదనాంధకమృత్యవః. మదనాంధక మృత్యూన్ జయతీతి = మదనాంధకమృత్యుజిత్.

## భావము :

ఓ మన్మథా! నీవు విరహులకు గర్వహర్షములనుఁ గల్గించుటచే, మదనుఁడవు. ఆ గర్వహర్షములతో వారిని నంధులనుఁ గావించుటవలన నంధకాసురుఁడవు. ఆ విరహులను బాధ పెట్టి చంపుట వలన, మృత్యువు గూడనగుదువు. కాన నాయుమాపతి నిన్నొక్కనినే, మదనునిగను, అంధకాసురునిగను, మృత్యువునుగనుఁజేసికొని జయించుట వలననే, మదనజిత్తనియు, నంధకజిత్తనియు, మృత్యుజిత్తనియుఁ బ్రసిద్ధి వడసెను. కావున నీ వొక్కఁడవే మన్మథుఁడవు, అంధకుఁడవు, మృత్యువు నగుదువు. కాన నీకును వారికిని భేదము

**లేదు.** కావున నిట్లు మదనుఁడగ విరహులకు మదహర్షములకుఁ గల్పించుటయే **గాక,** అంధకాసురుఁడవై వారిని మోహాంధులను జేయుచు, మృత్యువై వారిని **చంపుచున్నావు** ॥౮౭॥

**శ్లో॥** త్వమివ కోఽపి పరాపకృతౌ కృతీ
న దదృశే న చ మన్మథ శుశ్రువే।
స్వమదహద్దహనాజ్జ్వలతాత్మనా
జ్వలయితుం పరిరభ్య జగంతి యః॥ ౮౮

**ప॥వి॥** త్వమ్ । ఇవ । కః । అపి । పరాఽపకృతౌ । కృతీ । న । దదృశే । న । చ । మన్మథ । శుశ్రువే। స్వమ్। అదహత్ । దహనాత్। జ్వలతా। ఆత్మనా । జ్వలయితుం । పరిరభ్య । జగంతి । యః.

**టీక॥** హే మన్మథః = ఓ మన్మథా!, త్వమివ = నీవలె, పరాపకృతౌ; పర = ఇతరులకు, అపకృతౌ = అపకారముచేయుటయందు, కృతీ = సమర్థుఁడు, కోఽపి = ఎవ్వఁడును, నదదృశే = చూడఁబడలేదు. నశుశ్రువే = వినఁబడలేదు. యః = అపకారముచేసెడి నీవంటి వాఁడు, దహనాత్ = అగ్ని సంబంధముతో, జ్వలతా = ప్రజ్వలించునట్టి, ఆత్మనా = తన శరీరముతో, జగంతి = ప్రపంచములను, పరిరభ్య = కౌగలించుకొని, జ్వలయితుం = దహించుటకు, స్వం = తన శరీరమును, అదహత్ = దహించుకొనెను.

## సమాసములు :

పరాపకృతౌ: పరస్య అపకృతిః = పరాపకృతిః తస్యాం = పరాపకృతౌ.

## భావము :

ఓ మన్మథా! నీవలె పరోపకారము చేయుటయందు సమర్థుఁ డెవ్వఁడును కనఁబడడు వినబడఁడు. నీవు శివుని నేత్రాగ్నితో శరీరమును దహింపఁజేసికొని, యా శరీరముతోఁడనే ప్రపంచములను దహించుటకుఁ దలపెట్టితివి. ఒరుల శరీరమునకు బురద పూయుటకై తన శరీరమునకు బురదను పూసుకొనినట్లు

ఒరుల శరీరములను దహించుటకై తన శరీరమును దహించుకొనిన నీ నడవడిక మిక్కిలి ఆశ్చర్యకరము. ॥౬౮॥

శ్లో॥ త్వముచితం నయనార్చిషి శంభునా
భువనశాంతికహోమహవిః కృతః।
తవ వయస్యమపాస్య మధుం మధుం
హతవతా హరిణా బత కిం కృతమ్॥ ౬౯

ప॥వి॥ త్వమ్ । ఉచితం । నయనార్చిషి । శంభునా । భువనశాంతికహోమహవిః । కృతః। తవ । వయస్యమ్ । అపాస్య । మధుం। మధుం । హతవతా । హరిణా । బత । కిం । కృతమ్.

టీక॥ హేమార = ఓ మన్మథా! శంభునా = శివునిచే, నయనార్చిషి = నేత్రాగ్ని జ్వాలయందు, త్వమ్ = నీవు, భువనశాంతిక హోమహవిః; భువన = లోకములకు, శాంతిక = పీడలను శమింపజేసెడి, హోమ = హోమము నందు, హవిః = ఆహుతిగ, కృతః = చేయఁబడితివి. ఉచితమ్ = ఇది నీకు తగినది. తవ = నీకు,వయస్యం = చెలికాఁడైన,మధుం = వసంతుని, అపాస్య = ఉపేక్షించి, మధుం = మధువనెడి పేరుగల రాక్షసుని, హతవతా = చంపిన, హరిణా = విష్ణువుచే, కిం = ఏమి, కృతమ్ = చేయఁబడినది? (ఏమియు చేయఁబడలేదు). బత = అయ్యో.

## సమాసములు :

నయనార్చిషి : నయనస్య అర్చిః = నయనార్చిః. తస్మిన్ = నయనార్చిషి.

భువనశాంతికహోమహవిః : శాంతిః ప్రయోజనమస్యేతి = శాంతికః. భువనానాం శాంతికః = భువనశాంతికః. భువనశాంతికశ్చాసౌ హోమశ్చ = భువనశాంతికహోమః. భువనశాంతికహోమస్య హవిః = భువన శాంతికహోమ హవిః.

## భావము :

ఓ మన్మథా! లోకములకు నీ వలని బాధ తొలగుటకై, ప్రపంచమునకు మేలొనరించెడి శంభుఁడు అనగా శివుఁడు తన నేత్రాగ్నియందు లోకశాంతికై

గావించిన హోమమునందు నిన్ను ఆహుతి గావించినాఁడు. ఇది యుక్తము. వధింపఁదగిన, నిన్ను వధించుట జరిగినది గదా. కాని యా విష్ణువు నీ చెలికాఁడైన మధువును అనగా వసంతుని వధింపక, మధువనెడి రాక్షసుని జంపుటతో నేమి ఘనకార్యము చేసినాఁడు? ఏమియు లేదు. శివుఁడు ప్రపంచమునకు బాధ కరుఁడైన మన్మథుని చంపి లోకమునకు మేలుచేయగా, విష్ణువు, ఆ మన్మథుని మిత్రుఁడైన (మధువును) వసంతమునుఁ జంపియున్నచో జగత్తునకు చాల మేలు కల్గియుండెడిది. కాని అట్లు చేయక మధువనెడి రాక్షసునిఁ జంపెను. ఇది చాల విచారకరము. మధువనెడి రాక్షసుఁడు ప్రపంచమునకుఁ బెట్టిన బాధ కంటెను మన్మథుని మిత్రుఁడైన మధువు మిక్కిలి బాధను కల్గించుచున్నాఁడు. కాన విష్ణువు చేసిన మధువధ లోకమున కుపయోగపడలేదు. ॥౯౯॥

శ్లో॥ ఇతి కియద్వచసైవ భృశం ప్రియా
ధరపిపాసు తదాననమాశు తత్।
అజని పాంసులమప్రియవాగ్జ్వల
న్మదనశోషణబాణహతేరివ॥ ౧౦౦

ప॥వి॥ ఇతి । కియద్వచసా । ఏవ । భృశం। ప్రియాధరపిపాసు। తదాననమ్। ఆశు। తత్ । అజని । పాంసులమ్ । అప్రియవాగ్జ్వలన్మదనశోషణ బాణహతేః । ఇవ.

టీక॥ ప్రియాధరపిపాసు; ప్రియ = ప్రియుఁడైన నలునియొక్క, అధర = పెదవిని, పిపాసు = త్రాగఁగోరిన, తదాననమ్; తత్ = ఆ దమయంతియొక్క, ఆననం = ముఖము, ఇతి = ఇట్లు, కియద్వచసైవ = కొలదిపాటి సంభాషణము చేతనే, అప్రియవాగ్జ్వలన్మదనశోషణ బాణహతేరివ; అప్రియ = కఠినమైన, వాక్ = వచనములతో, జ్వలత్ = (కోపముచే) మండుచున్న, మదన = మన్మథునియొక్క, శోషణబాణ = శోషింపఁజేసెడి బాణముయొక్క, హతేరివ = దెబ్బవలననోయనునట్లు, ఆశు = శీఘ్రముగా, భృశం = మిక్కిలి, పాంసులం = దుమ్ముపడి యెండినదిగా, అజని = ఏర్పడినది.

వి॥ దమయంతి పెదవి యెండుటకు, మన్మథ బాణ ప్రహారము హేతువుకాక పోయినను, హేతువుగఁ జెప్పుటవలన హేతూత్ప్రేక్ష. ఇవశబ్ద ప్రయోగమువలన నది వాచ్యము.

**సమాసములు :**

*కియద్వచసా :* కియచ్చ తత్ వచశ్చ = కియద్వచః. తేన = కియద్వచసా.

*ప్రియాధరపిపాసు :* ప్రియస్య అధరః = ప్రియాధరః. పాతుమిచ్ఛు = పిపాసు. ప్రియాధరం పిపాసు = ప్రియాధర పిపాసు.

*తదాననమ్ :* తస్యాః ఆననమ్ = తదాననమ్.

*అప్రియవాగ్జ్వలన్మదనశోషణబాణహతేః :* న ప్రియాః = అప్రియాః. అప్రియాశ్చ తాః వాచశ్చ = అప్రియవాచః. అప్రియవాగ్భిః జ్వలన్ = అప్రియ వాగ్జ్వలన్. అప్రియవాగ్జ్వలంశ్చాసౌ మదనశ్చ = అప్రియవాగ్జ్వలన్మదనః. శోషణశ్చాసౌ బాణశ్చ = శోషణ బాణః. అప్రియ వాగ్జ్వలన్మదనస్య శోషణ బాణః = అప్రియ వాగ్జ్వలన్మదనశోషణబాణః. అప్రియ వాగ్జ్వలన్మదనదన శోషణ బాణస్య హతిః = అప్రియ వాగ్జ్వలన్మదనశోషణ బాణహతిః. తస్యాః = అప్రియ వాగ్జ్వలన్మదనశోషణ బాణహతేః.

**భావము :**

ప్రియుఁడైన నలుని పెదవిని పానముఁ జేయగోరిన, దమయంతీ ముఖము ఇంతటి వఱకు కొంచెది మాటలతో నామె గావించిన నిందకు కోపించి మండి పడుచున్న మన్మథుని శోషణ బాణముల దెబ్బతో దుమ్ముపడి వాడిపోయెనో యనునట్లు వాడినది. శోషణ బాణములు, తేమగల్గిన భాగములను శోషింపఁజేయును. ॥౧౦౦॥

శ్లో॥ ప్రియసఖీనివహేన సహాథ సా
వ్యరచయద్గిరమర్ధసమస్యయా।
హృదయమర్మణి మన్మథసాయకైః
క్షతతమా బహుభాషితుమక్షమా॥ ౧౦౧

ప॥వి॥ ప్రియసఖీనివహేన । సహ । అథ । సా । వ్యరచయత్ । గిరమ్ ।
అర్ధసమస్యయా । హృదయ మర్మణి । మన్మథ సాయకైః। క్షతతమా।
బహు । భాషితుమ్ । అక్షమా.

టీక॥ అథ = పిదప, సా = ఆ దమయంతి, మన్మథసాయకైః = మరుని బాణములచే, హృదయ మర్మణి = హృదయమనెడి మర్మస్థానమున, క్షతతమా = అధికముగాఁ గొట్టఁబడినదై (అతఏవ = ఇందువలననే) బహు = అధికముగా, భాషితుమ్ = మాట్లాడుటకు, అక్షమా = అశక్తురాలై, ప్రియసఖీనివహేన సహ; ప్రిసఖీ = ఇష్టమైన చెలికత్తెలయొక్క, నివహేన సహ = సమూహముతోఁ గూడ, అర్ధసమస్యయా = ఉత్తరరూపమైన యర్ధ కారికతో, గిరం = వచనమును, సమస్యలోని యుత్తరార్ధమును, వ్యరచయత్ = రచియించినది.

**సమాసములు :**

ప్రియసఖీనివహేన : ప్రియాశ్చ తాః సఖ్యశ్చ = ప్రియసఖ్యః. ప్రియసఖీనాం నివహః ప్రియసఖీనివహః. తేన = ప్రియసఖీనివహేన.

అర్ధసమస్యయా : అర్ధం సమస్యాయాః = అర్ధసమస్యా. తయా = అర్ధసమస్యయా.

హృదయమర్మణి : హృదయమేవ మర్మ = హృదయమర్మ. తస్మిన్ = హృదయమర్మణి.

మన్మథసాయకైః : మన్మథస్య సాయకాః = మన్మథసాయకాః. తైః = మన్మథసాయకైః.

క్షతతమా : అత్యంతం క్షతా = క్షతతమా.

అక్షమా : న క్షమా = అక్షమా.

**భావము :**

ఆ దమయంతి మన్మథ బాణములచే హృదయమనెడి మర్మస్థానమున గట్టిగాఁ గొట్టఁబడినదై ఎక్కువ మాట్లాడజాలక పోయినదై సమస్యలోని యర్ధ

భాగముతో, అనగా ఉత్తరార్ధములో బదులు చెప్పినది. సమస్యలోని పూర్వార్ధమును చెలికత్తెలు పూరింపగా నీమె యుత్తరార్ధమునుఁ బూరించినది. ॥౧౦౧॥

శ్లో॥ అకరుణాదవ సూనశరాదసూన్
సహజయాఽఽపది ధీరతయాఽఽత్మనః।
అసవ ఏవ మమాద్య విరోధినః
కథమరీన్ సఖి ! రక్షితుమాత్థ మామ్॥ ౧౦౨

ప॥వి॥ అకరుణాత్ । అవ । సూనశరాత్ । అసూన్ । సహజయా । ఆపది । ధీరతయా । ఆత్మనః । అసవః । ఏవ । మమ । అద్య । విరోధినః । కథమ్ । అరీన్ । సఖి । రక్షితుమ్ । ఆత్థ। మామ్.

టీక॥ (హేభైమి = ఓ దమయంతీ) ఆపది = ఆపదయందు, సహజయా = స్వభావసిద్ధమైన, ధీరతయా = ధైర్యముచే, అకరుణాత్ = దయలేని, సూనశరాత్ = పుష్పబాణుని బారినుండి, ఆత్మనః = తనయొక్క, అసూన్ = ప్రాణములను, అవ = రక్షింపుము. (ఇది సఖీవచనము). అద్య = ఇప్పుడు, అసవఏవ = ప్రాణములే, మమ = నాకు, విరోధినః = శత్రువులు. హేసఖి = ఓ చెలీ! మాం = నన్ను, కథం = ఎట్లు, అరీన్ = శత్రువులను, అనగా శత్రువులైన ప్రాణములను, రక్షితుం = రక్షించుటకు, ఆత్థ = చెప్పుచున్నావు. (ఇది దమయంతీ వచనము).

సమాసములు :

అకరుణాత్: అవిద్యమానా కరుణా యస్యసః = అకరుణః. తస్మాత్ = అకరుణాత్.

సూనశరాత్ : సూనం శరః యస్య సః = సూనశరః. తస్మాత్ = సూనశరాత్.

ధీరతయా : ధీరస్య భావః = ధీరతా. తయా = ధీరతయా.

భావము

ఓ దమయంతీ! ఆపదయందు ధైర్యము వహించి, కఠినుఁడైన మన్మథునుండి నీ ప్రాణములను రక్షించుకొనుము. అని చెలికత్తె చెప్పిన సమస్యా

పూర్వార్థము. ఓ చెలీ! ఇప్పుడు నాకు ప్రాణములే శత్రువులు కాన శత్రువులను రక్షించుకొనమని యెట్లు పలుకుచున్నావు? అని దమయంతి పూరించిన సమస్యయొక్క యుత్తరార్థము. ॥౧౦౨॥

శ్లో॥ హితగిరం న శృణోషి కిమాశ్రవే
ప్రసభమప్యవ జీవితమాత్మనః।
సఖి! హితా యది మే భవసీదృశీ
మదరిమిచ్ఛసి యా మమ జీవితమ్॥ ౧౦౩

ప॥వి॥ హితగిరం । న । శృణోషి । కిమ్ । ఆశ్రవే। ప్రసభమ్ । అపి । అవ । జీవితమ్। ఆత్మనః । సఖి। హితా । యది । మే । భవసి । ఈదృశీ । మదరిమ్ । ఇచ్ఛసి । యా । మమ । జీవితమ్.

టీక॥ హే ఆశ్రవే = ఓచెప్పినమాటను వినుదానా! ప్రసభమపి = బలత్కారముచేతనైనను, ఆత్మనః = స్వకీయమైన, జీవితం = ప్రాణమును, అవ = రక్షింపుము. హితగిరమ్; హిత = ఆప్తులయొక్క, గిరం = మాటను, కిం న శృణోషి = ఏల వినవు? హేసఖి = ఓచెలీ! యా = ఏ, త్వం = నీవు, మదరిం = నాకు శత్రువైన, మమ = నాయొక్క, జీవితమ్ = జీవితమును, ఇచ్ఛసి = కోరచున్నావో, ఈదృశీ = ఇట్లు, శత్రువృద్ధిని కోరుచున్నను (నీవు), మే = నాకు, హితా = ఆప్తురాలుగ, భవసియది = అయినచో, (నీ మాటను వినవలయును). (కాని) నీవు శత్రువృద్ధినికోరినందువలన నీవు హితురాలు కావు కాన నీమాటను వినను.

(ఇది దమయంతి వచనము)

## సమాసములు:

*హితగిరం :* హితాయాః గీః = హితగీః. తామ్ = హితగిరమ్.

(హే) *ఆశ్రవే:* ఆశృణోతి వాక్యమితి = ఆశ్రవా. తస్యాః సంబుద్ధిః = (హే) ఆశ్రవే.

*మదరిమ్ :* మమ అరిః = మదరిః. తమ్ = మదరిమ్.

భావము :

ఓ చెప్పిన మాటను వినుదానా! బలత్కారముతోనైనను జీవితమును రక్షించుకొనుము. 'ఏతి జీవంతమానందో నరం వర్షశతాదపి' యను న్యాయమున ననుసరించి జీవించియున్నచో ఎన్నటికైనను సుఖముఁబడయవచ్చును. ఆ పూరాల నైన నా మాటను వినవా? (అని చెలికత్తె వచనము).

ఓ చెలీ! నీవు నా శత్రువునైన నా జీవితముయొక్క వృద్ధి నపేక్షించుచు నాకు హితురాలవైతే నీ మాటను వినగలను. కాని శత్రువృద్ధినిఁ గోరిన నీవు నాకు హితురాలవు గావు కాన నీ మాటను వినను. ॥౧౦౭॥

శ్లో॥ అమృతదీధితిరేష విదర్భజే
భజసి తాపమముష్య కిమంశుభిః।
యది భవంతి మృతాస్సఖి చంద్రికా
శ్శశభృతః క్వ తదా పరితప్యతే॥ ౧౦౮

ప॥వి॥ అమృతదీధితిః । ఏషః । విదర్భజే । భజసి । తాపమ్ । అముష్య । కిమ్ । అంశుభిః । యది । భవంతి । మృతాః । సఖి । చంద్రికాః । శశభృతః । క్వ । తదా । పరితప్యతే,

టీక॥ హే విదర్భజే = విదర్భదేశమున జన్మించిన ఓ దమయంతీ! ఏషః = ఈ ఎదుటనున్న వాఁడు, అమృతదీధితిః = అమృత కిరణముగల చంద్రుఁడు. అముష్య = ఆ యమృతకరుఁడగు చంద్రునియొక్క, అంశుభిః = కిరణములచే, కిమ్ = ఏల, తాపమ్ = సంతాపమును; భజసి = పొందుచున్నావు? (అని చెలికత్తె వచనము).

హే సఖి = ఓ చెలీ!, శశభృతః = చంద్రుని యొక్క, చంద్రికాః = వెన్నెలలు, మృతాః భవలతియది = కృష్ణపక్షమందువలె, మృతములైనచో, (క్షీణించినచో), తదా = అప్పుడు, క్వ = ఎక్కడ, పరితప్యతే = పరితపింపఁబడుట (అని దమయంతీ వచనము).

వి॥ అమృత దీధితి శబ్దములోని యమృతశబ్దము సుధయనెడి యర్థమున ప్రయుక్తమై, మృతేతరమను నర్థమున నన్వయించుటవలన వక్రోక్త్యలంకారము. ఒక యర్థమున ప్రయుక్తమైన దానికి కాకువుచేతగాని శ్లేషచేతఁగాని మఱియొక యర్థమున నన్వయమేర్పడినచో వక్రోక్తి యగును.

సమాసములు :

*అమృతదీధితిః :* అమృతం దీధితిః యస్య సః = అమృతదీధితిః.

(హే) *విదర్భజే :* విదర్భేషు జాయత ఇతి = విదర్భజా. తస్యాః సంబుద్ధిః = హేవిదర్భజే.

*శశభృతః :* శశం బిభర్తీతి = శశభృత్. తస్య = శశభృతః.

భావము :

ఓ దమయంతీ! నీ ఎదుటనున్నది యమృతకిరణములు గల చంద్రుఁడు. అతని కిరణములచే నేల తాపమునుఁ బొందుచున్నావు. అని సఖీవచనము.

ఓ సఖీ! చంద్రుని వెన్నెలలు అమృతములు గాక, మృతములయినచో, అనగా కృష్ణపక్షమునందువలె క్షీణములయినచో, అప్పుడు తాపమెక్కడ నుండగలదు. కాన నితడు అమృత దీధితి యగుటవలననే యీ కష్టమంతయు నేర్పడినది. అట్లుగాక యితఁడు మృతదీధితియై యున్నచో, సమస్తపీడలు తొలగెడివి. ॥౧౦౪॥

శ్లో॥ వ్రజ ధృతిం త్యజ భీతిమహేతుకా
మయమచండమరీచిరుదంచతి।
జ్వలయతి స్ఫుటమాతపముర్మురై
రనుభవం వచసా సఖి లుంపసి॥ ౧౦౫

ప॥వి॥ వ్రజ । ధృతిం । త్యజ । భీతిమ్ । అహేతుకామ్ । అయమ్ । అచండమరీచిః । ఉదంచతి । జ్వలయతి । స్ఫుటమ్ । ఆతపముర్మురైః । అనుభవం । వచసా । సఖి । లుంపసి.

టీక॥ హేముగ్ధే = ఓ ముగ్ధయైన దమయంతీ! ధృతిం = ధైర్యమును, వ్రజ = పొందుము. అహేతుకాం = కారణములేని, భీతిం = భయమును, త్యజ = వదులుము. అయం = ఈ, అచండమరీచిః = తీక్ష్ణకిరణములులేని, అనగా చల్లని కిరణములు గల్గిన చంద్రుఁడు, ఉదంచతి = ఉదయించుచున్నాఁడు. హేసఖి = ఓచెలీ, ఆతపముర్మురైః; ఆతప = ఎండయనెడి, ముర్మురైః = పొట్టు నిప్పులతో, స్ఫుటం = స్పష్టముగా, జ్వలయతి = దహించుచున్నాఁడు. అనుభవం = ప్రత్యక్ష విషయమును, వచసా = ఆగమశబ్దంచే, లుంపసి = ఖండించుచున్నావు.

వి॥ అచండకరుఁడైన చంద్రునియందు చండకర భ్రాంతిని వర్ణించుటచే భ్రాంతిమదలంకారము.

## సమాసములు :

అహేతుకామ్ : అవిద్యమానః హేతుః యస్యాస్సా = అహేతుకా. తామ్ = అహేతుకామ్.

అచండమరీచిః : చండాః మరీచయః యస్య సః = చండమరీచిః. న చండమరీచిః = అచండమరీచిః.

ఆతపముర్మురైః : ఆతపా ఏవ ముర్మురాః = ఆతపముర్మురాః. తైః = ఆతపముర్మురైః.

## భావము :

ఓ ముగ్ధవైన దమయంతీ! ధైర్యమునవలంబింపుము. భయమును వదలిపెట్టుము. ఈ భయమున కెట్టి కారణము కానరాదు. ఇదిగో చల్లని కిరణములు గల చంద్రుఁడుదయించు చున్నాఁడు. అతఁడు నీ తాపమును హరింపఁగలఁడు అని సఖీ వచనము.

ఓ చెలీ! యుదయించువాఁడు పొట్టు నిప్పులతో సమానమైన తన కాంతులతో నన్ను దహించుచున్నాఁడు. ఇది నా ప్రత్యక్షము. దీనిని వచనమను శబ్ద ప్రమాణముతో ఖండించుచున్నావు. ఇది యుక్తము గాదు. ఆ యుదయించునట్టి వ్యక్తి తన తీక్ష్ణకిరణములతో, నన్ను దహించుచుండుటను, ప్రత్యక్షముతో ననుభవించుచున్నాను. నీవా యుదయించువ్యక్తిని నా ప్రత్యక్షమునకు విరు

ద్ధముగ చంద్రుఁడను చున్నావు. ఆ చంద్రుఁడు శీతకిరణుఁడని యాగమములు చెప్పినను, అది నా ప్రత్యక్షముతో బాధిత మగుచున్నది. ఏలయనగా నతడు శీతకిరణుఁడైనచో నాకుఁ జల్లదనము నీయవలయును గదా! అట్లుగాక యతఁడు నాకు వేడినే గల్గించి సంతాపమునకు నన్ను గురి చేయుచున్నాఁడు అని దమయంతీ వచనము. ॥౧౦౫॥

శ్లో॥ అయి శపే హృదయాయ తవైవ త
ద్యది విధోర్న రుచేరసి గోచరః।
రుచిఫలం సఖి! దృశ్యత ఏవ య
జ్జ్వలయతి త్వచముల్లలయత్యసూన్॥ ౧౦౬

ప॥వి॥ అయి । శపే। హృదయాయ । తవ । ఏవ । తత్ । యది । విధోః । న । రుచేః । అసి । గోచరః । రుచిఫలం । సఖి । దృశ్యతే । ఏవ । యత్ । జ్వలయతి । త్వచమ్ । ఉల్లలయతి । అసూన్.

టీక॥ అయి(ముగ్ధే)=ముగ్ధవైన యో దమయంతీ!, (విశ్వసిహి=సమ్మతము). విధోః=చంద్రునియొక్క, రుచేః=కాంతికి, గోచరః=విషయము, నాఽసియది=కాకుండ నీవున్నచో, తత్=అప్పుడు, తవైవ=నీదే యైన, హృదయాయ=హృదయమునకై, శపే=శపథము చేయుచున్నాను. (అనగా నీ హృదయమును స్పృశించి ఒట్టు పెట్టుకొనుచున్నాను. అనగా ఇతడు చంద్రుఁడే; సూర్యుఁడుకాడు అని గట్టిగాఒట్టు పెట్టుకొని చెప్పుచున్నాను).

సఖి=ఓ చెలీ!, తర్హి=అప్పుడు, రుచిఫలమేవ! రుచి=తేజస్సు యొక్క, ఫలమేవ=కార్యమే, దృశ్యతే=కనఁబడుచున్నది. యత్=ఏలయనగా, త్వచం=చర్మమును, జ్వలయతి=దహించుచున్నది. అసూన్=ప్రాణములను, ఉల్లలయతి=పెకలించుచున్నది.

**సమాసములు :**

రుచిఫలమ్ : రుచేః ఫలమ్=రుచిఫలమ్.

**భావము :**

ఓ ముగ్ధురాలవైన దమయంతీ! నా మాటను నమ్ముము నీ శరీరమును తాకుచున్న తేజస్సు చంద్రునిది. కానిచో నప్పుడు నీ హృదయమును తాకి యొట్టు పెట్టుకొనుచున్నాను. అనగా నీ శరీరమునుఁ దాకుచున్న తేజస్సు "చంద్రునిదే గాని సూర్యునిది గాదు" అని శపథము చేయుచున్నాను. అని సఖీవచనము.

ఓ చెలీ! కానిమ్ము అట్లయినచో, తేజస్సు యొక్క కార్యమే కానవచ్చు చున్నది. కాని ప్రత్యేకముగా చంద్రతేజస్సుయొక్క కార్యము నాకు కాన వచ్చుటలేదు. అది నా దురదృష్టము. ఇప్పుడీ తేజస్సు నా చర్మమును దహించు చున్నది. ప్రాణములనుఁ బెకలించుచున్నది. కాన తేజస్సునకు సాధారణమైన కార్యమిందుఁ గలదు. ఉష్ణస్పర్శము తేజస్సుయొక్క స్వభావము గదా! కాన నీవు చెప్పినది సత్యమే.అని దమయంతీ వచనము.తేజస్సులన్నియు స్వభావము తోనుష్ణములై దహించు స్వభావము గల్గి యుండును.కాని, పృథివ్యాది భూత పదార్థములతో నవి యభిభూతములై యనుద్భూతములుగ రత్నాదులయందుండు నని శాస్త్రము. ॥౧౦౬॥

శ్లో॥ విధువిరోధితిథేరభిధాయినీ
మయి న కిం పునరిచ్ఛసి కోకిలామ్।
సఖి కిమర్థగవేషణయా గిరం
కిర తిసేయ మనర్థమయీం మయి॥ ౧౦౭

ప॥వి॥ విధువిరోధితిథేః । అభిధాయినీం । అయి। న। కిం । పునః । ఇచ్ఛసి । కోకిలామ్ । సఖి । కిమ్ । అర్థగవేషణయా । గిరం । కిరతి । సా । ఇయమ్ । అనర్థమయీం । మయి.

టీక॥ అయిభైమి = ఓ దమయంతీ!, విధువిరోధితిథేః, విధు = చంద్రునకు, విరోధి = శత్రువైన, తిథేః = "కుహూ" యను పేరుగల తిథికి (అనగా అమావాస్యకు), అభిధాయినీం = పేరైన "కుహూ" శబ్దమునుచ్చరించు నట్టి, కోకిలాంపునః = కోయిలనో, కిం = ఏల, నేచ్ఛసి = కోరవు. హేసఖి = ఓ చెలీ! అర్థగవేషణయా; అర్థ = "కుహూ" శబ్దమునకు చంద్రదర్శములేని తిథియను నర్థమును, గవేషణయా = వెదకుటచేే,కిం =

ఏమి ప్రయోజనము, సాఽయం = ఆ యీ కోకిల, మయి = నా విషయ మున, అనర్థమయీమ్ = గవాదిశబ్దములవలె నర్థములేనిదియు, అనగా ఘరఘోషాదులవలె నర్థములేనిదియు, పిడుగుప్రోతవలె ననర్థమునుఁ గల్గించునదియు నగు, గిరం = కూతను, కిరతి = విసరుచున్నది.

సమాసములు :

విధువిరోధితిథేః : విధోః విరోధినీ = విధువిరోధినీ. విధువిరోధినీ చాసౌ తిథిశ్చ = విధువిరోధితిథిః. తస్యాః = విధువిరోధితిథేః.

అర్థగవేషణయా : అర్థస్య గవేషణా = అర్థగవేషణా. తయా = అర్థగవేషణయా.

అనర్థమయీమ్ : అవిద్యమానః అర్థః యస్య సః = అనర్థః. అనర్థస్య వికారః = అనర్థమయీ. తామ్ = అనర్థమయీమ్.

భావము :

ఓ దమయంతీ! చంద్రుఁడు కానరానందువలన చంద్రునికి విరోధినియైన యమావాస్యను కుహూశబ్దము చెప్పును. అట్టి కుహూశబ్దముచే "కుహూ కుహూ" అని చంద్రవైరిణియైన యమావాస్యను పిలుచుచుండునట్టి కోకిల నీ కిష్టమేనాః అని సఖీవచనము. ఓచెలీ! కుహూ శబ్దమునకు చంద్రదర్శనములేని తిథి యను నర్థవిచారణతో ప్రయోజనమేమున్నది. ఈ కోకిల కుహూశబ్దమును గవాది శబ్దములవలె నమావాస్యయనునర్థముతో కూడినట్లు ఉచ్చరించుట లేదు. మతే మనగా, బండి చక్రములధ్వని యెట్లు అర్థరహితమో, అట్లును, పిడుగుప్రోత వలె ననర్థముతో ననగా ననిష్టముతో నిండినదిగాను, నా పై విసరుచున్నది. కోకిల కూయునట్టి కుహూ శబ్దమునకు అమావాస్య యను నర్థమున్నను, అది యా యర్థముతో నుచ్చరించుట లేకపోగా, బండ్లప్రోతయెట్లు నిరర్థకమో ఆ విధముగా నర్థరహితముగను పైగా, పిడుగు ప్రోతవలె ననర్థము గల్గించు విధముగను నాపై యా కుహూ శబ్దమును విసరుచు నాకు విరహోద్దీపకముగ నున్నది యని దమయంతీ వచనము. ॥౧౦౭॥

శ్లో॥ హృదయ ఏవ తవాస్తి స వల్లభ
స్తదపి కిం దమయంతి విషీదసి।

హృది పరం న బహిః ఖలు వర్తతే
సఖి యతస్తత ఏవ విషీద్యతే॥ ౧౦౮

పఃవి॥ హృదయే । ఏవ । తవ । అస్తి । సః । వల్లభః । తత్ । అపి । కిం । దమయంతి । విషీదసి । హృది। పరం । న। బహిః। ఖలు। వర్తతే। సఖి। యతః । తతః । ఏవ । విషీద్యతే.

టీక॥ హే దమయంతి! = ఓ దమయంతీ! సః = ఆ, తే = నీయొక్క, వల్లభః = ప్రియుఁడైన నలుఁడు. తవ = నీయొక్క హృదయేఏవ = హృదయమందే; అస్తి = కలఁడు. తదపి = అయినను, కిం = ఏల, విషీదసి = దుఃఖింతువు. అని సఖీ వచనము.
హేసఖి = ఓచెలీ! యతః = ఎందువలన, హృదిపరం = హృదయమందే, వర్తతే = ఉన్నాఁడో, (అందువలన) బహిః = వెలుపల, నవర్తతే ఖలు = ఉండఁడుగదా! తతఏవ = అందువలననే, విషీద్యతే = దుఃఖింపఁబడుట.

**భావము :**

ఓ దమయంతీ! నీప్రియుడైఁన నలుఁడు నీ హృదయమందే యున్నాఁడు గదా! అట్లయిన నీవేల దుఃఖింతువు అని సఖీ వచనము.

ఓ చెలీ: నీవుచెప్పినది సత్యమే. అతఁడు హృదయమందే యున్నాఁడు. కావుననే వెలుపల నుండుట లేదు. అందువలననే దుఃఖింతును. అనగా,ఆ నలుడు స్మరింపఁబడుచున్నాఁడే గాని కంటితోఁ జూడబడుటలేదు. అందువలన నాకు దుఃఖము అని దమయంతీ వచనము. ॥౧౦౮॥

శ్లో॥ స్ఫుటతి హారమణౌ మదనోష్మణా
హృదయమప్యనలంకృతమద్యతే।
సఖి హతాఽస్మి తదా యది హృద్యపి
ప్రియతమస్స మమ వ్యవధాపితః॥ ౧౦౯

పఃవి॥ స్ఫుటతి । హారమణౌ । మదనోష్మణా । హృదయమ్ । అపి । అనలం

కృతమ్ । అద్య । తే। సఖి! । హతా। అస్మి । తదా । యది । హృది ।
అపి । ప్రియతమః । సః । మమ । వ్యవధాపితః.

టీక॥ హేభైమి = ఓ దమయంతీ! మదనోష్మణా = మన్మథజ్వరముచే, హార మణౌ = హృదయమునకు నలంకారమైన రత్నము, స్ఫుటతిసతి = పగిలి పోగా, అద్య = ఇప్పుడు, తే = నీయొక్క, హృదయమపి = వక్షఃస్థలము గూడ, అనలంకృతమ్ = అలంకరింపబడినది కాలేదు, (అనలం = నల రహితముగా, కృతం = చేయఁబడినది). అని సఖీ వచనము. హేసఖి = ఓ చెలీ!, సః = ఆ, ప్రియతమః = మిక్కిలి ప్రియమైన నలుఁడు, మమ = నాయొక్క, హృద్యపి = హృదయమందును, వ్యవధాపితః యది = దూరముచేయఁబడినచో, తదా = అప్పుడు హతా = చంపఁబడిన దానను. అస్మి = అగుదును.

వి॥ అలంకార రహితముగానింపఁబడినదను నర్థమిచ్చు 'అనలంకృత' శబ్దము నకు, నలరహితము చేయఁబడిన దను నర్థము కల్పించుటచే వక్రోక్త్యలం కారము.

## సమాసములు :

హారమణౌ : హారస్య మణిః = హారమణిః. తస్మిన్ = హారమణౌ.
మదనోష్మణా: మదనస్య ఊష్మా = మదనోష్మా. తేన = మదనోష్మణా.
అనలంకృతమ్ : న అలంకృతమ్ = అనలంకృతమ్.
అనలమ్ : అవిద్యమానః నలః యస్మిన్ తత్ = అనలమ్.
ప్రియతమః : అత్యంతం ప్రియః = ప్రియతమః.

## భావము :

ఓ దమయంతీ! మన్మథ జ్వరముచే కంఠహారమందలి మణి పగిలి పోయినచో, నీ వక్షః స్థలముగూడ ననలంకృతమగును. అనగా నలంకార రహితమగును. నీ యంతరంగము గూడ (అనలం-కృతమ్) నలరహితముగా చేయబడును. అని సఖీ వచనము. ఓ చెలీ! నా ప్రియుఁడైన నలుఁడు నాహృద యమందు దూరము చేయబడినచో, నప్పుడు నేను చంపబడినట్లే. ॥౧౦౯॥

శ్లో॥ ఇదముదీర్య తథైవ ముమూర్ఛసా
మనసి మూర్ఛితమన్మథపావకా।
క్వ సహతామవలంబలవచ్ఛిదా
మనుపపత్తిమతీమపి దుఃఖితా॥ ౧౧౦

ప॥వి॥ ఇదమ్ । ఉదీర్య । తథా । ఏవ । ముమూర్ఛ । సా । మనసి । మూర్ఛితమన్మథ పావకా । క్వ । సహతామ్ । అవలంబలవచ్ఛిదామ్ । అనుపపత్తిమతీమ్ । అపి । దుఃఖితా.

టీక॥ సా = ఆ దమయంతి, ఇదం = 'హతాఽస్మి' యనెడి మాటను, ఉదీర్య = చెప్పి, తథైవ = అట్లే, మనసి = మనస్సునందు, మూర్ఛిత మన్మథ పావకా; మూర్ఛిత = వర్ధిల్లిన, మన్మథ పావకా = మన్మథాగ్నికలదై, ముమూర్ఛ = మూర్ఛనొందెను. హే = ఏలయనగా, దుఃఖితా = దుఃఖము గల్గిన, సా = ఆ దమయంతి, అనుపపత్తిమతీం = ''అనలంకృత''-మ్మనుశ్లేషశబ్ద శ్రవణము భ్రాంతితోఁగూడినందువలన నుపపన్నము కానిదైనను, అవలంబలవచ్ఛిదామ్; అవలంబలవ = (నలునికి నంతరంగములోనునికియను) ప్రాణమును నిలపెట్టునట్టి స్వల్పపుటాధారమునకు, ఛిదాం = భంగమును, క్వ = ఎక్కడ, సహతామ్ = సహించును.

వి॥ దుఃఖితునకు, వాస్తవముగా గాని, భ్రాంతితోగాని యనిష్టము తెలియుట సహింప సాధ్యము కాదను సామాన్యముచే, దమయంతికి 'అనలంకృత మను'' శ్లేశబ్దముచే నలుఁడు దూరముగాఁ జేయఁబడెనను నర్థస్ఫురణచే ''హతాస్మి'' యని యామెయొక్క దుఃఖమునకు దుస్సహత్వమును వర్ణించుట యను విశేషము సమర్థితముగాన నర్థాంతరన్యాసాలంకారము.

## సమాసములు :

మూర్ఛితమన్మథపావకా : మన్మథస్య పావకః = మన్మథపావకః. మూర్ఛితః మన్మథపావకః యస్యాస్సా = మూర్ఛితమన్మథపావకా.

అవలంబలవచ్ఛిదామ్ : అవలంబస్య లవః = అవలంబలవః. అవలంబలవస్య ఛిదా = అవలంబలవచ్ఛిదా. తామ్ = అవలంబలవచ్ఛిదామ్.

**అనుపపత్తిమతీమ్ :** న ఉపపత్తిః అనుపత్తిః. అనుపత్తిః అస్యాః అస్తీతి = అనుపపత్తి మతీ. తామ్ = అనుపపత్తిమతీమ్.

దుఃఖితా : దుఃఖమస్యాః సంజాతమితి = దుఃఖితా.

**భావము :**

ఆ దమయంతి పూర్వశ్లోకములో ''హతాస్మి'' యని చెప్పి వెంటనే మనస్సున మన్మథాగ్ని ప్రజ్వరిల్లగా మూర్ఛ నొందినది. దుఃఖితులకు భ్రాంతితో గాని, భ్రాంతిలేకగాని యనిష్టము తెలిసినచో, వారికది సహింప సాధ్యము కాదు. కావుననే దమయంతి పూర్వశ్లోకములోని "అనలంకృత" శబ్దమున శ్లేషమహిమతో స్ఫురించిన నలరాహిత్యమును విని మూర్ఛ పోయినది. కాని దానికి అదియే అర్థమని ధ్రువపఱచుటకు వీలులేదు. "అనలంకృత" మనగా అలంకృతము కానిదనెడి యర్థమే దానికి వివక్షితమై యుండవచ్చును. కాని యామెకు ''నలరాహిత్య'' పరమైన యర్థము శ్లేషవలన గోచరించి, యది యామె మూర్ఛకు కారణమైనది. ఆ యర్థము భ్రాంతియే కావచ్చును. దుఃఖితులకు అనిష్ట భ్రాంతిగూడ సహింప సాధ్యము కానిదే. ॥౧౧౦॥

**శ్లో॥** అధిత కాపి ముఖే సలిలం సఖీ
ప్యధిత కాపి సరోజదళైస్స్తనౌ।
వ్యధిత కాపి హృది వ్యజనానిలమ్
న్యధిత కాపి హిమం సుతనోస్తనౌ॥ ౧౧౧

**ప॥వి॥** అధిత । కా । అపి । ముఖే । సలిలం । సఖీ । ప్యధిత । కా । అపి । సరోజదళైః । స్తనౌ । వ్యధిత । కా । అపి । హృది । వ్యజనానిలం । న్యధిత । కా । అపి । హిమం । సుతనోః । తనౌ.

**టీక॥** కాఽపి = ఒకానొక, సఖీ = చెలికత్తె, సుతనోః = (సుందర శరీరము గల) దమయంతియొక్క, ముఖే = ముఖమునందు, సలిలం = ఉదకమును. అధిత = ఉంచినది. అనగా పోసినది లేదా చల్లినది. కాఽపి = ఒకానొక, సఖీ = చెలికత్తె, స్తనౌ = స్తనములను, సరోజదళైః = తామర పూలరేకులతో, ప్యధిత = కప్పినది. కాఽపి = ఒకానొక, సఖీ = చెలి

క త్తె, హృది = హృదయముపై, వ్యజనానిలం = విసనకఱ్ఱతో గాలిని, వ్యధిత = కల్పించినది. కాపి = ఒకానొక, సఖీ = చెలిక త్తె, తనౌ = శరీరమందు, హిమం = చందనమును, న్యధిత = ఉంచినది (అలదినది).

సమాసములు :

సరోజదళైః: సరసి జాయంత ఇతి = సరోజాని. సరోజానాం దళాని = సరోజదళాని. తైః = సరోజదళైః.

వ్యజనానిలమ్ : వ్యజనస్య అనిలః = వ్యజనానిలః. తమ్ = వ్యజనానిలమ్.

సుతనోః : శోభనా తనుః యస్యాస్సా సుతనుః. తస్యాః = సుతనోః.

భావము :

ఇట్లు దమయంతి మూర్ఛపడగా, నొక్క చెలిక త్తె యామె ముఖమున నీరు చల్లినది. మఱి యొక్కతె, ఆమె చనుదోయిని తామరపూలరేకులతోఁ గప్పినది, మఱియొక్కతె, ఆమె ఱొమ్మునకు గాలి సోకునట్లు విసనకఱ్ఱతో విసరినది. మఱియొక్కతె యామె యొడలిపై చందనముచుఁ బట్టించినది. ఇవి యన్నియు మూర్ఛపడిన దమయంతికి శిశిరోపచారములు. ॥౧౧౧॥

శ్లో॥ ఉపచచార చిరం మృదుశీతలై
ర్జలజజాలమృణాళజలాదిభిః।
ప్రియసఖీ నివహస్స తథా క్రమా
దియమవాప యథా లఘు చేతనామ్॥ ౧౧౨

ప॥వి॥ ఉపచచార । చిరం । మృదుశీతలైః । జలజజాలమృణాళజలాదిభిః । ప్రియసఖీ నివహః । సః । తథా । క్రమాత్ । ఇయమ్ । అవాప । యథా । లఘు । చేతనామ్.

టీక॥ సః = ఆ, ప్రియసఖీనివహః; ప్రియసఖీ = ప్రియమైన చెలిక త్తెలయొక్క, నివహః = సమూహము, మృదుశీతలైః; మృదు = మెత్తని వియు, శీతలైః = చల్లనివియు నగు, జలజజాలమృణాళ జలాదిభిః; జలజ

జాల = పద్మసమూహములతోఁడను, మృణాళ = తామరతూండ్లతోడను, జలాదిభిః = ఉదకములు మున్నగు వానితోఁడను, క్రమాత్ = క్రమముగా, చిరం = చాలకాలము, తథా = ఆ విధముగా, ఉపచచార = = ఉపచారము గావించినది. యథా = ఏ ప్రకారము, ఇయం = ఈ దమయంతి, లఘు = శీఘ్రముగా, చేతనాం = సంజ్ఞను, అవాప = పొందునో.

## సమాసములు :

మృదుశీతలైః: మృదూని చ తాని శీతలాని చ = మృదుశీతలాని. తైః = మృదుశీతలైః.

*జలజజాలమృణాళజలాదిభిః :* జలే జాయంత ఇతి = జలజాని. జలజానాం జాలాని = జలజజాలాని. జలమ్ ఆదిః యేషాం తాని = జలాదీని. జలజజాలానిచ, మృణాళానిచ జలాదీనిచ = జలజజాలమృణాళజలాదీని. తైః = జలజజాలమృణాళజలాదిభిః.

*ప్రియసఖీనివహః :* ప్రియాశ్చతాః సఖ్యశ్చ = ప్రియసఖ్యః. ప్రియసఖీనాం నివహః = ప్రియసఖీనివహః.

## భావము :

దమయంతియొక్క ప్రియమైన చెలికత్తెలు మూర్ఛపడిన దమయంతిని మెత్తనివియును జల్లనివియునగు తామరపూలతోడను, తామరతూండ్లతోడను, ఉదకములు విసనకఱ్ఱలు మున్నగు సాధనములతోఁడను, వరుసగా నామెకు, తిరిగి చైతన్యము వచ్చునట్లు శిశిరోపచారములను గావించిరి. ॥౧౧౨॥

శ్లో॥ అథ కలే కలయ శ్వసితి స్ఫుటం
చలతి పక్ష్మ చలే! పరిభావయ।
అధరకంపన మున్నయ మేనకే
కిమపి జల్పతి కల్పలతే శృణు॥ ౧౧౩

ప॥వి॥ అథ । కలే । కలయ । శ్వసితి । స్ఫుటం । చలతి । పక్ష్మ । చలే ।

పరిభావయ । అధరకంపనమ్ । ఉన్నయ । మేనకే । కిమ్ । అపి ।
జల్పతి । కల్పలతే । శృణు.

టీక॥ అథ = పిదప, హేకలే = ఓ కళా!, స్ఫుటం = స్పష్టముగా, శ్వసితి =
నిట్టూర్పు విడచుచున్నది, కలయ = గ్రహించుము. హేచలే = ఓచలా!
పక్ష్మ = రెప్ప వెంద్రుక, చలతి = కదలుచున్నది. పరిభావయ = పరి
కించుము. హే మేనకే = ఓమేనకా! అధరకంపనమ్ = పెదవి కదలికను,
ఉన్నయ = ఊహించుము. హే కల్పలతే = ఓ కల్పలతా! కిమపి =
ఏదియో, జల్పతి = పలుకుచున్నది. శృణు = వినుము.

## సమాసములు :

అధరకంపనమ్ : అధరస్య కంపనమ్ = అధరకంపనమ్. తత్ =
అధరకంపనమ్.

## భావము :

దమయంతికి, కల, చల మున్నగు నేడుగురు చెలికత్తెలు గలరు. వారు
దమయంతియొక్క పరిస్థితి పరీక్షించుచు నిట్లు తమలో మాట్లాడుకొనుచున్నారు.

ఓ కళా! దమయంతికి ఊపిరి బాగుగ నాడుచున్నది; గమనించుము.
ఓ చలా! రెప్పలు కదలుచున్నవి. అనగా, కన్ను విప్పుచున్నది; పరిశీలించుము.
ఓ మేనకా! పెదవి కదలుచున్నదేమో ఊహించుము. ఓ కల్పలతా! ఏదియో
మాట్లాడుచున్నది వినుము. ॥౧౧౩॥

శ్లో॥ రచయ చారుమతే స్తనయోర్వృతిం
గణయ కేశిని కైశ్య మసంయతమ్।
అవగృహాణ తరంగిణి నేత్రయో
ర్జలఝురావితి శుశ్రువిరే గిరః॥ ౧౧౪

ప॥వి॥ రచయ। చారుమతే। స్తనయోః। వృతిమ్। గణయ । కేశిని । కైశ్యమ్।
అసంయతమ్ । అవగృహాణ । తరంగిణి । నేత్రయోః । జలఝురౌ ।
ఇతి । శుశ్రువిరే । గిరః.

టీక॥ హే చారుమతే = ఓ చారుమతీ, స్తనయోః = స్తనములకు, వృతిం = ఆవరణమును అనగా మరుగును, రచయ = ఏర్పఱచుము. హే కేశిని = ఓకేశినీ! అసంయతం = వదిలిపోయిన, కైశ్యం = వెండ్రుకల సమూహమును(గూర్చి, గణయ = ఆలోచించుము. హే తరంగిణి = ఓ తరంగిణీ! నేత్రయోః = నేత్రముల యందలి, జలఝరౌ = నీటి వెల్లువలను, అవగృహాణ = అరికట్టుము. ఇతి = ఈ విధముగా, గిరః = మాటలు, శుశ్రువిరే = వినఁబడినవి.

## సమాసములు :

కైశ్యమ్ : కేశానాం సమూహః = కైశ్యమ్. తత్ = కైశ్యమ్.

అసంయతమ్ : న సంయతం = అసంయతమ్. తత్ = అసంయతమ్.

జలఝరౌ : ఝరశ్చ ఝరశ్చ = ఝరౌ. జలయోః ఝరౌ = జలఝరౌ. తౌ = జలఝరౌ.

## భావము :

ఓ చారుమతీ! స్తనములపై కప్పుము. ఓ కేశినీ! విడిపోయిన కొప్పును చక్కబఱుపుము. ఓ తరంగిణీ! కన్నీళ్ల వెల్లువల నరికట్టుము. అని యీ విధముగ దమయంతి చెలికత్తెలు ఆమె మూర్ఛపడినపుడు కావించిన సంభాషణలు వినఁబడినవి. ఇచ్చట నా చెలికత్తెలకు వారి వారి పనికి తగిన విధముగా పేరు లేర్పఱచుట చమత్కారముగ నున్నది. ॥౧౦౪॥

శ్లో॥ కలకలస్స తదాళిజనాననా
దుదలసద్విపులస్త్వరితేరితైః।
యమధిగమ్య సుతాలయమేతవాన్
ద్రుతతరస్స విదర్భపురందరః॥ ౧౦౫

ప॥వి॥ కలకలః । సః । తదా । ఆళిజనాననాత్ । ఉదలసత్ । విపులః । త్వరితేరితైః । యమ్ । అధిగమ్య । సుతాలయమ్ । ఏతవాన్ । ద్రుతతరః । సః । విదర్భపురందరః.

టీక॥ తదా = చెలికత్తెలు దమయంతి యొక్క శరీర స్థితికి కలతఁబొందిన కాలమునందు, ఆళిజనాననాత్; ఆళిజన = చెలికత్తెలయొక్క, ఆన నాత్ = ముఖమునుండి, త్వరితేరితైః; త్వరిత = త్వరతోఁగూడిన, ఈరితైః = తత్తరపాటు మాటలచే, విపులః = పెద్దదైన, సః = ఆ, కల కలః = కోలాహలము, ఉదలసత్ = ఉద్భవించినది. యమ్ = ఏకలకల ధ్వనిని, అధిగమ్య = విని, సః = ఆ, విదర్భపురందరః; విదర్భ = విదర్భదేశమునకు, పురందరః = ఇంద్రుఁడైన భీమరాజు, ద్రుతతరః = మిక్కిలి వేగముతోఁ గూడినవాడై, సుతాలయం = కుమార్త నివాసస్థల కన్యాంతఃపురమును, ఏతవాన్ = పొందెను.

## సమాసములు :

ఆళిజనాననాత్ : ఆళయ ఏవ జనాః = ఆళిజనాః. ఆళిజనానామాననమ్ = ఆళిజనాననమ్. తస్మాత్ = ఆళిజనాననాత్.

త్వరితేరితైః : త్వరా ఏషాం సంజాతేతి = త్వరితాని. త్వరితాని చ తాని ఈరితాని చ = త్వరితేరితాని. తైః = త్వరితేరితైః.

సుతాలయమ్ : సుతాయాః ఆలయః = సుతాలయః. తమ్ = సుతాలయమ్.

ద్రుతతరః : అత్యంతం ద్రుతః = ద్రుతతరః.

విదర్భపురందరః : విదర్భాణాంపురందరః = విదర్భపురందరః.

## భావము :

ఈ విధముగ చెలికత్తెలు దమయంతియొక్క దేహ పరిస్థితినిఁ గూర్చి కలతనొంది తత్తరపాటుతో మాట్లాడుచుండుటవలన గొప్పకోలాహల మేర్పడి నది. ఆ కోలాహలమును విని విదర్భభూపతియైన భీమరాజు మిక్కిలి త్వరతో తన కొమార్తెయున్న కన్యాంతఃపురమునకు విచ్చేసెను. ॥౧౧౫॥

శ్లో॥ కన్యాంతపురబోధనాయ యదధీకారాన్న దోషా నృపం
ద్వౌ మంత్రిప్రవరశ్చ తుల్యమగదంకారశ్చ తావూచతుః।

దేవాకర్ణయ సుశ్రుతేన చరకస్యోక్తేన జానేఽఖిలం
స్యాదస్యా నళదం వినా న దశనే తాపస్య కోఽపి క్షమః॥౧౧౬

ప॥వి॥ కన్యాంతః పురబోధనాయ । యదధీకారాత్ । న । దోషాః । నృపం । ద్వౌ । మంత్రిప్రవరః । చ । తుల్యమ్ । అగదంకారః । చ । తౌ । ఊచతుః । దేవ । ఆకర్ణయ । శుశ్రుతేన । చరకస్య । ఉక్తేన । జానే । అఖిలమ్ । స్యాత్ । అస్యాః । నళదం । వినా । న । దశనే । తాపస్య । కః । అపి । క్షమః.

టీక॥ కన్యాంతరఃపురబోధనాయ; కన్యాంతఃపుర=కన్యయైన దమయంతి యొక్క యంతఃపురమునకు, బోధనాయ=యోగక్షేమములను బోధించి వానిని కల్పించుటకై, యదధీకారాత్; యత్=ఏ మంత్రి వైద్యుల, అధీకారాత్= ఏర్పాటువలన, దోషాః=పరపురుషప్రవేశము మున్నగు దోషములు(వాతపిత్త శ్లేష్మాదిదోషములు),(నసంతి=ఉండవో),తౌ= ఆ, మంత్రిప్రవరశ్చ=మంత్రిశ్రేష్ఠుఁడును, అగదంకారశ్చ=వైద్యుఁడును, ద్వౌ=ఇద్దఱు, నృపం=భీమభూపతినిఁగూర్చి, తుల్యమ్=(ఏక కాలమున,)ఒకే మాటను,ఊచతుః=చెప్పిరి. దేవః=రాజా! ఆకర్ణయ= వినుము. సుశ్రుతేన=చక్కఁగా వినఁబడిన, చరకస్య=గూఢచారుని యొక్క, ఉక్తేన=వచనముచేతను (ఇంకొక పక్షమున), సుశ్రుతేన= సుశ్రుతమను సుశ్రుతునిచే రచియింపఁబడిన యాయుర్వేద గ్రంథము చేతను, చరకస్య=చరకాచార్యునియొక్క, ఉక్తేన=వచనముచేతను, అనగా చరకాచార్యుఁడు రచియించిన యాయుర్వేద గ్రంథము చేతను, అఖిలం=సమస్తమైన తాపకారణమును, జానే=తెలుసుకొనుచున్నాను. అస్యాః=ఈమెయొక్క, తాపస్య=తాపముయొక్క, దశనే=నివృత్తి యందు, నళదం; నళ = నలమహారాజును, దం=ఇచ్చిఘటియింపఁ జేసెడి పురుషుని, వినా=లేకుండ, మఱియొక పక్షమున-నళదం= వట్టివేరును, వినా=లేకుండ, కోఽపి=ఎవ్వఁడును, క్షమః=శక్తుఁడు, నస్యాత్=కాఁడు.

వి॥ ఇచ్చట మంత్రి పక్షమున నలుని ఘటిల్లజేసెడి పురుషుఁడనియు, వైద్య పక్షమున వట్టివేరనియు నళదశబ్దమున కర్థముండుటచే నవి రెండును

ప్రకృతములే యగుటవలన కేవల ప్రకృత శ్లేషాలంకారము.

సమాసములు :

కన్యాంతఃపురబోధనాయ: కన్యానామంతఃపురమ్ = కన్యాంతఃపురం. కన్యాంతఃపురస్య బోధనమ్ = కన్యాంతః పురబోధనమ్. తస్మై = కన్యాంతః, పురబోధనాయ.

యదధికారాత్ : యయోః అధికారః = యదధికారః. తస్మాత్ = యదధికారాత్.

మంత్రిప్రవరః : మంత్రిణాం ప్రవరః = మంత్రిప్రవరః.

అగదంకారః : న గదః = అగదః. అగదం కరోతీతి = అగదంకారః.

నళదమ్ : నళం దదాతీతి = నళదః. తమ్ = నళదమ్.

భావము :

భీమభూపతి కన్యాంతః పురమునుఁ బ్రవేశించిన వెంటనే, యా యంతః పురము యోగక్షేమములనుఁ గమనించుటకై యేర్పాటు గావింపఁబడి (పర పురుష ప్రవేశము) (వాతపిత్తాది) దోషములు రాకుండఁజేసెడి మంత్రియు, వైద్యుఁడును, రాజుతో నళదము లేక యీమె తాపము నివారించదని యొక్క-కాలమందే, యొక్క- మాటనే చెప్పిరి. వారిలో మంత్రి యిట్లు చెప్పెను. రాజా! నళదము లేక యీమె తాపము నివారింపఁజాలదు. ఇచ్చట నళదమనగా, నలుని దమయంతితో ఘటింపఁజేసెడి వ్యక్తి. ఈ విషయము గూఢచారునిచే చెప్పఁబడి ప్రసిద్ధమైయున్నది. కావున దమయంతీ తాపమును హరించుటకు నలునితో నామెను ఘటింపఁజేయుటయే యుపాయము.

ఇఁక వైద్యుఁడును ఇట్లు చెప్పెను. రాజా! నళదములేక యీమె తాపము నివారింపదు. సుశ్రుతుని యొక్కయు చరకాచార్యునియొక్కయు నాయుర్వేద గ్రంథమువలన నీమె తాపమునకు కారణమునుఁ దెలిసికొనియున్నాను. కావున తాపనివారకమైనది నళదమని చెప్పఁబడు వట్టివేరు. కావున వట్టివేరుచే నీమెకు చికిత్స చేసినచోఁ దాపము శమించును. ఇది తప్ప మఱి యొండు నౌషధములేదు. ఇచ్చట "కన్యాంతఃపుర బాధనాయ" యని పాఠాంతరము కలదు.

ఆ పక్షమున కన్యాంతఃపురమును బాధించుటకు, పరపురుషప్రవేశము, మాత పిత్రాదులనెడి దోషములు, మంత్రివైద్యుల యధికారమువలన సంభవింపవనెడి యభిప్రాయము గ్రహింపవలయును. ॥౧౧౬॥

శ్లో॥ తాభ్యామభూద్యుగపదప్యభిధీయమానం
భేదవ్యయాకృతి మిథఃప్రతిఘాతమేవ।
శ్రోత్రే తు తస్య పపతుర్నృపతేర్న కించి
ద్భైమ్యామనిష్టశతశంకితయాకులస్య॥ ౧౧౭

ప॥వి॥ తాభ్యామ్।అభూత్। యుగపత్ । అపి।అభిధీయమానం ।భేదవ్యయాకృతి। మిథః ప్రతిఘాతమ్ । ఏవ । శ్రోత్రే । తు । తస్య ।పపతుః। నృపతేః। న । కిం । చిత్ । భైమ్యామ్ । అనిష్టశతశంకితయా । ఆకులస్య.

టీక॥ తాభ్యామ్ = ఆ మంత్రి వైద్యులచే, భేదవ్యయాకృతి; భేదవ్యయ = అభేదమైన, ఆకృతి = రూపము గల్గునట్లుగా, అనగా ఒక్క రూపముగా, యుగపత్ = ఏకకాలమున, అభిధీయమానం = చెప్పఁబడుచున్న, నళ దాది వాక్యము, మిథఃప్రతిఘాతమేవ = పరస్పర విరోధముగలదిగనే, అభూత్ = ఉండినది. భైమ్యాం = దమయంతి యందు, అనిష్టశత శంకితయా = పెక్కుహానులను శంకించుటచే,ఆకులస్య = కలతఁజెందిన, తస్య = ఆ భీమభూపతియొక్క, శ్రోత్రేతు = కర్ణములో, కించిత్ = కొంచెము విషయమునుఁ గూడ, నపపతుః = గ్రహింపలేదు.

## సమాసములు :

భేదవ్యయాకృతి : భేదస్య వ్యయః = భేదవ్యయః. భేదవ్యయ ఏవ ఆకృతిః యస్య తత్ = భేదవ్యయాకృతి.

మిథఃప్రతిఘాతమ్ : మిథఃప్రతిఘాతః యస్య తత్ = మిథప్రతిఘాతమ్.

నృపతేః : నౄన్ పాతీతి = నృపతిః. తస్య = నృపతేః.

భైమ్యామ్ : భీమస్య అపత్యం స్త్రీ = భైమీ. తస్యామ్ = భైమ్యామ్.

అనిష్టశతశంకితయా : న ఇష్టాని = అనిష్టాని. అనిష్టానాం శతమ్ = అనిష్టశతమ్. అనిష్టశతం శంకత ఇతి = అనిష్టశతశంకీ. అనిష్టశతశంకినః భావః = అనిష్టశంకితా. తయా = అనిష్టశతశంకితయా.

**భావము :**

ఆ మంత్రి వైద్యులిద్దఱు నొకేవిధముగ నొక్కకాలమందే చెప్పుచున్న. "నళదాది" వాక్యము, ఏకకాలమందు చెప్పఁబడినను, ఒక్క శబ్దముచేఁ జెప్పఁబడినను, నొక్క యర్థమునే కల్గినట్లు భాసించుచున్నను భిన్నార్థములగల రెండు వాక్యములుగనే యైనది. ఒకటి నలుని సంఘటన ప్రతిపాదించునదిగను, మఱియొక్కటి, పట్టివేరును ప్రతిపాదించునదిగనునై రెండు వాక్యములైనవి. కాని భీమరాజు దమయంతికి ఏమి యనిష్టము వాటిల్లగలదోయని శంకించుచుండుటచే నాతని రెండు చెవులును, ఈ రెండు వాక్యములను గ్రహించనందువలన, నాతడు వీని యర్థములను గ్రహింపలేదు ॥౧౧౩॥

శ్లో॥ ద్రుతవిగమిత విప్రయోగచిహ్నా
మపి తనయాం నృపతిః పదప్రణమ్రామ్,
అకలయదసమాశుగాధిమగ్నాం
ఝడితి పరాశయవేదినో హి విజ్ఞాః॥ ౧౧౪

ప॥వి॥ ద్రుతవిగమిత విప్రయోగ చిహ్నామ్ । అపి । తనయాం । నృపతిః । పదప్రణమ్రామ్ । అకలయత్ । అసమాశుగాధిమగ్నాం । ఝడితి । పరాశయవేదినః । హి । విజ్ఞాః.

టీక॥ నృపతిః = భీమరాజు, ద్రుతవిగమిత విప్రయోగ చిహ్నామ్; ద్రుత = శీఘ్రముగా, విగమిత = తొలగింపఁబడిన, విప్రయోగ చిహ్నమపి = వియోగబాధను తొలగించెడి శిశిరోపచార చిహ్నములు గలదియు, పదప్రణమ్రామ్ = పాదములపైఁబడినదియునగు, తనయాం = కొమార్తయైన దమయంతిని, అసమాశుగాధిమగ్నామ్; అసమాశుగ = మన్మథునియొక్క, ఆధి = పీడయందు, మగ్నాం = మునిగినదానినిగ, అకలయత్ = తెలిసి

కొనెను. హి = ఏలయనగా, విజ్ఞాః = వివేకము గలవారు, అనగా సమర్థులు, ఝడితి = శీఘ్రముగా, పరాశయ వేదినః; పరాశయ = ఒరుల యభిప్రాయమును, వేదినః = తెలిసిన వారలుగ నుందురు.

వి॥ భీమరాజు తనయను మన్మథబాధతో మునిగినదని తెలుసుకొనె నను విశేషార్థమును విజ్ఞులు శీఘ్రములో పరాశయమును తెలుసుకొనెద రను సామాన్యముతో సమర్థించుటవలన, అర్థాంతరన్యాసాలంకారము.

## సమాసములు :

*ద్రుతవిగమితవిప్రయోగచిహ్నామ్ :* విప్రయోగస్య చిహ్నాని = విప్రయోగ చిహ్నాని. ద్రుతం విగమితాని = ద్రుతవిగమితాని. ద్రుతవిగమితాని విప్రయోగచిహ్నాని యస్యాస్సా = ద్రుతవిగమిత విప్రయోగచిహ్నా. తామ్ = ద్రుతవిగమిత విప్రయోగచిహ్నామ్.

*పదప్రణమ్రామ్ :* పదయోః ప్రణమ్రా = పదప్రణమ్రా. తామ్ = పదప్రణమ్రామ్.

*అసమాశుగాధిమగ్నామ్ :* న సమాః = అసమాః. అసమాః ఆశుగాః యస్యసః = అసమాశుగః. అసమాశుగస్య ఆధిః = అసమాశుగాధిః. అసమాశుగాధౌ మగ్నా = అసమాశుగాధిమగ్నా. తామ్ = అసమాశుగాధిమగ్నామ్.

*పరాశయవేదినః :* పరేషామాశయాః = పరాశయాః. పరాశయాన్ విదంతీతి = పరాశయవేదినః.

*విజ్ఞాః :* విశేషేణ జానంతీతి = విజ్ఞాః.

## భావము:

భీమనృపతి దమయంతి కడకురాగనే, యామెయొద్ద నుంచబడిన శీతలోపచార చిహ్నములు తొలగింపఁబడినవి. ఆమె, తండ్రి పాదములపైఁ బడినది. శీతలోపచార చిహ్నములు తొలగింపఁబడినను భీమరాజు, ఆమెను మన్మథ బాధలో మునింగినదిగ గ్రహించెను. విజ్ఞులు విషయమును వెల్లడి చేయగల చిహ్నములు లేకపోయినను ఆకారము చేతనే పరుల ఇంగితములను నిశ్చయింపఁగలరు. ॥౧౧౮॥

శ్లో॥ వ్యతరదథ పితాశిషం సుతాయై
నతశిరసే ముహురున్నమయ్యమౌళిం।
దయితమభిమతం స్వయంవరే త్వం
గుణమయమాప్నుహి వాసరైః కియద్భిః॥ ౧౧౯

ప॥వి॥ వ్యతరత్ । అథ । పితా । ఆశిషం । సుతాయై। నతశిరసే । ముహుః। ఉన్నమయ్య । మౌళిం । దయితమ్ । అభిమతం । స్వయంవరే । త్వం। గుణమయమ్ । ఆప్నుహి । వాసరైః । కియద్భిః.

టీక॥ అథ = పిదప, పితా = తండ్రియైన భీమరాజు, నతశిరసే; నత = లజ్జచే వంచఁబడిన, శిరసే = తలగల్గిన అనగా ముఖము గల్గిన, సుతాయై = దమయంతికి, మౌళిమ్ = ముఖమును, ఉన్నమయ్య = పైకెత్తి, (హే వత్సే = ఓ బిడ్డా), కియద్భిః = కొలదియైన, వాసరైః = దినములతో, స్వయంవరే = స్వయంవర మహోత్సవమునందు, త్వం = నీవు, గుణమయం = పెక్కు గుణములు గల్గిన, అభిమతం = ఇష్టుఁడైన, దయితం = ప్రియుని, ఆప్నుహి = పొందుము. (ఇతి = అని), ఆశిషం = దీవెనను, వ్యతరత్ = మాటి మాటికి నొసంగెను.

**సమాసములు :**

నతశిరసే : నతం శిరః యస్యాస్సా నతశిరాః. తస్యై = నతశిరసే.

**భావము :**

తర్వాత తండ్రియైన భీమరాజు సిగ్గుచే మోమువంచుకొనియున్న కూతురగు దమయంతి ముఖము పెకెత్తి, బిడ్డా! కొన్ని దినములలోనే నీవు సకల గుణ సంపన్నుఁడును, ఇష్టుఁడునగు ప్రియుని స్వయంవర మహోత్సవమునందుఁబడయుమని పలుమాఱు దీవించెను. ॥౧౧౯॥

శ్లో॥ తదను స తనుజాసఖీరవాదీత్
తుహినఋతౌ గత ఏవ హీదృశానామ్।

కుసుమమపి శరాయతే శరీరే
తదుచితమాచరతోపచారమస్యామ్॥ ౧౨౦

ప॥వి॥ తత్ । అను । సః । తనుజాసఖీః । అవాదీత్ । తుహినఋతౌ । గతే । ఏవ । హి । ఈదృశీనామ్ । కుసుమమ్ । అపి శరాయతే । తత్ । ఉచితమ్ । ఆచరత । ఉపచారమ్ । అస్యామ్.

టీక॥ తదను = ఆశీర్వాదము చేసిన పిదప, సః = ఆ భీమరాజు, తనుజాసఖీః; తనుజా = తన పుత్రికయగు దమయంతియొక్క, సఖీః = చెలికత్తెలను, అవాదీత్ = చెప్పెను. హి = ఏలయనగా, తుహినఋతౌ = శిశిరఋతువు, గతేసత్యేవ = వెళ్లిపోగనే, ఈ దృశీనాం = ఇటువంటి సుకుమార శరీరముగల్గి యౌవన ప్రారంభమున నుండెడి వారికి,కుసుమమపి = పుష్పముగూడ, శరాయతే = బాణమువలె నాచరించును. తత్ = అందువలన,అస్యాం = ఈ కోమలాంగియందు, ఉచితం = తగిన, ఉపచారమ్ = శిశిరోపచారమును, ఆచరత = ఆచరింపుడు.

సమాసములు:

తనుజాసఖీః : తనోః జాయత ఇతి = తనుజా. తనుజాయాః సఖ్యః = తనుజాసఖ్యః. తాః = తనుజాసఖీః.

తుహినఋతౌ : తుహినస్య ఋతుః = తుహినఋతుః. తస్మిన్ తుహినఋతౌ.

భావము :

ఈ విధముగ తన పుత్రికయగు దమయంతిని దీవించి, యా భీమరాజు, తన కొమారిత చెలికత్తెలతో నిట్లనియెను-శిశిరఋతువు గడవగనే యౌవన ప్రారంభమందున్న కోమలాంగులకు పువ్వుసైతము బాణమువలె కఠినమై యుండును. అనగా మన్మథ బాణమై బాధ గల్గించును. కాన నీ వసంతమందు దానికి తగిన యుపచారము మీరీ యువతికి చేయుఁడు. ॥౧౨౦॥

శ్లో॥ కతిపయదివసైర్వయస్యయా వః
స్వయమభిలష్య వరిష్యతే వరీయాన్।

క్రశిమశమనయానయా తదాప్తుం
రుచిరుచితాథ భవద్విధాభిధాభిః॥ ౧౨౧

ప॥వి॥ కతిపయదివసైః । వయస్యయా । వః । స్వయమ్ । అభిలష్య । వరిష్యతే । వరీయాన్ । క్రశిమశమనయా । అనయా । తత్ । ఆప్తుం । రుచిః । ఉచితా । అథ । భవద్విధాభిధాభిః.

టీక॥ కతిపయదివసైః (రేవ) = కొన్ని దినముల చేతనే, వః = మీయొక్క, వయస్యయా = చెలికత్తెయగు దమయంతిచే, వరీయాన్ = శ్రేష్ఠుఁడైన పురుషుఁడు, స్వయం = తనంతట, అభిలష్య = కోరఁబడి, వరిష్యతే = వరింపఁబడనున్నాఁడు. తత్ = అందువలన, అథ = పిదపనిప్పుడు, అనయా = ఈ దమయంతిచే, భవద్విధాభిధాభిః; భవద్విధ = మీవంటి చెలికత్తెలయొక్క, అభిధాభిః = మాటలచే, యా = ఏకృశత్వమునుఁ దగ్గించుట గలదో, (తయా) క్రశిమశమనయా = ఆ కృశత్వమును తొలగించు యుక్తితో, రుచిః = కాంతియు ప్రీతియు, ఆప్తుం = పొందుటకు, ఉచితా = తగినది. కాంతినిఁ బ్రీతినిఁ బొందింపఁజేయుఁడు.

వి॥ ద్రుతవిగమితేత్యాది శ్లోకమునుండి యీ శ్లోకమువరకు పుష్పితాగ్రా వృత్తము.

## సమాసములు :

*కతిపయదివసైః:* కతిపయే చ తే దివసాశ్చ = కతిపయదివసాః. తైః = కతిపయదివసైః.

*క్రశిమశమనయా :* క్రశిమ్నః శమనా = క్రశిమశమనా. తయా = క్రశిమశమనయా.

*భవద్విధాభిధాభిః:* భవతీనాం విధేవ విధా యాసాం తాః = భవద్విధాః. భవద్విధానామభిధాః = భవద్విధాభిధాః. తాభిః = భవద్విధాఽభిధాభిః.

## భావము :

కొన్ని దినములలోనే మీ చెలికత్తెయగు దమయంతి తాను కోరిన శ్రేష్ఠుఁడైన వరుని వరించఁగలదు. అందువలన ప్రకృతము మీరు ఆమెను ప్రియమైన

వచనములతో సంతోష పఱచుచు నామె శరీరమందలి కృశత్వము తొలగించు నుపాయమునుఁ జెప్పి యామెకు కాంతినిఁ బ్రీతిని కలుగునట్లు చేయునది. స్వయవరము వరకు మీరు ఆమెను లాలించుచు నామెకు కష్టము లేకుండఁజేసి సంతోషము గల్గింపవలసినది. ॥౧౨౧॥

శ్లో॥ ఏవంయద్వదతా నృపేణ తనయా నాఽపృచ్ఛి లజ్జాపదం
యన్మోహస్స్మరభూ రకల్పి వపుషః పాండుత్వతాపాదిభిః।
యచ్చాశీః కపటాదవాది సదృశీ స్యాత్తత్ర యా సాంత్వనా
తన్మత్వాఽఽళిజనో మనోఽబ్ధిమతనోదానందమందాక్షయోః॥౧౨౨

ప॥వి॥ ఏవం । యత్ । వదతా । నృపేణ । తనయా । న । అపృచ్ఛి । లజ్జాపదం । యత్ । మోహః । స్మరభూః । అకల్పి । వపుషః । పాండుత్వతాపాదిభిః । యత్ । చ । ఆశీః । కపటాత్ । అవాది । సదృశీ । స్యాత్ । తత్ర।యా । సాంత్వనా । తత్। మత్వా । ఆళిజనః । మనః। అబ్ధిమ్ । అతనోత్ । ఆనందమందాక్షయోః.

టీక॥ ఏవం = ఇట్లు, వదతా = చెప్పుచున్న, నృపేణ = రాజుచే, తనయా = పుత్రికయగు దమయంతి, లజ్జాపదం = లజ్జకు హేతువునుఁగూర్చి, నాఽపృచ్ఛి = అడుగఁబడలేదు, ఇతియత్ = అనునది ఏది కలదో, వపుషః = దేహముయొక్క, పాండుత్వతాపాదిభిః; పాండుత్వ = తెల్లఁదనము, తాపాదిభిః = తాపము మొదలగు చిహ్నములచే, స్మరభూః = మన్మథునివలన కలిగిన, మోహః = మోహము, అకల్పిఇతియత్ = ఊహింపఁబడెననునది యేదిగలదో; తత్ర = ఆపుత్రికయందు, సదృశీ = తగిన, యా = ఏ, సాంత్వనా = లాలన, స్యాత్ = ఉండునో, (అది), ఆశీః కపటాత్ = ఆశీర్వాదమనెడు కపటమువలన, 'దయితమాప్నుహీ' త్యాది (ప్రియుని పొందుము మున్నగు) విధమున, అవాదీతిచయత్ = చెప్పఁబడెనను నదియు నేదిగలదో, తత్ = వానినంతటిని, మత్వా = ఆలోచించి, ఆళిజనః = చెలి కత్తెలు, మనః = తమ మనస్సులను, ఆనంద మందాక్షయోః; ఆనంద = సంతోషమునకును, మందాక్షయోః = లజ్జకును, అబ్ధిం = సముద్రముగ, అతనోత్ = చేసెను.

**సమాసములు :**

*లజ్జాపదమ్ :* లజ్జాయాః పదమ్ = లజ్జాపదమ్.

*పాండుత్వతాపాదిభిః :* పాండోఃభావః పాండుత్వమ్. పాండుత్వం చ తాపశ్చ = పాండుత్వతాపౌ. పాండుత్వతాపౌ ఆదీ యేషాం తే పాండుత్వతాపాదయః. తైః = పాండుత్వతాపాదిభిః.

*ఆనందమందాక్షయోః:* ఆనందశ్చ మందాక్షం చ = ఆనందమందాక్షే. తయోః = ఆనందమందాక్షయోః.

**భావము :**

పై విధముగా రాజు చెలికత్తెలను గూర్చి చెప్పెను. కాని దమయంతికి, ఆ సమయమునఁగల్గిన లజ్జకు హేతువు నడుగలేదు. ఏలయనగా నది స్పష్టముగా తెలియుచుండినది. అట్లే శరీరమునందలి తెల్లదనము మున్నగు వానిచే నామెకు మన్మథ బాధ కల్గినదని యతను ఊహించుకొనఁగల్గెను. ప్రియమైన వరుని శీఘ్రముగా వరింపగలదను సాభిప్రాయమైన యాశీర్వాదమును, ఆమె యెదఁ గనఁ బరచిన యోదార్పు మున్నగు వానిని చెలికత్తెలు గమనించి స్వయంవరముచే దమయంతికి బాధ తొలగుననని యానందమును, తామంతకాలము దాచి యుండిన దమయంతీ వియోగబాధ బయట పడినందులకు లజ్జనుపొందిరి. ॥౧౨౨॥

శ్లో॥ శ్రీహర్షంకవిరాజరాజి మకుటాలంకారహీరః సుతం
శ్రీహీరః సుషువే జితేంద్రియచయం మామల్లదేవీచ యమ్
తుర్యః స్థైర్యవిచారణప్రకరణభ్రాతర్యయం తన్మహా
కావ్యేఽత్ర వ్యగలన్నలస్యచరితే సర్గో నిసర్గోజ్జ్వలః॥౧౨౩

ప॥వి॥ శ్రీహర్షం । కవిరాజరాజిమకుటాలంకారహీరః । సుతం శ్రీహీరః । సుషువే । జితేంద్రియచయం । మామల్లదేవీ । చ । యమ్ ।తుర్యః । స్థైర్యవిచారణ ప్రకరణ భ్రాతరి । అయం । తన్మహాకావ్యే । అత్ర । వ్యగలత్ । నలస్య। చరితే । సర్గః।నిసర్గోజ్జ్వలః.

**టీక॥** కవిరాజ రాజిమకుటాలంకార హీరః; కవిరాజ = కవిశ్రేష్ఠుల యొక్క, రాజి = శ్రేణిలో, మకుట = కిరీట స్థానము నొందిన వారికి, అలంకార = భూషణమైన, హీరః = వజ్రమణియైన, శ్రీహీరః = శ్రీహీరుఁడను విద్వాంసుఁడు, జితేంద్రియచయం = ఇంద్రియ సమూహ మును జయించిన, యమ్ = ఏ, శ్రీహర్షం = శ్రీహర్షమహాకవిని, సుషువే = జన్మింపఁజేసెనో, మామల్లదేవీచ = తల్లియైన మామల్లదేవియు, సుషువే = కనెనో, స్థైర్యవిచారణ ప్రకరణ భ్రాతరి; స్థైర్య విచారణప్రక రణ = బౌద్ధులక్షణభంగవాదమును నిరసించి స్థిరత్వమునుగూర్చి విచా రణచేయు "స్థైర్యవిచారణ ప్రకరణ" గ్రంథమునకు, భ్రాతరి = సోదర మైన, తన్మహాకావ్యే; తత్ = ఆశ్రీహర్షునియొక్క, మహాకావ్యే = మహా కావ్యమైన, నలస్య = నలునియొక్క, చరితే = చరిత్రమందు, నిసర్గోజ్జ్వలః; నిసర్గ = స్వభావముతో, ఉజ్జ్వలః = ప్రకాశమానమైన, అయమ్ = ఈ, తుర్యః = నాల్గవదైన, సర్గ = సర్గ, వ్యగలత్ = కడచిపోయినది. "వ్యగ మత్" అని యుండుట యుచితము.

**భావము :**

కవి శ్రేష్ఠుల శ్రేణికి కిరీటస్థానము నలంకరించిన వజ్రమణియైన శ్రీహీరుఁడును, మామల్లదేవియు, జితేంద్రియుఁడగు శ్రీ హర్షుఁడను పేరుగల పుత్రుని కనిరి. అతడు బౌద్ధమతములో క్షణభంగవాదమును నిరసించి స్థైర్య విచారణ పరముగ, రచియించిన "స్థైర్యవిచారణ ప్రకరణ"మను గ్రంథమునకు సోదరమై, నలచరిత్రమును వర్ణించెడి నైషధ మహాకావ్యమునందు, నిర్దోషమగుట వలన స్వభావముతో ప్రకాశమానమైన నాల్గవ సర్గ కడచినది. స్థైర్యవిచారణ ప్రకరణమును శ్రీహర్షుడే రచియించినందువలన, దానికి నైషధము సోదర మైనది.

**సమాసములు :**

*కవిరాజరాజిమకుటాలంకారహీరః :* కవీనాం రాజానః = కవిరాజాః. కవిరాజానాంరాజయః = కవిరాజరాజయః. కవిరాజరాజీనాం మకుటాని = కవిరాజ రాజిమకుటాని. కవిరాజ రాజిమకుటేషుఅలంకారాః = కవిరాజరాజిమకుటాలం

కారాః. కవిరాజరాజిమకుటాలంకారేషు హీరః = కవిరాజరాజిమకుటాలంకార హీరః.

*జితేంద్రియచయమ్ :* ఇంద్రియాణాం చయః = ఇంద్రియచయః. **జితః** ఇంద్రియచయః యేన సః = జితేంద్రియచయః. తమ్ = జితేంద్రియచయమ్.

*స్థైర్యవిచారణ ప్రకరణ భ్రాతరి :* స్థైర్యస్యవిచారణం = స్థైర్యవిచారణమ్. స్థైర్యవిచారణస్యప్రకరణమ్ = స్థైర్యవిచారణప్రకరణమ్, స్థైర్యవిచారణ ణస్యభ్రాతా = స్థైర్యవిచారణ ప్రకరణ భ్రాతా, తస్మిన్ = స్థైర్యవిచారణ ప్రకరణ భ్రాతరి.

*నిసర్గోజ్వలః :* నిసర్గేణ ఉజ్జ్వలః = నిసర్గోజ్వలః.

ఇట్లు

శ్రీ మదాపస్తంబ సూత్రాఽఽత్రేయగోత్ర ఉడాలి నృసింహశాస్త్రి తనూజ
ఉడాలి సుబ్బరామశాస్త్రి విరచిత నైషధీయ చరితాఽఽంధ్ర
వ్యాఖ్యానమునందు
చతుర్థసర్గ సమాప్తము.

# శ్రీహర్ష నైషధము

## (పంచమ సర్గ)

శ్లో॥ యావదాగమయతేఽథ నరేంద్రాన్
స స్వయంవరమహాయ మహీంద్రః।
తావదేవ ఋషి రింద్రదిదృక్షు
ర్నారదస్త్రిదశధామ జగామ॥ ౧

ప॥వి॥ యావత్ । ఆగమయతే । అథ । నరేంద్రాన్ । సః । స్వయంవర మహాయ । మహీంద్రః । తావత్ । ఏవ । ఋషిః । ఇంద్రదిదృక్షుః । నారదః । త్రిదశధామ । జగామ.

టీక॥ అథ = పిదప, సః = ఆ, మహీంద్రః = భీమరాజు, స్వయంవర మహాయ = దమయంతీ స్వయంవరోత్సవమునకై, నరేంద్రాన్ = రాజులను, యావత్ = ఎంతలోపల, ఆగమయతే = రప్పించుటచే కాలహారణము చేయునో, తావదేవ = అంతలోపలనే, ఋషిః = ఋషియైన, నారదః = నారదుఁడు, ఇంద్రదిదృక్షుః = ఇంద్రుని చూడఁగోరినవాఁడై, త్రిదశధామ = స్వర్గమునుఁ గూర్చి, జగామ = వెళ్ళెను.

వి॥ ఈ సర్గయందు స్వాగతావృత్తము. ప్రతిపాదమునకును, రగణ-నగణ-భగణములు, గురువులు రెండు నున్నచో స్వాగతావృత్తమగును.

### సమాసములు :

నరేంద్రాన్ : నరాణామింద్రాః = నరేంద్రాః. తాన్ = నరేంద్రాన్.

స్వయంవరమహాయ : స్వయంవర ఇతి మహః = స్వయంవరమహః. తస్మై = స్వయంవరమహాయ.

మహీంద్రః : మహ్యాః ఇంద్రః = మహీంద్రః.

ఇంద్రదిదృక్షః : ద్రష్టుమిచ్ఛుః = దిదృక్షుః. ఇంద్రందిదృక్షుః = ఇంద్రదిదృక్షుః.

*త్రిదశధామ :* త్రయః దశాః యాసాం తాః = త్రిదశాః, త్రిదశానాం ధామ = త్రిదశధామ. తత్ = త్రిదశధామ.

**భావము :**

దమయంతీ స్వయంవరమునకై యింద్రాదులు రావలసి యున్నది. దానికి ననుగుణముగ నారదుఁ డింద్రలోకమునకు వెళ్లుటనుఁ గూర్చి యిటఁ జెప్పుచున్నాఁడు. ఆ భీమరాజు స్వయంవర మహోత్సవమునకై రాజుల నాహ్వానించి రప్పించుటలో నున్న తడవు నుపయోగించుకొని నారదమహర్షి యింద్రునిఁ జూడఁగోరి స్వర్గమునకు వెళ్లెను. అనగా స్వయంవరమునకు రాజు లందరు వచ్చులోపల నారదుఁడు స్వర్గమునకు వెళ్లెనని యాశయము. ॥౧॥

శ్లో॥ నా ఽత్ర చిత్రమను తం ప్రయయౌ యత్
పర్వతః ఖలు స తస్య సపక్షః।
నారదస్తు జగతో గురురుచ్చై
ర్విస్మయాయ గగనం విలలంఘే॥

ప॥వి॥ న । అత్ర । చిత్రమ్ । అను । తం । ప్రయయౌ । యత్ । పర్వతః । ఖలు । సః । తస్య । సపక్షః । నారదః । తు । జగతః । గురుః । ఉచ్చైః । విస్మయాయ । గగనం । విలలంఘే.

టీక॥ పర్వతః = పర్వతుఁడను నారదుని మిత్రుఁడగు ఋషి (పర్వతము), తం = ఆ నారదుని, అనుప్రయయౌ ఇతియత్ = అనుసరించి వెళ్లెననుట యేది కలదో, అత్ర = ఈ విషయమునందు, చిత్రమ్ = ఆశ్చర్యము, న = లేదు. (కుతః = ఏలయనగా), సః = ఆ పర్వతుఁడను ఋషి (పర్వతము), తస్య = ఆ నారదునకు, సపక్షఃఖలు = చెలికాడు గదా (రెక్కలు గలది గదా). కింతు = కాని, జగతః = లోకమునకు, ఉచ్చైః = ఉన్నతుఁడైన, గురుః = ఆచార్యుఁడును (బరువు కలవాడును) నగు, నారదస్తు = నారదుఁడో, విస్మయాయ = జనమున కాశ్చర్యము కలిగించుటకై, గగనం = ఆకాశమునుఁగూర్చి, విలలంఘే = లంఘించెను.

వి॥ గురువైన వస్తువు (అనగా నారదుఁడు) బరువుచేఁ బడవలసియుండగా, పైకెగసి పోయెనని వర్ణించుట విరుద్ధముగాన, విరోధాభాసాలంకారము. గురువనగా గౌరవము కలదని యర్థము. కాని భారము కలదియని యర్థము కాదని చెప్పుటవలన విరోధ పరిహారము.

## సమాసములు :

సపక్షః : సమానః పక్షః యస్య సః = సపక్షః. పక్షైః సహ వర్తత ఇతి = సపక్షః.

## భావము :

ఇది మొదలొక్కొని యారు శ్లోకములలో నారదుని స్వర్గగమనము వర్ణింపఁబడుచున్నది. నారదుని మిత్రుఁడు పర్వతుఁడను మహర్షి. అతడుగూడ నారదుని వెంట స్వర్గమునకు వెళ్లెను. ఈ పర్వతుఁడు స్వర్గమునకు వెళ్లుటలో నాశ్చర్యము లేదు. ఏలయనగా నతడు నారదునికి సపక్షుఁడు అనగా మిత్రుఁడు. సపక్షుఁడనగా పక్షములు గలవాఁడు. పక్షములనగా రెక్కలు. రెక్కలు గల వాఁడని యర్థము. పర్వతమునకు రెక్కలున్నవిగాన పర్వతుఁడు స్వర్గమునకుఁ బోవుటలో నాశ్చర్యము లేదు. కాని ప్రపంచమునకు గొప్పగురువైన నారదుఁడు స్వర్గమునకుఁ బోవుటకై యాకాశమున కెగరుట యాశ్చర్యకరమైనది. గురువనగా భారమైనదనియు నర్థము. ఆ భారమైన వస్తువు క్రిందఁబడవలయునే గాని పెకెగర లేదు గదా. కాని యిచ్చట గురువైన(భారము గల) నారదుఁడు పైకెగరుట యాశ్చర్యము. గురువనగా-గౌరవములేదా అచార్యత్వము గలవాఁడని యాశయము. ॥౨॥

శ్లో॥ గచ్ఛతాపథి వినైవ విమానం
వ్యోమ తేన మునినా విజగాహే।
సాధనే హి నియమోఽన్యజనానాం
యోగినాం తు తపసాఖిలసిద్ధిః॥ 3

ప॥వి॥ గచ్ఛతా । పథి । వినా । ఏవ । విమానం । వ్యోమ । తేన । మునినా।

విజగాహే । సాధనే । హి । నియమః । అన్యజనానాం । యోగినాం ।
తు । తపసా । అఖిలసిద్ధిః.

॥ థిప = మార్గమున, విమానం వినైవ = విమానము లేకయే, గచ్ఛతా = వెళ్లుచున్న, తేన = ఆ, మునినా = నారద మహర్షిచే, వ్యోమ = ఆకాశము, విజగాహే = ప్రవేశింపఁబడినది. తథాహి = అది యుక్తమే. సాధనే = ఉపాయమునందు, నియమః = ఆవశ్యకత, అన్యజ నానామ్ = మనవంటియితరజనులకు, యోగినాంతు = నారదమహర్షి వంటి యోగులకో, తపసా = తపస్సు చేత ననగా యోగమువలని ధర్మముచేతనే, అఖిలసిద్ధిః = సకల కార్యముల సిద్ధి యేర్పడుచున్నది. (కాన నారదునికి విమానమువంటి సాధనముతో నవసరము లేదు).

వి॥ యోగులకు సాధనాపేక్ష లేదను సామాన్యముచే, నారదమునికి స్వర్గ గమనమునకై సాధనాపేక్షలేదను విశేషార్థము సమర్థింపఁబడినది గాన నర్థాంతర న్యాసాలంకారము.

## సమాసములు :

అన్యజనానామ్ : అన్యే చ తే జనాశ్చ = అన్యజనాః. తేషామ్ = అన్యజనా నామ్.

యోగినామ్ : యోగః ఏషామ స్తీతి = యోగినః. తేషాం = యోగినామ్.

అఖిలసిద్ధిః : అఖిలస్య సిద్ధిః = అఖిలసిద్ధిః.

## భావము :

ఆ నారదమహర్షి విమానములేకయే స్వర్గమునకు వెళ్లెను. విమానమువంటి సాధనములు మనవంటి సాదారణ జనమునకు నావశ్యకములే గాని నారదునివంటి యోగులక నావశ్యకములు. వారికి తపస్సుచేతను, యోగాభ్యాస జనితసుకృత విశే షముచేతను సకలకార్యములు సిద్ధించుచుండును. కాన నారదుఁడు విమానము లేకయేతపశ్శక్తిచే స్వర్గమునకు పోఁగల్గెను. ॥3॥

శ్లో॥ ఖండితేంద్రభవనాద్యభిమానాన్
లంఘతే స్మ మునిరేష విమానాన్।

అర్థితో உప్యతిథితామనుమేనే
నైవ తత్పతిభిరంఘ్రివినమ్రైః॥ ౪

ప॥వి॥ ఖండితేంద్ర భవనాద్యభిమానాన్ । లంఘతే । స్మ । మునిః । ఏషః ।
విమానాన్ । అర్థితః । అపి । అతిథితామ్ । అనుమేనే । న । ఏవ ।
తత్పతిభిః । అంఘ్రివినమ్రైః.

టీక॥ ఏషః = ఈ, మునిః = నారదమహర్షి, ఖండితేంద్రభవనాద్యభిమానాన్,
ఖండిత = నిరసింపబడిన, ఇంద్రభవనాది = ఇంద్రుని భవనమున్నగు
వానియొక్క, అభిమానాన్ = అహంకారముగల్గిన, విమానాన్ = దేవతల
గృహములను, లంఘతే స్మ = దాటిపోవుచుండెను. (బహునాకిం =
పెక్కింటితో నేమిపని). అంఘ్రివినమ్రైః = పాదములపైఁ బడిన,
తత్పతిభిః = ఆ విమానముల యధిపతులచే, అర్థితఃఅపి = ప్రార్థింప
బడియు, అతిథితామ్ = ఆతిథ్యమును, నైవ అనుమేనే = అంగీకరింప
లేదు.

## సమాసములు :

*ఖండితేంద్రభవనాద్యభిమానాన్ :* ఇంద్రస్యభవనాని = ఇంద్రభవనాని.
ఇంద్రభవనాని ఆదిః యేషాం తాని = ఇంద్రభవనాదీని. ఇంద్రభవనాదీనా మభి
మానః = ఇంద్రభవనాద్యభిమానః, ఖండితః ఇంద్రభవనానాద్యభిమానఃయైస్తే =
ఖండితేంద్రభవనాద్యభిమానాః. తాన్ = ఖండితేంద్రభవనాద్యభిమానాన్.

*అతిథితామ్ :* అతిథేర్భావః = అతిథితా. తామ్ = అతిథితామ్.

*తత్పతిభిః :* తేషాం పతయః = తత్పతయః, తైః = తత్పతిభిః.

*అంఘ్రివినమ్రైః:* అంఘ్రిషు వినమ్రాః = అంఘ్రివినమ్రాః. తైః =
అంఘ్రివినమ్రైః.

## భావము :

ఈనారదుఁడు గగనమార్గమున, ఇంద్రాదుల భవనములను మించి ప్రకా
శించెడి దేవగృహములను దాటి వెళ్లుచుండెను. ఆ దేవగృహముల కధిపతులగు

దేవతలు ఆతిథ్యములను పరిగ్రహింపుమని ప్రార్థించినను. దానివలన నాలస్య మగునని తలంచి నారదమహర్షి యా యాతిథ్యములను స్వీకరింపలేదు. ॥౮॥

శ్లో॥ తస్యతాపనభియా తపనస్స్వం
తావదేవ సమకోచయదర్చిః।
యావదేష దివసేన శశీవ
ద్రాగతప్యత న తన్మహసైవ॥ ౫

ప॥వి॥ తస్య । తాపనభియా । తపనః । స్వం । తావత్ । ఏవ । సమకోచయత్ । అర్చిః । యావత్ । ఏషః । దివసేన । శశీ । ఇవ । ద్రాక్। అతప్యత । న । తన్మహసా । ఏవ.

టీక॥ తపనః = సూర్యుఁడు, తస్య = ఆ నారద మహర్షికి, తాపనభియా = తాపముగల్గించుట వలని భయముచే, స్వం = తనదైన, అర్చిః = తేజస్సును. తావదేవ = అంతలోపలనే (ముందుగానే) సమకోచయత్ = తగ్గించుకొనెను. యావత్ = ఎంతలో, ఏషః = ఈసూర్యుఁడు, దివసేన = పగటి తేజస్సుచే, శశీవ = చంద్రుఁడువలె, తన్మహసైవ; తత్ = ఆ నారద మహర్షియొక్క, మహసైవ = తేజస్సుచేతనే, ద్రాక్ = వెంటనే, (తాను), నాతప్యత = కాల్పఁబడడో.

## సమాసములు:

తాపనభియా : తాపనాత్ భీః = తాపనభీః. తయా = తాపనభియా.

శశీ : శశః అస్య అస్తీతి = శశీ.

తన్మహసా : తస్య మహః = తన్మహః. తేన = తన్మహసా.

## భావము

సూర్యుఁడు నారద మహర్షికి నెండవలన తాపము గలుగునను భయముచే తన తేజస్సును ముందుగనే యుపసంహరించుకొనెను. అట్లు చేయకయున్నచో చంద్రుఁడు తన తేజస్సుచే పగటియందు తాపముఁబొంది తేజస్సును కోల్పోయి

నట్లే, తానుగూడ నా నారద మహర్షి తేజస్సుచేఁ దాపముఁబొంది తేజస్సునుఁ గోల్పోయెడివాడు. కావున తన తేజస్సునుఁ దగ్గించుకొని నారదునకు సంతాపముగలుగని విధముగ వర్తించెను. ॥౨॥

శ్లో॥ పర్యభూద్దినమణిర్ద్విజరాజం
యత్కరైరహహ తేన తదా తమ్।
పర్యభూత్ ఖలుక రైర్ద్విజరాజః
కర్మ కస్స్వకృతమత్ర న భుంక్తే॥ ౬

ప॥వి॥ పర్యభూత్ । దినమణిః । ద్విజరాజం । యత్ । కరైః । అహహ । తేన । తదా । తమ్ । పర్యభూత్ । ఖలు । కరైః । ద్విజరాజః । కర్మ । కః । స్వకృతమ్ । అత్ర । న । భుఙ్క్తే.

టీక॥ దినమణిః = సూర్యుఁడు. ద్విజరాజం = చంద్రుని, (బ్రాహ్మణశ్రేష్ఠుని), కరైః = కిరణముచే (హస్తములచేతను), పర్యభూదితి యత్ = పరిభవించెనునది యేదికలదో, తేన = ఆపరిభవమను హేతువుచే, తదా = ఆనారదుఁడువచ్చినకాలమందు, తం = ఆసూర్యుని, ద్విజరాజః = బ్రాహ్మణోత్తముఁడు (చంద్రుఁడు), కరైః = కిరణమలచేత (హస్తములచేత), పర్యభూత్ ఖలు = తిరస్కరించెనుగదా, అహహ = కష్టము. తథాహి = అదియుక్తమే, అత్ర = ఈ జీవలోకమందు. కః = ఎవఁడు. స్వకృతం = తనచేఁజేయఁబడిన, కర్మ = కర్మమును, న భుఙ్క్తే = అనుభవింపడు.

వి॥ సూర్యుఁడు ద్విజరాజును తిరస్కరించినందువలన ద్విజరాజు (అనగా నారదుఁడు) సూర్యుని తిరస్కరించెనను విశేషార్థము, ఎవఁడు తానుజేసిన కర్మముననుభవింపడు అను సామాన్యార్థముచే సమర్థింపఁ బడుటవలన, అర్థాంతరన్యాసాలంకారము.

## సమాసములు :

*దినమణిః :* దినస్య మణిః = దినమణిః.

*ద్విజరాజమ్ :* ద్విజానాం రాజా = ద్విజరాజః. తమ్ = ద్విజరాజమ్.

స్వకృతమ్ : స్వేనకృతమ్ = స్వకృతమ్. తత్ = స్వకృతమ్.

**భావము :**

సూర్యుఁడు ద్విజరాజును (చంద్రుని) బ్రాహ్మణోత్తముని తిరస్కరించి నందువలన, నా సూర్యుని ద్విజరాజు (చంద్రుఁడు) బ్రాహ్మణోత్తముఁడైన నారదుఁడు తన కిరణములచేతను (హస్తముల చేతను) తిరస్కరించెను. అనగా సూర్యకిరణములచేత ద్విజరాజైన చంద్రునికి కాంతి తగ్గును. బ్రాహ్మణోత్తమునకు తిరస్కారమేర్పడునని యర్థాంతరము. ఇట్లు సూర్యుఁడు ద్విజరాజ తిరస్కారముఁ జేయుటవలన, నా సూర్యుని ద్విజరాజైన నారదమహర్షి (చంద్రుఁడును) తన హస్తముతో (తన కిరణములతో) తిరస్కరించెను. అనగా నారదమహర్షి సూర్యమండలము నతిక్రమించి గగనమార్గమున వెళ్లుచున్నాఁడని సూచితము. లోకమున కర్మఁజేసిన వాఁడు ఫలము ననుభవింపవలయును గదా. సూర్యుఁడు చంద్ర తిరస్కారమను ద్విజరాజ తిరస్కారముతో సంపాదించిన పాపమునకు, ఫలమును ద్విజరాజగు నారదమహర్షి హస్తములతో తిరస్కరింపఁబడుటచే (మఱుగుపఱచఁబడుటచే) ననుభవించెను. ॥౭॥

శ్లో॥ విష్టరం తటకుశాళిభిరద్భిః
పాద్యమర్ఘ్యమథ కచ్ఛరుహాభిః।
పద్మబృందమధుభిర్మధుపర్కం
స్వర్గసింధురదితాఽతిథయేఽస్మై॥ ౭

ప॥వి॥ విష్టరం । తటకుశాళిభిః । అద్భిః । పాద్యమ్ । అర్ఘ్యమ్ । అథ । కచ్ఛరుహాభిః । పద్మబృందమధుభిః । మధుపర్కం । స్వర్గసింధుః । అదిత । అతిథయే । అస్మై.

టీక॥ అథ = పిదప, స్వర్గసింధుః = ఆకాశగంగ, అతిథయే = అతిథియైన, అస్మై = ఈ నారదుని కొఱకు, తటకుశాళిభిః; తట = గట్టునందలి, కుశాళిభిః = దర్భపంక్తులతో, విష్టరం = ఆసనమును, అద్భిః = ఉదకములతో, పాద్యం = పాదములఁ గడుగుటకైన యుదకమును, కచ్ఛరుహాభిః: కచ్ఛ = తేమగల్గిన నేలయందు, రుహాభిః = మొలచునటువంటి

తీగెలచే, అర్ఘ్యం = పూజార్థపు పుష్పఫలాదికమును, పద్మబృందమధుభిః; పద్మబృంద = పద్మ సమూహముయొక్క, మధుభిః = మకరందములతో, మధుపర్కం = మధుపర్కమును, అదిత = ఇచ్చినది.

వి॥ ఇచ్చట దర్భాదులు, ఆసనాదులుగా పరిణమించి అతిథిసత్కార క్రియార్థములై నందువలన పరిణామాలంకారము.

## సమాసములు :

*తటకుశాళిభిః :* తటే కుశాః = తటకుశాః. తటకుశానామాళయః = తటకుశాళయః. తాభిః = తటకుశాళిభిః.

*పాద్యమ్ :* పాదార్థమ్ (జలమ్) = పాద్యమ్. తత్ = పాద్యమ్.

*అర్ఘ్యమ్ :* అర్ఘార్థమ్ అర్ఘ్యమ్. తత్ = అర్ఘ్యమ్.

*కచ్ఛరుహాభిః :* కచ్ఛేరోహంతీతి = కచ్ఛరుహాః. తాభిః = కచ్ఛరుహాభిః.

*పద్మబృందమధుభిః :* పద్మానాం బృందాః = పద్మబృందాః. పద్మబృందానాం మధూని = పద్మబృందమధూని. తైః = పద్మబృందమధుభిః.

*మధుపర్కమ్ :* మధునా పృచ్యత ఇతి = మధుపర్కః. తమ్ = మధుపర్కమ్.

*స్వర్గసింధుః :* స్వర్గస్య సింధుః = స్వర్గసింధుః.

## భావము :

గగనమార్గమునఁ బయనించుచున్న నారదమహర్షి యాకాశ గంగనుఁ జేరెను. ఆ యాకాశగంగ, నారదమహర్షికి తన గట్టున మొలచిన దర్భలతో, నాసనమును, తన యుదకములతో పాద్యమును, తన తేమ నేలలలో మొలచిన తీగెలతో పూజాద్రవ్య సంభారమును, తన యందుద్భవించిన పద్మముల మకరందములతో మధుపర్కమును, అనగా తేనెతోఁ గలసిన పెరుగును సమర్పించుటచే నతిథి సత్కారముఁ గావించెను. ॥౭॥

శ్లో॥ స వ్యతీత్య వియదంతరగాధం
నాకనాయకనికేతనమాప।

సంప్రతీర్య భవసింధుమనాదిం
బ్రహ్మ శర్మభరచారు యతీవ॥ ౭౦

ప॥ వి॥ సః । వ్యతీత్య । వియదంతః । అగాధం । నాకనాయకనికేతనమ్ । ఆప । సంప్రతీర్య । భవసింధుమ్ । అనాదిమ్ । బ్రహ్మ । శర్మభరచారు । యతీ । ఇవ.

టీక॥ సః = ఆ నారదమహర్షి, అగాధం = లోతైన, వియదంతః = ఆకాశ మధ్యభాగమును, వ్యతీత్య = అతిక్రమించి, నాకనాయక నికేతనం; నాకనాయక = స్వర్గమునకు ప్రభువైన ఇంద్రునియొక్క, నికేతనం = భవనమును, యతీ = యోగి, అనాదిం = ఆదిలేని, భవసింధుం = సంసార సాగరమును, సంప్రతీర్య = చక్కగ తరించి, శర్మభరచారు; శర్మభర = పరమానందముచే, చారు = రమ్యమైన, బ్రహ్మేవ = పరమాత్మనువలె, ఆప = పొందెను.

వి॥ ఇచ్చట నారదుని యోగితోఁడను ఇంద్రభవనమును పరమాత్మతోను బోల్చుటవలన నుపమాలంకారము.

## సమాసములు :

*వియదంతః :* వియతః అంతః = వియదంతః.

*నాకనాయకనికేతనమ్ :* నాకస్య నాయకః = నాకనాయకః. నాకనాయకస్య నికేతనమ్ = నాకనాయకనికేతనమ్. తత్ = నాకనాయకనికేతనమ్.

*భవసింధుమ్ :* భవ ఏవ సింధుః = భవసింధుః. తమ్ = భవసింధుమ్.

*అనాదిమ్ :* అవిద్యమానః ఆదిః యస్య సః = అనాదిః. తమ్ = అనాదిమ్.

*శర్మభరచారు :* శర్మణాం భరః = శర్మభరః. శర్మభరేణ చారు = శర్మభరచారు. తత్ = శర్మభరచారు.

## భావము :

ఆ నారదమహర్షి గగనమార్గమున పయనించుచు, అగాధమైన యాకాశ మధ్యభాగమును దాటి ఇంద్రభవనమును, బొందెను. అది ఆదిలేని,

సంసారసముద్రమునుఁ దాటి పరమానంద సుందరమైన పరబ్రహ్మమును యోగి పొందిన విధముగ నున్నది. ॥౮॥

శ్లో॥ అర్చనాభిరుచితోచ్చతరాభి
శ్చారు తం సదకృతాఽతిథిమింద్రః।
యావదర్హకరణం కిల సాధోః
ప్రత్యవాయధుతయే న గుణాయ॥ ౯

ప॥వి॥ అర్చనాభిః । ఉచ్చితోచ్చతరాభిః । చారు। తం। సదకృత। అతిథిమ్ । ఇంద్రః । యావదర్హకరణం । కిల । సాధోః । ప్రత్యవాయధుతయే । న । గుణాయ.

టీక॥ ఇంద్రః = ఇంద్రుఁడు, తమ్ = ఆ, అతిథిం = అతిథియైన నారదమహర్షిని, ఉచితోచ్చతరాభిః; ఉచిత = విధింపఁబడిన వానికంటెను, ఉచ్చతరాభిః = మిక్కిలి యధికములైన, అర్చనాభిః = పూజలచే, చారు = చక్కఁగా, సదకృత = సత్కరించెను. యావదర్హకరణం; యావదర్హ = ఎంతవరకు విధింపఁబడినదో యంతవరకు, కరణం = ఆచరించుట, సాధోః = శ్రద్ధాళువైన వానికి, ప్రత్యవాయధుతయే; ప్రత్యవాయ = పాపముయొక్క, ధుతయే = నివృత్తి కొఱకు మాత్రమే (అగును), గుణాయ = గుణవిశేషము కొఱకు, నకిల = కాదు గదా.

వి॥ శాస్త్రవిహితములకంటె నధికమయిన పూజలతో నారదుని సత్కరించెనను, విశేషార్థమును; యావదర్హ కరణము పాపమునుఁ దొలగించునేగాని గుణవిశేషమునుఁ గలిగించదను సామాన్యముచే సమర్థించుటవలన నర్థాంతర న్యాసాలంకారము.

## సమాసములు:

*ఉచితోచ్చతరాభిః :* అత్యంతముచ్చాః = ఉచ్చతరాః. ఉచితాత్ ఉచ్చతరాః = ఉచితోచ్చతరాః. తాభిః = ఉచితోచ్చతరాభిః.

*యావదర్హకరణమ్ :* యావతీ అర్హా = యావదర్హం. యావదర్హం కరణమ్ = యావదర్హకరణం.

ప్రత్యవాయధుతయే : ప్రత్యవాయస్య ధుతిః = ప్రత్యవాయధుతిః-తస్యై = ప్రత్యవాయధుతయే.

**భావము :**

ఇంద్రుఁడు తనకు నతిథియైన నారద మహర్షిని, శాస్త్రవిహితమైన పరిమితిని మించిన పూజలతో సత్కరించెను. శాస్త్రమునందు విధింపఁబడిన దానికి ఆచరించుటవలన, ఆచరింపక పోవుటవలన కలుగు పాపము శమించును కాని దాని వలన గొప్ప ఫలమేమియు నుండదు. కాన శాస్త్ర విహితాంశములనుమించిన పూజలతో నారదుని సత్కరించెను. ॥౯॥

శ్లో॥ నామధేయసమతాసఖమద్రే
రద్రిభిన్మునిమథాఽద్రియత ద్రాక్।
పర్వతోఽపి లభతాం కథమర్చాం
న ద్విజః స విబుధాధిపలంభీ॥ ౧౦

ప॥వి॥ నామధేయ సముతాసఖమ్ । అద్రేః । అద్రిభిత్ । మునిమ్ । అథ । ఆద్రియత । ద్రాక్ । పర్వతః । అపి । లభతాం। కథమ్ । అర్చాం । న । ద్విజః । సః । విబుధాధిపలంభీ.

టీక॥ అథ = నారదుని సత్కరించిన పిదప, అద్రిభిత్ = పర్వతములను భేదించినయింద్రుఁడు, అద్రేః = పర్వతమునకు,నామదేయ సమతాసఖం; నామధేయసమతా = నామసామ్యముతో, సఖం = చెలికాఁడైన, మునిం = పర్వతమునిని, ద్రాక్ = శీఘ్రముగా, ఆద్రియత = సత్కరించెను. పర్వతోఽపి = పర్వతుఁడైనను (పర్వతమైనను), సః = ఆ, ద్విజః = బ్రాహ్మణుఁడు, విబుధాధిపలంభీ; విబుధాధిప = దేవేంద్రుని (పండితోత్త మునిని), లంభీ = ఆశ్రయించిన వాఁడై, కథం = ఎట్లు, అర్చాం = పూజను, నలభతాం = పొందఁడు.

**సమాసములు :**

నామధేయసమతాసఖమ్ : నామధేయేన సమతా = నామధేయసమతా.

నామధేయసమతయా సఖా = నామధేయసమతాసఖః. తమ్ = నామధేయసమతా సఖమ్.

*అద్రిభిత్ :* అద్రీన్ భినత్తీతి = అద్రిభిత్.

*విబుధాధిపలంభీ:* విబుధానామధిపః = విబుధాధిపః. విబుధాధిపం లభత ఇతి = విబుధాధిపలంభీ.

**భావము :**

నారదుని సత్కరించిన వెంటనే యింద్రుఁడు నారదుని వెంట వచ్చిన పర్వతమునిని సత్కరించెను. ఈ పర్వతముని, పేరుతో పర్వతసామ్యముగల్గి పర్వతములకు మిత్రుఁడైనను, పర్వతభేదకుడైన యింద్రుఁడు పూజించుట సముచితమైనది. ఏలయనగా—ఇతడు పేరుచే పర్వతుఁడైనను, ద్విజుఁడు; విబుధాధిపుడైన దేవేంద్రుని, విబుధాధిపుడైన అనగా పండితోత్తముఁడైన నారదుని ఆశ్రయించినవాఁడు. కాన,పూజను ఏలపొందఁడు? తప్పక పొందఁగలడు. బ్రాహ్మణుఁడు పర్వతమై, పాషాణముతో సమానమైన మూర్ఖుఁడైనను బ్రాహ్మణత్వము చేతనే పూజార్హుఁడు. ఇక, దేవేంద్రుని (పండితోత్తముని) ఆశ్రయించిన యీపర్వతుఁడెట్లు పూజార్హుఁడు కాఁడు.పర్వతారియగు నింద్రునకు పర్వతనామముతో నితఁడు శత్రువైనను,అతఁడు పూజార్హుఁడే. ఏలయనగా,శత్రువైనను, అతిథిగా నింటికి వచ్చినచో నతనిని, వివేకవంతుఁడు తప్పక సత్కరింపవలయును గదా! ఇక దేవేంద్రునివంటి విజ్ఞుఁడెట్లు పూజింపక యుండగలఁడని సూచితము. ॥౧౦॥

శ్లో॥ తద్భుజాదతివితీర్ణసపర్యాత్
ద్యోద్రుమానపి వివేద మునీంద్రః।
స్వఃసహస్థితిసుశిక్షితయా తాన్
దానపారమితయైవ వదాన్యాన్॥ ౧౧

ప॥వి॥ తద్భుజాత్ । అతివితీర్ణసపర్యాత్ । ద్యోద్రుమాన్ । అపి । వివేద । మునీంద్రః । స్వః సహస్థితి సుశిక్షితయా । తాన్ । దానపారమితయా । ఏవ । వదాన్యాన్.

టీక॥ మునీంద్రః = మునిశ్రేష్ఠుఁడగు నారదుఁడు, తాన్ = ప్రసిద్ధములైన, ద్యోద్రుమానపి = స్వర్గమందలి కల్పవృక్షములను సైతము, అతివితీర్ణ సపర్యాత్; అతి = అధికముగా, వితీర్ణ = ఈయఁబడిన, సపర్యాత్ = పూజకల్గిన, తద్భుజాత్ = ఆ యింద్రుని భుజమునుండి, స్వఃసహస్థితి సుశిక్షితయా; స్వః = స్వర్గమందు, సహస్థితి = కూడనుండుటచే, సుశిక్షతయా = చక్కఁగా నేర్పఁబడిన, దానపారమితయైవ = "దానపారమిత" యను దాన ప్రతిపాదక గ్రంథముచేతనే, వదాన్యాన్ = త్యాగశీలములైనవిగ, వివేద = తెలిసికొనెను.

## సమాసములు :

తద్భుజాత్ : తస్య భుజః = తద్భుజః. తస్మాత్ = తద్భుజాత్.

అతివితీర్ణసపర్యాత్ : అత్యంతం వితీర్ణా = అతివితీర్ణా. అతివితీర్ణా సపర్యా యేన సః = అతీవితీర్ణసపర్యః. తస్మాత్ = అతివితీర్ణ సపర్యాత్.

ద్యోద్రుమాన్ : ద్యావః ద్రుమాః = ద్యోద్రుమాః. తాన్ = ద్యోద్రుమాన్.

మునీంద్రః : మునీనామింద్రః = మునీంద్రః.

స్వఃసహస్థితి సుశిక్షితయా : స్వః సహస్థితిః = స్వస్సహస్థితిః. స్వస్సహస్థిత్యా సుశిక్షితా = స్వస్సహస్థితిసుశిక్షితా. తయా = స్వస్సహస్థితి సుశిక్షితయా.

## భావము :

నారదుఁడా యింద్రుని భుజమువలన గొప్ప సత్కారమునందుకొనెను. అట్లు గొప్ప సత్కారము గావించిన యింద్రుని భుజమనెడి గురువునుండి స్వర్గలోకమందు నింద్రునితోడ నుండెడి కల్పవృక్షములు, "దానపారమిత" యను దానప్రతిపాదక గ్రంథము నధ్యయనముఁజేసి, త్యాగశీలము నలవరచుకొనిన వేమోయని నారఁదుడు తలంచెను.

శ్లో॥ ముద్రితాన్యజనసంకథనస్స
న్నారదం బలరిపుస్సమవాదీత్
ఆకరస్స్వ పరభూరికథానామ్
ప్రాయశో హి సుహృదోస్సహవాసః॥ ౧౨

ప॥వి॥ ముద్రితాన్య జనసంకథనః । సన్ । నారదం । బలరిపుః । సమవాదీత్ । ఆకరః । స్వపరభూరికథానాం । ప్రాయశః । హి । సుహృదోః । సహవాసః.

టీక॥ బలరిపుః = బలుఁడను రాక్షసునకు శత్రువైన యింద్రుఁడు, ముద్రితాన్యజనసంకథనస్సన్; ముద్రిత = నివారింపబడిన, అన్యజన = ఇతర జనులయొక్క, సంకథనస్సన్ = సల్లాపముగలవాఁడై, నారదం = నారద మహర్షినిఁ గూర్చి, సమవాదీత్ = పలికెను. ప్రాయశః = తఱచుగా, సుహృదోః = మిత్రద్వయముయొక్క, సహవాసః = కలయిక, స్వపర భూరికథానాం; స్వ = తనకు సంబంధించిన, పర = ఇతరులకు సంబంధించిన, భూరికథానాం = వివిధ ప్రసంగములకు, ఆకరో హి = గని గదా?.

వి॥ "మునితో నింద్రుఁడు సంభాషించెను" అను విశేషార్థము, "మిత్రుల సమాగమము స్వపరభూరికథలకు గని" యను సామాన్యార్థముచే సమర్థింపఁబడుటవలన, అర్థాంతరన్యాసాలంకారము.

## సమాసములు :

ముద్రితాన్యజనసంకథనః: అన్యే చ తే జనాశ్చ = అన్యజనాః. అన్యనానాం సంకథనం = అన్యజన సంకథనమ్. ముద్రితమ్ అన్యజనసంకథనం యేన సః = ముద్రితాన్యజనసంకథనః.

బలరిపుః : బలస్య రిపుః = బలరిపుః.

స్వపరభూరికథానామ్ : స్వే చ పరే చ = స్వపరే. భూరయశ్చ తాః కథాశ్చ = భూరికథాః. స్వపరేషాం భూరికథాః = స్వపరభూరికథాః. తాసాం = స్వపరభూరికథానామ్.

సహవాసః : సహ వాసః = సహవాసః.

## భావము :

ఇంద్రుఁడు నారదుని సత్కరించిన పిదప నితరులతో సంభాషణలను మాని, నారదునితో సంభాషింప మొదలిడెను. వారి సంభాషణలో తమకు సంబం

ధించిన సంగతులు, పరులకు సంబంధించిన సంగతులు ప్రసక్తములగు చుండి నవి. మిత్రుల కలయిక తమ సమాచారములకు పరుల సమాచారములకు సాధారణముగ పుట్టువంటిది గదా. ॥౧౨॥

శ్లో॥ తం కథాఽనుకథనప్రసృతాయాం
దూరమాలపనకౌతుకితాయాం।
భూభృతాం చిరమనాగమహేతుం
జ్ఞాతుమిచ్ఛురవదచ్ఛతమన్యుః॥ ౧౩

ప॥వి॥ తమ్ । కథానుకథనప్రసృతాయాం । దూరమ్। ఆలపనకౌతుకితాయాం। భూభృతాం । చిరమ్ । అనాగమహేతుం । జ్ఞాతుమ్ । ఇచ్ఛుః । అవదత్ । శతమన్యుః.

టీక॥ శతమన్యుః = ఇంద్రుఁడు, ఆలపనకౌతుకి తాయాం = సంభాషణ కుతూహలము, దూరం = దూరముగా (అధికముగా), కథాను కథనప్రసృతా యాంసత్యాం: కథాఽనుకథన = ఉత్తర ప్రత్యుత్తరములతో, ప్రసృతా యాం సత్యాం = వ్యాపింపగా, చిరం = చాలకాలముగా, భూభృతాం = రాజులయొక్క, అనాగమహేతుం; అనాగమ = స్వర్గమునకు రాక పోవుటలో, హేతుం = కారణమును, జ్ఞాతుం = తెలుసుకొనుటకు, ఇచ్ఛుః = కోరిక కలవాఁడై, తం = ఆ నారదునిఁ గూర్చి, అవదత్ = అడిగెను.

## సమాసములు :

కథాఽనుకథనప్రసృతాయామ్ : కథాచ అనుకథనంచ = కథానుకథనే. కథానుకథనాభ్యాం ప్రసృతా = కథాఽనుకథనప్రసృతా. తస్యాం = కథాఽనుకథన ప్రసృతాయామ్.

ఆలపనకౌతుకితాయామ్ : కౌతుకమస్యాఽస్తీతి = కౌతుకీ. కౌతుకినః భావః = కౌతుకితా. ఆలపనే కౌతుకితా = ఆలపనకౌతుకితా. తస్యాం = ఆలపన కౌతుకితాయామ్.

భూభృతామ్ : భువం బిభ్రతీతి = భూభృతః. తేషాం = భూభృతామ్.

శతమన్యుః : శతం మన్యవః యస్య సః = శతమన్యుః.

భావము :

ఇంద్రనారదుల సల్లాపము మధ్య ప్రసక్తములగు వచనాను వచనము లతో, చాలదూరము పెరిగిపోయినది. అప్పుడింద్రుఁడు, చాల కాలమునుండి భూమి యందున్న రాజులు స్వర్గమునకు రాకపోవుటకుఁ గారణమునుఁ దెలియ గోరి, నారదుని బ్రశ్నించెను. ॥౧౩॥

శ్లో॥ ప్రాగివ ప్రసువతే నృపవంశాః
కిన్ను సంప్రతి న వీరకరీరాన్।
యే పరప్రహరణైః పరిణామే
విక్షతాః క్షితితలే నిపతంతి॥ ౧౪

ప॥వి॥ ప్రాక్ । ఇవ । ప్రసువతే। నృపవంశాః । కిం। ను । సంప్రతి । న । వీరకరీరాన్ । యే । పరప్రహరణైః । పరిణామే। విక్షతాః । క్షితితలే। నిపతంతి.

టీక॥ నృపవంశాః = రాజవంశములు,(నృప = రాజులనెడి, వంశాః = వెదుళ్లు), ప్రాగివ = పూర్వమువలె, సంప్రతి = ఇప్పుడు, వీరకరీరాన్; వీర = వీరులనెడి, కరీరాన్ = మొలకలను, నప్రసువతేకిన్ను = కనుటలేదా యేమి?, యే = ఏ వీరులనెడి యంకురములు, పరిణామే = పరిపక్వదశ యందు, (పండిన దశయందు),పరప్రహరణైః; పర = శత్రువులయొక్క (ఇతరుల యొక్క) ప్రహరణైః = ఆయుధములచేత, (కత్తులచేత) విక్షతాః = విశేషముగ గాయపడిన వారై, తెగఁగొట్టఁబడినవై, క్షితి తలే = భూమిపై, నిపతంతి = పడుచున్నవి.

## సమాసములు :

నృపవంశాః నృపాణాం వంశాః = నృపవంశాః. నృపా ఏవ వంశాః = నృపవంశాః.

వీరకరీరాన్ : వీరా ఏవ కరీరాః = వీరకరీరాః, తాన్ = వీరకరీరాన్.

పరప్రహరణైః : పరేషాం ప్రహరణాని = పరప్రహరణాని. తైః = ప్రహరణైః.

**భావము :**

రాజవంశములు, (రాజులనెడి వెదుళ్లు), పూర్వమువలె వీరులనెడి వెదురు మొలకలను కనుటలేదా: ఆవీరులనెడి వెదురు మొలకలు, పరిపక్వ దశయందు, పండుబారిన, దశయందు యాయుధములచేత, ఇతరుల కత్తులచేత గాయపడినవై (కోయఁబడినవై), భూమిపైఁ బడును. వీరులు పరిపక్వదశ యందు యుద్ధ రంగమున శత్రువుల యాయుధములచే గాయపడి భూమిపైఁ బడెదరు. వారు మరణించినచో స్వర్గమునకు వత్తురు గదా. వెదళ్లు పండిన పిదప కత్తులతో నరుకఁబడి నేలపైఁ బడును గదా. ఇచ్చట రాజులు వంశ శబ్దశ్లేషతో వెదుళ్లతోఁ రూపింపబడిరి. వీరులు వెదురు మొలకతో రూపింపఁబడిరి.

శ్లో॥ పార్థివం హి నిజమాజిషు వీరా
దూరమూర్ధ్వగమనస్య విరోధి।
గౌరవాత్ వపురపాస్య భజంతే
మత్కృతామతిథి గౌరవబుద్ధిమ్॥ ౧౫

ప॥వి॥ పార్థివం హి । నిజమ్ । ఆజిషు । వీరాః । దూరమ్ । ఊర్ధ్వగమనస్య । విరోధి । గౌరవాత్ । వపుః । అపాస్య । భజంతే । మత్కృతామ్ । అతిథి గౌరవబుద్ధిమ్.

టీక॥ వీరాః = ముందుఁజెప్పబడినట్టి వీరులు, అనగా రణరంగమునఁ బడి పోయిన వీరులు, పార్థివం = పృథివీ వికారమైనదియు, (అతఏవ = కావుననే), గౌరవాత్ = గురుత్వమువలన, అనగా భారముతో గూడుటవలన, ఊర్ధ్వగమనస్య = పైకిఁబోవుటకు, దూరం = మిక్కిలి, విరోధి = ప్రతిబంధకమైనదియు, (ఊర్ధ్వగమనస్య = పైనున్న లోకములకు వెళ్లుటకు, దూరం = మిక్కిలి, విరోధి = ప్రతిబంధకమైనదియువగు) నిజం = తమదైన, వపుః = శరీరమును, ఆజిషు = యుద్ధములయందు, అపాస్య = వదలిపెట్టి, మత్కృతాం = నాచేఁ జేయఁబడిన, అతిథి గౌరవబుద్ధిం; అతిథిగౌరవ = అతిథి సత్కారముయొక్క, బుద్ధిం = సమృద్ధిని, భజంతే = పొందుచున్నారు. లేదా, గౌరవాత్ = ఆదరాతిశయమున, అతిథిగౌరవబుద్ధిం = అతిథి సత్కార సమృద్ధిని, భజన్తే = పొందుచున్నారు; అనియు నర్థమిచ్చును.

**సమాసములు :**

*పార్థివమ్* : పృథివ్యాః ఇదం = పార్థివం; తత్ = పార్థివమ్.

*ఊర్ధ్వగమనస్య* : ఊర్ధ్వం గమనం = ఊర్ధ్వగమనం. తస్య = ఊర్ధ్వగమనస్య.

*గౌరవాత్* : గురోర్భావః = గౌరవం. తస్మాత్ = గౌరవాత్.

*మత్కృతామ్* : మయా కృతా = మత్కృతా. తామ్ = మత్కృతామ్.

*అతిథిగౌరవబుద్ధిమ్* : అతిథేః గౌరవమ్ = అతిథిగౌరవమ్. అతిథిగౌరవస్య బుద్ధిః = అతిథి గౌరవబుద్ధిః. తామ్ = అతిథిగౌరవబుద్ధిమ్.

**భావము :**

యుద్ధ రంగమున పడిపోయిన వీరులు పృథివీ వికారమైన తమ శరీరము భారమగుటవలన నూర్ధ్వలోకములకువెళ్లుటకు ప్రతిబంధకమని దానిని త్యజించి నేనుగావించెడి యతిథి సత్కారములను బొందుచున్నారు. దూరమునకు వెళ్లెడి వారు భారమును మోయలేక దానినెట్లు వదలిపెట్టి వెళ్లెదరో, అట్లే దూరమైన స్వర్గమునకు వెళ్లెడి రాజులు భారమైన తమ శరీరమును భూమిపై వదలిపెట్టి వెళ్లుదురని సూచితము. అట్టిరాజులిప్పుడేల వచ్చుటలేదని యాశయము. ॥౧౫॥

**శ్లో॥** సాభిశాపమివ నాఽతిథయస్తే
మాం యదద్య భగవన్నుపయాంతి।
తేన న శ్రియమిమాం బహుమన్యే
స్వోదరైకభృతికార్యకదర్యామ్॥ ౧౬

**ప॥వి॥** సాభిశాపమ్ । ఇవ । న । అతిథయః । తే । మాం । యత్ । అద్య । భగవన్ । ఉపయాంతి । తేన । న । శ్రియమ్ । ఇమాం । బహు । మన్యే । స్వోదరైకభృతికార్యకదర్యామ్.

**టీక॥** హే భగవన్ = పూజ్యుడైన నారద మహర్షీ, తే = అవీరులైన, అతిథయః = అతిథులు, సాభిశాపమివ = దోషము నా యెడలేక పోయినను,

దోషముతోఁ గూడిన వాని వలె, మామ్ = నన్ను, అద్య = ఇప్పుడు, నోపయాంతీతియత్ = పొందుట లేదను నదియేది కలదో, తేన = ఆ కారణముచే, స్వోదరైక భృతి కార్యకదర్యామ్; స్వోదరైక = నా యుదరమునకు మాత్రమే, భృతికార్య = పోషణ కార్యముచే, కదర్యాం = నింద్యమైన, ఇమాం = ఈ, శ్రియమ్ = ఐశ్వర్యమును, బహు = గొప్పగా, నమన్యే = తలంపను.

వి॥ అభిశాప మనగా తప్పులేక పోయినను, దానిని ఆరోపించుట. అదియే మిథ్యాభిశంసనమని చెప్పబడును.

కదర్యుఁడనగా-ఎవ్వడు లోభముచే, తన్ను, ధర్మకార్యములను, పుత్రులను, భార్యలను, తల్లిదండ్రులను, భృత్యులను పోషింపక బాధించునో, యతఁడు.

## సమాసములు :

సాభిశాపమ్ : అభిశాపేన సహ వర్తత ఇతి = సాభిశాపః. తమ్ = సాభిశాపమ్.

స్వోదరైకభృతికార్యకదర్యామ్ : స్వస్య ఉదరం = స్వోదరమ్. స్వోదరమేవ = స్వోదరైకం. స్వోదరైకస్య భృతిః = స్వోదరైకభృతిః. స్వోదరైకభృతిరేవ కార్యం = స్వోదరైకభృతికార్యమ్. స్వోదరైకభృతికార్యేణ కదర్యా = స్వోదరైక భృతి కార్యకదర్యా. తామ్ = స్వోదరైకభృతికార్యకదర్యామ్.

## భావము :

పూజ్యుఁడవైన నారదమహర్షీ! యుద్ధరంగమున శరీరము త్యజించిన, వీరులైన యతిథులు, నాయెడనభూతమైన నింద నారోపించినట్లుగా, నా యొద్దకు వచ్చి, ఆతిథ్యమును గ్రహించుటలేదు. నా యైశ్వర్యమంతయు కేవలము నా యుదర పోషణ కార్యమున కుపయోగపడుటవలన నింద్యమైనది. కాన నేను నీ సంపదలను గొప్పగా భావించుటలేదు. సంపదలకు సత్పాత్రులందు వినియోగము లేనపుడు వానికి నేవిధమగు విలువ యుండదు. ॥౧౬॥

శ్లో॥ పూర్వపుణ్యవిభవ వ్యయలబ్ధాః
సంపదో విపద ఏవ విమృష్టాః।
పాత్రపాణికమలార్పణమాసాం
తాసు శాంతికవిధిర్విధిదృష్టః॥ ౧౭

ప॥వి॥ పూర్వపుణ్యవిభవవ్యయలబ్ధాః । సంపదః । విపదః । ఏవ । విమృష్టాః । పాత్రపాణికమలార్పణమ్ । ఆసామ్ । తాసు । శాంతికవిధిః । విధిదృష్టః.

టీక॥ పూర్వపుణ్యవిభవవ్యయలబ్ధాః; పూర్వపుణ్య = పూర్వజన్మమందలి పుణ్యముయొక్క, విభవ = అతిశయముయొక్క, వ్యయ = వినియోగముచే, లబ్ధాః = పొందఁబడిన, సంపదః = సంపదలు, విమృష్టాస్సత్యః = విచారింపఁబడినవై, విపదఏవ = ఆపదలే యగుచున్నవి. తాసు = ఆ సంపదల రూపమునందున్న ఆపదలుండగా, ఆసాం = ఈ సంపదలకు, పాత్రపాణికమలార్పణమ్; పాత్ర = విద్యయు, జాతియు, తపస్సు, శీలము మున్నగు వానితోఁగూడిన యర్హులయొక్క, పాణికమల = హస్తపద్మముల యందు, అర్పణం = సమర్పించుటయే, విధిదృష్టః = శాస్త్రమందుఁ జూడబడిన, శాంతికవిధిః = శాంతికర్మాచరణముగ, భవతి = అగుచున్నది.

## సమాసములు:

*పూర్వపుణ్యవిభవవ్యయలబ్ధాః :* పూర్వాణి చ తాని పుణ్యాని చ = పూర్వపుణ్యాని. పూర్వపుణ్యానాంవిభవః = పూర్వపుణ్యవిభవః. పూర్వపుణ్యవిభవస్య వ్యయః = పూర్వపుణ్యవిభవవ్యయః. = పూర్వపుణ్యవిభవవ్యయేన లబ్ధాః = పూర్వపుణ్యవిభవవ్యయలబ్ధాః.

*పాత్రపాణికమలార్పణమ్ :* పాణిఃకమలమివ = పాణికమలమ్. పాత్రస్య పాణికమలమ్ = పాత్రపాణికమలమ్. పాత్రపాణికమలే అర్పణమ్ = పాత్రపాణికమలార్పణమ్.

*శాంతికవిధిః :* శాంతిప్రయోజనకో విధిః = శాంతికవిధిః.

*విధిదృష్టః :* విధౌ దృష్టః = విధిదృష్టః.

**భావము :**

పూర్వజన్మములయందుఁ జేసిన కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతాచరణా దులచేఁ బుణ్యములు కలుగుచున్నవి. ఈ పుణ్యములయొక్క మహిమ వ్యయ మగుటవలననే, సంపదలు కలుగుచున్నవి. కావున మన పుణ్యమును హరించుట వలనను, ఇతర దుఃఖములకు మూలములగుటవలనను, ఈ సంపదలు విచారణ గావించినచో నాపదలే యగుచున్నవి. కాన నిట్లు సంపదల రూపముతో మన కేర్పడిన యాపదలను నివారించుటకు, వీనిని సత్పాత్రల హస్తపద్మముల యందర్పించుటయే శాస్త్రములయందు చెప్పబడిన శాంతికర్మయగు చున్నది. ఏలయనగా, దీనివలన మనకు నష్టమైన సుకృతము పెక్కు రెట్లు అభివృద్ధి నొందగలదు. ॥౧౨॥

శ్లో॥ తద్విమృజ్య మమ సంశయశిల్పి
స్ఫీతమత్ర విషయే సహసాఘమ్।
భూయతాం భగవతశ్శ్రుతిసారై
రద్య వాగ్భిరఘమర్షణఋగ్భిః॥ ౧౩

ప॥వి॥ తత్ । విమృజ్య । మమ । సంశయశిల్పి । స్ఫీతమ్ । అత్ర । విషయే। సహసా। అఘం । భూయతాం । భగవతః । శ్రుతిసారైః । అద్య। వాగ్భిః। అఘమర్షణఋగ్భిః.

టీక॥ తత్ = అందువలన, అత్ర = ఈ, విషయే = విషయమందు, మమ = నాకు, సంశయశిల్పి = సందేహమునుఁ గల్గించునట్టి, స్ఫీతం = మెండైన, అఘం = పాపమును, లేదా, సంశయశిల్పి = సందేహమే కారణముగాఁ గల్గిన, అఘం = దుఃఖమును, సహసా = వెంటనే, విమృజ్య = తొలగించి, భగవతః = పూజ్యుఁడైన నీయొక్క, వాగ్భిః = వాక్కులచే, అద్య = ఇప్పుడు, శ్రుతిసారైః = వేదసారములును, కర్ణామృతములునునగు, అఘమర్షణఋగ్భిః = అఘమర్షణములను పాపమును హరించెడి ఋక్కులగ, భూయతాం = ఉండబడుట (కోరబడినది).

వి॥ ఇచ్చట మునివాక్యమునందు నారోపింపఁబడిన యఘమర్షణము ప్రకృత

మైన యఘమును హరించుటలో నుపయుక్తమైనందువలన పరిణామాలంకారము.

## సమాసములు :

సంశయశిల్పి : సంశయస్య శిల్పి = సంశయశిల్పి. సంశయః శిల్పీ యస్య తత్ = సంశయశిల్పి. తత్ = సంశయశిల్పి.

శ్రుతిసారైః : శ్రుతేః సారాః = శ్రుతిసారాః. తైః = శ్రుతిసారైః.

అఘమర్షణఋగ్భిః : అఘమర్షణ్యాశ్చ తాః ఋచశ్చ = అఘమర్షణ ఋచః. తాభిః అఘమర్షణఋగ్భిః.

## భావము :

ఇట్లు రాజులు రాక పోవుటలో నా కేర్పడిన సందేహమునకు మూలమైన పాపమును దొలగించి, లేదా సంశయమువలన, నా కేర్పడిన దుఃఖమును దొలగించి యిప్పుడు నీ వాక్కులు వేదసారములును కర్ణామృతములును నగు నఘమర్షణ ఋక్కులుగా నుండుఁగాత-అనగా రాజులు నాయొద్దకు రాక పోవుటకు కారణమును సందేహములేక చెప్పమని యాశయము. ॥౧౮॥

శ్లో॥ ఇత్యుదీర్య మఘవా వినయర్ధిం
వర్ధయన్నవహితత్వభరేణ।
చక్షుషాం దశశతీమనిమేషాం
తస్థివాన్మునిముఖే ప్రణిధాయ॥ ౧౯

ప॥వి॥ ఇతి । ఉదీర్య । మఘవా । వినయర్ధిం । వర్ధయన్। అవహితత్వభరేణ। చక్షుషాం । దశశతీమ్ । అనిమేషాం । తస్థివాన్ । మునిముఖే । ప్రణిధాయ.

టీక॥ మఘవా = ఇంద్రుఁడు, ఇతి = ఇట్లు, ఉదీర్య = పలికి, అవహితత్వభరేణ = ఏకాగ్రతయొక్క ఆధిక్యముచే, వినయర్ధిం = వినయాతిశయమును, వర్ధయన్ = వర్ధిల్లజేయుచు, అనిమేషాం = రెప్పపాట్లులేని, చక్షుషాం = నేత్రములయొక్క, దశశతీం = వేయిని, మునిముఖే = నార

దమునియొక్క ముఖమునందు, ప్రణిధాయ = ఉంచి, తస్థివాన్ = ఉండెను.

**సమాసములు :**

అవహితత్వాభరేణ ; అవహితస్య భావః = అవహితత్వం. అవహితత్వస్య భరః = అవహితత్వభరః. తేన అవహితత్వాభరేణ.

వినయర్ధిమ్ : వినయస్య బుద్ధిః = వినయర్ధిః. తామ్ = వినయర్ధిమ్.

దశశతీమ్ : దశానాం శతానాం సమాహారః = దశశతీ. తామ్ = దశశతీమ్.

అనిమేషామ్ : అవిద్యమానాః నిమేషాః యస్యాఃసా = అనిమేషా. తామ్ = అనిమేషామ్.

మునిముఖే : మునేః ముఖమ్ = మునిముఖమ్. తస్మిన్ = మునిముఖే.

**భావము :**

ఈ విధముగా నింద్రుఁడు పలికి యేకాగ్రతతోఁడను శ్రద్ధతోఁడను, తన వినయాధిక్యమును పెంచుకొనుచు, తనవేయి కన్నులను నారదుని ముఖము వైపు మళ్లించి యుండెను. ॥౧౯॥

శ్లో॥ వీక్ష్య తస్య వినయే పరిపాకం
పాకశాసనపదం స్పృశతోఽపి।
నారదః ప్రమదగద్గదయోక్త్యా
విస్మితస్స్మితపురస్సరమాఖ్యత్॥ ౨౦

ప॥వి॥ వీక్ష్య । తస్య । వినయే । పరిపాకం । పాకశాసనపదం । స్పృశతః । అపి । నారదః । ప్రమదగద్గదయా । ఉక్త్యా । విస్మితః । స్మిస్మితపురస్సరమ్ । ఆఖ్యత్.

టీక॥ నారదః = నారదుఁడు, పాకశాసనపదం = ఇంద్రపదవిని, స్పృశతోఽపి = అధిష్టించియున్నను, తస్య = ఆ యింద్రునియొక్క, వినయే = వినయమందలి, పరిపాకం = ఆధిక్యమును, వీక్ష్య = చూచి, విస్మితస్సన్ = విస్మయముఁబొందినవాఁడగుచు, ప్రమదగద్గదయా =

ప్రమద = సంతోషముచే, గద్గదయా = డగ్గుత్తికగల్గిన, వాచా = వాక్కుచే, స్మితపురస్సరం = చిఱునగవు ముందిడుకొని, ఆఖ్యత్ = చెప్పెను.

**సమాసములు :**

పాకశాసనపదమ్ : పాకం శాస్తీతి = పాకశాసనః. పాకశాసనస్య పదమ్ = పాకశాసనపదమ్. తత్ = పాకశాసనపదమ్.

ప్రమదగద్గదయా : ప్రమదేన గద్గదా = ప్రమదగద్గదా. తయా = ప్రమదగద్గదయా.

స్మితపురస్సరమ్ : పురః సరతీతి = పురస్సరం. స్మితం పురస్సరం యస్మిన్ కర్మణి తత్ యథాభవతి తథా = స్మితపురస్సరమ్.

**భావము :**

ఇంద్ర పదవి యందుండియు, వినయాధిక్యమునుఁ బ్రకటించుచున్న యాతనిఁ జూచి నారదుఁడు విస్మయముఁబొంది, సంతోషముచే డగ్గుత్తిక నొందిన వాక్కుచే చిఱునగవుతో నా యింద్రునితోఁ జెప్పెను. ॥౨౦॥

**శ్లో॥** భిక్షితా శతమఖీ సుకృతం య
త్తత్పరిశ్రమవిదస్స్వవిభూతౌ।
తత్ఫలే తవ పరం యది హేలా
క్లేశలబ్ధమధికాదరదస్తు॥ ౨౧

**ప॥వి॥** భిక్షితా।శతమఖీ । సుకృతం । యత్। తత్పరిశ్రమవిదః । స్వవిభూతౌ। తత్ఫలే । తవ। పరం। యది। హేలా । క్లేశలబ్ధమ్। అదికాదరదం । తు.

**టీక॥** శతమఖీ = నూఱు యాగముల సమూహాము, యత్ = ఏ, సుకృతమ్ = పుణ్యమును, భిక్షితా = యాచింపఁబడినదో,తత్ఫలే;తత్ = ఆసుకృతములకు, ఫలే = ఫలమైన, స్వవిభూతౌ = తన యైశ్వర్యమునందు, హేలా యది = అశ్రద్ధ యేర్పడినచో, తత్పరిశ్రమవిదః; తత్ = యాచనమందలి, పరిశ్రమ = క్లేశమును, విదః = తెలిసిన, తవపరం = నీకే(తగును).

క్లేశలబ్ధంతు=కష్టముచే సంపాదింఁబడినది, అధికాదరదం; అధిక= అధికమైన, ఆదర=ఆసక్తిని, దం=ఇచ్చునది గదా.

వి॥ నూఱు యజ్ఞములచే సంపాదింపబడిన సుకృతముయొక్క ఫలములో హేల నీకే తగును—అను వాక్యార్థమును, కష్టముతో సంపాదింపఁబడినది యెక్కువ ఆదరమునుఁ గల్గించు నను వాక్యార్థముచే సమర్థించుట వలన వాక్యర్థ హేతుకమైన కావ్యలింగాలంకారము.

సమాసములు ;

శతమఖీ : శతానాం మఖానాం సమాహారః=శతమఖీ.

తత్పరిశ్రమవిదః : తస్య పరిశ్రమః తత్పరిశ్రమః. తత్పరిశ్రమం వేత్తీతి=తత్పరిశ్రమవిత్. తస్య=తత్పరిశ్రమవిదః.

స్వవిభూతౌ: స్వస్య విభూతిః=స్వవిభూతిః. తస్యామ్=స్వవిభూతౌ.

తత్ఫలే : తస్య ఫలమ్=తత్ఫలమ్. తస్మిన్=తత్ఫలే.

క్లేశలబ్ధమ్ : క్లేశేన లబ్ధమ్=క్లేశలబ్ధమ్.

అధికాదరదమ్ : అధికశ్చాసౌ ఆదరశ్చ = అధికాదరః. అధికాదరం దదాతీతి=అధికాదరదః. తత్=అధికాదరదం.

**భావము :**

నీవు అనుష్ఠించిన నూఱు యాగములనుండి యే పుణ్యము యాచింపఁబడినదో, ఆ పుణ్యఫలమైన యైశ్వర్యమును దాచిపెట్టుకొనవలయునని కోరిక లేక యతిథులకు దానిని దానము చేయుచు దానియందు నాస్థలేక యుండుట నీ కొక్కనికే తగినది. అనగా నీవు నూఱు యాగములుచేసి గొప్ప సుకృతము నార్జించితివి. ఆ సుకృతఫలమైన ఐశ్వర్యమునుఁ గాపాడుకొనవలయునని కోరిక గాని, దానియందు శ్రద్ధగాని లేకయుండుట నీకేతగును. ఏలయనగా నీవీ సంపదను దానము చేయుటకు తగిన వ్యక్తులు రాలేదే యని చింతించుచున్నావు గదా. ఇది మిక్కిలి యాశ్చర్యకరమైన విషయము. కాని ధనవంతులలో దాతృత్వముండుటలో నేమి యాశ్చర్యమనుటకు సాధ్యపడదు. ఏలయనగా, నీవు సంపాదించిన యైశ్వర్యము మిక్కిలి కష్టముతో నూఱు యాగములు చేయుటవలన నార్జింపఁ

బడినది. కావున నిట్టి కష్టార్జితమైన యైశ్వర్యమును వదలి పెట్టుట కష్టతరము. కాని నీవు ఎట్టి లోభబుద్ధిలేక కష్టపడి సంపాదించిన యీ యైశ్వర్యమును యాచకుల కొసంగుట యాశ్చర్యకరమైనదే. కావున నీ త్యాగము కొనియాడఁ దగినదే. ॥౨౦॥.

శ్లో॥ సమ్పదస్తవ గిరామపి దూరా
యన్న నామ వినయం వినయన్తే ।
శ్రద్దధాతి క ఇవేహ న సాక్షా
దాహ చేదనుభవః పరమాప్తః ॥ ౨౧

ప॥వి॥ సంపదః । తవ । గిరామ్ । అపి । దూరాః । యత్ । న । నామ । వినయం । వినయంతే । శ్రద్దధాతి । కః । ఇవ । ఇహ । న । సాక్షాత్ । ఆహ । చేత్ । అనుభవః । పరమాప్తః.

టీక॥ (బహునా = పెక్కు మాటలతో, కిం = ఏమి ప్రయోజనము). తవ = నీయొక్క, సంపదః = సంపదలు, గిరామపి = వాక్కులకును, దూరాః = అతీతములు. యత్ = ఏలయనగా, వినయం = వినయ స్వభావమును, నవినయంతేనామ = తగ్గించుటలేదు. ఇహ = ఈ వినయ విషయమునందు, పరమాప్తః = పరమ ప్రమాణమైన, సాక్షాత్ = ప్రత్యక్షమైన, అనుభవః = అనుభవము, నాఽఽహచేత్ = చెప్పనిచో, కఇవ = ఎవ్వఁడు, శ్రద్దధాతి = నమ్మును?

వి॥ ఇచ్చట సంపదలు వాక్కునకు అతీతములు కాకపోయినను, అతీతములని చెప్పుటచే సంబంధమున్నను సంబంధము లేదనుటచే అసంబధాతిశయోక్త్యలంకారము.

## సమాసములు :

పరమాప్తః : పరమశ్చాసౌ ఆప్తశ్చ = పరమాప్తః.

## భావము :

ఓ ఇంద్రా! పెక్కుమాటలతోఁ బనిలేదు. నీ సంపదలయొక్క గొప్పతనము మాటలకు గోచరము కాదు. వానినిఁగూర్చి చెప్పుటకుఁ దగిన మాటలు

లేవు. ఏలయనగా, నవి నీ వినయమునుఁ దగ్గించుట లేదు. ఇంత సంపదలున్న ప్పుడు ఇంత వినయముండుట యరుదు గదా. సంపదలెక్కువయైనపుడు వినయము లేకపోవుట సహజము. కాని యది నీయెడ కానరాదు. కాన నీ సంపదల గొప్పతనమునుఁ గూర్చి చెప్పుటకు మాటలుచాలవు. నీయొక్క వినయాతిశయ విషయమును పరమ ప్రమాణమైన, నావంటి వారి ప్రత్యక్షానుభవము చెప్పనిచో నెవ్వడు నమ్మఁగలడు? మావంటి వారు గూడ ముందీ విషయమును నమ్మక యుండిరి. ఇప్పుడు ప్రత్యక్షముతోఁ జూచి నమ్మగల్గియున్నాము. ॥౨౨॥

శ్లో॥ శ్రీభరానతిథిసాత్కరవాణి
స్వోపభోగపరతా న హితేతి।
పశ్యతో బహిరివాంతరపీయం
దృష్టిసృష్టిరధికా తవ కాఽపి॥ ౨౩

ప॥వి॥ శ్రీభరాన్ । అతిథిసాత్ । కరవాణి । స్వోపభోగపరతా । న । హితా । ఇతి – పశ్యతః । బహిః । ఇవ । అంతః । అపి । ఇయం । దృష్టి సృష్టిః । అధికా । తవ । కా । అపి,

టీక॥ శ్రీభరాన్ = ఐశ్వర్యాతిశయములను, అతిథిసాత్ = దానముచే నతిథులకు స్వాధీనములుగ, కరవాణి = చేసెదను. స్వోపభోగపరతా; స్వ = తన యొక్క, ఉపభోగ = సుఖానుభవమునందు, పరతా = ఆసక్తి, హితా = మేలైనది, న = కాదు. ఇతి = ఈ విధముగా, పశ్యతః = తెలుసుకొనిన వాఁడవు, (చూచుచున్న వాఁడవు)అగు, తవ = నీకు, బహరివ = వెలుపల నున్న దేహమునందెట్లో యట్లు, అంతరపి = లోపల అనగా నంతరంగ మందును, కాఽపి = చెప్ప శక్యము కాని, ఇయం = ఈ, దృష్టిసృష్టిః; దృష్టి = జ్ఞానదృష్టియొక్క, (నేత్రముయొక్క), సృష్టిః = సృష్టి, అధికా = అసాధారణమైనది.

వి॥ శ్లిష్టశబ్దముచేఁ జెప్పఁబడిన దృష్టిద్వయమునకు నభేదమును నధ్యసించుటచే, "దేహమందువలె" యను చోట నుపమాలంకారము.

**సమాసములు :**

శ్రీభరాన్ : శ్రీణాం భరాః = శ్రీభరాః. తాన్ = శ్రీభరాన్.

అతిథిసాత్ : అతిథీనామధీనాః = అతిథిసాత్. తాన్ = అతిథిసాత్.

స్వోపభోగపరతా : స్వస్య ఉపభోగః = స్వోపభోగః. స్వోపభోగే పరతా = స్వోపభోగపరతా.

దృష్టిసృష్టిః : దృష్టేః సృష్టిః = దృష్టిసృష్టిః.

**భావము :**

సంపదలన్నింటిని నతిథులకు నధీనములుగఁ జేసెదను; నాకు భోగాసక్తి శ్రేయస్కరము గాదు, అని చూచుచున్న నీకు శరీరమందు దృష్టియున్నట్లు, లోపలగూడ జ్ఞానదృష్టి యొకటి యధికముగ నున్నట్లు తెలియుచున్నవి. కేవలము బాహ్యదృష్టి కలవానికి భోగాసక్తియే మెండుగా నుండును. అతనియందు త్యాగ స్వభావమున కవకాశము లేదు. కాన నీయందీ జ్ఞానదృష్టి యసాధారణమని నారదుఁడింద్రునితోఁ జెప్పెను. ॥౨౩॥

శ్లో॥ ఆః స్వభావమధురైరనుభావై
స్తావకైరతితరాం తరలాః స్మః।
ద్యాం ప్రశాధి గళితావధికాలం
సాధు సాధు విజయస్వ బిడౌజః॥ ౨౪

ప॥వి॥ ఆః । స్వభావమధురైః । అనుభావైః । తావకైః । అతితరాం । తరలాః । స్మః । ద్యాం । ప్రశాధి । గళితావధికాలం । సాధు। సాధు। విజయస్వ । బిడౌజః.

టీక॥ హేబిడౌజః! = వ్యాపకమైన పరాక్రమముగల యో ఇంద్రుఁడా! లేదా శత్రువులను భేదించెడి పరాక్రమముగల యో ఇంద్రుఁడా!, స్వభావమధురైః = స్వభావముచే మధురములైన, తావకైః = నీకు సంబంధించిన, అనుభావైః = ఐశ్వర్యములచేతను, ప్రభావములచేతను, అతితరాం = అత్యధికముగా, తరళాః = చకితులుగా, స్మః = ఉన్నాము. ఆః = మిక్కిలి యానందము. గళితావధికాలం; గళిత = తొలగిపోయిన, అవధి = అవధిగల్గిన, కాలం = కాలమంతయు, అనగా, అనంతకాలము, ద్యాం = స్వర్గమును, సాధు = చక్కగా, ప్రశాధి = పాలింపుము.

సాధు = చక్కఁగా, విజయస్వ = విజయముఁ బొంది యందఱిని మించి యుండుము.

**సమాసములు :**

*స్వభావమధురైః :* స్వభావేన మధురాః = స్వభావమధురాః, తైః = స్వభావమధురైః .

*తావకైః :* తవ ఇమే = తావకాః . తైః = తావకైః.

*గళితావధికాలమ్ :* గళితః అవధిః యస్య. సః = గళితావధిః. గళితావధిశ్చాసౌ కాలశ్చ = గళితావధికాలః. తమ్ = గళితావధికాలమ్.

(హే) *బిడౌజః:* బిడం ఓజః యస్య సః = బిడౌజాః. తస్య సంబుద్ధిః = హేబిడౌజః.

**భావము :**

శత్రువులను భేదించెడి పరాక్రమముగల యో యింద్రా! స్వభావ మధురములైన నీ యైశ్వర్య ప్రభావములచే మేము మిగుల చకితులమైతిమి. నిరవధికమగుటచే ననంతమైన యీ కాలమంతయు నీవు స్వర్గమునుఁ బాలింపుము. విజయములఁ బడసి చక్కఁగా వర్ధిల్లుము. ॥౨౫॥

**శ్లో॥** సంఖ్యవిక్షతతనుస్రవదస్ర
క్షాళితాఖిలనిజాఘలఘూనాం।
యత్త్విహాఽనుపగమః శృణు రాజ్ఞాం
తజ్జగద్యువముదం తముదతమ్॥ ౨౬

**ప॥వి॥** సంఖ్యవిక్షత తనుస్రవదస్రక్షాళితాఖిలనిజాఘలఘూనాం । యిత్ । తు । ఇహ । అనుపగమః । శృణు । రాజ్ఞాం । తత్ । జగద్యువముదం । తమ్ । ఉదంతమ్.

**టీక॥** సంఖ్యవిక్షతతనుస్రవదస్రక్షాళితాఖిలనిజాఘలఘూనామ్; సంఖ్య = యుద్ధమందు, విక్షత = ఎక్కువ గాయములు పడిన, తను = శరీరముల

నుండి, స్రవత్ = స్రవించునట్టి, అస్ర = రక్తముతో, క్షాళిత = కడుగఁ బడిన, నిజాఘ = తమ పాపముచే, లఘూనాం = భారములేని, రాజ్ఞాం = రాజులకు, యత్ = ఏ కారణమువలన, ఇహ = ఇచ్చట అనగా స్వర్గము నందు, అనుపగమః = రాకపోవుట యేది గలదో, తత్ = దానికి కారణమైన, జగద్యువయువముదం; జగత్ = లోకములయందలి, యువ = యువకులకు, ముదం = సంతోషమునుఁ గూర్చెడి, తమ్ = ఆ ప్రసిద్ధమైన, ఉదంతం = సమాచారమును, శృణు = వినుము.

వి॥ ఇచ్చట "క్షాళితాఘ" మను పదార్థము, లఘుత్వమునకుఁ గారణముగాన పదార్థహేతుక కావ్యలింగాలంకారము.

## సమాసములు :

*సంఖ్యావిక్షతతనుస్రవదస్రక్షాళితాఖిల నిజాఘలఘూనామ్ :* సంఖ్యే విక్షతాః = సంఖ్యావిక్షతాః. సంఖ్యావిక్షతాశ్చ తాః తనవశ్చ = సంఖ్యావిక్షతతనవః. సంఖ్యావిక్షతతనుభ్యః స్రవంతి = సంఖ్యావిక్షతతనుస్రవంతి. సంఖ్యావిక్షతతనుస్రవంతి చ తాని అస్రాణి చ = సంఖ్యావిక్షతతనుస్రవదస్రాణి. సంఖ్యావిక్షతతనుస్రవదస్రైః క్షాళితాని = సంఖ్యావిక్షతతనుస్రవదస్రక్షాళితాని. నిజాని చ తాని అఘానిచ = నిజాఘాని. అఖిలాని చ తాని నిజాఘాని చ = అఖిలనిజాఘాని. సంఖ్యావిక్షతతనుస్రవదస్రక్షాళితాని చ తాని అఖిలనిజాఘాని చ = సంఖ్యావిక్షతతనుస్రవదస్రక్షాళితాఖిలనిజాఘాని. సంఖ్యావిక్షతతనుస్రవదస్రక్షాళితాఖిలనిజాఘైః లఘవః = సంఖ్యావిక్షతతను స్రవద స్రక్షాళితాఖిల నిజాఘలఘవః. తేషామ్ = సంఖ్య విక్షతతను స్రవదస్రక్షాళితాఖిలనిజాఘలఘూనామ్.

*అనుపగమః :* న ఉపగమః = అనుపగమః.

*జగద్యువముదమ్ :* జగతి యువానః = జగద్యువానః. జగద్యూనాం ముత్ = జగద్యువముత్. తామ్ = జగద్యువముదమ్.

## భావము :

ఇట్లు ఇంద్రునిఁ బొగడి యతని ప్రశ్నకు నుత్తరమిచ్చుచున్నాఁడు. ఓ యింద్రా! యుద్ధమున గాయపడిన శరీరములనుండి స్రవించు రక్తప్రవాహము

లచే కడిగివేయఁబడిన పాపములచే, భారము తొలగిన రాజులీ స్వర్గమునకు రాక పోవుటకు కారణము ప్రపంచమందలి యువకులకు నానంద మొసంగునట్టిది. అది యొక ప్రసిద్ధమైన విషయము. ఆ విషయమును వినుము అని నారదుఁడు చెప్పెను. ॥౨౩॥

శ్లో॥ సా భువః కిమపి రత్నమనర్ఘం
భూషణం జయతి తత్ర కుమారీ।
భీమభూపతనయా దమయంతీ
నామ యా మదనశస్త్రమమోఘమ్॥ ౨౬

ప॥వి॥ సా । భువః । కిమ్ । అపి । రత్నమ్ । అనర్ఘం । భూషణం । జయతి। తత్ర। కుమారీ । భీమభూపతనయా। దమయంతీ। నామ। యా । మదన శస్త్రమ్ । అమోఘమ్.

టీక॥ భువః = భూమికి, భూషణం = అలంకారమైన, కిమపి = చెప్ప సాధ్యము కాని, అనర్ఘం = అమూల్యమైన, రత్నం = సాటిలేని స్త్రీ రత్నమును, కుమారీ = కన్యకయునగు, సా = ఆ, దమయంతీ నామ = దమయంతి యను ప్రసిద్ధిగల, భీమభూపతనయా = భీమభూపతి పుత్రిక, తత్ర = ఆ భూమియందు, జయతి = (సుందరీ మణులనుమించి) వర్ధిల్లుచున్నది. యా = ఎవ్వతె, అమోఘం = కుంటుపోని, మదనాస్త్రమ్ = మన్మథుని యాయుధము.

## సమాసములు :

అనర్ఘమ్ : అవిద్యమానః అర్ఘః యస్య తత్ = అనర్ఘమ్.

భీమభూపతనయా : భీమ ఇతి భూపః = భీమభూపః. భీమభూపస్య తనయా = భీమభూపతనయా.

మదనశస్త్రమ్ : మదనస్య శస్త్రమ్ = మదనశస్త్రమ్.

అమోఘమ్ : న మోఘమ్ = అమోఘమ్.

## భావము :

ఇంద్రా! భీమభూపతి పుత్రికయైన దమయంతి యను ప్రసిద్ధిగల కన్యక, భూమికి భూషణము వర్ణింపశక్యముగాని వెలలేని స్త్రీ రత్నము మన్మథునకు

కుంటుపోని యాయుధము. ఆమె సుందరీ మణులనందఱిని మించి యీ భూమి యందు వెలయుచున్నది. ॥౨౬॥

శ్లో॥ సంప్రతి ప్రతిముహూర్తమపూర్వా
కాఽపి యౌవనజవేన భవంతీ।
ఆశిఖం సుకృతసారభృతే సా
క్వాఽపి యూని భజతే కిల భావమ్॥ ౨౭

ప॥వి॥ సంప్రతి । ప్రతిముహూర్తమ్ । అపూర్వా। కా। అపి । యౌవనజవేన । భవంతీ । ఆశిఖం । సుకృతసారభృతే । సా । క్వ । అపి । యూని । భజతే । కిల । భావమ్.

టీక॥ సంప్రతి = ఇప్పుడు, సా = దమయంతి, యౌవనజవేన; యౌవన = యౌవన వయస్సుయొక్క, జవేన = వికాస వేగముచే, ప్రతి ముహూర్తం = ప్రతిస్వల్ప కాలమునను, కాఽపిఅపూర్వా = వర్ణింప వలనుకానిఅపూర్వమైన సుందరిగా, భవంతీ = అగుచు, ఆశిఖం = శిఖవరకు, సుకృతసారభృతే; సుకృతసార = ఉత్కృష్టమైన పుణ్య ముచే, భృతే = నిండిన, క్వాఽపి = ఒకానొక, యూని = యువకుని యందు, భావం = అనురాగమును, భజతే కిల = పొందుచున్నది గదా.

సమాసములు :

ప్రతిముహూర్తమ్ : ముహూర్తే ముహూర్తే = ప్రతిముహూర్తం.

అపూర్వా : పూర్వం న భవతీతి = అపూర్వా.

ఆశిఖమ్ : శిఖామభివ్యాప్య = ఆశిఖమ్.

సుకృతసారభృతే : సుకృతానాం సారః = సుకృతసారః. సుకృత సారేణ భృతః = సుకృతసారభృతః, తస్మిన్ = సుకృతసారభృతే.

భావము:

ఇప్పుడు, ఆ దమయంతి యౌవనము వేగముగా వికసించుటచే, ప్రతి క్షణము సౌందర్యమయములయిన, యవయవముల వికాస పోషణలచే, గ్రొత్త

దనము నొందుచున్నది. శిఖవరకు సుకృత విశేషముచే నిండిన యొకానొక యువకుని యందునను రాగము వహించియున్నది. ॥౨౭॥

శ్లో॥ కథ్యతే న కతమస్స ఇతి త్వం
మాం వివక్షురసి కిం చలదోష్ఠః।
అర్ధవర్త్మని రుణత్సి న పృచ్ఛాం
నిర్గమేణ న పరిశ్రమయైనామ్॥ ౨౮

ప॥వి॥ కథ్యతే । న । కతమః । సః । ఇతి । త్వం । మాం । వివక్షుః । అసి । కిం । చలదోష్ఠః । అర్ధవర్త్మని । రుణత్సి । న । పృచ్ఛాం । నిర్గమేణ । న । పరిశ్రమయ । ఏనామ్.

టీక॥ కించ = మఱియు, చలదోష్ఠః; చలత్ = కదలుచున్న, ఓష్ఠః = పెదవి కల్గిన, త్వం = నీవు, సః = ఆయువకుఁడు, కతమః = ఎవ్వఁడు, ఇతి = అని, మాం = నన్నుఁగూర్చి, వివక్షుః = చెప్పఁగోరిన వాఁడవుగా, అసి కిమ్ = అగుచున్నావా ఏమి?, తర్హి = అట్లగుచో, అర్ధవర్త్మని = మాటల నడుమ, ప్రశ్నం = ప్రశ్నను, నరుణత్సి = అడ్డగింపవా! ఏనాం = ఈ, పృచ్ఛాం = ప్రశ్నను, నిర్గమేణ = వెలుపల నుచ్చరించుటచే, న పరిశ్రమయ = కష్టపఱచకుము. (ఏలయనగా), నకథ్యతే = అతఁడెవఁడో చెప్పఁబడడు.

**సమాసములు :**

వివక్షః : వక్తుమిచ్ఛుః = వివక్షుః.

చలదోష్ఠః : చలన్తౌ ఓష్ఠౌ యస్య సః = చలదోష్ఠః.

అర్ధవర్త్మని : అర్ధం వర్త్మనః = అర్ధవర్త్మ. తస్మిన్ = అర్ధవర్త్మని.

**భావము :**

ఓ యింద్రా! నీవు పెదవులను కదలించుచు నా యువకుఁడెవ్వడో చెప్పుమని యడుగఁగోరితివా యేమి? అట్లయినచో, సగము చెప్పఁబడినప్పుడే, ప్రశ్నను నిలుపుకొనవలసి వచ్చును. కావున ప్రశ్నను వెల్లడి పఱచుటచే దానిని

శ్రమ పెట్టకుము. ఏలయనగా నీవు ఆ యువకుడెవ్వఁడని యడిగినను, చెప్పఁ బడఁడు. ॥౨౮॥

శ్లో॥ యత్పథావధిరణుః పరమస్సా
యోగిధీరపి న పశ్యతి యస్మాత్।
బాలయా నిజమనఃపరమాణౌ
హ్రీదరీశయహరీకృతమేనమ్॥ ౨౯

ప॥వి॥ యత్పథావధిః । అణుః । పరమః । సా । యోగిధీః । అపి । న । పశ్యతి । యస్మాత్ । బాలయా । నిజమనః పరమాణౌ । హ్రీదరీశయహరీకృతమ్ । ఏనమ్.

టీక॥ పరమః అణుః = పరమాణువు, యత్పథావధిః; యత్ = ఏ బుద్ధియొక్క, పథ = మార్గమునకు, అవధిః = ఎల్లయో, సా = ఆ, యోగిధీరపి = యోగియొక్క బుద్ధియు, బాలయా = బాలికచే, (బాలికయగు దమయంతిచే), నిజమనః పరమాణౌ; నిజ = తనదైన, మనః = మనస్సనెడి, పరమాణౌ = పరమాణువునందు, హ్రీదరీశయహరీకృతమ్; హ్రీ = లజ్జయనెడి, దరీ = గుహయందు, శయ = శయనించిన, హరీకృతం = సింహముగాఁ జేయఁబడిన, ఏనం = ఈ యువకుని, యస్మాత్ = ఎందువలన, నపశ్యతి = చూడదో, (తస్మాత్ = అందువలన) న కథ్యతే = చెప్పఁబడడు అని పూర్వశ్లోకముతో నన్వయము.

**సమాసములు :**

యత్పథావధిః : యస్యాః పంథాః = యత్పథః. యత్పథస్య అవధిః = యత్పథావధిః.

పరమః : పరః మా యాస్మాత్సః = పరమః.

యోగిధీః : యోగినః ధీః = యోగిధీః.

నిజమనఃపరమాణౌ : నిజం చ తత్ మనశ్చ = నిజమనః. నిజమన ఏవ పరమాణుః = నిజమనః పరమాణుః. తస్మిన్ = నిజమనః పరమాణౌ.

హ్రీదరీశయహరీకృతమ్ : హ్రీరేవ దరీ = హ్రీదరీ. హ్రీదర్యాం శేత ఇతి = హ్రీదరశయః. హ్రీదరీశయశ్చాసౌ హరిశ్చ = హ్రీదరీశయహరిః. అహ్రీదరీశయహరిః హ్రీదరీశయహరిః సంపద్యమానః కృతః = హ్రీదరీశయహరీకృతః. తమ్ = హ్రీరదరీశయహరీకృతమ్.

**భావము :**

యోగిబుద్ధి పరమాణువువరకుఁ జూడఁగలదు కాని యాబాలిక, తనమనస్సనెడి పరమాణువు నందు, లజ్జయనెడి గుహ యందు నిద్రించెడి సింహముగాఁ జేసిన యాయువకుని, ఆ యోగియుఁ గాంచలేడు. పరమాణురూపమైన మనస్సును మాత్రము యోగి గ్రహింపవచ్చును. కాని యా మనస్సునందున్న లజ్జను గ్రహింపఁజాలడు. ఆ లజ్జనెప్పుడు గ్రహింపజాలడో, యందు శయనించిన సింహమైన యువకునెట్లు గ్రహింపఁగలడు. కావున ఈ యువకుఁ డెవఁడో చెప్ప సాధ్యము గాదు. ॥౨౯॥

శ్లో॥ సా శరస్య కుసుమస్య శరవ్యం
సూచితా విరహవాచిభిరంగైః।
తాతచిత్తమపి ధాతురధత్త
స్వస్వయంవరమహాయ సహాయమ్॥ ౩౦

ప॥వి॥ సా । శరస్య । కుసుమస్య । శరవ్యం । సూచితా । విరహవాచిభిః । అంగైః । తాతచిత్తమ్ । అపి । ధాతుః । అధత్త । స్వస్వయంవరమహాయ । సహాయమ్.

టీక॥ సా = ఆ దమయంతి, విరహవాచిభిః = వియోగ సూచకములగు, అంగైః = అవయములచే, కుసుమస్య శరస్య = కామబాణమైన పుష్పమునకు, శరవ్యం = గుఱియైనదిగా, సూచితా = సూచింపఁబడినది. తాతచిత్తమపి = తండ్రియొక్క హృదయమునుఁగూడ, స్వస్వయంవరమహాయ = తన స్వయంవరమహోత్సవమునకు, ధాతుః = బ్రహ్మకు, సహాయం = సహాయముగా, అధత్త = చేసెను.

## సమాసములు :

*శరవ్యం :* శృణాతీతి = శరుః. శరవేహితమ్ = శరవ్యమ్.

*విరహావాచిభిః :* విరహం బ్రువత ఇతి విరహవాచీని. తైః = విరహవాచిభిః.

*తాతచిత్తమ్ :* తాతస్య చిత్తమ్ = తాతచిత్తమ్. తత్ = తాతచిత్తమ్

*స్వయంవరమహాయ :* స్వయంవర ఇతి మహః = స్వయంవరమహః. తస్మై = స్వయంవరమహాయ.

## భావము :

ఆ దమయంతి మన్మథ బాణములకు గుఱియైన విషయము, ఆమె శరీరమందలి విరహ చిహ్నములగు కృశత్వము, తెల్లఁదనము మున్నగు వానిచే సూచింపఁబడినది. అందువలన నామె యొక యువకుని యందు ననురక్తురాలని తెలిసినది. ఆమె తండ్రికి నామె యొక్క ప్రియుఁడైన వరుఁడు తెలియకపోయినను, అతని చిత్తము ఆమె యొక్క స్వయంవర మహోత్సవమునకు బ్రహ్మకు సహాయపడినది. అనగా, నామె తండ్రియు బ్రహ్మ ప్రేరణచే స్వయంవరమే యుపాయమని నిశ్చయించెను. ॥30॥

శ్లో॥ మన్మథాయ యదథాఽదిత రాజ్ఞాం
హూతిదూత్యవిధయే విధిరాజ్ఞామ్।
తేన తత్పరవశాః పృథివీశాః
సంగరం గరమివాఽఽకలయంతి॥ 31

ప॥వి॥ మన్మథాయ । యత్ । అథ । అదిత । రాజ్ఞామ్ । హూతిదూత్యవిధయే । విధిః । ఆజ్ఞామ్ । తేన । తత్పరవశాః । పృథివీశాః । సంగరం । గరమ్ । ఇవ । ఆ కలయంతి.

టీక॥ అథ = తర్వాత, విధిః = దైవము, రాజ్ఞాం = రాజులకు, హూతిదూత్యవిధయే; హూతి = స్వయంవరాఽహ్వానమను, దూత్య = దూతకార్యమును, విధయే = అనుష్ఠించుటకై, మన్మథాయ = మన్మథునికొఱకు, ఆజ్ఞాం =

ఆదేశమును, అదిత ఇతియత్ = ఇచ్చెనను నది యేది గలదో, తేన = ఆ కారణముచే, తత్పరవశాః, తత్ = ఆ మన్మథునకు, పరవశాః = లోఁబడిన, పృథివీశాః = రాజులు, సంగరం = యుద్ధమును, గరమివ = విషమునువలె, ఆ కలయంతి = భావించుచున్నారు.

సమాసములు :

హూతిదూత్యవిధయే: దూతస్యకర్మ = దూత్యం. హూతిరేవ దూత్యం = హూతిదూత్యం. హూతిదూత్యస్య విధిః = హూతిదూత్యవిధిః. తస్మై = హూతిదూత్యవిధయే.

తత్పరవశాః : తస్య పరవశాః = తత్పరవశాః.

పృథివీశాః : పృథివ్యాః ఈశాః = పృథివీశాః.

భావము :

దైవము, దమయంతీ స్వయంవర మహోత్సవమునకై రాజుల నందఱిని పిలచుటకు, మన్మథుని ఆజ్ఞాపించెను. అందువలన రాజులందఱు మన్మథునికి వశ్యులై సంగరమును అనగా యుద్ధమును గరముగా, అనగా విషముగా, భావించి యుద్ధ విముఖులై యున్నారు. గరము అనగా విషము. దానిని పుచ్చుకొనిన వానినే అది చంపును. సంగరమో అట్లు కాదు. అది పెక్కు మందినిఁ జంపును. కావుననే అది సంగరమైనది. అనగా సమీచీనమైన గరముగా నైనది యని చమత్కారణము. ॥30॥

శ్లో॥ యేషు యేషు సరసా దమయంతీ
భూషణేషు యది వాపి గుణేషు।
తత్ర తత్ర కలయాఽపి విశేషో
యః స హి క్షితిభృతాం పురుషార్థః॥ 31

ప॥వి॥ యేషు । యేషు । సరసా । దమయంతీ । భూషణేషు । యది । వా అపి । గుణేషు । తత్ర । తత్ర । కలయా । అపి । విశేషః । యః సః । హి । క్షితిభృతాం । పురుషార్థః.

టీక॥ (కించ = మఱియు), దమయంతీ = ఆ దమయంతి. యేషు యేషు = ఏయే, భూషణేషు = హారాదిభూషణముల యందును, యదివా = లేదా, గుణేషు = దయా దాక్షిణ్యాది గుణముల యందును, సరసా = అభిలాషగల్గి యున్నదో, తత్ర తత్ర = ఆ భూషణములయందును, ఆ గుణముల యందును, కలయాఽపి = లేశముచేతను, యః = ఏ, విశేషః = విశేషముగలదో, క్షితిభృతాం = రాజులకు, సహి = అదియే, పురుషార్థః = ప్రయోజనము.

సమాసములు :

క్షితిభృతామ్ : క్షితిం బిభ్రతీతి = క్షితిభృతః. తేషాం = క్షితిభృతాం.

పురుషార్థః : పురుషస్య అర్థః = పురుషార్థః.

భావము ;

ఆ దమయంతికి ఏవే భూషణముల యందును, ఏయే గుణములయందును ఆసక్తి గలదో, అట్టి భూషణముల యందును, అట్టి గుణముల యందునుఁ గొంత ఆధిక్యమును గల్గి యామెను రంజింపఁజేయడమే తమకు పురుషార్థముగా భావించి రాజులు ప్రవర్తించుచున్నారే గాని వారికెవ్వరికిని యుద్ధమునందు ఆసక్తి లేదు. ॥౩౨॥

శ్లో॥ శైశవవ్యయదినావధి తస్యా
యౌవనోదయిని రాజసమాజే।
ఆదరాదహరహః కుసుమేషో
రుల్లలాస మృగయాభినివేశః॥ ౩౩

ప॥వి॥ శైశవవ్యయ దినావధి । తస్యాః । యౌవనోదయిని । రాజసమాజే । ఆదరాత్ । అహరహః । కుసుమేషోః । ఉల్లలాస । మృగయాభినివేశః ।

టీక॥ కుసుమేషోః = మన్మథునకు, యౌవనోదయిని = యౌవనము యొక్క ప్రారంభముతోఁగూడిన, రాజసమాజే = రాజసంఘము విషయమున,

తస్యాః = ఆదమయంతికి, శైశవవ్యయదినావధి; శైశవవ్యయ = బాల్య ముతొలగిన, దినావధి = దినము అవధిగాగల్గిన, అనగా, అట్టిదినము నుండి, అహరహః = ప్రతిదినము, ఆదరాత్ = ఆసక్తితో, మృగయాభినివేశః; మృగయా = వేటయందు, అభినివేశః = ఆసక్తి, ఉల్లాస = వర్ధిల్లినది.

*శైశవవ్యయదినావధి :* శిశోర్భావః = శైశవమ్. శైశవస్య వ్యయః = శైశవవ్యయః. శైశవవ్యయస్య దినమ్ = శైశవవ్యయదినమ్. శైశవవ్యయదినం. అవధిః యస్మిన్ తత్ = శైశవవ్యయదినావధి.

*యౌవనోదయిని :* యౌవనస్య ఉదయః = యౌవనోదయః. యౌవనోదయః అస్య అస్తీతి = యౌవనోదయి. తస్మిన్ = యౌవనోదయిని.

*రాజసమాజే :* రాజ్ఞాం సమాజః = రాజసమాజః. తస్మిన్ = రాజసమాజే.

*కుసుమేషోః :* కుసుమాని ఇషవః యస్య సః = కుసుమేషుః. తస్య = కుసుమేషోః.

*మృగయాభినివేశః:* మృగయాయామభినివేశః = మృగయాఽభినివేశః.

**భావము ;**

రాజులకు యౌవనము ప్రారంభించినది మొదలును, దమయంతికి బాల్యము తొలగినది మొదలును, ప్రతిదినము రాజులపై మన్మథుని వేట మిక్కుటమగుచున్నది. అనగా దమయంతికి యౌవనము ప్రారంభించినది మొదలు రాజుల కందఱికిని యామెపై వలపు యేర్పడినది కాన వారికి కామ వ్యసనమే గాని యుద్ధ వ్యసనము లేదని యాశయము. ॥33॥

శ్లో॥ ఇత్థమీ వసుమతీ కమితారః
సాదరాస్త్వదతిథీ భవితుం న।
భీమభూసురభువోరభిలాషే
దూరమంతరమహో నృపతీనాం॥ 34

ప॥వి॥ ఇతి । అమీ । వసుమతీ కమితారః । సాదరాః । త్వదతిథీభవితుం । న । భీమభూసురభువోః। అభిలాషే । దూరమ్ । అంతరం । అహో । నృపతీనాం.

టీక॥ ఇతి = ఇట్లు, అమీ = ఆ రాజులు, వసుమతీకమితారః సంతః = భూమిని కాంక్షించినవారై, త్వదతిథీభవితుం, త్వత్ = నీకు, అతిథీభవితుం = అతిథులగుటకు, సాదరాః = ఆదరముతోఁగూడిన వారుగా, న = లేరు. తథాహి = అది యుక్తమే. నృపతీనాం = రాజులకు, భీమభూసురభువోః; భీమభూ = భీముని పుత్రికయగు దమయంతియు, సురభువోః = స్వర్గము అను నీ రెంటి విషయముననున్న, అభిలాషే = అనురాగమునందు, దూరం = అధికమైన, అంతరం = వ్యత్యాసము. అహో = ఆశ్చర్యకరము.

వి॥ స్వర్గమందనురాగాభావమను నుత్తరవాక్యార్థముచే ఇంద్రుని యాతిథ్యమందలి యనాదర వాక్యార్థము సమర్థింపఁబడినది. కాన, వాక్యార్థహేతుకమగు కావ్యలింగాలంకారము.

## సమాసములు :

వసుమతీకమితారః : వసుమతీం కమితారః = వసుమతీకమితారః.

సాదరాః : ఆదరేణ సహ వర్తంత ఇతి = సాదరాః.

త్వదతిథీభవితుం: అనతిథయః అతిథయః సంపద్యమానాః భవితుం = అతిథీభవితుం. తవ అతిథీభవితుం = త్వదతిథీభవితుమ్.

భీమభూసురభువోః : భీమాత్ భవతీతి = భీమభూః. సురాణాం భూః = సురభూః. భీమభూశ్చ సురభూశ్చ = భీమభూసురభువౌ. తయోః = భీమభూసురభువోః.

## భావము :

ఇట్లు ఆ రాజులు దమయంతిపైని యనురాగముచే, భూమినిమాత్రమే కాంక్షించుచు, స్వర్గమునుఁ గాంక్షింపనందువలన నీకు నతిథులగుటలో నాసక్తి

లేక యున్నారు. రాజులకు దమయంతిపైని యభిలాషకును, స్వర్గముపైని యభిలాషకు మధ్య ఎంత వ్యత్యాస మున్నది. ఆశ్చర్యము ॥౩౪॥

శ్లో॥ తేన జాగ్రదధృతిర్దివమాగాం
సంఖ్యసౌఖ్యమనుసర్తుమను త్వాం।
యన్మృధం క్షితిభృతాం న విలోకే
తన్నిమగ్నమనసాం భువి లోకే॥ ౩౫

ప॥ వి॥ తేన । జాగ్రదధృతిః । దివమ్ । ఆగామ్ । సంఖ్యసౌఖ్యమ్ । అను సర్తుమ్ । అను । త్వాం । యత్ । మృధం । క్షితిభృతాం । న । విలోకే । తన్నిమగ్నమనసాం । భువి । లోకే.

టీక॥ యత్ = ఎందువలన, భువిలోకే = భూలోకమందు, తన్నిమగ్నమనసాం; తత్ = ఆదమయంతియందు,నిమగ్న = మునిగిన,మనసాం = మనస్సులు గల, రాజ్ఞాం = రాజులకు, మృధం = యుద్ధమును, నవిలోకే = నేను చూచుటలేదో, తేన = యుద్ధములేకపోవుటచే, జాగ్రదధృతిః; జాగ్రత్ = ఉత్పన్నమైన, అధృతిః = అధైర్యము గలవాఁడనై, సంఖ్యసౌఖ్యం = యుద్ధసుఖమును, అనుసర్తుం = అనుభవించుటకు, త్వామను = నిన్ను నుద్దేశించి, దివం = స్వర్గమును, ఆగాం = పొందితిని.

**సమాసములు :**

జాగ్రదధృతిః : న ధృతిః = అధృతిః. జాగ్రతీ అధృతిః యస్య సః = జాగ్రదధృతిః.

సంఖ్యసౌఖ్యమ్ : సంఖ్యస్య సౌఖ్యమ్ = సంఖ్యసౌఖ్యమ్. తత్ = సంఖ్యసౌఖ్యమ్.

క్షితిభృతామ్ : క్షితిం బిభ్రతీతి = క్షితిభృతః. తేషాం = క్షితిభృతామ్.

తన్నిమగ్నమనసాం : తస్యాం నిమగ్నం = తన్నిమగ్నం. తన్నిమగ్నం మనః యేషాం తే = తన్నిమగ్న మనసః. తేషాం = తన్నిమగ్న మనసాం.

**భావము :**

ఈవిధముగా నారదమహర్షి రాజులు స్వర్గమునకు రాకపోవుటకు కారణములను(జెప్పి తర్వాత తాను స్వర్గమునకు వచ్చుటకుఁ గారణము నిట్లు చెప్పుచున్నాఁడు. భూలోకమునందున్నరాజులు,దమయంతియందు లగ్నచిత్తులై యుద్ధమును చేయకయుండుట వలన నాకు సంతోషము లేకపోయినది. అందువలన యుద్ధసంతోషము ననుభవించుటకు నిన్ను(గూర్చి స్వర్గమునకు వచ్చితిని.॥౩౫॥

శ్లో॥ వేద యద్యపి న కోఽపి భవంతం
హంత! హంత్రకరుణం విరుణద్ధి।
పృచ్ఛ్యసే తదపి యేన వివేక
ప్రోంఛనాయ విషయే రససేకః॥ ౩౬

ప॥ వి॥ వేద । యది । అపి । న । కః । అపి । భవన్తం । హంత । హంత్ర కరుణం । విరుణద్ధి । పృచ్ఛ్యసే । తత్ । అపి । యేన వివేకప్రోంఛ నాయ । విషయే । రససేకః.

టీక॥ హంత్రకరుణం; హంతౄ = హంతకులయందు, అకరుణం = దయలేని హంతకుఁడైన, భవంతం = నిన్ను, కోఽపి = ఎవ్వఁడును,నవిరుణద్ధి = విరోధముచేసికొనడు. హంత = సంతోషము. వేద = ఎరుగుదును. తదపి = అయినను. పృచ్ఛ్యసే = అడుగఁబడుచున్నావు. యేన = ఏకారణముచే, విషయే = భోగ్యమైనవిషయమందు. రససేకః = రాగానుబంధము, (జలసేచనము), వివేకప్రోంఛనాయ; వివేక = వివేకమును, (చిత్తరువుల యంగలి యసాంకర్యమును), ప్రోంఛనాయ = కడిగివేయుటకును (తుడుచుటకును) (అగునో).

**సమాసములు :**

*హంత్రకరుణం :* హంతృషు అకరుణః = హంత్రకరుణః. తమ్ = హంత్రకరుణమ్.

*వివేకప్రోంఛనాయ :* వివేకస్య ప్రోంఛనమ్ = వివేకప్రోంఛనమ్. తస్మై = వివేకప్రోంఛనాయ.

**భావము :**

ఓ యింద్రా! నీవు హంతకులయెడ దయలేని కఠిన హంతకుఁడవు. కావున నీతో నెవ్వరును వైరము పెట్టుకొనరు. ఇది సంతోషకరమైన విషయము. ఇంతవరకు నాకును తెలుసును. అయినను నిన్నడుగుచున్నాను. ఏలయనగా, విషయముల యందలియనురాగాతిశయము మనకున్న వివేకమును హరించును. చిత్తరవు పైరస సేకము అనగా నీరుపడట యెట్లు ఆ చిత్తరువులను సంకరము గావించి వాని భేదమును తెలియనీయదో, యట్లే విషయమందలి రససేకము అనగా రాగానుబంధము మనకున్న వివేకమును హరించును. కాన వివేకలోపముచే నిన్నడుగుచున్నాను, యుద్ధమున్నదా లేదా యని. ॥౩౭॥

శ్లో॥ ఏవముక్తవతి దేవఋషీంద్రే
ద్రాగభేది మఘవాననముద్రా।
ఉత్తరోత్తరశుభో హి విభూనాం
కోఽపి మంజులతమః క్రమవాదః॥ ౩౮

ప॥వి॥ ఏవమ్ । ఉక్తవతి । దేవఋషీంద్రే । ద్రాక్ । అభేది । మఘవానన ముద్రా । ఉత్తరోత్తర శుభః । హి । విభూనాం । కః । అపి । మంజులతమః । క్రమవాదః.

టీక॥ దేవఋషీంద్రే = దేవర్షులలో శ్రేష్ఠుఁడైన నారదుఁడు, ఏవం = ఇట్లు, ఉక్తవతిసతి = చెప్పగా, మఘవాననముద్రా; మఘవ = ఇంద్రుని యొక్క, ఆనన = నోటియందలి, ముద్రా = మౌనము, ద్రాక్ = వెంటనే, అభేది = స్వయముగనే భిన్నమైనది. తథాహి = అది యుక్తమే. విభూనాం = ప్రభువులకు, కోఽపి = అపూర్వమైన, మంజులతమః = మిక్కిలి మనోహరమైన, క్రమవాదః = ప్రశ్నోత్తరరూప సంభాషణము, ఉత్తరోత్తరశుభః; ఉత్తరోత్తర = ముందు ముందు, శుభః = శుభములు గలది.

వి॥ ఇంద్రుని మౌనభేదనము విశేష విషయము. అది "ప్రభువుల సంభాషణము, ఉత్తరోత్తరశుభావహము" అను సామాన్యముచే సమర్థింపఁబడినది గాన నర్థాంతర న్యాసాలంకారము.

**సమాసములు :**

దేవఋషీంద్రే: దేవాశ్చ తే ఋషయశ్చ = దేవఋషయః. దేవఋషీణా మింద్రః = దేవఋషీంద్రః. తస్మిన్ = దేవఋషీంద్రే.

మఘవాననముద్రా : మఘోనః ఆననం = మఘవాననం. మఘవాననస్య ముద్రా = మఘవాననముద్రా.

ఉత్తరోత్తరశుభః: ఉత్తరోత్తరం శుభం యస్య సః = ఉత్తరోత్తరశుభః.

మంజులతమః : అత్యంతం మంజులః = మంజులతమః.

క్రమవాదః : క్రమేణ వాదః = క్రమవాదః.

**భావము :**

ఈ విధముగా నారదమహర్షి చెప్పగనే ఇంద్రుని మౌనము తనయంతట విడిపోవఁ బ్రారంభించినది. గొప్పవారి యొక్క పరస్పర సంభాషణము మిక్కిలి మనోహరమై రాబోవు శుభములకు హేతువగును గదా. ॥౩౨॥

శ్లో॥ కానుజే మమ నిజే దనుజారౌ
జాగ్రతి స్వశరణే రణచర్చా।
యద్భుజాంకముపధాయ జయాంకం
శర్మణా స్వపిమి వీతవిశంకః॥ ౩౩

ప॥వి॥ కా । అనుజే । మమ । నిజే । దనుజారౌ । జాగ్రతి । స్వశరణే । రణ చర్చా । యద్భుజాంకమ్ । ఉపధాయ । జయాంకం । శర్మణా । స్వపిమి । వీతవిశంకః.

టీక॥ నిజే = నాకు సంబంధించిన, అనుజే = తమ్ముఁడైన, దనుజారౌ = రాక్షసశత్రువైన ఉపేంద్రుఁడు, స్వశరణే = తనకురక్షకుఁడుగా, లేదా, తనయింట, జాగ్రతిసతి = మెలకువగల్గి యుండగా, మమ = నాకు, రణచర్చా = యుద్ధచింత, కా = ఏది? జయాంకం = జయచిహ్నము తోఁగూడిన, యద్భుజాంకం; యత్ = ఏ నాతమ్ముని యొక్క, భుజాం

కం = భుజముల యుత్సంగమును, ఉపధాయ = గిండుగాఁజేసికొని, వీతవిశంకః, వీత = తొలగిన, విశంకః = భయము గలవాఁడనై, శర్మణా = ఆనందముతో, స్వపిమి = నిద్రించుచున్నాను.

**సమాసములు:**

*దనుజారౌ :* దనోః జాయంత ఇతి దనుజాః. దనుజారిః. తస్మిన్ = దనుజారౌ.

*స్వాశరణే :* స్వస్యశరణం = స్వాశరణమ్. తస్మిన్ = స్వాశరణే.

*రణచర్చా :* రణస్యచర్చా = రణచర్చా.

*యద్భుజాంకమ్ :* యస్యభుజౌ = యద్భుజౌ. యద్భుజయోః అంకః = యద్భుజాంకః. తమ్ = యద్భుజాంకమ్.

*జయాంకం :* జయస్య అంకః యస్మిన్సః = జయాంకః. తమ్ = జయాంకమ్.

*వీతవిశంకః :* వీతా విశంకా యస్య సః = వీతవిశంకః.

**భావము :**

ఓనారదా! నాకుఁదమ్ముఁడైన యుపేంద్రుఁడు నాకురక్షకుఁడై నాయింటు మొలకువగల్గియుండగా, యుద్ధచింతనాకేమి యున్నది? అనగా లేదు. జయచిహ్నములతోఁగూడిన నా తమ్ముని భుజములయొడిని దిండుఁగాఁ జేసికొని, నిర్భయుఁడనై సుఖముగా నేను నిద్రించుచున్నాను. ॥౩౮॥

శ్లో॥ విశ్వరూపకలనాదుపపన్నం
తస్య జైమినిమునిత్వముదీయే।
విగ్రహం మఖభుజామసహిష్ణు
ర్వ్యర్థతాం మదశనిం స నినాయ॥ ౩౯

ప॥ వి॥ విశ్వరూపకలనాత్ । ఉపపన్నం । తస్య । జైమినిమునిత్వమ్। ఉదీయే। విగ్రహం । మఖభుజామ్ । అసహిష్ణుః । వ్యర్థతాం । మదశనిం । సః । నినాయ.

టీక॥ తస్య = ఆయుపేంద్రునకు, విశ్వరూపకలనాత్; విశ్వరూప = సమస్త పదార్థములను, కలనాత్ = ప్రత్యక్షముఁ జేసికొనుటవలనను, లేదా సర్వమయముగ నుండుట వలనను, లేదా మత్స్యకూర్మాద్యనంత రూపములను ధరించుట వలనను, సమస్త విషయములను నిరూపించుట వలనను, విశ్వరూప = సూత్రములను, కలనాత్ = రచించుట వలనను, జైమినిమునిత్వం = జైమినిమునియగుట, ఉదీయే = ఉత్పన్నమైనది. ఉపపన్నం = అది యుక్తమైనది. (ఏలయనగా), సః = ఆ యుపేంద్రుఁడు, మఖభుజాం = దేవతలయొక్క, విగ్రహం = యుద్ధమును, (శరీరమును), అసహిష్ణుః = సహింపనివాఁడై, మదశనిం = నా వజ్రాయుధమును, "వజ్రహస్తః పురందరః" ఇత్యాది వాక్యసమూహమును, వ్యర్థతాం = వ్యర్థమగుటను, దేవతలకు శరీరమును నిరాకరించుట వలన శరీరము కలదని చెప్పెడి "వజ్రహస్తః" ఇత్యాద్యర్థవాదవాక్యములకు అర్థశూన్యత్వముఁ జెప్పుటవలన వ్యర్థత్వమును, నినాయ = పొందించెనో.

వి॥ ఇచ్చట ప్రకృతమైన యుపేంద్రునకును, అప్రకృతమైన జైమినికిని శ్లేషవిశేషణములతో సామ్యము, జెప్పుటవలన ప్రకృతాప్రకృతశ్లేషాలంకారము.

## సమాసములు :

విశ్వరూపకలనాత్ : విశ్వాని చ తానిరూపాణి = విశ్వరూపాణి. విశ్వరూపాణాం కలనమ్ = విశ్వరూపకలనమ్. తస్మాత్ = విశ్వరూపకలనాత్.

లేదా

విశ్వేషాం రూపాణి = విశ్వారూపాణి. విశ్వరూపాణాం కలనమ్ = విశ్వరూపకలనమ్. తస్మాత్ = విశ్వరూపకలనాత్.

లేదా

విశ్వం రూపం యేషాం తాని = విశ్వరూపాణి (సూత్రాణి). విశ్వరూపాణాంకలనం = విశ్వరూపకలనమ్. తస్మాత్ = విశ్వరూపకలనాత్.

జైమినిమునిత్వమ్ : జైమినిరితి మునిః = జైమినిమునిః. జైమినిమునేః భావః = జైమినిమునిత్వమ్.

మఖభుజామ్ : మఖంభుంజత ఇతి = మఖభుజః. తేషాం = మఖభుజామ్.

అసహిష్ణుః : న సహిష్ణుః = అసహిష్ణుః.

వ్యర్థతామ్ : విగతః అర్థః యస్మాత్ తత్ = వ్యర్థమ్. వ్యర్థస్య భావః = వ్యర్థతా. తామ్ = వ్యర్థతామ్.

మదశనిం : మమ అశనిః = మదశనిః. తమ్ = మదశనిం.

**భావము :**

ఆ యుపేంద్రుఁడు విష్ణువగుటవలనను, "సర్వం విష్ణుమయంజగత్" అను వచనమునననుసరించి ప్రపంచ స్వరూపమును ధరించుటవనను, లేదా, ప్రపంచ మందలి పదార్థములను సాక్షాత్కరించుట వలనను, లేదా మత్స్య కూర్మాద్యవతారములతో పెక్కురూపములను వహించుట వలనను విశ్వరూపకలనుఁడాయెను. అట్లే విశ్వరూపములని చెప్పఁదగిన సూత్రములను నిర్మించుటచే జైమిని మహర్షియు విశ్వరూపకలనుఁడాయెను. కావున విశ్వరూపకలనత్వము కల్గిన యుపేంద్రుఁడు జైమినిముని యాయెను. ఇది యుక్తము.ఏలయనగా ఆ యుపేంద్రుఁడు దేవతలకు రాక్షసులతో విగ్రహము (యుద్ధము) సహింపక, తన యాయుధము నుపయోగించి నా యాయుధమైన, వజ్రమును వ్యర్థము గావించినాఁడు. ఆ జైమిని మునియు దేవతలకు విగ్రహమును-అనగా శరీరమును సహింపక నిరాకరించి "వజ్రహస్తః పురందరః" ఇత్యాద్యర్థ వాదవాక్యములను నర్థశూన్యములుగఁ గావించి వ్యర్థములు గావించెను. కావున నా యుపేంద్రునకు జైమినిత్వము యుక్తము. జైమిని మహర్షి పూర్వమీమాంసా సూత్రములను రచియించెను. సూత్రములు పెక్కు విధములగు నర్థములను సూచించును గాన "విశ్వరూపము" లని చెప్పఁబడును. వేదములలోని యర్థవాద వాక్యములు ఇంద్రాది దేవతలకు 'వజ్రహస్తః పురందరః" ఇత్యాదిగ శరీరమునుఁ జెప్పుచుండగా, జైమిని మహర్షి దేవతలకు శరీరము లేదనియు,అట్లు శరీరము గల్పించినచో నా దేవతలు ఒక్క కాలమునందే పెక్కండ్రచే ననుష్ఠింపఁబడు యాగములయందుఁ జాల్గొని యాహుతులను గ్రహింపలేరనియు చెప్పి వారికి మంత్ర

శరీరకత్వమును కల్పించెను. కాన నర్థవాదములలోఁ జెప్పఁబడిన శరీర కల్పన ప్రశంసాత్మకమే గాని "వాస్తవికము కాదు" అని మీమాంసా సూత్రములోని దేవతాధికరణమున విస్తరముగ జైమినిచే నిరూపింపఁబడి యున్నది. మఱియు నొకప్పుడు జైమిని మహర్షి, వజ్రాయుధముతోఁ గూడిన యింద్రుని భుజమును స్తంభింపఁ జేసెనను ప్రసిద్ధినిఁబట్టియు వజ్రాయుధము వ్యర్థము చేయఁబడినది. "జైమినిశ్చ సుమంతుశ్చ వైశంపాయన ఏవ చ. పులస్త్యః, పులహో, విష్ణుః షడేతే వజ్రదారణాః" అని వజ్రమును స్తంభింపఁజేసిన ఋషులున్నట్లు తెలియుచున్నది. ॥౩౯॥

శ్లో॥ ఈదృశాని మునయే వినయాబ్ధి
స్తస్థివాన్ స వచనాన్యుపహృత్య।
ప్రాంశు నిఃశ్వసిత పృష్ఠచరీ వాక్
నారదస్య నిరియాయ నిరోజాః॥ ౪౦

ప॥వి॥ ఈదృశాని । మునయే । వినయాబ్ధిః । తస్థివాన్ । సః । వచనాని । ఉపహృత్య । ప్రాంశునిః శ్వసితపృష్ఠచరీ । వాక్ । నారదస్య । నిరియాయ । నిరోజాః.

టీక॥ వినయాబ్ధిః = వినయ సముద్రుఁడైన, సః = ఆ యింద్రుఁడు, మునయే = నారద మహర్షికై, ఈదృశాని = యుద్ధమందు ననాసక్తిని సూచించునట్టి, వచనాని = మాటలను, ఉపహృత్య = సమర్పించి, తస్థివాన్ = ఊరక యుండెను. (అథ = పిదప) నారదస్య = నారదునకు, ప్రాంశు నిఃశ్వసిత పృష్ఠచరీ; ప్రాంశు = దీర్ఘమైన, నిఃశ్వసిత = నిట్టూర్పునకు, పృష్ఠచరీ = వెనుక నేర్పడిన, నిరోజాః = దీనమైన, వాక్ = మాట, నిరియాయ = వెలువడినది.

సమాసములు :

*వినయాబ్ధిః :* వినయస్య అబ్ధిః = వినయాబ్ధిః.

*ప్రాంశునిశ్వసితపృష్ఠచరీ :* ప్రాంశు చ తత్ నిఃశ్వసితం చ = ప్రాం

శునిఃశ్వసితం. ప్రాంశునిశ్శ్వసితస్య పృష్ఠః = ప్రాంశునిశ్శ్వసితపృష్ఠః. ప్రాంశు నిశ్శ్వసితపృష్ఠే చరతీతి = ప్రాంశునిశ్శ్వసిత పృష్ఠచరీ.

నిరోజాః : నిర్గతం ఓజః యస్యాస్సా = నిరోజాః.

**భావము :**

వినయ సముద్రుఁడైన యా యింద్రుఁడు, యుద్ధమందు నైరాశ్యముఁ గన్పించు మాటలనుఁ జెప్పి యూరకుండెను. అప్పుడు నారదుఁడు దీర్ఘమైన నిట్టూర్పులను విడచుచు దైన్యముతోఁ జెప్పఁదొడగెను. ॥४०॥

శ్లో॥ స్వారసాతలభవాహవశంకీ
నిర్వృణోమి న వసన్ వసుమత్యాం।
ద్యాం గతస్య హృది మే దురుదర్కః
క్ష్మాతలద్వయభటాజివితర్కః॥ ४१

ప॥వి॥ స్వారసాతలభవాహవశంకీ । నిర్వృణోమి । న । వసన్। వసుమత్యాం। ద్యాం । గతస్య । హృది । మే। దురుదర్కః । క్ష్మాతలద్వయభటాజివితర్కః.

టీక॥ వసుమత్యాం = భూమియందు, వసన్ = వసించుచు, స్వారసాతల భవాఽఽహవశంకీసన్; స్వః = స్వర్గలోకము, రసాతల = పాతాళలోకము అను నీ రెండులోకములయందు, భవ = జరుగుచున్న, ఆహవ = యుద్ధమును, శంకీసన్ = శంకించుచు, ననిర్వృణోమి = సంతోషించుట లేదు. ద్యాం = స్వర్గమును, గతస్య = పొందిన, మే = నాకు, హృది = హృదయమందు, క్ష్మాతలద్వయభటాజివితర్కః; క్ష్మా = భూమియందును, తల = పాతాళమందును, ద్వయ = ఈరెంటి యందలి, భట = వీరుల యొక్క, ఆజి = యుద్ధముయొక్క, వితర్కః = శంక, దురుదర్కః = దుష్టఫలము గలదిగా నుండగలదు.

**సమాసములు :**

స్వారసాతలభవాఽఽహవశంకీ : స్వశ్చరసాతలం చ = స్వారసాతలే. స్వారసాతలయోః భవః = స్వారసాతలభవః. స్వారసాతలభవశ్చాసౌ ఆహ

వశ్చ = స్వారసాతలభవాఽఽహవః. స్వారసాతలభవాహవం శంకత ఇతి = స్వారసాతలభవాహవశంకీ.

దురుదర్కః : దుష్టః ఉదర్కః యస్య సః = దురుదర్కః.

క్ష్మాతలద్వయభటాజివితర్కః : క్ష్మాచ తలంచ = క్ష్మాతలే. క్ష్మాతలయోః ద్వయం = క్ష్మాతలద్వయం. క్ష్మాతలద్వయే భటాః = క్ష్మాతలద్వయభటాః. క్ష్మాతలద్వయభటానామాజిః = క్ష్మాతలద్వయభటాజిః. క్ష్మాతలద్వయభటాజేః వితర్కః = క్ష్మాతలద్వయభటాజివితర్కః.

**భావము :**

నేను భూమిలో నున్నప్పుడు స్వర్గపాతాళ లోకముల యుద్ధమును భావించుచు, దానిని చూడజాలనందున, సంతోషింపక యుంటిని. ఇప్పుడు స్వర్గము నందుండుచు, భూలోకపాతాళలోకములయందు జరుగు వీరుల యుద్ధమును భావించుచు, దానిని చూడఁజాలనందువలన, సంతోషింపలేదు. అట్లే పాతాళలోకమందుండి స్వర్గభూలోకముల యందు జరిగెడి యుద్ధములనుఁ దర్కించుచు వానినిఁ జూడఁజాలనందువలనను సంతోషింపలేక పోతిని. ఒక లోకమునందున్నప్పుడు తదితర లోకములలోని యుద్ధములనుఁ జూచుట సాధ్యము కాదు గదా. ॥౪౦॥.

శ్లో॥ వీక్షిత స్త్వమసి మామథ గంతుం
తన్మనుష్యజగతేఽనుమనుష్వ।
కిం భువః పరివృఢా న వివోఢుం
తత్ర తాముపగతా వివదంతే॥ ౪౧

ప॥వి॥ వీక్షితః । త్వమ్ । అసి । మామ్ । అథ । గంతుం । తత్ । మనుష్యజగతే । అనుమనుష్వ । కిం । భువః । పరివృఢాః । న । వివోఢుం । తత్ర । తామ్ । ఉపగతాః । వివదంతే.

టీక॥ త్వం = నీవు, వీక్షితఃఅసి = చూడఁబడితివి. అథ = తర్వాత, మాం = నన్ను, మనుష్యజగతే = మానవలోకమునకై, గంతుం = వెళ్లుటకు, అనుమనుష్వ = అనుమతింపుము. తత్ర = అ మనుష్యలోకమందు, తాం =

ఆ దమయంతిని, వివోఢుం = వివాహమాడుటకొఱకు, ఉపగతాః = వచ్చిన, భువః = భూమికి, పరివృఢాః = ప్రభువులు, నవివదంతేకిం = కలహమాడరా యేమి ?

**సమాసములు :**

మనుష్యజగతే : మనుష్యాణాం జగత్ = మనుష్యజగత్. తస్మై = మనుష్య జగతే.

ఇంద్రా! నిన్నుఁజూచితిని. ఇదియే నే నిచ్చట వచ్చుటకు ప్రయోజనము. ఇఁక, నాకు మనుష్యలోకమునకు వెళ్లుటకు ననుమతి యొసంగుము. అచ్చట దమయంతిని వివాహమాడుటకై వచ్చినరాజులు కలహమాడుచుందురు. కాన నచ్చట వారాజులలోని యుద్ధము నైననుఁజూచి సంతోషింపఁగలను. ॥౪౨॥

శ్లో॥ ఇత్యుదీర్య స యయౌ మునిరుర్వీం
స్వర్పతిం ప్రతినివర్త్య జవేన।
వారితోఽప్యనుజగామ సయంతం
తం కియంత్యపి పదాన్యపరాణి॥ ౪౩

ప॥వి॥ ఇతి । ఉదీర్య । సః । యయౌ । మునిః । ఉర్వీం । స్వర్పతిం । ప్రతినివర్త్య । జవేన । వారితః । అపి। అనుజగామ । సః । యంతం। తం । కియంతి । అపి । పదాని । అపరాణి.

టీక॥ సః = ఆ నారదముని, ఇతి = ఇట్లు, ఉదీర్య = చెప్పి, స్వర్పతిం = స్వర్గమునకుఁ బ్రభువైన ఇంద్రుని, ప్రతినివర్త్య = వెనుకకుపంపి, జవేన = వేగముతో, ఉర్వీం = భూలోకమునుఁగూర్చి, యయౌ = వెళ్లెను. సః = ఆ యింద్రుఁడు, వారితోఽపి = వలదని నివారింపఁబడినను, యంతం = వెళ్లుచున్న, తం = ఆ నారదమునిని, అపరాణ్యపి = ఇతరములైన, కియంతి = కొన్ని, పదాని = అడుగులు, అనుజగామ = వెంబడించెను.

**సమాసములు :**

స్వర్పతిం : స్వఃపతిః = స్వర్పతిః. తమ్ = స్వర్పతిం.

**భావము :**

ఈ విధముగా నారదముని యింద్రునికిఁజెప్పి యాతనిని మఱలించి, తాను భూలోకమునకు వేగముగా వెళ్లెను. ఆ నారదుఁడు, 'వలద'ని వారించుచున్నను, ఇంద్రుఁడు కొన్నియడుగులు, తన యెల్లవరకును ఆ నారదమహర్షిని వెంబడించెను. ॥౪౽॥

శ్లో॥ పర్వతేన పరిపీయ గభీరం
నారదీయముదితం ప్రతినేదే।
స్వస్య కశ్చిదపి పర్వతపక్ష
చ్ఛేదిని స్వయమదర్శి న పక్షః॥ ౪౪

ప॥వి॥ పర్వతేన । పరిపీయ । గభీరం । నారదీయమ్ । ఉదితం । ప్రతినేదే । స్వస్య । కః । చిత్ । అపి । పర్వతపక్షచ్ఛేదిని । స్వయమ్ । అదర్శి । న । పక్షః.

టీక॥ పర్వతేన = నారదునివెంట వచ్చిన పర్వతమునిచేతను,(పర్వతముచేతను), గంభీరం = గంభీరమైన, నారదీయం = నారదునకు సంబంధించిన, అనగా నారదుఁడుచెప్పిన, ఉదితం = వాక్యమును, పరిపీయ = పానము చేయఁబడి, అనగా చక్కగా శ్రవణము చేయఁబడి, ప్రతినేదే = అనుకరింపఁబడినది. అనగా ప్రతిధ్వనిచేననుకరింపఁబడినది. పర్వతమున్నచో ప్రతిధ్వనియుండునుగదా. పర్వతపక్షచ్ఛేదిని = పర్వతములయొక్క ఱెక్కలను తెగఁగొట్టిన యింద్రునివిషయమున, స్వస్య = తనయొక్క, కశ్చిదపి = ఏయొక్కటియైనను, పక్షః = మతము, అనగా నభిప్రాయము (ఱెక్క), స్వయం = తనయంతట, నాఽదర్శి = చూపఁబడలేదు.

**సమాసములు :**

*నారదీయం :* నారదస్య ఇదం = నారదీయమ్. తత్ = నారదీయమ్.

*పర్వతపక్షచ్ఛేదిని:* పర్వతానాం పక్షాః = పర్వతపక్షాః. పర్వతపక్షాన్ ఛినత్తీతి = పర్వతపక్షచ్ఛేదీ. తస్మిన్ = పర్వతపక్షచ్ఛేదిని.

భావము :

ఆ నారదుని వెంటవచ్చిన పర్వతముని యేమియు తాను ఇంద్రునిగూర్చి చెప్పలేదు. నారదుఁడు చెప్పిన విషయములను విని దానినే యనుకరించినాఁడు. అనగా పర్వతమైనందువలన నారదుఁడు చెప్పినదానినే ప్రతిధ్వనించినాఁడనియు సూచితము. నారదుఁడు చెప్పినదానిని చక్కగా నున్నదని యతడభినందించెను. ఏలయనగా తనయెదుటనున్న యా యింద్రుఁడు పర్వతపక్షచ్ఛేది గదా! కాన నతని యెదుట పర్వతమైన తన యొక్క పక్షమునకు అనగా అభిప్రాయమునకును ఱెక్కకును భంగము కదా! కావున పర్వతముని తన పక్షమును దేనిని బయటపెట్టుకొనలేదు. నారదుఁడనగా - ''నారముదకం దదాతి'' యను వ్యుత్పత్తిననుసరించి ఉదకమిచ్చెడి మేఘమను నర్థముఁ జెప్పినచో నతనివచనమనెడి మేఘగర్జనమును చక్కగావిని, పర్వతమహర్షి యను పర్వతము ప్రతిధ్వనించినదను నర్థము లభ్యమగును. మేఘ గర్జనమునకు పర్వతము ప్రతిధ్వనించుట సహజముగదా! ॥౪౨॥

శ్లో॥ పాణయే బలరిపోరథ భైమీ
శీతకోమలకరగ్రహమర్హమ్।
భేషజం చిరచితాశనివాస
వ్యాపదాముపదిదేశ రతీశః॥ ౪౩

ప॥వి॥ పాణయే । బలరిపోః । అథ । భైమీశీతకోమలకరగ్రహమ్ । అర్హమ్।
భేషజం । చిరచితాశనివాసవ్యాపదామ్ । ఉపదిదేశ । రతీశః.

టీక॥ అథ = నారదుఁడు వెళ్లినపిదప, రతీశః = మన్మథుఁడు, బలరిపోః = ఇంద్రునియొక్క, పాణయే = హస్తముకొఱకు, చిరచితాశని వాసవ్యాపదాం; చిర = చాలకాలమునుండి, చిత = సంపాదింపఁబడినవియు, అశనివాస = వజ్రాయుధముయొక్క అగ్నిసంబంధముచేఁగల్గినవియునగు, వ్యాపదాం = ఆపదలకు, భైమీశీతకోమల కరగ్రహమ్; భైమీ = దమయంతియొక్క, శీత = చల్లని, కోమల = మృదువైన, కర = హస్తమును, గ్రహం = పట్టుటను, అర్హం = తగిన, భేషజం = ఔషధముగా, ఉపదిదేశ = ఉపదేశించెను.

వి॥ దమయంతీ పాణిగ్రహణము, వజ్రాయుధమువలని తాపశాంతి కొఱకుఁ గాకపోయినను, తచ్ఛాంతి కొఱకని చెప్పుటవలన నుత్ప్రేక్షాలంకారము. వ్యంజకములనుఁ బ్రయోగింపనందువలన నది గమ్యము.

## సమాసములు :

*బలరిపోః :* బలస్య రిపుః = బలరిపుః. తస్య = బలరిపోః.

*భైమీశీతకోమలకరగ్రహమ్ :* భీమస్య అపత్యం స్త్రీ = భైమీ. శీతశ్చాసౌ కోమలశ్చ = శీతకోమలః. శీతకోమలశ్చాసౌ కరశ్చ = శీతకోమలకరః. భైమ్యాః శీతకోమలకరః = భైమీశీతకోమలకరః. భైమీ శీతకోమలకరస్య గ్రహః = భైమీశీతకోమలగ్రహః. తమ్ = భైమీశీతకోమల కరగ్రహమ్.

*చిరచితాశనివాసవ్యాపదామ్ :* చిరం చితాః = చిరచితాః. అశనేః వాసః = అశనివాసః. అశనివా సేన వ్యాపదః = అశనివాసవ్యాపదః. చిరచితాశ్చ తాః అశనివాసవ్యాపదశ్చ = చిరచితాశనివాసవ్యాపదః. తాసామ్ = చిరచితాశనివాసవ్యాపదామ్.

*రతీశః :* రత్యాః ఈశః = రతీశః.

నారదుఁడింద్రుని యనుమతిఁబొంది భూలోకమునకేగగనే, మన్మథుఁడు, చాలకాలమునుండి వజ్రాయుధమును ధరించుటచే దాని యగ్నివలన హస్తమున కేర్పడిన బొబ్బలను మంటలను, శమింపజేయుటకు, దమయంతియొక్క చల్లని మృదువైన హస్తమునుబట్టుకొనుటయే తగిన యౌషధమని ఇంద్రునకుపదేశించెను. అనగా నింద్రునకుదమయంతిపై ననురాగమేర్పడినదనియాశయము॥౪౫॥

శ్లో॥ నాకలోకభిషజోస్సుషమా యా
పుష్పచాపమపి చుంబతి సైవ।
వేద్మి తాదృగభిషజ్యదసౌ త
ద్ద్వారసంక్రమితవైద్యకవిద్యః॥ ౪౬

ప॥వి॥ నాకలోకభిషజోః । సుషమా । యా । పుష్పచాపమ్। అపి । చుంబతి। సా । ఏవ। వేద్మి । తాదృక్ । అభిషజ్యత్ । అసౌ। తద్ద్వారసంక్రమితవైద్యకవిద్యః.

టీక॥ నాకలోకభిషజోః; నాకలోక = స్వర్గలోకమందలి, భిషజోః = వైద్యులైన యశ్వినులయొక్క, యా = ఏ, సుషమా = అందముగలదో, సైవ = అదియే, పుష్పచాపమపి = పూవిల్తుఁడైన మన్మథుని, చుంబతి = స్పృశించుచున్నది. అసౌ = ఆ మన్మథుఁడు, తద్ద్వారసంక్రమితవైద్యకవిద్యః; తద్ద్వార = అందమనెడి ద్వారముచే,సంక్రమిత = సంక్రమించిన, వైద్యకవిద్యః = వైద్యవిదగలవాఁడై, తాదృక్ = ఆ స్వర్గలోక వైద్యులకు సమానుఁడై, అభిషజ్యత్ = (ఇంద్రునకు) చికిత్స చేసెను. (ఇతి = అని) వేద్మి = తెలుసుకొనుచున్నాను.

వి॥ ఇంద్రునికి మన్మథుఁడు చికిత్స చేయుటలో, నశ్వినుల సౌందర్యసంక్రాంతి హేతువు కాకపోయినను హేతువుగఁ జెప్పుటవలన నుత్ప్రేక్ష.

**సమాసములు :**

*నాకలోకభిషజోః :* నాక ఇతి లోకః = నాకలోకః. నాకలోకస్య భిషజౌ = నాకలోకభిషజౌ. తయోః = నాకలోకభిషజోః.

*పుష్పచాపమ్ :* పుష్పం చాపః యస్య సః = పుష్పచాపః. తమ్ = పుష్పచాపమ్.

*తద్ద్వారసంక్రమితవైద్యకవిద్యః :* సైవ ద్వారం = తద్ద్వారం. తద్ద్వారేణ సంక్రమితా = తద్ద్వార సంక్రమితా. వైద్యస్య కర్మ = వైద్యకం. వైద్యకమేవ విద్యా = వైద్యకవిద్యా. తద్ద్వారసంక్రమితా వైద్యకవిద్యా యస్య సః = తద్ద్వారసంక్రమితవైద్యకవిద్యః.

**భావము :**

మన్మథునకు వైద్యవిద్య యెట్లు తెలుసునని సందేహింపవలదు. స్వర్గలోక వైద్యులగు నశ్వినుల సౌందర్యము మన్మథునికి సంక్రమించినది. ఆ సౌందర్యము నుండి వారి వైద్యవిద్యయు నా మన్మథునకు సంక్రమించినది. అట్లు మన్మథుఁడు సౌందర్యమందేగాక, వైద్యమందును నశ్వినులకు సమానుఁడై యింద్రునకుఁ జికిత్స చేయఁగల్గెను.

శ్లో॥ మానుషీమనుసరత్యథ పత్యౌ
ఖర్వభావమవలంబ్య మఘోనీ
ఖండితం నిజమసూచయదుచ్చై
ర్మానమాననసరోరుహనత్యా॥ ౪౭

ప॥వి॥ మానుషీమ్ । అనుసరతి । అథ । పత్యౌ । ఖర్వభావమ్ । అవలంబ్య । మఘోనీ । ఖండితం । నిజమ్ । అసూచయత్ । ఉచ్చైః । మానమ్ । ఆననసరోరుహనత్యా.

టీక॥ అథ = ఇంద్రునికి దమయంతి పైననురాగముగల్గిన పిదప, మఘోనీ = ఇంద్రుని భార్యయైన శచీదేవి, పత్యౌ = భర్తయగు నింద్రుఁడు, ఖర్వభావం = నీచత్వమును, అవలంబ్య = పొంది, మానుషీం = మానవజాతికి సంబంధించిన స్త్రీని, అనుసరతిసతి = అనుసరించుచుండగా, ఆననసరోరుహనత్యా = వదన పద్మమునువంచుటచే, ఉచ్చైః = ఉన్నతమైన, నిజం = తనదైన, మానం = అందఱి మించినదానను అను నహంకారమును, ఖండితం = భగ్నమైనదిగా, అసూచయత్ = సూచించెను.

## సమాసములు :

మనుష్యస్యా : ఇయం = మానుషీ. తామ్ = మానుషీమ్.

ఖర్వాభావమ్ : ఖర్వస్య భావః = ఖర్వభావః. తం = ఖర్వభావమ్.

ఆననసరోరుహనత్యా: ఆననమేవ సరోరుహమ్ = ఆననసరోరుహమ్. ఆననసరోరుహస్యనతిః = ఆననసరోరుహ నతిః.తయా = ఆననసరోరుహనత్యా.

## భావము :

ఇంద్రునకు దమయంతిపై ననురాగమేర్పడిన విషయమతని భార్యయగు శచీదేవికి తెలిసినది. తన భర్త నీచభావము నవలంబించి, దేవతాజాతికిఁ జెందిన తమకంటె నీచమైన మానవజాతికిఁ జెందిన దమయంతిని వలచినందులకు నేమియుఁ జెప్పక తన వదన పద్మమును వంచి తానందఱిని మించిన

దాననెడి తన యహంకారమునకు భంగము వాటిల్లినదని సూచించినది. ఆశచీ దేవి గంభీరనాయిక గాన నోటితో నేమియుఁ జెప్పక తన యాకారముచేతనే తనకుఁ గల్గిన దుఃఖమును సూచించినదని యాశయము. ॥౪౭॥

శ్లో॥ యో మఘోని దివముచ్చరమాణే
రంభయా మలినిమాలమలంభి।
వర్ణ ఏవ స ఖలూజ్జ్వలదస్యా
శ్శాంతమంతరమభాషత భంగ్యా॥ ౪౮

ప॥వి॥ యః । మఘోని । దివమ్ । ఉచ్చరమాణే । రంభయా । మలినిమా । ఆలమ్ । అలంభి । వర్ణః । ఏవ । సః । ఖలు । ఉజ్జ్వలత్ । అస్యాః । శాంతమ్ । అంతరమ్ । అభాషత । భంగ్యా.

టీక॥ మఘోని = ఇంద్రుఁడు, దివం = ఆకాశమునుఁగూర్చి, ఉచ్చరమాణే సతి = ఎగురుచుండగా, రంభయా = రంభచే, యః = ఏ, మలినిమా = మాలిన్యము, అలం = మిక్కిలి, అలంభి = పొందింపఁబడినదో, సః = ఆ, వర్ణఏవ = మాలిన్యమనెడి వర్ణమే, అస్యాః = ఈరంభ యొక్క, అంతరం = హృదయమును, ఉజ్జ్వలత్ = రోషమువలన జ్వలింపఁజేసినదై, భంగ్యా = ఒకానొక విధముతో, అనగా దైవ ప్రాబల్యాబుద్ధిచే, శాంతం = చల్లార్పఁబడినదై, అబాషతఖలు = మాట్లాడినది గదా! లేదా, ఉజ్జ్వలం = శృంగార రస ప్రధానముగాఁ బ్రకాశించెడి, అంతరం = హృదయమును, శాంతం = శాంతరస ప్రధానముగా, అభాషతఖలు = చెప్పుచుండినది గదా.

**భావము :**

ఇంద్రుఁడు మింటి కెగరగా, రంభ మిక్కిలి దుఃఖముతో నల్లఁబడినది. ఈ నలుపు వర్ణమే, రంభయొక్క హృదయమెట్లు కోపముతో రగుల్కొని దైవ గతితో నది చల్లారిన విధమునుఁ జెప్పుచున్నది. చల్లారిన కొఱవి యెట్లు నల్లఁ బడునో యట్లు రంభయొక్క హృదయము నల్లఁబడినది. ఆమె హృదయము, కోపముతో మండి చల్లారి నల్లఁబడినందువలననే, యామె శరీరముఁ గూడ నల్ల బారినది. అంతఃకిరణమందలి వైవర్ణ్యము, శరీరమందలి వైవర్ణ్యమునకుఁ గారణ

ముగదా? ఇంద్రుఁడు తన్ను వదలి మఱియొక స్త్రీని వలచుచు, నామెకై స్వర్గ మువదలి భూలోకమునకు వెళ్లుటవలన రంభ దుఃఖించి, యా దుఃఖముతో నల్ల బారినదని యాశయము. ॥౪౮॥

శ్లో॥ జీవితేన కృతమప్సరసాం తత్
ప్రాణముక్తిరిహ యుక్తిమతీ నః।
ఇత్యనక్షరమవాచి ఘృతాచ్యా
దీర్ఘనిశ్శ్వసితనిర్గమనేన॥ ౪౯

ప॥వి॥ జీవితేన । కృతమ్ । అప్సరసాం । తత్ । ప్రాణముక్తిః । ఇహ । యుక్తిమతీ । నః । ఇతి । అనక్షరమ్ । అవాచి । ఘృతాచ్యా । దీర్ఘ నిశ్శ్వసితనిర్గమనేన.

టీక॥ అప్సరసాం = అప్సరసలైన, నః = మనకు, జీవితేన = జీవితముచే, కృతం = చాలును. తత్ = అందువలన, ఇహ = ఈ సమయమున, ప్రాణముక్తిః = ప్రాణములను వదలుట, యుక్తిమతీ = యుక్తమైనది, ఇతి = అని, ఘృతాచ్యా = ఘృతాచియనెడి యచ్చరచే, దీర్ఘనిశ్శ్వసిత నిర్గమనేన; దీర్ఘనిశ్శ్వసిత = దీర్ఘమైన నిశాస్వమును, నిర్గమనేన = వదలి పెట్టుటచే, అనక్షరం = మాటలు లేకుండ, అవాచి = చెప్పఁబడి నదో యనునట్లుండినది.

వి॥ నిట్టూర్పుతోఁ జెప్పక పోయినను, జెప్పినట్లు వర్ణించుటవలన నుత్ప్రేక్ష. వ్యంజకము లేనందువలన నది గమ్యము.

## సమాసములు :

*ప్రాణముక్తిః :* ప్రాణానాం ముక్తిః = ప్రాణముక్తిః.

*యుక్తిమతీ :* యుక్తిః అస్యాః అస్తీతి = యుక్తిమతీ.

*అనక్షరమ్ :* అవిద్యమానం అక్షరం యస్మిన్ కర్మణి తద్యథాభవతి. తథా = అనక్షరమ్.

*దీర్ఘనిశ్శ్వసితనిర్గమనేన :* దీర్ఘం చ తత్ నిశ్శ్వసితం చ = దీర్ఘనిశ్శ్వసితమ్. దీర్ఘనిశ్శ్వసితస్య నిర్గమనం = దీర్ఘనిశ్శ్వసితనిర్గమనం. తేన = దీర్ఘ నిశ్శ్వసితనిర్గమనేన.

**భావము :**

అచ్చరలైన మనకిఁక జీవితను పనిలేదు. అందువలన మనమిప్పుడు ప్రాణములను వదలి పెట్టుటయే యుక్తము అని, మాటలాడకయే ఘృతాచి నిట్టూర్పుచే నిట్లు పలికినదో యని యుండినది. ॥౪౯॥

శ్లో॥ సాధు నః పతనమేవ మితస్స్యా
దిత్యభణ్యత తిలోత్తమయాఽపి।
చామరస్య పతనేన కరాబ్జా
త్తద్విలోలనవలద్భుజనాళాత్॥ ౫౦॥

ప॥వి॥ సాధు । నః । పతనమ్ । ఏవమ్ । ఇతః । స్యాత్ । ఇతి। అభణ్యత। తిలోత్తమయా । అపి । చామరస్య। పతనేన । కరాబ్జాత్। తద్విలోలనవలద్భుజనాళాత్.

టీక॥ తిలోత్తమయాఽపి = తిలోత్తమయనునచ్చరచే, తద్విలోలనవలద్భుజనాళాత్; తత్ = ఆచామరముయొక్క, విలోలన = ఆడించుటచే, వలత్ = కదలుచున్న, భుజనాళాత్ = బాహువనెడి కాడగల్గిన, కరాబ్జాత్ = హస్తపద్మమునుండి, చామరస్యపతనేన = చామరముపడుటచే, ఏవం = ఈ చామరమునకువలె, నః = మనకును, ఇతః = ఈ స్వర్గమునుండి, పతనమేవ = పడిపోవుటయే, సాధు = చక్కగా, స్యాత్ = అగును. ఇతి = అని, అభణ్యత = చెప్పఁబడెనో యనునట్లుండెను.

వి॥ చామర పతనముచే, తమయొక్క స్వర్గపతనమునుఁ జెప్పక పోయినను, చెప్పినట్లు వర్ణించుటవలన నుత్ప్రేక్ష. వ్యంజము చెప్పనందువలన నది గమ్యము.

"కరాబ్జాత్" అని హస్తమును పద్మముతో రూపించుటవలన రూపకము. "భుజనాళాత్" అని భుజమును కాడతో రూపించుట వలనను రూపకము. ఇది సావయవము. దీనితో నుత్ప్రేక్షకు సంసృష్టి.

**సమాసములు :**

కరాబ్జాత్ : కర ఏవ అబ్జమ్ = కరాబ్జమ్. తస్మాత్ = కరాబ్జాత్.

తద్విలోలనవలద్భుజనాళాత్ : తస్య విలోలనం = తద్విలోలనం. తద్విలోలనేన వలన్ = తద్విలోలనవలన్. భుజ ఏవ నాళః = భుజనాళః. తద్విలోలనవలంశ్చాసౌ భుజనాళశ్చ = తద్విలోలనవలద్భుజనాళః. తస్మాత్ = తద్విలోలనవలద్భుజనాళాత్.

భావము :

తిలోత్తమయను నప్సరస చామరమును విసరుటచే కదలు బాహువనెడి కాడగల్గిన కేలుతమ్మినుండి యది పడిపోగా, ఈ చామరమువలెనే మనకును స్వర్గమునుండి పతనము చక్కగా నేర్పడగలదని చెప్పినదా యనునట్లుండెను. ఆమె చామరము వేయునపుడు, ఆమెయొక్క భుజము తామరకాడగను, ఆమె చేయి పద్మముగను భాసించుచుండినది. ॥౨౦॥

శ్లో॥ మేనకా మనసి తాపముదీతం
యత్పిధిత్సురకరోదవహిత్థామ్।
తత్స్ఫుటం నిజహృదః పుటపాకే
పంకలిప్తిమసృజద్బహిరుత్థామ్॥ ౨౧

ప॥వి॥ మేనకా । మనసి । తాపమ్ । ఉదీతం । యత్ । పిధిత్సుః । అకరోత్ । అవహిత్థాం । తత్ । స్ఫుటం । నిజహృదః । పుటపాకే । పంకలిప్తిమ్ । అసృజత్ । బహిరుత్థామ్.

టీక॥ మేనకా = మేనకయనునొకయప్సరస, మనసి = తన మనస్సునందు, ఉదీతం = పుట్టిన, తాపం = సంతాపమును, పిధిత్సుః = మఱుగు పఱచుటకుఁ గోరినదై, అవహిత్థాం = తన యాకారమును మఱుగు పరచుటను, అకరోదితియత్ = చేసెనునట యేది గలదో, తత్ = ఆ యాకారమును మఱుగు పఱచుటయే, నిజహృదః = తన మనస్సునకు, పుటపాకే = గూఢమైనపాకమందు, బహిరుత్థాం = వెలుపల నేర్పడిన, పంకలిప్తిం = బురదపూతను, స్ఫుటం = స్పష్టముగా, అసృజత్ = కల్పించినది.

సమాసములు :

పిధిత్సుః : పిధాతుమిచ్ఛుః = పిధిత్సుః.

*నిజహృదః:* నిజం చ తత్ హృచ్చ = నిజహృత్. తస్య = నిజహృదః.

*పుటపాకే :* పుటయోః పాకః = పుటపాకః. తస్మిన్ = పుటపాకే.

*పంకలిప్తిమ్ :* పంకస్య లిప్తిః = పంకలిప్తిః.తాం = పంకలిప్తిమ్.

*బహిరుత్థామ్ :* బహిః ఉత్థా యస్యాస్సా = బహిరుత్థా. తామ్ = బహిరు-త్థామ్.

భావము ;

మేనకయను నప్సరస తన మనస్సునందుఁ గల్గిన తాపమును దాచుకొనఁ గోరినదై తన యాకారమును గోప్యము గావించుకొనినది. అందువలన నామె కింకను బాధ యెక్కువయైనది. ఆయాకారగోపనము, తన మనస్సునకు పుటపాకమునకై వెలుపల చేయవలసిన బురదపూతగా నేర్పడినదై, యింకను మిక్కుటమగు బాధనుఁ గల్గించినది. రెండు మూకుళ్లనుఁ దీసికొని యడుగు మూకుడునందు మందునుంచి పైన మూకుడును బోరగిలపెట్టి వాని సందులకు బురదనుఁ బూసి క్రిందనుఁ బైనను నిప్పును పోసి వండుటయే పుటపాక మనఁబడును. ఇచ్చట తిలోత్తమ తన మనస్సునందలి తాపమును దాచుకొనుటవలన, నా దాచడము లోపలనున్న మనస్సును పుటపాకమున పెట్టుచు, సందు లేకుండటకై చుట్టు పూసిన బురదవలె నేర్పడి యామె కధికమైన సంతాపమునుఁ గల్గించినది. బయటఁ గావించిన బురదపూత లోన జరిగెడి ఔషధపాకము నెట్టు వెల్లడి పఱచునో, అట్లే యీ తన తాపమును లోనదాచుకొనుటయే బురదపూత వలె నా యంతస్తాపమును బయలు పఱచినది. ॥౨౦॥

శ్లో॥ ఊర్వశీ గుణవశీకృతవిశ్వా
తత్క్షణస్తిమితభావనిభేన।
శక్రసౌహృదసమాపనసీమ్ని
స్తంభకార్యమపుషద్వపుషైవ॥ ౨౧

ప॥వి॥ ఊర్వశీ । గుణవశీకృతవిశ్వా । తత్క్షణస్తిమితభావనిభేన । శక్రసౌహృదసమాపనసీమ్ని । స్తంభకార్యమ్ । అపుషత్ । వపుషా । ఏవ.

**టీక॥** **గుణవశీకృతవిశ్వా;** గుణ = సౌందర్యాది గుణములచే, వశీకృత = వశము గావించుకొనఁబడిన, విశ్వా = ప్రపంచముగల్గిన, ఊర్వశీ = ఊర్వశి యను నప్సరస, తత్క్షణస్తిమితభావనిభేన; తత్క్షణ = ఆ సమయమందేర్ప డిన, స్తిమితభావ = నిశ్చలభావమను, నిభేన = మిషచే, వపుషైవ = శరీరముచేతనే, శక్రసౌహృదసమాపనసీమ్ని; శక్ర = ఇంద్రునియొక్క, సౌహృద = స్నేహమునకు, సమాపన = ముగింపునకు, సీమ్ని = ఎల్ల యైన స్థలమునందు, స్తంభకార్యమ్; స్తంభ = జడత్వమను సాత్త్వికభావముయొక్క, (స్తంభము యొక్కయు), కార్యం = పనిని, అపుషత్ = పోషించినది.

## సమాసములు :

*గుణవశీకృతవిశ్వా:* అవశః వశః సపద్యమానః కృతః = వశీకృతః. గుణైః వశీకృతః = గుణవశీకృతః. గుణవశీకృతః విశ్వః యయా సా = గుణవశీకృతవిశ్వా.

*తత్క్షణస్తిమితభావనిభేన :* స చాసౌ క్షణశ్చ = తత్క్షణః. తత్క్షణం స్తిమితః = తత్క్షణస్తిమితస్య. తత్క్షణస్తిమితస్యభావః = తత్క్షణస్తిమితభావః. తత్క్షణస్తిమితభావస్య నిభమ్ = తత్క్షణస్తిమితభావనిభమ్. తేన = తత్క్షణస్తిమితభావనిభేన.

*శక్రసౌహృదసమాపనసీమ్ని:* సుహృదః భావః = సౌహృదం. శక్రస్య సౌహృదం = శక్రసౌహృదం. శక్రసౌహృదస్య సమాపనమ్ = శక్రసౌహృదసమాపనమ్. శక్రసౌహృదసమాపనస్య సీమా = శక్రసౌహృదసమాపనసీమా. తస్మిన్ = శక్రసౌహృదసమాపనసీమ్ని.

*స్తంభకార్యమ్ :* స్తంభస్య కార్యమ్ = స్తంభకార్యమ్. తత్ = స్తంభకార్యమ్.

## భావము :

ఊర్వశియను నప్సరస తన సౌందర్యము మున్నగు గుణములచే, ప్రపంచమునే తన వశమందుంచుకొని యున్నది. ఆమె, యింద్రుఁడు దమయంతిని వలచిన సమాచారమును వినిన వెంటనే, స్తంభించిపోయినది. అనగా స్తంభమువలె నిశ్చేష్టురాలైనది. ఆ స్తంభీభావమను సాత్త్వికభావమునెపమున

నామె యింద్రునితోటి మైత్రి సమాప్తి పొందిన స్థానమున (జడత్వకార్యమును) స్తంభముయొక్క పనిని నెరవేర్చినది. అనగా నింతటితో నింద్రునితోటి మైత్రి ముగిసినదని భావించినది. ఆమె యింద్రుని నడవడిక వినిన వెంటనే పొందిన స్తంభీభావమే, యామెకు నింద్రునికి మధ్యగల స్నేహము ముగిసిన స్థానము నకు, అనగా ఎల్లకు, స్తంభమునాటి నట్లాయెను. ॥౫౨॥

శ్లో॥ కాపి కామపి బభాణ బుభుత్సుం
శృణ్వతి త్రిదశభర్తరి కించిత్।
ఏష కశ్యపసుతామభిగంతా
పశ్య కశ్యపసుతశ్శతయజ్ఞః॥ ౫౩

ప॥వి॥ కా । అపి । కామ్ । అపి । బభాణ । బుభుత్సుం । శృణ్వతి । త్రిదశ భర్తరి । కించిత్ । ఏషః । కశ్యపసుతామ్ । అభిగంతా । పశ్య । కశ్యపసుతః । శతయజ్ఞః.

టీక॥ కాఽపి = ఒకానొకయప్సరస, బుభుత్సుం = ఇంద్రుఁడు పోఁగోరిన స్థలమునుఁ దెలిసికొన గోరినదైన, కామపి = ఒకానొక యప్సరసను, త్రిదశభర్తరి = దేవతలకు ప్రభువైన యింద్రుఁడు, శృణ్వతిసతి = వినుచుండగనే, కించిత్ = ఒకానొక వాక్యమును, బభాణ = పలికెను. శతయజ్ఞః = నూఱు యజ్ఞములు గావించిన, కశ్యపసుతః = కశ్యపప్రజాపతి కుమారుఁడైన, ఏషః = ఈ యింద్రుఁడు, కశ్యపసుతాం = కాశ్యపియైన భూమినిఁగూర్చి, అభిగంతా = పోఁబోవుచున్నాఁడు, పశ్య = చూడుము.- (కశ్యపసుతః = కశ్యపుని పుత్రుఁడైన యింద్రుఁడు, కశ్యపసుతాం = కశ్యపుని కుమార్తెను, అభిగంతా = పొందగోరుచున్నాఁడు.) అనగా సోదరుడు చెల్లెలినిఁ బొందఁగోరు చున్నాఁడను నశ్లీలార్థము సూచితము.

సమాసములు :

బుభుత్సుమ్ : బోద్ధుమిచ్ఛుః = బుభుత్సుః. తామ్ = బుభుత్సుమ్.

త్రిదశభర్తరి: త్రిస్రః దశాః యేషాం తే = త్రిదశాః. త్రిదశానాం భర్తా = త్రిదశభర్తా. తస్మిన్ = త్రిదశభర్తరి.

కశ్యపసుతామ్ : కశ్యపస్య సుతా = కశ్యపసుతా. తామ్ = కశ్యపసుతామ్.

కశ్యపసుతః : కశ్యపస్య సుతః = కశ్యపసుతః.

శతయజ్ఞః : శతం యజ్ఞాః యస్య సః = శతయజ్ఞః.

భావము :

అప్సరసలలో కొందఱు ఇంద్రునిగూర్చి విమర్శలు చేయుచున్నారు. వారిలోనొకయప్సరస యింద్రుఁడు పోఁగోరినస్థలమునుఁ దెలిసికొనఁగోరిన యింకొక యప్సరసతో నింద్రుఁడు వినునట్లు కొంచెము చెప్పినది- కశ్యప ప్రజాపతి పుత్రుఁడును, నూఱు యజ్ఞములనుఁ జేసిన యీ యింద్రుఁడు స్వర్గలోకమనున్నతస్థానమునందుండి కశ్యపుని పుత్రికయగుటవలన కాశ్యపియని చెప్పఁబడుచున్న భూమినిగూర్చి వెళ్లుచున్నాడు; చూడు! ఇదిఎంత ఆశ్చర్యము! స్వర్గమనెడి యున్నత స్థానమున నున్నవాఁడు భూమియనెడి తక్కువ స్థానమునకు వెళ్లుట యాశ్చర్యమే గదా. భూమియందున్నవారు స్వర్గమునకు వెళ్లఁ గోరుదురే గాని స్వర్గమందున్న వారు భూమినిఁ గోరుట యసంభవము గదా! మఱియు నీ యింద్రుఁడు తాను కశ్యపుని పుత్రుడై, కశ్యప పుత్రిక యగుటవలన తనకు సోదరియగు కాశ్యపినిఁ బొందఁగోరు చున్నాఁడు. ఇది ఎంత ఆశ్చర్యకరము! లోకమున సోదరిని సోదరుఁడు పొందగోరునా! అని వ్యంగ్యముగా నింద్రుని తూలనాడినది. ॥౨౩॥

శ్లో॥ ఆళిమాత్మసుభగత్వసగర్వా
కాపి శృణ్వతి మఘోని బభాషే।
వీక్షణేఽపి సఘృణాఽసి నృణాం కిం
యాసి న త్వమపి సార్థగుణేన॥ ౨౪

ప॥వి॥ ఆళిమ్ । ఆత్మసుభగత్వసగర్వా । కా । అపి । శృణ్వతి । మఘోని । బభాషే । వీక్షణే । అపి । సఘృణా । అసి । నృణాం । కిం । యాసి । న । త్వమ్ । అపి । సార్థగుణేన.

టీక॥ ఆత్మసుభగత్వసగర్వా; ఆత్మ = తనయొక్క, సుభగత్వ = సౌభాగ్యముచే, పతికిఁ బ్రియమైన దాననను భావముచే, సగర్వా = గర్వముతోఁ గూడిన, కాఽపి = ఒకానొక యప్సరస, మఘోని = ఇంద్రుఁడు, శృణ్వతిసతి = వినుచుండగా, ఆళిం = చెలికత్తెనుఁగూర్చి, బభాషే = ఇట్లు పలికినది. నృణాం = మనుష్యులను, వీక్షణేఽపి = చూచుటయందును, సఘృణా = ఏవగింపుగల దానవుగా, అసి = అగుచున్నావు. సా = అటువంటి, త్వమపి = నీవును, సార్థగుణేన = సహవాస గుణముచే, నయాసికిం = పోవా ఏమిః.

## సమాసములు :

ఆత్మసుభగత్వసగర్వా : సుభగాయాః భావః = సుభగత్వం. ఆత్మనః సుభగత్వం = ఆత్మసుభగత్వం. గర్వేణ సహవర్తత ఇతి = సగర్వా. ఆత్మసుభగత్వేన సగర్వా = ఆత్మసుభగత్వసగర్వా.

సఘృణా : ఘృణయా సహ వర్తత ఇతి = సఘృణా.

సార్థగుణేన : సార్థప్రయుక్తో గుణః = సార్థగుణః. తేన = సార్థగుణేన.

## భావము :

తాను మిక్కిలి యందగత్తెను, భర్తకు ప్రియమైనదానను అను గర్వముతోఁ గూడిన యొకానొక యప్సరస, యింద్రుఁడు వినునట్లుగాఁ జెలికత్తెతో నిట్లనినది-మనుష్యులనుఁ జూచుటకే యేవగింపుగా నున్నపుడు, వారితోఁ గలియుట యెంత రోతః యని నీవు వారి విషయమున నేవగింపు కలదానవు. నీవు గూడ నింద్రునితోటి సహవాస గుణముతో, భూలోకమునకు వెళ్లెదవాః వివేకమున్నచో వెళ్లవు. ॥౨౪॥

శ్లో॥ అన్వయుర్ద్యుతిపయఃపితృనాథా
స్తం ముదాఽథ హరితాం కమితారః।
వర్త్మ కర్షతు పురః పరమేక
స్తద్గతానుగతికో న మహార్ఘః॥ ౨౫

**ప॥వి॥** అన్వయుః। ద్యుతిపయః పితృనాథాః। తం। ముదా। అథ । హరితాం। కమితారః । వర్త్మ । కర్షతు । పురః । పరమ్ । ఏకః । తద్గతానుగతికః । న । మహార్ఘః.

**టీక॥** అథ = పిదప, అనగా నింద్రుఁడు భూలోకమునుగూర్చి పయనించిన పిదప, హరితాం = దిక్కులను, కమితారః = నాథులైన, ద్యుతిపయః పితృనాథాః; ద్యుతి = వెలుగునకు, పయః = నీటికిని, పితృ = పితృదేవతలకును, నాథాః = నాథులైన అగ్ని వరుణ యములు, తం = ఆయింద్రుని, ముదా = సంతోషముతో, అన్వయుః = వెంబడించిరి. తథాహి = అదియుక్తమే, ఎట్లనగా-ఏకఃపరం = ఒక్కఁడు మాత్రమే, అనగా నిచ్చట నింద్రుఁడు, పురః = ముందు, వర్త్మ = త్రోవను, కర్షతు = చేయునుఁగాత. తద్గతానుగతికః; తత్ = అతనియొక్క, గత = గమనమును, అనుగతికః = అనుసరించి గమనము గలవాఁడు, నమహార్ఘః = గొప్ప విలువగల వ్యక్తి కానేరడు.

**సమాసములు :**

*ద్యుతిపయః పితృనాథాః :* ద్యుతిశ్చ పయశ్చ పితరశ్చ = ద్యుతిపయః పితరః. ద్యుతిపయఃపితౄణాం నాథాః = ద్యుతిపయః పితృనాథాః.

*తద్గతానుగతికః :* తస్య గతమ్ = తద్గతమ్. తద్గతంఅను గతిః యస్య సః = తద్గతానుగతికః.

*మహార్ఘః :* మహాన్ అర్ఘః యస్య సః = మహార్ఘః.

**భావము :**

ఇంద్రుఁడు భూలోకమునకుఁ బయనించిన వెంటనే దిక్పాలకులగు నగ్నియు వరుణుఁడును యముఁడును నతనివెంట నుత్సాహముతోఁ బయినించిరి. వారిలో నింద్రుఁడొక్కఁడే త్రోవఁజేసి ముందునడపించువాఁడు. కావున నట్లు ముందు నడచువ్యక్తికి గొప్పవిలువ. అతని ననుసరించ వెళ్లు జనమునకు గొప్ప విలువయేమియు లేదు ॥౨౩॥

**శ్లో॥** ప్రేషితాః పృథగథో దమయంత్యై
చిత్తచౌర్యచతురా నిజదూత్యః।

తద్గురుం ప్రతి చ తైరుపహారాః
సఖ్యసౌఖ్యకపటేన నిగూఢాః॥ ౫౬

ప॥వి॥ ప్రేషితాః । పృథక్ । అథో । దమయంత్యై । చిత్తచౌర్య చతురాః । నిజదూత్యః। తద్గురుం । ప్రతి। చ । తైః। ఉపహారాః । సఖ్యసౌఖ్యక పటేన । నిగూఢాః.

టీక॥ అథో = అనంతరము, తైః = ఆ యింద్రాదులచే, చిత్తచౌర్యచతురాః; చిత్త = దమయంతియొక్క మనస్సుయొక్క, చౌర్య = ఆకర్షణయందు, చతురాః = నేర్పరులైన, నిజదూత్యః = తమదూతికలు, దమయంత్యై = దమయంతికొఱకు, పృథక్ = ప్రత్యేకముగా, ప్రేషితాః = పంపఁబడిరి. తద్గురుం ప్రతిచ = ఆమెతండ్రియగు భీమునిగూర్చియు, సఖ్యసౌఖ్యక పటేన; సఖ్య = మైత్రికి, సౌఖ్య = సౌఖ్యమును సంపాదించుటయను, కపటేన = మిషచే, నిగూఢాః = మిక్కిలి గుప్తములైన, ఉపహారాః = కానుకలు, ప్రేషితాః = పంపఁబడినవి.

## సమాసములు :

చిత్తచౌర్యచతురాః : చౌరస్య కర్మ = చౌర్యం. చిత్తస్య చౌర్యం = చిత్తచౌర్యం. చిత్తచౌర్యే చతురాః = చిత్తచౌర్యచతురాః.

నిజదూత్యః : నిజాశ్చ తాః దూత్యశ్చ = నిజదూత్యః.

తద్గురుం : తస్యాః గురుః = తద్గురుః. తమ్ = తద్గురుం.

సఖ్యసౌఖ్యకపటేన : సఖ్యుః భావః = సఖ్యం. సఖ్యస్య సౌఖ్యం = సఖ్యసౌఖ్యం. సఖ్యసౌఖ్యస్య కపటః = సఖ్యసౌఖ్యకపటః. తేన = సఖ్యసౌఖ్య కపటేన.

## భావము :

తర్వాత నింద్రాది దేవతలు, దమయంతీ హృదయము నాకర్షింపగల నేర్పరులైన, తమ దూతికలను నామె వద్దకు పంపిరి. ఆమె తండ్రియగు భీమ రాజునకు, స్నేహసౌఖ్యము వర్ధిల్లవలయునను నెపముతో కానుకలనుఁ బంపిరి. ౫౬॥

శ్లో॥ చిత్రమత్ర విబుధైరపి యత్తైః
స్వర్విహాయ బత భూరనుసస్రే।
ద్యౌర్న కాచిదథవాఽస్తి నిరూఢా
సైవ సా చరతి యత్ర హి చిత్తమ్॥ ౪౭

ప॥వి॥ చిత్రమ్ । అత్ర । విబుధైః । అపి । యత్ । తైః । స్వః । విహాయ । బత । భూః । అనుసస్రే । ద్యౌః । న । కా । చిత్ । అథవా । అస్తి । నిరూఢా । సా । ఏవ । సా । చరతి । యత్ర । హి । చిత్తమ్.

టీక॥ విబుధైరపి = దేవతలు, (పండితులు) అగు, తైః = ఇంద్రాదులచే, స్వః = స్వర్గమును, విహాయ = వదలి, బత = కష్టము, భూః = భూమి, అనుసస్రే = అనుసరింపబడినది అనుమాట యేది గలదో, అత్ర = ఈ విషయమున, చిత్రం ఆశ్చర్యము, (ఏమున్నది?) (కుతః = ఏలయనగా) అథవా = లేదా, ద్యౌః = స్వర్గము,కాచిదపి = ఒక్కటియు, నిరూఢా = ప్రసిద్ధమైనది, నాస్తి = లేదు, కింతు = కాని, యత్ర = ఎచ్చట, చిత్తం = మనస్సు, చరతి = రమించునో, సైవ = అదియే; ద్యౌర్హి = స్వర్గము గదా.

**భావము :**

దేవతలును విద్వాంసులునగు నింద్రాదులు స్వర్గము వీడి భూమికి వచ్చిరి. ఇది కష్టమైన విషయము. విజ్ఞానవంతులెవ్వరునుఁ జేయరు. భూమి నుండి స్వర్గమునకు వెళ్లవలయునే గాని స్వర్గమునుండి భూమికి వచ్చుట యసహజము. కాని యిందులో నాశ్చర్యమేమియు లేదు. స్వర్గమని రూఢికెక్కిన దేదియు లేదు. ఎక్కడ మన మనస్సునకు సంతోషము గల్గునో యదియే స్వర్గము. ఇంద్రాదులకు దమయంతి వలన భూమియందే సంతోషము గల్గును. కాన, వారికి భూమియే స్వర్గమైనది. ॥౪౭॥

శ్లో॥ శీఘ్రలంఘితపథైరథ వాహై-
ర్లంభితా భువమమీ సురసారాః।
వక్రితోన్నమితకంధరబంధాః
శుశ్రువుర్ధ్వనితమధ్వని దూరమ్॥ ౪౮

ప॥వి॥ శీఘ్రలంఘితపథైః । రథవాహైః । లంభితాః । భువమ్ । అమీ । సుర సారాః । వక్రితోన్నమితకంధరబంధాః । శుశ్రువుః । ధ్వనితమ్ । అధ్వని । దూరమ్.

టీక॥ శీఘ్రలంఘితపథైః; శీఘ్ర = త్వరితముగా, లంఘిత = అతిక్రమింపఁబడిన, పథైః = మార్గములుగల్గిన, రథవాహైః = రథములకుఁ గట్టిన గుఱ్ఱములచే, భువం = భూమిని, లంభితాః = పొందింపఁబడిన, అమీ = ఈ, సురసారాః = సురశ్రేష్ఠులైన యింద్రాదులు, వక్రితోన్నత కంధర బంధాః; వక్రిత = ముందు వంకరగాఁ జేయబడినవి, ఉన్నమిత = తర్వాత నెత్తబడినవియునగు, కంధర = కంఠముయొక్క, బంధాః = అమరిక గలవారై, అధ్వని = మార్గమందు, దూరం = దూరముగా, ధ్వనితం = ధ్వనిని, శుశ్రువుః = వినిరి.

సమాసములు :

*శీఘ్రలంఘితపథైః :* శీఘ్రం లంఘితాః = శీఘ్రలంఘితాః. శీఘ్రలంఘితాః పంథానఃయైస్తే = శీఘ్రలంఘితపథాః. తైః = శీఘ్రలంఘితపథైః.

*రథవాహైః :* రథానాం వాహాః = రథవాహాః. తైః = రథవాహైః.

*సురసారాః :* సురాణాం సారాః = సురసారాః.

*వక్రితోన్నమితకంధరబంధాః :* వక్రితాశ్చ తాః ఉన్నమితాశ్చ = వక్రితోన్నమితాః. వక్రితోన్నమితాః కంధరాః యస్మిన్ సః = వక్రితోన్నమిత కంధరః. వక్రితోన్నమితకంధరః బంధః యేషాం తే = వక్రితోన్నమితకంధర బంధాః.

భావము :

దేవతా శ్రేష్ఠులైన యింద్రాదులు వేగముగా వెళ్లెడి తమ రథాశ్వములచే, భూలోకమునుఁ జేరిరి. వారు త్రోవలో తమ మెడలను వంచి పైకెత్తి యొక ధ్వనిని వినిరి. ॥౩౮॥

శ్లో॥ కిం ఘనస్య జలధేరథ వైవం
నైవ సంశయితుమప్యలభంత।

స్యందనం పరమదూరమపశ్య
న్నిఃస్వనశ్రుతిసహోపనతం తే॥ ౨౬

ప॥వి॥ కిం । ఘనస్య । జలధేః । అథ । వా । ఏవం । న । ఏవ । సంశయితుమ్ । అపి । అలభంత । స్యందనం । పరమ్ । అదూరమ్ । అపశ్యన్ । నిఃస్వనశ్రుతిసహోపనతం । తే.

టీక॥ తే = ఆ దేవతలు, ఘనస్య = మేఘముయొక్క, ధ్వనితంకిం = ధ్వనియా ఏమి? అథవా = లేదా, జలధేః = సముద్రముయొక్క, ధ్వనితంకిం = ధ్వనియా ఏమి? ఏవం = ఇట్లు, సంశయితుమపి = సందేహించుటకు గూడ, నాలభంతఏవ = అవకాశమును బొందనే లేదు. (కింతు = కాని), నిస్స్వనశ్రుతిసహోపనతం, నిస్స్వన = ఆ శబ్దమును, శ్రుతి = శ్రవణముతో, సహోపనతం = కూడవచ్చిన, అదూరం = సమీపమందలి, స్యందనం పరం = రథమును మాత్రము, అపశ్యన్ = చూచిరి.

వి॥ మేఘధ్వనియా సముద్ర ధ్వనియాయని సందేహించుట వలన సందేహాలంకారము. రథము నిస్స్వనశ్రుతితోడవచ్చిన దనుటవలన సహోక్త్యలంకారము. ఈ సందేహ సహోక్తులకు సంసృష్టి.

**సమాసములు :**

నిస్స్వనశ్రుతిసహోపనతమ్ : నిఃస్వనస్య శ్రుతిః = నిఃస్వనశ్రుతిః. సహ ఉపనతః = సహోపనతః. నిఃస్వనశ్రుత్యా సహోపనతః = నిఃస్వనశ్రుతిసహోపనతః. తమ్ = నిఃస్వనశ్రుతిసహోపనతమ్.

**భావము :**

ఆ దేవతలు తమకు వినఁబడిన ధ్వని మేఘధ్వనియా, సముద్ర ధ్వనియా యని సంశయించుటకుఁ గూడఁ దడవు లేక పోయినది. ధ్వని వినుటతోఁ బాటు సమీపమున రథము నొకదానినిఁ గాంచిరి. ॥౨౬॥

శ్లో॥ సూతవిశ్రమదకౌతుకిభావం
భావబోధచతురం తురగాణామ్।

తత్ర నేత్రజనుషః ఫలమేతే
నైషధం బుబుధిరే విబుధేంద్రాః॥ ౬౦

ప॥వి॥ సూతవిశ్రమదకౌతుకిభావం । భావబోధచతురం । తురగాణాం । తత్ర । నేత్రజనుషః । ఫలమ్ । ఏతే । నైషధం । బుబుధిరే । విబుధేంద్రాః.

టీక॥ ఏతే = ఈ, విబుధేంద్రాః = దేవతాశ్రేష్ఠులు, తత్ర = ఆ రథమందు, సూతవిశ్రమదకౌతుకిభావం; సూత = సారథికి, విశ్రమద = విశ్రాంతి నిచ్చెడి, కౌతుకిభావం = కుతూహలము గల్గిన, తురగాణాం = గుఱ్ఱముల యొక్క, భావబోధచతురం; భావ = అభిప్రాయములను, బోధ = తెలిసి కొనుటయందు, చతురం = నేర్పరియు, నేత్రజనుషః = కన్నులుద్భ వించుటకు, ఫలం = ఫలమునగు, నైషధం = నిషధదేశపు రాజగు నలుని, బుబుధిరే = తెలుసుకొనిరి.

## సమాసములు :

సూతవిశ్రమదకౌతుకిభావమ్ : సూతస్యవిశ్రమః = సూతవిశ్రమః. సూతవిశ్రమం దదాతీతి = సూతవిశ్రమదః. కౌతుకమస్యాస్తీతి = కౌతుకీ. కౌతుకినః భావః = కౌతుకిభావః. సూతవిశ్రమదః కౌతుకిభావః యస్య సః = సూతవిశ్రమదకౌతుకిభావః. తమ్ = సూతవిశ్రమదకౌతుకిభావమ్.

భావబోధచతురమ్ : భావస్య బోధః = భావబోధః. భావబోధే చతురః = భావబోధచతురః. తమ్ = భావబోధచతురమ్.

నేత్రజనుషః : నేత్రాణాం జనుః = నేత్రజనుః. తస్య = నేత్రజనుషః.

నైషధమ్ : నిషధానాం రాజా = నైషధః. తమ్ = నైషధమ్.

విబుధేంద్రాః : విబుధానామింద్రాః = విబుధేంద్రాః.

## భావము :

ఈ దేవతోత్తములు, ఆ రథమునందు నలునిఁ గాంచిరి. ఆ నలుఁడు సారథికి విశ్రాంతినిచ్చి తానే రథము తోలుచుండెను. అతఁడు గుఱ్ఱములయొక్క హృదయమునుఁ దెలుసుకొనఁగల్గిన యశ్వశాస్త్రవేత్త. అఁతడు మిక్కిలి సౌందర్య

ర్యవంతులగుటవలనఁ గన్నులు గల్గినందులకు ఫలముగా నతని దర్శన ముండినది. ॥౬౦॥

శ్లో॥ వీక్ష్య తస్య వరుణస్తరుణత్వం
యద్బభార నిబిడం జడభూయమ్।
నౌచితీ జడపతేః కిము సాఽస్య
ప్రాజ్యవిస్మయరసస్తిమితస్య॥ ౬౧

ప॥వి॥ వీక్ష్య । తస్య । వరుణః । తరుణత్వం । యత్ । బభార । నిబిడం । జడభూయమ్ । నౌచితీ । జడపతేః । కిమ్ । ఉ । సా । అస్య । ప్రాజ్యవిస్మయరసస్తిమితస్య.

టీక॥ వరుణః = వరుణుఁడు, తస్య = ఆ నలునియొక్క, తరుణత్వం = యౌవనమును, వీక్ష్య = చూచి, యత్ = ఏ నిబిడం = ఘనమైన, జడభూయం = స్తంభమని చెప్పఁబడు సాత్త్వికభావమును, బభార = దాల్చెనో, ప్రాజ్యవిస్మయరసస్తిమితస్య; ప్రాజ్య = అధికమైన, విస్మయరస = ఆశ్చర్యరసముచే, (జలముచే), స్తిమితస్య = నిశ్చలుఁడైన, జడపతేః = జలాధిపతి (జడులకు నధిపతి) అగు, అస్య = ఈ వరుణునకు, సా = ఆ జడత్వము, ఔచితీ = తగిన కార్యము, నకిము = కాదాఏమి?

## సమాసములు :

*తరుణత్వం :* తరుణస్య భావః = తరుణత్వమ్.

*జడభూయమ్ :* జడస్య భావః = జడభూయమ్. తత్ = జడభూయమ్.

*ఔచితీ :* ఉచితస్య కర్మ = ఔచితీ.

*జడపతేః :* జడానాం పతిః = జడపతిః. తస్య = జడపతేః.

*ప్రాజ్యవిస్మయరసస్తిమితస్య :* ప్రాజ్యశ్చాసౌ విస్మయః = ప్రాజ్యవిస్మయః. ప్రాజ్యవిస్మయ ఏవ రసః = ప్రాజ్యవిస్మయరసః. ప్రాజ్యవిస్మయరసేన స్తిమితః = ప్రాజ్యవిస్మయరసస్తిమితః. తస్య = ప్రాజ్యవిస్మయరసస్తిమితస్య.

**భావము:**

అట్లు నలుఁడు రథముపైన రాగనే, వరుణుఁడు, అతని యౌవనముతో భూషింపఁబడిన సౌందర్యమునుఁ జూచి యాశ్చర్యముతో స్తంభించిపోయినాఁడు. ఆశ్చర్యరసముచే నిశ్చలత్వమునుఁ బొందిన యతనికి నది తగినదే. ఏలయనగా నతఁడు జలపతి గదా. మఱియు "లడయోరభేదః" అను న్యాయము చొప్పున నతఁడు జడపతియు నగును. జడులకు పాలకుఁడైన వానికి జడత్వము (నిశ్చలత్వము) సహజము కదా! మఱియు నీటఁదడిసిన వస్తువునకు జడత్వమేర్పడును గదా! అదిగాక వరుణుఁడు జలపతి యగుటవలనను జడపతి యగుటవలనను నతనియందు జడత్వము స్వాభావికముగాన నతనికి జడత్వము తగినదే. ఇచ్చట నాశ్చర్యమును, ఆశ్చర్య రసమనుటవలన, దానిని జలముగ భావించుట వలన, ఆశ్చర్యరసముచే నిశ్చలత్వ మేర్పడుట యనగా, ఆశ్చర్యరసమను జలముచేతఁ దడియుటచేతను నిశ్చలత్వము వచ్చుట యగును. నీటఁ దడిసిన వస్తువు బరువెక్కుట వలన కదల లేనందువలన నిశ్చలమగు చున్నది. ఇచ్చట వరణుఁడు స్వయముగ జలపతియు "లడయోరభేదః" అను న్యాయము ననుసరించి జడపతియు నగుచు, ఆశ్చర్యరసముచేఁ దడియుటచే అనగా ఆశ్చర్యరసమను జలముచేఁ దడియుటచే నింకను జడత్వమునే పొందఁగల్గెను. ॥౮౦॥

శ్లో॥ రూపమస్య వినిరూప్య తథాతి
మ్లానిమాప రవివంశవతంసః।
కీర్త్యతే యదధునాపి స దేవః
కాల ఏవ సకలేన జనేన॥ ౮౧

ప॥వి॥ రూపమ్ । అస్య । వినిరూప్య । తథా । అతిమ్లానిమ్ । ఆప । రవివంశవతంసః । కీర్త్యతే । యత్ । అధునా । అపి । సః । దేవః । కాలః । ఏవ । సకలేన । జనేన.

టీక॥ రవివంశవతంసః; రవివంశ = సూర్య వంశమునకు, వతంసః = భూషణమైన యముఁడు, అస్య = ఈ నలునియొక్క, రూపం = సౌందర్యమును, వినిరూప్య = చూచి, తథా = చెప్పఁబోవు ప్రకారము, అతిమ్లానిం = మిక్కలి వన్నె మార్పును, అనగా మిక్కిలి నల్లఁదనమును, ఆప =

పొందెను, యత్ = ఏ ప్రకారము, అధునాపి = ఇప్పటికిని, సః = ఆ, దేవః = యముఁడు, సకలేన = సమస్తమైన, జనేన = జనముచే, కాల ఏవ = కాలుఁడుఁగనే, అనగా నల్లనివాఁడుగనే, కీర్త్యతే = చెప్పఁబడు చున్నాఁడు.

వి॥ యముని నల్లదనమునకు నతని యతిమ్లాని హేతువు కాకపోయినను, హేతువుగఁ జెప్పఁబడుటవలన హేతూత్ప్రేక్ష. వ్యంజకము లేనందు వలన నది గమ్యము.

## సమాసములు :

అతిమ్లానిమ్ : అత్యంతం మ్లానిః = అతిమ్లానిః. తామ్ = అతిమ్లానిమ్.

రవివంశవతంసః: రవేః వంశః = రవివంశః. రవివంశస్య వతంసః = రవివంశవంతసః.

## భావము :

సూర్య వంశమున కలంకారమైన యమధర్మరాజు, నలుని సౌందర్యమునుఁ జూచి, చింతతో మిక్కిలి వైవర్ణ్యమునుఁ బొందెను. అనగా మిక్కిలి నల్లఁదనముఁ బొందెను. అందువలననే, యతఁడిప్పటికిని కాలుఁడని, అనగా నల్లనివాఁడని జనులందఱిచేఁ జెప్పఁబడుచున్నాఁడు. ॥౮౨॥

శ్లో॥ యద్బభార దహనః ఖలు తాపం
రూపధేయభరమస్య విమృశ్య।
తత్ర భూదనలతా జనికర్త్రీ
మా తదప్యనలతైవ తు హేతుః॥ ౭౩

ప॥వి॥ యత్ । బభార । దహనః । ఖలు । తాపం। రూపధేయభరమ్ । అస్య। విమృశ్య । తత్ర । భూత్ । అనలతా । జనికర్త్రీ । మా। తత్ । అపి। అనలతా । ఏవ । తు । హేతుః.

టీక॥ దహనః = అగ్ని, అస్య = ఈ నలునియొక్క, రూపధేయభరమ్ = సౌందర్యముయొక్క సమృద్ధిని, విమృశ్య = విచారించి, తాపం = సంతా

పమును, బభారఖలు ఇతియత్ = భరించెననునది యేది గలదో, (తత్ర = ఆ తాపమును భరించుట యందు), అనలతా = అగ్నిత్వము, అనగా నగ్నియగుట, జనికర్త్రీ = ఉత్పాదకమైనదిగా, మాభూత్ = కారాదు. తదపి = అయినను, అనలతైవ = అగ్నిత్వమే, (నలత్వము తనకు లేక పోవుటయే), హేతుః = కారణము.

వి॥ ఇచ్చట నగ్నికిఁ గల్గిన తాపమునకు ననలత్వమే హేతువు కాదని చెప్పుచు, అనలత్వమే హేతువైనదని ముగించుటవలన విరోధాభాసాలంకారము. అనలత్వమనగా, నలత్వాభావమని యర్థము చెప్పుటచే విరోధ పరిహారము.

**సమాసములు :**

*రూపధేయభరమ్ :* రూపమేవ = రూపధేయమ్. రూపధేయస్య భరః = రూపధేయభరః. తమ్ = రూపధేయభరమ్,

*అనలతా :* అనలస్య భావః = అనలతా.

*జనికర్త్రీ :* జనేః కర్త్రీ = జనికర్త్రీ.

*అనలతా :* నలస్య భావః = నలతా. నలతాయాః అభావః = అనలతా.

**భావము :**

అగ్ని నలుని సౌందర్య సంపత్తినిఁ జూచి మిక్కిలి తాపముఁ జెందెను. కాని యీ తాపమునకు నతని యందున్న అనలత్వము అనగా-అగ్నిత్వము కారణము గాదు. కాని యా యనలత్వమే కారణమైనది. అనగా-నలత్వాభావము, అనగా తాను నలుఁడు కాకపోవుట యను ననలత్వమే కారణమైనది. ॥౬౩॥

శ్లో॥ కామనీయకమధఃకృతకామం
కామమక్షిభిరవేక్ష్య తదీయం।
కౌశికః స్వమఖిలం పరిపశ్యన్
మన్యతే స్మ ఖలు కౌశికమేవ॥ ౬౪

ప॥వి॥ కామనీయకమ్ । అధఃకృతకామం । కామమ్ । అక్షిభిః । అవేక్ష్య । తదీయం । కౌశికః । స్వమ్ । అఖిలం । పరిపశ్యన్ । మన్యతే । స్మ । ఖలు । కౌశికమ్ । ఏవ.

టీక॥ కౌశికః = ఇంద్రుఁడు, అధఃకృతకామం; అధః కృత = తిరస్కరింపఁబడిన, కామం = మన్మథుఁడు కల్గిన, తదీయం = నలునికి సంబంధించిన, కామనీయకం = సౌందర్యమును, కామం = మిక్కిలి, అక్షిభిః = వేయి కన్నులతో, అవేక్ష్య = చూచి, స్వం = తన్ను, అఖిలం = సమగ్రముగా, పరిపశ్యన్ = చూచుచు, కౌశికమేవ = గుడ్లగూబగనే, మన్యతేస్మఖలు = తలంచుచుండెను గదా.

కామనీయకమ్ : కమనీయస్య భావః = కామనీయకం. తత్ = కామనీయకమ్.

అధఃకృతకామమ్ : అధఃకృతః కామః యేన తత్ = అధఃకృతకామమ్. తత్ = అధః కృతకామమ్.

తదీయమ్ : తస్య ఇదం = తదీయమ్. తత్ = తదీయమ్.

కౌశికః : కుశికస్య అపత్యం పుమాన్ = కౌశికః.

**భావము :**

కౌశికుఁడైన యింద్రుఁడు మన్మథునిమించిన సౌందర్యము మున్నగువాని నంతయును, వేయికన్నులతోఁగాంచి, కడపట తన్ను కౌశికునిగనే యనగా గుడ్లగూబగనే భావించెను. నలునకును, తనకును మధ్య సౌందర్యాదుల విషయమునఁగల తారతమ్యమును గ్రహించుకొని దమయంతిపై నిరాశుఁడాయెను.॥౬౪॥

శ్లో॥ రామణీయకగుణాఽద్వయవాదం
మూర్తముత్థితమముం పరిభావ్య।
విస్మయాయ హృదయాని వితేరు
స్తేన తేషు న సురాః ప్రబభూవుః॥ ౬౫

ప॥వి॥ రామణీయకగుణాఽద్వయవాదం । మూర్తమ్ । ఉత్థితమ్ । అముం । పరిభావ్య । విస్మయాయ । హృదయాని । వితేరుః । తేన । తేషు । న । సురాః । ప్రబభూవుః.

టీక॥ సురాః = ఇంద్రాదిదేవతలు, అముం = నలుని, మూర్తం = శరీరమును ధరించినదై, ఉత్థితం = పుట్టిన, రామణీయకగుణాఽద్వయవాదం; రామణీయక = సౌందర్యమనెడి, గుణ = గుణమునకు, అద్వయ = అద్వితీయుఁడను, వాదం = ప్రవాదముగల వానినిగా, పరిభావ్య = పరికించి, హృదయాని = తమ మనస్సులను, విస్మయాయ = ఆశ్చర్యమునకై, వితేనుః = ఇచ్చిరి. తేన = ఆ కారణముచే, తేషు = ఆ మనస్సుల విషయమున, నప్రబభూవుః = స్వాతంత్ర్యముగలవారు కాలేదు.

## సమాసములు :

*రామణీయక గుణాద్వయవాదం :* రమణీయస్య భావః = రామణీయకం. రామణీయకమేవ గుణః = రామణీయకగుణః. అవిద్యమానం ద్వయం యస్య సః = అద్వయః. రామణీయకగుణే అద్వయః = రామణీయకగుణాద్వయః. రామణీయక గుణాద్వయఇతి వాదః యస్య సః = రామణీయక గుణాద్వయ వాదః. తమ్ = రామణీయకగుణాద్వయవాదమ్.

## భావము :

ఇంద్రాదిదేవతలు నలుని దేహమును ధరించిన సౌందర్య గుణమునకు సాటిలేని వానినిగా, ననగా త్రిలోకసుందరునిగా, భావించి, తమ మనస్సులను నాశ్చర్యమునకు వశ్యములనుఁగావించి, వానిపై నెట్టి స్వాతంత్ర్యమను వహింపలేకపోయిరి. అనగా నాశ్చర్యముచే వారిమనస్సు లాకర్షింపఁ బడినందువలన వారు పరవశులై యుండిరి.॥౭౫॥

శ్లో॥ పైత్రియరూపకవిశేషనివేశైః
సంవదద్భిరమరాః శ్రుతపూర్వైః।
ఏష ఏవ స నలః కిమితీదం
మందమందమితరేతరమూచుః॥ ౭౬

ప॥వి॥ పైత్రియరూపకవిశేషనివేశైః । సంవదద్భిః । అమరాః । శ్రుతపూర్వైః । ఏషః । ఏవ । సః । నలః। కిమ్ । ఇతి । ఇదం । మందమందమ్ । ఇతరేతరమ్ । ఊచుః.

టీక॥ అమరాః = ఇంద్రాదిదేవతలు, శ్రుతపూర్వైః = ముందువినఁబడినవి, సంవదద్భిః = ఇప్పుడు సరిపోవునవియునగు, పైప్రియరూపకవిశేష నివేశైః; పైప్రియరూపక = సౌందర్యమునకు, విశేష = ఆయాయవయవ ములందు.నివేశైః = అమరియుండడములచే, సః = పూర్వమువినఁబడిన, నలః = నలుఁడు, ఏషఏవకిమితి = ఇతఁడేనాఏమియని, ఇదం = ఈవాక్య మును, మందమందం = మెల్లమెల్లగా, ఇతరేతరం = ఒండొరుల నుద్దే శించి, ఊచుః = మాట్లాఁడుకొనిరి.

**సమాసములు :**

*పైప్రియరూపకవిశేషనివేశైః:* ప్రియరూపస్య భావః = పైప్రియరూపకమ్. పైప్రియరూపకస్య విశేషాః = పైప్రియరూపకవిశేషాః. పైప్రియరూపకవిశేషేషు నివేశాః = పైప్రియరూపకవివేషనివేశాః. తైః = పైప్రియరూపకవిశేషనివేశైః.

*శ్రుతపూర్వైః:* పూర్వం శ్రుతాః = శ్రుతపూర్వాః.తైః = శ్రుతపూర్వైః.

*మందమందమ్ :* మందసదృశం = మందమందమ్.

*ఇతరేతరం :* ఇతరః ఇతరః = ఇతరేతరః. శమ్ = ఇతరేతరం.

**భావము :**

ఇంద్రాది దేవతలు పూర్వమే నలుని సౌందర్యమును నవయవ సన్నివేశ ములనుఁ గూర్చి వినియున్నారు. కాన నిప్పుడా లక్షణములు నలుని యందుం డుట చూచి, 'ఆ నలుఁడితఁడేనా' యని మెల్ల మెల్లగాఁ దమలో మాట్లాడు కొనిరి. ॥౬౬॥

శ్లో॥ తేషు తద్విధవధూవరణార్హం
భూషణం స సమయః స రథాఢ్వా।
తస్య కుండినపురం ప్రతి సర్పన్
భూపతేర్వ్యవసితాని శశంసుః॥ ౬౭

ప॥వి॥ తేషు । తద్విధవధూవరణార్హం । భూషణం । సః । సమయః । సః । రథాఢ్వా । తస్య । కుండినపురం । ప్రతిసర్పన్ । భూపతేః । వ్యవసితాని । శశంసుః.

టీక॥ తస్య = ఆ, భూపతేః = నల మహారాజునకు, తద్విధవధూవరణార్హం; తద్విధ = అటువంటి, వధూ = యువతిని, వరణ = వరించుటకు, అర్హం = తగిన, భూషణం = అలంకారమును, సః = ఆ, సమయః = స్వయంవర కాలమును, కుండినపురం = కుండిన నగరమును గూర్చి, ప్రతిసర్పన్ = వెళ్లుచున్న, సః = ఆ, రథాధ్వా = రథమార్గము, ఇవి యన్నియు, వ్యవసితాని = ఆ నలుని ప్రయత్నములను, తేషు = ఆ యింద్రాదులయందు, అనగా వారిని గూర్చి, శశంసుః = చెప్పినవి.

## సమాసములు :

*తద్విధవధూవరణార్హమ్ :* సా విధా యస్యాస్సా = తద్విధా. తద్విధాచ సావధూశ్చ = తద్విధవధూః. తద్విధవధ్వాః వరణం = తద్విధవధూవరణం. తద్విధవధూవరణే అర్హమ్ = తద్విధవధూవరణార్హమ్.

*రథాధ్వా:* రథస్య అధ్వా = రథాధ్వా.

*కుండినపురం:* కుండినమితి పురం = కుండినపురమ్. తత్ = కుండిన పురం.

## భావము ;

లోకప్రసిద్ధ సౌందర్యాది గుణములుగల దమయంతివంటి యువతిని వరించుటకు తగిన భూషణము, ఆ స్వయంవరకాలము, కుండినపట్టణమునకుఁ బోయెడి రథమార్గము మున్నగు నివియన్నియు నలుని స్వయంవరసన్నాహముఁ లను నా యింద్రాదులకు సూచించినవి. ॥౬౭॥

శ్లో॥ ధర్మరాజసలిలేశహుతాశైః
ప్రాణతాం శ్రితమముం జగతస్తైః।
ప్రాప్యహృష్టచలవిస్తృతతాపై
శ్చేతసానిభృతమేతదచింతి॥ ౬౮

ప॥ వి॥ ధర్మరాజ సలిలేశహుతాశైః । ప్రాణతాం । శ్రితమ్। అముం । జగతః। తైః । ప్రాప్య । హృష్టచలవిస్తృతతాపైః । చేతసా । నిభృతమ్ । ఏతత్ । అచింతి.

టీక॥ జగతః = ప్రపంచమునకు, ప్రాణతాం = ప్రాణముగనుండుటను, లేదా ప్రియముగ నుండుటను, శ్రితమ్ = పొందిన, అముం = ఈ నలుని, ప్రాప్య = పొంది, హృష్టచలవిస్తృతతాపైః, హృష్ట = సంతోషించిన వారును, చల = అతని సౌందర్యమునుఁ జూచుటచేఁ జలించి దమయంతిపై ననురాగమును శిథిలము గావించుకొనినవారును, విస్తృతతాపైః = (అనురాగము శిథిలమగుటవలననే) మిక్కుటమైన సంతాపముగలవారును నగు ధర్మరాజసలిలేశహుతాశైః; ధర్మరాజ = యమధర్మరాజు, సలిలేశ = వరుణుఁడు, హుతాశైః = అగ్నియనుదేవతలచే, చేతసా = మనస్సుచే, నిభృతం = రహస్యముగా, (పైశ్లోకములయందుఁజెప్పఁబడఁబోవు ప్రకారము) అచింతి = ఆలోచింపఁబడినది.

వి॥ ఇచ్చట "హృష్టచలవిస్తృతతాపైః" అను సమస్త పదముచేఁజెప్పఁబడిన, హర్ష చలన సంతాపములు, యథాక్రమముగా, 'ధర్మరాజ - సలిలేశ - హుతాశైః' అను సమస్త పదముచేఁ జెప్పఁబడిన యమధర్మరాజునకు, వరుణునకును, అగ్నికిని నన్వయించునని కొందఱు చెప్పుచున్నారు. కాని యదిసరికాదు. ఈహర్షాదులలో నొక్కొక్కటి యొక్కనికని నియమమేమియున్నది? కావున నీ మూడును నొక్కొరికిని అన్వయింపఁదగినవే. కావునపైనఁ జెప్పెడి మూడు శ్లోకములలో ప్రతిపాదించెడి విషయములు గూడనట్లే ముగ్గురికిని సాధారణములు. కావుననే పైశ్లోకమున "నః" అని బహువచనము ప్రయోగింపఁబడినది. తర్వాతనున్న రెండు శ్లోకములలో "మామి"త్యాదిగ నేకవచనము చెప్పఁబడినను ప్రత్యేకముగ నన్వయింపవచ్చును గాన నదియు దోషముగాదు. మఱియు "ఇత్యవేత్య" యను నుపసంహారశ్లోకమునందు, నొండొరుల ముఖదర్శనము చెప్పఁబడినందువలనను, నందఱికిని ఏకాభిప్రాయము గల్గినందువలనను, నీధర్మములన్నియు ముగ్గురికి సాధారణములనియే తెలియుచున్నది.

**సమాసములు :**

*ధర్మరాజసలిలేశహుతాశైః :* ధర్మరాజశ్చ సలిలేశశ్చ హుతాశశ్చ = ధర్మరాజ సలిలేశ హుతాశాః. తైః = ధర్మరాజసలిలేశహుతాశైః.

*ప్రాణతామ్ :* ప్రాణస్య భావః = ప్రాణతా. తామ్ = ప్రాణతామ్.

*హృష్టచలవిస్తృతతాపైః :* హృష్టాశ్చ చలాశ్చ హృష్టచలాః. విస్తృతః తాపః యేషాం తే = విస్తృతతాపాః. హృష్టచలాశ్చతే విస్తృతతాపాశ్చ = హృష్టచలవిస్తృత తాపాః. తైః = హృష్టచలవిస్తృతతాపైః.

**భావము :**

ప్రపంచమునకే ప్రాణమువంటి వాఁడును ప్రియమైన వాఁడును, నగు నా నలమహారాజును, యమ-వరుణ-వహ్నిదేవతలు పొందిన ప్రపంచ ప్రాణమైన యా పురుషునిఁ జూచుటచే నానందించిరి. అంతటి యందగాఁడు దమయంతిని వరింపఁబోవుట వలన నామెపై తమ యనురాగము శిథిలమైనందువలనఁ జలించిరి. ఆమె నలుని వరించునే గాని తమ్ములనెక్కడ వరింపఁగలదనెడి నైరాశ్యమువలన నామెపై ననురాగమును వదలుకొనవలసిన పరిస్థితి వారి కేర్పడినది. ఇట్లామెపై ననురాగము శిథిలమగుటవలన నామె యిఁక తమకు లభింప దనెడి దుఃఖముతో విరహతాపమునుఁ బొందినవారై గుట్టుగా పైనఁ జెప్పఁ బోవు విధముగా మనస్సు నందనుకొనిరి. ॥౬౮॥

శ్లో॥ నైవ నః ప్రియతమోభయథాఽసౌ
యద్యముం న వృణుతే వృణుతే వా।
ఏకతో హి ధిగమూమగుణజ్ఞా
మన్యతః కథమదః ప్రతిలంభః॥ ౬౯

ప॥వి॥ న । ఏవ । నః । ప్రియతమా । ఉభయథా । అసౌ । యది । అముం । న । వృణుతే । వృణుతే । వా । ఏకతః । హి । ధిక్ । అమూమ్ । అగుణజ్ఞామ్ । అన్యతః । కథమ్ । అదః ప్రతిలంభః.

టీక॥ అసౌ = ఆ దమయంతి, అముం = ఆ నలుని, యదినవృణుతే = వరించని యెడలను, యది వృణుతేవా = వరించిన యెడలను, ఉభయథాఽపి = రెండు పక్షములలోను, నః = మనకు, ప్రియతమా = మిక్కిలి ప్రియమైనదిగా, న = కానేరదు. హి = ఏలయనగా, ఏకతః = మనలను వరించని పక్షమున, అగుణజ్ఞాం = గుణజ్ఞురాలుకానట్టి, అమూం = ఆమెను గూర్చి, ధిక్ = ఛీ, అనగా ఆమె తిరస్కరింపఁదగినది. అన్యతః = నలుని వరించిన మఱియొక పక్షమున, అదఃప్రతిలంభః; అదః = పరస్త్రీయైన యీ దమయంతిని, ప్రతిలంభః = ప్రతిగ్రహించుట, కథమ్ = ఎట్లు సంభవించును.

## సమాసములు :

ప్రియతమా : అత్యంతం ప్రియా = ప్రియతమా.

అగుణజ్ఞామ్ : గుణం జానాతీతి = గుణజ్ఞా. న గుణజ్ఞా = అగుణజ్ఞా. తామ్ = అగుణజ్ఞామ్.

అదఃప్రతిలంభః : అస్యాః ప్రతిలంభః = అదః ప్రతిలంభః.

## భావము :

ఈ దమయంతి నలుని వరించక పోయినను, వరించినను మనకు మాత్రము ప్రియురాలు గాదు. నలుని వరించక పోయినచో, నీమె గుణజ్ఞురాలుకాకపోవును. ఏలయనగా నా నలుఁడు లోకోత్తర సౌందర్యాది గుణములతో నొప్పువాఁడు. అట్టి వానిని వరించనప్పుడామె ఎట్లు గుణజ్ఞురాలగును? కావున గుణజ్ఞురాలు కాని యామె మనకేల? ఒకవేళ నలుని వరించినను మనకుపయోగము లేదు. నలుని వరించుట వలన నామె పర స్త్రీ యగును గదా! పర స్త్రీని మనమెట్లు సంగ్రహింతుము? కాన రెండు పక్షములలోను దమయంతి మనకు గిట్టదు. అని యమవరుణ వహ్నిదేవతలు తమలో ననుకొనిరి. ॥౧౯॥

శ్లో॥ మాముపైష్యతి తదా యది మత్తః
వేద నేయమియదస్య మహత్త్వమ్।
ఈదృశీ న కథమాకలయిత్రీ
మద్విశేషమపరాన్నృపపుత్రీ॥ ౨౦

ప॥వి॥ మామ్ । ఉపైష్యతి । తదా । యది । మత్తః । వేద । న । ఇయమ్ । ఇయత్ । అస్య । మహత్త్వమ్ । ఈదృశీ । న । కథమ్ । ఆకలయిత్రీ । మద్విశేషమ్ । అపరాత్ । నృపపుత్రీ.

టీక॥ ఇయం = ఈ దమయంతి, ఇయత్ = ఇంతటి, అస్య = ఈ నలునికి, మత్తః = నా కంటెను, మహత్త్వం = ఆధిక్యమును, నవేదయది = తెలుసుకొనక యున్నచో, తదా = అప్పుడు, మామ్ = నన్ను (నాయందలి దేవత్వబుద్ధితో), ఉపైష్యతి = వరింపఁగలదు. (కాని) ఈదృశీ = ఇట్లు నలుని యందలి మహత్త్వమునే, యనగా నందటికిని ప్రత్యక్ష

ముగఁ దెలియుచున్న నలుని మహత్త్వమునే తెలియని, నృపపుత్రీ=రాజపుత్రికయైన దమయంతి, అపరాత్=మఱి యొకని వలన, మద్విశేషం=నాయొక్క మహత్త్వమును, అనగాదేవత్వాదికమును, కథం=ఎట్లు, ఆకలయిత్రీ=తెలుసుకొనునుః.

సమాసములు :

మహత్త్వమ్ : మహతోభావః=మహత్త్వమ్

మద్విశేషమ్ : మమవిశేషః=మద్విశేషః. తం=మద్విశేషమ్.

నృపపుత్రీ : నృపస్య పుత్రీ=నృపపుత్రీ.

భావము :

ఈ దమయంతి యింతటి నలుని మహిమనుఁ దెలుసుకొననిచో, నన్ను వరించఁగలదు. ఏలయనగా నలుఁడు మానవుఁడు. అతని కంటె నుత్కృష్టమైన ధర్మము దేవత్వము నాకున్నది. ఈ దేవత్వమును గుర్తించి నన్న వరింప వచ్చును. కాని యందఱికిఁ బ్రత్యక్ష ముగ నున్న నలునియొక్క గొప్ప తనమునే తెలుసుకొనలేని రాజ పుత్రిక నాయొక్క గొప్పతనము నెట్లు తెలుసుకొనఁగలదు. మఱియు నాకంటె నుత్కృష్ట గుణము గల నలునే యామె వరించనపుడు, ఇతర రాజులకంటె నుత్కృష్ట గుణముగల నన్ను మాత్ర మెట్లు వరించుననియు నాశయమున్నట్లు ముప్వురు తమలో ననుకొను చున్నారు. ॥౨౦॥

శ్లో॥ నైషధే బత వృతే దమయంత్యా
వ్రీడితో హి న బహిర్భవితాస్మి।
స్వాం గృహేఽపి వనితాం కథమాస్యం
హ్రీనిమీలి ఖలు దర్శయితాహే॥ ౨౧

ప॥వి॥ నైషధే । బత । వృతే। దమయంత్యా । వ్రీడితః । హి । న । బహిః । భవితాస్మి । స్వాం । గృహే । అపి । వనితాం । కథమ్ । ఆస్యం । హ్రీనిమీలి । ఖలు। దర్శయితాహే.

టీక॥ దమయంత్యా = దమయంతిచే, నైషధే = నలుఁడు, వృతేసతి = వరింపఁబడగా, వ్రీడితస్సన్ = సిగ్గుఁ జెందినవాఁడనై, బహిః = వెలుపల, నభవితాస్మిహి = ఉండఁజాలను గదా ! బత = కష్టము. గృహేఽపి = ఇంటియందును, స్వాంవనితాం = తన భార్యనుఁ గూర్చి, హ్రీనిమీలి; హ్రీ = సిగ్గుచే, నిమీలి = సంకోచముఁజెందిన, ఆస్యం = మోమును, కథం = ఎట్లు, దర్శయితాహే = చూపఁగలను?

**సమాసములు:**

నైషధే : నిషధానాం రాజా = నైషధః. తస్మిన్ = నైషధే.

హ్రీనిమాలి : హ్రియా నిమీలతీతి = హ్రీనిమీలి. తత్ = హ్రీనిమీలి.

**భావము :**

దమయంతి నలుని వరింపఁగనే, సిగ్గుపడిన వాఁడనై వెలుపలఁ దిరుగుటఁ గూడ నాకు సాధ్యము గాదు. ఇంటియందు నా భార్యకు, సిగ్గుచే ముడుచుకొనిన మోమును నేనెట్లు చూపఁగలను? అని యా ముఫ్వురు ప్రత్యేకముగాఁ దమలో ననుకొనిరి. ॥౭౦॥

శ్లో॥ ఇత్యవేత్య మనసాత్మవిధేయం
కిం చన త్రివిబుధీ బుబుధే న।
నాకనాయకమపాస్య తమేకం
సా స్మ పశ్యతి పరస్పరమాస్యమ్॥ ౭౧

ప॥వి॥ ఇతి । అవేత్య। మనసా । ఆత్మవిధేయం । కిం । చన । త్రివిబుధీ । బుబుధే । న । నాకనాయకమ్ । అపాస్య । తమ్ । ఏకం । సా । స్మ। పశ్యతి । పరస్పరమ్ । ఆస్యమ్.

టీక॥ త్రివిబుధీ = యముఁడు మున్నగు ముగ్గురు దేవతల సంఘము, ఇతి = ముందుఁజెప్పిన మూడు శ్లోకములయందుఁ జెప్పబడిన ప్రకారముగా, మనసా = మనస్సుచే, అవేత్య = ఆలోచించి, కించన = కొంచమైనను, ఆత్మవిధేయం = తాముఁజేయవలసిన పనిని, నబుబుధే = తెలిసికొనలేదు.

సా = ముప్వురు దేవతల సంఘము, తమ్ = ఆ, నాకనాయకం = స్వర్గ పాలకుఁడగు నింద్రుని, అపాస్య = వదలిపెట్టి, పరస్పరం = ఒండొరులకు సంబంధించిన, ఆస్యం = మోమును, పశ్యతిస్మ = చూచుచుండినది.

సమాసములు :

ఆత్మవిధేయమ్ : ఆత్మనా విధేయమ్ = ఆత్మవిధేయమ్. తత్ = ఆత్మ విధేయమ్.

త్రివిబుధీ : త్రయాణాం విబుధానాం సమాహారః = త్రివిబుధీ.

నాకనాయకమ్ : నాకస్య నాయకః = నాకనాయకః. తమ్ = నాక నాయకమ్.

పరస్పరమ్ : పరం పరం = పరస్పరమ్. తత్ = పరస్పరమ్.

భావము :

యముఁడు మున్నగు వేల్పులు ముప్వురు పూర్వశ్లోకములు మూటిలోఁ జెప్పఁబడిన విధముగా, తమ మనస్సుతో నాలోచించి, యిట్టి పరిస్థితిలో నేమి చేయవలసినది తెలుసుకొనలేక పోయిరి. ఇంద్రుని తప్పించి, యా ముప్వురు నేమి చేయవలసినది తోచనందువలన నొండొరుల మోమునుఁ జూచుకొను చుండిరి. ॥౭౨॥

శ్లో॥ కిం విధేయమధునేతి విముగ్ధం
స్వానుగాననమవేక్ష్య బుభుక్షౌ।
శంసతి స్మ కపటే పటురుచ్చై
ర్వంచనం సమభిలష్య నలస్య॥ ౭౩

ప॥వి॥ కిం । విధేయమ్ । అధునా । ఇతి । విముగ్ధం । స్వానుగాననమ్ । అవేక్ష్య। బుభుక్షౌ । శంసతి । స్మ । కపటే । పటుః। ఉచ్చైః। వంచనం। సమభిలష్య । నలస్య.

టీక॥ కపటే = ఇతరులను వంచించుటయందు, పటుః = సమర్థుఁడైన, బుభుక్షౌ = ఇంద్రుఁడు, అధునా = ఇప్పుడు, కిం = ఏమి, విధేయం =

చేయఁదగినది, ఇతి = అని, విముగ్ధం = తెలియనట్టి, స్వానుగాననం; స్వానుగ = తనకు ననుచరులైన యమాది దేవతలయొక్క, ఆననం = మోమును, అవేక్ష్య = చూచి, నలస్య = నలునికి, వంచనం = మోసమును, సమభిలష్య = కోరి, ఉచ్చైః = బిగ్గరగా, శంసతిస్మ = చెప్పెను.

సమాసములు :

*విధేయమ్* : విధాతుం శక్యం = విధేయమ్.

*విముగ్ధమ్* : విశేషేణ ముగ్ధమ్ = విముగ్ధమ్. తత్ = విముగ్ధమ్.

*స్వానుగాననమ్* : స్వస్య అనుగాః = స్వానుగాః. స్వానుగానామానవమ్ = స్వానుగాననమ్. తత్ = స్వానుగాననమ్.

భావము :

ఒరులను వంచించుటలో నేర్పరియైన యింద్రుఁడు, ఇప్పుడేమి చేయవలయుననునది తెలియక చింతించుచున్న, తన యనుచరులగు యమాది దేవతల మోములనుఁ జూచి నలుని వంచించుటకై యభిప్రాయపడి గట్టిగా చెప్పఁదొడగెను. ॥౨౩॥

శ్లో॥ సర్వతః కుశలభాగసి కచ్చిత్
త్వం స నైషధ ఇతి ప్రతిభా నః।
స్వాసనార్ధసుహృద స్తవ రేఖాం
వీర సేననృపతేరివ విద్మః॥ ౨౪

ప॥వి॥ సర్వతః । కుశలభాక్ । అసి । కచ్చిత్ । త్వం । సః । నైషధః । ఇతి । ప్రతిభా । నః । స్వాసనార్ధసుహృదః । తవ । రేఖాం । వీర సేననృపతేః । ఇవ । విద్మః.

టీక॥ (హేసౌమ్య = ఓ సౌమ్యుఁడా!) సర్వతః = అన్ని విషయములయందును, అనగా స్వామ్యమాత్య సుహృదత్కోశ రాష్ట్ర దుర్గ బలములనెడి సప్తాంగములయందు, కుశలభాగసికచ్చిత్ = క్షేమముఁ గల్గియున్నావా? త్వం = నీవు, సః = ఆ ప్రసిద్ధమైన, నైషధఇతి = నలుఁడవని, నః =

మాకు, ప్రతిభా = ప్రతీతి. తవ = నీయొక్క, రేఖాం = ఆకృతిని, స్వాస నార్ధ సుహృదః; స్వ = నాదైన, ఆసన = సింహాసనమునకు, అర్ధ = సగ పాలున గూర్చుండెడి, సుహృదః = మిత్రుఁడైన, వీరసేననృపతేరివ = వీరసేన మహారాజునకు సమానమైనదిగ, విద్మః = తెలుసుకొనుచున్నాము.

## సమాసములు :

కుశలభాక్ : కుశలం భజతీతి = కుశలభాక్.

నైషధః : నిషధానాం రాజా = నైషధః.

స్వాసనార్ధసుహృదః : అర్ధమ్ ఆసనస్య = ఆసనార్ధమ్. స్వస్య ఆసనార్ధమ్ = స్వాసనార్ధమ్. స్వాసనార్ధస్యసుహృత్ = స్వాసనార్ధసుహృత్. తస్య = స్వాసనార్ధసుహృదః.

వీరసేననృపతేః : వీరసేన ఇతి నృపతిః = వీరసేననృపతిః. తస్య = వీరసేననృపతేః.

## భావము ;

ఓ సౌమ్యుఁడా! అన్ని విషయముల యందును నీకు క్షేమమా? నీవు మాకుఁ దెలియవని కాదు. నీవా ప్రసిద్ధుఁడైన నలుఁడవని యను కొనుచున్నాను. నీ యాకృతి వీరసేన మహారాజును జ్ఞప్తిపఱచుచున్నది. ఆ వీరసేన మహారాజు నాతోడ సింహాసనమునం దర్ధభాగమునఁ గూర్చుండెడివాఁడు కావున నీవు వీరసేన మహారాజు యొక్క కుమారుఁడవని భావించుచున్నాము. ॥౭౪॥

శ్లో॥ క్వ ప్రయాస్యసి నలేత్యలముక్త్వా
యాత్రయాఽత్ర శుభయాఽజని యన్నః।
తత్తయైవ ఫలసత్వరయా త్వం
నాఽధ్వనోర్ధమిదమాగమితః కిమ్॥ ౭౫

ప॥వి॥ క్వ । ప్రయాస్యసి । నల । ఇతి । అలమ్ । ఉక్త్వా । యాత్రయా । అత్ర । శుభయా । అజని । యత్ । నః । తత్ । తయా । ఏవ ।

ఫలసత్వరయా । త్వం । న । అధ్వనః । అర్ధమ్ । ఇదమ్ । ఆగ మితః । కిమ్.

టీక॥ హే నల! = ఓ నలా!, క్వ = ఎక్కడికి, ప్రయాస్యసి = వెళ్లగలవు, ఇతి = అని, ఉక్త్వా = ప్రశ్నించి, అలం = చాలును. యత్ = ఎందువలన, నః = మాకు, అత్ర = ఇచ్చటికి, యాత్రయా = ప్రయాణముచే, శుభయా = నీ దర్శనముచే, శుభముగా, అనగా సఫలముగా, అజని = ఏర్పడుట (జరిగినదో), తత్ = అందువలన, ఫలసత్వరయా; ఫల = ఫలమునందు, సత్వరయా = = త్వరతోఁ గూడిన, తయైవ = ఆ యాత్ర చేతనే, త్వం = నీవు, ఇదమ్ = ఈ, అధ్వనః = త్రోవయొక్క, అర్ధం = సగమును, గమితః = పొందింపఁబడిన వాఁడవుగ, నకిం = కావా యేమి.

## సమాసములు :

ఫలసత్వరయా : త్వరయా సహితా = సత్వరా. ఫలే సత్వరా = ఫల సత్వరా. తయా = ఫలసత్వరయా.

## భావము :

ఓ నలా! నీవెక్కడికి వెళ్లుచున్నావని యడుగ నవసరము లేదు. నీ దర్శనముచేత మా ప్రయాణము సఫలమైనది. ఫలమునఁ ద్వరలో నడించెడి మా ప్రయాణమే, నిన్ని త్రోవ నడుమకుఁ గొనితెచ్చినది. అనగా నీవు మా కొఱకే ఇచ్చటకు వచ్చితివి. కాన నీవెక్కడికిఁ బోయెదవను ప్రశ్న వ్యర్థము. ॥౭౫॥.

శ్లో॥ ఏష నైషధ స దండ భృదేష
జ్వాలజాలజటిలస్స హుతాశః।
యాదసాం స పతిరేష చ శేషం
శాసితారమవగచ్ఛ సురాణామ్॥ ౭౬

ప॥వి॥ ఏషః । నైషధ । సః । దండభృత్ । ఏషః । జ్వాలజాలజటిలః । సః। హుతాశః । యాదసాం । సః । పతిః। ఏషః । చ । శేషం । శాసితారమ్ । అవగచ్ఛ । సురాణామ్.

టీక॥ హే నైషధ! = ఓ నలా!, ఏషః = ఎదుటనున్న వాఁడు, సః = ప్రసిద్ధుఁడైన, దండభృత్ = యముఁడు. ఏషః = ఇతఁడు, జ్వాలజాలజటిలః; జ్వాలజాల = జ్వాలా సమూహముచే, జటిలః = జడలు ధరించిన వాఁడు, సః = ఆ ప్రసిద్ధమైన, హుతాశః = అగ్నిదేవుఁడు. ఏషచ = ఇతఁడును, సః = ఆ ప్రసిద్ధుఁడైన, యాదసాం = జల జంతువులకు, పతిః = పాలకుఁడైన వరుణుఁడు. శేషం = మిఁగిలియున్న నన్ను, సురాణాం = దేవతలకు, శాసితారం = పాలకునిగా, అవగచ్ఛ = తెలుసుకొనుము.

## సమాసములు :

*నైషధః* : నిషధానాం రాజా = నైషధః.

*దండభృత్* : దండం బిభర్తీతి = దండభృత్.

*జ్వాలజాలజటిలః*: జ్వాలానాం జాలం = జ్వాలజాలమ్. జ్వాలజాలేన జటిలః = జ్వాలజాలజటిలః.

## భావము :

ఓ నైషధా! ఎదుటనున్నట్టి యితఁడు ప్రసిద్ధుఁడైన యమధర్మరాజు. జ్వాలలచే జడగట్టుకొనిన యితఁడో, ప్రసిద్ధమైన యగ్నిదేవుఁడు. ఇతఁడు ప్రసిద్ధమైన వరుణదేవుఁడు. మిగిలియున్న నేను దేవతలకు పాలకుఁడైన యింద్రుఁడను అని మమ్ముల నందఱినిఁ దెలుసుకొనుము. ॥౭౬॥

శ్లో॥ అర్థినో వయమమీ సముపేమ
స్త్వాం కిలేతి ఫలితార్థమవేహి।
అధ్వనః క్షణమపాస్య చ ఖేదం
కుర్మహే భవతి కార్యనివేదమ్॥ ౭౭

ప॥వి॥ అర్థినః । వయమ్ । అమీ । సముపేమః । త్వాం । కిల । ఇతి । ఫలితార్థమ్ । అవేహి । అధ్వనః । క్షణమ్ । అపాస్య । చ । ఖేదం । కుర్మహే । భవతి । కార్యనివేదమ్.

టీక॥ హే నల = ఓ నలా! అమీ = ఈ, వయం = మేము, అర్థినః = యాచకులమై, త్వాం = నిన్ను, సముపేమఃకిల = పొందుచున్నాము గదా, ఇతి = అని,

ఫలితార్థం = ముఖ్య విషయమును, అనగా సారాంశమును, అవేహి = తెలుసుకొనుము. క్షణం = కొంతకాలము, అధ్వనః = మార్గముయొక్క, ఖేదం = కష్టమును, అపాస్య = తొలగించుకొని, భవతి = నీయందు, కార్య నివేదం = మాయొక్క కార్యమునుఁ దెలుపుటను, కుర్మహే = చేసెదము.

సమాసములు :

ఫలితార్థమ్ : ఫలితశ్చాసౌ అర్థశ్చ = ఫలితార్థః. తమ్ = ఫలితార్థమ్.

కార్యనివేదమ్ : కార్యస్యనివేదః = కార్యనివేదః. తమ్ = కార్యనివేదమ్.

భావము :

ఓ నలా! మేమందఱము యాచకులమై నీ యొద్దకు వచ్చితిమి. ఇదియే మేము వచ్చిన విషయముయొక్క సారాంశము. కొంతకాలము ప్రయాణమువలని బడలికను, తీర్చుకొని మేము వచ్చిన పనిని నీకు తెలిపెదము. ॥౭౭॥

శ్లో॥ ఈదృశీం గిరముదీర్య బిడౌజాః
జోషమాస న విశిష్య బభాషే ।
నాత్ర చిత్రమభిధాకుశలత్వే
శైశవావధి గురుర్గురురస్య॥ ౭౮

ప॥వి॥ ఈదృశీం । గిరమ్ । ఉదీర్య । బిడౌజాః । జోషమ్ । ఆస । న । విశిష్య । బభాషే । న । అత్ర । చిత్రమ్ । అభిధాకుశలత్వే । శైశవావధి । గురుః । గురుః । అస్య.

టీక॥ బిడౌజాః = ఇంద్రుఁడు, ఈదృశీం = ఇట్లు సామాన్యముగా నిర్దేశింపఁబడిన, గిరం = మాటను, ఉదీర్య = పలికి, జోషమ్ = ఊరక, ఆస = ఉండెను. విశిష్య = విశేషించి, నబభాషే = మాట్లాడ లేదు. అత్ర = ఈ, అభిధాకుశలత్వే = మాటలనేర్పునందు, చిత్రం = ఆశ్చర్యము, న = లేదు. అస్య = ఈ ఇంద్రునకు, శైశవావధి = బాల్యమునుండియు, గురుః = ఉపాధ్యాయుఁడు, గురుః = బృహస్పతి.

టీక॥ హే నైషధ! = ఓ నలా!, ఏషః = ఎదుటనున్న వాఁడు, సః = ప్రసిద్ధుఁడైన, దండభృత్ = యముఁడు. ఏషః = ఇతఁడు, జ్వాలజాలజటిలః; జ్వాలజాల = జ్వాలా సమూహముచే, జటిలః = జడలు ధరించిన వాఁడు, సః = ఆ ప్రసిద్ధమైన, హుతాశః = అగ్నిదేవుఁడు. ఏషచ = ఇతఁడును, సః = ఆ ప్రసిద్ధుఁడైన, యాదసాం = జల జంతువులకు, పతిః = పాలకుఁడైన వరుణుఁడు. శేషం = మిగిలియున్న నన్ను, సురాణాం = దేవతలకు, శాసితారం = పాలకునిగా, అవగచ్ఛ = తెలుసుకొనుము.

## సమాసములు :

*నైషధః :* నిషధానాం రాజా = నైషధః.

*దండభృత్ :* దండం బిభర్తీతి = దండభృత్.

*జ్వాలజాలజటిలః :* జ్వాలానాం జాలం = జ్వాలజాలమ్. జ్వాలజాలేన జటిలః = జ్వాలజాలజటిలః.

## భావము :

ఓ నైషధా! ఎదుటనున్నట్టి యితఁడు ప్రసిద్ధుఁడైన యమధర్మరాజు. జ్వాలలచే జడగట్టుకొనిన యితఁడో, ప్రసిద్ధమైన యగ్నిదేవుఁడు. ఇతఁడు ప్రసిద్ధమైన వరుణదేవుఁడు. మిగిలియున్న నేను దేవతలకు పాలకుఁడైన యింద్రుఁడను అని మమ్ముల నందఱిని దెలుసుకొనుము. ॥౭౬॥

శ్లో॥ అర్థినో వయమమీ సముపేమ
స్త్వాం కిలేతి ఫలితార్థమవేహి।
అధ్వనః క్షణమపాస్య చ ఖేదం
కుర్మహే భవతి కార్యనివేదమ్॥ ౭౭

ప॥వి॥ అర్థినః । వయమ్ । అమీ । సముపేమః । త్వాం । కిల । ఇతి । ఫలితార్థమ్ । అవేహి । అధ్వనః । క్షణమ్ । అపాస్య । చ । ఖేదం । కుర్మహే । భవతి । కార్యనివేదమ్.

టీక॥ హే నల = ఓ నలా! అమీ = ఈ, వయం = మేము, అర్థినః = యాచకులమై, త్వాం = నిన్ను, సముపేమఃకిల = పొందుచున్నాము గదా; ఇతి = అని,

## సమాసములు :

*బిడౌజాః :* బిడమ్ ఓజః యస్యసః = బిడౌజాః.

*అభిధాకుశలత్వే :* కుశలస్య భావః = కుశలత్వమ్. అభిధాయాం కుశలత్వం = అభిధాకుశలత్వం. తస్మిన్ = అభిధాకుశలత్వే.

*శైశవావధి :* శిశోర్భావః = శైశవమ్. శైశవమ్ అవధిః = యస్మిన్ కర్మణి తద్యథాభవతి. తథా = శైశవావధి.

## భావము :

ఇంద్రుఁడిట్లు సామాన్యముగాఁ జెప్పి యూరక యుండెను. విశేషించి మాట్లాడలేదు. ఇతనికిట్టి మాటలలో నేర్పునకు ఆశ్చర్యపడ నవసరము లేదు. ఇతనికి బాల్యమునుండి బృహస్పతి గురువు గదా. ఆయన వాచస్పతియని ప్రసిద్ధుఁడు గదా. ఇఁక నాయన శిష్యునకు, వాక్చాతుర్యము గూర్చి చెప్పనేలః. ॥౭౮॥

శ్లో॥ అర్థినామహృషితాఖిలలోమా
స్వం నృపస్స్ఫుట కదంబకదంబమ్।
అర్చనార్థమివ తచ్చరణానాం
స ప్రణామకరణాదుపనిన్యే॥ ౭౯

ప॥వి॥ అర్థినామ హృషితాఖిలలోమా । స్వం । నృపః । స్ఫుటకదంబకదంబమ్। అర్చనార్థమ్ । ఇవ । తచ్చరణానామ్ । సః । ప్రణామకరణాత్ । ఉపనిన్యే.

టీక॥ అర్థినామహృషితాఖిలలోమా; అర్థి = యాచకులయొక్క, నామ = పేరుచే, హృషిత = నిక్క పొడచుకొనిన, అఖిలలోమా = సమస్తమైన వెంట్రుకలు గల, సః = ఆ, నృపః = నల మహారాజు, స్వం = తన్ను, తచ్చరణానాం = వారి పాదములకు, అర్చనార్థమివ = పూజకొఱకో యన్నట్లు, స్ఫుటకదంబ కదంబమ్; స్ఫుట = వికసించిన, కదంబ = కడిమిపూలయొక్క, కదంబం = సమూహమునోయన్నట్లు, ప్రణామ కరణాత్ = వందనముచేయుటవలన, ఉపనిన్యే = సమర్పించెను.

**సమాసములు :**

అర్థినామహృషితాఖిలలోమా : అర్థినాం నామాని = అర్థినామాని. అర్థినామభిః హృషితాని = అర్థినామహృషితాని. అఖిలాని చ తాని లోమాని చ = అఖిల లోమాని. అర్థినామహృషితాని అఖిలలోమాని యస్య సః = అర్థినామహృషితాఖిలలోమా.

స్ఫుటకదంబకదంబమ్ : స్ఫుటాని చ తాని కదంబాని చ = స్ఫుటక దంబాని. స్ఫుటకందబానాం కదంబః = స్ఫుటకదంబకదంబః. తమ్ = స్ఫుటక దంబకదంబమ్.

అర్చనార్థమ్ : అర్చనాయ = అర్చనార్థమ్.

తచ్చరణానామ్ : తేషాం చరణాః = తచ్చరణాః. తేషాం = తచ్చరణానామ్.

ప్రణామకరణాత్ : ప్రణామస్య కరణం = ప్రణామకరణం. తస్మాత్ = ప్రణామకరణాత్.

**భావము :**

యాచకుల పేరు వినినంతనే యానలునకు శరీరమంతయు రోమాంచము, అనగా గగుర్పాటేర్పడినది. ఆ నలుఁడు వారి పాదములనుఁ బూజించుటకై, రోమాంచము కల్గిన తన శరీరమును, వికసించిన కడిమి పూవులకుప్ప యోయనునట్లు వందనవ్యాజమున వారికి సమర్పించెను. ॥౭౯॥

శ్లో॥ దుర్లభం దిగధిపైః కిమమీభి
స్తాదృశం కథమహో మదధీనమ్।
ఈదృశం మనసికృత్య విరోధం
నైషధేన సమశాయి చిరాయ॥ ౮౦

ప॥వి॥ దుర్లభం । దిగధిపైః । కిమ్ । అమీభిః। తాదృశం । కథమ్ । అహో।
మదధీనమ్ । ఈదృశం । మనసికృత్య । విరోధం । నైషధేన । సమశాయి । చిరాయ.

టీక॥ దిగధిపైః = దిక్పాలకులగు, అమీభిః = ఈ ఇంద్రాదులచే, దుర్లభం = దొఱకనిది, కిం = ఏమి? తాదృశమ్ = అట్టిదుర్లభమైనవస్తువు, కథం = ఎట్లు, మదధీనం = నాకధీనముగనుండును. అహో = ఆశ్చర్యము. ఈదృశం = ఇటువంటి, విరోధం = విరోధమును, మనసికృత్య = మనస్సునందుంచుకొని, నైషధేన = నలునిచే, చిరం = చాలకాలము, సమశాయి = సంశయింపఁబడుట (జరిగినది.)

## సమాసములు :

*దుర్లభమ్ :* దుఃఖేన లబ్ధుం శక్యం = దుర్లభమ్.

*దిగధిపైః :* దిశామధిపాః = దిగధిపాః. తైః = దిగధిపైః.

*మదధీనమ్ :* మయి అధీనమ్ = మదధీనమ్.

*మనసికృత్య :* మనసి కృత్వా = మనసికృత్య.

*నైషధేన :* నిషధానాం రాజా = నైషధః. తేన = నైషధేన.

## భావము :

దిక్పాలకులగు నింద్రాదులచే సాధింపరాని దేమియున్నది? అటువంటిది నాకు సాధ్యపడునా? ఆశ్చర్యము. దీనిని మనస్సునందుంచుకొని నలుఁడు చాలా కాలము సందేహించు చుండెను. ॥౮౦॥

శ్లో॥ జీవితావధి వనీపకమాత్రై
ర్యాచ్యమానమఖిలైః సులభం యత్।
అర్థినే పరివృఢాయ సురాణాం
కిం వితీర్య పరితుష్యతు చేతః॥ ౮౧

ప॥వి॥ జీవితావధి । వనీపకమాత్రైః । యాచ్యమానమ్ । అఖిలైః । సులభం । యత్ । అర్థినే । పరివృఢాయ । సురాణాం । కిం । వితీర్య । పరితుష్యతు । చేతః.

టీక॥ యత్ = ఎందువలన, అఖిలైః = సమస్తులైన, వనీపకమాత్రైః = యాచకులచే, జీవితావధి = ప్రాణపర్యంతము, యాచ్యమానం = యాచింపఁబడు

వస్తువు, సులభం = సులభము. సురాణాం = దేవతలకు, పరివృఢాయ = ప్రభువైన, అర్థినే = యాచకునికొఱకై, కిం = ఏవస్తువును, వితీర్య = ఇచ్చి, చేతః = మనస్సు, పరితుష్యతు = సంతోషించును ?

**సమాసములు :**

*జీవితావధి :* జీవితంఅవధిః యస్య తత్ = జీవితావధి.

*వనీపకమాత్రైః :* వనీం పాంతీతి = వనీపకాః. వనీపకా ఏవ = వనీపక మాత్రాః. తైః = వనీపకమాత్రైః.

**భావము :**

యాచకులకు జీవితమువరకు యాచించినను నీయవచ్చును. ప్రాణముల వరకునున్న వస్తువు సకల యాచకులకును నీయశక్యమే. వేల్పులఱేఁడైన యింద్రునకు జీవితమునకంటె నీయఁదగిన వస్తువేమి యున్నది? ॥౮౧॥

శ్లో॥ భీమజా చ హృది మే పరమాస్తే
జీవితాదపి ధనాదపి గుర్వీ ।
న స్వమేవ మమ సార్హతి యస్యాః
షోడశీమపి కళాం కిల నోర్వీ ॥ ౮౨

ప॥వి॥ భీమజా । చ । హృది । మే । పరమ్ । ఆస్తే । జీవితాత్ । అపి । ధనాత్ । అపి । గుర్వీ । న । స్వమ్ । ఏవ । మమ । సా । అర్హతి । యస్యాః । షోడశీమ్ । అపి । కళాం । కిల । న । ఉర్వీ.

టీక॥ ఉర్వీ = భూమి, యస్యాః = ఏదమయంతికి, షోడశీం = పదునాఱవదైన, కళామపి = కళనుఁగూడ, అనగానంశమునుఁగూడ, నార్హతి = పొందఁదగదో, (అతఏవ = కావుననే), ధనాదపి = ధనముకంటెను, జీవితాదపి = జీవితముకంటెను, గుర్వీ = అధికమైన, సా = ఆ, భీమజాచ = దమయంతి, మే = నాయొక్క, హృది = హృదయమందు, పరం = చక్కఁగా, ఆస్తే = ఉన్నది. కింతు = కాని, మమ = నాకు, స్వమేవ = స్వకీయమే, నభవతి = కాదు.

**సమాసములు :**

*భీమజా:* భీమాజ్జాయత ఇతి = భీమజా.

**భావము :**

ఇంద్రుని కీయఁదగిన వస్తువేమి యున్నదని సందేహింపవలదు. లోకో త్తరమైన వస్తువు దమయంతి యున్నది గదా. ఆమె నీయవచ్చునను ప్రశ్న యేర్పడగా దానికి నలుఁడు జెప్పుకొనుచున్నాఁడు. భూమి యాదమయంతికిఁ బదునాఱవ యంశముతోఁగూడ సాటి కానేరదు. కాన నా దమయంతి ధనమున కంటెను, జీవితమున కంటెను నధికమైనది. ఆమె నా హృదయమందున్నది. కాని యామె యింకను స్వకీయకాలేదు. నాకు స్వత్వము, అనగా నాదియను సంబంధ, మేర్పడనంతవరకు నట్టివస్తువు నెట్లీయఁగలను. ఒకవేళ స్వత్వ మేర్పడినను "దేయం దారసుతాదృతే" యనిచెప్పివ విధమున భార్యను పుత్రుని దానముచేయరాదను శాస్త్రము ననుసరించి యామెను దానముఁ జేయఁదగదు గదా! అని నలుఁడు విచారపడుచుండెను. ॥౧౨॥

శ్లో॥ మీయతాం కథమభీప్సితమేషాం
దీయతాం ద్రుతమయాచితమేవ ।
తం ధిగస్తు కలయన్నపి వాంఛా
మర్థివాగవసరం సహతే యః ॥ ౧౩

ప॥ వి॥ మీయతాం । కథమ్ । అభీప్సితమ్ । ఏషాం । దీయతాం । ద్రుతమ్ । అయాచితమ్ । ఏవ । తం । ధిక్ । అస్తు । కలయన్ । అపి । వాంఛామ్ । మర్థివాగవసరం । సహతే । యః.

టీక॥ ఏషాం = వీరియొక్క, అభీప్సితం = ఇష్టమైనవస్తువు, కథం = ఎట్లు, మీయతాం = తెలియఁబడును. అయాచితమేవ = యాచింపఁబడకయే, ద్రుతం = శీఘ్రముగా, కథం = ఎట్లు, దీయతాం = ఈయఁబడును. యః = ఏదాత, వాంఛాం = యాచకుని కోరికను, కలయన్నపి = తెలిసియు, అర్థివాగవసరం; అర్థి = యాచకునియొక్క, వాక్ = మాట

యొక్క, అవసరం = కాలమును, సహతే = ఎదురుచూచునో, తం = అట్టిదాతనుగూర్చి, ధిక్ = నింద, అస్తు = అగుఁగాత.

**సమాసములు :**

అయాచితమ్ : న యాచితమ్ = అయాచితమ్.

అర్థివాగవసరమ్ : అర్థినాం వాచః = అర్థివాచః. అర్థివాచామవసరః = అర్థివాగవసరః. తమ్ = అర్థివాగవసరమ్.

**భావము ;**

వీరు కోరిన విషయమెట్లు తెలియఁబడును? యాచింపకయే వెంటనే యెట్లు ఈయ సాధ్యమగును? యాచకుని కోరిక తెలిసియు నతఁడడుగు నంతవరకు నెదురుచూచునట్టి దాత నింద్యుఁడు. ॥౭౩॥

శ్లో॥ ప్రాపితేన చటుకాకువిడంబం
లంభితేన బహుయాచనలజ్జామ్ ।
అర్థినా యదఘమార్జతి దాతా
తన్న లుంపతి విళంబ్య దదానః ॥ ౭౪

ప॥వి॥ ప్రాపితేన । చటుకాకువిడంబం । లంభితేన । బహుయాచనలజ్జామ్ । అర్థినా । యత్ । అఘమ్ । ఆర్జతి । దాతా । తత్ । న । లుంపతి । విళంబ్య । దదానః.

టీక॥ చటుకాకు విడంబం; చటు = చమత్కార వచనములచేతను, కాకు = కాకు ధ్వనులతోఁడను, విడంబం = హాస్యత్వమును, లంభితేన = పొందింపఁబడినటు వంటివాఁడును, బహుయాచనలజ్జామ్; బహు = అధికముగా, యాచన = యాచించుటచే, లజ్జాం = సిగ్గును, పొందింపఁబడినవాడునునగు, అర్థినా = యాచకునిచే, విలంబ్య = ఆలస్యముగావించి, దదానః = ఇచ్చుచున్నట్టి, దాతా = దాత, యత్ = ఏ, అఘం = పాపమును, ఆర్జతి = సంపాదించునో, తత్ = దానిని, నలుంపతి = పోఁగొట్టుకొనలేడు,

**సమాసములు :**

*చటుకాకువిడంబః :* చటుశ్చకాకుశ్చ = చటుకాకూ. చటుకాకుభ్యాం విడంబః = చటుకాకు విడంబః. తమ్ = చటుకాకువిడంబమ్.

*బహుయాచనలజ్జామ్ :* బహు చ తత్ యాచనం చ = బహుయాచనమ్. బహుయాచనేన లజ్జా = బహుయాచనలజ్జా. తామ్ = బహుయాచనలజ్జామ్.

**భావము :**

దాత యాచకుని చమత్కార వచనములతోడను, కాకువచనములతోడను హాస్యము చేయుచు, పెక్కుమాఱులడిగించుకొని యాలస్యముచేసి దానము చేసినచో, పాపమును సంపాదించును. అట్టి పాపమునకుఁ బ్రాయశ్చిత్తము గూడ లేదు. ॥౭౪॥

శ్లో॥ యత్ప్రదేయముపనీయ వదాన్యై
ర్దీయతే సలిలమర్థిజనాయ ।
యాచనోక్తివిఫలత్వ విశంకా
త్రాసమూర్ఛన చికిత్సితమేతత్॥ ౭౫

ప॥వి॥ యత్ । ప్రదేయమ్ । ఉపనీయ । వదాన్యైః । దీయతే । సలిలమ్ । అర్థిజనాయ । యాచనోక్తివి ఫలత్వవిశంకాత్రాస మూర్ఛన చికిత్సితమ్ । ఏతత్.

టీక॥ వదాన్యైః = దాతలచే, ప్రదేయం = దానముఁ జెయఁదగిన ద్రవ్యము, ఉపనీయ = సమీపమునకుఁ దెచ్చి, అర్థిజనాయ = యాచకజనమునకై, సలిలం = ఉదకము, దీయత ఇతియత్ = ఇవ్వబడు చున్నది యను నదేది గలదో, ఏతత్ = ఈ యుదకదానము, యాచనోక్తి విఫలత్వ విశంకాత్రాసమూర్ఛన చికిత్సితమ్; యాచనోక్తి = యాచనమడుగుటకు, విఫలత్వ = వ్యర్థమగుటవలని, విశంకా = సందేహముచేఁ గల్గిన, త్రాస = భయముచే, మూర్ఛన = మూర్ఛకు, చికిత్సితమ్ = చికిత్సయా యేమిః.

**సమాసములు :**

ప్రదేయమ్ : ప్రదాతుం యోగ్యం = ప్రదేయమ్. తత్ = ప్రదేయమ్.

అర్థిజనాయ : అర్థీచాసౌ జనశ్చ = అర్థిజనః. తస్మై = అర్థిజనాయ.

యాచనోక్తివిఫలత్వ విశంకాత్రాసమూర్ఛనచికిత్సితమ్ : యాచనస్య ఉక్తిః = యాచనోక్తిః. యాచనోక్తేః విఫలత్వం = యాచనోక్తి విఫలత్వమ్. యాచనోక్తివిఫలత్వాత్ విశంకా = యాచనోక్తి విఫలత్వవిశంకా. యాచనోక్తి విఫలత్వవిశంకయా త్రాసః = యాచనోక్తి విఫలత్వవిశంకా త్రాసః. యాచనోక్తి విఫలత్వవిశంకాత్రాసస్య మూర్ఛనమ్ = యాచనోక్తి విఫలత్వవిశంకాత్రాసమూర్ఛనమ్. యాచనోక్తివిఫలత్వ విశంకా త్రాసమూర్ఛనస్య చికిత్సితమ్ = యాచనోక్తి విఫలత్వవిశంకాత్రా సమూర్ఛన చికిత్సితమ్.

భావము ;

దాతలు యాచకులకు ద్రవ్యమును దానము చేయునపుడు జలమును వదలి పెట్టుచున్నారు. యాచకుని ప్రార్థన విఫలమగు ననెడి భయముతో నొక వేళ మూర్ఛ సంభవించినచో నా మూర్ఛకు చికిత్సగా జలమీయఁబడుచున్నది. మూర్ఛపడిన వారిపై నీరు పోసినచో వారికి స్మృతి వచ్చుట ప్రసిద్ధము గదా. ॥౨౨॥

శ్లో॥ అర్థినే న తృణవద్ధనమాత్రం
కిం తు జీవనమపి ప్రతిపాద్యమ్ ।
ఏవమాహ కుశవజ్జలదాయీ
ద్రవ్యదానవిధిరుక్తి విదగ్ధః॥ ౨౩

ప॥వి॥ అర్థినే । న । తృణవత్ । ధనమాత్రం । కింతు । జీవనమ్ । అపి । ప్రతిపాద్యమ్ । ఏవమ్ । ఆహ । కుశవజ్జలదాయీ । ద్రవ్యదానవిధిః । ఉక్తివిదగ్ధః.

టీక॥ కుశవజ్జలదాయీ; కుశవజ్జల = దర్భతోఁ గూడిన జలమును, దాయీ = దానముచేయవలయునని ప్రతిపాదించెడి, (కావుననే), ఉక్తివిదగ్ధః;

ఉక్తి = మాటలయందు, విదగ్ధః = నేర్పుగల్గిన, అనగా నభిధావ్యాపారము లేకయే, యర్థమువలననే యింకొక యర్థమునుఁ బ్రతిపాదించునట్టి, ద్రవ్యదాన విధిః; ద్రవ్యదావ = ధనదానమునుఁ బ్రతిపాదించెడి, విధిః = శాస్త్రము, అర్థినే = యాచకుని కొఱకు, ధనమాత్రమ్ = ధనమునే, తృణమివ = గడ్డివలె నప్రతిపాద్యం = ఈయరాదు; కింతు = కాని, జీవనమపి = జీవితముగూడ, ప్రతిపాద్యం = ఈయఁదగినది. ఏవం = ఇట్లు, ఆహ = చెప్పుచున్నది.

**సమాసములు :**

తృణవత్ : తృణమివ = తృణవత్.

ధనమాత్రమ్ : ధనమేవ = ధనమాత్రమ్. తత్ = ధనమాత్రమ్.

కుశవజ్జలదాయీ : కుశాః అస్యసంతీతి = కుశవత్. కుశవచ్చతత్ జలంచ = కుశవజ్జలం. కుశవజ్జలం దదాతీతి = కుశవజ్జలదాయీ.

ద్రవ్యదానవిధిః : ద్రవ్యస్య దానం = ద్రవ్యదానమ్. ద్రవ్యదానస్య విధిః = ద్రవ్యదానవిధిః.

ఉక్తివిదగ్ధః : ఉక్తిషు విదగ్ధః = ఉక్తివిదగ్ధః.

**భావము :**

దర్భలతోఁగూడిన జలమును దానకాలమున ద్రవ్యముతోఁబాటు నీయవలయునని చెప్పెడి ద్రవ్యదానశాస్త్రము మిక్కిలి మాటల నేర్పుగలది. ఆ శాస్త్రమిట్లు చెప్పుచున్నది. యాచకునకు కేవలము ధనము గడ్డిపోచవలె నీయరాదు. దానితోఁబాటు జీవనమును (జలమును - జీవితమును) గూడ నీయవలయును. యాచకుఁడు కోరునది ద్రవ్యమేయైనను, దాత దానితోఁబాటు దర్భలను జలమును నిచ్చుచున్నాఁడు. దాని యర్థమేమనగా యాచకునికిచ్చెడి ధనము తృణముతో సమానము. అతనికి జీవనమును - అనగా జీవితమునుగూడ నీయవలయును జలముపోయుటవలన, జలమునకు జీవనమను పేరు గలదు గాన జీవితమునుగూడ యాచకునకు నీయవలయునని సూచించుచున్నది ॥౮౬॥

శ్లో॥ పంకసంకరవిగర్హితమర్హాం
న శ్రియః కమల మాశ్రయణాయ ।

అర్థిపాణికమలం విమలం త
ద్వాసవేశ్మ విదధీత సుధీస్తు॥ ౧౭

ప॥ వి॥ పంకసంకరవిగర్హితమ్ । అర్హం । న । శ్రియః । కమలమ్ । ఆశ్రయణాయ । అర్థిపాణికమలం । విమలం । తద్వాసవేశ్మ । విదధీత । సుధీః । తు.

టీక॥ పంకసంకరవిగర్హితమ్; పంక = బురదయొక్కయు, (పాపము యొక్క) సంకర = సంబంధముచే, విగర్హితం = నిందింపఁబడిన, కమలం = పద్మము, శ్రియః = లక్ష్మికి, ఆశ్రయణాయ = నివాసమునకు, నార్హమ్ = తగినది కాదు. తత్ = అందువలన, సుధీః = బుద్ధిమంతుఁడు, విమలం = నిర్మలమైన, అర్థిపాణికమలం; అర్థి = యాచకులయొక్క, పాణికమలం = హస్తమనుపద్మమును, దద్వాసవేశ్మ; తత్ = ఆలక్ష్మికి, వాసవేశ్మ = వాసస్థానముగా, విదధీత = చేయవలయును.

సమాసములు :

*పంకసంకరవిగర్హితమ్:* పంకస్య సంకరః = పంకసంకరః. పంకసంకరేణ విగర్హితమ్ = పంకసంకరవిగర్హితమ్.

*అర్థిపాణికమలమ్:* అర్థినః పాణిః = అర్థిపాణిః. అర్థిపాణిరేవ కమలమ్ = అర్థిపాణికమలమ్. తత్ = అర్థిపాణికమలమ్.

*తద్వాసవేశ్మ :* తస్యాః వాసః = తద్వాసః. తద్వాసస్య వేశ్మ = తద్వాసవేశ్మ. తత్ = తద్వాసవేశ్మ.

**భావము :**

పాపముతోడను, బురదతోడనుఁగూడి నిందితమైన పద్మము లక్ష్మికి నివాసయోగ్యముకాదు. అందువలన, బుద్ధిమంతుఁడు యాచకుల నిర్మలమైన హస్తకమలమునే యాలక్ష్మికి నివాస గృహముగఁ జేయుటమంచిది. సత్పాత్రల హస్తములయందు లక్ష్మినుంచవలయును గాని కేవలము భూమియందు నుంచరాదు. ॥౧౭॥

శ్లో॥ యాచమానజనమానసవృత్తేః
పూరణాయ బత జన్మ న యస్య।

తేన భూమిరతిభారవతీయం
న ద్రుమైర్న గిరిభిర్న సముద్రైః॥ ౨౨

ప॥వి॥ యాచమానజనమానసవృత్తేః । పూరణాయ । బత । జన్మ । న । యస్య । తేన । భూమిః । అతిభారవతీ । ఇయం । న । ద్రుమైః । న । గిరిభిః । న । సముద్రైః.

టీక॥ యస్య = ఏ ధనవంతునియొక్క, జన్మ = పుట్టుక, యాచమానజనమానసవృత్తేః; యాచమాన = యాచించునట్టి, జన = జనముయొక్క, మానసవృత్తేః = మనోరథమును, పూరణాయ = పూర్తి చేయుటకై, న = కాదో, బత = కష్టము, తేన = ఒక్కఁడైన యట్టిపాపిచే, ఇయం = ఈ, భూమిః = భూమి, అతిభారవతీ = అతిభారముతో కూడిన దగును. (కాని) ద్రుమైః = పెక్కు వృక్షములచేతను, అతిభారవతీన = మిక్కిలి భారము గలది కాదు, గిరిభిః = పెక్కు పర్వతములచే, అతిభారవతీ = అధిక భారము కలది, న = కాదు. సముద్రైః = సముద్రముల చేతను, అతిభారవతీ = మిక్కిలి భారము కలది, న = కాదు.

## సమాసములు :

యాచమానజనమానసవృత్తేః : యాచమానాశ్చ తే జనాశ్చ = యాచమానజనాః. యాచమానజనానాం మానసవృత్తిః = యాచమానజనమానసవృత్తిః. తస్యాః = యాచమానజనమానసవృత్తేః.

అతిభారవతీ : అత్యంతం భారః = అతిభారః. అతిభారః అస్యాః అస్తీతి = అతిభారవతీ.

## భావము :

ఏ ధనవంతుని జన్మము యాచకుల కోరికను దీర్చక పోవునో అట్టి పాపివలననే భూమికి ఎక్కువ భారము. ఈ భూమిపై పెక్కు వృక్షములున్నను, పెక్కు పర్వతములున్నను, పెక్కు సముద్రములున్నను వానిచే భూమికి ఎక్కువ భారము లేదు. ఏలయనగా నవి యన్నియు ప్రజలకు ఫలములు మున్నగు వాని నొసంగి యుపకారముఁ జేయుచున్నవి. ॥౨౨॥

శ్లో॥ మా ధనాని కృపణః ఖలు జీవన్
తృష్ణయాఽర్పయతు జాతు పరస్మై।
తత్ర నైష కురుతే మమ చిత్రం
యత్తు నార్పయతి తాని మృతోఽపి॥ ౮౯

ప॥వి॥ మా । ధనాని । కృపణః । ఖలు । జీవన్ । తృష్ణయా । అర్పయతు । జాతు । పరస్మై । తత్ర । న। ఏషః । కురుతే । మమ । చిత్రం । యత్ । తు । న । అర్పయతి । తాని । మృతః । అపి.

టీక॥ కృపణః = లోభి, జీవన్ = బ్రతుకుచు, తృష్ణయా = కాంక్షచే, జాతు = ఒకప్పుడును, పరస్మై = యాచించునట్టి యితరునకై, ధనాని = ధనములను, ఖలు = నిశ్చయముగా, నార్పయతు = ఈయఁడు. ఏషః = ఈ లోభి, తత్ర = బ్రతికిన కాలమందు నీయకపోవు విషయమున, మమ = నాకు, విస్మయం = ఆశ్చర్యమును, నకురుతే = చేయుటలేదు. కింతు = కాని, మృతోఽపి = చనిపోయిన వాఁడై గూడ, తాని = అ ధనములను, నార్పయతి = ఈయఁడనునది, యత్ = ఏది గలదో, తత్ర = ఆ విషయమున, చిత్రం = ఆశ్చర్యమును,కురుతే = చేయుచున్నాఁడు. బ్రతికి ఈయక పోవుట సహజము కాని చనిపోయి యీయకపోవుట విరుద్ధము. కాన, "నార్పయతి" యనగా, "నృపులకు స్వాధీనముఁ జేయు చున్నాఁడు" అని యర్థము చెప్పుకొనుటచే పరిహారము.

వి॥ బ్రతికియు "నార్పయతి = ఈయఁడు" చనిపోయి గూడ నార్పయతి = ఈయఁడు అని చెప్పుటవలన విరోధము. నార్పయతి యనగా నృపులకు స్వాధీనపరచుచున్నాఁడని యర్థము చెప్పుటవలన విరోధమునకు పరిహారము కాన విరోధాభాసాలంకారము.

**సమాసములు :**

నార్పయతి : నృపసంబంధీని కురుత ఇతి = నార్పయతి.

**భావము:**

లోభి జీవించియు కాంక్షచే, యాచకులకు ధనము నీయఁడనుటలో నాశ్చర్యము లేదు, కాని యతఁడు మరణించియు నా ధనముల నీయఁడు.

అనగా, నార్పయతి శబ్దముననుసరించి, యర్పించడు. ఇది ఆశ్చర్యకరమైన విషయము. కాని నార్పయతి యనగా నృపులఁబరముఁ జేయునని యర్థము ననుసరించి, లోభితాను బ్రతికియున్నప్పు డెవ్వరికి ధనముల నీయక కూడఁబెట్టినచో నది యాతఁడు మరణించిన పిదప ''భూమీశులపాలుజేరు భువిలో సుమతీ" యని సుమతి శతకమునఁ జెప్పిన విధముగ నృపులకు స్వాధీనమగును. కాన నతనికి నాధనముల వలన నేలాటి ప్రయోజనము కలుగదు. ॥౮౯॥

శ్లో॥ మామమీభిరిహ యాచితవద్భి
ర్దాతృజాతమవమత్య జగత్యాం।
యద్యశో మయి నివేశితమేత
న్నిష్క్రియోఽస్తు కతమస్తు తదీయః॥ ౯౦

ప॥వి॥ మామ్ । అమీభిః । ఇహ । యాచితవద్భిః । దాతృజాతమ్ । అవమత్య । జగత్యాం । యత్ । యశః । మయి । నివేశితమ్ । ఏతన్నిష్క్రియః । అస్తు । కతమః । తు । తదీయః.

టీక॥ జగత్యాం = భూమియందు, దాతృజాతం = దాతల సంఘమును, అవమత్య = తిరస్కరించి, అనగా లెక్కింపక, మాం = నన్ను, యాచితవద్భిః = యాచించునటువంటి, అమీభిః = ఈ వేల్పులచే, యత్ = ఏ, యశః = కీర్తి, మయి = నాయందు, నివేశితం = స్థాపింపబడినదో, ఏతన్నిష్క్రియః; ఏతత్ = ఈ యశస్సునకు, నిష్క్రియః = ప్రతినిధియైనది, కతమస్తు = ఏది, తదీయః = ఇంద్రాదులకు సంబంధించినదిగా, = అగును.

**సమాసములు :**

దాతృజాతమ్ : దాతౄణాంజాతం = దాతృజాతమ్. తత్ = దాతృజాతమ్.

**భావము :**

లోకమందున్న దాతల నందఱిని విడిచిపెట్టి నన్నొక్కనినే యీ యింద్రాది దేవతలు యాచించి నా యందు నెనలేని కీర్తిని స్థాపించిరి. ఈ కీర్తికి సరి తూగ గలది యేది యున్నది. అది యున్నచో దానిని ఇంద్రాదుల కొసంగి వారి ఋణమునుఁ దీర్చుకొందును. ॥౯౦॥

శ్లో॥ లోక ఏష పరలోకముపైతా
హా విహాయ నిధనే ధనమేకః।
ఇత్యముం ఖలు తదస్య నినీష
త్యర్థిబంధురుదయద్దయచిత్తః॥ ౮౧

ప॥వి॥ లోకః । ఏషః । పరలోకమ్ । ఉపైతా । హా । విహాయ । నిధనే । ధనమ్ । ఏకః । ఇతి । అముం । ఖలు । తత్ । అస్య । నినీషతి । అర్థిబంధుః । ఉదయద్దయచిత్తః.

టీక॥ ఏషః । ఈ, లోకః = జనము, హా = కష్టము, నిధనే = అంత్యకాలమునందు, ధనం = ధనమును, విహాయ = వదలి, ఏకః = ఒంటరిగా, పరలోకమ్ = పరలోకమును, ఉపైతా = పొందఁగలదు. ఇతి = ఈ కారణమువలన,ఉదయద్దయచిత్తః, ఉదయద్దయ = దయతోఁగూడిన, చిత్తః = మనస్సుగల, అర్థిబంధుః = యాచకుఁడను బంధువు, అస్య = ఇతనియొక్క, తత్ = ఆధనమును, అముం = ఆ పరలోకమును, నినీషతిఖలు = కొనిపోఁగోరును గదా!

## సమాసములు:

*పరలోకం :* పరశ్చాసౌ లోకశ్చ = పరలోకః. తమ్ = పరలోకమ్.

*అర్థిబంధుః :* అర్థ్యేవ బంధుః = అర్థిబంధుః.

*ఉదయత్ దయచిత్తః :* ఉదయంతీ దయా యస్య తత్ = ఉదయద్దయమ్. ఉదయద్దయం చిత్తం యస్య సః = ఉదయద్ధయచిత్తః.

## భావము :

ఈ జనముఅంత్యకాలమున, తమ ధనమును వదలిపెట్టి యొంటరిగాఁ బరలోకమునకకు వెళ్లుచున్నది. కాన, యాచకుఁడను బంధువుతాఁదీసుకొనినధనమునా పరలోకమునకుఁ దేఁగలడు. ఇతరులగు బంధువు లా ధనమును తామే తీసుకొందురు. కానిపరలోకమునకుఁదీసికొనిరారు. కాన యాచకుఁడు మనవలనధనము నీలోకమునఁ బుచ్చుకొనినచో, బరలోకమునకుఁ దేఁగలడు. కాన మనకచ్చట

దాన సుకృతమువలన సౌఖ్యములు జన్మాంతరమున నైశ్వర్య వైభవములు కల్గింపఁగలడు. ॥౯౨॥

శ్లో॥ దానపాత్రమధమర్ణమిహైక
గ్రాహి కోటిగుణితం దివి దాయి।
సాధురేతి సుకృతైర్యది కర్తుం
పారలౌకికకుసీదమసీదత్॥ ౯౩

ప॥వి॥ దానపాత్రమ్ । అధమర్ణమ్ । ఇహ । ఏకగ్రాహి । కోటిగుణితం । దివి। దాయి । సాధుః । ఏతి । సుకృతైః । యది । కర్తుం । పారలౌకికకుసీదమ్ । అసీదత్.

టీక॥ సాధుః = సజ్జనుఁడును, (వడ్డికిచ్చువాఁడును) ఇహ = ఈలోకమందు, ఏకగ్రాహి = ఒకటి పుచ్చుకొనిన వాఁడై, దివి = పరలోకమందు, కోటిగుణితం = కోటిరెట్లు పెంచఁబడినదిగా, దాయి = ఇచ్చు, దానపాత్రం = దానపాత్రమనఁబడు, అనగా దానమున కర్హుఁడగు, అధమర్ణం = ధనమునుఁ బుచ్చుకొనునట్టి వ్యక్తి, సుకృతైః = పుణ్యములచే, ఏతియది = స్వర్గమునుఁ బొందినచో, (తదా = అప్పుడు) అసీదత్ = నశింపనట్టి, పారలౌకికకుసీదం; పారలౌకిక = పరలోకమునకుసంబంధించిన, కుసీదం = వడ్డీజీవనమును, కర్తుం = చేయుటకు, అలం = తగియుండును.

- ప క్షాం త ర ము -

ఇహ = ఈ భూలోకమునందు, ఏకగ్రాహి = ఒక్కటినిఁ బుచ్చుకొనిన వ్యక్తి, దివి = స్వర్గమున, కోటిగుణితం = కోటిరెట్లు పెంచఁబడిన దానినిగ, దాయి = ఇచ్చును. దానపాత్రం = ఇట్టిస్వభావము గల్గి, దానమునకర్హుఁడైన, అధమర్ణం = యాచకుఁడనునప్పుఁబుచ్చుకొనఁగలవానిని, సుకృతైః = పుణ్యములచే (ఋణగృహీతారం = ఋణమునుపుచ్చుకొను వానినిగా, కృత్వా = చేసి) పారలౌకికం = పరలోకమునందుఁగల్గిన, కుసీదం = వడ్డివలని జీవనమును, కర్తుం = చేయుటకు, యదిఏతి = పొందినచో (అనగా నట్టియాచకుని సంపాదింప గల్గినచో) సః = ఆ యాచకుఁడైన యధమర్ణుని సంపాదించుకొనిన దాతయైన యుత్త

మర్ణుఁడు, సాధుః = సజ్జనుఁడే. అట్టి దానపాత్రుని సజ్జనుఁడే సంపాదింపఁగల్గి యుండును.

**సమాసములు :**

దానపాత్రమ్ : దానస్య పాత్రమ్ = దానపాత్రమ్.

అధమర్ణమ్ : అధమః ఋణః యస్య తత్ = అధమర్ణమ్.

ఏకగ్రాహి : ఏకం గృహ్ణాతీతి = ఏకగ్రాహి.

కోటిగుణితమ్ : కోటిభిః గుణితం = కోటిగుణితమ్. తత్ = కోటిగుణితమ్.

పారలౌకికమ్: పరశ్చ అసౌ లోకశ్చ = పరలోకః; పరలోకే భవం = పారలౌకికం. తత్ = పారలౌకికమ్.

అసీదత్ : న సీదత్ = అసీదత్. తత్ = అసీదత్.

**భావము :**

సాధువైనవ్యక్తి యీ లోకమునందొకటి పుచ్చుకొని స్వర్గమున కోటి రెట్లు దానమునిచ్చును. ఈ లోకమున వడ్డికిఁబరిమితి గలదు. కాని స్వర్గమున వడ్డికిఁ బరిమితిలేదు. దానమునకుఁ బాత్రుడై ద్రవ్యమును పుచ్చుకొని యప్పుబడుటచే నధమర్ణుఁడని చెప్పఁబడు యాచకుఁడు తన పుణ్యములచే స్వర్గమునుఁ బొందఁగల్గినచో, నా స్వర్గమునందు శాశ్వతమైన వడ్డీవ్యాపారమును, దాతయతని వలనఁ బొందుగలఁడు.

(పక్షాంతరము)

ఈ భూలోకమునందొకటి పుచ్చుకొని స్వర్గమునందు కోటి రెట్టీయఁగల దానపాత్రుఁడైన యాచకుని నధమర్ణునిగా ననగా నప్పుపుచ్చుకొను వానినిగా పుణ్యములచే సంపాదింపవలసినదే. అట్టివానిని సంపాదించి స్వర్గమున శాశ్వతమైన వడ్డీవ్యాపారముఁజేయగల యవకాశము సజ్జనునకుఁ దప్ప నితరునికి లేదు. సాధారణమైన యధమర్ణుఁడు తా నప్పుగాఁ బుచ్చుకొనిన ద్రవ్యమునకు రెండింత లీయవచ్చును. గాని దానిని మించి యీయఁజాలఁడు. దానపాత్రమైన యధమ

ర్ణుఁడు ఒకింతంబుచ్చుకొని కోటిరెట్లు చెల్లించును. అట్టియధమర్ణుని పుణ్యముల చేతనే సంపాదింపసాధ్యము. అట్టివాఁడు లభించినపుడు వానికోరికను దాతతీర్చ వలయును. అట్లు తీర్చినచో వానితో చిరకాలము స్వర్గవాసము లభించును. కావున నట్టి యాచకుడు లభించినప్పు డా యవకాశమును నుపయోగించుకొన వలయును. ॥౯-౨॥

శ్లో॥ ఏవమాది స విచింత్య ముహూర్తం
తానవోచత పతిర్నిషధానాం।
అర్థిదుర్లభమవాప్య చ హర్షా
ద్యాచ్యమానముఖముల్లసితశ్రీ॥ ౯-౩

ప॥వి॥ ఏవమాది । సః । విచింత్య । ముహూర్తం । తాన్ । అరోచత । పతిః। నిషధానాం । అర్థిదుర్లభమ్ । అవాప్య । చ । హర్షాత్ । యాచ్యమాన ముఖమ్ । ఉల్లసితశ్రీ.

టీక॥ సః = ఆ, నిషధానాం = నిషధదేశమునకు, పతిః = పాలకుఁడైన నల మహా రాజు, ఏవమాది = ఇవి మున్నగు వానిని, ముహూర్తం = కొలదికాలము, విచింత్య = ఆలోచించి, అర్థిదుర్లభం; అర్థి = యాచకులకు, దుర్లభం = పొంద సాధ్యముగాని, హర్షాత్ = సంతోషమువలన, ఉల్లసితశ్రీ; ఉల్ల సిత = వికసించిన, శ్రీ = శోభగల్గిన, యాచ్యమానముఖం; యాచ్య మాన = యాచింపఁబడుచున్న దాతయొక్క ముఖమును, అవాప్యచ = పొంది, తాన్ = ఇంద్రాదులను, అవోచత = పలికెను.

## సమాసములు :

*ఏవమాది :* ఏవంఆదిః యస్య తత్ = ఏవమాది.

*అర్థిదుర్లభమ్ :* దుఃఖేన లబ్ధుం శక్యం = దుర్లభమ్. అర్థినాం దుర్ల భమ్ = అర్థిదుర్లభమ్. తత్ = అర్థిదుర్లభమ్.

*యాచ్యమానముఖమ్ :* యాచ్యమానస్య ముఖమ్ = యాచ్యమానముఖమ్. తత్ = యాచ్యమానముఖమ్.

*ఉల్లసితశ్రీః* ఉల్లసితా శ్రీః యస్య తత్ = ఉల్లసితశ్రీ. తత్ = ఉల్లసితశ్రీ.

భావము :

నిషధదేశపు రాజైన యా నలుఁడు ఈ విధముగా, కొద్దికాలమాలోచించి, యాచకులకు దొఱకని, సంతోషముతో ప్రసన్నమైన, దాతయొక్క ముఖమును వహించి యా యింద్రాదులనుఁ గూర్చి యిట్లనెను. ॥౬౩॥

శ్లో॥ నాస్తి జన్యజనకవ్యతిభేదః
సత్యమన్నజనితో జనదేహః।
వీక్ష్య వః ఖలు తనూమమృతాదాం
దృఙ్నిమజ్జనముపైతి సుధాయాం॥ ౬౪

ప॥వి॥ న । అస్తి । జన్యజనకవ్యతిభేదః । సత్యమ్ । అన్నజనితః । జన దేహః । వీక్ష్య । వః । ఖలు । తనూమ్ । అమృతాదాం । దృక్ । నిమజ్జనమ్ । ఉపైతి । సుధాయామ్.

టీక॥ జన్యజనకవ్యతిభేదః; జన్యజనక = కార్యకారణములకు, వ్యతిభేదః = అధికభేదము, నాఽస్తి = లేదు. జనదేహః = జనులయొక్క శరీరము, అన్నజనితః = అన్నముచేఁ బుట్టినది. ఇది, సత్యం = సత్యము. అమృతాదాం = అమృతమును భుజించుచున్న, వః = మీయొక్క, తనూం = దేహమును, వీక్ష్య = చూచి, దృక్ = దృష్టి, సుధాయాం = అమృతమునందు, నిమజ్జనం = మునుగుటను, ఉపైతి = పొందుచున్నది.

సమాసములు :

*జన్యజనకవ్యతిభేదః :* జన్యం చ జనకం చ = జన్యజనకే. జన్యజనకయోః వ్యతిభేదః = జన్యజనకవ్యతిభేదః.

*అన్నజనితః :* అన్నేన జనితః = అన్నజనితః.

*జనదేహః :* జనానాం దేహః = జనదేహః.

*అమృతాదాం :* అమృతమదంతీతి = అమృతాదః. తేషాం = అమృతాదామ్.

**భావము:**

లోకమున కార్యకారణములకు గొప్పభేదము లేదు. కారణమే కార్యముగా పరిణమించును. కుండకు మట్టి ఉపాదాన కారణము. అదియే కుండగా పరిణమించును గదా! మానవుల దేహము అన్నము వలన బుట్టినదై అన్న పరిణామ రూపముగా నున్నది. కాన నన్నమున కంటె నది భిన్నము గాదు. మీ దేహము, అమృతమువలనఁ బుట్టినదై యమృత పరిణామముగా నున్నది. కాన నమృత దేహులగు మిమ్ములనుఁ జూచి, నా దృష్టి యమృతమున మునిగిన సుఖము ననుభవించు చున్నది. మీ దర్శనము వలన నేను కృతార్థుఁడనైతినని నలుఁడు దేవతలతోఁ జెప్పెను. ॥౭౪॥

శ్లో॥ మత్తపః క్వ ను తను క్వ ఫలం వా
యూయమీక్షణపథం వ్రజథేతి।
ఈదృశాన్యపి దధంతి పునర్నః
పూర్వపూరుషతపాంసి జయంతి॥ ౭౫

ప॥వి॥ మత్తపః । క్వ । ను । తను । క్వ । ఫలం । వా । యూయమ్ । ఈక్షణపథం । వ్రజథ । ఇతి । ఈదృశాని । అపి । దధంతి । పునః । నః । పూర్వపూరుషతపాంసి । జయంతి.

టీక॥ తను = స్వల్పమైన, మత్తపః = నా తపము, క్వ = ఎక్కడ, యూయం = మీరు, ఈక్షణపథం = దృష్టిమార్గమును, వ్రజథ = పొందుచున్నారు, ఇతి = అను, ఫలం = మహాఫలము, క్వ = ఎక్కడ. (అథవా = లేదా) ఈదృశాన్యపి = ఇటువంటి మహాఫలములను సైతము, పునః = అధికముగా, దధంతి = ధరించుచున్న, నః = మాయొక్క, పూర్వపూరుష తపాంసి = పూర్వపురుషులయొక్క తపములు, జయంతి = ఫలించుచున్నవి.

**సమాసములు :**

మత్తపః : మమ తపః = మత్తపః.

పూర్వపూరుషతపాంసి : పూర్వే చ తే పూరుషాశ్చ = పూర్వపూరుషాః. పూర్వపూరుషాణాం తపాంసి = పూర్వపూరుషతపాంసి.

**భావము :**

నా స్వల్పమైన తపమెక్కడ? మీవంటి మహాపురుషులను దర్శించెడి మహా ఫలమెక్కడ? లేదా ఇట్టి మహాఫలములకు, మా పూర్వ పురుషుల తపములు కారణములుగావచ్చును. ఆ తపములే యిప్పుడు ఫలించినవి. ॥౮౫॥

శ్లో॥ ప్రత్యతిష్ఠిపదిలాం ఖలు దేవీం
కర్మ సర్వసహనవ్రతజన్మ।
యూయమప్యహహ పూజనమస్యా
యన్నిజైః సృజథ పాదపయోజైః॥ ౮౬

ప॥వి॥ ప్రత్యతిష్ఠిపత్ । ఇలాం । ఖలు । దేవీం । కర్మ। సర్వసహనవ్రతజన్మ। యూయమ్ । అపి । అహహ । పూజనమ్ । అస్యాః । యత్ । నిజైః। సృజథ । పాదపయోజైః.

టీక॥ ఇలాందేవీం = భూదేవిని, సర్వసహన వ్రతజన్మ; సర్వసహన = సర్వమును సహించిమోయుటయను, వ్రత = వ్రతమువలన, జన్మ = కల్గినటువంటి, కర్మ = పుణ్యము, ప్రత్యతిష్ఠిపత్ = ప్రతిష్ఠను, పొందించెను గదా. యత్ = ఏలయనగా, యూయమపి = మీరును, నిజైః = తమవైన, పాదపయోజైః = పాద పద్మములచే, అస్యాః = ఈ భూదేవతకు, పూజనం = పూజను, సృజథ = చేయుచున్నారు. అహహ = ఆశ్చర్యము.

**సమాసములు :**

సర్వసహనవ్రతజన్మ : సర్వేషాం సహనమ్ = సర్వసహనమ్. సర్వసహనమేవ వ్రతమ్ = సర్వసహనవ్రతమ్. సర్వసహనవ్రతాత్ జన్మ యస్య తత్ = సర్వసహనవ్రతజన్మ. తత్ = సర్వసహనవ్రతజన్మ.

పాదపయోజైః : పాదా ఏవ పయోజాని = పాదపయోజాని. తైః = పాదపయోజైః.

**భావము :**

భూదేవత యన్నింటిని మోయుట అనగా పర్వతాదులను మానావమానములను నన్నింటిని సహించుట యను వ్రతమును బెక్కేండ్లు గావించి

యా వ్రతముచే గొప్ప ప్రతిష్ఠను సంపాదించినది. ఏలయనగా, మీ వంటి మహా పురుషులు గూడ మీ పాద పద్మములచే నా భూదేవత నర్చించుచున్నారు గదా! ఎంత ఆశ్చర్యము! భూదేవత యెంత భాగ్యముం జేసికొనినది. ॥౯౬॥

శ్లో॥ జీవితావధి కిమప్యధికం వా
యన్మనీషితమితో నరడింభాత్।
తేన వశ్చరణమర్చతు సోఽయం
బ్రూత వస్తు పునరస్తు కిమీదృక్॥ ౯౭

ప॥వి॥ జీవితావధి । కిమ్ । అపి । అధికం । వా । యత్ । మనీషితమ్ । ఇతః । నరడింభాత్ । తేన । వః । చరణమ్ । అర్చతు । సః । అయం । బ్రూత । వస్తు । పునః । అస్తు । కిమ్ । ఈదృక్.

టీక॥ ఇతః = ఈ, నరడింభాత్ = మానవశిశువునుండి, జీవతావధి = ప్రాణముల వరకుగాని, అధికంవా = దానికంటెనెక్కువగాని, కిమపి = ఏదైనను, ఈప్సితం = కోరఁబడినది, యత్ = ఏవస్తువుగలదో, తేన = ఆ వస్తువుచే, సోఽయం = ఆయీనరడింభము, అనగా మానవశిశువు, వః = మీయొక్క, చరణం = పాదమును, అర్చతు = పూజించునుఁగాత. ఈదృక్ = ఇట్లు దుర్లభమైన, వస్తుపునః = వస్తువో, కిమ్ = ఏమి, అస్తు = ఉండును? బ్రూత = చెప్పుఁడు.

## సమాసములు :

*జీవితావధి :* జీవితమ్ అవధిః యస్య తత్ = జీవితావధి. తత్ = జీవితావధి.

*నరడింభాత్ :* నరస్య డింభః = నరడింభః. తస్మాత్ = నరడింభాత్.

## భావము :

ఈ నరశిశువు ప్రాణమువరకుఁగాని దానిని మించిగాని దేనినిమీరు కోరితిరో దానితో మీ పాదములను పూజించును. దీనికంటెను దుర్లభమైన వస్తువేమి యుండును? అట్లున్నచో చెప్పుడు. ॥౯౭॥

శ్లో॥ ఏవముక్తవతి ముక్తవిశంకే
వీరసేనతనయే వినయేన।
వక్రభావవిషమామథ శక్రః
కార్యకైతవగురుర్గిరమూచే॥ ౧౬౨

ప॥ వి॥ ఏవమ్ । ఉక్తవతి । ముక్తవిశంకే । వీరసేనతనయే । వినయేన । వక్రభావవిషమామ్ । అథ । శక్రః । కార్యకైతవగురుః । గిరమ్ । ఊచే.

టీక॥ ఏవం = ఇట్లు, వీరసేనతనయే; వీరసేన = వీరసేనమహారాజుయొక్క, తనయే = కుమారుఁడైన నలుఁడు, వినయేన = వినయముచే, అనగా నిష్కాపట్యముగా, ముక్తవిశంకే; ముక్త = విడువఁబడిన, విశంకే = సందేహము గల్గినవాఁడుగా, ఉక్తవతిసతి = చెప్పగా, అథ = పిదప, కార్యకైతవగురుః; కార్యకైతవ = కార్యములయందలి కటోపాయములకు, గురుః = గురువైన, శక్రః = ఇంద్రుఁడు, వక్రభావవిషమాం; వక్ర భావ = ప్రతికూలభావముచే, విషమాం = ప్రతికూలమైన, గిరం = మాటను, ఊచే = చెప్పెను.

సమాసములు :

*ముక్తవిశంకే:* ముక్తా విశంకా యేన సః = ముక్తవిశంకః. తస్మిన్ = ముక్తవిశంకే.

*వీరసేనతనయే :* వీరసేనస్య తనయః = వీరసేనతనయః. తస్మిన్ = వీరసేనతనయే.

*వక్రభావవిషమామ్ :* వక్రస్య భావః = వక్రభావః. వక్రభావేన విషమా = వక్రభావవిషమా. తామ్ = వక్రభావవిషమామ్.

*కార్యకైతవగురుః:* కార్యేషు కైతవం = కార్యకైతవమ్. కార్యకైతవస్య గురుః = కార్యకైతవగురుః.

భావము :

వీరసేనమహారాజుయొక్క పుత్రుఁడైన నలమహారాజు, కపటములేక నిస్సందేహముగఁ జెప్పగా, కార్యములను సాధించుటకుఁ దగిన కపటోపాయ

ములకు గురువైన యింద్రుఁడు ప్రతికూల భావముతోఁ గూడినమాటనుఁ జెప్పెను. ॥౯౦॥

శ్లో॥ పాణిపీడనమహం దమయంత్యాః
కామయేమహి మహీమిహికాంశో।
దూత్యమత్ర కురు నః స్మరభీతిం
నిర్జితస్మర చిరస్య నిరస్య॥ ౯౯

ప॥వి॥ పాణిపీడనమహం । దమయంత్యాః । కామయేమహి । మహీమిహికాంశో। దూత్యమ్ । అత్ర । కురు । నః । స్మరభీతిం । నిర్జితస్మర । చిరస్య । నిరస్య.

టీక॥ హేమహీమిహికాంశో! = ఓ భూలోక చంద్రా!, వయం = మేము, దమయంత్యాః = దమయంతియొక్క, పాణిపీడనమహం = పాణిగ్రహణ మహోత్సవమును, కామయేమహి = కోరుచున్నాము. హేనిర్జితస్మర = జయింపఁబడిన మన్మథుఁడుగల యో నల మహారాజా! స్మరభీతిం = మన్మథుని వలని భయమును, చిరం = చాలదూరమునకు, నిరస్య = తిరస్కరించి, నః = మాకు, దూత్యం = రాయబారమును, కురు = చేయుము.

**సమాసములు :**

*పాణిపీడనమహమ్ :* పాణేః పీడనమ్ = పాణిపీడనమ్. పాణిపీడనమేవ మహః = పాణిపీడనమహః. తమ్ = పాణిపీడనమహమ్.

*(హే) మహీమిహికాంశో :* మిహికాః అంశవః యస్య సః = మిహికాంశుః. మహ్యాః మిహికాంశుః = మహీమిహికాంశుః. తస్యసంబుద్ధిః = (హే) మహీమిహికాంశో.

*దూత్యమ్ :* దూతస్య కర్మ = దూత్యమ్. తత్ = దూత్యమ్.

*స్మరభీతిమ్ :* స్మరాత్ భీతిః = స్మరభీతిః. తామ్ = స్మరభీతిమ్.

*(హే) నిర్జితస్మర :* నిర్జితః స్మరః యేన సః = నిర్జితస్మరః. తస్య సంబుద్ధిః = (హే) నిర్జితస్మర.

**భావము ;**

వీరసేన మహారాజుయొక్క పుత్రుఁడైన నలమహారాజు నిర్భయముగా తమరు కోరిన దేదో చెప్పవలసినదని ప్రార్థింపగా, నింద్రాది దేవతలు-ఓ భూతల చంద్రా మేము దమయంతితో వివాహమునుఁ గోరుచున్నాము. సౌందర్యమున మన్మథుని జయించిన నీకు మన్మథునివలన భయముండ నవసరము లేదు. కాన నీ విషయమున రాయబారము నడపవలసినది. మన్మథుని వలన భయమున్నచో నీవు రాయబారమును నడుపలేవు. ఏలయనగా నీకును దమయంతి యందు కామమేర్పడి యది దౌత్యమునకుఁ బ్రతిబంధకము కావచ్చును. కాన నీవు మన్మథుని జయించితివి గాన సులభముగా నీ దౌత్యమునుఁ జేయుమని తమ కోరికను బయట పెట్టిరి. ॥౯౯॥

శ్లో॥ ఆసతే శతమధిక్షితి భూపాః
తోయరాశిరపి తే ఖలు కూపాః।
కిం గ్రహో దివి న జాగ్రతి తే తే
భాస్వతస్తు కతమస్తులయాస్తే॥ ౧౦౦

ప॥వి॥ ఆసతే । శతమ్ । అధిక్షితి । భూపాః। తోయరాశిః। అపి । తే । ఖలు । కూపాః। కిం। గ్రహాః। దివి। చ । జాగ్రతి । తే । తే । భాస్వతః । తు। కతమః । తులయా । ఆస్తే.

టీక॥ అధిక్షితి = భూమియందు, శతం = అనేకులు, భూపాః = రాజులు, ఆసతే = ఉన్నారు. (అత్ర = ఈ విషయమున, త్వం = నీవు) తోయరాశిః = సముద్రముగా, అసి = ఉన్నావు. తే = ఆ రాజులు, కూపాః ఖలు = బావులు గదా. (తథాహి అదియు క్రమే.) దివి = ఆకసమునందు, తేతే గ్రహాః = చంద్రుఁడు మున్నగు గ్రహములు, నజాగ్రతికిమ్ = ప్రకాశించుట లేదా? (కింతు = కాని) కతమః = ఆ గ్రహములలో నేది, భాస్వతః = సూర్యునకు, తులయా = సామ్యముతో, ఆస్తే = ఉన్నది.

వి॥ ఇచ్చట రాజులను ప్రతిపాదించెడి వాక్యార్థమునకును, కూపములనుఁ బ్రతిపాదించెడి వాక్యార్థమునకును, అట్లే గ్రహములనుఁ బ్రతిపాదించెడి

వాక్యార్థమునకును, బింబ ప్రతిబింబభావాపన్న సామ్యము ప్రతీయమాన మగుట వలనను, అశ్లే నలునకు, సముద్ర ప్రతిపాదక వాక్యార్థము తోడను, సూర్య ప్రతిపాదక వాక్యార్థముతోఁడను బింబప్రతిబింబభావా పన్న సామ్యము ప్రతీయమాన మగుటవలనను దృష్టాంతాలంకారము.

**సమాసములు :**

అధిక్షితి : క్షితౌ = అధిక్షితి.

తోయరాశిః : తోయానాం రాశిః = తోయరాశిః.

**భావము :**

భూమియందు పెక్కండ్రు రాజులున్నారు. కాని వారిలో నీవు సముద్రుఁడవు. వారు బావులు కావున నీవెక్కడ? వారెక్కడ? ఆకసమునందు, చంద్రాది గ్రహములు పెక్కు ప్రకాశించుచున్నవి గదా. కాని వానిలోనే గ్రహము సూర్యునితోఁ దులఁదూగఁగలదు. కావున ఈ రాయబారమునకు నీవే తగిన వాఁడవు. ॥౧౦౦॥

శ్లో॥ విశ్వదృశ్వనయనా వయమేవ
త్వద్గుణాంబుధిమగాధమవేమః।
త్వామిహైవ వినివేశ్య రహస్యే
నిర్వృతిం న హి లభేమహి సర్వే॥ ౧౦౧

ప॥వి॥ విశ్వదృశ్వనయనాః । వయమ్ । ఏవ । త్వద్గుణాంబుధిమ్ । అగాధమ్ । అవేమః । త్వామ్ । ఇహ । ఏవ । వినివేశ్య । రహస్యే । నిర్వృతిం । న । హి । లభేమహి । సర్వే.

టీక॥ విశ్వదృశ్వనయనాః; విశ్వ = ప్రపంచమును, దృశ్వ = చూచునట్టి, నయనాః = నేత్రములుగల్గిన, వయమేవ = మేమే, అగాధం = గంభీరమైన, త్వద్గుణాంబుధిం; త్వత్ = నీయొక్క, గుణ = గుణములనెడి, అంబుఁధిం = సముద్రమును, అవేమః = తెలుసుకొనుచున్నాము. హి = ఏలయనగా, ఇహ = ఈరహస్యపు కార్యమునందు, త్వామేవ = నిన్నే,

వినివేశ్య = నియమించి, సర్వే = మేమందఱము, నిర్వృతిం = సుఖమును, నలభేమహి = పొందలేమా ? తప్పక పొందఁగలము.

**సమాసములు :**

విశ్వదృశ్వనయనాః : విశ్వంపశ్యంతీతి = విశ్వదృశ్వాని. విశ్వదృశ్వాని నయనాని యేషాం తే = విశ్వదృశ్వనయనాః.

త్వద్గుణాంబుధిమ్ : తవ గుణాః = త్వద్గుణాః. త్వద్గుణా ఏవ అంబుధిః = త్వద్గుణాంబుధిః. తమ్ = త్వద్గుణాంబుధిమ్.

అగాధమ్ : న గాధః = అగాధః. తమ్ = అగాధమ్.

**భావము :**

ప్రపంచమునందలి సూక్ష్మ విషయములనుఁగూడ మా కన్నులు చూడఁగలవు. దయాదాక్షిణ్య సత్యసంధత్వాదులను నీ గుణముల యగాధ సముద్రమును మేము తెలుసుకొనుచున్నాము. కావుననే యీ దూత్యమను రహస్య కార్యమును నిర్వహించుటకు నీవే తగినవాఁడవు. నిన్నీ పనియందు నియమించినచో మేము తప్పక సుఖపడగలము. ॥౧౦౦॥

శ్లో॥ శుద్ధవంశ జనితోఽపి గుణస్య
స్థానతామనుభవన్నపి శక్రః।
క్షిప్నురేనమృజుమాశు సపక్షం
సాయకం ధనురివాజని వక్రః॥ ౧౦౧

ప॥వి॥ శుద్ధవంశజనితః । అపి । గుణస్య । స్థానతామ్ । అనుభవన్ । అపి । శక్రః । క్షిప్నుః । ఏనమ్ । ఋజుమ్ । ఆశు । సపక్షం । సాయకం । ధనుః । ఇవ । అజని । వక్రః.

టీక॥ శుద్ధవంశజతోఽపి; శుద్ధవంశ = మంచివంశమునందు (వెదురునందు), జనితోఽపి = జన్మించియు, గుణస్య = శౌర్యాదిగుణములకు (అల్లెత్రాడునకు), స్థానతాం = స్థానమగుటను, అనుభవన్నపి = అనుభవించుచున్నను, శక్రః = ఇంద్రుఁడు, ఋజుం = కుత్సితబుద్ధిలేనటువంటి వాడును,

(వంకరలేనిదియు), సపక్షం = మిత్రుఁడును, (ఱెక్కలతోఁగూడినదియు) అగు, ఏనం = ఈనలుని, సాయకం = బాణమును, ధనురివ = ధనుస్సు వలె, ఆశు = శీఘ్రముగా, క్షిప్సుః = ప్రయోగింపఁ గోరినవాఁడై, వక్రః = వంపుగలవాఁడుగ, (కపటముగలవాఁడుగ), అజని = ఆయెను.

వి॥ ఇచ్చట శ్లిష్టవిశేషణములగు శుద్ధవంశజనిత- గుణ - సపక్షాదిశబ్దములచే, నింద్రుని గుణమును నల్లెత్రాటితోఁడను, నింద్రుని ధనుస్సుతోఁడను పోల్చుట వలన నుపమాలంకారమని కొందఱు, ప్రకృతాప్రకృతశ్లేషయని మఱికొందఱు చెప్పుచున్నారు.

## సమాసములు:

శుద్ధవంశజనితః : వంశ ఏవ వంశః = వంశః. శుద్ధశ్చాసౌ వంశశ్చ = శుద్ధవంశః. శుద్ధవంశేజనితః = శుద్ధవంశజనితః.

సపక్షం : పక్షైస్సహ వర్తత ఇతి = సపక్షః. లేదా, సమానః పక్షః యస్య సః = సపక్షః. తమ్ = సపక్షమ్.

## భావము :

ఈ ఇందుఁడు. ఉత్తమవంశమునందుఁ బుట్టినను, దయాదాక్షిణ్యాది గుణములకు స్థానమైనను, కపటములేనట్టి మిత్రుఁడైన నలుని బాణముగాఁ దన పనికై ప్రయోగింపఁ గోరినవాఁడై, మంచి వెదురునందుపుట్టి, యల్లెత్రాడుగల్గి, ఱెక్కలతోఁగూడిన బాణమునుఁ బ్రయోగించునట్టి విల్లువలె వంపు (కపటము) గలవాఁడాయెను. బాణములను ప్రయోగించునపుడు విల్లెట్లు వంపు తిరుగునో య్లా నలుని బాణముగా ప్రయోగించుటకైయా యింద్రుఁడు కపటమును వహించి వక్రుడై స్వార్థసాధనమునకుఁ గడంగెను. ॥౧౦౨॥

శ్లో॥ తేన తేన వచసైవ మఘోన
స్స స్మ వేద కపటం పటురుచ్చైః।
ఆచరత్తదుచితామథ వాణీ
మార్జవం హి కుటిలేషు న నీతిః॥ ౧౦౩

ప॥వి॥ తేన । తేన । వచసా । ఏవ । మఘోనః । సః । స్మ । వేద । కపటం। పటుః । ఉచ్చైః । ఆచరత్ । తదుచితామ్ । అథ । వాణీమ్ । ఆర్జవం । హి । కుటిలేషు । న । నీతిః.

టీక॥ ఉచ్చైః = గొప్ప, పటుః = సమర్థుఁడైన, సః = ఆ నలుఁడు, తేన, తేన = ఆయా, వచసైవ = మాటచేతనే, మఘోనః = ఇంద్రునియొక్క, కపటం = కపటమును, వేదస్మ = దెలుసుకొనెను. అథ = తెలిసిన పిదప, తదుచితాం; తత్ = ఆ కపటమునకు, ఉచితాం = తగిన, వాణీం = మాటను, ఆచరత్ = ప్రయోగించెను, కుటిలేషు = కపట స్వభావముగల వారి విషయమున, ఆర్జవం = నిష్కాపట్యము, నీతిః = నీతి, నహి = కాదు కదా?.

సమాసములు :

తదుచితామ్ : తస్య ఉచితా = తదుచితా. తామ్ = తదుచితామ్.

ఆర్జవమ్ : ఋజోర్భావః = ఆర్జవమ్.

భావము :

గొప్ప నేర్పరియైన నలుఁడు ఆయా మాటలచే నింద్రుని కపటమును గ్రహించెను. తానును నా యింద్రుని కపటమునకుఁ దగిన విధముగా కపటముతోడనే యుత్తరమిచ్చెను. కపటము గలవారి విషయమునందు కపటము లేక వ్యవహరించుట సరియైన పద్ధతి కాదు. కావున కపటి విషయమున, కపటము గల్గియే యుండవలయును. లేనిచో గొప్ప చేటు వాటిల్లును. ॥౧౦౩॥

శ్లో॥ సేయముచ్చతరతా దురితానా
మన్య జన్మని మయైవ కృతానాం ।
యుష్మదీయమపి యా మహిమానం
జేతుమిచ్ఛతి కథాపథపారమ్॥ ౧౦౪

ప॥వి॥ సా । ఇయమ్ । ఉచ్చతరతా । దురితానామ్ । అన్యజన్మని । మాయా। ఏవ । కృతానాం । యుష్మదీయమ్ । అపి । యా । మహిమానం । జేతుమ్ । ఇచ్ఛతి । కథాపథపారమ్.

టీక॥ సా = ఆ, ఇయం = ఇది, అన్యజన్మని = మఱియొక జన్మమందు, మయైవ = నాచేతనే, కృతానాం = చేయఁబడిన, దురితానాం = పాపముల యొక్క, ఉచ్చతరతా = ఆధిక్యము, యా = ఏ పాపముల యాధిక్యము, కథాపథపారమ్; కథాపథ = కథన మార్గమునకు, అనగా చెప్పుటకు, పారం = దూరమైన, యుష్మదీయమ్ = మీదైన, మహిమానమపి = మహిమనుఁగూడ, అనగా మీ యాజ్ఞనుఁ గూడ, జేతుమ్ = ఉల్లంఘించుటకు, ఇచ్ఛతి = కోరుచున్నది.

## సమాసములు :

ఉచ్చతరతా : అత్యంతముచ్చం = ఉచ్చతరం. ఉచ్చతరస్య భావః = ఉచ్చతరతా.

అన్యజన్మని : అన్యచ్చ తత్ జన్మ చ = అన్యజన్మ. తస్మిన్ = అన్య జన్మని.

యుష్మదీయమ్ : యుష్మాకం అయమ్ = యుష్మదీయం. తమ్ = యుష్మదీయమ్.

కథాపథపారమ్ : కథాయాః పంథాః = కథాపథః. కథాపథస్య పారం = కథాపథపారం. తత్ = కథాపథపారమ్.

## భావము :

నేను జన్మాంతరములయందుఁగావించిన నా పాపము లెంత గొప్పవి. ఆ పాపముల యాధిక్యము మాటలచేఁ జెప్ప సాధ్యము కాని మీయొక్క మహిమనుఁ అనగా మీ యాజ్ఞనుఁ గూఁడ నుల్లంఘింపఁ గోరుచున్నది. కాన మీ యాజ్ఞనుఁ జేయఁజాలనని నలుఁడు దేవతలకుఁ జెప్పెను. ॥౧౦౪॥

శ్లో॥ విత్త చిత్తమఖిలస్య న కుర్యాం
ధుర్యకార్యపరిపంథి తు మౌనమ్।
హ్రీర్గిరాస్తు పరమస్తు పునర్మా
స్వీకృతైవ పరవాగపరాస్తా॥ ౧౦౫

**ప॥వి॥** విత్త । చిత్తమ్ । అఖిలస్య । న । కుర్యాం । ధుర్యకార్యపరిపంథి । తు । మౌనమ్ । హ్రీః । గిరా । అస్తు । వరమ్ । అస్తు । పునః । మా । స్వీకృతా । ఏవ । పరవాక్ । అపరాస్తా.

**టీక॥** (హే దేవాః = ఓ దేవతలారా!), అఖిలస్య = సకలమైన, జనస్య = జనముయొక్క, చిత్తం = మనస్సును, విత్త = తెలుసుకొనుచున్నారు. ధుర్యకార్యపరిపంథి; ధుర్య = ఇష్టమును సాధింపగల, కార్య = ఉపాయ ప్రయోగ రూపమైన కార్యమునకు, పరిపంథి = ప్రతిబంధకమైన, మౌనంతు = మౌనమునో, నకుర్యాం = చేయను, గిరా = చేయనను పరిహార వచనముచే, హ్రీః = సిగ్గు, అస్తు = అగునుగాత. వరం = శ్రేష్ఠము. పరవాక్ = పరులప్రార్థనారూపమైన వచనము, అపరాస్తా = నిరాకరింపఁబడినది కానిచో, స్వీకృతైవతుపునః = అంగీకరింపఁబడినదిగా, మాఽస్తు = కారాదు.

## సమాసములు :

ధుర్యకార్యపరిపంథి : ధురం వహతీతి = ధుర్యమ్. ధుర్యం చ తత్ కార్యం చ = ధుర్యకార్యమ్. ధుర్యకార్యస్య పరిపంథి = ధుర్యకార్యపరిపంథి. తత్ = ధుర్యకార్యపరిపంథి.

పరవాక్ : పరస్య వాక్ = పరవాక్.

అపరాస్తా : న పరాస్తా = అపరాస్తా.

## భావము :

ఓ దేవతలారా! మీరు సమస్త జనులయొక్క మనస్సునుఁ దెలుసుకొనగలరు. నేను నా కార్యసాధనకు ప్రతిబంధకమైన మౌనమును వహింపను. మీకు కోరిన కార్యమును నేను చేయనని చెప్పుటవలన లజ్జకల్గినను కలుగనిండు. కోరిన విషయమును నిరాకరించనిచో నది యొప్పుకొనఁబడినదిగఁ గారాదు. ॥౧౦౩॥

**శ్లో॥** యన్మతౌ విమలదర్పణికాయాం
సమ్ముఖస్థమఖిలం ఖలు తత్త్వం।

తేఽపి కిం వితరథేదృశమాజ్ఞాం
యా న యస్య సదృశీ వితరీతుం॥ ౧౦౬

ప॥వి॥ యన్మతౌ । విమలదర్పణికాయాం । సమ్ముఖస్థమ్ । అఖిలం । ఖలు । తత్త్వం । తే । అపి । కిం । వితరథ । ఈదృశమ్ । ఆజ్ఞాం । యా । న । యస్య । సదృశీ । వితరీతుమ్.

టీక॥ యన్మతౌ; యత్ = ఏమీయొక్క, మతౌ = బుద్ధియనెడు, విమల దర్పణికాయమ్; విమల = నిర్మలమైన, దర్పణికాయాం = అద్దమునందు, అఖిలం = సమస్తమైన, తత్త్వం = వస్తువు, సమ్ముఖస్థంఖలు = ప్రత్యక్షము గదా! తే = అటువంటి సర్వజ్ఞులైన మీరు, ఈదృశం = ఇటువంటి, ఆజ్ఞాం = ఆజ్ఞను, కిమ్ = ఏల, వితరథ = ఇచుచున్నారు? యా = ఏ ఆజ్ఞ, యస్య = ఏ, మే = నాకు, వితరీతుం = ఇన్చుటకు, సదృశీ = యోగ్యము, న = కాదో.

## సమాసములు :

*యన్మతౌ :* యేషాం మతిః = యన్మతిః. తస్యాం = యన్మతౌ.

*విమలదర్పణికాయాం:* విమలా చ సా దర్పణికా చ = విమలదర్పణికా. తస్యాం = విమలదర్పణికాయామ్.

*సమ్ముఖస్థం :* సమ్ముఖే తిష్ఠతీతి = సమ్ముఖస్థమ్.

## భావము ;

ఓ దేవతలరా! మీ బుద్ధియనెడి శుభ్రమైన యద్దమునందు సమస్త విషయములు ప్రత్యక్షములు గదా. మీకుఁ దెలియని విషయము లేమి యన్నవి. అట్లు తెలిసియు మీరు నాకిటువంటి యాజ్ఞ నిచ్చితిరి? ఇది నాకుఁ దగునా? కావున నిట్టి యాజ్ఞ నిచ్చినందులకు మీరు నిందార్హులు. ॥౧౦౬॥

శ్లో॥ యామి యామిహ వరీతుమహో త
ద్దూతతాం తు కరవాణి కథం వః।

ఈదృశాం న మహతాం బత జాతా
వంచనే మమ తృణస్య ఘృణాపి॥ ౧౦౭

ప॥వి॥ యామి । యామ్ । ఇహ । వరీతుమ్ । అహో । తద్దూతతాం । తు । కరవాణి । కథం । వః । ఈదృశాం । న । మహతాం । బత । జాతా । వంచనే । మమ । తృణస్య । ఘృణా । అపి.

టీక॥ ఇహ = ఈ సమయమునందు, యాం = ఏ దమయంతిని. వరీతుం = వరించుటకై, యామి = వెళ్లుచున్నానో, తద్దూతతాంతు; తత్ = ఆ దమయంతి విషయమున, దూతతాంతు = దూత్యమునో, కథం = ఎట్లు, కరవాణి = చేయుదును? అహో = కష్టము. ఈదృశాం = ఇటువంటి, మహతాం = గొప్పవారైన, వః = మీకు, తృణస్య = గడ్డిపోచకుసమానమైన, మమ = నాయొక్క, వంచనే = మోసమునందు, ఘృణా = దయగాని, యేవగింపుగాని, నజాతా = కలుగలేదా? బత = కష్టము.

## సమాసములు :

తద్దూతతామ్ : తస్యాం దూతః = తద్దూతః. తద్దూతస్య భావః = తద్దూతతా. తామ్ = తద్దూతతామ్.

## భావము :

ఇప్పుడు నేను గూడ నా దమయంతిని వరించుటకై వెళ్లుచున్నాను. ఆమె విషయమున మీకెట్లు దూత్యమును నిర్వహింపఁగలను. ఇది కష్టమైన విషయము. ఇట్టి మహాపురుషులైన మీకు గడ్డిపోచతో సమానమైన నన్ను వంచించుటలో దయగాని యేవగింపుగాని కలుగదా! కష్టము. ॥౧౦౭॥

శ్లో॥ ఉద్భ్రమామి విరహాన్ముహురస్యా
మోహమేమి చ ముహూర్తమహం యః।
బ్రూత వః ప్రభవితాస్మి రహస్యం
రక్షితుం స కథమీదృగవస్థః॥ ౧౦౮

ప॥వి॥ ఉద్భ్రమామి । విరహాత్ । ముహుః । అస్యాః । మోహమ్ । ఏమి । చ । ముహూర్తమ్ । అహం । యః । బ్రూత । వః । ప్రభవితాస్మి । రహస్యం । రక్షితుం । సః । కథమ్ । ఈదృగవస్థః.

టీక॥ యః = ఏ, అహమ్ = నేను, అస్యాః = ఈ దమయంతియొక్క, విరహాత్ = వియోగమువలన, ఉద్భ్రమామి = ఉన్మత్తుఁడనై భ్రమించుచున్నాను, ముహూర్తం = కొద్ది కాలము, మోహంచ = మూర్ఛనుఁగూడ, ఏమి = పొందుచున్నాను, ఈదృగవస్థః = ఇటువంటి యవస్థగల్గిన, సః = అట్టి, అహం = నేను, వః = మీయొక్క, రహస్యం = రహస్యమును, రక్షితుం = కాపాడుటకు, కథం = ఎట్లు, ప్రభావితా = సమర్థుఁడను గాగలను.

## సమాసములు :

ఈదృగవస్థః : ఈదృశీ అవస్థా యస్య సః = ఈదృగవస్థః.

## భావము :

మఱియు నేను దమయంతీ వియోగమువలన వెఱ్ఱి పట్టి తిరుగుచున్నాను. అందువలన మాటిమాటికి మూర్ఛపడుచున్నాను. ఇట్టి యవస్థలో నున్న నేనెట్లు మీ రహస్యమునుఁ గాపాడుచు మీకు రాయబారము నడుపఁగలను?. ॥౧౦౮॥

శ్లో॥ యాం మనోరథమయీం హృది కృత్వా
యః శ్వసిమ్యథ కథం స తదగ్రే।
భావగుప్తిమవలంబితుమీశే
దుర్జయా హి విషయా విదుషాఽపి॥ ౧౦౯

ప॥వి॥ యాం । మనోరథమయీం । హృది । కృత్వా । యః । శ్వసిమి । అథ । కథమ్ । సః । తదగ్రే । భావగుప్తిమ్ । అవలంబితుమ్ । ఈశే । దుర్జయాః । హి । విషయాః । విదుషా । అపి.

టీక॥ యోఽహం = ఏ నేను, మనోరథమయీం = సంకల్పరూపమైన, యాం = ఏ దమయంతిని, హృది = హృదయమందు, కృత్వా = చేసు

కొని, శ్వసిమి = బ్రతుకుచున్నానో, సోఽహం = అటువంటి నేను, అథ = మీ యాజ్ఞయైన తర్వాత, తదగ్రే = ఆమెయెదుట, భావగుప్తిం = నాకేర్పడు కామ వికారముల నణచుకొనుటను, అవలంబితుం = పొందుటకు, కథమీశే = ఎట్లు సమర్థుఁడను కాగలను, తథాహి = అదియుక్తమే, (ఎట్లనగా) విదుషాపి = వివేకిచేతను, విషయాః = శబ్దాది విషయములు దుర్జయాః = జయింపసాధ్యములు కావు.

వి॥ దమయంతి ఎదుట భావగోపనమెట్లు చేయగలనను విశేషార్థము, వివేకవంతుఁడును విషయములను జయింపఁజాలఁడను సామాన్యముచే సమర్థించుట వలన నర్థాంతరన్యాసము.

**సమాసములు :**

మనోరథమయీమ్ : మనోరథానాం వికారః = మనోరథమయీ. తామ్ = మనోరథమయీమ్.

భావగుప్తిమ్ : భావస్య గుప్తిః = భావగుప్తిః. తామ్ = భావగుప్తిమ్.

దుర్జయాః : దుఃఖేన జేతుం శక్యాః = దుర్జయాః.

**భావము :**

నే నా దమయంతిని సంకల్పరూపమున నా మనస్సునందు నిలుపుకొని బ్రతుకుచున్నాను. నేను మీ దూత్యమునకై యామెనుఁ జూచినచో నా కామెపైఁ గామ వికారము లేర్పడును. వానినెట్లు నే నణచుకొనఁగలను? ఆ వికారములకు లోనైన నేను మీ కార్యముల నెట్లు సాధింపఁగలను? లోకమున విద్వాంసుఁడు గూడ రూపరసాది విషయములను జయింపలేడు. గదా! కావున నేను మీకు దూత్యమున కర్హుఁడను కాను. ॥౧౦౯॥

శ్లో॥ యామికాననుపమృద్య చ మాదృక్
తాం నిరీక్షితుమపి క్షమతే కః।
రక్షిలక్షజయచండచరిత్రే
పుంసి విశ్వసితి కుత్ర కుమారీ॥ ౧౧౦

ప॥వి॥ యామికాన్ । అనుపమృద్య । చ । మాదృక్ । తామ్ । నిరీక్షితుమ్ । అపి । క్షమతే । కః । రక్షిలక్షజయచండచరిత్రే । పుంసి । విశ్వసితి । కుత్ర । కుమారీ.

టీక॥ (కించ = మఱియు) మాదృక్ = నావంటి క్షత్రియుఁడైన, కః = ఎవ్వఁడు, యామికాన్ = జాములప్రకారము అంతఃపురమును రక్షించుచున్న కావలి వారిని, అనుపమృద్య = చంపక లేదా కొట్టక, తాం = ఆ దమయంతిని, నిరీక్షితుమపి = చూచుటకైనను, క్షమతే = శక్తుఁడగును? రక్షిలక్ష జయచండచరిత్రే; రక్షి = రక్షకులయొక్క, లక్ష = లక్ష సంఖ్యను, జయ = జయించుటచే, చండ = క్రూరమైన, చరిత్రే = నడవడిక గల్గిన, పుంసి = పురుషునియందు, కుమారీ = కన్య, కుత్ర = ఎచ్చట, విశ్వసితి = విశ్వసించును.

## సమాసములు :

*యామికాః :* యామాన్ రక్షంతీతి = యామికాః. తాన్ = యామికాన్.

*రక్షిలక్షజయచండచరిత్రే:* రక్షిణాంలక్షః = రక్షిలక్షః. రక్షిలక్షస్య జయః = రక్షిలక్షజయః. రక్షిలక్షజయేన చండం = రక్షిలక్షజయచండం. రక్షిలక్షజయ చండం చరిత్రం యస్య సః = రక్షిలక్షజయచండ చరిత్రః. తస్మిన్ = రక్షిలక్ష జయచండచరిత్రే.

## భావము :

మఱియు నా వంటి క్షత్రియుఁడు జాముజాము నకుఁ గావలి కాచెడి యంతఃపుర రక్షకులను మర్దింపక దమయంతినిఁ జూచుటకైనను తగునా? ఇఁక నామెతో మాట్లాడుట యెట్లు సాధ్యమగును. ఒకవేళ యంతఃపురమునుఁ గాపాడుచుండెడి లక్షలకొలది రక్షకులను జయించి యంతఃపురమునకుఁ బోగల్గి నను, లక్షలకొలఁది రక్షకులతోఁ బోరు పెట్టుకొనిన, క్రూరునియందు కన్య యైన దమయంతికి విశ్వాసమెట్లు కల్గును? అది లేనపుడు వివాహ ప్రసంగ మెట్లు సాధ్యము? వివాహదౌత్యమెక్కడ? అంతఃపురముతోఁ బో రెక్కడ?. ॥౧౦౦॥

శ్లో॥ ఆదధీచి కిల దాతృకృతార్ఘం
ప్రాణమాత్రపణసీమ యశో యత్।
ఆదదే కథమహం ప్రియయా తత్
ప్రాణతః శతగుణేన పణేన॥ ౧౧౧

ప॥వి॥ ఆదధీచి । కిల । దాతృకృతార్ఘం । ప్రణమాత్రపణసీమ । యశః । యత్ । ఆదదే । కథమ్ । అహం । ప్రియయా । తత్ । ప్రాణతః । శతగుణేన । పణేన.

టీక॥ ప్రాణమాత్రపణసీమ; ప్రాణమాత్ర = జీవితమునే, పణ = వెలకు, సీమ = అవధికల్గునట్లుగా, ఆదధీచి = దధీచిని‹ బ్రారంభించి, దాతృకృతార్ఘం; దాతృ = దాతలచే, కృత = నిశ్చయింపఁబడిన, అర్ఘం = వెలగలిన, యత్ = ఏ, యశః = కీర్తిగలదో, తత్ = ఆ కీర్తిని, ప్రాణతః = ప్రాణములకంటెను, శతగుణేన = పెక్కురెట్లు గల, ప్రియయా = ప్రియురాలైన దమయంతియను, పణేన = వెలచే, అహం = నేను, కథం = ఎట్లు, ఆదదే = పుచ్చుకొనఁగలను.

వి॥ దధీచి మున్నగువారు ప్రాణములచే యశస్సును సంపాదించిరి. ఇచ్చట తక్కువ విలువగల ప్రాణములచే నెక్కువ విలువగల కీర్తిని సంపాదించుట వలన న్యూనవస్తువులను నధికవస్తువులతో మార్పు చేయుటవలన న్యూనపరివృత్త్యలంకారము. ఎక్కువ విలువగల్గిన ప్రియురాలిని, తక్కువ విలువగల కీర్తితో మార్పును చెప్పుటవలన నధిక పరివృత్త్యలంకారము.

**సమాసములు :**

*ఆదధీచి :* దధీచిమారభ్య = ఆదధీచి.

*దాతృకృతార్ఘం :* దాతృభిః కృతః = దాతృకృతః. దాతృకృతః అర్ఘఃయస్య తత్ = దాతృకృతార్ఘం. తత్ = దాతృకృతార్ఘమ్.

*ప్రాణమాత్రపణసీమ:* ప్రాణ ఏవ = ప్రాణమాత్రమ్. పణస్య సీమా =

పణసీమా. ప్రాణమాత్రం పణసీమా యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = ప్రాణమాత్రపణసీమ.

*శతగుణేన:* శతం గుణాః యస్య సః = శతగుణః. తేన = శతగుణేన.

**భావము :**

దధీచి మున్నగు దాతలు యశస్సునకు ప్రాణములనే వెలగా నిశ్చయించిరి, అనగా వారందఱు ప్రాణములొడ్డి యశస్సును సంపాదించిరి. ప్రాణములకంటెను పెక్కు రెట్లుగల ప్రియురాలైన దమయంతి నొడ్డి ఆమెకంటెను తక్కువ వెలగలఁ గీర్తి నెట్లు కొందునుః. ॥౧౧౧॥

శ్లో॥ అర్థనా మయి భవద్భిరివాస్యై
కర్తుమర్హతి మయాఽపి భవత్సు।
భీమజార్థపరయాచనచాటౌ
యూయమేవ గురవః కరణీయాః॥ ౧౧౨

ప॥వి॥ అర్థనా । మయి । భవద్భిః । ఇవ । అస్యై । కర్తుమ్ । అర్హతి । మయా । అపి । భవత్సు । భీమజార్థపరయాచనచాటౌ । యూయమ్ । ఏవ । గురవః । కరణీయాః.

టీక॥ అస్యై = ఈ దమయంతికై, మయి = నా విషయమున, భవద్భిరివ = మీచే జేయబడినట్లు, మయాఽపి = నా చేతను, భవత్సు = మీ విషయమున. అర్థనా = ప్రార్థన, కర్తుం = చేయుటకు, అర్హతి = తగియున్నది. భీమజార్థపరయాచనచాటౌ; భీమజ = దమయంతియనెడు, అర్థ = వస్తువును విషయీకరించిన, పరయాచన = పరులను యాచించెడి, చాటౌ = ప్రియవచనమందు, యూయమేవ = మీరే, గురవః = గురువులుగా, అనగా నుపదేశకులుగా, కరణీయాః = చేయదగిన వారు.

**సమాసములు :**

*భీమజార్థపరయాచనచాటౌ:* భీమాత్ జాయత ఇతి = భీమజా. భీమజైవ అర్థః యస్మిన్ తత్ = భీమజార్థం. పరస్య యాచనం = పరయాచనమ్. భీమజార్థం

చ తత్ పరయాచనం చ = భీమజార్థపరయాచనం. భీమజార్థపరయాచనమేవ చాటు = భీమజార్థపరయాచనచాటు. తస్మిన్ = భీమజార్థపరయాచనచాటౌ.

**భావము :**

దమయంతి కొఱకు మీరు నన్నుఁ బ్రార్థించిన విధముగ నేనును మిమ్ముల నుఁ బ్రార్థింప నర్హుఁడను. మీకుఁ గూడ నాకున్నట్లు దమయంతిపై మోహము న్నను, ఆమెపై మీకంటె మునుపే మోహముగల నున్న దూత్యమునకై మీరు యాచించుటచే గురువులగు చున్నారు. కాన, నేను గూడ మిమ్ములను యాచించు టలో దోషము లేదు. తాను వలచిన కన్యను, వలచిన మరి యొక్కరిని దూత్యమున నియోగించుటలో మీరే నాకు మార్గ దర్శకులు. ఏలయనగా తొలుత నేను వలచిన దమయంతికై మీరు నన్ను దూత్యమున నియోగించితిరి గదా యని యాశయము. ॥౧౧౨॥

శ్లో॥ అర్థితా ప్రథమతో దమయంతీ
యూయమన్వహముపాస్య మయా యత్।
హ్రీర్న చేద్వ్యతియతామపి తద్వః
సా మమాఽపి సుతరాం న తదస్తు॥ ౧౧౩

ప॥వి॥ అర్థితా । ప్రథమతః । దమయంతీం । యూయమ్ । అన్వహమ్ । ఉపాస్య । మయా । యత్ । హ్రీః । న । చేత్ । వ్యతియతామ్ । అపి । తత్ । వః । సా । మమ । అపి । సుతరాం । న । తత్ । అస్తు.

టీక॥ మయా = నాచే, అన్వహం = ప్రతిదినము, యూయం = మీరు, ఉపాస్య = పూజింపఁబడి, ప్రథమతః = మొదట, దమయంతీం = దమయంతిని గూర్చి, అర్థితాః = ప్రార్థింపఁబడితిరి. తత్ = ఆ మొదటి ప్రార్థనను, వ్యతియతామ్ = అతిక్రమించుచున్న, వః = మీకు, హ్రీః = సిగ్గు, నచేత్ = లేనిచో, తత్ = అప్పుడు, సా = ఆ సిగ్గు, మమాఽపి = నాకును, సుతరాం = మిక్కిలి, నాఽస్తు = ఉండవలదు.

**సమాసములు :**

అన్వహమ్ : అహని అహని = అన్వహమ్.

**భావము :**

ఓ దేవతలారా! తొలుత మీరు దమయంతికై ప్రార్థించినందువలన మీ కోరికను నేను తీర్చవలయునను నదియు యుక్తము గాదు. ఆ పక్షమునఁ గూడ నేనే ముందు మిమ్ములనుఁ బ్రార్థించినవాఁడనగుచున్నాను. ఏల యనగా నేను ప్రతిదినము మిమ్ములనుఁ బూజించి, మొదట దమయంతికై ప్రార్థించు చుంటిని. అనగా నష్ట దిక్పాలక పూజఁజేయు చుంటిని. కావున నాదియే మొదటి ప్రార్థన. అట్టి మొదటిదైన నా ప్రార్థనను మీరు మీఱియు, సిగ్గుపడనిచో, నాకును నట్టి సిగ్గు మున్ముందుటికి నవసరము లేదు. ॥౧౧౩॥

శ్లో॥ కుండినేంద్రసుతయా కిల పూర్వం
మాం వరీతుమురరీకృతమాస్తే।
వ్రీడమేష్యతి పరం మయి దృష్టే
స్వీకరిష్యతి న సా ఖలు యుష్మాన్॥ ౧౧౪

ప॥వి॥ కుండినేంద్రసుతయా । కిల । పూర్వం । మాం । వరీతుమ్ । ఉరరీకృతమ్ । ఆస్తే । వ్రీడమ్ । ఏష్యతి । పరం। మయి । దృష్టే । స్వీకరిష్యతి । న । సా । ఖలు । యుష్మాన్.

టీక॥ కుండినేంద్రసుతయా; కుండినేంద్ర = భీమరాజుయొక్క, సుతయా = పుత్రికయైన దమయంతిచే, పూర్వమేవ = ముందే, మాం = నన్ను, వరీతుం = వరించుటకు, ఉరరీకృతమ్ = అంగీకరింపబడినదై, ఆస్తేకిల = ఉన్నది గదా, తతః = అందువలన, మయి = నేను, దృష్టేసతి = చూడఁబడగా. పరం = మిక్కిలి, వ్రీడమ్ = సిగ్గును, ఏష్యతి = పొందఁగలదు. (ఏవంచ = ఇట్లు కాగా) సా = ఆమె, యుష్మాన్ = మిమ్ములను, నస్వీకరిష్యతిఖలు = స్వీకరింపదు గదా!.

**సమాసములు :**

కుండినేంద్రసుతయా : కుండినస్య ఇంద్రః = కుండినేంద్రః. కుండినేంద్రస్య సుతా = కుండినేంద్రసుతా. తయా = కుండినేంద్రసుతయా.

**భావము :**

భీమనృపతి పుత్రికయైన దమయంతి పూర్వమే, నన్ను వరించుట కంగీకరించినది. కావున ఆమె నన్ను చూచి సిగ్గు పడినదై మిమ్ములను వరింపఁజాలదు. ॥౧౧౪॥

శ్లో॥ తత్ప్రసీదత విధత్త న ఖేదం
దూత్యమత్యసదృశం హి మమేదం।
హాస్యతైవ సులభా న తు సాధ్యమ్
తద్విధిత్సుభిరనౌపయికేన॥ ౧౧౫

ప॥వి॥ తత్ । ప్రసీదత । విధత్త । న । ఖేదం । దూత్యమ్ । అత్యసదృశం । హి । మమ । ఇదం । హాస్యతా । ఏవ । సులభా । న । తు । సాధ్యమ్ । తద్విధిత్సుభిః । అనౌపయికేన.

టీక॥ తత్ = అందువలన, ప్రసీదత = ప్రసన్నులు కండు. ఖేదం = కష్టమును, నకురుత = చేయకుడు. మమ = నాకు, ఇదం = ఈ, దూత్యమ్ = రాయబారము, అత్యసదృశం = మిక్కిలి యయోగ్యమైనది. హి = ఏలయనగా, అనౌపయికేన = ఉపాయములేక, తద్విధిత్సుభిః; తత్ = ఆ దూత్యమును, విధిత్సుభిః = చేయఁగోరిన వారిచే, హాస్యతైవ = పరిహాసభాజనత్వము, సులభా = సులభమైనది.

**సమాసములు :**

దూత్యమ్ : దూతస్య కృత్యమ్ = దూత్యమ్.

అత్యసదృశమ్ : న సదృశమ్ = అసదృశమ్. అత్యంతమసదృశమ్ = అత్యసదృశమ్.

హాస్యతా : హసితుం యోగ్యః = హాస్యః. హాస్యస్య భావః = హాస్యతా.

తద్విధిత్సుభిః : విధాతుమిచ్ఛవః = విధిత్సవః. తస్య విధిత్సవః = తద్విధిత్సవః. తైః = తద్విధిత్సుభిః.

అనౌపయికేన : ఉపాయ ఏవ ఔపయికః. నఔపయికః = అనౌప-
కః. తేన = అనౌపయికేన.

**భావము :**

కావున ఓ దేవతలారా ప్రసన్నులు కలడు. నాకీ కష్టము నీయకుండ ఈ దూత్యము నా కన్ని విధముల తగినది గాదు. ఉపాయములేక దూత్యమునుం జేయువారు పరిహాసమునుం బొందెదరు. కాని ప్రయోజనమునుం బొందలేరు. అనుచితమైన కార్యములకు పూనుకొనువారు ననిష్టమునే పొందెదరు కాని ఫలమునుం బొందలేరు. ॥౧౧౫॥

శ్లో॥ ఈదృశాని గదితాని తాదానీ
మాకలయ్య స నలస్య బలారిః।
శంసతి స్మ కిమపి స్మయమాన
స్స్వానుగాననవిలోకనలోలః॥ ౧౧౬

ప॥వి॥ ఈదృశాని । గదితాని । తదానీమ్ । ఆకలయ్య । సః। నలస్య । బలారిః । శంసతి । స్మ । కిమ్ । అపి । స్మయమానః । స్వానుగాననవిలోకనలోలః.

టీక॥ సః = ఆ, బలారిః = ఇంద్రుండు, తదానీం = అప్పుడు, నలస్య = నలుయొక్క, ఈదృశాని = ఇటువంటి, గదితాని = మాటలను, ఆకలయ్య = విని, స్మయమానః = మందహాసము గావించుచు, స్వానుగాననవిలోకలోలః; స్వానుగ = తన కనుచరులైన యమాదులయొక్క, ఆనన = ముఖములను, విలోకన = చూచుటయందు, లోలః = ఆసక్తి గలవాండై కిమపి = కొద్ది మాటను, శంసతిస్మ = చెప్పుచుండెను.

**సమాసములు :**

బలారిః : బలస్య అరిః = బలారిః.

స్వానుగాననవిలోకనలోలః : స్వస్య అనుగాః = స్వానుగాః. స్వానుగానామాననాని = స్వానుగాననాని. స్వానుగాననానాం విలోకనం = స్వానుగాననవిలోకనం. స్వానుగాననవిలోకనే లోలః = స్వానుగాననవిలోకనలోలః.

**భావము :**

ఆ యింద్రుఁడు నలుఁడు చెప్పిన మాటల నాలకించి, చిఱునగవుతో, తన యనుచరులైనయమాదులయొక్క ముఖములను చూచుచు, కొన్ని మాటలనుఁ జెప్ప నారంభించెను. ॥౧౧౬॥

శ్లో॥ నాభ్యధాయి నృపతే భవతేదం
రోహిణీరమణవంశభవేన।
లజ్జతే న రసనా తవ వామ్యా
దర్థిషు స్వయమురీకృతకామ్యా॥ ౧౧౭

ప॥వి॥ న । అభ్యధాయి । నృపతే । భవతా । ఇదం । రోహిణీరమణవంశభవేన । లజ్జతే । న । రసనా । తవ । వామ్యాత్ । అర్థిషు । స్వయమురీకృతకామ్యా.

టీక॥ హేనృపతే = ఓ రాజా! భవతా = నీచే, ఇదం = ఈ ''సేయముచ్చతరతే'' త్యాది శ్లోకములలోని ప్రతిషేధవచనము, రోహిణీరమణవంశభవేన; రోహిణీరమణ = రోహిణికి ప్రియుఁడైన చంద్రునియొక్క, వంశ = వంశమందు, భవేన = జన్మించిన వానివలె, నాభ్యధాయి = చెప్పఁబడలేదు. ఏలయనగా, అర్థిషు = యాచకుల విషయమున, స్వయమురీకృతకామ్యా; స్వయం = తమంతట, ఉరీకృత = అంగీకరింపఁబడిన, కామ్యా = కోరికను నెరవేర్చుట గల్గిన, రసనా = నాలుక, వామ్యాత్ = వెనుకకుఁ దిరుగుటవలన, నలజ్జతే = సిగ్గుపడుటలేదు.

**సమాసములు :**

(హే) నృపతే : నౄన్ పాతీతి = నృపతిః. తస్య సంబుద్ధిః = (హే) నృపతే.

*రోహిణీరమణవంశభవేన :* రోహిణ్యాః రమణః = రోహిణీరమణః. రోహిణీరమణస్య వంశః = రోహిణీరమణవంశః. రోహిణీరమణవంశే భవతీతి = రోహిణీరమణవంశభవః. తేన = రోహిణీరమణవంశభవేన.

స్వయమురీకృతకామ్యా : స్వయమురీకృతం = స్వయమురీకృతం. స్వయమురీకృతం కామ్యం యయా సా = స్వయమురీకృతకామ్యా.

**భావము :**

నీవు ''సేయముచ్చతరతా'' యను ౨౪వ శ్లోకమునుండి మేము నిన్ను ప్రార్థించిన దూత్యమును జేయనని చెప్పితివి. నీవు దీనిని చంద్రవంశమున బుట్టిన వానివలెఁ జెప్పలేదు. చంద్రవంశస్థులెవ్వరు ప్రతిజ్ఞకు భంగము జేసి కొనరు. యాచకుల మనోరథమునుఁ బూర్తిగావించెదనని తొలుత నంగీకరించి యిప్పుడు వెనుతిరిగిన నీ నాలుక సిగ్గు పడుట లేదా! కావున నీవుచంద్రవంశ స్థుఁడుగాఁ గనఁబడుటలేదు. ॥౧౧౭॥

శ్లో॥ భంగురం చ వితథం న కథం వా
జీవలోకమవలోకయసీమమ్।
యేన ధర్మయశసీ పరిహాతుం
ధీరహో చలతి ధీర తవాఽపి॥ ౧౧౮

ప॥వి॥ భంగురం । చ । వితథం । న । కథం । వా । జీవలోకమ్ । అవలోకయసి । ఇమమ్ । యేన । ధర్మయశసీ । పరిహాతుం । ధీః । అహో । చలతి । ధీర । తవ । అపి.

టీక॥ హేధీర = ఓ విద్వాంసుఁడా! ఇమం = ఈ, జీవలోకం = ప్రాణులసమూహమును, భంగురం = నశించునదిగాను, వితథం = నిష్ఫలమైనదిగాను, కథంవా = ఎట్లు, నాఽవలోకయసి = చూచుటలేదు? యేన = ఏ అజ్ఞానముచే, తవాఽపి = నీకును, ధీః = బుద్ధి, ధర్మయశసీ = ధర్మమును కీర్తిని, పరిహాతుం = వదలి పెట్టుటకు, చలతి = చలించుచున్నది.

**సమాసములు :**

*జీవలోకః :* జీవానాం లోకః = జీవలోకః. తమ్ = జీవలోకమ్.

*ధర్మయశసీ :* ధర్మశ్చ యశశ్చ = ధర్మయశసీ. తే = ధర్మయశసీ.

**భావము :**

ఓ విద్వాంసుఁడా! ఈ ప్రాణి లోకమంతయు నశించునది, నిష్ఫల

మైనది యని యెట్లు తెలుసుకొనవు? దీనిని నీవు తెలుసుకొనలేక పోవుటవలన, నీ బుద్ధి, శాశ్వతమైన ధర్మమును గీర్తిని వదలు కొనుచున్నది. కష్టము - అస్థిర విషయములకై స్థిరమైన సుకృతమును గీర్తిని వదలుకొనుట నీవంటి వారికిఁ దగుదు. ॥౧౧౮॥

శ్లో॥ కః కులేఽజని జగన్ముకుటే వః
ప్రార్థకేప్సితమపూరి న యేన।
ఇందురాదిరజనిష్ట కలంకీ
కష్టమత్ర స భవానపి మా భూత్॥ ౧౧౯

ప॥వి॥ కః । కులే । అజని । జగన్ముకుటే । వః । ప్రార్థకేప్సితమ్ । అపూరి। న । యేన । ఇందుః । ఆదిః అజనిష్ట । కలంకీ । కష్టమ్ । అత్ర । సః=భవాన్ । అపి । మా । భూత్.

టీక॥ జగన్ముకుటే; జగత్=లోకములకు, ముకుటే=భూషణమైన, వః= మీయొక్క, కులే=వంశమందు, యేన=ఎవనిచే, ప్రార్థకేప్సితమ్; ప్రార్థక=యాచకులయొక్క, ఈప్సితం=ఇష్టము, నాఽపూరి= పూరింపఁబడలేదో, సః=అటువంటి, కః=ఎవ్వఁడు, అజని=పుట్టి నాఁడు. ఆదిః=మీ వంశమునకు మొదటి వాఁడైన, ఇందుః=చం ద్రుఁడు, కలంకీ=కలంకము గలవాఁడుగా, అజనిష్ట = జన్మించెను. కష్టం = కష్టము. అత్ర=ఈ లోకమునందు, భవానపి=నీవును, సః=అట్లు కలంకముగల వాఁడుగా, మాభూత్=కారాదు.

సమాసములు

*జగన్ముకుటే :* జగతాం ముకుటం=జగన్ముకుటం. తస్మిన్=జగన్ము కుటే.

*ప్రార్థకేప్సితమ్ :* ప్రార్థకానామీప్సితం=ప్రార్థకేప్సితమ్.

*కలంకీ :* కలంకః అస్య అస్తీతి=కలంకీ.

భావము:

లోకముల కలంకారమైన మీ వంశమునందు యాచకుల మనోరథమునుఁ బూర్తి కావించని వాఁడెవ్వఁడును లేడు. మీ వంశమునకుమూలపురుషుఁడైన

చంద్రుఁడు కలంకము కలవాఁడగుట కష్టమైన విషయము. కాని నీవీ లోకము-నందు, కలంకములేక యుండుము. అపకీర్తిని సంపాదింపకుము. ॥౧౧౯॥

శ్లో॥ యాఽపదృష్టిరపి యా ముఖముద్రా
యాచమానమను యా చ న తుష్టిః।
త్వాదృశస్య సకలః స కలంకః
శీతభాసి శశకః పరమంకః॥ ౧౨౦

ప॥వి॥ యా । అపదృష్టిః । అపి । యా । ముఖముద్రా । యాచమానమ్ । అను । యా । చ । న । తుష్టిః । త్వాదృశస్య । సకలః । సః । కలంకః । శీతభాసి । శశకః । పరమ్ । అంకః.

టీక॥ త్వాదృశస్య = నీవంటి వానికి, యాచమానమను = యాచకుననుసరించి, యా = ఏ, అపదృష్టిః = వికారముతోఁ గూడిన చూపు, యాచ = ఏ, ముఖముద్రా = మౌనము, యా = ఏ, నతుష్టిః = సంతోషము లేకయుండుట, సః = ఆ, సకలః = అంతయు, కలంకః = కలంకము. శీతభాసి = చంద్రుని యందో, శశకః = కుందేలు, అంకః పరం = గుఱుతు మాత్రమే.

**సమాసములు :**

అపదృష్టిః : అపగతా దృష్టిః = అపదృష్టిః.
ముఖముద్రా : ముఖస్య ముద్రా = ముఖముద్రా.
శీతభాసి : శీతా భాః యస్య సః = శీతభాః. తస్మిన్ = శీతభాసి.

**భావము :**

నీవంటి యుత్తమ వంశస్థునకు, యాచకునిపైన, వికారదృష్టి, అతని విషయమున మౌనము, మఱియు నసంతోషము మున్నగునది యంతయు వాస్తవమున కలంకమని చెప్పవలయును. చంద్రుని యందలి కుందేలు కేవలము గుఱుతుకాని కళంకము కాదు. ॥౧౨౦॥

శ్లో॥ నాఽక్షరాణి పఠతా కిమపాఠి
ప్రస్మృతః కిమథవా పఠితోఽపి।

ఇత్థమర్థిజనసంశయదోలా
ఖేలనం ఖలు చకార నకారః॥ ౧-౨౧

ప॥వి॥ న । అక్షరాణి । పఠతా । కిమ్ । అపాఠి । ప్రస్మృతః । కిమ్। అథ। వా । పఠితః । అపి । ఇత్థమ్ । అర్థిజనసంశయదోలాఖేలనమ్ । ఖలు। చకార । నకారః.

టీక॥ అక్షరాణి = బాల్యము నందక్షరములను, పఠతా = నేర్చుకొనుచున్న, (భవతా = నీచే), నకారః = నిషేధమునుఁ జెప్పునట్టి నకారము, నాఽపాఠికిమ్ = పఠింపఁబడలేదా? అథవా = లేదా, పఠితోఽపి = పఠింపఁబడినను, ప్రస్మృతఃకిం = మఱువఁబడినదా యేమి?, ఇత్థం = ఇట్లు, అర్థిజనసంశయదోలా ఖేలనం; అర్థిజన = యాచకజనముయొక్క, సంశయ = సందేహమను, దోలా = ఊయెలతో, ఖేలనం = ఆడుటను, నకారః = నకారము, చకార = చేసెను.

వి॥ నలుఁడు చిన్నతనమునందు నకారమును నేర్చెనా, లేదా యను సంశయము యొక్క సంబంధము లేకపోయినను సంబంధమునుఁ జెప్పుట వలన సంబంధాతిశయోక్తి.

**సమాసములు :**

*అర్థిజనసంశయదోలాఖేలనమ్ :* అర్థినశ్చతే జనాశ్చ = అర్థిజనాః. అర్థిజనానాం సంశయః = అర్థిజనసంశయః. అర్థిజనసంశయ ఏవ దోలా = అర్థిజనసంశయదోలా. అర్థిజనసంశయదోలయా ఖేలనమ్ = అర్థిజనసంశయదోలాఖేలనమ్.

**భావము :**

బాల్యమున నీవు అక్షరములను నేర్చునపుడు "లేదు'' అను నర్థము చెప్పెడి "న" యను నక్షరమును నేర్చుకొనలేదా! ఒకవేళ నేర్చియు దానిని మఱచితివా? ఇట్లు యాచకులను సందేహమనెడి యూయెలయందుంచి ''నకారము" ఊచుచున్నది. అనగా నీవెప్పుడును యాచకులు గోరిన దానిని లేదని -న- శబ్దముతో నిరాకరింపలేదు. కావున నీవు 'న' అను వర్ణమును నేర్చుకొన

లేదో; లేక నేర్చి మఱచితివో యని యాచకులకు సందేహము గల్గుచున్నది. నీ వెల్లప్పుడును నెవ్వరికిని లేదని చెప్పలేదు. కావున మా విషయమునఁ గూడ లేదని చెప్పక మా కోరికనుఁ దీర్చవలసినది. ॥౧౨౧॥

శ్లో॥ అబ్రవీత్తమనలః క్వ నలేదం
లబ్ధముజ్ఝసి యశః శశికల్పం।
కల్పవృక్షపతిమర్థినమేనం
నాప కోఽపి శతమన్యుమిహాన్యః॥ ౧౨౨

ప॥వి॥ అబ్రవీత్ । తమ్ । అనలః । క్వ । నల । ఇదం । లబ్ధమ్ । ఉజ్ఝసి । యశః । శశికల్పమ్ । కల్పవృక్షపతిమ్ । అర్థినమ్ । ఏనమ్ । న । ఆప । కః । అపి । శతమన్యుమ్ । ఇహ । అన్యః.

టీక॥ అథ = తర్వాత, అనలః = అగ్ని, తం = ఆ నలునిఁగూర్చి, అబ్రవీత్ = పలికెను. హేనల = ఓ నలా, ఇదం = ఈ, చెప్పఁబడగల, లబ్ధమ్ = చేతికందిన, శశికల్పం = చంద్రునితో సమానమైన, యశః = కీర్తిని, క్వ = ఎక్కడ, ఉజ్ఝసి = వదలుకొనెదవు? ఇహ = ఈ లోకమునందు, అన్యః = నీకంటె నితరుఁడైన, కోఽపి = ఎవ్వఁడును, కల్పవృక్షపతిమ్ = కల్పవృక్షములకుఁ బాలకుఁడైన, ఏనం = ఈ, శతమన్యుం = ఇంద్రుని, అర్థినం = యాచకునిగా, నాప = పొందలేదు.

## సమాసములు :

*శశికల్పమ్ : శశినా సదృశమ్ = శశికల్పమ్. తత్ = శశికల్పమ్.*

## భావము :

ఓనలా! చేతికందిన చంద్రునివంటి తెల్లని కీర్తినేల వదలుకొనుచున్నావు? లోకమునందంతటి కోరికల నీడేర్చునట్టి కల్పవృక్షములకు ప్రభువైన యింద్రుఁడెవ్వరిని యాచించువాఁడు గాడు. అట్టి యింద్రుఁడు నీకు యాచకుఁడై యున్నాఁడు. అతని కోరికనుఁ దీర్చుము. ఇంద్రుఁడు నీకు యాచకుఁడగుటవలన నీకు గొప్ప కీర్తి లభించుచున్నది. ఆ కీర్తిని జారవిడుచుకొనవలదని యగ్ని నలునకుఁ జెప్పెను. ॥౧౨౨॥

శ్లో॥ న వ్యహన్యత కదాఽపి ముదం యః
స్వస్సదాముపనయన్నభిలాషః।
తత్పదే త్వదభిషేకత్కృతాం నః
స త్యజత్వసమతామదమద్య॥ ౧-౨౩

ప॥వి॥ న । వ్యహన్యత । కదా । అపి । ముదం । యః । స్వస్సదామ్ । ఉప నయన్ । అభిలాషః । తత్పదే । త్వదభిషేకకృతాం । నః । సః । త్యజతు । అసమతామదమ్ । అద్య.

టీక॥ స్వస్సదాం = స్వర్గలోకవాసులకు సంబంధించిన, యః = ఏ, అభిలాషః = మనోరథము, ముదం = సంతోషమును, ఉపనయన్ = పొందించుచు, కదాఽపి = ఎప్పుడు, నవ్యహన్యత = భంగమును పొందింపఁబడలేదు. అద్య = ఇప్పుడు, తత్పదే = ఆ మనోరథమును నెరవేర్చునట్టి యధికారమునందు, త్వదభిషేకకృతామ్; త్వత్ = నీయొక్క, అభిషేక = అభిషేకమును, కృతాం = చేసినట్టి, నః = మాయొక్క, సః = ఆ యభిలాష, అసమతామదం = తనకు సాటి లేదను మదమును, త్యజతు = వదలును గాత.

## సమాసములు :

స్వస్సదామ్ : స్వః సీదంతీతి = స్వస్సదః. తేషాం = స్వస్సదామ్.

తత్పదే : తస్య పదమ్ = తత్పదమ్. తస్మిన్ = తత్పదే.

త్వదభిషేకకృతామ్ : తవ అభిషేకః = త్వదభిషేకః. త్వదభిషేకం కుర్వంతీతి = త్వదభిషేకకృతః. తేషాం = త్వదభిషేకకృతామ్.

అసమతామదమ్ : సమస్య భావః = సమతా. న సమతా = అసమతా. అసమతాయాః మదః = అసమతామదః. తమ్ = అసమతామదమ్.

## భావము :

స్వర్గలోకవాసుల యభిలాష, సిద్ధించుటచే సంతోషముఁ గల్గించుచు

నెప్పుడును విఫలము కాలేదు. ప్రస్తుతము మా కోర్కెను తీర్చుటకై యా యభిలాష స్థానమున నిన్ను నభిషేకము గావించిన మాకు, నీవు మా మనోరథమును దీర్చుటచేత నా యభిలాష, తాను సాటిలేని దానసను గర్వము వదలిపెట్టును గాత. స్వర్గలోకవాసుల మనోరథములు తమ యంతటనే విఘ్నములేక సిద్ధించును. అందువలన నా మనోరథములు సాటిలేనివని గర్వించుచున్నవి. అనగా నా మనోరథము సిద్ధించుటకు పరాపేక్షలేదను గర్వము వాని కేర్పడియున్నది. ప్రకృతము దమయంతీ విషయము నందేర్పడిన మా మనోరథము నీ సహకారములేక సిద్ధింపదు గాన, నవిగూడ పరాపేక్షము లగుటవలన వాని గర్వము దీనితో నశించును. కాన నీవు దూత్యమును వహించుటచే వాని గర్వమును దొలిగింపవలయునని భావము. ॥౧-౨౩॥

శ్లో॥ అబ్రవీదథ యమస్తమహృష్టం
వీరసేనకులదీప తమస్త్వామ్।
యత్కిమప్యభిబుభూషతి తత్కిం
చంద్రవంశవసతేస్సదృశం తే॥ ౧-౨౪

ప॥వి॥ అబ్రవీత్ । అథ । యమః । తమ్ । అహృష్టమ్ । వీరసేనకులదీప । తమః । త్వామ్ । యత్ । కిమ్ । అపి । అభిబుభూషతి । తత్ । కిం। చంద్రవంశవసతేః । సదృశం । తే.

టీక॥ అథ = పిదప, యమః = యముఁడు, అహృష్టం = సంతోషములేని, నలం = నలుని, అబ్రవీత్ = పలికెను. హేవీరసేనకులదీప = ఓ వీరసేన వంశదీపమా! యత్ = ఏ, కిమపి = ఏదియోయొక, తమః = మోహము, చీకటి, త్వాం = నిన్ను, అభిబుభూషతి = తిరస్కరింపగోరుచున్నదో, తత్ = అది, చంద్రవంశవసతేః; చంద్రవంశ = చంద్రవంశమునందు, వసతేః = స్థితిగల్గిన, తే = నీకు, సదృశం కిం = తగినదా యేమి?

## సమాసములు:

అహృష్టం : న హృష్టః = అహృష్టః. తమ్ = అహృష్టమ్.

(హే) వీరసేనకులదీప : వీరసేనస్యకులం = వీరసేనకులమ్. వీరసేనకులస్య దీపః = వీరసేనకులదీపః. తస్య సంబుద్ధిః = (హే)వీరసేనకులదీప.

చంద్రవంశవసతేః : చంద్రస్య వంశః = చంద్రవంశః. చంద్రవంశే వసతిః యస్య సః = చంద్రవంశవసతిః. తస్య = చంద్రవంశవసతేః.

**భావము :**

అగ్ని చెప్పిన మాటలకు నలుఁడు సంతోషపడలేదు. దానినిఁ జూచి యముఁడిట్లు చెప్పఁదొడగెను-ఓ వీరసేన వంశమున దీపమువంటి నలమహా రాజా! నిన్నేదియో యొక మోహము (అంధకారము) అలముకొనుచున్నది. చంద్రవంశమున జన్మించిన నీకిది తగినదేనా? ॥౧౦౪॥

శ్లో॥ రోహణః కిమపి యః కఠినానాం
కామధేనురపి యా పశురేవ।
నైనయోరపి వృథాఽభవదర్థీ
హా విధిత్సురసి వత్స కిమేతత్॥ ౧౦౫

ప॥వి॥ రోహణః । కిమ్ । అపి । కఠినానాం । కామధేనుః । అపి । యా । పశుః । ఏవ । న । ఏనయోః । అపి । వృథా । అభవత్ । అర్థీ । హా । విధిత్సుః । అసి । వత్స । కిమ్ । ఏతత్

టీక॥ యః = ఏ, రోహణః = రత్నములకు గనియైన రోహణపర్వతముగలదో, (సోఽపి = అదియు), కఠినానాం = కఠినమైన వాని మధ్య, కిమపి (కఠినం) = మిక్కిలి కఠినము. యా = ఏ, కామధేనురపి = కామధేనువు గలదో, సాఽపి = అదియు, పశురేవ = పశువే. ఏనయోః = పర్వతమునకును పశువునకును, అర్థీ = యాచకుఁడు. వృథా = వ్యర్థుఁడు, నాఽభవత్ = కాలేదు. హేవత్స = ఓ బిడ్డా!, ఏతత్ = దీనిని, కిం = ఏమి, విధిత్సుః = చేయఁగోరినవాఁడుగా, అసి = ఉంటివ్నావు. హా = కష్టము.

**సమాసములు :**

విధిత్సుః : విధాతుమిచ్ఛుః = విధిత్సుః.

**భావము :**

రోహణ పర్వతము కఠినవస్తువులలో మిక్కిలి కఠినమైన పాషాణము. కామధేనువు పశువు. ఇట్టి పాషాణపశువులను యాచించిన వారెవ్వరు వ్యర్థులు

కాలేదు. కాన చిన్నవాఁడవైన నలా! ఏమి చేయఁగోరుచున్నావు. పశువున కంటెను, పాషాణము కంటెను నీవు హీనుఁడవు. ॥౧౨౩॥

శ్లో॥ యాచితశ్చిరయతి క్వ ను ధీరః
ప్రాణనే క్షణమపి ప్రతిభూః కః।
శంసతి ద్వినయనీ దృఢనిద్రాం
ద్రాఙ్నిమేషమిషఘూర్ణనపూర్ణా॥ ౧౨౪

ప॥వి॥ యాచితః । చిరయతి । క్వ । ను । ధీరః । ప్రాణనే । క్షణమ్ । అపి । ప్రతిభూః । కః । శంసతి । ద్వినయనీ । దృఢనిద్రాం । ద్రాఙ్నిమేష మిషఘూర్ణనపూర్ణా.

టీక॥ క్వను=ఎక్కడ, ధీరః=పండితుఁడు, యాచితస్సన్ = యాచింపఁ బడినవాఁడగుచు, చిరయతి=ఆలస్యమును గావించును? క్షణమపి=క్షణ కాలముగూడ, ప్రాణనే=జీవింపఁజేయుటయందు, ప్రతిభూః=బాధ్య తను వహించినవాఁడు, కః=ఎవ్వఁడు? ద్రాఙ్నిమేషమిషఘూర్ణనపూర్ణా; ద్రాక్ =శీఘ్రమైన, నిమేష=రెప్పపాట్లయొక్క, మిష=వ్యాజముచే, ఘూర్ణన=కంటిపాపను త్రిప్పుటవలన, పూర్ణా=సమాప్తినిఁ బొందిన, ద్వినయనీ=కన్నులజంట, దృఢనిద్రాం=మరణమును, శంసతి= చెప్పుచున్నది.

## సమాసములు :

ద్వినయనీ : ద్వయోః నయనయోః సమాహారః=ద్వినయనీ.

దృఢనిద్రాం : దృఢా చ సా నిద్రా చ=దృఢనిద్రా. తామ్=దృఢ నిద్రామ్.

ద్రాఙ్నిమేషమిషఘూర్ణనపూర్ణా : ద్రాక్ నిమేషః = ద్రాఙ్నిమేషః. ద్రాఙ్నిమేషస్య మిషః= ద్రాఙ్నిమేషమిషః. ద్రాఙ్నిమేషమిషేణ ఘూర్ణనం= ద్రాఙ్నిమేషమిషఘూర్ణనమ్. ద్రాఙ్నిమేషమిషఘూర్ణనేన పూర్ణా=ద్రాఙ్నిమేష మిషఘూర్ణనపూర్ణా.

**భావము :**

బుద్ధిమంతుని యాచించినచో నతఁడెక్కడ నాలస్యముచేయును? అతఁడు వెంటనే కోరికను తీర్చఁగలఁడు. ఏలయనగా, శీఘ్రమగు తెప్పపాట్లనునెపమున, కంటిపాపలు తిరుగుటతో సమాప్తినొందిన కన్నులు రెండే మరణమునుఁజెప్పు చున్నది. అనగా కన్నులు తిరుగుట యెంత క్షణికమో జీవితము గూడ నంత క్షణికమే. కావున మన జీవితము శాశ్వతముకాదు. కాన యాచించిన వెంటనే ధర్మమునుఁ జేయవలయును. ॥౧౨౬॥

శ్లో॥ అభ్రపుష్పమపి దిత్సతి శీతం
సార్థినా విముఖతా యదభాజి।
స్తోకకస్య ఖలు చంచుపుటేన
మ్లానిరుల్లసతి తద్ఘనసంఘే॥ ౧౨౭

ప॥ వి॥ అభ్రపుష్పమ్ । అపి । దిత్సతి । శీతం । సా । అర్థినా । విముఖతా యత్ । అభాజి । స్తోకకస్య। ఖలు। చంచుపుటేన । మ్లానిః । ఉల్లసతి । తద్ఘనసంఘే.

టీక॥ శీతం=చల్లని, అభ్రపుష్పం=ఉదకము, అనగా నభ్రపుష్పమను గగన పుష్పము, దిత్సతి= ఈయఁగోరిన. ఘనసంఘే = మేఘసమూహాము నందు, అర్థినా=యాచకునిచే, స్తోకకస్య=చాతకపక్షియొక్క, చంచు పుటేన=ముక్కుపుటముతో, సా=ప్రసిద్ధమైన, విముఖతా=పక్షిముఖ ముగానుండుట, (విముఖమగుట యనునది) అభాజి ఇతియత్ = పొంద బడుట యనునది) యేదిగలదో, తత్ = అందువలన, మ్లానిః = జల భారమువలని యలసత్వము, వన్నెమార్పు, ఉల్లసతి = ప్రకాశించు చున్నది.

**సమాసములు :**

*అభ్రపుష్పమ్ :* అభ్రస్య పుష్పమ్ = అభ్రపుష్పమ్. తత్ = అభ్ర పుష్పమ్.

*దిత్సతి :* దాతుమిచ్ఛన్=దిత్సన్. తస్మిన్=దిత్సతి.

విముఖతా: విపరీతం ముఖం = యస్య సః విముఖః. విముఖస్య భావః = విముఖతా. వేః ముఖం యస్యసః = విముఖః, విముఖస్య భావః = విముఖతా.

చంచుపుటేన : చంచ్వోః పుటః = చంచుపుటః. తేన = చంచుపుటేన.

ఘనసంఘే : ఘనానాం సంఘః = ఘనసంఘః. తస్మిన్ = ఘనసంఘే.

**భావము :**

చల్లని మేఘోదకము గగనకుసుమమువలె దుర్లభమైనది. దానిని మేఘసంఘమీయఁగోరినను, యాచకమైన చాతకపక్షియొక్క ముక్కుపుటము విముఖత్వమును (పక్షిముఖత్వమును) బొందుటచే, మేఘములలో గ్లాని (జలభావముచేత నాలస్యము, జలమును వహించుటవలన నలుపువన్నె) ఏర్పడుచున్నది గదా. ఇచ్చటకు మేఘములు సిద్ధముగానున్నను చాతక చంచుపుటము వైముఖ్యమగుటచే (పక్షిముఖత్వమును వహించుటచే) దాతృత్వము వహించిన మేఘములలో కళంకముగల్గినది. ఇట్లు తామిచ్చినది పుచ్చుకొననందువలనఁ గొఱతవడు దాతలే యున్నప్పుడు, గొప్పవంశమునందు జన్మించిన నీవు యాచకులకు విముఖుఁడై యుండుట తగదు. ॥౧౨౭॥

శ్లో॥ ఊచివానుచితమక్షరమేనం
పాశపాణిరపి పాణిముదస్య।
కీర్తిరేవ భవతాం ప్రియదారా
దాననీరఝురమౌక్తికహారా॥

౧౨౮

ప॥వి॥ ఊచివాన్ । ఉచితమ్ । అక్షరమ్ । ఏనం । పాశపాణిః । అపి । పాణిమ్ । ఉదస్య । కీర్తిః । ఏవ । భవతాం । ప్రియదారాః । దాననీరఝురమౌక్తికహారా.

టీక॥ పాశపాణిరపి = వరుణుఁడును, పాణిం = హస్తమును, ఉదస్య = ఎత్తి, ఏనం = ఈ నలునిగూర్చి, ఉచితం = యుక్తమైన, అక్షరం = మాటను, ఊచివాన్ = చెప్పెను. దాననీరఝురమౌక్తిక హారా; దాననీర = దానోదకముయొక్క, ఝుర = ప్రవాహమనెడు, మౌక్తిక హారా = ముత్తెముల హారము గల్గిన, కీర్తిరేవ = కీర్తియే, భవతాం = మీకు, ప్రియదారాః = ప్రియకళత్రము.

వి॥ కీర్తికి ప్రియదారలతో నభేదమున ధ్యవసించుటవలన నభేదరూపకా లంకారము.

## సమాసములు :

పాశఃపాణౌ యస్య సః = పాశపాణిః.

ప్రియదారాః : ప్రియాశ్చ తే దారాశ్చ = ప్రియదారాః.

*దాననీరఝరమౌక్తికహారాః* : దానస్య నీరం = దాననీరం. దాననీరస్య ఝరాః = దాననీరఝరాః. దాననీరఝరా ఏవ మౌక్తికాని = దాననీరఝరమౌక్తికాని. దాననీరఝరమౌక్తికమయః హారః యస్యాస్సా = దాననీరఝుమౌక్తికహారా.

## భావము :

వరుణుఁడు నలుని గూర్చియిట్లుచెప్పెను. ఓనలా! దానోదకములనెడి ముత్తెములహారమును దాల్చిన కీర్తియే నీకు ప్రియమైన కళత్రము. ఉదక పూర్వముగా దానము చేయవలయునని విధిగలదు. కాన దానముఁ జేయుటవలన వరించిన కీర్తికాంతకు నా దానోదకములు ముక్తాహారములగును. అట్టి కీర్తికాంత భార్యకంటెనుఁ బ్రియమైనదిగాన దమయంతిపైనఁగల్గిన కాంక్షచే నాకీర్తికాంతను వదలుకొనకుము. ॥౧౨౮॥

శ్లో॥ చర్మ వర్మ కిల యస్య న భేద్యం
యస్య వజ్రమయమస్థి చ తౌ చేత్।
స్థాయినావిహ న కర్ణదధీచీ
తన్న ధర్మమవధీరయ ధీర॥ ౧౨౯

ప॥వి॥ చర్మ । వర్మ । కిల। యస్య । న । భేద్యం । యస్య। వజ్రమయమ్ । అస్థి । చ । తౌ । చేత్ । స్థాయినౌ । ఇహ । న । కర్ణదధీచీ । తత్ । న । ధర్మమ్ । అవధారయ । ధీర.

టీక॥ యస్య = ఏకర్ణునకు, చర్మ = చర్మము, నభేద్యం = భేదింపనలవికాని, వర్మకిల = కవచముగదా! యస్య = ఏదధీచికి, అస్థిచ = ఎమ్ముకను, వజ్రమయంకిల = వజ్రరూపమే గదా! తౌ = ఆ, కర్ణదధీచీ = కర్ణుఁడును,

దధీచియు ఇహ = ఈ లోకమునందు, స్థాయినౌ = స్థిరమైన వారలుగా, నచేత్ = కానిచో, తత్ = అప్పుడు, హేధీర = ఓ బుద్ధిమంతుఁడా! ధర్మమ్ = ధర్మమును, నావధీరయ = తిరస్కరింపకుము.

## సమాసములు :

*వజ్రమయమ్ :* వజ్రస్య వికారః = = వజ్రమయమ్.

*కర్ణదధీచీ :* కర్ణశ్చ దధీచిశ్చ = కర్ణదధీచీ.

## భావము

ఓనలా! కర్ణుఁడు ధరించిన చర్మమభేద్యమైన కవచముగదా. దాని నతఁ డింద్రునకీయలేదా! దధీచి తన వెన్నెముకను వజ్రాయుధమునకై యింద్రుని కీయలేదా? అంతఁ బ్రసిద్ధినొందిన, కర్ణుఁడును, దధీచియు, స్థిరముగా నీలోక మందులేరు. వారు గావించిన ధర్మముమాత్రము స్థిరముగా నున్నది. కావున నీవు వారిని నుదాహరణముఁ గావించుకొని యస్థిరమైన దమయంతిని వదలుకొని స్థిరమైన ధర్మమునుఁ జేయుము. ॥౧౨౯॥

శ్లో॥ అద్య యావదపి యేన నిబద్ధౌ
న ప్రభూ విచలితుం బలివింధ్యౌ।
ఆశ్రుతావితథతాగుణపాశ
స్త్వాదృశేన విదుషా దురవాపః॥ ౧౩౦

ప॥వి॥ అద్య । యావత్ । అపి । యేన । నిబద్ధౌ । న । ప్రభూ । విచలితుం । బలివింధ్యౌ । ఆశ్రుతాఽవితథతాగుణపాశః । త్వాదృశేన । విదుషా । దురవాపః.

టీక॥ యేన = ఏ సత్యసంధత్వమనుత్రాటిచే, నిబద్ధౌ = కట్టఁబడిన, బలివింధ్యౌ = బలిచక్రవర్తియు, వింధ్యపర్వతమును నను నీ రెండును, అద్యయావత్ = నేటివరకు, విచలితుమపి = కదలుటకును, ప్రభూ = శక్తివంతులుగ, న = కరో, ఆశ్రుతాఽవితథతాగుణపాశః; ఆశ్రుత = ప్రతిజ్ఞ చేయఁబడిన, అవితథతా = సత్యత్వమను, గుణ = ఉత్కృష్టధర్మమే,

పాంశః = బంధము, త్వాదృశేన = నీవంటి, విదుషా = పండితునిచే, దురవాపః = ఛేదింప శక్యముఁగాదు.

**సమాసములు :**

*బలివింధ్యౌ :* బలిశ్చ వింధ్యశ్చ = బలివింధ్యౌ.

*ఆశ్రుతాఽవితథతాగుణపాశః :* అవితథస్య భావః = అవితథతా. ఆశ్రుతస్య అవితథతా = ఆశ్రుతావితథతా. ఆశ్రుతాఽవితథతైవ గుణః = ఆశ్రుతావితథతాగుణః. ఆశ్రుతావితథతాగుణ ఏవ పాశః = ఆశ్రుతావితథతాగుణపాశః.

*దురవాపః :* దుఃఖేన అవాప్తుం శక్యః = దురవాపః.

**భావము :**

ఓ నలా! బలిచక్రవర్తి వామనునకు మూడడుగులనేల నిచ్చెదనని ప్రతిజ్ఞగావించి యా ప్రతిజ్ఞను రక్షించుకొని పాతాళమునకుఁ బోయెను. వింధ్యపర్వతము సూర్యచంద్రాదుల మార్గమున కవరోధముగల్గునట్లు పెరిగి కడపట నగస్త్యమహర్షికి దక్షిణ దిక్కునకు మార్గమిచ్చి తానుమఱల తిరిగి వచ్చునంతవరకు పూర్వపుటౌన్నత్యమునుఁ దగ్గించుకొని యుండవలయునని కోరగానట్లే మాటనిచ్చి తన మాటకు కట్టుబడియే యున్నది. కాన బలిచక్రవర్తియు వింధ్యగిరియు, సత్యసంధత్వమను పాశముచే బంధింపఁబడి నేటికిని చలింపక యున్నప్పుడు పండితుఁడవైన నీవు దీనినెట్లు ఛేదింపగలవు. కాన నీవును దీనికి బద్ధుఁడవై యుండవలయును. కావున నీవు ప్రతిజ్ఞచేసిన విధముగా దూత్యమును నిర్వహింపవలయును. ॥౧౩౦॥

**శ్లో॥** ప్రేయసీ జితసుధాంశుముఖశ్రీః
యా న ముంచతి దిగంతగతాఽపి।
భంగిసంగమకురంగదృగర్థే
కః కదర్థయతి తామపికీర్తిమ్॥ ౧౩౧

ప॥వి॥ ప్రేయసీ । జితసుధాంశుముఖశ్రీః । యా । న। ముంచతి । దిగంతగతా। అపి । భంగిసంగమకురంగదృగర్థే । కః । కదర్థయతి । తామ్ । అపి। కీర్తిమ్.

టీక॥ ప్రేయసీ = మిక్కిలి ప్రియమైనదియు, జితసుధాంశుముఖశ్రీః; జిత = జయింపఁబడిన, సుధాంశు = చంద్రుఁడు, ముఖ = మొదలుగా గలవారి యొక్క, శ్రీః = శోభగలదియును, జితసుధాంశు = జయింపఁబడిన చంద్రుఁడుగల, ముఖశ్రీః = వదనశోభగలదియునగు, యా = ఏ, కీర్తిః = కీర్తి, దిగంతగతాఽపి; దిగంత = దిక్కుల యంచులను, గతా ఽపి = పొందియు, నముంచతి = విడచిపెట్టదో, తాం = అటువంటి, కీర్తి మపి = కీర్తినిఁగూడ, భంగిసంగమకురంగదృగర్థే; భంగి = భంగముఁ బొందెడు, అనగా శాశ్వతముగాని, సంగమ = సంబంధముగల్గిన, కురంగదృక్ = జింకకన్నులవంటి కన్నులు గల్గిన స్త్రీయనెడు, అర్థే = కార్యమందు, కః = ఎవ్వడు, కదర్థయతి = వ్యర్థముఁజేయును.

## సమాసములు :

*జితసుధాంశుముఖశ్రీః :* సుధాంశుః ముఖం యేషాం తే = సుధాంశుముఖాః. సుధాంశుముఖానాం శ్రీః = సుధాంశుముఖశ్రీః. జితా సుధాంశుముఖశ్రీః యయా సా = జితసుధాంశుముఖశ్రీః.

*దిగంతగతా :* దిశామంతాః = దిగంతాః. దిగంతాన్ గతా = దిగంతగతా.

*భంగిసంగమకురంగదృగర్థే :* భంగః అస్య అస్తీతి = భంగీ. భంగీ సంగమః యస్యాస్సా = భంగిసంగమా. కురంగస్యేవ దృశౌ యస్యాస్సా = కురంగదృక్. భంగిసంగమా చ సా కురంగిదృక్చ = భంగిసంగమకురంగదృక్. భంగిసంగమకురంగదృగేవ అర్థః = భంగిసంగమకురంగదృగర్థః. తస్మిన్ = భంగిసంగమకురంగదృగర్థే.

## భావము :

మిక్కిలి ప్రియమైనది కీర్తికాంత. అది చంద్రుఁడు మున్నగు సుందర వస్తువుల శోభను జయించినది. (కాంతపక్షమున) చంద్రుని జయించిన ముఖ శోభ గల్గినది. అట్టి కీర్తి దిక్కుల యంచులకుఁ బోయినను (దేశాంతరములకుఁ బోయినను) వదలిపెట్టదు. అశాశ్వతమైన సంగసౌఖ్యమునిచ్చెడి లేడికంటియగు స్త్రీకొఱకా శాశ్వత కీర్తి నెవ్వఁడు వ్యర్థపఱచుకొనును. అశాశ్వత వస్తువులకై

శాశ్వతవస్తువుల నెవ్వఁడు వదలిపెట్టును? కాన నీవు దమయంతికై ప్రయత్నిం పక, మాకు దూత్యమును నిర్వహింపుము. ॥౧౧౩॥

శ్లో॥ యాన్ వరం ప్రతి పరేఽర్థయితార
స్తేఽపి యం వయమహో స పునస్త్వామ్।
నైవ నః ఖలు మనోరథమాత్రం
శూర పూరయ దిశోఽపి యశోభిః॥ ౧౩౨

ప॥వి॥ యాన్ । వరం । ప్రతి । పరే । అర్థయితారః । తే । అపి । యం । వయమ్ । అహో । సః । పునః । త్వామ్ । న । ఏవ । నః । ఖలు । మనోరథమాత్రం । శూర । పూరయ । దిశః । అపి । యశోభిః.

టీక॥ పరే = ఇతరజనులు, వరంప్రతి = వరములనుఁగూర్చి, యాన్ = ఏ మమ్ములను, అర్థయితారః = యాచింతురో, తే = అట్టి, వయమపి = మేమును యం = ఏ, త్వాం = నిన్ను, అర్థయితారః (స్మః) = యాచించు వారముగా నున్నాము. అహో = ఆశ్చర్యము. సః = అట్టి, త్వంపునః = నీవో, నః = మాయొక్క, మనోరథమాత్రం = మనోరథమునే, నైవపూరయ = పూరింపవలదు. కింతు = మఱేమనగా, హేశూర = ఓశూరుఁడా, యశోభిః = కీర్తులతో, దిశోఽపి = దిక్కులనుఁగూడ, పూరయ = పూరించుము.

**సమాసములు :**

మనోరథమాత్రమ్ : మనోరథ ఏవ మనోరథమాత్రమ్. తత్ = మనోరథమాత్రమ్.

**భావము :**

లోకమునం దితరజనులు వరములచే తమకిష్టములను సంపాదించుటకై మమ్ములనే ప్రార్థించుచున్నారో, అటువంటి మేముఁగూడ నిన్ను యాచించెడివార మైతిమి. ఇది యెంత విపరీతము! కావున నట్టి నీవు మా మనోరథమును మాత్రమే పూరించుట కాక, దిక్కుల నన్నింటిని నీ కీర్తితో నింపుము. ॥౧౩౨॥

శ్లో॥ అర్థితాం త్వయి గతేషు సురేషు
మ్లానదానజనిజోరుయశః(శ్రీః।
అద్య పాండు గగనం సురశాఖీ
కేవలేన కుసుమేన విధత్తామ్॥ ౧౩౩

ప॥వి॥ అర్థితాం । త్వయి । గతేషు । సురేషు । మ్లానదానజనిజోరుయశః(శ్రీః ।
అద్య । పాండు । గగనం। సురశాఖీ । కేవలేన । కుసుమేన । విధ
త్తామ్.

టీక॥ అద్య = ఇప్పుడు, సురశాఖీ = కల్పవృక్షము, సురేషు = దేవతలమైన
మేము, త్వయి = నీ విషయమున, అర్థితాం = యాచకత్వమును,
గతేషుసత్సు = పొందగా, మ్లానదానజనిజోరుయశః(శ్రీః; మ్లాన = యాచ
కులు లేకపోవుటచే వాడు బారిన, దానజ = దానమువలనఁ గల్గిన,
నిజ = తనదైన, ఉరు = గొప్పదైన, యశః(శ్రీః = కీర్తి లక్ష్మిగల్గిన
దగుచు, కేవలేన = కేవలమైన, కుసుమేన = పుష్పముచే, గగనం = ఆకా
శమును, పాండు = శుభ్రముగా, విధత్తామ్ = చేయును గాత.

## సమాసములు:

అర్థితామ్ : అర్థినః భావః = అర్థితా. తామ్ = అర్థితామ్.

మ్లానదానజనిజోరుయశః(శ్రీః : దానేనజాయత ఇతి = దానజా. యశ
సః శ్రీః = యశః(శ్రీః. ఉర్వీ చ సా యశః(శ్రీశ్చ = ఉరుయశశ్శ్రీః. నిజా చ సా
ఉరుయశః శ్రీశ్చ = నిజోరుయశశ్శ్రీః. దానజా చ సా నిజోరుయశశ్శ్రీశ్చ =
దానజనిజోరుయశశ్శ్రీః. మ్లానా దానజనిజోరుయశశ్శ్రీః యస్య సః = మ్లానదాన
జనిజోరుయశశ్శ్రీః.

సురశాఖీ : సురాణాం శాఖీ సురశాఖీ.

## భావము :

నేడు మేము నీ విషయమునయాచకులము కాగనే, కల్పవృక్షము, దాన
ములవలన సంపాదించిన గొప్ప కీర్తి వాడి పోగనే, కేవలము పుష్పములతో

నాకసమును తెల్లఁబఱచును గాత. ఇఁక కల్పవృక్షమునకు దానజన్యమైన కీర్తి దక్కదు గదా? ఎప్పుడు నీవు మావంటి దేవతలకుఁగూడ దాతవైతివో యంతటి తోఁ గల్పవృక్షములకు దానముఁ జేయుపని యుండదు. నీ దాతృత్వముచే దాని దాతృత్వ కీర్తియు నడగి పోవును. ఇంతవరకుఁ దమకంటెను దాతలు లేరని సంపాదించుకొనిన యశస్సుతో కల్పవృక్షము నాకసమును తెల్లఁబరచుచుండె డిది. కాని నేడు నీకు దాతృత్వము సంక్రమించినది గాన నా కల్పవృక్షమున కింతటి వఱకున్న యశస్సుఁ గూడ వాడు బారును. ఇంక నా కల్పవృక్షము తన పూలచేతనే యాకసమునుఁ దెల్లఁబఱచుకొనవలయునే గాని తన యశ స్సుతోఁ దెల్లబరచక పోనిమ్ము. ॥౧౩౩॥.

శ్లో॥ ప్రవసతే భరతారునవైన్యవత్
స్మృతిధృతోఽపి నళ త్వమభీష్టదః।
స్వగమనాఽఫలతాం యది శంకసే
తదఫలం నిఖిలం ఖలు మంగళమ్॥ ౧౩౪

ప॥వి॥ ప్రవసతే । భరతార్జునవైన్యవత్ । స్మృతిధృతః । అపి । నళ। త్వమ్ । అభీష్టదః । స్వగమనాఽఫలతాం। యది। శంకసే । తత్ । అఫలం । నిఖిలం । ఖలు । మంగళమ్.

టీక॥ హేనల = ఓనలా! ప్రవసతే = ప్రయాణముఁజేయువానికొఱకు, భరతార్జున వైన్యవత్; భరత = శకుంతలపుత్రుఁడగుభరతుఁడును, అర్జున = హైహయుఁడును, వైన్యవత్ = పృథుమహారాజుననువీరితో సమానముగా, స్మృతిధృతోఽపి = స్మృతియందు ధరింపఁబడినవాఁడవై, అభీష్టదః = ఇష్టార్థముల నొసంగెడి, త్వం = నీవు, స్వగమనాఫలతాం; స్వ = మా యొక్క, గమన = యాత్రకు, అఫలతాం = నిష్ఫలత్వమును. శంకసే యది = సందేహించువాఁడవైనచో, నిఖిలం = సమస్తమైన, మంగళం = ప్రయాణకాలముననిన్ను స్మరించుటయను మంగళాచరణము, అఫలం ఖలు = నిష్ఫలమగును గదా !

వి॥ ప్రయాణకాలమందు పృథుమహారాజును, హైహయుని, భరతుని, నలుని స్మరించినచో, సర్థసిద్ధియు, మఱల తిరిగి వచ్చుటయు నగునని శాస్త్రము.

## సమాసములు :

భరతార్జునవైన్యవత్ : భరతశ్చ అర్జునశ్చవైన్యశ్చ = భరతార్జున వైన్యాః. భరతార్జునవైన్యైస్తుల్యం = భరతార్జునవైన్యవత్.

స్మృతిధృతః: స్మృత్యాం ధృతః = స్మృతిధృతః.

అభీష్టదః : అభీష్టం దదాతీతి = అభీష్టదః.

స్వాగమనాఫలతామ్ : స్వేషాం గమనం = స్వగమనం. అవిద్యమానం ఫలం యస్య తత్ = అఫలమ్. అఫలస్య భావః = అఫలతా. స్వగమనస్య అఫలతా = స్వగమనాఫలతా. తామ్ = స్వగమనాఽఫలతామ్.

అఫలమ్: అవిద్యమానం ఫలం యస్య తత్ = అఫలమ్.

## భావము :

ఓనలా ! ప్రయాణకాలమందు భరతార్జునవైన్యులతోఁబాటు నలుఁడైన నిన్నుగూడ స్మరింప వలసినదని శాస్త్రవచనము. ఆ శాస్త్రము ననుసరించియే ప్రయాణముఁజేసితిమి. కాని మా ప్రయాణము విఫలమగునని నీవు భావించినచో నిక లోకమున ప్రయాణకాలమున భరతాదులతోఁబాటు నిన్నును స్మరింపవల యునని చెప్పెడిశాస్త్రము, చేసిన మంగళము వ్యర్థము కావలసివచ్చును. కావున నిన్ను స్మరించిననే కార్యసిద్ధి యగునపుడు నీవే కార్యమునకై పూనుకొనినపుడు కార్యసిద్ధినిఁ గూర్చి సందేహమేమున్నది? ॥౧౩౪॥

శ్లో॥ ఇష్టిం నః ప్రతి తే ప్రతిశ్రుతిరభూద్యాద్యస్వరాహ్లాదినీ
ధర్మార్థా సృజ తాం శ్రుతిప్రతిభటీకృత్యాఽన్వితాఖ్యాపదాం।
త్వత్కీర్తిః పునతీ పునస్త్రిభువనం శుభ్రాద్వయావేశనా
ద్ద్రవ్యాణాం శితిపీతరోహితహరిన్నామాన్వయం లుంపతు॥౧౩౫॥

ప॥వి॥ ఇష్టిం । నః । ప్రతి । తే । ప్రతిశ్రుతిః । అభూత్ । యా । అద్య । స్వరాహ్లాదినీ । ధర్మార్థా । సృజ । తాం । శ్రుతిప్రతిభటీకృత్య । అన్వితాఖ్యాపదాం । త్వత్కీర్తిః । పునతీ । పునః । త్రిభువనం । శుభ్రాద్వయావేశనాత్ । ద్రవ్యాణాం । శితిపీతరోహితహరిన్నామాన్వయం । లుంపతు.

అద్య = ఇప్పుడు, నః = మాయొక్క, ఇష్టిం = కోరికను, (యాగమును), స్వరాహ్లాదినీ; స్వః = స్వర్గమువలె, ఆహ్లాదినీ = సంతోషపఱచునదియు (స్వర = ఉదాత్తాదిస్వరములతో, ఆహ్లాదినీ = సంతోష పఱచునదియు) ధర్మార్థా; ధర్మ = ధర్మమే, అర్థా = ప్రయోజనముగాఁ గలదియు, (ధర్మ = ధర్మమే, అర్థా = అర్థముగాగలదియు నగు) యా = ఏ, ప్రతి శ్రుతిః = ప్రతిజ్ఞ, అభూత్ = కలదో, తాం = ఆ ప్రతిజ్ఞను, శ్రుతిప్రతి భటీకృత్య; శ్రుతి = వేదములకు, ప్రతిభటీకృత్య = ప్రతినిధిగఁజేసి, అన్వితాఖ్యాపదాం; అన్విత = అన్వయింపబడిన, ఆఖ్యాపదాం = సంజ్ఞా పదము గలదానినిగా, అనగా సార్థక సంజ్ఞాక్షరములు గల దానినిగా, సృజ = చేయుము. త్వత్కీర్తిః పునః = నీ కీర్తియో, త్రిభువనం = మూడులోకములను, పునతీ = పావనములనుఁ జేయుచు, ద్రవ్యాణాం = నలుపు పసుపు మున్నగు వన్నెలుగల వస్తువులకు, శుభ్రాఽద్వయావేశ నాత్; శుభ్ర = తెలుపువన్నెతో, అద్వయ = ఐక్యమును, ఆవేశనాత్ = ఆపాదించుటవలన, శితిపీతరోహిత హరిన్నామాన్వయం = నలుపు, పసుపు, ఎఱుపు, ఆకుపచ్చయను నామవాచకపదములతో, వాచ్యత్వ సంబంధమును, లుంపతు = లేకుండఁజేయునుఁ గాత.

ఇచ్చట నీలాది వస్తువులు తమ గుణములైన నీలత్వపీతత్వాది ధర్మము లను వదలిపెట్టి కీర్తి గుణమైన తెల్లఁదనమునుఁ బరిగ్రహించినవి గాన తద్గుణాలంకారము.

## సమాసములు :

*స్వరాహ్లాదినీ :* స్వరివఆహ్లాదినీ = స్వరాహ్లాదినీ. పక్షాంతరమున-స్వరైః హ్లాదినీ = స్వరాహ్లాదినీ.

*ధర్మార్థా :* ధర్మః అర్థః యస్యాస్సా = ధర్మార్థా.

*శ్రుతిప్రతిభటీకృత్య :* అప్రతిభటం ప్రతిభటం సంపద్యమానం కృత్వా = ప్రతిభటీకృత్య. శ్రుతేః ప్రతిభటీకృత్య = శ్రుతిప్రతిభటీకృత్య.

*అన్వితాఖ్యాపదామ్ :* ఆఖ్యా ఏవ పదాని = ఆఖ్యాపదాని. అన్వితాని ఆఖ్యాపదాని యస్యాంసా = అన్వితాఖ్యాపదా. తామ్ = అన్వితాఖ్యాపదామ్.

త్వత్కీర్తిః : తవ కీర్తిః = త్వత్కీర్తిః.

త్రిభువనం : త్రయాణాం భువనానాం సమాహారః = త్రిభువనమ్. తత్ = త్రిభువనమ్.

శుభ్రాద్వయావేశనాత్ : శుభ్రేణ అద్వయం = శుభ్రాద్వయమ్. శుభ్రాద్వయస్యఆవేశనం = శుభ్రద్వయావేశనం. తస్మాత్ = శుభ్రాఽద్వయావేశనాత్.

శితిపీతరోహితహరిన్నామాన్వయం : శితిశ్చ, పీతశ్చ, రోహితశ్చ హరిచ్చ = శితిపీతరోహితహరితః. శితిపీతరోహితహరితాం నామాని = శితిపీత రోహితహరిన్నామాని. శితిపీతరోహితహరిన్నామభిః అన్వయః = శితిపీత రోహితహరిన్నామాన్వయః. తం = శితిపీతరోహితహరిన్నామాన్వయమ్.

**భావము :**

ఓనలా! నీవు మా యిచ్చనుఁ గుఱించి (యాగమును గుఱించి) స్వర్గముతో సమానముగ నాహ్లాదము గల్గించునట్టిదియు ఉదాత్తాది స్వరములచే నాహ్లాదము గల్గించునట్టిదియునగునే ప్రతిశ్రుతిని అనగా ప్రతిజ్ఞను(శ్రుతికి సమానమైన దానిని) వేదములకుప్రతినిధియైనదానిగావించితివో దానిని సార్థకముగఁజేయుము. అట్లుచేసి సత్యప్రతిజ్ఞుఁడవుకమ్ము. నీకీర్తి మూఁడులోకములనుఁ బవిత్రములనుగావించుచు నలుపు పసుపువన్నెలగల వస్తువులకు తన తెలుపు వన్నెలచే నభేదము నాపాదిఁచుచు లోకమున నలుపు పసుపుమున్నగు శబ్దములకు నన్వయములేకుండఁ జేయునుఁగాత. ఎప్పుడు నీకీర్తిచేఁ బ్రపంచమంతయు తెల్లనిదైనదో, అప్పుడు నీలపీతాది శబ్దముల కర్థము లెక్కడ లభింపగలవు? కావున నట్టి పీతాదిశబ్దములకు వాచ్యలోపమేర్పడుగాత. ॥౧౩౫॥

శ్లో॥ యం ప్రాసూత సహస్రపాదుదభవత్పాదేన ఖంజఃకథమ్
స చ్ఛాయాతనయస్సుతః కిల పితుస్సాదృశ్యమన్విష్యతి।
ఏతస్యోత్తరమద్య నస్సమజని త్వత్తేజసాం లఘనే
సాహస్రైరపిపంగురంఘ్రిభిరభివ్యక్తీభవన్ భానుమాన్॥ ౧౩౬॥

ప॥వి॥ యం । ప్రాసూత । సహస్రపాత్ । ఉదభవత్ । పాదేన । ఖంజః । కథమ్ । సః । ఛాయాతనయః । సుతః । కిల । పితుః । సాదృశ్యమ్।

అన్విష్యతి । ఏతస్య । ఉత్తరమ్ । అద్య । నః । సమజని । త్వత్తేజ
సాం । లంఘనే । సాహస్రైః । అపి । పంగుః । అంఘ్రిభిః । అభి
వ్యక్తీభవన్ । భానుమాన్.

టీక॥ యం = ఏశనైశ్చరుని, సహస్రపాత్ = సూర్యుఁడు, ప్రాసూత = కనెనో, సః = ఆ, ఛాయాతనయః = ఛాయాదేవి కొడుకైన శనైశ్చరుఁడు, కథం = ఎట్లు, పాదేన = పాదముచే, ఖంజః = కుంటివాఁడు, ఉదభవత్ = పుట్టెను? సుతః = కుమారుఁడు, పితుః = తండ్రియొక్క, సాదృశ్యం = పోలికను, అన్విష్యతికిల = పొందును గదా! ఏతస్య = ఈ ప్రశ్నకు, అద్య = ఇప్పుడు, త్వత్తేజసాం; త్వత్ = నీయొక్క, తేజసాం = కాంతులయొక్క, లంఘనే = లంఘించుటయందు, సాహస్రైః = వేయి సంఖ్యగల, అంఘ్రిభిరపి = పాదములచే తను (కిరణములచేతను), పంగుః = కుంటివాఁడుగా, అభివ్యక్తీభవన్ = కానవచ్చుచున్న, భానుమాన్ = సూర్యుఁడు, నః = మాకు, ఉత్తరం = సమాధానముగా, సమజని = ఆయెను.

వి॥ ఇచ్చట కుంటివాఁడు కాని సూర్యుని, కుంటివానిగాఁ జెప్పుటవలన నతిశయోక్త్యలంకారము. అది శనైశ్చరుని కుంటి తనమునకుఁ గారణము కాకపోయినను కారణముగఁ జెప్పుటవలనను నుత్ప్రేక్ష. ఈ యతిశయోక్తికి నుత్ప్రేక్షకును సంకరము.

**భావము :**

శనైశ్చరుని సూర్యుఁడు పుట్టించెను. అతనికి తల్లి ఛాయాదేవి. కావున శనైశ్చరుఁడు ఛాయాసుతుఁడునగుచున్నాఁడు. కాని యా శనైశ్చరునకు పాదము కుంటిది. ఇది ఎట్లు వీనికి వచ్చినదా యను ప్రశ్న. కుమారుఁడు తండ్రిపోలికను గదా కలిగియుండవయును. కాన దీనియందే సమాధానమిమిడి యున్నది. ఏల యనగా నితని తండ్రియైన సూర్యుఁడు సహస్రపాదుఁడు. అనగా వేయి పాదములు గలవాఁడు. అతఁడు నలమహారాజైన నిన్ను కాంతి యందు మించవలయునను దురాశతో, వేయిపాదములతో లంఘింపగా, పడి కుంటివాడాయెను. కాన తండ్రి పోలికయైన కుంటితనము కుమారుఁడైన శనైశ్చరునకు సంప్రాప్తమైనది. కావున నీ తేజస్సు వేయి కిరణములుగల సూర్యుని గూడ మించినదని నలుని దేవతలు పొగడుచున్నారు. ॥౧౩౯॥

శ్లో॥ ఇత్యాకర్ణ్య క్షితీశ స్త్రిదశపరిషదస్తాగిరశ్చాటుగర్భాః
వైదర్భీకాముకోఽపి ప్రసభవినిహితం దూత్యభావం బభార।
అంగీకారం గతేఽస్మిన్నమరపరివృఢస్సంభృతానందమూచే
భూయాదంతర్ధిసిద్ధేరనువిహితభవచ్చిత్తతాయత్ర కుత్ర॥ ౧౩౭

ప॥వి॥ ఇతి । ఆకర్ణ్య । క్షితీశః । త్రిదశపరిదః । తాః । గిరః । వైదర్భీ కాముకః । అపి । ప్రసభవినిహితం । దూత్యభారం । బభార । అంగీ కారం । గతే । అస్మిన్ । అమరపరివృఢః । సంభృతానందమ్ । ఊచే। భూయాత్ । అంతర్ధిసిద్ధేః । అనువిహితభవచ్చిత్తతా । యత్ర । కుత్ర.

టీక॥ క్షితీశః = ప్రభువైన నలుఁడు, త్రిదశపరిషదః = దేవతల సంఘము యొక్క, ఇతి = ఇట్లు, చాటుగర్భాః = ప్రీతిగర్భములైన, తాః = ఆ, గిరః = మాటలను, ఆకర్ణ్య = విని, వైదర్భీకాముకస్సన్నపి = దమయంతిని వలచుచున్నవాఁడైనను, ప్రసభవినిహితం; ప్రసభ = బలాత్కారముగ, వినిహితం = ఉంచఁబడిన, దూత్యభారం; దూత్య = దూత్యమను, భారః = భారమును, బభార = భరించెను. అస్మిన్ = ఈ విషయమున, అంగీకారం = ఆమోదమును, గతేసతి = పొందగా, అమర పరివృఢః = దేవతలకు ప్రభువైన యింద్రుఁడు (హేనరేంద్ర = ఓరాజా) యత్రకుత్ర = ఎచ్చటనైనను, అంతర్ధిసిద్ధేః = అంతర్ధానమునిచ్చు శక్తికి, అనువిహితభవచ్చిత్తతా; అనువిహిత = అనుసరింపఁబడిన, భవచ్చిత్తతా = నీ మనస్సు గల్గియుండుట, భూయాత్ = అగునుగాక. (ఇతి = ఇట్లు), సంభృతానందం = ఆనందముతో నింపినట్లుగా, ఊచే = పలికెను.

## సమాసములు :

*క్షితీశః* : క్షితేః ఈశః = క్షితీశః.

*త్రిదశపరిషదః* : త్రిస్రః దశాః యేషాం తే త్రిదశాః. త్రిదశానాం పరిషత్ = త్రిదశపరిషత్. తస్యాః = త్రిదశపరిషదః.

*చాటుగర్భాః* : చాటు గర్భః యాసాం తాః = చాటుగర్భాః. తాః = చాటుగర్భాః.

వైదర్భీకాముకః: విదర్భేషు భవా = వైదర్భీ. వైదర్భ్యాః కాముకః = వైదర్భికాముకః. లేదా, వైదర్భీం కాముకః = వైదర్భీకాముకః.

ప్రసభవినిహితమ్ : ప్రసభం వినిహితః = ప్రసభవినిహితః. తమ్ = ప్రసభవినిహితమ్.

దూత్యభారమ్ : దూతస్య కర్మ = దూత్యమ్. దూత్యమేవ భారః = దూత్యభారః. తమ్ = దూత్యభారమ్.

అమరపరివృఢః : అమరాణాం పరివృఢః = అమరపరివృఢః.

సంభృతానందమ్ : సంభృతః ఆనందః యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = సంభృతానందమ్.

అంతర్ధిసిద్ధేః : అంతర్ధేః సిద్ధిః = అంతర్ధిసిద్ధిః. తస్యాః = అంతర్ధిసిద్ధేః.

అనువిహితభవచ్చిత్తతా : భవతః చిత్తం = భవచ్చిత్తమ్. అనువిహితం భవచ్చిత్తం యయా సా = అనువిహితభవచ్చిత్తా. అనువిహితభవచ్చిత్తాయాః భావః = అనువిహితభవచ్చిత్తతా.

భావము :

నలుఁడు దేవతాసంఘముయొక్క ప్రీతిగర్భములైన మాటలను విని దమయంతిపైన వలపున్నను, బలాత్కారముగాఁ దనపైఁ బెట్టఁబడిన దూత్యమనెడి భారము నొప్పుకొనెను. ఈ నలుఁడంగీకరింపగనే యింద్రుఁడు - ఓ నరేంద్రా! నీ కిచ్చవచ్చిన యట్లు మాయమై పోవుట కనుగుణమైన మనస్సు నీకుండును గాత యని యంతర్ధాన విద్యను సహర్షముగా నిచ్చెను. ॥౧౩౭॥

శ్లో॥ శ్రీహర్షం కవిరాజరాజిమకుటాలంకారహీరస్సుతం
శ్రీహీరస్సుషువే జితేంద్రియచయం మామల్లదేవీచ యమ్।
తస్య శ్రీవిజయప్రశస్తిరచనాతాతస్య భవ్యే మహా
కావ్యే చారుణి నైషధీయచరితే సర్గోఽగమత్పంచమః॥ ౧౩౮

ప॥వి॥ శ్రీహర్షం । కవిరాజ రాజిమకుటాలంకారహీరః । సుతం । శ్రీహీరః । సుషువే । జితేంద్రియచయం । మామల్లదేవీ చ । యం । తస్య । శ్రీవిజయప్రశస్తిరచనాతాతస్య । భవ్యే । మహాకావ్యే । చారుణి । నైషధీయచరితే । సర్గః । అగమత్ । పంచమః.

టీక॥ కవిరాజ రాజిమకుటాలంకారహీరః; కవిరాజ = కవిశ్రేష్ఠులయొక్క, రాజి = వరుసకు, మకుట = కిరీటస్థానమునొందిన వారికి, అలంకార = భూషణమైన, హీరః = వజ్రమణియైన, శ్రీహీరః = శ్రీహీరుఁడను విద్వాంసుఁడు, జితేంద్రియచయం = ఇంద్రియ సమూహమును జయించిన, యమ్ = ఏ, శ్రీహర్షం = శ్రీహర్షమహాకవిని, సుషువే = జన్మింపఁజేసెనో, మామల్లదేవీ చ = తల్లియైన మామల్లదేవియు,సుషువే = కనెనో, శ్రీవిజయప్రశస్తి రచనాతాతస్య = విజయచంద్రుఁడను కాన్యకుబ్జరాజునుగూర్చి రచింపఁబడిన శ్రీ విజయప్రశస్తి రచనకు, జనకుఁడైన, తస్య = ఆశ్రీహర్షునియొక్క, భవ్యే = మంగళకరమైన, చారుణి = రమ్యమైన, మహాకావ్యే = మహాకావ్యమైన, నైషధీయచరితే = నైషధీయచరిత్రమను నలచరిత్రనుఁ జెప్పెడి గ్రంథమందు, పంచమః = ఐదవదైన, సర్గః = సర్గ, అగమత్ = కడచినది.

## సమాసములు :

*కవిరాజరాజిమకుటాలంకార హీరః:* కవీనాం రాజానః = కవిరాజాః. కవిరాజానాం రాజిః = కవిరాజరాజిః. కవిరాజరాజేః మకుటం = కవిరాజరాజమకుటం. కవిరాజరాజిమకుటే అలంకారః = కవిరాజరాజిమకుటాలంకారః. కవిరాజరాజిమకుటాలంకారశ్చాసౌ హీరః = కవిరాజరాజిమకుటాలంకారహీరః.

*జితేంద్రియచయమ్ :* ఇంద్రియాణాం చయః = ఇంద్రియచయః. జితః ఇంద్రియచయః యేన సః = జితేంద్రియచయః. తమ్ = జితేంద్రియచయమ్.

*శ్రీవిజయప్రశస్తిరచనాతాతస్య:* శ్రీవిజయప్రశస్తేః రచనా = శ్రీవిజయప్రశస్తి రచనా. శ్రీవిజయప్రశస్తిరచనాయాః తాతః = శ్రీవిజయప్రశస్తి రచనాతాతః. తస్య = శ్రీవిజయప్రశస్తి రచనా తాతస్య.

*నైషధీయచరితే :* నిషధానాం రాజా = నైషధః. నైషధస్య ఇదం =

నైషధీయం. నైషధీయం చరితం=నైషధీయచరితమ్. తస్మిన్=నైషధీయ చరితే.

**భావము :**

కవిరాజుల శ్రేణి మకుటమునకు నలంకార వజ్రమణి యగు శ్రీహీరుఁడను మహాకవియు, మామల్లదేవియు జితేంద్రియుఁడైన శ్రీహర్షుని కనిరి. "శ్రీవిజయ ప్రశస్తి" యను తనకాశ్రయుఁడైన విజయచంద్ర మహారాజ చరిత్రమునుఁ బ్రతిపాదించెడి కావ్యమును రచించిన యా శ్రీహర్షునియొక్క శుభకరమును రమ్యమునైన నైషధీయ చరితమను మహాకావ్యమునందు పంచమసర్గ సమాప్తము. ॥౧౩౮॥.

ఇట్లు

శ్రీమదాపస్తంబ సూత్రాఽఽత్రేయగోత్ర ఉడాలి నృసింహ సూరి తనూజ
ఉడాలి సుబ్బరామశాస్త్రి విరచిత నైషధీయ చరితాంధ్ర
వ్యాఖ్యయందు పంచమసర్గ సమాప్తము.

# శ్రీ హర్ష నైషధము

## షష్ఠస్సర్గః

శ్లో॥ దూత్యాయ దైత్యారిపతేః ప్రవృత్తో
ద్విషాం నిషేద్ధా నిషధప్రధానః।
స భీమభూమీపతిరాజధానీం
లక్షీచకారాథ రథస్యదస్య॥ ౧

ప॥ వి॥ దూత్యాయ । దైత్యారిపతేః । ప్రవృత్తః । ద్విషాం । నిషేద్ధా । నిషధ ప్రధానః । సః । భీమభూమీపతిరాజధానీం । లక్షీచకార । అథ । రథస్యదస్య.

టీక॥ ద్విషాం = శత్రులవుకు, నిషేద్ధా = నివారకుఁడైన, నిషధప్రధానః; నిషధ = నిషధదేశములకు, ప్రధానః = ముఖ్యుఁడైన, సః = ఆనలుఁడు, దైత్యారిపతేః = దేవేంద్రునియొక్క, దూత్యాయ = దూతకృత్యమునకై, ప్రవృత్తః = ఉద్యమించినవాఁడై, రథస్యదస్య = రథవేగమునకు, భీమభూమీపతిరాజధానీం; భీమభూమీపతి = భీమరాజుయొక్క, రాజధానీం = రాజధానియగు కుండిననగరమును, లక్షీచకార = గుఱిగావించుకొనెను.

**సమాసములు :**

*దూత్యాయ :* దూతస్య కర్మ = దూత్యమ్. తస్మై = దూత్యాయ.

*దైత్యారిపతేః:* దితేరపత్యాని పుమాంసః = దైత్యాః. దైత్యానాం అరిః = దైత్యారిః. దైత్యారేః పతిః = దైత్యారిపతిః. తస్య = దైత్యారిపతేః.

*నిషధప్రధానః:* నిషధానాంప్రధానః = నిషధప్రధానః.

*భీమభూమీపతిరాజధానీం:* భూమ్యాఃపతిః = భూమీపతిః. భీమ ఇతి భూమీపతిః = భీమభూమీపతిః. రాజానః ధీయంతే అస్మిన్నితి = రాజధానీ. భీమభూమీపతేః రాజధానీ = భీమభూమీపతిరాజధానీ. తామ్ = భీమభూమీపతి రాజధానీం.

*రథస్యదస్య :* రథస్య స్యదః = రథస్యదః. తస్య = రథస్యదస్య.

భావము :

శత్రునిరోధకుఁడుగను, నిషధదేశమునకు ముఖ్యాధికారిగనుఁ బ్రసిద్ధి నొందిన యా నలమహారాజు, దేవేంద్రునకు దూత్యమును జరుపుట కొప్పుకొని నవాఁడై, తన రథవేగమునకు, భీమరాజునగరమైన కుండిన పట్టణమును గుఱి గావించుకొనెను. అనగా తన రథమును కుండిననగరమునకు మఱలించెను. ॥౧॥

శ్లో॥ భైమ్యా సమం నాఽజగణద్వియోగం
స దూతధర్మే స్థిరధీరధీశః।
పయోధిపానే మునిరంతరాయం
దుర్వారమప్యౌర్వమివౌర్వశేయః॥ ౨

ప॥వి॥ భైమ్యా - సమం । న । అజగణత్ । వియోగం । సః । దూతధర్మే । స్థిరధీః । అధీశః । పయోధిపానే। మునిః । అంతరాయం । దుర్వారమ్। అపి । ఔర్వమ్ । ఇవ । ఔర్వశేయః.

టీక॥ అధీశః = మనోనిగ్రహమునందు సమర్థుఁడైనవాఁడును, (అతఏవ = కావుననే) దూతధర్మే = దూత్యమునందు, స్థిరధీః = నిశ్చలబుద్ధిగల్గిన, సః = ఆ నలుఁడు, భైమ్యాసమం = దమయంతితోఁడ, వియోగమపి = విరహమునుఁగూడ, ఔర్వశేయః = ఊర్వశికిఁబుత్రుడైన యగస్త్యుఁడు, పయోధిపానే = సముద్రపానమందు, దుర్వారం = దుస్సహమైన, ఔర్వమివ = ఉర్వుఁడనుమునికి జన్మించిన బడబానలమునువలె, అంతరాయం = విఘ్నముగా, నాజగణత్ = లెక్కించలేదు.

సమాసములు :

భైమ్యా : భీమస్య అపత్యం స్త్రీ = భైమీ. తయా = భైమ్యా.

దూతధర్మే : దూతస్య ధర్మః = దూతధర్మః. తస్మిన్ = దూతధర్మే.

స్థిరధీః : స్థిరా ధీః యస్య సః = స్థిరధీః

దుర్వారమ్ : దుఃఖేన వారయితుం శక్యః = దుర్వారః. తమ్ = దుర్వారమ్.

పయోధిపానే : పయాంసి ధీయంతే అస్మిన్నితి = పయోధిః. పయోధేః పానమ్ = పయోధిపానమ్. తస్మిన్ = పయోధిపానే.

ఔర్వమ్: ఉర్వస్య అపత్యం పుమాన్ = ఔర్వః. లేదా, తమ్ = ఔర్వమ్. ఉర్వ్యాః అపత్యం పుమాన్ ఔర్వః. తమ్ = ఔర్వమ్.

ఔర్వశేయః : ఊర్వశ్యాః అపత్యం పుమాన్ = ఔర్వశేయః.

**భావము :**

నలునకు మనోనిగ్రహముండుట వలన దూత్యమునందు నెట్టి కొఱతను భావింపక, దమయంతితోటి వియోగమును, దానికి విఘ్నముగా భావింపలేదు. దాని కుపమానము నగస్త్యుని సముద్రపానమీయఁబడినది. ఊర్వశికిఁ గుమారుఁడైన యగస్త్య మహర్షి, తాను సముద్రమును పానముచేయునపుడు, దాని యందు దాగియున్న బడబాగ్నిని విఘ్నముగా భావింపలేదు. అట్లే నలుఁడును దమయంతీ వియోగమును విఘ్నముగా భావింపక, దానిని సహించి తన ప్రతిజ్ఞకు భంగము గల్గునను భయమువలన, దూత్యమునే యవలంబించెను. ॥౨॥

శ్లో॥ నలప్రణాళీ మిలదంబుజాక్షీ
సంవాదపీయూషపిపాసవస్తే।
తదధ్వవీక్షార్థమివాఽనిమేషా
దేశస్య తస్యాఽఽభరణీబభూవుః॥ ౩

ప॥వి॥ నలప్రణాళీమిలదంబుజాక్షీ సంవాదపీయూషపిపాసవః । తే । తదధ్వవీక్షార్థమ్ । ఇవ । అనిమేషాః । దేశస్య । తస్య । అభరణీబభూవుః.

టీక॥ తే = ఆ యింద్రాది దేవతలు, నలప్రణాళీమిలదంబు జాక్షీ సంవాద పీయూషపిపాసవః; నల = నలుఁడనెడి, ప్రణాళీ = గొట్టమునుండి, మిలత్ = లభించుచున్న, అంబుజాక్షీ = తమ్మికంటియైన దమయంతి తోటి, సంవాద = సంభాషణమను, పీయూష = అమృతమును, పిపాసవః = త్రాగఁగోరినవారై, తదధ్వవీక్షార్థమివ; తత్ = ఆనలునియొక్క, అధ్వ = త్రోవను, వీక్షార్థమివ = చూచుటకోయనునట్లు, అనిమేషాః =

తెప్పపాట్లు లేనివారై, తస్య = ఆ, దేశస్య = ప్రదేశమునకు, ఆభరణీ బభూవుః = భూషణములైరి.

వి॥ "తదధ్వవీక్షార్థమివ" అని, వారిత్రోవనుచూచుట, ఱెప్పపాట్లు లేక పోవుటకు గారణముగాకపోయినను గారణముగాఁ జెప్పుటవలన హేతూత్ప్రేక్ష. "వ్యంజకమైన" ఇవ శబ్దమునుఁ బ్రయోగించుటవలన నది వాచ్యము. ఇచ్చట దేవతలకు ఱెప్పపాట్లు లేకపోవుట సహజము.

## సమాసములు:

*నలప్రణాళీమిలదంబుజాక్షీసంవాద పీయూషపిపాసవః :* నల ఏవ ప్రణాళీ = నలప్రణాళీ. నలప్రణాళ్యా మిలత్ = నలప్రణాళీమిలత్. అంబుజేఇవ అక్షిణీయస్యాస్సా = అంబుజాక్షీ. అంబుజాక్ష్యా సంవాదః = అంబుజాక్షీసంవాదః. అంబుజాక్షీసంవాద ఏవ పీయూషమ్ = అంబుజాక్షీ సంవాదపీయూషమ్. నలప్రణాళీమిళచ్చ తత్ అంబుజాక్షీ సంవాదపీయూషం చ = నలప్రణాళీమిలదంబుజాక్షీసంవాదపీయూషమ్. నలప్రణాళీమిలదంబుజాక్షీ సంవాదపీయూషం పాతుమిచ్ఛంతీతి = నలప్రణాళీమిలదంబుజాక్షీసంవాదపీ యూషపిపాసవః.

*తదధ్వవీక్షార్థమ్ :* తస్య అధ్వా = తదధ్వా. తదధ్వనః వీక్షా = తదధ్వవీక్షా. తదధ్వవీక్షాయై = తదధ్వవీక్షార్థమ్.

*అనిమేషాః :* అవిద్యమానాః నిమేషాః యేషాం తే = అనిమేషాః.

*ఆభరణీబభూవుః :* అనాభరణాని, ఆభరణాని సంపద్యమానాని బభూవుః = ఆభరణీబభూవుః.

## భావము :

ఆ యింద్రాది దేవతలు నలుఁడనెడి గొట్టమునుండి ప్రవహించునట్టి దమయంతీ సంవాదామృతమునుఁ బానము చేయగోరి యనగా దమయంతితో మాట్లాడిన వృత్తాంతమును వినఁగోరినవారై, నలుఁడు వెళ్లిన మార్గమునుఁ జూచుటకో యనునట్లు, ఱెప్పపాట్లు లేనివారై యా ప్రదేశమునకు నలంకారములైరి. అనగా ఆ నలుఁడు వచ్చునంత వరకు నచ్చటనే యుండిరి. దేవతలకు స్వాభావికముగనే ఱెప్పపాట్లు లేవు. కావుననే వారికి అనిమేషులనియుఁ బేరుగలదు. కాని

నలుని మార్గమును జూచుటకై తెప్పపాట్లులేక యుండిరనుట వాస్తవము కాక పోయినను, వారికి దమయంతీ సంవాద విషయమున నున్న యాతురత నది సూచించుచున్నది. ॥౩॥

శ్లో॥ తాం కుండినాఖ్యాపదమాత్రగుప్తా
మింద్రస్యభూమేరమరావతీం సః ।
మనోరథస్సిద్ధిమివ క్షణేన
రథస్తదీయః పురమాససాద॥ ౪

ప॥వి॥ తాం । కుండినాఖ్యాపదమాత్రగుప్తామ్ । ఇంద్రస్య । భూమేః । అమరావతీం। సః। మనోరథః । సిద్ధిమ్ । ఇవ । క్షణేన । రథః । తదీయః। పురమ్ । ఆససాద.

టీక॥ తదీయః=ఆ నలునకు సంబంధించిన, సః=ఆ, రథః=రథము, తాం=ఆ, కుండినాఖ్యాపద మాత్రగుప్తామ్; కుండినాఖ్యాపదమాత్ర= కుండినమను పేరుచేతనే, గుప్తాం = మఱుగైన, అమరావతీం=ఇంద్రుని రాజధానియగు నమరావతితో సమానమైన, భూమేః=భూమికి, ఇంద్రస్య=ఇంద్రుఁడైన భీమరాజుయొక్క, పురమ్=పట్టణమును, మనోరథః=కోరిక, సిద్ధిమివ=కార్యసిద్ధినివలె, క్షణేన=క్షణకాలముచే, ఆససాద=పొందెను.

## సమాసములు :

*కుండినాఖ్యాపదమాత్రగుప్తామ్ :* కుండినమితిఆఖ్యాపదం=కుండినాఖ్యాపదం. కుండినాఖ్యాపదమేవ=కుండినాఖ్యాపదమాత్రమ్. కుండినాఖ్యాపదమాత్రేణగుప్తా=కుండినాఖ్యాపదమాత్రగుప్తా. తామ్=కుండినాఖ్యాపదమాత్రగుప్తామ్.

*తదీయః :* తస్య అయం=తదీయః.

## భావము :

నలుని రథము, కుండిన మను పేరుతో మాత్రము, మఱుగుపడిన యమరావతివలె నున్న, భూలోకదేవేంద్రుఁడగు భీమరాజుయొక్క పట్టణమును, మనోరథము సిద్ధిని పొందినట్లు క్షణకాలమునఁ బ్రవేశించెను. ॥౪॥

శ్లో॥ భైమీపదస్పర్శకృతార్థరథ్యా
సేయం పురీత్యుత్కలికాకులస్సన్।
నృపో నిపీయ క్షణమీక్షణాభ్యాం
భృశం నిశశ్వాస సురైః క్షతాశః॥ 38

ప॥వి॥ భైమీపదస్పర్శకృతార్థరథ్యా । సా । ఇయం । పురీ । ఇతి । ఉత్కలికాకులః । సన్ । నృపః । నిపీయ । క్షణమ్ । ఈక్షణాభ్యాం । భృశం । నిశశ్వాస । సురైః । క్షతాశః.

టీక॥ భైమీపదస్పర్శకృతార్థరథ్యా; భైమీ = దమయంతియొక్క, పద = పాదములయొక్క, స్పర్శ = తాకిడిచే, కృతార్థ = సఫలమైన, రథ్యా = వీథులు కలదియు, సా = ఆ ప్రసిద్ధమైన, పురీ = కుండిన పట్టణము, ఇయం = ఇది, ఇతి = అని, ఉత్కలికాకులస్సన్; ఉత్కలికా = ఉత్కంఠతో, ఆకులస్సన్ = కలతఁజెందినవాఁడై, క్షణం = క్షణకాలము, ఈక్షణాభ్యాం = కన్నులచే, పురీం = ఆ పట్టణమును, నిపీయ = చూచి, సురైః = దేవతలచే, క్షతాశస్సన్; క్షత = భగ్నమైన, ఆశస్సన్ = ఆశ గల్గినవాఁడై, భృశం = మిక్కిలి, నిశశ్వాస = నిట్టూర్పును విడిచెను.

**సమాసములు :**

భైమీపదస్పర్శకృతార్థరథ్యాః భీమస్య అపత్యం స్త్రీ = భైమీ. భైమ్యాః పదే = భైమీపదే. భైమీపదయోః స్పర్శః = భైమీపదస్పర్శః. కృతః అర్థః యాభిస్తాః = కృతార్థాః. భైమీపదస్పర్శేన కృతార్థాః = భైమీపదస్పర్శకృతార్థాః. భైమీపదస్పర్శకృతార్థాః రథ్యాః యస్యాం సా = భైమీపదస్పర్శకృతార్థరథ్యా.

*ఉత్కలికాకులః :* ఉత్కలికయా ఆకులః = ఉత్కలికాకులః.

*క్షతాశః :* క్షతా ఆశా యస్య సః = క్షతాశః.

**భావము :**

నలుఁడు, దమయంతీ పాదముల స్పర్శచే సఫలతఁ జెందిన వీథులలో

వెలయుచున్న యా ప్రసిద్ధమైన కుండిన నగరమిదియా యను నుత్కంఠతోఁ గలతఁ జెంది, క్షణకాలమా పట్టణమును, రెండు కన్నులతో మిక్కిలి యాదరముగా చూచెను. కాని యింద్రాది దేవతల పన్నాగమువలన తన కోరిక భగ్నమైనందులకు మిక్కిలి నిట్టూర్పులను విడిచిపెట్టెను. ౨॥

శ్లో॥ స్విద్యత్ప్రమోదాశ్రులవేన వామం
రోమాంచభృత్పక్ష్మభిరస్య చక్షుః।
అన్యత్పునః కంప్రమపి స్ఫురంతం
తస్యాః పురః ప్రాప నవోపభోగమ్॥ ౬

ప॥వి॥ స్విద్యత్ప్రమోదాశ్రులవేన । వామం । రోమాంచభృత్ । పక్ష్మభిః । అస్య । చక్షుః । అన్యత్ । పునః । కంప్రమ్ । అపి । స్ఫురంతం । తస్యాః । పురః । ప్రాప । నవోపభోగమ్.

టీక॥ అస్య = నలునకు, వామం = ఎడమదైన, చక్షుః = కన్ను, ప్రమోదాశ్రులవేన; ప్రమోదాశ్రు = ఆనందబాష్పములయొక్క, లవేన = బిందువుచే, స్విద్యత్ = చెమర్చినదియు, (ఉన్మిషద్భిః = పైకి నిక్కపొడుచుకొనిన) పక్ష్మభిః = రెప్పలచే, రోమాంచ = భృత్; రోమాంచ = గగుర్పాటులను, భృత్ = దాల్చినదియునై, తస్యాః = ఆ, పురః = కుండిన నగరికి, నగరియను (కుండినస్త్రీకి), స్ఫురంతం = ప్రకాశించుచున్న, నవోపభోగం = నూతనమైనదర్శనమును, (మొదటి సంగమమును) ప్రాప = పొందినది. అన్యత్ పునః = కుడినేత్రమో, కంప్రమపి = కంపముతోఁడనుఁ గూడినదై, తం = మొదటిసంగమమును, ప్రాప = పొందినది.

వి॥ ఇచ్చట నానందబాష్పములయందు స్వేదత్వమును, పైకినిక్కిన రెప్పలయందు రోమాంచత్వమును ఆరోపించుట వలన రూపకాలంకారము. ఆ రూపకముచే నేర్పడిన నవోపభోగవ్యవహారమును నగరియను స్త్రీయందును, నేత్రమను పురుషునియందును నారోపించుటవలన అనగా స్త్రీగా తెలియఁబడు నగరియందును, పురుషుఁడుగాఁ తెలియఁబడు నేత్రమునందును నారోపించుటవలన సమాసోక్త్యలంకారము. రూపక సమాసోక్తులకిచ్చట సంకరము.

## సమాసములు :

ప్రమోదాశ్రులవేన : ప్రమోదస్య అశ్రూణి = ప్రమోదాశ్రూణి. ప్రమోదాశ్రూణాం లవః = ప్రమోదాశ్రులవః. తేన = ప్రమోదాశ్రులవేన.

రోమాంచభృత్ : రోమాంచాన్ బిభర్తీతి = రోమాంచభృత్.

నవోపభోగమ్ : నవశ్చాసౌ ఉపభోగశ్చ = నవోపభోగః. తమ్ = నవోపభోగమ్.

## భావము :

ఈ విధముగా నలమహారాజు, తనకుఁగల్గినయాశాభంగమునకు చింతించుచుండగా, నతనికి నిష్టసిద్ధిని సూచించుచున్నట్టి కుడికన్ను కంపించినది. అందు నెడమకన్ను మాత్రము ఆనందబాష్పములచేతఁ జెమర్చినది. ఱెప్పలుపైకి నిక్కుటచే గగుర్పాటు నొందినదై యా నగరియొక్క పూర్వదర్శనమును, (ప్రథమ సంభోగమును) నొందినది. కుడికన్ను ఆ రెంటితోఁబాటు అనగా స్వేదరోమాంచములతోఁబాటు కంపమునుఁగూడఁ బొందినదై యా యపూర్వదర్శనమును, (ప్రథమసంభోగమును) పొందినది. అనగా నతని ఎడమకన్ను అనుపురుషుఁడు కుండిననగరియను వనితతో, స్వేదరోమాంచములతోడను, కుడికన్ను అను పురుషుఁడు స్వేదరోమాంచకంపములతోడనుఁ బ్రథమ సంభోగము ననుభవించెనను నర్థమిట సూచితము. అనగా నాతని కన్నులు రెండును నా కుండిననగరినిఁ జూచినవనియు నతనికి శుభసూచకముగా కుడికన్ను అదరినదనియు నాశయము. ॥౬॥

శ్లో॥ రథాదసౌ సారథినా సనాథా
ద్రాజావతీర్యాశు పురం వివేశ।
నిర్గత్య బింబాదివ భానవీయా
త్సౌధాకరం మండలమంశుసంఘః॥ ౭

ప॥పి॥ రథాత్ । అసౌ । సారథినా । సనాథాత్ । రాజా । అవతీర్య । ఆశు । పురం । వివేశ । నిర్గత్య । బింబాత్ । ఇవ । భానవీయాత్ । సౌధాకరం । మండలమ్ । అంశుసంఘః.

టీక॥ అసౌ = ఈ నలమహారాజు, సారథినా = సారథితో, సనాథాత్ = కూడినట్టి, రథాత్ = రథమునుండి, అవతీర్య = దిగి, అంశుసంఘః = కిరణసమూహము, భానవీయాత్ = సూర్యునికిసంబంధించిన, బింబాత్ = మండలమునుండి, నిర్గత్య = వెలువడి, సౌధాకరం = చంద్రసంబంధమైన, మండలమివ = మండలమునువలె, ఆశు = శీఘ్రముగా, పురం = కుండినపురమును, వివేశ = ప్రవేశించెను.

వి: నలునిఁ జంద్రునితోఁ గుండిననగరమును సూర్యునితోఁ బోల్చుటవలన ఉపమాలంకారము.

## సమాసములు :

సనాథాత్ : నాథేన సహవర్తత ఇతి = సనాథః. తస్మాత్ = సనాథాత్.

భానవీయాత్ : భానోరయం = భానవీయః. తస్మాత్ = భానవీయాత్.

సౌధాకరమ్ : సుధాకరస్య ఇదం = సౌధాకరం. తత్ = సౌధాకరమ్.

## భావము :

నలమహారాజు సారథితోఁగూడిన రథమునుండి దిగి, సూర్యమండలమందలి కిరణసమూహము చంద్రమండలమును ప్రవేశించినట్లు, కుండిన నగరమునుఁ బ్రవేశించెను. సూర్యకిరములు జలమయమైన చంద్రమండలమందుఁ బ్రవేశించి రాత్రులు చీకటినిఁ దొలగించునని శాస్త్రము. ॥౭॥

శ్లో॥ చిత్రం తదా కుండినవేశినస్సా
నలస్య మూర్తిర్వవృతే నదృశ్యా।
బభూవ తచ్చిత్రతరం తథాపి
విశ్వైకదృశ్యైవ యదస్య మూర్తిః॥ ౮

ప॥వి॥ చిత్రం । తదా । కుండినవేశినః । సా । నలస్య । మూర్తిః । వవృతే । నదృశ్యా । బభూవ । తత్ । చిత్రతరం । తథా । అపి । విశ్వైక దృశ్యా । ఏవ । యత్ । అస్య । మూర్తిః.

టీక॥ తదా = అప్పుడు, కుండినవేశినః = కుండిన నగరమునుఁ బ్రవేశించిన, నలస్య = నలునియొక్క, సా = అంతఁజక్కగాఁ గనబడుచున్న, మూర్తిః = శరీరము, నదృశ్యా = కానరానిదిగా, వవృతే = ఏర్పడినది. చిత్రం = ఆశ్చర్యము. తథాపి = అట్లు కానరాక పోయినను, అస్య = ఇతనియొక్క, మూర్తిః = శరీరము, విశ్వైకదృశ్యైవ, విశ్వైక = అంద ఱిచేతనే, దృశ్యైవ = చూడఁదగినదే, (విశ్వ = ప్రపంచమునకు, ఏక = సాటిలేని, దృశ్యైవ = దర్శనీయమైనదే, అనగా దృష్టికిఁ బ్రియమైనదే) ఇతియత్ = అనునదేది గలదో, తత్ = అది, చిత్రతరం = మిక్కిలి ఆశ్చర్యకరముగా, బభూవ = ఉండినది.

వి॥ నలుని శరీరము దృశ్యము కాలేదని మఱల, విశ్వైకదృశ్యమైన దనుట వలన విరోధాభాసము. విశ్వమునకు సాటిలేని దృశ్యమనుటవలన దానికి పరిహారము.

**సమాసములు :**

*చిత్రతరమ్ :* అత్యంతం చిత్రం = చిత్రతరమ్.

*విశ్వైకదృశ్యా :* ద్రష్టుంయోగ్యా = దృశ్యా. ఏకా చ సా దృశ్యాచ = ఏకదృశ్యా. విశ్వస్యఏకదృశ్యా = విశ్వైకదృశ్యా.

**భావము :**

కుండిన నగరమును నలుఁడు ప్రవేశించినప్పుడంతవరకు చక్కగాఁ గాన వచ్చుచున్న నలునిశరీర మదృశ్యమైనది. దీనికింద్రుని వరము కారణము. అట్లు అదృశ్యమైనను నది విశ్వైక దృశ్యముగను, (విశ్వమునకెనలేని దర్శనీయమైన ప్రియమూర్తిగను) నుండినది. అతని శరీరమ దర్శనీయమైనను, విశ్వైకదర్శ నీయమైన దనగా, విశ్వములోనది యొక్కటియే రమ్యమైనదని యాశ యము. ॥౮॥

శ్లో॥ జనై ర్విదగ్ధైర్భవనై శ్చ ముగ్ధైః
పదే పదే విస్మయకల్పవల్లీం।

విగాహమానా పురమస్య దృష్టి
రథాఽఽదదే రాజకులాతిథిత్వమ్॥ ౯

ప॥వి॥ జనైః । విదగ్ధైః । భవనైః । చ ।ముగ్ధైః । పదే । పదే । విస్మయకల్ప వల్లీం । విగాహమానా । పురమ్ । అస్య । దృష్టిః । అథ । ఆదదే । రాజకులాతిథిత్వమ్.

టీక॥ అథ = తర్వాత, అస్య = ఈ నలుని యొక్క, దృష్టిః = చూపు, విదగ్ధైః = విజ్ఞానవంతులైన, జనైః = జనులతోఁడను, ముగ్ధైః = సుందరములైన, భవనైశ్చ = భవనములతోఁడను, పదేపదే = అడుగడుగునందు, విస్మయకల్పవల్లీం = ఆశ్చర్యరసమునకు కల్పలతయైన-అనగా నాశ్చర్యకరమైన, పురం = నగరమును, విగాహమానా = పరికించుచు, రాజకులాతిథిత్వమ్; రాజకుల = రాజనగరికి, అతిథిత్వం = అతిథియగుటను, లేదా, రాజకుల = రాజనగరికి, అతిథిత్వం = అతిథిగా అనగా విషయముగాఁ గల్గియుండుటను, ఆదదే = గ్రహించెను.

## సమాసములు:

విస్మయకల్పవల్లీమ్ : విస్మయస్య కల్పవల్లీ = విస్మయకల్పవల్లీ. తామ్ = విస్మయకల్పవల్లీమ్.

రాజకులాతిథిత్వమ్ : రాజ్ఞః కులం = రాజకులమ్. రాజకులస్య అతిథిః = రాజకులాతిథిః. రాజకులాతిథేః భావః = రాజకులాతిథిత్వమ్. లేదా రాజకులమ్ అతిథిః యస్యాస్సా = రాజకులాతిథిః. రాజకులాతిథేః భావః = రాజకులాతిథిత్వమ్. తత్ = రాజకులాతిథిత్వమ్.

## భావము :

విజ్ఞానవంతులైన జనులచేతను, సుందరభవనములచేతను శోభించుచు నడుగడుగునకును నాశ్చర్యముఁ గొల్పుచున్న యా కుండిన నగరమునుఁ బరికించుచు నలుని దృష్టి క్రమముగా రాజనగరినిఁ బ్రవేశించినది. ॥౯॥

శ్లో॥ లీనశ్చరామీతి హృదా లలజ్జే
హేలాం దధౌ రక్షిజనేఽప్యసజ్జే।

ద్రక్ష్యామి భైమీమితి సంతుతోష
దూత్యం విచింత్య స్వమసౌ శుశోచ॥ ౧౦

ప॥వి॥ లీనః । చరామి । ఇతి । హృదా । లలజ్జే । హేలాం । దధౌ । రక్షి జనే । అస్త్రసజ్జే । ద్రక్ష్యామి । భైమీమ్ । ఇతి । సంతుతోష । దూత్యం । విచింత్య । స్వమ్ । అసౌ । శుశోచ.

టీక॥ అసౌ = ఈ నలుఁడు, అస్త్రైః = ఆయుధములచే, సన్నద్ధే = సిద్ధమైన, రక్షిజనే = రాజకులమును రక్షించు జనము విషయమున, హేలాం = తిరస్కారమును, దధౌ = ధరించెను. లీనః = దాగినవాఁడనై, చరామీతి = సంచరించుచున్నానని, హృదా = మనస్సుచే, లలజ్జే = సిగ్గుపడెను. భైమీం = దమయంతిని, ద్రక్ష్యామీతి = చూడఁగలనని, సంతుతోష = సంతసించెను. స్వం = తనదైన, దూత్యం = దూతకృత్యమును, విచింత్య = ఆలోచించి, శుశోచ = దుఃఖించెను.

వి॥ రక్షకులను నిరసించుటవలన గర్వము, గూఢముగ సంచరించుటవలన లజ్జ, దమయంతిని జూడగల్గుటవలన హర్షము, తన దూత్యమునకై చింతించుటవలన నిర్వేదముఅని గర్వ-లజ్జా-హర్ష-నిర్వేదములనుఁ బెక్కు భావము లొకచోట నొండొం టినుపమర్దించుకొనుచు సమావేశమగుట వలన నిచ్చట బావశబలత చెప్పఁబడినది.

**సమాసములు:**

*రక్షిజనే :* రక్షీ చాసౌ జనశ్చ = రక్షిజనః. తస్మిన్ = రక్షిజనే.

*అస్త్రసజ్జే :* అస్త్రైః సజ్జః = అస్త్రసజ్జః. తస్మిన్ = అస్త్రసజ్జే.

*భైమీమ్ :* భీమస్య అపత్యం స్త్రీ = భైమీ. తాం = భైమీమ్.

*దూత్యం :* దూతస్య కర్మ = దూత్యమ్. తత్ = దూత్యమ్.

**భావము:**

ఈ నలుఁడు రాజకులమందు సాయుధులైన రక్షకవర్గములను గర్వముతో తృణీకరించెను. శూరుఁడై గూడ, గూఢముగాఁ దిరుగవలసివచ్చినదే యని

సిగ్గుపడెను. దమయంతినిఁ జూడఁగలను గదాయని హర్షించెను. తన దూత కృత్యమునకు దుఃఖించెను. ॥౧౦॥

శ్లో॥ అథోపకార్యామమరేంద్రకార్యా
త్కక్ష్యాసురక్షాధికృతైరదృష్టః।
భైమీం దిదృక్షుర్బహు దిక్షు చక్షు
ర్దిశన్నసౌ తామవిశద్విశంకః॥ ౧౧

ప॥వి॥ అథ । ఉపకార్యామ్ । అమరేంద్రకార్యాత్ । కక్ష్యాసు । రక్షాధికృతైః। అదృష్టః । భైమీం । దిదృక్షుః । బహు । దిక్షు । చక్షుః । దిశన్ । అసౌ । తామ్ । అవిశత్ । విశంకః.

టీక॥ అథ = అనంతరము, అసౌ = ఈ నలుఁడు, కక్ష్యాసు = రాజగృహము యొక్క యంతరవులయందు, అనగాఁ దొట్టి కట్టులయందు, రక్షాధికృతైః; రక్షా = రక్షణయందు, అధికృతైః = నియమింపఁబడిన రక్షకులచే, అదృష్టః = చూడఁబడనివాఁడై, భైమీం = దమయంతిని, దిదృక్షుః = చూడఁగోరినవాఁడై, దిక్షు = దిక్కులయందు, చక్షుః = దృష్టిని, బహు = ఎక్కువగా, దిశన్ = ఉంచుచు, విశంకస్సన్ = భయములేనివాఁడై, తాం = ఆ, ఉపకార్యాం = రాజభవనమును, అమరేంద్రకార్యాత్ = అమరేంద్ర = దేవతాశ్రేష్ఠులైన యింద్రాదులయొక్క, కార్యాత్ = కార్యమువలన, అవిశత్ = ప్రవేశించెను.

## సమాసములు :

*అమరేంద్రకార్యాత్ :* అమరాణామింద్రాః = అమరేంద్రాః. అమరేంద్రాణాం కార్యమ్ = అమరేంద్రకార్యమ్. తస్మాత్ = అమరేంద్రకార్యాత్.

*రక్షాధికృతైః :* రక్షాయామధికృతాః = రక్షాధికృతాః. తైః = రక్షాధికృతైః,

*భైమీమ్ :* భీమస్య అపత్యం స్త్రీ = భైమీ. తామ్ = భైమీమ్.

*విశంకః :* విగతా శంకా యస్యసః = విశంకః.

**భావము :**

ఆ నలుఁడు రాజభవనముయొక్క యంతరవులయందు నియమింపఁబడిన రక్షకభటుల కంటఁబడకుండ దమయంతినిఁ జూఁడగోరుచు దిక్కులయందు బాగుగా దృష్టినిఁ బెట్టుచు నిర్భయముగా నా రాజభవనమును దేవతల కార్యము కొఱకై ప్రవేశించెను. ॥౧౧॥

శ్లో॥ అయం క ఇత్యన్యనివారకాణాం
గిరా విభుర్ద్వారి విభుజ్య కంఠం।
దృశం దదౌ విస్మయని స్తరంగాం
విలంఘితాయామపి రాజసింహః॥ ౧౨

ప॥వి॥ అయం । కః । ఇతి। అన్యనివారకాణాం। గిరా। విభుః। ద్వారి। విభుజ్య। కంఠం । దృశం । దదౌ । విస్మయనిస్తరంగాం । విలంఘితాయామ్ । అపి । రాజసింహః.

టీక॥ విభుః = సమర్థుఁడైన, రాజసింహః = రాజశ్రేష్ఠుఁడైన, సః = ఆ నలుఁడు, అయం = వీఁడు, కః = ఎవఁడు? ఇతి = అని, అన్యనివారకాణాం; అన్య = తనకంటె నితరులను, నివారకాణాం = నివారించెడి రక్షకుల యొక్క, గిరా = మాటచే, కంఠం = కంఠమును, విభుజ్య = చూడఁ బడితినా యేమి యను భయముతో త్రిప్పి, విలంఘితాయామపి = దాటఁ బడినదైనను, ద్వారి = ద్వారమునందు, విస్మయ నిస్తరంగాం; విస్మయ = ఆశ్చర్యముచే, నిస్తరంగాం = తెప్పపాట్లు లేనటువంటి, దృశం = దృష్టిని, దదౌ = ఇచ్చెను.

**సమాసములు :**

అన్యనివారకాణామ్ : అన్యేషాం నివారకాః = అన్యనివారకాః. తేషామ్ = అన్యనివారకాణామ్.

విస్మయనిస్తరంగామ్ : నిర్గతాః తరఁగాః యస్యాస్సా = నిస్తరంగా. విస్మయేన నిస్తరంగా = విస్మయనిస్తరంగా. తామ్ = విస్మయనిస్తరంగామ్.

రాజసింహః : రాజా సింహ ఇవ = రాజసింహః.

భావము :

సమర్థుఁడును, రాజశ్రేష్ఠుఁడునైన యా నలుఁడు రాజకులమందలి కక్ష్యలలోఁ దిరుగుచుండగా, రక్షకభటులితని కంటె భిన్నులను "వీఁడెవ్వఁడని" నివారించుచున్నప్పుడు, "తన్నేమైనను జూచి వారించుచున్నారా" యను సందేహముతో మెడ త్రిప్పి చూచుచు, ద్వారమును దాటిపోయినప్పుడును వారేమైననుఁ తన్నుఁ జూచినారా! యను నాశ్చర్యముతో ఱెప్పపాటులేని దృష్టినిఁ బఱచెను. ఇతఁడింద్రుని వరముచే నంతర్ధాన విద్యయొక్క మహిమచే నచ్చట నొరులకు కానరాక తిరుగు చున్నను రక్షకభటు లితరులనుఁ గూర్చి మాట్లాడునప్పుడు తన్నుఁ గూర్చియేమైన మాట్లాడుచున్నారా? యను సందేహముతో వెనుకకు మరలి చూచుచు నాశ్చర్యముచే నిశ్చలమైనదృష్టినిఁబఱచెను. సింహము గుహను వదలి వెళ్లునపుడు కొంతదూరము పోయి వెనుకకు మరలి చూచుట ప్రసిద్ధము. అది యీ రాజసింహమైన నలునికి నన్వయింపబడినది. దీనినే సింహావలోకన న్యాయమందురు. ॥౧౩॥

శ్లో॥ అంతఃపురాంతస్స విలోక్య బాలాం
కాంచిత్సమాలబ్ధుమసంవృతోరుం।
నిమీలితాక్షః పరయా భ్రమంత్యా
సంఘట్టమాసాద్య చమచ్చకార॥ ౧౩

ప॥వి॥ అంతఃపురాంతః । సః । విలోక్య । బాలాం । కాం । చిత్ । సమాలబ్ధుం । అసంవృతోరుం । నిమీలితాక్షః ; పరయా । భ్రమంత్యా । సంఘట్టమ్ । ఆసాద్య । చమచ్చకార.

టీక॥ సః = ఆ నలుఁడు, అంతఃపురాంతః; అంతఃపుర = అంతఃపురముయొక్క, అంతః = లోపల, సమాలబ్ధుం = నలుఁగు పెట్టుకొనుటకు, అసంవృతోరుం; అసంవృత = ఆచ్ఛాదనలేనటువంటి, ఊరుం = తొడలుకల్గినటువంటి, కాంచిత్ = ఒకానొక, బాలాం = స్త్రీని, విలోక్య = చూచి, నిమీలితాక్షస్సన్; నిమీలిత = మూసుకొనబడిన, అక్షస్సన్ = నేత్రములు గలవాఁడగుచు, భ్రమంత్యా = అచ్చట తిరుగుచున్న, పరయా = మఱియొక స్త్రీతో, సంఘట్టనం = కొట్టుకొనడమును, ఆసాద్య = పొంది, చమచ్చకార = అదరిపోయెను.

**సమాసములు :**

*అంతఃపురాంతః :* అంతఃపురమ్ = అంతఃపురమ్. అంతఃపురస్య అంతః = అంతపురాంతః.

*అసంవృతోరుం :* న సంవృతౌ = అసంవృతౌ. అసంవృతౌ ఊరూ యస్యాస్సా = అసంవృతోరుః. తామ్ = అసంవృతోరుమ్.

*నిమీలితాక్షః :* నిమీలితే అక్షిణీ యస్య సః = నిమీలితాక్షః.

**భావము :**

ఆ నలుఁడంతఃపురమున సంచరించునపుడు నలుఁగు పెట్టుకొనుటకై తొడల పరిసరముల యందాచ్ఛాదనలేని యొకస్త్రీనిఁ గాంచి పరస్త్రీ విలోకన పాపభయముచే, కన్నులను మూసికొనెను. అట్లు మూసుకొనుట వలన నచ్చటనే తిరుగుచున్న మఱియొక స్త్రీతోఢీకొని యదరిపడెను. ఇతఁడు కన్నులు మూసుకొనుట వలన నామె యితనికిఁ గనఁబడలేదు. ఇతఁడంతర్ధాన విద్యలో మాయమై యుండుటవలన నామెకితఁడు కాన రాలేదు. అందువలన నిఱువురు నొండురుల కానఁజాలక ఢీకొనిరి. ॥౧౩॥

**శ్లో॥** అనాదిసర్గస్రజి వానుభూతా
చిత్రేషు వా భీమసుతా నలేన।
జాతైవ యద్వా జితశంబరస్య
సా శాంబరీశిల్పమలక్షి దిక్షు॥ ౧౪

**ప॥వి॥** అనాదిసర్గస్రజి । వా । అనుభూతా । చిత్రేషు । వా । భీమసుతా । నలేన। జాతా । ఏవ । యత్ । వా । జితశంబరస్య । సా । శాంబరీ శిల్పం। అలక్షి । దిక్షు.

**టీక॥** అనాదిసర్గస్రజివా; అనాది = ఆదిలేనట్టి, సర్గస్రజివా = సృష్టిపరంపర యందుఁగాని, చిత్రేషువా = చిత్తరువులయందుఁగాని, అనుభూతావా = అనుభవింపఁబడినదో, యద్వా = లేదా, (అనుభవమవసరము లేదు) జిత శంబరస్య = శంబరుని జయించిన మన్మథునియొక్క, శాంబరీశిల్పం =

మా యాసృష్టిగా, జాత్రైవ=ఏర్పడిన, సా=ఆ, భీమసుతా = దమ యంతి, నలేన=నలునిచే, దిక్షు=అన్ని దిక్కులయందు, **అలక్షి**= చూడఁబడినది.

వి॥ నలునకన్ని దిక్కులయందును దమయంతి కానవచ్చుటకు, జన్మాంతర సంస్కారము హేతువా? లేక చిత్రానుభవము హేతువా? లేక మన్మ థమాయాశిల్పము హేతువా? యని సంభావన చేయుటవలన నిచ్చట హేతూత్ప్రేక్ష.

## సమాసములు :

*అనాదిసర్గస్రజి* : అవిద్యమానా ఆదిః యస్య సః=అనాదిః. **అనా** దిశ్చాసౌ సర్గశ్చ=అనాదిసర్గః. అనాదిసర్గస్య స్రక్ = అనాదిసర్గస్రక్. తస్యాం = అనాదిసర్గస్రజి.

*జితశంబరస్య* : జితః శంబరః యేన సః=జితశంబరః. **తస్య**= జితశంబరస్య.

*శాంబరీశిల్పమ్* : శంబరస్య ఇయం=శాంబరీ. శాంబర్యాః శిల్పమ్= శాంబరీశిల్పమ్. ॥౧౪॥

## భావము :

అచ్చట నలునకన్ని దిక్కులయందును దమయంతి కానవచ్చుచున్నది. దీనికి జన్మాంతరమందలి యనుభవము కారణమా! లేదా చిత్తరువులలో దమ యంతీ దర్శనము కారణమా! లేదా మాయావులకు మాయావియైన యా మన్మ థుని మాయాసృష్టియా కారణమని సంభావింపఁబడినవి.

శ్లో॥ అలీకభైమీసహదర్శనాన్న
తస్యాన్యకన్యాప్సరసో రసాయ।
భైమీ భ్రమస్త్యైవ తతః ప్రసాదాత్।
భైమీభ్రమస్తేన న తాస్వలంభి॥ ౧౫

ప॥వి॥ అలీకభైమీసహదర్శనాత్ । న । తస్య । అన్యకన్యాప్సరసః । రసాయ । భైమీభ్రమస్య । ఏవ । తతః । ప్రసాదాత్ । భైమీభ్రమః । తేన । న । తాసు । అలంభి.

టీక॥ అన్యకన్యాప్సరసః; అన్య = ఇతరులైన, కన్యాఽప్సరసః = అప్సరసల వంటి కన్యకలు, అలీకభైమీసహదర్శనాత్; ఆలీకభైమీ = మాయాదమయంతితో, సహదర్శనాత్ = కూడ కానవచ్చుట వలన, తస్య = ఆ నలునకు, రసాయ = రాగముకొఱకు, న = కాలేదు. తతః = ఆ దమయంతీ భ్రమముయొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, తేన = ఆ నలునిచే, తాసు = ఆ యంతఃపుర స్త్రీలయందు, భైమీభ్రమః = దమయంతి భ్రమము, నాలంభి = పొందఁబడలేదు.

## సమాసములు :

అలీకభైమీసహదర్శనాత్ : అలీకప్రయుక్తాభైమీ = అలీకభైమీ. అలీకభైమ్యాసహ దర్శనం = అలీకభైమీసహదర్శనమ్. తస్మాత్ = అలీకభైమీ సహదర్శనాత్. లేదా-అలీకా చ సా భైమీ చ = అలీకభైమీ. అలీకభైమ్యా సహ దర్శనం = అలీకభైమీసహదర్శనం. తస్మాత్ = అలీకభైమీసహదర్శనాత్.

అన్యకన్యాప్సరసః : కన్యాః అప్సరస ఇవ = కన్యాప్సరసః. అన్యాశ్చ తాః కన్యాప్సరసశ్చ = అన్యకన్యాప్సరసః.

భైమీభ్రమః : భైమ్యాః భ్రమః = భైమీభ్రమః.

## భావము :

అచ్చటనున్న యితర కన్యలప్సరసలతో సమానముగానున్నను, వారు మాయాభైమితోఁ గలసి కనఁబడుటవలన వారిపై నలున కనురాగము కలుగలేదు. ఏలయనగా వారందఱు దమయంతికి సౌందర్యాది గుణములలో కీతగానే యుండిరి. ఆ దమయంతీ భ్రమయొక్క యనుగ్రహము వలననే వారియందు దమయంతి యనెడి భ్రమ కలుగలేదు. ఏలయనగా దమయంతితో వారికెట్టి సామ్యములేక యుండినది. కావున మాయా భైమియొక్క సాక్షాత్కారము రెండు విధములుగాను పకరించినది. ॥౧౩॥

శ్లో॥ భైమీనిరాశే హృది మన్మథేన
దత్తస్వహస్తాద్విరహాద్విహస్తః।
స తామలీకామవలోక్య తత్ర
క్షణాదపశ్యన్వ్యషదద్విబుద్ధః॥ ౧౬

ప॥వి॥ భైమీనిరాశే । హృది । మన్మథేన । దత్తస్వహస్తాత్ । విరహాత్ । విహస్తః । సః । తామ్ । అలీకామ్ । అవలోక్య । తత్ర । క్షణాత్ । అపశ్యన్ । వ్యషదత్ । విబుద్ధః.

టీక॥ భైమీనిరాశే; భైమీ = దమయంతియందు, నిరాశే = ఆశ లేకుండఁ జేయఁబడిన, హృది = హృదయమందు, మన్మథేన = మన్మథునిచే, దత్తస్వహస్తాత్; దత్త = ఈయఁబడిన, స్వహస్తాత్ = తనచేయికల్గిన, అనగా మన్మథునిచేఁ బుట్టింపఁబడిన, విరహాత్ = వియోగమువలన, విహస్తః = కలతనొందిన, సః = ఆనలుఁడు, అలీకాం = అసత్యమైన, తాం = ఆదమయంతిని, అవలోక్య = చూచి, క్షణాత్ = క్షణమున, విబుద్ధః = భ్రమ తొలంగినవాఁడై, తత్ర = అచ్చట, తామ్ = ఆమెను, అపశ్యన్ = చూడక, వ్యషదత్ = దుఃఖించెను,

## సమాసములు:

భైమీనిరాశే: భీమస్య అపత్యం స్త్రీ = భైమీ. నిర్గతా ఆశా యస్మాత్తత్ = నిరాశమ్. భైమ్యాం నిరాశమ్ = భైమీనిరాశమ్. తస్మిన్ = భైమీనిరాశే.

దత్తస్వహస్తాత్ : స్వస్యహస్తః = స్వహస్తః. దత్తఃస్వహస్తః. యస్య సః = దత్తస్వహస్తః తస్మాత్ = దత్తస్వహస్తాత్.

అపశ్యన్ : నపశ్యన్ = అపశ్యన్.

## భావము:

దేవతలచే దమయంతియందు నైరాశ్యముఁ బొందింపఁబడిన హృదయమందు మన్మథుఁడు కల్గించిన వియోగమువలనఁ గలతబొందిన నలుఁడు మిథ్యాదమయంతినిజూచి, క్షణములో మేల్కొనగనే భ్రమతొలంగుటచే నామె కానరాలేదు. దానివలన మిక్కిలి దుఃఖము ననుభవించెను. ॥౧౬॥

శ్లో॥ ప్రియాం వికల్పోపహృతాం స యావ
ద్దిగీశసందేశమజల్పదల్పం।
అదృశ్యవాగ్భీషితభూరిభీరు
భవోరవస్తావదచేతయత్తమ్॥ ౧౭

ప॥వి॥ ప్రియాం । వికల్పో పహృతాం । సః । యావత్ । దిగీశసందేశమ్ । అజల్పత్ । అల్పమ్ । అదృశ్యవాగ్భీషిత భూరిభీరుభవః । రవః । తావత్ । అచేతయత్ । తమ్.

టీక॥ సః = ఆనలుఁడు, వికల్పోపహృతాం;వికల్ప = విభ్రమములతో, ఉపనీతాం = తేఁబడిన, ప్రియాం = దమయంతినిఁ గూర్చి, యావత్ = ఎంతలోపల, దిగీశసందేశం;దిగీశ = దిక్పాలకుల యొక్క, సందేశం = సమాచారమును, అల్పం = కొద్దిగా, అజల్పత్ = చెప్పెనో, తావత్ = అంతలోపల, అదృశ్యవాగ్భీషితభూరిభీరుభవః; అదృశ్య = కంటికిఁగానరానివ్యక్తి యొక్క, వాక్ = మాటలచే, భీషిత = భయపఱుచఁబడిన, భూరి = అనేకులైన, భీరు = భయముఁగల్గిన స్త్రీలవలన, భవః = కల్గినటువంటి, రవః = శబ్దము, అనగా కలకలధ్వని, తం = వానిని, నలం = నలునిగా, అచేతయత్ = ప్రబోధించెను.

## సమాసములు :

*వికల్పోపహృతామ్ :* వికల్పైః ఉపహృతా = వికల్పోపహృతా. తామ్ = వికల్పోపహృతామ్.

*దిగీశసందేశమ్ :* దిశామీశాః = దిగీశాః. దిగీశానాం సందేశః = దిగీశసందేశః. తమ్ = దిగీశసందేశమ్.

*అదృశ్యవాగ్భీషితభూరిభీరుభవః:* ద్రష్టుంశక్యః = దృశ్యః.నదృశ్యః = అదృశ్యః. అదృశ్యస్య వాక్ = అదృశ్యవాక్. అదృశ్యవాచా భీషితాః = అదృశ్యవాగ్భీషితాః. భూరయశ్చ తాః భీరవశ్చ = భూరిభీరవః. అదృశ్యవాగ్భీషితాః భూరిభీరవశ్చ = అదృశ్యవాగ్భీషితభూరిభీరవః. అదృశ్యవాగ్భీషితభూరిభీరుభ్యఃభవతీతి = అదృశ్యవాగ్భీషితభూరిభీరుభవః.

భావము :

ఆ నలుఁడు తాను దిక్పాలకులవద్ద నుండి తెచ్చిన సమాచారమును మిథ్యా దమయంతికి నెంతవరకు నెవ్వరి కంటికిని కనఁబడక చెప్పెనో, అంతలోపల నీ యదృశ్యమైన వ్యక్తియొక్క మాటలవలన పెక్కండ్రు చెలికత్తెలు భయగ్రస్తులై కలకలధ్వనినిఁ జేసిరి. ఆ ధ్వనివలన నలుఁడు తాను భ్రాంతిఁ దొలగి యథాస్థితికి వచ్చెను. అంతవరకు నతఁడు తన భ్రాంతికి గోచరించుచున్న దమయంతితో భ్రమచే దిక్పాలక సందేశమునుఁ జెప్పుచుండెను. ఈ యదృశ్యవాణి వలన నచ్చటి స్త్రీలు భూతమేమైన వచ్చి మాట్లాడుచున్నదో, యని భయపడిరి. ॥౧౨॥

శ్లో॥ పశ్యన్ స తస్మిన్ మరుతాఽపి తన్వ్యా
స్తనౌ పరిస్పృష్టమివాస్తవస్త్రౌ।
అక్షాంతపక్షాంతమృగాంకమాస్యం
దధార తిర్యగ్వలితం విలక్షః॥ ౧౩

ప॥వి॥ పశ్యన్ । సః । తస్మిన్ । మరుతా । అపి । తన్వ్యాః । స్తనౌ । పరిస్పృష్టమ్ । ఇవ । అస్తవస్త్రౌ । అక్షాంత పక్షాంతమృగాంకమ్। ఆస్యం। దధార । తిర్యగ్వలితం । విలక్షః.

టీక॥ సః = ఆ నలుఁడు, తస్మిన్ = ఆయంతః పురమునందు, మరుతాఽపి = అచేతనమైనగాలిచేతను, పరిస్పృష్టమివ = తాకుటకొఱకో యనునట్లు, అస్తవస్త్రౌ; అస్త = తొలగింపఁబడిన, వస్త్రౌ = వస్త్రములు గల్గిన, తన్వ్యాః = స్త్రీయొక్క, స్తనౌ = స్తనములను, పశ్యన్ = చూచుచు, విలక్షః = సిగ్గుఁజెందినవాఁడై, అక్షాంతపక్షాంతమృగాంకమ్; అక్షాంత = ఓర్వఁబడని, పక్షాంత = పక్షమునకుచివరిదైనపూర్ణిమనాటి, మృగాంకం = చంద్రుఁడు గల్గిన, ఆస్యం = మోమును, తిర్యగ్వలితం; తిర్యక్ = అడ్డముగా, వలితం = మరలింపఁబడినదిగా, దధార = ధరించెను.

సమాసములు :

అస్తవస్త్రౌ : అస్తంవస్త్రంయయోస్తౌ = అస్తవస్త్రౌ. తౌ = అస్తవస్త్రౌ.

*అక్షాంతపక్షాంతమృగాంకం :* న క్షాంతః = అక్షాంతః. పక్షస్య అంతః = పక్షాంతః. పక్షాంతే మృగాంకః = పక్షాంతమృగాంకః. అక్షాంతః పక్షాంతమృగాంకః యేన తత్ = అక్షాంతపక్షాంతమృగాంకమ్. తత్ = అక్షాంత పక్షాంతమృగాంకమ్.

*తిర్యగ్వలితమ్ :* తిర్యక్ యథా తథా వలితమ్ = తిర్యగ్వలితమ్. తత్ = తిర్యగ్వలితమ్.

**భావము**

ఆయంతఃపురమునందుఁ జైతన్యములేని గాలికూడ తాకుటకోయనునట్లు ఒకానొక స్త్రీయొక్క పాలిండ్లపైని వలువలనుఁ దొలగింపగా, దానినిఁజూచి నలుఁడు సిగ్గుపడుచు, పున్నమ చంద్రునిఁ దిరస్కరించునట్టి తన మోమును నడ్డముగాఁ ద్రిప్పి వాల్చుకొనెను. అనగా గాలికిఁ బాలిండ్లపైని పయ్యెద తొలగినది. అందువలన నాగాలి యా పాలిండ్లనుఁదాకఁ దలంచినట్లు భావింపఁబడినది. ఇట్లు నలుఁడా పాలిండ్లనుఁ జూడక మోముత్రిప్పుటవలన నతని యింద్రియ నిగ్రహము వ్యక్తమైనది. చైతన్యములేని వాయువునకే యింత చాపల్యమున్నప్పుడు చైతన్యముగల నలున కట్టిసందర్భమున నెట్టి వికారము లేకపోవుట యతని గొప్పతనమును వెల్లడి పఱచుచున్నది. ॥౧౮॥

శ్లో॥ అంతఃపురే విస్తృతవాగురోఽపి
బాలావళీనాం వళితైర్గుణౌఘైః।
న కాలసారం హరిణం తదక్షిద్వంద్వం
ప్రభుర్బంధుమభూన్మనోభూః॥ ౧౯

ప॥వి॥ అంతఃపురే । విస్తృతవాగురః । అపి । బాలావళీనాం । వళితైః । గుణౌఘైః । న । కాలసారం । హరిణం । తదక్షిద్వంద్వం । ప్రభుః । బంధుమ్ । అభూత్ । మనోభూః.

టీక॥ అంతఃపురే = అంతఃపురమునందు, బాలావళీనాం = స్త్రీ సమూహముల యొక్కయు (వకార బకారములకు భేదము లేనందువలన, వాలావళీనాం = శిరోజముల వరుసలయొక్కయు) వళితైః = విలాసములచేతను,

(పెక్కుపోగులు పెట్టి పేనఁబడినటువంటిదియు) గుణౌఘైః; గుణ = నృత్యగీత సౌందర్యకటాక్షవిక్షేపాదిగుణములయొక్కయు, (పేనఁబడిన దారముల యొక్కయు) ఓఘైః = సమూహములచేతను, విస్తృతవాగురోఽపి; విస్తృత = పఱువఁబడిన, వాగురోఽపి = వలగలవాఁడైనను, మనోభూః = మన్మథుడనుఁ వేటకాఁడు, తదక్షిద్వంద్వం; తత్ = ఆ నలుని యొక్క, అక్షిద్వంద్వం = కన్నుల జంటయను, కాలసారం = కృష్ణసారమును, (కంటి పాపయొక్క నలుపువన్నెచే శ్రేష్ఠమైన దానిని) (జింకను) బంధుం = ఆకర్షించుటకు, (బంధించుటకు), ప్రభుః = సమర్థుఁడుగా, నాఽభూత్ = కాలేదు.

వి॥ ఇచ్చట కన్నులయందు హరిణత్వమును, బాలావళియందు వాలావళిత్వమును, గుణసమూహమునందు సూత్రత్వము నారోపించుటవలన మన్మథునకు మృగయుత్వము సిద్ధించుచున్నది. కాన నది గమ్యము కాననేకదేశవివర్తి రూపకము.

## సమాసములు :

*విస్తృతవాగురః :* విస్తృతా వాగురా యేన సః = విస్తృతవాగురః.

*బాలావళీనాం :* బాలానామ్ ఆవళ్యః = బాలావళ్యః. తాసాం = బాలావళీనామ్.

*గుణౌఘైః :* గుణానామోఘాః = గుణౌఘాః. తైః = గుణౌఘైః.

*కాలసారం :* కాలేనసారం = కాలసారం. తత్ = కాలసారమ్.

*అక్షిద్వంద్వమ్ :* అక్ష్ణోః ద్వంద్వమ్ = అక్షిద్వంద్వమ్. తత్ = అక్షిద్వంద్వమ్.

## భావము :

ఆ యంతః పురమునందలి స్త్రీ సంఘము, విలాసయుక్తములైన యొడలు విరుపులను, నృత్యములను, గానములనుఁ గటాక్షవిక్షేపములను, తమ శిరోజములను విప్పుట ముడులువేయుట, దువ్వుట, మున్నగు నందచందములను వెల్లడించు హావభావాదులతోఁడను, మధురములైన యంగ విన్యాసముల

తోఁడను, నలుని కంటఁ బడిరి. కాని మన్మథుఁడను వేటకాఁడా యంతఃపుర స్త్రీల శిరోజములచే పేనిన దారములతో నిర్మించిన వలనుఁ బఱచి, యా యంతఃపురమందు సంచరించు నలుని యొక్క (నల్లని కంటి పాపముచే శ్రేష్ఠమైనందు వలన కృష్ణ సారమనఁబడు) కన్నులజంటయను కృష్ణసారమును - అనగా జింకను నాకర్షించుటకును (పట్టుటకును) సమర్థుఁడు కాజాలకపోయెను. ఏల యనగా నలుఁడు జితేంద్రియుఁడు. అడవియందు వేటకాఁడు జింకనుఁ బట్ట గలుగుచున్నాఁడు. కాని మన్మథుఁడను వేటకాఁడంతఃపురమందుఁ గూడ జింకను పట్ట లేకపోయెను. అంతఃపురమందలి స్త్రీలు, వివిధ విలాసవిభ్రమములతోఁజేయు శృంగారచేష్టలేవియును జితేంద్రియుఁడగు నలుని, వికారపరచ లేదు. ॥౧౯॥

శ్లో॥ దోర్మూలమాలోక్య కచం రురుత్సో
స్తతః కుచౌ తావనులేపయంత్యాః।
నాభీమథైష శ్లథవాససోఽను
మిమీల దిక్షు క్రమకృష్టచక్షుః॥ ౨౦

ప॥వి॥ దోర్మూలమ్ । ఆలోక్య । కచం । రురుత్సోః । తతః । కుచౌ । తౌ । అనులేపయంత్యాః । నాభీమ్ । అథ । ఏషః । శ్లథవాససః । అను । మిమీల । దిక్షు । క్రమకృష్టచక్షుః.

టీక॥ ఏషః = ఈ నలుఁడు, కచం = తల వెంట్రుకలను, రురుత్సోః = బంధింపఁ గోరుచున్న, కస్యాశ్చిత్ = ఒకానొక యువతియొక్క, దోర్మూలం = బాహుమూలమును, ఆలోక్య = చూచి, తతః = తర్వాత, కుచౌ = స్తనములను, అనులేపయంత్యాః = చందనాది సుగంధద్రవ్యములనుఁ బట్టించుచున్న ఆమె యొక్కయే, కుచౌ = స్తనములను, ఆలోక్య = చూచి, అథ = పిదప, శ్లథవాససః; శ్లథ = జారిపోయిన, వాససః = వలువఁగల్గిన, ఆమెయొక్కయే, నాభీం = పొక్కిలిని, ఆలోక్య = చూచి, అను = తర్వాత, దిక్షు = దిక్కులయందు, అనగా నెదుట పార్శ్వభాగములయందు, క్రమ కృష్టచక్షుః, క్రమ = క్రమముగా, కృష్ట = ఉపసంహరింపఁబడిన, చక్షుః = కన్నులుగలవాఁడై, మిమీల = (కన్నులను) మూసుకొనెను.

**సమాసములు :**

దోర్మూలమ్ : దోషోర్మూలమ్ = దోర్మూలమ్. తత్ = దోర్మూలమ్.

రురుత్సోః : రోద్ధుమిచ్ఛుః = రురుత్సుః. తస్యాః = రురుత్సోః.

శ్లథవాససః : శ్లథంవాసః యస్యాస్సా = శ్లథవాసాః. తస్యాః = శ్లథవాససః.

క్రమకృష్టచక్షుః : క్రమేణకృష్టే = క్రమకృష్టే. క్రమకృష్టే చక్షుషీ యస్యసః = క్రమకృష్టచక్షుః.

**భావము :**

ఈ నలుఁడాయంతఃపురమునందు, తలవెంట్రుకలను ముడివేసుకొనుచున్న యొక యువతియొక్క బాహుమూలమునుఁ జూచి, తన దృష్టిని దిగువకు వంచుకొనెను. తర్వాత నా యువతియే తన స్తనములకు చందనాది సుగంధద్రవ్యములనలదుచుండగా వానినిఁ జూచి యింకనుఁ దన దృష్టిని వంచుకొనెను. తర్వాత నా యువతియే యిట్లు స్తనములకుఁ జందనాది ద్రవ్యముల నలఁదుటకై చీరను జార్చివేయగా, దానినిఁ జూచి ముందు కంటెను నింకను దిగువకుఁ గన్నులను వాల్చుకొనెను. ఈవిధముగా బాహుమూలమునుండి పొక్కిలివరకును నవయవములు తన కంటఁబడినను దానినిఁ జూడనొల్లక తలవంచుకొనిన నలుఁడు, నాభికంటెను దిగువ నంగములఁపైనఁ గన్నుగూడఁ బ్రసరింపగూడదను నాశయముతో చిట్టచివరికి, తన కన్నులనే మూసుకొనెను. అంతఃపురమునఁ పురుషులు లేనందువలన స్వేచ్ఛగా వర్తించుచున్న స్త్రీలనుఁ జూచుట పాపహేతువని భయపడుచున్న యా నలునికి కన్నులు మూసుకొనుటయే యుక్తమైనది. ॥౨౦॥

శ్లో॥ మీలన్న శేకేఽభిముఖాగతాభ్యాం
ధర్తుం నిపీడ్య స్తనసాంతరాభ్యామ్।
స్వాంగాన్యపేతో విజగౌ స పశ్చాత్
పుమంగసంగోత్పులకే పునస్తే॥ ౨౧

**ప॥వి॥** మీలన్ । న । శేకే । అభిముఖాగతాభ్యాం । ధర్తుం । నిపీడ్య । స్తనసాంతరాభ్యాం । స్వాంగాని । అపేతః । విజగౌ । సః । పశ్చాత్ । పుమంగసంగోత్పులకే । పునః । తే.

**టీక॥** మీలన్ = కనులు మూసికొనిన, సః = ఆ నలుఁడు, అభిముఖాగతాభ్యాం; అభిముఖ = ఎదురుగా, ఆగతాభ్యాం = వచ్చినట్టి, స్తనసాంతరాభ్యాం; స్తన = స్తనములచే, సాంతరాభ్యాం = వవ్యధానముగల్గిన యిద్దఱు స్త్రీలచే, నిపీడ్య = మధ్యఅడ్డగించి, ధర్తుం = పట్టుకొనఁబడుటకు, నశేకే = శక్యుఁడు కాలేదు. సః = ఆ నలుఁడు, పశ్చాత్ = వెనుకకు, అపేతః = తొలగినవాఁడై, స్వాంగాని = తనయవయవములను, విజగౌ = నిందించెను. తే = ఆ యిద్దఱుస్త్రీలు, పుమంగసంగోత్పులకే ; పుమ్ = పురుషుని యొక్క, అంగ = శరీరముయొక్క, సంగ = సంబంధముచే, ఉత్పులకే = పైకినిక్కిన రోమాంచములు గలవారుగ (జాతే = అయినారు).

## సమాసములు :

*అభిముఖాగతాభ్యామ్ :* అభిముఖమ్ ఆగతే = అభిముఖాగతే. తాభ్యామ్ = అభిముఖాగతాభ్యామ్.

*స్తనసాంతరాభ్యామ్ :* అంతరేణసహితే = సాంతరే. స్తనాభ్యాంసాంతరే = స్తనసాంతరే. తాభ్యాం = స్తనసాంతరాభ్యామ్.

## భావము :

కన్నులుమూసుకొని యానలుఁ డంతఃపురమునఁ దిరుగునప్పుడు మఱియొక బాధకు గుఱియైనాడు. ఇద్దఱు స్త్రీలలో నొకరుముందు, మఱియొకరు వెనుక వచ్చుచుండిరి. వారిఱువురిమధ్య నీ నలుఁడిఱుకు కొనెను. కాని వారిద్దఱి స్తనములు మిక్కిలి యురువుగ నుండుటవలన నవి వారిద్దరిమధ్య కొంత నెడమిచ్చినది. ఆ ఎడములో నీ నలునిఁబట్టివేయుటకు వారు ప్రయత్నించినను నలుఁడెట్లో తప్పించుకొని బయటపడి దూరముగాఁదొలగినవాఁడై పరస్త్రీల స్పర్శదోషమునఁ బొందిన తనయవయవములను నిందించుకొనెను. పురుషశరీర సంపర్కముచే నా స్త్రీలకిఱువురికిని శరీరమునందు గగుర్పాటేర్పడినది. ॥౨౦॥

శ్లో॥ నిమీలనస్పష్టవిలోకనాభ్యాం
కదర్థితస్తాః కలయన్ కటాక్షైః।
స రాగదర్శీవ భృశం లలజ్జే
స్వతః సతాం హ్రీః పరతోఽపి గుర్వీ॥ ౨౨

ప॥వి॥ నిమీలనస్పష్టవిలోకనాభ్యాం । కదర్థితః । తాః । కలయన్ । కటాక్షైః । సః । రాగదర్శీ । ఇవ । భృశం । లలజ్జే । స్వతః । సతాం । హ్రీః । పరతః । అపి । గుర్వీ.

టీక॥ నిమీలన స్పష్టవిలోకనాభ్యాం ; నిమీలన=కన్నులుమూయుట, స్పష్ట విలోకనాభ్యాం=స్పష్టముగాచూచుట అనువానిచే, కదర్థితః = పీడింపఁబడిన, సః=నలుఁడు, తాః=ఆ, స్త్రియః=స్త్రీలను, కటాక్షైః=కడకన్నులచే, కలయన్ = వికల్పరహితముగాఁజూచుచు, రాగదర్శీవ = అనురాగముతోఁజూచువానివలె, భృశం = మిక్కిలి, లలజ్జే=సిగ్గుపడెను. సతాం=సజ్జనులకు, పరతోఽపి = పరులకంటెను, స్వతః= తమవలననే, హ్రీః=సిగ్గు, గుర్వీ=గొప్పది.

వి॥ అంతఃపురస్త్రీలను నిష్కామముగఁ జూచినను సకామముగచూచిన వానివలె భావించి సిగ్గుపడెనను విశేషమునకు, సత్పురుషులకు పరులకంటెను తమవలననే సిగ్గుఎక్కువ యను సామాన్యముచే సమర్థనముండుట వలన నర్థాంతన్యాసము.

## సమాసములు :

*నిమీలనస్పష్టవిలోకనాభ్యామ్* : స్పష్టం చ తత్ విలోకనం చ=స్పష్టవిలోకనం. నిమీలనం చ స్పష్టవిలోకనం చ=నిమీలనస్పష్టవిలోకనే. తాభ్యాం= నిమీలనస్పష్టవిలోకనాభ్యామ్,

*రాగదర్శీ* : రాగేణ పశ్యతీతి=రాగదర్శీ.

## భావము :

అంతఃపురమున స్త్రీలనుఁ జూడరాదను నుద్దేశముతో, కన్నులు మూసికొనిన తర్వాత వారితో డీకొనుట మున్నగు వానిచే కన్నులు తెఱచుకొనుట

మున్నగు నవస్థలతో బాధనొందిన నలుఁడా స్త్రీలను నెట్టి వికల్పము లేకుండఁ జూడ నారంభించెను. అట్లు చూచియు తాను రాగముతోఁ జూచుచున్నవాడుగ భావించి సిగ్గుపడెను. కాని తాను రాగముతోఁ జూచినది చూడనిది యితరులకుఁ దెలియదు గదా దానికేల, తాను సిగ్గుపడవలసి వచ్చినదని ప్రశ్నింపరాదు. ఏల యనగా సజ్జనులకు పరులవలన వచ్చెడి లజ్జకంటెను, తన మనస్సువలన నేర్పడిన లజ్జయే గొప్పది. కావున నలుని మనస్సు రాగముతో చూడకపోయినను, రాగముతో చూచినదో యని యాతనికి లజ్జనుఁ గల్గించుచుండెను. ॥౨౨॥

శ్లో॥ రోమాంచితాంగీమనుతత్కటాక్షైః
భ్రాంతేన కాంతేన రతేర్నిసృష్టః।
మోఘశ్శరౌఘః కుసుమాని నాభూత్
తద్ధైర్యపూజాం ప్రతి పర్యవస్యన్॥ ౨౩

ప॥వి॥ రోమాంచితాంగీమ్ । అను । తత్కటాక్షైః । భ్రాంతేన । కాంతేన । రతేః । నిసృష్టః । మోఘః । శరౌఘః । కుసుమాని । న । అభూత్ । తద్దైర్యపూజాం । ప్రతి । పర్యవస్యన్.

టీక॥ రోమాంచితాంగీమను = పురుషదేహ సంబంధముచే గగుర్పాటుఁ జెందిన శరీరముగల స్త్రీని ఉద్దేశించి, తత్కటాక్షైః; తత్ = ఆ నలునియొక్క, కటాక్షైః = కటాక్షములచే, భ్రాంతేన = నలునికామెయందనురాగము కల్గినదని భ్రాంతిఁజెందిన, రతేః = రతీదేవియొక్క, కాంతేన = భర్తయైన మన్మథునిచే, నిసృష్టః = ప్రయోగింపఁబడిన, కుసుమాని = పుష్పములను, శరౌఘః = బాణసమూహము, తద్ధైర్యపూజాంప్రతి; తత్ = ఆ నలునియొక్క, ధైర్య = వికారరహితమైన మనస్సుగల్గి యుండుటకై ఏర్పడిన, పూజాంప్రతి = పూజనుఁగూర్చి యుద్దేశింపఁబడినదిగా, పర్యవస్యన్ = పరిణమించుచు, మోఘః = వ్యర్థముగా, నాఽభూత్ = కాలేదు.

వి॥ ఇచ్చట నలుని ధైర్యమును భగ్నముగావించుటకై ప్రయోగింపఁబడిన కుసుమశరములు వాని ధైర్యమును భగ్నము గావింపక యుండుటయే గాక వాని ధైర్యమునుఁ బూజించుట యను ననర్థమునుఁ గల్గించినది గాన విషమాలంకారము.

**సమాసములు :**

*రోమాంచితాంగీమ్ :* రోమాంచాః అస్య సంజాతా ఇతి = రోమాంచితమ్. రోమాంచితమ్ అంగం యస్యాస్సా = రోమాంచితాంగీ. తామ్ = రోమాంచితాంగీమ్.

*తత్కటాక్షైః :* తస్య కటాక్షాః = తత్కటాక్షాః. తైః = తత్కటాక్షైః.

*శరౌఘః :* శరాణామోఘః = శరౌఘః.

*తద్ధైర్యపూజాం :* ధీరస్యభావః = ధైర్యం. తస్యధైర్యం = తద్ధైర్యం. తద్ధైర్యస్య పూజా = తద్ధైర్యపూజా. తామ్ = తద్ధైర్యపూజామ్.

**భావము :**

నలుఁడంతఃపురమునందు తన శరీర సంపర్కమువలన గగుర్పాటుఁ జెందిన స్త్రీని తన కటాక్షములతోఁ జూచెను. అప్పుడు మన్మథుఁడతని కామెపై ననురాగముగల్గినదేమో యని భ్రాంతిపడి పుష్పములను బాణసమూహము నాతనిపైఁ బ్రయోగించెను. అవి యాతని మనః స్థైర్యము నేమాత్రము కదలింపలేక పోవుటయేగాక దాని పూజకై ప్రయోగింపఁబడిన పూలరాశిగాఁ బరిణమించుటచే వ్యర్థములు కాలేదు. శత్రువుయొక్క గుణమునుఁగూడఁ బూజింపవలసినదే గదా. ॥౨౩॥

శ్లో॥ హిత్వైవ వర్త్మైకమిహ భ్రమంత్యాః
స్పర్శః ప్రియాః సుత్యజ ఇత్యవేత్య।
చతుష్పథస్యాభరణం బభూవ
లోకావలోకాయ సతాం ప్రదీపః॥ ౨౪

ప॥వి॥ హిత్వా । ఏవ । వర్త్మ । ఏకమ్ । ఇహ । భ్రమంత్యాః । స్పర్శః । ప్రియాః । సుత్యజః । ఇతి । అవేత్య । చతుష్పథస్య । ఆభరణం । బభూవ । లోకావలోకాయ । సతాం । ప్రదీపః.

టీక॥ సతాం = సజ్జనులకు, ప్రదీపః = దీపమైన అనగా శ్రేష్ఠుఁడైన, (సతాం = భావములకు, ప్రదీపః = ప్రకాశకుఁడైన, సః = ఆ నలుఁడు, ఇహ = అంతఃపురమందు, భ్రమంత్యాః = సంచరించుచున్న, స్త్రియాః = స్త్రీ యొక్క, స్పర్శః = స్పర్శము, ఏకం = ఉభయులకు నొక్కటిగనున్న, వర్త్మ = త్రోవను, హిత్వైవ = వదలియే, సుత్యజః = సుఖముగా విడువ సాధ్యమైనది, ఇతి = అని, అవేత్య = తెలుసుకొని, లోకావలోకాయ; లోక = సంచరించునట్టి జనమును, అవలోకాయ = చూచుటకై (లోక = జనులయొక్క, అవలోకాయ = వ్యవహారముకొఱకు) చతుష్పథస్య = నాలుగు త్రోవలు కలయునట్టి ప్రదేశమునకు, ఆభరణం = ఆభరణముగా, బభూవ = ఆయెను.

## సమాసములు :

సుత్యజః : సుఖేన త్యక్తుం శక్యః = సుత్యజః.

చతుష్పథస్య : చతుర్ణాంపథాం సమాహారః = చతుష్పథమ్. తస్య = చతుష్పథస్య.

లోకావలోకాయ : లోకానామవలోకః = లోకావలోకః. తస్మై = లోకావలోకాయ.

## భావము :

అంతఃపురమున సంచరించుచున్న యా నలుఁడచ్చట సంచరించు స్త్రీల స్పర్శను తొలగించుకొనుటకై స్త్రీలు నడచెడి త్రోవనుఁ దాను వదలివేయుటయే సులభమైన యుపాయముగా భావించి, సంచరించెడి జనులనందఱినిఁ జూచుటకై నాలుగు త్రోవలు కలయునట్టి ప్రదేశమున నిలచిచూడ మొదలు పెట్టెను. వస్తువులు కనఁబడుటకై యుపయోగపడు దీపము నాలుగు త్రోవలు కలియుచోట నుంచఁబడినచో నది యెట్లు నలుత్రోవలలో నడచు జనులకుపయోగపడునో, యట్లే యా నలుఁడు, నాలుగు త్రోవలు కలియుచోట నిలిచి యచ్చట సంచరించు జనమునుఁ జూచుచుండెను. ॥౨౪॥

శ్లో॥ ఉద్వర్తయంత్యా హృదయే నిపత్య
నృపస్య దృష్టిర్న్యవృతద్ద్రుతైవ।

వియోగివైరాత్కుచయోర్నఖాంకై
రర్ధేందు లీలైర్గళహస్తితేవ॥ ౨౫

ప॥వి॥ ఉద్వర్తయంత్యాః । హృదయే । నిపత్య । నృపస్య । దృష్టిః । న్యవృతత్ । ద్రుతా । ఏవ । వియోగివైరాత్ । కుచయోః । నఖాంకైః । అర్ధేందులీలైః । గళహస్తితా । ఇవ.

టీక॥ నృపస్య = నలమహారాజుయొక్క, దృష్టిః = దృష్టి, ఉద్వర్తయంత్యాః = శరీరమునకు నలుగుపెట్టుకొనుచున్న స్త్రీయొక్క, హృదయే = వక్షఃస్థలమునందు, నిపత్య = పడి, అర్ధేందులీలైః; అర్ధేందు = అర్ధచంద్రునియొక్క, లీలైః = పోలికలుగల, కుచయోః = స్తనములయొక్క, నఖాంకైః = గోళ్ల గుఱ్ఱులచే, అనగా నఖక్షతచిహ్నములచే, వియోగివైరాత్; వియోగి = వియోగులయందలి, వైరాత్ = విరోధమువలన, ననగాఁ జంద్రత్వమువలన నేర్పడిన వైరమువలన, గళహస్తితేవ = మెడఁబట్టి చేతితో నెట్టి వేయఁబడినట్లుగా, ద్రుతా = త్వరగలదై, న్యవృతత్ = మఱలిపోయినది.

వి॥ నలదృష్టి మెడపట్టి ద్రోయఁబడకపోయినను త్రోయఁబడినదో యని చెప్పుటవలన నుత్ప్రేక్ష.

## సమాసములు :

*వియోగివైరాత్* : వియోగిషు వైరం = వియోగివైరం. తస్మాత్ = వియోగివైరాత్.

*నఖాంకైః* : నఖస్య అంకాః = నఖాంకాః. తైః = నఖాంకైః.

*అర్ధేందులీలైః*: అర్ధమిందోః = అర్ధేందుః. అర్ధేందోః లీలా యేషాం తే = అర్ధేందులీలాః. తైః = అర్ధేందులీలైః.

*గళహస్తితా* : గళే హస్తః = గళహస్తః. గళహస్తః అస్యాస్సంజాత ఇతి = గళహస్తితా.

**భావము :**

ఒకానొక స్త్రీ యంతఃపురమునందు శరీరమునకు నలుగు పెట్టుకొను చుండినది. ఆమె కుచలములపై నఖక్షతచిహ్నములు, అనగా గోటిగాయపు గుఱ్ఱులుండినవి. నలుని దృష్టి యామె హృదయముపైఁబడినది. ఆ దృష్టియామె హృదయముపైఁబడిన వెంటనే, యందలి స్తనములపైని యర్ధచంద్రాకారములగు నఖాంకములచే, మెడపట్టి త్రోయబడినట్లు గెంటివేయఁబడినదై వెంటనే మఱలి పోయినది. చంద్రుఁడు వియోగులకు వైరియగుటవలన నర్ధచంద్రాకారములైన యాగోటి గాయపు గుఱ్ఱులు, వియోగియైన నలునియొక్క దృష్టిని గెంటివేసినవో యనునట్లు నలుని దృష్టి మఱలి పోయినది. వస్తుస్థితిలో నలుని దృష్టి యామె హృదయముపైఁబడి స్తనములపైని నఖక్షతములనుఁ జూడగనే పరస్త్రీ మర్మావయవములనుఁ జూచుట పాపమనియెంచి తనంతటనే మఱలిపోయినది. కాని మెడ పట్టి గెంటివేయఁ బడలేదు. నఖక్షతములర్ధచంద్రునిఁ బోలియుండుటవలనను, చంద్రుఁడు వియోగులకు వైరియగుటవలనను నవి మెడపట్టి త్రోయఁబడినట్లు ఉత్ప్రేక్షింపఁబడినవి. ॥౨౫॥

శ్లో॥ తన్వీముఖం ద్రాగధిగత్య చంద్రం
వియోగిన స్తస్య నిమీలితాభ్యాం।
ద్వయం ద్రఢీయః కృతమీక్షణాభ్యాం
తదిందుతా చ స్వసరోజతా చ॥ ౨౬

ప॥వి॥ తన్వీముఖం । ద్రాక్ । అధిగత్య । చంద్రం । వియోగినః । తస్య । నిమీలితాభ్యాం । ద్వయం । ద్రఢీయః । కృతమ్ । ఈక్షణాభ్యాం । తదిందుతా । చ । స్వసరోజతా । చ.

టీక॥ తన్వీముఖం = స్త్రీముఖమును, చంద్రం = చంద్రుని, ద్రాక్ = హఠాత్తుగా, అధిగత్య = చూచి, నిమీలితాభ్యాం = (ప్రాపభయముచే) మూసుకొనఁబడిన, వియోగినః = వియోగియైన, తస్య = అతనియొక్క, ఈక్షణాభ్యాం = నేత్రములతో, తదిందుతా; తత్ = ఆ స్త్రీయొక్క ముఖమునకు, ఇందుతా = చంద్రత్వము, స్వసరోజతాచ; స్వ = తమకు, సరోజతాచ = తామరపూవులుగ నుండుటయు, ద్వయం = ఈ రెండు, ద్రఢీయః = మిక్కిలి దృఢమైనదిగా, కృతం = చేయఁబడినది.

వి॥ స్త్రీ ముఖమున చంద్రత్వమునకును, నలుని కన్నులయందు పద్మత్వమున కును దార్ఢ్యమేర్పడక పోయినను, దార్ఢ్యమేర్పడినట్లు చెప్పుట వలన నుత్ప్రేక్ష. దృఢీకరణమునకు కన్నులు మూయుట హేతువుగాఁ జెప్పుట వలనహేతూత్ప్రేక్ష. తన్వీముఖమను చంద్రునిఅనుచోటవ్య స్తరూపకము.

సమాసములు :

తన్వీముఖమ్ : తన్వ్యాః ముఖమ్ = తన్వీముఖమ్.

ద్రఢీయః : అతిశయేన దృఢమ్ = ద్రఢీయః.

తదిన్దుతా : ఇందోర్భావః = ఇందుతా. తస్య ఇందుతా = తదిందుతా.

స్వసరోజతా : సరసి జాయేతే ఇతి సరోజే. సరోజయోర్భావః = సరోజతా. స్వయోః సరోజతా = స్వసరోజతా.

భావము :

అంతఃపురమందలి యొక స్త్రీయొక్క ముఖమునుఁ జంద్రునిఁ జూచి నలుని కన్నులను పద్మములు ముకుళించినవి. చంద్రునిఁ జూచి పద్మములు ముకుళించుట సహజము గదా! అనగా పరస్త్రీ ముఖమునుఁ జూడఁబోయి యది పాపహేతువని నలుఁడు తన కన్నులను మూసికొనెనని యుద్దేశము. కాని యిట యా స్త్రీయొక్క ముఖము చంద్రుడు కానిచో, నలుని కన్నులను పద్మములు ముకుళింపవు గదా! కాన నామె మోము చంద్రుఁడగుటయు నీతని కన్నులు పద్మములగుటయు ధ్రువపడుచున్నవి. అట్లు కానిచో నామె మోమునుఁ జూచి నపుడవి యేల ముడుచుకొని పోవలసివచ్చినవి? ॥౨౬॥

శ్లో॥ చతుష్పథే తం వినిమీలితాక్షం
చతుర్దిగేతాస్సుఖమగ్రహీష్యన్।
సంఘట్య తస్మిన్ భృశభీనివృత్తా
స్తా ఏవ తద్వర్త్మ న చేదదాస్యన్॥ ౨౭

ప॥వి॥ చతుష్పథే । తం । వినిమీలితాక్షం ః చతుర్దిగేతాః । సుఖమ్ । అగ్ర

హీష్యన్ । సంఘట్య । తస్మిన్ । భృశభీనివృత్తాః । తాః । ఏవ । తద్వర్త్మ । న । చేత్ । అదాస్యన్.

టీక॥ చతుష్పథే = నలుత్రోవలు కలియుచోటునందు, నిమీలితాక్షం; నిమీలిత = మూయఁబడిన, అక్షం = కన్నులుగల్గిన, తం = ఆ నలుని, చతుర్దిగేతాః; చతుర్దిక్ = నాలుగు దిక్కులనుండి, ఏతాః = వచ్చినట్టి, తాః = ఆ స్త్రీలు, సుఖమ్ = సుఖముగా, అగ్రహీష్యన్ = గ్రహించియే యుందురు. తస్మిన్ = ఆ కాలమునందు, సంఘట్య = డీకొని, భృశభీనివృత్తాః; భృశ = అధికమైన, భీ = భయముతో, నివృత్తాః = మఱలినట్టి, తాఏవ = ఆస్త్రీలే, తద్వర్త్మ; తత్ = ఆనలు నికి, వర్త్మ = మార్గమును, నాఽదాస్యన్‌చేత్ = ఇవ్వక యున్నచో, అని పూర్వముతో నన్వయించుకొనవలయును. ఇచ్చట అగ్రహీష్యన్, అదాస్యన్ - అనునవి హేతుహేతుమద్భావార్థమున ల్ఙ్లులు. తాః వర్త్మనాఽదాస్యన్ చేత్ = ఆ స్త్రీలు త్రోవ యీయక యున్నచో, సుఖమగ్రహీష్యన్ = సుఖముగా నలునిఁ బట్టుకొనెడి వారు. కాని యతనితో డీకొనుటవలన నది భూతమని భయపడి పాఱిపోవుటచే వారతనికిఁ ద్రోవనిచ్చిరి. కాన నతనినిఁ బట్టుకొనలేక పోయిరి. ఇట పట్టు కొనలేకపోవుట యను హేతుమత్తునకు, అనగా కార్యమునకు త్రోవ యిచ్చుట హేతువుగాఁ జెప్పఁబడినందువలన హేతు హేతుమద్భావార్థకమగు ల్ఙ్లులు రెండు ప్రయోగింపఁబడినవి.

## సమాసములు

చతుష్పథే : చతుర్ణాం పథాం సమాహారః = చతుష్పథం. తస్మిన్ = చతుష్పథే.

వినిమీలితాక్షమ్ : వినిమీలితే అక్షిణీ యస్య సః = వినిమీలితాక్షః. తమ్ = వినిమీలితాక్షమ్.

చతుర్దిగేతాః : చతస్రశ్చ తాః దిశశ్చ = చతుర్దిశః. చతుర్దిగ్భ్యః ఏతాః = చతుర్దిగేతాః.

భృశభీనివృత్తాః : భృశా చ సా భీశ్చ = భృశభీః. భృశభియా నివృత్తాః = భృశభీనివృత్తాః.

*తద్వర్త్మ :* తస్య వర్త్మ = తద్వర్త్మ. తత్ = తద్వర్త్మ.

**భావము :**

శరీరములు డీకొనిన పిదప నా స్త్రీలు కన్నులు మూసికొనిన నలునిఁ బట్టుకొనవచ్చును గదా. వాస్తవమే పట్టుకొని యుండవచ్చును. నాలుగు దిక్కుల నుండి వచ్చిన స్త్రీలకిది సులభమే. కాని యీ నలువైపులనుండి వచ్చెడి స్త్రీ శీతనితో డీకొనగనే యితఁడేదియో భూతమని భయపడి పాఱిపోవ నారంభించిరి. వారెప్పుడు భయముతోఁ బాఱిపోయిరో, అప్పుడే వారు నలునకు త్రోవనిచ్చిన వారైరి. అందువలన నలుఁడు తప్పించుకొని పోవుట కవకాశమేర్పడినందువలన నాతనిని వారు పట్టుకొనలేక పోయిరి. ॥౨౭॥

శ్లో॥ సంఘట్టయంత్యాస్తరసాత్మభూషా
హీరాంకురప్రోతదుకూలహారీ।
దిశా నితంబం పరిధాప్య తన్వ్యా
స్తత్పాపసంతాపమవాప భూపః॥ ౨౮

ప॥వి॥ సంఘటయంత్యాః । తరసా । ఆత్మభూషాహీరాంకురప్రోతదుకూలహారీ । దిశా । నితంబం । పరిధాప్య । తన్వ్యాః । తత్పాపసంతాపమ్ । అవాప । భూపః.

టీక॥ తరసా = వేగముతో, సంఘట్టయంత్యాః = డీకొనుచున్న, తన్వ్యాః = స్త్రీయొక్క, ఆత్మభూషాహీరాంకురప్రోతదుకూలహారీ; ఆత్మ = తనదగు, భూషా = అభరణములలోని, హీర = వజ్రమణులయొక్క, అంకుర = కొనలయందు, ప్రోత = తగుల్కొనిన, దుకూల = వలువను, హారీ = హరించుచున్న, భూపః = నలమహారాజు, నితంబం = ఆ స్త్రీ యొక్క కటిభాగమును, దిశా = దిక్కుతో, పరిధాప్య = పరిధానము గల్గునట్లు-అనగా దిగంబరమగునట్లుచేసి, తత్పాపసంతాపమ్; తత్పాప = ఆ పాపమునకు, సంతాపం = దుఃఖమును, అవాప = పొందెను.

**సమాసములు :**

*ఆత్మభూషాహీరాంకురప్రోతదుకూలహారీ :* ఆత్మనః భూషాః = ఆత్మభూషాః. హీరాణామంకురాః = హీరాంకురాః. ఆత్మభూషాణాం హీరాంకురాః =

ఆత్మభూషాహీరాంకురాః. ఆత్మభూషాహీరాంకురేషు ప్రోతమ్ = ఆత్మభూషాహీరాంకురప్రోతం. ఆత్మభూషాహీరాంకురప్రోతమ్, చ తత్ దుకూలం చ = ఆత్మభూషాహీరాంకురప్రోతదుకూలం. ఆత్మభూషాహీరాంకురప్రోత దుకూలం హరతీతి = ఆత్మభూషాహీరాంకురప్రోతదుకూలహారీ.

తత్పాపసంతాపమ్ : తస్య పాపమ్ = తత్పాపమ్. తత్పాపస్య సంతాపః = తత్పాపసంతాపః. తమ్ = తత్పాపసంతాపమ్.

భూపః : భువం పాతీతి = భూపః.

**భావము :**

ఒకానొక స్త్రీ తన్ను వేగముగా డీకొనుటచే నామె వలువ తన యాభరణములయందలి వజ్రమణుల కొనలనుఁ దగుల్కొని లాగఁబడుటవలన వీడిపోయినది. అందువలన నామెకప్పుడు దిక్కే వలువయైనది. అట్లామె తనవలన దిసమొలయైనందులకు పాపము సంభవించునను భయముతో నా నలుఁడు మిగుల వగచెను. ॥౨౮॥.

శ్లో॥ హతః కయా చిత్పథి కందుకేన
సంఘట్య భిన్నః కరజైః కయాఽపి ।
కయా చనాక్తః కుచకుంకుమేన
సంభుక్తకల్పస్స బభూవ తాభిః॥ ౨౯

ప॥వి॥ హతః । కయా । చిత్ । పథి । కందుకేన । సంఘట్య । భిన్నః । కరజైః । కయా । అపి । కయా । చన । అక్తః । కుచకుంకుమేన । సంభుక్తకల్పః । సః । బభూవ । తాభిః.

టీక॥ సః = ఆ నలుఁడు, పథి = త్రోవయందు, కయాచిత్ = ఒకానొక స్త్రీచే, కందుకేన = బంతిచే, హతః = కొట్టఁబడెను. కయాఽపి = ఇంకొకతెచే, సంఘట్య = మొత్తుకొని, కరజైః = గోళ్లచే, భిన్నః = గాయపఱుపఁబడెను. కయాచన = మఱియొక స్త్రీచే, కుచకుంకుమేన; కుచ = స్తనములయందలి, కుంకుమేన = కుంకుమ పుష్పలేపముచే, అక్తః = పూయఁ

బడినవాఁడాయెను. (ఇట్లు), తాభిః = ఆ స్త్రీలచే, సంభుక్తకల్పః = ఇంచుమించు సంభోగింపఁబడిన వాఁడుగనే, బభూవ = అయెను.

సమాసములు :

కుచకుంకుమేన : కుచయోః కుంకుమం = కుచకుంకుమం. తేన = కుచకుంకుమేన.

సంభుక్తకల్పః : ఈషత్ సంభుక్తః = సంభుక్తకల్పః.

భావము :

ఆ నలుఁడు త్రోవన నిలచియున్నప్పుడొక్క స్త్రీ బంతి యాడుటచే నది యతనికి తగిలినది. మఱియొకస్త్రీ త్రోవనున్న యాతనిని డీకొని గోళ్లచే గాయపఱచినది. ఇంకొకతె, తనకు చములకుఁ బట్టించిన కుంకుమలేపము నతని కలదినది. ఇట్లు, బంతియాటను, నఖక్షతములను, కుంకుమలేపమునుఁ బొందిన యా నలుఁడు వారితో సంభోగసుఖము ననుభవించినట్లే యైనది. ॥౨౯॥

శ్లో॥ ఛాయామయః ప్రైక్షి కయాఽపి హారే
నిజే స గచ్ఛన్నథ నేక్ష్యమాణః।
తచ్చిత్తయాంతర్నిరచాయి చారు
స్వస్యైవ తన్వ్యా హృదయం ప్రవిష్టః॥ ౩౦

ప॥వి॥ ఛాయామయః। ప్రైక్షి । కయా । అపి । హారే । నిజే । సః । గచ్ఛన్। అథ । నేక్ష్యమాణః । తచ్చిత్తయా । అంతః । నిరచాయి । చారు । స్వస్య । ఏవ । తన్వ్యా । హృదయం । ప్రవిష్టః.

టీక॥ కయాపి = ఒకానొక, స్త్రియా = స్త్రీచే, నిజే = తనదైన, హారే = హారమందు, ఛాయామయః = ప్రతిబింబరూపముగా, సః = ఆ నలుఁడు, ప్రైక్షి = చూడఁబడెను. అథ = పిదప, గచ్ఛన్ = తొలగుచు, (కావుననే)నేక్ష్యమాణః = చూడఁబడనివాఁడై, తచ్చిత్తయా; తత్ = ఆ నలుని, చిత్తయా = మనస్సునందుంచుకొనిన, తన్వ్యా = స్త్రీచే. స్వస్యైవ = తనయొక్కయే, హృదయం = మనస్సును, ప్రవిష్టఇతి = ప్రవేశించినాఁడని

అంతః = లోపల, చారు = చక్కగా, నిరచాయి = నిశ్చయించుకొనఁ బడెను.

వి॥ ప్రతిబింబ రూపమునను్న నలుఁడు హారమునుండి తొలగిపోయెనే కాని, యామె హృదయమునుండి తొలగలేదని చెప్పుటవలన సౌంద ర్యాతిశయోక్తి.

## సమాసములు :

ఛాయామయః : ఛాయాయాః వికారః = ఛాయామయః.

నేక్ష్యమాణః : న ఈక్ష్యమాణః = నేక్ష్యమాణః.

తచ్చిత్తయాః సః చిత్తే యస్యాస్సా = తచ్చిత్తా. తయా = తచ్చిత్తయా.

## భావము :

ఆ నలుఁడొకానొక స్త్రీకి హారమందు ప్రతిబింబముగాఁ గనఁబడెను. వెంటనే తొలగిపోవుట వలన మఱల కనఁబడలేదు. ఆతనిని తన మనస్సు నందుంచుకొనిన యా స్త్రీ యతఁడు కనఁబడకపోగనే, యతఁడు తన హృదయ మందే ప్రవేశించెనని తనలో చక్కగా నిశ్చయించుకొనినది. ॥30॥

శ్లో॥ తచ్ఛాయసౌందర్యనిపీతధైర్యాః
ప్రత్యేకమాలింగదమూ రతీశః।
రతిప్రతిద్వంద్వితమాసు నూనం
నామూషు నిర్ణీతరతిః కథం చిత్॥ 31

ప॥వి॥ తచ్ఛాయసౌందర్యనిపీతధైర్యాః । ప్రత్యేకమ్ । ఆలింగత్ । అమూః । రతీశః । రతిప్రతిద్వంద్వితమాసు । నూనం । న । అమూషు । నిర్ణీత రతిః । కథంచిత్.

టీక॥ రతీశః = మన్మథుఁడు, తచ్ఛాయ సౌందర్యని పీతధైర్యాః; తత్ = ఆ నలునియొక్క, ఛాయ = మణిభూములపైని ప్రతిబింబముయొక్క, సౌంద ర్య = సౌందర్యముచే, నిపీత = అపహరింపఁబడిన, ధైర్యాః = ధైర్యము

గల్గిన,అమూః = ఆ స్త్రీలను, ప్రత్యేకం = ఒక్కొక్కతెనుగా, ఆలింగత్ = ఆలింగనముఁజేసుకొనెను. రతిప్రతిద్వంద్వితమాసు; రతి = రతీదేవికి, ప్రతిద్వంద్వితమాసు = సమానులైన, అమూషు = స్త్రీలమధ్య, రతీశః = మన్మథుఁడు, కథంచిదపి = ఎట్లయినను, నిర్ణీతరతిః; నిర్ణీత = నిర్ణయింపఁబడిన, రతిః = తన భార్యయైన రతీదేవినిఁ గలవాఁడుగ. నాఽభూత్ = కాలేదు. నూనం = నిశ్చయము.

వి॥ రతికి సమానులుగ నున్న యా స్త్రీలలో మన్మథుఁడు తన భార్యయైన రతీదేవినిఁ గుర్తించజాలనందున నందఱిని ప్రత్యేకముగాఁ గౌగలించెనని చెప్పుచు ప్రత్యేకముగాఁ గౌగలించుకొనుటకు రతీదేవిని గుర్తింపక పోవుట హేతువు కాకపోయినను హేతువుగఁ జెప్పుటవలన హేతూత్ప్రేక్ష. వ్యంజకమైన "నూనం" శబ్దమునుఁ బ్రయోగించుట వలన నది వాచ్యము.

## సమాసములు :

*తచ్ఛాయసౌందర్యనిపీతధైర్యాః :* తస్య ఛాయా = తచ్ఛాయం. తచ్ఛాయస్య సౌందర్యం = తచ్ఛాయ సౌందర్యం. తచ్ఛాయసౌందర్యేణ నిపీతం = తచ్ఛాయసౌందర్యనిపీతం. ధీరస్య భావః = ధైర్యం. తచ్ఛాయసౌందర్యనిపీతం ధైర్యం యాసాం తాః = తచ్ఛాయసౌందర్యనిపీతధైర్యాః. తాః తచ్ఛాయసౌందర్యనిపీతధైర్యాః.

*రతిప్రతిద్వంద్వితమాసు:* అత్యంతః ప్రతిద్వంద్విన్యః = ప్రతిద్వంద్వితమాః. రతేః ప్రతిద్వంద్వితమాః = రతిప్రతిద్వంద్వితమాః. తాసు = రతిప్రతిద్వంద్వితమాసు.

*నిర్ణీతరతిః :* నిర్ణీతా రతిః యేన సః = నిర్ణీతరతిః.

## భావము :

నలుని ప్రతిబింబమును మణి భూములలోఁ గాంచిన యా యంతఃపుర స్త్రీలతని సౌందర్యమునుఁ జూచి ధైర్యమునుఁ గోల్పోయిరి. అట్లు ధైర్యముఁ గోల్పోయిన యా స్త్రీలందఱును, రతీదేవిని బోలియుండిరి. అందువలన మన్మ

ఘు డు వారిలోఁన పత్నియైన రతియెవ్వతెయో గుర్తింపలేనివాఁడై వారందఱిని, గౌగలించుకొనెను. అనగా, నలుని ప్రతిబింబమునందతని సౌందర్యముఁగాంచి ధైర్యముఁగోల్పోయిన యంతఃపుర కాంతలకు మన్మథవికారము గల్గినదని యాశయము. ॥౩౦॥

శ్లో॥ తస్మాదదృశ్యాదపి నాఽతిబిభ్యు
స్తచ్ఛాయరూపాహితమోహలోలాః।
మన్యంత ఏవాఽఽదృతమన్మథాజ్ఞాః
ప్రాణానపి స్వాన్ సుదృశస్తృణాని॥ ౩౧

ప॥వి॥ తస్మాత్ । అదృశ్యాత్ । అపి । న। అతిబిభ్యుః । తచ్ఛాయరూపాహిత మోహలోలాః । మన్యంతే । ఏవ । ఆదృతమన్మథాజ్ఞాః । ప్రాణాన్ । అపి । స్వాన్ । సుదృశః । తృణాని.

టీక॥ సుదృశః = మంచి నేత్రములుగల యా స్త్రీలు, తచ్ఛాయరూపాహిత మోహలోలాః; తచ్ఛాయ = ఆ నలుని ప్రతిబింబమందలి, రూప = సౌందర్యముచే, ఆహిత = కల్గింపఁబడిన, మోహ = మోహము గల వారును, లోలాః = అందువలననే ఆసక్తిగల్గిన వారై, అదృశ్యాదపి = కనఁబడనటువంటి వాఁడైనను, తస్మాత్ = ఆ నలునివలన, నాఽతి బిభ్యుః = ఎక్కువ భయపడలేదు. ఆదృతమన్మథాజ్ఞాః; ఆదృత = ఆదరింపఁబడిన, మన్మథాజ్ఞాః = మన్మథుని ఆదేశములుగల్గిన వారై, స్వాన్ = స్వకీయములైన, ప్రాణానపి = ప్రాణములను సైతము, తృణాని = గడ్డిపోచలుగ, మన్యంత ఏవ = తలంచుచునే యుండిరి.

## సమాసములు :

అదృశ్యాత్ : ద్రష్టుం యోగ్యః = దృశ్యః. తస్మాత్ = అదృశ్యాత్.

తచ్ఛాయరూపాహితమోహలోలాః : తస్య ఛాయా = తచ్ఛాయం. తచ్ఛాయస్య రూపం = తచ్ఛాయరూపం. తచ్ఛాయరూపే ఆహితః = తచ్ఛాయ రూపాహితః. తచ్ఛాయరూపాహితః మోహః యాసాం తాః = తచ్ఛాయరూపాహి తమోహాః. తచ్ఛాయరూపాహితమోహాశ్చ తాః లోలాశ్చ = తచ్ఛాయరూపాహిత మోహలోలాః.

ఆదృతమన్మథాజ్ఞాః : మన్మథస్య ఆజ్ఞాః = మన్మథాజ్ఞాః. ఆదృతాః మన్మథాజ్ఞాః. యాభిస్తాః = ఆదృతమన్మథాజ్ఞాః.

సుదృశః : శోభనే దృశౌ యాసాం తాః = సుదృశః.

**భావము :**

ఆ నలుఁడు కానరాక పోయినప్పటికిని యతని బింబములోని సౌందర్యముఁగాంచి మోహముఁ జెంది యతని పైనను రక్తిఁజెందిన యా స్త్రీలకు నతని వలన భయము గలుగలేదు. ఆతనియందుఁ గల్గిన యనురాగముచే నతఁడదృశ్యుఁడైనను వారు భయపడలేదు. శృంగార రసముచే భయానక రసము తిరస్కరింపఁబడినది. మన్మథునికి లోబడిన యా స్త్రీలు తమ ప్రాణములను సైతము తృణీకరించి యా నలుని సంగమమును కోరిరి. అతని సంగమమును కోరినందువలన నతఁడదృశ్యుఁడైనను వారికి భయము గలుగలేదు. ॥౩౨॥

శ్లో॥ జాగర్తి తచ్ఛాయదృశాం పురా యః
స్పృష్టే చ తస్మిన్ విససర్ప కంపః।
ద్రుతం గతే తత్పదశబ్దభీత్యా
స్వహస్తితశ్చారుదృశాం పరం సః॥ ౩౩

ప॥వి॥ జాగర్తి। తచ్ఛాయదృశాం । పురా । యః । స్పృష్టే । చ । తస్మిన్ । విససర్ప । కంపః । ద్రుతం । గతే। తత్పదశబ్దభీత్యా। స్వహస్తితః । చారుదృశాం । పరం । సః.

టీక॥ పురా = పూర్వము, తచ్ఛాయదృశాం. తత్ = ఆ నలునియొక్క, ఛాయ = సౌందర్యమును, దృశాం = చూచుచున్న, చారుదృశాం = అందమైన చూపులుగల స్త్రీలకు, యః = ఏ, కంపః = వణకు, జాగర్తి = స్ఫురించునో, తస్మిన్ = అతఁడు, స్పృష్టేచసతి = స్పృశింపఁబడగా, విససర్ప = వ్యాపించెనో, సః = ఆకంపము, తస్మిన్ = ఆ నలుఁడు, ద్రుతం = శీఘ్రముగా, గతేసతి = వెడలిపోగా. తత్పదశబ్దభీత్యాపరం; తత్ = ఆతనియొక్క, పద = అడుగులయొక్క, శబ్ద = చప్పుడువలన,

భీత్యాపరం = భయముచేతనే, స్వహస్తితః = తన హస్తమునందింపఁ బడినదిగా, అనగా ప్రబలముచేయఁబడినదిగా, నాయెను.

**సమాసములు:**

తచ్ఛాయదృశాం : తస్య ఛాయా = తచ్ఛాయం. తచ్ఛాయం పశ్యంతీతి = తచ్ఛాయదృశః. తాసాం = తచ్ఛాయదృశామ్.

తత్పదశబ్దభీత్యా : తస్య పదే = తత్పదే. తత్పదయోః శబ్దః = తత్పదశబ్దః. తత్పదశబ్దాత్ భీతిః = తత్పదశబ్దభీతిః. తయా = తత్పదశబ్దభీత్యా.

స్వహస్తితః : స్వస్య హస్తౌ అస్య సంజాతౌ ఇతి = స్వహస్తితః.

చారుదృశామ్ : చారూ దృశౌ యాసాం తాః = చారుదృశః. తాసాం = చారుదృశామ్.

**భావము :**

తొలుత నా నలుని ప్రతిబింబమును జూచు నట్టి యా యువతులకు కంపము గల్గినది. అతనిని వారు తాకగనే యా కంపము వ్యాపింపఁదొడగినది. వారి తాకిడిచే నతడు వేగముగాఁ తొలగిపోగా నతని యడుగుల చప్పుడువలన భయముచే నా కంపము ప్రబలమైనది. ॥౩౩॥

శ్లో॥ ఉల్లాస్యతాంస్పృష్టనలాంగమంగం
తాసాం నలచ్ఛాయపిబాఽపి దృష్టిః।
అశ్మైవ రత్యాస్తదనర్తి పత్యా
ఛేదేఽప్యబోధం యదహర్షి లోమ॥ ౩౪

ప॥వి॥ ఉల్లాస్యతాం । స్పృష్టనలాంగమ్ । అంగం । తాసాం । నలచ్ఛాయపిబా । అపి । దృష్టిః । అశ్మైవ । రత్యాః । తత్ । అనర్తి । పత్యా । ఛేదే । అపి । అబోధం । యత్ । అహర్షి । లోమ.

టీక॥ రత్యాః = రతీదేవియొక్క, పత్యా = భర్తయైన మన్మథునిచే, స్పృష్టనలాంగం; స్పృష్ట = తాకఁబడిన, నలాంగం = నలుని దేహముగల్గిన,

తాసాం = ఆ స్త్రీలయొక్క, అంగం = శరీరము, ఉల్లాస్యతాం = ఉల్లాస మునుఁ బొందునుగాత. నలచ్ఛాయపిబా; నల = నలునియొక్క, ఛాయ = ప్రతిబింబమును, పిబా = చూచునట్టి, తాసాం = ఆ స్త్రీల యొక్క, దృష్టిరపి = దృష్టియు, ఉల్లాస్యతాం = ఉల్లాసమునుఁ బొందింపఁబడుఁ గాత. అనగా ఉల్లాసమునుఁ బొందును గాత. ఛేదేఽపి = ఖండించినను, అబోధం = జ్ఞానములేని, లోమ = రోమసమూహము, అహర్షి ఇతి యత్ = హర్షమునుఁ బొందింపఁబడున దేదిగలదో, తత్ = అందువలన, అశ్మైవ = జాతియే, అనర్తి = నృత్యము చేయింపఁబడినది.

వి॥ ఇచ్చట రోమములను హర్షింపఁజేయుట జాతిని నృత్యముఁ జేయించు టతో సమానమని చెప్పుటవలన రోమహర్షణ వాక్యార్థమునకును, అశ్మ నర్తన వాక్యార్థమునకును సాదృశ్యము సిద్ధించుటవలన వాక్యార్థవృత్తి నిదర్శనాలంకారము.

## సమాసములు :

స్పృష్టనలాంగం : నలస్య అంగం = నలాంగం. స్పృష్టం నలాంగం యేన తత్ = స్పృష్టనలాంగమ్.

నలచ్ఛాయపిబా : నలస్య ఛాయా = నలచ్ఛాయం. నలచ్ఛాయం పిబ తీతి = నలచ్ఛాయపిబా.

అబోధమ్ : అవిద్యమానః బోధః యస్య తత్ = అబోధమ్.

## భావము :

రతికి పతియైన మన్మథుఁడు స్పృశించినట్టి నలశరీరమునుఁ దాకిన యా స్త్రీలయొక్క దేహముల్లాసమునుఁ బొందవచ్చును. నలుని ప్రతిబింపమునుఁ జూచు నా స్త్రీల దృష్టియు నుల్లాసమునుఁ బొందవచ్చును. ఏలయనగా నివి రెండు చేతనములు. కాని అచేతనములైన రోమములు సంతోషముతో నిక్కఁబొడుచుకొనుట మాత్రమాశ్చర్యము. అది, జాతిని నృత్యముఁ జేయించి నట్లున్నది. అచేతనములగు రోమములకే హర్షముఁ గల్గించిన మన్మథుఁడు జాతినిఁగూఁడ నృత్యముఁ జేయింపఁగలఁడు. కాన నతనికి నసాధ్యమైనది లేదు. ॥౩౮॥

శ్లో॥ యస్మిన్నలస్పృష్టకమేత్య హృష్టా
భూయోఽపి తం దేశమగాన్మృగాక్షీ।
నిపత్య తత్రాస్య ధరారజఃస్థే
పాదే ప్రసీదేతి శనైరవాదీత్॥ ౩౮

ప॥వి॥ యస్మిన్ । నలస్పృష్టకమ్ । ఏత్య । హృష్టా । భూయః । అపి । తం । దేశమ్ । అగాత్ । మృగాక్షీ । నిపత్య । తత్ర । అస్య । ధరా రజస్థే । పాదే । ప్రసీద । ఇతి । శనైః । అవాదీత్.

టీక॥ మృగాక్షీ = లేడి కన్నులుగల యొక యువతి, యస్మిన్ = ఏ ప్రదేశమందు, నలస్య = నలునియొక్క, స్పృష్టకం = ప్రత్యేకమైన కౌగలింపును, ఏత్య = పొంది, హృష్టా = సంతోషించినదో, తం = ఆ, దేశం = ప్రదేశమును గూర్చి, భూయోఽపి = మఱలను, అగాత్ = పోయెను. కింతు = కాని, తత్ర = ఆ ప్రదేశమందు, ధరారజఃస్థే; ధరా = భూమియొక్క, రజఃస్థే = ధూళియందున్న, అస్య = ఈ నలుని యొక్క, పాదే = పాదముల జాడయందు, నిపత్య = వడి, ప్రసీద = నాకు ప్రసన్నుఁడవు కమ్ము అనగా నన్ను మఱల స్పృశించి యనుగ్రహింపుము, ఇతి = అని, శనైః = మెల్లగా, అవాదీత్ = పలికెను.

వి॥ స్పృష్టకమనగా నాలింగనవిశేషము. స్త్రీ పురుషులొండొరుల కొండొరు లెదురైనపు డొక శరీరమునకు మఱియొక శరీరము దాకినచో స్పృష్టకమని రతి రహస్యము.

## సమాసములు :

నలస్పృష్టకమ్ : నలస్యస్పృష్టకమ్ = నలస్పృష్టకమ్. తత్ = నలస్పృష్టకమ్.

మృగాక్షీ : మృగస్య అక్షిణీవ అక్షిణీ యస్యాస్సా = మృగాక్షీ.

ధరారజఃస్థే : ధరాయాః రజః = ధరారజః. ధరారజసి తిష్ఠతీతి = ధరారజః స్థః. తస్మిన్ = ధరారజఃస్థే.

**భావము :**

ఒకానొక యువతి నలుని కెదురేగుటవలన నతని శరీర స్పర్శముచే నా లింగనమును బొంది హర్షించినదై, మఱల నతని యాలింగనమును బొందు టకై యా స్థలమునకు వచ్చి యతని యడుగుజాడలను మఱల తన్ను నాలింగ నముచే ననుగ్రహింపమని మెల్లగా ప్రార్థించినది. ॥౩౫॥

శ్లో॥ భ్రమన్నముష్యాముపకారికాయా
మాయస్య భైమీవిరహాత్క్రశీయాన్।
అసౌ ముహుస్సౌధపరంపరాణాం
వ్యధత్త విశ్రాంతిముపత్యకాసు॥ ౩౬

ప॥వి॥ భ్రమన్ । అముష్యామ్ । ఉపకారికాయామ్ । ఆయస్య । భైమీవిరహాత్ । క్రశీయాన్ । అసౌ । ముహుః । సౌధపరంపరాణాం । వ్యధత్త । విశ్రాంతిమ్ । ఉపత్యకాసు.

టీక॥ భైమీవిరహాత్; భైమీ = దమయంతియొక్క, విరహాత్ = వియోగము వలన, క్రశీయాన్ = మిక్కిలి కృశించిన, అసౌ = ఈ నలుడు, అము ష్యాం = ఆ, ఉపకారికాయాం = రాజభవనమందు, భ్రమన్ = సంచ రించుచు, ఆయస్య = అలసటజెంది, ముహుః = మఱల మఱల, సౌధప రంపరాణాం = వరుసలు తీఱిన మేడలయొక్క, ఉపత్యకాసు = సమీప ప్రదేశములయందు, విశ్రాంతిం = విశ్రాంతిని, వ్యధత్త = చేసెను.

**సమాసములు :**

*భైమీవిరహాత్ :* భీమస్య అపత్యం స్త్రీ = భైమీ. భైమ్యాః విరహః = భైమీవిరహః. తస్మాత్ = భైమీవిరహాత్.

*క్రశీయాన్ :* అత్యంతం కృశః = క్రశీయాన్.

*సౌధపరంపరాణామ్ :* సౌధానాం పరమ్పరాః = సౌధపరంపరాః. తాసాం = సౌధపరంపరాణామ్.

**భావము:**

ఈ నలుఁడు దమయంతియొక్క యెడఁబాటుచే మిక్కిలి కృశించిన వాఁడై రాజభవనమునంచు సంచరించుచు నలసిపోయి, వరుసలు తీరిన మేడల యొక్క సమీప భూములయందు విశ్రమించెను. ॥౩౬॥

ఉల్లిఖ్యహంసేన దళే దళిన్యా
స్తస్మై యథాదర్శి తథైవ భైమీ।
తేనాఽభిలిఖ్యోపహృతస్వహారా
కస్యా న దృష్టాఽజని విస్మయాయ॥ ౩౭

ప॥వి॥ ఉల్లిఖ్య । హంసేన । దళే । నళిన్యాః । తస్మై । యథా । అదర్శి । తథా । ఏవ । భైమీ । తేన । అభిలిఖ్య । ఉపహృతస్వహారా । కస్యాః। న । దృష్టా । అజని । విస్మయాయ.

టీక॥ హంసేన = హంసచే, నళిన్యాః = తామరతీగెయొక్క, దళే = ఆకునందు, భైమీ = దమయంతి, యథా = ఏ ప్రకారముగాఁ, ఉల్లిఖ్య = వ్రాయఁబడి, తస్మై = ఆ నలునికి, ఆదర్శి = చూపఁబడినదో, తథైవ = అట్లే, తేన = ఆ నలునిచే, అభిలిఖ్య = వ్రాయఁబడి, ఉపహృతస్వహారా; ఉపహృత = సమర్పింపఁబడిన, స్వహారా = తన హారముగలదై, దృష్టా = చూడఁబడి నదై, కస్యాః = ఎవతెకు, విస్మయాయ = ఆశ్చర్యమునకు కారణముగా, నాఽజని = కాలేదు.

**సమాసములు :**

భైమీ : భీమస్య అపత్యం స్త్రీ = భైమీ.

ఉపహృతస్వహారా : స్వస్య హారః = స్వహారః. ఉపహృతః స్వహారః యస్యాస్సా = ఉపహృతస్వహారా.

**భావము :**

ఈ విధముగా నా మేడల సమీప ప్రదేశములయందు విశ్రమించిన నలుఁడు తనకు వినోదమునకై దమయంతియొక్క చిత్రమును పూర్వము హంస

తనకు తామరాకునందు వ్రాసి చూపిన విధముగా, వ్రాసి, తన కంఠహారమును చిత్రమందలి దమయంతి కంఠమునందు వైచెను. ఆ చిత్రమునుఁ జూచినచో నేయువతికి నాశ్చర్యము గలుగదు? అందఱికిని నాశ్చర్యము గలుగును. ॥౩౭॥

శ్లో॥ కౌమారగంధీని నివారయంతీ
వృత్తాని రోమావళి వేత్రచిహ్నా।
సాలిఖ్య తేనైక్ష్యత యౌవనీయ
ద్వాస్థామవస్థాం పరిచేతుకామా॥ ౩౮

ప॥వి॥ కౌమారగంధీని । నివారయంతీ । వృత్తాని । రోమావళివేత్రచిహ్నా । సా । ఆలిఖ్య । తేన । ఐక్ష్యత । యౌవనీయద్వాస్థాం । అవస్థాం । పరిచేతు కామా.

టీక॥ తేన=ఆ నలునిచే యౌవనీయద్వాస్థాం; యౌవనీయ=యౌవనమునకు సంబంధించిన, ద్వాః=ద్వారమందును, (ప్రారంభమందును), స్థాం= ఉన్నటువంటి, అవస్థాం = దశను, అనగా ద్వారపాలకుని దశను, యౌవన ప్రవేశదశను, పరిచేతుకామా=అభ్యసింపఁగోరినదై, రోమావళివేత్రచిహ్నా; రోమావళి=నూఁగారనెడి, వేత్రచిహ్నా = బెత్తమనెడి చిహ్నముగల్గినదై, కౌమారగంధీని=బాల్యమును స్పృశించెడి, వృత్తాని= చాపలములను, నివారయంతీ=వారించుచున్న, సా = ఆ దమయంతి, ఆలిఖ్య=వ్రాయఁబడి, ఐక్ష్యత=చూడఁబడినది.

వి॥ ఇచ్చట యౌవన ప్రారంభమును యౌవనద్వారముగను, రోమావళిని బెత్తముగను రూపించుటవలన రూపకాలంకారము.

## సమాసములు :

*కౌమారగంధీని:* కుమారస్య భావః=కౌమారం. కౌమారస్య గంధః= కౌమారగంధః. కౌమారగంధః ఏషామ స్తీతి=కౌమారగంధీని. తాని=కౌమారగంధీని.

*రోమావళివేత్రచిహ్నా:* రోమ్ణామావళిః=రోమావళిః. రోమావళిరేవ

వే(త్రం=రోమవళివే(త్రం. రోమావళివే(త్రం చిహ్నం యస్యాస్సా = రోమావళి వే(త్రచిహ్నా.

*యౌవనీయద్వాఃస్థామ్ :* యౌవనస్య ఇయం=యౌవనీయా. యౌవనీయా చ సా ద్వాశ్చ=యౌవనీయద్వాః. యౌవనీయద్వారి తిష్ఠతీతి=యౌవనీయద్వాఃస్థా. తామ్=యౌవనీయద్వాఃస్థామ్.

*పరిచేతుకామా:* పరిచేతుం కామః యస్యాస్సా=పరిచేతుకామా.

**భావము :**

ఆ దమయంతి యౌవన (ప్రారంభమునందున్నది. అందువలన నామె యౌవనమునకు ద్వారపాలకురాలైనది. ద్వారపాలికకు కావలసినది వే(త్రదండము. అనగా బెత్తపుకఱ్ఱ. ఇచ్చట నామెయొక్క నూఁగారే బెత్తము. ద్వారపాలిక యితరులను లోనికి రాకుండ నివారించును గదా! అట్లే యీమె తన బాల్య చాపలమును రానీయక వారించుచున్నది. ఈ విధముగ యౌవన ద్వారపాలికయై రోమావళి యను వే(త్రదండమును ధరించి బాల్య చాపలములను లోనికి రానీయక కావలికాచుచు యౌవన (ప్రవేశము నభ్యసింపఁ గోరునదిగనున్న యా దమయంతిని అనగా బాల్యయౌవనసంధి యందున్న యా దమయంతి చిత్తరవును (వ్రాసి యానలుఁడు చూచెను. ॥౩౦॥

శ్లో॥ పశ్యాః పురంధ్రీః (ప్రతి సాం(ద్రచం(ద్ర
రజఃకృత(క్రీడకుమారచ(క్రే।
చి(త్రాణి చ(క్రేఽధ్వని చ(క్రవర్తి
చిహ్నం తదం(ఘ్రి(ప్రతిమాసు చ(క్రమ్॥ ౩౧

ప॥ వి॥ పశ్యాః । పురంధ్రీః । (ప్రతి । సాం(ద్రచం(ద్రరజః కృత(క్రీడకుమారచ(క్రే । చి(త్రాణి । చ(క్రే । అధ్వని । చ(క్రవర్తిచిహ్నం । తతం(ఘ్రి(ప్రతిమాసు । చ(క్రమ్.

టీక॥ సాం(ద్రచం(ద్రరజః కృత(క్రీడకుమారచ(క్రే; సాం(ద్ర=దట్టమైన, చం(ద్రరజః=కర్పూరపుధూళులచే, కృత=చేయఁబడిన, (క్రీడ=ఆటలుగల్గిన, కుమార=బాలురయొక్క, చ(క్రే=సంఘముగల్గిన, అధ్వని=మార్గము

నందు, చక్రవర్తిచిహ్నం; చక్రవర్తి = సార్వభౌమునియొక్క, చిహ్నం = చిహ్నమైన, తదంఘ్రిప్రతిమాసు; తత్ = ఆ నలునియొక్క, అంఘ్రి = పాదములయొక్క, ప్రతిమాను = ముద్రలయందు, చక్రం = చక్రలేఖ, పశ్యాః = చూచుచున్న, పురంధ్రీఃప్రతి = స్త్రీలనుద్దేశించి, చిత్రాణి = ఆశ్చర్యములను, చక్రే = చేసినది.

## సమాసములు :

*సాంద్రచంద్రరజఃకృతక్రీడకుమారచక్రే:* చంద్రస్యరజాంసి = చంద్రరజాంసి. సాంద్రాణి చ తాని చంద్రరజాంసి చ = సాంద్రచంద్రరజాంసి. సాంద్రచంద్రరజోభిః కృతా క్రీడా యేన తత్ = సాంద్రచంద్రరజః కృతక్రీడమ్. కుమారాణాం చక్రమ్ = కుమారచక్రమ్. సాంద్రచంద్రరజఃకృతక్రీడం కుమారచక్రం యస్మిన్ తత్ = సాంద్రచంద్రరజః కృతక్రీడకుమారచక్రమ్. తస్మిన్ = సాంద్రచంద్రరజః కృతక్రీడకుమారచక్రే.

*చక్రవర్తిచిహ్నం:* చక్రవర్తినః చిహ్నం = చక్రవర్తిచిహ్నం,

*తదంఘ్రిప్రతిమాసు :* తస్య అంఘ్రీ = తదంఘ్రీ. తదంఘ్ర్యోః ప్రతిమాః = తదంఘ్రిప్రతిమాః తాసు = తదంఘ్రిప్రతిమాసు.

## భావము :

కర్పూరపు ధూళులతో నాడుకొనెడి బాలురుగల మార్గములయందు నలుని పాదముద్రలలో చక్రవర్తి చిహ్నము చక్రరేఖలనుఁ జూచుచున్న యా స్త్రీలకు వింతలు గొల్పుచుండెనది. ॥౩౯॥

శ్లో॥ తారుణ్యపుణ్యామవలోకయంత్యో
రన్యోన్యమేణేక్షణయోరభిఖ్యామ్।
మధ్యే ముహూర్తం స బభూవ గచ్ఛ
న్నాకస్మికాచ్ఛాదనవిస్మయాయ॥ ౪౦

ప॥వి॥ తారుణ్యపుణ్యామ్ । అవలోకయంత్యోః । అన్యోన్యమ్ । ఏణేక్షణయోః । అభిఖ్యామ్ । మధ్యే । ముహూర్తం । స । బభూవ । గచ్ఛన్ । ఆకస్మికాచ్ఛాదనవిస్మయాయ.

టీక॥ తారుణ్యపుణ్యాం; తారుణ్య = యౌవనముచే, పుణ్యాం = మనోహరమైన, అన్యోన్యం = ఒండొరులనుఁగూర్చి, అభిఖ్యాం = శోభను, అవలోకయంత్యోః = చూచుచున్న, ఏణేక్షణయోః = లేడికన్నులుగల యువతుల యొక్క, మధ్యే = నడుమ, గచ్ఛన్ = వెళ్లుచున్న, సః = ఆనలుఁడు, ముహూర్తం = కొంత కాలము, ఆకస్మికాచ్ఛాదనవిస్మయాయ; ఆకస్మికాచ్ఛాదన = ఆకస్మికముగ నడ్డుతగులుటచే, విస్మయాయ = ఆశ్చర్యమునకు కారణముగా, బభూవ = ఆయెను.

వి॥ ఇరువురు స్త్రీలమధ్య వ్యవధానమునకుఁగారణము లేకపోయినను వ్యవధానమను కార్యమునుఁ జెప్పుట వలన విభావనాలంకారము.

## సమాసములు :

*తారుణ్యపుణ్యామ్ :* తరుణస్య భావః = తారుణ్యమ్. తారుణ్యేన పుణ్యా = తారుణ్యపుణ్యా, తామ్ = తారుణ్యపుణ్యామ్.

*అన్యోన్యామ్ :* అన్యశ్చ అన్యశ్చ = అన్యోన్యః. తమ్ = అన్యోన్యమ్.

*ఏణేక్షణయోః :* ఏణస్య ఈక్షణే ఇవ ఈక్షణేయయోస్తే = ఏణేక్షణే. తయోః = ఏణేక్షణయోః.

*ఆకస్మికాచ్ఛాదనవిస్మయాయ :* అకస్మాత్ భవం = ఆకస్మికమ్. ఆకస్మికం చ తత్ ఆచ్ఛాదనం చ = ఆకస్మికాచ్ఛాదనం. ఆకస్మికాచ్ఛాదనేన విస్మయః = ఆకస్మికాచ్ఛాదన విస్మయః. తస్మై = ఆకస్మికాచ్ఛాదన విస్మయాయ.

## భావము :

ఇద్దఱు యువతులు ఒండొరులయొక్క యౌవనసౌందర్యమును చూచుకొనుచున్నపు డీ నలుఁడు వారిమధ్యవెళ్లుటచే క్షణకాలము వారి మధ్య వ్యవధానమేర్పడు చుండెడిది. కంటికి కానరాని యీ వ్యవధానమువలన వారికాశ్చర్యము గలుగుచుండెడిది. ॥౪౦॥

శ్లో॥ పురః స్థితస్య క్వచిదస్య భూషా
రత్నేషు నార్యః ప్రతిబింబితాని।

వ్యోమన్యదృశ్యేషు నిజాన్యపశ్యన్
విస్మిత్య విస్మిత్యసహస్రకృత్వః॥ ౪౧

ప॥వి॥ పురః । స్థితస్య । క్వ । చిత్ । అస్య । భూషారత్నేషు । నార్యః । ప్రతిబింబితాని । వ్యోమని । అదృశ్యేషు । నిజాని । అపశ్యన్ । విస్మిత్య । విస్మిత్య । సహస్రకృత్వః.

టీక॥ క్వచిత్ = ఒక ప్రదేశమున, నార్యః = స్త్రీలు, పురః = ఎదుట, స్థితస్య = ఉన్నటువంటి, అస్య = ఈ నలునియొక్క, అదృశ్యేషు = కానరాని, భూషారత్నేషు = భూషణములయందలి రత్నములయందు, నిజాని = తమవియైన, ప్రతిబింబితాని = ప్రతిబింబములను, వ్యోమని = శూన్యదేశమున, విస్మిత్య విస్మిత్య = పలుమాఱు లాశ్చర్యపడి, సహస్రకృత్వః = వేయిమాఱులు, అనగా పెక్కు మాఱులు, అపశ్యన్ = చూచిరి.

వి॥ ఇచ్చట నిరాధారమైన శూన్యమందు ప్రతిబింబములనుఁ జూచినట్లు వర్ణించుటవలన, కారణములేక కార్యోత్పత్తి యను విభావనాలంకారము.

## సమాసములు :

అదృశ్యేషు : ద్రష్టుం యోగ్యాని = దృశ్యాని. న దృశ్యాని = అదృశ్యాని. తేషు = అదృశ్యేషు.

సహస్రకృత్వః : సహస్రం వారాన్ = సహస్రకృత్వః.

## భావము :

ఒకానొక ప్రదేశమున స్త్రీలు కంటికిఁ గానరాని నలుని యాభరణ రత్నములయందు ప్రతిఫలించిన తమ బింబములను శూన్యప్రదేశమునఁగాంచి పలుమాఱులు విస్మయముఁజెంది పెక్కుమాఱులు వానినిఁ జూచిరి. నలుఁడు కానరానందువలన నతని భూషణమణులును గానరావు గదా! కాని యా భూషణముల మణులయందు స్త్రీలు ప్రతిఫలించిరి. కాని భూషణమణులు కానరానందువలన వారి ప్రతిబింబములు నిరాధారమైన శూన్యప్రదేశమునందే కానవలసి వచ్చుటచే వానినిఁ జూచి వారాశ్చర్యపడిరి. ॥౪౧॥

శ్లో॥ తస్మిన్ విషజ్యార్ధపథాఽభియాంతం
తదంగరాగచ్ఛురితం నిరీక్ష్య।
విస్మేరతామాపురనుస్మరంత్యః
క్షిప్తం మిథః కందుకమిందుముఖ్యః॥ ౪౨

ప॥వి॥ తస్మిన్ । విషజ్య । అర్ధపథా । అభియాంతం । తదంగరాగచ్ఛురితం । నిరీక్ష్య । విస్మేరతామ్ । ఆపుః । అనుస్మరంత్యః । క్షిప్తం । మిథః। కందుకమ్ । ఇందుముఖ్యః.

టీక॥ ఇందుముఖ్యః = చంద్రముఖులగు స్త్రీలు, మిథః = పరస్పరముఁగూర్చి, క్షిప్తం = విసరివేయఁబడినదై, తస్మిన్ = ఆ నలునిపైన విషజ్య = తగుల్కొని, అర్ధపథా = సగము త్రోవతో, అభియాంతం = తిరిగి వచ్చుచున్నదై, తదంగరాగచ్ఛురితమ్; తత్ = ఆ నలునియొక్క, అంగరాగ = మైపూతచే, చ్ఛురితం = పూయఁబడిన, కందుకం = బంతిని, నిరీక్ష్య = చూచి, అనుస్మరంత్యః = ఇది ఎట్లు పూయఁబడినదని మాటిమాటికిఁ దలంచుచు, విస్మేరతాం = విస్మయమును, ఆపుః = పొందిరి.

## సమాసములు :

అర్ధపథా : అర్ధః పంథాః = అర్ధపంథాః. తేన = అర్ధపథా.

*తదంగరాగచ్ఛురితమ్ :* తస్య అంగరాగః = తదంగరాగః. తదంగరాగేణ చ్ఛురితః = తదంగరాగచ్ఛురితః. తమ్ = తదంగరాగచ్ఛురితమ్.

*ఇందుముఖ్యః :* ఇందురివ ముఖం యాసాం తాః = ఇందుముఖ్యః.

## భావము

ఆ స్త్రీలు చెండు నొకరిపై నొకరు విసరుకొనుచుండగా, నలుఁడదృశ్యుఁడై మధ్య వచ్చుటచే నతనికిఁ దగిలి మార్గమధ్యమునుండి తిరిగి వచ్చినది. ఆ చెండు నలునికిఁ దగులుట వలన నాతని శరీరమందలి మైపూత దాని కంటుకొనినది. దానిఁ జూచిన స్త్రీలీ మైపూతయెట్లు దీని కంటినదని మాటిమాటికి నాలోచించుచు నాశ్చర్యపడుచుండిరి. ॥౪౨॥

శ్లో॥ పుంసి స్వభర్తృవ్యతిరిక్తభూతే
భూత్వాప్యవీక్షానియమవ్రతిన్యః।
ఛాయాసు రూపం భువి తస్య వీక్ష్య
ఫలం దృశోరానశిరే మహిష్యః॥ ౪౩

ప॥ వి॥ పుంసి । స్వభర్తృవ్యతిరిక్తభూతే । భూత్వా । అపి । అవీక్షానియమవ్రతిన్యః । ఛాయాసు । రూపం। భువి । తస్య । వీక్ష్య । ఫలం । దృశోః। ఆనశిరే । మహిష్యః.

టీక॥ మహిష్యః = రాజభార్యలు, స్వభర్తృవ్యతిరిక్తభూతే; స్వ = తమయొక్క, భర్తృ = భర్తకంటె, వ్యతిరిక్తభూతే = భిన్నుఁడైన, పుంసి = పర పురుషునియందు, అవీక్షానియమవ్రతిన్యః; అవీక్షా = చూడరాదను, నియమ = నియమముచే, వ్రతిన్యః = వ్రతముగల వారుగ, భూత్వా ఒపి = అయినను, భువి = రత్ననిబద్ధభూమియందలి, ఛాయాసు = నీడల యందు, అనగా ప్రతిబింబములయందు, తస్య = ఆ నలునియొక్క, రూపం = సౌందర్యమును, వీక్ష్య = చూచి, దృశోః = నేత్రములకు, ఫలం = ప్రయోజనమును, ఆనశిరే = పొందిరి.

## సమాసములు:

*స్వభర్తృవ్యతిరిక్తభూతే :* స్వాసాం భర్తా = స్వభర్తా. స్వభర్తుః వ్యతిరిక్తభూతః = స్వభర్తృవ్యతిరిక్తభూతః. తస్మిన్ = స్వభర్తృవ్యతిరిక్తభూతే.

*అవీక్షానియమవ్రతిన్యః :* న వీక్షా = అవీక్షా. అవీక్షైవ నియమః = అవీక్షానియమః. అవీక్షానియమేన వ్రతం = అవీక్షానియమవ్రతమ్. అవీక్షానియమవ్రత మాసామ స్తీతి = అవీక్షానియమవ్రతిన్యః.

## భావము :

ఆ రాజభార్యలు, తమ భర్తకంటె నితర పురుషుని చూడరాదని నియమము గల్గియున్నను, మణిభూములలో ప్రతిఫలించిన యా నలుని ప్రతిబింబమునుఁ గాంచి నేత్రములకు ఫలమునుఁ బొందిరి. ॥౪౩॥

శ్లో॥ విలోక్య తచ్ఛాయమతర్కి తాభిః
పతిం ప్రతి స్వం వసుధాఽపి ధత్తే।
యథా వయం కిం మదనం తథైనం
త్రినేత్రనేత్రానలకీలనీలమ్॥ ౪౪

ప॥వి॥ విలోక్య। తచ్ఛాయమ్ । అతర్కి । తాభిః । పతిం । ప్రతి । స్వం । వసుధా । అపి। ధత్తే । యథా । వయం । కిం । మదనం । తథా । ఏనం । త్రినేత్రనేత్రానలకీలనీలమ్.

టీక॥ తాభిః = ఆ రాజస్త్రీలచే, తచ్ఛాయం; తత్ = ఆ నలునియొక్క, ఛాయం = నీడ, నీలం = నల్లనైనది, విలోక్య = చూడఁబడి, యథా = ఎట్లు, వయం = మనము, స్వం = స్వకీయుఁడైన, పతింప్రతి = భర్తయగు భీమునిఁ గూర్చి, మదనం = కామమును(మన్మథుని),(ఉద్బుద్ధం = చెలరేగిన వానినిగా), (ప్రబోధము పొందిన వానినిగా), యథా = ఎట్లు, (దధ్మహే = హృదయమందు ధరించుచున్నామో), తథా = అట్లే, వసుధాఽపి = భూమియు, స్వం = స్వకీయుఁడైన, పతింప్రతి = భర్తయగు భీమరాజునిఁ గూర్చి, ఉద్బుద్ధం = చెలరేగిన (ప్రబోధముఁబొందిన), (కింతు = కాని) త్రినేత్రనేత్రానలకీలనీలమ్; త్రినేత్ర = శివునియొక్క, నేత్రానల = నయనమందలి యగ్నియొక్క, కీల = జ్వాలలచే, నీలం = నల్లఁబడిన, ఏనం = ఈ మన్మథుని. ధత్తేకిమ్ = హృదయమందు ధరించుచున్నదా యేమి యని, అతర్కి = ఉత్ప్రేక్షింపఁబడినది.

పక్షాంతరము :- తాభిః = ఆ రాజభార్యలచే, (భువి = భూమియందు) తచ్ఛాయం = ఆ నలునియొక్క నీడను, విలోక్య = చూచి, యథా = ఎట్లు, వయం = మనము, స్వం = మనకు సంబంధించిన, పతిం = భర్తయగు, భీమంప్రతి = భీమునిగూర్చి, మదనం = కామమును, (లజ్జవలన) పిదధ్మహే = లోన దాచుకొనుచున్నామో, తథా = అట్లే, స్వం = స్వకీయుఁడైన, పతింప్రతి = భర్తయగు భీమునిగూర్చి, వసుధా = భూమి, త్రినేత్రనేత్రానలకీలనీలమ్; త్రినేత్ర = ముక్కంటియొక్క, నేత్రానల = నయనాగ్నియొక్క, కీల = జ్వాలలచే, నీలమ్ = నల్లనైన, మదనం =

కామమును (మన్మథుని), పిధత్తేకిం = లోపల గూఢముగా దాచుకొని యున్నదా యేమి? ఇతి = అని, అతర్కి = ఊహింపఁబడినది.

వి॥ పట్టపురాణులు భీమునిగూర్చి (కామమును) మదనుని ధరించినట్లు భూదేవిగూడ భీమునిగూర్చి ముక్కంటి కంటిలోని యగ్నిజ్వాలలచే నల్లఁబడిన మన్మథుని ధరించుచున్నదా యేమి యని నలుని ఛాయను చూచి వర్ణించుటవలన నుత్ప్రేక్షాలంకారము.

## సమాసములు :

తచ్ఛాయమ్ : తస్య చ్ఛాయా = తచ్ఛాయమ్. తత్ = తచ్ఛాయమ్.

త్రినేత్రనేత్రానలకీలనీలమ్ : త్రీణి నేత్రాణి యస్య సః = త్రినేత్రః. త్రినేత్రస్యనేత్రం = త్రినేత్రనేత్రమ్. త్రినేత్రనేత్రస్య అనలః = త్రినేత్రనేత్రానలః. త్రినేత్రనేత్రానలస్య కీలాః = త్రినేత్రనేత్రానలకీలాః. త్రినేత్రనేత్రానలకీలైః నీలః = త్రినేత్రనేత్రానలకీలనీలః. తమ్ = త్రినేత్రనేత్రానలకీలనీలమ్.

## భావము :

ఆ భీమభూపాలుని పట్టపురాణులు భూమిలో నలుని నీడనుఁజూచి, మన మెటు మనభర్తయగు భీమభూపతికై (కామమును మదనుని) హృదయమందు దాల్చుచున్నామో, అట్లే యీ భూమియు తన భర్తయగు భీమభూపతినిఁగూర్చి ముక్కంటి కంటివలన యగ్నిజ్వాలలో మండి నలుపైన మన్మథునిగాను, (కామముగను), నలుని తన హృదయమందు ధరించుచున్నదా యేమి యని తర్కించిరి. అనగా, భీమరాజునుఁ గూర్చి (కామమును) (మన్మధుని) తమ హృదయమున పటపురాణులు దాచుకొనిన విధముగా భూమియు శివుని తృతీయ నేత్ర జ్వాలలలో దగ్ధుఁడైనందువలన నల్లబడిన మన్మథుఁడో యనునట్లున్న నలుని తన హృదయమందు దాచుకొనినదా యేమి యని పట్టపురాణులు తర్కించిరి. ॥౪౪॥

శ్లో॥ రూపం ప్రతిచ్ఛాయికయోపనీత
మాలోకి తాభిర్యది నామ కామం।
తథాఽపి నాఽఽలోకి తదస్య రూపం
హారిద్రభంగాయ వితీర్ణభంగమ్॥ ౪౫

ప॥వి॥ రూపం । ప్రతిచ్ఛాయికయా । ఉపనీతమ్ । ఆలోకి । తాభిః । యది । నామ । కామం । తథా । అపి । న । ఆలోకి । తత్। అస్య । రూపం। హారిద్రభంగాయ । వితీర్ణభంగమ్.

టీక॥ ప్రతిచ్ఛాయికయా = ప్రతిబింబముచే, ఉపనీత = తేఁబడిన, రూపం = స్వరూపము, తాభిః = ఆ స్త్రీలచే, ఆలోకి = చూడఁబడినచో, కామం = యథేచ్ఛగా, (ఆలోక్యతాం) నామ = చూడఁబడునుగాత. తథాపి = అయినను, హారిద్రభంగాయ = పసుపుముక్కకు, వితీర్ణభంగం; వితీర్ణ = ఒసగఁబడిన, భంగం = పరాజయముగలిగిన, అస్య = ఇతనియొక్క, తత్ = ఆ ప్రసిద్ధమైన, రూపం = స్వరూపము, నాఽఽలోకి = చూపఁ బడలేదు.

## సమాసములు :

*హారిద్రభంగాయ :* హరిద్రాయాః అయం = హారిద్రః. హారిద్రశ్చాసౌ భంగశ్చ = హారిద్రభంగః. తస్మై = హారిద్రభంగాయ.

*వితీర్ణభంగమ్ :* వితీర్ణః భంగః యేన సః = వితీర్ణభంగః. తమ్ = వితీర్ణభంగమ్.

## భావము ;

ఇట్లు నలునిఁ జూచుచున్న యా పట్టపు రాణులకుఁ బరపురుషదర్శన దోషము లేదు. ఏలయనగా వారు నలుని ప్రతిబింబములోని రూపమునుఁ జూచిరే గాని కోయఁబడిన పసుపుముక్కవలె పచ్చని నలుని శరీరమునుఁ జూడలేదు గదా! అతని నిజస్వరూపమును చూచినప్పుడే దోషము కాని యతని ప్రతిబింబ మున నతనిఁ గాంచుటలో దోషమెద్దియును లేదు. ॥౮౩॥

శ్లో॥ భవన్నదృశ్యః ప్రతిబింబదేహ
వ్యూహం వితన్వన్మణికుట్టిమేషు।
పురం పరస్య ప్రవిశన్ వియోగీ
యోగీవ చిత్రం స రరాజ రాజా॥ ౮౪

ప॥వి॥ భవన్ । అదృశ్యః । ప్రతిబింబదేహవ్యూహం । వితన్వన్ । మణికుట్టిమేషు । పురం । పరస్య । ప్రవిశన్ । వియోగీ । యోగీ । ఇవ । చిత్రం । సః । రరాజ । రాజా.

టీక॥ వియోగీ = విరహియు, అయోగియునగు, సః = ఆ, రాజా = రాజు, అదృశ్యః = కానరానివాఁడు, భవన్ = అగుచు, మణికుట్టిమేషు = మణులచేఁ గట్టఁబడిన భూములయందు, ప్రతిబింబదేహవ్యూహమ్; ప్రతిబింబ = ప్రతిబింబరూపములైన, దేహ = శరీరములయొక్క, వ్యూహం = సమూహమును, వితన్వన్ = కల్పించుచు, (అయోగి పక్షమున ననగా యోగి పక్షమున) పెక్కు యోగ శరీరములను కాయవ్యూహ విద్యచే నొక్క సమయమునందే కల్పించుచు, పరస్య = మఱియొక రాజు యొక్క, పురం = పట్టణమును, పరస్య = జీవాంతరముయొక్క, పురం = పురమైన శరీరమును, ప్రవిశన్ = పరకాయ ప్రవేశవిద్యచే ప్రవేశించుచు. యోగీవ = అణిమాసిద్ధులు కలవానివలె, రరాజ = ప్రకాశించెను. చిత్రం = ఆశ్చర్యము.

## సమాసములు:

*అదృశ్యః :* ద్రష్టుం యోగ్యః = దృశ్యః. న దృశ్యః = అదృశ్యః.

*ప్రతిబింబదేహవ్యూహమ్ :* ప్రతిబింబాశ్చ తే దేహాశ్చ = ప్రతిబింబ దేహాః. ప్రతిబింబదేహానాం వ్యూహః = ప్రతిబింబదేహవ్యూహః. తమ్ = ప్రతిబింబదేహవ్యూహమ్.

*మణికుట్టిమేషు :* మణిమయాశ్చ తే కుట్టిమాశ్చ = మణికుట్టిమాః. తేషు = మణికుట్టిమేషు.

*వియోగీ :* వియోగః అస్య అస్తీతి = వియోగీ. విగతః యోగః = వియోగః. వియోగః అస్య అ స్తీతి = వియోగీ.

## భావము :

వియోగియు యోగియునగు నా నలుఁడు తా నదృశ్యుఁడుగ నుండుచు మణిమయ భూములయందలి తన ప్రతిబింబ దేహములయొక్క సమూహమును కల్పించుచు, (యోగి పక్షమున) కాయవ్యూహవిద్యచే పెక్కు యోగ శరీరము

లను ధరించుచు, ఇతరాజుయొక్క నగరమును అనగా భీముని నగరమును, ప్రవేశించుచు, (యోగి పక్షమున) జీవాంతరముయొక్క శరీరమునుఁ బరకాయ ప్రవేశవిద్యచే ప్రవేశించుచు, అణిమాది సిద్ధులుగల యోగివలెఁ బ్రకాశించెను. ॥౪౬॥

శ్లో॥ పుమానివాస్పర్శి మయా భ్రమంత్యా
ఛాయామయః పుంస ఇవావలోకి।
బ్రువన్నివాఽతర్కి మయాఽపి కశ్చి
దితి స్మ స స్త్రైణగిరశ్శృణోతి॥ ౪౭

ప॥వి॥ పుమాన్ । ఇవ । అస్పర్శి । మయా । భ్రమంత్యా । ఛాయామయః । పుంసః । ఇవ । అవలోకి । బ్రువన్ । ఇవ। అతర్కి । మయా । అపి। కశ్చిత్ । ఇతి । స్మ । సః । స్త్రైణగిరః । శృణోతి.

టీక॥ భ్రమంత్యా = సంచరించుచున్న, మయా = నాచే, పుమానివ = పురుషుడువలె, అస్పర్శి = తాకఁబడినది. మయా = నాచే, పుంసః = పురుషుని యొక్క, ఛాయేవ = నీడవలె, వ్యలోకి = చూడఁబడినది. మయాపి = నాచేతను, కశ్చిత్ = ఒక పురుషుఁడు, బ్రువన్నివ = మాట్లాఁడువానివలె, అతర్కి = ఊహింపఁబడెను. ఇతి = ఇట్లు, స్త్రైణగిరః = స్త్రీ సమూహము యొక్క మాటలను, లేదా స్త్రైణ = స్త్రీలకుసంబంధించిన, గిరః = మాటలను, సః = ఆ నలుఁడు, శృణోతిస్మ = వినుచుండెను.

## సమాసములు :

*స్త్రైణగిరః :* స్త్రీణాం సమూహః = స్త్రైణమ్. స్త్రైణస్య గిరః = స్త్రైణగిరః.తాః = స్త్రైణగిరః. లేదా స్త్రీషుభవాః = స్త్రైణాః. స్త్రైణాశ్చ తాః గిరశ్చ = స్త్రైణగిరః.

## భావము

ఆ స్త్రీలలో నొకతె తాను తిరుగుచున్నప్పుడు మగవానిని తాకినట్లున్నదనియు, మఱియొకతె తాను మగవాని నీడనుఁ జూచినట్లున్నదనియు, నింకొకతె

మగవాఁడు మాట్లాడుచున్నట్లు తాను ఊహించుచున్నాననియు నిట్లు వారు చేయు చున్న సంభాషణములను నలుఁడు వినుచుండెను. ॥౪౭॥

శ్లో॥ అంబాం ప్రణమ్యోపనతా నతాంగీ
నలేన భైమీ పథి యోగమాప।
స భ్రాంతభైమీషు న తాం వివేద
సా తం చ నాఽదృశ్యతయా దదర్శ॥ ౪౮

ప॥వి॥ అంబాం । ప్రణమ్య । ఉపనతా ॥ నతాంగీ । నలేన । భైమీ । పథి । యోగమ్ । ఆప । సః । భ్రాంతభైమీషు । న । తాం । వివేద । సా । తం । చ । న । అదృశ్యతయా । దదర్శ.

టీక॥ నతాంగీ = వంగిన శరీరముగల్గిన, భైమీ = దమయంతి, అంబాం = తల్లిని, ప్రణమ్య = నమస్కరించి, ఉపనతా = చెంతకు వచ్చినదై, నలేన = నలునిచే, పథి = త్రోవయందు, యోగం = సంబంధమును, ఆప = పొందెను. సః = ఆ నలుఁడు, భ్రాంతభైమీషు; భ్రాంత = అసత్యలైన, అనగా భ్రమకు గోచరించిన, భైమీషు = దమయంతుల మధ్య, తాం = ఆమెను, నవివేద = తెలిసికొనలేదు. సాచ = ఆ దమయంతియు, తం = ఆ నలుని, అదృశ్యతయా = అదృశ్యముగ నుండుటచే, నదదర్శ = చూడలేదు.

వి॥ ఇచ్చట అసత్య దమయంతులతో సత్య దమయంతికి, రూపసామ్యముచే నభేదము చెప్పఁబడుటవలన సామాన్యాలంకారము.

**సమాసములు :**

*నతాంగీ :* నతం అంగం యస్యాస్సా = నతాంగీ.

*భైమీ :* భీమస్య అపత్యం స్త్రీ = భైమీ.

*భ్రాంతభైమీషు :* భీమస్య అపత్యం స్త్రియః = భైమ్యః. భ్రాంతాశ్చ తాః భైమ్యశ్చ = భ్రాంతభైమ్యః. తాసు = భ్రాంతభైమీషు.

అదృశ్యతయా : ద్రష్టుం యోగ్యా = దృశ్యా. దృశ్యాయాః భావః = దృశ్యతా. న దృశ్యతా = అదృశ్యతా. తయా = అదృశ్యతయా.

**భావము :**

స్తనభారముచే వంగిన దమయంతి తల్లికి నమస్కరించి చెంతకు వచ్చినదై త్రోవలో కలసినది. కాని నలుఁడు సత్య దమయంతులలో వాస్తవమైన దమయంతిని గుర్తించలేక పోయెను. ఆ దమయంతియు నదృశ్యుఁడుగ నుండుటచే నలుని గుర్తింపలేక పోయినది. ॥౪౮॥

శ్లో॥ ప్రసూప్రసాదాధిగతా ప్రసూన
మాలా నలస్య భ్రమవీక్షితస్య।
క్షిప్తాఽపి కంఠాయ తయోపకంఠే
స్థితం తమాలంబత సత్యమేవ॥ ౪౯

ప॥వి॥ ప్రసూప్రసాదాధిగతా । ప్రసూనమాలా । నలస్య । భ్రమవీక్షితస్య । క్షిప్తా । అపి । కంఠాయ । తయా । ఉపకంఠే । స్థితం । తమ్ । ఆలంబత । సత్యమ్ । ఏవ.

టీక॥ ప్రసూప్రసాదాధిగతా; ప్రసూ = తల్లియొక్క, ప్రసాద = అనుగ్రహముచే, అధిగతా = పొందఁబడిన, ప్రసూనమాలా = పుష్పమాల, తయా = ఆ దమయంతిచే, భ్రమవీక్షితస్య; భ్రమ = భ్రాంతితో, వీక్షితస్య = చూడఁబడిన, నలస్య = నలునియొక్క, కంఠాయ = కంఠము కొఱకు, క్షిప్తాఽపి = వేయఁబడినదైనను, ఉపకంఠే = సమీపమందు, స్థితం = ఉన్న, సత్యం = నిజమైన, తమేవ = ఆ నలునే, ఆలంబత = పొందినది.

**సమాసములు:**

ప్రసూప్రసాదాధిగతా : ప్రస్వాః ప్రసాదః = ప్రసూప్రసాదః. ప్రసూప్రసాదేన అధిగతా = ప్రసూప్రసాదాధిగతా.

ప్రసూనమాలా : ప్రసూనానాం మాలా = ప్రసూనమాలా.

పరస్పరేణ : పరశ్చ పరశ్చ = పరస్పరః. తేన = పరస్పరేణ.

ఆలింగితాళీకపరస్పరాంతః : ఆలింగితం అలీకం యస్య తత్ = ఆలింగితాళీకం. పరశ్చ పరశ్చ = పరస్పరః. పరస్పరస్య అంతః = పరస్పరాంతః. ఆలింగితాళీకం పరస్పరాంతః యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = ఆలింగితాళీకపరస్పరాంతః.

**భావము :**

ఆ నలదమయంతులొండొరులు తామొక్క ప్రదేశమందుండియు నొండొరులను, అనగా, దనుయంతిని నలుఁడు నలుని దమయంతియు దేశాంతరమందున్న వారినివలెఁ జూచుకొనుచు, వారి యాలింగనములన్నియు నసత్యములని భావించెడి యొండొరుల హృదయములు కల్గునట్లుగా నొండొరులను నిజముగనే కౌగలించుకొనుచుండిరి. అనగా వారు నిజముగా గౌగలించుకొనుచున్నను దానిని భ్రాంతియని వారి మనస్సులు చెప్పుచుండినవని యభిప్రాయము. ॥౨౧॥

శ్లో॥ స్పర్శం తమస్యాధిగతాఽపి భైమీ
మేనే పునర్భ్రాంతిమదర్శనేన।
నృపస్తు పశ్యన్నపి తాముదీత
స్తంభో న ధర్తుం సహసా శశాక॥ ౨౨

ప॥వి॥ స్పర్శం । తమ్ । అస్య । అధిగతా । అపి । భైమీ । మేనే । పునః । భ్రాంతిమ్ । అదర్శనేన । నృపః । తు । పశ్యన్ । అపి । తామ్ । ఉదీత స్తంభః । న । ధర్తుం । సహసా । శశాక.

టీక॥ భైమీ = దమయంతి, తం = ఆ నిజమైన, స్పర్శం = నలుని స్పర్శను, అధిగతాఽపి = పొందినను, పునః = మఱల, అస్య = ఈ నలుని యొక్క, అదర్శనేన = దర్శనము లేకపోవుటచే, భ్రాంతిం = భ్రాంతిగా, మేనే = తలంచెను. (అతః = ఇందువలన, నలం = నలుని, ధర్తుం = పట్టుకొనుటకు, నశశాక = శక్తురాలు కాలేదు) నృపస్తు = రాజో, పశ్యన్నపి = చూచుచున్నను, ఉదీత స్తంభః; ఉదీత = ఉద్భవించిన, స్తంభః = నిశ్చలత్వమను సాత్త్విక భావముగలవాఁడై, తాం = ఆ దమ

యంతిని, పశ్యన్నపి = చూచుచున్నను, సహసా = వెంటనే, ధర్తుం = ధరించుటకు, నశశాక = శక్తురాలు కాలేదు.

వి॥ దమయంతినిఁ బట్టుకొనలేక పోవుటకు స్తంభపదార్థమైన నిశ్చలత్వము కారణముగాన పదార్థహేతుకమైన కావ్యలింగాలంకారము.

**సమాసములు :**

*భైమీ :* భీమస్య అపత్యం స్త్రీ = భైమీ.

*అదర్శనేన :* న దర్శనమ్ = అదర్శనం. తేన = ఆదర్శనేన.

*ఉదీత స్తంభః :* ఉదీతః స్తంభః యస్య సః = ఉదీత స్తంభః.

**భావము :**

ఆ దమయంతి నిజమైన నలుఁడు తాకియు నాతఁడు మాయమైనందు వలన నా స్పర్శ నసత్యముగా భావించినది. అందువలన నా నలుని పట్టలేక పోయెను. ఆ నలుఁడు దమయంతినిఁ జూచుచున్నను ఆమె తాకిడివలన తనకుఁ గల్గిన నిశ్చలత్వమను సాత్త్విక భావముచే కదలలేక యామెను వెంటనే పట్టు కొనలేక పోయెను. ॥౫౨॥

శ్లో॥ స్పర్శాతిహర్షాదృతసత్యమత్యా
ప్రవృత్య మిథ్యాప్రతిలబ్ధబోధౌ।
పునర్మిథస్సత్యమపి స్పృశంతౌ
న శ్రద్దధాతే పథి తౌ విముగ్ధౌ॥ ౫౩

ప॥వి॥ స్పర్శాతిహర్షాదృతసత్యమత్యా । ప్రవృత్య । మిథ్యాప్రతిలబ్ధబోధౌ । పునః । మిథః । సత్యమ్ । అపి । స్పృశంతౌ । న । శ్రద్దధాతే । పథి । తౌ । విముగ్ధౌ.

టీక॥ విముగ్ధౌ = విశేష రాగముచే నంధులైన, తౌ = ఆ దమయంతీ నలులు, పథి = మార్గమున, స్పర్శాతి హర్షాదృతసత్యమత్యా; స్పర్శ = ఒండొరు లను తాకుటచే నుద్భవించిన; అతిహర్ష = మిక్కుటమైన యానందము

వలన, ఆదృత = ధ్రువీకరింపఁబడిన, సత్యమత్యా; సత్య = ఈ స్పర్శ సత్యమైనదను, మత్యా = బుద్ధిచే, ప్రవృత్య = మఱలఁబూనుకొని, మిథ్యా ప్రతిలబ్ధబోధౌ; మిథ్యా = అసత్యమని, ప్రతిలబ్ధ = పొందఁబడిన, బోధౌ = జ్ఞానముగలవారై, పునః = మఱల, పథి = మార్గమందు మిథః = ఒండొరులును, సత్యం = నిజముగా, స్పృశం తావపి = తాకు కొనుచును, నశ్రద్దధాతేస్మ = నమ్మకయుండిరి.

## సమాసములు :

స్పర్శాతిహర్షాదృతసత్యమత్యా : స్పర్శేన అతిహర్షః = స్పర్శాతిహర్షః. సత్యస్య మతిః = సత్యమతిః. స్పర్శాతిహర్షేణ ఆదృతా = స్పర్శాతిహర్షాదృతా. స్పర్శాతిహర్షాదృతా చ సా సత్యమతిశ్చ = స్పర్శాతిహర్షాదృతసత్యమతిః. తయా = స్పర్శాతిహర్షాదృతసత్యమత్యా.

మిథ్యాప్రతిలబ్ధబోధౌ : ప్రతిలబ్ధశ్చాసౌ బోధశ్చ = ప్రతిలబ్ధబోధః. మిథ్యేతి ప్రతిలబ్ధబోధః యయోస్తౌ = మిథ్యాప్రతిలబ్ధబోధౌ.

## భావము :

రాగాంధులైన దమయంతీ నలులు ఒండొరుల స్పర్శచే నానంద మొండొరులకుఁ గల్గుటవలన వారి స్పర్శసత్యమని భావించి మఱల స్పర్శకొఱకుఁ బ్రయత్నించిరి. కాని యప్పుడాస్పర్శ కలుగునందువలన నది యసత్యమని భావించుచుండిరి. ॥౫౩॥

శ్లో॥ సర్వత్ర సంవాద్యమబోధమానౌ
రూపశ్రియాతిథ్యకరం పరం తౌ।
న శేకతుః కేళిరసాద్విరంతు
మళీకమాలోక్య పరస్పరం తు॥ ౫౪

ప॥వి॥ సర్వత్ర । సంవాద్యమ్ । అబోధమానౌ । రూపశ్రియా । ఆతిథ్యకరం । పరం । తౌ । న । శేకతుః । కేళిరసాత్ । విరంతుమ్ । అళీకమ్ । ఆలోక్య । పరస్పరం । తు.

టీక॥ తౌ = ఆ దమయంతీ నలులు, రూపశ్రియా = సౌందర్యలక్ష్మిచే, సర్వత్ర = అన్ని యవయవములయందు, సంవాద్యం = ఒండొంటికి తగిన, (అతఏవ = కావుననే) పరమ్ = మిక్కిలి, ఆతిథ్యకరం = పరస్పరమును సత్కరించుకొనెడి, అలీకం = అసత్యమైన, పరస్పరంతు = ఒండొరులను, ఆలోక్య = చూచి, అబోధమానౌ = అసత్యమని తెలియనివారై, కేళీరసాత్ = క్రీడలయందలి రాగమువలన, నివర్తితుం = మఱలుటకు, నశేకతుః = శక్తులు కాలేక పోయిరి.

## సమాసములు :

అబోధమానౌ : న బోధమానౌ = అబోధమానౌ.

రూపశ్రియా : రూపస్య శ్రీః = రూపశ్రీః. తయా = రూపశ్రియా.

ఆతిథ్యకరం : అతిథేః భావః = ఆతిథ్యం. ఆతిథ్యం కరోతీతి = ఆతిథ్యకరః. తమ్ = ఆతిథ్యకరమ్.

కేళీరసాత్ : కేళ్యాం రసః = కేళీరసః. తస్మాత్ = కేళీరసాత్.

పరస్పరమ్ : పరశ్చ పరశ్చ = పరస్పరః. తమ్ = పరస్పరమ్.

## భావము :

ఆ దమయంతీ నలులు తమ సౌందర్యశోభచే నన్ని యంశములయందును నొకరికొకరు సరితూగుచుండిరి. అందువలననే వారొండొరులను నొండొరులాదరించుకొనుచుండిరి. ఆ యిరువురు నిజముగా నటనుండకపోయినను, వారి యునికి యసత్యమని గ్రహింపక క్రీడలయందలి యాసక్తిచే విరమింపలేక పోయిరి. వారొండొరు లసత్యస్వరూపులయినను గ్రీడింపఁగోరిరని యాశయము. ॥౨౪॥

శ్లో॥ పరస్పరస్పర్శరసోర్మిసేకా
త్తయోః క్షణం చేతసి విప్రలంభః।
స్నేహాతిదానాదివ దీపికార్చి
ర్నిమిష్య కించిద్ద్విగుణం దిదీపే॥ ౨౫

ప॥వి॥ పరస్పర్శరసోర్మి సేకాత్ ః తయోః । క్షణం । చేతసి । విప్రలంభః । స్నేహాతిదానాత్ । ఇవ । దీపికార్చిః । నిమిష్య । కిం । చిత్ । ద్విగుణం । దిదీపే.

టీక॥ తయోః = ఆ దమయంతీ నలులయొక్క, చేతసి = మనస్సునందు, విప్రలంభః = వియోగము, పరస్పరస్పర్శరసోర్మి సేకాత్: పరస్పర = ఒండొరుల, స్పర్శరస = స్పర్శసుఖముయొక్క, ఊర్మి = అలలచే, సేకాత్ = తడుపుటవలన, క్షణం = క్షణకాలము, స్నేహాతిదానాత్: స్నేహ = నూనెను, అతిదానాత్ = ఎక్కువగాఁ బోయుటవలన, దీపికార్చిరివ = దీపజ్వాలవలె, కించిత్ = కొంచెము, నిమిష్య = చల్లారి, ద్విగుణం = రెట్టింపుగా, దిదీపే = వెలిగినది.

## సమాసములు :

*పరస్పరస్పర్శరసోర్మిసేకాత్ :* పరశ్చ పరశ్చ = పరస్పరౌ. పరస్పరయోః స్పర్శః = పరస్పరస్పర్శః. పరస్పరస్పర్శే రసః = పరస్పరస్పర్శరసః. పరస్పరసర్శరసస్య ఊర్మయః = పరస్పర స్పర్శరసోర్మయః. పరస్పరస్పర్శరసోర్మిభిః సేకః = పరస్పరస్పర్శరసోర్మి సేకః. తస్మాత్ = పరస్పరస్పర్శరసోర్మి సేకాత్.

*స్నేహాతిదానాత్ :* అత్యంతం దానమ్ = అతిదానమ్. స్నేహస్య అతిదానమ్ = స్నేహాతిదానమ్. తస్మాత్ = స్నేహాతిదానాత్.

*ద్విగుణం :* ద్వౌ గుణౌ యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = ద్విగుణమ్.

## భావము :

దమయంతీ నలుల మనస్సునందలి వియోగము వారి యొండొరుల స్పర్శ సుఖతరంగముల తాకిడిచే, క్షణకాలము, తైలమెక్కువ పోయుటచేఁ గొంచెము చల్లారి రెట్టింపుగా జ్వలించెడి దీపజ్వాలవలె వర్ధిల్లుచుండినది. ॥౨౩॥

శ్లో॥ వేశ్మాప సా ధైర్యవియోగయోగా
దోర్భేధం చ మోహం చ ముహూర్ధధానా।

పునః పున స్తత్ర పురస్స పశ్య
న్బభ్రామ తాం సుభ్రువముద్భ్రమేణ॥ ౫౬

ప॥వి॥ వేశ్మ । ఆప । సా । ధైర్యవియోగయోగాత్ । బోధం। చ । మోహం। చ । ముహుః । దధానా । పునః । పునః । తత్ర । పురః । సః । పశ్యన్। బభ్రామ । తాం । సుభ్రువమ్ । ఉద్భ్రమేణ.

టీక॥ సా = దమయంతి, ధైర్యవియోగయోగాత్; ధైర్య = ధైర్యముయొక్క, వియోగ = వియోగముయొక్క, యోగాత్ = సంబంధమువలన, ముహుః = పలుమాఱు, బోధంచ = జ్ఞానమును, మోహంచ = మోహమును, దధానా = ధరించుచు, వేశ్మ = తనయింటినిగూర్చి, ఆప = పొందెను. సః = ఆ నలుఁడు, తత్ర = అచ్చట, తాం = ఆ, సుభ్రువం = చక్కని కనుబొమ్మలుగల దమయంతిని, ఉద్భ్రమేణ = భ్రాంతితో, పునః పునః = పలుమాఱులు, పురః = ముందు, పశ్యన్ = చూచుచు, బభ్రామ = తిరిగెను.

వి॥ దమయంతి తన నివాసమున కరిగిన వెంటనే నలుఁడు భ్రాంతితో నామెను వెదకుట చాపలమను సంచారి భావము. ధైర్యముచే బోధమును, వియోగముచే మోహమునుఁ బొందుచున్నట్లు క్రమముగాఁ జెప్పుటవలన యథాసంఖ్యాలంకారము.

**సమాసములు :**

ధైర్యవియోగయోగాత్ : ధీరాయాః భావః = ధైర్యం. ధైర్యం చ వియోగశ్చ = ధైర్యవియోగౌ. ధైర్యవియోగయోః యోగః = ధైర్యవియోగ యోగః. తస్మాత్ = ధైర్యవియోగయోగాత్.

**భావము :**

ఆ దమయంతి, తన ధైర్యముచే చైతన్యమును, నలుని వియోగముచే మోహమునుఁ బొందుచు తన నివాసమున కరిగినది. ఆ నలుఁడు ఆ దమయంతిని, భ్రాంతితో నెదుటఁ గాంచుచు నామె లభింపనందువలన వెదకుచు తిరుగుచుండెను. ॥౫౬॥

శ్లో॥ పద్భ్యాం నృపస్సంచరమాణ ఏవ
చిరం పరిభ్రమ్య కథం కథం చిత్।
విదర్భరాజప్రభవానివాసం
ప్రాసాదమభ్రంకషమాససాద॥ ౫౭

ప॥వి॥ పద్భ్యాం । నృపః । సంచరమాణః । ఏవ।చిరం। పరిభ్రమ్య । కథం । కథం । చిత్ । విదర్భరాజప్రభవా నివాసం । ప్రాసాదమ్ । అభ్రం కషమ్ । ఆససాద.

టీక॥ ఏషః = ఈ, నృపః = నలమహారాజు, పద్భ్యాం = పాదములతో, సంచరమాణఃఏవ = సంచరించుచు, చిరం = చాలకాలము, పరిభ్రమ్య = సంచరించి, కథంకథం చిత్ = కాలినడకవలనికష్టముచే,విదర్భరాజప్రభవానివాసమ్; విదర్భరాజ = విదర్భదేశమునకుప్రభువైన భీముని, ప్రభవా = జనకుఁడుగాఁ గల్గిన దమయంతియొక్క, నివాసం = నివాసస్థానమైనదియును, అభ్రంకషం = మేఘములనంటెడి యౌన్నత్యముగల్గిన, ప్రాసాదం = మేడను, ఆససాద = పొందెను.

**సమాసములు :**

విదర్భరాజప్రభవా : విదర్భాణాం రాజా = విదర్భరాజః. విదర్భరాజః ప్రభవః యస్యాస్సా = విదర్భరాజప్రభవా.

అభ్రంకషమ్ : అభ్రం కషతీతి = అభ్రంకషః. తమ్ = అభ్రంకషమ్.

**భావము :**

ఈ నల మహారాజు, కాలి నడకతో సంచరించుచు చాలకాలము తిరిగి కాలినడకవలన మిక్కిలి శ్రమపడుచు మేఘముల నొరయునట్టి యౌన్నత్యము గల్గిన, దమయంతీ నివాసభవనమునుఁ జేరుకొనెను. ॥౫౭॥

శ్లో॥ సఖీశతానాం సరసైర్విలాసై
స్స్మరావరోధభ్రమమావహంతీం।

విలోకయామాస సభాం స భైమ్యా
స్తస్య ప్రతోళీమణివేదికాయామ్॥ ౫౮

ప॥వి॥ సఖీశతానాం । సరసైః । విలాసైః । స్మరావరోధభ్రమమ్। ఆవహంతీం। విలోకయామాస । సభాం । సః । భైమ్యాః । తస్య । ప్రతోళీమణి వేదికాయామ్.

టీక॥ సః = ఆ నలుఁడు, తస్య = ఆ మేడయొక్క, ప్రతోళీమణివేదికాయాం; ప్రతోళీ = ముంగటనున్న, మణివేదికాయాం = రత్నపుతిన్నెయందు. సఖీశతానాం = నూర్గురు చెలికత్తెలమధ్య, సరసైః = రసవంతములైన, విలాసైః = విలాసములచే, స్మరావరోధభ్రమం; స్మర = మన్మథుని యొక్క, అవరోధ = అంతఃపురమనెడి, భ్రమం = భ్రాంతిని, ఆవహంతీం = కల్పించుచున్నటువంటి, భైమ్యాః = దమయంతి యొక్క, సభాం = సభను, విలోకయామాస = కాంచెను.

## సమాసములు :

*సఖీశతానాం* : సఖీనాం శతాని = సఖీశతాని, తేషాం = సఖీశతానాం.

*సరసైః* : రసేన సహ వర్తంత ఇతి = సరసాః. తైః = సరసైః.

*స్మరావరోధభ్రమమ్* : స్మరస్య అవరోధః = స్మరావరోధః. స్మరావరోధస్య భ్రమః = స్మరావరోధభ్రమః. తమ్ = స్మరావరోధభ్రమమ్.

*భైమ్యాః*: భీమస్య అపత్యం స్త్రీ = భైమీ. తస్యాః = భైమ్యాః.

*ప్రతోళీమణివేదికాయామ్* : మణిమయీ చ సా వేదికా చ = మణివేదికా. ప్రతోళ్యాః మణివేదికా = ప్రతోళీమణివేదికా. తస్యాం = ప్రతోళీమణివేదికాయామ్.

## భావము :

ఆ నలుఁడు ఆ మేడయొక్క మణివేదికపైఁ బెక్కండ్రు చెలికత్తెల మధ్య రసవంతములైన లీలలచే మన్మథునియంతఃపురమనెడి భ్రాంతినిఁగల్గించు దమయంతి యొక్క సభనుఁగాంచెను. ॥౫౮॥

శ్లో॥ కంఠః కిమస్యాః పికవేణువీణా
త్రిస్రో జితాస్సూచయతి త్రిరేఖః।
ఇత్యంతరస్తూయత కాఽపి యత్ర
నలేన బాలా కలమాలపంతీ॥ ౫౫

ప॥వి॥ కంఠః । కిమ్ । అస్యాః । పికవేణువీణాః । తిస్రః । జితాః । సూచయతి । త్రిరేఖః । ఇతి । అంతః । అస్తూయత । కా । అపి । యత్ర । నలేన । బాలా । కలమ్ । ఆలపంతీ.

టీక॥ యత్ర = ఏసభయందు, కలం = మధురముగా, ఆలపంతీ = ఆలాపము చేయుచున్న, కాఽపి = ఒకానొక, బాలా = బాలయైన స్త్రీ, నలేన = నలునిచే, త్రిరేఖః = మూడురేఖలుగల, అస్యాః = ఈబాలికయొక్క, కంఠః = కంఠము, పికవేణువీణాః; పిక = కోకిల, వేణు = పిల్లనగ్రోవి, వీణాః = వీణఅను నీ వాద్యములు, జితాః = జయింపఁబడినవిగా, సూచయతికిమ్ = సూచించుచున్నదాయేమిః ఇతి = అని, అంతః = లోపల, అనగా నంతఃకరణమందు, అస్తూయత = స్తుతింపఁబడినది.

వి॥ ఇచ్చట కంఠమందలి మూడురేఖలు పికవేణువీణలను జయించుటను సూచించుచున్నవాయేమి యని చెప్పుటవలన కావ్యలింగముతో సంకీర్ణమైన యుత్ప్రేక్ష.

## సమాసములు :

పికవేణువీణాః : పికశ్చ వేణుశ్చ వీణా చ = పికవేణువీణాః. తిస్రః రేఖాః యస్య సః = త్రిరేఖః.

## భావము :

ఇచ్చట నీ శ్లోకము మొదలు పదునాలుగుశ్లోకములచే దమయంతియొక్క సభను కవి వర్ణించుచున్నాఁడు. ఈ సభయందు నొక యమ్మాయి మధురముగా నాలాపము చేయుచుండెను. ఆమె కంఠమునందు మూడురేఖలుండెను. ఆమూడు రేఖలాయమ్మాయి కంఠము కోయలను, మురళిని, వీణను మాధుర్యమునందు

జయించినదా యను నంశమును సూచించునవిగా నుండినవి. అనగా నామె కంఠము పికాదులను మించిన మాధుర్యము గలదిగ నొప్పుచుండెనని భావము.

॥౧౮॥

శ్లో॥ ఏతం నలం తం దమయంతి పశ్య
త్యజా_ర్తిమిత్యాళికులప్రబోధాన్।
శ్రుత్వా స నారీకరవ_ర్తిశారీ
ముఖాత్స్వమాశంకత యత్ర దృష్టమ్॥ ౬౦

ప॥వి॥ ఏతం । నలం । తం । దమయంతి । పశ్య । త్యజ । ఆ_ర్తిమ్ । ఇతి । ఆళికులప్రబోధాన్ । శ్రుత్వా । సః । నారీకరవ_ర్తిశారీముఖాత్ । స్వమ్। ఆశంకత । యత్ర । దృష్టమ్.

టీక॥ సః = ఆనలుఁడు, యత్ర = ఏసభయందు, నారీకరవ_ర్తిశారీముఖాత్; నారీ = కాంతయొక్క, కర = చేతియందు,వ_ర్తి = ఉన్నటువంటి, శారీ = గోరువంకయొక్క, ముఖాత్ = ముఖమునుండి, హే దమయంతి! = ఓ దమయంతీ! తమ్ = ఆప్రసిద్ధమైన, ఏతం = ఈ,నలం = నలుని,పశ్య = చూడుము. ఆ_ర్తిం = బాధను, త్యజ = విడువుము. ఇతి = ఇట్లు, ఆలికుల ప్రబోధాన్; ఆలికుల = చెలిక_త్తెలసంఘముయొక్క, ప్రబోధాన్ = ఓదార్పుమాటలను, శ్రుత్వా = విని, స్వం = తనను, దృష్టం = చెలిక_త్తెలచే చూడఁబడిన వానినిగా, ఆశంకత = సందేహించెను.

వి॥ గోరువంకమాటల యందు స్త్రీవాక్య భ్రాంతి వ్యంగ్యము. కాననిచ్చట వస్తువుచే భ్రాంతి మదలంకారధ్వని.

## సమాసములు :

*ఆలికులప్రబోధాన్ :* ఆలీనాం కులం = ఆలికులమ్, ఆలికులస్య ప్రబోధాః = ఆలికులప్రబోధాః. తాన్ = ఆలికులప్రబోధాన్.

*నారీకరవ_ర్తిశారీముఖాత్ :* నార్యాః కరః = నారీకరః. నారీకరే వ_ర్తినీ = నారీకరవ_ర్తినీ. నారీకరవ_ర్తినీ చ సా శారీ చ = నారీకరవ_ర్తిశారీ. నారీకరవ_ర్తి శార్యాః ముఖం = నారీకరవ_ర్తిశారీ ముఖమ్. తస్మాత్ = నారీకరవ_ర్తిశారీముఖాత్.

**భావము :**

ఆ సభలో నొకానొక స్త్రీయొక్క హస్తము నందలిగోరువంక దమయంతిని గూర్చి - ఓ దమయంతీ! ఇదిగో ప్రసిద్ధమైన నలుఁడు. వానినిచూడుము. బాధను వదలిపెట్టుము; అని చెలికత్తెలాడుచుండిన యోదార్పులను నలుఁడువిని యా మాటలను చెలికత్తెలు చెప్పుచుండిరేమోయని భ్రాంతిపడినవాఁడైమాయతో సంచరించుచున్న తన్నుఁ దమయంతి చెలికత్తెలు చూచినారాయనిభావించెను ౬౦

శ్లో॥ యత్రైకయాళీకనళీకృతాళి
కంఠే మృషాభీమభవీభవంత్యా ।
తద్దృక్పథేదోహళికోపనీతా
శాలీనమాధాయి మధూకమాలా॥ ౬౧

ప॥వి॥ యత్ర । ఏకయా । అళీకనళీకృతాళికంఠే । మృషాభీమభవీభవంత్యా। తద్దృక్పథే । దోహళికా । ఉపనీతా । శాలీనమ్ । ఆధాయి । మధూకమాలా.

టీక॥ యత్ర = ఏసభయందు, తద్దృక్పథే; తత్ = ఆ నలునియొక్క, దృక్పథే= నయనమార్గమునందు, మృషాభీమభవీభవంత్యా; మృషా= అసత్యమైన, భీమభవీ=భీమపుత్రికయైన దమయంతిగా, భవంత్యా= అగుచున్న, ఏకయా=ఒకచెలికత్తెచే, అళీకనళీకృతాళికంఠే; అళీక = అసత్యమైన, నళీకృత = నలుఁడుగాఁజేయఁబడిన, ఆళి = చెలికత్తె యొక్క, కంఠే=కంఠమునందు. దోహళికోపనీతా; దోహళికా=దాదిచే, ఉపనీతా=తేఁబడిన, మధూకమాలా = ఇప్పపూలమాల, శాలీనం= సిగ్గుతోమెల్లగా, ఆధాయి=ఉంచఁబడినది.

*అలీకనలీకృతాళికంఠే:* అళీకభూతోనలః = అళీకనలః. అనలీకనలః అలీకనలః సంపద్యమానా కృతా=అలీకనళీకృతా.

**లేదా**

అనలః నలః సంపద్యమానాకృతా = నలీకృతా. అలీకం నళీకృతా = అళీకనలీకృతా. అళీకనలీకృతా చ సా ఆళిశ్చ=అళీకనలీకృతాళిః. అళీకనలీకృతాళ్యాః కంఠః=అళీకనలీకృతాళికంఠః. తస్మిన్ =అళీకనలీకృతాళికంఠే.

మృషాభీమభవీభవంత్యాః భీమాత్ భవా = భీమభవా. అభీమభవా భీమభవా సంపద్యమానా భవంతీ = భీమభవీభవంతీ. మృషా భీమభవీభవంతీ = మృషా భీమభవీభవంతీ. తయా = మృషాభీమభవీభవంత్యా.

తద్దృక్పథే: తస్యదృశౌ = తద్దృశౌ. తద్దృశోఃపంథాః = తద్దృక్పథః. తస్మిన్ = తద్దృక్పథే.

దోహళికోపనీతా : దోహళికయా ఉపనీతా = దోహళికోపనీతా.

మధూకమాలా : మధూకానాం మాలా = మధూకమాలా.

**భావము :**

ఆ సభయందు ఒక్కతె దమయంతి వేషమును వహించినది. మఱియొక్కతె నలుని వేషమును వహించినది. దమయంతీ పాత్రమును వహించిన చెలికత్తె, నలుని పాత్రను వహించిన చెలికత్తెయొక్క కంఠమందు దాది తెచ్చిన ఇప్పపూలమాలను లజ్జతో మెల్లగ వైచినది. ఇందువలన దమయంతికి స్వయంవరమునకై తొందర, నలునియందే యాసక్తి వెల్లడింపఁబడినవి. ఈ సన్నివేశము నలుని దృష్టియందుఁ బడినది. ॥౬౦॥

**శ్లో॥** చంద్రాభమాభ్రం తిలకం దధానా
తద్వన్నిజాస్యేందుకృతానుబింబమ్।
సఖీముఖే చంద్రసమే ససర్జ
చంద్రానవస్థామివ కాఽపి యత్ర॥ ౬౧

**ప॥వి॥** చంద్రాభమ్ । ఆభ్రం । తిలకం । దధానా । తద్వత్ । నిజాస్యేందు కృతానుబింబమ్ । సఖీముఖే । చంద్రసమే । ససర్జ । చంద్రానవస్థామ్। ఇవ । కా । అపి । యత్ర.

**టీక॥** యత్ర = ఏ సభయందు, కాపి = ఒకానొకకాంత, చంద్రాభం = చంద్రునితో సమానమైన, ఆభ్రం = అభ్రకమయమైన, తిలకం = బొట్టును, చంద్రసమే = చంద్రునితో సమానమైన, సఖీముఖే = చెలికత్తె ముఖమునందు, తద్వన్నిజాస్యేందు కృతానుబింబమ్; తద్వత్ = ఆ తిలకము

గల్గిన, నిజ = తనదైన, ఆస్యేందు = ముఖచంద్రునియందు, కృత = చేయఁబడిన, అనుబింబమ్ = ప్రతిబింబమేర్పడునట్లుగా, దధానా = రచియించుచు, చంద్రానవస్థాం = చంద్రపరమ్పరను, ససర్జేవ = సృజించెనో యనునట్లుండెను.

వి॥ చంద్రా నవస్థలేకపోయినను చంద్రానవస్థ యేర్పడినదా యని చెప్పుట వలన ఉత్ప్రేక్షాలంకారము.

## సమాసములు:

*చంద్రాభమ్ :* చంద్రస్య ఆభేవ ఆభా యస్య సః = చంద్రాభః. తం = చంద్రాభమ్.

*ఆభ్రమ్ :* అభ్రస్య వికారః = ఆభ్రః. తమ్ = ఆభ్రమ్.

*తద్వన్నిజాస్యేందుకృతానుబింబమ్ :* సః అస్య అస్తీతి = తద్వత్. నిజం చ తత్ ఆస్యం చ = నిజాస్యం. తద్వచ్చ తత్ నిజాస్యం చ = తద్వన్నిజాస్యం. తద్వన్నిజాస్యమేవ ఇందుః = తద్వన్నిజాస్యేందుః. తద్వన్నిజాస్యేందునా కృతం అనుబింబం యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = తద్వన్నిజాస్యేందుకృతానుబింబమ్.

*సఖీముఖే :* సఖ్యాః ముఖం = సఖీముఖమ్. తస్మిమ్ = సఖీముఖే.

*చంద్రసమే:* చంద్రేణ సమం = చంద్రసమమ్. తస్మిన్ = చంద్రసమే.

*చంద్రానవస్థామ్ :* న అవస్థా = అనవస్థా. చంద్రస్య అనవస్థా = చంద్రానవస్థా. తామ్ = చంద్రానవస్థామ్.

## భావము :

ఆ సభయందొక వనిత చంద్రునివలెఁ బ్రకాశించెడి అభ్రకపు తిలకమును చెలికత్తెనుదట రచియింప నారంభించినది. అప్పుడు తన ముఖమునందున్న యా యభ్రకతిలకము తన చెలినుదటఁ దాను రచియించుచున్న యభ్రకతిలకమునందుఁ బ్రతిఫలింపనారంభించినది. తర్వాత చెలినుదటి నున్న తిలకములో తన తిలకము ప్రతిఫలింపనారంభించినది. ఇట్లొకరి తిలకమునందు

మరియొకరి తిలకము ప్రతిఫలించుటవలన, ఆ తిలకములు చంద్రునివలె గుండ్రము గను కాంతిమంతముగను నుండుటవలన నంతములేని చంద్రపరంపర యేర్పడి నదా యేమి యని భావింపఁబడుచున్నది. ॥౬౨॥

శ్లో॥ దళోదరే కాంచన కైతకస్య
క్షణాన్మషీభావుకవర్ణలేఖమ్।
తస్యైవ యత్ర స్వమనంగలేఖం
లిలేఖ భైమీ నఖలేఖినీభిః॥ ౬౩

ప॥వి॥ దళోదరే । కాంచనకైతకస్య । క్షణాత్ మషీభావుకవర్ణలేఖమ్ । తస్య । ఏవ । యత్ర । స్వమ్ । అనంగలేఖం । లిలేఖ । భైమీ । నఖలేఖినీభిః.

టీక॥ యత్ర = ఏ సభయందు, భైమీ = దమయంతి, కాంచనకైతకస్య; కాంచన = స్వర్ణమయమైన, కైతకస్య = మొగలిపూవుయొక్క, దళోదరే = తేకు మధ్యభాగమున. క్షణాత్ = క్షణమున, మషీభావుకవర్ణరేఖం; మషీభావుక = మసివలె అనగా సిరావలె నల్లఁబడెడి, వర్ణరేఖం = అక్షరపంక్తి గల, తస్యైవ (కృతే) = ఆ నలునికొఱకే, స్వం = తనదైన, అనంగలేఖం = మన్మథలేఖను, నఖలేఖినీభిః = గోరులనెడి కలములతో, లిలేఖ = వ్రాసినది.

## సమాసములు :

*దళోదరే :* దళస్య ఉదరమ్ = దళోదరమ్. తస్మిన్ = దళోదరే.

*కాంచనకైతకస్య :* కేతక్యాః ఇదం = కైతకం. కాంచనమయం చ తత్ కైతకం చ = కాంచన కైతకం. తస్య = కాంచనకైతకస్య.

*మషీభావుకవర్ణరేఖమ్ :* మష్యాః భావుకాః = మషీభావుకాః. మషీభావుకాః వర్ణరేఖాః యస్మిన్ సః = మషీభావుకవర్ణరేఖః. తమ్ = మషీభావుకవర్ణరేఖమ్.

*తద్దృక్పథే :* తస్య దృశౌ = తద్దృశౌ. తద్దృశోః పంథాః = తద్దృక్పథః. తస్మిన్ = తద్దృక్పథే.

*అనంగలేఖమ్ :* అనంగస్య లేఖః = అనంగలేఖః. తమ్ = అనంగ లేఖమ్.

*నఖలేఖినీభిః :* నఖా ఏవ లేఖిన్యః = నఖలేఖిన్యః. తాభిః = నఖలేఖి నీభిః.

**భావము ;**

ఆ సభయందు దమయంతి బంగారు మొగలి పూరేకు నడుమ వెంటనే నల్లఁబడెడి యక్షరపంక్తులుగల మన్మథలేఖను నలునిఁ గూర్చి తన గోళ్లతో వ్రాసెను. ॥౬౩॥

శ్లో॥ విలేఖితుం భీమభువో లిపీషు
సఖ్యాతివిఖ్యాతిభృతాఽపి యత్ర।
అశాకి లీలాకమలం న పాణి
మపారి కర్ణోత్పలమక్షి నైవ॥ ౬౪

ప॥వి॥ విలేఖియం । భీమభువః । లిపీషు । సఖ్యా । అతివిఖ్యాతిభృతా । అపి । యత్రఅశాకీ । లీలాకమలం । న । పాణిమ్ । అపారి । కర్ణోత్పలమ్ । అక్షి । న । ఏవ.

టీక॥ యత్ర = ఏ సభయందు, లిపీషు = చిత్తరువులు వ్రాయుటయందు, అతి విఖ్యాతిభృతా = గొప్ప ప్రసిద్ధిని వహించిన, సఖ్యాఽపి = చెలికత్తె చేతను, భీమభువః = దమయంతియొక్క, లీలాకమలం = విలాసపద్మము, అశాకి = సాధ్యపడుట (సంభవించినది). పాణింతు = హస్తమునో, విలేఖితుం = వ్రాయుటకు, మపారి = సాధ్యపడుట (సంభవింపలేదు). కర్ణోత్పలం = చెవియందలి కలువను, విలేఖితుం = వ్రాయుటకు, అపారి = సాధ్యపడుట (సంభవించినది). అక్షితు = నేత్రమునో, విలేఖితుం = వ్రాయుటకు, నాఽపారి = సాధ్యపడుట (సంభవింపలేదు).

**సమాసములు :**

*భీమభువః :* భీమాత్ భవతీతి = భీమభూః. తస్యాః = భీమభువః.

అతివిఖ్యాతిభృతా : అత్యంతం విఖ్యాతిః = అతివిఖ్యాతిః. అతివిఖ్యాతిం బిభర్తీతి = అతివిఖ్యాతిభృత్. తయా = అతివిఖ్యాతిభృతా.

లీలాకమలం : లీలా ప్రధానం కమలం = లీలాకమలం.

కర్ణోత్పలమ్ : కర్ణస్య ఉత్పలం = కర్ణోత్పలమ్. తత్ = కర్ణోత్పలమ్.

**భావము :**

ఆ సభయందు చిత్రరచనయందు అతిప్రతిష్ఠగల్గిన చెలికత్తెగూడ, దమయంతియొక్క లీలాపద్మమును జిత్రింపఁగల్గినదిగాని, యామె హస్తమును చిత్రింపలేక పోయినది. అట్లే యామె కర్ణమందలి కలువను జిత్రింపగల్గినది కాని యామె కంటిని జిత్రింపలేక పోయినది. ॥౬౪॥

శ్లో॥ భైమీముపావీణయదేత్య యత్ర
కలిప్రియస్య ప్రియశిష్యవర్గః।
గంధర్వవధ్వస్స్వరమధ్వరీణ
తత్కంఠనాళైకధురీణవీణః॥ ౬౫

ప॥వి॥ భైమీమ్ । ఉపావీణయత్ । ఏత్య । యత్ర । కలిప్రియస్య । ప్రియ శిష్యవర్గః । గంధర్వవధ్వః । స్వరమధ్వరీణతత్కంఠనాళైకధురీణ వీణః.

టీక॥ యత్ర = ఏ సభయందు, గంధర్వవధ్వఏవ = గంధర్వ స్త్రీలనెడి, కలిప్రియస్య = కలహప్రియుఁడైన నారదునియొక్క, ప్రియశిష్యవర్గః = ప్రియమైన శిష్య సమూహము, స్వరమధ్వరీణ తత్కంఠనాళైకధురీణవీణః; స్వరమధు = స్వరమనెడి తేనెతో, అరీణ = నిండిన, తత్ = ఆ దమయంతియొక్క, కంఠనాళ = కంఠనాళముతో, ఏకధురీణ = సమాన భారమును వహించిన, వీణః = వీణకలదై, ఏత్య = వచ్చి, భైమీం = దమయంతిని, ఉపావీణయత్ = వీణతో పాడించిరి.

**సమాసములు:**

కలిప్రియస్య : ప్రియః కలిః యస్య సః = కలిప్రియః. తస్య = కలిప్రియస్య.

*ప్రియశిష్యావర్గః* : శిష్యాణాం వర్గః=శిష్యవర్గః. ప్రియశ్చాసౌ శిష్య వర్గశ్చ=ప్రియశిష్యవర్గః.

*గంధర్వావధ్వః* : గంధర్వాణాం వధ్వః=గంధర్వవధ్వః.

*స్వరమధ్వారీణతత్కంఠనాళైకధురీణవీణః* : స్వర ఏవ మధు=స్వర మధు. స్వరమధునా ఆరీణమ్=స్వరమధ్వారీణం. తస్యాః కంఠః=తత్కంఠః. తత్కంఠస్య నాళమ్=తత్కంఠనాళమ్. స్వరమధ్వారీణం చ తత్ తత్కంఠ నాళం చ=స్వరమధ్వారీణతత్కంఠనాళమ్. ఏకా చ సా ధూశ్చ=ఏకధూః. ఏకధురం వహతీతి=ఏకధురీణా. స్వరమధ్వారీణ తత్కంఠనాళేన ఏకధురీణా= స్వరమధ్వారీణతతత్కంఠ నాళైకధురీణా. స్వరమధ్వారీణతత్కంఠ నాళైకధు రీణా వీణా యస్య సః=స్వరమధ్వారీణ తత్కంఠ నాళైకధురీణవీణః.

**భావము :**

ఆ సభయందు నారదుని శిష్యురాండ్రగు గంధర్వస్త్రీలు, స్వరమధువుతో నిండిన యా దమయంతియొక్క కంఠనాళముతోఁదులతూగెడి వీణను ధరించిన వారై యా దమయంతిని వీణచే పాడించి విని యానందించిరి. ॥౬౫॥

శ్లో॥ నావా స్మరః కిం హరభీతిగుప్తేః
పయోధరే ఖేలతి కుంభ ఏవ।
ఇత్యర్ధచంద్రాభనఖాంకచుంబి
కుచా సఖీ యత్ర సఖీభిరూచే॥ ౬౬

ప॥వి॥ నావా । స్మరః । కిం । హరభీతిగుప్తేః । పయోధరే । ఖేలతి । కుంభే । ఏవ । ఇతి । అర్ధచంద్రాభనఖాంకచుంబికుచా । సఖీ । యత్ర । సఖీ । యత్ర । సఖీభిః । ఊచే.

టీక॥ యత్ర=ఏ సభయందు, అర్ధచంద్రాభ నఖాంకచుంబికుచా; అర్ధ చంద్రాభ=అర్ధచంద్రునివలె ప్రకాశించు, నఖాంక = నఖక్షతము లనెడి గోటి గాయములను, మచ్చలను, చుంబి = పొందిన, కుచా = స్తనములు గల్గిన, సఖీ=చెలికత్తె, స్మరః=మన్మథుఁడు, హరభీతిగుప్తేః; హర=శివునివలని, భీతి=భయమునుండి, గుప్తేః=

రక్షణకు, పయోధరే; పయః = పాలను, నీటిని ధరించెడి స్తనమనెడి, కుంభేఏవ = కలశమునందు (నఖాంకేన = గోటి గుఱుతనెడి) నావా = ఓడచే, ఖేలతికిం = (దాహము తొలగుటకై) విహరించుచున్నాడా యేమి, ఇతి = అని, సఖీభిః = చెలికత్తెలచే, ఊచే = చెప్పబడినది.

వి॥ ఇచ్చట పయోధరమును కుంభముతో రూపించుటవలన రూపకము. హరభీతిగుప్తికై మన్మథుఁడు విహరింపక పోయినను, విహరించు చున్నాఁడా యేమి యని చెప్పుటవలన ఉత్ప్రేక్ష. ఆ యుత్ప్రేక్ష రూపకముతో సంకీర్ణము.

**సమాసములు :**

*హరభీతిగుప్తేః:* హరాత్ భీతిః = హరభీతిః. హరిభీతేఃగుప్తిః = హరభీతిగుప్తిః. తస్యాః = హరభీతిగుప్తేః.

*పయోధరే:* పయాంసి ధారయతీతి = పయోధరః. తస్మిన్ = పయోధరే.

*అర్ధచంద్రాభనఖాంకచుంబికుచా :* అర్ధం చంద్రస్య = అర్ధచంద్రః. అర్ధచంద్రస్య ఆభేవ ఆభాయస్య సః = అర్ధచంద్రాభః. నఖస్య అంకః = నఖాంకః. అర్ధచంద్రాభశ్చ అసౌ నఖాంకశ్చ = అర్ధచంద్రాభనఖాంకః. అర్ధచంద్రాభనఖాంకం చుంబతీతి = అర్ధచంద్రాభనఖాంకచుంబీ. అర్ధచంద్రాభనఖాంకచుంబీ కుచః యస్యాస్సా = అర్ధచంద్రాభనఖాంకచుంబికుచా.

**భావము :**

ఆ సభయందు నర్ధచంద్రాకారమైన నఖ చిహ్నములతోఁగూడిన స్తనముతోఁ జెన్నొందు చెలికత్తె; మన్మథుఁడు శివునివలని భయమునుండి తన్ను రక్షించుకొనుటకై పయోధరమనెడి కుండయందు ననగా స్తనమనెడికుండయందు నఖచిహ్నమనెడి యోడతో శివునివలని దాహమునుఁబోగొట్టుకొనుటకై విహరించుచున్నాడా యేమి యని తోటి చెలికత్తెలతోఁ జెప్పినది. పయస్సనగా పాలు నీరు రెండును నగును. పయోధరము స్తనవాచకమగుటవలన పాలను ధరించిన దైనను, శ్లేషచే నీటినిఁగూడ ధరించుచున్నట్లు వ్యాఖ్యాతము. ॥౬౬॥

శ్లో॥ స్మరాశుగీభూయ విదర్భసుభ్రూ
వక్షోయదక్షోభి ఖలు ప్రసూనైః।

స్రజం సృజంత్యా తదశోధి తేషు
యత్రైకయా సూచిశిఖాం నిఖాయ॥ ౬౭

ప॥వి॥ స్మరాశుగీభూయ । విదర్భసుభ్రూవక్షః । యత్ । అక్షోభి । ఖలు । ప్రసూనైః । స్రజం । సృజంత్యా । తత్ । అశోధి । తేషు । యత్ర । ఏకయా । సూచిశిఖాం । నిఖాయ.

టీక॥ ప్రసూనైః = పుష్పములచే, స్మరాశుగీభూయ = మన్మథుని బాణముగా నేర్పడి, విదర్భసుభ్రూవక్షః; విదర్భసుభ్రూ = దమయంతియొక్క, వక్షః = వక్షఃస్థలము, అక్షోభిఖలుఇతియత్ = కలతపెట్టఁబడిన దనుట యేదిగలదో, తత్ = ఆ కలతపెట్టుటవలనివైరము, యత్ర = ఏసభ యందు, తేషు = ఆపుష్పములయందు, సూచిశిఖాం = సూదికొనను, నిఖాయ = గ్రుచ్చి, స్రజం = మాలను, సృజంత్యా = సృజించుచున్న, ఏకయా = ఒక చెలికత్తెచే, అశోధి = తీర్చుకొనబడినది.

## సమాసములు :

స్మరాశుగీభూయ : అనాశుగః ఆశుగః సంపద్యమానః భూత్వా = ఆశుగీభూయ. స్మరస్య ఆశుగీభూయ = స్మరాశుగీభూయ.

విదర్భసుభ్రూవక్షః: విదర్భాణాం సుభ్రూః = విదర్భసుభ్రూః. విదర్భసుభ్రువః వక్షః = విదర్భసుభ్రూవక్షః.

సూచిశిఖామ్ : సూచేః శిఖా = సూచిశిఖా. తామ్ = సూచిశిఖామ్.

## భావము :

పుష్పములు మన్మథబాణములై దమయంతి వక్షఃస్థలమునందు గ్రుచ్చుకొని యామెను బాధించినందువలన నా సభలో నొకచెలికత్తె పూలను సూదికొనకు గ్రుచ్చుచు మాలను కట్టుచున్నదై, దానికిఁ బగతీర్చుకొనినది. ॥౬౭॥

శ్లో॥ యత్రావదత్తామతిభీయ భైమీ
త్యజత్యజేదం సఖి సాహసిక్యం।

త్వమేవ కృత్వా మదనాయ దత్సే
బాణాన్ ప్రసూనాని గుణేన సజ్జాన్॥ ౬౭

ప॥వి॥ యత్ర । అవదత్। తామ్ । అతిభీయ। భైమీ । త్యజ । త్యజ । ఇదం। సఖి । సాహసిక్యం । త్వమ్ । ఏవ । కృత్వా । మదనాయ । దత్సే । బాణాన్ । ప్రసూనాని । గుణేన । సజ్జాన్.

టీక॥ యత్ర = ఏసభయందు, తాం = ఆమాలికను కట్టినటువంటి చెలికత్తెను, భైమీ = దమయంతి, అతిభీయ = మిక్కిలి భయపడి, అవదత్ = చెప్పెను. హేసఖి = ఓచెలీ, ఇదం = ఈ, సాహసిక్యం = సాహసకృత్యమును, త్యజత్యజ = వదలుము, వదలుము. (కుతః = ఏలయనగా), త్వమేవ = నీవే, ప్రసూనాని = పుష్పములనెడి, బాణాన్ = బాణములను, గుణేన = నూలుతోడను, (అల్లెత్రాటితోఁడను), సజ్జాన్ = గ్రుచ్చిసిద్ధమైనవానినిగా, కృత్వా = చేసి, మదనాయ = మన్మథునికొఱకు, దత్సే = ఇచ్చుచున్నావు.

**సమాసములు:**

అతిభీయ : అత్యంతం భీత్వా = అతిభీయ.

సాహసిక్యం : సహసావర్తత ఇతి = సాహసికః. సాహసికస్య కర్మ = సాహసిక్యం. తత్ = సాహసిక్యం.

**భావము:**

ఆ మాలికను కట్టుచున్న చెలికత్తెనుఁజూచి దమయంతి చాల భయపడి యిట్లుచెప్పినది. ఓచెలీ ! ఈపూలమాలను కట్టు నీసాహసమునను వదిలివేయుము. ఏలయనగా, నీవు కట్టుచున్న పూలమాలలోని పూలు బాణములుగను, దానిదారము అల్లెత్రాడుగను, స్మరునకుపయోగపడగలదు. ॥౬౭॥

శ్లో॥ ఆలిఖ్య సఖ్యాః కుచపత్రభంగీ
మధ్యే సుమధ్యా మకరీం కరేణ।
యత్రావదత్తామియమాళి యానం
మన్యే త్వదేకావళినాకనద్యాః॥ ౬౮

ప॥వి॥ ఆలిఖ్య । సఖ్యాః । కుచపత్రభంగీమధ్యే । సుమధ్యా । మకరీం । కరేణ । యత్ర । అవదత్ । తామ్। ఇయమ్ । ఆళి । యానం । మన్యే। త్వదేకావళి నాకనద్యాః.

టీక॥ యత్ర = ఏ సభయందు, సుమధ్యా = చక్కని నడుము కల్గిన యొక కాంత, సఖ్యాః = చెలికత్తెయొక్క, కుచపత్రభంగీమధ్యే; కుచ = స్తనములయందు, పత్రభంగీ = మకరికాది పత్రరచనలయొక్క, మధ్యే = మధ్యయందు, మకరీం = మకరిని, కరేణ = హస్తముతో, ఆలిఖ్య = వ్రాసి, తాం = ఆ, సఖీం = చెలికత్తెను, అవదత్ = పలికెను. హేఆళి = ఓ చెలీ ! ఇయం = ఈమకరి, త్వదేకావళి నాకనద్యాః, త్వత్ = నీయొక్క, ఏకావళి = ఏకావళియను ముక్తాహారమయిన, నాకనద్యాః = గంగా నదికి, యానం = వాహనముగా, మన్యే = తలంతును.

వి॥ ఏకావళిని గంగానదిగఁ జెప్పుటవలన రూపకము. ఆ దమయంతి పత్ర రచనలలో నున్న మకరిక గంగకు వాహనము గాక పోయినను వాహనముగా సంభావన చేయుటవలన నుత్ప్రేక్ష. ఆయుత్ప్రేక్షకు రూపకమునకు సంకరము.

## సమాసములు :

*కుచపత్రభంగీమధ్యే :* కుచయోః పత్రాణి = కుచపత్రాణి. కుచపత్రాణాం భంగ్యః = కుచపత్రభంగ్యః. కుచపత్రభంగీనాం మధ్యః = కుచపత్రభంగీమధ్యః. తస్మిన్ = కుచపత్రభంగీమధ్యే,

*సుమధ్యా :* శోభనః మధ్యః యస్యాస్సా = సుమధ్యా.

*త్వదేకావళినాకనద్యాః:* తవ ఏకావళిః = త్వదేకావళిః. నాకస్య నదీ = నాకనదీ, త్వదేకావళిరేవ నాకనదీ = త్వదేకావళినాకనదీ. తస్యాః = త్వదేకావళి నాకనద్యాః.

## భావము :

ఆ సభయందు, చక్కటినడుముగల్గిన యొకకాంత చెలికత్తెయొక్క చనుగవలో పత్రరచనలయందలి మకరికనుఁ జేతితో వ్రాసిచూపి – ఓ సఖీ!

ఈ మకరిక నీ ముత్తెపుసరమనెడి గంగకు వాహనమైన మకరికయని నేను భావించుచున్నానని చెప్పెను. గంగకు మకరి వాహనమను ప్రసిద్ధిగలదు. ఆ చెలికత్తె కంఠమందలి ముక్తావళి గంగగాను ఆమెచనుగవపైని మకరిక యాగంగకు వాహనముగాను రూపింపఁబడినది. ॥౭౯॥

శ్లో॥ తామేవ సా యత్ర జగాద భూయః
పయోధియాదఃకుచకుంభయోస్తే।
సేయం స్థితా తావకహృచ్ఛయాంక
ప్రియాస్తు విస్తారయశఃప్రశస్తిః॥ ౭౦

ప॥వి॥ తామ్ । ఏవ । సా । యత్ర । జగాద । భూయః । పయోధియాదః । కుచకుంభయోః । తే । సా । ఇయం । స్థితా । తావకహృచ్ఛయాంక ప్రియా । అస్తు । విస్తారయశఃప్రశస్తిః.

టీక॥ యత్ర = ఏ సభయందు, సా = ముందలంకరించిన చెలికత్తె, తామేవ = అలంకరింపబడిన యా చెలికత్తెనే, భూయః = మఱల, జగాద = పలికెను. (కిమితి = ఏమనగా), పయోధియాదః; పయోధి = సముద్రము యొక్క, యాదః = జంతువైన మొసలి, (కించ = మఱియు) తావక హృచ్ఛయాంకప్రియా; తావక = నీదైన, హృత్ = హృదయమునందు, శయ = ఉండెడి మన్మథునియొక్క, అంక = చిహ్నమైన మొసలికి, ప్రియా = ప్రియురాలుగా, అస్తు = అగును గాత. తే = నీయొక్క, కుచ కుంభయోః = స్తనకలశముల యందు, స్థితా = ఉన్నటువంటి, సా = ఆ, ఇయం = ఈమకరి, విస్తారయశఃప్రశస్తిః; విస్తారయశః = ఆ రెంటి యొక్క విశాలమైన కీర్తికి, ప్రశస్తిః = స్తుతించెడి వర్ణపంక్తిగా, అస్తు = ఉండును గాత.

**సమాసములు :**

పయోధియాదః : పయోధేః యాదః = పయోధియాదః.

కుచకుంభయోః : కుచౌ = కుంభావివ = కుచకుంభౌ. తయోః = కుచకుంభయోః.

తావకహృచ్ఛయాంకప్రియా : తవ అయం = తావకః. తావకశ్చాసౌ హృచ్ఛయశ్చ = తావకహృచ్ఛయః. తావకహృచ్ఛయస్య అంకః = తావకహృచ్ఛయాంకః. తావకహృచ్ఛయాంకస్య ప్రియా = తావకహృచ్ఛయాంకప్రియా.

విస్తారయశఃప్రశస్తిః : విస్తారం చ తత్ యశశ్చ = విస్తారయశః. విస్తారయశసః ప్రశస్తిః = విస్తారయశఃప్రశస్తిః.

**భావము :**

అచ్చట నొక కాంతకు చనుగవలో మకరికాది పత్రములను రచియించిన సుమధ్యయగు చెలికత్తె యామెనుఁ గూర్చి యిట్లు పలికెను-ఓ చెలీ! సముద్రమందలి మొసలి నీహృదయమందలి మన్మథుని ధ్వజచిహ్నమైనమొసలికిప్రియురాలగు గాత. నీచనుగవపై వ్రాయఁబడిన మకరి యాచనుగవయొక్క వైశాల్యమునకు నౌన్నత్యమునకు సంబంధించిన కీర్తి స్తుతివర్ణములుగా నుండనిమ్ము. ॥౨౦॥

శ్లో॥ శారీం చరంతీం సఖి మారయైనా
మిత్యక్షదాయే కథితే కయాఽపి।
యత్ర స్వఘాతభ్రమభీరుశారీ
కాకూత్థసాకూతహసస్స జజ్ఞే॥ ౨౧

ప॥వి॥ శారీం । చరంతీం । సఖి । మారయ । ఏనామ్ । ఇతి । అక్షదాయే । కథితే । కయా । అపి । యత్ర । స్వఘాతభ్రమభీరుశారీ కాకూత్థసాకూతహసః । సః । జజ్ఞే.

టీక॥ యత్ర = ఏ సభయందు, సః = ఆ నలుఁడు, కయాఽపి = ఒకానొక (జూదగత్తెచే), హేసఖి = ఓ చెలీ! ఏనాం = ఈ, చరంతీం = సంచరించుచున్న, శారీం = పాచికను, (గోరువంకను), మారయ = కొట్టుము, ఇతి = అని, అక్షదాయే = పాచికలను వేయుట, కథితేసతి = చెప్పఁబడగా, స్వఘాతభ్రమభీరుశారీకాకూత్థసాకూతహసః; స్వ = తనయొక్క, ఘాత = మారణమందలి, భ్రమ = భ్రాంతిచే, భీరు = భయపడు

చున్న, శారీ = గోరువంకయొక్క, కాకు = వికృతధ్వనిచే, ఉత్థ = ఉద్భవించిన, సాకూతహాసః = సాభిప్రాయమైన నవ్వు గలవాఁడుగా, జజ్ఞే = ఆయెను.

## సమాసములు :

అక్షదాయే : అక్షాణాం దాయః = అక్షదాయః. తస్మిన్ = అక్షదాయే.

స్వఘాతభ్రమభీరుశారీకాకూత్థసాకూతహాసః : స్వస్య ఘాతః = స్వఘాతః. స్వఘాతస్య భ్రమః = స్వఘాతభ్రమః. స్వఘాతభ్రమాత్ భీరుః = స్వఘాతభ్రమ భీరుః. స్వఘాతభ్రమభీర్భుశ్చాసౌ శారీ చ = స్వఘాతభ్రమభీరు శారీ. స్వఘాతభ్రమభీరుశార్యాః కాకుః = స్వఘాత భ్రమభీరుశారీకాకుః. స్వఘాతభ్రమభీరుశారీకాకోః ఉత్థః = స్వఘాతభ్రమభీరుశారీకాకూత్థః. ఆకూతేన సహ వర్తత ఇతి = సాకూతః. స్వఘాతభ్రమభీరుశారీకాకూత్థః, సాకూతః హాసః యస్యసః = స్వఘాతభ్రమభీరుశారీకాకూత్థసాకూతహాసః.

## భావము :

ఆ సభయందు చెలికత్తెలు పాచికలాడుచున్నారు. అందొక జూదగత్తె ఓ చెలీ! ఇచ్చట నడచుచున్న యీశారిని అనగా పాచికలలోని యొక సాధనమునుఁ జంపుమని చెప్పెను. అది విని యచ్చట సంచరించెడి శారిక అనగా గోరువంక, తన్నుఁ జంపమనినట్లు భ్రమించి బెగడొంది వికారముగ కూయఁ దొడగెను. దానిని వినిన నలుఁడు భావగర్భముగా నవ్వెను. ॥౨౦॥

శ్లో॥ భైమీసమీపే స నిరీక్ష్య యత్ర
తాంబూలజాంబూనదహంసలక్ష్మీమ్।
కృతప్రియాదూత్యమహోపకార
మరాళమోహాద్రధిమానమూహే॥ ౨౧

ప॥వి॥ భైమీసమీపే । సః । నిరీక్ష్య । యత్ర । తాంబూలజాంబూనదహంస లక్ష్మీమ్ । కృతప్రియాదూత్యమహోపకారమరాళమోహాద్రధిమానమ్ । ఊహే.

టీక॥ యత్ర = ఏ సభయందు, సః = ఆ నలుఁడు, భైమీసమీపే = దమయంతి యెదుట, తాంబూలజాంబూనదహంసలక్ష్మీం; తాంబూల = తాంబూల పాత్రమందలి, జాంబూనద హంస = పసిడిహంసయొక్క, లక్ష్మీం = శోభను, నిరీక్ష్య = చూచి, కృతప్రియా దూత్యమహోపకారమరాళమో హద్రఢిమానమ్; కృత = చేయఁబడిన, ప్రియాదూత్య = ప్రియురాలి దూత్యమను, మహోపకార = గొప్ప యుపకారము గల్గిన, మరాళ = హంసయొక్క, మోహ = భ్రాంతియొక్క, ద్రఢిమానం = దార్ఢ్యమును, ఊహే = వహించెను.

## సమాసములు :

భైమీసమీపే : భీమస్య అపత్యం స్త్రీ = భైమీ. భైమ్యాః సమీపమ్ = భైమీసమీపమ్. తస్మిన్ = భైమీసమీపే.

తాంబూలజాంబూనదహంసలక్ష్మీమ్ : జాంబూనదశ్చ యశ్చాసౌ హంసశ్చ = జాంబూనందహంసః. తాంబూలస్య జాంబూనదహంసః = తాంబూలజాంబూనదహంసః. తాంబూలజాంబూనదహంసస్య లక్ష్మీః = తాంబూలజాంబూన దహంస లక్ష్మీః. తామ్ = తాంబూలజాంబూనదహంసలక్ష్మీమ్.

కృతప్రియాదూత్యమహోపకారమరాళమోహద్రఢిమానం : దూతస్య కర్మ = దూత్యం. ప్రియాయాః దూత్యం = ప్రియాదూత్యం. మహాంశ్చాసౌ ఉపకారశ్చ = మహోపకారః. ప్రియాదూత్యమేవ మహోపకారః = ప్రియా దూత్యమహోపకారః. కృతః ప్రియాదూత్యమహోపకారః యేన సః = కృత ప్రియాదూత్యమహోపకారః. కృతప్రియాదూత్యమహోపకారశ్చాసౌ మరాళశ్చ = కృతప్రియాదూత్యమహోపకారమరాళః. కృతప్రియాదూత్యమహోప కారమరాళే మోహః = కృతప్రియాదూత్యమహోపకారమరాళమోహః. కృత ప్రియాదూత్యమహోపకారమరాళమోహస్య ద్రఢిమా = కృతప్రియాదూత్య త్యమహోపకారమరాళమోహద్రఢిమా. తమ్ = కృతప్రియాదూత్య మహోప కారమరాళ మోహద్రఢిమానమ్.

## భావము :

ఆ నలుఁడా సభయందు దమయంతి దగ్గఱ తాంబూలపాత్ర కతికింపఁ బడిన పసిడిహంసయొక్క శోభను చూచి, ప్రియురాలైన దమయంతికై

దూత్యమును వహించిన హంసయందుఁ దనకుఁ గల్గిన మోహమును దృఢపఱచు కొనెను. పూర్వము పసిడి ఱెక్కలుగల హంసను నలుఁడు కొలనిగట్టునఁ గాంచి దాని కాసపడి పట్టుకొనెను. అప్పుడు పసిడి ఱెక్కలుగల హంసలెక్కడివి? అని యాశ్చర్యపడి యుండెను. కాని యిప్పుడు పసిడి హంసను, తాంబూలపాత్ర యందు గాంచి యానాటి తన మోహమును పరికించుకొని సంశయనివృత్తి గావించుకొనెను. మఱియు నాడు కొలని గట్టున తాఁజేతపట్టుకొనిన పసిడి యంచ దూత్యమునకై దమయంతి కడకు వచ్చినది. ఆహంస యిది యాః యని భ్రాంతిని దృఢపఱచుకొనెను. ॥౭౨॥

శ్లో॥ తస్మిన్నియం సేతి సఖీసమాజే
నలస్య సందేహమథ వ్యుదస్యన్।
అపృష్ట ఏవ స్ఫుటమాచచక్షే
సకోఽపి రూపాతిశయస్స్వయం తామ్॥ ౭౩

ప॥వి॥ తస్మిన్ । ఇయం । సా । ఇతి । సఖీసమాజే । నలస్య । సందేహమ్ । అథ । వ్యుదస్యన్ । అపృష్టః । ఏవ । స్ఫుటమ్ । ఆచచక్షే । సః । కః । అపి । రూపాతిశయః । స్వయం । తామ్.

టీక॥ అథ = తర్వాత, తస్మిన్ = ఆ, సఖీసమాజే = ఆచెలికత్తెల సంఘమందు, నలస్య = నలునియొక్క, సందేహం = సంశయమును, అనగా వీరిలో నెవ్వతె దమయంతి యను సంశయమును, వ్యుదస్యన్ = తొలగించుచు, సః = అప్రసిద్ధమైన, కోఽపి = అపూర్వమైన, రూపాతిశయః = సౌంద ర్యాతిశయము, స్వయం = తనయంతట, అపృష్టఏవ = అడుగఁబడకయే. తాం = ఆదమయంతిని, సా = ఆ దమయంతి, ఇయం = ఈమె, ఇతి = అని, స్ఫుటం = స్పష్టముగా, ఆచచక్షే = చెప్పినది.

**సమాసములు :**

అపృష్టః: న పృష్టః = అపృష్టః.

రూపాతిశయః: రూపస్య అతిశయః = రూపాతిశయః.

భావము :

ఆ సభనుచూచిన పిదప నా యువతులలో దమయంతియెవ్వతె? యనెడి నలుని సందేహము తనయంతటనే ఎవ్వరినిగూడ నడుగకయే తీరినది-అదెట్లనగా ఆ సభయందుఁ జేరియున్న స్త్రీలలో లోకోత్తరమగు సౌందర్య విశేషమెవ్వత యందుఁగలదో యామెయే దమయంతియని నిశ్చయింప వీలైనది. ఆప్రకారము పరికింపగా నా సౌందర్యవిశేష మొక్కతెయందే యున్నది. అందువలన నామె దమయంతి యని చెప్పనవసరములేకయే యాయపూర్వ సౌందర్యమే దమయంతిని గుర్తింప జేసినది. ॥౨౩॥

శ్లో॥ భైమీవినోదాయ ముదా సఖీభి
స్తదాకృతీనాం భూవి కల్పితానాం।
నాఽతర్కి మధ్యే స్ఫుటమప్యుదీతమ్
తస్యాను బింబం మణివేదికాయమ్॥ ౨౪

ప॥వి॥ భైమీవినోదాయ । ముదా । సఖీభిః । తదాకృతీనాం । భువి । కల్పితానాం । న । అతర్కి । మధ్యే । స్ఫుటమ్ । అపి । ఉదీతం । తస్య । అనుబింబం । మణివేదికాయామ్.

టీక॥ భైమీవినోదాయ; భైమీ = దమయంతికి, వినోదాయ = వినోదముకొఱకు, ముదా = కుతూహలముచే, భువి = భూమియందు, కల్పితానాం = కల్పింపఁబడిన, తదాకృతీనాం, తత్ = ఆనలునియొక్క, ఆకృతీనాం = ఆకృతులకు, (ప్రతిమలకు) మధ్యే = నడుమ, మణివేదికాయాం = రత్నమయమైన వేదికయందు, స్ఫుటం = స్పష్టముగా, ఉదీతమపి = వ్యక్తమైనను, తస్య = అతనియొక్క, అనుబింబం = ప్రతిబింబమని, నాఽతర్కి = ఊహింపఁబడలేదు.

వి॥ నలునిప్రతిమలకును, నలుని ప్రతిబింబమునకు వ్యత్యాసము తెలియలేదని వర్ణించుటవలన సామాన్యాలంకారము. దీనివలన నిజమైన నలుని ప్రతిబింబమందు కల్పితనలుఁడనియు కల్పితమైన నలునియందు నిజమైన నలుఁడనియు భ్రాంతి వ్యంగ్యమగుటవలన భ్రాంతి మదలంకార ధ్వని.

**సమాసములు :**

*భైమీవినోదాయ :* భైమ్యాః వినోదః = భైమీవినోదః. తస్మై = భైమీ వినోదాయ.

*తదాకృతీనాం :* తస్య ఆకృతయః = తదాకృతయః. తాసాం = తదాకృతీనామ్.

*మణివేదికాయా :* మణిమయీ చ సా వేదికా చ = మణివేదికా. తస్యామ్ = మణివేదికాయామ్.

**భావము :**

దమయంతికి, కాలము సుఖముగాఁ గడచుటకై నలుని ప్రతిమలనుఁ గల్పించిరి. నలుడు మణివేదికపై నిలచినపుడచ్చట బ్రతిఫలించిన యాతని ప్రతిబింబమునకును నా ప్రతిమలకును భేదము తెలియక పోయినది. కావున నచ్చట నున్న నలప్రతిమలకును, నల ప్రతిబింబమునకు భేదము తెలియక యందఱికిని భ్రాంతి గలిగినది. అనగా నలుని ప్రతిమానిర్మాణశిల్పకౌశల మపూర్వమైనది. ఏలయనగా నిజమైన నలుని ప్రతిబింబమునకు, కల్పిత ప్రతిమలకును భేదము కానరాక పోవుటయే యా కౌశలమని యాశయము. ॥౨౪॥

శ్లో॥ హుతాశకీనాశజలేశదూతీ
ర్నిరాకరిష్ణోః కృతకాకుయాచ్ఞాః।
భైమ్యా వచోభిస్స నిజాం తదాశాం
న్యవర్తయద్దూరమపి ప్రయాతామ్॥ ౨౫

ప॥వి॥ **హుతాశకీనాశజలేశదూతీః** । నిరాకరిష్ణోః। కృతకాకుయాచ్ఞాః। భైమ్యాః। వచోభిః । సః । నిజాం । తదాశాం । న్యవర్తయత్ । దూరమ్ । అపి । ప్రయాతామ్.

**టీక॥** కృతకాకుయాచ్ఞాః; కృత = చేయబడిన, కాకు = దైన్యస్వరముతోఁ గూడిన, యాచ్ఞాః = యాచనలు గల్గిన, హుతాశకీనాశజలేశదూతీః; **హుతాశ** = అగ్నియు, **కీనాశ** = యముఁడును, **జలేశ** = వరుణుఁడు అను

నీ దిక్పాలురయొక్క, దూతీః = దూతికలను, నిరాకరిష్ణోః = నిరాకరింపఁ గోరిన, భైమ్యాః = దమయంతియొక్క, వచోభిః = మాటలచే, సః = ఆ నలుఁడు, దూరం = అందుబాటు లేనిదిగా, ప్రయాతామపి = పోయిన దైనను, నిజాం = తనదైన, తాదాశాం; తత్ = ఆ దమయంతిపైన, ఆశాం = ఆశను, న్యవర్తయత్ = మఱలించుకొనెను.

## సమాసములు :

*హుతాశకీనాశజలేశదూతీః :* హుతాశశ్చ కీనాశశ్చ జలేశశ్చ = హుతాశకీనాశజలేశాః. హుతాశకీనాశజలేశానాం దూత్యః = హుతాశకీనాశజలేశదూత్యః. తాః = హుతాశకీనాశజలేశదూతీః.

*నిరాకరిష్ణోః :* నిరాకర్తు మిచ్ఛుః = నిరాకరిష్ణుః. తస్యాః = నిరాకరిష్ణోః.

*కృతకాకుయాచ్ఞాః :* కాక్వా యాచ్ఞాః = కాకుయాచ్ఞాః కృతాః కాకుయాచ్ఞాః యాభిస్తాః = కృతకాకుయాచ్ఞాః. తాః = కృతకాకుయాచ్ఞాః.

*తదాశాం :* తస్యామాశా = తదాశా. తాం = తదాశామ్.

## భావము :

అగ్ని యమవరుణుల దూతికలు వారికొఱకై దమయంతిని మిక్కిలి దీనముగా యాచించిరి. కాని దమయంతి వారి నందఱిని తిరస్కరింప నిశ్చయించుకొనిన విషయమును దమయంతియొక్క మాటల వలన నలుఁడు గ్రహించెను. అందువలన ఇంద్రాది దిక్పాలుర కుట్రవలన తనకు దమయంతి లభ్యము కాదని యామెపై నిరాశఁ జేసుకొనిన నలుఁడు మఱల యామెపై నాశను మఱలింపఁ జేసెను. ॥౭౨॥

శ్లో॥ విజ్ఞప్తిమంతస్సభయస్స భైమ్యాం
మధ్యేసభం వాసవశంభలీయాం।
సంభావయామాస భృశంకృశాశ
స్తదాశిబృందైరభినంద్యమానాం॥

ప॥వి॥ విజ్ఞప్తిం । అంతః । సభయః । సః ః భైమ్యాం । మధ్యేసభం । వాస వశంభలీయాం । సంభావయామాస । భృశం । కృశాశః । తదాలిబృం దైః । అభినంద్యమానామ్.

టీక॥ సః = ఆ నలుఁడు, మధ్యేసభం = సభా మధ్యమందు, తదాళిబృందైః; తత్ = ఆ దమయంతియొక్క, ఆళిబృందైః = చెలికత్తెల సమూహము లచే, అభినంద్యమానాం = శ్లాఘింపఁబడుచున్న, వాసవశంభళీయాం; వాసవ = ఇంద్రునియొక్క, శంభళీయాం = దూతికి సంబంధించిన, భైమ్యాం = దమయంతీ విషయమున, విజ్ఞప్తిం = విన్నపమును, అంతః = లోపల, సభయః = భయముతోఁ గూడినవాఁడై, (అతఏవ = ఇందువలననే) కృశాశః = తగ్గిపోయిన ఆశకలవాఁడై అనగా దమయంతీ ప్రాప్త్యాశను శిథిలము గావించుకొనినవాఁడై, భృశం = మిక్కిలి, సంభావ యామాస = సావధానముగా వినెను.

సమాసములు :

సభయః : భయేన సహవర్తత ఇతి = సభయః.

మధ్యేసభం : సభాయాః మధ్యే = మధ్యేసభమ్.

వాసవశంభళీయామ్ : వాసవస్య శంభళీ = వాసవశంభళీ. వాసవ శం భల్యాః ఇయం = వాసవశంభళీయా. తామ్ = వాసవశంభళీయామ్.

కృశాశః : కృశా ఆశా యస్య సః = కృశాశః.

తదాలిబృందైః: తస్యాః ఆళయః = తదాళయః. తదాళీనాం బృందాః = తదాళిబృందాః. తైః = తదాళిబృందైః.

భావము

సభా మధ్యలో, దమయంతి చెలికత్తెలు మెచ్చుచుండగా, ఇంద్రుని దూతి విజ్ఞప్తి చేయఁదొడగినవి. కాని నలుఁడు దూతి దమయంతీ విషయము నందేమి విజ్ఞప్తి చేయునో, ఒకవేళ ఇంద్రుని యందలి గౌరవముచేత నా విజ్ఞప్తి నంగీకరించునేమో యను భయ సందేహములతో, దమయంతిపైన నాశనుఁ దగ్గించుకొనుచు మిక్కిలి శ్రద్ధతో నా విజ్ఞప్తిని విన నుద్యమించెను. ॥౨౬॥

శ్లో॥ లిపిర్న దైవీ సుపఠా భువీతి
తుభ్యం మయి ప్రేషితవాచికస్య।
ఇంద్రస్య దూత్యాం రచయ ప్రసాదం
విజ్ఞాపయంత్యామవధానదానమ్॥ ౭౭

ప॥వి॥ లిపిః । న । దైవీ । సుపఠా । భువి । ఇతి । తుభ్యం । మయి । ప్రేషితవాచికస్య । ఇంద్రస్య । దూత్యాం । రచయ । ప్రసాదం । విజ్ఞాపయంత్యామ్ । అవధానదానమ్.

టీక॥ దైవీ = దేవసంబంధమైన, లిపిః = వ్రాత, భువి = భూమియందు, సుపఠా = పఠింపసాధ్యము, న = కానేరదు, ఇతి = అని, తుభ్యం = నీ కొఱకు, ప్రేషిత వాచికస్య; ప్రేషిత = పంపఁబడిన, వాచికస్య = సందేశము గలిగిన, ఇంద్రస్య = ఇంద్రునియొక్క, దూత్యాం = దూతియైన, మయి = నేను, విజ్ఞాపయంత్యాం = విన్నవించుచుండగా, అవధానదానం; అవధాన = ఏకాగ్రతయొక్క, దానం = దానమును, ప్రసాదం = అనుగ్రహముగా, రచయ = చేయుము.

## సమాసములు :

దైవీ : దేవానామియం = దైవీ.

ప్రేషితవాచికస్య : ప్రేషితం వాచికం యేన సః = ప్రేషితవాచికః. తస్య = ప్రేషితవాచికస్య.

అవధానదానమ్ : అవధానస్య దానమ్ = అవధానదానమ్.

## భావము :

ఓ దమయంతీ! దేవతల వ్రాత భూలోక వాసులకుఁ దెలియదని యింద్రుఁడు నీకు సందేశమును మాటల రూపమునఁ జెప్పి పంపియున్నాఁడు. కావున నీవు విజ్ఞప్తి చేయుచున్న యింద్రదూతికయైన నాయెడ నవధానము నను గ్రహింపుము. అనగా నేను చెప్పబోవు నింద్రసందేశమును సావధానముగ వినుము. ॥౭౭॥

శ్లో॥ సలీలమాలింగనయోపపీడ
మనామయంపృచ్ఛతి వాసవస్త్వామ్।
శేష స్త్వదాశ్లేషకథావినిద్రై
స్తద్రోమభిస్సందిదిశే భవత్యై॥ ౭౮

ప॥వి॥ సలీలమ్ । ఆలింగనయా । ఉపపీడమ్ । అనామయం । పృచ్ఛతి । వాసవః । త్వామ్ । శేషః ।త్వదాశ్లేషకథావినిద్రైః । తద్రోమభిః । సందిదిశే । భవత్యై.

టీక॥ హేభైమి = ఓ దమయంతీ! వాసవః = ఇంద్రుడు, త్వాం = నిన్ను, సలీలం = విలాసముతో, ఆలింగనయా = కౌగలింపుచే, ఉపపీడమ్ = గాఢముగ నాలింగనము గావించుకొని, అనామయం = క్షత్రియ సంప్రదాయ ప్రకారము నీ యారోగ్యమునుఁ గూర్చి, పృచ్ఛతి = యడుగుచున్నాడు. శేషః = మిగిలిన విషయము, త్వదాశ్లేషకథావినిద్రైః; త్వత్ = నీయొక్క, ఆశ్లేషకథా = ఆలింగన వృత్తాంతముచే, వినిద్రైః = నిక్క పొడుచుకొనిన, తద్రోమభిః; తత్ = ఆ యింద్రునియొక్క, రోమభిః = పులకములచే, భవత్యై = నీ కొఱకు, సందిదిశే = చెప్పిపంపఁబడినది.

## సమాసములు :

సలీలం : లీలయా సహితం యథా తథా = సలీలం.

అనామయం : న ఆమయః = అనామయః. తమ్ = అనామయం.

త్వదాశ్లేషకథావినిద్రైః : తవ ఆశ్లేషః = త్వదాశ్లేషః. త్వదాశ్లేషస్య కథా = త్వదాశ్లేషకథా. విగతా నిద్రా యేషాం తే = వినిద్రాః. త్వదాశ్లేష కథయా వినిద్రాః = త్వదాశ్లేషకథావినిద్రాః. తైః = త్వదాశ్లేషకథావినిద్రైః.

## భావము :

ఓ దమయంతీ! ఇంద్రుఁడు నిన్ను విలాస పూర్వకముగా గాఢాలింగనము గావించుకొని క్షత్రియ మర్యాదననుసరించి నీ కనామయమా? యని నీ క్షేమ

ముఁగూర్చి ప్రశ్నించుచున్నాఁడు. తక్కిన పని, నీ యాలింగన వృత్తాంతముచే నిక్కపొడుచుకొనిన యతని రోమాంచములచేతనే చెప్పఁబడుచున్నది. ॥౭౪॥

శ్లో॥ యః ప్రేర్యమాణోఽపి హృదా మఘోనః
త్వదర్థనాయాం హ్రియమాపదాగః।
స్వయంవరస్థానజుషస్తమస్య
బధాన కంఠం వరణస్రజైవ॥ ౭౫

ప॥వి॥ యః । ప్రేర్యమాణః । అపి । హృదా । మఘోనః । త్వదర్థనాయాం । హ్రియమ్ । అపత్ । ఆగః । స్వయంవరస్థానజుషః । తమ్ । అస్య । బధాన । కంఠం । వరణస్రజా । ఏవ.

టీక॥ (హే భైమి = ఓ దమయంతీ!) మఘోనః = ఇంద్రునియొక్క, యః = ఏ కంఠము, త్వదర్థనాయాం = నిన్ను యాచించుటలో, హృదా = హృదయముచే, ప్రేర్యమాణోఽపి = ప్రేరేపింపఁబడినను, హ్రియమేప = సిగ్గనెడి, ఆగః = అపరాధమును, అపత్ = పొందెను. స్వయంవరస్థానజుషః; స్వయంవర = స్వయంవరముయొక్క, స్థాన = స్థానమును, జుషః = పొందుచున్న, అనగా స్వయంవరమునకే తెంచిన, అస్య = ఈ యింద్రుని యొక్క, తం = ఆ యపరాధముగావించిన, కంఠం = కంఠమును, వరణస్రజైవ = భర్తను వరించెడి పుష్పమాలచే, బధాన = బంధింపుము.

## సమాసములు :

*త్వదర్థనాయాం:* తవ అర్థనా = త్వదర్థనా, తస్యాం = త్వదర్థనాయాం.

*స్వయంవరస్థానజుషః:* స్వయంవరస్యస్థానం జుషత ఇతి = స్వయంవరస్థానజుః. తస్య స్వయంవరస్థానజుషః.

*వరణస్రజా :* వరణస్య స్రక్ = వరణస్రక్. తయా = వరణస్రజా.

## భావము :

ఓ దమయంతీ! ఇంద్రుని కంఠము నిన్ను యాచించు విషయమున హృదయముచేఁ బ్రేరేపింపఁబడినను, సిగ్గనెడి యపరాధమునుఁ బొందెను. స్వయంవర

మునకు వచ్చిన యీ యింద్రునియొక్క, యీ నేరముచేసిన కంఠమును భర్తను వరించెడి స్వయంవరపుష్పమాలచే బంధించుము. అట్టి నేరము చేయువారి కదియే తగిన దండనము. లజ్జనుగూడ వీడి నిన్నుఁ బ్రార్థించెడి యింద్రుని మనోరథమును నీవు తీర్చుట యుచితము. ॥౭౯॥

శ్లో॥ నైనం త్యజ క్షీరధిమంథనాద్యై
రస్యానుజాయోద్గమితామరైః శ్రీః।
అస్మై విమథ్యేక్షురసోదమన్యాం
శ్రామ్యంతు నోత్థాపయితుం శ్రియం తే॥ ౮౦

ప॥వి॥ న । ఏనం । త్యజ । క్షీరధిమంథనాత్ । యైః । అస్య । అనుజాయ ఉద్గమితా । అమరైః । శ్రీః । అస్మై । విమథ్య । ఇక్షురసోదమ్ అన్యాం । శ్రామ్యంతు । న । ఉత్థాపయితుం । శ్రియం । తే.

టీక॥ (హే భైమి = ఓ దమయంతీ) ఏనం = ఈ యింద్రుని, నత్యజ = విడువవలదు. యైః = ఏ, అమరైః = దేవతలచే, అస్య = ఈయింద్రునియొక్క, అనుజాయ = తమ్ముఁడైన యుపేంద్రుని కొఱకు, క్షీరధిమంథనాత్; క్షీరధి = పాల సముద్రముయొక్క, మంథనాత్ = చిలుకుట వలన, శ్రీః = లక్ష్మి, ఉద్గమితా = పైకిఁదేఁబడినదో, తే = దేవతలు, అస్మై = ఇంద్రుని కొఱకు, ఇక్షురసోదం; ఇక్షురస = చెఱకురసమునే, ఉదం = ఉదకముగాఁగల్గిన సముద్రమును, విమథ్య = చిలికి, అన్యాం = మఱియొక్క, శ్రియం = లక్ష్మిని, ఉత్థాపయితుం = పైకిఁదెచ్చుటకు, నశ్రామ్యంతు = శ్రమింపక యుందురుఁగాత.

వి॥ ఇచ్చట దేవతలకు మఱియొక్క లక్ష్మి నుత్పాదన జేయు ప్రయత్న సంబంధము లేకపోయినను, సంబంధమునుఁజెప్పుట వలన నతిశయోక్త్యలంకారము.

**సమాసములు:**

*క్షీరధిమంథనాత్* : క్షీరాణి ధీయంతే అస్మిన్నితి = క్షీరధిః, క్షీరధేః మంథనమ్ = క్షీరధిమంథనమ్. తస్మాత్ = క్షీరధిమంథనాత్.

ఇక్షురసోదమ్ : ఇక్షోః రసః = ఇక్షురసః. ఇక్షురస ఏవ ఉదకం యస్య సః = ఇక్షురసోదః. తమ్ = ఇక్షురసోదమ్.

భావము :

ఇంద్రుని దూతి, దమయంతినిఁ జూచి యిట్లను చున్నది. ఓ దమయంతీ! నీవు ఇంద్రుని వదలుకుము. ఏలయనగా, దేవతలందఱు నింద్రుని తమ్ముఁడైన యుపేంద్రుని కొఱకు క్షీరసముద్రమునుఁ జిలికి దాని నుండి లక్ష్మిని సంపాదించిరి. ఇక మఱల నా దేవతలు ఈ యింద్రుని కొఱకు ఇక్షురస సముద్రములనుఁ జిలికి మఱియొక లక్ష్మిని సంపాదించుటకై శ్రమపడ నీయకుము. ఉపేంద్రునికి పాల్కడలిలోని లక్ష్మి భార్యయైనట్లు, నీవీ యింద్రునకుభార్యవై నచో వారియిఱువురు లక్ష్మీపతులు కాగలరు. అప్పుడు మఱియొక లక్ష్మికై దేవతలు ప్రయాసపడ నవసర ముండదు. ॥౮౦॥

శ్లో॥ లోకస్రజి ద్యౌర్దివి చాదితేయా
అప్యాఽదితేయేషు మహాన్మహేంద్రః।
కిం కర్తుమర్థీ యది సోఽపి రాగా
జ్జాగర్తి కక్ష్యా కిమాతః పరాపి॥ ౮౧

ప॥వి॥ లోకస్రజి । ద్యౌః । దివి । చ । ఆదితేః యాః । అపి । ఆదితేయేషు । మహాన్ । మహేంద్రః । కిం । కర్తుమ్ । అర్థీ । యది । సః । అపి । రాగాత్ । జాగర్తి । కక్ష్యా । కిమ్ । అతః । పరా । అపి.

టీక॥ లోకస్రజి = స్వర్గముమున్నగు లోకముల వరుసయందు, ద్యౌః = స్వర్గము మహతీ = గొప్పది. దివిచ = స్వర్గమందును, ఆదితేయాః = దేవతలు, మహాంతః = గొప్పవారు, ఆదితేయేష్వపి = దేవతలలోను, మహేంద్రః = ఇంద్రుఁడు, మహాన్ = గొప్పవాఁడు, సోఽపి = ఆ మహేంద్రుఁడును, రాగాత్ = రాగమువలన, కింకర్తుం = సేవించుటకు, అర్థీయది = కోరిక కలవాఁడైనచో, అతః = ఈ యింద్రునిచే సేవింపఁబడుటకంటె, పరా = అధికమైన, కక్ష్యాపి = స్థానముగూడ, జాగర్తి కిం = స్ఫురించుచున్నదా యేమిః.

వి॥ ఇచ్చట లోకాదులలో పూర్వ పూర్వమున కంటె నుత్తరోత్తరమున కుత్కర్ష చెప్పుటవలన సారాలంకారము.

**సమాసములు :**

*లోకస్రజి :* లోకానాం స్రగ్ = లోకస్రగ్. తస్యాం = లోకస్రజి.

*అదితేయాః :* అదిత్యాః అపత్యాని పుమాంసః = అదితేయాః.

**భావము :**

లోకములయొక్క మాలలో స్వర్గము గొప్పది. దాని యందు దేవతలు గొప్పవారు. వారిలో నింద్రుఁడు గొప్పవాఁడు. అట్టి యింద్రుఁడే రాగమువలన నిన్ను సేవించుటకు సిద్ధమైనప్పుడు, అట్టి వాని వలన సేవింపఁబడుట కంటె నుత్కృష్టమైన దశయేమున్నది ఏమియు లేదు. ॥౮౧॥

శ్లో॥ పదం శతేనాపమఖై ర్యదింద్ర
స్తస్మై స తే యాచనచాటుకారః।
కురు ప్రసాదం తదలంకురుష్వ
స్వీకారకృద్భ్రూనటనక్రమేణ॥ ౮౨

ప॥వి॥ పదం । శతేన । ఆప । మఖైః । యత్ । ఇంద్రః । తస్మై । సః । తే । యాచనచాటుకారః । కురు । ప్రసాదం । తత్ । అలంకురుష్వ । స్వీకారకృద్భ్రూనటనక్రమేణ.

టీక॥ ఇంద్రః = ఇంద్రుఁడు, శతేన = నూఱు సంఖ్యగల, మఖైః = యాగములచే, యత్ పదం = ఇంద్రత్వపదమును అనగా నింద్రపదవిని, ఆప = పొందెనో, సః = ఆ యింద్రుఁడు, తస్మై = ఆ పదముకొఱకు అనగా ఆ పదవీస్వీకారము కొఱకు, తే = నీకు, యాచనచాటుకారః; యాచన = ప్రార్థనచే, చాటుకారః = ప్రియవచనము గలవాఁడుగా, జాతః = ఆయెను. ప్రసాదం = అనుగ్రహమును, కురు = చేయుము. తత్ = ఆ ఇంద్ర పదవిని, స్వీకారకృద్భ్రూనటనక్రమేణ; స్వీకారకృత్ = స్వీకార

మును(జేసెడి, భ్రూనటన = కనుబొమ్మల కదలించుటలోని, క్రమేణ = క్రమముచే, అలంకురుష్వ = అలంకరింపుము.

**సమాసములు :**

యాచనచాటుకారః : యాచనేన చాటుకారః = యాచనచాటుకారః.

స్వీకారకృద్భ్రూనటనక్రమేణ : స్వీకారం కరోతీతి = స్వీకారకృత్. భ్రువోః నటనం = భ్రూనటనం. స్వీకారకృచ్ఛాదః భ్రూనటనం చ = స్వీకారకృద్భ్రూనటనం. స్వీకారకృద్భ్రూనటనస్య క్రమః = స్వీకారకృద్భ్రూనటనక్రమః. తేన = స్వీకారకృద్భ్రూనటనక్రమేణ.

**భావము :**

ఇంద్రుఁడు నూఱు యజ్ఞములు గావించి యింద్ర పదవిని సంపాదించెను. ఆ యింద్రుఁడా పదవిని స్వీకరింప నిన్నుఁ బ్రార్థించుచు నీకు ప్రియవచనుఁడై యున్నాఁడు. అనుగ్రహించుము. ఆ యింద్ర పదవీ స్వీకారమును సూచించు నటువంటి కన్నుబొమ్మల నాట్యముచే నా పదవి నలంకరింపుము. ॥౮౨॥

శ్లో॥ మందాకినీనందనయోర్విహారే
దేవే భవేద్దేవరి మాధవే చ।
శ్రేయః శ్రియాం యాతరి యచ్చ సఖ్యాం
తచ్చేతసా భావిని భావయ త్వమ్॥ ౮౩

ప॥వి॥ మందాకినీనందనయోః । విహారే । దేవే। భవేత్ । దేవరి। మాధవే। చ। శ్రేయః । శ్రియాం । యాతరి । యత్ । చ । సఖ్యాం । తత్ । చేతసా। భావిని । భావయ । త్వమ్.

టీక॥ భావిని = విచార చాతుర్యము గల యో దమయంతీ!, మందాకినీనందనయోః; మందాకినీ = గంగయందును, నందన = నందనవనము నందును, విహారేసతి = క్రీడయుండగా, దేవేమాధవే = భగవానుఁడైన మాధవుఁ డు అనగా విష్ణువు, దేవరిసతి = ఉపేంద్రుఁడను మఱది కాగా, శ్రియాం = లక్ష్మీదేవి, యాతరి మఱది భార్యగను, సఖ్యాంచ = చెలికత్తె —,

సత్యాం = కాగా, యత్ = ఏ, శ్రేయః = గొప్పయుత్కర్ష, భవేత్ = కలుగునో, తత్ = దానిని, చేతసా = మనస్సుచే, త్వం = నీవు, భావయ = భావింపుము.

వి॥ ఇచ్చట మందాకినీ నందన విహారక్రియకు, మాధవుని దేవరునిగాఁ గలియుండుట, లక్ష్మిని మఱది భార్యగా గల్గి యుండుట యను గుణములకును నేకకాల సంబంధము చెప్పఁబడినందువలన సముచ్చయాలంకారము.

## సమాసములు ;

*మందాకినినందనయోః :* మందాకినీ చ నందనం చ = మందాకినీనందనే. తయోః = మందాకినీ నందనయోః.

*(హేభావిని)*: భావయతీతి = భావినీ. తస్యాః సంబుద్ధిః = (హే)భావిని.

## భావము ;

ఆలోచనా చాతుర్యముగల యో దమయంతీ! గంగానదియందు, నందనవనమందును క్రీడలో, భగవంతుఁడగు మాధవుఁడు మఱదిగను, లక్ష్మీదేవి మఱదికి భార్యగను చెలికత్తెగను నుండగాఁ గల్గెడి గొప్పతనమెంతటిదో, దానిని నీవు నీ మనస్సుచే విచారింపుము. మన ప్రయత్నము లేకయే లభించెడి గొప్ప మేలునుఁ బోగొట్టు కొనరాదు. కావున నీవు ఇంద్రుని వరింపుము. ॥౮౩॥

శ్లో॥ రజ్యస్వ రాజ్యే జగతామితీంద్రాత్
యాచ్ఞాప్రతిష్ఠాం లభసే త్వమేవ।
లఘూకృతస్త్వం బలి యాచనేన
తత్ప్రాప్తయే వామనమామనంతి॥ ౮౪

ప॥వి॥ రజ్యస్వ । రాజ్యే । జగతామ్ । ఇతి । ఇంద్రాత్ । యాచ్ఞాప్రతిష్ఠాం । లభసే । త్వమ్ । ఏవ । లఘూకృతస్త్వం । బలియాచనేన । తత్ప్రాప్తయే । వామనమ్ । ఆమనంతి.

టీక॥ (హే భైమి = ఓ దమయంతీ!), జగతాం = మూడు లోకముల యొక్క, రాజ్యే = ఆధిపత్యమునందును, రజ్యస్వ = అనురక్తురాలవు కమ్ము,

ఇతి = ఇట్టి, యాచ్ఞాప్రతిష్ఠామ్; యాచ్ఞా = ప్రార్థనవలని, ప్రతిష్ఠాం = గౌరవమును, ఇంద్రాత్ = ఇంద్రునివలన, త్వమేవ = నీవే, లభసే = పొందుచున్నావు. తథాహి = అది యుక్తమే. తత్ప్రాప్తయే; తత్ = ఆ మూడు లోకముల యాధిపత్యమును, ప్రాప్తయే = పొందుటకై, బలి యాచనేన; బలి = బలిచక్రవర్తిని, యాచనేన = యాచించుటచే, లఘూ కృతస్వం; లఘూకృత = తగ్గింపఁబడిన, స్వం = తన స్వరూపముగల్గిన, తంవిష్ణుమపి = ఆ ప్రసిద్ధమైన విష్ణువునుఁ గూడ, వామనం = వామనునిగా అనగా పొట్టివానిగా, ఆమనంతి = చెప్పుచున్నారు.

వి॥ విష్ణువు వామనావతారమెత్తి బలిని యాచించి త్రైలోక్య రాజ్యమునుఁ బొందగలిగెను. ఆ యాచనవలన చులకన పొంది వామనుఁడై దానిని సంపాదింపఁ గల్గెను. కాని యట్టి యాచన నీకవసరము లేకయే ఇంద్రుఁడు త్రైలోక్యరాజ్యమిచ్చుచున్నాఁడని వామనునిని వ్యతిరేకోదాహరణముగఁ జెప్పుటవలన నిట వ్యతిరేక ప్రయుక్తముగా దృష్టాంతాలంకారము.

## సమాసములు:

యాచ్ఞాప్రతిష్ఠామ్ : యాచ్ఞైవ ప్రతిష్ఠా = యాచ్ఞాప్రతిష్ఠా. తామ్ = యాచ్ఞాప్రతిష్ఠామ్.

లఘూకృతస్వం : అలఘుః లఘుః సంపద్యమానః కృతః = లఘూకృతః. లఘూకృతః స్వః యస్య సః = లఘూకృతస్వః. తమ్ = లఘూకృతస్వం.

బలియాచనేన : బలేః యాచనం = బలియాచనమ్. తేన = బలియాచనేన.

తత్ప్రాప్తయే : తస్య ప్రాప్తిః = తత్ప్రాప్తిః. తస్యై = తత్ప్రాప్తయే.

## భావము :

ఓ దమయంతీ! మూడులోకములపై నీకు లభించెడి యాధిపత్యము నంగీకరింపుము. ఇంద్రుఁడు నీకిట్టి యాధిపత్య మొసంగుటకై నీకుఁ గావించిన

ప్రార్థనవలని గౌరవమునుఁ బొందుము. బలిచక్రవర్తిని మూడు లోకములపైనధి కారము నొసంగుమని యాచించుటకై విష్ణువు వామనుఁడైనట్లు (చులకన పొంది నట్లు) చెప్పుదురు. కాన నీ కట్టి చులకన లేదు. నిన్నుఁ బిలచి యింద్రుఁడే నీకా ముజ్జగములపై నధికారమొసంగుచున్నాఁడు. కాన దప్పక యంగీక రింపుము. ॥౮౪॥

శ్లో॥ యానేవదేవాన్నమసి త్రికాలం
న తత్కృతఘ్నీకృతిరౌచితీ తే।
ప్రసీద తానప్యనృణాన్విధాతుం
పతిష్యతః స్త్వత్పదయోస్త్రిసంధ్యమ్॥ ౮౫

ప॥వి॥ యాన్ । ఏవ । దేవాన్ । నమసి । త్రికాలం । న । తత్కృతఘ్నీ కృతిః । ఔచితీ । తే । ప్రసీద । తాన్ । అపి । అనృణాన్ । విధా తుం । పతిష్యతః । త్వత్పదయోః । త్రిసంధ్యమ్.

టీక॥ (హే భైమి = ఓ దమయంతీ!) యానేవదేవాన్ = ఏ యింద్రాది దేవత లనే, త్రికాలమ్ = మూడు కాలములు, నమసి = నమస్కరింతువో, తత్కృతఘ్నీకృతిః; తత్ = వారికి, కృతఘ్నీకృతిః = కృతఘ్నురాల గుట, తే = నీకు, ఔచిచీ = ఔచిత్యము, న = కానేరదు. త్రిసంధ్యం = మూడు సంధ్యలయందును, త్వత్పదయోః = నీ యొక్క పాదముల యందు, పతిష్యతః = పడఁబోవుచున్న, తానపి = ఆ యింద్రాదులను, అనృణాన్ = (వారి ప్రతి వందనమునుఁ దీసికొనుటచే), ఋణవిముక్తుల నుగా, విధాతుం = చేయుటకు, ప్రసీద = ప్రసన్నురాలవు కమ్ము.

**సమాసములు :**

*త్రికాలమ్ :* త్రయః కాలాః యస్మిన్ కర్మణి తద్యథా భవతితథా = త్రికాలమ్.

*తత్కృతఘ్నీకృతిః :* అకృతఘ్నకృతిః కృతఘ్నకృతిః సంపద్యమానా కృతా = కృతఘ్నీకృతిః. తేషాం కృతఘ్నీ కృతిః = తతకృతఘ్నీకృతిః.

*అనృణాన్ :* అవిద్యమానః ఋణః యేషాంతే = అనృణాః. తాన్ = అనృణాన్.

త్వత్పదయోః : తవ పదే = త్వత్పదే. తయోః = త్వత్పదయోః.

త్రిసంధ్యమ్ : తిసృణాం సంధ్యానాం సమాహారః = త్రిసంధ్యమ్. తత్ = త్రిసంధ్యమ్.

**భావము :**

ఓ దమయంతీ! నీవు ఏ దేవతలను మూడుకాలములలోను మ్రొక్కెదవో అట్టి దేవతలకు నీవు కృతఘ్నురాలగుట తగదు. కాన మూడు సంధ్యలయందును నీ పాదములపైఁ బడుచున్న యా దేవతలను, వారి ప్రతివందనమును స్వీకరించు టచే ఋణవిముక్తులనుఁ గావింపుము. అనగా నింద్రుని వరింపుము అని యాశయము. ॥౮౫॥

శ్లో॥ ఇత్యుక్తవత్యా నిహితాదరేణ
భైమీగృహీతా మఘవత్ప్రసాదః।
స్రక్పారిజాతస్య ఋతే నలాశాం
వాసైరశేషామపుపూరదాశామ్॥ ౮౬

ప॥వి॥ ఇతి । ఉక్తవత్యా । నిహితా । ఆదరేణ । భైమీగృహీతా । మఘవత్ప్రసాదః । స్రక్ । పారిజాతస్య । ఋతే । నలాశాం । వాసైః । అశేషాం। అపుపూరత్। ఆశామ్.

టీక॥ ఇతి = ఇట్లు, ఉక్తవత్యా = చెప్పిన యింద్రుని దూతిచే, ఆదరేణ = ఆదరముతో, నిహితా = సమర్పింపఁబడినదియు, భైమీగృహీతా; భైమీ = దమయంతిచే, గృహీతా = గ్రహింపఁబడినదియు నగు, మఘవత్ప్రసాదః; మఘవత్ = ఇంద్రునియొక్క, ప్రసాదః = అనుగ్రహమనెడి, పారిజాతస్య = పారిజాతవృక్షముయొక్క, స్రక్ = మాలిక, నలాశాం; నల = నలునియొక్క, ఆశాం = ఆశను (దిక్కును), ఋతే = లేక, అశేషాం = సమస్తమైన, దిశం = దిక్కులను, వాసైః = తన పరిమళములచే అపుపూరత్ = నింపినది.

వి॥ "నలాశాంవినా" అనగా "నలుని యాశను, నలుని దిక్కును వదలి" అని వినా శబ్దముచే మినహాయించుటచే, ఆశకును దిక్కునకు నభేదాధ్యవసాయము చేయుటవలన వినోక్త్యలంకారము.

సమాసములు :

భైమీగృహీతా : భీమస్య అపత్యం స్త్రీ = భైమీ. భైమ్యా గృహీతా = భైమీగృహీతా.

మఘవత్ప్రసాదః : మఘోనః ప్రసాదః = మఘవత్ప్రసాదః.

నలాశాం : నలస్య ఆశా = నలాశా. తామ్ = నలాశామ్.

అశేషామ్ : అవిద్యమానః శేషః యస్యాస్సా = అశేషా. తామ్ = అశేషామ్.

భావము :

ఇట్లు సంభాషించిన యింద్రదూతి యాదరముతో సమర్పించిన యింద్రుని ప్రసాదరూపమైన సందేశమును దమయంతి విని యంగీకరించినది. ఆ యింద్రుని ప్రసాదమనెడి పారిజాత పుష్పమాల నలుని యాశను(దిక్కును) దప్పతక్కిన యాశలన్నింటిని అనగా దిక్కులన్నింటిని పరిమళములతోఁ బూరించెను. నలుని యాశను మాత్రము పూరింపలేదు. ఇంద్రుని యాశనుఁ బూరించుటవలన నలుని యాశనుఁ బూరింపలేదని యాశయము. ॥౮౬॥

శ్లో॥ ఆర్యే విచార్యాలమిహేతి కాఽపి
యోగ్యం సఖి స్యాదితి కాచనాఽపి।
ఓంకార ఏవోత్తరమస్తు వస్తు
మంగళ్యమత్రేతి చ కాప్యవోచత్॥ ౮౭

ప॥వి॥ ఆర్యే । విచార్య । అలమ్ । ఇహ । ఇతి । కా । అపి । యోగ్యం । సఖి । స్యాత్ । ఇతి । కా । చన । అపి । ఓంకారః । ఏవ । ఉత్తరమ్। అస్తు । వస్తు। మంగళ్యమ్। అత్ర । ఇతి । చ । కా । అపి । అవోచత్.

టీక॥ ఆర్యే - పూజ్యురాలైన దమయంతీ! ఇహ = ఇంద్రుని వరించు విషయమున, విచార్య = విచారించి, అలం = చాలును, ఇతి = అని, కాఽపి = ఒకానొక చెలికత్తె, అవోచత్ = పలికెను. సఖి! = ఓచెలీ!(ఇదం = ఇది), యోగ్యం = యుక్తమైనది, ఇతి = అని, కాచనాఽపి = ఒకానొక చెలికత్తె,

అవోచత్ = పలికెను. అత్ర = ఈవిషయమునందు, ఓంకారఏవ = అంగీకారమే, మంగళ్యం = మంగళసాధనమైన, ఉత్తరం = ఉత్తరముగా, అస్తు అగునుగాత, ఇతి = అని, కాపి = ఒకానొకతె, అవోచత్ = పలికెను.

భావము :

ఓ దమయంతీ! యింద్రుని వరించు విషయము విచారింపవలదు. అనియొక సఖిచెప్పినది. ఓభైమీ! ఇదియుక్తమైనదని మఱియొక సఖి చెప్పినది. ఓవైదర్భీ: ఈ విషయమునందంగీకారమే, మంగళకరమైన యుత్తరము అని ఇంకొకతె చెప్పినది. ॥౮౭॥

శ్లో॥ అనాశ్రవా వః కిమహం కదాఽపి
వక్తుం విశేషః పరమస్తి శేషః।
ఇతీరితే భీమజయా న దూతీ
మాలింగదాళీశ్చ ముదామియత్తా॥ ౮౮

ప॥వి॥ అనాశ్రవా । వః । కిమ్ । అహం । కదా । అపి। వక్తుం । విశేషః । పరమ్ । అస్తి । శేషః । ఇతి । ఈరితే । భీమజయా । న। దూతీమ్ । ఆలింగత్ । ఆళీః । చ । ముదామ్ । ఇయత్తా.

టీక॥ హే సఖ్యః = ఓ చెలికత్తెలారా, అహం = నేను, కదాఽపి = ఎప్పుడును, వః = మీకు, అనాశ్రవాకిం? = మాట పాటించని దాననా?, పరం = కాని, వక్తుం = చెప్పుటకు, విశేషః = విశేషము, శేషః = మిగిలినదై, అస్తి = ఉన్నది. ఇతి = ఇట్లు, భీమజయా = దమయంతిచే, ఈరితేసతి = చెప్పంబడగా, దూతీమ్ = ఇంద్రదూతిని, ఆళీశ్చ = దమయంతి చెలికత్తెలను, ముదాం = సంతోషములయొక్క, ఇయత్తా = పరిమితి, నాఽఽలింగత్ = పొందలేదు.

## సమాసములు :

అనాశ్రవా : న ఆశ్రవా = అనాశ్రవా.

భీమజయా : భీమాత్ జాయత ఇతి = భీమజా. తయా = భీమజయా.

**భావము :**

ఓ చెలికత్తెలారా! నేను మీకెన్నడైనను మాటను పాటించని దాననా? కాని కొంచెము చెప్పవలసిన విశేషమొండు మిగిలియున్నది. ఇట్లు దమయంతి చెప్పగనే యింద్రుని దూతికి, తన చెలికత్తెలకును మహానందము గల్గినది. ఏల యనగా, ఇంద్రుని వరించుటకై తానంగీకరించినందులకు వరమేమైననడుగఁ దలచి యున్నదా? యని వారు భ్రాంతిచే గొప్ప యానందము ననుభవించిరి. ॥౮౮॥

శ్లో॥ భైమీం చ దూత్యం చ న కించిదాప
మితి స్వయం భావయతో నలస్య।
ఆలోకమాత్రాద్యది తన్ముఖేందో
రభూన్న భిన్నం హృదయారవిందమ్॥ ౮౯

ప॥వి॥ భైమీం । చ । దూత్యం । చ । న । కిం । చిత్ । ఆపమ్ । ఇతి । స్వయం భావయతః । నలస్య । ఆలోకమాత్రాత్ । యది । తన్ముఖేందోః । అభూత్ । న । భిన్నం । హృదయారవిందమ్.

టీక॥ భైమీంచ = దమయంతినిఁగాని, దూత్యం = దూత్యమునుగాని, కించిదపి = ఆరెంటిలో దేనినిగూడ, నాఽఽపమ్ = నేను పొందకపోతిని, ఇతి = ఇట్లు, స్వయం భావయతః; స్వయం = తన యంతట, భావయతః = భావించుచున్న, నలస్య = నలునియొక్క, హృదయారవిందం = హృదయమను పద్మము, తన్ముఖేందోః; తత్ = ఆ దమయంతి యొక్క, ముఖేందోః = ముఖచంద్రునియొక్క, ఆలోకమాత్రాత్ = దర్శన మాత్రమువలన, భిన్నం = భగ్నమైనదిగను, వికసించినదిగను, నాభూత్యది = కాలేదా ఏమి?

**సమాసములు :**

భైమీం : భీమస్య అపత్యం స్త్రీ = భైమీ. తామ్ = భైమీం.

దూత్యం : దూతస్య కర్మ = దూత్యం. తత్ = దూత్యం.

స్వయంభావయతః : స్వయం భావయతీతి = స్వయంభావయన్. తస్య = స్వయంభావయతః.

ఆలోకమాత్రాత్ : ఆలోక ఏవ-ఆలోకమాత్రమ్. తస్మాత్ = ఆలోక మాత్రాత్.

తన్ముఖేందోః : తస్యాః ముఖమ్ = తన్ముఖమ్. తన్ముఖమేవ ఇందుః = తన్ముఖేందుః. తస్మాత్ = తన్ముఖేందోః.

హృదయారవిందమ్ : హృదయమేవ అరవిందమ్ = హృదయార విందమ్.

భావము :

నేను దేవదూత్యమును వహించియు దమయంతిని పొందలేదు. దూత్యమునుఁ జేయలేదు. భైమినిఁ బొందియున్నచో నొక స్త్రీరత్న లాభముండెడిది. దూత్యమును నిర్వహింయున్నచో పరోపకారమైన సిద్ధమైయుండును. ప్రస్తుతమా యుభయములేదు. అనియిట్లు తన హృదయమున భావించుచున్న నలునియొక్క హృదయమనెడి పద్మము, ఆ దమయంతీ ముఖ చంద్రుని చూచిన మాత్రమున (ఆ చంద్రుని వెలుగు తనపైన పడినమాత్రముననె) భగ్నమైనదిగను, వికసిత మైనదిగను ఏలకాలేదు. తప్పక యుండును. ఆమె ముఖచంద్రునిఁ జూడగనే యామె తను నమ్మించి వంచించినందులకు నలుని హృదయము వ్రయ్యలయ్యె డిది. చంద్రకాంతివలన పద్మమెట్లు వికసించును. అనగా ఇట దమయంతి ముఖ చంద్రకాంతిచే నలునిహృదయపద్మమెట్లు వికసించునను విరోధముగూడ ధ్వనించుచున్నది. ॥౮౯॥

శ్లో॥ ఈషత్స్మితక్షాళితసృక్విభాగా
దృక్సంజ్ఞయా వారితతత్తదాళిః।
స్రజా నమస్కృత్య తమేవ శక్రం
తాం భీమభూరుత్తరయాంచకార॥ ౯౦

ప॥వి॥ ఈషత్స్మితక్షాళిత సృక్విభాగా । దృక్సంజ్ఞయా । వారిత తత్తదాళిః స్రజా । నమస్కృత్య । తయా । ఏవ । శక్రం । తాం । భీమభూః ఉత్తరయాంచకార.

టీక॥ భీమభూః = దమయంతి, ఈషత్స్మితక్షాళితసృక్విభాగా; ఈషత్ స్మిత = మంధహాసముతో, క్షాళిత = కడిగివేయఁబడినట్లున్న, సృక్విభాగా = సెలవులయంచులు గల్గినదియు, దృక్సంజ్ఞయా; దృక్ = నేత్రములయొక్క, సంజ్ఞయా = సైగచే, వారితతత్తదాళిః; వారిత = అడ్డగింపఁబడిన, తత్తదాళిః = ఆయాచెలికత్తెలు గల్గినదై, తయైవ = ఇంద్రదూతియిచ్చిన పుష్పమాలతోడ, శక్రం = ఇంద్రుని, నమస్కృత్య = నమస్కరించి, తామ్ = ఆ ఇంద్రదూతినిఁగూర్చి, ఉత్తరయాంచకార = బదులుచెప్పెను.

## సమాసములు :

*ఈషత్స్మితక్షాళితసృక్విభాగా :* ఈషత్ స్మితం = ఈషత్స్మితం. ఈషత్స్మితేన క్షాళితౌ = ఈషత్స్మితక్షాళితౌ. సృక్విణోః భాగౌ = సృక్విభాగౌ. ఈషత్స్మితక్షాళితౌ సృక్విభాగౌ యస్యాస్సా = ఈషత్స్మితక్షాళిత సృక్విభాగా.

*దృక్సంజయా :* దృశోః సంజ్ఞా = దృక్సంజ్ఞా. తయా = దృక్సంజ్ఞయా.

*వారితతత్తదాళిః :* తాస్తాః ఆళయః = తత్తదాళయః. వారితాఃతత్తదాళయః యయా సా = వారితతత్తదాళిః.

*భీమభూః :* భీమాత్ భవతీతి = భీమభూః.

## భావము :

దముయంతి చిఱునగవుచే పెదవులకిఱువైపులున్న సెలవులుక్షాళనచేయఁబడగా, ఆయాచెలికత్తెలను కనుసైగచే వారించి యింద్రునిదూతితెచ్చిన పుష్పమాలతోడ నింద్రునికి వందనముఁగావించినది. కాని యాపుష్పమాలతో తానలంకరించు కొనలేదు. పిదప నాదూతితో బదులు చెప్పసాగినది. ॥౯౦॥

శ్లో॥ స్తుతౌ మఘోనస్త్యజ సాహసిక్యం
వక్తుం కియత్తం యది వేద వేదః।
వృథోత్తరం సాక్షిణిహృత్సు నౄణా
మజ్ఞాతృవిజ్ఞాపి మమాఽపి తస్మిన్॥ ౯౧

ప॥వి॥ స్తుతౌ । మఘోనః । త్యజ । సాహసిక్యం । వక్తుం । కియత్ । తం। యది । వేద । వేదః । వృథా । ఉత్తరం । సాక్షిణి । హృత్సు । నృణామ్ । అజ్ఞాతృవిజ్ఞాపి । మమ । అపి । తస్మిన్.

టీక॥ హే దూతి = ఓ దూతీ, మఘోనః = ఇంద్రునియొక్క, స్తుతౌ = స్తుతి విషయమున, సాహసిక్యం = సాహసమును, త్యజ = వదలుము. తం = ఆ యింద్రునిగూర్చి, వక్తుం = చెప్పుటకు, యదివేద = తెలుసుకొని యున్నచో, వేదః = వేదము, కియత్ = కొంచెము, వేద = తెలుసుకొని యున్నది. నృణాం = మనుష్యులయొక్క, హృత్సు = మనస్సుల విషయమున, సాక్షిణి = నేరుగాఁ జూచునట్టి, తస్మిన్ = ఆ యింద్రుని విషయమున, అజ్ఞాతృవిజ్ఞాపి, అజ్ఞాతృ = జ్ఞానము లేనివారిని, విజ్ఞాపి = బోధించెడి, మమ = నాదైన, ఉత్తరమపి = సమాధానముగూడ, వృథా = వ్యర్థము.

## సమాసములు :

సాహసిక్యం : సహసా వర్తత ఇతి = సాహసికః. సాహసికస్య కర్మ = సాహసిక్యం. తత్ = సాహసిక్యం.

అజ్ఞాతృవిజ్ఞాపి : న జ్ఞాతారః = అజ్ఞాతారః. అజ్ఞాతౄన్ విజ్ఞాపయతీతి = అజ్ఞాతృవిజ్ఞాపి.

## భావము :

ఓ దూతీ! ఇంద్రుని స్తుతిచేయు నీ సాహసమును వదలుము. అది నీకు సాధ్యము కాదు. ఆ యింద్రునిగూర్చి కొద్దిగా తెలిసియున్నచో, అది వేదమునకే తెలియును. మనుష్యుల హృదయములనుఁ జూచుచున్న యా యింద్రుని విషయమున నజ్ఞానులకు బోధఁగల్పించెడి నా యుత్తరముగూడ వ్యర్థము. కాన నింద్రుఁడే నా హృదయమునుఁ దెలిసికొని యున్నాఁడు. అందువలన నేను చెప్పవలసినది లేదు. ॥౯౦॥

శ్లో॥ ఆజ్ఞాం తదీయామను కస్య నామ
నకారపారుష్యముపైతు జిహ్వా।

ప్రహ్వా తు తాం మూర్ధ్ని నిధాయమాలాం
బాలాపరాధ్యామి విశేషవాగ్భిః॥ ౯-౨

ప॥వి॥ ఆజ్ఞాం । తదీయామ్ । అను । కస్య । నామ । నకారపారుష్యమ్ । ఉపైతు । జిహ్వా । ప్రహ్వా । తు । తాం । మూర్ధ్ని । నిధాయ । మాలాం । బాలా । అపరాధ్యామి । విశేషవాగ్భిః.

టీక॥ తదీయాం = ఆ యింద్రునికి సంబంధించిన, ఆజ్ఞామను = ఆదేశమునుద్దే శించి, కస్యనామ = ఎవ్వనియొక్క, జిహ్వా = నాలుక, నకారపారు ష్యమ్ = "కాదను" నర్థమిచ్చెడి "నఞ్"ను ఉచ్చరించుట యను కాఠిన్య మును, ఉపైతు = పొందును?, కింతు = కాని, బాల్లా = బాలికయైన నేను, ప్రహ్వా = నమ్రురాలనై, తాం = ఆ యాజ్ఞయను, మాలాం = మాలను, మూర్ధ్ని = తలపైన, నిధాయ = ఉంచుకొని, విశేషవాగ్భిః = అతివాద ములచే, అపరాధ్యామి = అపరాధము చేయుచున్నాను.

సమాసములు :

తదీయామ్ : తస్య ఇయం = తదీయా. తామ్ = తదీయామ్.

నకారపారుష్యమ్ : పరుషస్య భావః = పారుష్యమ్. నకారస్య పారు ష్యమ్ = నకారపారుష్యమ్. తత్ = నకారపారుష్యమ్.

విశేషవాగ్భిః: విశేషాశ్చతాఃవాచశ్చ = విశేషవాచః. తాభిః = విశేషవాగ్భిః.

భావము :

అయినను నాయహంకారమును దొలగించుకొనుటకై కొంచెము విజ్ఞప్తి చేసుకొనుచున్నాను. ఇంద్రుని యాజ్ఞను కాదని పరుషముగా నెవ్వఁడు చెప్పఁ గలఁడు? ఎవ్వఁడును కాదనలేఁడు. కాని యాతనియాజ్ఞయను మాలను తలపై దాల్చి బాలికయైన నేను అతివాదములతో నేరము చేయుచున్నాను. ఈ నా చాప లము సహింపఁదగినది. ॥౯-౨॥

శ్లో॥ తపఃఫలత్వేన హరేః కృపేయ
మిమం తపస్యేవ జనం నియుఙ్క్తే।

భవత్యుపాయం ప్రతి హి ప్రవృత్తా
వుపేయమాధుర్యమధైర్యసజ్జి॥ ౯౩

ప॥వి॥ తపఃఫలత్వేన । హరేః । కృపా । ఇయం । ఇమం । తపసి । ఏవ । జనం । నియుఙ్క్తే । భవతి । ఉపాయం । ప్రతి । హి । ప్రవృత్తా । ఉపేయమాధుర్యమ్ । అధైర్యసజ్జి.

టీక॥ తపఃఫలత్వేన; తపః = ఇంద్రునిగూర్చిఁ గావించిన యుపాసనకు, ఫలత్వేన = ఫలముగా నేర్పడిన, ఇయం = ఈ, కృపా = నన్నుఁ బరిగ్రహింపఁ గోరినదయ, ఇనుం = ఈ, జనం = జనమైన, మాం = నన్ను తపస్యేవ = తపమునందే, అనగా నింద్రోపాసనయందే, నియుఙ్క్తే = నియమించుచున్నది. హి = ఏలయనగా, ఉపాయంప్రతి = ఉపాయమునుఁగూర్చిన, ప్రవృత్తా = ప్రయత్నవిషయమున, ఉపేయస్య = పొందఁదగిన కార్యముయొక్క, మాధుర్యం = రుచియే, అధైర్యసజ్జి, అధైర్య = అధైర్యమును, సజ్జి = కల్పించుచున్నది.

## సమాసములు :

తపఃఫలత్వేన : తపసః ఫలం = తపః ఫలం. తపః ఫలస్య భావః = తపః ఫలత్వమ్.

ఉపేయమాధుర్యమ్ : మధురస్య భావః = మాధుర్యం. ఉపేయస్య మాధుర్యమ్ = ఉపేయమాధుర్యమ్.

అధైర్యసజ్జి : ధీరస్య భావః = ధైర్యం. న ధైర్యమ్ = అధైర్యమ్. అధైర్యం సజ్జయతీతి = అధైర్యసజ్జి.

## భావము :

ఇంద్రునుపాసించుటకు ఫలముగా నేను అతని కృపకుఁ బాత్రురాలనైతిని. ఈ తపః ఫలము నన్నుఁ దపస్సునకే మఱలఁ బ్రేరణచేయు చున్నది. అనగా తపస్సునకు ఫలము మధురమైనందు వలన నది మఱల నా ఫలమునకు సాధకమైన తపస్సునకుఁ బ్రేరేపణఁ జేయుచున్నది. కాన సాధ్యమందభిరుచి

సాధన విషయ ప్రవృత్తికి హేతువు గదా. ఫలములోని మాధుర్యము తత్సాధనముఁగూర్చి ప్రవర్తింపఁజేయును గదా. కావున నేను మఱల తపస్సునుఁ జేసెదను. నా తపస్సునకు ఫలముగా నేనింద్రుని దయకెట్లు పాత్రురాలనైతినో, యట్లే మఱల తపస్సుఁ గావించినచో నలుని దయకునుఁ బాత్రురాలను కాగలను నాశయమిందు సూచితము. ॥౯౩॥

శ్లో॥ శుశ్రూషితాహే తదహం తమేవ
పతిం ముదేఽపి వ్రతసంపదేఽపి।
విశేషలేశోఽయమదేవదేహ
మంశాగతం తు క్షితిభృత్తయేహ ౯౪

ప॥వి॥ శుశ్రూషితాహే । తత్ । అహం । తమ్ । ఏవ । పతిం । ముదే। అపి । వ్రతసంపదే । అపి । విశేషలేశః । అయమ్ । అదేవదేహమ్ । అంశాగతం । తు । క్షితిభృత్తయా । ఇహ.

టీక॥ తత్ = అందువలన, అహం = నేను, తమేవ = ఆయింద్రునే, పతిం = భర్తనుగా, శుశ్రూషితాహే = సేవింపఁగలను. కింతు = కాని, ముదేఽపి = సంతోషముకొఱకును, వ్రతసంపదేఽపి; వ్రత = పాతివ్రత్యముయొక్క, సంపదేఽపి = సంపత్తికొఱకును, క్షితిభృత్తయా = రాజత్వమనుధర్మముచే, ఇహ = ఈలోకమున (కస్మింశ్చిత్ = ఒకానొక, నరే = మానవునియందు)(నలునియందు)అంశాగతం; అంశ = అంశముచే, ఆగతం = అవతరించిన (కావుననే) అదేవదేహం = దేవతలదేహములేని, అనగా మానవశరీరముగల్గినవానిని, శుశ్రూషితాహే = సేవింపఁగలను. అయం = ఇది, విశేషలేశః = స్వల్పమైన భేదము (సహింపఁదగినది).

**సమాసములు :**

*వ్రతసంపదే:* వ్రతస్య సంపత్ = వ్రతసంపత్. తస్యై = వ్రతసంపదే.

*విశేషలేశః:* విశేషస్య లేశః = విశేషలేశః.

*అదేవదేహమ్ :* దేవానాం దేహః = దేవదేహః. అవిద్యమానః దేవదేహః యస్య సః = అదేవదేహః. తమ్ = అదేవదేహమ్.

అంశాగతమ్ : అంశేన ఆగతః = అంశాగతః. తమ్ = అంశాగతమ్.

క్షితిభృత్తయా: క్షితిం బిభర్తీతి = క్షితిభృత్. క్షితిభృతః భావః = క్షితిభృత్తా. తయా = క్షితిభృత్తయా.

**భావము :**

కావున నేను ఇంద్రునే పతిగా భజింతును కాని, సంతోషముకొఱకును, పాతివ్రత్యసంపత్తికిని రాజత్వధర్మముచే నొక నరునియం దవతరించి (నలుని యందవతరించి) మానవదేహముననున్న వానిని మాత్రమే భజింతును, ఏల యనగా, సప్తదిక్పాలుర యంశములతో రాజు జన్మించునుగదా. కావున భూతల మందు జన్మించిన రాజునందు నాయింద్రుని యంశముగూడ నున్నదిగదా. కాన రాజునందు నంశతోనున్న యింద్రుని కొలుతును. కాని నేరుగా నింద్రుని గొలువఁజాలను. ఇచ్చట నింద్రునకును, రాజునకును భేదము కొద్దియే. దీనిని వహింపవచ్చును. అట్లుకానిచో నాకు వ్రతలోపమేర్పడవలసి వచ్చును. ॥౬౪॥

శ్లో॥ అశ్రౌషమింద్రాదరిణీ గిరస్తే
సతీవ్రతాతిప్రతిలోమతీవ్రాః।
స్వం ప్రాగహం ప్రాదిషి నాఽమరాయ
కిం నామ తస్మైమనసా నరాయ॥ ౬౫

ప॥వి॥ అశ్రౌషమ్ । ఇంద్రాదరిణీ = గిరః । తే । సతీవ్రతాతి ప్రతిలోమతీవ్రాః। స్వం । ప్రాక్ । అహం । ప్రాదిషి । న । అమరాయ । కిం । నామ । తస్మై । మనసా । నరాయ.

టీక॥ (హే ఇంద్రదూతి = ఓయింద్రదూతీ!) సతీవ్రతాతిప్రతిలోమతీవ్రాః; సతీవ్రత = పతివ్రతాధర్మమునకు, అతిప్రతిలోమ = మిక్కిలిప్రతికూలములును, తీవ్రాః = తీవ్రములై వినఁదగనివియునగు, తే = నీయొక్క, గిరః = మాటలను, ఇంద్రాదరిణీ; ఇంద్ర = ఇంద్రునియందు, ఆదరిణీ = ఆదరము గలదాననై, అశ్రౌషమ్ = వింటిని. ప్రాక్ = పూర్వము, అహం = నేను, స్వం = నన్ను, అమరాయ = దేవతా స్వరూపుఁడైన, తస్మై = ఆయింద్రుని కొఱకు, నప్రాదిషి = ఇచ్చుకొనలేదు.కింనామ =

కాని, నరాయ = నరరూపముగల్గిన,(నలరూపము గల్గిన), తస్మై = ఆ యింద్రునికొఱకు, మనసా = మనస్సుచే, ప్రాదిషి = ఇచ్చుకొంటిని.

## సమాసములు:

*ఇంద్రాదరిణీ :* ఆదరః అస్యాః అస్తీతి = ఆదరిణీ. ఇంద్రే ఆదరిణీ = ఇంద్రాదరిణీ.

*సతీవ్రతాతిప్రతిలోమతీవ్రాః:* సత్యాః వ్రతం = సతీవ్రతమ్. అత్యంతం ప్రతిలోమాః = అతిప్రతిలోమాః. అతిప్రతిలోమాశ్చ తాః తీవ్రాశ్చ = అతిప్రతిలోమతీవ్రాః. సతీవ్రతస్య అతిప్రతిలోమ తీవ్రాః = సతీవ్రతాతిప్రతిలోమతీవ్రాః.

## భావము :

ఓ యింద్రదూతీ ! పతివ్రతాధర్మమునకు మిక్కిలి ప్రతికూలములును, వినరానంతఁ గఠినములునగు నీ మాటలను నింద్రునియందలి భక్తి గౌరవములతో వింటిని కాని యాతని యందలి యనురాగముతో నేను వినలేదు. నన్ను నేను పూర్వము దేవతాస్వరూపుఁడగు నింద్రునికిచ్చుకొనలేదు "రలయోరభేదః" అను న్యాయము ననుసరించి, నరస్వరూపుడును, నలస్వరూపుడునగు నాయింద్రునికిచ్చుకొంటిని. కావున నేను నేరుగా నింద్రుని సేవించినచో నాకు వ్రతభంగమేర్పడును. కాన నింద్రుని యంశమును వహించిన నరుని (నలుని) సేవించుట ధర్మము. ॥౬౩॥

శ్లో॥ తస్మిన్ విమృశ్యైవ వృతే హృదేషా
నైంద్రీ దయా మామనుతాపికా భూత్।
నిర్వాతుకామం భవసంభవానాం
ధీరం సుఖానామవధీరణేవ॥ ౬౪

ప॥వి॥ తస్మిన్ । విమృశ్య । ఏవ । వృతే । హృత్ ; ఏషా । న । ఐంద్రీ । దయా । మామ్ । అనుతాపికా । అభూత్ । నిర్వాతుకామం । భవసంభవానాం । ధీరం । సుఖానామ్ । అవధీరణా । ఇవ.

టీక॥ తస్మిన్ = ఆ నరుఁడు (నలుఁడు), హృదా = హృదయముచే, విమృశ్యైవ = విచారణచేయఁబడియే, వృతేసతి = వరింపఁబడగా, ఏషా = ఈ,

ఐంద్రీ=ఇంద్రుని సంబంధించిన, దయా = నన్ను పరిగ్రహింపఁ గోరుటయను కృప, నిర్వాతుకామం=మోక్షమునుగోరిన, ధీరం=వికార రహితచిత్తముగలవానిని, అనగా జ్ఞానిని, భవసంభవానాం=సాంసారిక సుఖములకు, అవధీరణాఇవ=పరిత్యాగమువలె, మామ్=నన్ను, అను తాపికా = "అయ్యోపొరబాటు చేసితినే" యని సంతాపపఱచునదిగా, నాభూత్=కాదు.

**సమాసములు :**

*ఐంద్రీ :* ఇంద్రస్య ఇయం=ఐంద్రీ.

*నిర్వాతుకామం :* నిర్వాతుం కామః యస్య సః= నిర్వాతుకామః. తమ్ =నిర్వాతుకామమ్.

*భవసంభవానామ్ :* భవే సంభవః యేషాం తాని = భవసంభవాని. తేషాం=భవసంభవానామ్.

**భావము :**

ఆ నరుని మనస్సుచే చక్కగా విచారించి యిదియుక్తమని నిశ్చయించుకొని వరించిన తర్వాత, నీయింద్రుఁడు నన్నుఁబరిగ్రహింపఁ గోరుట యను నాపైఁజూపిన దయయు, దానిని నేను నిరాకరించుటయు, మోక్షగామియగు జ్ఞానికి సాంసారిక సుఖపరిత్యాగమెట్లు బశ్చాత్తాపమునుఁ గల్గించదో, యట్లే నాకునుఁ పశ్చాత్తాపముఁ గల్గించలేదు. అనగా "నింద్రుని దయను గణింపకపోతినే ఎంతపొరబాటు గావించితినని" నేను పిదప చింతింపనవసరము లేకపోయినది. ఏల యనగా నేను చక్కగా నామస్సుతో నిశ్చయించుకొనియే నరుని (నలుని) వరింపఁగోరితిని. అట్లే సంసారసుఖములనుఁ బరిత్యజించి మోక్షమునకువెళ్లు జ్ఞాని "అయ్యో నేనుసాంసారిక సుఖములనుఁ బోగొట్టుకొంటినే, ఎంత పొరబాటుగావించితి"నని పశ్చాత్తాపపడడుగదా. ॥౯౬॥

శ్లో॥ వర్షేషు యద్భారతమార్యధుర్యాః
స్తువంతి గార్హస్థ్యమివాశ్రమేషు।

తత్రాస్మి పత్యుర్వరివస్యయాఽహం
శర్మోర్మికిర్మీరితధర్మలిప్సుః॥ ౯౭

ప॥వి॥ వర్షేషు । యత్ । భారతమ్ । ఆర్యధుర్యాః । స్తువంతి । గార్హస్థ్యమ్ ।
ఇవ । ఆశ్రమేషు । తత్ర । అస్మి । పత్యుః । వరివస్యయా । అహం ।
శర్మోర్మికిర్మీరితధర్మలిప్సుః.

టీక॥ ఆర్యధుర్యాః = ఆర్యశ్రేష్ఠులు, ఆశ్రమేషు = బ్రహ్మచర్యాద్యాశ్రమముల యందు, గార్హస్థ్యమివ = గృహస్థాశ్రమమునువలె, వర్షేషు = ఇలావృతాది తొమ్మిది ఖండములయిందును, యత్ = ఏ, భారతం = భారత ఖండమును, స్తువంతి = పొగడుచున్నారో, తత్ర = ఆ భారత వర్షమునందు, పత్యుః = భర్తయొక్క, వరివస్యయా = శుశ్రూషచే, అహం = నేను, శర్మోర్మికిర్మీరితధర్మలిప్సుః; శర్మోర్మి = సుఖతరంగపరంపరలచే, కిర్మీరిత = చిత్రమైన, ధర్మ = పతివ్రతాధర్మమును, లిప్సుః = కోరిన దాననుగా, అస్మి = ఉన్నాను.

## సమాసములు :

ఆర్యధుర్యాః : ధురం వహంతీతి = ధుర్యాః. ఆర్యేషుధుర్యాః = ఆర్య ధుర్యాః.

గార్హస్థ్యమ్ : గృహే తిష్ఠతీతి = గృహస్థః. గృహస్థస్య భావః = గార్హస్థ్యమ్. తత్ = గార్హస్థ్యమ్.

శర్మోర్మికిర్మీరితధర్మలిప్సుః : శర్మణామూర్మయః = శర్మోర్మయః. శర్మోర్మిభిఃకిర్మీరితః = శర్మోర్మికిర్మీరితః. శర్మోర్మికిర్మీరితశ్చాసౌ ధర్మశ్చ = శర్మోర్మికిర్మీరితధర్మః. లబ్ధుమిచ్ఛుః = లిప్సుః. శర్మోర్మికిర్మీరిత ధర్మం లిప్సుః = శర్మోర్మికిర్మీరితధర్మలిప్సుః.

## భావము :

ఆర్యశ్రేష్ఠులు బ్రహ్మచర్యాద్యాశ్రమములయందు గార్హస్థ్యము శ్రేష్ఠమని చెప్పుదురు. ఇళావృతముమున్నగు నవవర్షములయందు భారతవర్షము శ్రేష్ఠ

మనియు ప్రశంసింతురు. అట్టి భారత వర్షమునందు, భర్తకు శుశ్రూషఁ జేయుచు సుఖపరంపరలతోఁ గూడిన ధర్మమునుఁ బొందఁగోరుచున్నాను. ॥౯౭॥

శ్లో॥ స్వర్గే సతాం శర్మ పరం న ధర్మా
భవంతి భూమావిహ తచ్చ తేచ।
ఇష్ట్వాఽపి తుష్టిస్సుకరా సురాణాం
కథం విహాయ త్రయమేకమీహే॥ ౯౮

ప॥వి॥ స్వర్గే । సతాం । శర్మ । పరం । న । ధర్మాః । భవంతి । భూమౌ । ఇహ । తత్ । చ । తే । చ ।ఇష్ట్వా । అపి । తుష్టిః । సుకరా । సురాణాం । కథం । విహాయ । త్రయమ్ । ఏకమ్ । ఈహే.

టీక॥ స్వర్గే = స్వర్గమునందు, సతాం = ఉన్నవారికి. శర్మపరం = సుఖము మాత్రమే,(యుండును). ధర్మాః = సుకృతములు, నభవంతి = ఉండవు. ఇహ = ఈ, భూమౌ = భూమియందు, తచ్చ = ఆ సుఖము, తే చ = ఆ సుకృతములు, భవంతి = ఉన్నవి. (కించ = మఱియు), ఇహ = ఈ భూమియందు, ఇష్ట్వా = యాగముచే,సురాణాం = దేవతలకు, తుష్టిరపి = సంతోషముగూడ, సుకరా = సుఖముగాచేయసాధ్యము. ఏవంసతి = ఇట్లుండగా, కథం = ఎట్లు, త్రయం = సుఖ ధర్మ తుష్టిరూపములైన మూఁటిని, విహాయ = వదలి, ఏకం = ఒకటైన, సుఖం = సుఖమును, ఈహే = కోరుదును.

## సమాసములు :

సుకరా : సుఖేనకర్తుం శక్యా = సుకరా.

## భావము :

స్వర్గలోకమున సుఖముమాత్రమేకలదు. అచ్చటధర్మములేదు. ఈభూమియందు ఆ సుఖము ఆధర్మములు కలవు. మఱియు యాగాదులచే దేవతలనుఁ దృప్తిపఱచుట సుకరము. కాన సుఖ ధర్మ తృప్తులలో నొక సుఖము నెట్లు కోరెదము. ఇది వివేకవంతులు చేయఁదగిన పనికాదు. కావున స్వర్గముకంటెను భూలోకమే మెచ్చఁదగినది. ॥౯౮॥

శ్లో॥ సాధోరపి స్వః ఖలు గామితాధో
గామీ స తు స్వర్గమితః ప్రయాణే।
ఇత్యాయతిం చింతయతో హృది ద్వే
ద్వయోరుదర్కః కిము శర్కరేన॥ ౯౯

ప॥వి॥ సాధోః । అపి । స్వః । ఖలు । గామితా । అధః । గామీ । సః । తు
స్వర్గమ్ । ఇతః । ప్రయాణే । ఇతి। ఆ యతిం । చింతయతః ।హృ
ద్వే । ద్వయోః । ఉదర్కః । కిమ్ । ఉ । శర్కరే । న.

టీక॥ (కించ = మఱియు) సాధోరపి = సుకృతవంతునికి, స్వః = స్వర్గ
నుండి, అధోగామితాఖలు = దిగువకుఁబోవుటగదా. సః = ఆ సాధు
ఇతః = ఈ భూలోకమునుండి, ప్రయాణేతు = ప్రయాణమందో, స్వ
= స్వర్గమును, గామీ = పొందఁగలడు. ఇతి = ఇట్లు, ఆయతిం
ఉత్తరకాలమును, చింతయతః = ఆలోచించుచున్న వివేకికి, ద్వయో
= స్వర్గలోక భూలోకములయందు, ఉదర్కః = ఉత్తరఫలము, ద్వే
రెండైన, శర్కరే = శిలాప్రాయమైనమట్టియు పంచదారయు, నకిము
కావాయేమి?

వి॥ ఉత్తరఫలమునందు శర్కరాత్వము నారోపించుటవలన నిదర్శనాలం
భేదము పదార్థవృత్తి నిదర్శన.

**భావము :**

ఈ చెప్పఁబోవు కారణములచేతను స్వర్గము కంటెను, భూలోకమే శ్రేష్ఠము. ఎట్లనగా పుణ్యవంతుఁడుగూడ స్వర్గమునుండి పుణ్యము క్షీణమైన వెంటనే దిగిరావలసినదే గదా! ఆ పుణ్యవంతుఁడు భూలోకమునుండి పయనించినచో, స్వర్గమునే పొందగలడు గదా! కావున స్వర్గలోకవాసికి పతనము, భూలోకవాసికి నభ్యుదయము ప్రసిద్ధములు. కావున నిట్లుత్తరకాలమునుఁ గూర్చి యాలోచించునట్టి వివేకికి స్వర్గలోకభూలోకములలోనుత్తరఫలము రెండు చక్కెరలు. అందొకటి తాటితోఁగలసినమట్టి. మఱియొకటి, చెఱకునుండి యుద్భవించిన పంచదార. కాని పేరుమాత్రము రెంటికి నొక్కటియే. జాతిపలుకులకుఁ గూడ శక్కర యని పేరు నిఘంటు ప్రసిద్ధము. ॥౯౯॥

శ్లో॥ ప్రక్షీణ ఏవాయుషి కర్మకృష్టే
నరాన్నతిష్ఠత్యుపతిష్ఠతే యః।
బుభుక్షతే నాకమపథ్యకల్పం
ధీర స్తమాపాతసుఖోన్ముఖం కః ॥ ౧౦౦

ప॥వి॥ ప్రక్షీణే । ఏవ । ఆయుషి । కర్మకృష్టే । నరాన్ । న । తిష్ఠతి । ఉపతిష్ఠతే । యః । బుభుక్షతే । నాకమ్ । అపథ్యకల్పం । ధీరః । తమ్ । ఆ పాతసుఖోన్ముఖం । కః.

టీక॥ (కించ = మఱియు), యః = ఏ స్వర్గము, కర్మకృష్టే = తన పుణ్యపాపములచే నార్జింపఁబడిన, ఆయుషి = ఆయువు, ప్రక్షీణేసత్యేవ = క్షీణించి పోగనే, నరాన్ = మనుష్యులను, ఉపతిష్ఠతే = పొందును. తిష్ఠతిసతి = ఆయువు ఉండగా, నోపతిష్ఠతే = పొందదు. ఆపాత సుఖోన్ముఖం; ఆపాత = ప్రారంభమునందు, సుఖోన్ముఖం = సుఖమునకు మొగ్గిన, (అతఏవ = కావుననే) అపథ్యకల్పం = అపథ్యమైనయన్నముతో సమానమైన, తం = ఆ, నాకం = స్వర్గమును, ధీరః = బుద్ధిమంతుఁడు, కః = ఎవఁడు, బుభుక్షతే = అనుభవింపఁగోరును?

## సమాసములు :

కర్మకృష్టే : కర్మణా కృష్టం = కర్మకృష్టం. తస్మిన్ = కర్మకృష్టే.

అపథ్యకల్పం : పథి భవః = పథ్యః. న పథ్యః = అపథ్యః. అపథ్యేన సదృశః = అపథ్యకల్పః. తమ్ = అపథ్యకల్పమ్.

ఆపాతసుఖోన్ముఖం : ఆపాతేసుఖమ్ = ఆపాతసుఖం. ఆపాతసుఖస్య ఉన్ముఖః = ఆపాతసుఖోన్ముఖః. తమ్ = ఆపాతసుఖోన్ముఖమ్.

## భావము :

ఆ స్వర్గముగూడ, సుకృతముచేతను, దుష్కృతముచేతను సంపాదింపఁబడిన ఆయువు క్షీణించిననే మనుష్యులనుఁ బొందును. ఆ యాయువున్నచో పొందదు. ప్రారంభమునందు సుఖకరమై, యపథ్యాన్నము వంటి యా స్వర్గమును బుద్ధిమంతుఁడెవ్వఁడనుభవింపఁగోరును. ॥౧౦౦॥

శ్లో॥ ఇతీంద్రదూత్యాం ప్రతివాదమర్ధే
ప్రత్యుహ్య సైషాభిదధే వయస్యాః।
కించిద్వివక్షోల్లసదోష్ఠలక్ష్మీ
జితాపనిద్రద్దళపంకజాస్యాః ౧౦౧

ప॥వి॥ ఇతి । ఇంద్రమాత్యాం । ప్రతివాధమ్ । అర్ధే । ప్రత్యుహ్య । సా । ఏషా । అభిదధే । వయస్యాః । కించిద్వివక్షోల్లసదోష్ఠలక్ష్మీజితాపనిద్రద్దళపంకాజాస్యాః.

టీక॥ సాఏషా = ఆ ఈ దమయంతి, ఇతి = ఇట్లు, ఇంద్రదూత్యాం = ఇంద్రుని దూతి విషయమునందు, ప్రతివాదం = ప్రత్యుత్తరమును, అర్ధే = మధ్య, మధ్య, ప్రత్యుహ్య = ఆపుకొని, కించిద్వివక్షోల్లసదోష్ఠలక్ష్మీజితాపనిద్రద్దళపంకజాస్యాః; కించిత్ = కొంచెము, వివక్షా = మాట్లాడఁగోరుటచే, ఉల్లసత్ = చలించుచున్న, ఓష్ఠలక్ష్మీ = పెదవియొక్క శోభచే, జిత = జయింపఁబడిన, అపనిద్రత్ = వికసించిన, దళ = రేకులుగల్గిన, పంకజాస్యాః = పద్మమువంటి ముఖములు గల్గిన, వయస్యాః = చెలికత్తెలను, అభిదధే = పలికెను.

## సమాసములు :

*ఇంద్రదూత్యామ్ :* ఇంద్రస్య దూతీ = ఇంద్రదూతీ. తస్యామ్ = ఇంద్రదూత్యామ్.

*కించిద్వివక్షోల్లసదోష్ఠలక్ష్మీజితావనిద్రదళపంకజాస్యాః:* వక్తుమిచ్ఛా = వివక్షా. కించిత్ వివక్షా = కించిద్వివక్షా. కించిద్వివక్షయా ఉల్లసంతౌ = కించిద్వివక్షోల్లసంతౌ. కించిద్వివక్షోల్లసంతౌ చ తౌ ఓష్ఠౌ చ = కించిద్వివక్షోల్లసదోష్ఠౌ. కించిద్వివక్షోల్లసదోష్ఠయోః లక్ష్మీః = కించిద్వివక్షోల్లసదోష్ఠలక్ష్మీః. కించిద్వివక్షోల్లసదోష్ఠలక్ష్మ్యా జితమ్ = కించిద్వివక్షోల్లసదోషలక్ష్మీజితమ్. అపనిద్రంతి దళాని యస్య తత్ = అపనిద్రద్దళమ్. అపనిద్రద్దళం చ తత్ పంకజం చ = అపనిద్రద్దళపంకజం. కించిద్వివక్షోల్లసకోష్ఠలక్ష్మీ జితం చ తత్ అపనిద్రద్దళపంకజం చ = కించిద్వివక్షోల్లసదోష్ఠలక్ష్మీజితాపనిద్రద్దళపంకజమ్. కించిద్వివక్షోల్లసదోష్ఠలక్ష్మీజీతాపనిద్రద్దళపంకజమివ ఆస్యం యాసాం తాః = కించిద్వివక్షోల్లస

ద్యోషలక్ష్మీజితాప నిద్రద్దళపంకజాస్యాః. తాః = కించిద్వివక్షోల్లస దోష్ఠలక్ష్మీ జితాపనిద్రద్దళపంకజాస్యాః.

**భావము :**

ఆ దమయంతి యింద్రదూతి విషయమున తానుఁజెప్పెడి ప్రత్యుత్తర మును మధ్య మధ్య ఆపి కొంచెము చెప్పఁదలచి పెదవులను కదలించుచున్న పద్మముఖులైన చెలికత్తెలనుఁ గూర్చి చెప్పఁదొడగినది. ॥౧౦౧॥

శ్లో॥ అనాదిధావిస్వపరంపరాయా
హేతుస్రజస్స్రోతసి వేశ్వరే వా।
ఆయత్తధీరేషజనస్తదార్యాః
కిమీదృశః పర్యనుయుజ్య కార్యః॥ ౧౦౨

ప॥వి॥ అనాదిధావిస్వపరంపరాయాః । హేతుస్రజః। స్రోతసి । వా। ఈశ్వరే। వా । ఆయత్తధీః । ఏషః । జనః । తత్ । ఆర్యాః । కిమ్ । ఈదృశః। పర్యనుయుజ్య । కార్యః.

టీక॥ హే ఆర్యాః = ఓ పూజ్యులారా! ఏషజనః = ఈ జనము, అనాదిధావి స్వపరంపరాయాః; అనాది = ఆదిలేక, ధావి = పరుగెత్తు, స్వపరంపరా యాః = తమ దేహపరంపరకు, హేతుస్రజః = కారణమైన కర్మపరం పరయొక్క, స్రోతసివా = ప్రవాహమందుగాని, ఈశ్వరేవా = ఈశ్వరుని యందుఁగాని, ఆయత్తధీః = స్వాధీనమైన బుద్ధి గల్గినది. తత్ = అందు వలననే, ఈదృశః = ఇటువంటి, ఏషః = ఈ, జనః = జనము, పర్యను యుజ్య = నిందింపఁబడి, కిం = ఏమి, కార్యః = చేయసాధ్యము.

**సమాసములు :**

*అనాదిధావిస్వపరంపరాయాః :* అవిద్యమానః ఆదిః యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = అనాది. అనాది యథా తథా ధావినీ = అనాదిధావినీ. స్వేషాం పరంపరా = స్వపరంపరా. అనాదిధావినీ చ సా స్వపరంప రా చ = అనాదిధావిస్వపరంపరా. తస్యాః = అనాదిధావిస్వపరంపరాయాః.

హేతుస్రజః: హేతూనాం స్రక్ = హేతుస్రక్: తస్యాః = హేతుస్రజః.

ఆయత్తధీః : ఆయత్తా ధీః యస్య సః = ఆయత్తధీః

**భావము :**

ఈ జనము మొదలులేక ప్రవహించుచున్న దేహపరంపరకు కారణమైన కర్మపరంపరాప్రవాహమునందు గాని యీశ్వరునందుగాని అధీనమైన బుద్ధిగలిగినది. కాని స్వతంత్రబుద్ధి దీనికి లేదు. కాన దీనిని నిందించి మనము చేయునది లేదు. కాన నేనును, దైవమునకు పరతంత్రురాలను కాన నిందింపఁబడుటకు నర్హురాలను కాను. ॥౧౨౨॥

శ్లో॥ నిత్యం నియత్యా పరవత్యశేషే
కస్సంవిదానోఽప్యనుయోగ్యయోగ్యః।
అచేతనా సా చ న వాచమర్హే
ద్వక్తా తు వక్త్రశ్రమకర్మ భుఙ్క్తే॥ ౧౦౩

ప॥వి॥ నిత్యం । నియత్యా । పరవతి । అశేషే । కః । సంవిదానః । అపి । అనుయోగయోగ్యః । అచేతనా । సా । చ । న । వాచమ్ । అర్హేత్ । వక్తా । తు । వక్త్రశ్రమకర్మ । భుఙ్క్తే.

టీక॥ అశేషే = సమస్తమైన(జనే = జనము), నిత్యం = ఎల్లప్పుడు, నియత్యా = దైవముచే, పరవతిసతి = పరతంత్రముకాగా, సంవిదానోఽపి = విద్వాంసుఁడుగూడ, కః = ఎవ్వఁడు, అనుయోగయోగ్యః = నిందార్హుఁడు? అచేతనా = చైతన్యములేని, సా = ఆనియతి, వాచం = నిందనుఁగూర్చి, నార్హేత్ = తగినదిగాదు. వక్తాతు = అచేతనమును నిందించు వ్యక్తియో, వక్త్రశ్రమకర్మ = నోటికి శ్రమనిచ్చెడి పనిని, భుంక్తే అనుభవించుచున్నాఁడు.

**సమాసములు :**

పరవతి : పరః అస్య అస్తితి = పరవాన్. తస్మిన్ = పరవతి.

అశేషే: అవిద్యమానః శేషః యస్య సః = అశేషః. తస్మిన్ = అశేషే.

అనుయోగయోగ్యాః : అనుయోగస్య యోగ్యాః = అనుయోగయోగ్యాః.

వక్త్రిక్రమకర్మ : వక్త్రిస్య క్రమః = వక్త్రిక్రమః. వక్త్రిక్రమ ఏవ కర్మ = వక్త్రిక్రమకర్మ. తత్ = వక్త్రిక్రమకర్మ.

**భావము:**

అందఱికిని దైవపారతంత్ర్యమున్నను మూఢుఁడు నిందార్హుఁడు కాఁడు. కాని విద్వాంసుఁడు నిందార్హుఁడే యనియుఁ జెప్పఁదగదు. లోకమంతయు దైవాయత్తమైనపుడు విద్వాంసుఁడు మాత్రమెట్లు నిందార్హుఁడగును? విద్వాంసుఁడు గూడ దైవము నుల్లంఘింపలేడు గదా. అట్లుకానిచో నానియతియే యనగా దైవమే నింద్యమని చెప్పెదమా యనినచో నదియు సాధ్యముకాదు. ఆ నియతికి చైతన్యములేదు. కాన దానిని నిందించినచో ఫలములేదు. అది కేవల మరణ్యరోదన మగును మఱియు నచేతనమైన యా నియతిని నిందించుటవలన పైగా నోరు నొప్పిగూడ యేర్పడును. కాన దైవాయత్తమైన విషయములయందెవ్వరిని నిందింపరాదు. కావున దైవాయత్తమైన నా విషయము నందు నేనుకూడ నట్లే నింద్యురాలను కాజాలను. ॥౧౦౩॥

శ్లో॥ క్రమేళకం నిందతి కోమలేచ్ఛుః
క్రమేళకః కంటకలంపటస్తమ్।
ప్రీతౌ తయోరిష్టభుజోస్సమాయాం
మధ్యస్థతా నైకతరోపహాసః॥ ౧౦౪

ప॥వి॥ క్రమేళకం । నిందతి । కోమలేచ్ఛుః । క్రమేళకః । కంటకలంపటః । తమ్ । ప్రీతౌ । తయోః । ఇష్టభుజోః । సమాయాం । మధ్యస్థతా । న । ఏకతరోపహాసః.

టీక॥ కోమలేచ్ఛుః; కోమల = మృదువైన ఆహారమును, ఇచ్ఛుః = కోరుచున్న గజాశ్వాదికము, క్రమేళకం = ఒంటెను, నిందతి = నిందించును, కంటకలంపటః = ముండ్లయందు నాసక్తి గలిగిన ఒంటె, తమ్ = ఆ, కోమలేచ్ఛుగలగజాదికమును, నిందతి = నిందించును. ఇష్టభుజోః = తమ తమ యిష్టములననుభవించుచున్న, తయోః = ఆరెంటికిని, ప్రీతౌ = ప్రీతి

సమాయాం = సమముగానున్నను, (తత్ర = వానిలో), ఏకతరోపహాసః; ఏకతర = ఒకరిని, ఉపహాసః = పరిహసించుట, మధ్యస్థతా = మధ్యమ మార్గము, అనగా తాటస్థ్యము, న = కాదు.

**సమాసములు :**

*కోమలేచ్ఛుః :* కోమలమిచ్ఛుః = కోమలేచ్ఛుః.

*కంటకలంపటః :* కంటకే లంపటః = కంటకలంపటః.

*ఇష్టభుజోః :* ఇష్టం భుంక్తే ఇతి = ఇష్టభుజౌ. తయోః = ఇష్టభుజోః.

మధ్యస్థతా : మధ్యే తిష్ఠతీతి = మధ్యస్థః. మధ్యస్థస్య భావః = మధ్యస్థతా.

*ఏకతరోపహాసః :* ఏకతరస్య ఉపహాసః = ఏకతరోపహాసః.

**భావము :**

దేవేంద్రుని వదలి నలునిఁ బరిణయమాడినచో, లోకులు పరిహసింతురనుట సరికాదు. మృదువైన యాహారమును గ్రహించు గజాశ్వాదులు ముండ్లను తినునట్టి యొంటెను నిందించును. అట్లే ముండ్లను తినునట్టి యొంటె కోమలాహారమునుఁ దిను గజాశ్వాదులను నిందించును. ఎవరి కిష్టమైన దానిని వారు భుజింతురు. అప్పుడొకరి నొకరు నిందించుట న్యాయము గాదు. అందఱిని తన వలెనే భావించుకొని నిందించుటకు బదులు సంతోషింపవలసి యుండగా నిందించినచో, నిందించువారే పరిహాస పాత్రులగుదురు. కాన నాకు నలుడిష్టుడైనందువలన నతనిని నేను పరిణయమాడఁ దలచితిని. ఈ విషయమున నన్ను లోకులు నిందించుట యర్థరహితము. ॥౧౦౪॥

శ్లో॥ గుణా హరంతోఽపిహరేర్న్నరం మే
న రోచమానం పరిహారయంతి।
న లోకమాలోకయథాపవర్గా
త్త్రివర్గమర్వాంచమముంచమానమ్॥ ౧౦౫

ష॥వి॥ గుణాః । హరంతః । అపి । హరేః । నరం । మే । న । రోచమానం । పరిహారయంతి । న । లోకమ్ । ఆలోకయథ । అపవర్గాత్। త్రివర్గమ్। అర్వాంచమ్ । అముంచమానమ్.

టీక॥ హరంతోఽపి = మనస్సును హరించున్నవియైనను, హరేః = ఇంద్రుని యొక్క, గుణాః = గుణములు, మే = నాకు, రోచమానం = నచ్చుచున్న, (తం = ఆ) నరం = నరుని, (నలుని) న పరిహారయంతి = తుడిచి వేయవు. అపవర్గాత్ = మోక్షముకంటె, అర్వాంచం = అపకృష్టమైన, త్రివర్గం = ధర్మ-అర్థ-కామములను, అముంచమానం = వదలనటువంటి, లోకం = జనమును, నాఽఽలోకయథ! = చూడరా!.

**సమాసములు ;**

త్రివర్గం : త్రయాణాం వర్గః = త్రివర్గః. తమ్ = త్రివర్గమ్.

**భావము :**

నలుని కంటెను గుణములచే నధికుఁడైన యింద్రుని యందేల యభిరుచి లేదని ప్రశ్నింపరాదు. ఇంద్రుని గుణములు మనస్సును హరించునవియే; కాద నను. కాని యాతని మనోహర గుణములు నలుని నా మనస్సునుండి తుడిచి వేయఁజాలవు. ఏలయనగా-ధర్మార్థకామ మోక్షములలో మోక్షమప వర్గమనియు, ధర్మార్థకామములు త్రివర్గమనియుఁ జెప్పఁబడును. అందు త్రివర్గమయిన ధర్మార్థకామములు అపవర్గమనఁబడు మోక్షమునకంటెను తక్కువ అయినను నా మోక్షమును వదలి ధర్మార్థకామములనే సేవించు జనమును మీరు చూచుట లేదా! వస్తువును పరిగ్రహించుట గాని, పరిత్యజించుటగాని దాని యుత్కర్ష నికర్షలతో సంబంధించినవి కావు. అవి వాని పైనున్న యభిరుచితో సంబంధించి నవి. ॥౧౦౩॥

శ్లో॥ ఆకీటమాకైటభవైరి తుల్యః
స్స్వాభీష్టలాభాత్కృతకృత్యభావః।
భిన్నస్పృహాణాం ప్రతిచార్థమర్థం
ద్విష్టత్వమిష్టత్వమపవ్యవస్థమ్॥ ౧౦౪

ప॥వి॥ ఆకీటమ్ । ఆకైటభవైరి । తుల్యాః । స్వాభీష్టలాభాత్ । కృతకృత్యభావః । భిన్నస్పృహాణాం । ప్రతి । చ । అర్థమ్ । అర్థమ్ । ద్విష్టత్వమ్ । ఇష్టత్వమ్ । అపవ్యవస్థమ్.

టీక॥ ఆకీటమ్ = పురుగును మొదలుబెట్టి; ఆకైటభవైరి = విష్ణువువఱకును, స్వాభీష్టలాభాత్; స్వ = తనకు, అభీష్ట = ఇష్టమైనదానిని, లాభాత్ = పొందుటవలన, కృతకృత్యభావః = కృతార్థత, తుల్యాః = సమానము. భిన్నస్పృహాణాం = భిన్నరుచిగల జనులకు, అర్థమర్థంప్రతి = ప్రతి వస్తువునందును, ద్విష్టత్వం = ద్వేషము, ఇష్టత్వం = కోరిక, అపవ్యవస్థం = వ్యవస్థారహితమైనది.

## సమాసములు :

ఆకీటమ్ : కీటాదారభ్య = ఆకీటమ్.

ఆకైటభవైరి : కైటభస్య వైరిః = కైటభవైరిః. కైటభవైరిమభివ్యాప్య = ఆకైటభవైరి.

స్వాభీష్టలాభాత్ : స్వస్య అభీష్టం = స్వాభీష్టమ్. స్వాభీష్టస్య లాభః = స్వాభీష్టలాభః. తస్మాత్ = స్వాభీష్టలాభాత్.

కృతకృత్యభావః : కృతం కృత్యం యేన సః = కృతకృత్యః. కృతకృత్యస్య భావః = కృతకృత్యభావః.

భిన్నస్పృహాణామ్ : భిన్నాః స్పృహాః యేషాం తే = భిన్నస్పృహాః. తేషాం = భిన్నస్పృహాణామ్.

అపవ్యవస్థమ్ : అపగతా వ్యవస్థాయస్య తత్ = అపవ్యవస్థమ్.

## భావము :

ఇంద్రునిఁ బొంది కృతార్థురాలవు కమ్ము. ఏల యీ నలునికై శ్రమపడెదవని యనరాదు. ఏలయనగా, పురుగునుండి యా మహావిష్ణువు వఱకును గలజంతుకోటి తమతమయిష్టములనుఁబొంది సుఖించి కృతార్థత నొందుచున్నది. నాకు, నాకభీష్టమైనది లభించినపుడే కృతార్థత గానియింద్రుఁడు లభించుటవలన

గాదు. అట్లగుచో నింద్రునే యభీష్టుని(జేసికొనరాదా యని చెప్పనొప్పదు. ఏలః యనగా - జనులందఱును భిన్నభిన్నములైన, యభిరుచులు గల్గి యుందురు. వారికేది యిష్టమేది యిష్టము కాదను విషయమునం దేలాటి వ్యవస్థ లేదు. కావున నింద్రుఁడు నా కభీష్టుఁడు కాఁడు. కాన నిందులో దోష మేమి యున్నది. ॥౧౦౬॥

శ్లో॥ అగ్రాధ్వజాగ్రన్నిభృతాపదంధుం
బంధుర్యదిస్యాత్ప్రతిబంధుమర్హః।
జోషం జనః కార్యవిదస్తు వస్తు
పృచ్ఛ్యో నిజేచ్ఛాపదవీం ముదస్తు॥ ౧౦౭

ప॥వి॥ అగ్రాధ్వజాగ్రన్నిభృతాపదంధుం । బంధుః । యది । స్యాత్ । ప్రతిబంధుమ్ । అర్హః । జోషం । జనః । కార్యవిత్ । అస్తు । వస్తు । పృచ్ఛ్యః । నిజేచ్ఛాపదవీం । ముదః । తు.

టీక॥ అగ్రాధ్వజాగ్రన్నిభృతాపదంధుం; అగ్రాధ్వ = ఎదుటనున్న మార్గమున, జాగ్రత్ = నెలకొన్న, నిభృత = మఱుగైన, ఆపత్ = ఆపద యనెడి, అంధుం = కూపమును, ప్రతిబంధుం = వారించుటకు, అర్హః = శక్తి కలవాఁడు, బంధుః = బంధువుగా, స్యాద్యది = అయినచో, సః జనః = అట్టిజనము, బంధుః = బంధువును, కార్యవిత్ = కార్యజ్ఞుఁడును (అగును). జోషమ్ = (నేనడుగు నంతవరకును), ఊరక, అస్తు = ఉండవలయును. (నన్నువారింపవలదు), ముదః = శ్రేయస్సుయొక్క, పదవీంతు = మార్గమును(గూర్చియో, నిజేచ్ఛా = తనయిచ్ఛయే, పృచ్ఛ్యః = అడుగఁదగినది. వస్తు = ఇదియే సత్యము.

**సమాసములు:**

*అగ్రాధ్వజాగ్రన్నిభృతాపదంధుమ్ :* అగ్రం చాసౌ అధ్వా చ = అగ్రాధ్వా. అగ్రాధ్వని జాగ్రత్ = అధ్వాగ్రజాగ్రత్. నిభృతా చ సా ఆపచ్చ = నిభృతాపత్. నిభృతాపదేవ అంధుః = నిభృతాపదంధుః అగ్రాధ్వజాగ్రచ్చాసౌ నిభృతాపదంధుశ్చ = అగ్రాధ్వజాగ్రన్నిభృతాపదంధుః. తమ్ = అగ్రాధ్వజాగ్రన్నిభృతాపదంధుమ్.

కార్యవిత్ : కార్యం వేత్తీతి = కార్యవిత్.

పృచ్ఛ్యా : ప్రష్టుం యోగ్యా = పృచ్ఛ్యా.

నిజేచ్ఛా : నిజా చ సా ఇచ్ఛా చ = నిజేచ్ఛా.

**భావము :**

ముందు త్రోవయందు నాపదయనెడి మఱుగుపడిన బావియున్నచో నందుఁబడకుండ వాదించువాఁడు బంధువైనచో బంధువే కాదు మఱేమనగా కార్యజ్ఞుఁడు గూడ నగును. కాని నలుని వరించుటలో నాకేమియు నట్టి యాపద లేదు. కాన నన్ను నీ విషయమునందు వారింపవలదు. ఊరక యుండుడు. నేను ప్రశ్నించిననే యుత్తర మొసంగుఁడు. నా శ్రేయమునకు సంబంధించిన మార్గమును గూర్చి నా యిచ్ఛనే యడుగవలయును. అదియే నన్ను ప్రవర్తింపఁ జేయునది. ఇదియే పరమార్థము.

లేదా

ఎదుటి త్రోవయందు మఱుగుపడిన యాపదయను బావిని తెలుసుకొని స్నేహితుఁడు ఆ యాపదలోఁబడకుండ వారించుట యుచితము. కాని యిప్పుడట్లు లేదు. ఇప్పుడు చెలికత్తెలైన మీరందఱును నట్టి యాపదలేదని తెలిసికొని యున్నారు. అట్టి తఱి నన్ను వారించవలసినదే మున్నది? కాన నూరక యుండుట మీకు తగినది. గుణవంతుఁడైన నలుని వరించుటవలన నా కనిష్టమేమియుఁ గలుగదు కాన మీరా విషయమున నన్ను వారింపనవసరము లేదు. నలునిఁ జక్కఁగా విచారించియే నేను వరించితిని. కావున మీరు ఊరక యుండవలయును. మీరు కూడ మీకు హర్షకారణమైన మార్గరూపమైన వస్తువునకై మీ యిచ్ఛనే యడుగవలయును. మీకు గూడ నే పురుషునియందు హర్షమేర్పడునో, యతని యందేల మీకు సంతోషమని ప్రశ్నించుకొనినచో, దానికిఁ గూడ మీ కతనియందు గల్గిన యనురాగమే కారణమని చెప్పవలయును గదా! అట్లే నా విషయమందును మీరు గ్రహింపవలయును. నా కార్యమునుఁ దెలిసిన వారు ఊరకయే యుందురు. తెలియని వారేదో మాట్లాడెదరు. ॥౧౦౭॥

శ్లో॥ ఇత్థం ప్రతీపోక్తిమతిం సఖీనాం
విలుప్య పాండిత్యబలేన బాలా।

అపి శ్రుతస్వర్పతిమంత్రిసూక్తిం
దూతీం బభాషేఽద్భుతలోలమౌళిమ్॥ ౧౦౨

ప॥వి॥ ఇత్థం । ప్రతీపోక్తమతిం । సఖీనాం । విలుప్య । పాండిత్యబలేన । బాలా । అపి । శ్రుతస్వర్పతిమంత్రిసూక్తిం । దూతీం । బభాషే । అద్భుతలోలమౌళిమ్.

టీక॥ బాలా = బాలయైన దమయంతి, ఇత్థం = ఇట్లు, సఖీనాం = చెలికత్తెల యొక్క, ప్రతీపోక్తిమతిమ్; ప్రతీపోక్తి = ప్రతికూలపు మాటలకు మూలమైన, మతిం = బుద్ధిని, పాండిత్యబలేన = తన పాండిత్యబలముచే, విలుప్య = ఖండించి, శ్రుతస్వర్పతిమంత్రిసూక్తిమపి; శ్రుత = వినఁబడిన, స్వర్పతి = ఇంద్రునికి, మంత్రి = మంత్రియైన బృహస్పతియొక్క, సూక్తి మపి = మాటలు కల్గినదైనను, అద్భుతలోల మౌళిమ్; అద్భుత = ఆశ్చర్యముతో, లోల = కదలుచున్న, మౌళిం = శిరస్సుగల్గిన, దూతీం = దూతిని, బభాషే = మాట్లాడెను.

## సమాసములు :

ప్రతీపోక్తిమతిమ్ : ప్రతీపాశ్చతాః ఉక్తయశ్చ = ప్రతీపోక్తయః. ప్రతీపోక్తీనాం మతిః = ప్రతీపోక్తిమతిః. తామ్ = ప్రతీపోక్తిమతిమ్.

పాండిత్యబలేన : పండితస్య భావః = పాండిత్యమ్. పాండిత్యమేవ = బలమ్ = పాండిత్యబలమ్. తేన = పాండిత్యబలేన.

శ్రుతస్వర్పతిమంత్రిసూక్తిమ్ : స్వః పతిః = స్వర్పతిః. స్వర్పతేః మంత్రీ = స్వర్పతిమంత్రీ. స్వర్పతిమంత్రిణః సూక్తిః = స్వర్పతిమంత్రి సూక్తిః. శ్రుతాస్వర్పతిమంత్రిసూక్తిః యయాసా = శ్రుతస్వర్పతిమంత్రి సూక్తిః. తామ్ = శ్రుతస్వర్పతిమంత్రిసూక్తిమ్.

అద్భుతలోలమౌళిమ్ : అద్భుతేనలోలా = అద్భుతలోలా. అద్భుతలోలా మౌళిః యస్యాస్సా = అద్భుతలోలమౌళిః. తామ్ = అద్భుతలోలమౌళిమ్.

## భావము :

బాలికయైన దమయంతి యిట్లు చెలికత్తెలయొక్క ప్రతికూలవచనములతో

గూడిన బుద్ధిని తన పాండిత్యబలముచే ఖండించి, దేవేంద్రునిమంత్రియగు బృహస్పతి వచనములనువినినట్టిదయ్యు, ఆశ్చర్యముతోఁ దలయూపుచున్న యింద్రుని దూతినిఁగూర్చి పలికినది. ॥౧౦౮॥

శ్లో॥ పరేతభర్తుర్మనసైవ దూతీం
నభస్వతైవానిలసఖ్యభాజః।
త్రిస్రోతసైవాంబుపతేస్తదాశు
స్థిరాస్థమాయాతవతీంనిరాస్థమ్॥ ౧౦౯

ప॥వి॥ పరేతభర్తుః । మనసా । ఏవ । దూతీం । నభస్వతా । ఏవ । అనిలసఖ్యభాజః । త్రిస్రోతసా । ఏవ । అంబుపతేః । తత్ । ఆశు । స్థిరాస్థమ్ । ఆయాతవతీం । నిరాస్థమ్.

టీక॥ హే ఇంద్రదూతి = ఓయింద్రదూతీ,(ఎందువలన దమయంతి తాను నలుని మనస్సుచే వరించినదో, అందువలన)స్థిరాస్థం; స్థిర = స్థిరమైన, ఆస్థం = వశీకరణశక్తి కల్గినట్లుగా (నేను దమయంతిని మనస్సుచే వశపఱచుకొనగలనను బుద్ధితో),ఆశు = శీఘ్రముగా, మనసైవ = మనస్సనెడి వాహనముతో, ఆయాతవతీం = వచ్చిన, పరేతభర్తుః = యమునియొక్క, దూతీః = దూతిని, తదా = వచ్చినక్షణమందే, నిరాస్థమ్ = నిరాకరించితిని. తథా = అట్లే, నభస్వతైవ = వాయువనెడి వాహనముతో, స్థిరాస్థం దృఢమయినపట్టుదల, గల్గినట్లుగా, ఆశు = శీఘ్రముగా, ఆయాతవతీం = వచ్చిన, అనిలసఖ్యభాజః = వాయువుయొక్క చెలిమిని పొందిన అగ్నియొక్క, దూతీం = దూతిని, తదా = వచ్చినక్షణమందే, నిరాస్థం = నిరాకరించితిని. తథా = అట్లే,త్రిస్రోతసైవ = మందాకినియనువాహనముతో, స్థిరాస్థం = దృఢమైన పట్టుదల గల్గినట్లుగా, ఆశు = శీఘ్రముగా ఆయాతవతీం = వచ్చిన, అంబుపతేః = వరుణునియొక్క, దూతీం = దూతిని, తదా = వచ్చినక్షణమందే, నిరాస్థం = నిరాకరించితిని.

**సమాసములు :**

పరేతభర్తుః : పరం ఇతాః = పరేతాః. పరేతానాం భర్తా = పరేతభర్తా. తస్య = పరేతభర్తుః.

అనిలసఖ్యభాజః : అనిలేన సఖ్యం = అనిలసఖ్యం. అనిలసఖ్యం భజతీతి = అనిలసఖ్యభాక్. తస్య = అనిలసఖ్యభాజః.

త్రిస్రోతసః : త్రీణి స్రోతాంసి యస్యాస్సా = త్రిస్రోతాః. తస్యాః = త్రిస్రోతసః.

అంబుపతేః : అంబూనాం పతిః = అంబుపతిః. తస్య = అంబుపతేః.

స్థిరాస్థమ్ : స్థిరా అస్థా యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = స్థిరాస్థమ్.

**భావము :**

ఓ యింద్రదూతీ! నేను నలుని మనస్సుతో వరించినందు వలన మనస్సును వాహనముగాఁ జేసికొని స్థిరమైన పట్టుదలవహించి నన్ను ఒప్పింపగలననెడి యాశయముతో శీఘ్రము వచ్చిన యమునిదూతిని, అదేవిధముగా వాయువును వాహనముఁగావించుకొని వచ్చిన యగ్నిదూతిని, అట్లే మందాకినిని వాహనముగావించుకొని వచ్చిన వరుణుని దూతిని వెంటనే నిరాకరించితిని. ఇంద్రునియందలి గౌరవముతో ఇంతకాలము నీతో సంభాషించితిని. ॥౧౦౯॥

శ్లో॥ భూయోర్థమేనం యది మాం త్వమాత్థ
తదా పదావాలభసే మఘోనః।
సతీవ్రతైస్తీవ్రమిమం తు మంతు
మంతఃపరం వజ్రిణి మార్జితాస్మి॥ ౧౧౦

ప॥వి॥ భూయః । అర్థమ్ । ఏనం । యది । మాం । త్వమ్ । ఆత్థ । తదా । పదౌ । ఆలభసే । మఘోనః । సతీవ్రతైః । తీవ్రమ్ । ఇమం । తు । మంతుమ్ । అంతః। పరం । వజ్రిణి। మార్జితాస్మి.

టీక॥ (హేశక్రదూతి = ఓయింద్రదూతీ!), త్వం = నీవు, భూయః = మఱల, ఏనం = ఈ, అర్థం = ఇంద్రుని వరించుమనెడియర్థమును, మాం = నన్నుఁగూర్చి, ఆత్థయది = చెప్పినయెడల, తదా = అప్పుడు, మఘోనః = ఇంద్రునియొక్క, పదౌ = పాదములను, ఆలభసే = స్పృశించి యొట్టు

పెట్టుకొందువు. వజ్రిణి = ఇంద్రుని విషయమున, అంతః = అంతఃకరణ మందు, పరం = శ్రేష్ఠముగా గ్రహింపఁబడు, ఇమం = ఈ, తీవ్రం = దుస్సహమైన, మంతుం = తనయాజ్ఞనుల్లంఘించితి ననెడి నా యపరాధ మును, సతీవ్రతైః = పతివ్రతానియమములచే, మార్జితాస్మి = కడిగి వేయఁగలను.

**సమాసములు :**

సత్యాః వ్రతాని = సతీవ్రతాని. తైః = సతీవ్రతైః.

**భావము :**

ఓ యింద్రదూతీ! నీవు మఱల నన్నింద్రుని వరింపుమనెడి మాటనుఁ జెప్పకుము. అట్లు చెప్పరాదని నీవు ఇంద్రుని పాదములను స్పృశించి శపథము చేయుము. ఇంద్రుని విషయమున నేను గావించిన యపరాధమును నతఁడు హృదయమున గుణముగా భావించినను నదియాతని యాజ్ఞోల్లంఘనము కాన తీవ్రమైనది. దీనిని నేను నా పతివ్రతా నియమములతో కడిగివేసుకొనఁగలను. పతివ్రతాధర్మము లెఱింగిన సర్వజ్ఞుఁడైన ఇంద్రభగవానుఁడు నన్నీయప రాధమునుండి రక్షింపగలడు. ॥౧౧౦॥

శ్లో॥ ఇత్థం పునర్వాగవకాశనాశా
న్మహేంద్రదూత్యామపయాతవత్యామ్।
వివేశ లోలం హృదయం నలస్య
జీవః పునః క్షీబమివప్రబోధః॥ ౧౧౧

ప॥వి॥ ఇత్థం । పునః । వాగవకాశనాశాత్ । మహేంద్రదూత్యామ్ । అపయాత వత్యాం । వివేశ । లోలం । హృదయం । నలస్య । జీవః । పునః । క్షీబమ్ । ఇవ । ప్రబోధః.

టీక॥ ఇత్థం = ఇట్లు, పునః = మఱల, వాగవకాశనాశాత్; వాక్ = మాటకు, అవకాశ = అవకాశము, నాశాత్ = నశించుటవలన, ఇంద్రదూత్యాం = ఇంద్రునిదూతి, అపయాతవత్యాం = వెడలిపోగా, నలస్య = నలుని

యొక్క, జీవః = జీవాత్మ, లోలం = చంచలమైన, హృదయం = హృదయమును, క్షీబం = మత్తుని, ప్రబోధఇవ = వివేకమువలె, పునః = మఱల, వివేశ = ప్రవేశించినది.

సమాసములు :

పునర్వాగవకాశనాశాత్ : పునః వాక్ = పునర్వాక్. పునర్వాచః అవకాశః = పునర్వాగవకాశః. పునర్వాగవకాశస్య నాశః = పునర్వాగవకాశనాశః. తస్మాత్ = పునర్వాగవకాశనాశాత్.

మహేంద్రదూత్యామ్ : మహేంద్రస్య దూతీ = మహేంద్రదూతీ. తస్యామ్ = మహేంద్రదూత్యామ్.

భావము :

ఇట్లు శపథముచే మఱల మాటలాడుట కవకాశము లేనందువలన మహేంద్రుని దూతి మఱలి వెళ్లి పోయినది. అప్పుడు మద్యపానముచే మత్తుని ప్రబోధము ప్రవేశించిన విధముగా, నలునియొక్క జీవము చంచలమైన హృదయమును మఱల ప్రవేశించెను. అతడు పునర్జన్మమెత్తినట్లాయెను. ॥౧౧౧॥

శ్లో॥ శ్రవణపుటయుగేన స్వేన సాధూపనీతం
దిగధిపకృపయాత్తాదీదృశాత్సన్నిధానాత్।
అలభత మధుబాలారాగవాగుత్థమిత్థం
నిషధజనపదేంద్రః పాతుమానందసాంద్రః ౧౧౨

ప॥వి॥ శ్రవణపుటయుగేన । స్వేన । సాధు । ఉపనీతం । దిగధిపకృపయా । ఆత్తాత్ । ఈదృశాత్ । సన్నిధానాత్ । అలభత । మధు । బాలారాగ । వాగుత్థమ్ । ఇత్థం । నిషధజనపదేంద్రః । పాతుమ్ । ఆనందసాంద్రః.

టీక॥ నిషధజనపదేంద్రః; నిషధ జనపద = నిషధ దేశమునకు, ఇంద్రః = ప్రభువైన నలుఁడు, దిగధిపకృపయా; దిగధిప = దిక్పాలురయొక్క, కృపయా = దయచే, ఆత్తాత్ = పొందఁబడిన, ఈదృశాత్ = ఇటువంటి, సన్నిధానాత్ = సాన్నిధ్యమువలన, అనగా ఆప్రకాశరూపసాన్నిధ్యము వలన, స్వేన = తనదైన, శ్రవణపుటయుగేన; శ్రవణపుట = కర్ణ పుట

ములయొక్క, యుగేన = జంటచే, సాధు = చక్కగా, ఉపనీతం = సమర్పింపఁబడిన, ఇత్థం = ఈ విధముగా, బాలారాగవాగుత్థం; బాలా = బాలికయైన దమయంతియొక్క, రాగవాక్ = అనురాగవచనముల నుండి, ఉత్థం = ఉద్భవించిన, మధు = తేనెను, అనగా రసామృతమును, ఆనందసాంద్రః; ఆనంద = ఆనందముచే, సాంద్రః = నిండినవాఁడై, పాతుమ్ = త్రాగుటకు, అలభత = అవకాశమునుఁ బొందెను.

## సమాసములు :

*శ్రవణపుటయుగేన :* శ్రవణయోః పుటౌ = శ్రవణపుటౌ. శ్రవణపుటయోః యుగం = శ్రవణపుటయుగం తేన = శ్రవణపుటయుగేన.

*దిగధిపకృపయా :* దిశామధిపాః = దిగధిపాః. దిగధిపానాం కృపా = దిగధిపకృపా. తయా = దిగధిపకృపయా.

*బాలారాగవాగుత్థమ్ :* బాలాయాః రాగః = బాలారాగః. బాలారాగేణ వాచః = బాలారాగవాచః. బాలారాగవాగ్భ్యః ఉత్థా యస్య తత్ = బాలారాగవాగుత్థమ్.

*నిషధజనపదేంద్రః :* జనానాం పదాని = జనపదాని. నిషధా ఇతి జనపదాని = నిషధజనపదాని. నిషధజనపదానామ్ ఇంద్రః = నిషధజనపదేంద్రః.

*ఆనందసాంద్రః :* ఆనందేన సాంద్రః = ఆనందసాంద్రః

## భావము :

నిషధదేశ ప్రభువైన నలమహారాజు దిక్పాలుర కృపచే ననుగ్రహింపఁబడిన తిరోధాన విద్యచే నాకరికిని కానరాక సాన్నిధ్యమొసఁగి, తన కర్ణపుటములచేఁ జక్కగా నాస్వాదింపఁబడిన, బాలికయగు దమయంతియొక్క యనురాగ పూర్ణ వచనముల యందుద్భవించిన రసామృతమును నానందఘనుఁడై పానముఁ జేయుట కవకాశమునుఁ బొందెను. ॥౧౧౨॥

శ్లో॥ శ్రీహర్షం కవిరాజరాజిమకుటాలంకారహీరః సుతం
శ్రీహీరః సుషువే జితేంద్రియచయం మామల్లదేవీ చ యమ్।

**షష్ఠః ఖండన ఖండతోఽపి సహజాత్ క్షోదక్షమే తన్మహా**
**కావ్యే చారుణి నైషధీయచరితే సర్గోఽగమద్భాస్వరః॥ ౧౧౩**

ప॥వి॥ శ్రీహర్షం । కవిరాజ రాజిమకుటాలంకారహీరః । సుతం । శ్రీ హీరః । సుషువే । జితేంద్రియచయం । మామల్లదేవీ । చ । యం । షష్ఠః । ఖండనఖండతః । అపి । సహజాత్ । క్షోదక్షమే । తన్మహాకావ్యే । చారుణి । నైషధీయచరితే । సర్గః । అగమత్ । భాస్వరః.

టీక॥ కవిరాజరాజిమకుటాలంకారహీరః; కవిరాజ = కవిశ్రేష్ఠులయొక్క, రాజి = పంక్తులయొక్క, మకుట = కిరీటములలో, అలంకార = భూషణమైన, హీరః = వజ్రమణియగు, శ్రీహీరః = శ్రీహీరుఁడను విద్వాంసుఁడు, జితేంద్రియచయం; జిత = జయింపఁబడిన, ఇంద్రియచయం = ఇంద్రియముల సమూహముగల, శ్రీహార్షం = శ్రీహర్షుఁడను, యం = ఏ, సుతం = కుమారుని, సుషువే = కనెనో, మామల్లదేవీ = మామల్లదేవి యను తల్లియు, సుషువే = కనెనో, సహజాత్ = సోదరమైనట్టి యనగా సమాన శర్తృకమైనట్టి, ఖండన ఖండతోఽపి = ఖండనఖండమను గ్రంథము కంటెను, లేదా, ఖండన = ఖండనమను గ్రంథమనెడి, ఖండతః = చెఱకు ముక్కకంటెను, క్షోదక్షమే = విమర్శసహమైన, తన్మహాకావ్యే; తత్ = ఆ శ్రీహార్షునియొక్క, మహాకావ్యే = మహాకావ్యమైన, నైషధీయ చరితే = నైషధీయచరితమునందు, భాస్వరః = శృంగారఘట్టములచే ప్రకాశశీలమైన, షష్ఠః = ఆఱవదైన, సర్గః = సర్గ, అగమత్ = కడచి నది అనగా సమాప్తమైనది.

## సమాసములు:

*కవిరాజరాజిమకుటాలంకారహీరః :* కవీనాం రాజానః = కవిరాజాః. కవిరాజానాం రాజిః = కవిరాజరాజిః. కవిరాజరాజేః మకటం = కవిరాజరాజి మకుటం. కవిరాజరాజిమకుటే అలంకారః = కవిరాజరాజిమకుటాలంకారః. కవి రాజరాజిమకుటాలంకారశ్చాసౌ హీరశ్చ = కవిరాజరాజి మకుటాలంకారహీరః.

*జితేంద్రియచయమ్ :* ఇంద్రియాణాం చయః = ఇంద్రియచయః. జితః ఇంద్రియచయః యేన సః = జితేంద్రియచయః. తమ్ = జితేంద్రియచయమ్.

క్షోదక్షమే : క్షోదస్య క్షమమ్ = క్షోదక్షమమ్. తస్మిన్ = క్షోదక్షమే.

నైషధీయచరితే : నిషధానాం రాజా = నైషధః. నైషధస్య ఇదం = నైషధీయం. నైషధీయం చ తత్ చరితం చ = నైషధీయ చరితం. తస్మిన్ = నైషధీయ చరితే.

**భావము :**

కవిశ్రేష్ఠులపంక్తికి శిరోభూషణ రత్నములలో వజ్రమణియగు శ్రీహీరుండును, మామల్లదేవియు జితేంద్రియుండైన శ్రీ హర్షుని కనిరి. అతడు రచించిన, ఖండనఖండ మను గ్రంథమున కంటెను విచారసహమైన యా శ్రీహర్షుని మహాకావ్యమైన నైషధీయ చరితము నందు, శృంగార ఘట్టములచే నుజ్జ్వలమైన యారవ సర్గ సమాప్తము ॥౧౧౩॥

ఇట్లు

శ్రీ మదాపస్తంబసూత్రాఽఽత్రేయగోత్ర ఉడాలి నృసింహసూరి తనూజ
ఉడాలి సుబ్బరామశాస్త్రి విరచిత నైషధీయచరిత్రాఽఽంధ్ర
వాఖ్యయందు షష్ఠ సర్గ సమాప్తము.

---

# శ్రీ హర్ష నైషధము



(తృతీయభాగము - టీకాతాత్పర్య సహితము)

వ్యాఖ్యాత

శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రి, ఎం. ఎ.

ప్రిన్సిపాలు, వైదిక సంస్కృతకళాశాల, నెల్లూరు







ప్రచురణ

ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ

కళాభవనము, సైఫాబాదు, హైదరాబాదు-500 004.

# శ్రీ హర్ష నైషధము

(తృతీయభాగము - టీకాతాత్పర్య సహితము)

వ్యాఖ్యాత

శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రి, ఎం. ఎ.

ప్రిన్సిపాలు, వైదిక సంస్కృతకళాశాల, నెల్లూరు




ప్రచురణ

ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ

కళాభవనము, సైఫాబాదు, హైదరాబాదు-500 004.

# తొలిపలుకు

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి చేపట్టిన అనేక సారస్వత కార్యక్రమా లలో సంస్కృత గ్రంథ ప్రచురణ ఒకటి. ఆంధ్రవిద్వాంసులు, కవులు సంస్కృతీకరించిన కొన్ని తెలుగుకావ్యాలు అకాడమీ ప్రకటించింది. వీటిలో శ్రీ యస్. టి. జి. వరదాచార్యులుగారు సంస్కృతంలోనికి అనువదించిన ఏడు తెలుగు శతకాల సంపుటము, శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు పరివర్తించిన కళాపూర్ణోదయము, శ్రీ కుంటిమద్ది శేషశర్మగారు అనువదించిన మనుచరిత్ర చేరి ఉన్నవి.

కొన్ని సంస్కృత స్వతంత్రగ్రంథాలుకూడా అకాడమీ ప్రకటించింది. వీనిలో ఇప్పటివరకు అచ్చయిన పుస్తకాలు:— డా॥ బి. రామరాజుగారి సంపాద కత్వములో శ్రీ కృష్ణదేవరాయ రచితమైన జాంబవతీపరిణయము, అభినవ కాళిదాసు వెల్లాల ఉమామహేశ్వరుడు రచించిన శృంగారశేఖరభాణము, మధురవాణి రచించిన శ్రీరామాయణ సార కావ్యతిలకము ప్రకటింపబడినవి. శ్రీ సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారి ఆంధ్రదేశ హాస్యకథలు మరియొక గ్రంథము.

డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు కప్పగంతుల లక్షణశాస్త్రిగార్ల సంపాద కత్వమున ఒక తెలుగు సంస్కృత నిఘంటువును కూడ అకాడమీ ప్రచురించింది. ఈవరుసలోనే శ్రీహర్షుని నైషధమును టీకాతాత్పర్య సహితముగా ప్రకటింపవలెనని అకాడమీ సంస్కృత సలహాసంఘము నిశ్చయించి ఈ కార్యమును శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రిగారికి అప్పగించినది. ఇదివరలో మూడేసి సర్గలతో రెండు సంపుటములు వెలువడినది. ఇది మూడవసంపుటము. ఈపనిని చక్కగా నిర్వహించుచున్న శ్రీఉడాలి సుబ్బరామశాస్త్రిగారికి అకాడమీ పక్షాన కృతజ్ఞతా వందనములు.

ఈ గ్రంథముద్రణమును పర్యవేక్షించిన, ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృతరీడర్ డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడుగారికి ధన్యవాదాలు.

ఆంధ్రపాఠకలోకానికి ఈ గ్రంథం ఆదరపాత్రము కాగలదని విశ్వసించుచున్నాను.

హైదరాబాదు
18, అక్టోబరు 1977

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# శ్రీ హర్షనైషధము

## (సప్తమసర్గ)

శ్లో॥ అథప్రియాసాదన శీలనాదౌ
మనోరథః పల్లవితః పురా యః।
విలోకనేనైవ స రాజపుత్ర్యాః
పత్యా భువః పూర్ణవదభ్యమాని॥ ౧

ప॥వి॥ అథ। ప్రియాసాదనశీలనాదౌ। మనోరథః। పల్లవితః। పురా। యః। విలోకనేన । ఏవ । సః । రాజపుత్ర్యాః । పత్యా । భువః । పూర్ణవత్ । అభ్యమాని ।

టీక॥ అథ = ఇంద్రుని దూతిని నిరాకరించిన పిదప, యః = ఏ, మనోరథః = మనస్సునందలి కోరిక, ప్రియాసాదనశీలనాదౌ; ప్రియా = ప్రియురాలైన దమయంతియొక్క, ఆసాదన = ప్రాప్తి విషయమందలి, శీలన = భావనయందును అనగా రూప పరికల్పనాది విషయమందును, ఆదౌ = ఆలింగనము మున్నగు సంభోగ విషయమందును, పురా = పూర్వము, పల్లవితః = దమయంతి నెట్లు పొందగలను, దమయంతి భావాదుల నెట్లెఱుంగ గలను అని చాలకాలముగ తన యందు చిగిర్చిన, సః = ఆ మనోరథము, భువః = భూమికి, పత్యా = భర్తయైన నలునిచే. రాజపుత్ర్యాః = రాజపుత్రికయైన దమయంతి యొక్క, విలోకనేనైవ = దర్శనముచేతనే, పూర్ణవత్ = నిండిన విధముగ, అభ్యమాని = అభిమానింపబడినది, అనగా భావింపంబడినది.

వి॥ ప్రాప్తియను కారణము లేకయే దాని వలనఁగలుగు నానందమును వర్ణించుట వలన విభావనాలంకారము. పూర్ణము కాక పోయినను పూర్ణమైనదో యన్నట్లు వర్ణించుట వలన నుత్ప్రేక్ష.

# తొలి పలుకు

ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమి చేపట్టిన అనేక సారస్వత కార్యక్రమా లలో సంస్కృత గ్రంథ ప్రచురణ ఒకటి. ఆంధ్రవిద్వాంసులు, కవులు సంస్కృతీకరించిన కొన్ని తెలుగుకావ్యాలు అకాడమీ ప్రకటించింది. వీటిలో శ్రీ యస్. టి. జి. వరదాచార్యులుగారు సంస్కృతంలోనికి అనువదించిన ఏడు తెలుగు శతకాల సంపుటము, శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు పరివర్తించిన కళాపూర్ణోదయము, శ్రీ కుంటిమద్ది శేషశర్మగారు అనువదించిన మనుచరిత్ర చేరి ఉన్నవి.

కొన్ని సంస్కృత స్వతంత్రగ్రంథాలుకూడా అకాడమీ ప్రకటించింది. వీనిలో ఇప్పటివరకు అచ్చయిన పుస్తకాలు:— డా॥ బి. రామరాజుగారి సంపాద కత్వములో శ్రీ కృష్ణదేవరాయ రచితమైన జాంబవతీపరిణయము, అభినవ కాళిదాసు వెల్లాల ఉమామహేశ్వరుడు రచించిన శృంగారశేఖరభాణము, మధురవాణి రచించిన శ్రీరామాయణ సార కావ్యతిలకము ప్రకటింపబడినవి. శ్రీ సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారి ఆంధ్రదేశ హాస్యకథలు మరియొక గ్రంథము.

డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు కప్పగంతుల లక్షణశాస్త్రిగార్ల సంపాద కత్వమున ఒక తెలుగు సంస్కృత నిఘంటువును కూడ అకాడమీ ప్రచురించింది. ఈవరుసలోనే శ్రీహర్షుని నైషధమును టీకాతాత్పర్య సహితముగా ప్రకటింపవలెనని అకాడమీ సంస్కృత సలహాసంఘము నిశ్చయించి ఈ కార్యమును శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రిగారికి అప్పగించినది. ఇదివరలో మూడేసి సర్గలతో రెండు సంపుటములు వెలువడినది. ఇది మూడవసంపుటము. ఈపనిని చక్కగా నిర్వహించుచున్న శ్రీఉడాలి సుబ్బరామశాస్త్రిగారికి అకాడమీ పక్షాన కృతజ్ఞతా వందనములు.

ఈ గ్రంథముద్రణమును పర్యవేక్షించిన, ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృతరీడర్ డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడుగారికి ధన్యవాదాలు.

ఆంధ్రపాఠకలోకానికి ఈ గ్రంథం ఆదరపాత్రము కాగలదని విశ్వసించుచున్నాను.

హైదరాబాదు
18, అక్టోబరు 1977

దేవులపల్లి రామానుజరావు
కార్యదర్శి

# శ్రీ హర్షనైషధము

## (సప్తమసర్గ)

శ్లో॥ అథప్రియాసాదన శీలనాదౌ
మనోరథః పల్లవితః పురా యః।
విలోకనేనైవ స రాజపుత్ర్యాః
పత్యా భువః పూర్ణవదభ్యమాని॥ ౧

ప॥వి॥ అథ। ప్రియాసాదనశీలనాదౌ। మనోరథః। పల్లవితః। పురా। యః। విలోకనేన । ఏవ । సః । రాజపుత్ర్యాః । పత్యా । భువః । పూర్ణవత్ । అభ్యమాని ।

టీక॥ అథ = ఇంద్రుని దూతిని నిరాకరించిన పిదప, యః = ఏ, మనోరథః = మనస్సునందలి కోరిక, ప్రియాసాదనశీలనాదౌ; ప్రియా = ప్రియురాలైన దమయంతియొక్క, ఆసాదన = ప్రాప్తి విషయమందలి, శీలన = భావనయందును అనగా రూప పరికల్పనాది విషయమందును, ఆదౌ = ఆలింగనము మున్నగు సంభోగ విషయమందును, పురా = పూర్వము, పల్లవితః = దమయంతి నెట్లు పొందగలను, దమయంతి భావాదుల నెట్లెఱుంగ గలను అని చాలకాలముగ తన యందు చిగిర్చిన, సః = ఆ మనోరథము, భువః = భూమికి, పత్యా = భర్తయైన నలునిచే. రాజపుత్ర్యాః = రాజపుత్రికయైన దమయంతి యొక్క, విలోకనేనైవ = దర్శనముచేతనే, పూర్ణవత్ = నిండిన విధముగ, అభ్యమాని = అభిమానింపబడినది, అనగా భావింపంబడినది.

వి॥ ప్రాప్తియను కారణము లేకయే దాని వలనఁగలుగు నానందమును వర్ణించుట వలన విభావనాలంకారము. పూర్ణము కాక పోయినను పూర్ణమైనదో యన్నట్లు వర్ణించుట వలన నుత్ప్రేక్ష.

సమాసములు :

ప్రియాసాదన శీలనాదౌ : శీలనం ఆదిః యస్య తత్ = శీలనాది, ఆసాదనంచ శీలనాదిచ = ఆసాదనశీలనాది. ప్రియాయాః ఆసాదనశీలనాది = ప్రియాసాదనశీలనాది తస్మిన్ = ప్రియాసాదనశీలనాదౌ.

పల్లవితః : పల్లవాః అస్య సంజాతా ఇతి = పల్లవితః.

రాజపుత్ర్యాః : రాజ్ఞః పుత్రీ = రాజపుత్రీ, తస్యాః = రాజపుత్ర్యాః.

పూర్ణవత్ః : పూర్ణ ఇవ = పూర్ణవత్.

భావము :

ఇంద్రుని పరిణయమాడుమని యింద్రదూతి చెప్పిన విషయమును దమయంతి నిరాకరింపగనే యామెకు తనపైన దృఢముగ ననురాగము గలదని గ్రహించి నలుఁడు సంతసించెను. తర్వాత నామె నీ సర్గయందు వర్ణింపఁబోవుచు పూర్వము పెక్కు సందేహములతో వాడుబారిన యాతని మనోరథము దమయంతి నెట్లు పొందగలమనెడి. యౌత్సుక్యముతో చిగిరించినదై యామెను చూచుటచేతనే యామెను పొందుటవలని యానందమును గల్గించుట వలన నది పూర్ణమైనదిగా భావింపఁబడినది. ॥౧॥

శ్లో॥ ప్రతి ప్రతీకం ప్రథమం ప్రియాయా
మథాంత రానంద సుధాసముద్రే।
తతః ప్రమోదాశ్రు పరంపరాయాం
మమజ్జతు స్తస్యదృశౌ నృపస్య॥ ౨

ప॥వి॥ ప్రతిప్రతీకం । పథమం । ప్రియాయామ్ । అథ । అంతరానందసుధాసముద్రే । తతః । ప్రమోదాశ్రు పరంపరాయాం । మమజ్జతుః । తస్య । దృశౌ । నృపస్య ।

టీక॥ తస్య = ఆ, నృపస్య = రాజైన నలుని యొక్క, దృశౌ = నేత్రములు, ప్రథమం = మొదట, ప్రియాయాం = ప్రియురాలియందును, తర్వాత, ప్రతిప్రతీకం = ఆ దమయంతి యొక్క ఒక్కొక్క యవయవమందును,

మమజ్జతుః = మునిగినవి. అథ = పిదప, అంతరానంద సుధాసముద్రే; అంతః = అంతఃకరణమదంలి, ఆనంద = అవయవములను చూచుట వలన యానందమనెడి, సుధాసముద్రే = అమృతసముద్రమందు, మమజ్జతుః = మునిగినవి. తతః = తర్వాత, ప్రమోదాశ్రు పరంపరాయాం, ప్రదామోశ్రు = ఆనందమువలన కల్గిన కన్నీటి యొక్క, పరంపరాయాం = ప్రవాహమందు, మమజ్జతుః = మునిగినవి. దృష్టియనెడి యొక యాధేయము క్రమముగా ప్రియురాలి యందును తర్వాత నామె యొక్క ప్రత్యవయవములయందును తర్వాత ఆనందసుధా సాగరమునందును, తర్వాత ఆనందబాష్పప్రవాహమందును మునిగెనని ఒక్క ఆధేయమునకు పెక్కు ఆధారములను జెప్పుట వలన పర్యాయాలంకారము.

## సమాసములు ;

*ప్రతిప్రతీకం :* ప్రతీకే ప్రతీకే = ప్రతిప్రతీకం.

*అంతరానందసుధాసముద్రేః :* అంతఃఆనందః = అంతరానందః, అంతరానంద ఏవ సుధా = అంతరానందసుధా. అంతరానంద సుధాయాః సముద్రః = అంతరానందసుధాసముద్రః. తస్మిన్ = అంతరానందసుధా సముద్రే.

*ప్రమోదాశ్రు పరంపరాయాం :* ప్రమోదస్య అశ్రూణి = ప్రమోదాశ్రూణి. ప్రమోదాశ్రూణాం పరంపరా = ప్రమోదాశ్రుపరంపరా. తస్యాం = ప్రమోదాశ్రు పరంపరాయామ్,

*నృపస్య :* నౄన్‌పాతీతి = నృపః, తస్య = నృపస్య,

## భావము :

ఆ నలమహారాజు యొక్క నేత్రములు తొలుత నా దమయంతిపైనను, తర్వాత నామె యొక్క యవయవములన్నింటి మీదను, పిదప నంతఃకరణము నందుఁ గల్గిన యానంద సుధాసాగరమందును, చివర నానందబాష్ప ప్రవాహమందును క్రమముగా మునిగినవి. ॥౨॥

శ్లో॥ బ్రహ్మాఽద్వయ స్యాన్వభవత్ప్రమోదం
రోమాగ్ర ఏవాగ్ర నిరీక్షితేఽస్యాః।
యథౌచితీత్థం తదశేషదృష్టౌ
వథస్మరాద్వైతముదం తథాఽసౌ॥ 3

ప॥వి॥ బ్రహ్మాద్వయస్య । అన్వభవత్ । ప్రమోదం । రోమాగ్రే । ఏవ । అగ్ర నిరీక్షితే । అస్యాః । యథా । ఔచితీ । ఇత్థం । తదశేషదృష్టౌ । అథ। స్మరాద్వైతముదం । తథా । అసౌ.

టీక॥ అసౌ = ఈనలుఁడు, అస్యాః = ఈ దమయంతియొక్క, రోమాగ్రే ఏవ = రోమములకొన, అగ్రనిరీక్షితేసతి; అగ్ర = మొదట, నిరీక్షితేసతి = చూడఁబడగనే, బ్రహ్మాద్వయస్య = బ్రహ్మైక్యముయొక్క, ప్రమోదం = ఆనంధమును, అన్వభవత్ = అనుభవించెను. అథ = పిదప, ఇత్థం = ఇట్లు, తదశేషదృష్టౌ; తత్ = ఆదమయంతియొక్క, అశేష దృష్టౌ = సకలదర్శనము, సత్యాం = కాగా, (లేదా) తత్ = ఆ రోమ ములయొక్క, అశేషదృష్టౌ = సకలదర్శనము, సత్యాం = కాగా; యథా = ఎట్లు, ఔచితీ = ఔచిత్యము (భవతి = ఆగునో) తథా = అట్లు, స్మరాద్వైతముదం; స్మరాద్వైత = మన్మథులోనైక్యముఁ జెందుట వలని, ముదం = ఆనందమును, అన్వభవత్ = అనుభవించెను.

వి॥ బ్రహ్మానందమునకు, స్మరానందమునకు నొక్క నలుఁడను నధికరణ మందు క్రమముగా స్థితినిఁజెప్పుటవలన పర్యాయాలంకారము.

సమాసములు:

*బ్రహ్మాద్వయస్య:* న విద్యతే ద్వయం యస్యతత్ = అద్వయం. బ్రహ్మైవ అద్వయం = బ్రహ్మాద్వయం. తస్య = బ్రహ్మాద్వయస్య.

*రోమాగ్రే:* రోమ్ణామగ్రం = రోమాగ్రం, తస్మిన్ = రోమాగ్రే.

*అగ్రనిరీక్షితే:* అగ్రేనిరీక్షితం = అగ్రనిరీక్షితం, తస్మిన్ = అగ్ర నిరీక్షితే. *ఔచితీ:* ఉచితస్య భావః = ఔచితీ. *తదశేషదృష్టౌ:* నశేషః = అశేషః;

తస్యాః అశేషః = తదశేషః, తదశేషస్యదృష్టిః = తదశేషదృష్టిః. తస్యాం = తదశేషదృష్టౌ.

లేదా

నశేషః = అశేషః. తేషామశేషః = తదశేషః. తదశేషస్యదృష్టిః = తదశేషదృష్టిః. తస్యాం = తదశేషదృష్టౌ. స్మరాద్వైతముదం: ద్వయోర్భావః = ద్వితా. ద్వితైవ = ద్వైతం. నద్వైతం = అద్వైతం, స్మరఏవఅద్వైతం = స్మరాద్వైతం. స్మరాద్వైతస్యముత్ = స్మరాద్వైతముత్. తామ్ = స్మరాద్వైతముదమ్.

భావము :

ఈ నలమహారాజు దమయంతియొక్క రోమాగ్రములను దొలుతఁ జూడగనే, బ్రహ్మానందము ననుభవించెను. తర్వాత నామె రోమములను సమగ్రముగాఁ జూచినవాడై యౌచిత్యము ననుసరించి స్మరైక్యముఁబొంది స్మరానందము ననుభవించెను. ఇచ్చట బ్రహ్మానందముకంటె స్మరానంద మధిక మనియు, రోమాగ్రమువకంటె సమగ్రరోమము లధిక మనియు వివక్షింపఁబడినది. అల్పదర్శనమువలన ననగా, నల్పమైన రోమాగ్ర మును దర్శించుటవలన నల్పమైన యానందము, అధికమైన రోమములనుఁ జూచుటవలన నధికమైన యానందము గల్గినది. ఇదియౌచిత్యముతో నొప్పినది. ॥౩॥

శ్లో॥ వేలామతిక్రమ్య పృథుం ముఖేందో
రాలోక పీయూషరసేన తస్యాః।
నలస్య రాగాంబునిధౌ వివృద్ధే
తుంగౌ కుచావాశ్రయతి స్మ దృష్టిః॥ ౪

ప.వి॥ వేలామ్ । అతిక్రమ్య । చిరం । ముఖేందోః । ఆలోకపీయూషరసేన । తస్యాః । నలస్య । రాగాంబునిధౌ । వివృద్ధే । తుంగౌ । కుచౌ । ఆశ్రయతి । స్మ । దృష్టిః.

టీక॥ నలస్య = నలునియొక్క, దృష్టిః = చూపు, తస్యాః = ఆ దమయంతి యొక్క, ముఖేందోః = ముఖచంద్రునియొక్క, ఆలోకపీయూషరసేన; ఆలోక = దర్శనము (వెలుగు) అనెడి, పీయూషరసేన = అమృతరసముచే, రాగాంబునిధౌ = అనురాగసాగరము, పృథుం = గొప్పదైన, వేలాం = గట్టును, (మర్యాదను) అతిక్రమ్య = దాటి, వివృద్ధేసతి = వర్థిల్లగా, తుంగౌ = ఎత్తైన, కుచౌ = స్తనములను, ఆశ్రయతిస్మ = ఆశ్రయించుచుండినది.

వి॥ ఇచ్చట చంద్రోదయమునందు సముద్రము గట్టును పొరలిపొంగునపుడు, అందలి మనుష్యుడు ఎత్తైయిన స్థానము నాశ్రయించు ననువృత్తాంతము, దమయంతి ముఖచంద్రునిచే ననురాగ సాగరము పొంగి గట్టును మించగా, నలునిదృష్టి తాను మునుగుదునను భయముచే నెత్తైయిన యామెకుచముల నాశ్రయించినదను ప్రకృత వృత్తాంతముచే స్ఫురించుచున్నదికాన సమాసోక్త్యలంకారము.

దృష్టికి వాస్తవముగా తాను మునుగుదు నను భయములేక పోయినను, ఆ భయముచేతనో యన్నట్లు దమయంతియొక్క కుచముల నాశ్రయించెనని చెప్పుటవలన నుత్ప్రేక్ష. ఆ సమాసోక్తివలన నుత్ప్రేక్ష వ్యక్తమైనది గాన నలంకారముచే నలంకార ధ్వని.

## సమాసములు:

*ముఖేందోః:* ముఖమేవ ఇందుః = ముఖేందుః, తస్య = ముఖేందోః. *ఆలోకపీయూషరసేన:* ఆలోకఏవపీయూషమ్ = ఆలోకపీయూషమ్. ఆలోకపీయూషస్యరసః = ఆలోకయూషరసః. తేన, ఆలోకపీయూషరసేన. *రాగాంబునిధౌ:* రాగస్య అంబునిధిః = రాగాంబునిధిః. తస్మిన్ = రాగాంబునిధౌ.

## భావము:

నలునిదృష్టి దమయంతీ ముఖచంద్రుని దర్శనము (ప్రకాశము) అను

నమృతము నాస్వాదించుటచే, వర్ధిల్లిన యనురాగసాగరము, గట్టును పొరలి పొంగ, మునిగిపోయెద నను భయముచే నామెయొక్క యెత్తైన స్తనముల నాశ్రయించినది. తొలుత నామె మోముపైఁ బడిన నలునిదృష్టి యామె స్తనములపైఁ బడినదని భావము. ॥౪॥

శ్లో॥ మగ్నా సుధాయాం కిము తన్ముఖేందో
ర్లగ్నా స్థితా తత్కుచయోః కిమంతః।
చిరేణ తన్మధ్యమముంచతాస్య
దృష్టిః క్రశీయః స్ఖలనాద్భియాను॥ ౫

ప॥వి॥ మగ్నా । సుధాయాం । కిమ్ । ఉ । తన్ముఖేందోః । లగ్నా । స్థితా । తత్కుచయోః । కిమ్ । అంతః । చిరేణ । తన్మధ్యమ్ । అముంచత । అస్య । దృష్టిః । క్రశీయః । స్ఖలనాత్ । భియా । ను ।

టీక॥ అస్య = ఈ నలునియొక్క, దృష్టిః = దృష్టి, తన్ముఖేందోః; తత్ = ఆదమయంతి యొక్క, ముఖేందోః = ముఖచంద్రుని యొక్క, సుధాయాం = అమృతమందు, మగ్నా కిము = మునిగినదా యేమి? తత్కుచయోః; తత్ = ఆ దమయంతియొక్క, కుచయోః = స్తనములయొక్క, అంతః = మధ్య, లగ్నా = తగుల్కొనినదై, స్థితాకిము = నిలచినదా యేమి? (కించ = మఱియు) క్రశీయః = మిక్కిలికృశించిన, తన్మధ్యం;, తత్ = ఆదమయంతియొక్క, మధ్యం = నడుమును, స్ఖలనాత్ = తొట్రుపాటువలని, భియాను = భయముచేతనోయనునట్లు, చిరేణ = చాలకాలమునకు, అముంచత = విడచిదది.

వి॥ నలునిదృష్టి యాదమయంతి ముఖచంద్రుని యమృతమందు మనిగినదా యేమి, యని హేతువుకాని దానిని విలంబమునకు హేతువుగాఁ జెప్పుట వలన హేతూత్ప్రేక్ష.

అట్లే ఆనలుని దృష్టి ఆదమయంతి చనుదోయి నడుమ నిరుకుకొనినదా యేమి యని హేతువుకాని దానిని, విలంబమునకు హేతువుగాఁజెప్పుట వలన నిదియు హేతూత్ప్రేక్ష.

అట్లే ఆనలునిదృష్టి యాదమయంతి యొక్క సన్నని నడుమునుండి జారిపడెదనను భయముతో కూడియుండినదా యేమి యని హేతువు కాని దానిని ఆలస్యమునకు హేతువుగా జెప్పుట వలన నిచ్చటఁగూడ హేతూత్ప్రేక్ష ఇట్లు మూడు ఉత్ప్రేక్షల కిట సంసృష్టి.

## సమాసములు :

*తన్ముఖేందోః :* తస్యాః ముఖం, తన్ముఖమ్. తన్ముఖమేవఇందుః. తన్ముఖే-దుః = తస్య = తన్ముఖేందోః.

*తత్కుచయోః :* తస్యాఃకుచౌ = తత్కుచౌ. తయోః = తత్కుచయోః.

*తన్మధ్యం :* తస్యాః మధ్యః = తన్మధ్యః. తమ్ = తన్మధ్యమ్

*క్రశీయః :* అత్యంతం కృశం క్రశీయః. తత్. క్రశీయః.

## భావము :

ఆ నలమహారాజు యొక్క దృష్టి చిరకాలము దమయంతి ముఖచంద్రుని చూచుచునేయుండి యెంతకాలమునకు తిరిగి రానందువలన నది ఆ ముఖ చంద్రుని యమృత ప్రవాహమందు మునిగిపోయెనా యని భావింపవలసి వచ్చినది. అటనుండి యెట్లో మఱలివచ్చిన యాదృష్టి చనుదోయిపై ప్రసరించినది అచ్చటఁగూడఁ జాలవిలంబము చేసినది. అందువలన చనుదోయి మధ్య భాగము చాలఇరుకైనదిగాన దాని యందు నిరుకుకొనిపోయినదా యని భావింపవలసి వచ్చినది. అటనుండి యెట్లనో మఱలినను, తర్వాత నామెయొక్క మిక్కిలి సన్నని నడుముపై వాలి యటనుండియు వెంటనే తిరిగిరాలేదు. అందు వలన నాదృష్టి దమయంతియొక్క సన్నని నడుముపై నడచునపుడు జారిపడెదనను భయముతో మిక్కిలి మెలకువతో, త్రాటిమీదన గారడివలె నడచుట వలన నాలస్యము చేసినదా యని భావింపవలసి వచ్చినది. ఇట్లు వర్ణించుటవలన దమయంతి యొక్క నెమ్మోము సొబగు, చనుగవసొంపు నెన్నడుము చెన్ను ద్యోతితములు ॥౩॥

శ్లో॥ ప్రియాఙ్గపాంథా కుచయోర్నివృత్య
నివృత్యలోలా నలదృక్ భ్రమంతీ।
బభౌతమాం తన్మృగనాభిలేప
తమః సమాసాదిత దిగ్భ్రమేవ॥ ౬

ప॥వి॥ ప్రియాఙ్గపాంథా । కుంచయోః । నివృత్య । నివృత్య । లోలా । నలదృక్ భ్రమంతీ। బభౌతమాం । తన్మృగనాభిలేపతమః సమాసాదితదిగ్భ్రమా । ఇవ.

టీక॥ ప్రియాఙ్గపాంథా; ప్రియా = ప్రియురాలైన దమయంతియొక్క, అంగ = అవయవముల యందు, పాంథా = నిత్యము నడచెడిబాటసారియై, లోలా = ఆశగలదైన, నలదృక్ = నలునియొక్కదృష్టి, కుచయోః = స్తనములయందు,నివృత్యనివృత్య = మరలిమరలి, భ్రమంతీ = తిరుగుచు, తన్మృగనాభిలేపతమః సమాసాదిత దిగ్భ్రమాఇవ, తత్ = ఆ స్తనముల యందలి, మృగనాభి = కస్తూరియొక్క, లేప = లేపనమనెడి, తమః = చీకటిచే, సమాసాదిత = పొందిపఁబడిన, దిగ్భ్రమాఇవ = దిగ్భ్రాంతి కలదియో యనునట్లు, బభౌతమాం = మిక్కిలి ప్రకాశించినది.

వి॥ ఇచ్చట స్తనలేపమైన కస్తూరియను చీకటిచే, దిగ్భ్రమ గలుగక పోయినను దిగ్భ్రమ కలిగినట్లు వర్ణించుటచే ఉత్ప్రేక్షాలకారము; ఇవశబ్ద ప్రయోగముచే నది వాచ్యము.

కస్తూరిని చీకటిగా చెప్పుటవలన రూపకాలంకారము.

సమాసములు :

ప్రియాఙ్గపాంథా : ప్రియాయాఃఅఙ్గాని = ప్రియాఙ్గాని. పంథానం గచ్ఛతీతి పాంథా. ప్రియాఙ్గేషు పాంథా = ప్రియాఙ్గపాంథా.

నలదృక్ః : నలస్యదృక్ = నలదృక్

బభౌతమాం : అతిశయేనబభౌ = బభౌతమాం.

తన్మృగనాభిలేపతమః సమాసాదితదిగ్భ్రమా : మృగనాభేఃలేపః = మృగనాభిలేపః. తయోఃమృగనాభిలేపః = తన్మృగనాభిలేపః. తన్మృగ

నాభిలేపపేవతమః = తన్మృగనాభిలేపతమః, తన్మృగనాభిలేపతమసాసమాసాదితః = తన్మృగనాభిలేప తమస్సమాసాదితః. దిశ్భ్రమః = దిగ్భ్రమః. తన్మృగనాభిలేప తమస్సమాసాదితః, దిగ్భ్రమః యయాసా = తన్మృగనాభిలేప తమఃస్సమాసాదితదిగ్భ్రమా.

**భావము :**

ఆ నలునిదృష్టి నిరంతరము దమయంతియొక్క యవయవములపై సంచరించుచు, నొక బాటసారివలెనైనది. ఆదృష్టి యాదమయంతియొక్క సుందరావయవములనుఁ జూడఁదృష్టగలదై ఆమె చనుదోయినుండి మఱలి తిరుగుచు, నందలి కస్తూరి కాలేపమనెడి చీకటివలన దిగ్భ్రమంజెందినదో యను నట్లు భాసించినది. కస్తూరి నల్లగానుండుటవలన చీకటితోఁ బోల్చ బడినది. ॥౬॥

శ్లో॥ విభ్రమ్య తచ్చారునితమ్బచక్రే
దూతస్య దృక్ తస్యఖలుస్థలస్త్రీ।
స్థిరా చిరాదాస్త తదూరు రంభా
స్తమ్భావుపాశ్లిష్య కరేణ గాఢమ్॥ ౭

ప॥వి॥ విభ్రమ్య । తచ్చారుని తమ్బచక్రే । దూతస్య । దృక్ । తస్య । ఖలు । స్థలస్త్రీ । స్థిరా । చిరాత్ । ఆస్త । తదూరురమ్భాస్తమ్భౌ। ఉపాశ్లిష్య। కరేణ । గాఢమ్.

టీక॥ దూతస్య = దూతయైన, తస్య = ఆ నలునియొక్క, దృక్ = చూపు, తచ్చారుని తమ్బచక్రే; తత్ = ఆ దమయన్తియొక్క, చారు = అందమైన, నితమ్బ = కటిపశ్చాద్భాగమనెడి, చక్రే = చక్రమందు, విభ్రమ్య = తిరిగి, స్థలస్త్రీ = తొట్రుపాటునుఁబొందినదై, తదూరురమ్భాస్తమ్భౌ, తత్ = ఆ దమయన్తియొక్క, ఊరు = తొడలనెడి, రమ్భాస్తమ్భౌ = అరటిచెట్ల స్తంభములను, కరేణ = కిరణముచే (నేత్రకిరణములచే) హస్తముచేతను, గాఢం = గట్టిగా, ఉపాశ్లిష్య = కౌగలించుకొని, చిరాత్ = చాలకాలము, ఆస్త (ఖలు) = ఉండెనగి (గదా.)

వి॥ ఇచ్చట దృక్ యనిదృష్టి శబ్దము స్త్రీలిఙ్గము నందుండుటవలన నాట్య లాడెడి బాలిక స్ఫురణకు వచ్చుచున్నది. దృష్టికిచ్చిన విశేషణములు,

బాలికకుఁగూడ సరిపడును. నితమ్బ చక్రముపై భ్రమించిన దృష్టి తొట్రుపాటుపడుచు దమయంతి యొక్క తొడలనెడి యరటి స్తంభములనుఁ బట్టుకొని నిలచెనని చెప్పుటయును ప్రస్తుతవృత్తాన్తముచే రంగుల రాట్నము మున్నగు చక్రములయందు కూర్చొని యాట్లాడుటచే కన్నులు తిరిగి పడఁబోయిన బాలిక, ప్రక్కనున్న స్తంభములనుఁ బట్టుకొని నిలబడునట్టి యప్రస్తుతవృత్తాన్తము ప్రతీయమానముగాన సమాసోక్త్యలఙ్కారము. "తదూరు స్తమ్భౌ" అను నెడ నూరువులను స్తంభములుగా రూపించుటవలన రూపకాలఙ్కారము. దీనితో నమాసోక్తికి సఙ్కరము.

## సమాసములు

తచ్చారునితమ్బచక్రే: నితమ్బఏవచక్రం = నితమ్బచక్రం. తస్యాః చారు నితమ్బచక్రం = తచ్చారునితమ్బచక్రం. తస్మిన్ = తచ్చారునితమ్బచక్రే.

తదూరుస్తమ్భౌ : ఊరూఏవస్తమ్భౌ = ఊరుస్తమ్భౌ. తస్యాః ఊరుస్తమ్భౌ = తదూరుస్తమ్భౌ. తౌ తదూరుస్తమ్భౌ.

## భావము :

నలునిదృష్టి యా దమయంతి కటిపశ్చాద్భాగమనెడి చక్రముపై వాలి గిరగిర తిరుగుటచే, కన్నులు తిరిగి పడఁబోయినదై యామె యొక్క తొడలనెడు అరటి కంబములను బట్టుకొని పడకుండ తప్పించుకొని దానినిఁ గౌగలించుకొనుచు నిలచినవి. అనగా నలుని దృష్టి తొలుత దమయంతియొక్క నితమ్బముపైనను, తర్వాత నామె తొడలపైన నానినదని యాశయము ॥౭॥

శ్లో॥ వాసః పరంనేత్రమహం ననేత్రం
కిముత్వమాలిఙ్గయ తన్మయాఽపి।
ఉరోనితమ్బోరు కురుప్రసాద
మితీత సాతత్పదయోః పపాత॥ ౮

ప॥వి॥ వాసః । పరం । నేత్రమ్ । అహం । న । నేత్రం । కిమ్ । ఉ ।

త్వమ్ । ఆలిఙ్గయ । తత్ । మయా । అపి । ఉరోనితమ్బోరు । కురు । ప్రసాదమ్ । ఇతి । ఇవ । సా । తత్పదయోః । పపాత.

టీకా॥ (హే భైమి = ఓదమయన్తీ) వాసఃపరం; వస్త్రమే, నేత్రమ్ = ఆచ్ఛాదనమా? (నేత్రము) అహం = నేను, (దృష్టి) నేత్రం = నేత్రము (వస్త్రము) నకిము = కానేరనా? (తప్పక కాఁగలను). తత్ = అందువలన అనగా, రెంటికిని నేత్రత్వము సమానముకాన, మయాఽపి = నా చేతను, ఉరోనితమ్బోరు; ఉరః = వక్షఃస్థలమును, నితమ్బ = నితమ్బమును, ఊరూ = తొడలను, ఆలిఙ్గయ = కౌగలింపఁజేసికొనుము. ప్రసాదమ్ = కౌగలింపఁ జేసికొనుట యను ననుగ్రహము, కురు = చేయుము, ఇతీవ = ఇట్టి తలంపుతోడనో యనునట్లు, సా = ఆనలుని దృష్టి, తత్పదయోః; తత్ = ఆదమయన్తియొక్క, పదయోః = పాదములయందు, పపాత = పడినది.

వి॥ పాదములయందుఁ బడుటకు అనుగ్రహమునుఁ గోరుట హేతువుకాకపోయినను హేతువుగాఁ జెప్పుటవలన హేతూత్ప్రేక్ష. వ్యఞ్జకమైన ఇవ శబ్దప్రయోగమువలన నిది వాచ్యము.

## సమాసములు :

ఉరోనితమ్బోరు : ఉరశ్చ, నితమ్బశ్చ, ఊరూచఏషాం సమాహారః = ఉరోనితమ్బోరు. తత్ = ఉరోనితమ్బోరు.

తత్పదయోః : తస్యాఃపదే = తత్పదే. తయోః = తత్పదయోః

## భావము :

ఓదమయన్తీ నీ యురము మున్నగు నవయవములనుఁ గప్పునట్టి వస్త్రమే నేత్రమా? నేను అనగా దృష్టియైన నేను వస్త్రముకానా? (నేత్రశబ్దమునకు వస్త్రమనియు నర్థము గలదను విషయమిట గమనీయము.) వస్త్రమను నర్థము గల నాచేత అనగా దృష్టిచే, నీయురము, నితంబము ఊరువులనెడి యవయవముల నాచ్ఛాదపఱచుకొని కౌగలించుకొనుము, ఇట్లు కౌగలించుకొనుట యను ననుగ్రహమును నాకుఁ గల్పింపుము. అని ప్రార్థించుచున్నదో యనునట్లు నలుని

దృష్టి. ఆమె పాదములపైఁబడినది. ఇతరములగు నవయవములనుఁ జూచిన విధముగనే, ఆమెయొక్క పాదములనుకూడ నలుఁడు చూచెనని యాశయము ॥౮॥

శ్లో॥ దృశోర్యథాకామమథోపహృత్య
సప్రేయసీమాలికులం చ తస్యాః।
ఇదం ప్రమోదాద్భుత సంభృతేన
మహీమహేన్ద్రో మనసా జగాద॥

ప॥వి॥ దృశోః । యథాకామమ్ । అథ । ఉపహృత్య । సః । ప్రేయసీమ్ । ఆలికులం । చ । తస్యాః । ఇదం । ప్రమోదాద్భుతసంభృతేన । మహీమహేన్ద్రః । మనసా । జగాద ।

టీక॥ అథ = పిదప, మహీమహేన్ద్రః = భూమికినింద్రుఁడైన, సః = ఆనలుఁడు, దృశోః = తననేత్రములకు, ప్రేయసీం = ప్రీతినిఁగొల్పు నట్టి దమయన్తిని, తస్యాః = ఆమెయొక్క, ఆలికులంచ = చెలికత్తెల సమూహమును, యథాకామం = కోరినంత, ఉపహృత్య = ఉపహారము అనగా బలినిగా, గావించుకొని అనగా యథేచ్ఛముగాఁజూచి, ప్రమోదాద్భుతసంభృతేన; ప్రమోద = సంతోషము, అద్భుత = ఆశ్చ ర్యము, అనువానిచే, సంభృతేన = నిండిన, మనసా = మనస్సుచే, ఇదం = చెప్పఁబోవు విషయమును, జగాద = చెప్పెను.

సమాసములు :

యథాకామమ్ : కామమనతి క్రమ్య = యథా కామమ్.

ఆలికులమ్ : ఆలీనాంకులమ్ = ఆలికులమ్. తత్ = ఆలికులమ్.

ప్రమోదాద్భుతసంభృతేన: ప్రమోదశ్చ, అద్భుతంచ = ప్రమోదాద్భుతే. ప్రమోదాద్భుతాభ్యాం సంభృతమ్ = ప్రమోదాద్భుత సంభృతమ్. తేన = ప్రమోదాద్భుత సంభృతేన.

మహీమహేంద్రః : మహ్యాః మహేంద్రః = మహీ మహేంద్రః.

**భావము :**

అనలుఁడు తనకు నేత్రప్రీతికరముగానున్న నాదమయన్తిని ఆమె చెలికత్తెలనుఁ దనివితీర తన నేత్రములకు విందుగావించుకొని యానందముతోఁడను నాశ్చర్యముతోడను నిండిన మనస్సుగలవాడై చెప్పఁబోవు ప్రకారము పలుకనారంభించెను. ॥౯॥

శ్లో॥ పదే విధాతుర్యదిమన్మథో వా
మమాఽభిషిచ్యేత మనోరథో వా।
తదాఘటేతాఽపి నవాతదేతత్
ప్రతిప్రతీకాద్భుత రూపశిల్పమ్॥ ౧౦

ప॥వి॥ పదే। విధాతుః । యది। మన్మథః । వా। మమ। అభిషిచ్యేత। మనోరథః। వా । తదా । ఘటేత । అపి । న । వా । తత్ । ఏతత్ । ప్రతిప్రతీకాద్భుత రూపశిల్పమ్.

టీక॥ విధాతుః = సృష్టికర్తయగు బ్రహ్మయొక్క స్థానమున, మన్మథోవా = మన్మథుఁడుగాని, మమ = నాయొక్క, మనోరథోవా = మనోరథము గాని, అభిషిచ్యేత యతి = అభిషిక్తము గావింపఁబడినచో, తదా = అప్పుడు, తత్ = ఆ ప్రసిద్ధమైన, ఏతత్ = సమీపమందున్న, ప్రతిప్రతీకాద్భుత రూపశిల్పం, ప్రతిప్రతీక = ఒక్కొక్క యవయవము నందును, అద్భుత = అచ్చెరువుఁగొల్పు, రూపశిల్పమ్ = రూపమును అనగా ఆకృతిని సృజించుట, ఘటేతాఽపి = సంభవింపవచ్చును, నవా ఘతేత = సంభవింపకనుఁ బోవచ్చును.

వి॥ దమయన్తీ రూపమునకు బ్రహ్మ సృష్టి సంబంధమున్నను లేదని చెప్పుటవలనను, మన్మథునకు మనోరథమునకును సంబంధము లేకపోయినను, సంబంధము గల్పించుటచేతను రూపకాతిశయోక్తి ప్రభేదము.

**సమాసములు :**

ప్రతిప్రతీకాద్భుతరూపశిల్పమ్ : ప్రతీకే ప్రతీకే = ప్రతిప్రతీకం. రూపస్య శిల్పమ్ = రూపశిల్పమ్. అద్భుతంచ తత్ రూపశిల్పంచ = అద్భుత

రూపశిల్పం. ప్రతి ప్రతీకమ్, అద్భుత రూపశిల్పమ్ = ప్రతి ప్రతీకాద్భుతరూప శిల్పమ్.

**భావము :**

దమయన్తివంటి యపూర్వ సౌందర్య సృష్టినిఁ జేయుటకు బ్రహ్మకూడ సమర్థుఁడు గాదు. ఇఁక బ్రహ్మ స్థానమున మన్మథుని నియమించినను, లేదా, నా మనోరథమును నియమించిననునట్టి రూపసృష్టి సాధ్యమగునో కాదో చెప్పలేము. అనగా, బ్రహ్మ సాధారణమైన వానిని సృజింపవచ్చును. కాని యింతటి యపూర్వ సౌందర్యనిధియగు దమయన్తిని సృజింపలేడనుట నిశ్చయము. ఇఁత సౌందర్యనిధియగు మన్మథుఁడా యపూర్వ సౌందర్య ఖనియైన దమయన్తిని సృజింపవచ్చు ననుకొనవచ్చును. లేదా, మనోరథముచేత నట్టి యపూర్వరూప చిత్రణము గావింపవచ్చుననుకొనవచ్చును. కాని, వస్తుస్థితిలో నిదికూడ సంభావ్యము కాదు. ఏలయనగా నామె సౌందర్యసృష్టి మన్మథునకును సాధ్యముకాదు. మనస్సునకును సాధ్యముగాదు. అనగా, నా దమయన్తియొక్క సౌందర్యము సాటిలేనిదని యాశయము ॥౧౦॥

శ్లో॥ తరఙ్గిణీ భూమిభృతః ప్రభూతా
జానామి శృఙ్గారరసస్య సేయమ్।
లావణ్యపూరేఽజని యౌవనేన
యస్యాం తథోచ్చైః స్తనతా ఘనేన॥ ౧౧

ప॥వి॥ తరఙ్గిణీ । భూమిభృతః । ప్రభూతా । జానామి । శృఙ్గారరసస్య। సా । ఇయమ్ । లావణ్యపూరే । అజని । యౌవనేన । యస్యాం । తథా । ఉచ్చైః స్తనతా । ఘనేన.

టీక॥ సా = ఆ, ఇయం = ఈ దమయన్తి, భూమిభృతః = భీమభూపతియను భూధరమునుండి యనగా పర్వతమునుండి, ప్రభూతా = పుట్టినట్టి, శృఙ్గార రస్య = శృఙ్గార రసముయొక్క, తరఙ్గిణీ = నది (అని), జానామి = తెలుసుకొనుచున్నాను. (అదియు క్తమే) యస్యాం = ఏ దమయంతియందు, తథా = అటువంటి, ఉచ్చైః స్తనతా = ఉన్నతములగు స్తనములను

గల్గియుండుట, తథా = అట్లు, ఘనేన = ఘనమైన, సంపూర్ణమైన, యౌవనేన (ఇవ) = యౌవనముచేత నెట్లో యట్లు లేదా యౌవనమనెడి, ఉచ్చైః స్తనతా; ఉచ్చైః = బిగ్గరగా, స్తనతా = గర్జించుచున్న, ఘనేన = మేఘముచే, లావణ్య పూరః = సౌందర్య ప్రవాహము, జనితః = పుట్టింపఁబడినది.

వి॥ ఇచ్చట భూమిభృతః యను నొక పదముచే భీమరాజును, భూమిభృత్తగు పర్వతముతో రూపించుటవలన శ్లిష్ట రూపకము. శృఙ్గార రస వాహినికాని దమయన్తిని, శృఙ్గార రసవాహినిగాఁ జెప్పుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకముగా "జానామి" నిఁ బ్రయోగించుటచే నిది వాచ్యము. యౌవనేన ఘనేనయని (యౌవన మనెడి మేఘముచేతనని) యౌవనమును, మేఘముతో రూపించుటవలన రూపకము. యౌవనము ఘనము, విడి విడి శబ్దములచే చెప్పఁబడుటవలన నిది వ్యస్తము. ఉచ్చైస్తనతా యను శబ్దముచేత నున్నత స్తనవత్త్వము ఉన్నత గర్జన కర్తృత్వము చెప్పఁబడుటవలన నిది శబ్దశ్లేష. ఈ శబ్దశ్లేషవలన దమయన్తి యందు, శృఙ్గార రసవాహినీత్వము ఉత్ప్రేక్షింపఁబడినది గాన నాయుత్ప్రేక్షతో శబ్దశ్లేషకు సఙ్కరము.

## సమసములు :

భూమీభృతః : భూమింబిభర్తీతి = భూమిభృత్, తస్మాత్ = భూమిభృతః

శృఙ్గారరసస్య: శృఙ్గారఇతిరసః = శృఙ్గారరసః. తస్య = శృఙ్గారరసస్య.

లావణ్యపూరః : లావణ్యమేవ పూరః = లావణ్యపూరః.

ఉచ్చైఃస్తనతా: ఉచ్చైఃస్తనౌయస్యాఃసా ఉచైఃస్తనా. ఉచ్చైస్తనాయాఃవ భావః. ఉచ్చైస్తనతా = ఉచ్చైఃస్తనతీతి = ఉచ్చైస్తనన్. తేన = ఉచైః స్తనతా.

## భావము :

ఆదమయంతి భీమరాజనెడి పర్వతమునుండి యుద్భవించిన శృంగార రసవాహిని యని భావింతును; ఏలయనగాఁ ఆమెయందు సంపూర్ణమగు యౌవ

నముచేత నున్నతములగు స్తనములను కల్గియుండుట యను, నుచ్చైస్తనత ఎట్లు కల్పింపఁబడినదో, అట్లే ఆ సంపూర్ణ యౌవనమనెడి, ఉచ్చైర్గర్జనము చేయు మేఘముచే నా శృఙ్గారవాహినియందు లావణ్యమను ప్రవాహముద్భవింపఁజేయఁబడినది. గట్టిగా గర్జించు మేఘమెట్లు నదియందు ప్రవాహమును వర్ధిల్లఁజేయునో, యట్లే మన్మథుఁడు దమయన్తియనెడి శృఙ్గారరసవాహిని యందు సౌందర్యమును వర్ధిల్లఁజేసెనని యాశయము ॥౧౧॥

శ్లో॥ అస్యాం వపుర్వ్యూహ విధానవిద్యాం
కిం ద్యోతయామాస నవామవాప్తమ్ ।
ప్రత్యఙ్గ సఙ్గస్ఫుట లబ్ధభూమా
లావణ్య సీమా యదిమాముపాస్తే॥ ౧౨

ప॥వి॥ అస్యాం। వపుర్వ్యూహవిధానవిద్యాం । కిం। ద్యోతయామాస । నవామ్ । అవాప్తామ్ । ప్రత్యఙ్గసఙ్గస్ఫుటలబ్ధభూమా । లావణ్యసీమా । యది । మామ్ । ఉపాస్తే.

టీక॥ బ్రహ్మే = బ్రహ్మ, అవాప్తాం = తనచేనభ్యసింపఁబడిన. నవాం = నూతనమైన, వపుర్వ్యూహ విధానవిద్యాం: వపుః = శరీరము యొక్క, వ్యూహ = అవయవ సన్నివేశములను, విధాన = సృజించునట్టి, విద్యాం = విద్యను, అస్యాం = ఈ దమయంతి యందు, ద్యోతయామాసకిం = వెల్లడిపఱచుకొనెనా యేమి? యత్ = ఏలయనగా ప్రత్యఙ్గ సఙ్గస్ఫుట లబ్ధభూమా; ప్రత్యఙ్గ = ఒక్కొక్క అవయవమును, సంగ = వ్యాపించుటచే, స్ఫుట = స్పష్టముగా, లబ్ధ = పొందఁబడిన, భూమా = ఆధిక్యముగల, లావణ్యసీమా = సౌందర్యమునకుపరమావధి, ఇమాం = ఈదమయన్తిని, ఉపాస్తే = సేవించుచున్నది.

సమాసములు :

వపుర్వ్యూహవిధానవిద్యామ్ : వపుషః వ్యూహః = వపుర్వ్యూహః. వపుర్వ్యూహస్యవిధానం = వపుర్వ్యూహ విధానం. వపుర్వ్యూహ విధానస్య విద్యా = వపుర్వ్యూహ విధాన విద్యా. తాం = వపుర్వ్యూహవిధాన విద్యామ్.

ప్రత్యఙ్గసఙ్గస్ఫుటలబ్ధభూమా : అఙ్గేఅఙ్గే = ప్రత్యఙ్గం. ప్రత్యఙ్గం సఙ్గః = ప్రత్యఙ్గసఙ్గః.స్ఫుటంలబ్ధః = స్ఫుటలబ్ధః.బహోర్భావః = భూమ. ప్రత్యఙ్గ సఙ్గేన స్ఫుటలబ్ధం = ప్రత్యఙ్గసఙ్గస్ఫుటలబ్ధం. ప్రత్యఙ్గసఙ్గస్ఫుటలబ్ధం భూమయ యాసా = ప్రత్యఙ్గసఙ్గస్ఫుటలబ్ధభూమా.

లావణ్యసీమా : లావణ్యస్యసీమా = లావణ్యసీమా.

భావము :

బ్రహ్మ తాను చక్కగా నభ్యసించిన యసాధారణమైన శరీరావయవ నిర్మాణ విద్యను దమయంతి యందు ప్రకటించుకొనినాడాయేమి? ఏలయనగా, ఒక్కొక్క యవయవమునందును జక్కగా వ్యాపించిచక్కగా వికసితమైన సౌందర్య పరమావధి యీ దమయన్తిని సేవించుచున్నది, కాన బ్రహ్మ తాను నేర్చిన శరీరావయవ సన్నివేశ నిర్మాణ కళను నీమె యందు ప్రకాశ పఱచు కొనెనా యేమి? అని తోచుచున్నది. ॥౧౨॥

శ్లో॥ జమ్బాలజాలాత్ కిమకర్షి జమ్బూ
నద్యా న హారిద్రనిభప్రభేయమ్ ।
అప్యఙ్గయుగ్మస్య న సఙ్గచిహ్నా
మున్నీయతే దన్తురతాయదత్ర ॥ ౧౩

ప॥వి॥ జమ్బాలజాలాత్ । కిమ్ । అకర్షి । జమ్బూనద్యా । న । హారిద్రనిభ ప్రభా । ఇయమ్ । అపి । అఙ్గయుగ్మస్య । న । సఙ్గచిహ్నమ్ । ఉన్నీ యతే । దన్తురతా । యత్ । అత్ర.

టీక॥ హారిద్రనిభప్రభా; హారిద్ర = పసుపు రంగుగల వస్తువుతో, నిభ = సమానమైన, ప్రభా = కాంతిగల, ఇయమ్ = ఈ దమయన్తి, జమ్బూ నద్యాః = మేరు పర్వతము ప్రక్కన ప్రవహించు జమ్బూనదియొక్క, జమ్బాలజాలాత్; జమ్బాల = అడుసుయొక్క, జాలాత్ = సమూహము నుండి, నాఽకర్షి = లాగఁబడలేదా ఏమి? తప్పక లాగబడియే యుండును. యత్ = ఏలయనగా, అత్ర = ఈ దమయంతియందు, అఙ్గయుగస్య = రెండు అవయవములయొక్క, సఙ్గచిహ్నం = అతుకువలన కల్గునదైన

దన్తురతాఽపి = ఔన్నత్యము గూడ, నోన్నీయతే = ఊహింపఁబడుట లేదు.

## సమాసములు :

జమ్బూలజాలాత్ : జమ్బూలస్యజాలం = జమ్బూలజాలం. తస్మాత్ జమ్బూలజాలాత్.

జమ్బూనద్యా : జమ్బూఇతినదీ = జమ్బూనదీ. తయా = జమ్బూనద్యా.

హారిద్రనిభప్రభః : హరిద్రయా రక్తం వస్తు = హారిద్రం. హారిద్రేణ సదృశీ = హారిద్రనిభా. హారిద్రనిభాప్రభాయస్యాస్సా = హారిద్రనిభప్రభా.

అఙ్గయుగ్మస్య : అఙ్గయోఃయుగ్మం = అఙ్గయుగ్మం. తస్య = అఙ్గయుగ్మస్య.

సఙ్గచిహ్నం : సఙ్గస్యచిహ్నమ్ = సఙ్గచిహ్నమ్.

దన్తురతా : దన్తురస్యభావః = దన్తురతా.

## భావము :

పసుపుపచ్చని శరీరకాంతిగల యీ దమయన్తి, పసిడికొండ ప్రక్కన పారు జమ్బూనదియను పసిడియేటియొక్క బురదలనుండి లాగఁబడుటవలన, నీమెయొక్క శరీరమందలి యవయవముల యతుకులవలని మెట్టపల్లములు కానరాకయున్నదా యని తోచుచున్నది. అనగా నామెశరీరము బంగరువన్నె కల్గియుండుటయేగాక శరీరమందెచ్చటఁగూడ నంగముల యతుకులు కానరాక నునుపుగా నున్నదని యాశయము. ॥౧౩॥

శ్లో॥ సత్యేవసామ్యే సదృశాదశేషాద్
గుణాన్తరేణోచ్చకృషే యదఙ్గైః ।
అస్యాస్తతః స్యాత్తులనాఽపి నామ
వస్తు త్వమీషాముపమానమానః॥ ౧౪

ప॥వి॥ సతి । ఏవ । సామ్యే । సదృశాత్ । అశేషాత్ । గుణాన్తరేణ । ఉచ్చ కృషే । యత్ । అఙ్గైః । అస్యాః । తతః । స్యాత్ । తులనా । అపి నామ । వస్తు । తు । అమీషామ్ । ఉపమావమానః.

టీకా॥ యత్ = ఎందువలన, అస్యాః = ఈ దమయన్తి యొక్క, అఙ్గైః = అవయవములచేత, అశేషాత్ = సమస్తమైన, సదృశాత్ = సమానమైన చంద్రుఁడు మున్నగువానినుండి, గుణాన్తరేణ = ఏదియో యొక గుణ విశేషముచే, ఉచ్చకృషే = ఉత్కర్షింపబడుట, యనగామించియుండుట, (కలదో) తత్ = ఆయుత్కర్ష వలన ననగా, ఔన్నత్యమువలన, తులనాఽపి = సమముగఁ జేయుట, స్యాన్నామ = అగునా? కాజాలదు. ఉన్నతమైనది ఉన్నతముకానిదానితో నెట్లు సమమగును! (ఏలయనగా) వస్తుతః = నిజస్థితియందు, అమీషాం = ఈ దమయన్తియొక్క యవయవములకు, ఉపమా = పోలిక, అవమానః = అవమానము, తిరస్కారణము.

సమాసములు :

*గుణాన్తరేణ :* అన్యః గుణః = గుణాన్తరం, తేన = గుణాన్తరేణ.

**భావము :**

ఈ దమయన్తియొక్క యఙ్గములు తమకు సమానములైన చంద్రుఁడు మున్నగు వానిలో, నేదియోయొక గుణవిశేషముతో, వానిని మించియే యుండినవి. అనగా నా చంద్రాదులకంటె నున్నతముగనే యుండినవి, ఇఁక నున్నతములైన దమయన్తి యఙ్గములకు నున్నతములుకాని చంద్రాదులతో సమత్వ మెట్లుకల్గును. మెట్ట పల్లములు రెండు సమములు కాదుగదా? వాస్తవములో నామె యవయవములను పోల్చిచెప్పుట యవమానమే. ఏలయనగా, లోకమున, నుత్కృష్ట వస్తువులను నికృష్టములతోఁ బోల్చుట తగదుగదా.॥౧౪॥

శ్లో॥ పురాకృతి స్త్రైణమిమాంవిధాతు
మభూద్విధాతుః ఖలుహస్తలేఖః ।
యేయంభవద్భావి పురన్ధ్రి సృష్టిః
సాఽస్యైయశస్తజ్జయజం ప్రదాతుమ్॥ ౧౫

ప॥వి॥ పురాకృతి । స్త్రైణమ్ । ఇమాం । విధాతుమ్ । అభూత్ । విధాతుః । ఖలు । హస్తలేఖః । యా । ఇయం । భవద్భావిపురన్ధ్రి । సృష్టిః । సా। అస్యై।యశః । తజ్జయజం । ప్రదాతుమ్.

టీక। విధాతుః = బ్రహ్మకు, పురాకృతి = పూర్వసృష్టియైన, స్త్రైణం = స్త్రీ సమూహము, ఇమాం = ఈ దమయన్తిని, విధాతుం = సృజించుటకు, హస్తలేఖః = హస్త కౌశలమునలవరచుటకై చిత్రాది రచనలకు ముందు వ్రాయఁబడు రచనగా, అభూత్ ఖలు = ఉండెనుగదా. (మఱియు) యా = ఏ, ఇయం = ఈ, భవత్‌భావిపురన్ధ్రిసృష్టిః; భవత్ = వర్తమాన కాలమునకు సంభంధించినదియు, భావి = భవిష్యత్కాలమునకు సంబంధించినదియునగు, పురన్ధ్రిసృష్టిః = స్త్రీల సృష్టి ఏదికలదో, సా = అది, అస్యై = ఈ దమయన్తికి, తజ్జయజం = వర్తమాన భవిష్యత్కాలపుస్త్రీలను జయించుటవలనఁగల్గిన, యశః = కీర్తిని, ప్రదాతుం = ఇచ్చుటకై యుండినది.

వి॥ బ్రహ్మయొక్క తొల్లిటి స్త్రీ సృష్టి దమయన్తి యొక్క సృష్టిని నభ్యసించుటకైన హస్తలేఖ యని తొల్లిటిసృష్టియందు హస్తలేఖత్వము నారోపించుటవలన నిదర్శన. తొల్లిటి సృష్టి దమయన్తీ నిర్మాణముకాక పోయినను, అయినట్లు చెప్పుటవలన, నుత్ప్రేక్ష. ఈ యుత్ప్రేక్ష నిదర్శనచే ననుప్రాణితము.

వర్తమాన భావి స్త్రీ సృష్టికి వారియశోవిజయము ఫలము కాక పోయినను, ఫలముగాఁ జెప్పుట వలన ఫలోత్ప్రేక్ష.

సమాసములు :

పురాకృతిః : పురాకృతిః యస్య తత్ = పురాకృతి.
స్త్రైణమ్ : స్త్రీణాంసమూహః స్త్రైణమ్.
హస్తలేఖః హస్తస్యలేఖః = హస్తలేఖః.

భవద్భావిపురన్ధ్రిసృష్టిః : భవన్తీచ సాభావినీచ భవద్భావినీ. పురన్ధ్రీణాంసృష్టిః = పురన్ధ్రిసృష్టిః. భవద్భావినీచ సా పురన్ధ్రిసృష్టిః = భవద్భావి పురన్ధ్రిసృష్టిః.

తజ్జయజమ్: తాసాంజయః = తజ్జయః. తజ్జయాత్ జాయతఇతి = తజ్జయజమ్. తత్ = తజ్జయజమ్.

భావము :

బ్రహ్మయొక్క పూర్వసృష్టిలోని స్త్రీసమూహము దమయంతియొక్క సృష్టికి నభ్యాసమిచ్చెడి పూర్వరచనవంటిది. వర్తమాన స్త్రీసృష్టియు భవిష్యత్ స్త్రీసృష్టియు, వారి జయమువలని యశస్సును దమయన్తికి లభింపఁజేయుట కుద్దేశింపఁబడినది. కాన దమయంతికి సమానమైన సుందరి భూతభవిష్య ద్వర్తమాన కాలములయందు లేదని తాత్పర్యము ॥౧౭॥

శ్లో॥ భవ్యాని హానీరగురేతదఙ్గాత్
యథాయథాఽనర్తి తథా తథా తైః ।
అస్యాధికస్యోపమయోపమాతా
దాతాప్రతిష్ఠాం ఖలు తేభ్య ఏవ॥ ౧౮

ప॥వి॥ భవ్యాని । హానీః । అగుః । ఏతదఙ్గాత్ । యథా । యథా । అవర్తి । తథా । తథా । తైః । అస్య । అధికస్య । ఉపమయా । ఉపమాతా । దాతా । ప్రతిష్ఠాం । ఖలు । తేభ్యః । ఏవ ।

టీక॥ భవ్యాని = సుందరములైన చంద్రాద్యుపమానములు,ఏతదఙ్గాత్;ఏతత్ = ఈ దమయంతియొక్క, అఙ్గాత్ = అవయవములనుండి, యథాయథా = ఎట్లుఎట్లు, హానీః = తక్కువ తనములను, అగుః = పొందినవో, తథా తథా = అట్లట్లే, తైః = ఉపమానములగు చంద్రాదులచే, అనర్తి = నృత్యము చేయఁబడినది. ఉపమాతా = పోల్చునట్టికవి, అధికస్య = అధికమైన అనగాశ్రేష్ఠమైన, అస్య = ఈ దమయంతియొక్క అవయము నకు, ఉపమయా = పోల్చుటచే, తేభ్యఏవ = చంద్రాదులకే, ప్రతిష్ఠాం = ప్రతిష్ఠను, దాతాఖలు = ఇచ్చువాడుగదా.

భావము :

దమయన్తియొక్క యవయవములవలన, చంద్రుఁడు మున్నగు నుప

మానవస్తువులు భఙ్గమునుఁ బొందిననునవి సంతోషముతో నృత్యము గావించినవి. ఏలయనగా కవి, వానిని మిగుల నుత్కృష్టములైన దమయన్తి యొక్కయవయవములతోఁ బోల్చినందువలన, చంద్రాదులకుకూడ ప్రతిష్ఠ దెచ్చినను అవి దమయన్తియొక్క యవయవ సౌందర్యముచే నిరాకృతములైనను, కవి వానిని అనగా చంద్రాదులను, అట్టి శ్రేష్ఠములగు దమయన్త్యవయవములతోఁ బోల్చుట కుద్దేశించుట చేతనే, ఆ చంద్రాదులకు నాధిక్యము లభించినది. అందువలన నవి హర్షముతో నృత్యములు గావించినవి. ॥౧౬॥

శ్లో॥ నాఽస్పర్శి దృష్టాఽపి విమోహికేయం
దోషైరశేషైః స్వభియేతి మన్యే ।
అన్యేషు తైరాకులితస్తదస్యాం
వసత్యసాపత్న్యసుఖీ గుణౌఘః ॥ ౧౭

ప॥వి॥ న । అస్పర్శి । దృష్టా । అపి । విమోహికా । ఇయం । దోషైః । అశేషైః । స్వభియా । ఇతి । మన్యే । అన్యేషు । తైః । ఆకులితః । తత్ । అస్యాం । వసతి । అసాపత్న్యసుఖీ । గుణౌఘః.

టీక॥ దృష్టాఽపి = చూడఁబడినను, విమోహికా = మోహమునుఁ గల్గించెడి, ఇయం = ఈదమయన్తి, అశేషైః = సమస్తములైన, దోషైః = దోషములచే, స్వభియా = తమకు కల్గినభయముచే, అనగా తమ్ముఁగూడ మోహింపఁజేయునను భయముచే, నాస్పర్శి = తాకఁబడలేదు, ఇతి = అని, మన్యే = తలతును. తత్ = అందువలన, అన్యేషు = ఇతర స్త్రీజనులయందు, తైః = ఆదోషములచే, ఆకులితః = పీడించఁబడిన, గుణౌఘః = గుణసమూహము, అస్యాం = ఈదమయన్తియందు, అసాపత్న్యసుఖీ; అసాపత్న్య = వైరములేనందువలన, సుఖీ = సుఖముగలదిగా, వసతి = నివసించుచున్నది.

వి॥ దోషములు దమయన్తిని తాకక యుండుటకు నామెయందలి మోహనస్వభావము కారణముకాకపోయినను, దానిని కారణముగాఁ జెప్పుటవలన హేతూత్ప్రేక్ష. ''మన్యే''యని వ్యఞ్జకమును ప్రయోగించుటవలన నది వాచ్యము.

సమాసములు :

అసాపత్న్యేనసుఖీ: సపత్న్యా భావః = సాపత్న్యం. నసాపత్న్యం = అసాపత్న్యం. సుఖమస్యాస్తీతి = సుఖీ. అసాపత్న్యేనసుఖీ = అసాపత్న్యసుఖీ.

గుణౌఘః: గుణానామోఘః = గుణౌఘః.

భావము :

చూచినంతమాత్రముననే దమయంతి మోహింపజేయునది యనితలంచి, దోషములన్నియు తమ్ములను మోహింపఁజేయునను భయముతో నామెను తాక లేదు. పిఱికివారు భయమునకు కారణమైన వానినిగూడ స్పృశించుటకు భయపడెదరు. అట్లు భయముచే దోషము లెవ్వియును దమయన్తిని స్పృశించనందువలన గుణములన్నియు నామెయందు దోషములతోటి పీడలేక సుఖముగా నుండినవి. ఈగుణము లితర స్త్రీలయందు దోషములచే నుపద్రవముఁబొందు చుండినది. కాని యిచ్చట గుణములకట్టి బెడదలేక యుండినది. అనగా దమయన్తి ఎట్టి దోషము లేని గుణనిధి యని యాశయము. ॥౧౭॥

శ్లో॥ ఔజ్ఝిప్రియాఙ్గైర్ఘృణయైవరూక్షా
న వారి దుర్గాత్తు వరాటకస్య ।
నకణ్టకైరావరణాచ్చ కాంతి
ర్ధూలీభృతా కాఞ్చనకేతకస్య ॥ ౧౮

ప॥వి॥ ఔజ్ఝి । ప్రియాఙ్గైః । ఘృణయా । ఏవ । రూక్షా । న । వారిదుర్గాత్ । తు । వరాటకస్య । న । కణ్టకైః । ఆవరణాత్ । చ । కాన్తిః । ధూలీభృతా । కాఞ్చనకేతకస్య ।

టీక॥ ప్రియాఙ్గైః; ప్రియా = ప్రియురాలైన దమయన్తియొక్క, అఙ్గైః = అవయవములచే, వరాటకస్య = తామరపూవుదిన్నెయొక్క, రూక్షా = తీవ్రమైన లేదా కఠినమైన, కాన్తిః = కాన్తి, ఘృణయా ఏవ = ఏవగింపు

చేతనే, ఔజ్ఝి = విడువఁబడినది. వారిదుర్గాత్తు = జలదుర్గమునందుండుట వలన మాత్రము, న = కాదు. అనగా విడువఁబడలేదు (మఱియు) కాఞ్చనకేతకస్య = పసిడిమొగలి పూవుయొక్క, ధూళీభిః = ధూళులచే, భృతా = నిండిన, కాన్తిః = కాన్తి, ఔజ్ఝి = (రేణువులతోఁ గూడినందువలననే) విడువఁబడినది. కణ్టకైః = ముండ్లచే ఆవరణాత్తు కూడుటవలన మాత్రము, న కాదు.

## సమాసములు :

ప్రియాఙ్గైః: ప్రియాయాః అఙ్గాని = ప్రియాఙ్గాని. తైః = ప్రియాఙ్గైః।

ధూళీభృతా : ధూళ్యాభృతా = ధూళీభృతా।

కాఞ్చనకేతకస్య : కాఞ్చనమయంచ, తత్ కేతకంచ = కాఞ్చన కేతకం. తస్య = కాఞ్చనకేతకస్య.

## భావము :

దమయంతియొక్క యవయవములు తామరపూవు దిన్నెయొక్క కాంతి పరుషమని దానిని విడచినవి కాని యా తామరపూవు జలదుర్గముల యందున్నదను భయముతో విడువలేదు. అట్లే యామె యవయవములు పసిడి మొగలి పూపుయొక్క కాన్తిని ధూళితోనిండినందు వలన వదలినవి కాని యామొగలిపువ్వు ముండ్లతోనిండినదను భయముతో వదలలేదు. కాన కమల కర్ణికయు మొగలిపూపును నామెశరీరకాంతితో పోల్చుట కర్హములుకావు॥౧౮॥

శ్లో॥ ప్రత్యఙ్గమస్యామభికేన రక్షాం
కర్తుంమఘోనేవ నిజాస్త్రమస్తి।
వజ్రఞ్చ భూషామణి మూర్తిధారి
నియోజితం తత్ ద్యుతికార్ముకం చ ॥ ౧౯

ప॥వి॥ ప్రత్యఙ్గమ్ । అస్యామ్ । అభికేన । రక్షాం । కర్తుం । మఘోనా । ఇవ। నిజాస్త్రమ్ । అస్తి । వజ్రం । చ। భూషామణిమూర్తిధారి । నియోజితం । తద్ద్యుతికార్ముకం । చ.

టీక॥ అస్యాం = ఈ దమయన్తి విషయమున, అభికేన = కాముకుఁడగు, మఘోనా = ఇంద్రునిచే, ప్రత్యఙ్గం = ప్రత్యవయవమును, రక్షాం = రక్షణను, కర్తుం = చేయుటకు, నియోజితం = నియమింపంబడిన, భూషామణి మూర్తిధారి; భూషామణి = భూషణరత్నముల యొక్క అనగా వజ్రాది మణులయొక్క, మూర్తి = ఆకారమును, ధారి = ధరించిన, వజ్రంచ = వజ్రాయుధము, తద్ద్యుతికార్ముకంచ; తత్ = ఆమణులయొక్క, ద్యుతి = కాన్తులనెడి, కార్ముకంచ = మణి ధనుస్సును, అస్తీవ = ఉన్నదోయనునట్లున్నది.

వి॥ ప్రత్యఙ్గమును వజ్రాయుధము ధనువు, రక్షణకై యావరించి యండక పోయినను నావరించి యుండినట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష.

సమాసములు :

ప్రత్యఙ్గమ్ : అఙ్గే, అఙ్గే = ప్రత్యఙ్గమ్

భూషామణిమూర్తిధారి : భూషాణాం మణయః = భూషామణయః. భూషామణీనాంమూర్తిః = భూషామణిమూర్తిః. భూషామణిమూర్తింధారయతీతి = భూషామణిమూర్తిధారి.

తద్ద్యుతికార్ముకమ్ : తేషాంద్యుతయః = తద్ద్యుతయః తద్ద్యుతయ ఏవకార్ముకమ్ = తద్ద్యుతికార్ముకమ్.

భావము :

దమయన్తిని కామించిన యింద్రుడు, ఆమెయొక్క యవయములనన్నింటిని రక్షించుటకై యామె భూషణములయందలి వజ్రమణుల యాకృతిని ధరించిన, తన వజ్రాయుధమును, నామణుల కాంతులనెడి ధనుస్సును నా యవయముల నావరించి యుండునట్లు చేసెను. అనగా నాదమయంతి తనశరీరము వజ్రమణి ఖచితములైన భూషణములను ధరించియున్నదనియు నావజ్రమణులు, వానికాంతులు, ఆమెయొక్క యవయవముల రక్షణకైయుంచిన వజ్రాయుధము గాను, ధనుస్సుగాను భావింపఁబడినవని భావము ॥౧౯॥

శ్లో॥ అస్యాః సపక్షైకవిధోః కచౌఘః
స్థానే ముఖస్యోపరి వాసమాప।
పక్షస్థతావద్ బహుచంద్రకోఽపి
కలాపినాం యేనజితః కలాపః ॥ ౨౦

వ॥వి॥ అస్యాః । సపక్షైకవిధోః । కచౌఘః। స్థానే । ముఖస్య। ఉపరి। వాసమ్। ఆప । పక్షస్థతావద్ బహుచంద్రకః । అపి । కలాపినాం । యేన జితః। కలాపః.

టీక॥ అస్యాః = ఈదమయన్తియొక్క, కచౌఘః = కేశపాశము, సపక్షైక విధోః; సపక్ష = సమానుఁడును, సహృదయుఁడునునగు, ఏక = ఒక్క డేయైన, విధుః = చంద్రుఁడుగల, ముఖస్య = మోముయొక్క, ఉపరి = పైన, వాసం = నివాసమును, ఆప = పొందెను. స్థానే = ఇదియుక్తము. (కుతః = ఏలయనగా) యేన = ఏ, కచౌఘేన = కేశసమూహముచే, పక్షస్థతావద్బహుచంద్రకోఽపి; పక్ష = తెక్కలియందును, తనపక్షమువారి యందును, స్థ = ఉన్నటువంటి, తావత్ = అంతటి, బహు = పెక్కైన, చంద్రకోఽపి = పెక్కు పింఛములుగల్గియున్నను, పెక్కుచంద్రులు కల్గియున్నను, కలాపినాం = నెమళ్లయొక్క, కలాపః = పింఛము, జితః = జయింపఁబడినది.

సమాసములు :

సపక్షైకవిధోః: సమానఃపక్షఃయస్యసః = సపక్షః. సపక్షఃఏకఃవిధుః యస్యసః = సపక్షైకవిధుః. తస్య = సపక్షైకవిధోః.

కచౌఘః: కచానామ్ ఓఘః = కచౌఘః.

పక్షస్థతావద్బహుచంద్రకః: పక్షేతిష్ఠన్తీతి = పక్షస్థాః. బహవశ్చతే చంద్రాశ్చ = బహుచంద్రాః. తావన్తశ్చతే బహుచంద్రాశ్చ = తావద్బహు చంద్రాః. పక్షస్థాః తావద్ బహుచంద్రాః యస్యసః = పక్షస్థతావద్బహు చంద్రకః.

భావము :

ఒక్కచంద్రుని దనవర్గమునకుఁ జెందినవానినిగాఁగల్గిన (చంద్రునితో సమానమైన) దమయన్తిమోముపైన నామె కురులు నెలకొనియుండుటయు క్తమే. ఏల యనగా నామెకురులు పెక్కు చంద్రకములను (చంద్రులను) (నెమలి పింఛములోని కన్నులను) సహాయముగాఁ గల్గిన నెమలిపింఛమును జయించినవి గదా! కాని పెక్కు చంద్రులకు సహాయముగాఁ గలవానిని జయించిన దమయన్తి కురులకు నొక్క చంద్రుని (సమానముగా) సహాయముగాఁగల్గిన యామె మోమును జయించి దానిపైన నెలకొనుటలో నాశ్చర్యమేమున్నది. చంద్రక మనగా నెమలికన్ను చంద్రుఁడు అని యర్థద్వయ ముండుటవలన నీ కల్పన జరిగినది. బహుచంద్రకములుగల నెమలి ఫించమును జయించిన దమయంతి కురులు ఏక చంద్రకముగల దమయన్తి మోముపై నధిష్టించుటలో నబ్బుర మేమి యున్నదని సారాంశము-ఇచ్చట చంద్రకము లనగా చంద్రులు, నెమలి పింఛములోని కన్నులు అని యర్థము గ్రాహ్యము ॥౨౦॥

శ్లో॥ అస్యాయదాస్యేన పురస్తిరశ్చ
తిరస్కృతం శీతరుచాఽన్ధకారమ్ ।
స్ఫుటస్ఫురద్భఙ్గ కచచ్ఛలేన
తదేవ పశ్చాదిదమస్తి బద్ధమ్ ॥ ౨౧

ప॥వి॥ అస్యాః । యత్ । ఆస్యేన । పురః । తిరః । చ । తిరస్కృతం । శీతరుచా । అన్ధకారమ్ । స్ఫుటస్ఫురద్భఙ్గ కచచ్ఛలేన । తత్ । ఏవ । పశ్చాత్ । ఇదమ్ । అస్తి । బద్ధమ్.

టీక॥ అస్యాః = ఈదమయన్తియొక్క, ఆస్యేన = ముఖమనెడి, శీతరుచా = చంద్రునిచే, యత్ = ఏ, అంధకారం = చీకటి, పురః = ఎదుట, తిరశ్చ = ప్రక్కలయందు, తిరస్కృతం = తిరస్కరింపఁబడినదో, తత్ = ఆ యంధకారమై, ఇధం = ఇది, స్ఫుటస్ఫురద్భృఙ్గకచచ్ఛలేన; స్ఫుట = స్పష్టముగా, స్ఫురత్ = ప్రకాశించు, భఙ్గ = వంకర, పరాజయముగల, కచ = వెంట్రుకలనెడి, ఛలేన = నెపముచే, పశ్చాత్ = వెనుకవైపు, బద్ధమస్తి = కట్టఁబడినదా యేమి?

**సమాసములు :**

స్ఫుటస్ఫురద్భఙ్గకచచ్ఛలేన : స్ఫుటంస్ఫురన్ = స్ఫుటస్ఫురన్. స్ఫుటస్ఫురన్భఙ్గాయేషాంతే స్ఫుటస్ఫురద్భఙ్గాః; స్ఫుటస్ఫురద్భంగాశ్చతే కచాశ్చ = స్ఫుటస్ఫురద్భఙ్గకచాః. స్ఫుటస్ఫురద్భఙ్గకచానాంఛలమ్ = స్ఫుటస్ఫురద్భంగ కచచ్ఛలమ్. తేన = స్ఫుటస్ఫురద్భఙ్గకచచ్ఛలేన.

**భావము:**

ఈ దమయన్తి ముఖచంద్రునిచే, చీకటి ఎదుటను ప్రక్కలను తొలగింపఁబడినది అదియే చక్కగా పరాజయమును సూచించు కురులనెపముతో, తల వెనుక బంధింపఁబడెనో యనునట్లున్నది. తిరస్కరింపఁబడినవ్యక్తి యుత్సాహ రహితుడై వెనుకవైపున బంధింపఁబడియుండును గదా. ॥౨౧॥

శ్లో॥ అస్యాః కచానాంశిఖినశ్చకిన్ను
విధిం కలాపౌ విమతేరగాతామ్ ।
తేనాఽయమేభిః కిమపూజి పుష్పై
రభర్త్సి దత్త్వా సకిమర్ధ చంద్రమ్॥ ౨౨

ప॥ వి॥ అస్యాః । కచానాం । శిఖినః । చ । కిం । ను । విధిం । కలాపౌ । విమతేః । అగాతామ్ । తేన । అయమ్ । ఏభిః । కిమ్ । అపూజి । పుష్పైః । అభర్త్సి । దత్త్వా । సః । కిమ్ । అర్ధచన్ద్రమ్.

టీక॥ అస్యాః = ఈ దమయన్తియొక్క, కచానాం = కురులయొక్క, శిఖినశ్చ = నెమలియొక్కయు, కలాపౌ = కేశపాశము, పింఛము అను నీరెండును, విమతేః = వివాదమువలన, విధిం = బ్రహ్మను, అగాతామ్ కిన్ను = తారతమ్యమునుఁ తెలుసుకొనుటకు వెళ్లినవాయేమి? తేన = ఆబ్రహ్మచే, అయం = ఈ కేశపాశము, ఏభిః = ఈ, పుష్పైః = తల యందలి పూవులచే, అపూజికిమ్ = పూజింపఁబడినదా యేమి? సః = ఆ నెమలిపింఛము, అర్ధచంద్రమ్ = చన్ద్రికమును (పింఛములోని కన్నును) మెడపైఁజేతితో నెట్టుటను, దత్వా = ఇచ్చి, భర్త్సితః కిం = భయపఱుపఁబడినదా యేమి.

వి॥ బ్రహ్మ నడుగుటకు వెళ్లినవాయేమి? యనునెడ అడుగుటకు వెళ్లకపోయి
నను వెళ్లినవాయేమి యని చెప్పుటవలన నుత్ప్రేక్ష. కేశపాశము
పూలతోపూజింపంబడినదాయేమి యనునెడ పూజింపఁబడక పోయినను,
పూజింపఁబడెనో యనునట్లున్నది అని చెప్పుటవలన, నుత్ప్రేక్ష.
అట్లే అర్ధచంద్రమునిచ్చి బెదరింపఁబడెనా యనుచోటఁగూడ, అర్ధచంద్ర
మిచ్చి బెదరింపబడెనో యనునట్లున్నదని వర్ణించుటవలన నుత్ప్రేక్ష.
మొదటి యుత్ప్రేక్షపైన తర్వాతి రెండు ఉత్ప్రేక్షలు సాపేక్షములుగాన
నిచ్చట సజాతీయములకు సంకరము.

భావము :

దమయన్తియొక్క కేశపాశమును, నెమలియొక్క పింఛమును నీరెం
డును తమతమ తారతమ్యముల తెలిసికొనుటకై బ్రహ్మయొద్దకు వెళ్లినవా
యేమి? ఆ బ్రహ్మ దమయన్తియొక్క కేశపాశమును పూవులచే ననగా నామె
ధరించియున్న పూవులనుఁబట్టి వానితో పూజించిగౌరవించెనా? నెమలిపింఛమును
సహజముగ చంద్రకములతో(కన్నులతో చంద్రులతోఁ)గూడినదాని నర్ధచంద్ర
ప్రయోగమిచ్చి బెదరించినాడా? అనగా తొలగించినాడా? అనగా దమయంతి
కేశపాశము నెమలి ఫింఛమును మించియున్నదని యాశయము. ॥౨౨॥

శ్లో॥ కేశాన్ధకారాదథ దృశ్యఫాల
స్థలార్ధ చంద్రా స్ఫుట మష్టమీయమ్ ।
ఏ తాం యదాసాద్య జగజ్జయాయ
మనోభువా సిద్ధిరసాధి సాధు ॥ ౨౩

ప॥వి॥ కేశాన్ధకారాత్ । అథ । దృశ్యఫాలస్థలార్ధచంద్రా । స్ఫుటమ్।అష్టమీ ।
ఇయమ్ । ఏతాం । యత్ । ఆసాద్య । జగజ్జయాయ । మనోభువా ।
సిద్ధిః । అసాధి । సాధు.

టీక॥ కేశాన్ధకారాత్ ; కేశ = కేశపాశమనెడి, అర్ధకారాత్ = చీకటికంటె, అథ =
తర్వాత, దృశ్యఫాలస్థలార్ధచన్ద్రా; దృశ్య = చూడఁదగిన,
ఫాలస్థల = లలాటదేశమను,అర్ధచంద్రాః = అర్ధచంద్రుఁడుకల,ఇయం =
ఈదమయన్తి, అష్టమీ = కృష్ణాష్టమి. స్ఫుటమ్ = స్పష్టము. యత్ =
ఎందువలన, మనోభువా = మన్మథునిచే, జగజ్జయాయ = ప్రపఞ్చవిజయ

మునకై, ఏతాం = ఈదమయన్తిని, అసాద్య = పొంది, సాధు = చక్కగా, సిద్ధిః = ప్రపఞ్చవిజయసిద్ధి, అసాధి = సాధింపఁబడినది.

వి॥ కేశపాశమనెడి యంధకారమునకంటెఁ తర్వాత కానవచ్చు నొసలనెడి యర్ధచంద్రుఁడుకల దమయన్తి యష్టమి కాకపోయినను సప్తమిగా చెప్పఁబడుటవలన నుత్ప్రేక్ష. అందు "స్ఫుట" శబ్దప్రయోగముచే నిది వాచ్యము.

## సమాసములు :

కేశాన్ధకారాత్ : కేశ ఏవ అన్ధకారః = కేశాన్ధకారః. తస్మాత్ = కేశాన్ధకారాత్.

దృశ్యఫాలస్థలార్ధచన్ద్రా : దృశ్యంచ తత్ ఫాలస్థలంచ = దృశ్యఫాలస్థలమ్. దృశ్యఫాలస్థలమేవ అర్ధచన్ద్రః యస్యాస్సా = దృశ్యఫాలస్థలార్ధచంద్రా.

జగజ్జయాయ: జగతాం జయః = జగజ్జయః. తస్మై = జగజ్జయాయ.

మనోభూః : మనసః భవతీతి = మనోభూః.

## భావము :

దమయన్తియొక్క కేశపాశము అంధకారము. అది తలవెనుక నున్నది. దానిని దాటిన పిదప తల ముందుభాగమున దమయన్తి నొసలను నర్ధచంద్రుఁడున్నాడు. అట్టి యర్ధచంద్రునిఁ గల్గియుండుటవలన దమయన్తి యష్టమి యగుచున్నది. ఏలయనగా సప్తమి నాటికి మింట నర్ధచంద్రుఁడుకానవచ్చును. అందు లోను తలవెంట్రుకలనెడి చీకటికిఁ బిదప నా నొసలనెడి యర్ధచంద్రుఁడుండుటవలన నది కృష్ణాష్టమిగా భావింపఁదగినది. ఏలయనగా, కృష్ణపక్షమున సూర్యుడస్తమించినపిదప సుమారు పదునాలుగు గడియలకు నష్టమినాడు చంద్రుఁడుదయించును. కాన చంద్రోదయమగు నంతవరకును ముందు చీకటియేయుండును. అట్లే యిక్కడ దమయన్తియొక్క కేశభారము తలయందు పూర్వభాగమున నుండుట వలనను, దర్వాత నామెనొసలు, అర్ధచంద్రాకృతిగ నుండుట వలనను దమయన్తి యష్టమిగా భావింపఁబడివి. ఇట్టి అష్టమినాఁడు ప్రపఞ్చవిజయమునకై బయలుదేరిన మన్మథునకు కార్యము సిద్ధించినది. జ్యోతిశ్శాస్త్రమునను సరించి బహుళాష్టమినాటి విజయయాత్రసఫలమని తెలియుచున్నది. ౨౩

శ్లో॥ పుష్పంధనుః కిం మదనస్య దాహే
శ్యామీభవత్ కేసర శేషమాసీత్ ।
వ్యధాద్ద్విధేశ స్తదపిక్రుధా కిం
భైమీభ్రువౌ యేన విధిర్వ్యధత్త॥ —౨౪

ప॥వి॥ పుష్పం । ధనుః । కిమ్। మదనస్య। దాహే। శ్యామీభవత్కేసర శేషమ్।
ఆసీత్ । వ్యధాత్ । ద్విధా । ఈశః । తత్ । అపి । క్రుధా । కిం ।
భైమీభ్రువౌ । యేన । విధిః । వ్యధత్త.

టీక॥ మదనస్య = మన్మథునియొక్క, దాహే = దాహకాలమందు, పుష్పమ్ =
పువ్వనెడి, ధనుః = ధనుస్సు, శ్యామీభవత్కేసర శేషమ్; శ్యామీభవత్ =
నల్లనగుచున్న, కేసర = కేసరములే, శేషం = మిగిలినదిగా, అసీత్ కిం =
అయినదా ఏమి ? (కిఞ్చ = మఱియు) ఈశః = శివుఁడు, క్రుధా = కోప
ముచే, తదపి = ఆపూవిల్లునుఁగూడ, ద్విధా = రెండుభాగములుగా, వ్యధాత్
కిమ్? = చేసెనా యేమి? యేన = రెండుగా విభజింపఁబడిన యేధనుస్సుచే
విధిః = బ్రహ్మ, భైమ్యాః = దమయన్తియొక్క, భ్రువౌ = కనుబొమ్మ
లను, వ్యధత్త = సృజించెను.

వి॥ మన్మథుని దాహకాలమునందు, పూవిల్లుయొక్క కేసరములు కమలక
పోయినను, కమలిపోయెనా యనుటవలన నుత్ప్రేక్ష.

శివుడు మన్మథుని పూవిల్లును రెండు ఖండములు గావింపక పోయినను.
గావించెనో యని యనుటవలన నిదియు నుత్ప్రేక్ష.

ఆ పూవిల్లుయొక్క రెండుతునుకలచే దమయన్తియొక్క కనుబొమ్మలు
చేయఁబడకపోయినను చేయఁబడినట్లు చెప్పుటవలన నిదియు నుత్ప్రేక్ష. ఈ
యుత్ప్రేక్షలు రెండును మొదటి యుత్ప్రేక్ష నపేక్షించుటవలన, సజాతీయము
లగు నలంకారములకిఁట సంకరము.

## సమాసములు

**శ్యామీభవత్కేసర శేషమ్: అశ్యామాఃశ్యామాఃసమ్పద్యమానాఃభవన్తః = శ్యామీభవన్తః. శ్యామీభవన్తశ్చతే కేసరాశ్చ = శ్యామీభవత్కేసరాః. శ్యామీ**

భవత్కేసరాః, శేషఃయస్య తత్ = శ్యామీభవత్కేసర శేషమ్.

భైమీభ్రువౌః భీమస్య అపత్యం, స్త్రీ = భైమీ. భైమ్యాః భ్రువౌ = భైమీభ్రువౌ. తే = భైమీభ్రువౌ.

భావము :

శివుడు మన్మథుని దహించు కాలమున నతని పూవిల్లులోని కేసరములు కమలిపోయి మిగిలినట్లున్నది. అట్లే యా శివుఁడు కోపముచే మరుని విల్లును రెండు తునకలు గావించినట్లున్నది. నల్లగా కమలిపోయిన కేసరములతోఁడను, రెండు వింటిముక్కలతోడను బ్రహ్మ దమయంతియొక్క కనుబొమ్మలను సృజించినట్లున్నది. కమలిపోయిన కేసరములు నల్లని వెంట్రుకలుగను త్రుంచఁబడిన వింటిముక్కలు రెండుసమంపుగా నుండుటవలనను, వీనితో బ్రహ్మ దమయన్తియొక్క కనుబొమ్మలను సృజించినట్లున్నది. అనగా మన్మథునియొక్క పూవింటి కేసరములను, నావింటియొక్క ఖండములును కలసి దమయంతి కనుబొమ్మలుగా సృజింపఁబడినట్లు చెప్పుటవలన దమయంతి కనుబొమ్మలు మిక్కిలి రమ్యములై మన్మథోద్రేకమును జూపరులకుఁ గల్గించుచున్నవని యాశయము. ॥౨౪॥

శ్లో॥ భ్రూభ్యాం ప్రియాయా భవతా మనోభూ
చాపేన చాపే ఘనసారభావః ।
నిజాం యదప్లోషదశామపేక్ష్య
సంప్రత్యనేనాధికవీర్యతార్జి ॥ ౨౫

ప॥వి॥ భ్రూభ్యాం । ప్రియాయాః । భవతా । మనోభూచాపేన । చ । ఆపే । ఘనసార భావః । నిజాం । యత్ । అప్లోషదశామ్ । అపేక్ష్య । సంప్రతి । అనేన । అధికవీర్యతా । అర్జి.

టీక॥ (కిఞ్చ = మఱియు) ప్రియాయాః = ప్రియురాలైన, భైమ్యాః = దమయన్తియొక్క, భ్రూభ్యాంభవతా = కనుబొమ్మలైన, మనోభువః = మన్మథునియొక్క, చాపేన = ధనుస్సుచే, ఘనసారభావః; ఘన = దృఢత్వము, సారభావః = స్థిరత్వము, ఘనసారభావః = కర్పూ

రత్వము, ఆపే = పొందఁబడినది, యత్ = ఏలయనగా, నిజాం = అప్లోషదశామ్ = తనదైన, కాలిపోనట్టి ముందటి దశను, అపేక్ష్య = అపేక్షించి, అనగాఁ కాల్పుకుముందటి దశ కంటె, సమ్ప్రతి = ఇప్పుడు, అనేన = ఈమన్మథుని ధనుస్సుచే, అధికవీర్యతా = నధికబలము, ఆర్జి = సంపాదింపఁబడినది.

వి॥ దగ్ధమైన స్మరునివిల్లు దమయన్తికి కనుబొమ్మలగుటవలన దృఢత్వము స్థిరత్వము రాకపోయినను, నవివచ్చినట్లు చెప్పుటవలన నిట నుత్ప్రేక్ష.

## సమాసములు :

మనోభూచాపేన: మనసః భవతీతి = మనోభూః. మనోభువః చాపః = మనోభూచాపః. తేన = మనోభూచాపేన.

ఘనసారభావః: ఘనశ్చాసౌసారశ్చ = ఘనసారః. ఘనసారస్య భావః = ఘనసారభావః.

అప్లోషదశామ్ : నప్లోషః = అప్లోషః. అప్లోషస్యదశా = అప్లోషదశా. తామ్ = అప్లోషదశామ్.

అధికవీర్యతా : అధికంవీర్యంయస్యసః = అధిక వీర్యః. అధికవీర్య స్యభావః = అధికవీర్యతా.

## భావము :

మన్మథుని విల్లు దమయన్తికి కనుబొమ్మలు కాగనే, ఘనసారత్వమును, అనగా దృఢత్వస్థిరత్వములను (కర్పూరత్వమును) పొందినది. ఏలయనగా నా విల్లు దగ్ధముకాని మునుపటి దశకంటె, దగ్ధమైన దశయందు నధికబలమును సంపాదించినది. దమయన్తికిఁ గనుబొమ్మలగుటవలననే దానికింతటి శక్తి యేర్పడినది. దమయన్తి కనుబొమ్మలు ప్రేక్షకులకు చల్లదనము నొసంగుచు గాన కర్పూరత్వముగూడ దానికిఁ దగినది.

శ్లో॥ స్మారం ధనుర్యద్విధునోజ్ఝితాస్యా
యాస్యేనభూతేన చ లక్ష్మరేఖా।

ఏతద్భ్రువౌ జన్మత దాపయుగ్మం
లీలాచలత్వోచితబాలభావమ్ ॥ ౨౯

ప॥వి॥ స్మారం । ధనుః । యత్ । విధునా । ఉజ్ఝితా । అస్యాః । యా । ఆస్యేన । భూతేన । చ । లక్ష్మరేఖా । ఏతద్భ్రువౌ । జన్మ । తత్ । ఆప । యుగ్మం । లీలాచలత్వోచిత బాలభావమ్.

టీక॥ స్మారం = మన్మథునికి సంబంధించిన, ధనుః = ధనుస్సును, అస్యాః = ఈ దమయన్తికి, ఆస్యేన = ముఖముగా, భూతేన = అయినటువంటి, విధునా = చంద్రునిచే, ఉజ్ఝితా = విడువఁబడిన, యా = ఏ, లక్ష్మరేఖా = కలఙ్కరేఖయు, అను, తత్ = ఆ, యుగ్మం = రెండును, అనగా మన్మథుని ధనుస్సు కలఙ్కరేఖయను రెండును, లీలాచలత్వోచితబాలభావమ్; లీలా = విలాసము, చలత్వ = చఞ్చలత్వము అను నీ రెంటికిని తగిన, బాలభావమ్ = వాలత్వము అనగా కేశత్వము, "వబయోరభేదః" యను న్యాయముచే బాలత్వము, అనగా శిశుత్వము, ఏతద్భ్రువౌ; ఏతత్ = ఈ దమయన్తి యొక్క, భ్రువౌ = కనుబొమ్మలనెడి, జన్మ = జన్మమును, ఆప = పొందినది.

వి॥ ఈ దమయన్తియొక్క ముఖమనెడి నిష్కలఙ్క చంద్రుఁడు చంద్రునికిని, కనుబొమ్మలు ఆ చంద్రునిలోని కళఙ్కమునకు నపర జన్మములు కాకపోయినను నపరజన్మములుగా నుత్ప్రేక్షింపఁబడుట వలననుత్ప్రేక్ష.

## సమాసములు :

స్మారమ్ : స్మరస్య ఇదం = స్మారమ్.

ఏతద్భ్రువౌ: ఏతస్యాః భ్రువౌ = ఏతద్భ్రువౌ.

లీలా చలత్వోచిత బాలభావమ్ : లీలాచ, చలత్వంచ = లీలాచలత్వే. లీలాచలత్వయోరుచితః = లీలాచలత్వోచితః. బాలస్యభావః = బాలభావః. లీలచలత్వోచితః బాలభావః యస్మిన్ (జన్మని) తత్ = లీలాచలత్వోచిత బాల భావమ్.

**భావము :**

మన్మథుని విల్లు, దమయన్తి ముఖమనెడిచంద్రునిచే విడువఁబడిన కళఙ్కము, అను నీరెండును; విలాసమునకు చాఞ్చల్యమునకును తగిన వాలత్వమును (కేశత్వమును)(బాలత్వమును) గల్గినవై దమయన్తియొక్క కనుబొమ్మలుగా జన్మమెత్తినవి. మన్మథుని విల్లు వంపుగా నుండుటవలన వంపైన కనుబొమ్మలగను, చంద్రకళఙ్కము నల్లగా నుండుటవలన, కనుబొమ్మలలోని నల్లని వెంట్రుకలుగను నేర్పడి మన్మథ చాఞ్చల్యములతోడను, కేవల విలాస చాఞ్చల్యముతోడనుఁ జూచి కామోత్పాదకములుగా నుండినవి. ॥౨౬॥

శ్లో॥ ఇషుత్రయేణైవ జగత్త్రియస్య
వినిర్జయాత్ పుష్పమయాశుగేన।
శేషా ద్విబాణీ సఫలీకృతేయం
ప్రియాదృగమ్భోజపదేఽభిషిచ్య ॥ ౨౭

ప॥వి॥ ఇషుత్రయేణ । ఏవ । జగత్త్రియస్య । వినిర్జయాత్ । పుష్పమయాశుగేన । శేషా । ద్విబాణీ । సఫలీకృతా । ఇయం । ప్రియాదృగమ్భోజపదే । అభిషిచ్య.

టీక॥ పుష్పమయాశుగేన; పుష్పమయ = పుష్పవికారములైన, ఆశుగేన = బాణములుగల మన్మథునిచే, ఇషుత్రయేణ = మూడు బాణములచే, జగత్త్రియస్య = మూడులోకములయొక్క, వినిర్జయాత్ = విజయమువలన, శేషా = మిగిలిన, ఇయం = ఈ, ద్విబాణీ = రెండుబాణములు, ప్రియాదృగమ్భోజపదే; ప్రియా = ప్రియురాలియొక్క, దృగమ్భోజ = నేత్రములనెడి తామర పూవులయొక్క, పదే = స్థానమందు, అభిషిచ్య = అభిషిక్తముఁ గావించి, సఫలీకృతా = సఫలములుచేయఁబడినది.

వి॥ మిగిలిన రెండు బాణములు నేత్ర పద్మముల స్థానమునం దభిషిక్తములు గావింపఁబడకపోయినను, గావింపఁబడినట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష.

**ససమాసములు :**

ఇషుత్రయేణ : ఇషూణాంత్రయమ్ = ఇషుత్రయమ్. తేన = ఇషుత్రయేణ.

జగత్త్రియస్య : జగతాంత్రయమ్ = జగత్త్రియమ్. తస్య = జగత్త్రియస్య.

పుష్పమయాశుగేన : పుష్పాణాంవికారాః = పుష్పమయాః. పుష్పమయాః, ఆశుగాః యస్యసః = పుష్పమయాశుగః. తేన = పుష్పమయాశుగేన.

ద్విబాణీ : ద్వయోః బాణయోః సమాహారః = ద్విబాణీ.

సఫలీకృతా : ఫలేనసహితా = సఫలా. అసఫలా, సఫలాసమ్పద్యమానా కృతా = సఫలీకృతా.

ప్రియాదృగమ్భోజపదే : దృశావేవ అమ్భోజే = దృగమ్భోజే. ప్రియాయాః, దృగమ్భోజే = ప్రియాదృగమ్భోజే. ప్రియాదృగమ్భోజయోః పదం = ప్రియాదృగమ్భోజపదమ్. తస్మిన్ = ప్రియాదృగమ్భోజపదే.

భావము :

పూవిలుడైన మన్మథునకు ఐదుబాణములుకలవు. అందు మూడు బాణములచే, మూడులోకములను జయించెను. తర్వాత మిగిలిన రెండు బాణములను దమయన్తియొక్క నేత్రములనెడి తామర పూవుల జంటయొక్క స్థానమున నభిషిక్తములుగావించి వానిని సఫలముగావించెను ॥౨౦॥

శ్లో॥ సేయం మృదుః కౌసుమచాపయష్టిః
స్మరస్య ముష్టిగ్రహణార్హమధ్యా ।
తనోతి నః శ్రీమదపాఙ్గముక్తాం
మోహాయ యా దృష్టిశరౌఘవృష్టిమ్ ॥ ౨౧

ప॥వి॥ సా । ఇయం । మృదుః । కౌసుమచాపయష్టిః । స్మరస్య । ముష్టిగ్రహణార్హమధ్యా । తనోతి । నః । శ్రీమదపాఙ్గముక్తాం । మోహాయ।యా। దృష్టిశరౌఘవృష్టిమ్.

టీక॥ మృదుః = కోమలమైనదియు, ముష్టిగ్రహణార్హమధ్యా; ముష్టి = పిడికిలిచే, గ్రహణ = పట్టుకొనుటకు, అర్హ = తగిన, మధ్యా = నడుముగల్గిన, సా ॥

ఆ, ఇయం = ఈ దమయన్తి, స్మరస్య = మరునకు, కౌసుమచాప యష్టిః; కౌసుమ = పుష్పవికారమైన, చాపయష్టిః = వింటిదండమని భావింపఁదగినది. యా = ఏ, ఇయం = ఈమె, నః = మనకు, మోహాయ = మూర్ఛకై, శ్రీమదపాఙ్గముక్తాం; శ్రీమత్ = శోభనమైన, అపాఙ్గ = కడకన్నుల నుండి, ముక్తాం = విడువఁబడిన, దృష్టిశరౌఘ వృష్టిం; దృష్టి = చూపులనెడి, శర = బాణములయొక్క, ఓఘ = సమూహముయొక్క, వృష్టిం = వర్షమును, తనోతి = చేయుచున్నదో.

వి॥ పిడికిలిచేఁ బట్టగల్గిన నడుముగల యీ దమయన్తి మన్మథుని పూవిల్లు కాకపోయినను, పూవిల్లుగ సంభావింపఁబడుటవలన నుత్ప్రేక్ష.

**సమాసములు:**

కౌసుమచాపయష్టిః: కుసుమానాంవికారః = కౌసుమీ. చాపఏవయష్టిః = చాపయష్టిః. కౌసుమీ చ సా చాపయష్టిశ్చ = కౌసుమచాపయష్టిః.

శ్రీమదపాఙ్గముక్తామ్: శ్రీమన్తశ్చ తే అపాఙ్గాశ్చ = శ్రీ మదపాఙ్గాః. శ్రీమదపాఙ్గేభ్యః ముక్తా = శ్రీ మదపాఙ్గముక్తా. తామ్ = శ్రీ మదపాఙ్గముక్తామ్.

దృష్టిశరౌఘవృష్టిః: దృష్టయ ఏవ శరాః = దృష్టిశరాః. దృష్టిశరాణా మోఘః = దృష్టిశరౌఘః. దృష్టిశరౌఘస్యవృష్టిః = దృష్టిశరౌఘవృష్టిః. తామ్ = దృష్టిశరౌఘవృష్టిమ్.

**భావము:**

పిడికిలిచేఁ బట్టగల్గిన కౌనుగల్గిన కోమలమైన యీ దమయంతి, మన్మథునికి, పిడికిలిచేఁ బట్టఁగల్గిన మధ్యప్రదేశముగల పూవింటి దండమే. ఏల యనగా నీ దమయన్తి, మనలను మూర్ఛింపఁజేయుటకే యందమైన తన కడ కన్నులనుండి చూపులనెడి బాణవృష్టిని కురిపించుచున్నది. కాన నామె మన్మథుని చాపయష్టి (వింటి దండము) ఏల కాదు. ॥౨౮॥

**శ్లో॥ ఆఘూర్ణితం పక్ష్మలమక్షిపద్మం**
**ప్రాన్తద్యుతి శ్వైత్యజితామృతాంశు ।**

అస్యా ఇవాఽస్యాశ్చల దింద్రనీల
గోలా మలశ్యామల తారతారమ్॥ ౨౯

ప॥వి॥ ఆఘూర్ణితం । పక్ష్మలమ్ । అక్షిపద్మం । ప్రాన్తద్యుతి శ్వైత్య జితాఽమృతాంశు । అస్యాః । ఇవ । అస్యాః । చలదింద్రనీలగోలామలశ్యామల తారతారమ్.

టీక॥ ఆఘూర్ణితం = కదలింపఁబడినదియు, పక్ష్మలం = రెప్పలతోఁగూడిన, ప్రాన్తద్యుతి శ్వైత్యజితాఽమృతాంశు; ప్రాన్త = కొనలయందలి, ద్యుతి = కాంతియొక్క, శ్వైత్య = తెల్లఁదనముచే, జిత = జయింపఁబడిన, అమృతాంశు = చంద్రుడుగల్గిన, చలదింద్రనీలగోలామలశ్యామలతార తారమ్; చలత్ = చలించుచున్న, ఇంద్రనీల = ఇన్ద్రనీలమణియొక్క, గోల = మణ్డలమువలె, అమల = నిర్మలమైన, శ్యామల = నల్లని, తార = స్థూలమైన, తారమ్ = కంటిపాపఁగల్గిన, అస్యాః = ఈమెయొక్క, అక్షి పద్మమ్ = పద్మమువంటినేత్రము, అస్యాః = ఈమెయొక్క, అక్షి పద్మమ్ = పద్మమువంటి నేత్రమే, అనగా సాటి లేనిది.

వి॥ ఇచ్చట అక్షిపద్మము, అక్షిపద్మమే యని సాటి లేనిదిగా వర్ణింపఁబడుట వలన ననన్వయాలఙ్కారము.

## సమాసములు :

పక్ష్మలమ్: పక్ష్మాణి లాతీతి = పక్ష్మలమ్.

అక్షిపద్మమ్: అక్షి పద్మమివ = అక్షిపద్మమ్.

ప్రాన్తద్యుతిశ్వైత్యజితామృతాంశు: ప్రాన్తేషు ద్యుతిః = ప్రాన్తద్యుతిః. శ్వేతాయాఃభావః = శ్వైత్యం; ప్రాన్తద్యుతేః శ్వైత్యం = ప్రాన్తద్యుతిశ్వైత్యమ్. ప్రాన్తద్యుతిశ్వైత్యేనజితః అమృతాంశుఃయేన,తత్ = ప్రాన్తద్యుతిశ్వైత్యజితామృతాంశు.

చలదింద్రనీలగోలామలశ్యామలతారతారమ్ : ఇంద్రనీలస్య గోలమ్ = ఇంద్రనీలగోలమ్. చలచ్చ తత్ ఇంద్రనీలగోలం చ = చలదింద్ర నీలగోలమ్.

చలదింద్ర నీలగోలమివ అమలా = చలదింద్రనీలగోలామలా. చలదింద్రనీలగోలా మలా చ శ్యామలా చ = చలదింద్రనీల గోలామల శ్యామలా. తారా చ సా తారా చ = తారతారా. చల దింద్ర నీలగోలామలశ్యామలా తారతారా యస్య తత్ = చలదింద్రనీలగోలామలశ్యామలతారతారమ్.

**భావము :**

కంటి పాపయొక్క ప్రాన్తములయందలి తెల్లటి కాన్తులచే చంద్రుని జయించినదియు, కదలుచున్న యింద్ర నీలమణి మణ్డలము వలె నల్లని కంటి పాపగల్గిన, యీ దమయన్తియొక్క నయన పద్మము సాటి లేనిది. అనగా నీమెయొక్క కంటిపాపచుట్టు తెల్లగ నుండుటవలన నది చంద్రుని జయించినది గను, కంటిపాప యింద్రనీలమణి వలె నిర్మలమై నల్లగ నున్నదిగను వర్ణితము. ॥౨౯॥

శ్లో॥ కర్ణోత్పలేనాపి ముఖం సనాథం
లభేత నేత్రద్యుతి నిర్జితేన ।
యద్యేతదీయేన తతః కృతార్థా
స్వచక్షుషీ కిం కురుతే కురఙ్గీ॥ ౩౦

ప॥వి॥ కర్ణోత్పలేన । అపి । ముఖం । సనాథం । లభేత । నేత్రద్యుతినిర్జితేన । యది । ఏతదీయేన । తతః । కృతార్థా । స్వచక్షుషీ । కిం । కురుతే । కురఙ్గీ.

టీక॥ నేత్రద్యుతినిర్జితేన; నేత్రద్యుతి = నయన కాన్తులచే, నిర్జితేన = ఓడింపఁబడిన, ఏతదీయేన = ఈ దమయన్తికి సంబంధించిన, కర్ణోత్పలేనాఽపి = కర్ణములయందలి కలువతోను, సనాథం = సహకరింపఁబడిన, ముఖం = మోము, లభేతయది = లభించినచో, తతః = తర్వాత, కృతార్థా = కృతకృత్యురాలైన. కురఙ్గీ = లేడి, స్వచక్షుషీ = తన కన్నులను, కింకురుతే = వృథా చేసికొనును, అనగా నుపేక్షించుకొనును.

**సమాసములు:**

కర్ణోత్పలేన : కర్ణే ఉత్పలమ్ = కర్ణోత్పలమ్. తేన = కర్ణోత్పలేన.

నేత్రద్యుతినిర్జితేన : నేత్రయోః ద్యుతిః = నేత్రద్యుతిః. నేత్రద్యుత్యా నిర్జితమ్ = నేత్రద్యుతినిర్జితమ్. తేన = నేత్రద్యుతినిర్జితేన.

ఏతదీయేన : ఎతస్యాః ఇదమ్ = ఏతదీయమ్. తేన = ఏతదీయేన.

కృతార్థా : కృతః అర్థః యయా సా = కృతార్థా.

స్వచక్షుషీ : స్వయోః చక్షుషీ = స్వచక్షుషీ. తే = స్వచక్షుషీ.

**భావము :**

దమయన్తి కనుల కాంతితో నోడింపఁబడిన యామెయొక్క కర్ణభూషణమైన కలువతోఁ గూడిన యామె మోము తనకు లభించినను లేడి కృతార్థురాలై తన కన్నుల నుపేక్షింపఁగలదు. ఆ దమయన్తి కన్నులతో తనకు సామ్యము లభించు నను మాటకు ప్రసక్తియే లేదు. ఇఁక నామె కనులచే నోడింపఁబడిన కర్ణోత్పలముతో సామ్యము వచ్చినను తనకు చాలునని లేడి యాశించుచున్నది. అనగా తన మోమునకు పద్మము నోడించిన కనులతో గూడిన యామె మోముతో సామ్యమునకు ప్రసక్తి లేదు. ఇఁక తన కనులచే నోడింపఁబడిన కర్ణోత్పలముతోఁ గూడిన యామె మోముతో తన మోమునకు సామ్యము వచ్చిన చాలు నని యాడుజింక తృప్తిపడినదై యంతటితో తన కన్నుల నుపేక్షించుకొనును. లేదా, అట్టి కన్నులతో తానేమిచేయునని యాశయము॥ ౩౦॥

శ్లో॥ త్వచః సముత్సార్య దళాని రీత్యా
మోచాత్వచః పఞ్చషపాటనానామ్ ।
సారైర్గృహీతైర్విధిరుత్పలౌఘా
దస్యామభూదీక్షణరూపశిల్పీ ॥ ౩౧

ప॥వి॥ త్వచః । సముత్సార్య । దలాని । రీత్యా । మోచాత్వచః । పఞ్చషపాటనానామ్ । సారైః । గృహీతైః । విధిః । ఉత్పలౌఘాత్ । అస్యామ్ । అభూత్ । ఈక్షణరూపశిల్పీ.

టీక॥ విధిః = బ్రహ్మ, మోచాత్వచః = అరటిపట్టయొక్క, పఞ్చషపాటనానాం; పఞ్చష = అయిదో, లేదా ఆరో, పాటనానాం = ఒలచుటయొక్క

రీత్యా = విధముచే, త్వచః = పట్టలను, సముత్సార్య = తొలగించి, గృహీతైః = తీసికొనఁబడినవియు, (తథా = అట్లే) ఉత్పలౌఘాత్ = కలువలసమూహమునుండి, గృహీతైః = తీసుకొనఁబడినవియునగు, సారైః = సారములచేత, అనగా, తెలుపునలుపు వన్నెల చేతను, సౌందర్యద్రవ్యముల చేతను, అస్యాం = ఈదమయన్తియందు, ఈక్షణ రూపశిల్పీ; ఈక్షణరూప = నయనసౌందర్యమునకు, శిల్పీ = నిర్మాతగా, అభూత్ = ఆయెను.

వి॥ బ్రహ్మ యరటి స్తంభముల సారమును, కలువపూలసారమును గ్రహించి దమయన్తి కన్నుల సౌందర్యము సృజింపక పోయినను, సృజియించి నట్లు చెప్పుటవలన ఉత్ప్రేక్ష.

సమాసములు:

మోచాత్వచః : మోచాయాః త్వక్ = మోచాత్వక్ః తస్యాః = మోచాత్వచః ।

పఞ్చషపాటనానామ్ : పఞ్చ వా షడ్వా = పఞ్చషాని. పఞ్చషాని చ తాని పాటనాని చ = పఞ్చషపాటనాని. తేషాం, = పఞ్చషపాటనానామ్.

**ఉత్పలౌఘాత్ : ఉత్పలానామోఘః = ఉత్పలౌఘః. తస్మాత్ = ఉత్పలౌఘాత్.**

ఈక్షణరూపశిల్పీ : ఈక్షణయోః రూపమ్ = ఈక్షణరూపమ్. ఈక్షణ రూపస్య శిల్పీ = ఈక్షణరూపశిల్పీ.

భావము :

బ్రహ్మ యరటిచెట్టుయొక్క యయిదాఱు పట్టలను తీసివైచి యందలి సారపదార్థములను, నట్లే కలువపూలనుండి సారపదార్థములను గ్రహించి అనగా వానియందలి నలుపుతెలుపు వన్నెలచేతను, సౌందర్యద్రవ్యములచేతను దమయన్తియొక్క కన్నుల సౌందర్యము సృజింపగలైను॥౩౦॥

శ్లో॥ చకోరనేత్రైణ దృగుత్పలానాం
నిమేషయన్త్రైణ కిమేష కృష్టః ।

సారః సుధోద్గారమయః ప్రయత్నై
ర్విధాతుమేతన్నయనే విధాతుః ॥ ౩౨

ప॥వి॥ చకోరనేత్రైణదృగుత్పలానాం । నిమేషయన్త్రేణ । కిమ్ । ఏషః । కృష్టః । సారః । సుధోద్గారమయః । ప్రయత్నైః । విధాతుమ్ । ఏతన్నయనే । విధాతుః.

టీక॥ విధాతుః = బ్రహ్మకు, ఏతన్నయనే; ఏతత్ = ఈ దమయంతియొక్క, నయనే = నేత్రములను, విధాతుం = నిర్మించుటకు, ప్రయత్నైః = పెక్కు ప్రయత్నములచే, చకోరనేత్రైణదృగుత్పలానాం, చకోర దృక్ = చకోరపక్షి నేత్రములయొక్కయు, ఏణదృక్ = జింక కన్నుల యొక్కయు, ఉత్పలానాం = కలువలయొక్కయు, సుధోద్గారమయః = అమృతస్రావరూపమైన, ఏషః = ఈ కనుఁలనెడి, సారః = రసము, నిమేషయన్త్రేణ = కనులుమూయుట యను యన్త్రముచే. కృష్టఃకిమ్ = తీయఁబడినదా యేమి.

వి॥ దమయంతి కన్నులను సృజించుటకై చకోర నేత్రములనుండియు, జింక కన్నుల నుండియు, కలువపూల నుండియు నమృతనిష్యందరూప మైన సారము తీయఁబడకపోయినను, తీయఁబడినట్లు చెప్పుటచే నుత్ప్రేక్ష.

సమాసములు :

చకోరనేత్రైణదృగుత్పలానామ్ : చకోరస్య నేత్రే = చకోరనేత్రే. ఏణస్య దృశౌ = ఏణదృశౌ. చకోరనేత్రే చ ఏణదృశౌ చ ఉత్పలాని చ = చకోరనేత్రైణదృగుత్పలాని. తేషాం = చకోర నేత్రైణదృగుత్పలానామ్.

నిమేషయన్త్రేణ : నిమేషఏవయన్త్రః = నిమేషయన్త్రః. తేన = నిమేషయన్త్రేణ.

సుధోద్గారమయః : సుధాయాః ఉద్గారః = సుధోద్గారః. సుధోద్గారస్య వికారః = సుధోద్గారమయః.

ఏతన్నయనే : ఏతస్యాః నయనే = ఏతన్నయనే. తే = ఏతన్నయనే.

**భావము :**

బ్రహ్మ యా దమయంతి కన్నులను సృజించుటకై పెక్కు ప్రయత్నములచే చకోరనేత్రములును, జింక కనులును కలువపూవులు ననెడి చంద్రునితో సంబంధించిన వానినుండి యమృతనిష్యందరూపమైన సారమైన వస్తువును వాని నిమేషములు, అనగా, వాని కనుల మోడ్పనెడి యన్త్రమునుండియు, దళముల మోడ్పనెడి యన్త్రమునుండియు వెలికితీసెనా యని తోచుచున్నది. అనగా - చకోర నేత్రములు వెన్నెలనుఁ బానము చేయును, జింక చంద్రుని యక్కునందుండి యాతని వెన్నెలబానయుఁ జేయును. అట్లే కలువలుగూడ చంద్రవంశమునకు చేరినవై వెన్నెలను పానము చేయును. కాన వీని యన్నిటి యందును చంద్రామృత మను సారభూతమైన పదార్థ ముండును. దానిని వెలికి లాగి వానితో దమయంతి కనులను సృజించె నని భావము. ॥౩౨॥

శ్లో॥ ఋణీకృతా కిం హరిణీభిరాసీ
దస్యాః సకాశాన్నయనద్వయశ్రీః।
భూయోగుణేయం సకలా బలాద్యత్
తాభ్యోఽనయాలభ్యత బిభ్యతీభ్యః ॥ ౩౩

ప॥వి॥ ఋణీకృతా । కిం ॥ హరిణీభిః । ఆసీత్ । అస్యాః । సకాశాత్ । నయనద్వయశ్రీః । భూయోగుణా । ఇయం । సకలా । బలాత్ । యత్ । తాభ్యః । అనయా । అలభ్యత । బిభ్యతీభ్యః.

టీక॥ హరిణీభిః = జింకలచే, అస్యాః = ఈ దమయంతియొక్క, అనగా ఋణమునిచ్చిన ఉత్తమర్ణురాలియొక్క, సకాశాత్ = సమీపమునుండి, నయనద్వయశ్రీః; నయనద్వయ = కనుదోయియొక్క, శ్రీః = శోభ, ఋణీకృతాకిమ్ = అప్పు చేయబడినదా యేమి? యత్ = ఏలయనగా, అనయా = ఈ దమయంతిచే, బిభ్య తీభ్యః = భయపడుచున్నటువంటి, తాభ్యః = ఆ యాడు జింకలనుండి, భూయోగుణా = రెండురెట్లు మూడు రెట్లు అధికమైన, ఇయం = ఈనేత్రశోభ, సకలా = నిశ్శేషముగా, బలాత్ = బలముచేత, అలభ్యత = పొందఁబడినది.

వి॥ దమయంతినుండి నయనశోభ యప్పుగాఁ దీసుకొనఁబడకపోయినను, తీసుకొనఁబడి నట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష.

**సమాసములు :**

*ఋణీకృతా :* అనృణం ఋణం కృతా = ఋణీకృతా.

*నయనద్వయశ్రీః :* నయనయోః ద్వయం = నయనద్వయం నయనద్వయస్య శ్రీః = నయనద్వయ శ్రీః.

*భూయోగుణా :* భూయాన్ గుణః యస్యాస్సా = భూయోగుణా.

**భావము :**

ఆడు జింకలు దమయన్తినుండి కనుదోయి యందమును నప్పుగాఁ దీసికొనినవా యేమి? ఏలయనగా దమయన్తివలన భయపడుచున్న యా యాడు జింకల నుండి రెండింతలు, మూడింతలు నైనయూ కనుదోయి యంద మనెడి యప్పు నిశ్శేషముగాఁ దమయన్తి బలముతో రాఁబట్టుకొనినది. ఆ జింకలు భయపడినట్లు చెప్పుటవలన వానికి నయనశోభ యతిశయించి యుండును. మఱియు భయగ్రస్తులనుండి పూర్తిగా ఋణమును రాబట్టుట సులభమను నంశములిట సూచితములు ॥33॥

శ్లో॥ దృశౌ కిమస్యాశ్చపలస్వభావే
న దూరమాక్రమ్య మిథో మిలేతామ్ ।
న చేత్ కృతః స్యాదనయోః ప్రయాణే
విఘ్నః శ్రవఃకూపనిపాతభీత్యా ॥ 34

ప॥వి॥ దృశౌ । కిమ్ । అస్యాః । చపలస్వభావే । న । దూరమ్ । ఆక్రమ్య । మిథః । మిలేతామ్ । న । చేత్ । కృతః । స్యాత్ । అనయోః । ప్రయాణే । విఘ్నః । శ్రవః కూపనిపాతభీత్యా ।

టీక॥ చపలస్వభావే = చఞ్చలస్వభావముగల్గిన, అస్యాః = ఈదమయన్తి యొక్క, దృశౌ = నేత్రములు, దూరమ్ = దూరము, గత్వా = పోయి,

అనగా ఉదకపర్యన్తముపోయి, మిథః = పరస్పరము, నమిలేతామ్ = కలియవా? కిన్తు = కాని, అనయోః = ఈ, దృశోః = నేత్రములకు, ప్రయాణే = దూరప్రయాణమందు, శ్రవఃకూపనిపాతభీత్యా; శ్రవః = చెవులనెడి, కూప = బావులయందు, నిపాత = పడుటవలని, భీత్యా = భయముచే, విఘ్నః = విఘ్నము, కృతః = చేయఁబడినది, నస్యాచ్చేత్ = కానిచో, (కలియవచ్చును)

వి॥ కర్ణాన్తవిశ్రాన్తములైన నేత్రములకు కూపపాతభయ కారణము లేక పోయినను, భయకారణముఁ జెప్పుటవలన నుత్ప్రేక్ష.

"శ్రవఃకూప" యనికర్ణములను కూపముతో రూపించుటవలన రూపకము.

ఆయుత్ప్రేక్ష, రూపకముచే నుజ్జీవితము గాన నా రెంటికిని సంకరము.

సమాసములు :

చపలస్వభావే : చపలః స్వభావః యయో స్తే = చపలస్వభావే.

శ్రవఃకూపనిపాతభీత్యా : శ్రవస్యేవ కూపౌ = శ్రవఃకూపౌ; శ్రవః కూపయోః నిపాతః = శ్రవఃకూపనిపాతః. శ్రవః కూపనిపాతాత్ భీతిః = శ్రవః కూపనిపాతభీతిః. తయా = శ్రవఃకూపనిపాతభీత్యా.

భావము :

చంచలస్వభావము గల దమయన్తి కన్నులు రెండును దూరము పోయి, మఱల కలియవా! కాని ప్రతినేత్రమునకుఁ బ్రక్కన చెవులనెడి బావులు కలవు. అందులో, పడుదమేమో యనెడి భయము విఘ్నము కల్పింపక యున్నచో తప్పక కలియవచ్చును. ఇచ్చట దమయన్తి కన్నులు కర్ణాన్తవిశ్రాన్తము లని చెప్పుటముఖ్యోద్దేశము కాన నవి కర్ణములువరకు వ్యాపించి యున్నందు వలన, కర్ణములవఱకు ప్రయాణము చేయుట సంభావితమైనది. పైగా నివి చంచల స్వభావములు. ఏల యనగా, స్వాభావికముగా సుందరీమణుల నేత్రములు చంచలము లనియు వారు చంచలాక్షు లనియు, చంచలత్వము గూడ వాని కొకసౌందర్యవిశేష మనియు కవిసమయము గాన నట్టి చంచలత్వమిట నుద్దేశింపఁబడినది. దూరమునకుఁ అనగా, నీటి వరకుననియు తాత్పర్యార్థము

చెప్పఁబడుట వలన, చంచలమైనవి, నీటియంచువరకుఁ బోయినచో నొకప్పుడా నీటఁబడుటకవకాశముండుసు కాన నావిధముగా కర్ణకూపజలములలోఁ బడక యున్నచో నా కన్నులు మఱల పూర్వస్థలములకుఁ దిరిగి వచ్చి కలియవచ్చు నని యాశయము ॥౩౪॥

శ్లో॥ కేదారభాజా శిశిరప్రవేశాత్
పుణ్యాయ మన్యే మృతముత్పలిన్యా ।
జాతా యత స్తత్కుసుమేక్షణేయం
యతశ్చ తత్కోరకదృక్ చకోరః॥ ౩౫

ప॥వి॥ కేదారభాజా । శిశిరప్రవేశాత్ । పుణ్యాయ । మన్యే । మృతం । ఉత్పలిన్యా । జాతా । యతః । తత్కుసుమేక్షణా । ఇయం । యతః । చ । తత్కోరకదృక్ । చకోరః ।

టీక కేదారభాజా; కేదార = క్షేత్రవిశేషమును, పర్వతవిశేషమును, భాజా = పొందిన, ఉత్పలిన్యా = కలువచే, శిశిరప్రవేశాత్ = శిశిరఋతువు ప్రవేశించుటవలన, పుణ్యాయ = ధర్మమునకై, మృతం = మరణించి నదిగా, మన్యే = తలంతును. యతః = ఏ, కేదారక్షేత్ర మరణము వలన (భైమీ = ఈదమయిన్తి) తత్కుసుమేక్షణా; తత్ = ఆకలువ యొక్క, కుసుమ = పుష్పములనెడి, ఈక్షణా = కన్నులుగలదిగా, జాతా = అయినదో, యతః = ఏపుణ్యమువలన చకోరః = చకోరము గూడ, తత్కోరకదృక్; తత్ = ఆకలువయొక్క, కోరక = మొగ్గల నెడి, దృక్ = నేత్రములు గలదిగా, జాతః = అయినది.

వి॥ ఇచ్చట కేదారక్షేత్రమునందు, శిశిరఋతువు ప్రవేశించుటచే సహజముగా కలువలు నశించును కాని యవి పుణ్యము నార్జించుటకై నశింపకపోయినను నశించినట్లు చెప్పుటమున నుత్ప్రేక్ష "మన్యే" యని వ్యఞ్జకమునుఁ బ్రయోగించుట వలన నది వాచ్యము.

## సమాసములు :

కేదారభాజా : కేదారం భజతీతి = కేదారభాక్. తయా = కేదారభాజా

శిశిర ప్రవేశాత్ : శిశిరస్య ప్రవేశః = శిశిరప్రవేశః; తస్మాత్ = శిశిర ప్రవేశాత్.

కుసుమేక్షణా : కుసుమే ఇవ ఈక్షణే యస్యాస్సా=కుసుమేక్షణా,

తత్కోరకదృక్ : తస్యాః కోరకౌ = తత్కోరకౌ; తత్కోరకావేవ దృశౌ యస్య సః = తత్కోరకదృక్.

భావము :

కేదార మను పుణ్యభూమియందు శిశిరఋతువు ప్రవేశింపగనే, పుణ్యమును సంపాదించుకొనుటకై కలువ మృతిఁ జెందిన దని తలంతుము. కేదారక్షేత్రమరణముచే నుత్తమజన్మ ప్రాప్తి యని శాస్త్రములు చెప్పుచున్నవి. అట్లు కేదారక్షేత్రమున మరణించుట వలని పుణ్యముచే కలువతీగెయొక్క పూలు దమయన్తికి కన్నులై యుత్తమజన్మ మందినవి. అట్లే యాకలువమొగ్గలు చకోరమునకు కన్నులై పుణ్యముచే ధన్యము లైనవి. కలువపూలు, దమయన్తికి కన్నులగుటకును, కలువమొగ్గలు చకోరమునకు కన్నులగుటకు కేదారక్షేత్ర మరణమువలని పుణ్యమే కారణము. అనగా దమయన్తి కన్నులు కలువ పూవులను మించిన సౌందర్యము గలవని యాశయము ॥౩౭॥

శ్లో॥ నాసాదసీయా తిలపుష్పతూణం
జగత్త్రియన్యస్తశరత్రయస్య ।
శ్వాసానిలామోదభరానుమేయాం
దధద్ద్విబాణీం కుసుమాయుధస్య॥ ౩౮

ప॥వి॥ నాసా । అదసీయా । తిలపుష్పతూణం । జగత్త్రియ న్యస్త శరత్ర యస్య । శ్వాసాని లామోదభవానుమేయాం । దధత్ । ద్విబాణీం । కుసుమాయుధస్య.

టీక॥ అదసీయా = ఆ దమయన్తికిసంబంధించిన, నాసా = నాసిక, జగత్త్రియ న్యస్తశరత్రయస్య; జగత్త్రియ = మూడులోకములయందును, న్యస్త = ప్రయోగింపఁబడిన, శరత్రయస్య = మూడు బాణములుగల్గిన, కుసుమా

యుధస్య = మన్మథునకు సంబంధించిన, శ్వాసానిలామోదభరానుమే యాం; శ్వాసానిల = నిట్టూర్పువాయువులయొక్క, భర = భారముచే; అనుమేయాం = ఊహింపఁదగిన, ద్విబాణీం = రెండుబాణములను; దధత్ = ధరించిన, తిలపుష్పతూణమ్; తిలపుష్ప = నూవులపూవనెడి; తూణమ్ = అమ్ములపొదిగా నుండెను.

వి॥ దమయన్తి నాసిక, మన్మథుని రెండు బాణములను వహించిన తిలపుష్ప మనెడి అమ్ములపొది గాకపోయిననను నట్లు సంభావింపఁబడినది గాన నుత్ప్రేక్ష.

## సమాసములు :

*అదసీయా :* అముష్యాః ఇయమ్ = అదసీయా.

*తిలపుష్పతూణమ్ :* తిలస్య పుష్పమ్ = తిలపుష్పమ్. తిలపుష్పమేవ తూణమ్ = తిలపుష్ప తూణమ్.

*జగత్త్రియన్యస్త శరత్రయస్య :* జగతాం త్రయం = జగత్త్రియం. శరాణాంత్రయం = శరత్రయమ్. జగత్త్రియే న్యస్తం = జగత్త్రియన్యస్తం. జగత్త్రియన్యస్తం శరత్రయం యస్య సః = జగత్త్రియన్యస్త శరత్రయః. తస్య = జగత్త్రియన్యస్త శరత్రయస్య.

*శ్వాసానిలామోదభరానుమేయామ్ :* శ్వాస ఏవ అనిలః = శ్వాసానిలః. ఆమోదస్య భరః = ఆమోద భరః. శ్వాసానిలస్య ఆమోద భరః = శ్వాసానిలా మోద భరః. శ్వాసానిలామోద భరేణ అనుమేయా = శ్వాసానిలామోద భరాను మేయా. తామ్ = శ్వాసానిలామోద భరానుమేయామ్.

*ద్విబాణీం :* ద్వయోః బాణయోః సమాహారః = ద్విబాణీ. తామ్ = ద్విబాణీమ్.

*కుసుమాయుధస్య :* కుసుమం ఆయుధః యస్య సః = కుసుమాయుధః. తస్య = కుసుమాయుధస్య.

## భావము :

ఈ దమయన్తి ముక్కు, మూడు లోకములలోను తన మూడు బాణము లనుఁబ్రయోగించిన పిదప మిగిలిన తన రెండు బాణములను, మన్మథుఁడు

నిలవయుంచి దాచుకొనిన నూగుపూ వనెడి యమ్ముల పొదియా, యని భావింపఁబడినది. ఆ దమయన్తి ముక్కు నూగు పూవువలె నుండెను. ఆమె యుత్తమజాతికిఁ చెందిన స్త్రీ యగుటవలన, దానినుండి సువాసన వెలువడు చుండెను. ఆ సువాసనచే, మన్మథునికి చెందిన రెండు బాణములనెడి పుష్పములందుంచబడినదిగా భావింపఁబడినదని యాశయము. మన్మథునికి బాణములైదు. ఇవి యైదుపుష్పములు. అందు మూడు పుష్పబాణములు మూడు లోకములపై ప్రయోగింపఁబడినవి. తక్కిన రెండు బాణములును, దమయంతి నాసిక యను నూగుపూవువంటి యమ్ముల పొదియందు దాచఁబడినదా యని యందుండి వెల్వడు పరిమళముచే నూహింపఁబడినదని సారాంశము. ॥౩౮॥

శ్లో॥ బంధూక బంధూ భవదేతదస్యా
ముఖేందు నాఽనేన సహోజ్జిహానా।
రాగశ్రియా శైశవ యౌవనీయాం
స్వామాహ సన్ధ్యామ ధరోష్ఠలేఖా॥ ౩౭

ప॥వి॥ బంధూకబంధూ భవత్ । ఏతత్ । అస్యాః । ముఖేందునా । అనేన । సహ । ఉజ్జిహానా । రాగశ్రియా । శైశవయౌవనీయాం । స్వమ్ । ఆహ । సన్ధ్యామ్ । అధరోష్ఠలేఖా.

టీక॥ అస్యాః = ఈ దమయన్తియొక్క, అధరోష్ఠ లేఖా; అధరోష్ఠ = పెదవుల యొక్క, లేఖా = రేఖ, అనేన = ఈ, ముఖేందునాసహ = ముఖచంద్రుని తోఁడ, ఉజ్జిహానా = ఉత్పన్నమైనదై, బంధూకబంధూభవత్; బంధూక = మంకెనపూవునకు, బంధూ భవత్ = బంధువైన, అనగా సమానమైన, ఏతత్ = ఎదుటనున్న, స్వం = తనను, రాగశ్రియా = ఎఱ్ఱఁదనపు కాంతిచే, శైశవయౌవనీయాం; శైశవ = బాల్యమునకు, యౌవనీయాం = యౌవనమునకును సంబంధించిన, సంధ్యాం = సంధ్య యని అనగా నా రెండు వయస్సుల సంధిలో కల్గినదిగా, ఆహ = చెప్పు చున్నది.

వి॥ అహోరాత్ర సంధియం దేర్పడిన సంధ్య వలె, శైశవ యౌవనముల సంధియందు నేర్పడినది సంధ్య కాకపోయినను సంధ్యగా తన్నుఁ

జెప్పుకొనుచున్న దనుటవలన నుత్ప్రేక్ష. సంధ్యాకాల మందెట్లు ఏఱ్ఱదన ముండునో, యట్లే యీ వయస్సంధులయందును నధరోష్ఠములోని యెఱ్ఱదనముండుటవలన నిది యీ విధముగా నుత్ప్రేక్షితము,

## సమాసములు :

*బంధూకబంధూ భవత్ :* అబంధుః బంధుః భవత్ = బంధూ భవత్. బంధూకస్య బంధూ భవత్ = బంధూకబంధూ భవత్.

*ముఖేందునా :* ముఖమేవ ఇందుః = ముఖేందుః. తేన = ముఖేందునా.

*రాగశ్రియా :* రాగస్య శ్రీః = రాగశ్రీః. తయా = రాగశ్రియా.

*శైశవయౌవనీయామ్ :* శైశవం చ యౌవనం చ = శైశవ యౌవనే. శైశవ యౌవనయోరియమ్ = శైశవయౌవనీయా. తామ్ = శైశవయౌవనీయామ్.

*అధరోష్ఠలేఖా :* అధరశ్చ ఓష్ఠశ్చ = అధరోష్ఠమ్. అధరోష్ఠస్య లేఖా = అధరోష్ఠ లేఖా.

## భావము :

ఈ దమయన్తియొక్క యధరోష్ఠరేఖ అనగా రెండు పెదవుల రేఖ వయస్సువలన మిక్కిలి యెఱ్ఱఁదనము పొందినది. ఆమె ముఖము చంద్రునితోఁ బోలి యున్నది. కాన నీ యధరోష్ఠరేఖ యామె ముఖ చంద్రునితో నుదయించినదై మంకెన పూవునుఁ బోలిన యెఱ్ఱదనమును వహించి తన్ను (అనగా అధరోష్ఠరేఖను) సంధ్య యని చెప్పుకొనుచున్నది. రేయింబవళ్ల సంధియందు చంద్రోదయముండును; ఎఱ్ఱదనము నుండును. అట్లే యిట దమయన్తియొక్క ముఖచంద్రోదయము, ఆమెయొక్క యధరోష్ఠములయందు నెఱ్ఱదనము నున్నది. కొన నామెయొక్క బాల్య యౌవనములకు సంధ్యగా నామె యెఱ్ఱటి పెదవుల రేఖ భావింపఁబడినది. అనగా నా దమయన్తి బాల్యయౌవనముల సంధియం దున్నదని భావము. ॥౩౨॥

శ్లో॥ అస్యా ముఖేందోరధరః సుధాభూ
ర్బిమ్బస్య యుక్తః ప్రతిబిమ్బ ఏషః ।

తస్యాథవా శ్రీర్ద్రుమభాజి దేశే
సమ్భావ్యమానస్య తు విద్రుమే సా ॥౩౮॥

ప॥వి॥ అస్యాః । ముఖేంధోః । అధరః । సుధాభూః । బిమ్బస్య । యుక్తః । ప్రతిబిమ్బః । ఏషః । తస్య । అథవా । శ్రీః । ద్రుమభాజి । దేశే । సమ్భావ్యమానస్య । తు । విద్రుమే । సా.

టీక॥ అస్యాః = ఈ దమయంతియొక్క, ఏషః = ఈ, అధరః = క్రింది పెదవి, ముఖేందోః = ముఖచంద్రునియొక్క, సుధాభూః; సుధా = అమృతమునుండి, భూః = ఉత్పన్నమైన, బిమ్బస్య = దొండపండునకు, ప్రతిబిమ్బః = సమానమైనది, యుక్తః = ఇది యుక్తము. తస్య = ఆ దొండపండుయొక్క, శ్రీః = శోభ, ద్రుమభాజి; ద్రుమ = చెట్లను, భాజి = పొందినట్టి ప్రదేశమందు, సమ్భావ్యమానా = భావింపఁబడు చున్నది. అస్య = ఈ పెదవియొక్క, సా = ఆశోభ, విద్రుమే = పగడ మందును, (చెట్లు లేని స్థలములయందును), సమ్భావ్యమానా = భావింపఁ బడుచున్నది.

సమాసములు :

ముఖేందోః : ముఖమేవ ఇందుః = ముఖేందుః. తస్య = ముఖేందోః.

సుధాభూః : సుధాయాః భవతీతి = సుధాభూః.

ద్రుమభాజి : ద్రుమాన్ భజతీతి = ద్రుమభాక్. తస్మిన్ = ద్రుమభాజి.

విద్రుమే : విగతాః ద్రుమాః యస్మిన్ సః = విద్రుమః. తస్మిన్ = విద్రుమే.

భావము :

దమయంతి ముఖము చంద్రుడు గాన, నామె ముఖమునందలి క్రింది పెదవి యా ముఖచంద్రునినుండి స్రవించు నమృతమం దుద్భవించిన దొండ పండునకు సమానము. ఇది యుక్తమే. ఏల యనగా, అసలు దొండపండు యొక్క శోభ, దొండచెట్లు కల ప్రదేశమందే యుండును. కాని యీ ముఖ

చంద్రునందలి పెదవియను దొండపండుశోభ విద్రుమములయందు అనగా - ద్రుమములులేని ప్రదేశములయందు, విద్రుమములయందు, అనగా పగడముల యందు, కానవచ్చును. అనగా నీమె పెదవి పగడముల వలె నెఱ్ఱగ నున్న దని భావము. ॥౩౮॥

శ్లో॥ జానేఽతిరాగాది దమేవ బిమ్బం
బిమ్బస్య చ వ్యక్తమితోఽధరత్వమ్ ।
ద్వయోర్విశేషావగమాక్ష మాణాం
నామ్ని భ్రమోఽభూదనయోర్జనానామ్ ॥ ౩౯

ప॥వి॥ జానే । అతిరాగాత్ । ఇదమ్ । ఏవ । బిమ్బం । బిమ్బస్య । చ । వ్యక్తమ్ । ఇతః । అధరత్వమ్ । ద్వయోః । విశేషావగమాక్షమాణాం। నామ్ని । భ్రమః । అభూత్ । అనయోః । జనానామ్.

టీక॥ అతిరాగాత్ = ఎక్కువ ఎఱ్ఱదనముండుటవలన, ఇదం = ఎదుట నున్న దానినే, బిమ్బం = బిమ్బమను పేరున కర్హమైన దానినిగా, అనగా దొండపండుగా, జానే = తెలుసుకొనుచున్నాను. బిమ్బస్యచ = అసలు దొండపండునకో, ఇతః = ఈ పెదవినుండి, అధరత్వం = హీనత్వము (ఓష్ఠత్వము) వ్యక్తం = స్పష్టము. ద్వయోః అనయోః = ఈ అధర బిమ్బములను నామముల విషయమునందు, విశేషావగమాక్షమాణామ్; విశేష = భేదమును, అవగమ = తెలిసికొనుటయందు, అక్షమాణాం = అసమర్థులైన, జనానాం = జనులకు, నామ్ని = పేరునందు, భ్రమః = భ్రాన్తి, అభూత్ = ఏర్పడినది. జానే = ఇట్లు తెలుసుకొనుచున్నాను.

వి॥ దమయంతి పెదవి దొండపండు కాదు. దొండపండు పెదవికాదు, అని వాస్తవముగా తెలిసియున్నను నది తెలియలేదనుచును, వాని పేర్లకు స్పష్టముగా భేదము తెలియుచున్నను తెలియలేదనుచును చెప్పుటవలన నుత్ప్రేక్ష.

**సమాసములు :**

అతిరాగాత్ : అత్యన్తం రాగః = అతిరాగః తస్మాత్ = అతిరాగాత్.

విశేషాఽవగమాఽక్షమాణామ్ : విశేషస్య అవగమః = విశేషాఽవగమః. న క్షమాః = అక్షమాః. విశేషావగమే అక్షమాః = విశేషావగమాక్షమాః. తేషాం = విశేషావగమాక్షమాణామ్.

భావము :

ఎక్కువ ఎఱ్ఱఁదనమునుఁ గల్గి యుండుటవలన దమయంతి పెదవియే దొండపండు. అసలు దొండపండు దీనికంటె హీనమైనది. అనగా దానికి దీని కంటె నధరత్వము (హీనత్వము) (ఓష్ఠత్వము) స్పష్టమైనది. ఇది వాస్తవ స్థితి. కాని యిది యిట్లుండగా; అధర-బింబము లను రెండు పేర్లలో విశేషముఁ దెలియనివారికి, అనగా "ఇది దీనికి పేరు, ఇది దీనికి పేరు" అనివిశేషము తెలియనివారికి పేరు నందు భ్రమమేర్పడి వారు దమయంతి పెదవిని-అధరమనియు దొండపండును బింబ మనియు వ్యవహరింపఁదొడగిరి, కాని వాస్తవములో దమయంతి పెదవి బింబమనియు దొండపండు అధర మనియు వ్యవహరింప పలయు నని భావింతును. ॥౩౯॥

శ్లో॥ మధ్యోపకణ్ఠావ ధరోష్ఠభాగౌ
భాతః కిమప్యుచ్ఛ్వ సితౌయదస్యాః ।
తత్స్వప్న సంభోగ వితీర్ణద న్త
దంశేన కిం వా న మయాఽపరాద్ధమ్॥ ౪౦

ప॥వి॥ మధ్యోపకణ్ఠౌ । అధరోష్ఠభాగౌ । భాతః । కిమ్ । అపి । ఉచ్ఛ్వసితౌ । యత్ । అస్యాః । తత్ । స్వప్నసంభోగవితీర్ణదన్తదంశేన । కిం । వా । న । మయా । అపరాద్ధమ్.

టీక॥ యత్ = ఎందువలన, అస్యాః = ఈ దమయంతికి సంబంధించిన, మధ్యోపకణ్ఠౌ; మధ్య = అధర మధ్య భాగమునకు, ఉపకణ్ఠౌ = సన్నిహితములైన, అధరోష్ఠభాగౌ; అధరోష్ఠ = పెదవియొక్క, భాగౌ = రెండు ప్రక్కలు, కిమపి = కొంచెముగా, ఉచ్ఛ్వసితౌ = ఉబ్బినవై, భాతః = స్ఫురించుచున్నవో, తత్ = అందువలన, స్వప్నసంభోగవితీర్ణ దన్తదంశేన; స్వప్నసంభోగ = స్వప్నమందలి రతియందు,

వితీర్ణ = ఈయఁబడిన, దన్తదంశేన = దన్తక్షతముగల్గిన, మయా = నా చేత, నాऽపరాద్ధంకింవా = అపరాధము చేయఁబడలేదా?

వి॥ స్వప్నమందు దన్తక్షతము గావింపఁబడక పోయినను, గావింపఁబడినట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష.

## సమాసములు :

మధ్యోపకణ్ఠౌ : మధ్యస్య ఉపకణ్ఠౌ = మధ్యోపకణ్ఠౌ.

అధరోష్ఠభాగౌ : అధరశ్చాసౌ = ఓష్ఠశ్చ = అధరోష్ఠః. అధరోష్ఠస్య భాగౌ = అధరోష్ఠభాగౌ.

స్వప్నసంభోగవితీర్ణదన్తదంశేన: స్వప్నే సమ్భోగః = స్వప్నసమ్భోగః. స్వప్నసమ్భోగే వితీర్ణః = స్వప్నసమ్భోగవితీర్ణః. దన్తానాందంశః = దన్తదంశః. స్వప్నసమ్భోగవితీర్ణః దన్తదంశః యేన సః = స్వప్నసంభోగ వితీర్ణ దన్త దంశః. తేన = స్వప్న సంభోగవితీర్ణ దన్తదంశేన.

## భావము :

ఈ దమయన్తి పెదవియొక్క మధ్యభాగమునకు సమీపమందలి యిఱు ప్రక్కలు కొంచె ముబ్బి యున్నవి. ఇట్లు రెండు అంచులు కొంచెము లావుగ నుండుట యుత్తమ సాముద్రిక లక్షణము. కాని యది యచ్చట మరొకవిధముగ నలునిచే భావింపఁబడుచున్నది. తాను దమయంతితో స్వప్నసంభోగమునందు గావించిన దన్తక్షతమువలన నిది యేర్పడినదా? అట్టి పని గావించి నేనిం దపరాధము నొడిగట్టుకొంటినా? యని నలునిచే భావింపఁబడినది. ॥౮౦॥

శ్లో॥ విద్యా విదర్భేన్ద్రసుతాధరోష్ఠే
నృత్యన్తి కత్యన్తరభేద భాజః ।
ఇతీవ రేఖాభిరపశ్రమాస్తాః
సంఖ్యాతవాన్ కౌతుకవాన్ విధాతా॥ ౮౧

ప॥వి॥ విద్యాః । విదర్భేన్ద్రసుతాధరోష్ఠే । నృత్యన్తి । కతి । అన్తరభేదభాజః । ఇతి । ఇవ । రేఖాభిః । అపశ్రమః । తాః । సంఖ్యాతవాన్ । కౌతుకవాన్ । విధాతా.

టీక॥ కౌతుకవాన్ = కుతూహలముగల్గిన, విధాతా = బ్రహ్మ, విదర్భేన్ద్రసుతాధరోష్ఠే; విదర్భేన్ద్ర = భీమరాజుయొక్క, సుతా = పుత్రికయైన దమయంతియొక్క, అధరోష్ఠే = క్రింది పెదవియందు; కతి = ఎన్ని, విద్యాః = విద్యలు, అన్తః = లోపల, అభేదభాజః = అభేదమునుం బొందినవై, నృత్యన్తి = విహరించుచున్నవి, ఇతీవ = అని తెలుసుకొనం గోరికతో నోయనునట్లు, అపశ్రమః = శ్రమలేనివాడై, తాః = ఆ విద్యలను, రేఖాభిః = గీతలచే, సంఖ్యాతవాన్ = ఎంచినాడాయేమి.

వి॥ ఇచ్చట దమయన్తి పెదవులపైని రేఖలు సౌందర్య హేతువులుగా నున్నను వానిని, ఆమె యొక్క పెదవిపై నెన్ని విద్య లున్నవో లెక్క పెట్టుటకై బ్రహ్మ గీచుకొనిన గీతలుగా భావింపఁబడుటవలన నిట నుత్ప్రేక్ష.

## సమాసములు :

*విదర్భేన్ద్రసుతాధరోష్ఠః* విదర్భాణామిన్ద్రః = విదర్భేన్ద్రః. విదర్భేన్ద్రస్య సుతా = విదర్భేన్ద్రసుతా. విదర్భేన్ద్ర సుతాయాః అధరోష్ఠః = విదర్భేన్ద్ర సుతాఽధరోష్ఠః. తస్మిన్ = విదర్భేన్ద్ర సుతాధరోష్ఠే.

*అన్తరభేదభాజః :* అన్తః అభేదః = అన్తరభేదః. అన్తరభేదం భజన్తీతి = అన్తరభేదభాజః.

*అపశ్రమః :* అపగతః శ్రమః యస్మాత్సః = అపశ్రమః.

*కౌతుకీ :* కౌతుకమస్య అస్తీతి = కౌతుకీ.

## భావము :

ఈ దమయన్తికి పెదవులపై కొన్ని రేఖలు విలసిల్లుచున్నవి. అవి యామెయొక్క సౌందర్యహేతువులు. కాని అవి యిప్పుడు మఱొక విధముగా భావింపఁబడుచున్నవి. బ్రహ్మ కుతూహలముతో, నామె పెదవిపైన విద్యల

నెంచఁగోరినవాఁడై రేఖలు గీచుకొని యా విద్యల నెంచినారా యని భావింపఁ బడినది. ॥౪౧॥

శ్లో॥ సమ్భుజ్యమానాఽద్య మయా నిశాన్తే
స్వప్నేఽనుభూతా మధురాధరేయమ్ ।
అసీమ లావణ్య రదచ్ఛదేత్థం
కథం మయైవ ప్రతిపద్యతే వా ॥౪౨॥

ప॥వి॥ సమ్భుజ్యమానా । అద్య । మయా । నిశాన్తే । స్వప్నే । అనుభూతా । మధురాధరా । ఇయమ్ । అసీమలావణ్యరదచ్ఛదా । ఇయం । కథం । మయా । ఏవ । ప్రతిపద్యతే । వా.

టీక॥ ఇయం = ఈ దమయంతి. అద్య = ఇప్పుడు, మయా = నాచే, నిశాన్తే = వేకువన, స్వప్నే = స్వప్నమందు, సమ్భుజ్యమానా = సంభోగింపఁ బడుచు, మధురాధరా = మనోహరమైన పెదవి గలదై, అనుభూతా = చూడఁబడినది. ఇత్థం = ఈ విధముగా, స్వప్నదృష్టయైన, అసీమ లావణ్యరదచ్ఛదా; అసీమ = ఎల్లలేని, లావణ్య = సౌందర్యముగల, రదచ్ఛదా = పెదవిగల్గినదై, కథంవా = ఎట్లు, ప్రతిపద్యతే = చూడఁ బడును? ఆశ్చర్యము.

సమాసములు:

నిశాన్తే = నిశాయాః అన్తః = నిశాన్తః. తస్మిన్ = నిశాన్తే.

మధురాధరా : మధురః ఆధరః యస్యాస్సా = మధురాధరా.

అసీమలావణ్యరదచ్ఛదా : అవిద్యమానా సీమా యస్య తత్ = అసీమం. అసీమం లావణ్యం యయోస్తౌ = అసీమలావణ్యౌ. అసీమలావణ్యౌ రదచ్ఛదౌ యస్యాస్సా = అసీమలావణ్యరదచ్ఛదా.

**భావము :**

వేకువ స్వప్నమున తియ్యని పెదవి గల యీ దమయన్తి సంభోగింపఁ బడుచు చూడఁబడినది. జాగ్రద్దశయందుఁ గూడ నెల్ల లేని పెదవుల యందముఁ

గల్గిన యామె యట్లే చూడఁబడుచున్నది. ఇది యాశ్చర్యము. సాధారణముగా వేకువన వచ్చెడి స్వప్నములు సత్యఫలముల నిచ్చును గాన, నా దమయంతిని నలుడెట్లు స్వప్నమునఁ జూచెనో, యట్లే యిప్పుడు చూడగల్గెను. మఱియు, స్వప్నమున మాధుర్యయుక్త మైన యధరము గల యీ దమయంతి జాగ్రద్దశ యందు లావణ్యయుక్తమైన పెదవిగలదిగాఁ జూడబడినందువలన నాశ్చర్యము. మాధుర్య మనగా తీపు. లావణ్యమనగా ఉప్పఁదనము. ఈ రెండును విరుద్ధ రసములు. ఇవి యొక పెదవియందే గానవచ్చుట ఆశ్చర్యము, అని భావము. ॥౪౨॥

శ్లో॥ యది ప్రసాదీకురుతే సుధాంశో
రేషా సహస్రాంశమపి స్మితస్య।
తత్కౌముదీనాం కురుతే తమేవ
నిమిత్య దేవః సఫలం స జన్మ॥ ౪౩॥

ప॥వి॥ యది । ప్రసాదీకురుతే । సుధాంశోః । ఏషా । సహస్రాంశమ్ । అపి । స్మితస్య । తత్ । కౌముదీనాం । కురుతే । తమ్ । ఏవ । నిమిత్య । దేవః । సఫలం । సః । జన్మ.

టీక॥ ఏషా = ఈ దమయన్తి, స్మితస్య = చిఱునగవుయొక్క, సహస్రాంశ మపి = వేయిలోనొకభాగము నైనను, సుధాంశోః = చంద్రునకు, ప్రసాదీకురుతేయది = ఇచ్చినచో, తత్ = అప్పుడు, సః = ఆ, దేవః = చంద్రుఁడు, కౌముదీనాం = తన వెన్నెలల యొక్క, జన్మ = జన్మమును, తమేవ = ఆ చిఱునగవులోని భాగమును, నిమిత్య = ఉంచి, సఫలం = సఫలము, కురుతే = చేయును.

వి॥ ఇచ్చట వెన్నెలలకు స్మితాంశముతో సంబంధము లేకపోయినను, సంబంధముఁ గల్పించుటవలన నతిశయోక్త్యలఙ్కారము.

సమాసములు:

సహస్రాంశమ్ : సహస్రస్య అంశః = సహస్రాంశః. తమ్ = సహస్రాంశమ్.

భావము :

ఈ దమయన్తి తన చిఱునగవులోని సహస్రతమ భాగమును, చన్ద్రి దేవున కొసంగిచచో, నా చంద్రుఁడు దానిని తన వెన్నెలలలో నుంచుకొని వానికి సాఫల్యము ధన్యతను సంపాదించును. సాధారణ మైన బావి నీటియందు కొంచెము గంగాజలమునుఁ గల్పినచో నది యంతయు గంగాజలమై సఫలతను, ధన్యతను గాంచును. అట్లే వెన్నెలలయందు, దమయన్తి చిఱునగవులోని స్వల్పాంశమునుఁ గల్పినచో, నదియు సాఫల్యమును, రమ్యతనుఁ బొందు నని యాశయము. ॥౪౩॥

శ్లో॥ చన్ద్రాధికైతన్ముఖచన్ద్రికాణాం
దరాయతం తత్కిరణాత్ ఘనానామ్।
పురః పరిస్రస్తపృషద్ద్వితీయం
రదావలిద్వంద్వతి బిన్దువృన్దమ్॥ ౪౪

ప॥వి॥ చన్ద్రాధికైత న్ముఖ చన్ద్రికాణాం । దరాయతం । తత్కిరణాత్ । ఘనానాం । పురః । పరిస్రస్త పృషత్ ద్వితీయం । రదావళి ద్వన్ద్వతి । బిన్దు వృన్దమ్.

టీక॥ తత్కిరణాత్; తత్ = ఆ చన్ద్రునియొక్క, కిరణాత్ = కిరణమువలన, అనగా చన్ద్రికాన్తివలన, ఘనానాం = దట్టములైన, చన్ద్రాధికైతన్ముఖ చన్ద్రికాణాం; చన్ద్ర = చన్ద్రునికంటె, అధిక = అధికములైన, ఏతన్ముఖ చన్ద్రికాణాం = ఈమె ముఖముయొక్క వెన్నెలలకు సమ్బంధించిన, దరాయతం; దర = కొంచెము, ఆయతం = పొడవైన, పురః పరిస్రస్త పృషత్; పురః = మొదట, పరిస్రస్త = జారిపడిన, పృషత్ = బిందువులు గల్గిన, ద్వితీయం = రెండవదైన, బిందువృన్దం = బిందువులసమూహము, రదావళి ద్వంద్వతి = దన్త పంక్తుల జంటగా నాచరించుచున్నది.

వి॥ మొదట జారిపడిన బిందుపఙ్క్తి, దిగువ దన్తపఙ్క్తి యనియు, తర్వాత జారి పడిన బిందుపఙ్క్తి, పైని దన్తపఙ్క్తి యనియు, భావింపఁబడుటవలన నుత్ప్రేక్ష.

**సమాసములు :**

చన్ద్రాధికై తన్ముఖ చన్ద్రికాణాం : చన్ద్రాత్ అధికం=చన్ద్రాధికం. ఏతస్యాః ముఖం=ఏతన్ముఖం. చన్ద్రాధికం చ తత్ ఏతన్ముఖం. చ=చన్ద్రాధికై తన్ముఖం. చన్ద్రాధికై తన్ముఖస్య చన్ద్రికాః=చన్ద్రాధికై తన్ముఖ చన్ద్రికాః. తాసాం=చన్ద్రాధికై తన్ముఖ చన్ద్రికాణాం.

దరాయతమ్ : దరమ్ ఆయతమ్=దరాయతమ్.

తత్కిరణాత్ : తస్య కిరణః=తత్కిరణః. తస్మాత్=తత్కిరణాత్.

పురఃపరిస్రస్తపృషత్ : పురః పరిస్రస్తాః = పురఃపరిస్రస్తాః. పురఃపరిస్రస్తాః పృషతః యస్య తత్=పురః పరిస్రస్త పృషత్.

రదావళీ ద్వన్ద్వతి : రదానామా వళయః=రదావళయః. రదావళీనాం ద్వన్ద్వమ్=రదావళి ద్వన్ద్వమ్. రదావళి ద్వన్ద్వమివ ఆచరతీతి =రదావళి ద్వన్ద్వతి.

బిందువృన్దమ్ : బిన్దూనాం వృన్దమ్=బిన్దువృన్దమ్.

**భావము :**

చన్ద్రకాన్తి కంటెను, దమయంతి ముఖచన్ద్రికలు మిక్కిలి ఘనములు. వానికి సంబంధించిన బిందువులు తొలుత జారినవి. అవి యా దమయన్తికి, క్రింది వరుసయందలి, దన్తపఙ్క్తి అయినది. తర్వాత జారిన బిన్దుపఙ్క్తి యామెకు మొదటి వరుసకుఁ జెందిన దంతపఙ్క్తియైనది. మొదట జారిన బిందువులు సూక్ష్మములు గాన నవి దిగువ దన్తపఙ్క్తి యైనవి. తర్వాత జారిన బిందువులు పెద్దవి గాన నవి పై దన్తపఙ్క్తి యైనవి. కాన క్రింది దన్తపఙ్క్తికంటె, పై దన్తపఙ్క్తి కొంచెము పెద్దదిగా నుండును. దన్తములు కొంచెము పొడవుగను, కొంచెము చిన్నవిగను, గట్టిగ నుంటుట సాముద్రిక లక్షణము. అట్టి లక్షణములతో నామె దన్తములు కూడి యున్న వని యాశయము. ॥౪౪॥

శ్లో॥ సేయం మమైతద్విరహార్తిమూర్ఛా
తమీవిభాతస్య విభాతి సన్ధ్యా ।
మహేన్ద్రికాష్ఠాగతరాగకర్త్రీ
ద్విజైరమీభిః సముపాస్యమానా॥ ౪౦

ప॥వి॥ సా । ఇయం । మమ । ఏతద్విరహార్తి మూర్ఛా తమీ విభాతస్య । విభాతి । సన్ధ్యా । మహేన్ద్రి కాష్ఠాగత రాగకర్త్రీ । ద్విజైః । అమీభిః। సముపాస్యమానా.

టీక॥ మహేన్ద్రి కాష్ఠాగత రాగకర్త్రీ; మహేన్ద్రి = ఇంద్రునియొక్క, కాష్ఠా = ఆధిక్యమును, గత = పొందిన, రాగ = అనురాగమునకు, మహేన్ద్రి కాష్ఠా = ఇంద్రుని దిక్కైన తూర్పును, గత = పొందిన, రాగ = ఎఱ్ఱదనమునకు, కర్త్రీ = ఉత్పాదకురాలును, అమీభిః = ఈ, ద్విజైః = దన్తములచే, విప్రులచే, సముపాస్యమానా = సేవింపఁబడుచున్న, సా = ఆ, ఇయం = ఈ దమయన్తి, మమ = నాకు, ఏతద్విరహార్తిమూర్ఛా తమీవిభాతస్య; ఏతత్ = ఈ దమయన్తియొక్క, విరహార్తి = విరహబాధచేఁ గల్గిన, మూర్ఛా = మూర్ఛయనెడి, తమీ = రాత్రియొక్క, విభాతస్య = ప్రభాతమునకు సంబంధించిన, సంధ్యా = ప్రాతఃసంధ్యగా, విభాతి = ప్రకాశించుచున్నది.

వి॥ సన్ధ్యకు సంబంధించిన ధర్మము తోటి సంబంధము ననుసరించి సంధ్యగా దమయన్తి యుత్ప్రేక్షింపబడుటవలన నిచ్చట నుత్ప్రేక్ష.

సమాసములు :

ఏతద్విరహార్తిమూర్ఛాతమీవిభాతస్య: ఏతస్యాః విరహార్తిః = ఏతద్విరహార్తిః. ఏతద్విరహార్త్యా మూర్ఛా = ఏతద్విరహార్తిమూర్ఛా. ఏతద్విరహార్తిమూర్ఛైవ తమీ = ఏతద్విరహార్తిమూర్ఛాతమీ. ఏతద్విరహార్తిమూర్ఛాతమ్యాః విభాతం = ఏతద్విరహార్తిమూర్ఛాతమీవిభాతం. తస్య = ఏతద్విరహార్తిమూర్ఛాతమీవిభాతస్య.

సన్ధ్యా : సంధౌ భవా = సంధ్యా.

మహేన్ద్రికాష్ఠాగతరాగకర్త్రీ : మహేన్ద్రిస్య కాష్ఠా = మహేన్ద్రికాష్ఠా. మహేన్ద్రికాష్ఠాం గతః = మహేన్ద్రికాష్ఠాగతః. మహేన్ద్రికాష్ఠాగతశ్చాసౌ రాగశ్చ = మహేన్ద్రి కాష్ఠాగతరాగః. మహేన్ద్రికాష్ఠాగతరాగస్య కర్త్రీ = మహేన్ద్రికాష్ఠాగతరాగకర్త్రీ.

భావము :

ఈ దమయంతి మహేన్ద్రుని వఱకు ననురాగము నుత్పత్తిఁ జేసి ఈ ద్విజములచే ననగా దన్తములచేతను (విప్రులచేతను) సేవింపఁబడుచున్నదై, నాకు విరహబాధవలన గల్గిన మూర్ఛ యనెడి రాత్రియొక్క ప్రాతఃకాలమునకు సన్ధ్య యగు గాఁత. సన్ధ్య, మహేన్ద్రుని దిక్కైన తూర్పునం దెఱ్ఱదనమును గల్గించును. దమయంతి మహేన్ద్రుని వఱకు ననురాగము గల్గించినది. సన్ధ్య ద్విజులచే సేవింపఁబడును. ఈమె దన్తములచే సేవింపఁబడును. అనగా చక్కటి దన్త పఙ్క్తి గల దని యర్థము. ఇట్లు దమయన్తికి సన్ధ్యతో పోలికలు సూచింపఁబడినవి. ॥౪౫॥

శ్లో॥ రాజౌ ద్విజానామిహ రాజదన్తాః
సంబిభ్రతి శ్రోత్రియవిభ్రమం యత్।
ఉద్వేగరాగాదిమృజావదాతా
శ్చత్వార ఏతే తదవైమి ముక్తాః॥ ౪౬

ప॥వి॥ రాజౌ । ద్విజానామ్ । ఇహ । రాజదన్తాః । సంబిభ్రతి । శ్రోత్రియవిభ్రమం । యత్ । ఉద్వేగరాగాదిమృజావదాతాః । చత్వారః । ఏతే । తత్ । అవైమి । ముక్తాః.

టీక॥ యత్ = ఎందువలన, ఇహ = ఈ దమయన్తి యందు; ద్విజానాం = దన్తములయొక్క (విప్రులయొక్క) రాజౌ = పఙ్క్తియందు, ఉద్వేగరాగాదిమృజావదాతాః; ఉద్వేగ = పోకయొక్క, రాగాది = ఎఱ్ఱఁదనముఁమున్నగువానిని, మృజా = శోధించుటచేతను, ఉద్వేగ = ఆసక్తివలని, రాగ = విషయములయందలి కోరికను, మృజా = శోధించుటచేతను, (కడిగివేయుటచేతననియర్థము) అవదాతాః = శుద్ధములైన, ఏతే = ఈ, చత్వారః = నాలుగైన, రాజదన్తాః = శ్రేష్ఠమైనదన్తములు, శ్రోత్రియ

విభ్రమం = వేదపండితులను భ్రాన్తిని (శోభను), సంబిభ్రతి = భరించుచున్నవి. తత్ = అందువలన, ముక్తాః = ముత్యములుగా (మోక్షముఁ బొందిన వారుగను) అవైమి = తెలుసుకొనుచున్నాను.

వి॥ నాలుగు దంత శ్రేష్ఠములు ముత్యములు గాక పోయినను ముత్యములుగ నుత్ప్రేక్షింపఁబడినవి గాన నుత్ప్రేక్ష.

## సమాసములు :

*రాజదన్తాః* : దన్తానాం రాజానః = రాజదన్తాః.

*శ్రోత్రియవిభ్రమః* : శ్రోత్రియాణాం విభ్రమః = శ్రోత్రియవిభ్రమః. తమ్ = శ్రోత్రియవిభ్రమమ్.

*ఉద్వేగరాగాదిమృజావదాతాః* : ఉద్వేగస్య రాగః = ఉద్వేగరాగః. ఉద్వేగరాగః ఆదిః యస్య సః = ఉద్వేగరాగాదిః. ఉద్వేగరాగాదేః మృజా = ఉద్వేగరాగాది మృజా. ఉద్వేగరాగాదిమృజయా అవదాతాః = ఉద్వేగరాగాది మృజావదాతాః. (అథవా, ఉద్వేగశ్చ రాగశ్చ = ఉద్వేగరాగౌ. ఉద్వేగరాగౌ ఆదీ యేషాం తే = ఉద్వేగరాదాదయః. ఉద్వేగరాగాదీనాం మృజా = ఉద్వేగరాగాదిమృజా. ఉద్వేగరాగాదిమృజయా అవదాతాః = ఉద్వేగరాగాదిమృజావదాతాః).

## భావము :

దమయంతి పంటి వరుసలో, నాలుగు శ్రేష్ఠములైన దన్తములు గలవు. వాని యంపలి యుద్వేగరాగాదులు అనగా వక్కవలని ఎఱ్ఱఁదనము మున్నగునవి కడిగివేయఁబడుటచేతను, (ఆసక్తివలని విషయానురాగము కడిగివేయఁబడుటచేతను) నవి నలువురు వేదపండితుల భ్రాంతిని (గల్గించుచు) ముక్తములైనవి (ముత్యములైనవి). మోక్షమును బొందినవి. తాంబూలము వక్కలు కలిపి సేవించుట వలన, దన్తము లెఱ్ఱదనముఁ బొందును. వానిని శుభ్రపఱచుటచే నవి తెల్లఁబడి ముత్యముల వలె నుండును. అట్లే శ్రోత్రియులు విషయానురాగమును కడిగి వైచికొనినచో, ముక్తు లగుదురు. అనగా మోక్షముఁ బడసెదరు. పై వరుసలోని దన్తములలో నాలుగు ప్రధానదన్తములు. అవి ముఖ్యముగా శోధింపఁబడునవియు కానవచ్చునవియునై యున్నవి. ॥౪౬॥

శ్లో॥ శిరీషకోశాదపి కోమలాయా
వేధా విధాయాఽఙ్గమశేషమస్యాః।
ప్రాప్తప్రకర్షః సుకుమారసర్గే
సమాపయద్వాచి మృదుత్వముద్రామ్॥ 42

ప॥వి॥ శిరీషకోశాత్ । అపి । కోమలాయాః । వేధాః । విధాయ । అఙ్గమ్ । అశేషమ్ । అస్యాః । ప్రాప్తప్రకర్షః । సుకుమారసర్గే । సమాపయత్ । వాచి । మృదుత్వముద్రామ్.

టీక॥ వేధాః = నలువ, శిరీషకోశాదపి; శిరీష = దిరిసెన చెట్టుయొక్క, కోశాదపి = మొగ్గకంటెను, కోమలాయాః = మృదువైన ఈ దమయన్తి యొక్క, అశేషం = సమస్తమైన, అఙ్గం = శరీరమును, విధాయ = సృజించి, సుకుమారసర్గే = కోమలపదార్థ సృష్టియందు, లబ్ధప్రకర్షః; లబ్ధ = పొందఁబడిన, ప్రకర్షః = అతిశయముగలవాఁడై, మృదుత్వ ముద్రాం; మృదుత్వ = మెత్తఁదనముయొక్క, ముద్రాం = పరమావధిని, వాచి = దమయన్తివచనమందు, సమాపయత్ = పరిపూర్తిగావించెను.

**సమాసములు:**

*శిరీషకోశాత్:* శిరీషస్య కోశః = శిరీషకోశః. తస్మాత్ = శిరీషకోశాత్.

*ప్రాప్తప్రకర్షః:* ప్రాప్తః ప్రకర్షః యేన సః = ప్రాప్తప్రకర్షః.

*సుకుమారసర్గే:* సుకుమారస్య సర్గః = సుకుమారసర్గః = తస్మిన్ = సుకుమారసర్గే.

*మృదుత్వముద్రామ్:* మృదోః భావః = మృదుత్వం. మృదుత్వస్య ముద్రా = మృదుత్వముద్రా. తామ్ = మృదుత్వముద్రామ్.

**భావము :**

బ్రహ్మ దిరిసెన పూవుకంటెను మెత్తనైన దమయంతి శరీరమును సృజించి కోమలవస్తువులను సృజించుటలో గొప్ప ఖ్యాతి గడించెను. ఆ మృదుత్వమునకు పరమావధిని దమయన్తి వచనమందు సమాప్తి గావించెను. అందువలన దమయన్తి మృదుమధురవాణియై విలసిల్లినది. ॥42॥

శ్లో॥ ప్రసూనబాణాఽద్వయవాదినీ సా
కాఽపి ద్విజేనోపనిషత్పికేన।
అస్యాః కిమాస్యద్విజరాజతో వా
నాఽధీయతే భైక్షభుజా తరుభ్యః ॥ ౪౦

ప॥వి॥ ప్రసూనబాణాఽద్వయవాదినీ । సా । కా । అపి । ద్విజేన । ఉపనిషత్ । పికేన । అస్యాః । కిమ్ । ఆస్యద్విజరాజతః । వా । న । అధీయతే । భైక్షభుజా । తరుభ్యః ।

టీక॥ ప్రసూనబాణాఽద్వయవాదినీ; ప్రసూనబాణ = బాపుష్పబాణమే, అద్వయ = రెండవదిలేదని, వాదినీ = ప్రతిపాదించు, కాపి = ఒకానొక, ఉపనిషత్ = ఉపనిషత్తు, (కోకిల వాగ్రూపమైనది) తరుభ్యః = చెట్లనుండి, భైక్షభుజా; భైక్ష = బిక్షలసమూహమును, భుజా = భుజించు, పికేన = పికమనెడి యనగా కోకిలయనెడి, ద్విజేన = పక్షి చేతను (బ్రాహ్మణుని చేతను), అస్యాః = ఈ దమయన్తియొక్క, ఆస్యద్విజరాజతః; ఆస్య = ముఖమనెడి, ద్విజరాజతః = చంద్రునినుండి, (బ్రాహ్మణశ్రేష్ఠునినుండి) అధీయతేకిం = పఠింపఁబడుచున్నదాయేమి?

వి॥ కోకిలయు (విప్రుఁడును) దమయన్తి ముఖ మనెడి చంద్రునినుండియు బ్రాహ్మణోత్తమునినుండియు నుపనిషత్తునుఁ జదువకపోయినను, జదువు నట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష.

## సమాసములు :

*ప్రసూనబాణాఽద్వయవాదినీ :* ప్రసూనమేవ బాణః = ప్రసూనబాణః. న విద్యతే ద్వయం యస్య తత్ = అద్వయమ్. ప్రసూనబాణ ఏవ అద్వయమ్ = ప్రసూనబాణాద్వయం. ప్రసూనబాణాఽద్వయం వదతీతి = ప్రసూనబాణాద్వయవాదినీ,

**ఆస్యద్విజరాజతః :** ద్విజానాం రాజా = ద్విజరాజః. ఆస్యమేవ ద్విజరాజః = ఆస్యద్విజరాజః. తస్మాత్ = ఆస్యద్విజరాజతః ।

భైక్షభుజా : భిక్షాణాం సమూహః=భైక్షమ్. భైక్షం భునక్తీతి=భైక్ష భుక్. తేన=భైక్షభుజా ।

**భావము :**

పుష్పబాణ మొండు తప్ప మఱియొక్కటి లేదని చెప్పెడి కోకిలవాగ్రూపమైన యొకానొక యుపనిషత్తును చెట్లనుండి చిగుళ్లమున్నగు వానిని భిక్ష మెత్తి భుజించెడి కోకిల యనెడి ద్విజము (పక్షియు, విప్రుడును) ఈ దమయన్తి ముఖ మనెడి ద్విజరాజునుండి (చంద్రునినుండి, బ్రాహ్మణోత్తమునుండి) అధ్యయనము చేయుట లేదా? తప్పక అధ్యయనము చేయుచున్నది. విప్రుడు భిక్ష మెత్తి బ్రాహ్మణోత్తమునుండి ఉపనిషదధ్యయనము చేయుట ప్రసిద్ధము. అట్లే యిచ్చట కోకిలయను ద్విజుడు (పక్షి) చెట్లనుండి చిగుళ్లమున్నగువానిని భిక్షగాఁ దెచ్చుకొని తిని, దమయన్తి ముఖ మనెడి ద్విజోత్తము నుండిఁ బ్రాహ్మణోత్తమునుండి పుష్పబాణ మొక్కటే యీ ప్రపఞ్చమున నున్నది. మఱి యొండు లేదను విషయమునుఁబ్రతిపాదించు నుపనిషత్తును నధ్యయనము చేయదా? అనియాశయము. అనగా దమయన్తి వాణి కోకిల వాణి కంటెను మిక్కిలి మధుర మని సారాంశము ॥౪౮॥

శ్లో॥ పద్మాఙ్కసద్మానమవేక్ష్య లక్ష్మీ
మేకస్య విష్ణోః శ్రయణాత్ సపత్నీమ్ ।
ఆస్యేన్దుమస్యా భజతే జితాబ్జం
సరస్వతీ తద్విజిగీషయా కిమ్॥ ౪౯

ప॥వి॥ పద్మాఙ్కసద్మానమ్ । అవేక్ష్య । లక్ష్మీమ్ । ఏకస్య । విష్ణోః । శ్రయణాత్ । సపత్నీమ్ । ఆస్యేన్దుమ్ । అస్యా । భజతే । జితాబ్జం । సరస్వతీ । తద్విజిగీషయా । కిమ్.

టీక॥ సరస్వతీ=వాగ్దేవతయైనవాణి (ఇద్దఱికిని) ఏకస్య = ఒక, విష్ణోః (పత్యుః) = విష్ణువనెడిభర్తను, శ్రయణాత్ = ఆశ్రయించుటవలన, సపత్నీమ్ = సవతియైన. లక్ష్మీం = లక్ష్మిని, పద్మాఙ్కసద్మానం=పద్మముయొక్క యొడినేనివాసముగలదిగా, అవేక్ష్య =

చూచి, తద్విజిగీషయా; తత్ = అలక్ష్మియొక్క, విజిగీషయా = జయింప గోరికచే, జితాబ్జం, జిత = జయింపఁబడిన, అబ్జం = పద్మముఁ గల్గిన, ఆస్యాః = ఈదమయన్తియొక్క, ఆస్యేన్దుం; ఆస్య = ముఖమ నెడి, ఇందుం = చంద్రుని, భజతేకిం = పొందుచున్నదాయేమి?

వి॥ లక్ష్మిని జయించుటకై దమయన్తి ముఖచంద్రుని సరస్వతి, ఆశ్రయిం పకపోయినను, ఆశ్రయించినట్లు భావింపఁబడుటవలన నుత్ప్రేక్ష.

## సమాసములు :

పద్మాఙ్కసద్మానమ్ : పద్మమేవ అఙ్కః = పద్మాఙ్కః. పద్మాఙ్కః సద్మ యస్యాస్సా = పద్మాఙ్కసద్మా. తాం = పద్మాసద్మానమ్.

ఆస్యేన్దుమ్ : ఆస్యమేవ ఇన్దుః = ఆస్యేన్దుం? తమ్ = ఆస్యేన్దుమ్.

జితాబ్జమ్ : జితం అబ్జం యేన సః = జితాబ్జః. తమ్ = జితాబ్జమ్.

తద్విజిగీషయా : విజేతుమిచ్ఛా = విజిగీషా. తస్యాః విజిగీషా తద్విజి గీషా. తయా = తద్విజిగీషయా.

## భావము :

సరస్వతియు, లక్ష్మియు విష్ణువునకు భార్య లని పురాణ ప్రసిద్ధి. అందు వలన లక్ష్మి సరస్వతికి, సవతి యగుచున్నది. తనకు సవతియైన లక్ష్మికి పద్మము నివాస స్థల మగుటవలన, నామెను మించుటకై సరస్వతి, లక్ష్మి నివాస స్థల మైన పద్మమును జయించిన దమయన్తి ముఖచన్ద్రునిఁ బొందు చున్నది. చంద్రుఁడు పద్మముల జయించినవాఁడు గదా? బలహీనుఁడుగూఁడ శత్రువుపైఁ బగ తీర్చుకొనుటకై బలవన్తుని ఆశ్రయించును గదా? అట్లే దుర్బలయైన సరస్వతి లక్ష్మిని జయించుటకై, బలవన్తుఁడైన దమయన్తీ ముఖ చంద్రుఁ నాశ్రయించిన దని భావము. ॥౪౯॥

శ్లో॥ కణ్ఠే వసన్తీ చతురా యదస్యాః
సరస్వతీ వాదయతే విపఞ్చీమ్ ।

శ్లో॥ విలోకితాస్యా ముఖమున్నమయ్య
కిం వేధసేయం సుషమాసమాప్తౌ।
ధృత్యుద్భవా యచ్చిబుకే చకాస్తి
నిమ్నే మనాగఙ్గులియన్త్రణేవ॥ ॥౨౧॥

ప॥వి॥ విలోకితాస్యా । ముఖమ్ । ఉన్నమయ్య । కిం । వేధసా । ఇయం సుషమాసమాప్తౌ । ధృత్యుద్భవా । యత్ । చిబుకే । చకాస్తి నిమ్నే । మనాక్ । అఙ్గులియన్త్రణా । ఇవ.

టీక॥ ఇయం = ఈదమయన్తి, సుషమాసమాప్తౌ; సుషమా = సౌందర్యపరమ వధియొక్క, సమాప్తౌ = పూర్తిగావించువిషయమున, వేధసా = బ్రహ్మచే, అస్యాః = ఈదమయన్తియొక్క, ముఖం = మోమ ఉన్నమయ్య = పైకెత్తి, విలోకితాకిం = (చక్కదనమును పరీక్షి చుటకై) చూడబడినదాయేమి? యత్ = ఏలయనగా, మనాక్ = కొంచెము, నిమ్నే = పల్లమైన, చిబుకే = గడ్డమునందు, ధృత ద్భవా; ధృతి = పైకెత్తిపట్టుకొనుట వలన, ఉద్భవా = కల్గిన, అఙ్గులిం న్త్రణా; ఇవ, అఙ్గులి = వ్రేలియొక్క, యన్త్రణా ఇవ = ముద్రవలె అనగా నొక్కువలె, చకాస్తి = ప్రకాశించుచున్నది,

వి॥ బ్రహ్మ దమయన్తి మోమును సౌందర్యపరీక్షకై యెత్తి చూడకపోం నను, చూచినట్లు చెప్పుట వలన నుత్ప్రేక్ష.

సమాసములు :

సుషమాసమాప్తౌ : సుషమాయాః సమాప్తిః = సుషమాసమాప్తి తస్యాం = సుషమాసమాప్తౌ

ధృత్యుద్భవా : ధృతేః ఉద్భవః యస్యాస్సా = ధృత్యుద్భవా.
అఙ్గులియన్త్రణా : అఙ్గులేః యన్త్రణా = అఙ్గులియన్త్రణా.

భావము :

బ్రహ్మ దమయన్తియందు గొప్ప సౌందర్య నిర్మాణమును గావించెన ఆ సౌందర్యనిర్మాణము సమాప్తి చేయునపు డొక తడవ సౌందర్యపరీక్ష

దమయన్తి ముఖము వ్రేలితో నెత్తి పట్టుకొని చూచెను. ఆమె శరీరము మిక్కిలి సుకుమారము గాన నా బ్రహ్మవ్రేలితో నామె గడ్డమునుఁ బట్టగనే యచ్చట గుంటపడినది. అది యిప్పటికిని మాయక యున్నది. ఇట్లు గడ్డము క్రింద పల్లముండుట యుత్తమసాముద్రికలక్షణము ॥౫౦॥

శ్లో॥ ప్రియాముఖీభూయ సుఖీ సుధాంశు
ర్వసత్యసౌ రాహుభయవ్యయేన।
ఇమాం దధారాధరబిమ్బలీలాం
తస్యైవ బాలం కరచక్రవాలమ్॥ ౫౧

ప॥వి॥ ప్రియాముఖీభూయ । సుఖీ । సుధాంశుః । వసతి । అసౌ । రాహుభయవ్యయేన । ఇమాం । దధార । అధరబిమ్బలీలాం । తస్య । ఏవ । బాలం । కరచక్రవాలమ్.

టీక॥ అసౌ = ఈ, సుధాంశుః = చంద్రుఁడు, ప్రియాముఖీభూయ; ప్రియా = ప్రియురాలియొక్క, ముఖీభూయ = ముఖముగా నేర్పడి, రాహుభయవ్యయేన;రాహు = రాహువువలని, భయ = భయముయొక్క, వ్యయేన = నివారణచే, సుఖీ = సుఖముగల్గి, వసతి = నివసించుచున్నాడు. తస్యైవ = ఆ చంద్రునియొక్కయే, బాలం = నూతనమైన, కరచక్రవాళమ్; కర = కిరణములయొక్క, చక్రవాళమ్ = మణ్డలము, ఇమాం = ఈ కానవచ్చుచున్న, అధరబిమ్బలీలాం = అదరోష్ఠమనెడి దొండపండు లీలను లేదా అధరోష్ఠమణ్డలముయొక్క శోభను, దధార = ధరించెను.

వి॥ 1) ఇచ్చట చన్ద్రమణ్డలము దమయన్తి ముఖమై రాహుభయము దొలగి సుఖముగా నుండకపోయినను సుఖముగా నున్నట్లు చెప్పుట వలన నుత్ప్రేక్ష. 2) ఆ చన్ద్రుని నూతనమైన కిరణమణ్డలము దమయన్తి యధరోష్ఠము గాకపోయినను నధరోష్ఠముగా నైనట్లు చెప్పుటవలనను నుత్ప్రేక్ష. ఈ రెంటికి నిట సంసృష్టి.

**సమాసములు :**

*ప్రియాముఖీభూయ* : ప్రియాయాః ముఖం = ప్రియాముఖమ్. అప్రియాముఖం ప్రియాముఖం సమ్పద్యమానం భూత్వా = ప్రియాముఖీభూయ.

*రాహుభయవ్యయేన* : రాహోః భయం = రాహుభయం. రాహుభయస్య వ్యయః = రాహుభయవ్యయః. తేన = రాహుభయవ్యయేన.

*అధరబిమ్బలీలాం* : అధరస్య బిమ్బమ్ = అధరబిమ్బమ్. అధరఃబిమ్బ మివ = అధరబిమ్బం. అధరబిమ్బస్య లీలా = అధరబిమ్బలీలా. తామ్ = అధర బిమ్బలీలామ్.

*కరచక్రవాలమ్* : కరాణాం చక్రవాలమ్ = కరచక్రవాలమ్.

**భావము :**

ఈ చంద్రుఁడు దమయన్తికి ముఖముగా నేర్పడుటవలన రాహువువలని భయము తొలగి సుఖముగా నివసించుచున్నాడు. ఆ చంద్రునియొక్క యుదయ కాలపు కిరణమణ్డలము దమయన్తి యధరోష్ఠమణ్డలశోభను వహించినది. ఆమె ముఖము చంద్రుడైనందువలన నామె క్రింది పెదవి యొక్క శోభను యుదయచంద్రుని కిరణమండలము వహించినది. లేదా యామె యొక్క క్రింది పెదవి యనెడి దొండపండు శోభను నా యుదయచంద్రుని కిరణమణ్డలము వహించినదని యాశయము.

శ్లో॥ అస్యా ముఖస్యాస్తు న పూర్ణమాస్యం
పూర్ణస్య జిత్వా మహిమా హిమాంశుం।
భ్రూలక్ష్మ ఖణ్డం దధదర్ధమిన్దు
ర్బాల స్తృతీయః ఖలు యస్య భాగః॥ ౫౩

ప॥వి॥ అస్యాః । ముఖస్య । అస్తు । న । పూర్ణమాస్యం । పూర్ణస్య । జిత్వా । మహిమా । హిమాంశుం । భ్రూలక్ష్మఖణ్డం । దధత్ । అర్ధం । ఇన్దుః । బాలః । తృతీయః । ఖలు । యస్య । భాగః.

టీక॥ పూర్ణమాస్యం; పూర్ణమా = పున్నమకు, ఆస్యం = ముఖ్యమైన, హిమాం శుం = చంద్రుని, జిత్వా = జయించి, పూర్ణస్య = పూర్ణమైన, అస్యాః = ఈ దమయన్తియొక్క, ముఖస్య = ముఖమునకు, మహిమా = గొప్ప తనము, న అస్తు = ఉండదా? తప్పక యుండును. (కించ = మఱియు)

యస్య=ఏ ముఖముయొక్క, తృతీయః భాగః = మూడవయంశము, లలాటం=నొసలు, భ్రూలక్ష్మఖణ్డం; భ్రూ=కనుబొమ్మలనే, లక్ష్మ= లాఞ్ఛనమునకు అనగాకళంకమునకు, ఖణ్డం=తునుకను, దధత్=ధరించు చున్నట్టి, అర్ధమ్=అర్ధమైన, ఇందుః=చన్ద్రుఁడు గదా।

వి॥ "పూర్ణమాస్యం హిమాంశుమ్" అనునెడ, పూర్ణమకుముఖముచంద్రు డనియు, "భ్రూలక్ష్మ ఖణ్డమ్" అను నెడ కనుబొమ్మను కళఙ్క ఖండముగను రూపించుట వలన రూపకములు. ఈ రూపకములచే దమయన్తి ముఖమునకు పూర్ణచన్ద్రత్వము, ఆమె నొసటికి నర్ధచన్ద్ర త్వము ఉత్ప్రేక్షింపఁబడినవి గాన రూపకానుప్రాణితమైన యుత్ప్రేక్ష. ఆ రూపకములకు నీ యుత్ప్రేక్షలకును పరస్పము ఉపకార్యత్వము ఉపకారకత్వము ఉండుట వలన నఙ్గాఙ్గి భావమువచ్చి సంకర మేర్ప డినది. ॥౨౩॥

శ్లో॥ వ్యధత్త ధాతా ముఖపద్మమస్యాః
సమ్రాజమమ్భోజకులేఽఖిలేఽపి।
సరోజరాజౌ సృజతోఽదసీయాం
నేత్రాభిధేయావత ఏవ సేవామ్॥ ౨౪

ప॥వి॥ వ్యధత్త । ధాతా । ముఖపద్మమ్ । అస్యాః । సమ్రాజమ్ । అమ్భోజ కులే । అఖిలే । అపి । సరోజరాజౌ । సృజతః । అదసీయాం । నేత్రా భిధేయౌ । అతః । ఏవ । సేవామ్.

టీక. ధాతా = బ్రహ్మ, అస్యాః = ఈ దమయన్తి యొక్క, ముఖపద్మం; ముఖ=ముఖమనెడి, పద్మం = పద్మమును, అఖిలే=సమస్తమైన, అమ్భోజకులే=పద్మములవంశమందు, సమ్రాజం = రాజరాజుగా, వ్యధత్త=చేసెను. అతఏవ=ఇందువలననే, నేత్రాభిధేయౌ, నేత్ర= నేత్రశబ్దముచే, అభిధేయౌ= చెప్పఁదగిన, సరోజరాజౌ, సరోజ= కమలములను, రాజౌ = రాజులు, అదసీయాం = ముఖపద్మమునకు సంబంధించిన, సేవాం=సేవను, సృజతః=చేయుచున్నవి.

వి॥ ఇచ్చట దమయన్తి ముఖమునకు పద్మత్వము, ఆమె నేత్రములకు సరోజ రాజత్వము రూపితములు కాన రూపకములు. భైమీముఖపద్మము నకు సమ్రాట్త్వము అనగా రాజరాజత్వము లేకపోయినను, పై రూపకము లచే దాని నుత్ప్రేక్షించుటవలన నుత్ప్రేక్ష. ఈ రూపకోత్ప్రేక్షలకు సఙ్కరము.

## సమాసములు :

*ముఖపద్మమ్ :* ముఖమేవ పద్మమ్ = ముఖపద్మం.

*అమ్భోజకులే :* అమ్భోజానాం కులం = అమ్భోజకులం. తస్మిన్ = అమ్భోజకులే.

*సరోజరాజౌ :* సరోజానాం రాజానౌ = సరోజరాజౌ.

*అదసీయాం :* అముష్య ఇయం = అదసీయా. తామ్ = అదసీయాం.

*నేత్రాభిదేయౌ :* నేత్రే ఇతి అభిధేయే యయోస్తౌ = నేత్రాభిధేయౌ.

## భావము :

బ్రహ్మ దమయన్తి ముఖపద్మమును, కమలముల సంఘమున కంతటికిని రాజరాజుగా ననగా చక్రవర్తిగా చేసెను, కావుననే, కమలములకు రాజులైన (సామన్త రాజులైన) రెండు పద్మములు నేత్రము లను పేరు వహించి యా దమయన్తి ముఖమునకు సేవనుఁ చేయుచున్నవి. దమయన్తి ముఖము, ఆమె నేత్రములు పద్మముల నతిశయించిన శోభతో నొప్పుచున్న వని సారాంశము. ॥౨౪॥

శ్లో॥ దివారజన్యోరవి సోమభీతే
చన్ద్రార్కమ్భోజే నిక్షిపతః స్వలక్ష్మీమ్।
అస్యా యదాస్యే న తదా తయోశ్శ్రీ
రేకశ్రియేదం తు కదా న కాన్తమ్॥ ౨౫

ప॥వి॥ దివారజన్యోః । రవిసోమభీతే । చన్ద్రార్కమ్భోజే । నిక్షిపతః । స్వలక్ష్మీమ్।

అస్యాః । యదా । ఆస్యే । న । తదా । తయోః శ్రీః । ఏకశ్రియా । ఇదం । తు । కదా । న । కాన్తమ్.

టీక॥ చన్ద్రామ్బుజే; చన్ద్ర=చన్ద్రుడు, అమ్బుజే=తామరపూవు, దివారజన్యోః; దివా=పగటియందును, రజన్యోః=రాత్రియందును, రవిసోమభీతే; రవి=సూర్యునిచేతను, సోమ=చంద్రునిచేతను, భీతే=భయపడినవై, స్వలక్ష్మీమ్=తమ శోభను, యదా = ఎప్పుడు, అస్యాః=ఈ దమయన్తియొక్క, ఆస్యే=ముఖమునందు, నిక్షిపతః=ఉంచుచున్నవో, తదా=అప్పుడు, తయోః = చన్ద్ర పద్మములకు, శ్రీః=శోభ, న=లేదు, ఏలయనగా, చంద్రునకు పగలు శోభయుండదు, పద్మమునకు రాత్రి శోభయుండదు. ఇదంతు=ఈ దమయన్తి ముఖమో, కదా=ఏ కాలమందు, అనగా పగటియందుగాని, రాత్రియందుగాని, ఏకశ్రియా = చన్ద్ర పద్మములతో నొక్కదాని శోభతో, న కాన్తమ్=రమ్యముగా నుండదు? రమ్యముగనే యుండఁగలదు.

వి॥ 'దివారజన్యోః రవిసోమభీతే చన్ద్రాంబుజే' యని, దివా పదార్థమునకు రవి పదార్థముతోఁడను, చంద్ర పదార్థముతోడను, రజనీ పదార్థమునకు సోమ పదార్థముతోఁడను, అమ్బుజపదార్థముతోఁడను క్రమముగా నన్వయ మేర్పడినందువలన యథా సంఖ్యాలఙ్కారము. చన్ద్రామ్బుజములు, తమశోభలను దమయన్తి ముఖమున నుంచుటలో, వానియందలి కాదాచిత్క శోభలు కారణములు. అనగా పద్మము పగలు శోభించును. చంద్రుడు రాత్రి శోభించును. కాన నివి కాదాచిత్కశోభలు. దమయన్తి ముఖమునం దుంచుటవలన వానికి నిత్యశోభలు, అనగా రాత్రిఁ బవలును శోభ లేర్పడినవి. దమయన్తి ముఖమునం దుంచబడకపోయినను నుంచినట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష. చంద్ర పద్మములలో శోభ యున్నప్పుడు అవి కాదాచిత్కములైన వని, అవి దమయన్తి ముఖమునం దుంచఁబడినవుడు సార్వకాలికములైన వని ఆధిక్యమును చెప్పుటవలన నిచ్చట వ్యతిరేకాలఙ్కారము ధ్వనించుచున్నది. యథా సంఖ్యాలఙ్కారముతోఁ గూడిన యుత్ప్రేక్షచే వ్యతిరేకాలఙ్కారము ధ్వనించుటవలన నలఙ్కారముచే నలఙ్కారధ్వని.

సమాసములు :

*దివా చ రజనీ చ :* దివారజన్యౌ. తయోః = దివారజన్యోః.

*రవిసోమభీతే:* రవిశ్చ సోమశ్చ = రవిసోమౌ. రవిసోమాభ్యాం భీతే = రవిసోమభీతే.

*చన్ద్రామ్బుజే :* చన్ద్రశ్చ అమ్బుజం చ = చన్ద్రామ్బుజే.

*స్వాలక్ష్మీమ్ :* స్వస్య లక్ష్మీః = స్వలక్ష్మీః. తాం = స్వలక్ష్మీమ్.

*ఏకశ్రియా :* ఏకా చ సా శ్రీశ్చ = ఏకశ్రీః. తయా = ఏకశ్రియా.

భావము :

చంద్రుఁడు పగటియందు సూర్యునివలనను, పద్మము రాత్రియందు చన్ద్రుని వలనను భయపడి, తమ శోభలను దమయన్తి ముఖమునం దుంచినవి. అందువలన వానికి అనగా చంద్రునకు పగటియందును కమలమునకు రాత్రి యందును శోభలు లేవు. ఇఁక దమయన్తి ముఖమో, అన్ని వేళలయందును నేదియో యొక శోభచే అనగా పగటి యందు పద్మకాంతి చేతను రాత్రియందు చంద్రునికాంతి చేతను రమ్యముగనే యుండును. ॥౨౨॥

శ్లో॥ అస్యా ముఖశ్రీప్రతిబిమ్బమేవ
జలాచ్చ తాతాన్ముకురాచ్చ మిత్రాత్।
అభ్యర్థ్య ధత్తః ఖలు పద్మచన్ద్రౌ
విభూషణం యాచితకం కదాచిత్॥ ౨౬

ప॥వి॥ అస్యాః । ముఖశ్రీప్రతిబిమ్బమ్ । ఏవ । జలాత్ । చ । తాతాత్ । ముకురాత్ । చ । మిత్రాత్ । అభ్యర్థ్య । ధత్తః । ఖలు । పద్మచన్ద్రౌ । విభూషణం । యాచితకం । కదాచిత్.

టీక॥ పద్మచన్ద్రౌ = పద్మము, చంద్రుఁడు, (క్రమముగా) తాతాత్ = జనకుడైన, జలాచ్చ = ఉదకమునుండియు, మిత్రాత్ = మిత్రము అనగా సమానమైన, ముకురాచ్చ = అద్దమునుండియు, అభ్యర్థ్య = యాచించి,

ఆస్యాః = ఈ దమయన్తియొక్క, ముఖశ్రీప్రతిబిమ్బమేవ; ముఖశ్రీ = ముఖశోభయనెడి, ప్రతిబిమ్బమేవ = ప్రతిబిమ్బమునే, యాచితకం = యాచింపఁబడిన, విభూషణం = ఆభరణముగా, కదాచిత్ = ఒకప్పుడు, పగటియందును, ఒకప్పుడు రాత్రియందు, ధత్తః ఖలు = ధరించుచున్నవి గదా.

**సమాసములు :**

*ముఖశ్రీప్రతిబిమ్బమ్ :* ముఖస్య శ్రీః = ముఖశ్రీః, ముఖశ్రియః ప్రతిబిమ్బమ్ = ముఖశ్రీప్రతిబిమ్బమ్.

*పద్మచన్ద్రౌ :* పద్మం చ చన్ద్రశ్చ = పద్మచన్ద్రౌ.

*యాచితకం :* యాచితేన ప్రాప్తమ్ = యాచితకమ్. తత్ = యాచితకమ్.

**భావము :**

పద్మము జనకుఁడైన జలమునుండియు, చన్ద్రుడు, ఆకారసామ్యముతో మిత్రుఁడైన అద్దమునుండియు నీ దమయంతియొక్క ముఖప్రతిబింబమును యాచించుకొని దానిని భూషణముగా ధరించుచున్నవి. పద్మము జలమునందుఁ బుట్టుట వలన జలము పద్మమునకు జనకుఁడు. అద్దము గుండ్రముగానుఁ బ్రకాశవస్తముగాను నుండుటవలన నది చంద్రునకు మిత్రము. తండ్రియు సోదరుఁడును యాచించినచో నిత్తురు. ఆ యాచింపఁబడిన వస్తువు ఒకప్పుడు ధరింపఁబడును కాని యెల్లప్పుడు ధరింపఁబడదు. జలమందు దమయంతి ముఖము ప్రతిబింబించినప్పుడు పద్మము తండ్రియైనజలమును యాచించి పగటి యందు శోభించును. అద్దమందుఁ బ్రతిబింబించి నప్పుడు మిత్రమైన యా యద్దమును యాచించి రాత్రియందు చంద్రుఁడు శోభించును. మఱియొకవిధముగా వీనికి శోభలు లేవు. దమయన్తి ముఖప్రతిబిమ్బముతోనే యీ పద్మచన్ద్రులు సమానములు కానప్పుడు దమయన్తి ముఖముతో సమానము లెట్లగును? కాన దమయంతి మోము పద్మ చంద్రాలను మించి యున్నదని భావము. ॥౨౬॥

శ్లో॥ అర్కాయ పత్యే ఖలు తిష్ఠమానా
భృఙ్గైర్మితామక్షిభిరమ్బుకేళా।

భైమీముఖస్య శ్రియమమ్బుజిన్యో
యాచన్తి విస్తారితపద్మహస్తాః॥ ౫౭

ప॥వి॥ అర్కాయ । పత్యే । ఖలు । తిష్ఠమానాః । భృఙ్గైః । మితామ్ । అక్షిభిః । అమ్బుకేళౌ । భైమీముఖస్య । శ్రియమ్ । అమ్బుజిన్యః । యాచన్తి । విస్తారితపద్మహస్తాః.

టీక॥ పత్యే = భర్తయైన, అర్కాయ = సూర్యునికొఱకు, తిష్ఠమానాః = తమయభిలాషను వెల్లడిఁ జేయుచున్నటువంటి, అనగా కాముకస్త్రీలైనటువంటి, అమ్బుజిన్యః = కమలములు, అమ్బుకేలౌ = జలక్రీడాకాలమందు, భృఙ్గైః = తుమ్మెదలనెడి, అక్షిభిః = కన్నులచే, మితాం = చూడఁబడిన, ముఖస్య = ముఖముయొక్క, శ్రియం = శోభను, విస్తారిత పద్మహస్తాః; విస్తారిత = చాచఁబడిన, పద్మహస్తాః = పద్మములనెడి హస్తములు కల్గినవై, భైమీం = దమయన్తిని, యాచన్తిఖలు = యాచించుచున్నది గదా.

వి॥ పద్మినులు, దమయన్తి ముఖశోభను యాచింపక పోయినను, యాచించునట్లు భావింపఁబడుటవలన నుత్ప్రేక్ష.
ఆ యుత్ప్రేక్షచే పద్మములకంటె దమయన్తి ముఖమునకు ఆధిక్యము తెలియఁబడుచున్నది కాన వ్యతిరేకాలఙ్కార ధ్వని.

సమాసములు :

అమ్బుకేళౌ : అమ్బుని కేళిః = అమ్బుకేళిః. తస్యాం = అమ్బుకేళౌ.

విస్తారితపద్మహస్తాః : పద్మాని హస్తా ఇవ = పద్మహస్తాః. విస్తారితాః పద్మహస్తాః యాభిస్తాః = విస్తారితపద్మహస్తాః.

భావము :

భర్తయైన సూర్యునికై తమ కోరికను వెల్లడించుచున్న పద్మినులు, జలక్రీడాకాలమందు తుమ్మెదలను కన్నులచేఁ జూడఁబడిన యీ దమయన్తి ముఖశోభను పద్మములనెడి హస్తములనుఁ జాపి దమయన్తిని యాచించుచున్నది గదా? ॥౫౭॥

శ్లో॥ అస్యా ముఖేనైన విజిత్య నిత్య
స్పర్ధీ మిలత్కుఙ్కుమరోషభాసా।
ప్రసహ్య చన్ద్రః ఖలు నహ్యమానః
స్యాదేవ తిష్ఠన్ పరివేషపాశః॥ ౫౮

ప॥వి॥ అస్యాః । ముఖేన । ఏవ । విజిత్య । నిత్యస్పర్ధీ । మిలత్కుఙ్కుమ రోషభాసా । ప్రసహ్య । చన్ద్రః । ఖలు । నహ్యమానః । స్యాత్ । ఏవ । తిష్ఠన్ । పరివేషపాశః ।

టీక॥ నిత్యస్పర్ధీ; నిత్య = ప్రతిదినము, స్పర్ధీ = జగడమాడెది, చన్ద్రః = చన్ద్రుఁడు, మిలత్కుఙ్కుమరోషభాసా, మిలత్ = వ్యాపించుచున్నట్టి, కుఙ్కుమ = కుఙ్కుమమనెడి. రోషభాసా = క్రోధకాన్తిగల్గిన, అస్యాః = ఈదమయన్తియొక్క, ముఖేనైవ = ముఖముచేతనే, విజిత్య = జయింపఁబడి, ప్రసహ్య = బలాత్కారముగావించి, నహ్యమానః = బంధింపఁబడుచున్నవాడుగా, తిష్ఠన్ = ఉన్నవాడగుచు, పరివేషపాశః; పరివేష = పరివేషమనెడి, పాశః = కట్టుత్రాడుగల్గినవాఁడుగా, స్యాదేవ = అయితీరును.

వి॥ చంద్రుఁడు పరివేష మనెడి పాశముతో బంధింపఁబడక పోయినను, బంధింపఁబడి నట్లు చెప్పుట వలన నుత్ప్రేక్ష.

## సమాసములు :

నిత్యస్పర్ధీ : నిత్యం స్పర్ధత ఇతి = నిత్యస్పర్ధీ.

మిలత్కుఙ్కుమరోషభాసా : రోషస్య భాః = రోషభాః. కుఙ్కుమమేవ రోషభాః = కుఙ్కుమరోషభాః. మిలన్తీ కుఙ్కుమరోషభాః యస్య తత్ = మిలత్కుఙ్కుమరోషభాః. తేన = మిలత్కుఙ్కుమరోషభాసా.

పరివేషపాశః : పరివేష ఏవ పాశః యస్య సః = పరివేషపాశః.

## భావము :

నిత్యము పోటి చేయుచున్న చంద్రుడు, కుఙ్కుమలేప మనెడి కోప

కాన్తితోఁ గూడిన దమయన్తి ముఖముచే నోడింపఁబడి బలాత్కారముచే బంధింపఁబడినవాఁడై పరివేష మను పాశముతోఁ గూడినవా డాయెను॥౫౦॥

శ్లో॥ విధోర్విధిర్బిమ్బశతాని లోపం
లోపం కుహూరాత్రిషు మాసి మాసి।
అభఙ్గురశ్రీకమముం కిమస్యా
ముఖేన్దుమస్థాపయదేకశేషమ్॥ ౫౧

ప॥వి॥ విధోః । విధిః । బిమ్బశతాని । లోపం । లోపం । కుహూరాత్రిషు । మాసి । మాసి । అభఙ్గురశ్రీకమ్ । అముం । కిమ్ । అస్యాః । ముఖేన్దుమ్ । అస్థాపయత్ । ఏకశేషమ్.

టీక॥ విధిః = బ్రహ్మ, విధోః = చంద్రునియొక్క, బిమ్బశతాని; వందల కొలదిమణ్డలములను, మాసిమాసి = ప్రతిమాసమందును, కుహూరాత్రిషు = అమావాస్య రాత్రులయందు, లోపంలోపం = లోపించి లోపించి, అభఙ్గురశ్రీకం; అభఙ్గుర = నాశముగాని, శ్రీకం = శోభగల్గిన, అముం = ఈ, అస్యాః = ఈదమయన్తియొక్క, ముఖేన్దుం = ముఖచన్ద్రుని, ఏకశేషమ్ = ఒక్కటేశేషించునదిగా, అస్థాపయత్‌కిం = స్థాపించెనాయేమి?

వి॥ బ్రహ్మ అమావాస్యనాటి రాత్రులయందు చన్ద్రమండలమును నశింపఁ జేసి దమయన్తిముఖచంద్రుని స్థాపింపకపోయినను, స్థాపించినట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష.

## సమాసములు

*బిమ్బశతాని:* బిమ్బానాం శతాని = బిమ్బశతాని. తాని = బిమ్బశతాని.

*లోపంలోపమ్ :* లుప్త్వా లుప్త్వా = లోపం లోపమ్.

*కుహూరాత్రిషు :* కుహూనాం రాత్రయః = కుహూరాత్రయః. తాసు = కుహూరాత్రిషు.

*అభఙ్గురశ్రీకమ్ :* న భఙ్గురా = అభఙ్గురా. అభఙ్గురా శ్రీః యస్య తత్ = అభఙ్గురశ్రీకమ్ ।

ముఖేందుమ్ : ముఖమేవ ఇందుః = ముఖేందుః. తమ్ ముఖేందుమ్.

ఏకశేషమ్ : ఏకః శేషః యస్య సః = ఏవశేషః. తం = ఏకశేషమ్.

**భావము :**

బ్రహ్మ ప్రతిమాసము వందలకొలది చన్ద్రబిమ్బములను సృజించి చక్కఁగా కుదరనందువలన, వానిని అమావాస్య రాత్రులయందు పలుమాఱు లోపింపఁజేయుచు కడకుఁ జక్కఁగా కుదిరినట్టి శ్రోభితఋగనట్టి దమయన్తి ముఖచంద్రు నొకనిని, తన శిల్పమున మిగిల్చి, చంద్రుని స్థానమున స్థాపించెను. ఎట్లనగా చిత్రకారుడు గాని శిల్పి గాని తొలుత కొన్ని చిత్రములను శిల్పములను నిర్మించును. అట్లు నిర్మించిన పిదప కట్టకడపట వానిలో చక్కఁగా లేనివానిని తొలగించి, చక్కనైన వానిని నిలుపుకొనును. అట్లే బ్రహ్మ దమయన్తి ముఖచంద్రుని సృజించుటకై, తత్పూర్వము పెక్కు చంద్రుల సృజించుచు నవి చక్కఁగా లేనందువలన దానిని నమావాస్యలనాటి రాత్రులయందు తొలగించి క్రమముగా దమయన్తి ముఖచన్ద్రుఁ డను దివ్యసున్దర శిల్పమును నిర్మింపఁగల్గెను. సమాన పదములలో పెక్కింటికి సమాసము చేయగా, వానిలో నొక్కటి మాత్రమే మిగులుటవలన నెట్లేకశేష మగునో, అట్లే సమాన వస్తువులనుఁ పెక్కింటినిఁ జేయగా వానిలో నొక్కటిమాత్రమే చక్కనిదిగా శేషించు నని యేకశేష శబ్దముచే ధ్వనితము. ॥౨౯॥

శ్లో॥ కపోలపత్రాన్మకరాత్ స కేతుః
భ్రూభ్యాఞ్జిగీషుర్ధనుషా జగన్తి।
ఇహాఽవలమ్బ్యాస్తి రతిం మనోభూ
రాజద్వయస్యో మధునాఽధరేణ॥ ౬౦

ప॥వి॥ కపోలపత్రాత్ । మకరాత్ । సకేతుః । భ్రూభ్యాం । జిగీషుః । ధనుషా । జగన్తి । ఇహ । అవలమ్బ్య । అస్తి । రతిం । మనోభూః । రాజద్వయస్యః । మధునా । అధరేణ.

టీక॥ మనోభూః = మన్మథుడు, కపోలపత్రాత్ = కణతలయందు వ్రాయఁబడిన పత్రభంగమను, మకరాత్ = మొసలివలన, కేతుమాన్ = ధ్వజము

గలవాడై, భ్రూభ్యాం = కనుబొమ్మలచే, ధనుషా = ధనుస్సుచే, జగన్తి = ప్రపఞ్చములను, జిగీషుః = జయింపఁగోరినవాడై, అధరేణ = క్రిందిపెదవియను, మధునా = తేనెచేతను, (వసన్తునిచేతను), రాజద్వయస్యః; రాజత్ = ప్రకాశించెడి, వయస్యః = చెలికానిఁ గలవాడై, ఇహ = ఈమెయందు, రతిం = ప్రీతిని, (రతీదేవిని), అవలమ్బ్య = అవలంబించుకొని, అస్తి = ఉన్నాడు.

వి॥ ఇచ్చట మకరికాది పత్రభఙ్గములయందును, కనుబొమ్మలయందును, అధరమునందును, ఆరోపింపఁబడిన ధ్వజాదులు జగజ్జయ మను ప్రకృతక్రియ కుపయోగపఁడుటవలన పరిణామాలఙ్కారము.

## సమాసములు :

కపోలపత్రాత్ : కపోలయోః పత్రమ్ = కపోలపత్రమ్. తస్మాత్ = కపోలపత్రాత్.

సకేతుః : కేతునా సహ వర్తత ఇతి = సకేతుః.

జగజ్జిగీషుః : జేతుమిచ్ఛుః = జిగీషుః. జగతాం జిగీషుః = జగజ్జిగీషుః.

మనోభూః : మనసః భవతీతి = మనోభూః.

రాజద్వయస్యః : రాజన్ వయస్యః యస్య సః = రాజద్వయస్యః.

## భావము :

మన్మథుఁడు దమయన్తికపోలమందలి మకరికాదిపత్రభంగ మను మకరమును ధ్వజముగాను ఆమె కనుబొమ్మలను ధనుస్సుచేతను, ప్రపఞ్చములను జయింపఁగోరినవాఁడై, ఆమెయొక్క క్రిందిపెదవి యను (తేనెను) వసన్తుని మిత్రుఁడుగను జేసికొని, దమయన్తి రతిని (ప్రీతిని రతీదేవిని) కల్పించుకొనియున్నాడు. దమయన్తియందు సకలకామచిహ్నములు కానవచ్చుట వలన నామెయందు మన్మథుఁడు వసించుచున్నా డని యూహింపవలయును. అనగా దమయన్తి ముఖమును చూచుట తోడనే, యనుచరాదిబలసమృద్ధి గల మన్మథుఁడావిర్భవించు నని యాశయము ॥౬౦॥

శ్లో॥ వియోగబాష్పాఞ్చితనేత్రపద్మ
చ్ఛద్మాన్వితోత్సర్గపయఃప్రసూనౌ।
కర్ణౌ కిమస్యా రతితత్పతిభ్యాం
నివేద్య పూపౌ విధిశిల్పమీదృక్॥ ౬౧

ప॥వి॥ వియోగబాష్పాఞ్చిత నేత్రపద్మచ్ఛద్మాన్వితోత్సర్గపయః ప్రసూనౌ। కర్ణౌ। కిమ్। అస్యాః। రతితత్పతిభ్యాం। నివేద్యపూపౌ। విధి శిల్పమ్। ఈదృక్।

టీక॥ ఈదృక్ విధిశిల్పం = అపూర్వమైన ఈ బ్రహ్మసృష్టియైన, అస్యాః = దమయన్తియొక్క, కర్ణౌ = చెవులు, వియోగబాష్పాఞ్చిత నేత్రపద్మచ్ఛద్మాన్వితోత్సర్గ పయః ప్రసూనౌ; వియోగ = విరహమువలుని, బాష్ప = కన్నీటిచే, అఞ్చిత = కూడిన, నేత్రపద్మ = నేత్రములనెడి పద్యముల యొక్క, ఛద్మ = నెపముచే, అన్విత = కూడిన, ఉత్సర్గపయః = దానోదకముచేఁగూడిన, ప్రసూనే = పుష్పములుగలవై, రతితత్పతిభ్యాం; రతి = రతీదేవి, తత్పతిభ్యాం = ఆమెభర్తయైన మన్మథుఁడు అనువీరికి, నివేద్యపూపౌకిం, నివేద్య = నివేదనముఁజేయఁదగిన, పూపౌ కిం = అప్పములాయేమిః

వి॥ కన్నీటితోఁ గూడిన నేత్రము లనెడి పద్మముల నెపముతోఁ బాష్పాంజలి యొసంగఁబడి నట్లు చెప్పుటవలన అపహ్నవము.

ఆమె కర్ణములు రతీమన్మథులకు నివేదింపఁ దగిన యపూపములా యని చెప్పుటవలన నుత్ప్రేక్ష.

అపహ్నవముతోఁ గూడిన యీ యుత్ప్రేక్షచే, దమయన్తి కర్ణముల వరకుఁ బొడవైన నేత్రములు గల్గియున్న దను వస్తువు ధ్వనించుచున్నది గాన అలఙ్కారముచే, వస్తుధ్వని.

సమాసములు :

*వియోగబాష్పాఞ్చిత నేత్రపద్మచ్ఛద్మాన్వితోత్సర్గ పయఃప్రసూనే :* వియోగేన బాష్పః = వియోగబాష్పః. వియోగబాష్పైః అఞ్చితే = వియోగ

బాష్పాఞ్చితే. నేత్రే పద్మే ఇవ = నేత్రపద్మే. వియోగభాష్పాఞ్చితే చ తే నేత్రపద్మే చ = వియోగబాష్పాఞ్చిత నేత్రపద్మే. వియోగబాష్పాఞ్చిత నేత్ర పద్మయోః ఛద్మ = వియోగబాష్పాఞ్చిత నేత్రపద్మచ్ఛద్మ. వియోగబాష్పాఞ్చిత నేత్రపద్మచ్ఛద్మనా అన్వితే = వియోగబాష్పాఞ్చిత నేత్రపద్మచ్ఛద్మాన్వితే. ఉత్సర్గస్య పయః = ఉత్సర్గపయః. వియోగభాష్పాఞ్చిత నేత్రపద్మచ్ఛ ద్మాన్వితం చ తత్ ఉత్సర్గపయశ్చ = వియోగబాష్పాఞ్చిత నేత్రపద్మచ్ఛ ద్మాన్వితోత్సర్గపయః. వియోగబాష్పాఞ్చిత నేత్రపద్మచ్ఛద్మాన్వితోత్సర్గ ప్రయసా మిశ్రే ప్రసూనే యయోస్తౌ = వియోగబాష్పాఞ్చిత నేత్రపద్మచ్ఛద్మా న్వితోత్సర్గపయఃప్రసూనౌ.

## సమాసములు :

*రతితత్పతిభ్యాం* : తస్యాః పతిః = తత్పతిః. రతిశ్చ తత్పతిశ్చ = రతితత్పతీ. తాభ్యాం రతితత్పతిభ్యాం

*నివేద్యపూపౌ* : నివేదయితుం యోగ్యౌ = నివేద్యౌ. నివేద్యౌ చ తౌ పూపౌ చ = నివేద్యపూపౌ.

*విధిశిల్పమ్* : విధేః శిల్పమ్ = విధిశిల్పమ్.

## భావము :

దమయన్తి చెవులు, అపూర్వ మైన బ్రహ్మసృష్టి. ఆ చెవుల కిఱు వైపుల దమయన్తియొక్క బారెడు కన్ను లనెడి పుష్పము లున్నవి. ఆ పుష్పము లామెయొక్క విరహమువలని కన్నీటితోఁ గూడిన నేత్ర పద్మము లనెడి నెపము గల్గి యున్నవి. అనగా కన్నీటితోఁ గూడిన యామె నేత్రపద్మము లనెడి మిషతో నామె కర్ణముల కిఱువైపుల దానజలముతోఁ గూడిన పుష్పము లున్నవని యర్థము. ఆ దాన జలముతోఁ గూడిన యా పుష్ప ములకు దగ్గర నున్న యామె కర్ణములు, రతీమన్మథులకు నివేదనమునకుఁ తగిన యప్పముల వలె వెలయుచున్నవి. నివేదనము చేయు నపుడు కావపలసిన దానోదకముగా కన్నీరును, పూజకుఁ గావలసిన పుష్పములుగా నామె కన్నులు భాసించుచున్న వని యాశయము ॥౬౦॥

శ్లో॥ ఇహాఽవిశద్యేన పథాఽతివక్రః
శాస్త్రౌఘనిష్యన్దసుధాప్రవాహః।
సోఽస్యాః శ్రవఃపత్రయుగే ప్రణాళీ
రేఖేవ ధావత్యభికర్ణకూపమ్॥ ౬౨

ప॥వి॥ ఇహ । అవిశత్ । యేన । పథా । అతివక్రః । శాస్త్రౌఘనిష్యన్ద సుధా ప్రవాహః । సః । అస్యాః । శ్రవః పత్రయుగే । ప్రణాళీ । రేఖా । ఇవ । ధావతి । అభికర్ణకూపమ్.

టీక॥ అతివక్రః = మిక్కిలి వంకరయైన, శాస్త్రౌఘనిష్యన్ద సుధాప్రవాహః; (వ్యఙ్గ్యార్థములచే దుర్బోధమైన)శాస్త్రౌఘ = శాస్త్ర సమూహముయొక్క, నిష్యన్ద = సారమను, సుధాప్రవాహః = అమృత ప్రవాహము, యేన = ఏ, పథా = మార్గముచే, ఇహ = ఈ దమయన్తియందు, అవిశత్ = ప్రవేశించెనో, సః = ఆ మార్గము, అస్యాః = ఈమెయొక్క, శ్రవః పత్రయుగే; శ్రవఃపత్ర = ఆకులవంటి చెవులయొక్క, లేదా (చెవ్వాకుల యొక్క), యుగే = జంట యందు, (యా = ఏ) రేఖా = గీతగలదో, సా ఇవ = ఆ వంకరగల మార్గమువలె, అభికర్ణకూపం = చెవులనెడి బావుల సమీపమును, ధావతి = పొందుచున్నది.

వి॥ చెవియందు కాలువల వంటి వంకర మార్గములలో సుధాప్రణాళీత్వ ముత్ప్రేక్షింపఁబడినది కాన నుత్ప్రేక్ష.

సమాసములు :

అతివక్రః : అత్యన్తం వక్రః = అతివక్రః.

శాస్త్రౌఘనిష్యన్ద సుధాప్రవాహః : శాస్త్రాణామోఘః = శాస్త్రౌఘః. శాస్త్రౌఘస్య నిష్యన్దః = శాస్త్రౌఘనిష్యన్దః. సుధాయాః ప్రవాహః = సుధా ప్రవాహః. శాస్త్రౌఘనిష్యన్ద ఏవ సుధాప్రవాహః = శాస్త్రౌఘనిష్యన్ద సుధా ప్రవాహః.

శ్రవః పత్రయుగే : శ్రవసీ పత్రే ఇవ = శ్రవః పత్రే. శ్రవః పత్రయోః యుగమ్ = శ్రవః పత్రయుగమ్. తస్మిన్ = శ్రవపత్రయుగే.

శ్రవసోః పత్రే=శ్రవః పత్రే. శ్రవః పత్రయోః యుగమ్=శ్రవః పత్ర యుగమ్. తస్మిన్=శ్రవః పత్రయుగే.

అభికర్ణకూపమ్ : కర్ణః కూప ఇవ=కర్ణకూపః. కర్ణకూపం ప్రతి= అభికర్ణకూపమ్.

**భావము :**

మిక్కిలి వంకరయైనవియు వ్యఙ్గ్యార్థయుక్తమై గూఢమైనందువలన దురవగాహమైన శాస్త్రములయొక్క సారమైన యమృత ప్రవాహము దమయన్తియందు నేమార్గమునఁ బ్రవేశించినదో, అట్టి మార్గము ఈ దమయన్తి యొక్క కర్ణతాటఙ్కముల జంటయందున్న వంపులు తిరిగిన కాలువల రేఖ వలె నామె కర్ణము లనెడి బావుల సమీపముఁ గూర్చి పోవుచున్నది. కాలువ లెట్లుండునో అట్లే ప్రవాహము పాఱుచుండును. ఇచ్చట దమయంతియొక్క కర్ణ తాటఙ్కముల (చెవ్వాకులు) యందలి కాలువలు కుణ్డలాకారములై వంపు తిరిగియున్నవి. ఇందువలన నా కాలువలయందుఁ బారెడి ప్రబాహములును వంపుతిరిగి యుండును. ఇందువలన వంకర యైన కర్ణరేఖల రూపమం దున్న కాలువలలో పారు నట్టి అమృత ప్రవాహము కర్ణయుగ్మమునందు గాని దమయంతియందు గాని ప్రవేశించినది. అనగా దమయన్తి సకల కలా ప్రేరణురాలనియు, దురవగాహ మైన శాస్త్రసారములను చెవులనుండి గ్రోలినదనియు భావము. ॥౬౨॥

శ్లో॥ అస్యా యదష్టాదశ సంవిభజ్య
విద్యాః శ్రుతీ దధ్రతురర్ధ మర్ధమ్ ।
కర్ణాన్తరుత్కీర్ణగభీరలేఖః
కిం తస్య సంఖ్యైవ న వా నవాఙ్కః ॥ ౬౩

ప॥వి॥ అస్యాః । యత్ । అష్టాదశ । సంవిభజ్య । విద్యాః । శ్రుతీ । దధ్రతుః । అర్ధమ్ । అర్ధమ్ । కర్ణాన్తరుత్కీర్ణగభీరలేఖః । కిం । తస్య । సంఖ్యా । ఏవ । న । వా । నవాఙ్కః.

టీక॥ అస్యాః=ఈ దమయన్తియొక్క, శ్రుతీ=కర్ణములు, అష్టాదశ=పదునెనిమిది సంఖ్యగల, విద్యాః=వేదవేదాఙ్గాది విద్యలను, సంవిభజ్య=

రెండుగా భాగించుకొని, యత్ = ఎందువలన, అర్ధం అర్ధం = సగము సగము, దధ్రతుః = ధరించినవో, (తత్ = అందువంన), కర్ణాన్తరుత్కీర్ణ గభీరలేఖః; కర్ణాన్తః = చెవిలోపల, ఉత్కీర్ణ = ఉత్పత్తి గావింపఁబడిన (చెక్కఁబడిన), గభీర = లోతైన, లేఖః = గీతగల, తస్య = ఆ యర్ధ భాగముయొక్క, యనగా తొమ్మిది విద్యలయొక్క, సంఖ్యైవ = ఆకృతిని ధరించిన సంఖ్యయే, న కిమ్ = కాదా? యద్వా = లేదా, నవాఙ్కః; నవ = తొమ్మిదికి, అఙ్కః = చిహ్నము, న భవతి కిం = కానేరదా?

వి॥ ఇచ్చట దమయంతి చెవిలోపల చెక్కఁబడిన సాముద్రికలేఖ నవవిద్యలను సూచించెడి నవత్వ సంఖ్యకు చిహ్నము కాకపోయినను చిహ్నముగా చెప్పుటవలన నుత్ప్రేక్ష. అనగా నామె చెవులలోపల నేర్పడిన సాముద్రిక చిహ్నముగా నేర్పడిన యవయవ విన్యాసము, తొమ్మిది విద్యలను బోధించుటకై శరీరము దాల్చిన నవ సంఖ్యయా, యని నవత్వ సంఖ్యగా నుత్ప్రేక్షించుటవలన నొక యుత్ప్రేక్ష.

లేదా యా, కర్ణాన్తర్గత మైన యవయవ విన్యాసము తొమ్మిదిని బోధించు నవత్వ సంఖ్యకు చిహ్నమా యని యుత్ప్రేంచుటచేతను నుత్ప్రేక్ష.

## సమాసములు :

*కర్ణాన్తరుత్కీర్ణ గభీరలేఖః :* కర్ణయోః అంతః = కర్ణాన్తః. కర్ణాన్తే ఉత్కీర్ణా = కర్ణాన్తరుత్కీర్ణా. గభీరా చ సా లేఖా చ = గభీరలేఖా. కర్ణాన్తరుత్కీర్ణా గభీరలేఖా యస్య సః = కర్ణాన్తరుత్కీర్ణ గభీరలేఖః.

*నవాఙ్కః :* నవశ్చాసౌ అఙ్కశ్చ = నవాఙ్కః.

## భావము :

వేదవేదాఙ్గాది పదునెనిమిది విద్యలను [నాలుగు వేదములు, ఆఱు వేదాఙ్గములు, (శిక్షాకల్ప వ్యాకరణ, నిరుక్త-జ్యోతిషఛందములు) మీమాంసా, న్యాయ, అయుర్వేద, ధనుర్వేద, గాన్ధర్వవిద్యా, అర్థశాస్త్ర, పురాణ, ధర్మశాస్త్రములను] రెండుగా విభజించి దమయంతియొక్క రెండు కర్ణములును ధరించుచున్నవి. ఆమె చెవులలోపల నున్న సాముద్రిక చిహ్నమగు నవ

యవము, ఆ తొమ్మిది విద్యలను సూచించు సంఖ్యయొక్క స్వరూపమా? లేదా తొమ్మిదిని బోధించు చిహ్నమా? తప్పక కానవచ్చును. అనగా నా దమయన్తి కర్ణములలోపల సాముద్రిక చిహ్నము లైన యవయవ రచన యున్నది. అది నవత్వ సంఖ్యా స్వరూపముగను, నవత్వ సంఖ్యా చిహ్నముగను భావింపఁబడుచున్నది. ॥౬౩॥

శ్లో॥ మన్యేఽమునా కర్ణలతామయేన
పాశద్వయేన చ్ఛిదురేతరేణ ।
ఏకాకిపాశం వరుణం విజిగ్యేఽ
నఙ్గీకృతాఽఽయాసతతీ రతీశః॥ ౬౪

ప॥ వి॥ మన్యే । అమునా । కర్ణలతామయేన । పాశద్వయేన । ఛిదురేతరేణ । ఏకాకిపాశం । వరుణం । విజిగ్యే । అనఙ్గీకృతాఽఽయాసతతిః । రతీశః.

టీక॥ రతీశః = రతికిభర్తయైన మన్మథుఁడు, అమునా = ఈ, కర్ణలతామయేన = కర్ణపాశరూపమైన, ఛిదురేతరేణ = ఛేదమునుఁబొందని, పాశద్వయేన = పాశాయుధముల జంటచే, ఏకాకిపాశం = ఒకేపాశముగల్గిన, వరుణం = వరుణుని, అనఙ్గీకృతాఽఽయాసతతిః; అనఙ్గీకృత = అంగీకరింపఁబడని, (పరిహరింపఁబడిన), ఆయాసతతిః = ప్రయాసపరంపర గల్గినవాడై, విజిగ్యే = జయించెను. మన్యే = తలంచుచున్నాను.

వి॥ దమయన్తి కర్ణములను రెండుపాశాయుధములుగల మన్మథుడు ఏకపాశాయుధము గల్గిన వరుణుని జయించెనని యుత్ప్రేక్షింపఁబడినది. 'మన్యే' యని వ్యఞ్జకమును చెప్పుటవలన నది వాచ్యము.

## సమాసములు :

కర్ణలతామయేన : కర్ణయోః లతాః = కర్ణలతాః. కర్ణలతానాం వికారః = కర్ణలతామయః. తేన = కర్ణలతామయేన.

పాశద్వయేన : పాశయోః ద్వయం = పాశద్వయమ్. తేన = పాశద్వయేన.

ఛిదురేతరేణ : ఛిదురాత్ ఇతరమ్ = ఛిదురేతరం. తేన = ఛిదురేతరేణ.

ఏకాకిపాశం: ఏకాకీ పాశః యస్య సః = ఏకాకిపాశః. తమ్ = ఏకాకి పాశమ్.

అనఙ్గీకృతాఽఽయాసతతిః : న అఙ్గీకృతా = అనఙ్గీకృతా. ఆయాసానాం తతిః = ఆయాసతతిః. అనఙ్గీకృతా ఆయాస తతిః యేన సః = అనఙ్గీకృతాఽఽయాసతతిః.

రతీశః : రత్యాః ఈశః = రతీశః.

**భావము :**

మన్మథుఁడు ఈ దమయన్తి యొక్క కర్ణపాశముల రూపమున నున్న దృఢమైన రెండు పాశములతో, ఒక్కపాశమే గల్గిన వరుణుని ప్రయాసలేకయే జయించెను. అధిక సాధనములు గలవాడు, స్వల్పసాధనములు గలవానిని జయించుట సుకరము గదా. ॥౬౪॥

శ్లో॥ ఆత్మైవ తాతస్య చతుర్భుజస్య
జాతశ్చతుర్దోరుచిరః స్మరోఽపి ।
తచ్చాపయోః కర్ణలతే భ్రువోర్జ్యే
వంశత్వగంశౌ చిపిటే కిమస్యాః ॥ ౬౫

టీక॥ చతుర్భుజస్య = నాలుగు బాహువులుగల్గిన, తాతస్య = తన తండ్రియైన విష్ణువుయొక్క, ఆత్మైవ = స్వరూపముగనే, జాతః = జన్మించిన, స్మరోఽపి = మన్మథుఁడును, చతుర్దోరుచిరః; చతుర్దోః = నాలుగు భుజములచే, రుచిరః = అందమైనవాఁడు, తచ్చాపయోః; తత్ = ఆ మన్మథునియొక్క, చాపయోః = విండ్లైన, అస్యాః = ఈ దమయన్తియొక్క, భ్రువోః = కనుబొమ్మలకు, అస్యాః = ఈమెయొక్క, కర్ణలతే = తీగలవంటిచెవులే, చిపిటే = వంపులేని, వంశత్వగంశౌ; వంశ = వెదురుయొక్క, త్వగంశౌ = తాటకు సంబంధించిన భాగములైన, జ్యేకిమ్ = అల్లెత్రాళ్లా యేమి?

వి॥ మన్మథునికి చతుర్భుజత్వము లేక పోయినను, చతుర్భుజత్వము, దమయన్తి కనుబొమ్మ లాతని విండ్లు కాక పోయినను, విండ్లుగను, ఆమె

యొక్క కర్ణములు అల్లెత్రాళ్లు కాకపోయినను, అల్లెత్రాళ్లుగను సంభావింపఁబడినవిగాన నుత్ప్రేక్ష.

సమాసములు :

*చతుర్భుజస్య :* చత్వారః భుజాః యస్య సః=చతుర్భుజః. తస్య=చతుర్భుజస్య.

*చతుర్దోరుచిరః :* చత్వారః దోషః=చతుర్దోషః. చతుర్దోర్భిః రుచిరః=చతుర్దోరుచిరః.

*తచ్చాపయో :* తస్య చాపౌ=తచ్చాపౌ. తయోః=తచ్చాపయోః.

*వంశత్వగంశౌ :* వంశస్య త్వక్=వంశత్వక్. వంశత్వచఃఅంశౌ=వంశత్వగంశౌ.

భావము :

నాలుగు బాహువులు గల విష్ణువునకు కుమారుఁడుగా జన్మించిన, మన్మథుఁడు నాలుగు బాహువులతో రమ్యముగా నున్నాఁడు. ఏలయనగా 'ఆత్మా వై పుత్రనామాఽసి' యను శ్రుతి ననుసరించి తండ్రి యాత్మయే పుత్రుఁ డని తెలియుచున్నది. ఆ నాలుగు భుజములు గల్గిన మన్మథునకు రెండు విండ్లేర్పడినవి. దమయన్తియొక్క రెండు కన్నుబొమ్మలును నారెండు విండ్లుగను, ఆమె యొక్క తీగెలవంటి రెండుచెవులును వెదురుతాటల వలె గట్టివైన రెండు అల్లెత్రాళ్లగను భావింపఁబడునది॥౭౨॥

శ్లో॥ గ్రీవాద్భుతైవాఽవటుశోభితాఽపి
ప్రసాధితా మాణవకేన సేయమ్।
ఆలిఙ్గ్యతా మప్యవలమ్బమానా
సరూపతాభాగఖిలోర్ధ్వకాయా॥ ౭౭

ప॥ వి॥ గ్రీవా। అద్భుతా। అవటుశోభితా (వటుశోభితా)। అపి। ప్రసాధితా। మాణవకేన। సా। ఇయమ్। ఆలిఙ్గ్యతామ్। అపి। అవలమ్బమానా। సరూపతాభాగఖిలోర్ధ్వకా। యా.

టీక॥ యా = ఏ, గ్రీవా = దమయన్తిమెడ, అవటుశోభితాఽపి; (వటువుచే) మాణవకునిచే శోభింపఁబడనిదైనను, మాణవకేన = (వటువుచే) మాణవకమను పేరుగలహారముచే, ప్రసాధితా = అలంకరింపఁబడినదో, అవటుశోభితా; అవటు = పెడతలచే శోభితా = అలంకరింపఁబడినదో (మఱియు) ఆలిఙ్గ్యతాం = కౌగలింపఁదగియుండుటను (ఆలిఙ్గ్యమను మృదఙ్గరూపమును) అవలమ్బమానాఽపి = పొందినదైనను, సరూపతాభాగఖిలోర్ధ్వకా; సరూపతా = సమానరూపత్వమును, అనగా మెట్టపల్లములులేనిరూపమును, భాక్ = పొందిన, అఖిల = సమగ్రమైన, ఊర్ధ్వకా = శరీరముయొక్క ఊర్ధ్వభాగములుగలదిగను, (ఊర్ధ్వకమనుమద్దెలగలదిగనున్న) సా = ఆ, ఇయం = ఈదమయన్తిమెడ, అద్భుతా = ఆశ్చర్యకరమైనది.

వి॥ మృదఙ్గములు మూడువిధములు 1)అఙ్క్యము, 2)ఊర్ధ్వకము, 3) ఆలిఙ్గ్యము అని. అఙ్క్యము కరక్కాయ యాకృతిగను, ఊర్ధ్వకము యవమధ్యాకారముగను, ఆలిఙ్గ్యము గోపుచ్ఛాకారముగను నుండును.

1) ఇచ్చట తొలుత, దమయన్తి మెడ అవటుశోభితమైనను, అనగా అమాణవకశోభిత మైనను, మాణవశోభిత మని చెప్పుటవలన విరోధాభాసము. అవటుఅనగా, పెడతల పెడతలతో శోభించునది యనియు, మాణవక మను హారముచే శోభించు నదియు నని యర్థమునుఁ జెప్పుటచే విరోధపరిహారము. వటు వనగా మాణవకుఁడు, అనగా బాలుడు. మాణవక మనగా నిఱువదిసరములు గల హారము. ఈ యర్థములనుఁ జెప్పి విరోధపరిహారము లూహ్యములు.

2) ఆలిఙ్గ్య మను మృదఙ్గరూపమును బొందినను అనగా గోపుచ్ఛాకార మైన మృదఙ్గత్వముఁబొందినను, సరూపమైనదియు, సమగ్రమైనదియు నగు నూర్ధ్వక మను మృదఙ్గరూపమును అనగా యవమధ్యాకారమృదఙ్గరూపమునుఁ బొందినదై యున్నది. ఆలిఙ్గ్య మను మృదఙ్గరూపమునుఁ బొందినది, ఊర్ధ్వక మను మృదఙ్గ రూపమునుఁ బొందదు గదా. ఏల యనగా ఆలిఙ్గ్య మను మృదఙ్గము గోపుచ్ఛాకారము; ఊర్ధ్వక మను మృదఙ్గము యవమధ్యాకారము. కాన నీ రెండుమృదఙ్గములకు నాకార భేద మున్నది కాన నిందులో నొకటి మఱియొకటి కానేరదు. కాన విరోధ మేర్పడినది. ఆమె మెడ ఆలి

ఙ్గనముచేసుకొనఁదగిన దైనను సరూపత్వమును, అనగా నంతట మెట్టు పల్లములు లేక యుండుటనుఁ బొందిన ఉపరిభాగమునుఁ గల్గి యున్న దని చెప్పుటవలన విరోధమునకు పరిహారము కాన నిచ్చట గూడ విరోధాభాసము. ఈ రెండు విరోధాభాసములకు సంసర్గమున్నందు వలన సజాతీయసంసృష్టి.

## సమాసములు :

*అవటుశోభితా :* వటునా శోభితా = వటుశోభితా. న వటుశోభితా = అవటుశోభితా.

*ఆలిఙ్గ్యతామ్ :* ఆలిఙ్గితుం యోగ్యా = ఆలిఙ్గ్యా. ఆలిఙ్గ్యాయాః భావః = ఆలిఙ్గ్యతా. తామ్ = ఆలిఙ్గ్యతామ్.

(వాద్యపక్షమున)

*ఆలిఙ్గ్యతామ్ :* ఆలిఙ్గ్యస్య భావః = ఆలిఙ్గ్యతా. తామ్ = ఆలిఙ్గ్యతామ్.

*సరూపతాభాగఖిలోర్ధ్వకా :* సమానం రూపం యస్య తత్ = సరూపమ్. సరూపస్య భావః = సరూపతా. సరూపతాం భజతీతి = సరూపతాభాక్. అఖిల శ్చాసౌ ఊర్ధ్వకశ్చ = అఖిలోర్ధ్వకః. సరూపతాభాక్ అఖిలోర్ధ్వకః యస్యాస్సా = సరూపతాభాగఖిలోర్ధ్వకా. (మృదఙ్గపక్షమునగూఁడ నీవిగ్రహము సమానము).

## భావము :

దమయన్తి మెడ మిక్కిలి యాశ్చర్యకరముగ నున్నది. ఏల యనగా నది వటువుచే ననగా, మాణవకునిచే శోభితము కాకపోయినను మాణవక శోభితము. ఇది విరోధము. మాణవక శబ్దమునకు బాలుఁడనియు, హారమనియు నర్థములు చెప్పుటవలన నా విరోధమునకు పరిహారము. ఇట్లు విరోధములతోఁ గూడి నందువలననే యాశ్చర్యకర మని చెప్పఁబడినవి. అవటుశబ్దమునకు పెడతల యని యర్థము చెప్పుటచే నామె మెడ పెడతలచే శోభించుచున్నదనియు సుందర మైన దనియు నర్థ మేర్పడును.

అట్లే, ఆమె మెడ యాలిఙ్గనముఁ జేయఁదగిన దైనను ఆలిఙ్గ్య మను మృదఙ్గరూపమునుఁ బొందిన దైనను, సమానరూపముగా వెలసి సుందర మైన

శరీరోర్ధ్వభాగము కల్గిన దనియు, సమానరూపము గల్గిన సమగ్ర మైన ఊర్ధ్వక మను మృదఙ్గరూపమును బొందిన దనియు వర్ణితము. ఇచ్చట ఆలిఙ్గ్య మను మృదఙ్గము గోపుచ్ఛాకారముగను ఊర్ధ్వక మను మృదఙ్గము యవ మధ్యాకారముగను నుండుటవలన నీ రెంటికి నేకత్వము చెప్పుట వలన విరోధము. అది "ఆలిఙ్గ్యతామ్'' అను పదమునకు ఆలిఙ్గనార్హతను, ఊర్ధ్వకపదమునకు శరీరోపరిభాగ మను నర్థమునుఁ జెప్పుటవలన పరిహృతము. మఱియు ''సరూపతాభాగఖిలోర్ధ్వకాయా'' అనియు నిట పాఠము గలదు. ఆ పక్షమున సరూపత్వమును అనగా నిమ్నోన్నతత్వరాహిత్యమునుఁ బొందిన ఊర్ధ్వకాయము, అనగా శరీరోపరిభాగ మను నర్థముఁ జెప్పుకొన వలయును. ఈ పాఠము "సరూపతాభాగఖిలోర్ధ్వకాయా,'' యను శ్లోకపాదములో 'సరూపతా భాగఖిలోర్ధ్వకా । యా' అని పదచ్ఛేదము చేయక "సరూపతాభాగఖిలోర్ధ్వ కాయా" అని కలిపి పఠించుటచేతనే లభించును. ఇట్టి విరోధములతోఁ గూడి నందువలననే, దమయన్తి "మెడ" అద్భుత మని చెప్పఁబడినది. ॥౮౮॥

శ్లో॥ కవిత్వగానప్రియవాదసత్యా
న్యస్యా విధాతా న్యధితాఽధికణ్ఠం ।
రేఖాత్రయన్యాసమిషాదమీషాం
వాసాయ సోఽయం విబభాజ సీమాః॥ ౮౭

ప॥ వి॥ కవిత్వగానప్రియవాదసత్యాని । అస్యాః । విధాతా । న్యధిత । అధి కణ్ఠం । రేఖాత్రయ న్యాసమిషాత్ । అమీషాం । వాసాయ । సః । అయం । విబభాజ । సీమాః.

టీక॥ విధాతా = బ్రహ్మ, అస్యాః = ఈదమయన్తియొక్క, అధికణ్ఠం = కణ్ఠ మునందు, కవిత్వగానప్రియవాదసత్యాని; కవిత్వ = కవిత, గాన = సంగీతము, ప్రియవాద = ప్రియవచనము, సత్యాని = సత్యము అను నీ నాలుగును, న్యధిత = ఉంచెను. సః = ఆ, అయం = ఈ బ్రహ్మ, అమీ షాం = చెప్పఁబడిన కవిత్వము మున్నగు వానియొక్క, వాసాయ = నివాసమునకై, రేఖాత్రయన్యాసమిషాత్; రేఖాత్రయ = మూడురేఖలను, న్యాస = ఉంచుటయొక్క, మిషాత్ = వ్యాజమువలన, సీమాః = హద్దు లను, విబభాజ = విభజించెను.

వి॥ మెడయందలిమూడుభాగ్యరేఖలను, ఎల్లలకై గీచిన గుఱుతులుగాఁభావించుటవలన నుత్రేక్ష. అది ''రేఖాత్రయన్యాసమిషాత్''అని మిషశబ్దముచేఁ జెప్పఁబడిన యపహ్నవాలఙ్కారముతో ననుప్రాణితము.

సమాసములు:

కవిత్వగానప్రియవాదసత్యాని : కవిత్వం చ గానం చ ప్రియవాదశ్చ సత్యం చ కవిత్వగానప్రియవాదసత్యాని. తాని = కవిత్వగాన ప్రియవాద సత్యాని.

అధికణ్ఠం : కణ్ఠే = అధికణ్ఠం.

రేఖాత్రయన్యాసమిషాత్ : రేఖాణాం త్రయం = రేఖాత్రయం. రేఖాత్రయస్య న్యాసః = రేఖాత్రయన్యాసః. రేఖాత్రయన్యాసస్య మిషః = రేఖాత్రయ న్యాసమిషః. తస్మాత్ = రేఖాత్రయన్యాసమిషాత్.

భావము :

బ్రహ్మ దమయన్తి కణ్ఠమున, కవిత్వము, గానము, ప్రియవచనము, సత్యభాషణము అనునాలుగు విషయముల నుంచెను. ఈ నాల్గింటికిని ప్రత్యేక నివాసములను గల్పించుటకై యామె కణ్ఠమందు మూఁడు లేఖలను గీచి వానికి వివాదము లేకుండఁ జేసెను. కణ్ఠమున మూఁడు రేఖలుండుట భాగ్యలక్షణము. అట్టి రేఖలు గల యువతి కమ్బుగ్రీవ-యని చెప్పఁబడుచున్నది. దమయన్తి కవిత్వాది కళలు గల్గినదియు కమ్బుకణ్ఠియు నని భావము ॥౬౫॥

శ్లో॥ బాహూ ప్రియాయా జయతాం మృణాలం
ద్వన్ద్వే జయా నామ న విస్మయోఽస్మిన్ ।
ఉచ్చైస్తు తచ్చిత్రమముష్య భగ్న
స్యాలోక్యతే నిర్వ్యథనం యదన్తః ॥ ౬౬

ప॥వి॥ బాహూ । ప్రియాయాః । జయతాం । మృణాలం । ద్వన్ద్వే । జయః । నామ । న । విస్మయః । అస్మిన్ । ఉచ్చైః । తు । తత్ । చిత్రమ్ । అముష్య । భగ్నస్య । ఆలోక్యతే । నిర్వ్యథనం । యత్ । అన్తః.

టీక॥ ప్రియాయాః = ప్రియురాలైన దమయన్తియొక్క, బాహూ = భుజములు, మృణాలం = తామరకాడను, జయతాంనామ = జయింపనిమ్ము. అస్మిన్ = ఈ, ద్వన్ద్వే = జంటయందు (కలహమందు,) విస్మయః = ఆశ్చర్యము, న = లేదు. కిన్తు = కాని; భగ్నస్య = భంగమును అనగా పరాజయమునుఁ బొందిన, అముష్య = ఈతామరకాడయొక్క, అన్తః = లోపల, (అన్తఃకరణమునందును,) నిర్వ్యథనం = దుఃఖము లేకయుండుటయు, (రంధ్రము), యత్ = ఎందువలన, ఆలోక్యతే = చూడఁబడుచున్నది, తత్ = అది, ఉచ్చైః = గొప్ప, చిత్రం = ఆశ్చర్యము.

వి॥ భంగము పొందిన తామరకాడయొక్క గర్భమున (మనస్సున) నిర్వ్యథనము అనగా దుఃఖము లేదనుట విరోధము. నిర్వ్యథనశబ్దమునకు రంధ్ర మను నర్థము చెప్పుటచే విరోధపరిహారము. కాన విరోధాభాసాలఙ్కారము.

సమాసములు:

నిర్వ్యథనం : వ్యథనస్య అభావః = నిర్వ్యథనం.

**భావము :**

దమయన్తి బాహువులు తామరకాడలను జయించునుగాక. ఇది యాశ్చర్యము గాదు. మఱేమనగా నామెయొక్క బాహువులచే పరాజయముఁ బొందిన తామరకాడలలోపల నిర్వ్యథన మనగా దుఃఖము లేక యుండుటయే యాశ్చర్యము. పరాజయము పొందినవారు దుఃఖింతురు గదా. కాని యది యీతామర కాడకు లేకపోవుట వింతగా నున్నది. నిర్వ్యథన మనగా రంధ్రము. తామర కాడకు నిర్వ్యథన మనగా, దుఃఖరాహిత్యము గాదు. మఱే మనగా రంధ్రము తామరకాడను తుంచినచో దాని లోపల రంధ్ర ముండుట ప్రసిద్ధము. కాన తామరకాడకు దుఃఖము లేదనుట పరిహరింపఁబడినవి. అనగా నామె బాహువులు తామరకాడలకు సమానము లైన వని భావము ॥౭౧॥

శ్లో॥ అజీయతావర్త శుభంయునాభ్యా
దోర్భ్యాం మృణాలం కిము కోమలాభ్యాం ।

నిఃసూత్రమాస్తే ఘనపఙ్కమృత్సు
మూర్తాసు నాఽకీర్తిషు తన్నిమగ్నమ్॥ ౬౯

ప॥వి॥ అజీయత । ఆవర్తశుభంయునాభ్యాః । దోర్భ్యాం । మృణాలం । కిమ్ । ఉ । కోమలాభ్యాం । నిఃసూత్రమ్ । ఆస్తే । ఘనపఙ్కమృత్సు । మూర్తాసు । న । అకీర్తిషు । తత్ । నిమగ్నమ్ ।

టీక॥ ఆవర్తశుభంయునాభ్యాః; ఆవర్త = సుడివలె, లేదా ఆవర్త = దక్షిణావర్తముచే, శుభంయు = శుభముతోఁగూడిన, నాభ్యాః = బొక్కిలిగల్గిన దమయన్తియొక్క, కోమలాభ్యాం = మృదువులైన, దోర్భ్యాం = భుజములచే, మృణాలం = తామరకాడ, అజీయతకిము = జయింపఁబడినదా యేమి? కుతః = ఏలయనగా, ఘనపఙ్కమృత్సు; ఘన = చిక్కనైన, పఙ్క = బురదలనెడి, మృత్సు = మట్టియనెడి, మూర్తాసు = శరీరమునుధరించిన, అకీర్తిషు = అపకీర్తులయందు, తత్ = ఆతామరకాడ, నిమగ్నం = మునిగినదై, నిఃసూత్రం = వ్యవస్థయు, స్ఫూర్తియు, ఉపాయములేనిదై (లోపలదారములులేనిదై), నాస్తేకిము = ఉండలేదా యేమి (తప్పక యున్నది.)

వి॥ ఇచ్చట దమయన్తి భుజములచే తామరతూండ్లు జయింపఁబడక పోయినను జయింపఁబడి నట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష. బురదమట్టిని అపకీర్తితో రూపించుటవలన రూపకము.

## సమాసములు :

ఆవర్తశుభంయునాభ్యాః : శుభమస్యాఅస్తీతి = శుభంయుః. ఆవర్త ఇవ ఆవర్తేన వా శుభంయుః = ఆవర్తశుభంయుః. ఆవర్తశుభంయుః నాభిః యస్యాస్సా = ఆవర్తశుభంయునాభిః. తస్యాః = ఆవర్తశుభంయునాభ్యాః.

నిస్సూత్రమ్ : నిర్గతం సూత్రం యస్మాత్తత్ = నిస్సూత్రమ్.

ఘనపఙ్కమృత్సు : ఘనా ఏవ పఙ్కాః = ఘనపఙ్కాః. ఘనపఙ్కా ఏవ మృదః = ఘనపఙ్కమృదః. తాసు = ఘనపఙ్కమృత్సు.

అకీర్తిషు : న కీర్తయః = అకీర్తయః. తాసు = అకీర్తిషు.

**భావము :**

ఈ దమయన్తి పొక్కిలి నీటిసుడి వలె శుభప్రద మైనది. లేదా ఆ పొక్కిలి దక్షిణావర్తముచే శుభప్రద మైనది. అట్టి దమయన్తి తన సుకుమారములైన బాహువులచే తామరతూఁడుమ జయించినది. కావుననే యాతామరతూడు చిక్కని బురదల నెడి యపకీర్తులయందు మునింగి, ఉపాయము వ్యవస్థయు లేక యున్నది. లేత తామరకాడలో దారము లుండవు గాన నది నిస్సూత్రములై యుండును. అట్టి లేఁదామరతూడు సైతము దమయన్తి భుజములచే జయింపఁబడిన దని యాశయము ॥౭౯॥

శ్లో॥ రజ్యన్నఖస్యాఙ్గులిపఞ్చకస్య
మిషాదసౌ హైఙ్గుల పద్మతూణే।
హైమైకపుఙ్ఖాఽస్తి విశుద్ధపర్వా
ప్రియాకరే పఞ్చశరీ స్మరస్య॥ ౭౦

ప॥వి॥ రజ్యన్నఖస్య । అఙ్గులిపఞ్చకస్య । మిషాత్ । అసౌ । హైఙ్గుల పద్మతూణే । హైమైకపుఙ్ఖా । అస్తి । విశుద్ధపర్వా । ప్రియాకరే । పఞ్చశరీ । స్మరస్య ।

టీక॥ రజ్యన్నఖస్య; రజ్యత్ = స్వభావముచే రక్తములైన, నఖస్య = గోళ్లు గల్గిన, అఙ్గులిపఞ్చకస్య = అయిదుప్రేళ్లయొక్క, మిషాత్ = నెపము వలన, అసౌ = ఎదుటనున్న, హైమైకపుఙ్ఖా; హైమ = సువర్ణమయమును, ఏక = అసాధారణములైన, పుఙ్ఖా = మూలప్రదేశములుగల విశుద్ధపర్వా = పురుగుకొట్టని కణుపులుగల, స్మరస్య = మన్మథునియొక్క, పఞ్చశరీ = అయిదుబాణములసమూహము, ప్రియాకరే = ప్రియురాలి హస్తమనెడు, హైఙ్గులపద్మతూణే; హైఙ్గుల = ఇంగిలీకవువన్నెగల్గిన, పద్మతూణే = పద్మమనెడియమ్ములపొదియందు, అస్తి = కలదు.

**సమాసము :**

రజ్యన్నఖస్య : **రజ్యన్తః నఖాః యస్య తత్** = రజ్యన్నఖం. **తస్య** = రజ్యన్నఖస్య.

హైఙ్గులపద్మతూణే : హిఙ్గులేన రక్తః = హైఙ్గులః. పద్మమేవ తూణః = పద్మతూణః. హైఙ్గులశ్చాసౌ పద్మతూణశ్చ = హైఙ్గులపద్మతూణః. తస్మిన్ = హైఙ్గులపద్మతూణే

హైమైకపుఙ్ఖా : హేమ్నః వికారాః = హైమాః. ఏకే చ తే పుఙ్ఖాశ్చ = ఏకపుఙ్ఖాః. హైమాః ఏకపుఙ్ఖాః యస్యాస్సా = హైమైకపుఙ్ఖా.

విశుద్ధపర్వా : విశుద్ధాని పర్వాణి యస్యాస్సా = విశుద్ధపర్వా.

ప్రియాకరే : ప్రియాయాః కరః = ప్రియాకరః. తస్మిన్ = ప్రియాకరే.

పఞ్చశరీ : పఞ్చానాం శరాణాం సమాహారః = పఞ్చశరీ.

భావము :

దమయన్తి గోరులు స్వభావముచేతనే యెఱ్ఱగా నున్నవి. అట్టి గోళ్లతోఁ గూడిన యామెయొక్క యైదు ప్రేళ్లనెడి నెపముతో, బంగారు మొదళ్లు కలిగినవియు, పురుగులుకొట్టని కణువులు కలవియు నగు మన్మథుని యైదు బాణములు దమయన్తి హస్తమనెడు, ఇంగిలీకపు వన్నె గల్గిన పద్మపు టమ్ములపొదియం దున్నవి. ॥౨౦॥

శ్లో॥ అస్యాః కరస్పర్శనగర్ధిబుద్ధి
ర్బాలత్వమాపత్ ఖలు పల్లవో యః।
భూయోఽపి నామాధరసామ్యగర్వం
కుర్వన్ కథం వాఽస్తు స న ప్రవాళః॥ ౨౧

ప॥వి॥ అస్యాః । కరస్పర్శనగర్ధిబుద్ధిః । బాలత్వమ్ । ఆపత్ । ఖలు । పల్లవః । యః । భూయః । అపి । నామ । అధరసామ్యగర్వం । కుర్వన్ । కథం । వా । అస్తు । సః । న । ప్రవాలః ।

టీక॥ యః = ఏ, పల్లవః = చిగురు, అస్యాః = ఈదమయన్తియొక్క, కరస్పర్శనగర్ధిబుద్ధిః; కర = హస్తముతో, స్పర్శన = స్పృశించుటను, గర్ధి = కోరుచున్న, బుద్ధిః = కాంతిగల్గినదై, బాలత్వం = శిశుత్వమును, అనగా నూతనత్వమును, (మూర్ఖత్వమును), ఆపత్ఖలు = పొందినదిగదా.

భూయోఽపినామ = మఱలను, అధరసామ్య = పెదవితోటిసాదృశ్యముచే, గర్వం = అహంకారమును, కుర్వన్ = చేయుచు, సః = ఆచిగురు, ప్రవాలః = ప్రవాలశబ్దవాచ్యముగను, ప్రబాలః = మిక్కిలి బాలుఁడు అనగా మూర్ఖుఁడుగను, కథంవా = ఎట్లు, నాఽస్తు = కాదు? పెద్దలతో పోటీకి దిగెడుబాలుడు మిక్కిలి మూర్ఖుడుగా భావింపఁబడును.

సమాసములు:

*కరస్పర్శనగర్ధిబుద్ధిః* : కరేణ స్పర్శనం = కరస్పర్శనం. కరస్పర్శనం గృధ్నాతీతి = కరస్పర్శనగర్ధినీ. కరస్పర్శనగర్ధినీ బుద్ధిః యస్య సః = కరస్పర్శనగర్ధిబుద్ధిః.

*అధరసామ్యగర్వం* : అధరేణ సామ్యం = అధరసామ్యమ్. అధరసామ్యేన గర్వః = అధరసామ్యగర్వః. తమ్ = అధరసామ్యగర్వం

భావము :

చిగురు మొదట నీ దమయన్తి చేతితో స్పర్శమున కాశపడి బాలత్వమును అనగా నూతనత్వమును మూర్ఖత్వమునుఁ బొందినది గదా! పెద్దవారితో స్పర్ధకు దిగునట్టి చిన్నవారు మూర్ఖులు గదా! ఇంతియ కాదు, ఇంకను పెదవితోటి సామ్యముచే గర్వము నొందుచు ప్రవాలమైనది (చిగురైనది). "వబయోరభేదః" అను న్యాయము ననుసరించి యా చిగురు ప్రబాలము గూడ నైనది. అనగా ప్రకృష్ట మైన బాల మైనది. అనగా మిక్కిలి మౌర్ఖ్యము గలదైనది. చేతికంటెను పెదవి రతిసర్వస్వ మైనందువలన మిక్కిలి యధికము. అందువలన ప్రవాలమునకు నధరసామ్యమే కాదు; హస్త సామ్యముగూడ లేదు. అనగా దమయన్తి చేయి, పెదవి చిగురుటాకును మించిన యెఱ్ఱదనమును గల్గియున్న వని భావము ॥౨౦॥

శ్లో॥ అస్యైవ సర్గాయ భవత్కరస్య
సరోజసృష్టిర్మమ హస్తలేఖః।
ఇత్యాహ ధాతా హరిణేక్షణాయాం
కిం హస్తలేఖీకృతయా తయాఽస్యామ్ ॥ ౨౧

ప॥వి॥ అస్య । ఏవ । సర్గాయ । భవత్కరస్య । సరోజసృష్టిః । మమ । హస్త లేఖః । ఇతి । ఆహ । ధాతా । హరిణేక్షణాయాం । కిం । హస్తలేఖీ కృత యా । తయా । అస్యామ్.

టీక॥ అస్య = ఈ, భవత్కరస్య = నీహస్తముయొక్క, సర్గాయైవ = సృష్టి కొఱకే, సరోజసృష్టిః = పద్మములసృష్టి, మమ = నాకు, హస్తలేఖః = తొలుతనలవరచుకొనెడిరేఖాభ్యాసము, ఇతి = అని, విధాతా = బ్రహ్మ, అస్యాం = ఈ,హరిణేక్షణాయాం = జింకకనులవంటికనులుగలదమయన్తి యందు, హస్తలేఖీకృతయా = తొలుతనభ్యాసమునకై హస్తమందలి పద్మరేఖగాచేయఁబడిన, తయా = ఆపద్మసృష్టితో, ఆహకిమ్ = చెప్పెనా యేమి?

వి॥ బ్రహ్మ దమయన్తి హస్తమందలి పద్మరేఖ యను పద్మసృష్టి ద్వారా చెప్పకపోయినను, చెప్పినట్లు చెప్పినందువలన నుత్ప్రేక్ష.

సమాసములు :

భవత్కరస్య : భరత్యాః కరః = భవత్కరః. తస్య = భవత్కరస్య.

సరోజసృష్టిః : సరోజస్య సృష్టిః = సరోజసృష్టిః.

హస్తలేఖః : హస్తస్య లేఖా యస్మిన్సః = హస్తరేఖః

హరిణేక్షణాయాం : హరిణస్య ఈక్షణే ఇవ ఈక్షణే యస్యాః సా = హరిణేక్షణా. తస్యాం = హరిణేక్షణాయాం.

హస్తలేఖీకృతయా : అలేఖా లేఖా సమ్పద్యమానా కృతా = లేఖీకృతా. హస్తే లేఖీకృతా = హస్తలేఖీకృతా. తయా = హస్తలేఖీకృతయా.

భావము :

నీయొక్క హస్తములను సృజించుటకై పద్మసృష్టి నాకు తొలుత నలవాటుకై గావించెడి యభ్యాసపు హస్తరేఖ యని బ్రహ్మ ఈ దమయన్తి విషయమున నభ్యాసము చేయఁబడినదియు, హస్తమందలి పద్మరేఖగాఁ జేయఁ బడినదియు నగు పద్మసృష్టి ద్వారా ఆమెకై చెప్పెనా యేమి? ॥౭౨॥

శ్లో॥ కిం నర్మదాయా మమ సేయమస్యా
దృశ్యాఽభితో బాహులతామృణాళీ।
కుచౌ కిము త్తస్థతుర న్తరీ పే
స్మరోష్మశుష్య త్తరబాల్యవారః॥ ౨౩

ప॥వి॥ కిం । నర్మదాయాః । మమ । సా । ఇయమ్ । అస్యాః । దృశ్యా । అభితః । బాహులతా । మృణాళీ । కుచౌ । కిమ్ । ఉత్తస్థతుః । అన్తరీపే । స్మరోష్మశుష్య త్తరబాల్యవారః ।

టీక॥ స్మరోష్మణా = మన్మథసన్తాపముచే, శుష్య త్తరబాల్యవారః; శుష్య త్తర = మిక్కిలియెండిపోవుచున్న, బాల్య = శైశవమను, వారః = ఉదకము గల్గిన, అస్యాః = ఈదమయ న్తియనెడు, నర్మదాయాః = సుఖము నొసంగెడు, నర్మదాయాః = నర్మదానదికి, అభితః = రెండుపార్శ్వ ములయందును, దృశ్యా = కానవచ్చెడి, బాహులతా = భుజలత, మృణాలీ కిం = తామరతూడాయేమి. కుచావేవ = స్తనములే, అన్తరీపే = నది యందలిద్వీపములుగా, ఉత్తస్థతుః కిం = పైకిలేచినవాయేమి.

వి॥ దమయన్తిని నర్మదగను బాహులతను తామర తూఁడుగను రూపించుట వలన రూపకము. కుచములను నదీమధ్యమందు త్థిము లైన ద్వీపము లుగా భావించుటవలన నుత్ప్రేక్ష. ఆ రూపకముచే నీ యుత్ప్రేక్ష యుజ్జీ వితము.

సమాసములు :

నర్మదాయాః : నర్మదదాతీతి = నర్మదా. తస్యాః = నర్మదాయాః.

బాహురేవ లతా = బాహులతా.

అన్తరీపే : అన్తః ఆపః యయో స్తే = అన్తరీపే.

స్మరోష్మశుష్య త్తరబాల్యవారః: స్మరస్య ఊష్మా = స్మరోష్మా. అత్య న్తం శుష్యత్ = శుష్య త్తరం. స్మరోష్మణా శుష్య త్తరం = స్మరోష్మశుష్య త్తరం. బాల్యమేవ వాః = బాల్యవాః. స్మరోష్మశుష్య త్తరం బాల్యవాఃయస్యాస్సా = స్మరోష్మశుష్య త్తరబాల్యవాః. తస్యాః = స్మరోష్మశుష్య త్తరబాల్యవారః.

**భావము :**

మన్మథసన్తాపముచే నెండిపోయిన బాల్య మను సుదకము గల్గిన యీ దమయన్తి, క్రీడాప్రదయై నర్మద యైనది, నర్మదానదియు నైనది. కావుననే యీమె నర్మదానదివలె నుభయపార్శ్వములయందును భుజలత లనెడి తామర తూండ్లను గల్గి యున్నది. నర్మదానదియం దుభయపార్శ్వములయందును తామరతూండ్లుండును. ఆమెయొక్క చనుదోయి యా నర్మద యందు పైకి లేచిన నదీమధ్యపు ద్వీపములా యని భావింపఁబడుచున్నది. ॥౨౩॥

శ్లో॥ తాళం ప్రభు స్స్యాదనుకర్తుమేతా
వుత్థానసుస్థౌ పతితం న తావత్ ।
పరం చ నాశ్రిత్య తరుం మహాన్తం
కుచౌ కృశాఙ్గ్యాః స్వత ఏవ తుఙ్గౌ॥ ౨౪

ప॥వి॥ తాళం । ప్రభు । స్యాత్ । అనుకర్తుమ్ । ఏతౌ । ఉత్థానసుస్థౌ । పతితం । న । తావత్ । పరం । చ । న । ఆశ్రిత్య । తరుం । మహాన్తం । కుచౌ । కృశాఙ్గ్యాః । స్వతః । ఏవ । తుఙ్గౌ ।

టీక॥ పతితం = పడిపోయిన, తాళం = తాటిపండు, ఉత్థానసుస్థౌ; ఉత్థాన = ఊర్ధ్వముఖముగానుండుటచే, సుస్థౌ = చక్కగానెలకొనిన, అనగా పడిపోనటువంటి, ఏతౌ = ఈ, స్తనౌ = దమయన్తి చనుదోయిని, అనుకర్తుం = అనుకరించుటకు, నప్రభు = సమర్థముగాదు. పరంచ = పడిపోక, చెట్టునందున్నటువంటి, తాళం = తాళఫలము, మహాన్తం = ఎత్తైన, తరుం = చెట్టును, ఆశ్రిత్య = ఆశ్రయించి, తుఙ్గంసత్ = ఎత్తైనదైనను, స్వతఏవ = స్వాభావికముగనే, తుఙ్గౌ = ఎత్తైనటువంటి, కృశాఙ్గ్యాః = దమయన్తియొక్క, కుచౌ = స్తనములను, అనుకర్తుం = అనుకరించుటకు, నప్రభు = సమర్థముగాదు.

**సమాసములు :**

సుస్థౌ : సుష్ఠు తిష్ఠత ఇతి = సుస్థౌ తౌ = సుస్థౌ.
కృశాఙ్గ్యాః: కృశం అఙ్గం యస్యాః సా = కృశాఙ్గీ. తస్యాః = కృశాఙ్గ్యాః.

**భావము :**

చెట్టునుండి పడిన తాటిపండు, పైభాగమున చక్కగా నమర్చఁబడిన దమయన్తి చనుదోయి ననుకరింప సమర్థము గాదు. ఏల యనగా తాటిపండు వృక్షమునుండి పడుటవలన పతితము. చనుదోయి దమయన్తి శరీరోపరిభాగమున సుప్రతిష్ఠితము. కాన పతితమయినది పతితము కానిదాని ననుకరింపఁజాలదు. పాపముచేఁ బతితుఁడు పుణ్యవన్తు ననుకరింపలేడు గదా. అట్లే తాటిచెట్టునుండి క్రింద పడకుండ జెట్టునందే యున్న తాటిపండు గూడ దమయన్తి చనుదోయి ననుకరింపఁ జాలదు. ఏల యనగా చెట్టునుండి పడనట్టి తాటిపండు చెట్టుపైన నెలకొని యున్నతమై యున్నదే గాని సహజముగా లేదు. కావున సహజముగా నున్నతములుగా నెలకొనిన దమయన్తి స్తనములను కేవలము ఎత్తైన చెటు నాశ్రయించుటచే నున్నత మైన తాటిపండు అనుకరింపఁజాలదు. స్వాభావిక మైన ఔన్నత్యము గల చనుదోయికిని, అస్వా భావిక మైన యౌన్నత్యము గల తాళఫలమునకు సామ్య మెట్లు పొసగును. కాన క్రిందఁబడిన తాళఫలము గాని, చెట్టునందలి తాళఫలము గాని దమయన్తి చనుదోయి ననుకరింపఁ జాల దని, తాళఫలముల నతిశయించిన యౌన్నత్యము వానికిఁ గలదని భావము ॥౨౪॥

శ్లో॥ ఏతత్కుచస్పర్ధితయా ఘటస్య
ఖ్యాతస్య శాస్త్రేషు నిదర్శనత్వం ।
తస్మాచ్చ శిల్పాన్మణికాదికారీ
ప్రసిద్ధనామాఽజని కుమ్భకారః॥ ౨౫

ప॥వి॥ ఏతత్కుచస్పర్ధితయా । ఘటస్య । ఖ్యాతస్య । శాస్త్రేషు । నిదర్శనత్వం । తస్మాత్ । చ । శిల్పాత్ । మణికాదికారీ । ప్రసిద్ధనామా । అజని । కుమ్భకారః.

టీక॥ ఏతత్కుచస్పర్ధితయా; ఏతత్కుచ = ఈ దమయన్తి స్తనములకు, స్పర్ధితయా = స్పర్ధగలవిగా, ఖ్యాతస్య = ప్రసిద్ధిపొందిన, ఘటస్య = కుండకు, శాస్త్రేషు = శాస్త్రములయందు, నిదర్శనత్వం = దృష్టాన్తముగా నుండుట, అజని = ఏర్పడినది. (మఱియు) మణికాదికారీ; మణిక =

పెద్దకాగుమున్నగువానిని, కారీ = నిర్మించునట్టి, కులాలః = కుమ్మరి, తస్మాత్ = ఆ, శిల్పాత్ = ఘటనిర్మాణమను శిల్పమునుండియే, ప్రసిద్ధ నామా = ప్రసిద్ధమైనపేరుగలవాఁడుగా, అజని = ఏర్పడెను.

## సమాసములు

*ఏతత్కుచస్పర్ధితయా :* ఏతస్యాః కుచౌ = ఎతత్కుచౌ, ఏతత్కుచాభ్యాం స్పర్ధీ = ఏతత్కుచస్పర్ధీ. ఏతత్కుచస్పర్ధినః భావః = ఏతత్కుచస్పర్ధితా. తయా = ఏతత్కుచస్పర్ధితయా.

*మణికాదికారీ :* మణికః ఆదిః యేషాన్తే = మణికాదయః. మణికాదీన్ కరోతీతి = మణికాదికారీ.

*ప్రసిద్ధనామా:* ప్రసిద్ధం నామ యస్య సః = ప్రసిద్ధనామా.

*కుమ్భకారః ;* కుమ్భం కరోతీతి = కుమ్భకారః.

## భావము :

న్యాయాదిశాస్త్రములలో "యత్ కృతకం తదనిత్యం; యథా ఘటః" అనియు, "యన్నిత్యం న; తదకృతకమపి న; యథాఘటః" అనియు అన్వయ వ్యతిరేకములతో ఘటము దృష్టాన్త మగుటకు కారణ మేమనగా నాఘటము దమయన్తి స్తనములతో నౌన్నత్యాదులయందు స్పర్ధవహించుటయే. కాగులు మున్నగు పెద్ద కుండలను నిర్మించు కుంభకారుఁడు అనగా కుమ్మరి గూఁడ, దమయన్తి చనుదోయితో స్పర్ధ వహించిన కుండలను నిర్మించుటచేతనే కుమ్భకారుఁ డను ప్రసిద్ధినిఁ బొందఁ గల్గెను. కావున దమయంతి చనుదోయి కుంభముల కంటె నున్నతములని సారాంశము ॥౭౩॥

శ్లో॥ గుచ్ఛాలయస్వచ్ఛతమోదబిన్దు
వృన్దాభముక్తాఫలఫేనిలాఙ్కే।
మాణిక్యహారస్య విదర్భసుభ్రూ
పయోధరే రోహతి రోహితశ్రీః॥ ౭౪

ప॥వి॥ గుచ్ఛాలయస్వచ్ఛ తమోద బిన్దువృన్దాభముక్తా ఫలఫేనిలాఙ్కే । మాణి క్యహారస్య । విదర్భసుభ్రూపయోధరే । రోహతి । రోహితశ్రీః.

టీక॥ మాణిక్యహారస్య = మాణిక్యమణిమయమైనహారముయొక్క, రోహితశ్రీః = ఎఱ్ఱని కాంతి, గుచ్ఛాలయస్వచ్ఛతమోదబిన్దు వృన్దాభముక్తాఫల ఫేనిలాఙ్కే; గుచ్ఛాలయ = గుచ్ఛమను హారవిశేషమును స్థానముగాఁ గల్గిన, స్వచ్ఛతమ = మిక్కిలి నిర్మలములైన, ఉదబిన్దువృన్ద = ఉదక బిందువుల సమూహముయొక్క, ఆభ = కాన్తివంటికాన్తిగల్గిన, ముక్తా ఫల = ముత్తియములతో, ఫేనిల = నురుగుకమ్మినదానివలె ప్రకాశ వన్తమైన, అఙ్కే = మధ్యభాగము గల్గిన, విదర్భసుభ్రూ పయోధరే; విదర్భసుభ్రూ = విదర్భదేశపు సున్దరియైన దమయన్తియొక్క, పయో ధరే = స్తనమునందు, రోహతి = పుట్టుచున్నది. పయోధరే = మేఘ మందు, రోహితశ్రీః; రోహిత = వంకరలేని యింద్రధనుస్సుయొక్క, శ్రీః = శోభ, రోహతి = ప్రాదుర్భవించుచున్నది.

సమాసములు :

*గుచ్ఛాలయస్వచ్ఛతమోదబిన్దువృన్దాభముక్తాఫలఫేనిలాఙ్కే*: గుచ్ఛః ఆలయః యేషాం తాని = గుచ్ఛాలయాని. అత్యన్తం స్వచ్ఛాని = స్వచ్ఛతమాని. ఉదకానాం బిన్దవః = ఉదబిన్దవః. ఉదబిన్దూనాం వృన్దః = ఉదబిన్దువృన్దః. ఉద బిన్దువృన్దస్య ఆభేవ ఆభా యేషాం తాని = ఉదబిన్దు వృన్దాభాని. స్వచ్ఛతమాని చ తాని ఉదబిన్దువృన్దాభాని చ = స్వచ్ఛతమోదబిన్దువృన్దాభాని. గుచ్ఛాలయాని చ తాని స్వచ్ఛతమోదబిన్దువృన్దాభాని చ = గుచ్ఛాలయస్వచ్ఛతమోదబిన్దువృన్దా భాని. గుచ్ఛాలయ స్వచ్ఛతమోద బిన్దువృన్దాభాని చ తాని ముక్తాఫలాని చ = గుచ్ఛాలయస్వచ్ఛతమోద బిన్దువృన్దాభముక్తాఫలాని. ఫేనః అస్యఅస్తీతి = ఫేనిలః. గుచ్ఛాలయస్వచ్ఛతమోద బిన్దువృన్దాభముక్తాఫలైః ఫేనిలః = గుచ్ఛా లయ స్వచ్ఛతమోదబిన్దు వృన్దాభముక్తాఫలఫేనిలః. గుచ్ఛాలయ స్వచ్ఛతమోద బిన్దు వృన్దాభము కాఫలఫేనిలః అఙ్కః యస్యసః = గుచ్ఛాలయస్వచ్ఛతమోద బిన్దు వృన్దాభముక్తాఫల ఫేనిలాఙ్కః. తస్మిన్ = గుచ్ఛాలయ స్వచ్ఛతమోద బిన్దువృన్దాభముక్తాఫలఫేనిలాఙ్కే.

**మాణిక్యహారస్య**: మాణిక్యమయః హారః = మాణిక్యహారః. తస్య = మాణిక్యహారస్య.

విదర్భసుభ్రూపయోధరే : విదర్భాణాం సుభ్రూః = విదర్భసుభ్రూః. విదర్భసుభ్రువః పయోధరః = విదర్భసుభ్రూపయోధరః, తస్మిన్ = విదర్భ సుభ్రూపయోధరే.

రోహితశ్రీః : రోహితా చ సా శ్రీశ్చ = రోహితశ్రీః.

**భావము :**

గుచ్ఛ మను హారమునఁ గూర్పఁబడినవియు, స్వచ్ఛ మగు నీటి బిందువుల సమూహము వంటి కాంతిగలవియు నగు ముత్తెములతో నురుగుతో కూడిన దానివలె ప్రకాశించెడి మధ్యప్రదేశము గల్గిన దమయన్తి చనుదోయిపై మాణిక్యహారముయొక్క యెఱ్ఱని కాన్తి కమ్ముకొనినది. అనగా దమయన్తి చను దోయి ముత్యాహారముతోఁడను మాణిక్యహారముతోడను శోభించుచున్న దని యాశయము. ఆ ముత్తెములు గుచ్ఛమను హారమునందుఁ గూర్పఁబడినవై మిక్కిలి స్వచ్ఛము లైన నీటి బిందువులనుఁ బోలి యున్నవి. అట్టి ముత్తెము లతో చనుదోయి మధ్యభాగము నునుపుతోఁ గూడినట్టుగ ప్రకాశించుచున్నది. అట్టి ముత్తెముల సరముపై మాణిక్యహారము వేయఁబడుట వలన దాని ఎఱ్ఱని కాన్తి చనుదోయిపై పర్వి మిక్కిలి శోభ నిచ్చినది. పయోధరశబ్దమునకు మేఘమనునర్థ ముండుట వలనను, రోహితశబ్దమునకు వంపు లేని యింద్ర ధనుస్సనెడి యర్థ ముండుటవలనను, మేఘముపైన వంపులేని యింద్రధనుస్సు యొక్క కాంతి పర్విన దనియు భావము ॥౭౬॥

శ్లో॥ నిఃశఙ్కసఙ్కోచితపఙ్కజోఽయ
మస్యాముదీతో ముఖమిన్దుబిమ్బః।
చిత్రం తథాఽపి స్తనకోకయుగ్మం
న స్తోకమప్యఞ్చతి విప్రయోగమ్॥ ౭౭

ప॥వి॥ నిః శఙ్కసఙ్కోచితపఙ్కజః । అయమ్ । అస్యామ్ । ఉదీతం । ముఖమ్ । ఇందుబిమ్బః । చిత్రం । తథా । అపి । స్తనకోకయుగ్మం । న । స్తోకమ్ । అపి । అఞ్చతి । విప్రయోగమ్.

టీక॥ నిః శఙ్కసఙ్కోచితపఙ్కజః; నిః శఙ్క = జంకులేక, సఙ్కోచిత = ముడుచుకొనునట్లు చేయఁబడిన, పఙ్కజః = పద్మముగల్గిన, ముఖం =

ముఖమనెడి, ఇన్దుబిమ్బః = చన్ద్రబిమ్బము, అస్యాం = ఈదమయన్తి యందు, ఉదీతః = ఉదయించినది. తథాఽపి = అయినను, అనగా చంద్రుఁడుదయించినను, స్తనకోకయుగ్మం; స్తన = స్తనములనెడి, కోకయుగ్మం = చక్రవాకములజంట, స్తోకమపి = కొంచమైనను, విప్రయోగం = విరహమును, నఅఞ్చతి = పొందుటలేదు. చిత్రం = అశ్చర్యము.

వి॥ చంద్రోదయ మైనను స్తనచక్రవాకములకు విరహము కలుగలేదనుట విరోధము కాన విరోధాభాసాలఙ్కారము. ముఖమునుఁ జంద్రునితోఁడను, కుచములను చక్రవాకములతోఁడను రూపించుటవలన రూపకము. ఈ రూపకముచే విరోధాభాస ముత్థాపితఃము కాన నీరెంటికి నిట సఙ్కరము.

## సమాసములు :

*నిః శఙ్క సఙ్కోచిత పఙ్కజః :* నిర్గతా శఙ్కా యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = నిఃశఙ్కం. నిఃశఙ్కం సఙ్కోచితే = నిఃశఙ్క సఙ్కోచితే. నిఃశఙ్క సఙ్కోచితే పఙ్కజే యేన సః = నిఃశఙ్క సఙ్కోచిత పఙ్కజః.

*స్తనకోకయుగ్మం :* కోకయోః యుగ్మం = కోకయుగ్మమ్. స్తనావేవ కోకయుగ్మం = స్తనకోకయుగ్మం.

## భావము :

ఈ దమయన్తియొక్క ముఖచన్ద్రుఁడు జంకు లేకయే, తామరపూలను ముకుళింపఁజేసినవాడై దమయన్తియం దుదయించెను. అనగా దమయన్తి మోము పద్మముల నతిశయించి యున్నదని యాశయము. అట్లు ముఖచంద్రుఁ డుదయించినను స్తనము లనెడి చక్రవాకముల జంట నొండొంటిని వీడక యుండుట యాశ్చర్యము. చంద్రోదయము కాగానే చక్రవాకముల జంట నొండొంటిని వీడి పోవుట కవి సమయసిద్ధము. కాని యిట స్తనము లనెడి చక్రవాకములకు విరహము గలుగక పోవుట యాశ్చర్యము. అనగా దమయన్తి చనుదోయి చక్రవాకములవలె నున్న వని యాశయము. ॥22॥

శ్లో॥ అభ్యాం కుచాభ్యామిభకుమ్భయోః శ్రీ
రాదీయతేఽసావనయోః క్వ తాభ్యామ్।

భయేన గోపాయితమౌక్తికౌ తౌ
ప్రవ్యక్తముక్తాభరణావిమౌ యత్॥ ౭౮

ప॥వి॥ ఆభ్యాం । కుచాభ్యామ్ । ఇభకుమ్భయోః । శ్రీః। ఆదీయతే । అసౌ అనయోః । క్వ । తాభ్యామ్। భయేన । గోపాయితమౌక్తికౌ । తౌ । ప్రవ్యక్తముక్తాభరణౌ । ఇమౌ । యత్ ।

టీక॥ ఆభ్యాం = ఈ, కుచాభ్యాం = దమయన్తి చనుదోయిచే, ఇభకుమ్భయోః; ఇభ = ఏనుగుయొక్క, కుమ్భయోః = కుమ్భస్తలములయొక్క, శ్రీః = శోభ(సంపద),ఆదీయతే = గ్రహింపఁబడుచున్నది. తాభ్యాం = అ కుమ్భ స్థలములచే, అనయోః = ఈ స్తనములయొక్క, అసౌ = ఈశోభ, క్వ = ఎక్కడ, ఆదీయతే = గ్రహింపఁబడుచున్నది? (గ్రహింపఁబడుటలేదు). యత్ = ఏలయనగా, తౌ = ఆ గజకుమ్భములు, భయేన = భయముచేత, గోపాయితమౌక్తికౌ; గోపాయిత = దాచుకొనబడిన, మౌక్తికౌ = ముత్యములు గలవి. ఇమౌ = ఈదమయన్తియొక్క కుచకుమ్భములు, ప్రవ్యక్త = చక్కగావెల్లడింపఁబడిన, ముక్తాభరణౌ = ముత్తెములహారమును గల్గియున్నవి.

## సమాసములు :

*ఇభకుమ్భయోః* : ఇభయోః కుమ్భౌ = ఇభకుమ్భౌ. తయోః = ఇభకుమ్భయోః.

*గోపాయితమౌక్తికౌ* : గోపాయితాని మౌక్తికాని యాభ్యాం తౌ = గోపాతమౌక్తికౌ.

*ప్రవ్యక్తముక్తాభరణౌ* : ముక్తామయాని ఆభరణాని = ముక్తాభరణాని. ప్రవ్యక్తాని ముక్తాభరణాని యాభ్యాం తౌ = ప్రవ్యక్తముక్తాభరణౌ.

## భావము :

దమయన్తి స్తనములచే గజకుమ్భముల శోభ (సమ్పద) గ్రహింపఁబడినది. కాని గజకుమ్భములు దమయన్తి స్తనముల శోభ నెచ్చట గ్రహించును.

గ్రహింపఁజాలదు. ఏల యనగా గజకుమ్భములు స్తనకుమ్భముల వలని భయముతో ముత్తెములను లోనఁ దాచుకొనినవి. గజముల కుమ్భస్థలములలో ముత్తెము లుండుననిప్రసిద్ధి. కాని కుచకుమ్భములు ముత్యములతో గూర్పఁబడిన సొమ్ములను నిర్భయముగా ధరించుచున్నవి. రాజు ఎవ్వనిదైనను ధనమునుహరించునో,యతఁ డా ధనశేషమునుఁ దీసికొని దాచుకొనును. కాని రాజు తాను హరించిన ధనమును నిర్భయముగా వెల్లడిపఱచుకొనును. అట్లే యిట స్తనములు గజకుమ్భముల సంపదను హరించి వానిని ముక్తాభరణ రూపమున బట్టబయలులో ధరించి నిర్భయముగా నున్నవి. అనగా స్తనములు గజకుమ్భములను మించి యున్నవని సారాంశము. ॥౨౮॥

శ్లో॥ కరాగ్రజాగ్రచ్ఛతకోటిరర్థీ
యయోరిమౌ తౌతులయేత్ కుచౌ చేత్।
సర్వం తదా శ్రీఫలమున్మదిష్ణు
జాతం వటీమప్యధునా న లబ్ధుమ్॥ ౨౯

ప॥వి॥ కరాగ్రజాగ్రచ్ఛతకోటిః । అర్థీ । యయోః । ఇమౌ । తౌ । తులయేత్ । కుచౌ । చేత్ । సర్వం । తదా । శ్రీఫలమ్ । ఉన్మదిష్ణు । జాతం । వటీమ్ । అపి । అధునా । న । లబ్ధుమ్.

టీక॥ కరాగ్రజాగ్రచ్ఛతకోటిః; కరాగ్ర = చేతికొనయందు, జాగ్రత్ = ప్రకాశించెడి, శతకోటిః = వజ్రాయుధమును, నూరుకోట్లధనముగల్గినయింద్రుడు, యయోః = ఏ స్తనములకు, అర్థీ = యాచకుఁడో, తౌ = అటువంటి, ఇమౌ = ఈ స్తనములను, వటీ = చిన్నగవ్వను గూడ, లబ్ధుం = పొందుటకు, నజాతం = సమర్థము కానట్టి, అనగా నిర్ధనమైనటువంటి, సర్వం = సమగ్రమైన, శ్రీఫలం = మారేడుపండు, తులయేత్ = తనతోఁ బోల్చుకొనినచో, తదా = అప్పుడు, ఉన్మదిష్ణు = పిచ్చిపొందినదిగా, స్యాత్ = అగును.

## సమాసములు:

*కరాగ్ర జాగ్రచ్ఛత కోటిః:* కరస్య అగ్రం = కరాగ్రం. కరాగ్రే జాగ్రత్ = కరాగ్ర జాగ్రత్. కరాగ్ర జాగ్రత్ శతకోటిః యస్యసః = కరాగ్ర జాగ్రచ్ఛత కోటిః.

**భావము :**

దమయన్తి చనుదోయిని చేత శతకోటి యనగా వజ్రాయుధమును, నూరు కోట్ల ద్రవ్యముఁ గల్గిన యింద్రుడే యాచించి యున్నాఁడు. అట్టి స్తనములను చిన్న గవ్వనుఁ గూడ సంపాదింప లేని బిల్వఫలము లన్నియు తమతోఁ బోల్చుకొన నెంచినచో వానికి పిచ్చి సంభవించినట్లే భావింపవలసి యున్నది. ఏ విధముగను తమతోఁ బోలిక లేని స్తనములతోఁ బోలికనుఁ బొంద నాలోచించుటయు, ధనవన్తునికి లభ్యమైన వస్తువును చిల్లిగవ్వ లేని తాము (అనగా బిల్వఫలములు) ఆశించుటయు నున్మాదమే గదా. బిల్వఫలము లన్నియు నామె చనుదోయితోఁ బోలిక పొందలేకపోయిన వని 'సర్వ' శబ్దముచే సూచితము ॥౨౯॥

శ్లో॥ స్తనాతటే చన్దనపఙ్కిలేఽస్యా
జాతస్య యావద్యువమానసానామ్।
హారావలీ రత్నమయూఖధారా
కారాః స్ఫురన్తి స్ఖలనస్య రేఖాః॥ ౩౦

ప॥వి॥ స్తనాతటే । చన్దనపఙ్కిలే । అస్యాః । జాతస్య । యావద్యువమానసానామ్ । హారావలీరత్న మయూఖధారాకారాః । స్ఫురన్తి । స్ఖలనస్య । రేఖాః.

టీక॥ చందనపఙ్కిలే = చన్దనలేపతోఁగూడిన, అస్యాః = ఈదమయన్తి యొక్క, స్తనాఽఽతటే. స్తన= స్తనములయొక్క, ఆతటే=చఱియ యందు, జాతస్య=జన్మించిన, యావద్యువమానసానాం; యావత్= సమస్తములైన, యువమానసానాం = యువకుల మనస్సులకుసమ్బంధించిన, స్ఖలనస్య=జారినకాలినడకయొక్క, రేఖాః=బాటలు, హారావళీ రత్నమయూఖధారాకారాః; హారావళీ = కణ్ఠమందలిహారపఙ్క్తిలోని, రత్న = రత్నములయొక్క, మయూఖధారాః = కిరణ పఙ్క్తులనెడి, ఆకారాః=ఆకారములుగలవై, స్ఫురన్తి=ప్రకాశించుచున్నవి.

వి॥ ఇచ్చట రత్నకిరణ పఙ్క్తులయందు యువకుల మానసములు జారిన కాలి బాటల గీతల నుత్ప్రేక్షించుటవలన నుత్ప్రేక్ష.

**సమాసములు :**

స్తనాతటే : స్తనయోః ఆతటః = స్తనాతటః. తస్మిన్ = స్తనాతటే.

చన్దనపఙ్కిలే : పఙ్కః అస్య జాత ఇతి = పఙ్కిలః. చన్దనేన పఙ్కిలః = చన్దనపఙ్కిలః. తస్మిన్ = చన్దనపఙ్కిలే.

యావద్యువమానసానామ్ : యూనాం మానసాని = యువమానసాని. యావన్తి చ తాని యువమానసాని చ = యావద్యువమానసాని. తేషాం = యావద్యువమానసానాం.

హారావలీరత్నమయూఖధారాకారాః: హారాణామావల్యః = హారావల్యః. హారావలీనాం రత్నాని = హారావలీరత్నాని. హారావలీరత్నానాం మయూఖాః = హారావలీరత్నమయూఖాః. హారావలీరత్నమయూఖానాం ధారాః = హారావలీ రత్నమయూఖధారాః. హారావలీరత్నమయూఖధారా ఏవ ఆకారాః యాసాం తాః = హారావలీరత్నమయూఖధారాకారాః.

**భావము :**

చన్దనలేప మను నడుసుతోఁ గూడిన దమయన్తి స్తనముల చఱియలందు, యువకుల మనస్సులు జారగా నేర్పడిన కాలి బాటల గీతలు ఆమె ధరించిన రత్నంపు సరములలోని మణుల కిరణపఙ్క్తుల యాకారము గల్గి స్ఫురించుచున్నవి. అడుసు పైనఁ గాలిడినచో జారును గదా? అట్లే యీ దమయన్తి స్తనతటములపై పూయఁబడిన చన్దనపు టడుసుతో యువకుల మనస్సులు నడువ నారంభింపఁగా వానికి కాలు జారినవి. ఆ మనస్సులు నడుచుచుండుట వలన నా స్తనములపై బాటలు పడి గీత లేర్పడినవి. ఆ గీత లామె ధరించిన యాభరణముల కాంతి రేఖలా యని భావింపఁబడినవి. అనగా యువకుల మానసములు దమయన్తి చనుదోయిచఱియలపైఁ బడినవై వారి నాకర్షించుచున్న వనియు మిక్కిలి రమ్యములైన వనియు సారాంశము ॥౮౦॥

శ్లో॥ క్షీణేన మధ్యేఽపి సతోదరేణ
యత్ ప్రాప్యతే నాక్రమణం బలిభ్యః।

సర్వాఙ్గశుద్ధౌ తదనఙ్గరాజ్యే
విజృమ్భితం భీమభువీహ చిత్రమ్॥ ౧౧

ప॥వి॥ క్షీణేన । మధ్యే । అపి । సతా । ఉదరేణ । యత్ । ప్రాప్యతే । న । ఆక్రమణం । బలిభ్యః । సర్వాఙ్గశుద్ధౌ । తత్ । అనఙ్గరాజ్యే । విజృమ్భితం । భీమభువి । ఇహ । చిత్రమ్.

టీక॥ ఇహ = ఈ, భీమభువి = భీమునికూతురైనదమయన్తియందును, (భయఙ్కరస్థానమందును,) క్షీణేన = కృశించిన(దుర్బలమైన) మధ్యే = నడుమునందును (శత్రువులమధ్యయందును) సతాఽపి = వసించుచదైనను, ఉదరేణ = కడుపుచే, అనగా బొత్తికడుపుచే, వలిభ్యః = కడుపుపైని త్రివళులనుండియు, (వబలక భేదము కాన) బలిభ్యః = బలవన్తులనుండియు, ఆక్రమణం = అభివ్యాప్తియు, (పరాభవము) నప్రాప్యతే ఇతియత్ = పొందఁబడలేదనుటయేదిగలదో, తత్ = అది, చిత్రమ్ = ఆశ్చర్యకరము. (కిఞ్చ = మఱియు), సర్వాఙ్గశుద్ధౌ; సర్వాఙ్గ = సమస్తములగు కాలు,చేయి,మున్నగు నవయవములకును(స్వామ్యమాత్యాదికములగురాజ్యాఙ్గములకును) శుద్ధౌ = శుద్ధియుండగా, అనఙ్గరాజ్యే; అనఙ్గ = అఙ్గములేనివానికిని (మన్మథునకును), రాజ్యే = రాజ్యమునందు, విజృమ్భితం = విజృమ్భణ అనునది, చిత్రమ్ = మఱియొక ఆశ్చర్యము. మఱియు "అనఙ్గరాజ్యవిజృమ్భితమ్" అనుపాఠమున భీమభువి = దమయన్తియందు, అనఙ్గరాజ్య = మన్మథరాజ్యమునకు, విజృమ్భితం = విజృమ్భణ, చిత్రం = ఆశ్చర్యము. భీమభువి = భీమునిరాజ్యమందు,అనఙ్గరాజ్యవిజృమ్భితమ్ = అనఙ్గునిరాజ్యవిజృమ్భణ చిత్రం = ఆశ్చర్యకరము, ఒకరి రాజ్యమందు మఱియొకరి రాజ్య మెట్లు విజృమ్భించును? భీమభువి = శివునిరాజ్యమందు,అనఙ్గరాజ్యవిజృమ్భితమ్ = మన్మథరాజ్యవిజృమ్భణ, చిత్రమ్ = ఆశ్చర్యము, మున్నగు నర్థములూహ్యములు.

వి॥ శత్రుమధ్యమందున్నవానికి బలవంతులవలన నాక్రమణ జరుగలేదనుట విరోధము కాన విరోధాభాసాలఙ్కారము. మధ్యశబ్దమునకు "కౌను" అను నర్థము చెప్పుటవలనను పరిహారము.

సర్వాఙ్గశుద్ధి యున్నప్పుడు, అఙ్గరహితుని రాజ్యవిజృమ్భణ విరుద్ధము కాన నిదియు విరోధాభాసము. అఙ్గరహితశబ్దమున కనఙ్గుడనగా మన్మథుడను నర్థవివక్షచే దానికి పరిహారము.

ఇట్లే భీమభూమియందు, అనఙ్గరాజ్యవిజృమ్భణము విరుద్ధము. కాన నిచ్చటఁగూడ విరోధాభాసము. భీమభువి = భీముని కూతు రగు దమయన్తియందు నను నర్థమును వివక్షించుటవలన దానికి పరిహారము.

ఆట్లే భీమభూమియందు, అనగా శివుని భూమియందు, అనఙ్గుని విజృమ్భణ మన్మథుని విజృమ్భణ విరుద్ధము కాన విరోధాభాసము. "భీమభూ" శబ్దముదమయన్తి యను నర్థమును వివక్షించుటచే విరోధమునకు పరిహారము.

## సమాసములు :

సర్వాఙ్గశుద్ధౌ : సర్వాణి చ తాని అఙ్గానిచ = సర్వాఙ్గాణి. సర్వాఙ్గాణాం శుద్ధిః = సర్వాఙ్గశుద్ధిః. తస్యాం = సర్వాఙ్గశుద్ధౌ.

అనఙ్గరాజ్యే : అవిద్యమానం అఙ్గం యస్య సః = అనఙ్గః. అనఙ్గస్య రాజ్యమ్ = అనఙ్గరాజ్యమ్. తస్మిన్ = అనఙ్గరాజ్యే.

భీమభువి : భీమాత్ భవతీతి = భీమభూః. తస్యామ్ = భీమభువి. లేదా భీమస్య భూః = భీమభూః. తస్యాం = మభువి.

## భావము :

ఈ భైమి యఁనబడు దమయన్తియందు (భయఙ్కరస్థానమందును) కృశించినట్టిదియు (దుర్బలమై నట్టిదియు) నడుముపైన నున్నట్టి(శత్రుమధ్యమున నున్నట్టి)పొత్తికడుపును, త్రివళులచేననగా మూడు మడతలచే( బలులచేననగా బలవన్తులచే)అభివ్యాప్తియు (పరాభవము)లేకయుండుట ఆశ్చర్యకరము. సన్నని దమయన్తి కౌనుపై నున్న పొత్తికడుపుపై భాగమున త్రివళు లని చెప్పఁబడు మూడు మడతలు గలవు. ఆ మూడు మడతలు పొత్తికడుపు మీదికి వ్యాపించ లేదనుట ముఖ్యార్థము. ఈమెకుయౌవనము ప్రబలముగా నుండుటవలన నామె యుదరముపై నెలకొన్న యా త్రివళులు పొత్తికడుపుమీదికి వ్యాపింపలేకపోయి

నవి. ఆ యౌవనము క్షీణమైనచో బిగువు తగ్గుటవలన నా మదతలు పొత్తి కముపుమీదికిని వ్యాపించెడివి. ఇది శ్లేషచే నిట్లు చమత్కరింపఁబడుచున్నది. ఆమె యుదరము మిక్కిలి దుర్బలమైమధ్యమందు, అనగా శత్రువుల మధ్యము నం దున్నను వళు లనెడి బలులు (బలవన్తులు) ఆ యుదరము నాక్రమింపక పోవుట యాశ్చర్యము. మఱియు నామెకు సర్వాఙ్గములయందును శుద్ధి యున్నను సర్వాఙ్గ సమ్పత్తి యున్నను, అనగా సమస్త శరీరావయవములయందు శుద్ధి యున్నను, అఙ్గరహితునకు నామెపై విజృమ్భణ మఱి యొక ఆశ్చర్యము. అఙ్గసహితుల యెడ నఙ్గరహితునకు విజృమ్భణ యశక్యము గదా. అఙ్గ రహితుఁ డనగా ననఙ్గు డైన మన్మథుడు. అతనికి సర్వాఙ్గశుద్ధి గల దమ యన్తిపై విజృమ్భణ యిఁట వివక్షింపఁబడినది. ఇదియు శ్లేషచే నిట్లుచమత్కృ తము—స్వామ్యమాత్య సుహృత్ కోశ రాష్ట్ర దుర్గ బలము లనెడు సప్తాఙ్గము లను సర్వాఙ్గములయందు శుద్ధి గల్గినపుడు, అట్టి రాజ్యముపైన ఎట్టి యఙ్గము లేనివా డెట్లు విజృమ్భింపగలడు? కాన నిట్లు విజృమ్భణము ఆశ్చర్యకరము. అనగా దమయన్తి కౌను మిక్కిలి సన్నముగను, ఆమె యుదరము, త్రివళులతో యౌవనవశముచే బిగువుగాఁ నున్నవనియు నందువలననే యవి యామె పొత్తి కడుపుమీదికి జారలేదనియు, నామె కరచరణాది సకలావయవముల యందును శుద్ధిగను రమ్యముగను నుండుటవలన నామెపై కాముని విజృమ్భణ యేర్పడిన దనియు ననగా చూపరులకు కామోద్రేకహేతువుగ నామె యున్నదనియు సారము. ॥౮౧॥

శ్లో॥ మధ్యం తనూకృత్య యదీదమీయం
వేధా న దధ్యాత్ కమనీయమంశమ్।
కేన స్తనౌ సమ్ప్రతి యౌవనేఽస్యాః
సృజేదనన్యప్రతిమాఙ్గదీప్తేః॥ ౮౨

ప॥వి॥ మధ్యం । తనూకృత్య । యది । ఇదమీయం । వేధాః । న । దధ్యాత్ । కమనీయమ్ । అంశం । కేన । స్తనౌ । సమ్ప్రతి । యౌవనే । అస్యాః । సృజేత్ । అనన్య ప్రతిమాఙ్గ దీప్తేః.

టీక॥ వేధాః = బ్రహ్మ, ఇదమీయం = ఈ దమయన్తికి సంబంధించిన, మధ్యం = కౌనును, తనూకృత్య = సన్నముఁ గావించి, కమనీయం =

రమ్యమైన, అంశమ్ = ఎత్తఁబడిన భాగమును, న దధ్యాత్ యది = ఒక చోట స్థాపింపకున్నచో, సమ్ప్రతి = ఇప్పుడు, యౌవనే = యౌవనమందు, అనన్య ప్రతిమాఙ్గ దీప్తేః; అనన్య ప్రతిమా = మఱియొక దానికి సాటిలేని, అఙ్గ = శరీరముయొక్క, దీప్తేః = కాన్తిగల్గిన, అస్యాః = ఈ దమయన్తియొక్క, స్తనౌ = కుచములను, కేన = ఏ వస్తువుచే, సృజేత్ = సృజించును.

వి॥ ఈమెయొక్క స్తనములను నడుము చెక్కి తీసికొనిన రమ్యవస్తువుతో సృజింపకపోయినను, సృజించి నట్లు వర్ణించుటవలన నుత్ప్రేక్ష.

## సమాసములు :

తనూకృత్య : అతనుం తనుం కృత్వా = తనూకృత్వ.

ఇదమీయం : అస్యాః అయం = ఇదమీయః. తమ్ = ఇదమీయమ్.

అనన్య ప్రతిమాఙ్గ దీప్తేః : అన్యః ప్రతిమా యస్యాస్సా = అన్య ప్రతిమా. అన్యప్రతిమా న భవతీతి = అనన్య ప్రతిమా. అఙ్గస్య దీప్తిః = అఙ్గ దీప్తిః. అనన్య ప్రతిమా అఙ్గ దీప్తిః యస్యాస్సా = అనన్య ప్రతిమాఙ్గ దీప్తిః. తస్యాః = అనన్య ప్రతిమాఙ్గ దీప్తేః.

## భావము :

బ్రహ్మ దమయన్తి నడుము చెక్కి మిక్కిలి సన్నము గావించి, యా చెక్కడములో లభించిన రమ్యమైన వస్తువు నొకచోట స్థాపించి యుంచెను, ఇప్పుడు యౌవనము రాఁగానే, యా వస్తువుతో సాటిలేని దేహలావణ్యము గల దమయన్తికి స్తనముల నేర్పఱచెను. లేనిచో నింతటి సౌన్దర్య సమ్పద గల యామె శరీరమునకు తగిన స్తనముల నెట్లు నిర్మింపఁగలడు. అనగా నామెయొక్క కౌను సన్ననిదియు స్తనములు రమ్యము లనియు భావము. ॥౮౨॥

శ్లో॥ గౌరీవ పత్యా సుభగా కదాచిత్
కర్త్రీయమప్యర్ధతనూస్సమస్యామ్।
ఇతీవ మధ్యే నిదధే విధాతా
రోమావళీమేచకసూత్రమస్యాః॥ ౮౩

ప॥వి॥ గౌరీ । ఇవ । పత్యా । సుభగా । కదా । చిత్ । కర్త్రీ । ఇయమ్ । అపి । అర్ధతనూసమస్యామ్ । ఇతి । ఇవ । మధ్యే । నిదధే । విధాతా । రోమావళీమేచకసూత్రమ్ । అస్యాం.

టీక॥ సుభగా = భర్తకు ప్రియురాలైన, ఇయమ్ = ఈ దమయన్తి, కదాచిత్ = ఒకప్పుడు, గౌరీవ = పార్వతివలె, పత్యా = భర్తతోడ, అర్ధతనూసమస్యామ్ = సగపుమేనుకలుపుకొనుటను, కర్త్రీ = చేయఁబోవును, ఇతి = ఇట్లు, (మత్వాతలంచి) విధాతా = బ్రహ్మ, అస్యాః = ఈమెయొక్క, మధ్యే = మధ్యభాగమునందు, రోమావళీమేచకసూత్రమ్; రోమావళీ = నూగారనెడి, మేచకసూత్రం = నల్లనిదారమును, నిదధే ఇవ = ఉంచెనోయనునట్లుండెను.

వి. శరీరమున సగపాలునకు నవధిని అనగా ఎల్లను నేర్పఱచుటకు నీల సూత్రముగా రోమాంచము నుఁచకపోయినను నుంచినట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష.

## సమాసములు :

*అర్ధతనూసమస్యామ్ :* అర్ధంతన్వాః = అర్ధతనూః. అర్ధతన్వాః సమస్యా = అర్ధతనూ సమస్యా. తామ్ = అర్ధతనూసమస్యామ్.

*రోమావళీమేచకసూత్రమ్ :* రోమ్ణామావళీ = రోమావళీ. మేచకం చ తత్ సూత్రం చ = మేచకసూత్రమ్. రోమావల్యేవ మేచకసూత్రమ్ = రోమావళీమేచకసూత్రమ్. తత్ = రోమావళీమేచకసూత్రమ్.

## భావము :

దమయన్తి తన యపూర్వసౌన్దర్యాది గరిమచే, భర్తకు ప్రియురాలై యుండును కాన నొకప్పుడు పార్వతి వలె భర్తతో శరీరమున సగముపాలునుఁ బూర్తి చేయఁగల దని భావించి బ్రహ్మ యామె శరీరమందు నూగారనెడి నల్లని దారముతో శరీరమునందలి యర్ధభాగమున నెల్లనేర్పఱచెనా యని తోచుచున్నది. ॥౮౩॥

శ్లో॥ రోమావలీరజ్జుమురోజకుమ్భౌ
గమ్భీరమాసాద్య చ నాభికూపమ్।

మద్దృష్టితృష్ణావిరమేద్యది స్యా
న్నైషాం బతైషా సిచయేన గుప్తిః॥ ౮౪

ప॥వి॥ రోమావళీరజ్జుమ్ । ఉరోజకుమ్భౌ । గమ్భీరమ్ । ఆసాద్య । చ ।
నాభికూపమ్ । మద్దృష్టితృష్ణా । విరమేత్ । యది । స్యాత్ । న ।
ఏషాం । బత । ఏషా । సిచయేన । గుప్తిః ।

టీక॥ మద్దృష్టితృష్ణా; మత్ = నాయొక్క, దృష్టి = నేత్రములయొక్క,
తృష్ణా = దాహము, రోమావలీరజ్జుం; రోమావలీ = నూగారనెడి,
రజ్జుం = త్రాడును, ఉరోజకుమ్భౌ; ఉరోజ = స్తనములనెడి, కుమ్భౌ =
కడవలను, గమ్భీరం = లోతైన, నాభికూపమ్; నాభి = పొక్కిలియనెడి,
కూపం = బావిని, ఆసాద్య = పొంది, ఏషాం = ఈసాధనములకు,
ఏషా = ఈ, సిచయేన = వస్త్రముతో, గుప్తిః = ఆచ్ఛాదనము, నస్యా
ద్యది = లేనిచో, తదా = అప్పుడు, విరమేత్ = శమించును. బత =
కష్టము.

వి॥ రోమావళిని త్రాడుగను, స్తనములను కుమ్భములుగను, నాభిని
కూపముగను, రూపించుటవలన రూపకాలఙ్కారము.

**సమాసములు :**

*రోమావలీరజ్జుమ్ :* రోమ్ణామావలీ = రోమావలీ. రోమావల్యేవ రజ్జుః
= రోమావలీరజ్జుః. తామ్ = రోమావలీరజ్జుమ్.

*నాభికూపమ్ :* నాభిరేవ కూపః = నాభికూపః. తమ్ = నాభికూపమ్.

మద్దృష్టితృష్ణా : మమ దృష్టిః = మద్దృష్టిః. మద్దృష్టేః తృష్ణా =
మద్దృష్టితృష్ణా.

**భావము :**

ఆమెయొక్క నూగారును త్రాడుగను, ఆమెయొక్క స్తనములను
కడవలుగను, ఆమెయొక్క పొక్కిలిని బావిగనుజేసి యీ నూగారుమున్నగు
వానికి, వస్త్రముచే నాచ్ఛాదనము లేక యున్నచో నా కన్నుల దాహము తీరును.
కాని యిది యసాధ్యము కాన కష్టము. ॥౮౪॥

శ్లో॥ ఉన్మూలితాలానబిలాభనాభి
శ్ఛిన్నస్ఖలచ్ఛృంఖలరోమదామా।
మత్తస్య సేయం మదనద్విపస్య
ప్రస్వాపవప్రోచ్చకుచాఽస్తు వాస్తు॥ ౭౫

ప॥వి॥ ఉన్మూలితాలానబిలాభనాభిః । ఛిన్నస్ఖలచ్ఛృంఖలరోమదామా । మత్తస్య । సా । ఇయం । మదనద్విపస్య । ప్రస్వాపవప్రోచ్చకుచా । అస్తు । వాస్తు.

టీక ఉన్మూలితాలానబిలాభనాభిః; ఉన్మూలిత = పెకలింపఁబడిన, ఆలాన = ఏనుగనుకట్టెడుస్తమ్భముయొక్క, బిల = రన్ధ్రిముతో, ఆభ = సమానమైన, నాభిః = బొక్కిలికల్గిన, ఛిన్నస్ఖలచ్ఛృఙ్ఖలరోమదామా; ఛిన్న = తెగినదియు, స్ఖలత్ = జారిపోయినదియునగు, శృఙ్ఖల = గొలుసువంటి, రోమదామ = నూగారుగల్గిన, ప్రస్వాపవప్రోచ్చకుచా; ప్రస్వాప = గజమునిద్రించుట కర్హమైన, వప్ర = మట్టిదిబ్బవంటి ఉచ్చకుచా = ఎత్తైన స్తనములుగల యీదమయన్తి, మదనద్విపస్య = మన్మథుఁడనెడి గజమునకు, వాస్తు = వసతిస్థానముగా, అస్తు = అగుఁగాక.

వి॥ ఆలానబిలమును నాభితో పోల్చుటవలన నుపమ. గొలుసును నూగారుతో రూపించుటవలన రూపకము. మన్మథుని ద్విపముతో రూపించుట వలనను రూపకము. వప్రమును (మట్టిదిబ్బలను) స్తనములతో పోల్చుట వలన ఉపమ. కావున నుపమారూపకముల సంసృష్టి.

సమాసములు :

ఉన్మూలితాలానబిలాభనాభిః : ఉన్మూలితం చ తత్ ఆలానం చ = ఉన్మూలితాలాన.. ఉన్మూలితాలానస్య బిలం = ఉన్మూలితాలానబిలం. ఉన్మూలితాలానబిలస్య ఆభేవ ఆభా యస్యాస్సా = ఉన్మూలితాలానబిలాభా. ఉన్మూలితాలానబిలాభానాభిః యస్యాః సా = ఉన్మూలితాలాన బిలాభనాభిః.

ఛిన్నస్ఖలచ్ఛృఙ్ఖలరోమదామా : ఛిన్నం చ తత్ స్ఖలచ్చ = ఛిన్నస్ఖలత్. ఛిన్నస్ఖలచ్చ తత్ శృఙ్ఖలం చ = ఛిన్నస్ఖలచ్ఛృఙ్ఖలం. ఛిన్నస్ఖలచ్ఛృఙ్ఖలమివరోమదామ యస్యాస్సా = ఛిన్నస్ఖలచ్ఛృఙ్ఖలరోమదామా.

మదనద్విపస్య : ద్వాభ్యాం పిబతీతి = ద్విపః. మదన ఏవ ద్విపః = మదనద్విపః. తస్య = మదనద్విపస్య.

ప్రస్వాపవప్రోచ్చకుచా : ప్రస్వాపస్య వప్రౌ = ప్రస్వాపవప్రౌ. ఉచ్చౌ చ తౌ కుచౌ చ = ఉచ్చకుచౌ. ప్రస్వాపవప్రావివ ఉచ్చకుచౌయస్యాస్సా = ప్రస్వాపవప్రోచ్చకుచా.

**భావము :**

ఆ దమయన్తి పొక్కిలి, ఏనుగ తన కట్టుగుంజను పెకలించినచో నేర్పడు గుంత వలె నున్నది. ఆమెయొక్క నూగారు, ఆ ఏనుగును కట్టెడు, తెగి జారిపోయిన గొలుసు వలె నున్నది. ఆమెయొక్క యున్నతస్తనములు, ఏనుగ విశ్రాన్తిని నిద్రనుఁ బొందెడు మట్టిదిబ్బల వలె నున్నవి. కాన నిట్టిలక్ష ములతోఁ గూడిన యా దమయన్తి మన్మథుఁ డను నేనుగునకు వసతిస్థాన మగుఁ గాక ॥౮౨॥

శ్లో॥ రోమావలిభ్రూకుసుమైః స్వమౌర్వీ
చాపేషుభిర్మధ్యలలాటమూర్ధ్ని।
వ్యస్తైరపి స్థాస్నుభిరేతదీయై
ర్జైత్రః స చిత్రం రతిజానివీరః॥ ౮౩

ప॥వి॥ రోమావలిభ్రూకుసుమైః । స్వమౌర్వీచాపేషుభిః । మధ్యలలాటమూర్ధ్ని । వ్యస్తైః । అపి । స్థాస్నుభిః । ఏతదీయైః । జైత్రః । సః । చిత్రం । రవిజానివీరః.

టీక॥ రతిజానివీరః; రతిజాని = రతినిభార్యగఁగల్గిన, వీరః = వీరుఁడైన మన్మథుడు, మధ్యలలాటమూర్ధ్ని; మధ్య = మధ్యభాగమునందును, లలాట = నొసటియందును, మూర్ధ్ని = తలయందును, వ్యస్తైరపి = విడిగా నున్నటువంటివైనను, స్థాస్నుభిః = స్థిరములైన, ఏతదీయైః = ఈదమయన్తికిసంబంధించిన, రోమావలిభ్రూకుసుమైః; రోమావలి = నూగారు, భ్రూ = కనుబొమ్మలు, కుసుమైః = పుష్పములుఅను, స్వమౌర్వీచాపే

షుభిః; స్వ = తనవియైన, మౌర్వీ = అల్లెత్రాడును, చాప = ధనుస్సును, ఇషు = బాణములుననువానిచే, జైత్రః = జయశీలుఁడైయున్నాడు. చిత్రం = ఆశ్చర్యము.

వి॥ మన్మథునికి సాధనము లైన అల్లెత్రాడు ధనుస్సు బాణములు దమయన్తి యొక్క నూగారు కనుబొమ్మలు తలలోని పూలు అనువానితో రూపింపఁబడినవై భిన్నస్థానములయందు నెలకొనినను జయసాధనము లైనవి కాన విషమాలఙ్కారము. ఇది పై రూపకముతో ననుప్రాణితము.

## సమాసములు :

*రోమావలిభ్రూకుసుమైః :* రోమ్ణామావలిః = రోమావలిః. రోమావలిశ్చ భ్రువౌ చ కుసుమాని చ = రోమావలిభ్రూకుసుమాని. తైః = రోమావలిభ్రూకుసుమైః.

*స్వమౌర్వీచాపేషుభిః :* మౌర్వీ చ చాపశ్చ ఇషవశ్చ = మౌర్వీచాపేషవః. స్వస్యమౌర్వీచాపేషవః = స్వమౌర్వీచాపేషవః. తైః = స్వమౌర్వీచాపేషుభిః.

మధ్యలలాటమూర్ధ్ని: మధ్యశ్చ లలాటం చ మూర్ధా చ = మధ్యలలాటమూర్ధ. తస్మిన్ = మధ్యలలాటమూర్ధ్ని.

*ఏతదీయైః :* ఏతస్యా ఇమాని = ఏతదీయాని. తైః = ఏతదీయైః.

*జైత్రః :* జేతైవ = జైత్రః

*రతిజానివీరః :* రతిః జాయా యస్యసః = రతిజానిః. రతిజానిశ్చాసౌ వీరశ్చ = రతిజానివీరః.

## భావము :

మన్మథుఁ డను వీరుఁడు దమయన్తి యొక్క నడుమునందును, నొసటి యందు విడివిడిగా నిలచెడు నూగారు, కనుబొమ్మలు, పుష్పములను, తన యల్లెత్రాడు, ధనుస్సు బాణము లనువానితో జయము సాధించుచున్నాడు. అల్లెత్రాడు, ధనుస్సు బాణము లను సాధనము లొక్కచోట నున్నప్పుడే జయముఁ బొందుట దుష్కరమై యుండగా నిచ్చట మన్మథుడు తన యల్లెత్రాటిని, దమయన్తి

యొక్క-శరీరమధ్యమునందును, ధనుస్సును లలాటమందును, బాణములను, తల యందు నుంచియు అనగా భిన్నభిన్న స్థానములయం దుంచియు, జయమును సాధించుచున్నాడు. ఇది యాశ్చర్యకరము. అనగా;దమయన్తినూగారు అల్లెత్రాటి వలెను, ఆమెయొక్క- కనుబొమ్మలు ధనుస్సువలెను, ఆమె తలయందలి పూలు మన్మథ బాణములవలెను కడు మనోజ్ఞములై కామోద్రేక హేతువు లని సారము ॥౮౯॥

శ్లో॥ అస్యాః ఖలు గ్రన్థినిబద్ధకేశ
మల్లీకదమ్బ ప్రతిబిమ్బవేశాత్।
స్మరప్రశస్తీ రజతాక్షరేయం
పృష్ఠస్థలీహాటకపట్టికాయామ్॥ ౯౦

ప॥వి॥ అస్యాః । ఖలు । గ్రన్థినిబద్ధకేశమల్లీకదమ్బప్రతిబిమ్బవేశాత్ । స్మరప్రశస్తిః । రజతాక్షరా । ఇయం । పృష్ఠస్థలీహాటకపట్టికాయామ్.

టీక॥ అస్యాః = ఈ దమయన్తియొక్క, పృష్ఠస్థలీహాటకపట్టికాయాం;పృష్ఠస్థలీ = శరీరముయొక్క వెనుకటిభాగము అనగా వీపు అనెడి,హాటకపట్టికాయాం = పసిడిపలకయందు, గ్రన్థినిబద్ధకేశమల్లీకదమ్బప్రతిబిమ్బవేశాత్ ;గ్రన్థి = ముడితో, నిబద్ధ = కట్టఁబడిన, కేశ = వెంట్రుకలయందలి, మల్లీ = మల్లె పూవులయొక్క-, కదమ్బ = సమూహముయొక్క-, ప్రతిబిమ్బ = ప్రతిబిమ్బముయొక్క-,వేశాత్ = ప్రవేశమువలన,ఇయం = ఈకనబడునది,రజతాక్షరా = వెండియక్షరములుగల,స్మరప్రశస్తిః = మన్మథునివర్ణనగదా.

వి॥ స్వచ్ఛముగా నుండుటవలన వీపునందు ప్రతిఫలించినకురులయందలి మాల్లెపూలు, పసిడిపలకపై వ్రాయబడిన మన్మథ ప్రశస్తియా యని భావింపఁబడుటవలన నుత్ప్రేక్ష.

## సమాసములు :

గ్రన్థినిబద్ధకేశమల్లీకదమ్బప్రతిబిమ్బవేశాత్ : గ్రన్థినా నిబద్ధాః = గ్రన్థినిబద్ధాః. గ్రన్థినిబద్ధాశ్చ తే కేశాశ్చ = గ్రన్థినిబద్ధకేశాః. మల్లీనాం కదమ్బః = మల్లీకదమ్బం. గ్రన్థినిబద్ధకేశేషు మల్లీకదమ్బం = గ్రన్థినిబద్ధకేశమల్లీక

దమ్బం. గ్రన్థినిబద్ధకేశమల్లీకదమ్బస్య ప్రతిబిమ్బః = గ్రన్థినిబద్ధకేశ మల్లీక దమ్బ ప్రతిబిమ్బః. గ్రన్థినిబద్ధకేశమల్లీకదమ్బ ప్రతిబిమ్బస్య వేశః = గ్రన్థిని బద్ధకేశమల్లీకదమ్బ ప్రతిబిమ్బవేశః. తస్మాత్ = గ్రన్థినిబద్ధకేశ మల్లీకదమ్బ ప్రతిబిమ్బవేశాత్ ।

స్మరప్రశస్తిః : స్మరస్య ప్రశస్తిః = స్మరప్రశస్తిః.

రజతాక్షరా: రజతమయాని అక్షరాణి యస్యాం సా = రజతాక్షరా.

పృష్ఠస్థలీహాటకపట్టికాయామ్ : పృష్ఠమేవ స్థలీ = పృష్ఠస్థలీ. హాటక మయీ చ సా పట్టికా చ = హాటకపట్టికా. పృష్ఠస్థల్యేవ హాటకపట్టికా = పృష్ఠ స్థలీహాటకపట్టికా. తస్యాం = పృష్ఠస్థలీహాటకపట్టికాయామ్.

**భావము :**

దమయన్తి కురులు మల్లెపూలకదమ్బముతో నలంకరింపబడియున్నవి. ఆమెయొక్క వీపు పసిడి పలకవలె మెఱయుచున్నది. దానియందు నామె యొక్క కురుల మల్లెపూవులు ప్రతిబింబించినవి. అది బంగారుపలకపై వెండి యక్షరములతో వ్రాయంబడిన మన్మథప్రశస్తియా యని భావింపఁబడినది. ఆమె వీపు బంగారుచాయతో నిర్మలమై యున్న దనియు, నామె కురులు మల్లెపూలతో నలంకరింపఁబడి కడు రమ్యమై మన్మథోద్రేకమునుఁ గల్గించు చున్న దనియు భావము॥౮౭॥

శ్లో॥ చక్రేణ విశ్వం యది మత్స్యకేతుః
పితుర్జితం వీక్ష్య సుదర్శనేన।
జగజ్జిగీషత్యమునా నితమ్బ
ద్వయేన కిం దుర్లభదర్శనేన॥ ౮౮

వ॥వి॥ చక్రేణ । విశ్వం । యది । మత్స్యకేతుః । పితుః । జితమ్ । వీక్ష్య । సుదర్శనేన । జగత్ । జిగీషతి । అమునా । నితమ్బద్వయేన । కిం । దుర్లభదర్శనేన ।

టీక॥ మత్స్యకేతుః = మత్స్యమునుధ్వజమందుఁగల్గిన మన్మథుఁడు, సుదర్శ నేన = సుదర్శనమను (సులభదర్శనముగల్గిన), పితుః = తండ్రియైన

విష్ణువుయొక్క, చక్రేణ=చక్రముచే, విశ్వం=ప్రపఞ్చమును, జితం =జయింపఁబడినదానినిగా, వీక్ష్యయది=చూచిగదా, అమునా=ఈ, దుర్లభదర్శనేన; దుర్లభ=లభింపని, దర్శనేన = దర్శనముఁగల్గిన, నితమ్బద్వయేన=పిఱుదులజంటయను, చక్రేణ=చక్రముచే, జగత్= ప్రపంచము, జిగీషతికిం=జయింపఁగోరుచున్నాదాయేమి?

వి॥ దమయన్తి పిఱుదల జంట యను చక్రముచే ప్రపంచమును జయింపఁ గోరక పోయినను, జయింపఁగోరినట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష.

**సమాసములు :**

మత్స్యకేతుః : మత్స్యః కేతౌ యస్య సః=మత్స్యకేతుః.

సుదర్శనేన : సులభం దర్శనం యస్య తత్=సుదర్శనం. తేన= సుదర్శనేన.

నితమ్బద్వయేన : నితమ్బయోః ద్వయమ్=నితమ్బద్వయమ్. తేన= నితమ్బద్వయేన.

దుర్లభదర్శనేన : దుఃఖేన లబ్ధుం శక్యం = దుర్లభం. దుర్లభం దర్శనం యస్య తత్=దుర్లభదర్శనం. తేన=దుర్లభదర్శనేన.

**భావము :**

మన్మథుడు తనతండ్రి సుదర్శన మను పేరు గలదియు (చక్కఁగాఁ గానవచ్చు నదియు) నగు చక్రముచే ప్రపంచమును జయించిన విషయమునుఁ జూచి దర్శింప సాధ్యముకాని దమయన్తియొక్క నితమ్బముల (పిఱుదల) జంటయను చక్రముచే ప్రపంచమును జయింపఁ కోరుచున్నాడా యేమి? తండ్రి చక్కఁగాఁ గానవచ్చెడి తన సుదర్శనముచేఁ బ్రపంచమును జయింపగా. కుమారుఁడు చక్కఁగాఁ గాన రాని నితంబము లను రెండు చక్రములచే ప్రపంచమును జయింపఁగోరుచున్నా డని భావము ॥౮౮॥

శ్లో॥ రోమావళీదణ్డ నితమ్బచక్రే
గుణౌచ లావణ్యజలఞ్చ బాలా।

తారుణ్యమూర్తేః కుచకుమ్భకర్తుః
బిభర్తి శఙ్కే సహకారిచక్రమ్॥ ౮౫

ప॥వి॥ రోమావలీదణ్డనితమ్బచక్రే । గుణం । చ । లావణ్యజలం । చ । బాలా।
తారుణ్యమూర్తేః । కుచకుమ్భకర్తుః । బిభర్తి । శఙ్కే । సహకారి
చక్రమ్ ।

టీక॥ బాలా = దమయన్తి, తారుణ్యమూర్తేః, యౌవనమేశరీరముగాగల్గిన, యౌవనమను, కుచకుమ్భకర్తుః; కుచకుమ్భ = స్తనములనెడి కుంభములను, కర్తుః = చేయునట్టి కుమ్మరికి, రోమావలీ దణ్డ నితమ్బ చక్రే; రోమావలీ = నూగారనెడి, దణ్డ = దండము, నితమ్బ = పిరుదులనెడి, చక్రే = చక్రములు, గుణఞ్చ = సౌన్దర్యాదిగుణమను త్రాడును, లావణ్యజలఞ్చ = లావణ్యమనునీరును అను, సహకారిచక్రమ్ = సహకారిసమూహములు, బిభర్తిఖలు = ధరించుచున్నదిగదా (అని) శఙ్కే = భావింతును.

వి॥ ఇచ్చట రోమావళిని, దండముగను, నితమ్బమును చక్రముగను గుణమును దారముగను, లావణ్యమును జలముగను తారుణ్యమును శరీరముగను రూపించుటవలన రూపకము. ఈ రూపకముచే పై రోమావళ్యాదిసహకారిచక్రమును ధరించుచున్నదా యని భావించుటవలన నుత్ప్రేక్ష యుత్థాపితము.

## సమాసములు :

*రోమావలీదణ్డనితమ్బచక్రే* : రోమ్ణామావలీ = రోమావలీ. రోమావల్యేవ దణ్డః = రోమావలీదణ్డః. నితమ్బ ఏవ చక్రం = నితమ్బచక్రం. రోమావలీదణ్డశ్చ నితమ్బచక్రం చ = రోమావలీదణ్డనితమ్బచక్రే. తే = రోమావలీదణ్డనితమ్బచక్రే.

*లావణ్యజలమ్* : లావణ్యమేవ జలమ్ = లావణ్యజలమ్. తత్ = లావణ్యజలమ్.

*తారుణ్యమూర్తి* : తారుణ్యమేవ మూర్తిః యస్య సః = తారుణ్యమూర్తిః. తస్య = తారుణ్యమూర్తేః.

*కుచకుమ్భకర్తుః* : కుచావేవ కుమ్భౌ = కుచకుమ్భౌ. కుచకుమ్భయోః కర్తా = కుచకుమ్భకర్తా. తస్య = కుచకుమ్భకర్తుః.

సహకారిచక్రమ్ : సహకుర్వన్తీతి = సహకారిణః. సహకారిణాం చక్రమ్ = సహకారిచక్రమ్. తత్ = సహకారిచక్రమ్.

**భావము :**

ఈ దమయన్తి యౌవన మను స్వరూపము గల్గినట్టి, కుచకుంభములను నిర్మించునట్టి కుమ్మరికి తన నూగారనెడి దణ్డమును, తననితమ్బ మను చక్రమును తన సౌన్దర్యాదిగుణములను త్రాటిని, లావణ్యమను జలమును సహకారి కారణములుగా వహించి యుండెను. ఘటమును నిర్మించుటకు కుమ్మరికి దణ్డము, చక్రము, దారము, నీరు మున్నగునవి సహకారికారణములు. ఇచ్చట దమయన్తియొక్క కుచకుమ్భమును నిర్మించుట కామెయొక్క నూగారు మున్నగునవి సహకారికారణము లైనవి. అట్టి సహకారికారణముల నామె తన యందు వహించి యుండిన దని భావము ॥౮౯॥

శ్లో॥ అజ్ఞేన కేనా ఽపి విజేతుమస్యా
గవేష్యతే కిఞ్చలపత్రపత్రమ్।
నో చేద్విశేషాదితరచ్ఛదేభ్య
స్తస్యాస్తు కమ్పస్తు కుతో భయేన॥ ౯౦

ప॥వి॥ అజ్ఞేన । కేన । అపి । విజేతుమ్ । అస్యాః । గవేష్యతే । కిం । చల పత్రపత్రమ్ । నో । చేత్ । విశేషాత్ । ఇతరచ్ఛదేభ్యః । తస్య । అస్తు । కమ్పః । తు । కుతః । భయేన.

టీక॥ అస్యాః = ఈదమయన్తియొక్క, కేనాఽపి = చెప్పఁదగనటువంటి, అజ్ఞేన = అవయవముచే, ననగామన్మథమన్దిరముచే, చలపత్రపత్రమ్; చల పత్ర = రావిచెట్టుయొక్క, పత్రం = ఆకు, విజేతుం = జయించుటకు, గవేష్యతేకిం = వెదుకఁబడుచున్నదాయేమిః నోచేత్ = అట్లుగానిచో, తస్య = ఆరావియాకునకు, కుతః = దేనినుండి, భయేన = భయముచే, ఇతరచ్ఛదేభ్యః = ఇతరవృక్షములయొక్క యాకులకంటె, విశేషాత్ = అధికముగా, కమ్పస్తు = కమ్పమో, అఃగాచలనమో, అస్తు = ఉండును.

ఉత్ప్రే॥ ఈమెయొక్క మదనమన్దిరము రావియాకును జయింప నన్వేషింపక పోయినను, అన్వేషించినట్లు చెప్పుటచే నుత్ప్రేక్ష.

సమాసములు :

చలపత్రపత్రమ్ : చలపత్రస్య పత్రమ్=చలపత్ర పత్రమ్.

ఇతరచ్ఛదేభ్యః : ఇతరే చ తే ఛదాశ్చ=ఇతరచ్ఛదాః. తేభ్యః=ఇతరచ్ఛదేభ్యః

భావము :

రావిచెట్టునకు చలపత్రమని పేరు.సాధారణముగా నితరవృక్షములయాకులకంటెను దానియందు నాకులెక్కువగాఁ జలించుచుండును. సహజముగా దానికీ పేరువచ్చినది కాని యిట మఱియొక విధముగా నా పేరును కవి సమర్థించుచున్నాడు. ఎట్లనగా—దమయన్తియొక్క మదనమందిరము,ఆ రావియాకును జయించుటకై యత్నించుటవలన, నది భయపడి కమ్పముచే, గదలుచున్నది. కానిచో, ఇతర వృక్షములకు ఆకులు కదలకున్నను, దీని కేల కదలుచున్నవి? కావున నామెయొక్క మదనమందిరము తన్ను జయింపఁకలదను భయముతో డనే రావియాకు కదలుచున్న దనియు నందువలననే రావిచెట్టునకు చలపత్ర మను పేరు వచ్చిన దనియు భావము. రావియాకుతో సమాన మగు మదమనందిరము గల యాడుది సుభగయని చెప్పఁబడును. అట్టి "వనితపుణ్యములచేతనే లభించునని" సాముద్రికశాస్త్రము.అనగా నామెయొక్క వరాఙ్గము రావియాకును బోలియున్న దని సారాంశము ॥౯౦॥

శ్లో॥ భ్రూశ్చిత్రలేఖా చ తిలోత్తమాఽస్యా
నాసా చ రమ్భా చ యదూరుసృష్టిః।
దృష్ట్వా తతః పూరయతీయమేకాఽ
నేకాప్సరః ప్రేక్షణకౌతుకాని॥ ౯౧

ప॥వి॥ భ్రూః । చిత్రలేఖా । చ । తిలోత్తమా । అస్యాః । నాసా । చ । రమ్భా । చ । యదూరుసృష్టిః । దృష్ట్వా । తతః । పూరయతి । ఇయమ్ । ఏకా । అనేకాప్సరఃప్రేక్షణకౌతుకాని.

టీక॥ యత్=ఎందువలన, అస్యాః =ఈమెయొక్క, భ్రూః = కనుబొమ్మ, చిత్రలేఖా = విచిత్రమైన విన్యాసముగలది (చిత్రరేఖయనునప్సరస).

నాసా=నాసిక, తిలోత్తమా; తిల=తిలపుష్పముకంటెను, ఉత్తమా=శ్రేష్ఠమైనది. (తిలోత్తమయనునప్సరస),ఊరుసృష్టిః = తొడలనిర్మాణము, రమ్భా=అరటిచెట్టు (రమ్భయనునప్సరస) తతః=అందువలన ఇయం=ఈమె, ఏకా=ఒక్కతెయే, దృష్టాసతీ=చూడఁబడినదై, అనేకాప్సరః ప్రేక్షణకౌతుకాని; అనేక=పెక్కండ్రైన, అప్సరః=అచ్చరలను, ప్రేక్షణ=చూచుటకైన, కౌతుకాని=కుతూహలములను, పూరయతి=నింపుచున్నది.

వి॥ ఇచ్చట నొక దమయన్తిని పెక్కండ్రు అచ్చరలుగా చెప్పుట విరుద్ధము కాన విరోధాభాసము. అది చిత్రరేఖాదిశ్లేషచే నుత్థాపికము. కాన విరోధాభాసశ్లేషలకు సఙ్కరము.

**సమాసములు :**

*చిత్రరేఖా :* చిత్రా రేఖా యస్యాస్సా=చిత్రరేఖా.

*తిలోత్తమా :* తిలాత్ ఉత్తమా=తిలోత్తమా.

*ఊరుసృష్టిః :* ఊర్వోః సృష్టిః=ఊరుసృష్టిః.

**అనేకాప్సరః ప్రేక్షణకౌతుకాని :** అనేకాశ్చ తాః అప్సరసశ్చ=అనేకాప్సరసః. అనేకాప్సరసాం ప్రేక్షణం=అనేకాప్సరః ప్రేక్షణమ్. అనేకాప్సరః ప్రేక్షణే కౌతుకాని=అనేకాప్సరః ప్రేక్షణకౌతుకాని.

**భావము :**

ఒక్కతె యగు నాదమయన్తిని చూచినచో పెక్కండ్రగు నచ్చరలనుఁ జూచుటవలని యానందముఁబడయవచ్చును. ఎట్లనగా ఆ దమయన్తి కనుబొమ్మ (చిత్రవిన్యాసముగలదై) చిత్రరేఖ యైనది. ఆమె నాసిక తిల (పుష్పముకంటెను శ్రేష్ఠమై) తిలోత్తమ యైనది. ఆమె తొడ, రంభావృక్షములను ననగా నరటి స్తమ్భములనుఁ బోలినదై రంభయైనది. కావున నామె నొక్కతెనుఁగాంచినచో, చిత్రరేఖను, తిలోత్తమను, రమ్భనుఁ జూచుటవలని యానందముఁ గల్గు నని యాశయము. అనగా నామెయొక్క కనుబొమ్మలు విచిత్రవిన్యాసములు గలవియు, ఆమె ముక్కు నూగుపూవువలె రమ్య మైనదియు, నామె తొడ అరటి స్తంభములఁ బోలి యున్న వనియు నాశయము. ॥౯౦॥

శ్లో॥ రమ్భాఽపి కిం చిహ్నయతి ప్రకాణ్డం
న చాఽఽత్మనః స్వేన న చైతదూరూ ।
స్వస్యైవ యేనోపరి సాదధానా
పత్రాణి జాగర్త్యనయోర్భ్రమేణ ॥ ౮౨

ప॥వి॥ రమ్భా । అపి । కిం । చిహ్నయ తి । ప్రకాణ్డం । న । చ । ఆత్మనః । స్వేన । న । చ । ఏతదూరూ । స్వస్య । ఏవ । యేన । ఉపరి । సా । దధానా । పత్రాణి । జాగర్తి । అనయోః । భ్రమేణ.

టీక॥ రమ్భాపి=అరటిచెట్టుగూడ, ఆత్మనః=తనయొక్క, ప్రకాణ్డం=బోదెను, స్వేన=స్వయముగా, నచిహ్నయతికిం=గుఱ్తుపెట్టుకొనుట లేదా? ఏతదూరూచ=ఈదమయన్తియొక్క తొడలను, నచిహ్నయతికిం =భేదముతెలియుటకు గుఱ్తుపెట్టుకొనుచున్నదాయేమి? (కుతః = ఏల యనగా) యేన=ఏ కారణముచే, సా=ఆ యరటిచెట్టు, అనయోః= ఈ తొడలయొక్క, భ్రమేణ=భ్రమచే, స్వస్యైవ=తన బోదెకే, ఉపరి=పై భాగమున, పత్రాణి=ఆకులను(ఎదురు పక్షములపై వేయఁదగిన వ్రాతఁ కాగితములను), దధానా=ధరించుచు, జాగర్తి=ప్రకాశించుచున్నది.

వి : తన యందు తొడల భ్రాంతిచే, నరటిచెట్టు ఆకులనుఁ దొడగుటవలన భ్రాన్తి మదలఙ్కారము. చిహ్నమును ధరింపక పోయినను, చిహ్నమును ధరించెనా యని చెప్పుటవలన నుత్ప్రేక్ష. ఆ భ్రాన్తి మదలఙ్కారముచే నుత్ప్రేక్ష యుజ్జీవితము గాన నా రెంటికిని అఙ్గాఙ్గి భావముచే సఙ్కరము.

సమాసములు ;

ఏతదూరూ : ఏతస్యాః ఊరూ=ఏతదూరూ.

భావము :

అరటిచెట్టు తన స్తంభమును తాను చిహ్నితముచేయుటలేదా? అట్లే యీ దమయన్తి తనకు సంబంధించినరెండు తొడలను చిహ్నితములు చేయుట లేదా?

ఏల యనగా తన స్తంభము,దమయన్తియొక్క రెండుతొడలు సమానములుగాను నుండుటవలన భేదముతెలియుటకై తన స్తమ్భమునకును, దమయన్తితొడలకును తప్పకగుఱుతులు వేయవలసినదే. అట్లుకానిచో తన స్తంభము తనదనియు,దమయన్తి తొడలు దమయన్తివనియు తెలియ శక్యముకాకున్నవి.తన స్తంభము దమయన్తి తొడయని భ్రాన్తి పడి తనపైన పత్రములను అనగా ఆకులను,పత్రములను అనగా నారోపణలతో నిండిన కాగితములను వహించుచున్నది. అనగా ప్రతిపక్షులపై వ్యాజ్యములయందు వేయవలసిన ఆరోపణపత్రములను దనపై వేసుకొనుచున్న దను నర్మధ్వనితము. అనగా తన స్తంభములను దమయన్తి తొడలుగా భ్రాంతిపడినదై దమయన్తితొడలపైవేయవలసిన ఆరోపణపత్రములను దనపైన అనగా అరటి స్తంభముపైన వేసుకొనినది. అనగా అకులను, అరటి స్తంభము తొడిగినది. ఆకులు తొడుగుటచే, స్తంభములు దొడలకంటె ఎత్తైన వని గ్రహింప నగునుగదా। దమయన్తి తొడలు అరటిస్తంభముల వలె రమ్యములుగా నున్నవని సారాంశము. ॥౯౨॥

శ్లో॥ విధాయ మూర్ధానమధశ్చరఞ్చే
న్ముఞ్చేత్తరోభిః స్వమసారభావమ్ ।
జాడ్యఞ్చ నాఽఞ్చేత్ కదలీ బలీయ
స్తదా యది స్యాదిదమూరుచారుః॥ ౯౩

ప॥వి॥ విధాయ । మూర్ధానమ్ । అధశ్చరం । చేత్ । ముఞ్చేత్ । తపోభిః । స్వమ్ । అసార భావమ్ । జాడ్యం । చ । న । అఞ్చేత్ । కదలీ । బలీయః । తదా । యది । స్యాత్ । ఇదమూరుచారుః.

టీక॥ కదలీ=అరటి స్తంభము, తపోభిః=తపస్సులచే, మూరానం=తలను, అధశ్చరం=క్రింద సంచరించు దానినిగా, విధాయ=చేసి, స్వం=తనదైన, అసార భావం=నిస్సారత్వమును, ముఞ్చేతచేత్=విడిచి పెట్టినచో, బలీయః=అధికమైన, జాడ్యఞ్చ=శైత్యమును (జడత్వమును), నాఽఞ్చేత్=పొందదు, తదా=అప్పుడు, ఇదమూరుచారుః; ఇదమ్=ఈ దమయన్తియొక్క, ఊరు=తొడలవలె, చారుః=శోభనముగా, స్యాద్యది=తప్పక కాగలదు.

వి॥ ఇచ్చట అరటి కంబమునకు తలక్రిందు లగుట లేకపోయినప్పటికిని, అట్లున్నదని, దాని సమ్బంధమునుఁ జెప్పుటవలన సంబంధాతిశయో క్తి యను నతిశయో క్త్య లఙ్కార భేదము.

**సమాసములు :**

అధశ్చరమ్ : అధశ్చరతీతి = అధశ్చరమ్. తత్ = అధశ్చరమ్.

అసారభావమ్ : అవిద్యమానః సారః యస్య సః = అసారః. అసారస్య భావః = అసారభావః. తం = అసారభావమ్.

ఇదమూరుచారుః : అస్యాః ఊరూ = ఇదమూరూ. ఇదమూరూ ఇవ చారుః = ఇదమూరుచారుః.

**భావము :**

అరటిస్తమ్భము తలక్రిందులై తపస్సులు గావించి తన సారరాహిత్యమును, వదలినచో, బలీయమైన జాడ్యమును అనగా శైత్యమును (జడత్వమును) పొందదు. అప్పుడు దమయన్తి తొడలవలె తప్పక రమ్యమై యుండును అనగా శైత్యాదిగుణములు లేనప్పుడే యరటిస్తంభములు శీతకాలమున వేడిగను ఎండకాలమున చల్లగను నుండెడు దమయన్తి తొడలకు సమానములు కాఁగల వని యాశయము ॥౭౩॥

శ్లో॥ ఊరుప్రకాణ్డద్వితయేన తస్యాః
కరః పరాజీయత వారణీయః ।
యుక్తం హ్రియా కుణ్డలనచ్ఛలేన
గోపాయతి స్వంముఖపుష్కరం సః ॥ ౭౪

ప॥వి॥ ఊరుప్రకాణ్డద్వితయేన । తస్యాః । కరః । పరాజీయత । వారణీయః । యుక్తం । హ్రియా । కుణలనచ్ఛలేన । గోపాయతి । స్వం । ముఖపుష్కరం । సః.

టీక॥ తస్యాః = ఆదమయన్తియొక్క, ఊరుప్రకాణ్డద్వితయేన; ఊరుప్రకాణ్డ = శ్రేష్ఠములైన తొడలయొక్క, ద్వితయేన = జంటచే, లేదా-

ఊరుప్రకాణ్డ = స్తమ్భముల వంటి తొడలయొక్క, ద్వితయేన = జంటచే, వారణీయః = ఏనుగకుసంబంధించిన, కరః = హస్తము, అనగా తొండము, పరాజీయత = ఓడింపఁబడినది. సః = ఆతొండము, హ్రియా = సిగ్గుచే, స్వం = తనదైన, ముఖపుష్కరం = ముఖమనెడి పద్మమును తొండముకొనను, కుణ్డలనచ్ఛలేన = వంపుగఁ జేయుట యను నెపముచే, గోపాయతి = కప్పిపుచ్చుకొనుచున్నది. యుక్తమ్ = తగినది.

వి॥ "కుణ్డలనచ్ఛలేన" యని ఛలశబ్దప్రయోగముచే నపహ్నవాలఙ్కారము. ముఖపుష్కరమును కప్పిపుచ్చకపోయినను కప్పిపుచ్చి నట్లు చెప్పుట వలన నుత్ప్రేక్ష. కాన నిచ్చట నపహ్నవముతోఁ గూడిన యుత్ప్రేక్ష.

సమాసములు :

*ఊరుప్రకాణ్డద్వితయేన :* ఊర్వోః ప్రకాణ్డౌ = ఊరుప్రకాణ్డౌ. ఊరుప్రకాణ్డయోః. ద్వితయం = ఊరుప్రకాణ్డద్వితయమ్. తేన = ఊరుప్రకాణ్డద్వితయేన.

*వారణీయః :* వారణస్య అయం = వారణీయః.

*కుణ్డలనచ్ఛలేన :* కుణ్డలనస్య ఛలం = కుణ్డలనచ్ఛలం. తేన = కుణ్డలనచ్ఛలేన.

*ముఖపుష్కరం :* ముఖమేవ పుష్కరం = ముఖపుష్కరం. తత్ = ముఖపుష్కరమ్.

**భావము :**

దమయన్తి యొక్క స్తమ్భముల వంటి తొడలతో, ఏనుగ తొండము ఓడింపఁబడినది. కావుననే నా తొండము సిగ్గుచే తన ముఖపద్మమును తన తొండముకొనను వంచుకొనుట యను నెపముచే కప్పిపుచ్చుకొనుచున్నది. అనగా, దమయన్తి తొడలు ఏనుగ తొండములను మించి రమ్యములుగా నున్న వని యాశయము ॥౯౪॥

**శ్లో॥ అస్యాం మునీనామపి మోహమూహే**
**భృగుర్మహాన్ యత్కుచ శైలశీలీ ।**

నానారదాహ్లాది ముఖం శ్రితోరు
ర్వ్యాసో మహాభారతసర్గయోగ్యః ॥ ౬౨

ప॥వి॥ అస్యాం । మునీనామ్ । అపి । మోహమ్ । ఊహే । భృగుః । మహాన్ । యత్కుచశైలశీలీ । నానారదాహ్లాది । ముఖం । శ్రితోరుః । వ్యాసః । మహాభారతసర్గయోగ్యః.

టీక॥ అస్యాం = ఈదమయన్తియందు, మునీనామపి = ఋషులకుఁగూడ, మోహమ్ = ఆసక్తిని, ఊహే = ఊహించుచున్నాను. (కుతః = ఏల యనగా) యత్ = ఎందువలన, మహాన్ = గొప్పదైన (గొప్పవాడైన), భృగుః = కొండచఱియయు, (భృగుమహర్షియు), యత్కుచశైలశీలీ; యత్ = ఏదమయన్తియొక్క, కుచశైల = స్తనములనెడి పర్వతములను, శీలీ = పరిచయముగావించుకొనుచున్నాడు. ముఖం = ఆ దమయన్తి యొక్క ముఖము, నానారదాహ్లాది, నానారద = నానావిధములైన దన్తములచే, ఆహ్లాది = సంతోషపఱచునది. నానారదాహ్లాది; న+అ+నార దాహ్లాది, నారదుని ఆహ్లాదపఱచునది ఏదికాదో అదికానిది, అనగా నారదుని తప్పక ఆహ్లాదపఱచునది. మహాభారత సర్గయోగ్యః, మహాభాః = గొప్పకాంతిగల్గిన, రతసర్గయోగ్యః = సురతమును సంపాదించుట కర్హమైనట్టి, వ్యాసః = విస్తారము అనగావైశాల్యము, శ్రితోరుః; శ్రిత = ఆశ్రయింపఁబడిన, ఊరుః = తొడలుకల్గినది, మహాభారత = మహాభారతమను నితిహాసమును, సర్గ = సృజించుటకు, యోగ్యః = అర్హుడైన, వ్యాసః = వ్యాసమహర్షి, శ్రితోరుః; శ్రిత = ఆశ్రయింపఁబడిన, ఊరుః = ఊరువులు గలవాఁడు లేదా ఉరుప్రదేశముగలవాఁడు అనగా నున్నత స్థానము గల్గియున్నాడు.

వి॥ శ్లేషచే దమయన్తిపై మునులకు మోహము నుత్ప్రేక్షించుట వలన నుత్ప్రేక్ష. అందువలన జితేన్ద్రియు లైన మునులకే యీమెయందు మోహము గల్గినచో సామాన్యుల కెంతటి మోహముగల్గు నను వస్తువు ధ్వనించుచున్నది కాన నలఙ్కారముచే వస్తుధ్వని.

సమాసములు :

యత్కుచశైలశీలీ : యస్యాః కుచౌ = యత్కుచౌ. యత్కుచావేవ శైలౌ

= యత్కుచశైలౌ. యత్కుచశైలౌ. శీలయతీతి = యత్కుచశైలశీలీ.

నానారదాహ్లాదీ: నానా చ తే రదాశ్చ = నానారదాః; నానారదైః ఆహ్లాద యతీతి = నానారదాహ్లాదీ. యద్వా నారదమాహ్లాదయతీతి = నారదాహ్లాదీ. నారదాహ్లాదీ న భవతీతి = అనారదాహ్లాదీ. అనారదాహ్లాదీ న భవతీతి = నానారదాహ్లాదీ.

మహాభారతసర్గయోగ్యః : మహతీ భాః యస్య సః = మహాభాః. రతస్య సర్గః = రతసర్గః. రతసర్గస్య యోగ్యః = రతసర్గయోగ్యః. మహాభాశ్చాసౌ రత సర్గయోగ్యశ్చ = మహాభారతసర్గయోగ్యః.

శ్రితోరుః : శ్రితౌ ఊరూ యేన సః = శ్రితోరుః.

భావము :

మునులకు సైతము దమయన్తియందు మోహము గల్గిన దని యూహింపఁబడుచున్నది. ఏల యనగా భృగువు, ఈ దమయన్తియొక్క స్తనశైలములను సేవించుచున్నాడు. ఈమె ముఖముచే నారదుఁడు సంతోష పడుచున్నాడు. వ్యాసుడుమహాభారతసర్గయోగ్యుడై అనగా గొప్పరతిసంపర్కముఁ గల్గి యీమె తొడల నాశ్రయించి యున్నాడు. పైవానికిఁబరిహారములు భృగువు అనగా కొండచఱియ. అది స్తనశైలములను సేవించుచున్న దనియు, ముఖము నా నారదములతో ననగా నానావిధము లగు దన్తములతో నాహ్లాదకరమై యున్న దనియు వ్యాసుడు మహాభారతసృష్టికి యోగ్యుడై ఉన్నత స్థానము నాశ్రయించియున్నా డనియు భావము. రతిపక్షమున వ్యాసశబ్దమునకు విస్తారమని యర్థము కాన నామె తొడలను వైశాల్యము ఆశ్రయించిన దనగా విశాలమైన తొడలు కల్గి రతిసంపర్గయోగ్యురాలుగ నామె యున్న దను నంశము గ్రాహ్యము. ॥౬౫॥

శ్లో॥ క్రమోద్గతా పీవరతాధిజఙ్ఘం
వృషాధిరూఢిం విదుషీ కిమస్యాః ।
అపి భ్రమీభఙ్గిభిరావృతాఙ్గం
వాసో లతావేష్టితకప్రవీణమ్ ॥ ౬౬

ప॥వి॥ క్రమోద్గతా । పీవరతా । అధిజఙ్ఘం । వృషాధిరూఢిం । విదుషీ । కిమ్।

అస్యాః । అపి । భ్రమీభఙ్గిభిః । అవృతాఙ్గం । వాసః । లతావేష్టితక ప్రవీణమ్.

టీక॥ అస్యాః = ఈదమయన్తియొక్క, అధిజఙ్ఘమ్ = మోకాళ్లయందు, క్రమోద్గతా; క్రమ = క్రమముచే, ఉద్గతా = ఉదయించిన, పీవరతా = బలుపు, వృక్షాధి రూఢిం = వృక్షాధిరూఢమను, ఆలిఙ్గనమును, లేదా వృక్షము మొదట మూలభాగమున సూక్ష్మముగా నుండి పైభాగమునం దెట్లు స్థూల మగునో యట్టి వృద్ధిని, విదుషీకిం = తెలుసుకొనినదా యేమి. (తథా = అట్లే) భ్రమీభఙ్గిభిః = వస్త్రమునుఁ జుట్టడములోని ప్రకారముతో, అవృ తాఙ్గం; అవృత = ఆవరింపఁబడిన, అఙ్గం = శరీరముగల, వాసఃఅపి = వస్త్రముగూడ, లతావేష్టితకప్రవీణమ్; లతావేష్టితక = లతావేష్టితకమను పేరు గల ఆలిఙ్గనమునందు, ప్రవీణంకిం = నేర్పుగల్గినదాయేమి? లేదా లతావేష్టితక = తీగె తనచుట్లతో ఎట్లుచెట్టును చుట్టుకొనునో, అట్లు వస్త్రము శరీరమును జుట్టుకొనుట యందు, ప్రవీణాకిం = నేర్పుగలదా యేమి.

వి॥ భర్తలేవగనే ప్రేయసి యతని కణ్ఠమునుఁ దన బాహువులచే కౌగలించి యతని యొడియందుఁ గూర్చొనినచో నది వృక్షారూఢ మను నాలిఙ్గనము. ఉపవిష్టుఁడైన ప్రియుని ప్రేయసి నిద్రించుచుఁ గట్టుకొనినచో నది లతావేష్టితకమను నాలిఙ్గనము అని కామశాస్త్రప్రసిద్ధములు.

## సమాసములు :

క్రమోద్గతా : క్రమేణ ఉద్గతా = క్రమోద్గతా.

పీవరతా : పీవరస్య భావః = పీవరతా.

అధిజఙ్ఘమ్ : జఙ్ఘాయామ్ = అధిజఙ్ఘమ్.

వృక్షాధిరూఢిం : వృక్షస్య అధిరూఢిః = వృక్షాధిరూఢిః. తామ్ = వృక్షాధి రూఢిమ్.

భ్రమీభఙ్గిభిః : భ్రమీణాం భఙ్గయః = భ్రమీభఙ్గయః. తాభిః = భ్రమీ భఙ్గిభిః.

అవృతాఙ్గం : ఆవృతమ్ అఙ్గం యేన తత్ = అవృతాఙ్గమ్.

లతావేష్టితక ప్రవీణమ్ : లతాయాః వేష్టితకం = లతావేష్టితకం. లతా వేష్టితకే ప్రవీణమ్ = లతావేష్టితకప్రవీణమ్.

**భావము :**

దమయన్తి మోకాలుపై నడుమునుండి పైవరకు క్రమముగా బలుపు ఏర్పడియున్నది. ఈ బలుపు వృక్షాధిరూఢ మను నాలిఙ్గనముఁ దెలిసికొనినదా యని భావింపఁదగియున్నది. అట్లే యీామెయొక్క వస్త్రము పెక్కు చుట్లతో శరీరము నావరించినదై లతాలేష్టితకమను నాలిఙ్గనమునందు నేర్పరియా యని భావింపఁ దగి యున్నది. అనగా నామెయొక్క మోకాళ్లను, నామె వలువను ధరించెడి భఙ్గిమములు రమ్యములై కామోద్రేక హేతువులుగా నున్నవనిభావము.

శ్లో॥ అరున్ధతీకామపురన్ధ్రిలక్ష్మీ
జమ్భద్విషద్దారనవామ్బికానామ్ ।
చతుర్దశీయం తదిహోచితైవ
గుల్ఫద్వయాప్తా యదదృశ్యసిద్ధిః ॥ ౯౭

ప॥వి॥ అరున్ధతీ కామపురన్ధ్రి లక్ష్మీ జమ్భ ద్విషద్దార నవామ్బికానాం । చతుర్దశీ। ఇయం । తత్ । ఇహ । ఉచితా । ఏవ । గుల్ఫద్వయాప్తా । యదదృశ్య సిద్ధిః.

టీక॥ ఇయం = ఈ దమయన్తి, అరున్ధతీకామపురన్ధ్రి లక్ష్మీజమ్భ ద్విషద్దార నవామ్బికానామ్; అరున్ధతీ = అరున్ధతియు, కామపురన్ధ్రీ = కామునిస్త్రీయైన రతియు, లక్ష్మీ = లక్ష్మియు, జమ్భద్విషత్ = జమ్భాసురుని శత్రువైన యింద్రునియొక్క, దార = భార్యయైన శచియు, నవామ్బికానాం = తొమ్మండుగురు తల్లులు అను పదముగ్గురికిని, చతుర్దశీ = పదునాల్గవ దియాయేమి? తత్ = అందువలననే, ఇహ = ఈమెయందు, గుల్ఫ ద్వయాప్తా; గుల్ఫద్వయ = రెండు చీలమండలచే, ఆప్తా = పొందఁబడిన, యదదృశ్య సిద్ధిః = అదృశ్య సిద్ధియేది గలదో, సా = అది, ఉచితైవ = తగినదిగనే యున్నది. లేదా నవామ్బికానాం = తొమ్మిది తల్లులు అను

పదముగ్గురికిని, చతుర్దశీ=పదునాల్గవదిగా, ఇయం=ఈ దమయన్తి, యత్=ఎందువలన నున్నదో, తత్=అందువలన, ఇహ=ఈమెయందు, అదృశ్య సిద్ధిః; అదృశ్య=కంటికి కానరాని వస్తువునకు, సిద్ధిః=ప్రాప్తి అనగా నదృశ్యత్వ మేదిగలద్దో (కంటికిఁ గానరాక యుండుట యని యర్థము) సా=అది, ఉచితైవ=తగినదై, గుల్ఫద్వయాప్తా;గుల్ఫద్వయ=రెండు చీలమండలచే, ఆప్తా=పొందఁబడినది.

## సమాసములు :

*అరున్ధతీ కామపురన్ధ్రి లక్ష్మీజమ్బు ద్వీపషద్దార నవామ్బికానామ్ :* అరున్ధతీ చ కామపురన్ధ్రిశ్చ లక్ష్మీశ్చ జమ్బుద్వీపషద్దారాశ్చ నవామ్బికాశ్చ= అరున్ధతీ కామపురన్ధ్రి లక్ష్మీ జమ్బు ద్వీపషద్దార నవామ్బికాః. తాసామ్=అరున్ధతీ కామపురన్ధ్రి లక్ష్మీ జమ్బు ద్వీపషద్దార నవామ్బికానామ్.

*గుల్ఫద్వయాప్తా :* గుల్ఫయోః ద్వయం=గుల్ఫద్వయం. గుల్ఫద్వయేన ఆప్తా=గుల్ఫద్వయాప్తా.

*యదదృశ్యసిద్ధిః :* అదృశ్యస్య సిద్ధిః=అదృశ్యసిద్ధిః. యా చ సా అదృశ్యసిద్ధిశ్చ=యదదృశ్యసిద్ధిః.

## భావము :

అరున్ధతియు, రతియు,లక్ష్మియు,శచియు,బ్రాహ్మి-మాహేశ్వరి-కౌమారి-వైష్ణవి-వారాహి-ఇంద్రాణి-చాముణ్డి యనఁబడు నేడ్గురును, గౌరి, సరస్వతి యను నిఱువురును మొత్తము తొమ్మండుగురు తల్లులతో నరున్ధతి మొదలు శచివరకు గల వారినిఁ గలుపుకొనగా పదముగ్గు రగుచున్నారు. వారితోఁ బదునాల్గవదిగా దమయన్తి చేరినది గాన నీమెకును నదృశ్యసిద్ధి అనగా నదృశ్యత్వము తన చీల మండెలచేఁ బొందఁబడుట యుక్తము. అరున్ధతి మున్నగువారివలె నీమె మిక్కిలి సుందరియు, పతివ్రతయునై యున్నది. కావున నామెయందు చీలమండలు లోపలికి నొదిగి యుండుట యను సాముద్రిక లక్షణము యుక్తము. మఱియు చతుర్దశి యను తిథియందు నదృశ్యీకరణ విద్య, సాధకులకు లభించుట సులభ మను నర్థము సూచితము. "చతుర్దశ్యా మదృశ్యత్వ సిద్ధిర్భవతి" యను నాగమ ప్రమాణ మిట నను సన్ధేయము. ॥౯౨॥

శ్లో॥ అస్యాః పదౌ చారుతయా మహాన్తా
వపేక్ష్య సౌక్ష్మ్యల్లవభావభాజః।
జాతా ప్రవాళస్య మహీరుహాణాం
జానీమహే పల్లవశబ్దలబ్ధిః॥ ౯౨

ప॥వి॥ అస్యాః పదౌ । చారుతయా । మహాన్తౌ । అపేక్ష । సౌక్ష్మ్యత్ । లవ భావభాజః । జాతా । ప్రవాళస్య । మహీరుహాణాం । జానీమహే । పల్లవ శబ్దలబ్ధిః.

టీక॥ చారుతయా = సౌన్దర్య గుణముచే, మహాన్తౌ = గొప్పవైన, అస్యాః = ఈమెయొక్క, పదౌ = పాదములను, అపేక్ష్య = అపేక్షించి అనగా అవధినిఁ గావించుకొని, సౌక్ష్మ్యత్ = అల్పముగా నుండుటవలన, లవ భావభాజః; లవభావ = లవత్వమును లేశత్వమును, భాజః = పొందు చున్న, మహీరుహాణాం = వృక్షములయొక్క, ప్రవాలస్య = చిగురునకు, పల్లవశబ్ద లబ్ధిః; పల్లవశబ్ద = "పద్భ్యాంలవః" అను వ్యుత్పత్తి ననుస రించి, పాదములకంటెను స్వల్పమైన దను నర్థ మొసంగెడి పల్లవ శబ్దముయొక్క, లబ్ధిః = ప్రాప్తి, జాతా = ఏర్పడినదిగా, జానీమహే = తెలుసుకొనుచున్నారము.

వి॥ పల్లవ శబ్దమునకు, "పద్భ్యాంలవః" యనెడి వ్యుత్పత్తి లేకపోయినను నట్టి వ్యుత్పత్తి యుత్ప్రేక్షింపఁబడినది గాన నుత్ప్రేక్ష.

సమాసములు :

చారుతయా : చార్వోః భావః = చారుతా. తయా = చారుతయా.

సౌక్ష్మ్యత్ : సూక్ష్మస్య భావః = సౌక్ష్మ్యం. తస్మాత్ = సౌక్ష్మ్యత్.

లవభావభాజః : లవస్య భావః = లవభావః. లవభావం భజతీతి = లవ భావభాక్. తస్య = లవభావభాజః.

పల్లవశబ్దలబ్ధిః : పల్లవ ఇతి శబ్దః = పల్లవశబ్దః. పల్లవశబ్దస్య లబ్ధిః = పల్లవశబ్దలబ్ధిః.

**భావము :**

ఇచ్చట పల్లవశబ్దముయొక్క వ్యుత్పత్తిని కవి చమత్కారముగా నిచ్చుచున్నాడు. సౌన్దర్య గుణముచే దమయన్తి పాదములు గొప్పవి. దానికంటెను నల్పముగా నుండుటవలన, "పాదముకంటెను లవము" అను వ్యుత్పత్తి ననుసరించి, పత్+లవః=పల్లవః అని శబ్ద మేర్పడినది. అనగా దమయన్తి పాదముకంటెను చిగురు స్వల్పమైన దనియు, దమయన్తి పాదము చిగురుకంటెను రమ్యమైనదనియు భావము. పాదముయొక్క+లవము=పల్లవ మను షష్ఠీ సమాసము చెప్పినచో పల్లవము అనగా చిగురు దమయన్తి పాదము యొక్క లేశభాగ మను నర్థ మిచ్చును. ఇదియు నుచితముగనే యున్నది. ॥౯౮॥

శ్లో॥ జగద్వధూమూర్ధసు రూపదర్పాత్
యదేతయాఽధాయి పదారవిన్దమ్।
తత్సాన్ద్రసిన్దూరపరాగరాగైః
ధ్రువం ప్రవాలప్రబలారుణం తత్॥ ౯౯

ప॥వి॥ జగద్వధూమూర్ధసు । రూపదర్పాత్ । యత్ । ఏతయా । అధాయి । పదారవిన్దమ్ । తత్ సాన్ద్రసిన్దూరపరాగరాగైః । ధ్రువం । ప్రవాలప్రబలారుణం । తత్.

టీక॥ యత్=ఎందువలన, ఏతయా = ఈదమయన్తిచే, రూపదర్పాత్ = సౌన్దర్యగర్వమువలన, (ద్వయః=రెంటిసమూహమైన) పదారవిన్దం = పద్మములవంటి రెండు పాదములు, జగద్వధూమూర్ధసు; జగద్వధూ = ప్రపఞ్చమందలిమహిళలయొక్క, మూర్ధసు = తలలయందు, అధాయి = ఉంచఁబడినదో, తత్ = అందువలన, తత్సాన్ద్రసిన్దూరపరాగరాగైః; తత్ = ఆతలల యందలి, సాన్ద్ర = దట్టములైన, సిన్దూరపరాగ = సిన్దూరపుపొడులయొక్క, రాగైః = ఎఱ్ఱనికాన్తులచే, ప్రవాలప్రబలారుణం; ప్రవాల = పగడములకంటెను, ప్రబల = మిక్కిలి, అరుణం = ఎఱ్ఱనైనది. ధ్రువం = నిశ్చయము.

వి॥ దమయన్తియొక్క పాదారవిన్దము జగన్మహిళల తలపై నుంచుటవలన నెఱ్ఱఁదనముఁ బొందక పోయినను నెఱ్ఱఁదనమునుఁ బొంది నట్లు

చెప్పుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జక మగు ధ్రువశబ్దమునుఁ బ్రయోగించుట వలన నిది వాచ్యము

**సమాసములు :**

*జగద్వధూమూర్ధసు :* జగతాం వధ్వః = జగద్వధ్వః. జగద్వధూనాం మూరానః = జగద్వధూ మూర్ధానః. తేషు = జగద్వధూమూర్ధసు.

*రూపదర్పాత్ :* రూపస్య దర్పః = రూపదర్పః. తస్మాత్ = రూప దర్పాత్.

*పదారవిన్దమ్ :* పదం అరవిన్దమివ = పదారవిన్దమ్.

*తత్సాన్ద్రసిన్దూరపరాగరాగైః :* సిన్దూరస్య పరాగాః = సిన్దూర పరాగాః. సాన్ద్రాశ్చ తే సిన్దూర పరాగాశ్చ = సాన్ద్రసిన్దూరపరాగాః. తేషు సాన్ద్రసిన్దూరపరాగాః = తత్సాన్ద్రసిన్దూరపరాగాః. తత్సాన్ద్రసిన్దూరపరాగాణాం రాగాః = తత్సాన్ద్రసిన్దూరపరాగరాగాః. తైః = తత్సాన్ద్రసిన్దూరపరాగరాగైః.

*ప్రవాలప్రబలారుణమ్ :* ప్రబలం చ తత్ అరుణం చ = ప్రబలా రుణమ్. ప్రవాలాత్ ప్రవాలారుణమ్ = ప్రవాలప్రబలారుణమ్.

**భావము :**

దమయన్తి తన రూపగర్వముచే, తన పాదములను ప్రపఞ్చసుందరుల తలపై నుంచినది. అందువలన నా సుందరీమణుల నెత్తిపై నందుకొనిన సింధూరపు ధూళులు కాలికంటినవి. అందువలన నామెయొక్క పాదపద్మము చిగురుకంటెను మిక్కిలి యెఱ్ఱనై శోభించుచున్నది. ॥౯౯॥

శ్లో॥ రుషాఽరుణా సర్వగుణైర్జయన్త్యా
భైమ్యాః పదం శ్రీః స్మ విధేర్వృణీతే।
ధ్రువం స తామచ్ఛలయద్యతః సా
భృశారుణైతత్పదభాక్ విభాతి॥ ౧౦౦

ప॥వి॥ రుషా । అరుణా । సర్వగుణైః । జయన్త్యాః । భైమ్యాః । పదం । శ్రీః ।

విధేః । వృణీతే । ధ్రువం । సః । తామ్ । అచ్ఛలయత్ । యతః । సా ।
భృశారుణా । ఏతత్పదభాక్ । విభాతి.

టీక॥ శ్రీః = లక్ష్మి, రుషా = రోషముచే అనగాపరాజయమువలని కోపముచే, అరుణాసతీ = ఎఱ్ఱఁదనముఁబొందినదై, సర్వగుణైః = సమస్తగుణములచే, జయన్త్యాః = తన్నుజయించుచున్న, అనగా తన్ను నతిక్రమించుచున్న, భైమ్యాః = దమయన్తియొక్క, పదం = స్థానమును, విధేః = బ్రహ్మవలన, వృణీతేస్మ = కోరుచుండినది. సః = ఆవిధి, తా = ఆ లక్ష్మిని, అచ్ఛలయత్ = వంచించెను. ధ్రువం = నిశ్చయము. యతః = ఏలయనగా, సా = ఆ లక్ష్మి, ఏతత్ పదభాక్; ఏతత్ = ఈ దమయన్తి యొక్క, పద = పాదమును, భాక్ = పొందినదై, అనగాశోభగానున్నదై, భృశారుణా = మిక్కిలియెఱ్ఱనిదై, విభాతి = ప్రకాశించుచున్నది.

వి॥ ఇచ్చట లక్ష్మి కోపముచే నెఱ్ఱఁదనమునుఁ బొందకపోయినను నెఱ్ఱఁదనమునుఁ బొంది నట్లు వర్ణించుటవలన నుత్ప్రేక్ష. ధ్రువమ్మను వ్యఞ్జకమునుఁ బ్రయోగించుటవలన నది వాచ్యము.

## సమాసములు :

సర్వగుణైః : సర్వే చ తే గుణాశ్చ = సర్వగుణాః. తైః = సర్వగుణైః.

భృశారుణా : భృశం అరుణా = భృశారుణా.

ఏతత్పదభాక్ : ఏతస్యాః పదం = ఏతత్పదం. ఏతత్పదంభజతీతి = ఏతత్పదభాక్.

## భావము :

లక్ష్మిదేవి సమస్త గుణములచేతను దమయన్తివలన నోటమినిఁ బొంది రోషముచే నెఱ్ఱఁదనము వహించి, దమయన్తియొక్క పదమును (స్థానమును) (పాదమును) బ్రహ్మవలన పొందినది. ఇది నిశ్చయమే. కాని ఆ బ్రహ్మ యీామెను వంచించెను. ఏలయనగా---ఈలక్ష్మి కోపముతో నేర్పడిన యెఱ్ఱఁదనము నెక్కువగా వహించి ఆమెయొక్క (పదమును) స్థానమునుఁ బొందక, ఆమె పాదమునే పొందినది. ఈ విధముగా దమయన్తి యొక్క పదమును (స్థానమును) కోరిన లక్ష్మికి దమయన్తి పదము అనగా దమయన్తి పాదము

లభించినది. ఈ విధముగా స్థానమును గోరిన లక్ష్మికి స్థానము నీయక పాదము నిచ్చి బ్రహ్మలక్ష్మినేమార్చె నని భావము. అనగా దమయన్తి పాదము మిక్కిలి యెట్టని శోభతో నలరారుచున్న దని యాశయము ॥౧౦౦॥

శ్లో॥ యానేన తన్వ్యా జితదన్తినాథౌ
పదాబ్జరాజౌ పరిశుద్ధ పార్ష్ణీ ।
జానే న శుశ్రూషయితుం స్వమిచ్ఛూ
నతేన మూర్ధ్నా కతరస్య రాజ్ఞః॥ ౧౦౧

ప॥వి॥ యానేన । తన్వ్యాః । జితదన్తినాథౌ । పదాబ్జరాజౌ । పరిశుద్ధపార్ష్ణీ । జానే । న । శుశ్రూషయితుం । స్వమ్ । ఇచ్ఛూ । నతేన । మూర్ధ్నా । కతరస్య । రాజ్ఞః.

టీక॥ యానేన = నడకచేతను, (దణ్డ యాత్రచేతను) జితదన్తినాథౌ; జిత = జయింపఁబడిన, దన్తినాథౌ = గజశ్రేష్ఠము (గజపతియు) కల్గిన, పరిశుద్ధపార్ష్ణీ; పరిశుద్ధ = మిక్కిలి నిర్మలములైన, పార్ష్ణీ = చరణముల వెనుకటి భాగము గల్గినవియు, (వెనుకనున్న శత్రుత్వము గలవియు) నగు, తన్వ్యాః = దమయన్తియొక్క, పాదాబ్జరాజౌ; పాదాబ్జ = తామర పూవులవంటి పాదములనే, రాజౌ = రాజులు. కతరస్య = ఏ, రాజ్ఞః = పతియొక్కయు, (శత్రువుయొక్కయు), (మానశాన్తికై, రౌద్రశాన్తికై) నతేన = వంగిన, మూర్ధ్నా = శిరముచే, స్వం = సేవ్యుఁడైన తన్ను, శుశ్రూషయితుం = సేవించుటకు, ఇచ్ఛూ = కోరికగలవిగా నున్నవో, నజానే = తెలిసికొనుటలేదు.

వి॥ "పాదాబ్జరాజౌ" అనునెడ పాదాబ్జములను రాజులతో రూపించుటవలన రూపకము. ఈ రూపకమునకును, యానేన-ఇత్యాదిస్థలలోని శ్లేషతో నఙ్గాఙ్గి భావ ముండుటవలన సఙ్కరము.

**సమాసములు:**

*జితదన్తినాథౌ :* దన్తినాం నాథః = దన్తినాథః. జితః దన్తినాథః. యాభ్యాం తౌ = జితదన్తినాథౌ.

పాదబ్జరాజౌ : పాదౌ అబ్జే ఇవ = పాదాబ్జే. పాదాబ్జే ఏవ రాజానౌ = పాదాబ్జరాజౌ.

పరిశుదపార్ష్ణీ : పరిశుదః పార్ష్ణిః యయోస్తౌ = పరిశుదపార్ష్ణీ.

భావము :

నడకతో మేటి యేనుగును జయించినవియు, పరిశుద్ధములైన చరణ పృష్ఠభాగములు కలవియు నగు దమయన్తియొక్క పాదపద్మములను రాజులు మానము శమియించుటకై యేపతియొక్క నమ్రశిరమును తన్ను శుశ్రూషింపఁ గోరుచున్నవో తెలియుటలేదు. దమయన్తికిఁ గల్గిన ప్రణయకోపమునుఁ బోగొట్టుటకై తలను వాల్చి యనునయించెడి భర్త నెవ్వని నామెయొక్క పాదపద్మములు గోరుచున్నవో తెలియుటలేదు. ఆమెయొక్క మహోత్తమములైన పాదపద్మములను సేవించు నట్టి యామెయొక్క భర్త మహాపుణ్యశాలి యని యాశయము.

రాజపక్షమున భావము — నడక యను దణ్డయాత్రచే గజశ్రేష్ఠమను గజపతిని జయించినవియు, నిర్మలమైనందువలన వశుడైన వెనుకతట్టు నివసించు శత్రువు గల వారుననగు, పాదపద్మము లనెడి రాజులు తమకు కోపము శమించుటకై తలవంచి వినయశాలిగా వ్యవహరించు శత్రువు నెవ్వనిని దమ్ముసేవింపదగినవానినిగా గోరుచున్నాడో, తెనియుటలేదు. దండయాత్రకు వెళ్లిన రాజులు, శత్రువులు తమకు లొంగి సేవింపవలయు నని కోరుదురు కదా. ఆ విషయమిట ననుసంధేయము ॥౧౦౧॥

శ్లో॥ కర్ణాక్షిదన్తచ్ఛదబాహుపాణి
పదాదినః స్వాఖిలతుల్యజేతుః ।
ఉద్వేగభాగద్వయతాభిమానా
దిహైవ వేధా వ్యధిత ద్వితీయమ్॥ ౧౦౨

ప॥వి॥ కర్ణాక్షిదన్తచ్ఛదబాహుపాణిపదాదినః। స్వాఖిలతుల్యజేతుః। ఉద్వేగభాక్ । అద్వయతాభిమానాత్ । ఇహ । ఏవ । వేధాః । వ్యధిత । ద్వితీయమ్ ।

టీక॥ స్వాఖిలతుల్యజేతుః; స్వ = తనకుసంబంధించిన, అఖిల = సమస్తములును, తుల్య = సమానములైన చక్కిలములు కమలములు మున్నగు

నుపమానవస్తువులను, జేతుః = జయించిన, కర్ణాక్షిద న్తచ్ఛద పాణి పదాదినః; కర్ణ = చెవులు, అక్షి = కన్ను, ద న్తచ్ఛద = పెదవి, పాణి = చేయి, పద = పాదము, మున్నగునవయవసముదాయమునకు, అద్వయతాభిమానాత్; అద్వయతా = తమకుసాటియైనదిలేదను, అభిమానాత్ = గర్వమువలన, ఉద్వేగభాక్; ఉద్వేగ = రోషమును, భాక్ = పొందిన, వేధాః = బ్రహ్మ, ఇహైవ = ఈమెయందే, ద్వితీయం = రెండవదైనచెవ్వుమున్నగువానిని, వ్యధిత = ఉంచెను.

సమాసములు :

కర్ణాక్షిద న్తచ్ఛదబాహుపాణిపదాదినః : కర్ణశ్చ, అక్షి చ, ద న్తచ్ఛదశ్చ, బాహుశ్చ, పాణిశ్చ, పదశ్చ = కర్ణాక్షిద న్తచ్ఛదబాహుపాణిపదమ్. కర్ణాక్షిద న్తచ్ఛదబాహుపాణిపదం ఆది యస్య తత్ = కర్ణాక్షిద న్తచ్ఛదబాహుపాణిపదాది. తస్య = కర్ణాక్షిద న్తచ్ఛదబాహుపాణిపదాదినః.

స్వాఖిలతుల్యజేతుః : అఖిలాని చ తానితుల్యాని చ = అఖిలతుల్యాని. స్వస్యాః అఖిలతుల్యాని = స్వాఖిలతుల్యాని. స్వాఖిలతుల్యానాం జేతా = స్వాఖిలతుల్యజేతా. తస్య = స్వాఖిలతుల్యజేతుః.

ఉద్వేగభాక్ : ఉద్వేగం భజతీతి = ఉద్వేగభాక్.

అద్వయతాభిమానాత్ : న ద్వయం యస్య తత్ = అద్వయం. అద్వయస్య భావః = అద్వయతా. అద్వయతాయాః అభిమానః = అద్వయతాభిమానః. తస్మాత్ = అద్వయతాఽభిమానాత్.

భావము :

దమయన్తియొక్క చెవ్వు కన్ను పెదవి బాహువు చేయి కాలు మున్నగు నొక్కొక్కయవయము, తమకు సాటి యనఁబడు చక్కిలము, కమలము మున్నగు నుపమానవస్తువులను జయించి తమ కీ లోకమున రెండవది (సాటియైనది) లేదను గర్వమును వహించినది. ఈ గర్వమును బ్రహ్మ సహింపనోపక యీ కర్ణాద్యవయవములకు సాటిగా కొన్ని యుపమాన వస్తువులు కల వని తెలియుటకై, రెండవ కర్ణమును కన్నును పెదవిని,

బాహువును, హస్తమును పాదమును సృజించెను. అనగా నామెయొక్క యవయవము లొండొంటితోఁ బోలినవే గాని వానికంటె వేఱైనవి వానికి సాటి గాదని యాశయము ॥౧౦౨॥

శ్లో॥ తుషారనిః శేషితమబ్జసర్గం
విధాతుకామస్య పునర్విధాతుః ।
పఞ్చస్విహాస్యాఙ్ఘ్రికరేష్వభిఖ్యా
భిక్షాధునా మాధుకరీసదృక్షా॥ ౧౦౩

ప॥వి॥ తుషారనిఃశేషితమ్ । అబ్జసర్గం । విధాతుకామస్య । పునః । విధాతుః । పఞ్చసు । ఇహ । ఆస్యా ఙ్ఘ్రికరేషు । అభిఖ్యాభిక్షా । అధునా । మాధుకరీసదృక్షా.

టీక॥ తుషారనిఃశేషితమ్; తుషార = మంచుచే, నిఃశేషితం = శేషములేక నాశముగావింపఁబడిన, అబ్జసర్గం = పద్మసృష్టిని, పునః = మఱల, విధాతుకామస్య = సృజింపఁగోరిన, విధాతుః = బ్రహ్మకు, అధునా = ఇప్పుడు, ఇహ = ఈదమయన్తియందు, పఞ్చసు = అయిదైన, ఆస్యాఙ్ఘ్రికరేషు: ఆస్య = మోము, అఙ్ఘ్రి = రెండుపాదములు, కరేషు = రెండుచేతులయందు, అభిఖ్యాభిక్షా; అభిఖ్యా = శోభను, భిక్షా = యాచించుట, మాధుకరీసదృక్షా = పఞ్చభిక్షయనిచెప్పఁబడు మధుకరవృత్తితో సమానముగా (వర్తతే = ఉన్నది.)

సమాసములు:

తుషారనిఃశేషితమ్ : తుషారేణ నిఃశేషితః = తుషారనిఃశేషితః. తమ్ = తుషారనిఃశేషితమ్.

అబ్జసర్గం : అబ్జానాం సర్గః = అబ్జసర్గః. తమ్ = అబ్జసర్గమ్.

విధాతుకామస్య : విధాతుం కామః యస్య సః = విధాతుకామః. తస్య = విధాతుకామస్య.

ఆస్యాఙ్ఘ్రికరేషు : ఆస్యం చ అఙ్ఘ్రీ చ కరౌచ = ఆస్యాఙ్ఘ్రికరాః. తేషు = ఆస్యాఙ్ఘ్రికరేషు.

అభిఖ్యాభిక్షా : అభిఖ్యాయాః భిక్షా = అభిఖ్యాభిక్షా.

మాధుకరీసదృక్షా : మధుకరాణామియం = మాధుకరీ. మాధుకర్యాః సదృక్షా = మాధుకరీసదృక్షా.

భావము :

మంచువలన పద్మములు నశించిపోయినవి. మఱల నా పద్మములను సృజింపఁదలచిన బ్రహ్మ, ఆసృష్టికిఁ గావలసిన సౌన్దర్య సాధనములను దమయన్తియొక్క ఐదు అవయవములయందు అనగా మోము, రెండు పాదములు, రెండుచేతులు, అను నవయవములయందు మాధుకర మనెడి భిక్షమువంటి భిక్షము నెత్తవలసివచ్చెను. మధుకరము లొక్కొక్క పుష్పము నుండి మధుబిందువులను సేకరించువిధమున, బ్రహ్మచారులైదు గృహముల నుండి యన్నమును యాచించుకొని వృత్తిఁ జేసికొనుచు విద్య నేర్చుట సమ్ప్రదాయము. మధుకరముల వృత్తివంటి వృత్తి కాన నది మాధుకరవృత్తి యని చెప్పఁబడును. ఇచ్చట బ్రహ్మగూడ పఞ్చగృహముల యందు బ్రహ్మచారులవలెతాను దమయన్తి యొక్క పఞ్చాఽవయవముల యందు సౌన్దర్యభిక్ష జేసి పద్మములను సృజింపఁగల్గెను. ఈమెయొక్క మోము మున్నగు పఞ్చావయవముల యందున్న సౌన్దర్యము పద్మమునందు లేదని యాశయము ॥౧౦౩

శ్లో॥ ఏష్యన్తి యావద్గణనాద్దిగన్తా
న్నృపాః స్మరార్తాః శరణే ప్రవేష్టుమ్।
ఇమే పదాబ్జే విధినాఽపి సృష్టా
స్తావత్య ఏవాఽంగులయోఽత్ర రేఖాః॥ ౧౦౪

ప॥వి॥ ఏష్యన్తి । యావద్గణనాత్ । దిగన్తాత్ । నృపాః । స్మరార్తాః । శరణే । ప్రవేష్టుమ్ । ఇమే । పదాబ్జే । విధినా । అపి । సృష్టాః । తావత్యః । ఏవ । అంగులయః । అత్ర । రేఖాః.

టీక॥ స్మరార్తాః; స్మర = మన్మథునిచే, ఆర్తాః = పీడింపఁబడిన, నృపాః = రాజులు, ఇమే = ఈదమయన్తికిసంబంధించిన, పదాబ్జే = పాదపద్మము

లను, శరణే=రక్షకములనుగా, ప్రవేష్టుం =ప్రవేశించుటకు, యావద్గ ణనాత్ =ఎంతసంఖ్యకల, దిగన్తాత్ =దిక్ప్రదేశములనుండి, ఏష్యన్తి= వత్తురో, అత్ర =ఈపాదపద్మములయందు, తావత్యఏవ =అంతసంఖ్య యేగల్గిన, అంగులయః =వ్రేళ్లనెడి, రేఖాః =గీతలు, సృష్టాః =సృజిం పఁబడినవి.

వి॥ దమయన్తియొక్క పది వ్రేళ్లను, స్వయంవరమునకై విచ్చేయు రాజుల పది దిక్కులను సూచించు రేఖలు కాకపోయినను, అట్టిరేఖలుగా భావిం పఁబడుటవలన నుత్ప్రేక్ష.

సమాసములు :

యావద్గణనాత్ : యావన్తి గణనాయస్య సః=యావద్గణనః. తస్మాత్ =యావద్గణనాత్.

దిగన్తాత్ : దిశామన్తః=దిగన్తః. తస్మాత్=దిగన్తాత్.

స్మరార్తాః : స్మరేణ ఆర్తాః=స్మరార్తాః.

పదాబ్జే : పదే అబ్జే ఇవ=పదాబ్జే. తే=పదాబ్జే.

భావము :

కామపీడితులైన రాజులు శ్రీ దమయన్తి పాదపద్మములనుఁ శరణుఁ బొందుటకై ఎన్ని దిక్కుల నుండి విచ్చేయుదురో, ఆ దిక్కుల సంఖ్యను గల్గిన పదివ్రేళ్లనెడి రేఖలు సృజింపఁబడినవి. పది దిక్కులనుంటి రాజులు స్వయంవర మహోత్సవమునకై వచ్చి యీమెయొక్క పాదములను శరణుఁ బొందుదురు గాన, నా పది దిక్కుల సూచించు రేఖలుగ నామె పాదముల యందు పది వ్రేళ్లు సృజింపఁబడినవి ॥౧౦౪॥

శ్లో॥ ప్రియాసఖీభూతవతో ముదేదం
వ్యధాద్విధిః సాధుదశత్వమిన్దోః ।
ఏతత్పదచ్ఛద్మసరాగపద్మ
సౌభాగ్యభాగ్యం కథమన్యథా స్యాత్॥ ౧౦౫

ప॥వి॥ ప్రియాసఖీభూతవతః । ముదా । ఇదం । వ్యధాత్ । విధిః । సాధుదశత్వమ్ । ఇందోః । ఏతత్పదచ్ఛద్మసరాగపద్మసౌభాగ్యభాగ్యం । కథమ్ । అన్యథా । స్యాత్.

టీక॥ విధిః = బ్రహ్మ, ప్రియాసఖీభూతవతః; ప్రియా = ప్రియురాలైనదమయన్తికి, సఖీభూతవతః = మిత్రుఁడైన, ఇందోః = చంద్రునకు, ఇదం = ఈ, సాధుదశత్వం = మంచిదశనుఁగల్గియుండుటను, ముదా = సంతోషముతో, వ్యధాత్ = విధించెను. అన్యథా = లేనిచో, అస్య = ఈచంద్రునకు, ఏతత్పదచ్ఛద్మసరాగపద్మసౌభాగ్యభాగ్యం; ఏతత్ = ఈదమయన్తియొక్క, పద = పాదముయొక్క, ఛద్మ = నెపముగల్గిన, సరాగపద్మ = ఎఱ్ఱనిపద్మముయొక్క, సౌభాగ్య = సౌన్దర్యమందలి, భాగ్యం = భాగ్యము, కథం = ఎట్లు, స్యాత్ = అగును

ప్రియానఖీభూతవతః అను పాఠాన్తరము గూడ కలదు. ఆపక్షమున— విధిః = బ్రహ్మ, ముదా = స్వేచ్ఛతో, ప్రియనఖీభూతవతః; ప్రియా = ప్రియురాలైన దమయన్తికి, నఖీభూతవతః = గోర్లుగానుండుటను, ప్రాప్తవతః = పొందిన, ఇందోః = చంద్రునకు, ఇదం = ఈ, దశత్వం = పదిగానుండుటను, (పదిగోళ్లుగాన పదిగా నుండుటయనియర్థము) సాధు = లెస్సగా, వ్యధాత్ = చేసెను. లేదా సాధుదశత్వం = మంచి దశనుకల్గియుండుటను, వ్యధాత్ = చేసెను. అన్యథా = అట్లుకానిచో, అస్య = ఈచన్ద్రునకు, ఏతత్పదచ్ఛద్మసరాగ పద్మసౌభాగ్య భాగ్యం; ఏతత్ = ఈదమయన్తియొక్క, పద = పాదములయొక్క, ఛద్మ = నెపముగల్గిన, సరాగపద్మ = ఎఱ్ఱనిపద్మముయొక్క, సౌభాగ్య = సౌన్దర్యముయొక్క, భాగ్యం = ప్రాప్తి, కథం = ఎట్లు, స్యాత్ = అగును.

సమాసములు :

ప్రియాసఖీభూతవతః: ప్రియాయాః సఖా = ప్రియాసఖః. అప్రియాసఖః ప్రియాసఖః సమ్పద్యమానః భూతవాన్ = ప్రియాసఖీభూతవాన్. తస్య = ప్రియాసఖీభూతవతః.

సాధుదశత్వం : సాధ్వీ దశా యస్య సః = సాధుదశః = సాధుదశస్య భావః = సాధుదశత్వమ్. తత్ = సాధుదశత్వమ్.

ఏతత్పదచ్ఛద్మసరాగపద్మసౌభాగ్యభాగ్యమ్ : ఏతస్యాః పదం = ఏతత్పదం. ఏతత్పదస్య ఛద్మ యస్య తత్ = ఏతత్పదఛద్మ. రాగేణ సహితం = సరాగం. సరాగంచ తత్ పద్మం చ = సరాగపద్మం. ఏతత్పదచ్ఛద్మ చ తత్ సరాగపద్మం చ = ఏతత్పదచ్ఛద్మసరాగపద్మం. ఏతత్పదచ్ఛద్మసరాగపద్మే సౌభాగ్యం = ఏతత్పదచ్ఛద్మశిసరాగపద్మసౌభాగ్యం. ఏతత్పదచ్ఛద్మసరాగపద్మసౌభాగ్యస్యభాగ్యమ్ = ఏతత్పదచ్ఛద్మసరాగపద్మసౌభాగ్యభాగ్యమ్. తత్ = ఏతత్పదచ్ఛద్మసరాగపద్మసౌభాగ్యభాగ్యమ్.

**భావము :**

బ్రహ్మ, దమయంతికిఁ జెలికాడుగా నైన చంద్రునకు మంచి దశనుఁ గల్పించెను, లేదా పది గోళ్లుఁగా చేసి పది యను సంఖ్యగాఁ గావించెను. అట్లు గావింపనిచో, నీ చంద్రునకు నీమెయొక్క పాదమను నెపము గల్గిన యెఱ్ఱ తామరపూవుయొక్క సౌన్దర్య మెట్లు అబ్బును? సహజముగా చన్ద్రోదయమున కమలము ముకుళించును గదా. కాన చన్ద్రునకు పద్మసౌభాగ్యమునుఁ బొందుట కవకాశ ముఁడదు. కాని యామె పాదములకు గోళ్లుగాఁ దానగుటవలనఁ దాను ఎఱ్ఱని కాన్తి గల పాద మను పద్మము ప్రక్కన నుండి యా పద్మకాంతి ననుభవింపఁగల్గెను. ఆమెకు గోళ్లగుటవలన సఖ్యమేర్పడి పద్మములు ముకుళింపక వికసితములుగానే యుండినవి. అందువలన పద్మశోభను చంద్రుఁడు పొందగల్గెను. అనగా నామెయొక్క కాలిగోళ్లు చంద్రునితోఁడను, నామె పాదము కమలముతోఁడను తుల్యములుగా నున్న వని భావము॥౧౦౫॥

శ్లో॥ యశ్శః పదాఙ్గుష్ఠనఖౌ ముఖం చ
బిభర్తి పూర్ణేన్దుచతుష్టయం యా।
కలాచతుఃషష్టిరుపైతు వాసం
తస్యాం కథం సుభ్రువి నామ నాస్యామ్॥ ౧౦౬

ప॥వి॥ యశ్శః । పదాఙ్గుష్ఠనఖౌ । ముఖం । చ । బిభర్తి । పూర్ణేన్దుచతుష్టయం । యా । కలాచతుఃషష్టిః । ఉపైతు । వాసం । తస్యాం । కథం । సుభ్రువి । నామ । న । అస్యామ్.

టీక॥ యా = ఏ దమయన్తి, యశః = కీర్తి, పదాఙ్గుష్ఠనఖౌ; పద = పాదము యొక్క, అఙ్గుష్ఠ = రెండుబొటన|వ్రేళ్లయొక్క, నఖౌ = గోళ్లు, ముఖంచ = ముఖము, అను పూర్ణేన్దుచతుష్టయం; పూర్ణేన్దు = పూర్ణచన్ద్రుల యొక్క, చతుష్టయం = నాల్గింటిని, బిభర్తి = ధరించుచున్నది. తస్యాం = ఆ, సుభ్రువి = సుందరియందు, కలాచతుఃషష్టిః, కలా = పదునారుకళలయొక్కయు, (విద్యలయొక్కయు) చతుఃషష్టిః = అరువదినాలుగు, వాసం = నివాసమును, కథంనామ = ఎట్లు, నోపైతు = పొందదు?

## సమాసములు :

పదాఙ్గుష్ఠనఖౌ : పదస్య అఙ్గుష్ఠౌ = పదాఙ్గుష్ఠౌ. పదాఙ్గుష్ఠయోః, నఖౌ = పదాఙ్గుష్ఠనఖౌ.

పూర్ణేన్దుచతుష్టయం : పూర్ణాశ్చ తే ఇన్దవశ్చ = పూర్ణేన్దవః. పూర్ణేన్దూనాం చతుష్టయం = పూర్ణేన్దుచతుష్టయమ్. తత్ = పూర్ణేన్దుచతుష్టయమ్.

కలాచతుఃషష్టిః : చతురుత్తరా షష్టిః = చతుఃషష్టిః. కలానాం చతుఃషష్టిః = కలాచతుఃషష్టిః.

సుభ్రువి: శోభనే భ్రువౌ యస్యాస్సా = సుభ్రూః. తస్యాం = సుభ్రువి.

## భావము :

ఆదమయన్తి కీర్తి, రెండు కాలిబొటన|వ్రేలిగోళ్లు, ముఖము, అను, నాల్గు పూర్ణచంద్రులను, తనయందు ధరించుచున్నది. ప్రతిచన్ద్రునకు పదునారు కళలుండుటవలన నలుగురు చన్ద్రులకును కలసి యరువదినాలుగు కళలు (విద్యలు) ఆమెయందు నివాసముఁజేయుచున్నవి ॥౧౦౬॥

శ్లో॥ సృష్టాతివిశ్వా విధినైవ తావ
త్తస్యాపి నీతోపరి యౌవనేన।
వైదగ్ధ్యమధ్యాప్య మనోభువేయ
మవాపితా వాక్పథపారమేవ ॥ ౧౦౭

ప॥వి॥ సృష్టా । అతివిశ్వా । విధినా । ఏవ । తావత్ । తస్య । అపి । నీతా । ఉపరి । యౌవనేన । వైదగ్ధ్యమ్ । అధ్యాప్య । మనోభువా । ఇయమ్ । అవాపితా । వాక్పథపారమ్ । ఏవ ।

టీక॥ ఇయంతావత్ = ఈదమయన్తి, (తొలుత) విధినైవ = బ్రహ్మచేతనే, అతివిశ్వా = విశ్వము నతిక్రమించినదిగా, అనగా విశ్వాతిశాయినిగా, సృష్టా = సృజింపఁబడినది, (అథ = పిదప), యౌవనేన = యౌవనముచే, తస్యాఽపి = ఆవిశ్వాతిశయమునకు, ఉపరి = పైన, నీతా = పొందింపఁబడినది. అథ = పిదప, మనోభువా = మన్మథునిచే, వైదగ్ధ్యం = నేర్పును, ప్రాగల్భ్యమును, అధ్యాప్య = నెర్పఁబడి, వాక్పథపారమేవ; వాక్పథ = వాఙ్మార్గముయొక్క, పారమేవ = ఆవలి గట్టునే, అవాపితా = పొందింపఁబడినది.

వి॥ ఇచ్చట దమయన్తి కొక్కతెకే, విధి, యౌవన, మన్మథులతో, విశ్వాతిశాయిత్వాది ధర్మసంబంధములు చెప్పుటవలన పర్యాయాలఙ్కారము.

సమాసములు :

అతివిశ్వా : విశ్వమతిక్రాన్తా = అతివిశ్వా.

వాక్పథపారమ్ : వాచాం పన్థాః = వాక్పథః. వాక్పథస్య పారం = వాక్పథపారమ్. తత్ = వాక్పథపారమ్.

భావము :

ఈ దమయన్తి బ్రహ్మచేతనే విశ్వము నతిశయించినదిగ సృజింపఁబడినది. తర్వాత యౌవనముచేత నింకను దానిని మించి సృజింపఁబడినది. తర్వాత మన్మథునిచే, నేర్పునందును, ప్రాగల్భ్యమునందును శిక్షణపొంది, వాక్కుచేతను మనస్సుచేతను వర్ణింప శక్యముగానిదిగ జేయఁబడినది ॥౧౦౭॥

శ్లో॥ ఇతి స చికురాదారభ్యైతాంనఖావధి వర్ణయన్
హరిణరమణీనేత్రాం చిత్రామ్ముదా తరదన్తరః।

హృదయభరణోద్వేలానన్దః సఖీవృతభీమజా
నయనవిషయీభావే భావం దధార ధరాధిపః॥ ౧౦౮

ప॥వి॥ ఇతి । సః । చికురాత్ । ఆరభ్య । ఏతాం । నఖావధి । వర్ణయన్ । హరిణరమణీనేత్రాం । చిత్రామ్బుధౌ । తరదన్తరః । హృదయభరణోద్వేలానన్దః । సఖీవృతభీమజానయనవిషయీభావే । భావం । దధార । నరాధిపః.

టీక॥ ఇతి = ఇట్లు, సః = ఆ, ధరాధిపః = నలమహారాజు, హరిణరమణీనేత్రాం; హరిణరమణీ = ఆడుజింకయొక్క, నేత్రాం = నేత్రములవంటి నేత్రములు గల్గిన, ఏతాం = ఈ దమయన్తిని, చికురాత్ = కేశపాశమును, ఆరభ్య = మొదలిడి, నఖావధి = గోళ్లవఱకును, వర్ణయన్ = వర్ణించుచు, చిత్రామ్బుధౌ = ఆశ్చర్యసాగరమందు, తరదన్తరః; తరత్ = తేలుచున్న, అన్తరః = అన్తరఙ్గముగలవాడై, (తథా = అట్లే) హృదయభరణోద్వేలానన్దః; హృదయ = హృదయమందు, భరణ = నిండుటవలన, ఉద్వేల = ఎల్లలేని, ఆనన్దః = సంతోషముగలవాడై, సఖీవృతభీమజానయనవిషయీ భావే; సఖీవృత = చెలికత్తెలతోఁగూడిన, భీమజా = దమయన్తియొక్క, నయనవిషయీభావే = నేత్రములకు కానవచ్చు విషయమున, భావం = అభిప్రాయమును, అనగా, కోరికను, దధార = ధరించెను.

## సమాసములు :

*నఖావధి* : నఖః అవధిః యస్మిన్ కర్మణి తత్ = నఖావధి.

*హరిణరమణీనేత్రాం* : హరిణస్య రమణీ = హరిణరమణీ. హరిణరమణ్యాః నేత్రే ఇవ నేత్రే యస్యాస్సా = హరిణరమణీ నేత్రా. తామ్ = హరిణరమణీనేత్రామ్.

*చిత్రామ్బుధౌ* : చిత్రస్య అమ్బుధిః = చిత్రామ్బుధిః. తస్మిన్ = చిత్రామ్బుధౌ.

*తరదన్తరః* : తరత్ అన్తరం యస్య సః = తరదన్తరః.

*హృదయభరణోద్వేలానన్దః* : హృదయస్య భరణం = హృదయభర

ణమ్. ఉద్గతా వేలా యస్య సః = ఉద్వేలః. ఉద్వేలశ్చాసౌ ఆనన్దశ్చ = ఉద్వేలానన్దః. హృదయ భరణేన ఉద్వేలానన్దః యస్యసః = హృదయభరణోద్వేలానన్దః.

*సఖీవృతభీమజానయనవిషయీభావే :* సఖీభిః వృతా = సఖీవృతా. సఖీవృతా చ సా భీమజా చ = సఖీవృతభీమజా. సఖీవృతభీమజాయాః నయనే = సఖీవృత భీమజానయనే. అవిషయస్య విషయస్య భావః = విషయీభావః. సఖీవృతభీమజానయనయోః విషయీభావః = సఖీవృతభీమజానయనవిషయీభావః. తస్మిన్ = సఖీవృత భీమజానయనవిషయీభావే.

*ధరాధిపః :* ధరాయాః అధిపః = ధరాధిపః.

**భావము :**

ఈ విధముగా నలమహారాజు, కేశాదినఖాన్తము దమయన్తిని వర్ణించుచు, నాశ్చర్యసాగరమున మునుగుచు, హృదయమందు నెల్ల లేని యానందమును వహించి, చెలికత్తెలతోఁ గూడిన దమయన్తికి కనబడుటకై యిచ్చగించెను. ॥౧౦౮॥

శ్లో॥ శ్రీహర్షం కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః సుతం
శ్రీహీరః సుషువే జితేన్ద్రియచయం మామల్లదేవీ చ యం।
గౌడోర్వీశకులప్రశస్తిభణితిభ్రాతర్యయం తన్మహా
కావ్యే చారుణి నైషధీయచరితే సర్గోఽగమత్సప్తమః॥ ౧౦౯

ప॥వి॥ శ్రీహర్షం । కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః । సుతం । శ్రీహీరః । సుషువే । జితేన్ద్రియచయం । మామల్లదేవీ । చ । యం । గౌడోర్వీశకులప్రశస్తిభణితి భ్రాతరి । అయం । తన్మహాకావ్యే । చారుణి । నైషధీయచరితే । సర్గః । అగమత్ । సప్తమః ।

టీక॥ కవిరాజరాజమకుటాలఙ్కారహీరః; కవిరాజ = కవిశ్రేష్ఠులయొక్క, రాజి = పఙ్క్తికి, మకుట = కిరీటమువంటివారికి, అలఙ్కార = భూషణమైన, హీరః = వజ్రమణి యగు, శ్రీహీరః = హీరుఁడను (విద్వాన్ = విద్వాంసుడు) శ్రీహర్షం = శ్రీహర్షుఁడనుపేరుగల, సుతం = పుత్రుని, సుషువే = ఉత్పత్తిఁగావించెనో, మామల్లదేవీచ = మామల్లదేవియను తల్లియు, సుషువే = కనెనో, గౌడోర్వీశకుల ప్రశస్తి భణితిభ్రాతరి; గౌడోర్వీశకులప్రశస్తిభణితి = గౌడోర్వీశకుల ప్రశస్తి భణితియను కావ్యమునకు, భ్రాతరి = సోదరమైన, తన్మహాకావ్యే; తత్ = ఆశ్రీహర్షునియొక్క, మహాకావ్యే = మహాకావ్యమును, చారుణి = రమ్యమునగు. నైషధీయచరితే = నైషధీయచరితమునందు, సప్తమః = ఏడవదైన, సర్గః = సర్గ, అగిమత్ = కడచినది. (సమాప్తిఁజెందినది).

## సమాసములు :

*కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః* : కవీనాం రాజానః = కవిరాజాః. కవిరాజానాం రాజిః = కవిరాజరాజిః. కవిరాజరాజేః మకుటాని = కవిరాజరాజిమకుటాని. కవిరాజరాజిమకుటేషు అలఙ్కారః = కవిరాజరాజిమకుటాలఙ్కారః. కవిరాజరాజిమకుటాలఙ్కారశ్చాసౌ హీరశ్చ = కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః

*జితేన్ద్రియచయం* : ఇన్ద్రియాణాం చయః = ఇన్ద్రియచయః. జితః ఇన్ద్రియచయః యేన సః = జితేన్ద్రియచయః. తమ్ = జితేన్ద్రియచయమ్.

*గౌడోర్వీశకులప్రశస్తిభణితిభ్రాతరి* : గౌడోర్వీశకుల ప్రశస్తిభణితేః భ్రాతా = గౌడోర్వీశకులప్రశస్తిభణితిభ్రాతా. తస్మిన్ = గౌడోర్వీశకులప్రశస్తి భణితిభ్రాతరి.

*తన్మహాకావ్యే* : తస్య మహాకావ్యం = తన్మహాకావ్యం. తస్మిన్ = తన్మహాకావ్యే.

## భావము :

కవిశ్రేష్ఠుల వరుసలో శ్రేష్ఠులై కిరీటస్థానమందున్న కవులకు నలఙ్కారమైన వజ్రమణి యగు శ్రీహీరుఁడును, మామల్లదేవియు జితేన్ద్రియుఁడైన శ్రీ

హర్షునిఁ గనిరి. "గౌడోర్వీశకులప్రశస్తిభణితి" యను కావ్యమునకు సోదర మైన యాతని మహాకావ్య మగు నైషధీయ చరితమునందు నేడవ సర్గ పరిసమాప్తి నొందినది.

ఇతి

శ్రీ మదాత్రేయగోత్ర శ్రీమదుడాలి నృసింహశాస్త్రితనూజ విక్రమ
సింహపురీవేదసంస్కృత కళాశాలా ప్రధానోపాధ్యాయ
శ్రీ సుబ్బరామశాస్త్రి
విరచితమగు
నైషదాంధ్ర వ్యాఖ్యానమునకు
సప్తమసర్గ
సమాప్తము.

# శ్రీ హర్షనైషధము

## అష్టమసర్గః

శ్లో॥ అథాద్భుతేనాऽస్తనిమేషముద్ర
మున్నిద్రరోమాణమముం యువానమ్।
దృశా పపుస్తాః సుదృశః సమస్తాః
సుతా చ భీమస్య మహీమఘోనః॥ ౧

ప॥వి॥ అథ । అద్భుతేన । అస్తనిమేషముద్రమ్ । ఉన్నిద్రరోమాణమ్ । అముం । యువానమ్ । దృశా । పపుః । తాః । సుదృశః।సమస్తాః । సుతా । చ । భీమస్య । మహీమఘోనః.

టీక॥ అథ = నలుఁడుప్రత్యక్షమైనపిదప, అద్భుతేన = ఆశ్చర్యకరమైన సన్నివేశముచే, అనగా దమయన్తినిఁగాంచుటవలని యాశ్చర్యముచే, అస్తనిమేషముద్రం; అస్త = విరమించిన, నిమేషముద్రం = కనులు మూయుట యనుబంధముగల్గిన, ఉన్నిద్రరోమాణం; ఉన్నిద్ర = నిక్కుకొనిన, రోమాణం = పులకములు గల్గిన, యువానం = యువకుఁడైన, అముం = ఈనలుని, అద్భుతేన = నలునిఁజూచుట వలని విస్మయముచే, అస్తనిమేషముద్రాః; అస్త = విరతములైన, నిమేష = కనుమోడ్పులయొక్క, ముద్రాః = బంధములు గల, ఉన్నిద్ర రోమాణః; ఉన్నిద్ర = నిక్కుకొనిన, రోమాణః = పులకములుగల, యువతయః = యువతులైన, తాః = ఆ సభాసదులైన, సమస్తాః = సకలురైన, సుదృశః = స్త్రీలు, దృశా = నేత్రములతో, పపుః = మిక్కిలి యాశతోఁజూచిరి (తథా = అట్లే) మహీమఘోనః = భూమికిదేవేంద్రుఁడైన,భీమస్య = భీమరాజుయొక్క, సుతాచ = పుత్రికయైన, యువతియు, అనగాదమయన్తియు, తం = ఆనలుని, దృశా = నేత్రములతో, పపౌ = మిక్కిలియాశతోఁజూచెను.

**సమాసములు :**

అస్తనిమేషముద్రమ్ : నిమేషాణాం ముద్రా = నిమేషముద్రా. అస్తా నిమేషముద్రా యస్య సః = అస్తనిమేషముద్రః. తమ్ = అస్తనిమేషముద్రమ్.

ఉన్నిద్రరోమాణమ్ : ఉద్గతా నిద్రా యేభ్యస్తాని ఉన్నిద్రాణి. ఉన్నిద్రాణి రోమాణి యస్య సః = ఉన్నిద్రరోమా. తం = ఉన్నిద్రరోమాణమ్,

మహీమఘోనః : మహ్యాః మఘవా = మహీమఘవా. తస్య = మహీమఘోనః.

**భావము :**

నలుఁడు ప్రత్యక్షము కాగనే దమయన్తినిఁగాంచుటచే కల్గిన విస్మయము వలన, ఱెప్పలను మూయక, నిక్కపొడుచుకొనిన పులకములు గల యువకుఁడైన నలుని; అతని సాక్షాత్కారముచేఁ గల్గిన విస్మయముతో, ఱెప్పలు వాల్చక, నిక్కపొడుచుకొనిన రోమాఞ్చములు గల సభాసదులగు యువతులందఱును తమ నేత్రములతో నాశ తీరునట్లు చూచిరి. ఆ విధముగనే గగుర్పాటు చెందిన దమయన్తియు తనివిదీర నలునిఁ గాంచినది ॥౧॥

శ్లో॥ కియచ్చిరం దైవతభాషితాని
నిహ్నోతుమేనం ప్రభవన్తు నామ।
పలాలజాలైః పిహితః స్వయం హి
ప్రకాశమాసాదయతీక్షుడిమ్భః॥ ౨

ప॥వి॥ కియత్ । చిరం । దైవతభాషితాని । నిహ్నోతుమ్ । ఏనం । ప్రభవన్తు । నామ । పలాలజాలైః । పిహితః । స్వయం । హి । ప్రకాశమ్ । ఆసాదయతి । ఇక్షుడిమ్భః ।

టీక॥ దైవతభాషితాని = దేవతలవచనములు, అనగా "నిట్లు దూత్యమును నిర్వహింపుము" అని ఇంద్రవాక్యములు, కియచ్చిరం = ఎంతకాలము, ఏనం = ఈనలుని నిహ్నోతుం = మఱుగుపఱచుటకు, ప్రభవన్తు, నామ = సమర్థములగును? హి = ఏలయనగా, పలాలజాలైః = వరి

మున్నగు తృణసమూహములచే,పిహితః = మూయఁబడిన, ఇక్షుడిమ్భః = చెఱకుమొలక, స్వయం = స్వయముగనే, ప్రకాశం = ప్రాదుర్భావమును, ఆసాదయతి = పొందించుకొనును.

వి॥ ఇచ్చట నలునకును చెఱకుమొకలకును బిమ్బప్రతిబిమ్బ భావముచే సమానధర్మమునుఁ జెప్పుట వలన దృష్టాన్తాలఙ్కారము.

సమాసములు :

*దైవతభాషితాని :* దైవతానాం భాషితాని = దైవతభాషితాని.

*పలాలజాలైః :* పలాలానాం జాలాని = పలాలజాలాని. తైః = పలాలజాలైః.

*ఇక్షుడిమ్భః :* ఇక్షోః డిమ్భః = ఇక్షుడిమ్భః.

భావము :

ఇన్ద్రాదిని వాక్యములు నలుని ఎంత కాలము దాచగలవు? వాస్తవములో దాచలేవు. చెఱకు మొలకగా నున్నప్పుడు దాని నెండనుండి కాపాడుటకై దాని పైన గడ్డిపోచలు కప్పఁబడును. అట్లుకప్పఁబడినను మొలక బలపడి తానుగనే వెలుపలికి వచ్చుచున్నది గదా. అట్లే, గాఢరాగము గల కాముకునియొక్క వికారము గూడ దాచిపెట్టశక్యము గాదు గదా.కావున నలు డిన్ద్రాదుల వాక్యముల నతిక్రమించి యా దమయన్తి మున్నగువారికి నగుపడఁ దొడగెను. ॥౨॥

శ్లో॥ అపాఙ్గమప్యాప దృశోర్న రశ్మి
ర్నలస్య భైమీమభిలష్య యావత్।
స్మరాశుగః సుభ్రువి తావదస్యాం
ప్రత్యఙ్గమాపుఙ్ఖశిఖం మమజ్జ॥ 3

ప॥వి॥ అపాఙ్గమ్ । అపి । ఆప । దృశోః । న । రశ్మిః । నలస్య । భైమీమ్ । అభిలష్య । యావత్ । స్మరాశుగః । సుభ్రువి । తావత్ । అస్యాం । ప్రత్యఙ్గమ్ । ఆపుఙ్ఖశిఖం । మమజ్జ.

టీక॥ (అస్య) = ఈ, నలస్య = నలునియొక్క, దృశోః = నేత్రములయొక్క, రశ్మిః = కిరణము, భైమీం = దమయన్తిని, అభిలష్య = అపేక్షించి, యావత్ = ఎంతలో, అపాఙ్గమపి = కడకన్నునుఁగూడ, నాఽఽప = పొందలేదో, తావత్ = అంతలో, స్మరాశుగః = మన్మథునిబాణము, అస్యాం = ఈ, సుభ్రువి = దమయన్తియందు, ప్రత్యఙ్గం = ఒక్కొక్క యవయవమునందు, ఆపుఙ్ఖశిఖం = మూలమునుండి కొనవరకును, మమజ్జ = నాటుకొనినది.

## సమాసములు :

*స్మరాశుగః* : స్మరస్య ఆశుగః = స్మరాశుగః.

*ప్రత్యఙ్గం* : అఙ్గే అఙ్గే = ప్రత్యఙ్గమ్.

***ఆపుఙ్ఖశిఖం*** : పుఙ్ఖస్య శిఖా = పుఙ్ఖశిఖా. పుఙ్ఖశిఖామభివ్యాప్య = ఆపుఙ్ఖశిఖం.

## భావము :

నలునియొక్క నేత్రకిరణము దమయన్తి నభిలషించి యామె కడకన్నునుఁ బొందక మునుపే మన్మథబాణము, ఆ సుందరియొక్క యవయవములయం దంతట నామూలాగ్రము నాటుకొనినది. ॥3॥

శ్లో॥ యదక్రమం విక్రమశక్తిసామ్యా
దుపాచరద్ద్వావపి పఞ్చబాణః।
చక్రే న వైమత్యమముష్య కస్మాత్
బాణైరనర్ధార్ధవిభాగభాగ్భిః॥ ౪

ప॥వి॥ యత్ । అక్రమం । విక్రమశక్తిసామ్యాత్ । ఉపాచరత్ । ద్వౌ । అపి । పఞ్చబాణః । చక్రే । న । వైమత్యమ్ । అముష్య । కస్మాత్ । బాణైః । అనర్ధార్ధవిభాగభాగ్భిః.

టీక॥ పఞ్చబాణః = మన్మథుఁడు, ద్వావపి = ఇద్దఱైననలదమయన్తులను, అక్రమం = ఒక్కమాటే, విక్రమశక్తిసామ్యాత్; విక్రమ = పరాక్రమ

ముచేఁగల్గిన, శక్తి=శక్తియొక్క, సామ్యాత్ = సామ్యమునవలంబించి, లేదా, విక్రమ = మానసోత్సాహముయొక్కయు, శక్తి = శరీరబలము యొక్కయు, సామ్యాత్ = సమత్వమువలన, ఉపాచరత్ = విషమ సంఖ్యగలబాణములచే నేకకాలమందే యిద్దఱిని వైషమ్యములేక కొట్టెను. అనర్ధార్ధవిభాగభాగ్భిః; అర్ధము అర్ధము అను విభాగమును, అనగా సగము సగము విభాగమును పొందనటువంటి, అనగా సగముగా విభజింప వీలులేనటువంటి, బాణైః=బాణములచే, కస్మాత్ = ఎందు వలన, అముష్య = ఈ సమప్రహరణమునకు, అనగా సమముగా కొట్టుటకు. వైమత్యం=అసమ్మతి, అనగా సరిపడకపోవుట, నచక్రే= చేయఁబడలేదు, చిత్రం=ఆశ్చర్యము.

వి॥ అయిదు విషమసంఖ్య అనగా బేసి సంఖ్య. ఇట్టి విషమసంఖ్య గల బాణములచే నలుని దమయన్తిని స్మరుఁడు సమముగనే కొట్టె ననుట విరుద్ధము. కాన విరోధాభాసము. స్మరుఁడు తన మహిమవలన నట్లు చేయగల్గె ననుట పరిహారము.

## సమాసములు :

*విక్రమశక్తిసామ్యాత్* : విక్రమస్య శక్తిః = విక్రమశక్తిః. విక్రమ శక్తేః సామ్యమ్ = విక్రమశక్తిసామ్యం. తస్మాత్= విక్రమశక్తిసామ్యాత్. లేదా విక్రమశ్చ శక్తిశ్చ=విక్రమశక్తీ. విక్రమశక్త్యోః సామ్యం = విక్రమ శక్తిసామ్యం. తస్మాత్ =విక్రమశక్తిసామ్యాత్.

*పఞ్చబాణః* : పఞ్చ బాణాః యస్య సః=పఞ్చబాణః.

*అనర్ధార్ధవిభాగభాగ్భిః* : అర్ధం చ అర్ధం చ = అర్ధార్ధే. అర్ధార్ధే ఇతి విభాగః=అర్ధార్ధవిభాగః. అర్ధార్ధవిభాగం భజన్తీతి = అర్ధార్ధవిభాగభాజః. న అర్ధార్ధవిభాగభాజః = అనర్ధార్ధవిభాగభాజః. తైః = అనర్ధార్ధవిభాగభాగ్భిః.

## భావము :

పఞ్చబాణుఁడు నలుని దమయన్తిని తన విక్రమశక్తిచే నొక్కకాల మునసే తనబాణములచే సమముగా ప్రహరించెను. పఞ్చబాణములు బేసిసంఖ్య

గలవి గాన విభజింప శక్యములు గావు కావున నిరువురిపై నైదుబాణముల నొక్కకాలమునఁ బ్రయోగింప శక్యములు గావుగదా. ఆ బాణములు సరి సంఖ్య గలవైనచో అనగా నాల్గుసంఖ్యగలవైనచో, ఒక్కొక్కరిపై రెండు రెండు చొప్పునఁ బ్రయోగింపశక్యములు. కావున నాతని బాణములు, అర్ధాఽర్ధ విభాగమునుఁ బొందుట కనర్హములు. అట్లు అర్ధాఽర్ధ విభాగమునుఁ బొందజాలని యైదు బాణము లెట్లు ప్రయోగమునకు సరిపడినవో యాశ్చర్యకరముగా నున్నది. అనగా దమయన్తికిని నలునకు నొండొరులపై నొక్క కాలమునందే యనురాగ మేర్పడిన దని భావముః ॥౪॥

శ్లో॥ తస్మిన్నలోఽసావితి సాఽన్వరజ్యత్
క్షణం క్షణం క్వేహ స ఇత్యుదాస్త ।
పురః స్మ తస్యాం వలతేఽస్య చిత్తం
దూత్యాదనేనాథ పునర్న్యవర్తి॥ ౫

ప॥వి॥ తస్మిన్ । నలః । అసౌ । ఇతి । సా । అన్వరజ్యత్ । క్షణం । క్షణం । క్వ । ఇహ । సః । ఇతి । ఉదాస్త । పురః । స్మ । తస్యాం । వలతే । అస్య । చిత్తం । దూత్యాత్ । అనేన । అథ । పునః । న్యవర్తి.

టీక॥ సా = ఆదమయన్తి, తస్మిన్ = ఆపురుషునియందు, అసౌ = ఇతఁడు, నలఇతి = నలుఁడని తలంచి, క్షణం = కొద్దికాలము, అన్వరజ్యత్ = అనురక్తురాలాయెను. పురః = ఎదుట, సః = ఆనలుఁడు, ఇహ = ఇచ్చట, క్వ = ఎక్కడ, ఇతి = అనితలంచి, క్షణం = కొద్దికాలము, ఉదాస్త = ఉదాసీనురాలై యుండెను. అస్య = ఈనలునియొక్క, చిత్తం = మనస్సు, పురః = మొదట, తస్యాం = ఆ దమయన్తియందు, వలతేస్మ = చలించుచుండినది. పునః = మఱల, దూత్యాత్ = దూతకర్మవలన, నలేన = నలునిచే, న్యవర్తి = మఱలింపఁబడినది.

వి॥ "అన్వరజ్యత్" అని = అనురాగోదయముచే హర్ష మను భావము, 'ఉదాస్త' యని యౌదాసీన్యమును వహించుటచే విషాద మను భావము దమయన్తియం దేర్పడుటవలన, హర్ష విషాదముల సంధి కాన నిది దమయన్తియం దేర్పడిన భావ సంధి. నలుని చిత్తము "వలతేస్మ" అని

చలించినట్లు చెప్పుటవలన హర్షము, న్యవర్తి యని చిత్తమును మఱల్చుట వలన విషాదము అను రెండు భావములకు సంధి నలుని యందును నేర్పడినది.

**సమాసములు :**

దూత్యాత్ : దూతస్య కర్మ = దూత్యం. తస్మాత్ = దూత్యాత్.

**భావము :**

దమయన్తి యెదుట నున్న పురుషుని, నలుఁడని హంస చెప్పిన యానవాళ్ల ప్రకారము గ్రహించి క్షణకాల మతని యందనురక్తురాలాయెను. కాని అత డిక్కడ నెట్లు కనఁబడునని భావించి క్షణకాల ముదాసీనతను వహించినది. తొలుత నలుఁడని భావించుటచే హర్షము, తర్వాత నలు డిక్కడి కెట్లు వచ్చునను సందేహముచే విషాదముఁ బొందుటచే నామెయందు హర్షవిషాదభావముల సంధి యని భావింపవలయును. నలునకును తొలుత దమయన్తియందు మనస్సు లగ్నమైనది. తర్వాత దూత్య మను నీచకార్యమునం దున్న తన కిది తగదని తన మనస్సును మఱల్చుకొనెను. కాన నిచ్చట నలునికిని మనస్సు లగ్నమగుటవలన ననురాగము, అది తగనిదని భావించుటవలన విషాదము నేర్పడుటవలన నిచ్చటను భావసంధి యని భావింపవలయును. ఇట్లు భావసన్ధులుభయులయం దేర్పడిన నుభయులకును నొండొరులపై సంపూర్ణమైన యనురాగము మాత్రమేర్పడిన దని భావము॥౩॥

శ్లో॥ కయాచిదాలోక్య నలం లలజ్జే
కయాఽపి తద్భాసి హృదా మమజ్జే ।
తం కాపి మేనే స్మరమేవ కన్యా
భేజే మనోభూవశభూయమన్యా॥ ౬

ప॥వి॥ కయా । చిత్ । ఆలోక్య । నలం । లలజ్జే । కయా । అపి । తద్భాసి । హృదా । మమజ్జే । తం । కా । అపి । మేనే । స్మరమ్ । ఏవ । కన్యా । భేజే । మనోభూవశభూయమ్ । అన్యా.

టీక॥ కయాచిత్ = ఒకానొక, కన్యయా = కన్యకచే, నలం = నలుని, ఆలోక్య = చూచి, లలజ్జే = సిగ్గుపడుట (జరిగినది). కయాఽపి = మఱియొక

కన్యచే, తద్భాసి; తత్ = ఆతనియొక్క, భాసి = సౌనర్యమందు, హృదా = హృదయముచే, మమజ్జే = మునుఁగుట (జరిగినవి). కాపి = ఒకానొకకన్యక, తం = వానినిఅనగానలుని, స్మరమేవ = మన్మథునిగనే, మేనే = తలంచినది. అన్యా = మఱియొక్కతె, మనోభూవశభూయం; మనోభూ = మన్మథునకు, వశభూయం = వశత్వమును, భజే = పొందినది.

## సమాసములు :

*మనోభూవశభూయః:* మనసః భవతీతి = మనోభూః. వశస్య భావః = వశభూయం. మనోభువః వశభూయం = మనోభూవశభూయం.

## భావము :

ఒక కన్యక నలునిఁ జూచి సిగ్గుపడినది. మఱియొకతె తన మనస్సుచే నాతని సౌన్దర్యమునందు మునిగినది. ఇంకొకతె యా నలుని మన్మథునిగనే భావించినది. మఱియొకతె వానినిఁ జూచి మన్మథునికి వశమైనది. ॥౬॥

శ్లో॥ కస్త్వం కుతో వేతి న జాతు శేకు
స్తం ప్రష్టుమప్యప్రతిభాతిభారాత్।
ఉత్తస్థురభ్యుత్థితివాఞ్ఛయేవ
నిజాసనాన్నైకరసాః కృశాఙ్గ్యః ॥౭॥

ప॥వి॥ కః । త్వం । కుతః । వా । ఇతి । న । జాతు । శేకుః । తం । ప్రష్టుం । అపి । అప్రతిభాతిభారాత్ । ఉత్తస్థుః।అభ్యుత్థితివాఞ్ఛయా। ఇవ । నిజాసనాత్ । న । ఏకరసాః । కృశాఙ్గ్యః.

టీక॥ కృశాఙ్గ్యః = కృశించినయవయవములుగలస్త్రీలు, ఏకరసాః = ఏకమైన యాన్దరసపరవశులై, అప్రతిభాతిభారాత్; అప్రతిభా = స్ఫురణలేక పోవుట యొక్క, అతిభారాత్ = మిక్కిలిభారమువలన, తం = ఆనలుని, త్వం = నీవు, కః = ఎవ్వఁడవు? కుతోవా = ఎక్కడనుండి,(వచ్చితివి?)

ఇతి = అని, ప్రష్టుమపి = అడుగుటకును, జాతు = ఒకప్పుడును, నశేకుః = శక్తులుకాలేదు. (కిఞ్చ = మఱియు) అభ్యుత్థితి వాఞ్ఛయాఇవ; అభ్యుత్థితి = ప్రత్యుత్థానమునందలి, వాఞ్ఛయాఇవ = కోరికచేత నోయనునట్లు, ఉత్తస్థుః = లేచిరి, నిజాసనాత్ = తమఆసనమునుండి, నోత్తస్థుః = లేవకపోయిరి. అతని తేజోవిశేషమువలన హఠాత్తుగ శరీరముతో కాకపోయినను మనస్సుచేతనే లేవగలిగిరి.

సమాసములు :

*అప్రతిభాతిభారాత్* : నప్రతిభా = అప్రతిభా. అప్రతిభాయాః అతిభారః = అప్రతిభాతిభారః. తస్మాత్ = అప్రతిభాతిభారాత్.

అభ్యుత్థితివాఞ్ఛయా : అభ్యుత్థితేః వాఞ్ఛా = అభ్యుత్థితివాఞ్ఛా.

*నిజాసనాత్* : నిజం చ తత్ ఆసనం చ = నిజాసనం. తస్మాత్ = నిజాసనాత్.

*ఏకరసాః* : ఏకః రసః యాసాం తాః = ఏకరసాః.

*కృశాఙ్గ్యః* : కృశం అఙ్గం యాసాం తాః = కృశాఙ్గ్యః.

భావము :

ఆ సమయమునందు స్త్రీలు ఆనందపరవశులై యుండుటవలన నేమి చేయవలయునో స్ఫురించుకొనలేక "నీవెవ్వడవు? ఎందుండిక్కడికేగితివి?," అని ప్రశ్నింప నశక్తులైరి. మఱియు నభ్యుత్థానముఁజేయవలయు నను కోరికతో లేచిరి కాని తమ యాసనములనుండి లేవలేకపోయిరి. అనగా నతని తేజోవిశేషముచే హఠాత్తుగా మనస్సుచేతనే లేచిరి కాని శరీరముచే లేవఁజాలకపోయిరి.॥౭॥

శ్లో॥ స్వాచ్ఛన్ద్యమానన్దపరమ్పరాణాం
భైమీతమాలోక్య కిమప్యవాప।
మహారయం నిర్ఝరిణీవ వారా
మాసాద్య ధారాధరకేలికాలమ్॥ ౮

ప॥వి॥ స్వాచ్ఛన్ద్యమ్ । ఆనన్దపరమ్పరాణాం । భైమీ । తమ్ । ఆలోక్య । కిమ్ । అపి । అవాప । మహారయం । నిర్ఝరిణీ । ఇవ । వారామ్ । ఆసాద్య । ధారాధరకేలికాలమ్.

టీక॥ భైమీ = దమయన్తి, తమ్ = ఆనలుని, ఆలోక్య = చూచి, కిమపి = చెప్పశక్యముకాని, ఆనన్దపరమ్పరాణాం = ఆనన్దపరమ్పరలయొక్క, స్వాచ్ఛన్ద్యం = ఉచ్ఛృఙ్ఖలత్వమును, నిర్ఝరణీ = పర్వతనది, ధారాధర కేళికాలమ్; ధారాధర = మేఘములకు, కేళికాలమ్ = క్రీడాకాలమైనవర్ష సమయమును, ఆసాద్య = పొంది, వారాం = ఉదకములయొక్క, మహా రయమివ = గొప్పవేగమునువలె, ఆప = పొందినది.

సమాసములు :

స్వాచ్ఛన్ద్యమ్ : స్వచ్ఛన్దస్య భావః = స్వాచ్ఛన్ద్యమ్.

ఆనన్దపరమ్పరాణాం : ఆనన్దస్య పరమ్పరాః = ఆనన్దపరమ్పరాః. తాసామ్ = ఆనన్దపరమ్పరాణామ్.

ధారాధరకేలికాలమ్ : ధారాధరణాం కేలిః = ధారాధరకేలిః. ధారాధరకేలేః కాలః = ధారాధరకేలికాలః. తమ్ = ధారాధరకేలికాలమ్.

భావము :

ఆ దమయన్తి నలునిఁ జూచి, యడ్డు లేని యానన్దపరమ్పరను; సెలయేఱు వర్షకాలమున నీటివేగమునుఁ బొందినట్లు పొందినది. ॥౮॥

శ్లో॥ తత్రైవ మగ్నా యదపశ్యదగ్రే
నాస్యా దృగస్యాఙ్గమయాస్యదన్యత్।
నాఽదాస్య దస్యై యది బుద్ధిధారాం
విచ్ఛిద్య విచ్ఛిద్య చిరాన్నిమేషః॥ ౯

ప॥వి॥ తత్ర । ఏవ । మగ్నా । యత్ । అపశ్యత్ । అగ్రే । న । అస్యాః । దృక్ । అస్య । అఙ్గమ్ । అయాస్యత్ । అన్యత్ । న । అదాస్యత్ । అస్యై । యది । బుద్ధిధారాం । విచ్ఛిద్య । విచ్ఛిద్య । చిరాత్ । నిమేషః ।

టీక॥ అస్యాః = ఈదమయన్తియొక్క, దృక్ = దృష్టి, అస్య = ఈనలుని యొక్క, యత్ = ఏ, అఙ్గం = అవయవమును, అగ్రే = మొదట, అపశ్యత్ = చూచెనో, తత్రైవ = ఆయవయవమునందే, మగ్నాసతీ = నాటుకొనినదై, అన్యత్ = వేఱైన, అఙ్గం = అవయవమును, నాఽయాస్యత్ = పొందియుండదు, నిమేషః = ఱెప్పపాటు, చిరాత్ = చాలకాలము, విచ్ఛిద్య విచ్ఛిద్య = విరమించి విరమించి, బుద్ధిధారాం = జ్ఞానధారను, అస్యై = ఈదృష్టికి, నాఽదాస్యత్ = ఈయకయున్నచో, జ్ఞానధారను రెప్పపాటు ఇచ్చినందువలననే యొక యవయవమందు నాటుకొనిన దమయన్తి దృష్టి మఱియొక యవయవమునకు మఱలినది.

భావము :

దమయన్తి దృష్టి తొలుత నలునియొక్క యే యవయవముపై నాటుకొనినదో, దానియందే లగ్నమై పోయినది. కాని చాలకాలము వరకును, ఆగి, ఆగి ఱెప్పపాటు దృష్టికి జ్ఞానము నిచ్చుటవలన నా దృష్టి మఱియొక యవయవము వైపు మరలినది. కాని మఱి యొక యవయవమునుఁ జూడవలయు నను కోరికతో దృష్టి మఱలలేదు. ఏల యనగా ఆ తొలుతచూచిన యవయము నెంత చూచినను తనివితీరలేదు. ఎందువలననగా నది మిక్కిలి యందమై యున్నది. ఇట్లు, ఒక యఙ్గమునందే యింత తడవైనచో తక్కిన యఙ్గములనుఁ జూచుట కెంత తడ వేర్పడునో చెప్ప శక్యముగాదు. అనగా నలుని యొక్కొక్క యవయవము మిక్కిలి సౌన్దర్యయుక్తము లని భావము॥౯॥

శ్లో॥ దృశాఽపి సాఽలిఙ్గితమఙ్గమస్య
జగ్రాహ నాగ్రావగతాఙ్గహర్షైః।
అఙ్గాన్తరేఽనన్తరమీక్షితే తు
నివృత్య సస్మార న పూర్వదృష్టమ్॥ ౧౦

ప॥వి॥ దృశా । అపి । సా । ఆలిఙ్గితం । అఙ్గమ్ । అస్య । జగ్రాహ । న । అగ్రావగతాఙ్గహర్షైః । అఙ్గాన్తరే । అనన్తరమ్ । ఈక్షితే । తు । నివృత్య । సస్మార । న । పూర్వదృష్టమ్.

టీక॥ సా = ఆదమయన్తి, దృశా = దృష్టిచే, ఆలిఙ్గితం = కౌగలింపఁబడిన అనగాపొందబడిన, అస్య = ఈనలునియొక్క, అఙ్గం = మఱియొక యఙ్గమును, అగ్రావగతాఙ్గహర్షైః; అగ్ర = తొలుత, అవగత = గ్రహింపఁబడిన, అఙ్గ = అవయవమువలని, హర్షైః = సంతోషముతో, నజగ్రాహ = తెలిసికొనలేదు. అఙ్గాన్తరే = మఱియొకయవయవము, అనన్తరం = పిదప, ఈక్షితేసతి = ఎట్లనోచూపఁబడఁగా, నివృత్య = మఱలి, పూర్వదృష్టమ్ = ముందుఁజూడఁబడిన అవయవమును, ననస్మార = స్మరించలేదు.

**సమాసములు:**

**అగ్రావగతాఙ్గహర్షైః** : అగ్రే అవగతం = అగ్రావగతం. అగ్రావగతం చ తత్ అఙ్గం చ = అగ్రావగతాఙ్గం. అగ్రావగతాఙ్గేన హర్షాః = అగ్రావగతాఙ్గహర్షాః. తైః = అగ్రావగతాఙ్గహర్షైః.

అఙ్గాన్తరే : అన్యత్ అఙ్గం అఙ్గాన్తరం తస్మిన్. అఙ్గాన్తరే.

పూర్వదృష్టమ్ : పూర్వం దృష్టం = పూర్వదృష్టమ్.

**భావము :**

ఆ దమయన్తి తన కంటికి అనిన నలునియొక్క మఱియొక యవయవమును, తొలుతఁ జూచిన యవయవము వలనఁ గల్గిన హర్షాతిశయముచే గ్రహింపలేదు. ఒక వేళ యాయవయవమును గ్రహించినను మఱల ముందుఁ జూచిన యవయవమును స్మరించలేదు. అతని యొక్క యొక్కొక్క యవయవము, ఒక్కొక్కదానికంటెను మిక్కిలి రమ్యముగా నుండుటవలన నా యవయవమును మిక్కిలి యాసక్తిచేఁ జూచుటవలన మఱియొక యవయవము దృష్టికిఁ దగిలినను గ్రహింపఁబడకపోవుటయు నట్లు గ్రహించినను దాని యందలి యాసక్తిచే తొలుత గ్రహించిన యవయవమును మఱచుటయు సంభవించినది. అనగా నలుని యవయవము లన్నియు లోకోత్తర సౌన్దర్యము గల్గి యున్నవని యాశయము. ॥౧౦॥

శ్లో॥ హిత్వైకమస్యాపఘనం విశన్తి
తద్దృష్టిరఙ్గాన్తరభుక్తిసీమామ్।

చిరం చకారోభయలాభలోభాత్
స్వభావలోలాగతమాగతం చ ॥ ౧౧

ప॥వి॥ హిత్వా । ఏకమ్ । అస్య । అపఘనం । విశన్తీ । తద్దృష్టిః । అఙ్గాన్తర భుక్తిసీమామ్ । చిరం । చకార । ఉభయలాభలోభాత్ । స్వభావలోలా । గతమ్ । ఆగతం । చ.

టీక॥ స్వభావలోలా; స్వభావ = స్వభావముచే, లోలా = చఞ్చలమైన, తద్దృష్టిః; తత్=ఆదమయన్తియొక్క, దృష్టిః =దృష్టి, అస్య = ఈ నలునియొక్క, ఏకం = ఒకటైన, అపఘనం = అవయవమును, హిత్వా=వదలి, అఙ్గాన్తరభుక్తిసీమామ్; అఙ్గాన్తర = మఱియొకయవ యవముయొక్క, భుక్తి = అనుభోగము అనగా ఆలోకనముయొక్క, సీమాం=మర్యాదను, అనగాఎల్లను, విశన్తీ=ప్రవేశించుచు, ఆగగామఱి యొకయవయవమును చూచుచు, ఉభయలాభలోభాత్; ఉభయ = రెంటి యొక్క,లాభ=లాభమందు,లోభాత్=ఆశవలన, చిరం=చిరకాలము, గతం=పోకను, ఆగతంచ =రాకను, అనగారాకపోకలను, చకార = చేసినది.

సమాసములు:

తద్దృష్టిః : తస్యాః దృష్టిః=తద్దృష్టిః.

అఙ్గాన్తరభుక్తిసీమామ్ : అన్యత్ అఙ్గమ్ = అఙ్గాన్తరం. అఙ్గాన్తరస్య భుక్తిః=అఙ్గాన్తరభుక్తిః.అఙ్గాన్తరభుక్తేః సీమా=అఙ్గాన్తరభుక్తిసీమా.తామ్= అఙ్గాన్తరభుక్తిసీమామ్.

ఉభయలాభలోభాత్ : ఉభయస్య లాభః = ఉభయలాభః. ఉభయ లాభస్య లోభః=ఉభయలాభలోభః=తస్మాత్. ఉభయలాభలోభాత్.

స్వభావలోలా : స్వభావేన లోలా=స్వభావలోలా.

భావము :

ఆ దమయన్తి దృష్టి స్వభావముగనే చఞ్చలము. ఇక నిష్టమైన విషయ మును చూచునపు డెంత చఞ్చలమో చెప్పఁ బని లేదు. అట్టి దమయన్తియొక్క

దృష్టి నలునియొక్క యొక యవయవమును వదలి మఱి యొక్క యవ యవమును భోగించుట కనువైన స్థలమును పొందుచు, రెండు అవయవము లును రమ్యములుగా నుండుటవలన చిరకాలము రెంటిని బొందవలయు నను నాశచే క్రొత్త యజ్ఞముపై మోజుచే మొదటఁ జూచిన యవయవమును వదలిపెట్టి కొంత వెళ్లుటను మఱల వెనకటి యవయవముపై మోజుచే మఱలుటనుఁ జేయు చుండినది. ॥౧౦॥

శ్లో॥ నిరీక్షితఞ్చాజ్గమవీక్షితఞ్చ
దృశా పిబన్తీ రభసేన తస్య।
సమానమానన్దమియం దధానా
వివేద భేదం న విదర్భసుభ్రూః॥ ౧౨

ప॥వి॥ నిరీక్షితం । చ । అజ్గం । అవీక్షితం । చ । దృశా । పిబన్తీ । రభసేన । తస్య । సమానమ్ । ఆనన్దమ్ । ఇయం । దధానా । వివేద । భేదం । న । విదర్భసుభ్రూః.

టీక॥ ఇయం = ఈ, విదర్భసుభ్రూః=విదర్భదేశపు సుందరి, తస్య=ఆ నలునికి సంబంధించిన, నిరీక్షితం= చూడఁబడినదియు, అవీక్షితంచ =చూడఁబడనిదియు నగు, అజ్గం=అవయవమును, దృశా=దృష్టిచే, రభసేన=వేగముతో, పిబన్తీ=ఆశతో చూచుచు, సమానం=సమాన మైన, ఆనన్దం=ఆనన్దమును, దధానా=ధరించుచు, భేదం=వివేచనను, అనగా నిది ముందుఁ జూడఁబడినది, ఇది ముందుఁ జూడఁబడలేదని వివేచనను, న వివేద=తెలిసికొనలేదు.

**సమాసములు:**

*అవీక్షితం :* న వీక్షితం=అవీక్షితం. తత్=అవీక్షితం.
*విదర్భ సుభ్రూః :* విదర్భాణాం సుభ్రూః=విదర్భ సుభ్రూః.

**భావము :**

ఈ దమయన్తి నలునికి సంబంధించిన యవయవములలో చూచినదానిని చూడనిదానిని వేగముగా ఆశతో చూచుచు సమానమైన యానందము నునుభ

వించినదై యిది ముందుఁ జూడఁబడినది. యిది ముందుఁజూడబడనిది యనెడు వివేచనను అనగా తారతమ్యమును తెలిసికొనలేదు. అవయవము లన్నియు నిర్దోషము లైనందువలన నపూర్వములుగనే యుండినవి. ॥౧౨॥

శ్లో॥ సూక్ష్మే ఘనే నైషధకేశపాశే
నిపత్య నిష్యన్దతరీభవద్భ్యామ్।
తస్యానుబన్ధం న విమోచ్య గన్తు
మపారి తల్లోచనఖఞ్జనాభ్యామ్॥ ౧౩

ప॥వి॥ సూక్ష్మే । ఘనే । నైషధకేశపాశే । నిపత్య । నిష్యన్దతరీభవద్భ్యామ్ । తస్య । అనుబన్ధం । న । విమోచ్య । గన్తుమ్ । అపారి । తల్లోచన ఖఞ్జనాభ్యామ్.

టీక॥ సూక్ష్మే = సూక్ష్మమైనదియు, ఘనే = దట్టమైనదియునగు, నైషధకేశ పాశే; నైషధ = నలునియొక్క, కేశపాశే = కేశకలాపమందును, కేశములనెడి బంధనము నందును; నిపత్య = పడి, నిష్యన్దతరీభవద్భ్యామ్ = ఆశ్చర్యమువలనను, బంధనమున తగుల్కొనుటవలనను నిశ్చలము లైన, తల్లోచనఖఞ్జనాభ్యాం; తత్ = ఆదమయన్తియొక్క, లోచనఖఞ్జ నాభ్యాం = నేత్రములనెడికాటుక పిట్టలచే, తస్య = ఆకేశపాశమునకు సంబంధించిన, అనుబంధం = సంసర్గమును, బంధనమును, విమోచ్య = విభజింపఁజేసుకొని, గన్తుం = వెళ్లుటకు, నాఽపారి = శక్యములేక యుండుట (ఏర్పడినది).

వి॥ నలుని కేశపాశము శ్లేషచే బంధనముగా, అనగా వలగా రూపింపఁ బడుటవలనను, అనుబంధమును, సంసర్గముగను రూపించుటవలనను శ్లిష్టరూపకము.

సమాసములు :

నైషధకేశపాశే: నిషధానాం రాజా = నైషధః. నైషధస్య కేశపాశః = నైషధకేశపాశః. తస్మిన్ = నైషధకేశపాశే.

నిష్యన్దతరీభవద్భ్యామ్ : అత్యన్తం నిష్యన్దౌ = నిష్యన్దతరౌ. అనిష్యన్ద తరౌ నిష్యన్దతరౌ సమ్పద్యమానౌ భవన్తౌ = నిష్యన్దతరీభవన్తౌ. తాభ్యాం = నిష్యన్దతరీభవద్భ్యామ్.

తల్లోచనఖఞ్జనాభ్యాం : తస్యాః లోచనే = తల్లోచనే తల్లోచనే ఏవ ఖఞ్జనౌ = తల్లోచనఖఞ్జనౌ. తాభ్యాం = తల్లోచనఖఞ్జనాభ్యాం.

**భావము :**

ఆ నలుని కేశపాశ మనెడి వలయందు నాశ్చర్యముచేతను, (నేత్ర పక్షమున) తగుల్కొనుటచేతను (ఖఞ్జనపక్షిపక్షమున) దమయన్తి కన్ను లనెడి కాటుకపిట్టలు మిక్కిలి నిశ్చలము లైనవి అవి యా కేశపాశమునకు సంబంధించిన యనుబంధమును జాలబంధనమును విడిపించుకొని వెళ్లుటకు సమర్థములు కాలేకపోయినవి॥౧౩॥

శ్లో॥ భూలోకభర్తుర్ముఖపాణిపాద
పద్మైః పరీరమ్భమవాప్య తస్య।
దమస్వసుర్దృష్టిసరోజరాజి
శ్చిరం న తత్యాజ సబంధుబంధమ్॥ ౪౧

ప॥వి॥ భూలోకభర్తుః । ముఖపాణిపాదపద్మైః । పరీరమ్భమ్ । అవాప్య । తస్య । దమస్వసుః । దృష్టిసరోజరాజిః । చిరం । న । తత్యాజ । సబంధుబంధమ్ ।

టీక॥ దమస్వసుః = దముని చెల్లెలగు దమయన్తియొక్క, దృష్టిసరోజరాజిః; దృష్టి = దృష్టులనెడు, సరోజరాజిః = తామర పూలయొక్క పజ్త్కి, భూలోకభర్తుః; భూలోక = భూలోకమునకు, భర్తుః = పాలకుఁడైన నలునియొక్క, ముఖపాణిపాదపద్మైః; ముఖ = మోము, పాణి = హస్తములు, పాద = పాదములు అనెడి, పద్మైః = పద్మములతో, పరీరమ్భం = ఆలిఙ్గనమును, అవాప్య = పొంది, సబంధుబంధమ్, సబంధు = సమానబంధువుల యందలి, బంధం = ఆసక్తిని, చిరం = చాలకాలము, నతత్యాజ = విడువలేదు.

**సమాసములు :**

భూలోకభర్తుః : భూరితి లోకః = భూలోకః. భూలోకస్య భర్తా = భూలోకభర్తా. తస్య = భూలోకభర్తుః.

*ముఖపాణిపాదపద్మైః* : ముఖం చ పాణీ చ పాదౌ చ = ముఖపాణిపాదం. ముఖపాణిపాదమేవ పద్మాని=ముఖపాణిపాదపద్మాని. తైః=ముఖపాణిపాదపద్మైః.

*దమస్వసుః* దమస్యస్వసా=దమస్వసా. తస్యాః=దమస్వసుః

*దృష్టిసరోజరాజీః* : దృష్టయ ఏవ సరోజాని=దృష్టిసరోజాని. దృష్టిసరోజానాం రాజిః=దృష్టిసరోజరాజీః.

*సబంధుబంధమ్* : సమానాః బంధవః = సబంధవః. సబంధుషు బంధః=సబంధుబన్ధః. తమ్=సబన్ధుబన్ధమ్.

**భావము :**

దమయన్తియొక్క దృష్టులనెడి సరోజములు నలునియొక్క మోము, హస్తములు పాదము లనెడి పద్మములను కౌగలించుకొని వాని సమానబంధుత్వముచే నేర్పడిన బంధమును చాలకాలము వదలలేదు. అనగా దమయన్తి చూపులు సరోజములు. నలుని మోమును హస్తములును పాదములును పద్మములు కాననివిసబంధువులైనవి॥౧౪॥

శ్లో॥ తత్కాలమానన్దమయీభవన్తీ
భవత్తరానిర్వచనీయమోహా।
సా ముక్తసంసారిదశా రసాభ్యాం
ద్విస్వాదముల్లాసమభుఙ్క్త మృష్టమ్॥ ౧౫

ప॥వి॥ తత్కాలమ్ । ఆనన్దమయీ । భవన్తీ । భవత్తరానిర్వచనీయమోహా । సా । ముక్తసంసారిదశారసాభ్యాం । ద్విస్వాదమ్ । ఉల్లాసమ్ । అభుఙ్క్త । మృష్టమ్.

టీక॥ తత్కాలమ్=ఆకాలమునందు, ఆనన్దమయీ=ఆనన్దస్వరూపురాలుగ, భవన్తీ = అగుచు, భవత్తరానిర్వచనీయమోహా, భవత్తర = అతిశయముగానగుచున్న, అనిర్వచనీయ=చెప్పశక్యముగాని, మోహః = మోహముగల్గిన, సా = ఆదమయన్తి, ముక్తసంసారిదశారసాభ్యాం;

ముక్త = ముక్తునియొక్కయు, సంసారి = సంసారియొక్కయు, దశా = అవస్థలయందలి, రసాభ్యాం = రుచులచేత. ద్విస్వాదం = రెండు ఆస్వాదములుగల్గిన, మృష్టం = శుద్ధమైన, ఉల్లాసం = ఉల్లాసమును, అభుఙ్క్త = అనుభవించినది.

## సమాసములు :

తత్కాలమ్ : స చాసౌ కాలశ్చ = తత్కాలః. తమ్ = తత్కాలమ్.

అనన్దమయీ : ఆనన్దస్య వికారః = ఆనన్దమయీ.

భవత్తరానిర్వాచనీయమోహా: అతిశయేన భవన్ = భవత్తరః. నిర్వక్తుం శక్యః = నిర్వచనీయః. న నిర్వచనీయః = అనిర్వచనీయః. అనిర్వచనీయశ్చాసౌ మోహశ్చ = అనిర్వచనీయమోహః. భవత్తరః అనిర్వచనీయమోహః యస్యాస్సా = భవత్తరానిర్వచనీయమోహా.

ముక్తసంసారిదశారసాభ్యామ్ : ముక్తశ్చ సంసారీచ = ముక్తసంసారిణౌ. ముక్తసంసారిణోః దశే = ముక్తసంసారిదశే. ముక్తసంసారిదశయోః రసౌ = ముక్తసంసారిదశారసౌ. తాభ్యాం = ముక్తసంసారిదశారసాభ్యామ్.

ద్విస్వాదమ్ః ద్వౌ స్వాదౌ యస్య సః = ద్విస్వాదః. తమ్ = ద్విస్వాదమ్.

## భావము :

నలునిఁ జూచుటచేఁ గల్గిన సంతోషభరముతో నా దమయన్తి యానన్దస్వరూపురాలై చెప్పశక్యముగాని మోహావేశము ననుభవించినది. ఒక వైపు ఆనన్దము, మఱియొక వైపు అతిశయమైన మోహము గల్గినది. ఆనందముచేత మోక్షము పొందిన వ్యక్తియొక్క దశయందలి స్వారస్యానుభూతి, మోహము చేత సంసారమందలి వ్యక్తియొక్క దశయందలి యనుభూతి, యను రెండు రుచులతోఁ గూడిన యుల్లాసమును దమయన్తి యనుభవించినది. అనగా నామె యొక వైపు ఆనందమును మఱి యొక వైపు మోహము ననుభవించిన దని యాశయము. ॥౧౩॥

శ్లో॥ దూతే నలశ్రీభృతి భావిభావా
కలఙ్కనీయం జనితేతి నూనం।

మించి యున్నచో, నలుని పోలిక యా యింద్రునియందు,గాంచి యామె యతని యం దనురక్తురాలై వ్రతభఙ్గమునుఁ బొంది యుండెడిది. దీనిని ఆలోచించియే బ్రహ్మ యచ్చపునలునే దూతగా నియమించెను. అందువల నామెకు నట్టి నలుని యందు ననురాగమేర్పడినను నతడు వస్తుస్థితియందు నలుఁడే గాన నామెకు వ్రతభఙ్గము తప్పినది. అనగా నీ వ్రతభఙ్గదోషమును తప్పించుటకొఱకే బ్రహ్మ యింద్రునకు తానే నలవేషమున దూత కావలయు ననుబుద్ధినిఁ గల్పించలే దని భావము. ॥౧౨॥

శ్లో॥ పుణ్యే మనః కస్య మునేరపి స్యాత్
ప్రమాణమాస్తే యదఘేఽపి ధావత్।
తచ్చిన్తి చిత్తం పరమేశ్వరస్తు
భక్తస్య హృష్యత్కరుణో రుణద్ధి॥ ౧౩

ప॥వి॥ పుణ్యే । మనః । కస్య । మునేః । అపి । స్యాత్ । ప్రమాణమ్ । ఆస్తే । యత్ । అఘే । అపి । ధావత్ । తచ్చిన్తి । చిత్తం । పరమేశ్వరః । తు । భక్తస్య । హృష్యత్కరుణః । రుణద్ధి.

టీక॥ మునేరపి = విషయపరిత్యాగముగావించినయతియైనను, కస్య = ఎవనికి, మనః = మనస్సు, పుణ్యే = పవిత్రమైనవిషయమందే, ప్రమాణం = నిశ్చయమునొసంగునదిగా, స్యాత్ = అగును? యత్ = ఏలయనగా, అఘేఽపి = పాపమందును, ధావత్ = ఆలోచింపకయేపరుగిడునదిగా, (తత్ = ఆమనస్సు) ఆస్తే = ఉన్నది. (కిన్తు = మఱేమనగా) హృష్యత్కరుణః; హృష్యత్ = ఉదయించిన, కరుణః = దయగల్గిన, పరమేశ్వరః = పరమేశ్వరుఁడు, తచ్చిన్తి; తత్ = ఆపాపమును, లేదా ఆపరమేశ్వరుని, చిన్తి = ఆలోచించునట్టి, భక్తస్య = భక్తుని యొక్క, చిత్తం = మనస్సును, రుణద్ధి = వారించుచున్నాడు.

**సమాసములు :**

తచ్చిన్తి : తత్ చిన్తయతీతి = తచ్చిన్తి. తత్ = తచ్చిన్తి.

హృష్యత్కరుణః : హృష్యన్తీ కరుణా యస్య సః = హృష్యత్కరుణః.

**భావము :**

ఒకవేళ యింద్రుడు నలుని వేషమున వచ్చిన నతనియం దభిలాష లేని యీ దమయన్తికి వ్రతభఙ్గము కాదని చెప్ప వీలులేదు. ఏల యనగా విషయములను పరిత్యజించి సన్న్యాసి యైన మునికిఁ గూడ పుణ్యవిషయముల యందే మనస్సు ప్రవర్తించు నని చెప్పసాధ్యము కాదు. ఇఁక విషయాసక్తి గల దమయన్తియొక్క విషయమునఁ జెప్ప నవసర మేమున్నది. పాపకార్య ములయందును వివేచన చేయకయే యట్టియతియొక్క మనస్సు ప్రవర్తిం చును. కావున దయామయుఁ డైన పరమేశ్వరుడే పాపచింతనుఁ జేయుచున్న వారి మనస్సును, లేదా, తన్ను ధ్యానించుచున్నవారి మనస్సును పాపకృత్య ములకుఁ బోనీయక నివారించుచుండును. కావున నింద్రుడు నలుని దూతగా పంపుట దైవవిలసితమే కాని యింద్రుని యాలోచనవలన జరిగినది గాదు॥౧౭॥

శ్లో॥ సాలీకదృష్టేమదనోన్మదిష్ణు
ర్యథాఽఽపశాలీనతయా న మౌనం।
తథైవ తథ్యేఽపి నలే న లేభే
ముగ్ధేషు కః సత్యమృషావివేకః॥ ౧౮

ష॥వి॥ సా । అలీకదృష్టే । మదనోన్మదిష్ణుః । యథా । ఆప । శాలీనతయా। న । మౌనం । తథా । ఏవ । తథ్యే । అపి । నలే । న । లేభే । ముగ్ధేషు । కః । సత్యమృషావివేకః।

టీక॥ మదనోన్మదిష్ణుః = కామముచేఉన్మాదశీలముగల్గిన, సా = ఆదమయన్తి, యథా = ఎట్లు, అలీకదృష్టే; అలీక = అసత్యముగా, దృష్టే = చూడఁ బడిన, నలే = నలునివిషయమున, శాలీనతయా = బిడియముచే, మౌనం = మౌనమును, నాఽఽప = పొందలేదో, తథైవ = అట్లే, తథ్యే ఽపి = సత్యమైనవాడైనను, నలే = నలునియందు, మౌనం = మౌన మును, నలేభే = పొందలేదు. ముగ్ధేషు = మదనోన్మాదముగలవారియందు, సత్యమృషావివేకః; సత్య = ఇదిసత్యము, మృషా = ఇదియసత్యముఅను, వివేకః = వివేచన, కః = ఎక్కడిది.

**సమాసములు :**

అలీకదృష్టే : అలీకం దృష్టః = అలీకదృష్టః. తస్మిన్ = అలీకదృష్టే.

మదనోన్మదిష్ణుః : మదనేన ఉన్మదిష్ణుః = మదనోన్మదిష్ణుః.

సత్యమృషావివేకః : సత్యం చ మృషా చ = సత్యమృషా. సత్యమృషా ఇతి వివేకః = సత్యమృషావివేకః.

**భావము :**

ఉన్మత్తురాలైన ఆ దమయన్తి యసత్యనలునియం దెట్లు బిడియముచే మౌనమును వహింపలేదో, యటే సత్యనలునియందును మౌనమును వహింప లేదు. సత్యనలునియందు నిట్లు బిడియము వీడి వర్తించుట యనుచితము గాదు. ఏలయనగా నున్మాదుల విషయమున సత్యాఽసత్యవివేచన యెక్కడిది? కావున సత్యనలుని విషయమున నామెబిడియము వీడి వర్తించుట దోషము కాదు.॥౧౮॥

శ్లో॥ వ్యర్థీభవత్భావపిధానయత్నా
స్వరేణ సాఽథ శ్లథగద్గదేన।
సఖీజనే సాధ్వససన్నవాచి
స్వయం తమూచే నమదాననేందుః॥ ౧౯

ప॥వి॥ వ్యర్థీభవద్భావపిధానయత్నా । స్వరేణ । సా । అథ । శ్లథగద్గదేన । సఖీజనే । సాధ్వససన్నవాచి । స్వయం । తమ్ । ఊచే । నమదాననేందుః.

టీక॥ అథ = ఆనన్దమోహములననుభవించినపిదప; వ్యర్థీభవద్భావపిధానయత్నా: వ్యర్థీభవత్ = నిష్ఫలమగుచున్న, భావపిధాన = భావములనుమఱుగు పఱచుటయందు, యత్నా = ప్రయత్నముఁగల్గిన, సా = ఆదమయన్తి, సఖీజనే = చెలికత్తెలు, సాధ్వససన్నవాచి; సాధ్వస = భయముతో, సన్న = కుణ్ఠితమైన, వాచి = వాక్కుగరవారుకాగా, నమదాననేన్దుః; నమత్ = వాలిన, ఆననేన్దుః = ముఖచంద్రునిగలదై, శ్లథగదదేన;

శ్లథ = శిథిలమును. గద్గద = తెగినదియునగు, స్వరేణ = స్వరముతో, తం = ఆనలుని, ఊచే = చెప్పినది.

## సమాసములు :

వ్యర్థీభవద్భావపిధానయత్నా : అవ్యర్థః వ్యర్థః సమ్పద్యమానః భవన్ = వ్యర్థీభవన్. భావానాం పిధానం = భావపిధానం. భావపిధానే యత్నః = భావపిధానయత్నః. వ్యర్థీభవన్ భావపిధానయత్నః యస్యాస్సా = వ్యర్థీభవద్భావపిధానయత్నా.

శ్లథగద్గదేన : శ్లథశ్చాసౌ గద్గదశ్చ = శ్లథగద్గదః = తేన శ్లథగద్గదేన.

సఖీజనే : సఖ్య ఏవ జనః = సఖీజనః. తస్మిన్ = సఖీజనే.

సాధ్వససన్నవాచి : సాధ్వసేన సన్నా = సాధ్వససన్నా. సాధ్వససన్నా వాక్ యస్య సః = సాధ్వససన్నవాక్. తస్మిన్ = సాధ్వససన్నవాచి.

నమదాననేన్దుః : ఆననమేవ ఇందుః = ఆననేన్దుః. నమన్ ఆననేందుః యస్యాస్సా = నమదాననేన్దుః.

## భావము :

ఆ దమయన్తి నలునిఁ జూడగనే యొక వైపు బ్రహ్మానన్దమును మఱియొక వైపు మహామోహమునుఁ జెంది ముక్తునియొక్కయు, సంసారియొక్కయు దశలలోని రసాస్వాదములను రెంటిని ననుభవించినది. అట్టి తరుణమునం దామె తనయందు నేర్పడు భావములను మఱుగుపరచుకొనలేకపోయినది. చెలికత్తె లంతఃపురమునకు నలుఁడురాగనే, తత్తరపాటుఁజెంది పలుకలేకపోయిరి అందువలన దమయన్తి తానే లజ్జచే తల వాల్చినదై తొట్రుపాటుఁ జెందిన కణ్ఠముతో నలునిఁగూర్చి చెప్పినదిః౧౯॥

శ్లో॥ నత్వా శిరోరత్నరుచాఽపి పాద్యం
సమ్పాద్యమాచారవిదాతిథిభ్యః।
ప్రియాక్షరాలీరసధారయాఽపి
వైదర్భీ విధేయా మధుపర్కతృప్తిః॥ ౨౦

ప॥వి॥ నత్వా । శిరోరత్నరుచా । అపి । పాద్యం । సమ్పాద్యమ్ । ఆచారవిదా । అతిథిభ్యః । ప్రియాక్షరాలీరసధారయా । అపి । వైధీ । విధేయా । మధుపర్కతృప్తిః ।

టీక॥ ఆచారవిదా = ఆచారమునుఁదెలిసినగృహస్థునిచే, అతిథిభ్యః = అతిథులకై, నత్వా = నమస్కరించి, శిరోరత్నరుచాఽపి = శిరస్సునందున్న రత్నముల కాంతిచేతనైనను, పాద్యం = పాదములకు నుదకము, సమ్పాద్యం = కల్పింపఁదగినది. (కిఞ్చ = మఱియు) ప్రియాక్షరాలీరసధారయాపి; ప్రియాక్షరాలీ = ప్రియవాక్యసమూహముచేఁగల్గు, రసధారయాఽపి = రసప్రవాహముచేతను, వైధీ = శాస్త్రవిహితమైన, మధుపర్కతృప్తిః; మధుపర్క = మధుపర్కముతోఁకలిగెడి, తృప్తిః = తృప్తి, విధేయా = చేయఁదగినది.

## సమాసములు :

*శిరోరత్నరుచా:* శిరసః రత్నం = శిరోరత్నమ్. శిరోరత్నస్య రుక్ = శిరోరత్నరుక్. తయా = శిరోరత్నరుచా.

*ఆచారవిదా :* ఆచారం వేత్తీతి = ఆచారవిత్. తేన = ఆచారవిదా.

*ప్రియాక్షరాలీరసధారయా :* అక్షరాణామాలీ = అక్షరాలీ. ప్రియా చ సా అక్షరాలీ చ = ప్రియాక్షరాలీ. రసస్యధారా = రసధారా. ప్రియాక్షరాల్యాః రసధారా = ప్రియాక్ష రాలీరసధారా. తయా = ప్రియాక్షరాలీరసధారయా.

*వైధీ :* విధినా ప్రాప్తా = వైధీ.

*విధేయా :* విధాతుం యోగ్యా = విధేయా.

*మధుపర్కతృప్తిః :* మధుపర్కేణ తృప్తిః = మధుపర్కతృప్తిః.

## భావము :

గృహస్థుఁడు తన యొద్ద పాద్యాది సామగ్రి లేకపోయినను, నమస్కరించి తన శిరోరత్నపు కాంతులతో నతిథికొఱకుఁ బాద్యము నొసంగవలయును. అట్లే ప్రియవచనములనుండి చిందెడు మాధుర్యధారచే శాస్త్రవిహితమైన మధుపర్కతృప్తినిఁ గావింపవలయును. ॥౨౦॥

శ్లో॥ స్వాత్మాపి శీలేన తృణం విధేయం
దేయా విహాయాఽఽసనభూర్నిజాఽపి।
ఆనన్దబాష్పైరపి కల్ప్యమమ్బుః
పృచ్ఛా విధేయా మధుభిర్వచోభిః॥ ౨౧

ప॥వి॥ స్వాత్మా । అపి । శీలేన । తృణం । విధేయం । దేయా । విహాయ । ఆసనభూమిః । నిజా । అపి । ఆనన్దబాష్పైః । అపి । కల్ప్యమ్ । అమ్బుః । పృచ్ఛా । విధేయా । మధుభిః । వచోభిః.

టీక॥ కిఞ్చ = మఱియు, శీలేన = సత్స్వభావముచేతలేదాఆచారప్రమాణముచేత, స్వాత్మాఽపి = తనశరీరముకూడ, తృణం = గడ్డిపోచగా, విధేయం = చేయఁదగినది. అనగానర్పింపఁదదినగి. నిజాఽపి = తనదైనను, ఆసన భూః = కూర్చొనుస్థలము, విహాయ = వదలి, అనగానందుండిలేచి, దేయా = ఈయఁదగినది. ఆనన్దబాష్పైరపి = ఆనన్దమువలనికన్నీటిచే, అమ్బుః = పాదోదకము, కల్ప్యం = చేయవలయును. మధుభిః = తేనె లొలుకు, వచోభిః = మాటలచే, పృచ్ఛా = కుశలప్రశ్న, విధేయా = చేయఁ దగినది.

సమాసములు :

స్వాత్మా : స్వస్య ఆత్మా = స్వాత్మా.

ఆసనభూః : ఆసనస్య భూః = ఆసనభూః.

ఆనన్దబాష్పైః : ఆనందేన బాష్పాః = ఆనన్దబాష్పాః. తైః = ఆనన్ద బాష్పైః.

భావము :

ఆచారప్రమాణమును బట్టి లేదా సత్స్వభావమునను సరించి, యతిథికి తన శరీరమును గూడ గడ్డిపోచ వలె నర్పింపవలయును. తాను కూర్చొనిన స్థల మును వదలి లేచి దానిని నతిథికొసంగవలయును. ఆనన్దబాష్పములచే పాద్యాదుల నొసంగవలయను. తియ్యని మాటలచే కుశలప్రశ్నను గావించి మధుపర్క

మొసంగవలయును. తన యొద్ద శాస్త్రప్రకార మాతిథ్య మొసంగుటకు సామగ్రి లేనపుడు పైవిధముగా నతిథిసత్కారములనుఁ గావింపవలయును. ఇది యనుకల్ప మనఁబడును. శాస్త్రీయముగాఁ జేయనపుడు యథాశక్తిగా జేయు పద్ధతి యనుకల్పము కాన నతిథిని నేవిధముగ నుపేక్షింపరాదు. ॥౨౦॥

శ్లో॥ పదోపహారేఽనుపసన్నమతాఽపి
సమ్భావ్యతేఽపాం త్వరయాఽపరాధః।
తత్కర్తుమర్హాఞ్జలిసఞ్జనేన
స్వసంభృతిప్రాఞ్జలతాఽపి తావత్॥ ౨౨

ప॥వి॥ పదోపహారే । అనుపసన్నమతా । అపి । సమ్భావ్యతే । అపాం । త్వరయా। అపరాధః । తత్ । కర్తుం । అర్హా । అఞ్జలిసఞ్జనేన । స్వసంభృతిప్రాఞ్జలతా । అపి । తావత్.

టీక॥ పదోపహారే = పాదములుకడుగువిషయమున, త్వరయా = శీఘ్రముగా, అపాం = ఉదకములను, అనుపసన్నమతాఽపి = తేకయుండుటయు, అపరాధః = అపరాధముగా, సమ్భావ్యతే = భావింపఁబడుచున్నది. తత్ = అందువలన, అఞ్జలిసఞ్జనేన = రెండు హస్తములను జోడించుటచే. స్వసంభృతిప్రాఞ్జలతా; స్వసంభృతి = తన్నుసమాయత్తపఱచుటచేత, ప్రాఞ్జలతా = ఆర్జవమును, అనగాకౌశల్యములేకవర్తించుట, కర్తుం = చేయుటకు, అర్హాతావత్ = తగినది.

## సమాసములు :

పదోపహారే : పదయోః ఉపహారః = పదోపహారః. తస్మిన్ = పదోపహారే.

అనుపసన్నమతా : న ఉపసన్నమతా = అనుపసన్నమతా.

అఞ్జలిసఞ్జనేన : అఞ్జల్యోః సఞ్జనం = అఞ్జలిసఞ్జనం. తేన = అఞ్జలిసఞ్జనేన.

స్వసంభృతిప్రాఞ్జలతా: స్వస్యసంభృతిః = స్వసంభృతిః. స్వసంభృతేః ప్రాఞ్జలతా = స్వసంభృతిప్రాఞ్జలతా.

**భావము :**

పాద్యము తెచ్చుటలో తడ వొనర్చినను నపరాధముగా భావింపఁబడును. అందువలన చేతులు మోడ్చి తన్ను నతిథిసమీపమునందు నాయత్తపఱచుకొనుటచే, నిష్కపటముగావర్తింపవలయును. అనగా నాతిథ్యమునుశాస్త్రప్రకారము చేయలేని సందర్భమున వినయముతో నతిథిచిత్తమును తృప్తిపఱచవలయును. లేనిచో పాపము సంభవించును. ॥౨౨॥

శ్లో॥ పురాపరిత్యజ్య మయాఽత్యసర్జి
స్వమాసనం తత్కిమితి క్షణన్న ।
అనర్హమప్యేతదలఙ్క్రియేత
ప్రయాతుమీహా యది చాన్యతోపి॥ ౨౩

ప॥వి॥ పురా । పరిత్యజ్య । మయా । అత్యసర్జి । స్వమ్ । ఆసనం । తత్ । కిమ్ । ఇతి । క్షణం । న । అనర్హమ్ । అపి । ఏతత్ । అలఙ్క్రియేత । ప్రయాతుమ్ । ఈహా । యది । చ । అన్యతః । అపి.

టీక॥ మయా = నాచే, స్వమ్ = నాదైన, ఆసనం = ఆసనము, పురా = పూర్వము, అనగా నిన్నుదర్శించినక్షణముననే, పరిత్యజ్య = వదలిపెట్టిలేచి, అత్యసర్జి = విడువఁబడినది. (తత్ = ఆ) ఏతత్ = ఈయాసనము, అనర్హమపి = అర్హముకాకపోయినప్పటికిని, యదివా = లేదా, అన్యతః = మఱియొకచోటికి, ప్రయాతుం = వెళ్లుటకు, ఈహావా = కోరికయున్నను, కిమితి = ఏల, క్షణం = క్షణకాలము, నాలఙ్క్రియేత = అలఙ్కరింపఁబడఁగూడదు?

**సమాసములు :**

అనర్హమ్ : నఅర్హం = అనర్హమ్.

**భావము :**

పూర్వము అనగా నిన్ను దర్శించి నపుడే నాయాసనమును వదలి లేచి దానిని నీకొసంగితిని. ఆ యీయాసనము నీకు అర్హముకాక పోయినను లేదా

మఱి యొక ప్రదేశమునకు వెళ్లుటకు నీకు కోరిక యున్నను క్షణకాల మేల దీని నలంకరింపఁగూడదు. భక్తజనుల ననుగ్రహించుట కిట నాసీనుఁడవు కమ్ము అని దమయన్తి నలునిఁ బ్రార్థించినది. ॥౨౩॥

శ్లో॥ నివేద్యతాం హన్త సమాపయన్తౌ
శిరీషకోశమ్రదిమాభిమానం ।
పదౌ కియద్దూరమిమౌ ప్రయాసే
నిధిత్సతే తుచ్ఛదయం మనస్తే॥ ౨౪

ప॥వి॥ నివేద్యతాం । హన్త । సమాపయన్తౌ । శిరీషకోశమ్రదిమాభిమానం । పదౌ । కియద్దూరమ్ । ఇమౌ । ప్రయాసే । నిధిత్సతే । తుచ్ఛదయం । మనః । తే.

టీక॥ శిరీషకోశమ్రదిమాభిమానం, శిరీషకోశ = దిరిసెనమొగ్గయొక్క, మ్రదిమా = మెత్తదనముయొక్క, అభిమానం = గర్వమును, సమాపయన్తౌ = సమాప్తిగావించునటువంటి, ఇమౌపదౌ = ఈపాదములను, తుచ్ఛదయం = దయమాలినటువంటి, తే = నీయొక్క, మనః = మనస్సు, కియద్దూరం = ఎంతకాలము, ప్రయాసే = కష్టమునందు, నిధిత్సతే = ఉంచుటకుఁగోరుచున్నది. నివేద్యతాం = నివేదింపబడుగాక. హన్త = అయ్యో!

సమాసములు:

*శిరీషకోశమ్రదిమాభిమానమ్* : శిరీషస్య కోశః = శిరీషకోశః. శిరీషకోశస్య మ్రదిమా = శిరీషకోశమ్రదిమా. శిరీషకోశమ్రదిమ్నః అభిమానః = శిరీషకోశమ్రదిమాభిమానః. తమ్ = శిరీషకోశమ్రదిమాభిమానమ్.

*కియద్దూరమ్* : కియచ్చ తత్ దూరం చ = కియద్దూరం. తత్ = కియద్దూరమ్.

తుచ్ఛదయం : తుచ్ఛా దయా యస్య తత్ = తుచ్ఛదయం.

**భావము :**

దిరిసెన మొగ్గయొక్క మెత్తదనమువలని గర్వమును నీ పాదములు అపహరించుచున్నవి.అనగా దిరిసెనమొగ్గకంటెను నీపాదములుసుకుమారములు. అట్టి సుకుమారములైన నీపాదముల నెంత కాలము నీ కఠినమైన మనస్సు ప్రయాసపఱచును?అట్టి నీ పాదముల నొత్తి ప్రయాసను తీర్చుటకు నాకెప్పుడు భాగ్యము గల్గును? అనగా నన్నెప్పుడు వరింతు వని భావము. ॥౨౪॥

శ్లో॥ అనాయి దేశః కతమస్త్వయాఽద్య
వసన్తముక్తస్య దశాం వనస్య ।
త్వదాప్తసఙ్కేతతయా కృతార్థా
శ్రవ్యాఽపి నాఽనేన జనేన సంజ్ఞా॥ ౨౫

ప॥వి॥ అనాయి । దేశః । కతమః । త్వయా । అద్య । వసన్తముక్తస్య । దశాం । వనస్య । త్వదాప్తసఙ్కేతతయా । కృతార్థా । శ్రవ్యా । అపి । న । అనేన । జనేన । సంజ్ఞా ।

టీక॥ అద్య = ఇప్పుడు, త్వయా = నీచే, కతమః = ఏ, దేశః = దేశము, వసన్తముక్తస్య = వసన్తఋతువుచేవిడువఁబడిన, వనస్య = వనముయొక్క, దశాం = దశను, అనాయి = పొందింపఁబడినది? కిఞ్చ = మఱియు, త్వదాప్తసఙ్కేతతయా, త్వత్ = నీయందు, ఆప్త = పొందఁబడిన, సఙ్కేతతయా = సంబంధముగల్గియుండుటచే, కృతార్థా = సఫలమైన, సంజ్ఞా = పేరు, అనేనజనేన = ఈజనముచే,(ఈదమయన్తిచే), శ్రవ్యా = వినుటకర్హమైనదిగ, అపిన = కాదాయేమి.

**సమాసములు :**

వసన్తముక్తస్య : వసన్తేన ముక్తః = వసన్తముక్తః. తస్య = వసన్తముక్తస్య.

త్వదాప్తసఙ్కేతతయా : త్వయి ఆప్తః = త్వదాప్తః. త్వదాప్తః సఙ్కేతః యయా సా = త్వదాప్తసఙ్కేతా. త్వదాప్తసఙ్కేతాయాః భావః = త్వదాప్తసఙ్కేతతా. తయా = త్వదాప్తసఙ్కేతతయా.

కృతార్థా : కృతః అర్థః యయా సా = కృతార్థా.

**భావము :**

నీచే ఏ దేశము వసన్తముచే విడువఁబడిన వనముయొక్క దశనుఁ బొందింపఁబడినది? అనగా నేదేశము నీవలన శూన్యమైనది. అనగా నేది నీదేశము? నీకు సఙ్కేతభూమగుటచే సాఫల్యము నొందిన నీ పేరు నాకు వినఁదగినది కాదా? అనగా నీ నామధేయమేది?అని దమయన్తి నలుని ప్రశ్నించెను. ॥౭౪॥

శ్లో॥ తీర్ణః కిమమ్భోనిధిరేవ నైష
సురక్షితేఽభూదిహ యత్ప్రవేశః।
ఫలం కిమేతస్య తు సాహసస్య
న తావదద్యాఽపి వినిశ్చినోమి॥ ౭౫

ప॥వి॥ తీర్ణః । కిమ్ । అమ్భోనిధిః । ఏవ । న । ఏషః । సురక్షితే । అభూత్ । ఇహ । యత్ప్రవేశః । ఫలం । కిమ్ । ఏతస్య । తు । సాహసస్య । న । తావత్ । అద్య । అపి । వినిశ్చినోమి ।

టీక॥ సురక్షితే = చక్కగారక్షింపఁబడిన, ఇహ = ఈయన్తఃపురమునందు, ప్రవేశఃఅభూదితియత్ = ప్రవేశముగల్గుట అనునది ఏదికలదో, తత్ = అది, అర్ణోనిధిరేవ = సముద్రమే, తీర్ణోనకిమ్ = దాటఁబడినదిగాదా? కిన్తు = కాని, ఏతస్య = ఈ, సాహసస్య = సాహసమునకు, ఫలం = ఫలము, కిమ్ = ఏమియని, అద్యాపితావత్ = ఇప్పటికిని, ననిశ్చినోమి = నిశ్చయింపలేకయున్నాను.

వి॥ ఇచ్చట అన్తపురపుర ప్రవేశ వాక్యార్థమునకును, అర్ణవతరణవాక్యార్థమునకును సామానాధికరణ్యము వాని సాదృశ్యము నాక్షేపించునుగాన, అసమ్భవద్వస్తుసంబంధ రూప మగు నిదర్శనాలఙ్కారము,

**సమాసములు :**

అర్ణోనిధిః : అర్ణసాం నిధిః = అర్ణోనిధిః

భావము :

చక్కగా రక్షింపఁబడిన యీ యంతః పురమునందు ప్రవేశము సముద్రము దాటుటతో సమానము. సముద్రము దాటుట యెంత దుష్కరమో యన్తఃపురమునుఁ బ్రవేశించుటయు నంత దుష్కరము. ఇట్టి సాహసమునకు ఫలమెద్దియో యెంత విమర్శించియు నిప్పటికిని గ్రహింపలేక యున్నాను, అని నలునితో దమయన్తి చెప్పుచున్నది. ॥౨౭॥

శ్లో॥ తవ ప్రవేశే సుకృతాని హేతుం
మన్యే మదక్ష్ణోరపి తావదత్ర ।
న లక్షితో రక్షిభటైర్యదాభ్యాం
పీతోఽసి తన్వా జితపుష్పధన్వా॥ ౨౮

ప॥వి॥ తవ । ప్రవేశే । సుకృతాని । హేతుం । మన్యే । మదక్ష్ణోః । అపి । తావత్ । అత్ర । నలక్షితః । రక్షిభటైః । యత్ । ఆభ్యాం । పీతః । అసి । తన్వా । జితపుష్పధన్వా ।

టీక॥ అథవా = లేదా, అత్ర = ఈయంతఃపురమునందు, తవ = నీకు, ప్రవేశే = ప్రవేశమునందు, మదక్ష్ణోః = నాకన్నులయొక్క, సుకృతాన్యపి = పుణ్యములుగూడ, తావత్ = అంతవరకును, (హేతుః = కారణము, యావత్ = ఎంతవరకు ఇతఱహేతువు వినఁబడదో) హేతుం = కారణముగా, మన్యే = తలంతును. యత్ = ఏలయనగా, తన్వా = శరీరముచే, జితపుష్పధన్వా = జయింపఁబడినమన్మథునిగల్గిన, త్వం = నీవు, రక్షిభటైః = రక్షకభటులచే, నలక్షితస్సన్ = చూడబడకయే; ఆభ్యాం = నానేత్రములచే, పీతః = మిక్కిలియాశచేఁజూడఁబడినవాడుగా, అసి = అగుచున్నావు.

సమాసములు :

నలక్షితః : న లక్షితః = నలక్షితః.

రక్షిభటైః: రక్షిణశ్చ తే భటాశ్చ = రక్షిభటాః. తైః = రక్షిభటైః.

**జిత**పుష్పధన్వా: పుష్పం ధనుః యస్య సః = పుష్పధన్వా. జితః పుష్పధన్వా యేన సః = జితపుష్పధన్వా.

**భావము :**

లేదానీకుతః యన్తఃరపుప్రవేశమునకు నానేత్రములు చేసిన **పుణ్యములు** గూడ కారణము కావచ్చును. కావున, మన్మథుని జయించిన దేహము గల నీవు **తొలుత** రక్షకభటుల కన్నులలోఁ బడక నా నేత్రములచే మిక్కిలి యాశతోఁ జూడఁబడితివి. పుణ్యవిశేషము లేనిచో నెట్లు నీవంటి సుందరాకృతినిఁ జూడ గలను. ॥౨౭॥

శ్లో॥ యథాऽऽకృతిః కా చన తే యథా వా
దౌవారికాన్ధఙ్కరిణీ చ శక్తిః ।
రుచ్యో రుచీభిర్జితకాఞ్చనీభి
స్తథాऽసి పీయూషభుజాం సనాభిః॥ ౨౮

ప॥వి॥ యథా । ఆకృతిః । కాచన । తే । యథా । వా । దౌవారికాన్ధఙ్కరిణీ । చ।శక్తిః । రుచ్యః । రుచీభిః । జితకాఞ్చనీభిః । తథా । అసి।పీయూషభుజాం । సనాభిః.

టీక॥ యథా = ఎందువలన, తే = నీయొక్క, ఆకృతిః = ఆకారము, కాచన = అపూర్వమైనది, అనగా **అమానుషమైనది.** యథావా = ఎందువలన, దౌవారికాన్ధఙ్కరిణీ; దౌవారిక = ద్వారపాలకులను, అన్ధఙ్కరిణీ = దృష్టినిఁబ్రతిబంధించెడి, శక్తిశ్చ = శక్తియు, కాచన = అమానుషమైనది, (కిఞ్చ = మఱియు) జితకాఞ్చనీభిః = జయింపఁబడినపసుపుగల్గిన, రుచీభిః = కాన్తులచే, రుచ్యః = దేదీప్యమానుడవు, తథా = అందువలననగా, ఆకృతివలనను, కాన్తివలనను, పీయూషభుజాం = అమృతపానముఁగావించినదేవతలకు, సనాభిః = బంధువైనదివ్యపురుషుడవుగా **భావింపఁదగి** యున్నావు.

సమాసములు :

*దౌవారికాన్ధఙ్కరిణీ :* ద్వారి నియుక్తాః = దౌవారికాః దౌవారికానా మంధఙ్కరిణీ = దౌవారికాన్ధఙ్కరిణీ.

*జితకాఞ్చనీభిః* : జితా కాఞ్చనీ యాభిస్తాః = జితకాఞ్చన్యః. తాభిః = జితకాఞ్చనీభిః.

*పీయూషభుజాం* : పీయూషం భుఞ్జత ఇతి = పీయూషభుజః. తేషాం = పీయూషభుజాం.

*సనాభిః* : సమానా నాభిః యస్య సః = సనాభిః.

భావము :

నీ యాకృతి యమానుషమైనది. నీ శక్తియు ద్వారపాలకుల దృష్టినిఁ బ్రతిబంధించినదై యమానుషమైనది. నీ శరీరకాన్తియు, పసుపును జయించినదై మిక్కిలి యుజ్జ్వలమైనది. కావున నీవు దేవతలకు బంధువైన దివ్యపురుషుఁడవుగ నూహింపదగియున్నావు. అనిదమయన్తి నలునితోఁ జెప్పినది. ॥౨౮॥

శ్లో॥ న మన్మథస్త్వం స హి నాస్తిమూర్తిః
నా వాశ్వినేయః స హి నాఽద్వితీయః ।
చిహ్నైః కి మన్యైరథవా తవేయం
శ్రీరేవ తాభ్యామధికో విశేషః॥ ౨౯

ప॥వి॥ న । మన్మథః । త్వం । సః । హి । నాస్తిమూర్తిః । న । వా । ఆశ్వినేయః । సః । హి । న । అద్వితీయః । చిహ్నైః । కిమ్ । అన్యైః । అథ । వా । తవ । ఇయం । శ్రీః । ఏవ । తాభ్యామ్ । అధికః । విశేషః.

టీక॥ త్వం = నీవు(దేవేష్వపి = దేవతలయందును) మన్మథః = మన్మథుఁడుగా, నాసి = ఉండవు. హి = ఏలయనగా, సః = ఆమన్మథుఁడు, నాస్తి మూర్తిః = దేహముగలవాడుకాడు. ఆశ్వినేయః = అశ్వినీకుమారుఁడవు, న = కావు. హి = ఏలయనగా, సః = ఆయశ్వినీకుమారుఁడు, అద్వితీయః = ఒంటరి, న = కాడు, అథవా = లేదా, అన్యైః = ఇతరములైన. చిహ్నైః = చిహ్నములతో, కిం = ఏమిప్రయోజనము,తవ = నీయొక్క ఇయం = ఈ, శ్రీరేవ = శోభయే, తాభ్యాం = ఆయిరువురికంటెను విశేషః = భేదము.

సమాసములు :

నాస్తిమూర్తిః : అస్తి మూర్తిః యస్య సః = అస్తిమూర్తిః. అస్తి మూర్తిః న భవతీతి = నాస్తిమూర్తిః.

అశ్వినేయః : అశ్విన్యాః అయం = ఆశ్వినేయః.

అద్వితీయః : అవిద్యమానః ద్వితీయః యస్య సః = అద్వితీయః.

భావము :

నీవు దివ్యపురుషులకుఁ జెందినవాడ వైనను, నీవు మన్మథుఁడవు కావు. ఏల యనగా మన్మథునకు శరీరము లేదు గదా. ఇక నశ్వినీపుత్రుఁడవును గావు. ఏల యనగా నశ్వినీపుత్రుఁ డెప్పుడు నొంటరిగ నుండడు. వారు జంటలుగానే యుందురు ఇఁక నితరము లగు నానవాళ్లతో ప్రయోజన మేమి? నీ శోభయే వారిద్దఱికంటెను నీలో విశేషమై యున్నది. కాన వారిద్దఱికంటెను భిన్నమైన లోకోత్తరపురుషుఁడవు నీవని తెలియుచున్నది॥౨౯॥

శ్లో॥ ఆలోకతృప్తీకృతలోక యస్త్వా
మసూత పీయూషమయూఖమేతమ్ ।
కః స్పర్ధితుం ధావతి సాధు సార్ధ
ముదన్వతా నన్వయమన్వవాయః॥ ౩౦

ప॥వి॥ ఆలోకతృప్తీకృతలోక । యః । త్వామ్ । అసూత । పీయూషమయూఖమ్ । ఏతమ్ । కః । స్పర్ధితుం । ధావతి । సాధు । సార్ధమ్ । ఉదన్వతా । నను । అయమ్ । అన్వవాయః ।

టీక॥ హేఆలోకతృప్తీకృతలోక; ఆలోక = దర్శనముచేత, (నీదగువెలుగు చేతను) తృప్తీకృత = సంతుష్టముగావింపఁబడిన, లోక = లోకములు గలవాడా, యః = ఏ, అన్వవాయః = వంశము, ఏతం = ఇట్టినిన్ను అనెడి, పీయూషమయూఖం = అమృతకిరణుఁడైనచన్ద్రుని, అసూత = కనినది, (అతఏవ = కావుననే,) ఉదన్వతాసార్ధం = సముద్రముతోడ, సాధు = చక్కఁగా, స్పర్ధితుం = కలహించుటకు, ధావతి = పరుగిడును, నను = ఓయీ, అయం = ఈ, అన్వవాయః = వంశము, కః = ఏది.

వి॥ నలుని చంద్రునితో రూపించుటవలన రూపకము. వంశమును సముద్రముతోఁబోల్చుటవలన ఉపమ. రెంటికిని సంకరము.

**సమాసములు:**

ఆలోకతృప్తీకృతలోక : అతృప్తః తృప్తః సమ్పద్యమానః కృతః = తృప్తీకృతః. ఆలోకేన తృప్తీకృతః = ఆలోకతృప్తీకృతః. ఆలోకతృప్తీకృతః లోకః యస్య సః = ఆలోకతృప్తీకృతలోకః తస్యసమ్బుద్ధిః = హే ఆలోకతృప్తీకృతలోక.

పీయూషమయూఖమ్ : పీయూషమయాః మయూఖాః యస్య సః = పీయూషమయూఖః. తమ్ = పీయూషమయూఖం.

**భావము :**

దర్శనము చేతను, (కాంతిచేతను) తృప్తిపఱుపఁబడిన ప్రపఞ్చములు గలవాడా నిన్ను అనెడి చంద్రుని కనిన వంశము సముద్రముతోఁ బోటీపడుటకు బరుగిడుచున్నది. సముద్రము చంద్రునిఁ గనినది. నీవును చంద్రుఁడవే కాన వంశము సముద్రముతో పోటీపడుట యుక్తము. కాన సముద్రముతో సమానమైన నీవంశ మేదో చెప్పవలయు నని దమయన్తి నలునిఁ బ్రశ్నించినది ॥30॥

శ్లో॥ భూయోఽపి బాలా నలసున్దరం తం
మత్వాఽమరం రక్షిజనాక్షిబంధాత్ ।
ఆతిథ్యచాటూన్యపదిశ్య తత్త్వాం
శ్రియం ప్రియస్యాస్తుత వస్తుతః సా॥ 31

ప॥వి॥ భూయః । అపి । బాలా । నలసున్దరం । తం । మత్వా । అమరం । రక్షిజనాక్షిబంధాత్ । ఆతిథ్యచాటూని । అపదిశ్య । తత్త్వాం । శ్రియం । ప్రియస్య । అస్తుత । వస్తుతః । సా.

టీక॥ భూయోఽపి = మఱలను, సా = ఆ, బాలా = బాలయగుదమయన్తి, తం = వానిని, రక్షిజనాక్షిబంధాత్; రక్షిజన = రక్షకజనముయొక్క, అక్షిబంధాత్ = నేత్రములనుఁ బ్రతిబంధించుటవలన ననగా వారికనులఁ

గట్టుటవలన, తం = ఆ, నలసున్దరం = నలుఁడనుసున్దరుని, అమరం = దివ్యపురుషునిగా, మత్వా = తలంచి, ఆతిథ్యచాటూని; ఆతిథ్య = అతిథి కొఱకైన, చాటూని = ప్రియవాక్యములను, అపదిశ్య = నెపముఁగావించు కొని, తస్థాం; తత్ = ఆపురుషునియందు, స్థాం = ఉన్నటువంటి, ప్రియస్య = ప్రియుఁడైననలునియొక్క, శ్రియం = శోభను, వస్తుతః = వాస్తవములో, దృష్ట్వైవ = చూచియే, అస్తుత = స్తుతించినది.

## సమాసములు :

*రక్షిజనాక్షిబంధాత్* : రక్షిణశ్చ తే జనాశ్చ = రక్షిజనాః. అక్ష్ణాం బంధః = అక్షిబంధః. రక్షిజనానామక్షిబన్ధః = రక్షిజనాక్షిబన్ధః. తస్మాత్ = రక్షిజనాక్షిబంధాత్.

*ఆతిథ్యచాటూని* : ఆతిథయే = ఆతిధ్యాని. ఆతిధ్యాని చ తానిచాటూని = ఆతిథ్యచాటూని. తాని = ఆతిథ్యచాటూని.

## భావము :

మఱల నా దమయన్తి యా పురుషుని రక్షకజనుల కన్నులఁ గప్పినందు వలన దివ్యపురుషునిగా భావించి యతిథిని సంతోషపఱచునట్టి ప్రియవచనమును నెపముగావించి యా దివ్యపురుషునియందున్న నలుని శోభను వాస్తవమునఁ జూచి వర్ణించినది. ॥30॥

శ్లో॥ వాగ్జన్మవైఫల్యమసహ్యశల్యం
గుణాధికే వస్తుని మౌనితా చేత్ ।
ఖలత్వమల్పీయసి జల్పితేఽపి
తదస్తు వన్దిభ్రమభూమితైవ॥ 31

ప॥వి॥ వాగ్జన్మవైఫల్యమ్ । అసహ్యశల్యం । గుణాధికే । వస్తుని । మౌనితా । చేత్ । ఖలత్వమ్ । అల్పీయసి । జల్పితే । అపి । తత్ । అస్తు । వన్దిభ్రమభూమితా । ఏవ.

టీక॥ గుణాధికే; గుణ = ఆశ్చర్యకరములగుగుణములచే, అధికే = అధికమైన, వస్తుని = వస్తువువిషయమున, మౌనితా = మౌనమువహించుట, వాగ్జ

న్మనః = వాక్కు ఏర్పడినందులకు, అసహ్యశల్యం; అసహ్య = సహింప రాని, శల్యం = చీలవంటిది. అల్పీయసి = మిక్కిలిస్వల్పము, జల్పితే సతి = చెప్పఁబడగా, ఖలత్వం = దుర్జనత్వము, (వచ్చును.) తత్ = అందువలన, వందిభ్రమభూమితైవ; వన్ది = స్తుతిపాఠకునియొక్క, భ్రమ = భ్రమకు అనగా నితడుస్తుతిపాఠకుఁడను భ్రమకు, భూమి తైవ = విషయమగుటయే, అస్తు = కానిమ్ము.

## సమాసములు :

వాగ్జన్మవైఫల్యం : వాచః జన్మ = వాగ్జన్మ. వాగ్జన్మనః వైఫల్యం = వాగ్జన్మవైఫల్యం.

అసహ్యశల్యం : సోఢుమశక్యం = అసహ్యం. అసహ్యం చ తత్ శల్యం చ = అసహ్యశల్యమ్.

*గుణాధికే* : గుణై రధికః = గుణాధికః. తస్మిన్ = గుణాధికే.

**మౌనితా** : మునేః కర్మ = మౌనం. మౌనమస్యాస్తీతి = మౌనీ. మౌనినః భావః = మౌనితా.

**ఖలత్వమ్** : ఖలస్య భావః = ఖలత్వమ్.

**వన్దిభ్రమభూమితా** : వన్దీతి భ్రమః = వన్దిభ్రమః. వన్దిభ్రమస్య భూమితా = వన్దిభ్రమభూమితా.

## భావము :

గుణములచే నధికమైన వస్తువును శ్లాఘింపక యుండినచో మన వాక్కు విఫలమై యది సహింపరాని శల్యముగ నేర్పడును అనగా నది శల్యము వలె ననగా మేకు వలె నొప్పించును. ఒక వేళ మెచ్చఁదగిన వస్తువునుఁ గొలదిగ మెచ్చినను నసూయచే నట్లుచేసెనని దుర్జనత్వము నాపాదించును. కావున నలుని శ్లాఘించుటవలన నన్ను స్తుతిపాఠకురాలని భావించినను హానిలేదు. ఏల యనగా స్తుతిపాఠకులు గానివారి స్తుతిపాఠకులుగా భావించుట, లేదా భ్రాన్తిపడుట శ్రోతల దోషము కాని వాగ్వైఫల్యము కాదు. అసూయచే గుణములనుఁ గప్పిపుచ్చుట ఖలత్వము. అదియే స్తోతలోని దోషము. గుణవస్తుల స్తుతి గుణమే యగును. ॥౩౨॥

శ్లో॥ కన్దర్ప ఏవేదమనిన్దత త్వాం
పుణ్యేన మన్యే పునరన్యజన్మ।
చణ్డీశ చణ్డాక్షిహుతాశకుణ్డే
జుహావ యన్మన్దిరమిన్ద్రియాణామ్॥ 33

ప॥వి॥ కన్దర్పః । ఏవ । ఇదమ్ । అవిన్దత । త్వాం । పుణ్యేన । మన్యే । పునః । అన్యజన్మ । చణ్డీశ।చణ్డాక్షిహుతాశకుణ్డే । జుహావ । యత్ । మందిరమ్ । ఇంద్రియాణామ్ ।

టీక॥ కన్దర్పఏవ = మన్మథుఁడే, పుణ్యేన = పుణ్యముచే, ఇదం = ఈ, త్వాం = నీయొక్క రూపముతోనుండెడి, అన్యజన్మ = మఱియొకజన్మమును, పునః = మఱల, అవిన్దత = పొందెను, ఇతి = అని, మన్యే = తలంతును. యత్ = ఎందువలన (సః = ఆమన్మథుఁడు) చణ్డీశచణ్డాక్షిహుతాశకుణ్డే; చణ్డీశ = పార్వతీపతియైనశివునియొక్క, చణ్డ = తీక్ష్ణమైన, అక్షి = నేత్రమనెడు; హుతాశకుణ్డే = అగ్నికుణ్డమునందు, ఇన్ద్రియాణాం = ఇన్ద్రియములయొక్క, మన్దిరం = స్థానమైనశరీరము, జుహావ = వ్రేల్చెనో.

వి॥ మన్మథుఁడు నలరూపమున పునర్జన్మ మెత్తకపోయినను, ఎత్తినట్లు చెప్పుట వలననుత్ప్రేక్ష. "మన్యే" యని వ్యఞ్జకమునుఁ బ్రయోగించుట వలన నది వాచ్యము.

సమాసములు :

అన్యజన్మ : అన్యం చ తత్ జన్మ చ = అన్యజన్మ. తత్ = అన్యజన్మ.

చణ్డీశచణ్డాక్షిహుతాశకుణ్డే : చణ్డ్యాః ఈశః = చణ్డీశః. చణ్డం చ తత్ అక్షి చ = చణ్డాక్షి. చణ్డీశస్య చణ్డాక్షి = చణ్డీశచణ్డాక్షి. హుతాశస్య కుణ్డం = హుతాశకుణ్డం. చణ్డీశచణ్డాక్షి ఏవ హుతాశకుణ్డం = చణ్డీశచణ్డాక్షిహుతాశకుణ్డం. తస్మిన్ = చణ్డీశచణ్డాక్షిహుతాశకుణ్డే.

భావము :

మన్మథుడే పుణ్యవశమున నీయొక్క రూపముతో పునర్జన్మము నెత్తెను.

ఏల యనగా నతడు శివుని తీక్ష్ణ మగు నేత్ర మనెడి యగ్నికుణ్డమునందు తన శరీరమును వ్రేల్చి గొప్ప పుణ్యమును సంపాదించెను గదా! ॥33॥

శ్లో॥ శోభాయశోభిర్జితశైవశైలం
కరోషి లజ్జాగురుమౌలిమైలమ్ ।
దస్రౌ హఠాత్ శ్రీహరణాదుదస్రౌ
కన్దర్పమప్యుజ్ఝితరూపదర్పమ్ ॥ 34

ప॥వి॥ శోభాయశోభిః । జితశైవశైలం । కరోషి । లజ్జాగురుమౌలిం । ఐలం । దస్రౌ । హఠాత్ । శ్రీహరాణాత్ । ఉదస్రౌ । కన్దర్పమ్ । అపి । ఉజ్ఝితరూపదర్పమ్.

టీక॥ కిఞ్చ = మఱియు, హఠాత్ = బలవన్తముగా, శ్రీహరణాత్; శ్రీ = సౌన్దర్యమును, హరణాత్ = అపహరించుట వలనఁ గల్గిన, శోభాయశోభిః = సౌన్దర్యమువలనికీర్తులచే, జితశైవశైలం; జిత = జయింపబడిన, శైవశైలం = శివునికిసంబంధించిన పర్వతమును అనగా కైలాసమును గల్గిన, ఐలం = ఇలయొక్క కుమారుఁడైన పురూరవుసుని, లజ్జాగురుమౌలిం; లజ్జా = సిగ్గుచే, గురు = భారభూతమైన, మౌలిం = శిరస్సు గల్గినవానినిగా, కరోషి = చేయుచున్నావు. దస్రౌ = అశ్వినీకుమారులను, ఉదస్రౌ = ఉద్భవించిన కన్నీరుగలవారినిగా, కరోషి = చేయుచున్నావు. కన్దర్పం = మన్మథుని, ఉజ్ఝితరూపదర్పం; ఉజ్ఝిత = విడువఁబడిన, రూపదర్పం = సౌన్దర్యగర్వముగలవానిగను, కరోషి = చేయుచున్నావు.

## సమాసములు :

*శోభాయశోభిః* : శోభయా యశాంసి = శోభాయశాంసి. తైః = శోభాయశోభిః.

*జితశైవశైలం* : శివస్య అయం = శైవః. శైవశ్చాసౌ శైలశ్చ = శైవశైలః. జితః శైవశైలః యేన సః = జితశైవశైలః. తమ్ = జితశైవశైలమ్.

*లజ్జాగురుమౌలిమ్* : లజ్జయా గురుః = లజ్జాగురుః. లజ్జాగురుః మౌలిః యస్య సః = లజ్జాగురుమౌలిః. తమ్ = లజ్జాగురుమౌలిమ్.

**ఐలమ్** : ఇలాయాః అపత్యం పుమాన్ = ఐలః. తమ్ = ఐలమ్.

**శ్రీహరణాత్**: శ్రియః హరణం = శ్రీహరణం. తస్మాత్ = శ్రీహరణాత్.

**ఉదస్రౌ**: ఉద్గతాని అస్రాణి యాభ్యాం తౌ = ఉదస్రౌ. తౌ = ఉదస్రౌ.

**ఉజ్ఝితరూపదర్పమ్** : రూపస్య దర్పః = రూపదర్పః. ఉజ్ఝితః రూప దర్పః యేన సః = ఉజ్ఝితరూపదర్పః. తమ్ = ఉజ్ఝితరూపదర్పమ్.

**భావము** :

నీవు బలవన్తముగా సౌందర్యము నపహరించుటవలన, సౌందర్యము వలని కీర్తులచే కైలాసమును జయించిన పురూరవుని లజ్జచే తల వాల్పించితివి. అశ్వినీకుమారుల నేడ్పించితివి. మన్మథుని గర్వము నుడిగించితివి. అనగా పురూరవుఁడు మున్నగువారికంటెను నీవు మిక్కిలి యందగాడ వని దమయన్తి నలునితోఁ బలికినది. ॥34॥

శ్లో॥ అవైమి హంసావలయో వలక్షా
స్త్వత్కాన్తికీర్తేశ్చపలాః పులాకాః ।
ఉడ్డీయ యుక్తం పతితాః స్రవన్తీ
వేశన్తపూరం పరితః ప్లవన్తే ॥ 35

ప॥వి॥ అవైమి । హంసావలయః । వలక్షాః । త్వత్కాన్తికీర్తేః । చపలాః । పులాకాః । ఉడ్డీయ । యుక్తం । పతితాః । స్రవన్తీవేశన్తపూరం । పరితః । ప్లవన్తే.

టీక॥ వలక్షాః = తెల్లనైన, హంసావలయః = హంసలపఙ్క్తులు, తవ = నీయొక్క, కాన్తికీర్తేః = సౌన్దర్యమువలనికీర్తికి, చపలాః = చలించినవై, పులాకాః = తఱకలుగ, అవైమి = తెలుసుకొనుచున్నాను. అతఏవ = కావుననే, ఉడ్డీయ = పైకెగిరి, పతితాః = పడినవై, స్రవన్తీవేశన్త పూరం; స్రవన్తీ = నదులయొక్కయు, వేశన్త = పడియలయొక్కయు, పూరం = ప్రవాహమునకు, పరితః = చుట్టు, ప్లవన్తే = తేలుచున్నవి. యుక్తం = ఇదియుక్తమే.

సమాసములు :

హంసావలయః : హంసానాం ఆవలయః = హంసావలయః.

త్వత్కాంతికీర్తేః : తవ కాన్తిః = త్వత్కాన్తిః. త్వత్కాన్తేః కీర్తిః = త్వత్కాన్తికీర్తిః. తస్యాః = త్వత్కాన్తికీర్తేః.

భావము :

హంసలు నీ సౌందర్యమువలని కీర్తి వలన బెగడొంది తఱకలై పోయినవని తలంతును. కావుననే యవి తఱకలవలెఁ బైకెగరి పడినవై నదుల యొక్కయు, పడియలయొక్కయుఁ బ్రవాహముల చుట్టు తేలుచున్నవి. తఱకలు నీటిపైన తేలుట యుక్తము గదా ॥౩౫॥

శ్లో॥ భవత్పదాఙ్గుష్ఠమపి శ్రితా శ్రీ
ర్ధ్రువం న లబ్ధా కుసుమాయుధేన ।
జేతుస్తమేతత్ఖలుచిహ్నమస్మి
న్నర్ధేన్దురాస్తే నఖవేషధారి ॥ ౩౬

ప॥వి॥ భవత్పదాఙ్గుష్ఠమ్ । అపి । శ్రితా । శ్రీః । ధ్రువం । న । లబ్ధా । కుసుమాయుధేన । జేతుః । తమ్ । ఏతత్ । ఖలు । చిహ్నమ్ । అస్మిన్ । అర్ధేన్దుః । ఆస్తే । నఖవేషధారి.

టీక॥ కుసుమాయుధేన = మన్మథునిచే, భవత్పదాఙ్గుష్ఠం; భవత్ = నీయొక్క, పద = పాదముయొక్క, అఙ్గుష్ఠం = బొటనవ్రేలిని, శ్రితా = ఆశ్రయించిన, శ్రీరపి = సౌన్దర్యముకూడ, నలబ్ధా = పొందఁబడలేదు, తం = ఆమన్మథుని, జేతుః = జయించిన శివునకు, ఏతత్ = ఈ, అర్ధేన్దుః = అర్ధచన్ద్రరూపమైన, చిహ్నం = గుఱుతు, అస్మిన్ = ఈ బొటనవ్రేలియందు, నఖవేషధారి = గోరుయొక్కరూపముధరించినదై, ఆస్తే = ఉన్నది.

సమాసములు:

భవత్పదాఙ్గుష్ఠమ్ : భవతః పదం = భవత్పదం. భవత్పదస్య అఙ్గుష్ఠః = భవత్పదాఙ్గుష్ఠః. తమ్ = భవత్పదాఙ్గుష్ఠమ్.

కుసుమాయుధేన : కుసుమం ఆయుధః యస్య సః = కుసుమాయుధః. తేన = కుసుమాయుధేన.

అర్ద్ధేన్దుః : అర్ధమ్ ఇందోః = అర్ద్ధేన్దుః.

నఖవేషధారి : నఖస్య వేషః = నఖవేషః. నఖవేషం ధారయతీతి = నఖవేషధారి.

**భావము :**

మన్మథుడు నీ కాలి బొటనవ్రేలి గోటి కాన్తినిఁ గూడఁ బొందలేడు. ఇఁక నీ దేహకాన్తి నెట్లు పొందఁగలడు? గోటి కాంతికే యర్హత లేని వ్యక్తి శరీరకాంతి కెట్లర్హతనుఁ బొందును? ఆ బొటనవ్రేలి పైన స్మరుని జయించిన శివునికిఁ జిహ్న మైన చంద్రుడు గోటివేషమును ధరించి యున్నాడు. ఈ విధముగా నర్ధచన్ద్రునిఁ జిహ్నమును దరించుటవలన నీ బొటనవ్రేలును మన్మథుని జయించినదే. కావున నీయొక్క సౌన్దర్యమును మన్మథు డెట్లు బడయఁగలడు? అనగా నీ సౌన్దర్యము మన్మథుని సౌన్దర్యమును మించినదని యాశయము. ఇట్లు దమయన్తి నలునితోఁ జెప్పినది ॥౩౬॥

శ్లో॥ రాజా ద్విజానామనుమాసభిన్నః
పూర్ణాం తనూకృత్య తనుం తపోభిః।
కుహూషు దృశ్యేతరతాం కిమేత్య
సాయుజ్యమాప్నోతి భవన్ముఖస్య॥ ౩౭

ప॥వి॥ రాజా । ద్విజానామ్ । అనుమాసభిన్నః । పూర్ణాం । తనూకృత్య । తనుం । తపోభిః । కుహూషు । దృశ్యేతరతాం । కిమ్ । ఏత్య । సాయుజ్యమ్ । ఆప్నోతి । భవన్ముఖస్య.

టీక॥ ద్విజానాం = ద్విజులకు, రాజా = రాజును (బ్రాహ్మణోత్తముఁడును) నైనచంద్రుఁడు, అనుమాసభిన్నః; అనుమాస = ప్రతిమాసము, భిన్నః = వేఱగుచు, పూర్ణాం = పున్నమలయందు నిండుఁదనమునుఁ బొందిన, తనుం = శరీరమును, తపోభిః = తపస్సులచే ననగా ప్రతి

దినము తనకళలను దేవతలకు సమర్పించుటయను తపములచే, తనూకృత్య=కృశముఁగావించి, కుహూషు = అమావాస్యలయందు, దృశ్యేతరతాం; దృశ్య= దృశ్యమునకంటె, ఇతరతాం = భిన్నముగా నుండుటను, ననగా నదృశ్యత్వమును, ఏత్య=పొంది, భవన్ముఖస్య = నీముఖముయొక్క, సాయుజ్యం=ఐక్యమును, అప్నోతికిం = పొందు చున్నాడాయేమి.?

## సమాసములు :

అనుమాసభిన్నః : మాసే మాసే = అనుమాసం. అనుమాసం-భిన్నః=అనుమాసభిన్నః.

దృశ్యేతరతాం : ద్రష్టుం యోగ్యః=దృశ్యః. దృశ్యాత్ ఇతరః = దృశ్యేతరః. దృశ్యేతరస్య భావః=దృశ్యేతరతా. తామ్=దృశ్యేతరతామ్.

భవన్ముఖస్య : భవతః ముఖం=భవన్ముఖం. తస్య=భవన్ముఖస్య.

## భావము :

ద్విజరాజగు చంద్రుఁడు (బ్రాహ్మణోత్తముడు) ప్రతిమాసము భిన్నుఁడగుచు పూర్ణిమలయందు నిండుఁదనమునుఁ బొందిన తన శరీరమును, తన కళలను దేవతల కర్పించుట యను తపములచే కృశింపఁజేయుచు అమావాస్యలయందు నదృశ్యుడై నీ ముఖమునందు నైక్యము నొందుచున్నాడా యేమిః ఏవిధముగా బ్రాహ్మణుడు తీవ్రతపముచే బ్రహ్మ సాయుజ్యము నొందునో, అటే చంద్రుడును ప్రతిమాసమందలి యమావాస్యలలో నీ ముఖమునం దైక్యము నొందుచున్నాడు. అట్లు కానిచో నమావాస్యలయందు చంద్రు డెక్కడికిఁ బోవును ॥32॥

శ్లో॥ కృత్వా దృశౌ తే బహువర్ణచిత్రే
కిం కృష్ణసారస్య తయోర్మృగస్య।
అదూరజాగ్రద్విదరప్రణాళీ
లేఖామయచ్ఛద్విధిరర్ధచన్ద్రిమ్॥ 33

ప॥వి॥ కృత్వా । దృశౌ । తే । బహువర్ణచిత్రే । కిం । కృష్ణసారస్య । తయోః । మృగస్య । అదూరజాగ్రద్ద్వేదరప్రణాళీరేఖామ్ । అయచ్ఛత్ । విధిః । అర్ధచన్ద్రిమ్.

టీక॥ విధిః = బ్రహ్మ, బహువర్ణచిత్రే; బహువర్ణ = పెక్కువర్ణములచే ననగా నలుపుతెలుపు వన్నెలచే, చిత్రే = విచిత్రములైన, తే = నీయొక్క, దృశౌ = నేత్రములను, కృత్వా = చేసి, కృష్ణసారస్య = కృష్ణసారమను, మృగస్య = జింకకు సంబంధించిన, తయోః = ఆనేత్రములకు, అదూరజాగ్రద్ద్వేదరప్రణాళీరేఖామ్; అదూర = సమీపమునందు, జాగ్రత్ = నెలకొనిన, విదర = పల్లపు, ప్రణాళీ = స్రోవయొక్క, రేఖాం = గీతయను, అర్ధచన్ద్రిం = అర్ధచన్ద్రిప్రయోగమును, అనగా మెడపట్టిగెంటుటను, అయచ్ఛత్ కిం = ఇచ్చెనాయేమి.

వి॥ "అదూరజాగ్రద్ద్వేదరప్రణాళీచ్ఛలాత్" అను పాఠము ననుసరించి 'ఛల' శబ్దప్రయోగముచే అపహ్నవము. మెడఁ బట్టి గెంటక పోయినను, మెడఁ బట్టి గెంటెనా యేమి యని భావించుటచే, ను త్ప్రేక్ష. అవి యపహ్నవముతోఁ గూడినందువలన సాపహ్నవము. వ్యఞ్జకమునుఁ బ్రయోగించనందువలన ఉత్ప్రేక్ష గమ్యము.

## సమాసములు :

బహువర్ణచిత్రే : బహవశ్చ తే వర్ణాశ్చ = బహువర్ణాః. బహువర్ణైః చిత్రే = బహువర్ణచిత్రే. తే = బహువర్ణచిత్రే.

అదూరజాగ్రద్ద్వేదరప్రణాళీరేఖామ్ : న దూరం = అదూరం. అదూరే జాగ్రతీ = అదూరజాగ్రతీ. విదరస్య ప్రణాళీ = విదరప్రణాళీ. అదూరజాగ్రతీ చ సా విదరప్రణాళీ చ = అదూరజాగ్రద్ద్వేదరప్రణాళీ. అదూరజాగ్ర ద్వేదరద ప్రణాళ్యేవ రేఖా = అదూరజాగ్రద్ద్వేదర ప్రణాళీరేఖా. తామ్ = అదూరజాగ్రద్ద్వేదరప్రణాళీరేఖామ్.

అర్ధచన్ద్రిమ్ : అర్ధం చన్ద్రిస్య = అర్ధచన్ద్రిః. తమ్ = అర్ధచన్ద్రిమ్.

## భావము :

బ్రహ్మ పెక్కు వర్ణములచే అనగా తెలుపు నలుపు ఎఱుపు వన్నెలచే, విచిత్రములైన నీ నేత్రములను సృజించినాఁడు. కాని నీ నేత్రములనుఁ జూచి

కృష్ణసార మను జింక నీ నేత్రములతో సామ్యముఁ గోరి, వానితో తన నేత్రములను సమానములుగాఁజేయ నారంభించినది. కృష్ణసార మనుటలో, నా జింకయందు కృష్ణవర్ణమే సారముగా ననగా ముఖ్యముగా నున్నట్లును నితరము లగు వర్ణములు, అనగా తెలుపు, ఏఱుపు, వన్నెలు, లేనట్లును సూచితము. కాన నీ నేత్రములలో కృష్ణవర్ణమే గాక తదితము లగు శ్వేత రక్తవర్ణములను విధి కూర్చెను కానఁ బెక్కు వర్ణములచే విచిత్రము లగు నీ నేత్రములతో తన నేత్రములకు సామ్యము గోరిన యా కృష్ణసారమృగముయొక్క నేత్రములకు విధి దాని కన్నుల సమీపమందలి పల్లపుగీతల నెపముచే నర్ధచన్ద్రప్రయోగముఁ గ వించెనా యని తోచుచున్నది. అనగా దాని కన్నుల సమీపమందుఁ గానవచ్చు రేఖ యర్ధచంద్రాకారముగఁ గానవచ్చుటచే నది విధి వానికిచ్చిన యర్ధచన్ద్రా కారముగా భావితము. ఉత్తములతో సామ్యముఁ బొందఁగోరువారిని మెడపట్టి గెంటుట సహజమే గదా! అనగా నలుని నేత్రములు జింకకన్నులను మించి యున్న వని సారము. ఇట్లు దమయన్తి నలుని వర్ణించినది. ॥౩౮॥

శ్లో॥ ముగ్ధస్స మోహాత్ సుభగాన్న దేహాత్
దదత్ భవద్భ్రూరచనాయ చాపమ్।
భ్రూభఙ్గజేయ స్తవ యన్మనోభూ
రనేన రూపేణ యదాతదాభూత్॥ ౩౯

ప॥వి॥ ముగ్ధః । సః । మోహాత్ । సుభగాత్ । న । దేహాత్ । దదత్ । భవద్భ్రూరచనాయ । చాపమ్ । భ్రూభఙ్గజేయః । తవ । యత్ । మనోభూః । అనేన । రూపేణ । యదాతదా । అభూత్.

టీక॥ భవద్భ్రూరచనాయ; భవత్ = నీయొక్క, భ్రూ = కనుబొమ్మలను, రచనాయ = సృజించుటకు, చాపం = తనధనుస్సును, (బ్రహ్మణే = బ్రహ్మకొఱకు) దదత్ = ఇచ్చుచున్న, సః = ఆమన్మథుఁడు, మోహాత్ = అజ్ఞానమువలన, అనగా, విమర్శించి చేయనందువలన, ముగ్ధః = మూఢుడుగా, అభూత్ = ఆయెను. సుభగాత్ = సున్దరమైన, దేహాత్తు = దేహమువలననో, న = కాదు. యత్ = ఏలయనగా, తవ = నీకు, అనేన = ఈ, రూపేణ = రూపముచేతననగా సౌన్దర్యముచే, యదా

తదా = ఎల్లప్పుడు, భ్రూభఙ్గజేయః; భ్రూభఙ్గ = బొమముడిపాటు చేతనే, జేయః = జయింపశక్యమైనవాఁడుగా, అభూత్ = ఆయెను.

## సమాసములు :

*భవద్భ్రూరచనాయ* : భవతః భ్రువౌ = భవద్భ్రువౌ. భవద్భ్రువోః రచనమ్ = భవద్భ్రూరచనం. తస్మై = భవద్భ్రూరచనాయ.

*భ్రూభఙ్గజేయః* : భ్రువోః భఙ్గః = భ్రూభఙ్గః. భ్రూభఙ్గేన జేయః = భ్రూభఙ్గజేయః.

## భావము :

నీ కనుబొమ్మలను నిర్మించుటకు మన్మథుఁడు తన వింటిని బ్రహ్మ కిచ్చెను. ఈ విధముగా యుక్తాఽయుక్తములను విమర్శింపక తన వింటి నిచ్చుట వలన నతడు ముగ్ధు డాయెను. అనగా మూఢు డాయెను, కాని యందమైన శరీరమును వహించుటవలన ముగ్ధుఁ డనగా సున్దరుఁడు కాలేదు. ఎవడు తన ఆయుధమును శత్రువున కిచ్చునో యతడు నిరాయుధు డగుట వలన శత్రువుచే సులభముగ నోడింపఁబడును కావున మన్మథుడు ముగ్ధుడనగా మూర్ఖుఁడే గాని యందకాడు కాడు. కాన నా మన్మథుఁ డిప్పుడు నిరాయుధుఁడు. కాన నెల్లప్పుడును నీవు నీ సౌన్దర్యము చేతను బొమముడిపాటుచేతను వానిని సుఖముగా జయింపఁగలవు. మన్మథుఁడు తన రూపముచేత నిన్నెప్పుడును జయింపఁ జాలడు. ఇక విల్లు లేనందువలన వింటిచేతను జయింప లేడు కాన నుభయభ్రష్టు డాయె నని యాశయము—ఇట్లు దమయన్తి నలునితోఁ జెప్పెను॥౩౯॥

శ్లో॥ మృగస్య నేత్రద్వితయం త్వదాస్యే
విధౌ విధుత్వానుమితస్య దృశ్యమ్ ।
తస్యైవ చ త్వత్కచపాశవేశః
పుచ్ఛేస్ఫురచ్చామరగుచ్ఛ ఏషః॥ ౪౦

ప॥వి॥ మృగస్య । నేత్రద్వితయం । త్వదాస్యే । విధౌ । విధుత్వానుమితస్య ।

దృశ్యమ్ । తస్య । ఏవ । చ । త్వత్కచపాశవేశః । పుచ్ఛే । స్ఫురచ్చామరగుచ్ఛః । ఏషః.

టీక॥ త్వదాస్యే = నీమోమనెడి, విధౌ = చంద్రునియందు, దృశ్యం = కానవచ్చెడి, నేత్రద్వితయం = రెండుకన్నులు, విధుత్వానుమితస్య: విధుత్వే = చన్ద్రత్వధర్మముచే, అనుమితస్య = ఊహింపఁబడిన చన్ద్రుని యొక్క, మృగస్య = జింకకుసంబంధించినవి. (కిఞ్చ = మఱియు) ఏషః = ఈ, త్వత్కచపాశవేశః; త్వత్ = నీదైన, కచపాశవేశః = కేశపాశముయొక్క సన్నివేశము, తస్యైవ = ఆమృగముయొక్కయే, పుఛ్ఛే = తోకయందు, స్ఫురచ్చామరగుచ్ఛః; స్ఫురత్ = ప్రకాశించెడి, చామరగుచ్ఛః = చామరపుగుత్తి.

వి॥ నేత్రములు రెండును మృగమునకు సంబంధించక పోయినను, సంబంధించిన వని భావించుటవలనను, ఆ మృగము యొక్క తోకయందలి చామరగుచ్ఛముగా కేశపాశము కాక పోయినను చామరగుచ్ఛ మైనట్లు భావించుటవలనను నుత్ప్రేక్ష.

భావము :

నీ మోమనెడి చన్ద్రుని యందు కాన వచ్చెడి కన్నులు రెండును, చన్ద్రుడుగా నూహింపఁబడిన నీ ముఖచంద్రునియందున్న జింకయొక్క కనులు నీ కేశపాశము గూడ నాజింకకు సంబంధించిన తోకయందలి చామరపు గుత్తి. అట్లు కానిచో నీ నేత్రముల కింతటి శోభయు నీ కేశ పాశమున కింతటి సౌన్దర్యము నెట్లువచ్చును అని దమయన్తి నలుని వర్ణించు చున్నది. ॥౪౦॥

శ్లో॥ ఆస్తామనఙ్గీకరణాద్భవేన
దృశ్యః స్మరో నేతి పురాణవాణీ ।
తదైవ దేహం శ్రితయా శ్రియేతి
నవస్తు వస్తు ప్రతిభాతి వాదః॥ ౪౧

ప॥వి॥ ఆస్తామ్ । అనఙ్గీకరణాత్ । భవేన । దృశ్యః । స్మరః । న । ఇతి ।

పురాణవాణీ । తవ । ఏవ । దేహం । శ్రితయా । శ్రియా । ఇతి । నవః । తు । వస్తు । ప్రతిభాతి । వాదః.

టీక॥ స్మరః = మన్మథుఁడు, భవేన = శివునిచే, అనఙ్గీకరణాత్ = అనఙ్గుడుగా ననగా శరీరములేనివాడుగ చేయుటవలన, దృశ్యః = కనఁబడువాఁడుగా, నేతి = కాడను, పురాణవాదః = ప్రాతకాలపుమాట, ఆస్తాంతావత్ = ఉండనిమ్ము. తవైవ = నీదియేయైన, దేహం = శరీరమును, శ్రితయా = ఆశ్రయించిన, శ్రియా = సౌన్దర్యముచే, నదృశ్యః = కనఁబడడను, నవః = నూతనమైన, వాదస్తు = వాదమో, వస్తు = నిజముగా, ప్రతిభాతి = తోచుచున్నది.

వి॥ మన్మథుఁడు శరీరము లేనందువలన కనబడక పోవుట సహజము. కాని యిచ్చట నలుని సౌన్దర్యముచే సిగ్గుపడి కనబడకయున్నాడని సిగ్గుపడుటను కారణముగాఁజెప్పుటవలన నుత్ప్రేక్ష.

సమాసములు :

అనఙ్గీకరణాత్ : నానఙ్గస్య అనఙ్గస్య సమ్పద్యమానస్య కరణం = అనఙ్గీకరణం. తస్మాత్ = అనఙ్గీకరణాత్.

పురాణవాణీ : పురాణా చ సా వాణీచ = పురాణవాణీ.

భావము :

మన్మథుని శివుఁడు భస్మముగావించి శరీరము లేనినివానిగాఁ జేయుట వలన నతడు కానవచ్చుటలేదనుట ప్రాతకాలపు మాటకాని సౌన్దర్యము నీయందు నెలకొనుటవలన నతడు సిగ్గుపడి కానవచ్చుటలేదను నూతనవాదమే సత్యమైనది. ॥౪౧॥

శ్లో॥ త్వయా జగత్యుచ్చితకాన్తిసారే
యదిన్దునాఽశీలి శిలోఞ్ఛవృత్తిః।
ఆరోపి తన్మాణవకోపి మౌలౌ
స యజ్వరాజ్యేఽపి మహేశ్వరేణ॥ ౪౨

మిక్కిలి సున్దరుఁడుగా వెలుగొందుచుండుటవలన శివుఁడు వీనిని తనకు శిరోభూషణము గావించుకొనెను. శిలోఞ్ఛవృత్తిచేఁ దాపసోత్తముఁడై వెలయుటవలన ద్విజరాజ్యమునం దభిషేకింపఁబడెను. పూర్వము ద్విజులు, అయాచితవృత్తిగలవారై శిలోఞ్ఛవృత్తులతో పవిత్రమైనఁ జీవితమునుఁ గావించెడివారు. అట్లే చన్ద్రుఁడును సౌన్దర్యమునకై శిలోఞ్ఛవృత్తినిఁ గావించె నని యాశయము. ఇట్లు దమయన్తి నలునిఁ గూర్చి చెప్పినది. ॥౫౩॥

శ్లో॥ ఆదేహదాహం కుసుమాయుధస్య
విధాయ సౌన్దర్యకథాదరిద్రమ్।
త్వదఙ్గశిల్పాత్పునరీశ్వరేణ
చిరేణ జానే జగదన్వకమ్పి॥ ౫౩

ప॥వి॥ ఆదేహదాహం। కుసుమాయుధస్య। విధాయ। సౌన్దర్యకథాదరిద్రమ్। త్వదఙ్గశిల్పాత్। పునః। ఈశ్వరేణ। చిరేణ। జానే। జగత్। అన్వకమ్పి।

టీక॥ ఈశ్వరేణ = శివునిచే, కుసుమాయుధస్య = మన్మథునియొక్క, ఆదేహదాహం = శరీరమునుదగ్ధముఁగావించినదిమొదలు, జగత్ = ప్రపఞ్చమును, సౌనర్యకథాదరిద్రం; సౌన్దర్యకథా = అందమునకుసంబంధించిన సమాచారములతో, దరిద్రం = శూన్యముగా, విధాయ = కావించి, చిరేణ = చాలకాలమునకు, త్వదఙ్గశిల్పాత్; త్వత్ = (నలుడవైన) నీయొక్క, అఙ్గ = శరీరమును, శిల్పాత్ = నిర్మించుటవలన, (విశ్వం = ప్రపఞ్చము) పునః = మఱల, అన్వకమ్పి = అనుగ్రహింపఁబదినది, (ఇతి = అని) జానే = తెలిసికొనుచున్నాను.

వి॥ నలుని సృష్టిచే సౌన్దర్యశూన్యమైన ప్రపఞ్చ మనుగ్రహింపబడక పోయినను, ననుగ్రహింపఁబడినట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష.

సమాసములు :

ఆదేహదాహమ్ : దేహస్య దాహః = దేహదాహః. దేహదాహాదారభ్య = ఆదేహదాహమ్.

సౌన్దర్యకథాదరిద్రమ్ : సౌన్దర్యస్య కథా = సౌన్దర్యకథా. సౌన్దర్య కథయా దరిద్రమ్ = సౌన్దర్యకథాదరిద్రమ్. తత్ = సౌన్దర్యకథాదరిద్రమ్.

త్వదఙ్గశిల్పాత్ : తవ అఙ్గం = త్వదఙ్గం. త్వదఙ్గస్య. శిల్పమ్ = త్వదఙ్గ శిల్పం. తస్మాత్ = త్వదఙ్గశిల్పాత్.

**భావము :**

మహేశ్వరుఁడు మన్మథుని భస్మము చేసిన వెంటనే చాలకాలము ప్రపఞ్చము సౌన్దర్యశూన్యమైనది. తర్వాత దివ్యసున్దరశరీరమును సృజించుటవలన మఱల ప్రపఞ్చ మనుగ్రహింపఁబడి నీవలన సౌన్దర్యభరితమై వెలుగుచున్న దని భావము. అనగా నీకును మన్మథునకును భేధము లేదని సారాంశము ॥౪౩॥

శ్లో॥ మహీ కృతార్థా యది మానవోఽసి
జితం దివా యద్యమరేషు కోఽపి।
కులం త్వయాలఙ్కృతమౌరగఞ్చే
న్నాధోఽపి కస్యోపరి నాగలోకః॥ ౪౪

ప॥వి మహీ । కృతార్థా । యది । మానవః । అసి । జితం । దివా । యది । అమరేషు । కః । అపి । కులం । త్వయా । అలఙ్కృతమ్ । ఔరగం । చేత్ । న । అధః । అపి । కస్య । ఉపరి । నాగలోకః.

టీక॥ మానవః = మనుష్యుడుగా, అసియది = అయితివో, మహీ = భూమి, కృతార్థా = సఫలమగుచున్నది. అమరేషు = వేల్పులలో, కోఽప్యసి యది = ఒకానొకడవైతివో, దివా = ద్యులోకముచే, జితం = జయింపఁ బడుట. అనగా సర్వోత్కర్షగా వెలయుటయే. త్వయా = నీచే, ఔరగం = ఉరగములకు ననగా నాగములకు సంబంధించిన, కులం = వంశము, అలఙ్కృతంచేత్ = అలంకరింపఁబడినచో, అధోఽపి = అట్నికంటెను నడుగుభాగమునందున్నను, నాగలోకః = నాగలోకము, కస్య = ఏలోకమునకు, ఉపరి = పైన, న = ఉండదు. అన్నింటికిని పైన తప్పకయుండఁగలదు.

**సమాసములు :**

మానవః : మనోరయం = మానవః.

*ఔరగం* : ఉరగాణామిదం = ఔరగం.

**భావము :**

నీవు మానవుఁడ వైనచో భూమి నీవంటివానినిఁ గనినందువలన సఫల-ము గును. వేల్పులలో నీవొక్కఁడ వైనచో, నీవంటివానినిఁ గల్గి యుండుటవలన దేవలోక మన్నింటిని మించినదే యగును. ఇక నీవు నాగకులమునకుఁ జెందిన-వాఁడ వైనచో నింతవరకు నన్నిటికంటెను నడుగున పడిన నాగలోక మన్ని లోకములకంటెనుఁ బైనయుండినదే యగు నని దమయన్తి నలునిగూర్చి వక్కా-ణించెను. ॥౪౪

శ్లో॥ సేయం న ధత్తేఽనుపపత్తిముచ్చై-
ర్మచ్చిత్తవృత్తిస్త్వయి చిన్త్యమానే।
మమౌ స భద్రం చులుకే సముద్ర-
స్త్వయాత్తగామ్భీర్యమహత్త్వముద్రః॥ ౪౫

ప॥వి॥ సా । ఇయం । న । ధత్తే । అనుపపత్తిం । ఉచ్చైః। మచ్చిత్తవృత్తిః । త్వయి । చిన్త్యమానే । మమౌ । సః । భద్రం । చులుకే । సముద్రః । త్వయా । ఆత్తగామ్భీర్యమహత్త్వముద్రః.

టీక॥ త్వయి = నీవు, చిన్త్యమానేసతి = స్వరూపముతోఁడను గుణముతోడను-నాలోచింపఁబడుచుండగనే, మచ్చిత్తవృత్తిః, మత్ = నాయొక్క, చిత్తవృత్తిః = మనోవృత్తి, ఉచ్చైః = గొప్పదైన, అనుపపత్తిం = హేతు-రాహిత్యచిన్తను, నధత్తే = వహించుటలేదు. సః = ఆ, సముద్రః = సాగరము, త్వయా = నీచే, ఆత్తగామ్భీర్యమహత్త్వముద్రః; ఆత్త = గ్రహింపఁబడిన, గామ్భీర్య = లోతును, మహత్త్వ = గొప్పతనమును, ముద్రః = చిహ్నములుగాఁగలదై, చులుకే = అగస్త్యునియరచేతియందు, మమౌ = పట్టినది, భద్రం = యుక్తము.

వి॥ సముద్ర మగస్త్యుని యరచేతఁ బట్టుటకు గామ్భీర్యమహత్త్వములు నలునిచే గ్రహింపఁబడుట హేతువు కాన, నరచేతఁబట్టె నను నర్థము

గామ్భీర్యమహత్త్వముల గ్రహణముచే సమర్థితములు గాన కావ్యలిఙ్గాలఙ్కారము.

అనుపపత్తిగాహిత్యమునకు గాంభీర్యమహత్త్వములను గ్రహించుట హేతువు కాకపోయినను, హేతువుగాఁ జెప్పుటవలన నుత్ప్రేక్ష. "భద్రమ్" అను వ్యఞ్జకమునుఁ బ్రయోగించుటవలన నది వాచ్యము.

## సమాసములు :

అనుపపత్తిమ్ : ఉపపత్తేరభావః = అనుపత్తిః. తామ్ = అనుపపత్తిమ్.

మచ్చిత్తవృత్తిః : చిత్తస్యవృత్తిః = చిత్తవృత్తిః. మమచిత్తవృత్తిః = మచ్చిత్తవృత్తిః.

ఆత్తగామ్భీర్యమహత్త్వముద్రః : గమ్భీరస్య భావః = గామ్భీర్యమ్. మహతోభావః = మహత్త్వమ్. గామ్భీర్యం చ మహత్త్వం చ = గామ్భీర్యమహత్తే. గమ్భీర్యమహత్త్వే ఏవ ముద్రా = గామ్భీర్యమహత్త్వముద్రా. ఆత్తా గామ్భీర్యమహత్త్వముద్రా యస్య సః = ఆత్తగామ్భీర్యమహత్త్వముద్రః.

## భావము :

నిన్ను స్వరూపమునుఁ బట్టియు గుణమునుఁ బట్టియు నాలోచించినచో నాకొక సంశయము తీఱినది. అదేదనగా—సముద్రుని నగస్త్యమహర్షి తన యరచేత నింపుకొని పానముఁ జేసెనని చెప్పుదురు గదా! అంత లోతును వైశాల్యమును గల్గిన యా సముద్ర మాతని యరచేత నెట్లు పట్టినదని యింత కాలము సందేహించుచుంటిని. కాని యిప్పుడా సందేహము తీరినది. ఏలయనగా సముద్రమందలి, లోతు, వైశాల్యము, మాహాత్త్వము మున్నగు గుణములు నీచే గ్రహింపఁబడినవి గాన సముద్రము స్వల్పమైనదై యా యచస్త్యుని యరచేతఁ బట్టినది. ఇది యుక్తమైనదే. ॥౮౨॥

శ్లో॥ సంసారసింధావనుబిమ్బమత్ర
జాగర్తి జానే తవ వైరసేనిః।
బిమ్బానుబిమ్బౌ హి విహాయ ధాతు
ర్న జాతు దృష్టాతిసరూపసృష్టిః॥ ౮౩

ప॥వి॥ సంసారసింధౌ । అనుబిమ్బమ్ । అత్ర । జాగర్తి । జానే । తవ । వైరసేనిః । బిమ్బానుబిమ్బౌ । హి । విహాయ । ధాతుః । న । జాతు । దృష్టా । అతిసరూపసృష్టిః.

టీక॥ (కిఞ్చ=మఱియు) అత్ర = ఈ, సంసారసిన్ధౌ = సంసారసాగరమునందు, వైరసేనిః = వీరసేనునికుమారుఁడైననలుడు, తవ = నీకు, అనుబిమ్బం = ప్రతిబింబముగా, జాగర్తి = ప్రకాశించుచున్నాడు. (ఇతి=ఇట్లు) జానే = ఊహింతును. హి = ఎందువలన, బిమ్బానుబిమ్బౌ = బిమ్బప్రతిబిమ్బములను, విహాయ = వదలి, ధాతుః = బ్రహ్మకు, అతిసరూపసృష్టిః; అతిసరూప=మిక్కిలిసమానరూపములుగలవస్తువులయొక్క, సృష్టిః=సృష్టి, జాతు=ఒకప్పుడును, న=లేదు.

## సమాసములు ;

*సంసారసింధౌ* : సంసార ఏవ సిన్ధుః = సంసారసిన్ధుః. తస్మిన్ = సంసారసిన్ధౌ.

*వైరసేనిః* : వీరసేనస్య అపత్యం పుమాన్ = వైరసేనిః.

*బిమ్బానుబిమ్బౌ* : బిమ్బశ్చ అనుబిమ్బశ్చ = బిమ్బానుబిమ్బౌ.

*అతిసరూపసృష్టిః* : అత్యంతం సరూపౌ = అతిసరూపౌ. అతిసరూపయోః సృష్టిః = అతిసరూపసృష్టిః.

## భావము :

ఈ సంసారసాగరమునందు నలుడొక్కడే నీకు ప్రతిబిమ్బముగాఁ గానవచ్చుచున్నాడు. సమానరూపములుగల వస్తువులను సృజించునపుడు బ్రహ్మ యెప్పుడును బిమ్బప్రతిబిమ్బములను వదలి సృజించుటలేదు. కాన నలుఁడు నీకు ప్రతిబిమ్బము కానిచో నిట్టి సామ్య మెట్లు పొసంగును. కాన నీవు నలుఁడవని నాకు తోచుచున్నది. ॥౪౭॥

శ్లో॥ ఇయత్కృతం కేన మహీజగత్యా
మహో మహీయః సుకృతం జనేన।

పాదౌ యముద్దిశ్య తవాఽపి పద్యా
రజస్సు పద్మస్రజమారభేతే॥ ౪౭

ప॥వి॥ ఇయత్ । కృతం । కేన । మహీజగత్యామ్ । అహో । మహీయః । సుకృతం । జనేన । పాదౌ । యమ్ । ఉద్దిశ్య । తవ । అపి । పద్యా. రజస్సు । పద్మస్రజమ్ । ఆరభేతే.

టీక॥ మహీజగత్యాం = భూలోకమందు, కేన = ఎవ్వనిచే, ఇయత్ = ఇంతటి, మహీయః = గొప్పదైన, సుకృతం = పుణ్యము, కృతం = చేయఁబడినది. అహో = ఆశ్చర్యము, యం = ఎవనినిఁగూర్చి, తవాఽపి = నీయొక్కయు, పాదౌ = పాదములు, పద్యారజస్సు; పద్యా = మార్గమందలి, రజస్సు = దుమ్ములయందు, పద్మస్రజం = పద్మమాలను, ఆరభేతే = నిర్మించుచున్నవి. అహో = ఆశ్చర్యము.

సమాసములు;

*మహీజగత్యాం*: మహ్యేవ జగతీ = మహీజగతీ. తస్యాం = మహీజత్యాం.

*మహీయః* : అత్యంమహత్ = మహీయః.

*పద్యారజస్సు* : పద్యానాం రజాంసి = పద్యారజాంసి. తేషు = పద్యారజస్సు.

*పద్మస్రజమ్* : పద్మానాం స్రక్ = పద్మస్రక్. తామ్ = పద్మస్రజమ్.

భావము:

భూలోకమునం దే వ్యక్తి యింత గొప్ప పుణ్యమునుఁ గావించెనో కాని అట్టి వ్యక్తినిఁ గూర్చి నీ పాదము మార్గధూళులయందుఁ బద్మమాలను నిర్మించుచున్నది. ఇది మిక్కిలి ఆశ్చర్యము. నలుని పాదములు పద్మముల వలె నున్నవి. మఱియు నాపాదములయందు పద్మరేఖలున్నవి. కాన నతడు నడచిన మార్గమంతయు నాపాదపద్మముల జాడలు పడి పద్మమాలవలెఁ గానవచ్చును. కాన పాదములు పద్మమాలను నిర్మించునట్లు చెప్పఁబడినది. ఇట్లు దమయన్తి నలునిఁ గూర్చి యాతవే వ్యక్తికై భూలోకమున కరుదెంచెనో చెప్పమని ప్రశ్నించినది. ॥౪౭॥

శ్లో॥ బ్రవీతి మే కిం కిమియం న జానే
సన్దేహడోలామవలమ్బ్య సంవిత్ ।
కస్యాఽపి ధన్యస్య గృహాతిథిత్వ
మలీకసమ్భావనయాఽథవాఽలమ్ ॥ ౪౦

ప॥వి॥ బ్రవీతి । మే । కిం । కిం । ఇయం । న । జానే । సన్దేహడోలామ్ । అవలమ్బ్య । సంవిత్ । కస్య । అపి । ధన్యస్య । గృహాతిథిత్వమ్ । అలీకసమ్భావనయా । అథ । వా । అలమ్.

టీక॥ ఇయం = ఈ, మే = నాయొక్క, సంవిత్ = బుద్ధి, సన్దేహడోలామ్; సన్దేహ = సంశయమను, డోలాం = ఊయెలను, అవలమ్బ = ఎక్కి, కింకిం = దేనిని, దేనిని, అనగా దేనినో, దేనినో, బ్రవీతి = చెప్పుచున్నది, అనగానూహించుచున్నది. అతః = ఇందువలన, నజానే = నిశ్చయించుకొనలేకయున్నాను. అథవా = లేదా, అలీకసమ్భావనయా = అసత్యపుటూహతో, అలం = చాలును. కిన్తు = కాని, త్వం = నీవు, కస్య = ఏ, ధన్యస్య = ధన్యునియొక్క, లేదా నాకంటెనితరమైనవ్యక్తియొక్క, గృహాతిథిః; గృహ = ఇంటికి, అతిథిః = అతిథిగా, అసి = అయియున్నావు.

**సమాసములు :**

*సందేహడోలామ్ :* సందేహ ఏవ డోలా = సందేహడోలా. తామ్ = సందేహడోలామ్.

*గృహాతిథి :* గృహస్య అతిథిః = గృహాతిథిః,

*అలీకసమ్భావనయా :* అలీకా చ సా సమ్భావనా చ = అలీకసమ్భావనా. తయా = అలీకసమ్భావనయా.

**భావము :**

నా బుద్ధి నీవు మాకై వచ్చితివా? మఱెవ్వరికైనను వచ్చితివా? అను సందేహ మను నూయలలో నూగుచు నేమేమో యూహించు కొనుచున్నది.

కావున, నేనీవిషయము నిశ్చయించుకొనలేక యున్నాను లేదా యీ యసత్యము లైన నితర్కములతో నేమి పని? నీవు ఏ ధన్యమైన వ్యక్తికి అనగా నాకుగాని, నాకంటె నితరమైన మఱి యొక వ్యక్తికి గాని యతిథిగా వచ్చినచో వివరింపఁ బ్రార్థింతును, అని దమయన్తి నలునికిఁ జెప్పినది॥౪౮॥

శ్లో॥ ప్రాప్తైవ తావత్ తవ రూపసృష్టం
నిపీయ దృష్టిర్జనుషః ఫలం మే ।
అపి శ్రుతీ నాఽమృతమాద్రియేతాం
తయోః ప్రసాదీకురుషే గిరశ్చేత్ ॥ ౪౯

ప॥వి॥ ప్రాప్తా । ఏవ । తావత్ । తవ । రూపసృష్టం । నిపీయ । దృష్టిః । జనుషః । ఫలం । మే । అపి । శ్రుతీ । న । అమృతమ్ । అద్రియేతామ్ । తయోః । ప్రసాదీకురుషే । గిరః । చేత్.

టీక॥ తావత్ = మొదట, మే = నాయొక్క, దృష్టిః = నేత్రము, తవ = నీయొక్క, రూపసృష్టం: రూప = ఆకారముచే, సృష్టం = కల్పింపఁబడిన, అమృతం = అమృతమును, నిపీయ = త్రాగి, జనుషః = జన్మమునకు, ఫలం = ఫలమును, ప్రాప్తైవ = పొందియైనది. అథ = ఇఁక, శ్రుతీఅపి = కర్ణములుగూడ, అమృతం = అమృతమును, నాద్రియేతాం = పానముఁజేయవా యేమి? తప్పక పానముఁజేయగలవు. (కాని) తయోః = ఆకర్ణములకు, గిరః = నీమాటలను, ప్రసాదీకురుషేచేత్ = ప్రసాదములుగాఁచేసినచో (తప్పక కర్ణములుగూడనమృతపానముఁచేయ గలవు.)

సమాసములు :

రూపసృష్టం : రూపేణ సృష్టం = రూపసృష్టం. తత్ = రూపసృష్టమ్.

భావము :

నా నేత్రములు నీ యాకారముచే గల్గిన యమృతమునుఁ బానముఁ గావించి తమ జన్మమునకు ఫలమునఁ బొందినవి. ఇఁక నా కర్ణములు గూడ నట్టి యమృతమును గ్రోలవా? తప్పక గ్రోలగలవు. కాని నీవు మాటల నను

గ్రహింపవలయును. అట్లును గ్రహించినప్పుడే యవి యమృతపానముఁజేయఁ గలవు. కాన దయచేసి పలుకుము, అని దమయన్తి నలునితోఁ చెప్పినది. ॥౪౯॥

శ్లో॥ ఇత్థం మధూత్థం రసముద్గిరన్తీ
తదోష్ఠబన్ధూకధనుర్విసృష్టా ।
కర్ణాత్ప్రసూనాశుగపఞ్చబాణీ
వాణీమిషేణాఽస్య మనో వివేశ॥ ౫౦

ప॥వి॥ ఇత్థం । మధూత్థం । రసమ్ । ఉద్గిరన్తీ । తదోష్ఠబన్ధూకధనుర్విసృష్టా । కర్ణాత్ । ప్రసూనాశుగపఞ్చబాణీ । వాణీమిషేణ । అస్య । మనః । వివేశ.

టీక॥ ఇత్థం = ఇట్లు, మధూత్థం; మధు = తేనెనుండి, ఉత్థం = ఉద్భవించిన, రసం = రసమును; ఉద్గిరన్తీ = స్రవింపఁజేయుచున్న, తదోష్ఠబన్ధూకధనుర్విసృష్టా; తత్ = ఆదమయన్తియొక్క, ఓష్ఠ = పెదవియను, బన్ధూక = దాసానిపూవనెడి, ధనుః = ధనుస్సుచేత, విసృష్టా = విడువఁబడిన, ప్రసూనాశుగ = పూవిల్తునియొక్క, పఞ్చబాణీ = ఐదుబాణముల సమూహము, వాణీమిషేణ; = వాక్కనెడినెపముచే, అస్య = ఇతనియొక్క, కర్ణాత్ = కర్ణములనుండి, మనః = ఈనలునియొక్క మనస్సును, వివేశ = ప్రవేశించినది.

## సమాసములు :

మధూత్థమ్ : మధునః ఉత్థమ్ = మధూత్థమ్.

తదోష్ఠబన్ధూక ధనుర్విసృష్టా : తస్యాః ఓష్ఠః = తదోష్ఠః; తదోష్ఠ ఏవ బన్ధూకం = తదోష్ఠబన్ధూకం. తదోష్ఠబన్ధూకమేవ ధనుః = తదోష్ఠబన్ధూకధనుః. తదోష్ఠబన్ధూకధనుషః విసృష్టా = తదోష్ఠబన్ధూకధనుర్విసృష్టా.

పఞ్చబాణీ : పఞ్చానాం బాణానాం సమాహారః = పఞ్చబాణీ.

వాణీమిషేణ : వాణ్యాః మిషః = వాణీమిషః. తేన = వాణీమిషేణ,

భావము :

ఈ విధముగా తేనెలొలికించుచు, నామెయొక్క పెదవి యనెడి దాసాని పూవిల్లునుండి వెల్వడిన యైదు బాణముల గుత్తి; వాక్కనెడి నెపముతో నాతని కర్ణములఁ జొచ్చి హృదయమునుఁ బ్రవేశించినది. అనగా దమయన్తి వచనముల నతఁడు విని హృదయమునకుఁ దీసుకొనెనని యాశయము ॥౨౦॥

శ్లో॥ మమజ్జదామజ్జమసౌ సుధాసు
ప్రియం ప్రియాయా వదనాన్నిపీయ।
ద్విషన్ముఖేఽపి స్వదతే స్తుతిర్యా
తన్మిష్టతా నేష్టముఖే త్వమేయా॥ ౨౧

ప॥వి॥ అమజ్జత్ । ఆమజ్జమ్ । అసౌ । సుధాసు । ప్రియం । ప్రియాయాః వదనాత్ । నిపీయ । ద్విషన్ముఖే । అపి । స్వదతే । స్తుతిః । యా । తన్మిష్టతా । న । ఇష్టముఖే । తు । అమేయా.

టీక॥ అసౌ = ఈనలుఁడు, ప్రియాయాః = ప్రియురాలైన దమయన్తియొక్క, వదనాత్ = నోటినుండి, ప్రియం = ఇష్టమైనమాటను, నిపీయ = శ్రద్ధతోవిని, సుధాసు = అమృతములయందు, ఆమజ్జం = మజ్జయనెడి ధాతువువరకును, అమజ్జత్ = అమృతాస్వాదసుఖానుభూతియందు మునిగెను. ద్విషన్ముఖేఽపి = శత్రుముఖమునందును; యా = ఏ, స్తుతిః = శ్లాఘ, స్వదతే = రుచించునో, ఇష్టముఖేతు = ప్రియమైన వ్యక్తి ముఖమునందో, తన్మిష్టతా; తత్ = ఆస్తుతికి, మిష్టతా = స్వాదుత్వము, అనగారుచి, అమేయా = అపరిమితమైనదిగా, నకిం = కాదాయేమి. అనగా తప్పక కాఁగలదు.

## సమాసములు :

ఆమజ్జం : మజ్జామభివ్యాప్య = ఆమజ్జం.

ద్విషన్ముఖే : ద్విషదః ముఖమ్ = ద్విషన్ముఖం. తస్మిన్ = ద్విషన్ముఖే.

తన్మిష్టతా : తస్యాః మిష్టతా = తన్మిష్టతా.

**భావము :**

ఈ విధముగా నలుఁడు ప్రియురాలి ముఖమునుండి ప్రియమైన వచనమును విని యమృతము నాస్వాదించునంతటి సుఖము ననుభవించెను. పొగడ్త శత్రుముఖమునుండి వచ్చినను నింపుగనే యుండును.ఇఁక ప్రియజనులముఖము నుండి వచ్చినచో నది యపరిమిత మైన రుచినొసంగును గదా ॥౪౧॥

శ్లో॥ పౌరస్త్యశైలం జనతోపనీతాం
గృహ్ణా ౯ యథాహర్పతిరర్ఘ్యపూజామ్ ।
తథాతథేయీమథ సమ్ప్రతీచ్ఛ
న్నస్యా వయస్యాసనమాససాద॥ ౫౨

ప॥వి॥ పౌరస్త్యశైలం । జనతోపనీతాం । గృహ్ణన్ । యథా । అహర్పతిః । అర్ఘ్యపూజాం । తథా । ఆతిథేయీమ్ । అథ । సమ్ప్రతీచ్ఛన్ । అస్యాః । వయస్యాసనమ్ । ఆససాద.

టీక॥ అథ = పిదప, నలః = నలుఁడు, అహర్పతిః = సూర్యుఁడు, యథా = ఎట్లు, జనతోపనీతాం; జనతా = జనసమూహముచే, ఉపనీతాం = తేఁబడిన, అర్ఘ్యపూజామ్; అర్ఘ్య = అర్ఘ్యమనెడి, పూజాం = పూజను, గృహ్ణన్ = స్వీకరించుచు, పౌరాస్త్యశైలం; పౌరస్త్య = తూర్పునందలి, శైలం = పర్వతమైనఉదయాద్రిని, (ఆససాద = పొందెనో,) తథా = అట్లే, ఆతిథేయీం = అతిథిపూజను, సమ్ప్రతీచ్ఛన్ = స్వీకరించుచు, అస్యాః = ఈదమయన్తియొక్క, వయస్యాసనం; వయస్యా = చెలికత్తె యొక్క, ఆసనం = ఆసనమును, ఆససాద = అలఙ్కరించెను.

వి॥ ఇచ్చట నలుని సూర్యునితోడను, ఆసనమును, ఉదయాద్రితోఁడను, జనులుసమర్పించెడియర్ఘ్యమును, నతిథిపూజతోఁడనుఁ బోల్చుటవలన ఉపమాలఙ్కారము-

**సమాసములు :**

పౌరస్త్యశైలమ్ : పురస్తాత్ భవః = పౌరస్త్యః. పౌరస్త్యశ్చాసౌ శైలశ్చ = పౌరస్త్యశైలః. తమ్ = పౌరస్త్యశైలమ్.

అహర్పతిః : అహ్నః పతిః = అహర్పతిః.

అర్ఘ్యపూజామ్ : అర్ఘార్థం = అర్ఘ్యమ్. అర్ఘ్యమేవ పూజా = అర్ఘ్యపూజా. తామ్ = అర్ఘ్యపూజాం.

ఆతిథేయీమ్ : అతిథిషు సాధుః = ఆతిథేయీ. తామ్ = ఆతిథేయీం.

వయస్యాసనం : వయసా తుల్యా = వయస్యా. వయస్యాయాః ఆసనం = వయస్యాసనం. తత్ = వయస్యాసనం.

## భావము :

సూర్యుఁడు జనులు సమర్పించెడి యర్ఘ్యమునుఁ దీసికొని యుదయాద్రి నధిష్ఠించినట్లు, నలుఁడు దమయన్తి యొసంగిన యతిథిపూజను స్వీకరించి యామె చెలికత్తెయొక్క యాసనము నలఙ్కరించెను. అతఁడు దూత గాన దమయన్తి యొక్క యాసనమునలఙ్కరింపఁ దగదని చెలికత్తె యొక్క యాసనమునే యలఙ్కరించెనని యాశయము. ॥౫౨॥

శ్లో॥ అయోధి తద్ధైర్యమనోభవాభ్యాం
తామేవ భూమీమవలమ్బ్య భైమీమ్ ।
ఆహ స్మ యత్ర స్మరచాపమన్త
శ్ఛిన్నం భ్రువౌ తజ్జయభఙ్గవార్తామ్॥ ౫౩

ప॥వి॥ అయోధి । తద్ధైర్యమనోభవాభ్యాం । తామ్ । ఏవ । భైమీమ్ । అవలమ్బ్య । భైమీమ్ । ఆహ । స్మ । యత్ర । స్మరచాపమ్ । అన్తశ్ఛిన్నం । భ్రువౌ । తజ్జయభఙ్గవార్తామ్.

టీక॥ తద్ధైర్యమనోభవాభ్యాం; తత్ = ఆ నలునియొక్క, ధైర్య = ధైర్యము, మనోభవాభ్యాం = మన్మథుఁడు అనువారిచే, తామ్ = ఆ, భైమీమేవ = దమయన్తినే, భూమీం = యుద్ధభూమిగా, అవలమ్బ్య = పొంది, అయోధి = యుద్ధమాడుటఁ జరిగినది. యత్ర = ఏయుద్ధభూమియందు, అన్తశ్ఛిన్నం; అన్తః = మధ్యభాగమునందు, ఛిన్నం = తెగిన, భ్రువౌ = దమయన్తి కనుబొమ్మలనెడి, స్మరచాపం = మన్మథునివిల్లు, తజ్జయ

భఙ్గవార్తామ్; తత్ = ఆధైర్యమునకును మన్మథునకును, జయభఙ్గ వార్తామ్; జయమునుఁ దెలిపెడివార్తను, భఙ్గమునుఁదెలిపెడివార్తను, అనగా ధైర్యమునకు జయమును, మన్మథునకుఁ బరాజయమును, ఆహస్మ = చెప్పుచుండినది.

## సమాసములు:

తద్ధైర్యమనోభవాభ్యాం: ధీరస్య భావః = ధైర్యమ్. మనసి భవతీతి = మనోభవః. ధైర్యం చ మనోభవశ్చ = ధైర్యమనోభవౌ. తస్య ధైర్యమనోభవౌ = తద్ధైర్యమనోభవౌ. తాభ్యాం = తద్ధైర్యమనోభవాభ్యాం.

స్మరచాపం : స్మరస్య చాపమ్ = స్మరచాపమ్.

అన్తశ్ఛిన్నం : అన్తః ఛిన్నం = అన్తశ్ఛిన్నం.

తజ్జయభఙ్గవార్తామ్ : జయశ్చ భఙ్గశ్చ = జయభఙ్గౌ. తయోః జయభఙ్గౌ = తజ్జయభఙ్గౌ. తజ్జయభఙ్గయోః వార్తా = తజ్జయభఙ్గవార్తా. తామ్ = తజ్జయభఙ్గవార్తామ్.

## భావము :

ఆ దమయన్తిని యుద్ధరంగముఁ గావించుకొని నలునియొక్క ధైర్యము కామము అనునవి యుద్ధముఁగావించినవి. కాని యా యుద్ధమునందు, మధ్య తెగిన, దమయన్తియొక్క కనుబొమ్మలనెడి విల్లు ఆ యుద్ధములోని ఫలితమునుఁ జెప్పినది. అందు ధైర్యముగెలిచినది. కామము ఓడిపోయినది. అనగా దమయన్తినిఁ జూచినను, నలుఁడు కామపరవశుఁడుగాక, ధైర్యమును నిల్పుకొనెనని భావము ॥౨౩॥

శ్లో॥ అథ స్మరాజ్ఞామవధీర్య ధైర్యా
దూచే స తద్వాగుపవీణితోఽపి ।
వివేకధారాశతధౌతమన్తః
సతాం న కామః కలుషీకరోతి ॥ ౨౪

ప॥వి॥ అథ । స్మరాజ్ఞామ్ । అదధీర్య । ధైర్యాత్ । ఊచే । సః । తద్వాగుపవీణితః । అపి । వివేకధారాశతధౌతమ్ । అంతః । సతాం । న । కామః । కలుషీకరోతి.

టీక॥ అథ = పిదప. సః = ఆనలుఁడు, తద్వాగుపవీణితోఽపి; తత్ = ఆమె యొక్క. వాక్ = మాటచే, ఉపవీణితోఽపి = ఉపగానముచేయఁబడినను అనఁగా నామె యొక్క వాక్కనెడి వీణచే ఉపగానము చేయఁబడినను, అనగా నామె యొక్క వాక్కనెడి వీణచే నాకర్షింపఁబడిన మనస్సుగల వాడైనను, ధైర్యాత్ = ధైర్యమునువహించి, స్మరాజ్ఞాం = మన్మథాజ్ఞను, అవధీర్య = తిరస్కరించి, ఊచే = పలికెను. తథాహి = అదియుక్తమే, (ఏలయనగా) వివేకధారా శతధౌతం; వివేక = వివేకములయొక్క, ధారాశత = నూఱుప్రవాహములచే, ధౌతం = కడుఁగఁబడిన, సతాం = సత్పురుషులయొక్క, అంతః = మనస్సును, కామః = మన్మథుఁడు, నకలుషీకరోతి = కలుషముఁ గావింపఁడు.

వి॥ ''సత్పురుషుల మనస్సును కామము కలుషితముఁ జేయదను'' సామాన్యముచే నలుఁడు ధైర్యమును వహించి పలికె నను విశేషము సమర్థితము కాన నర్థాన్తరన్యాసము.

సమాసములు :

స్మరాజ్ఞామ్ : స్మరస్య ఆజ్ఞా = స్మరాజ్ఞా. తామ్ = స్మరాజ్ఞామ్.

తద్వాగుపవీణితః : తస్యాః వాక్ = తద్వాక్. తద్వాచా ఉపవీణితః = తద్వాగుపవీణితః.

వివేకధారాశతధౌతం: వివేకానాం ధారాః = వివేకధారాః. వివేకధారాణాం శతమ్ = వివేకధారాశతం. వివేకధారాశతేన ధౌతం = వివేకధారాశతధౌతమ్. తత్ = వివేకధారాశతధౌతమ్.

భావము :

దమయన్తి వచనములచే నలుఁడు ఆకర్షింపఁబడినను ధైర్యమును వీడక కామమునకు లోబడక బలికెను. వివేచనజ్ఞానముల పరంపరచే సజ్జనుల చిత్తము కరుఁగఁబడి శుద్ధమైయుండును. దానిని కామము కలుషితముఁ జేయఁజాలదు. ॥౨౪॥

శ్లో॥ హరిత్పతీనాం సదసః ప్రతీహి
త్వతీయమేవాఽఽతిథిమాగతం మామ్ ।
వహన్తమన్తర్గురుణాఽఽదరేణ
ప్రాణానివ స్వఃప్రభువాచికాని॥ ౨౨

ప॥వి॥ హరిత్పతీనాం । సదసః । ప్రతీహి । త్వదీయమ్ । ఏవ । అతిథిమ్ । ఆగతం । మామ్ । వహన్తమ్ । అన్తః । గురుణా । ఆదరేణ । ప్రాణాన్ । ఇవ । స్వఃప్రభువాచికాని.

టీక॥ మాం = నన్ను, గురుణా = గొప్పదైన, ఆదరేణ = ఆదరముతో, స్వఃప్రభువాచికాని; స్వఃప్రభు = స్వర్గమునకుఁ బ్రభువులైన యిన్ద్రాదుల యొక్క, వాచికాని = చెప్పఁబడినవాక్యములను (సన్దేశములను) ప్రాణానివ = నీదగుప్రాణములవలె, అంతః = అంతరాత్మయందు, వహన్తం = వహించిన, హరిత్పతీనాం = ఇన్ద్రాదిదిక్పాలురయొక్క, సదసః = ఆస్థానమునుండి, ఆగతం = వచ్చిన, త్వదీయమేవ = నీకేసంబంధించిన, అతిథిమ్ = అతిథిగా, ప్రతీహి = తెలిసికొనుము.

**సమాసములు :**

*హరిత్పతీనాం* : హరితాం పతయః = హరిత్పతయః. తేషాం = హరిత్పతీనామ్.

*స్వఃప్రభువాచికాని* : స్వః ప్రభుః = స్వఃప్రభుః. స్వఃప్రభోః వాచికాని = స్వఃప్రభువాచికాని. తాని = స్వఃప్రభువాచికాని.

భావము :

నేను మిక్కిలి యాదరముతో దేవలోక ప్రభువులైన యిన్ద్రాదుల యొక్క సందేశమును ప్రాణమువలె నన్తరాత్మయందు ధరించినవాడనై లుదిక్పాలర యొక్క యాస్థానమునుండి వచ్చి నీకతిథినైతి నని యెరుఁగుము. అని నలుఁడు దమయన్తికిఁ జెప్పెను. ॥౨౨॥

శ్లో॥ విరమ్యతాం భూతవతీ సపర్యా
నివిశ్యతామాసనముజ్ఝితం కిమ్ ।

యా దూతతా నః ఫలినా విధేయా
సైవాఽఽతిథేయీ పృథురుద్భవిత్రీ ॥ ౫౬

ప॥వి॥ విరమ్యతాం । భూతవతీ । సపర్యా । యా । దూతతా । నః ।
ఫలినా । విధేయా । సా । ఏవ । ఆతిథేయీ । పృథుః । ఉద్భవిత్రీ ।

టీక॥ సపర్యా = పూజ, భూతవతీ = జరిగిపోయినది. విరమ్యతాం = విరమించుట (యుక్తము). నివిశ్యతాం = కూర్చుండుట (యుక్తము). కిమ్ = ఏల, ఆసనం = ఆసనము, ఉజ్ఝితం = విడువఁబడినది? ఫలినా = ఫలవంతముగా, విధేయా = చేయఁదగిన, నః = మాయొక్క, యా = ఏ, దూతతా = దూత్యముకలదో, సైవ = అదియే, పృథుః = గొప్పదైన, ఆతిథేయీ = అతిథిపూజగా, ఉద్భవిత్రీ = కాఁబోవుచున్నది.

సమాసములు :

దూతతా : దూతస్య భావః = దూతతా.
ఆతిథేయీ : అతిథిషుసాధుః = ఆతిథేయీ.

భావము :

అతిథిపూజ నెరవేర్పఁబడియైనది, కావున దాని నుండి విరమింపుము. కూర్చుండుము. ఏల యాసనమును వదలితివి? మా దూత్యమును సఫలముగావించుటయే గొప్ప యతిథిపూజ కాఁగలదు. అని నలుఁడు దమయన్తికిఁ జెప్పెను. ॥౫౬॥

శ్లో॥ కల్యాణి కల్యాని తవాజ్ఞకాని
కచ్చిత్తమాం చిత్తమనావిలం తే ।
అలం విలమ్బేన గిరం మదీయా
మాకర్ణయాఽఽకర్ణతటాయతాక్షి॥ ౫౭

ప॥వి॥ కల్యాణి । కల్యాని । తవ । అజ్ఞకాని । కచ్చిత్తమాం । చిత్తమ్ ।
అనావిలం । తే । అలం । విలమ్బేన । గిరం । మదీయామ్ ।
ఆకర్ణయ । ఆకర్ణతటాయతాక్షి ।

టీక॥ హేకల్యాణి = ఓమఙ్గలస్వరూపిణీ. తవ = నీయొక్క, అఙ్గకాని = కోమలములైన యవయవములు, కల్యాని = దృఢములుగా, కచ్చిత్తమాం = లెస్సగానున్నవాయేమి? కిఞ్చ = మఱియు, తే = నీయొక్క, చిత్తం = మనస్సు, అనావిలం = కాలుష్యము లేనిదై, కచ్చిత్తమాం = లెస్సగానున్నదా? ఆకర్ణతటాయతాక్షి; ఆకర్ణతట = చెవులవరకువ్యాపించిన, ఆయత = విశాలములైన అక్షి = నయనములుగలదానా! విలమ్బేన అలం = ఆలస్యముచేఁజాలును. మదీయాం = నాదైన, గిరం = వాక్కును, ఆకర్ణయ = వినుము.

సమాసములు:

ఆకర్ణతటాయతాక్షి: కర్ణతటమభివ్యాప్య = ఆకర్ణతటం. ఆకర్ణతటమాయతే అక్షిణీ యస్యాస్సా = ఆకర్ణతటాయతాక్షీ. తస్యాః సమ్బుద్ధిః = (హే) ఆకర్ణతటాయతాక్షి.

భావము :

ఓ మఙ్గలస్వరూపిణివైన దమయంతీ! నీ సుకుమారములగు నవయవములు దృఢముగా నున్నవా? నీ చిత్తము నిర్మలముగా నున్నదా? కర్ణాన్తవిశ్రాన్తము లైన విశాలనేత్రములు గలదానా! తడవొనరింపకుము. నామాటను వినుము అని నలుఁడు దమయన్తికిఁ జెప్పెను. ॥౫౭॥

శ్లో॥ కౌమారమారభ్య గణా గుణానాం
హరన్తి తే దిక్షు ధృతాధిపత్యాన్ ।
సురాధిరాజం సలిలాధిపం చ
హుతాశనఞ్చార్యమనన్దనం చ॥ ౫౮

ప॥వి॥ కౌమారమ్ । ఆరభ్య । గణాః । గుణానాం । హరన్తి । తే । దిక్షు । ధృతాధిపత్యాన్ । సురాధిరాజం । సలిలాధిపం । చ । హుతాశనం । చ । అర్యమనన్దనం । చ.

టీక॥ (ఓదమయన్తి) కౌమారం = నీబాల్యమును, ఆరభ్య = మొదలొకొని, తే = నీయొక్క, గుణానాం = గుణములయొక్క, గణాః = గణములు,

దిక్షు = దిక్కులయందు, ధృతాధిపత్యాన్; ధృత = ధరింపఁబడిన, ఆధిపత్యాన్ = అధికారము గల్గిన, అనగా అధికృతులైన, సురాధిరాజం = ఇంద్రుని, సలిలాధిపంచ = ఉదకములకధిపతియైనవరుణుని, హుతాశనంచ = అగ్నిని, అర్యమనన్దనం చ = సూర్యపుత్రుఁడైన యముని, హరన్తి = ఆకర్షించుచున్నవి.

సమాసములు :

కౌమారం : కుమారస్య ఇదం = కౌమారం. తత్ = కౌమారం.

ధృతాధిపత్యాన్ : ఆధిపతేర్భావః = ఆధిపత్యమ్ ధృతమ్. ఆధిపత్యం యై స్తే = ధృతాధిపత్యాః. తాన్ = ధృతాధిపత్యాన్.

సురాధిరాజః : సురాణామధిరాజః = సురాధిరాజః. తమ్ = సురాధిరాజమ్.

సలిలాధిపం : సలిలానా మధిపః = సలిలాధిపః. తమ్ = సలిలాధిపం.

అర్యమనన్దనం : అర్యమ్ణః నన్దనః = ఆర్యమనన్దనః. తమ్ = ఆర్యమనన్దనం.

భావము :

ఓ దమయన్తీ! బాల్యమునుండియు నీ గుణములు దిక్పాలకులైన యింద్రుని, వరుణుని, అగ్నిని, సూర్యపుత్రుఁడైన యముని, ఆకర్షించుచున్నవి. ॥౨౩॥

శ్లో॥ చరచ్చిరం శైశవయౌవనీయ
ద్వైరాజ్యభాజి త్వయి ఖేదమేతి ।
తేషాం రుచశ్చౌరతరేణ చిత్తం
పఞ్చేషుణా లుణ్ఠితధైర్యవిత్తమ్॥ ౨౪

ప॥వి॥ చరత్ । చిరం । శైశవయౌవనీయద్వైరాజ్యభాజి । త్వయి । ఖేదమ్ । ఏతి । తేషాం । రుచః । చౌరతరేణ । చిత్తం । పఞ్చేషుణా । లుణ్ఠితధైర్యవిత్తమ్.

టీక॥ శైశవయౌవనీయద్వైరాజ్యభాజి; శైశవ = బాల్యమునకును, యౌవనీయ = యౌవనమునకుసంబంధించిన, ద్వైరాజ్య = రెండురాజ్యములను, భాజి = పొందిన, త్వయి = నీయందు, చిరం = చాలకాలము, చరత్ = తిరుగుచున్న, తేషాం = ఇన్ద్రాదులయొక్క, చిత్తం = మనస్సు, రుచః = కాన్తికి, చౌరతరేణ = గొప్పచోరుఁడైనట్టి, పఞ్చేషుణా = మన్మథునిచే, లుణ్ఠితధైర్యవిత్తం: లుణ్ఠిత = అపహరింపఁబడిన, ధైర్య = ధైర్యమను, విత్తం = ధనముగలదై, ఖేదం = కష్టమును, ఏతి = పొందుచున్నది.

వి॥ వయోద్వయమును ద్వైరాజ్యముగను, పఞ్చేషుని చోరునిగను, ధైర్యమును ధనముగను, రూపించుటవలన రూపకము.

చిత్తము కష్టము ననుభవించుటకు ధైర్యవిత్తహరణము హేతువు కాన వాక్యార్థహేతుకమైన కావ్యలిఙ్గము. రూపకమునకును కావ్యలిఙ్గమునకు నిట సఙ్కరము.

సమాసములు :

*శైశవయౌవనీయద్వైరాజ్యభాజి* : శిశోర్భావః = శైశవం. శైశవం చ యౌవనం చ = శైశవయౌవనే. శైశవయౌవనయోరిదం = శైశవయౌవనీయం. ద్వయోః రాజ్ఞోః కర్మ = ద్వైరాజ్యం. శైశవయౌవనీయం చ తత్ ద్వైరాజ్యం చ = శైశవయౌవనీయద్వైరాజ్యం. శైశవయౌవనీయద్వైరాజ్యం భజతీతి = శైశవయౌవనీయద్వైరాజ్యభాక్. తస్యాం = శైశవయౌవనీయద్వైరాజ్యభాజి.

*చౌరతరేణ* : అత్యన్తం చౌరః = చౌరతరః. తేన = చౌరతరేణ.

*పఞ్చేషుణా*: పఞ్చ ఇషవః యస్య సః = పఞ్చేషుః. తేన = పఞ్చేషుణా.

*లుణ్ఠితధైర్యవిత్తమ్* : ధైర్యమేవ విత్తమ్ = ధైర్యవిత్తం. లుణ్ఠితం ధైర్యవిత్తం యస్య తత్ = లుణ్ఠితధైర్యవిత్తం.

**భావము :**

ఒక వైపు బాల్యము మఱి యొక వైపు యౌవనము అను రెండు రాజ్యములనుఁ బొందిన నీయందు నిన్ద్రాదులయొక్క మనస్సు చాలకాలము సంచరించినది. విరహుల తేజస్సు నపహరించెడి పఞ్చబాణుడను దొంగచే,

వారి ధైర్యమను ధనము అపహరింపఁబడినది. దమయన్తి శైశవయౌవనముల మధ్య నుండి సౌన్దర్యాతిశయమునుఁ బొంది యింద్రాదుల చిత్తమును హరించుచున్న దని యాశయము. రెండు రాజ్యముల సంధిస్థలమునందు రక్షకులు బాధ్యత వహింపనందువలన దొంగల బాధయుండును. అట్లే బాల్యయౌవనరాజ్యసంధి యందు సంచరించు నిద్రాదుల ధైర్యము మన్మథుఁడను చోరునిచే నపహరింపఁబడిన దని సారాంశము. ॥౨౯॥

శ్లో॥ తేషామిదానీం కిల కేవలం సా
హృది త్వదాశా విలసత్యజస్రమ్ ।
ఆశాస్తు నాఽఽసాద్య తనూరుదారాః
పూర్వాదయః పూర్వవదాత్మదారాః ॥ ౬౦

ప॥వి॥ తేషామ్ । ఇదానీం । కిల । కేవలం । సా । హృది । త్వదాశా । విలసతి । అజస్రం । ఆశాః । తు । న । ఆసాద్య । తనూః । ఉదారాః । పూర్వాదయః । పూర్వవత్ । ఆత్మదారాః.

టీక॥ ఇదానీం = ఇప్పుడు, తేషామ్ = ఆయిన్ద్రాదులయొక్క, హృది = హృదయమందు, సా = ఆ ప్రసిద్ధమైన, త్వదాశా; త్వత్ = నీయందలి, ఆశా = మిక్కిలికాంక్ష (దిక్కు), అజస్రం = ఎల్లప్పుడు, విలసతి = ప్రకాశించుచున్నది. ఆత్మదారాః = తమకుభార్యలైన, పూర్వాదయః = తూర్పుమున్నగు, ఆశాస్తు = దిక్కులో, ఉదారాః = దాక్షిణ్యముతోఁ గూడినవియును, గొప్పవియునగు, తనూః = శరీరములను, ఆసాద్య = పొంది, పూర్వవత్ = పూర్వమువలె, నవిలసన్తి = విజృమ్భించుటలేదు. అనగా నూతన మైన నాయికయందు ననురక్తునకు ప్రాతనాయిక నేర్పు గలదైనను నామెపై హృదయము లగ్నముకాదు. అట్లే పరమాణుస్వరూప మైన మనస్సునందు గొప్పవైన దిశలు పట్టవుగదా.

వి॥ ఇచ్చట రెండు ఆశలు అనగా కాంక్ష, దిక్కు అను నీరెండును నొక్క హృదయమందుండవలసి యుండగా, నందు నొక్కదాని ననగా కాంక్షను మాత్రమే యనగా దమయన్తి పైని కోరికను మాత్రమే నియమించుట వలన నిచ్చట పరిసంఖ్యాలఙ్కారము.

ఒక్క ఆశాశబ్దముచే, దృష్టకును, దిక్కునకు నభేదాధ్యవసాయము చేయుటవలన శ్లేషమూలక మగు నభేదాతిశయోక్తి. ఆ పరిసంఖ్యకును నీయభేదాతిశయోక్తికిని సఙ్కరము.

సమాసములు :

పూర్వాదయః : పూర్వా ఆదిః యాసాం తాః = పూర్వాదయః.

భావము :

ఇప్పుడు దిక్పాలకుల హృదయమందు నిన్ను విషయీకరించిన యాశ యనగా కాంక్ష (దిక్కు) యొక్కటే నెలకొనినవి. తమ భార్యలైన తూర్పు మున్నగు ఆశలు అనగా దిక్కులు దాక్షిణ్యయుక్తము లైన గొప్ప దేహముల నెత్తినవై ముందు వలె వారి హృదయములందు విలసిల్లుట లేదు. క్రొత్త నాయికయందనురక్తమైన హృదయమందు ప్రాత నాయికలు నేర్పరు లైనను నెలకొనలేరు. అట్లే గొప్పవైన దిక్కులు పరమాణురూపమైన హృదయ మందు పట్టవుగదా. ఆ దిక్పాలురందఱు నీ యందలి యాశకు లోబడినవారై తూర్పు మున్నగు తమతమ దిక్కులనుఁ బాలించవలసిన తమ బాధ్యతలను మఱచి యున్నారని భావము. ॥౭౦॥

శ్లో॥ అనేన సార్ధం తవ యౌవనేన
కోటిం పరామచ్ఛిదురోఽధ్యరోహత్ ।
ప్రేమాఽపి తన్వి త్వయి వాసవస్య
గుణోఽపి చాపే సుమనః శరస్య॥ ౭౧

ప॥వి॥ అనేన । సార్ధం । తవ । యౌవనేన । కోటిం । పరామ్ । అచ్ఛిదురః । అధ్యరోహత్ । ప్రేమా । అపి । తన్వి । త్వయి । వాసవస్య । గుణః । అపి । చాపే । సుమనఃశరస్య.

టీక॥ హేతన్వి = ఓసుందరియగు దమయన్తీ, వాసవస్య = ఇన్ద్రునకు, త్వయి = నీయందు, ప్రేమాపి = అనురాగముగూడ, అనేన = ఈ, యౌవనేనసార్ధం = యౌవనముతోడ, అచ్ఛిదురః = విచ్ఛేదములేనిదై,

పరాంకోటిం = పరమావధిని, అధ్యరోహత్ = ఎక్కినది. (తథా = అట్లే) సుమనఃశరస్య = పుష్పబాణునియొక్క, చాపే = వింటియందు, గుణో౽పి = అల్లెత్రాడుగూడ, పరాం = పరమైన, కోటిం = కొనను, అధ్యరోహత్ = ఎక్కినది.

వి॥ ఇచ్చట ప్రకృతములైన, ప్రేమగుణములకు విశేషణసామ్యముచే నౌపమ్యముండుటవలన కేవలప్రకృతవిషయమైన తుల్యయోగితాలఙ్కారము. ఆప్రేమను, గుణమును పరాం 'కోటిమ్' అని శ్లేషమూలముగా నభేదాధ్యవసానముఁ జేయుటవలన అభేధాతిశయోక్తి. "యౌవనేనసార్థమ్" అని సహార్థసంబంధమునుఁజెప్పుటవలన సహోక్తి. అతిశయోక్తికిని సహోక్తికిని సఙ్కరము.

## సమాసములు :

సుమనఃశరస్య : సుమనాంసి శరాః యస్య సః = సుమనఃశరః. తస్య = సుమనఃశరస్య.

## భావము :

ఓదమయన్తీ నీపై నింద్రునకున్నట్టి యనురాగము నీ యౌవనముతోడ నవిచ్ఛిన్నమై పరమావధినొందినది. అట్లే పుష్పబాణుని వింటియొక్క యల్లెత్రాడుగూడ, నావింటియొక్క కొట్టకొన కెక్కినది. ॥౽౧॥

శ్లో॥ ప్రాచీం ప్రయాతే విరహం దధత్తే
తాపాచ్చ రూపాచ్చ శశాఙ్కశఙ్కీ।
పరా౽పరాధై ర్నిదధాతి భానౌ
రుషారుణం లోచనవృన్దమిన్ద్రః॥ ౽౨

ప॥వి॥ ప్రాచీం। ప్రయాతే। విరహం। దధత్। తే। తాపాత్। చ। రూపాత్। చ। శశాఙ్కశఙ్కీ। పరా౽పరాధైః। నిదధాతి। భానౌ। రుషా। అరుణం। లోచనవృన్దమ్। ఇన్ద్రః.

టీక॥ ఇన్ద్రః = ఇన్ద్రుడు, తే = నీయొక్క, విరహం = వియోగమును, దధత్ = ధరించుచున్నవాఁడై (కావుననే), ప్రాచీం = తూర్పుదెసను,

ప్రయాతే = పొందినట్టి, భానౌ = సూర్యునియందు, తాపాచ్చ = తాపము కల్గించుటవలనను, రూపాచ్చ = ఉదయకాలమందు రక్తవర్ణముగానుండుట వలనను, శశాఙ్కశఙ్కీ = చంద్రుని సందేహించినవాఁడై, పరాపరాధైః = ఇతరునిదోషములచే, అనగాఁ జంద్రునిదోషములచే, రుషా = రోషముతో, అరుణం = ఎఱ్ఱని, లోచనవృన్దం = నేత్రసమూహమును, నిదధాతి = ఉంచుచున్నాఁడు.

వి॥ ఇచ్చట నింద్రునకు సూర్యునియందు చన్ద్రభ్రాన్తి గలుగుటవలన భ్రాన్తిమదలఙ్కారము.

## సమాసములు :

శశాఙ్కశఙ్కీ : శశాఙ్క ఇతి శఙ్కత ఇతి = శశాఙ్కశఙ్కీ.

పరాపరాధైః : పరేషామపరాధాః = పరాపరాధాః. తైః = పరాపరాధైః.

లోచనవృన్దం : లోచనానాం వృన్దః = లోచనవృన్దః తమ్ = లోచనవృన్దం.

## భావము :

ఇన్ద్రుడు నీ విరహమును వహించి యుండగా, తూర్పు దెసనుఁ బొందిన సూర్యునియందు, తాపమును నెఱ్ఱని రూపమునుఁ గాంచి చన్ద్రుడని భ్రాన్తిపడి చన్ద్రుని దోషములతో నేర్పడిన దోషముతో నెఱ్ఱనైన తన వేయినేత్రములచే నతనినిఁ గాంచెను. చన్ద్రుడు విరహతాపమునుఁ గల్గించుటవలన నపరాధి. చన్ద్రుడుదయకాలమం దెఱ్ఱగ నుండును. అట్లే సూర్యుఁడును తాపముఁ గల్గించును. ఉదయకాలమందు నెఱ్ఱగనుండును. కాన చన్ద్రునితో సమానములగు ధర్మము లుండుటవలన సూర్యుని చంద్రుడని భ్రాన్తిపడి యాతనిని రోషముతో నెఱ్ఱనైన తన వేయి నేత్రములతోఁ జూచెనని భావము. ॥౬౨॥

శ్లో॥ త్రినేత్రమాత్రేణ రుషా కృతం య
త్తదేవ యోఽద్యాఽపి న సంవృణోతి।
న వేద రుష్టోద్యసహస్రనేత్రే
గన్తా స కామః ఖలు కామవస్థామ్॥ ౬౩

ప॥వి॥ త్రినేత్రమాత్రేణ । రుషా । కృతం । యత్ । తత్ । ఏవ । యః అద్య । అపి । న । సంవృణోతి । న । వేద । రుష్టే । అద్య సహస్రనేత్రే । గన్తా । సః । కామః । ఖలు । కామ్ । అవస్థామ్.

టీక॥ త్రినేత్రమాత్రేణ = మూడుకన్నులే గలశివునిచే, రుషా = రోషముతో, యత్ = ఏది, కృతం = చేయఁబడినదో, తదేవ = దానినే, యః = ఏకాముఁడు, అద్యాఽపి = ఇప్పటికిని, నసంవృణోతి = మఱుగుపఱచు కొనలేకయున్నాడు, సః = ఆమన్మథుఁడు, అద్య = ఇప్పుడు, సహస్ర నేత్రే = వేయి కన్నులుగల యింద్రుఁడు, రుష్టేసతి = రోషముఁ బొందగా, కామ్ = ఏ, అవస్థాం = దశను, గన్తా = పొందఁబోవు చున్నాడో, నవేదఖలు = తెలిసికొనకయున్నానుగదా.

## సమాసములు:

*త్రినేత్రమాత్రేణ :* త్రీణి నేత్రాణి యస్య సః = త్రినేత్రః. త్రినేత్ర ఏవ = త్రినేత్రమాత్రః. తేన = త్రినేత్రమాత్రేణ.

*సహస్రనేత్రే :* సహస్రాణి నేత్రాణి యస్య సః = సహస్రనేత్రః. తస్మిన్ = సహస్రనేత్రే.

## భావము :

మూడు కన్నులు గల శివుఁడు రోషముతో, మన్మథునకు దేహము లేక యుండుటనుఁ గావించినాఁడు. దాని నామన్మథు డింత వరకును కప్పి పుచ్చుకొనలేకపోయెను. ఇఁక వేయి కన్నులు గల యింద్రుడు రోషపడినచో, నామన్మథుని గతి యేమగునో తెలియుటలేదు. ముక్కంటి నెదిరించి నశించి పోయిన మన్మథుఁడు సహస్రనేత్రు నెట్లు జయింపఁగలడు. అనగా మన్మథుఁడు, నీకై యింద్రుని వేధించుచున్నా డని యాశయము. ॥౬౩॥

శ్లో॥ పికస్య వాఙ్మాత్రకృతవ్యలీకా
న్న స ప్రభుర్నన్దతి నన్దనేఽపి।
బాలస్య చూడాశశినోఽపరాధా
న్నారాధనం శీలతి శూలినోఽపి॥ ౬౪

ప॥వి॥ పికస్య । వాఙ్మాత్రకృతవ్యలీకాత్ । న । సః । ప్రభుః । నన్దతి । నన్దనే । అపి । బాలస్య । చూడాశశినః । అపరాధాత్ । న । ఆరాధనం । శీలతి । శూలినః । అపి.

టీక॥ సఃప్రభుః = ఆ యింద్రుఁడు, పికస్య = కోయిలయొక్క, వాఙ్మాత్రకృతాత్; వాఙ్మాత్ర = వాక్కుచేతనే, కృతాత్ = చేయఁబడిన, వ్యలీకాత్ = అప్రియమువలన, నన్దనే = నన్దమనుపేరుగలదియు ఆనన్దమొసంగునదియునగు, వనే = వనమందు, ననన్దతి = సంతోషించుటలేదు, (ఇఁక నితర ప్రదేశములయందు నెట్లుసంతోషింపఁగలదు) (కిఞ్చ = మఱియు) బాలస్య = కృశించిన, చూడాశశినః = శిరస్సునందలి చంద్రునియొక్క, అపరాధాత్ = నేరమువలన, శూలినోఽపి = శివునికిని, ఆరాధనం = పూజను, నశీలతి = చేయుటలేదు.

వి॥ ఆనన్దసంబంధ మున్నను నది లేదని చెప్పుటవలనను, శివారాధన సమ్బన్ధమున్నను నది లేదని చెప్పుటవలనను సమ్బన్ధాతిశయోక్తి.

## సమాసములు :

వాఙ్మాత్రకృతాత్ : వాగేవ వాఙ్మాత్రమ్. వాఙ్మాత్రేణ కృతమ్ = వాఙ్మాత్రకృతమ్. తస్మాత్ = వాఙ్మాత్రకృతాత్.

చూడాశశినః : చూడాయాం శశీ యస్య సః = చూడాశశీ. తస్య = చూడాశశినః.

## భావము :

ఆయింద్రుడు కోకిల కూతవలని యప్రియముచే నందనవనమునందును సంతోషించుటలేదు. ఇఁక నెచ్చట సంతోషము నొందఁగలడు. మఱియు శిరస్సున బాలచంద్రకళను ధరించె నను నపరాధముచే శివునికిని పూజ సలుపుట లేదు. ॥౬౪॥

శ్లో॥ తమోమయీకృత్య దిశః పరాగైః
స్మరేషవః శక్రదృశాం దిశన్తి।

కుహూగిరం చఞ్చుపుటం ద్విజస్య
రాకారజన్యామపి సత్యవాచమ్॥ ౬౨

ప॥వి॥ తమోమయీ కృత్య । దిశః । పరాగైః । స్మరేషవః । శక్రదృశాం ।
దిశన్తి । కుహూగిరం । చఞ్చుపుటం । ద్విజస్య । రాకారజన్యామ్ ।
అపి । సత్యవాచమ్.

టీక॥ స్మరేషవః = మన్మథునిబాణములు, పరాగైః = ధూళులచే, దిశః =
దిక్కులను, శక్రదృశాం = ఇంద్రునినేత్రములకు, తమోమయీకృత్య =
అన్ధకారమయముఁగావించి, కుహూగిరం = "కుహూ" అనుకూతఁగల్గిన
(అమావాస్యయనువచనముగల్గిన,) ద్విజస్య = పక్షియైనకోకిలకును
(బ్రాహ్మణునకును), చఞ్చుపుటం = ముక్కును (ముఖమును), రాకార
జన్యామపి = పున్నమనాటిరాత్రియందును, సత్యవాచం = సత్యవచనముఁ
గలదిగా, దిశన్తి = చెప్పుచున్నవి.

వి॥ ఇచ్చట శ్లిష్టములైన కుహువులకును, ద్విజులకును, నభేదాధ్యవసాయ
ముచే విరుద్ధమైన కుహూత్వసత్యవాదిత్వము సిద్ధించుటవలన వాక్యార్థ
హేతుకమగు కావ్యలిఙ్గాలఙ్కారము. దిక్కులకు తమస్సంబంధము లేక
పోయినను దమస్సంబంధమునుఁ జెప్పుటవలన సమ్బన్ధాతిశయోక్తి. ఈ
యతిశయోక్తి కుహూత్వసత్యవాదిత్వమునకు సమర్థాపకము. ఈకావ్యలిఙ్గ
మునకుఁ బైనఁ జెప్పిన యతిశయోక్తికిని సఙ్కరము. దానిచే నిన్దు9నకు
ప్రున్నమయందు, కుహూభ్రాన్తి యనగా నమావాస్యాభ్రాన్తిని ననుసరించి
భ్రాన్తిమదలఙ్కారము వ్యఙ్గ్యము.

సమాసములు:

తమోమయీకృత్య : అతమోమయం తమోమయం సమ్పద్యమానం
కృత్వా = తమోమయీకృత్య.

స్మరేషవః : స్మరస్య ఇషవః = స్మరేషవః.

శక్రదృశాం : శక్రస్య దృశః = శక్రదృశః. తాసాం = శక్రదృశామ్.

కుహూగిరమ్ : కుహూరితి గీః యస్య సః = కుహూగీః, తం =
కుహూగిరమ్.

చఞ్చుపుటమ్ : చఞ్చ్వోః పుటః = చఞ్చుపుటః. తమ్ = చఞ్చుపుటమ్.

రాకారజన్యాం : రాకాయాః రజనీ = రాకారజనీ. తస్యాం = రాకారజన్యాం.

సత్యవాచమ్ : సత్యా వాక్ యస్య సః = సత్యవాక్. తమ్ = సత్యవాచమ్.

**భావము :**

మన్మథుని పుష్పబాణములు తమ ధూళిచే నిన్దు్రని నేత్రములకు దిక్కులు అన్ధకారములు గావించినవి. "కుహూ" యని కూయునట్టి కోయిల కేకను, "కుహువు" అనగా నమావాస్య యని చెప్పుచున్న విప్రుని వచనమును పున్నమరేయియందును, సత్యములు గావించినవి. పున్నమరేయి యందు మన్మథుని పుష్పబాణముల ధూళిచే నిన్దు్రడన్ధుడై కోయిలయొక్క "కుహూ" కూతలచే నా పున్నమ నమావాస్యగా భ్రాన్తిఁ జెందుచున్నాడు. విరహమువలన నిన్దు్రడు మిక్కిలి యన్ధుఁడాయెనని యాశయము. విప్రుఁడు గూఁడ నొకగ్రుడ్డివానికిఁ బున్నమను నమావాస్యయని చెప్పినచో నాతడా మాట నింకొకనికి సత్యమనియే చెప్పును. పుష్పాడిచే నంధుడైన యింద్రునకు కోయిల కూతవలన నట్టి దశయే సంప్రాప్తించిన దని సారాంశము. ॥౭౫॥

శ్లో॥ శరైః ప్రసూనైస్తుదతః స్మరస్య
స్మర్తుం స కిం నాశనినా కరోతి ।
అభేద్యమస్యాహహ వర్మ న స్యా
దనఙ్గతా చేద్గిరిశ ప్రసాదః॥ ౭౬

ప॥వి॥ శరైః । ప్రసూనైః । తుదతః । స్మరస్య । స్మర్తుం । సః । కిం । న । అశనినా । కరోతి । అభేద్యమ్ । అస్య । అహహ । వర్మ । న । స్యాత్ । అనఙ్గతా । చేత్ । గిరిశప్రసాదః.

టీక॥ సః = ఇంద్రుడు, ప్రసూనైః = పువ్వులనెడి, శరైః = బాణములచే, తుదతః = పీడించుచున్న, స్మరస్య = మన్మథుని, స్మర్తుం = స్మరించుటకు, అశనినా = వజ్రాయుధముచే, కిం = ఏమి, నకరోతి = చేయఁడు?

తప్పక శంపఁగలడనియర్థము. అహహ = కష్టము, అస్య = ఈ మన్మథునికి, అనఙ్గతా = దేహరాహిత్యమను, గిరిశప్రసాదః = శివుని యనుగ్రహమను, అభేద్యం = భేదింపశక్యముకాని, వర్మ = కవచము, నస్యాచ్చేత్ = లేనిచో (తప్పక చంపఁగలఁడు).

వి॥ అనఙ్గత్వ మనునది కవచముగా రూపితము గాన రూపకము.

## సమాసములు :

*అభేద్యమ్ :* న భేద్యమ్ = అభేద్యమ్.

*అనఙ్గతా :* అవిద్యమానమఙ్గం యస్య సః = అనఙ్గః. అనఙ్గస్య భావః = అనఙ్గతా.

*గిరిశప్రసాదః :* గిరిశస్య ప్రసాదః = గిరిశప్రసాదః.

## భావము :

పుష్పబాణములచే బాధించుచున్న యా మన్మథుని ఇంద్రుఁడు తన వజ్రాయుధముచే స్మృతిమాత్రశేషుని అనగా నిహతునిఁగాఁ జేయజాలక పోలేదు. ఏల యనగా మన్మథుని పుష్పములు. ఇంద్రునిదో వజ్రము. కాని శివునిప్రసాదముచే నామన్మథుఁడు అనఙ్గత్వ మనగా శరీరరాహిత్య మను గొప్ప కవచమును ధరించి యున్నాడు. అది దేనిచేతను భేదింపనసాధ్యము గాదు. అది శూన్యరూపము కాన దానిపైన నెవ్వరి యాయుధములునుఁ బని జేయఁజాలవని భావము. ॥౮౬॥

శ్లో॥ ధృతాధృతేస్తస్య భవద్వియోగా
న్నానార్ధ్రశయ్యారచనాయ లూనైః ।
అప్యన్యదారిద్ర్యహరాః ప్రవాలై
ర్జాతా దరిద్రాస్తరవోఽమరాణామ్ ॥ ౮౭

ప॥వి॥ ధృతాధృతేః । తస్య । భవద్వియోగాత్ । నానార్ద్రశయ్యారచనాయ । లూనైః । అపి । అన్యదారిద్ర్యహరాః । ప్రవాలైః । జాతాః । దరిద్రాః । తరవః । అమరాణామ్,

టీక॥ అన్యదారిద్ర్యహరాఅపి; అన్య=ఇతరులయొక్క, దారిద్ర్యహరాఅపి= దారిద్ర్యమునుఁబోగొట్టునవియైనను, అమరాణాం = దేవతలయొక్క, తరవః = వృక్షములు, అనగా కల్పవృక్షములు, భవద్వియోగాత్; భవత్=నీయొక్క, వియోగాత్ = వియోగమువలన, ధృతాధృతేః; ధృత=ధరింపఁబడిన, అధృతేః = అనుత్సాహముగల్గిన, తస్య= ఆ యింద్రునికి, నానార్ద్రశయ్యారచనాయ; నానా = పెక్కువిధములైన, అర్ద్రశయ్యా=చల్లఁదనముఁగల్గిన, శయ్యా=పడకలను, రచనాయ= నిర్మించుటకై, లూనైః=త్రుంపఁబడిన, ప్రవాలైః = చిగుళ్లచే, దరిద్రాః=శూన్యములుగ, జాతాః=ఏర్పడినవి.

వి॥ కల్పవృక్షములకు దారిద్ర్యసంబంధము లేకపోయినను తత్సంబంధముసుఁ జెప్పుటవలన సంబంధాతిశయోక్తి.

## సమాసములు :

ధృతాధృతేః : ధృతా అధృతిః యేన సః = ధృతాధృతిః. తస్య = ధృతాఽధృతేః.

భవద్వియోగాత్ : భవత్యాః వియోగః=భవద్వియోగః. తస్మాత్ = భవద్వియోగాత్,

నానార్ద్రశయ్యారచనాయః ఆర్ద్రాశ్చ తాః శయ్యాశ్చ=ఆర్ద్రశయ్యాః. నానావిధాశ్చ తాః ఆర్ద్రశయ్యాశ్చ= నానార్ద్రశయ్యాః. నానార్ద్రశయ్యానాం రచనం=నానార్ద్రశయ్యారచనం. తస్మై=నానార్ద్రశయ్యారచనాయ.

అన్యదారిద్ర్యహరా : దరిద్రస్య భావః=దారిద్ర్యం. అన్యేషాం దారిద్ర్యం=అన్యదారిద్ర్యం. అన్యదారిద్ర్యం హరన్తీతి=అన్యదారిద్ర్యహరాః.

## భావము :

ఒరుల దారిద్ర్యమును హరించెడి దేవతావృక్షములైన కల్పవృక్షములు, నీయొక్క వియోగముచే నుత్సాహముఁదొలంగిన యింద్రునకు, చల్లనిఁ పాన్పుల నమర్చుటకై చిగుళ్ల నొసగుచు శూన్యములై పోయినవి. ఇట్లు శిశిరోపచారములను గావించినను నతని విరహవేదన శమించలేదు ॥౬౭॥

శ్లో॥ రవైర్గుణాస్ఫాలభవైః స్మరస్య
స్వర్ణాథకర్ణౌ బధిరావభూతామ్ ।
గురోః శృణోతు స్మరమోహనిద్రా
ప్రబోధదక్షాణి కిమక్షరాణి॥ ౬౮

ప॥వి॥ రవైః । గుణాస్ఫాలభవైః । స్మరస్య । స్వర్ణాథకర్ణౌ । బధిరౌ । అభూతామ్ । గురోః । శృణోతు । స్మరమోహనిద్రాప్రబోధదక్షాణి । కిమ్ । అక్షరాణి ।

టీక॥ స్వర్ణాథకర్ణౌ; స్వర్ణాథ = స్వర్గలోకప్రభువైన యింద్రునియొక్క, కర్ణౌ = చెవులు, స్మరస్య = మన్మథునియొక్క, గుణాస్ఫాలభవైః; గుణ=అల్లెత్రాటిని, ఆస్ఫాల=మీటుటచే, భవైః = కల్గినటువంటి, రవైః=శబ్దములచే, బధిరౌ=చెవిటివిగా, అభూతామ్ = అయినవి. (అయినను) గురోః=బృహస్పతియొక్క (సమీపమునుండి), స్మరమోహనిద్రాప్రబోధదక్షాణి; స్మరమోహ=మన్మథునివలని మోహమను, నిద్రా = నిద్రనుండి, ప్రబోధ = మేల్కొలుపునకు, దక్షాణి = సమర్థములైన, అక్షరాణి = అక్షరములు, కింశృణోతు= వినగలడా యేమి? (వినలేడనియర్థము)

సమాసములు :

*గుణాస్ఫాలభవైః* : గుణస్య ఆస్ఫాలః = గుణాస్ఫాలః. గుణాస్ఫాలాత్ భవన్తీతి =గుణాస్ఫాలభవాః. తైః = గుణాస్ఫాలభవైః.

*స్వర్ణాథకర్ణౌ* : స్వః నాథః=స్వర్ణాథః. స్వర్ణాథస్య కర్ణౌ = స్వర్ణాథకర్ణౌ.

*స్మరమోహనిద్రాప్రబోధదక్షాణి* : స్మరస్య మోహః =స్మరమోహః. స్మరమోహ ఏవ నిద్రా =స్మరమోహనిద్రా. స్మరమోహనిద్రాయాః ప్రబోధః =స్మరమోహనిద్రాప్రబోధః. స్మరమోహనిద్రాప్రబోధే దక్షాణి = స్మరమోహనిద్రాప్రబోధదక్షాణి. తాని =స్మరమోహనిద్రాప్రబోధదక్షాణి.

భావము :

ఇంద్రుని చెవులు మన్మథుడు వింటి నారిని మీటుటచే గల్గిన శబ్దము వలనఁ జెవుడ్పడినవి. ఇఁక నతనిని మరునివలని మోహనిద్రనుండి మేల్కొల్పు టకై బృహస్పతి చెప్పెడి యుపదేశవచనముల నతడెట్లు వినఁగలడు. అనగా వినలేఁడని భావము. ॥౬౮॥

శ్లో॥ అనఙ్గతాపప్రశమాయ తస్య
కదర్థ్యమానా ముహురామృణాళమ్ ।
మధౌ మధౌ నాకనదీనలిన్యో
వరం వహన్తాం శిశిరేఽనురాగమ్॥ ౬౯

ప॥వి॥ అనఙ్గతాపప్రశమాయ । తస్య । కదర్థ్యమానా । ముహుః । ఆమృణాళమ్ । మధౌ । మధౌ । నాకనదీనలిన్యః । వరం । వహన్తాం । శిశిరే । అనురాగమ్.

టీక॥ నాకనదీనలిన్యః; నాకనదీ = గఙ్గానదియొక్క, నలిన్యః = తామరలు, మధౌమధౌ = ప్రతివసన్తమునందును, తస్య = ఆయింద్రునకు, అనఙ్గ తాపప్రశమాయ; అనఙ్గతాప = మన్మథతాపముయొక్క, ప్రశమాయ = నివృత్తికి, ముహుః = ప్రతిమాఱు, ఆమృణాళం = తామరకాడవరకును, కదర్థ్యమానాః = పీడింపఁబడినవై, శిశిరే = శిశిరఋతువునందును, అనురాగం = అనురాగమును, వహన్తాం = వహించునుఁగాక. (ఏతత్ = ఇది) వరం = శ్రేష్టము.

సమాసములు :

అనఙ్గతాపప్రశమాయ : అవిద్యమానమఙ్గం యస్య సః = అనఙ్గః. అనఙ్గస్య తాపః = అనఙ్గతాపః. అనఙ్గతాపస్య ప్రశమః = అనఙ్గతాపప్రశమః. తస్మై = అనఙ్గతాపప్రశమాయ.

ఆమృణాలమ్ : మృణాలమభివ్యాప్య = ఆమృణాలమ్.

కదర్థ్యమానా : కదర్థాః క్రియమాణాః = కదర్థ్యమానాః.

నాకనదీనలిన్యః: నాకస్య నదీ = నాకనదీ. నాకనద్యాః నలిన్యః = నాకనదీనలిన్యః.

**భావము :**

ఆకాశగఙ్గయందలి తామరలు ప్రతివసన్తమునందును నింద్రుని మన్మథ తాపమును శమింపఁజేయుటకై కాడలువరకు పెఱుకఁబడి యుపయోగింపఁబడు చున్నవి. అందు వలన క్రమముగా పద్మజాతి కొంతకాలమునకుఁ బూర్తిగా నశించిపోవచ్చును. అందువలన నాతామరలు వసంతమున కంటెను శిశిర ఋతువునందుఁ బ్రీతిని వహించుట మంచిది. శిశిరఋతువునందు, కేవలము పుష్పములు మాత్రమే నశించును కాని కాడలు నశింపవు. వసంతఋతువునందేర్పడు మన్మథతాపము, శిశిరఋతువునం దేర్పడదు. కాన వానికి వినాశ మాఋతువు నందేర్పడ దని భావము.

శ్లో॥ దమస్వసః! సేయముపైతి తృష్ణా
జిష్ణోర్జగత్యగ్రిమలేఖ్యలక్ష్మీమ్ ।
దృశాం యదబ్ధిస్తవ నామ దృష్టి
త్రిభాగలోభార్తిమసౌ బిభర్తి ॥ ౭౦

ప॥ వి॥ దమస్వసః । సా । ఇయమ్ । ఉపైతి । తృష్ణా । జిష్ణోః । జగతి । అగ్రిమలేఖ్యలక్ష్మీమ్ । దృశాం । యత్ । అబ్ధిః । తవ । నామ । దృష్టి త్రిభాగలోభార్తిమ్ । అసౌ । బిభర్తి.

టీక॥ హేదమస్వసః = దమునిచెల్లెలైన యోదమయన్తీ! జిష్ణోః = ఇన్ద్రుని యొక్క, సాఇయం = ఆయీ, తృష్ణా = కాంక్ష, జగతి = ప్రపఞ్చము నందు, అగ్రిమలేఖ్యలక్ష్మీమ్; అగ్రిమ = తొలుత, లేఖ్య = గణింపఁదగిన, లక్ష్మీం = శోభను, అనగా ప్రపంచమునందు తొలుతగణింపఁదగి యుండుటను, ఉపైతి = పొందుచున్నది, యత్ = ఎలయనగా, దృశాం = నేత్రములకు, అబ్ధిః = సాగరుఁడైన, అనగా నిధియైన, అసౌ = ఈ ఇంద్రుఁడు, తవ = నీయొక్క, దృష్టిత్రిభాగలోభార్తిమ్; దృష్టి = నేత్రముయొక్క, త్రిభాగ = మూడవభాగమునందలి. లోభ = ఆశవలని, ఆర్తిం = బాధను, బిభర్తినామ = వహించునుగదా.

సమాసములు :

దమస్వసః : దమస్య స్వసా = దమస్వసా. తస్యాః సమృద్ధిః = సేదమస్వసః.

అగ్రిమలేఖ్యాలక్ష్మీమ్ : అగ్రిమాచ సా లేఖ్యా చ = అగ్రిమలేఖ్యా. అగ్రిమలేఖ్యాచసాలక్ష్మీః = అగ్రిమలేఖ్యాలక్ష్మీః. తామ్ = అగ్రిమలేఖ్యాలక్ష్మీమ్.

దృష్టిత్రిభాగలోభార్తిమ్ : దృష్టేః త్రిభాగః = దృష్టిత్రిభాగః. దృష్టి త్రిభాగే లోభః = దృష్టిత్రిభాగలోభః. దృష్టిత్రిభాగలోభేన ఆర్తిః = దృష్టి త్రిభాగలోభార్తిః. తామ్ = దృష్టిత్రిభాగలోభార్తిమ్.

భావము :

ఓదమయన్తీ ఇన్ద్రునికిఁ గల్గిన యాయాశ ప్రపఞ్చమునందుఁ దొలుత గణింపదగిన వస్తువుయొక్క శోభను వహించుచున్నది. అనగా నతని తృష్ణ ప్రపఞ్చమునఁదు మొట్టమొదట గణింపఁదగినది. ఏలయనగా వేయికన్నులు గల నేత్రములకు నిధియైన యింద్రుఁడు నీకంటియొక్క మూడవ భాగమును, అనగా కటాక్షమునుఁ గోరుచు బాధపడుచున్నాడుగదా. కావున, నేత్రములకు నిధియైన యింద్రుఁడు నేత్రములో మూడవ భాగము కోరుటవలన నతని తృష్ణ ప్రపంచమునందు తొలుత గణింపఁదగినది. అనగా నిన్ని కన్నులు గల తనకు నీ దృష్టిలోని మూడవభాగమునుఁ బొందుటయే ఫలమనియాశయము. సకలవస్తుసమృద్ధి గల భాగ్యశాలికి, వస్తులేశమునందలి యాశతో నిది పోల్చఁదగినది.॥౨౦॥

శ్లో॥ అగ్న్యాహితా నిత్యముపాసతే యాం
దేదీప్యమానాం తనుమష్టమూర్తేః।
ఆశాపతిస్తే దమయన్తి! సోఽపి
స్మరేణ దాసీభవితుం న్యదేశి॥ ౨౧

ప॥వి॥ అగ్న్యాహితాః । నిత్యమ్ । ఉపాసతే । యాం । దేదీప్యమానాం । తనుమ్ । అష్టమూర్తేః । ఆశాపతిః । తే । దమయన్తి । సః । అపి । స్మరేణ । దాసీభవితుం । న్యదేశి.

టీక॥ అగ్న్యాహితాః=ఆహితాగ్నులు, యాం = ఏ, దేదీప్యమానాం = మిక్కిలిప్రకాశించెడి, అష్టమూర్తేః = శివునియొక్క, తనుం = శరీరమును, నిత్యమ్=ఎల్లప్పుడును, ఉపాసతే = కొలచుచున్నారో, హేదమయన్తి=ఓదమయన్తీ, ఆశాపతిః=దిక్పతియైన, సోఽపి = ఆయగ్నియు, స్మరేణ=మన్మథునిచే, తే=నీకు, దాసీభవితుం = దాసుఁడగుటకు, న్యదేశి=ఆదేశింపఁబడెను.

## సమాసములు:

అగ్న్యాహితాః : ఆహితః అగ్నిః యైస్తే=అగ్న్యాహితాః.

అష్టమూర్తేః : అష్టౌ మూర్తయః యస్య సః=అష్టమూర్తిః. తస్య= అష్టమూర్తేః.

ఆశాపతిః : ఆశాయాః పతిః=ఆశాపతిః.

దాసీభవితుం : అదాసః దాసః, సంపద్యమానః భవితుం = దాసీభవితుం.

## భావము :

ఓదమయన్తీ అగ్నిని సిద్ధిఁ జేసికొని యుపాసించెడి యాహితాగ్నులు మిక్కిలి ప్రకాశించెడి యా యష్టమూర్తి యైన శివుని యొక్క శరీరమగు ఏఅగ్ని నుపాసింతురో, దిక్పాలకులలో నొక్కడైన యా యగ్నిసైతము మన్మథునివలన నీకు దాసుడై యుండుటకు ఆదేశింపఁబడినాడు॥౨౦॥

శ్లో॥ త్వద్గోచరస్తం ఖలు పఞ్చబాణః
కరోతి సన్తాప్య తథావినీతమ్ ।
స్వయం యథాస్వాదితతప్తభూయః
పరం న సన్తాపయితా స భూయః॥ ౨౧

ప॥వి॥ త్వద్గోచరః । తం । ఖలు । పఞ్చబాణః । కరోతి । సన్తాప్య । తథా । వినీతమ్ । స్వయం । యథా । స్వాదితతప్తభూయః । పరం । న । సన్తాపయితా । స । భూయః.

టీక॥ పఞ్చబాణః = మన్మథుడు, త్వద్గోచరః = నిన్ను గుఱిగాఁజేసికొని, తం = ఆయగ్నిని, సన్తాప్య = చక్కగాఁదపింపఁజేసి, తథా = ఆప్రకారముగా; వినీతం = వినయవన్తునిగా, కరోతిఖలు = చేయుచున్నాడుగదా, యథా = ఏప్రకారము, స్వయం = తానుగా, స్వాదితతప్తభూయః, స్వాదిత = అనుభవింపఁబడిన, తప్తభూయః = సన్తాపముగలవాడై, పరమ్ = ఇతరుని, భూయః = మఱల, యథా = ఎట్లు, నసన్తాపయితా = సన్తాపపఱచడో (అట్లే వినయవన్తునిగాఁజేయుచున్నాడు.)

**సమాసములు :**

త్వద్గోచరః : త్వం గోచరః యస్యసః = త్వద్గోచరః.

పఞ్చబాణః : పఞ్చ బాణాః యస్య సః = పఞ్చబాణః.

స్వాదితతప్తభూయః : తప్తస్య భావః = తప్తభూయం. స్వాదితం తప్తభూయం యేన సః = స్వాదితతప్తభూయః.

**భావము :**

మన్మథుఁడు నిన్ను గుఱిగాఁ జేసికొని యా యగ్నినిఁ జక్కగా సన్తాపపఱచి సుశిక్షితుని గావించుచున్నాడు. అందువలన నా యగ్ని సన్తాపము ననుభవించినవాడై యితరులను సన్తాపపఱచుటలేదు. స్వయముగా దుఃఖముల ననుభవించినవాడు తన్ను దృష్టాన్తముగాఁ జేసికొని యితరులను దుఃఖింపఁజేయడు. అనగా నగ్ని నీకై మదనబాధ ననుభవించుచున్నాడని యాశయము. ॥౭౨॥

శ్లో॥ అదాహి యత్తేన దశార్ధబాణః
పురా పురారేర్నయనాలయేన ।
స నిర్దహంస్తం భవదక్షివాసీ
న వైరశుద్ధేరధునాఽధమర్ణః॥ ౭౩

ప॥వి అదాహి । యత్ । తేన । దశార్ధబాణః । పురా । పురారేః । నయనాలయేన । సః । నిర్దహన్ । తం । భవదక్షివాసీ । న । వైరశుద్ధేః । అధునా । అధమర్ణః.

టీక॥ యః = ఏ, దశార్ధబాణః = పదిలోసగమైనబాణములుగల, అనగా పఞ్చబాణములుగల మన్మథుడు, పురా = పూర్వము, పురారేః = శివుని యొక్క, నయనాలయేన; నయన = నేత్రములను, ఆలయేన = ఆశ్రయముగాఁగల్గిన, తేన = ఆయగ్నిచే, అదాహి = కాల్చఁబడెనో, సః = ఆమన్మథుఁడు. అధునా = ఇప్పుడు, భవదక్షివాసీ; భవత్ = నీయొక్క, అక్షి = కన్నులయందు, వాసీ = నివసించుచున్నవాడై, తమ్ = ఆయగ్నిని, వైరనిర్యాతనాత్ = పగనుఁదీర్చుటవలన, అధమర్ణః = ఋణముకలవాఁడుగా, న = లేదు, అనగా ఋణములేనివాఁడాయెను.

## సమాసములు :

*దశార్ధబాణః :* దశానామర్ధం = దశార్ధం. దశార్ధం బాణాః యస్య సః = దశార్ధబాణః.

*పురారేః :* పురాణామరిః = పురారిః. తస్య = పురారేః.

*నయనాలయేన :* నయనం ఆలయః యస్య సః = నయనాలయః. తేన = నయనాలయేన.

*భవదక్షివాసీ :* భవత్యాః అక్షిణీ = భవదక్షిణీ. భవదక్షిణ్యోః వసతీతి = భవదక్షివాసీ.

*వైరశుద్ధేః :* వైరస్య శుద్ధిః = వైరశుద్ధిః. తస్యాః = వైరశుద్ధేః.

*అధమర్ణః :* అధమః ఋణాత్ = అధమర్ణః.

## భావము :

పూర్వము మన్మథుఁడు శివుని నేత్రమందలి యగ్నిచే గాల్చఁబడెను ఆ మన్మథు డిప్పుడు నీ నేత్రములయందు నెలకొనినవాఁడై యా యగ్నిని దహించుచు నతనిపైని పగను తీర్చుకొని ఋణవిముక్తుఁ డాయెను. ఎవఁడు ఎవని కపకారముఁ గావించునో యతడు వాని కట్టే బదులుఁ గావించి వైరము తీర్చుకొనును. ॥23॥

శ్లో॥ సోమాయ కుప్యన్నివ విప్రయుక్తః

స సోమమాచామతి హూయమానమ్ ।

నామాఽపి జాగర్తి హి యత్ర శత్రో
స్తేజస్వినస్తం కతమే సహన్తే॥ ౭౪

ప॥ వి॥ సోమాయ । కుప్యన్ । ఇవ । విప్రయుక్తః । సః । సోమమ్ । ఆచామతి । హూయమానమ్ । నామ । అపి । జాగర్తి । హి । యత్ర । శత్రోః । తేజస్వినః । తం । కతమే । సహన్తే.

టీక॥ విప్రయుక్తః = వియోగము(బొందిన, అగ్నిః = అగ్ని, సోమాయ = చన్ద్రునికై, కుప్యన్నివ = కోపించుచున్నవానివలె, హూయమానం = యజ్ఞమునందు నీయ(బడుచున్న, సోమం = సోమరసమును, ఆచామతి = పానము(జేయుచున్నా(డు, తథాహి = అదియుక్తమే. యత్ర = ఏ పురుషునియందు, శత్రోః = శత్రువుయొక్క, నామాపి = పేరుకూడ, జాగర్తి = వెలయునో, తం = ఆ శత్రువు పేరును ధరించినవానిని, తేజస్వినః = వైరివలని యవమానమును సహింపని పరాక్రమవన్తులు, కతమే = ఎందఱు, సహన్తే = సహింతురు.

వి॥ తేజోవన్తులకు శత్రునామశ్రవణము గూడ దుస్సహమను సామాన్యముచే, అగ్ని సోముని సహింపక సోమపానము( గావించుచున్నా డను విశేషము సమర్థితము గాన నర్థాన్తరన్యాసాలఙ్కారము.

**భావము :**

నీయొక్క వియోగము( జెందిన యగ్ని తన్ను బాధించెడి సోముని అనగా చన్ద్రునిపై కోపించెనో యనునట్లు యజ్ఞములయందు( దనకిచ్చెడి సోమరసమును( బానము( జేయుచున్నాడు. చన్ద్రునిపై( గోపముతో సోమరసము( బానము జేయుటవలన( బ్రయోజనమేమియనినచో లోకమున( బరాక్రమవన్తులు శత్రువుయొక్క పేరును(గూడసహింపలేరు. కాన సోమరసమునందు శత్రువైన సోమునియొక్క అనగా చన్ద్రునియొక్క నామముండుటవలన, సోమపానము( జేయుట చేతను శత్రువైన సోమునిపై యనగా చంద్రునిపై పగ తీర్చుకొన్నట్లగును. కాన నగ్ని యిట్లు సోమపానముచే( జంద్రునిపై( బగతీర్చుకొనెనని భావము. ॥౭౪॥

శ్లో॥ శరైరజస్రం కుసుమాయుధస్య
కదర్థ్యమానస్తవ కారణాయ ।

అభ్యర్చ్యయద్భిర్వినివేద్యమానా
దప్యేష మన్యే కుసుమాద్బిభేతి॥ ౭౫

ప॥వి॥ శరైః । అజస్రం । కుసుమాయుధస్య । కదర్థ్యమానః । తవ । కారణాయ । అభ్యర్చ్యయద్భిః । వినివేద్యమానాత్ । అపి । ఏషః । మన్యే । కుసుమాత్ ، బిభేతి.

టీక॥ (ఓదమయన్తీ) తవకారణాయ = నీకొరకు, కుసుమాయుధస్య = పూవిల్తునియొక్క, శరైః = బాణములను పూవులచే, అజస్రం = ఎల్లప్పుడు, కదర్థ్యమానః = పీడింపఁబడుచున్న, ఏషః = ఈయగ్ని, అభ్యర్చ్యయద్భిః = పూజించుచున్నవారిచే, నివేద్యమానాత్ = అర్పింపఁబడునట్టి, కుసుమాత్ = పుష్పమునుండియు, బిభేతి = భయపడుచున్నాడు. మన్యే = ఇట్లుతలంతును.

వి॥ ఆరాధించువా రర్పించెడి పూవులచే భయపడకపోయినను, భయపడినట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష. "మన్యే" అను వ్యఞ్జకమునుఁ బ్రయోగించుట వలన నది వాచ్యము.

**భావము :**

ఓదమయన్తీ! నీకై మన్మథునిచే, పుష్పబాణములతోఁ గొట్టఁబడుచున్నట్టి యీ యగ్ని, యిప్పుడు, ఆరాధకులు తన కర్పించెడి పూవుపలనఁ గూడ భయపడుచున్నా డని తలంతును. ॥౭౫॥

శ్లో॥ స్మరేన్ధనే వక్షసి తేన దత్తా
సంవర్తికా శైవలవల్లిచిత్రా ।
చకాస్తి చేతోభవపావకస్య
ధూమావిలా కీలపరమ్పరేవ ॥ ౭౬

ప॥వి॥ స్మరేన్ధనే । వక్షసి । తేన । దత్తా । సంవర్తికా । శైవలవల్లిచిత్రా । చకాస్తి । చేతోభవపావకస్య । ధూమావిలా । కీలపరమ్పరా । ఇవ.

టీక॥ తేన = ఆయగ్నిచే, స్మరేన్ధనే = మన్మథుఁడనునగ్నిచే దహింపఁదగిన, వక్షసి = వక్షఃస్థలమునందు, (తాపశాంతికై) దత్తా = ఉంచబడినదియు,

శైవలవల్లిచిత్రా; శైవలవల్లి=నాచుతీగెలచే, చిత్రా =చిత్రవర్ణములు గల్గిన, సంవర్తికా = నూతనదళమైనపద్మము, చేతోభవపావకస్య; చేతోభవ =మన్మథుఁడనెడి, పావకస్య=అగ్నికి, ధూమావిలా = పొగతోఁగలసిన, కీలపరమ్పరాఇవ = జ్వాలలసమూహమువలె, చకాస్తి =ప్రకాశించుచున్నది.

## సమాసములు :

స్మరేన్ధనే : స్మరస్య ఇన్ధనం=స్మరేన్ధనం. తస్మిన్=స్మరేన్ధనే.

శైవలవల్లిచిత్రా : శైవలానాం వల్లయః = శైవలవల్లయః. శైవల వల్లిభిః చిత్రా=శైవలవల్లిచిత్రా.

చేతోభవపావకస్య : చేతసి భవతీతి = చేతోభవః. చేతోభవ ఏవ పావకః=చేతోభవపావకః. తస్య=చేతోభవపావకస్య.

ధూమావిలా : ధూమేన ఆవిలా=ధూమావిలా.

కీలపరమ్పరా : కీలానాం పరమ్పరా=కీలపరమ్పరా.

## భావము :

ఆ యగ్ని మన్మథతాపము శమించుటకై తన యక్కున నుంచుకొన్నిన నాచు తీవెలతో చిత్రమైనట్టి క్రొన్దామరపూవు పొగతోఁ గలసిన మన్మథాగ్ని జ్వాలల సమూహము వలెఁ బ్రకాశించుచున్నది॥౭౬॥

శ్లో॥ పుత్రీ సుహృద్యేన సరోరుహాణాం
యత్ప్రేయసీ చన్దనవాసితా దిక్।
ధైర్యం విభుః సోఽపి తవైవ హేతోః
స్మరప్రతాపజ్వలనే జుహావ॥ ౭౭

ప॥వి॥ పుత్రీ । సుహృత్ । యేన । సరోరుహాణాం । యత్ప్రేయసీ । చన్దన వాసితా । దిక్ । ధైర్యం । విభుః । సః । అపి । తవ । ఏవ । హేతోః । స్మరప్రతాపజ్వలనే । జుహావ.

టీక॥ యేన = ఎవ్వనిచే, సరోరుహాణాం = పద్మములయొక్క. సుహృత్ = మిత్రుఁడైన సూర్యుఁడు, పుత్రీ = పుత్రవన్తుఁడో, చన్దనవాసితా = చన్దనవృక్షములచేఁబరిమళించునట్టి, దిక్ = దక్షిణదిశ, యత్ప్రేయసీ; యత్ = ఎవ్వనికి, ప్రేయసీ = మిక్కిలిప్రియురాలో, సః = ఆ, విభురపి = యముఁడనెడి ప్రభువుగూడ, తవైవహేతోః = నీకొఱకే, ధైర్యం = తనధైర్యమును, స్మరప్రతాపజ్వాలనే; స్మర = మన్మథుని యొక్క, ప్రతాపజ్వలనే = ప్రతాపమనునగ్నియందు, జుహావ = హెూతముఁగావించెను.

సమాసములు :

యత్ప్రేయసీ : యస్య ప్రేయసీ = యత్ప్రేయసీ.

చన్దనవాసితా : చన్దనేన వాసితా = చన్దనవాసితా,

స్మరప్రతాపజ్వలనే : స్మరస్య ప్రతాపః = స్మరప్రతాపః. స్మర ప్రతాప ఏవ జ్వలనః = స్మరప్రతాపజ్వలనః. తస్మిన్ స్మరప్రతాపజ్వలనే.

భావము :

ఎవ్వనిచే సూర్యుఁడు పుత్రవన్తుఁడో, అనగా యముడు, ఉత్తమవంశమందు జన్మించినవాడని భావము, చన్దనవృక్షములతోఁ బరిమళించెడి దక్షిణపు దిక్కు, ఎవ్వనికి మిక్కిలి ప్రియురాలో-అనగా చక్కటి భోగశాలి యని యర్థము, అట్టి ప్రభువైన యముఁడు నీకొఱకై తన ధైర్యమును మన్మథాగ్ని యందు వ్రేల్చివేసెను. ఆ యముఁడు గూడ నీయం దనురక్తుఁడై ధైర్యము కోల్పోయె నని భావము. ॥౨౨॥

శ్లో॥ తం దహ్యమానైరపి మన్మథైధం
హసైరుపాస్తే మలయః ప్రవాతైః।
కృచ్ఛ్రేప్యసౌ నోజ్ఝతి తస్య సేవాం
సదా యదాశామవలమ్బతే యః॥ ౨౩

ప॥వి॥ తం । దహ్యమానైః। అపి। మన్మథైధం। హసైః । ఉపాస్తే ।మలయః।

ప్రవాలైః । కృచ్ఛ్రే । అపి । అసౌ । న । ఉజ్ఝతి । తస్య । సేవాం । సదా । యదాశామ్ । అవలమ్బతే । యః.

టీక॥ మలయః = మలయపర్వతము, మన్మథైధమ్; మన్మథ = కామాగ్నికి, ఏధం = ఇన్ధనమైన, తం = ఆ, యమం = యముని, దహ్యమానైః = అతనిదేహ సంబంధముచే దహింపఁబడుచున్న, ప్రవాలైః = చిగుళ్లనెడి, హస్తైః = హస్తములచే, ఉపాస్తే = కొలుచుచున్నది. అనగా నతనికి శిశిరోపచారములాచరించుచున్నది. యః = ఏజనము, సదా = ఎల్లప్పుడు, యదాశాం; యత్ = ఎవనియొక్క, ఆశాం = దేశమును, అనురాగమును, అవలమ్బతే = పొందుచున్నదో, అసౌ = ఈజనము, కృచ్ఛ్రేఽపి = కష్టమందును, తస్య = అతనియొక్క, సేవాం = సేవను, నోజ్ఝతి = వదలిపెట్టదు.

వి॥ ఎవడు ఎవని దిక్కు నాశ్రయించి యుండునో యతడు వానికి సేవనుఁ జేయుననను సామాన్యముచే మలయపర్వతము యముని సంబంధమువలన కాలిపోవుచున్న తనచిగుళ్లనెడి హస్తములతో నాయమునికి శిశిరోపచారములు చేయుచుండెనని విశేషము సమర్థింపఁబడినది గాన నర్థాన్తరన్యాసాలంకారము.

**భావము :**

మలయపర్వతము మన్మథాగ్నికి నాహుతి యగుచున్న యమునికి నతని శరీరసంబంధముచే కాలిపోవుచున్న చిగుళ్లనెడి హస్తముతో శిశిరోపచారములు చేయుచున్నది. ఎవరు ఎవ్వని దేశమునందుండెదరో (ఎవ్వనిపై ననురాగము వహింతురో) వారు కష్టదశయందుఁ గూడ వాని సేవను వదలిపెట్టరు. కావున మలయపర్వతము యముని దిశయందుండుటవలన నీతనికిఁ దన చిగుళ్లనెడి హస్తములు కాలుచున్నను సేవఁ జేసినదని యాశయము. ॥౭౮॥

శ్లో॥ స్మరస్య కీర్త్యేవ సితీకృతాని
తద్దోఃప్రతాపైరివ తాపితాని ।
అఙ్గాని ధత్తే న భవద్వియోగాత్
పాణ్డూని చణ్డజ్వరజర్జరాణి॥ ౭౯

ప॥వి॥ స్మరస్య । కీర్త్యా । ఏవ । సితీకృతాని । తద్దోః ప్రతాపైః । ఇవ ।
తాపితాని । అఙ్గాని । ధత్తే । సః । భవద్వియోగాత్ । పాణ్డూని ।
చణ్డజ్వరజర్జరాణి.

టీక॥ సః = ఆయముడు, భవద్వియోగాత్ = నీయొక్క విరహమువలన, పాణ్డూని = తెల్లనైనవియు, చణ్డజ్వరజర్జరాణి; చణ్డజ్వర = తీవ్రమైన జ్వరముచే, జర్జరాణి = శిథిలములైనవియును, (అందువలననే) స్మరస్య = మన్మథునియొక్క, కీర్త్యా = కీర్తిచే, సితీకృతానీవ = తెల్లనివిగాఁ జేయఁబడినవో యనునట్లుండునవియు, తద్దోఃప్రతాపైః; తత్ = ఆమన్మథునియొక్క, దోః = భుజములయొక్క, ప్రతాపైః = ప్రతాపముచే, తాపితానీవ = సంతాపముఁబొందింపఁబడినవోయన్నట్లుండునవియునగు. అఙ్గాని = అవయవములను, ధత్తే = ధరించుచున్నాడు.

వి॥ సితీకృతములు కాకపోయినను, సితీకృతములైనట్లు, తాపితములు కాకపోయినను తాపితములులైనట్లును నఙ్గములను గూర్చి చెప్పుటవలనను నుత్ప్రేక్ష.

వియోగముచే తెల్లబారిన యవయవములనుఁ కీర్తిచేతెల్లఁబడినవిగను, చణ్డజ్వరముచే జర్జరితములైనవానిని, ప్రతాపముచే తాపితములుగను క్రమముగాఁ జెప్పుటవలన యథాసంఖ్యాలఙ్కారము. ఈ యథాసంఖ్యమునకు నుత్ప్రేక్షకును సఙ్కరము.

**సమాసములు :**

సితీకృతాని : అసితాని సితాని సంపద్యమానాని కృతాని = సితీకృతాని. తాని = సితీకృతాని.

తద్దోః ప్రతాపైః : తస్య దోషౌ = తద్దోషౌ. తద్దోషయోః ప్రతాపాః = తద్దోఃప్రతాపాః. తైః = తద్దోఃప్రతాపైః.

భవద్వియోగాత్ : భవత్యాః వియోగః = భవద్వియోగః. తస్మాత్ = భవద్వియోగాత్.

చణ్డజ్వరజర్జరాణి : చణ్డశ్చాసౌ జ్వరశ్చ = చణ్డజ్వరః. చణ్డజ్వరేణ జర్జరాణి = చణ్డజ్వరజర్జరాణి. తాని = చణ్డజ్వరజర్జరాణి.

భావము :

ఆ యముఁడు నీయొక్క విరహమునఁ దెల్లవారినవియును, తీవ్రమైన జ్వరముచే శిథిలములైనవియునగు నవయవములను ధరించుచున్నాడు. అందు తెల్లవారినయవయవములు, స్మరునికీర్తిచేఁ దెల్లవారిన విధముగను, జ్వరముచే శిథిలములైన యవయవములు, స్మరుని భుజప్రతాపములచే దాపముఁబొందింపఁ బడిన విధముగను భావింపఁబడినవి. ॥౭౯॥

శ్లో॥ యస్తన్వి భర్తా ఘుసృణేన సాయం
దిశః సమాలమ్భనకౌతుకిన్యాః ।
తదా స చేతః ప్రజిఘాయ తుభ్యం
యదా గతో నైతి నివృత్య పాన్థః॥ ౮౦

ప॥వి॥ యః । తన్వి । భర్తా । ఘుసృణేన । సాయం । దిశః । సమాలమ్భనకౌతుకిన్యాః । తదా । సః । చేతః । ప్రజిఘాయ । తుభ్యం । యదా । గతః । న । ఏతి । నివృత్య । పాన్థః.

టీక॥ హేతన్వి = ఓసున్దరీ! యః = ఏవేల్పు, ఘుసృణేన = కుఙ్కుమముచే, సమాలమ్భనకౌతుకిన్యాః; సమాలమ్భన = మైపూతఁగావించుకొనుటకు, కౌతుకిన్యాః = కోరికఁగల్గిన, దిశః = పడమటిదెసకు, భర్తా = భర్తయో, సః = ఆవరుణదేవుఁడు; తదా = ఆకాలమందు, తుభ్యం = నీకొఱకు, చేతః = మనస్సును, ప్రజిఘాయ = పంపెను, యదా = ఏసమయమందు, గతః = వెళ్లిన, పాన్థః = బాటసారి, నివృత్య = మఱలి, నైతి = రాఁజాలఁడో, అనగా నాసమయము చిత్రతో లేక స్వాతితోఁడనో కూడి యుండునేమో!

వి॥ మనస్సును పంపిన సమయము చిత్రానక్షత్రముతోఁడను స్వాతీ నక్షత్రముతోడను కూడియుండకపోయినను, కూడియుండునేమో యని భావించుటవలన నుత్ప్రేక్ష.

" నన్దన్తి న నివర్తన్తేచిత్రాస్వాత్యోర్గతాః నరాః" యని జ్యోతిషవచనము ననుసరించి చిత్రాస్వాతులలో బయలుదేరినవారు సుఖముగా నుందరు.

మఱలియురారు. కానవరుణదేవుని మనస్సు దమయన్తియొద్దకుఁ బంపిన సమయము చిత్రాస్వాతులుగా నుండుటవలన నది తిరిగిరాక యున్నదని యర్థము.

## సమాసములు :

సమాలమ్భనకౌతుకిన్యాః:కౌతుకమ్ అస్యాః అస్తీతి=కౌతుకినీ. సమాలమ్భనేకౌతుకినీ=సమాలమ్భనకౌతుకినీ. తస్యాః=సమాలమ్భనకౌతుకిన్యాః.

పాన్థః : పన్థానం గచ్ఛతీతి=పాన్థః.

## భావము :

ఓసున్దరీ! సాయంకాలమున కుఙ్కుమతో మైపూతఁగావించుకొను పడమటిదెస యను యువతికి భర్తయగు వరుణుఁడు తన మనస్సును, "ప్రయాణముఁజేసిన బాటసారి తిరిగిరాని సమయమున" అనగా మఱలి రాని ముహూర్తమున నీయొద్దకుఁ బంపినాడు. అందువలన నాతని మనస్సు నీయొద్దనే యుండిపోయినది. ఆముహూర్తము చిత్తాస్వాతులలోఁ గూడిన సమయముగా నుండునేమో. చిత్తాస్వాతులయందు బయలుదేరి వెళ్లినవారు సుఖముగానుండరు. మఱలియు రారు. ॥౭౦॥

శ్లో॥ తథా న తాపాయ పయోనిధీనా
మశ్వాముఖోత్థః క్షుధితః శిఖావాన్ ।
నిజః పతిః సమ్ప్రతి వారిపోఽపి
యథా హృదిస్థః స్మరతాపదుఃస్థః॥ ౭౧

ప॥వి॥ తథా । న । తాపాయ । పయోనిధీనామ్ । అశ్వాముఖోత్థః । క్షుధితః । శిఖావాన్ । నిజః । పతిః । సమ్ప్రతి । వారిపః । అపి । యథా । హృదిస్థః । స్మరతాపదుఃస్థః ।

టీక॥ క్షుధితః=ఆకలిఁగొన్నటువంటి, అశ్వాముఖోత్థః; అశ్వా=బడబయను నశ్వముయొక్క, ముఖ = ముఖమునుండి, ఉత్థః = ఉద్భవించిన, శిఖావాన్=అగ్ని, అనగాబడబాగ్ని, పయోనిధీనాం=సముద్రములకు, తథా= అట్లు, తాపాయ = సంతాపముకొఱకు, నభవతి = కాదు,

యథా = ఎట్లు, (అసౌ = ఈవరుణుడు) స్మరతాపదుఃస్థః; స్మరతాప = మన్మథతాపముచే, దుఃస్థః = అస్వస్థుఁడై, నిజః = తమకుసంబంధించిన, అనగా సముద్రములకు సంబంధించిన, పతిః = భర్తయై, హృదిస్థః = (హృదయమునందున్నవాడై) స్మరింపఁబడినంత మాత్రముచేతనే, వారిపోఽపి = జలరక్షకుఁడైనను, తాపాయ = సముద్రములనుఁదపింపఁ జేయుటకు, భవతి = కారణమగుచున్నాడో.

పక్షాన్తరము.

యతః = ఎందువలన, స్మరతాపదుఃస్థః; స్మరతాప = మన్మథతాపముచే, దుఃస్థః = దురవస్థనుఁబొందినవాడై, వారిపోఽపి = ఉదకములను రక్షించువాడైనను, హృదిస్థః = స్మరణచేతనేగోచరించు వాఁడును, మధ్యభాగము నందుండు వాడునునగు, నిజః = తనకు సంబంధించిన, పతిః = పాలకుఁడగువరుణుఁడు, సంప్రతి = ఇప్పుడు, అనగా నీయొక్క విరహదశయందు, యథా = ఎట్లు, పయోనిధీనాం = సముద్రములకు, సంతాపాయ = సంతాపమునకు, భవతి = అనుచున్నాఁడు, తథా = అట్లు, క్షుధితః = ఆకలిఁగొన్న, హృదిస్థః = సాగరమధ్యము నందున్నట్టి దియు, వారిపోఽపి = ఉదకమునుఁద్రాగునట్టిదియునగు, అశ్వాముఖోత్థః = బడబాముఖమునందుద్భవించిన, శిఖావాన్ = అగ్ని, పయోనిధీనాం = సముద్రములకు, తాపాయ = సంతాపమునకు, నాభూత్ = కారణముగా లేదు.

వి॥ వరుణుని కిట్టి తాపకారిత్వ సంబంధము లేక పోయినను, తాపకారిత్వ సంబంధమునుఁ జెప్పుటవలన సంబంధాతిశయోక్తి.

సమాసములు :

*పయోనిధీనాం :* పయాంసి నిధీయన్తే అస్మిన్ ఇతి = పయోనిధయః. తేషాం = పయోనిధీనాం,

*అశ్వాముఖోత్థః :* అశ్వాయాః ముఖం = అశ్వాముఖం. అశ్వాముఖాత్ ఉత్తిష్ఠతీతి అశ్వాముఖోత్థః.

*వారిపః :* వారి పాతీతి = వారిపః. యద్వా వారి పిబతీతి = వారిపః.

హృదిస్థః : హృది తిష్ఠతీతి = హృదిస్థః.

స్మరతాపదుఃస్థః : స్మరస్య తాపః = స్మరతాపః. స్మరతాపేన దుఃఖం తిష్ఠతీతి = స్మరతాపదుఃస్థః.

**భావము :**

వరుణుఁడు జలరక్షకుఁడని ప్రసిద్ధి. తలంచినంతమాత్రముననే ప్రత్యక్షమగునట్టి రక్షకుఁడు అతడు కామజ్వరముచేఁ బీడింపఁబడి సముద్రమధ్యమందున్నవాఁడై నీ విరహతాపముచే నే విధముగ నా సముద్రముల నుడికించుచున్నాడో, ఆవిధముగా నాకలిఁగొన్న బడబాగ్ని సముద్రమధ్యమందుండి దానినీటి మట్టమునుఁ పెరుగనీయక యందలి జలమును, గ్రోలుచు నాసముద్రముల నుడికించుచున్నదైనను, నంతటి సంతాపము నా సముద్రములకుఁ గల్గించలేదు. వరుణుఁడు వారిని పాలించుటవలన వారిపుడు. బడబాగ్ని వారినిఁ ద్రాగుట వలన వారిపుఁడు. వరుణుఁడును తలంచినంత మాత్రముననే గోచరించుటవలన హృదయస్థుఁడు. బడబాగ్ని సముద్రమధ్యమునం దుండుటవలన హృదయస్థుడు. వరుణుడు తలంచినంత మాత్రముననే గోచరుఁడగుటయే కాదు మఱేమనగా, విరహతాపముచే సముద్రమధ్యమందున్నవాడు ఇట్లు వరుణునికిని, బడబాగ్నికిని పోలిక యున్నను బడబాగ్నిలోనిది విరహతాపము కానందువలన నది సముద్రముల నెక్కువ సంతాపపఱచుటలేదు. వరుణుని యందలి తాపమో విరహతాపమే కాన నది సముద్రముల నెక్కువ సంతాప పఱుపఁగల్గినది. బాడబాగ్ని తాపముకంటెను విరహాగ్నితాపము మిక్కుటమైనది. అనగా జలాధిపతి యగు వరుణుడు సహజముగా తాపమునుఁ జల్లార్చుకొనఁగల్గినవాడైనను, విరహతాపమునుఁ జల్లార్చుకొనజాలక సముద్రమధ్యమున మునుగగా నతని తాపము బడబాగ్ని తాపము నతిశయించి సముద్రములను మిక్కిలి యుడికించినది. ॥౮౧॥

శ్లో॥ యత్ప్రీత్యుత త్వన్మృదుబాహువల్లీ
స్మృతిప్రసజం గుమ్ఫతి దుర్వినీతా ।
తతో విధత్తేఽధికమేవ తాపం
తేన శ్రితా శైత్యగుణా మృణాళీ॥ ౮౨

ప॥వి॥ యత్ । ప్రతి । ఉత । త్వన్మృదుబాహువల్లీస్మృతిస్రజం । గుమ్ఫతి । దుర్వినీతా । తతః । విధత్తే । అధికమ్ । ఏవ । తాపం । తేన । శ్రితా । శైత్యగుణా । మృణాళీ.

టీక॥ తేన = ఆవరుణునిచే, శ్రితా = తాపశాంతికై ఆశ్రయింపఁబడిన, శైత్యగుణా = చల్లనిస్వభావముగలదైనను, దుర్వినీతా = ప్రతికూలముగసంచరించు, మృణాళీ = లేఁదామరతూఁడు, యత్ = ఎందువలన, త్వన్మృదుబాహువల్లీస్మృతిస్రజం; త్వత్ = నీయొక్క, మృదు = మెత్తని, బాహువల్లీ = తీగెలవంటిభుజములయొక్క, స్మృతిస్రజం = స్మృతులతోఁ గూర్చినమాలికను, గుమ్ఫతి = కట్టుచున్నదో అనగా నెల్లప్పుడును స్మరింపజేయుచున్నదో, తత్ = అందువలన ననగా నీదగు బాహువులను స్మరింపజేయుటవలన, ప్రత్యుత = దానికివిపరీతముగా, అధికం = అధికమైన, తాపమేవ = సన్తాపమునే, విధత్తే = కల్గించుచున్నది.

వి॥ ఇచ్చట మృణాళి,బాహువల్లిని స్మరింపఁజేయుటవలన స్మరణాలఙ్కారము. తాపశాన్తికి కారణమైన మృణాళి, తద్విపరీత మగు కార్యమును, అనగా తాపమునుఁ గల్గించుటవలన విషమాలఙ్కారము. స్మరణాలఙ్కారమునకును విషమాలఙ్కారమునకును సఙ్కరము.

## సమాసములు :

*త్వన్మృదుబాహువల్లీస్మృతిస్రజమ్* : మృదూ చ తౌ బాహూ చ = మృదుబాహూ. తవమృదుబాహూ = త్వన్మృదుబాహూ.త్వన్మృదుబాహూఏవ వల్ల్యౌ = తన్మృదుబాహువల్ల్యౌ.స్మృతీనాంస్రక్ = స్మృతిస్రక్. త్వన్మృదుబాహువల్ల్యౌ ఏవ స్మృతిస్రక్ = త్వన్మృదుబాహువల్లీస్మృతిస్రక్. తామ్ = త్వన్మృదుబాహువల్లీస్మృతిస్రజమ్.

*శైత్యగుణా* : శీతస్య భావః = శైత్యమ్. శైత్యమేవ గుణః యస్యాస్సా = శైత్యగుణా.

## భావము :

ఆ వరుణుఁడు తన తాపము శమించుటకై చల్లని తామరతూఁడు నాశ్రయించెను, కాని తుంటరియైన యా లేఁదామరతూడు నీబాహులతల

స్మృతిమాలనుఁ గుచ్చి ఎల్లప్పుడును, దానిని స్మరింపఁజేయుచున్నది. ఇట్లు చల్లదనము నీయవలసిన యా తామరతూఁడు దానికి విపరీతముగా సంతాపమునే యొసంగుచున్నది. అనగా చల్లఁదనము నొసంగుటకై యుపయోగింపఁబడిన తామరతూడు చల్లదనఁము నొసంగక,నీ బాహువులను స్మరింపఁజేసి తాపమునే మొసంగుచున్నది. ॥౮౨॥

శ్లో॥ న్యస్తం తతస్తేన మృణాలదణ్డ
ఖణ్డం బభాసే హృది తాపభాజి ।
తచ్చిత్తమగ్నైర్మదనస్య బాణైః
కృతం శతచ్ఛిద్రమివ క్షణేన ॥ ౮౩

ప॥వి॥ న్యస్తం । తతః । తేన । మృణాలదణ్డఖణ్డం । బభాసే । హృది । తాపభాజి । తచ్చిత్తమగ్నైః । మదనస్య । బాణైః కృతం । శతచ్ఛిద్రమ్ । ఇవ । క్షణేన.

టీక॥ తతః = తర్వాత, తేన = వరుణునిచే, తాపబాజి = సంతాపమునుఁ బొందిన, హృది = హృదయమందు, న్యస్తం = ఉంచబడిన, మృణాలదణ్డఖణ్డం; మృణాలదణ్డ = తామరతూటియొక్క, ఖణ్డం = తునుక, తచ్చిత్తమగ్నైః; తత్ = ఆతనియొక్క, చిత్త = మనస్సునందు, మగ్నైః = నాటుకొనిన, మదనస్య = మన్మథునియొక్క, బాణైః = బాణములచే, క్షణేన = క్షణముచేతనే, శతచ్ఛిద్రం = నూఱుబెజ్జములతోఁ గూడినదిగా, కృతమివ = చేయఁబడెనోయనునట్లు, బభాసే = ప్రకాశించెను.

వి॥ నూఱు బెజ్జములు సహజముగనే, తామరతూడునకు గలవు. కాని యది మన్మథబాణములచే నేర్పడినవో యనునట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష.

సమాసములు :

మృణాలదణ్డఖణ్డం : మృణాలమేవ దణ్డః = మృణాలదణ్డః. మృణాలదణ్డస్య ఖణ్డం = మృణాలదణ్డఖణ్డం.

తాపబాజి : తాపం భజతీతి = తాపభాక్. తస్మిన్ = తాపభాజి.

తచ్చిత్తమగ్నైః: తస్య చిత్తం=తచ్చిత్తమ్. తచ్చిత్తే మగ్నాః=తచ్చిత్తమగ్నాః. తైః=తచ్చిత్తమగ్నైః.

శతచ్ఛిద్రమ్ : శతం ఛిద్రాణి యస్య తత్=శతచ్ఛిద్రమ్.

భావము :

తర్వాతఁ గూడ నా పరుణుఁడు, తాపముచే బాధ నొందెడి తన హృదయముపై తామరతూడు నుంచుకొనగా నతని హృదయమున నాటుకొనిన మన్మథబాణములచే నది నూఱు బెజ్జములతోఁ గూడిన దాయెను. ॥౮౩॥

శ్లో॥ ఇతి త్రిలోకీతిలకేషు తేషు
మనోభువో విక్రమకామచారః ।
అమోఘమస్త్రం భవతీమవాప్య
మదాన్ధతానర్గలచాపలస్య ॥ ౮౪

ప॥వి॥ ఇతి । త్రిలోకీతిలకేషు । తేషు । మనోభువః । విక్రమకామచారః । అమోఘమ్ । అస్త్రం । భవతీమ్ । అవాప్య । మదాన్ధతానర్గలచాపలస్య.

టీక॥ (ఓదయయన్తి) భవతీమ్ = నీవనెడు, అమోఘం = వ్యర్థముకాని, అస్త్రమ్=బాణమును, అవాప్య=పొంది, మదాన్ధతాఽనర్గలచాపలస్య; మదాన్ధతా=మదాన్ధుఁడగుటచే, అనర్గల=అడ్డులేని, చాపలస్య = చపలచేష్టగల్గిన, మనోభువః=కామునకు, త్రిలోకీతిలకేషు; త్రిలోకీ= మూడులోకములకును, తిలకేషు = భూషణములైన, తేషు = ఆ యిన్ద్రాదుల విషయమందు, ఇతి=ఇట్లు, విక్రమకామచారః; విక్రమ= పరాక్రమమునకు, కామచారః=స్వేచ్ఛ, (వర్తతే=ఉన్నది).

సమాసములు :

త్రిలోకీతిలకేషు : త్రయాణాం లోకానాం సమాహారః = త్రిలోకీ. త్రిలోక్యాః తిలకాః=త్రిలోకీతిలకాః. తేషు=త్రిలోకీతిలకేషు.

విక్రమకామచారః : విక్రమస్య కామచారః=విక్రమకామచారః.

అమోఘమ్ :- న మోఘమ్=అమోఘమ్.

మదాన్ధతానర్గలచాపలస్య : అన్ధస్య భావః=అన్ధతా. మదేన అన్ధతా= మదాన్ధతా. అనర్గలం చ తత్ చాపలం చ = అనర్గలచాపలం. మదాన్ధతయా అనర్గలచాపలం యస్య సః=మదాన్ధతాఽనర్గలచాపలః. తస్య=మదాన్ధతాఽనర్గలచాపలస్య.

**భావము :**

ఆ మన్మథుఁడు నిన్ను నమోఘ మగు నస్త్రముఁ గావించుకొని విశృఙ్ఖల విహారముఁ జేయుచు ముజ్జగములకుఁ దొడవులైన యిన్ద్రాదులయందు నీ విధముగా తన పరాక్రమమును స్వచ్ఛన్దముగా నెరపుచున్నాఁడు. ॥౮౪॥

శ్లో॥ సారోఽథ ధారేవ సుధారసస్య
స్వయంవరః శ్వో భవితా తవేతి।
సన్తర్పయన్తీ దమయన్తి! తేషాం
శ్రుతిః శ్రుతీ నాకజుషామయాసీత్ ॥ ౮౫

ప॥వి॥ సారః । అథ । ధారా । ఇవ । సుధారసస్య । స్వయంవరః । శ్వోభవితా । తవ । ఇతి । సన్తర్పయన్తీ । దమయన్తి । తేషాం । శ్రుతిః । శ్రుతీ । నాకజుషామ్ । అయాసీత్.

టీక॥ అథ=తర్వాత, హేదమయన్తి=ఓదమయన్తీ, తవ = నీయొక్క, స్వయంవరః=నీ స్వయంవరవివాహము, శ్వోభవితా; శ్వః = రేపు, భవితా=జరుగఁబోవును, ఇతి=అని, శ్రుతిః=వార్త, సుధారసస్య= అమృతరసముయొక్క, సారః=సారభూతమైన, ధారేవ=ధారవలె, సన్తర్పయన్తీ=సంతృప్తిఁ గలుగఁజేయుచు, నాకజుషాం = స్వర్గవాసులగు నిన్ద్రాదులయొక్క, శ్రుతీ=చెవులను, అయాసీత్=పొందెను.

**భావము :**

ఓదమయన్తీ! నీకు స్వయంవరము రేపు మధ్యాహ్నమున జరుగునను వార్త అమృతరసముయొక్క సారమైన ధారవలె సంతృప్తినిఁ గల్గించుచు, దేవలోకమందలి యిన్ద్రాదుల చెవులకు సోకినది. ॥౮౫॥

శ్లో॥ సమం సపత్నీభవదుఃఖతీక్ష్ణైః
స్వదారనాసాపథికైర్మరుద్భిః ।
అనఙ్గశౌర్యానలతాపదుఃస్థైః
రథ ప్రతస్థే హరితాం మరుద్భిః ॥ ౭౬

ప॥వి॥ సమం । సపత్నీభవదుఃఖతీక్ష్ణైః । స్వదారనాసాపథికైః । మరుద్భిః । అనఙ్గశౌర్యానలతాపదుఃస్థైః । అథ । ప్రతస్థే । హరితాం । మరుద్భిః ।

టీక॥ అథ = స్వయంవరవార్తను వినినపిదప, అనఙ్గశౌర్యానలతాపదుఃస్థైః; అనఙ్గ=మన్మథునియొక్క, శౌర్యానల=శౌర్యాగ్నియొక్క, తాప = వేడిచే, దుఃస్థైః = స్వస్థతలేనటువంటి, హరితాం = దిక్కులయొక్క, మరుద్భిః = ఇన్ద్రాదిదేవతలచే, సపత్నీభవదుఃఖతీక్ష్ణైః; సపత్నీ = సవతి వలన, భవ = కల్గిన, దుఃఖ = దుఃఖముతో, తీక్ష్ణైః = తీవ్రములైన, స్వదారనాసాపథికైః; స్వదార = తనభార్యలయొక్క, నాసా = ముక్కుల యందు, పథికైః = బాటసారులైన, మరుద్భిస్సమం = వాయువులతోడ, ప్రతస్థే = బయలుదేరుటజరిగినది.

వి॥ ఇచ్చట దిక్పాలుర భార్యలగు శచ్యాదులు నిట్టూర్పులకును, నిన్ద్రాది దేవతలకును, నేకకాలమందే ప్రస్థానము చెప్పఁబడుటవలన సహోక్త్యలఙ్కారము.

## సమాసములు :

*సపత్నీభవదుఃఖతీక్ష్ణైః* : సమానః పతిః యాసాన్తాః = సపత్న్యః. సపత్నీభ్యః భవం = సపత్నీభవం. సపత్నీభవం చ తత్ దుఃఖం చ = సపత్నీభవదుఃఖం. సపత్నీభవదుఃఖేన తీక్ష్ణాః = సపత్నీభవదుఃఖతీక్ష్ణాః. తైః = సపత్నీభవదుఃఖతీక్ష్ణైః,

*స్వదారనాసాపథికైః* : స్వేషాం దారాః = స్వదారాః. స్వదారాణాం నాసాః = స్వదారనాసాః. స్వదారనాసాసుపథికాః = స్వదారనాసాపథికాః. తైః = స్వదారనాసాపథికైః.

అనఙ్గశౌర్యానలతాపదుఃస్థైః : అనఙ్గస్య శౌర్యం = అనఙ్గశౌర్యం. అనఙ్గశౌర్యస్యఅనలః = అనఙ్గశౌర్యానలః. అనఙ్గశౌర్యానలేన తాపః = అనఙ్గశౌర్యానలతాపః. అనఙ్గశౌర్యానలతాపేన దుఃస్థాః = అనఙ్గశౌర్యానలతాపదుఃస్థాః. తైః = అనఙ్గశౌర్యానలతాపదుఃస్థైః.

భావము :

స్వయంవరవార్త వినిన పిదపనే, మన్మథ ప్రతాపాగ్నివలని జ్వరముచే నస్వస్థులైన యింద్రాదిదేవతలు దమయన్తి యను సవతివలనఁ గల్గెడి దుఃఖములచే, తమ భార్యల నాసికారన్ధ్రములనుండి వెల్వడు వేడి నిట్టూర్పులను వాయువులతోడ స్వయంవరమునకై వెల్వడిరి. అనగా దమయన్తీ స్వయంవర వార్తను విని యింద్రాదిదేవతలు బయలుదేరగనే వారి భార్యలు తమకు దమయన్తి సవతియగునని దుఃఖముతో వేడినిట్టూర్పులు విడచిరని యాశయము.౮౬

శ్లో॥ అపాస్తపాథేయ సుధోపయోగై
స్త్వచ్చుమ్బినైవ స్వమనోరథేన ।
క్షుధఞ్చ నిర్వాపయతా తృషఞ్చ
స్వాదీయసాఽధ్వా గమితః సుఖం తైః ॥ ౮౭

ప॥వి॥ అపాస్తపాథేయసుధోపయోగైః । త్వచ్చుమ్బినా । ఏవ । స్వమనోరథేన । క్షుధం । చ । నిర్వాపయితా । తృషం । చ । స్వాదీయసా । అధ్వా । గమితః । సుఖం । తైః.

టీక॥ అపాస్తపాథేయసుధోపయోగైః; అపాస్త = విసర్జింపఁబడిన, పాథేయ = దారిబత్తెమైన, సుధా = అమృతముయొక్క, ఉపయోగైః = ఉపయోగము గల, తైః = వారిచే, క్షుధం = ఆకలిని, తృషం = దాహమును, నిర్వాపయతా = తీర్చుచున్నటువంటి, స్వాదీయసా = అమృతమునకంటెను మిక్కిలిరుచిగల, త్వచ్చుమ్బినా = నిన్ను విషయముఁ గావించుకొనిన, స్వమనోరథేన = తమకోరికచేతనే, అధ్వా = త్రోవ, సుఖం = సుఖముగా, గమితః = కడవఁబడినవి.

సమాసములు;

అపాస్తపాథేయసుధోపయోగైః : పథి సాధు = పాథేయం. పాథేయమేవ సుధా = పాథేయసుధా. పాథేయసుధాయాః ఉపయోగః = పాథేయసుధోపయోగః. అపాస్తః పాథేయసుధోపయోగః యైస్తే = అపాస్తపాథేయసుధోపయోగాః. తైః = అపాస్తపాథేయసుధోపయోగైః.

త్వాచ్చుమ్బినా : త్వాం చుమ్బతీతి = త్వాచ్చుమ్బి. తేన = త్వాచ్చుమ్బినా.

స్వమనోరథేన : స్వస్య మనోరథః = స్వమనోరథః. తేన = స్వమనోరథేన.

స్వాదీయసా : అత్యన్తం స్వాదుః = స్వాదీయాన్. తేన = స్వాదీయసా.

భావము :

ఆ యింద్రాదిదిక్పాలురు త్రోవబత్తెమునకై యమృతమునుఁ గూడఁ దెచ్చుకొనలేదు. నీకు సంబంధించిన వారి మనోరథములే వారికి నాకలి దప్పులనుఁ దీర్చుచుండినవి. కాన, వా రట్టి మనోరథములతోఁడనే త్రోవను సుఖముగాఁ గడపిరి ॥౮౨॥

శ్లో॥ ప్రియా మనోభూశరదావదాహే
దేవీ స్త్వదర్థేన వియోజయద్భిః।
సురేషు సారైః క్రియతేఽధునా తైః
పాదార్పణానుగ్రహభూరియం భూః॥ ౮౩

ప॥వి॥ ప్రియాః । మనోభూశరదావదాహే । దేవీః । త్వదర్థేన । వియోజయద్భిః । సురేషు । సారైః । క్రియతే । అధునా । తైః । పాదార్పణానుగ్రహభూః । ఇయం । భూః.

టీక॥ త్వదర్థేన = నీవనెడినిమిత్తముచే, ప్రియాః = ప్రియురాండ్రైన, దేవీః = శచిమున్నగుదేవేరులను, మనోభూశరదావదాహే;మనోభూ = మన్మథుని యొక్క, శర = బాణములనెడి, దావదాహే = కార్చిచ్చునందు, నిమజ్జయద్భిః = ముంచుచున్నటువంటి, సురేషు = దేవతలయందలి, సారైః =

శ్రేష్ఠులైనయింద్రాదులచే, అధునా = ఇప్పుడు, ఇయం = ఈ, భూః = విదర్భభూమి, పాదార్పణానుగ్రహభూః; పాదార్పణ = పాదముల నుంచుటయను, అనుగ్రహ = అనుగ్రహమునకు, భూః = స్థానము, క్రియతే = చేయఁబడుచున్నది.

సమాసములు :

మనోభూశరదావదాహే : మనసి భవతీతి = మనోభూః. మనోభువః శరాః = మనోభూశరాః. మనోభూశరాః ఏవ దావః = మనోభూశరదావః. మనోభూశరదావస్య దాహః = మనోభూశరదావదాహః. తస్మిన్ = మనోభూశర దావదాహే.

త్వదర్థేన : త్వమేవ అర్థః = త్వదర్థః. తేన = త్వదర్థేన.

పాదార్పణానుగ్రహభూః : పాదానామర్పణం = పాదార్పణమ్. పాదార్పణమేవ అనుగ్రహః = పాదార్పణానుగ్రహః. పాదార్పణానుగ్రహస్య భూః = పాదార్పణానుగ్రహభూః.

భావము :

నీకొఱకై ప్రియురాండ్రైన శచ్యాదులగు దేవేరులను కాముని వలని విరహాగ్నియందు ముంచుచున్న సురశ్రేష్ఠులగు నిన్ద్రాదులచే నీ విదర్భదేశము వారి పాదము లుంచుట యను ననుగ్రహమునకు స్థానముగావింపఁబడినది. ఇన్ద్రాదిదేవతలు స్వయంవరమునకై విదర్భదేశమునకు విచ్చేసి యా దేశమును తమ పాదస్పర్శలచే పవిత్రముఁ గావించుచున్నారు. ॥౮౫॥

శ్లో॥ అలఙ్కృతాసన్నమహీవిభాగై-
రయం జనస్తై రమరై ర్భవత్యామ్ ।
అవాపితో జఙ్గమలేఖ్యలక్ష్మీం
నిక్షిప్య సందేశమయాక్షరాణి ॥ ౮౬

ప॥వి॥ అలఙ్కృతాసన్నమహీవిభాగైః । అయం । జనః । తైః । అమరైః । భవత్యామ్ । అవాపితః । జఙ్గమలేఖ్యలక్ష్మీం । నిక్షిప్య । సందేశమయాక్షరాణి.

టీక॥ అలఙ్కృతాసన్నమహీవిభాగైః; అలఙ్కృత = అలఙ్కరింపఁబడిన, ఆసన్న = సన్నిహితమైన, మహీ = భూమియొక్క, విభాగైః = ప్రదేశములుకల్గిన, తైః = ఆ, అమరైః = దేవతలచే, అయంజనః = ఈ నేను, భవత్యాం = నీ విషయమున, సందేశమయాక్షరాణి = సందేశరూపములైన వాక్యములను, నిక్షిప్య = ఉంచి, జఙ్గమలేఖ్యలక్ష్మీం; జఙ్గమ = సంచరించెడి, లేఖ్య = లేఖయొక్క, లక్ష్మీం = శోభను, అవాపితః = పొందింపఁబడితిని, అనగా నేను వారికి సందేశహారి యని యర్థము.

## సమాసములు :

*అలఙ్కృతాసన్నమహీవిభాగైః :* ఆసన్నా చ సా మహీచ = ఆసన్నమహీ. ఆసన్నమహ్యాః విభాగః = ఆసన్నమహీవిభాగః. అలఙ్కృతః ఆసన్నమహీవిభాగః యైస్తే = ఆసన్నమహీవిభాగాః. తైః = అలఙ్కృతాసన్నమహీవిభాగైః.

*జఙ్గమలేఖ్యాలక్ష్మీమ్ :* జఙ్గమా చ సా లేఖ్యా చ = జఙ్గమలేఖ్యా. జఙ్గమలేఖ్యాయాః లక్ష్మీః = జఙ్గమలేఖ్యలక్ష్మీః. తామ్ = జఙ్గమలేఖ్యలక్ష్మీమ్.

*సన్దేశమయాక్షరాణి :* సన్దేశస్య వికారాః = సన్దేశమయాని. సన్దేశమయాని చ తాని అక్షరాణి = సన్దేశమయాక్షరాణి. తాని = సన్దేశమయాక్షరాణి.

## భావము :

భూతలముయొక్క సమీపప్రదేశముల నలఙ్కరించిన దేవతలు నిన్ను గూర్చి సమాచార వచనములను నాయందుంచి, నన్ను సంచారిలేఖగా నీయొదకుఁ బంపినారు. ॥౭౯॥

శ్లో॥ ఏకైకమేతే పరిరభ్య పీన
స్తనోపపీడం త్వయి సన్దిశన్తి।
త్వం మూర్ఛతాన్నః స్మరభిల్లశల్యై
ర్ముదే విశల్యౌషధవల్లిరేధి॥ ౮౦

ప॥వి॥ ఏకైకమ్ । ఏతే । పరిరభ్య । పీనస్తనోపపీడం । త్వయి । సన్దిశన్తి । త్వం । మూర్ఛతాత్ । నః । స్మరభిల్లశల్యైః । ముదే । విశల్యౌషధవల్లిః । ఏధి.

టీక॥ ఏతే = ఈయింద్రాదులు, ఏకైకం = ప్రత్యేకముగా, పీనస్తనోపపీడం = బలిసినసీచనుదోయినిఁ గౌగలించుకొని, స్మరభిల్లశల్యైః; స్మర = మన్మథుఁడను, = భిల్ల బోయవానియొక్క, శల్యైః = బాణములచే, మూర్ఛితాం = మూర్ఛఁజెందిన, నః = మాకు, ముదే = సంతోషమునకై, త్వం = నీవు, విశల్యౌషధివల్లిః; విశల్యా = శల్యములనుఁ దొలగించిన, ఔషధివల్లిః = మూలికగా, ఏధి = ఉండుము ఇతి = అని, త్వయి = నీవిషయమున, సన్దిశన్తి = చెప్పిపంపుచున్నారు.

## సమాసములు :

ఏకైకమ్ : ఏకః ఏకః యస్మిన్ కర్మణి తత్ = ఏకైకమ్.

పీనస్తనోపపీడం : పీనౌ చ తౌ స్తనౌ చ = పీనస్తనౌ. పీనస్తనయోరుపపీడ్య = పీనస్తనోపపీడమ్.

స్మరభిల్లశల్యైః : స్మర ఏవ భిల్లః = స్మరభిల్లః. స్మరభిల్లస్య శల్యాని = స్మరభిల్లశల్యాని తైః = స్మరభిల్లశల్యైః.

విశల్యౌషధివల్లిః : విగతం శల్యం యయా సా = విశల్యా. విశల్యా చ సా ఓషధిశ్చ = విశల్యౌషధిః. విశల్యౌషధిరేవ వల్లిః = విశల్యౌషధివల్లిః.

## భావము :

ఈ యిన్ద్రాది దేవతలు, ఒక్కొక్కరుగా నిన్ను బలిసిన చనుదోయి యందుఁ గౌగలించుకొని యిట్లు చెప్పి పంపినారు. "మన్మథుఁడను బోయవాడు ప్రయోగించిన బాణములచే మూర్ఛఁబొందిన మాకు, సంతోషముఁ గల్గించుటకై విశల్యకరణి యనగా బాణములఁదొలగించెడి మూలికగా నుండుము" అని.॥౯౦॥

శ్లో॥ త్వత్కాన్తిరస్మాభిరయం పిపాసన్
మనోరథాశ్వాసనయైకయైవ ।
నిజైః కటాక్షైః ఖలు విప్రలభ్యైః
కియన్తి యావద్ఘృణ వాసరాణి॥ ౯౧

ప॥వి॥ త్వత్కాన్తిమ్ । అస్మాభిః । అయం । పిపాసన్ । మనోరథాఽఽశ్వాసనయా । ఏకయా । ఏవ । నిజః । కటాక్షః । ఖలు । విప్రలభ్యః । కియన్తి । యావత్ । భణ । వాసరాణి.

టీక॥ (ఓదమయన్తీ) త్వత్కాన్తిం; త్వత్=నీయొక్క, కాన్తిం = సౌన్దర్య సుధను,పిపాసన్=త్రాగఁగోరుచు, అయం= ఈ, నిజః=మాదైన, కటాక్షః = కడకన్ను, అస్మాభిః = మనచే, కియన్తి = ఎన్ని, వాసరాణి =దివసములు, ఏకయా=ఒక్కటైన, మనోరథాశ్వాసన యైవ; మనోరథ = మనోరథప్రాప్తియను, ఆశ్వాసనయా ఏవ = ఓదార్పుచేతనే, విప్రలభ్యఃఖలు=వంచింపఁదగినది. భణ= చెప్పుము.

## సమాసములు :

త్వత్కాన్తిమ్ : తవ కాన్తిః=త్వత్కాన్తిః. తామ్=త్వత్కాన్తిమ్.

పిపాసన్ : పాతుమిచ్ఛన్=పిపాసన్.

మనోరథాశ్వాసనయా : మనోరథ ఏవ ఆశ్వాసనా=మనోరథాశ్వాసనా. తయా=మనోరథాశ్వాసనయా.

## భావము :

ఓ దమయన్తీ! నీ సౌన్దర్యసుధను మా కటాక్షము పానముఁ చేయఁ గోరుచున్నది. కాన మా కటాక్షము ఎన్ని దినములవరకు తన మనోరథము సిద్ధింపఁగల దను నోదార్పుచే వంచింపఁదగినది. అందు వలన కాలయాపన వలదు నిన్ను చూడఁ గోరిన మమ్ముల ననుగ్రహింపుము॥౯౧॥

శ్లో॥ నిజే సృజాస్మాసు భుజే భజన్త్యా
వాదిత్యవర్గే పరివేషవేషమ్ ।
ప్రసీద నిర్వాపయ తాపమఙ్గై
రనఙ్గలీలాలహరీతుషారైః॥ ౯౨

ప॥వి॥ నిజే । సృజ । అస్మాసు । భుజే । భజన్త్యా । ఆదిత్యవర్గే । పరివేష

వేషం । ప్రసీద । నిర్వాపయ । తాపమ్ । అఙ్గైః । అనఙ్గలీలాల
హరీతుషారైః

టీక॥ (ఓదమయన్తీ) (త్వం=నీవు) నిజే = తనకుసంబంధించిన, (నీకు సంబంధించిన) భుజే=భుజములను, ఆదిత్యవర్గే = అదితిపుత్రులైన దేవతావర్గమగు మాయందు, పరివేషవేషమ్=పరివేషముయొక్క ఆకార మును, భజన్త్యౌ=పొందినవానినిగా, సృజ = చేయుము అనగా నొడి నొసంగము. అనఙ్గలీలాలహరీతుషారైః; అనఙ్గలీలా = మన్మథలీల యనెడి, లహరీ = అలలచే, తుషారైః = చల్లనైన, అఙ్గైః = అవ యములచే, తాపం=వేడిని, నిర్వాపయ = చల్లార్చుము. ప్రసీద = ప్రసన్నురాలవుకమ్ము.

## సమాసములు :

*ఆదిత్యవర్గే :* అదితేరపత్యాని పుమాంసః = ఆదిత్యాః. ఆదిత్యానాం వర్గః=ఆదిత్యవర్గః, తస్మిన్=ఆదిత్యవర్గే.

*పరివేషవేషమ్ :* పరివేషస్య వేషః = పరివేషవేషః. తం = పరి వేషవేషమ్.

*అనఙ్గలీలాలహరీతుషారైః:* అనఙ్గస్య లీలా=అనఙ్గలీలా. అనఙ్గలీలైవ లహర్యః=అనఙ్గలీలా లహర్యః. అనఙ్గలీలాలహరీణాం తుషారాణి = అనఙ్గలీ లాలహరీతుషారాణి. తైః=అనఙ్గలీలాలహరీతుషారైః.

## భావము :

ఓ దమయన్తీ! నీయొక్క భుజములను దేవతావర్గమైన మాయందును, (సూర్యవర్గమునందును) పరివేషాకారమునుఁ బొందినవిఁ గావింపుము. అనగా మమ్ములఁ గౌగలించుకొనుము. సూర్యుని చుట్టును పరివేష మేర్పడుట (గుడిగట్టుట) ప్రసిద్ధము గదా! వీరును నదితిపుత్రులు. సూర్యుడు నదితి పుత్రుఁడగుట వలన నాదిత్యుఁడు. అందువలన నాదిత్యశబ్దసామ్యముచే నిన్ద్రాదులకును, సూర్యునకు పరివేషబంధము సమానమైనది. మన్మథ విలాసములను తరంగములచేఁ జల్లనైన నీ యవయవములతో మాతాపమునుఁ బోగొట్టుము. ప్రసన్నురాలవు కమ్ము ॥౯౨॥

శ్లో॥ దయస్వ నో ఘాతయ నైవమస్మా
నసఙ్గచణ్డాలశరైరదృశ్యైః ।
భిన్నా వరం తీక్ష్ణకటాక్షబాణైః
ప్రేమ స్తవప్రేమరసాత్పవిత్రైః॥ ౯౩

ప॥వి॥ దయస్వ । నః । ఘాతయ । న । ఏవమ్ । అస్మాన్ । అనఙ్గ చణ్డాలశరైః । అదృశ్యైః । భిన్నాః । వరం । తీక్ష్ణకటాక్షబాణైః । ప్రేమః । తవ । ప్రేమరసాత్ । పవిత్రైః.

టీక॥ హేభైమి = ఓదమయన్తీ! నః = మాకు, దయస్వ = దయనునెఱపుము. అదృశ్యైః = కానరానటువంటి, అనఙ్గచణ్డాలశరైః; అనఙ్గ = మన్మథుడను, చణ్డాల = చణ్డాలునియొక్క, శరైః = బాణములచే, ఏవం = ఇట్లు, అస్మాన్ = మమ్ములను, నఘాతయ = కొట్టకుము. కిన్తు = కాని, ప్రేమరసాత్ = ప్రేమరసమువలన, పవిత్రైః = పవిత్రములైన. తవ = నీయొక్క, తీక్ష్ణకటాక్షబాణైః; తీక్ష్ణ = తీవ్రములైన, కటాక్ష = కడకన్నులైన, బాణైః = బాణములచే, భిన్నాః = భేదింపఁబడినవారలమై, ప్రేమః = మరణింతుము వరం = ఇది కొంచెము శ్రేష్ఠము.

## సమాసములు :

అనఙ్గచణ్డాలశరైః : అనఙ్గ ఏవ చణ్డాలః = అనఙ్గచణ్డాలః. అనఙ్గచణ్డాలస్యశరాః = అనఙ్గచణ్డాలశరాః. తైః = అనఙ్గచణ్డాలశరైః.

తీక్ష్ణకటాక్షపాతైః : తీక్ష్ణాశ్చ తే కటాక్షాశ్చ = తీక్ష్ణకటాక్షాః. తీక్ష్ణకటాక్షాణాం పాతాః = తీక్ష్ణకటాక్షపాతాః. తైః = తీక్ష్ణకటాక్షపాతైః.

## భావము :

ఓ దమయన్తీ! మా యెడ దయ యుంచుము. అదృశ్యములైన స్మరబాణములచే మమ్ముల నేల కొట్టించెదవు నీయొక్క ప్రేమరస పవిత్రములైన తీక్ష్ణకటాక్షము లను బాణముచే మమ్ములను వధింపుము. చణ్డాలహస్తమున చచ్చుటకంటె నీ పవిత్రపు ప్రేమరసార్ద్రము లైన బాణములచే చచ్చుట శ్రేష్ఠము కదా ॥౯౩॥

శ్లో॥ త్వదర్థినః సన్తు పర సహస్రాః
ప్రాణాస్తు నస్త్వచ్చరణప్రసాదః।
విశఙ్కసే కైతవనర్తితఞ్చే
దన్తశ్చరః పఞ్చశరః ప్రమాణమ్॥ ౯౪

ప॥వి॥ త్వదర్థినః । సన్తు । పరఃసహస్రాః । ప్రాణాః । తు । నః । త్వచ్చరణ ప్రసాదః । విశఙ్కసే । కైతవనర్తితం । చేత్ । అన్తశ్చరః । పఞ్చ శరః । ప్రమాణమ్.

టీక॥ (ఓ దమయన్తీ) త్వదర్థినః = నిన్ను కోరునటువంటివారు, పరస్స హస్రాః = వేలకుమించినవారై, సంతు = ఉండనిమ్ము. నః = మా యొక్క, ప్రాణాస్తు = ప్రాణములో, త్వచ్చరణప్రసాదం; త్వత్ = నీయొక్క, చరణప్రసాదః = పాదముల యనుగ్రహము, కైతవనర్తితం = కపటనాటకముగా, విశఙ్కసేచేత్ = సందేహించితివో, అంత శ్చరః = అంతరంగమునందు సంచరించెడి, పఞ్చశరః = మన్మథుడు, ప్రమాణం = సాక్షి.

సమాసములు;

త్వదర్థినః : త్వామ్ అర్థయన్త ఇతి = త్వదర్థినః.
పరఃసహస్రాః: సహస్రాత్ పరే = పరస్సహస్రాః.
త్వచ్చరణప్రసాదః : చరణయోః ప్రసాదః = చరణప్రసాదః. తవ చరణప్రసాదః = త్వచ్చరణప్రసాదః.
కైతవనర్తితం: కితవస్య కర్మ = కైతవం. కైతవేన నర్తితం = కైతవనర్తితమ్.
అన్తశ్చరః : అన్తః చరతీత = అన్తశ్చరః.
పఞ్చశరః : పఞ్చశరాః యస్య సః = పఞ్చశరః.

భావము :.

ఓ దమయన్తీ! నిన్నుగామించెడి యువకులు వేలకొలది మంది యుందురు గాక. కాని మా ప్రాణములు నీ పాదానుగ్రహమున కధీనములు. అనగా

నీ యధీనములు. ఇది కపటనాటక మని సందేహింపవలదు. దీనికి మా యన్త రంగమందు సంచరించెడి మన్మథుడే సాక్షి. ॥౮౪॥

శ్లో॥ నాఽస్మాకమస్మాన్మదనాపమృత్యో
స్త్రాణాయ పీయూషరసాయనాని।
సుధారసాదభ్యధికం ప్రయచ్ఛ
ప్రసీద వైదర్భి! నిజాధరం నః॥ ౮౫

ప॥వి॥ న । అస్మాకమ్ । అస్మాన్ । మదనాపమృత్యోః । త్రాణాయ । పీయూషరసాయనాని । సుధారసాత్ । అభ్యధికం । ప్రయచ్ఛ । ప్రసీద । వైదర్భి । నిజాధరం । నః.

టీక॥ హేవైదర్భి = ఓదమయన్తీ? మదనాపమృత్యోః, మదన = మన్మథుడు, (ఉమ్మెత్తచెట్టు) అనెడి, అపమృత్యోః = అపమృత్యువునుండి అనగా, అకాలమరణమునుండి, త్రాణాయ = రక్షణకై, పీయూషరసాయనాని; పీయూష = అమృతమనెడి, రసాయనాని = రసాయనౌషధములు, న = సమర్థములుకావు. తతః = అందువలన, ప్రసీద = ప్రసన్నురాలవు కమ్ము. సుధారసాత్ = అమృతరసముకంటె, అభ్యధికం = మిక్కిలి యతిశయించిన, నిజాధరం = నీదైనయధరమును, ప్రయచ్ఛ = (అపమృత్యువునువారించుటకై), ఇమ్ము.

**సమాసములు:**

*మదనాపమృత్యోః :* మదన ఏవ అపమృత్యుః = మదనాపమృత్యుః. తస్మాత్ = మదనాపమృత్యోః.

*పీయూషరసాయనాని :* పీయూషమేవ రసాయనాని = పీయూష రసాయనాని.

*నిజాధరం:* నిజశ్చాసౌ అధరశ్చ = నిజాధరః; తమ్ = నిజాధరం.

**భావము :**

ఓ దమయన్తీ! మన్మథుఁడు మాపాలిటి కపమృత్యువై నాడు. వాని నుండి రక్షణఁ బొందుటకు నమృతమను రసాయనౌషధములు పనికిరావు.

కావున మాయెడ ప్రసన్నురాలవు కమ్ము అమృతమను రసాయనము కంటెను మిక్కిలి ప్రభావము నీ యధరమునఁ గలదు. కాన నద్ది యధర మొసంగి మమ్ముల నపమృత్యువు నుండి కాపాడుము దేవతల మగు మాకు నమృతము నిత్యసేవ్యముగా సులభము కావచ్చును. కాని యది నీ యధరామృతమున కంటెను తక్కువ దైనది. కాన నీయధరామృత మొసంగి మమ్ములను కావుము ॥౯౪॥

శ్లో॥ అస్మాకమధ్యాసితమేతదన్త
స్తావద్భవత్యా హృదయం చిరాయ।
బహిస్త్వయాలఙ్క్రియతామిదానీ
మురో మురంవిద్విషతః శ్రియేవ॥ ౯౫

ప॥వి॥ అస్మాకమ్ । అధ్యాసితమ్ । ఏతత్ । అన్తః । తావత్ । భవత్యా । చిరాయ । బహిః । త్వయా । అలఙ్క్రియతామ్ । ఇదానీం । ఉరః । మురం । విద్విషతః । శ్రియా । ఇవ.

టీక॥ భవత్యా = పూజ్యురాలైననీచేత, అస్మాకం = మాయొక్క. ఏతత్ = ఈ, అన్తః = లోపలనున్న, హృదయం = హృదయము, చిరాయ = చాలకాలమునుండి, అధ్యాసితంతావత్ = అధిష్ఠింపఁబడినదే. (కిన్తు = కాని) ఇదానీం = ఇప్పుఁడు, బహిః = వెలుపలనున్న, హృదయమపి = హృదయముఁగూడ, అనగావక్షఃస్థలముగూడ, మురం = మురాసురుని, విద్విషతః = ద్వేషించుచున్న, అనగా విష్ణువుయొక్క. హృదయం = వక్షఃస్థలమును, శ్రియాఇవ = లక్ష్మిచేతనెట్లోయట్లు, అలఙ్క్రియతామ్ = అలంకరింపఁబడునుఁగాత.

**భావము :**

ఓపూజ్యురాలా! నీచేత మాయొ లోపలి హృదయము చాలకాలము నుండి నిన్నే మేము చింతించుచున్నాము. కాని యిప్పుడు బాహ్యహృదయమును అనగా వక్షః స్థలమును. గూడ లక్ష్మి విష్ణునివక్షఃస్థలము నధిష్ఠించిన విధముగా నధిష్ఠించుము అనగా మమ్ములంబరిణయ మాడుము ॥౯౫॥

శ్లో॥ దయోదయశ్చేతసి చేత్తవాభూ
దలఙ్కురు ద్యాం విఫలో విలమ్బః।
భువః స్వరాదేశమథాచరామో
భూమౌ ధృతిం యాసి యది స్వభూమౌ॥ ౯౬

ప॥వి॥ దయోదయః। చేతసి। చేత్। తవ। అభూత్। అలఙ్కురు। ద్యాం। విఫలః। విలమ్బః। భువః। స్వరాదేశమ్। అథ। ఆచరామః। భూమౌ। ధృతిం। యాసి। యది। స్వభూమౌ.

టీక॥ తవ=నీయొక్క, చేతసి=మనస్సునందు, దయోదయః=దయ కలుగుట, అభూచ్చేత్=అయినచో, ద్యాం=స్వర్గమును, అలఙ్కురు= అలఙ్కరింపుము. విలమ్బః=ఆలస్యము, విఫలః=వ్యర్థము. (అథవా =లేకపోతే) స్వభూమౌ=తనజన్మభూమియైన, భూమౌ = భూలోకమునందు, ధృతిం = సంతోషమును, యాసియది = పొందితివో, భువః = భూమికి, స్వరాదేశం = స్వర్గసంజ్ఞను, ఆచరామః = ఆచరింతము.

సమాసములు :

దయోదయః : దయాయాః ఉదయః=దయోదయః.

విఫలః : విగతం ఫలం యస్మాత్సః=విఫలః.

స్వరాదేశం : స్వః ఇతి ఆదేశః=స్వరాదేశః. తమ్=స్వరాదేశమ్.

స్వభూమౌ : స్వస్య భూమిః=స్వభూమిః. తస్యాం=స్వభూమౌ.

భావము :

నీకు మా యెడ దయ గల్గినచో స్వర్గము నలఙ్కరింపుము. ఆలస్యము చేయుట వలనఁ బ్రయోజనము లేదు లేదా నీకు జన్మస్థాన మైన భూమి యందుండఁ గోరితివో, భూమికి స్వర్గ మనుఁ బేరిడి మేము గూడ నిందే యుండగలము అనగా నీవు ఉన్నట్టి ప్రదేశమునే స్వర్గముగా భావింతుము॥౯౬॥

అఙ్గ! త్వదఙ్గాని నిపీతపీతా
దర్పాణి పాణిః ఖలు యాచతే నః॥ ౬౮

ప॥వి॥ స్వర్ణైః । వితీర్ణైః । కరవామ । వామనేత్రేః । భవత్యా । కిమ్ । ఉపాసనాసు । అఙ్గ । త్వదఙ్గాని । నిపీతపీతాదర్పాణి । పాణిః । ఖలు । యాచతే । నః.

టీక॥ హే వామనేత్రే! = ఓ సుందరాక్షీ! భవత్యా = నీచేత, నిజోపాసనాసు; నిజ = తనకుసంబంధించిన, ఉపాసనాసు = పూజలయందు, వితీర్ణైః = సమర్పింపఁబడిన, స్వర్ణైః = పసిడిదామరపూలు మున్నగువానిచే, కింకరవామ = ఏమిచేతుము? కిన్తు = కాని, హేఅఙ్గ = ఓ ప్రియురాలా! నిపీతపీతాదర్పాణి; నిపీత = పానముచేయఁబడిన, పీతా = పసుపుమున్నగువానియొక్క, దర్పాణి = గర్వముగల్గిన, త్వదఙ్గాని = నీయవయవములను, నః = మాయొక్క, పాణి = హస్తము, యాచతేఖలు = యాచించుచున్నది గదా!

వి॥ ''నిపీతపీతదర్పాణి'' యని పుంలిఙ్గపీతశబ్దపాఠము సమఞ్జసము. ఏల యనగా నా పాఠమునందు పీతశబ్దమునకు బంగారమను నర్థము. కాన నిపీత = పానముచేయఁబడిన, పీత = బంగారుయొక్క, దర్పాణి = గర్వము గల్గినట్టి, యని యర్థముఁ జెప్పవలయును. ఈ పక్షమున బంగారుయొక్క గర్వమును హరించిన యఙ్గములని యర్థము. పసుపు గర్వమును హరించిన యఙ్గములనుట కంటెను, బంగారుయొక్క గర్వమును హరించిన యఙ్గములనుట శ్రేష్ఠము. ఏలయనగా పసుపుకంటె విలువ గలినది బంగారు కాన దాని గర్వమును హరించిన యఙ్గములనుట యుక్తము.

## సమాసములు :

త్వదఙ్గాని: తవ అఙ్గాని = త్వదఙ్గాని. తాని = త్వదఙ్గాని.

నిపీతపీతాదర్పాణి: పీతాయాః దర్పః = పీతాదర్పః. నిపీతః పీతాదర్పః యైస్తాని = నిపీతపీతాదర్పాణి. తాని = నిపీతపీతాదర్పాణి.

**భావము :**

ఓ సుందరాక్షీ! నీవు చేసెడి పూజలయందు సమర్పించఁబడిన పసిడి తామరపూలు మున్నగువానిచే నేమి చేయుదము? స్వర్ణపర్వతమునందే నివసించు మాకు స్వర్ణకమలాదులచేఁ బ్రయోజన మేమి యున్నది? కాని ఓ ప్రియురాలా! పసుపు మున్నగువాని గర్వమును లేదా బంగారు మున్నగువాని గర్వమును హరించిన, అనగా వానిని కాన్తిచే మించిన నీ యవయవములను మా చేయి యర్థించుచున్నది. ॥౯౪॥

శ్లో॥ వయం కలాదా ఇవ దుర్వ్విదగ్ధం
త్వద్గౌరిమస్పర్ధి దహేమ హేమ।
ప్రసూననారాచ శరాసనేన
సహైకవంశప్రభవభ్రు బభ్రు॥ ౯౫

ప॥వి॥ వయం । కలాదాః । ఇవ । దుర్వ్విదగ్ధం । త్వద్గౌరిమస్పర్ధి । దహేమ । హేమ । ప్రసూననారాచశరాసనేన । సహైకవంశప్రభవభ్రుః । బభ్రు.

టీక॥ ప్రసూననారాచశరాసనేన; ప్రసూననారాచ = పూవిల్తుఁడగు మన్మథుని యొక్క, శరాసనేన = ధనుస్సుతో, సహైకవంశప్రభవభ్రు; సహ = కూడ, ఏకవంశప్రభవ = ఒక వంశమునందేగల్గిన, భ్రు = కనుబొమ్మ గలదానా! వయం = మేము, కలాదాఇవ = స్వర్ణకారులవలె, త్వద్గౌరిమ స్పర్ధి; త్వత్ = నీయొక్క, గౌరిమ = పసిమితో, స్పర్ధి = సామ్యమునభిలషించెడి (కావుననే) దుర్వ్విదగ్ధం = దగ్ధముకానిదియు, బుద్ధిమాలినదియు నగు, బభ్రు = పిఙ్గళవర్ణముగల్గిన, హేమ = బంగారు, దహేమ = కాల్చెదము.

సమాసములు :

కలాదాః : కలాః ద్యన్తీతి = కలాదాః.

త్వద్గౌరిమస్పర్ధి: తవ గౌరిమా = త్వద్గౌరిమా. త్వద్గౌరిమ్ణా స్పర్ధత ఇతి = త్వద్గౌరిమస్పర్ధి. తత్ = త్వద్గౌరిమస్పర్ధి.

ప్రసూననారాచశరాసనేన : ప్రసూనాని నారాచాః యస్య సః = ప్రసూననారాచః. ప్రసూననారాచస్య శరాసనం = ప్రసూననారాచశరాసనం. తేన = ప్రసూననారాచశరాసనేన.

సహైకవంశప్రభవభ్రు : ఏకశ్చాసౌ వంశశ్చ = ఏకవంశః. ఏకవంశే ప్రభవః = ఏకవంశప్రభవః. సహ ఏకవంశ ప్రభవః యయోస్తే = సహైకవంశ ప్రభవే. సహైకవంశప్రభవే భ్రువౌ యస్యాస్సా = సహైకవంశ ప్రభవభ్రూః. తస్యాస్సంబుద్ధిః = హేసహైకవంశప్రభవభ్రుః

భావము :

మరుని విల్లుతోఁ బాటు నొకవంశమునందుఁ బుట్టిన వెదురువంటి కనుబొమ్మలు గల ఓదమయన్తీః స్వర్ణకారులవలె మేము, కాల్చఁబడనందువలన వన్నెనుఁ బొందనిదియు నుత్కృష్టమగు నీయొదలి పసిమితో సామ్యము కోరినందువలన బుద్ధిమాలినదైన బంగారమును ఆయపరాధమునకై దహింతుము కాన నట్టిబంగారును మాకు సమర్పించుటకంటెను, నా బంగారును మించిన నీయొడలిసి మాకు సమర్పించుటయే సంతోషకరము. ॥౯౯॥

శ్లో॥ సుధాసరస్సు త్వదనఙ్గతాపః
శాన్తో నవః కిం పునరప్సరస్సు ।
నిర్వాతి తు త్వన్మమతాక్షరేణ
సూనాశుగేషోర్మధుశీకరేణ॥ ౧౦౦

ప॥వి॥ సుధాసరస్సు । త్వదనఙ్గతాపః । శాన్తః । నవః । కిం । పునః । అప్సరస్సు । నిర్వాతి । తు । త్వన్మమతాక్షరేణ । సూనాశుగేషోః । మధుశీకరేణ.

టీక॥ (హేభైమి = ఓదమయన్తీ) సుధాసరస్సు = అమృతంపుకొలనుల యందు, నః = మాకు, త్వదనఙ్గతాపః; త్వత్ = నీవలన నేర్పడిన, అనఙ్గతాపః = మన్మథతాపము, నశాన్తః = శమింపలేదు. అప్సరస్సు; అప్ = ఉదకములయొక్క, సరస్సు = కొలనులయందు, లేదా అచ్చరల యందు, కింపునః శాన్తః = ఇకనెట్లు శమించును? కిన్తు = కాని,

సూనాశుగేషోః = మరునిబాణముయొక్క, మధుశీకరేణ = మకరంద బిందువువంటి, త్వన్మమతాక్షరేణ; త్వత్ = నీయొక్క, మమతా = మదీయత్వమునుసూచించునట్టి, అక్షరేణ = వాక్యముచే, "మీరునావార" నెడి వాక్యముచే, నిర్వాతి = శమించును.

సమాసములు :

సుధాసరస్సు: సుధామయాని చ తానిసరాంసి చ = సుధాసరాంసి. తేషు = సుధాసరస్సు.

త్వదనఙ్గతాపః: అనఙ్గస్య తాపః = అనఙ్గతాపః. తవ అనఙ్గతాపః = త్వదనఙ్గతాపః.

అప్సరస్సు : అపాం సరాంసి = అప్సరాంసి. తేషు = అప్సరస్సు.

త్వన్మమతాక్షరేణ : మమతాయాః అక్షరం = మమతాక్షరం. తవ మమతాక్షరం = త్వన్మమతాక్షరం. తేన = త్వన్మమతాక్షరేణ.

సూనాశుగేషోః : సూనాన్యాశుగాః యస్య సః = సూనాశుగః. సూనాశుగస్య ఇషుః = సూనాశుగేషుః. తస్య = సూనాశుగేషోః.

మధుశీకరేణ : మధోః శీకరః = మధుశీకరః. తేన మధుశీకరేణ.

భావము :

దమయన్తీ! నీవలన మాకు గల్గిన మరుని సంతాపము అమృతపు సరస్సులయందుఁ గూడ శమించలేదు. ఇఁక కేవలపు నీటికొలంకులయం దెట్లు శమించును. అచ్చరలయందు నెట్లు శమించును ? "మీరు నాకు సంబంధించిన వారు" అను నీయొక్క తీయని మాటచేతనే యిది శమించును. ఎవరి విరహమువలన గల్గిన బాధ వారి సంగమముచేతనే గదా శమించును. ॥౧౦౦॥

శ్లో॥ ఖణ్డః కిము త్వద్గిర ఏవ ఖణ్డః
కిం శర్కరా తత్ప్రథశర్కరైవ ।
కృశాఙ్గి! త్వద్భృఙ్గిరసోత్థకచ్ఛ
తృణాన్ను దిశు ప్రథితం తదిక్షుః॥ ౧౦౧

ప॥వి॥ ఖణ్డః । కిము । త్వద్గిరః । ఏవ । ఖణ్డః । కిం । శర్కరా । తత్పథ శర్కరా । ఏవ । కృశాఙ్గి । త్వద్భఙ్గిరసోత్థకచ్ఛతృణం । ను । దిక్షు । ప్రథితం । తత్ । ఇక్షుః.

టీక॥ హేకృశాఙ్గి = ఓ కృశించిన శరీరముగల దమయన్తీ! ఖండ = కలకండ పెళ్ల, త్వద్గిరఏవ = నీ మాటలయొక్కయే, ఖణ్డఃకిము = ముక్కయా యేమి? (తథా = అట్లే) శర్కరా = చక్కెర, తత్పథశర్కరైవ; తత్ = ఆ మాటలయొక్క, పథ = మార్గమందలి, శర్కరైవకిం = జాతిముక్కలాయేమి? దిక్షు = దిక్కులయందు, ప్రథితం = ప్రసిద్ధినిఁ బొందిన, ఇక్షుః = చెఱకు అనెడి పేరుగల, తత్ = ఆ తృణము, త్వద్భఙ్గిరసోత్థకచ్ఛతృణంను; త్వత్ = నీమాటలయొక్క, భఙ్గి = తరఙ్గములతోఁ గూడిన, రస శృఙ్గారాదిరసము నుండియు, (ఉదకము నుండియు) ఉత్థ = ఉత్పన్నమైన, కచ్ఛ = తేమగల ప్రదేశమునందలి, తృణన్ను = తృణజాతికిఁజెందినదా?

సమాసములు :

తత్పథశర్కరా: తస్య పన్థాః = తత్పథః. తత్పథే శర్కరా = తత్పథశర్కరా.

హేకృశాఙ్గి: కృశం అఙ్గం యస్యాస్సా = కృశాఙ్గీ. తస్యాఃసమ్బుద్ధిః = హేకృశాఙ్గి.

త్వద్భఙ్గిరసోత్థకచ్ఛతృణం : భఙ్గః అస్య అస్తీతి = భఙ్గీ. తవ భఙ్గీ = త్వద్భఙ్గీ. త్వద్భఙ్గీ చాసౌ రసశ్చ = త్వద్భఙ్గిరసః. త్వద్భఙ్గిరసాత్ ఉత్తిష్ఠతీతి = త్వద్భఙ్గిరసోత్థం. త్వద్భఙ్గిరసోత్థం చ తత్ కచ్ఛం చ = తద్భఙ్గిరసోత్థకచ్ఛం. తద్భఙ్గిరసోత్థకచ్ఛే తృణం = తద్భఙ్గిరసోత్థకచ్ఛతృణం.

భావము :

ఓదమయన్తీ! కలకండ నీ మాటలయొక్క ముక్కయా యేమి? చక్కెర నీ మాటల బాటలోని జాతిముక్కలా? లోకప్రసిద్ధ మైన చెఱకు నీ మాటల రసము పాఱుటచే నేర్పడిన తేమ నేలలో మొలచిన గడ్డిజాతికిఁ జెందినదా?

వి॥ నీమాటలు కలకండ తునుకయా యనియు, చక్కెర నీమాటల తోటలోని జాతిపలుకులా యనియు చెఱకు, నీమాట లనెడి రసము పాఱుటవలన నేర్పడిన తేమనేలయందలి గడ్డిజాతికిఁ జెందినదాః యని "కింవా" శబ్దములతో సంభావనఁ జేయుటవలన ముడు ఉత్ప్రేక్షలు. వీనికి మూటికిని సఙ్కరము ॥౧౦౧॥

శ్లో॥ దదామి కిం తే సుధయాఽధరేణ
త్వదాస్య ఏవ స్వయమాస్యతే హి।
విధుం విజిత్య స్వయమేవ భావి
త్వదాననం తన్మఖభాగభోజి॥ ౧౦౨

ప॥వి॥ దదామి । కిం । తే । సుధయా । అధరేణ । త్వదాస్యే । ఏవ । స్వయమ్ । ఆస్యతే । హి । విధుం । విజిత్య । స్వయమ్ । ఏవ । భావి । త్వదాననం । తన్మఖభాగభోజి.

టీక॥ తే = నీకొఱకు, కిం = దేనిని, దదామ = ఇత్తుముః హి = ఎందువలన, సుధయా = అమృతముచే, అధరేణ = పెదవియొక్క-రూపముతో, త్వదాస్యేఏవ = నీనోటనే, స్వయం = తనంతట, ఆస్యతే = ఉండుట (ప్రసిద్ధము). త్వదాననం = నీమోము, విధుం = చన్ద్రుని, స్వయమేవ = తనంతటనే; విజిత్య = జయించి, తన్మఖభాగభోజి; తత్ = ఆచన్ద్రుని యొక్క, మఖభాగ = యజ్ఞభాగమును, భోజి = భుజించునదిగ, భావి = ఉండఁగలదు.

**సమాసములు :**

త్వదాస్యే : తవ ఆస్యమ్ = త్వదాస్యం. తస్మిన్ = త్వదాస్యే.

త్వదాననం : తవ ఆననం = త్వదాననం.

తన్మఖభాగభోజి : మఖే భాగః = మఖభాగః. తస్య మఖభాగః = తన్మఖభాగః. తన్మఖభాగం భుఙ్క్తే ఇతి = తన్మఖభాగభోజి.

**భావము :**

ఓ దమయన్తీ! మేము నీకు ప్రియమైన వస్తువు నొసంగి నిన్నుఁ దృప్తిపఱుపఁ జాలము. కేవలము నీ దయనే శరణు వేడెదము నీ కొక

వేళ అమృతము నొసంగి తృప్తిపఱుపఁ బూనెదమా యని తలంచితే యది వ్యర్థ మగుచున్నది. ఏల యనగా నీ పెదవి యమృతమయము. అది నీ నోటనే యున్నది లేదా యజ్ఞముతో భాగమొసంగి తృప్తిపఱుపఁ బూనుటయు వ్యర్థము. ఏల యనగా, నీవు నీ మోముచేఁ జన్ద్రుని జయించితివి. కాన నతని కున్న యజ్ఞభాగము నీకు సంక్రమింపగలదు గదా। కాన దేనిచేతను నిన్ను తృప్తిపఱుపలేనివారలమైన మేము నీదయనే శరణు వేఁడుకొనుచున్నా మని భావము ॥౧౦౨॥

శ్లో॥ ప్రియేః వృణీష్వామరభావమస్మా
దితి త్రపోదఞ్చి వచో న కిన్నః।
త్వత్పాదపద్మే శరణం ప్రవిశ్య
స్వయం వయం యేన జిజీవిషామః॥ ౧౦౩

ప॥వి॥ ప్రియే । వృణీష్వ । అమరభావమ్ । అస్మాత్ । ఇతి । త్రపోదఞ్చి । వచః । న । కిం । నః । త్వత్పాదపద్మే । శరణం । ప్రవిశ్య । స్వయం । వయం । యేన । జిజీవిషామః.

టీక॥ హే ప్రియేః = ఓ ప్రియురాలా, అస్మత్ = మావలన, అమరభావం = మరణములేకయుండుటను, వృణీష్వ = వరింపుము. ఇతి = అని, నః = మాయొక్క, వచః = మాట, త్రపోదఞ్చి = లజ్జఁ గల్గించునదిగా, కింన = కాదాయేమిః (తప్పకకాఁగలదు). యేన = ఏకారణముచే, త్వత్పాదపద్మే = నీపాదపద్మములను, శరణం = రక్షకమని, ప్రవిశ్య = పొంది, వయం = మేము, స్వయం = మేముగ, జిజీవిషామః = జీవింపఁగోరుచున్నాము.

## సమాసములు :

అమరభావమ్ : అమరస్య భావః = అమరభావః. తమ్ = అమరభావమ్.

త్రపోదఞ్చి : త్రపాముదఞ్చతీతి = త్రపోదఞ్చి.

త్వత్పాదపద్మే : పాదౌ పద్మే ఇవ = పాదపద్మే. తవ పాదపద్మే = త్వత్పాదపద్మే. తే = త్వత్పాదపద్మే.

భావము :

ఓ దమయన్తీ! మేము అమరులము అనగా మరణము లేని వార మని, నీకు నమరత్వమును, అనగా మరణరాహిత్యము నిత్తుమా యని తలంచినచో నదియు, సాధ్యము కాదు. ఏల యనగా, మేము విరహబాధ ననుభవించుచు, నీ పాదపద్మముల నాశ్రయించి బ్రతుకఁగోరుచున్నాము కదా? కాన మా జీవితమే, నీ యధీనమై యున్నప్పుడు మే మెట్లు నీకు నమరత్వ మీయఁ గలము? ఇది మిక్కిలి హాస్యాస్పద మైన భావము. కావున నిదియు మాకు సాధ్యము కాదు ॥౧౦౩॥

శ్లో॥ అస్మాకమస్మాన్మదనాపమృత్యో
స్త్రాణాయ పీయూషరసోఽపి నాసౌ ।
ప్రసీద తస్మాదధికం నిజం తు
ప్రయచ్ఛ పాతుం రదనచ్ఛదన్నః॥ ౧౦౪

ప॥వి॥ అస్మాకమ్ । అస్మాత్ । మదనాపమృత్యోః । త్రాణాయ । పీయూషరసః । అపి । న । అసౌ । ప్రసీద । తస్మాత్ । అధికం । నిజం । తు । ప్రయచ్ఛ । పాతుం । రదనచ్ఛదం । నః.

టీక॥ హేదమయన్తి = ఓదమయన్తీ, అస్మాత్ = ఈ, మదనాపమృత్యోః = మన్మథుఁడనునపమృత్యువునుండి, త్రాణాయ = రక్షించుటకై, అసౌ = ఈ, పీయూషరసోఽపి = అమృతరసముఁగూడ, నాఽలమ్ = చాలదు. కిన్తు = కాని, తస్మాత్ = దానికంటెను, అధికం = అతిశయించిన, నిజం = తనదైన, (నీదైన), రదనచ్ఛదం = పెదవిని, పాతుం = త్రాగుటకు, నః = మాకు, ప్రయచ్ఛ = ఇమ్ము. ప్రసీద = ప్రసన్నురాలవుకమ్ము.

సమాసములు :

మదనాపమృత్యోః : మదన ఏవ అపమృత్యుః = మదనాపమృత్యుః. తస్మాత్ = మదనాపమృత్యోః.

భావము :

ఓ దమయన్తీ! నేడు మన్మథుఁడు మాకు, అకాలమృత్యువుగా నేర్పడి నాడు. అమృతరసముగూడ నీ యకాలమరణమునుండి తప్పించఁజాలదు. నీ యధరరసమో అమృతరసమును సైతము మించినది. కాన దానిని పానముఁ జేయుటకై మాకొసంగుము. ప్రసన్నవుకమ్ము ॥౧౦౪॥

శ్లో॥ ప్లుష్టశ్చాపేన రోపైరపి సహ మకరే
ణాత్మభూః కేతునాఒభూ
ద్ధత్తాం నస్త్వత్ప్రసాదాదథ మనసిజతాం
మానసో నన్దనః సన్.
భ్రూభ్యాం తే తన్వి! ధన్వీ భవతు తవ సితై
ర్జైత్రభల్లైః స్మితైః స్తా
దస్తు త్వన్నేత్రచఞ్చత్తరశఫరయుగా
ధీనమీనధ్వజాఙ్కః॥ ౧౦౫

ప॥వి॥ ప్లుష్టః । చాపేన । రోపైః । అపి । సహ । మకరేణ । ఆత్మభూః । కేతునా । అభూత్ । ధత్తాం । నః । త్వత్ప్రసాదాత్ । అథ । మనసిజతాం । మానసః ః నన్దనః । సన్ । భ్రూభ్యాం । తే । తన్వి । ధన్వీ । భవతు । తవ । సితైః । జైత్రమల్లైః । స్మితైః । స్తాత్ । అస్తు । త్వన్నేత్రచఞ్చత్తరశపరయుగాధీన మీనధ్వజాఙ్కః.

టీక॥ హేతన్వి = ఓసున్దరీ, ఆత్మభూః = స్వయముగ జన్మించినమన్మథుఁడు, స్వైః = తనకుఁజెందిన, చాపేన = ధనుస్సుతోఁడను, రోపైరపి = బాణములతోఁడను, మకరేణ = మొసలియనెడి, కేతునా = ధ్వజము తోఁడను, సహ = కూడ, ప్లుష్టః = దగ్ధుఁడుగా, అభూత్ = ఆయెను. సః = ఆ, ఆత్మభూః = మన్మథుఁడు, అథ = పిదప, త్వత్ప్రసాదాత్; త్వత్ = నీయొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, నః = మనకు, అనగా మాకునునీకును, మానసః = మనస్సునకు సంబంధించిన,

నన్దనః = పుత్రుడును, (ఆనన్దపఱచువాడును) అగుచు, మనసిజతాం = మనసిజుండగుటను, ధత్తాం = ధరించునుగాత. కిఞ్చ = మఱియు తే = నీయొక్క, భ్రూభ్యాం = కనుబొమ్మలచే, ధన్వీ = ధనుస్సుగలవాడుగ, భవతు = అగునుగాత. తవ = నీయొక్క, సితైః = నిర్మలములైన, స్మితైః = నవ్వులచే, జైత్రభల్లః = జయశీలములగుబాణము కలవాండగా, స్తాత్ = అగుగాత. త్వన్నేత్రచఞ్చత్తరశఫరయుగాధీనమీనధ్వజాఙ్కః; త్వత్ = నీయొక్క, నేత్ర = కన్నులనెడి, చఞ్చత్తర = మిక్కిలిచఞ్చలములైన, శఫరయుగ = చేపలజంటకు, అధీన = అధీనమైన, మీన = చేపయనెడి, ధ్వజాఙ్కః; ధ్వజ = టెక్కెమందలి, అఙ్కః = గుఱుతుకలవాడుగా, అస్తు = అగునుగాత.

వి॥ కనుబొమ్మలను వింటితోడను, నిర్మలములైన నవ్వులను నమ్ములతోడను, నేత్రములను మీనములజంటతోడను రూపించుటవలన రూపకము ప్రథమపాదమునుండి చెప్పబడిన చాపశర-మకర-కేతువులతో భ్రూస్మితాదులు క్రమముగా నన్వయించుటవలన యథాసంఖ్యాలఙ్కారము. ఈరెంటికిని సఙ్కరము.

సమాసములు :

ఆత్మభూః : ఆత్మనైవ భవతీతి = ఆత్మభూః.

త్వత్ప్రసాదాత్ : తవ ప్రసాదః = త్వత్ప్రసాదః. తస్మాత్ = త్వత్ప్రసాదాత్.

మనసిజతాం : మనసి జాయత ఇతి = మనసిజః. మనసిజస్య భావః = మనసిజతా. తాం = మనసిజతాం.

మానసః : మనసః అయం = మానసః.

నన్దనః : నన్దయతీతి = నన్దనః.

జైత్రభల్లః : జైత్రాః భల్లాః యస్య సః = జైత్రభల్లః

త్వన్నేత్రచఞ్చత్తరశఫరయుగాధీనమీనధ్వజాఙ్కః : తవ నేత్రే = త్వన్నేత్రే. శఫరయోః యుగం = శఫరయుగం. అత్యంతం చఞ్చత్ =

చఞ్చత్తరం. చఞ్చత్తరం చ తత్ శఫరయుగం చ = చఞ్చత్తరశఫరయుగం. త్వన్నేత్రే ఏవ చఞ్చత్తరశఫరయుగం = త్వన్నేత్రచఞ్చత్తరశఫరయుగం. త్వన్నేత్ర చఞ్చత్తరశఫరయుగే అధీనః = త్వన్నేత్రచఞ్చత్తర శఫరయుగాధీనః. ధ్వజే అఙ్కః = ధ్వజాఙ్కః. మీన ఏవ ధ్వజాఙ్కః = మీనధ్వజాఙ్కః. త్వన్నేత్రచఞ్చత్తర శఫరయుగాధీనః మీనధ్వజాఙ్కః యస్య సః = త్వన్నేత్ర చఞ్చత్తరశఫరయుగాధీన మీనధ్వజాఙ్కః.

భావము :

ఓ దమయన్తీ! స్వయమున నుద్భవించు నా మన్మథుఁడు తన చాపము తోఁడను, బాణములతోఁడను ధ్వజ మైన మకరముతోఁడను భస్మమాయెను. అత డిప్పుడు నీ యనుగ్రహముచే నీకును మాకును మానసపుత్రుడై యానం దముఁ గల్గించుచున్నాఁడు. అందువలన నతడు మనసిజుఁ డగును గాత. కావున మన్మథుడు నీయందును మాయందును సమానముగనే వర్తించుచున్నాడు. ఇఁక నతడు విల్లు మున్నగువానితో భస్మమగుటవలన నీ కనుబొమ్మలతో వింటిని, నీ నిర్మలము లగు చిఱునగవుంతో బాణములను, నీ కనుదోయిచే ధ్వజచిహ్న మగు మీనమును సంపాదించుకొనినవాడై వెలుగుఁగాత. ॥౧౦౫॥

శ్లో॥ స్వప్నేన ప్రాపితాయాః ప్రతిరజని తవ
శ్రీషు మగ్నః కటాక్షః
శ్రోత్రే గీతామృదాబ్ధౌ త్వగపి నను తనూ
మఞ్జరీసౌకుమార్యే.
నాసా శ్వాసాధివాసేఽధరమధుని రస
జ్ఞా చరిత్రేషు చిత్తం
తన్నస్తన్వఙ్గి! కైశ్చిన్న కరణహరిణై
ర్వాగురా లమ్భితాఽసి॥ ౧౦౬

ప॥ వి॥ స్వప్నేన । ప్రాపితాయాః । ప్రతిరజని । తవ । శ్రీషు । మగ్నః । కటాక్షః । శ్రోత్రే । గీతాఽమృతాబ్ధౌ । త్వక్ । అపి । నను । తనూమఞ్జరీసౌకుమార్యే । నాసా । శ్వాసాధివాసే । అధరమధుని ।

రసజ్ఞా । చరిత్రేషు । చిత్తం । తత్ । నః । తన్వఙ్గి । కైః । చిత్ । న । కరణహరిణైః । వాగురా । లమ్భితా । అసి.

టీక॥ హే తన్వఙ్గి = ఓ కృశాఙ్గీ, ప్రతిరజని = ప్రతిరాత్రియు, స్వప్నేన = స్వప్నముచే, ప్రాపితాయాః = పొందింపఁబడిన, అనగా స్వప్నమునఁ జూడఁబడిన, తవ = నీయొక్క, శ్రీషు = సౌన్దర్యతరఙ్గములయందు, నః = మాయొక్క, కటాక్షః = కడకన్ను, మగ్నః = మునిగినది. గీతామృతాబ్ధౌ; గీత = గానమనెడి, అమృతాబ్ధౌ = అమృతసాగరమందు, శ్రోత్రే = చెవులు, మగ్నే = మునిగినవి. తనూమఞ్జరీసౌకుమార్యే; తనూ = శరీరమనెడి, మఞ్జరీ = పూలగుత్తియొక్క, సౌకుమార్యే = మెత్తఁదనమునందు, త్వక్ = చర్మము, మగ్నం = మునిగినది. నాసా = ముక్కు, శ్వాసాధివాసే = నిట్టూర్పులతావియందు, మగ్నా నను = మునిగినదిగదా. అధరమధుని = అధరామృతమునందు, రసజ్ఞా = నాలుక, మగ్నా = మునిగినది. చరిత్రేషు = చేష్టలయందు, చిత్తం = మనస్సు, మగ్నం = మునిగినది. తత్ = అందువలన, కైశ్చిత్ = కొన్ని, కరణహరిణైః = ఇంద్రియములను జింకలచే, త్వం = నీవు, వాగురా = వలగా, నలమ్భితాఽసి = పొందింపఁబడకయున్నావా? తప్పక, వలగానుండుటనుఁ బొందింపఁబడితివి. నీ రూపము మా యింద్రియముల నన్నింటిని మోహింపఁజేయునది యని యర్థము.

వి॥ వలగాఁ జేయఁబడితి వను నాల్గవపాదమందలి యర్థము, కటాక్షాదులను, సౌన్దర్యాదులయందు ముంచుట యను వాక్యార్థములచే సమర్థితము కాన కావ్యలిఙ్గము. ఇన్ద్రియము లనెడి కరణములను హరిణములతో రూపించుటవలనను దమయన్తిని వాగుర - అనగా వలగా రూపించుటవలనను రూపకము. ఈ రెంటికిని సఙ్కరము.

## సమాసములు :

*ప్రతిరజని :* రజన్యాం రజన్యాం = ప్రతిరజని.

*గీతామృతాబ్ధౌ :* గీతమేవ అమృతం = గీతామృతం గీతామృతస్య అబ్ధిః = గీతామృతాబ్ధిః. తస్మిన్ = గీతామృతాబ్ధౌ.

తనూమఞ్జరీసౌకుమార్యే: తనూరేవమఞ్జరీ = తనూమఞ్జరీ. తనూమఞ్జర్యాః సౌకుమార్యం = మఞ్జరీసౌకుమార్యమ్.

శ్వాసాధివాసే : శ్వాసస్య అధివాసః = శ్వాసాధివాసః. తస్మిన్ = శ్వాసాధివాసే.

అధరమధుని : అధర ఏవ మధు = అధరమధు. తస్మిన్ = అధర మధుని.

హేతన్వఙ్గి : తను అఙ్గం యస్యాస్సా = తన్వఙ్గీ. తస్యాః సమ్బుద్ధిః = హేతన్వఙ్గి.

కరణహారిణైః : కరణానాం హారిణాః = కరణహారిణాః. తైః = కరణహారిణైః.

భావము :

ఓదమయన్తీ. ప్రతిరాత్రియు స్వప్నమునందు నిన్ను దర్శించినప్పుడు, నీ సౌన్దర్యతరంగములయందు మాకడకన్ను, నీగానామృతసముద్రమునందు మా చెవులు, నీ శరీర మనెడి పూల గుత్తిమెత్తఁదనమునందు మా చర్మము, నీ నిట్టూర్పుల, నెత్తావియందు మా ముక్కు. నీ యధరమధువునందు మానాలుక, నీ చేష్టలయందు మామనస్సు, మునుగుచున్నవి. మాయింద్రియము లనెడు జింకలచే నీవు మృగములనుఁ బట్టెడి వలగాఁజేయఁబడితివి. వీ వనెడి వలయందుఁ జిక్కుకొనిన మా యింద్రియములు నిన్నుఁ దప్పించుకొని వెళ్లలేక యున్నది. ॥౧౦౬॥

శ్లో॥ ఇతి ధృతసురసార్థవాచికస్ర
జ్ఞిజరసనాతలపత్రవాహకస్య ।
సఫలయ మమ దూతతాం వృణీష్వ
స్వయమవధార్య దిగీశమేకమేషు ॥ ౧౦౭

ప॥వి॥ ఇతి । ధృతసుర సార్థవాచిక స్రజ్ఞిజరసనాతలపత్ర హారకస్య । సఫలయ । మమ । దూతతాం । వృణీష్వ । స్వయమ్ । అవధార్య । దిగీశమ్ । ఏకమ్ । ఏషు.

టీక॥ ఇతి = ఇట్లు, ధృత = ధరింపఁబడిన, సురసార్థ = ఇన్ద్రాదిదేవతా సంఘముయొక్క, వాచిక = సన్దేశములయొక్క, స్రక్ = పరంపర యనెడి, మాలనుఁగల్గిన, నిజ = తనదైన, రసనాతల = నాలుకపైభాగ మను, పత్ర = జాబునకు, హారకస్య = తెచ్చెడివాఁడైన, మమ = నా యొక్క, దూతతాం = దూత్యమును, సఫలయ = సఫలము గావింపుము. ఏషు = ఈ యిన్ద్రాది దిక్పాలురమధ్య, ఏకం = ఒకనిని, స్వయం = స్వయముగనే, అవధార్య = నిశ్చయించుకొని, వృణీష్వ = వరింపుము.

## సమాసములు :

ధృతసురసార్థవాచిక స్రజ్నిజరసనాతలపత్రహారకస్య : సురాణాం సార్థః = సురసార్థః సురసార్థస్య వాచికాని = సురసార్థవాచికాని. సురసార్థవాచి కాన్యేవ స్రక్ = సురసార్థవాచికస్రక్. ధృతా = సురసార్థవాచికస్రక్ యేన సః = ధృతసురసార్థవాచికస్రక్. ధృతసురసార్థవాచికస్రక్ చాసౌ నిజం చ = ధృతసురసార్థవాచిక స్రజ్నిజం. ధృతసురసార్థవాచికస్రజ్నిజం చ తత్ రస నాతలం చ = ధృతసురసార్థవాచిక స్రజ్నిజరసనాతలం. ధృతసురసార్థవాచిక స్రజ్నిజరసనాతలమేవ పత్రమ్ = ధృతసురసార్థవాచిక స్రజ్నిజరసనాతల పత్రమ్. ధృతసురసార్థవాచిక స్రజ్నిజరసనాతలపత్రస్య హారకః = ధృతసుర సార్థవాచికస్రజ్నిజరసనాతలపత్రహారకః. తస్య = ధృతసురసార్థవాచికస్ర జ్నిజరసనాతల పత్రహారకస్య.

## భావము :

ఇట్లు దేవతల సన్దేశపరమ్పర యనెడి మాలను ధరించి, నాలుక పైభాగ మనెడి లేఖనుఁ దెచ్చినట్టి నా దూత్యమును సఫలముఁ గావింపుము. దిక్పాలురలో నొకనిని జక్కఁగా నిశ్చయించుకొని వరింపుము. ॥౧౦౭॥

శ్లో॥ అనఙ్గమేన్ద్రమథ మన్మథమగ్నిమగ్నిం
కేళీవిరుద్ధర తనూదరి ! నూతనాభిః ।
ఆస్వాదయోదితదయం శమనే మనో వా
నో వా యదీత్థమథ తద్వరుణం వృణీథాః॥ ౧౦౮

ప॥వి॥ ఆనన్దయ । ఇన్ద్రమ్ । అథ । మన్మథమగ్నం । అగ్నిం । కేళీభిః । ఉద్ధర । తనూదరి । నూతనాభిః । ఆసాదయ। ఉదితదయం । శమనే। మనః । వా । నో । వా । యది । ఇత్థమ్ । అథ । తత్ । వరుణం । వృణీథాః.

టీక॥ హేతనూదరి! = ఓ కృశోదరి! నూతనాభిః = క్రొత్తవైన, కేళీభిః = ఆటలతో, మన్మథమగ్నం = మన్మథునియందు మునిగిన, ఇన్ద్రం = ఇంద్రుని, ఆనన్దయ = సంతోషపఱచుము. అథవా = లేదా, అగ్నిం = అటువంటి యగ్నిని, నూతనాభిః = ఆ నూతనములగు నాటలతో, ఉద్ధర = ఉద్ధరింపుము. అథవా = లేదా, శమనే = యమునియందు, ఉదితదయం = ఉద్భవించిన దయగలదైన, మనః = మనస్సును, ఆసాదయ = ఉంచుము. ఇత్థంనోవాయది = ఇట్లుకానిచో, అథ = పిదప, తత్ = అప్పుడు, వరుణం = వరుణుని, వృణీథాః = వరింపుము.

సమాసములు :

మన్మథమగ్నం : మన్మథే మగ్నః = మన్మథమగ్నః. తమ్ = మన్మథమగ్నం.

హేతనూదరి : తను ఉదరం యస్యాస్సా = తనూదరీ. తస్యాస్సమ్బుద్ధిః = హేతనూదరి.

ఉదితదయా : ఉదితా దయా యస్య తత్ = ఉదితదయం. తత్ = ఉదితదయం.

భావము :

ఓ దమయన్తీ! నవీనములైన క్రీడలతో మన్మథబాధకు గురియైన ఇంద్రుని సంతోషపఱచుము. లేదా, అట్టి క్రీడతో నగ్ని నుద్ధరింపుము. లేదా యమునియందు నిదయాపూర్ణమైన మనస్సునుంచుము. ఇట్లు కానిచో నప్పుడు వరుణుని వరింపుము ॥౧౨౮॥

శ్లో॥ శ్రీహర్షం కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః సుతం
శ్రీహీరః సుషువే జితేన్ద్రియచయం మామల్లదేవీ చ యమ్ ।

తస్యాఽగాదయమష్టమః కవికులాదృష్టాధ్వ
పాన్థే మహా
కావ్యే చారుణి వైరసేనిచరితే సర్గో నిసర్గోజ్జ్వలః॥౧౦౫

ప॥వి॥ శ్రీహర్షం । కవిరాజరాజి మకుటాలఙ్కారహీరః । సుతం । శ్రీహీరః । సుషువే । జితేన్ద్రియచయం । మామల్లదేవీ । చ । యమ్ । తస్య । అగాత్ । అయమ్ । అష్టమః । కవికులాదృష్టాధ్వపాన్థే । మహాకావ్యే । చారుణి । వైరసేనిచరితే । సర్గః । నిసర్గోజ్జ్వలః.

టీక॥ కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః; కవిరాజ = కవిశ్రేష్ఠులయొక్క, రాజి = వరుసలో, మకుట = శ్రేష్ఠులైనవారికి, అలఙ్కారభూతః = భూషణమైనట్టి, హీరః = వజ్రమణితో సమానమైన, శ్రీహీరః = హీరుఁడను విద్వాంసుఁడు, శ్రీహర్షం = శ్రీహర్షుఁడను, జితేన్ద్రియచయం = ఇంద్రియ సమూహమును జయించిన, యం = ఏ, సుతం = కుమారుని, సుషువే = యుత్పత్తిఁగవించెనో, మామల్లదేవీచ = మామల్లదేవియను నతని తల్లియు, యం = ఏ, సుతం = కుమారుని, సుషువే = కనెనో, తస్య = ఆ శ్రీహర్షునికి సంబంధించిన, కవికులాఽదృష్టాధ్వపాన్థే; కవికుల = కవిసంఘముచే, అదృష్ట = చూడఁబడని, అధ్వ = మార్గమునందు, పాన్థే = బాటసారియైనదియు, చారుణి = రమ్యమైనదియు, వైరసేనిచరితే; వైరసేని = వీరసేనుని కుమారుఁడైన నలునియొక్క, చరితే = చరిత్రమైనదియునగు, మహాకావ్యే = మహాకావ్యమైననైషధీయచరిత్రమునందు, నిసర్గోజ్జ్వలః = స్వభావముతోనే వెలుగొందునట్టి, అయం = ఈ, అష్టమః = ఎనిమిదవదైన, సర్గః = సర్గ, అగాత్ = కడచినది. (సమ్పూర్ణమైనది.)

## సమాసములు :

*కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః :* కవీనాం రాజానః = కవిరాజాః. కవిరాజానాం రాజిః = కవిరాజరాజిః. కవిరాజరాజేః మకుటాః = కవిరాజరాజి మకుటాః. కవిరాజరాజిమకుటానామలఙ్కారః = కవిరాజరాజిమకుటాలఙ్కారః. కవిరాజరాజిమకుటాలఙ్కారశ్చాసౌ హీరశ్చ = కవిరాజరాజిమకుటాలఙ్కార హీరః.

*జితేన్ద్రియచయం :* ఇన్ద్రియాణాం చయః = ఇన్ద్రియచయః. జితః ఇన్ద్రియచయః యేన సః = జితేన్ద్రియచయః. తమ్ = జితేన్ద్రియచయం.

*కవికులాదృష్టాధ్వపాన్థే :* కవీనాం కులం = కవికులం. కవికులేనఅదృష్టః = కవికులాదృష్టః. కవికులాదృష్టశ్చాసౌ అధ్వా చ = కవికులాదృష్టాధ్వా. కవికులాదృష్టాఽధ్వని పాన్థం = కవికులాదృష్టాధ్వపాన్థమ్. తస్మిన్ = కవికులాదృష్టాధ్వపాన్థే.

*వైరసేనిచరితే :* వీరసేనస్య అపత్యం పుమాన్ = వైరసేనిః. వైరసేనేః చరితమ్ = వైరసేని చరితమ్. తస్మిన్ = వైరసేనిచరితే.

*నిసర్గోజ్జ్వలః :* నిసర్గేణ ఉజ్జ్వలః = నిసర్గోజ్జ్వలః.

భావము :

కవిశ్రేష్ఠుల వరుసలో శ్రేష్ఠులకు భూషణమగు వజ్రమణియైన శ్రీహీరుఁడను విద్వాంసుడును మామల్లదేవియు జితేన్ద్రియుడైన శ్రీహర్షుని కనిరి. కవులెఱుంగని మార్గమున నడచెడి, నలచరిత్రమైన రమ్యమగు మహాకావ్యమునందు స్వభావముతోఁడనే వెలుఁగొందునట్టి యష్టమసర్గ సమాప్తము.

ఇతి

శ్రీ మదాత్రేయగోత్ర శ్రీమదుడాలి నృసింహశాస్త్రితనూజ విక్రమసింహపురీవేదసంస్కృత కళాశాలా ప్రధానోపాధ్యాయ

శ్రీ సుబ్బరామశాస్త్రి

విరచితమగు

నైషదాంధ్ర వ్యాఖ్యానమున

అష్టమసర్గ

సమాప్తము.

# శ్రీ హర్షనైషధము

## నవమసర్గః

శ్లో॥ ఇతీయమక్షిభ్రువవిభ్రమేఙ్గితైః
స్ఫుటామనిచ్ఛాం వివరీతుముత్సుకా ।
తదుక్తిమాత్రశ్రవణేచ్ఛయాఽశృణో
ద్దిగీశసన్దేశగిరో న గౌరవాత్॥ ౧

ప॥వి॥ ఇతి । ఇయమ్ । అక్షిభ్రువవిభ్రమేఙ్గితైః । స్ఫుటామ్ । అనిచ్ఛాం । వివరీతుమ్ । ఉత్సుకా । తదుక్తిమాత్రశ్రవణేచ్ఛయా । అశృణోత్ । దిగీశసన్దేశగిరః । న । గౌరవాత్.

టీక॥ ఇయం = ఈదమయన్తి, అక్షిభ్రువవిభ్రమేఙ్గితైః; అక్షి = కన్నుల యొక్కయు, భ్రువ = కనుబొమ్మలయొక్కయు, విభ్రమ = వికారమనెడి, ఇఙ్గితైః = చేష్టలచే, స్ఫుటాం = స్పష్టమైన, అనిచ్ఛాం = ఇన్ద్రాదులవిషయమునందు నిచ్ఛలేకయుండుటను, వివరీతుం = మాటలచే వివరించుటకు. అనగా నిషేధించుటకు, ఉత్సుకాసతీ = ఉద్యుక్తురాలై, తదుక్తిమాత్రశ్రవణేచ్ఛయా: తదుక్తిమాత్ర = నలుని వచనములను మాత్రమే, శ్రవణేచ్ఛయా = వినఁగోరికతో, దిగీశసన్దేశగిరః; దిగీశ = దిక్పాలురయొక్క, సన్దేశగిరః = సమాచారవచనములను, అశృణోత్ = వినినది. గౌరవాత్ = దిక్పాలపైనిగౌరమువలన, న అశృణోత్ = వినలేదు.

### సమాసములు :

అక్షిభ్రువవిభ్రమేఙ్గితైః : అక్షిణీ చ భ్రువౌ చ = అక్షిభ్రువమ్. అక్షిభ్రువస్య విభ్రమః = అక్షిభ్రువవిభ్రమః. అక్షిభ్రువవిభ్రమ ఏవ ఇఙ్గితాని = అక్షిభ్రువవిభ్రమేఙ్గితాని, తైః = అక్షిభ్రువవిభ్రమేఙ్గితైః,

అనిచ్ఛామ్ : న ఇచ్ఛా = అనిచ్ఛా. తామ్ = అనిచ్ఛామ్.

*తదుక్తిమాత్రశ్రవణేచ్ఛయా :* తస్య ఉక్తిః = తదుక్తిః. తదుక్తిరేవ = తదుక్తిమాత్రమ్. తదుక్తిమాత్రస్య శ్రవణం = తదుక్తిమాత్రశ్రవణమ్. తదుక్తిమాత్రశ్రవణే ఇచ్ఛా = తదుక్తిమాత్రశ్రవణేచ్ఛా. తయా = తదుక్తిమాత్రశ్రవణేచ్ఛయా,

*దిగీశసన్దేశగిరః :* దిశామీశాః = దిగీశాః. దిగీశానాం సన్దేశాః = దిగీశసన్దేశాః. దిగీశసన్దేశా ఏవ గిరః = దిగీశసన్దేశగిరః. తాః = దిగీశసన్దేశగిరః.

*గౌరవాత్ :* గురోర్భావః = గౌరవమ్. తస్మాత్ = గౌరవాత్.

**భావము :**

ఈ దమయన్తి ఇన్ద్రాది దిక్పాలురపై దనకు గల యప్రీతి, తన కన్నులు, కనుబొమ్మలు మున్నగు వాని విలాసము లనెడి చేష్టలచే వ్యక్తమగుచున్నను దానిని మాటలచేఁ జెప్పఁగోరినది. దిక్పాలురనుఁ గూర్చి నలుఁడు చెప్పునట్టివిషయములను కేవలము నలుని మధురవచనములను వినుటకై కోరెనే గాని, దిక్పాలురపై గౌరవముతో వినలేదు. అనగా దమయన్తికి దిక్పాలురపై నెట్టి యనురాగము కలుగలేదు. ॥౧॥

శ్లో॥ తదర్పితామశ్రుతవద్విధాయ
దిగీశసన్దేశమయీం సరస్వతీం ।
ఇదం తముర్వీతలశీతలద్యుతిం
జగాద వైదర్భనరేన్ద్రనన్దినీ॥ ౨

ప॥వి॥ అనర్పితామ్ । అశ్రుతవత్ । విధాయ । తాం । దిగీశసన్దేశమయీం । సరస్వతీం । ఇదం । తమ్ । ఉర్వీతలశీతలద్యుతిం । జగాద । వైదర్భనరేన్ద్రనన్దినీ.

టీక॥ వైదర్భనరేన్ద్రనన్దినీ; వైదర్భనరేన్ద్ర = విదర్భరాజుయొక్క, నన్దినీ = పుత్రికయైన దమయన్తి, తదర్పితాం; తత్ = ఆనలునిచే, అర్పితాం = చెప్పఁబడిన, దిగీశసన్దేశమయీం; దిగీశ = దిక్పాలురయొక్క, సన్దేశ

ప॥వి॥ మయా । అజ్ఞ । పృష్టః । కులనామనీ । భవాన్ । అమూ । విముచ్య। ఏవ । కిమ్ । అన్యత్ । ఉక్తవాన్ । న । మహ్యామ్ । అత్ర । ఉత్త రధారయస్య । కిం । హ్రియే । అపి । సా । ఇయం । భవతః । అధ మర్ణతా.

టీక॥ హే అజ్ఞ = ఓ పూజ్యుడా! మయా = నాచే, భవాన్ = నీవు, కులనా మనీ = వంశమును బేరును గూర్చి, పృష్టః = అడుగబడినవాడవై, కిమ్ = ఏల, అమూ = ఆ వంశమును పేరును, విముచ్యైవ = వదలియే, అన్యత్ = మఱియొక్క సంగతి, ఉక్తవాన్ = చెప్పితివి. అత్ర = ఈ వంశమును, పేరునుగూర్చి యడుటగులో, మహ్యం = ఉత్తమర్ణురాలైన నాకై, ఉత్తరధారయస్య = ఉత్తరమను నప్పుబడిన, భవతః = నీకు, సేయం = ఆయీ, అధమర్ణతా = అప్పును జెల్లింప వలసియుండుట, హ్రియేఽపి = సిగ్గుకొఱకు, నకిమ్ = కారణముగాదా ?

సమాసములు :

కులనామనీ: కులం చ నామ చ = కులనామనీ. తే = కులనామనీ.

ఉత్తరధారయస్య: ఉత్తరం ధారయతీతి = ఉత్తరధారయః. తస్య = ఉత్తరధారయస్య.

అధమర్ణతా: ఋణేన అధమః = అధమర్ణః. అధమర్ణస్య భావః = అధ మర్ణతా.

భావము :

ఓ పూజ్యుడా! నేను నీయొక్క వంశమును బేరును గూర్చి యడుగగా, వానిని వదలిపెట్టి దిక్పాలురసందేశమను నసజ్ఞతవిషయమును జెప్పుచున్నావు. నీవు నా ప్రశ్నకు సమాధానముగా నీ కులమును నామమును జెప్పనందువలన నాకు సమాధాన మివ్వనందులకు ఋణపడి యున్నావు. కాన నేని యప్పునందు నుత్తమర్ణురాలను. అనగా నప్పు నిచ్చిన దానను. నీవు అధమర్ణుడవు. అనగా నప్పు తీసికొనినవాడవు. కాన నాకు సమాధానమనెడి ఋణమును యప్పుబడి యధమర్ణుడైనందుల కేల సిగ్గుపడవు? ॥౩॥

శ్లో॥ అదృశ్యమానా క్వచిదీక్షితాక్వచి
న్మమానుయోగే భవతః సరస్వతీ।
క్వచిత్ప్రకాశాం క్వచిదస్ఫుటార్ణసం
సరస్వతీం జేతుమనాః సరస్వతీం॥ ౪

ప॥వి॥ అదృశ్యమానా । క్వచిత్ । ఈక్షితా । క్వచిత్ । మమ । అనుయోగే । భవతః । సరస్వతీ । క్వ । చిత్ । ప్రకాశాం । క్వ । చిత్ । అస్ఫుటార్ణసం । సరస్వతీం । జేతుమనాః । సరస్వతీమ్.

టీక॥ మమ = నాయొక్క, అనుయోగే = ప్రశ్నవిషయమునందు, క్వచిత్ = ఒకయెడ, అనగా కులనామవిషయమునందు, అదృశ్యమానా = ప్రకాశితముకాకను, క్వచిత్ = ఒకయెడ, అనగా నెందుండి వచ్చితివి? ఎవరికి సంబంధించినవాఁడవు అను విషయమున, ఈక్షితా = ప్రకాశితముగనున్న, ఈదృక్ = ఇటువంటి, భవతః = నీయొక్క, సరస్వతీ = వాక్కు, క్వచిత్ = ఒకచోట, ప్రకాశాం = స్పష్టమైనజలముగలదియు, క్వచిత్ = ఒకచోట, అస్ఫుటార్ణసమ్; అస్ఫుట = అస్పష్టమైన, అర్ణనం = జలముకలదియునగు, సరస్వతీం = వాక్కును (సరస్వతినదిని) జేతుమనాః = జయింపమనస్సుగలదై యున్నది.

వి॥ నలవాక్కునకు సరస్వతీనదీ ధర్మ సంబంధ ముండుటవలన ఆ నదిని జయింపవలయు నను కోరిన యుత్ప్రేక్షితము. దానివే ఉపమాలఙ్కారము వ్యఙ్గ్యము కాన నలఙ్కారముచే నలఙ్కారధ్వని.

సమాసములు :

అదృశ్యమానా :- న దృశ్యమానా = అదృశ్యమానా.

అస్ఫుటార్ణసం : అస్ఫుటాని అర్ణాంసి యస్యాస్సా = అస్ఫుటార్ణాః-తామ్ = అస్ఫుటార్ణసమ్.

జేతుమనాః : జేతుం మనః యస్యాస్సా = జేతుమనాః.

**భావము :**

నేను ప్రశ్నించిన విషయమున, కులనామములను మఱుగు పఱచుచు, నెందుండి వచ్చినది, ఎవరికిసంబంధించినది బయలుపఱచు చున్న నీవాక్కు ఒక్కయెడ కానవచ్చెడి యుదకములను, మఱి యొకయెడ కానరాని యుదకములను గల్గిన (వాక్కును) సరస్వతియనునదిని జయింపఁగోరినదిగ నున్నది. అనగా, సరస్వతి యను నది యంతర్వాహిని యని ప్రసిద్ధి కాన నా నదిలో కొన్నిచోట్ల ఉదకములు కానవచ్చును, మఱికొన్నిచోట్ల, ఉదకములు కానరావు. అట్లే నలుని వచనములు కొన్ని ప్రశ్నలకు సమాధానము లీయనందు వలన, నస్ఫుటములుగను కొన్నింటికి సమాధానము లిచ్చుటవలన స్ఫుటములుగ నుండుటవలన వ్యక్తావ్యక్తములై, వక్తాఽవ్యక్తప్రవాహము గల సరస్వతీనదివలె నున్నదని యాశయము ॥౪॥

శ్లో॥ గిరః శ్రుతా ఏవ తవ శ్రవఃసుధాః
శ్లథా భవన్నామ్ని తు న శ్రుతిస్పృహా ।
పిపాసుతా శాన్తిముపైతి వారిణా
న జాతు దుగ్ధాన్మధునోఽధికాదపి॥ ౫

ప॥వి॥ గిరః । శ్రుతాః ఏవ । తవ । శ్రవఃసుధాః । శ్లథా । భవన్నామ్ని । తు । న । శ్రుతిస్పృహా । పిపాసుతా । శాన్తిమ్ । ఉపైతి । వారిణా । న । జాతు । దుగ్ధాత్ । మధునః । అధికాత్ । అపి.

టీక॥ శ్రవస్సుధాః = చెవులకమృతములవంటివైన, తవ = నీయొక్క, గిరః = వాక్కులు, శ్రుతాఏవ = కేవలమువినఁబడినవి. కిన్తు = కాని, భవన్నామ్ని = నీపేరువిషయమున, శ్రుతిస్పృహా = వినఁగోరిక, నశ్లథా = తగ్గదు. తథాహి = అదియుక్తమే. పిపాసుతా = దాహము, వారిణా = ఉదకముచే, శామ్యతి = శమించును. అధికాత్ = అధికమైన, దుగ్ధాత్ = పాలవలనను, మధునోఽపి = తేనెవలనను, జాతు = ఒకప్పుడును, నశామ్యతి = శమించదు.

వి॥ కర్ణామృతము లగు నీమాటలను వినినను, వినఁగోరిక యింకను తీరలేదు అను విషయమునకు "ఉదకముచే దాహము తీరును కాని

యధికముగా పాలను గాని తేనెని గాని త్రాగుటచే తీరదు'' అను విషయమునకు బింబప్రతిబింబభావమును జెప్పుటవలన దృష్టాన్తాలఙ్కారము.

## సమాసములు:

భవన్నామ్ని : భవతః నామ = భవన్నామ. తస్మిన్ = భవన్నామ్ని.

పిపాసుతా : పాతుమిచ్ఛుః = పిపాసుః. పిపాసోః భావః = పిపాసుతా.

శ్రుతిస్పృహా : శ్రుతేః స్పృహా = శ్రుతిస్పృహా.

## భావము :

కర్ణామృతము లైన నీ మాటలను వినినను నింకను నీ పేరుమున్నగు వానికి సంబంధించిన విషయములను వినవలయు నను కోరికతీరలేదు. దాహము ఉదకమునుఁద్రావిన తీరును కాని దానికంటె నధికముగా పాలనుఁగాని తేనెనుఁగాని త్రాగిన తీరదు గదా ॥౫॥

శ్లో॥ బిభర్తి వంశః కతమస్తమోఽపహం
భవాదృశం నాయకరత్నమీదృశమ్ ।
తమన్యసామాన్యధియావమానితం
త్వయా మహాన్తం బహుమన్తుముత్సహే॥ ౬

ప॥వి॥ బిభర్తి । వంశః । కతమః । తమోపహం । భవాదృశం । నాయకరత్నమ్ । ఈదృశమ్ । తమ్ । అన్యసామాన్యధియా । అవమానితం। త్వయా । మహాన్తం । బహు । మన్తుమ్ । ఉత్సహే.

టీక॥ తమోపహం = అజ్ఞానాన్ధకారమునుఁదొలగించునట్టి, భవాదృశం = నీవంటి, నాయకరత్నం = నాయకశ్రేష్ఠమును, అనగా రాజశ్రేష్ఠమును, హార మధ్యమందలి మణిని, కతమః = ఏ, వంశః = వంశము, (వెదురు) బిభర్తి = ధరించుచున్నది. (ఏలయనగా) అన్యసామాన్యధియా = ఇతరులతో సమానమను బుద్ధితో, అవమానితం = అవమానింపఁబడినది, (అద్య = ఇప్పుడు) త్వయా = నీచేత, మహాన్తం = ఉత్కర్షనుఁబొందిం

పఁబడిన, తమ్ = ఆవంశమును, బహూమక్తుం = బహుమానించుటకు, ఉత్సహే = ఉత్సాహముఁజెందుచున్నాను.

**సమాసములు :**

తమోపహం : తమః అపహన్తీతి = తమోపహః. తమ్ = తమోపహం.

నాయకరత్నమ్: నాయకానాం రత్నమ్ = నాయకరత్నమ్. తత్ = నాయకరత్నమ్.

అన్యసామాన్యధియా: అన్యశ్చాసౌ సామాన్యశ్చ = అన్యసామాన్యః. అన్యసామాన్య ఇతి ధీః = అన్యసామాన్యధీః. తయా = అన్యసామాన్యధియా.

**భావము :**

మధ్యమణివలె నంధకారమునుఁ దొలగించు నాయకరత్నమైన నీవంటి వానిని ఏ వంశము (వెదురు) ధరించుచున్నది. సాధారణమైనదిగా భావింపఁ బడి నాచే నవమానింపఁబడినదై, నీచేత నుత్కర్షనుఁ బొందిన యా నీవంశ మును గౌరవింపఁ గోరుచున్నాను. ॥౬॥

శ్లో॥ ఇతీరయిత్వా విరతాం పునః స తాం
గిరానుజగ్రాహతరాం నరాధిపః ।
విరుత్య విశ్రాన్తవతీం తపాత్యయే
ఘనాఘనశ్చాతకమణ్డలీమివ॥ ౭

ప॥వి॥ ఇతి । ఈరయిత్వా । విరతాం । పునః । సః । తాం । గిరా । అనుజగ్రాహతరాం । నరాధిపః । విరుత్య । విశ్రాన్తవతీం । తపాత్యయే । ఘనాఘనః । చాతకమణ్డలీమ్ । ఇవ.

టీక॥ ఇతి = ఇట్లు, ఈరయిత్వా = చెప్పి, విరతాం = విరమించిన, తాం = ఆదమయన్తిని, సః = ఆ, నరాధిపః = నలమహారాజు, తపాత్యయే = గ్రీష్మర్తువు చివరభాగమున, విరుత్య = దాహముచేనఱచి, విశ్రాన్తవతీం = విరమించిన, చాతకమణ్డలీం = చాతపక్షుల సమూహమును,

ఘనాఘనఇవ = వర్షోన్ముఖమైన మేఘమువలె, పునః = మఱల, గిరా = మాటచే,(గర్జనముచే) అనుజగ్రాహతరాం = మిక్కిలి యనుగ్రహించెను.

సమాసములు :

తపాత్యయే: తపస్య అత్యయః = తపాత్యయః. తస్మిన్ = తపాత్యయే.

చాతకమణ్డలీమ్ : చాతకానాం మణ్డలీ = చాతకమణ్డలీ. తామ్ = చాతకమణ్డలీం.

భావము :

ఈ విధముగా దమయన్తి పలికి విరమించినది. అప్పుడు నలుఁడు; గ్రీష్మ ఋతువు ముగియునపుడు దాహముచే నఱని విశ్రమించిన చాతకపక్షుల గుంపును, వర్షోన్ముఖ మగు మేఘము, గర్జనముతో నాదరించినట్లు నలుడు తన మాటలతో మిక్కిలి యనుగ్రహించెను. ॥౭॥

శ్లో॥ అయే మమోదాసితమేవ జిహ్వయా
ద్వయేఽపి తస్మిన్ననతిప్రయోజనే ।
గరౌ గిరః పల్లవనార్థలాఘే
మితఞ్చ సారఞ్చ వచో హి వాగ్మితా॥ ౮

ప॥వి॥ అయే । మమ । ఉదాసితమ్ । ఏవ । జిహ్వయా । ద్వయే । అపి । తస్మిన్ । అనతిప్రయోజనే । గరౌ । గిరః । పల్లవనార్థలాఘే । మితం। చ । సారం । చ । వచః । హి । వాగ్మితా.

టీక॥ అయే = ఓ దమయన్తీ, అనతిప్రయోజనే = అతిప్రయోజనము లేని, ద్వయేఽపి = కులము విషయమందును పేరు విషయమందును, మమ = నాయొక్క, జిహ్వయా = నాలుకచే, ఉదాసితం = ఉపేక్షించుట (జరిగినది) తథాహి = అదియుక్తమే. పల్లవనార్థలాఘవే; పల్లవన = వృథాప్రలాపము, అర్థలాఘవే = చెప్పవలసిన విషయమును సంగ్రహపఱచుట అను నీరెండును, గిరః = వాక్కునకు, గరౌఇవ = విషప్రాయములు, అనగా పరిత్యాజ్యములు. మితఞ్చ = అల్పాక్షరముగలదియు,

సారఞ్చ = మహార్థములు గల్గిన, వచః = వచనమే, వాగ్మితా = వక్తృత్వము. అట్లు కానిచో నది వాచాలత్వము. అనగా వదరుఁబోతుతనము అగును.

వి॥ ఇచ్చట సామాన్యమైన యుత్తరార్ధముచే ప్రయోజనరహిత విషయమున నా జిహ్వ యుదాసీనమైన దను విశేషార్థము సమర్థితము కాన నర్థాన్తరన్యాసాలఙ్కారము.

సమాసములు :

అనతిప్రయోజనే : అత్యన్తం ప్రయోజనం = అతిప్రయోజనం. అవిద్యమానం అతిప్రయోజనం యస్మిన్ తత్ = అనతి ప్రయోజనం. తస్మిన్ = అనతిప్రయోజనే.

పల్లవనార్థలాఘవే : లఘోర్భావః = లాఘవమ్. అర్థస్య లాఘవం = అర్థలాఘవం. పల్లవనఞ్చ అర్థలాఘవఞ్చ = పల్లవనార్థలాఘవే.

వాగ్మితా : వాగ్మినః భావః = వాగ్మితా.

భావము :

ఓ దమయన్తీ! అధిక ప్రయోజనము లేని కులము విషయమునను, పేరు విషయమునను నా నాలుక ఉపేక్షను వహించినది. వృథాప్రలాపము, చెప్పవలసిన విషయములను చెప్పకపోవుట, యను నవి మాటలకు విషములవంటివి. వానిని ముందు పరిత్యజింపవలయును. అల్పాక్షరములను గల్గుటచేత మితమైనదియు, మహార్థములతోఁ గూడినందువలన సారమైనదియునైన వాక్కువలననే వాగ్మిత్వ మేర్పడును. అట్లుకానిచో వదరుబోతుతనమే యగును. కావున కులనామము లనవసరము లని నీకుఁజెప్పలేదు. ॥౮॥

శ్లో॥ వృథాకథేయం మయి వర్ణపద్ధతిః
కయానుపూర్వ్యా సమకేతి కేతి చ ।
క్షమే సమక్షవ్యవహారమావయోః
పదే విధాతుం కిల యుష్మదస్మదీ॥ ౯

ప॥వి॥ వృథా । కథా । ఇయం। మయి । వర్ణపద్ధతిః । కయా । ఆనుపూర్వ్యా।
సమకేతి । కా । ఇతి । చ । క్షమే । సమక్షవ్యవహారం । ఆవయోః ।
పదే । విధాతుం । కిల । యుష్మదస్మదీ.

టీక॥ హే దమయంతిః = ఓదమయన్తీ, మయి = నాయందు, కా = ఏ, వర్ణపద్ధతిః = అక్షరములవరుస, కయా = ఏ, ఆనుపూర్వ్యా = వరుసతో, సమకేతి = సంజ్ఞగాసంకేతింపఁబడినది, ఇతి = అను, ఇయం = ఈ, కథా = ప్రశ్నసడుగుట, వృథా = వ్యర్థము. ఆవయోః = మనయిరువురికిని, సమక్షవ్యవహారం = ప్రత్యక్ష సంభాషణమును, విధాతుం = చేయుటకు, యుష్మదస్మదీ = "త్వమ్" అని నిన్నుఁజెప్పుపదమును, 'అహమ్' అనినన్నుఁజెప్పుపదమును, క్షమే = సమర్థములు (అనగా జాలినవి).

## సమాసములు :

వర్ణపద్ధతిః : వర్ణానాం పద్ధతిః = వర్ణపద్ధతిః.

సమక్షవ్యవహారం : అక్ష్ణోః సమీపే = సమక్షం. సమక్షం వ్యవహారః = సమక్షవ్యవహారః. తమ్ = సమక్షవ్యవహారం.

యుష్మదస్మదీ : యుష్మచ్చ అస్మచ్చ = యుష్మదస్మదీ.

## భావము :

ఓదమయన్తీ నాయొక్క కులనామములఁ గూర్చిన ప్రశ్న వ్యర్థము. నా నామమందలి యక్షరపఙ్క్తి యేమిః అది యే వరుసతో నాకు పేరుగాఁ జేయఁబడిన దని యడుగుట వ్యర్థము. మనమిరువురము పరస్పరసంభాషణము చేయుటకు కులనామములవసరములు గావు. మఱేమనగా త్వం యనుయుష్మచ్ఛబ్దము; అహమ్, అను నస్మచ్ఛబ్దముచాలును ॥౯॥

శ్లో॥ యది స్వభావాన్మమ నోజ్జ్వలం కులం
తత స్తదుద్భావనమౌచితీ కుతః ।
అథావదాతం తదహో! విడమ్బనా
యథా తథా ప్రేష్యతయోపనేదుషః ॥ ౧౦

ప॥వి॥ యది । స్వభావాత్ । మమ । న । ఉజ్జ్వలం । కులం । తతః । తదుద్భావనమ్ । ఔచితీ । కుతః । అథ । అవదాతం । తత్ । అహో । విడమ్బనా । యథా । తథా । ప్రేష్యతయా । ఉపసేదుషః.

టీక॥ మమ = నాయొక్క, కులం = వంశము, స్వభావాత్ = స్వభావమువలన, ఉజ్జ్వలం = నిష్కళఙ్కము, యదిన = కానిచో, తతః = అందువలన, తదుద్భావనం; తత్ = ఆకులమును, ఉద్భావనం = ప్రకటించుట, కుతః = ఎందువలన, ఔచితీ = ఔచిత్యము (కలదగును)? అథ = పిదప, అవదాతం = ఉజ్జ్వలమైనచో, తథాఽపి = అయినను, యథా తథా = ఎట్లనోయొకట్లు, ప్రేష్యతయా = దూతగా, ఉపసేదుషః = నిన్నుఁబొందిన, మమ = నాకు, తత్ = ఆకులమునుఁజెప్పుకొనుట. విడమ్బనా = పరిహాసము. అహో = ఆశ్చర్యము.

**భావము :**

నా కులము స్వభావసిద్ధముగనే గొప్పదికానిచో, దానిని వెల్లడిపఱచు కొనుటలో నౌచిత్య మేమున్నది. ఒక వేళ గొప్పదే యైనను, దూతగా నీదగ్గరకు వచ్చిన నాకు దానిని వెల్లడి పఱచు కొనుట పరిహాసమే గదా ॥౧౦॥

శ్లో॥ ఇతి ప్రతీత్యైవ మయావధీరితే
తవాఽపి నిర్బన్ధరసో న శోభతే ।
హరిత్పతీనాం ప్రతివాచికం ప్రతి
శ్రమో గిరాం తే ఘటతే హి సమ్ప్రతి॥ ౧౧

ప॥వి॥ ఇతి । ప్రతీత్యా । ఏవ । మయా । అవధీరితే । తవ । అపి । నిర్బన్ధరసః । న । శోభతే । హరిత్పతీనాం । ప్రతివాచికం । ప్రతి । శ్రమః । గిరాం । తే । ఘటతే । హి । సమ్ప్రతి.

టీక॥ ఇతి = ఇట్లు, ప్రతీత్యైవ = కులనామములనుఁ జెప్పుటవృథాయని నిశ్చయించుకొనియే, మయా = నాచేత, అవధీరితే = ఉపేక్షింపఁబడిన విషయములు, తవాఽపి = నీకును, నిర్బన్ధరసః = నిర్బంధముఁ జేయు టకుకోర్కె, నశోభతే = శోభించుటలేదు. కిన్తు = కాని, సమ్ప్రతి =

**సమాసములు:**

*ఫలేగ్రహిగ్రహా :* ఫలే గృహ్ణాతీతి = ఫలేగ్రహిః. ఫలేగ్రహిః గ్రహః యస్యాస్సా = ఫలేగ్రహిగ్రహా.

**భావము :**

నీ ప్రశ్నకు సమాధాన మొసంగుట నిష్ప్రయోజన మైనను, నీవు నిర్బంధించుచున్నందువలన పరిమితవచనముచే, నీకోరిక ననుసరింతును. నన్ను చంద్రవంశమునఁ బుట్టిన యజ్ఞ్కూర మని తెలిసికొని నీ యభినివేశమును సఫలము గావించుకొనుము ॥౧౨॥

శ్లో॥ మహాజనాచార పరమ్పరేదృశీ
స్వనామ నామాఽఽదదతే న సాధవః ।
అతోఽభిధాతుం న తదుత్సహే పునః
జనః కిలాఽఽచారముచం విగాయతి॥ ౧౩

ప॥వి॥ మహాజనాచారపరమ్పరా । ఈదృశీ । స్వనామ । నామ। ఆదదతే। న। సాధవః । అతః । అభిధాతుం । న । తత్ । ఉత్సహే । పునః । జనః । కిల । ఆచారముచం । విగాయతి.

**టీక॥** మహాజనాచారపరమ్పరా; మహాజన = సజ్జనులయొక్క, ఆచారపరమ్పరా = సమ్ప్రదాయపు పరమ్పర, ఈదృశీ = ఇటువంటిది. ఎటువంటిదనగా, సాధవః = సజ్జనులు, స్వనామ = తమ పేరును, నాదదతేనామ = పేర్కొనరుగదా. అతః = ఇందువలన, తత్పునః = ఆ పేరునుమాత్రము, అభిధాతుం = చెప్పుటకు, నోత్సహే = శక్తుఁడును కాను. తథాహి = అదియుక్తమే. జనః = జనము, ఆచారముచం = ఆచారమును వదలినవానిని, విగాయతి = నిందించుచున్నది.

**సమాసములు :**

*మహాజనాచారపరమ్పరా :* మహాన్తశ్చ తే జనాశ్చ = మహాజనాః. ఆచారస్య పరమ్పరా = ఆచారపరమ్పరా, మహాజనానామాచార పరమ్పరా = మహాజనాచారపరమ్పరా.

స్వనామ: స్వస్యనామ=స్వనామ. తత్ =స్వనామ.

అచారముచం: ఆచారం ముంచతీతి = ఆచారముక్. తమ్=అచారముచమ్.

భావము :

సజ్జనుల సమ్ప్రదాయము ననుసరించి సాధువులు తమ పేరును( జెప్పరాదు. అందువలన నాపేరును నీకు( జెప్పలేక యున్నాను. ఆచారమును వదలినవానిని ప్రజలు నిందింతురు. ॥౧౩॥

శ్లో॥ అదోఽయమాలప్య శిఖీవ శారదో
బభూవ తూష్ణీమహితాపకారకః ।
అథాఽస్య రాగస్య దధా పదే పదే
వచాంసి హంసీవ విదర్భజాదదే॥ ౧౪

ప॥వి॥ అదః । అయమ్ । ఆలప్య । శిఖీ । ఇవ। శారదః। బభూవ। తూష్ణీమ్। అహితాపకారకః । అథ । అస్య । రాగస్య । దధా । పదే । పదే । వచాంసి । హంసీ । ఇవ । విదర్భజా । అదదే.

టీక॥ అహితాపకారకః; అహిత=శత్రువులకు, అపకారకః = అపకారము( జేసెడి, అయం=ఈ నలు(డు, శారదః=శరదృతువునకు సంబంధించిన, శిఖీవ = నెమలివలె, అదః = ఈమాటను, ఆలప్య = చెప్పి, తూష్ణీం = ఊరక, బభూవ = ఉండెను. అథ = తర్వాత, అస్య = ఈ వాక్యమునకు సమ్బంధించిన, పదేపదే = సుప్తిఙన్తపద విషయమున, రాగస్య = వినవలయునను కోరికను, దధా=ధరించుచున్నదై (పక్షాన్తరమునందు) పదేపదే=రెండుపాదముల యందును, రాగస్య=ముక్కుయొక్క ఎఱ్ఱ(దనమును, దధా=ధరించుచున్న, విదర్భజా = దమయన్తి, హంసీవ = ఆడహంసవలె, వచాంసి = మాటలను, ఆదదే= చెప్పినది.

సమాసములు :

శారదః : శరది భవః = శారదః.

అహితాపకారకః : న హితాః = అహితాః. అహితానామపకారకః = అహితాపకారకః. విదర్భేషు జాయత ఇతి = విదర్భజా.

**భావము :**

శత్రుసంహారకుఁడైన నలుఁడు శరదృతువునందలి నెమలి వలె పరిమితముగా పలుకులు చెప్పి యూరకుండెను. పిదప నతని వాక్యమునందలి ప్రతిపదమునమృతముఁ జిలుకుచుండగా వానిపై రాగమువహించినదై, రెండు పాదములయందును, చంచుపుటములయొక్క ఎఱ్ఱఁదనమును వహించిన దమయన్తి హంసవలె పలకఁ దొడగినది. ॥౧౪॥

శ్లో॥ సుధాంశువంశాభరణం భవానితి
శ్రుతేఽపి నాఽపైతి విశేషసంశయః ।
కియత్సు మౌనం వితతా కియత్సు వా
ఙ్మహత్యహో! వఞ్చనచాతురీ తవ॥ ౧౫

ప॥వి॥ సుధాంశువంశాభరణం । భవాన్ । ఇతి। శ్రుతే । అపి । న । అపైతి । విశేషసంశయః । కియత్సు । మౌనం । వితతా । కియత్సు । వాక్ । మహతీ । అహో । వఞ్చనచాతురీ । తవ.

టీక॥ భవాన్ = నీవు, సుధాంశువంశాభరణం; సుధాంశువంశ = చన్ద్రవంశమునకు, ఆభరణం = భూషణమని, శ్రుతేఽపి = వినఁబడిన విషయమందును, విశేషసంశయః; విశేష = విశేషవిషయమందు, సంశయః = సన్దేహము, నాఽపైతి = తొలగుటలేదు. కియత్సు = ఎన్ని విషయములయందు, మౌనం = మౌనము, కియత్సు = ఎన్ని విషయములయందు, వాక్ = వచనము, వితతా = విస్తృతమైనది? (ఈవిషయములలో నియామక మేదియును లేదు). కిన్తు = కాని, తవ = నీయొక్క, వఞ్చనచాతురీ = వఞ్చనలోనినేర్పు, మహతీ = గొప్పది. అహో = ఆశ్చర్యము.

**సమాసములు :**

సుధాంశువంశాభరణం: సుధాంశోః వంశః = సుధాంశువంశః. సుధాంశువంశస్య ఆభరణం = సుధాంశువంశాభరణమ్.

**విశేషసంశయః** : విశేషే సంశయః = విశేషసంశయః.

వఞ్చనచాతురీ : వఞ్చనే చాతురీ = వఞ్చనచాతురీ.

భావము :

నీవు చన్ద్రవంశాభరణ మని చెప్పితివి. కాని ఆ విషయము విస్పష్టముగ నీచే నిపు త్తము గాలేదు. కాఁబట్టి చన్ద్రవంశమునం దెవ్వడవో యను విశేష విషయమున సంశయ మట్లే యున్నది. అది చెప్పఁగూడదనినచో, నెంత వరకుఁ జెప్పఁదగినదో, యెంతవరకుఁ జెప్పదగనిదో దానినేవివరింపఁ గోరితిని. ఎన్ని విషయములయందు మౌనమో, ఎన్ని విషయములందు మౌనము లేదో దానికి నియామక మేమి యున్నది. కాని నీ వంచనాచాతుర్యము ఎంతగొప్పది.

శ్లో॥ మయాపి దేయం ప్రతివాచికం న తే
స్వనామ మత్కర్ణసుధామకుర్వతే ।
పరేణ పుంసా హి మమాపి సఙ్కథా
కులాబలాచారసహాసనాఽసహా॥ ౧౬

ప॥వి॥ మయా । అపి । దేయం । ప్రతివాచికం । న। తే। స్వనామ । మత్కర్ణ సుధామ్ । అకుర్వతే । పరేణ। పుంసా। హి । మమ । అపి।సఙ్కథా । కులాబలాచారసహాసనాఽసహా.

టీక॥ స్వనామ = తనపేరును, మత్కర్ణసుధాం; మత్ = నాయొక్క, కర్ణ = చెవులకు, సుధామ్ = అమృతమును, అకుర్వతే = చేయనటువంటి, తే = నీకు, మయాఽపి = నాచేతను, ప్రతివాచికం = ప్రతిసందేశము, నదేయం = ఈయఁదగినది గాదు. హి = ఏల యనగా, మమాఽపి = నాకును, పరేణ = ఇతరుఁడైన, పుంసా = పురుషునితో, సఙ్కథా = సల్లాపము, కులాబలాచార సహాసనాఽసహా; కులాబలా = కులస్త్రీల యొక్క, ఆచార = ఆచారముతోటి, సహాఽసన = సహవాసమును, అసహా = సహించునదిగాదు. అనగా కులస్త్రీల యాచారమునకు విరుద్ధము.

## సమాసములు :

మత్కర్ణసుధామ్: మమ కర్ణౌ = మత్కర్ణౌ. మత్కర్ణయోః సుధా = మత్కర్ణసుధా తామ్ = మత్కర్ణసుధామ్.

కులాబలాచారసహాసనాఽసహా : కులే అబలాః = కులాబలాః. కులాబలానామాచారః = కులాబలాచారః. కులాబలాచారేణ సహాసనం = కులాబలాచార సహాసనం. కులాబలాచార సహాసనం న సహత ఇతి = కులాబలాచార సహాసనాఽసహా.

## భావము :

నీ పేరుతో నా చెవులకు విందొనర్చుకయున్న నీకు ప్రతిసందేశ మీయఁ దగినది గాదు. ఏల యనగా పరపురుషుని తోటి సల్లాపము కులస్త్రీల యాచారమునకు విరుద్ధము పేరు చెప్పుట సదాచారవిరుద్ధ మైనట్లే పరపురుషసల్లాపము గూడ కులస్త్రీ ధర్మ విరుద్ధముగదా. ॥౧౬॥

శ్లో॥ హృదాభినన్ద్య ప్రతిబన్ద్యనుత్తరః
ప్రియాగిరః సస్మితమాహ స స్మ తామ్ ।
వదామి వామాక్షి! పరేషు మాక్షిప
త్వమీదృశం మాక్షికమాక్షిపద్వచః ౧౭

ప॥వి॥ హృదా । అభినన్ద్య । ప్రతిబన్ద్యనుత్తరః । ప్రియాగిరః । సస్మితమ్ । ఆహ । సః । స్మ । తామ్ । వదామి । వామాక్షి । పరేషు । మా । క్షిప । త్వమ్ । ఈదృశం । మాక్షికమ్ । ఆక్షిపత్ । వచః.

టీక॥ సః = ఆనలుఁడు, ప్రియాగిరః; ప్రియా = ప్రియురాలైన దమయన్తి యొక్క, గిరః = మాటలను, హృదా = హృదయముచే, అభినన్ద్య = అభినందించి, ప్రతిబన్ద్యనుత్తరః; ప్రతిబన్దీ = పూర్వశ్లోకమందలి పోటీ వచనముచే, అనుత్తరః = బదులులేనివాఁడై, తామ్ = ఆప్రియురాలిని, సస్మితం = చిఱునగవుతో, ఆహస్మ = చెప్పుచుండెను. హేవామాక్షి = ఓ యందమైనకన్నులు గలదానా! వదామి = చెప్పుచున్నాను.

మాక్షికం = తేనెను, అక్షిపత్ = తిరస్కరించునట్టి, ఈదృశం = ఇట్టిలోకోత్తరమైన, వచః = మాటను, పరేషు = పరపురుషులయందు, మాక్షిప = ఉంచవలదు.

## సమాసములు :

ప్రతిబన్ద్యనుత్తరః : అవిద్యమానముత్తరం యస్య సః = అనుత్తరః. ప్రతిబన్ద్యా అనుత్తరః = ప్రతిబన్ద్యనుత్తరః.

ప్రియాగిరః : ప్రియాయాః గిరః = ప్రియాగిరః. తాః = ప్రియాగిరః.

సస్మితమ్ : స్మితేన సహితం యథా తథా = సస్మితమ్.

వామాక్షి : వామే అక్షిణీ యస్యాఃసా = వామాక్షీ. తస్యాః సంబుద్ధిః = హేవామాక్షిః

మాక్షికం : మక్షికాభిః కృతమ్ = మాక్షికమ్.

## భావము :

ఆ నలుఁడు ప్రియురాలి మాటలను మనస్సునందామోదించెను. నలుఁడు, పేరు చెప్పుట యాచారవిరుద్ధ మని చెప్పగా నామె దానికి పోటీగా పరపురుషసల్లాపము గూడ కులస్త్రీధర్మమునకు విరుద్ధ మని ప్రతిబందితో బదులొసంగగా, నలుఁడుదాని కేమియునుత్తరము చెప్పలేకపోయెను. కానియామెతో, చిఱునవ్వు లొలుకునట్లు చెప్పెను. ఓసున్దరాక్షి! తేనెనుఁ గూడ నిరాకరించెడి నీమాటల నెప్పుడునుఁ బరపురుషుల యందుఁ బ్రయోగింపకుము పరపురుష సమ్భాషణ వాస్తవముగా నీవుచెప్పినట్లు కులస్త్రీదర్మవిరుద్ధము. ఇట్లు చెప్పుట వలనఁ దాను పరపురుషుఁడు కాడని సూచితము ॥౧౭॥

శ్లో॥ కరోషి నైనం ఫలినం మమ శ్రమం
దిశోఽనుగృహ్ణాసి న కఞ్చన ప్రభుమ్ ।
త్వమిత్థమర్హాసి సురానుపాసితుం
రసామృతస్నానపవిత్రయా గిరా॥ ౧౮

ప॥వి॥ కరోషి । న । ఏనం । ఫలినం । మమ । శ్రమం । దిశః । అను గృహ్ణాసి । న । కం । చన । ప్రభుమ్ । త్వమ్ । ఇత్థం । అర్హా । అసి । సురాన్ । ఉపాసితుం । రసామృతస్నానపవిత్రయా । గిరా.

టీక॥ హేభైమి! = ఓ దమయన్తి! మమ = నాకు, ఇమం = ఈ, శ్రమం = దేవతా కార్యమువలని ప్రయాసను, ఫలినం = సఫలము, నకరోషి = చేయవా? కఞ్చన = ఒకరినైన, దిశః = దిక్కునకు, ప్రభుం = పాలకుఁడైన వానిని, నానుగృహ్ణాసి = అనుగ్రహింపవా? త్వమ్ = నీవు, ఇత్థం = ఇట్లు, రసామృతస్నానపవిత్రయా; రస = మాధుర్యమనెడి, అమృత = అమృతమందలి, స్నాన = స్నానముచే, పవిత్రయా = పవిత్రమైన, గిరా = వాక్కుచే, సురాన్ = దేవవలను, ఉపాసితుం = ఉపాసించుటకు, అర్హా = తగినదానవుగా, అసి = అగుచున్నావు.

సమాసములు :

ఫలినం : ఫలమస్యాస్తీతి = ఫలీ. తమ్ = ఫలినం.

రసామృతస్నానపవిత్రయా : రస ఏవ అమృతం = రసామృతం. రసామృతేన స్నానం = రసామృతస్నానం. రసామృతస్నానేన పవిత్రా = రసామృతస్నాన పవిత్రా. తయా = రసామృతస్నాన పవిత్రయా.

భావము :

దేవతల కొఱకు నేను గావించు ప్రయత్నమును సఫలము జేయవా? ఒక్క దిక్పాలకునైన ననుగ్రహింపవా? మాధుర్యసుధలో జలకమాడిన శుద్ధమగు నీ వాక్కుచే, నీవు దేవతల నారాధించుట కర్హురాలవు. ॥౧౮॥

శ్లో॥ సురేషు సన్దేశయ సీదృశీం బహూం
రసస్రవేణ స్తిమితాం న భారతీం ।
మదర్పితా దర్పకతాపి తేషు యా
ప్రయాతు దావార్దితదావపృష్టితామ్॥ ౧౯

ప॥వి॥ సురేషు । సన్దేశయసి । ఈదృశీం । బహూం । రసస్రవేణ । స్తిమితాం ।

న । భారతీం । మదర్పితా । దర్పకతాపితేషు । యా । ప్రయాతు ।
దావార్దితదావవృష్టితామ్.

టీక॥ ఈదృశీం = ఇట్లు, లోకోత్తరమైన, బహుం = అధికమైన, రసస్రవేణ = రసప్రవాహముచేత, స్తిమితాం = నిశ్చలమైన, భారతీం = వాక్కును, సురేషు = దేవతలయందు, నసన్దేశయసి = సన్దేశము(గావింపవా? యా = ఏభారతి, దర్పకతాపితేషు; దర్పక = మన్మథునిచే, తాపితేషు = సంతాప పఱుప(బడినవారియందు, మదర్పితా = నాచేత నర్పింప(బడినదై, దావార్దిత దావవృష్టితాం;దావ = దావాగ్నిచే, అర్దిత = కాల్చబడిన, యరణ్యమందు, దావవృష్టితామ్ = వనవర్షముగానుండుటను, ప్రయాతి = పొందుచున్నది.

వి॥ భారతి దావవృష్టిత్వమును పొందునట్లు చెప్పుటవలన నిదర్శనాలఙ్కారము.

## సమాసములు :

రసస్రవేణ : రసస్య స్రవః = రసస్రవః. తేన = రసస్రవేణ.

మదర్పితా : మయా అర్పితా = మదర్పితా.

దర్పకతాపితేషు: దర్పకేణ తాపితాః = దర్పకతాపితాః. తేషు = దర్పకతాపితేషు.

దావార్దితదావవృష్టితాం : దావేన ఆర్దితాః = దావార్దితాః. దవేభవా = దావా. దావా చ సా వృష్టిశ్చ = దావవృష్టిః. దావవృష్టేర్భావః = దావవృష్టితా. దావార్దితానాం దావవృష్టితా = దావార్దితదావవృష్టితా.

## భావము :

లోకోత్తరమై, మెండుగా రసప్రవాహముచే నిశ్చల మైన నీవాక్కులతో దేవతలకు సన్దేశమంపవా? నీ వాక్కులు, మన్మథునిచే సంతాపపఱుప(బడిన యా దిక్పాలురకు నాచే సంద(చేయ(బడును. అది వారికి దావాగ్నిచే పీడింప(బడినవానికి వనవృష్టివలె నుండునుగాత. అనగా నీ సందేశము వారి తాపమును హరించునుగాత. ॥౧౯॥

శ్లో॥ యథాయథేహ త్వదపేక్షయాఽనయా
నిమేషమప్యేష జనో విలమ్బతే।
రుషా శరవ్యీకరణే దివౌకసాం
తథా తథాఽద్య త్వరతే రతేః పతిః ॥ ౨౦

ప॥వి॥ యథా । యథా । ఇహ । త్వదపేక్షయా । అనయా । నిమేషమ్ । అపి । ఏషః । జనః । విలమ్బతే । రుషా । శరవ్యీకరణే। దివౌకసాం। తథా । తథా । అద్య । త్వరతే । రతేః । పతిః.

టీక॥ (హైమి = ఓదమయన్తి) ఏషః = ఈ, జనః = జనము, యథా యథా = ఏయే ప్రకారము, ఇహ = నీసమీపమున, అనయా = ఈ, త్వదపేక్షయా = నీయనురోధముచే, నిమేషమపి = రెప్పపాటుకాలము గూడ, విలమ్బతే = ఆలస్యముఁజేయునో, రతేః = రతికి, పతిః = భర్తయగు మన్మథుఁడు, దివౌకసాం = దేవతలను, శరవ్యీకరణే = తన బాణములకుగుఱిఁ జేసికొనుటయందు, తథాతథా = ఆయాప్ర కారముగా, అద్య = ఇప్పుడు, త్వరతే = తొందరపడుచున్నాడు, (కాన తొందరగా ప్రతిసన్దేశము నొసంగుము.)

**సమాసములు :**

త్వదపేక్షయా : తవ అపేక్షా = త్వదపేక్షా. తయా = త్వదపేక్షయా.
శరవ్యీకరణే : శరస్య లక్ష్యం = శరవ్యం, అశరవ్యస్య శరవ్యస్య సమ్పద్యమానస్య కరణం = శరవ్యీకరణం. తస్మిన్ = శరవ్యీకరణే.

దివౌకసాం : ద్యౌః ఓకః యేషాం తే = దివౌకసః. తేషాం = దివౌకసాం.

**భావము :**

నేను నీయొద్ద నీ యనుసరణచే నెంతెంత జాగు చేయుదునో, మన్మథుఁడు ఇన్ద్రాదిదేవతలను తన బాణములకు గుఱిచేయు సన్నాహమున కంతంత త్వరపడుచున్నాడు. కాన వెంటనే నీ ప్రతిసన్దేశమొసంగుము ॥౨౦॥

శ్లో॥ ఇయచ్చిరస్యావదధన్తి మత్పథే
కిమిన్ద్రనేత్రాణ్యశనిర్న నిర్మమౌ।
ధిగస్తు మాం సత్వరకావ్యమన్థరం
స్థితః పరప్రేష్యగుణోఽపి యత్ర న॥ ౨౧

ప॥వి॥ ఇయచ్చిరస్య । అవదధన్తి । మత్పథే । కిమ్ । ఇన్ద్రనేత్రాణి । అశనిః । న । నిర్మమౌ । ధిక్ । అస్తు । మాం । సత్వరకార్య మన్థరం । స్థితః । పరప్రేష్యగుణః । అపి । యత్ర । న.

టీక॥ మత్పథే = నామార్గమందు, ఇయచ్చిరం = ఇంతపెద్దకాలమునకును, అవదధన్తి = మెలకువఁగల్గిన, (ఎదురుచూచుచున్న) ఇన్ద్రనేత్రాణి = ఇంద్రుని నేత్రములను, అశనిః = వజ్రము, ననిర్మమౌకిం = నిర్మించలేదాయేమి? (నిశ్చయముగా వజ్రనిర్మితములే, కానిచో నింతటి యాలస్యము నవి యెట్లు సహించును). సత్వర కార్యమన్థరం; సత్వర = త్వరతోఁగూడిన, కార్యే = కార్యమునందు, మన్థరం = జాగుచేసెడి, మాం = నన్నుగూర్చి, ధిక్ = అధిక్షేపము, అస్తు = అగునుగాత, యత్ర = ఏనాయెడల, పరప్రేష్యగుణః; పర = ఇతరులకు, ప్రేష్య = సేవకునియొక్క, గుణోఽపి = గుణముగూడ, నస్థితః = ఉండలేదు.

సమాసములు :

ఇయచ్చిరమ్ : ఇయత్ చిరమ్ = ఇయచ్చిరమ్.

మత్పథే : మమ పన్థాః = మత్పథః. తస్మిన్ = మత్పథే.

ఇన్ద్రనేత్రాణి : ఇన్ద్రస్య నేత్రాణి = ఇన్ద్రనేత్రాణి. తాని = ఇన్ద్రనేత్రాణి.

సత్వరకార్యమన్థరం : త్వరయా సహితం = సత్వరం. సత్వరం చ తత్ కార్యం చ = సత్వరకార్యం. సత్వరకార్యే మన్థరః = సత్వరకార్య మన్థరః. తం = సత్వరకార్యమన్థరం.

పరప్రేష్యగుణః : పరేషాం ప్రేష్యః = పరప్రేష్యః. పరప్రేష్యస్య గుణః = పరప్రేష్యగుణః.

**భావము :**

నేను తిరిగి వచ్చెడి మార్గము నింతకాలము మిక్కిలి మెలకువతో నెదురుచూచెడి యిన్ద్రుని నేత్రములను వజ్రము నిర్మించినదా! వానిని నిజముగా వజ్రమే నిర్మించినది. లేనిచో నీపాటి కవి యుండెడివి కావు. త్వరతో గూడిన పనియందు జాగుచేసిడి నేను నిన్దార్హుడను. నాలో సేవకున కుండవలసిన గుణము గూడ లేదు నీవు ప్రతిసందేశము నిచ్చుటలోఁ జేసెడి జాగే నా యీ స్థితికి కారణము. ఒకరికి భృత్యుడుగా నుండుట ఎంతకష్టము, అయ్యో! ॥౨౦॥

శ్లో॥ ఇదం నిగద్య క్షితిభర్తరి స్థితే
తయాఽభ్యధాయి స్వగతం విదగ్ధయా ।
అధిస్త్రి తం దూతయతాం భువః స్మరం
మనో దధత్యా నయనైపుణవ్యయే॥ ౨౨

ప॥వి॥ ఇదం । నిగద్య । క్షితిభర్తరి । స్థితే । తయా । అభ్యధాయి । స్వగతం । విదగ్ధయా । అధిస్త్రి । తం । దూతయతాం । భువః । స్మరం । మనః । దధత్యా । నయనైపుణవ్యయే.

టీక॥ క్షితిభర్తరి = నలమహారాజు, ఇదం = దీనిని, నిగద్య = చెప్పి, స్థితే = ఊరకయుండగా, అధిస్త్రి = స్త్రీలయందు, భువః = భూమికి, స్మరం = మన్మథుఁడైన, తం = ఆపురుషుని, దూతయతాం = దూతగాఁజేసిన వారియొక్క, నయనైపుణవ్యయే; నయ = నీతియందలి, నైపుణ = చాతుర్యముయొక్క, వ్యయే = లేమియందు, మనః = మనస్సును, దధత్యా = ఉంచుచున్న, (కావుననే) విదగ్ధయా = సమర్థురాలైన దమయన్తిచే, స్వగతమ్ = ఇతరులకుఁదెలియకతనయందున్నదిగ, అభ్యధాయి = చెప్పఁబడినది.

**సమాసములు :**

**క్షితిభర్తరి :** క్షితేః భర్తా = క్షితిభర్తా. తస్మిన్ = క్షితిభర్తరి.

**అధిస్త్రి :** స్త్రీషు = అధిస్త్రి.

దూతయతాం : దూతం కుర్వత ఇతి = దూతయన్తః. తేషాం = దూతయతాం.

నయనైపుణవ్యయే: నిపుణస్య భావః = నైపుణం. నయే నైపుణం = నయనైపుణం. నయనైపుణస్య వ్యయః = నయనైపుణవ్యయః. తస్మిన్ = నయనైపుణవ్యయే.

భావము :

స్త్రీలవిషయమున భూలోకమన్మథుడువంటి యందగాఁడైన పురుషుని దూతగాఁజేసినవారి యొక్క నీతి చాతుర్యరాహిత్యమును. అనగా నుపాయ ప్రయోగములయందు నేర్పు మాలినతనమునుఁ గూర్చి యాలోచించుచున్న నేర్పరి యగు దమయన్తి తనలో చెప్పఁబోవు విధముగా ననుకొనినది. ॥౨౨॥

శ్లో॥ జలాధిపస్త్వామదిశన్మయి ధ్రువం
పరేతరాజః ప్రజిఘాయ స స్ఫుటం ।
మరుత్వతైవ ప్రహితోఽసి నిశ్చితం
నియోజితశ్చోర్ధ్వముఖేన తేజసా ॥ ౨౩

ప॥వి॥ జలాధిపః । త్వామ్ । అదిశత్ । మయి । ధ్రువం । పరేతరాజః । ప్రజిఘాయ । సః । స్ఫుటం । మరుత్వతా । ఏవ । ప్రహితః । అసి । నిశ్చితం । నియోజితః । చ । ఊర్ధ్వముఖేన । తేజసా.

టీక॥ జలాధిపః = వరుణుఁడు (డలలకు భేదములేదు కావున - జడాధిపః = జడులకు నాయకుఁడును) మయి = నావిషయమందు, త్వాం = నిన్ను, అదిశత్ = పంపెను. ధ్రువం = నిశ్చయము. సః = ఆ ప్రసిద్ధుడైన, పరేతరాజః = ప్రేతలకు రాజైనయముఁడు, త్వాం = నిన్ను, ప్రజిఘాయ = పంపెను. స్ఫుటం = నిశ్చయము. మరుత్వతైవ = ఇన్ద్రుని చేతనే, ప్రహితః = పంపఁబడినవాడవుగా, అసి = అగుచున్నావు. నిశ్చితం = నిజము. ఊర్ధ్వముఖేన = పైకిజ్వాలలుగల, (స్థూలదృష్టిగల) తేజసా = అగ్నిచే, నియోజితః = పంపఁబడితివి. (వారు పంపినారు నీవు

పంపఁబడితివి. ఇది సత్యమే. కాని యీప్రయత్నము వ్యర్థము. అని స్వగతముగా ననుకొనినది.)

## సమాసములు :

జలాధిపః : జలానామధిపః = జలాధిపః.

పరేతరాజః : పరమితాః = పరేతాః. పరేతానాం రాజా = పరేతరాజః.

మరుత్వతా : మరుతః అస్య స న్తీతి = మరుత్వాన్. తేన = మరుత్వతా.

ఊర్ధ్వముఖేన : ఊర్ధ్వం ముఖం యస్య సః = ఊర్ధ్వముఖః. తేన = ఊర్ధ్వముఖేన.

## భావము :

వరుణుఁడు నాకై నిన్ను పంపెననుట సత్యమే. కాని యతడు జలాధిపతి కాదు. కాని జడాధిపతి. కాన జడుఁడు అని సూచితము. ప్రేతలకు రాజైన యముడు నిన్నుఁ బంపె ననుటయు సత్యమే. కాని యతఁడు ప్రేతలకు అనగా పిశాచములకు రాజుగదా? కాన నతడును పిశాచస్వరూపు డని సూచితము. ఇన్ద్రుడు నిన్నుఁ బంపెననుటయు సత్యమే. కాని యాయింద్రుఁడు దేవతలనుఁ గల్గియుండుటవలన మరుత్వన్తుఁడు గాడు. మఱే మనగా మరుత్తుతో, అనగా గాలి జబ్బుతోఁ గూడినందువలన మరుత్వన్తుడని సూచితము. ఊర్ధ్వముఖుఁడైన యగ్ని నిన్నుఁ బంపెననిన విషయము సత్యమే. కాని యతనికి మోము పైకి నుండును. కాన వాఁడు నీ యందమునుఁ జూచి యుండడు. స్థూలదృష్టి గల మందుఁడు. కాన నిన్ను పంపిన వారికందఱికిని యేదియో యొక పంక యున్న దనియు నీ ప్రయత్నము వ్యర్థమనియు స్వగతముగా నామె చెప్పుకొనినది. ౨౩

శ్లో॥ అథ ప్రకాశం నిభృతస్మితా సతీ
సతీకులస్యాభరణం కిమప్యసౌ।
పున స్తదాభాషణవిభ్రమోన్ముఖం
ముఖం విదర్భాధిపసమ్భవా దధే॥ ౨౪

ప॥వి॥ అథ । ప్రకాశం । నిభృతస్మితా । సతీ । సతీకులస్య ॥ ఆభరణం

కిమ్ । అపి । అసౌ । పునః । తదాభాషణవిభ్రమోన్ముఖం । ముఖం ।
విదర్భాధిపసమ్భవా । దధే.

టీక॥ అథ = స్వగతముగాఁ జెప్పుకొనినపిదప, సతీకులస్య = పతివ్రతా సంఘమునకు, కిమపి = అనిర్వాచ్యమైన, ఆభరణం = భూషణమైన, అసౌ = ఈ, విదర్భాధిపసమ్భవా; విదర్భాధిప = విదర్భరాజువలన, సమ్భవా = సమ్భవముగల్గిన దమయన్తి, నిభృతస్మితా = గమ్భీరమైన నవ్వుఁగల్గినదై, ప్రకాశంయథాతథా = బహిరఙ్గముగా, తదాభాషణ విభ్రమోన్ముఖం; తదాభాషణ = వానితో సల్లాపమనెడి, విభ్రమ = వినోదమందు, ఉన్ముఖం = ఔత్సుక్యము గల్గిన, ముఖం = ముఖమును, ఆదధే = ఉంచెను. అనగా సంభాషించెను.

## సమాసములు :

నిభృతస్మితా : నిభృతం స్మితం యస్యాస్సా = నిభృతస్మితా.

సతీకులస్య : సతీనాం కులం = సతీకులం. తస్య = సతీకులస్య.

తదాభాషణవిభ్రమోన్ముఖం : తేన ఆభాషణం = తదాభాషణం. తదాభాషణమేవ విభ్రమః = తదాభాషణవిభ్రమః. తదాభాషణవిభ్రమే ఉన్ముఖం = తదాభాషణ విభ్రమోన్ముఖం. తత్ = తదాభాషణవిభ్రమోన్ముఖం.

విదర్భాధిపసమ్భవా : విదర్భాణామధిపః = విదర్భాధిపః. విదర్భాధిపాత్ సమ్భవః యస్యాస్సా = విదర్భాధిపసమ్భవా.

## భావము :

తనలో నా విధముగా ననుకొనిన పిదప, పతివ్రతలసంఘమునకు నపూర్వమగు నాభరణ మైన యీ దమయన్తి గమ్భీరస్మితము గలదై, బహిరఙ్గముగా నతనితో మాట్లాడద మన్న, వినోదమునకు నుద్యుక్తురా లాయెను ॥౨౪॥

శ్లో॥ వృథాపరీహాసు ఇతి ప్రగల్భతా
న నేతి చ త్వాదృశి వాగ్విగర్హణా ।

భవత్యవజ్ఞా చ భవత్యనుత్తరా
దతః ప్రదిత్సుః ప్రతివాచమస్మి తే॥ ౨౫

ప॥వి॥ వృథాపరీహాసః । ఇతి । ప్రగల్భతా । న । న । ఇతి । చ । త్వాదృశి । వాక్ । విగర్హణా । భవతి । అవజ్ఞా । చ । భవతి । అనుత్తరాత్ । అతః । ప్రదిత్సుః । ప్రదివాచమ్ । అస్మి । తే.

టీక॥ భవతి = పూజ్యుఁడవైన, త్వాదృశి = నీవంటి వానివిషయమున, వృథాపరీహాసః = వ్యర్థమైన పరీహాసము, ఇతి = అనుట, ప్రగల్భతా = ప్రాగల్భ్యమగును. కాననిది దోషము. ననేతిచ = వద్దు వద్దు అనెడి నిషేధవాక్యము, విగర్హణా = నింద. అనుత్తరాత్ = ఉత్తరమీయనందువలన, అవజ్ఞా = తిరస్కరణము, భవతి = అగుచున్నది. అతః = ఇందువలన, తే = నీకు, ప్రతివాచం = ప్రత్యుత్తరమును, ప్రదిత్సుః = ఈయగోరినదాననుగా, అస్మి = అగుచున్నాను.

భావము :

నీవంటి పూజ్యునియందు వ్యర్థమైన పరిహాస మని చెప్పుట గడుసుదన మగును. అదిదోషము. వలదువలదని చెప్పుటయు నింద యగును. ఉత్తర మీయకపోవుట తిరస్కార మగును. అందువలన నీకుఁ బ్రత్యుత్తర మీయఁ గోరుచున్నాను. వాస్తవములో ప్రత్యుత్తరమున కర్హత లేక యున్నను, దాక్షిణ్యమువలనఁ బ్రత్యుత్తర మిచ్చుచున్నాను. ॥౨౫॥

శ్లో॥ కథం ను తేషాం కృపయాఽపి వాగసా
వసావి మానుష్యకలాఞ్ఛనే జనే ।
స్వభావభక్తిప్రవణం ప్రతీశ్వరాః
కయా న వాచా ముదముద్గిరన్తి వా॥ ౨౬

ప॥వి॥ కథం । ను । తేషాం । కృపయా । అపి । వాక్ । అసౌ । అసావి । మానుష్యకలాఞ్ఛనే । జనే । స్వభావభక్తిప్రవణం । ప్రతి । ఈశ్వరాః । కయా । న । వాచా । ముదం । ఉద్గిరన్తి । వా.

టీక॥ తేషాం = ఆయింద్రాదులయొక్క, కృపయాఽపి = దయచేతను, మానుష్యకలాఞ్ఛనే; మానుష్యక = మానవత్వమను, లాఞ్ఛనే = కళఙ్కముగల్గిన, జనే = జనవిషయమునందు, అసౌవాక్ = మమ్ములను వరించుమనెడి వాక్కు, కథంను = ఎట్లు, అసావి = ఉత్పత్తిఁజేయఁబడినది. (ఇది అనుచితమని యర్థము). అథవా = లేకపోతే, ఈశ్వరాః = స్వాములు, స్వభావభక్తిప్రవణంప్రతి = స్వభావముతోడనే, అభక్తిగలవానినిఁగూర్చి, కయా = ఏ, వాచా = వాక్కుతో, ముదం = సంతోషమును, నోద్గిరన్తి = వెల్లిడిఁజేయరు?

భావము :

నీచుఁడైన భక్తుని గూడ వాత్సల్యముతో ప్రభువులు గొప్పగాఁ జెప్పెదరు. ॥౨౬॥

శ్లో॥ అహో మహేన్ద్రస్య కథం మయౌచితీ
సురాఙ్గనాసఙ్గమశోభితాఽభృతః ।
హ్రదస్య హంసావలి మాంసలశ్రియః
బలాకయేవ ప్రబలా విడమ్బనా॥ ౨౭

ప॥వి॥ అహో । మహేన్ద్రస్య । కథం । మయా । ఔచితీ । సురాఙ్గనాసఙ్గమశోభితాభృతః । హ్రదస్య । హంసావలిమాంసలశ్రియః । బలాకయా । ఇవ । ప్రబలా । విడమ్బనా

టీక॥ సురాఙ్గనాసఙ్గమశోభితాభృతః; సురాఙ్గనా = దేవతాస్త్రీలయొక్క, సఙ్గమ = సఙ్గమముచేఁగల్గిన, శోభితా = శోభను, భృతః = దాల్చిన, మహేన్ద్రస్య = ఇన్ద్రునికి, హంసావలిమాంసలశ్రియః; హంసావలి = హంసల పఙ్క్తిచే, మాంసల = దట్టమైన, శ్రియః = శోభఁగల్గిన, హ్రదస్య = కొలఁకుకు, బలాకయాఇవ = కొంగచేతనెట్లోయట్లు, మయా = నాచేత, ప్రబలా = అధికమైన, విడమ్బనా = పరిహాసము, కథం = ఎట్లు, ఔచితీ = తగియుండుట (అగును): అహో = ఆశ్చర్యము.

సమాసములు :

మహేన్ద్రస్య: మహతామిన్ద్రః = మహేన్ద్రః.

ఔచితీ: ఉచితస్య భావః = ఔచితీ.

సురాఙ్గనాసఙ్గమశోభితాభృతః : సుర్యశ్చ తాః అఙ్గనాశ్చ = సురాఙ్గనాః. సురాఙ్గనానాం సఙ్గమః = సురాఙ్గనాసఙ్గమః. సురాఙ్గనాసఙ్గమేన శోభత ఇతి = సురాఙ్గనాసఙ్గమశోభి. సురాఙ్గనాసఙ్గమశోభినః భావః = సురాఙ్గనాసఙ్గమశోభితా. సురాఙ్గనాసఙ్గమశోభితాం బిభర్తీతి = సురాఙ్గనాసఙ్గమశోభితాభృత్. తస్య = సురాఙ్గనాసఙ్గమశోభితాభృతః.

హంసావలిమాంసలశ్రియః : హంసానామావలిః = హంసావలిః. హంసావల్యా మాంసలా = హంసావలిమాంసలా. హంసావలిమాంసలా శ్రీః యస్య సః = హంసావలి మాంసలశ్రీః. తస్య = హంసావలిమాంసలశ్రియః.

భావము :

దేవతాస్త్రీల సఙ్గమముచే శోభించెడి యింద్రునకు మానవస్త్రీయగు నాతోటి సఙ్గమము, హంసల పఙ్క్తులతో నిండారిన శోభఁ గల కొలనుకుఁ, గొంగతోటి సంబంధ మెట్లు తగదో యట్లే తగనిది. అట్లు నాతోటి సంబంధము పరిహాసాస్పదమగును. ॥౨౭॥

శ్లో॥ పురః సురీణాం భణ కేవ మానవీ
న యత్ర తాస్తత్ర తు సాఽపి శోభికా।
అకాఞ్చనేఽకిఞ్చననాయికాఙ్గకే
కిమారకూటాభరణేన న శ్రియః॥ ౨౮

ప॥వి॥ పురః । సురీణాం । భణ । కా । ఇవ । మానవీ । న । యత్ర । తాః। తత్ర । తు । సా । అపి । శోభికా । అకాఞ్చనే । అకిఞ్చననాయికాఙ్గకే । కిం । ఆరకూటాభరణేన । న । శ్రియః.

టీక॥ సురీణాం = దేవతాస్త్రీలయొక్క, పురః = ముందట, మానవీ = మనుష్యస్త్రీ, కాఇవ = ఎవ్వతెః ఎవ్వతెయుఁగాదు (లెక్కలేని). భణ = చెప్పుము,

పృషత్కిశోరీ కురుతామసజ్గతాం
కథం మనోవృత్తిమపి ద్విపాధిపే॥ ౨౯

ప॥వి॥ యథా । తథా । నామ । గిరః । కిరన్తు । తే । శ్రుతీ । పునః । మే । బధిరే । తదక్షరే । పృషత్కిశోరీ । కురుతామ్ । అసజ్గతాం । కథం । మనోవృత్తిమ్ । అపి । ద్విపాధిపే.

టీక॥ యథాతథా=ఏదియోయొకవిధముగా, తే = నీయొక్క, గిరః = వాక్కులు, కిరన్తునామ=వర్షించునుగాత. కిన్తు = కాని, మే = నాయొక్క, శ్రుతీపునః=కర్ణములో, తదక్షరే; తత్ = ఆవాక్కుల యొక్క, అక్షరే=అక్షరమందును, బధిరే=చెవిటిని అనగా నది నాకు వినఁబడనట్లేగణింప వలయును, తథాహి=అదియుక్తమే. పృషత్కిశోరీ=జింకపడుచు, ద్విపాఽధిపేఽపి= శ్రేష్ఠమైన యేనుగునందును, అసజ్గతాం=యుక్తముకాని, మనోవృత్తిం=అభిలాషను, కథం = ఎట్లు, కురుతాం=చేయును.

వి॥ జింకపడుచు గజశ్రేష్ఠముపై నభిలాష పెట్టదను వాక్యార్థమునకును మానవస్త్రీ దేవేన్ద్రునియందభిలాష పెట్టదను వాక్యార్థమునకును బింబ ప్రతిబింబభావముచే నౌపమ్యము చెప్పుటవలన దృష్టాన్తాలజ్కారము.

## సమాసములు :

తదక్షరే : తాసామక్షరం=తదక్షరం. తస్మిన్=తదక్షరే.

పృషత్కిశోరీ : పృషతః కిశోరీ=పృషత్కిశోరీ.

అసజ్గతాం : న సజ్గతా=అసజ్గతా. తాం=అసజ్గతాం.

మనోవృత్తిం: మనసః వృత్తిః=మనోవృత్తిః. తాం=నోమవృత్తిం.

ద్విపాధిపే : ద్వాభ్యాం పిబంతీతి=ద్విపాః. ద్విపానామధిపః=ద్విపాధిపః. తస్మిన్=ద్విపాధిపే.

## భావము :

ఆ దేవతలు నన్ను వరించుటకై ఎన్ని విధములుగానైనను మాటలను వర్షింపనిమ్ము. కాని నా చెవులా మాటల నన్నింటిని విననేరవు. పడుచు జింక

గజరాజుపైనఁగూడ, నసజ్జత మైన యభిలాష నుంచదు గాదా. అట్లభిలాష నుంచినచో నది యసజ్జతమే. అట్లే మానవయువతియైన నాకు దేవేన్ద్రునిపై నభిలాష యసజ్జతమే యగును. ॥౨౯॥

శ్లో॥ అదోనిగద్యైవ నతాస్యయాయాత
శ్రుతౌ లగిత్వాభిహితాళి రాలపత్ ।
ప్రవిశ్య యన్మే హృదయం హ్రియాహత
ద్వినిర్యదాకర్ణయ మన్ముఖాధ్వనా॥ ౩౦

ప॥ వి॥ అదః । నిగద్య । ఏవ । నతాస్యయా । తయా । శ్రుతౌ । లగిత్వా । అభిహితా । ఆళిః । ఆలపత్ । ప్రవిశ్య । యత్ । మే । హృదయం । హ్రియా । ఆహ । తత్ । వినిర్యత్ । ఆకర్ణయ । మన్ముఖాధ్వనా.

టీక॥ అదః = ఈ మాటను, నిగద్యైవ = చెప్పియే, నతాస్యయా; నత = వంచఁబడిన, ఆస్యయా = మోముగల్గిన, తయా = ఆ దమయన్తిచే, శ్రుతౌ = చెనియందు, లగిత్వా = సమీపించి, అభిహితా = చెప్పఁబడిన, ఆళిః = చెలికత్తె, ఆలపత్ = పలికినది. (అదేమనగా) ఇయం = ఈదమయన్తి, హ్రియా = సిగ్గుచే, మే = నాయొక్క, హృదయం = హృదయమును, ప్రవిశ్య = ప్రవేశించి, యత్ = ఏ, వచః = మాటను, ఆహ = చెప్పుచున్నదో, మన్ముఖాధ్వనా; మత్ = నాయొక్క, ముఖాధ్వనా = ముఖమార్గముచే, వినిర్యత్ = వెల్వాడెడు, తత్ = ఆమాటను, ఆకర్ణయ = వినుము.

**సమాసములు;**

నతాస్యాయాః నతం ఆస్యం యస్యాస్సా = నతాస్యా. తయా = నతాస్యయా.

మన్ముఖాధ్వనా: మమ ముఖం = మన్ముఖమ్. మన్ముఖమేవ అధ్వా = మన్ముఖాధ్వా. తేన = మన్ముఖాధ్వనా.

భావము :

ఈ మాటనుఁ జెప్పిన వెంటనే దమయన్తి తల వాల్చుకొనినదై, తన చెంత నున్న చెలికత్తెయొక్క చెవియందు దేనినో చెప్పినది. అప్పుడా చెలికత్తె చెప్పఁదొడగినది. అదేమనగా- "ఈ దమయన్తి లజ్జచే నాహృదయమునుఁ బ్రవేశించి యేమి చెప్పినదో దానిని నానోటినుండి వినుముఅని." ॥౩౦॥

శ్లో॥ బిభేతి చిన్తామపి కర్తుమీదృశీం
చిరాయ చిత్తార్పితనైషధేశ్వరా ।
మృణాలతన్తుచ్ఛిదురా సతీస్థితిః
లవాదపి త్రుట్యతి చాపలాదపి ॥ ౩౧

ప॥వి॥ బిభేతి । చిన్తామ్ । అపి । కర్తుం । ఈదృశీం । చిరాయ । చిత్తార్పిత నైషధేశ్వరా । మృణాల తన్తుచ్ఛిదురా । సతీస్థితిః । లవాత్ । అపి । త్రుట్యతి । చాపలాత్ । అపి.

టీక॥ చిరాయ=చాలకాలమునుండి, చిత్తార్పిత నైషధేశ్వరా; చిత్త=మనస్సునందు, అర్పిత=ఉంచుకొనఁబడిన, నైషధేశ్వరా = నలుని గల్గిన (సా=ఆస్త్రీ) ఈ దృశీం=ఇట్టిపరపురుషునిఁగూర్చిన, చిన్తామపి = ఆలోచననుఁగూడ, కర్తుం=చేయుటకు, బిభేతి=భయపడుచున్నది. (ఏలయనగా) మృణాలతన్తుచ్ఛిదురా; మృణాలతన్తు=తమరకాడలోని దారమువలె, ఛిదురా=తెగునట్టిస్వభావముగల, సతీస్థితిః = పతివ్రతయొక్కస్థితి, అనగామర్యాద, లవాదపి=లేశమైనదైనను, చాపలాత్= చాపల్యమువలన, త్రుట్యతికిల=భగ్నమగునుగదా.

సమాసములు :

చిత్తార్పితనైషధేశ్వరా : చిత్తే అర్పితః = చిత్తార్పితః. నిషధానాం రాజా=నైషధః. నైషధ ఇతి ఈశ్వరః = నైషధేశ్వరః. చిత్తార్పితః నైషధేశ్వరః యయా సా = చిత్తార్పితనైషధేశ్వరా.

మృణాలతన్తుచ్ఛిదురా: మృణాలస్య తన్తుః =మృణాలతన్తుః. మృణాలతన్తురివ చ్ఛిదురా=మృణాలతన్తుచ్ఛిదురా.

**భావము :**

ఈ దమయన్తి చిరకాలమునుండి నిషధేశ్వరుని తన మనస్సునందు నిడుకొని యున్నది. కాన నామె పరపురుషునిఁ గూర్చి యాలోచించుటకును భయపడుచున్నది. పతివ్రతయొక్క మర్యాద, తామరకాడలోని దారమువలె భంగురమైనది. కాన లేశమైన పరపురుషచాపల్యముచే నది భగ్నమైపోవునుగదా.॥౩౦॥

శ్లో॥ మమాశయః స్వప్నదశాజ్ఞయాఽపి వా
నలం విలఙ్ఘ్యేతరమస్పృశద్యది।
కుతః పునస్తత్ర సమస్తసాక్షిణీ
నిజైవ బుద్ధిర్విబుధైర్న పృచ్ఛ్యతే॥ ౩౧

ప॥వి॥ మమ । ఆశయః । స్వప్నదశాజ్ఞయా । అపి । వా । నలం । విలఙ్ఘ్య । ఇతరమ్ । అస్పృశత్ । యది । కుతః । పునః । తత్ర । సమస్తసాక్షిణీ । నిజా । ఏవ । బుద్ధిః । విబుధైః । న । పృచ్ఛ్యతే.

టీక॥ అథవా = లేదా, మమ = నాయొక్క, ఆశయః = అభిప్రాయము, స్వప్నదశాజ్ఞయాఽపివా; స్వప్నదశా = స్వప్నావస్థయందలి, ఆజ్ఞయాఽపివా = ఆజ్ఞచేతనైనను, నలం = నలుని, విలఙ్ఘ్య = అతిక్రమించి, ఇతరం = ఇతరపురుషుని, యది అస్పృశత్ = తాకినచో, అప్పుడు, సమస్తసాక్షిణీ; సమస్త = సకలమును, సాక్షిణీ = చూచునట్టి, నిజా = స్వకీయమైన, బుద్ధిరేవ = బుద్ధియే, తత్ర = ఆ విషయమున, కుతః = ఎందువలన, విబుధైః = ఇన్ద్రాదులచే, (పణ్డితులచే) నపృచ్ఛ్యతే = అడుగఁబడుటలేదు.

**సమాసములు :**

స్వప్నదశాజ్ఞయా : స్వప్న ఏవ దశా = స్వప్నదశా. స్వప్నదశాయాః ఆజ్ఞా = స్వప్నదశాజ్ఞా. తయా = స్వప్నదశాజ్ఞయా.

సమస్తసాక్షిణీ : సమస్తస్య సాక్షిణీ = సమస్తసాక్షిణీ.

**భావము :**

లేదా నా చిత్తవృత్తి స్వప్నదశయందలి మోహాదుల వలనఁగూడ పర పురుషునిఁ గోరలేదు. అట్లు కోరి యున్నచో నా విషయమును నిన్ద్రాఁదు మున్నగు దేవతలు తమ బుద్ధివలననే తెలిసికొనవచ్చును. వారు విబుధులు అనగా దేవతలు (పండితులు) కాన, వారి బుద్ధి ప్రతివిషయమునుఁ దెలిసికొనఁ గలదు. కాన వారు దానిని తమ బుద్ధితోడనే తెలుసుకొన వచ్చునుగదా! సర్వ సాక్షు లగు నిన్ద్రాదులకుఁ తెలియని దేదిగలదు. కాన వారు స్వయముగనే యీ విషయమును అనగాఁ బరపురుషచిన్త నాకు లేదను విషయము నేలఁ దెలిసి కొనలేదు. ॥౩౨॥

శ్లో॥ అపి స్వమస్వప్నమసూషుపన్నమీ
పరస్యదారాననవైతుమేవ మామ్ ।
స్వయం దురధ్వార్ణవనావికాః కథమ్
స్పృశన్తు విజ్ఞాయ హృదాఽపి తాదృశీమ్॥ ౩౩

ప॥వి॥ అపి । స్వమ్ । అస్వప్నం ।అసూషుపన్ । అమీ । పరస్య ।దారాన్ । అనవైతుం । ఏవ । మామ్ । స్వయం। దురధ్వార్ణవనావికాః । కథమ్ । స్పృశన్తు । విజ్ఞాయ । హృదా । అపి । తాదృశీమ్.

టీక॥ అమీ = ఈ ఇంద్రాదులు, అస్వప్నం = స్వప్నములేనటువంటి, స్వం = నన్ను, పరస్య = పరునియొక్క, దారాన్ = భార్యనని, అనవైతుమేవ = తెలిసికొనక యుండుటకొఱకే, అసూషుపన్ = నిద్రించిరా? (లేనిచో సర్వజ్ఞులైనవారికీవిషయమెట్లు తెలియకపోనిది). స్వయం = తాము, దురధ్వార్ణవనావికాః; దురధ్వ = దుష్టమార్గమనెడు, అర్ణవ= సముద్రమున, నావికాః = ఓడనునడపువారై, కథం = ఎట్లు, తాదృశీం = అటువంటి, అనగా పరపురుషచిన్తలేనట్టి, మాం = నన్ను, హృదా = హృదయముచే, విజ్ఞాయాఽపి = తెలిసికొనియు, స్పృశన్తు= స్పృశింపఁ గలరు.

**సమాసములు :**

అస్వప్నం : అవిద్యమానః స్వప్నః యస్య సః = అస్వప్నః. తమ్= అస్వప్నమ్.

దురధ్వార్ణవనావికాః : దుష్టః అధ్వా = దురధ్వః. దురధ్వా ఏవ అర్ణవః = దురధ్వార్ణవః. దురధ్వార్ణవే నావికాః = దురధ్వార్ణవ నావికాః.

**భావము :**

నాకు విరహబాధచే స్వప్నములు రావని భావించి నన్ను పరదార యని తెలిసికొనక యుండుటకే.వారు నిద్రించిరాఃకానిచో సర్వజ్ఞులైన వారికి తెలియని విషయమేమున్నది. ఇట్లు తెలిసియు తాము దుష్టమార్గ మనెడి సముద్రమున నావికులై యెట్లు నన్ను స్పృశింతురు. తాము, దుష్టమార్గమున నడిచెడివారిని, వారింపవలసినవారుగా నుండియు నిప్పుడు వారే యట్టి మార్గమున నడచుట యయుక్తము గదా. ॥33॥

శ్లో॥ అనుగ్రహః కేవల ఏషః మాదృశే
మనుష్యజన్మన్యపి యన్మనో జనే ।
న చేద్విధేయ స్తదమీ తమేవ మే
ప్రసద్య భిక్షాం వితరీతుమీశతామ్॥ 34

ప॥వి॥ అనుగ్రహః । కేవలః । ఏషః । మాదృశే । మనుష్యజన్మని । అపి । యత్ । మనః । జనే । న । చేత్ । విధేయః । తత్ । అమీ । తమ్ । ఏవ । మే । ప్రసద్య । భిక్షాం । వితరీతుం । ఈశతామ్.

టీక॥ మనుష్యజన్మని = మనుష్యజన్మముగల, మాదృశే = నావంటిజనమునందు, యత్ = ఎందువలన, మనః = చిత్తము, వర్తతే = ఉన్నదో, ఏషః = ఇది, కేవలః = కేవలము, అనుగ్రహః = అనుగ్రహము. కిన్తు = కాని, సః = ఆయనుగ్రహము, విధేయశ్చేత్ = చేయవలసినదైనచో, (తర్హి = అప్పుడు) అమీ = ఈఇంద్రాదులు, ప్రసద్య = ప్రసన్నతనుఁబొంది, మే = నాకు, తమేవ = ఆనలునే, భిక్షాం = భిక్షనుగా, వితరీతుం = ఇచ్చుటకు, ఈశతాం = సమర్థులగుదురుగాత.

**సమాసములు:**

మనుష్యజన్మని : మనుష్యస్య జన్మ యస్య సః = మనుష్యజన్మా. తస్మిన్ = మనుష్యజన్మని.

*విధేయః :* విధాతుం యోగ్యః = విధేయః.

**భావము :**

మనుష్యజన్మ యైన నావంటిదాని యందు వారికి మనస్సు గల్గుట కేవల మనుగ్రహము కాని యట్టి యనుగ్రహమును వారు నాకుఁ జేయఁ దలచినచో నప్పుడు వారు, అనగా ఇన్ద్రాదిదేవతలు ప్రసన్నులై నాకు నలభిక్ష ననుగ్రహింప వచ్చును, కాన నలుని ఘటింపజేసి నన్ను ననుగ్రహించ వలసినదే గాని మఱి యొక విధముగా నేను సాధ్యపడను. ॥౩౪॥

శ్లో॥ అపి ద్రఢీయః శృణు మే ప్రతిశ్రుతం
స పీడయేత్ పాణిమిమం న చేన్నృపః ।
హుతాశనోద్బన్ధనవారివారితాం
నిజాయుష స్తత్కరవై స్వవైరితామ్ ॥ ॥౩౫॥

ప॥వి॥ అపి । ద్రఢీయః । శృణు । మే । ప్రతిశ్రుతం । సః । పీడయేత్ । పాణిమ్ । ఇమం । న । చేత్ । నృపః । హుతాశనోద్బన్ధనవారివారితాం । నిజాయుషః । తత్ । కరవై । స్వవైరితామ్.

టీక॥ (హేధీర = ఓధీరుఁడా) ద్రఢీయః = మిక్కిలి దృఢమైన, మే = నాయొక్క, ప్రతిశ్రుతం = ప్రతిజ్ఞను, శృణు = వినుము. సఃనృపః = ఆ నలమహారాజు, ఇమం = ఈ, పాణిం = నాహస్తమును, నపీడయేచ్చేత్ = పట్టుకొననిచో, తర్హి = అప్పుడు, నిజాయుషః = నా ఆయుస్సునకు, స్వవైరితాం; స్వ = తనచేత, వైరితాం = శత్రుత్వమును, హుతాశనోద్బన్ధనవారివారితాం; హుతాశన = అగ్నిచేతను, ఉద్బన్ధన = ఉరిచేతను, వారి = ఉదకముచేతను, వారితాం = వారింపఁబడినదానినిగా, కరవై = చేయుదును.

**సమాసములు :**

*ద్రఢీయః :* అత్యన్తం దృఢం = ద్రఢీయః.

*హుతాశనోద్బన్ధనవారివారితాం :* హుతాశనశ్చ ఉద్బన్ధనం చ వారి

చ = హుతాశనోద్భన్ధనవారిభిః. హుతాశనోద్బన్ధనవారిభిః వారితా = హుతాశనోద్బన్ధనవారివారితా. తాం = హుతాశనోద్బన్ధనవారివారితామ్.

*నిజాయుషః :* నిజం చ తత్ ఆయుశ్చ = నిజాయుః. తస్య = నిజాయుషః.

*స్వవైరితాం :* స్వస్య వైరీ = స్వవైరీ. స్వవైరిణః భావః = స్వవైరితా. తాం = స్వవైరితామ్.

భావము :

నా దృఢమైన ప్రతిజ్ఞను వినుము. ఆ నలమహారాజు నా పాణిగ్రహణమును జేయక పోయినచో, అనగా నిన్ను వివాహముం జేసికొనకపోయినచో, నా యాయున్సనకు నాతోటి వైరమును, నగ్నిప్రవేశముచేతఁ నాని ఉరివేసుకొనుటచేతఁ గాని జలప్రవేశముచేత గాని నివృత్తిఁ జేసికొనెదను. అనగా నగ్ని ప్రవేశాదులచేఁ బ్రాణములను వదలగలను. ॥౭౫॥

శ్లో॥ నిషిద్ధమప్యాచరణీయమాపది
క్రియా సతీ నావతి యత్ర సర్వథా ।
ఘనామ్బునా రాజపథేఽతిపిచ్ఛిలే
క్వచిద్బుధైరప్యపథేన గమ్యతే ॥ ౭౬

ప॥వి॥ నిషిద్ధమ్ । అపి । ఆచరణీయమ్ । ఆపది । క్రియా । సతీ । న । అవతి । యత్ర । సర్వథా । ఘనామ్బునా । రాజపథే । అతిపిచ్ఛిలే । క్వచిత్ । బుధైః । అపి । అపథేన । గమ్యతే.

టీక॥ యత్ర = ఎచ్చట, ఆపది = ఆపదయందు, సతీక్రియా = ధర్మబద్ధమైన క్రియ, యదినాఽవతి = రక్షించదో, తత్ర = అచ్చట, నిషిద్ధమపి = నిషేధింపబడినదానిని గూడ, సర్వథా = అన్నివిధములచేతను, ఆచరణీయం = ఆచరింపఁ దగినది. తథాహి = అతియుక్తమే, రాజపథేపి = రాజవీథి, ఘనామ్బునా = మెండైన మేఘజలముచే, అతిపిచ్ఛిలేసతి = మిక్కిలి బురదకాగా; బుధైః = విద్వాంసులచే, అపథేనాఽపి = అమార్గముచేతను, క్వచిత్ = ఒకప్పుడు, గమ్యతే = పోఁబడుచున్నది.

వి॥ ధర్మ్యమార్గము శీలమునురక్షించుట కుపయోగపడనిచో, నిషిద్ధమార్గము నమసరించి యైనను శీలమును రక్షించుకొనవలయు నను ప్రకృతవాక్యార్థమునకును, రాజమార్గమునందు బురద యేర్పడినపుడు పండితులు అమార్గమునందు నడతురు అనెడి అప్రకృతవాక్యార్థమునకును బింబ ప్రతిబింబభావ ముండుటవలన దృష్టాన్తాలఙ్కారము.

సమాసములు :

ఆచరణీయం : ఆచరితుం యోగ్యం = ఆచరణీయమ్.

ఘనం చ తత్ అమ్బు చ = ఘనామ్బు. తేన = ఘనామ్బునా.

అపథేన : న పన్థాః = అపథం. తేన = అపథేన.

భావము :

ఆపదలయందు ధర్మబద్ధ మగు క్రియ రక్షింపనిచో నిషద్ధమైనదానిని గూడ నాచరించి పాతివ్రత్యము మున్నగు శీలములను రక్షించుకొనవలయును. పండితులకు రాజమార్గమునందే సంచరింపవలయు నను విషయము విదితమే. కాని వర్షాదులచే రాజమార్గమడుసుగా నున్నచో నా రాజమార్గమును వీడి మఱొక త్రోవయందు నడచుచున్నారు. కాన స్త్రీలు సర్వవిధముల ప్రాణత్యాగము చేసి యైనను పాతివ్రత్యమును రక్షించుకొనవలయును. ॥౩౬॥

శ్లో॥ స్త్రియా మయా వాగ్మిషు తేషు శక్యతే
న జాతు సమ్యక్ వివరీతుముత్తరమ్।
తదత్ర మద్భాషితసూత్రపద్ధతౌ
ప్రబంధృతాస్తు ప్రతిబన్ధృతా న తే॥ ౩౭

ప॥వి॥ స్త్రియా । మయా । వాగ్మిషు। తేషు । శక్యతే । న । జాతు । సమ్యక్। వివరీతుం। ఉత్తరమ్ । తత్ । అత్ర । మద్భాషితసూత్రపద్ధతౌ । ప్రబన్ధృతా । అస్తు । ప్రతిన్ధృతా । న । తే.

టీక॥ స్త్రియా = స్త్రీయైన, మయా = నాచేత, వాగ్మిషు = పణ్డితులైన, తేషు = ఆదేవతలయందు, సమ్యక్ = సంతోషమునుఁ గల్గించునట్టి, ఉత్తరం =

సమాధానము, జాతు = ఒకప్పుడును, వివరీతుం = వివరించుటకు, నశక్యతే = సాధ్యపడదు. తత్ = అందువలన, అత్ర = ఈ, మద్భాషిత సూత్రపద్ధతౌ; మత్ = నాయొక్క, భాషిత = మాటలనెడు, సూత్ర = సూత్రములయొక్క, పద్ధతౌ = మార్గమునందు, తే = నీకు, ప్రబన్ధృతా = ప్రబన్ధకర్తృత్వము, అనగా భాష్యకర్తృత్వము, లేదా, వార్తికారిత్వము, అస్తు = ఉండునుగాత. ప్రతిబన్ధృతా = ప్రతిబన్ధకత్వము, అనగా దూషకత్వము, నఅస్తు = కారాదు.

## సమాసములు :

మద్భాషితసూత్రపద్ధతౌ : మమ భాషితాని = మద్భాషితాని; మద్భాషితాన్యేవ సూత్రాణి = మద్భాషితసూత్రాణి. మద్భాషిత సూత్రాణాం పద్ధతిః = మద్భాషిత సూత్రపద్ధతిః. తస్యాం = మద్భాషితసూత్రపద్ధతౌ.

## భావము :

పణ్డితులైన యింద్రాదిదేవతల విషమున శ్రీయైన నేనేమి యుత్తరమీయ గలను. కావున ఈ విషయమున నామాటలను సూత్రముగాఁ దీసికొని దానికి సముచితములగు వివరణ భాష్యములను సమకూర్చి దేవతలకు మనస్సును నొప్పింపక తగు విధమున నుత్తర మీయవలసినది. భాష్యకర్త యెప్పుడును సూత్రములను ఖండింపడు. మఱేమనగా సమర్థించును. అట్లే నీవును జేయగలవని నేను భావింతురు. ॥౩౭॥

శ్లో॥ నిరస్య దూతః స్మ తథా విసర్జితః
ప్రియోక్తిరప్యాహ కదుష్ణ మక్షరమ్।
కుతూహలేనేవ ముహుః కుహూరవం
విడమ్బ్య డిమ్భేన పికః ప్రకోపితః॥ ౩౮

ప॥వి॥ నిరస్య । దూతః । స్మ । తథా । విసర్జితః । ప్రియోక్తిః । అపి । ఆహ । కదుష్ణమ్ । అక్షరమ్ । కుతూహలేన । ఇవ । ముహుః । కుహూరవం । విడమ్బ్య । డిమ్భేన । పికః । ప్రకోపితః.

టీక॥ సః = ఆ, దూతః = దూతయైన నలుఁడు, తథా = ఆవిధముగా, నిరస్య = నిరసించి, విసర్జితః = విడువఁబడినవాఁడై, కుతూహలేన = కుతూహలముచే, డిమ్భేన = శిశువుచే, ముహుః = పలుమాఱు, కుహూరవం = కుహూధ్వనిని, విడమ్బ్య = అనుకరించి, ప్రకోపితః = కోపముఁబొందింపఁబడిన, పికఇవ = కోకిలవలె, ప్రియోక్తిరపి = ప్రియమైనవచనమునుఁగల్గియు, కదుష్ణం = కొంచెము పరుషమైన, అక్షరం = వాక్యమును, ఆహ = పలుకుచుండెను.

సమాసములు :

ప్రియోక్తిః: ప్రియా ఉక్తిః యస్య సః = ప్రియోక్తిః.

కదుష్ణమ్ : ఈషదుష్ణమ్ = కదుష్ణమ్.

కుహూరవం : కుహూరితి రవః = కుహూరవః. తమ్ = కుహూరవమ్.

భావము :

దూతయైన నలుఁడు, ఆ విధముగా దేవతల ప్రార్థన విషయమున నిరాకరింపఁబడి మఱలింపఁబడెను. కుహూధ్వనిని అనుకరించెడి తన శిశువు, కోకిలనెట్లు కోపపఱచునో అట్లే దమయంతి వచనములు తనకు ప్రియములుగా నున్నను కోకిలవలెఁ గోపముఁజెందినవాఁడై పరుషవాక్యము ను నుడువఁదొడగెను. అనగా పిల్లకోయిల కుహూధ్వని ననుకరించుట తల్లి కోయిలకుఁ బ్రియమైనదే. కానియది కుహూధ్వనినిఁ జక్కఁగ'ననుకరింప లేకపోవుటవలన దానికి విసుగేర్పడును. అందువలన కోయిల ప్రకోపిత మగును. అట్లే దమయన్తి వచనములు ప్రియములే యైనను నిన్ద్రాదుల విషయమున దాక్షిణ్యమునుఁ జూపనందువలన నితనికిని ప్రకోపమేర్పడినది. అందువలన పరుషముగా మాట్లాడఁదొడగెను.౩౮

శ్లో॥ అహో మనస్త్వామను తేఽపి తన్వతే
త్వమప్యమీభ్యో విముఖీతి కౌతుకమ్ ।
క్వ వా నిధిర్నిర్ధనమేతి కిఞ్చ తం
స వా కవాటం ఘటయన్నిరస్యతి॥ ౩౯

ప॥వి॥ అహో । మనః । త్వామ్ । అను । తే । అపి । తన్వతే । త్వమ్ । అపి । అమీభ్యః । విముఖీ । ఇతి । కౌతుకం।క్వ।వా। నిధిః। నిర్ధనమ్। ఏతి । కిం । చ । తం । సః। వా । కవాటం । ఘటయన్ । నిరస్యతి.

టీక॥ తేఽపి = ఆయింద్రాదులుగూడ, త్వామను = నిన్నునుద్దేశించి, మనః = మనస్సును, తన్వతే = చేయున్నారు. అహో = ఆశ్చర్యము. త్వమపి = నీవును, అమీభ్యః = వారికి, విముఖీతియత్ = పరాఙ్ముఖురాలుగ నుండుటయనునది, కౌతుకం = విచిత్రమైనది. కిఞ్చ = మఱియు, క్వవా = ఏలోకమునందు, నిధిః = మహాపద్మాదినిధి, నిర్ధనం = దరిద్రుని, ఏతి = పొందుచున్నది. కిఞ్చ = మఱియు, సః = ఆ దరిద్రుఁడు, తం = ఆనిధిని, వాక్కవాటం = వాక్కనెడితలుపును, ఘటయన్ = నావద్దకునీవురావద్దని చెప్పుటచే, (తలుపునుమూయుచు) నిరస్యతి = నిరాకరించుచున్నాడు?

వి॥ దిక్పాలుర విషయమున దమయన్తీవైముఖ్య వాక్యమునకు నిర్ధనునిచే నిరాకరింపఁబడిన నిధివాక్యమునకు బింబప్రతిబిమ్బభావముచే నౌపమ్యము చెప్పుటవలన దృష్టాన్తాలఙ్కారము.

## సమాసములు :

నిర్ధనమ్ : నిర్గతం ధనం యస్మాత్సః = నిర్ధనః. తమ్ = నిర్ధనమ్.

## భావము :

ఆ యిన్ద్రాదులు నీపై మనస్సు నుంచిరి. నీవు వారిని నిరసించు చున్నావు. లోకమున దైవవశముచే లచ్చి కాసు లేనిదరిద్రునిఁ బొందును. కాని యా దరిద్రుఁడు తనకు వద్దని నిరాకరించును. అనగా తనకు వలదని తలుపును మూయును నీవు చేసిన పని యావిధముగా నున్నది. ॥౩౯॥

శ్లో॥ సహాఽఖిలస్త్రీషు వహేఽవహేలయా
మహేన్ద్రరాగాద్గురుమాదరం త్వయి ।
త్వమీదృశి శ్రేయసి సంముఖేఽపి తం
పరాఙ్ముఖీ చన్ద్రముఖి! న్యవీవృతః॥ ౪౦.

ప॥వి॥ సహ । అఖిలస్త్రీషు । వహే । అవహేలయా । మహేన్ద్రరాగాత్ । గురుమ్ । ఆదరం । త్వయి । త్వమ్ । ఈదృశి । శ్రేయసి।సంముఖే । అపి । తం । పరాఙ్ముఖీ । చన్ద్రముఖి । న్యవీవృతః,

టీక॥ హే చన్ద్రముఖి = ఓచన్ద్రముఖీ! మహేన్ద్రరాగాత్; మహేన్ద్ర = దేవేన్ద్రుని యొక్క, రాగాత్ = అనురాగమువలన, త్వయి = నీయందు, గురుం = అధికమైన, ఆదరం = ఆదరమును, అఖిలస్త్రీషు = సమస్తస్త్రీలయందును, అవహేలయాసహ = అనాదరముతోఁడ, వహే = వహింతును, ఈదృశి = ఇటువంటి, శ్రేయసీ = మేలు, సంముఖేసత్యపి = అభిముఖమైనను, త్వం = నీవు, పరాఙ్ముఖీసతీ = విముఖురాలవై, తం = ఆయాదరమును, న్యవీవృతః = మఱలించితివి.

వి॥ అనాదరముతోఁడ వహింతు నని సహశబ్దప్రయోగము చేసినందువలన సహోక్త్యలంకారము.

## సమాసములు :

అఖిలస్త్రీషు : అఖిలాశ్చ తాః స్త్రియశ్చ = అఖిలస్త్రియః. తాసు = అఖిలస్త్రీషు.

మహేన్ద్రరాగాత్ : మహేన్ద్రస్యరాగః = మహేన్ద్రరాగః. తస్మాత్ = మహేన్ద్రరాగాత్.

పరాఙ్ముఖీ : పరాక్ ముఖం యస్యాస్సా = పరాఙ్ముఖీ.

చన్ద్రముఖీ : చన్ద్ర ఇవ ముఖం యస్యాస్సా = చన్ద్రముఖీ.

## భావము :

ఓ చన్ద్రముఖీ! ఇన్ద్రునకు నీ యెడఁ గల్గిన యాదరమువలన నితరస్త్రీలయందు నాదరము వహింపక నీయందే యాదరమును వహింతును. అనగా నితరస్త్రీలయం దనాదరముతోడ నీ యందాదరము నుంచుచున్నాను. ఇట్టు మేలైన విషయమందు అనగా నిన్ద్రాదులను వరించు విషయమున నీవు పరాఙ్ముఖురాలవై నేను నీయందుంచిన యాదరమును మఱలించితివి. ॥౪౦॥

శ్లో॥ దివౌకసం కామయతే న మానవీ
నవీనమశ్రావి తవాననాదిదమ్ ।
కథం న వా దుర్గ్రహదోష ఏష తే
హితేన సమ్యగ్గురుణాఽపి శామ్యతే॥ ౪౧

ప॥వి॥ దివౌకసం । కామయతే । న । మానవీ । నవీనమ్ । అశ్రావి । తవ । అననాత్ । ఇదమ్ । కథం । న । వా । దుర్గ్రహదోషః । ఏషః । తే । హితేన । సమ్యక్ । గురుణా । అపి । శామ్యతే.

టీక॥ మానవీ=మానవస్త్రీ, దివౌకసం=స్వర్లోకవాసియగువేల్పును, నకామయతే=కోరదు, (ఇతి=అనునీవిషయము) నవీనం=క్రొత్తది, తవ=నీయొక్క, అననాత్=మోమునుండి, అశ్రావి=వినఁబడినది. హన్త=అయ్యో! ఏషః=ఇది, తే=నీకు, దుర్గ్రహదోషః=దుష్టమగు నాగ్రహము వలనఁ గల్గినదోషము, దుష్టగ్రహములవలని దోషము. లేదా దురభిప్రాయమువలని దోషము. హితేన=ఆప్తుడును ననుకూలుఁడును నగు, గురుణా=తండ్రిమున్నగు గురువులచే, (బృహస్పతిగ్రహముచే) కథంనశామ్యతే=ఎట్లునివారింపఁబడదు.

వి॥ ఇచ్చట పదశక్తి యను నభిధ, ప్రకృతార్థమును అనగా దురాగ్రహార్థమును బోధించి విరమించినది. కాన సూర్యాదిగ్రహపర మగు నర్థము, అనగా నప్రకృతార్థము ధ్వనియగును కాని శ్లేషకాదు

**సమాసములు:**

*దివౌకసం :* ద్యౌః ఓకః యస్య సః=దివౌకాః. తమ్=దివౌకసమ్.

**భావము :**

మానవస్త్రీ స్వర్గవాసియగు వేల్పునుఁ గోరదను విషయము చాలకొత్తది. దానిని నీ ముఖమునుండియే వినుచున్నాను. నీకుఁ గల్గిన యీ దురాగ్రహము వలని దోషము తండ్రి మున్నగు హితులైన గురువులవలన శమింపవలసినవే. లేదా సూర్యాది దుష్టగ్రహదోషము బృహస్పతి గ్రహముచే శమించవలసినదే.

" కిం కుర్వన్తి గ్రహాస్సర్వే కేన్ద్రస్థానే బృహస్పతౌ" అని కేన్ద్రస్థానమునందు బృహస్పతి యున్నచో తక్కిన గ్రహము లేమిఁ జేయు నని జ్యోతిషమువలన దెలియుచున్నది. ॥౪౦॥

శ్లో॥ అనుగ్రహాదేవ దివౌకసాం నరో
నిరస్య మానుష్య కమేతి దివ్యతాం।
అయోధికారే స్వరితత్వమిష్యతే
కుతోఽయసాం సిద్ధరసస్పృశామపి॥ ౪౧

ప॥వి॥ అనుగ్రహాత్ । ఏవ । దివౌకసామ్ । నరః । నిరస్య । మానుష్యకమ్। ఏతి । దివ్యతాం । అయోధికారే । స్వరితత్వం । ఇష్యతే । కుతః । అయసాం । సిద్ధరసస్పృశామ్।అపి.

టీక॥ దివౌకసాం = స్వర్గవాసులగు దేవతలయొక్క, అనుగ్రహాదేవ = ప్రసాదమువలననే, నరః = మనుష్యుడు, మానుష్యకం = మనుష్యత్వమును, నిరస్య = వదలి, దివ్యతాం = దేవత్వమును, ఏతి = పొందుచున్నాఁడు. సిద్ధరసస్పృశామపి। సిద్ధ = పరిశుద్ధమైన, రస = పాదరసమును, స్పృశామ్ = తాకుచున్న, అయసామపి = ఇనుపలోహములకును, అయోఽధికారే = ఇనుమునుప్రస్తావించుసందర్భమున, స్వరితత్వం = "స్వరితేనాఽధికారః" యనువైయాకరణ పరిభాషాసిద్ధమైన యధికారము, ఆలోహమునందులెక్క, కుతః = ఎందువలన, ఇష్యతే = అంగీకరింపఁబడును. (అంగీకరింపఁబడదనియర్థము)

వి॥ దేవతల యనుగ్రహముచే మానవస్త్రీకి దేవత్వము వచ్చునను ప్రకృత వాక్యార్థమునకును, శుద్ధపాదరసస్పర్శచే నినుమునకు స్వర్ణత్వము వచ్చునను నప్రకృత వాక్యార్థమునకును బిమ్బప్రతిబిమ్బభావాఽఽపన్న సామ్యముఁ జెప్పుటవలన దృష్టాన్తాలఙ్కారము.

## సమాసములు:

దివౌకసాం : ద్యౌః ఓకః యేషాన్తే = దివౌకసః. తేషాం = దివౌకసాం.

మానుష్యకమ్: మనుష్యస్య భావః = మానుష్యకం. తత్ = మానుష్యకం.

సిద్ధరసస్పృశామ్: సిద్ధశ్చాసౌరసశ్చ = సిద్ధరసః. సిద్ధరసం స్పృశన్తీతి = సిద్ధరసస్పృశః. తేషాం = సిద్ధరసస్పృశామ్.

భావము :

దేవతల యనుగ్రహముచేతనే మానవుఁడు నరత్వమును వీడి దేవత్వము నొందును కాన నీవు వారి సమ్పర్కముచే దేవత్వము నొందెదవు కాన నీకు మానవత్వ మెక్కడిది? కాన మానవస్త్రీ దేవతల నెట్లు కామించు నని చెప్పఁ బని లేదు. మూలికలచే శుద్ధిని బొంది సిద్ధమైన పాదరసమును తాకించుటచేత నినుము బంగార మగు నని ప్రసిద్ధి. అట్లు బంగారముగా మాఱిన ఇనుమును మఱల ఇను మని చెప్పరు. అది బంగారముగనే పరిగణింపఁబడును. అట్లే దేవతల సంసర్కమున నీవును దేవస్త్రీగనే పరిగణింపఁబడెదవు కాన దేవస్త్రీ దేవతలను కామించినట్లే యగును. నీవు చెప్పిన మానవస్త్రీ దేవతలనుఁ గామించుట కాదు. కాన నీవు దేవతలనుఁ గామింపవచ్చును. ॥౪౨॥

శ్లో॥ హరిం పరిత్యజ్య నలాభిలాషుకా
న లజ్జసే వా విదుషిబ్రువా కథమ్ ।
ఉపేక్షితేక్షోః కరభాచ్ఛమీరతా
దురుం వదే త్వాం కరభోరు! భో ఇతి॥ ౪౩

ప॥పి॥ హరిం । పరిత్యజ్య । నలాభిలాషుకా । న । లజ్జసే । వా । విదుషిబ్రువా । కథమ్ । ఉపేక్షితేక్షోః । కరభాత్ । శమీరతాత్ । ఉరుం । వదే । త్వాం । కరభోరు । భో । ఇతి.

టీక॥ హరిం = ఇన్ద్రదేవుని, పరిత్యజ్య = వదలి, నలాభిలాషుకా; నల = నలుని యందు, (నరునియందు) అభిలాషుకా = అభిలాషఁగల్గిన, (అతఏవ = ఇందువలననే) విదుషిబ్రువా = పణ్డితంమన్యురాలవైన, త్వం = నీవు, కథం = ఎట్లు, నలజ్జసే = సిగ్గుపడవు? ఉపేక్షితేక్షోః; ఉపేక్షిత = ఉపేక్షింపఁబడిన, ఇక్షోః = చెఱకుఁగల్గినదై, శమీరతాత్; శమీ = జమ్మి చెట్టునందు, రతాత్ = ఆసక్తిగల్గిన, కరభాత్ = ఒంటెకంటె, ఉరుం =

అధికమైన, మౌఢ్యముగల్గిన, త్వాం = నిన్ను, భోకరభోరు; (ఒంటె కంటె నెక్కువ మౌఢ్యముగలదానా యనునర్థమున) ! కరభోరుఇతి = అని, వదే = చెప్పఁబోవుచున్నాను. కాని కరభము అనగా చిటికెన వ్రేలిపార్శ్వము వంటి యూరువు (తొడ) కల్గినందు వలన 'కరభోరు' అని పిలుతురు.

## సమాసములు :

నలాభిలాషుకా : నలమ్ అభిలాషుకా = నలాభిలాషుకా.

విదుషిబ్రువా : బ్రవీతీతి = బ్రువా. విదుష్యాబ్రువా = విదుషిబ్రువా.

ఉపేక్షితేక్షోః : ఉపేక్షితః ఇక్షుః యేన సః = ఉపేక్షితేక్షుః. తస్మాత్ = ఉపేక్షితేక్షోః.

శమీరతాత్ : శమ్యాం రతః = శమీరతః. తస్మాత్ = శమీరతాత్.

భోకరభోరు! : కరభాత్ ఉరుః = కరభోరుః (నతుకరభఇవఊరుః యస్యాస్యా = కరభోరుః). తస్యాస్సంబుద్ధిః = భోకరభోరు !

## భావము :

సురుఁడైన యింద్రునిఁ బరిత్యజించి నలుని - నలమహారాజును, "రలయోరభేదః" అను న్యాయముచే నరుని అనగా మానవునిఁ గోరుచున్న పణ్డితంమన్యురాల వైన నీకు సిగ్గులేదా! చెఱకును వదలి జమ్మి యాకును తినుటకిష్ట పడిన యొంటెకంటె మౌఢ్యమున నధిక మైన దానవను నర్థమును నీ విషయమున "కరభోరు" శబ్దమునకుఁ జెప్పఁబోవుచున్నాము. ఇంతకాలము "కరభోరు" శబ్దము, "చిటికెనవ్రేలి పార్శ్వము వంటి తొడ గల స్త్రీ" యను నర్థమున నీవిషయమునఁ బ్రయోగింపఁబడినది. కాని ప్రస్తుతమది యా యర్థమును వదలి, కరభ = ఒంటె కంటెను, ఉరు = అధికమైన, మౌఢ్యముగలదానా యనునర్థమున నీయందు ప్రయోగింపఁబడబోవుచున్నది. కాన నీ చేష్టలు ఒంటె చేష్టల వలె హాస్యాస్పదము లని భావము. ॥43॥

శ్లో॥ విహాయ హా సర్వసుపర్వనాయకం
త్వయాదృతః కిం నరసాధిమభ్రమః।

ముఖం విముచ్య శ్వసితస్య ధారయా
వృథైవ నాసాపథధావనశ్రమః ॥ ౪౪

ప॥వి॥ విహాయ । హా । సర్వసుపర్వనాయకం । త్వయా । ఆదృతః । కిం । నరసాధిమభ్రమః । ముఖం । విముచ్య । శ్వసితస్య । ధారయా । వృథా । ఏవ । నాసాపథధావనశ్రమః.

టీక॥ కిఞ్చ = మఱియు, హా = అయ్యో! త్వయా = నీచేత, సర్వసుపర్వనాయకం; సర్వ = సకలులైన, సుపర్వ = దేవతలకు, నాయకం = నాయకుఁడైన యింద్రుని, విహాయ = వదలి, నరసాధిమభ్రమః; నర = మనుష్యునియందు, సాధిమ = సాధుత్వముయొక్క, భ్రమః = భ్రమ, కిం = ఏల, ఆదృతః = ఆదరింపఁబడినది. శ్వసితస్య = నిట్టూర్పుయొక్క, ధారయా = పరంపరచే, ముఖం = నోటిని, విముచ్య = వీడి, నాసాపథధావనశ్రమః; నాసాపథ = ముక్కుత్రోవనుండి, ధావన = పరుగిడుటవలని, శ్రమః = పరిశ్రమ, ఆదృతఃఖలు = ఆదరింపఁబడినది గదా.

వి॥ సురనాయకుని వీడి దమయన్తి నరుని - నలుని వరించుట యుక్తము కాదను వాక్యార్థములకును, నిట్టూర్పులు సుఖముగ వెళ్లుటకు వీలైన నోటిత్రోవను వదలి ముక్కుమార్గమునుండి వెళ్లుట వ్యర్థమను వాక్యార్థమునకు బిమ్బప్రతిబిమ్బ భావముచే సామ్యముఁ గల్పించుటవలనదృష్టాన్తాలఙ్కారము

## సమాసములు :

*సర్వసుపర్వనాయకం:* సర్వే చ తే సుపర్వాణశ్చ = సర్వసుపర్వాణః. సర్వసుపర్వణాం నాయకః = సర్వసుపర్వనాయకః, తమ్ = సర్వసుపర్వనాయకం.

*నరసాధిమభ్రమః :* సాధోర్భావః = సాధిమ. సాధిమ్నః భ్రమః = సాధిమభ్రమః. నరే సాధిభ్రమః = నరసాధిమభ్రమః.

*నాసాపథధావనశ్రమః :* నాసాయాః పన్థాః = నాసాపథః. నాసాపథే

ధావనం = నాసాపథధావనం. నాసాపథధావనేన శ్రమః = నాసాపథధావనశ్రమః.

భావము :

ఓదమయస్త్రీ! సకలదేవతలకును, నాయకుఁడైన యింద్రుని వీడి, నరునియందు (నలునియందు) సాధుత్వభ్రాన్తి నీ కెట్లు గల్గినది? ఇది యెట్లున్నదనగా—నిట్టూర్పుల సుఖముగా నోటినుండి వెడలుట మాని, ముక్కులోని రన్ధ్రమార్గములనుండి వెల్వడునట్లున్నవి. సురనాయకునికంటె, నరునియందు సాధిమభ్రమ వ్యర్థమైనట్లే, కిన్నరుఁడను దేవజాతి విశేషమందు సాధివభ్రమయు వ్యర్థ మని పదచ్ఛేదము చేసి యర్థమునుఁజెప్పుదురు. కావున, నీవిట్టి భ్రాన్తిని వదలి మహేన్ద్రుని వరించుట యుక్తము ॥౪౪॥

శ్లో॥ తపోఽనలే జుహ్వతి సూరయస్తనూ
ర్దివే ఫలాయాన్యజనుర్భవిష్ణవే ।
కరే పునః కర్షతి సైవ విహ్వాలా
బలాదివ త్వాం వలసే న బాలిశే ॥ ౪౫

ప॥వి॥ తపోఽనలే । జుహ్వతి । సూరయః । తనూః । దివే । ఫలాయ । అన్యజనుర్భవిష్ణవే । కరే । పునః । కర్షతి । సా । ఏవ । విహ్వాలా । బలాత్ । ఇవ । త్వాం । వలసే । న । బాలిశే.

టీక॥ (కిఞ్చ=మఱియు) సూరయః = విద్వాంసులు, అన్యజనుర్భవిష్ణవే; అన్యజనుః= మఱియొకజన్మమునందు, భవిష్ణవే = కలుగఁబోవు, దివే= స్వర్గమనెడి, ఫలాయ=ఫలమునకై, తనూః = శరీరములను, తపోఽనలే= తపస్సనెడి అగ్నియందు, జుహ్వతి = వ్రేల్చుచున్నారు. త్వాంపునః = నిన్నో, సాఏవ=కఠినతరతపస్సాధ్యమైనస్వర్గమే, విహ్వాలా= ఔత్సుక్యముగలదై, బలాదివ = బలాత్కారమువలననో యనునట్లు, కరే=హస్తమందు, కర్షతి=లాగుచున్నది. హేబాలిశే = ఓమూఢురాలా, నవలసే = కదలవా? కోరవా? (అయ్యో నీతెలివిమాలినతనమెంతటిది.)

సమాసములు ;

తపోఽనలే : తప ఏవ అనలః = తపోఽనలః. తస్మిన్ = తపోఽనలే.

అన్యజనుర్భవిష్ణవే : అన్యం చ తత్ జనుశ్చ = అన్యజనుః. అన్య జనుషి భవిష్ణుః = అన్యజనుర్భవిష్ణుః. తస్మై = అన్యజనుర్భవిష్ణవే.

భావము :

జ్ఞానులు జన్మాంతరమున రానున్న స్వర్గరూపఫలమునకై తపములు గావించి యాతపోఽగ్నియందు తమ శరీరములను త్యజింతురు. నిన్నో ప్రాణాన్తకమైన తపస్సుచే సాధింపవలసిన, స్వర్గమే తనంతట మిక్కిలి యుత్సాహముతో బలవన్తముగా హస్తమునుఁ బట్టుకొని లాగుచున్నది. ఓమూఢురాలా! కదలవా! స్వర్గమునుఁగోరవా! అయ్యో! ఏమీ యీ యజ్ఞానము ॥౪౫॥

శ్లో॥ యది స్వముద్బన్ధుమనా వినా నలం
భవేర్భవన్తీం హరిరన్తరిక్షగాం
దివిస్థితానాం ప్రథితః పతిస్తతో
హరిష్యతి న్యాయ్యముపేక్షతే కః॥ ౪౬

ప॥వి॥ యది । స్వమ్ । ఉద్బన్ధుమనాః । వినా । నలం । భవేః । భవన్తీం । హరిః । అన్తరిక్షగాం । దివి । స్థితానాం । ప్రథితః । పతిః । తతః । హరిష్యతి । న్యాయ్యమ్ । ఉపేక్షతే । కః.

టీక॥ (హేముగ్ధే = ఓముగుదా!) నలంవినా = నలుడులేనిచో, స్వం = తనను, ఉద్బన్ధుమనాః = ఉరిత్రాడితో మరణింపఁగోరినదానవుగా, యదిభవేః = అయితివో, తతః = తర్వాత, అన్తరిక్షగాం = దుర్మరణదోషముచే నంతరిక్షమునఁ బోవుచున్ననిన్ను, దివి, స్థితానాం = స్వర్గమందున్న వాఁకిని అంతరిక్షమందున్నవారికిని, ప్రథితః = ప్రసిద్ధిఁబొందిన, పతిః = పాలకుఁడైన, హరిః = ఇంద్రుఁడు, హరిష్యతి = గ్రహింపఁ గలడు. (జన్మాన్తరమందును నిన్ను నింద్రుఁడువదలఁడు). తథాహి =

అది యుక్తమే, న్యాయ్యం = న్యాయముతో లభించిన వస్తువును, కః = ఎవ్వడు, ఉపేక్షతే = ఉపేక్షించును; సొంతదారులు లేని యాస్తి రాజునకుఁ జెందునుగదా ?

వి॥ నలుఁడు లభింపనిచో నురి వేసికొనినచో నంతరిక్షచారిణి యగు నిన్ను నన్తరిక్షపాలకుఁ డగు నింద్రుఁడు హరించు నను విశేషార్థమును న్యాయ లభ్యమైనదానిని నెవ్వ రుపేక్షించు నను సామాన్యార్థముచే సమర్థించుట వలన నర్థాన్తరన్యాసము.

## సమాసములు :

ఉద్బద్ధమనాః : ఉద్బద్ధం మనః యస్యాస్సా = ఉద్బద్ధమనాః.

అన్తరిక్షగామ్ : అన్తరిక్షే గచ్ఛతీతి = అన్తరిక్షగా. తామ్ = అన్తరిక్షగామ్.

న్యాయ్యామ్ : న్యాయాదనపేతం = న్యాయ్యమ్. తత్ = న్యాయ్యమ్.

## భావము :

నలుఁడు లభింపనిచో నురిత్రాటితో ప్రాణత్యాగము చేసితివో, దుర్మరణమువలన నంతరిక్షమున సంచరించు నిన్ను, దానికి పాలకుఁ డైన యింద్రుఁడు హరింపఁగలఁడు. కాన జన్మాన్తరమునందును నిన్ను వాఁడు వీఁడడు. న్యాయముచే లబ్ధ మైన వస్తువు నెవడు విడచును. ఇన్ద్రుడు అంతరిక్షమునకు రాజు గాన ననాథ యగు నీవు వానికే జెందవలసి యుందువు. ॥౪౬॥

శ్లో॥ నివేక్ష్యసే యద్యసతే నలోజ్ఝితా
సురే తదస్మిన్ మహతీ దయాఽఽదృతా।
చిరాదనేనార్థనయాపి దుర్లభం
స్వయం త్వయైవాఙ్గ! యదఙ్గమర్ప్యతే ॥ ౪౭

ప॥వి॥ నివేక్ష్యసే । యది । అసతే నలోజ్ఝితా । సురే । తత్ । అస్మిన్ । మహతీ । దయా । ఆదృతా । చిరాత్ । అనేన । అర్థనయా । అపి। దుర్లభం । స్వయం । త్వయా । ఏవ । అఙ్గ । యత్।అఙ్గమ్। అర్ప్యతే.

టీక॥ హేముగ్ధే=ఓముగుదా! నలోజ్ఝితా; నల=నలునిచే, ఉజ్ఝితా=విడువఁ బడినదానవై, అనలే=అగ్నియందు, నివేక్ష్యసేయది = ప్రవేశింపఁ బోతివో, తత్=అప్పుడు. (అస్మిన్=ఈ), అనలే=అగ్నియనెడు దేవతయందును, అగ్నియనెడు భూతమునందును, మహతీ=గొప్పదైన, దయా=దయ, ఆదృతా=చేయఁబడినదగును. యత్ = ఏలయనగా, అనేన=ఈ, అనలేన=అగ్నిచే, చిరాత్=చాలకాలమునుండి, అర్థన యాపి=యాచనచేతను, దుర్లభం=లభింపని, అఙ్గం = నీశరీరము, అఙ్గ=ఓప్రియమైనదమయన్తీ! త్వయైవ = నీచేతనే, స్వయం = తనంతట, అర్ప్యతే=ఈయఁబడుచున్నది.

వి॥ ఇచ్చట నలుఁడులభింప నపుడు, అనలగ్రహణ బుద్ధి ననుసరించి యనర్థమునుఁ జెప్పుటవలన విషమాలఙ్కారము.

సమాసములు :

నలోజ్ఝితా : నలేన ఉజ్ఝితా=నలోజ్ఝితా.

దుర్లభం : దుఃఖేన లబ్ధుం శక్యం=దుర్లభం.

భావము :

ఓముగ్ధరాలా! నలుఁడు లభించనందు వలన నీవు అగ్నియందుఁ బ్రవేశించినచో నప్పుడు అనలుఁడనెడి దేవతయందును భూతమునందును గొప్ప దయనుఁ జూపినదాన వయ్యెదవు. ఏల యనగా అనలుడు. అనగా నగ్నిదేవత, నిన్ను చిరకాలమునుండి కోరుచున్నాడు. కావున నతనికి లభింపని నీశరీరము నిప్పుడు నీవు నీ యంతట నర్పించితివో యతడు నిన్ను సజీవముగనే పరిగ్రహించి తనకోరికనుఁ దీర్చుకొనఁగలడు. నీవు నిరాకరించుచున్న యగ్నిని మఱియొకవిధమున నీవే యాదరింపఁగలవు. ॥౪౭॥

శ్లో॥ జితం జితం తత్ఖలు పాశపాణినా
వినా నలం వారి యది ప్రవేక్ష్యసి ।
తదా త్వదాఖ్యాన్ బహిరప్యసూనసౌ
పయః పతిర్వ్యక్షసి వక్ష్యతే తరామ్॥ ౪౮

ప॥వి॥ జితం । జితం । తత్ । ఖలు । పాశపాణినా । వినా । నలం । వారి । యది । ప్రవేక్ష్యసి । తదా । త్వదాఖ్యాన్ । బహిః । అపి । అసూన్। అసౌ । పయఃపతిః । వక్షసి । వక్ష్యతేతరామ్.

టీక॥ హేముగ్ధే = ఓముగ్ధా, నలంవినా = నలుడులేక, వారి = ఉదకమును, ప్రవేక్ష్యసియది = ప్రవేశించినచో, అథ = పిదప, పాశపాణినా = పాశాయుధుఁడగువరుణినిచే, జితంజితం = పలుమాఱుజయింపఁబడినట్లే. తదా = ఆజలప్రవేశకాలమందు, అసౌ = ఈవరుణుఁడు, త్వదాఖ్యాన్ = నీపేరుగల్గిన, బహిః = వెలుపలనున్న, అసూనపి = ప్రాణములనుఁగూడ, వక్షసి = తనయక్కునందు, వక్ష్యతేతరాం = చక్కగామోయఁగలడు.

## సమాసములు :

పాశపాణినా : పాశః పాణౌ యస్య సః పాశపాణిః తేన = పాశపాణినా.

త్వదాఖ్యాన్ : త్వం ఆఖ్యా యేషాం తే = త్వదాఖ్యాః. తాన్ = త్వదాఖ్యాన్.

పయఃపతిః : పయసాం పతిః = పయఃపతిః.

## భావము :

ఓముగ్ధా! నలుఁడు లభింపనందు వలన నీవు ఉదకప్రవేశముఁ గావించితివో అప్పుడు జలాధిపతి యగు వరుణుఁడుగూడ, దమయన్తియను పేరు గల్గిన, తన వెలుపలి ప్రాణములను తన రొమ్మునఁ బెట్టుకొని చక్కగా మోయఁగలడు. ఇంతకాలము నిన్ను తన యన్తఃకరణమునందు మోసినాడు. ఇప్పుడు నిన్ను తన యక్కున నుంచుకొని బహిరంగముగఁ గూడ మోయఁగలడు. కాన వరుణదేవుడు దీనిచే నెక్కువ జయమును సాధించినవాఁడగును. ॥౭౮॥

శ్లో॥ కరిష్యసే యద్యత ఏవ దూషణా
దుపాయమన్యం విదుషీ స్వమృత్యవే।

ప్రియాఽతిథిః స్వేన గతాగృహాన్ కథం
న ధర్మరాజం చరితార్థయిష్యసి॥ ౪౯

ప॥వి॥ కరిష్యసే । యది । అతః । ఏవ । దూషణాత్ । ఉపాయమ్ ।అన్యం ।
విదుషీ । స్వమృత్యవే । ప్రియాతిథిః । స్వేన । గతా । గృహాన్ ।
కథం । న । ధర్మరాజం । చరితార్థయిష్యసి.

టీక॥ విదుషీ = పండితురాలవైననీవు, అతఏవ = ఉరిమున్నగు వానిచే
ఇన్ద్రాదులకధీనము కావలసి వచ్చునను దోషముచే, స్వమృత్యవే =
తనమరణమునకై, అన్యం = మఱియొక, ఉపాయం = ఉపాయమును
అనగా నిరశనాదిరూపమైన యుపాయమును, కరిష్యసేయది = చేయఁ
బోతివో, తదా = అప్పుడు, ప్రియాతిథిః = ప్రియురాలిరూపము
నందున్న యతిథివగునీవు, స్వేన = స్వయముగా, గృహాన్ = యమ
ధర్మరాజగృహమును, గతా = పొందినదానవై, ధర్మరాజం = యమ
ధర్మరాజును, కథం = ఎట్లు, నచరితార్థయిష్యసి = కృతార్థునిఁజేయవు?
(తప్పక చేయగలవు).

## సమాసములు :

ప్రియాతిథిః : ప్రియా చ సా అతిథిశ్చ = ప్రియాతిథిః.

## భావము :

ప్రతిభావంతురాలవైన నీవు ఉరి మున్నగు నుపాయములచే
మరణించినచో నిన్ద్రాదుమున్నగువారి చేతులలోఁ బడవలసి యుండు నను
భయముతో, నీ మరణమునకు మఱియొక యుపాయమును, అనగా నిరశ
నాదిరూపమైన యుపాయమునుఁ జేసినచో నప్పుడు ప్రియురాలి రూపమున
నతిథిగా యముని గృహమున కేగి యతనిని గూఁడ కృతార్థునిఁ జేయఁగలవు.
లేదా ప్రియాతిథి యనగా నతిథులను ప్రియముగాఁగల్గిన నీవు యముని యింటి
కేగి. యచ్చటనే యతని కతిథిసత్కారము గావించి యతనిని సఫలపఱుపఁ
గలవు. ఇదికృతయుగ ధర్మముఁగదా! కృతయుగమున గృహస్థులు, అతిథుల
యింటికి అనగా యాచకుల యింటికిఁ బోయి తాము వారిని సత్కరించువారు

గాన నా ధర్మము నీకు దక్కఁగలదు. బ్రతికి నీవు వారికి నలభ్య వైనను, మరణించి వారికి సులభవు కాఁగలవు. ॥౪౯॥

శ్లో॥ నిషేధవేషో విధిరేష తేఽథవా
తవైవ యుక్తా ఖలు వాచి వక్రతా।
విజృమ్భితం యస్య కిల ధ్వనేరిదం
విదగ్ధనారీవదనం తదాకరః ॥ ౫౦

ప॥వి॥ నిషేధవేషః । విధిః । ఏషః । తే । అథ । వా । తవ । ఏవ । యుక్తా । ఖలు । వాచి । వక్రతా । విజృమ్భితం । యస్య । కిల । ధ్వనేః । ఇదం । విదగ్ధనారీవదనం । తదాకరః.

టీక॥ హేవిదగ్ధే=ఓపణ్డితురాలా! తవ=నీయొక్క, ఏషః=ఈ, నిషేధ వేషః=ఇన్ద్రాదులు వలదను ఆకారము, విధిః = అఙ్గీకారమేయగు చున్నది. తథాహి=అదియుక్తమే, వాచి=మాటయందు, వక్రతా = చాతుర్యము అనగా వ్యఙ్గ్యోక్తిచాతుర్యము, తవైవ=నీకే, యుక్తాఖలు= యుక్తముగదా. (ఏలయనగా) ఇదం=ఈవక్రవాక్యము అనగా వఞ్చనా చాతుర్యము, యస్య=ఏ, ధ్వనేః=వ్యఞ్జనావృత్తికి, విజృమ్భితంకిల= విజృమ్భణముగదా! విదగ్ధనారీవదనం; విదగ్ధ=నేర్పరులగు, నారీ= స్త్రీలయొక్క, వదనం=మోము, తస్య = ఆధ్వనికి, ఆకరః = స్థానము.

వి॥ నీ వక్రోక్తిచాతురి నీకేఁ దగు నను విశేషార్థమును! నేర్పరి యగు స్త్రీయొక్క వదనము ధ్వనికి స్థానము గదా యను సామాన్యముచే సమర్థించుటవలన అర్థాన్తరన్యాసాలఙ్కారము.

సమాసములు :

*నిషేధవేషః :* నిషేధస్య వేషః=నిషేధవేషః.

*వక్రతా :* వక్రస్య భావః=వక్రతా.

*విదగ్ధనారీవదనం :* విదగ్ధా చ సా నారీ చ=విదగ్ధనారీ. విదగ్ధ నార్యాః వదనం=విదగ్ధనారీవదనం.

తదాకరః : తస్య ఆకరః = తదాకరః.

**భావము :**

ఓదమయన్తీ! నీవుఇన్ద్రాదులను నిషేధించుట మఱియొక విధముగా నఙ్గీకారమే. మాటలయందు నేర్పు నీకే తగినది. ఈ నీ వంచనా చాతుర్యము వ్యఙ్జకవృత్తి యగు ధ్వనికి విజృమ్భణమే. లోకమున నేర్పరులగు స్త్రీల ముఖము ధ్వనికిఁ బుట్టినిల్లుగదా! అనగా నీవు నీ యఙ్గీకారమునే దృఢపఱచుకొనుటకై యిన్ద్రాదులను నిషేధించెడి నాటకమును వేయుచున్నావు. కావున నిది నిన్ద్రాదులపైని నీకున్న సమ్మతినే దృఢపఱచుచున్నది కాన నిషేధముచే విధియే వ్యఙ్గ్య మగుచున్నది. ॥౨౦॥

శ్లో॥ భ్రమామి తే భైమి ! సరస్వతీరస
ప్రవాహచక్రేషు నిపత్య కత్యదః ।
త్రపామపాకృత్య మనాక్ కురు స్ఫుటం
కృతార్థనీయః కతమః సురోత్తమః ॥ ౨౧

ప॥వి॥ భ్రమామి । తే । భైమి । సరస్వతీరసప్రవాహచక్రేషు । నిపత్య । కత్యదః । త్రపామ్ । అపాకృత్య । మనాక్ । కురు । స్ఫుటం । కృతార్థనీయః ।కతమః । సురోత్తమః.

టీక॥ హేభైమి = ఓదమయన్తీ! తే = నీయొక్క, సరస్వతీరసప్రవాహచక్రేషు; సరస్వతీ = వాక్కుయొక్కయు, (సరస్వతీనదియొక్కయు) రస = శృఙ్గారరసముయొక్కయు (జలముయొక్కయు), ప్రవాహ = ప్రవాహముయొక్క, చక్రేషు = వక్రోక్తిరూపములగుమణ్డలములయందును, పుటభేదములను సుడులయందును, కత్యదః; కతి = ఎన్ని, అదః = ఈచక్రములుగల్గునట్లుగా, నిపత్య = పడి, భ్రమామి = తిరుగుచున్నాను, అనగా భ్రమనుపొందుచున్నాను? కిన్తు = కాని, కతమః = ఏ, సురోత్తమః = దేవతాశ్రేష్ఠుఁడు, కృతార్థనీయః = కృతార్థతనుఁ బొందింప వలయును? అనగా వరింపఁదగిన వాఁడు? ఏతదేవ = దీనినే, త్రపాం = సిగ్గును, అపాకృత్య = వదలి, స్ఫుటంకురు = స్పష్టపఱపుము.

## సమాసములు :

సరస్వతీరసప్రవాహచక్రేషు : సరస్వత్యాః రసః = సరస్వతీరసః. సరస్వతీరసస్య ప్రవాహః = సరస్వతీరసప్రవాహః. సరస్వతీరసప్రవాహస్య చక్రాణి = సరస్వతీరసప్రవాహచక్రాణి. తేషు = సరస్వతీరసప్రవాహచక్రేషు

కత్యదః : కతి అమూని యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = కత్యదః.

కృతార్థనీయః : కృతార్థయితుం యోగ్యః = కృతార్థనీయః

సురోత్తమః : సురాణాముత్తమః = సురోత్తమః.

## భావము :

ఓదమయన్తీ! నీవాక్కులలోని శృఙ్గారరస ప్రవాహములోని వక్రోక్తి మణ్డలములలో (సరస్వతీనదీప్రవాహముయొక్క సుడులలో) పడి ఎన్నియో చక్రము లేర్పడునట్లుగా భ్రమించుచున్నాను. ఇఁక నీ వక్రోక్తులు చాలును. కాని యిన్ద్రాదిదేవతోత్తములలో నెవ్వని నీవు వరించి కృతార్థునిఁగావింతువో సిగ్గును వదలి స్పష్టముఁ గావింపుము. ॥౫౦॥

శ్లో॥ మతః కిమైరావతకుమ్భకైతవ
ప్రగల్భపీనస్తనదిగ్ధవస్తవ ।
సహస్రనేత్రాన్న పృథఙ్ మతే మమ
త్వదఙ్గలక్ష్మీమవగాహితుం క్షమః ॥ ౫౧

ప॥వి॥ మతః । కిం । ఐరావతకుమ్భకైతవప్రగల్భపీనస్తనదిగ్ధవః । తవ । సహస్రనేత్రాత్ । న । పృథక్ । మతే । మమ । త్వదఙ్గలక్ష్మీమ్ । అవగాహితుం । క్షమః.

టీక॥ హేభైమి = ఓదమయన్తీ! ఐరావతకుమ్భకైతవప్రగల్భపీనస్తనదిగ్ధవః; ఐరావత = ఐరావతముయొక్క, కుమ్భ = కుమ్భస్థలములయొక్క, కైతవ = మిషచే, ప్రగల్భ = కఠినములును, పీన = బలసినవియునగు, స్తన = స్తనములుగల్గిన, దిక్ = తూర్పుదెసకు. పతిః = భర్తయగు

నింద్రుఁడు, తవ = నీకు, సమ్మతః కిం = ఇష్టుఁడాయేమి? మమ = నాయొక్క, మతే = అభిప్రాయమునందు, త్వదఙ్గలక్ష్మీం; త్వత్ = నీయొక్క, అఙ్గ = శరీరముయొక్క, లక్ష్మీం = లావణ్యసమ్పదను, అవగాహితుం = బాగుగాగ్రహించుటకు, సహస్రనేత్రాత్ = వేయి కన్నులుగల్గిన యిన్ద్రునికంటె, పృథక్ = వేఱైనవ్యక్తి, క్షమః = సమర్థుఁడు, న = కాఁడు.

వి॥ ప్రాచీదిగధిపతి నీకు సమ్మతుడా యను వాక్యార్థమును, నీ దేహలక్ష్మి నవగాహించుట కతడు తప్ప నితరుఁడు యోగ్యుఁడు కాఁడను వాక్యార్థముచే సమర్థించుటవలన కావ్యలిఙ్గాలఙ్కారము.

## సమాసములు :

*ఐరావతకుమ్భకైతవప్రగల్భపీనస్తనదిగ్ధవః:* ఐరావతస్య కుమ్భః = ఐరావతకుమ్భః. ఐరావతకుమ్భస్య కైతవం = ఐరావతకుంభకైతవమ్. ఐరావతకుంభకైతవేన ప్రగల్భౌ = ఐరావతకుంభకైతవప్రగల్భౌ. ఐరావతకుంభకైతవప్రగల్భౌ చ తౌ పీనౌ చ = ఐరావతకుమ్భకైతవప్రగల్భపీనౌ. ఐరావతకుంభకైతవ ప్రగల్భపీనౌ స్తనౌ యస్యాస్సా = ఐరావతకుంభకైతవప్రగల్భపీనస్తనా. ఐరావతకుంభకైతవ ప్రగల్భపీనస్తనా చ సా దిక్చ = ఐరావతకుమ్భ కైతవ ప్రగల్భపీనస్తనదిక్. ఐరావతకుమ్భ కైతవ ప్రగల్భపీనస్తనదిశః ధవః = ఐరావత కుమ్భకైతవ ప్రగల్భపీనస్తనదిగ్ధవః.

*సహస్రనేత్రాత్ :* సహస్రాణి నేత్రాణి యస్య సః = సహస్రనేత్రః. తస్మాత్ = సహస్రనేత్రాత్.

*త్వదఙ్గలక్ష్మీమ్ :* తవ అఙ్గం = త్వదఙ్గం. త్వదఙ్గస్య లక్ష్మీః = త్వదఙ్గలక్ష్మీః. తాం = త్వదఙ్గలక్ష్మీమ్.

## భావము :

ఐరావతముయొక్క కుంభస్థలము లనెడి వ్యాజముతో కఠిన మైన స్తనములు గల ప్రాగ్దిక్కునకు; పరిపాలకుడైన యింద్రుడు నీకు సమ్మతుఁడా? నాయభిప్రాయమున నీ శరీరసౌన్దర్యమునవగాహించుటకు వేయి కన్నులు గల యిన్ద్రుడు తప్ప మఱియొకడు అర్హుఁడు కాఁడు, ॥౩౭॥

శ్లో॥ ప్రసీద తస్మిన్ దమయన్తి సంతతం
త్వదఙ్గసఙ్గప్రభవైర్జగత్ప్రభుః।
పులోమజాలోచనతీక్ష్ణ కణ్టకై
స్తనుం ఘనామాతనుతాం స కణ్టకైః॥ 43

ప॥వి॥ ప్రసీద । తస్మిన్ । దమయన్తి । సంతతం । త్వదఙ్గసఙ్గప్రభవైః । జగత్ప్రభుః । పులోమజాలోచన తీక్ష్ణకణ్టకైః । తనుం । ఘనాం । ఆతనుతాం ।సః । కణ్టకైః.

టీక॥ హేదమయన్తి! = ఓ దమయన్తీ, తస్మై = ఆ యింద్రునికొఱకు, ప్రసీద = ప్రసన్నురాలవుకమ్మ. జగత్ప్రభుః = ప్రపంచప్రభువైన యా యింద్రుఁడు, సన్తతం= ఎల్లప్పుడు, తనుం = తనశరీరమును, త్వదఙ్గసఙ్గప్రభవైః; త్వదఙ్గ = నీశరీరముయొక్క, సఙ్గ = సమ్బన్ధముచే, ప్రభవైః = ఉత్పన్నములైన, (కావుననే) పులోమజాలోచన తీక్ష్ణకణ్టకైః; పులోమజా = శచీదేవియొక్క, లోచన = నేత్రములకు, తీక్ష్ణ = తీవ్రములైన, కణ్టకైః = ముండ్లైన, (బాధించెడి సవతి యొక్క చేష్టలనెడి) కణ్టకైః = పులకములచే, ఘనాం = దట్టముగా, ఆతనుతాం = చేయునుగత.

వి॥ పులకములను కణ్టకములుగా రూపించుట వలన రూపకము.

సమాసములు:

త్వదఙ్గ సఙ్గ ప్రభవైః : తవ అఙ్గం = త్వదఙ్గం. త్వదఙ్గస్య సఙ్గః = త్వదఙ్గసఙ్గః.త్వదఙ్గస్యసఙ్గాత్ ప్రభవాః = త్వదఙ్గసఙ్గప్రభవాః. తైః = త్వదఙ్గ సఙ్గప్రభవైః.

జగత్ప్రభుః: జగతాం ప్రభుః = జగత్ప్రభుః.

పులోమజాలోచనకణ్టకైః : పులోమజాయాః లోచనే = పులోమజాలోచనే. పులోమజాలోచనయోః కణ్టకాః = పులోమజాలోచనకణ్టకాః. తైః = పులోమజాలోచనకణ్టకైః.

భావము :

ఓదమయ స్త్రీ! అయిన్ద్రునికి ప్రసన్నురాలవుకమ్ము. అజగత్ప్రభుమైన యింద్రుఁడు తన శరీరమును, నీ శరీరసంబంధముచేఁ గల్గినవియు, శచీదేవి కనులకు ముఁడ్లవంటియు నగు పులకములచే దట్టముఁ గావింపనిమ్ము అనగా నీవు శచికి సపతివి కమ్ము అతని శరీరమునందు గల్గిన పులకములు శచీదేవిని వేధించెడివిగ నుండును గాత. ॥౫౩॥

శ్లో॥ అబోధి తత్త్వం దహనేఽనురజ్యసే
స్వయం ఖలు క్షత్రియగోత్ర జన్మనః ।
వినా తమోజస్వినమన్యతః కథం
మనోరథస్తే వలతే విలాసిని ॥ ౫౪

ప॥వి॥ అబోధి । తత్త్వం । దహనే । అనురజ్యసే। స్వయం। ఖలు । క్షత్రియ గోత్రజన్మనః । వినా । తమ్ । ఓజస్వినమ్ । అన్యతః । కథం । మనోరథః । తే । వలతే । విలాసిని.

టీక॥ హే విలాసిని! = ఓవిలాసవతి! తత్త్వం = వాస్తవము అనగా నీమనోరథము, అబోధి = తెలియఁబడినది. (అదేమనగా) స్వయం = నీవు, దహనే = అగ్నియందు, అనురజ్యసే = అనురక్తురాలవగు చున్నావు. ఏల యనగా, క్షత్రియగోత్రజన్మనః; క్షత్రియగోత్ర = క్షత్రియవంశము నందు, జన్మనః = జననమందిన నీయొక్క, మనోరథః = కోరిక, ఓజస్వినం = తేజోవంతుఁడగు, తం = ఆయగ్నిని, వినా = కాకుండ, అన్యత = మఱియొకచోట, కథం = ఎట్లు, వలతే = ప్రవర్తించును. (ఏవిధముగను ప్రవర్తింపదు).

వి॥ నీకు నగ్నియందనురాగ మున్నదని చెప్పి, దానిని క్షత్రియవంశమున జన్మించుటచే ఓజస్విని యగు స్త్రీకి నోజస్వి యగు నగ్నియందు తప్ప మఱొక్కచోట మనోరథ మెట్లేర్పడు నను వాక్యార్థముచే సమర్థించుట వలన కావ్యలిఙ్గాలఙ్కారము.

**సమాసములు :**

**క్షత్రియగోత్రజన్మనః :** క్షత్రియస్యగోత్రం = క్షత్రియగోత్రం. క్షత్రియగోత్రే జన్మ యస్యాఃసా = క్షత్రియగోత్రజన్మా. తస్యాః = క్షత్రియగోత్రజన్మనః.

**ఓజస్వినమ్ :** ఓజః అస్య అస్తీతి = ఓజస్వీ. తం = ఓజస్వినమ్.

**భావము :**

ఓదమయన్తీః మనస్సులోని వాస్తవస్థితి తెలిసినది. అదేదనగా – నీవు అగ్నిదేవుని వలచుచున్నావు. క్షత్రియజాతియందు జన్మించిన నీయొక్క మనోరథము, క్షత్రియజాతి వలె నోజస్సు గల్గిన యగ్నియందు తప్ప మఱొకచోట నెట్లు ప్రవర్తించును? ఏవిధముగను ప్రవర్తించదు; ఓజస్సు గల స్త్రీ ఓజస్సు గలవానినే వలచును గాని తక్కినవానిని వలవదు గదా. ॥२४॥

శ్లో॥ త్వయైకపత్న్యా తనుతాపశఙ్కయా
తతో నివర్త్యం న మనః కథం చ న ।
హిమోపమా తత్ర పరీక్షణక్షణే
సతీషు వృత్తిః శతశో నిరూపితా॥ २२

ప॥వి॥ త్వయా । ఏకపత్న్యా । తనుతాపశఙ్కయా । తతః । నివర్త్యం । న । మనః । కథం । చన । హిమోపమా । తత్ర । పరీక్షణక్షణే । సతీషు । వృత్తిః । శతశః । నిరూపితా.

టీక॥ ఏకపత్న్యాః = ఒక్కభర్తయందే వ్రతము గల్గిన, త్వయా = నీచేత, తనుతాపశఙ్కయా; తనుతాప = దేహతాపమును గల్గించునను, శఙ్కయా = సందేహముచేత, కథంచన = ఏవిధముగను, తతః = ఆయగ్నినుండి, మనః = మనస్సు, ననివర్త్యం = మఱలింపఁదగనిది. తస్య = ఆయగ్నికి, పరీక్షణక్షణే = పాతివ్రత్యపరీక్షా సమయమందు, సతీషు = పతివ్రతలయందు, హిమోపమా; హిమ = మంచుతో, ఉపమా = సామ్యముగల,

వృత్తిః = వృత్తి, శతశః = పెక్కుమారులు, నిరూపితా = నిరూపింప బడినది.

వి॥ నీ దేహము నగ్ని తపింపఁజేయు నను భయముచే నగ్నినుండి నీ చిత్తమును మఱలింపకుము అను వాక్యార్థమును, ఏకపత్నీపదార్థముచే సమర్థించుటవలన కావ్యలిఙ్గము.

సతుల పరీక్షలో నగ్నియొక్క వృత్తి మంచుతో సాటి యైనదను వాక్యార్థము, ఏకపత్నీ పదార్థమును సమర్థింపఁ బడుటవలన నిదియు కావ్యలిఙ్గము. ఈ రెంటికి నిందు సఙ్కరము.

సమాసములు :

ఏకః పతిః యస్యాస్సా = ఏకపత్నీ. తయా = ఏకపత్న్యా.

తనుతాపశఙ్కయా : తనోస్తాపః = తనుతాపః. తనుతాపాత్ శఙ్కా = తనుతాపశఙ్కా. తయా = తనుతాపశఙ్కయా.

హిమోపమా : హిమేన ఉపమా యస్యాస్సా = హిమోపమా.

పరీక్షణక్షణే : పరీక్షణస్య క్షణః = పరీక్షణక్షణః. తస్మిన్ = పరీక్షణక్షణే.

భావము :

పతివ్రత యగు నీవు, అగ్నిదేవుఁడు నీ శరీరమునుఁ దపింపఁజేయు నని భయపడి నీ మనస్సు నతనినుండి మఱల్చవలదు. ఏలయనగా సతుల పరీక్షఁ జేయు సమయమునం దగ్నిదేవుడు మంచువలె చల్లగనేయుండును. కాన నాతని వరించుటచే నీకు శరీరము కాలు నను భయ ముండ నవసరము లేదు. ॥౨౨॥

శ్లో॥ స ధర్మరాజః ఖలు ధర్మశీలయా
త్వయాఽస్తి చిత్తాఽతిథితామవాపితః ।
మమాఽపి సాధు ప్రతిభాత్యయం క్రమః
చకాస్తి యోగ్యేన హి యోగ్యసఙ్గమః॥ ౨౭

ప॥వి॥ సః । ధర్మరాజః । ఖలు । ధర్మశీలయా । త్వయా । అస్తి । చిత్తాతిథితామ్ । అవాపితః । మమ । అపి । సాధు । ప్రతిభాతి । అయం । క్రమః । చకాస్తి । యోగ్యేన । హి । యోగ్యసఙ్గమః.

టీక॥ అథవా = లేదా, సః = ఆప్రసిద్ధమైన, ధర్మరాజః = యముఁడు, ధర్మశీలయా = ధర్మస్వభావముగల, త్వయా = నీచేత, చిత్తాతిథితాం = చిత్తమునకు గోచరుడుగ నుండుటను, అవాపితఃఖలు = పొందింపఁబడెను గదా. మమాఽపి = నాకును, అయంక్రమః = ఈక్రిమము, సాధు = చక్కఁగా, ప్రతిభాతి = స్ఫురించుచున్నది. తథాహి = అదియుక్తమే. యోగ్యేనసహ = యోగ్యునితోఁడ, యోగ్యసఙ్గమః = యోగ్యునకుకలయిక, చకాస్తి = ప్రకాశించుచున్నది.

వి॥ నీవు యముని నీ మనస్సునకు గోచరుని గావించుకొనుట యుక్తమను విశేషమగు నర్థము యోగ్యులతో యోగ్యసమాగమము శోభించు నను సామాన్యముతో సమర్థించుటవలన నర్థాన్తరన్యాసాలఙ్కారము.

సమాసములు :

ధర్మరాజః : ధర్మస్య రాజా = ధర్మరాజః.

ధర్మశీలయా : ధర్మబద్ధం శీలం యస్యాస్సా = ధర్మశీలా. తయా = ధర్మశీలయా.

లేదా

ధర్మే శీలం యస్యాస్సా = ధర్మశీలా. తయా = ధర్మశీలయా.

చిత్తాతిథితామ్ : చిత్తస్యఅతిథిః = చిత్తాతిథిః. చిత్తాతిథేర్భావః = చిత్తాతిథితా. తామ్ = చిత్తాతిథితామ్.

యోగ్యసఙ్గమః : యోగ్యస్య సఙ్గమః = యోగ్యసఙ్గమః.

భావము :

లేదా, ఆధర్మరాజైన యముని ధర్మప్రవృత్తి గల్గిన నీవు, నీ మనస్సునకు గోచరింపఁజేసుకొంటివా ? అనగా నీవు యముని వలచితివా? అట్లగుచో

నది శ్రేష్ఠమే. నాకును నిది మెచ్చఁదగినదిగనే స్ఫురించుచున్నది. లోకమునందు యోగ్యునకు యోగ్యునితోఁడ సంబంధ మెప్పుడును శోభించును. ఏల యనగా మీరుభయులును ధార్మికులే గదా. ॥౫౬॥

శ్లో॥ అజాతవిచ్ఛేదలవైః స్మరోత్సవై
రగస్త్యభాసా దిశి నిర్మలత్విషి।
ధుతావధిం కాల మమృత్యుశఙ్కితా
నిమేషవత్తేన నయస్వ కేలిభిః॥ ౫౭

ప॥వి॥ అజాత విచ్ఛేదలవైః । స్మరోత్సవైః । అగస్త్యభాసా దిశి । నిర్మలత్విషి । ధుతావధిం । కాలమ్ । అమృత్యుశఙ్కితా । నిమేషవత్। తేన । నయస్వ । కేలిభిః.

టీక॥ (హేభైమి = ఓదమయన్తీ!) అగస్త్యభాసా = అగస్త్యనక్షత్రము యొక్క కాంతిచే, నిర్మలత్విషి = నిర్మలమగు దీప్తిగల్గిన, దిశి = దక్షిణదిక్కునందు, తేన = ఆ యమునితో, అమృత్యుశఙ్కితా = మరణభయములేనిదానవై, అజాతవిచ్ఛేదలవైః; అజాత = సంభవింపని, విచ్ఛేద = విఘ్నములయొక్క, లవైః = లేశములు గల్గిన, అనగా విఘ్నములులేని, స్మరోత్సవైః = సమ్భోగములనెడి, కేళిభిః = వినోదములతో, ధుతావధిం; ధుత = తొలగింపఁబడిన, అవధిం = అంతముగల్గిన, కాలం = కాలమును, అనగా, అనన్తమైనకాలమును, నిమేషవత్ = ఱెప్పపాటువలె, నయస్వ = కడపుము.

## సమాసములు :

అజాతవిచ్ఛేదలవైః : న జాతః = అజాతః. విచ్ఛేదస్య లవః = విచ్ఛేదలవః అజాతః విచ్ఛేదలవః యేషాంతే = అజాతవిచ్ఛేదలవాః. తైః = అజాతవిచ్ఛేదలవైః

స్మరోత్సవైః : స్మరస్య ఉత్సవాః = స్మరోత్సవాః. తైః = స్మరోత్సవైః.

అగస్త్యభాసా : అగస్త్యస్య భాః = అగస్త్యభాః. తయా = అగస్త్యభాసా.

నిర్మలత్విషి : నిర్మలా త్విట్ యస్యాస్సా = నిర్మలత్విట్. తస్యాం = నిర్మలత్విషి.

ధుతావధిం : ధుతః అవధిః యస్య సః = ధుతావధిః. తామ్ = ధుతావధిం.

అమృత్యుశఙ్కితా : మృత్యోః శఙ్కితం = మృత్యుశఙ్కితం; అవిద్యమానం మృత్యుశఙ్కితం యస్యాస్సా = అమృత్యుశఙ్కితా.

**భావము :**

ఓదమయన్తీ! దక్షిణదిక్కున నగస్త్య నక్షత్రము వెలుగుచుండును. దాని వలన నిర్మలమైన వెలుగు గల్గిన యా దిక్కునందు యమధర్మరాజుతోఁడ మరణభయము లేక నిర్విఘ్నముగా సమ్భోగవినోదములతో, ననన్త కాలమును రెప్పపాటుతో సమానముగాఁ గడపుము. మఱి యొకని వరించినచో నిట్టి సౌభాగ్యము నీకు దుర్లభమగును. ॥౫౭॥

శ్లో॥ శిరీషమృద్వీ వరుణం కిమీహసే
పయః ప్రకృత్యా మృదువర్గవాసవమ్ ।
విహాయ సర్వాన్ వృణుతే స్మ కిన్న సా
నిశాఽపి శీతాంశుమనేన హేతునా ॥ ౫౮

ప॥వి॥ శిరీషమృద్వీ । వరుణం । కిమ్ । ఈహసే । పయఃప్రకృత్యా । మృదువర్గవాసవమ్ । విహాయ । సర్వాన్ । వృణుతే । స్మ । కిం । న । సా । నిశా । అపి । శీతాంశుమ్ । అనేన । హేతునా.

టీక॥ అథవా = లేదా, శిరీషమృద్వీ = దిరిసెనపూవువలెమెత్తనైన, త్వం = నీవు, పయఃప్రకృత్యా = నీటియొక్క ప్రకృతిచే, లేదా జలస్వభావముచే, మృదువర్గవాసవమ్; మృదువర్గ = మెత్తనివస్తువులలో, వాసవం = శ్రేష్ఠుఁడైన, వరుణం = వరుణుని, ఈహసేకిం = కోరుచున్నావాయేమిః అదిగూడఁదగినదే, తథాహి = అదియుక్తమే. సా = ఆమెత్తని స్వభావముగల, నిశాఽపి = రాత్రియు, అనేన = ఈ, హేతునా =

కారణముచే అనగాఁ చల్లదనము లేదా మెత్తఁదనమను కారణముచే, సర్వాన్ = తీక్ష్ణములైనవానినన్నింటిని, విహాయ = వదలి, శీతాంశుం = చన్ద్రుని, నవృణుతేస్మకిం = వరించుటలేదా యేమిః.

వి॥ దిరిసెన పూవు వలె మెత్తని శరీరము గల దమయన్తి వరుణునిఁ గోరుచున్న దను వాక్యార్థమునకును రాత్రి చన్ద్రునే వరించు నను వాక్యార్థమునకును బింబప్రతి భింబభావాపన్న మగు సామ్యముఁ జెప్పుటవలన దృష్టాన్తాలఙ్కారము.

## సమాసములు :

శిరీషమృద్వీ : శిరీషవత్ మృద్వీ = శిరీషమృద్వీ.

పయఃప్రకృత్యా : పయసః ప్రకృతిః = పయఃప్రకృతిః తయా = పయఃప్రకృత్యా.

మృదువర్గవాసవమ్ : మృదూనాం వర్గః = మృదువర్గః. మృదువర్గస్య వాసవః = మృదువర్గవాసవః. తమ్ = మృదువర్గవాసవమ్.

## భావము :

దిరిసెనపూవు వలె మెత్తని యొడలు గల నీవు జలస్వభావముచేత నట్టి మెత్తని శరీరము గల్గిన వరుణుని వలతువాః ఆతడు మెత్తని వస్తువులలో శ్రేష్ఠుఁడు కాన నతడు నీకు మెత్తఁదనమున తగియున్నాఁడు. కాన వానిని వలచుట యుక్తమే. కావుననే రాత్రిసున్దరి కఠినపదార్థముల నన్నింటిని వీడి చల్లదనమును మెత్తఁదనమునుఁ గల్గిన చన్ద్రునే వలచుచున్నది. ॥౨౮॥

శ్లో॥ అసేవి యస్త్యక్తదివా దివానిశం
శ్రియః ప్రియేణానణురామణీయకః।
సహాఽమునా తత్ర పయః పయోనిధౌ
కృశోదరి! క్రీడ యథామనోరథమ్॥ ౨౯

ప॥వి॥ అసేవి । యః । త్యక్తదివా । దివానిశం । శ్రియః । ప్రియేణ । అనణురామణీయకః । సహ । అమునా । తత్ర । పయఃపయోనిధౌ । కృశోదరి । క్రీడ । యథామనోరథమ్.

టీక॥ హేకృశోదరి = కృశించినయుదరముగలదానా! అనణురామణీయకః, అనణు = అధికమైన, రామణీయకః = అందముగల్గిన, యః = ఏ, పయఃపయోనిధిః = పాలసముద్రము, త్యక్తదివా; త్యక్త = విడువఁబడిన, దివా = స్వర్గముగల్గిన, శ్రియః = లక్ష్మికి, ప్రియేణ = ప్రియుడైన విష్ణువుతో, దివానిశం = పగలురాత్రి, అసేవి = సేవింపఁబడినది, తత్ర = ఆసాగరమందు, అమునాసహ = ఈ వరుణునితోఁడ, యథా మనోరథం = యథేచ్ఛగా, క్రీడ = క్రీడింపుము.

సమాసములు :

త్యక్తదివా : త్యక్తా ద్యౌః యేన సః = త్యక్తద్యౌః. తేన = త్యక్తదివా.

అనణురామణీయకః : రమణీయస్య భావః = రామణీయకం. అనణు రామణీయకం యస్య సః = అనణురామణీయకః.

పయఃపయోనిధౌ : పయసాం నిధిః = పయోనిధిః. పయసాం పయోనిధిః = పయః పయోనిధిః. తస్మిన్ = పయఃపయోనిధౌ.

హేకృశోదరి : కృశం ఉదరం యస్యాస్సా = కృశోదరీ. తస్యాః సమ్బుద్ధిః = హేకృశోదరి ।

యథామనోరథమ్ : మనోరథమనతిక్రమ్య = యథా మనోరథమ్.

భావము :

ఓకృశోదరీ! గొప్ప సౌన్దర్యము గల పాలకడలి స్వర్గమును వీడిన లక్ష్మీపతితో రేయింబవలు శయనమునకై యుపయోగింపఁబడినది. అట్టి పాల్కడలి యందు వరుణునితోఁడ యథేచ్ఛగా లక్ష్మీనారాయణులవలె క్రీడలతో సుఖించుము ॥౩౯॥

శ్లో॥ ఇతి స్ఫుటం తద్వచసస్తదాదరాత్
సురస్పృహారోప విడమ్బనాదపి ।

కరాఙ్కసుప్తైకకపోల కర్ణయా
శ్రుతఞ్చ తద్భాషితమశ్రుతఞ్చ తత్॥ ౬౦

ప॥వి॥ ఇతి । స్ఫుటం।తద్వచసః। తదాదరాత్। సురస్పృహారోపవిడమ్బనాత్। అపి । కరాఙ్కసుప్తైకవపోలకర్ణయా । శ్రుతం । చ । తద్భాషితమ్ । అశ్రుతం । చ । తత్.

టీక॥ ఇతి = ఇట్లు, స్ఫుటం = స్పష్టమైన, తత్ = పూర్వోక్తమైన, తర్వచసః = నలుని వచనముయొక్క, ఆదరాత్ = ఆదరమువలన, సురస్పృహారోపవిడమ్బనాదపి; సుర = ఇన్ద్రాదిదేవతలయందలి, స్పృహా = అభిలాషయొక్క, ఆరోప = ఆరోపమనెడి, విడమ్బనాత్ = పరిహాసమువలనను, కరాఙ్కసుప్తైకకపోలకర్ణయా; కరాఙ్క = హస్తముయొక్క యొడియందు, సుప్త = నిద్రించిన, ఏక = ఒక, కపోల = కణతయు, కర్ణయా = చెవియుఁగల్గిన,తయా = దమయన్తిచే, శ్రుతం = వినఁబడినది, అశ్రుతఞ్చ = వినఁబడనులేదు.

వి॥ నలుని యందలి యాదరముచేత వినుటను. దిక్పాలురయందలి పరిహాసముచే వినకపోవుటను క్రమముగాఁ జెప్పుటవలన యథాసంఖ్యాలఙ్కారము.

**సమాసములు :**

*తదాదరాత్ :* తస్మిన్ ఆదరః = తదాదరః. తస్మాత్ = తదాదరాత్.

*సురస్పృహారోపవిడమ్బనాత్ :* సురేషు స్పృహా = సురస్పృహా. సురస్పృహాయాఃఆరోపః = సురస్పృహారోపః. సురస్పృహారోప ఏవ విడమ్బనం = సురస్పృహారోపవిడమ్బనం. తస్మాత్ = సురస్పృహారోపవిడమ్బనాత్.

*కరాఙ్కసుప్తైకకపోలకర్ణయా :* కరస్య అఙ్కః = కరాఙ్కః. కరాఙ్కే సుప్తం = కరాఙ్కసుప్తం. కపోలశ్చ కర్ణశ్చ = కపోలకర్ణం. ఏకం చ తత్ కపోలకర్ణం చ = ఏకకపోలకర్ణం. కరాఙ్కసుప్తం ఏకకపోల-

కర్ణం యస్యాస్సా=కరాబ్జన్యస్తైకకపోలకర్ణా. తయా = కరాబ్జన్యస్తైకకపోలకర్ణయా.

**సమాసములు :**

తద్భాషితం : తస్య భాషితం=తద్భాషితమ్.

అశ్రుతం : న శ్రుతం=అశ్రుతం.

**భావము :**

ఇట్లు స్పష్ట మగు నర్థము గల్గిన నలుని వాక్యమును నతని మాట యందలి యాదరముతోఁడను ననగా ననురాగముతోఁడను, దేవేన్ద్రాదులయందు, కృత్రిమాభిలాష ప్రదర్శన మను పరిహాసముతోడను, దమయంతి తన చేతి యందు నొక కపోలమును నొక కర్ణము నుంచుకొనినదై వినినది. దేవేన్ద్రాదుల యందలి విదమ్బనముచే మఱియొక చెవితో వినలేదు. చింత వలన నొక కపోలమును, జేతియందుంచుకొనినది. ॥౬౦॥

శ్లో॥ చిరాదనధ్యాయమవాఙ్మఖీ ముఖే
తతః స్మ సా వాసయతే దమస్వసా ।
కృతాయతశ్వాసవిమోక్షణాథ తం
క్షణాద్బభాషే కరుణం విచక్షణా॥ ౬౧

ప॥వి॥ చిరాత్ । అనధ్యాయమ్ । అవాఙ్మఖీ । ముఖే । తతః । స్మ । సా । వాసయతే । దమస్వసా । కృతాయతశ్వాసవిమోక్షణ । అథ । తం । క్షణాత్ । బభాషే । కరుణం । విచక్షణా.

టీక॥ **తతః** = నల వాక్యమును వినిన పిదప, **సా** = ఆ, దమస్వసా = దముని చెల్లెలైన దమయన్తి, అవాఙ్మఖీ = చింతచేఁ దలవంచినదై, ముఖే = నోటియందు, చిరాత్ = చాలాకాలము, అనధ్యాయం = మౌనమును, **వాసయతేస్మ** = నెలకొల్పుకొనినది అనగా వహించినది. కిన్తు = కాని, విచక్షణా = వాక్కౌశలముగలదైన దమయన్తి, కృతాయతశ్వాసవిమోక్షణా; కృత = చేయఁబడి, ఆయత = దీర్ఘమైన,

శ్వాస విమోక్షణా = నిట్టూర్పును వదలినదై, తం = ఆ నలుని, క్షణాత్ = క్షణమాగి, కరుణం = దీనముగా, బభాషే = మాట్లాడినది.

వి॥ మౌనము, శ్వాస అవాఙ్ముఖత్వము మున్నగునవి చింతవలనఁకల్గు నను భావములు.

## సమాసములు :

అనధ్యాయం : న అధ్యాయః = అనధ్యాయః. తమ్ = అనధ్యాయం.

అవాఙ్ముఖీ : అవాక్ ముఖం యస్యాసా । = అవాఙ్ముఖీ.

దమస్వసా : దమస్య స్వసా = దమస్వసా.

కృతాయతశ్వాసవిమోక్షణా : ఆయతశ్చాసౌ శ్వాసశ్చ = ఆయత శ్వాసః. ఆయతశ్వాసస్యవిమోక్షణం = ఆయతశ్వాసవిమోక్షణం. కృతం ఆయత శ్వాసవిమోక్షణం యయా సా = కృతాయతశ్వాసవిమోక్షణా.

## భావము :

నలుని మాటను వినిన పిదప దమయన్తి చింతవలన తలను వాల్చు కొనినదై చాలకాలము మౌనము వహించినది. కాని వాక్కౌశలము గల యామె దీర్ఘమైన నిట్టూర్పును విడచి క్షణమాగి యా నలునితో దీనముగా మాట్లాడఁ జొచ్చినది. ॥౬౧॥

శ్లో॥ విభిన్దతా దుష్కృతినీం మమ శ్రుతిం
దిగిన్ద్రదుర్వాచికసూచిసఞ్చయైః ।
ప్రయాతజీవామివ మాం ప్రతి స్ఫుటం
కృతం త్వయాప్యన్తకదూతతోచితమ్॥ ౬౨

ప॥వి॥ విభిన్దతా । దుష్కృతినీం । మమ । శ్రుతిం । దిగిన్ద్రదుర్వాచకసూచి సఞ్చయైః । ప్రయాతజీవామ్ । ఇవ । మాం । ప్రతి । స్ఫుటం । కృతం । త్వయా । అపి । అన్తకదూతతోచితమ్.

టీక॥ దుష్కృతినీం = పాపిష్ఠియైనట్టి, మమ = నాయొక్క, శ్రుతిం = చెవిని, దిగిన్ద్ర దుర్వాచకసూచిసఞ్చయైః; దిగిన్ద్ర = దిక్పాలురయొక్క, దుర్వాచక = దుష్టసన్దేశములను, సూచి = సూదులయొక్క,

సఞ్చయైః = సమూహములచే, విభిన్దతా = గ్రుచ్చుచున్న, త్వయాఽపి = నీ చేతను, ప్రయాతజీవామివ; ప్రయాత = వెళ్లి పోయిన, జీవామివ = జీవముఁగల్గిన దానివలెనున్న, మాంప్రతి = నన్నుఁ గూర్చి, స్ఫుటం = స్పష్టముగా, అన్తకదూతతోచితమ్; అన్తకదూతతా = యముని దూత్యమునకు, ఉచితం = తగినది, కృతం = చేయఁబడినది.

## సమాసములు :

*దిగిన్ద్రదుర్వాచిక సూచిసఞ్చయైః :* దిశామిన్ద్రాః = దిగిన్ద్రాః. దిగిన్ద్రాణాందుర్వాచికాని = దిగిన్ద్రదుర్వాచికాని. దిగిన్ద్రదుర్వాచికాన్యేవసూచయః = దిగిన్ద్రదుర్వాచికసూచయః. దిగిన్ద్రదుర్వాచికసూచీనాం సఞ్చయాః = దిగిన్ద్రదుర్వాచికసూచిసఞ్చయాః. తైః = దిగిన్ద్రదుర్వాచిక సూచిసఞ్చయైః.

*ప్రయాతజీవామ్ :* ప్రయాతః జీవః యస్యాస్సా = ప్రయాతజీవా. తామ్ = ప్రయాతజీవాం.

*అన్తకదూతతోచితమ్ :* అన్తకస్య దూతః = అన్తకదూతః. అన్తకదూతస్య భావః = అన్తకదూతతా. అన్తకదూత తాయాః ఉచితమ్ = అన్తకదూతతోచితం.

## భావము :

నా పాపిష్ఠి చెవ్వును దిక్పాలకులయొక్క, దుష్టసన్దేశములను సూదులచే గ్రుచ్చుచున్న నీచేత, జీవము తొలగిన ప్రేతవలె నున్న నాకు యముని దూత్యమునకుఁ దగిన కార్యము చేయఁబడినదేగాని మఱి యొండు చేయఁబడలేదు. పతివ్రతలకు పరపురుషవార్త కూడ యమయాతనతో సమాన మైనది. యముని దూత హింసించునుఁ గాని సుఖపఱచడు గదా! ॥౬౨॥

శ్లో॥ త్వదాస్య నిర్యన్మదలీక దుర్యశో
మసీమయత్వాల్లిపిరూపభాగివ ।
శ్రుతిం మమాఽఽవిశ్య భవద్దురక్షరం
సృజత్యదః కీటవదుత్కటా రుజః ॥ ౬౩

ప॥వి॥ త్వదాస్యనిర్యన్మదలీకదుర్యశోమసీమయత్వాత్ । లిపిరూపభాక్ । ఇవ॥ శ్రుతిం । మమ । ఆవిశ్య । భవద్దురక్షరం। సృజతి । అదః । కీటవత్। ఉత్కటాః । రుజః.

టీక॥ త్వదాస్య = నీ ముఖమునుండి, నిర్యత్ = వెలువడుచున్న, మత్ = నా యొక్క, అలీక = అసత్యమైన, దుర్యశః = అపకీర్తియనెడి, మసీ = సిరాయొక్క, మయత్వాత్ = రూపముగనుండుటవలన, లిపిరూపభాగివ = లిపిరూపమునుఁబొందినదో యనునట్లున్న, అదః = ఈ, భవద్దురక్షరం; భవత్ = నీయొక్క, దురక్షరం = దుష్టవాక్యము, కీటవత్ = పురుగు వలె, మమ = నాయొక్క, శ్రుతిం = చెవిని, ఆవిశ్య = ప్రవేశించి, ఉత్కటాః = అధికములైన, రుజః = బాధలను, సృజతి = కల్గించుచున్నది.

వి॥ అలీకమును అపకీర్తిగను, అపకీర్తిని సిరాగాను రూపించుట వలన రూపకము.

దుష్టవాక్యమును లిప్యక్షరముగా సంభావించుటవలన నుత్ప్రేక్ష. దుష్టవాక్యమును పురుగుతోఁ బోల్చుటవల ఉపమ. పై రూపకోత్ప్రేక్షలతోనుపమ సజ్కీర్ణము.

## సమాసములు :

*త్వదాస్యనిర్యన్మదలీకదుర్యశోమసీమయత్వాత్* : తవ ఆస్యం = త్వదాస్యం. త్వదాస్యాత్ నిర్యత్ = త్వదాస్యనిర్యత్. మమఅలీకం = మదలీకం. త్వదాస్యనిర్యచ్చ తత్ మదలీకం చ = త్వదాస్యనిర్యన్మదలీకం. త్వదాస్యనిర్య న్మదలీక మేవ దుర్యశః = త్వదాస్యనిర్యన్మదలీకదుర్యశః. త్వదాస్యనిర్యన్మద లీకదుర్యశ ఏవమసీ = త్వదాస్యనిర్యన్మదలీకదుర్యశోమసీ. త్వదాస్యనిర్యన్మద లీకదుర్యశోమస్యాః వికారః = త్వదాస్యనిర్యన్మదలీకదుర్యశోమసీమయః. త్వదా స్యనిర్యన్మదలీకదుర్యశోమసీమయస్యభావః = త్వదాస్యనిర్యన్మదలీకదుర్యశోమ సీమయత్వం. తస్మాత్ = త్వదాస్యనిర్యన్మదలీకదుర్యశోమసీమయత్వాత్.

*లిపిరూపభాక్*: లిపేః రూపం = లిపిరూపం. లిపిరూపం భజతీతి = లిపిరూపభాక్.

*కీటవత్*: కీటఇవ = కీటవత్.

భవదక్షరమ్ : భవతః అక్షరం = భవదక్షరం.

**భావము :**

నీ నోటినుండి వెల్వడిన ఇన్ద్రాద్యనురాగము నా యందలి యసత్యరూపమైన యపకీర్తి సిరాగా నేర్పడినది. ఆ యపకీర్తియనెడి సిరాతో వ్రాయఁబడిన లిప్యక్షరమో యనునట్లుండిన నీ దుర్వాక్యమను పురుగు నా చెవినిఁ బ్రవేశించినదై యధికమైన బాధనుఁ గల్గించుచున్నది. ఇన్ద్రాదులపైన నా కనురాగమున్నట్లు, నీ నోటినుండి వచ్చిన వాక్యముచే నాకు లేని యపకీర్తి వాటిల్లినది. అపకీర్తి నలుపుకాన సిరా వలె నున్నది. ఆ సిరాతో వ్రాయఁబడిన లిప్యక్షరమో యన్నట్లు నీ నోటినుండి వచ్చిన దుర్వాక్య మున్నది. ఆ వాక్యమే పురుగు వలె నా చెవిని దూరి నాకు మిక్కుటమైన బాధనుఁ గల్గించుచున్నది. దమయన్తికి సహజముగా నిన్ద్రాదులయందు ననురాగము లేకపోయినను నలుఁడు తన వక్రసంభాషణములతో ననురాగము నారోపించి యభూతమైన యపకీర్తిని దమయన్తికి వాటిల్లఁజేయగా దానికి దమయన్తి కుందుకొనుచున్నది. ॥౬౩॥

శ్లో॥ తమాలిరూచేఽథ విదర్భజేరితా
ప్రగాఢమౌనవ్రతయైకయా సఖీ ।
త్రపాం సమారాధయతీయమన్యథా
భవన్తమాహ స్మ రసజ్ఞయా మయా ॥ ౬౪

ప॥వి॥ తమ్ । ఆలిః । ఊచే । అథ । విదర్భజేరితా । ప్రగాఢమౌనవ్రతయా। ఏకయా । సఖీ । త్రపాం । సమారాధయతి । ఇయమ్ । అన్యథా । భవన్తమ్ । ఆహ । స్మ । రసజ్ఞయా । మయా.

టీక॥ అథ = పిదప, విదర్భజేరితా; విదర్భజా = దమయన్తిచే, ఈరితా = ప్రేరేపింపఁబడిన, ఆలిః = చెలికత్తె, తం = నలునిగూర్చి, ఊచే = చెప్పినది. (ఏమనగా) (హేసౌమ్య = ఓసౌమ్యుడా) ఇయం = ఈ, సఖీ = మాచెలికత్తెయగు దమయన్తి, ప్రగాఢమౌనవ్రతయా; ప్రగాఢ = దృఢమైన, మౌనవ్రతయా = మౌనవ్రతముగల్గిన, ఏకయా = ఒక్కటైన, రసజ్ఞయా = నాలుకలో, త్రపాం = సిగ్గును, సమారాధయతి = సేవించుచున్నది.

(దేవతారాధనయందు మౌనము యుక్తముగదా). మయా = నారూపమం దున్న, అన్యయా = మఱియొక, రసజ్ఞయా = నాలుకచే, భవన్తం = నిన్నుగూర్చి, ఆహస్మ = చెప్పుచున్నది.

**సమాసములు:**

*విదర్భజేరితా :* విదర్భజయా ఈరితా = విదర్భజేరితా.

*ప్రగాఢమౌనవ్రతయా :* ప్రగాఢం చ తత్ మౌనం చ = ప్రగాఢ మౌనం. ప్రగాఢమౌనమేవ వ్రతం యస్యాస్సా = ప్రగాఢమౌనవ్రతా. తయా = ప్రగాఢమౌనవ్రతయా.

**భావము :**

తర్వాత దమయన్తిచే ప్రేరేపింపఁబడిన చెలికత్తె పలుకఁదొడగినది. ఓ సౌమ్య! ఈమె గొప్ప మౌనవ్రతము వహించిన యొక నాలుకచే లజ్జ నారా ధించుచున్నది. అనగా లజ్జచేఁ బలుకలేకయున్నది. దేవతారాధనఁ జేయులనపుడు మౌనమవసరము గదా! నేననెడి మఱి యొక నాలుకచేత నీతో మాట్లాడుచున్నది. అనగా నికఁ జెప్పవలసిన విషయమునుఁ జెప్పలేక మౌనము వహించి నా మూల మునఁ జెప్పించుచున్నది. ॥౬౭॥

శ్లో॥ తమర్చితుం సంవరణస్రజా నృపం
స్వయంవరః సమ్భవితా పరేద్యవి ।
మమాఽసుభిర్గస్తుమనాః పురఃసరై
స్తదన్తరాయః పునరేష వాసరః ॥ ౬౮

ప॥వి॥ తమ్ । అర్చితుం । సంవరణస్రజా । నృపం । స్వయంవరః । సమ్భవితా । పరేద్యవి । మమ । అసుభిః । గస్తుమనాః । పురఃసరైః । తదన్తరాయః । పునః । ఏషః । వాసరః.

టీక॥ మమ = నాయొక్క, సంవరణస్రజా = చక్కగా వరించుటకువేయఁ బడు మాలచే, తం = ఆ, నృపం = నలమహారాజును, అర్చయితుం = పూజించుటకు, పరేద్యవి = మఱుదినము, స్వయంవరః = స్వయంవర

మహోత్సవము, సమ్భవితా = సమ్భవింపఁబోవుచున్నది. కిన్తు = కాని, పురఃసరైః = ముందునడచుచున్నటువంటి, మమ = నాయొక్క, అసుభిః = ప్రాణములతోడ, గన్తుమనాః = పోఁగోఁచున్న, ఏషః = ఈః, వాసరః = దివసము, తదన్తరాయః; తత్ = అస్వయంవరమునకు, అన్తరాయః = విఘ్నము. (ఒక్కదినము తడవు గూడ సహింపరానిదై యున్నది)

సమాసములు :

*సంవరణస్రజా :* సంవరణస్య స్రక్ = సంవరణస్రక్. తయా = సంవరణస్రజా.

*గన్తుమనాః :* గన్తుం మనః యస్యసః = గన్తుమనాః.

*పురఃసరైః :* పురః సరన్తీతి = పురస్సరాః. తైః = పురస్సరైః.

*తదన్తరాయః :* తస్య అన్తరాయః = తదన్తరాయః.

భావము :

వరించెడి పుష్పమాలచే నతనినిఁ బూజించుటకు తేపు స్వయవరము జరుగఁ బోవుచున్నది. కాని నా ప్రాణములతోఁ గూడ వెళ్లనున్న యీ దినము ఆ స్వయంవరమునకు విఘ్నముగా నున్నది. అనగా నీ దినమునుఁ గడపుట కష్టసాధ్యముగా నున్నది. ॥౬౨॥

శ్లో॥ తదద్య విశ్రమ్య దయాలురేధి మే
దినం నినీషామి భవద్విలోకినీ ।
నఖైః కిలాఖ్యాయి విలిఖ్య పక్షిణా
తవైవ రూపేణ సమః స మత్ప్రియః ॥ ౬౬

ప॥వి॥ తత్ । అద్య । విశ్రమ్య । దయాలుః । ఏధి । మే । దినం । నినీషామి । భవద్విలోకినీ । నఖైః । కిల । ఆఖ్యాయి । విలిఖ్య । పక్షిణా । తవ । ఏవ । రూపేణ । సమః । సః । మత్ప్రియః.

టీ॥ తత్ = అందువలన, అద్య = ఇప్పుడు, విశ్రమ్య = విశ్రమించి, మే = నాకు, దయాలుః = దయఁగలవాడవుగ. ఏధి = కమ్ము. భవద్విలోకినీ = నిన్నుఁజూచుచు, దినం = ఈపగటిని, నినీషామి = కడపఁగోరుచున్నాను. సః = ఆ, మత్ప్రియః = నాకుప్రియుఁడైన, నలః = నలుఁడు, నఖైః = గోళ్లచే, పక్షిణా = హంసచే, విలిఖ్య = వ్రాయఁబడి, తవైవ = నీయొక్కయే, రూపేణ = రూపముతో, సమః = సముఁడుగా, అఖ్యాయికిల = చెప్పఁబడెనుగాదా.

సమాసములు :

భవద్విలోకినీ : భవన్తం విలోకత ఇతి = భవద్విలోకినీ.

మత్ప్రియః : మమ ప్రియః = మత్ప్రియః.

భావము :

నీవు నేడిచ్చట విశ్రమించి నాయందు దయను నెఱపుము. నిన్నుఁజూచుచు దినమునుఁ గడపఁ గోరుచున్నాను. నా ప్రియుఁడైన నలుని హంస గోళ్లతో వ్రాసి చూపించినది. ఆ వ్రాయఁబడిన చిత్రము నీతో సమానముగా నుండినది. అందువలన నిన్నుఁ జూచుటచే దినమునుఁ గడపఁగోరితిని. ॥౮౮॥

శ్లో॥ దృశోర్ద్వయీ తే విధినాఽస్తి వఞ్చితా
ముఖేందులక్ష్మీం తవ యన్న వీక్షతే ।
అసావపి శ్వస్తదిమాం నలాననే
విలోక్య సాఫల్యముపైతు జన్మనః ॥ ౮౯

ప॥వి॥ దృశోః । ద్వయీ । తే । విధినా । అస్తి । వఞ్చితా । ముఖేందులక్ష్మీం । తవ । యత్ । న । వీక్షతే । అసౌ । అపి । శ్వః । తత్ । ఇమాం । నలాననే । విలోక్య । సాఫల్యమ్ । ఉపైతు । జన్మనః.

టీక॥ (హేసౌమ్య = ఓసౌమ్యుఁడా) విధినా = సృష్టికర్తచే, తే = నీయొక్క, దృశోః = నేత్రములయొక్క, ద్వయీ = జంట, వఞ్చితా = వఞ్చింపఁబడినదిగా, అస్తి = ఉన్నది. యత్ = ఏలయనగా, తవ = నీయొక్క,

ముఖేన్దులక్ష్మీం = ముఖచన్ద్రుని శోభను, నవీక్షతే = చూచుటలేదు: (తన ముఖమును తన కన్నులతోఁ జూచుట యసాధ్యముకదా). తత్ = అందు వలన, తే = నీయొక్క, అసౌఅపి = ఈకన్నుల జంటఁగూడ, శ్వః = రేపు, ఇమాం = ఈనీముఖశోభను, నలాననే = నలునిముఖము నందు, విలోక్య = చూచి, జన్మనః = జన్మమునకు, సాఫల్యం = సఫలత్వమును, ఉపైతు = పొందునుఁగాత.

వి॥ ఇచ్చట దూతయందు దేవతాబుద్ధిచే, దూతముఖలక్ష్మికిని, దేవతాముఖలక్ష్మికిని భేద మున్నను నభేదముఁజెప్పుటవలన నతిశయోక్త్యలఙ్కారము.

## సమాసము:

ముఖేన్దులక్ష్మీం : ముఖమిన్దురివ = ముఖేందుః. ముఖేందోః లక్ష్మీః = ముఖేందులక్ష్మీః. తాం = ముఖేన్దులక్ష్మీమ్.

సాఫల్యమ్ : సఫలస్య భావః = సాఫల్యమ్.

## భావము :

ఓసౌమ్యుఁడా! బ్రహ్మ సృజించిన నీ రెండు నేత్రములును వ్యర్థము లగుచున్నవి. ఏల యనగా నవి నీముఖముఁ జూచి యందలి సౌన్దర్యము ననుభవింపలేవు. కావున నీ యీ రెండు కన్నులును, రేపు జరిగెడి స్వయంవరమున కేతెంచు నలుని మోమునందు నీ ముఖలక్ష్మినిఁ జూచి తమ జన్మమునకు సాఫల్యముఁ బడయఁగలవు. కావున నేడిచ్చట విశ్రమింపవలసినది.॥౬౭॥

శ్లో॥ మమైవ పాణౌ కరణేఽగ్నిసాక్షికం
ప్రసజ్జసమ్పాదితమఙ్గ సఙ్గతమ్ ।
న హా సహాధీతిధృతః స్పృహా కథం
తవార్యపుత్రీయమజర్యమర్జితుం ॥ ౬౮

ప॥వి॥ మమ । ఏవ । పాణౌకరణే । అగ్నిసాక్షికం । ప్రసజ్జసమ్పాదితమ్ । అఙ్గ । సఙ్గతమ్ । న । హా । సహాధీతిధృదః । స్పృహా । కథం । తవ । ఆర్యపుత్రీయమ్ । అజర్యమ్ । అర్జితుం.

టీక॥ కిఞ్చ = మఱియు, అఙ్గ = ఓసౌమ్యా! మమ = నాయొక్క, పాణౌకరణే ఏవ = పాణిగ్రహణమునందే, అగ్నిసాక్షికం యథాతథా = అగ్నినిసాక్షిగాఁగలుగునట్లుగా, ప్రసఙ్గసమ్పాదితం; ప్రసఙ్గ = స్వయంవరప్రసఙ్గమువలన, సమ్పాదితం = సంపాదింపఁబడిన, సఙ్గతం = మైత్రము (యుక్తము). ఆర్యపుత్రీయం; ఆర్యపుత్రుఁడైన నలునికి సంబంధించిన, అజర్యం = స్థిరమైనస్నేహమును, అర్జితుం = సమ్పాదించుటకు, సహాధీతిధృతః; సహాధీతి = సామ్యమును, ధృతః = దరించిన, తవ = నీకు, స్పృహా = కోరిక, కథం = ఎట్లు, నాఽస్తి = లేదు? హా = కష్టము.

## సమాసములు :

పాణౌకరణే: పాణౌ కరణం = పాణౌకరణం. తస్మిన్ = పాణౌకరణే.

అగ్నిసాక్షికం : అగ్నిః సాక్షీ యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = అగ్నిసాక్షికం.

ప్రసఙ్గసమ్పాదితం : ప్రసఙ్గేన సమ్పాదితం = ప్రసఙ్గసమ్పాదితం.

సహాధీతిధృతః : సహ అధీతిః = సహధీతిః. సహాధీతిం ధారయతీతి = సహాధీతిధృత్, తస్య = సహాధీతిధృతః.

ఆర్యపుత్రీయం : ఆర్యయోః పుత్రః = ఆర్యపుత్రః. ఆర్యపుత్రస్య ఇదం = ఆర్యపుత్రీయం. తత్ = అర్యపుత్రీయం.

అజర్యాం : న జీర్యతీతి = అజర్యమ్. తత్ = అజర్యమ్.

## భావము :

ఓసౌమ్యా! నా వివాహసమయమందే అగ్నిసాక్షిక మైన మైత్రిని అనగా నలునితోటి మైత్రిని నీవు స్వయంవరప్రసఙ్గమున సమ్పాదించు కొనవచ్చును. నీవు కార్యాన్తరమునకై వచ్చి యున్నను ప్రాసఙ్గికముగా నగ్నిసమక్షమున రామసుగ్రీవుల సఖ్యమువంటి సఖ్యమును నలునితో సమ్పాదించు కొనుము. రూపరేఖాదులయం దంతట నీతో సమానమైన నలునివంటి గొప్పవ్యక్తియొక్క మైత్రినీకు కోరఁదగినది. కాన దానికై యొక దిన మిచ్చట విశ్రమింపుము. ॥౯౦॥

శ్లో॥ దిగీశ్వరార్థం న కథం చన త్వయా
కదర్థనీయాఽస్మి కృతోఽయమఞ్జలిః।
ప్రసద్యతాం నాద్య నిగాద్య మీదృశం
దధే దృశౌ బాష్పరయాస్పదే భృశమ్॥ ౬౯

ప॥వి॥ దిగీశ్వరార్థం । న । కథం । చన । త్వయా । కదర్థనీయా । అస్మి । కృతః । అయమ్ । అఞ్జలిః । ప్రసద్యతాం । న । అద్య।నిగాద్యమ్ । ఈదృశం । దధే । దృశౌ । బాష్పరయాస్పదే । భృశమ్.

టీక॥ కిఞ్చ = మఱియు, అహం = నేను, త్వయా = నీచేత. దిగీశ్వరార్థం = దిక్పతులకొఱకు. కథంచన = ఏవిధముగను, నకదర్థనీయాస్మి = బాధింపనర్హురాలనుకాను. అయం = ఇదిగో, అఞ్జలిః = చేదోయిని జోడించివందనము, కృతః = చేయఁబడినది. అద్య = ఇప్పుడు, ఈదృశం = ఇట్టి, దిగీశసన్దేశము, ననిగాద్యం = చెప్పఁదగినదికాదు, భృశం = మిక్కిలి, బాష్పరయాస్పదే; బాష్పరయ = కన్నీటి వేగమునకు, ఆస్పదే = స్థానములైన, దృశౌ = నేత్రములను, దధే = ధరింతును. (ఇట్లు నన్నేడిపించుట నీకుఁదగదు.)

సమాసములు :

కదర్థనీయా : కదర్థయితుం యోగ్యా = కదర్థనీయా.

బాష్పరయాస్పదే : బాష్పస్య రయః = బాష్పరయః. బాష్పరయస్య ఆస్పదం = బాష్పరయాస్పదం. తస్మిన్ = బాష్పరయాస్పదే.

భావము :

నన్ను నీవు దిక్పతులకొఱకు నిర్బంధపఱచవలదు. దానికై నీకు నమస్కరింతును. ప్రసన్నుడవు కమ్ము. ఎప్పటికిని దిక్పాలురసందేశమును నాకుఁజెప్పవలదు. పెక్కేల? దీనికై నాకన్నులు బాష్పములతో నిండియున్నవి. అనగా రేయింబవలు దుఃఖించుచున్నాను. ॥౬౯॥

శ్లో॥ వృణే దిగీశానితి కా కథా తథా
త్వయీతి నేక్షే నలభామపీహయా।
సతీవ్రతేఽగ్నౌ తృణయామి జీవితం
స్మరస్తు కిం వస్తు తదస్తు భస్మ యః ॥ ౭౦

ప॥వి॥ వృణే । దిగీశాన్ । ఇతి । కా । కథా । తథా । త్వయి । ఇతి । న । ఈక్షే । నలభామ్ । అపి । ఈహయా । సతీవ్రతే । అగ్నౌ । తృణయామి । జీవితం । స్మరః । తు । కిం । వస్తు । తత్ । అస్తు । భస్మ ।యః.

టీక॥ కిఞ్చ = మఱియు, దిగీశాన్ = దిక్పతులను, వృణే = వరింతును అనుటలో, కాకథా = ఏమిమాట? అనగా నిదియసమ్భవము. నలభామపి; నల = నలునియొక్క, భామపి = కాంతినిగూడ, త్వయిఇతి = పర పురుషుఁడవైన నీయందున్నదని, ఈహయా = ఆశతోఅనగానను రాగముతో, నేక్షే = చూడను. సతీవ్రతే = పాతివ్రత్యమను, అగ్నౌ = అగ్నియందు, జీవితం = జీవితమును, తృణయామి = గడ్డిపోచనుఁ గావింతును. స్మరస్తు = మన్మథుఁడో, తత్ = ఆప్రసిద్ధమైన, కింవస్తు = = ఏమివస్తువు, అస్తు = అగును. ఏలయనగా, యః = ఏమన్మథుఁడు, భస్మ = బూడిదగదా.

## సమాసములు :

*దిగీశాన్ :* దిశః ఈశాః = దిగీశాః. తాన్ = దిగీశాన్.

*నలభామ్ :* నలస్య భాః = నలభాః. తామ్ = నలభామ్.

*సతీవ్రతే :* సత్యాః వ్రతం = సతీవ్రతమ్. తస్మిన్ = సతీవ్రతే.

## భావము :

ఇఁక దిక్పాలురను వరించునట్టి కథ లేదు. అది యసమ్భవము. నీయందు నలుని శోభ యున్నను, నీవు పరపురుషుఁడ వను కారణముచే ననురాగముతో నిన్నుఁ జూడను ఇట్లు దిక్పాలురను నిరసించుటవలన బలవద్విరోధ మను

భయముఁ గూడ లేదు. పాతివ్రత్య మను నగ్నియందు నా జీవితమును తృణీక రించుచున్నాను. మన్మథునివలనను నేను భయపడను. మన్మథుఁడెవడు. వాఁడు తుచ్ఛమైన బూడిదయే గదా! అతడేమి చేయఁగలడు. శీలమే ప్రధానముగాఁగల పతివ్రతలు దేనిని లెక్కింపరు. ॥20॥

శ్లో॥ న్యవేశి రత్నత్రితయే జినేన యః
స ధర్మచిన్తామణి రుజ్ఝితో యయా ।
కపాలికోపానలభస్మనః కృతే
తదేవ భస్మ స్వకులే స్తృతం తయా॥ 21

ప॥వి॥ న్యవేశి । రత్నత్రితయే । జినేన । యః । సః । ధర్మచిన్తామణిః । ఉజ్ఝితః । యయా । కపాలికోపానలభస్మనః । కృతే । తత్ । ఏవ । భస్మ । స్వకులే । స్తృతం । తయా.

టీక॥ హేసౌమ్య! = ఓసౌమ్యుఁడా! యః = ఏ, ధర్మచిన్తామణిః = ధర్మమనెడి చిన్తామణిరత్నము, జినేనదేవేన = జినభగవానునిచే, రత్నత్రయే; సద్దృష్టి-సత్‌జ్ఞాన-సద్వృత్తములనెడిమూడురత్నములయందు,న్యవేశి = ఉంచఁబడినదో, సః = ఆధర్మచిన్తామణి, యయా = ఏస్త్రీచేత, కపాలికోపానలభస్మనఃకృతే; కపాలి = శివునియొక్క, కోపానల = కోపాగ్ని యొక్క, భస్మనఃకృతే = బూడిదయైన మన్మథునికొఱకు, ఉజ్ఝితః = విడువఁబడినదో, తయా = ఆస్త్రీచేతనే, తదేవ = అదే, భస్మ = బూడిద, స్వకులే = తనకులమందు, స్తృతం = విస్తరించుకొనఁబడినదగును. అనగా చల్లుకొనఁబడినదగును.

## సమాసములు :

*రత్నత్రితయే :* త్రయాణాం సమూహః = త్రితయం. రత్నానాం త్రితయం = రత్నత్రితయం. తస్మిన్ = రత్నత్రితయే.

*ధర్మచిన్తామణిః :* ధర్మ ఏవ చిన్తామణిః = ధర్మచిన్తామణిః.

*కపాలికోపానలభస్మనః :* కపాలినః కోపః = కపాలికోపః. కపాలి

కోప ఏవ అనలః = కపాలికోపానలః. కపాలికోపానలస్య భస్మ = కపాలికోపానలభస్మ. తస్య = కపాలికోపానలభస్మనః.

స్వకులే : స్వస్య కులం = స్వకులం. తస్మిన్ = స్వకులే.

భావము :

ఓ సౌమ్యా; ధర్మ మను చింతామణిని, జిన భగవానుడు జైన పరిభాషలో, సత్‌దృష్టి-సత్‌జ్ఞానము-సత్‌వృత్తము, అను రత్నత్రయమందుఁజేర్చి యున్నాడు. ఆ ధర్మచిన్తామణిని ఏ స్త్రీ రుద్రుని కోపాగ్నిభస్మమైన మన్మథునకై త్యజించునో, అట్టి స్త్రీ యా భస్మమునే తనకులమందు జల్లుకొనినదై కులవినాశమునకు మూల మగును. అనగా నే స్త్రీ కామభస్మముచే నన్ధురాలై తన శీలమును వదలునో, అటి స్త్రీ తనకులమునే, భస్మము గావించును. కావున నలునియందే వ్రతమువహించిన నాయెదుట నిన్దుఁడు మున్నగువారి పేర్లనుఁ జెప్పవలదు. ॥౭౦॥

శ్లో॥ నిపీయ పీయూషరసౌరసీరసౌ
గిరః స్వకన్దర్పహుతాశనాహుతీః ।
కృతాన్తదూతం న తయా యథోదితం
కృతాన్తమేవ స్వమమన్యతాదయమ్ ॥ ౭౧

ప॥వి॥ నిపీయ । పీయూషరసౌరసీః । అసౌ । గిరః । స్వకన్దర్పహుతాశనాహుతీః । కృతాన్తదూతం । న । తయా । యథా । ఉదితం । కృతాన్తం । ఏవ । స్వం । అమన్యత । అదయమ్.

టీక॥ అసౌ = ఈనలుఁడు, పీయూషరసౌరసీః; పీయూషరస = అమృతరసమునకు, ఔరసీః = పుత్రికలైన, స్వకన్దర్ప హుతాశనాహుతీః; స్వ = తనయొక్క, కన్దర్ప = కామనునెడి, హుతాశన = అగ్నినిముద్దీపింపఁజేసెడు, ఆహుతీః = హోమద్రవ్యములవంటివైన, గిరః = దమయన్తి మాటలను, నిపీయ = ఆశతోవిని, స్వం = తన్ను (అనగానలుని) తయా = ఆదమయన్తిచే, యథోదితం = చెప్పఁబడినవిధముగా, కృతాన్తదూతం = యమునిదూతగా, నామన్యత = తలంచలేదు. కిన్తు =

మహేమనగా, అదయం = దయలేక, స్వం = తన్ను (అనగానలుని) కృతా న్తమేవ = యమునిగనే, అమన్యత = తలంచెను.

## సమాసములు :

పీయూషరసౌరసీః : పీయూష ఇతి రసః = పీయూషరసః. ఉరసా నిర్మితాః ఔరస్యః. పీయూషరసస్య ఔరస్యః = పీయూషరసౌరస్యః. తాః = పీయూషరసౌరసీః. స్వస్య కన్దర్పః = స్వకన్దర్పః. స్వకన్దర్ప ఏవ హుతాశనః = స్వకన్దర్పహుతాశనః. స్వకన్దర్పహుతాశనస్య ఆహుతయః = స్వకన్దర్పహుతుశనాహుతయః. తాః = స్వకన్దర్పహుతాశనాహుతీః.

కృతాన్తదూతం : కృతాన్తస్య దూతః = కృతాన్తదూతః. తమ్ = కృతాన్తదూతమ్.

అదయమ్ : న విద్యతే దయా యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = అదయమ్,

## భావము :

నలుఁడు అమృతరసమునకు పుత్రికలుగా నున్నటువంటివియు అనగా నమృతరసముతో సమానములైనవియు, కామాగ్ని నుద్దీపింపఁజేయునవియు నగు దమయన్తి మాటలను శ్రద్ధగా వినెను. తర్వాత దమయన్తి ముందుఁ జెప్పినవిధముగా తన్ను యముని దూతగా తలంపక, నిర్దయగా తన్ను యమునిఁగనే తలంచెను. దూత ధర్మము గాన నిర్దాక్షిణ్యముగనే చెప్పఁ దొడగెను.॥౨౨॥

శ్లో॥ స భిన్నమర్మాపి తదార్తికాకుభిః
స్వదూతధర్మాన్నవిరన్తుమైహత ।
శనైరశంసన్నిభృతం వినిశ్వసన్
విచిత్రవాక్చిత్రశిఖణ్డినన్దనః ॥ ౨౩

ప॥వి॥ సః । భిన్నమర్మా । అపి । తదార్తికాకుభిః । స్వదూతధర్మాత్ । న। విరన్తుమ్ । ఐహత । శనైః । అశంసత్ । నిభృతం । వినిశ్వసన్। విచిత్రవాక్చిత్రశిఖణ్డినన్దనః.

టీక॥ విచిత్రవాక్చిత్రశిఖణ్డినన్దనః; విచిత్రవాక్ = చమత్కార విలసితములగు వచనములయందు, చిత్రశిఖణ్డినన్దనః = బృహస్పతియైన, సః = ఆ నలుఁడు, తదార్తికాకుభిః; తత్ = ఆదమయన్తియొక్క, ఆర్తి = బాధచే, కాకుభిః = కరుణవచనములతో, భిన్నమర్మాఽపి; భిన్న = భేదనముఁబొందిన, మర్మాపి = మర్మ స్థానమైన హృదయముగల వాడైనను, స్వదూతధర్మాత్; తనదూతధర్మమునుండి, విరన్తుం = విరమించుటకు, నైహత = కోరలేదు, కిన్తు = కాని, నిభృతం = గూఢముగా, వినిశ్వసన్ = నిట్టూర్పువిడచుచు, శనైః = మెల్లగా, అశంసత్ = పలికెను.

## సమాసములు :

*భిన్నమర్మా :* భిన్నం మర్మ యస్య సః = భిన్నమర్మా.

*తదార్తికాకుభిః :* తస్యాః ఆర్తిః = తదార్తిః. తదార్త్యా కాకవః = తదార్తికాకవః. తైః = తదార్తికాకుభిః.

*స్వదూతధర్మాత్ :* దూతస్య ధర్మః = దూతధర్మః. స్వస్య దూతధర్మః = స్వదూతధర్మః. తస్మాత్ = స్వదూతధర్మాత్.

*విచిత్రవాక్చిత్రశిఖణ్డినన్దనః :* విచిత్రాశ్చ తాః వాచశ్చ = విచిత్రవాచః. చిత్రశిఖణ్డినః నన్దనః = చిత్రశిఖణ్డినన్దనః. విచిత్రవాక్షు చిత్రచిఖణ్డినన్దనః = విచిత్రవాక్చిత్రశిఖణ్డినన్దనః.

## భావము :

నానావిధచమత్కారస్ఫూర్తులు గల మాటలయందు బృహస్పతియైన, నలుఁడు, ఆదమయన్తి తన బాధచేఁ బలుకు దీనవచనములతో హృదయ భేదనమునుఁ బొందినను లేదా కామవేదననుఁ గల్గి యున్నను తన దూత ధర్మము నుండి విరమింప నిచ్చగించలేదు. ధీరోదాత్తుఁ డగుటవలనఁ దానుగా నామెను వరింపఁగోరలేదు. కాని గూఢముగా కామపీడచే నిట్టూర్పులు విడచుచు మెల్లగాఁ బలుకఁదొడగెను. ॥23॥

శ్లో॥ దివోధవస్త్వాం యది కల్పశాఖినం
కదాఽపి యాచేత నిజాఙ్గణాలయమ్।
కథం భవేదస్య న జీవితేశ్వరీ
న మోఘయాచ్ఞః స హి భీరు భూరుహః॥ 24

ప॥వి॥ దివః । ధవః । త్వాం । యది । కల్పశాఖినం । కదా । అపి । యాచేత । నిజాఙ్గణాలయమ్ । కథం । భవేః । అస్య । న । జీవితేశ్వరీ । న । మోఘయాచ్ఞః । సః । హి । భీరు । భూరుహః.

టీక॥ హేభీరు = ఓభయశీలురాలా! దివః = స్వర్గమునకు ధవః = భర్తయగు నిన్ద్రుఁడు, కదాపి = ఎప్పుఁడైనను, నిజాఙ్గణాలయం; నిజాఙ్గణ = తనముంగిలినే, ఆలయం = స్థానముగాఁగల్గిన, కల్పశాఖినం = కల్పవృక్షమును, త్వాం = నిన్ను గూర్చి, యాచేతయది = యాచించియున్నచో, తదా = అప్పుడు, కథం = ఎట్లు, అస్య = ఇతనికి, జీవితేశ్వరీ = భార్యగ, నభవేః = కానేరవు? హి = ఏలయనగా, భూరుహః = కల్పవృక్షము, మోఘయాచ్ఞః; మోఘ = వ్యర్థమైన, యాచ్ఞః = యాచనగలదిగ, న = కాదు.

## సమాసములు :

*నిజాఙ్గణాలయమ్ :* నిజం చ తత్ అఙ్గణం చ = నిజాఙ్గణం. నిజాఙ్గణమ్ ఆలయః యస్య సః = నిజాఙ్గణాలయః. తమ్ = నిజాఙ్గణాలయం.

*జీవితేశ్వరీ :* జీవితస్య ఈశ్వరీ = జీవితేశ్వరీ.

మోఘయాచ్ఞః: మోఘా యాచ్ఞా యస్య సః = మోఘయాచ్ఞః.

*భూరుహః :* భువః రోహతీతి = భూరుహః.

## భావము :

ఓభయశీలురాలా! స్వర్గాధిపతి యైన యిన్ద్రుఁడు ఎప్పుడైనను తన యింటి ముంగిట నున్న కల్పవృక్షమును నిన్నుఁ గూర్చి యాచించినచో, నప్పుడు నీవెట్లీ యింద్రునికి జీవితేశ్వరివి కాక పోయెదవు? ఏల యనగా కల్పవృక్షమును యాచించినచో నా యాచన వృథా గాదు. ॥24॥

శ్లో॥ శిఖీ విధాయ త్వదవాప్తికామనాం
స్వయం హుతస్వాంశహవిః స్వమూర్తిషు।
క్రతుం విధత్తే యది సార్వకామికం
కథం స మిథ్యాఽస్తు విధిస్తు వైదికః॥ ౭౫

ప॥వి॥ శిఖీ । విధాయ । త్వదవాప్తికామనాం । స్వయంహుతస్వాంశహవిః । స్వమూర్తిషు । క్రతుం । విధత్తే । యది । సార్వకామికం । కథం । సః । మిథ్యా । అస్తు । విధిః । తు । వైదికః.

టీక॥ శిఖీ = అగ్ని, త్వదవాప్తికామనాం; త్వదవాప్తి = నిన్నుఁబొందుటకైన, కామనాం = కోరికను, విధాయ = చేసి, స్వమూర్తిషు = తనశరీరములైనయాహవనీయాదులయందు, స్వయంహుతస్వాంశహవిః; స్వయం = స్వయముగా, హుత = వ్రేల్వఁబడిన, స్వాంశ = తనభాగమైన, హవిః = హవిస్సులు గల్గినవాఁడై, సార్వకామికం = సమస్తకామములనుఁదీర్చెడి, క్రతుం = యజ్ఞమును, విధత్తేయది = చేసినచో, తదా = అప్పుడు, సః = ఆ, వైదికః = వేదమూలకమైన, విధిః = అనుష్ఠానము, కథంతు = ఎట్లు, మిథ్యా = అసత్యము, అనగానిష్ఫలము, అస్తు = అగును.

## సమాసములు :

త్వదవాప్తికామనాం : తవ అవాప్తిః = త్వదవాప్తిః. త్వదవాప్తౌ కామనా = త్వదవాప్తికామనా. తాం = త్వదవాప్తికామనాం.

స్వయంహుతస్వాంశహవిః : స్వయం హుతః = స్వయంహుతః. స్వస్య అంశః = స్వాంశః. స్వయం హుతశ్చాసౌ స్వాంశశ్చ = స్వయంహుతస్వాంశః. స్వయంహుతస్వాంశః హవిః యస్య సః = స్వయంహుతస్వాంశహవిః.

స్వమూర్తిషు : స్వస్య మూర్తయః = స్వమూర్తయః. తాసు = స్వమూర్తిషు.

సార్వకామికం : సర్వశ్చాసౌ కామశ్చ = సర్వకామః. సర్వకామః ప్రయోజనం అస్యేతి = సార్వకామికః. తమ్ = సార్వకామికమ్.

వైదికః : వేదస్య అయం = వైదికః.

**భావము :**

అగ్నిదేవుఁడు నిన్నుఁ బొందఁదగోరికతో తన శరీరములైన యాహవనీయాదులయందు తానుగా వ్రేల్చిన తనహవిర్భాగములననగా "నగ్నయేస్వాహా" ఇత్యాది మన్త్రములచేఁదనకై విడువఁ బడిన హవిర్భాగములు గలవాఁడై సర్వకామప్రద మైనయజ్ఞమునుఁ జేసినచో నప్పుడా వైదికకృత్య మెట్లు వ్యర్థ మగును? కావున నీవు అగ్నిదేవుఁ డనుష్ఠించెడి యాగము ననుసరించి యగ్నికి స్వాధీనముకావలసి యుండును. వేదవిహితకర్మ లెన్నిటికిని నిష్ఫలములు కావు. ॥౭౫॥

శ్లో॥ సదా తదాశామధితిష్ఠతః కరం
వరం ప్రదాతుం వలితాద్బలాదపి ।
మునేరగస్త్యాద్వృణుతే సధర్మరాడ్
యది త్వదాప్తిం భణ కా తదా గతిః॥ ౭౬

ప॥వి॥ సదా । తదాశామ్ । అధితిష్ఠతః । కరం । వరం । ప్రదాతుం । వలితాత్ । బలాత్ । అపి । మునేః । అగస్త్యాత్ । వృణుతే । సః । ధర్మరాట్ । యది । త్వదాప్తిం । భణ । కా । తదా । గతిః.

టీక॥ సః = ఆ, ధర్మరాడ్ = యముఁడు, సదా = ఎల్లప్పుఁడు, తస్య = అతనియొక్క, ఆశాం = దిక్కును, అనగా దక్షిణదిక్కును, అధితిష్ఠతః = అతిష్ఠించియున్న, (కావుననే), బలాదపి = బలమువలనను, వరమేవ = వరమేయనెడు, కరం = పన్నును, ప్రదాతుం = ఇచ్చుటకు, వలితాత్ = ప్రయత్నించిన, మునేః = మునియైన, అగస్త్యాత్ = అగస్త్యునినుండి, త్వదాప్తిం = నీప్రాప్తిని, వృణుతేయది = కోరినచో, తదా = అప్పుడు, కా = ఏమి, గతిః = గతి? భణ = చెప్పుము.

**సమాసములు :**

తదాశాం : తస్య ఆశా = తదాశా. తామ్ = తదాశాం,
ధర్మరాట్ : ధర్మస్య రాట్ = ధర్మరాట్.

త్వదాప్తిం : తవ అప్తిః = త్వదాప్తిః. తామ్ = త్వదాప్తిం.

**భావము :**

ఆ యమధర్మరాజు నిరన్తరము తన దక్షిణదిక్కున నివసించుటచేఁ బన్నుఁ జెల్లించుటకు బదులు బలవన్తముగా వరము నిచ్చుటకై యుద్యుక్తుఁడైన యగస్త్యునినుండి నీ ప్రాప్తినే వరముఁగాఁ గోరినచో అప్పు డేమి గతిః అట్టి మహాముని యగు నగస్త్యుని వారించువా రెవ్వరుః ఆయనకు శక్యముకాని పని యేమున్నదిః ॥౭౮॥

శ్లో॥ క్రతోః కృతే జాగ్రతి వేత్తి కః కతి
ప్రభోరపాం వేశ్మని కామధేనవః ।
త్వదర్థమేకామపి యాచతే స చేత్
ప్రచేతసః పాణిగతైవ వర్తసే॥ ౭౭

ప॥వి॥ క్రతోః । కృతే । జాగ్రతి । వేత్తి । కః । కతి । ప్రభోః । అపాం । వేశ్మని । కామధేనవః । త్వదర్థమ్ । ఏకామ్ । అపి । యాచతే । సః । చేత్ । ప్రచేతసః । పాణిగతా । ఏవ । వర్తసే.

టీక॥ క్రతోఃకృతే=యాగముకొఱకు, అపాం=ఉదకములకు, ప్రభోః = రాజైనవరుణునియొక్క, వేశ్మని = ఇంటియందు, కతి = ఎన్ని, కామధేనవః=కామధేనువులు, జాగ్రతి=వెలయుచున్నవో, కః = ఎవ్వడు, వేత్తి = తెలుసుకొనుచున్నాడుః సః = ఆవరుణుఁడు, త్వదర్థం = నీకొఱకు, అనగానిన్నుఁబొందుటకొఱకు, ఏకామపి = ఒక్కకామధేనువునైనను, యాచతేచేత్=యాచించినచో (తర్హి = అప్పుఁడు), ప్రచేతసః=వరుణునికి, పాణిగతైవ = హస్తమునుఁబొందినదానవుగనే, వర్తసే=ఉన్నావు.

**సమానములు :**

త్వదర్థం : తుభ్యం=త్వదర్థం.

*పాణిగతా :* పాణిం గతా=పాణిగతా.

**భావము :**

యజ్ఞమునకుఁగావలసిన పాలు మున్నగు హవిస్సుల నొసంగుటకై జలాధిపతి యగు వరుణునింట కామధేనువులెన్ని యున్నవో ఎవరికిఁ దెలుసును? అనగా నతని యింట పెక్కు కామధేనువులున్నవి. అతడు వానిలో నొక కామధేనువును యాచించినచో నప్పుడే నీవు వరుణునిచేతఁ జిక్కఁగలవు. అప్పుడు నిన్ను విడిపించువాఁ డెవఁడు? ॥౭౭॥

శ్లో॥ న సన్నిధాత్రీ యది విఘ్నసిద్ధయే
పతివ్రతా పత్యురనిచ్ఛయా శచీ ।
స ఏవ రాజవ్రజవైశసాత్ కుతః
పరస్పరస్పర్ధి వరః స్వయంవరః ॥ ౭౮

ప॥వి॥ న । సన్నిధాత్రీ । యది । విఘ్నసిద్ధయే । పతివ్రతా । పత్యుః । అనిచ్ఛయా । శచీ । సః । ఏవ । రాజవ్రజవైశసాత్ । కుతః । పరస్పరస్పర్ధివరః । స్వయంవరః.

టీక॥ కిఞ్చ = మఱియు, పతివ్రతా = పతివ్రతయైన. శచీ = శచీదేవి, పత్యుః = భర్తయైన యిన్ద్రునియొక్క, అనిచ్ఛయా = అసమ్మతిచే, విఘ్నసిద్ధయే = స్వయంవరమునకు విఘాత మేర్పడుటకై, సన్నిధాత్రీ నయది = ఉపస్థితురాలుకానిచో, రాజవ్రజవైశసాత్; రాజవ్రజ = రాజసంఘమునకు, వైశసాత్ = పరస్పర విరోధమువలన, పరస్పరస్పర్ధి వరః; పరస్పర = ఒండొరులతో, స్పర్ధి = జగడమాడెడు, వరః = వరులు, అనగా వివాహమాడెడు వారు కల్గిన, స్వయంవరః = స్వయంవరమే, కుతః = ఎక్కడిది. (నలవరణం = నలునివరించుట, కుతస్తరాం = అసలెక్కఁడ.)

**సమాసములు :**

విఘ్నసిద్ధయే : విఘ్నానాం సిద్ధిః = విఘ్నసిద్ధిః. తస్యై = విఘ్నసిద్ధయే.

పతివ్రతా : పత్యౌ వ్రతం యస్యాస్సా = పతివ్రతా.

అనిచ్ఛయా : న ఇచ్ఛా = అనిచ్ఛా. తయా = అనిచ్ఛయా.

రాజవ్రజవైశసాత్ : రాజ్ఞాం వ్రజః = రాజవ్రజః. విశసతీతి = విశసః. విశసస్య కర్మ = వైశసం. రాజవ్రజస్య వైశసం = రాజవ్రజ వైశసం. తస్మాత్ = రాజవ్రజవైశసాత్.

పరస్పరస్పర్ధివరః : పరస్పరంస్పర్ధన్త ఇతి = పరస్పరస్పర్ధినః, పరస్పరస్పర్ధినఃవరాః యస్మిన్ సః = పరస్పరస్పర్ధివరః.

**భావము :**

శచీదేవి తన భర్త యగు నిన్ద్రునకు సమ్మతి లేనందువలన పతివ్రత యైన తాను స్వయంవరమునకు రానిచో, అనగా స్వయంవరకాలమునందు సన్నిహితురాలు కానిచో దానికి విఘ్నము లేర్పడును. అప్పు డొండొరులపైన నొండొరులకు వైర ముండుట వలన వివాహార్థమై వచ్చిన వరులు పరస్పరము కలహించు కొనినచో స్వయంవర మెట్లు జరుగును? అది జరగనిచో నీ వెట్లు నలుని వరింతువు? శచీదేవి స్వయంవరములయందును గౌరి వివాహముల యందును విఘ్నములను వారించెడి దేవతలుగాఁ బూజింపఁబడెదరు. ఇన్ద్రుని నీవు వరించనందువలన పతివ్రత యగు శచీదేవి స్వయంవరమునకు విఘ్నములు కలుగుటకై యిన్ద్రుని యనుమతితో రాకపోవచ్చును. అందువలన స్వయం వరమునందు విఘ్నప్రసక్తియు, దానివలన రాజన్యకలహములు, దానివలన స్వయంవరమున కుపరోధములు కలుగును. దానివలన నీవు నలుని వరించుట యసంభవ మని యెఱుంగుము. ॥౭౮॥

శ్లో॥ నిజస్య వృత్తాన్తమజానతాం మిథో
ముఖస్య రోషాత్ పరుషాణి జల్పతః ।
మృధం కిమచ్ఛత్రకదణ్డతాణ్డవం
భుజాభుజి క్షోణిభుజాం దిదృక్షసే ॥ ౭౯

ప॥వి॥ నిజస్య । వృత్తాన్తమ్ । అజానతాం । మిథః । ముఖస్య । రోషాత్ । పరుషాణి । జల్పతః । మృధం । కిమ్ । అచ్ఛత్రకదణ్డతాణ్డవం । భుజాభుజి । క్షోణిభుజాం । దిదృక్షసే.

టీక॥ మిథః = పరస్పరము, రోషాత్ = రోషమువలన, పరుషాణి = కఠిన వచనములను, జల్పతః = పలుకుచున్న, నిజస్య = తమదైన, ముఖస్య = నోటియొక్క, వృత్తాన్తం = సమాచారమును, అనగా నోటవచ్చినసంగతిని, అజానతాం = తెలియనటువంటి, క్షోణిభుజాం = రాజులకు, (ఆయుధములు భగ్నములుకాగా) అచ్ఛత్రక దణ్డతాణ్డవం; అచ్ఛత్రక = గొడుగులుతొలగిన, దణ్డ = (గొడుగు) కఱ్ఱలయొక్క, తాణ్డవం = నాట్యమనెడి, మృధం = యుద్ధము, అనగా దణ్డములతోనొండొరులకొట్టుకొనుటయనెడిదణ్డాదణ్డియు, తథా = అట్లే (దండములు విఱిగిపోగా) భుజాభుజి = భుజములతో నొండొరుల కొట్టుకొనుటయనెడి బాహుయుద్ధమును, దిదృక్షసే = చూడఁగోరు చున్నావు.

## సమాసములు :

అజానతాం : న జానన్తః = అజానన్తః. తేషాం = అజానతాం.

అచ్ఛత్రకదణ్డతాణ్డవం : అవిద్యమానం ఛత్రం యేషాం తే = అచ్ఛత్రకాః. అచ్ఛత్రకాశ్చ తే దణ్డాశ్చ = అచ్ఛత్రకదణ్డాః. అచ్ఛత్రక దణ్డానాం తాణ్డవం = అచ్ఛత్రకదణ్డతాణ్డవం. తత్ = అచ్ఛత్రకదణ్డతాణ్డవం.

భుజాభుజి : భుజైశ్చ భుజైశ్చ ప్రహృత్య ఇదం యుద్ధం ప్రవృత్తం భుజాభుజి.

క్షోణిభుజాం : క్షోణిం భుఞ్జత ఇతి = క్షోణిభుజః. తేషాం = క్షోణి భుజాం.

## భావము :

ఓదమయన్తీ! రోషముతో నొండొరులనుఁ గూర్చి కఠినముగా నఱచు కొనుచు తమతమ నోళ్లలో నేమి వచ్చుచున్నది తెలియని రోషాన్ధులైన రాజులలో మడిచిన గొడుగుల కఱ్ఱలతోడను, నాకఱ్ఱలు విఱిగిపోగా, నొండొరుల భుజములతోడనుఁగొట్టుకొనుచు జరుగఁబోవు దణ్డాదణ్డి, భుజాభుజి యుద్ధములనుఁజూడఁగోరుచున్నావు. ॥౭౫॥

శ్లో॥ అపార్థయన్ యాజ్ఞిక ఫూత్కృతిశ్రమం
జ్వలేద్రుషా చేద్వపుషా తు నాఽనలః ।
అలం నలః కర్తుమనగ్నిసాక్షికో
విధిం వివాహే తవ సారసాక్షి! కమ్॥ ౭౦

ప॥వి॥ అపార్థయన్ । యాజ్ఞికఫూత్కృతిశ్రమం । జ్వలేత్ । రుషా । చేత్ । వపుషా । తు । న । అనలః । అలం । నలః । కర్తుమ్ । అనగ్నిసాక్షికః । విధిం । వివాహే । తవ । సారసాక్షి । కమ్.

టీక॥ హేసారసాక్షి!=ఓకమలాక్షీ, తవ=నీయొక్క, వివాహే = పెండ్లియందు, అనలః=అగ్ని, యాజ్ఞికఫూత్కృతిశ్రమం; యాజ్ఞిక = పురోహితుసయొక్క, ఫూత్కృతి=ఫూత్కారమువలని, శ్రమమ్=శ్రమను, అనగా చక్కగామండుటకై, యగ్నిని గొట్టముతో నూదుటవలని శ్రమను, అపార్థయన్=వ్యర్థముఁగావించుచు, రుషా=రోషముచేతనే, జ్వలేత్=జ్వలించును, వపుషాతు=శరీరముచేతనో, నజ్వలేత్‌చేత్=జ్వలింపనిచో, తదా=అప్పుడు, నలః=నలుఁడు, అనగ్నిసాక్షికః= అగ్నిసాక్షిలేనివాఁడై, తం = దానిని, కం = ఏ, విధిం = విధిగా, కర్తుం=చేయుటకు, అలం=సమర్థుఁడగును

## సమాసములు :

యాజ్ఞికఫూత్కృతిశ్రమం: యాజ్ఞికానాం ఫూత్కృతిః = యాజ్ఞికఫూత్కృతిః. యాజ్ఞికఫూత్కృతిరేవ శ్రమః=యాజ్ఞిక ఫూత్కృతిశ్రమః. తమ్= యాజ్ఞికఫూత్కృతిశ్రమం.

అనగ్నిసాక్షికః : అగ్నిః సాక్షీ యస్య సః=అగ్నిసాక్షికః. న అగ్నిసాక్షికః=అనగ్నిసాక్షికః.

హేసారసాక్షి : సారసే ఇవ అక్షిణీ యస్యాస్సా=సారసాక్షీ. తస్యాః సంబుద్ధిః = హేసారసాక్షి

## భావము :

ఓ కమలాక్షి! నీ వివాహమందగ్ని యాజ్ఞికుని ఫూత్కారశ్రమను వ్యర్థ

పఱచుచు నీవు తన్నుఁబరిణయమాడలేదని రోషముతోనే జ్వలించును కాని శరీరముతో జ్వలింపదు. అట్లు జ్వలింపనిచో నలుఁడు, అగ్నిలేనందువలన, నగ్నిసాక్షి లేక లాజహోమాదుల నెట్లు చేయఁగలుగును. నీవు అగ్నిని తిరస్కరించితివి గాన నగ్నిని పురోహితు డెంత ఊదినను నీపై కోపమువలన జ్వలింపదు. కేవలము పొగనుఁ జిమ్ముచుండును. కాని జ్వాలారూపుడై యుండదు. కాన పరిణయము అగ్నిసాక్షికము గాక ధూమసాక్షికముగనే యగును. అది శాస్త్రవిరుద్ధము. ॥౮౦॥

శ్లో॥ పతింవరాయాః కులజం వరస్య వా
యమః కమప్యా చరితాతిథిం యది।
కథం న గన్తా విఫలీభవిష్ణుతాం
స్వయంవరః సాధ్వి! సమృద్ధిమానపి॥ ౮౧

ప॥వి॥ పతింవరాయాః । కులజం । వరస్య । వా । యమః । కమ్ । అపి । ఆచరితా । అతిథిం । యది । కథం । న । గన్తా । విఫలీభవిష్ణుతాం । స్వయంవరః । సాధ్వి । సమృద్ధిమాన్ । అపి.

టీక॥ (కిఞ్చ=మఱియు) యమః = యమధర్మరాజు, పతింవరాయాః = భర్తనువరించెడి వధువునకు సంబంధించినవానిని గాని, వరస్యవా = వివాహముఁ జేసికొను వరునికి సంబంధించినవానిని గాని, కులజం = కులమునందుఁబుట్టిన, కమపిజనం = ఎవనినో యొకనిని, అతిథిం = అతిథిగా, ఆచరితా యది = చేయఁగలిగినచో అనగా చంపినచో, సమృద్ధిమానపి = సర్వసాధనములతోఁగూడినదైనను, స్వయంవరః = స్వయంవర మహోత్సవము, హేసాధ్వి = ఓశీలవతీ! విఫలీభవిష్ణుతాం = విఫలముగాఁ బోవుటను, కథం, ఎట్లు, నగన్తా = పొందదు.

సమాసములు :

**పతింవరాయాః :** పతిం వృణోతీతి = పతింవరా. తస్యాః = పతింవరాయాః.

**కులజం :** కులే జాయత ఇతి = కులజః. తమ్ = కులజం.

విఫలీభవిష్ణుతాం : అవిఫలః విఫలః సమ్పద్యమానః భవిష్ణుః = విఫలీభవిష్ణుః. విఫలీభవిష్ణోః భావః = విఫలీభవిష్ణుతా. తాం = విఫలీభవిష్ణుతాం.

సమృద్ధిమాన్ : సమృద్ధిః అస్యాఽస్తీతి = సమృద్ధిమాన్.

భావము :

ఓశీలవతీ! పతిని వరించెడి వధువు వంశమునకుఁ జెందినవానినిగాని వరునివంశమునకుఁజెందినవానినిఁ గాని యముఁడు తనకు నతిథిఁగా జేసి కొనినచో, ననగా మరణింపఁజేసినచో. సర్వసాధనములతోఁ గూడిన స్వయంవరమహోత్సవము వ్యర్థము కాదా! తప్పక వ్యర్థ మగును. ॥౮౧॥

శ్లో॥ అపాంపతిః స్వామితయా పరః సురః
స తా నిషేధేద్యది నైషధక్రుధా।
నలాయ లోభాయతపాణయేఽపి తత్
పితా కథం త్వాం వద సమ్ప్రదాస్యతే॥ ౮౨

ప॥వి॥ అపాం । పతిః । స్వామితయా । పరః । సురః । సః । తాః । నిషేధేత్ । యది । నైషధక్రుధా । నలాయ । లోభాయతపాణయే । అపి । తత్ । పితా । కథం । త్వాం । వద । సంప్రదాస్యతే.

టీక॥ హేసాధ్వి! = ఓశీలవతీ! అపాం = ఉదకములకు, పతిః = ప్రభువైన, సః = ఆ, ప్రసిద్ధుడైన, పరః = శ్రేష్ఠుడైన, సురః = వేల్పైన, వరుణుఁడు, స్వామితయా = ఉదకములకుఁప్రభువగుటచే, నైషధక్రుధా = నలునియందలికోపముచే, తాః = అయుదకములను, నిషేధేద్యది = నిషేధించినచో, తత్ = అప్పుడు, లోభాయతపాణయేఽపి; లోభ = ఆశచేత, ఆయత = చాపఁబడిన, పాణయేఽపి = చేయికలవాడైనప్పటికిని, నలాయ = నలునికొఱకు, పితా = నీతండ్రియైనభీముఁడు, కథం = ఎట్లు, సమ్ప్రదాస్యతే = ఈయఁగలడు? వద = చెప్పుము.

**సమాసములు :**

స్వామితయా : స్వమ్ అస్యాఽస్తీతి = స్వామీ. స్వామినః భావః = స్వామితా. తయా = స్వామితయా

నైషధక్రుధా : నిషధానాం రాజా = నైషధః. నైషధే క్రుధ్ = నైషధక్రుధ్. తయా = నైషధక్రుధా.

లోభాయతపాణయే : లోభేన ఆయతః = లోభాయతః. లోభాయతః పాణిః యస్య సః = లోభాయతపాణిః. తస్మై = లోభాయతపాణయే.

**భావము :**

ఓశీలవతీ! జలాధిపతి యగు వరుణుఁడు నలునిపైఁ గోపముతో, ఉదకములను నిషేధించినచో, లోభముతో నలుఁడు నీకై చేయినిఁ జాచినచో, నీరు లేక, నీ తండ్రి నిన్నెట్లు దానముఁ జేయఁగలడు. దానము ఉదక పూర్వకముగాఁ జేయవలయునే గాని యూరక చేయుట శాస్త్రవిరుద్ధము. ॥౮౨॥

శ్లో॥ ఇదం మహత్తేభిహితం హితం మయా
విహాయ మోహం దమయన్తి చిన్తయ।
సురేషు విఘ్నైకపరేషు కో నరః
కరస్థ మప్యర్థమవాప్తుమీశ్వరః॥ ౮౩

ప॥వి॥ ఇదం । మహత్ । తే । అభిహితం । హితం । మయా । విహాయ । మోహం । దమయన్తి । చిన్తయ । సురేషు । విఘ్నైకపరేషు । కః । నరః । కరస్థమ్ । అపి । అర్థం । అవాప్తుం । ఈశ్వరః.

టీక॥ హేదమయన్తి = ఓ దమయన్తీ! మయా = నాచేత, ఇదం = ఈ, మహత్, గొప్పదైన, హితం = మేలు, తే = నీకై, అభిహితం = చెప్పఁబడినది. మోహం = మౌఢ్యమును, విహాయ = వదలి, చిన్తయ = ఆలోచింపుము, తథాహి = అదియుక్తమే. సురేషు = వేల్పులు, విఘ్నై పరేషు సత్సు; విఘ్నములనుఁజేయుటయందే పట్టుదలఁ గల్గియున్నచో, కః = ఏ,

నరః = మనుష్యుఁడు, కరస్థమపి = చేతనున్నదైనను, అర్థం = వస్తువును అనగా ధనమును, ఆప్తుం = పొందుటకు, ఈశ్వరః = సమర్థుఁడు.

వి॥ దేవతలు విఘ్నములు కలిగించినచో, చేతనున్న వస్తువునుగూడ మనుష్యు డెవ్వడు పొందఁగల డను సామాన్యముచే, దమయన్తికి నలప్రాప్తికై దైవప్రాతికూల్యాదిరూప మైన విశేషార్థము సమర్థితము గాన నర్థాన్తర న్యాసాలఙ్కారము.

## సమాసములు :

విఘ్నైకపరేషు : విఘ్నః ఏవ ఏకః పరః యేషాన్తే = విఘ్నైకపరాః. తేషు = విఘ్నైకపరేషు.

## భావము :

ఓ దమయన్తీ! నీకింతవరకునుఁ జెప్పవలసిన హితమునుఁ జెప్పినాను మౌఢ్యమును వదలి యాలోచింపుము. దేవతలతోఁ దగవు కూడదు. దేవతలు విఘ్నములను జేయఁదొడగినచో మనుష్యుడు తన చేతనున్నవస్తువునుఁ గూడ పొందలేడు గదా! ॥౮౩॥

శ్లో॥ ఇమా గిరస్తస్య విచిన్త్య చేతసా
తథేతి సమ్ప్రత్యయమాససాద సా।
నివారితావగ్రహనీరనిర్ఝరే
నభోనభస్యత్వమల మ్భయద్దృశౌ॥ ౮౪

ప॥వి॥ ఇమాః । గిరః । తస్య । విచిన్త్య । చేతసా । తథా । ఇతి । సమ్ప్రత్యయమ్ । ఆససాద । సా । నివారితావగ్రహనీరనిర్ఝరే । నభోనభస్యత్వమ్ । అలమ్భయత్ । దృశౌ.

టీక॥ సా = ఆదమయన్తి, ఇమాః = ఈ, తస్య = ఆ నలునియొక్క. గిరః = మాటలను, చేతసా = మనస్సుచే, విచిన్త్య = ఆలోచించి, తథేతి = అట్లే యని, సమ్ప్రత్యయం = విశ్వాసమును. ఆససాద = పొందినది. అథ = పిదప, నివారితావగ్రహనీరనిర్ఝరే, నివారిత = తొలగింపఁబడిన, అవ

గ్రహా = ప్రతిబంధము గల్గిన, నీరనిర్ఝరే = జలప్రవాహముఁగల, దృశౌ = నేత్రములను, నభోనభస్యత్వం = శ్రావణత్వమును, భాద్రపద త్వమును, అలమ్భయత్ = పొందించినది.

## సమాసములు:

*నివారితావగ్రహనీరనిర్ఝరే :* నీరస్య నిర్ఝరః = నీరనిర్ఝరః. నివారితః అవగ్రహః యయోస్తౌ = నివారితావగ్రహౌ = నివారితావగ్రహౌ నీరనిర్ఝరౌ యయోస్తే = నివారితావగ్రహనీరనిర్ఝరే. తే = నివారితావగ్రహనీర నిర్ఝరే.

*నభోనభస్యత్వం :* నభాశ్చ నభస్యశ్చ = నభోనభస్యౌ. నభోనభస్యయోః భావః = నభోనభస్యత్వం.

## భావము :

నలుని మాటలను విని దమయన్తి యట్లే యని విశ్వాసమునుఁబొందినది. అనగా దేవతలు విఘ్నములు గల్గించునపుడు మానవులేమియు చేయలేరు అని నలుఁడు చెప్పిన విషయములను నమ్మినది. తర్వాత నెద్దడి తీరగనే, నీటి వెల్లువలతో నిండిన తననేత్రములను శ్రావణ భాద్రపదమాసములనుఁ గావించినది. దైవప్రాతికూల్యమును విని దుఃఖింపఁ దొడగినది. శ్రావణ భాద్రపదములు వర్షర్తువు గాన, తన కన్నులను వర్షర్తుప్రవాహముచే నింపుకొనిన దనిభావము.. ॥౮౪॥

శ్లో॥ స్ఫుటోత్పలాభ్యామలిదమ్పతీవ త
ద్విలోచనాభ్యాం కుచకుడ్మలాశయా ।
నిపత్య బిన్దూ హృది కజ్జలావిలౌ
మణీవ నీలౌ తరలౌ విలేసతుః॥ ౮౫

ప॥వి॥ స్ఫుటోత్పలాభ్యామ్ । అలిదమ్పతీ । ఇవ । తద్విలోచనాభ్యాం । కుచకుడ్మలాశయా । నిపత్య । బిందూ । హృది । కజ్జలావిలౌ। మణీ। ఇవ। నీలౌ । తరలౌ । విలేసతుః.

టీక॥ అథ = పిదప, కజ్జలావిలౌ; కజ్జల = కాటుకచే, ఆవిలౌ = మలినములైన, బిన్దూ = కన్నీటిబొట్టులు, తద్విలోచనాభ్యాం = ఆమె నేత్రములనెడి, స్ఫుటోత్పలాభ్యాం; స్ఫుట = వికసించిన, ఉత్పలాభ్యాం = కలువలచే, అలిదమ్పతీవ = తుమ్మెదలజంటవలె, కుచకుడ్మలాశయా; కుచ = స్తన ములనెడి, కుడ్మల = మొగ్గలపై, ఆశయా = ఆశచే, హృది = వక్షము పైన, నిపత్య = వ్రాలి, తరలౌ = చఞ్చలములైన, నీలమణీఇవ = హారమధ్యమందలి యింద్రనీలమణులవలె, విలేసతుః = ప్రకాశించినవి.

## సమాసములు :

స్ఫుటోత్పలాభ్యాం: స్ఫుటే చ తే ఉత్పలే చ = స్ఫుటోత్పలే. తాభ్యాం = స్ఫుటోత్పలాభ్యాం.

అలిదమ్పతీ : జాయా చ పతిశ్చ = దమ్పతీ. అల్యోః దమ్పతీ = అలిద మ్పతీ.

కజ్జలావిలౌ : కజ్జలేన ఆవిలౌ = కజ్జలావిలౌ.

## భావము :

ఆ దమయన్తి కనుదోయి యనెడి కలువల నుండి కాటుకచే నల్లనైన కన్నీటి బిందువులు తుమ్మెదల జంటవలె నామె చనుదోయి యనెడి మొగ్గలపైన వ్రాలినవి. చఞ్చలములైన యా తుమ్మెదలు హారమధ్యమునందు నిటునటు కదలుచున్న యిన్ద్రనీలమణుల వలెఁ బ్రకాశించినవి. ॥౮౫॥

శ్లో॥ ధుతా పతత్పుష్పశిలీముఖాశుగైః
శుచేస్తదాసీత్ సరసీరసస్య సా ।
రసాయ బద్ధాదరయాఽశ్రుధారయా
సనాలనీలోత్పల నీలలోచనా॥ ౮౬

ప॥వి॥ ధుతా । పతత్పుష్పశిలీముఖాశుగైః । శుచేః । తదా । ఆసీత్ । సరసీ । రసస్య । సా । రసాయ । బద్ధాదరయా । అశ్రుధారయా । సనాల నీలోత్పలనీలలోచనా.

టీక॥ పతత్పుష్పశిలీముఖాశుగైః, పతత్ = రాలుచున్న, పుష్ప = పూవులనెడి, శిలీముఖ = బాణములుగలమన్మథునియొక్క, ఆశుగైః = శరములచేతను, పతత్ = రాలుచున్న! పుష్ప = పుష్పములు. శిలీముఖ = తుమ్మెదలు గల్గిన, ఆశుగైః = వాయువులచేతను, ధుతా = కదలింపఁబడినదియు, రయాయ = వేగమునకై, బద్ధాదరయా = ఆదరమునువహించిన, అనగా వేగముతోఁగూడిన, అశ్రుధారయా = కన్నీటిధారచే, సనాలనీలోత్పల లీలలోచనా;సనాల = కాడతోఁగూడిన, నీలోత్పల = నల్లకలువలయొక్క, లీల = శోభమును వహించిన, లోచనా = నేత్రములుగల, సా = అదమయన్తి, తదా = అప్పుడు, శుచేఃరసస్య = విప్రలమ్భశృఙ్గార రసమునకును, శుచేః = గ్రీష్మమునకు సంబంధించిన, రసస్య = రసమైనజలమునకును, సరసీ = కొలనుగా, ఆసీత్ = ఆయెను.

వి॥ ఇచ్చట దమయన్తిని శృఙ్గారమునకును, ఎండకును కొలను వలె రూపించుటవలన రూపకము. అది "పతత్పుష్పశిలీముఖాశుగా" దిస్థలములలోని శ్లేషతోఁడను, సనాలనీలోత్పలలీలలోచనా యను నెడ నున్న యుపమతోఁడనుఁగూడినందువలన వానితో రూపకమునకు సఙ్కరము.

## సమాసములు :

*పతత్పుష్పశిలీముఖాశుగైః :* పుష్పాణి శిలీముఖాః యస్య సః = పుష్పశిలీముఖః. పుష్పశిలీముఖస్య ఆశుగాః = పుష్పశిలీ ముఖాశుగాః. పతన్తశ్చ తే పుష్పశిలీముఖాశుగాశ్చ = పతత్పుష్పశిలీముఖాశుగాః. తైః = పతత్పుష్పశిలీముఖాశుగైః.

*బద్ధాదరయా :* బద్ధః ఆదరః యయా సా = బద్ధాదరా. తయా = బద్ధాదరయా.

*అశ్రుధారయా :* అశ్రూణాం ధారా = అశ్రుధారా. తయా = అశ్రుధారయా.

*సనాలనీలోత్పలలీలలోచనా :* నాలేన సహ వర్తత ఇతి = సనాలం. నీలం చ తత్ ఉత్పలం చ = నీలోత్పలం. సనాలం చ తత్ నీలోత్పలం

చ = సనాలనీలోత్పలం. సనాలనీలోత్పలస్య లీలేవ లీలా యయోస్తే = సనాలనీలోత్పలలీలే. సనాలనీలోత్పలీలే లోచనే యస్యాస్సా = సనాలలీలోత్పల లీలలోచనా.

భావము :

ఆ దమయన్తి తనపైఁ బడుచున్న మన్మథునియొక్క బాణములచేతను, రాలుచున్న పూవులతోడను, తుమ్మెదలతోడనుఁ గూడిన గాలిచేతను కదలింపఁ బడినదై వేగముగాఁ బ్రవహించు కన్నీటిచే, కాడలతోఁగూడిన నల్లకలువల వంటి నేత్రములు గల్గినదై శృఙ్గారరసమను జలమునకును, గ్రీష్మకాలపు రసమైన యుదకమునకునుఁ గొలనుగా నైనది. ఆమె నలుని మాటలచే దిక్పాలుర ప్రాతికూల్యమువలని యనిష్టములకు భయపడి దుఃఖింపఁ దొడగినది. దానితో బాటు మరునిబాణములచేతను కొట్టఁబడి కామపీడితురాలగుచు దుఃఖించినది.॥౯౬॥

శ్లో॥ అథోద్భ్రమన్తీ రుదతీ గతక్షమా
సససమ్భ్రమాలుప్తరతిః స్ఖలన్మతిః ।
వ్యధాత్ ప్రియాఽవాప్తి విఘాతనిశ్చయా
న్మృదూని దూనా పరిదేవితాని సా॥ ౯౭

ప॥వి॥ అథ । ఉద్భ్రమన్తీ । రుదతీ । గతక్షమా । ససమ్భ్రమా । లుప్తరతిః। స్ఖలన్మతిః । వ్యధాత్ । ప్రియాఽవాప్తి విఘాతనిశ్చయాత్। మృదూని। దూనా । పరిదేవితాని । సా.

టీక॥ అథ = స్మరవికారమేర్పడినపిదప, ప్రియాఽవాప్తివిఘాతనిశ్చయాత్; ప్రియ = ప్రియుని, అవాప్తి = పొందుటలోని, విఘాత = ప్రతిబంధమును విషయీకరించిన,నిశ్చయాత్ = నిర్ధారణవలన, దూనా = సంతాపముఁబొందిన, సా = ఆదమయన్తి,ఉద్భ్రమన్తీ = ఉన్మాదమునుఁబొందుచున్నదై, రుదతీ = ఏడ్చుచున్నదై, గతక్షమా; గత = తొలగిపోయిన, క్షమా = ధైర్యముగలదై, ససమ్భ్రమా = తత్తరపాటుతోఁగూడినదై, లుప్తరతిః = లోపించిన విషయాన్తరమందలి స్పృహఁగల్గినదై , స్ఖలన్మతిః = తత్తరపాటుఁజెందన బుద్ధిగలదై, మృదూని = మెత్తనైన,

అనగా నోరులహృదయములనుకలిగించునట్టి, పరిదేవితాని = విలాపము లను, వ్యధాత్ = చేసినది.

## సమాసములు:

*గతక్షమా :* గతా క్షమా యస్యాస్సా = గతక్షమా.

ససంభ్రమా : సంభ్రమేణ సహ వర్తత ఇతి = ససంభ్రమా.

లుప్తరతిః : లుప్తా రతిః యస్యాస్సా = లుప్తరతిః.

స్ఖలన్మతిః : స్ఖలన్తీ మతిః యస్యాస్సా = స్ఖలన్మతిః.

ప్రియావాప్తి విఘాతనిశ్చయాత్ : ప్రియస్య అవాప్తిః = ప్రియా వాప్తిః. ప్రియావాప్తౌ విఘాతః = ప్రియావాప్తి విఘాతః. ప్రియావాప్తి విఘాతే నిశ్చయః = ప్రియావాప్తివిఘాతనిశ్చయః. తస్మాత్ = ప్రియావాప్తి విఘాతనిశ్చయాత్.

## భావము :

మన్మథుని వికారము లేర్పడిన వెంటచే దమయన్తి తన ప్రియునిఁ బడ యుటకు విఘ్నములనఁ దెలిసికొనినదై ఉన్మాదమునుఁ బొంది రోదనముఁ చేయుచు, ధైర్యమును వీడి అన్నిటియందును నాసక్తినిఁ గోల్పోయి, తొట్రుపాటుతోఁ గూడిన బుద్ధిగలదై, పరితాపముఁ జెంది విలపించుచుండినది. ॥౮౭॥

శ్లో॥ త్వరస్వ పఞ్చేషుహుతాశనాత్మన
స్తనుష్వ మద్భస్మచయం యశశ్చయమ్ ।
విధేః పరేహాఫలభక్షణవ్రతీ
పతాఽద్య తృప్యన్నసుభిర్మమాఽఫలైః ॥ ౮౮

ప॥వి॥ త్వరస్వ । పఞ్చేషుహుతాశన । ఆత్మనః । తనుష్వ । మద్భస్మచయంః యశశ్చయమ్ । విధే । పరేహాఫలభక్షణవ్రతీ । పత । అద్య । అసుభిః । మమ । అఫలైః.

టీక॥ హేపఞ్చేషుహుతాశనః ఓ, మన్మథుదనునగ్నిదేవాః త్వరస్వ = త్వర పడుము. మద్భస్మచయం = నాబూడిదకుప్పను, ఆత్మనః = నీకు,

యశశ్చయం = కీర్తిరాశిని, తనుష్వ = చేయుము. హేవిధే = ఓబ్రహ్మా! పరేహాఫలభక్షణవ్రతీ; పర = ఇతరులయొక్క, ఈహా = కోరికలకు సంబంధించిన, ఫల = ఫలములను, భక్షణ = తినుటయే, వ్రతీ = వ్రతముగాఁగల్గిన వాఁడవై, అద్య = ఇప్పుడు, అఫలైః = నిష్ఫలములైన, మమ = నాయొక్క, అసుభిః = ప్రాణములచే, తృప్యన్ = తృప్తిఁజెందుచు, పత = పతనముఁజెందుము.

సమాసములు :

హేపఞ్చేషుహుతాశన : పఞ్చ ఇషవః యస్య సః = పఞ్చేషుః. పఞ్చేషురేవ హుతాశనః = పఞ్చేషుహుతాశనః. తస్య సమ్బుద్ధిః = హేపఞ్చేషు హుతాశన.

మద్భస్మచయమ్ : భస్మనాం చయః = భస్మచయః. మమ భస్మ చయః = మద్భస్మచయః. తం = మద్భస్మచయమ్.

యశశ్చయమ్ : యశసాం చయః = యశశ్చయః. తం = యశశ్చయమ్.

**పరేహాఫలభక్షణవ్రతీ :** పరేషామీహాః = పరేహాః. పరేహాణాం. ఫలం = పరేహాఫలం. పరేహాఫలస్య భక్షణం = పరేహాఫలభక్షణం. పరేహాఫల భక్షణే వ్రతం = పరేహాఫలభక్షణవ్రతం. పరేహాఫలభక్షణవ్రతం అస్య అస్తీతి = పరేహాఫలభక్షణవ్రతీ.

అఫలైః : అవిద్యమానం ఫలం యేషాన్తే = అఫలాః. తైః = అఫలైః.

భావము :

ఓస్మరాగ్నీ! త్వరపడుము. నా బూడిద కుప్పను నీ కీర్తిరాశినిఁ గావించుకొనుము. అనగా స్త్రీవధవలనఁ గీర్తినిఁ బొందుము. ఓబ్రహ్మా! ఇతరుల కామనాఫలములను భక్షించుట యందు వ్రతము గల్గిన నీవు వ్యర్థములైపోయిన నా ప్రాణములచేఁ దృప్తినిఁ బొంది పతితుఁడవు కమ్ము అనగా స్త్రీవధవలన పాతకము ననుభవింపుము ॥౮౮॥

శ్లో॥ భృశం వియోగానలతప్యమాన కిం
విలీయ సే నత్వమయోమయం యది।
స్మరేషుభిర్భేద్య! న వజ్రమప్యసి
బ్రవీషి న స్వాన్త! కథం న దీర్యసే॥ ౨౯

ప॥వి॥ భృశం । వియోగానలతప్యమాన । కిం । విలీయసే । న । త్వం । అయోమయం । యది । స్మరేషుభిః । భేద్య । న । వజ్రమ్ । అపి । అసి । బ్రవీషి । న । స్వాన్త । కథం । న । దీర్యసే.

టీక॥ హేభృశంవియోగానలతప్యమానః = మిక్కుటమగువిరహాగ్నిచే దహింపఁబడునట్టివానా! హేస్వాన్త = ఓహృదయమా! త్వం = నీవు, అయోమయంయది = ఇనుమేయైనచో, కిం = ఏల, నవిలీయసే = కఱుగవు? హేస్మరేషుభిః భేద్యః = ఓమన్మథబాణములచే భేదింపఁదగినదానా! (కావుననే) వజ్రమపి = వజ్రముగూడ, నాసి = కానేరవు. (వజ్రము లోహముచే భేదింపఁబడదు) కిన్తు = కాని, కథం = ఎట్లు, నదీర్యసే = భేదింపఁబడవు; నబ్రవీషి = నీస్వరూపమునునేలజెప్పవు.

**సమాసములు :**

హేవియోగానలతప్యమాన : వియోగస్య అనలః = వియోగానలః. వియోగానలేన తప్యమానః = వియోగానలతప్యమానః. తస్యసమ్బుద్ధిః = హేవియోగానలతప్యమాన.

అయోమయం : అయసః వికారః = అయోమయం.

స్మరేషుభిః : స్మరస్య ఇషవః = స్మరేషవః; తైః = స్మరేషుభిః.

**భావము :**

విరహాగ్నిచే మిక్కిలి దహింపఁబడునట్టి యో హృదయమా! నీవు ఇనుమే యైనచో నేల కఱుగవు. కావున నినుము కాదు. మన్మథబాణములచే భేదింపఁబడుదానా! నీవు వజ్రముకావు. ఏల యనగా వజ్రము లోహముచే భేదింపఁబడదు. కావున నీవు నీయొక్క స్వరూప మేదో చెప్పవా? ॥౨౯॥

శ్లో॥ విలమ్బసే జీవిత! కిం ద్రవ ద్రుతం
జ్వలత్యద_స్తే హృదయం నికేతనమ్।
జహాసి నాఽద్యాపి మృషాసుఖాసికా
మపూర్వమాలస్యమహో తవేదృశమ్॥ ౯౦

ప॥వి॥ విలమ్బసే । జీవిత! । కిం । ద్రవ । ద్రుతం । జ్వలతి । అదః । తే । హృదయం । నికేతనం । జహాసి । న । అద్య । అపి । మృషా । సుఖాసికాం । అపూర్వం । ఆలస్యమ్ । అహో । తవ । ఈదృశమ్.

టీక॥ హేజీవిత = ఓ ప్రాణమా! కిం = ఏల, విలమ్బసే = తడవొనరించెదవు? ద్రుతం = శీఘ్రముగా, ద్రవ = వెళ్లుము. యతః = ఏలయనగా, తే = నీయొక్క, నికేతనం = నివాసస్థానమైన, హృదయం = హృదయము, జ్వలతి = మండుచున్నది. అద్యాపి = ఇప్పటికిని, మృషా = వ్యర్థముగా, సుఖాసికాం = సుఖాసనమును, నజహాసి = విడువవు. తవ = నీకు, ఈదృశం = ఇటువంటి, ఆలస్యం = విలమ్బము, అపూర్వం = అపూర్వమైనది. అహో = అశ్చర్యము.

భావము :

ఓ జీవితమా! ఏల తడ వొనరింతువు? శీఘ్రము గా వెళ్లిపొమ్ము. నీకు నివాసగృహ మైన హృదయము తగలఁబడుచున్నది. ఇప్పటికిని వ్యర్థముగా సుఖాసనమునుఁ గోరుచున్నావు. ఇల్లు తగలఁబడినవు డెవ్వడు సుఖముగాఁ గూర్చుండఁగలడు? కావున నీవుసుఖముగా గూర్చొని చేయు నాలస్యము వింతగా నున్నది. సోమరిపోతు గూడ తన యిల్లు తగలఁబడితే దానిని విడచిపెట్టి చల్లార్చుటకు పరుగిడును గదా! నీవు గృహము మండిపోవు చున్నను నింటిలోపల నుండి వెలుపలికి రావు. లోపలనే యున్నావు. నీవు అనగా జీవితము వెళ్లిపోయినచో, నాకీ పీడ తొలగును కావున తొందరగా వెళ్లుము. ॥౯౦॥

శ్లో॥ దృశౌ మృషాపాతకినో మనోరథాః
కథం పృథూ వామపి విప్రలేభిరే।

ప్రియశ్రియః ప్రేక్షణఘాతి పాతకం
స్వమశ్రుభిః క్షాలయతం శతం సమాః॥ ౯౧

ప॥వి॥ దృశౌ । మృషాపాతకినః । మనోరథాః । కథం । పృథూ । వామ్ । అపి । విప్రలేభిరే । ప్రియశ్రియః । ప్రేక్షణఘాతి । పాతకం। స్వమ్। అశ్రుభిః । క్షాలయతం । శతం । సమాః.

టీక॥ హేదృశౌ = ఓకన్నులారా! మృషాపాతకినః = అసత్య పాతకమును వహించిన, మనోరథాః = నలునిఁజూడఁగోరికలు, పృథూ = గొప్ప వారైన, అనగా మోసముఁచేయఁదగనివారైన, వామపి = మీయిద్దఱినిఁ గూడ, కథం = ఎట్లు, విప్రలేభిరే = మోసగించినవి? కిఞ్చ = మఱియు, ప్రియశ్రియః! ప్రియునిసౌన్దర్యమును, ప్రేక్షణఘాతి; ప్రేక్షణ = చూచుటను, ఘాతి = ప్రతిబంధించుచున్న, పాతకం = జన్మాన్తరమునఁ జేయఁబడినపాపమును, అశ్రుభిః = కన్నీళ్లచే, శతం = నూఱు, సమాః = సంవత్సరములు, క్షాలయతం = కడుగుడు.

సమాసములు:

మృషాపాతకినః : మృషైవ పాతకం మృషాపాతకం. మృషాపాతకం ఏషామ స్తీతి = మృషాపాతకినః.

ప్రియశ్రియః : ప్రియస్య శ్రీః = ప్రియశ్రీః. తస్యాః = ప్రియశ్రియః.

ప్రేక్షణఘాతి : ప్రేక్షణస్య ఘాతి = ప్రేక్షణఘాతి. తత్ = ప్రేక్షణ ఘాతి.

భావము :

ఓ కన్నులారా! మీరు చాల గొప్పవారు. (అనగా విశాలములు) అట్టి మిమ్ములనుఁ గూడ నసత్యపాపమునుఁ గావించిన నా మనోరథములు, ఎట్లు వంచించినవి ? ప్రియుఁడైన నలుని సౌన్దర్యమును జూచుటకు ప్రతిబంధ మైన పాపమును నూఱేండ్లు కన్నీళ్లతో కడుగుడు. ఇఁక నలదర్శనముఁ జేయుటకు నాకు ఆశ లేదు. ॥౯౧॥

శ్లో॥ ప్రియం న మృత్యుం న లభే త్వదీప్సితం
తదేవ న స్యాన్మమ యత్త్వమిచ్ఛసి ।
వియోగమేవేచ్ఛ మనః ప్రియేణ మే
తవ ప్రసాదాన్న భవత్యసావపి॥ ౯౨

ప॥వి॥ ప్రియం । న । మృత్యుం । న । లభే । త్వదీప్సితం । తత్ । ఏవ। న। స్యాత్ । మమ । యత్ । త్వమ్ । ఇచ్ఛసి । వియోగమ్ । ఏవ।ఇచ్ఛ। మనః । ప్రియేణ । మే। తవ । ప్రసాదాత్ । న । భవతి। అసౌ। అపి.

టీక॥ హేమనః = ఓమనస్సా! త్వదీప్సితం = నీకు ఇష్టమైన, ప్రియం = ప్రియుని, నలభే = పొందకయున్నాను. తత్ = అందువలన, త్వం = నీవు, యత్ = దేనిని, ఇచ్ఛసి = కోరెదవో, తదేవ = అదియే, మమ = నాకు, నస్యాత్ = కానేరదు. అతః = ఇందువలన, మే = నాయొక్క, ప్రియేణ = ప్రియునిచే, వియోగమేవ = విరహమునే, ఇచ్ఛ = కోరుము. తవ = నీయొక్క, ప్రసాదాత్ = అనుగ్రహమువలన, అసావపి = ఈ వియోగముగూడ, మే = నాకు, నభవతి = కాదు.

వి॥ నలసంయోగముకొఱకు వియోగమునుఁ బ్రార్థించుటవలన విచిత్రాలఙ్కారము.

సమాసములు :

త్వదీప్సితం : ఆప్తుమిష్టః = ఈప్సితః; తవ ఈప్సితః = త్వదీప్సితః. తమ్ = త్వదీప్సితమ్.

**భావము :**

ఓ చిత్తమా! నీ కిష్టమైన ప్రియుని పొందకయున్నాను. కావున నీవు దేనిని నాకై కోరెదవో అది లభింప దని తెలియుచున్నది. అందువలన నీవు నాప్రియునితో వియోగమనే కోరుము. అందువలన నాకీ వియోగము తొలగిపోయి సంయోగము కలుగవచ్చును. ॥౯౨॥

శ్లో॥ న కాకువాక్యైరతివామమఙ్గజం
ద్విషత్సు యాచే పవనం తు దక్షిణమ్ ।

దిశాऽపి మద్భస్మ కిరత్వయం తయా
ప్రియో యయా వైరవిధిర్వధావధిః॥ ౯౩

ప॥వి॥ న। కాకువాక్యైః । అతివామమ్ । అజ్జజం । ద్విషత్సు । యాచే ।
పవనం । తు। దక్షిణం । దిశా । అపి । మద్భస్మ । కిరతు । అయం।
తయా । ప్రియః । యయా । వైరవిధిః । వధావధిః,

టీక॥ ద్విషత్సు = చన్ద్రుఁడు మున్నగు శత్రువుల మధ్య, అతివామం =
మిక్కిలివక్రుఁడైన, అజ్జజం=మన్మథుని, కాకువాక్యైః = దీనవచనము
లతో, నయాచే=ప్రార్థించను. కిన్తు=కాని, దక్షిణం=దక్షిణదిక్కున
జన్మించిన,(దాక్షిణ్యముగల్గిన) పవనం=వాయువును, యాచే=యాచిం
తును. అయం = ఈవాయువు, యయా = ఏ, దిశా=దిక్కుచే,
ప్రియః=ప్రియుడైననలుఁడు, సఞ్చరతే=సంచరించునో, తయా =
ఆ దిక్కుతోఁడను, మద్భస్మ = నాబూడిదెను, కిరతు =వెదఁజల్లుగాత.
వైరవిధిః=వైరమును నడుపుట, వధావధిః=మరణమును నంతము
గాఁగల్గి యుండును. 'మరణాన్తాని వైరాణి' అను న్యాయము ననుసరించి
వైరము మరణమువరకే యుండును కాన దక్షిణ పవనము శత్రుపక్ష
మునందున్నను నా మరణముతో నతని వైరము తీరి నాకీ యుపకార
ముఁ జేయు నని యర్థము.

## సమాసములు :

కాకువాక్యైః : కాకురూపాణి చ వాక్యాని చ=కామవాక్యాని. తైః=
కాకువాక్యైః.

వైరవిధిః: వైరస్య విధిః=వైరవిధిః.

వధావధిః : వధః అవధిః యస్య సః=వధావధిః.

## భావము :

నాకు శత్రువులైన చన్ద్రమదనమలయ పవనములలో మిక్కిలి వక్రుఁ
డైన మన్మథుని మాత్రము యాచింపను. కాని దక్షిణ వాయువును మాత్రము

యాచింతును. ఇతడు దక్షిణుఁడుగాన దాక్షిణ్యవంతుఁడు. ఏ దిక్కున నా ప్రియుఁడైన నలుడు సంచరించుచున్నాడో, ఆ వైపు నా భస్మము నితఁడు వెదఁజల్లుఁగాత. దక్షిణపవనుడు వైరి వర్గమునకుఁ జంద్రాదులవలెఁ జెంది యున్నను. "వైరాణి మరణాన్తాని" యని చెప్పిన ప్రకారము నా మరణముతో నతనికి నాపై వైరము తీరును గాన నా భస్మమునుఁ జల్లుటలో నతనికి కష్ట ముండదు. ॥౯౩॥

శ్లో॥ అమూని గచ్ఛన్తి యుగాని న క్షణః
కియత్ సహిష్యే న హి మృత్యుర స్తి మే।
స మాం న కాంతః స్ఫుటమంతరుజ్ఝితా
న తం మనస్తచ్ఛ న కాయవాయవః॥ ౯౪

ప॥వి॥ అమూని । గచ్ఛన్తి । యుగాని । న । క్షణః । కియత్ । సహిష్యే । న । హి । మృత్యుః । అస్తి । మే । సః । మాం । న । కాన్తః । స్ఫుటమ్ । అంతః । ఉజ్ఝితా । న । తం । మనః । తత్ । చ । న । కాయవాయవః.

టీక॥ గచ్ఛన్తి = కడిచిపోవుచున్న, యుగాని = యుగములు, నక్షణః = క్షణ కాలముకాదు. అనగా ఒక్కొక్కక్షణము యుగసహస్రములగుచున్నది. కియత్ = ఎంతకాలము, సహిష్యే = సహింపఁగలను? మృత్యుః = మరణము, మే = నాకు.నాస్తిహి = లేదుగదా. సః = ఆ, కాన్తః = ప్రియుడు, అన్తః = అన్తరాత్మయందు, మాం = నన్ను, నోజ్ఝితా = విడువడు, తం = వానిని, మనశ్చ = మనస్సుఁగూడ, నోజ్ఝితా = విడువదు. స్ఫుటం = స్పష్టము కాయవాయవః = శరీరమందలి ప్రాణవాయువులు, నోజ్ఝితారః = విడువఁబోవు.

## సమాసములు :

కాయవాయవః : కాయస్య వాయవః = కాయవాయవః.

## భావము :

కడచుచున్న యుగములు ఒక్క క్షణముకాదు. ఒక్కొక్క క్షణము గూడ యుగసహస్రము లగుచున్నవి. ఎంత సహింపఁగలను. చావు నాకు లేదు

గదా? ఆ ప్రియుఁడైన నలుడో నన్ను లోన విడువడు. వానిని నాయన్తరా త్మయు విడువదు. ఇది స్పష్టము. నా శరీరమందలి ప్రాణాది వాయువులు గూడ నన్ను విడువవు. అయ్యో! ఏమిగతి. ॥౯౪॥

శ్లో॥ మదుగ్రతాపవ్యయశ క్తశీకరః
సురాః! స వః కేన పపే కృపార్ణవః।
ఉదేతి కోటిర్న ముదే మదుత్తమా
కిమాశు సఙ్కల్పకణశ్రమేణ వః॥ ౯౫

ప॥వి॥ మదుగ్రతాపవ్యయశక్తశీకరః । సురాః । సః । వః । కేన । పపే । కృపార్ణవః । ఉదేతి । కోటిః । న । ముదే । మదుత్తమా । కిమ్। ఆశు। సఙ్కల్పకణశ్రమేణ । వః.

టీక॥ హేసురాః = ఓ దేవతలారా! మదుగ్రతాపవ్యయశక్తశీకరః; మత్ = నాయొక్క, ఉగ్రతాప = తీవ్రతాపముయొక్క, వ్యయ = నాశమునందు, శక్త = సమర్థములైన, శీకరః = తుంపురులుగల, వః = మీయొక్క, కృపార్ణవః = దయాసాగరము, కేన = ఎవ్వనిచే, పపే = త్రాడఁబడినది? సఙ్కల్పకణశ్రమేణ; సఙ్కల్పకణ = సఙ్కల్పలేశముయొక్క, శ్రమేణ = పరిశ్రమచే, (అనగా స్వల్పసఙ్కల్పముచేతనే), మదుత్తమా = నాకంటెనుత్తమమైన, కోటిః = స్త్రీకోటి, అనగా మఱియొకస్త్రీ, వః = మీకు, ముదే = సంతోషమునకై, నోదేతికిము = ఉదయించదాయేమి?

## సమాసములు :

మదుగ్రతాపవ్యయశక్తశీకరః: మమ ఉగ్రతాపః = మదుగ్రతాపః. మదుగ్రతాపస్య వ్యయః = మదుగ్రతాపవ్యయః. మదుగ్రతాపవ్యయేశక్తాః = మదుగ్రతాపవ్యయశక్తాః. మదుగ్రతాపవ్యయశక్తాఃశీకరాః యస్యసః = మదుగ్రతాపవ్యయశక్తశీకరః.

కృపార్ణవః: కృపాయాః అర్ణవః = కృపార్ణవః.

మదుత్తమా : మత్ ఉత్తమా = మదుత్తమా.

సఙ్కల్పకణశ్రమేణ: సఙ్కల్పస్య కణః = సఙ్కల్పకణః. సఙ్కల్పకణస్య శ్రమః = సఙ్కల్పకణశ్రమః. తేన = సఙ్కల్పకణశ్రమేణ.

భావము :

ఓ దేవతలారా ! నా తీవ్రతాపమును హరించుటకు శక్తి గల నీటి తుంపురలతోఁ గూడిన మీయొక్క దయాసముద్రమును నెవ్వరు పానముఁగావించినారు? తొల్లి సముద్రము నగస్త్యుఁడు పానముఁ జేసెను కదా. అట్లే యిప్పుడు ఈ దయాసముద్రము నెవ్వడు పానముఁగావించిరి ? నీ కొఱకే అనగానిన్నుఁ బొందుట కొఱకే యా దయాసముద్రము పానముఁ జేయఁబడె ననుట తగదు. ఏల యనగా మీరు లేశమాత్రము సఙ్కల్పించుకొనినచో నాకంటె నుత్తమస్త్రీ మీకానన్దమొసంగగల్గినది లభించదా? కావున దయఁజూపవలసిన నావంటి దీనురాలియందు విపరీతముగా మీరు వర్తించుట యుచితము కాదు. ॥౯౨॥

శ్లో॥ మమైవ వాహర్దివమశ్రుదుర్దినైః
ప్రసహ్య వర్షాసు ఋతౌ ప్రసఞ్జితే
కథం ను శృణ్వన్తు సుషుప్య దేవతా
భవత్వరణ్యే రుదితం న మే గిరః॥ ౯౩

ప॥వి॥ మమ । ఏవ । అహర్దివం । అశ్రుదుర్దినైః । ప్రసహ్య । వర్షాసు । ఋతౌ । ప్రసఞ్జితే । కథం । ను । శృణ్వన్తు । సుషుప్య । దేవతాః । భవతు । అరణ్యే । రుదితం । న । మే । గిరః.

టీక॥ అథవా = లేదా, అహర్దివం = పగలురాత్రి, మమైవ = నాయొక్కయే, అశ్రుదుర్దినైః = బాష్పవర్షములచే, ప్రసహ్య = బలవన్తముగా, వర్షాసు ఋతౌ = వర్షర్తువు, ప్రసఞ్జితేసతి = ప్రవర్తింపఁబడగనే, దేవతాః = దేవతలు, సుషుప్య = నిద్రించి. మేగిరః = నాయొక్కమాటలను, కథంనుశృణ్వన్తు = ఎట్లువినెదరు? (అందువలననే) మేగిరః = నాయొక్కమాటలు, కథం = ఎట్లు, అరణ్యే = అరణ్యమందలి, రుదితం = రోదనముగా, నభవతు = కాదు?.

వి॥ దేవతలకు నిద్రతో సమ్బన్ధము లేకపోయినను, సమ్బన్ధముఁ జెప్పుటవలన నతిశయోక్తి.

దమయన్తీవచనములకు నరణ్యరుదితత్వము లేక పోయినను నరణ్య

రుదితత్వము చెప్పుటవలన, నరణ్యరుదితత్వసాదృశ్య మాక్షేపింపఁ బడుచున్నది కాన నిదర్శనాలఙ్కార భేదము.

సమాసములు :

అహర్దివమ్ : అహ్ని చ దివా చ = అహర్దివం.

అశ్రుదుర్దినైః : అశ్రుభిః దుర్దినాని = అశ్రుదుర్దినాని, తైః = అశ్రుదుర్దినైః.

భావము :

లేదా రేయింబవలు నా కన్నీళ్లవలని మేఘచ్ఛన్నదివసములచే బలవన్తముగా వర్షర్తువు ప్రవర్తింపఁబడగనే దేవతలు చక్కగా నిదురించి, నామాటల నెట్లు వినఁగలరు? అట్టి నా మాట లెట్లు అరణ్యరుదితములు గావు. వర్షర్తువు ప్రారంభముకాగనే శ్రీమహావిష్ణువు నిదురించును. ఆయనయందలి దేవతాత్వ సామ్యముచే, నిన్ద్రాదులకు నిద్ర ఆరోపితమైనది. కాన దేవత లెవ్వరును నా మొర వినుట లేదని యాశయము ॥౯౬॥

శ్లో॥ ఇయం న తే నైషధ! దృక్పథాతిథి
స్త్వదేకతానస్య జనాయ యాతనా।
హ్రదే హ్రదే హా! న కియద్గవేషితః
స వేధసాఽగోపి ఖగోపి వక్తి యః॥ ౯౭

ప॥వి॥ ఇయం । న । తే । నైషధ। దృక్పథాతిథిః। త్వదేకతానస్య । జనాయ । యాతనా । హ్రదే । హ్రదే । హా । న । కియత్ । గవేషితః । సః । వేధసా। అగోపి । ఖగః । అపి । వక్తి । యః.

టీక॥ హేనైషధ! = ఓనలమహారాజా! ఇయం = ఈదమయన్తి, త్వదేకతానస్య; త్వత్ = నీయందే, ఏకతానస్య = ఆసక్తిఁగల్గిన, జనస్య = జనమునకు అనగా నాకు, యాతనా = తీవ్రవేదన, తే = నీకు. దృక్పథాతిథిః; దృక్పథ = నేత్రమార్గమునకు, అతిథిః = గోచరము, న = కాదు. కిఞ్చ = మఱియు, యః = ఏ, ఖగః = హంస, వక్తి =

నలునకు నాబాధనుచెప్పునో, సః = ఆహంసయు, వేధసా = బ్రహ్మచే, అగోపి = దాచఁబడినది. (ఏలయనగా) హ్రదేహ్రదే = అన్నికొల నులయందును, కియత్ = ఎంత, నగవేషితః = వెదకఁబడలేదు! హా = కష్టము.

## సమాసములు :

దృక్పథాతిథిః : దృశోః పన్థాః = దృక్పథః. దృక్పథస్య అతిథిః = దృక్పథాతిథిః.

త్వదేకతానస్య : త్వయి ఏకతానః = త్వదేకతానః. తస్య = త్వదేకతానస్య.

## భావము :

ఓ నలమహారాజా! నీయందే యాసక్తి గల నాయొక్క యీ తీవ్రవేదన నీ దృష్టికి గోచరము కాలేదు. ఏల యనగా నీవు చాల దూరమందున్నావు. మఱియు నా యాతనను నీకు చెప్పఁగల్గిన హంసనుఁ గూడ బ్రహ్మదాచి పెట్టెను. ఏల యనగా అన్ని కొలనుల యందును దాని నెంత వెదకితిని! కష్టము. ॥౯౭॥

శ్లో॥ మమాఽపి కిం నో దయసే దయాఘన!
త్వదఙ్ఘ్రిమగ్నం యది వేత్థ మే మనః।
నిమజ్జయన్ సన్తమసే పరాశయం
విధిస్తు వాచ్యః క్వతవాఽఽగసః కథా॥ ౯౮

ప॥వి॥ మమ । అపి । కిం । నో । దయసే । దయాఘన । త్వదఙ్ఘ్రిమగ్నం। యది । వేత్థ । మే । మనః । నిమజ్జయన్ । సన్తమసే । పరాశయం। విధిః । తు । వాచ్యః । క్వ । తవ । ఆగసః । కథా.

టీక॥ హేదయాఘన; = ఓదయతోఘనమైనవాడా! మమ = నాయొక్క, మనః = మనస్సు, త్వదఙ్ఘ్రిమగ్నం; త్వత్ = నీయొక్క, అఙ్ఘ్రి = పాదములయందు, మగ్నం = నాటినదిగా, అనగానీపాదములను శరణుఁ

గలదిగా, యదివేత్సి = తెలిసికొంటివో, మమాఽపి = నాకును, కింనోదయసే = ఏలదయఁజూపవు? అథవా = లేదా, పరాశయం = ఇతరులహృదయమును, స న్తమసే = గొప్పయన్ధకారమందు, నిమజ్జయన్ = ముంచుచున్న, విధిస్తు = బ్రహ్మయో, వాచ్యః = నిందింపఁదగినవాఁడు. తవ = నీదగు, ఆగసః = అపరాధముయొక్క, కథా = కథ, క్వ = ఎక్కడ?.

## సమాసములు :

హేదయాఘన : దయయా ఘనః = దయాఘనః. తస్యసమ్బుద్ధిః = హేదయాఘన.

త్వదఙ్ఘ్రిమగ్నం : తవ అఙ్ఘ్రీ = త్వదఙ్ఘ్రీ. త్వదఙ్ఘ్ర్యోః మగ్నః = త్వదఙ్ఘ్రిమగ్నః. తం = త్వదఙ్ఘ్రిమగ్నం.

పరాశయం : పరస్య ఆశయః = పరాశయః. తమ్ = పరాశయం.

## భావము :

ఓదయాసాన్ద్రా! నా మనస్సు నీ చరణములను శరణు బొందిన దని తెలిసికొనినచో, నాయందు దయను నెరపవాయేమి? లేదా పరుల హృదయమును గొప్పచీకటియందు ముంచుచున్న బ్రహ్మయే నిన్దార్హుఁడు, నీ యపరాధ మేమియు లేదు. బ్రహ్మచే వ్యామోహమునుఁ బొంది నీవు నన్నుఁ దెలుసుకొనుటలేదే గాని నా యెడ దయలేకపోవుటచేతఁ గాదు. ॥౯౮॥

శ్లో॥ కథావశేషం తవ సా కృతే గతే
త్యుపైష్యతి శ్రోత్రపథం కథం న తే।
దయాణునా మాం సమనుగ్రహీష్యసే
తదాఽపి తావద్యది నాథ నాధునా॥ ౯౯

ప॥వి॥ కథావశేషం । తవ । సా । కృతే । గతా । ఇతి । ఉపైష్యతి । శ్రోత్రపథం । కథం । న । తే । దయాణునా । మాం । సమనుగ్రహీష్యసే । తదా । అపి । తావత్ । యది । నాథ । న । అధునా.

టీక॥ హేనాథ = ఓనాథా! తవకృతే = నీకొఱకు, సా = ఆదమయన్తి, కథావశేషం = కథశేషముగాఁ గలదిగా, అనగా నవసానమును, గతాఇతి = పొందినదని, తవ = నీయొక్క, శ్రోత్రపథం = కర్ణ మార్గమును, కథం = ఎట్లు, నోపైష్యతి = పొందదు? తదాఽపి = దానినివినినసమయమందును. దయాణునా = దయాలేశముతో, మాం = నన్ను, సమనుగ్రహీష్యసేతాపత్ = అనుగ్రహింపవా? తప్పక యను గ్రహింపఁగలవు. అధునా = ఇప్పుఁడు, నయది = కానిచో, మాఽస్తు = వలదు. (వెనుక నీవునాకై నిర్వేదమునుఁబొందుట మహానుగ్రహము)

సమాసములు ;

*కథావశేషం* : కథా అవశేషః యస్య సః = కథావశేషః. తం = కథావశేషం.

*శ్రోత్రపథం* : శ్రోత్రయోః పన్థాః = శ్రోత్రపథః. తం = శ్రోత్రపథం.

*దయాణునా* : దయాయాః అణుః = దయాణుః. తేనా = దయాణునా.

భావము :

ఓనాథా! నీకొఱకు దమయన్తి యవసానముఁ బొందిన దను విషయ మెట్లు నీ చెవికి రాదు? తప్పక రాఁగలదు. కాని దానిని వినిన సమయమందును దయాలేశముతో నన్ననుగ్రహింపవా? తప్పక అనుగ్రహింపఁగలవు. ఒకవేళ ఇప్పుడు కాకపోయినచో పోనిమ్ము. వెనుక నన్ను గూర్చి యనుశోకించుట యైనను గొప్ప యనుగ్రహమే. ॥౯౯॥

శ్లో॥ మమాదరీదం విదరీతుమాన్తరం
తదర్థికల్పద్రుమ కిఞ్చిదర్థయే।
భిదాం హృది ద్వారమవాప్య మైవ మే
హతాసుభిః ప్రాణసమః సమజ్గమః॥ ౧౦౦

ప॥వి॥ మమ । ఆదరి । ఇదం। విదరీతుం । ఆన్తరం । తత్ । అర్థికల్పద్రుమః । కిఞ్చిత్ । అర్థయే । భిదాం । హృది । ద్వారమ్ । అవాప్య । మా । ఏవ । మే । హతాసుభిః । ప్రాణసమః । సమం । గమః.

టీక॥ హేనాథ = ఓనాథా! మమ = నాయొక్క, ఇదం = ఈ, అన్తరం = హృదయము, వివరీతుం = పగలుటకు, ఆదరి = ఆదరముగల్గియున్నది. తత్ = అందువలన, హేఅర్థికల్పద్రుమః = ఓయాచకులపాలిటికల్పవృక్షమా, కిఞ్చిత్ = కొంచెము, అర్థయే = యాచింతును. (ఏమనగా) ప్రాణసమః = ప్రాణములతోసమానమైన, త్వం = నీవు, హృది = హృదయమందలి, భిదాం = పగులు అనెడి, ద్వారమ్ = ద్వారమును, అవాప్య = పొంది, అనగా మార్గమునుఁబొంది, మే = నాయొక్క, హతాసుభిః హత = నిన్నుఁబొందనందువలన నిష్ఫలములైన, అసుభిః = ప్రాణములతో, సమం = కూడ, మాగమః = వెలువడఁబోకుము.

## సమాసములు :

*ఆదరి :* ఆదరః అస్యాఽస్తీతి = ఆదరి.

*హేఅర్థికల్పద్రుమ :* అర్థినాం కల్పద్రుమః = అర్థికల్పద్రుమః. తస్య సమ్బుద్ధిః = హేఅర్థికల్పద్రుమ.

*హతాసుభిః:* హతాశ్చ తే అసవశ్చ = హతాసవః. తైః = హతాసుభిః.

*ప్రాణసమః:* ప్రాణైః సమః = ప్రాణసమః.

## భావము :

ఓ నాథా! నా హృదయము పగలుటకు నాసక్తి గల్గి యున్నది. ఓయాచకుల పాలిటి కల్పవృక్షమా! నేను నిన్నొక విషయమును యాచింతును. ప్రాణసమానమైన నీవు నాహృదయమందు నెలకొని యున్నావు. కాన నా ప్రాణము వెల్వడిపోవు నపుడు నీపును వానితోఁ బాటు నా హృదయరన్ధ్రమునుండి వెడలిపోకుము. నాకు ప్రాణోత్క్రమణముజరుగు నప్పుఁడు జన్మాన్తరమునందు నీవే నాకుఁ బతివి కావలయు నను కోరిక యున్నది. కావున నిర్యాణకాలమందే కోరికతో ప్రాణములను జీవుఁడు విడచునో, ఆ కోరికల ప్రకారము జన్మాన్తరమునందు జరుగును కాన నీవు నా హృదయమునుండి వెళ్లవలదు అనగా నప్పుడు నిన్నే ధ్యానించుచుందును. ॥౧౦౦॥

శ్లో॥ ఇతి ప్రియాకాకుభిరున్మిషన్ భృశం
దిగీశదూత్యేన హృది స్థిరీకృతః ।

నృపం స యోగేఽపి వియోగమన్మథః
క్షణం తముద్భ్రాన్తమజీజనత్ పునః॥ ౧౦౧

ప॥ వి॥ ఇతి । ప్రియాకాకుభిః । ఉన్మిషన్ । భృశం । దిగీశదూత్యేన। హృది। స్థిరీకృతః । నృపం । సః । యోగే । అపి । వియోగమన్మథః। క్షణం। తమ్ । ఉద్భ్రాన్తమ్ । అజీజనత్ । పునః.

టీక॥ దిగీశదూత్యేన; దిగీశ = దిక్పాలురయొక్క, దూత్యేన = దూత్యముచే, హృది = హృదయమందు, స్థిరీకృతః = ఇంతకాలము వరకును స్థిరము గావింపఁబడిన, సః = ఆ, వియోగమన్మథః = విప్రలమ్భశృఙ్గారము, ఇతి = ఇట్లు, ప్రియాకాకుభిః; ప్రియా = ప్రియురాలియొక్క, కాకుభిః = దీనవచనములచే, ఉన్మిషన్ = ఉద్బుద్ధమైనదగుచు అనగా జాగృతి నొందినదగుచు, తం = ఆ, నృపం = రాజును, యోగేఽపి = సాన్నిధ్య మున్నను, క్షణం పునః = క్షణకాలము, ఉద్భ్రాన్తచిత్తం = ఉన్మాద ముతోఁగూడిన మనస్సునుఁ గల వానినిగా, అజీజనత్ = చేసెను.

సమాసములు :

*ప్రియాకాకుభిః:* ప్రియాయాః కాకవః = ప్రియాకాకవః. తైః = ప్రియా కాకుభిః.

*దిగీశదూత్యేన :* దిశామీశాః = దిగీశాః. దిగీశానాం దూత్యం = దిగీశ దూత్యమ్. తేన = దిగీశదూత్యేన

*స్థిరీకృతః:* అస్థిరః స్థిరః సమ్పద్యమానః కృతః = స్థిరీకృతః.

*వియోగమన్మథః :* వియోగస్య మన్మథః = వియోగమన్మథః.

భావము :

ఆ నలుఁడు దిక్పాలురకు దూత్యమును వహించిన వెంటనే యతని యందలి విప్రలమ్భశృఙ్గార మణఁగి యుండినది. కాని యిట్లు ప్రియురా లగు దమయన్తి దైన్యముతో మాట్లాడుటవలన నది మఱల నుద్బుద్ధమైనదై యొక వైపు ప్రియురాలి సామీప్య మున్నను వానివలన నున్మత్తునిఁ గావించినది. ॥౧౦౧॥

శ్లో॥ మహేన్ద్రదూత్యాది సమస్తమాత్మన
స్తతః స విస్మృత్య మనోరథస్థితైః।
క్రియాః ప్రియాయా లలితైః కరమ్బితా
వికల్పయన్నిత్థమలీకమాలపత్॥ ౧౦౨

ప॥వి॥ మహేన్ద్రదూత్యాది । సమస్తమ్ । ఆత్మనః । తతః । సః। విస్మృత్య। మనోరథస్థితైః । క్రియాః । ప్రియాయాః । లలితైః । కరమ్బితాః । వికల్పయన్ । ఇత్థమ్ । అలీకమ్ । ఆలపత్.

టీక॥ తతః = ఉన్మాదమేర్పడినపిదప, సః = ఆ నలుఁడు, ఆత్మనః = తన యొక్క, మహేన్ద్రదూత్యాది = ఇన్ద్రదూత్యమున్నగు, సమస్తం = సకలకార్యమును, విస్మృత్య = మఱచి, మనోరథస్థితైః = మనోరథములచే ననగా సఙ్కల్పములచే, స్థితైః = కల్పితములైన, లలితైః = విలాసములతో, కరమ్బితాః = మిశితములైన, ప్రియాయాః = ప్రియురాలి యొక్క, క్రియాః = శృఙ్గారచేష్టలను, వికల్పయన్ = ఆలోచించుచు, ఇత్థం = చెప్పఁబోవువిధముగా, అలీకం = జ్ఞానరహితముగా, ఆలపత్ = మాట్లాడెను.

## సమాసములు:

మహేన్ద్రదూత్యాదిః దూతస్య కర్మ = దూత్యం. మహేన్ద్రస్యదూత్యం = మహేన్ద్రదూత్యం. మహేన్ద్రదూత్యం ఆదిః యస్య తత్ = మహేన్ద్రదూత్యాది.

మనోరథస్థితైః : మనోరథే స్థితాని = మనోరథస్థితాని. తైః = మనోరథస్థితైః.

## భావము :

ఇట్లు ఉన్మాద మేర్పడగనే, యా నలుఁడు తన కర్తవ్యమైన, యింద్రదూత్యము మున్నగు సమస్త కృత్యములను మఱచి, మనోరథకల్పితములైన విలాసములతో మిశితములైన ప్రియురాలి శృఙ్గారచేష్టలను, ఆలోచించుచుఁ జెప్పబోవు విధముగా దనకుఁ దెలియకుండనే, మాట్లాడఁ దొడగెను. ॥౧౦౨॥

శ్లో॥ అయి! ప్రియే! కస్య కృతే విలప్యతే
విలిప్యతే హా ముఖమశ్రుబిన్దుభిః।
పుర స్త్వయాలోకి నమన్నయన్న కిం
తిరశ్చలల్లోచనలీలయా నలః॥ ౧౦౩

ప॥వి॥ అయే । ప్రియే । కస్య । కృతే । విలప్యతే । విలిప్యతే । హా । ముఖమ్ । అశ్రుబిన్దుభిః । పురః । త్వయా । ఆలోకి । నమన్ । అయం । న । కిం । తిరశ్చలల్లోచనలీలయా । నలః.

టీక॥ అయిప్రియే! = ఓప్రియురాలా!, కస్యకృతే = ఎవనికొఱకు, విలప్యతే = ఏడ్చుట. ముఖం = మోము, అశ్రుబిన్దుభిః = కన్నీటిబొట్టులతో, విలిప్యతే = పూయఁబడుచున్నది, హా = కష్టము, పురః = ఎదుట, నమన్ = నమస్కరించుచున్న, అయం = ఈ, నలః = నలుఁడు, తిరశ్చలల్లోచనలీలయా; తిరః = అడ్డముగా, చలత్ = ప్రసరించుచున్న, లోచన = నేత్రములయొక్క, లీలయా = విలాసముచే, నాలోకికిం = చూడఁబడలేదాయేమి?

సమాసములు :

*అశ్రుబిన్దుభిః:* అశ్రూణాం బిన్దవః = అశ్రుబిన్దవః. తైః = అశ్రుబిన్దుభిః.

*తిరశ్చలల్లోచనలీలయా :* తిరః చలతీతి = తిరశ్చలత్. తిరశ్చలచ్చ తత్ లోచనం చ = తిరశ్చలల్లోచనం. తిరశ్చలల్లోచనస్య లీలా = తిరశ్చలల్లోచనలీలా. తయా = తిరశ్చలల్లోచనలీలయా.

భావము :

ఓప్రియురాలా! ఎవనికొఱకేడ్చెదవు. నీ మోమును కన్నీటిబొట్లు మలినపఱచుచున్నవి. నీ ఎదుటఁ బ్రణమిల్లుచున్న యీ నలుని నీకటాక్షముతోఁ జూడలేదా? మనిషి యెదుటనున్నను లేనట్లు భావించి నిందిచుట యుక్తము గాదు. ॥౧౦౩॥

శ్లో॥ చకాస్తి బిన్దుచ్యుతకాతిచాతురీ
ఘనాశ్రుబిన్దుస్రుతికైతవాత్తవ।

మసారసారాక్షి! ససారమాత్మనా
తనోషి సంసారమసంశయం యతః॥ ౧౦౪

ప॥వి॥ చకాస్తి । బిన్దుచ్యుతకాతిచాతురీ । ఘనాశ్రుబిన్దుస్రుతికైతవాత్ । తవ । మసారసారాక్షి । ససారమ్ । ఆత్మనా । తనోషి । సంసారమ్ । అసంశయం । యతః.

టీక॥ మసారసారాక్షి; మసారసార = శ్రేష్ఠములైన యిన్ద్రనీలమణులవంటి, అక్షి = కన్నులుకలదానా! ఘనాశ్రుబిన్దుస్రుతికైతవాత్; ఘన = దట్టమైన, అశ్రుబిన్దు = కన్నీటిబిన్దువులయొక్క, స్రుతి = స్రావముయొక్క, కైతవాత్ = నెపమువలన, బిన్దుచ్యుతకాతిచాతురీ; బిన్దుచ్యుతక = అనుస్వారచ్యుతకమెనెడి విచిత్రవాక్యరచనయందు, అతిచాతురీ = మిక్కిలి నేర్పు, తవ = నీకు, భాతి = ప్రకాశించుచున్నది. యతః = ఏచాతుర్యము వలననే, సంసారం = సంసారమును, సంసారశబ్దమును, ఆత్మనా = నీసామర్థ్యముచేత, ససారం = సారవన్తముగను, తొలగినయనుస్వారము కలదిగను, అనగా సంసార శబ్దములో, ననుస్వారము దొలగినచో ససారమని యగును కాన ససారముగను, అనగా సారముతోఁగూడినదిగను, తనోషి = చేయుచున్నావు. అసంశయం = సన్దేహములేదు.

వి॥ అశ్రుబిన్దుస్రుతియందు, కైతవశబ్దముచే, తద్రూపమును నపహ్నవించి బిన్దుచ్యుతకత్వమును, ఆరోపించుటవలన నపహ్నవాలఙ్కారము.

దాని నుపజీవించి ససార మను శ్లిష్టపదముచే లభ్యములైన అర్థములకు రెంటికిని అభేదాధ్యవసాయము చేయుటచే, బిన్దుచ్యుతక మను కావ్యరచన నుత్ప్రేక్షించుటచే శ్లేషమూలకమును, నపహ్నవముతోఁ గూడినదియు నగు నుత్ప్రేక్ష. అసంశయ మను వ్యఞ్జకమునుఁ బ్రయోగించుట వలన నిది వాచ్యము.

## సమాసములు:

*బిన్దుచ్యుతకాతిచాతురీ:* బిన్దోః చ్యుతమేవ = బిన్దుచ్యుతకం. బిన్దుచ్యుతకే అతి చాతురీ = బిన్దుచ్యుతకాతిచాతురీ.

ఘనాశ్రుబిన్దుస్రుతికైతవాత్ : ఘనాని చ తాని అశ్రూణి చ = ఘనాశ్రూణి. ఘనాశ్రూణాం బిన్దవః = ఘనాశ్రుబిన్దవః. ఘనాశ్రుబిన్దూనాం స్రుతిః = ఘనాశ్రుబిన్దుస్రుతిః. ఘనాశ్రుబిన్దుస్రుతేః కైతవం = ఘనాశ్రుబిన్దుస్రుతికైతవం. తస్మాత్ = ఘనాశ్రుబిన్దు స్రుతికైతవాత్.

హేమసారసారాక్షి : మసారాణాం సారౌ = మసారసారౌ. మసారసారావివ అక్షిణీ యస్యాస్సా = మసారసారాక్షీ. తస్యాః సమ్బుద్ధిః = హే మసారసారాక్షి !

ససారం : సారేణ సహితః = ససారః. తమ్ = ససారం.

అసంశయం : సంశయస్య అభావః = అసంశయం.

భావము :

శ్రేష్ఠములైన యిన్ద్రనీలమణులవంటి కన్నులు కలదానా! దట్టమైన కన్నీళ్లబొట్టుల నెపముచే, నీకు బిన్దుచ్యుతకమను విచిత్రవాక్యభేదముతోఁగూడిన కావ్యరచనయందు సామర్థ్య మున్నట్లు తెలుపు చున్నావు. అట్టి చాతుర్యము నీకుండుటవలననే, సంసారమును, సంసారశబ్దమును, ససారముగను అనగా సారవన్తముగను, అనుస్వారరహితముగను చేయుచున్నావు. సందేహములేదు. సంసారశబ్దమునందు "సం" అను నెడనున్న సున్న తొలగినచో నది ససారమగును. ససార మనగా సారవన్తమైన దని యర్థము. అట్లు సున్న తొలగుటయే యిఁట బిన్దుచ్యుతకము. అనగా నామె సంసారశబ్దమును ననుస్వారశూన్యము గావించి సంసారమును ససారముఁజేయుటయే గాక, బిన్దుచ్యుతక కావ్యరచనా నైపుణినిఁ గూడఁ బ్రదర్శించిన దని భావము. ॥౧౦౪॥

శ్లో॥ అపాస్తపాథోరుహి శాయితం కరే
కరోషి లీలానలినం కిమాననమ్।
తనోషిహారం కియదశ్రుణఃస్రవై
రదోషనిర్వాసితభూషణే హ్రాది॥ ౧౦౫

ప॥వి॥ అపాస్తపాథోరుహి । శాయితం । కరే । కరోషి । లీలానలినం । కిమ్ । ఆననమ్ । తనోషి । హారం । కియత్ । అశ్రుణః । స్రవైః । అదోషనిర్వాసితభూషణే । హ్రాది.

టీక॥ హేప్రియే = ఓప్రియురాలా! కిం = ఏల, అపాస్తపాథోరుహిః అపాస్త = విడువఁబడిన, పాథోరుహి = లీలాకమలముఁ గల్గిన, కరే = చేతియందు, శాయితం = పరుండఁబెట్టఁబడిన, అనగా ఉంచఁబడిన, ఆననమ్ = ముఖమునే, లీలానలినం = లీలాకమలమును, కరోషి = చేయుచున్నావు? అదోషనిర్వాసితభూషణే; అదోష = దోషములు, అనగా నపవాదములు లేకయే, నిర్వాసిత = తొలగింపఁబడిన, భూషణే = ఆభరణములుగల్గిన, హృది = హృదయమందు, అశ్రుణః = కన్నీటియొక్క, స్రవైః = ధారలచేతనే, హారం = హారమును, కియత్ = ఎంతకాలము, లేదా ఏల, తనోషి = చేయుచున్నావు.

## సమాసములు :

అపాస్తపాథోరుహి : పాథసి రోహతీతి = పాథోరుట్. అపాస్తం పాథోరుట్ యస్మిన్ సః = అపాస్తపాథోరుట్. తస్మిన్ = అపాస్తపాథోరుహి.

లీలాకమలం : లీలార్థం కమలం = లీలాకమలం. తత్ = లీలా కమలం.

అదోషనిర్వాసితభూషణే : అవిద్యమానః దోషః యస్మిన్ కర్మణి తత్ = అదోషం. అదోషం నిర్వాసితాని = అదోషనిర్వాసితాని. అదోషనిర్వాసితాని భూషణాని యస్యాస్సా = అదోషనిర్వాసితభూషణా. తస్యాః సమ్బుద్ధిః = అదోషనిర్వాసితభూషణే.

## భావము :

ఓప్రియురాలా! హస్తమునందు లీలాకమలమునుఁ దొలగించి దాని స్థానమున నీమోమును చిన్నపలన, లీలాకమలము గావించితివా యేమి? అట్లు చేయకుము. లీలాకమలమునుఁ దీసికొనుము. చింత వలదు. దొంగలవలన భయము గాని, యితరాపరాధములు గాని లేకయే విరహవశముచే ముక్తాహారా ద్యాభరణములు తొలగింపఁబడిన నీవక్షఃస్థలమునందు నెంతకాలము, కన్నీటి బిన్దువులచే ముక్తాహారముల నాపాదించెదవు? కావున నట్లు చేయకుము. భూషణములను ధరించుము. దుఃఖింపవలదు. లోకమున నేరము చేసినవానిని తొలగించినవిధముగ, సొమ్ములు దొలగింపఁబడినవా యను విషయము సూచితము. ॥౧౦౫॥

శ్లో॥ దృశోరమఙ్గల్యమిదం మిలజ్జలం
కరేణ తావత్పరి మార్జయామి తే।
అథా పరాధం భవదఙ్ఘ్రిపఙ్కజ
ద్వయీరజోభిః సమమాత్మమౌలినా॥ ౧౦౬

ప॥వి॥ దృశోః । అమఙ్గల్యమ్ । ఇదం । మిలత్ । జలం । కరేణ । తావత్ । పరిమార్జయామి । తే । అథ । అపరాధం । భవదఙ్ఘ్రిపఙ్కజద్వయీర జోభిః । సమమ్ । ఆత్మమౌలినా.

టీక॥ ఇదం = ఈ, తే = నీయొక్క, దృశోః = కన్నులయందు, మిలత్ = ఉత్పన్నమైన, అమఙ్గల్యం = అమఙ్గలకరమైన, జలం = నీటిని(కన్నీటిని) కరేణ = చేతిచే, పరిమార్జయామి = తుడుచుచున్నాను. అథ = తుడిచిన పిదప, అపరాధం = నేనునిన్ను వంచించిననేరమును, భవదఙ్ఘ్రిపఙ్కజ ద్వయీరజోభిః; భవత్ = నీయొక్క, అఙ్ఘ్రిపఙ్కజ = పాదపద్మముల యొక్క, ద్వయీ = జంటయొక్క, రజోభిః = ధూళులతో, సమం = కూడ, ఆత్మమౌలినా = నాకిరీటముచే, అనగా వన్దనముచే, పరిమార్జ యామి = తుడుచుకొనెదను.

వి॥ పాదపఙ్కజధూళులతోడ నని కలిసమ్మితమగు సహభావముఁ జెప్పుట వలన సహోక్త్యలఙ్కారము.

సమాసములు :

అమఙ్గల్యం : మఙ్గలస్య అర్హం = మఙ్గల్యం. న మఙ్గల్యం = అమఙ్గల్యం. తత్ = అమఙ్గల్యమ్.

భవదఙ్ఘ్రిపఙ్కజద్వయీరజోభిః: అఙ్ఘ్రీపఙ్కజే ఇవ = అఙ్ఘ్రి పఙ్కజే. భవత్యాః అఙ్ఘ్రిపఙ్కజే = భవదఙ్ఘ్రిపఙ్కజే. భవదఙ్ఘ్రిపఙ్కజయోః ద్వయీ = భవదఙ్ఘ్రిపఙ్కజద్వయీ. భవదఙ్ఘ్రిపఙ్కజద్వయ్యాః రజాంసి = భవదఙ్ఘ్రి పఙ్కజద్వయీరజాంసి. తైః = భవదఙ్ఘ్రిపఙ్కజద్వయీరజోభిః.

ఆత్మమౌలినా: ఆత్మనః మౌలిః = ఆత్మమౌలిః. తేన = ఆత్మమౌలినా.

**భావము :**

ఓదమయన్తీ! నీ కన్నులయం దేర్పడిన యశుభకరమైన నీటిని తుడిచెదను. తుడిచిన పిదప నేను నిన్నింతవఱకు వంచించిన నేరమును, నీ పాదపద్మముల ధూళులతోఁ గూడ నా కిరీటముచే అనగా వందనముచే తుడుచుకొనెదను. నీ పాదధూళిని తుడుచుటతోఁ బాటు నా యపరాధమును నా కిరీటముతోఁ గూడినశిరమును నీ పాదములపై వ్రాల్చి ప్రణమిల్లి తుడుచు కొనెదను. ॥౧౦౯॥

శ్లో॥ మమ త్వదచ్ఛాఙ్ఘ్రినఖామృతద్యుతేః
కిరీటమాణిక్యమయూఖమఞ్జరీ ।
ఉపాసనామస్య కరోతు రోహిణీ
త్యజత్యజాఽకారణరోషణే రుషమ్ ॥ ౧౧౦

ప॥వి॥ మమ । త్వదచ్ఛాఙ్ఘ్రినఖామృతద్యుతేః। కిరీటమాణిక్యమయూఖమఞ్జరీ । ఉపాసనామ్ । అస్య । కరోతు । రోహిణీ । త్యజ । త్యజ । అకారణ రోషణే । రుషమ్.

టీక॥ హేఅకారణరోషణే! = ఓసి నిష్కారణరోషముగలదానా!, రోహిణీ = ఏట్టిదైన, కిరీటమాణిక్యమయూఖమఞ్జరీ; కిరీట = కిరీటమందలి, మాణిక్య = రత్నములయొక్క, మయూఖమఞ్జరీ = కిరణపుంజమనెడి, రోహిణీ = రోహిణియను, చన్ద్రునికిప్రియురాలైనతార, అస్య = ఈఎదుటనున్న, త్వదచ్ఛాఙ్ఘ్రినఖామృతద్యుతేః; త్వత్ = నీయొక్క, అచ్ఛ = స్వచ్ఛములైన, అఙ్ఘ్రినఖ = పాదమందలిగోళ్లనెడి, అమృతద్యుతేః = చన్ద్రునికి, ఉపాసనాం = పూజను, కరోతు = చేయునుఁగాత. రుషం = రోషమును, త్యజత్యజ = విడువుము, విడువుము.

వి॥ ఇచ్చట పాదనఖములను చన్ద్రునిగను, మాణిక్యమయూఖమఞ్జరిని రోహిణిగను రూపించుటవలనరూపకము.

**సమాసములు :**

త్వదచ్ఛాఙ్ఘ్రినఖామృతద్యుతేః : అచ్ఛే చ తే అఙ్ఘ్రీ చ = అచ్ఛాఙ్ఘ్రీ. తవ అచ్ఛాఙ్ఘ్రీ = త్వదచ్ఛాఙ్ఘ్రీ. త్వదచ్ఛాఙ్ఘ్యోః నఖాః = త్వదచ్ఛాఙ్ఘ్రినఖాః.

త్వదచ్ఛాఙ్ఘ్రినఖా ఏవ అమృతద్యుతిః = త్వదచ్ఛాఙ్ఘ్రినఖామృతద్యుతిః. తస్య = త్వదచ్ఛాఙ్ఘ్రినఖామృతద్యుతేః.

*కిరీటమాణిక్యమయూఖమఞ్జరీ :* కిరీటే మాణిక్యాని = కిరీటమాణిక్యాని. కిరీటమాణిక్యానాం మయూఖాః = కిరీటమాణిక్యమయూఖాః. కిరీటమాణిక్య మయూఖానాం మఞ్జరీ = కిరీటమాణిక్యమయూఖమఞ్జరీ

*అకారణరోషణే :* అవిద్యమానం కారణం యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = అకారణం. అకారణం రోషణా = అకారణరోషణా. తస్యాస్స మ్బుద్ధిః = హే అకారణరోషణే.

భావము :

ఓసి నిష్కారణరోషము గలదానా? రక్తవర్ణము గల నా కిరీటమాణిక్య కిరణపుంజ మనెడి రోహిణి యను చన్ద్రప్రియ యగు తార నీయొక్క పాద నఖము లనెడి చన్ద్రునిఁ గొలచుఁగాత. అనగా నేను నీ పాదములకు వన్దనము గావించునపుడు నా కిరీటమందలి రత్నకాంతిపుంజము తెల్లని నీ కాలిగోళ్లపైఁ బడునని యర్థము. కావున నీవు రోషము వదలివేయుము. నా ప్రణిపాతమే నీయెడ నేను కావించిన యపరాధములకు ప్రతీకారము. ॥౧౦౭॥

శ్లో॥ తనోషి మానం మయి చేన్మనాగపి
త్వయి శ్రయే తద్బహుమానమానతః ।
వినమ్య వక్త్రం యది వర్తసే కియ
న్నమామి తే చణ్డి! తదా పదావధి॥ ౧౦౮

ప॥వి॥ తనోషి । మానం । మయి । చేత్ । మనాక్ । అపి । త్వయి । శ్రయే । తత్ । బహుమానమ్ । ఆనతః । వినమ్య । వక్త్రం । యది । వర్తసే । కియత్ । నమామి । తే । చణ్డి! । తదా । పదావధి.

**టీక॥** **హేచణ్డి** = ఓసి తీవ్రకోపముగలదానా! మనాగపి = కొంచెమైనను, మానం = రోషమును, మయి = నాయెడ, తనోషిచేత్ = **చేసితివో**, **తత్ = అప్పుడు**, త్వయి = నీవిషయమున, ఆనతస్సన్ = వంగిన వాఁడనై, బహుమానం = **పూజను** లేదా, సన్మానమును, శ్రయే =

చేతును. కిఞ్చ = మఱియు, వక్త్రం = ముఖమును, కియత్ = కొంచెము, వినమ్య = (రోషముచే) వంచి. వర్తసేచేత్ = ఉంటివో, తదా = అప్పుడు, పదావధి = పాదములవరకును, నమామి = ప్రణమిల్లుదును.

సమాసములు :

పదావధి : పదం అవధిః యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = పదావధి

భావము :

ఓ కోపశీలా, నీవు నాయెడ నిసుమంత కోపమునుఁ జేసితివో, అప్పుడు నీ విషయమున నమ్రుఁడనై గొప్ప పూజనుఁగాని, సన్మానమునుఁ గాని చేయఁగలను. నీవు రోషవశముచే, తల వాల్చుకొని యుంటివో, అప్పుడు నేను నీపాదములవఱకును నమస్కరించి నీ రోషమునుఁ దొలఁగింతును నీ యల్ప మానమును అనగా కోపమును బహుమానము తోఁడను, నీ యల్పనమనమును బహునమనముచేతనుఁ దొలఁగింతు నని యాశయము. ॥౧౦౮॥

శ్లో॥ ప్రభుత్వభూమ్నాను గృహాణ వా న వా
ప్రణామమాత్రాధిగమేఽపి కః శ్రమః ।
క్వ యాచతాం కల్పలతాసి మాం ప్రతి
క్వ దృష్టిదానే తవ బద్ధముష్టితా ॥ ౧౦౯

ప॥వి॥ ప్రభుత్వభూమ్నా । అనుగృహాణ । వా । న । వా । ప్రణామమాత్రాధిగమే । అపి । కః । శ్రమః । క్వ । యాచతాం । కల్పలతా । అసి । మాం । ప్రతి । క్వ । దృష్టిదానే । తవ । బద్ధముష్టితా.

టీక॥ ఓదమయన్తి! ప్రభుత్వభూమ్నా; ప్రభుత్వ = (నాజీవితము నీకధీనము కాన) నాపైని నీకున్న యధికారముయొక్క, భూమ్నా = అతిశయముచే, అనుగృహాణవా = అనుగ్రహింపుము, నవాఽనుగ్రహాణ = అను గ్రహింపకపొమ్ము. కిన్తు = కాని, ప్రణామమాత్రాధిగమేఽపి; ప్రణామ మాత్ర = నమస్కారమునుమాత్రము. అధిగమేఽపి = పొందుట

యందును, కః = ఏమి, శ్రమః = భారము? యాచతాం = యాచకులకు, కల్పలతా = కల్పవృక్షమైన, అసి = నీవు, క్వ = ఎక్కడ? మాం ప్రతి = నన్నుఁగూర్చి, దృష్టిదానే = దృష్టినొసంగుటయందు, అనగా నన్నుఁజూచుటయందు, తవ = నీయొక్క, బద్ధముష్టితా = లోభిత్వము, (గట్టిపిడికిలిగల్గియుండుట) క్వ = ఎక్కడ.

వి॥ దానమందుఁ గల్పలతగా నుండుటకు, దృష్టిదానమునందు లుబ్ధురాలుగ నుండుటకును సంబంధము లేదు. ఇది రెండును విరూపములు కాన విరూపముల నొకచోటఁ జేర్చుటవలన విషమాలఙ్కారము,

**భావము :**

ఓదమయన్తీ! నా జీవితము నీ కధీనము. కావున నీకు నాపైఁ బ్రభుత్వము అనగా నధికార మున్నది. కావున నట్టి ప్రభుత్వశక్తిచే నన్ను ననుగ్రహింపుము. లేదా అనుగ్రహింపకుము. కాని నావన్దనములను స్వీకరించుటలో నీకేమి శ్రమ యున్నది? అదియు, సాధ్యపడనిచో దర్శన మొసంగియైనను ననుగ్రంపుము యాచకుల పాటికి కల్పవృక్ష మైన నీవెక్కడ? దర్శన మొసంగుటలో నీ లుబ్ధత్వ మెక్కడ? ఇవి రెండును పరస్పరవిరుద్ధములు కాన కటాక్షములచే నన్ను ననుగ్రహింపుము. ॥౧౦౯॥

శ్లో॥ స్మరేషుబాధాం సహసే మృదుః కథం
హృది ద్రఢీయః కుచసంవృతే తవ।
నిపత్య వైసారిణకేతనస్య వా
వ్రజన్తి బాణా విముఖోత్ప్రతిష్ఠుతామ్॥ ౧౧౦

ప॥వి॥ స్మరేషుబాధాం । సహసే । మృదుః । కథం । హృది । ద్రఢీయః । కుచసంవృతే । తవ । నిపత్య : వైసారిణకేతనస్య । వా । వ్రజన్తి । బాణాః । విముఖోత్ప్రతిష్ఠుతామ్.

టీక॥ హేభైమి = ఓదమయన్తీ! మృదుః = మెత్తనిశరీరముగల, త్వం = నీవు, స్మరేషుబాధాం; స్మరేషు = మన్మథబాణములయొక్క, బాధాం = బాధను, కథం = ఎట్లు, సహసే = సహింతువు? అథవా = లేదా,

వైసారిణకేతనస్య: వైసారిణ = మీనమును, కేతనస్య ధ్వజమందుఁ గల్గిన మన్మథునియొక్క, బాణః = బాణము, ప్రథీయఃకుచసంవృతే; ప్రథీయః = మిక్కిలిగట్టివైన, కుచ = స్తనములచే, సంవృతే = మూయఁబడిన, తవ = నీయొక్క, హృది = హృదయమందు, నిపత్య = పడి, విముఖోత్పతిష్ణుతాం; విముఖ = (కుచములదెబ్బచే) వెనుకకుఁదిరిగినవై, ఉత్పతిష్ణుతాం = పైకెగురుస్వభావమును, వ్రజన్తివా = పొందుచున్నవా; (కానిచో నీ కింతటి యుపేక్ష యేల?)

సమాసము:

స్మరేషుబాధాం : స్మరస్య ఇషవః = స్మరేషవః. స్మరేషూణాం బాధా = స్మరేషుబాధా. తామ్ = స్మరేషుబాధాం.

కుచసంవృతే : కుచాభ్యాం సంవృతం = కుచసంవృతం. తస్మిన్ = కుచసంవృతే.

వైసారిణకేతనస్య : విసరతీతి = విసారీ. విసార్యేవ = వైసారిణః. వైసారిణః కేతనే యస్య సః = వైసారిణకేతనః. తస్య = వైసారిణకేతనస్య.

విముఖోత్పతిష్ణుతాం : విముఖాశ్చ తే ఉత్పతిష్ణవశ్చ = విముఖోత్పతిష్ణవః. విముఖోత్పతిష్ణూనాం భావః = విముఖోత్పతిష్ణుతా. తామ్ = విముఖోత్పతిష్ణుతాం.

భావము :

ఓదమయన్తీ! మెత్తని యొడలు గల్గిన నీవు మన్మథుని బాణముల దెబ్బ నెట్లు సహింతువు. లేదా, మీనధ్వజుని బాణములు, నీ దృఢతరము లగు స్తనములచే మూయబడిన హృదయముపైనఁ బడి వెనుకకుఁ దిరిగి పై కెగురుచున్నవా? కానిచో నీ కున్న మన్మథబాధకు నీవిట్లు ఉపేక్షించుట యెట్లు సంభవించును. ॥౧౧౦॥

శ్లో॥ స్మితస్య సమ్భావయ సృక్వణా కణా-
విధేహి లీలాచలమఞ్చలం భ్రువోః ।

అపాఙ్గరథ్యాపథికీఞ్చ హేలయా
ప్రసహ్య సన్ధేహి దృశం మమోపరి॥ ౧౧౧

ప॥వి స్మితస్య । సమ్భావయ । సృక్వణా । కణాః । విధేహి । లీలాచలమ్ ।
అఞ్చలం । భ్రువోః । అపాఙ్గరథ్యాపథికీం । చ । హేలయా ।
ప్రసహ్య । సన్ధేహి । దృశం । మమ । ఉపరి.

టీక॥ స్మితస్య = చిఱునగవుయొక్క, కణాన్ = కణములను, సృక్వణా = సెలవులచే, అనగా పెదవులకొనలచే, సమ్భావయ = గౌరవింపుము. భ్రువోః = కనుబొమ్మలయొక్క, అఞ్చలం = కొసను, లీలాచలం; లీలా = విలాసముతో, చలం = చఞ్చలముగా, విధేహి = చేయుము. తథా = అట్లే. అపాఙ్గరథ్యాపథికీం; అపాఙ్గరథ్యా = కటాక్షమార్గము నందు, పథికీం = బాటసారియైన, దృశం = నేత్రమును, మమ = నాయొక్క, ఉపరి = పైన, హేలయా = లీలతో, ప్రసహ్య = బలాత్కారముగా, సన్ధేహి = ప్రసరింపఁజేయుము.

సమాసములు :

*లీలాచలం :* లీలయా చలం = లీలాచలం. తత్ = లీలాచలం.

*అపాఙ్గరథ్యాపథికీం :* అపాఙ్గ ఏవ రథ్యా = అపాఙ్గరథ్యా. అపాఙ్గ రథ్యాయాం పథికీ = అపాఙ్గరథ్యాపథికీ. తామ్ = అపాఙ్గరథ్యాపథికీం.

భావము :

ఓదమయన్తీ! నీ చిఱునగవుయొక్క లేశభాగమును నీ పెదవి యంచులచే శోభింపఁజేయుము. కనుబొమ్మల కొనలను విలాసముతో కదలింపకుము. కడ కంటిత్రోవన బాటసారి యగు కన్నును నాపై లీలతోఁ బఱపుము. ॥౧౧౧॥

శ్లో॥ సమాపయ ప్రావృషమశ్రువిప్రుషాం
స్మితేన విశ్రాణయ కౌముదీముదః
దృశావితః ఖేలతు ఖఞ్జనద్వయీ
వికాసి పఙ్కేరుహమస్తు తే ముఖమ్॥ ౧౧౨

ప॥వి॥ సమాపయ । ప్రావృషమ్ । అశ్రువిప్రుషాం । స్మితేన । విశ్రాణయ । కౌముదీముదః । దృశౌ । ఇతః । ఖేలతు । ఖఞ్జనద్వయీ । వికాసి పఙ్కేరుహమ్ । అస్తు । తే । ముఖమ్.

టీక॥ కిఞ్చ = మఱియు, అశ్రువిప్రుషాం = కన్నీటిబొట్లయొక్క, ప్రావృషం = వర్షఋతువును, సమాపయ = పూర్తిజేయుము. స్మితేన = చిఱునగవుచే, కౌముదీముదః = వెన్నెలవలని ప్రమోదములను, విశ్రాణయ = ఇమ్ము. దృశౌ = కన్నులనెడి, ఖఞ్జనద్వయీ = కాటుకపిట్టలజంట, ఇతః = ఈనాయందు, ఖేలతు = ఆడునుగాత. తే = నీయొక్క, ముఖం = మోము, వికాసి = వికాసముఁబొందిన, పఙ్కేరుహం = తామరపూవు, అస్తు = అగుఁగాక.

సమాసములు :

*అశ్రూణాం విప్రుషః :* అశ్రువిప్రుషః. తాసాం = అశ్రువిప్రుషాం.

*కౌముదీముదః :* కౌముద్యాః ముదః = కౌముదీముదః. తాః = కౌముదీముదః.

*ఖఞ్జనద్వయీ :* ఖఞ్జనయోః ద్వయీ = ఖఞ్జనద్వయీ.

*వికాసిపఙ్కేరుహమ్ :* వికాసి చ తత్ పఙ్కేరుహం చ = వికాసి పఙ్కేరుహం.

భావము :

నీ కన్నీటివర్షర్తువును సమాప్తిఁగావింపుము, నీ చిఱునగవుచే వెన్నెల వలని సంతోషములను గల్పింపుము. నీ కన్నులనెడి కాటుకపిట్టల జంట నాపై నాడనిమ్ము. నీముఖము వికసించిన పద్మము కానిమ్ము. ౹౧౧౨॥

శ్లో॥ సుధారసోద్వేలనకేళిమక్షర
స్రజా సృజాన్తర్మమ కర్ణకూపయోః ।
దృశౌ మదీయే మదిరాక్షి కారయ
స్మితశ్రియా పాయసపారణావిధిమ్॥ ౧౧౩

ప॥వి॥ సుధారసోద్వేలనకేళిమ్ । అక్షరస్రజా । సృజ । అన్తః । మమ । కర్ణకూపయోః । దృశౌ । మదీయే । మదిరాక్షి । కారయ । స్మితశ్రియా । పాయసపారణావిధిమ్.

టీక॥ హేమదిరాక్షి! = ఓసి మదమును గల్గించు కన్నులుగలదానా! అక్షరస్రజా = వర్ణపఙ్క్తిచే, అనగా మాటలను గూర్చుటచే, కర్ణకూపయోః = కర్ణరన్ధ్రములయొక్క, అన్తః = లోపల, సుధారసోద్వేలనకేళిం; సుధారస = అమృతరసముయొక్క, ఉద్వేలన = పొంగిపొరలునట్టి, కేళిం = క్రీడను, సృజ = చేయుము. అనగా సంభాషింపుము. మదీయే = నాకుసంబంధించిన, దృశౌ = కన్నులను, స్మితశ్రియా = చిఱునగవు సోయగముచే, పాయసపారణావిధిం; పాయసపారణా = ఉపవాసమైన పిదప జేసెడి పాయసభోజనముయొక్క, విధిం = క్రియను, కారయ = చేయించుము.

## సమాసములు :

*సుధారసోద్వేలనకేళిం* : సుధారసస్య ఉద్వేలనం = సుధారసోద్వేలనం. సుధారసోద్వేలనమేవ కేళిః = సుధారసోద్వేలనకేళిః. తామ్ = సుధారసోద్వేలనకేళిం.

*అక్షరస్రజా* : అక్షరాణాం స్రక్ = అక్షరస్రక్. తయా = అక్షరస్రజా.

*కర్ణకూపయోః* : కర్ణౌ కూపావివ = కర్ణకూపౌ. తయోః = కర్ణకూపయోః.

*మదీయే* : మమ ఇమే = మదీయే. తే = మదీయే.

*మదిరాక్షి* : మదిరే అక్షిణీ యస్యాస్సా = మదిరాక్షీ. తస్యాస్సమ్బుద్ధిః = హేమదిరాక్షి.

*స్మితశ్రియా* : స్మితస్య శ్రీః = స్మితశ్రీః. తయా = స్మితశ్రియా.

*పాయసపారణావిధిమ్* : పాయసస్య పారణా = పాయసపారణా. పాయసపారణైవ విధిః = పాయసపారణావిధిః. తమ్ = పాయసపారణావిధిమ్.

**భావము :**

ఓసి, మోహింపఁజేయుకన్నులుకలదానా! వర్ణావళిచే ననగా మాటలనుఁ గూర్చుటచే, నా కర్ణరన్ధ్రములలోపల నమృతరసము నుప్పొంగించెడి లీలనుఁ జేయుము. అనగాఁ జక్కఁగా మాట్లాడి యా మాటలచే నా చెవ్వులయం దమృత రసము నుప్పొంగింపుము. ఎన్నడును నీ చిఱునగవునుఁ జూడక యుపవాసము గావించు నా కన్నులకు నీ చిఱునగవుసోయగములతో నుపవాసాంతము నందా చరించెడి పాయసాన్నముతో పారణనుఁ జేయింపుము. ॥౧౧౩॥

శ్లో॥ మమాఽసనార్ధే భవ మణ్డనం న న
ప్రియే! మదుత్సఙ్గవిభూషణం మమ।
భ్రమాత్ భ్రమాదాలపమఙ్గ! మృష్యతాం
వినా మమోరః కతరత్తవాసనమ్॥ ౧౧౪

ప॥వి॥ మమ । ఆసనార్ధే । భవ । మణ్డనం । న । న । ప్రియే । మదుత్సఙ్గవిభూషణం । మమ । భ్రమాత్ । భ్రమాత్ । ఆలపమ్ । అఙ్గ । మృష్యతాం । వినా । మమ । ఉరః । కతరత్ । తవ।ఆసనమ్.

టీక॥ హే ప్రియే! = ఓ ప్రియురాలా! మమ = నాయొక్క, ఆసనార్ధే = సింహాసనముయొక్క యర్ధభాగమున, మణ్డనం = అలఙ్కారము, భవ = కమ్ము (అచ్చటఁగూర్చుండుము). నన = కూడదుకూడదు ఇది చాల అనుచితము. కిన్తు = కాని, మదుత్సఙ్గవిభూషణం; మత్ = నాయొక్క, ఉత్సఙ్గ = ఒడికి, విభూషణం = ఆభరణము, భవ = కమ్ము అనగా నొడియందు కూర్చొనుము(అదియుకాదనినచో) భ్రమాత్ = భ్రాన్తివలన, ఆలపమ్ = జెప్పితిని. భ్రమాత్ = భ్రాన్తివలన, ఆలపమ్ = చెప్పితిని. అఙ్గ, = ఓదమయన్తీ! మృష్యతాం = క్షమింపఁ బడునుఁగాత. కిన్తు = కాని, మమ = నాయొక్క, ఉరః = వక్షః స్థలమును, వినా = కాకుండ, తవ = నీకు, ఆసనం = అసనము, కతరత్ = ఏదియున్నది? ముందుఁజెప్పిన, ఆసనార్ధనమునకంటెను, ఒడికంటెను, వక్షఃస్థలమే యుత్కృష్టమైన దని యర్థము.

వి॥ ఇచ్చట దమయన్తి యను నాధేయమునకుఁ గ్రమముగా ననేకము లగు నాధారములను అనగా-అర్ధాసనోత్సఙ్గ-వక్షఃస్థలములనుఁ జెప్పుటవలన పర్యాయాలఙ్కారము.

## సమాసములు :

ఆసనార్ధే : అర్ధమాసనస్య=ఆసనార్ధం. తస్మిన్=ఆసనార్ధే.

మదుత్సఙ్గవిభూషణం : మమ ఉత్సఙ్గః=మదుత్సఙ్గః. మదుత్సఙ్గస్య విభూషణం=మదుత్సఙ్గవిభూషణం,

## భావము :

ఓ ప్రియురాలా! నా యాసనముయొక్క సగపాలు నాక్రమించి దానికి భూషణము కమ్ము. ఇది కూడదు ఇది కూడదు. దీనిని నేను ఆలోచింపక చెప్పితిని కాన ఊనికంటెను శ్రేష్ఠమైన నా యొడికి భూషణము కమ్ము అనగా నా యొడియందుఁ గూర్చుండుము. ప్రియురాలా భ్రమతోఁ జెప్పినాను భ్రమతో జెప్పినాను. క్షమించుము. నా యీ యొడికంటెను నుత్కృష్ట మైన యాసన మున్నది. అదేదనగా నా వక్షఃస్థలము. నా వక్షఃస్థలమును వదలి మఱి యేది నీకు, ఆసనము కాఁగలదు. కావున నా వక్షఃస్థలము నలఙ్కరింపుము. ॥౧౧౪॥

శ్లో॥ అధీతపఞ్చాశుగబాణవఞ్చనే!
స్థితామద స్తర్బహిరేషి చేదురః।
స్మరాశుగేభ్యో హృదయం బిభేతు న
ప్రవిశ్య త త్త్వన్మయసంపుటే మమ॥ ౧౧౫

ప॥వి॥ అధీతపఞ్చాశుగబాణవఞ్చనే । స్థితా । మదన్తః । బహిః । ఏషి । చేత్ । ఉరః । స్మరాశుగేభ్యః । హృదయం । బిభేతు । న । ప్రవిశ్య । తత్ । త్వన్మయసంపుటే । మమ.

టీక॥ అధీతపఞ్చాశుగపాణవఞ్చనే!; అధీత = అభ్యసింపఁబడిన, పఞ్చాశుగ=పఞ్చబాణునియొక్క, బాణ=బాణములకు, వఞ్చనే=మోసము గలదానా, (హే భైమి=ఓదమయన్తీ=) త్వం=నీవు, మదన్తః=

నాలోన, స్థితా = ఉన్నావు. అథ = పిదప, బహిః = వెలుపల, ఉరః = వక్షఃస్థలమును, ఏషిచేత్ = పొందితివో, తత్ = అప్పుడు, మమ = నాయొక్క, హృదయం = హృదయము, త్వన్మయసంపుటే = నీయొక్క రూపముననున్న సంపుటయందు, ప్రవిశ్య = ప్రవేశించి, స్మరాశుగేభ్యః = మన్మథబాణములనుండి, నబిభేతు = భయపడక యుండునుగాక.

సమాసములు :

అధీతపఞ్చాశుగబాణవఞ్చనే: పఞ్చ ఆశుగాః యస్య సః = పఞ్చాశుగః. పఞ్చాశుగస్య బాణాః = పఞ్చాశుగబాణాః. పఞ్చాశుబాణానాం వఞ్చనా = పఞ్చాశుగబాణవఞ్చనా. అధీతా పఞ్చాశుగబాణవఞ్చనా యయా సా = అధీతపఞ్చాశుగబాణవఞ్చనా: తస్యాఃసమ్బుద్ధిః = అధీతపఞ్చాశుగబాణవఞ్చనే:

మదన్తః : మమ అన్తః = మదన్తః.

స్మరాశుగేభ్యః : స్మరస్య ఆశుగాః = స్మరాశుగాః. తేభ్యః = స్మరాశుగేభ్యః.

త్వన్మయసంపుటే : తవ వికారః = త్వన్మయః త్వన్మయశ్చాసౌసంపుటశ్చ త్వన్మయసంపుటః. తస్మిన్ = త్వన్మయసంపుటే.

భావము :

ఓ దమయన్తీ! నీవు పఞ్చబాణుని శరములను వంచించుటలోఁ జక్కగా నభ్యాసముఁ గావించినదానవు? నీవు నాహృదయమందున్నావు. ఇఁక నీవు వెలుపల నా వక్షస్థలమునందుంటివో, అప్పుడు నాహృదయము త్వద్రూప మైన సంపుటయందు అనగా పెట్టెయందుండి స్మరబాణములవలని భయము లేక యుండును. అనగా నా యభ్యన్తరమునందు, అనగా, నా లోపల, నా వెలుపల అనగా నా వక్షస్థలమునందు నీవు నెలకొనినచో నాకు లోపల వెలుపల నీ రక్షణ ముండుటవలన మన్మథబాణముల బెడద యుండదు. ॥౧౧౫॥

శ్లో॥ పరిష్వజస్వానవకాశబాణతా
స్మరస్య లగ్నే హృదయద్వయేఽస్తు నౌ ।

దృఢా మమ త్వత్కుచయోః కఠోరయో
రురస్థలీయం పరిచారికోచితా॥ ౧౧౬

ప॥వి॥ పరిష్వజస్వ । అనవకాశబాణతా । స్మరస్య । లగ్నే । హృదయద్వయే । అస్తు । నౌ । దృఢా । మమ । త్వత్కుచయోః । కఠోరయోః । ఉరస్థలీ । ఇయం । పరిచారికా । ఉచితా.

టీక॥ హే ప్రియే = ఓ ప్రియురాలా! పరిష్వజస్వ = కౌగలింపుము. తథాసతి = అట్లు కౌగలించుకొనినచో, లగ్నే = ఒండొంటితో నతుకుకొనిపోయిన, నౌ = మనయొక్క, హృదయద్వయే = రెండుహృదయములయందును, స్మరస్య = మన్మథునికి, అనవకాశబాణతా = అవకాశములేని బాణముల ప్రయోగము కల్గియుండుట, అస్తు = అగును. కిఞ్చ = మఱియు, దృఢా = కఠినమైన, మమ = నాయొక్క, ఇయం = ఈ, ఉరస్థలీ = వక్షస్థలి, కఠోరయోః = కఠినములైన, త్వత్కుచయోః = నీ స్తనములకు, పరిచారికా = పరిచారికగా, ఉచితా = తగినది.

వి॥ సమమైన వస్తువులకు యోగమున్నప్పుడు సమాలఙ్కారము గాన నిచట పరస్పరాలిఙ్గనముచే, సమములైన హృదయములకు చేరికయు, సమములైన యురఃస్థలములకు చేరికయు నేర్పడుటవలన సమాలఙ్కారము.

## సమాసములు :

అనవకాశబాణతా : అవిద్యమానః అవకాశః యేషాం తే = అనవకాశాః. అనవకాశాః బాణాః యస్య సః అనవకాశబాణః. అనవకాశబాణస్య భావః = అనవకాశబాణతా.

హృదయద్వయే : హృదయయోః ద్వయం = హృదయద్వయం. తస్మిన్ = హృదయద్వయే.

త్వత్కుచయోః : తవ కుచౌ = త్వత్కుచౌ. తయోః = త్వత్కుచయోః.

ఉరస్థలీ : ఉరసః స్థలీ = ఉరస్థలీ.

## భావము :

ఓదమయన్తీ! నీవు నన్నుఁ గౌగలించు కొనుము. అట్లు కౌగలింపులో మన యిరువురి హృదయములు సందులేక యొండొంటితో నతుకుకొని

పోయినచో మన్మథబాణములు దూరుట కవకాశముండదు. మఱియు దృఢమైన నా వక్షస్థలి కఠినములగు నీ స్తనములకు పరిచారికగా నుండుటకుఁ దగినది. ॥౧౧౬॥

శ్లో॥ శుభాష్టవర్గ స్త్వదనఙ్గజన్మన
స్తవాధరేఽలిఖ్యత యత్ర లేఖయా ।
మదీయ ద న్తక్షతరాజి రఞ్జనైః
స భూర్జతామార్జతు బిమ్బపాటలః ॥ ౧౧౭

ప॥వి॥ శుభాష్టవర్గః । త్వదనఙ్గజన్మనః । తవ । అధరే । అలిఖ్యత । యత్ర । లేఖయా । మదీయద న్తక్షతరాజిరఞ్జనైః । సః । భూర్జతామ్ । ఆర్జతు । బిమ్బపాటలః.

టీక॥ యత్ర = ఏ, తవ = నీయొక్క, అధరే = పెదవియందు, రేఖయా = రేఖలచే, త్వదనఙ్గజన్మనః; త్వత్ = నీదైన, అనఙ్గ = మన్మథుని యొక్క, జన్మనః = పుట్టుకకుసమ్బంధించినదైన, శుభాష్టవర్గః; శుభ = శుభమును సూచించెడి, అష్టవర్గః = జ్యోతిశ్శాస్త్రమునకు సంబంధించిన యష్టవర్గ, అలిఖ్యత = రేఖారూపముతో వ్రాయఁబడినది. (రేఖారూపమైనది శుభసూచకమనియు బిందురూపమైనవి యశుభసూచికమనియు భావము.) మదీయద న్తక్షతరాజిరఞ్జనైః; మదీయ = నాదైన, ద న్తక్షత = ద న్తక్షతములయొక్క, రాజి = పఙ్క్తిచే, రఞ్జనైః = రంగువేయుట చేత, బిమ్బఫలవత్ = దొండపండువలె, పాటలః = ఎఱ్ఱనైన, సః = ఆ పెదవి, భూర్జతాం = భూర్జపత్రముగానుండుటను, ఆర్జతు = పొందును గాక.

వి॥ ఇచ్చట నధరముపైని రేఖలకు అష్టవర్గరేఖాత్వము, అధరమునకు భూర్జపత్రత్వ ముత్ప్రేక్షితములు గాన నుత్ప్రేక్ష.

సమాసములు :

శుభాష్టవర్గః : అష్టానాం వర్గః = అష్టవర్గః. శుభశ్చాసౌ అష్టవర్గశ్చ = శుభాష్టవర్గః.

త్వదనఙ్గజన్మనః : తవ అనఙ్గః = త్వదనఙ్గః. త్వదనఙ్గస్య జన్మ = త్వదనఙ్గజన్మ. తస్య = త్వదనఙ్గజన్మనః.

మదీయదన్తక్షతరాజిరఞ్జనైః : మమ ఇమాని = మదీయాని. దన్తానాం క్షతాని = దన్తక్షతాని. మదీయాని చ తాని దన్తక్షతాని చ = మదీయదన్తక్షతాని. మదీయదన్తక్షతానాం రాజిః = మదీయదన్తక్షతరాజిః. మదీయదన్తక్షతరాజ్యా రఞ్జనాని = మదీయదన్తక్షతరాజిరఞ్జనాని. తైః = మదీయదన్తక్షరాజిరఞ్జనైః.

బిమ్బపాటలః : బిమ్బవత్ పాటలః = బిమ్బపాటలః.

భావము :

ఓదమయన్తీః నీ మన్మథుని జన్మకు శుభసూచకమగు, జ్యోతిశ్శాస్త్ర ప్రసిద్ధమైన యష్టవర్గము నీ యధరమందు వ్రాయఁబడినది. అ యనఙ్గుఁడు మానసపుత్రుఁ డగుటవలన నుత్తముఁడు. అట్టివాని జన్మపత్రికను భూర్జ పత్రమున వ్రాయుదురు. నీపెదవి యష్టవర్గలో శుభసూచకము లగు రేఖలతోఁ గూడినదై, నా దన్తక్షతరాజితో రంగువేయఁబడినట్లు కానవచ్చు చు దొండపండు వలె శోభించుచున్నది. అట్టి యాయధరము నీ యనఙ్గుని జన్మపత్రికను వ్రాయుట కుపయోగపడు భూర్జపత్రమో యనునట్లున్నది. జన్మకాలమందలి గ్రహముల కధీనము లగు భావిశుభాశుభములనుఁ దెలుపునట్టిదియు శుభఫలము లను సూచించు రేఖలతోఁడను, నశుభఫలములను సూచించుబిందువులతోఁడను గూడి గృహసన్నివేశములనుఁ తెలుపునట్టి చక్రవిశేషము అష్టవర్గ మనఁ బడును. ॥౧౨౭॥

శ్లో॥ తవాఽధరాయ స్పృహయామి యన్మధు
స్రవైః శ్రవః సాక్షికమాక్షికా గిరః।
అధిత్యకాసు స్తనయోస్తనోతు తే
మమేన్దురేఖాభ్యుదయాద్భుతం నఖః॥ ౧౧౮

ప॥వి॥ తవ । అధరాయ । స్పృహయామి । యత్ । మధుస్రవైః । శ్రవః సాక్షికమాక్షికాః । గిరః । అధిత్యకాసు । స్తనయోః । తనోతు । తే । మమ । ఇన్దురేఖాభ్యుదయాద్భుతం । నఖః.

టీక॥ కిఞ్చ = మఱియు, తవ = నీయొక్క, అధరాయ = పెదవికై, స్పృహయామి = ఆశపడుచున్నాను, అనగా నీయధరమును పానముఁ జేయఁగోరుచున్నాను. (ఏలయనగా) యన్మధుస్రవైః, యత్ = ఏ పెదవియొక్క, మధుస్రవైః = తేనెరసములచే, తవ = నీయొక్క, గిరః = మాటలు, శ్రవఃసాక్షికమాక్షికాః; శ్రవః = కర్ణములే, సాక్షిక = సాక్షులుగాఁగల్గిన, మాక్షికాః = తేనెగలవిగా అనగా శ్రవణపేయములుగానున్నవి. కిఞ్చ = మఱియు, తే = నీయొక్క, స్తనయోః = స్తనములయొక్క, అధిత్యకాసు = పైభాగములయందు, మమ = నాయొక్క, నఖః = గోరు, ఇన్దురేఖాభ్యుదయాద్భుతం; ఇన్దురేఖా = చన్ద్రికలయొక్క, అభ్యుదయ = ఉదయముచే, అద్భుతం = వింతను, తనోతు = చేయునుఁగాత అనగా నీ కుచకుమ్భములయందు నఖక్షతమునుఁ జేయఁగోరుచున్నాననియర్థము.

సమాసములు :

యన్మధుస్రవైః : మధునః స్రవాః = మధుస్రవాః. యస్య మధుస్రవాః = యన్మధుస్రవాః. తైః = యన్మధుస్రవైః.

శ్రవఃసాక్షికమాక్షికాః : శ్రవసీ సాక్షిణీ యస్య తత్ = శ్రవఃసాక్షికం. శ్రవఃసాక్షికం మాక్షికం యాసు తాః = శ్రవస్సాక్షికమాక్షికాః.

ఇన్దురేఖాభ్యుదయాద్భుతం : ఇన్దోః రేఖా = ఇన్దురేఖా. ఇన్దురేఖాయాః అభ్యుదయః = ఇన్దురేఖాభ్యుదయః. ఇన్దురేఖాభ్యుదయేన,అద్భుతం = రేఖాభ్యుదఇన్దురేఖాభ్యుదయాద్భుతం. తత్ = ఇన్దురేఖాభ్యుదయాద్భుతం.

భావము :

ఓదమయన్తీ! నీ పెదవిని పానము చేయఁకోరుచున్నాను. ఏల యనగా ఆ పెదవియందలి తేనెరసములచే నీ మాటలు మాధుర్యము నొంది శ్రవణపేయము లైనవి. మఱియు నీ స్తనపర్వతముల పైభాగములయందు నా గోరు చంద్రకళ యుదయించినప్పుడు గల్గు వైచిత్ర్యమునుఁ జేయఁగోరుచున్నది. అనగా నీ కుచకుమ్భములపైన నఖక్షతముఁజేయఁగోరుచున్నాను. ॥౧౧౮॥

శ్లో॥ న వర్తసే మన్మథ నాటికా కథం
ప్రకాశ రోమావలిసూత్రధారిణీ।
తవాఙ్గహారే రుచిమేతి నాయకః
శిఖామణిశ్చ ద్విజరాడ్విదూషకః ॥ ౧౦౯

ప॥వి॥ న । వర్తసే । మన్మథనాటికా । కథం । ప్రకాశమేమావలిసూత్రధారిణీ । తవ । అఙ్గహారే । రుచిమ్ । ఏతి । నాయకః । శిఖామణిః । చ । ద్విజరాడ్విదూషకః.

టీక॥ హేభైమి= ఓదమయస్త్రీ! త్వం=నీవు, మన్మథనాటికా = మన్మథుఁడనుకవియొక్క నాటికవుగా, కథం=ఎట్లు, నవర్తసే= ఉండవు? (మన్మథోద్దీపికవుగను నెట్లుండవు)? ఎట్లనగా, ప్రకాశ రోమావలి సూత్రధారిణీ; ప్రకాశ=స్పష్టమైన, రోమావలిసూత్ర = సూత్రము వంటినూగారును, ధారిణీ=ధరించుదానవు, నాటికపక్షమున; సూత్రధారునిఁగల్గినదియు. తవ=నీయొక్క, అఙ్గహారే = ముక్తాహారము నందు, నాయకః=మధ్యమణి, రుచిమ్=కాన్తిని, ఏతి = పొందుచున్నది. నాటికపక్షమున, నాయకః=కథానాయకుఁడు, అఙ్గహారే = అఙ్గవిన్యాసమందు, రుచిం=ప్రీతిని, ఏతి= పొందును. శిఖామణిశ్చ= శిరోరత్నముగూడ, ద్విజరాడ్విదూషకః, ద్విజరాట్ = చన్ద్రుని, విదూషకః = విశేషముగాదూషించునది నాటకపక్షమున, ద్విజరాడ్విదూషకః; ద్విజరాట్ = బ్రాహ్మణోత్తములైన, విదూషకః = విదూషకుఁడు, శిఖామణిః = ఆదరింపఁదగినవాడు, ఇట్లు సూత్రధారాతియోగ ముండుటవలన నీవు మన్మథనాటికవు ఏలకావు. పక్షాన్తరమున యౌవనాలఙ్కారాది సంబంధమువలన నెట్లు మన్మథోద్దీపకురాలవు గావు.

సమాసములు :

మన్మథనాటికా : మన్మథస్య నాటికా = మన్మథనాటికా.

ప్రకాశరోమావలిసూత్రధారిణీ : రోమ్ణామావలిః = రోమావలిః.

రోమావలిః సూత్రమివ రోమావలి సూత్రమ్. ప్రకాశం రోమావలిసూత్రం = ప్రకాశరోమావలిసూత్రం. ప్రకాశరోమావలిసూత్రం ధారయతీతి = ప్రకాశ రోమావలిసూత్రధారిణీ.

అఙ్గహారే : అఙ్గస్య హారః = అఙ్గహారః. తస్మిన్ = అఙ్గహారే.

ద్విజరాడ్విదూషకః : ద్విజానాం రాట్ = ద్విజరాట్. ద్విజరాజస్య విశేషేణ దూషకః = ద్విజరాడ్విదూషకః.

**భావము :**

ఓదమయన్తీ! నిన్ను మన్మథుఁడు నాటికగాఁ జేసెను. కాఁబట్టి నీవు మన్మథనాటికవు (మన్మథోద్దీపకురాలుగను నున్నావు). నీవు సూత్రమువంటి నూగారును ధరించి యున్నావు. నాటికపక్షమున సూత్రధారుని గల్గినది. నీ ముక్తాహారమున నాయకమణిశోభను వహించియున్నది. నాటికలో కథా నాయకుఁడు అఙ్గవిన్యాసమునఁ బ్రీతినిఁ బొందుచున్నాడు. నీ శిరోరత్నము ద్విజరాజైన చంద్రుని మించి ప్రకాశించుచున్నది. నాటికలో బ్రాహ్మణో త్తముడు విదూషకుఁడై నాయకునకు హాస్యసచివుఁడై శిరోరత్నమై యనగా నాదరపాత్రుడై వెలుఁగుచున్నాడు. ఇట్లు సూత్రధారాదుల సంబంధమునుఁ బట్టి నీవు మన్మథనాటికవుగా నేల కావు. మన్మథనాటిక యనగా, మన్మథుఁ డను కవిచే రచియింపఁబడిన నాటిక యని యర్థము. కావున నీవు మన్మథుఁ డను కవిచే విరచితమైన నాటికవే యగుచున్నావు. పైనఁ జెప్పినవిధముగా నీయందు నాటికకుఁ గావలసిన సూత్రధారాదుల మున్నగు లక్షణము లమరి యున్నవి గదా!.

శ్లో॥ గిరాఽనుకమ్పస్వ దయస్వ చుమ్బనైః
ప్రసీద శుశ్రూషయితుం మయా కుచౌ।
నిశేవ చాన్ద్రస్య కరోత్కరస్య య
న్మమ త్వమేకాసి నలస్య జీవితమ్॥ ౧౨౦

ప॥వి॥ గిరా । అనుకమ్పస్వ । దయస్వ । చుమ్బనైః । ప్రసీద । శుశ్రూష యితుం । మయా । కుచౌ । నిశా । ఇవ । చాన్ద్రస్య । కరోత్కరస్య । యత్ । మమ । త్వమ్ । ఏకా । అసి । నలస్య । జీవితమ్.

టీక॥ గిరా = సమ్భాషణముచే, అనుకమ్పస్వ = దయనునెరపుము. చుమ్బనైః = ముద్దులతో, దయస్వ = కృపఁజూఁడుము. కుచౌ = స్తనములను, మయా = నాచే, శుశ్రూషయితుం = శుశ్రూషఁజేయుటకు, ప్రసీద = ప్రసన్నవుకమ్ము. లేనిచో నేనెట్లుజీవింతును? యత్ = ఏలయనగా, చాన్ద్రస్య = చన్ద్రసంబంధమైన, కరోత్కరస్య = కిరణసమూహమునకు, నిశేవ = రాత్రివలె, నలస్య = నలుఁడైన, మమ = నాకు, త్వమ్ = నీవు, ఏకా = ఒక్కతవే, జీవితం = జీవితముగా, అసి = అగుచున్నావు.

భావము :

మాటలచే ననుకమ్పింపుము. ముద్దులచే దయను నెఱపుము. నీ స్తనములను సేవించుటకు ప్రసన్నరాలవు కమ్ము. చంద్రునికి సంబంధించిన కిరణసమూహమునకు రాత్రివలెనలుఁడనైన నాకు, నీవు ఒక్కతవే జీవితమగుచున్నావు. ॥౨౦॥

శ్లో॥ మునిర్యథాఽఽత్మానమథ ప్రబోధవాన్
ప్రకాశయన్తం స్వమసావబుధ్యత ।
అపి ప్రపన్నాం ప్రకృతిం విలోక్య తా
మవాప్త సంస్కారతయాఽసృజద్గిరః ॥ ౧౨౧

ప॥వి॥ మునిః । యథా । ఆత్మానమ్ । అథ । ప్రబోధవాన్ । ప్రకాశయన్తం । స్వమ్ । అసౌ । అబుధ్యత । అపి । ప్రపన్నాం । ప్రకృతిం । విలోక్య । తామ్ । అవాప్తసంస్కారతయా । అసృజత్ । గిరః ।

టీక॥ అథ = ఇట్లుభ్రాన్తితొలగినపిదప, అసౌ = ఈనలుఁడు, మునిర్యథా = మునివలె, ప్రబోధవాన్ = జ్ఞానమునుఁబొందినవాడై, ఆత్మానం = తనస్వరూపమును, ప్రకాశయన్తం = ప్రకాశించుచున్నదిగా, అబుధ్యత = తెలిసికొనెను. అథ = పిదప, ప్రపన్నాం = పొందఁబడిన, తాం = ఆ, ప్రకృతిం = స్వభావమును, విలోక్యాఽపి = చూచియు, అవాప్త సంస్కారతయా; అవాప్త = వికాసముఁబొంగిన, సంస్కారతయా = సంస్కారముగల్గియుంటుటచే, అనగా తన దూతత్వమును స్మరించుట వలన, గిరః = దూత్యమునకుఁదగినమాటలనే, అసృజత్ = చెప్పెను.

సమాసములు :

అవాప్తసంస్కారతయా : అవాప్తః సంస్కారః యేన సః = అవాప్త సంస్కారః. అవాప్తసంస్కారస్య భావః = అవాప్త సంస్కారతా. తయా = అవాప్తసంస్కారతయా.

భావము :

తర్వాత నలునికి భ్రాన్తి తొలగినది. అప్పుడు నలుడు మునివలె ప్రబోధమునుం బొందినవాఁడై తన స్వరూపమును మఱలఁ ప్రకాశమునుఁ బొందుచున్న దని తెలిసికొని తన పూర్వ స్వరూపమును గుర్తించుకొనినవాఁడై తాను దూతయను సంస్కార ముద్బుద్ధమైనందువలన మఱల యథాపూర్వము దూతగా, సంభాషింప మొదలిడెను. ॥౧౨౧॥

శ్లో॥ అయే మయాఽఽత్మా కిమనిహ్నుతీకృతః
కిమత్ర మన్తా స తు మాం శతక్రతుః ।
పురః స్వభక్త్యాథ నమన్ హ్రియావిలో
విలోకితాహే న తదిఙ్గితాన్యపి ॥ ౧౨౨

ప॥వి॥ అయే । మయా । ఆత్మా । కిమ్ । అనిహ్నుతీ కృతః । కిమ్ । అత్ర । మన్తా । సః । తు । మాం । శతక్రతుః । పురః । స్వభక్త్యా । అథ । నమన్ । హ్రియా । ఆవిలః । విలోకితాహే । న । తదిఙ్గితాని । అపి.

టీక॥ అయే = అయ్యో, మయా = నాచే, ఆత్మా = స్వరూపము, కిం = ఏల, అనిహ్నుతీకృతః = ప్రకటింపఁబడినది. అత్ర = ఈ విషయమున, సః = ఆ, శతక్రతుస్తు = ఇన్ద్రుఁడో, మాం = నన్ను, కిం = ఏమి, మన్తా = తలంపఁగలడు? అథ = పిదప, పురః = ఎదుట, స్వభక్త్యా = తన యందలి భక్తిచే, నమన్ = ప్రణమిల్లుచు, హ్రియా = సిగ్గుచే, ఆవిలః = కలుషితుఁడనై, తదిఙ్గితాన్యపి = తత్ = ఆ యిన్ద్రునియొక్క, ఇఙ్గితాన్యపి = చేష్టలనుఁ గూడ, నవిలోకితాహే = చూడఁబోను, అనగా నతని ముఖమునుఁ జూచుటకును నుత్సాహపడ లేదు.

సమాసములు :

అనిష్ప్నుతీకృతః: అనిష్ప్నుతః నిష్ప్నుతః సమ్పద్యమానః కృతః = నిష్ప్నుతీకృతః.

స్వభక్త్యా: స్వస్మిన్ భక్తిః = స్వభక్తిః. తయా = స్వభక్త్యా.

తదిఙ్గితాని : తస్య ఇఙ్గితాని = తదిఙ్గితాని. తాని = తదిఙ్గితాని.

భావము :

అయ్యో! నే నేల నా స్వరూపమును బయటఁ బెట్టితిని. ఈ సంగతి తెలిసినచో నింద్రు దేమనుకొనును? అతని ఎదుట నిలఁబడి భక్తితో వంగి ప్రణమిల్లుచు సిగ్గుచే కాలుష్యము నొంది యతని యిఙ్గితములను చూడలేను అనగా నతని మోమును జూచుటకును నుత్సాహపడను. ॥౧౨౨॥

శ్లో॥ స్వనామ యన్నామ ముధాఽభ్యధామహం
మహేన్ద్రకార్యం మహదేత దుజ్ఝితమ్ ।
హనూమదాద్యైర్యశసా మయాపున
ర్ద్విషాం హసైర్దూతపథః సితీకృతః ॥ ౧౨౩

ప॥ఛే॥ స్వనామ । యత్ । నామ । ముధా । అభ్యధామ్ । అహం । మహేన్ద్రకార్యం । మహత్ । ఏతత్ । ఉజ్ఝితమ్ । హనూమదాద్యైః । యశసా । మయా । పునః । ద్విషాం । హసైః । దూతపథః । సితీకృతః.

టీక॥ యత్ = ఎందువలన, ముధా = వ్యర్థముగా, స్వనామ = నా పేరును, అభ్యధాంనామ = చెప్పితినిగదా, తత్ = అందువలన, మహత్ = గొప్పదైన, ఏతత్ = ఇది అనగా నిన్ద్రకార్యము, ఉజ్ఝితం = విడువఁబడినది. అహో ఆశ్చర్యము. హనూమదాద్యైః = హనుమన్తుడు మున్నగువారిచే, దూతపథః = దూతమార్గము, యశసా = కీర్తిచే, సితీకృతః = తెలుపుచేయఁబడినది. మయాపునః = నాచేతనో, ద్విషాం = శత్రువులయొక్క, హసైః = నవ్వులచే, సితీకృతః = తెలుపుచేయఁబడినది.. (నలుపుచేయఁబడినదని కొందఱు చెప్పుదురు).

**సమానములు :**

మహేన్ద్రకార్యమ్: మహేన్ద్రస్య కార్యమ్ మహేన్ద్రకార్యమ్.

హనూమదాద్యైః : హనూమాన్ ఆదిః యేషాన్తే = హనూమదాద్యాః.
తైః = హనూమదాద్యైః.

దూతపథః: దూతస్య పన్థాః = దూతపథః.

సితీకృతః : అసితః సితః సమ్పద్యమానః కృతః = సితీకృతః.

**భావము :**

నేను వృథాగా నా పేరునుఁ జెప్పితిని అందువలన గొప్పదైన యింద్రుని కార్యము విడువఁబడినది. అయ్యో! హనుమన్తుఁడు మున్నగువారు చక్కఁగా దూత్యమును నిర్వహించి తమ కీర్తులచే, దూత్యమార్గమును తెలుపుగావించిరి, నేనో, దూత్యమునుఁ జక్కఁగా నిర్వహింపక శత్రువులయొక్క పరిహాసములచే, దూత్యమార్గమును దెలుపుఁగావించిరి. అనగా దూత్యమార్గము కళఙ్కితము గావింపఁబడినది. "సిత"శబ్దమునకు "సితే ధవళమేచకౌ" యని, నీలమనియర్థ ముండుటవలన, శత్రువులనవ్వవలన, "సితీకృతము"అనగా నలుపు గావింపఁ బడినదనియు నర్థముఁ జెప్పుదురు. ॥౧౩॥

శ్లో॥ ధియాత్మనస్తావదచారు నాచరం
పరస్తు యద్వేద స తద్వదిష్యతి।
జనావనాయోద్యమినం జనార్దనం
క్షయే జగజ్జీవపిబం వదన్ శివం॥ ౧౪

ప॥ వి॥ ధియా । ఆత్మనః । తావత్ । అచారు । న । ఆచరం । పరః । తు । యత్ । వేద । సః । తత్ । వదిష్యతి । జనావనాయ । ఉద్యమినం । జనార్దనం । క్షయే । జగజ్జీవపిబం । వదన్ । శివమ్.

టీక॥ అథవా = లేదా, ఆత్మనః = నాయొక్క, ధియా = బుద్ధిచే, అచారు = కూడనిపనిని, నాఽఽచరం = చేయలేదు. (ఏవంస్థితే = ఇట్లుండగా).

పరః = ఇతరమైన, జనః = జనము, యత్ = దేనిని, అచారు = హీనముగా, వదిష్యతి = చెప్పఁగలదో, తత్తు = అది, జనావనాయ; జన = జనులయొక్క, అవనాయ = రక్షణకొఱకు, ఉద్యమినం = ప్రయత్నముఁగల్గిన (విష్ణువును) జనార్దనం = జనులనుఁబీడించువానినిగా, అనగా జనసంహారకునిగాను, అథ = పిదప, క్షయే = ప్రళయమందు, జగజ్జీవపిబం; జగత్ = ప్రపఞ్చమందలి, జీవ = జీవములను, పిబం = పానము చేయునట్టి, అనగా సంహరించువానిని (రుద్రం = రుద్రుని, శివం = శాంతునిగా, వదన్ = చెప్పుచు, (అనగా శివుని అశివునిగాను అశివుని శివునిగాను, వదన్ = చెప్పుచు) సః = అయితరుఁడే, వేద = తెలిసుకొనును.

సమాసములు :

*జగజ్జీవపిబమ్:* జగతాం జీవాః = జగజ్జీవాః. జగజ్జీవాన్ పిబతీతి = జగజ్జీవపిబః. తమ్ జగజ్జీవపిబమ్.

భావము :

లేదా, నాబుద్ధిపూర్వకముగా నేనుతప్పును జేయలేదు. ఇతరుఁ డెవ్వడైనను నేను తప్పునుఁ జేసినట్లు చెప్పినచో నప్పుడు, జనులను రక్షించునట్టి విష్ణువు జనార్దనుఁడగుటవలన, అనగా జన సంహర్త యను నర్థమిచ్చెడి పేరును వహించుటవలన, జనసంహారకుఁడైన రుద్రునిగను, ప్రళయమందు ప్రపఞ్చమందలి జీవములను సంహరించునట్టి రుద్రుఁడు "శివుఁడను" నామముఁ గల్గియుండుట వలన అనగా శుభకరుఁడను నామమునుఁ గల్గియుండుటవలన "శివుఁ"డనియు నాతడు తెలుసుకొనును. అనగా ప్రపఞ్చ సంహారకు డగు రుద్రుని, ప్రపంఞ్చ పాలకుఁడనియుఁ దెలిసికొన వలసి యుండును. అనగా, విష్ణువునకు సంహారకత్వమును శివునికి రక్షకత్వమునెట్లు సత్యములుకావో, అట్లే నేను తప్పుఁ జేసితి నను విషయము సత్యదూరమే. లోకముతో నాకుఁ బనిలేదు. నేను నిరపరాధి యను విషయము నా యన్తర్యామి సాక్షికము ॥౧౨౪॥

శ్లో॥ స్ఫుటత్వదః కిం హృదయం త్రపాభరాత్
యదస్య శుద్ధిర్విబుధైర్విబుధ్యతామ్ ।

విదన్తు తే తత్త్వమిదం తు దస్తర
జనాననే కః కరమర్పయిష్యతి॥ ౧౨౫

ప॥వి॥ స్ఫుటతి । అదః । కిం । హృదయం । త్రపాభరాత్ । యత్ । అస్య । శుద్ధిః । విబుధైః । విబుధ్యతామ్ । విదన్తు । తే । తత్వమ్ । ఇదం । తు । దస్తరం । జనాననే । కః । కరమ్ । అర్పయిష్యతి.

టీక॥ అదః = ఈ, హృదయం = హృదయము, త్రపాభరాత్ = సిగ్గుచేతి భారమువలన. స్ఫుటతికిం = పగులునాయేమి? యత్ = ఎందువలన, అస్య = ఈహృదయముయొక్క, శుద్ధిః = శుద్ధి, విబుధైః = దేవతలచే. విబుధ్యతాం = తెలియబడునుగదా! పరన్తు = కాని, తే = ఆవేల్పులు, తత్త్వం = హృదయశుద్ధిని, విదన్తు = తెలుసుకొనెదరుగాక, తథాపి = అయినను, దస్తరం = ఇదిచాలవిషమము. జనాననే = జనులనోట, కః = ఎవరు, కరం = చేతిని, అర్పయిష్యతి = ఉంచును. ఒకవిధముగా దేవతలను నమ్మింపఁగల్గినను మనుష్యులను నమ్మింపలేము.

సమాసములు:

త్రపాభరాత్ : త్రపాయాః భరః = త్రపాభరః. తస్మాత్ = త్రపాభరాత్.

జనాననే : జనానామాననం = జనాననం. తస్మిన్ = జనాననే.

భావము :

నా యీ హృదయము, సిగ్గుయొక్కభారముచే పగులుచున్నది. అందు వలన హృదయశుద్ధిని దేవతలు తెలిసికొనఁగలరు. కాని ఆ దేవత లీ సత్యము తెలుసుకొందురుగాక. అయినను యిది విషమమైనది. జనుల నోట నెవ్వడు చేయిపెట్టఁగలడు. ఒక విధముగా దేవతలను నమ్మింపగల్గినను మనుష్యులను నమ్మించుట మిక్కిలి కష్టము. ॥౧౨౫॥

శ్లో॥ మమ శ్రమశ్చేతనయానయా ఫలీ
బలీయసాఽలోపి చ నైవ వేధసా।

న వస్తు దైవస్వరసాద్వినశ్వరం
సురేశ్వరోఽపి ప్రతికర్తు మీశ్వరః॥ ౧౨౬

ప॥వి॥ మమ । శ్రమః । చేతనయా । అనయా । ఫలీ । బలీయసా । ఆలోపి । చ । సా । ఏవ । వేధసా । న । వస్తు । దైవస్వరసాత్ । వినశ్వరం । సురేశ్వరః । అపి । ప్రతికర్తుమ్ । ఈశ్వరః.

టీక॥ మమ = నాయొక్క, శ్రమః = దూత్యమువలనిపరిశ్రమ్ము, అనయా చేతనయా = నేనుదూతయనుభావనచే, అనగా స్వస్వరూపమును దాచుకొనిన బుద్ధిచే, ఫలీ = సఫలము, (స్యాత్ = అగును.) బలీయసా = మిక్కిలిబలముగల్గిన, వేధసా = దైవముచే, సాఏవ = ఆచేతనయే, ఆలోపి = లోపింపబడినది, తథాహి = అదియుక్తమే. దైవస్వరసాత్; దైవ = దైవముయొక్క, స్వరసాత్ = స్వేచ్ఛవలన, వినశ్వరం = నశించెడి, వస్తు = వస్తువును, సురేశ్వరోఽపి = ఇన్ద్రుడుకూడ, ప్రతికర్తుం = నిలుపుటకు, నఈశ్వరః = సమర్థుఁడుగాడు.

సమాసములు :

ఫలీ : ఫలమస్యాస్తీతి = ఫలీ.

దైవస్వరసాత్ : దైవస్య స్వరసః = దైవస్వరసః. తస్మాత్ = దైవస్వరసాత్.

భావము :

నా దూత్యమందలి పరిశ్రమ, స్వరూపముఁ దాచుకొనినచో నా యీ చేతనచే సఫలమైయుండెడిది. కాని బలవన్తమైన దైవముచే నాచేతన నాశముగావింపఁబడినది. అదియుక్తమే. దైవేచ్ఛచే నశించునట్టి వస్తువును దేవేన్ద్రుడు గూడ జక్కఁజేయలేడు. ॥౧౨౬॥

శ్లో॥ ఇతి స్వయం మోహమయోర్మినిర్మితం
ప్రకాశనం శోచతి నైషధే నిజం
తథా వ్యథామగ్నతదుద్ధధీర్షయా
దయాలురాగాల్లఘు హేమహంసరాట్॥ ౧౨౭

ప॥వి॥ ఇతి । స్వయం । మోహమయోర్మినిర్మితం । ప్రకాశనం । శోచతి । నైషధే । నిజం । తథా । వ్యథామగ్నతదుద్ధిధీర్షయా । దయాలుః । ఆగాత్ । లఘు। హేమహంసరాట్.

టీక॥ ఇతి = ఇట్లు, నైషధే = నలుఁడు, మోహమయోర్మినిర్మితం; మోహమయ = మోహవికారమైన, ఊర్మి = అలలచే, నిర్మితం = నిర్మింపబడిన, నిజం = తనదైన, స్వయం = స్వస్వరూపమును, ప్రకాశనం = ప్రకటనఁ జేసికొనుటఁగూర్చి, శోచతిసతి = దుఃఖి-పగానే, దయాలుః = దయఁ గల్గిన, హేమహంసరాట్ = సువర్ణమయమైన హంసరాజు, తథా = అట్లు, వ్యథామగ్నతదుద్ధిధీర్షయా; వ్యథా = దుఃఖమందు, మగ్న = మునిగిన, తత్ = ఆనలుని యొక్క, ఉద్ధిధీర్షయా = ఉద్ధరింపవలయుననుఁగోరికచే, లఘు = శీఘ్రముగా, ఆగాత్ = వచ్చెను.

## సమాసములు :

మోహమయోర్మినిర్మితం: మోహస్య వికారాః = మోహమయ్యః. మోహమయ్యశ్చ తాః ఊర్మయశ్చ = మోహమయోర్మయః. మోహమయోర్మిభిః నిర్మితమ్ = మోహమయోర్మినిర్మితం. తత్ = మోహమయోర్మినిర్మితమ్.

నైషధే : నిషధానాం రాజా = నైషధః. తస్మిన్ = నైషధే.

వ్యథామగ్నతదుద్ధిధీర్షయా : వ్యథాయాం మగ్నః = వ్యథామగ్నః. వ్యథామగ్నశ్చాసౌ సచ = వ్యథామగ్నతత్. వ్యథామగ్నతస్య ఉద్ధర్తుమిచ్ఛా = వ్యథామగ్నతదుద్ధిధీర్షా. తయా = వ్యథామగ్నతదుద్ధిధీర్షయా.

హేమహంసరాట్ : హంసానాం రాట్ = హంసరాట్. హేమమయశ్చాసౌ హంసరాట్ చ = హేమహంసరాట్.

## భావము :

ఈ విధముగ నలుఁడు తన యజ్ఞానముచే, దాఁగావించిన తన స్వరూప ప్రకటనకు, దుఃఖించుచుండగా, నా నలుని దుఃఖమునుండి యుద్ధరించుటకై దయానిధి యైన యా సువర్ణహంస త్వరగా నతనియొద్దకు వచ్చినది. ॥౧౨౭॥

శ్లో॥ నలం స తత్పక్షరవోర్ధ్వ వీక్షిణం
స ఏష పక్షీతి భణన్తమభ్యధాత్ ।
నయాఽదయైనామతి మా నిరాశతా
మసూ న్విహాతేయమతః పరం పరమ్॥ ౧_౨౮

ప॥వి॥ నలం । సః । తత్పక్షరవోర్ధ్వవీక్షిణం । సః । ఏషః । పక్షీ । ఇతి । భణన్తమ్ । అభ్యధాత్ । నయ । అదయ । ఏనామ్ । అతి । మా । నిరాశతామ్ । అసూ న్ । విహాతా । ఇయమ్ । అతః । పరం । పరమ్.

టీక॥ సః = ఆ రాజహంస, తత్పక్షరవోర్ధ్వ వీక్షిణం, తత్ = ఆ హంస యొక్క, పక్షరవ = ఱెక్కలచప్పుళ్లతో, ఊర్ధ్వవీక్షిణం = పైకిఁజూచు చున్నవాఁడును, తథా = అట్లే, ఏషః = ఇది, సః = ఆ సర్వోపకారము చేసిన, పక్షీతి = పక్షియని, భణన్తమేవ = చెప్పుచునేయున్న, నలం = నలునిఁగూర్చి, అభ్యధాత్ = పలికినది. హే అదయ = ఓదయమాలిన వాఁడా! ఏనాం = ఈ దమయన్తిని, అతినిరాశతాం = మిక్కిలి నైరాశ్య మును. మానయ = పొందింపకుము. అతఃపరం = ఇఁకమీదట, ఇయం పరం = ఈమెమాత్రము, ప్రాణా న్ = ప్రాణములను, విహాతా = విడువఁ గలదు.

## సమాసములు :

తత్పక్షరవోర్ధ్వవీక్షిణా: తస్య పక్షౌ = తత్పక్షౌ. తత్పక్షయోః రవః = తత్పక్షరవః. ఊర్ధ్వం వీక్షత ఇతి = ఊర్ధ్వవీక్షీ. తత్పక్షరవేణ ఊర్ధ్వవీక్షీ = తత్పక్షరవోర్ధ్వవీక్షీ. తం = తత్పక్షరవోర్ధ్వవీక్షిణం.

నిరాశతాం: నిర్గతా ఆశా యస్యాస్సా = నిరాశా. నిరాశాయాః భావః = నిరాశతా. తామ్ = నిరాశతాం.

## భావము :

ఆ హంసయొక్క ఱెక్కల ధ్వనిచే పైకిఁ జూచుచున్న వాఁడును, ఆ హంస సర్వోపకారి యగు పక్షి యనియు, చెప్పుచున్న నలునిఁ గూర్చి

యాహంస యిట్లు చెప్పినది ఓదయలేనివాఁడా! ఈదమయన్తి కఠినైరాశ్యమునుఁ గల్గింపకుము ఇఁక మీద నామెమాత్రము ప్రాణములను విడువఁబోవుచున్నది. కాన నీమె ప్రాణములను రక్షింపఁగోరిన నీవు, ఆమె కాశాభఙ్గమునుఁ జేయఁ దగదు. ॥౧౨౮॥

శ్లో॥ సురేషు పశ్యన్నిజ సాపరాధతా
మియత్ప్రియస్యాఽపి తదర్థసిద్ధయే।
న కూటసాక్షీ భవనోచితో భవాన్
సతాం హి చేతఃశుచితాత్మసాక్షికా॥ ౧౨౯

ప॥వి॥ సురేషు । పశ్యన్ । నిజసాపరాధతామ్ । ఇయత్ । ప్రయస్య । అపి । తదర్థసిద్ధయే । న । కూటసాక్షిభవనోచితః । భవాన్ । సతాం । హి । చేతఃశుచితా । ఆత్మసాక్షికా.

టీక॥ హేనల = ఓనలుఁడా, భవాన్ = పూజ్యుఁడవైననీవు, తదర్థసిద్ధయే; తత్ = ఆదేవతలయొక్క, అర్థసిద్ధయే = కార్యసిద్ధికై, ఇయత్ = ఇంత, ప్రయస్యాఽపి = ప్రయాసపడియు, సురేషు = దేవతలవిషయమున, నిజ సాపరాధతాం; నిజ = తనదైన, సాపరాధతాం = నీఅపరాధముతోఁగూడి యుండుటను, అనగానపరాధమును, పశ్యన్ = తర్కించుచు, కూట సాక్షిభవనోచితః; కూటసాక్షిభవన = కపట సాక్షిగానుండుటకు, ఉచితః = తగినవాడు, న = కావు, (అపరాధము లేని తనయందు నప రాధమును భావించుటయే కూటసాక్షిత్వము) తథాహి = అదియుక్తమే, సతాం = సత్పురుషులయొక్క, చేతఃశుచితా = చిత్తశుద్ధి, ఆత్మ సాక్షికా = తామేసాక్షిగాగలది, అనగా స్వప్రమాణకము.

## సమాసములు:

*నిజసాపరాధతాం :* అపరాధేన సహ వర్తత ఇతి = సాపరాధః. సాప రాధస్య భావః = సాపరాధతా. తాం = సాపరాధతాం.

*అర్థసిద్ధయే :* అర్థస్య సిద్ధిః = అర్థసిద్ధిః. తస్యై = అర్థసిద్ధయే.

కూటసాక్షిభవనోచితః : అకూటసాక్షిణః కూటసాక్షిణః భవనం = కూటసాక్షిభవనం. కూటసాక్షిభవనే ఉచితః = కూటసాక్షిభవనోచితః.

ఆత్మసాక్షికా : ఆత్మా సాక్షీ యస్యాస్సా = ఆత్మసాక్షికా.

భావము :

ఓః నలా నీవు దేవతలకార్యసిద్ధికై యింత ప్రయాసపడియు, నీయం దపరాధమును దర్శించుచు కపటసాక్షి యగుట తగినదికాదు. ఇది యుక్తమే. ఏలయనగా సత్పురుషుల చిత్తశుద్ధికి వారి యాత్మయే సాక్షి యనగాం బ్రమాణము. ॥౧౨౯॥

శ్లో॥ ఇతీరిణాపృచ్ఛ్య నలం విదర్భజా
మపి ప్రయాతేన ఖగేన సాన్త్వితః।
మృదుర్బభాషే భగినీం దమస్య స
ప్రణమ్య చిత్తేన హరిత్పతీన్ నృపః ॥ ౧౩౦

ప॥వి॥ ఇతి । ఈరిణా । అపృచ్ఛ్య । నలం । విదర్భజామ్ । అపి । ప్రయాతేన । ఖగేన । సాన్త్వితః । మృదుః । బభాషే । భగినీం । దమస్య । సః । ప్రణమ్య । చిత్తేన । హరిత్పతీన్ । నృపః.

టీక॥ ఇతి = ఇట్లు, ఈరిణా = చెప్పుచు, నలం = నలుని, విదర్భజామపి = దమయన్తిని, అపృచ్ఛ్య = ఆమన్త్రిణముగావించి, ప్రయాతేన = ప్రయాణమునకై యుపక్రమించిన, ఖగేన = హంసచే, సాన్త్వితః = ఓదార్పంబడిన, సః = ఆ, నృపః = నలమహారాజు, చిత్తేన = మనస్సుచే, హరిత్పతీన్ = దిక్పాలకులను, ప్రణమ్య = నమస్కరించి, మృదుః = మెత్తనిమనస్సుంగల్గినవాడై, దమస్య = దమునియొక్క, భగినీం = చెల్లెలైనదమయన్తినింగూర్చి, బభాషే = పలికెను.

సమాసములు :

హరిత్పతీన్ : హరితాం పతయః = హరిత్పతయః. తాన్ = హరిత్పతీన్.

**భావము :**

ఈ విధముగా మాట్లాడుచున్న యా హంస, నలునికిని, దమయన్తికిని పోయివచ్చెదనని చెప్పి ప్రయాణమున కుపక్రమించినదై నలుని నోదార్చినది. అప్పుడా నలుఁడు దిక్పాలురకు మనస్సుచే, ప్రణమిల్లి కలిగిన మనస్సుఁ గల వాడై దమయన్తితోఁ బలుకఁదొడగెను. ॥౧౩౦॥

శ్లో॥ దదేఽపి తుభ్యం కియతీః కదర్థనాః
సురేషు రాగప్రసవావకేశినీః ।
అదమ్భదూత్యేన భజన్తు వా దయాం
దిశన్తు వా దణ్డమమీ మమాఽఽగసా॥ ౧౩౧

ప॥వి॥ దదే । అపి । తుభ్యం । కియతీః । కదర్థనాః । సురేషు । రాగప్రసవావకేశినీః । అదమ్భదూత్యేన । భజన్తు । వా । దయాం । దిశన్తు । వా । దణ్డమ్ । అమీ । మమ । ఆగసా.

టీక॥ హే ప్రియే = ఓ ప్రియురాలా! సురేషు = దేవతలవిషయమున, రాగప్రసవే = అనురాగమునుఁగల్గించుటయందు, అవకేశినీః = అసమర్థములైనవియు, కియతీః = ఇంతనేయని ఎల్లలేనివియునగు, కదర్థనాః = అనుచితవచనములను, తుభ్యం = నీకొఱకు, దదేఽపి = పలుకుచునతి నిన్దితుఁడనగుచున్నాను. కిఞ్చ = మఱియు, (ఏవంసతి = ఇట్లుకాగా) అమీ = ఈదేవతలైన యిన్ద్రాదులు, అదమ్భదూత్యేన = కపటములేని నా దూత్యముచే, దయాంవా = దయనుగాని, భజన్తు = పొందెదరుగాక, ఆగసా = నాయపరాధముచే, దణ్డంవా = శిక్షనుగాని, దిశన్తు = ఇచ్చెదరుగాక. (ఇఁకమీదనిన్ను దేవతలకొఱకై పీడింపను.)

**సమాసములు :**

*రాగప్రసవావకేశినీ* : రాగస్య ప్రసవః = రాగప్రసవః. రాగప్రసవే అవకేశిన్యః = రాగప్రసవావకేశిన్యః. తాః = రాగప్రసవావకేశినీః.

*అదమ్భదూత్యేన* : అవిద్యమానః దమ్భః యస్య తత్ = అదమ్భం. అదమ్భం చ తత్ దూత్యం చ = అదమ్భదూత్యం. తేన = అదమ్భదూత్యేన.

భావము :

ఓ ప్రియురాలా! దేవతలపైన నీకు ననురాగము కల్గుటకై నిష్ఫలములైన, ఏల్లలేని యసహ్యాసంభాషణములను, ప్రియురాలైన నీ విషయమునఁ గావించి చాల నిన్ద్యుడ నైతిని. ఇఁక నావేల్పులు నిష్కపట మైన నాదూత్యముతో నా యెడ దయనుఁ జూపనిమ్ము. లేదా నాయందలి యపరాధమునకు దణ్డనను విధింపనిమ్ము. కాని నేనిఁక వారికొఱకై నిన్ను పీడింపను. ॥౧౩౧॥

శ్లో॥ అయోగజామన్వభవం న వేదనాం
హితాయ మేఽభూదియ మున్మదిష్ణుతా !
ఉదేతి దోషాదపి దోషలాఘవం
కృశత్వమజ్ఞానవశాదివై నసః॥ ౧౩౨

ప॥వి॥ అయోగజామ్ । అన్వభవం । న । వేదనాం । హితాయ । మే । అభూత్ । ఉన్మదిష్ణుతా । ఉదేతి । దోషాత్ । అపి । దోషలాఘవం । కృశత్వమ్ । అజ్ఞానవశాత్ । ఇవ। ఏనసః.

టీక॥ ఇయమ్ = ఈ, ఉన్మదిష్ణుతా = ఉన్మాదము, మే = నాయొక్క, హితాయ = మేలుకొఱకై, అభూత్ = సాధనమైనది, కుతః = ఏల యనగా, అయోగజాం = వియోగమువలనఁగల్గిన, వేదనాం = బాధను, నాన్వభవమ్ = అనుభవించలేదు. తథాహి = అదియుక్తమే. అజ్ఞాన వశాత్ = అజ్ఞానవశమువలన, ఏనసః = పాపమునకు, కృశత్వమివ = (జ్ఞానపూర్వకముగాఁజేసినదానికంటెను,) అల్పత్వమువలె, దోషాదపి = ఉన్మాదదోషమువలనను, దోషలాఘవం; దోష = వియోగదుఃఖమునకు, లాఘవం = అల్పత్వము, ఉదేతి = కలుగుచున్నది, కావున దోషముఁ గూడ నొకప్పుడు ఉపకరించును.

సమాసములు :

*అయోగజామ్* : న యోగః = అయోగః. అయోగాత్ జాయత ఇతి = అయోగజా. తాం = అయోగజామ్.

*దోషలాఘవం* : దోషస్య లాఘవం = దోషలాఘవం.

అజ్ఞానవశాత్ : అజ్ఞానస్య వశః=అజ్ఞానవశః. తస్మాత్=అజ్ఞాన వశాత్.

భావము :

ఈ యున్మాదము గూడ నా మేలునకే యుపయోగపడినది. ఏలయనగా నున్మాదముచే నొడలుతెలియనందువలన వియోగజన్యబాధ ననుభవింపకయుంటిని. అజ్ఞానమువలనఁ జేయఁబడిన పాపము, జ్ఞానమువలనఁ జేయఁబడిన పాపము కంటెను నెట్లుస్వల్పమో, అట్లే ఉన్మాదదోషముకంటెను వియోగదుఃఖము తక్కువ యగుచున్నది. కాన నిట్లు దోషము గూడ నొకప్పు డుపక రించును. ॥౧౩౨॥

శ్లో॥ తవేత్యయోగస్మరపావకోఽపి మే
కదర్థనాత్యర్థతయాగమద్దయామ్ ।
ప్రకాశమున్మాద్య యదద్య కారయ-
న్మయాత్మనో మామనుకమ్పతే స్మ సః॥ ౧౩౩

ప॥వి॥ తవ । ఇతి । అయోగస్మరపావకః । అపి । మే । కదర్థనాత్యర్థతయా । అగమత్ । దయాం । ప్రకాశమ్ । ఉన్మాద్య । యత్ । అద్య । కారయన్ । మయా । ఆత్మనః । మామ్ । అనుకమ్పతే । స్మ । సః.

టీక॥ హే ప్రియే=ఓప్రియురాలా! ఇతి=ఇట్లు, తవ=నీయొక్క, కదర్థనాత్యర్థతయా; కదర్థనా=అప్రియవచనములనెడి నిన్దలకు, అత్యర్థతయా=ఆధిక్యముండుటచే, మే=నాకుసంబంధించిన, అయోగస్మరపావకోఽపి=మన్మథాగ్నియు, దయాం=దయను, అగమత్=పొందెను. యత్=ఎందువలన, అద్య=ఇప్పుడు, సః=ఆ కామాగ్ని, ఉన్మాద్య=నన్నుఁబిచ్చివానినిగావించి, మయా=నాచేత, ఆత్మనః=నాస్వరూపముయొక్క, ప్రకాశం=ప్రకటనను, కారయన్=చేయించుచు, త్వామ్=నిన్ను, అనుకమ్పతేస్మ=దయచూచుచుండెనో,

**సమాసములు :**

*అయోగస్మరపావకః* : న యోగః = అయోగః. స్మరస్య పావకః = స్మరపావకః. అయోగస్య స్మరపావకః = అయోగస్మరపావకః.

*కదర్థనాత్యర్థతయా* : కదర్థనాయాః అత్యర్థతా = కదర్థనాత్యర్థతా. తయా = కదర్థనాత్యర్థతయా.

**భావము :**

ఈ విధముగా నిన్నుఁగూర్చి నేను చెప్పిన నిన్దావచనముల యతిశయముచే, నా విరహకామాగ్నియు నాయెడ దయఁ జూపినది. ఏలయనగా నిప్పుడు ఆ కామాగ్ని నన్ను పిచ్చివానినిఁగావించి నాస్వరూపమును వెల్లడిగావించుచు నిన్నుఁ గనికరించుచున్నది. కావున కామాగ్నికిఁ గూడ నీపై దయయేర్పడినది. పెక్కేలః ఉన్మాదముయొక్క ప్రసాదమువలన మనము భయులము కృతార్థుల మగుచున్నాము. ॥౧౩౩॥

శ్లో॥ అమీ సమీహైకపరా స్తవాఽమరాః
స్వకిఙ్కరం మామపి కర్తుమీశిషే ।
విచార్య కార్యం సృజ మా విధాన్ముధా
కృతోనుతాప స్త్వయి పార్ష్ణివిగ్రహమ్॥ ౧౩౪

ప॥వి॥ అమీ । సమీహైకపరాః । తవ । అమరాః । స్వకిఙ్కరం । మామ్ । అపి । కర్తుమ్ । ఈశిషే । విచార్య । కార్యం । సృజ । మా । విధాత్ । ముధా । కృతః । అనుతాపః । త్వయి । పార్ష్ణివిగ్రహం.

టీక॥ అమీ = ఈ, అమరాః = దేవతలు, తవ = నీయొక్క, సమీహైకపరాః; సమీహా = నీయనురాగమునందు, ఏకపరాః = ఏకాగ్రతగలవారై యున్నారు. త్వఞ్చ = నీవును, మామపి = నన్నును, స్వకిఙ్కరం = నీదాసుని, కర్తుం = చేయుటకు, ఈశిషే = శక్తురాలవు, కిన్తు = కాని, విచార్య = విమర్శించి, కార్యం = పనిని, సృజ = చేయుము. అతః =

ఇందువలన, అనుతాపః = పశ్చాత్తాపము, కృతస్సన్ = చేయఁబడినదై.
పార్ష్ణివిగ్రహం; పార్ష్ణి = వెనుకనున్నశత్రువుయొక్క, విగ్రహం =
కలహమువంటికలహమును, ముధా = వ్యర్థముగా, మావిధాత్ =
చేయరాదు.

సమాసములు :

సమీహైకపరాః : సమీహాయాం ఏకపరాః = సమీహైకపరాః.

స్వకింకరం : స్వస్య కింకరః = స్వకింకరః. తం = స్వకింకరం.

పార్ష్ణివిగ్రహం : పార్ష్ణేః విగ్రహః = పార్ష్ణివిగ్రహః. తం = పార్ష్ణి
విగ్రహం.

భావము :

ఈ దేవతలు నీ యనురాగమునందేకాగ్రచిత్తులై యున్నారు. నీవు నన్నును నీ దాసునిఁ జేసికొనఁగలవు. వారినిఁ గూడ నీదాసులనుఁ జేసికొనఁ గలవు. కాని విమర్శించికార్యమునుఁజేయుము. కావున పశ్చాత్తాపము కలుగునట్లు చేయఁబడినచో నీయెడనదివెనుక నున్న శత్రువు చేయు కలహమువంటి కలహమును అనగా దుఃఖమును వృథాగా కలుగనట్లు చూడుము. అనగా నీవు దేవతలను వరించువిషయమును గాని నన్ను వరించు విషయమునుఁ గాని చక్కగాఁ బర్యాలోచించి వెనుక పశ్చాత్తాపము పడులాగున చేయకుము. అనగా దేవతలను వరించిన పిదప నేను నలుని వరించి యున్నచో బాగుగ నుండు ననియు నట్లే నన్నువరించినపిదప దేవతలనువరించి యున్నచో బాగుగ నుండెడి దనియు పశ్చాత్తాపముఁ గావింపవలసి వచ్చును. కావున వరణము నాలోచించి చేయుట యుచితము. ॥౧౩౪॥

శ్లో॥ ఉదాసితేనేవ మయేదముద్యసే
భియా న తేభ్యః స్మరతానవాన్న వా।
హితం యది స్యాన్మదసువ్యయేన తే
తదా తవ ప్రేమణి శుద్ధిలబ్ధయే॥ ౧౩౫

ప॥వి॥ ఉదాసితేన । ఇవ । మయా । ఇదమ్ । ఉద్యసే । భియా । న । తేభ్యః । స్మరతానవాత్ । న । వా । హితం । యది । స్యాత్ । మదసువ్యయేన । తే । తదా । తవ । ప్రేమణి । శుద్ధిలబ్ధయే.

టీక॥ ఉదాసితేన = ఔదాసీన్యముచే, లేదా, ఉదాసితేన = మధ్యస్థుఁడనైన, మయా = నాచే. ఇదం = ముందుఁజెప్పఁబడినవిషయము. ఉద్యసే = చెప్పఁబడుచున్నావు. తేభ్యః = ఇన్ద్రాదులవలని భియావా = భయము చేతఁగాని, స్మరతానవాద్వా; స్మర = మన్మథునిచేనేర్పడిన, తానవాద్వా = కృశత్వమువలనగాని, న = (చెప్పఁబడుటలేదు). (అందువలన విమర్శించి వరణమునుఁ జేయుము) మదసువ్యయేన; మత్ = నాయొక్క. అసు = ప్రాణములయొక్క. వ్యయేన = వ్యయముచే, తే = నీకు, హితం = మేలు, యదిస్యాత్ = అగుచో, తదా = అప్పుడు, (మత్ప్రాణసమర్పణమ్ = నాప్రాణములనుసమర్పించుట) తవ = నీయొక్క, ప్రేమణి = ప్రేమవిషయమందు, శుద్ధిలబ్ధయే; శుద్ధి = ఋణవిముక్తియను శుద్ధిని, లబ్ధయే = పొందుటకొఱకు, భవతి = అగు చున్నది.

## సమాసములు :

స్మరతానవాత్ : తనోర్భావః = తానవం. స్మరస్య తానవం = స్మరతానవం. తస్మాత్ = స్మరతానవాత్.

మదసువ్యయేన : మమ అసవః = మదసవః. మదసూనాం వ్యయః = మదసువ్యయః తేన = మదసువ్యయేన.

శుద్ధిలబ్ధయే : శుద్ధేః లబ్ధిః = శుద్ధిలబ్ధిః. తస్యై = శుద్ధిలబ్ధయే.

## భావము :

ఓ దమయన్తీ! నేను మధ్యస్థుఁడుగ నుండియే దీనికి ముందు విషయమును నీకుఁ జెప్పితిని. ఆదేవతలవలన భయముతోఁ గాని, మరుని వలని దేహకార్శ్యమువలనగాని చెప్పలేదు. నీవు చేయు వరించు కార్యమును, ఆలోచించి చేయుము. నీవు నన్ను వరించు పక్షమున నీ ఋణమును తీర్చుటకు నీకిష్ట

మైనచో నా ప్రాణములనుఁ గూడ సమర్పింపఁగలను. నీవు నాకు చేసిన నీ యనురాగ మను మహోపరమునకు ప్రాణములను సమర్పించుటయే ప్రత్యుపకారము. ౧౦౩౫॥

శ్లో॥ ఇతీరితైర్నైషధసూనృతామృతై
ర్విదర్భజన్మా భృశముల్లలాస సా।
ఋతోరధిశ్రీః శిశిరానుజన్మనః
పికస్వరైర్దూరవికస్వరైర్యథా॥ ౧౩౬

ప॥వి॥ ఇతి । ఈరితైః । నైషధసూనృతామృతైః । విదర్భజన్మా । భృశమ్। ఉల్లలాస । సా । ఋతోః । అధిశ్రీః । శిశిరానుజన్మనః । పికస్వరైః । దూరవికస్వరైః । యథా.

టీక॥ ఇతి = ఇట్లు, ఈరితైః = చెప్పఁబడిన, నైషధసూనృతామృతైః; నైషధ = నలునియొక్క, సూనృత = సత్యప్రియవచనములను, అమృతైః = అమృతములచే, సా = ఆ, విదర్భజన్మా = దమయన్తి, శిశిరానుజన్మనః; శిశిర = శిశిరఋతువును, అనుజన్మనః = అనుసరించిపుట్టిన, ఋతోః = వసన్తఋతువుయొక్క, అధిశ్రీః = అధికమైనశోభ, దూరవికస్వరైః = అతివికాసమును, మెప్పునుఁబొందిన, పికస్వరైర్యథా = కోకిలకూతలచేతనెట్లోయట్లు, భృశం = మిక్కిలి, ఉల్లలాస = హర్షించినది.

## సమాసములు :

నైషధసూనృతామృతైః : నిషధానాం రాజా = నైషధః. నైషధస్య సూనృతాని = నైషధసూనృతాని. నైషధసూనృతాన్యేవ అమృతాని = నైషధసూనృతామృతాని. తైః = నైషధసూనృతామృతైః.

విదర్భజన్మా : విదర్భేషు జన్మ యస్యాః సా = విదర్భజన్మా.

అధిశ్రీః : అధికా చ సా శ్రీశ్చ = అధిశ్రీః.

శిశిరానుజన్మనః : శిశిరస్య అనుజన్మా = శిశిరానుజన్మా. తస్య = శిశిరానుజన్మనః.

పికస్వరైః : పికస్య స్వరాః = పికస్వరాః. తైః = పికస్వరైః.

దూరవికస్వరైః : దూరం వికస్వరాః = దూరవికస్వరాః. తైః = దూరవికస్వరైః.

**భావము :**

ఈ విధముగా నలునిచేఁ జెప్పఁబడినసత్యప్రియవచనము లను నమృతరసములచే దమయన్తి, శిశిరఋతువు ననుసరించి జన్మించిన వసన్తఋతువు నందలి యధికశోభ; మిక్కిలి వికసించి శ్లాఘింపఁదగిన కోకిలస్వరములచేత నెట్లోయట్లు మిక్కిలిహర్షించినది. ॥౧౩౮॥

శ్లో॥ నలం తదావేత్య తమాశయే నిజే
ఘృణాం విగానఞ్చ ముమోచ భీమజా।
జుగుప్సమానా హి మనో ద్రుతం తదా
సతీధియా దైవతదూతధావి సా॥ ౧౩౯

ప॥వి॥ నలం । తదా । అవేత్య । తమ్ । ఆశయే । నిజే । ఘృణాం । విగానం । చ । ముమోచ । భీమజా । జుగుప్సమానా । హి । మనః । ద్రుతం । తదా । సతీధియా । దైవతదూతధావి । సా.

టీక॥ తదా = అప్పుడు, అనగా నలుని స్వరూపమునుదాచునట్టికాలమునందు, దైవతదూతధావి; దైవతదూత = దేవదూతనుద్దేశించి, ధావి = పరుగిడునదిగా, ద్రుతం = కఱగిన, మనః = మనస్సును, సతీధియా = పతివ్రతయనునభిమానముచే, జుగుప్సమానా = ఏవగించుచున్న, భీమజా = దమయన్తి, తదా = అప్పుడు అనగా నలుని స్వరూపమునుఁ జెప్పునవసరమున, తం = ఆదూతను, నలం = నలునిగా, అవేత్య = తెలిసికొని, నిజే = తనదైన, ఆశయే = అభిప్రాయమందు, ఘృణాం = పరపురుషుఁడను నేవగింపును, విగానంచ = నిన్దను, ముమోచ = విడచినది.

**సమాసములు :**

దైవతదూతధావి : దైవతస్య దూతః = దైవతదూతః. దైవతదూతం ప్రతి ధావతీతి = దైవతదూతధావి. తత్ = దైవతదూతధావి.

సతీధియా : సత్యాః ధీః = సతీధీః. తయా = సతీధియా.

**భావము :**

నలుఁడు తన స్వరూపమును గోపనముఁ గావించిన కాలమందు దేవ దూతయగు నాతని వంకకుఁ బరుగిడి ద్రవించిన తన మనస్సును పతివ్రతాభి మానముచే నేవగించుకొనినది. ఇప్పుడు నలుని స్వరూపమునుఁ జెప్పు కాలము నం దా దూతను నలుడని తెలిసికొని తన మనస్సునందు దూతయనియు పర పురుషుడనియు పూర్వ మతనిపై నేర్పడిన యేవగింపును, నిన్దను వదలి పెట్టినది. ॥౧౩౭॥

శ్లో॥ మనోభువస్తే భవినాం మనః పితా
నిమజ్జయన్నేనసి తన్నలజ్జసే ।
అముద్రి సత్పుత్రకథా త్వయేతి సా
స్థితా సతీ మన్మథనిన్దినీ ధియా ॥ ౧౩౮

ప॥వి॥ మనోభువః । తే । భవినాం । మనః । పితా । నిమజ్జయన్ । ఏనసి । తత్ । న లజ్జసే । అముద్రి । సత్పుత్రకథా । త్వయా । ఇతి । సా । స్థితా । సతీ । మన్మథనిన్దినీ । ధియా.

టీక॥ హే మన్మథ = ఓ మన్మథా! మనోభువః = మనస్సునందుఁ బుట్టిన, తే = నీకు, భవినాం = పుట్టఁ బోవుచున్న సంసారులయొక్క, మనః = మనస్సు, పితా = తండ్రి, తత్ = ఆ తండ్రియైన మనస్సును, ఏనసి = దుశ్చిన్తయను పాపమునందు, నిమజ్జయన్ = ముంచుచు, నలజ్జసే = సిగ్గుపడక యున్నావు. త్వయా = ఇట్టి పితృద్రోహియైన నీచేత, సత్పుత్రకథా; సత్పుత్ర = పితృభక్తులైన పుత్రుల ఖ్యాతి, అముద్రి = నివారింపఁబడినది. ఇతి = ఇట్లు, సా = ఆ దమయన్తి, ధియా = మనస్సుచే, మన్మథ నిన్దినీసతీ = మన్మథుని నిన్దించుచున్నదై, స్థితా = ఉండినది.

**సమాసములు:**

మనోభువః : మనసి భవతీతి = మనోభూః. తస్య = మనోభువః.

సత్పుత్రకథా : సన్తశ్చ తే పుత్రాశ్చ = సత్పుత్రాః. సత్పుత్రాణాం కథా = సత్పుత్రకథా.

మన్మథనిన్దినీ : మన్మథస్య నిన్దినీ = మన్మథనిన్దినీ.

భావము :

ఓ మన్మథా! మనస్సునందుఁ బుట్టిన నీకు రాఁబోవు తరములవారి యొక్క మనస్సు తండ్రి. అట్టి తండ్రియైన మనస్సును పాపమునందు ముంచుచు సిగ్గుపడవేమి? పితృద్రోహి వైన నీచేత, సత్పుత్రుల ఖ్యాతి నాశముఁజేయఁబడి నది. ఇట్లు దమయన్తి తన మనస్సుచే మన్మథుని దూషించుచుండినది. ॥౧౩౮॥

శ్లో॥ ప్రసూనమిత్యేవ తదఙ్గ వర్ణనా
న సా విశేషాత్ కతమ త్తదిత్యభూత్।
తదా కదమ్బం నిరవర్ణి రోమభి
ర్ముదశ్రుణా ప్రావృషి హర్షమాగతైః॥ ౧౩౯

ప॥వి॥ ప్రసూనమ్ । ఇతి । ఏవ । తదఙ్గవర్ణనా । న । సా । విశేషాత్ । కతమత్ । తత్ । ఇతి । అభూత్ । తదా । కదమ్బం । నిరవర్ణి । రోమభిః । ముదశ్రుణా । ప్రావృషి । హర్షమ్ । ఆగతైః.

టీక॥ సా = ఆ ప్రసిద్ధమైన, తదఙ్గవర్ణనా; తత్ = ప్రసిద్ధమైన, దమయన్తి యొక్క, అఙ్గవర్ణనా = దేహవర్ణన, ప్రసూనమిత్యేవ = సామాన్యముగా పుష్పమే, అభూత్ = ఆయెను. కిన్తు = కాని, తత్ = ఆ పుష్పము, కతమత్ = ఏ జాతికిఁ జెందినదని, విశేషాత్ = విశేషము నుల్లేఖించి, నాఽభూత్ = కాలేదు. తదా = ఆ కాలమున, ముదశ్రుణా = ఆనంద బాష్పముచే, ప్రావృషి = వర్షఋతువు (కాగా), హర్షం = వికాసమును, గతైః = పొందిన, రోమభిః = శరీరమందలి రోమాఞ్చము నెపముతో, కదమ్బం = కడిమిపూవు అని, నిరవర్ణి = చూడఁబడినది.

వి॥ దమయన్తి శరీరమునకును, కడిమి పూవునకును భేద మున్నను నభేద మునుఁ జెప్పుటవలన నభేదాతిశయోక్తి.

## సమాసములు :

తదఙ్గవర్ణనా : తస్యాః అఙ్గం= తదఙ్గం. తదఙ్గస్య వర్ణనా=తదఙ్గ వర్ణనా.

ముదశ్రుణా: : ముదా అశ్రు=ముదశ్రు. తేన= ముదశ్రుణా.

భావము :

ప్రసిద్ధమైన దమయన్తీ దేహవర్ణన యొక పుష్పముగా నుండినది. కాని యా పుష్ప మేది యని విశేషించి తెలియలేదు. కాని, ఆ సమయమందు, రా యానంద బాష్పములచే వర్షఋతువు ఏర్పడగా దానివలన వికాసముఁ బొందిన రోమాఞ్చముల నెపముచే కదమ్బపుష్ప మని - అనగా కడిమి పూవని ప్రత్యక్షముగాఁ జూడఁబడినది. అనగా నానన్ద బాష్ప వర్షముచే పులకితమైన యామె శరీరము కడిమిపూవుగా నుండెనది. వర్షర్తువునందు కడిమిచెట్లు పుష్పించుట ప్రసిద్ధము గదా. ॥౧౩౯॥

శ్లో॥ మయైవ సమ్బోధ్య నలం వ్యలాపి య
త్స్వమాహ మద్బుద్ధమిదం విమృశ్య తత్ ।
అసావితి భ్రాన్తిమసాద్దమస్వసుః
స్వభాషిత స్వోద్భ్రమ విభ్రమక్రమః॥ ౧౪౦

ప॥వి॥ మయా । ఏవ । సమ్బోధ్య । నలం । వ్యలాపి । యత్ । స్వమ్ । ఆహ । మద్బుద్ధమ్ । ఇదం । విమృశ్య। తత్। అసౌ। ఇతి భ్రాన్తిమ్ । అసాత్ । దమస్వసుః । స్వభాషితస్వోద్భ్రమవిభ్రమక్రమః.

టీక॥ మయా=నాచే, నలమేవ=నలునే, సమ్బోధ్య=సంబోధించి, వ్యలాపీతి యత్=విలపింపఁబడినదేదిగలదో, తత్=ఆ, ఇదం=ఈ, మద్విలపితం=నా విలాపమును, విమృశ్య = ఆలోచించి, అసౌ = ఈ నలుఁడు, మద్బుద్ధం=నా చేత తెలియఁబడెనని, స్వమ్ = తన్ను నుద్దేశించి, ఆహ= చెప్పుకొనుచుండెను. ఎట్లనగా - ఈమె నన్నుఁ దెలిసికొనిన పిదప మఱల దాచి పెట్టుకొనడ మేల యని, నలుఁడు నేనే నలుఁడ నని చెప్పుకొనె నని యర్థము, దమస్వసుః=దమయన్తి

యొక్క, భ్రాన్తిం = భ్రమను, అసౌ = ఈ నలుఁడు, స్వభాషిత స్వోద్భ్రమ విభ్రమక్రమః. స్వభాషిత = తనచేఁ జెప్పఁబడిన, స్వోద్భ్రమ విభ్రమ = తన యున్మాదాలాపములయొక్క, క్రమః = క్రమము గలవాఁడగుచు, అసాత్ = ఖండించెను.

సమాసములు ;

మద్బుద్ధం : మయా బుద్ధః = మద్బుద్ధః. తమ్ = మద్బుద్ధం.

స్వేన భాషితస్వోద్భ్రమవిభ్రమక్రమః: స్వేన భాషితః. = స్వభాషితః, ఉద్భ్రమాశ్చ విభ్రమాశ్చ = ఉద్భ్రమవిభ్రమాః. స్వస్య ఉద్భ్రమవిభ్రమాః = స్వోద్భ్రమవిభ్రమాః. స్వోద్భ్రమవిభ్రమాణాం క్రమః = స్వోద్భ్రమవిభ్రమః. క్రమస్యభాషితఃస్వోద్భ్రమవిభ్రమక్రమః యస్య సః = స్వభాషితస్వోద్భ్రమవిభ్రమక్రమః.

భావము :

నేను నలుని సంబోధించి చేసిన విలాపమును విని, నలుఁడు తన్ను నేను తెలిసికొంటినని గ్రహించి యిఁక నన్ను దాచుకొనుట వలన ప్రయోజన మేమి యని తలంచి నేనే నలుఁడనని చెప్పుకొనెను. దమయన్తికి కల్గిన భ్రాన్తిని నలుఁడు తన యున్మాదభ్రమల క్రమమును తానుఁ జెప్పుటవలన తొలగించెను. ఉన్మాదమువలన నలుఁడు తన్ను బయటపెట్టుకొనెనని యతని మాటవలననే తెలిసికొని దమయన్తి నలునియందు దూతభ్రాన్తినిఁ పోగొట్టుకొనినది. ॥౧౪౦॥

శ్లో॥ విదర్భరాజప్రభవా తతః పరం
త్రపాసఖీ వక్తుమలం న సా నలమ్ ।
పురస్తమూచేఽభిముఖం యదత్రపా
మమజ్జ తేనైవ మహాహ్రదే హ్రియః॥ ౧౪౧

ప॥వి॥ విదర్భరాజప్రభవా । తతః । పరం । త్రపాసఖీ । వక్తుమలం । న । సా । నలమ్ । పురస్తమూచే । అభిముఖం। యత్। అత్రపా। మమజ్జ । తేనైవ । మహాహ్రదే । హ్రియః.

టీక॥ విదర్భరాజప్రభవా = విదర్భరాజుకుమార్తెయైనదమయన్తి, తతః

పరం = నలుఁడనితెలిసినపిదప, త్రపాసఖీ; త్రపా = సిగ్గునకు, సఖీ = చెలికత్తెయైనదై, అనగా సిగ్గుతోఁగూడినదై, నలం = నలునిగూర్చి, వక్తుం = నేరుగా మాట్లాడుటకు, నాఽలం = శక్తురాలుకా లేదు. ఏలయనగా, పురః = పూర్వము, అత్రపా = సిగ్గులేనిదై, తం = ఆనలుని, అభిముఖం యథాతథా = ఎదుట, ఊచేఇతియత్ = పలికినదనుటయేటికలదో, ఆ కారణముచేతనే, హ్రియః = సిగ్గుయొక్క, మహాహ్రదే = గొప్పకొలని యందు, మమజ్జ = మునిగినది.

సమాసములు :

*విదర్భరాజప్రభవా :* విదర్భాణాం రాజా = విదర్భరాజః. విదర్భరాజః ప్రభవః యస్యాస్సా = విదర్భరాజప్రభవా.

*త్రపాసఖీ :* త్రపాయాః సఖీ = త్రపాసఖీ.

*మహాహ్రదే :* మహాంశ్చాసౌ హ్రదశ్చ = మహాహ్రదః. తస్మిన్ = మహాహ్రదే.

భావము :

ఆ దమయన్తి నలుడని తెలిసికొనిన పిదప లజ్జపడినదై యతని యెదుట మాట్లాడలేక పోయినది. పూర్వము సిగ్గువిడచినదై యతని యెదుట మాట్లాడి నందులకు సిగ్గు కొలనునందు మునిగినది. ॥౧౪౧॥

శ్లో॥ యదాఽపవార్యాఽపి న దాతుముత్తరం
శశాక సఖ్యాః శ్రవసి ప్రియాయ సా।
విహస్య సఖ్యేవ తమబ్రవీత్తదా
హ్రియాఽధునా మౌనధనా తవ ప్రియా ౧౪౨

ప॥వి॥ యదా । అపవార్య । అపి । న । దాతుమ్ । ఉత్తరం । శశాక । సఖ్యాః । శ్రవసి । ప్రియాయ । సా । విహస్య । సఖీ । ఏవ । తమ్ । అబ్రవీత్ । తదా । హ్రియా । అధునా । మౌనధనా । భవత్ప్రియా.

టీక॥ సా = ఆదమయన్తి, యదా = ఎప్పుడు, అపవార్యాఽపి = ఇతరులను విననీయక, సఖ్యాః = చెలికత్తెయొక్క, శ్రవసి = చెవియందు,

ప్రియాయా = ప్రియునకు, ఉత్తరం = సమాధానమును, దాతుం = ఇచ్చుటకు, నశశాక = శక్తురాలుకాలేదో, తదా = అప్పుడు, సఖ్యేవ = చెలికత్తెయే, విహస్య = నవ్వి, తం = ఆనలుని, అబ్రవీత్ = పలికినది (ఏమనగా) అధునా = ఇప్పుడు, భవత్ప్రియా = నీకుప్రియురాలైన దమయన్తి, హ్రియా = సిగ్గుచే, మౌనధనా = మౌనమునే ధనముగా గల్గియున్నది.

సమాసములు :

మౌనధనా : మునేః కర్మ = మౌనం. మౌనం ధనం యస్యాస్సా = మౌనధనా.

భవత్ప్రియా : భవతః ప్రియా = భవత్ప్రియా.

భావము :

ఆ దమయన్తి యితరులను వినసీయక యెప్పుడు చెలికత్తె చెవిలో ప్రియుఁడైన నలునికై యుత్తర మీయఁజాలకపోయెనో, అప్పుడు చెలికత్తెయే ఇప్పుడు మీ ప్రియురాలు సిగ్గుచే మాట్లాడలేక యున్నది. అని నలునితోఁ జెప్పినది.

శ్లో॥ పదాతిథేయాంల్లిఖితస్య తే స్వయం
వితన్వతీ లోచననిర్ఝరానియమ్।
జగాద యాం సైవ ముఖాన్మమ త్వయా
ప్రసూనబాణోపనిషన్నిశమ్యతామ్ ॥ ౧౪౩

ప॥వి॥ పదాతిథేయాన్ । లిఖితస్య । తే । స్వయం । వితన్వతీ । లోచననిర్ఝరాన్ । ఇయం । జగాద । యాం । సా । ఏవ । ముఖాత్ । మమ । త్వయా । ప్రసూనబాణోపనిషత్ । నిశమ్యతామ్.

టీక॥ ఇయం = ఈ, భవత్ప్రియా = నీప్రియురాలు, లిఖితస్య = చిత్రమందున్న, తే = నీయొక్క, పదాతిథేయాన్; పద = పాదములయందు, అతిథేయాన్ = అతిథిసత్కారములుజేయునట్టి అనగా పాద్యములైనట్టి,

లోచననిర్ఝరాన్ = కన్నీటివెల్లువలను, వితన్వతీ = చేయుచు, యాం = ఏ, ప్రసూనబాణోపనిషదం = కామోపనిషత్తును, త్వాగమాత్ ప్రాక్ = నీవు రాకముందు, జగాద = చెప్పెనో, సైవ = అదియేయైన, కామోపనిషత్తు, మమ = నాయొక్క, ముఖాత్ = మోమునుండి, నిశమ్యతాం = వినబడుఁగాక.

## సమాసములు :

పదాతిథేయాన్ : అతిథిషు సాధవః = ఆతిథేయాః. పదయోః ఆతిథేయాః = పదాతిథేయాః. తాన్ = పదాతిథేయాన్.

లోచననిర్ఝరాన్ : లోచనయోః నిర్ఝరాః = లోచననిర్ఝరాః. తాన్ = లోచననిర్ఝరాన్.

ప్రసూనబాణోపనిషత్ : ప్రసూనాని బాణాః యస్య సః = ప్రసూనబాణః. ప్రసూనబాణస్య ఉపనిషత్ = ప్రసూనబాణోపనిషత్.

## భావము :

ఈ నీ ప్రియురాలు చిత్రమందలి నీ పాదములకు నతిథిసత్కారరూపములైన పాద్యజలము లనెడి కన్నీటి వెల్లువలనుఁ బ్రవహింపఁజేయుచు, ఏ మన్మథోపనిషత్తును జెప్పినదో, దానిని నీకు జెప్పెదను. నీవు శ్రద్ధగా వినవలసినది. ॥౧౪౩॥

శ్లో॥ అసంశయం స త్వయి హంస ఏవ మాం
శశంస న త్వద్విరహో ప్తసంశయామ్ ।
క్వ చన్ద్రవంశస్య వతంస! మద్వధా
న్నృశంసతా సమ్భవినీ భవాదృశే ॥ ౧౪౪

ప॥వి॥ అసంశయం । సః । త్వయి । హంసః । ఏవ । మాం । శశంస । న । త్వద్విరహోప్తసంశయామ్ । క్వ । చన్ద్రవంశస్య । వతంస । మద్వధాత్। నృశంసతా । సమ్భవినీ । భవాదృశే.

శ్లో॥ కథా సు శిష్యే వరమద్య న మ్రియే
మమావగన్తాసి న భావమన్యథా ।
త్వదర్థముక్తాసుతయాశు నాథ! మాం
ప్రతీహి జీవాభ్యధిక ! త్వదేకికామ్॥ ౧౪౯

ప॥వి॥ కథాసు । శిష్యే । వరమ్ । అద్య । న । మ్రియే । మమ । అవగన్తా । అసి । న । భావమ్ । అన్యథా । త్వదర్థముక్తాసుతయా । ఆశు । నాథ । మాం । ప్రతీహి । జీవాభ్యధిక । త్వదేకికామ్.

టీక॥ హేనాథ = ఓనాథా! కథాసు = కథలయందు, శిష్యే = శేషింతును. అనగామరణింతును. వరం = శ్రేష్ఠము. అద్య = ఇప్పుడు, నమ్రియే = ఉండఁజాలనుఅనగా జీవింపలేను. అన్యథా = లేదా, మమ = నాయొక్క, భావమ్ = భావమును, నాఽవగన్తాసి = తెలియకయున్నావు. త్వదర్థ ముక్తాసుతయా;త్వదర్థ = నీవిషయమున, ముక్త = విడువఁబడిన, అసు తయా = ప్రాణములనుఁగల్గియుండుటచే, ఆశు = శీఘ్రముగా, మాం = నన్ను, హే జీవాభ్యధిక! = ఓప్రాణమునకంటెనధికుఁడా! త్వదేకికాం;త్వత్ = నీవే, ఏకికాం = ముఖ్యముగాఁగలదానినిగా, ప్రతీహి = తెలియును.

## సమాసములు:

త్వదర్థముక్తాసుతయా : త్వమేవ అర్థః = త్వదర్థః. త్వదర్థే ముక్తాః = త్వదర్థముక్తాః. త్వదర్థముక్తాః అసవః యస్యాస్సా = త్వదర్థముక్తాసుః. త్వదర్థ ముక్తాసోః భావః = త్వదర్థముక్తాసుతా. తయా = త్వదర్థముక్తాసుతయా.

హేజీవాభ్యధిక : జీవాత్ అభ్యధికః = జీవాభ్యధికః. తస్య సమ్బుద్ధిః = హేజీవాభ్యధిక.

త్వదేకికామ్ : త్వమేవ ఏకః యస్యాస్సా = త్వదేకికా. తాం = త్వదే కికామ్.

## భావము :

నేను కథామాత్రశేషనయ్యెదను. అనగామరణింతును. ఇదికొంత శ్రేష్ఠము.

ఇఁక నేనుజీవింపఁజాలను. నాభావము నింకను నీవు తెలియక యున్నావు. నీకై ప్రాణత్యాగము జేయుచున్న నన్ను, నిన్నుశరణుఁగా జేసి కొంటినని తెలిసి కొనుము. ॥౧౪౯॥

శ్లో॥ మహేన్ద్రహేతేరపి రక్షణం భయా
ద్యదర్థిసాధారణమస్త్రభృద్వ్రతమ్ ।
ప్రసూనబాణాదపి మామరక్షతః
క్షతం తదుచ్చైరవకీర్ణిన స్తవ॥ ౧౫౦

ప॥వి॥ మహేన్ద్రహేతేః । అపి । రక్షణం । భయాత్ । యత్ । అర్థిసాధారణమ్ । అస్త్రభృద్వ్రతమ్ । ప్రసూనబాణాత్ । అపి । మామ్ । అరక్షతః । క్షతం । తత్ । ఉచ్చైః । అవకీర్ణినః । తవ.

టీక॥ మహేన్ద్రహేతేరపి; మహేన్ద్ర = ఇన్ద్రునియొక్క, హేతేరపి = ఆయుధమైనవజ్రమువలనను, భయాత్ = భయమునుండి, రక్షణం = రక్షణ, ఆర్థిసాధారణం = యాచకసామాన్యమునకు సాధారణమైన, అస్త్రభృత్ వ్రతమ్ = ఆయుధధారులయొక్క వ్రతము. ప్రసూనబాణాదపి = పుష్పబాణునుండియు, మాం = స్త్రీయైననన్ను. అరక్షతః = రక్షింపని, (కావునసే) అవకీర్ణినః = వ్రతభఙ్గముఁగల్గిన, తవ = నీకు, తత్ = ఆ, ఉచ్చైః = గొప్పదైన, వ్రతం = వ్రతము, క్షతం = దెబ్బతినినది.

సమాసములు :

మహేన్ద్రహేతేః : మహేన్ద్రస్య హేతిః = మహేన్ద్రహేతిః. తస్య = మహేన్ద్రహేతేః.

అర్థిసాధారణమ్ : అర్థినాం సాధారణమ్ = అర్థిసాధారణమ్.

అస్త్రభృద్వ్రతమ్ : అస్త్రంబిభర్తీతి = అస్త్రభృతః. అస్త్రభృతాం వ్రతమ్ = అస్త్రభృద్వ్రతమ్.

ప్రసూనబాణాత్ : ప్రసూనాని బాణాః యస్య సః = ప్రసూనబాణః. తస్మాత్ = ప్రసూనబాణాత్.

అరక్షతః : న రక్షన్ = అరక్షన్. తస్య = అరక్షతః.

టీక॥ హేచన్ద్రవంశస్యవతంసః = ఓచన్ద్రవంశమునకు భూషణమైనవాడా!, సః = ఆహంస, త్వద్విరహాప్తసంశయామ్; త్వద్విరహ = నీవిరహముచే, ఆప్త = పొందఁబడిన, సంశయాం = ప్రాణసంశయముఁ గల్గిన, మాం = నన్ను, త్వయి = నీవిషయమునందు, నశశంసైవ = చెప్పనేలేదు. అసంశయం = సంశయములేదు. (అన్యథా = అట్లుకానిచో) భవాదృశే = నీవంటివారివిషయమున, మద్వధాత్ = నామరణమువలన, నృశంసతా = ఘాతుకత్వము, అనగా స్త్రీవధపాతకము, క్వసమ్భవినీ = ఎచ్చట సంభావింపఁబడును, ఎచ్చటను సంభావింపఁబడదు.

## సమాసములు :

అసంశయం : అవిద్యమానః సంశయః యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = అసంశయం.

త్వద్విరహాప్తసంశయామ్ : తవ విరహః = త్వద్విరహః. త్వద్విరహేణ ఆప్తః = త్వద్విరహాప్తః. త్వద్విరహాప్తః సంశయః. యస్యాస్సా = త్వద్విరహాప్తసంశయా. తామ్ = త్వద్విరహాప్తసంశయామ్.

చన్ద్రవంశస్య : చన్ద్రస్య వంశః = చన్ద్రవంశః. తస్య = చన్ద్రవంశస్య.

మద్వధాత్ : మమ వధః = మద్వధః. తస్మాత్ = మద్వధాత్.

## భావము :

ఓచన్ద్రవంశభూషణమా! ఆ హంస నీ విరహముచే ప్రాణసన్దేహమునుఁ బొందిన నన్నుగూర్చి నీకు చెప్పనే లేదు. ఇందు సన్దేహము లేదు. కానిచో నీవంటివాని విషయమున నా వధవలన స్త్రీహత్యాపాతకమెట్లు ఊహింపఁబడును? సజ్జనుఁడును, కృపానిధియు నైన నీకిట్టి కార్యము యుక్తముకాదు గదా ॥౧౪౪॥

శ్లో॥ జితస్త్వదాస్యేన విధుః స్మరః శ్రియా
కృతప్రతిజ్ఞౌ మమ తౌ వధే కుతః ।
తవేతి కృత్వా యది తజ్జితం మయా
న మోఘసఙ్కల్పధరాః కిలామరాః॥ ౧౪౫

ప॥వి॥ జితః । త్వదాస్యేన । విధుః । స్మరః । శ్రియా । కృతప్రతిజ్ఞౌ ।
మమ । తౌ । వధే । కుతః । తవ । క్షతి । కృత్వా । యది । తత్ ।
జితం । మయా । న । మోఘసఙ్కల్పధరాః । కిల । అమరాః.

టీక॥ విధుః = చన్ద్రుఁడు, త్వయా = నీచేత, ఆస్యేన = ముఖముచే, జితః = జయింపఁబడినాఁడు. స్మరః = మన్మథుఁడు, శ్రియా = సౌన్దర్యముచే, జితః = జయింపఁబడెను. కుతః = ఏకారణమువలనో, తౌ = ఆచన్ద్రమన్మథులు, మమ = నాయొక్క, వధే = వధయందు, కృతప్రతిజ్ఞౌ; కృత = చేయఁబడిన, ప్రతిజ్ఞా = ప్రతిజ్ఞఁగలవారలు. తవేతి = నీకు సంబంధించినదాననని, కృత్వా = ఆలోచించి, యదిపీడయతః = నన్నుఁబీడించినచో, తత్ = అప్పుడు, మయా = నాచేత, జితం = జయింపఁబడినది. అమరాః = దేవతలు, మోఘసఙ్కల్పధరాః; మోఘ = వ్యర్థమైన, సఙ్కల్ప = సఙ్కల్పమును, ధరాః = ధరించినవారుగ, నకిల = కారుగదా.

వి॥ చన్ద్రమన్మథులు తమ్ముల నోడించిన నలుని నేమియుఁ జేయలేక నలునికిఁ బ్రియమై నలుని పక్షమునందున్న దమయంతిపైఁ దమ పరాక్రమముల జూపుటవలనఁ బ్రత్యనీకాలఙ్కారము.

## సమాసములు :

త్వదాస్యేన : తవ ఆస్యం = త్వదాస్యం. తేన = త్వదాస్యేన.

కృతప్రతిజ్ఞౌ : కృతా ప్రతిజ్ఞా యాభ్యాం తౌ = కృతప్రతిజ్ఞౌ.

మోఘసఙ్కల్పధరాః : మోఘశ్చాసౌ సఙ్కల్పశ్చ = మోఘసఙ్కల్పః. మోఘసఙ్కల్పం ధారయన్తీతి = మోఘసఙ్కల్పధరాః.

## భావము :

చన్ద్రుఁడు నీమోముచేతను, మన్మథుఁడు నీ సౌన్దర్యముచేతను ఓడిపోయిరి. ఏకారణమువలననో, వారిరువురు నన్నుఁ జంపఁ బ్రతిజ్ఞఁ చేసియున్నారు. నీకు సంబంధించినదాన నని నన్నుఁ జంపినచో, నేను జయించినట్లే. నిన్ను లేక నేను జీవింపను కాన మరణమే నాకిష్టము. ఇది సరియైనదే. ఎం

యనగా దేవతల ప్రతిజ్ఞలు ఎప్పుడును వ్యర్థములు గావు కాన చన్ద్రమన్మథులును దేవతలు గాన సత్యసఙ్కల్పు లగు వారలు నన్నుఁ జంపఁగలరు. ॥౧౪౭॥

శ్లో॥ నిజాంశునిర్దగ్ధమదఙ్గభస్మభి
ర్ముధా విధుర్వాఞ్ఛతిలాఞ్ఛనోన్మృజాం ।
త్వదాస్యతాం యాస్యతి తావతాఽపి కిం
వధూవధేనైవ పునః కలఙ్కితః॥ ౧౪౮

ప॥వి॥ నిజాంశునిర్దగ్ధమదఙ్గభస్మభిః । ముధా । విధుః । వాఞ్ఛతి । లాఞ్ఛనోన్మృజాం । త్వదాస్యతాం । యాస్యతి । తావతా । అపి । కిం । వధూవధేన । ఏవ । పునః । కలఙ్కితః.

టీక॥ విధుః = చన్ద్రుఁడు, నిజాంశునిర్దగ్ధమదఙ్గభస్మభిః; నిజాంశు = తన కిరణములచే, నిర్దగ్ధ = కాల్చివేయఁబడిన, మదఙ్గ = నాశరీరముయొక్క, భస్మభిః = బూడిదెలచే, లాఞ్ఛనోన్మృజాం; లాఞ్ఛన = తనకలఙ్కము యొక్క, ఉన్మృజాం = తుడిచివేతను, ముధా = వ్యర్థముగా, వాఞ్ఛతి = కోరుచున్నాఁడు. తథాహి = అదియుక్తమే. హే ప్రియ = ఓ ప్రియుఁడా! వధూవధేనైవ; వధూ = నేననెడిస్త్రీయొక్క, వధేనైవ = వధచేతనే, పునః = మఱల, కలఙ్కితః = కలఙ్కమునుఁ బొందించినవాఁడై, తావతాఽపి = నాదేహముయొక్క భస్మములచేఁ గడుగబడుటచే, త్వదాస్యతాం = నీకు ముఖముగానుండుటను, అనగా నీసామ్యమును, యాస్యతికిం = పొందఁగలడాయేమి?

వి॥ ఇచ్చట చన్ద్రుడు నలుని మోముతో సామ్యముఁ బొందుటకు దమయన్తీ శరీరభస్మముచే తన కలఙ్కమునుఁ తుడుచుకొనినను, స్త్రీవధపాతకము వలని కళఙ్కము ప్రాప్తించినది. కళఙ్కరాహిత్యమునకై గావించిన ప్రయత్నము మఱల కళఙ్కప్రాప్తికే సాధన మైనందువలన విషమాలఙ్కారము.

## సమాసములు :

నిజాంశునిర్దగ్ధమదఙ్గభస్మభిః : నిజాశ్చాసౌ అంశుశ్చ = నిజాంశుః.

నిజాంశునా నిర్దగ్ధం = నిజాంశునిర్దగ్ధం. మమ అఙ్గం = మదఙ్గం. నిజాంశు నిర్దగ్ధం చ తత్ మదఙ్గం చ = నిజాంశునిర్దగ్ధమదఙ్గం. నిజాంశునిర్దగ్ధమదఙ్గస్య భస్మాని = నిజాంశునిర్దగ్ధమదఙ్గభస్మాని. తైః = నిజాంశునిర్దగ్ధమదఙ్గ భస్మభిః.

లాఞ్ఛనోన్మృజామ్ : లాఞ్ఛనస్య ఉన్మృజా = లాఞ్ఛనోన్మృజా. తామ్ = లాఞ్ఛనోన్మృజామ్.

త్వదాస్యతాం : తవ ఆస్యం = త్వదాస్యం. త్వదాస్యస్య భావః = త్వదాస్యతా. తామ్ = త్వదాస్యతాం.

వధూవధేన : వధ్వాః వధః = వధూవధః. తేన = వధూవధేన.

**భావము :**

చన్ద్రుఁడు తన కిరణములచే నన్ను దగ్ధముఁ గావించి, నా శరీర భస్మములచే తన కళఙ్కమునుఁ దుడిచివేయఁగోరుచున్నాఁడు. అట్లు తాను తన కళఙ్కమునుఁ దుడిచివేసికొనినను, నన్నుఁ జంపుటవలని పాతకముచే, ననగా స్త్రీవధపాతకముచే, మఱల కలఙ్కమునుఁబొందుచున్నాఁడు. ॥౧౪౬॥

శ్లో॥ ప్రసీద యచ్ఛ స్వశరాన్ మనోభువే
స హన్తు మాం తైర్ధుతకౌసుమాశుగః ।
త్వదేకచిత్తాఽహమసూన్ విముఞ్చతీ
త్వమేవ భూత్వా తృణవజ్జయామి తమ్॥ ౧౪౭

ప॥వి॥ ప్రసీద । యచ్ఛ । స్వశరాన్ । మనోభువే । సః । మాం । తైః । ధుతకౌసుమాశుగః । త్వదేకచిత్తా । అహమ్ । అసూన్ । విముఞ్చతీ । త్వమ్ । ఏవ । భూత్వా । తృణవత్ । జయామి।తమ్.

టీక॥ హే ప్రియ = ఓ ప్రియుఁడా! ప్రసీద = ప్రసన్నుఁడవుకమ్ము. స్వశరాన్ = నీబాణములను, మనోభువే = మన్మథునికొఱకు, యచ్ఛ = ఇమ్ము, సః = ఆమన్మథుడు, ధుతకౌసుమాశుగః; ధుత = విడుపఁబడిన, కౌసు మాశుగః = పుష్పబాణములుగలవాఁడై, తైః = నీబాణములతో, మాం =

టీక॥ కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః; కవిరాజరాజి = కవిశ్రేష్ఠులపఙ్క్తి లోని,మకుట = శ్రేష్ఠమైనవారికి,అలఙ్కార = భూషణమైన,హీరః = వజ్రమణియగు, శ్రీహీరః = శ్రీహీరుఁడు, జితేన్ద్రియచయం; జిత = జయింపబడిన, ఇన్ద్రియచయం = ఇన్ద్రియసమూహముగల్గిన, శ్రీహర్షం = శ్రీహర్షుఁడను పేరుగల, యం = ఏ, సుతం = కుమారుని, సుషువే = ఉత్పత్తి గావించెనో, మామల్లదేవీచ = మామల్లదేవియను, స్వమాతాచ = తనతల్లి, యంసుతం = ఏకుమారుని, సుషువే = కనెనో, సందృబ్ధార్ణవవర్ణనస్య; సందృబ్ధ = రచింపఁబడిన, అర్ణవవర్ణనస్య = అర్ణవవర్ణనమను గ్రన్థముగల, తస్య = ఆశ్రీహర్షునియొక్క, నైషధీయచరితే = నైషధీయచరితనును, చారుణి = రమ్యమైన, మహాకావ్యే = మహాకావ్యమందు, నిసర్గోజ్జ్వలః; నిసర్గ = స్వభావముతోడనే, ఉజ్జ్వలః = ప్రకాశమానమైన, నవమః = తొమ్మిదవ, సర్గః = సర్గ, వ్యరంసీత్ = సమాప్తిఁజెందినది.

## సమాసములు :

*కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః* : కవీనాం రాజానః = కవిరాజాః. కవిరాజానాం రాజిః = కవిరాజరాజిః. కవిరాజరాజేఃమకుటం = కవిరాజరాజిమకుటం. కవిరాజరాజిమకుటే అలఙ్కారః = కవిరాజరాజిమకుటాలఙ్కారః. కవిరాజరాజిమకుటాలఙ్కారశ్చాసౌ హీరశ్చ = కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః.

*జితేన్ద్రియచయం* : ఇన్ద్రియాణాం చయః = ఇన్ద్రియచయః. జితః ఇన్ద్రియచయః యేన సః = జితేన్ద్రియచయః. తమ్ = జితేన్ద్రియచయం.

*సందృబ్ధార్ణవవర్ణనస్య* : అర్ణవస్య వర్ణనం అర్ణవవర్ణనం. సందృబ్ధం అర్ణవవర్ణనం యేనసః = సందృబ్ధార్ణవవర్ణనః. తస్య = సందృబ్ధార్ణవవర్ణనస్య.

*నైషధీయచరితే* : నిషధానాం రాజా = నైషధః. నైషధస్య ఇదం = నైషధీయం. నైషధీయం చ తత్ చరితం చ = నైషధీయచరితం. తస్మిన్ = నైషధీయచరితే.

*నిసర్గోజ్జ్వలః* : నిసర్గేణ ఉజ్జ్వలః = నిసర్గోజ్జ్వలః.

భావము :

కవిరాజశ్రేణిలో కిరీటస్థాన మలఙ్కరించినవారికి నలఙ్కారమగు వజ్రమణి యైన శ్రీహీరకవి ఇన్ద్రియనిగ్రహముఁ గావించిన శ్రీహర్షుఁడను సుతుని నుత్పత్తిఁజేసెను. తల్లియైన మామల్లదేవియు నా సుతుని కనెను. "అర్ణవవర్ణన" మను కావ్యమును రచించిన యా శ్రీహర్షునియొక్క రమ్యమైన మహాకావ్యమగు నైషధీయచరితమునందు స్వభావముచే నుజ్జ్వలమగు నవమసర్గ సమాప్తి జెందినది. ॥౧౬౦॥

ఇట్లు

శ్రీ మదాత్రేయగోత్ర శ్రీమదుదాలి నృసింహశాస్త్రితనూజ విక్రమ సింహపురీవేదసంస్కృత కళాశాలా ప్రధానోపాధ్యాయ

శ్రీ సుబ్బరామశాస్త్రి

విరచితమగు

నైషధాంధ్ర వ్యాఖ్యానమునకు

నవమసర్గ

సమాప్తము.

నన్ను, హన్తు = చంపునుగాక, అహం = నేను, త్వదేకచిత్తాసతీ; త్వదేక = నీయొక్కనియందే, చిత్తాసతీ = మనస్సుగల దానసుగానై, అసూన్ = ప్రాణములను, విముఞ్చతీ = విడచుచు, త్వమేవ = నీవుగనే, భూత్వా = అయినదాననై, తమ్ = ఆమన్మథుని, తృణవత్ = గడ్డి పోచనువలె, జయామి = జయింతును.

## సమాసములు :

స్వాశరాన్ : స్వస్య శరాః = స్వాశరాః. తాన్ = స్వాశరాన్.

ధుతకౌసుమాశుగః : కుసుమస్య వికారః = కౌసుమః. కౌసుమశ్చాసౌ ఆశుగశ్చ = కౌసుమాశుగః. ధుతః కౌసుమాశుగః యేన సః = ధుతకౌసుమాశుగః.

త్వదేకచిత్తా : త్వమేవ ఏకః = త్వదేకః. త్వదేకస్మిన్ చిత్తం యస్యాస్సా = త్వదేకచిత్తా.

తృణవత్ : తృణమివ = తృణవత్.

## భావము :

ఓ ప్రియుడా! ప్రసన్నుఁడవు కమ్ము. నీబాణములను మన్మథున కిమ్ము. ఆ మన్మథుడు పుష్పబాణములను వదలిపెట్టినవాడై యా నీబాణములచే నన్ను జంపును గాత. నాకు నీయందొకనియందే మనస్సు లగ్నమైనదై, ప్రాణములను బరిత్యజించుచు నీవుగా నేర్పడి యామన్మథుని గడ్డిపోచనుఁ బోలె జయింతును. మరణకాలమునందు ఏయే భావములను స్మరించుచు జీవుడు శరీరత్యాగముఁ జేయునో మఱు జన్మమునం దాయా భావములనే యతడు పొందునని చెప్పుట వలన దమయన్తి మఱు జన్మమునకు నలుఁడుగా జన్మించవచ్చును. కాన నలుడుగా జన్మించి యా మన్మథుని జయింపవచ్చునని యాశయము. ॥౧౪౭॥

శ్లో॥ శ్రుతిః సురాణాం గుణగాయనీ యది
త్వదఙ్ఘ్రిమగ్నస్య జనస్య కిం తతః ।
స్తవే రవేరప్సు కృతాప్లవైః కృతే
న ముద్వతీ జాతు భవేత్ కుముద్వతీ ॥ ౧౪౮

ప॥వి॥ శ్రుతిః । సురాణాం । గుణగాయనీ । యది । త్వదఙ్ఘ్రిమగ్నస్య । జనస్య । కిం । తతః । స్తవే । రవేః । అప్సు । కృతాప్లవైః । కృతే । న । ముద్వతీ । జాతు । భవేత్ । కుముద్వతీ.

టీక॥ శ్రుతిః = వేదము, సురాణాం = దేవతలయొక్క, గుణగాయనీయది = గుణములను కీర్తించునదియైనచో, త్వదఙ్ఘ్రిమగ్నస్య; త్వదఙ్ఘ్రి = నీపాదములయందు, మగ్నస్య = నాటుకొనిన అనగా శరణుఁబొందిన, జనస్య = జనమునకు, అనగా నాకు, తతః = ఆదేవతలవలన, కిం = ఏమిప్రయోజనము? తథాహి = అదియుక్తమే. అప్సు = ఉదకములయందు, కృతాప్లవైః, కృత = చేయఁబడిన, ఆప్లవైః = స్నానముగల్గినజనములచే, రవేః = సూర్యునియొక్క, స్తవే = స్తోత్రముఁచేయఁబడగా, కుముద్వతీ = కలువ, జాతు = ఒకప్పుడైనను, ముద్వతీ = సంతోషముగలదిగను వికాసముగలదిగను, కథమపి = ఎట్లైనను, నభవేత్ = కాదు.

## సమాసములు :

*గుణగాయనీ :* గుణస్య గాయనీ = గుణగాయనీ.

*త్వదఙ్ఘ్రిమగ్నస్య :* తవ అఙ్ఘ్రి = త్వదఙ్ఘ్రి. త్వదఙ్ఘ్ర్యోః మగ్నః = త్వదఙ్ఘ్రిమగ్నః. తస్య = తదఙ్ఘ్రిమగ్నస్య.

*కృతాప్లవైః :* కృతః ఆప్లవః యైస్తే = కృతాఽఽప్లవాః. తైః = కృతాప్లవైః.

*ముద్వతీ :* ముత్ అస్యాః అస్తీతి = ముద్వతీ.

## భావము :

వేదము దేవతల గుణమును స్తోత్రము చేయునదియేకాని నీపాదములను శరణుఁజొచ్చిన నాకు వానితో నేమిప్రయోజనము. ఉదకములయందు స్నానమాడి సూర్యునిస్తుతినిఁ జేసినచో, కలువ (సంతోషమును) వికాసము నేలఁ బొందును. ॥౧౪౮॥

# శ్రీహర్ష నైషధము

చతుర్థభాగము

తెలుగు వ్యాఖ్యానం

శ్రీ ఉడాలి సుబ్బరామ శాస్త్రి, ఎం. ఏ.
రిటైర్డ్ ప్రిన్సిపాలు, వైదిక సంస్కృత కళాశాల, నెల్లూరు




ప్రచురణ
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

SRI HARSHANAISHADHAM - Volume IV (Containing 10th, 11th and 12th Sargas)-A Sanskrit classic by Sri Harsha of 7th century A.D. with Telugu commentary by Sri Udali-Subbarama Sastry, Retd. Principal, Veda and Sanskrit college, Nellore Dist., Andhra Pradesh.

---

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాదు – 500 004

ప్రచురణ : 318

ప్రథమ ముద్రణ : 1981

ప్రతులు : 1,000

**వెల : రూ. 16-50**

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి,
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాదు – 500 004

ముద్రణ
**నాగలక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్**
బషీర్‌బాగ్, హైదరాబాదు,

# తొలిపలుకు

ప్రసిద్ధమైన సంస్కృత గ్రంథాలలోని మూలస్వరూపాన్ని తెలుగు పాఠకులకు పరిచయం చేయాలనే ఉద్దేశంతో అకాడమీ ఇంతవరకు కొన్ని పుస్తకాలను ప్రచురించింది. మృచ్ఛకటికం, ఉత్తరరామచరిత్ర, ముద్రా రాక్షసం, ఆంధ్ర రసగంగాధరం, లాంటి పఠనీయ గ్రంథాలకు పండితులచే అర్థ తాత్పర్యాలూ, విశేషాలూ వ్రాయించి అందించింది. సంస్కృతంలో బాగా వ్యాప్తిలోనికివచ్చి తెలుగులో కావ్యాలుగా అవతరించిన గ్రంథాలు అనేకం. జిజ్ఞాసువులకు మూలంలోని అంతర్యాన్ని, అది వేసుకున్న తెలుగువేషాన్ని తెలుసుకొని తులనాత్మకంగా పరిశీలించవలసిన అగత్యం ఉంటుంది. ఉత్తమా ధ్యయనానికి ఇది అత్యంతావశ్యకంకూడ.

ఈ ప్రణాళికను అనుసరించి నెల్లూరు వైదిక కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రిగారు శ్రీ హర్షుని నైషధానికి తెలుగు అర్థతాత్ప ర్యాలు సమకూర్చి అకాడమీకి అందించినారు. ఇంతవరకు శ్రీ హర్షనైషధం మూడు సంపుటాలుగా వచ్చింది. మొదటి సంపుటంలో 1, 2, 3 సర్గలకు, రెండవ సంపుటములో, 4, 5, 6 సర్గలకు, మూడవ సంపుటంలో 7, 8, 9 సర్గలకు లఘువ్యాఖ్యానం (మూలశ్లోకం, పదవిభజన అర్థము, విశేషము, సమాసములు, భావము) ఉన్నది. ఇప్పుడు 10, 11, 12 సర్గలతో ఉన్న నాల్గవ సంపుటాన్ని అందిస్తున్నాము. ఇక మిగిలిన సర్గలను త్వరలో పాఠకులు అందుకుంటారు.

శ్రీనాథుని శృంగారనైషధం వల్ల తెలుగు కవితా ప్రపంచంలో విశేష ప్రాచుర్యాన్ని పొందిన శ్రీ హర్షునినైషధం విద్వదౌషధంగానూ, రసకోశంగానూ వాసికెక్కింది. శ్రీ హర్షుని నైషధానికి చక్కని వ్యాఖ్యానం తెలుగులో వెల యించిన శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రిగారికి అకాడమి కృతజ్ఞతలను సమర్పించు కుంటున్నది.

హైద్రాబాదు.
తేది. 23-1-1981

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి

# శ్రీ హర్షనైషధము

## దశమసర్గ

శ్లో. రథైరథాయుః కులజాః కుమారాః
శస్త్రేషు శాస్త్రేషు చ దృష్టపారాః.
స్వయంవరం శమ్బరవైరికాయ
వ్యూహశ్రియః శ్రీజితయక్షరాజాః 1

ప॥ఛే॥ రథైః-అథ - ఆయుః-కులజాః-కుమారాః - శస్త్రేషు - శాస్త్రేషు-చ-దృష్టపారాః -స్వయంవరం —శమ్బరవైరి కాయవ్యూహశ్రియః— శ్రీజిత యక్షరాజాః.

అర్థము : అథ = నలుఁడు పయనించిన పిదప, కులజాః = ఉత్తమ వంశమందు జన్మించిన, శస్త్రేషు = శస్త్ర విద్యలయందును, శాస్త్రేషు చ = శాస్త్రములయందును, దృష్టపారాః, దృష్ట = చూఁడబడిన, పారాః = ఆవలిగట్టు గలవారును, శమ్బరవైరికాయవ్యూహశ్రియః = శమ్బరవైరి = మన్మథునియొక్క, కాయవ్యూహ = శరీర సముదాయముయొక్క, శ్రియః = శోభకలవారును, శ్రీజితయక్షరాజాః; శ్రీ = ఐశ్వర్యముచే, జిత = జయింపఁబడిన, యక్షరాజాః = కుబేరుడు గలవారును నగు, కుమారాః = రాజపుత్రులు, రథైః = రథములతో, స్వయంవరం = స్వయంవర మహోత్సవమునుఁ గూర్చి, ఆయుః = విచ్చేసిరి.

వి॥ "కాయవ్యూహశ్రియః" యనునెడ కాయవ్యూహముల శోభను రాజకుమారులయందు ఆరోపించుటవలన పదార్థవృత్తి నిదర్శనాలంకారము. "శ్రీజితయక్షరాజాః" యనునెడ నైశ్వర్యముచే కుబేరుని జయించినవా

రని యుపమానమైన కుబేరుని నుపమేయమైన రాజపుత్రులు జయించి నట్లు చెప్పుటచే వ్యతిరేకాలంకారము. ఈ రెండు అలంకారములును తిలతండుల న్యాయముచే సంసృష్టి.

ఈ సర్గయందు ఉపేంద్రవజ్రేంద్రవజ్రోపజాతులు వృత్తములు.

**సమాసములు :**

కులజాః— కులే జాయన్తే ఇతి = కులజాః.

దృష్టపారాః— దృష్టం పారం యైస్తే = దృష్టపారాః.

స్వయంవరం — స్వయం ప్రియతే అస్మిన్నితి = స్వయంవరః, తం = స్వయంవరం.

శమ్బరవైరికాయశ్రియః— శమ్బరస్య వైరీ = శమ్బరవైరీ, కాయానాం వ్యూహాః = కాయవ్యూహాః శమ్బరవైరిణః కాయవ్యూహాః = శమ్బరవైరికాయవ్యూహాః. శమ్బరవైరికాయవ్యూహానాం శ్రీరివ శ్రీః యేషాం తే = శమ్బరవైరికాయవ్యూహశ్రియః.

శ్రీజితయక్షరాజాః— శ్రియా జితః = శ్రీజితః, యక్షాణాం రాజా = యక్షరాజః = శ్రీజితః, యక్షరాజః యైః తే = శ్రీజితయక్ష రాజాః।

**భావము :**

నలుఁడు దమయంతితో మంతనములు సలిపి స్వయంవరమునకుఁ బయ నించెను. ఆ స్వయంవరమునుఁ గూర్చి సద్వంశమందు జన్మించి, శస్త్రవిద్యల యందును, శాస్త్రములయందును నారితేరినవారును, శంబరాసురుని వధించుటకై యెత్తిన మన్మథుని శరీరసమూహముల శోభను దాల్చినవారును, నైశ్వర్యముచే కుబేరుని జయించినవారును నగు రాజపుత్రులు తమ తమ రథములపైని విచ్చే సిరి. తొల్లి శంబరాసురుని నోడించుటకై మాయచే మన్మథుఁడు పెక్కుశరీరము లను ధరించెను. అటువంటి రాజపుత్రులు ఆతని శరీరముల శోభను వహించియున్నా రని భావము. ॥౧॥

శ్లో॥ నాఽభూదభూమిః స్మరసాయకానాం
నాసీదగన్తా కులజః కుమారః,
నాస్థాదపన్థా ధరణేః కణోఽపి
ప్రజేషు రాజ్ఞాం యుగపద్వ్రజత్సు. **2**

ప॥వి॥ న - అభూత్ - అభూమిః - స్మరసాయకానాం - న - ఆసీత్ - అగన్తా - కులజః - కుమారః - న - అస్థాత్ - అపన్థాః - ధరణేః - కణః - అపి - ప్రజేషు - రాజ్ఞాం - యుగపత్ - వ్రజత్సు -

అర్థము: కులజః = సత్కులమునందు బుట్టిన, కోఽపి కుమారః = ఏ రాజపుత్రుండును, స్మరసాయకానాం = మన్మథబాణములకు, అభూమిః = గురికాని వాడుగా, నాఽభూత్ = కాలేదు (తథా = అట్లే) అగన్తాచ = స్వయంవరమునకు రానివాడుగను, నాభూత్ = కాలేదు. (కిఞ్చ = మఱియు) రాజ్ఞాం = రాజులయొక్క, ప్రజేషు = సంఘములు, యుగపత్ — ఏక కాలమునందు, వ్రజత్సు సత్సు = వెళ్ళుచుండగా, ధరణేః = భూమి యొక్క = కణోఽపి = లేశము గూడ, అపన్థాః = దారికానిదిగ, నాఽస్థాత్ = ఉండలేదు.

వి॥ ఇచ్చట రాజు లందఱు మన్మథబాణములకు గుఱి యగుటకును, స్వయంవరమును కేతెంచుటకును సంబంధము లేకపోయినను, సంబంధము చెప్పుటవలన సంబంధాతిశయోక్తి.

## సమాసములు

అభూమిః - న భూమిః = అభూమిః.

స్మరసాయకానాం - స్మరస్య సాయకాః = స్మరసాయకాః తేషాం = స్మరసాయకానామ్.

అగన్తా - న గన్తా = అగన్తా.

అపన్థాః - న పన్థాః = అపన్థాః.

## భావము :

అప్పటికి విచ్చేసిన రాజకుమారులలో నొక్కడును గూడ మన్మథబాణము

లను గెలిచి రానివాడు లేడు. అట్టి స్వయంవరమునకు పోనివాడును లేడు. మఱియు రాజుల తండములు దమయంతి యొక్క స్వయంవరమునకు వెళ్ళుచుండగా, భూమిలోని లేశభాగముగూడ వారి రాకపోకలు లేనిది కాదు. అనగా భూమి యంతయు వారి దైనది. ఆ స్వయంవరమునకు విచ్చేసిన రాజకుమారు లందఱును దమయంతి యొక్క సౌందర్యమునుఁ జూచి మన్మథుని బాణములకు గురి యైరి. ఆ స్వయంవరమునకు రాజకుమారులందఱును విచ్చేసిరి. ఆ స్వయంవరమునకు రాజ సంఘము లేకకాలమునందు వచ్చుచుండగా భూమియందలి సూక్ష్మభాగము గూడ దారిగానే యుండిన దని భావము. ॥౨॥

శ్లో॥ యోగ్యైర్వ్రజద్భిర్నృపజాం వరీతుం
వీరైరనర్హైః ప్రసభేన హర్తుమ్.
ద్రష్టుం పరైస్తాననురోద్ధుమన్యైః
స్వమాత్రశేషాః కకుభో బభూవుః. 3

ప॥వి॥ యోగ్యైః - వ్రజద్భిః - నృపజాం - వరీతుం - వీరైః - అనర్హైః - ప్రసభేన - హర్తుం - ద్రష్టుం - పరైః - తాన్ - అనురోద్ధుమ్ - అన్యైః - స్వమాత్రశేషాః - కకుభః - బభూవుః.

అర్థము: యోగ్యైః = అందచందములతో సంబంధమున కర్హులై, నృపజాం = రాజపుత్రిక యగు దమయంతిని, వరీతుం = వరించుటకు, వ్రజద్భిః = వెళ్ళుచున్న, వీరైః = వీరులచేతను, అనర్హైః = అందచందములు లేనందువలన సంబంధమునకర్హతలేక, ప్రసభేన = బలవంతముగా, హర్తుం = అపహరించుటకు, వ్రజద్భిః = వెళ్ళుచున్న, వీరైః = వీరులచేతను, ద్రష్టుం = స్వయంవరమును దర్శించుటకుమాత్రమే, వ్రజద్భిః = వెళ్ళుచున్న, పరైః = ఇతరులచేతను, తాన్ = ఆ రాజపుత్రులను, అనురోద్ధుం = అనుసరించుటకు, వ్రజద్భిః = వెళ్ళుచున్న, అన్యైః = తదితరులచేతను, కకుభః = దిక్కులు, స్వమాత్రశేషాః = తమ స్వరూపము మాత్రమె మిగిలినవిగా, బభూవుః — ఏర్పడినవి.

వి॥ ఇచ్చట దిక్కులకు స్వమాత్రశేషత్వసంబంధము లేకపోయినను, ఆ సంబంధమును చెప్పుటవలన సంబంధాతిశయోక్త్యలఙ్కారము.

**సమాసములు :**

యోగ్యైః - యోగమర్హాః=యోగ్యాః. తైః=యోగ్యైః.
స్వజనామ్ - స్వస్మాత్ జాయత ఇతి = స్వజా. తామ్ = స్వజనామ్.
అనర్హైః - న అర్హాః = అనర్హాః = తైః. అనర్హైః.
స్వమాత్రశేషాః - స్వా ఏవ = స్వమాత్రం. స్వమాత్రం శేషః యాసాం తాః = స్వమాత్రశేషాః.

**భావము:**

ఆ స్వయంవరభూమికి, సందడములతో సర్వత గల్గి రాజపుత్రికను వరించుటకు కొందఱు వీరు తేలెంచుచున్నారు. అట్టి యర్హత లేక కేవలము ఆమెను, అపహరించుటకు కొందఱు వెళ్ళుచున్నారు. కొందఱు ఏలాంటి యర్హత లేక నిస్పృహులై, స్వయంవరమును మాత్రముఁ జూచుటకై విచ్చేయు చున్నారు. మఱికొందఱు, స్వయంవరమునకు అఱుతెంచు రాజపుత్రులను సేవిం చుటకు వచ్చుచున్నారు. ఇట్లు పెక్కు కోరికలతో, పెక్కండ్రు పెక్కుదిక్కుల నుండి విచ్చేయుచుండుటవలన దిక్కు లన్నియు జనశూన్యములై తమ స్వరూప మాత్రముచే శేషించి యుండినవి. ॥3॥

శ్లో॥ **లోకైరశేషైరవనిశ్రియస్తా**
**ముద్దిశ్య దిశ్యైర్విహితే ప్రయాణే.**
**స్వవర్తి తత్తజ్జనయన్త్రిణా ర్తి**
**విశ్రాన్తిమాపుః కకుభాం విభాగాః. 4**

ప॥వి॥ లోకైః - అశేషైః - అవనిశ్రియం - తామ్ - ఉద్దిశ్య - దిశ్యైః - విహితే - ప్రయాణే - స్వవర్తితత్తజ్జనయన్త్రిణార్తి విశ్రాన్తిమ్ - ఆపుః - కకుభాం - విభాగాః.

అర్థము : అవనిశ్రియం = భూలోకలక్ష్మి యైన, తామ్ = దమయన్తిని, ఉద్దిశ్య = ఉద్దేశించి, దిశ్యైః = దిక్కులయందలి, అశేషైః = సకలురైన, లోకైః = ప్రజలచే, ప్రయాణే = పయనము, విహితే సతి = చేయఁబడగా, కకుభాం = దిక్కులయొక్క, విభాగాః = ప్రదేశములు, స్వావర్తి తత్తజ్జనయన్త్రిణార్తి విశ్రాన్తిమ్; స్వ — తమయందు, వర్తి = నివసించు, తత్తజ్జన — ఆయాజనులయొక్క, యన్త్రిణా = సంబంధము వలని, ఆర్తి = బాధయొక్క, విశ్రాన్తం = విశ్రాన్తిని, ఆపుః = పొందినవి.

వి॥ జనసంబంధ విశ్రాన్తినిఁ బొందకపోయినను, పొంది నట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జక ప్రయోగము లేనందువలన నది గమ్యము.

**సమాసములు :**

అశేషైః - అ విద్యమానః శేషః యేషాం తే = అశేషాః. తైః = అశేషైః.

అవనిశ్రియం - అవనేః శ్రీః = అవనిశ్రీః. తామ్ = అవనిశ్రియమ్.

స్వావర్తితత్తజ్జన యన్త్రిణార్తి విశ్రాన్తిమ్ - స్వాసు వర్తన్త ఇతి = స్వావర్తినః. తే తే చ జనాశ్చ = తత్తజ్జనాః, స్వావర్తినశ్చ తే తత్తజ్జనాశ్చ = స్వావర్తితత్తజ్జనాః. స్వావర్తితత్తజ్జనానాం యన్త్రిణా = స్వావర్తితత్తజ్జనయన్త్రిణా. స్వావర్తితత్తజ్జనయన్త్రిణయా ఆర్తిః = స్వావర్తి స్వావర్తితత్తజ్జనయన్త్రిణార్తిః. స్వావర్తితత్తజ్జనయన్త్రిణార్తేః విశ్రాన్తిః = స్వావర్తితత్తజ్జనయన్త్రిణార్తి విశ్రాన్తిః. తామ్ = స్వావర్తితత్తజ్జనయన్త్రిణార్తి విశ్రాన్తిమ్.

**భావము :**

భూలోకలక్ష్మిగా వెలుగునట్టి యా దమయన్తినిఁ జూచుటకై యన్ని దిక్కులనుండి జను లందఱు బయలుదేరగా, నా దిక్ప్రదేశములు తమయందు నివసించు జనుల త్రొక్కిడి తగ్గినందువలన విశ్రాన్తి ననుభవించుచున్నట్లు కానవచ్చినది. ॥౪॥

శ్లో. తలం యథేయుర్న తిలా వికీర్ణాః
సైన్యైస్తథా రాజపథా బభూవుః
భైమీం స లబ్ధామివ తత్ర మేనే
యః ప్రాప భూభృద్భవితుం పురస్తాత్. 5.

ప॥వి॥ తలం-యథా-ఈయుః -న- తిలాః -వికీర్ణాః - సైన్యైః - తథా - రాజపథాః - బభూవుః - భైమీం - సః - లబ్ధామ్ - ఇవ - తత్రమేనే - యః - ప్రాప - భూభృత్ భవితుం - పురస్తాత్

అర్థము:- యథా=ఎట్లు వికీర్ణాః=పైన జల్లబడిన, తిలాః=నువ్వులు, తలం=భూమిని, నేయుః=పొందవో, సైన్యైః=సైన్యములచే, రాజపథాః=రాజమార్గములు, తథా=అట్లు, బభూవుః=అయినవి. అనగా నువ్వులు రాలుటకు కూడ నవకాశము లేని వైనవి. (కించ=మఱియు) తత్ర=ఆ సమయమందు, యః=ఏ, భూభృత్=రాజు, పురస్తాత్=ముందు, భవితుం=ఉండుటకు, ప్రాప=(అవకాశమును) పొందెనో, సః=ఆ రాజు, భైమీం=దమయన్తిని, లబ్ధామివ=పొందబడినదానినిగనే, మేనే=తలంచెను.

వి॥ తిల మాత్రావకాశ సంబంధమున్నను, ఆ యవకాశము లేదని చెప్పుట వలన సంబంధాతిశయోక్తి

**సమాసములు :**

సైన్యైః=సేనాయాం సమవేతాః=సైన్యాః. తైః=సైన్యైః.

**భావము :**

ఆ స్వయంవరమహోత్సవమునకు పైన నువ్వులు చల్లినను రాలుటకు సందు లేని విధముగా సైన్యములు రాజమార్గములందు నిండిపోయినవి. ఆ సమయమునం దెవ్వడు ముందువ చొరబడునో భూతడే దమయన్తి తనకు లభించినదని భావించుచుండెను ॥౫॥

శ్లో. నృపః పురఃస్థైః ప్రతిరుద్ధవర్త్మా
పశ్చాత్తనైః కశ్చన నుద్యమానః
యన్త్రిస్థసిద్ధార్థపదాభిషేకం
లబ్ధ్వాప్యసిద్ధార్థమమన్యత స్వమ్. 6

ప॥వి॥ నృపః - పురఃస్థైః - ప్రతిరుద్ధవర్త్మా - పశ్చాత్తనైః - కః - చన - నుద్యమానః - యన్త్రిస్థసిద్ధార్థ పదాభిషేకం - లబ్ధ్వా-అపి-అసిద్ధార్థమ్-అమన్యత - స్వమ్.

అర్థము. పురఃస్థైః = ముందున్నట్టి (జనైః=జనులచే,) ప్రతిరుద్ధవర్త్మా=అడ్డగింపఁబడిన మార్గము గలవాఁడును, పశ్చాత్తనైః=వెనుక నున్న జనులచే, నుద్యమానః=ప్రేరేపింపఁబడుచున్న, కశ్చన=ఒకానొక, నృపః=రాజు, యన్త్రిస్థసిద్ధార్థపదాభిషేకం; యన్త్రిస్థ=నూనెతీసెడి గానుగయందున్న, సిద్ధార్థ=ఆవగింజలయొక్క, పద=స్థానమందు, అభిషేకం=అభిషేకమును, లబ్ధ్వాఽపి= పొందియు, స్వమ్=తన్ను, అసిద్ధార్థం=ఆవగింజకంటె భిన్నమైనవానినిఁగను, దమయన్తీప్రాప్తిరూపమను నర్థమును పొందని వానినిగను, అమన్యత=తలంచెను.

వి॥ యన్త్రిమందలి సిద్ధార్థముగా (ఆవగింజగా) నైనవాఁడు అసిద్ధార్థముగా (ఆవగింజకంటె భిన్నముగా) తన్నెట్లు భావించు నని విరోధము. దమయన్తీప్రాప్తిరూపకార్యసిద్ధి లేనందువలన అసిద్ధార్థు డాయె నని చెప్పుటచే విరోధమునకు పరిహారము కాన విరోధాభాసాలఙ్కారము.

## సమాసములు

పురఃస్థైః-పురః తిష్ఠన్తీతి=పురఃస్థాః, తైః=పురస్థైః.

ప్రతిరుద్ధవర్త్మా-ప్రతిరుద్ధం వర్త్మ యస్య సః=ప్రతిరుద్ధవర్త్మా.

యన్త్రిస్థసిద్ధార్థ పదాభిషేకం- యన్త్రే తిష్ఠతీతి=యన్త్రిస్థః, యన్త్రిస్థశ్చాసౌ సిద్ధార్థశ్చ=యన్త్రిస్థసిద్ధార్థః, యన్త్రిస్థసిద్ధార్థస్య పదం=యన్త్రిస్థసిద్ధార్థపదం, యన్త్రిస్థసిద్ధార్థపదే అభిషేకః=యన్త్రిస్థసిద్ధార్థ పదాభి

షేకః, తం—యస్త్రస్థసిద్ధార్థపదాభిషేకమ్॥
అసిద్ధార్థమ్-న సిద్ధార్థః—అసిద్ధార్థః, తమ్—అసిద్ధార్థమ్.
అసిద్ధః, అర్థః యస్య సః—అసిద్ధార్థః, తమ్—అసిద్ధార్థమ్.

**భావము ;**

ఒక రాజు ముందున్న జనముచే సద్గగింపబడెను. వెనుక నున్న జనముచే నెట్టబడెను. ఈ పరిస్థితిలో, గానుగయందున్న యావగింజ స్థానమునందు (కార్యసిద్ధిస్థానమునందును) ఆవగింజకంటె భిన్న మైనవానిగను, (సమయస్త్రీ ప్రాప్తిరూప మగు నర్థసిద్ధి లేనివానిగను] భావించుచుండెను. ఆ స్వయంవర మందు జనబాహుళ్యమునందు, వారి మధ్య నిరుకొనిన యా రాజు ముందు కుగాని వెనుకకుగాని పోజాలకపోయెను ॥౬॥

**శ్లో. రాజ్ఞాం పథి స్త్యానతయానుపూర్వీ**
**విలఙ్ఘనాశక్తి విలమ్బభాజామ్**
**ఆహ్వాన సంజ్ఞానమివాఽగ్రకమ్పై**
**ర్దధుర్విదర్భేంద్ర పురీపతాకాః. 7**

ప॥వి॥ రాజ్ఞాం - పథి-స్త్యానతయా - ఆనుపూర్వీవిలఙ్ఘనాశక్తి విలమ్బభాజామ్-ఆహ్వానసంజ్ఞానమ్-ఇవ-అగ్రకమ్పైః-దధుః-విదర్భేన్ద్రపురీపతాకాః.

అర్థము- విదర్భేన్ద్రపురీపతాకాః; విదర్భేన్ద్రపురీ—విదర్భమహారాజు పట్టణ మందలి, పతాకాః—టెక్కెములు, అగ్రకమ్పైః—తమ యగ్రభాగము లయొక్క కదలికలచే, పథి—మార్గమునందు, స్త్యానతయా—క్రిక్కిరిసి యుండుటచే, ఆనుపూర్వీ విలఙ్ఘనాశక్తి విలమ్బభాజామ్; ఆనుపూర్వీ విలఙ్ఘన—క్రమముగా దాటుటయందు, అశక్తి—శక్తి లేనందువలన, విలమ్బభాజాం—ఆలస్యముఁజేయునట్టి, రాజ్ఞాం—రాజులకు, ఆహ్వాన సంజ్ఞానం—పిలుపువనిని, దధురివ—ధరించినవో యనునట్లున్నవి.

వి॥ ఇచ్చట టెక్కెములు తమ యగ్రభాగముల కదలికలచే పిలువకపోయి నను, పిలిచినవో యని చెప్పుటవలన నుత్ప్రేక్ష.

**సమాసములు :**

ఆనుపూర్వ్యా విలఙ్ఘనా శక్తి విలమ్బభాజాం- ఆనుపూర్వ్యా విలఙ్ఘనం=ఆనుపూర్వీవిలఙ్ఘనమ్ ఆనుపూర్వీవిలఙ్ఘనే అశక్తిః=ఆనుపూర్వీవిలఙ్ఘనాశక్తిః,ఆనుపూర్వీ విలఙ్ఘనాశక్త్యా విలమ్బః = ఆనుపూర్వీవిలఙ్ఘనాశక్తివిలమ్బః, ఆనుపూర్వీవిలఙ్ఘనాశక్తివిలమ్బం భజన్తీతి=ఆనుపూర్వీవిలఙ్ఘనాశక్తివిలమ్బభాజః, తేషామ్ = ఆనుపూర్వీవిలఙ్ఘనాశక్తివిలమ్బభాజామ్.

ఆహ్వానసంజ్ఞానమ్-ఆహ్వానస్య సంజ్ఞానమ్=ఆహ్వానసంజ్ఞానం, తత్=ఆహ్వానసంజ్ఞానమ్.

అగ్రకమ్పైః-అగ్రస్య కమ్పాః—అగ్రకమ్పాః, తైః=అగ్రకమ్పైః విదర్భేన్ద్రపురీపతాకాః - విదర్భాణామిన్ద్రః=విదర్భేన్ద్రః, విదర్భేన్ద్రస్య పురీ=విదర్భేన్ద్రపురీ, విదర్భేన్ద్రపుర్యాం పతాకాః=విదర్భేన్ద్రపురీపతాకాః

**భావము :**

విదర్భనగర మందలి పెక్కెములు, క్రమముగా జనులను దాటి ముందుకుఁ బోవుటకు శక్తి లేనందువలన జాగు చేయుచున్న రాజులకు తమ యగ్రభాగముల కదలికలచే పిలుపునిచ్చుచున్నవో యనునట్లుండినవి ॥౭॥

శ్లో. **ప్రాగ్భూయ కర్కోటక ఆచకర్ష**
**సకమ్బలం నాగబలం యదుచ్చైః.**
**భువస్తలే కుణ్డినగామిరాజ్ఞాం**
**యద్వాసుకేశ్చాశ్వతరోఽన్వగచ్ఛత్.** **8**

ప॥వి॥ ప్రాగ్భూయ - కర్కః-అటకః-ఆచకర్ష-సకమ్బలం-నాగబలం-యత్-ఉచ్చైః-భువః-తలే కుణ్డినగామి రాజ్ఞాం - యత్-వాసుకేః-చ-అశ్వతరః-అన్వగచ్ఛత్-

అర్థము· భువః—భూమియొక్క, తలే=పైభాగమునందు, రాజ్ఞాం—రాజులను సంబంధించిన, సకమ్బలం=ప్రావారములఁబడు కంబళములతోఁ గూడిన,

ఉచ్చైః=గొప్పదైన, కుణ్డినగామి=కుణ్డిననగరమును(గూర్చి పోవుచున్న, యత్=ఏ, నాగబలం = ఏనుగులదండును(గూర్చి, అటకః=వేగముగా( బోయెడు, కర్కాః=తెల్లనిగుఱ్ఱములజాతి, ప్రాగ్భూయ=ముందుండి, ఆచకర్ష=ఆకర్షించినదో, అనగానడిపించినదో, సైన్యమునందు తొలుత గుఱ్ఱములు పిదప నేనుగులు నడచును. యత్-ఏ గజబలమును, అశ్వతరః=కంచరగాడిద, అన్వగచ్ఛత్=అనుసరించినదో, అనగా తొలుత శ్వేతాశ్వములు, తర్వాత గజములు, పిదప కంచరగాడిదలు సైన్యమున నడుచు నని ప్రసిద్ధి.

మరియొక అర్థము

ఘనః తలే=పాతాళమందు, కుణ్డినగామి=కుండిననగరమునకువెళ్లుచున్న, వాసుకేః=వాసుకి యను మహాసర్పమునకు సంబంధించిన, సకమ్బలం=కమ్బల మను సర్పరాజుతో( గూడిన, యత్=ఏ, ఉచ్చైః=గొప్పదైన, నాగబలం=సర్పసైన్యమును, కర్కోటకః=కర్కోటకు(డను సర్పము, ప్రాగ్భూయ=ముందునుండి, ఆచకర్ష=ఆకర్షించినదో, అనగా, నడిపించినదో, తత్=ఆ సర్పసైన్యమును, అశ్వతరః=అశ్వతరమను సర్పవిశేషము, అన్వగచ్ఛత్ = వెంబడించినది.

వి॥ ఇచ్చట గజబలము సర్పబలము అను నీ రెండు ప్రకృతములే గాన ప్రకృతశ్లేష-అనగా స్వయంవరమునకు భూమిపైన, నశ్వగజవేసరబలములతో రాజులు విచ్చేసిరి. అట్లే పాతాళమునుండి కంబలకర్కోటకాశ్వతరులతో వాసుకియు విచ్చేసెను. కాన నుభయము ప్రకృతము గాన ప్రకృతశ్లేష.

**సమాసములు :**

ప్రాగ్భూయ-ప్రాక్ భూత్వా=ప్రాగ్భూయ,
అటకః-అటతీతి=అటకః,

సకమ్బలం-కమ్బలేన సహ వర్తత ఇతి = సకమ్బలం. తత్= సకమ్బలమ్।

నాగబలం-నాగా ఇతి బలం = నాగబలం. తత్ = నాగబలమ్।

కుణ్డినగామి = కుణ్డినం గచ్ఛతీతి = కుణ్డినగామి.

**భావము :**

భూమిపైన కుణ్డినగరమునకు వెళ్లునదియు, రాజులకు సంబంధించి నదియు, ప్రాకారసహితము నగు గజబలమును, శీఘ్రముగా నడచెడు తెల్లని గుఱ్ఱములు నడిపించినవి. ఆ గజబలమును కంచరగాడిదలు వెంబడించినవి.

పాతాళమున వాసుకి యను సర్పరాజమునకు సంబంధించిన, కుణ్డినగర మునకు పోవు కమ్బల మను సర్పముతోఁ గూడిన గొప్ప సర్పసైన్యమును కర్కోటకుఁ డను సర్పరాజు ముందుండి నడిపించెను. ఆ సర్పసైన్యమును నశ్వ తర మనుసర్పము వెంబడించెను. భూలోకమునందు కుండిననగరమునకు పోవు రాజులకు సంబంధించిన గజసైన్యమును ముందు, శ్వేతాశ్వములు నడిపిం చినవి. కంచరగాడిదలు వెంబడించినవి. పాతాళమందు, వాసుకికి సంబంధించిన సర్పసైన్యమును కర్కోటకుఁడు నడిపించెను. అశ్వతరుఁడు వెంబడించె నని యాశయము. అనగా భూలోకమునుండి రాజులు తమయశ్వగజదళముతో విచ్చే సిరి. పాతాళమునుండి వాసుకి తన సర్పబలముతో విచ్చేసెను. ఇట్లు రెండు లోకములనుండియు రాజులు విచ్చేసి రని భావము ॥౮॥

**శ్లో. ఆగచ్ఛ దుర్వీన్ద్ర చమూసముత్థై**
**ర్భూరేణుభిః పాణ్డురితా ముఖశ్రీః.**
**విస్పష్టమాచష్ట దిశాం జనేషు**
**రూపం పతిత్యాగదశానురూపమ్. 9**

ప.వి. ఆగచ్ఛదుర్వీన్ద్రచమూసముత్థైః-భూరేణుభిః-పాణ్డురితా-ముఖశ్రీః-విస్ప ష్టమ్-ఆచష్ట-దిశాం-జనేషు-రూపం-పతిత్యాగదశానురూపమ్-

అర్థము. ఆగచ్ఛదుర్వీన్ద్ర చమూసముత్థైః; అగచ్ఛత్ = స్వయంవరమునకు విచ్చే యుచున్న, ఉర్వీన్ద్ర = రాజులయొక్క చమూః = సేననుండి, సముత్థైః =

పైకిలేచిన భూరేణుభిః=భూమిపైని ధూళులచే, పాణ్డురితా=ధూసరవర్ణముం బొందింపఁబడిన, దిశాం=దిక్కులయొక్క, ముఖశ్రీః=ముఖశోభ, పతిత్యాగదశానురూపమ్; పతిత్యాగ=భర్తను పీడుటచే ననగా భర్తప్రవాసము చేయుటచే, నేర్పడిన, దశా= అవస్థకు, అనురూపం=తగిన అనగా "ప్రోషితే మలినా కృశా" యని చెప్పఁబడిన, రూపం=రూపమును, జనేషు= జనుల విషయమునందు, ఆచష్ట=ప్రకటించినది.

వి॥ ఇచ్చట ప్రోషితభర్తృక యను నాయికయొక్క ధర్మము, దిక్కులకు సంభవించదు గాన, "రూప" మనగా ప్రోషితభర్తృకారూపము వంటి రూపమని సాదృశ్యము నాక్షేపించుటవలన, "అసంభవద్వస్తుసంబంధ మను" నిదర్శనాలఙ్కారభేదము.

కొన్ని దేశములలో "విస్పష్టమాచష్ట హరిద్వధూనాం రూపమ్ "అని పాఠాన్తర మున్నది. ఆ పాఠమునందు "హరిద్వధూనాం", అనగా దిక్కు లనెడి స్త్రీలయొక్క యనునర్థము, చెప్పుటవలన రూపకము.

**సమాసములు ;**

ఆగచ్ఛదుర్వీన్ద్రచమూసముత్థైః — ఆగచ్ఛన్తీతి=ఆగచ్ఛన్తః। ఉర్వ్యాః ఇన్ద్రాః=ఉర్వీన్ద్రాః, ఆగచ్ఛన్తశ్చ తే ఉర్వీన్ద్రాశ్చ=ఆగచ్ఛదుర్వీన్ద్రాః, ఆగచ్ఛదుర్వీన్ద్రాణాం చమూః=ఆగచ్ఛదుర్వీన్ద్రచమూః, ఆగచ్ఛదుర్వీన్ద్రచమ్వాః సముత్థాః=ఆగచ్ఛదుర్వీన్ద్రచమూసముత్థాః।

తైః = ఆగచ్ఛదుర్వీన్ద్రచమూసముత్థైః

భూరేణుభిః-భువః రేణవః=భూరేణవః, తైః=భూరేణుభిః।

పాణ్డురితా-పాణ్డురః అస్యాః సంజాత ఇతి పాణ్డురితా.

ముఖశ్రీః-ముఖస్య శ్రీః=ముఖశ్రీః।

పతిత్యాగదశానురూపమ్ - పత్యుః త్యాగః=పతిత్యాగః, పతిత్యాగ ఏవ దశా=పతిత్యాగదశా, పతిత్యాగదశాయాః అనురూపమ్=పతిత్యాగదశానురూపమ్, తత్=పతిత్యాగదశానురూపమ్.

**భావము :**

స్వయంవరమునకు విచ్చేయుచున్న భూపతులు సేనలనుంచి యుద్భవించిన దుమ్ముతో, దిక్కు లన్నియు ధూసరవర్ణమును బొందినవి. రాజులు దిక్పతులై యా యా దిక్కులయం దున్న దేశములనుఁ బరిపాలింతురు. కాన నారాజులందరు స్వయంవరమునకు రాగనే దిశాకాంతలు ప్రోషితభర్తృకల వలె "ప్రోషితే మలినా కృశా" అని చెప్పఁబడిన విధముగా, దుమ్ము పడిన ముఖశోభను వహించి పతివియోగదశకు తగిన రూపమును వహించి యుండినవి. పతివిరహకాలమున స్త్రీ లెట్టి యలఙ్కారములను నంగరాగములను నుపయోగింపక యుండవలయు ననుట సంప్రదాయము. ధర్మము. ఇఁట దిక్కాన్తలు గూడ తమ కాన్తు లైన రాజుల నెడఁబాసి నందువలన నా ధర్మమును పాటించుచున్నారు. ॥౯॥

శ్లో. ఆఖణ్డలో దణ్డధరః కృశానుః
పాశీతి నాథైః కకుభాం చతుర్భిః।
భైమ్యేవ వధ్వా స్వగుణేన కృష్టైః
యయే తదుద్వాహరసాన్న శేషైః. 10

ప.వి. ఆఖణ్డలః - దణ్డధరః - కృశానుః-పాశీ-ఇతి-నాథైః-కకుభాం-చతుర్భిః-భైమ్యా-ఇవ-వధ్వా-స్వగుణేన-కృష్టైః-యయే - తదుద్వాహరసాత్-న-శేషైః.

అర్థము. ఆఖణ్డలః=ఇన్ద్రుఁడు, దణ్డధరః=యముఁడు, కృశానుః=అగ్ని, పాశీ=వరుణుఁడు, అని ప్రసిద్ధు లగు, చతుర్భిః=నలుగురైన, కకుభాం=దిక్కులయొక్క, నాథైః=పాలకులచే, భైమ్యా=దమయన్తిచే, స్వగుణేన=తనసౌన్దర్యగుణమను త్రాటిచే, బద్ధ్వా=బంధింపఁబడి, కృష్టైరివ=లాగఁబడిరో యనునట్లు, తదుద్వాహరసాత్; తత్=ఆ దమయన్తియొక్క, ఉద్వాహ=వివాహమందలి,రసాత్=రాగమువలన, యయే=వెళ్లఁబడుట-శేషైః=మిగిలినటువంటి, నైరృతుడు మున్నగు వారిచే, నయయే=పోబడకయుండుట (జరిగెనది)

వి. స్వగుణేన - తనసౌందర్యాదిగుణ మను గుణముచే (త్రాటిచే)యని గుణ మను త్రాడుగా శ్లేషతో రూపించుటవలన శ్లిష్టరూపకము.
ఆ గుణ మను త్రాటితో దిక్పాలకులను బంధింపక పోయినను, "బద్ధ్వేవ" యని బంధించెనో యనునట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష.

**సమాసములు :**

దండధరః-దండం ధరతీతి=దణ్డధరః
పాశీ-పాశః అస్య అస్తీతి=పాశీ
భైమ్యాః-భీమస్య అపత్యం స్త్రీ==భైమీ. తయా=భైమ్యాః.
తదుద్వాహరసాత్-తస్యాః ఉద్వాహః=తదుద్వాహః, తదుద్వాహే రసః=తదుద్వాహరసః తస్మాత్=తదుద్వాహరసాత్ ॥౧౦॥

**భావము :**

ఆ దమయన్తి తన సౌందర్యాదిగుణమును గుణముతో ననగా త్రాటితో బంధించి లాగెనా యనునట్లు, దేవేంద్రుఁడు, యముఁడు, అగ్ని, వరుణుఁడు, అను నలుగురు దిక్పాలురు ఆమెయొక్క వివాహమునుఁ చింతించుటకై రాగముతో వచ్చేసిరి. తక్కిన నైరృతుడు మున్నగు నారుగురు దిక్పాలురు రాలేదు ॥౧౦॥

**శ్లో. మన్త్రైః పురం భీమపురోహితస్య**
**తద్బద్ధరక్షం విశతి క్వ రక్షః.**
**తత్రోద్యమం దిక్పతిరాతతాన**
**యాతుం తతో జాతు న యాతుధానః. 11**

ప.వి. మన్త్రైః-పురం - భీమపురోహితస్య-తత్-బద్ధరక్షం-విశతి-క్వ-రక్షః-తత్ర-ఉద్యమం-దిక్పతిః-ఆతతాన-యాతుం-తతః-జాతు-న-యాతుధానః-

అర్థము. భీమపురోహితస్య=భీమరాజు పురోహితునియొక్క, మన్త్రైః=మన్త్రములచే. అనగా రాక్షసులను సంహరించెడి రక్షోఘ్నమన్త్రములతో, బద్ధరక్షం=రక్షణము చేయఁబడిన, తత్=ఆ, పురం=కుణ్డినపురమును,

రక్షః = రాక్షసుఁడు, క్వాపి = ఎక్కడ, విశతి = ప్రవేశించును. తతః = రక్షాబంధముండుట వలననే, యాతుధానః = రాక్షసుఁడగు నైరృతుఁడను, దిక్పతిః = దిక్పాలకుఁడు, జాతు = ఒకప్పుడును, తత్ర — ఆ పట్టణమునందు, యాతుం = ప్రవేశించుటకు, ఉద్యమం = ప్రయత్నమును, నాతతాన = చేయలేదు.

**సమాసములు :**

భీమపురోహితస్య - భీమస్య పురోహితః = భీమపురోహితః; తస్య = భీమపురోహితస్య.

బద్ధరక్షం—బద్ధా రక్షా యస్య తత్ = బద్ధరక్షమ్ తత్ = బద్ధ రక్షమ్
దిక్పతిః- దిశః పతిః = దిక్పతిః-

**భావము :**

భీమరాజుయొక్క పురోహితుఁడు రాక్షసులను సంహరింపఁ గల రక్షోఘ్నమన్త్రములచే నా కుణ్డినసగరమునకు రక్షణను కల్పించి యుండుటవలన, దిక్పాలకుఁడైన నైరృతుఁ డను రాక్షసుఁడు దానిని బ్రవేశించుటకుఁ బ్రయత్నమునే చేయలేదు ॥ 11 ॥

**శ్లో. కర్తుం శశాకాభిముఖం న భైమ్యా**
**మృగం దృగమ్భోరుహనిర్జితం యత్**
**తస్యా వివాహాయ యయౌ విదర్భాన్**
**తద్వాహనస్తేన న గన్ధవాహః. 12**

ప.వి. కర్తుం — శశాక — అభిముఖం — న — భైమ్యాః — మృగం — దృగమ్భోరుహనిర్జితం — యత్ — తస్యాః — వివాహాయ — యయౌ- విదర్భాన్ — తద్వాహనః — తేన — న — గన్ధవాహః—

అర్థము. గన్ధవాహః = వాయువు, భైమ్యాః = దమయన్తి యొక్క, దృగమ్భోరుహనిర్జితం; దృగమ్భోరుహ = నయనార విన్దములచే, నిర్జితం = జయింపఁబడిన, మృగం = తన వాహనమైన మైన జింకను, అభి

ముఖం = ఎదుటనున్న దానినిగా, కర్తుం = చేయుటకు, నశశాక ఇతి = శక్తుఁడు కాలేదనుట యేది కలదో, తేన = ఆ యశక్తిచేతనే, తద్వాహనః = ఆ మృగమును వాహనముగా గలవాడై, తస్యాః = ఆమె యొక్క, వివాహాయ = వివాహముకొఱకు, విదర్భాన్ = విదర్భ దేశమునకు, న యయౌ = వెళ్లలేదు.

**సమాసములు :**

దృగమ్భోరుహనిర్జితం– దృశావేవ అమ్భోరుహే=దృగమ్భోరుహే, దృగమ్భోరుహాభ్యాం నిర్జితః=దృగమ్భోరుహ నిర్జితః,తమ్=దృగమ్భోరుహా నిర్జితమ్. తద్వాహనః, స్వః = వాహనం యస్య సః = తద్వాహనః

గన్ధవాహః :– గన్ధం వహతీతి = గన్ధవాహః

**భావము :**

వాయు వను దిక్పాలకుఁడు దమయన్తియొక్క నయన పద్మములచే నోడింపఁ బడిన తన వాహనమగు జింకను నామె యెదుట నుంచలేక పోయెను. అందువలననే యాతడు దమయన్తి వివాహమునకై విదర్భ దేశమునకువెళ్లలేదు. వాహనములేక యాతడు వెళ్లలేడు గదా! ॥౧౨॥

**శ్లో॥ జాతౌ న చిత్తే న గుణే న కామః**
**సౌన్దర్య ఏవ ప్రవణః న వామః.**
**స్వచ్ఛస్వశై లేక్షిత కుత్స బేరః**
**తాం ప్రత్యగాన్న స్త్రీ తరాం కుబేరః 13**

ప.వి. జాతౌ–న-చిత్తే-న-గుణే-న-కామః - సౌన్దర్యే- ఏవ-ప్రవణః-సః-వామః - స్వచ్ఛస్వశై లేక్షిత కుత్సబేర ః - తాం- ప్రత్యగాత్- న-స్త్రీతరాం-కుబేరః.

అర్థము: కామః కన్యయొక్క యభిలాష, జాతౌ=జాతియందును, ననగా నుత్తమ కులమందును, ప్రవణః= ఆసక్తమైనది, న=గాదు. విత్తే= ధనమందును, న ప్రవణః=ఆసక్తమైనదిగాదు. గుణే=శీలాది గుణముల

యందును, న ప్రవణః = ఆసక్తమైనదిగాదు. కిన్తు = మరే మనగా. సౌన్దర్య ఏవ = సౌందర్యమందే ప్రవణః = ఆసక్తమైనది. ఏలయనగా సః = ఆ కామము, (కాముఁడు) వామః = వక్రముఁ (సుందరుడు) కావుననే "కన్యా వరయతేరూపమ్" అని వచింతురు. తస్మాత్ = అందువలన, స్వచ్ఛ స్వశైలేక్షితకుత్సబేరః, స్వచ్ఛ = నిర్మలమైన, స్వ = తనదగు, శైల = పర్వతమైన కైలాసమందు, ఈక్షిత = చూడఁబడిన, కుత్స = ఏవగింపు గల్గిన, బేరః = శరీరముగల, కుబేరః = కుబేరుఁడు, స్త్రీతరాం = ఉత్కృష్ట స్త్రీయైన, తామ్ = ఆ దమయన్తినిఁ గూర్చి, న ప్రత్యగాత్ = వెళ్లలేదు.

## సమాసములు

స్వస్య శైలః = స్వశైలః, స్వచ్ఛశ్చాసౌ స్వశైలశ్చ = స్వచ్ఛస్వశైలః. స్వచ్ఛస్వశైలే ఈక్షితా = స్వచ్ఛస్వశైలేక్షితా, స్వచ్ఛస్వశైలేక్షితా కుత్సాయస్య తత్ = స్వచ్ఛస్వశైలేక్షితకుత్సం. స్వచ్ఛస్వశైలేక్షిత కుత్సం,బేరం యస్య సః = స్వచ్ఛస్వశైలేక్షిత కుత్సబేరః.

స్త్రీ తరాం- ఉత్కృష్టా స్త్రీ : = స్త్రీతరా, తామ్ = స్త్రీతరాం
కుబేరః-కుత్సితం బేరం యస్య సః కుబేరః

## భావము :

కన్యయొక్క కామము చాల వంకరయైనది.దానికి జాతియందుగాని ధనము నందుగాని, గుణమునందుగాని యాసక్తిలేదు. దానికి సౌన్దర్యమునందే యాసక్తి కావున, కుబేరుడు తనకు నెలవైన, యద్దమువలె స్వచ్ఛమైన కైలాసమున తన కురూపమైన శరీరమును చూచుకొనినవాడై త్రైలోక్య సుందరియగుదమయన్తినిఁ గూర్చి వెళ్లలేదు. ఈ కురూపిని యామె యిట్లు వలచును? కుబేరుని దేహము వ్యాధి వలన పొడలతో వికృత మవి ప్రసిద్ధి ॥౧౩॥

**శ్లో॥ భైమీ వివాహం సహతేఽస్య కస్మా**
**దర్థం తమర్ధ్యా గిరిజా స్వభర్తుః ॥**
**తేన వ్రజన్త్యా విదధే విదర్భా**
**నీళానయానాయ తయాన్తరాయః ॥ 14**

ప. వి. భైమీ వివాహం- సహతే- అస్య-కస్మాత్- అర్ధం- తనుః- యాం- గిరిజా- స్వభర్తుః-తేన-ప్రజన్త్యా- విదధే- విదర్భాన్ - ఈశానయానాయ-తయా- అన్తరాయః

అర్థము : గిరిజా=పార్వతి, స్వభర్తుః=తన భర్తయైన శివునకు, భైమీ వివాహం= దమయన్తితోటి వివాహమును; కస్మాత్= ఎందువలన సహతే= ఓర్చును? ఏలయనగాఁ, యా= ఎవ్వతె, భర్తుః= భర్తకు, అర్ధం= సగముపాలు, తనుః= శరీరమైనది (కాన-సహించదు) తేన= ఆయసహనము చేతనే, విదర్భాన్= విదర్భదేశములను, వ్రజన్త్యా= వెళ్ళుచున్న, తయా=ఆగిరిజచే, ఈశానయానాయ= శివుని ప్రయాణమునకై, అన్తరాయః= విఘ్నము, విదధే= చేయబడినది. సగము శరీరమైన పార్వతి కదలక పోయినచో మఱియొక సగమైన పరమశివుడెట్లు కదలునని యాశయము.

**సమాసములు :**

భైమీ వివాహమ్- భీమస్య అపత్యం స్త్రీ=భైమీ. భైమ్యాః వివాహః= భైమీ వివాహః. తం=భైమీ వివాహమ్.

గిరిజా:- గిరేః జాయత ఇతి=గిరిజా.

స్వభర్తు:=స్వస్యాః భర్తా = స్వభర్తా. తస్య స్వభర్తుః.

ఈశానయానాయ- ఈశానస్య యానమ్ = ఈశానయానమ్. తస్మై=. ఈశానయానాయ.

**భావము :**

పార్వతి పరమశివునకర్ధశరీరమగుటలన నామె,శివునకు దమయన్తితోడ వివాహము నెట్లు సహించును.? సహింపదు. ఆమె యర్ధశరీర మైనందువలననే, విదర్భదేశములను గూర్చి పరమేశ్వరుని ప్రయాణమునకు విఘ్నమునుఁ గల్పించినది. సగముశరీర మైన పార్వతి కదలు నప్పుడు మఱి యొక సగము శరీర మగు పరమశివుఁ డెట్లుకదలఁగలఁడు. ఒకవేళ బలవన్తముగాఁ

గపలినచో శరీరమే దెబ్బ తినును. లేదా కదలక యే పడి యుండును. అందు వలననే యీశానదిక్పాలుఁడు అనగా శివుఁడు స్వయంవరమునకు రాలేదు ॥౧౪॥

శ్లో॥ స్వయంవరం భీమనరేన్ద్రజాయాః
దిశః పతిర్న ప్రవివేశ శేషః।
ప్రయాతు భారం స నివేశ్య కస్మి
న్నహిర్మహీగౌరవ సాసహిః కః 15

ప.వి: స్వయంవరం-భీమనరేన్ద్రజాయాః-దిశః-పతిః- న - ప్రవివేశ - శేషః- ప్రయాతు-భారం-సః-నివేశ్య-కస్మిన్-అహిః-మహీగౌరవసాసహిః-కః-

అర్థము: దిశఃపతిః=దిక్కునకు ననగా పాతాలమునకుఁ బాలకుఁడైన, శేషః= శేషసర్పము, భీమనరేన్ద్రజాయాః=భీమరాజ పుత్రికయైన దమయన్తి యొక్క, స్వయంవరం=స్వయంవరమును, నప్రవివేశ=ప్రవేశించలేదు. (ఏలయనగా), సః=ఆశేషసర్పము, భారం=భూభారమును, కస్మిన్= ఎవ్వనియందు, నివేశ్య=ఉంచి, ప్రయాతు=పోవలయును? ఎవనియందు నుంచి పోఁజాలఁడు. తథాహి=అదియుక్తమే. మహీగౌరవసాసహిః, మహీగౌరవ= భూభారమును, సాసహిః=చక్కగాసహింపగల, అహిః= మఱి యొక సర్పము, కః=ఏది (ఏదియును లేదు)

**సమాసములు :**

స్వయంవరమ్- స్వయం వ్రియతే అస్మిన్నితి స్వయంవరః: తమ్= స్వయంవరమ్.

భీమనరేన్ద్రజాయాః- భీమ ఇతి నరేన్ద్రః = భీమనరేన్ద్రః. భీమనరేన్ద్రాత్ జాయత ఇతి= భీమనరేన్ద్రజా. తస్యాః=భీమనరేన్ద్రజాయాః।

మహీగౌరవ సా సహిః:- మహ్యాః గౌరవం=మహీగౌరవం. మహీగౌరవం భృశం సహత ఇతి=మహీగౌరవసాసహిః।

**భావము:**

దశదిశలలో పాతాళము గూడ నొక దిశ. దానికి పాలకుఁడై భూభారమును నెత్తియం దుంచుకొనిన యాదిశేషుడు దమయన్తీ వివాహమునకు రాజాలక పోయెను.ఏల యనగా అతడు వచ్చినచో, భూభారము నెవ్వనిపై మోపిరాఁ గలడు? అట్లే భూభారమును మోయ గల సర్పమెయ్యది? లేదుగదా! కావున శేషుఁడును స్వయంవరమునకు రాఁజాలకపోయెను ॥౧౫॥

**శ్లో॥ యయౌ విమృశ్యోర్ధ్వదిశః పతిర్న**
**స్వయంవరం వీక్షితధర్మశాస్త్రః।**
**వ్యలోకి లోకే శ్రుతిషు స్మృతౌ వా**
**సమం వివాహః క్వ, పితామహేన ॥ 16**

ప॥వి॥ యయౌ-విమృశ్య-ఊర్ధ్వదిశః-పతిః-స్వయంవరం- వీక్షితధర్మశాస్త్రః - వ్యలోకి-లోకే-శ్రుతిషు-స్మృతౌ-వా-సమం-వివాహః-క్వ-పితామహేన-

అర్థము: వీక్షితధర్మశాస్త్రః; వీక్షిత=పరిశీలింపఁబడిన, ధర్మశాస్త్రః = ధర్మశాస్త్రముగల, ఊర్ధ్వదిశః=ఊర్ధ్వదిక్కునకు, పతిః = పాలకుఁడైన బ్రహ్మ, విమృశ్య = అయుక్తమని నిశ్చయించియే, స్వయంవరం = స్వయంవరమునుఁగూర్చి, నయయౌ = వెళ్ళలేదు. తథాహి = అది యుక్తమే, పితామహేనసమం = బ్రహ్మతోఁడను (తండ్రికి తండ్రితోఁడను) వివాహః = వివాహము, లోకే = ప్రపంచమునందు, క్వ = ఎచ్చట, వ్యలోకి = చూడఁబడినది? శ్రుతిషువా = వేదములయందుగాని, స్మృతౌవా = స్మృతియందునుగాని, క్వ = ఎచ్చట, వ్యలోకి = చూఁడఁబడినది?

వి. ఊర్ధ్వదిక్పతి యైన బ్రహ్మ వివాహమునకు వెళ్లుట యయుక్త మని నిశ్చయించుకొని వెళ్లలేదను విశేషార్థమును, పితామహునితో వివాహము, లోక-శ్రుతి-స్మృతి విరుద్ధమను" సామాన్యార్థముచే సమర్థించుటవలన నర్థాన్తరన్యాసాలఙ్కారము.

"అసపిణ్డాం యవీయసీమ్" అని, సపిణ్డత్వము లేని చిన్నదానిని వివాహమాడవలయు నని ధర్మశాస్త్రమునుఁ బట్టి తండ్రి తండ్రి యగు పితామహుఁడు సపిణ్డుఁడు కాన వానితో వివాహము నిషిద్ధము.

**సమాసములు :**

ఊర్ధ్వదిశ : ఊర్ధ్వాచసాదిక్చ = ఊర్ధ్వదిక్. తస్యాః = ఊర్ధ్వదిశః

వీక్షిత ధర్మశాస్త్రః - ధర్మ ప్రతిపాదకం శాస్త్రం= ధర్మశాస్త్రం, వీక్షితం ధర్మశాస్త్రంయేన సః=వీక్షిత ధర్మశాస్త్రః.

పితామహేన- పితుః పితా పితామహః తేన=పితామహేన.

**భావము :**

ఊర్ధ్వదిక్కునకధిపతి యగు బ్రహ్మ ధర్మశాస్త్ర పరిశీలనఁ గావించి యయుక్తమని నిశ్చయించుకొని దమయన్తి వివాహమునకు వెళ్ళలేదు. ఏల యనగా బ్రహ్మ పితామహుఁడు అనగా. తండ్రికి,తండ్రి. లోకమునందు తండ్రికి తండ్రి సపిణ్డుడు, అనగా సమానదేహుడు- సమానగోత్రుడు, కాన నతనితోఁ బరిణయము తగదు గదా.కావున బ్రహ్మ వివాహమునకు వెళ్లుటను మానుకొనెను. ॥౧౬॥

**శ్లో॥ భైమీనిరస్తం సమవేత్య దూత్యా**
**ముఖాత్ కిలేన్ద్రప్రముఖాః దిగీశాః.**
**స్వన్దే ముఖేన్దౌ చ వితత్య మాన్ద్యం**
**చిత్తస్య తే రాజసమాజమీయుః. 17**

-ప.వి. భైమీనిరస్తం- సమవేత్య- దూత్యాః- ముఖాత్-కిల ఇన్ద్రప్రముఖాః- దిగీశాః- స్వన్దే-ముఖేన్దౌ- చ- వితత్య మాన్ద్యం-చిత్తస్య-తే- రాజసమాజమ్- ఈయుః.

**అర్థము:** ఇన్ద్రప్రముఖాః= ఇన్ద్రుఁడు మున్నగు నలుగురు దిగీశాః= దిక్పాలకులు, దూత్యాః=తాము పంపిన దూతిక యొక్క ముఖాత్= ముఖము నుండి, స్వమ్= తమను, భైమీనిరస్తం= దమయన్తిచే నిరసింపబడిన వారినిగ, అవేత్య=తెలుసుకొని, చిత్తస్య= మనస్సుయొక్క,

మాన్ద్యం= దుఃఖముచే నేర్పడిన జడత్వమును, స్పందే= తమ నడక యందును, ముఖేన్దౌ చ= ముఖచంద్రుని యందును, వితత్య=విస్తరింప జేసి (అనగా దుఃఖముచే మన్దగమనము, ముఖవైవర్ణ్యమును బొందిన వారై) రాజసమాజమ్=రాజసభను, ఈయుఃకిల=వెళ్ళిరిగదా.

## సమాసములు

భైమీనిరస్తమ్- భీమస్య అపత్యం స్త్రీ= భైమీ, భైమ్యా నిరస్తః= భైమీనిరస్తః. తమ్= భైమీ నిరస్తమ్.

ఇన్ద్రప్రముఖాః-ఇన్ద్రః ప్రముఖః యేషాం తే= ఇన్ద్రప్రముఖాః.

దిగీశాః- దిశామీశాః = దిగీశాః

ముఖేన్దౌ- ముఖమిన్దురివ= ముఖేన్దుః, తస్మిన్ ముఖేన్దౌ.

రాజ సమాజమ్-రాజ్ఞాం సమాజః—రాజసమాజః, తమ్=రాజసమాజమ్.

## భావము

తర్వాత నిన్ద్రాది దిక్పాలురు నలుగురును, తమ్ము దమయన్తి తిరస్కరించిన విషయమును, తాము పంపిన దూతికవలనఁ దెలిసికొని విషాదము నొందిరి. ఆ విషాదము వలనఁ గల్గిన మాన్ద్యమును తమ నడకయందును, తమ మోమునందును కనఁబఱచుచు రాజసభకు వెళ్ళిరి. ॥౧౭॥

**శ్లో॥ నలభ్రమేణాఽపి భజేత భైమీ**
**కదాచిదస్మానితి శేషితాశా.**
**అభూన్మహేన్ద్రాదిచతుష్టయీ సా**
**చతుర్నలీ కాచిదలీకరూపా. 18**

ప.వి. నలభ్రమేణ- అపి- భజేత- భైమీ- కదాచిత్- అస్మాన్- ఇతి- శేషితాశా- అభూత్- మహేన్ద్రాదిచతుష్టయీ-సా-చతుర్నలీ- కాచిత్- అలీకరూపా.

అర్థము: (అథ =రాజసభను పొందిన పిదప)సా=ఆ,మహేంన్ద్రాది చతుష్టయీ= మహేన్ద్రాగ్నియమ వరుణుల చతుష్టయము, భైమీ=దమయన్తి, కదా

చిత్=ఒకప్పుడు, నలభ్రమేణాపి=నలుడనుభ్రమచేతనైనను,అస్మాన్=మనలను, భజేత, వరించును. ఇతి=అని, శేషితాశా= మిగిలిన ఆశగలదై,అలీకరూపా=అసత్యరూపమైన,అనగా కృత్రిమ రూపమైన,కావుననే, కాచిత్= అనిర్వాచ్యమైన,చతుర్నలీ=నలచతుష్టయముగా,అభూత్=ఆయెను.

**సమాసములు :**

నలభ్రమేణ : నల ఇతి భ్రమః= నలభ్రమః. తేన= నలభ్రమేణ.

శేషితాశా- శేషితా ఆశా యస్యాస్సా=శేషితాశా.

మహేన్ద్రాదిచతుష్టయీ- చత్వారః అవయవాః యస్యాస్సా=చతుష్టయీ. మహేన్ద్రః ఆదిః యేషాంతే,మహేన్ద్రాదయః,మహేన్ద్రాదీనాం చతుష్టయీ = మహేన్ద్రాదిచతుష్టయీ.

చతుర్నలీ: చతుర్ణాం నలానాం సమాహారః = చతుర్నలీ.

అలీకరూపా-అలీకం రూపం యస్యాస్సా = అలీకరూపా.

**భావము :**

ఉపాయాన్తరము లన్నియు విఫలములు కాగానే,యిన్ద్రాదులు దమయన్తిని వంచించి గ్రహింప నుద్యమించిరి. ఆ దమయన్తి నలుఁడను భ్రాన్తితో నైనను మనలను నొకప్పుడు వరింపవచ్చు నను నాశతో వారు నలుగురు నసత్యరూపులైన నలుగురు నలులుగా మారిపోయిరి. అనగా నా నలుగురు నలుని రూపము ధరియించిరి.

॥౧౮॥

శ్లో॥ ప్రయస్యతాం తద్భవితుం సురాణాం
దృష్టేన పృష్టేన పరస్పరేణ
తద్వైతసిద్ధిర్న బతానుమేనే
స్వాభావికాత్ కృత్రిమమన్యదేవ. 19

ప.వి. ప్రయస్యతాం- తద్భవితుం-సురాణాం- దృష్టేన పృష్టేన -పరస్ప

రేణ-తద్ద్వైతసిద్ధిః- న-బత-అనుమేనే- స్వాభావికాత్- కృత్రిమమ్-
అన్యత్-ఏవ.

అర్థము: తద్భవితుం= నలులు కాని వారు నలులుగా నగుటకు, ప్రయస్యతాం= ప్రయత్నించుచున్న, సురాణాం = ఇన్ద్రాదిదేవతలకు, తద్ద్వైత సిద్ధిః- తత్= ఆ నలుని యొక్క, ద్వైత= ద్వితీయత్వముయొక్క, సిద్ధిః=సిద్ధి, దృష్టేన=చూడఁబడిన, పృష్టేన=ప్రశ్నింపఁబడిన, పర స్పరేణ= ఒండొరులచే, నాను మేనే=అనుమతింపఁబడలేదు. బత= అయ్యో! (ఏలయనగా) స్వాభావికాత్=స్వభావసిద్ధమైనదానికంటె, కృత్రిమం=కాల్పనికమైనది, అన్యదేవ = మఱియొక్కటియేయగును.

వి. ఇచ్చట స్వాభావిక మైన దానికంటెను, కృత్రిమమైనది భిన్నమే అను సామాన్యముచే యథార్థనలుని కంటె కృత్రిమ నలులు భిన్నులే యను విశేషార్థము సమర్థితము గాన నర్థాన్తరన్యాసాల ఙ్కారము.

**సమాసములు :**

తద్భవితుమ్:- అసః సః భవితుం= తద్భవితుం.
పరస్పరేణ:- పరేణ పరేణ వ్యతిహారః=పరస్పరః. తేన = పరస్పరేణ.
తద్ద్వైతసిద్ధిః:-ద్వయోర్భావః =ద్వితా,ద్వితైవ=ద్వైతం, తస్యద్వైతం= తద్ద్వైతమ్,తద్ద్వైతస్య సిద్ధిః=తద్ద్వైతసిద్ధిః.
స్వాభావికాత్ స్వభావేన సిద్ధమ్=స్వాభావికం. తస్మాత్=స్వాభావికాత్.
కృత్రిమమ్- క్రియయా నిర్వృత్తమ్=కృత్రిమమ్.

**భావము :**

నలులుగా నగుటకుఁ బ్రయత్నించు చున్న దేవతలకు ద్వితీయ నలత్వసిద్ధి వారు చూచుకొనినను, వారు ప్రశ్నించుకొనినను నంగీకరింపఁదగి యుండలేదు. లోకమున, స్వాభావికమునకంటె కృత్రిమమైనది భిన్నమే. కాన నిచ్చట నలులుగా నగుటకుఁ బ్రయత్నించిన యింద్రాదిదేవతలు కృత్రిము లగుటవలన స్వాభావికనలునితో సామ్యమును వహింపలేకపోయిరి. ॥౧౮॥

శ్లో॥ పూర్ణేన్దుమాస్యం విదధుః పునస్తే
పునర్ముఖీచక్రురనిద్రమబ్జమ్।
స్వవక్త్రమాదర్శతలేఽథ దర్శం
దర్శం బభఞ్జుర్న తథాతి మఞ్జు ॥ 20

ప.వి. పూర్ణేన్దుమ్-ఆస్యం - విదధుః-పునః-తే-పునః-ముఖీచక్రుః- అనిద్రమ్-అబ్జమ్-స్వవక్త్రమ్-ఆదర్శతలే-అథ-దర్శందర్శం- బభఞ్జుః-న-తథా-అతిమఞ్జు.

అర్థము: తేపునః = ఆ యిన్ద్రాదిదేవతలో, పూర్ణేన్దుం = పూర్ణచన్ద్రునే, ఆస్యం = ముఖముగా, విదధుః = చేసిరి. తథాపునః = అట్లే, మఱల, అనిద్రం = వికసించిన, అబ్జం = పద్మమును, ముఖీచక్రుః = ముఖముగాఁ గావించిరి. నలుని ముఖముతో సామ్యము వచ్చుటకై యొక తడవ చన్ద్రుని, నొక తడవ పద్మమును ముఖముగాఁ జేసుకొని రని యర్థము. అథ = పిదప, స్వవక్త్రం = తమముఖమును, ఆదర్శతలే = అద్దమునందు, దర్శం దర్శం = పలుమాఱుచూచి, తథా = నలునిముఖమువలె, అతిమఞ్జు = మిక్కిలి మనోహరము, న ఇతి = ఉండలేదని బభఞ్జుః = పగులఁగొట్టిరి, అనగా నిందించిరి.

వి. ఇచ్చట పూర్ణచన్ద్రుడు మున్నగు కారణము లున్నను నలరూపసిద్ధి యను కార్య ముద్భవించ నందువలన విశేషోక్త్య లఙ్కారము.

**సమాసములు :**

పూర్ణేన్దుమ్-పూర్ణశ్చాసౌ ఇందుశ్చ = పూర్ణేన్దుః. తమ్ = పూర్ణేన్దుమ్.
ముఖీచక్రుః- అముఖం ముఖం సమ్పద్యమానం చక్రుః = ముఖీచక్రుః.
అనిద్రమ్- అవిద్యమానా నిద్రా యస్య తత్ = అనిద్రమ్.
స్వవక్త్రమ్- స్వస్య వక్త్రమ్ = స్వవక్త్రమ్. తత్ = స్వవక్త్రమ్
ఆదర్శతలే-ఆదర్శస్య తలమ్ = ఆదర్శతలమ్. తస్మిన్ = ఆదర్శతలే
అతిమఞ్జ- అత్యన్తం మఞ్జు = అతిమఞ్జు,

**భావము :**

ఆ యిన్ద్రాదిదేవతలు నలుని సామ్యమునుఁ బొందుటకు నొక తడవ పూర్ణచంద్రుని ముఖముగాఁ జేసికొనిరి. అది సరిగా కానరానందువలన పద్మమును ముఖముగాఁ జేసికొనిరి. ఈ విధముగా చన్ద్ర పద్మములను ముఖముగాఁ జేసికొనిన పిదప వారు, అద్దము నందు తమ ముఖములను మాటిమాటికిఁ జూచుకొనిరి. కాని నలుని ముఖము వలె నీముఖములు మిక్కిలి రమ్యములుగా లేనందు వలన, వారు అద్దములను పగులఁగొట్టిరి. అనగా నిందించికొనిరని యాశయము. ॥౨౦॥

శ్లో॥ **తేషాం తథా లబ్ధుమనీశ్వరాణాం**
**శ్రియం నిజాస్యేన నలాననస్య ।**
**నాలం తరీతుం పునరుక్తిదోషం**
**బర్హిర్ముఖానామనలాననత్వమ్ ॥** **21**

ప. వి తేషాం— తథా- లబ్ధుమ్- అనీశ్వరాణాం-శ్రియం- నిజాస్యేన- నలాననస్య-న- అలం- తరీతుం- పునరుక్తిదోషమ్- బర్హిర్ముఖానామ్—అనలాననత్వమ్-

అర్థము: తథా = ఆప్రకారము, నిజాస్యేన = తమ ముఖముతో, నలాననస్య = నలుని మోముయొక్క, శ్రియం = శోభను, లబ్ధుం = పొందుటకు, అనీశ్వరాణాం = అసమర్థులైన, బర్హిర్ముఖానాం = అగ్నిముఖు లగు దేవతలకు సంబంధించిన, అనలాననత్వమ్ = అగ్నిముఖత్వము, నలుని ముఖము వంటి ముఖము లేకుండుట యను, పునరుక్తిదోషం = పునరుక్తి దోషమును, అనగా, "అగ్నిముఖా వై దేవాః" యను శ్రుతి ననుసరించి దేవతల కగ్ని ముఖత్వ ముండగా ప్రకృతము మరల వహ్నిముఖత్వమునుఁ జెప్పుట యొక పునరుక్తి. పూర్వము నలరూపప్రాప్తి లేనందువలన, నలుని ముఖముతో తుల్యమైన ముఖము లేకపోయినను, అసత్యపు నలులుగా నేర్పడి చంద్రపద్మములతో నలునికి సదృశ మైన ముఖమును పొందలేకపోయినందువలన మళ్లు, అనలాననత్వ మను పున

రు_క్తి అను నీ దోషములను తరీతుం = తరించుటకు నాలం = సమర్థము కాలేదు.

వి. నలముఖశోభను పొందగోరిన యిన్ద్రాదులకు నది లభింపక పోవుటయే గాక, పరిహరింప సాధ్యము కాని పునరు_క్తి దోషము గూడ వాటిల్లి నది గాన విషమాల జ్కారము

**సమాసములు :**

అనీశ్వరాణాం-న ఈశ్వరాః=అనీశ్వరాః = తేషామ్= అనీశ్వరాణామ్.

నిజాస్యేన- నిజం చతత్ ఆస్యం చ = నిజాస్యం. తేన= నిజ స్యేన.

నలాననస్య- నలస్య ఆననమ్ = నలాననమ్. తస్య=నలాననస్య.

పునరు_క్తి దోషమ్- పునః ఉ_క్తిః = పునరు_క్తిః. పునరు_క్తిరితి దోషః= పునరు_క్తి దోషః. తమ్ = పునరు_క్తి దోషమ్.

బ_ర్హిర్ముఖానామ్- బ_ర్హిః ముఖంయేషాం తే బ_ర్హి ర్ముఖాః. తేషాం = బ_ర్హిర్ముఖానామ్.

అనలాననత్వమ్- నలస్య ఆననమ్=నలాననమ్. అవిద్యమానం నలాననం యేషా_న్తే=అనలానా ననాః. అనలాననాం భావః = అనలాననత్వమ్, తత్ =అనలాననత్వమ్.

పక్షా_న్తరమున- అనలః ఆననం యేషాం తే=అనలాననాః.అనలాననాం భావః=అనలాననత్వం. తత్=అనలాననత్వమ్.

**భావము :**

ఇన్ద్రాదిదేవతలు తమ ముఖమునకు, నలుని ముఖశోభను పొందించుటకు సమర్థులు కాకపోవుటయే గాక, అగ్నిముఖావై దేవాః యను శ్రుతి ననుసరించి తమకున్న యగ్నిముఖత్వముతోఁ బాటు నలముఖశ్రీని పొందనందువలన, అనలా ననత్వము వారికి సంప్రాప్తించుటచే మరి యొక అనలాననత్వము అనగా అగ్ని ముఖత్వము వచ్చినది. అందువలన పునరు_క్తి దోషమును వారు సంపాదించు కొన్నుట యను నిష్ఠాప్రాప్తి యేర్పడినది. కాని వారు నలముఖశోభనుఁ బొంద

జాలకపోయిరి. అనలాననత్వములు రెండును పరస్పర భిన్నములైనను శ్లిష్ట పదముచే నవి చెప్పఁబడుటవలన వానికి రెంటికి నభేదాభిమానముతో నీ కల్పన చేయఁబడినది. ॥౨౧॥

శ్లో. ప్రియావియోగవ్యథితాత్ కిమైలా
చ్చన్ద్రాద్గృహీతైర్గ్రహపీడితాత్తే।
ధ్మాతాద్భవేన స్మరతోఽపి సారైః
స్వం కల్పయన్తి స్మ నలానుకల్పమ్ ॥ 22

ప.వి. ప్రియావియోగవ్యథితాత్- కిమ్-ఐలాత్- చన్ద్రాత్- గృహీతైః- గ్రహపీడితాత్-తే- ధ్మాతాత్-భవేన-స్మరతః-అపి-సారైః- స్వం-కల్పయన్తి -స్మ-నలానుకల్పమ్.

అర్థము: తే= ఆ యిన్ద్రాదిదేవతలు, ప్రియావియోగ వ్యథితాత్; ప్రియా = ప్రియురాలగునూర్వశియొక్క, వియోగ = విరహముచే, వ్యథితాత్ = దహింపంబడిన, ఐలాత్=ఇలాపుత్రుడైన పురూరవునుండియు (అగ్ని యందుడికించినిర్మించిన కర్పూరము మున్నగు వస్తువులనుండి యెట్లో అట్లు) గ్రహపీడితాత్=రాహు గ్రహముచే పీడింపబడిన, చన్ద్రాత్ =చన్ద్రుని నుండిఁ గానుగలోవేసి నలుపఁబడిననువ్వులు, ఆవాలు మున్నగు వాని నుండి యెట్లో అట్లు) భవేన = శివునిచే, ధ్మాతాత్=నిప్పుతో రగిలింపఁ బడిన. స్మరతోఽపి=మన్మథుని నుండియు, (నిప్పుపెట్టి నోటితో నూదబడిన చంద్రడ మున్నగు కట్టెలనుండి యెట్లో అట్లు) గృహీతైః=గ్రహింపబడిన, సారైః = సారములైన సాధనములతో, స్వం=తమ్ములను, నలానుకల్పమ్ = నలునికి సమానముగా, కల్పయన్తి స్మకిం=నిర్మించుకొను చుండిరాయేమి?

వి. ఇచ్చట పురూరవునుండియు చంద్రునుండియు, మన్మథునుండియు గ్రహించిన సారములచే నిన్ద్రాదులు తమ్ము నలునితో సమానముగా నిర్మించుకొనక పోయినను నిర్మించుకొను నట్లుచెప్పుటవ లన నుత్ప్రేక్ష.

**సమాసములు :**

ఐలాత్-ఇలాయాః అపత్యం పుమాన్ = ఐలః. తస్మాత్ = ఐలాత్.

ప్రియావియోగవ్యథితాత్-ప్రియాయాః వియోగః = ప్రియావియోగః. ప్రియావియోగేన వ్యథితః = ప్రియావియోగవ్యథితః. తస్మాత్ = ప్రియావియోగవ్యథితాత్.

గ్రహపీడితాత్- గ్రహేణ పీడితః = గ్రహపీడితః. తస్మాత్ = గ్రహపీడితాత్.

నలానుకల్పం-నలస్య అనుకల్పః=నలానుకల్పః. తమ్=నలానుకల్పమ్.

**భావము :**

ఆ యిన్ద్రాదిదేవతలు తమ్ము నలునితో సమానముగఁ జేసికొనుటకు నూర్వశీ విరహాగ్నిచే నుడికింపఁబడిన పురూరవునుండియు, రాహువుచేఁ బట్టుపడి గానుగలో నువ్వులు మున్నగువానివలె పీడింపంబడిన చంద్రుని నుండియు, నిప్పులు పైచి రగల్చఁబడిన చంద్ర మున్నగు కట్టెల వలె మండు శివుని మూడవ కంటి యగ్నిచే మండింపఁబడిన మన్మథు నుండియు, సారములను గ్రహించి, దానితో తమ శరీరములను నలునితో సమానముగ నుండునట్లు కల్పించుకొనుచుండిరి. నలుఁడు ప్రియురాలి వియోగాగ్నిచే నుడికింపఁబడిన పురూరవుని కంటెను, రాహుగ్రహముచే పీడింపబడిన చంద్రుని కంటెను, శివునిచేఁగాల్చబడిన మన్మథుని కంటెను నెక్కువ సౌన్దర్యము గలవాడని సూచితము. లోకమున నగ్నిదాహముచేతను, పీడనాదులచేతను సారములు గ్రహింపఁబడును. అట్లే యిచ్చట వియోగాగ్ని మున్నగువానిచే పురూరవాదుల సారములు తీయఁబడిన వని భావము. పురూరవుడు ఊర్వశిని ప్రేమించి యామె యొక్క విరహముచే బాధపడుట, చన్ద్రుని గ్రహణ కాలమందు రాహువు పీడించుట మన్మథుని శివుడు తన మూడవకంటి యందలి యగ్నిచే దహించుట పురాణ ప్రసిద్ధములు. ॥౨౨॥

శ్లో, నలస్య పశ్యత్స్వయదన్తరం తై

ర్వైభమీతి భూపాన్ విధిరాహ్వృతాన్యై॥

**స్పర్ధాం దిగీశానపి కారయిత్వా**
**తస్యైవ తేభ్యః ప్రథిమానమాఖ్యత్ 23**

ప. వి. నలస్య- పశ్యతు- ఇయత్-అన్తరం- తైః భైమీ- ఇతి=భూపాన్-విధిః-ఆహృత- అస్యై- స్పర్ధాం దిగీశాన్-అపి- కారయిత్వా- తస్య-ఏవ- తేభ్యః- ప్రథిమానమ్- ఆఖ్యత్.

అర్థము: విధిః = బ్రహ్మ, నలస్య = నలునకు, తైః= ఆ రాజులతో, ఇయత్=ఇంతటి,అన్తరం = తారతమ్యమును, భైమీ = దమయన్తి, పశ్యతు=చూడవలయును, ఇతి= ఈ కారణము వలన, భూపాన్= ఈ రాజులను, ఆహృత = కొనితెచ్చెను. కిఞ్చ=మఱియు, దిగీశానపి= దిక్పాలకుల గూర్చి, స్పర్ధాం = తగవును, కారయిత్వా = కల్పించి, తస్యైవ = ఆ నలునికే, తేభ్యః = ఇన్ద్రాదులకంటెను, ప్రథిమానం = ఆధిక్యమును, అస్యై=ఈ దమయన్తికి, ఆఖ్యత్=వెల్లడిగావించెను.

వి. బ్రహ్మ నలుని సౌన్దర్యము ముల్లోకములను మించిన దని దమయన్తికిఁ దెలియుట కొఱకే, స్వయంవర మను నెపముచే మూఁడులోకములను నొక్క చోట జేర్చెనా యని యుత్ప్రేక్ష. ఇది గమ్యము.

**సమాసములు :**

భైమీ- భీమస్య అపత్యం స్త్రీ=భైమీ.
దిగీశాన్- దిశామీశాః = దిగీశాః. తాన్=దిగీశాన్.

**భావము :**

బ్రహ్మ దేవుడు; నలునకును రాజులకును, మధ్య తారతమ్యమును దమయన్తి చూడవలయునని రాజుల నొకచోటఁ జేర్చెను. అట్లే దిక్పాలకులను స్పర్థనేర్పరచి, వారికంటెను నలునికున్న యాధిక్యమును దమయన్తికిఁ గన్పఱచెను. నలుని సౌన్దర్యము ముల్లోకములను మించిన దని దమయన్తి గ్రహించుట కొఱకే, స్వయంవర మను నెపముచే, మూడు లోకములలోని ప్రజల నొక చోటి కాకర్షించెను. ॥౨౩॥

**శ్లో॥ సభా నలశ్రీయమకైర్యమాద్యై**
**ర్నలం వినాఽభూద్ధృత దివ్యరత్నైః ।**
**భామాఙ్గణ ప్రాఘుణికే చతుర్భి**
**ర్దేవద్రుమైర్ద్యౌరివ పారిజాతే॥ 24**

ప.వి. సభా-నలశ్రీయమకైః- యమాద్యైః-నలం - వినా-అభూత్-ధృతదివ్య రత్నైః- భామాఙ్గణ ప్రాఘుణికే- చతుర్భిః- దేవద్రుమైః- ద్యౌః-ఇవ- పారిజాతే-

అర్థము: సభా=ఆ రాజసభ, నలశ్రీయమకైః- నలశ్రీ=నలుని సౌన్దర్యమునకు, యమకైః=పునరుక్తి గలవారైన, అనగా నలుని రూపమును ధరించిన, ధృతదివ్యరత్నైః- ధృత = ధరింపబడిన, దివ్యరత్నైః=దివ్యరత్నములు కల, నలంవినా = నలుని వదలిన చతుర్భిః=నలుగురైన యిన్ద్రాదులచే, (కావుననే) పారిజాతే=పారిజాత వృక్షము, భామాఙ్గణ ప్రాఘుణికే సతి భామా = సత్యభామ యొక్క, అఙ్గణ=ముంగిట, ప్రాఘుణికేసతి = అతిథికాగా, ధృతదివ్యరత్నైః=మూలమునుండి కొనవరకును ధరింప బడిన దివ్యరత్నములుగల, చతుర్భిః=నాలుగైన, దేవద్రుమైః = దేవతా వృక్షములైన,అనగా పారిపాతము పోగా మిగిలిన మన్దార-సన్తాన-కల్ప వృక్ష-హరిచన్దనము లను దేవతా వృక్షములచే, ద్యౌరివ = స్వర్గమువలె, అభూత్ = ఆయెను.

**సమాసములు :-**

నలశ్రీయమకైః- నలస్య శ్రీః=నలశ్రీః. నలశ్రియాః యమకాః=నలశ్రీ యమకాః. తైః = నలశ్రీ యమకైః.

ధృతదివ్యరత్నైః-దివ్యాని చ తాని రత్నాని చ=దివ్యరత్నాని. ధృతాని దివ్యరత్నాని యైస్తే = ధృతదివ్యరత్నాః. తైః. ధృతదివ్యరత్నైః.

భామాఙ్గణప్రాఘుణికే; భామాయాః అఙ్గణం = భామాఙ్గణం. భామాఙ్గణస్య ప్రాఘుణికః = భామాఙ్గణప్రాఘుణికః. తస్మిన్=భామాఙ్గణప్రాఘుణికే.

దేవద్రుమైః :- దేవానాం ద్రుమాః = దేవద్రుమాః, తైః = దేవద్రుమైః.

**భావము :**

మన్దారము, పారిజాతము, సన్తానము, కల్పవృక్షము, హరిచన్దన మని దేవతావృక్షములు నాలుగు. అందు పారిజాతము సత్యభామకడకు పోగా నిక స్వర్గమున నాలుగు దేవతావృక్షములే యున్నవి. వీనిలో పారిజాతము శ్రేష్ఠము. అది లేక, దివ్యాభరణములతో నలంకృతము లైన తక్కిన నాలుగు వృక్షములతో స్వర్గ మెట్లు శోభించలేదో, అట్లే నలుని వదలి పెట్టి, నలుని రూపమును ధరించిన దివ్యాభరణభూషితులైన యా నలుగురు దిక్పాలురచే నా రాజసభ గూడ శోభించలేదు. ॥౨౪॥

**శ్లో. తత్రాగమ ద్వాసుకి రీశభూషా**
**భస్మోపలేపస్ఫుట గౌరదేహః।**
**ఫణీన్ద్రవృన్ద ప్రణిగద్యమాన**
**ప్రసీదజీవాద్యనుజీవివాదః॥ 25**

ప.వి. తత్ర - ఆగమత్ - వాసుకిః - ఈశభూషా - భస్మోపలేపస్ఫుట గౌరదేహః - ఫణీన్ద్ర వృన్దప్రణి గద్యమాన ప్రసీద జీవాద్యనుజీవివాదః.

అర్థము: ఈశభూషా - ఈశ = శివునికి, భూషా = యోగపట్టగా నుండి యాతనికి నాభరణమైనవాఁడై, భస్మోపలేపస్ఫుట గౌరదేహః = భస్మ = శివుని మైపూత యగు బూడిదయొక్క, ఉపలేప = స్పర్శచే, స్ఫుట = చక్కగా, గౌరదేహః = తెల్లఁబడిన దేహముగలవాఁడై, ఫణీన్ద్ర వృన్దప్రణిగద్యమాన ప్రసీద జీవాద్యను జీవివాదః - ఫణీన్ద్ర వృన్ద = సర్పరాజ సమూహములచే, ప్రణిగద్యమాన = పలుకఁబడుచున్న, ప్రసీదజీవాది = ప్రసీద = ప్రసన్నుఁడవుకమ్ము, జీవ = జీవింపుము, ఆది = మున్నగు, అనుజీవి = భృత్యుల యొక్క, వాదః = వాదము అనగా కోలాహలము గల, వాసుకిః = వాసుకి, తత్ర = అ స్వయంవరమందు, ఆగమత్ = వచ్చెను.

**సమాసములు :**

ఈశభూషా :- ఈశస్య భూషా = ఈశభూషా.

భస్మోపలేహస్ఫుటగౌరదేహః :- భస్మనః ఉపలేహః భస్మోపలేహః. స్ఫుటం చ తత్ గౌరం. చ=స్ఫుటగౌరం. భస్మోపలేహేన స్ఫుటగౌరం= భస్మోపలేహస్ఫుటగౌరం. భస్మోపలేహస్ఫుటగౌరం దేహం యస్య సః= భస్మోపలేహస్ఫుటగౌరదేహః.

ఫణీన్ద్రవృన్దప్రణిగద్యమాన ప్రసీద జీవాద్యనుజీవివాదః :-ఫణినామిన్ద్రాః =ఫణీన్ద్రాః., ఫణీన్ద్రాణాం వృన్దః = ఫణీన్ద్రవృన్దః. ఫణీన్ద్రవృన్దేన ప్రణిగద్యమానః = ఫణీన్ద్ర వృన్దప్రణిగద్యమానః. అనుజీవినాం వాదః=అనుజీవివాదః. ఫణీన్ద్రవృన్దప్రణిగద్యమానః ప్రసీద జీవాదిః అను జీవివాదః యస్య=ఫణీన్ద్రవృన్ద ప్రణిగద్యమాన ప్రసీద జీవాద్యను జీవివాదః.

**భావము :**

ఆ స్వయంవర సభకు సర్పరాజగు వాసుకి విచ్చేసెను. పరమశివుడు ఆతని శరీరమును యోగపట్టగా నుపయోగించుటవలన నీతడు భూషణముగాను వెలియుచు పరమశివుని శరీరమందలి భస్మము తగులుటచే, తెల్లఁబడినశరీరము కలవా డాయెను. అతడు సభకు విచ్చేయు నపుడు, సర్పేన్ద్ర సంఘములు, ప్రసీద, జీవ, జయ, మున్నగు రాజలాఞ్ఛనపు శబ్దములను పలుకుచుండినవి. ఇట్టి వాసుకి సభాప్రవేశమునుఁ గావించెను. ॥౨౫॥

**శ్లో. ద్వీపాన్తరేభ్యః పుటభేదనం తత్**
**క్షణాదవాపే సురభూమిపాలైః।**
**తత్కాల మాలమ్బి న కేన యూనా**
**స్మరేషుపక్షానిరతూలలీలా॥ 26**

ప.వి: ద్వీపాన్తరేభ్యః- పుటభేదనం– తత్- క్షణాత్– అవాపే- సురభూమిపాలైః- తత్కాలమ్- ఆలమ్బి – న - కేన యూనా - స్మరేషుపక్షానిల తూలలీలా.

అర్థము: తత్=ఆ, పుటభేదనం=పట్టణమునుఁ గూర్చి అన్గా [illegible] పుర మునుఁ గూర్చి, ద్వీపాన్తరేభ్యః=ఇతర ద్వీపములనుండి, సురభూమిపాలైః=

దేవతల చేతను, రాజులచేతను లేదా సురభూమిని పాలించెడివారిచే, క్షణాత్ = క్షణమున, అవాపే = పొందఁబడుట. దేవతలు భోగదేహమును ధరింతురు. ద్వీపాన్తరములు భోగభూములు. కాన వానిని సురభూమి యనుట యొప్పుచున్నది. తథాహి = అది యుక్తమే, తత్కాలం = ఆ కాలమందు, కేన = ఏ, యూనా = యువకునిచే, స్మరేషు పక్షానిలతూలలీలా- స్మరేషు = మన్మథ బాణములయొక్క, పక్ష = రెక్కలయొక్క, అనిల = గాలిచే, తూల = ప్రత్తియొక్క, లీలా = విలాసము, నాఽలమ్భి = పొందింపఁబడలేదు.

వి. ఇచ్చట యువకులయందు మన్మథ బాణముల ఱెక్కల కెగరిపోయెడు ప్రత్తియొక్క ధర్మమును నారోపించుటవలన, పదార్థ వృత్తిరూప మగు నిదర్శనాలఙ్కారము.

ప్రపంచమందలి యువకు లందఱును కాముకులగుట యను కారణముచే, సకల సురభూమిపాలురు కుండిన నగరమును విచ్చేయుట యను కార్యము సమర్థితము కాన అర్థాన్తరన్యాసాలఙ్కారము. అది నిదర్శనాలఙ్కార ముతో, సఙ్కీర్ణము గాన సంకరము.

**సమాసములు :**

ద్వీపాన్తరేభ్యః:- అన్యే ద్వీపాః = ద్వీపాన్తరాణి, తేభ్యః = ద్వీపాన్త రేభ్యః.

సురభూమిపాలైః :- సుర భూమేః పాలాః = సురభూమిపాలాః, తైః = సురభూమిపాలైః.

తత్కాలమ్ :- స చాసౌ కాలశ్చ = తత్కాలః, తం తత్కాలమ్.

స్మరేషుపక్షానిలతూలలీలా :- స్మరస్య ఇషవః = స్మరేషవః = స్మరేషూణాం పక్షాః, స్మరేషుపక్షాః, స్మరేషుపక్షాణామనిలః = స్మరేషుపక్షానిలః, తూలస్య లీలా = తూలలీలా. పక్షానిలేన తూలలీలా = పక్షానిల తూలలీలా. స్మరేషుపక్షానిలతూలలీలేవ లీలా = స్మరేషుపక్షానిలతూలలీలా.

**భావము :**

ఇతర ద్వీపముల నుండి దేవతలు, రాజులు క్షణకాలమున, నా స్వయంవరమునకు విచ్చేసిరి. లేదా, భారతభూమి తప్ప తక్కిన ద్వీపము లన్నియు భోగభూము లగుటవలన, దేవతలకు భోగాయతన మగు శరీర ముండుటవలన, నా ద్వీపములు సురభూము లగుచున్నవి. అట్టి సురభూములను పాలించెడివారు విచ్చేసి రని యర్థము. ఆ స్వయంవరకాలమునందు, దమయన్తీ సౌన్దర్యమున కాశపడిన యువకుఁ డెవ్వఁడు, మన్మథ బాణముల తెక్కల గాలికి ప్రత్తి వలె నెగిరిపోఁడు-? అనగా, నా బాణముల తెక్కల గాలిదెబ్బను ధైర్యమును బలమునుఁ గోల్పోయి, ప్రత్తివలె, తేలికఁ బొందిరని యాశయము. ॥౨౬॥

**శ్లో. రమ్యేషు హర్మ్యేషు నివేశనేన**
**సపర్యయా కుణ్డిననాకనాథః।**
**ప్రియోక్తిదానాదరనమ్రతాద్యై**
**రుపాచరచ్చారు స రాజచక్రమ్॥ 27**

ప.వి : రమ్యేషు - హర్మ్యేషు- నివేశనేన - సపర్యయా, కుణ్డిననాకనాథః - ప్రియోక్తి దానాదరనమ్రతాద్యైః-ఉపాచరత్-చారు-సః-రాజచక్రమ్.

అర్థము: సః=ఆ కుణ్డిననాకనాథః=కుణ్డిన నగరమున కిన్ద్రుఁడైన భీముఁడు, రాజచక్రం = స్వయంవరమునకు విచ్చేసిన రాజసమూహమును, రమ్యేషు=సుందరము లయిన, హర్మ్యేషు=భవనములయందు, నివేశనేన=నిలుపుట చేతను, సపర్యయా = అర్ఘ్యపాద్యాదిపూజచేతను, ప్రియోక్తిదానాదరనమ్రతాద్యైః = ప్రియోక్తి=ప్రియవచనములచేతను, దాన=గంధమాల్య తామ్బూలప్రదానములచేతను ఆదర = సమ్మాననాదులచేతను, నమ్రతా = వినయప్రదర్శము, ఆద్యైః = మున్నగు వానిచే, చారు=బాగుగా, ఉపాచరత్ = ఉపచారములనుఁ గావించెను.

**సమాసములు ।**

కుణ్డిననాకనాథ :- నాకస్య నాథః నాకనాథః కుణ్డినస్య నాకనాథః = కుణ్డిన నాకనాథః.

ప్రియోక్తి దానాదరసమ్రతాద్యైః:-ప్రియా చ సా ఉక్తిశ్చ=ప్రియోక్తిః, ప్రియోక్తిశ్చ, దానం చ, ఆదరశ్చ, నమ్రతా చ=ప్రియోక్తిదానాదర నమ్రతాః, ఆదౌ భవాః = ఆద్యాః-ప్రియోక్తి దానాదరనమ్రతాః, ఆద్యాః యేషాం తే = ప్రియోక్తి దానాదరనమ్రతాద్యాః-తైః=ప్రియోక్తి దానాదరనమ్రతాద్యైః.

రాజచక్రమ్ :-రాజ్ఞాం చక్రమ్.-రాజచక్రమ్. తత్=రాజచక్రమ్.

**భావము :**

ఆ కుణ్డినగరమున కీర్తిమంతుడైన భీమరాజు స్వయంవరమును గూర్చి విచ్చేసిన రాజులను సుందరములైన భవనములయందు విశ్రమింపజేయుటచేతను, అర్ఘ్యపాద్యాదులచేతను, ప్రియవచనములతోడను గన్ధ తాంబూలాదుల నర్పించుటచేతను, వినయ ప్రవర్తనాదులచేతను చక్కగా గౌరవించెను. ॥౨౭॥

**శ్లో. చతుస్సముద్రీపరిఖే నృపాణా**
**మన్తఃపురే వాసితకీర్తిదారే,**
**ఔదార్య దాక్షిణ్య దయా దమానాం**
**చతుష్టయీ రక్షణసౌవిదల్లా॥ 28**

ప.వి: చతుస్సముద్రీపరిఖే-నృపాణామ్- అన్తఃపురే- వాసిత కీర్తిదారే-ఔదార్య దాక్షిణ్య దయాదమానాం-చతుష్టయీ-రక్షణసౌవిదల్లాః.

అర్థము: చతుస్సముద్రీపరిఖే=చతుస్సముద్రీ=నాలుగు సముద్రములే, పరిఖే = అగడ్తగాగల, వాసితకీర్తిదారే-వాసిత = నివసింపజేయబడిన, కీర్తిదారే=కీర్తులనెడు భార్యలు గలిగిన, రాజ్ఞాం=రాజుల యొక్క, అన్తఃపురే=భూమి యను అన్తఃపురమునందు, ఔదార్యదాక్షిణ్యదయాదమానాం- ఔదార్య=వితరణ, దాక్షిణ్య=పరుల చిత్తమునను సరించుట, దయా=కృప, దమానాం=ఇన్ద్రియ నిగ్రహము అను నీ గుణముల యొక్క, చతుష్టయీ రక్షణ సౌవిదల్లాః; చతుష్టయీ=నాలుగింటి సమూహమే, రక్షణ=రక్షించుటయందు, సౌవిదల్లాః = కంచుకులుగా నుండినవి,

వి : నాలుగు సముద్రములను, నగడ్తెలుగను భూమిని నన్తఃపురముగను, కీర్తులను భార్యలుగను, ఔదార్యాది గుణములను కంచుకులుగను, రూపించినందువలన రూపకాలఙ్కారము.

**సమాసములు :**

చతుఃసముద్రీపరిఖే:-చతుర్ణాం సముద్రాణాం సమాహారః=చతుస్సముద్రీ. చతుస్సముద్రీ పరిఖా యస్యాః సః=చతుస్సముద్రీ పరిఖః, తస్మిన్ = చతుస్సముద్రీ పరిఖే.

వాసితకీర్తిదారే :-కీర్తయ ఏవ దారాః=కీర్తిదారాః,వాసితాః కీర్తి దారాః యస్మిం స్తత్=వాసితకీర్తిదారం - తస్మిన్= వాసితకీర్తిదారే.

ఔదార్యదాక్షిణ్య దయాదమానామ్:- ఉదారస్య భావః = ఔదార్యం. దక్షిణస్య భావః=దాక్షిణ్యమ్. ఔదార్యం చ, దాక్షిణ్యం చ, దయా చ దమశ్చ=ఔదార్యదాక్షిణ్యదయాదమాః. తేషాం=ఔదార్యదాక్షిణ్య దయా దమానామ్.

చతుష్టయీ రక్షణ సౌవిదల్లాః :- చతుర్ణాం సమూహః = చతుష్టయీ. చతుష్టయ్యాః రక్షణం = చతుష్టయీ రక్షణమ్. చతుష్టయీరక్షణే సౌవిదల్లాః=చతుష్టయీరక్షణసౌవిదల్లాః.

**భావము :**

నాలుగు సముద్రములను నగడ్తెలుగాఁ గల్గిన, కీర్తు లనెడు భార్యలకు నివాసస్థలమైన భూమి యను నంతఃపురమునందు ఔదార్యము, దాక్షిణ్యము, దయ, దమము అను నీ నాలుగును నా యన్తఃపురమును రక్షించెడి కంచుకులుగా నుండినవి. ఔదార్యము మున్నగు నీ నాలుగు గుణము లున్నప్పుడే రాజుల కీర్తి రక్షింపబడును. అవి లేనప్పుడు వారి కీర్తికి రక్షణ యెక్కడిది ? ఇచ్చట భీమరాజున కట్టి గుణము లుండుటవలన నాతని కీర్తి రక్షితమై దిగన్తవిశ్రాన్తమై యున్నది. ॥౨౪॥

**శ్లో. అభ్యాగతైః కుణ్డిన వాసవస్య**
**పరోక్షవృత్తేష్వపి తేషు తేషు।**
**జిజ్ఞాసిత స్వేప్సితలాభలిఙ్గం**
**స్వల్పోఽపి నాఽవాపి నృపైర్విశేషః॥ 29**

ప.వి. అభ్యాగతైః- కుణ్డినవాసవస్య - పరోక్షవృత్తేషు - అపి - తేషు-తేషు- జిజ్ఞాసిత స్వేప్సితలాభలిఙ్గం- స్వల్పః- అపి- న- అవాపి- నృపైః- విశేషః-

అర్థము:అభ్యాగతైః=స్వయంవరమునకు విచ్చేసినట్టి, నృపైః=రాజుచే, కుణ్డిన వాసవస్య = కుణ్డిన నగరమున కిన్ద్రుఁడైన భీమరాజునకు సంబంధించిన, పరోక్ష వృత్తేష్వపి- పరోక్ష=కంటికి మరుగున జరిగినవియు, కనుల యెదుట జరిగినవియు నగు, తేషుతేషు=రాజులకుఁ గావించిన యా యా యుపచారములయందు, జిజ్ఞాసిత స్వేప్సితలాభలిఙ్గం- జిజ్ఞాసిత = ప్రత్యక్షముతోఁ దెలుసుకొనఁ గోరఁబడిన, స్వేప్సితలాభ = తమ కిష్ట మైన దమయన్తియొక్క ప్రాప్తికి, లిఙ్గం = చిహ్నముగా, స్వల్పోఽపి = స్వల్పమైనట్టియు, విశేషః = తారతమ్యము, నావాపి = పొందఁబడ లేదు.

**సమాసములు :**

కుణ్డినవాసవస్య:- కుణ్డినస్య వాసవః = కుణ్డినవాసవః తస్య = కుణ్డిన వాసవస్య.

పరోక్ష వృత్తేషు- అక్ష్ణః పరస్తాత్ = పరోక్షం, పరోక్షం వృత్తాః = పరోక్ష వృత్తాః, తేషు=పరోక్షవృత్తేషు.

జిజ్ఞాసితస్వేప్సితలాభలిఙ్గమ్- జ్ఞాతుమీప్సితః=జిజ్ఞాసితః, స్వేషామీప్సితం=స్వేప్సితమ్. స్వేప్సితస్య లాభః=స్వేప్సితలాభః. జిజ్ఞాసి తశ్చాసౌ స్వేప్సితలాభశ్చ=జిజ్ఞాసితస్వేప్సితలాభః. జిజ్ఞాసితస్వేప్సిత లాభస్య లిఙ్గమ్ =జిజ్ఞాసిత స్వేప్సితలాభలిఙ్గమ్.

**భావము :**

ఆ భీమరాజు తన యభ్యాగతు లగు రాజుల విషయమున ప్రత్యక్షముగఁ గాని, పరోక్షముగఁ గాని చేసిన యుపచారములయందు నే రాజునకును, దమయన్తీ లాభమునకు చిహ్నముగా స్వల్పమైన తారతమ్యమును గూడ జూప లేదు. ఆ రాజు లట్టి తారతమ్యము నన్వేషింపఁ బ్రయత్నించినను నట్టి స్వల్ప తారతమ్యముగూడఁ గానరాలేదు. ॥౨౯॥

శ్లో. అజ్కే విదర్భేన్ద్రపురస్య శఙ్కే
న సమ్మమౌ నైవ తథా సమాజః।
యథా పయోరాశిరగస్త్యహస్తే
యథా జగద్వా జఠరే మురారేః॥ **30**

ప.వి. అఙ్కే- విదర్భేన్ద్ర పురస్య- శఙ్కే - న - సమ్మమౌ - న - ఏవ - తథా- సమాజః- యథా- పయోరాశిః- అగస్త్యహస్తే- యథా-జగత్- వా- జఠరే- మురారేః.

అర్థము. విదర్భేన్ద్రపురస్య=భీముని పట్టణ మైన కుణ్డినముయొక్క, అఙ్కే= సమీపమునందు, ఏషః=ఈ, సమాజః=రాజ సంఘము, అగస్త్యహస్తే= అగస్త్య మహర్షి యొక్క హస్తమునందు, పయోరాశిః యథా = సముద్ర మెట్లో, మురారేః = విష్ణువుయొక్క, జఠరే=గర్భమందు, జగద్వా = ప్రపంచముగాని, యథా=ఎట్లో, అట్లు, నసమ్మమౌన=పట్టలేదనుటలేదు. అనగా చక్కగాఁ బట్టినది. (ఇతి=అని) శఙ్కే=భావింతును.

వి. ఇచ్చట మునిహస్తముతోడను, హరియొక్క యుదరముతోడను, కుణ్డిన నగరమునకును; సముద్రముతోఁడను, ప్రపఞ్చముతోఁడను, రాజ సమాజమునకు సామ్యముఁ జెప్పుటవలన నుపమాలఙ్కారము.

స్వల్పమైన కుణ్డిన నగరమందు రాజసంఘము పట్టినదాయేమి ? యని చెప్పుట యుత్ప్రేక్ష. ఈ రెంటికిని సఙ్కరము.

స్వల్ప మైన కుణ్డిన నగరముఫకును, గొప్పదైన రాజసమాజమునకును

ఆధారాధేయభావమునుఁ జెప్పుటవలన నిది, యనునుగుణముగా నుండుట వలన నధికాలఙ్కారము.

దానివలన రాజసమాజముయొక్క మహత్త్వమను వస్తువు వ్యఙ్గ్యము.

**సమాసములు :**

విదర్భేన్ద్రపురస్య- విదర్భాణామ్ ఇన్ద్రః = విదర్భేన్ద్రః. విదర్భేన్ద్రస్య పురం=విదర్భేన్ద్రపురం, తస్య =విదర్భేన్ద్రపురస్య.

పయోరాశిః :-పయసాం రాశిః =పయోరాశిః.

అగస్త్యహస్తే :- అగస్త్యస్య హస్తః = అగస్త్యహస్తః. తస్మిన్ = అగస్త్యహస్తే.

మురారేః :-మురస్య అరిః=మురారిః. తస్య=మురారేః.

**భావము :**

విదర్భరాజైన భీముని కుణ్డిన పట్టణమందు గొప్పదైన రాజసమూహము, అగస్త్యుని హస్తమందు సముద్రమువలెను, విష్ణువుయొక్క యుదరమునందు ప్రపంచమువలె పట్టినది, ॥30॥

**శ్లో. పురే పథిద్వారగృహాణి తత్ర**
**చిత్రీకృతాన్యుత్సవ వాఞ్ఛయేవ।**
**నభోఽపి కిర్మీరమకారి తేషాం**
**మహీభుజామాభరణప్రభాభిః॥ 31**

ప.వి: పురే- పథిద్వారగృహాణి- తత్ర-చిత్రీకృతాని-ఉత్సవ వాఞ్ఛయా-ఇవ-నభః-అపి-కిర్మీరమ్-అకారి-తేషాం-మహీభుజామ్-ఆభరణప్రభాభిః.

అర్థము: తత్ర = ఆ, పురే = కుణ్డిన నగరమందు, ఉత్సవవాఞ్ఛయా ఇవ = వివాహమహోత్సవమందలి యభిలాషచేతనో యనునట్లు, పథిద్వారగృహాణి—పథి = మార్గములు, ద్వార = ద్వారములు, గృహాణి = గృహములు, చిత్రీకృతాని = చిత్రవర్ణముకలవిగాఁ జేయఁబడినవి.

తేషాం=అభ్యాగతులైన, మహీభుజాం = రాజుల యొక్క, ఆభరణ ప్రభాభిః = భూషణముల కాంతులతో, నభోఽపి = ఆకసము గూడ, కిర్మీరమ్=నానావర్ణయుక్తగా, అకారి=చేయఁబడినది.

వి : ఇచ్చట భూషణ కాంతులతో నాకసము చిత్రము గావింపఁబడిన దని సమృద్ధి యుక్తమగు వస్తువు వర్ణింపఁబడుటవలన నుదాత్తాలఙ్కారము.

**సమాసములు :**

పథిద్వారగృహాణి : పన్థానశ్చ, ద్వారాణి చ, గృహాణి చ=పథిద్వార గృహాణి.

చిత్రీకృతాని : అచిత్రాణి, చిత్రాణి సమ్పద్యమానాని కృతాని=చిత్రీ కృతాని.

ఉత్సవవాఞ్ఛయా :—ఉత్సవే వాఞ్ఛా=ఉత్సవవాఞ్ఛా, తయా=ఉత్సవ వాఞ్ఛయా. ఆభరణానాం ప్రభాః = ఆభరణప్రభాః, తాభిః = ఆభరణ ప్రభాభి .

**భావము :**

దమయంతి పెండ్లి సంబరమునకై యా కుణ్డిన నగరమందలి వీథులు, ద్వారములు, గృహములు అలఙ్కరణములచే చిత్రవర్ణములు పొందింపఁబడినవి. అట్లే యా రాజులయొక్క యాభరణ కాంతులతో నాకసముఁ గూడ పలు వన్నెలతో శోభించుచు చిత్రవర్ణముఁ బొందింపఁబడినది. అనగా నా మహోత్స వమునందు భూమ్యాకాశములు రెండును నలఙ్కృతములైన వని యాశ యము.. ॥౩౦॥

**శ్లో.** **విలాసవైదగ్ధ్యవిభూషణశ్రీ**
**స్తేషాం తథాఽభూత్ పరిచారకేఽపి।**
**అజ్ఞాసిషుః స్త్రీశిశుబాలిశా స్తం**
**యథాగతం నాయకమేవ కఞ్చిత్॥** **32**

ప.వి. విలాసవైదగ్ధ్యవిభూషణశ్రీః- తేషాం-తథా- అభూత్- పరిచారకే- అపి- అజ్ఞాసిషుః- స్త్రీశిశుబాలిశాః- తం- యథా-ఆగతం- నాయకమ్- ఏవ- కం-చిత్.

అర్థము. తేషాం=ఆ రాజులయొక్క, పరిచారకేఽపి=సేవకునియందును, విలాస వైదగ్ధ్య విభూషణశ్రీః. విలాస=కటాక్షవిక్షేపాదిశృఙ్గార చేష్టల యొక్కయు, వైదగ్ధ్య—చమత్కార సంభాషణయందలి నేర్పుయొక్కయు, విభూషణ = ఆభరణములయొక్కయు, శ్రీః=అతిశయము, తథా= ఆవిధముగా, అభూత్=ఉండినవి, యథా=ఎట్లనగా, స్త్రీశిశుబాలిశాః- స్త్రీ=స్త్రీలు, శిశు = బాలురు, బాలిశాః=అజ్ఞానులు, తం=ఆ పరిచారకుని, ఆగతం=విచ్చేసిన, కఞ్చిత్ = ఒకానొక, నాయకమేవ=నాయకునిగనే, అజ్ఞాసిషుః=భావించిరి.

వి. ఇచ్చట రాజసేవకుని రాజ సమానునిగా రాజుల యైశ్వర్యమును వాని యందుఁ జెప్పుటవలన నతిశయోక్త్యలఙ్కారము.

**సమాసములు :**

విలాసవైదగ్ధ్య విభూషణశ్రీః- విలాసశ్చ, వైదగ్ధ్యం చ, విభూషణాని చ=విలాసవైదగ్ధ్య విభూషణాని. విలాసవైదగ్ధ్య విభూషణానాం శ్రీః = విలాసవైదగ్ధ్య విభూషణశ్రీః.

స్త్రీ శిశుబాలిశాః— స్త్రియశ్చ శిశవశ్చ బాలిశాశ్చ=స్త్రీశిశుబాలిశాః.

**భావము :**

ఆ రాజుల పరిచారకుని యందలి కటాక్షవిక్షేపాది శృఙ్గార చేష్టలు, సంభాషణమందలి చాతుర్యము, ధరించిన భూషణముల శోభనుఁ గాంచి, స్త్రీలు, శిశువులు. అమాయకులు, వానిని సైతం మచ్చుటికి విచ్చేసిన రాజులలో నొకనిగా భావించిరి. అనగా నా రాజు పరిచారకులు సైతము తమ వేషభాషలతో రాజునుఁ బోలియుండిరనియు, వివేక శూన్యులు, వారిని భృత్యులుగా గ్రహింపఁగల్గినను, వివేచనా శక్తి

తక్కువగాఁగల యమాయకులగు స్త్రీలు మున్నగువారు మాత్రము వానినిఁగూడ రాజులతోఁ జేరిన నాయకునిగా భావించిరి. ॥౩౨॥

శ్లో. అస్వేదగాత్రాశ్చలచామరౌఘై
రమీలనేత్రాః ప్రతివస్తు చిత్రైః।
అమ్లానమాలా విపులాతపత్రై
ర్దివా నృదేవాశ్చ భిదాం న భేజుః॥ **33**

ప.వి. అస్వేదగాత్రాః-చలచామరౌఘైః- అమీలనేత్రాః- ప్రతివస్తుచిత్రైః- అమ్లానమాలాః- విపులాతపత్రైః- దివా- నృదేవాః- చ- భిదాం- న-భేజుః.

అర్థము. చలచామరౌఘైః- చల=కదలుచున్న, చామరౌఘైః = వింజామరల సమూహముచే, అస్వేదగాత్రాః- అస్వేద = చెమటఁబట్టని, గాత్రాః = శరీరము గలవారును, ప్రతివస్తుచిత్రైః- ప్రతివస్తు=ప్రతివస్తువునందును, చిత్రైః = అద్భుతములచే, అమీల నేత్రాః- అమీల = మూతపడని, నేత్రాః = కన్నులు గలవారును, విపులాతపత్రైః-విపుల=విశాలములైన, ఆతపత్రైః = గొడుగులచే, అమ్లానమాలాః- అమ్లాన = వాడని, మాలాః=పుష్పమాలలు గలవారును నగు, నృదేవాః=నరులైన రాజులు, దేవతలైన యిన్ద్రాదులును, భిదాం = భేదమును, న భేజుః = పొంద లేదు.

వి : ఇచ్చట నరుల పక్షమునను దేవతల పక్షమునను విశేషణము లన్వయించును కాని నరుల పక్షమున "చామరౌఘైః" ఇత్యాది స్థలముల యందలి తృతీయ హేత్వర్థమున నుండును. దేవతల పక్షమున నది ఉపలక్షణార్థకముగ నుండును. మానవులకు చెమట లేక యుండుట మున్నగునవి చామరములు మున్నగు హేతువులచే నేర్పడును. కాని సహజముగ స్వేదరాహిత్యము మానవుల కుండదు. దేవతలకు చెమట లేక యుండుట సహజము కాన చామరాదు లవసరము లేవు. కాన నవి యచ్చట నుపలక్షణములు,

ఇచ్చట నరులకు దేవతలకు భేదా భావమునకు అస్వేదగాత్రత్వాది పదార్థములు హేతువులు కాన పదార్థహేతుక కావ్యలిఙ్గాలఙ్కారము.

**సమాసములు :**

అస్వేదగాత్రాః :—అవిద్యమానః స్వేదః యేషు తాని=అస్వేదాని. అస్వేదాని, గాత్రాణి యేషాం తే=అస్వేదగాత్రాః.

చలచామరౌఘైః :-చలాశ్చ తే చామరాశ్చ=చంచామరాః, చలచామరాః; చలచామరాణామోఘాః=చలచామరౌఘాః, తైః=చలచామరౌఘైః.

అమీలనేత్రాః :-అవిద్యమానా మీలా యేషాం తాని=అమీలాని, అమీలాని నేత్రాణి యేషాం తే=అమీలనేత్రాః

ప్రతివస్తుచిత్రైః :-వస్తుని వస్తుని ప్రతివస్తు, ప్రతివస్తు, చిత్రాణి=ప్రతివస్తుచిత్రాణి, తైః=ప్రతివస్తుచిత్రైః.

అమ్లానమాలాః :-న మ్లానాః అమ్లానాః. అమ్లానాః మాలాః యేషాం తే=అమ్లానమాలాః.

విపులాతపత్రైః :-విపులాని చ తాని ఆతపత్రాణి చ=విపులాతపత్రాణి, తైః=విపులాతపత్రైః.

నృదేవాః :-నరశ్చ దేవాశ్చ=నృదేవాః.

**భావము :**

ఆ స్వయంవర మణ్డపమందు, నరజాతికి జెందిన రాజులు, దేవతా జాతికి జెందిన యింద్రాదులును భేదమును బొందక కానవచ్చుచుండిరి. వింజామరలు వీచుచుండుటవలన రాజులు చెమట లేక యుండిరి. దేవతలు సహజముగనే చెమటం బొందక యుండిరి. రాజులు ఆ స్వయంవరమునం దేర్పాటుపంబడిన ప్రతివస్తువును జూచియాశ్చర్యం మొందుటవలన కన్నులను మూయక యుండిరి. దేవతలు సహజముగనే రెప్పపాట్లు లేని వారు గాన కన్నులను మూయక యుండిరి. రాజులు విశాలములైన గొడుగుల క్రింద నుండుటవలన వారి పుష్పమాలలు వాడుబారలేదు. దేవతల పుష్పమాలలు సహజముగనే

వాడవు. ఈ విధముగా నరులగు రాజులకును నిన్ద్రాదిదేవతలకును భేదము లేక యుండినది. ॥33॥

శ్లో. అన్యోన్యభాషాఽనవబోధభీతేః
సంస్కృత్రిమాభి ర్వ్యవహారవత్సు।
దిగ్భ్యః సమేతేషు నరేషు వాగ్భిః
సౌవర్గ వర్గో న నరై రచిహ్ని॥ 34

ప.వి. అన్యోన్యభాషా నవబోధ భీతేః- సంస్కృత్రిమాభిః- వ్యవహారవత్సు- దిగ్భ్యః- సమేతేషు- నరేషు- వాగ్భిః- సౌవర్గ వర్గః- న- నరైః- అచిహ్ని.

అర్థము. దిగ్భ్యః= భిన్నదిక్కులనుండి, సమేతేషు = విచ్చేసిన, నరేషు=మనుష్యులు, అన్యోన్యభాషాఽనవబోధ భీతేః- అన్యోన్య = ఒండొరుల యొక్క, భాషా=భాషయొక్క, అనవబోధ = తెలియమివలని, భీతేః= భయమువలన, సంస్కృత్రిమాభిః = సంస్కారముచే నేర్పడిన, వాగ్భిః = మాటలతో, అనగా సంస్కృత భాషతో, వ్యవహారవత్సు సత్సు = అభివాదన సంభాషణాదికములను చేయుచుండగా, సౌవర్గ వర్గః- సౌవర్గ=దేవతలయొక్క, వర్గః = సమూహము, నరైః=అ కుణ్డిన నగర మందలి జనులచే, వాఽచిహ్ని=గుర్తింపబడలేదు.

వి. ఇచ్చట నరులకును దేవతలకును భేదమున్నను నభేదముఁ జెప్పుటవలన నభేదాతిశయోక్తి.

**సమాసములు ;**

అన్యోన్యభాషా నవబోధభీతేః- అన్యే చ అన్యే చ ఏషాంవ్యతిహారః= అన్యోన్యే. అన్యోన్యేషాం భాషాః = అన్యోన్యభాషాః. అన్యోన్యభాషాణామనవబోధః=అన్యోన్యభాషా నవబోధః. అన్యోన్యభాషాఽనవబోధాత్ భీతిః=అన్యోన్యభాషాఽనవబోధభీతిః, తస్యాః = అన్యోన్యభాషాఽనవబోధభీతేః.

సంస్కృత్రిమాభిః- సంస్కారాత్ నిర్వృత్తాః = సంస్కృత్రిమాః. తాభిః = సంస్కృత్రిమాభిః.

వ్యవహారవత్సు- వ్యవహారః ఏషామ స్తీతి= వ్యవహారవన్తః, తేషు = వ్యవహారవత్సు.

సౌవర్గవరః- స్వర్గే భవాః = సౌవర్గాః. సౌవర్గాణాం వర్గః = సౌవర్గ వర్గః.

**భావము :**

నరజాతికి జెందిన యా రాజులు వివిధ దిక్కులనుండి వచ్చిరి. అందు వలన నొకరి భాష మఱియొకరికి బోధపడదు. అందువలన వారందఱు సంస్కృత భాషయందే వ్యవహారముఁ జేయఁదొడగిరి. ఇన్ద్రాదులు దేవతలు కాన వారు స్వాభావికముగనే సంస్కృతమున వ్యవహరించు చుండిరి. ఇట్లు నరులు, దేవతలు సంస్కృతమునందే తమ వ్యవహారము లను సాగించుకొనుచుండుటవలన, నా కుండిన నగరవాసులగు జనులు, దేవతలను రాజులను ప్రత్యేకముగా గుర్తింపఁజాలరైరి. ॥౩౪॥

**శ్లో. తే తత్ర భైమ్యాశ్చరితాని చిత్రే**
**చిత్రాణి పౌరైః పురి లేఖితాని।**
**నిరీక్ష్య నిన్యుర్దివసం నిశాం చ**
**తత్స్వప్నసమ్భోగకలావిలాసైః॥ 35**

ప.వి. తే- తత్ర- భైమ్యాః- చరితాని- చిత్రే - చిత్రాణి - పౌరైః - పురి - లేఖితాని- నిరీక్ష్య- నిన్యుః- దివసం- నిశాం- చ- తత్స్వప్నసమ్భోగ కలావిలాసైః.

అర్థము. తే = ఆ రాజులందఱు, తత్ర=ఆ, పురి = కుండిన పట్టణమందు, పౌరైః=పౌరులచే, చిత్రే=చిత్తరువునందు, లేఖితాని = వ్రాయింపఁ బడిన, చిత్రాణి = పలువిధములగు నాశ్చర్యములైన, భైమ్యాః=దమ యన్తియొక్క, చరితాని=చరిత్రములను, నిరీక్ష్య=చూచి, దివసం =

పగటిని, నిన్యుః=కడపిరి. తత్స్వప్నసమ్భోగకలావిలాసైః- తత్= ఆ దమయన్తికి సంబంధించిన, స్వప్నసమ్భోగకలావిలాసైః = స్వప్నమందలి సమ్భోగ చేష్టలనెడి వినోదముంతో, నిశాంచ = రాత్రిని నిన్యుః=కడపిరి.

వి. ఇచ్చట రాత్రియందు స్వప్నమున దమయన్తితోటి సమ్భోగ కళను జెప్పుటవలన నిదుర లేమి యనగా జాగర మనెడి మన్మథావస్థ చెప్పఁబడినది.

**సమాసములు :**

తత్స్వప్నసమ్భోగకళావిలాసైః :- స్వప్నే సమ్భోగః = స్వప్నసమ్భోగః. తస్యాః స్వప్నసమ్భోగః=తత్స్వప్న సమ్భోగః, తత్స్వప్నసమ్భోగే కళాః=తత్స్వప్నసమ్భోగకళాః. తత్స్వప్న సమ్భోగకళా ఏవ విలాసాః=తత్స్వప్నసమ్భోగకళావిలాసాః, తైః = తత్స్వప్న సమ్భోగకళావిలాసైః.

**భావము :**

ఆ కుణ్డిన నగరమందలి పౌరులు చిత్తరువులయందు, విచిత్రములైన దమయన్తియొక్క చరిత్రమును వ్రాయించియుండిరి. వివిధ దిక్కులనుండి స్వయంవరమునకు విచ్చేసిన రాజులందఱు ఆ చిత్రములను జూచుచు పగటినిఁ గడపిరి. స్వప్నమునందు దమయన్తి సంభోగ కళలచే రాత్రినిఁ గడపిరి.॥35॥

**శ్లో. సా విభ్రమం స్వప్నగతాఽపి తస్యాం**
**నిశి స్వలాభస్య దదే యదేభ్యః।**
**తదర్థినాం భూమిభుజాం వదాన్యా**
**సతీ సతీ పూరయతి స్మ కామమ్॥** **36**

ప.వి. సా-విభ్రమం-స్వప్నగతా- అపి- తస్యాం- నిశి- స్వలాభస్య- దదే- యత్- ఏభ్యః- తత్-అర్థినాం- భూమిభుజాం- వదాన్యా- సతీ- సతీ- పూరయతి- స్మ- కామమ్.

అర్థము: సతీ = పతివ్రతయగు, సా=ఆ దమయన్తి, తస్యాం=ఆ రాత్రియందు, అనగా స్వయంవరమునకు ముందు రాత్రియందు, స్వప్నగతాఽపి = కలయందుఁ గానవచ్చినను, ఏభ్యః=ఈ వేల్పులకు, రాజులకు, విభ్రమం =భ్రాన్తిని, అనగా తనతోపు సంగమమును, వదేశతియత్ = ఇచ్చినది యనుట యేదికలదో, తత్=అందువలన, వదాన్యా=త్యాగము కలదిగా, సతీ=అగుచు, అర్థినాం=యాచకులైన, భూమిభుజాం = భూపాలుర యొక్క, కామం=కోరికను, పూరయతిస్మ=పూరించుచుండెను.

**సమాసములు :**

స్వప్నగతా :- స్వప్నం గతా = స్వప్నగతా.

స్వలాభస్య :- స్వస్యాః లాభః =స్వలాభః. తస్య=స్వలాభస్య.

భూమిభుజామ్ :- భూమిం భుఞ్జత ఇతి=భూమిభుజః. తేషాం = భూమి భుజామ్.

**భావము :**

సాధ్వియైన ఆ దమయన్తి స్వయంవరమునకు ముందటి రాత్రి స్వప్నమునఁ గానవచ్చి దేవతలకును, రాజులకును మిథ్యాసఙ్గమము నిచ్చి త్యాగిని యైనది. తన సఙ్గమము స్వప్నగతమై కల్లయైనందువలన పతివ్రతయునైనది. ఇట్లు లోకోత్తర సౌన్దర్యముగల యువతులమధ్య నుండియు, నామె నలునికే తన జీవితము సమర్పితము గావించినదై తన శీలమును రక్షించుకొనినది. ॥౩౬॥

శ్లో. వైదర్భదూతానునయోపహూతైః
శృఙ్గారభఙ్గీరనుభావయద్భిః।
స్వయంవరస్థానజనాశ్రయస్తై
ర్దినే పరత్రాలమకారి వీరైః॥ **37**

ప.వి. వైదర్భదూతానునయోపహూతైః- శృఙ్గారభఙ్గీః - అనుభావయద్భిః - స్వయంవరస్థానజనాశ్రయః- తైః- దినే- పరత్ర- అలమ్- అకారి- వీరైః.

అర్థము: పరత్రదినే = మఱునాడు, వైదర్భదూతానునయోపహూతైః- వైదర్భ =విదర్భరాజగు భీమునియొక్క, దూత=దూతలచే, అనునయ = ప్రార్థనతో, ఉపహూతైః=పిలువఁబడిన, శృఙ్గారభఙ్గీః=శృఙ్గారపుంచలి భావ విశేషములను, అనుభావయద్భిః=ప్రకటించుచున్న, తైః=ఆ, వీరైః= వీరులైన రాజులచే, స్వయంవరస్థాన జనాశ్రయః, స్వయంవరస్థాన = స్వయంవరమునకు స్థానమైన, జనాశ్రయః=మణ్డపము, అలమకారి = అలఙ్కరింపబడినది.

**సమాసములు :**

వైదర్భ దూతానునయోపహూతైః:- విదర్భాణాం రాజా = వైదర్భః. వైదర్భస్య దూతాః=వైదర్భదూతాః, వైదర్భదూతానామనునయః = వైదర్భ దూతానునయః, వైదర్భదూతానునయేన, ఉపహూతాః=వైదర్భ దూతానునయోపహూతాః, తైః=వైదర్భ దూతానునయోపహూతైః.

శృఙ్గారభఙ్గీః :- శృఙ్గారస్య భఙ్గయః=శృఙ్గారభఙ్గయః, తాః = శృఙ్గార భఙ్గీః.

స్వయంవరస్థానజనాశ్రయః:- స్వయంవరస్య స్థానం=స్వయంవరస్థానం, జనానామాశ్రయః=జనాశ్రయః, స్వయంవరస్థానస్య జనాశ్రయః = స్వయంవరస్థానజనాశ్రయః.

**భావము :**

మఱుదినమునందు, భీమరాజుయొక్క దూతలు ప్రార్థనాపూర్వకముగా నాహ్వానింపగా, నా రాజులు శృఙ్గార చేష్టలనుఁ బ్రకటించుచు స్వయంవర మణ్డపమును జేరిరి. ॥౩౭॥

శ్లో. **భూషాభిరుచ్చైరపి సంస్కృతేయం**
**వీక్ష్యాఽకృత ప్రాకృతబుద్ధిమేవ.**
**ప్రసూనబాణే విబుధాధినాథ**
**స్తేనాథ సాఽశోభి సభా సలేస॥** **38**

ప.వి. భూషాభిః- ఉచ్చైః-అపి-సంస్కృతే- యం-వీక్ష్య- అకృత- ప్రాకృత బుద్ధిమ్- ఏవ- ప్రసూనబాణే- విబుధాధినాథః - తేన - అథ - సా - అశోభి- సభా- నలేన.

అర్థము: విబుధాధినాథః=ఇన్ద్రుఁడు, యం = ఏ నలుని, వీక్ష్య = చూచి, భూషాభిః = భూషణములచే (అలఙ్కారములతో కూడిన), ఉచ్చైః= అతిశయముగా, సంస్కృతేఽపి=అలఙ్కరింపబడినను (సంస్కృతము నందును), ప్రసూనబాణే = మన్మథునియందును, ప్రాకృత బుద్ధిం = (ప్రాకృతభాషా బుద్ధిని) నీచబుద్ధిని, అకృత=చేసెను, అనగా సున్దరుఁ డను బుద్ధినిఁ జేయలేదు. అథ=నలుఁడు వచ్చినపిదప, తేన=ఆ, నలేన = నలునిచే, సా = ఆ, సభా = స్వయంవరసభ, అశోభి = శోభించినది.

వి. విబుధాధినాథుఁడు అనగా పణ్డితశ్రేష్ఠుడు, సంస్కృతమునందు ప్రాకృత బుద్ధి నుంచుట అనగా సంస్కృత భాషయందు ప్రాకృత భాషాబుద్ధి నుంచుట విరుద్ధము కాన నిఁట విరోధాభాసము సూచితము. భూషణాది సంస్కారము గల్గినందువలన సంస్కృతుడైన మన్మథునియందు ప్రాకృతబుద్ధిని అనగా నీచబుద్ధినుంచెనని చెప్పుటచే విరోధ పరిహారము.

**సమాసములు :**

ప్రాకృతబుద్ధిమ్:, ప్రాకృత ఇతి బుద్ధిః=ప్రాకృతబుద్ధిః, తామ్=ప్రాకృత బుద్ధిమ్.

ప్రసూనబాణే:- ప్రసూనం బాణః యస్య సః=ప్రసూనబాణః, తస్మిన్ =ప్రసూనబాణే.

విబుధాధినాథః :- విబుధానామధినాథః=విబుధాధినాథః.

**భావము :**

ఆ స్వయంవర మణ్డపమందు, ఇంద్రుఁడు నలునిఁజూచి, భూషణములతో మెండుగా నలఙ్కరింపఁబడిన (సంస్కృతమందు) మన్మథునియందు సాధారణ బుద్ధిని (ప్రాకృత బుద్ధిని) ఉంచెను. అనగా సందగాడను బుద్ధినుంచ

లేదు. నలుఁడు విచ్చేయఁగానే యా సభ శోభిల్లఁ దొడఁగినది. అనఁగా, నలుఁడు మన్మథు నతిశయించిన సౌన్దర్యముతో వెలయుచుండె నని భావము. ॥౩౮॥

శ్లో. ధృతాఙ్గరాగే కలితద్యుశోభాం
తస్మిన్ సభాం చుమ్బతి రాజచన్ద్రే।
గతా బతాక్ష్ణో ర్విషయం విలఙ్ఘ్య
క్వ క్షత్రనక్షత్ర కులస్య లక్ష్మీః॥ **39**

ప.వి : ధృతాఙ్గరాగే–కలితద్యుశోభాం-తస్మిన్–సభాం-చుమ్బతి-రాజచన్ద్రే-గతా –బత–అక్ష్ణోః-విషయం-విలఙ్ఘ్య-క్వ-క్షత్ర నక్షత్ర కులస్య-లక్ష్మీః.

అర్థము: ధృతాఙ్గరాగే=ధృత=ధరింపఁబడిన, అఙ్గరాగే=మైపూత కల్గినట్టి,(చంద్ర పక్షమున)ధృత=ధరింపఁబడిన,అఙ్గ=బింబమండలి,రాగే=ఎఱ్ఱఁదనముఁ గల్గినట్టి,రాజచన్ద్రే=రాజచన్ద్రుడైన నలుఁడు(చన్ద్రుఁడు,కలితద్యుశోభాం-కలిత = పొందబడిన, ద్యుశోభాం=స్వర్గశోభగల్గిన, (ఆకాశశోభగల్గిన), తాం=ఆ సభను, చుమ్బతి సతి = ప్రవేశింపగా, (సభయను స్త్రీని ముద్దిడగా) క్షత్ర నక్షత్ర కులస్య=క్షత్ర=క్షత్రియులను,నక్షత్ర= నక్షత్రములయొక్క, కులస్య=సంఘమునకు సమ్బన్ధించిన, లక్ష్మీః= శోభ, అక్ష్ణోః=నేత్రములయొక్క, విషయం = గోచరమును, విలఙ్ఘ్య= దాటి, క్వ=ఎచ్చటికి, గతా=వెళ్ళినది? బత=ఆశ్చర్యము.

వి:- "రాజచన్ద్రే-అనునెడ, క్షత్ర నక్షత్ర కులస్య" యనునెడ రాజును చన్ద్రుఁడుగను, క్షత్రియులను నక్షత్రములుగను రూపించుటవలన రూపకము.

"కలితద్యుశోభామ్" అనునెడ సభను స్వర్గశోభ వంటి శోభను వహించి నదిగఁజెప్పుటవలన, నిదర్శనాలఙ్కారము. పైరెంటికిని సఙ్కరము.

**సమాసములు :**

ధృతాఙ్గరాగే:-అఙ్గస్య రాగః=అఙ్గరాగః; ధృతః అఙ్గరాగః యేన సః= ధృతాఙ్గరాగః. తస్మిన్=ధృతాఙ్గరాగే.

కలితద్యుశోభాం :- ద్యోః శోభా = ద్యుశోభా, కలితా ద్యుశోభా యస్యాస్సా = కలితద్యు శోభా, తామ్ = కలితద్యుశోభాం.

రాజచన్ద్రః :- రాజైవ చన్ద్రః = రాజచన్ద్రః, పక్షాన్తరమున రాజా చన్ద్ర ఇవ = రాజచన్ద్రః.

క్షత్రనక్షత్రకులస్య :- క్షత్రాణ్యేవ నక్షత్రాణి = క్షత్ర నక్షత్రాణి, క్షత్ర నక్షత్రాణాం కులమ్ — క్షత్ర నక్షత్రకులమ్, తస్య — క్షత్ర నక్షత్ర కులస్య.

**భావము :**

రాజచన్ద్రుఁ డగు నలుఁడు మై పూత నలదుకొని స్వర్గ శోభతోఁడను (నాకాశ శోభతోఁడను) వెలయుచున్న సభను ప్రవేశింపఁగనే క్షత్రియు లనెడి నక్షత్ర సంఘము యొక్క శోభ దృష్టికి కానరాలేదు - చన్ద్రుడు బింబమునందు రాగమును ఉదయకాలపు టెఱ్ఱఁదనమును, వహించి యాకసమునకు రాగనే యందలి నక్షత్రముల కాన్తి తొలగిపోవును. అట్లే నలచంద్రుడు ఆకాశ శోభగల సభను ప్రవేశింపఁగనే రాజు లనెడి నక్షత్రముల కాంతి తఱిగిపోయినది ॥౩౯॥

**శ్లో. ప్రాక్ దృష్టయః క్షోణి భుజామముష్మి**
**న్నాశ్చర్య పర్యుత్సుకితా నిపేతుః।**
**అనన్తరం దన్తురిత భ్రువాం తు**
**నితాన్త మీర్ష్యాకలుషా దదృగన్తాః॥ 40**

ప.వి. ప్రాక్-దృష్టయః - క్షోణిభుజామ్ - అముష్మిన్ - ఆశ్చర్యపర్యుత్సుకితాః-నిపేతుః - అనన్తరం—దన్తురిత భ్రువాం-తు-నితాన్తమ్- ఈర్ష్యాకలుషాః - దృగన్తాః

అర్థము: ప్రాక్ = తొలుత, అముష్మిన్ = ఈ నలునియందు, క్షోణిభుజాం = రాజులయొక్క, దృష్టయః - పూర్ణదృష్టులు, ఆశ్చర్యపర్యుత్సుకితాః- ఆశ్చర్య = ఆశ్చర్యముచే, పర్యుత్సుకితాః = మిక్కిలియుత్కణ్ఠతసుఁ

బొందింపఁబడినవై, నిపేతుః=పడినవి. అనన్తరంతు = తర్వాతనో, దన్తురితభ్రువామ్, దన్తురిత=ద్వేషముచే మెట్టపల్లములుగాఁ జేయఁబడిన, భ్రువాం=కనుబొమ్మలు గల యీరాజుల యొక్క, దృగన్తాః=కంటి కొనలచూపులు, నితాన్తం=మిక్కిలి, ఈర్ష్యాకలుషాః, = అసూయతో కాలుష్యమునొందినవై, నిపేతుః=పడినవి.

వి. ఇచ్చట, ఔత్సుక్యముచేతను, అసూయచేతను, ప్రయోగింపఁబడిన, పూర్వదృష్టులకును, అపూర్వదృష్టులకును క్రమముగా నొక్కకాలము నందు పాతమునుఁజెప్పుటవలన పర్యాయాలఙ్కారము.

అట్లే, ఔత్సుక్యము, ఈర్ష్య, విస్మయము, ద్వేషము మున్నగు ఇచ్ఛా విభావమునుఁ గూర్చుట వలన ప్రియమనెడి, భావాలఙ్కారము. పై రెంటికిని సంసృష్టి.

**సమాసములు :**

ఆశ్చర్యపర్యుత్సుకితా :- పర్యుత్సుకినః భావః=పర్యుత్సుకితా. ఆశ్చర్యేణ పర్యుత్సుకితా=ఆశ్చర్య పర్యుత్సుకితా.

దన్తురితభ్రువామ్ :- దన్తురితాః భ్రువః యేషాం తే=దన్తురితభ్రువః, తేషాం=ధన్తురితభ్రువామ్.

ఈర్ష్యాకలుషాః :- ఈర్ష్యయా కలుషాః = ఈర్ష్యా కలుషాః.

దృగన్తా, :- దృశామన్తాః = దృగన్తాః.

**భావము :**

తొలుత నీ నలునిపై నాశ్చర్యయుక్తములైన రాజదృష్టులు పడినవి. తర్వాత నాతని సౌన్దర్యాదులను భావించుటవలన ద్వేషాదులచే మిట్టపల్లములు గావింపఁబడిన కనుబొమ్మలుగల యీ రాజులయొక్క కన్నుల కొనలనుండి యీర్ష్యతోఁ గలుషితములైన దృష్టులు పడసాగినవి. ఔత్సుక్యముతోఁ బూర్వ దృష్టులును ద్వేషాదులతో నపూర్వ దృష్టులును నలునిపైఁ బర్వినవని యాశయము. ॥౪౧॥

శ్లో. సుధాంశురేష ప్రథమో భువీతి
స్మరో ద్వితీయః కిమసావితీమమ్।
దస్ర స్తృతీయోఽయ మితి క్షితీశాః
స్తుతిచ్ఛలా న్మత్సరిణో నినిన్దుః॥ 41

ప,వి. సుధాంశుః- ఏషః- ప్రథమః- భువి- ఇతి- స్మరః- ద్వితీయః- కిమ్- అసౌ- ఇతి- ఇమమ్- దస్రః- తృతీయః- అయమ్- ఇతి- క్షితీశాః- స్తుతిచ్ఛలాత్- మత్సరిణః- నినిన్దుః.

అర్థము. మత్సరిణః = ఒరుల శుభమును ద్వేషించునట్టి, క్షితీశాః=రాజులు, భువి=భూమియందు, ఏషః=ఇతఁడు, ప్రథమః=క్రొత్తగా నవతరించిన, సుధాంశుః కిం = అసలుచంద్రుడాయేమి? ఇతి=అని, అసౌ=ఇతడు, భువి=భూమియందు, ద్వితీయః=రెండవ, స్మరఃకిమ్=మన్మథుఁడాయేమి? ఇతి=అని, అయం=ఇతఁడు భువి=భూమియందు, తృతీయః=మూడవ, దస్రః కిం=అశ్వినీ పుత్రుఁడాయేమి, ఇతిచ=అనియు, స్తుతిచ్ఛలాత్=స్తుతి చేయునెపమువలన, ఇమం=ఈః నలుని, నినిన్దుః=నిందించిరి.

వి: ఇచ్చట నలుడు చన్ద్రుడా యేమి ? మన్మథుడా యేమి ? అశ్వినీ కుమారుఁడా యేమి? అను నీ మూడును నుత్ప్రేక్షలు. వీనికిఁట సంసృష్టి.

**సమాసములు :**

స్తుతిచ్ఛలాత్ :- స్తుతిరేవ ఛ్చలం=స్తుతిచ్ఛలం, తస్మాత్=స్తుతిచ్ఛలాత్.
మత్సరిణః :- మత్సరః ఏషామస్తీతి=మత్సరిణః.

**భావము :**

నలుని సౌన్దర్యాదులఁ జూచి యోర్వలేని రాజులు, అతనిని, భూమియందు నూతనముగా నవతరించిన చంద్రుడా యేమి ? అనియు, లేదా భూమియం దుద్భవించిన రెండవ మన్మథుడా యేమి ? యనియు లేదా భూమియం దవతరించిన మూడవ యశ్వినీకుమారుడా యేమి ? యని స్తుతి వ్యాజమున నింధించుచుండిరి. ॥౪౧॥

శ్లో. ఆద్యం విధోర్జన్మ స ఏష భూమౌ
ద్వైతం యువాఽసౌ రతివల్లభస్య।
నాసత్యయోర్మూర్తిరియం తృతీయా
ఇతి స్తుతస్తైః కిల మత్సరైః సః॥ 42

ప.వి. ఆద్యం-విధోః-జన్మ-సః-ఏషః - భూమౌ-ద్వైతం - యువా-అసౌ-రతి వల్లభస్య-నాసత్యయోః-మూర్తిః - ఇయం-తృతీయా-ఇతి-స్తుతః-తైః-కిల-మత్సరైః-సః.

అర్థము: సః=ఆ, ఏషః=ఈ నలుఁడు, భూమౌ=భూమియందు, విధోః=చంద్రునికి, ఆద్యం=మొదటిదైన, జన్మ=జన్మము. (లేదా) అసౌ=ఈ, యువా =యువకుఁడు, రతివల్లభస్య=రతికి, భర్తయగు మన్మథునకు, ద్వైతం= ద్విత్వము, అనగా రెండవ మన్మథుఁడు. (లేదా) ఇయం=ఈ నలుని మూర్తి, నా సత్యయోః=అశ్వినీ కుమారులకు, తృతీయా=మూడవదైన, మూర్తిః=శరీరము ఇతి = అని, సః = ఆ నలుడు, మత్సరైః= అసూయగల, తైః=ఆరాజులచే, స్తుతః = స్తుతింపఁబడెను.

వి: ఇందు, పూర్వశ్లోకములోని యర్థమే కింశబ్ద రహితముగా వర్ణితము— కవి వచనము గాన నిందు పునరుక్తిదోషము లేదు·
ఇచ్చటను పూర్వము వలె నుత్ప్రేక్షాత్రయము. కాని గమకము లేనందు వలన నిది గమ్యము.

**సమాసములు :**

ద్వైతం : ద్వయోర్భావః=ద్వితా, ద్వితైవ=ద్వైతమ్.

రతివల్లభస్య : రతేః వల్లభః=రతివల్లభః, తస్య=రతివల్లభస్య.

నాసత్యయో :- న సత్యౌ=అసత్యౌ, న అసత్యౌ=నాఽసత్యౌ, తయోః =నా సత్యయోః,

**భావము :**

ఈ నలుఁడు భూమియందు చంద్రుని ప్రథమావతారము. లేదా ఈ యువకుఁడైన నలుఁడు మన్మథునకు రెండవవాడు. లేదా ఈ నలుని మూర్తి అశ్వినీ కుమారుల మూడవ మూర్తి అని యీ విధముగా సీర్ష్యను వహించిన రాజులీతనిని స్తుతించిరి ॥ ౪౨ ॥

**శ్లో. ఇహేదృశాః సన్తి కతీతి దుష్టై**
**ర్దృష్టాన్తితాలీకనలావలీ తైః।**
**ఆత్మాపకర్షే కిల మత్సరాణాం**
**ద్విషః పరస్పర్ధనయా సమాధిః॥ 43**

ప.వి. ఇహ- ఈదృశాః-సన్తి-కతి-ఇతి-దుష్టైః - దృష్టాన్తితా-అలీకనలావలీ - తైః - ఆత్మాపకర్షే-కిల - మత్సరాణాం - ద్విషః - పరస్పర్ధనయా - సమాధిః.

అర్థము: దుష్టైః = దుష్టులైన, తైః = ఆ రాజులచే, ఇహ = ఈ సభయందు, ఈదృశాః = ఈ నలునికి సాటియైనవారు, కతి = ఎందరో, సన్తీతి = కలరని, అలీకనలావలీ; అలీక = అసత్యమైన, నలావలీ = నలపఙ్క్తి, దృష్టాన్తితా = ఉదాహరణము గావింపఁబడినది. మత్సరాణాం = ఈర్ష్య గలవారికి, ఆత్మాపకర్షేసతి = శత్రువువలనఁ దమకు న్యూనతయేర్పడగా, ద్విషః = శత్రువునకు, పరస్పర్ధనయా; పర = మరియొకనిచే, స్పర్ధనయా = సంఘర్షణ నేర్పఱచుటచే, సమాధిఃకిల = మనస్సునకు సమాధానముగదా! అనఁగా తమ న్యూనతకు పరిహారముగదా.

వి. ఇచ్చట పూర్వార్థార్థమైన సామాన్యమును ఉత్తరార్థార్థమైన విశేషము సమర్థించినందువలన నర్థాన్తర న్యాసాలఙ్కారము

**సమాసములు ;**

అలీకనలావలీ:- నలానామావలిః = నలావలీ, అలీకా చ సా నలావలీ చ = అలీకనలావలీ.

ఆత్మాపకర్షే :- ఆత్మనః అపకర్షః=ఆత్మాపకర్షః, తస్మిన్=ఆత్మాపకర్షే.
పరస్పర్ధనయా :-పరేణ స్పర్ధనా=పరస్పర్ధనా, తయా=పరస్పర్ధనయా.

**భావము :**

పరశ్రేయస్సును సహింపలేని యా దుష్టులగు రాజులు, నలునివంటివారు ఎందరో కలరని నలరూపమందున్న ఇన్ద్రాగ్నియమవరుణు లను నసత్యపునలుల నుదాహరించిరి. ఈర్ష్య వహించినవారు తమకు నపకర్ష వచ్చినపుడు వానిని పరిహరించుకొనుటకు తమ ప్రతిపక్షమునకు కాని పరులతోఁ జేరి. వారితో తమ శత్రువునకు స్పర్ధఁ గలిగించి తృప్తి నొందుదురు. ఇచ్చట రాజులు తమకు నలునివలన నేర్పడిన యపకర్షను తొలగించుకొనుటకై యసత్య నలులతో, నలునకు స్పర్ధ గల్పించి తమ యపకర్షకు పరిహారము నొందిరి. ॥౪౩॥

శ్లో. గుణేన కేనాఽపి జనేఽనవద్యే
దోషాన్తరోక్తిః ఖలు తత్ఖలత్వమ్।
రూపేణ తత్సంసద దూషితస్య
సురైర్నరత్వం యతదూషి తస్య॥ **44**

ప. వి. గుణేన - కేన - అపి - జనే - అనవద్యే - దోషాన్తరోక్తిః - ఖలు - తత్ - ఖలత్వమ్ - రూపేణ - తత్సంసదదూషితస్య - సురైః - నరత్వం - యత్ - అదూషి - తస్య -

అర్థము: కేనాపి = ఒకానొక, గుణేన = గుణముచే, అనవద్యే = నిర్దోషమైన, జనే = జనమునందు, దోషాన్తరోక్తిః —దోషాన్తర = మఱియొక దోషమును, ఉక్తిః = చెప్పుట, ఇతియత్=ఏదికలదో, తత్=అది, ఖలత్వం ఖలు=దుష్టత్వముగదా. యత్ = ఏలయనగా, రూపేణ=సౌన్దర్యముచే, తత్సంసదదూషితస్య — తత్సంసత్=ఆ సభచే, అదూషితస్య=దూషింపఁబడని, తస్య=ఆ నలునికి, నరత్వం=మనుష్యత్వము, సురైః=ఇన్ద్రాదులచే, అదూషి = దూషింపఁబడినది. మిక్కిలి యందిగాఁడైనను నీ నళుఁడు మనుష్యుఁడే గాని దేవుఁడు గాడు, అనగాదేవజాతికిఁ జెందఁడు,

వి : "నిర్దోషమైన దానికి దోషాన్తరారోపణ, ఖలత్వము" అను సామాన్య విషయము నరత్వమును దూషించుటచే సమర్థింపఁబడినది గాన, విశేష ముచే సామాన్యమును సమర్థించుట యను నర్థాన్తర న్యాసాలఙ్కారము.

**సమాసములు :**

అనవద్యే :- అవిద్యమానమవద్యం యస్య సః-అనవద్యః. తస్మిన్= అనవద్యే.

దోషాన్తరోక్తిః-అన్యః దోషః = దోషాన్తరం. దోషాన్తరస్య ఉక్తిః = దోషాన్తరోక్తిః.

తత్సంసదదూషితస్య :-సా చాసౌ సంసచ్చ=తత్సంసత్. తత్సంసదా అదూషితః = తత్సం సదదూషితః—తస్య=తత్సంసదదూషితస్య.

**భావము :**

లోకమునందు గుణయుక్తమగు వ్యక్తి యందు దోషము నారోపించుటయే దుష్టత్వము. ఇన్ద్రాదిదేవతలు, లోకోత్తర సౌందర్యశాలియైన నలునిపై నీర్ష్య వహించి, యత డెంత సౌన్దర్యము గలవాడైనను నతడు మనుష్యజాతికిఁ జెందిన వాఁడే గాని దేవజాతికిఁ జెందినవాఁడు కాదుగదా ! అతనియందు సౌన్దర్య మను గుణ మున్నను నతనియందు నరత్వ మను దోష ముండుటవలన నా గుణము నకు విలువలేదు. అని దేవతలు తమ యీసును వెలిబుచ్చిరి. ॥४४॥

**శ్లో. నలానసత్యా నవదత్ న సత్యః**
**కృతోపవేశాన్ సవిధే సురేశాన్।**
**నోభావిలాభూః కిము దర్పకశ్చ**
**భవన్తి నా సత్యయుజౌ భవన్తః॥ 45**

ప. వి. నరాన్ - అసత్యాన్ - అవదత్ - సః - సత్యః - కృతోపవేశాన్ - సవిధే - సురేశాన్ - న - ఉభౌ - ఇలాభూః - కిమ్ - ఉ - దర్ప కః - చ-భవన్తి - నా సత్యయుజౌ - భవన్తః.

అర్థము: సత్యాః = నిజమైన, సః = ఆ నలుఁడు, అసత్యాన్ = నిజమైనవారు గానట్టి, అనగా నలుని రూపమునుఁదాల్చినట్టి, సవిధే = సమీపమున, కృతోపవేశాన్ = కృత = చేయఁబడిన, ఉపవేశాన్ = కూర్చుండుట గల్గిన, సురేశాన్ = దేవతాశ్రేష్ఠులైన యిన్ద్రాదులను, అవదత్ = చెప్పెను (కిమితి = ఏమనగా) హే ధన్యాః = ఓ ధన్యులారా ! భవన్తః = మీరు, నాఽసత్యయుజౌ = అశ్వినీ దేవతలతోఁగూడిన, ఉభౌ = ఇరువురైన, ఇలాభూః = ఇలాదేవియందు జన్మించిన పురూరవుఁడు, దర్పకశ్చ = మన్మథుఁడును, నభవన్తికిము = కారాయేమి ?

**సమాసములు :**

అసత్యాన్ :— నసత్యాః = అసత్యాః, తాన్ = అసత్యాన్.
కృతోపవేశాన్ :— కృతః ఉపవేశః యైస్తే = కృతోపవేశాః, తాన్ = కృతోపవేశాన్.

ఇలాభూః :- ఇలాయాం భవతీతి = ఇలాభూః.

నాసత్యయుజౌ :— న సత్యౌ = అసత్యౌ, అసత్యౌ న భవత ఇతి = నాసత్యౌ, నాసత్యాభ్యాం యుజ్యేతే ఇతి = నా సత్యయుజౌ.

**భావము :**

సత్యమైన నలుడు, తన వేషమును ధరించిన, యసత్యనలులైన యిన్ద్రాది దేవతలనుఁ గూర్చి యో ధన్యాత్ములారా ! మీరు సౌన్దర్యముచే నశ్వినీ దేవతలుగను పురూరవుఁడుగను, మన్మథుఁడుగను, లేరా యేమి? యని ప్రశ్నించెను. అనగా నిన్ద్రాగ్ని యమవరుణులు నలుగురును, నందచందములతో నశ్వికుమార - పురూరవో — మన్మథులను బోలి యున్నారనియు, తన వేషమున నున్న వారినిఁ జూచుటచే, తనకును నాశ్చర్యము గల్గినదనియు భావము ॥౨౫॥

శ్లో. అమీ తమాహుః స్మ యదత్ర మధ్యే
కస్యాపి నోత్పత్తిరభూ దిలాయామ్।
అదర్పకాస్స్మః సవిధే స్థితాస్తే
నాసత్యతాం నాఽపి బిభర్తి కశ్చిత్॥ 46

ప. వి. అమీ - తమ్ - ఆహుః - స్మ - యత్ - అత్ర - మధ్యే - కస్య - అపి - న - ఉత్పత్తిః - అభూత్ - ఇలాయామ్ - అదర్పకాః - స్మ - సవిధే - స్థితాః - తే - నా సత్యతాం - న - అపి - బిభర్తి - కః - చిత్ .

అర్థము:- అమీ=ఈ వేల్పులు, తం=ఆ నలుని, ఆహుఃస్మ=చెప్పుచుండిరి, యత్=ఏ కారణమువలన, తే=నీయొక్క, సవిధే=సమీపమందు, స్థితాః=ఉన్న, యే=ఏ, వయం=మేముగలమో, అత్ర=నలుగురైన మాలో, మధ్యే=మధ్యయందు, కస్యాఽపి=ఎవనికిని, ఇలాయాం=బుధుని భార్యయైన ఇలాదేవి యందు, (భూమి యందును) ఉత్పత్తిః=పుట్టుక, నాఽభూత్=ఏర్పడలేదు: అనగా మా నలుగురిలో నెవ్వడును నిలాదేవియందుద్భవించిన పురూరవుఁడు కాఁడు (భూమియందు దుద్భవించిన భౌముఁడును కాఁడు) కిన్తు=మఱేమనగా, అదర్పకాః=కామునికంటె భిన్నులముగా, (సౌన్దర్య గర్వశూన్యులముగా) స్మః=ఉన్నారము. కశ్చిత్=మాలో నొక్కఁడును నా సత్యతాం=అశ్వినీకుమారత్వమును. నాఽపిబిభర్తి=ధరించుటయు లేదు.

**సమాసములు :**

అదర్పకాః :- న దర్పకాః = అదర్పకాః, పక్షాన్తరమున — అవిద్యమానః దర్పః యేషాం తే=అదర్పకాః.

**భావము :**

తర్వాత నిన్ద్రాదిదేవతలు నలుని గూర్చి యిట్లు చెప్ప దొడగిరి:- ఓ నలమహారాజా! నీ యెదుట నున్న మా నలుగురిలో నొక్కఁడును నిలాదేవి యందు జన్మించిన పురూరవుఁ డెవడును లేడు. అట్లే యిలాదేవి యందు (భూదేవియందు) జన్మించిన భౌముడును (అంగారకుడును) లేడు. మఱియు మే మందఱము మన్మథునికంటెను భిన్నులము. అయినను లోకోత్తర సౌన్దర్యము గలవారి మగుటవలనగూడ మాకేలాంటి గర్వమునులేదు. కాబట్టి మేము రెండు విధములుగను అదర్పకములము. మాలో నెవ్వడు "నా సత్యత్వము"ను అనగా అశ్వినీదేవత్వమును ధరించుటలేదు. అట్లె "నా సత్యత్వము" నత్యత్వమును, అనగా సత్యనలత్వమును వహించుట లేదు కేవలము నీ రూపమును మేము వహించుటవలన నీవలె కానవచ్చుచున్నాము. ॥౬౭॥

శ్లో. తేభ్యః పరాన్నః పరిభావయస్వ
శ్రియా విదూరీకృతకామదేవాన్।
అస్మిన్ సమాజే బహుషు భ్రమన్తీ
భైమీ కిలాఽస్మాసు ఘటిష్యతేఽసౌ। 47

ప.వి. తేభ్యః- పరాన్- నః-పరిభావయస్వ-శ్రియా-విదూరీకృత కామదేవాన్- అస్మిన్-సమాజే-బహుషు-భ్రమన్తీ-భైమీ-కిల- అస్మాసు- ఘటిష్యతే - అసౌ-

అర్థము: (తత్=ఇలాదేవియందు జన్మించుట మున్నగునవి లేనందువలన) శ్రియా =అందముచే, విదూరీకృత కామదేవాన్—విదూరీకృతః=తిరస్కరింపఁబడిన, కామదేవాన్ = మన్మథుడుగల్గిన, నః = మమ్ములను, తేభ్యః= ఇలా పుత్రాదులకంటెను, పరాన్=ఇతరులుగా, పరిభావయస్వ=నిశ్చయించుకొనుము. (కించ = మఱియు) (హేసౌమ్య=ఓ సౌమ్యస్వభావము గల నలమహారాజా!) శ్రియా=సౌన్దర్యలక్ష్మిచే, విదూరీకృత=తిరస్కరింపఁబడిన, కామదేవాన్=మన్మథుడు గల్గిన, నః=మమ్ములను, పరాన్ =వానికంటె శ్రేష్ఠమైన వారినిగా, పరిభావయస్వ = తెలిసికొనుము; అసౌ=ఈ, భైమీ=దమయన్తి, అస్మిన్ = ఈ, సమాజే=రాజసభయందు, బహుషు = పెక్కండ్రయందు, మధ్యే=నడుమ, భ్రమన్తీ= సంచరించుచు, అస్మాసు=మాయందు, ఘటిష్యతే=చేరనున్నది. తథా= అట్లే, బహుషు=పెక్కండ్రైన, అస్మాసు=నలరూపమును ధరించిన మాయందు, భ్రమన్తీ=నలుఁడను భ్రాన్తిని వహించినదై, ఘటిష్యతే= కిం=సఙ్గమింపఁబోవుచున్నదిగదా. (దానికై మేమిఁటకు వచ్చితిమి).

వి: ఇచ్చట నర్థములు రెండు ప్రకృతములుగా వివక్షితములు గాన కేవల ప్రకృతశ్లేషాలఙ్కారము.

**సమాసములు :**

విదూరీకృత కామదేవాన్ :- అవిదూరాః విదూరాః సమ్పద్యమానాః కృతాః=విదూరీకృతాః, విదూరీకృతాః కామదేవాః యైస్తే విదూరీకృత కామదేవాః; తాన్=విదూరీకృత కామదేవాన్.

**భావము :**

పూర్వ శ్లోకమునఁజెప్పిన ప్రకారము మే మెప్వరము ఇలాసుతులము కాని, యశ్వినీ దేవతలముకాని, మన్మథులముకాని కాము. సౌన్దర్యమున మన్మథుని జయించిన మమ్ములను ఇలాసుతాదులకంటె భిన్నులుగను, శ్రేష్ఠులుగను నెఱుంగుము. దమయన్తి, రాజసభయందు సంచరించుచు మాతో కలియును. లేదా నలరూపమును ధరించిన మాయెడ నల భ్రాన్తిచే సఙ్గమించును. దీనికొఱకు మేమిఁటకు వచ్చితిమి ॥౪౭॥

**శ్లో. అసామ యన్నామ తవేహ రూపం**
**స్వేనాఽధిగత్య శ్రితముగ్ధభావాః।**
**తన్నో ధిగాశాపతితాన్నరేన్ద్ర**
**ధిక్ చేదమస్మద్విబుధత్వమస్తు॥ 48**

ప. వి. అసామ-యత్-నామ-తవ-ఇహ-రూపం-స్వేన-అధిగత్య-శ్రిత ముగ్ధ భావాః-తత్-నః-ధిక్-చ-ఆశాపతితాన్-నరేన్ద్ర-ధిక్-ఇదమ్-అస్మ ద్విబుధత్వమ్-అస్తు.

అర్థము:- హే నరేన్ద్ర!=ఓ రాజా! యత్=ఎందువలన, తవ=నీయొక్క, నామ =పేరు, రూపంచ=సౌన్దర్యమును, స్వేన=స్వయముగా, అధిగత్యాఽపి =తెలిసికొనియు, శ్రితముగ్ధభావాః-శ్రిత=ఆశ్రయింపఁబడిన, ముగ్ధభావాః =మూఢత్వము గలవారమై, ఇహ=ఈ స్వయంవరమందు, అసామ= ఉన్నారమో, తత్=అందువలన, ఆశాపతితాన్—ఆశా=దమయింతిపైని యపేక్షచే, ఆ పతితాన్=వచ్చిన, నః=మమ్ములనుగూర్చి, ధిక్=ధిక్కా రమే తగినది. ఇదం=ఈ, విబుధత్వం = దేవత్వమును గురించియు, పండితత్వమును గూర్చియు, ధిక్=ధిక్కారమే, అస్తు=అగునుగాత, (కించ=మఱియు) యత్=ఎందువలన, తవ = నీయొక్క, రూపం=రూప మును, అనగా వేషమును, అధిగత్య=పొంది, శ్రితముగ్ధభావాః, శ్రిత= పొందబడిన, ముగ్ధభావాః=సౌందర్యముకల వారమై, అసామనామ= శోభించుచున్నామో, తత్=అందువలన, నః=మాయొక్క, ఆశాపతితాం= దిక్పతిత్వమునుఁగూర్చి, ధిక్=ధిక్కారము, ఇదం=ఈ, విబుధత్వం=దేవ

త్వమును(గూర్చియు, పండితత్వమును గూర్చియు, ధిక్=ధిక్కారము, ఏల యనగా నీ పనులన్నియు హేయములు. దిక్పాలకులవంటి వారికి తగనివి.

వి. ఇచ్చట గూడ రెండర్థములును ప్రకృతములుగా వివక్షితములు గాన కేవల ప్రకృతశ్లేష.

## సమాసములు :

శ్రితముగ్ధభావాః :— ముగ్ధస్య భావః= ముగ్ధభావః = శ్రితః ముగ్ధభావః యైస్తే = శ్రితముగ్ధభావాః।

ఆశాపతితాన్ :- ఆశయా అపతితాః=ఆశాపతితాః, తాన్=ఆశాపతితాన్.

ఆశాపతితామ్ :- ఆశానాం పతయః=ఆశాపతయః. ఆశాపతీనాం భావః= ఆశాపతితా. తామ్=ఆశాపతితామ్.

అస్మద్విబుధత్వమ్:- విబుధానాం భావః=విబుధత్వం. అస్మాకం విబుధత్వమ్=అస్మద్విబుధత్వమ్. తత్=అస్మద్విబుధత్వమ్.

## భావము :

ఓ రాజా ! మేము స్వయముగా నీ వేషమును దాల్చి మౌఢ్యముతోఁ గూడి యీ స్వయంవర సభయందున్నారము. అందువలన, దమయన్తిపై మోహముతో నిచ్చటికి విచ్చేసిన మేము చాల నైచ్యమునకు పాల్పడితిమి. అట్లే మా దేవత్వము, పండితత్వము గూడఁ జాల హేయమైనది. అనగా నలుని వేషమును ధరించి స్వయంవర సభకు విచ్చేయుట చాల హీన మైనది. అందులోను దేవతలుగానుండి (జ్ఞానులుగా నుండి) యిట్టి తుచ్ఛమైన పనికిఁ బాల్పడుటయు హీనమైనది. మఱియు, స్వయముగా చాలినంత సౌన్దర్యము లేకపోయినను, నీ వేషమును ధరించి సౌన్దర్యమును సంపాదించుచున్నాము కాని, యాశాపతులమైన — (ఇట్టి నీచమైన పని కొడిగట్టిన) మా యాశాపతిత్వము, అనగా దిక్పాలకత్వము చాల హేయమైనది. అట్లే మా దేవతాత్వము గూడ చాల నిన్ద్యమైనది ॥౪౮॥

శ్లో. సా వాగవాజ్ఞాయితమాం నలేన
తేషా మనాశఙ్కిత వాక్ఛలేన.
స్త్రీ రత్నలాభోచిత యత్నమగ్న
మేనం న హి స్మ ప్రతిభాతి కిఞ్చిత్॥ 49

ప. వి. సా-వాక్-అవాజ్ఞాయితమాం-నలేన-తేషామ్- అనాశఙ్కిత వాక్ఛలేన - స్త్రీరత్నలాభోచిత యత్నమగ్నమ్ - ఏనం-న-హి-స్మ-ప్రతిభాతి-కిం-చిత్.

అర్థము:- అనాశఙ్కిత వాక్ఛలేన; అనాశఙ్కిత=సందేహింపఁబడని, అనగాఁ దెలిసికొనఁబడని, వాక్ఛలేన=దేవతలమాటలలోనికపటము గల్గిన, నలేన= నలునిచే, తేషాం = ఆ యిన్ద్రాదుల యొక్క, సా=ఆ కపటపు వాక్కు, అవాజ్ఞాయితమాం = మిక్కిలి నిర్లక్ష్యభావముతో గ్రహింపఁబడినది. అనగా వారి వచనమంతలి పైనఁ గానఁబడు నర్థమే గ్రహింపఁబడినది కాన దానియొక్క యంతరార్థము గ్రహింపఁబడలేదు. హి=ఏలయనగా, స్త్రీరత్నలాభోచిత యత్నమగ్నం, స్త్రీరత్న=శ్రేష్ఠమైన వనితను, లాభ= సంపాదించుటకు, ఉచిత=తగిన, యత్న=ప్రయత్నమునందు, మగ్నం= మునిగియున్న అనగా దేవతా ధ్యానాదులయందు మునిగిన, ఏనం = ఈ నలునిఁ గూర్చి, కిఞ్చిత్=ఏదియు, నప్రతిభాతిస్మ=స్ఫురించుటలేదు.

**సమాసములు :**

అవాజ్ఞాయితమామ్ :- అతిశయేన అవాజ్ఞాయి = అవాజ్ఞాయితమామ్.
అనాశఙ్కితవాక్ఛలేన :—వాచః ఛలం = వాక్ఛలమ్ న. ఆశఙ్కితం = అనాశఙ్కితం, అనాశఙ్కితం, వాక్ఛలం యేన సః = అనాశఙ్కిత వాక్ఛలః, తేన=అనాశఙ్కిత వాక్ఛలేన.
స్త్రీరత్నలాభోచితయత్నమగ్నమ్ : స్త్రీషు రత్నం = స్త్రీరత్నం, స్త్రీ రత్నస్య లాభః=స్త్రీరత్నలాభః, స్త్రీరత్న లాభస్య ఉచితః = స్త్రీరత్న లాభోచితః, స్త్రీరత్నలాభోచితశ్చాసౌ యత్నశ్చ = స్త్రీరత్నలాభోచిత

యత్నః, స్త్రీరత్నలాభోచితయత్నే మగ్నః. స్త్రీరత్నలాభోచితయత్న=
మగ్నః. తమ్ =స్త్రీరత్నలాభోచితయత్నమగ్నమ్.

**భావము :**

దేవతల మాటలలోని కపట మెఱుంగని నలుఁడు వారి మాటలకు పైపైని యర్థముల నెఱుంగ గల్గెనే గాని వాని యన్తరార్థముల నెఱుంగ లేకపోయెను. దమయంతి యను స్త్రీరత్నమును సంపాదించుటకు వలసిన దేవతోపాసనలయందు మునింగిన వీనికి నేదియు స్ఫురింపక పోయినది. వ్యాసంగము వివేచనాశక్తికి గొప్ప ప్రతిబంధకము ॥౪౯॥

**శ్లో. యః స్పర్ధయా యేన నిజప్రతిష్ఠాం**
**లిప్సుః స ఏవాహ తదున్నతత్వమ్।**
**కః స్పర్ధితుః స్వాభిహితస్వహానేః**
**స్థానేఽవహేలాం బహులాం న కుర్యాత్॥ 50**

ప. వి. యః-స్పర్ధయా-యేన-నిజప్రతిష్ఠాం-లిప్సుః - సః-ఏవ - ఆహ - తదున్నతత్వమ్- కః- స్పర్ధితుః - స్వాభిహితస్వహానేః- స్థానే -- అవహేలాం — బహులాం-న-కుర్యాత్.

అర్థము:- యః = ఏ, అపకృష్టః=హీనుఁడు, యేనసహ = ఏ ఉత్కృష్టునితోడ, స్పర్ధయా=సంఘర్షణచే, నిజప్రతిష్ఠాం=తన ప్రతిష్ఠను, అనగా తన యాధిక్యమును, లిప్సుః=పొందఁగోరినవాఁడై యుండునో, సః=వాఁడు, అనగా సంఘర్షణనుఁ జేయువాఁడే, తదున్నతత్వం, తత్=ఆయుత్కృష్ట పురుషునకు, ఉన్న తత్వం = ఆధిక్యమును, ఆహ=చెప్పుచున్నాడు. అనగా నతని చేష్ట చేతనే యాతనికి నపకర్ష స్పష్ట మగును. తథాహి = అదియుక్తమే, కః=ఏ వివేకవన్తుఁడు, స్వాభిహితస్వహానేః, స్వ = తనచేతనే, అభిహిత=చెప్పబడిన, స్వహానేః=తనహాని కల్గిన, స్పర్ధితుః= సంఘర్షణనుఁజేయువానికి, బహులాం = అధికమైన, అవహేలాం=అవమానమును, న కుర్యాత్ = చేయఁడు. స్థానే = యుక్తము. దమయన్తిఁ బడయఁ గోరి నలుని వేషమును ధరించుట యను దుష్కృత్యము చేత

నలునకు గొప్ప యుత్కర్ష యేర్పడినది. అందువలన వారికి నిరాదరణ మేర్పడుట తగినదే.

**సమాసములు :**

నిజప్రతిష్ఠాం :- నిజా చ సా ప్రతిష్ఠా చ = నిజప్రతిష్ఠా. తామ్ = నిజ ప్రతిష్ఠామ్.

తదున్నతత్వమ్ :- ఉన్నతస్య భావః = ఉన్నతత్వమ్. తస్య ఉన్న తత్వమ్ = తదున్నతత్వమ్. తత్ = తదున్నతత్వమ్.

స్వాభిహితస్వహానేః :- స్వేన అభిహితా = స్వాభిహితా, స్వస్య హానిః = స్వహానిః, స్వాభిహితా చ సా స్వహానిశ్చ = స్వాభిహితస్వహానిః, తస్యాః = స్వాభిహితస్వహానేః.

**భావము :**

లోకమున హీనుఁడు ఉత్తమునితో పోటీ పడి తనకు, ఆధిక్యమును పెంచుకొనుటకు కోరుచు, నా యుత్తమునకే యాధిక్యమునుఁ గల్పించును. అనగా హీనుని యా ప్రయత్నము ఉత్తమునకు నాధిక్యమునే సూచించును, అదెట్లనగా- వివేకవంతుఁడు తన చేష్టలతోఁ తనే తన హానిని సూచించునట్టి. తనతో పోటీ పడిన హీనునకు గొప్ప యవమానమునే కల్పించును. దమయన్తినిఁ బడయ గోరి, నలుని వేషమును దాల్చిన యిన్ద్రాదుల దుశ్చర్య కడకు నలునికే గొప్ప యుత్కర్షను కల్పించినది. అందువలన నలునిచే వారి కవమాన మేర్ప డుట యుక్తమే యైనది. ॥౫౦॥

శ్లో. గీర్దేవతాగీతయశః ప్రశస్తిః
శ్రియా తటిత్వల్లలితాభినేతా.
ముదా సదాఽవైక్షత కేశవస్తం
స్వయంవరాఽడమ్బర మమ్బరస్థః॥ 51

ప.వి: గీర్దేవతాగీత యశః ప్రశస్తిః - శ్రియా - తటిత్వల్లలితాఽభినేతా - ముదా- తదా- అవైక్షత- కేశవః- తం- స్వయంవరాడమ్బరమ్- అమ్బరస్థః.

అర్థము: తదా = ఆ సమయమునందు, కేశవః = విష్ణువు, గీర్దేవతాగీతయశః ప్రశస్తిః - గీర్దేవతా = వాగ్దేవిచే, గీత = పాడఁబడిన, యశఃప్రశస్తిః = కీర్తికి సంబంధించిన గ్రంథము గలవాడై, శ్రియా = తన శరీరమందున్న లక్ష్మీదేవితో, తటిత్వల్లలితాఽభినేతాసన్;- తటిత్వాన్ = మెఱపుతీగెతో కూడిన మేఘముయొక్క, లలిత = విలాసమును, అభినేతాసన్ = అనుకరించుచున్న వాఁడై, అమ్బరస్థః = ఆకసమందున్నవాడై, తం = ఆ, స్వయంవరాడమ్బరం = స్వయంవర సభయొక్క సంబరమును, ముదా = సంతోషముతో, అవైక్షత = చూచెను. ఇఁక నితరులు చూచిరని చెప్పనవసర మేల? అనగా లక్ష్మీసరస్వతులతోఁ గూడి నారాయణుఁడు స్వయంవరమునుఁ జూడ వచ్చెనని యర్థము.

**సమాసములు :**

గీర్దేవతాగీతయశః ప్రశస్తిః :- గీరేవ దేవతా = గీర్దేవతా, గీర్దేవతయా గీతా = గీర్దేవతాగీతా, యశసః ప్రశస్తిః = యశఃప్రశస్తిః, గీర్దేవతా గీతా యశః ప్రశస్తిః యస్య సః = గీర్దేవతాగీత యశఃప్రశస్తిః.

తటిత్వల్లలితాభినేతా :- తటిత్ అస్య అస్తీతి = తటిత్వాన్, తటిత్వతః లలితం = తటిత్వల్లలితం, తటిత్వల్లలితస్య అభినేతా = తటిత్వల్లలితాభినేతా.

స్వయంవరాడమ్బరం :- స్వయంవరస్య ఆడమ్బరః = స్వయంవరాడమ్బరః, తమ్ = స్వయంవరాడమ్బరమ్.

అమ్బరస్థః :- అమ్బరే తిష్ఠతీతి = అమ్బరస్థః

**భావము :**

ఆ సమయమందు వాగ్దేవిచే గానము చేయఁబడిన తన యశస్సునకు సంబంధించిన ప్రశస్తి గలవాడై, లక్ష్మితోడ మెఱపుతీగెతోఁ గూడిన మేఘము యొక్క విలాసము ననుకరించుచు శ్రీ మహావిష్ణువు ఆకసమునందుండి సంతసముతో నా స్వయంవర మహోత్సవమునుఁ దిలకించెను. అనగా లక్ష్మీసరస్వతులతోఁ గూడి శ్రీ మహావిష్ణువు గూడ నా స్వయంవరమునకు వచ్చెనింక యితరులను తక్కినవారు వచ్చెనని చెప్ప నవసరము లేదు. ॥౫౧॥

శ్లో. అష్టౌ తదాఽష్టాసు హరిత్సు దృష్టీః
సదో దిదృక్షుర్నిదిదేశ దేవః।
లైఙ్గీం మదృష్ట్వాఽపి శిరశ్శ్రియం యో
దృష్టౌ మృషావాదితకేతకీకః॥ 52

ప.వి. అష్టౌ- తదా- అష్టాసు- హరిత్సు- దృష్టీః- సదః- దిదృక్షుః- నిదిదేశ- దేవః- లైఙ్గీమ్- అదృష్ట్వా- అపి- శిరశ్శ్రియం- యః- దృష్టౌ- మృషావాదితకేతకీకః.

అర్థము: తదా=ఆ కాలమందు, సదః=స్వయంవర సభను, దిదృక్షుః = చూడఁ గోరినవాఁడై, ఆగతః = వచ్చిన, దేవః = బ్రహ్మదేవుఁడు (నలువ), అష్టాసు = ఎనిమిదైన, హరిత్సు =దిక్కుల యందు, అష్టౌ=ఎనిమిదైన, దృష్టీః=నేత్రములను, నిదిదేశ=పంపెను. యః = ఏ నలువ, లైఙ్గీం= జ్యోతిర్లిఙ్గమునకు సంబంధించిన, శిరఃశ్రియం=లిఙ్గమునకు నుత్తరావధి లోని శిరఃకాన్తిని, అదృష్ట్వాపి=చూడకుండియు, దృష్టౌ= లిఙ్గశిరోదర్శన విషయమున, మృషావాదితకేతకీకః; మృషావాదిత= బొంకును పలుకు నదిగ చేయఁబడి, కేతకీకః=మొగలిపూవు గలవాఁడై యుండెను.

**సమాసములు :**

దిదృక్షుః :- ద్రష్టు మిచ్ఛుః = దిదృక్షుః.
లైఙ్గీమ్ :- లిఙ్గస్య ఇయం=లైఙ్గీ, తామ్ =లైఙ్గీమ్.
శిరశ్శ్రియమ్ :- శిరసః శ్రీః=శిరఃశ్రీః, తామ్=శిరఃశ్రియమ్.
మృషావాదితకేతకీకః :- మృషా వదతీతి=మృషావాదినీ, మృషావాదినీ కృతా=మృషావాదితా. మృషావాదితా కేతకీ యస్య సః=మృషావాదితకేతకీకః.

**భావము :**

ఆ సమయమున, స్వయంవరసభను వీక్షించుటకై చతుర్ముఖుఁడును విచ్చేసెను. అతఁడు అష్టదిక్కులనుండి విచ్చేసిన జనులనుఁ జూచుటకై తన నాలుగు మోములయందలి యెనిమిది నేత్రములను ప్రసరింపఁజేసెను. ఆ బ్రహ్మ

దేవుడు శివుని జ్యోతిర్లింగముయొక్క యుత్తర భాగమందలి శిరశ్శోభనుఁ జూచుటకై వెళ్ళి, దానినిఁ జూడకయే చూచినట్లు చెప్పుచు దానికి శివుని శిరము నుండి పడిన మొగలిపూవును సాక్షిగా నుంచెను. ఆ మొగలిపూవు శివుని జ్యోతిర్లింగముయొక్క శిరోభాగమందున్న నన్ను బ్రహ్మ చూచి తెచ్చె నని యస త్యమునుఁ బల్కెను. పూర్వము బ్రహ్మ శివుని జ్యోతిర్లింగముయొక్క శిరస్సును చూచెద నని విష్ణువుతో పందెము వేసుకొని వెళ్ళి, దానిని చూడకయే చూచి తినని చెప్పి దానిని బలపఱచుకొనుటకై శివుని శిరమందలి మొగలిపూవును సాక్షిగా నుంచె నను పురాణ కథ యిచ్చట ననుసంధేయము. అట్లగా బ్రహ్మ శివుని జ్యోతిర్లింగపు టుత్తరభాగము నెట్లు చూడజాలకపోయెనో, అట్లే బ్రహ్మ స్వయంవరమునకు విచ్చేసిన జన సముద్రమును నెనిమిది నేత్రములతో జూచు చున్నను జూడజాలకపోయె నని యాశయము. ॥౫౨॥

శ్లో. ఏకేన పర్యక్షిపదాత్మనాఽద్రిం
చక్షుర్మురారే రభవత్ పరేణ।
తై ర్ద్వాదశాత్మా దశభిస్తు శేషై
ర్దిశో దశాలోకత లోకపూర్ణాః॥ 53

ప.వి. ఏకేన- పర్యక్షిపత్- ఆత్మనా- అద్రిం- చక్షుః- మురారేః- అభవత్- పరేణ- తైః- ద్వాదశాత్మా- దశభిః- తు- శేషైః- దిశః- దశ- ఆలోకత- లోకపూర్ణాః.

అర్థము: ద్వాదశాత్మా=సూర్యుఁడు, ఏకేన=ఒక, ఆత్మనా=రూపముచే, అద్రిం= మేరుపర్వతమును, పర్యక్షిపత్=ప్రదక్షిణముఁగావించెను. పరేణ=మఱి యొక, ఆత్మనా=రూపముచే, మురారేః=విష్ణువుయొక్క, చక్షుః=నేత్రము (వలకన్ను)గా, అభవత్=ఆయెను, శేషైః=మిగిలిన, దశభిః=పదియైన, తైః=ఆ యాత్మలచే, లోకపూర్ణాః =జనులచేనిండిన, దశ=పదియైన, దిశః=దిక్కులను, ఆలోకత=చూచెను.

**సమాసములు :**

ద్వాదశాత్మా- ద్వాదశ ఆత్మానః యస్య సః =ద్వాదశాత్మా.
లోకపూర్ణాః :- లోకైః పూర్ణాః=లోకపూర్ణాః, తాః =లోకపూర్ణాః.

**భావము :**

ద్వాదశరూపములు గల్గిన సూర్యుఁడు ఒక్క రూపముచే మేరుపర్వతమునుఁజుట్టుచున్నాఁడు. మఱి యొక రూపముతో విష్ణువునకు వలకన్నుగా నున్నాడు. తక్కిన పది రూపములతో, జనులతో నిండిన పది దిక్కులనుఁ చూచుచున్నాఁడు ॥౫౩॥

శ్లో. ప్రదక్షిణం దైవతహర్మ్యమద్రిం
స దైవ కుర్వన్నపి శర్వరీశః।
ద్రష్టా మహేన్ద్రానుజదృష్టిమూర్త్యా
న ప్రాప తద్దర్శన విఘ్నతాపమ్॥ 54

ప.వి. ప్రదక్షిణం - దైవతహర్మ్యమ్ - అద్రిం - సదా - ఏవ-కుర్వన్ - అపి- శర్వరీశః- ద్రష్టా- మహేన్ద్రానుజ దృష్టిమూర్త్యా- న- ప్రాప- తద్దర్శన విఘ్నతాపమ్.

అర్థము: శర్వరీశః=రాత్రికిపాలకుఁడైన చంద్రుఁడు, దైవతహర్మ్యమ్=దేవతలకు వాసగృహమైన, అద్రిం=మేరువును, సదైవ=ఎల్లప్పుడు, ప్రదక్షిణం=ప్రదక్షిణమును, కుర్వన్నపి=చేయుచున్నను, మహేన్ద్రానుజదృష్టిమూర్త్యా; మహేన్ద్రానుజ=మహేన్ద్రునిసోదరుఁడగు మహేన్ద్రుని యొక్క, దృష్టిమూర్త్యా=నేత్రశరీరముతో, అనగా నెడమకన్నుతో, ద్రష్టాసన్ = చూచుచున్నవాఁడై, తద్దర్శనవిఘ్నతాపమ్; తత్ = ఆ స్వయంవరమును, దర్శన=దర్శించుటకైన, విఘ్న=విఘ్నమువలన, తాపం=సంతాపమును, నప్రాప=పొందలేదు. అనగా చంద్రుఁడు రాకపోయినను, విష్ణువు వచ్చుటవలన నాతనియెడమ కన్నుగా తానును వచ్చెనని యర్థము.

**సమాసములు :**

దైవతహర్మ్యమ్:- దైవతానాం హర్మ్యం -దైవతహర్మ్యమ్. త.త్=దైవతహర్మ్యమ్.

శర్వరీశః; శర్వర్యాః ఈశః=శర్వరీశః

మహేన్ద్రానుజదృష్టిమూర్త్యా:- మహేన్ద్రస్య అనుజః = మహేన్ద్రానుజః, మహేన్ద్రానుజస్యదృష్టిః-మహేన్ద్రానుజదృష్టిః, మహేన్ద్రానుజ దృష్టిరేవ మూర్తిః=మహేన్ద్రానుజ దృష్టిమూర్తిః తయా = మహేన్ద్రానుజదృష్టి మూర్త్యా.

తద్దర్శనవిఘ్నతాపమ్: తస్య దర్శనం=తద్దర్శనమ్, తద్దర్శనే విఘ్నః= తద్దర్శనవిఘ్నః, తద్దర్శనవిఘ్నే తాపః = తద్దర్శనవిఘ్నతాపః, తమ్= తద్దర్శనవిఘ్నతాపమ్.

**భావము :**

చంద్రుడు ఎల్లప్పుడును దేవతలకు నివాసగృహ మైన మేరుపర్వతమును చుట్టుచున్నను, విష్ణువునకు నెడమకన్నుగా నుండి స్వయంవరమునుఁ జూడఁ గల్గినందువలన, నతఁడు రాకపోయినను, విష్ణువు వచ్చుటవలన నతని యెడమ కన్నుగాఁ దాను వచ్చినవాడై, రాజాలకపోతి నను సంతాపమును వహింప లేదు. ॥౫౪॥

శ్లో. విలోకమానా వరలోక లక్ష్మీం
తాత్కాలికీ మప్సరసో రసోత్కాః।
జనాంబుధౌ తత్ర నిజాననాని
వితేను రమ్భోరుహ కాననాని॥ **55**

ప.వి. విలోకమానాః - వరలోకలక్ష్మీం- తాత్కాలికీమ్- అప్సరసః- రసోత్కాః- జనాంబుధౌ-తత్ర- నిజాననాని- వితేనుః- అమ్భోరుహ కాననాని.

**అర్థము:** రసోత్కాః; రస=స్వయంవరముచూచుట యందలి యనురాగముచే, ఉత్కాః=ఉత్సాహముగల్గిన, తాత్కాలికీం = ఆసమయమందేర్పడిన, వరలోకలక్ష్మీమ్; వరలోక=వరించెడిజనముయొక్క, లక్ష్మీం=శోభను, విలోకమానాః=చూచుచున్న, అప్సరసః=అప్సరసలు, తత్ర=ఆ, జనామ్బుధౌ=జను లనెడి సముద్రమందు, నిజాననాని=తమ ముఖములను, అమ్భోరుహకాననాని=పద్మవనములుగా, వితేనుః=చేసిరి. అనగా నప్స రసలు సైతముస్వయంవరసభనుఁ జూడనేతెంచి రని యర్థము.

**సమాసములు :**

పరలోకలక్ష్మీమ్: పరా ఏవ లోకః=పరలోకః. పరలోకస్య లక్ష్మీః= పరలోకలక్ష్మీః, తాం=పరలోకలక్ష్మీమ్.

తాత్కాలికీమ్: స చాఽసౌ కాలశ్చ=తత్కాలః, తత్కాలే భవా=తాత్కాలికీ, తామ్=తాత్కాలికీమ్,

రసోత్కాః : రసేన ఉత్కాః=రసోత్కాః.

నిజాననాని : నిజాని చ తాని ఆననానిచ=నిజాననాని, తాని=నిజాననాని,

అమ్భోరుహకాననాని: అమ్భోరుహాణాం కాననాని=అమ్భోరుహకాననాని, తాని=అమ్భోరుహకాననాని,

**భావము :**

స్వయంవరమును దర్శింపఁగోరిన యప్సరసలు, దమయన్తిని వరించుటకై యటకు విచ్చేసిన వరుల శోభనుఁ జూచుచున్నవారై తమ ముఖములను, స్వయంవరమునకు వచ్చిన జనసమూహ మను సముద్రమునందు పద్మవనమునుఁ గావించిరి. అనగా నప్సరసల ముఖములు పద్మములను పోలియుండిన దని యాశయము. ॥౫౫॥

**శ్లో. న యక్షలక్షైః కిమలక్షి నో సా**
**సిద్ధైః కిమధ్యాసి సభాఽప్తశోభా।**
**సా కిన్నరైః కిం న రసాదసేవి**
**నాఽదర్శి హర్షేణ మహర్షిభిశ్చ॥ 56**

ప.వి. న- యక్షలక్షైః- కిమ్- అలక్షి- నో- సా- సిద్ధైః- కిమ్- అధ్యాసి- సభా- ఆప్తశోభా- సా- కిన్నరైః- కిం- న- రసాత్- అసేవి- న- అదర్శి -హర్షేణ- మహర్షిభిః- చ.

అర్థము: సభా=అప్పుడు, ఆప్తశోభా; ఆప్త=పొందఁబడిన, శోభా=కాన్తిగల్గిన, సా=ఆ సభ, యక్షలక్షైః=లక్షలకొలఁది యక్షులచేతను, నాలక్షికిమ్= చూడఁబడలేదా యేమి? సిద్ధైః=సిద్ధులచేత, నాఽధ్యాసికిమ్=అధిష్ఠింపఁబడ

లేదా? కిన్నరైః=కిన్నరులచేత, సా=ఆ సభ, నాఽ సేవికిమ్=సేవింపఁబడ లేదాయేమి ? మహర్షిభిశ్చ=మహర్షులచేతను, హర్షేణ = సంతోషముతో, నాదర్శికిమ్=దర్శింపఁబడలేదా, అనగా నాసభనుయక్షసిద్ధకిన్నరమహ ర్షులందఱును దర్శించిరని యర్థము.

**సమాసములు :**

యక్షలక్షైః : యక్షాణం లక్షాః=యక్షలక్షాః, తైః=యక్షలక్షైః.

ఆప్తశోభా : ఆప్తా శోభా యయా సా=ఆప్తశోభా.

**భావము :**

పెక్కింద్రతో శోభించుచున్న యా సభకు లక్షలకొలఁది యక్షులు, సిద్ధులు, కిన్నరులు, మహర్షులు విచ్చేసిరి, ॥౫౬॥

**శ్లో. వాల్మీకి రశ్లాఘత తామనేక**
**శాఖాత్రయీభూరుహరాజిభాజా।**
**క్లేశం వినా కణ్ఠపథేన యస్యా**
**దైవీ దివః ప్రాగ్భువమాగమత్ వాక్॥ 57**

ప.వి. వాల్మీకిః- అశ్లాఘత- తామ్- అనేకశాఖాత్రయీభూరుహరాజిభాజా- క్లేశం- వినా- కణ్ఠపథేన- యస్య- దైవీ- దివః- ప్రాక్- భువమ్- ఆగమత్- వాక్.

అర్థము: తామ్=ఆ సభను, వాల్మీకిః=వాల్మీకిమహర్షి, అశ్లాఘత=కొనియాడెను. అనేకశాఖాత్రయీభూరుహరాజిభాజా; అనేకశాఖా=అశ్వలాయనాద్యనేక శాఖలతోఁడను, (పెక్కు-కొమ్మలతోఁడను) గూడిన, త్రయీ=ఋగ్యజు స్సామరూపములగు మూడువేదములనఁబడు, భూరుహరాజి=వృక్ష పఙ్క్తిని భాజా=పొందిన, అనగా బాటసారులకు నీడ నిచ్చెడి చెట్ల వరుసలతోఁ గూడిన, యస్య=ఏ వాల్మీకియొక్క, కణ్ఠపథేన=కణ్ఠమార్గ ముచే, అనగా కణ్ఠ మను మార్గముచే, దైవీ=దేవసంబంధముగల్గిన, అనగా ఛన్దోమయ మైన, వాక్=వాక్కు, అనగా సరస్వతి, క్లేశం=వినా= కష్టములేక, దివః=స్వర్గమునుండి, ప్రాక్=తొలుత, భువం=భూలోక

మును, ఆగమత్ = పొందినది. ఛందోబద్ధ మైన వాక్కును భూలో కమునకుఁదొలుత ప్రవేశపఱచిన వాల్మీకియు నాసభనుఁ గొనియాడె నని యర్థము.

**సమాసములు :**

అనేకశాఖాత్రయీ భూరుహరాజిభాజా:- త్రయాణాం సమాహారః-త్రయీ, అనేకాః శాఖాః యస్యాస్సా= అనేకశాఖా, అనేకశాఖాచ సా త్రయీ చ=అనేకశాఖాత్రయీ, భూరుహాణాం రాజిః =భూరుహరాజిః, అనేకశాఖా త్రయ్యేవ భూరుహరాజిః = అనేకశాఖాత్రయీభూరుహరాజిః, అనేక శాఖాత్రయీభూరుహరాజిం భజతీతి = అనేకశాఖాత్రయీ భూరుహరాజి భాక్. లేన = అనేకశాఖాత్రయీ భూరుహరాజిభాజా,

కణ్ఠపథేన:- కణ్ఠ ఏవ పన్థాః -కణ్ఠపథః. తేన=కణ్ఠపథేన

**భావము :**

వాల్మీకిమహర్షి గూడ సభకు వచ్చి దానిని కొనియాడెను. ఆశ్వలాయ నాద్యనేకశాఖలతోఁ గూడిన ఋగ్యజుస్సామరూపము లగు మూడు వేదము లనెడి వృక్షపఙ్క్తులతో నాతని కణ్ఠమార్గము శోభించుచున్నది. అట్టికణ్ఠమార్గము నుండి తొట్టతొలుత ఛన్దోబద్ధ మైన సరస్వతిని అనగా వాక్కును భూలోకము నకు వాల్మీకిమహర్షి యవతరింపఁజేసెను ॥౫౭॥

**శ్లో. ప్రాశంసి సంసత్ గురుణాఽపి చార్వీ**
**చార్వాకతాసర్వవిదూషకేణ।**
**ఆస్థానపట్టం రసనాం యదీయాం**
**జానామి వాచామధిదేవతాయాః॥ 58**

ప.వి. ప్రాశంసి– సంసత్- గురుణా-అపి- చార్వీ- చార్వాకతాసర్వవిదూషకేణ -ఆస్థానపట్టం- రసనాం- యదీయాం– జానామి- వాచామ్– అధిదేవ తాయాః.

అర్థము: చార్వీ– రమ్యమైన సంసత్=సభ, చార్వాకతా సర్వవిదూష కేణ, చార్వాకతా–చార్వాకత్వముచే, అనగా నాస్తికత్వముచే, సర్వ

విదూషకేణ=వేదము మున్నగు సకలశాస్త్రములను ఖణ్డించెడి, గురుణాఽపి=నాస్తికశాస్త్రమును ప్రవర్తింపఁ జేసెడి బృహస్పతిచేతను, ప్రాశంసి= కొనియాడఁబడినది. (అన్యైః=ఇతరులచే, కిముత= కొనియాడఁబడినదనిచెప్పనేల?) యదీయాం=ఎవనికి సంబంధించిన, అనగా ఏ బృహస్పతికి సంబంధించిన, రసనాం=నాలుకను, వాచామ్=వాక్కులకు, అధిదేవతాయాః=అధిదేవతయైన సరస్వతికి, ఆస్థానపట్టం=ఆస్థాన మంచలిపీఠముగా, జానామి=తెలుసుకొనుచున్నాను.

## సమాసములు :

చార్వాకతా సర్వవిదూషకేణః- చార్వాకస్య భావః=చార్వాకతా, సర్వస్య విదూషకః=సర్వవిదూషకః, చార్వాకతయా సర్వవిదూషకః= చార్వాకతాసర్వవిదూషకః. తేన=చార్వాకతాసర్వవిదూషకేణ.

## భావము :

రమణీయ మైన యా స్వయంవరసభను, నాస్తికశాస్త్రమును ప్రవర్తింపఁ జేసినఁ బృహస్పతి యను మహాపణ్డితుఁడు గూడ, చాల ప్రశంసించెను. ఆతడు వేదములు మున్నగు సకలశాస్త్రములను ఖండించిన మహాప్రతిభాశాలి. ఆతని నాలుక సరస్వతీదేవికి సింహాసనమై యున్నది. బృహస్పతి వంటి ప్రతిభాశాలియే యాసభను మెచ్చినందువలన, దాని యాధిక్యము వెల్లడి యగుచున్నది ॥౫౭॥

శ్లో. నాకేఽపి దీవ్యత్తమదివ్యవాచి
వచః స్రగాచార్యకవిత్ కవిర్యః।
దైతేయనీతేః పథి సార్థవాహః
కావ్యః స కావ్యేన సభామభాణీత్॥ 59

ప.వి. నాకే- అపి- దీవ్యత్తమ దివ్యవాచి- వచః స్రగాచార్యకవిత్- కవిః- యః- దైతేయనీతేః- పథి- సార్థవాహః- కావ్యః- సః-కావ్యేన-సభామ్- అభాణీత్.

అర్థము: యః=ఏ, కావ్యః=శుక్రాచార్యుఁడు, దీవ్యత్తమ దివ్యవాచి; దీవ్యత్తమ= మిక్కిలి ప్రకాశించెడి, దివ్యవాచి = సంస్కృతము మున్నగు దైవ

వాక్కులు గల నాకేఽపి=స్వర్గమందును, వచః స్రగాచార్యకవిత్;వచః= మాటలయొక్క, స్రక్=మాలలను కట్టుటయందు, ఆచార్యక=ఉపదేశమును, విత్=తెలిసిన, కవిః=స్వయముగా కవియునైన, దైతేయనీతేః: దైతేయ=రాక్షసులయొక్క, నీతేః=నీతిశాస్త్రమునకు సంబంధించిన,పథి= మార్గమునందు, సార్థవాహః=మార్గదర్శకుడైన, సః=కావ్యుడైన శుక్రాచార్యుడు, కావ్యేన=గ్రంథముతో, సభాం=ఆ స్వయంవరసభను, అభాణీత్= వర్ణించెను. అనగా కవి యగుశుక్రాచార్యుడు, ఆ సభను వర్ణించుటకై గ్రంథమునే రచియించెను.

## సమాసములు :

దీవ్యత్తమదివ్యవాచి :- దివ్యాశ్చ తాః వాచశ్చ=దివ్యావాచః, అతిశయేన దీవ్యన్త్యః= దీవ్యత్తమాః, దీవ్యత్తమాః దివ్యవాచః యస్మిన్ సః=దీవ్యత్తమదివ్యవాక్, తస్మిన్=దీవ్యత్తమదివ్యవాచి.

వచఃస్రగాచార్యకవిత్:- వచసాం స్రక్=వచః స్రక్, వచస్రజామాచార్యకమ్ = వచఃస్రగాచార్యకం, వచస్రగాచార్యకం వేత్తీతి=వచః స్రగాచార్యకవిత్.

దైతేయనీతేః :- దితేః అపత్యాని పుమాంసః=దైతేయాః, దైతేయానాం నీతిః=దైతేయనీతిః, తస్యాః=దైతేయనీతేః।

సార్థవాహః :- సార్థం వహనీతి=సార్థవాహః. కావ్యః=కవేః అపత్యం పుమాన్=కావ్యః.

కావ్యేన :- కవేః కర్మ=కావ్యమ్. తేన=కావ్యేన

## భావము :

స్వర్గమున సంస్కృతాది దేవభాషలు దేదీప్యమానములుగా నుండును. అట్టి స్వర్గమందును, వాక్కు లనెడి పుష్పములతో మాలికలను కట్టుటలోను, కావ్య రచనను నేర్పుటలోను నాచార్యస్థాన మలఙ్కరించినవాడును, దితిపుత్రులగు రాక్షసుల నీతికి మార్గదర్శకుడు నైన శుక్రాచార్యుడు, స్వయంవరసభను రమ్యముగా వర్ణించునట్టి కావ్యమును రచియించెను ॥౫౯॥

శ్లో, అమేలయత్ భీమనృపః పరం న
నాకర్షదేతాన్ దమనస్వసైవ।
ఇదం విధాతాఽపి విచిత్య యూనః
స్వశిల్ప సర్వస్వమదర్శయన్నః॥ 60

ప.వి. అమేలయత్ - భీమనృపః - పరం - న - న - ఆకర్షత్ - ఏతాన్, దమనస్వసా- ఏవ- ఇదం- విధాతా- అపి- విచిత్య- యూనః-స్వశిల్ప సర్వస్వమ్- అదర్శయత్- నః.

అర్థము: ఏతాన్=ఈ స్వయంవరసభయందలి, యూనః=యువకులను, భీమనృపః కేవలం=భీమరాజుమాత్రమే, న అమేలయత్=స్వయంవరమునకై యొకచోట చేర్చలేదు. (తథా=అట్లు) దమనస్వసైవ=దమనుని చెల్లెలైన దమయన్తిమాత్రమే, నాఽఽకర్షత్=ఆకర్షింపలేదు. కిన్తు = మరేమనగా, విధాతాఽపి=బ్రహ్మయు, విచిత్య=ఒకచోటచేర్చి; ఇదం= ఎదుటనున్న యువకులరూపముతోనున్న, స్వశిల్పసర్వస్వం=తన శిల్పమందలి సర్వస్వమును, అనగా తననిర్మాణకౌశల సంపదసంతతిని, నః=మనకు, అదర్శయత్ = చూపెను.

వి. ఈ స్వయంవరమణ్డపమున యువకుల సమ్మేళనము, కేవలమొక్క దానితోఁ గాక, భీమరాజప్రయత్నముచేతను, దమయన్తి సౌందర్య సంపదచేతను, బ్రహ్మయొక్క తననిర్మాణచాతురిని వెల్లడింప కుతూహలముచేతను, జరుగకపోయినను, జరిగినట్లు చెప్పుటచే నిది యుత్ప్రేక్ష. వ్యఞ్జకమునుఁ బ్రయోగింపనందువలన నిది గమ్యము.

**సమాసములు :**

భీమనృపః :- భీమ ఇతి నృపః=భీమనృపః.

దమనస్వసా:- దమనస్య స్వసా=దమనస్వసా

స్వశిల్పసర్వస్వమ్:- స్వస్య శిల్పం=స్వశిల్పమ్. సర్వం చ తత్ స్వం చ =సర్వస్వమ్, స్వశిల్పస్య సర్వస్వమ్ =స్వశిల్పసర్వస్వమ్.

**భావము :**

స్వయంవరమణ్డపమందు దమయన్తిని వరించుటకై యువకులనుఁ జేర్చి నది కేవలము భీమరాజును గాదు, కేవలము దమయన్తియొక్క సౌందర్యమును గాదు. మరేమనగా-బ్రహ్మ యంద మైన యువకబృందమును నొకచోటఁ జేర్చి యట్టి యందగాండ్రను సృజించుటలోని తన నేర్పును, మనకుఁ జూపుటయే వీరిని సమాయత్తపఱచుటలో ముఖ్యకారణము. ॥౬౦॥

శ్లో॥ ఏకాకిభావేన పురా పురారి
ర్యః పఞ్చతాం పఞ్చశరం నినాయ।
తద్భీసమాధానమముష్య కాయ
నికాయలీలాః కిమమీ యువానః॥ **61**

ప.వి. ఏకాకిభావేన- పురా- పురారిః- యః- పఞ్చతాం- పఞ్చశరం- నినాయ- తద్భీసమాధానమ్- అముష్య- కాయనికాయలీలాః- కిమ్- అమీ- యువానః-

అర్థము: యః=ఏ, పురారిః =శివుఁడు, ఏకాకిభావేన= మన్మథుడు, సహాయ రహితుఁడగుటవలన (ఒక్కఁడే యగుటవలన), పఞ్చశరం = మన్మథుని, పఞ్చతాం=భౌతికశరీరమును తమ తమ పాఞ్చభౌతికాంశములయందు లయింపఁజేయుట యను మరణమును, నినాయ=పొందించెనో, అమీ=ఈ, యువానః=యువకులు, అముష్య=ఈమన్మథునికి, తద్భీ సమాధానమ్; తత్=ఆ శివునివలని, భీ=భయమునకు, సమాధానం=నివారకమైన, కాయ నికాయలీలాః కిమ్?; కాయ=మన్మథుని శరీరముల యొక్క, నికాయ= సమూహముయొక్క, అనగా యోగశక్తిచే నేర్పడు కాయవ్యూహము యొక్క, లీలాః కిమ్=విలాసములా యేమి?

వి. మన్మథుఁడు కాయవ్యూహశక్తిచే నింతమంది యువకుల శరీరములను ధరించి, పెక్కండ్రుగా కాకపోయినను, అయినట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష.

**సమాసములు :**

ఏకాకిభావేన:- ఏకాకినః భావః=ఏకాకిభావః, తేన=ఏకాకిభావేన.

పురారి:- పురాణామరిః=పురారిః.

పఞ్చతామ్:- పఞ్చానాం భావః=పఞ్చతా, తామ్=పఞ్చతామ్.

పఞ్చశరం:- పఞ్చ శరాః యస్య సః=పఞ్చశరః, తమ్=పఞ్చశరమ్.

తద్భీసమాధానం:- తస్మాత్ భీః=తద్భీః, తద్భియః సమాధానం=తద్భీ సమాధానం.

కాయనికాయలీలాః:- కాయానాం నికాయః = కాయనికాయః. కాయని కాయస్య లీలాః=కాయనికాయలీలాః

**భావము :**

మన్మథుఁడు సహాయము లేక యొంటరిగా నుండుటవలన పరమశివుడు వానిని పఞ్చత్వమును అనగా పఞ్చభూతములయందు తనయంశములను లయింపఁజేయుట యను మరణమును పొందించెను. అందువలన నతని వలన ననగా శివునివలన నట్టి భయముఁ దొలగుటకై యా మన్మథుఁడుతాను కాయవ్యూహ విద్యచే నీ యువకుల రూపమును వహించె ననియు, నావిద్యా విలాసమే యీ యువకు లనియు నాశయము ॥౬౧॥

> శ్లో. పూర్ణేన్దుబిమ్బా ననుమానభిన్నా
> నస్థాపయత్ క్వాపి నిధాయ వేధాః।
> తైరేవ శిల్పీ నిరమాదమీషాం
> ముఖాని లావణ్యమయాని మన్యే॥ 62

వ.వి:- పూర్ణేన్దుబిమ్బాన్- అనుమానభిన్నాన్- అస్థాపయత్- క్వ- అపి- నిధాయ- వేధాః- తైః- ఏవ- శిల్పీ, నిరమాత్, అమీషాం- ముఖాని- లావణ్యమయాని- మన్యే.

అర్థము: శిల్పీ=నిర్మాణమందు నేర్పరియైన, వేధాః=బ్రహ్మ. అనుమాన= ప్రతిమానము, భిన్నాన్=వేఱువేఱైన, పూర్ణేన్దుబిమ్బాన్ = లెక్కలేని పూర్ణ చంద్రమండలములను, క్వాపి=ఒకానొకచోట, నిధాయ=ఉంచి,

అస్థాపయత్=స్థాపించి రక్షించెను. (అథ=పిదప), తై రేవ = ఆ పూర్ణ చన్ద్రమండలములచేతనే, అమీషాం = ఈ యువతులయొక్క, లావణ్యమయాని=సౌందర్యమయములైన, ముఖాని=ముఖములను, నిరమాత్=నిర్మించెను. (ఇతి=అని) మన్యే=తలంతును.

వి. యువతుల ముఖములను బ్రహ్మ సృష్టినుండి దాచియుంచిన పూర్ణచన్ద్రమండలములచే, సృజింపకపోయినను, సృజించునట్లుచెప్పుటచే నుత్ప్రేక్ష. 'మన్యే' అను వ్యఞ్జకమును బ్రయోగించుటవలన నది వాచ్యము.

**సమాసములు :**

పూర్ణేన్దుబిమ్బాన్ : పూర్ణేన్దూనాం బిమ్బాః = పూర్ణేన్దుబిమ్బాః; తాన్ = పూర్ణేన్దుబిమ్బాన్.

అనుమాసమ్ :- మాసి మాసి=అనుమాసమ్.

లావణ్యమయాని :- లావణ్యస్య వికారాః=లావణ్యమయాని; తాని= లావణ్యమయాని.

**భావము :**

సుందరములగు వస్తువులను సృజించుటయందు నేర్పరి యైన బ్రహ్మ యనాది యగు సృష్టినుండి, ప్రతిమాసము నుద్భవించెడు పూర్ణచన్ద్రమణ్డలముల నొకచోట దాచి యుంచి యా మణ్డలములచే, నీ యువతుల ముఖములను సృజించె నని తలంతును. కానిచో నింత సౌన్దర్య మెక్కడిది? ॥౬౨॥

**శ్లో. ముధార్పిత మూర్ధసు రత్నమేతై**
**ర్యన్నామ తాని స్వయమేత ఏవ।**
**స్వతః ప్రకాశే పరమాత్మబోధే**
**బోధాన్తరం న స్ఫురణార్థమర్థ్యమ్॥ 63**

ప.వి. ముధా- అర్పితం- మూర్ధసు- రత్నమ్- ఏతైః- యత్- నామ- తాని- స్వయమ్- ఏతే- ఏవ- స్వతఃప్రకాశే- పరమాత్మబోధే- బోధాన్తరం- న- స్ఫురణార్థమ్- అర్థ్యమ్.

అర్థము : ఏతైః = ఈ రాజులచే, మూర్ధసు=తలలయందు, రత్నం=మణి, ముధా=వ్యర్థముగా, అర్పితం=ఉంచబడినది. యత్=ఏలయనగా, ఏతే= రాజులు, స్వయమేవ=తమంతటనే, తానినాను=ఆ రత్నములే గదా. అనగా సంతశ్రేష్ఠులు కాన రత్నధారణము వారి కవసరము లేదు. ఏలయనగా- స్వతఃప్రకాశే=స్వయముగాఁ బ్రకాశించెడి, పరమాత్మ బోధే=పరమాత్మ విషయకమైన బోధయందు, స్ఫురణార్థం = ఆ, జ్ఞానమునుఁ బ్రకాశపఱచుటకై, బోధాన్తరం=మఱియొక జ్ఞానము, అనగా ననువ్యవసాయమను జ్ఞానవిషయకజ్ఞానమున, న అర్థ్యమ్ = అపేక్షింపఁ దగినదిగాదు.

వి. రాజులే రత్నము లగుటవలన, వారిని భూషించుటకై రత్నము లనవసరములను ప్రకృత వాక్యార్థమునకును, స్వతఃప్రకాశముగల పరమాత్మ బోధకు బోధాన్తర మనవసర మను నప్రకృత వాక్యార్థమునకు బింబ ప్రతిబింబభావముండుట వలన దృష్టాన్తాలఙ్కారము.

**సమాసములు :**

పరమాత్మబోధే :- పరో మా యస్మాత్ స పరమః, పరమశ్చాసౌ ఆత్మా చ=పరమాత్మా, పరమాత్మనః బోధః= పరమాత్మబోధః, తస్మిన్ =పరమాత్మబోధే.

బోధాన్తరం :- అన్యః బోధః=బోధాన్తరం.

స్ఫురణార్థమ్ :- స్ఫురణాయ=స్ఫురణార్థమ్.

అర్థ్యమ్:- అర్థితుం యోగ్యం=అర్థ్యమ్.

స్వతఃప్రకాశే :- స్వతః ప్రకాశః యస్య సః=స్వతఃప్రకాశః, తస్మిన్ =స్వతఃప్రకాశే.

**భావము :**

ఆ స్వయంవరమునకు విచ్చేసిన రాజులందఱును తమ శిరముపై రత్నములను ధరించియున్నారు, కాని విచారించినచో, వారు రత్నములను ధరించుట వ్యర్థము. ఏల యనగా వా రాజులే రత్నములు. అనగా రత్నముల వలె

విలువ కలవారు. కాన రత్నములు రత్నములను ధరించుట యనవసరము గదా. అదెట్లనగా- లోకమున పరమాత్మ జ్ఞానము. స్వయం ప్రకాశమైనది. అట్టి జ్ఞానమును ప్రకాశపరచుటకై మంజీ యొక జ్ఞాన మనవసరము గదా. ॥౬౩॥

**శ్లో. ప్రవేక్ష్యతః సున్దరబృన్దముచ్చై**
**రిదం ముదా చేదితరేతరం తత్.**
**న శక్ష్యతో లక్షయితుం విభిన్నం**
**దస్రౌ సహస్రైరపి వత్సరాణాం॥ 64**

ప.వి. ప్రవేక్ష్యతః- సున్దరబృన్దమ్- ఉచ్చైః- ఇదం- ముదా- చేత్- ఇతరేతరం- తత్- న- శక్ష్యతః- లక్షయితుం- విభిన్నం- దస్రౌ- సహస్రైః-అపి- వత్సరాణాం.

అర్థము:- దస్రౌ=అశ్వినీకుమారులు, ఉచ్చైః=గొప్పదైన, ఇదం= ఈ, సున్దరబృన్దం=అందగాండ్ర సమూహమును, ముదా=కుతూహలముచే, ప్రవేక్ష్యతః చేత్ = లోపలఁ బ్రవేశింపఁగల్గినచో, తత్=అప్పుడు, విభిన్నం=కలిసిన, ఇతరేతరమ్=తమ తమ సోదరరూపమైన అన్యోన్యమును, వత్సరాణాం = సంవత్సరముల యొక్క, సహస్రైరపి= వేయింటి చేతను; లక్షయితుం = గుర్తించుటకు, నశక్ష్యతః=శక్తులు కాఁబోరు. అనగా నా సభయం దున్నవారందఱును, అశ్వినీకుమారులకు సమానులుగా నున్నారు. కాన వానిని భిన్నులుగాఁ గుర్తించుట యశ్వినీకుమారులకు నసాధ్యమగు నని యర్థము.

వి:- ఇచ్చట నశ్వినీ కుమారులకును, సుందరులగు నరపతులకు సౌన్దర్య గుణముచే నభేదము నాపాదించుటవలన సామాన్యాలఙ్కారము.

**సమాసములు:**

సున్దరబృన్దమ్:- సున్దరాణాం బృన్దః=సున్దరబృన్దః, తమ్=సున్దరబృన్దమ్.
ఇతరేతరమ్:- ఇతర మితరం ప్రతిష్ఠురిహారః, ఇతరేతరః. తమ్=ఇతరేతరం.

**భావము :**

అశ్వినీకుమారులు అందగాండ్రతో నిండిన స్వయంవరసభను ప్రవేశించినచో తర్వాత వారితో కలిసిపోయిన యీ యన్నదమ్ముల జంట యొకరి నొకరు గుర్తింపజాలరు. ఏల యనగా, సభామణ్డపమందలి రాజులందఱు నశ్వినీకుమారుల వలె నందచందములతోడను , రూపరేఖలతోడనుం గూడి యుండుటవలన, వారితో కలసిన యశ్వినీకుమారులు గూడ వారి వలెనే యుండుటవలన, నన్నదమ్ములైన వారిలో నన్న తమ్మునిఁగాని, తమ్ముడు అన్ననుఁ గాని గుఱుతింప లేరని భావము. అనగా సభయందు విచ్చేసిన రాజులందఱును సౌన్దర్యమున నశ్వినీకుమారులఁ బోలి యున్నారని యాశయము. ॥౬౪॥.

శ్లో. స్థితైరియద్భి ర్యువభిర్విదగ్ధై
ర్దగ్ధేఽపి కామే జగతః క్షతిః కా?
ఏకామ్బుబిన్దువ్యయమమ్బురాశేః
పూర్ణస్య కః శంసతి శోషదోషమ్॥ 65

ప.వి. స్థితైః- ఇయద్భిః- యువభిః- విదగ్ధైః-దగ్ధే- అపి- కామే- జగతః- క్షతిః- కా- ఏకామ్బుబిన్దువ్యయమ్- అమ్బురాశేః- పూర్ణస్య- కః- శంసతి-శోషదోషమ్.

అర్థము:- విదగ్ధై = గడుసరులైన వారును, (పరిహాసముఁబొందనివారును)స్థితైః =జీవించియున్న; ఇయద్భిః=ఇంతటి, యువభిః=యువకులతోఁగూడిన, జగతః=ప్రపఞ్చమునకు, కామే=మన్మథుడు, దగ్ధేఽపి=దగ్ధుఁడైనను, కా=ఏల, క్షతిః=హాని? ఎట్టి హానియులేదు. తథాహి=అదియుక్తమే. పూర్ణస్య=నిండిన, అమ్బురాశేః=సముద్రమునకు, ఏకామ్బుబిన్దువ్యయం ఏక=ఒక, అమ్బుబిన్దు=నీటిబొట్టుయొక్క, వ్యయం=వ్యయమును, కః= ఎవ్వరు, శోషదోషం=ఎండుజారుటయను దోషముగా, శంసతి=చెప్పును.

వి:— మన్మథుని బోలిన యింతమంది రాజు లున్నప్పుడు, మన్మథుఁ డొకడు దగ్ధుడయినందు వలన ప్రపంచమునకు హాని యేమి యను నుపమేయ

వాక్యార్థమునకు, పూర్ణమైన సముద్రమున కొక నీటిబొట్టు తగ్గినందు వలన శోషదోషమెవ్వఁడు చెప్పు నను నుపమానవాక్యార్థమునకును బిమ్బ ప్రతిబింబభావము జెప్పుటవలన దృష్టాన్తాలఙ్కారము.

**సమాసములు :**

ఏకామ్బు బిన్దు వ్యయమ్; అమ్బునః బిన్దుః = అమ్బు బిన్దు, ఏకశ్చాసౌ అమ్బు బిన్దుశ్చ = ఏకామ్బు బిన్దుః, ఏకామ్బు బిన్దోః వ్యయః=ఏకామ్బు బిన్దు వ్యయః, తమ్ = ఏకామ్బు బిన్దు వ్యయమ్.
శోషదోషమ్ :— శోష ఏవ దోషః = శోష దోషః రమ్ = శోష దోషమ్.

**భావము :**

గడుసుతనము సౌన్దర్యము గల్గి మన్మథునిఁ బోలిన యిందఱు రాజు లున్నప్పుడు, ఒక మన్మథుడు దగ్ధుడైపోయినందువలనఁ బ్రపంచమునకెట్టి హానియు లేదు. ఒక్క నీటిబొట్టు తగ్గినందువలన సముద్రమెండునా ? ॥౬౫॥

**శ్లో. ఇతి స్తువన్ హూహుక్కృతివర్గణాభి**
**ర్గన్ధర్వవర్గేణ స గాయతైవ.**
**ఓఙ్కారభూమ్నా పఠతైవ వేదాన్**
**మహర్షిబృందేన తథాఽన్వమాని॥ 66**

ప. వి. ఇతి - స్తువన్ - హూహుక్కృతివర్గణాభిః - గన్ధర్వ వర్గేణ - సః - గాయతా - ఏవ - ఓఙ్కార భూమ్నా - పఠతా - ఏవ — వేదాన్ - మహర్షి బృందేన - తథా - అన్వమాని.

అర్థము :— ఇతి = ఇట్లు, స్తువన్ = కొనియాడుతున్న, సః = ఆ, శుక్రాచార్యుఁడు, గాయతైవ = గానముచేయుచునేయున్న, గన్ధర్వవర్గేణ = గన్ధర్వ సంఘముచే, హూహుక్కృతి వర్గణాభిః; హూహుక్కృతి = హూహుక్కారముల యొక్క, వర్గణాభిః = ఆ వృత్తులచే, అన్వమాని = అనుమో

దింపఁబడెను. తథా = అట్లే, వేదాన్ = వేదములను, పఠతైవ = పఠించుచునేయున్న, మహర్షి బృన్దేన = మ హ ర్షు ల సంఘముచే, ఓఙ్కార భూమ్నా; ఓఙ్కార = ఓఙ్కారముల యొక్క, భూమ్నా = బాహుళ్యముచే, అన్వమాని = అనుమోదింపఁబడెను.

వి. గానముకొఱకైన హూఙ్కారము చేతను, వేద పఠనము కొఱకైన ఓఙ్కారముల చేతను శుక్రుని వాక్యము ననుమోదింపకపోయినను, ననుమోదించినట్లు చెప్పుటవలన ఉత్ప్రేక్ష. వ్యఞ్జకముసుఁ బ్రయోగింప నందువలన నది గమ్యము.

**సమాసములు :**

హూఙ్కృతి వర్గణాభిః : హూఙ్కృతీనాం వర్గణాః = హూఙ్కృతి వర్గణాః. తాభిః = హూఙ్కృతి వర్గణాభిః.
గన్ధర్వ వర్గేణ : గంధర్వాణాం వర్గః=గన్ధర్వ వర్గః, తేన = గన్ధర్వ వర్గేణ.
ఓఙ్కార భూమ్నా : బహోర్భావః = భూమా, ఓఙ్కారస్య భూమా = ఓఙ్కార భూమా, తేన = ఓఙ్కార భూమ్నా.
మహర్షిబృన్దేన :- మహర్షీణాం బృన్దః= మహర్షిబృన్దః, తేన = మహర్షి బృన్దేన.

**భావము :**

ఈ విధముగా శుక్రాచార్యుఁడు స్వయంవర ప్రశస్తిని రచియించి సభనుఁ బొగడుచుండగా, నొక వైపు గన్ధర్వులు తమ గానమునకు సంబంధించిన 'హూం' కారములతోఁడ నతని "ప్రశస్తిని" ననుమోదించిరి. అట్లే మఱియొకవైపు మహర్షులు తమ వేదపఠనమునకు సంబంధించిన 'ఓ'ఙ్కారవాదములచే ననుమోదించిరి. గానము చేయునపుడు 'హూం' 'హూం' నాదములు పరిపాటి. అట్లే వేదపాఠమునందు 'ఓం'కార నాదములు పరిపాటి. గన్ధర్వులును, మహర్షులును శుక్రాచార్యుని స్వయంవర ప్రశస్తి ననుమోదించి రని భావము. హూఙ్కార శబ్దము, ఓఙ్కార శబ్దము, అంగీకారవాచకములు. ॥౯౯॥

శ్లో. న్యవీవిశత్తానథ రాజసింహాన్
సింహాసనౌఘేషు విదర్భరాజః।
శృఙ్గేషు యత్ర త్రిదశైరివైభి
రశోభి కార్తస్వరభూధరస్య॥ 67

ప.వి. న్యవీవిశత్- తాన్- అథ- రాజసింహాన్- సింహాసనౌఘేషు- విదర్భ రాజః- శృఙ్గేషు- యత్ర- త్రిదశైః- ఇవ- ఏభిః- అశోభి- కార్తస్వరభూధరస్య.

అర్థము :- (అథ-పిదప) విదర్భరాజః-విదర్భదేశ ప్రభువైన, భీమరాజు, తాన్ =ఆ, రాజసింహాన్=రాజశ్రేష్ఠులను, సింహాసనౌఘేషు, సింహాసన = సింహాసనములయొక్క, ఓఘేషు =సమూహములయందు, న్యవీవిశత్ = కూర్చుండఁబెట్టెను. యత్ర = ఏ సింహాసనములయందు, ఏభిః = ఈ రాజసింహములచే, కార్తస్వరభూధరస్య = పసిడి కొండయొక్క, శృఙ్గేషు=శిఖరములయందు, త్రిదశైరివ=దేవతలవలె, అశోభి = శోభించుట (ఏర్పడినది).

వి. సింహాసనములయందలి రాజసింహములు, పసిడి కొండపై నెలకొనిన వేల్పులతోఁ బోల్చఁబడుటవలన నుపమాలఙ్కారము.

**సమాసములు :**

రాజసింహాన్ : రాజానః సింహా ఇవ = రాజసింహాః, తాన్ = రాజ సింహాన్.
సింహాసనౌఘేషు : సింహాసనానామోఘాః = సింహాసనౌఘాః, తేషు = సింహాసనౌఘేషు.
విదర్భరాజః : విదర్భాణాం రాజా = విదర్భరాజః.
త్రిదశాః : త్రిసః దశాః = యేషాంతే = త్రిదశాః, తైః =త్రిదశైః.
యద్వా - తృతీయాదశాయేషాన్తే = త్రిదశాః.
కార్తస్వర భూధరస్య:కృతస్వరే(ఆకరే) భవం=కార్తస్వరం. కార్తస్వర మయః భూధరః=కార్తస్వర భూధరః, తస్య = కార్తస్వర భూధరస్య.

**భావము :**

విదర్భ ప్రభు వైన భీముఁడు ఆ రాజోత్తములను సింహాసనముల యందు నాసీనులఁ గావింపఁగా వారు పసిడికొండ యొక్క శిఖరములపై నెల కొనిన వేల్పులవలె శోభించిరి. ॥౬౭॥

శ్లో. విచిన్త్య నానాభువనాగతాంస్తా
నమర్త్యసజ్కీర్త్య చరిత్రగోత్రాన్.
కథ్యాః కథఙ్కార మమీ సుతాయా
మితి వ్యషాది క్షితిపేన తేన॥ **68**

ప.వి. విచిన్త్య- నానాభువనాగతాన్- తాన్-అమర్త్యసజ్కీర్త్యచరిత్రగోత్రాన్- కథ్యాః- కథఙ్కారమ్- అమీ- సుతాయామ్- ఇతి- వ్యషాది- క్షితిపేన- తేన.

అర్థము:- తేన=ఆ, క్షితిపేన=రాజుచే, ననగాభీమరాజుచే, నానాభువనాగతాన్; నా నా భువన = పెక్కుదేశములనుండి, ఆగతాన్=వచ్చిన, తాన్= ఆయువకులను, అమర్త్యసజ్కీర్త్యచరిత్రగోత్రాన్; = మానవులచే కీర్తింపఁదగని శీలములు కులములుగల వారినిగా, విచిన్త్య=ఆలోచించి, అమీ=ఈయువకులు, సుతాయాం=తనకుమార్తె యొక్కవిషయమున, కథఙ్కరమ్=ఏ ప్రకారముగా, కథ్యాః=చెప్పఁదగినవారు. ఇతి=అని, వ్యషాది=దుఃఖింపఁబడుట (ఏర్పడినది). అనగా స్వయంవరమణ్డప మునకు విచ్చేసిన నరపతుల చరిత్రలను గోత్రములను మానవులు వర్ణింపఁజాలనందువలన, దమయన్తి దాని నెట్లు తెలుసుకొనఁగల దని చింతలో పడె నని యర్థము.

నానాభువనాగతాన్:- నానావిధాని చ తాని భువనాని చ=నానా భువనాని. నానాభువనేభ్యః ఆగతాః = నానాభువనాగతాః, తాన్=నానాభువనాగతాన్.

**సమాసములు :**

నానాభువనాగతాన్ :- నానావిధాని చ తాని భువనాని చ = నానాభువ

నాని. నానాభువనేభ్యః ఆగతాః = నానాభువనాగతాః, తాన్ = నానాభువ నాగతాన్.

అమర్త్యన జీర్త్యచరిత్ర గోత్రాన్:- చరిత్రాణి గోత్రాణి చ = చరిత్ర గోత్రాణి, మర్త్యైఃసజీర్త్యాని = మర్త్యసజీర్త్యాని. మర్త్యసజీర్త్యాని, చరిత్రగోత్రాణి యేషాం న భవన్తీతి = అమర్త్యసజీర్త్య చరిత్ర గోత్రాః, తాన్ = అమర్త్యసజీర్త్య చరిత్రగోత్రాన్.

కథఙ్కారమ్;- కేన ప్రకారేణ = కథఙ్కారమ్.

క్షితిపేన:- క్షితిం పాతీ = క్షితిపః. తేన = క్షితిపేన.

**భావము :**

పెక్కు ప్రదేశములనుండి స్వయంవరసభకు విచ్చేసిన యీ యువకులు సాధారణులు గారు. వారి కులగోత్రాదులు మానవులుచే వర్ణింప సాధ్యములుగావు. కావున నట్టి యువకులను గురించి వమయన్ని యెట్లు తెలుసుకొనఁగలదు. వారిని వరించుటకు, వారి కులగోత్రాదులు తెలియవలయును గదా. అందువలన భీమ నృపతి చింతింపఁ దొడగెను. ॥౬౮॥

**శ్లో. శ్రద్ధాళు సఙ్కల్పిత కల్పనాయాం**
**కల్పద్రుమస్యాథ రథాఙ్గపాణేః।**
**తదాఽఽకులేఽసౌ కులదైవతస్య**
**స్మృతిం తతాన క్షణమేకతానః॥ 69**

ప.వి. శ్రద్ధాళు సఙ్కల్పిత కల్పనాయామ్-కల్పద్రుమస్య- అథ-రథాఙ్గపాణేః- తదా- ఆకులః-అసౌ- కులదైవతస్య- స్మృతిం- తతాన- క్షణమ్- ఏకతానః.

అర్థము:- అథ = ఇట్లుచింతించినపిదప, ఆకులః = కలతపడిన, అసౌ = ఈ భీముఁడు, తదా = అప్పుడు, శ్రద్ధాళుసఙ్కల్పిత కల్పనాయాం; శ్రద్ధాళు = భక్తులయొక్క, సఙ్కల్పిత = కోరికలను, కల్పనాయాం = సమ్పాదన యందు, కల్పద్రుమస్య = కల్పవృక్షమువంటి, కులదైవతస్య = వంశ పరంపరగా నుపాసింపఁబడిన, రథాఙ్గపాణేః = శ్రీమన్నారాయణుని

యొక్క, స్మృతిం=స్మరణమును, క్షణం=క్షణకాలము, ఏకతానః= తదేకదృష్టిగల్గినవాడై, తతాన=చేసెను.

**సమాసములు :**

శ్రద్ధాళుసఙ్కల్పిత కల్పనాయామ్: శ్రద్ధాళూనాం సఙ్కల్పితం=శ్రద్ధాళు సఙ్కల్పితమ్, శ్రద్ధాళుసఙ్కల్పితస్య = కల్పనా శ్రద్ధాళు సఙ్కల్పిత కల్పనా, తస్యాం = శ్రద్ధాళుసఙ్కల్పిత కల్పనాయామ్.
రథాఙ్గపాణేః : రథస్య అఙ్గం = రథాఙ్గం, రథాఙ్గం పాణౌ యస్య సః = రథాఙ్గపాణిః, తస్య = రథాఙ్గపాణేః.

**భావము :**

ఇట్లు పగచిన పిదప, కలతపడి యున్న యా భీమ భూపతి, భక్తుల మనోరథముల నీడేర్చెడి తన కులదైవ మైన శ్రీమన్నారాయణుని తదేకాగ్రతతో స్మరించెను. ॥౬౯॥

> శ్లో. తచ్చిన్తనానన్తరమేవ దేవః
> సరస్వతీం సస్మితమాహ స స్మ।
> స్వయంవరే రాజకగోత్రవృత్త
> వక్త్రీమిహ త్వాం కరవాణి వాణి!॥ **70**

ప. వి. తచ్చిన్తనానన్తరమ్ - ఏవ - దేవః - సరస్వతీం - సస్మితమ్ - ఆహ- సః - స్మ - స్వయంవరే - రాజకగోత్రవృత్తవక్త్రీమ్ - ఇహ - త్వాం- కరవాణి – వాణి.

అర్థము :- తచ్చిన్తనానన్తరమ్; తత్ = ఆ భీమునియొక్క, చిన్తనానన్తర మేవ = స్మరణమైన పిదపనే, సః = ఆ, దేవః = హరి, యనగా శ్రీమన్నారాయణుడు, సరస్వతీం=సరస్వతీ దేవిని, సస్మితమ్ = చిఱు నగవుతో, ఆహస్మ = చెప్పుచుండెను. హే వాణి=ఓ సరస్వతి ! ఇహ = ఈ స్వయంవరమందు, త్వాం = నిన్ను, రాజకగోత్రవక్త్రీం; రాజక = రాజసమూహము యొక్క, గోత్ర = వంశములను గూర్చి, వక్త్రీం = చెప్పుదానినిగా, కరవాణి = చేయుదును,

**సమాసములు :**

తచ్చిన్తనానన్తరమ్ :- తస్య చిన్తనమ్ = తచ్చిన్తనం, తచ్చిన్తనస్య అనన్తరమ్ = తచ్చిన్తనానన్తరమ్.
సస్మితమ్ :- స్మితేన సహ యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = సస్మితమ్.

రాజకగోత్రపఙ్క్తిమ్ :- రాజ్ఞాం సమూహః = రాజకమ్, రాజకస్య గోత్రాణి = రాజక గోత్రాణి, రాజక గోత్రాణాం పఙ్క్తి = రాజకగోత్ర పఙ్క్తి, తామ్ = రాజకగోత్రపఙ్క్తిమ్.

**భావము :**

ఆ భీమ భూపతి స్మరింపగనే భగవన్తుడైన శ్రీమన్నారాయణుఁడు సరస్వతినిఁ గూర్చి మందహాసముతో నిట్లు పలికెను. ఓ సరస్వతీ! ఈ స్వయంవరమందు రాజులు వంశములను వారి చరిత్రలనుఁ జెప్పుటకై నిన్ను నియమింతు నని. ॥౭౦॥

**శ్లో. కులఞ్చ శీలఞ్చ బలఞ్చ రాజ్ఞాం**
**జానాసి నానాభువనాగతానామ్।**
**ఏషామత స్త్వం భవ వావదూకా**
**మూకాయితుం కః సమయ స్తవాయమ్॥ 71**

ప. వి. కులం -- చ - శీలం - చ - బలం -చ - రాజ్ఞాం - జానాసి - నానా భువనాగతానామ్ - ఏషామ్ - అతః - త్వం - భవ - వావదూకా - మూకాయితుం - కః - సమయః - తవ - అయమ్.

అర్థము :- హే వాణి = ఓ సరస్వతీ ! నానాభువనాగతానాం — నానా = పెక్కైన, భువన =లోకములనుండి, ఆగతానాం =విచ్చేసిన, రాజ్ఞాం = రాజులయొక్క, కులం చ = కులమును, శీలం చ=శీలమును, బలం చ = బలమును, జానాసి = తెలుసుకొనుచున్నావు, త్వం = నీవు, ఏషాం = వీరికి, వావదూకా = వంశచరిత్రాదులను వర్ణించుదానవు, భవ= కమ్ము.

తథాహి = అది యుక్తమే, తవ = నీకు, మూకాయితుం = మూగవలె నాచరించుటకు, అయం = ఇది, కః = ఏమి, సమయః = అవసరము. వక్తలు అవసరమునందు మాటలాడకుండుట యుక్తము గాదు గదా.

వి. "మాట్లాడఁగల వ్యక్తి యవసరమునందు మూగనోమును వహించుట యుక్తము గాదు" అను సామాన్యముచే, సరస్వతి యొక్క వావదూ మూకత్వ మను విశేషము సమర్థితము గాన అర్థాన్తరన్యాసము.

**సమాసములు :**

నానాభువనాగతానామ్ :- నానావిధాని చ తాని భువనాని చ = నానాభువనాని; నానా భువనేభ్యః ఆగతాః-నానాభువనాగతాః, తేషాం = నానా భువనాగతానామ్.

మూకాయితుం :- మూకవత్ ఆచరితుమ్=మూకాయితుమ్.

**భావము :**

ఓ సరస్వతీ ! నీవు పెక్కు దేశములనుండి వచ్చిన వీరి కులశీలబలముల గూర్చి తెలిసినదానవు. కాన వీరిని గూర్చి నీవు వర్ణించుదానవు కమ్ము. మాట్లాడ గలవారు అవసర మేర్పడినపుడు మూకత్వము నేల వహింపవలయును? ॥౭౧॥

**శ్లో. జగత్త్రియా పణ్డితమణ్డితైషా**
**నభా న భూతా న చ భావినీ చ।**
**రాజ్ఞాం గుణజ్ఞాపనసక్తైతవేన**
**సఙ్ఖ్యావతః శ్రావయ వాఙ్ముఖాని॥ 72**

ప.వి. జగత్త్రియా పణ్డిత మణ్డితా- ఏషా- సభా- న- భూతా- న- చ- భావినీ- చ- రాజ్ఞాం- గుణజ్ఞాపనసక్తైతవేన- సఙ్ఖ్యావతః- శ్రావయ- వాఙ్ముఖాని.

అర్థము: హే వాణి ! = ఓ సరస్వతీ ! జగత్త్రియా పణ్డితమణ్డితా; జగత్త్రియా =ముజ్జగములందలి, పణ్డిత = విద్వాంసులతో, మణ్డితా =

అలఙ్కరింపబడిన, ఏషా=ఈ, సభా=సభ, సభూతా=పూర్వమెప్పుడును జరుగలేదు. న చ భావినీవా=ఇక మీదటను జరుగఁబోదు. (అతః = ఇందువలన) రాజ్ఞాం = రాజులయొక్క, గుణజ్ఞాపనకైతవేన; గుణ = గుణమును, జ్ఞాపన=ప్రకాశించుటయను, కైతవేన=నెపముచే, సఙ్ఖ్యావతః = విద్వాంసులను, వాఙ్ముఖాని=ఉపన్యాసములకు, శ్రావయ=విని పింపుము.

**సమాసములు :**

జగత్త్రయీపణ్డితమణ్డితా :- జగతాం త్రయీ=జగత్త్రయీ, జగత్త్రయ్యాః పణ్డితాః=జగత్త్రయీ పణ్డితాః, జగత్త్రయీపణ్డితైః, మణ్డితా= జగత్త్రయీ పణ్డితమణ్డితా.

గుణజ్ఞాపనకైతవేన :- గుణానాం జ్ఞాపనమ్=గుణజ్ఞాపనమ్, గుణజ్ఞాపన మేవ కైతవమ్=గుణజ్ఞాపనకైతవమ్, తేన=గుణజ్ఞాపన కైతవేన.

సఙ్ఖ్యావతః :- సఙ్ఖ్యా ఏషా మస్తీతి=సఙ్ఖ్యావన్తః, తాన్ = సఙ్ఖ్యావతః.

**భావము :**

ఓ సరస్వతీ ! బృహస్పతి- శుక్రాచార్యుఁడు మున్నగు మూడు లోకముల యందలి పండితు లీ సభ నలఙ్కరించి యున్నారు. వారి గుణములను వెల్లడి చేయు నెపముతో, నీవు పణ్డితులఁ గూర్చి యుపన్యాసము లిమ్ము. పణ్డితులతో. గూడిన సభయందు వక్త తన వాక్కులను విజృంభింపఁజేయుట యుచితముఁ అట్లు కానిచో నట్టి వక్తృత్వము వ్యర్థము కాఁగలదు. అతనికి యోగ్యతయు నశించును. ॥౭౨॥

శ్లో. **ఇతీరితా తచ్చరణాత్ పరాగం**
**గీర్వాణచూడామణిమృష్టశేషమ్।**
**తస్య ప్రసాదేన సహాజ్ఞయాఽసౌ**
**వాహాయ మూర్ధ్నాఽఽదరిణీ బభార॥**

ప.వి. ఇతి- ఈరితా- తచ్చరణాత్- పరాగం- గీర్వాణ చూడామణి మృష్ట శేషమ్- తస్య- ప్రసాదేన- సహ- ఆజ్ఞయా- అసౌ- ఆదాయ- మూర్ధ్నా- ఆదరిణీ- బభార.

అర్థము: ఇతి=ఇట్లు, ఈరితా=విష్ణువుచే నాజ్ఞాపింపఁబడిన, అసౌ=ఈ సరస్వతి, తస్య=ఆ విష్ణువుయొక్క, చరణాత్=పాదమునుండి, గీర్వాణచూడా మణి మృష్టశేషమ్; గీర్వాణ=దేవతలయొక్క, చూడామణి=శిరోరత్నము లచే, మృష్ట=తుడిచివేయఁబడినదై, శేషం=మిగిలిన, పరాగం=ధూళిని, తస్య=అతనియొక్క, ఆజ్ఞయా=ఆజ్ఞారూపమైన, ప్రసాదేనసహ=అను గ్రహముతోఁగూడ, ఆదాయ=తీసుకొని, మూర్ధ్నా=శిరముచే, ఆదరిణీ= ఆదరముతోఁ గూడినదై, బభార=ధరించెను.

## సమాసములు :

గీర్వాణచూడామణి మృష్టశేషమ్ :- గీర్వాణానాం చూడామణయః = గీర్వాణ చూడామణయః. గీర్వాణ చూడామణిభిః మృష్టస్చాసౌ శేషశ్చ= గీర్వాణ చూడామణి మృష్టశేషః, తమ్=గీర్వాణచూడామణి మృష్టశేషమ్. అదరిణీ :- ఆదరః అస్యాః అస్తీతి=ఆదరిణీ.

## భావము :

ఇవ్విధముగా సరస్వతి విష్ణువుచే నాదేశింపఁబడినదై యాతని పాదము లకు మ్రొక్కినది. అప్పుడు, ఆతని పాదములకు దేవతలు మ్రొక్కుటచే వారి చూడామణుల వలనఁ దుడిచివేయఁబడిన శ్రీ విష్ణుని పాదపరాగ శేషమును, నాతని యాజ్ఞతోఁ గూడ గ్రహించి యాదరముతో శిరమున దాల్చినది. అనగా శ్రీ విష్ణువుయొక్క యాజ్ఞతోఁబాటు ఆతని పాదధూళినిఁ గూడ శిరసావహించిన దని యాశయము. ॥౬౬॥

శ్లో. మధ్యేసభం సాఽవతతార బాలా
గన్ధర్వవిద్యామయ కణ్ఠనాళా।

త్రయీమయీభూతవలీవిభఙ్గా
సాహిత్య నిర్వర్తిత దృక్తరఙ్గా॥ **74**

ప.వి. మధ్యేసభం- సా- అవతతార- బాలా- గన్ధర్వ విద్యామయ కణ్ఠనాళా- త్రయీమయీభూతవలీ విభఙ్గా- సాహిత్య నిర్వర్తితదృక్తరఙ్గా.

అర్థము: సా=ఆ సరస్వతి, మధ్యేసభం = సభామధ్యమందు, బాలా = బాలికా రూపమును ధరించినదై, గన్ధర్వవిద్యామయకణ్ఠనాళా; గన్ధర్వవిద్యామయ=గానవిద్యా రూపమైన, కణ్ఠనాళా=కణ్ఠమందలినాడులుగలదియు, త్రయీమయీభూతవలీవిభఙ్గా; త్రయీమయీ=మూడు విధములైన, వేదముల రూపముగల, వలీవిభఙ్గా=ఉదరముపైని త్రివళుల విలాసములు గలదియు, సాహిత్య నిర్వర్తిత దృక్తరఙ్గా;సాహిత్య = కావ్యనాటక చంపూ రూపములుగల కావ్యములచే, నిర్వర్తిత=నిర్మింపఁబడిన, దృక్ తరఙ్గా=అలలవంటి నేత్రములుగలదై, అవతతార=దిగినది.

వి:- ఇచ్చట గాంధర్వవిద్యను కణ్ఠనాళములతోఁడను, వేదములను మూటిని, త్రివళులతోఁడనును సాహిత్యము నేత్రములతోడను రూపించుటవలన రూపకము.

**సమాసములు :**

మధ్యేసభమ్: సభాయాః మధ్యే=మధ్యేసభమ్.

గంధర్వ విద్యామయకణ్ఠనాళా:- గన్ధర్వాణాం విద్యా = గన్ధర్వవిద్యా, గన్ధర్వవిద్యాయాః వికారాః = గన్ధర్వవిద్యామయాః, కణ్ఠస్య నాళాః=కణ్ఠనాళాః, గన్ధర్వవిద్యామయాః కణ్ఠనాళాః యస్యాస్సా = గన్ధర్వవిద్యామయకణ్ఠనాళా.

త్రయీమయీభూతవలీవిభఙ్గా: త్రయాణాం సమాహారః = త్రయీ; త్రయ్యాఃవికారాః = త్రయీమయాః. అత్రయీమయాః త్రయీమయాః సమ్పద్యమానాః భూతాః=త్రయీమయీభూతాః. వలీనాం విభఙ్గాః, వలీ విభఙ్గాః, త్రయీమయీభూతాః వలివిభఙ్గాః యస్యాస్సా=త్రయీమయీ భూతవలీ విభఙ్గా.

సాహిత్యనిర్వర్తిత దృక్తరఙ్గా :- సహితయోర్భావః సాహిత్యం, సాహిత్యేన నిర్వర్తితాః=సాహిత్యనిర్వర్తితాః, దృశః తరఙ్గా ఇవ = దృక్తరఙ్గాః, సాహిత్యనిర్వర్తితాః దృక్తరఙ్గాః యస్యాస్సా = సాహిత్య నిర్వర్తిత దృక్తరఙ్గా.

**భావము :**

ఆ సరస్వతి సభా మధ్యమందు బాలికగా స్వర్గమునుండి దిగినది. ఆమె యొక్క కణ్ఠనాళములు గానవిద్యా రూపముగను, ఆమెయొక్క త్రివళులు ఋగ్యజుస్సామరూపము లైన మూడు వేదములుగను, ఆమెయొక్క నేత్రవిలాసములు, కావ్యనాటక చంపూ రూపములుగా వెలసిన సాహిత్యముగను శోభించు చుండినవి. ॥౭౪॥

**శ్లో. ఆసీదథర్వా త్రివళిత్రివేదీ**
**మూలాద్వినిర్గత్య వితాయమానా।**
**నానాభిచారోచితమేచకశ్రీః**
**శ్రుతిర్యదీయోదరరోమరేఖా॥** **75**

ప.వి. ఆసీత్- అథర్వా- త్రివళిత్రివేదీ మూలాత్- వినిర్గత్య- వితాయమానా- నానాభిచారోచితమే చకశ్రీః- శ్రుతిః- యదీయోదరరోమరేఖా.

అర్థము : అథర్వాశ్రుతిః = అథర్వవేదము, త్రివళిత్రివేదీమూలాత్; త్రివళి= త్రివళి యని చెప్పఁబడెడి యుదరముపైని మూడుమడతలనెడి, త్రివేదీ= మూడు వేదములనఁబడు, మూలాత్=మూలప్రదేశమునుండి, వినిర్గత్య = వెల్వడి, వితాయమానా=విస్తరించుచున్నదై, నానాభిచారోచితమే చకశ్రీః; నానాభిచార = నానా విధములగు హింసాకర్మలకు, ఉచిత= యుక్తమైన, మేచకశ్రీః=నల్లనికాన్తిగల్గినదై, నానాభిచార=అనాభిసంచారముయొక్క, యభావమునకు అనగా నాభిసంచారమునకు, ఉచిత= యుక్తమైన, మేచకశ్రీః = నల్లని కాంతిగల, యదీయోదరరోమరేఖా; యదీయ=ఏపెకు సంబంధించిన, అనగా ఏ సరస్వతికిసంబంధించిన, ఉదరరోమరేఖా=ఉదరముపైని రోమముల పఙ్క్తిగా(ఆసీత్=ఉండెను).

వి : త్రివలిని త్రివేదిగను, అథర్వవేదమును శ్లేషమూలకముగా రోమరేఖతోను రూపించుట వలన రూపకము.

**సమాసములు :**

త్రివలి త్రివేదీ మూలాత్ : తిస్రః వలయః=త్రివలిః, త్రయాణాం వేదానాం సమాహారః =త్రివేదీ, త్రివలిరేవ త్రివేదీ=త్రివలి త్రివేదీ, త్రివలి త్రివేద్యాః మూలమ్=త్రివలి త్రివేదీ మూలమ్, తస్మాత్ = త్రివలి త్రివేదీ మూలాత్.

నానాభిచారోచితమేచకశ్రీః : నానా విధాశ్చ తే అభిచారాశ్చ = నానాభిచారాః, నానాభిచారాణాముచితా =నానాభిచారోచితా, మేచకా చ సా శ్రీశ్చ =మేచకశ్రీః, నానాభిచారోచితా మేచకశ్రీః యస్యాస్సా = నానాభిచారోచితమేచకశ్రీః పక్షాన్తరమున–అనాభిచారో న భవతీతి=నానాభిచారః. (నాభిసంచరణ మిత్యర్థః) నానాభిచారోచితామేచకశ్రీః యస్యాస్సా=నానాభిచారోచితమేచక్రశ్రీః

యదీయోదర రోమరేఖా : యస్యాః ఇయమ్=యదీయా, రోమ్ణాం రేఖా=రోమరేఖా, ఉదరే రోమరేఖా=ఉదర రోమరేఖా, యదీయా చ సా ఉదర రోమరేఖా చ = యదీయోదర రోమరేఖా.

**భావము :**

ఇది మొదలు పదునాలుగు శ్లోకములయందు సరస్వతిని వర్ణించుచున్నాడు- అథర్వణ వేదము సరస్వతియొక్క యుదరముపైని త్రివలి యను మూడు మడతలుగావెలసిన మూడువేదముల రూపముననున్న మూలప్రదేశమునుండివెల్వడినదై విస్తరించుచున్నది. అది పెక్కు విధములగు నభిచార క్రియలను ననగా హింసాక్రియలను ప్రతిపాదించుటవలన దానికిఁ దగిన నల్లని వన్నెగలదిగను, నాభిసంచారమునకు తగిన నల్లని వన్నెనుఁ గలదిగను నుండి యా వాణికి సంబంధించిన యుదరముపై నూగారుగా నేర్పడినది. అథర్వణవేదము హింసాక్రియలనుఁ బ్రతిపాదించును. అందువలన నది నలుపు వన్నె గలదిగా వర్ణితము. మఱియు నా యథర్వణ వేదమునకు ఋగ్యజుస్సామము లనఁబడు త్రివేది యనగా మూడు వేద

ములు మూలము. ఆ త్రివేది యను మూలములనుండి యుద్భవించిన యా యథర్వాణ వేదము, నానాభిచారోచితమేచకశ్రీని—అనగా నానావిధము లగు నభిచార క్రియలను – అనగా హింసా క్రియలను ప్రతిపాదించుటచేత దానికి తగిన నల్లని కాంతిని, (పక్షాన్తరమున) అనాభిసంచారము లేనందువలన నసగా, నాభి సంచారము కల్గినందువలన దానికి దగిన నలుపు వన్నెను బొందినదై యా సరస్వతికి నూగారుగా నేర్పడినది ॥౭౫॥

శ్లో. శిక్షైవ సాక్షాచ్చరితం యదీయం
కల్పశ్రియాఽఽకల్పవిధిర్యదీయః।
యస్యాః సమస్తార్థ నిరుక్తరూపైః
నిరుక్తవిద్యా ఖలు పర్యణంసీత్॥ **76**

ప వి:- శిక్షా-ఏవ-సాక్షాత్-చరితమ్ - యదీయం - కల్పశ్రియా - ఆకల్పవిధిః - యదీయః-యస్యాః- సమస్తార్థ నిరుక్తరూపైః-నిరుక్త విద్యా-ఖలు-పర్యణంసీత్.

అర్థము: శిక్షైవ = శిక్షయను గ్రంథమే, సాక్షాత్ = స్వయముగా, యదీయం = ఏ వాగ్దేవికి సంబంధించిన, చరితం=చరిత్రముగా, అభూత్=అయినది. యదీయః=ఎవతెకు సంబంధించిన, ఆకల్పవిధిః=అలఙ్కరణ విధానము, కల్పశ్రియా=కర్మకాణ్డకు సంబంధించిన కల్పసూత్రముల శోభతోడనే, (నిర్వృత్తః=నెరవేర్పబడినది). నిరుక్తవిద్యాఖలు = నిరుక్త విద్యయే, యస్యాః=ఎవతెకు, సమస్తార్థనిరుక్తరూపైః; సమస్తార్థ = సకలవేదార్థములకు, నిరుక్తరూపైః=నిర్వచన విధానముతో, పర్యణంసీత్=పరిణమించినది.

**సమాసములు :**

యదీయం :- యస్యాః ఇదం=యదీయం.

కల్పశ్రియా :- కల్పస్య శ్రీః=కల్పశ్రీః,తయా=కల్పశ్రియా.

ఆకల్పవిధిః :- ఆకల్పస్య విధిః=ఆకల్పవిధిః.

యదీయః :- యస్యాః అయం=యదీయః.

సమస్తార్థ నిరుక్తరూపైః :- సమస్తాశ్చ తే అర్థాశ్చ = సమస్తార్థాః, సమస్తార్థానాం నిరుక్తరూపాణి =సమస్తార్థ నిరుక్తరూపాణి, తైః = సమస్తార్థ నిరుక్తరూపైః.
నిరుక్తవిద్యా :- నిరుక్తమితి విద్యా =నిరుక్త విద్యా.

**భావము :**

ఆ సరస్వతికి వేదాఙ్గములలో నొక్కటి యైన శిక్షాగ్రంథము శీలశిక్షణ చేసెడి సాధన మైనది. కర్మకాండకు సంబంధించిన కల్పసూత్రలక్ష్మిచే నామెకు నలఙ్కరణ విధి యేర్పడినది. నిరుక్తవిద్య యామెకు సకల వేదార్థములను నిర్వచించు విధానములతో పరిణమించినది. ॥౭౬॥

**శ్లో. జాత్యా చ వృత్తేన చ భిద్యమానం**
**ఛన్దో భుజద్వంద్వమభూత్ యదీయమ్।**
**శ్లోకార్ధవిశ్రాన్తిమయీ భవిష్ణు**
**పర్వద్వయీ సంధిసుచిహ్నమధ్యమ్॥ 77**

ప.వి:- జాత్యా- చ- వృత్తేన- చ- భిద్యమానం- ఛన్దః- భుజద్వంద్వమ్- అభూత్- యదీయమ్- శ్లోకార్ధ విశ్రాన్తి మయీభవిష్ణు- పర్వద్వయీ సన్ధిసుచిహ్నమధ్యమ్.

అర్థము:- జాత్యాచ= ఆర్యమున్నగు మాత్రావృత్తరూపము చేతను, వృత్తేన చ=వర్ణవృత్తములైన యిన్ద్రవజ్రాది వృత్తములచేతను, భిద్యమానం = రెండుగా భేదములనుఁ బొందినదియు, శ్లోకార్ధవిశ్రాన్తిమయీ భవిష్ణు. శ్లోకార్ధ=శ్లోకమందలి సగమునందు, విశ్రాన్తిమయీభవిష్ణు = విశ్రాన్తిరూపమునుఁ బొందిన, ఛన్దః=ఛన్దోగ్రన్థము, యదీయః = ఏ సర్వతికి సంబంధించిన,పర్వద్వయీ సన్ధిసుచిహ్నమధ్యం;పర్వద్వయీ= కూర్పరముయొక్క, అనగా మోచేయి యొక్క ముందువెనుకల భాగములయొక్క, సన్ధి =కలయికచే, సుచిహ్నం = చక్కగాఁగాన వచ్చిన, మధ్యం=మధ్యభాగము గల్గిన, యనగా మోచేయి యొక్క స్థానముగల్గిన భుజద్వన్ద్వం=బాహువుల జంటగా, అభూత్=అయినది.

అనగా రెండు విధములైన ఛన్దస్సులు సరస్వతికి రెండుభుజములుగను, శ్లోకార్ధ మందలి విశ్రాన్తి యామెయొక్క కూర్పరములగను నగా మో చేతులుగను నేర్పడిన దని యర్థము.

**సమాసములు :**

భుజద్వన్ద్వమ్: భుజయోః ద్వన్ద్వమ్=భుజద్వన్ద్వమ్.
యదీయమ్ :- యస్యాః ఇదమ్=యదీయమ్.
శ్లోకార్థ విశ్రాన్తిమయీభవిష్ణు :- శ్లోకస్య అర్థం=శ్లోకార్థమ్. విశ్రాన్తేః వికారః = విశ్రాన్తిమయం, అవిశ్రాన్తిమయం విశ్రాన్తిమయం సమ్పద్య మానం భవిష్ణు=విశ్రాన్తిమయీభవిష్ణు.
పర్వద్వయీసన్ధిసుచిహ్నమధ్యమ్ :- పర్వణోః ద్వయీ=పర్వద్వయీ, పర్వద్వయ్యాః సన్ధిః=పర్వద్వయీ సన్ధిః. పర్వద్వయీ సన్ధినాసుచిహ్నం =పర్వయీసన్ధిసుచిహ్నం, పర్వద్వయీసన్ధిసుచిహ్నం మధ్యం యస్య తత్=పర్వద్వయీసన్ధిసుచిహ్నమధ్యమ్.

**భావము :**

ఆర్య మున్నగు మాత్రాఛన్దోరూపముగను, నిన్ద్రవజ్రాది వర్ణఛన్దోరూపముగను ఛన్దస్సు ఇరుతెఱంగులు గల్గి యున్నది. శ్లోకార్థములయందు దానికి విశ్రాన్తి యునున్నది. సరస్వతీ భుజములు కూర్పరమున కిఱువైపుల సన్ధివలన వాని మధ్యభాగము చక్కగా కానవచ్చుచున్నది. పై విధముగా మాత్రారూపముగను వర్ణరూపముగను రెండు విధములుగా విభక్తమై, శ్లోకార్థవిశ్రాన్తితోఁ గూడిన ఛన్దస్సు, ఆ సరస్వతికి పైన వివరింపఁబడిన రెండు భుజములుగా పరిణమించిన దని యాశయము. ॥౭౭॥

శ్లో. అసంశయం సా గుణదీర్ఘభావ
కృతాం దధానా వితతిం యదీయా।
విధాయికా శబ్దపరమ్పరాణాం
కిఞ్చారచి వ్యాకరణేన కాఞ్చీ॥ 78

ప.వి. అసంశయం- సా-గుణదీర్ఘ భావకృతాం- దధానా- వితతిం- యదీయా- విధాయికా- శబ్దపరమ్పరాణాం- కిం- చ- అరచి- వ్యాకరణేన- కాఞ్చి.

అర్థము:- కిఞ్చ=మఱియు, గుణదీర్ఘ భావకృతాం; గుణ = పట్టుదారమునకు, దీర్ఘభావ = పొడవుచే, కృతాం = చేయఁబడిన, వితతిం=విస్తారమును, దధానా=ధరించునదియు, (గుణ=గుణము, దీర్ఘ=దీర్ఘము, భావ=భావ ప్రత్యయము, కృతాం=కృత్ ప్రత్యయములను వీనియొక్క, వితతిం= =విస్తారమును, దధానేన=ధరించినట్టి) శబ్దపరమ్పరాణాం=ఘల్లు ఘల్లు- అనెడి ధ్వనులకు, విధాయికా = ఉత్పాదకమైనదియు, (శబ్దపరమ్పరాణాం = సుబన్త-తిఙన్త- శబ్దములకు, విధాయకేన=సాధకమైనది యునగు) సా = ఆప్రసిద్ధమైన, యదీయా=ఎవతెకు సంబంధించిన, కాఞ్చి = మొలనూలు అనగా ఒడ్యాణము. వ్యాకరణేన = వ్యాకరణ శాస్త్రముచే, అరచి = నిర్మింపఁబడినది. అసంశయం=సందేహములేదు.

**సమాసములు :**

అసంశయమ్: సంశయస్య అభావః=అసంశయం।
గుణదీర్ఘభావకృతామ్:- దీర్ఘస్య భావః=దీర్ఘభావః, గుణస్య దీర్ఘభావః= గుణదీర్ఘభావః. గుణదీర్ఘభావేన కృతా = గుణదీర్ఘభావకృతా, తామ్= గుణదీర్ఘభావకృతామ్,
పక్షాన్తరమునందు- గుణశ్చ దీర్ఘశ్చ భావశ్చ కృచ్చ = గుణదీర్ఘభావ కృతః, తేషాం=గుణదీర్ఘభావకృతామ్.
శబ్దపరమ్పరాణాం :- శబ్దానాం పరమ్పరాః=శబ్దపరమ్పరాః, తాసామ్= శబ్దపరమ్పరాణామ్.

**భావము :**

ఇచ్చట సరస్వతియొక్క మొలనూలు అనగా ఒడ్యాణము వర్ణింపఁబడు చున్నది.

ఆ మొలనూలు పట్టుదారముయొక్క పొడవుచే విస్తరించి యున్నది. అది దానికి గట్టిన చిఱుగంటలచే ఘల్లుఘల్లుమని ధ్వనులనుఁ జేయుచున్నది. అట్టి మొల

నూలు 'ఆద్గుణః' అను సూత్రముచే (దేవ + ఇన్ద్ర) = దేవేన్ద్రాది శబ్దములయందు విధింపబడిన గుణమును, అకస్సవర్ణే దీర్ఘః అను సూత్రముచే (పుర + అరిః) = పురారిః ఇత్యాది శబ్దములయందు విధింపఁబడిన దీర్ఘమును, "లః కర్మణి చ భావే చాఽకర్మకేభ్యః" అను సూత్రముచే భూయతే ఇత్యాదిస్థలములయందు విధింపఁబడిన భావార్థక ప్రత్యయమును, "తవ్యత్తవ్యానీయరః'' యను సూత్ర ముచే, కర్తవ్యకరణీయాది శబ్దములయందు విధింపఁబడిన తవ్యాది ప్రత్యయ ములు మున్నగువానియొక్క విస్తారమును కల్గియున్నదై, సుబన్తతిఙన్త శబ్ద పరమ్పరలను సాధించు నట్టి వ్యాకరణ శాస్త్రముచే రచియింపఁబడినది. ॥౭౮॥

శ్లో. స్థితైవ కణ్ఠే పరిణమ్య హార
లతా బభూవోదితతారవృత్తా।
జ్యోతిర్మయీ యద్భజనాయ విద్యా
మధ్యేఽఙ్గమఙ్గేనభృతా విశఙ్కే॥ 79

ప.వి. స్థితా- ఏవ- కణ్ఠే-పరిణమ్య- హారలతా- బభూవ- ఉదిత తారవృత్తా- జ్యోతిర్మయీ- యద్భజనాయ- విద్యా- మధ్యేఽఙ్గమ్ - అఙ్గేన- భృతా- విశఙ్కే.

**అర్థము:** కణ్ఠే=వాక్కునందు (మెడయందు), పరిణమ్య=మఱియొక రూపమును వహించి, స్థితా=ఉన్నదియు, ఉదితతార వృత్తా; ఉదిత = ఉదయించిన, తార = అశ్విన్యాది నక్షత్రములతోఁగూడిన, వృత్తా = పద్యవృత్తములు గలదియు, (ఉదిత=ప్రకాశించెడి, తార=శుద్ధములైన, ముత్తెములుగలదై, వృత్తా=వర్తులమైనదియు) మధ్యేఽఙ్గం = శిక్షా కల్పము మున్నగు వేదా ఙ్గముల మధ్య యందును (హస్తాద్యఙ్గముల మధ్యయందును) అఙ్కేన= ఒకటి రెండు మున్నగునంకెల గుఱుతుచే, భృతా=నిండినదియు, (అఙ్కేన= ఒడిచే ననగా వక్షఃస్థలముచే, భృతా=భరింపఁబడినదియు) జ్యోతిర్మయీ= నక్షత్రములనుఁ బ్రధానముగాఁ గలదియు, (ప్రకాశించునదియు) నగు విద్యైవ=జ్యోతిర్విద్యయే, యద్భజనాయ=ఏ సరస్వతిని సేవించుటకై, హారలతా=ముక్తాహారముగా, బభూవ=అయినది, ఇతి=అని, విశఙ్కే= భావింతును,

: జ్యోతిర్విద్యను శ్లిష్టవిశేషణములచే హారలతగా భావించుటవలన నుత్ప్రేక్ష. "విశఙ్కే" అని వ్యఞ్జకమునుఁ బ్రయోగించుట వలన నది వాచ్యము.

**మాసములు :**

హారలతా:- హారః లతా ఇవ=హారలతా.

ఉదితతారవృత్తాః :- ఉదితాః తారాః యేషు తాని=ఉదితతారాణి. ఉదిత తారాణి వృత్తానియస్యాం సా=ఉదిత తారవృత్తా.

పక్షాన్తరమున: — ఉదితాః తారాః యస్యాం సా=ఉదితతారా, ఉదిత తారా చ సా వృత్తా చ=ఉదితతార వృత్తా.

జ్యోతిర్మయీ :- జ్యోతిషాం వికారః=జ్యోతిర్మయీ.

మధ్యేఽఙ్గమ్ :- అఙ్గానాం మధ్యే =మధ్యేఽఙ్గమ్.

**•వము :**

ఇచ్చట వేదాఙ్గములలో నొక్కటైన జ్యోతిషము సరస్వతి కెట్లు ముత్యాల ·రమైనదో చెప్పుచున్నారు.—

ఆ జ్యోతిర్విద్య కణ్ఠమునందు అనగా వాక్కునందుండును. ఆ ముత్యాల ·రము కణ్ఠమునందు, అనగా మెడయందుండును. ఆ జ్యోతిషము భిన్న భిన్న ·స్థాన రూపముగా పరిణామము నొందినది. ఆ ముత్యాలహారముగూడ సువర్ణ ·ందు పొదుగఁ బడినదై పరిణామము నొందినది. జ్యోతిశ్శాస్త్రము ఉదయించిన ·శ్విన్యాది తారలనుఁ బ్రతిపాదించు పద్యముల తోడనుఁ గూడియుండును. ·ుత్యాల హారము తార లని చెప్పఁబడు ప్రకాశించు శుద్ధములైన ముత్తెములతోఁ ·గూడి, వృత్తముగా, ననగా సుందరముగా నుండును. కాన జ్యోతిర్విద్యకును ·ుత్యాల హారమునకును ఉదితతార వృత్తత్వము సమానమైనది. జ్యోతిర్విద్య ·క్షాదిషడఙ్గముల మధ్యమందుండుటవలనను, ముత్యాలహారము హస్తాద్యఙ్గముల ·ధ్య నుండుటవలనను, మధ్యేఽఙ్గస్థితినిఁ గల్గి యున్నది. జ్యోతిర్విద్య ఒకటి ·ందు మూడు మున్నగు సంకెల గుఱుతులచే నిండినందువలనను, ముత్యాల ·రము వక్షఃస్థలమున ధరింపఁబడుటవలనను, "అఙ్కభృతత్వ"మునుఁ గల్గి యున్నది. జ్యోతిర్విద్య, నక్షత్ర ప్రధాన మగుటవలనను, ముత్యాలహారము ·ళతళ మెఱయుటవలనను, జ్యోతిర్మయత్వమునుఁ బొందినది.

ఇట్లు జ్యోతిర్విద్య యీ సరస్వతిని సేవించుటకై హారలతగా ననగా ముత్యాలహారముగా నైనదని భావము.

శ్లో. అవైమి వాదిప్రతివాదిగాఢ
స్వపక్షరాగేణ విరాజమానే।
తౌ పూర్వపక్షోత్తరపక్షశాస్త్రే
రదచ్ఛదౌ భూతవతీ యదీయౌ॥ 80

ప.వి. అవైమి- వాదిప్రతివాది గాఢస్వపక్షరాగేణ- విరాజమానే- తౌ- పూర్వ పక్షోత్తరపక్షశాస్త్రే- రదచ్ఛదౌ- భూతవతీ-యదీయౌ.

అర్థము : వాదిప్రతివాదిగాఢ స్వపక్షరాగేణ; వాదిప్రతివాది = వాదప్రతివాదుల యొక్క, గాఢ=దృఢమైన, స్వపక్షరాగేణ = తమతమ పక్షముల యందలి పట్టుదలచే, (లోపల ప్రక్కల నెఱ్ఱగా) విరాజమానే = ప్రకాశించునట్టి, పూర్వోత్తర పక్షశాస్త్రే=పూర్వపక్ష శాస్త్రము, ఉత్తరపక్ష శాస్త్రము అను నీ రెండును; యదీయౌ = ఏ సరస్వతికి సంబంధించిన, తౌ=ఆ ప్రసిద్ధములగు, రదచ్ఛదౌ=పెదవులుగా, భూతవతీ = అయినవి (అని) అవైమి=భావింతును.

వి. పూర్వపక్షశాస్త్రము, ఉత్తరపక్ష శాస్త్రము సరస్వతికిఁ బెదవులు కాక పోయినను నయినట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష. వ్యంజకమైన "అవైమి"ని ప్రయోగించుటవలన నది వాచ్యము.

**సమాసములు :**

వాదిప్రతివాదిగాఢస్వపక్షరాగేణ :- వాదీ చ ప్రతివాదీ చ = వాదిప్రతి వాదినౌ. స్వయోః=పక్షౌః స్వపక్షౌ, స్వపక్షయోః రాగః = స్వపక్షరాగః, గాఢశ్చాసౌ స్వపక్షరాగశ్చ=గాఢస్వపక్షరాగః, వాదిప్రతివాదినోః గాఢ స్వపక్షరాగః = వాదిప్రతివాది గాఢ స్వపక్షరాగః. తేన=వాదిప్రతివాది గాఢ స్వపక్షరాగేణ.

పూర్వపక్షోత్తరపక్షశాస్త్రే :- పూర్వశ్చాసౌ పక్షశ్చ = పూర్వపక్షః. ఉత్తరశ్చాసౌ పక్షశ్చ = ఉత్తరపక్షః. పూర్వపక్షశ్చ ఉత్తరపక్షశ్చ=

పూర్వపక్షోత్తరపక్షౌ, శాస్త్రం చ శాస్త్రం చ=శాస్త్రే. పూర్వపక్షోత్తర పక్షయోః శాస్త్రే=పూర్వపక్షోత్తరపక్షశాస్త్రే.

యదీయౌ :- యస్యాః ఇమౌ=యదీయౌ.

**భావము**

ఇచ్చట పూర్వపక్ష ఉత్తరపక్ష శాస్త్రములు సరస్వతియొక్క పై పెదవిగను, క్రింది పెదవిగను నైన పని వర్ణించుచున్నాడు.

సభయందు వాదిప్రతివాదులు చాల గట్టి పట్టుదలతో నసగా గాథాను రాగముతో వాదింతురు. అందులో నొక్కనిది పూర్వపక్షము మఱియొక్కనిది యుత్తరపక్షము. పూర్వపక్షము ప్రశ్నరూపముగను, నుత్తర పక్షము సిద్ధాన్త రూపముగ నుండును. ఓడిపోయినవారు పూర్వపక్షి, గెల్చినవారు ఉత్తరపక్షి. ఉత్తరపక్షమే సిద్ధాన్తము. ఆ పూర్వపక్షము నుత్తరపక్షము నను నీ రెండును నా సరస్వతికి రెండు పెదవులుగా నైనవో యన్నట్లున్నది. పెదవులలో నెఱ్ఱదనము. అనగా రాగమున్నట్లు, ఆ పూర్వోత్తర పక్షములలోను, వాదిప్రతివాదుల యభినివేశ మను"రాగము" కలదు. ఇచ్చటను పెదవులయం దెఱ్ఱదనము గలదు. రాగయుక్తములగు పూర్వోత్తర పక్షములు సరస్వతికి రాగయుక్తములగు పెదవులుగా నైనవి. ఆ పూర్వోత్తర పక్షములయం దొకటి పై పెదవిగను మఱియొకటి క్రింది పెదవిగను నైనదని యాశయము. ॥౮౦॥

శ్లో. బ్రహ్మార్థ కర్మార్థక వేదభేదాత్
ద్విధా విధాయ స్థితయాఽఽత్మభేదమ్।
చక్రే పరాచ్ఛాదనచారు యస్యాః
మీమాంసయా మాంసలమూరుయుగ్మమ్॥ 81

ప వి. బ్రహ్మార్థకర్మార్థకవేదభేదాత్- ద్విధా- విధాయ- స్థితయా- ఆత్మభేదం- చక్రే- పరాచ్ఛాదనచారు- యస్యాః- మీమాంసయా- మాంసలమ్- ఊరుయుగ్మమ్.

అర్థము: పరాచ్ఛాదనచారు; పర=శ్రేష్ఠమైన, ఆచ్ఛాదన=వస్త్రముచే, చారు= రమ్యమైన, మాంసలమ్=బలిసిన, యస్యాః-ఏ సరస్వతియొక్క, ఊరు

యుగ్మమ్=తొడలు రెండును, పరాచ్ఛాదనచారు; పర=ప్రతివాదులను, ఆచ్ఛాదన=తిరస్కరించుటచే, చారు=అందమైన, ఆత్మదేహమ్ = తన స్వరూపమును, బ్రహ్మార్థకర్మార్థకవేదభేదాత్; బ్రహ్మార్థ = బ్రహ్మమునే ప్రతిపాదించెడి బ్రహ్మకాణ్డమనియు, కర్మార్థక=యాగాది కర్మములనే ప్రతిపాదించెడి కర్మకాణ్డమనియు, వేద = వేదములయొక్క, భేదాత్= భేదమువలన, ద్విధా=రెండుగా, విధాయ=కావించి, అనగా పూర్వోత్తర మీమాంసా రూపములతో రెండుగాఁగావించి, స్థితయా=ప్రతిష్ఠింపఁబడిన, మీమాంసయా = రెండు విధములగు మీమాంసలచే, చక్రే=చేయబడినదో యన్న ట్లున్నది.

వి. సరస్వతియొక్క యూరుయుగ్మము పూర్వోత్తరమీమాంసలుగా విభక్తము గాకపోయినను నైనట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకము లేనందువలన నది గమ్యము.

**సమాసములు :**

బ్రహ్మార్థ కర్మార్థక వేదభేదాత్:- బ్రహ్మ అర్థః యస్య సః=బ్రహ్మార్థః. కర్మ అర్థః యస్య సః = కర్మార్థకః, బ్రహ్మార్థశ్చ కర్మార్థకశ్చ బ్రహ్మార్థ కర్మార్థకౌ. బ్రహ్మార్థకర్మార్థకౌచ తా వేదౌ చ=బ్రహ్మార్థ కర్మార్థ కవేదౌ, బ్రహ్మార్థ కర్మార్థక వేదయోః భేదః= బ్రహ్మార్థకర్మార్థక వేద భేదః=తస్మాత్ =బ్రహ్మార్థకర్మార్థక వేదభేదాత్.

ఆత్మదేహమ్: ఆత్మనః దేహః=ఆత్మదేహః, తమ్ = ఆత్మదేహమ్

పరాచ్ఛాదనచారు:- పరం చ తత్ ఆచ్ఛాదనం చ=పరాచ్ఛా దనం, పరాచ్ఛాదనేన చారు=పరాచ్ఛాదనచారు. తత్=పరాచ్ఛాదనచారు. పక్షాన్తరమున- పరేషామాచ్ఛాదనం = పరాచ్ఛాదనం. పరాచ్ఛాద నేనచారు = పరాచ్ఛాదననచారు.

**భావము :**

అందమైన వలువను దాల్చుచుటచే రమ్యమై బలిసినట్టి ఆ సరస్వతియొక్క తొడలు రెండును; ప్రతివాదులను ఖండించుటచే రమ్యములైన బ్రహ్మకాణ్డ,

కర్మకాణ్డ లను పేర రెండుగా విభజింపగానే ర్పడిన వేదముల భేదము నను రించి, పూర్వోత్తల మీమాంసలను పేర నేర్పడిస రెండు భాగములుగా నేర్పడినవి. అనగా నా సరస్వతియొక్క రెండు తొడలును, వేదములో పర బ్రహ్మమునుఁ బ్రతిపాదించెడి బ్రహ్మకాండమునుఁ బట్టియు, యా గాదికర్మలనుఁ బ్రతిపాదించెడి కర్మకాణ్డనుఁ బట్టియు రెండు విధములుగా నేర్పడిన యుత్తర మీమాంసా పూర్వ మీమాంసలుగా నేర్పడినవి అందులో బ్రహ్మకాణ్డ యుత్తర మీమాంస యగు వేదాన్తముగాను కర్మకాణ్డ పూర్వమీమాంస యగు వేదార్థవిచార ప్రకరణముగాను ప్రసిద్ధి నొంది యున్నది. ఉపనిషత్తులు బ్రహ్మప్రతిపాదక ములు కాన నవి బ్రహ్మకాణ్డకుఁ జెందును. బ్రాహ్మణాది భాగములు యాగాదులను బోధించునుఁ గాన నవికర్మకాణ్డకుఁ జెందును. కర్మకాండమనియు బ్రహ్మకాణ్డ మనియు వేదవిభాగము ప్రసిద్ధ మైనది. ఆ కర్మకాండకు సంబం ధించిన పూర్వమీమాంసగను బ్రహ్మకాండకు సంబంధించిన యుత్తరమీమాంస గను సరస్వతియొక్క రెండు తొడలును పరిణమించిన వని సారము ॥౮౧॥

> శ్లో. ఉద్దేశపర్వణ్యపి లక్షణే౽పి
> ద్వేధోదితైః షోడశభిః పదార్థైః।
> ఆన్వీక్షికీం యద్దశనద్విమాలీ
> తాం ముక్తికామాకలితాం ప్రతీమః॥ **82**

ప.వి. ఉద్దేశపర్వణి- అపి- లక్షణే- అపి- ద్వేధా- ఉదితైః- షోడశభిః- పదార్థైః- ఆన్వీక్షకీం- యద్దశనద్విమాలీం- తాం- ముక్తికామ్- ఆకలి తాం- ప్రతీమః.

అర్థము:- యద్దశనద్వి మాలీం: యత్=ఏ సరస్వతియొక్క, దశన=దన్తముల యొక్క, ద్విమాలీం=రెండువరుసలనెడి, ఆకలితాం=కూర్చఁబడిన, ముక్తికామ్=ముత్తెములహారమును, ఉద్దేశపర్వణ్యపి=పేర్లతో పదార్థము లను పేర్కొను నవసరమందును, లక్షణే౽పి=సమానవస్తువులనుండియు, న సమానవస్తువులనుండియు లక్ష్యమును వేఱుచేయునట్టి, లక్షణమునుఁ జెప్పు నవసరమందును, ద్వేధా=రెండు విధములుగా, ఉదితైః=చెప్పఁ బడిన, అనగా, ఉద్దేశముగను, లక్షణముగను నిర్దేశింపఁబడిన పఞ్చా

స్తరమున- ఉద్దేశపర్వణి=ఉద్దేశింపఁబడినపర్వ్వదినసమందును,లక్షణేఽపి సాముద్రికలక్షణమందును, ద్విధా = రెట్టింపుగా, ఉదితైః=చెప్పఁబడిన, కావుననే ముప్పది రెండు సంఖ్యగల, షోడశభిః=పదునారైన, పదార్థైః= న్యాయ దర్శనమందుఁ జెప్పఁబడిన- ప్రమాణ- ప్రమేయ- సంశయ -ప్రయోజన- దృష్టాన్త- సిద్ధాన్త- అవయవ- తర్క- నిర్ణయ- వాద- జల్ప- వితణ్డా- హేత్వాభాస- ఛల- జాతి- నిగ్రహస్థానములనఁబడు పదార్థములచే నుపలక్షిత మైన, ముక్తికామకలితాం; ముక్తి = ముక్తిని, కామ=కోరెడి ముముక్షువులచే, ఆకలితాం—అభ్యసింపఁ బడిన,తాం= ప్రసిద్ధమైన, ఆన్వీక్షకీం = (వేదశ్రవణముఁ గావించిన పిదప పదార్థ పరీక్షనుఁ బ్రయోజనముగాఁ గల్గిన) తర్క విద్యగా, ప్రతీమః = తెలుసు కొనుచున్నాము. పైనఁ జెప్పఁబడిన ప్రమాణాది—నిగ్రహస్థానములపరకుఁ గల పదునారు పదార్థములను రెట్టింపుఁ జేయగా నవి సరస్వతీ దేవికి ముప్పదిరెండు దన్తములుగా నైన వని యర్థము.

వి. దశనద్విమాలిని అనగా, దంతముల రెండువరుసలును, ముక్తికామాకలితామ్, అను శ్లిష్టవిశేషణముచే, ముక్తికగను-అనగా ముత్యముల హారము గను, ముక్తికాములచే నభ్యసింపఁబడిన తర్కవిద్యగను రూపించుట వలన రూపకము. దశనద్విమాలి, తర్కవిద్య గాకపోయినను నయి నట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష. ఈ రూపకోత్ప్రేక్షలకు సఙ్కరము.

**సమాసములు :**

ఉద్దేశపర్వణి:- ఉద్దేశస్య పర్వ=ఉద్దేశపర్వ, తస్మిన్ = ఉద్దేశపర్వణి. పక్షాన్తరమున-ఉద్దేశయుక్తం పర్వ=ఉద్దేశపర్వ, తస్మిన్=ఉద్దేశపర్వణి
ఆన్వీక్షకీం:- అను ఈక్షా యస్యాస్సా=ఆన్వీక్షకీ, తాం=ఆన్వీక్షకీమ్.
యద్దశనద్విమాలీమ్:- యస్యాః దశనాః=యద్దశనాః. ద్వయోః మాల యోః సమాహారః—ద్విమాలీ, యద్దశనానాం ద్విమాలీ=యద్దశనద్విమాలీ.
ముక్తికామ్:- ముక్తైవ=ముక్తికా,తామ్=ముక్తికామ్.
ముక్తికామాకలితామ్:- ముక్తిం కామయన్తే ఇతి = ముక్తికామాః. ముక్తి కామైః రాకలితా=ముక్తికామాకలితా,తామ్=ముక్తికామాకలితామ్.

**భావము :**

ఇచ్చట శ్లేషతో సామెయొక్క దన్తపజ్క్తి ముత్యాలహారముగను తర్క విద్యగాను పరిణమించిన దని వర్ణింపఁబడుచున్నది-

ఆ సరస్వతియొక్క రెండు పంటి వరుస అనెడి ముత్యాలహారము తర్కవిద్యయందలి రెట్టింపుగావింపఁబడిన ముప్పదిరెండు పదార్థములైనవి. అ పదార్థములను పేరుతోఁజెప్పునవసరమందును, లక్షణముతోఁ జెప్పు నవసర మందును, రెండు మాఱులు నిర్దేశించుటచే తర్కవిద్యయందలి పదునాఱు పదార్థములు ముప్పదిరెండైనవి. అనగా తర్కవిద్యయందు ప్రమాణము మొదలు నిగ్రహస్థానము వరకుపదునాఱుపదార్థములు చెప్పఁబడియున్నవి. ఆ పదునాఱు పదార్థములను నుద్దేశమార్గమునను (పదార్థములపేరును వరుసగాఁ జెప్పుమార్గము నను) లక్షణమార్గమునను (బేర్కొనుటవలన నవి రెట్టింపగుచున్నవి. అనగా పైనఁబిల్చిన ప్రకారము ముప్పది రెండుగుచున్నదని యర్థము. సరస్వతియొక్క రెండు పంటివరుసల యందును ముప్పది రెండు దన్తము లున్నవి. సాముద్రిక శాస్త్రము ననుసరించి ముప్పదిరెండు దంతములుండుట భాగ్యలక్షణము-ఆ ముప్పదిరెండు దన్తములును, తర్కశాస్త్రమునందలి పదునాఱు పదార్థములను పైనఁ జెప్పిన ప్రకారను ఉద్దేశమార్గమునను, లక్షణ మార్గమునను, రెట్టింపుఁ జేయుటచే నేర్పడినది. సహజముగా పదార్థములు పదునాఱైనను, పై రెండు మార్గములచే రెట్టింపు చేయుటచే, ముప్పదిరెండైనవి. ఇట్లు రెట్టింపుగాఁ జేయఁ బడిన ప్రమాణాది నిగ్రహస్థానాన్తములైన పదునాఱు పదార్థముల తత్త్వ జ్ఞానముచే మోక్షప్రాప్తి యగునని చెప్పుటవలన ముముక్షువులు వాని తత్త్వ జ్ఞానమునకై పాటుపడుచుందురు. అట్టి తత్త్వజ్ఞానమునకు సాధనమైన యా తర్కవిద్య యాన్వీక్షకి యని చెప్పఁబడుచున్నది. ఏలయనగా- "అను = పశ్చాత్, వేదశ్రవణానన్తర మిత్యర్థః ఈక్షణం=పరీక్షణ మిత్యన్వీక్షా. సా ప్రయోజనమస్యా ఇత్యాన్వీక్షకీ=తర్కవిద్యా" అను వ్యుత్పత్తి ననుసరించి వేదశ్రవణముఁ గావించిన పిదప చేయవలసిన పదార్థ పరీక్షకు సాధనమైనందు వలన తర్కవిద్యకా పేరు వచ్చినది. ఆ యాన్వీక్షకియే రెట్టింపు గావింపఁబడిన పదునాఱు పదార్థములు గలదై సరస్వతికి ముప్పదిరెండు దన్తములుగాఁ బరిణ మించినదని యాశయము. ॥౮౨॥

శ్లో. తర్కా రదా యద్వదనస్య తర్క్యా
వాదేఽస్య శక్తిః క్వ? తథాఽన్యథా తైః।
పత్రం క్వ దాతుం గుణశాలిపూగమ్
క్వ వాదతః ఖణ్డయితుం ప్రభుత్వమ్॥ 83

ప.వి. తర్కాః- రదాః- యద్వదనస్య- తర్క్యాః—వాదే- అస్య- శక్తిః-క్వ- తథా- అన్యథా- తైః— పత్రం— క్వ- దాతుం- గుణశాలిపూగమ్- క్వ- వా- అదతః- ఖణ్డయితుం- ప్రభుత్వమ్.

అర్థము:- యద్వదనస్య=ఏ సరస్వతి మోమునకు సంబంధించిన, రదాః = దన్తములు, తర్కాః = ఊహలు- అనగా, ప్రమాణములకు ననుమాపకములగు జ్ఞాన విశేషములు అనగాఁ దర్కములచేతనే ప్రమాణములు ప్రమాత్మక జ్ఞానములను నసగా యథార్థజ్ఞానములనుఁ గల్గించుచున్నవని యర్థము. తర్క్యాః=ఉత్ప్రేక్షింపఁదగినవి. (తర్క్యాః = తర్కము వలె కఠినములు) తథాహి=అది యుక్తమే. అస్య=ఈ ముఖమునకు, తైః అన్యథా=దంతములును, తర్కములును లేక, వాదే=వాదమునందు, అనగా కథయందును, అభిభాషణమునందును, తథా=అటువంటి, శక్తిః =శక్తి, క్వ=ఎక్కడిది. అనగా దన్తములు తర్కములు లేక వాదమును చేయుట యసాధ్యము. (ఏవం=ఇట్లే, తర్కైః వినా = తర్కములులేక). వాదతః=వాదమును నిమిత్తీకరించి, పత్రం=ప్రతివాదికి, తన పక్షమును సమర్థించెడి లేఖను (లేదా) ప్రతివాదియొక్క ప్రతిజ్ఞనుఁ దెలిపెడి లేఖను, దాతుం=ఇచ్చుటకు, శక్తిః=శక్తి, క్వ=ఎక్కడ ? (దంతము లేక) అదతః=తినువానికి, పత్రం=తమలపాకును, దాతుం=ఖండించుటకు. శక్తిః=శక్తి, క్వవా=ఎక్కడిది. (తర్కైర్వినా) తర్కములు లేక, గుణశాలిపూగమ్; గుణశాలి=ప్రతిభాది గుణవంతులయొక్క, పూగం= సమూహము, వాదతః=వాదముచే, ఖణ్డయితుం=ఖండించుటకు (పగులఁ గొట్టుటకు) పక్షాన్తరమునందు- "వా- అదతః" యని పదవిభాగము. దాని ననుసరించి, దన్తైర్వినా=దన్తములు లేక, అదతః=భక్షించువానికి, లేదా, అదతః వా = దన్తములు లేనివానికిగాని, గుణశాలి=రసపూర్ణమైన,

పూగం=వక్క పండు, ఖండయితుం=తునుకలు, చేయుటకు ప్రభుత్వం సామర్థ్యము, క్వవా=ఎక్కడిది.

వి. ఇచ్చట సరస్వతి దన్తములు తర్కములుగా శ్లేషచే నుత్ప్రేక్షింపఁబడినవి. కాన నిచ్చట శ్లేషోత్ప్రేక్షలకు సఙ్కరము.

**సమాసములు :**

యద్వదనస్య :- యస్యాః వదనమ్ = యద్వదనం, తస్య = యద్వదనస్య.
గుణశాలిపూగమ్ :- గుణైః శాలన్తే ఇతి=గుణశాలినః. గుణశాలినాం పూగః=గుణశాలిపూగః. తమ్ = గుణశాలిపూగమ్. పక్షాన్తరమున- గుణశాలి చ తత్ పూగం చ=గుణశాలిపూగమ్, తత్=గుణశాలిపూగమ్.
అదతః :- అత్తీతి = అదన్, తస్య=అదతః. పక్షాన్తరమున- న విద్యన్తే దతః యస్య సః=అదత్, తస్య=అదతః.

**భావము :**

ఇచ్చట సరస్వతియొక్క దన్తములు తర్కములుగా వర్ణింపబడుచున్నవి.

ఆ సరస్వతి వదనమునందలి దన్తములు ఊహ లని చెప్పఁబడుచున్నవి. అనగా ప్రత్యక్షాది ప్రమాణములకు, అనుమాపక జ్ఞాన విశేషములు. మఱియు నామె దన్తములు తర్కములవలె కఠినములు. అనగా గట్టివి. దన్తములు గట్టిగనే యుండును గదా! అవి తర్క్యములు. అనగా తర్కములుఁ గా నుత్ప్రేక్షింపఁ బడినవి. ఈమె ముఖమునకు దన్తములుగాని, తర్కములు గాని లేనిచో వాదము చేయుట కెట్లు సాధ్యమగును? దన్తములు లేనివారును, తర్కములు తెలియని వారును వాదింప ననమర్థులు. అట్లే తర్కము తెలియనిచో, వాదముకొఱకు ప్రతివాదికి తన పక్షమును సమర్థించుకొనుటకు సాధనమైన లేఖను, లేదా ప్రతిజ్ఞా పత్రమును సమర్పించుట కవకాశ మెక్కడిది? దన్తములు లేనివానికి పత్రమును- అనగా తమలపాకును నములుటకు-శక్తి యెక్కడిది. తర్కములు లేక ప్రతిభావన్తు లగు విద్వాంసుల సంఘమును వాదమున ఖండించుట యసాధ్యము

గదా ! లేదా దన్తములు లేక భక్షించువానికి గాని, దన్తములు లేనివానికిఁగాని పండిన వక్కను ముక్కలుచేయుటకు సాధ్యము గాదు గదా ! శ్లేషవశముచే నీ యర్థములు పై శ్లోకమునకు లభ్యములై చివరకు సరస్వతి దన్తములు తర్క ములుగా పరిణమించిన వను నర్థమునందు పర్యవసానము నొందుచున్నవి. న్యాయశాస్త్రమున తర్కము, అయథార్థానుభవమునకుఁ జెందినది. దానికి- "వ్యాప్యారోపేణ వ్యాపకారోపః" అని లక్షణము. అనగా వ్యాప్యమైన వహ్న్యభావముయొక్క యాహార్యజ్ఞానముచే, వ్యాపకమైన ధూమాభావజ్ఞానము సిద్ధించును. "యది వహ్నిర్న స్యాత్, తర్హి ధూమోఽపి న స్యాత్" యని. అనగా వహ్ని లేనిచో ధూమముగూడ లేదని దాని యర్థము. ఈ తర్కము "క్వచిచ్ఛఙ్కానివర్తకః" అని చెప్పినట్లు వ్యభిచారశఙ్కానివర్తకముగా ననుమానాది ప్రమాణములకు సహకరించును. ఇట్టి తర్కములుగా సరస్వతీ దన్తములు పరిణమించిన వని సారాంశము. ॥౮౩॥

**శ్లో. సపల్లవం వ్యాసపరాశరాభ్యాం**
**ప్రణీతభావాదుభయీ భవిష్ణు।**
**తన్మత్స్య పద్మాద్యుపలక్ష్యమాణం**
**యత్పాణియుగ్మం వవృతే పురాణమ్॥ 84**

ప.వి. సపల్లవం- వ్యాసపరాశరాభ్యాం- ప్రణీతభావాత్- ఉభయీభవిష్ణు- తత్- మత్స్యపద్మాద్యుపలక్ష్యమాణం- యత్పాణియుగ్మమ్- వవృతే- పురాణమ్.

అర్థము: వ్యాసపరాశరాభ్యాం = వ్యాసపరాశర మహర్షులచే, ప్రణీతభావాత్ = విరచింపఁబడుటవలన, ఉభయీభవిష్ణు = మహాపురాణత్వమును, ఉపపురాణత్వమును పొందిన, తత్ = ఆ ప్రసిద్ధమైన, మత్స్యపద్మాద్యుపలక్ష్యమాణమ్ = మత్స్యపద్మస్కాన్ద పురాణాదుల చేతను, పక్షాన్తరమున- మత్స్యపద్మధ్వజకులిశాది సాముద్రిక రేఖలచేతను, నిర్దేశింపఁబడినదియు, సపల్లవం = కథాఽఽఖ్యాయికాది రూపముచే విస్తారమునుఁ బొందినదియు- పక్షాన్తరమున- సపల్లవం = చిగురుటాకుతో సమానమైనదియు నగు, యత్పాణియుగ్మం = ఏ సరస్వతియొక్క చేదోయిగా, పురాణం = మత్స్యపద్మాది పురాణ చయము, వవృతే = పరిణమించినది.

వి. పురాణచయము చేదోయిగాఁ బరిణమింపకపోయినను బరిణమించినదో యని చెప్పుటవలన నుత్ప్రేక్ష. ఇది గమ్యము.

**సమాసములు :**

పల్లవేన సహితం=సపల్లవమ్, పక్షాన్తరమున— సహ్యేన పల్లవేన = సపల్లవమ్.

వ్యాసపరాశరాభ్యామ్ :- వ్యాసశ్చ పరాశరశ్చ = వ్యాసపరాశరౌ, తాభ్యామ్=వ్యాసపరాశరాభ్యామ్.

ప్రణీతభావాత్ :- ప్రణీతస్య భావః=ప్రణీతభావః, తస్మాత్ = ప్రణీత భావాత్.

ఉభయీభవిష్ణు :- అనుభయముభయం సమ్పద్యమానం భవిష్ణు = ఉభయీభవిష్ణు.

మత్స్యపద్మాద్యుపలక్ష్యమాణమ్ :- మత్స్యం చ పద్మం చ = మత్స్య పద్మే. ఆదిశ్చ ఆదిశ్చ=ఆదీ. మత్స్యపద్మే ఆదీ యేషాం తాని=మత్స్య పద్మాదీని, మత్స్యపద్మాదిభిరుపలక్ష్యమాణమ్ = మత్స్యపద్మాద్యుపలక్ష్య మాణమ్.

యత్పాణియుగ్మమ్ :- పాణ్యోః యుగ్మమ్=పాణియుగ్మమ్, యస్యాః పాణియుగ్మమ్=యత్పాణియుగ్మమ్.

**భావము :**

వ్యాస మహర్షియు పరాశర మహర్షియు పురాణములను రచియించిరి. అందు మహాపురాణములను వ్యాసుఁడు రచియించెను. పరాశరుఁడు ఉప పురాణములను రచియించెను. కాని 'అష్టాదశపురాణానాం కర్తా సత్యవతీసుతః'' అని వ్యాసుడే యష్టాదశపురాణములను రచి యించినట్లు ప్రసిద్ధి గలదు. అయినను, "పురాణం వైష్ణవం చక్రే యస్తం వందే పరాశరమ్" అనియు ప్రసిద్ధియున్నది. కాన వ్యాసపరాశర రచితములై మహా పురాణ— ఉపపురాణముల పేర రెండుగా నేర్పడిన మత్స్యపద్మమార్కండేయాద్యా రూపములుగాఁ బ్రసిద్ధి నొందినదియు, ఇతిహాస్యాయికా రూపమునవి స్తరించినదియు

నగు పురాణవచనము మత్స్యపద్మాది సాముద్రిక రేఖలతోఁ గూడినదై, చిగురు టాకుతో సమానమగు మార్దవముగల యా సరస్వతియొక్క చేవోయిగాఁ బరిణ మించినది. ॥౮౪॥

శ్లో. ఆకల్పవిచ్ఛేదవివర్జితో యః
స ధర్మశాస్త్రవ్రజ ఏవ యస్యాః।
పశ్యామి మూర్ధ్నా శ్రుతిమూలశాలీ
కణ్ఠే స్థితః కస్య ముదే న వృత్తః॥ 85

ప.వి. ఆకల్పవిచ్ఛేద వివర్జితః- యః- సః- ధర్మశాస్త్రవ్రజః- ఏవ-యస్యాః- పశ్యామి- మూర్ధ్నా- శ్రుతిమూలశాలీ- కణ్ఠే- స్థితః తస్య- ముదే- న- వృత్తః.

అర్థము ఆకల్పవిచ్ఛేదవివర్జితః; ఆకల్ప=ప్రళయము వరకును, విచ్ఛేద= భంగముచే, వివర్జితః=విడువఁబడినదియు ననగా నవిచ్ఛిన్న సంప్ర దాయము గలదియు, పక్షాన్తరమున- ఆకల్ప =అలఙ్కారములున్నగు వానియొక్క, విచ్ఛేద=విచ్ఛేదముచే, వివర్జితః = విడువఁబడినదియు, అనగా నలఙ్కారాదులతోఁ గూడినదియు, ననగా నిత్యము నలఙ్క రింపఁబడినదియు, శ్రుతిమూలశాలీ; శ్రుతి=వేదమనెడి, మూల=ప్రమా ణముచే, శాలీ=ప్రకాశించునదియు, పక్షాన్తరమున- శ్రుతిమూల=చెవుల యొక్క మూల ప్రదేశములచే, శాలీ=శోభించునదియు, లేదా, శ్రుతి= శబ్దమును గ్రహించుటయందు, మూలకారణములైన చెవులతో, శాలీ = శోభించునదియు, కణ్ఠే=ముఖమునందు, స్థితః=ఉన్నదియు, పక్షాన్తర మున- కణ్ఠే=కణ్ఠముపైన, స్థితః=ఉన్నదియునగు, యః=ఏ,ధర్మశాస్త్ర వ్రజః=మన్వాది స్మృతులయొక్క సమూహముగలదో, సఏవ=అదియే, యస్యాః=ఏ సరస్వతికి, మూర్ధ్నా=తలగా, వృత్తః=ఏర్పడినదై, కస్య= ఎవనికి, ముదే=సంతోషమునకై, న=కాదు, పక్షాన్తరమున - వృత్తః =గుండ్రమైన, మూర్ధ్నా=తల, కస్య=ఎవనికి, ముదే = సంతోషమునకు, న=కాదు, పశ్యామి=ఉత్ప్రేక్షించుచున్నాను.

**సమాసములు :**

ఆకల్పవిచ్ఛేద వివర్జితః :- ఆకల్పం విచ్ఛేదః=ఆకల్పవిచ్ఛేదః, ఆకల్ప విచ్ఛేదేన వివర్జితః=ఆకల్పవిచ్ఛేద వివర్జితః.
ధర్మశాస్త్రప్రజః :- ధర్మప్రతిపాదకాని శాస్త్రాణి ధర్మశాస్త్రాణి, ధర్మ శాస్త్రాణాం ప్రజః=ధర్మశాస్త్రప్రజః.
శ్రుతిమూలశాలీ = శ్రుతేః మూలం=శ్రుతిమూలం, శ్రుతిమూలేన శాలత ఇతి=శ్రుతిమూలశాలీ. పక్షాన్తరమున- శ్రుతేః మూలే = శ్రుతిమూలే, శ్రుతిమూలాభ్యాం శాలత ఇతి = శ్రుతిమూలశాలీ. శ్రుతిరేవ మూలమ్= శ్రుతిమూలం, శ్రుతిమూలేన, శాలత ఇతి=శ్రుతిమూలశాలీ.

**భావము :**

ఇచ్చట ధర్మశాస్త్ర సమూహము సరస్వతికి శిరముగా నైనట్లు వర్ణింపఁ బడినది.

ధర్మశాస్త్రములు ఆకల్పవిచ్ఛేద వివర్జితములు అనగా ప్రళయము వరకును నవిచ్ఛిన్న సంప్రదాయమును గల్గియున్నవి. అవి శ్రుతిమూలశాలులు అనగా వేదమునుఁ బ్రమాణముఁగాఁ గల్గియున్నవి. అవి కణ్ఠస్థితములై, అనగా- వాచోవిధేయములై నోటనే యున్నవి. అవి యనగా, నా ధర్మశాస్త్రముల సమూహము సరస్వతీదేవికిఁ దలగా నేర్పడినది.

సరస్వతీ శిరము పక్షమున:-సరస్వతీ శిరము, ఆకల్పవిచ్ఛేదవివర్జితము. అనగా నలఙ్కారవిచ్ఛేద రహితము. అనగా నిత్యాలఙ్కార శోభితము. అది శ్రుతిమూలశాలి; అనగా కర్ణములయొక్క మూల ప్రదేశములతో గాని, శ్రుతి గ్రహణమూలములు అనగా శబ్దగ్రహణ మూలము లగు కర్ణములతో శోభించు చున్నది. ఆ శిరము కణ్ఠస్థము. అనగా కణ్ఠమునకుఁ బై భాగమునందున్నది. ఇట్టి సరస్వతీశిర మెవ్వని సంతోషహేతువు గాదు. మరియు సుంద్రమైన తల యెవ్వరికి సంతోషకరముగాదు? అనగా నందఱికిని సంతోషహేతువే యగు చున్నది. ధర్మశాస్త్రసమూహ మిట్టి సరస్వతీశిరముగా నేర్పడిన దని యాశ యము. ॥౮౩॥

శ్లో. భ్రువౌ దలాభ్యాం ప్రణవస్య యస్యా
స్తద్బిన్దునా భాలతమాలపత్రమ్।
తదర్ధచన్ద్రేణ విధిర్విపఞ్చీ
నిక్వాణనాకోణధనుః ప్రణిన్యే॥ 86

ప.వి. భ్రువౌ- దలాభ్యాం- ప్రణవస్య- యస్యాః- తద్బిన్దునా- భాలతమాల పత్రమ్- తదర్ధచన్ద్రేణ- విధిః- విపఞ్చీనిక్వాణ నాకోణధనుః- ప్రణిన్యే.

అర్థము:- విధిః=బ్రహ్మ, ప్రణవస్య = ఓఙ్కారముయొక్క, దలాభ్యాం = ఇరుప్రక్కలనున్న రేఖలచే, యస్యాః= ఏ సరస్వతియొక్క, భ్రువౌ= కనుబొమ్మలను, తద్బిన్దునా = ఆ ఓఙ్కారమందలి ''బిందువు"చే, భాలత మాలపత్రమ్; భాల=నొసటియందలి, తమాలపత్రమ్ = తిలకమును, తదర్ధచన్ద్రేణ; తత్=ఆ ప్రణవమందలి, అర్ధచన్ద్రేణ=అర్ధచన్ద్రాకారపు రేఖచే, విపఞ్చీనిక్వాణనా కోణధనుః; విపఞ్చీ=వీణను, నిక్వాణనా= వాదించుటకై, కోణధనుః=విల్లువలె వంకర యైన కోణమను కొయ్యను, ప్రణిన్యే=చేసెను.

వి :- ఇచ్చట నోఙ్కారమందలి రేఖలచేతను బిందువుచేతను నర్ధ చన్ద్రాకార రేఖచేతను సరస్వతీదేవియొక్క కనుబొమ్మలు మున్నగువానిని నిర్మింపక పోయినను నిర్మించి నట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకమును జెప్ప నందువలన నది గమ్యము.

**సమాసములు :**

భాలతమాలపత్రమ్ :- తమాలస్య పత్రమ్ = తమాలపత్రమ్, భాలే తమాలపత్రమ్ = భాలతమాలపత్రమ్. తత్=భాలతమాలపత్రమ్,

విపఞ్చీ నిక్వాణనా కోణధనుః :- విపఞ్చ్యాః నిక్వాణనా=విపఞ్చీ నిక్వాణనా, కోణః ధనురివ=కోణధనుః. విపఞ్చీనిక్వాణనాయాః కోణ ధనుః=విపఞ్చీ నిక్వాణనాకోణధనుః.

**భావము :**

నాగరలిపియందలి యోఙ్కారవర్ణమును నాధారము గావించుకొని సర స్వతియొక్క కనుబొమ్మలు మున్నగునవి వర్ణింపఁబడినవి—

బ్రహ్మయోఙ్కారమందలి రెండుప్రాన్తములయందలి రేఖలతో ననగా నిట్టి ॐ కారమందలి పైన దిగువనున్న రేఖలతో కనుబొమ్మలను నందలి బిందురేఖతో ననగా చుక్కతో, నామెయొక్క నొసటియందలి తిలక మును ననగా బొట్టును, పైన నున్న యర్ధచన్ద్రాకారపు రేఖతో నామెయొక్క పీణను వాదించెడి కోణ మని చెప్పఁబడు వింటి యాకారమును నున్న కొయ్య ముక్కను నిర్మించెను. అనగా నోఙ్కారమే యామెయొక్క కనుబొమ్మలు మున్నగునవిగాఁ బరిణమించె నని యాశయము. ॥౮౭॥

> శ్లో. ద్వికుణ్డలీ వృత్తసమాప్తి లిప్యాః
> కరాఙ్గులీ కాఞ్చనలేఖినీనామ్।
> కైశ్యం మసీనాం స్మితభాః కఠిన్యాః
> కాయే యదీయే నిరమాయి సారైః॥ **87**

ప.వి. ద్వికుణ్డలీ— వృత్తసమాప్తిలిప్యాః — కరాఙ్గులీ — కాఞ్చనలేఖినీనామ్ - కైశ్యం— మసీనాం- స్మితభాః— కఠిన్యాః— కాయే— యదీయే— నిర మాయి— సారైః,

అర్థము:- యదీయే=ఏ సరస్వతికి సంబంధించిన కాయే=దేహమందు, ద్వికుణ్డలీ=కర్ణములయందలి రెండు కుణ్డలముల, వృత్తసమాప్తిలిప్యాః=; వృత్త=గుండ్రమైన, సమాప్తిలిప్యాః=విరామరేఖయొక్క, అనగా విసర్గా కారమైన రేఖయొక్క, సారైః = శ్రేష్ఠములైన, భాగములచే, నిర మాయి=నిర్మింపబడిన. కైశ్యం=ఆ సరస్వతియొక్క కేశచయము, మసీనాం = సిరాలయొక్క, సారైః=సారములచేతను, స్మితభాః=అమె చిఱునగవుయొక్క కాన్తి, కఠిన్యాః=సుద్దయొక్క, సారైః=సారముచే, నిరమాయి=నిర్మింపఁబడినది,

వి:- ఆ సరస్వతియొక్క కమ్మలు రెండును, కేశచయము, చిఱునగవు కాంతి యనునివి; విసర్గసారములతోడను, సిరాయొక్క సారభాగముల తోడను కలముయొక్క సారభాగములతోడను నిర్మింపఁబడకపోయినను నిర్మింపఁబడినవో యని చెప్పుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకమునుఁ బ్రయోగింప నందువలన నది గమ్యము.

**సమాసములు :**

ద్వికుణ్డలీ:- ద్వయోః కుణ్డలయోః సమాహారః=ద్వికుణ్డలీ.
వృత్తసమాప్తిలిప్యాః :- సమాప్తౌ లిపిః = సమాప్తిలిపిః, వృత్తా చ సా సమాప్తిలిపిశ్చ=వృత్తసమాప్తిలిపిః, తస్యాః=వృత్తసమాప్తిలిప్యాః.
కరాఙ్గులీ=కరయోరఙ్గులీ=కరాఙ్గులీ.
కాఞ్చనలేఖినీనామ్: కాఞ్చనమయ్యః లేఖిన్యః=కాఞ్చనలేఖిన్యః, తాసామ్ =కాఞ్చనలేఖినీనామ్.
స్మితభాః :— స్మితస్య భాః=స్మితభాః.

**భావము :**

ఆమె చెవులయందలి కమ్మలు రెండును, వాక్యములలో విరామచిహ్నము లగు విసర్గాకారపు లిపియొక్క సారములచే నిర్మింపఁబడినవి. "శృఙ్గవత్ బాలవత్సస్య బాలికాకుచయుగ్మవత్। నేత్రవత్ కృష్ణసర్పస్య స విసర్గ ఇతి స్మృతః" అని చెప్పినలక్షణము ననుసరించి విసర్గ లేదూడయొక్క కొమ్ములవలెను, బాలిక యొక్క చనుదోయి వలెను, కృష్ణసర్పముయొక్క కన్నులవలెను నుండును. ఆమె చేతిలోని వ్రేళ్లు పసిడి కలములయొక్క సారభాగములచేతను, నామె కురుల సమూహము సిరాయొక్క సారభాగములతోఁడను, ఆమెయొక్క చిఱునగవు వెలుగు తెల్లని బొలపముయొక్క సారభాగములచేతను నిర్మింపఁబడినది ॥౮౭॥

శ్లో. యా సోఽపసిద్ధాన్తమయానసేవ
శూన్యాత్మతావాదమయోదరేవ।
విజ్ఞానసామస్త్యమయాన్తరేవ
సాకారతాసిద్ధిమయాన్తరేవ॥ 88

ప.వి. యా- సోమసద్ధాన్తమయాననా- ఇవ- శూన్యాత్మతావాదమయోదరా- ఇవ- విజ్ఞానసామస్త్యమయాన్తరా- ఇవ- సాకారతాసిద్ధిమయాన్తరా- ఇవ.

అర్థము. యా=ఏ సరస్వతీదేవి సోమసిద్ధాన్తమయాననా ఇవ, సోమసిద్ధాన్తమయ =కాపాలికదర్శనరూపమైన, పక్షాన్తరమున, సోమసిద్ధాన్తమయ= చన్ద్ర సిద్ధాన్తరూపమైన, అనగా చన్ద్రునివలెనఖణ్డరూపమైన, యనగా పూర్ణ రూపమైన, ఆననేవ=మోముకల్గినదియో యన్నట్లును, తథా=అట్లే,శూన్యా త్మతావాదమయోదరేవ;శూన్యాత్మతావాదమయ=ఆత్మలులేవనుమాధ్యమిక బౌద్ధదర్శనమయ మైన, ఉదరేవ-ఉదరముగలదియో యనునట్లు, అనగా మిక్కిలికృశించిన యుదరముగలదియోయనునట్లువి,జ్ఞానసామస్త్యమయో దరా ఇవ; విజ్ఞాన సామస్త్యమయ; విజ్ఞాన=నిరాకారవిజ్ఞానముయొక్క, సామస్త్యమయ=సాకల్యరూపమైన, అనగా ప్రపఞ్చ మంతయు నిరాకార విజ్ఞానస్వరూప మని చెప్పు యోగాచారుఁ డను బౌద్ధుని దర్శనస్వరూప మైన, అంతరా=అంతరఙ్గముగలదియోయన్నట్లును- అనగా నర్థముతోఁ గూడిన జ్ఞానసంపత్తిమయ మైన యంతరఙ్గము గలదియో యన్నట్లును, తథా = అట్లే, సాకారతాసిద్ధిమయాఖిలేవ; సాకారతాసిద్ధిమయ; సాకార విజ్ఞానమయమే ప్రపఞ్చ మని చెప్పుసౌత్రాన్తికుఁడను బౌద్ధుని దర్శన రూప మైన, అఖిలేవ=సమస్తము గలదియో యన్నట్లు నున్న సర స్వతీదేవి , మధ్యేసభమ్ = సభామధ్యమందు, అవతతార = దిగెను. -ఇట్లు శ్లోకమంతటి క్రియతోనన్వయము.

వి. ఇచ్చట సోమసిద్ధాన్తమయాననేవ-ఇత్యాదిగానుత్ప్రేక్షావ్యఞ్జకములగు నివ శబ్దములనుఁ బ్రయోగించి, సోమసిద్ధాన్తాదిరూపము లైన యాననాదులు లేకపోయినను నున్నట్లు చెప్పుటవలన వాచ్యోత్ప్రేక్ష.

**సమాసములు :**

సోమసిద్ధాన్తమయాననా — సోమస్య సిద్ధాన్తః=సోమసిద్ధాన్తః. సోమసిద్ధా న్తస్య వికారః = సోమసిద్ధాన్తమయం, సోమసిద్ధాన్తమయమ్ ఆననం య స్యాస్సా=సోమసిద్ధాన్తమయాననా,

శూన్యాత్మతావాదమయోదరా:- శూన్యాః ఆత్మానః యస్యసః=శూన్యాత్మా, శూన్యాత్మనః భావః=శూన్యాత్మతా। శూన్యాత్మతాయాః వాదః=శూన్యాత్మతావాదః। శూన్యాత్మతావాదస్య వికారః = శూన్యాత్మతావాదమయం, శూన్యాత్మతావాదమయమ్, ఉదరం యస్యాస్సా = శూన్యాత్మతావాదమయోదరా।

విజ్ఞానసామస్త్యమయాన్తరా:- సమస్తస్య భావః=సామస్త్యమ్, విజ్ఞానస్య సామస్త్యమ్=విజ్ఞానసామస్త్యమ్, విజ్ఞానసామస్త్యమేవ = విజ్ఞానసామస్త్యమయమ్, విజ్ఞానసామస్త్యమయమ్ అంతరం యస్యాస్సా=విజ్ఞానసామస్త్యమయాన్తరా.

సాకారతాసిద్ధిమయాఖిలా:- ఆకారేణ సహ వర్తత ఇతి = సాకారమ్, సాకారస్య భావః = సాకారతా, సాకారతాయాః సిద్ధిః = సాకారతాసిద్ధిః, సాకారతాసిద్ధిరేవ = సాకారతా సిద్ధిమయమ్, సాకారతాసిదిమయమఖిలం యస్యాస్సా=సాకారతాసిద్ధిమయాఖిలా.

**భావము :**

సరస్వతీదేవియొక్క ముఖము కాపాలికదర్శనసిద్ధాన్తమయమై యఖండముగ విలసిల్లుచున్నది. అనగా కాపాలికదర్శనమందు పరమాత్మకు నఖండస్వరూపత్వము చెప్పఁబడినది, కాపాలికదర్శనమును సోమసిద్ధాన్త మనియు చెప్పుదురు. సోమసిద్ధాన్త మనగా చంద్రసిద్ధాన్త మనియు నర్థము. సరస్వతి ముఖము చన్ద్రసిద్ధాన్తమయముగ నున్నది, అనగా చన్ద్రునివలె గుండ్రముగనున్నదని యర్థము. ఆమెయొక్క యుదరము, బుద్ధునిముగ్గురు శిష్యులలో నొక్కడైన మాధ్యమికుని శూన్యతాసిద్ధాన్తమయముగా నున్నది. మాధ్యమికుని మతమునందు నాత్మలు లేవని సిద్ధాన్తము. కాన నది శూన్యవాదమని ప్రసిద్ధము. అట్టి శూన్యవాదమయముగా నామెయొక్క యుదర మున్న దనగా నుదరము మిక్కిలి పలుచగా నుండుటవలన కానరాకయున్న దని యర్థము. అందువలన నామెయొక్క యుదరము శూన్యమని చెప్పఁబడినది, దమయన్తియొక్క యుదరమును వర్ణించునపుడు "సదసత్సంశయగోచరోదరీ"యని చెప్పిన విధముగా నిచ్చట సరస్వతీదేవియొక్కయుదరమును గూడ సదసత్సంశయగోచరముగా గ్రహింపవలయును. బుద్ధుని శిష్యులలో రెండవ వ్యక్తి యోగాచారుఁడు. అతని మతమున

ప్రపఞ్చమంతయు నిరాకారవిజ్ఞానస్వరూపము, అదియు క్షణికము. ఈ సరస్వతి యొక్క యన్తరఙ్గప్రపఞ్చము, అర్థ విశిష్టజ్ఞానసన్తతిరూప మైన విజ్ఞానముతో విలసించుచున్నదని యర్థము. అనగా విద్యారూపిణి యగు సరస్వతియొక్క యన్తరఙ్గము విజ్ఞానసన్తతితో విలసిత మని యాశయము. బుద్ధుని శిష్యులలో మూడవ వ్యక్తి సౌత్రాన్తికుడు. ఇతని మతమున జ్ఞానములు సాకారములు. అనగా యోగాచారుని మతమునందు వలె నిరాకారములు, అనగా నిర్విషయకములు గాక సవిషయకము లని యర్థము ఇతని సిద్ధాన్తమునందు, నీలపీతాదిజ్ఞానములు నీలాకారపీతాకారాదిరూపముతోనే యుండు ననియు వానికి పరస్పరభేదసాధకము గా 'అతద్వ్యావృత్తి'యను నపోహ యంగీకరింపబడినదనియు తెలియవల యును. సరస్వతీదేవికి సంబంధించిన సకలవిషయములు, సాకారతాసిద్ధిమయ ములుగా నున్నవి. అనగా సుందరాకారసన్తతితో వెలయుచున్న వని యర్థము. ఇట్లు సరస్వతీదేవియొక్క మోము, కాపాలికదర్శనమయముగను, ఆమెయొక్క యుదరము శూన్యవాదమయముగను అమెయొక్క యంతరఙ్గము, నిరాకార విజ్ఞానమయముగను, ఆమెయొక్క సకలవిషయములు, సాకారవిజ్ఞానవాదమయ ముగనున్న వని యాశయము ॥౮౮॥

**శ్లో.** **భీమ స్తయాఽగదృత మోదితుం తే**
**వేలా కిలేయం తదలం విషద్య।**
**మయా నిగాద్యం జగతీపతీనాం**
**గోత్రం చరిత్రఞ్చ యథావదేషామ్॥** **89**

ప వి భీమః — తయా — అగదృత — మోదితుం — తే — వేలా—కిల— ఇయం- తత్-అలం—విషద్య - మయా - నిగాద్యం - జగతీపతీనాం - గోత్రం - చరిత్ర-చ -యథావత్-ఏషామ్.

అర్థము: ( అథ = పిదప ) అనగా-74వ శ్లోకము నుండి 88వ శ్లోకమువరకు వర్ణింపబడిన సరస్వతీదేవి సభామధ్యమునందు వచ్చినపిదప అనియర్థము. తయా=ఆ సరస్వతిచేత, భీమః=భీమరాజు, అగదృత=చెప్పబడెను,- ఓ రాజన్=ఓ రాజా, ఇయం=ఇది తే=నీకు;మోదితుం=సంతోషించుటకు, వేలాకిల=సమయముగదా! విషద్య = దుఃఖించి, అలం=చాలును, (ఏల

యనగా) ఏషాం=ఈ జగతీపతీనాం=రాజులయొక్క, గోత్రం= కులము, చరిత్రం=చరిత్ర, యథావత్=ఉన్నదానిని ఉన్నవిధముగా, మయా = నాచేత; నిగాద్యం=చెప్పఁదగియున్నది. అనగా నేను చెప్పఁగలను.

**సమాసములు :**

జగతీపతీనామ్:- జగతీనాం పతయః=జగతీపతయః, తేషాం=జగతీపతీనామ్।

**భావము :**

సరస్వతీదేవి స్వయంవరసభామధ్యమున దిగిన వెంటనే భీమరాజునుఁ గూర్చి- ఓరాజా! ఇది నీకు హర్షించుటకు సమయము, నీవు చింతపడవలదు. ఇచ్చటికి విచ్చేసిన ప్రభువులయొక్క గోత్రములను, నామములను, చరిత్రనుఁ గూర్చి నేను చెప్పఁగలను. ॥౮౯॥

శ్లో. **అవిన్దతాఽసౌ మకరన్దలీలాం**
**మన్దాకినీ యచ్చరణారవిందే.**
**అత్రావతీర్ణా గుణవర్ణనాయ**
**రాజ్ఞాం తదాజ్ఞావశగాఽస్మి కాఽపి॥ 90**

ప.వి. అవిన్దత - అసౌ—మకరన్దలీలాం - మన్దాకినీ—యచ్చరణారవిందే—అత్ర—అవతీర్ణా-గుణవర్ణనాయ-రాజ్ఞాం-తదాజ్ఞావశగా-అస్మి - కా-అపి.

అర్థము :- అసౌ=ఈప్రసిద్ధమైన, మన్దాకినీ=గంగానది, యచ్చరణారవిందే; యత్=ఏపురుషునియొక్క, చరణారవిన్దే=పాదకమలమునందు; మకరన్దపుష్పరసముయొక్క, లీలాం = పోలికను, అవిన్దత = పొందినదో, తదాజ్ఞానవశగా; తత్=ఆమహావిష్ణువుయొక్క, ఆజ్ఞా=ఆదేశమునకు, వశగా=అధీనురాలైన, కాఽపి=ఎవ్వతెయో యొకతె యైన, అస్మి=నేను, రాజ్ఞాం=రాజులయొక్క, గుణవర్ణనాయ=గుణములను వర్ణించుటకై, అత్ర=ఈ స్వయంవరసభయందు, అవతీర్ణా = దిగినదాననుగా, ( అస్మి = అగుచున్నాను)

**సమాసములు :**

మకరన్దలీలామ్ = మకరన్దస్య లీలా = మకరన్దలీలా, తామ్ = మకరన్దలీలామ్.

మన్దాకినీ:— మన్దమకతీతి = మన్దాకినీ.

యచ్చరణారవిన్దే ;— చరణం అరవిన్దమివ = చరణారవిన్దమ్, యస్య చరణారవిన్దం = యచ్చరణారవిన్దమ్, తస్మిన్ = యచ్చరణారవిన్దే

గుణవర్ణనాయ:- గుణానాం వర్ణనం = గుణవర్ణనం, తస్మై = గుణవర్ణనాయ.

తదాజ్ఞావశగా:- తస్య ఆజ్ఞా = తదాజ్ఞా, తదాజ్ఞాయాః వశః - తదాజ్ఞావశః, తదాజ్ఞావశంగచ్ఛతీతి - తదాజ్ఞావశగా.

**భావము :**

సరస్వతీదేవి తన్నుఁ గూర్చి చెప్పుకొనుచున్నది- ప్రసిద్ధమైన యీ గంగానది ఎవ్వనిపాదారవిందములయందు జన్మించిన మకరన్దవాహినిగా నున్నదో అట్టి మహావిష్ణువుయొక్క యాజ్ఞకులోఁబడి యీస్వయంవరసభ కేతెంచిన రాజుల చరిత్రను వర్ణించుట కిఁట వచ్చితిని నే నెవ్వతెనో యొకతెను- ఆ వివరముతో నిఁటఁ బని లేదు, అని నిరాడంబరముగా తన్నుఁ గూర్చి యామె చెప్పు కొనినది ॥౯౦॥

**శ్లో. తత్కాలవేద్యైశ్శకునస్వరాద్యై**
**రాప్తామవాప్తాం నృపతిః ప్రతీత్య।**
**తాం లోకపాలైకధురీణ ఏష**
**తస్యై సపర్యాముచితాం దిదేశ॥ 91**

ప:వి. తత్కాలవేద్యైః -శకునస్వరాద్యైః-ఆప్తామ్ అవాప్తాం-నృపతిః-ప్రతీత్య-తాం-లోకపాలైకధురీణః-ఏషః-తస్యై-సపర్యామ్-ఉచితాం-దిదేశ.

అర్థము: లోకపాలైకధురీణః; లోకపాలః=లోకమును, పాలించెడియిన్ద్రాదులతో, ఏకధురీణః=సమానభారమును వహించెడి, అనగా సమానస్కంధుఁడైన,

ఏషః—ఈ, నృపతిః = భీమభూపతి, అవాప్తాం = ఆకస్మికముగా సభకు విచ్చేసిన, తాం—ఆ సరస్వతీదేవిని; తత్కాలవేద్యైః; తత్కాల = ఆ కాలమునందు, వేద్యైః—తెలియఁదగిన; శకునస్వరాద్యైః; శకున—శుభ సూచము లగు నిమిత్తములు, స్వర—ముక్కునందలిగాలి, ఆద్యైః—కన్ను అదరుట మున్నగు సాధనములతో, ఆప్తాం = హితురాలుగా, ప్రతీత్య = నిర్ధారణఁ గావించుకొని, తస్యై = ఆ సరస్వతికి, ఉచితాం = తగినట్టి, సపర్యాం—పూజను; దిదేశ—సమర్పించెను.

**సమాసములు :**

తత్కాలవేద్యైః :- స చాఽసౌ కాలశ్చ—తత్కాలః, తత్కాలే వేద్యాః— తత్కాలవేద్యాః, తైః—తత్కాలవేద్యైః.

శకునస్వరాద్యైః - శకునం చ స్వరశ్చ = శకునస్వరౌ, శకునస్వరౌ ఆద్యౌ యేషాం తాని—శకునస్వరాద్యాని, తైః—శకునస్వరాద్యైః.

నృపతిః ;- నృణాం పతిః—నృపతిః।

లోకపాలైకధురీణః :- లోకం పాలయన్తీతి—లోకపాలాః, ధురం వహ తీతి—ధురీణః, ఏకశ్చాసౌ ధురీణశ్చ—ఏకధురీణః, లోకపాలైరేకధురీణః —లోకపాలైకధురీణః॥

**భావము :**

ఇన్ద్రాదులతో సమానస్కంధుఁడైన భీమరాజు హఠాత్తుగా సభామధ్య మందు దిగిన సరస్వతినిఁ గూర్చి కొంతవరకు సందేహించి, తర్వాత శుభశకు నాదులనుఁ బట్టి యామెను హితురాలుగనే భావించి యామెకు తగిన పూజాదు లనుఁ గావించెను ॥౯౧॥

**శ్లో. దిగన్తరేభ్యః పృథివీపతీనా**
**మాకర్ష కౌతూహలసిద్ధవిద్యాం।**
**తతః క్షితీశః స నిజాం తనూజా**
**మధ్యేమహారాజకమాజుహావ॥ 92**

ప.వి. దిగన్తరేభ్యః-పృథివీపతీనామ్ - ఆకర్ష కౌతూహలసిద్ధవిద్యాం - తతః - క్షితీశః-సః-నిజాం-తనూజాం-మధ్యేమహారాజకమ్-ఆజుహావ.

అర్థము: తతః=సరస్వతీదేవిని బూజించిన పిదప, సః = ఆ, క్షితీశః = భీమ నృపతి, దిగన్తరేభ్యః=భిన్నభిన్నదిక్కులనుండి, పృథివీపతీనాం = రాజులను, ఆకర్షకౌతూహలసిద్ధి విద్యాం; ఆకర్షికౌతూహల = ఆకర్షణచేసెడి యుత్సాహక్రియయందు, సిద్ధివిద్యాం=సిద్ధినొసంగెడి మన్త్రస్వరూపురాలైన , అనగా సౌన్దర్యముచే నందఱి నాకర్షణ జేయునట్టిదైన యని యర్థము. నిజాం=తనదైన, తనూజాం=పుత్రికను, మధ్యేమహారాజకం= గొప్ప రాజసమూహమునకు మధ్యభాగమునందు, ఆజుహావ= పిలిచెను.

**సమాసములు :**

దిగన్తరేభ్యః :- అన్యాః దిశః=దిగన్తరాణి. తేభ్యః=దిగన్తరేభ్యః.
పృథివీపతీనాం :- పృథివ్యాః పతయః=పృథివీపతయః. తేషాం= పృథివీ పతీనామ్.
ఆకర్షకౌతూహలసిద్ధవిద్యామ్:- ఆకర్షే కౌతూహలమ్=ఆకర్షకౌతూహలమ్, ఆకర్షకౌతూహలే సిద్ధవిద్యా=ఆకర్షకౌతూహల సిద్ధవిద్యా, తామ్=ఆకర్ష కౌతూలహల సిద్ధవిద్యామ్.
క్షితీశః:- క్షితేః ఈశః = క్షితీశః.
తనూజామ్:- తన్వాః జాయత ఇతి=తనూజా, తామ్, తానూజామ్.
మధ్యేమహారాజకమ్:- రాజ్ఞాం సమూహః = రాజకం, మహచ్చ తత్ రాజకంచ=మహారాజకం, మహారాజకస్య మధ్యే=మధ్యేమహారాజకమ్,

**భావము :**

భిన్న భిన్న దిక్కులనుండి విచ్చేసిన రాజుల నందఱిని, తన దివ్యసౌన్దర్యముచే నాకర్షింప నట్టి సిద్ధమ న్త్రస్వరూపముగ నున్న తన పుత్రిక యగు దమయన్తిని భీమరాజు, రాజపుత్రులతో నిండిన యా మహాసభకు రప్పించెను ॥౯-౨॥

శ్లో. దాసీషు నాసీరచరీషు జాతం
స్ఫీతం క్రమేణాళిషు వీక్షితాసు।
స్వాఙ్గేషు రూపోత్థమథాద్భుతాబ్ధి
ముద్వేలయ న్తీమవలోకకానామ్॥ 93

ప.వి. దాసీషు- నాసీరచరీషు- జాతం- స్ఫీతం- క్రమేణ- అలిషు-వీక్షితాసు- స్వాఙ్గేషు- రూపోత్థమ్- అథ- అద్భుతాబ్ధిమ్- ఉద్వేలయన్తీమ్- అవ లోకకానామ్.

అర్థము:- అథ = దమయన్తిసభకు విచ్చేసిన పిదప, నాసీరచరీషు= ముందు నడచుచున్న, దాసీషు=పరిచారికలు, వీక్షితాసు సతీషు = చూడఁబడగా, క్రమేణ=క్రమముగా, అలిషు=చెలికత్తెలు వీక్షితాసు= చూడఁబడగా,స్ఫీతం = వర్ధిల్లినదియు,అథ = పిదప, రూపోత్థం—సౌన్దర్య మువలన నుద్భవించినదియునైన. అవలోకకానాం = ప్రేక్షకులయొక్క, అద్భుతాబ్ధిం = ఆశ్చర్యరససాగరమును, స్వాఙ్గేషు=దమయన్తియొక్క యవయవములు, వీక్షితేషు సత్సు = చూడఁబడగా, ఉద్వేలయన్తీం = గట్టునుఁబొరలునట్లు చేయుచున్న, భైమీం=దమయన్తిని, రాజరాజిః = రాజులపఙ్క్తి, పపౌ=మిక్కిలి యాదరముతో చూచెను (అని 108వ శ్లోక మందలి కర్తతోఁడను క్రియతోఁడను నన్వయము)

వి:- ఇచ్చట నొక్కటైన విస్మయ సముద్రమందు, సౌన్దర్యజాతత్వము, తర్వాత స్ఫీతత్వము, తర్వాత ఉద్వేలత్వ మను ధర్మములను క్రమ ముగా జెప్పుటవలన పర్యాయాలఙ్కారము.

**సమాసములు :**

నాసీరచరీషు:- నాసీరే చరన్తీతి=నాసీరచర్యః, తాసు = నాసీరచరీషు.

స్వాఙ్గేషు:- స్వస్యాః అఙ్గాని=స్వాఙ్గాని, తేషు=స్వాఙ్గేషు.

రూపోత్థమ్ :- రూపేణ ఉత్థా యస్య తత్=రూపోత్థమ్.

అద్భుతాబ్ధిం:- అద్భుతమేవ అబ్ధిః=అద్భుతాబ్ధిః. తమ్=అద్భుతాబ్ధిమ్.

**భావము :**

ఇదిమొదలు పదునాఱు శ్లోకములచే కవి దమయన్తిని వర్ణించుచున్నాఁడు.
ఆ దమయన్తికి ముందు నడచెడిపరిచారికలనుఁ జూడగనేజన్మించినదియు, పిదప క్రమముగాఁ జెలికత్తెలనుఁ జూడగనే వర్ధిల్లినదియును పిదప సౌన్దర్యముచే ప్రేక్షకుల యందు వృద్ధిచెందినదియు నైన, యాశ్చర్యసముద్రమును, తన యవయవముల వర్ణించుటచే గట్టులనుఁ బొరలునట్లు చేయుచుండినది. తొలుత పరిచారికలనుఁ చూడగనే ప్రేక్షకులయందు వారిసౌందర్యమువలన నాశ్చర్యము కల్గినది. ఆ యాశ్చర్యము దమయన్తి సఖుల సౌన్దర్యదర్శనముచే వర్ధిల్లినది. చివర దమయన్తి రాగనే యామె సౌన్దర్యమును జూచుటచే ప్రేక్షకుల యాశ్చర్యసాగరము గట్టులనుఁ బొరల దొడగినది. ఆ విధముగ ప్రేక్షకుల యాశ్చర్యసాగరము గట్టులపైఁ బొంగించి పొరలఁ జేయుచున్న యా దమయన్తిని యా స్వయంవరసభయందలి రాజు లెల్లరు గాంచిరి ॥౯౩॥

**శ్లో. స్నిగ్ధత్వమాయాజలలోపలేప**
**సయత్నరత్నాంశుమృజాంశుకాభామ్।**
**నేపథ్యహీరద్యుతివారివర్తి**
**స్వచ్ఛాయనిచ్ఛాయనిజాలిజాలామ్॥ 94**

ప.వి. స్నిగ్ధత్వమాయాజల లేపలోపసయత్నరత్నాంశు మృజాంశుకాభామ్ - నేపథ్యహీరద్యుతి వారి వర్తిస్వచ్ఛాయనచ్ఛాయనిజాలిజాలామ్.

అర్థము: స్నిగ్ధత్వమాయాజలలోపలేపసయత్న రత్నాంశు మృజాంశుకాభామ్; స్నిగ్ధత్వ=నునుపు తనమునకు, మాయాజల=లోన నీరుండుట యను దోషము, (తథా=అట్లే) లేప=మఱియొక వస్తువు కలియుటచే రత్నము యొక్క రంగును నతిశయింపఁ జేయుట యను దోషము, అను వీని యొక్క, లోప=అభావములకు ననగా నట్టి దోషములు లేకయుండుటకు, సయత్న=ప్రయత్నము గల్గిన- అనగా ప్రయాసతో నట్టి దోషములు లేనివిగఁ జేయబడిన, రత్న=రత్నములయొక్క, అంశుమృజా = కిరణముల తేటఁదనము వంటి, అంశుకాభాం=వలువలయొక్క, కాన్తి గల్గినదియు, (తథా- అట్లే) నేపథ్య హీరద్యుతివారివర్తి స్వచ్ఛాయనచ్ఛాయని

జాలిజాలామ్; నేపథ్య=ఆభరణముల యంచలి, హీర = వజ్రములు యొక్క, ద్యుతి=కాంతియనెడి, వారి = ఉదకముననందు, ప్రతి = ప్రతి ఫలించిన రూపముతోనున్న, స్వ=తనయొక్క, ఛాయా = ప్రతిబింబ ముతో, సచ్ఛాయ=సమాన కాంతిగల్గిన, నిజ = తనకు సంబంధించిన, ఆలి=చెలికత్తెలయొక్క, జాలాం=సమూహముగల, (భైమీం = దమ యన్తిని, రాజరాజిః=రాజసమూహము, పపౌ=ఆదరముతో చూచినది).

వి. ఇచ్చట, ఆభరణముల యంచలి తన ప్రతిబింబముచే తన చెలికత్తెలకు సాదృశ్యము ఉండకపోయినను ఉన్నట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష. ఆ యుత్ప్రేక్షచే వారికి తనతో సమాన మైన సౌన్దర్యము కలదను వస్తువు ధ్వనించుచున్నది. కాన నలఙ్కారముతో వస్తుధ్వని.

**సమాసములు :**

స్నిగ్ధత్వమాయాజలలేపలోప సయత్నర త్నాంశు మృజాంశుకాభామ్.
స్నిగ్ధస్య భావః=స్నిగ్ధత్వం, మాయయా జలం = మాయాజలమ్, స్నిగ్ధత్వాయ మాయాజలం=స్నిగ్ధత్వ మాయాజలమ్. స్నిగ్ధత్వమాయా జలం చ లేపశ్చ=స్నిగ్ధత్వ మాయాజలలేపౌ, స్నిగ్ధత్వ మాయాజల లేపయోః లోపౌ=స్నిగ్ధత్వ మాయాజల లేపలోపౌ. స్నిగ్ధత్వ మాయాజల లేపలోపాభ్యాం సయత్నాని=స్నిగ్ధత్వ మాయాజల లేపలోపసయత్నాని, స్నిగ్ధత్వ మాయాజల లేపలోపసయత్నాని చ తాని రత్నాని చ = స్నిగ్ధత్వమాయాజలలేపలోప సయత్నరత్నాని, స్నిగ్ధత్వమాయాజల లేపలోప సయత్న రత్నానామంశవః = స్నిగ్ధత్వమాయాజలలేపలోప సయత్న రత్నాంశవః=స్నిగ్ధత్వమాయాజల లేపలోప సయత్న రత్నాం శవః. స్నిగ్ధత్వ మాయాజలలేపలోప సయత్న రత్నాంశూనాం మృజా స్నిగ్ధత్వ మాయాజలలేపలోప సయత్నరత్నాంశు మృజా. అంశుకస్య ఆభా=అంశుకాభా, స్నిగ్ధత్వ మాయాజలలేపలోప సయత్నరత్నాంశు. మృజేవ అంశుకాభా యస్యాస్సా = స్నిగ్ధత్వ మాయాజలలేపలోప సయత్నరత్నాంశు మృజాంశుకాభా. తామ్=స్నిగ్ధత్వ మాయాజలలేప లోప సయత్నరత్నాంశు మృజాంశుకాభామ్.

నేపథ్యహీరద్యుతివారిపత్రి స్వచ్ఛాయసచ్ఛాయ నిజాలిజాలామ్ :-
నేపథ్యస్య హీరాః = నేపథ్య హీరాః, నేపథ్య హీరాణాం ద్యుతిః =

నేపథ్యోహీరద్యుతిః, నేపథ్యోహీరద్యుతిరేవ వారి = నేపథ్యహీరద్యుతివారి, నేపథ్యహీరద్యుతివారిణి ప్రవర్తతే ఇతి=నేపథ్యహీరద్యుతివారిప్రవృత్తి, స్వస్య చ్ఛాయా=స్వచ్ఛాయమ్, నేపథ్యహీరద్యుతివారిప్రవృత్తి చ తత్ స్వచ్ఛాయం చ=నేపథ్యహీరద్యుతివారిప్రవృత్తి స్వచ్ఛాయమ్, నేపథ్యహీరద్యుతివారిప్రవృత్తి స్వచ్ఛాయేన సమానా ఛాయా యాసాం తాః, నేపథ్యహీరద్యుతివారిప్రవృత్తి స్వచ్ఛాయసచ్ఛాయాః, నేపథ్యహీరద్యుతివారిప్రవృత్తి స్వచ్ఛాయసచ్ఛాయం నిజాలీనాం జాలం యస్యాస్సా=నేపథ్యహీరద్యుతివారిప్రవృత్తి స్వచ్ఛాయ సచ్ఛాయనిజాలిజాలా. తామ్= నేపథ్యహీరద్యుతి వారిప్రవృత్తి స్వచ్ఛాయ సచ్ఛాయ నిజాలిజాలామ్".

**భావము :**

రత్నములలో, 'రాగస్త్రాసశ్చ బిన్దుశ్చ రేఖా చ జలగర్భతా. సర్వ రత్నేష్వమీ పఞ్చ దోషాః సాధారణా మతాః' అని చెప్పిన విధముగా, రాగము, త్రాసము, బిందువు రేఖ, జలగర్భత్వము అను నైదు దోషము లున్నవి. ఇట్టి దోషములలో జలగర్భత్వము, లేపము అను నె రెండును చేరియున్నవి. దమ యన్తి ధరించిన వలువ అట్టి దోషములు లేక స్వచ్ఛము లైన రత్నముల తేట దనమును గల్గియున్నది. రత్నమునందు నీరున్నచో జలగర్భత్వమను దోషము. దీనివలన రత్నము చూచుటకు మసుపుగా నుండును. రత్నమునందు మఱి యొక వస్తువు కలిసి యున్నచో లేప మను దోషము. ఈ లేపదోషము వలన రత్నము చాల కాన్తియుక్తముగా గానవచ్చును. ఇట్టి దోషములు లేని రత్నముల కాంతి చాల నిర్మలముగా నుండును. అట్టి కాంతి గల్గిన వలువను దమయన్తి ధరించియున్నది. మఱియు నామె ధరించిన యాభరణములలో వజ్ర ములు లున్నవి. ఆ వజ్రములు కాన్తి నీటి వలె స్వచ్ఛమై యున్నది. దాని యందు కానవచ్చెడి దమయన్తియొక్క ప్రతిబిమ్బముతో నామెయొక్క చెలి కత్తెలు పోలియున్నారు. అట్టి చెలికత్తెలతో సభకు విచ్చేసిన దమయన్తిని రాజ సమూహము దర్శించినది.

శ్లో. విలేపనామోదముదాగతేన
తత్కర్ణపూరోత్పల సర్పిణా చ।

రతీశదూతేన మధువ్రతేన
కర్ణే రహః కిఞ్చిదివోచ్యమానామ్‌॥ 95

ప. వి. విలేపనా మోదముదా-ఆగతేన-తత్కర్ణ పూరోత్పలసర్పిణా-చ-రతీశదూతేన-మధువ్రతేన-కర్ణే-రహః-కిం-చిత్-ఇవ-ఉచ్యమానామ్.

అర్థము: విలేపనామోదముదా; విలేపన=చన్దనము మున్నగు మైపూతలయొక్క, ఆమోద=పరిమళమందలి, ముదా = సంతోషముతో, ఆగతేన = వచ్చినదియు, (తథా=అట్లే) తత్కర్ణ పూరోత్పల సర్పిణా చ; తత్=ఆ దమయన్తి యొక్క, కర్ణోత్పల=కర్ణభూషణమైన కలువను, సర్పిణా చ=పరిమళముచే నాకర్షింపఁబడి చుట్టుచున్నదియును, రతీశదూతేన; రతీశ=మన్మథునకు, దూతేన=దూతయైనదియు, ననగా కామోద్దీపకమైనదియునగు, మధువ్రతేన=తుమ్మెదచే, కర్ణే=చెవియందు, కిఞ్చిత్=కొంచెము, రహః="నలుడే, విచ్చేసిన, రాజులందఱిలోను నంచగాఁడని" రహస్యమును, ఉచ్యమానామివ = చెప్పఁబడుచున్నదో యనునట్లున్నదియునగు, భైమీం=దమయన్తిని, రాజరాజిః=రాజుల సంఘము, అపాఙ్గైః=కడకన్నులచే, పపౌ=ప్రీతితోఁజూచినది.

వి. ఇచ్చట మధువ్రతముచే రహస్యము చెప్పఁబడక పోయినను, చెప్పబడుచున్నదో యనునట్లు వర్ణించుటవలన నుత్ప్రేక్షాలఙ్కారము. వ్యఞ్జకమగు నివశబ్దమునుఁ బ్రయోగించుటవలన నది వాచ్యము — ఆ యుత్ప్రేక్షచే దమయన్తి యందలి కిలికిఞ్చితాది శృఙ్గార చేష్టలు ధ్వనించుచున్నవి. కాన నలఙ్కారముచే వస్తుధ్వని.

**సమాసములు :**

విలేపనామోదముదా :- విలేపనానామామోదః=విలేపనామోదః, విలేపనామోదేన ముత్=విలేపనామోదముత్, తేన=విలేపనామోదముదా.

తత్కర్ణపూరోత్పలసర్పిణా :- తస్యాః కర్ణపూరః = తత్కర్ణపూరః, తత్కర్ణపూర ఏవ ఉత్పలమ్=తత్కర్ణపూరోత్పలం, తత్కర్ణ పూరో

త్పలం సర్పరీతి=తత్కర్ణ పూరోత్పల సర్పీ, తేన = తత్కర్ణ పూరో
త్పలసర్పిణా.
రతీశదూతేన :- రతేః ఈశః -రతీశః, రతీశస్య దూతః = రతీశదూతః,
తేన=రతీశదూతేన.

**భావము :**

ఆ దమయన్తి శరీరమునకు పట్టించిన చన్దనాది విలేపన ద్రవ్యముల పరి మళముచే నాకర్షింపఁబడిన తుమ్మెద, యామె కర్ణభూషణ మైన కలువ పూవును చుట్టుచు, మన్మథుని దూత యనుటవలన కామోద్దీపకమై, దమయన్తి చెవియందు "స్వయంవరసభ నలఙ్కరించిన రాజులలో నలుఁడే యందగాడ"ని రహస్య మునుఁ జెప్పుచున్నట్లుండినది. అట్టి దమయన్తిని రాజసంఘము ప్రీతితో దర్శిం చినది. ॥౯౫॥

శ్లో. విరోధి వర్ణాభరణాశ్మ భాసాం
మల్లాజి కౌతూహల మీక్షమాణామ్।
స్మరస్య చాపభ్రమచాలితే ను
భ్రువౌ విలాసాత్ వలితే వహన్తీమ్। 96

ప్ర.వి. విరోధివర్ణాభరణాశ్మభాసాం-మల్లాజికౌతూహలమ్- ఈక్షమాణామ్-స్మర
స్యచాప భ్రమచాలితే-ను-భ్రువౌ-విలాసాత్-వలితే-వహన్తీమ్-.

అర్థము: విరోధివర్ణాభరణాశ్మభాసాం; విరోధివర్ణ=తెలుపు నలుపుమున్నగు నానా వర్ణములుగల,ఆభరణాశ్మ=ఆభరణ రత్నములయొక్క,భాసాం=కాంతుల యొక్క, మల్లాజి కౌతూహలమ్; మల్లాజి = మల్లయుద్ధమందలి, కౌతూ హలం = కుతూహలమును, అనగా, నొక కాన్తిని మఱియొక కాన్తి యాక్రమించవలయు ననెడి కోరికను, ఈక్షమాణాం=చూచుచున్నదియు; విలాసాత్=స్త్రీ స్వభావసిద్ధమైన సిగ్గు మున్నగు విలాసమువలన, వలితే= కదలింపఁబడినవై, స్మరస్యచాప భ్రమచాలితేను; స్మర = మన్మథుని యొక్క, స్వచాప=తన విల్లనెడి, భ్రమ=భ్రాంతితో, చాలితేను = కదలింపఁబడినవో యనునట్లున్న, భ్రువౌ=కనుబొమ్మలను, వహన్తీం

=పరిహసించుచున్న, భైమీం=దమయన్తిని, రాజరాజిః=రాజులసమూహము, పపౌ=ప్రీతితోఁ జూచినది.

వి : మన్మథుఁడు తన విల్లనెడి భ్రాన్తితో, దమయన్తియొక్క కన్నులనుఁ గదలింపకపోయినను, కదలించె నని చెప్పుటవలన నుత్ప్రేక్ష-'ను' అని యివార్థకపు వ్యఞ్జకమునుఁ బ్రయోగించుటవలన నది వాచ్యము.

**సమాసములు :**

విరోధి వర్ణాభరణాశ్మభాసామ్ :- విరోధినః వర్ణాః యేషాన్తే = విరోధి వర్ణాః, ఆభరణానామశ్మానః=ఆభరణాశ్మానః, విరోధివర్ణాశ్చ తే ఆభరణాశ్మానశ్చ = విరోధి వర్ణాభరణాశ్మానః, విరోధి వర్ణాభరణాశ్మనాం భాసః=విరోధి వర్ణాభరణాశ్మభాసః, తాసాం = విరోధి వర్ణాభరణాశ్మభాసామ్

మల్లాజి కౌతూహలమ్ :- మల్లానామాజిః = మల్లాజిః, మల్లాజౌ కౌతూహలమ్=మల్లాజి కౌతూహలమ్, తత్=మల్లాజి కౌతూహలమ్.

స్మరస్వచాపభ్రమచాలితే :- స్వస్య చాపః = స్వచాపః, స్వచాపస్య భ్రమః=స్వచాపభ్రమః, స్వచాపభ్రమాత్ చాలితే = స్వచాపభ్రమచాలితే, స్మరేణ స్వచాపభ్రమచాలితే = స్మరస్వచాపభ్రమచాలితే, తే = స్మరస్వచాపభ్రమచాలితే.

**భావము :**

దమయన్తి యొడలియందు ధరించిన భూషణములలోని మణులు, తెలుపు, నలుపు మున్నగు భేదములచే నానా విధము లగు రంగులనుఁ గల్గి యున్నవి. అందువలన నా మణుల వివిధ కాన్తులు నొండొంటిని మించవలయు నని మల్లయుద్ధము సలుపుటకు కుతూహలము గల్గినట్లు కానవచ్చుచున్నవి. అనగా నా మణులనుండి వివిధ వర్ణములతోఁ గూడిన కాన్తులు మెండుగా ప్రసరించుచున్నవి. వానిని చూచుచు, విలాసముతో తన కనుబొమ్మలను, ఆమె కదలించుచుండగా, మన్మథుఁడు తన విల్లనెడి భ్రాన్తితో నా కనుబొమ్మలను కదలించెనా యనునట్లు ప్రవర్తించుచు సభను ప్రవేశించిన దమయన్తిని రాజులందఱుఁ బ్రీతితోఁ గాంచిరి. ॥౯-౨॥

శ్లో॥ సామోద పుష్పాశుగవాసితాఙ్గీం
కిశోరశాఖాగ్రశయాలిమాలామ్।
వసన్తలక్ష్మీ మివ రాజభిస్తైః
కల్పద్రుమై రప్యభిలష్యమాణామ్। 97

ప.వి. సామోదపుష్పాశుగవాసితాఙ్గీం- కిశోరశాఖాగ్ర శయాలిమాలాం- వసన్త లక్ష్మీమ్ - ఇవ - రాజభిః - తైః - కల్పద్రుమైః - అపి - అభిలష్య మాణామ్.

అర్థము: సామోదపుష్పాశుగవాసితాఙ్గీం; సామోద= (రమణీయమగు దమయన్తి శరీరము లభించినందువలన) మిక్కిలి సంతోషముతోఁ గూడిన, పుష్పాశుగ = మన్మథునితో, వాసిత=అధిష్ఠింపఁబడిన, అఙ్గీం = దేహము గలదియును, కిశోరశాఖాగ్రశయాలిమాలామ్; కిశోరశాఖా = మెత్తనివైన వ్రేళ్ళును, అగ్రశయ=ముంజేతులును గల్గిన, అలిమాలాం = చెలికత్తెల వరుస గలదియును,పక్షాన్తరమున—సామోదపుష్పాశుగవాసితాఙ్గీం సామోదపుష్ప= నెత్తావిగల పూలును, అశుగ = మలయమారుతమునునను వానిచే, వాసిత = పరిమళము నొందింపఁబడిన, అఙ్గీం = శరీరము గలదియు, కిశోరశాఖాగ్రశయాలిమాలాం; కిశోరశాఖాగ్ర = క్రొంజిగురుల కొనలయందు, శయ=విశ్రమించు, అలిమాలాం=తుమ్మెదల బారు గలదియును, తైః = ఆ,రాజభిః=రాజులనెడి, కల్పద్రుమైరపి = కల్పవృక్షముల చేతను, ననగానందఱి మనోరథముల తీర్చునట్టివారిచేత నని యర్థము. అభిలష్యమాణామ్ = అపేక్షింపఁబడుచున్న,వసన్తలక్ష్మీమివ =వసన్త శోభవలె,(స్థితాం = ఉన్నటువంటి)భైమీం = దమయన్తిని, రాజరాజిః = రాజసమూహము, పహో=ప్రీతితోః గాంచెను.

**సమాసములు :**

సామోదపుష్పాశుగవాసితాఙ్గీమ్ :- అమోదేన సహితం యథా తథా = సామోదం, పుష్పాణి అశుగాః యస్య సః—పుష్పాశుగః, సామోదం =

పుష్పాశుగేన వాసితం = సామోదపుష్పాశుగవాసితం, సామోద పుష్పాశుగవాసితమ్ అఙ్గం యస్యాస్సా=సామోదపుష్పాశుగవాసితాఙ్గీ, తామ్ = సామోదపుష్పాశుగవాసితాఙ్గీమ్.

పక్షాన్తరమున— ఆమోదేన సహవర్తన్త ఇతి=సామోదాని, సామోదాని చ తాని పుష్పాణి చ=సామోదపుష్పాణి, సామోదపుష్పాణి, ఆశుగాశ్చ= సామోదపుష్పాశుగాః, సామోద పుష్పాశుగైః వాసితం అఙ్గం యస్యాస్సా = సామోదపుష్పాశుగవాసితాఙ్గీ, తాం=సామోదపుష్పాశుగవాసితాఙ్గీమ్.

కిశోరశాఖాగ్రశయాలిమాలామ్ :- కిశోరాశ్చ తా శాఖాశ్చ = కిశోరశాఖాః, కిశోరశాఖాశ్చ అగ్రశయాశ్చ యాసాం తాః = కిశోరశాఖాగ్రశయాః, కిశోరశాఖాగ్రశయాశ్చతాః అలయశ్చ = కిశోరశాఖాగ్రశయాలయః, కిశోరశాఖాగ్రశయాలీనాం మాలా=కిశోరశాఖాగ్రశయాలిమాలా, తామ్=కిశోరశాఖాగ్రశయాలిమాలాం.

పక్షాన్తరమున— కిశోరాశ్చ తాః శాఖాశ్చ=కిశోరశాఖాః, కిశోరశాఖానామగ్రాణి=కిశోరశాఖాగ్రాణి, కిశోరశాఖాగ్రేషు శేరత ఇతి=కిశోరశాఖాగ్రశయాః, అలీనాంమాలాః = అలిమాలాః, కిశోరశాఖాగ్రశయాః అలిమాలాః యస్యాస్సా=కిశోరశాఖాగ్రశయాలిమాలా, తామ్=కిశోరశాఖాగ్రశయాలిమాలామ్.

వసన్త లక్ష్మీమ్ :- వసన్తస్య లక్ష్మీః=వసన్తలక్ష్మీః, తామ్ = వసన్తలక్ష్మీమ్.

**భావము :**

ఆ దమయన్తిని వసంతలక్ష్మితోఁ బోల్చి వర్ణించుచున్నాడు.

ఆ దమయన్తి యనెడి రమ్యమైన వస్తువు లభించుటచే, సంతోషముచే పుష్పబాణుడైన మన్మథుఁడు, ఆమె శరీరము నధిష్ఠించి యుండెను. వసన్తలక్ష్మియో పరిమళము గల పూలతోఁడను, మలయమారుతము తోఁడను నెత్తావినిఁ గల్గి యుండెను. కావున నుభయులును "సామోద పుష్పాశుగవాసితాఙ్గు" లైరి. అట్లే దమయన్తి మెత్తని వైన వ్రేళ్ళను, ముంజేతులను గల చెలికత్తెల వరుసతో పరివేష్టితురాలై యున్నది. వసన్తలక్ష్మియో, క్రొంజిగురుల కొనలపై విశ్రమించు తుమ్మెదల బారు గల్గియున్నది. కావున నుభయులును కిశోరశాఖాగ్రశయాలి మాలనుఁ గల్గిన వారైరి. అందఱి యభిలాషలనుఁ బూర్తి గావించెడి

రాజు లనెడి కల్పవృక్షములు దమయన్తి యనెడి వసన్తలక్ష్మిని@ గోరుచున్నవి. కల్పవృక్షములు గూడ వసన్తలక్ష్మిని@ గోరుచున్నవి. కావున నుభయులకును "కల్పద్రుమైరభ్యభిలష్యమాణామ్" అను విశేషణము సరిపడినది. ఇట్లు వసన్త లక్ష్మివలె నున్న దమయన్తిని రాజసమూహము ప్రీతితో@ దర్శించినది. ॥౯౭॥

**శ్లో. పీతావదాతారుణనీలభాసాం**
**దేహోపలేపాత్ కిరణైర్మణీనామ్।**
**గోరోచనా చన్దన కుఙ్కుమైణ**
**నాభివిలేపాన్ పునరుక్తయన్తీమ్॥ 98**

ప.వి. పీతావదాతారుణనీలభాసాం-దేహోపలేపాత్-కిరణైః-మణీనాం-గోరోచనా చన్దనకుఙ్కుమైణనాభివిలేపాన్-పునరుక్తయన్తీమ్.

అర్థము:- పీతావదాతారుణనీలభాసాం; పీత = పసుపువన్నెయు, అరుణ = ఎఱ్ఱటివన్నెయు, అవదాత=తెల్లటి వన్నెయు, నీల=నీలపువన్నెయు నైన, భాసాం=కాన్తులుగల, మణీనాం=రత్నములయొక్క, కిరణైః = కిరణములచే, దేహోపలేపాత్ = దేహమునకు ననులేప మేర్పడుటవలన. ననగా, దేహమలద@బడుటవలన,గోరోచనాచన్దనకుఙ్కుమైణనాభివిలేపాన్!=గోరోచనా=గోరోజనము, చన్దన = చన్దనము, కుఙ్కుమ = కుఙ్కుమపూవు, ఏణనాభీ=కస్తూరి యను వీనియొక్క, విలేపాన్=అనులేపములను, పునరుక్తయన్తీం=రెట్టింపుచేయు చున్నదియు నగు,భైమీం=దమయన్తిని,రాజరాజిః=రాజసమూహము, పపౌ=ప్రేమతోచూచినది.

వి. ఇచ్చట గోరోచనా-చన్దన-కుఙ్కుమ-ఏణనాభివిలేపనములకు క్రమముగా పీతావదాతారుణనీలమణికాన్తులతో గతార్థత్వమును@ జెప్పుటవలన యథాసంఖ్యాలఙ్కారము. పీతాదికాన్తులకును గోరోచనావిలేపనవర్ణములకు నభేదమున ననుసరించి సామాన్యాలఙ్కారము. యథాసంఖ్యాలఙ్కారమునకు సామాన్యాలఙ్కారముతో సంకరము.

**సమాసములు :**

పీతావదాతారుణనీలభాసాం. పీతాశ్చ అవదాతాశ్చ అరుణాశ్చ నీలాశ్చ =

పీతావదాతారుణనీలాః, పీతావదాతారుణనీలాః భాసః యేషాం తే-పీతావదా తారుణనీలభాసః, తేషాం=పీతావదాతారుణనీలభాసామ్.
దేహోపలేపాత్:- దేహస్య ఉపలేపః=దేహోపలేపః, తస్మాత్ = దేహోప లేపాత్।
గోరోచనాచన్దనకుఙ్కుమైణనాభీవిలేపాన్:- గోరోచనా చ చన్దనం చ కుఙ్కుమం చ ఏణనాభి చ=గోరోచనాచన్దనకుఙ్కుమైణనాభ్యః, గోరో చనాచన్దనకుఙ్కుమైణనాభీనాం విలేపాః =గోరోచనాచన్దనకుఙ్కుమైణ నాభీవిలేపాః, తాన్=గోరోచనాచన్దనకుఙ్కుమైణనాభీవిలేపాన్.
పునరుక్తయన్తీమ్:- పునరుక్తానివ ఆచరన్తీ=పునరుక్తయన్తీ, తామ్= పునరుక్తయన్తీమ్.

**భావము :**

ఆ దమయన్తి ధరించిన యాభరణములనుండి ప్రసరించెడి పసుపు, తెలుపు, ఎఱుపు, నీలంపు కాంతులు, ఆమెయొక్క శరీరము నంటుకొని యున్నవి. ఆమె శరీరమునకు గోరోజనము, చన్దనము, కుఙ్కుమపూవు, కస్తూరి యను నీ పరిమళద్రవ్యములు పూయఁ బడియున్నవి. పైనఁ జెప్పఁబడిన పసుపు తెలుపు మున్నగు రత్నకాన్తులును గోరోచనాదివర్ణములనుఁ గల్గి యుండుటవలన, వీనిచే పైనఁ జెప్పఁబడిన రత్నకాన్తులు తెట్టింపుఁ జేయఁబడి నట్లు కానవచ్చు చున్నవి. అనగా నీ రెంటిలో రత్నకాంతు లైనను చాలును. లేదా గోరోచనాది లేపము లైనను చాలును. కాన రెంటిని ధరించుటచే మణికాన్తులవలన గోరోచ నాదిలేపములకుఁ బునరుక్తిని వాటిల్లజేయుచున్న యా దమయన్తి రాజులు ప్రేమతోఁ జూచిరి. ॥౯౮॥

శ్లో. స్మరం ప్రసూనేన శరాసనేన
**జేతారమశ్రద్ధధతీం నలస్య।**
**తస్మై స్వభూషాదృషదంశు శిల్పం**
**బలద్విషః కార్ముకమర్పయన్తీమ్॥** 99

ప.వి. స్మరం-ప్రసూనేన-శరాసనేన-జేతారమ్-అశ్రద్ధధతీం - నలస్య-తస్మై- స్వభూషాదృషదంశుశిల్పం-బలద్విషః-కార్ముకమ్-అర్పయన్తీమ్.

అర్థము: ప్రసూనేన = పుష్పరూపమైన; శరాసనేన = ధనుస్సుచే, అనగా మిక్కిలి కోమలమైన వింటిచే, నలస్య = నలుని, జేతారం = జయించిన, స్మరం=మన్మథుని, అశ్రద్ధధతీం=నమ్మనిదియు, (కావుననే) తస్మై=అత నికి, అనగా మన్మథునకు, స్వభూషాదృషదంశుశిల్పం; స్వ=తనవైన భూషా=ఆభరణములయందలి, దృషత్ = రత్నములయొక్క, అంశు= కిరణములచే, శిల్పం=నిర్మాణముగల్గిన, బలద్విషః=ఇంద్రునియొక్క, కార్ముకం = వింటిని. నానావర్ణములలో ప్రకాశించునింద్రధనుస్సును, అర్పయన్తీం=అర్పించుచున్న, భైమీం=దమయన్తిని, రాజరాజిః=రాజుల సమూహము, మహాప్రీతితో వీక్షించినది.

వి. భైమి తన ఆభరణరత్నకాన్తులతో నింద్రధనుస్సును కల్పించి మన్మథున కీయక పోయినను నిచ్చినట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకమును ప్రయోగింపనందువలన నది గమ్యము.

**సమాసములు :**

అశ్రద్ధధతీం :— న శ్రద్ధధతీ=అశ్రద్ధధతీ, తామ్=అశ్రద్ధధతీమ్.
స్వభూషా దృషదంశు శిల్పమ్ :—స్వస్యాః భూషాః = స్వభూషాః, స్వభూషాసు దృషదః=స్వభూషాదృషదః, స్వభూషాదృషదా మంశవః= స్వభూషాదృషదంశవః, స్వభూషా దృషదం శుభిః శిల్పం యస్య తత్= స్వభూషాదృషదంశు శిల్పమ్.
బలద్విషః :—బలస్య ద్విట్=బలద్విట్, తస్య=బలద్విషః.

**భావము :**

ఆ దమయన్తి, మన్మథుడు మహా బలవంతుడైన నలుని బూవింటితో జయించె నను విషయమును నమ్మజాలక, తన యాభరణమందలి రత్నముల యొక్క వివిధ వర్ణములతో నింద్రధనుస్సు నిర్మించి దానిని నలుని జయించుటకై, మన్మథుని కర్పించుచున్నదా యనునట్లున్నది. అట్టి దమయన్తిని రాజ సమూహము సాదరముగా వీక్షించినది. ॥౮౯॥

శ్లో. విభూషణేభ్యో వరమంశుకేషు
తతో వరం సాన్ద్రమణిప్రభాసు.
సమ్యక్ పునః క్వాఽపి న రాజకస్య
పాతుం దృశా ధాతృకృతావకాశామ్॥ 100

ప వి. విభూషణేభ్యః-వరమ్-అంశుకేషు-తతః- వరం- సాన్ద్రమణి ప్రభాసు- సమ్యక్ - పునః-క్వ-అపి న-రాజకస్య-పాతుం- దృశా- ధాతృకృతావకాశామ్.

అర్థము: విభూషణేభ్యః=అభరణములకంటెను, వరం=అధికముగా, అంశుకేషు= వస్త్రములయందు, (సక్తయా=లగ్నమైనదియు) తతః = దానికంటెను, వరమ్=అధికముగా, సాన్ద్రమణి ప్రభాసు; సాన్ద్ర-దట్టమైన. మణి ప్రభాసు=రత్నకాంతులయందు, (సక్తయా= లగ్నమైనదియునగు), రాజకస్య=రాజ సమూహము యొక్క, దృశా=దృష్టిచే, సమ్యక్=చక్కగా, అనగా స్థిరముగా, పాతుం=చూచుటకు, క్వాపి = ఎచ్చటను, నధాతృకృతావకాశాం= బ్రహ్మచే చేయఁబడిన యవకాశములేనిదైన, భైమీం= దమయన్తిని, రాజరాజిః=రాజసమూహము, పపౌ=చూచినది.

వి. ఇచ్చటి రాజుల దృష్టి, ఉత్తరోత్తరముగా నుత్కర్ష గల యాభరణాద్యనేకము లగు నాధారములు గల్గినందువలన సారాలఙ్కారము.

**సమాసములు :**

సాన్ద్ర మణిప్రభాసు :- మణీనాం ప్రభాః=మణిప్రభాః, సాన్ద్రాశ్చ తాః మణిప్రభాశ్చ=సాన్ద్రమణి ప్రభాః, తాసు= సాన్ద్రమణి ప్రభాసు.
రాజకస్య=రాజ్ఞాం సమూహః=రాజకమ్. కస్య=రాజకస్య.
ధాతృకృతావకాశామ్:-ధాత్రా కృతః=ధాతృకృతః ధాతృకృతః అవకాశః యస్యాస్సా=ధాతృకృతావకాశా, తామ్=ధాతృకృతావకాశామ్.

**భావము :**

ఆ రాజుల దృష్టి తొలుత నధికముగా దమయన్తి యొక్క యాభరణములపైఁ బడినది. తర్వాత దానికంటె నధికముగా నామెయొక్క వలువలపైఁ

బడినవి. పిదప దానికంటె సధికముగా నామెయొక్క భూషణములపైనఁ బడినది. కాని యెచ్చటను నిలిపి, చూచుటకు, దైవ మవకాశ మొసంగలేదు. ఆభరణ కాన్తులతోడను, వలువలతోడను, రత్నకాన్తులతోడను నామెయొక్క యవయవ ములు కప్పఁబడియుండుటవలన నామెయొక్క యవయవము లెవ్వియు రాజుల దృష్టి కందలేదని యాశయము. ॥౧౦౦॥

శ్లో. ప్రాక్పుష్పవర్షైర్వియతః పతద్భిః
ద్రష్టుం నదత్తామథ తద్ద్విరేఫైః.
తద్భీతిభుగ్నేన తతో ముఖేన
విధేరహో వాఞ్ఛితవిఘ్నయత్నః॥ **101**

ప.వి. ప్రాక్-పుష్పవర్షైః-వియతః-పతద్భిః-ద్రష్టుం-న - దత్తామ్-అథ - తద్ద్వి రేఫైః-తద్భీతిభుగ్నేన-తతః-ముఖేన-విధేః-అహో-వాఞ్ఛితవిఘ్నయత్నః.

అర్థము: ప్రాక్=మొదట, వియతః=ఆకాసము నుండి, పతద్భిః=పడుచున్న, పుష్పవర్షైః = (దమయన్తి యొక్క సౌన్దర్యమునుఁ జూచి హర్షించిన దేవతలచే కురిపింపబడిన) పూల వానలచేతను, అథ = తర్వాత,తద్ద్వి రేఫైః=ఆ పూలచే నాకర్షింపఁబడిన, తుమ్మెదలచేతను, తతః=తర్వాత, తద్భీతిభుగ్నేన; తత్=ఆ తుమ్మెదలవలన, భీతి=భయముతో, భుగ్నేన= వంగిన, ముఖేనచ=ముఖముచేతను, ద్రష్టుం = చూచుటకు, నదత్తాం= ఈయఁబడని, అనగా లభింపని, భైమీం—దమయన్తిని, రాజరాజిః=రాజ సమూహము, పపౌ=దర్శించినది. తథాహి=అదియుక్తమే. విధేః= దైవమునకు, వాఞ్ఛిత విఘ్నయత్నః; వాఞ్ఛిత=కోరఁబడిన విషయముల యందు, విఘ్నయత్నః = విఘాతమునుఁ గల్పింపవలయు ననెడి యత్నము. అహో! = ఆశ్చర్యకరమైనది.

వి. వాఞ్ఛితార్థములకు విఘ్నముఁ గల్పించెడి దైవయత్నము ఆశ్చర్యకర మనుసామాన్యముతో,దమయన్తియొక్క యవయవదర్శనమునకు విఘ్నము వాటిల్లిన దను విశేషము సమర్థితము కాన నర్థాన్తర న్యాసాలఙ్కారము. రాజుల దృష్టికి దమయన్తీ దర్శనమునకు ప్రతిబంధకమ్ముగా పూల వాన

మున్నగు ననేకము లగు నాధారములతో సంబంధముఁ జెప్పుటవలన పర్యాయాలఙ్కారము. ఈ రెంటికిని సఙ్కరము.

**సమాసములు :**

పుష్పవర్షైః=పుష్పాణాం వర్షాణి =పుష్పవర్షాణి. తైః=పుష్పవర్షైః ॥
తద్ద్విరేఫైః :- తేషాం ద్విరేఫాః=తద్ద్విరేఫాః, తైః=తద్ద్విరేఫైః.
తద్భీతిభుగ్నేన:- తేభ్యః భీతిః=తద్భీతిః, తద్భీత్యా భుగ్నం = తద్భీతి భుగ్నమ్. తేన=తద్భీతిభుగ్నేన.
వాఞ్ఛిత విఘ్నయత్నైః :- వాఞ్ఛితస్య విఘ్నః = వాఞ్ఛిత విఘ్నః, వాఞ్ఛిత విఘ్నే యత్నాః=వాఞ్ఛిత విఘ్నయత్నాః.

**భావము :**

ఇతర కారణములచేతను దమయన్తిని చక్కగా దర్శించుటకు రాజుల కవకాశము లేకపోయినది. ఎట్లనగా—తొలుత దమయన్తీ సౌన్దర్యమునుఁ జూచి హర్షించిన దేవత లాకాశమునుండి పుష్పవర్షమునుఁ గురిపించిరి. ఆ పుష్ప వర్షముచే నామె యాచ్ఛాదింపఁబడి రాజులకు కానరాలేదు. తర్వాత నా పుష్ప ముల పరిమళముచే నాకర్షింపఁబడిన తుమ్మెద లామె చుట్టును మూగినవి. అందువలన నామె కానరాలేదు. తర్వాత నీ తుమ్మెదల బారునకు భయపడి యామె ముఖమును వంచినది. అందువలన నామె మోము కానరాలేదు. దైవము మనుష్యులు కోరిన విషయముల కెట్లు విఘ్నము గల్గించుచున్నదో చూడుడు- ఇది యాశ్చర్యకరమైన విషయము ॥౧౦౧॥

శ్లో. **ఏతద్వరం స్యామితి రాజకేన**
**మనోరథాతిథ్యమవాపితాయ।**
**సఖీముఖాయోత్సృజతీమపాఙ్గాత్**
**కర్పూరకస్తూరికయోః ప్రవాహమ్॥ 102**

ప. వి, ఏతత్-వరం-స్యామ్-ఇతి-రాజకేన - మనోరథాతిథ్యమ్ - అవాపితాయ- సఖీముఖాయ - ఉత్సృజతీమ్ - అపాఙ్గాత్ - కర్పూరకస్తూరికయోః - ప్రవాహమ్,

అర్థము: ఏతత్=ఈ చెలికత్తెయొక్క మోము, పరం = (రాజత్వము కంటెను) ఎక్కువగా, స్యాం=అయ్యెదను. (ఆ చెలికత్తెల మోముగా నున్నచో దమయన్తి దర్శనము లభించును. రాజుగా నున్నచో నది లభింపదు. కాన రాజత్వము కంటెను నామె చెలికత్తెల ముఖముగా నుండుటయే మాకు శ్రేష్ఠము) అని, రాజకేన=రాజసమూహముచే, మనోరథాతిథ్యం; మనోరథ=అభిలాషకు, ఆత్యిథం=విషయత్వమును, అవాపితాయ=పొందింపఁబడిన, సఖీముఖాయ=చెలికత్తెల ముఖమునకై, అపాఙ్గాత్ = కడకన్ను నుండి, కర్పూర కస్తూరికయోః; కర్పూర = కర్పూరముయొక్కయు, కస్తూరికయోః=కస్తూరియొక్కయు, అనగా తెలుపునలుపు వన్నెలుగల దృష్టంయొక్క, ప్రవాహం=వెల్లువను, ఉత్సృజన్తీం = విడచుచున్నట్టి, భైమీం=దమయన్తిని, రాజరాజిః=రాజసమూహము, పపౌ=ప్రేమతోఁ జూచినది.

వి: ఇచ్చట సితాఽసితరూపము లైన దృష్టు లనెడి విషయములను (ఉపమేయములను) చెప్పక, విషయు లైన కర్పూర కస్తూరికలనుఁ జెప్పుట వలన నా యుపమేయోపమానములకు భేద మున్నను నభేదము సిద్ధించుట వలన నభేదాతిశయోక్త్యలఙ్కారము.

**సమాసములు :**

రాజకేన :- రాజ్ఞాం సమూహః=రాజకం, తేన=రాజకేన.
మనోరథాతిథ్యమ్ :- అతిథేర్భావః=ఆతిథ్యమ్, మనోరథస్య ఆతిథ్యమ్=మనోరథాతిథ్యమ్. తత్ = మనోరథాతిథ్యమ్.
సఖీముఖాయ :-సఖ్యాః ముఖం=సఖీముఖమ్.
కర్పూరకస్తూరికయోః :- కర్పూరశ్చ కస్తూరికా చ=కర్పూరకస్తూరికే, తయోః=కర్పూరకస్తూరికయోః

**భావము :**

ఆ స్వయంవరసభకు విచ్చేసిన రాజు లందఱును, తాము రాజులుగా నుండుటకంటె, దమయన్తిచెలికత్తెల మోముగా నుండుటయే శ్రేష్ఠమని భావించిరి.

ఏల యనగా, దమయన్తి, తన కడకంటినుండి కర్పూర కస్తూరికలవంటి తెలుపునలుపు దృష్టులను చెలికత్తెల ముఖములపై, సారించుచున్నది. కాని యామె దృష్టులు రాజుల వైపు ప్రసరించుటలేదు. అందువలన నామె ముఖమును చూచుటకు రాజులుగా నుండుటకంటె చెలికత్తెల ముఖముగా నుండుట యుత్తమము. అట్లున్నచో నామె దృష్టులు తమపైఁ గూడ పడఁగలవు గదా. ఇట్లు భావించుచు నారాజలోకము చెలికత్తెల మోమును తమయభిలాషకు గుఱిగావించిరి. ఇట్లు చెలికత్తెల మోముల వంకకే దృష్టిని సారించుచున్న దమయన్తిని రాజులు ప్రీతితో దర్శించిరి, ॥౧౦౨॥

శ్లో. స్మితేచ్ఛదన్తచ్ఛదకమ్పకిఞ్చి
ద్దిగమ్బరీభూతరదాంశువృన్దైః।
ఆనన్దితోర్వీన్ద్రముఖారవిన్దై
ర్మదం నుదన్తీం హృది కౌముదీనాం॥ **103**

ప.వి. స్మితేచ్ఛదన్తచ్ఛదకమ్పకిఞ్చిద్దిగమ్బరీభూతరదాంశువృన్దైః - ఆనన్దితోర్వీన్ద్రము ఖారవిన్దైః-మదం-నుదన్తీం-హృది--కౌముదీనామ్.

అర్థము. ఆనన్దితోర్వీన్ద్రముఖారవిన్దైః; ఆనన్దిత = (నా విషయమునం దీ దమయన్తి ప్రసన్నురాలు) అనెడిభావముచే సంతోషించిన, ఉర్వీన్ద్ర= భూపతులయొక్క, ముఖారవిన్దైః =పద్మములవంటి మోములచేతను, (ఆనందిత=వికసించిన, ఉర్వీన్ద్ర = భూపతులయొక్క, ముఖారవిందైః = ముఖపద్మములచేతను ) ( కావుననే ) స్మితేచ్ఛదన్తచ్ఛదకమ్పకిఞ్చిద్దిగమ్బరీభూతరదాంశువృన్దైః,స్మిత=చిఱునగవునందు,ఇచ్ఛ=కోరిక గల, దన్తచ్ఛద=పెదవులయొక్క,కమ్ప=కదలికచే,కిఞ్చిత్=కొంచెము, దిగమ్బరీభూత=మఱుగుతొలగిన, లేదా దిక్ = దిక్కులకు ,అమ్బరీభూత= ఆచ్ఛాదనరూపమునొందిన, అనగా దిక్కులను వ్యాపించిన, రదాంశు=దన్త కాన్తులయొక్క, వృన్దైః=సమూహములచే, కౌముదీనాం =వెన్నెలలయొక్క, హృది=అన్తర్భాగమందలి, మదం= గర్వమును, నుదన్తీం = తొలగించు

చున్న, భైమీం = దమయన్తిని, రాజరాజిః=రాజులసమూహము, పపౌ=ప్రీతితోఁజూచినది.

వి. వెన్నెలలు పద్మములను వికసింపఁజేయుటలో నసమర్థములు. ఇచ్చట దమయన్తియొక్క చిఱునగ వనెడి వెన్నెలలు రాజుల ముఖపద్మములను వికసింపఁజేయఁ గల్గినవి కాన నిచ్చటి నుపమాన మగు వెన్నెలలకంటెను నుపమేయము లగు దమయన్తి చిఱునగవు వెన్నెలలకు నాధిక్యము సిద్ధించినది. కానవ్యతిరేకాలఙ్కారము.

**సమాసములు :**

స్మితేచ్ఛదస్తచ్ఛదకమ్పకిఞ్చిద్దిగమ్బరీభూతరదాంశువృన్దైః:- స్మితేఇచ్ఛా =స్మితేచ్ఛా, స్మితేచ్ఛా చ తౌ దన్తచ్ఛదౌ చ=స్మితేచ్ఛదన్తచ్ఛదౌ, స్మితేచ్ఛదన్తచ్ఛదయోః కమ్పః = స్మితేచ్ఛదన్తచ్ఛదకమ్పః, అదిగమ్బరాః దిగమ్బరాః సమ్పద్యమానా భూతాః=దిగమ్బరీభూతాః, స్మితేచ్ఛదన్తచ్ఛదకమ్పేన కిఞ్చిత్ దిగమ్బరీభూతాః- స్మితేచ్ఛ దన్తచ్ఛదకమ్పకిఞ్చిద్దిగమ్బరీ భూతాః, స్మితేచ్ఛ దన్తచ్ఛకమ్పకిఞ్చిద్దిగమ్బరీ భూతాశ్చ తే రదాశ్చ=స్మితేచ్ఛదన్తచ్ఛదకమ్పకిఞ్చిద్దిగమ్బరీభూతరదాః, స్మితేచ్ఛదన్తచ్ఛద కమ్పకిఞ్చిద్దిగమ్బరీ భూతరదానామంశవః = స్మితేచ్ఛ దన్తచ్ఛదకమ్పకిఞ్చి ద్దిగమ్బరీభూతరదాంశవః, స్మితేచ్ఛ దన్తచ్ఛదకమ్పకిఞ్చిద్దిగమ్బరీభూతరదాంశూనాం బృన్దాః=స్మితేచ్ఛదన్తచ్ఛదకమ్పకిఞ్చిద్దిగమ్బరీభూతరదాంశుబృన్దాః, తైః=స్మితేచ్ఛదన్తచ్ఛదకమ్పకిఞ్చిద్దిగమ్బరీభూతరదాంశుబృన్దైః।

ఆనన్దితోర్వీన్ద్రముఖారవిన్దైః :- ఉర్వ్యాః ఇన్ద్రాః=ఉర్వీన్ద్రాః, ఆనన్దితాశ్చ తే ఉర్వీన్ద్రాశ్చ=ఆనన్దితోర్వీన్ద్రాః, ఆనన్దితోర్వీన్ద్రాణాం ముఖాని=ఆనందితోర్వీన్ద్రముఖాని, ముఖాన్యేవ అరవిన్దాని =ఆనన్దితోర్వీన్ద్రముఖారవిన్దాని, తైః=ఆనన్దితోర్వీన్ద్రముఖారవిన్దైః.

**భావము :**

ఆ దమయన్తి పెదవుల మన్దహాసము కావించుట కుద్యమించి కదలగనే యామె దన్తములు కొలదిగ మఱుఁగు దొలగినవి. ఆ దన్తకాన్తిచే నామె, చూ

రాజుల ముఖారవిందముల నానందపరచుచు (వికసింపఁజేయుచు) వెన్నెల హృదయమందున్న గర్వమును నణచుచుండినది. కేవలము వెన్నెల పద్మములను వికసింపఁజేయఁజాలదు. దమయంతియొక్క చిఱునగవు వెన్నెలలు, రాజులముఖములనెడి పద్మములను వికసింపఁజేసి యా వెన్నెలను మించి యున్నది. ఇట్లు మన్దహాసముతో సభను ప్రవేశించుచున్న దమయంతిని రాజసంఘము దర్శించినది. ॥౧౦౩॥

శ్లో. ప్రత్యఙ్గభూషాచ్ఛమణిచ్ఛలేన
యల్లగ్నతన్నిశ్చల లోకనేత్రామ్।
హారాగ్రజాగ్రద్గరుడాశ్మరశ్మి
పీనాభనాభీకుహరాన్ధకారామ్॥ 104

ప.వి. ప్రత్యఙ్గ భూషాచ్ఛమణి చ్ఛలేన - యల్లగ్నతన్నిశ్చలలోకనేత్రామ్-
హారాగ్రజాగ్రద్గరుడాశ్మరశ్మి పీనాభనాభీకుహరాన్ధకారామ్.

అర్థము: ప్రత్యఙ్గ భూషాచ్ఛమణిచ్ఛలేన; ప్రత్యఙ్గ = ప్రత్యవయవమందలి, భూషాచ్ఛమణి: భూషా = భూషణముల యందలి, అచ్ఛ=స్వచ్ఛములైన, మణి=రత్నములయొక్క, ఛలేన = నెపముతో, యల్లగ్నతన్నిశ్చల లోకనేత్రామ్; యత్=ఏ యవయవములయందు, లగ్న = తగులుచో, తత్=అచ్చటనే, నిశ్చల=నిశ్చలములైన, లోక=ప్రజలయొక్క, నేత్రామ్ = నేత్రములు కలదియు అనగా, నానాలఙ్కారములతో శోభించునదియు నని యర్థము. హారాగ్రజాగ్రద్గరుడాశ్మరశ్మి పీనాభనాభీకుహరాన్ధకారామ్; హారాగ్ర= హారముల కొనలయందు, జాగ్రత్=ప్రకాశించుచున్న, గరుడాశ్మ=గారుడమణులయొక్క, రశ్మి = కిరణముల యొక్క, పీనాభ=దట్టమైన కాంతిగల, నాభీకుహరాంధకారాం = బొడ్డు యొక్క రంధ్రమునందలి చీకటి గలదియునగు, భైమీం = దమయన్తిని, రాజరాజిః=రాజసంఘము, పపౌ=ప్రీతితోఁ జూచినది.

వి. ఇచ్చట దమయన్తియొక్క ప్రత్యఙ్గ భూషణమణులు, దమయన్తిని దర్శింపఁగోరిన ప్రజల నేత్రములే గాని రత్నములు కావు. అని చెప్పు

టచే అపహ్నవముతోఁ గూడిన యుత్ప్రేక్ష. వ్యఞ్జకముఁ బ్రయోగించని యందువలన నది గమ్యము.

గారుడమణుల కాంతికి, నాభీకుహరాన్ధకారముతో నభేదముచెప్పుట వలన సామాన్యాలఙ్కారము.

## సమాసములు

ప్రత్యఙ్గభూషాచ్ఛమణిచ్ఛలేన :- అఙ్గే అఙ్గే = ప్రత్యఙ్గం, ప్రత్యఙ్గం భూషాః=ప్రత్యఙ్గభూషాః, అచ్ఛాశ్చ తే మణయశ్చ = అచ్ఛమణయః, ప్రత్యఙ్గ భూషాణామచ్ఛమణయః= ప్రత్యఙ్గభూషాచ్ఛమణయః, ప్రత్యఙ్గ భూషాచ్ఛమణీనాం ఛలం=ప్రత్యఙ్గ భూషాచ్ఛమణిచ్ఛలం, తేన=ప్రత్యఙ్గ భూషాచ్ఛమణిచ్ఛలేన.

యల్లగ్నతన్నిశ్చల లోకనేత్రామ్ :- యస్మిన్ లగ్నాని = యల్లగ్నాని, తస్మిన్ నిశ్చలాని=తన్నిశ్చలాని, యల్లగ్నాని చ తాని తన్నిశ్చలాని చ=యల్లగ్నతన్నిశ్చలాని, లోకానాం నేత్రాణి=లోకనేత్రాణి, యల్లగ్న న్నిశ్చలాని లోకనేత్రాణి యస్యాస్సా = యల్లగ్నతన్నిశ్చల లోకనేత్రా, తామ్=యల్లగ్నతన్నిశ్చల లోకనేత్రామ్.

హారాగ్ర జాగ్రద్గరుడాశ్మరశ్మి పీనాభనాభీకుహరాన్ధకారామ్ :- హారస్య అగ్రమ్, హారాగ్రమ్, హారాగ్రేజాగ్రన్తః=హారాగ్రజాగ్రన్తః, హారాగ్ర జాగ్రన్తశ్చ తే గరుడాశ్మానశ్చ=హారాగ్రజాగ్రద్గరుడాశ్మానః, హారాగ్ర జాగ్రద్గరుడాశ్మనాం రశ్మయః=హారాగ్రజాగ్రద్గరుడాశ్మ రశ్మయః, పీనా ఆభా యస్య తత్ = పీనాభం. హారాగ్రజాగ్రద్గరుడాశ్మరశ్మిభిః పీనాభం=హారాగ్రజాగ్రద్గరుడాశ్మరశ్మి పీనాభం, నాభ్యాః కుహరం= నాభీకుహరం, నాభీకుహరే అన్ధకారం=నాభీకుహరాన్ధకారం, హారాగ్ర జాగ్రద్గరుడాశ్మరశ్మి పీనాభం నాభీకుహరాన్ధకారం యస్యాస్సా=హారాగ్ర జాగ్రద్గరుడాశ్మరశ్మి పీనాభ నాభీకుహరాన్ధకారా, తామ్ = హారాగ్రజాగ్ర ద్గరుడాశ్మరశ్మి పీనాభనాభీకుహరాన్ధకారామ్.

**భావము :**

ఆ దమయన్తికి నొకొక్కక్క యవయవమందును నాభరణములు ప్రకాశించుచున్నవి. ఏ యవయవమును ప్రజలు చూతురో, దానియందే వారి దృష్టి యతికిపోవుచున్నది. ప్రత్యఙ్గమునందును ధరించిన భూషణమణుల నెపముతో, ప్రజల దృష్టులను నామె వహించియున్నది. అనగా నామె శరీరమందలి యాభరణ రత్నములు, రత్నములు గావు. అవి ప్రజలదృష్టులే. మఱియు నామె ధరించిన హారముల కొనలయందు గారుడమణులు కట్టఁబడి యున్నవి. వాని కాన్తులు పొక్కిలియొక్క రన్ధ్రములోనికి దిగి యందలి యన్ధకారములో మిశితమైపోవుచున్నవి. ఇట్లు ప్రజల దృష్టులను గారుడమణి కాంతులతో నిండిన, పొక్కిలి రన్ధ్రమునుఁ గల్గిన దమయన్తిని రాజసంఘము మిక్కిలి ప్రేమతో వీక్షించినది. ॥౧౦౪॥

**శ్లో. తద్గౌరసారస్మితవిస్మితేన్దు**
**ప్రభాశిరఃకమ్ప్రరుచోఽభినేతుం।**
**విపాణ్డుతామణ్డితచామరాలీ**
**నానామరాళీకృతలాస్యలీలామ్॥ 105**

ప.వి. తద్గౌరసారస్మిత విస్మితేన్దుప్రభాశిరః కమ్ప్రరుచః- అభినేతుం- విపాణ్డుతామణ్డితచామరాలీనానామరాలీకృతలాస్యలీలామ్.

అర్థము : తద్గౌరసారస్మితవిస్మితేన్దు ప్రభాశిరః కమ్ప్రరుచః; తత్=ఆ దమయన్తియొక్క, గౌర=నిర్మలమైన, సార=శ్రేష్ఠమైన, స్మిత = చిఱునగవుచే. విస్మిత=అచ్చెరువందిన, ఇందుప్రభా = చంద్రుని కాంతియగు వెన్నెలయొక్క, శిరఃకమ్ప్రరుచః=తల నూగించుట యందలి శోభను, అభినేతుం=అభినయించుటకో యనునట్లు, విపాణ్డుతామణ్డిత చామరాలీ నానామరాలీకృతలాస్యలీలాం విపాణ్డుతా=తెల్లదనముతో, మణ్డిత = అలఙ్కరింపబడిన, చామరాలీ=చామరముల వరుసయనెడి, నానామరాలీ= పెక్కు ఆడహంసలచే, కృత=చేయఁబడిన, లాస్యలీలామ్ = నృత్యవిలాసములు గల్గిన, భైమీం=దమయన్తిని, రాజరాజిః=రాజుల సమూహము, పపౌ=శ్రద్ధతోఁ జూచినది.

**సమాసములు :**

తద్గౌరసారస్మిత విస్మితేన్దు ప్రభాశిరః కమ్ప్రరుచః :- గౌరం చ తత్ సారం చ=గౌరసారం, గౌరసారం చ తత్ స్మితం చ=గౌరసారస్మితమ్, తస్యాః గౌర సారస్మితం = తద్గౌరసారస్మితం, తద్గౌరసారస్మితేన విస్మితా = తద్గౌరసారస్మితా విస్మితా, ఇన్దోః ప్రభా=ఇన్దు ప్రభా. తద్గౌరసారస్మిత విస్మితా చ సా ఇన్దుప్రభా చ = తద్గౌరసార స్మిత విస్మితేన్దుప్రభా, తద్గౌరసారస్మితవిస్మితేన్దు ప్రభాయాః శిరః కమ్పాః=తద్గౌరసారస్మిత విస్మితేన్దు ప్రభాశిరః కమ్పాః, తద్గౌర సార స్మిత విస్మితేన్దు ప్రభాశిరఃకమ్పానాం రుచః =తద్గౌరసారసిశితవిస్మితేన్దు ప్రభాశిరః కమ్ప్రరుచః, తాః = తద్గౌరసారస్మిత విస్మితేన్దుప్రభాశిరః కమ్ప్రరుచః,

విపాణ్డు తామణ్డితచామరాలీ నానామరాలీకృత లాస్యలీలామ్ :- విపాణ్డు తయా మణ్డితా=విపాణ్డుమణ్డితా, చామరాణామాలీ=చామరాలీ, విపాణ్డు తామణ్డితా చ సా చామరాలీ చ=విపాణ్డుతామణ్డితచామరాలీ, నానా విధాశ్చ తాః మరాళ్యశ్చ=నానామరాళ్యః. విపాణ్డుతామణ్డిత చామరాళ్య ఏవ నానా మరాళ్యః=విపాణ్డుతామణ్డిత చామరాళీనానామరాళ్యః, విపాణ్డు-తామణ్డితచామరాళనానామరాళీభిః కృతాని చతాని లాస్యాని చ=విపాణ్డు-తామణ్డితచామరాలీనానామరాళీ కృతలాస్యాని. విపాణ్డుతా మణ్డితచామరాళీ మరాళీ కృతలాస్యానాం లీలా యస్యాస్సా=విపాణ్డుతామణ్డిత చామరాళీ మరాళీ కృతలాస్యలీలా, తామ్=విపాణ్డుతామణ్డిత చామరాళీ మలాళీకృత లాస్యలీలామ్.

**భావము :**

ఆ దమయన్తి మన్దహాసముఁ గాంచి వెన్నెల యాశ్చర్యపడుచు తల నూగించుచున్నది. ఆ వెన్నెల తల యూపులోని శోభలను సభినయించుటకు తెల్లని చామరాళు లనెడి యాడహంసలు గావించెడి నాట్యముల విలాసముతో నామె యొప్పుచున్నది. ఆమె పచ్చు నప్పుడు రాజలాంఛనముగా విసరెడి చామ రాళులు (అనగా చామరపజ్జులు) నానావిధము లగు యాడహంసలుగా నున్నవి.

ఆ చామరములు విసరఁ బడుచుండగ నవియాడుచున్నట్లు కానవచ్చుచున్నవి. అట్టి చామరాళి యను నాదహంసల నృత్యవిలాసములతో నొప్పుచు దమయన్తి సభను ప్రవేశించినది. అట్టి దమయన్తిని రాజసంఘము ప్రీతితో చూచినది ॥౧౦౫॥

**శ్లో. తదఙ్గభోగావళిగాయనీనాం**
**మధ్యే నిరుక్తిక్రమకుణ్ఠితానాం।**
**స్వయంధృతామప్సరసాం ప్రసాదం.**
**హ్రియం హృదో మణ్డనమర్పయన్తీమ్॥ 106**

ప.వి. తదఙ్గ భోగావళి గాయనీనాం- మధ్యే- నిరుక్తిక్రమకుణ్ఠితానాం స్వయం- ధృతామ్- అప్సరసాం- ప్రసాదం- హ్రియం- హృదః- మణ్డనమ్- అర్పయన్తీమ్.

అర్థము:- తదఙ్గ భోగావళిగాయనీనాం; తదఙ్గ; తత్ = ఆమెయే, అఙ్గ=కావ్యార్థరూపమైన, శరీరముగల, ఆమెను విషయముగాఁగల, భోగావళి = భోగావళియను కావ్యవిశేషమును, గాయనీనాం = పాడుచున్నట్టి వారి యొక్క, మధ్యే=మధ్యయందు, నిరుక్తిక్రమ కుణ్ఠితానాం; నిరుక్తిక్రమ =నిష్కృష్టముగా నుచ్చరించు విధమునందు, కుణ్ఠితానాం = లోపించిన ప్రతిభ గల్గిన, అప్సరసాం = అచ్చరలకు, స్వయం = స్వయముగా, ధృతాం=ధరింప బడిన, హృదః=హృదయమునకును, (అక్కనకును) మణ్డనం=అలఙ్కారమైన, హ్రియం=సిగ్గును, ప్రసాదం = కానుకగా, అర్పయన్తీం=అర్పించుచున్న, భైమీం=దమయన్తిని, రాజరాజిః = రాజ సమూహము, పపౌ=ప్రీతితో వీక్షించినది,

**సమాసములు :**

తదఙ్గభోగావళి గాయనీనామ్ :- సైవ అఙ్గం యస్యాస్సా=తదఙ్గా. తదఙ్గా చ సా భోగావళిశ్చ = తదఙ్గ భోగావళిః, తదఙ్గ భోగావళేః గాయన్యః= తదఙ్గ భోగావళి గాయన్యః. తాసాం=తదఙ్గ భోగావళిగాయనీనామ్.
నిరుక్తిక్రమకుణ్ఠితానామ్ :- నిరుక్తేః క్రమః = నిరుక్తిక్రమః, నిరుక్తి క్రమే కుణ్ఠితాః- నిరుక్తిక్రమకుణ్ఠితాః, తాసాం=నిరుక్తిక్రమకుణ్ఠితానామ్.

**భావము :**

ఆ దమయన్తిని కావ్యార్థము గావించి భోగావళి యను కావ్యము రచింపఁ బడినది. అట్టి భోగావళినిఁ బాడుటలోఁ బొరపాట్లు గావించిన యప్సరలకు తన సిగ్గునే బహుమతిగా నామె యిచ్చినది. అనగా నామెయొక్క సౌన్దర్యమును వర్ణించుటలో సామర్థ్యము లేక మధ్యయందే యాగిపోయిన యా యప్సరసలను హేళనఁ గావించి సిగ్గునుఁ గల్గించిన దని భావము. స్త్రీ హృదయమునకు లజ్జ భూషణము కాన గానము గావించిన విదుషీమణులకు బహుమతి ప్రదానము చేయుట యుచిత మని భావించి గానమునఁ దప్పిన యా యచ్చరలు స్త్రీలు గాన స్త్రీలకు భూషణము లజ్జ యగుటవలన వారికి లజ్జనే బహూకరించినది. అనగా దమయన్తి సౌన్దర్యస్తుతిని గానము చేయుటయందు వారసమర్థులైనందువలన వారి కట్టి బహుమతి యొసంగఁబడినది. ఇట్లు దివ్యసుందరీమణు లగు నప్సరసలు సైతము దమయన్తి సౌన్దర్యస్తుతినిఁ జేయఁజాలక పోయిరని చెప్పుటవలన దమయన్తి యప్సరసలను సైతము మించిన దను భావము ద్యోతిత మగుచున్నది. "హృదః మణ్డన" మని చెప్పుటలో సిగ్గు హృదయమునకు ననగా చిత్తమునకు నలఙ్కార మనియు, హారాదులు, హృదయమునకు ననగా వక్షః స్థలమునకు నలఙ్కార మనియు ద్యోతితము - అట్టి దమయన్తిని రాజులు వీక్షించిరి. ॥౧౦౬

శ్లో. తారా రదానాం వదనస్య చన్ద్రిం
రుచా కచానాం చ నభో జయన్తీమ్।
ఆకర్ణ మక్ష్ణో ర్ద్వితయం మధూని
మహీభృతః కస్య న భోజయన్తీమ్॥ **107**

ప. వి. తారాః-రదానాం-వదనస్య-చన్ద్రిం - రుచా - కచానాం - చ-నభః-జయన్తీమ్-ఆకర్ణమ్-అక్ష్ణోః-ద్వితయం-మధూని- మహీభృతః - కస్య-నభోజయన్తీమ్.

అర్థము : రదానాం=దంతములయొక్క, రుచా=కాన్తిచే, తారాః=నక్షత్రములను, వదనస్య=ముఖముయొక్క, రుచా=కాంతిచే, చంద్రం=చంద్రుని, కచానాం=వెండ్రుకలయొక్కయు, రుచా=కాంతితో, నభః = ఆకసమును,

జయ స్త్రీమ్=జయించుచున్నదియు, (అతఏవ=ఇందువలననే) కన్యా=ఒక, మహీభృతః=రాజుయొక్క, అక్ష్ణోః=కన్నుల, ద్వితయం=రెంటిని, ఆ కణ్ఠమ్ = గొంతుపరకు, అనగా తృప్తియగునంతపరకు, మధూని= తేనెలను, సభోజయ స్త్రీమ్=త్రాగించున్నదియు. అనగా నొక్కరాజుకుఁ గాక యందఱి రాజుల కన్నుల జంటలకు మధువును త్రాగించుచున్న దని యర్థము-అట్టి; భైమీం=దమయన్తిని, రాజరాజిః=రాజుల సమాజము, పపౌ=ప్రీతితో సందర్శించినది.

వి. ఇచ్చట రాజు లందఱి నేత్రములకును. మధువును త్రాగించుచున్నదను ఉత్తర వాక్యార్థమునకు, తారా-చన్ద్రి-న భో విజయములనుఁ బ్రతిపాదించెడి పూర్వవాక్యార్థము కారణము గాన కావ్యలిఙ్గాలఙ్కారము. దానికి పూర్వార్ధమందలి తారాదుల సాదృశ్య సిద్ధములగు నుపమతో సాఙ్కర్యము. కాన సఙ్కరము. వానికిఁ గూడ "జయ స్త్రీం, భోజయ స్త్రీమ్" అను యమకములతో సంసృష్టి.

**సమాసములు :**

అ కణ్ఠమ్ :- కణ్ఠమభివ్యాప్య=ఆ కణ్ఠమ్.

**భావము :**

ఆ దమయన్తి తన దంతముల కాంతిచే నక్షత్రములను, తనముఖకాంతిచే చంద్రుని, తన కురుల కాంతిచే నాకాశమును జయించినదై యా సభకు విచ్చేసిన రాజులందఱి కన్నులకు తృప్తి యగునంతవరకును, మధువును - అనగా తేనెను త్రావించుచుండినది. అనగా నామె సౌన్దర్యమును దర్శించుటచే, నా రాజుల కందఱికిని మధుపానము వలన పరవశత యేర్పడిన దని భావము ॥౧౦౭॥

**శ్లో. అలఙ్కృతాఙ్గాద్భుతకేవలాఙ్గీం**
**స్తవాధికాధ్యక్షనివేద్యలక్ష్మీం।**
**ఇమాం విమానేన సభాం విశన్తీం**
**పాపావపాఙ్గైరథ రాజరాజిః॥ 108**

ప.వి. అలఙ్కృతాఙ్గాద్భుతకేవలాఙ్గీం- స్తవాధి కాధ్యక్ష నివేద్యలక్ష్మీమ్-ఇమాం-
విమానేన-సభాం-విశ స్తీం-పపౌ- అపాఙ్గైః-అథ-రాజరాజిః.

అర్థము: అథ=పిలచిన పిదప, అలఙ్కృతా ఙ్గాద్భుత కేవలాఙ్గీమ్; అలఙ్కృత=
భూషింపఁబడిన, అఙ్గ=అవయవములకంటెను, అద్భుత = ఆశ్చర్యము
గొలుపునట్టి, కేవలాఙ్గీం=అలఙ్కరింపబడని యవయవములు కలదియు,
స్తవాధికాధ్యక్షనివేద్యలక్ష్మీం; స్తవ=స్తుతులకు, అధిక=అధికములైన-
అనగా మించినట్టి అధ్యక్ష=ప్రత్యక్షముతో, నివేద్య=తెలుపఁదగిన,
లక్ష్మీం=శోభలు గలదియును, విమానేన-మనుష్యులు మోయఁదగిన
నలుచదరమైన వాహనముతో, సభాం-సభను, విశ స్తీం=ప్రవేశించుచున్న,
ఇమాం=ఈదమయ స్తిని, రాజరాజిః-నృపాళి, అపాఙ్గైః=కడకన్నులతో,
పపౌ-మిక్కిలియాదరముతో, విలాసమధురముగా వీక్షించినది.

**సమాసములు :**

అలఙ్కృతాఙ్గాద్భుతకేవలాఙ్గీమ్ :– అలఙ్కృతాని చ తాని అఙ్గాని చ=
అలఙ్కృతాఙ్గాని, అలఙ్కృతాఙ్గేభ్యః అద్భుతాని = అలఙ్కృతాఙ్గాద్భు
తాని, కేవలాని చ తాని అఙ్గాని చ=కేవలాఙ్గాని, అలఙ్కృతాఙ్గాద్భుతాని
కేవలాఙ్గాని యస్యాస్సా=అలఙ్కృతాఙ్గాద్భుత కేవలాఙ్గీ, తామ్, అలఙ్కృ
తాఙ్గాద్భు కేవలాఙ్గీమ్।

స్తవాధికాధ్యక్షనివేద్యలక్ష్మీమ్ :– స్తవాత్ అధికాః=స్తవాధికాః, అధ్య
క్షేణ నివేద్యాః=అధ్యక్షనివేద్యాః, స్తవాధికాశ్చ తాః అధ్యక్షనివేద్యాశ్చ=
స్తవాధికాధ్యక్షనివేద్యాః, స్తవాధికాధ్యక్షనివేద్యాః లక్ష్మ్యః యస్యాస్సా=
స్తవాధికాధ్యక్షనివేద్యలక్ష్మీః, తామ్= స్తవాధికాధ్యక్షనివేద్యలక్ష్మీమ్ ।
రాజరాజిః :– రాజ్ఞాం రాజిః=రాజరాజిః

**భావము :**

ఆమె శరీరమునందు అలఙ్కరింపఁబడిన యవయవముల కంటెను, నల
ఙ్కరింపఁబడని యవయవములు మిక్కిలి యాశ్చర్యకరములై యున్నవి.

స్తుతిని మించి ప్రత్యక్షముచేతనే తెలుసుకొనఁదగిన సోయగముల నామె వహించి యున్నది. అట్టి దమయన్తి మనుష్యులు మోయఁదగిన సలుచదరపు విమానము నెక్కి సభను ప్రవేశించినది. అట్టి దమయన్తిని సభయందు నాసీనమై యున్న నృపావలి మిక్కిలి యాదరముతో, విలాసమధురముగా తమ కడకన్నులతో చూచిరి. ॥౧౦౮॥

శ్లో. ఆసీదసౌ తత్ర న కోఽపి భూప
స్తన్మూర్తి రూపోద్భవదద్భుతస్య।
ఉల్లేసురఙ్గాని ముదా న యస్య
వినిద్రరోమాఙ్కురదన్తురాణి॥ 109

ప.వి. ఆసీత్- అసౌ-తత్ర-న-కః-అపి-భూపః- తన్మూర్తి రూపోద్భవదద్భుతస్య-ఉల్లేసుః- అఙ్గాని-ముదా- న-యస్య- వినిద్రరోమాఙ్కురదన్తురాణి.

అర్థము :— తత్ర=ఆ సభయందు, అసౌ=ఇటువంటి, భూపః=రాజు, కోఽపి= ఒక్కడును, నాఽఽసీత్ = ఉండలేదు. తన్మూర్తి రూపోద్భవదద్భుతస్య-తత్=ఆ దమయన్తియొక్క, మూర్తి=శరీరము, రూప=అందము అనువీనిచే, ఉద్భవత్=ఉద్భవించిన, అద్భుతస్య=ఆశ్చర్యరసముగల్గిన, యస్య=ఏ రాజుయొక్క, అఙ్గాని = అవయవములు, ముదా = సంతోషముతో, వినిద్రరోమాఙ్కుర దన్తురాణి; వినిద్ర=నిక్కపొడుచుకొనిన, రోమాఙ్కుర=పులకములచే, దన్తురాణి=నిండినవిగా, న ఉల్లేసుః=విలసింపలేదో.

**సమాసములు :**

తన్మూర్తిరూపోద్భవదద్భుతస్య:— మూర్తిశ్చ రూపం చ =మూర్తిరూపే, తస్యాః మూర్తి రూపే=తన్మూర్తిరూపే. తన్మూర్తి రూపాభ్యా ముద్భవత్=తన్మూర్తి రూపోద్భవత్. తన్మూర్తి రూపోద్భవత్ అద్భుతం యస్యసః=తన్మూర్తి రూపోద్భవదద్భుతః తస్య=తన్మూర్తి రూపోద్భవదద్భుతస్య.

వినిద్రరోమాఙ్కురదన్తురాణి :— విగతా నిద్రా యేషాన్తే=వినిద్రాః,

రోమ్ణాముఙ్కురాః=రోమాఙ్కురాః, వినిద్రాశ్చ తే రోమాఙ్కురాశ్చ=వినిద్ర రోమాఙ్కురాః, వినిద్రరోమాఙ్కురైః దన్తురాణి=వినిద్రరోమాఙ్కుర దన్తురాణి.

**భావము :**

ఆ స్వయంవరసభకు విచ్చేసిన రాజులలో నామె శరీరమును రూపమును జూచి యాచ్చర్యపడిన వాని కెవ్వనికి సంతోషముతో శరీరము గగుర్పాటుతో నిండలేదు? ఆమె శరీరసౌన్దర్యములనుఁ జూచి యాచ్చర్యపడిన ప్రతిరాజునకు శరీరము గగుర్పాటుతో నిండినది. ॥౧౦౯॥

శ్లో॥ అఙ్గుష్ఠమూర్ధ్నా చ నిపీడితాగ్రాః
మధ్యేన భాగేన చ మధ్యమాయాః।
ఆస్ఫోటి భైమీమవలోక్య తత్ర
న తర్జనీ కేన జనేన నామ॥ **110**

ప.వి. అఙ్గుష్ఠమూర్ధ్నా-చ-నిపీడితాగ్రా-మధ్యేన-భాగేన-చ-మధ్యమాయాః-ఆస్ఫోటి--భైమీమ్—అవలోక్య-తత్ర-న-తర్జనీ-కేన-జనేన-నామ.

అర్థము. తత్ర = ఆ సభయందు, భైమీం=దమయన్తిని, అవలోక్య=చూచి, అఙ్గుష్ఠమూర్ధ్నా, అఙ్గుష్ఠ=బొటనవ్రేలియొక్క, మూర్ధ్నా = కొనచేతను, మధ్యమాయాః=నడిమివ్రేలియొక్క;మధ్యేన చ=మధ్యభాగముచేతను, నిపీడితాగ్రాః, నిపీడిత=నలుపఁబడిన, అగ్రా=కొనగల్గిన, తర్జనీ=చూపుడు వ్రేలు, కేననామ జనేన=ఏమనుష్యునిచే, నాఽఽస్ఫోటి = మ్రోగింపఁ బడలేదు? అనగా ప్రతివ్యక్తియు నాశ్చర్యానుభవమును సూచించెడి చిటికెను వేసె నని యర్థము. ఇది లోకానుభవముఁ బట్టి యుండును.

**సమాసములు :**

అఙ్గుష్ఠస్య మూర్ధా=అఙ్గుష్ఠమూర్ధా, తేన = అఙ్గుష్ఠమూర్ధ్నా।

**భావము :**

ఇవ్విధముగా దమయన్తి పల్లకిపైని సభనుఁ బ్రవేశింపఁగనే, రాజు

లందఱు నామెనుఁ గాంచి యామెయొక్క సౌన్దర్యమున కాశ్చర్యపడి యాశ్చర్య ద్యోతకముగా, చిటికెలు వేయుట మున్నగు చేష్టలనుఁ గావించిరి ॥౧౧౦॥

**శ్లో. అస్మిన్ సమాజే మనుజేశ్వరేణ**
**తాం ఖఞ్జనాక్షీమవలోక్య కేన।**
**పునః పునర్లోలితమౌలినా న**
**భ్రువోరుదక్షేపితరాం ద్వయీ వా॥ 111**

ప.వి. అస్మిన్ - సమాజే - మనుజేశ్వరేణ-తాం-ఖఞ్జనాక్షీమ్-అవలోక్య-కేన -పునః పునః-లోలితమౌలినా-న-భ్రువోః-ఉదక్షేపితరాం-ద్వయీ-వా.

అర్థము. అస్మిన్=ఈ, సమాజే=సభయందు, ఖఞ్జనాక్షీం = కాటుకపిట్టలవంటి కన్నులుగల్గిన, తాం = ఆదమయన్తిని, అవలోక్య = చూచి, లోలితమౌలినా=(ఆశ్చర్యముచే) కదలింపఁబడినకిరీటముగల, కేనవామనుజేశ్వరేణ= ఏనరపతిచే, భ్రువోః-కనుబొమ్మలయొక్క, ద్వయీ-రెండు, పునఃపునః= పలుమాఱు, న ఉదక్షేపితరాం = పైకి మిక్కిలిఎగురవేయఁబడలేదు.? అంతఱిచేతను నెగురవేయఁబడిన దని యర్థము.

**సమాసములు :**

మనుజేశ్వరేణ - మనుజానామీశ్వరః=మనుజేశ్వరః, తేన-మనుజేశ్వరేణ।
ఖఞ్జనాక్షీమ్:- ఖఞ్జనస్యేవ అక్షిణీ యస్యాస్సా=ఖఞ్జనాక్షీ। తామ్ = ఖఞ్జనాక్షీమ్।
లోలితమౌలినా:- లోలితా మౌలిః యస్య సః=లోలితమౌలిః, తేన -లోలితమౌలినా।
ఉదక్షేపితరామ్:- అతిశయేన ఉదక్షేపి=ఉదక్షేపితరామ్।

**భావము :**

కాటుకపిట్ట కన్నుల వంటి కన్నులు గల దమయన్తిని జూచి యే రాజు అశ్చర్యముతో తల నూపి మాటిమాటికి కనుబొమ్మలను రెంటిని నెగుర వేయఁడు.? తప్పక యెగురవేయు నని యాశయము ॥౧౧౧॥

శ్లో. స్వయంవరస్యాజిరమాజిహానాం
విభావ్య భైమీమథ భూమినాథైః।
ఇదం ముదా విహ్వలచిత్తభావా
దవాది ఖణ్డాక్షర జిహ్మజిహ్వమ్॥ 112

ప.వి. స్వయంవరస్య-అజిరమ్-ఆజిహానాం-విభావ్య-భైమీమ్ - అథ - భూమినాథైః-ఇదం-ముదా-విహ్వల చిత్తభావాత్ - అవాది - ఖణ్డాక్షర జిహ్మజిహ్వమ్.

అర్థము. అథ-అనన్తరము, స్వయంవరస్య=స్వయంవరముయొక్క, అజిరం=ముంగిలిని, ఆజిహానాం=ప్రవేశించుచున్న, భైమీమ్=దమయన్తిని, విభావ్య=చూచి, భూమినాథైః=రాజులచే, ముదా=సంతోషముతో, విహ్వల చిత్తభావాత్; విహ్వల=కలతపడిన, చిత్తభావాత్=మనస్సుగల్గియుండుటవలన, ఇదం=చెప్పఁబోవు ఖణ్డాక్షరం=అర్ధోక్తి రూపములైలు ప్తాక్షరములు గల్గుటచే, జిహ్మజిహ్వం=తొట్రుపడిననాలుకకల్గునట్లుగా, అవాది=చెప్పఁబడినది.

**సమాసములు :**

విహ్వలచిత్తభావాత్:- విహ్వలం చిత్తం యేషాం తే = విహ్వలచిత్తాః విహ్వలచిత్తానాం భావః = విహ్వలచిత్తభావః. తస్మాత్ = విహ్వల చిత్తభావాత్।
ఖణ్డాక్షర జిహ్మ జిహ్వమ్:- ఖణ్డాక్షరేణ జిహ్మా = ఖణ్డాక్షరజిహ్మా, ఖణ్డాక్షరజిహ్మా జిహ్వా యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = ఖణ్డాక్షరజిహ్మజిహ్వమ్.

**భావము :**

స్వయంవర మణ్డపము ముంగిలిని దమయన్తి ప్రవేశింపఁగనే, యామెను చూచిన రాజులకు సంతోషముచే మనస్సున కలవరపా టేర్పడినది. అందువలన వారు కొంతుకుపడి తుంటువడిన మాటలతోఁ జెప్పఁబోవు ప్రకారము మాట్లాడఁ దొడఁగిరి. ॥౧౧౨॥

శ్లో. రమ్భాదిలోభాత్ కృతకర్మభిర్భూః
శూన్యైవ మా భూత్ సురభూమిపాన్థైః.
ఇత్యేతయాఽలోపి దివోఽపి పుంసాం
వైమత్యమత్యప్సరసా రసాయామ్॥ 113

ప.చ్ఛే. రమ్భాదిలోభాత్- కృతకర్మభిః- భూః- శూన్యా- ఏవ- మా- భూత్- సురభూమిపాన్థైః- ఇతి- ఏతయా- అలోపి- దివః- అపి- పుంసాం- వైమత్యమ్- అత్యప్సరసా- రసాయాం.

అర్థము:- రమ్భాదిలోభాత్; రమ్భాది = రమ్భమున్నగునచ్చరలయందలి లోభాత్=ఆశవలన, కృతకర్మభిః, కృత=చేయఁబడిన, కర్మభిః = యాగాదికర్మలుగల, సురభూమిపాన్థైః సురభూమి= స్వర్గలోకమునకుఁ బోయెడి, పాన్థైః = బాటసారులచే, భూః=భూమి, శూన్యా=శూన్యమైన దిగా, మాభూదితి = కారాదను కారణమువలన, అత్యప్సరసా = (సౌన్దర్యాదులచే) అప్సరసలను మించిన, ఏతయా=ఈ దమయన్తిచే, దివః=స్వర్గముయొక్క, పుంసామపి = పురుషులకుకూడ, అనగా దేవతలకుగూడ, రసాయాం=భూలోకమందు, వైమత్యం = వైరాగ్యము, అలోపి=లుప్తమైనదా యేమి? అనగా దమయన్తి యందమువలన భూలోకము స్వర్గలోకమునుఁ గూడ మించిన దని యర్థము.

వి. దేవతలకు భూలోకముపై వైరాగ్యము లోపింపక పోయినను, లోపించినదో యనునట్లున్నదని చెప్పుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకమునుఁ బ్రయోగింప నందువలన నది గమ్యము.

వైమత్య-మత్య- ప్సరసా రసాయామ్- అనుచోట ఛేకానుప్రాస- వృత్త్యనుప్రాసములు. ఈ రెంటికి నుత్ప్రేక్షతో సంసృష్టి.

**సమాసములు :**

రమ్భాదిలోభాత్:- రమ్భా ఆదిః యసాన్తాః=రమ్భాదయః, రమ్భాదిషు లోభః=రమ్భాదిలోభః, తస్మాత్, రమ్భాదిలోభాత్,

కృతకర్మభిః :- కృతం కర్మ యైస్తే = కృతకర్మాణః, తైః కృత కర్మభిః.
సురభూమిపాన్థైః :- సురాణాం భూమిః = సురభూమిః, సురభూమౌ పాన్థాః=సురభూమిపాన్థాః, తైః=సురభూమిపాన్థైః.
వైమత్యమ్:- విమతస్య భావః=వైమత్యమ్
అత్యప్సరసా:- అతిక్రాన్తాః అప్సరసః యయా సా=అత్యప్సరాః, తయా=అత్యప్సరసా.

**భావము :**

ఇది మొదలు, ఇరువది శ్లోకములచే స్వయంవరమునకు విచ్చేసిన రాజుల యభిభాషణములు వర్ణింపఁబడుచున్నవి.

భూలోకమునందు జ్యోతిష్టోమాదియాగములనుష్ఠించిరమ్యాప్సరసలనుఁ గూడుటకై పెక్కండ్రు స్వర్గమునకు వెళ్లుటవలన భూమిశూన్యము కాక యుండు టకును, స్వర్గలోకమందలి దేవతలు భూలోకమునందు విరక్తి మాని యిచ్చటికి విచ్చేయుటకును, వారి కిచ్చట సచ్చరలు లేరను కొఱుతను దీర్చుటకై సౌన్దర్య మున నాయప్సరసలను మించిన దమయన్తి సృజింపఁబడినదై, సురలోకవాసు లగు దేవతలకు, భూలోకమునందచ్చరలు లేనందువలనఁ గల్గిన విరక్తినిఁ బోగొట్టినది. ॥౧౧౩॥

శ్లో. రూపం యదాకర్ణ్య జనాననేభ్య
స్తత్తద్దిగన్తాద్వయమాగమామ।
సౌన్దర్యసారాదనుభూయమానా
దస్యాస్తదస్మాత్ బహునా కనీయః॥ 114

ప.వి. రూపం- యత్- ఆకర్ణ్య- జనాననేభ్యః- తత్తద్దిగన్తాత్- వయమ్- ఆగమామ- సౌన్దర్యసారాత్= అనుభూయమానాత్- అస్యాః- తత్- అస్మాత్- బహునా- కనీయః.

అర్థము : వయం=మేము, జనాననేభ్యః=జనుల ముఖములనుండి, యత్=ఏ, రూపం=సౌన్దర్యమును, ఆకర్ణ్య=విని, తత్తద్దిగన్తాత్=ఆ యా దిక్కుల

ప్రాన్తములనుండి, ఆగమామ=వచ్చియున్నామో, తత్=ఆ సౌన్దర్యము, అస్మాత్=ఈ, అనుభూయమానాన్ = అనుభవింపఁబడుచున్న అనగా ప్రత్యక్షముగా చూడఁబడుచున్న, అస్యాః = ఈమెయొక్క, సౌన్దర్య సారాత్=సౌన్దర్యము యొక్క శ్రేష్ఠభాగముకంటెను, బహూనా=పెక్కు మడుంగులచే, కనీయః=స్వల్పమైనది. మేము జనులవలన వినిన సౌన్దర్యము ఈ దమయన్తియొక్క సౌన్దర్యముకంటె వేయి మడుంగులు తక్కువ యైన దని యర్థము.

**సమాసములు :**

జనాసనేభ్యః :- జనానామాసనాని = జనాసనాని, తేభ్యః=జనాసనేభ్యః.
దిగన్తాత్ : దిశామన్తః=దిగన్తః, తస్మాత్=దిగన్తాత్.
సౌన్దర్యసారాత్ :- సౌన్దర్యస్య సారః = సౌన్దర్యసారః, తస్మాత్ = సౌన్దర్యసారాత్.

**భావము :**

మేము జనులనుండి యే యందమును విని నానాదిక్కులనుండి యిటకు వచ్చితిమో, ఆ యందము మేము వినినదానికంటెను, ప్రస్తుతము చూడఁబడిన దానికంటెను చాల తక్కువగా నున్నది. అనగా మేము దమయన్తినిఁ జూడగనే యామె సౌన్దర్యము తొలుత వినిన సౌన్దర్యమును మించి యున్నదని యాశయము. ॥౧౧౪॥

**శ్లో. రసస్య శృఙ్గార ఇతి శ్రుతస్య**
**క్వ నామ జాగర్తి మహానుదన్వాన్।**
**కస్మాదుదస్థాదియమన్యదా శ్రీ**
**ర్లావణ్య వైదగ్ధ్యనిధిః పయోధేః। 115**

ప.వి. రసస్య- శృఙ్గారః- ఇతి- శ్రుతస్య- క్వ- నామ- జాగర్తి- మహాన్- ఉదన్వాన్- కస్మాత్- ఉదస్థాత్- ఇయమ్- అన్యథా- శ్రీః- లావణ్య వైదగ్ధ్యనిధిః- పయోధేః.

అర్థము: శృఙ్గారఇతి=శృఙ్గారమని, ప్రథితస్య=ప్రసిద్ధమైన, రసస్య=రసమునకు, మహాన్=గొప్పదైన, ఉదధిః=సముద్రము, క్వనామ = ఎచ్చటనో, జాగర్తి కిల=ఉండనే యున్నది. (యతః=ఏలయనగా)అన్యథా = శృఙ్గార రససాగరము లేకపోయినచో, లావణ్యవైదగ్ధ్యనిధిః; లావణ్య = సౌన్దర్య మునకు, వైదగ్ధ్య=చాతుర్యమునకును, నిధిః = నిబ్బరియైన, ఇయం= ఈ యెదుటనున్న దమయన్తియొక్క రూపమున నున్న, శ్రీః = లక్ష్మి, కస్మాత్ = ఏ, పయోధేః=సముద్రమునుండి, ఉదస్థాత్=ఉద్భవించినది.

వి. శృఙ్గార రస సాగరము లేకపోయినను నుండనే యున్న దని చెప్పుట వలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకమునుఁ బ్రయోగింపనందువలన నది గమ్యము. 'ఇయం శ్రీః' 'ఈ లక్ష్మి' యని యుపమానమునే చెప్పి యుపమేయ మగు దమయన్తినిఁ జెప్పనందువలన నిందు నుపమానోపమేయములకు భేద మున్నను నభేద మేర్పడుటవలన నిట నభేదాతిశయోక్తి. ముందుఁ జెప్పఁబడిన నుత్ప్రేక్షతో దీనికి నఙ్గాఙ్గిభావమునుఁ చెప్పుటవలన సఙ్కరము.

**సమాసములు:**

లావణ్యవైదగ్ధ్యనిధిః:- లావణ్యం చ వైదగ్ధ్యం చ = లావణ్యవైదగ్ధ్యే, లావణ్య వైదగ్ధ్యయోః నిధిః=లావణ్యవైదగ్ధ్యనిధిః.

**భావము :**

శృఙ్గార మని ప్రసిద్ధి నొందిన రసమునకు సముద్ర మొకటి యుండవల యును. అది లేనిచో సౌన్దర్యమునకును, చాతుర్యమునకును నిధియైన యీ లక్ష్మి (దమయన్తి) ఏ సముద్రమునుండి యుద్భవించినది. లక్ష్మి సముద్రమునందు పుట్టిన దని ప్రసిద్ధి గలదు-కాని యీలక్ష్మి (దమయన్తి)ఆ లక్ష్మికంటెను మిక్కిలి యందగత్తె కాన నీమె పుట్టుటకును శృఙ్గార రస సాగర ముండి తీరవల యును. ॥౧౧౫॥

**శ్లో. సాక్షాత్ సుధాంశు ర్ముఖమేవ భైమ్యాః**
**దివః స్ఫుటం లాక్షణికః శశాఙ్కః।**
**ఏతద్భ్రువౌ ముఖ్యమనఙ్గచాపం**
**పుష్పం పున స్తద్గుణమాత్రవృత్త్యా॥ 116**

ప.వి. సాక్షాత్ - సుధాంశుః - ముఖమ్ - ఏవ - భైమ్యాః - దివః - స్ఫుటం - లాక్షణికః - శశాఙ్కః - ఏతద్భ్రువౌ - ముఖ్యమ్ - అనఙ్గచాపం - పుష్పం - పునః - తద్గుణమాత్రవృత్త్యా.

అర్థము. భైమ్యాః=దమయన్తియొక్క, ముఖమేవ=ముఖముమాత్రమే, సాక్షాత్= ముఖ్యమైన, సుధాంశుః = చన్ద్రుఁడు. దమయన్తి ముఖము పెదవుల యందలి యమృతముతోటి సంబంధమునుఁ బట్టి యభిధ యను ముఖ్య వృత్తిచే సుధాంశుపదమున కర్థము. దివః=అకాశమునకుసంబంధించిన, శశాఙ్కస్తు=చన్ద్రుఁడో, లాక్షణికః=లక్షణ యనుగుణవృత్తిచేఁ దెలి యఁదగిన (కలఙ్కముతోఁగూడిన) వాఁడు. అనగా సుధాంశుపదమునకు శక్తిచే దమయన్తిముఖము అర్థము; ఏలయనగా, దమయన్తిముఖమందలి పెదవు లమృతమును స్రవింపజేయును గాన సుధాంశుశబ్దమున అమృత కిరణుఁ డని యర్థ మున్నను నమృతము లేని చన్ద్రుని సుధాంశు వని చెప్పుటకంటె, నమృతస్రావి పెదవులతోఁ గూడిన దమయన్తి మోమునే సుధాంశు వని ముఖ్యవృత్తితోఁ జెప్పవలయు నని యర్థము. స్ఫుటం= స్పష్టము (తథా=అట్లే) ఏతద్భ్రువావేవ = ఈ దమయన్తి కనుబొమ్మలే, ముఖ్యం = ప్రధానమైన, యనగా ముఖ్యవృత్తిచే వాచ్యమైన యర్థము. (మఱియు)ముఖ్యం=ముఖమునందున్నందువలన, (అనగా కనుబొమ్మలు ముఖమునందున్నవి గదా.) ముఖ్యమైన, అనఙ్గచాపం = మన్మథునివిల్లు. పుష్పంపునః = (మన్మథుని విల్లుగాఁ జెప్పఁబడు) పుష్పముమాత్రము, తద్గుణమాత్రవృత్త్యా; తత్ = ఆకనుబొమ్మలయొక్క, గుణమాత్ర = కామోద్దీపకత్వాదిగుణములనుమాత్రమే, వృత్త్యా = బోధించెడిగౌణవృత్తి యైన లక్షణచేత, మన్మథుని విల్లని చెప్పఁబడుచున్నది.

వి. దమయన్తి ముఖమే ముఖ్యమైన చన్ద్రుఁడు, ఆకసమున నున్న చంద్రుఁడు అముఖ్యమైన చంద్రుఁడు అస్పష్టము.అట్లె దమయన్తి కనుబొమ్మలే ముఖ్య మైన మన్మథుని విల్లు. పుష్పము కేవలము ఉద్దీపక మగుటవలన గౌణముగా మన్మథునివిల్లు-స్పష్టము-అని చంద్రుఁడు కానటువంటి దమయన్తి ముఖ మును చంద్రుఁ డని చెప్పుటవలనను, మన్మథుని విల్లు కానట్టి దమయన్తి కనుబొమ్మలను మన్మథుని విల్లని చెప్పుటవలనను నుత్ప్రేక్ష-వ్యఞ్జక మైన స్ఫుటశబ్దమునుఁ బ్రయోగించుటచే నది వాచ్యము.

**సమాసములు :**

సుధాంశుః :- సుధామయాః అంశవః యస్యసః=సుధాంశుః।
లాక్షణికః :- లక్షణయా గమ్యః =లాక్షణికః.
శశాఙ్కః :- శశః అఙ్కః యస్య సః=శశాఙ్కః.
ఏతద్భ్రువౌ:- ఏతస్యాః భ్రువౌ=ఏతద్భ్రువౌ।
అనఙ్గచాపమ్:- అనఙ్గస్య చాపమ్=అనఙ్గచాపమ్।
తద్గుణమాత్రవృత్త్యా:- తయోః గుణః = తద్గుణః, తద్గుణ ఏవ తద్గుణ మాత్రమ్, తద్గుణమాత్రే వృత్తిః=తద్గుణమాత్రవృత్తిః, తయా=తద్గుణ మాత్రవృత్త్యా.

**భావము :**

దమయన్తి ముఖమే సుధాంశువు అనగా ముఖ్యమైన చన్ద్రుఁడు. ఆకాశ మందలి చన్ద్రుఁడు, సుధాంశువు కాడు. అతడు లాక్షణిక మైన చన్ద్రుఁడు. లక్షణమనగా కళఙ్కము కాన లాక్షణికుఁ డనగాకళఙ్కముతోఁ గూడిన చంద్రు డని యర్థము, వానిని సూచించుటకై "శశాఙ్కః" యనిప్రయోగించెను. లక్షణా వృత్తిచే నని చంద్రునిఁ జెప్పును గానసందుచేతను లాక్షణికుడు. ఆకాశమందలి చంద్రుఁడు సుధను-అనగా అమృతమునుఁ గురిపింపఁడు కాన ముఖ్యసుధాంశువు కాడు. దమయన్తిముఖమున పెదవులు అమృతమును వర్షించుచు గాన, యామె ముఖము ముఖ్యసుధాంశువు. అట్లే దమయన్తి కనుబొమ్మలే ప్రధాన మైన మన్మథచాపము. పుష్పము కామోద్దీపకత మున్నగు గుణములనుబోధించుటచే, గౌణవృత్తివలన నప్రధాన మైన మన్మథ చాప మైనది. అనగా దమయన్తి మోము చంద్రుని వలె, దమయన్తి కనుబొమ్మలుమన్మథుని విల్లు వలె నున్న వని సారాంశము ॥౧౧౬॥

శ్లో. **లక్ష్యే ధృతం కుణ్డలికే సుదత్యా**
**తాటఙ్కయుగ్మం స్మరధన్వినే కిమ్।**
**సవ్యాఽపసవ్యం విశిఖా విసృష్టా**
**స్తై నైత యోర్యాన్తి కిమన్తరేణ॥** 117

ప.వి. లక్ష్యే- ధృతం - కుణ్డలికే- సుదత్యాః- తాటఙ్కయుగ్మం-స్మరధన్వినే- కిమ్- సవ్యాపసవ్యం- విశిఖాః- విసృష్టాః-తేన- ఏతయోః-యాన్తి- కిమ్- అన్తరేణ.

అర్థము: సుదత్యాః =(అందమైన పంటిపరుసగల) దమయన్తియొక్క, తాటఙ్కయుగ్మం = చెవులయందలి కమ్మలయొక్క జంట, స్మరధన్వినే; స్మర=మన్మథుఁడనెడు, ధన్వినే=విలుకానికొఱకు, లక్ష్యే = గురియైన, కుణ్డలికే=చక్రములుగా, ధృతం కిమ్ = ధరింపఁబడినవా యేమి? అత ఏవ=ఇందువలననే, తేన=ఆ విలుకానిచే, సవ్యాపసవ్యం యథాతథా; కుడియెడమలుగా, విసృష్టాః=విడువఁబడిన, విశిఖాః=బాణములు, ఏతయోః= ఈ గుఱులగా నేర్పడిన చక్రములకు, అంతరేణ = మధ్యభాగమునందు, యాన్తికిమ్ = వెళ్ళుచున్నవాయేమి? కుడియెడమ చేతులతో నొక్క కాలమునందే బాణములనుఁ బ్రయోగించెడి విలుకాండ్రు రెండుఁ గుఱుల పైనను బాణములను వదలఁగలరని ప్రసిద్ధి.

వి. మన్మథుఁడు విడిచిన, బాణములు రెండు కర్ణములలోని కమ్మల మధ్య వెళ్ళిపోకపోయినను, వెళ్ళిన వని చెప్పుటవలన నుత్ప్రేక్ష. "కిమ్" అని వ్యఞ్జకమునుఁ జెప్పుటవలన నది వాచ్యము.

తాటఙ్కయుగ్మమును లక్ష్యముగా ధరింపకపోయినను, ధరించినట్లు చెప్పుట వలన నుత్ప్రేక్ష. కింశబ్ద ప్రయోగముచే నది వాచ్యము.
పైన నుదాహృతము లగు నుత్ప్రేక్షలకు రెంటికిని సఙ్కరము.

## సమాసములు :

కుణ్డలికే :– కుణల్యావేవ=కుణ్డలికే.
తాటఙ్కయుగ్మమ్ :- తాఙ్కయోః యుగ్మం=తాటఙ్కయుగ్మమ్.
సవ్యమపసవ్యం చ యథా తథా=సవ్యాపసవ్యమ్.

## భావము :

దమయన్తియొక్క చెవులలోని రెండు కమ్మలు, మన్మథుఁ డను విలుకానికి గుఱియైన రెండు చక్రములా యేమి ? ఆమె చెవులలోని కమ్మలనే మన్మథ

బాణములకు గుఱియైన చక్రములుగా ధరించిన దని యర్థము. కావుననే మన్మథుఁడు తన కుడియెడమ చేతులతో వదలిపెట్టిన బాణములు, ఈ చక్రములకు మధ్య పోవుచున్నవా, యనునట్లున్నవి. సవ్యసాచులైన విలుకాండ్రు, అనగా కుడి యెడమ చేతులతో, బాణములను ప్రయోగించు నేర్పు గల విలుకాండ్రు రెండు గుఱులపైనను బాణములనుఁ బ్రయోగింపఁగలరు. అనగా దమయన్తి కను బొమ్మ లనెడి వింటినుండి విడువఁబడిన దమయన్తి కడకన్ను లను బాణములు. ఆమెయొక్క చెవిలోని కమ్మల మధ్యనుండి వెడలిపోవుచున్న వని యాశయము.॥౧౧౭॥

శ్లో. తనోత్యకీర్తిం కుసుమాశుగస్య
సైషా బతేన్దీవరకర్ణపూరా।
యతః శ్రవః కుణ్డలికాపరాద్ధ
శరం ఖలః ఖ్యాపయితా తమాభ్యామ్॥ **118**

ప. వి. తనోతి-అకీర్తిం-కుసుమాశుగస్య-సా-ఏషా - బత-ఇన్దీవర కర్ణపూరా - యతః-శ్రవః కుణ్డలికా పరాద్ధశరం-ఖలః-ఖ్యాపయితా-తమ్- ఆభ్యామ్.

అర్థము: సా=ఆ, ఏషా=ఈ దమయన్తి, ఇన్దీవర కర్ణపూరా = నల్లకలువ లనెడి తన కర్ణభూషణముల రూపమున, కుసుమాశుగస్య = పుష్పబాణునకు, అకీర్తిం = అపకీర్తిని, తనోతి=కల్గించుచున్నది. బత=అయ్యో ! యతః =ఏలయనగా, ఖలః=తప్పును వెదకెడు దుష్టుడు; ఆభ్యాం=కామబాణము లైన యీ నల్లకలువల నుండి, తం=ఆపుష్పబాణుని, శ్రవఃకుణ్డలికాపరాద్ధ శరం; శ్రవఃకుణ్డలికా; శ్రవః = చెవులయందలి, కుణ్డలికా = గురియైన కమ్మ లనెడి చక్రములనుండి, అపరాద్ధశరం=జారిపోయిన బాణము గల వానినిగా, ఖ్యాపయితా=వెల్లడి చేయఁగలడు.

**సమాసములు :**

అకీర్తిమ్ :- న కీర్తిః = అకీర్తిః, తామ్=అకీర్తిమ్.

కుసుమాశుగస్య :- కుసుమాని ఆశుగాః యస్య సః = కుసుమాశుగః, తస్య = కుసుమాశుగస్య.

ఇందీవర కర్ణపూరౌ : ఇన్దీవరే ఏవ కర్ణపూరౌ = ఇన్దీవర కర్ణపూరౌ
శ్రవః కుణ్డలికా పరాద్ధశరమ్ :- శ్రవసోః కుణ్డలికే = శ్రవఃకుణ్డలికే, అప
రాద్ధశ్చాసౌ శరశ్చ = అపరాద్ధశరః, శ్రవః కుణ్డలికయోః అపరాద్ధశరః
యస్య సః = శ్రవః కుణ్డలికాపరాద్ధశరః, తమ్ - శ్రవఃకుణ్డలికాపరాద్ధశరమ్.

**భావము :**

ఆ దమయన్తి తన చెవులయందు నల్లకలువలను నలఙ్కారముగా ధరించి యున్నది. అవి రెండును మన్మథున కపకీర్తినిఁ దెచ్చుచున్నవి. (ఆ కలువపూలు నలుపు గాన వానివలన నల్లని యపకీర్తిఁ గల్గు ననియు నర్థము. కారణ గుణములు కార్యమునందు సంక్రమించును గదా!) అయ్యో! ఏల యనగా— ఆ రెండు కలువలును నామె చెవుల యంచులలో జారినట్లు కనఁబడును. అందువలన, తప్పుల నెంచెడి దుష్టుఁ డెవఁడైన నొకఁడు, ఆ కలువలనుఁ జూపించి,మన్మథుని బాణములైన పూలకుఁ జెందిన యీ కలువలు, దమయన్తి చెవికమ్మ లనెడి లక్ష్యచక్రములయందు పడకుండఁ దప్పిపోయిన వని వానినిఁ బ్రయోగించిన మన్మథున కపకీర్తి నిఁ దేవచ్చును.

**శ్లో. రజఃపదం షట్పదకీటజుష్టం**
**హిత్వాఽఽత్మనః పుష్పమయం పురాణమ్।**
**అద్యాత్మభూరాద్రియతాం స భైమ్యా**
**భ్రూయుగ్మమన్తర్ధృతముష్టిచాపమ్॥ 119**

ప.వి. రజఃపదం- షట్పదకీటజుష్టం- హిత్వా- ఆత్మనః- పుష్పమయం- పురాణమ్- అద్య - ఆత్మభూః - ఆద్రియతాం- సః- భైమ్యాః- భ్రూయుగ్మమ్- అన్తర్ధృత ముష్టిచాపమ్.

అర్థము : అద్య=ఇప్పుడు, ఆత్మభూః=మనస్సునందుద్భవించిన, సః = ఆమన్మథుఁడు, రజఃపదం—పుప్పొడికి స్థాన మైనదియు, (దూళికి స్థాన మైనదియు) షట్పదకీటజుష్టం; షట్పద = తుమ్మెదలను, కీట = పురుగులచే (పురుగులచేఁ గొట్టబడినదియు), జుష్టం=సేవింపఁబడినదియు, పురాణం ప్రాతఁబడినదియు నగు, పుష్పమయం = పుష్పవికారమైన, ఆత్మనః=

తనయొక్క, చాపం = ధనుస్సును, హిత్వా=వదలి, అన్తర్ధృతముష్టిః; అంతః=మధ్యభాగమున, ధృత= పట్టుకొనిన, ముష్టి=పిడికిలికలదియగు (కావుననే నడిమభాగము పిడికిలి యందుండుట వలన కానరాదు) భైమ్యాః = దమయన్తియొక్క, భ్రూయుగ్మం = కనుబొమ్మల జంట యను, చాపం=ధనుస్సును, ఆద్రియతాం = ఆదరించునుగాక. (ఏల యనగా నీ విల్లును, బాణములు తప్పిపోవు. మఱియు నది క్రొత్తది.)

**సమాసములు :**

రజఃపదమ్ :— రజసః పదమ్=రజఃపదమ్, తత్ = రజఃపదమ్.
షట్పద కీటజుష్టమ్ :— షట్పదా ఏవ కీటాః = షట్పదకీటాః, షట్పద కీటైః జుష్టమ్=షట్పదకీటజుష్టమ్, తత్ = షట్పదకీటజుష్టమ్ ।
పుష్పమయమ్ :— పుష్పాణాం వికారః=పుష్పమయం, తత్ = పుష్ప మయమ్
ఆత్మభూః :— ఆత్మని భవతీతి=ఆత్మభూః.
భ్రూయుగ్మమ్ :—భ్రువోః యుగ్మమ్ = భ్రూయుగ్మమ్, తత్=భ్రూ యుగ్మమ్.
అన్తర్ధృతముష్టి :— అన్తః ధృతా = అన్తర్ధృతా, అన్తర్ధృతా ముష్టిః యస్య తత్=అన్తర్ధృతముష్టి, తత్=అన్తర్ధృతముష్టి॥

**భావము :**

మన్మథుఁడు పుప్పొడికి (ఉలుకుపట్టిన కొయ్యపొడికి) స్థాన మైనదియు తుమ్మెద లనెడి పురుగుల తోడను (ఉలుకు పురుగులతోడను) కూడినదియు పాతఁ బడినదియు నైన తన పూవిల్లును వదలి పిడికిలితోఁ బట్టుకొనినందువలన, మధ్య భాగమున కానరానట్టి, దమయన్తి కనుబొమ్మలనెడి వింటినే యికఁ జేఁబట్ట వలయును. ఏల యనగా నీ విల్లు క్రొత్తది. ఇందుండి ప్రయోగింపఁబడిన శరములు తప్పిపోయ్యేడివి కావు. ॥౧౦౫॥

శ్లో. పద్మాన్ హి మే ప్రావృషి ఖఞ్జరీటాన్
క్షిప్నుర్భృమాదాయ విధిః క్వచిత్తాన్।

సారేణ తేన ప్రతివర్షముచ్చైః
పుష్ణాతి దృషిద్వయమేతదీయమ్॥ **120**

ప.వి. పద్మాన్-హిమే-ప్రావృషి-ఖఞ్జరీటాన్-క్షిప్నుః-యమ్ - ఆదాయ-విధిః - క్వచిత్-తాన్-సారేణ-తేన-ప్రతివర్షమ్- ఉచ్చైః - పుష్ణాతి - దృష్టిద్వయమ్-ఏతదీయమ్.

అర్థము: విధిః = బ్రహ్మ, యం=ఏ, సారం=పద్మముల యందలి శ్రేష్ఠమైన ఏ

భాగమును, తథా = అట్లే, కాటుకపిట్టలయందలి శ్రేష్ఠమైన ఏ భాగమును, ఆదాయ = తీసికొని, (తాన్=ఆ నిస్సారములైన) పద్మాన్ = పద్మములను, హిమే = మంచుకాలమునందును, తథా = అట్లే, ఖఞ్జరీటాన్= కాటుక పిట్టలను, ప్రావృషి = వర్షరుతువునందును, క్వచిత్=ఎక్కడనో, క్షిప్నుః = పడవేయుచున్నవాఁడై, తేన=ఆ, సారేణ=సారముచే, ప్రతివర్షం=ప్రతిసంవత్సరము, ఏతదీయం = ఈమెకు సంబంధించిన, దృష్టిద్వయం=కనుఁగవను,ఉచ్చైః=అధికముగా ,పుష్ణాతి=పెంపుఁబొందించుచున్నాడా యేమి?

వి. బ్రహ్మ, పద్మముల సారమును కాటుకపిట్టల సారమునుఁ దీసి దమయన్తి కనుఁగవను చేయకపోయినను, చేయు నట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష.

**సమాసములు :**

క్షిప్నుః :- క్షేప్తుం శీలమస్యేతి=క్షిప్నుః.
ప్రతివర్షమ్ :- వర్షే వర్షే = ప్రతివర్షమ్.
దృష్టిద్వయమ్ :- దృష్ట్యోః ద్వయమ్ = దృష్టిద్వయమ్, తత్=దృష్టిద్వయమ్.

**భావము :**

బ్రహ్మ పద్మములయందలి సారభాగమును, కాటుకపిట్టల యందలి సారభాగమును తీసుకొని, వానిని సారహీనములనుఁ గావించి, హేమన్తమునందు పద్మములను, వర్షర్తువునందు కాటుకపిట్టలను నెక్కడనో పడవేయుచున్నవాఁడై

ఆ. సారములచే దమయన్తి కనుఁగవకు గొప్పఁ బెంపునుఁ జేకూర్చు చున్నాఁడు. ॥౧౨౧॥

శ్లో. ఏతద్దృశోరమ్బురుహైర్విశేషం
భృఙ్గౌ జనః పృచ్ఛతు తద్గుణజ్ఞౌ।
ఇతీవ ధాతాఽకృత తారకాలి
స్త్రీపుంస మాధ్యస్థ్యమిహాఽక్షియుగ్మే॥ 121

ప.వి. ఏతద్దృశోః- అమ్బురుహైః- విశేషం- భృఙ్గౌ- జనః- పృచ్ఛతు- తద్గుణజ్ఞౌ- ఇతి- ఇవ- ధాతా-అకృత-తారకాలిస్త్రీపుంస మాధ్యస్థ్యమ్- ఇహ- అక్షియుగ్మే.

అర్థము: జనః = (రెంటియొక్క తారతమ్యమును తెలియఁగోరిన) జనము, ఏత ద్దృశోః=ఈ దమయన్తి కన్నులకు, అమ్బురుహైః = తామరపూవులతో, విశేషం=భేదమును, తద్గుణజ్ఞౌ; తత్=ఆ తామరయొక్కయు, నేత్రముల యొక్కయు, గుణ=గుణములను, జ్ఞౌ= తెలిసిన, భృఙ్గౌ=తుమ్మెదలను అనగా, తుమ్మెదల మిథునమును, పృచ్ఛతు = అడుగవలయును, ఇతీవ=ఇట్లుభావించెనోయనునట్లు, ధాతా=బ్రహ్మ, ఇహ=ఈ దమయన్తికి సంబంధించిన, అక్షియుగ్మే = కన్నుల జంటయందు, తారకాళి స్త్రీపుంస మాధ్యస్థ్యమ్; తారకా = కంటిపాప లనెడి, అలి స్త్రీపుంస = తుమ్మెదల దమ్పతులయొక్క, మాధ్యస్థ్యమ్ = మాధ్య స్థ్యమును, అనగా పద్మములు శ్రేష్ఠములా, లేక యీమె నేత్రములు శ్రేష్ఠములా ? యని జనులకు సందేహము రాగా, ఆ సంశయ విచ్ఛేద మునుఁ జేయు సాక్షిత్వమును (రెండు కన్నులకు మధ్య భాగస్థితిని) అకృత = చేసెను.

వి. కంటి పాపలను రెంటిని భృఙ్గదమ్పతులో యని భావించుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకమునుఁ జెప్పనందువలన నది గమ్యము.

**సమాసములు :**

ఏతద్దృశోః :— ఏతస్యాః దృశౌ= ఏతద్దృశౌ, తయోః = ఏతద్దృశోః. భృఙ్గౌః — భృఙ్గీ చ భృఙ్గశ్చ-భృఙ్గౌ, తౌ=భృఙ్గౌ ॥

తద్గుణజ్ఞౌ :— తయోః గుణః = తద్గుణః, తద్గుణం జానీత ఇతి=తద్గుణజ్ఞౌ, తౌ=తద్గుణజ్ఞౌ.

తారకాళిస్త్రీపుంసమాధ్యస్థ్యమ్ :— అలిశ్చ స్త్రీపుంసశ్చ=అలిస్త్రీపుంసౌ, తారకే ఏవ అలిస్త్రీపుంసౌ=తారకాలిస్త్రీపుంసౌ. మధ్యే తిష్ఠతీతి=మధ్యస్థః, మధ్యస్థస్య భావః=మాధ్యస్థ్యమ్, తారకాలి స్త్రీపుంసయోర్మాధ్యస్థ్యమ్=తారకాళిస్త్రీపుంసమాధ్యస్థ్యమ్, తత్=తారకాళిస్త్రీపుంసమాధ్యస్థ్యమ్ ।

అక్షియుగ్మే :— అక్ష్ణోః యుగ్మమ్=అక్షియుగ్మమ్. తస్మిన్ = అక్షియుగ్మే.

**భావము :**

జనులు దమయన్తి కన్నులకును, పద్మములకును భేదమును దెలియగోరిన వారై, ఆ రెంటి యొక్క గుణమును (రసమును) దెలిసిన తుమ్మెదల జంటను విచారింతు రని బ్రహ్మ తలంచి, యామె కనుఁగవయందు కంటిపాప లనెడి, భృఙ్గ దమ్పతులను మధ్యస్థులను గావించి, పద్మములు శ్రేష్ఠములా లేక, ఆమె కనుగవ శ్రేష్ఠమా యను జనుల సంశయము తీర్చుటకు సాక్షులుగను, కన్నులకు మధ్యనుండువానిగనుఁ గావించెను. ఆ విధముగా, భృఙ్గదంపతులు పద్మమును వదలి దమయన్తి కన్నులయం దుండుటవలన (కంటి పాపలుగా నుండుటవలన) పద్మమున కంటె దమయన్తి కన్నులే యందమైన వని సూచించుచున్నవి.కాన దమయన్తి కన్నులు పద్మమునకంటె నందమైన వనియు తుమ్మెదల వంటి నల్లని కంటిపాపలనుఁ గల్గిన వనియు సారాంశము ॥౧౨౧॥

శ్లో. వ్యధత్త సౌధౌ రతికామయోస్తద్
భక్తం వయోఽస్యా హృది వాసభాజోః ।
తదగ్రజాగ్రత్ప్రథుశాతకుమ్భ
కుమ్భౌ న సమ్భావయతి స్తనౌ కః ॥ **122**

ప.వి. వ్యధత్త-సౌధౌ-రతికామయోః, తత్-భక్తం - వయః-అస్యాః. హృది - వాసభాజోః-తదగ్రజాగ్రత్ప్రథుశాతకుమ్భ కుమ్భౌ-న సమ్భావయతి-స్తనౌ-కః,

అర్థము: తద్భుక్తం; తత్=ఆరతికిని, మన్మథునకు, భుక్తం=లొంగిన, యౌవనం=జవ్వనము, అస్యాః= ఈ దమయన్తియొక్క, హృది=హృదయమున, వాసభాజోః=నివాసమును జేయుచున్న, రతికామయోః=రతిమన్మథుల, కృతే=కొఱకు, సౌధౌ=మేడలను, వ్యధత్త=నిర్మించెను. (అట్లు కానిచో వారి కట నివసించుటకు సౌకర్యము లేదు) (యస్మాత్=ఏ కారణము వలన) కః=ఏ జనము, స్తనౌ=ఈ దమయన్తియొక్క స్తనములను, తదగ్రజాగ్రత్పృథుశాతకుంభకుంభౌ, తత్ = ఆ మేడలయొక్క, అగ్ర = కొనలయందు, జాగ్రత్ = వెలసిల్లు, పృథు = గొప్పవైన, శాతకుమ్భ=పసిడితో నిర్మితములైన, కుమ్భౌ=కలశములుగా, న సమ్భావయతి=ఊహింపడు? తప్పక యూహించును.

**సమాసములు :**

రతికామయోః :– రతిశ్చ కామశ్చ=రతికామౌ, తయోః=రతికామయోః ।

తద్భుక్తం :– తయోః భుక్తం=తద్భుక్తం ।

వాసభాజోః :– వాసం భజత ఇతి=వాసభాజౌ. తయోః=వాసభాజోః ॥

తదగ్రజాగ్రత్పృథుశాతకుమ్భకుమ్భౌ :- తయోః అగ్రం = తదగ్రం, తదగ్రేజాగ్రతౌ=తదగ్రజాగ్రతౌ. శాతకుమ్భమయౌ చ తౌ కుమ్భౌ చ =శాతకుమ్భకుమ్భౌ, పృథూ చ తౌ శాతకుమ్భకుమ్భౌ చ = పృథుశాతకుమ్భకుమ్భౌ, తదగ్ర జాగ్రతౌ చ తౌ పృథుశాతకుమ్భకుమ్భౌచ = తదగ్రజాగ్రత్పృదు శాత కుమ్భ కుమ్భౌ =తౌ తదగ్రజాగ్రత్పృథు శాత కుమ్భకుమ్భౌ.

**భావము :**

రతిమన్మథులకు లోబడిన యౌవనము, దమయన్తి హృదయమున నివసించెడి వారిద్దరికిని రెండు మిద్దెలను నిర్మించినవి. అట్లు కానిచో వారి కచ్చట నివసించుట కనువులేదు. కావుననే యా దమయన్తి చనుదోయిని, నా మేడలపై విలసిల్లు గొప్ప సువర్ణ కలశములుగా నెవ్వడు భావింపడు ? అందఱును భావింతు రని యే యాశయము. సాధారణముగా రాజభవనముల పైభాగములపై సువర్ణకలశము లుంచుట ప్రసిద్ధముగదా ! ॥౧౮౩॥

శ్లో. అస్యా భుజాభ్యాం విజితాత్ బిసాత్ కిం
పృథక్ కరోఽగృహ్యత తత్ప్రసూనమ్।
ఇహోచ్యతే తన్న గృహం శ్రియః కై
ర్న గీయతే వా కర ఏవ లోకైః॥ 123

ప.వి. అస్యాః- భుజాభ్యాం- విజితాత్- బిసాత్- కిం- పృథక్- కరః- అగృహ్యత- తత్ప్రసూనమ్- ఇహ- ఉచ్యతే- తత్- న- గృహం- శ్రియః- కైః- న- గీయతే- వా- కరః-ఏవ- లోకైః.

అర్థము : అస్యాః=ఈ దమయన్తియొక్క, భుజాభ్యాం=బాహువులచే, విజితాత్ =ఓడింపఁబడిన, బిసాత్=తామరకాడనుండి, పృథక్=ప్రత్యేకముగా తత్ప్రసూనం=ఆ తామరపూవు. (కరః=పన్నుగను, హస్తముగను) అగృహ్యత కిం ?=తీసికొనఁబడినదా యేమి. ఓడింపఁబడిన వ్యక్తి పన్నును జెల్లించుట యుచితముగదా. తథా హి = అది యుక్తమే. ఇహ=ఈ దమయన్తియొక్క భుజములయందు, తత్ = (కరముగా) హస్తముగాఁ దీసికొనఁబడిన పద్మము. కైః=ఏ, లోకైః = జనులచే, శ్రియః=లక్ష్మికి (శోభకు), గృహం=స్థానముగా, నేక్ష్యతే = చూడఁ బడుటలేదు? వా=లేదా, కరఏవ=కర శబ్దముచేతనే, న గీయతే=చెప్పఁ బడుటలేదు? తప్పక చెప్పఁబడుచున్న దని యర్థము. ఈమె హస్తము లక్ష్మినివాస మగుటవలన పద్మ మగుచున్నది. హస్త మగుటవలన తామరకాడలుగ నామె భుజములు భావింపఁబడిన వని యర్థము.

**భావము :**

ఈ దమయన్తి బాహువులచే తామర తూండ్లు ఓడింపఁబడినవి. అందు వలన ఓడిపోయిన వానినుండి యందలి పూవు కప్పముగను హస్తముగను తీసి కొనఁబడినది. అనగా నా తామరపూవే దమయన్తి హస్త మైన దని యర్థము. అట్లు హస్తముగాఁ గావింపఁబడిన యా పద్మమును నెవ్వరు లక్ష్మినివాసముగా భావింపరు?పద్మము లక్ష్మినివాసమే గానఁ దప్పక భావింతురు.లేదా యామె హస్త మునే లక్ష్మిగృహముగా నెవ్వరు చెప్పరు. అందఱుఁ జెప్పుదు రని యాశ యము. ॥౧౨౪॥

శ్లో. ఛద్మైవ తచ్ఛమ్బరజం బిసిన్యా
స్తత్పద్మమస్యాస్తు భుజాగ్రసద్మ।
ఉత్కణ్టకాదుద్గమనేన నాలా
దుత్కణ్టకం శాతశిఖై ర్నఖైర్యత్॥ 124

ప.వి. ఛద్మ- ఏవ- తత్- శమ్బరజం- బిసిన్యాః- తత్- పద్మమ్- అస్యాః- తు- భుజాగ్రసద్మ- ఉత్కణ్టకాత్- ఉద్గమనేన- నాలాత్-ఉత్కణ్టకం- శాతశిఖైః- నఖైః- యత్.

అర్థము: బిసిన్యాః=తామరకాడకు సంబంధించినదైన, తత్ = ఆ పద్మము, శమ్బరజం=మాయవలన నేర్పడిన; ఛద్మైవ=అసత్యమే తు = కాని, అస్యాః = ఈ దమయన్తియొక్క, భుజాగ్రసద్మ; భుజాగ్ర=భుజముల చివరిభాగమును, సద్మ=స్థలముగాఁ గల్గిన, పద్మం=పద్మము, తత్ = పారమార్థికమైనది. యత్=ఏలయనగా, ఉత్కణ్టకాత్= (పైకి నిక్కిన) ముండ్లు, (పులకములు) గల్గిన, నాలాత్=తామరకాడ నుండియు, భుజ నాళమునుండియు, ఉద్గమనేన = ఉద్భవించుట యను కారణముచే, శాతశిఖైః=వాడి కొనలుగల, నఖైః=గోళ్ళచే, (ఏతత్ = ఈ, పాణి పద్మమ్=కరకమలము) ఉత్కణ్టకం=ఉద్భవించిన కణ్టకములనుఁ గల్గి నది. బిస పద్మం తు = తామరకాడనుండి యుద్భవించిన పద్మమో, నోత్కణ్టకం=ఉద్భవించిన ముండ్లు లేనిది. ఏలయనగా పద్మమునందు ముండ్లులేవు) కాన ముండ్లతోఁ గూడిన నాళమునుండి పుట్టిన పద్మము ముండ్లతోఁ గూడి యుండవలయును గదా. దమయన్తి హస్తపద్మమే పద్మము. ఏల యనగా నది యుత్కణ్టకమగు, అనగా ముళ్ళతోఁ గూడిన (పులకములతోఁ గూడిన) భుజనాళము నుండి యుత్పన్నమైనదై వాడి గోళ్ళనెడి కణ్టకములతోఁ గూడి యుత్కణ్టకమై "కారణగుణాః కార్యగుణానారభన్తే" యను న్యాయమున కనుకూలముగా నున్నది. సరః పద్మము ఉత్కణ్టకమగు తామరకాడనుండి పుట్టినను, కారణ గుణ ములగు కణ్టకములనుఁ బొందక కణ్టకరహితమై యున్నది.

వి. ఇచ్చట దమయన్తి హస్తపద్మ ముత్కణ్టకమై నిష్కణ్టకమైన సరః పద్మమును మించినందువలన నిట వ్యతిరేకాలఙ్కారము,

**సమాసములు :**

భుజాగ్రసద్మ:- భుజయోరగ్రం = భుజాగ్రమ్, భుజాగ్రమేవ సద్మ యస్యా తత్=భుజాగ్రసద్మ.
ఉత్కణ్టకాత్ :- ఉద్గతాః కణ్టకాః యస్మాత్తత్=ఉత్కణ్టకం, తస్మాత్= ఉత్కణ్టకాత్.
శాతశిఖైః:- శాతాః శిఖాః యేషాం తే=శాతశిఖాః, తైః=శాతశిఖైః.

**భావము :**

తామరకాడకు సంబంధించిన పద్మము మాయాకల్పితము కాన నది యసత్యమైనది. అనగా పారమార్థికము గాదు. కాని దమయన్తియొక్క భుజాగ్రమునందు నెలకొన్న పద్మమో వాస్తవిక మైనది. అనగా పారమార్థిక మైనది. ఏల యనగా ముండ్లు గల్గినట్టి (పులకములు గల్గినట్టి) భుజనాళమునుండి పుట్టిన యీ దమయన్తి చేదమ్మి వాడి గోళ్ళనెడి కణ్టకములతో (ముండ్లతో) కూడి, ఉత్కణ్టకమై కారణగుణములు కార్యమునందు గుణముల నుత్పాదించు నను న్యాయమున కనుగుణముగ నున్నది. కాన దమయన్తి హస్తపద్మము సరః పద్మమును మంచినదని యాశయము. ॥౧౨౪॥

> శ్లో. **జాగర్తి మర్త్యేషు తులార్థమస్యాః**
> **యోగ్యేతి యోగ్యానుపలమ్భనం నః।**
> **యద్యస్తి నాకే భువనేఽథవాఽథ**
> **స్తదా న కౌతస్కుతలోకబాధః॥** **125**

ప.వి. జాగర్తి మర్త్యేషు- తులార్థమ్- అస్యాః- యోగ్యా- ఇతి- యోగ్యానుపలమ్భనం- నః- యది- అస్తి- నాకే- భువనే- అథ- వా- అధః- తదా- న- కౌతస్కుతలోకబాధః.

అర్థము: మర్త్యేషు=మానవులయందు, అస్యాః=ఈ దమయన్తికి, తులార్థం= పోలికకు, యోగ్యా=తగిన, (కాచిత్ = ఒక్కతె, అస్తీతి = ఉన్నదని) (అత్ర = ఇచ్చట) నః = మనకు, యోగ్యానుపలమ్భనం = యోగ్యాను

పలబ్ధియే (బాధకముగా) జాగర్తి=పిలసిల్లుచున్నది. మర్త్యులయందు నీమెకు సాటి యైన స్త్రీ యున్నచో తప్పక కనఁబడు నని యావిధముగా నాపాదన చేయుటవలన నేర్పడిన యనుపలబ్ధిచే యట్టి స్త్రీయొక్క యభావ మేర్పడుచున్నది. నాకే=స్వర్గమునందు, అథవా=లేదా, అధో భువనే=పాతాళమునందును, యద్యస్తి = ఇట్టి స్త్రీ యున్నచో, తదా =అప్పుడు, కౌతస్కుతలోకబాధః; కౌతస్కుత = ఎక్కడెక్కడి నుండియో, స్వర్గాది లోకములనుండి) వచ్చిన, లోక=దేవతలు నాగులు మున్నగు జనులయొక్క, బాధః=బాధ, అనగా వారితో త్రొక్కిడి, న= ఉండదు. అనగా నా లోకముల యందలి జనులు వచ్చి యుండెడి వారు కారు.

వి. మానవ లోకమందు నీమెకు సాటి యైన స్త్రీ యున్నచో మనకు కనఁబడి యుండెడిది. ఎందువలన లేదో యందువలన కనబడుట లేదు. అనెడి యనుపలబ్ధి చేతను, స్వర్గపాతాళములయందు నీమెకు సాటి యైన స్త్రీ యున్నచో, అందలి దేవతలు, నాగులు మున్నగు వారివలన భూలోక మున నింత సమ్మర్ద ముండెడిది కావున నర్థాపత్తి చేతను, మూడు లోకముల యందును నామెకు సాటి లే దని నిశ్చయింపఁబడినది. ఇట్లు విషయ న్నికిఁ బోల్పఁ దగిన వస్తువు లేనందువలన నుపమానమునకు లోపము వచ్చినది కాన నుపమాన లుప్త.

## సమాసములు :

యోగ్యానుపలమ్భనం :- యోగ్యం చ తత్ అనుపలమ్భనం చ = యోగ్యానుపలమ్భనం.
కౌతస్కుతలోకబాధః :- కుతః కుతః ఆగతాః=కౌతస్కుతాః. కౌత స్కుతాశ్చ తే లోకాశ్చ = కౌతస్కుతలోకాః. కౌతస్కుత లోకానాం బాధః= కౌతస్కుతలోకబాధః.

## భావము :

మానవులయందు నమయన్తికి సాటి యైన స్త్రీ యొకతె యున్నదను విషయమున యోగ్యానుపలబ్ధియే బాధక ప్రమాణము. మానవులయం దిట్టి స్త్రీ

యున్నచో కానవచ్చెడిది. ఎందువలన లేదో అందువలన కానరాదు. అనుయోగ్యానుపలబ్ధియే యామెకు సాటి యగు స్త్రీ లేదనుటకు ప్రమాణము. స్వర్గమందుఁగాని, పాతాళమందు గాని దమయన్తికి సాటి యైన స్త్రీ యున్నచో, నా లోకవాసు లైన దేవతలు నాగులు మున్నగువారు భూమికి వచ్చుటచే వారివలన నిట్టి సమ్మర్దముగాసి యుండదు గదా కాన నీయర్థాపత్తి ప్రమాణమునుఁ బట్టియు స్వర్గపాతాళములయందు నామెకు సాటి యైన స్త్రీ లేదని సిద్ధించుచున్నది. కావున పై రెండు ప్రమాణముల చేతను దమయన్తికి సాటియైన స్త్రీ మూడు లోకముల యందు లేదని సిద్ధించుచున్నది. ॥౧౨౫॥

శ్లో. నమః కరేభ్యోఽస్తు విధేర్న వాఽస్తు
స్పృష్టం ధియాప్యస్య న కిం పునస్తైః।
స్పర్శాదిదం స్యాల్లులితం హి శిల్పం
మనోభువోఽనఙ్గతయానురూపమ్॥ **126**

ప.వి. నమః– కరేభ్యః- అస్తు- విధేః– న- వా- అస్తు- స్పృష్టం- ధియా- అపి- అస్య- న- కిం- పునః- తైః- స్పర్శాత్- ఇదం– స్యాత్– లులితం– హి– శిల్పం- మనోభువః- అనఙ్గతయా- అనురూపమ్.

అర్థము: విధేః=సృష్టికర్తయొక్క, కరేభ్యః=హస్తములకు, నమః=నమస్కారము, అస్తు=అగుఁగాత. యైః=ఏ హస్తములచే, ఇదం=ఈ శిల్పము, అకల్పి=చేయఁబడినదో, వా=లేదా, నాఽస్తు = నమస్కారము వలదు. అస్య = ఈ సృష్టికర్తయొక్క, ధియాఽపి=మనస్సు చేతను, (ఇదం శిల్పమ్=ఈ శిల్పము) నస్పృష్టం=తాకబడలేదు. తైః=ఆ, కరైః= హస్తములచే, కింపునః (వాచ్యం) తాకఁబడలేదని చెప్పవలసినదే మున్నది. అనగా తాకఁబడలేదని యర్థము. హి=ఏలయనగా, కింతు=కాని, స్పర్శాత్=హస్తముయొక్క స్పర్శవలన, ఇదంశిల్పం=ఈకోమలశిల్పము, లులితం=నలిగినదిగా,స్యాత్=అగును.అనఙ్గతయా=దేహము లేదను కారణముచే,మనోభువః=మన్మథునకు, (ఇదం=ఈశిల్పనిర్మాణము)అనురూపం =తగినది. మన్మథుడు శరీరము లేనివాడు కావున హస్తస్పర్శ లేకయే ఈ దమయన్తి యను శిల్పమును సృజింప శక్తి కలవాఁడు.

వి. భైమీశిల్పము మన్మథసృష్టి కాకపోయినను, అయినట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష.

భైమీ శిల్పమునకు సృష్టికర్తయొక్క సంబంధ మున్నను సంబంధము లేదని చెప్పుటవలన సమ్బన్ధాతిశయోక్తి. ఆ ఉత్ప్రేక్ష యీ యతిశయోక్తి సాపేక్షము కాన సఙ్కరము.

**సమాసములు :**

అనఙ్గతయా:- అవిద్యమానమఙ్గం యస్య సః=అనఙ్గః, అనఙ్గస్య భావః =అనఙ్గతా. తయా=అనఙ్గతయా.

**భావము :**

బ్రహ్మహస్తముల కొఱకు నమస్కారము. ఏ హస్తములవలన దమయన్తి శిల్పము సృజింపబడినదో. లేదా- ఆ నమస్కారము వలదు. ఏల యనగా నీ దమయన్తి యను శిల్పము బ్రహ్మయొక్క మనస్సుచేతను స్పృశింపఁబడ లేదు. కాన నా హస్తములతో నా శిల్పము స్పృశింపఁబడలే దని చెప్ప నవసర మేమి యున్నది. ఏల యనగా హస్త స్పర్శవలన నీ మృదు వైన దమయన్తి శిల్పము పలిగిపోవును. కాని మన్మథునకు శరీరము లేనందువలన దమయన్తి యను శిల్పమును నిర్మించుటకు సాధ్య మగును. ఏల యనగా ననఙ్గుడైన మన్మథుని వలన కరస్పర్శయుండదు. కాన నతడు కర స్పర్శ లేకయే యామెను సృజింపఁగలడు. అందువలన నీ దమయన్తి సృష్టి ననఙ్గుఁడు చేయుట వలన కరస్పర్శ లేక యీామె సృజింపబడిన దని యాశయము. ॥౧౨౬॥

> శ్లో. **ఇమాం న మృద్వీమసృజత్ కరాభ్యాం**
> **వేధాః కుశాధ్యాసనకర్కశాభ్యాం।**
> **శృఙ్గారధారాం మనసా న శాన్తి**
> **విశ్రాన్తి ధన్యాధ్యమహీరుహేణ॥** **127**

ప.వి. ఇమాం- న- మృద్వీమ్- అసృజత్- కరాభ్యాం- వేధాః- కుశాధ్యాసన

కరకృశాభ్యాం- శృఙ్గారధారాం- మనసా- న- శాన్తి విశ్రాన్తి ధన్వా ధ్వమహీరుహేణ.

అర్థము : వేధాః=బ్రహ్మ, మృద్వీం=మెత్తని శరీరము కలిగిన, ఇమాం = ఈదమయన్తిని, కుశాధ్యాసనకరకృశాభ్యాం; కుశాధ్యాసన=దర్భలను ధరించుటచే, కరకృశాభ్యాం=కఠినములైన. కరాభ్యాం=హస్తములచే, నా౽సృజత్=సృజింపలేదు. తథా = అట్లే, శృఙ్గారధారాం=శృఙ్గార నదియగు, ఇమాం=ఈదమయన్తిని;శాన్తివిశ్రాన్తి ధన్వాధ్వమహీరుహేణ; శాన్తి=విషయసుఖములనువిరమించుట,విశ్రాన్తి=విశ్రమించుట యనువీనికి. ధన్వ=మరుభూమియందలి, అధ్వ=మార్గమునందు, మహీరుహేణ=వృక్షమైన, (విషయ రసములు తెలియని) మనసా౽పి=మనస్సు చేతను, నా౽సృజత్=సృజింపలేదు. శృఙ్గారి కాని బ్రహ్మ, శృఙ్గారిణి యగు దమయన్తిని నెట్లు సృజించునని యర్థము.

## సమాసములు :

కుశాధ్యాసనకరకృశాభ్యామ్ :- కుశస్య అధ్యాసనం, కుశాధ్యాసనం, కుశాధ్యాసనేన కరకృశౌ=కుశాధ్యాసన కరకృశౌ, తాభ్యాం, కుశాధ్యాసన కరాభ్యామ్.

శృఙ్గారధారాం :- శృఙ్గారస్య ధారా=శృఙ్గారధారా, తామ్ = శృఙ్గార ధారామ్.

శాన్తివిశ్రాన్తిధన్వాధ్వమహీరుహేణ :- శాన్తిశ్చ, విశ్రాన్తిశ్చ = శాన్తి విశ్రాన్తీ, ధన్వనః అధ్వా=ధన్వాధ్వా, ధన్వాధ్వని మహీరుహః ధన్వాధ్వ మహీరుహః, శాన్తివిశ్రాన్త్యోః ధన్వాధ్వమహీరుహః శాన్తివిశ్రాన్తి ధన్వాధ్వమహీరుహః. తేన = శాన్తివిశ్రాన్తిధన్వాధ్వమహీరుహేణ.

## భావము :

బ్రహ్మ, సుకుమారశరీరముగల ఈ దమయన్తిని, దర్భలను ధరించుటచే కఠినములైన హస్తములచేత సృజింపలేదు. కఠిన హస్తములు సుకుమారములగు వాని నెట్లు నిర్మించును ? అనగా నిర్మింపజాలడని యర్థము. అట్లే

శృఙ్గార రసమునకు వాహిని యైన యీ దమయన్తి, విషయ విరామమునకు, విశ్రాన్తి కిని, మరుభూమి యందలి మార్గవృక్షమును, విషయ రసమును దెలియని తన మనస్సు చేత బ్రహ్మ నిర్మింప లేడు. అనగా శృఙ్గార రసవాహిని యగు దమయన్తి యెక్కడ ? విషయ పరాఙ్ముఖమై శృఙ్గార రసమును దెలియని బ్రహ్మ యొక్క మనస్సెక్కడ ? కాన అట్టి బ్రహ్మ యీ దమయన్తిని నెట్లు సృజింపఁగలఁడు. కాన దమయన్తి సృష్టి, బ్రహ్మ హస్తములకును మనస్సు నకు సందని దని యాశయము. ॥౧౨౭॥

శ్లో. ఉల్లాస్య ధాతుస్తులితా కరేణ
శ్రోణౌ కిమేషా స్తనయోర్గురుర్వా।
తేనాన్తరాలైస్త్రిభిరఙ్గులీనా
ముదీతమధ్యత్రివలీవిలాసా॥ **128**

ప.వి. ఉల్లాస్య- ధాతుః- తులితా- కరేణ- శ్రోణౌ- కిమ్- ఏషా- స్తనయోః- గురుః- వా- తేన- అన్తరాలైః- త్రిభిః- అఙ్గులీనామ్- ఉదీతమధ్య త్రివలీవిలాసా.

అర్థము: ఏషా=ఈ దమయన్తి, శ్రోణౌ=కటిపశ్చాద్భాగమునందు, గురుః కిం= గొప్పదా యేమి? లేదా స్తనయోర్వా=స్తనముల యందుగాని, గురుః కిం వా=గొప్పదాయేమి ? (అని సంశయము రాగా) ధాతుః = బ్రహ్మ యొక్క, కరేణ=హస్తముచే, నడుగా వెల్లకిలఁ బెట్టిన హస్తముచే, ఉల్లాస్య =(కోకముడిని) విప్పి, (ఉదరమునందుఁ బట్టిఁగొని) తులితా =సమముగాఁ పట్టుకొనఁబడినదా యేమి? తేన=ఆ విధమైన తూనికచే, అఙ్గుళీనాం = నాల్గు వ్రేళ్ళయొక్క, త్రిభిః=మూడైన, అంతరాళైః= సందులచే, ఉదీతమధ్యత్రివలీవిలాసా; ఉదీత=ఉద్భవించిన, మధ్య = మధ్యభాగమందలి, త్రివళీ=త్రివళి యను మూడు ముడతలయొక్క, విలాసా=శోభ గలదిగా, జాతా=అయినది.

**సమాసములు :**

ఉదీతామధ్యత్రివళీ విలాసా :- తిస్రః వళ్యః=త్రివళీ, మధ్యే త్రివళీ=

మధ్యత్రివలీ, వలీనాం వలా మధ్యత్రివలీ చ=ఉదీతమధ్యత్రివలీ, ఉదీత మధ్యత్రివల్యాః విలాసః యస్యాస్సా=ఉదీరమధ్యత్రివలీవిలాసా.

**భావము :**

ఈ దమయన్తికి నితమ్బ దేశమునందు భారమున్నదా? లేక, స్తనముల యందు భారమున్నదా? యని సంశయము రాగా, బ్రహ్మ తన యరచేతితో నామెయొక్క నడుమును పట్టుకొని, కొలత వేసెనా యేమి యని తోచుచున్నది. అట్లు బ్రహ్మ తూనికc చేయుటచే యాతని చేతియొక్క నాలుగు వ్రేళ్ళమధ్య సందులచే నేర్పడిన మడతలే యామెకు త్రివళీవిలాసముగా నున్నవి దమయన్తి శరీరమును త్రాసులో నొకవైపు స్తనములను, మఱియొకవైపు నితంబము నుంచి, బ్రహ్మ యామె నడుమున నీవిని విప్పి చేతితో నామె నడుమును బట్టుకొని తూనిక వేయుటవలన నాతని చేతిలోని నాలుగు వ్రేళ్ళ సందున నుద్భవించిన యామె యొక్క యుదరముపైని మడతలే, త్రివళియైనదని యభి ప్రాయము. ॥౧౨౮॥

శ్లో. నిజామృతోద్యన్నవనీతజాఙ్గీ
మేతాం క్రమోన్మీలితపీతిమానమ్।
కృత్వేన్దురస్యా ముఖమాత్మనాభూ
న్నిద్రాళునా దుర్ఘట మమ్బుజేన॥ 129

ప.వి. నిజామృతోద్యన్నవనీతజాఙ్గీమ్- ఏతాం- క్రమోన్మీలిత పీతిమానమ్ - కృత్వా- ఇన్దుః- అస్యాః- ముఖమ్- ఆత్మనా- అభూత్- నిద్రాళునా- దుర్ఘటమ్- అమ్బుజేన.

అర్థము : ఇన్దుః=చన్ద్రుడు, నిజామృతోద్యన్నవనీతజాఙ్గీం; నిజ=తనదైన, అమృత=అమృతమునుండి, ఉద్యత్=పుట్టిన, నవనీత = వెన్నవంటి, అఙ్గీం=శరీరముకల, (అతఏవ=కావుననే) క్రమోన్మీలితపీతిమానమ్; క్రమ=క్రమముగా, ఉన్మీలిత=ఉద్భవించిన, పీతిమానం=పసిమి వన్నె గలిగిన, ఏతాం=ఈ దమయన్తిని, కృత్వా=చేసి(యుండి), నిద్రాళునా= నిద్రయందున్న ముకుళించు స్వభావముగల, (సోమరియైన) అమ్బుజేన=

తామరపూవుచే, అస్యాః=ఈమెయొక్క, ముఖం=ముఖమును, దుర్ఘటం అసాధ్యముగా (భావించి), ఆత్మనా=తానే (అనగా చంద్రుడే), భూత్= =(ముఖముగా) నాయెను.

**సమాసములు :**

నిజామృతోద్యన్నవనీతజాఙ్గీం :- నిజం చ తత్ అమృతం చ=నిజామృతం, నిజామృతాదుద్యత్, నిజామృతోద్యత్, నిజామృతోద్యచ్చ తత్ నవనీతం చ=నిజామృతోద్యన్నవనీతం, నిజామృతోద్యన్నవనీతాత్ జాయత ఇతి= నిజామృతోద్యన్నవనీతజం, నిజామృతోద్యన్నవనీతజమ్; అఙ్గం యస్యాస్సా=నిజామృతోద్యన్నవనీతజాఙ్గీ, తామ్—నిజామృతోద్యన్నవనీత జాఙ్గీమ్.

క్రమోన్మీలితపీతిమానమ్ :- క్రమేణ ఉన్మీలితః= క్రమోన్మీలితః, క్రమోన్మీలితః = పీతిమా యస్యాస్సా=క్రమోన్మీలిత పీతిమా, తామ్= క్రమోన్మీలిత పీతిమానమ్.

దుర్ఘటమ్:- దుఃఖేన ఘటయితుం శక్యం=దుర్ఘటమ్, తత్= దుర్ఘటమ్.

**భావము :**

చన్ద్రుడు తన యమృతము నుండి యుద్భవించిన వెన్న నుండి పుట్టిన శరీరము గల్గి, క్రమముగా నుద్భవించుచున్న పసిమితనమును వహించిన దమయన్తిని సృజించి, రాత్రిపూట ముకుళించు నట్టి (నిద్రాదులచే నలసత్వముగల్గిన) పద్మము నామె ముఖముగా నుంచుట దుర్ఘటమని భావించి యాతడే (యా చంద్రుడే) యామెకు ముఖముగా నాయెను. ॥౧౨౯॥

**శ్లో. అస్యాః స చారుర్మధురేవ కారుః**
**శ్వాసం వితేనే మలయానిలేన।**
**అమూని పుష్పైర్విదధేఽఙ్గకాని**
**చకార వాచం పికపఞ్చమేన॥** **130**

న.వి. అస్యాః- సః- చారుః- మధుః- ఏవ- కారుః- శ్వాసం- వితేనే-

మలయానిలేన- అమూని- పుష్పైః- విదధే - అఙ్గకాని-చకార-వాచం-పికపఞ్చమేన.

అర్థము : చారుః=నేర్పరియైన, సః = ఆ ప్రసిద్ధుఁడైన, మధురేవ=వసన్తుఁడే, అస్యాః=ఈ దమయన్తికి, కారుః = శిల్పి. యతః=ఏలయనగా, మలయానిలేన=మలయమారుతముచే, అస్యాః=ఈమెయొక్క, శ్వాసం=నిట్టూర్పును, వితేనే=చేసెను, పుష్పైః=పూలచే, అమూని=ఈ, అఙ్గకాని=అవయవములును, విదధే=చేసెను. వాచం=వాక్కును, పికపఞ్చమేన=కోకిల యొక్క పఞ్చమస్వరముచే, చకార=చేసెను.

వి. వసన్తుఁడు మలయానిలాదులచే దమయన్తి శరీరమును నిర్మింపక పోయినను నిర్మించినట్లు చెప్పుటచే సుత్ప్రేక్ష.

**సమాసములు :**

పికపఞ్చమేన :- పికస్య పఞ్చమః=పికపఞ్చమః, తేన=పికపఞ్చమేన.

**భావము :**

నేర్పరి యైన వసన్తుడే యామెను నిర్మించిన శిల్పి. అతడు మలయమారుతముచే, దమయన్తికి, నిట్టూర్పును, పూలచే నామె యొక్క యవయవములను, కోకిల పఞ్చమస్వరముచే వాక్కును నిర్మించెను. ॥౧౩౦॥

**శ్లో. కృతిః స్మరస్యైవ న ధాతురేషా**
**నాస్యా హి శిల్పీతరకారుజేయః।**
**రూపస్య శిల్పే వయసా న వేధాః**
**నిర్జీయతే స స్మరకిఙ్కరేణ॥ 131**

ప.వి. కృతిః- స్మరస్య- ఏవ- న- ధాతుః- ఏషా- న- అస్యాః- హి- శిల్పీ-ఇతరకారుజేయః- రూపస్య- శిల్పే- వయసా- సః- వేధాః- నిర్జీయతే-సః- స్మరకిఙ్కరేణ.

అర్థము: ఏషా=ఈ దమయన్తి, స్మరస్యైవ=మన్మథుని యొక్కయే, కృతిః=సృష్టి. ధాతుః=బ్రహ్మయొక్క, న (సృష్టిః) =సృష్టికాదు. (యస్మాత్=

ఏలయనగా) అస్యాః=ఈ దమయన్తియొక్క, శిల్పీ=శిల్పి. ఇతర కారు జేయః; ఇతరకారు= ఇతర శిల్పులచే, జేయః = జయింపఁదగినవాఁడు. న=కాఁడు. అనగా నీ శిల్పి యజేయుడని యర్థము. రూపస్య=సౌన్దర్యము యొక్క, శిల్పే = నిర్మాణమునందు, స చ వేధాః = ఆ బ్రహ్మయో, స్మరకిఙ్కరేణ= మన్మథున కధీనమైన, వయసా=యౌవనము చేతను, నిర్జీయతే=ఓడింపఁబడును.

## సమాసములు :

ఇతరకారుజేయః :- ఇతరే చ తే కారవశ్చ=ఇతర కారవః, ఇతర కారుభిః జేయః=ఇతర కారుజేయః.

స్మరకిఙ్కరేణ :- స్మరస్య కిఙ్కరః, స్మరకిఙ్కరః, తేన = స్మర కిఙ్కరేణ.

## భావము :

ఈ దమయన్తి మన్మథుని సృష్టియే కాని బ్రహ్మ సృష్టికాదు. ఈ దమయన్తిని సృజించిన శిల్పి ఇతరులగు శిల్పుల కజేయుఁడు. బ్రహ్మయో యోడింపఁబడునేగాని గెలువఁజాలఁడు. ఏల యనగా ఈ దమయన్తి రూప నిర్మాణశిల్పము నందు, బ్రహ్మ, మన్మథునికి కిఙ్కరత్వమును వహించి యతనిక। ధీనత్వము నందుండెడి యౌవనమను వయస్సు చేతను నోడింపఁబడును. కాన నా యౌవనమునకు నధికారియైన మన్మథునిచే నాబ్రహ్మ యోడింపఁ బడునని ప్రత్యేకముగా చెప్పనవసరము లేదు. బాల్య శరీరము బ్రహ్మ సృష్టికాని యది యంత అందమైనది కాదు. యౌవనమో మిక్కిలి రమణీయమైనది. బాల్య వయస్సును నిర్మించిన బ్రహ్మ యౌవనముచే నోడింపఁబడును. ఆ యౌవన వయస్సు మన్మథునికి కిఙ్కరత్వమును వహించినది గాన, దానిచే నోడిన బ్రహ్మ, మన్మథుని చేతను నోడిన వాడే యగునని ప్రత్యేకముగాఁ జెప్పనవసరము లేదు. ప్రకృతి సుందరమైన దమయన్తి, యౌవనము చేతను, మన్మథుని చేతను నింకను రామణీయకము నొందిన దని భావము. ॥౧౩౦॥

శ్లో. గురోరపి మా భణదోష్టకణ్ఠౌ
నిరుక్తి గర్వచ్ఛిదయా విభేను॥

శ్రమః స్మరస్యైవ భవం విహాయ
ముక్తిం గతానామనుతాపనాయ॥ **132**

ప.వి. గురోః- అపి- ఇమాం - భణదోష్ఠకణ్ఠ నిరుక్తిగర్వచ్ఛిదయా - వినేతుః- శ్రమః- స్మరస్య- ఏవ- భవం- విహాయ- ముక్తిం- గతానామ్- అను తాపనాయ.

అర్థము: గురోరపి -బృహస్పతికిని, ఇమాం - ఈ దమయన్తిని, భణదోష్ఠకణ్ఠ నిరుక్తి గర్వచ్ఛిదయా; భణత్ -వర్ణించునట్టి, ఓష్ఠ = పెదవులు, కణ్ఠ= కణ్ఠము అను వీనియొక్క, నిరుక్తి = సౌన్దర్యాతిశయమును వర్ణించుట యందు, గర్వ= సాటిలేని వక్తల మను సహజాహంకారమును, ఛిదయా= ఖణ్డించుటచే, వినేతుః- బోధకుడైన, అనగా, నీవు దమయన్తి యొక్క సౌందర్యమును వర్ణింప లేవని బోధించు, స్మరస్య=మన్మథునికి, ఏషః= ఈ, శ్రమః=దమయన్తిని సృజించెడి పరిశ్రమ, భవం = సంసార బంధ మును, విహాయ -వదలి, ముక్తిం- మోక్షమును, గతానాం- పొందిన వారికి, అనుతాపనాయ= పశ్చాత్తాపము కొఱకు, భవతి -అగుచున్నది.

**సమాసములు :**

భణదోష్ఠ కణ్ఠ నిరుక్తి గర్వచ్ఛిదయా :— ఓష్ఠౌ చ కణ్ఠశ్చ= ఓష్ఠకణ్ఠమ్, భణచ్చ తత్ ఓష్ఠకణ్ఠం చ- భణదోష్ఠకణ్ఠమ్, నిరుక్తౌ గర్వః నిరుక్తిగర్వః, భణదోష్ఠ కణ్ఠస్య నిరుక్తిగర్వః- భణదోష్ఠకణ్ఠ నిరుక్తిగర్వః భణదోష్ఠకణ్ఠ నిరుక్తిగర్వస్యఛిదా- భణదోష్ఠకణ్ఠ నిరుక్తి గర్వచ్ఛిదా.తయా =భణదోష్ఠ కణనిరుక్తి గర్వచ్ఛిదయా.

**భావము :**

దమయన్తి ని వర్ణించుటలో బృహస్పతి యొక్క పెదవులు కణ్ఠము గూడ నసమర్థములై నందు వలన, నని దమయన్తిసౌందర్యవర్ణనమున న సమర్థములని బోధించెడి మన్మథునికి నీదమయన్తిని సృజించుట వలన ప్రయాస, సంసారము వదలి మోక్షము(బొందెడి వారికి పశ్చాత్తాప కారణమగు చున్నది ఏల యనగా దమయన్తియుండుట చేత నీ సంసారమే ఎల్లప్పుడును, ఆనందమయము. కావు

సీ. సంసారమే మోక్షము. మేముదమయన్తియుండుట వలన నెల్లప్పుడు నానంద మయమగు సంసారమును వదలి ముక్తినిపొందితిమని పశ్చాత్తాపము ముక్తులకుఁ గల్గును. ముక్తులకే యంత పశ్చాత్తాపము గల్గినచో నితరులకీవిషయము గూర్చి చెప్పనేల? ముక్తులకే యిట్టియభిప్రాయము గల్గినపుడితరుల కెట్లు కలుగక యుండును. ముక్తులను సైతము దమయన్తీ సౌన్దర్యము చలింపఁ జేయుచున్నచో నది యెంతగొప్పదో యోచింపవలయును-దమయన్తి సమ్బన్ధములేని ముక్తి ముక్తి కాదని సారాంశము ॥౧౩౨॥

శ్లో. ఆఖ్యాతుమక్షివ్రజసర్వపీతాం
భైమీం తదేకాఙ్గ నిఖాతదృక్షు।
గాథాసుధాశ్లేషకలావిలాసై
రలఞ్చకారాననచన్ద్రమిన్ద్రః॥ 133

ప.వి. ఆ ఖ్యాతుమ్- అక్షివ్రజసర్వపీతాం- భైమీం- తదేకాఙ్గనిఖాతదృక్షు- గాథాసుధాశ్లేష కలావిలాసైః- అలఞ్చకార- అననచన్ద్రమ్- ఇన్ద్రః-

అర్థము:- ఇన్ద్రః= ఇన్ద్రుఁడు, అక్షివ్రజసర్వపీతాం; అక్షివ్రజ= తన వేయి కన్నుల సమూహముచే, సర్వ= సమస్తములగు నవయవములయందు, పీతాం= ప్రీతితోఁజూడఁబడిన, భైమీం=దమయన్తిని, తదేకాఙ్గ నిఖాత దృక్షు; తత్=ఆ దమయన్తియొక్క ఏకాఙ్గ=ఒకయఙ్గము నందే, నిఖాత= నాటుకొనఁబడిన, దృక్షు= నేత్రములుగల మనుష్యులవిషయమున, ఆఖ్యాతుం=చెప్పుటకు, గాథాసుధాశ్లేషకలావిలాసైః, గాథాసుధా=శ్లోకామృతము యొక్కయు, శ్లేషకలావిలాసైః = శ్లేషాలఙ్కారముయొక్కయు విలాసములచే (గాథాసుధాశ్లేష= గాథలనెడి అమృతోటి సంబంధముచేతను, కలా విలాసైః= పదునారు కళల విలాసములచేతను) అననచన్ద్రమ్= ముఖ చన్ద్రుని, అలఞ్చకార= అలఙ్కరించెను.

**సమాసములు:**

అక్షివ్రజసర్వపీతామ్:- అక్ష్ణాం వ్రజ అక్షివ్రజః, అక్షివ్రజేణ సర్వేషు పీతా- అక్షివ్రజసర్వపీతా. తామ్ -అక్షివ్రజసర్వపీతామ్,

తదేకాఙ్గనిఖాతదృశః:- ఏకంచతత్ అఙ్గంచ=కాఙ్గం, తస్యాః ఏకాఙ్గం= తదేకాఙ్గం. తదేకాఙ్గే నిఖాతాదృశౌ యేషాన్తే = తదేకాఙ్గనిఖాతదృశః, తేషు= తదేకాఙ్గ నిఖాతదృక్షు.

**భావము :**

ఇన్ద్రుడు తన వేయికన్నులచే, నా దమయన్తి యొక్క సర్వాఙ్గములను ప్రీతితోఁ జూచెను. మనుష్యులకు రెండుకన్నులే యుండుట వలన, వారు ఆమె యొక్క యొకయఙ్గమును మాత్రమే చూడఁగల్గుదురు. కానసట్టియల్పజ్ఞులకు వివరములతోనుఁ జెప్పుటను, సర్వవిశేషములనుఁ దెలిసిన యిన్ద్రుడే సమర్థుఁడు. కాన నా యింద్రుఁడు శ్లోకసుధయొక్కయు, శ్లేషాలఙ్కారములయొక్కయు విలాసములచేతను పక్షాంతరమున అమృతసంబంధముచేతను, పదునాఱుకలల విలాసముల చేతను తన యానన చంద్రునలఙ్కరించెను. అనగా శ్లిష్టార్థములతోఁ జెప్పఁబోవు శ్లోకముచేఁజెప్పఁబోయెనని యాశయము ॥౧౩౩॥

శ్లో. స్మితేన గౌరీ హరిణీ దృశేయం
వీణావతీ సుస్వరకణ్ఠభాసా।
హేమైవ కాయప్రభయాఙ్గశేషై
స్తన్వీ మతిం క్రామతి మేన న కాఽపి॥ 134

ప.వి. స్మితేన- గౌరీ - హరిణీ- దృశా- ఇయం- వీణావతీ- సుస్వరకణ్ఠభాసా- హేమా-ఏవ- కాయప్రభయా - అఙ్గశేషైః- తన్వీ-మతిం-క్రామతి- మే- న- కా- అపి-

అర్థము:- ఇయం= ఈ దమయన్తి, స్మితేన= చిఱునగవుచే, గౌరీ=గౌరియను పేరు గల యొకస్త్రీయు, పక్షాన్తరమున, గౌరీ=తెల్లనిదియునై, మే=నాయొక్క మతిం=బుద్ధిని, క్రామతి= అధిరోహించుచున్నది, దృశా = నేత్రకాన్తితో హరిణీ= ఒకస్త్రీయై (లేడియై) సుస్వరకణ్ఠభాసా= మంచిస్వరముతోఁ గూడినకణ్ఠకాన్తిచే, వీణావతీ=వీణావతియను పేరుగల అప్సరస. (వీణ, తోఁగూడినదియు) కాయప్రభయా= శరీరకాన్తిచే, హేమ= హేమయను నప్సరస. (పసిడి) అఙ్గేషు-అవయవములయందు, శేషైః=మిగిలినవారితో

తన్వీ = మేనకయను నొకస్త్రీ(అచ్చరలలో నొకతెయు(నై)మతిం = బుద్ధిని, క్రామతి = అధిరోహించుచున్నది
వి. ఇచ్చట నొక దమయన్తినే గౌరీమున్నగు రూపములలో నుల్లేఖించుట వలన నుల్లేఖాలఙ్కారము.

**భావము :**

ఈ దమయన్తి చిఱునగవుచే గౌరి యను దేవతాస్త్రీ గను (తెల్లనిదిగ) నున్నది. మఱియు నీదమయన్తి హరిణి యను దేవతాస్త్రీగను (నాడజింకగను) నున్నది. ఇంకను నీమె వీణావతి యను నప్సరసగను (వీణతోకూడిన యొకస్త్రీగను) నున్నది. ఈమె తనశరీరకాన్తితో హేమయను నప్సరసగను (పసిడిగను) నున్నది. తక్కిన తన యవయవములతో నీమె మేనకయను స్త్రీగాను (ఒక యచ్చరగను) నున్నది. ఈ విధముగా నామె నాబుద్ధికి దేవతాస్త్రీగను మానవస్త్రీగను కానవచ్చుచున్నది. ఇచ్చట దేవతాస్త్రీలకు మానవస్త్రీలను శ్లిష్ట విశేషణములచే చెప్పుటవలన పూర్వశ్లోకమున సూచించిన శ్లేషవిలాస సంపత్తి దీనియందొనఁగూడినది. ఈ విధముగా నలరూపమునందున్న యింద్రుడు దమయన్తిని వర్ణించెను ॥౧౩౪॥

శ్లో. ఇతి స్తువానః సవిధే నలేన
విలోకితః శఙ్కితమానసేన।
వ్యాకృత్య మర్త్యోచితమర్థముక్తేః
అఖణ్డలస్తస్య నునోద శఙ్కామ్॥ 135

ప.వి. ఇతి- స్తువానః- సవిధే- నలేన- విలోకితః- శఙ్కిత మానసేన- వ్యాకృత్య- మర్త్యోచితమ్- అర్థమ్- ఉక్తేః- అఖణ్డలః-తస్య-నునోద- శఙ్కామ్.

అర్థము : ఇతి=ఇట్లు, స్తువానః=గౌరి మున్నగు నచ్చరల రూపమున, దమయన్తిని వర్ణించుచున్న, అఖణ్డలః=ఇన్ద్రుఁడు, సవిధే = సమీపమందు, శఙ్కితమానసేన= (దేవతలకు తగిన యర్థమునుఁ జెప్పుట వలన, తన రూపమును ధరించిన యిన్ద్రుఁడే యాతడని)సందేహించిన మనస్సుగల, నలేన =నలునిచే, విలోకితస్సన్ =చూపఁబడినవాడై, ఉక్తేః = తాను

పూర్వ శ్లోకమునందుఁ జెప్పిన గౌరిమున్నగు పదములకు, మర్త్యోచితం= మానవులకు దగిన, తెల్లనిదిమున్నగు, అర్థం=అర్థమును, వ్యాకృత్య = వ్యాఖ్యానించి, తస్య=ఆ నలునకు, శఙ్కాం=సందేహమును, నునోద= =తొలగించెను.

**సమాసములు :**

శఙ్కితమానసేన :- శఙ్కితం మానసం యస్యసః = శఙ్కితమానసః, తేన=శఙ్కిత మానసేన.
మర్త్యోచితమ్ :- మర్త్యానా ముచితః-మర్త్యోచితః, తం=మర్త్యోచితమ్.

**భావము :**

ఇట్లు గౌరి మున్నగు నప్సరల రూపములతో దమయన్తిని వర్ణించుచున్న యిన్ద్రుని సమీపమందు నలుఁడు చూచి యితడు గౌరి మున్నగు దేవతా స్త్రీ పరమగు నర్థముతో దమయన్తిని వర్ణించుచున్నాడు కాన నితడు నల రూపమును ధరించిన యింద్రుడా ? యని సంశయింపఁ దొడగెను. దానిని గ్రహించి యిన్ద్రుఁడు తాను చెప్పిన గౌర్యాదిశబ్దములకు దేవతాది పరములగు నర్థములను వదలి 'తెల్లనిది' మున్నగు మానవోచితములగు నర్థములనుఁ జెప్పి వెంటనే యా నలుని సందేహమునుఁ బోగొట్టెను. ॥౧౩౫॥

శ్లో. స్వం నైషధాదేశమహో విధాయ
కార్యస్య హేతోరపి నాఽనలః సన్।
కిం స్థానివద్భావ మథ త్ర దుష్టం
తాదృక్కృతవ్యాకరణః పునః సః॥ **136**

ప.వి. స్వం- నైషధాదేశమ్- అహో- విధాయ- కార్యస్య- హేతోః- అపి- నానలః- సన్- కిం- స్థానివత్- భావమ్- అథత్ర- దుష్టం- తాదృక్- కృత వ్యాకరణః- పునః- సః.

అర్థము: సః=ఇన్ద్రుఁడు, కార్యస్య=దమయన్తీ ప్రాప్తి యను కార్యమునకు;

హేతోరపి = నిమిత్తమునకును, స్వం=తన్ను, నైషధాదేశం; నైషధ= నలునకు, ఆదేశం = ఆదేశముగా, విధాయ-చేసి, నా నలస్సన్= నలుఁడేయై, అనగా నలరూపమును ధరించి, పునః=వెనుక అనగా నిన్ద్రుఁడని సంశయము వచ్చిన పిదప, తాదృక్కృత వ్యాకరణఃసన్; తాదృక్=ఆ విధముగా, కృత్=చేయఁబడిన, వ్యాకరణస్సన్=దేవతాపర మైన వివరణము గలవాడై, స్థానివత్=ఆదేశ ప్రసక్తిగల్గిన యింద్రుఁడు వలె, కిం=ఏల, దుష్టం=పాపముతోఁ గూడిన, భావం = పరస్త్రీ వాఞ్ఛను, అధత్త = ధరించెను, అహో=ఆశ్చర్యము. నలస్వరూపమును ధరించిన యిన్ద్రుఁడు నలుడువలె ధర్మబుద్ధిని గల్గియుండవలయును గదా. కాని దానిని విడిచి పరులను మోసగించెడి తన స్వభావమును ధరించుట యాశ్చర్యకరమని అర్థము. (మఱియు, తాదృక్కృత వ్యాక రణో౽పి; తాదృక్ = ఆ విధముగా, కృత=చేయబడిన, వ్యాకరణో౽పి = వ్యాకరణము గలవాడైనను. అనగా మహేన్ద్ర వ్యాకరణము రచి యించిన వాడైనను, సః = పణ్డితుఁడైన యా యింద్రుఁడు, నైషధా దేశమ్=నలుని రూపమును ధరించి నలున కాదేశమై, నానలః (న అల్ =అనల్, అనల్ న భవతీతి=నానల్, తస్య=నానలః, అను విగ్రహ ముచే) "అల్ న కు, అనగా నక్షరమునకు- దానికి సంబంధించిన, కార్యస్య హేతోః=కార్యము కొఱకై, దుష్టం=నిషేధింపఁబడిన, స్థాని వద్భావం=స్థానివలె నాదేశమగుటను, కిమ్=ఏల, అధత్త = ధరించెను. అహో=ఆశ్చర్యము.వ్యాకరణశాస్త్రమును రచియించిన యిన్ద్రుఁడు అల్విధి యందు స్థానివద్భావమునెట్లు గావించెను? అల్విధియందు స్థానివద్భావము "స్థానివదాదేశో౽నల్విధౌ" యను పాణిని సూత్రము ననుసరించి నిషేధింపఁ బడినది. ప్రకృతము 'నానల్లు' యొక్క అనగా 'అల్లు' యొక్క విధిగాన నదిగూడదు.

మఱియు తాదృక్కృత వ్యాకరణః; తాదృక్ = ఆ విధముగా, కృత=చేయఁబడిన, వ్యాకరణః=వ్యాకరణ సంస్కారముగల, సః='సః' అను శబ్దము, స్వం=స్వకీయమైన, ఆదేశం=ఆదేశమును (నైషధాదేశము శబ్దమునుండి ఖణ్డ విశ్లేషచే నాదేశ శబ్దము గ్రహింపఁబడినది) విధాయ=

చేసి, అనగా త్యదాద్యత్వమును బొంది యని అర్థము. నానలః కార్యస్య హేతోః=అల్లును ఆశ్రయించిన హల్ఙ్యాదిరూపమైన స్థానికార్యము కొఱకు, దుష్టం = అల్విధియందు నిషేధింపఁబడిన స్థానివద్భావమును, కిం=ఏల, అధత్త = ధరించినది, అహో = ఆశ్చర్యము అనగా విరుద్ధమని యర్థము.

వి. తొలుత దేవతాపరమగు నర్థముఁ జెప్పి, నలుఁడు సందేహింపగనే మానవపరమగు యర్థమునుఁ జెప్పుట వలనను, దానికి పరిహారము గూడ సందేయున్నది గాన విరోధాభాసము. అది శ్లేషమహిమతో నేర్పడినది కాన శ్లేషతో దానికి సఙ్కరము.

**సమాసములు :**

నైషధాదేశం :- నైషధస్య ఆదేశః=నైషధాదేశః తమ్=నైషధాదేశమ్.
నానలః :- న అల్=అనల్- న అనల్ = నానల్, తస్య,=నానలః.
స్థానివద్భావమ్ :- స్థానీవ స్థానివత్। స్థానివతః భావః = స్థానివద్భావః, తమ్=స్థానివద్భావమ్.
తాదృక్కృతవ్యాకరణః:-తాదృక్ కృతం=తాదృక్కృతం.తాదృక్కృతం వ్యాకరణం యస్యసః= తాదృక్కృత వ్యాకరణః.

**భావము :**

ఆ యిన్ద్రుఁడు దమయన్తిని సంపాదించు బ్రయత్నముతో తన్ను అనగా తన స్వరూపమును నలునికి ఆదేశముగా ననగా నలుని రూపమగు నాదేశముగాఁ గావించి (న నలః=అనలః, న అనలః=నానలః అను వ్యుత్పత్తిచే) నా నలుఁడై యనగా నలుడేయై పిదప నిజమైన నలునకు సందేహము రాగనే, (తాదృక్కృత వ్యాకరుణుఁడై ) అనగా మనుష్యపరముగాఁ జెప్పఁబడిన వివణము గలవాడై యనగా తన మాటలకు వేఱుగా నర్థముఁ జెప్పినవాఁడై యాదేశ ప్రసక్తి గల స్థాని యాయెను. ఇంద్రునియందు నలరూపముగా నాదేశమగుటవలన - నా ఇంద్రుఁడు స్థాని యాయెను. ఇట్లు స్థానియైన యింద్రుఁడు నలుని రూపమున నుండుటవలన నలుని వలె వ్యవహరింపవలయును గదా. అట్లు వ్యవహరింపక

యింద్రుని వలె దుష్టభావము గల్గి పర స్త్రీ వాంఛ నత డేల వహించెను. అనగా నింద్రుఁడు నలరూపమును ధరించినపుడు నలుని యొక్క ప్రశస్త గుణములను వహింపక, ఇతరులను వంచించుట మున్నగు తన స్వభావ నేల వహించె నని యర్థము. ఇది చాల యాశ్చర్యకరమైనది. మఱియు నా యింద్రుఁడు 'తాదృ కృత వ్యాకరణుఁడు" అనగా నా విధముగా రచియింపఁబడిన మహేన్ద్ర వ్యాకరణముఁ గల్గియు, పండితుఁడయ్యు నైషధునకు అనగా నలున కాదేశమై యాతని రూపమును ధరించి నా నలునకు అనగా (న + అల్ = అనల్, న,అనల్ = నానల్ = తస్య = నానలః) అను వ్యుత్పత్తి ననుసరించి యేర్పడిన యర్థమగు "అల్'' నకు ననగా నక్షర సమామ్నాయమందు, 'అ ఇ ఉ ణ్' సూత్రములోని 'అ' ను, 'హల్' సూత్రములోని 'ల్' ను కలుపుటచే నేర్పడిన 'అల్' ప్రత్యాహారములోని యక్షరములకు ననగా నక్షర సామాన్యమునకు సంబంధించిన కార్యమునకై "స్థానివదాదేశోఽ నల్విధౌ' అను సూత్రము ననుసరించి 'అలా' శ్రయ కార్యమునుఁ జేయునపుడు నిషేధింపఁబడిన స్థానివద్భావమును, నేల గావించెను. ఎట్లనగా (నహోధః"" పా. సూ ౮-౨-౩౪) అను సూత్రముచే "ధ'' ఆదేశమును విధించి, యిది 'అలాశ్రయ విధి' అనగా 'ధ' అను నక్షరమును ఆశ్రయించి చేయు కార్యముగా నిఁట స్థానివద్భావము నిషిద్ధమైయున్నను, స్థానివద్భావమును గావించెను.

ఇట్లే ('పథిమథి.........పా.సూ ౭-౧-౮౫) అనుసూత్రముచే 'అల్' ను చేసినపిదప, నిషిద్ధమైన స్థానివద్భావముచే నేర్పడిన, హల్త్వము' నాశ్రయించి ''హల్ఙ్యాబ్భ్యోదీర్ఘాత్సు తిస్యపృక్తంహల్''అను సూత్రముచే లోపమునుఁ గావించెను.

లేదా తనయందు నలుని యాదేశముఁగావించుకొని విశిష్టమైన దేవతాకారములను వదలి మానవుఁడగు నలుని రూపమును వహించిన యింద్రుఁడు హీనమైన స్థానివద్భావము నేల వహించెననియు నాశయము ॥౧౩౬॥

**శ్లో. ఇయమియ మధిరథ్యం యాతి నేపథ్యమఙ్గు**
**ర్విశతి విశతి వేదీమూర్వశీ సేయమన్యాః।**
**ఇతి జనజనితైః సా సన్దనాద్యైర్విజఘ్నే**
**నలహృది పరభైమీ వర్ణనాఽఽకర్ణనాప్తిః॥ 137**

ప.వి. ఇయమ్- ఇయమ్- అధిరథ్యం- యాతి- నేపథ్యమఞ్జుః- విశతి-విశతి- వేదీమ్- ఊర్వశీ- సా- ఇయమ్-ఉర్వ్యాః- ఇతి- జనజనితైః- సానన్ద నాదైః- విజఘ్నే- నలహృది- పరభైమీవర్ణనా కర్ణనాఽఽప్తిః-

అర్థము. నేపథ్యమఞ్జుః; నేపథ్య=అలఙ్కారములచే, మఞ్జుః=అందమైన, ఉర్వ్యాః =భూమికి, ఊర్వశీ = ఊర్వశియైన యీదమయన్తి, ఇయమియమితి= "ఈమె, యీమె" యని తత్తరపాటుతోఁజెప్పబడినదై, అధిరథ్యం=వీధి యందు, యాతి=పోవుచున్నది. వేదీం=స్వయంవరపు వేదికను, విశతి విశతి= ప్రవేశించుచున్నది. ఇతి=అని, జనజనితైః=ప్రేక్షకులగు జనుల నుండి - = ఉద్భవించిన, సానన్దనాదైః = ఆనందముతోఁగూడిన కేకలతో, నలహృది=నలుని హృదయమందు, పరభైమీవర్ణనాకర్ణనాప్తిః; పర=పరులయొక్క, భైమీవర్ణన=దమయన్తి వర్ణించుటను, ఆకర్ణన= వినుటలోని, ఆప్తిః=సౌఖ్యలాభము, విజఘ్నే=కొట్టఁబడినది.

## సమాసములు :

అధిరథ్యమ్ :- రథ్యాయామ్, = అధిరథ్యమ్

నేపథ్యమఞ్జుః :- నేపథ్యనమఞ్జుః= నేపథ్యమఞ్జుః.

జనజనితైః :- జనైః జనితాః=జనజనితాః, తైః=జనజనితైః.

సానన్దనాదైః-ఆనన్దేన సహవర్తన్తఇతి= సానన్దాః, సానన్దానాం నాదః, సానన్దనాదాః, తైః=సానన్దనాదైః.

నలహృది :- నలస్యహృత్= నలహృత్, తస్మిన్=నలహృది.

పరభైమీవర్ణనా కర్ణనాప్తిః :- భైమ్యాః, వర్ణనం= భైమీర్ణనం, పరేః ం భైమీవర్ణనమ్= పరభైమీవర్ణనం, పరభైమీవర్ణనస్య ఆకర్ణనమ్= పర భైమీవర్ణనాకర్ణనమ్. పరభైమీవర్ణనాకర్ణనస్య ఆప్తిః= పరభైమీవర్ణనా కర్ణనాఽఽప్తిః।

## భావము :

భూషణములచే నలఙ్కృతయై మనోహరముగా నున్న భూలోకపు [illegible]

"ఇదిగో స్వయంవర వేదికను ప్రవేశించుచున్నది ప్రవేశించుచున్నది" యని ప్రేక్షకజనులు హర్షముతోఁ గేకలు వేయుటచే సంతసపడకను, నితరులు దను యస్తుతి (నూర్చి చేయువర్ణనలచే శ్రవణానందము ననుభవించుచున్న నలున కది ప్రతిబంధకమైనది. అనగా జనుల కేకలలో నది కలసి పోయి విన(బడలేదని యాశయము ॥౧౩౭॥

శ్లో. శ్రీహర్షం కవిరాజరాజిముకుటాలఙ్కార హీరః సుతం
శ్రీహీరః సుషువే జితేన్ద్రియచయం మామల్ల దేవీ చ యమ్।
తర్కేష్వప్యసమశ్రమస్య దశమ స్తస్య వ్యరంసీన్మహా
కావ్యే చారుణి నైషధీయచరితే సర్గో నిసర్గోజ్జ్వలః॥ 138

ప.వి. శ్రీహర్షం- కవిరాజ రాజిముకుటాలఙ్కార హీరః- సుతం- శ్రీహీరః- సుషువే- జితేన్ద్రియచయం- మామల్లదేవీ- చ-యం- తర్కేషు- అపి- అసమశ్రమస్య- దశమః- తస్య-వ్యరంసీత్- మహాకావ్యే-చారుణి- నైషధీయచరితే- సర్గః- నిసర్గోజ్జ్వలః-

అర్థము:- కవిరాజ రాజిముకుట ఙ్కారహీరః; కవిరాజ=కవిశ్రేష్ఠులయొక్క, రాజి = పఙ్క్తి యొక్క, మకుట= కిరీటమునకు, అలఙ్కార= భూషణమైన, హీరః=వజ్రమణియగు, శ్రీహీరః= శ్రీహీరు(డను విద్వాంసు(డు, జితేంద్రియచయం; జిత=జయింప(బడిన, ఇంద్రియచయం=ఇంద్రియ సమూహముగలిగిన, శ్రీహర్షం= శ్రీహర్షుడను, సుతం=కుమారుని సుషువే=ఉత్పత్తిగావించెను. మామల్లదేవీ చ= మామల్ల దేవియను తల్లియు, యం = ఎవనిని, సుషువే = కనెనో; తర్కేష్వపి= గౌతమ కాణాదాది శాస్త్రాది వివిధ తర్కములయందును, అసమశ్రమస్య= సాటిలేని పరిశ్రమముగల, తస్య= ఆ శ్రీహర్షునియొక్క, చారుణి= రమ్యమైన, నైషధీయచరితే= నలుని చరిత్రమను మహాకావ్యే= మహాకావ్యమందు,నిసర్గోజ్జ్వలః, నిసర్గ= [illegible] [illegible] [illegible] దశమః సర్గః [illegible], వ్యరంసీత్=సమాప్తినొందినది.

**సమాసములు :**

కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః :- కవీనాంరాజానః=కవిరాజాః. కవిరాజానాంరాజిః=కవిరాజరాజిః, కవిరాజ రాజేఃమకుటాని=కవిరాజ రాజిమకుటాని. కవిరాజ రాజిమకుటేష్వలఙ్కారాః = కవిరాజ రాజిమకుటాలఙ్కారాః, కవిరాజ రాజిమకుమలఙ్కారేషుహీరః=కవి రాజరాజిమకుటాలఙ్కార హీరః.

జితేన్ద్రియచయం :- ఇన్ద్రియాణాం చయః=ఇన్ద్రియచయః, జితః ఇన్ద్రియచయః యేన సః= జితేన్ద్రియచయః.

అసమశ్రమస్య:- అవిద్యమానః సమః యస్యసః= అసమః, అసమః, శ్రమః యస్య సః= అసమశ్రమః, తస్య=అసమశ్రమస్య

మహాకావ్యే:- మహచ్చతత్ కావ్యం చ= మహాకావ్యమ్, తస్మిన్ = మహాకావ్యే

నైషధీయచరితే :- నిషధానాంరాజా=నైషధః, నైషధస్య, ఇదం=నైషధీయం, నైషధీయం చ తత్ చరితం చ=నైషధీయచరితమ్, తస్మిన్, నైషధీయ చరితే

నిసర్గోజ్జ్వలః :- నిసర్గేణ ఉజ్జ్వలః=నిసర్గోజ్జ్వలః

**భావము :**

కవిశ్రేష్ఠుల వరుసల మకుటములలో వజ్రమణియైన శ్రీహీరుడు ఇంద్రియ నిగ్రహమును గావించిన శ్రీహర్షుని జన్మింపఁజేసెను. మామల్లదేవి యను తల్లి యాతనిని కనెను. కవిత్వమందేగాక గౌతమకాణాద బౌద్ధాది తర్కములయందు సాటిలేని పరిశ్రమఁ గావించిన యా శ్రీహర్షుని నైషధీయ చరితమను మహాకావ్యమందు స్వభావముతోఁ బ్రకాశమానమైన దశమసర్గ సమాప్తి నొందినది.॥౧౬౨॥

ఇట్లు

శ్రీమదాత్రేయ గోత్రోద్భవ ఉదాలి నరసింహ సూరి తనూజ ఉడాలి
సుబ్బరామశాస్త్రి విరచితమగు శ్రీ హర్షనైషధ వ్యాఖ్యయందు
దశమసర్గ సమాప్తము.

ఓంశమ్

# శ్రీ హర్ష నైషధము

## ఏకాదశ సర్గ

శ్లో. **తాం దేవతామివ ముఖేన్దులసత్ప్రసాదా**
**మక్ష్ణా రసాదనిమిషేణ నిభాలయన్తీమ్।**
**లాభాయ చేతసి ధృతస్య వరస్య భీమ**
**భూమీన్ద్రజా తదను రాజసభాం బభాజ॥** 1

ప.వి. తాం-దేవతామ్-ఇవ-ముఖేన్దులసత్ప్రసాదామ్-అక్ష్ణా-రసాత్-అనిమిషేణ-నిభాలయన్తీం-లాభాయ-చేతసి-ధృతస్య-వరస్య-భీమభూమీన్ద్రజా-తదను-రాజసభాం-బభాజ.

అర్థము: తదను = ప్రజలయానంద ఘోష ఏర్పడిన పిదప, భీమభూమీన్ద్రజా= భీమరాజు పుత్రిక యైన దమయన్తి, ముఖేన్దుల సత్ప్రసాదాం; ముఖేన్దు= రాజుల ముఖ చంద్రులయందు (దేవతయొక్క ముఖచంద్రునియందును) లసత్ప్రసాదాం=దమయన్తి రాకచే, లసత్=విలసిల్లు, ప్రసాదాం=సంతోషముఁగలదియు, పక్షాన్తరమున-ఇష్టమును కోరుము అని యనుగ్రహము గలదై, వరము నీయ సిద్ధమైనదియు, తథా=అట్లే, రసాత్=అనురాగము వలన, అనిమేషేణ = రెప్పపాటులేని, అక్ష్ణా = నేత్రముతో, నిభాలయన్తీం=చూచుచున్నదియు, పక్షాన్తరమున; రసాత్ = సాధకుల భక్తి విశేషము వలన, అనిమేషేణ=రెప్పపాటులేని, అక్ష్ణా=నేత్రముచే, నిభాలయన్తీం=భక్తజనమునుఁ జూచుచున్నదియునగు, తాం=ఆ, రాజసభాం= రాజసభను, దేవతామివ=దేవతవలె, చేతసి=మనస్సునందు, ధృతస్య= ఆలోచింపఁబడిన, వరస్య=వివాహమాడెడి వరుడైన నలునికి (దేవత లొసంగెడి యర్థమునకును)లాభాయ=ప్రాప్తికై, బభాజ=పొందెను.

వి. ఇప్పుడు సభను దేవతతోఁ బోల్చినందు వలన నుపమాలంకారము. ఈ సర్గయందు వసన్త తిలకావృత్తము. దానిలక్షణము - "ఉక్తా వసన్త తిలకా... తభజాజగౌగః.

## సమాసములు :

ముఖేన్దులసత్ప్రసాదామ్ :— ముఖాన్యేవ ఇన్దవః = ముఖేన్దవః, ముఖేన్దుషులసన్=ముఖేన్దులసన్, ముఖేన్దుల సన్ ప్రసాదః యస్యాస్సా=ముఖేన్దుల సత్ప్రసాదా, తాం = ముఖేన్దులసత్ప్రసాదామ్, దేవతా పక్షమున - ముఖమేవఇందుః=ముఖేన్దుః; ముఖేందౌలసన్ = ముఖేన్దులసన్, ముఖేన్దులసన్ - ప్రసాదః యస్యాస్సా = ముఖేన్దుల సత్ప్రసాదా, తామ్=ముఖేన్దుల సత్ప్రసాదామ్ ।

అనిమేషేణ :— అవిద్యమానః నిమేషః యస్యతత్ = అనిమేషం, తేన= అనిమేషేణ.

భీమభూమీన్ద్రిణా:— భీమ ఇతి భూమీన్ద్రః = భీమభూమీన్ద్రః, భీమభూమీన్ద్రాత్ జాయత ఇతి = భీమభూమీన్ద్రిణా.

## భావము :

జనుల హర్షనాదమునకు తర్వాత దేవత వలె నుండెడి యా రాజసభనుఁ బ్రవేశించినది. ఆ సభయందు దమయన్తి రాగానే రాజుల ముఖచంద్రులు, ప్రసన్నతతోఁ గూడినవి,దేవతయో భక్తులను వరమును కోరుకొను మని చెప్పుచు దానినొసంగుటకుఁ దగిన ముఖ ప్రసాదమునుఁ గల్గియున్నది. ఆ సభ దమయన్తి పైన ననురాగముచే, రెప్పపాటు లేని నేత్రములతో చూచుచున్నది. దేవత యో సహజముగా రెప్పపాట్లులేని నేత్రములతోఁ దనయెడ భక్తిగల వారిని చూచుచున్నదియు నగు నా రాజసభను, మనస్సున ధరింపఁబడిన నలుఁడైన వరునిఁ బడయుటకై, (దేవత యొసంగెడి వస్తువును) బడయుటకై ప్రవేశించెను ॥౧॥

శ్లో. తస్మిన్సమ్మలావయవభిత్తిషు తద్విభూషా
రత్నేషు చ ప్రతిఫలన్నిజదేహదమ్భాత్ ।

దృష్ట్యైవ పరం స హృదయేన స కేవలం తైః
సర్వాత్మనైవ సుతనౌ యువభిర్మమజ్జే॥ 2

ప.చ. తన్నిర్మలావయవభిత్తిషు- తద్విభూషారత్నేషు- చ- ప్రతిఫలన్నిజదే- హదంభాత్- దృష్ట్యా- పరం- న- హృదయేన- న- కేవలం- తైః- సర్వాత్మనా- ఏవ- సుతనౌ- యువభిః- మమజ్జే.

అర్థము :- తైః = ఆ, యువభిః = యువకులచే, సుతనౌ = సుందరశరీరము గల దమయన్తియందు, దృష్ట్యైవ= దృష్టిచేతనే, న కేవలం మమజ్జే = కేవలము మునుగుట గాదు. కిన్తు = మరేమనగా, తన్నిర్మలావయవభిత్తిషు: తత్= ఆ దమయన్తియొక్క, నిర్మల= పరిశుద్ధములైన, అవయవభిత్తిషు= గణ్డస్థలము మున్నగు నవయవములయందును, తద్విభూషారత్నేషు చ; తత్=ఆ దమయన్తియొక్క విభూషా= భూషణముల యందలి, రత్నేషు చ= రత్నములయందును, ప్రతిఫలన్నిజదేహదంభాత్; ప్రతిఫలత్= ప్రతిఫలించిన, నిజ = తమవియైన, దేహ=దేహములయొక్క, దంభాత్ = నెపమువలన, సర్వాత్మనైవ= సమస్తములయిన యవయవములచే, మమజ్జే= మునుగుట. (జరిగినది)

వి. ప్రతి ఫలన్నిజదేహదంభాత్; అనుచోట వ్యాజార్థకమగుదమ్భశబ్దమును, ప్రయోగించి సర్వాఙ్గ మజ్జనమును జెప్పుటవలన నపహ్నవము. సర్వాఙ్గములతో మజ్జనము లేకపోయినను నది యేర్పడినట్లు చెప్పుట వలన ఉత్ప్రేక్ష- వ్యఞ్జకమును ప్రయోగింప నందువలన నది గమ్యము

**సమాసములు :**

తన్నిర్మలావయవభిత్తిషు:-నిర్మలాశ్చతే అవయవాశ్చ=నిర్మలావయవాః, తస్యాః నిర్మలావయవాః = తన్నిర్మలావయవాః, తన్నిర్మలావయవా ఏవభిత్తయః = తన్నిర్మలావయవభిత్తయః. తాసు= తన్నిర్మలావయవభిత్తిషు.

ప్రతిఫలన్నిజదేహదమ్భాత్ :- నిజాశ్చతే దేహాశ్చ= నిజదేహాః. ప్రతిఫలన్తశ్చతే నిజదేహాశ్చ= ప్రతిఫలన్నిజదేహాః, ప్రతిఫలన్నిజదేహా

నానావపుః = ప్రతిఫలన్నిజదేహవపుః, తస్మాత్ — ప్రతిఫలన్నిజదేహ వపుష్ట్వాత్।

సర్వాత్మనా :- సర్వశ్చాసౌ ఆత్మా చ = సర్వాత్మా, తేన = సర్వాత్మనా

**భావము :**

ఆ సభయందలి యువకులు, ఆ దమయన్తియందు. తమ దృష్టిచేతనే మునుగలేదు. తమహృదయముచేతను మునుగలేదు. మరేమనగా-ఆమెయొక్క నిర్మలములగు గణ్డస్థలాద్య వయవములయందును, ఆమెయొక్క భూషణరత్నముల యందును తమదేహములు ప్రతిబింబించుట యను నెపముతో తమ సర్వావయవములతోడను నామెయందు వారు మునిగిరి. ॥౨॥

**శ్లో. ద్యామ న్తరా వసుమతీమపి గాధిజన్మా**
**యద్యన్య మేవ నిరమాస్యత నాకలోకమ్।**
**చారుః స యాదృగభవిష్యదభూద్విమానైః**
**తాదృక్ తదభ్రమవలోకితుమాగతానాం॥ 3**

ప.వి. ద్యామ్- అన్తరా- వసుమతీమ్- అపి- గాధిజన్మా- యది-అన్యమ్-ఏవ- నిరమాస్యత- నాకలోకమ్- చారుః- సః- యాదృక్- అభవిష్యత్- అభూత్- విమానైః- తాదృక్- తదభ్రమ్-అవలోకితుమ్- ఆగతానామ్.

అర్థము :- గాధిజన్మా— గాధిపుత్రుఁడైన విశ్వామిత్రుఁడు, ద్యాం=స్వర్గమునకు, వసుమతీ మపి= భూమికిని, అన్తరా=మధ్యభాగమున, అన్యమేవ = మఱియొక్కటైన, నాకలోకం=స్వర్గమును, నిరమాస్యత యది = నిర్మించినచో, యాదృక్= ఎటువంటి, చారుః= సుందరముగా, అభవిష్యత్= అగునో, తదభ్రం, తత్=స్వయంవరమణ్డపముపైని, అభ్రం=ఆకసము, అవలోకితుం= స్వయంవరమునుఁ జూచుటకు, ఆగతానాం= విచ్చేసిన దేవతలయొక్క, విమానైః= విమానములచే, తాదృక్=అంతటి, చారు= అందముగా, అభూత్=ఉండినది. స్వయంవరసభకుఁ బైనున్న యన్తరిక్షము, దేవతల విమానములతోఁ గూడినదై యన్తరిక్షము సృజించిన మఱియొక స్వర్గము వలె శోభించుచున్న దనియర్థము.

వి. స్వర్గభూములకు మధ్య నాకలోక సంబంధము లేకపోయినను దాని సంబంధమును జెప్పుటచే సంబంధాతిశయోక్తి, కొందఱువీనిని 'అభూతోపమ' యని జెప్పుదురు.

**సమాసములు :**

గాధిజన్మా:- గాధేః జన్మ యస్యసః = గాధిజన్మా।.

**భావము:**

విశ్వామిత్రుఁడు స్వర్గభూములమధ్య భాగమున, మఱియొక స్వర్గమును సృజించినచో, నా స్వర్గమెంత సుందరముగానుండునో ఆ స్వయంవరమండపము పైని యాకాశము అ మహోత్సవమును దర్శింపుటకై ఏతెంచిన దేవతల విమానములతోఁగూడి యంతరమ్యముగా నుండినది ॥౬॥

**శ్లో. కుర్వద్భిరాత్మభవసౌరభసమ్ప్రదానం**
**భూపాలచక్రచలచామర మారుతౌఘమ్।**
**ఆలోకనాయ దివి సఞ్చరతాం సురాణాం**
**తత్రార్చనా విధిరభూదధివాసధూపైః॥ 4**

ప.వి. కుర్వద్భిః- ఆత్మభవసౌరభసమ్ప్రదానం- భూపాల చక్రచల చామర మారుతౌఘమ్- ఆలోకనాయ- దివి- సఞ్చరతాం- సురాణాం- తత్ర- అర్చనావిధిః- అభూత్- అధివాసధూపైః.

అర్థము : భూపాల చక్రచలచామరమారుతౌఘమ్; భూపాలచక్ర = నరపాల సమూహముయొక్క, చల = కదలుచున్న, చామర = చామరములయొక్క, మారుత = గాలియొక్క, ఓఘం = సమూహము గలదియు, ఆత్మభవ సౌరభ సమ్ప్రదానం; ఆత్మభవ = తమయందు దుద్భవించిన, సౌరభ = పరిమళమును, సమ్ప్రదానం = పరిగ్రహించు దానినిగా, కుర్వద్భిః = చేయుచున్న అనగా పరిమళమును సంక్రమింపఁ జేయుచున్న, అధివాసధూపైః - వాసనకై వేయు ధూపములచేత, ఆలోకనాయ = స్వయంవరమును దర్శించుటకై, దివి = ఆకసమునందు, సఞ్చరతాం = సఞ్చరించెడి,

సురాణాం=దేవతలకు, తత్ర=ఆ స్వయంవర మణ్డపమునందు, అర్చనా విధిః=పూజా కృత్యము, అభూత్=అయెను.

వి. ఇచ్చట అధివాస ధూపములకు సురార్చనతో సంబంధము లేకపోయినను, నా సంబంధమును జెప్పుటవలన సమ్బన్ధాతిశయోక్తి.

**సమాసములు :**

ఆత్మభవ సౌరభ సమ్ప్రదానం :- ఆత్మనః భవం=ఆత్మభవం, ఆత్మభవం చ తత్ సౌరభం చ-ఆత్మభవ సౌరభం, ఆత్మభవసౌరభస్య సమ్ప్రదానం-ఆత్మభవసౌరభసమ్ప్రదానం తత్=ఆత్మభవ సౌరభసమ్ప్రదానమ్.

భూపాలచక్రచలచామర మారుతౌఘమ్ - భూపాలానాం చక్రం = భూపాలచక్రం, చలాశ్చతే చామరాశ్చ=చలచామరాః, భూపాలచక్రస్య చలచామరాః =భూపాలచక్ర చలచామరాః, భూపాలచక్రచలచామరణాం మారుతాః=భూపాలచక్రచలచామర మారుతాః. భూపాలచక్రచల చామర మారుతానామోఘః= భూపాల చక్రచలచామరమారుతౌఘః, తమ్-భూపాలచక్రచల చామర మారుతౌఘమ్.

అర్చనావిధిః :- అర్చనాయావిధిః=అర్చనావిధిః.

అధివాసధూపైః:- అధివాసార్థం ధూపాః=అధివాసధూపాః, తైః = అధివాసధూపైః.

**భావము :**

స్వయంవర మణ్డపము నందాసీనులైన రాజులకు వింజామరలు విసరఁబడుచున్నవి. ఆ వింజామరల గాలికి అధివాస ధూపముల పరిమళము తగులుటచే స్వయంవరమునుఁ జూచుటకు వచ్చి, యాకసమునందు సంచరించుచున్న దేవతా సంఘమునకు పూజల నొనరించి నట్లున్నది. ॥౪॥

శ్లో. తత్రావనీన్ద్రచయ చన్దన చన్ద్రలేప
నేపథ్య గన్ధమయ గన్ధ వహప్రవాహమ్।

ఆలీభిరాపత దనఙ్గశరానుసారీ
సంరుధ్య సౌరభమగాహత భృఙ్గవర్గః॥ 5

ప.వి. తత్ర- అవనీన్ద్రచయచన్దనచన్ద్రలేపనేపథ్యగన్ధమయగన్ధవహప్రవాహమ్ -ఆలీభిః- అపతపదనఙ్గశరానుసారీ- సంరుధ్య- సౌరభమ్- అగాహత- భృఙ్గవర్గః.

అర్థము. తత్ర—అస్వయంవరమందు, ఆలీభిఃపరుసలతో, అపతత్=వచ్చుచున్న, అనఙ్గశరానుసారీ=మన్మథబాణములననుసరించునట్టి, భృఙ్గవర్గః=తుమ్మెద లసంఘము, అవనీన్ద్రచయచన్దనచన్ద్రలేపనేపథ్యగన్ధమయగన్ధవహప్రవాహమ్, అవనీన్ద్రచయ -రాజసంఘముయొక్క,చందన=చందనములు,చన్ద్ర=కర్పూరము, అనుపీనియొక్క, లేప=పఙ్కమనెడి, నేపథ్య=అలఙ్కారముయొక్క, గన్ధమయ=పరిమళముతోనిండిన, గన్ధవహ =గాలియొక్క, ప్రవాహం=ప్రవాహమును, సంరుధ్య = అడ్డగించి, లేదా-ఆలీభిః = తమ శ్రేణులతో, సంరుధ్య = అడ్డగించి, అనగావెలుపలకుబోనీయక, సౌరభం-పరిమళమును, అగాహత-చొచ్చుకొనినది, అనగా ననుభవించినది. పరిమళముపైనాశతో తుమ్మెదలు పరుసలు తీరి యా సభయందు సఞ్చరించుచుండెనని యర్థము.

**సమాసములు :**

అవనీన్ద్రచయచన్దనచన్ద్రలేపనేపథ్యగన్ధమయగన్ధవహప్రవాహమ్:అవన్యాః ఇన్ద్రాః=అవనీన్ద్రాః, అవనీన్ద్రాణాంచయః=అవనీన్ద్రచయః, చన్దనంచ, చన్ద్రశ్చ= చన్దనచన్ద్రౌ, చన్దనచన్ద్రయోఃలేపః=చన్దనచన్ద్రలేపః; చన్దన చన్ద్ర లేపఏవనేపథ్యం =చన్దనచన్ద్రలేపనేపథ్యమ్, చన్దచన్ద్రలేపనేపథ్యస్యగన్ధః=చన్దనచన్ద్రలేపనేపథ్యగన్ధః, చన్దన న్ద్రచలేపనేపథ్యగన్ధేనప్రచురః=చన్దనచన్ద్రలేపనేపథ్యగన్ధమయః, చన్దనచన్ద్రలేపనేపథ్యగన్ధమ యశ్చాసౌగన్ధవహశ్చ=చన్దనచన్ద్రలేపనేపథ్యగన్ధమయ గన్ధవహః, అవనీన్ద్రచయచన్దనచన్ద్రలేపనేపథ్యగన్ధమయ గన్ధవహస్యప్రవాహః = అవనీన్ద్రచయచన్దనలేపనేపథ్యగన్ధమయగన్ధవహ ప్రవాహః, తమ్=అవనీన్ద్రచయచన్దనచన్ద్రలేపనేపథ్యగన్ధమయగన్ధవహప్రవాహమ్।

ఆ పతదనఙ్గశరానుసారీ:- అనఙ్గస్యశరాః = అనఙ్గశరాః, ఆపత న్తశ్చతే, అనఙ్గశరాశ్చ=ఆపతదనఙ్గశరాః, ఆపతదనఙ్గ శరాననుసరతీతి = ఆపతదనఙ్గశరానుసారీ,
భృఙ్గవర్గః :- భృఙ్గాణాంవర్గః=భృఙ్గవర్గః

**భావము :**

ఆ స్వయంవరమందు పరుసలుతీరి పడుచున్న మన్మథ బాణములను వెంబడించుచున్న తుమ్మెదలబారు, రాజుల శరీరములకలదిన చన్దనకర్పూర లేపముల పరిమళముఁ గొనివచ్చు వాయుప్రవాహము నే వైపునకు పోనీయక యాపి యాపరిమళము ననుభవించుచున్నది ॥౫॥

**శ్లో. ఉత్తుఙ్గ మఙ్గల మృదఙ్గ నినాదభఙ్గీ**
**సర్వానువాదవిధి బోధితసాధు మేధాః।**
**సౌధస్రజః ప్లుతపతాకతయాఽభినిన్యు**
**ర్మన్యే జనేషు నిజతాణ్డవపణ్డితత్వమ్॥ 6**

ప.వి. ఉత్తుఙ్గమఙ్గల మృదఙ్గ నినాదభఙ్గీసర్వానువాద విధిబోధితసాధు మేధాః - సౌధస్రజః - ప్లుతపతా కతయా - అభినిన్యుః - మన్యే - జనేషు - నిజతాణ్డవపణ్డితత్వమ్.

అర్థము. ఉత్తుఙ్గ మఙ్గలమృదఙ్గనినాద భఙ్గీసర్వానువాద విధిబోధితసాధు మేధాః; ఉత్తుఙ్గ=మిక్కిలి యుచ్చైఃస్వరముకల్గిన, మఙ్గల = శుభసూచకములైన, మృదఙ్గనినాద = మృదఙ్గవాద్యధ్వనులయొక్క, భఙ్గీ =ప్రకారవిశేషముల యొక్క, సర్వానువాద = ప్రతిధ్వనిరూపముతో సందరియొక్క ప్రత్యుచ్చారణయొక్క, విధి-కృత్యముచే, బోధిత=నివేదింపఁబడిన, సాధు = శ్రేష్ఠమైన, మేధాః =ధారణశక్తిగల్గిన, సౌధస్రజః=మేడలపఙ్క్తులు, ప్లుతపతాకతయా; ప్లుత=ఎగరుచున్న, పతాకతయా=టెక్కెములు కల్గియుండుటచే, జనేషు = సభాస్థలియందలి జనులయెదుట, నిజతాణ్డవ పణ్డితత్వం; నిజ=తనదైన, తాణ్డవ=నృత్యమందలి, పణ్డితత్వం=నేర్పును, అభినిన్యుః

= అభినయించుచుండినవి. అనగా ప్రకటించుచుండినవి (ఇతి = అని) మన్యే=తలంతును.

వి. బిగ్గరగా మ్రోగెడి మృదఙ్గముల ధ్వనుల ననువాదము చేయుచున్న మేడలు ఆడుచున్న పతాకలతో, నృత్యముచేయు స్త్రీవలె హస్తాభినయాదులనుఁ జేసినవో యనునట్లున్నవని చెప్పుటవలన నుత్ప్రేక్ష. మేడలపఙ్క్తి యందు నర్తకీ వ్యవహారము నారోపించుటచే సమాసోక్త్యలఙ్కారము.

## సమాసములు

ఉత్తుఙ్గమఙ్గళమృదఙ్గనినాదభఙ్గీ సర్వానువాద విధిబోధిత సాధుమేధాః :- మఙ్గళార్థం మృదఙ్గాః=మఙ్గళ మృదఙ్గాః, మఙ్గళమృదఙ్గానాం నినాదాః,= మఙ్గళ మృదఙ్గనినాదాః, ఉత్తుఙ్గాశ్చతే మఙ్గళ మృదఙ్గ నినాదాశ్చ= ఉత్తుఙ్గ మఙ్గళ మృదఙ్గ నినాదాః, ఉత్తుఙ్గ మఙ్గళ మృదఙ్గ నినాదానాం భఙ్గ్యః- ఉత్తుఙ్గమఙ్గళ మృదఙ్గ నినాదభఙ్గ్యః, సర్వస్య అనువాదః= సర్వానువాదః, సర్వానువాదస్య విధిః=సర్వానువాద విధిః, ఉత్తుఙ్గ మఙ్గళ మృదఙ్గ నినాద భఙ్గీనాం సర్వానువాద విధిః= ఉత్తుఙ్గ మఙ్గళ మృదఙ్గ నినాదభఙ్గీ సర్వానువాద విధిః. ఉత్తుఙ్గ మఙ్గళ మృదఙ్గ నినాద భఙ్గీ సర్వానువాద విధినా బోధితా=ఉత్తుఙ్గ మఙ్గళమృదఙ్గనినాదభఙ్గీ సర్వానువాద విధిబోధితా, సాధ్వీ చసా మేధాశ్చ=సాధుమేధాః, ఉత్తుఙ్గ మఙ్గళ మృదఙ్గ నినాదభఙ్గీ సర్వానువాద విధిబోధితా సాధుమేధాః యస్యాన్తాః=ఉత్తుఙ్గ మఙ్గళ మృదఙ్గ నినాదభఙ్గీ సర్వానువాద విధి బోధిత సాధుమేధాః.

సౌధస్రజః :- సౌధానాం స్రజః=సౌధస్రజః.

ప్లుతపతాకతయా :- ప్లుతాః పతాకాఃయాసాంతాః = ప్లుతపతాకాః, ప్లుత పతాకానాం భావః = ప్లుతప్లుతపతాకతా, తయా. ప్లుతపతాకతయా.

నిజతాణ్డవపణ్డితత్వమ్ :- నిజం చ తత్ తాణ్డవం చ = నిజతాణ్డవం, పణ్డిత స్యభావః -పణ్డితత్వం, నిజతాణ్డవే పణ్డితత్వమ్=నిజతాణ్డవ పణ్డితత్వం, తత్=నిజతాణ్డవ పణ్డితత్వమ్,

**భావము :**

ఆ స్వయంవరమందు మద్దెలలు బిగ్గరగా మ్రోగుచున్నవి. అవి మంగళ సూచకములైనవి. ఆ మద్దెల ధ్వనులలోని వివిధ భఙ్గులను పూర్తిగా ప్రతిధ్వని రూపమున ననువదించుచు నా నగరమందలి మేడలు తమ ధారణాశక్తియైన మేధను ప్రకటించుచున్నవి. ధారణాశక్తి అనగా జ్ఞాపకశక్తి. అది లేనిచో ఇతరులు చెప్పిన విషయముల నన్నింటిని ననువదించ సాధ్యము కాదుగదా. ఈ విధముగా మృదఙ్గ నాదముల ననువదించెడి మేడల పఙ్క్తులు, చలించు చున్న పతాకలతో జనుల యెదుట తమ నృత్య కౌశలమును ప్రదర్శించుచున్నవో యని కానవచ్చుచున్నవి. నృత్యముచేయు నర్తకులకు కావలసిన సాధనము లిచ్చుటను సమకూరినవి. అందు స్వయంవర మృదఙ్గ నాదములు, నాట్యకత్తెల కును ఉపయోగకరములు. ఇచ్చట మేడలయందలి నాదముల ప్రతిధ్వనులు, నాట్యకత్తెలు గాయకుఁడు పాడెడి పాటల ననువదించుచున్నట్లున్నవి. ఎగురు చున్న హస్తములవంటి చేతుల నాడించుచు పతాకలచే నృత్యములుచేయు నాట్య కత్తెల ననుకరించుచున్నవి. కాన నా స్వయంవర మహోత్సవమున నా నగర మందలి సౌధ రాజులు ఎగురుచున్న పతాక లనెడి హస్తముల యభినయముల తోడను స్వయంవరములోని మృదఙ్గ నాదము లనెడి వాద్యనాదములతోడను ఆ నాదములను ప్రతిధ్వనింపఁజేయుట యనెడి పాటల యనువాదముతోడను నర్తకీ రాజివలె శోభించుచున్నవి. ॥౬॥

శ్లో. సమ్భాషణం భగవతీ సదృశం విధాయ
వాగ్దేవతా వినయబంధురకన్ధరాయాః।
ఊచే చతుర్దశజగజ్జనతానమస్యా
తత్రాశ్రితా సదపి దక్షిణపక్షమస్యాః॥ 7

ప.వి. సమ్భాషణం- భగవతీ- సదృశం- విధాయ- వాగ్దేవతా- వినయబంధుర కన్ధరాయాః- ఊచే- చతుర్దశ జగజ్జనతానమస్యా- తత్ర- ఆశ్రితా- సదసి- దక్షిణపక్షమ్- అస్యాః.

అర్థము: చతుర్దశ జగజ్జనతానమస్యా; చతుర్దశజగత్=పదునాలుగు లోకముల యందలి, జనతా = జనసమూహముచే, నమస్యా=నమస్కరింపఁదగిన,

భగవతీ=పూజ్యమైన, వాగ్దేవతా=సరస్వతి, తత్ర = ఆ సభయందు, వినయబంధురకన్ధరాయాః; వినయ=వినయముచే, బంధుర=రమణీయ మైన, కంధరాయాః=కణ్ఠము గల్గిన, అస్యాః=ఈ దమయన్తియొక్క, దక్షిణపక్షం=కుడిప్రక్కను అనగా పూజ్యురాలు కాన దక్షిణపార్శ్వము నాశ్రయించినదని యర్థము, ఆశ్రితా=ఆశ్రయించినదై, సదృశం=ఆ కాల మునకుఁ దగిన, సమ్భాషణం = సమ్భాషణమును, విధాయ = చేసి, అనగా బిడ్డా! రమ్ము- చూడుము అని మాటాడి, ఊచే = చెప్పఁబోవు విధముగా మాట్లాడెను.

**సమాసములు :**

వాగ్దేవతా :- వాగేవ దేవతా=వాగ్దేవతా.
వినయబంధురకన్ధరాయాః :- వినయేన బంధురా = వినయబంధురా, వినయబంధురాకన్ధరా, యస్యాస్సా = వినయబంధురకన్ధరా, తస్యాః= వినయబంధురకన్ధరాయాః॥
చతుర్దశజగజ్జనతానమస్యా :- చతుర్దశ చ తాని జగన్తి చ = చతుర్దశ జగన్తి=చతుర్దశ జగతాం జనతా=చతుర్దశజగజ్జనతా, చతుర్దశ జగ జ్జనతయా నమస్యా=చతుర్దశజగజ్జనతానమస్యా.
దక్షిణపక్షమ్ :- దక్షిణశ్చాసౌ పక్షశ్చ=దక్షిణ పక్షః, తమ్ = దక్షిణ పక్షమ్.

**భావము :**

పదునాల్గు లోకముల యందలి జనులకు వంద్యురాలైన సరస్వతి, యా సభయందు, వినయముచే తల వాల్చుకొనిన దమయన్తికి కుడి పార్శ్వమునను (అనుకూల పక్షమునందును నాసీనురాలై యా సమయమునకు తగిన సమ్భా షణముఁ గావించి, అనగా బిడ్డా! రమ్ము, చూడుము; అని ఇట్లు సాదరముగా మాట్లాడి చెప్పఁబోవు ప్రకారము పలికినది. ॥౭॥

శ్లో. అస్మాఽఽగమత్ మఖభుజామిహ కోటిరేషా
యేషాం పృథక్కథన మబ్దశతాతిపాతి।

**అస్యాం వృణీష్వ మనసా పరిభావ్య కఞ్చిత్**
**యం చిత్తవృత్తిరనుధావతి తావకీనా॥ 8**

ప.వి. అభ్యాగమత్-మఖభుజామ్-ఇహ-కోటిః-ఏషా - యేషాం - పృథక్కథనమ్-అబ్దశతాతిపాతి-అస్యాం-వృణీష్వ- మనసా- పరిభావ్య-కఞ్చిత్ - యం-చిత్తవృత్తిః-అనుధావతి-తావకీనా.

అర్థము: (హేవత్సే—ఓ బిడ్డా !(మఖభుజాం=దేవతలయొక్క, ఏషా=ఈ, కోటిః= కోటి (లెక్కింప సాధ్యముకాని సంఘము) అభ్యాగతా = విచ్చేసినది. యేషాం = ఏ దేవతలకు, పృథక్కథనం=ప్రత్యేకముగాఁ జెప్పుట, అబ్దశతాతిపాతి = వంద సంవత్సరముల కాలమునుఁ గూడ దాటునది· అస్యాం=ఈ దేవతాకోటియందు, యం కఞ్చిత్=ఎవనినో యొక సురుని, తావకీనా=నీకు సంబంధించినదైన, చిత్తవృత్తిః=మనోవృత్తి. అనుధావతి=అనుసరించుచున్నదో, మనసా=మనస్సుచే, పరిభావ్య=ఆలోచించి, తం=వానిని, వృణీష్వ = వరించుము.

వి. మఖభుజామ్ :– మఖే భుఞ్జత ఇతి = మఖభుజః, తేషాం=మఖభుజామ్।
పృథక్కథనమ్ :– పృథక్, కథనమ్, పృతక్కథనం ।

**సమాసములు :**

అబ్దశతాతిపాతి :– అబ్దానాంశతం= అబ్దశతం. అబ్దశత మతిపతతీతి=అబ్దశతాతిపతి.
చిత్తవృత్తిః :– చిత్తస్య వృత్తిః=చిత్తవృత్తిః

**భావము :**

ఓ బిడ్డా ! ఓ యువస్త్రీ ! లెక్కింపశక్యముగాని దేవతా సంఘము విచ్చేసినది. వీరినిఁగూర్చి ప్రత్యేకించి చెప్ప మొదలిడినచో. వంద సంవత్సరముల కాలము గూడ దాటిపోవును. కాన ఈ సురసంఘము నందు ఎవనినైనను నీ మనస్సు అనుసరించుచో, అట్టి వానిని మనస్సుచేత నాలోచించి వరింపుము ॥౮॥

శ్లో. ఏషాం త్వదీక్షణరసాదనిమేషతైషా
స్వాభావికానిమిషతా మిలితా యథాభూత్।
ఆస్యే తథైవ తవ నన్వధరోపభోగైః
ముగ్ధే। విధావమృత పానమపి ద్విధాస్తు॥ 9

ప.వి. ఏషాం-త్వదీక్షణరసాత్ - అనిమేషతా - ఏషా - స్వాభావికా నిమిషతా మిలితా-యథా-అభూత్-ఆస్యే-తథా-ఏవ-తవ-నను - అధరోపభోగైః- ముగ్ధే-విధౌ-అమృతపానమ్-అపి-ద్విధా-అస్తు

అర్థము: ఏషాం=ఈ దేవతలకు, త్వదీక్షణరసాత్; త్వత్=నిన్ను, ఈక్షణ= చూచుటయందలి, రసాత్=అనురాగమువలన, ఏషా=ఈ, అనిమేషతా= ఱెప్పపాటు లేకయుండుట, యథా=ఎట్లు-స్వాభావికా నిమిషతామిలితా, స్వాభావిక=స్వభావసిద్ధమైన, అనిమిషతా = ఱెప్పపాట్లలేమితో, మిలితా= కూడినదై, ద్విధా=రెట్టింపుగా, అభూత్=ఆయెనో, తథైవ = అట్లే, నను, ఓసిముగ్ధే=చక్కనిదానా !, విధౌ = చంద్రునియందు, అమృత పానమపి=అమృతపానము గూడ, తవ=నీయొక్క, ఆస్యే = ముఖ చంద్రునందలి, అధరోపభోగైః=అధరామృతపానములచే, మిలితంసత్= కూడినదై, ద్విధా=రెట్టింపుగా, అస్తు=అగునుగాక.

వి. ఇచ్చట అనిమేషత్వమునకును, నమృతపానమునకును ద్వైవిధ్యము లేక పోయినను తత్సంబంధమును జెప్పుటవలన సంబంధాతిశయోక్తి.

**భావము :**

ఈ దేవతలకు నిన్నుఁజూచుట యందలి యనురాగముతో నీ యని మేష త్వము, అనగా ఱెప్పపాటు లేని తనము వచ్చినది. ఈయనిమేషత్వము, దేవ తలకు స్వభావసిద్ధమైన యనిమేషత్వముతోఁ గూడినదై ఱెట్టింపు అయినది. ఈ విధముగనే ఓ సుందరీ! దేవతలకు చంద్రునియందున్న యమృతపానముఁగూడ నీ ముఖచంద్రునందలి యమృతపానముతోఁ గూడి రెట్టింపుకానిమ్ము. నైసర్గిక ముగా ఱెప్పపాట్లు లేనందువలన నిర్నిమేషులైన దేవతలు నిన్నుఁజూచుటచే నెట్లు నిమేషరహితులై ఱెట్టింపు నిమేషరాహిత్యము నెట్లు పొందిరో, అట్లే స్వాభావిక

ముగా చంద్రునియందలి యమృతమును బానముగావించెడి దేవతలు నీముఖ చంద్రునియందలి యధరామృతపానము గావించి పెట్టింపు అమృతపానము గావించినవారు కానిమ్ము ॥౯॥

శ్లో. ఏషాం గిరేః సకలరత్న ఫల స్తరుస్సః
ప్రాక్ దుగ్ధభూమి సురభేః ఖలు పఞ్చశాఖః।
ముక్తా ఫలం ఫలనసాన్వయనామ తన్వ
న్నాభాతి బిందుభిరివ చ్ఛురితః పయోభిః॥ 10

వ.వి. ఏషాం-గిరేః-సకలరత్నఫలః-తరుః-స-ప్రాక్ - దుగ్ధభూమిసురభేః - ఖలు-పఞ్చశాఖః-ముక్తాఫలం-ఫలనసాన్వయనామ-తన్వన్ -ఆభాతి-బిన్దుభిః-ఇవ-ఛురితః-పయోభిః-

అర్థము. సకల రత్నఫలః=సకలరత్నములను ఫలములుగాఁగలదియు, ఫలనసాన్వయనామ; ఫలన = సస్యముగాఁ జేయుటచే, సాన్వయ =సార్థకమైన, నామ= పేరుగల,ముక్తాఫలం=ముక్తాఫలమును, తన్వన్=అట్టిదిగాచేయుచు, అనగా ముత్తెములు ముత్తెపు చిప్పలయందుఁ బుట్టుటవలన నవిఫలముగా నుండుటకు దగవు కాని కల్పవృక్షమునుండి పుట్టుటవలన దానికి ఫలత్వము సరిపడినది కాన ముక్తాఫలమనెడి పేరును సార్థకపరచుచున్న, ఏషాం=ఈ దేవతలకు సంబంధించినదైన, సః=ఆ ప్రసిద్ధమైన, తరుః= కల్పవృక్షము, ప్రాక్=పూర్వము, దుగ్ధభూమిసురభేః;దుగ్ధ=పిదుకఁబడిన, భూమి=భూమియనెడు, సురభేః=కామధేనువుగల (గోరూపమును ధరించిన భూమి ఓషధులను రత్నములను పితికినది.) గిరేః=మేరువునకు సంబంధించినదై, పయోభిః = క్షీరరూపముననున్న, బిందుభిః = బిందువులతో, చరితః=అంతటవ్యాప్తమైన,పఞ్చశాఖఇవ=హస్తమోయన్నట్లు,ఆభాతిఖలు =ప్రకాశించుచున్నదిగదా! పఞ్చశాఖః = అయిదుకొమ్మలతోఁ గూడిన పఞ్చశాఖః = హస్తముగా సుమేరోః=మేరువునకు ఆసీత్=అయినది.

వి. ఇచ్చటి రత్నములను పిదుకుటకు మేరుపర్వతమునకు కల్పవృక్షము హస్తముకాకపోయినను, హస్తమోయన్నట్లు ప్రకాశించుచున్నదని చెప్పుట వలన నుత్ప్రేక్ష.

**సమాసములు :**

సకలరత్నఫలః;— సకలానిచతానిరత్నాని చ = సకలరత్నాని, సకల రత్నాని ఫలానియస్యసః=సకల రత్నఫలః।
దుగ్ధభూమిసురభే:- భూమేః = సురభిః=భూమిసురభిః, దుగ్ధా భూమిసుర భిః యస్యసః = దుగ్ధ భూమిసురభిః, తస్య = దుగ్ధభూమిసురభేః।
పఞ్చశాఖః:- పఞ్చశాఖాః యస్యసః = పఞ్చశాఖః।
ఫలనసాన్వయనామ:- అన్వయేనసహితం=సాన్వయం।ఫలనేనసాన్వయం= ఫలనసాన్వయం, ఫలనసాన్వయం, నామయస్యతత్ = ఫలనాసాన్వయ నామ। తత్=ఫలనసాన్వయనామ।

**భావము :**

కల్పవృక్షము సకల రత్నములను ఫలములుగా కల్గినదై యనగా సకల రత్నములకు జన్మభూమియై ముక్తాఫలములకు సత్యత్వమును కల్పించియాముక్తా ఫలమను పేరును సార్థకపఱచుచున్నది. వాస్తవస్థితియందు ముక్తాఫలములు శుక్తి గర్భమునఁ బుట్టుటవలన వానికి సస్యసంబంధియగు ముక్తాఫలత్వము సంభ వింపదు. కాని సకలరత్నములకును కల్పవృక్షము మూలముగావున ముక్తాఫలము లకును కల్పతరు సంభవము. వీటివలన వానికి సస్యసం బంధమేర్పడి ఫలత్వము సిద్ధించినది. ఆ కల్పవృక్షము ఓషధులను రత్నములు మున్నగు వానినిఁ బిదుకఁ బడిన గోరూపమును ధరించిన భూమికి, దోగ్ధయైన మేరువునకు, పాలబొట్టలతో వ్యాప్తమైన పఞ్చశాఖగా ననగా హస్తముగా నున్నది:-

"ప్రమాణం శ్రూయతే దుగ్ధా పునర్దివ్యైర్వసుంధరా
ఓషధీశ్చైవ భాస్వన్తి రత్నాని వివిధాని చ।
వత్సస్తు హిమవానాసీత్ దోగ్ధామేరుర్మహాగిరిః"

అని పౌరాణిక వచనములు పై విషయమును కనుసంధేయములు. మఱియు పఞ్చశాఖ యనగా నైదుశాఖలతోఁగూడిన దనియు నర్థము. అట్టి యైదు కొమ్మలతోఁ గూడిన కల్పవృక్షము హస్తమైన దనియు నర్థము. పిదుకు వానిచేయి పాలబొట్లతోఁ గూడియుండును. ఇచ్చట మేరుపర్వతము భూమియను గోవును, కల్పవృక్షమనెడి హస్తముతో రత్నములనే పిదు

కుట వలన, కల్పవృక్షమున కట్టు రత్నములతో సంబంధమేర్పడుట వలన కల్పవృక్షము మున్నాటికి మేరువునకు హస్తమే యగుచున్నది. నీవు దేవతలలో నెవ్వరినైనను వరించినచో, నీవు, కల్పవృక్షము, మేరువు, హస్తగతములగు నని యాశయము ॥౧౦॥

శ్లో. వక్త్రేన్దు సన్నిధి నిమీల దలారవిన్ద
ద్వన్ద్వభ్రమక్షమమథాఞ్జలిమాత్మమౌలౌ।
కృత్వాఽపరాధభయచఞ్చల మీక్షమాణా
సాన్యత్ర గన్తుమమరైః కృపయాన్వమాని॥ 11

ప.వి. వక్త్రేన్దు సన్నిధినిమీలదలారవిన్ద ద్వంద్వ భ్రమక్షమమ్—అథ—అఞ్జలిం- ఆత్మ మౌలౌ- కృత్వా— అపరాధభయచఞ్చలమ్— ఈక్షమాణా— సా— అన్యత్ర— గన్తుమ్— అమరైః— కృపయా— అన్వమాని.

అర్థము : అథ=సరస్వతి చెప్పిన పిదప, వక్త్రేన్దుసన్నిధినిమీలదలారవిన్ద ద్వన్ద్వ భ్రమక్షమమ్; వక్త్రేన్దు=ముఖచన్ద్రునియొక్క, సన్నిధి = సమీపమునందు, నిమీల = ముడుచుకొని పోయెడు, దల = రేకులుగల, అరవిన్ద=తమ్మిపూలయొక్క, ద్వన్ద్వ=జతయనెడి, భ్రమ=భ్రాన్తికి, క్షమం = తగిన, అఞ్జలిం = దోసిలిని, ఆత్మమౌ = తన శిరమునందు, కృత్వా=ఉంచి, (దేవతలకు నమస్కరించి) అపరాధభయచఞ్చలమ్; అపరాధ=(దేవతలను వరించలేదను) నేరమువలని, భయ=భయముచే, చఞ్చలం=చఞ్చలముగా, ఈక్షమాణా=చూచుచున్న, సా = ఆ దమయన్తి, అమరైః=దేవతలచే, కృపయా=దయతో, అన్యత్ర=మఱియొక చోటికి, గన్తుం=వెళ్ళుటకు, అన్వమాని=అనుమతింపఁబడినది. దమయన్తికి తన జాతికిఁ జెందిన మనుష్యులయందే యనురాగమని దేవతలు గ్రహించి యెవనియందు నీ కనురాగమో వానినే వరింపుము. భయపడకుము. అని దయతో ననుమతించిరని యర్థము. ఏలయనగా గొప్పవారు వందనమునకు ప్రసన్నులగుదురుగదా !

వి. ఇచ్చట దమయంతి దోసిలియందు పద్మముల జంట భ్రాంతిని వర్ణించుట

వలనను భ్రాన్తిమదలఙ్కారము. 'వక్త్రేన్దు' అను రూపకముతో దానికి సఙ్కరము.

**సమాసములు :**

వక్త్రేన్దుసన్నిధి నిమీలితలారవిన్దద్వన్ద్వభ్రమక్షమమ్ :- వక్త్రమేవ ఇన్దుః = వక్త్రేన్దుః, వక్త్రేన్దోః సన్నిధిః = వక్త్రేన్దు సన్నిధిః, వక్త్రేం దుసన్నిధినానిమీలిని = వక్త్రేన్దుసన్నిధినిమీలిని. వక్త్రేన్దుసన్నిధిని నిమీలిని దలానియయోస్తే = వక్త్రేన్దుసన్నిధినిమీలిదవే; వక్త్రేన్దు సన్నిధి నిమీలిత లేచ తే అరవిన్దేచ=వక్త్రేన్దుసన్నిధి నిమీదలార విన్దే. వక్త్రేన్దుసన్నిధి నిమీలితలారవిన్దయోః ద్వన్ద్వమ్ = వక్త్రేన్దుసన్నిధి నిమీలిదలార విన్దద్వన్ద్వమ్, వక్త్రేన్దుసన్నిధినిమీలితలారవిందద్వంద్వస్య భ్రమః = వక్త్రేన్దుసన్నిధి నిమీలితలావింద భ్రమః, వక్త్రేన్దు సన్నిధినిమీలితలారవింద భ్రమస్య క్షమః,=వక్త్రేన్దుసన్నిధినిమీలిదలార విన్ద భ్రమక్షమః, తం = వక్త్రేన్దుసన్నిధినిమీలితలారవిన్ద భ్రమక్షమమ్. ఆత్మమౌలౌ :- ఆత్మనః మౌలిః=ఆత్మమౌలిః, తస్మిన్=ఆత్మమౌలౌ, అపరాధభయచఞ్చలమ్ :- అపరాధాత్ భయం=అపరాధభయం, అప రాధ భయేన చంచలా యస్మిన్ కర్మణిత థ్యాభవతి తథా=అపరాధ భయచఞ్చలమ్.

**భావము :**

సరస్వతి మాట్లాడిన పిదప, దమయన్తి దేవతలలో నెవ్వనిని వరించ నందువలన నేరమువలన భయముతో, కమ్పమొంది తన తలపైన నఞ్జలి ఘటించినది. ఆయఞ్జలి యా దమయన్తి యొక్క ముఖచన్ద్రుని సన్నిధిచే ముడుచు కొనిపోవు రేకలతోఁ గూడినపద్మముల జంట యను భ్రాన్తినిఁ గల్గించుచున్నది. అట్లు పద్మముగ్మ మను భ్రాన్తినిఁ గల్గించు నఞ్జలితో గూడి భయకంపితురాలై దేవతలనుఁ జూచుచు,తన మానవజాతికిఁ జెందిన వానినే వరింపఁ గోరిక యామె కున్నట్లు గ్రహించి దయతో వెళ్లుటకు వారిచే ననుమతింపఁ బడినది. మహాత్ము లెప్పుడును వందనాదులచేఁ బ్రసన్నతనుఁ జెందుదురు గదా! దమయన్తి యఞ్జ లిని ఘటింపగనే వారు ప్రసన్నులై తాను వలచిన వానినే వరింపుమని యామెకుఁ జెప్పి యామెను ముందుకు వెళ్లుటకు సెలవొసంగిరని యాశయము ॥౧౧॥

శ్లో. తత్తద్విరాగ ముదితం శిబికాధరస్థాః
సాక్షాద్విదుః స్మ న మనాగపి యానధుర్యాః.
ఆసన్ననాయకవిషణ్ణముఖానుమేయ
భైమీవిరక్తి చరితానుమయా నుజజ్ఞుః 12

ప.వి. తత్తద్విరాగమ్- ఉదితం- శిబికాధరస్థాః- సాక్షాత్- విదుః- స్మ- న- మనాక్- అపి- యానధుర్యాః- ఆసన్ననాయక విషణ్ణముఖాను మేయ భైమీవిరక్తి చరితానుమయా- ను- జజ్ఞుః

అర్థము:- శిబికాధరస్థాః; శిబికా=పల్లకికి, అధర= దిగువభాగమునందు,స్థాః = ఉన్నటువంటి, యానధుర్యాః = వాహనమును మోయునట్టి, వాహకులు, ఉదితం= ఉద్భవించిన, తత్తద్విరాగం, తత్=ఆ సమయమునకు, తద్వి రాగం= ఆయారాజుల యందుకల్గిన విరక్తిని, మనాక్=కొంచెముగూడ, సాక్షాత్= ప్రత్యక్షముగా, నవిదుఃస్మ = తెలిసికొనక యుండిరి. ఆసన్న నాయకవిషణ్ణ ముఖానుమేయ భైమీ విరక్త చరితానుమయా; ఆసన్న= సమీపమందున్న, నాయక = రాజులయొక్క, విషణ్ణ= విషాదముతోఁ గూడిన, ముఖ= మోములచే, అనుమేయ= ఊహింపదగిన, భైమీ= దమయన్తియొక్క,విరక్తచరిత=నిరాకరణసూచకములగు నమస్కారాది చేష్టలను, అనుమయాను= ఊహించుటచేతనే [తత్తద్విరాగం = ఆయా నాయకులయందు తనకు గల్గినవిరక్తిని] జజ్ఞుః= తెలిసికొనిరి. అనగా నాయకుల ముఖచేష్టల చేతనే దమయన్తికి వారిపైఁ గల్గినవిరక్తిని తెలిసికొని రని యర్థము.

## సమాసములు ;

తత్తద్విరాగమ్:-తేషు విరాగః=తద్విరాగః, తస్యాః,తద్విరాగః=తత్తద్వి రాగః, తమ్=తత్తద్విరాగం

శిబికాధరస్థాః:- అధరే తిష్ఠన్తీతి=అధరస్థాః, శిబికాయాఃఅధరస్థాః. = శిబికా ధరస్థాః.

యానధుర్యాః:- ధురం వహన్తీతి=ధుర్యాః, యానస్య ధుర్యాః=నయా ధుర్యాః.

ఆసన్న నాయకవిషణ్ణ ముఖానుమేయభైమీ విరక్త చరితానుమయా.
ఆసన్నాశ్చతేనాయకాశ్చ=ఆసన్ననాయకాః, విషణ్ణానిచతానిముఖాని చ=
విషణ్ణముఖాని, ఆసన్ననాయకానాం విషణ్ణముఖాని=ఆసన్ననాయక విషణ్ణ
ముఖాని, ఆసన్ననాయకవిషణ్ణముఖైః అనుమేయమ్=ఆసన్ననాయక విషణ్ణ
ముఖానుమేయం. విరక్తానాం చరితం = విరక్తచరితం. భైమ్యాః విరక్త
చరితం=భైమీ విరక్తచరితం, ఆసన్న నాయకముఖానుమేయం చ తత్
భైమీవిరక్తచరితం చ =ఆసన్ననాయక విషణ్ణముఖానుమేయ భైమీ
విరక్తచరితం, ఆసన్ననాయక విషణ్ణ ముఖాను మేయ భైమీ విరక్త
చరితస్య అనుమా=ఆసన్ననాయకవిషణ్ణముఖాను మేయ భైమీ విరక్త
చరితానుమా, తయా=ఆసన్ననాయక విషణ్ణముఖాను మేయ భైమీ విరక్త
చరితాను మయా.

**భావము :**

ఆ దమయన్తికి నాయారాజులపైన గల్గిన విరక్తినెవ్వరు గ్రహింపఁ జాలక పోయిరి. చివరకు, ఆమెపల్లకిని మోయువారు గూడ దగ్గర నుండియు తెలిసికొనఁ జాలక పోయిరి. కాని యారాజుల విషణ్ణ వదనములనుఁ జూచి దమయన్తి వారిని నిరాకరించినదని మాత్రము ఊహింపఁదగినదిగ నుండినది. అనగా దమయన్తి మిక్కిలి గంభీరముగా నాయకుం నెన్నుకొనుటలో ప్రవర్తించినది. ॥౧౨॥

> **శ్లో. రక్షఃస్వరక్షణమవేక్ష్య నిజం నివృత్తో**
> **విద్యాధరేష్వధరతాం వపుషైవ భైమ్యాః.**
> **గన్ధర్వసంసది న గన్ధమపి స్వరస్య**
> **తస్యావిమృశ్య విముఖోఽజని యానివర్గః. 13**

ప. వి. రక్షః సు–అరక్షణమ్-అవేక్ష్య- నిజం-నివృత్తః - విద్యాధరేషు - అధరతాం - వపుషా - ఏవ - భైమ్యాః– గన్ధర్వసంసది - నగన్ధమ్ - అపి - స్వరస్య–తస్యాః- విమృశ్య -విముఖః – అజని–యానివర్గః

అర్థము: యానివర్గః = పల్లకిని మోసెడి వాహక బృన్దము; రక్షస్సు= రాక్షసుల యందు, నిజం=తనదైన, అరక్షణం =వినాశనమును, అవేక్ష్య=చూచి

అనగా నాలోచించి, అనగా వారు హింసాపరులు గాన వారి మధ్య వెళ్ళుట తగదని నిర్ణయించుకొని, నివృత్తః=వారినుండి మరలినది. విద్యాధరేషు= విద్యాధరులయందు, భైమ్యాః=దమయన్తికంటె, వపుషైవ = శరీరము చేతనే, అధరత్వం= తక్కువతనమును, విమృశ్య = నిశ్చయించుకొని, తథా=అట్లే, గన్ధర్వ సంసది= గన్ధర్వసంఘమందు, తస్యాః = ఆమె యొక్క, స్వరస్య = స్వరమునకు, నగన్ధమపి = లేశముగూడ లేకపోవు టను, విమృశ్య=నిశ్చయించుకొని, విముఖః = పెడముఖముగా, అజని= ఏర్పడినది..

**సమాసములు :**

అరక్షణమ్:- రక్షణస్య అభావః=అరక్షణమ్; తత్=అరక్షణమ్.

గన్ధర్వసంసది:- గన్ధర్వాణాం సంసత్ = గన్ధర్వసంసత్, తస్యాం = గన్ధర్వసంసది.

న గన్ధమ్- నగన్ధః = నగన్ధః, తమ్=నగన్ధమ్.

యానివర్గః-యానమేషామస్తీతి=యానినః; యానినాం వర్గః=యానివర్గః.

**భావము :**

ఆ దమయన్తి యందలమును మోసెడి కింకరులు, రాక్షసుల మధ్య బోయినచో వారు తమ్ము భక్షింతురనియు, తమకు రక్షణ యుండదనియు భావించి యచ్చటకిఁబోలేదు. విద్యాధరులలో స్త్రీలు దమయన్తి కంటెను నందము న లోపించినవారు గాన నచ్చటికిని వారు పోలేదు. ఇఁక గంధర్వసదస్సున స్త్రీలకు నామె కంఠస్వరముతో సామ్యము లేశము గూడ లేదు కాన నచ్చటికిని వారు పోలేదు. ఇట్లు పల్లకిని మోసెడి బృన్దము రాక్షసులను విద్యాధరులను గన్ధర్వులను నుపేక్షించిరి ॥13॥

శ్లో. దీనేషు సత్స్వపి కృతాఫలవిత్తరక్షై
ర్యక్షైరదర్శి న ముఖం త్రపయైవ తస్యామ్.
తే జానతే స్మ సురశాఖి పతివ్రతాం కిం
తాం కల్పవీరుధమధిక్షితి నావతీర్ణామ్. **14**

ప.వి. దీనేషు-సత్సు-అపి-కృతా౽ఫల విత్తరక్షైః-యక్షైః-అదర్శి-న-ముఖం-త్రపయా-ఏవ-తస్యాం-తే-జానతే-స్మ-సురశాఖి పవిత్రతాం-కిం-తాం కల్పవీరుధమ్-అధిక్షితి-న-అవతీర్ణామ్.

అర్థము. దీనేషు = దరిద్రులు, సత్స్వపి=ఉన్నను, కృతా౽ ఫలవిత్త రక్షైః; కృత = చేయఁబడిన, అఫల = నిష్ఫలమైన, విత్తరక్షైః = ధనరక్షణ గల్గిన, అనగాలుబ్ధులైన, యక్షైః=యక్షులచే, త్రపయేవ=సిగ్గుచేత నో యనునట్లు, తస్యాం =ఆ దమయన్తి విషయము నందు, ముఖం=మోము,న అదర్శి =చూపబడలేదు. తథాహి = అది యుక్తమే. ఏల యనగా, తే = ఆ యక్షులు, తాం = ఆ దమయన్తిని, అధిక్షితి = భూమియందు, అవతీర్ణాం = ఉద్భవించిన, సురశాఖి పతివ్రతామ్; సురశాఖి =కల్పవృక్షము నకు బోలిన, పతివ్రతాం = పతియందలి యిచ్ఛనుఁబూరించుట యను వ్రతము గల్గిన (పక్షాన్తరమున) కల్పవృక్ష స్వరూపుఁడైన నలునికి భార్యయైన. కల్పవీరుధం =కల్పలతగ, నజానతేస్మకిం = తెలిసికొన లేదాయేమి ? బహుదానములు జేసెడి దమయన్తిని కల్పలతగనే తెలిసికొని రని యర్థము. లుబ్ధులై ధనమును దాచుకొను యక్షులను నతివదాన్యురాలైన దమయన్తి పరించు ప్రసక్తి యెక్కడిది ? ఈమె త్యాగశీలురాలుగాఁ బట్టి, యీమెనుఁ జూచుటకు వారికి లజ్జ యుక్తమైనదే.

**సమాసములు :**

కృతాఫల విత్తరక్షైః :– విత్తస్యరక్షా = విత్తరక్షా, అవిద్యమానం ఫలం యస్యాస్సా=అఫలా, అఫలాచసావిత్త రక్షా చ = అఫలవిత్తరక్షా. కృతా, అఫలవిత్తరక్షాయైస్తే=కృతా౽ఫలవిత్తరక్షాః తైః = కృతా౽ఫలవిత్తరక్షైః।

సురశాఖిపతివ్రతామ్ :– సురాణాం శాఖీ = సురశాఖీ. సురశాఖినాం పత్యురివవ్రతం యస్యాస్సా= సురశాఖిపతివ్రతా। తాం,సురశాఖిపతివ్రతామ్। పక్షాన్తరే - సురశాఖ్యేవ పతిః -సురశాఖిపతిః. సురశాఖిపత్యావ్రతం యస్యాస్సా -సురశాఖిపతివ్రతా, తామ్ -సురశాఖిపతివ్రతామ్।

కల్పవీరుధమ్ :- కల్పాచసా వీరుచ్చ-కల్పవీరుత్, తాం కల్పవీరుధమ్॥

అధిక్షితి :- క్షితౌ =అధిక్షితి.

భావము :

యక్షులు; దరిద్రులున్నను, తమ ధనమును వారికి దానముచేయక దాచు కొనునట్టిలుబ్ధులు. దమయన్తి యోభూలోకమునకు దిగివచ్చిన కల్పవృక్షము వంటి నలునిభార్యయై కల్పలతగా భాసిల్లుచున్నది. ఆమె దానధర్మము లచే దరిద్రులను కాపాడు వదాన్యురాలు. కాన నట్టి వదాన్యురాలును చూచు టకు సైతము యక్షులకు సిగ్గుకల్గినది. ఇఁక వారి సీమె పరించు ప్రసక్తి యెక్కడిది ? ॥౧౪॥

శ్లో. జన్యాః స్తతః ఫణభృతామధిపం సురౌఘా
న్మాఞ్జిష్ఠమఞ్జిమవిగర్హిపదౌష్ఠలక్ష్మీమ్.
తాం మానసం నిఖిలవారిఝురాన్నవీనా
హంసావళీమివ ఘనాః గమయామ్బభూవుః. 15

ప.వి. జన్యాః-తతః-ఫణభృతామ్- అధిపం- సురౌఘాత్-మాఞ్జిష్ఠ మఞ్జిమ విగర్హిపదౌష్ఠలక్ష్మీమ్-తాం-మానసం-నిఖిలవారిఝురాత్-నవీనాః-హంసావళీమ్-ఇవ-ఘనాః-గమయామ్బభూవుః.

అర్థము. తతః=అనన్తరము, జన్యాః=వధువైన దమయన్తి యొక్క భృత్యులు, మాఞ్జిష్ఠమఞ్జిమ విగర్హిపదౌష్ఠలక్ష్మీమ్; మాంజిష్ఠ=మఞ్జిష్ఠను పసుపు వంటి పదార్థముచే రంగుచేయఁబడిన వస్తువుయొక్క, మఞ్జిమ=అందము ను ననగా పసిమిని, విగర్హి=తిరస్కరించు, పదౌష్ఠ=పాదములు, పెదవులు, అను వీనియొక్క, లక్ష్మీ=శోభవంటి శోభఁగల్గిన, తాం=ఆదమయన్తిని; (లేదా)మఞ్జిమ= అందమును ననగా పసిమిని, విగాహి= స్ఫురింపజేసెడి, పదౌష్ఠ=పాదములయొక్కయు పెదవులయొక్కయు, లక్ష్మీం=శోభ, గల్గిన, తాం= ఆదమయన్తిని, నవీనాః= నూతనములైన, ఘనాః=మేఘములు. మాఞ్జిష్ఠమఞ్జిమ విగాహిపదౌష్ఠలక్ష్మీం; మాఞ్జిష్ఠ=మఞ్జిష్ఠతో రంగు వేయఁ బడిన వస్త్రాదులయొక్క, మఞ్జిమ=అందమును ననగా పసిమిని, విగాహి= స్ఫురింప జేసెడి, పదౌష్ఠలక్ష్మీం = పాదముల యొక్కయు, పెదవుల యొక్కయు, లక్ష్మీం=శోభగల్గిన. హంసావళీం=హంసలపజ్క్తిని, నిఖిల వారిఝురాత్; నిఖిల=సమస్తములైన, వారిఝురాత్=జలప్రవాహము నుండి,

మానసమివ=మానససరస్సునువలె సురౌఘాత్=దేవతల సంఘము నుండి (విడిపించి) ఫణభృతామ్ =పాములకు, అధిపం=ప్రభువైన వాసుకిని, గమయామ్బభూవు=పొందించిరి.

**సమాసములు :**

ఫణభృతామ్ :- ఫణంబిభ్రతీతి=ఫణభృతః, తేషాం=ఫణభృతామ్.

సురౌఘాత్ :- సురాణామోఘః = సురౌఘః, తస్మాత్=సురౌఘాత్.

మాఞ్జిష్ఠ మఞ్జిమవిగాహి పదౌష్ఠలక్ష్మీమ్ :- మఞ్జిష్ఠేనరక్తం=మాఞ్జిష్ఠమ్. మాఞ్జిష్ఠస్యమఞ్జిమా=మాఞ్జిష్ఠమఞ్జిమా, మాఞ్జిమఞ్జిమానం విగాహత ఇతి= మాఞ్జిష్ఠ మఞ్జిమవిగాహినీ, పదంచ ఓష్ఠంచ=పదౌష్ఠం, పదౌష్ఠస్యలక్ష్మీః= పదౌష్ఠ లక్ష్మీః,మాఞ్జిష్ఠ మఞ్జిమవిగాహినీ పదౌష్ఠలక్ష్మీః యస్యాస్సా = మాఞ్జిష్ఠ మఞ్జిమవిగాహిపదౌష్ఠలక్ష్మీః॥

నిఖిలవారిధురాత్:-వారిణాంధురః=వారిధురః, నిఖిలశ్చాసౌవారిధురశ్చ =నిఖిలవారిధురః, తస్మాత్=నిఖిలవారిధురాత్

హంసావలీమ్ :- హంసానామావలీ=హంసావలీ,తామ్=హంసావలీమ్॥

**భావము :**

దేవతల సంఘమున వరులను చూచిన పిదప భృత్యులు, మఞ్జిష్ఠ వర్ణము గల వస్త్రాదులయందమును స్ఫురింపఁజేయు పాదములతోడను పెదవుల తోడనుశోభించుచున్న దమయన్తిని అట్టి యందమును స్ఫురింపఁజేసెడి,హంసల శ్రేణిని నూతన మేఘములు మానస సరస్సునుఁ బొందించు విధమున వాసుకి యను సర్పరాజు కడకుఁ బొందించిరి. వర్షర్తువు రాగనే హిమాలయమందలి క్రౌఞ్చరన్ధ్రమునుండి హంసలు మానససరోవరమునుఁ బ్రవేశించుచున్నవి. లేనిచో నవి వర్షర్తువునందు నశించును. అట్లేదమయన్తిని భృత్యులు వాసుకి యొద్దకుఁ గొనిపోయిరని యాశయము ॥౧౩॥

శ్లో. యస్యా విభోరఖిలవాఙ్మయవిస్తరోఽయ
మాఖ్యాయతే పరిణతిర్మునిభిః పునః సః।
ఉద్గత్వరామృతకరార్ధపరార్ధ్య భాలాం
బాలామభాషత సభాసతతప్రగల్భా

ప.వి. యస్యాః- విభోః - అఖిలవాఙ్మయవిస్తరః - అయమ్ - ఆఖ్యాయతే - పరిణతిః- మునిభిః- పునః- సః- ఉద్గత్వరామృతకరార్ధపరార్ధ్యభాలాం- బాలామ్- అభాషత- సభాసతతప్రగల్భా-

అర్థము. అయం=ఈ, నిఖిలవాఙ్మయవిస్తరః; నిఖిల=సమస్తమైన, వాఙ్మయ= శబ్దములయొక్క,విస్తరః=ప్రపఞ్చము,మునిభిః=వేదవ్యాసాదిమహర్షులచే, విభోః = సర్వమును వ్యాపించిన శక్తి స్వరూపిణియగు, యస్యాః=ఏ సరస్వతికి, పరిణతిః=పరిణామముగా, అనగా మఱియొకరూపముగా ఆఖ్యాయతే = చెప్పఁబడుచున్నదో; సభా సతతప్రగాల్భా,సభా = సభల యందు సతత=నిరన్తరము, ప్రగల్భా = ప్రాగల్భ్యము కల్గిన, సా=ఆ సరస్వతీదేవి, ఉద్గత్వరామృత కరార్ధపరార్ధ్యభాలాం; ఉద్గత్వర= ఉదయించుచున్న, అమృతకర = చన్ద్రునియొక్క, అర్ధ=సగమువలె పరార్ధ్య=శ్రేష్ఠమైన, భాలాం=నొసలు గల్గిన, బాలాం=బాలయైన, దమయన్తినిఁ గూర్చి, పునః పునః = పలుమారు, అభాషత = పలికినది.

## సమాసములు :

అఖిలవాఙ్మయవిస్తరః ;— అఖిలంచ తత్ వాఙ్మయం చ = అఖిలవాఙ్మయం, అఖిలవాఙ్మయస్య విస్తరః=అఖిలవాఙ్మయ విస్తరః॥

ఉద్గత్వరామృత కరార్ధ పరార్ధ్య భాలామ్:- ఉద్గచ్ఛతీతి = ఉద్గత్వరః: ఉద్గత్వరశ్చాసౌ అమృతకరశ్చ=ఉద్గత్వరామృతకరః, ఉద్గత్వరామృత కరస్య అర్ధమ్ = ఉద్గత్వరామృతకరార్ధమ్, ఉద్గత్వరామృతకరార్ధమివ పరార్ధ్యమ్, ఉద్గత్వరామృత కరార్ధపరార్ధ్యమ్, ఉద్గత్వరామృతకరార్ధ పరార్ధ్యం భాలం యస్యాస్సా=ఉద్గత్వరామృత కరార్ధ పరార్ధ్యభాలా, తామ్, ఉద్గత్వరామృతకరార్ధపరార్ధ్య భాలామ్.

సభాసతతప్రగల్భా:- సతతంప్రగల్భా=సతతప్రగల్భా, సభాసుసతత ప్రగల్భా = సభాసతతప్రగల్భా.

**భావము :**

ఈ సాహిత్యరూపమైన శబ్దరాశి ప్రపఞ్చ మంతయు నా సరస్వతియొక్క పరిణామము. అనగా నా సరస్వతికి ఇంతియొక రూపమని ఋషులు చెప్పుదురు. సభలయందు ప్రాగల్భ్యము గల్గిన యీ సరస్వతి యువతియొక్క నాసిక వంటి నొసలు గల్గిన రూపమును పెద్దలు చెప్పుదురు ॥16॥

**శ్లో. ఆశ్లేషలగ్నగిరిజాకుచకుఙ్కుమేన**
**యః పట్టసూత్రపరిరమ్భణశోణశోభః।**
**యజ్ఞోపవీతపదవీం భజతే స్మ శంభోః**
**సేవాసు వాసుకిరయం ప్రసితః సితశ్రీః॥ 17**

ప.వి. ఆశ్లేషలగ్నగిరిజాకుచకుఙ్కుమేన—యః — పట్టసూత్ర పరిరమ్భణశోణ శోభః- యజ్ఞోపవీత పదవీం—భజతే-స్మ-శంభోః-సేవాసు - వాసుకిః- అయం-ప్రసితః—సితశ్రీః-

అర్థము. యః—ఏవాసుకి, ఆశ్లేషలగ్నగిరిజాకుచకుఙ్కుమేన; ఆశ్లేష—శరీరసంయోగముచే, లగ్న—అతికిన, గిరిజాకుచకుఙ్కుమేన—పార్వతికుచములపైని కుఙ్కుమము చేత, పట్టసూత్ర పరిరమ్భణశోణశోభః; పట్టసూత్ర—పట్టుదారమును, పరిరమ్భణ—కట్టుటచేతనో యనునట్లు, శోణశోభః—ఎఱ్ఱనిశోభ గల్గిన, వాడగుచు. శమ్భోః—శివునకు, యజ్ఞోపవీతపదవీం, యజ్ఞోపవీత—జందెముయొక్క, పదవీం — స్థానమును, భజతే — పొందుచున్నాడో, సేవాసు — శివునికిపరిచర్యల యందు, ప్రసితః—ఆసక్తిగల్గిన, సితశ్రీః—తెల్లనికాంతిని గల్గిన. సః—ఆవాసుకి, అయమ్—ఇదిగో నెదుటనున్నాడు. యజ్ఞోపవీతము తెల్లనిదిగనుండు, ముడియందునెఱ్ఱనిపట్టుదారము చుట్టబడి యుండునని ప్రసిద్ధి. ఆవాసుకియెల్లప్పుడు శివునికి బరిచర్య చేయుచుండునుగాన నతనితో సంభోగమునకవకాశము లేదు గావున నతడు పరిహర్తవ్యుడు గావని సూచితము.

**సమాసములు :**

ఆశ్లేషలగ్నగిరిజాకుచకుఙ్కుమేనః- ఆశ్లేషేణ లగ్నమ్ —ఆశ్లేషలగ్నమ్, గిరిజాయాః కుచౌ —గిరిజాకుచౌ, గిరిజాకుచయోః కుఙ్కుమమ్ —గిరిజాకుచ

కుఙ్కుమం, ఆశ్లేషలగ్నం చ తత్ గిరిజాకుచకుఙ్కుమం చ=ఆశ్లేషలగ్న
గిరిజాకుచకుఙ్కుమం. తేన=అశ్లేషలగ్నగిరిజాకుచకుఙ్కుమేన।
పట్టసూత్రపరిరమ్భణశోణశోభః:- పట్టమయం చ తత్ సూత్రం చ=పట్ట
సూత్రం, పట్టసూత్రస్య పరిరమ్భణం=పట్టసూత్రపరిరమ్భణం, పట్టసూత్ర
పరిరమ్భణేన శోణా=పట్టసూత్రపరిరమ్భణశోణా, పట్టసూత్రపరిరమ్భణ
శోణా శోభా యస్య సః=పట్ట సూత్రపరిరమ్భణశోణశోభః॥

యజ్ఞోపవీతపదవీం :- యజ్ఞోపవీతస్య పదవీ=యజ్ఞోపవీతపదవీ, తామ్=
యజ్ఞోపవీతపదవీమ్॥

సితశ్రీః :- సితా శ్రీః యస్య సః—సితశ్రీః

**భావము :**

ఈ వాసుకి శివునికి యజ్ఞోపవీతమై యతని శరీరమునంతటిని జుట్టు
కొనియుండుటవలన, శివునికర్ధాంగి యైన పార్వతి శరీరమును గూడ, జుట్టుకొని
యున్నాడు. పార్వతి తన చనుదోయికి కుఙ్కుమ పూవునలది యుండుటవలన నది
యావాసుకిశరీరమునకును నతికియున్నది. అందువలన నెఱ్ఱని పట్టుదారమును జుట్టి
నట్లు వాసుకి యెఱ్ఱని మైచాయగల్గియున్నాడు. యజ్ఞోపవీతము తెల్లగనున్నను
బ్రహ్మగ్రన్థిపైన నెఱ్ఱని పట్టుదారమును జుట్టెదరను ప్రసిద్ధి యున్నది. మఱియు
బ్రహ్మగ్రంథికి కుఙ్కుమమును బట్టించునాచారము గూడ గలదు. అట్టివాసుకి
రేయింబవలు శివునిపరిచర్యలో మునిగియుండుటవలన నాతనితో సంభోగమునకవ
కాశము లేనందువలన నాతడు వరింపదగిన వాడు కాడని తాత్పర్యము ॥౧౭॥

**శ్లో. పాణౌ ఫణీ భజతి కఙ్కణభూయమైశే**
**సోఽయం మనోహరమణీరమణీయమూర్తిః।**
**కోటీరబంధనధనుర్గుణయోగ పట్ట**
**వ్యాపారపారగమముం భజ భూతభర్తుః॥** **18**

ప.చ్ఛే. పాణౌ-ఫణీ-భజతి-కఙ్కణభూయమ్-ఐశే-సః-అయం -మనోహరమణీ
రమణీయమూర్తిః - కోటీరబన్ధనధనుర్గుణయోగ పట్టవ్యాపారపారగమ్-
అముం-భజ-భూతభర్తుః.

అర్థము. మనోహరమణీరమణీయమూర్తిం; మనోహర=రమ్యములైన, మణీ=రత్నములచే, రమణీయ=అందమైన, మూర్తిః=దేహముగల్గిన, సోఽయం, అట్టియీ, ఫణీ=వాసుకిసర్పము, పాణౌ=హస్తమందు, కఙ్కణభావం, వలయముగనుండుటను, భజతి = పొందును. భూతభర్తుః=శివునకు కోటీరబంధన ధనుర్గుణయోగపట్టవ్యాపారపారగమ్; కోటీర=జటాజూటమును, బంధన=బంధించుపట్టిసాధనమును, ధనుర్గుణ=వింటిత్రాడును యోగపట్ట= యోగాభ్యాసమున శరీరమునకు జుట్టు, యోగపట్టమునునువీని యొక్క, వ్యాపార=ఉనికికి, పారగం=నేర్పరియైన, అనగానాయాకార్యములయందు సమర్థతఁగల్గిన, అముం= ఈ వాసుకిని, భజ=పరించుము.

వి. ఇచ్చట నొక్కవాసుకికిఁ బెక్కు చోట్లనునికినిఁ జెప్పుటవలన పర్యాయాలంకారము-వాసుకి యేకకాలమందేప్రభావ విశేషముచేఁ బెక్కుచోట్లనున్నచో సముచ్చయాలంకారము-

**సమాసములు :**

కఙ్కణభూయమ్:-కఙ్కణస్య భావః=కఙ్కణభూయమ్, తత్=కఙ్కణభూయమ్।

మనోహరమణీరమణీమూర్తిః :- మనోహరాశ్చతాః మణ్యశ్చ=మనోహరమణ్యః, రమణీయాచసామూర్తిశ్చ=రమణీయమూర్తిః, మనోహరమణీభిః రమణీయమూర్తిః యస్యసః=మనోహరమణీరమణీయమూర్తిః.

కోటీరబన్ధన ధనుర్గుణయోగపట్టవ్యాపార పారగమ్ :- కోటీరస్యబన్ధనం=కోటీరబన్ధనం, ధనుషఃగుణః=ధనుర్గుణః, యోగస్యపట్టః=యోగపట్టః. కోటీరబన్ధనంచ, ధనుర్గుణశ్చ, యోగపట్టశ్చ=కోటీరబన్ధన, ధనుర్గుణ యోగపట్టాః, కోటీరబన్ధన ధనుర్గుణ యోగపట్టానాం వ్యాపారః= కోటీరబన్ధన ధనుర్గుణయోగపట్టవ్యాపారః, కోటీర బన్ధన ధనుర్గుణ యోగపట్ట వ్యాపారేపారగః= కోటీరబన్ధన ధనుర్గుణ యోగపట్ట వ్యాపారపారగః, తమ్= కోటీరబన్ధన ధనుర్గుణ యోగపట్ట వ్యాపార పారగమ్॥

భూతభర్తుః :- భూతానాం భర్తా=భూతభర్తా, తస్య=భూతభర్తుః.

**భావము :**

ఈ వాసుకి మనోజ్ఞములైన మణులతో రమ్యమైన దేహము గలవాఁడై శివునకు హస్తమున వలయముగ నున్నాఁడు. ఇంకను నతడు శివుని జటాజూటమునఁ జుట్టిముడి గానుండుట, యతని వింటికి నల్లెత్రాడుగానుండుట, యతనికి యోగిపట్టగా నుండుట యను పనులలో దక్షుఁడు. కాన నతనిని వరింపుము. ఇచ్చటఁగూడ శివునికి సంబంధించిన పనులలో నాతఁడు మునిగి యుండుట వలన నీతోటి సఙ్గమమున కతని కవకాశము లేదను గూఢార్థము సూచితమగుచున్నది. ॥౧౮॥

శ్లో. ధృత్వైకయా రసనయాఽమృతమీశ్వరేన్దోః
రప్యన్యయా త్వదధరస్య రసం ద్విజిహ్వః।
ఆస్వాదయన్ యుగపదేష పరం విశేషం
నిర్ణేతుమేతదుభయస్య యది క్షమః స్యాత్॥ **19**

ప వి. ధృత్వా - ఏకయా - రసనయా - అమృతమ్ - ఈశ్వరేన్దోః - అపి - అన్యయా - త్వదధరస్య - రసం - ద్విజిహ్వః - ఆస్వాదయన్ - యుగపత్ - ఏషః - పరం - విశేషం - నిర్ణేతుం - ఏతత్ - ఉభయస్య - యది - క్షమః - స్యాత్.

అర్థము:- ద్విజిహ్వః = రెండు నాలుకలుగల్గిన, ఏషఃపరం=ఈ వాసుకియే, ఏకయా=ఒకటైన, రసనయా = నాలుకచే, ఈశ్వరేన్దోః; ఈశ్వర = శివుని శిరస్సునందలి, ఇందోః=చంద్రుని యొక్క, అమృతం=అమృతమును, అన్యయా=మఱియొక నాలుకచే, త్వదధరస్య=నీ పెదవియొక్క, రసం=అమృతమును, ధృత్వా=పట్టుకొని, యుగపత్=ఏక కాలమందే, ఆస్వాదయన్=రుచినిఁ జూచుచు, ఏతదుభయస్య=ఈ రెంటియొక్క, విశేషం = భేదమును, నిర్ణేతుం = నిర్ణయించుటకు, క్షమః = శక్తుఁడుగా, యదిస్యాత్=అయినచో (వరింపనర్హుఁడు).

**సమాసములు :**

ఈశ్వరేన్దోః - ఈశ్వరస్య, ఇందుః=ఈశ్వరేన్దుః, తస్య, = ఈశ్వరేన్దోః.

ద్విజిహ్వః :- ద్వే జిహ్వే యస్యసః = ద్విజిహ్వః.

త్వదధరస్య :- తవ అధరః=త్వదధరః, తస్య = త్వదధరస్య.
ఏతదుభయస్య :- ఏతయోరుభయమ్=ఏతదుభయం, తస్య=ఏతదుభయస్య.

**భావము :**

ఆ వాసుకికి రెండు నాలుకలుగలవు. సర్పజాతి కంతటికిని రెండునాలుకలుండును. అతడు శివుని శిరమునందుండుటవలన నొక నాలుకచే నందలి చంద్రుని యమృతమును, మఱియొక నాలుకచే, యధరములోని యమృతమును నొక్క కాలమందే పానము చేయఁ గల్గి యమృతములకు రెంటికిని గల మచిభేదమునుఁ జెప్పఁగల్గియున్నచో; నాతనిని వరింపవలసినది. ॥౧౯॥

> **శ్లో. ఆశీవిషేణ రదనచ్ఛదదంశదాన**
> **మేతేన తే పునరనర్థతయా న గణ్యమ్।**
> **బాధాం విధాతుమధరే హి న తావకీనే**
> **పీయూషసారఘటితే ఘటతేఽస్య శక్తిః ॥ 20**

ప.వి. ఆశీవిషేణ- రదనచ్ఛదదంశదానమ్- ఏతేన- తే - పునః-అనర్థతయా- న-గణ్యమ్-బాధాం- విధాతుమ్- అధరే-హి-న- తావకీనే-పీయూషసారఘటితే-ఘటతే- అస్య-శక్తిః.

అర్థము. ఆశీవిషేణ=కోరలయందు విషముగల్గిన, ఏతేన=ఈ వాసుకి సర్పముచే, తేపునః=నీ యొక్కయో, అధరస్య = పెదవికి, దంశదానమ్ = కాటు వేయుట, అనర్థతయా=మరణహేతువుగా, నగణ్యమ్=లెక్కింపఁదగినది కాదు. హి=ఏలయనగా, పీయూషసారఘటితే; పీయూషసార=అమృతసారముతో, ఘటితే=నిర్మింపబడిన, తావకీనే=నీకు సంబంధించినదైన, అధరే=పెదవి యందు, బాధాం=కాటుచేబాధను, విధాతుం=చేయుటకు, అస్య=ఈ వాసుకికి, శక్తిః=శక్తి, నఘటతే=సంభవింపదు.

**సమాసములు :**

ఆశీవిషేణ:- ఆశిషి విషమస్యేతి=ఆశీవిషః, తేన=ఆశీవిషేణ.

రదనచ్ఛదదంశదానమ్ :- రదనానాం ఛదః = రదనచ్ఛదః, రదనచ్ఛదస్యదంశః=రదనచ్ఛదదంశః, రదనచ్ఛదదంశస్య దానం=రదనచ్ఛదదంశదానమ్ ।

అసర్థతయా :- అర్థోనభవతీతి = అనర్థః, అనర్థస్య భావః = అనర్థతా, తయా=అనర్థతయా ।

తావకీనే :- తవ అయం=తావకీనః. తస్మిన్=తావకీనే ।

పీయూషసారఘటితే- పీయూషస్యసారః=పీయూషసారః, పీయూషసారేణ ఘటితః=పీయూషసారఘటితః, తస్మిన్=పీయూషసారఘటితే।

**భావము:**

దమయన్తి ! కోరలలో విషముఁ గల్గిన వాసుకి, నీ పెదవిపై కాటు వేసినచో నది యపమృత్యువుఁ గల్గించునని భావింప వలదు. ఏలయనగా నీ పెదవి యమృత సారముతో నిర్మింపఁబడినది కాన దానిపై పాము కాటు పెట్టి బాధనుఁ గల్గింపఁ జాలదు. అమృతముతోఁ గూడినవానికి, విషభయమెట్లు కల్గును. ॥౨౦॥

**శ్లో. తద్విస్ఫురత్ఫణవిలోకనభూతభీతేః**
**కమ్పఞ్చ వీక్ష్య పులకఞ్చ తతోఽను తస్యాః।**
**సఞ్జాతసాత్త్వికవికారధియః స్వభృత్యాన్**
**నృత్యాన్న్యషేధదురగాధిపతిర్విలక్షః ॥ 21**

ప.వి. తద్విస్ఫురత్ఫణవిలోకనభూతభీతేః - కమ్పం-చ- వీక్ష్య-పులకం-చ- తతః-అను- తస్యాః - సఞ్జాతసాత్త్వికవికారధియః - స్వభృత్యాన్- నృత్యాత్-న్యషేధత్-ఉరగాధిపతిః-విలక్షః.

అర్థము :— తతోఽను = ఈ విధముగా సరస్వతి పలికిన పిదప, తద్విస్ఫురత్ఫణ విలోకనభూతభీతేః, తత్ = ఆవాసుకి యొక్క, విస్ఫురత్ = విప్పఁబడి చలించుచున్న, ఫణ = పడగ లను, విలోకన=చూచుటచే, భూత=కల్గిన, భీతేః=భయముతో గూడిన, తస్యాః=ఆ దమయన్తి యొక్క, కమ్పం=వణకును, పులకంచ=గగు

ర్పాటును, వీక్ష్య=చూచి, సఞ్జాతసాత్త్వికవికారధియః, సఞ్జాత=ఉద్భవించిన, సాత్త్వికవికార=శృఙ్గారమందలి సాత్త్వికభావములనెడి భ్రమను గల్గిన, స్వభృత్యాన్=తన సేవకులను, విలక్షః=దమయన్తి భావమునెఱింగి సిగ్గుఁజెందిన, ఉరగాధిపతిః=సర్పరాజైన వాసుకి, నృత్యాత్=ఆనన్దనాట్యము నుండి, న్యషేధత్=వారించెను.

వి. ఇచ్చట దమయన్తికి భయమువలనఁగల్గిన సాత్త్వికభావముల యందు, శృఙ్గార రససాత్త్వికభావ భ్రమగల్గినందువలన భ్రాన్తిమదలఙ్కారము.

**''స్తమ్భ ప్రలయ రోమాఞ్చాః స్వేదోవైవర్ణ్య వేపథూ**
**అశ్రువైస్వర్య మిత్యష్టౌసాత్త్వికాఃపరికీర్తితాః"**

అని సాత్త్వికభావము లెనిమిది తెలుఁగులుగనున్నవి.

**సమాసములు :**

తద్విస్ఫురత్ఫణవిలోకనభూతభీతేః :— విస్ఫురన్తశ్చతే ఫణాశ్చ=విస్ఫురత్ఫణాః, తస్యవిస్ఫురత్ఫణాః, తద్విస్ఫురత్ఫణాః, తద్విస్ఫురత్ఫణానాం విలోకనం=తద్విస్ఫురత్ఫణవిలోకనం, తద్విస్ఫురత్ఫణవిలోకనేన, భూతా=తద్విస్ఫురత్ఫణ విలోకన భూతా, తద్విస్ఫురత్ఫణ విలోకన భూతా, భీతిః యస్యాస్సా = తద్విస్ఫురత్ఫణ విలోకనభూత భీతిః, తస్యాః=తద్విస్ఫురత్ఫణవిలోకనభూతభీతేః.

సఞ్జాతసాత్త్వికవికారధియః :— సాత్త్వికైర్వికారాః=సాత్త్వికవికారాః. సాత్త్వికవికారేభ్యః ధీః సాత్త్వికవికారధీః. సఞ్జాతా, సాత్త్విక వికారధీః యే షాంతే=సఞ్జాత సాత్త్విక వికారధియః, తాన్=సఞ్జాతసాత్త్విక వికారధియః।

ఉరగాధిపతిః :- ఉరగాణామధిపతిః=ఉరగాధిపతిః

**భావము :**

సరస్వతీదేవి పైవిధముగా వాసుకినిఁ గూర్చి చెప్పిన మీదట యా వాసుకి యొక్క వేయిపడగలను చూచి భయపడిన దమయన్తికి శరీరమందు గగుర్పాటు మున్నగు సాత్త్వికభావము లేర్పడినవి. కాని వాసుకి భృత్యులు వానినిఁజూచి,

తమ ప్రభువగు వాసుకినిఁజూచుటచే దమయన్తికి ననురాగమేర్పడి దానివలనశ్శృఙ్గార సాత్త్వికభావము లేర్పడినవని భ్రాన్తి జెందిరి. దానిలో నృత్యములొనర్పుట కుపక్రమించిరి. అప్పుడు వాస్తవమెఱిగిన వాసుకి ఆ సాత్త్వికభావములు తననపవ గలనుఁ జూచి భయపడుట వలన నేర్పడినవే గాని తన్ను ప్రేమించుట వలన నేర్పడినవి గావని గ్రహించెను. ఆమె తన్నుఁ బ్రేమింపనందువలన నావాసుకి సిగ్గుపడిదమయన్తి తన్ను బ్రేమించిన దను భ్రమతో నానందనృత్యముల కుపక్రమించిన తన భృత్యులను వారించెను.

శ్లో. తద్దర్శిభిః స్వవరణే ఫణిభిర్నిరాశైః
నిఃశ్వస్య తత్కిమపి సృష్టమనాత్మనీనమ్।
యత్తాన్ ప్రయాతుమనసోఽపి విమానవాహా
హాహా! ప్రతీపపవనాశకునాన్న జగ్ముః ॥ 22

ప.వి. తద్దర్శిభిః- స్వవరణే-ఫణిభిః- నిరాశైః-నిఃశ్వస్య-తత్-కిమ్- అపి-సృష్టమ్ - అనాత్మనీనమ్- యత్- తాన్ - ప్రయాతుమనసః- అపి- విమానవాహాః -హా-హా-ప్రతీపపవనాశకునాత్-న-జగ్ముః.

అర్థము, తద్దర్శిభిః; తత్ = ఆ వాసుకియొక్క వృత్తాన్తమును, దర్శిభిః=చూచుచున్న(అతఏవ=ఇందువలననే)స్వవరణే=తమ్ములనువరించువిషయమున, నిరాశైః=ఆశనువదలుకొనిన, ఫణిభిః=కర్కోటకాదిసర్పములచే, నిఃశ్వస్య =నిట్టూర్పు వదలఁబడి, కిమపి=ఏదోచెప్పదగని, అనాత్మనీనం=తమకు హితముకానిది, సృష్టం=కల్పింపబడినది. యత్=ఏనిట్టూర్పువలన, తాన్= ఆ కర్కోటాది సర్పములనుద్దేశించి, ప్రయాతుమనసోఽపి=వెళ్లుటకు నిశ్చయించు కొనినవారైనను, విమానవాహాః=దమయన్తి పల్లకిని మోయువారలు, ప్రతీపపవనాశకునాత్; ప్రతీపపవన=ఎధురుగాలియనెడి, అశకునాత్=అపశకునమువలన, నజగ్ముః=వెళ్ళలేదు. హా హా=కష్టము కష్టము.

**సమాసములు :**

తద్దర్శిభిః :- తంపశ్యంతీతి=తద్దర్శినః, తైః=తద్దర్శిభిః,
స్వవరణే :- స్వేషాం వరణమ్=స్వవరణమ్. తస్మిన్=స్వవరణే.

అనాత్మనీనమ్:- ఆత్మనే హితమ్=ఆత్మనీనమ్ న ఆత్మనీనమ్=అనాత్మనీనమ్.

నిరాశైః :- నిర్గతా, ఆశా యేభ్యస్తే=నిరాశాః, తైః=నిరాశైః।

ప్రయాతుమనసః :- ప్రయాతుం మనః యేషాం తే=ప్రయాతుమనసః।

విమానవాహాః :- విమానం వహన్తి ఇతి=విమానవాహాః।

ప్రతీపపవనాశకునాత్ :- ప్రతీపశ్చాసౌ పవనశ్చ=ప్రతీపపవనః, న శకునమ్=అశకునమ్, ప్రతీపపవన ఏవ అశకునమ్=ప్రతీపపవనాశకునమ్, తస్మాత్=ప్రతీపపవనాశకునాత్।

**భావము :**

వాసుకి విషయమును చూచుచున్న కర్కోటాది సర్పములు, దమయన్తి తమ్ము వరించు నను విషయము నందాశను వదలుకొని నిట్టూర్పును వదలి యేదోయొక యవాచ్యమును జెప్పినవి. వారి నిట్టూర్పు నెదురు గాలిగా భ్రాన్తిపడిన విమానవాహకులు, వాసుకినిం జూచినపిదప నచ్చట అనగా, కర్కోటకాదిసర్పముల యొద్దకువెళ్ళం గోరియు, వారి నిట్టూర్పనెడి ఎదురు గాలి యపశకునమగుటవలన వారివైపునకు వెళ్ళుటను మానుకొనిరి. దమయన్తి తమ్ము వరించదను విషయమునందాశ వదులుకొనిన యా కర్కోటకాది సర్పముల నిట్టూర్పు ఎదురుగాలియంతటి తీవ్రముగాం బరిగెనిది. దానివలన నా సర్పములకు గల్గిన మనఃఖేదమెంత తీవ్రమో యూహింపందగును ॥౨౨॥

శ్లో. హ్రీసఙ్కుచత్ఫణగణా దురగప్రధానాత్
తాం రాజసఙ్ఘమనయన్త విమానవాహాః।
సన్ధ్యానమద్దలకులాత్కమలాద్వినీయ
కల్హారమిందుకిరణా ఇవ హాసభాసమ్॥ 23

ప.వి. హ్రీసఙ్కుచత్ఫణగణాత్-ఉరగ ప్రధానాత్-తామ్-రాజసంఘమ్-అనయన్త - విమానవాహాః - సన్ధ్యానమద్దలకులాత్-కమలాత్-వినీయ-కల్హారమ్-ఇన్దుకిరణాః-ఇవ-హాసభాసమ్.

అర్థము. విమానవాహాః=విమానము మోసెడివారలు, తామ్ = ఆదమయన్తిని, హ్రీ సఙ్కుచత్ఫణగణాత్; హ్రీ=సిగ్గుచే, సఙ్కుచత్=ముడుచుకొనిపోవు, ఫణగణాత్=పడగల సమూహము గల్గిన, ఉరగప్రధానాత్=సర్పము లకు రాజైన వాసుకినుండి, అపనీయ=తొలగించుకొని, ఇన్దుకిరణాః= చన్ద్రకిరణములు, హాసభాసం=వికాసశోభను, సన్ధ్యానమద్దలకులాత్;సన్ధ్యా= సాయంకాలపు సన్ధ్యయందు, నమత్ = ముకుళించు,దలకులాత్ = రేకుల సమూహము గల్గిన, కమలాత్=తామర పూవునుండి. కహ్లారమివ = కలువ పూవునువలె, రాజసంఘం=రాజసమూహమును, అనయన్త= పొందించిరి.

వి. కమలమువలె వాసుకిని, కలువ పూవువలె రాజసంఘమును బోల్చుట వలన నుపమాలఙ్కారము.

**సమాసములు :**

హ్రీసఙ్కుచత్ఫణగణాత్ :- ఫణానాం గణః ఫణగణః, హ్రియాసఙ్కుచన్,ఫణగణః యస్యసః=హ్రీసఙ్కుచత్ ఫణగణః,తస్మాత్=హ్రీసఙ్కుచత్ఫణగణాత్ .

రాజసఙ్ఘమ్ :- రాజ్ఞాం సఙ్ఘః=రాజసఙ్ఘః, తమ్=రాజ సఙ్ఘమ్.

విమానవాహాః :- విమానస్య వాహాః=విమానవాహాః.

సన్ధ్యాన మద్దల కులాత్ :- సన్ధ్యాయాం నమత్=సన్ధ్యానమత్, దలానాం కులం= దలకులమ్, సన్ధ్యానమత్, దలకులం యస్యతత్=సన్ధ్యాన మద్దలకులమ్, తస్మాత్ = సన్ధ్యాన మద్దలకులాత్.

ఇన్దుకిరణాః :- ఇన్దోః కిరణాః=ఇన్దుకిరణాః.

హాసభాసమ్ :- హాసస్యభాః=హాసభాః, తామ్=హసభాసమ్.

**భావము :**

దమయన్తి తన్ను వరించ నందువలన, సర్పరాజగు వాసుకికి లజ్జచే పడగలు వాలిపోయినవి. అట్టి వాసుకిని వదలి, దమయన్తిని విమానవాహకులు, సంధ్యాకాలమున ముకుళించు పద్మము నుండి వికాసకాంతులను, కలువను బొందించెడి చన్ద్రకిరణములవలె,రాజసమూహమును బొందించిరి. అనగా వాసుకి

సంగతి ముగిసిన పిదప రాజులకడకు నామెను వారు గొనిపోయిరని యాశయము ॥౨౩॥

శ్లో. దేవ్యాఽభ్యధాయి భవ భీరుః ధృతావధానా
భూమీభుజః త్యజత భీమభువో నిరీక్షామ్।
ఆలోకితామపి పునః పిబతాం దృశైతా
మిచ్ఛాఽపగచ్ఛతి న వత్సరకోటిభిర్వః॥ **24**

ప.వి. దేవ్యా - అభ్యధాయి - భవ - భీరు - ధృతావధానా - భూమీభుజః— త్యజత - భీమభువః - నిరీక్షామ్ - ఆలోకితామ్ - అపి - పునః - పిబతాం - దృశా - ఏతామ్—ఇచ్ఛా - అపగచ్ఛతి - న - వత్సరకోటి భిః - వః.

అర్థము. దేవ్యా=సరస్వతీ దేవిచే, అభ్యధాయి = చెప్పఁబడినది (ఏమనగా) హేభీరు = ఓ భయ స్వభావముగల దమయన్తీ, ధృతావధానా; ధృత = ధరింఁపబడిన, అవధానా = గమనింపుఁ గలదానవు, భవ = కమ్ము, హేభూమీభుజః=ఓ రాజులారా! (యూయఞ్చ = మీరును) భీమభువః= దమయన్తియొక్క, నిరీక్షాం = దర్శనమును, త్యజత = విడువుఁడు. అనగా మీరు ఆమెనుఁ జూచినచో సిగ్గుతో నామె మిమ్ములనుఁ జూడదు. కాన మీరు అమెనుఁ జూచుటను మానుడని యర్థము. ఆలోకి తా మపి= మీచే చూఁడబడినను, ఏతాం=ఈమెను, పునః=మరల, దృశా=కంటిచే, పిలతాం=ఆదరముతోఁ జూచుచున్న, వః=మీకు, వత్సరకోటిభిః= పెక్కేండ్ల చేతను, ఇచ్ఛా=ఆమెనుఁ జూడఁ గోరిక, నాఽపగచ్ఛతి= తీరదు. కావున నా మాటను వినుఁడని యర్థము.

## సమాసములు :

ధృతావధానా :— ధృతమ్, అవధానం యయాసా=ధృతావధానా.

భూమీభుజః:- భుమీం భుఙ్తే ఇతి=భూమీ భుజః, తస్యసమ్బుద్ధిః=హేభూ మీభుజః॥

వత్సరకోటిభిః:- వత్సరాణాం కోటయః=వత్సర కోటయః, తాభిః=వత్స రకోటిభిః॥

**భావము :**

దమయన్తి రాజ సంఘమునుఁ జేరగనే సరస్వతీ దేవి యామెనుఁ గూర్చి యిట్లు చెప్పినది. ఓ దమయన్తీ? భయశీలా! జాగరూకతనుఁ గల్గి యుండుము. ఓ రాజులారా! దమయన్తినిఁ జూచుటను మానుడు! మీరు అమెనుఁ జూచినచో నామె సిగ్గుపడి మిమ్ములనుఁ జూడఁజాలదు. కావున నామెనుఁ జూడకుడు. ఒక్కతడవఁ జూచినను, మరల నామెను సాధరణముగాఁ జూడఁగోరుచున్న మీకు పెక్కేండ్లకుఁ గూడఁ గోరిక తీరదు. ॥౨౪॥

శ్లో. లోకేశకేశవశివానపి యశ్చకార
శృఙ్గారసాన్తరభృశాన్తరశాన్తభావాన్।
పఞ్చేన్ద్రియాణి జగతామిషుపఞ్చకేన
సఙ్క్షోభయన్ వితనుతాం వితనుర్ముదం వః॥ 25

ప.వి. లోకేశకేశవశివాన్- అపి-యః- చకార- శృఙ్గారసాన్తరభృశాన్తర శాన్తభావాన్- పఞ్చ- ఇన్ద్రియాణి- జగతామ్-ఇషుపఞ్చకేన-సఙ్క్షోభయన్- వితనుతామ్- వితనుః- ముదం—వః.

అర్థము. యః = ఏ మన్మథుఁడు, లోకేశ కేశవశివానపి; లోకేశ = బ్రహ్మ, కేశవ = విష్ణువు, శివానపి=శివుఁడు అనువారిని సైతము, శృఙ్గారసాన్తరభృశాన్తరశాన్తభావాన్; శృఙ్గార = శృఙ్గారరసముచే, సాన్తర = వ్యవధానముఁ బొందిన, భృశ = గాఢమైన, ఆన్తర = మానసికమైన, శాన్తభావాన్=శాన్తరసము గలవారినిగ, అనగా విరక్తుల ననురక్తులునుగా, చకార=చేసెనో, ఇషుపఞ్చకేన=అయిదుబాణములచే, జగతాం=లోకములయొక్క, పఞ్చేన్ద్రియాణి=ఇన్ద్రియములనైదింటిని, సఙ్క్షోభయన్=కలత పఱచుచున్న, సః=ఆ, వితనుః=శరీరములేని మన్మథుఁడు, వః=మీకు, ముదం=హర్షమును,వితనుతాం=వర్ధిల్లఁ జేయునుఁగాక. ప్రపఞ్చవిజయముఁ గావించిన పూజ్యుఁడగు మన్మథుని ప్రసాద మెప్పటికి మెచ్చదగినది కాదా? అందఱికిని మెచ్చఁదగినదని యర్థము.

లను కారణముగాఁ గల్గిన యనగా రెండు అణువులచే నుద్భవించిన, ద్వ్యణుకమువంటి, ఉదరి=ఉదరముగల ఓ దమయన్తీ! అనగా, శృఙ్గారము నుద్దీపింపఁ జేయు కృశమైన యుదరముగలదానా! యని యర్థము. త్వం=నీవు, పుష్పేషుణా=పూవిల్తునిచే, ధ్రువం=సత్యముగా, ఇషువర్ష జప్తహుఙ్కార మన్త్రబలభస్మిత శాన్తి శక్తీన్; ఇషువర్ష = బాణవర్ష కాలమునందు, జప్త=జపియింపఁబడిన, హుఙ్కారమన్త్రబల=(కోపముచే, నుచ్చరింపఁబడిన) హుఙ్కార మనెడి మన్త్రము యొక్క బలముచే, భస్మిత = భస్మము గావింపఁబడిన, శాన్తి శక్తీన్; శాన్తి = ఇంద్రియ నిగ్రహమందలి, శక్తీన్ = శక్తులుగల, ద్వీపాధిపాన్ = పుష్కరము మున్నగు ద్వీపమునుఁ బాలించెడి, అమూన్ = ఈ రాజులను, నయ నయోః=నేత్రములకు, గోచరత్వం=విషయత్వమును, నయ=పొందింపుము, అనగా ద్వీపాన్తరముల నుండి వచ్చిన రాజులనుఁ జూడుమని యర్థము.

## సమాసములు :

పుష్పేషుణా :- పుష్పాణి ఇషవః యస్యసః = పుష్పేషుః, తేన=పుష్పే షుణా।

ఇషువర్ష జప్తహుఙ్కారమన్త్ర బల భస్మితశాన్తిశక్తీన్ :- ఇషూణాం వర్షమ్=ఇషువర్షమ్, ఇషువర్షే జప్తః = ఇషువర్ష జప్తః. హుఙ్కారఏవ మన్త్రః=హుఙ్కారమన్త్రః, ఇషువర్షజప్తశ్చాసౌ హుఙ్కారమన్త్రశ్చ =ఇషువర్ష జప్త హుఙ్కారమన్త్రః, ఇషువర్షజప్తహుఙ్కారమన్త్ర స్యబలమ్ = ఇషువర్ష జప్త హుఙ్కారమన్త్ర బలమ్, ఇషువర్ష జప్త హుఙ్కారమన్త్రబలేన భస్మితా=ఇషువర్షజప్త హుఙ్కారమన్త్ర బల భస్మితా, ఇషువర్షజప్తహుఙ్కారబలభస్మితాచసాశాన్తిశ్చ =ఇషువర్షజప్త హుఙ్కారమన్త్ర బలభస్మిత శాన్తిః, ఇమవర్ష జప్త హుఙ్కార మన్త్ర బలభస్మితశాన్తౌ శక్తిః యేషాంతే=ఇషువర్షజప్తహుఙ్కారమన్త్ర బలభస్మిత శాన్తి శక్తయః, తాన్=ఇషువర్షజప్త హుఙ్కారమన్త్ర బల భస్మితశాన్తి శక్తీన్ ।

శృఙ్గారసర్గరసిక ద్వ్యణుకోదరి !:- శృఙ్గారస్యసర్గః=శృఙ్గారసర్గః, రసః అస్యఅస్తీతి=రసికమ్, శృఙ్గారసర్గే రసికం=శృఙ్గారసర్గరసికమ్, ద్వౌ,

అణూ యస్య తత్=ద్వ్యణుకమ్,శృఙ్గారసర్గరసికంచ తత్ ద్వ్యణుకం చ=శృఙ్గారసర్గ రసిక ద్వ్యణుకం, శృఙ్గారసర్గరసిక ద్వ్యణుకమివ ఉదరం యస్యాః సా=శృఙ్గారసర్గ రసికద్వ్యణోదరీ, తస్యాః సమ్బుద్ధిః, హే శృఙ్గారసర్గరసిక ద్వ్యణుకోదరి!

ద్వీపాధిపాన్ :- ద్విర్గతాః ఆపః యేషాంతే=ద్వీపాః, ద్వీపానామధిపాః=ద్వీపాధిపాః, తాన్=ద్వీపాధిపాన్।

గోచరత్వమ్ :- గోచరస్య భావః = గోచరత్వమ్, తత్=గోచరత్వమ్।

**భావము :**

ప్రపంచ సృష్టి ద్వ్యణుకాదులతో ప్రారంభింపఁబడునని తార్కికులు చెప్పుదురు. అట్లే ప్రకృతము శృఙ్గారసృష్టికి కారణములు గా నిట ద్వ్యణుకాదులు కావలయును గదా. ఇచ్చట దమయన్తి యుదరమే ద్వ్యణుకమని భావింప వలయును. ఆమె యుదరము ద్వ్యణుకమెంత సూక్ష్మమో అంత సూక్ష్మమైనదని యాశయము. ద్వ్యణుకమనగా-రెండు అణువులతో నుద్భవించినది. అట్లే మూడు ద్వ్యణుకములతో నుద్భవించినది త్ర్యణుకమని చెప్పఁబడును. ఇట్లే చతురణుకాదుల నూహించునది. అణువనగా-

**జాలసూర్యమరీచిస్థం యత్సూక్ష్మం దృశ్యతే రజః**
**తస్య షష్ఠతమో భాగః పరిమాణుర్నిగద్యతే॥**

యనెడి లక్షణము ననుసరించి గవాక్షమందలి సూర్యకిరణములలోఁ గానవచ్చెడి సూక్ష్మకణము నందు నారవ భాగము. అట్టి సూక్ష్మమైన యుదరము గల్గి యుండుట యుత్తమ స్త్రీ లక్షణము. అట్టి యుదరము గల యో దమయన్తీ! మన్మథుడు తాను బాణ వర్షమునుఁ జేయుకాలమున హుఙ్కార మన్త్రమును జపించుటవలన దాని బలముచే నిన్ద్రియ నిగ్రహ శక్తులు భస్మములగును. బాణ ప్రయోగకాలము నందు మన్త్రము నుచ్చరించుట సమ్ప్రదాయము. అట్లు నిగ్రహ శక్తినిఁ గోల్పోయిన, ద్వీపములను పరిపాలించెడి రాజు లిచ్చటికి విచ్చేసి యున్నారు. నీవు వారినిఁ జూడుమని సరస్వతీదేవి చెప్పినది. ॥౨౯॥

శ్లో. స్వాదూదకే జలనిధౌ నవనేన సార్ధం
భవ్యా భవన్తు తవ వారివిహారలీలాః।
ద్వీపస్య తం పతిమముం భజ పుష్కరస్య
నిస్తన్ద్రిపుష్కరతిరస్కరణక్షమాక్షి॥ 27

ప. వి. స్వాదూదకే- జలనిధౌ- నవనేన- సార్ధం- భవ్యాః — భవన్తు - తవ- వారివిహారలీలాః- ద్వీపస్య- తం- పతిమ్- అముం— భజ-పుష్కరస్య- నిస్తన్ద్రి పుష్కరతిరస్కరణక్షమాక్షి.

అర్థము. హే నిస్తన్ద్రిపుష్కర తిరస్కరణక్షమాక్షి! = వికసితములగు పద్మము లను తిరస్కరించుట యందు శక్తిగల నేత్రములతోఁ గూడిన యో దమ యన్తీ!, పుష్కరస్య=పుష్కరమను, ద్వీపస్య=ద్వీపమునకు, పతిం= పాలకుఁడైన, నవనుఁడను, అముం=ఈ రాజును. భజ = వరింపుము తతః=అందువలన, స్వాదూదకే=మధురజలము గల్గిన, జలనిధౌ=సాగ రము నందు, నవనేన సార్ధం=నవనునితోడ, తవ=నీకు, భవ్యాః=మనో హరములైన, వారి విహారలీలాః=జలక్రీడావిలాసములు, భవన్తు= ఉండునుగాక.

**సమాసములు :**

స్వాదూదకే :- స్వాదూని ఉదకాని యస్యసః=స్వాదూదకః, తస్మిన్= స్వాదూదకే.

జలనిధౌ :- జలానాం నిధిః=జలనిధిః, తస్మిన్=జలనిధౌ.

వారివిహారలీలాః :- వారిషు విహారాః = వారివిహారాః, వారివిహా రాణాం లీలాః, వారివిహారలీలాః.

నిస్తన్ద్రి పుష్కర తిరస్కరణ క్షమాక్షి :- నిర్గతా తన్ద్రా ఘయోస్తే= నిస్తన్ద్రే, నిస్తన్ద్రేచతే, పుష్కరేచ = నిస్తన్ద్రి పుష్కరే, నిస్తన్ద్రి పుష్కరయోః తిరస్కరణం=నిస్తన్ద్రి పుష్కర తిరస్కరణం, నిస్తన్ద్రి పుష్కర తిరస్కరణే క్షమే అక్షిణీ యస్యాస్సా=నిస్తన్ద్రి పుష్కరతిర స్కరణక్షమాక్షీ, తస్యాఃసమ్బుద్ధిః, హే నిస్తన్ద్రి పుష్కర తిరస్కరణ క్షమాక్షి.

**భావము :**

ఓ వికసిత పద్మనయనవైన దమయన్తి! "పుష్కర ద్వీపమునకుఁబాలకుడైన ఈ సవనుని వరింపుము. అందువలన మధురోదకములు గల సముద్ర మధ్యము నందతనితోడ జలక్రీడా వినోదము ననుభవింపఁ గలవు" అని సరస్వతీ దేవి దమయన్తినికి జెప్పినది ॥౨౭॥

శ్లో. సావర్త భావభవదద్భుతనాభికూపే
స్వర్భౌమ మేతదుపవర్తనమాత్మనైవ।
స్వారాజ్యమర్జయసి న శ్రియమేతదీయా
మేతద్గృహే పరిగృహాణ శచీవిలాసమ్॥ 28

ప.వి. సావర్త భావ భవ దద్భుతనాభికూపే-స్వః - భౌమమ్-ఏతదుపవర్తనమ్-ఆత్మనావేవ-స్వారాజ్యమ్-అర్జయసి - న- శ్రియమ్-ఏతదీయామ్-ఏతద్గృహే- పరిగృహాణ-శచీవిలాసమ్.

అర్థము :- సావర్త భావ భవదద్భుత నాభికూపే!; సావర్త భావ = ఆవర్తముతో అనగా రోమముల సుడితోడను ఉదకముల సుడి తోఁడను, భవత్= ఉప్పవించిన, అద్భుత=ఆశ్చర్యకరమైన. నాభికూపే=నాభియనెడు బావి గలదానా! ఏతదుపవర్తనం; ఏతత్ = ఈ సవనుని యొక్క, ఉపవర్తనం=దేశము, ఆత్మనైవ = స్వయముగనే, భౌమం = భూమియందుద్భవించిన, స్వః=స్వర్గము. అతః=ఇందువలన, ఏతదీయాం=ఇతనికిసంబంధించిన, శ్రియం = ఐశ్వర్యమైన, స్వారాజ్యం=స్వర్గలోక రాజ్యమును, నార్జయసి (కిం)? = సంపాదింపవా యేమి? తప్పక సంపాదింపఁగలవు. ఏతద్గృహే=ఈతని యింటి యందు, శచీవిలాసం = శచీదేవి యొక్క లీలను, గృహాణ = గ్రహింపుము.

వి. ఇతని దేశమే స్వర్గము. ఇతని రాజ్యమే స్వర్గ లోక రాజ్యము. ఇతడే యింద్రుఁడు నీవు శచీదేవివి - యని నిరూపించుట వలన రూపకాలఙ్కారము.

**సమాసములు :**

హే సావర్త భావ భవదద్భుత నాభికూపే:- ఆవర్తేన సహవర్తత ఇతి= సావర్తః, సావర్తస్య భావః=సావర్త భావః, సావర్త భావేన భవతీతి = సావర్తభావ భవత్, సావర్త భావభవత్ అద్భుతం యస్మాత్సః=సావర్త భావభవదద్భుతః, నాభిరేవకూపః=నాభికూపః, సావర్తభావభవదద్భుతః, నాభికూపః యస్యాస్సా=సావర్తభావ భవదద్భుత నాభికూపా, తస్యాస్సం బుద్ధిః, హే సావర్త భావ భవదద్భుతనాభికూపే! ॥

భౌమమ్ :- భూమౌభవం = భౌమం.

ఏతదు పవర్తనమ్ :- ఏతస్య ఉపవర్తనమ్ = ఏతదు పవర్తనమ్

స్వారాజ్యం :- స్వః రాజ్యం = స్వారాజ్యం, తత్=స్వారాజ్యమ్.

ఏతదీయాం :- ఏతస్య ఇయం=ఏతదీయా, తామ్, ఏతదీయామ్.

ఏతద్గృహే :- ఏతస్యగృహమ్=ఏతద్గృహమ్, తస్మిన్=ఏతద్గృహే.

శచీ విలాసమ్ :- శచ్యాః విలాసః=శచీవిలాసః, తమ్=శచీవిలాసమ్.

**భావము :**

సుడితోఁ గూడి యాశ్చర్యముఁ గొల్పునాభి యనెడి కూపము గల దమయన్తీ! ఈ నవనుని దేశము భూలోకస్వర్గము. ఈతని నీవు వరించి యీతని స్వర్గ రాజ్యలక్ష్మిని సంపాదింపవా? తప్పక సంపాదింతువు. ఇతని యింట నీవు శచీదేవి యొక్క సౌభాగ్యమునుఁ బడయుదువు. ఇతని దేశము స్వర్గమైనప్పుడితడు ఇంద్రుడే యగును. ఇతని రాజ్యము స్వారాజ్యమగును. అందువలన నీవు ఇతని యింట శచీదేవివై యుందువు. దమయన్తి నాభి, బావివలె లోతై, వెంట్రుకల సుడితోఁ గూడియున్నది. బావితో రూపించుట వలన, బావియందు నీళ్ళసుడిని గ్రహింపవలయును. బావియందు నీళ్ల సుడియుండుట యాశ్చర్యము కదా! ఇట్లు వెంట్రుకల సుడిని గల్గియుండుట యుత్తమ స్త్రీ లక్షణమని యాశయము. ॥౨౮॥

శ్లో॥ **దేవః స్వయం వసతి తత్ర కిల స్వయంభూ**
**ర్వైశ్రోధమణ్డలతలే హిమశీతలే యః।**
**స త్వాం విలోక్య నిజశిల్పమనన్యకల్పం**
**సర్వేషు కార్యషు కరోతు కరేణ దర్పమ్॥** **29**

ప. వి. దేవః- స్వయం-వసతి- తత్ర-కిల-స్వయం భూః-న్యగ్రోధమణ్డలతలే-
హిమశీతలే- యః-సః- త్వాం-విలోక్య- నిజశిల్పమ్- అనన్య కల్పమ్-
సర్వేషు- కారుషు-కరోతు-కరేణ- దర్పమ్.

అర్థము- తత్ర = ఆ పుష్కర ద్వీపమందు, హిమశీతలే = మంచుచే చల్లనైన, న్యగ్రోధ మణ్డలతలే, న్యగ్రోధ =మఱ్ఱిచెట్టు యొక్క, మణ్డలతలే =మణ్డలా కారమైన దిగువభాగమును నందు, స్వయంభూః = స్వయముగ నుద్భవించిన, దేవః =బ్రహ్మ, స్వయం=స్వయముగా, వసతికిల = నివసించు చున్నాఁడు గదా! సః= ఆ బ్రహ్మదేవుఁడు, అనన్యకల్పం=అనితర సాధారణమైన, నిజశిల్పం = తన నిర్మాణమైన, త్వాం = నిన్ను, విలోక్య = చూచి, సర్వేషు = సకలురైన, కారుషు = శిల్పుల యందు, కరేణ = తన హస్తమునుఁజూపుటచే, దర్పం=గర్వమును, కరోతు=చేయునుఁగాక. నా కంటె నితరులగు శిల్పులకిట్టి నిర్మాణకౌశలములు గల హస్తములేదని చెప్పుచు తన హస్తముఁజూపి గర్వమునుఁ బొందునని యర్థము.

**సమాసములు :**

స్వయం భూః:- స్వయం భవతీతి=స్వయం భూః.

న్యగ్రోధమణ్డలతలే:- న్యగ్రోధస్యమణ్డలం =న్యగ్రోధమణ్డలమ్, న్యగ్రోధ మణ్డలస్యతలమ్ =న్యగ్రోధమణ్డలతలమ్ - తస్మిన్ =న్యగ్రోధమణ్డలతలే.
హిమశీతలే :- హిమేనశీతలమ్=హిమశీతలమ్, తస్మిన్=హిమశీతలే.
నిజశిల్పమ్:- నిజంచ తత్ శిల్పం చ=నిజశిల్పమ్, తత్=నిజశిల్పమ్.
అనన్యకల్పమ్:- అన్యేన సదృశమ్ = అన్యకల్పమ్, అన్యకల్పమ్, న భవతీతి=అనన్యకల్పమ్, తత్=అనన్యకల్పమ్.

**భావము :**

బ్రహ్మ ఆ పుష్కర ద్వీపమునందు ఒక మఱ్ఱిచెట్టు క్రింద స్వయముగా నావిర్భవించి నివసించుచున్నాఁడు. ఆ ప్రదేశము మంచుచేఁ జల్లనై యుండును. అద్వితీయమగు నతని సృష్టియైన నిన్నుఁ జూచి యా బ్రహ్మదేవుఁడు, సకల శిల్పుల హస్తముల యందును, తన హస్తములోని నిర్మాణ కౌశలములేదని

చెప్పుచు, తన హస్తమునుఁజూపి గర్వమును వహించును. అనగా నీ సృష్టి బ్రహ్మకు కీర్తినిఁ దెచ్చునట్టి దని యాశయము॥౨౯॥

శ్లో. న్యగ్రోధనాదివ దివః పతదాతపాదే
ర్న్యగ్రోధమాత్మభరధారమివావరోహైః।
తం తస్య పాకి ఫలనీలదలద్యుతిభ్యాం
ద్వీపస్య పశ్య శిఖిపత్త్రజమాతపత్త్రమ్. **30**

ప. వి. న్యగ్రోధనాత్—ఇవ-దివః-పతదాత పాదేః-న్యగ్రోధం—ఆత్మభరధారమ్-ఇవ- అవరోహైః- తం- తస్య- పాకిఫలనీలదల ద్యుతిభ్యాం- ద్వీపస్య-పశ్య- శిఖిపత్రజమ్-ఆతపత్రమ్.

అర్థము. దివః = ఆకసము నుండి, పతదాతపాదేః, పతత్ = పడుచున్న, ఆత పాదేః = ఎండవానలు మున్నగువానిని, న్యగ్రోధనాదివ, న్యక్ = దిగువకు, వాలిం రోధనాదివ = వారించుట చేతనో యని, న్యగ్రోధం = న్యగ్రోధ శబ్దమునకర్థ మైనదియును. తథా = అట్లే, అవరోహైః—దిగువకు వాలినయూడలచే, ఆత్మభారధారమ్; ఆత్మ—తన యొక్క, భార = భారమును, ధారమివ—ధరించుచున్నదో యనునట్లున్న దియు, (అనగా, యా వటవృక్షము తన యూడలచేఁ గ్రిందికి ఊని తన భారమును మోయుచున్నట్లు కానవచ్చుచున్నదని యర్థము.) (మఱియు) పాకిఫలనీలదళద్యుతిభ్యాం; పాకి = పండిన, ఫల—ఫలముల యొక్కయు, నీలదళ = నీలపుటాకుల యొక్కయు, ద్యుతిభ్యాం = కాంతులతో, అనగా ఫలముల యెఱ్ఱని కాన్తితోఁడను, ఆకుల పచ్చని కాన్తితోడను, తస్య ద్వీపస్య = ఆ పుష్కర ద్వీపమునకు, శిఖిపత్రజం—నెమలి పింఛము వలన నేర్పడిన, ఆతపత్రం = గొడుగుగా, తం—ఆ చెట్టును, పశ్య—చూడుము.

వి : ఆతపాదులను వారించుటచే న్యగ్రోధమను పేరు రాకపోయినను, వచ్చి నట్లు చెప్పుటవలన నొక యుత్ప్రేక్ష- అట్లే మఱ్ఱియూడలు భారమును మోయుటకై భూమి నూనుటకై యేర్పడిన కొమ్మలు కాకపోయినను నైనట్లు చెప్పుట మఱియొక్క యుత్ప్రేక్ష. ఈ రెంటికిని సఙ్కరము,

ఆ వృక్షము నెమలి కుంచెల గొడుగు కాకపోయినను, అట్టి గొడుగుగాఁ జెప్పుటవలన నదియును నుత్ప్రేక్ష. పైరెంటిలో దీనికి సజాతీయ సంసృష్టి. వ్యఙ్జకమగు నివశబ్దమునుఁ బ్రయోగించినందు వలన నివి యన్నియు వాచ్యములు.

**సమాసములు :**

న్యగ్రోధనాత్ -న్యగ్ రోధనం=న్యగ్రోధనం, తస్మాత్=న్యగ్రోధనాత్.
పతదాతపాదేః :- పతంశ్చాసౌ ఆతపశ్చ=పతదాతపః, పతదాతపః ఆదిః యస్యసః=పతదాతపాదిః, తస్య=పతదాతపాదేః.
ఆత్మభరధారమ్ :-ఆత్మనః భరః = ఆత్మభరః, ఆత్మభరం ధరతీతి= ఆత్మభరధారః, తమ్=ఆత్మభరధారమ్
పాకిఫల నీలదల ద్యుతిభ్యామ్ :- పాకః ఏషామస్తీతి=పాకీని, పాకీని చ తాని ఫలాని చ=పాకిఫలాని, నీలాని చ తాని దళాని చ=నీలదళాని. పాకిఫలాని చ, నీలదళాని చ=పాకిఫల నీలదలాని, పాకిఫల నీల దలానాం ద్యుతీ=పాకి ఫల నీలదద్యుతీ, తాభ్యాం = పాకిఫల నీల ద్యుతిభ్యామ్.
శిఖిపత్రజమ్ :- శిఖినః పత్రాణి=శిఖి పత్రాణి, శిఖిపత్రేభ్యః జాయత ఇతి=శిఖి పత్రజమ్, తత్=శిఖి పత్రజమ్.
ఆత పత్రమ్ :- ఆతపాత్ త్రాయత ఇతి=ఆత పత్రమ్.

**భావము :**

ఆ మఱ్ఱి చెట్టు ఆకాశము నుండి పడెడి యెండ వానలను క్రిందనుండి యవరోధించుట వలన న్యగ్రోధమను పేరు వడసినది. భూమి తగిలి వ్రేలాడెడియూడలచే నా వృక్షము భు మిపైననిలచి యూడలనెడి కొమ్మల నేల నదిమి పట్టుకొని తన్నుఁబడనీయక నిలచినట్లు కానవచ్చును. ఇంకను నా మఱ్ఱిచెట్టు ఎఱ్ఱనిపండ్లచేతను నీలపుటాకుల చేతనుఁ గూడినదై యెఱుపు కాన్తులతో నా ద్వీపమునకునెమలి యీకలతో, నిర్మింపఁ బడిన నానా వర్ణములుగల గొడుగుగాఁ గానవచ్చు చున్నది. అట్టి మఱ్ఱిచెట్టునుఁ తిల కింపుము. ఇచ్చటి రాజునుఁ బరిణయ మాడినచో నిట్టి యద్భుతము లగు ప్రకృతి దృశ్యములను జూడ గలవు. అని సరస్వతీ దేవి, దమయన్తికిఁ జెప్పు చున్నది ॥౩౦॥

శ్లో. న శ్వేతతాం చరతు వా భువనేషు రాజ
హంసస్య న ప్రియతమా కథమస్య కీర్తిః।
చిత్రం తు తద్విశదిమాద్వయమాదిశన్తీ
క్షీరఞ్చ నాఽమ్బు చ మిథః పృథగాతనోతి॥ 31

ప.వి. న-శ్వేతతాం- చరతు- వా-భువనేషు- రాజహంసస్య- న-ప్రియతమా- కథమ్-అస్య- కీర్తిః-చిత్రం- తు-తత్-విశదిమాద్వయమ్- ఆదిశన్తీ- క్షీరం-చ-న-అమ్బు-మిథః-పృథగ్-ఆతనోతి.

అర్థము. రాజహంసస్య=రాజశ్రేష్ఠుఁడైన, అస్య= ఈ నపనుని యొక్క, ప్రియతమా=మిక్కిలి యిష్టమైన, కీర్తిః=కీర్తి, పక్షాన్తరమున-రాజ హంసస్య = కలహంస యొక్క, కీర్తిః = కీర్తివలె శుభ్రమైన, ప్రియతమా=మిక్కిలి ప్రియురాలైన యాడుహంస, కథం=ఎట్లు, నశ్వేతతాం=తెల్లనిది కాదు. తప్పక తెల్లనిదే యగును. భువనేషు= లోకములయందును, జలములయందును, కథం వా=ఎట్లు, న చరతు= చరింపదు. తు=కాని, విశదిమాఽద్వయం=ధావల్యమునకు ఏకత్వమును, ఆదిశన్తీ=కల్పించుచున్న (కీర్తిః=కీర్తి) క్షీరం చ=పాలను, అంబు చ= నీటిని, మిథః=పరస్పరము, పృథక్=వేఱుగా, నాతనోతి ఇతియత్= చేయుట లేదనుట యేదిగలదో, తత్=అది, చిత్రమ్=ఆశ్చర్యము. హంసలకు పాలను నీటిని వేఱుపఱచుట జాతి ధర్మమైనను, దానిని కీర్తి హంసి, చేయకపోవుట విరుద్ధము. అనగా పాలను నీటిని విభజించి పాలను పాలరంగునందును, నీటిని నీటిరంగునందునను నుంచక, పాలను నీటిని రెంటిని తెల్లగనే యుంచినదని యర్థము. ఇది విరుద్ధము.

వి. కీర్తి హంసియైనను, పాలను నీటినివేఱుపఱచి, పాలను పాలరంగునం దును, నీటిని నీటిరంగునందున నుంచక రెంటిని నొక్కరంగునందే యుంచుట వలన విరోధాభాసాలఙ్కారము. కీర్తి ధావళ్యమువలన నీరు గూడ పాలవన్నెలో నుండినదని చెప్పుటచే పరిహారము.

"విశదిమాద్వయమాదిశన్తీ" అనుచోట ప్రపఞ్చమును తెలుపుగా జేయుచున్నదని చెప్పుటచే సామాన్యాలఙ్కారము.

పాలకు నీటికిని భేదము తెలియకపోవుటకు, విశదిమాద్వయము కారణము గాన పదార్థహేతుక కావ్యలిఙ్గాలఙ్కారము.

శ్లిష్టములగు రాజహంస భువన ప్రియతమా కీర్తి శబ్దములు శ్లేష మహిమచే నప్రస్తుతములైన రాజహంస తత్ప్రియావృత్తములనుస్ఫురింపఁ జేయుటవలన సమాసోక్త్యలఙ్కారము. ఇట్లు సామాన్య-కావ్యలిఙ్గ-సమాసోక్త్యలఙ్కారములచే సఙ్గాఙ్గీభావముతో, విరోధాభాసాలఙ్కారమునకు సఙ్కరము.

**సమాసములు :**

రాజహంసస్య :- రాజాహంస ఇవ=రాజహంసః । పక్షాన్తరమున-హంసానాం రాజా=రాజహంసః ।

ప్రియతమా :- అత్యంతంప్రియా=ప్రియతమా ।

విశదిమాఽద్వయం :- విశదిమ్నః=అద్వయం = విశదిమాఽద్వయం తత్=విశదిమాద్వయమ్ ।

**భావము :**

రాజశ్రేష్ఠుఁడైన నవనునికి మిక్కిలి ప్రియమైన కీర్తి (కలహంసకు కీర్తిరూపమును వహించిన ప్రియురాలుగా) ఎట్లు తెల్లఁదనమును వహింపదు. తప్పక వహించును. భువనములయందు (లోకములయందు నీళ్ళయందును) కీర్తియు కీర్తిరూపము గల హంసయునెట్లు సంచరింపదు. తప్పక సంచరింపఁగలదు. కీర్తి లోకములయందు సంచరించును. హంస నీటియందు సంచరించును. కాని ప్రపంచమునంతయుఁ దెల్లఁబఱచుచున్న యా కీర్తి (కీర్తిరూపమున హంస) పాలను, నీటిని స్వాభావికమగు తన శక్తితో వేఱు పఱచుట లేదే! ఇది యాశ్చర్యకరము. విరుద్ధము. ఇదియే నవన నృపతి యొక్క కీర్తిహంసలోని విశేషము. కేవలహంస క్షీరనీరములను వేఱుపఱచును గాని కీర్తిహంస తాను ధవళమైనందువలన ప్రపఞ్చమునంతటిని ధవళము చేయుటవలన క్షీరనీరములలోను నా ధావళ్యమే యేర్పడి, వాని విభాగము జరుగకపోయినదని విరోధ పరిహారము. ॥౩౦॥

శ్లో. శూరేఽపి సూరిపరిషత్ప్రథమార్చితేఽపి
శృఙ్గారభఙ్గిమధురేఽపి కలాకరేఽపి.
తస్మిన్నవద్యమియమాప తదేవ నామ
యత్కోమలం న కిల తస్య నలేతి నామ. 32

ప వి. శూరే-అపి-సూరిపరిషత్ప్రథమార్చితే-అపి- శృఙ్గారభఙ్గిమధురే- అపి-కలాకరే-అపి-తస్మిన్- అవద్యమ్- ఇయమ్-ఆప-తత్- ఏవ- నామ-యత్-కోమలం-న-కిల-తస్య-నలేతి-నామ.

అర్థము. ఇయం=ఈ దమయన్తి, శూరేఽపి=శూరుడైనను, సూరిపరిషత్ప్రథమార్చితేఽపి; సూరి పరిషత్=పణ్డితుల సభయందు, ప్రథమార్చితేఽపి=తొలుతఁ పూజింపఁబడినవాఁడైనను, శృఙ్గారభఙ్గిమధురేఽపి; శృఙ్గారభఙ్గి=శృఙ్గార విలాసముచే, మధురేఽపి=సుందరుఁడైనను, కలాకరేఽపి=సకల విద్యలకు నిధియైనను, తస్మిన్=ఆ నవస నృపతి యందు, కోమలంకిల=సుకుమారమైనదై, వినసింపైన, నలనామ=నలుఁడను పేరు, తస్య=ఆ నవసునికి, న ఇతియత్=లేకపోవుట యనున దేది గలదో, తదేవ=దానినే యనగా నలుని పేరు లేకపోవుట యను దానినే, అవద్యం=దోషముగా, ఆపనామ = గ్రహించినదిగదా. అనలత్వమునకంటె భిన్నమైనదేదియు, నప్రీతికారణము లేదు. అనలత్వమే, యప్రీతికి కారణము. నలునియందలి యనురాగము వలననే, నవనుని వంటి గుణశాలియగు రాజునుఁ గూడ నామె నిరాకరించినదని యర్థము.

**సమాసములు :**

సూరి పరిషత్ప్రథమార్చితే :- సూరీణాం పరిషత్=సూరి పరిషత్' ప్రథమమర్చితః = ప్రథమార్చితః, సూరి పరిషదాప్రథమార్చితః=సూరిపరిషత్ప్రథమార్చితః; తస్మిన్ = సూరి పరిషత్ప్రథమార్చితే ।

శృఙ్గారభఙ్గి మధురే :- శృఙ్గార స్యభఙ్గయః = శృఙ్గార భఙ్గయః, శృఙ్గార భఙ్గిభిః మధురః= శృఙ్గార భఙ్గి మధురః, తస్మిన్=శృఙ్గార భఙ్గి మధురే।

కలాకరే:- కలానామాకరః=కలాకరః, తస్మిన్=కలాకరే.

నలేతి:- నల ఇతి--నలేతి.

**భావము :**

ఆ నవసనృపతి, శూరుడైనను, పండిత సదస్సున ప్రథమ పూజితుఁడైనను, శృఙ్గారవిలాసములతోఁ జక్కనివాఁడైనను, కలలకు నిధియైనను, నా సవనసృపతియందు సుకుమారమైన "నల" యను నామములేక పోవుటయే దోషమై యాతని నామె యిష్టపడలేదు. నలుని యందలి యనురాగముచే గుణ వంతుడైన యా సవనుని వరింపదలచలేదు. ॥౩౨॥

శ్లో. భ్రూవల్లి కిఞ్చననికుఞ్చితమిఙ్గితం సా
లిఙ్గం చకార తదనాదరణస్య విజ్ఞా.
రాజ్ఞోఽపి తస్య తదలాభజతాపవహ్నే
శ్చిహ్నం బభూవ మలినచ్ఛవిభూమధూమః. 33

ప.వి. భ్రూవల్లికిఞ్చన నికుఞ్చితమ్-ఇఙ్గితం - సా -లిఙ్గం-చకార-తదనాద రణ్యస - విజ్ఞా - రాజ్ఞః - అపి-తస్య - తదలాభజ తాపవహ్నేః- చిహ్నంబ భూవ=మలినచ్ఛవిభూమధూమః.

అర్థము : విజ్ఞా=విజ్ఞురాలైన, సా=ఆదమయన్తి, భ్రూవల్లికిఞ్చన నికుఞ్చితం; భ్రూవల్లి = తీగెవంటి కనుబొమ్మయొక్క, కిఞ్చన = కొలదిపాటి, నికుఞ్చితం=ముడుచుట యనెడు, చేష్టితం=చేష్టను, తదనాదరణస్య; తత్= ఆ సవనునియందు, అనాదరణస్య = తిరస్కరణమునకు, ఇఙ్గితం = చేష్టను, లిఙ్గం=చిహ్నముగా, చకార=చేసినది. తస్య=ఆ, రాజ్ఞోఽపి= రాజునకును, మలినచ్ఛ విభూమధూమః; మలినచ్ఛవి=మలినకాన్తి యొక్క, భూమ=ఆధిక్యమనెడి, ధూమః=పొగ, తదలాభజ తాపవహ్నేః; తత్=ఆ దమయన్తి యొక్క, అలాభ=అప్రాప్తిచే నేర్పడిన, తాప = సంతాపమునకు కారణమైన, వహ్నేః=అగ్నికి, చిహ్నంబభూవ=గుఱుతైనది. అనగా హేతువైనది. అగ్ని నూహించుటకు ధూమము హేతువు కదా.

వి. కనుబొమ్మల ముడత యను హేతువుచే దమయంతి యందలి రాజానా౽ పరము, ఊహింపఁబడుట వలనను నవసనృపతి యొక్క శరీరమందలి వైవర్ణ్య మనెడి ధూమముచే నాతని హృదయమందలి సన్తాపాగ్ని యూహింపబడుటవలనను ననుమానాలఙ్కారములు.

**సమాసములు :**

భ్రూవల్లికిఞ్చననికుఞ్చితమ్:- భ్రూః వల్లీవ = భ్రూవల్లీ, కిఞ్చన నికుఞ్చితమ్ = కిఞ్చననికుఞ్చితమ్, భ్రూవల్ల్యాః కిఞ్చననికుఞ్చితం, భ్రూవల్లికిఞ్చననికుఞ్చితమ్, తత్ = భ్రూవల్లికిఞ్చననికుఞ్చితమ్॥

తదనాదరణస్య :- తస్మిన్ అనాదరణం = తదనాదరణం, తస్య = తదనాదరణస్య ।

తదలాభజతాపవహ్నేః :- తస్యాః అలాభః = తదలాభః, తదలాభేన జాయత ఇతి = తదలాభజః, తదలాభజశ్చాసౌతాపశ్చ = తదలాభజతాపః, తదలాభజతాపస్య వహ్నిః = తదలాభజతాపవహ్నిః, తస్య = తదలాభజతాపవహ్నేః.

చిహ్నీబభూవ :- అచిహ్నం చిహ్నంసమ్పద్యమానం బభూవ = చిహ్నీబభూవ ।

మలినచ్ఛవిభూమధూమః :- మలినాచసాఛవిశ్చ = మలినచ్ఛవిః, బహోర్భావః = భూమ. మలినచ్ఛవేః భూమ = మలినచ్ఛవిభూమ, మలినచ్ఛవిభూమైవ ధూమః = మలినచ్ఛవిభూమధూమః ।

**భావము :**

ఆ నవనరాజును నిరాకరించుటకు, ఆమె తన కనుబొమ్మలను ముడుచుటను చిహ్నముగాఁ జేసినది. ఆరాజున కతని హృదయమున, దమయన్తి లభించనందువలన కల్గిన తాపాగ్నికి, నతని శరీరమునందలి వైవర్ణ్య మనెడి పొగయే చిహ్నమైనది. ఎట్లు ధూమముచే నగ్ని యనుమానింపఁ బడునో యట్లే యారాజుయొక్క శరీరమందలి మలినవర్ణమనెడి ధూమమే యాతని హృదయమందలి సంతాపాగ్నికి లిఙ్గమైనదని యర్థము. దమయన్తి నవనన్పతిని వరింప నొల్ల నందుపలన నతడు సంతాపముఁ జెందెనని యాశయము. ॥33॥

శ్లో. **రాజాన్తరాభిముఖమిన్దుముఖీమథైనాం**
**జన్యాజనో హృదయవేదితయైవ నిన్యుః ।**
**అన్యానపేక్షితవిధౌ న ఖలు ప్రధాన**
**వాచాం భవత్యవసరః సతి భవ్యభృత్యే. 34**

ప.వి. రాజాన్తరాభిముఖమ్ — ఇన్దుముఖీమ్—అథ-ఏనాం—జన్యాజనాః-హృదయ వేదితయా - ఏవ-నిన్యుః - అన్యానపేక్షితవిధౌ -న-ఖలు-ప్రధానవాచాం-భవతి-అవసరః—సతి-భవ్యభృత్యే.

అర్థము. అథ=సవనునినిరాకరించినపిదప, జన్యాజనాః=సేవకజనులు, హృదయ వేదితయైవ=దమయన్తియొక్క చిత్తమును దెలుసుకొనినతోడనే, ఇన్దు ముఖీం=చన్ద్రవదనయైన, ఏనాం=ఈదమయన్తిని, రాజాన్తరాభిముఖం; రాజాన్తర=మఱియొకరాజునకు, అభిముఖం=ఎదురుగా, నిన్యుః =కొని పోయిరి. అన్యానపేక్షితవిధౌ, అన్య=ఇతరులు (యజమానులు), అన పేక్షిత=అపేక్షింపఁబడని, విధౌ=కార్యముగల్గిన, భవ్యభృత్యే=యోగ్యుఁ డైన భృత్యుడు, సతి=ఉండగా, ప్రధానవాచాం; ప్రధాన=యజమానుని యొక్క, వాచాం=మాటలకు, అనగా నాజ్ఞలకు, అవసరః=ఆవశ్యకత, నభవతి ఖలు=ఉండదు గదా !

వి. భృత్యులు దమయన్తి హృదయమునుఁ దెలిసినంతటనే యొకరి ప్రేరణ నపేక్షింపక, తమంతట తామే యామెను మఱియొక రాజునొద్దకుఁ గొని పోయిరను విశేషమును మంచిభృత్యులకు యజమానునితో నవసరము లేని పనులనుఁ జేయుటకు నాతని యాదేశమ నావశ్యక మను సామాన్య ముతో సమర్థించుట వలన నర్థాన్తరన్యాసాలఙ్కారము.

**సమాసములు :**

రాజాన్తరాభిముఖమ్ :- అన్యో రాజా న్తరమ్, రాజాన్తరస్య అభిముఖం యథా తథా=రాజాన్తరాభిముఖమ్ ।

ఇన్దుముఖీమ్:- ఇన్దురివముఖం యస్యాస్సా=ఇన్దుముఖీ. తాం=ఇన్దుముఖీమ్,

జన్యాజనాః :- జన్యా ఏవ జనాః=జన్యాజనాః.

హృదయవేదితయా :- విద స్తీతి = వేదిన్యః, వేదినీనాంభావః = వేదితా. హృదయస్యవేదితా, హృదయ వేదితా,తయా=హృదయ వేదితయా.

అన్యానపేక్షితవిధౌ :- న అపేక్షితాః=అనపేక్షితాః, అన్యేఅనపేక్షితాః యస్మిన్సః=అన్యానపేక్షితః, అన్యానపేక్షితశ్చాసౌవిధిశ్చ=అన్యానపేక్షిత విధిః, తస్మిన్=అన్యానపేక్షితవిధౌ.

ప్రధానవాచామ్ :- ప్రధానస్యవాచః = ప్రధానవాచః, తాసాం=ప్రధాన వాచామ్.

భవ్యభృత్యేః:- భవ్యశ్చాసౌభృత్యశ్చ=భవ్యభృత్యః,తస్మిన్=భవ్యభృత్యే.

**భావము :**

భృత్యులు దమయన్తి హృదయమునుఁ దెలిసికొన్న వెంటనే యొరుల ప్రేరణ లేకయే యామెను మఱియొక రాజునొద్దకుఁ గొనిపోయిరి. యజమానుల యపేక్ష లేని కార్యము చేయుటయందు దక్షులైన యోగ్యులకు భృత్యులగు యజ మానుల యాజ్ఞలనవసరము గదా ! ॥౩౪॥

**శ్లో. ఊచే పునర్భగవతీ నృపమన్యమస్యై**
**నిర్దిశ్య దృశ్యతమతావమతాశ్వినేయమ్ ।**
**ఆలోక్యతామయమయే కులశీలశాలీ**
**శాలీనతానతముదస్య నిజాస్యబిమ్బమ్. 35**

ప.వి. ఊచే - పునః-భగవతీ-నృపమ్-అన్యమ్-అస్యై-నిర్దిశ్య-దృశ్యతమతావ మతాశ్వినేయమ్ — ఆలోక్యతామ్ - అయమ్-అయే-కులశీలశాలీ-శాలీనతా నతమ్ - ఉదస్య - నిజాస్యబిమ్బమ్-

అర్థము. భగవతీ=పూజ్యురాలైన సరస్వతీదేవి, పునః=మరల, దృశ్యతమతావ మతాశ్వినేయమ్; దృశ్యతమతా = మిక్కిలిదర్శింపఁదగిన వాడగుట వలన, అనగా మిక్కిలి యందగాడగుటవలన, అవమత=తిరస్కరింపఁ బడిన, ఆశ్వినేయం=అశ్వినీకుమారులుగల, అన్యం=మఱియొక, నృపం= రాజును, అస్యై=ఈమెకై, నిర్దిశ్య=చూపి, అయే౹భైమి!=ఓ దమయన్తీ! కులశీలశాలీ = వంశముతోఁడను, నడవడికతోఁడను విలసిల్లునట్టి,

అయం=ఈరాజు, శాలీనతానతం, శాలీనతా = బిడియముచే, నతం = వంచఁబడిన, నిజాస్యబింబమ్=తనముఖమణ్డలమును, ఉదస్య=పైకెత్తి, ఆలోక్యతాం=చూడఁబడునుఁగాక, ఇతి=అని, ఊచే=చెప్పినది.

## సమాసములు :

దృశ్యతమతాపమతాశ్వినేయమ్ :— ద్రష్టుంయోగ్యః = దృశ్యః, అతిశయేనదృశ్యః=దృశ్యతమః, దృశ్యతమస్యభావః = దృశ్యతమతా, అశ్వినోరపత్యేపుమాంసౌ=అశ్వినేయౌ, దృశ్యతమతయా అపమతౌ=దృశ్యతమతాపమతౌ,దృశ్యతమతాపమతౌ. అశ్వినేయౌయస్యసః=దృశ్యతమతాపమతాశ్వినేయః, తమ్=దృశ్యతమతాపమ తాశ్వినేయమ్ ।

కులశీలశాలీ :- కులం చ శీలం చ=కులశీలే. కులశీలాభ్యాం శాలత ఇతి= కులశీలశాలీ.

శాలీనతానతమ్ :— శాలీనస్యభావః = శాలీనతా, శాలీనతయానతం, శాలీనతానతమ్, తత్=శాలీనతానతమ్.

నిజాస్యబిమ్బమ్ :— నిజం చ తత్ ఆస్యం చ=నిజాస్యం, నిజాస్యస్య బిమ్బమ్=నిజాస్యబిమ్బమ్, తత్=నిజాస్యబిమ్బమ్.

## భావము :

ఆ సరస్వతీదేవి, సౌన్దర్యముచే మిక్కిలి చూఁడదగినవాఁడై, యశ్వినీ కుమారుల సైతము సౌన్దర్యమునందు ఓడించిన యొక రాజును వ్రేలితోఁ జూపి— "ఓ దమయన్తీ! కులము చరిత్రగల యీ రాజును బిడియముచే వంచిన తలను పైకెత్తి చూడుము." అని చెప్పెను. ॥౩౫॥

**శ్లో.** **ఏతత్పురః పఠదపశ్రమవన్దిబృన్ద**
**వాగ్డమ్బరైరనవకాశతరేఽమ్బరేఽస్మిన్ ।**
**ఉత్పత్తుమస్తి పదమేవ న మత్పదానా**
**మర్థోఽపి నార్థపునరుక్తిషు పాఠకానామ్॥ 36**

ప.వి. ఏతత్పురః పఠదపశ్రమ వన్దిబృన్దవాగ్డమ్బరైః-అనవకాశతరే - అమ్బరే-అస్మిన్-ఉత్పత్తుమ్-అస్తి-పదమ్-ఏవ-న-మత్పదానామ్-అర్థం -అపి-న-అర్థపునరుక్తిషు-పాతుకానామ్-

అర్థము. ఏతత్పురః పఠదపశ్రమవన్దిబృన్దవాగ్డమ్బరైః; ఏతత్=ఇతనికి, పురః=ఎదుట, పఠత్=స్తుతి పాఠములు గావించుచున్న, అపశ్రమ=శ్రమలేని, వన్ది=స్తుతి పాఠకులయొక్క, వృన్ద=సమూహముయొక్క, వాగ్డమ్బరైః=మాటలయొక్క ఆటోపములచే, అనవకాశతరే=మిక్కిలి యవకాశము లేనటువంటి, అస్మిన్=ఈ, అమ్బరే=అన్తరిక్షమునందు, మత్పదానాం=నా మాటలకు, ఉత్పత్తుమేవ=పుట్టుటకే, పదం=స్థానము, నాస్తి=లేదు. (ఒకవేళ పుట్టుట కవకాశమున్నను) అర్థపునరుక్తిషు=వాచ్యార్థముయొక్క పునరుక్తులయందు, పాతుకానాం=పడుచున్న, మత్పదానామ్=నా పదములకు, అర్థోఽపి=ప్రయోజనము గూడ, నాస్తి=లేదు. వన్దులు గావించిన స్తుతులు యదార్థములు కాన నితడు నాకు చాల సమ్మతమైన వాఁడు. కాన వీనిని వరింపుమని యర్థము.

## సమాసములు :

ఏతత్పురః పఠదపశ్రమ వన్దివృన్దవాగ్డమ్బరైః :— ఏతస్య పురః=ఏతత్పురః, ఏతత్పురః పఠన్తీతి=ఏతత్పురః పఠన్తః, అపగతః శ్రమః యేషాన్తే = అపశ్రమాః, ఏతత్పురః పఠన్తశ్చతే అపశ్రమాశ్చ=ఏతత్పురః పఠదపశ్రమాః, ఏతత్పురః పఠదపశ్రమాశ్చతే వన్దినశ్చ=ఏతత్పురః పఠదపశ్రమవన్దినః, ఏతత్పురః పఠదపశ్రమవన్దినాం వృన్దః,=ఏతత్పురః పఠదపశ్రమవన్దివృన్దః, వాచాండమ్బరాః=వాగ్డమ్బరాః, ఏతత్పురః పఠదపశ్రమవన్దివృన్దస్య వాగ్డమ్బరాః=ఏతత్పురః పఠదపశ్రమవందివృన్దవాగ్డమ్బరాః, తైః=ఏతత్పురః పఠదపశ్రమవన్దివృన్దవాగ్డమ్బరైః ।

మత్పదానామ్ :— మమపదాని=మత్పదాని, తేషాం=మత్పదానామ్.॥

అర్థపునరుక్తిషు :— అర్థానాం పునరుక్తయః = అర్థపునరుక్తయః, తాసు=అర్థపునరుక్తిషు.

**భావము :**

ఈ రాజునెదుట స్తుతిపాఠకులు శ్రమలేక యీతని యథార్థగుణములనే గానము చేయుచున్నారు. యథార్థగుణములనే వారు గానముచేయుటవలన వారికి శ్రమ గూడ నుండదు. వారి వాగాటోపములతో నాకాశము నిండిపోవుచున్నది. తార్కికమతమున నాకాశమునందు శబ్దములుండును. కాన స్తుతి పాఠకుల శబ్దములు గూడ నాకసమును నిండిపోయినవి. అందువలన నా వాక్యముల నాకాశమునందు సందులేదు. ఒకవేళ సందున్నను నేను చెప్పెడి విషయములు, వన్దులు చెప్పెడి విషయములు నొక్కటిగనే యుండి పునరుక్తి యేర్పడ వచ్చును. కావున నా మాటలకెట్టి ప్రయోజనము నుండదు ఏలయనగా నవి వన్దుల మాటలచేతనే గతార్థములు కావచ్చును. అనగా నీతనిఁ గూర్చి వన్దులు గావించిన స్తుతులు వాస్తవికములు గాన నాకు సమ్మతములు. కాన నీవు వీనిని వరింపుము అని యాశయము. ॥౩౬॥

**శ్లో.** **నన్వత్ర హవ్య ఇతి విశ్రుతనామ్ని శాక**
**ద్వీపప్రశాసిని సుధీషు సుధీభవన్త్యాః ।**
**ఏతద్భుజాబిరుదవన్దిజయాఽనయాఽపి**
**కిం రాగిరాజని గిరాఽజని నాన్తరం తే॥ 37**

ప.వి. నను-అత్ర-హవ్యః-ఇతి- విశ్రుతనామ్ని-శాకద్వీపప్రశాసిని - సుధీషు-సుధీభవన్త్యాః-ఏతద్భుజా బిరుదవన్దిజయా- అనయా-అపి-కిం- రాగిరాజని-గిరా-అజని-న-అన్తరం-తే.

అర్థము. హేభైమి!=ఓ దమయన్తీ!, అత్ర=ఈ ద్వీపమునందు, హవ్య ఇతి=హవ్యుఁడను, విశ్రుతనామ్ని = ప్రసిద్ధ నామధేయము గల, శాకద్వీప=శాకద్వీపమును, ప్రశాసిని=పరిపాలించెడి, రాజని = రాజు విషయమునందు, సుధీషు=విదుషులయందు, సుధీభవన్త్యాః=విదుషియగుచున్న, తే=నీయొక్క, అంతరం=అంతరాత్మ, అనయా=ఈ వినఁబడుచున్న, ఏతద్భుజాబిరుదవన్దిజయా, ఏతత్=ఈ రాజుయొక్క, భుజా=బాహువుల యొక్క, బిరుద=ప్రశస్తి గ్రంథమును స్తుతిఁజేసెడి, వన్ది = స్తుతి

పాతకులనుండి, జయా = ఉద్భవించిన, గిరాఽపి = వాక్కు-చేతను, రాగి=అనురాగము గలదిగ, నాఽజనికిమ్?=కాలేదా యేమి?

**సమాసములు:**

విశ్రుతనామ్ని :— విశ్రుతం నామ యస్యసః=విశ్రుతనామా, తస్మిన్= విశ్రుతనామ్ని.

శాకద్వీపప్రశాసిని :— శాక ఇతిద్వీపః = శాకద్వీపః, శాకద్వీపం ప్రశా స్తీతి = శాకద్వీపప్రశాసీ, తస్మిన్=శాకద్వీప ప్రశాసిని.

సుధీభవన్త్యాః :— అసుధీః సుధీః సమ్పద్యమానాభవన్తీ=సుధీభవన్తీ, తస్యాః=సుధీభవన్త్యాః.

ఏతద్భుజాబిరుదవన్దిజయా :— ఏతస్యభుజే=ఏతద్భుజే, ఏతద్భుజయోః బిరుదం = ఏతద్భుజాబిరుదం, ఏతద్భుజాబిరుదస్యవన్దినః = ఏతద్భుజా బిరుదవన్దినః, ఏతద్భుజాబిరుదవన్దిభ్యః జాయత ఇతి=ఏతద్భుజాబిరుద వన్దిజా, తయా=ఏతద్భుజాబిరుదవన్దిజయా. ।

**భావము :**

ఓ దమయన్తీ ! హవ్యుడను ప్రసిద్ధిగల ఈ శాకద్వీపప్రభువు విషయమున, విదుషీమణివైన నీకు, సంబంధించిన యన్తరాత్మ, స్తుతిపాఠకులు పఠించెడి 'బిరుద' ప్రశస్తులను వినుటచే ననురాగము నొందలేదా! ॥32॥

**శ్లో. శాకః శుకచ్ఛదసమచ్ఛవిపత్రమాల**
**భారీ హరిష్యతి తరుస్తవ తత్ర చిత్తమ్ ।**
**యత్పల్లవౌఘపరిరమ్భవిజృమ్భితేన**
**ఖ్యాతా జగత్సు హరితో హరితః స్ఫురన్తి॥ 38**

ప.వి. శాకః-శుకచ్ఛదసమచ్ఛవిపత్రమాలభారీ- హరిష్యతి-తరుః-తవ- తత్ర- చిత్తమ్-యత్పల్లవౌఘపరిరమ్భవిజృమ్భితేన-ఖ్యాతాః-జగత్సు-హరితః- హరితః-స్ఫురన్తి.

అర్థము. తత్ర = ఆ శాకద్వీపమునందు, శుకచ్ఛదసమచ్ఛవిపత్రమాలభారీ; శుకచ్ఛద=చిలుక టెక్కలవంటి, ఛవి = ఆకుపచ్చ పన్నెగల, పత్ర= ఆకులయొక్క, మాలా=వరుసను, భారీ=వహించిన, శాకః=శాకమను, తరుః=చెట్టు, తవ=నీయొక్క, చిత్తం = మనస్సును, హరిష్యతి= హరించును. హరితః=దిక్కులు, యత్పల్లవౌఘపరిరమ్భవిజృమ్భితేన; యత్=ఏశాకవృక్షము యొక్క, పల్లవౌఘ = చిగుళ్ళరాశి యొక్క, పరిరమ్భ=వ్యాప్తియందలి, విజృమ్భితేన = అతిశయముచే, హరితః ఆకుపచ్చని వర్ణముగలవై, జగత్సు=లోకములయందు, ఖ్యాతాః= హరిత్తులని ప్రసిద్ధినొందినవై, స్ఫురన్తి=వెలయుచున్నవి.

వి. దిక్కులకు హరిత్తులను పేరు వచ్చుటకు శాకతరుపల్లవకాన్తి వ్యాప్తికి సంబంధము లేకపోయినను సంబంధముఁ జెప్పుటవలన సమ్బన్ధాతిశయోక్తి. ఈ యలఙ్కారముచే శాకవృక్షముయొక్క ప్రసిద్ధి ధ్వనించుచున్నది కాన నలఙ్కారముచే వస్తుధ్వని.

**సమాసములు :**

శుకచ్ఛదసమచ్ఛవిపత్రమాలభారీ :- శుకస్యచ్ఛదః=శుకచ్ఛదః.శుకచ్ఛదేన సమా = శుకచ్ఛదసమా, శుకచ్ఛదసమాఛవిః యస్య సః=శుకచ్ఛదసమచ్ఛవిః. పత్రాణాంమాలా=పత్రమాలం, శుకచ్ఛదసమచ్ఛవి శ్చాసౌ పత్రమాలశ్చ=శుకచ్ఛదసమచ్ఛవిపత్రమాలః, శుకచ్ఛదసమచ్ఛవిపత్రమాలం భరతీతి=శుకచ్ఛదసమచ్ఛవిపత్రమాలభారీ ॥

యత్పల్లవౌఘపరిరమ్భవిజృమ్భితేన :- యస్యపల్లవాః = యత్పల్లవాః, యత్పల్లవానామోఘాః=యత్పల్లవౌఘాః, యత్పల్లవౌఘానాంపరిరమ్భః= యత్పల్లవౌఘపరిరమ్భః, యత్పల్లవౌఘపరిరమ్భస్య విజృమ్భితమ్= యత్పల్లవౌఘపరిరంభవిజృమ్భితమ్,తేన=యత్పల్లవౌఘపరిరంభవిజృమ్భితేన ।

**భావము :**

ఆ శాకద్వీపమునందు చిలుకటెక్కలవంటి యాకుపచ్చని యాకు వరుసలు గల శాకవృక్షము నీ మనస్సును హరింపగలదు. దిక్కులకు హరిత్తు

లని పేరు ఆ చెట్టుయొక్క యాకు పచ్చని కాన్తులు ప్రసరించుట చేతనే వచ్చినది. హరిత్తని యాకు పచ్చని వన్నెకును దిక్కునకును పేరు. దిక్కులకాపేరెట్లు వచ్చినదనగా—ఈ శాకవృక్షము యొక్క యాకు పచ్చఁదనము వానియందు వ్యాపించుటచే నవి హరిత్తులై యా పేరు ను బొందినవని యర్థము. ॥౬౮॥

శ్లో. స్పర్శేన తత్ర కిల తత్తరుపత్రజన్మా
యన్మారుతః కమపి సమ్మదమాదధాతి।
కౌతూహలం తదనుభూయ విధేహి భూయః
శ్రద్ధాం పరాశరపురాణకథాన్తరేఽపి॥ 39

ప. వి. స్పర్శేన-తత్ర-కిల-తత్ - తరుపత్రజన్మా-యత్-మారుతః-కమ్-అపి-సమ్మదమ్-ఆదదాతి-కౌతూహలం - తత్-అనుభూయ-విధేహి-భూయః-శ్రద్ధాం-పరాశరపురాణకథాన్తరే-అపి-

అర్థము. తత్రకిల=ప్రసిద్ధమగునాద్వీపమునందు, తత్తరుపత్రజన్మా; తత్=ఆ, తరు=శాకవృక్షముయొక్క, పత్ర=ఆకులవలన, జన్మా=ఉద్భవించిన, మారుతః=గాలి, స్పర్శేన=తాకుటచేతనే, కమపి=చెప్పసాధ్యముకాని, సమ్మదం=ఆనన్దమును, ఆదధాతీతియత్=ఇచ్చుచున్నదనుటయేది కలదో, తత్=ఆయానన్దమునొసగునట్టి, కౌతూహలం=ఆశ్చర్యమునుఁగల్గించెడి వ్యాపారమును, అనుభూయ=అనుభవించి, భూయః=మఱల, పరాశర పురాణకథాన్తరేఽపి; పరాశరపురాణ=పరాశరమహర్షి రచియించిన విష్ణు పురాణమందలి, కథాన్తరేఽపి=మఱియొక కథయందునుఁ గూడ, శ్రద్ధాం=శ్రద్ధను, విధేహి=చేయుము. ఆ విష్ణుపురాణమందు సకల భూగోళమందలి సమాచారములనుఁ జెప్పుటవలన నందులో నొకవిషయము సరి పోవునపుడు తక్కిన విషయములు గూడ యథార్థములై సరిపోవు నను విశ్వాసము నుంచుము-ఆవిష్ణు పురాణమునందు—

"శాకస్తత్రమహావృక్షః సిద్ధగన్ధర్వసేవితః।
యత్పత్రవాతసంస్పర్శాదాహ్లాదో జాయతే పరః"

అని యాద్వీపమందు, సిద్ధదన్ధర్వులచే సేవింపఁబడిన శాక మనెడి చెట్టు కలదు. దాని గాలి దేహమునకు సోకినచో పరమానందముగల్గునని చెప్పబడినది.

**సమానములు :**

తరుపత్రజన్మా :- తరూణాం పత్రాణి = తరుపత్రాణి, తరుపత్రేభ్య జన్మ యస్యసః-తరుపత్రజన్మా ।

పరాశరపురాణకథాన్తరే :- పరాశరస్య పురాణం = పరాశరపురాణమ్, అన్యాకథా=కథాన్తరమ్, పరాశరపురాణస్య కథాన్తరమ్=పరాశరపురాణ కథాన్తరమ్, తస్మిన్=పరాశరపురాణకథాన్తరే.

**భావము :**

ఆ ద్వీపమందలి యా వృక్షపుటాకులవలన గాలి యొడలికంటినచో, చెప్పరాని యానందముగలుగును. ఆశ్చర్యమునుఁ గల్గించెడిదానిని నీవనుభవించి విష్ణుపురాణమండలి శాకద్వీప ఘట్టమునందును విశ్వాసముంచ వలయును. ఏలయనగా-విష్ణుపురాణము, భూగోళమందంతట నున్న విషయములనుఁ జెప్పు చున్నది. అందు కొన్నివిషయములు యథార్థములై సరిపోవుచున్నపుడు తక్కిన విషయములు గూడా యథార్థములుగనే యుండఁ గలవు. కాన నీ శాకద్వీప ఘట్టముగూడ యథార్థమని నమ్మము. ॥౩౯॥

**శ్లో. క్షీరార్ణవ స్తవ కటాక్షరుచిచ్ఛటానా**
**మధ్యేతు తత్ర వికటాయితమాయతాక్షి।**
**వేలావనీవనతతిప్రతిబిమ్బచుమ్బి**
**కిమ్మీరితోర్మిచయచారిమచాపలాభ్యామ్॥ 40**

ప. వి. క్షీరార్ణవః-తవ-కటాక్షరుచిచ్ఛటానామ్-అధ్యేతు-తత్ర-వికటాయితమ్-ఆయతాక్షి-వేలావనీవనత తిప్రతిబిమ్బచుమ్బికిమ్మీరితోర్మిచయచారిమ చాపలాభ్యామ్,

అర్థము: హే ఆయతాక్షి! ఓ విశాలనయనా! తత్ర = ఆ శాకద్వీపమునందు, క్షీరార్ణవః=పాలకడలి, తవ=నీయొక్క,కటాక్షరుచిచ్ఛటానామ్;కటాక్ష= కడకన్నులయందలి, రుచి=కాంతియొక్క, ఛటానాం=సమూహముల యొక్క, వికటాయితం=ఆధిక్యమును, లేదా సౌన్దర్యాతిశయమును, వేలావనీవనతతిప్రతిబిమ్బచుమ్బి కిర్మీరితోర్మిచయచారిమచాపలాభ్యామ్; వేలావనీ=తీరభూమియందున్న, వనతతి = వనసమూహము యొక్క, ప్రతిబిమ్బ = ప్రతిబిమ్బమును, చుమ్బి = స్పృశించునదై (కావుననే) కిర్మీరిత=పెక్కురంగులుగల, ఊర్మిచయ=అలల సమూహముయొక్క, చారిమ=అందము, చాపలాభ్యాం=చాఞ్చల్యము అనువీనిని, అధ్యేతు = స్మరించునుగాక. అనగా ననుకరించునుగాక। అనగా నీ కడకన్నుల చుట్టునుం దెల్లతనము మధ్యగ్రుడ్డులోనల్లదనము, చాఞ్చల్యము గలవు గాన పాలకడలి కూడ దానికి సమానమగుగాక, యని యర్థము.

వి. ఇచ్చట పలువన్నెలుగల యలలయందు తెలుపు నలుపు వన్నెల పోలిక లనుబట్టి, వాని కదలికలు కడకన్నుల విలాసములను స్మరింపజేయును గాన నిచ్చట స్మరణాలఙ్కారము. అనగా నలల కదలికలు, కన్నుల కదలికలను స్మరింపజేయుచున్నందువలన స్మరణాలఙ్కారమని యర్థము.

## సమాసములు :

క్షీరార్ణవః :- క్షీరస్య అర్ణవః=క్షీరార్ణవః.

కటాక్షరుచిచ్ఛటానామ్ :- కటాక్షాణాం రుచయః, = కటాక్షరుచయః, కటాక్షరుచీనాం ఛటాః, కటాక్షరుచిచ్ఛటాః, తాసాం=కటాక్షరుచిచ్ఛటా నామ్।

వికటాయితమ్ :- వికటస్యభావః=వికటాయితమ్, తత్=వికటాయితమ్।

ఆయతాక్షి:- ఆయతే ఆక్షిణీయస్యాస్సా=ఆయతాక్షీ, తస్యాః=సంబుద్ధిః= ఆయతాక్షి.

వేలావనీవనతతి ప్రతిబిమ్బచుమ్బి కిర్మీరితోర్మిచయచారిమచాపలాభ్యామ్:- వేలాయాః అవనీ=వేలావనీ, వనానాం తతిః=వనతతిః, వేలావన్యాం వన

తతిః=వేలావనీవనతతిః, వేలావనీవనతతేః ప్రతిబిమ్బః=వేలావనీవనతతిప్రతి బిమ్బః, వేలావనీవనతతిప్రతిబిమ్బం చుమ్బతీతి =వేలావనీవనతతిప్రతిబింబ చుమ్బి, ఊర్మీణాంచయః=ఊర్మిచయః, కిర్మీరితశ్చాసౌ ఊర్మిచయశ్చ= కిర్మీరితోర్మిచయః, వేలావనీవనతతిప్రతిబిమ్బచుమ్బిచాసౌకిర్మీరితోర్మి చయశ్చ = వేలావనీవనతతిప్రతిబిమ్బచుమ్బికిర్మీరితోర్మిచయః, చారోః భావః=చారిమా, చపలస్యభావః=చాపలమ్, చారిమాచ, చాపలం చ = చారిమచాపలే, వేలావనీవనతతిప్రతిబిమ్బచుమ్బికిర్మీరితోర్మిచయస్య చారిమచాపలే = వేలావనీవనతతిప్రతిబిమ్బచుమ్బికిర్మీరితోర్మిచయచారిమ చాపలే, తాభ్యాం = వేలావనీవనతతిప్రతిబిమ్బచుమ్బికిర్మీరితోర్మిచయ చారిమచాపలాభ్యామ్.

**భావము :**

ఓ విశాలనయనా ! ఆ శాకద్వీపమునందు క్షీరసాగరమున్నది. అది నీ కటాక్షకాన్తిచయము నందలి యందమును, తన యందు ప్రతిబింబించిన, గట్టు నందలి వనములచే పలువన్నెలుగల యలల యందలి యందమును, కదలిక చేతను స్మరించునుగాక. నీకటాక్షములు చుట్టు తెల్లగను, నడుమ నల్లగను నున్నవి. నీ కటాక్షములయందు కదలిక యున్నది. పాలకడలి కెరటముల యందు చెట్లు ప్రతిబింబించుట వలన నల్లఁదనము చుట్టునుఁదెల్లదనము గలవు గావున, నాపాల్కడలి నీ కటాక్షముల సొంపును సందలి కదలికను, తన యలల యందలి యందము చేతను, కదలిక చేతను తప్పక స్మరించునని యాశయము ॥४०॥

శ్లో. కల్లోలజాలచలనోపనతేన పీవా
జీవాతునానవరతేన పయోరసేన ।
అస్మిన్నఖణ్డపరిమణ్డలితోరుమూర్తి
రధ్యాస్యతే మధుభిదా భుజగాధిరాజః॥ **41**

ప.వి. కల్లోలజాలచలనోపనతేన - పీవా - జీవాతునా-అనవరతేన-పయోరసేన- అస్మిన్ - అఖణ్డపరిమణ్డలితోరుమూర్తిః - అధ్యాస్యతే - మధుభిదా - భుజగాధిరాజః.

అర్థము. అస్మిన్=ఈక్షీరసాగరమందు, కల్లోలజాలచలనోపనతేన; కల్లోలజాల=తరఙ్గసమూహముయొక్క, చలన=కదలికవలన, ఉపనతేన=సంప్రాప్తమైన, జీవాతునా = బ్రతికించెడి, అనవరతేన=అవిచ్ఛిన్నమైన, పయోరసేన = పాలనెడిమధురద్రవముచే, పీవా=బలిసిన, అఖణ్డపరిమణ్డలితోరుమూర్తిః; అఖణ్డ=సంపూర్ణముగా, పరిమణ్డలిత=చుట్టను, వలయాకృతిగనున్న,ఉరు=గొప్పదైన, మూర్తిః=శరీరముగల, భుజగాధిరాజః=సర్పరాజగుశేషుఁడు, మధుభిదా = మధువనురక్కసునిఁ జంపిన విష్ణువుచే, అధ్యాస్యతే=అధిష్ఠింపఁ బడుచున్నాఁడు.

## సమాసములు :

కల్లోలజాలచలనోపనతేన:- కల్లోలానాం జాలమ్=కల్లోలజాలమ్, కల్లోలజాలస్య చలనాని = కల్లోలజాలచలనాని, కల్లోలజాలచలనై రుపనతః = కల్లోలజాలచలనోపనతః, తేన=కల్లోలజాలచలనోపనతేన.

పయోరసేన :- పయఏవరసః=పయోరసః, తేన=పయోరసేన.

అఖణ్డపరిమణ్డలితోరుమూర్తిః:- అఖణ్డంపరిమణ్డలితా=అఖణ్డపరిమణ్డలితా, ఉర్వీచసామూర్తిశ్చ = ఉరుమూర్తిః, అఖణ్డపరిమణ్డలితా ఉరుమూర్తిః యస్యసః = అఖణ్డపరిమణ్డలితోరుమూర్తిః ॥

మధుభిదా :- మధుం భినత్తీతి=మధుభిత్, తేన=మధుభిదా.

భుజగాధిరాజః :- భుజగానామధిరాజః=భుజగాధిరాజః.

## భావము :

ఈ పాలకడలి యందలి యలల నుండి తుంపురులు తెంపులేక పడుచుండును. అవి జీవనౌషధములై ప్రాణముల నొసంగుచుండును. అవి రుచ్యములునై యున్నవి. వానిచే సర్పరాజైన యాదిశేషుఁడు బలిసి, నిండారగ తన దేహమును చుట్టుకొని యున్నాఁడు. దానిపై శ్రీమహావిష్ణువు శయనించి యున్నాఁడు. ॥౪౦॥

శ్లో. త్వద్రూపసమ్పదవలోకనజాతశఙ్కా
పాదాబ్జయోరిహ కరాఙ్గులిలాలనేన।
భూయాచ్చిరాయ కమలాకలితావధానా
నిద్రానుబన్ధమనురోధయితుం ధవస్య॥ 42

ప.వి. త్వద్రూపసమ్పదవలోకనజాతశఙ్కా - పాదాబ్జయోః-ఇహ-కరాఙ్గులిలాలనేన-భూయాత్ -చిరాయ -కమలా-కలితావధానా-నిద్రానుబన్ధమ్-అనురోధయితుం- ధవస్య.

అర్థము. ఇహ = ఈపాలకడలియందు, త్వద్రూపసమ్పదవలోకనజాతశఙ్కా; త్వత్=నీయొక్క, రూప=అందమనెడి, సంపత్=సంపదను, లేదా నీ సౌన్దర్యసమ్పదను, అవలోకన=చూచుటకు, జాతశఙ్కా; జాత=ఉద్భవించిన, శఙ్కా=సంశయముగల్గిన, (ఈమె నా కంటెనుఁ జాల చక్కనిది. ఈమెనుఁ జూచి నా భర్త శ్రీమహావిష్ణు వొకప్పుడు కోర వచ్చునను సందేహముతో) కమలా=లక్ష్మి, పాదాబ్జయోః=తన భర్త యొక్క పాదపద్మములయందు, కరాఙ్గులిలాలనేన; కరాఙ్గులి = చేతివ్రేళ్లచే, లాలనేన = ఆదరించుటచే, అనగా పాదములను పిసుకుటచే, ధవస్య = భర్తయైన శ్రీవిష్ణువునకు, నిద్రానుబంధం = నిద్రనుతెగనీయక యుండుటను, అనురోధయితుం= పెంచుటకు, చిరాయ = చాలకాలము, కలితావధానా; కలిత = ఈయఁబడిన, అవధానా = మనోనిరోధముగలదిగా, భూయాత్=అగునుగాక.

## సమాసములు :

త్వద్రూపసమ్పదవలోకనజాతశఙ్కా :- రూపస్య సమ్పత్, రూపసమ్పత్, తవరూపసమ్పత్ = త్వద్రూపసమ్పత్, త్వద్రూపసమ్పదః అవలోకనమ్=త్వద్రూపసమ్పదవలోకనమ్, త్వద్రూపసమ్పదవలోకనే జాతా=త్వద్రూపసమ్పదవలోకనజాతా, త్వద్రూపసమ్పదవలోకన జాతా, శఙ్కాయస్యాఃసా = త్వద్రూపసమ్పదవలోకనజాతశఙ్కా.

పాదాబ్జయోః :- పాదౌ, అబ్జే ఇవ=పాదాబ్జే, తయోః=పాదాబ్జయోః ।

కరాఙ్గులిలాలనేన :- కరయోరఙ్గులయః = కరాఙ్గులయః, కరాఙ్గులిభిః లాలనం = కరాఙ్గులిలాలనమ్, తేన=కరాఙ్గులిలాలనేన ॥

కలితావధానా :- కలితమ్, అవధానం యయా సా=కలితావధానా ॥

నిద్రానుబన్ధమ్ :- నిద్రాయాః అనుబంధః = నిద్రానుబన్ధః, తమ్ = నిద్రానుబన్ధమ్.

**భావము :**

ఈ పాలకడలియందు నీ సౌందర్యాతిశయమునుంజూచి, లక్ష్మి; తన భర్తయైన విష్ణువు; ఒకప్పుడు నిన్నుంజూచి నీ పైననురాగము వహించు నేమోయని సందేహించినదై, యాతని పాదపద్మములను దన చేతి వ్రేళ్లతో మృదువుగాంబట్టుచు నతనికి నిద్రకు భంగము లేక చాల కాలము నిద్ర కలుగు నట్లుగాం జేయుచున్నది. అట్లు నిదురం బొందినచో నాతనికి దమయన్తిం జూచుటకుంగాని తన్మూలమున మోహించుటకుం గాని యవకాశ ముండదని యాశయము ॥౪౨॥

**శ్లో. బాలాతపైః కృతకగైరికతాం కృతాం ద్వి**
**స్తత్రోదయాచలశిలాః పరిశీలయన్తు ।**
**తద్విభ్రమభ్రమణజశ్రమవారిధారి**
**పాదాఙ్గులీగలితయా నఖలాక్షయాఽపి॥ 43**

ప.వి. బాలాతపైః - కృతకగైరికతాం - కృతాం - ద్విః - తత్ర - ఉదయాచలశిలాః - పరిశీలయన్తు - తద్విభ్రమభ్రమణజశ్రమవారిధారి పాదాఙ్గులీగలితయా - నఖలాక్షయా - అపి.

అర్థము. తత్ర=ఆ శాకద్వీపమందు, ఉదయాచలశిలాః; ఉదయాచల=ఉదయ పర్వతమందలి, శిలాః=శిలలు, బాలాతపైః=లేత యెండలచేతను, తథా = అట్లే, త్వద్విభ్రమభ్రమణజశ్రమవారిధారిపాదాఙ్గులీగలితయా; త్వత్ = నీయొక్క, విభ్రమ = విలాసముతోం గూడిన, భ్రమణజ= సంచారమువలనం గల్గిన, శ్రమవారి=చెమటను, ధారి = వహించెడి, పాదాఙ్గులీ = కాలివ్రేళ్ళనుండి, గలితయా = పడినటువంటి, నఖలాక్ష

యాఽపి=గోళ్లహారాశిచేతను, ద్విః = రెండు మాఱులు, కృతాం=చేయ బడిన, కృతకగైరికతాం; కృతక=కృత్రిమమైన, గైరికతాం=పర్వత ముల యందలి రంగురాళ్ళ యొక్క పూతను, పరిశీలయస్తు=పరిశీలిం చును గాక. నీకు ఉదయాచలమున విహరింపఁ గోరికయున్నచో వీనిని పరింపుమని యర్థము.

## సమాసములు :

బాలాతపైః :- బాలాశ్చతే ఆతపాశ్చ, బాలాతపాః, తైః=బాలాతపైః ,

కృతకగైరికతామ్ :- కృతకాని, గైరికాణి యాసాంతాః = కృతక గైరికాః, కృతకగైరికాణాంభావః=కృతకగైరికతా, తామ్ = కృతక గైరికతామ్ ।

ఉదయాచలశిలాః :- ఉదయస్య అచలః=ఉదయాచలః, ఉదయాచలస్య శిలాః=ఉదయాచలశిలాః, తాః=ఉదయాచలశిలాః.

త్వద్విభ్రమభ్రమణజశ్రమవారిధారిపాదాఙ్గులీగలితయా:- తవవిభ్రమాః= త్వద్విభ్రమాః, త్వద్విభ్రమైః భ్రమణం=త్వద్విభ్రమభ్రమణమ్, త్వద్వి భ్రమభ్రమణాత్ జాయన్త ఇతి=త్వద్విభ్రమభ్రమణజాని, త్వద్విభ్రమ భ్రమణజానిచతానిశ్రమవారీణిచ = త్వద్విభ్రమభ్రమణజశ్రమవారీణి, త్వద్విభ్రమభ్రమణజశ్రమవారీణి, ధరన్తీతి=త్వద్విభ్రమభ్రమణజశ్రమ వారిధారిణ్యః. పాదానామఙ్గుల్యః=పాదాఙ్గుల్యః, త్వద్విభ్రమభ్రమణజశ్రమ వారిధారిణ్యశ్చతాః పాదాఙ్గుల్యశ్చ = త్వద్విభ్రమభ్రమణజశ్రమవారిధారి పాదాఙ్గుల్యః=త్వద్విభ్రమభ్రమణజశ్రమవారిధారిపాదాఙ్గులీభ్యః గలితా= త్వద్విభ్రమభ్రమణజశ్రమవారిధారాపాదాఙ్గులీగలితా, తయా=త్వద్విభ్రమ భ్రమణజశ్రమవారిధారిపాదాఙ్గులీగలితయా.

నఖలాక్షయా :- నఖానాంలాక్షా=నఖలాక్షా, తయా, నఖలాక్షయా.

భావము :

ఆ ఉదయపర్వతపు శిలలు నీ తోడ యుండుటచేతను. నీ విలాసవిహారములందుఁ జెమర్చిన నీ కాళ్ళవ్రేళ్ళనుండి జారెడి, పారాణిచేతను,

రెట్టింపుగా నేర్పడిన, కృత్రిమమగు గైరికామల శోభను జూపునుగాక. సహజముగా నా పర్వతము గైరికామలమను బహు రంగుధాతువులచే నెఱ్ఱఁబడి యుండును. నీవు నడచునపుడు నీకాలిపారాణి కరిగి యంటుకొనినచో, దాని వలన దానికి కృత్రిమ గైరికముతో తుల్యమైన శోభయతిశయించును. అనగా నీకాలి పారాణి కృత్రిమ గైరికమై యా పర్వత మంచలి సహజగైరికముతో మిశ్రితమై దానికి రెట్టింపు గైరిక శోభనొసంగునని యాశయము ॥౪౩॥

శ్లో. నృణాం కరమ్బితముదాముదయన్మృగాఙ్క-
శఙ్కాం సృజత్వనఘజఙ్ఘి! పరిభ్రమన్త్యాః ।
తత్రోదయాద్రిశిఖరే తవ దృశ్యమాస్యం
కాశ్మీరసమ్భవసమారచనాభిరామమ్॥ 44

ప. వి. నృణాం- కరమ్బితముదామ్- ఉదయన్మృగాఙ్క- శఙ్కాం- సృజతు - అనఘజఙ్ఘి !- పరిభ్రమన్త్యాః-తత్ర — ఉదయాద్రిశిఖరే-తవ-దృశ్యమ్- ఆస్యం-కాశ్మీరసమ్భవసమారచనాభిరామమ్.

అర్థము. హే అనఘజఙ్ఘి! = అందముగల పిక్కలు గలదానా! తత్ర=ఆ ద్వీపమున, ఉదయాద్రిశిఖరే=ఉదయగిరియొక్క శిఖరమందు, పరిభ్రమన్త్యాః= తిరుగుచున్న, తవ=నీయొక్క, కాశ్మీరసమ్భవసమారచనాభిరామమ్, కాశ్మీరసమ్భవ=కుఙ్కుమ పూవుయొక్క, సమారచన=లేపనముచే, అభిరామమ్=సుందరమైన(కావుననే), దృశ్యం=చూడఁదగిన, ఆస్యం=నీ ముఖము, కరమ్బితముదాం; కరమ్బిత=సమ్మిలితమైన, ముదాం=సంతసముగల, నృణాం=పురుషులకు, ఉదయన్మృగాఙ్కశఙ్కామ్; ఉదయత్=ఉదయించుచున్న, మృగాఙ్క=చన్ద్రుడనెడి, శఙ్కాం=సందేహమును లేదా భ్రాన్తిని, సృజతు=కల్గించునుగాక.

వి. ఇచ్చట సందేహమునుఁగల్గించినచో, సందేహాలఙ్కారము, భ్రాన్తినిఁ గల్గించినచో, భ్రాన్తిమదలఙ్కారము, వీనిలో నొకటి యగును.

**సమాసములు :**

కరమ్బితముదామ్ :- కరమ్బితా - ముత్ యేషాన్తే = కరమ్బితముదః, తేషాం=కరమ్బితముదామ్.

ఉదయసమృగాఙ్కశఙ్కామ్ :- ఉదయంశ్చాసౌమృగాఙ్కశ్చ = ఉదయ సమృగాఙ్కః, ఉదయసమృగాఙ్కస్యశఙ్కా = ఉదయసమృగాఙ్కశఙ్కా, తామ్ = ఉదయసమృగాఙ్కశఙ్కామ్ ॥

హేఅనఘజఙ్ఘే ! :- అనఘేజఙ్ఘే యస్యాస్సా = అనఘజఙ్ఘే, తస్యాస్స మ్బుద్ధిః= హేఅనఘజఙ్ఘే !

ఉదయాద్రిశిఖరే:- ఉదయాద్రేః శిఖరమ్, ఉదయాద్రిశిఖరమ్, తస్మిన్ = ఉదయాద్రిశిఖరే.

దృశ్యమ్ :- ద్రష్టుంయోగ్యమ్=దృశ్యమ్, తత్=దృశ్యమ్.

కాశ్మీరసంభవసమారచనాభిరామమ్:- కాశ్మీరేభ్యః సమ్భవః యస్యతత్= కాశ్మీరసమ్భవమ్, కాశ్మీరసమ్భవస్యసమారచనం = కాశ్మీరసమ్భవసమా రచనం, కాశ్మీరసమ్భవసమారచనమివ, అభిరామమ్ = కాశ్మీరసమ్భవ సమారచనాభిరామమ్.

**భావము :**

ఓ సుందరములగు పిక్కలు కలదానా! ఆ శాకద్వీపము సంచలి యుదయగిరి శృఙ్గమున సఞ్చరించునట్టి నీయొక్క; కుఙ్కుమపుష్పలేపనముతో నలఙ్కరింపఁ బడిన రమ్యమైనట్టి ముఖము, హర్షపరవశులగు పురుషులకు ఉదయచంద్రుఁ డనెడి సంశయమునుగాని భ్రాన్తినిఁ దాని గల్గించును. ఉదయచంద్రుఁ డెఱ్ఱని కాన్తులతోఁగూడి యుండును. కావున కుఙ్కుమపఙ్కముతో నలదఁబడిన నీమోము గూడ నట్లే యరుణ వర్ణము కల్గియుండును కాన నట్టి నీమోమును జూచిన వారికి నిది యుదయ చంద్రుడా ? లేక మఱియొక్కటియా ? యను సందేహమును గాని, యుదయచంద్రుఁడే యను భ్రమనుఁ గాని కల్గింప వచ్చును. ॥౪౪॥

శ్లో. ఏతేన తే విరహపావకమేత్య తావత్
కామం స్వనామ కలితాన్వయమన్వభావి ।
అఙ్గీకరోషి యది తత్త్వవ నన్దనాద్రై
ర్లబ్ధాన్వయం స్వమపి నన్వయమాతనోతు॥ 45

ప.వి. ఏతేన-తే-విరహపావకమ్-ఏత్య-తావత్-కామం-స్వనామకలితాన్వయమ్-అన్వభావి-అఙ్గీకరోషి-యది-తత్-తవ-సన్తనాద్యైః-లబ్ధాన్వయం-స్వమ్-అపి-నను-అన్వయమ్-ఆతనోతు.

అర్థము. నను=ఓదమయన్తీ! ఏతేన=ఈ హవ్యుడను రాజుతో, తే=నీకు, విరహపావకమ్=విరహాగ్నిని, ఏత్య=పొంది, స్వనామ=తనదగు హవ్యుఁడను పేరు, కామం = మిక్కిలి, కలితాన్వయం; కలిత = పొందఁబడిన, అన్వయం=అన్వయముగలదిగా ననగా సార్థక నామధేయము గలదిగా, అన్వభావితావత్=అనుభవింపఁబడినదే. నీ విరహాగ్ని యందు హతము గావింపఁబడుటవలననే హవ్యుఁడను పేరు సార్థకమగుచున్నది. అఙ్గీకరోషియది=అతనిని భర్తనుగా నీవు స్వీకరించితివేని, తత్=అప్పుడు, అయమ్ = ఈరాజు, స్వమపి = తన్నుఁగూడ, తవ = నీయొక్క, సన్తనాద్యైః=పుత్రపౌత్రులతోఁడ, లబ్ధాన్వయం; లబ్ధ = పొందఁబడిన, అన్వయం=వంశప్రతిష్ఠనుఁగలవానినిగా, ఆతనోతు=చేయునుగాక-భార్యలను ధర్మ ప్రజా సంపత్తికొఱకే గదా స్వీకరింతురు.

**సమాసములు :**

విరహపావకమ్ :- విరహస్యపావకః, విరహపావకః, తమ్=విరహపావకమ్ ।

స్వనామ :- స్వస్య, నామ=స్వనామ.

కలితాన్వయమ్ :- కలితః అన్వయః, యస్య తత్=కలితాన్వయమ్.

సన్తనాద్యైః :- సన్తనః ఆద్యఃయేషాం తే=సన్తనాద్యాః, తైః=సన్తనాద్యైః।

లబ్ధాన్వయం :- లబ్ధః=అన్వయః, యస్యాసః = లబ్ధాన్వయః, తత్ = లబ్ధాన్వయమ్.

భావము :

ఓ దమయన్తీ! ఈ హవ్యుఁడను రాజు, నీవిరహాగ్నినిఁబొంది తనపేరును హవ్యుఁడుగా నిజముగా హోమమునుచేయఁబడిన విధముగా సార్థకము చేసికొనెను. నీయందు వివాహమునకు వానిని నీవు వరునిగా నొప్పుకొనినచో నప్పుడీరాజు

తన్ను; నీయందుఁ బుట్టింపఁబడిన పుత్రపౌత్రాదులతోఁగూడ, వంశప్రతిష్ఠనుఁ బొందిన వానినిగాఁ జేసికొనును. ఎలయనగా భార్యాపరిగ్రహము ధర్మప్రజనుఁ బడయుట కొఱకే గదా! ॥౪౫॥

శ్లో. లక్ష్మీలతాసమవలమ్బభుజద్రుమేఽపి
వాగ్దేవతాయతనమఞ్జుముఖామ్బుజేఽపి ।
సాఽముత్ర దూషణమజీగణదేకమేవ
నాఽర్థీబభూవ మఘవా యదముష్య దేవః॥ **46**

ప.వి. లక్ష్మీలతాసమవలమ్బభుజద్రుమే - అపి — వాగ్దేయతాఽఽయతనమఞ్జుముఖామ్బుజే-అపి-సా-అత్ర-దూషణమ్ - అజీగణత్-ఏకమ్-ఏవ-న అర్థీ-బభూప-మఘవా-యత్— అముష్య-దేవః.

అర్థము. లక్ష్మీ = లక్ష్మియనెడు, లతా = తీగెకు, సమవలమ్బ = ఆధారమైన, భుజ = బాహువనెడి, ద్రుమేఽపి = వృక్షముగలవాడైనను, వాగ్దేవతాఽయతనమఞ్జు ముఖామ్బుజేఽపి; వాగ్దేవతా=సరస్వతీదేవికి, ఆయతన = స్థానమైన, మఞ్జు = మనోహరమైన, ముఖామ్బుజేపి = ముఖపద్మము గలవాడైనను, అనగా లక్ష్మీ సరస్వతుల కిఱువురికిని స్థానముగా నున్నవాడైననని యర్థము. అముత్ర=ఈ హవ్యుఁడను రాజునందు, సా=ఆ దమయన్తి, ఏకమేవ = ఒక్కటే, దూషణం= దోషమును, అజీగణత్=లెక్కించెను. (అదేదనగా) అముష్య = ఈ హవ్యుఁడను రాజునకు, దేవః=వేల్పైన, మఘవా=ఇంద్రుఁడు, యత్= ఎందువలన, అర్థీ=యాచకుఁడుగా, న బభూవ=కాలేదో, ఇంద్రుఁడు నలుని దూత్యమును యాచించెను. కాని యితనిని యాచించలేదు. కావున నలునికంటె హీనమైన వానినెట్లు వరింతువని యర్థము.

**సమాసములు :**

లక్ష్మీలతాసమవలమ్బభుజద్రుమే :- లక్ష్మీరేవలతా = లక్ష్మీలతా, లక్ష్మీలతాయాః సమవలమ్బః=లక్ష్మీలతాసమవలమ్బః, భుజఏవద్రుమః=భుజ

ద్రుమః, లక్ష్మీలతాసమవలమ్బః భుజద్రుమః యస్యసః = లక్ష్మీలతాసమ వలమ్బభుజద్రుమః, తస్మిన్=లక్ష్మీలతాసమవలమ్బభుజద్రుమే.

వాగ్దేవతాయతనమఞ్జుముఖామ్బుజే :- వాగేవదేవతా, వాగ్దేవతా, వాగ్దేవతాయాః ఆయతనమ్ = వాగ్దేవతాయతనమ్, మఞ్జుచతత్ముఖామ్బుజంచ=మఞ్జుముఖామ్బుజమ్, వాగ్దేవతాయతనం, మఞ్జుముఖామ్బుజం యస్యసః=వాగ్దేవతాయతనమఞ్జుముఖామ్బుజః, తస్మిన్=వాగ్దేవతాయతన మఞ్జుముఖామ్బుజే.

**భావము :**

ఆ హవ్యుని బాహువృక్షము, లక్ష్మీయను తీగె ప్రాకుటకు నాధారమైనను, నాతని సుందర ముఖాంబుజము సరస్వతీదేవికి నిలయమైనను, దమయన్తి వాని యందొక్క దోషమునుఁ గనిబెట్టినది. అదేమనగా—అతనికి సిన్ద్రిభగవానుఁడు నలునికి యాచకుఁడైనట్లు యాచకుఁడు కాలేదు. ఇన్ద్రుఁడు దమయన్తిని తన్ను వరించునట్లు చేయుమని నలుని దూత్యమును యాచించెనుగదా—అట్లు హవ్యుఁడు నలుని యాచించలేదుగదా. కాన నలునికంటె హీనుఁడైన హవ్యునెట్లు వరింతును? అని దమయన్తి చెప్పినది. ॥౪౬॥

**శ్లో. లక్ష్మీవిలాసవసతేః సుమనస్సు ముఖ్యా**
**దస్మాద్ విక్రుష్య భువి లబ్ధగుణప్రసిద్ధిమ్ ।**
**స్థానాన్తరం తదను నిన్యురిమాం విమాన**
**వాహాః పునః సురభితామివ గన్ధవాహాః॥ 47**

ప.వి. లక్ష్మీవిలాసవసతేః-సుమనఃస్సు — ముఖ్యాత్-అస్మాత్—విక్రుష్య—భువి-లబ్ధగుణప్రసిద్ధిమ్ - స్థానాన్తరం-తత్-అను-నిన్యుః - ఇమాం-విమానవాహాః-పునః-సురభితామ్-ఇవ-గన్ధవాహాః.

**అర్థ**ము. తదను=హవ్యుని పరిహరించిన పిదప, విమానవాహాః=పల్లకిని మోసెడి భృత్యులు, భువి=లోకమందు, లబ్ధగుణప్రసిద్ధమ్; లబ్ధ = పొందఁబడిన, గుణ=సౌన్దర్యాది గుణములచేతను, పక్షాన్తరమున-గుణ = ముక్కుపైన కింపైన పరిమళాది గుణములచేతను, ప్రసిద్ధిమ్=ప్రసిద్ధి గల్గిన, ఇమాం=

ఈ దమయన్తిని, గన్ధవాహాః = వాయువులు, సురభితా మివ=సౌందర్య సంపదను వలె, లక్ష్మీవిలాసవసతేః; లక్ష్మీ = సంపదకు, పక్షాన్తర మున, లక్ష్మీ=లక్ష్మీదేవికి, విలాసవసతేః = విలాసగృహము నుండి, సుమనః సు=విద్వాంసులయందు, పక్షాన్తరమున, సుమనః సు=పుష్ప ములయందు, ముఖ్యాత్=ముఖ్యుడైన, అస్మాత్ = ఈ రాజునుండి (పద్మమునుండియు) వికృష్య=తొలగించి, పునః=మరల, స్థానాన్తరం= మఱియొక రాజును, పక్షాన్తరమున - స్థానాన్తరం = మఱియొక పుష్పమును, నిన్యుః = పొందించిరి.

## సమాసములు :

లక్ష్మీవిలాసవసతేః :— విలాసానాం వసతిః=విలాసవసతిః, లక్ష్మ్యాః విలాసవసతిః=లక్ష్మీవిలాసవసతిః, తస్యాః=లక్ష్మీవిలాసవసతేః.

సుమనఃసు :— శోభనం మనః యేషాం తే=సుమనసః,తేషు=సుమనఃసు।

లబ్ధగుణప్రసిద్ధిమ్ :— గుణైః ప్రసిద్ధిః=గుణప్రసిద్ధిః, లబ్ధా, గుణప్రసిద్ధిః యయాసా=లబ్ధగుణప్రసిద్ధిః, తామ్=లబ్ధగుణప్రసిద్ధిమ్ ।

స్థానాన్తరమ్ :— అన్యత్ స్థానం=స్థానాన్తరమ్, తత్=స్థానాన్తరమ్.

విమానవాహాః :— విమానం వహన్తీతి=విమానవాహాః.

## భావము :

హవ్యుని దమయన్తి నిరాకరించిన పిదప విమానవాహులగు భృత్యులు, సౌన్దర్యాది గుణములతోఁ బ్రసిద్ధినొందిన యా దమయన్తిని సంపదల కింపైన విలాసగృహమునుండి విద్వాంసులయందు ముఖ్యుడైన యీ రాజునొద్దనుండి తొలగించి మఱియొక రాజునొద్దకు; వాయువులు పరిమళసంపదను, లక్ష్మీ విలాసగృహమగు పద్మమునుండి తొలగించి మరల మఱియొక పుష్పమును పొందించునట్లు, పొందించిరి. ॥౪౩॥

శ్లో. భూయస్తతో నిఖిలవాఙ్మయదేవతా సా
హేమోపమేయతనుభాసమభాషతైనామ్ ।
ఏనం స్వబాహుబహువారనివారితారిం
చిత్తే కురుష్వ కురువిన్దసకాన్తిదన్తి॥ 48

ప.వి. భూయః-తతః -నిఖిలవాఙ్మయదేవతా-సా- హేమోపమేయతనుభాసమ్-అభాషత-ఏనామ్-ఏనం-స్వబాహుబహువారనివారితారిం-చిత్తే-కురుష్వ-కురువిన్దసకాన్తిదన్తి.

అర్థము. తతః=తర్వాత, భూయః=మరలఁగూడ, నిఖిలవాఙ్మయదేవతా; నిఖిల=సమస్త వాక్కులకధి దేవతయగు సా=ఆ సరస్వతి, హేమోపమేయ తనుభాసమ్; హేమ=బంగారుచేత, ఉపమేయ = పోల్పఁదగిన, తను భాసమ్ = శరీరకాంతి గల్గిన, ఏనాం=దమయన్తిని, అభాషత=పలికెను. హే కురువిన్దసకాంతిదన్తి! = పద్మరాగముతో సమానకాంతి గల్గిన దంతములు గల యో దమయన్తీ!, స్వబాహుబహువారనివారితారిమ్; స్వబాహు=తను బాహువులచే, బహువార=పెక్కుమాఱులు, నివారిత=నిరోధింపబడిన, అరిం=శత్రువులుగల, ఏనం=ఈ రాజును, చిత్తే=మనస్సునందు, కురుష్వ=ఉంచుకొనుము.

## సమాసములు :

నిఖిలవాఙ్మయదేవతా :— నిఖిలంచతత్ వాఙ్మయం చ=నిఖిలవాఙ్మయమ్, నిఖిలవాఙ్మయస్య దేవతా=నిఖిలవాఙ్మయదేవతా.

హేమోపమేయతనుభాసమ్ :— హేమ్నా ఉపమేయా=హేమోపమేయా, తనోః భాః=తనుభాః, హేమోపమేయా, తనుభాః యస్యాస్సా=హేమోపమేయతనుభాః,తామ్=హేమోపమేయతనుభాసమ్, స్వస్యబాహూ =స్వబాహూ, బహువారం నివారితాః=బహువారనివారితాః బహువారనివారితాశ్చతే అరయశ్చ=బహువారనివారితారయః. స్వబాహుభ్యాం బహువారనివారితారయః యస్యసః = స్వబాహుబహువారనివారితారిః, తమ్=స్వబాహుబహువారనివారితారిమ్ ।

కురువిన్దసకాన్తిదన్తి :— కురువిన్దైః సమానా, కాన్తిఃయేషాంతే=కురువిన్ద సమానకాంతయః, కురువిన్దసమానకాన్తయఃదన్తాః యస్యాస్యా=కురువిన సమానకాన్తిదన్తీ; తస్యాఃసంబుద్ధిః= హే కురువిన్దసమానకాన్తిదన్తి!

**భావము :**

తర్వాత సరస్వతీదేవి పసిడితోఁ బోల్పఁదగినదై చాయగల్గిన దమయన్తిని గూర్చి చెప్పినది. "ఓ పద్మరాగములవంటి దన్తములు గల దమయన్తీ! పలు మాఱులు తన బాహువులచే శత్రువులఁ బారఁద్రోలిన యీ రాజును వరింపుము. అని ॥౪౮॥

శ్లో. ద్వీపస్య పశ్య దయితం ద్యుతిమన్తమేతం
క్రౌఞ్చస్య చఞ్చలదృగఞ్చలవిభ్రమేణ ।
యన్మణ్డలే స కిల పాణ్డులసన్నివేశః
పూరశ్చకాస్తి దధిమణ్డమయః పయోధేః॥ 49

ప.వి. ద్వీపస్య-పశ్య-దయితం-ద్యుతిమన్తమ్-ఏతమ్-క్రౌఞ్చస్య-చఞ్చలదృగఞ్చలవిభ్రమేణ-యన్మణ్డలే-సః-కిల-పాణ్డులసన్నివేశః—పూరః-చకాస్తి-దధిమణ్డమయః- పయోధేః.

అర్థము. ద్యుతిమన్తం నామ=ద్యుతిమన్తుఁడను, ఏతం = వీనిని, క్రౌఞ్చస్య= క్రౌఞ్చమనెడి, ద్వీపస్య=ద్వీపమునకు, దయితం=అధిపతిని, చఞ్చలదృగఞ్చలవిభ్రమేణ; చఞ్చల=చఞ్చలమైన, దృగఞ్చల=కటాక్షము యొక్క, విభ్రమేణ=విలాసముతో, పశ్య=చూడుము. యన్మణ్డలే= ఎవ్వని రాజ్యమందు, పయోధేః=సముద్రముయొక్క, సః=ఆ ప్రసిద్ధమైన, పాణ్డులసన్నివేశః; పాణ్డుల=తెల్లనైన, సన్నివేశః=స్థితిగల్గిన, దధిమణ్డమయః—పెరుగునందలి పరకయొక్క లేదా మీగడయొక్క రూపమునున్న, పూరః=ప్రవాహము, చకాస్తి కిల=విలసిల్లుచున్నది గదా,

**సమాసములు :**

చఞ్చలదృగఞ్చలవిభ్రమేణ :— చఞ్చలాశ్చతేదృగఞ్చలాశ్చ = చఞ్చల దృగఞ్చలాః, చఞ్చలదృగఞ్చలానాం విభ్రమః= చఞ్చలదృగఞ్చల విభ్రమః, తేన=చఞ్చలదృగఞ్చలవిభ్రమేణ ।
యన్మణ్డలే :— యస్యమణ్డలమ్=యన్మణ్డలం, తస్మిన్=యన్మణ్డలే.
పాణ్డులసన్నివేశః :— పాణ్డులఃసన్నివేశః యస్యసః=పాణ్డులసన్నివేశః.
దధిమణ్డమయః :— దధ్నఃమణ్డం=దధిమణ్డం, దధిమణ్డస్యవికారః=దధి మణ్డమయః ।

**భావము :**

ఓ దమయన్తీ ! క్రౌఞ్చద్వీపప్రభువగు నీ ద్యుతిమన్తుని నీ చఞ్చలము లగు కటాక్షముల విలాసముతోఁ జూడుము. ఇతని దేశమందు ప్రసిద్ధముగాఁ జెప్పఁబడు, తెల్లని సన్నివేశము గల్గిన, పెరుగునందలి పరకతో లేదా మీగడతో లేదా తేటతో నిండిన సముద్రపు ప్రవాహము విలసిల్లుచున్నది. ॥౪౯॥

> శ్లో. తత్రాఽద్రిరస్తి భవదఙ్ఘ్రివిహారయాచీ
> క్రౌఞ్చః స్ఫురిష్యతి గుణానివ యస్త్వదీయాన్ ।
> హంసావలీకలకలప్రతినాదవాగ్భిః
> స్కన్దేషువృన్దవివరై ర్వివరీతుకామః॥ 50

ప.వి. తత్ర-అద్రిః-అస్తి-భవదఙ్ఘ్రివిహారయాచీ-క్రౌఞ్చః-స్ఫురిష్యతి-గుణాన్-ఇవ – యః - త్వదీయాన్-హంసావలీకలకలప్రతినాదవాగ్భిః- స్కన్దేషు వృన్దవివరైః-వివరీతుకామః.

అర్థము. తత్ర = ఆక్రౌఞ్చద్వీపమునందు, భవదఙ్ఘ్రి విహారయాచీ; భవత్=నీ యొక్క, అఙ్ఘ్రి=పాదములయొక్క, విహార=సంచారమును, యాచీ= ప్రార్థించుచున్న, క్రౌఞ్చః=క్రౌఞ్చమను పేరుగల్గిన, అద్రిః=పర్వతము, అస్తి=కలదు. యః=ఏపర్వతము, హంసావలీకలకలప్రతినాదవాగ్భిః; హంసావలీ=హంసశ్రేణుల, కలకల=కలకలధ్వనులయొక్క, ప్రతినాద= ప్రతిధ్వనులనెడి, వాగ్భిః=వాక్కులుగల, స్కన్దేషువృన్దవివరైః, స్కన్ద=

కుమారస్వామియొక్క, ఇషు=బాణములవలనసేర్పడిన, వివరైః=రన్ధ్రము లచే, అనగా రన్ధ్రములనెడి ముఖములచే, త్వదీయాన్=నీకుసంబంధించిన, గుణాన్ = గుణములను, వివరీతుకామః = వివరింపఁగోరికకలదిగా, స్ఫురిష్యతి = ప్రకాశించును. పూర్వము కుమరస్వామి తన బాణములచే క్రౌఞ్చ పర్వతమునకు రన్ధ్రములను వేసెనని పురాణ ప్రసిద్ధి.

## సమాసములు :

భవదఙ్ఘ్రివిహారయాచీ :- భవత్యాః అఙ్ఘ్రయః= భవదఙ్ఘ్రయః భవద ఙ్ఘ్రీణాంవిహారః=భవదఙ్ఘ్రివిహారః, భవదఙ్ఘ్రివిహారం, యాచత ఇతి= భవదఙ్ఘ్రివిహారయాచీ.

హంసావలీకలకలప్రతినాదవాగ్భిః :- హంసానామావలీ = హంసావలీ, హంసావల్యాః కలకలః=హంసావలీకలకలః, హంసావలీకలకలస్య ప్రతి నాదః = హంసావలీకలకలప్రతినాదః, హంసావలీకలకలప్రతినాద ఏవవాచః=హంసావలీకలకలప్రతినాదవాచః, తాభిః = హంసావలీకలకల ప్రతినాదవాగ్భిః ॥

స్కన్దేషువృన్దవివరైః :- స్కన్దస్యఇషవః=స్కన్దేషవః, స్కన్దేషూణాం వృన్దః=స్కన్దేషువృన్దః। స్కన్దేషువృన్దస్యవివరాః=స్కన్దేషువృన్దవివరాః, తైః=స్కన్దేషువృన్దవివరైః.

వివరీతుకామః :- వివరీతుంకామః యస్యసః=వివరీతుకామః.

## భావము :

ఆ క్రౌఞ్చద్వీపమందు సవిలాసమగు నీ సఞ్చారమునుఁ గోరిన క్రౌఞ్చ పర్వతము గలదు. ఆ పర్వతము హంసలకలకల నాదముల ప్రతిధ్వనులనెడి వాక్కులు కల్గిన; కుమారస్వామి బాణసమూహము దెబ్బలచే నేర్పడిన రన్ధ్రము లనెడి ముఖములచే నీ గుణములను వివరింపఁగోరిక కలదిగా ప్రకాశించుచున్నది. పూర్వము కుమార స్వామి విలువిద్యను నేర్చునపుడు క్రౌఞ్చపర్వతముపై బాణ ముల ప్రయోగమునభ్యసింపగా దానివలన నా పర్వతమున రన్ధ్రములేర్పడినవని పురాణప్రసిద్ధి. ఆరన్ధ్ర మార్గము నుండి హంసలు వర్షర్తువురాగనే మానససరో వరమునుఁజేరి యాత్మరక్షణముఁ జేసికొనును. ॥౨౦॥

శ్లో. వైదర్భి! దర్భదలపూజనయాఽపి యస్య
గర్భే జనః పునరుదేతి న జాతు మాతుః,
తస్యార్చనాం రచయ తత్ర మృగాఙ్కమౌళే
స్తన్మాత్రదైవతజనాభిజనః స దేశః॥ 51

ప. వి. వైదర్భి! - దర్భదలపూజనయా - అపి - యస్య - గర్భే - జనః - పునః - ఉదేతి - న - జాతు - మాతుః - తస్య - అర్చనాం - రచయ - తత్ర - మృగాఙ్కమౌళేః - తన్మాత్రదైవతజనాభిజనః - సః - దేశః.

అర్థము. హే వైదర్భి=ఓ దమయన్తీ!, యస్య=ఏ చన్ద్రమౌళిస్వామికి, దర్భదల పూజనయాఽపి; దర్భదల=దర్భ పత్రములయొక్క, పూజనయాఽపి= పూజచేతను, జనః=జనము, జాతు=ఎప్పుడు, పునః=మరల, మాతుః=తల్లి యొక్క, గర్భే=గర్భమునందు న ఉదేతి=జన్మింపడో, అనగా పునర్జన్మ రాహిత్యమునుఁ బొందునో, తస్య=అటువంటి, మృగాఙ్కమౌళేః=చన్ద్ర మౌళియగు శివునకు, అర్చనాం=పూజను, రచయ=చేయుము. తథాహి= అదియుక్తమే, సః=ఆ, దేశః=దేశము, తన్మాత్రదైవతజనాభిజనః; తన్మాత్రదైవత=శివుడొక్కడే దైవముగాగల జనులకు, అభిజనః=జన్మ భూమి. అనగా నచ్చటివారికి శ్రీ చన్ద్రమౌళిస్వామియే దైవము. ఆ దేవత నుపాసించుటచేతనే వారు ముక్తిఁబడయుదురని యర్థము-

వి. తన్మాత్ర దైవతజనాభిజనః యను సామాన్యముచే, ఆ చన్ద్రమౌళిస్వామికి పూజ చేయమను, దర్భదళ పూజచేతను పునర్జన్మ రాహిత్యమేర్పడునను విశేషార్థము సమర్థితముగాన అర్థాన్తరన్యాసాలఙ్కారము.

**సమాసములు :**

దర్భదలపూజనయా :- దర్భాణాం దలాని=దర్భదలాని దర్భదలైః పూజనా=దర్భదల పూజనా, తయా=దర్భదలపూజనయా। మృగాఙ్క మౌళేః :- మృగః అఙ్కః యస్య సః = మృగాఙ్కః, మృగాఙ్కః మౌళౌ యస్య సః=మృగాఙ్కమౌళిః, తస్య=మృగాఙ్కమౌళేః ॥

తన్మాత్రదైవతజనాభిజనః :- స ఏవ తన్మాత్రం, తన్మాత్రం దైవతం యేషాం తే=తన్మాత్రదైవతాః, తన్మాత్రదైవతాశ్చ తే, జనాశ్చ=తన్మాత్ర

దైవతజనాః, తన్మాత్రదైవత జనానామభిజనః=తన్మాత్రదైవతజనాభి
జనః ॥

**భావము :**

ఓ దమయన్తీ! దర్భపత్రములతో నెవ్వానిఁ పూజించిన, మరల తల్లి గర్భమున జన్మము రాదో, యనగా జన్మరాహిత్యమేర్పడునో, అట్టి చంద్రమౌళీశ్వరు నాపర్వతమునఁ బూజింపుము. ఆ దేశమందలి జనులకు వారొక్కరే దైవముగా నున్నారు. ॥౫౦॥

శ్లో. **చూడాప్రచుమ్బిమిహిరోదయశైలశీల**
**స్తేనాః స్తనన్ధయసుధాకరశేఖరస్య ।**
**తస్మిన్ సువర్ణరసరూషణరమ్యహర్మ్య**
**భూభృద్ఘటా ఘటయ హేమఘటావతంసాః॥ 52**

ప.వి. చూడాప్రచుమ్బిమిహిరోదయశైలశీలస్తేనాః - స్తనన్ధయసుధాకరశేఖరస్య - తస్మిన్ - సువర్ణరసరూషణరమ్యహర్మ్యభూభృద్ఘటాః - ఘటయ - హేమఘటావతంసాః.

అర్థము. తస్మిన్=ఆ దేశమునందు, స్తనంధయసుధాకరశేఖరస్య; స్తనంధయ= బాలుఁడైన, సుధాకర=చంద్రుని, శేఖరస్య శిరోభూషణముగాఁ గల్గిన, శివునకు, హేమఘటావతంసాః; హేమఘటీ = సువర్ణకలశములు, అవతంసాః=శిరోభూషణములుగాఁ గల అనగాఁ పై భాగమున [illegible] కలశములచే భూషింపఁబడినవని యర్థము. (కావుననే) చూడాప్ర[illegible] మిహిరోదయశైలశీలస్తేనాః; చూడా=శిఖరములను, ప్రచుమ్బి=స్పృ[illegible] మిహిర=సూర్యుడు గల, ఉదయశైల=ఉదయపర్వతమునొక్క, శీల= స్వభావమును, స్తేనాః=అపహరించునట్టివియు ననగా దానికి సమా[illegible] నైనవియు, సువర్ణరసరూషణరమ్యహర్మ్యభూభృద్ఘటాః; సువర్ణరస = స్వర్ణద్రవముచే, రూషణ = పూతచేయుటచే, రమ్య=మనోహరములగు, హర్మ్య=మేడలనెడు, భూభృత్ = పర్వతములయొక్క, ఘటాః [illegible] లను, ఘటయ=నిర్మింపుము. సువర్ణకలశములతోఁ [illegible]

మేడలను నిర్మించి యా చన్ద్రమౌళి స్వామిని సంతోషపఱచు మని యర్థము.

**సమాసములు :**

చూడాప్రచుమ్బిమిహిరోదయశైలశీలస్తేనాః :— చూడాం ప్రచుమ్బతీతి= చూడాప్రచుమ్బి, చూడాప్రచుమ్బి, మిహిరః యస్యసః= చూడాప్రచుమ్బి మిహిరః,ఉదయస్యశైలః=ఉదయశైలః చూడాప్రచుమ్బిమిహిరశ్చాసౌ ఉదయశైలశ్చ=చూడాప్రచుమ్బిమిహిరోదయశైలః,చూడాప్రచుమ్బిమిహి రోదయశైలస్యశీలం,=చూడాప్రచుమ్బిమిహిరోదయశైలశీలమ్, చూడా ప్రచుమ్బిమిహిరోదయశైలశీలస్యస్తేనాః = చూడాప్రచుమ్బిమిహిరోదయ శైలశీలస్తేనాః।

స్తనన్ధయసుధాకరశేఖరస్య :— స్తనంధయతీతి= స్తనన్ధయః స్తనంధయః సుధాకరః శేఖరః యస్యసః- స్తనంధయసుధాకరశేఖరః, తస్య = స్తనన్ధయసుధాకరశేఖరస్య.

సువర్ణరసరూషణరమ్యహర్మ్యభూభృద్ఘటాః :— సువర్ణస్యరసః=సువర్ణ రసః, సువర్ణరసేనరూషణం=సువర్ణరసరూషణమ్, సువర్ణరసరూషణేన, రమ్యాణి=సువర్ణరసరూషణరమ్యాణి, సువర్ణరసరూషణరమ్యాణిచతాని హర్మ్యాణిచ=సువర్ణరసరూషణరమ్యహర్మ్యాణి, సువర్ణరసరూషణరమ్య హర్మ్యాణ్యేవభూభృతః=సువర్ణరసరూషణరమ్యహర్మ్యభూభృతః, సువర్ణ రసరూషణరమ్యహర్మ్యభూభృతాంఘటాః = సువర్ణరూషణరమ్యహర్మ్య భూభృద్ఘటాః, తాః, సువర్ణరసరూషణరమ్యహర్మ్యభూభృద్ఘటాః ॥

హేమఘటావతంసాః :— హేమమయాశ్చతే ఘటాశ్చ= హేమఘటాః, హేమఘటాః అవతంసాః, యేషాన్తే=హేమఘటావతంసాః ॥

**భావము :**

దమయన్తీ! ఆ క్రౌఞ్చ ద్వీపమునందు బాలేన్దుశేఖరుడైన శివునకు, సువర్ణ కలశములతోఁ బైభాగమునందలంకరింపఁబడినవియు, కాఫునసే యుదయగిరి శిఖరములను సూర్యుడధిరోహింపఁగనే కానవచ్చెడి సౌన్దర్యము నపహరించునట్టి

యునగు పసిడిపూతలతో సొబగారు మేడలనెడి కొండలవరసలను కట్టించి, శ్రీ చంద్రశేఖరస్వామి వారిని సంతోష పఱచుము. ॥౫౨॥

శ్లో. తస్మిన్మలిమ్లుచ ఇవ స్మరకేలిజన్మ
ఘర్మోదబిన్దుమయమౌక్తిమణ్డనం తే ।
జాలైర్మిలన్దధిమహోదధిపూరలోల
కల్లోలచామరమరుత్తరుణిః చ్ఛినత్తు॥ 53

ప. వి. తస్మిన్-మలిమ్లుచః-ఇవ-స్మరకేలిజన్మఘర్మోదబిన్దు మయమౌక్తికమణ్డనం-తే-జాలైః-మిలన్ - దధిమహోదధిపూరలోలకల్లోలచామరమరుత్-తరుణి!-ఛినత్తు-

అర్థము. హేతరుణి!=ఓ యువతీ!, తస్మిన్=అ ద్వీపమునందు, దధి మహోదధి పూర్ణలోలకల్లోల చామరమరుత్; దధి మహోదధి=పెరుగుకడలియొక్క, పూర =ప్రవాహమునందు, లోల =కదలుచున్న, కల్లోల=అలలనెడి, చామర=వింజామరలయొక్క, మరుత్=గాలి, మలిమ్లుచ ఇవ=దొంగవలె, జాలైః=గవాక్షరన్ధ్రములతో, మిలన్=లోనసంచరించుచు, స్మరకేలిజన్మ ఘర్మోదబిన్దు మయమౌక్తికమణ్డనం; స్మరకేళి=సమ్భోగముచే, జన్మ = ఉద్భవించిన, ఘర్మోదబిందుమయ=చెమటబొట్లనెడి, మౌక్తిక=ముత్తెము లతో నిర్మితమైన, మణ్డనం=ఆభరణమును, ఛినత్తు=ఛేదించి హరించును గాక.-

వి. వాయువును దొంగతో పోల్చుట వలన నుపమ. చెమటనీటిబొట్టులను, ముక్తాభరణముగను, దధిసాగరమునందలి తరఙ్గములను వింజామరలుగ నిరూపించుట వలన రూపకము. ఈ రెంటికి సఙ్కరము.

**సమాసములు :**

స్మరకేలిజన్మఘర్మోదబిందుమయమౌక్తికమణ్డనమ్ :- స్మరస్య కేళిః= స్మరకేళిః, స్మరకేళేఃజన్మయస్యతత్=స్మరకేళిజన్మ, ఘర్మాత్ ఉదకం= ఘర్మోదం, స్మరకేలిజన్మఘర్మోదస్యబిందవః = స్మరకేళిజన్మఘర్మోద బిందవః, స్మరకేళిజన్మఘర్మోదబిందూనాం వికారః = స్మరకేళిజన్మ

ఘర్మోదబిందుమయం, మౌక్తికంచతత్ మణ్డనం చ = మౌక్తికమణ్డనమ్, స్మరకేళి జన్మఘర్మోదబిందుమయంచతత్ మౌక్తికమణ్డనం చ=స్మరకేళి జన్మఘర్మోదబిందుమయమౌక్తికమండనమ్, తత్=స్మరకేళిజన్మఘర్మోదబిందుమయమౌక్తికమణ్డనమ్ ॥

దధిమహోదధిపూరలోలకల్లోలచామరమరుత్:- మహాంశ్చాసౌఉదధిశ్చ=మహోదధిః। దధిమయశ్చాసౌమహోదధిశ్చ=దధిమహోదధిః, దధిమహోదధేఃపూరః=దధిమహోదధిపూరః, దధిమహోదధిపూరేలోలాః=దధిమహోదధిపూరలోలాః, దధిమహోదధిపూరలోలాశ్చతే కల్లోలాశ్చ=దధిమహోదధిపూరలోలకల్లోలాః, దధిమహోదధిపూరలోలకల్లోలాఏవచామరాః=దధిమహోదధిపూరలోలకల్లోలచామరాః, దధిమహోదధిపూరలోలకల్లోలచామరాణాంమరుత్=దధిమహోదధిపూరలోల కల్లోల చామరమరుత్॥

**భావము :**

ఓ యువతీ ! ఆద్వీపమునందు పెరుగుకడలిలోని కెరటములనెడి వింజామరలగాలి; వెంగవలె గవాక్షముల సందులలోఁ దిరుగుచు, నీ సమ్భోగకాలమందలి చెమట బొట్లనెడి ముక్తాభరణమును నపహరించ వలయును. అనగా నీకు సమ్భోగమువలన శ్రమ జలములను పెరుగు కడలిపైనలలపై వచ్చెడి చల్లని పిల్లగాడ్పులు తొలగించునని యర్థము. ఇచ్చట తరుణియని దమయన్తిని సంబోధించుట వలన, నామెకు సమ్భోగోచితమగు యౌవనమున్నదనిసూచించుట ముఖ్యాశయము. ఇట్లేత త్తత్సందర్భముల యందలి విశేషణములాయా సందర్భోచితములగనే, సాభిప్రాయముగా కవిప్రయోగించుచున్నాడను విషయమును పాఠకులు గమనింతురు గాక. ॥౨౭॥

శ్లో. ఏతద్యశో నవసవం ఖలు హంసవేశం
వేశన్తన స్తరణదుంరగమత్రమేణ।
ఆఖ్యాసమద్ధయతి న స్తరితుం నముద్రాన్
గన్తుం చ నిఃక్రమమితః సకలాన్ దిగన్తాన్॥ ౯౩

ప.వి. ఏతద్యశః-నవనవం-ఖలు-హంసవేశం-వేశన్తసన్తరణదూరగమక్రమేణ-అభ్యాసమ్ - అర్జయతి-సన్తరితుం-సముద్రాన్-గన్తుం-చ-నిఃశ్రమమ్-ఇతః-సకలాన్-దిగన్తాన్.

అర్థము. నవనవం = ప్రతిదినముక్రొత్తపద్ధతితోనున్న, హంసవేశం=హంసవంటి వ్యాపారమును లేదా, హంసశరీరమువంటితెల్లదనమును గల్గిన, ఏతద్యశః; ఏతత్ = ఈరాజుయొక్క, యశః = కీర్తి, వేశన్తసన్తరణదూరగమక్రమేణ; వేశన్త=పడియలను, సన్తరణ=దాటుట, దూరగమ=దూరమువెళ్ళుటయను నీ రెండురీతులతో, ఇతః=ఇక్కడనుండి, నిఃశ్రమం=ప్రయాసలేక, సముద్రాన్=సముద్రములను, సన్తరితుం = దాటుటకును, సకలాన్=సమస్తములైన, దిగన్తాన్=దిక్కులయంచువరకును, గన్తుఞ్చ=వెళ్ళుటకును, అభ్యాసం = అలవాటును, అర్జమతిఖలు=సమ్పాదించుచున్నదా యేమి ? కానిచో నిది యెట్లు సకలలోకములను దాటుచున్నది.

వి. పల్వత సముద్రాదులను కీర్తి దాటుచు పోకపోయినను పోయినట్లు చెప్పుటచే, నుత్ప్రేక్ష.

**సమాసములు :**

హంసవేశమ్ :– హంసస్యవేశః, హంసవేశః, తమ్=హంసవేశమ్.

వేశన్తసన్తరణ దూరగమక్రమేణ:– వేశన్తానాం సన్తరణం=వేశన్తసన్తరణమ్, దూరం గమః,=దూరగమః, వేశన్తసన్తరణం చ దూరగమశ్చ=వేశన్తసన్తరణదూరగమౌ, వేశన్తసన్తరణదూరగమయోః క్రమః=వేశన్తసన్తరణదూరగమక్రమః, తేన=వేశన్తసన్తరణదూరగమక్రమేణ ।

నిఃశ్రమమ్ :– నిర్గతః శ్రమః యస్మిన్కర్మణి తద్యథాభవతి తథా=నిఃశ్రమమ్ ।

దిగన్తాన్ :– దిశామన్తాః=దిగన్తాః, తాన్=దిగన్తాన్.

**భావము :**

ప్రతిదినము క్రొత్తక్రొత్త పోకడలతో వెలయుచు, హంసపంక్తి ప్రవృత్తియు వేషము గల్గిన యీ నృపతి యొక్క కీర్తి, పడియలను, దాటుట, దూరము వెళ్లుట యను నీ రీతులతో, నీ ప్రదేశము నుండి శ్రమ లేక సముద్రములనుదాటుటకును, దిక్కుల యంచుల వరకు సంచరించుటకును నభ్యాసము చేయుచున్నట్లు కానవచ్చుచున్నది. కానిచో సకలలోకములనిది యెట్లు లంఘించు చున్నది. అనగా నీ తేని కీర్తి సర్వలోక వ్యాప్తినిఁ చొందినదని యాశయము. ॥౫౪॥

**శ్లో. తస్మిన్ గుణైరపి భృతే గణనాదరిద్రై**
**స్తన్వీ న సా హృదయబన్ధమవాప భూపే ।**
**దైవే నిరున్ధతి నిబన్ధనతాం వహన్తి**
**హన్తః ప్రయాసపరుషాణి న పౌరుషాణి॥ 55**

ప.వి. తస్మిన్-గుణైః-అపి-భృతే-గణనాదరిద్రైః -తన్వీ-న-సా-హృదయ బన్ధమ్-అవాప-భూపే-దైవే-నిరున్ధతి-నిబన్ధనతాం-హన్త!-ప్రయాసపరుషాణి-న-పౌరుషాణి-

అర్థము. తన్వీ=కృశాంగియైన,సా=ఆదమయన్తి. గణనాదరిద్రైః=లెక్కలేనటువంటి, గుణైః=గుణములతో, భృతేఽపి=నిండినవాఁడైనను, తస్మిన్=ఆ, భూపే=రాజునందు, ననగా ద్యుతిమన్తుఁడను రాజునందు, హృదయబన్ధమ్; హృదయ=మనస్సునకు, బంధం=సంబంధమును, అనగామనస్సజ్ఞమును. న అవాప = పొందలేదు. తథాహి=అదియుక్తమే ! దైవే=దైవము, అనగా భాగ్యము, నిరున్ధతిసతి=ప్రతిబంధించుచుండగా,ప్రయాసపరుషాణి; ప్రయాస=కష్టములధికముగానుండుటచే, పరుషాణి=కఠినములైన, పౌరుషాణి = పురుషప్రయత్నములు, నిబన్ధనతాం=కార్యములకు కారణములుగా నుండుటను, నవహన్తి=వహింపవు. హన్త=కష్టము.

వి. దైవము నిరోధించినచో, పురుషప్రయత్నములు ఫలింపవను సామాన్యముతో, ద్యుతిమన్తుఁ డెంత గుణవన్తుఁ డైనను, నాతని యందు దమయన్తికి మనస్సఙ్గము కలుగ లేదను విశేషము సమర్థితము కాన నర్థాన్తరన్యాసాలఙ్కారము.

**సమాసములు :**

గణనాపరిద్రైః :- గణనాయాం పరిద్రాః=గణనాపరిద్రాః, తైః= గణనాపరిద్రైః ।
హృదయబద్ధమ్ :- హృదయస్య బద్ధః=హృదయబద్ధః, తమ్=హృదయ బద్ధమ్ ।
ప్రయాసపరుషాణి :- ప్రయాసైః పరుషాణి=ప్రయాసపరుషాణి, తాని= ప్రయాసపరుషాణి ।

**భావము :**

ఆ ద్యుతిమన్తుఁడను రాజెంత గుణవన్తుఁడైనను, వానియందు నా దమయన్తికి మనస్సంగ మేర్పడలేదు. ఇది యుక్తమే, ఏలయనగా, దైవము అడ్డంకులు గల్గించునపుడు, మనమెంత శ్రమపడినను మన ప్రయత్నములు ఫలింపవుగదా. కాననే యంతటి గుణవన్తుఁడగు రాజునందు దమయన్తికి ప్రేమ గలుగలేదని యాశయము. ॥౫౫॥

శ్లో. తే నిర్వ్యరే నృపతిమన్యమిమామముష్మా
దంసావతంసశిబికాంశభృతః పుమాంసః ।
రత్నాకరాదివ తుషారమయూఖలేఖాం
లేఖానుజీవిపురుషా గిరిశోత్తమాఙ్గమ్॥ **56**

ప.వి. తే-నిర్వ్యరే-నృపతిమ్-అన్యమ్ - ఇమామ్-అముష్మాత్-అంసావతంసశిబి కాంశభృతః-పుమాంసః - రత్నాకరాత్-ఇవ - తుషారమయూఖలేఖాం- లేఖానుజీవిపురుషాః-గిరిశోత్తమాఙ్గమ్.

అర్థము. తే=ఆ, అంసావతంసశిబికాంశభృతః; అంస = భుజ శిఖరములకు, అవతంస=భూషణమైన, శిబికా=పల్లకియొక్క, అంశ=భాగములను, భృతః = ధరించుచున్న, పుమాంసః=పురుషులు, లేఖానుజీవిపురుషాః; లేఖ -దేవతారూపమును సున్న, అనుజీవి = భృత్యులైన, పురుషాః= పురుషులు, రత్నాకరాత్ = సముద్రమునుండి, తుషారమయూఖలే

ఖామ్; తుషారమయూఖ=చన్ద్రుని యొక్క, లేఖామ్=కళను, గిరిశోత్త మాఙ్గమివ; గిరిశ=శివునియొక్క, ఉత్తమాఙ్గమివ = శిరస్సునువలె, ఇమాం=ఈ దమయన్తిని, అముష్మాత్=ఈ ద్యుతిమన్తుని నుండి, అన్య నృపమ్=మఱియొక రాజును, నిన్యిరే=పొందించిరి.

**సమాసములు :**

అంసావతంసశిబికాంశభృతః :– అంసయోరవతంసః=అంసావతంసః, అంసావతంసశ్చాసౌశిబికాచ = అంసావతంస శిబికా, అంసావతంస శిబి కాయాః అంశాః= అంసావతంస శిబికాంశాః, అంసావతంస శిబకాఁశాన్ బిభ్రతీతి=అంసావతంస శిబికాంశభృతః.

తుషారమయూఖలేఖామ్ :– తుషారమయాః మయూఖాః యస్యసః= తుషారమయూఖః, తుషారమయూఖస్య లేఖా = తుషారమయూఖలేఖా, తామ్=తుషారమయూఖలేఖామ్ ।

లేఖానుజీవిపురుషాః :– లేఖాశ్చతే అనుజీవినశ్చ=లేఖానుజీవినః, లేఖాను జీవినశ్చతే పురుషాశ్చ=లేఖానుజీవిపురుషాః.

గిరిశోత్తమాఙ్గమ్ :– గిరిశస్య ఉత్తమాఙ్గమ్=గిరిశోత్తమాఙ్గమ్। తత్= గిరిశోత్తమాఙ్గమ్.

**భావము :**

భుజశిఖరములకు భూషణములైన పల్లకియొక్క యాయా భాగములను మోయుచున్న భృత్యులు; దేవతాభృత్యులు సముద్రమునుండి చన్ద్రకళను శివుని శిరమునుఁ బొందించునట్లు దమయన్తిని ద్యుతిమన్తుఁ డను రాజునుండి విడిపించి మఱియొక రాజుకడకుఁ గొనిపోయిరి. ॥౫౬॥

శ్లో. ఏతైకముద్గతగుణం ధుతదూషణం చ
హిత్వాఽన్యమన్యముపగమ్య పరిత్యజన్తీమ్ ।
ఏతాం జగాద జగదర్చితపాదపద్మా
పద్మామివాచ్యుతభుజాన్తరవిచ్యుతాం సా॥ 57

ప.వి. ఏకైకమ్-ఉద్గతగుణమ్-ధుతదూషణం-చ - హిత్వా-అన్యమ్-అన్యమ్-ఉపగమ్య-పరిత్యజన్తీమ్-ఏతాం-జగాద-జగదర్చితపాదపద్మా- పద్మామ్ -ఇవ-అచ్యుతభుజాన్తరవిచ్యుతామ్-సా.

అర్థము. జగదర్చితపాదపద్మా; జగత్=లోకములచే, అర్చిత=పూజింపఁబడిన, పాదపద్మా=పద్మములవంటి పాదములు గల్గిన, సా=ఆ సరస్వతీదేవి, ఉద్గతగుణం = గుణములతో నిండిన, ధుతదూషణమ్=దోషములేని, ఏకైకం=ఒక్కొక్క, నృపం = రాజును, హిత్వా=వదలి, అన్య మన్యమ్=భిన్న భిన్నమైన, (నృపతిం)=రాజును, ఉపగమ్య=పొంది, పరిత్యజన్తీం = విడచుచున్నదియు, అచ్యుత భుజాన్తరవిచ్యుతాం; అచ్యుత=విష్ణువుయొక్క, భుజాన్తర=భుజమధ్యమునుండి, విచ్యుతాం= జారిపోయిన, పద్మామివ=లక్ష్మివలెనున్న, ఏతాం = ఈ దమయన్తిని, జగాద=పలికినది.

**సమాసములు :**

ఏకైకమ్:— ఏకశ్చ ఏకశ్చ యత్ర క్రమేణ ఉపాధీయతే=ఏకైకః, తమ్ ఏకైకమ్ ।

ఉద్గతగుణమ్ :- ఉద్గతాఃగుణాః యస్యసః=ఉద్గతగుణః, తమ్=ఉద్గత గుణమ్ ।

అన్యమన్యమ్ :— అన్యశ్చ, అన్యశ్చ అనయోర్వీప్సా=అన్యః అన్యః, తమ్=అన్యమన్యమ్ ।

జగదర్చితపాదపద్మా :— జగద్భిరర్చితే = జగదర్చితే, పాదౌపద్మే ఇవ= పాదపద్మే, జగదర్చితేపాదపద్మే యస్యాస్సా = జగదర్చితపాదపద్మా, తామ్=జగదర్చితపాదపద్మామ్.

అచ్యుతభుజాన్తరవిచ్యుతామ్ :— భుజయోరన్తరం=భుజాన్తరమ్, అచ్యుతస్యభుజాన్తరమ్, అచ్యుతభుజాన్తరం. అచ్యుత జాన్తరాత్ విచ్యుతా= అచ్యుత భుజాన్తరవిచ్యుతా, తామ్=అచ్యుతభుజాన్తరవిచ్యుతామ్ ।

**భావము :**

జగత్తుచే పూజింపఁబడు పాదపద్మములు గల సరస్వతీదేవి, గుణవన్తు

డును దోషరహితుఁడునగు నొక్కొక్క రాజును వదలి, వేలువేలు రాజులను సమీపించి వారినిఁగూడ పరిహరించుచు విష్ణువు భుజ మధ్యమునుండి జారిపోయిన లక్ష్మియో యనునట్లున్న దమయన్తినిఁ గూర్చి పలికెను. ॥౫౭॥

శ్లో. ఈశః కుశేశయసనాభిశయే కుశేన
ద్వీపస్య లాఞ్ఛితతనోర్యది వాఞ్ఛితస్తే ।
జ్యోతిష్మతా సమమనేన వనీఘనాసు
తత్ త్వం వినోదయ ఘృతోదతటీషు చేతః॥ 58

ప. వి. ఈశః :- కుశేశయసనాభిశయే—కుశేన-ద్వీపస్య—లాఞ్ఛితతనోః-యది-వాఞ్ఛితః-తే- జ్యోతిష్మతా-సమమ్—అనేన— వనీఘనాసు తత్- త్వం-వినోదయ-ఘృతోదతటీషు- చేతః.

అర్థము. కుశేశయసనాభిశయే; కుశేశయ=పద్మముతో, సనాభిః=సమానమైన' శయే!=అరచేయిగలదానా!, కుశేన=దర్భస్తమ్బముచే, లాఞ్ఛితతనోః; లాఞ్ఛిత=గుఱుతింపఁబడిన, తనోః=స్వరూపముగల్గిన, ద్వీపస్య = కుశద్వీపముయొక్క, ఈశః=ప్రభువు, తే=నీకు, వాఞ్ఛితఃయది = ఇష్టమైనవాడైనచో, తత్=అప్పుడు, త్వం=నీవు, జ్యోతిష్మతాసమం = జ్యోతిష్మన్తుఁడు కుశద్వీపపుప్రభువైన, అనేన=వీనితో, వనీఘనాసు = వనములలో దట్టములైన, ఘృతోదతటీషు; ఘృతోద=నేతికడలియొక్క, తటీషు=గట్టులయందు, చేతః=మనస్సును, వినోదయ=వినోదపఱచు కొనుము.

**సమాసములు :**

కుశేశయసనాభిశయే!:—కుశేశయేనసనాభిః శయః యస్యాస్సా=కుశేశయసనాభిశయా! తస్యాస్సంబుద్ధిః=హే కుశేశయసనాభిశయే!

లాఞ్ఛితతనోః:-లాఞ్ఛితా, తనుః యస్యసః=లాఞ్ఛితతనుః, తస్యాః = లాఞ్ఛితతనోః।

వనీఘనాసు:- వనీభిః ఘనాః=వనీఘనాః, తాసు=వనీఘనాసు.

ఘృతోదతటీషు:- ఘృతం ఉదకం యస్మిన్సః=ఘృతోదః, ఘృతోదస్య తట్యః=ఘృతోద తట్యః, తాసు=ఘృతోదితటీషు.

**భావము :**

పద్మమువంటి యరచేయికలదానా ! దర్భలచే గుఱుతింపఁబడిన-అనగా దర్భలు సమృద్ధములుగాఁ గల యీ కుశద్వీపమునకు ప్రభువు నీ యెదుటనే యున్నాఁడు. అతని పేరు జ్యోతిష్మన్తుఁడు. నీవు ఆతనిని యిష్టపడినచో, నాతనితో, సాన్ద్రమగు సడవులతోఁ జెన్నొందిన ఘృతసాగరపు గట్టులయందు విహారముఁజేయుచు నీ మనస్సు నాహ్లాదపఱచుకొనుము. ॥౫౮॥

**శ్లో. వాతోర్మిలోలనచలద్దలమణ్డలాగ్ర**
**భిన్నాభ్రమణ్డలగలజ్జలజాతసేకః ।**
**స్తమ్బః కుశస్య భవితా౽మ్బరచుమ్బిచూడ**
**శ్చిత్రాయ తత్ర తవ నేత్రనిపీయమానః॥ 59**

ప. వి. వాతోర్మిలోలనచలద్దలమణ్డలాగ్రభిన్నాభ్రమణ్డల గలజ్జలజాతసేకః— స్తమ్బః-కుశస్య-భవితా - అమ్బరచుమ్బిచూడః-చిత్రాయ-తత్ర-తవ-నేత్రనిపీయమానః.

అర్థము. తత్ర=ఆ కుశద్వీపమునందు, అమ్బరచుమ్బిచూడః; అమ్బర=ఆకసమును, చుమ్బి=తాకునట్టి, చూడః=కొనగల్గిన(కావుననే), వాతోర్మిలోలన చలద్దలమణ్డలాగ్ర భిన్నాభ్రమణ్డలగలజ్జల జాతసేకః; వాత = గాలి యొక్క, ఊర్మి=అలలచే, లోలన=కలియఁబెట్టుటవలన, చలత్=కదలుచున్న, దల=ఆకులనెడి, మణ్డలాగ్ర=కత్తులచే, భిన్న=భేదింపఁబడిన, అభ్రమణ్డల=మేఘమణ్డలమునుండి, గలత్=పడుచున్న, జల=నీటితో, జాత=సంభవించిన, సేకః=తడుపుటకల్గిన, కుశస్య స్తమ్బః=దర్భలగంట, నేత్రనిపీయమానః, నేత్ర=కన్నులచే, నిపీయమానః=ప్రీతితోఁజూడఁబడినదై, తవ=నీకు, చిత్రాయ=ఆశ్చర్యమునకై, భవితా=కాఁగలదు,

**సమాసములు :**

వాతోర్మిలోలన చలద్దలమణ్డలాగ్ర భిన్నాభ్రమణ్డల గలజ్జలజాతసేకః :- వాతస్య ఊర్మిః = వాతోర్మిః, వాతోర్మిణా లోలనం=వాతోర్మిలోలనమ్, వాతోర్మిలోలనేన చలన్తి=వాతోర్మిలోలచలన్తి, వాతోర్మిలోలనచలన్తి చతాని దలానిచ=వాతోర్మిలోలనచలద్దలాని, వాతోర్మిలోలనచలద్దలమణ్డలాగ్రైః భిన్నమ్=వాతోర్మిలోలనచలద్దలమణ్డలాగ్రభిన్నమ్, వాతోర్మిలోలనచలద్దలమణ్డలాగ్రభిన్నంచ తత్, అభ్రమణ్డలంచ=వాతోర్మిలోలనచలద్దలమణ్డలాగ్రభిన్నాభ్రమణ్డలమ్, వాతోర్మిలోలనచలద్దలమణ్డలాగ్రభిన్నాభ్రమణ్డలాత్, గలన్తి= వాతోర్మిలోలనచలద్దలమణ్డలాగ్ర భిన్నాభ్రమణ్డల గలన్తి, వాతోర్మిలోలనచలద్దలమణ్డలాగ్రభిన్నాభ్రమణ్డలగలన్తి చతాని జలానిచ = వాతోర్మిలోలన చలద్దలమణ్డలాగ్రభిన్నాభ్రమణ్డలగలజ్జలాని, వాతోర్మిలోలనచలద్దలమణ్డలాగ్ర భిన్నాభ్రమణ్డల గలజ్జలైః జాతః సేకః యస్యసః=వాతోర్మిలోలనచలదలమణ్డలాగ్ర భిన్నాభ్రమమణ్డలగలజ్జలజాతసేకః ॥

అమ్బరచుమ్బిచూడః ;- అమ్బరం చుమ్బతీతి=అమ్బరచుమ్బినీ, అమ్బరచుమ్బినీ చూడా యస్యసః=అమ్బరచుమ్బిచూడః ।

నేత్రనిపీయమానః :- నేత్రాభ్యాం నిపీయమానః=నేత్రనిపీయమానః.

**భావము :**

ఆ కుశద్వీపమునందు దర్భల పొదలు మెండుగానున్నవి. వాని కొనలు ఆకసమునంటుకొని యుండుట వలన నవి గాలికెరటములుచే కలియఁ బెట్టఁబడుట వలనవాని యాకులు కదలుచున్నవి. ఆ యాకులు చూఁడఁగత్తులు వలెనున్నవి. ఆ కత్తులు, మేఘమండలములకుఁ దగులట వలన, సవిభిన్నములై నీటిని కార్చుచున్నవి. ఆ నీటితో నాదర్భల పొదలు తడిసి యుండును. వానినిఁ జూడనీకు మిక్కిలి యాశ్చర్యము కల్గును. ॥౫౯॥

శ్లో. పాథోధిమన్థసమయోత్థితసింధుపుత్రీ
పత్యఙ్గజార్పణపవిత్రశిలాసు తత్ర ।
పత్యా సహాఽఽవహ విహారమయైర్విలాసై
రానన్దమిన్దుముఖి! మన్థరకన్దరాసు॥ 60

ప.వి. పాథోధిమన్థసమయోత్థిత సింధు పుత్రీపత్పఙ్కజార్పణ పవిత్ర శిలాసు-తత్ర-పత్యా-సహ-ఆవహ-విహారమయైః-విలాసైః-ఆనన్దమ్-ఇన్దుముఖి-మన్దరకన్దరాసు.

అర్థము : హే ఇన్దుముఖి ! = ఓ చన్ద్రవదనా !, తత్ర=ఆ కుశద్వీపమునందు, పాథోధిమన్థ సమయోత్థిత సింధుపుత్రీ పత్పఙ్కజార్పణ పవిత్రశిలాసు; పాథోధి=సముద్రమును, మన్థ=చిలుకుటకు సంబంధించిన, సమయ=వేళయందు, ఉత్థిత=ఉద్భవించిన, సింధుపుత్రీ=సముద్రుని కూతురైన, లక్ష్మియొక్క, పత్పఙ్కజ=పాదపద్మములను, అర్పణ=ఉంచుటచే, పవిత్ర-పావనములైన, శిలాసు=రాళ్లుగల, మన్దరకన్దరాసు=మందర పర్వత గుహల యందు, పత్యాసహ=భర్తతో డ, విహారమయైః=విహార రూపములైన, విలాసైః=విలాసములతో, ఆనందమ్=సంతోషమును, ఆవహ=వహింపుము.

**సమాసములు :**

పాథోధిమన్థసమయోత్థితసింధుపుత్రీ పత్పఙ్కజార్పణ పవిత్రశిలాసు:— పాథాంసి ధీయన్తే అస్మిన్నితి=పాథోధిః, పాథోధేః మన్థః=పాథోధిమన్థః, పాథోధిమన్థస్యసమయః = పాథోధిమన్థసమయః, పాథోధిమన్థసమయే ఉత్థితా=పాథోధిమన్థ సమయోత్థితా, పాథోధిమన్థ సమయోత్థి చ సా సింధు పుత్రీచ = పాథోధిమన్థ సమయోత్థిత సింధుపుత్రీ, పదౌ పఙ్కజే ఇవ= పత్పఙ్కజే, పాథోధిమన్థ సమయోత్థిత సింధుపుత్ర్యాః పత్పఙ్కజే = పాథోధిమిన్థసమయోత్థిత పత్పఙ్కజే, పాథోధిమన్థ సమయోత్థిత సింధుపుత్రీ పత్పఙ్కజ యోరర్పణమ్ = పాథోధిమన్థసమయోత్థిత సింధుపుత్రీ పత్పఙ్కజార్పణమ్, పాథోధిమన్థ సమయోత్థిత సింధుపుత్రీ పత్పఙ్కజార్పణేన పవిత్రాః శిలాఃయా సుతాః=పాథోధిమన్థసమయోత్థిత సింధుపుత్రీ పత్పఙ్కజార్పణ పవిత్రశిలాః, తాసు = పాథోధిమన సమయోత్థిత సింధుపుత్రీ పత్పఙ్కజార్పణ పవిత్ర శిలాసు:

ఇందుముఖి :- ఇందురివ ముఖం యస్యాస్సా=ఇందుముఖీ, తస్యాస్సమ్బుద్ధిః=హే ఇన్దుముఖి।

మన్దరకన్దరాసు :- మన్దరస్య కన్దరాః=మన్దరకన్దరాః, తాసు=మన్దరకన్దరాసు।

**భావము :**

ఓ చన్ద్రముఖీ ! ఆ ద్వీపమునందు మన్దర పర్వతము గలదు. సముద్రమును చిలుకునపుడు జన్మించిన లక్ష్మీదేవి తన పాదపద్మములచే సందలి గుహాశిలలను పావనపఱచి యున్నది. అట్టి గుహలయందు భర్తతో, విలాస విహారములు గావించి యానందింపుము. ౹౬౦॥

**శ్లో. ఆరోహణాయ తవ సజ్జ ఇవాస్తి తత్ర**
**సోపానశోభివపురశ్మవలిచ్ఛటాభిః ।**
**భోగీన్ద్రవేష్టశతఘృష్టికృతాభిరబ్ధి**
**క్షుబ్ధాచలః కనకకేతకగోత్రగాత్రి !॥ 61**

ప. వి. ఆరోహణాయ-తవ-సజ్జః-ఇవ—అస్తి - తత్ర—సోపానశోభివపుః—అశ్మదలచ్ఛటాభిః-భోగీన్ద్రవేష్టశతఘృష్టికృతాభిః--అబ్ధిక్షుబ్ధాచలః—కనక కేతకగోత్రగాత్రి !.

అర్థము : కనకకేతకగోత్రగాత్రి! కనక కేతక=పసిడిమొగలి పూరేకును, గోత్ర=జన్మభూమిగాఁగల, గాత్రి=శరీరము గలదానా!, అనగా పసిడి మొగలి పూవువలె పచ్చని శరీరము గలదానా! యని యర్థము. తత్ర=ఆ కుశ ద్వీపమందు, భోగీన్ద్రవేష్టశతఘృష్టికృతాభిః; భోగీన్ద్ర=వాసుకియొక్క, వేష్టశత=వేష్టన శతములవలని, అనగా పెక్కుమాఱులు చుట్టుటవలని, ఘర్షణ=ఒరిపిళ్లచే, కృతాభిః=చేయఁబడిన, అశ్మవలిచ్ఛటాభిః; అశ్మ=శిలలయందలి. వలి=వాసుకినిఁ జుట్టుటచే, చేర్పడిన గాళ్ల యొక్క, ఛటాభిః=సమూహములచే, సోపానశోభివపుః; సోపాన=మెట్లచే, శోభి=ప్రకాశించు, వపుః=శరీరముగల, మన్దరాద్రిః=మన్దరపర్వతము, తవ=నీకు, ఆరోహణాయ=ఎక్కుటకొఱకు, సజ్జఇవ=సిద్ధము గావింపఁబడిన దానివలె, అస్తి=ఉన్నది.

వి. మన్దరపర్వతము వాసుకి శరీరముయొక్క యొరిపిడులచే నేర్పడిన గాళ్ళు, దమయన్తి, కొండ నెక్కుటకై సిద్ధము గావింపఁబడిన మెట్లు

గాకపోయినను సిద్ధము గావింపఁబడిన మెట్లుగా చెప్పుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకమగు 'ఇవ' శబ్దమునుఁ బ్రయోగించుటవలన నిది వాచ్యము.

## సమాసములు :

సోపానశోభివపుః :- సోపానైః శోభత ఇతి=సోపానశోభి, సోపానశోభి వపుః యస్యాసః=సోపానశోభివపుః ।

అశ్మవలివచ్ఛటాభిః :- అశ్మనాం వలయః-అశ్మవలయః, అశ్మవలీనాం ఛటాః=అశ్మవలిచ్ఛటాః, తాభిః=అశ్మవలిచ్ఛటాభిః ।

భోగీన్ద్రవేష్టశతఘృష్టికృతాభిః :- భోగినామిన్ద్రః =భోగీన్ద్రః, భోగీన్ద్రస్యవేష్టాః=భోగీన్ద్రవేష్టాః, భోగీన్ద్రవేష్టానాంశ తాని -భోగీంద్రవేష్టశతాని. భోగీన్ద్రవేష్టశతానాం ఘృష్టయః = భోగీన్ద్రవేష్టశత ఘృష్టయః, భోగీన్ద్రవేష్టశతఘృష్టభిః కృతాః=భోగీన్ద్రవేష్టశతఘృష్టికృతాః, తాభిః= భోగీన్ద్రవేష్టశతఘృష్టికృతాభిః॥

అబ్ధిక్షుబ్ధాచలః :- అబ్ధేః క్షుబ్ధాచలః=అబ్ధిక్షుబ్ధాచలః.

కనక కేతకగోత్రగాత్రి :- కనకమయంచ తత్ కేతకం చ =కనక కేతకమ్, కనక కేతకం, గోత్రం, యస్యతత్= కనక కేతకగోత్రమ్, కనక కేతకగోత్రం గాత్రం యస్యాస్సా = కనక కేతకగోత్రగాత్రీ, తస్యాస్సమ్బుద్ధిః కనక కేతకగోత్రగాత్రి ।

## భావము :

మొగలిపూరేకుల వంశమునకుఁ జెందిన శరీరము గల యో దమయన్తీ! ఆ కుశద్వీపమునందు మన్దర పర్వతమున్నది. ఆ పర్వతమునకు వాసుకి శరీరమును పెక్కు చుట్లు చుట్టి సముద్రమునుఁ జిలికిరి. ఆ విధముగాఁ జిలుకునపుడు, ఆ మందరపర్వతమునకు, వాసుకి శరీరమువలన యొరిపిడి వలన గాళ్ళు ఏర్పడినవి. అవి యా కొండనెక్కుటకు నుపయోగపడు మెట్ల వలె శోభించుచున్నవి. నీ వా కుశద్వీపపు రాజును వరించి యచటి నా పర్వతముపైన నీకు విహరించు నవకాశ మేర్పడును. ॥౮౧॥

శ్లో. మన్థా నగః స భుజగప్రభువేష్టఘృష్టి
లేఖాచలద్ధవలనిర్ఝరవారిధారః ।
త్వన్నేత్రయోః స్వభరయన్త్రితశీర్షశేష
శేషాఙ్గవేష్టితతనుభ్రమమాతనోతు॥ 62

ప.వి. మన్థా-నగః - సః-భుజగప్రభువేష్టఘృష్టిలేఖాచలద్ధవలనిర్ఝరవారిధారః-త్వన్నేత్రయోః — స్వభరయన్త్రితశీర్షశేషశేషాఙ్గవేష్టతనుభ్రమమ్-ఆతనోతు.

అర్థము. భుజగప్రభువేష్టఘృష్టిలేఖాచలద్ధవలనిర్ఝరవారిధారః; భుజగప్రభు = వాసుకిని, వేష్ట = చుట్టుటచే నేర్పడిన, ఘృష్టిలేఖా=ఒరిపిడుల వరుసల యందు, అనగా ఒరిపిడులచే నేర్పడిన గాళ్ళయందు, చలత్=పారుచున్న, ధవల = తెల్లని, నిర్ఝర = సెలయేళ్ళయొక్క, వారిధారాః=నీటిధారలు గల, సః=ఆ ప్రసిద్ధమైన, మన్థా=కవ్వమైన, నగః=మన్దరపర్వతము, త్వన్నేత్రయోః=నీ కన్నులకు, స్వభరయన్త్రితశీర్షశేషశేషాఙ్గవేష్టిత తనుభ్రమమ్; స్వభర=తనయొక్క భారముచే, ననగా మన్దర పర్వతము యొక్క భారముచే, యన్త్రిత=వాల్చఁబడిన, శీర్ష=తలలు గల, శేష= శేషసర్పముయొక్క, శేషాఙ్గ=మిగిలిన శరీరముచే, వేష్టితతను=చుట్టఁ బడిన శరీరము కలది, యను, భ్రమం=భ్రాన్తిని, ఆతనోతు=చేయును గాక.

వి. ఇచ్చట సెలయేటి నీటిధారలయందు శేషసర్పభ్రాన్తి వర్ణితము కాన భ్రాన్తిమదలఙ్కారము.

**సమాసములు :**

భుజగప్రభువేష్టఘృష్టిలేఖాచలద్ధవలనిర్ఝరవారిధారః :— భుజగానాం ప్రభుః=భుజగప్రభుః, భుజగప్రభోః వేష్టాః=భుజగప్రభువేష్టాః । భుజగప్రభువేష్టైః, ఘృష్టిలేఖాః=భుజగప్రభువేష్టఘృష్టిలేఖాః, భుజగప్రభువేష్ట ఘృష్టిలేఖాసుచలన్త్యః=భుజగప్రభువేష్టఘృష్టిలేఖాచలన్త్యః, నిర్ఝరాణాం వారిధారాః=నిర్ఝరవారిధారాః, ధవళాశ్చతాః నిర్ఝరవారిధారాశ్చ=ధవళ

నిర్ఝరవారిధారాః, భుజగప్రభువేష్టసృష్టిలేఖాచలన్త్యః ధవళనిర్ఝరవారిధారాః యస్యసః=భుజగప్రభువేష్టసృష్టిలేఖాచలద్ధవళనిర్ఝరవారిధారః।

త్వన్నేత్రయోః :- తవనేత్రే=త్వన్నేత్రే, తయోః, త్వన్నేత్రయోః.

స్వభరయన్త్రితశీర్షశేషశేషాఙ్గవేష్టితతనుభ్రమమ్ :- స్వస్యభరః = స్వభరః, స్వభరేణయన్త్రితాని=స్వభరయన్త్రితాని, స్వభరయన్త్రితాని, స్వభరయన్త్రితాని శీర్షాణి యస్యసః = స్వభరయన్త్రితః శీర్షః, స్వభరయన్త్రితశీర్షశ్చాసౌ శేషశ్చ=స్వభరయన్త్రితశీర్షశేషః. స్వభరయన్త్రితశీర్షశేషస్యశేషాఙ్గమ్=స్వభరయన్త్రితశీర్షశేషశేషాఙ్గం, స్వభరయన్త్రితశీర్షశేషశేషాఙ్గేనవేష్టితా = స్వభరయన్త్రితశీర్షశేషశేషాఙ్గవేష్టితా, స్వభరయన్త్రితశీర్షశేషశేషాఙ్గవేష్టితా తనుః యస్యసః=స్వభరయన్త్రితశీర్షశేషశేషాఙ్గవేష్టిత తనుః, స్వభరయన్త్రితశీర్షశేషశేషాఙ్గవేష్టిత తనురితిభ్రమః=స్వభరయన్త్రితశీర్షశేషశేషాఙ్గవేష్టితతనుభ్రమః, తమ్=స్వభరయన్త్రితశీర్షశేషశేషాఙ్గవేష్టిత తనుభ్రమమ్.

**భావము :**

ఆ పర్వతమునకు వాసుకిని చుట్టి చిలుకుటచే నేర్పడిన గాళ్ళ గీతలలో సెలయేళ్ళు పారుచున్నవి. అవి తెల్లగా నున్నవి. భూభారమును వహించెడి యాదిశేషుని శరీరము గూడఁ దెల్లగా నుండును. మందరపర్వత భారముచే వాలిపోయిన శిరస్సులుగల యాదిశేషుఁడు తన మిగిలిన శరీరముచే మన్దరగిరిని జుట్టెనాయని యా సెలయేళ్ళ రేఖలు నీ కన్నులకు భ్రాన్తినిఁ గల్గించుచున్నవి. ॥౬౨॥

శ్లో. ఏతేన తే స్తనయుగేన సురేభకుమ్భౌ
పాణిద్వయేన దివిషద్ద్రుమపల్లవాని ।
ఆస్యేన స స్మరతు నీరధిమన్థనోత్థం
స్వచ్ఛన్దమిన్దుమపి సుందరి! మన్దరాద్రిః॥ 63

ప.వి. ఏతేన - తే- స్తనయుగేన-సురేభకుమ్భౌ-పాణిద్వయేన-దివిషద్ద్రుమపల్ల

వాని-ఆస్యేన-సః-స్మరతు-నీరధిమన్థనోత్థం-స్వచ్ఛన్దమ్-ఇన్దుమ్-అపి-సుందరి—మన్దరాద్రిః.

అర్థము. హేసున్దరి=ఓ యందగత్తా!, సః=ఆ, మన్దరాద్రిః = మన్దరపర్వతము, ఏతేన=ఈ, తే=నీయొక్క, స్తనయుగేన=చనుదోయిచే, సురేభకుమ్భౌ; సురేభ=దేవతలయేనుగైన ఐరావతముయొక్క, కుమ్భౌ=కుంభస్థలములను, పాణిద్వయేన = చేదోయిచే, దివిషద్ద్రుమస్య=దేవతావృక్షమైన, కల్పవృక్షముయొక్క, పల్లవాని=చిగుళ్లను, ఆస్యేన=ముఖముచే, ఇన్దుమపి=చన్ద్రుని, ఏవం=ఇట్లు, నీరధిమన్థనోత్థమ్; నీరధి=సముద్రమును, మన్థన=చిలుకటవలన, ఉత్థమ్=ఉద్భవించినవస్తువుల సమూహమును, స్వచ్ఛన్దమ్=స్వేచ్ఛగా, స్మరతు=స్మరించునుగాక.

వి. ఇచ్చట స్తనయుగ-పాణిద్వయ-ముఖములలో,నైరావతకుమ్భస్థల-కల్పతరు, పల్లవ-చన్ద్రులను స్మరించుటవలన స్మరణాలఙ్కారము.

**సమాసములు :**

స్తనయుగేన :- స్తనయోర్యుగమ్=స్తనయుగమ్, తేన=స్తనయుగేన.

సురేభకుమ్భౌ :- సురాణామిభః = సురేభః, సురేభస్యకుమ్భౌ=సురేభకుమ్భౌ, తౌ=సురేభకుమ్భౌ.

నీరధిమన్థనోత్థమ్ :- నీరాణిధీయన్తే అస్మిన్నితి = నీరధిః, నీరధేః మన్థనమ్=నీరధిమన్థనమ్, నీరధిమన్థనేన ఉత్థాయస్యతత్=నీరధిమన్థనోత్థమ్, తత్=నీరధిమన్థనోత్థమ్.

మన్దరాద్రిః :- మన్దర ఇతి అద్రిః=మన్దరాద్రిః.

**భావము :**

ఓ యందగత్తా ! ఆమన్దరపర్వతము నీచనుదోయినిఁజూచి ఐరావతముయొక్క కుమ్భస్థలములను, నీచేఁదోయినిఁజూచి, కల్పవృక్షముల చిగుళ్లను, నీ ముఖమునుఁజూచి చంద్రుని స్మరించుగాక. అనగా చనుదోయిమున్నగునవి యైరావతకుమ్భస్థలాదులఙ్కాక్షిప్తి పఱచు చున్నవని యాశయము. అనగా చనుదోయి మున్నగువానితో నవిపోలియున్నవనియు భావము ॥౬౩॥

శ్లో. వేదైర్వచోభిరఖిలైః కృతకీర్తిరత్నే
హేతుం వినైవ ధృతనిత్యపరార్థయత్నే।
మీమాంసయేవ భగవత్యమృతాంశుమౌళౌ
తస్మిన్మహీభుజి తయాఽనుమతిర్న భేజే॥ 64

ప.వి. వేదైః-వచోభిః-అఖిలైః-కృతకీర్తిరత్నే-హేతుం-వినా-ఏవ-ధృతనిత్య పరార్థయత్నే-మీమాంసయా-ఇవ-భగవతి అమృతాంశుమౌళౌ-తస్మిన్-మహీభుజి-తయా-అనుమతిః-న-భేజే.

అర్థము. అఖిలైః = సమస్తములైన పక్షాన్తరమున అఖిలైః = ఖిలముకానట్టి సంప్రదాయముగల, వేదైః=వేదములతో సమానములైన, వచోభిః=వచనములతోడను, అనగా సజ్జనులవచనములతోడను, పక్షాన్తమున=వేదవాక్యములతోడను, కృతకీర్తిరత్నే!; కృత=ప్రకాశితమైన, కీర్తిరత్నే=అనర్ఘమైన కీర్తిగల, పక్షాన్తరమున-కృత=ప్రతిపాదింపబడిన, కీర్తిరత్నే=స్తుతిరూపములైన రత్నములుగల, హేతుంవినైవ = ప్రతిఫలమునపేక్షింపకయే, ధృతనిత్యపరార్థయత్నే; ధృత = ధరింపబడిన, నిత్య=ఎల్లప్పుడును, పరార్థయత్నే=పరోపకారప్రయత్నముగల్గిన, తస్మిన్=ఆజ్యోతిష్మన్తుడను, మహీభుజి=రాజునందు, తయా=ఆదమయన్తిచే, భగవతి=పూజ్యుడైన, అమృతాంశుమౌళౌ=చంద్రుని శిరోభూషణముగాఁ గల్గిన యీశ్వరునందు, మీమాంసయా ఇవ=పూర్వమీమాంసచేతనెట్లోయట్లు, అనుమతిః=అఙ్గీకారము, న భేజే=పొందఁబడలేదు.

వి. మీమాంసచే దమయన్తిని, ఈశ్వరునిచే, జ్యోతిష్మన్తుని, పోల్చుచు, కృతకీర్తిరత్నత్వాదిసాధర్మ్యములను చెప్పి, ఉపమావాచకమగునివ శబ్దమునుఁ జెప్పుటవలనను పూర్ణోపమాలఙ్కారము.

**సమాసములు :**

అఖిలైః :- నఖిలాః=అఖిలాః. తైః=అఖిలైః.

కృతకీర్తిరత్నే :- కీర్తిః రత్నమివ, ఇదా, కీర్తిరేవరత్నం=కీర్తిరత్నమ్, కృతంకీర్తిరత్నం యేనసః=కృతకీర్తిరత్నః, తస్మిన్=కృతకీర్తిరత్నే.

ధృతనిత్యపరార్థయత్నే:- పరః అర్థః యస్యసః=పరార్థః, పరార్థశ్చాసౌ యత్నశ్చ=పరార్థయత్నః, ధృతః నిత్యః పరార్థయత్నః యస్యసః = ధృతనిత్య పరార్థయత్నః, తస్మిన్=ధృతనిత్య పరార్థయత్నే.

అమృతాంశుమౌలౌ:- అమృతాంశుః మౌలౌ యస్యసః=అమృంశుమౌలిః. తస్మిన్=అమృలౌంశుమౌలౌ।

**భావము :**

ఆ కుశద్వీపపు ప్రభువైన జ్యోతిష్మన్తుని కీర్తిని సత్పురుషులు వేదతుల్యములగు వాక్యములతో స్తుతించి యున్నారు. అతడు ఫలాపేక్ష లేకయే పరోపకారపరాయణుఁడు. చంద్రశేఖరుడును వేదములచే బ్రతిపాదింపబడును. ఫలాపేక్ష లేకయే పరోపకారము గావించును. కాని పూర్వమీమాంస యాతని యస్తిత్వము నఙ్గీకరింపలేదు. ఆ పూర్వమీమాంస యెట్లు ఈశ్వరు నంగీకరింపలేదో, అ దమయన్తి గూడ నా జ్యోతిష్మన్తుని గూఁడ నఙ్గీకరింప లేదని యాశయము.

పూర్వమీమాంస వేదములు నిత్యములనియు, నందువలననే వానికి కర్తలు లేరనియుఁ చెప్పుచు దాని నపౌరుషేయములని చెప్పి వానికి కర్తగా నీశ్వరు నంగీకరింపదు. ఈశ్వరునిఁ బ్రతిపాదించెడి వేదవాక్యములు ఈశ్వరుని యస్తిత్వమునకు ప్రమాణము కావు. అవి యితర వాక్యములతోనేకవాక్యత్వమునుఁబొంది యర్థమును ప్రతిపాదించును. కాన వీనికి నీశ్వర ప్రతిపాదనమందు తాత్పర్యము లేదు. ॥౬౪॥

శ్లో. తస్మాదిమాం నరపతేరపనీయ తన్వీం
రాజన్యమన్యమథ జన్యజనః స నిన్యే ।
శ్రీభావధావితపదామభిమృశ్య యాఞ్చా
మర్థీనివర్త్య విధనాదివ విత్తవిత్తమ్॥ 65

ప. వి. తస్మాత్-ఇమం-నరపతేః-అపనీయ-తన్వీం-రాజన్యమ్-అన్యమ్-అథ-జన్యజనః - సః-నిన్యే-శ్రీభావధావితపదామ్ - అభిమృశ్య - యాఞ్చామ్-అర్థీ-నివర్త్య-విధనాత్-ఇవ-విత్తవిత్తమ్.

అర్థము. అథ=పిదప, జన్యాజనః=పల్లకిని మోసెడి భృత్య జనము, స్త్రీభావధా వితపదామ్; స్త్రీభావ=స్త్రీ విలాసముచే, ధావితపదామ్=కదిలింపఁబడిన పాదములు గలదియు, అనగా స్త్రీలకు తగిన చేష్టచేతనే మఱియొక చోటికిఁబొమ్మని యనుమతించుచున్న;బక్షాన్తరమున, స్త్రీభావ=స్త్రీలింగము నందు, ధావిత=ప్రవేశమొందిన, పదం="యాఞ్చా" అను పదము గల్గిన యాఞ్చాం=యాచనను), తన్వీం=కృశించిన శరీరము గల్గిన, ఇమాం = ఈ దమయన్తిని, తస్మాత్=ఆ రాజు నుండి, అనగా జ్యోతిష్మన్తు నుండి, అపనీయ=తొలగించి,; అర్థీ=యాచకుఁడు, అభిమృశ్య=ఆలోచించి, యాఞ్చాం=యాచనావృత్తిని, విధనాత్=ధనములేని పురుషునుండి, అప నీయ=తొలగించి, విత్తవిత్తమివ, విత్త=ధనముతో, విత్తమివ=కూడిన వానిని వలె, ననగా ధనాఢ్యుని వలె, అన్యం=మఱియొక, రాజన్యం = రాజపుత్రుని, నిన్యే=పొందించెను.

వి: స్త్రీ భావ ధావితపదామ్, అనునోచోటశ్లేషయు,యాచనతోడ దమయన్తిని, విత్తవన్తునితోఁడ రాజపుత్రునిఁబోల్చుటచే, ఉపమాలఙ్కారము.ఈ శ్లేషోప ములకు రెంటికిని సంసృష్టి.

**సమాసములు :**

రాజన్యమ్:– రాజ్ఞః అపత్యంపుమాన్=రాజన్యః, తమ్=రాజన్యమ్.

జన్యజనః:– జన్యఇతిజనః=జన్యజనః ।

స్త్రీ భావధావితపదామ్:- స్త్రియఃభావః=స్త్రీభావః,స్త్రీభావేన ధావితానిపదాని యస్యాస్సా=స్త్రీభావధావితపదా, తామ్, స్త్రీభావధావితపదామ్.

విధనాత్:– విగతం ధనంయస్మాత్సః=విధనః, తస్మాత్, విధనాత్ ।

విత్తవిత్తమ్:– విత్తేన విత్తః=విత్తవిత్తః, తమ్=విత్తవిత్తమ్.

**భావము :**

తర్వాత పల్లకినిమోయు సేవకులు, దమయన్తి స్త్రీ స్వభావమునకు సాధా రణమైన తన కాలి కదలికలతో సైగ చేయగా, భృత్యులు; యాచకుఁడు తన

యాచ్ఞను అనగా యాచనను నిర్ధనికు నుండి తొలగించి, ధనవంతుని వైపునకు మరలించు విధముగనే; దమయన్తిని కుశద్వీపపురాజగు జ్యోతిష్మన్తు నుండి మఱలించి, మఱియొక రాజు కడకుఁ గొనిపోయిరి. ఇచ్చట దమయన్తితో యాచ్ఞ- పోల్చబడినది. దమయన్తి యందు స్త్రీ భావధావితపదత్వ మెట్లున్నదో అట్లే యాచ్ఞ యందునునది యున్నది. యాచ్ఞా శబ్ద మొక్కటే, "యజ-యాచ-యత-విచ్ఛ-ప్రచ్ఛ-రక్షధాతువులకు నఙ్ ప్రత్యయము విధింపఁబడి నపుడు, స్త్రీ లిఙ్గమునుఁబొందును. యాచ్ఞేతరములగు" యజాదులు నఙ్ ప్రత్యయము విహితమైన పిదప స్త్రీత్వమునుఁ బొందవు. కాననిఁట "యాచ్ఞ" స్త్రీ భావ ధావితపదమైనది. స్త్రీ భావమనగా=స్త్రీ లిఙ్గము. స్త్రీ లిఙ్గమునందలి ధావితము, అనగా ప్రవిష్టముగాన "యాచ్ఞా" అను యాచనార్థ కరూపము, "యాచ్ఞా" యను స్త్రీ భావధావితపదమును వాచకముగాఁ గల్గినదని యర్థము ॥౬౫॥

శ్లో. దేవీ పవిత్రితచతుర్భుజవామభాగా
వాగాఽఽలపత్ పునరిమాం గరిమాభిరామామ్
అస్యాఽరినిష్కృపకృపాణసనాథపాణేః
పాణిగ్రహాదనుగృహాణ గణం గుణానామ్॥ 66

ప. వి. దేవీ-పవిత్రితచతుర్భుజవామభాగా - వాక్-ఆలపత్-పునః-ఇమాం - గరిమాభిరామామ్-అస్య - అరినిష్కృపకృపాణసనాథపాణేః-పాణిగ్రహాత్-అనుగృహాణ-గణం-గుణానామ్.

అర్థము : పవిత్రితచతుర్భుజవామభాగా; పవిత్రిత = పవిత్రముగావింపఁబడిన, చతుర్భుజ=నాలుగు బాహువులు గల విష్ణువు యొక్క, వామభాగా=ఎడమ వైపుగల, వాగ్దేవీ=సరస్వతి, గరిమాభిరామామ్; గరిమ=గుణగౌరవముచే, అభిరామామ్=మనోహరమైన, పక్షాన్తరము గరిమ=అర్థ గౌరవముచే, అభిరామాం=మనోహరమైన, గిరం=వాక్కును, ఆలపత్=చెప్పినది. (ఏమనగా) హేవత్సే=ఓ బిడ్డా ! అరినిష్కృప కృపాణసనాథపాణేః; అరి=శత్రువుల యందు, నిష్కృప=దయలేని, కృపాణ=ఖడ్గముతో, సనాథ=కూడిన, పాణేః=హస్తము గల్గిన, అస్య=ఈ రాజుయొక్క,

గుణానాం=గుణముల యొక్క, గణం=సమూహమును, పాణిగ్రహాత్ = పరిణయమాడుట వలన, అనుగ్రహాణ=అనుగ్రహింపుము- లేదా, పాణిగ్రహాత్ అను = పెండ్లియాడిన పిదప, గుణానాం గణం = గుణముల యొక్క సమూహమును, గ్రహాణ = గ్రహింపుము. అనగా పెండ్లి యాడిన పిదప నాతని గుణగణములు తెలియఁగలవని యర్థము.

**సమాసములు :**

పవిత్రితచతుర్భుజవామభాగా:- చత్వారః భుజాః యస్యసః = చతుర్భుజః, చతుర్భుజస్య వామభాగః=చతుర్భుజవామభాగః, పవిత్రితః, చతుర్భుజ వామభాగః యయాసా, పవిత్రిత చతుర్భుజవామభాగా.

గరిమాభిరామామ్ :- గరిమ్ణా, అభిరామా =గరిమాభిరామా, తామ్ = గరిమాభిరామామ్.

అరినిష్కృప కృపాణసనాథపాణేః :- నిర్గతా కృపాయస్మాత్సః = నిష్కృపః, అరిషు నిష్కృపః = అరినిష్కృపః. అరినిష్కృపశ్చాసౌ కృపాణశ్చ = అరినిష్కృపకృపాణః । అరినిష్కృపకృపాణః పాణౌ యస్యసః = అరినిష్కృపకృపాణపాణిః. తస్య = అరినిష్కృప కృపాణపాణేః ।

పాణిగ్రహాత్ :- పాణౌ గ్రహః=పాణిగ్రహః, తస్మాత్=పాణిగ్రహాత్ ।

**భావము :**

మహా విష్ణువునకు కుడివైపున లక్ష్మియు నెడమవైపున సరస్వతియు నున్నారని పురాణ ప్రసిద్ధి. అందు సరస్వతి విష్ణువునకు నెడమవైపున బవిత్ర పఱచుచున్నది. ఆ సరస్వతీదేవి గుణగౌరవముతోఁడనుఁ అర్థగౌరవము తోడను, గూడిన మాటను దమయంతికిఁ జెప్పినది. ఓ బిడ్డా! శత్రువుల విషయమున దయమాలిన ఖడ్గమును, చేత ధరించిన యీ రాజును పాణిగ్రహము గావింపుము. అట్లు గావించినచో వెనుక నతని గుణగణములను నీవు గ్రహింపఁగలవు. లేదా యాతనిఁబరిణయమాడి గుణగణముల గౌరవింపుము. అనగా నాతడు మిక్కిలి గుణవన్తుఁ డును పరిణయ యోగ్యుడునై యున్నాడని యాశయము. ॥౬౬॥

శ్లో. ద్వీపస్య శాల్మల ఇతి ప్రథితస్య నాథః
పాథోధినా వలయితస్య సురామ్బునాఽయమ్ ।
అస్మిన్వపుష్మతి న విస్మయసే గుణాబ్ధౌ
రక్తా తిలప్రసవనాసికి! నాసి కిం వా ॥ 67

ప. వి. ద్వీపస్య-శాల్మలః-ఇతి-ప్రథితస్య-నాథః-పాథోధినా-వలయితస్య-సురామ్బునా-అయమ్-అస్మిన్-వపుష్మతి-న-విస్మయసే-గుణాబ్ధౌ - రక్తా - తిలప్రసవనాసికి-న-అసి-కిం-వా.

అర్థము. హేతిలప్రసవనాసికి!=ఓ నువ్వు పూవువంటి ముక్కుగల దమయన్తీ! అయం=ఈ రాజు, సురామ్బునా ; సురా = మద్యమనెడి, అమ్బునా = ఉదకము గల, పయోధినా = సముద్రముచే, వలయితస్య=చుట్టఁబడిన, శాల్మల ఇతి=శాల్మలమని, ప్రథితస్య=ప్రసిద్ధి నొందిన, ద్వీపస్య = ద్వీపమునకు, నాథః -ప్రభువు, గుణాబ్ధౌ = గుణమునకు సాగరమైన, అస్మిన్=ఈ, వపుష్మతి=వపుష్మన్తుడను పేరు గల్గిన, శ్రేష్ఠమైన శరీరము గల్గిన రాజునందున, విస్మయసే=(అతని గుణములనుఁబట్టి) ఆశ్చర్య పడవా ? రక్తావా=అనురక్తురాలువుగా గాని, నాసికిం ?=కానేరవాయమి? అతని గుణముల గూర్చి యాశ్చర్యపడుటయు నాతని యందనురక్తురాలుగ నుండుటయు యుక్తములే యని యర్థము.

**సమాసములు :**

గుణాబ్ధౌ :- గుణానామబ్ధిః=గుణాబ్ధిః, తస్మిన్=గుణాబ్ధౌ ।

తిలప్రసవనాసికి:- తిలానాం ప్రసవః-తిలప్రసవః, తిలప్రసవ ఇవనాసికా యస్యాస్సా=తిలప్రసవనాసికీ, తస్యాస్సమ్బుద్ధిః = హే తిలప్రసవనాసికి।

**భావము :**

నువ్వు పూవు వంటి ముక్కుతో వెలయునో దమయన్తీ! ఈ రాజు మధ్య సముద్రముతోఁ జుట్టబడిన శాల్మల ద్వీపమునకు ప్రభువు. ఈతని పేరు వపుష్మన్తుఁడు. ఈ పేరుకు తగినట్లతడు శ్రేష్ఠమైన దేహముతో వెలయు

చున్నాడు. ఇంకను నితడు గుణములకు కడలి. ఇట్టి గుణవన్తునిఁ గాంచి నీవు అబ్బురపడవా ? ఇతని యందను రక్తురాలవు కావా ? ఇతని గుణముల కబ్బుర పడుట, ఇతనిపై ననురాగము వహించుట యనునవి సముచితములే. ॥౬౭॥

శ్లో. విప్రే ధయత్యుదధిమేకతమం త్రసత్సు
యస్తేషు పఞ్చసు బిభాయ న సీధుసిన్ధుః ।
తస్మిన్ననేన చ నిజాలిజనేన చ త్వం
సార్ధం విధేహి మధురా మధుపానకేలీః ॥ 68

ప.వి. విప్రే-ధయతి-ఉదధిమ్ -ఏకతమం- త్రసత్సు-యః - తేషు-పఞ్చసు-బిభాయ-న-సీధుసిన్ధుః- తస్మిన్ - అనేన-చ-నిజాలిజనేన-చ- త్వం-సార్ధం-విధేహి-మధురాః-మధుపానకేలీః.

అర్థము. శీధుసిన్ధుః=మద్యసాగరము, విప్రే=బ్రాహ్మణుఁడైన యగస్త్యుఁడు, ఏకతమం=ఒకటైన, ఉదధిం=లవణ సముద్రమును, ధయతి=పానము చేయుచుండగా, తేషు=ఆ, పఞ్చను, దధిమణ్డాది సాగరములు, త్రసత్సు సత్సు=భయపడుచుండగా, (ఇతడు తమ్ములఁ గూడ పానముచేయునని) నబిభాయ=తాను భయపడలేదు. ఏలయనగా "బ్రాహ్మణో న సురాం పిబేత్" అని బ్రాహ్మణునకు సురాపానము నిషేధింపఁబడినది. కాన తన్ను అనగా సురాసముద్రమును బ్రాహ్మణుడైన యగస్త్య మహర్షి త్రాగడని భయములేక యది యుండినదని యర్థము. తస్మిన్=ఆ సురా సముద్రమునందు, అనేన చ=ఈ రాజుతోఁడను, నిజాలిజనేన; నిజ= తనకు సంబంధించిన, ఆలిజనేన చ=చెలికత్తెలతో, సార్ధం=కూడ, మధురాః = మధురములైన, మధుపానకేలీః = మద్యపాన క్రీడలను, త్వం=నీవు, విధేహి=ఆచరింపుము.

**సమాసములు :**

శీధుసిన్ధుః :- శీధోః సిన్ధుః=శీధుసింధుః.

నిజాలిజనేన :- నిజాః ఆలయః=నిజాలయః, నిజాలయ ఏవ జనః= నిజాలిజనః, తేన=నిజాలిజనేన.

మధుపానకేలీః :— మధోః పానాని=మధుపానాని, మధుపానైః కేలయః=మధుపానకేలయః, తాః=మధుపానకేలీః.

**భావము :**

ఈ మద్యసాగరము తక్కిన దధిక్షీరాది సాగరమువలె నగస్త్యమహర్షి లవణసముద్రమునుఁ బానముఁ జేయునపుడు భయపడలేదు. ఏల యనగా నగస్త్యుడు బ్రాహ్మణుఁడు. "బ్రాహ్మణునకు మద్యపానము నిషిద్ధము" కాన నితడు మద్యసాగరమైన తనను, పానము చేయఁడని నిర్భయముగా నుండినది. అట్టి మద్యసాగరమునందు నీ రాజుతోఁడ చెలికత్తెలతోఁ గలసి మనోహరము లగు మధుపాన క్రీడలనుఁ జేయుము. ॥౬౮॥

శ్లో. ద్రోణస్స తత్ర వితరిష్యతి భాగ్యలభ్య
సౌభాగ్యకార్మణమయీముపదాం గిరిస్తే ।
తద్ద్వీపదీప ఇవ దీప్తిభిరోషధీనాం
చూడామిలజ్జలదకజ్జలదర్శనీయః ॥ **69**

ప.వి. ద్రోణః-సః- తత్ర-వితరిష్యతి - భాగ్యలభ్యసౌభాగ్యకార్మణమయీమ్-ఉపదామ్-గిరిః-తే - తద్ద్వీపదీపః-ఇవ - దీప్తిభిః-ఓషధీనాం - చూడామిలజ్జలదకజ్జలదర్శనీయః.

అర్థము. తత్ర=ఆ శాల్మల ద్వీపమునందు, ఓషధీనాం = ఓషధులయొక్క, దీప్తిభిః=కాన్తులచే అనగా జ్యోతిర్లతల యొక్క కాంతులచే, తద్ద్వీపదీప ఇవ; తద్ద్వీప=ఆ ద్వీపమునకు, దీప ఇవ=దీపమువలె (స్థితః=ఉన్న) (కావుననే) చూడామిలజ్జలదకజ్జలదర్శనీయః; చూడా=శిఖరమునందు, మిలత్=చేరుచున్న, జలద=మేఘములనెడి, కజ్జల=కాటుకలచే, దర్శనీయః=చూడఁదగిన, సః=ఆ ప్రసిద్ధమైన, ద్రోణః=ద్రోణమను పేరుగల, గిరిః=పర్వతము, తే=నీకు, భాగ్యలభ్యసౌభాగ్యకార్మణమయీమ్; భాగ్య=భాగ్యములచే, లభ్య=పొందఁదగిన, సౌభాగ్య=పతి ప్రేమను, కార్మణమయీమ్=మూలకర్మరూపమైన, అనగా ఓషధుల వేరులతో సాధింపఁబడు వశీకరణాది మూలకర్మరూపమైన, ఉపదాం=

కానుకను, వితరిష్యతి=ఈయఁగలదు. (ఇంతియేఁ గాక సఞ్జీవని మున్నగు నితర మూలికలను సైతము నీ కచ్చట లభింపఁగలదు.)

వి. ఇచ్చట వశీకరణాది మూలకర్మలు కానుకలుగా పరిణమించుట వలన పరిణామాలఙ్కారము.

ద్రోణపర్వతమును తద్ద్వీపదీపముగా సంభావనఁ జేయుటవలన నుత్ప్రేక్ష. దీనితో పరిణామాలఙ్కారమునకు సంసృష్టి. ఆయుత్ప్రేక్షకు "జలద కజ్జల" యను రూపకముతో సఙ్కరము.

**సమాసములు :**

భాగ్యలభ్యసౌభాగ్యకార్మణమయీమ్:— భాగ్యేనలభ్యమ్=భాగ్యలభ్యమ్, భాగ్యలభ్యం చతత్ సౌభాగ్యం చ=భాగ్యలభ్యసౌభాగ్యమ్, భాగ్య లభ్యసౌభాగ్యస్య కార్మణమ్=భాగ్యలభ్యసౌభాగ్యకార్మణమ్, భాగ్యలభ్య సౌభాగ్యకార్మణస్యవికారః =భాగ్యలభ్యసౌభాగ్యకార్మణమయీ, తామ్= భాగ్యలభ్య సౌభాగ్యమయీం.

తద్ద్వీపదీపః :— సచాసౌద్వీపశ్చ=తద్ద్వీపః, తద్ద్వీపస్యదీపః=తద్ద్వీపదీపః.

చూడామిలజ్జలదకజ్జలదర్శనీయః :— చూడాయాంమిలన్తః = చూడా మిలన్తః, చూడామిలన్తశ్చతేజలదాశ్చ = చూడామిలజ్జలదాః, చూడామిల జ్జలదా ఏవకజ్జలాని=చూడామిలజ్జలదకజ్జలాని, చూడామిలజ్జలదకజ్జలైః దర్శనీయః=చూడామిలజ్జలదకజ్జలదర్శనీయః.

**భావము :**

ఆశాల్మలి ద్వీపమునందు జ్యోతిర్లతల కాంతులతో,వెలుంగుచు నాద్వీపము నకు దీపమాయన్నట్లు ద్రోణగిరి కలదు. ఆ పర్వతము శిఖరమునందు విడియు చున్న మేఘములనెడి కాటుకలచే, నీకుఁ జూడ కడురమ్యమై యుండును. పూర్వ జన్మసుకృతముచే లభించెడి పతివాల్లభ్యమునకు సాధనములైన, వశీకరణములకు కావలసిన మూలికలను, సఞ్జీవనిమున్నగు నితర దివ్యౌషధులను నా పర్వతము నీకు కానుకలుగా నొసంగఁ గలదు. ॥౨౯॥

శ్లో. తద్ద్వీపలక్ష్మ పృథుశాల్మలితూలజాలైః
క్షోణీతలే మృదుని మారుతచారుకీర్ణైః ।
లీలావిహారసమయే చరణార్పణాని
యోగ్యాని తే సరససారసకోశమృద్వి ॥ 70

ప. వి. తద్ద్వీపలక్ష్మ పృథుశాల్మలితూలజాలైః - క్షోణీతలే-మృదుని - మారుత చారుకీర్ణైః- లీలావిహారసమయే- చరణార్పణాని- యోగ్యాని-తే- సరస సారసకోశమృద్వి.

అర్థము. సరససారసకోశమృద్వి!; సరస=రసవంతమై క్రొత్తదైన, సారస= పద్మముయొక్క, కోశ=మొగ్గవలె, మృద్వి!=కోమలమగు దమయంతీ! మారుతచారుకీర్ణైః, మారుత=గాలిచే, చారు=చక్కగా, కీర్ణైః = వెదఁజల్లఁ బడిన, తద్ద్వీపలక్ష్మపృథుశాల్మలితూలజాలైః; తద్ద్వీప=ఆ ద్వీపమునకు లక్ష్మ=చిహ్నమైన, పృథుశాల్మలి= పెద్ద బూరుగచెట్టు యొక్క, తూల జాలైః=ప్రత్తి ప్రోవులచే, మృదుని = మెత్తనైన, క్షోణీతలే=భూతల మునందు, తే = నీకు, లీలావిహారసమయే = విలాసవిహారకాలమందు, చరణార్పణాని—పాదవిన్యాసములు, యోగ్యాని=తగినవిగా, (భవిష్యన్తి= ఉండఁగలవు) మిక్కిలి సుకుమారములైన నీ పాదములకు మిక్కిలి మెత్తని నేల తగినదని యర్థము.

వి. అనురూపములైన పాదములకును మెత్తని నేలకును సంబంధముఁ జెప్పుటవలన నిఁట సమాలఙ్కారము.

**సమాసములు :**

తద్ద్వీపలక్ష్మపృథుశాల్మలితూలజాలైః :-సచాఽసౌద్వీపశ్చ = తద్ద్వీపః, తద్ద్వీపస్యలక్ష్మ=తద్ద్వీపలక్ష్మ, పృథుశ్చాసౌశాల్మలిశ్చ=పృథుశాల్మలిః, తద్ద్వీపలక్ష్మచాసౌ పృథుశాల్మలిశ్చ= తద్ద్వీపలక్ష్మపృథుశాల్మలిః, తద్ద్వీప లక్ష్మపృథుశాల్మలేః తూలాని, తద్ద్వీపలక్ష్మపృథుశాల్మలితూలాని, తద్ద్వీప లక్ష్మపృథుశాల్మలితూలానాం జాలాని, తద్ద్వీపలక్ష్మపృథుశాల్మలితూల జాలాని, తైః=తద్ద్వీపలక్ష్మపృథుశాల్మలితూలజాలైః.

క్షోణీతలే :— క్షోణ్యాః తలమ్=క్షోణీతలమ్, తస్మిన్=క్షోణీతలే.

మారుతచారుకీర్ణైః :— చారు, కీర్ణాని = చారుకీర్ణాని, మారుతైః చారు కీర్ణాని=మారుతచారుకీర్ణాని, తైః=మారుతచారుకీర్ణైః.

లీలావిహారసమయే :— లీలయావిహారః= లీలావిహారః, లీలావిహారస్య సమయః=లీలావిహారసమయః, తస్మిన్=లీలావిహారసమయే.

చరణార్పణాని:— చరణయోరర్పణాని=చరణార్పణాని తాని=చర్పరణా ణాని.

సరససారసకోశమృద్వి! :—సరసం చ తత్=సారసంచ=సరససారసమ్, సరససారసస్యకోశః=సరససారస కోశః, సరససారసకోశ ఇవ మృద్వీ= సరససారసకోశమృద్వీ, తస్యాస్సమ్బుద్ధిః=హే, సరససారసకోశమృద్వి!

**భావము :**

క్రౌందమ్మి మొగ్గవలె మెత్తని యో దమయన్తీ! ఆ ద్వీపమునకు చిహ్నముగా నచ్చట పెద్ద బూరుగచెట్టు కలదు. దానినే శాల్మలివృక్షమందురు. ఆ శాల్మలివృక్షమందుండుట వలననే నది శాల్మలి ద్వీపమనఁబడుచున్నది. ఆ బూరుగచెట్టులో పండిన ప్రత్తి గాలిచే విసరఁబడి యా దీవియంతట నేలనుఁ గ్రమ్మియున్నది. అందువలన నా నేల మిక్కిలి మెత్తనై యుండును. అట్టి మెత్తటి నేల, నీవు గావించెడి విలాసవిహార కాలములయందు, నీ మెత్తటి పాదములుంచుట కనువుగా నుండును. ॥౭౦॥

**శ్లో. ఏతద్గుణశ్రవణకాలవిజృమ్భమాణ**
**తల్లోచనాఞ్చలనికోచనసూచితస్య ।**
**భావస్య చక్షురుచితం శిబికాభృతస్తే**
**తామేకతః క్షితిపతేరపరం నయన్తః ॥ 71**

ప.వి. ఏతద్గుణశ్రవణకాలవిజృమ్భమాణతల్లోచనాఞ్చలనికోచన సూచితస్య - భావస్య-చక్షుః—ఉచితం-శిబికాభృతః-తే—తామ్- ఏకతః — క్షితిపతేః— అపరం-నయన్తః.

అర్థము. తామ్=ఆ దమయన్తిని, ఏకతః=ఒక, క్షితిపతేః = రాజునుండి, అపరం = మఱియొక రాజును, న యన్తః=పొందించుచున్న, శిబికా భృతః=పల్లకిని మోసెడివారలు, ఏతద్గుణశ్రవణకాలవిజృమ్భమాణతల్లోచనాఞ్చల నికోచనసూచితస్య; ఏతత్=ఈ రాజుయొక్క, గుణ= గుణములను గూర్చి, శ్రవణకాల=వినెడి కాలమునందు, విజృమ్భమాణ= ఆవలించుచున్న, తత్=ఆ దమయన్తియొక్క, లోచన=కన్నులయొక్క, అఞ్చల=అంచులు, నికోచన=ముడుచుకొనుటచే, సూచితస్య=సూచింపఁ బడిన, భావస్య=అభిప్రాయమునకు, ఉచితం=తగినట్టి, కృత్యం=కార్య మును, చక్రుః=చేసిరి. కన్నులయంచులను మూయుటచేతనే, యామెకు వారియం దనురాగము కలుగలేదని గ్రహించి పల్లకిని మఱియొక చోటికిఁ గొనిపోయిరని యర్థము. అనగా నామె చెప్పకయే, సైగచేతనే వాహకులు గుర్తించి తర్వాత కృత్యమునుఁ గావించిరని యర్థము.

**సమాసములు :**

ఏతద్గుణశ్రవణకాలవిజృమ్భమాణతల్లోచనాఞ్చలనికోచనసూచితస్య :— ఏతస్యగుణాః= ఏతద్గుణాః, ఏతద్గుణానాంశ్రవణం=ఏతద్గుణశ్రవణమ్, ఏతద్గుణశ్రవణస్యకాలః = ఏతద్గుణశ్రవణకాలః, ఏతద్గుణశ్రవణకాలే విజృమ్భమాణా= ఏతద్గుణశ్రవణకాల విజృమ్భమాణా, ఏతద్గుణశ్రవణ కాలవిజృమ్భమాణాచ,సా సాచ=ఏతద్గుణశ్రవణకాలవిజృమ్భమాణతత్, ఏతద్గుణశ్రవణకాల విజృమ్భమాణతస్యాః లోచనే=ఏతద్గుణశ్రవణకాల విజృమ్భమాణతల్లోచనే, ఏతద్గుణశ్రవణకాల విజృమ్భమాణతల్లోచనయో రఞ్చలం=ఏతద్గుణశ్రవణకాల విజృమ్భమాణతల్లోచనాఞ్చలం, ఏతద్గుణ శ్రవణకాల విజృమ్భమాణతల్లోచనాఞ్చలస్యనికోచనమ్ = ఏతద్గుణశ్రవణ కాల విజృమ్భమాణతల్లోచనాఞ్చలనికోచనమ్, ఏతద్గుణశ్రవణకాల విజృమ్భమాణతల్లోచనాఞ్చలనికోచనేనసూచితః = ఏతద్గుణ శ్రవణకాల విజృమ్భమాణతల్లోచనాఞ్చలనికోచనసూచితః, తస్య= ఏతద్గుణశ్రవణ కాలవిజృమ్భమాణతల్లోచనాఞ్చల నికోచన సూచితస్య.

**శిబికాభృతః** :— శిబికాం బిభ్రతీతి=శిబికాభృతః.

**క్షితిపతేః :— క్షితేః పతిః=క్షితిపతిః, తస్మాత్=క్షితిపతేః.**

భావము :

పల్లకిని మోసెడి సేవకులు, దమయన్తి నొక రాజునుండి మఱియొక రాజుకడకుఁ గొనిపోవుచుండిరి. సరస్వతీదేవి, యాయా రాజుల గుణముల వర్ణించుచున్నప్పుడు, ఈమె వానిని విని తనకా రాజుపై నభిలాష కలుగక పోయినచో, నా విషయమును బయటఁ జెప్పక కనుసైగలు మున్నగు గమ్భీర చేష్టలచే సూచించుచుండినది. ఇచ్చట తన కెప్పుడు సమక్షమందలి రాజు మనస్సునకుఁ బట్టలేదో యప్పుడు, ఆమె తన యొకలిని విరచి, తన కను కొసలను మూయుటచే నా విషయమును సూచింపగనే, సేవకులు, మఱల నామె మాట కెదురుచూడక వెంటనే యామె యభిప్రాయమున కనుగుణమైన కార్య మునుఁ జేసెడివారు. అనగా మఱియొక రాజునొద్దకుఁ గొనిపోయెడివారని యాశయము. ॥౭౦॥

శ్లో. తాం భారతీ పునరభాషత నన్వముష్మిన్
కాశ్మీరపఙ్కనిభలగ్నజనానురాగే ।
శ్రీఖణ్డలేపమయదిగ్జయకీర్తిరాజి
రాజద్భుజే భజ మహీభుజి భైమి! భావమ్ ॥ 72

ప.వి. తాం-భారతీ-పునః-అభాషత-నను - అముష్మిన్-కాశ్మీరపఙ్కనిభలగ్న జనానురాగే-శ్రీఖణ్డ లేపమయదిగ్జయకీర్తిరాజిరాజద్భుజే-భజ-మహీభుజి-భైమి!-భావమ్.

అర్థము. భారతీ=సరస్వతీదేవి, తామ్ = ఆ దమయన్తిని, పునః = మఱల, అభాషత=పలికినది, (కిమితి=ఏమనగా), నను భైమి! ఓ దమయన్తీ! కాశ్మీరపఙ్కనిభలగ్నజనానురాగే! కాశ్మీరపఙ్క=కుంకుమపువ్వుపు లేప మనెడి, నిభ=నెపముతో, లగ్న=అంటుకొనిన, జనానురాగే=జనుల యను రాగము గలవాడును, శ్రీఖణ్డలేపమయదిగ్జయకీర్తిరాజి రాజద్భుజే; శ్రీఖణ్డలేపమయ; శ్రీఖణ్డ = చన్దనఖణ్డముయొక్క, లేపమయ = లేప రూపమున నున్న, దిగ్జయ=దిక్కులను జయించుటవలన, కీర్తిరాజి =

కీర్తిపఙ్క్తిచే, రాజద్భుజే=ప్రకాశించుచున్న భుజము కల్గిన, అముష్మిన్= ఈ, మహీభుజి=రాజునందు, భావం=అనురాగమును, భజ=ఉంచుము.

వి. ఇచ్చట శ్రీఖణ్డలేపమును కీర్తిగా భావించుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకము నుఁ బ్రయోగించనందువలన నది గమ్యము.

కాశ్మీరపఙ్కమునందు, పఙ్కత్వమున పహ్నవించి, అనురాగత్వము నారోపించుటవలన నపహ్నవాలఙ్కారము.

**సమాసములు :**

కాశ్మీరపఙ్కనిభలగ్నజనానురాగే:– కాశ్మీరస్యపఙ్కః = కాశ్మీరపఙ్కః, కాశ్మీరపఙ్కస్యనిభః = కాశ్మీరపఙ్కనిభః, కాశ్మీరపఙ్కనిభేనలగ్నః= కాశ్మీరపఙ్కనిభలగ్నః, జనేషుఅనురాగః= జనానురాగః, కాశ్మీరపఙ్కనిభలగ్నః, జనానురాగః, యస్మిన్ సః=కాశ్మీరపఙ్కనిభలగ్నజనానురాగః, తస్మిన్=కాశ్మీరపఙ్కనిభలగ్నజనానురాగే.

శ్రీఖణ్డలేపమయదిగ్జయకీర్తిరాజిరాజద్భుజే :– శ్రీఖణ్డస్యలేపః, శ్రీఖణ్డలేపః, శ్రీఖణ్డలేపస్య వికారః=శ్రీఖణ్డలేపమయీ, దిశాంజయః=దిగ్జయః, దిగ్జయేనకీర్తిః=దిగ్జయకీర్తిః, శ్రీఖణ్డలేపమయీచసా దిగ్జయకీర్తిశ్చ= శ్రీఖణ్డలేపమయ దిగ్జయకీర్తిః, శ్రీఖణ్డలేపమయ దిగ్జయకీర్తేః రాజిః= శ్రీఖణ్డలేపమయ దిగ్జయకీర్తిరాజిః, శ్రీఖణ్డలేపమయదిగ్జయకీర్తిరాజ్యా రాజన్తౌ=శ్రీఖణ్డలేపమయదిగ్జయకీర్తిరాజిరాజన్తౌ, శ్రీఖణ్డలేపమయదిగ్జయకీర్తిరాజిరాజన్తౌ భుజౌ, యస్యసః = శ్రీఖణ్డలేపమయదిగ్జయకీర్తిరాజిరాజద్భుజః, తస్మిన్ = శ్రీఖణ్డలేపమయిదిగ్జయకీర్తిరాజిరాజద్భుజే.

**భావము :**

మరల సరస్వతీదేవి దమయన్తికిఁ జెప్పెను–"ఓ దమయన్తీ! ఈ రాజు కుఙ్కుమపూవుతోటిమై పూతయను నెపమున, జనానురాగమును వహించియున్నాడు. అనగా నది కుఙ్కుమపూమైపూతకాదు. యదేమనగా జనులకతనిపై నేర్పడిన యనురాగమే యా కుఙ్కుమపుష్పవర్ణమునఁ గానవచ్చుచున్నదని యాశయము. అతని భుజములపై శ్రీ చందనపఙ్కము, పట్టింపఁబడియున్నది.

అది యాతని దిగ్విజయముల వలని కీర్తియా యని కనిపించుచున్నది. అట్టి యీ ద్వీపపు రాజునందు ననురాగముంచుమా. ॥౭౨॥

శ్లో. ద్వీపం ద్విపాధిపతిమన్దపదే! ప్రశాస్తి
ప్లక్షోపలక్షితమయం క్షితిపస్తదస్య।
మేధాతిథే స్త్వమురసి స్ఫుర సృష్టసౌఖ్యా
సాక్షాద్యథైవ కమలా యమలార్జునారేః॥ 73

ప.వి. ద్వీపం-ద్విపాధిపతిమన్దపదే! - ప్రశాస్తి - ప్లక్షోపలక్షితమ్ - అయం-క్షితిపః-తత్-అస్య-మేధాతిథేః – త్వమ్ - ఉరసి-స్ఫుర-సృష్టసౌఖ్యా-సాక్షాత్-యథా-ఏవ-కమలా-యమలార్జునారేః.

అర్థము. హే ద్విపాధిపతిమన్దపదే!=గజేన్ద్రమువలె మెల్లగ నడచు యో దమయన్తీ! అయం=ఎదుటనున్న ఈ, క్షితిపః=రాజు, ప్లక్షోపలక్షితమ్; ప్లక్ష=మఱ్ఱిచెట్టుచే, ఉపలక్షితమ్=గుర్తింపఁబడిన, ద్వీపం = ద్వీపమైన ప్లక్ష ద్వీపమును, ప్రశాస్తి=పాలించును. తత్=అందువలన, మేధాతిథేః=మేధాతిథి యను పేరుగల్గిన, అస్య=ఈ రాజుయొక్క, ఉరసి=వక్షః స్థలమునందు, సృష్టసౌఖ్యా; సృష్ట=సృజింపఁబడిన, సౌఖ్యా = సౌఖ్యము గలదై, యమలార్జునారేః; యమలార్జున = ఏఱుమద్దిచెట్ల జత రూపమున నున్న రాక్షసులకు, అరేః=శత్రువైన విష్ణువుయొక్క, ఉరసి=వక్షః స్థలమునందు, సాక్షాత్=స్వయముగ నధిష్ఠించిన, కమలాయథైవ=లక్ష్మి యెట్లో (తథైవ=అట్లే), స్ఫుర=ప్రకాశించుము.

**సమాసములు :**

ద్విపాధిపతిమన్దపదే:– ద్వాభ్యాం పిబన్తీతి=ద్విపాః, ద్విపానామధిపతిః= ద్విపాధిపతిః, ద్విపాధిపతేరివమన్దం పదం యస్యాస్సా=ద్విపాధిపతిమన్ద పదా, తస్యాః=సమ్బుద్ధిః ద్విపాధి పతిమన్దపదే।

ప్లక్షోపలలక్షితమ్:– ప్లక్షేన ఉపలక్షితః=ప్లక్షోపలక్షితః, తమ్=ప్లక్షోపల క్షితమ్

సృష్టసౌఖ్యా:– సృష్టం సౌఖ్యం యస్యాస్సా=సృష్టసౌఖ్యా।

యమలార్జునారేః— యమలౌచతౌ అర్జునౌచ = యమలార్జునౌ, యమలార్జునయోః అరిః=యమలార్జునారిః, తస్య=యమలార్జునారేః.

**భావము :**

గజేన్ద్రగమనయైన యో దమయన్తీ! ప్లక్ష ద్వీపమును, ఈ యెదుట నున్న రాజు పాలించును. ప్లక్షమనగా మఱ్ఱిచెట్టు. మఱ్ఱిచెట్టుతో గుర్తింపఁబడినందు వలన నిది ప్లక్షద్వీపము. ఇతని పేరు మేధాతిథి. నీవు ఇతని యక్కునందు నానందమొందుచు, యమరార్జులను సంహరించిన, శ్రీ మహావిష్ణువు నురమున వెలసిన లక్ష్మీదేవివలె ప్రకాశించుము. ॥౭౩॥

శ్లో. ప్లక్షే మహీయసి మహీవలయాతపత్రే
తత్రేక్షితే ఖలు తవాఽపి మతిర్భవిత్రీ ।
ఖేలాం విధాతుమధిశాఖివిలమ్బిదోలా
లోలాఖిలాఙ్గజనతా జనితానురాగే ॥ 74

ప. వి. ప్లక్షే-మహీయసి–మహీవలయాతపత్రే-తత్ర–ఈక్షితే–ఖలు–తవ–అపి–మతిః-భవిత్రీ-ఖేలాం-విధాతుమ్-అధిశాఖివిలమ్బిదోలా లోలాఖిలాఙ్గజనతా జనితానురాగే.

అర్థము. తత్ర = ఆ ప్లక్షద్వీపమందు, అధిశాఖవిలమ్బిదోలా లోలాఖిలాఙ్గజనతా జనితానురాగే; అధిశాఖ=కొమ్మయందు, విలమ్బి=వ్రేలాడు, దోలా = ఊయెలయందు, లోల=చలించెడి, అఖిలాఙ్గ=సమస్తములగు నవయవములు గల్గిన, జనతా=జనసమూహముచే, జనిత=కల్గింపఁబడిన, అనురాగే=అనురాగము గల్గిన, మహీవలయాతపత్రే; మహీవలయ=భూవలయమునకు, ఆతపత్రే=గొడుగుగానున్న, మహీయసి=మిక్కిలి గొప్పదైన, ప్లక్షే=మఱ్ఱిచెట్టు, ఈక్షితేసతి=చూడఁబడగా, తవాఽపి=నీకును, ఖేలామ్=ఆటను, విధాతుం=చేయుటకు. మతిః=బుద్ధి లేదా కోరిక, భవిత్రీఖలు=కలుగఁగలదు గదా!

**సమాసములు :**

మహీయసి :— అతిశయేనమహాన్=మహీయాన్, తస్మిన్=మహీయసి।
అధిశాఖవిలమ్బిదోలాలోలాఖిలాఙ్గజనతాజనితానురాగే ;— శాఖాయామధి=శాఖమ్, అధిశాఖం విలమ్బిన్యః,=అధిశాఖవిలమ్బిన్యః, అధిశాఖవిలమ్బిన్యశ్చతాఃదోలాశ్చ=అధిశాఖవిలమ్బిదోలాః, అధిశాఖ విలమ్బిదోలాభిః లోలాని=అధిశాఖవిలమ్బిదోలాలోలాని, అధిశాఖవిలమ్బిదోలాలోలాని, అఖిలాఽఙ్గానియస్యాస్సా = అధిశాఖవిలమ్బిదోలాలోఖిలాఙ్గా, అధిశాఖ విలమ్బిదోలాలోలాఖిలాఙ్గాచసాజనతాచ = అధిశాఖవిలమ్బిదోలాలోలాఖిలాఙ్గజనతా, అధిశాఖవిలమ్బిదోలాలోలాఖిలాఙ్గజనతయాజనితః=అధిశాఖవిలమ్బిదోలాలోలాఖిలాఙ్గజనతాజనితః, అధిశాఖవిలమ్బిదోలాలోలాఖిలాఙ్గజనతాజనితః. అనురాగః యస్మిన్ తత్=అధిశాఖవిలమ్బిదోలాలోలాఖిలాఙ్గజనతాజనితానురాగమ్, తస్మిన్=అధిశాఖవిలమ్బిదోలాలోలాఖిలాఙ్గజనతాజనితానురాగే।
మహీవలయాతపత్రే:— మహ్యాః వలయః=మహీవలయః, మహీవలయస్య ఆతపత్రం= మహీవలయతపత్రమ్, తస్మిన్=మహీవలయాతపత్రే॥

**భావము :**

ఆ ప్లక్షద్వీపము నందలి మఱ్ఱిచెట్టునకు పెక్కు ఊయెలలు కట్టి జనులు ఊగుచు నా వృక్షముపైన ననురాగమునుఁ జూపుచున్నారు. భూవలయమునకు గొడుగుగా నుండు, నా గొప్ప మఱ్ఱిచెట్టును నీవు గాంచినచో, నీకు దానిపైన నూగవలయునను కోరిక కలుగగలదు. ॥౭౪॥

శ్లో. **పీత్వా తవాధరసుధాం వసుధాసుధాంశు**
**ర్న శ్రద్దధాతు రసమిక్షురసోదవారామ్ ।**
**ద్వీపస్య తస్య దధతాం పరివేశవేశం ।**
**సోఽయం చమత్కృతచకోరచలాచలాక్షి! ॥ 75**

ప. వి. పీత్వా-తవ—అధరసుధాం-వసుధాసుధాంశుః-న-శ్రద్దధాతు-రసమ్-ఇక్షురసోదవారామ్-ద్వీపస్య-తస్య-దధతాం—పరివేశవేశం-సః-అయం-చమత్కృతచకోరచలాచలాక్షి.

అర్థము. హే చమత్కృత చకోర చలాచలాక్షి! చమత్కృత = బెదరిన, చకోర=చకోరపక్షివలె, చలాచల=మిక్కిలి చలించు, అక్షి=నేత్రముగల దమయన్తీ! వసుధాసుధాంశుః = భూమికిఁచంద్రుఁడైన, సోఽయం = ఆ యీ మేధాతిథి, తవ=నీయొక్క, అధరసుధాం=పెదవిలోని యమృత మును, పీత్వా=త్రాగి, తస్య=ఆ, ద్వీపస్య=ద్వీపమునకు, పరివేశవేశం; పరివేశ=ద్వీపముచుట్టిన యగడ్తయొక్క, వేశం=ఆకృతిని, దధతాం= ధరించుచున్న, ఇక్షురసోదవారామ్; ఇక్షురసోద=చెఱకురసపు సాగరము యొక్క, వారామ్=ఉదకములయొక్క, రసం=రుచిని, నశ్రద్ధధాతు = అభిలషింపఁడు. నీ యధరామృతమునుఁగ్రోలిన యా రాజునకు నిక్షురస ముపై మక్కువ యెట్లు గల్గును. కలుగదని యర్థము. మఱియు చకోర ములు, చన్ద్రుని యమృతమునుఁద్రాగును కాని, చకోరాక్షివైన నీ యొక్క యధరామృతమును భూచన్ద్రుఁడు త్రాగును. అందువలన చకోర శబ్దము నకు పూర్వము "చమత్కృత" పదమునకు సార్థకత్వమేర్పడినది. ఏల యనగా నిట చన్ద్రుడు చకోరాక్షి యొక్క యధరామృతమును త్రాగుట విరుద్ధము. చకోరము చంద్రామృతము త్రాగుట సహజము. అందువలన చకోరములు చకితములైనవని యాశయము.

## సమాసములు :

అధరసుధామ్:- అధరస్యసుధా=అధరసుధా, తామ్=అధరసుధామ్.

ఇక్షురసోదవారామ్:- ఇక్షోః రసః=ఇక్షురసః, ఇక్షురసఏవఉదకం యస్యసః=ఇక్షురసోదః, ఇక్షురసోదస్యవారీణి=ఇక్షురసోదవారీణి, తేషా మిక్షురసోదవారామ్।

పరివేశవేశమ్:- పరివేశస్యవేశః=పరివేశవేశః, తమ్=పరివేశవేశమ్।

చమత్కృతచకోరచలాచలాక్షి! :- చమత్కృతశ్చాసౌ చకోరశ్చ=చమ త్కృతచకోరః,అత్యన్తం చలే=చలాచలే, చలాచలేచతే అక్షిణీచ=చలాచ లాక్షిణీ, చమత్కృతచకోరస్యేవచలాఽచలాక్షిణీ, యస్యాస్సా = చమ త్కృతచకోరచలాచలాక్షిణీ,తస్యాస్సమ్బుద్ధిః=చమత్కృతచకోరచలాచ లాక్షి!

**భావము :**

ఓ చకోరాక్షీ! భూలోకచన్ద్రుఁడైన యీ మేధాతిథి నీయధరామృతముఁ గ్రోలి తన ద్వీపమునకు నగ్తవలె నాచరించు నిక్షుసాగరపు జలముల ద్రాగ నభిలషింపఁడు. ఆ దమయన్తి యధరామృతము ఇక్షురససాగర జల మాధుర్యమునుఁగూడ మించినదని యాశయము. చంద్రుడు చకోరముల అమృత మును పానము చేయడు. మరేమనగా చకోరములు చంద్రామృతమును పానముచేయును. ఇచ్చట తద్విరుద్ధముగాఁ జెప్పుటవలన చకోరములు చకితము లైనవని భావము. ॥౭౫॥

శ్లో. సూరం న సౌర ఇవ నేన్దుమవేక్ష్య తస్మిన్
అశ్నాతి య స్తదితరత్రిదశానభిజ్ఞః ।
తస్యైన్దవస్య భవదాస్య నిరీక్షయైవ
దర్శేఽశ్నతోఽపి న భవత్యవకీర్ణిభావః॥ 76

ప.వి. సూరం-న-సౌరః- ఇవ-న- ఇన్దుమ్ - అవేక్ష్య-అశ్నాతి-యః-తదితర త్రిదశానభిజ్ఞః- తస్య- ఐన్దవస్య- భవదాస్య నిరీక్షయా- ఏవ- దర్శే- అశ్నతః అపి-న-భవతి-అవకీర్ణిభావః.

అర్థము. తస్మిన్ = అప్లక్షద్వీపమందు, తదితరత్రిదశానభిజ్ఞః; తత్=ఆ చన్ద్రునికంటె, ఇతర = తక్కిన, త్రిదశ = దేవతలను, అనభిజ్ఞః=: తెలియనట్టిఅనగా నితరదేవతనుఁ గొల్వనట్టి, యః = చన్ద్రుని యందు భక్తి గల్గిన ఏజనము, సౌరః=సూర్యునియందు భక్తిగలవాడు సూరమివ=సూర్యునివలె, ఇందుం = చంద్రుని, న అవేక్ష్య = చూడక, నాఽశ్నాతి=భుజింపడో, తస్య, ఐన్దవస్య = చంద్రభక్తునికి, భవదాస్యని రీక్షయైవ; భవత్=నీయొక్క, ఆస్య=ముఖమును, నిరీక్షయైవ=చూచుట చేతనే, దర్శే = అమావాస్యయందు, అశ్నతోఽపి = తినినను, అవకీర్ణి భావః=వ్రతహాని, నభవతు = ఉండదు. ఏలయనగా నీ ముఖచన్ద్రుని దర్శించుటచేతనే యతనకి చన్ద్రదర్శనమేర్పడి భోజనమందధికారము సిద్ధించును. కాన వ్రతహానిలేదని యర్థము.

వి. ఇచ్చట దమయన్తి ముఖమునందు చన్ద్రభ్రాంతియేర్పడినదిగాన భ్రాన్తి మదలఙ్కారము ధ్వనించుచున్నది కాన వస్తువుచేనలఙ్కారధ్వని.

**సమాసములు :**

సౌర:- సూరేభక్తిః యస్యసః=సౌరః।

తదితర త్రిదశానభిజ్ఞః:- తస్మాదితరే=తదితరే, తదితరేచ తేత్రిదశాశ్చ, తదితరత్రిదశాః, నఅభిజ్ఞః = అనభిజ్ఞః, తదితర త్రిధశానామనభిజ్ఞః = తదితర త్రిదశానభిజ్ఞః

భవదాస్యనిరీక్షయా : భవత్యాః ఆస్యమ్ = భవదాస్యమ్, భవదాస్యస్య నిరీక్షా=భవదాస్య నిరీక్షా, తయా=భవదాస్య నిరీక్షయా.

అవకీర్ణిభావః :- అవకీర్ణినాంభావః=అవకీర్ణిభావః ।

**భావము :**

ఇతర దేవతలనుఁ దెలిసికొనక, కేవలము చంద్రునుపాసించు భక్త జనమునకు, సూర్యభక్తులకు సూర్యునివలె, చన్ద్రదర్శన మవసరము. ఎట్లు సూర్య భక్తులు సూర్యదర్శనము లేక భుజింపరో, అట్లే చంద్రభక్తులును చంద్ర దర్శనము లేక భుజింపరు. కాన నాచంద్రదర్శనము కోరినభక్తులకు నీ ముఖ చంద్రదర్శనముచేతనే వ్రతసిద్ధి యేర్పడును. కాన నట్టివారు, అమావాస్యయందు భుజించినను వ్రతహాని కలుగదు. ॥౭౬॥

**శ్లో. ఉత్సర్పిణీ న కిల తస్య తరఙ్గిణీ యా**
**త్వన్నేత్రయోరహహ, తత్ర విపాశి జాతా।**
**నీరాజనాయ నవనీర జరా జిరాస్తా**
**మత్రాఞ్జసాఽనురజ రాజని రాజమానే॥ 77**

ప.వి. ఉత్సర్పిణీ-న-కిల-తస్య- తరఙ్గిణీ-యా- త్వన్నేత్రయోః- అహహ- తత్ర-విపాశి- జాతా- నీరాజనాయ- నవనీరజరాజిః- ఆస్తామ్- అత్ర- అఞ్జసా- అనురజ-రాజని- రాజమానే-

అర్థము. తస్య=ఆద్వీపమునకు సంబంధించినదైన, యా=ఏ, విపాట్=విపాశ యను, తరఙ్గిణీ=నది, ఉత్సర్పిణీ=పొంగెడి ప్రవాహముగలదిగా, నకిల= కాదు, తత్ర=ఆ,విపాశి = విపాశయందు,జాతా=ఉద్భవించిన, నవనీరజ రాజిః; నవ=నూతనమైన, నీరజ=కమలములయొక్క; రాజిః = పంక్తి, త్వన్నేత్రయోః = నీకన్నులను, నీరాజనాయ = హారతి యొసంగుటకు లేదా, దృష్టితీయుటకు, ఆస్తాం=ఉండునుగాత. అహహ = ఆశ్చర్యము. (కావుననే), రాజమానే = ప్రకాశించుచున్న, అత్ర=ఇందలి, రాజని = మేధాతిథియనురాజునందు, అఞ్జసా = వేగముగా, అనురజ=అనురాగ ముంచుము. విపాశానదియందు పెద్దయలలు లేనందువలన నందు తామర పూవులు నిరంతరముపూచుచుండును. అవినీకనుగవకు నీరాజనమగునని యర్థము.

**సమాసములు :**

త్వన్నేత్రయోః: తవనేత్రే=త్వన్నేత్రే, తయోః=త్వన్నేత్రయోః.
నవనీరజరాజిః: నవానిచతాని నీరజానిచ= నవనీరజాని, నవనీరజానాం= రాజిః=నవనీరజరాజిః।

**భావము :**

ఆద్వీపమందు విపాశయను నది ప్రవహించును. అదియెప్పుడును నలలు లేక ప్రశాన్తముగాఁ బారుచుండును. అందువలన నానదియందు పద్మములు నిరన్తరము మొలచి వికసించుచుండును. కాన నందలి పద్మములు నీ కన్ను గవకు నీరాజన మొసంగగలవు. అందువలన నీవు, ఆద్వీపపు రాజుగా వెలు గొందు నీ మేధాతిథిని వివరింపుము. ॥౭౭॥

శ్లో. ఏతద్యశోభిరభితేమ్బుని సన్తు హంసాః,
దుగ్ధీకృతే తదుభయవ్యతిభేదముగ్ధాః।
క్షీరే పయస్యపి పదే ద్వయవాచిభూయం
నానార్థకోషవిషయోఽద్య మృషోద్యమస్తు॥ 78

ప.వి. ఏతద్యశోభిః- అఖిలే-అమ్బుని-సంతు-హంసాః-దుగ్ధీకృతే- తదుభయ వ్యతి భేదముగ్ధాః-క్షీరే-పయసి-అపి-పదే-ద్వయవాచిభూయం-నానార్థ కోషవిషయః-అద్య-మృషోద్యమ్-అస్తు.

అర్థము. ఏతద్యశోభిః, ఏతస్య=ఈరాజుయొక్క, యశోభిః=కీర్తులచే, అలేఖి=సమస్తమైన, అమ్బుని, ఉదకము=దుగ్ధీకృతే సతి=పాలుగాఁజేయఁబడగా, హంసాః=హంసలు, తదుభయ వ్యతిభేదముగ్ధాః; తదుభయ=ఆ రెంటి యొక్క, వ్యతిభేద=యొండొంటిభేదమునందు, ముగ్ధాః=మూఢులుగాసన్తు=అగును గాత. కిఞ్చ=మఱియు, క్షీరే=క్షీరమను పదే=పదము విషయము నను, పయసి పదేపి=పయస్సు అను పదము విషయమునను, అనగా క్షీరపయఃపదములవిషయమున, నానార్థ కోశ విషయః, నానార్థ కోశ= "క్షీరం నీరేచ దుగ్ధేచ" "పయోఽమ్బుని చదుగ్ధేచ" ఇత్యాద్యనే కార్థ నిఘణ్టు యొక్క, విషయః=విషయమైన, అనగా నందు ప్రతిపాదింప బడు విషయమైన, ద్వయవాచిభూయం=రెండు అర్థములను బోధించుట, అద్య = ఇప్పుడు అనగా నిన్ను పరిగ్రహించుటవలన, మృషోద్యమ్ = అసత్యవచనముగా, అస్తు=అగునుగాత. ఉదకముగూడ పాలగుటవలన రెండవయర్థము సంభవింపదని యర్థము. సమస్తజలములు పాలుగానైన దని చెప్పుటవలన నా పదములకు రెండవ యర్థము సంభవింపదని యాశయము.

వి. ఇచ్చట నఖిల జలముల క్షీరములతో నభిన్నములైనవని చెప్పుటవలన సామాన్యాలఙ్కారము.

హంసలు, పాలనునీటిని, వేఱుపఱచు, సంబంధము గల్గియున్నను, సంబంధములేదని చెప్పుటవలనను, క్షీరనీర పదములకు నర్థద్వయ సంబంధమున్నను, లేదని చెప్పుటవలనను నతిశయోక్తిద్వయము. వీనికి సామాన్యాలఙ్కారముపజీవ్యము, ఈ రెండు అలఙ్కారములకును సఙ్కరము.

## సమాసములు :

ఏతద్యశోభిః:- ఏతస్య యశాంసి = ఏతద్యశాంసి, తైః=ఏతద్యశోభిః।

దుగ్ధీకృతేః :— అదుగ్ధం దుగ్ధం సమ్పద్యమానం కృతమ్=దుగ్ధీకృతమ్, తస్మిన్=దుగ్ధీకృతే.

తదుభయవ్యతి భేదముగ్ధాః:— తయోరుభయం=తదుభయం, తదుభయస్య వ్యతిభేదః=తదుభయవ్యతిభేదేసముగ్ధాః = తదుభయ వ్యతిభేదముగ్ధాః॥

ద్వయవాచిభూయమ్:— ద్వయం వక్తీతి = ద్వయవాచి. ద్వయవాచినః భావః=ద్వయవాచిభూయమ్, తత్ = ద్వయవాచిభూయమ్.

నానార్థకోశ విషయః:- నానా విధాః అర్థాః యేషాంతాని = నానార్థాని, నానార్థానాం కోశః=నానార్థకోశః, నానార్థ కోశస్య విషయః = నానార్థ కోశ విషయః—

మృషోద్యమ్:- మృషా ఉదితమ్ = మృషోద్యమ్.

**భావము :**

ఈతని కీర్తి ప్రపఞ్చమంతటిని వ్యాపింపగా దానితెల్లతనముచే నీరుగూడ పాలుగామాఱినది. అందువలననేఁక హంసలు పాలను నీటినివేఱుపఱచు విషయము నందు మూఢత్వము వహింపవలసియున్నది. క్షీరపదమునందును పయః పదము నందును, ద్వయవాచకత్వము అనగా పాలను నీటి చెప్పుట నానార్థ నిఘంటు వులలో కానవచ్చు చున్నది. అనగా క్షీరపదము—పాలను నీరును బోధించును. అట్లే పయఃపదముపై రెంటినిబోధించును. కాన నివినానార్థకములుగా నిఘంటువు వలనఁ దెలియుచున్నది. కాని ప్రకృతము, ఆ రాజుల కీర్తులవలన నీరు గూడ పాలుగా మాఱుటవలన క్షీరపయః ప్రభృతి శబ్దములు రెండర్థములనుఁ జెప్ప నవసరములేదు. అనగా నారాజుకీర్తివిశ్వవ్యాప్తినిఁ బొందినది. కాన నట్టివాఁడు వరింప నర్హుడని యాశయము. ॥౭౮॥

**శ్లో. బ్రూమః కిమస్య నలఘుప్వలమాజుహూషోః**
**కీర్తిం స చైష చ సమాదిశతః స్మకర్తుమ్।**
**స్వద్వీపసోమసరి దీశ్వరపూరపార**
**వేలాబలాక్రమణ విక్రమ మక్రమేణ॥**

ప. ఛే. బ్రూమః-కిమ్--అస్య-నలమ్-అపి-అలమ్- ఆజుహూషోః- కీర్తిం-సః-చ-ఏషః- సమాదిశతః-స్మ-కర్తుమ్ - స్వద్వీపసీమసరిదీశ్వర పూరపార వేలాబలాత్క్రమణ విక్రమమ్-అక్రమేణ.

అర్థము. నలమపి = నలునిఁగూడ, అలం = మిక్కిలి, ఆజుహూషోః=స్పర్ధతోఁ బిలువఁగోరిన, అస్య=ఈ మేధాతిథియొక్క, (మాహాత్మ్యం=మహిమను గూర్చి), కిమ్=ఏమని, బ్రూమః=చెప్పుదుము? తథాహి=అదియుక్తమే, సచ=ఆనలుఁడును, ఏషచ=ఈ మేధాతిథియు, అక్రమేణ=ఏకకాలమున, స్వద్వీపసీమ సరిదీశ్వరపూరపారవేలాబలాత్క్రమణ విక్రమమ్; స్వ = తమయొక్క, ద్వీపసీమ = జమ్బూప్లక్ష ద్వీపముల యొక్క ఎల్లల యందలి, సరిదీశ్వర = సముద్రముయొక్క, పూర=ప్రవాహమునకు, పారవేలా=ఆవలిగట్టు యొక్క ఎల్లను, బలాత్క్రమణ=బలముచే నాక్రమించుటయను, విక్రమం=పరాక్రమమును, కర్తుం=చేయుటకు, కీర్తిం= తమకీర్తిని, సమాదిశతః స్మ=ఆదేశించుచుండిరి. వీరికీర్తి యితర ద్వీపములయందు సైతము సంభవించుచున్నదని యర్థము,

## సమాసములు :

ఆజుహూషోః :-ఆహ్వాతుమిచ్ఛుః=ఆజుహూషుః, తస్య=ఆజుహూషోః, స్వద్వీపసీమసరిదీశ్వరపూరపారవేలాబలాత్క్రమణవిక్రమమ్:- స్వయోః ద్వీపౌ=స్వద్వీపౌ, స్వద్వీపయోః సీమ=స్వద్వీపసీమ, సరితామీశ్వరః= సరిదీశ్వరః, సరిదీశ్వరస్య పూరః=సరిదీశ్వరపూరః, స్వద్వీపసీమ్ని సరిదీశ్వరపూరః=స్వద్వీపసీమ సరిదీశ్వరపూరః, స్వద్వీపసీమ సరిదీశ్వర పూరస్య పారవేలా=స్వద్వీపసీమ సరిదీశ్వర పూరపారవేలా. స్వద్వీపసీమ సరిదీశ్వరపూరపారవేలా యాః బలేన ఆక్రమణమ్= స్వద్వీపసీమ సరిదీశ్వరపూరపారవేలాబలాత్క్రమణమ్, స్వద్వీపసీమ సరిదీశ్వర పూరపారవేలాబలాత్క్రమణే విక్రమః = స్వద్వీపసీమసరిదీశ్వర పూరపారవేలా బలాత్క్రమణవిక్రమః, తమ్=స్వద్వీపసీమసరిదీశ్వరపూరపారవేలా బలాత్క్రమణ విక్రమమ్.

అక్రమేణః- అవిద్యమానః క్రమః యస్మిన్ తత్=అక్రమమ్, తేన= అక్రమేణ.

**భావము :**

నలమహారాజును పోటీగా పిలువఁగోరిన యీ మేధాతిథియొక్క మహిమనుఁ గూర్చి యేమి చెప్పుదము. ఇది చెప్పసాధ్యము కానిదని యాశయము. అది యుక్తమే. ఆ నలమహారాజును, ఈ మేధాతిథియు, నేకకాలమునందే తమ తమ ద్వీపముల యొక్క యెల్లలయందు, సముద్ర ప్రవాహముయొక్క ఆవలిగట్టు యెల్లను బలముతో నాక్రమించుటలో పరాక్రమము తెలుపుటకు తమ కీర్తిని, ఆదేశించుచున్నారు. నలమహారాజు కంటె నే విషయమందును మేధాతిథి తీసిపోడు. ఉభయులు తమతమ ద్వీపములనంటిన సముద్రప్రవాహముల యావలి తీరపు టెల్లలను నాక్రమించుటలో తమ తమ పరాక్రమముల దెలుపుచున్నారని యాశయము ॥౭౯॥

శ్లో. అమ్భోజగర్భరుచిరాఽథ విదర్భసుభ్రూ
స్తం గర్భరూపమపి రూపజితత్రిలోకమ్।
వైరాగ్యరూక్షమవలోకయతి స్మ భూపం
దృష్టిః పురత్రయరిపోరివ పుష్పచాపమ్॥ 80

ప.వి. అమ్భోజగర్భరుచిరా-అథ-విదర్భసుభ్రూః- తమ్- గర్భరూపమ్-అపి-రూపజిత త్రిలోకమ్-వైరాగ్య రూక్షమ్- అవలోకయతి- స్మ- భూపం-దృష్టిః-పురత్రయరిపోః-ఇవ-పుష్పచాపమ్.

అర్థము. అథ=ఈమాటను వినినపిదప, అమ్భోజగర్భరుచిరా; అమ్భోజగర్భ=కమలము యొక్క మధ్యభాగమువలె, రుచిరా=అందమైన అనగా దానివలె కోమలశరీరము గల్గిన, విదర్భసుభ్రూః = దమయన్తి, గర్భరూపమపి=ప్రశస్తమైనగర్భమైనను, అనగా యువకుఁడైనను, రూపజిత త్రిలోకమ్; రూప=సౌందర్యముతో, జిత = జయింపఁబడిన, త్రిలోకం = మూఁడు లోకములుగల్గిన, తం=ఆ, భూపం=రాజైన, మేధాతిథిని, పుష్పచాపమ్=పూవిల్తుడైన, కామం=మన్మథుని, పురత్రయరిపోః=శివునియొక్క, దృష్టిరివ=దృష్టివలె వైరాగ్యరూక్షం; వైరాగ్య=విరక్తిచే, రూక్షం=కఠినముగా, అవలోకయతిస్మ = చూచుచుండెను.

మిక్కిలి యందగాడైన యారాజునందు దమయన్తి యనురాగమునుఁ జూడక తీవ్రదృష్టితో చూచుచుండినదని యర్థము.

**సమాసములు :**

అమ్భోజగర్భ రుచిరా :- అమ్భోజస్యగర్భః=అమ్భోజగర్భః, అమ్భోజగర్భ ఇవరుచిరా=అమ్భోజగర్భరుచిరా.

విదర్భసుభ్రూః విదర్భాణాం సుభ్రూః=విదర్భసుభ్రూః,

గర్భరూపమ్ :- ప్రశస్తః గర్భః=గర్భరూపః, తమ్=గర్భరూపమ్.

రూపజిత త్రిలోకమ్ :- రూపేణ జితాః = రూపజితాః. త్రయః లోకాః త్రిలోకాః, రూపజితాః త్రిలోకాః యేనసః=రూపజిత త్రిలోకః, తమ్=రూపజిత త్రిలోకమ్.

వైరాగ్యరూక్షమ్ :- విరాగిణఃభావః=వైరాగ్యం, వైరాగ్యేణరూక్షః=వైరాగ్యరూక్షః, తమ్=వైరాగ్యరూక్షమ్।

పురత్రయరిపోః:- పురాణాంత్రయమ్=పురత్రయమ్,పురత్రయస్యరిపుః=పురత్రయరిపుః, తస్య=పురత్రయరిపోః।

పుష్పచాపమ్:- పుష్పంచాపః యస్యసః=పుష్పచాపః, తమ్ = పుష్పచాపమ్.

**భావము :**

సరస్వతీదేవి చెప్పిన మాటలను వినినపిదప; కమలగర్భమువలె మెత్తని దేహముగల్గిన దమయన్తి ప్రశస్తగర్భమైనను, అనగా యువకుఁడైనను, సౌన్దర్యముచే మూడులోకములను జయించినవాఁడైనను మేధాతిథిని, శివుని దృష్టి మన్మథునిఁబోలె తీవ్రముగా చూచెనుకాని వాని నొల్లలేదు. ॥౮౦॥

శ్లో. తే తాం తతోఽపి చక్రుషుర్జగదేకదీపా
దంసస్థల స్థితసమాన విమానదక్షాః।
చణ్డమ్శుతేరుదయినీమివ చన్ద్రిలేఖా
సోత్కణ్ఠ వైరవ వనీసుకృత ప్రరోహాః॥ 81

ప.వి. తే-తాం-తతః-అపి-చక్రుషః-జగదేగ దీపాత్-అంసస్థం స్థిత సమాన దణ్డాః-చణ్డద్యుతేః-ఉదయినీమ్-ఇవ-చన్ద్రిలేఖామ్-సోత్కణ్ఠ కైరవవనీ సుకృత ప్రరోహాః.

అర్థము. అంసస్థల స్థిత సమాన విమానదణ్డాః, అంస = భుజశిఖరములయందు, స్థిత=ఉన్న, సమాన=ఒక్క విధముగనేయున్న, విమానదణ్డాః= పల్లకి కొయ్యలుగల, తే=ఆ, వాహకులు, తామ్=ఆదమయన్తిని, సోత్కణ్ఠ కైరవ వనీ సుకృత ప్రరోహాః, సోత్కణ్ఠ = చన్ద్రికలయందు నుత్సుకత కల, కైరవవనీ=కలువల వనములయొక్క, సుకృత ప్రరోహాః=సౌభాగ్యరేఖలు, ఉదయినీం=ఉదయించుచున్న చన్ద్రిలేఖామ్=చన్ద్రికలను, అమావాస్య యందు సూర్యమణ్డలమునుఁ బ్రవేశించిన చన్ద్రికలనని యర్థము. జగదేక దీపాత్ = ప్రపఞ్చమునకంతటికిని సాటిలేని దీపమైన, చణ్డద్యుతేరివ= సూర్యునుండివలె, జగదేక దీపాత్ = ప్రపఞ్చమునకు దీపమువంటి వాఁడైన, తతోఽపి=ఆ మేధాతిథి నుండియు, చక్రుషుః=లాగి వైచిరి. ఆ మేధాతిధినుండి మఱియొకరాజు కడకుఁ గొనిపోయిరని యర్థము – సూర్యునికాన్తులే చన్ద్రునియందు సఙ్క్రమించి కలువలను వికసింపఁ జేయునని ప్రసిద్ధి. కావుననే వరాహమహిరుఁడను ప్రసిద్ధ జ్యోతిశ్శాస్త్రవేత్త.

"యత్తేజః పితృధామ్ని శీతలహిమః పాథోమయే మణ్డలే
సఙ్క్రాన్తః కుముదాకరస్య కురుతే కాఞ్చిత్ వికాస శ్రియమ్"

అని పై విషయమునుఁ చెప్పియున్నాఁడు.

**సమాసములు :**

జగదేకదీపాత్ :- ఏకశ్చాసౌదీపశ్చ=ఏకదీపః, జగతామేకదీపః=జగదేక దీపః, తస్మాత్, జగదేకదీపాత్।

అంసస్థల స్థిత సమాన విమానదణ్డా:- అంసానాంస్థలాని=అంసస్థలాని, అంసస్థలేషు స్థితః = అంసస్థలస్థితః, విమానస్యదణ్డః = విమానదణ్డః. సమానశ్చాసౌ విమానదణ్డశ్చ = సమాన విమానదణ్డః, అంసస్థల స్థితః సమాన విమానదణ్డః యేషాంతే=అంసస్థవిస్థితసమానవిమానదణ్డాః ।

చణ్డద్యుతేః :-చణ్డాద్యుతిః యస్యసః=చణ్డద్యుతిః. తస్మాత్=చణ్డద్యుతేః।

సోత్కణ్ఠకైరవవనీసుకృతప్రరోహాః:- ఉత్కణ్ఠయా సహితా=సోత్కణ్ఠా, కైరవాణాంవనీ=కైరవవనీ, సోత్కణ్ఠాచసాకైరవవనీచ=సోత్కణ్ఠకైరవవనీ, సుకృతస్యప్రరోహాః = సుకృతప్రరోహాః, సోత్కణ్ఠకైరవవన్యాః సుకృత ప్రరోహాః=సోత్కణ్ఠకైరవవనీసుకృతప్రరోహాః ।

**భావము :**

అవాహకులు, తమ భుజశిఖరములయందు నొక్కరూపుననే విమాన దండము నుంచుకొనినవారై యనగా నెత్తుపల్లములు లేక దానిని ధరించినవారై; యా దమయన్తిని నుత్సుకతతోఁ గూడిన, కలువల వనముయొక్క సౌభాగ్య రేఖలు, అమావాస్యయందు సూర్యమణ్డలమునుఁ బ్రవేశించిన చంద్రకలను నా సూర్యునుండి యాకర్షించునట్లు, మేధాతిథినుండి యాకర్షించుకొని యనగాఁ దొలగించి మఱియొక రాజునొద్దకుఁ గొనిపోయిరి. అమావాస్యయందు చన్ద్రుని కలలు సూర్యమణ్డలమునుఁ బ్రవేశించును. శుక్లపక్షద్వితీయనుండి మఱల, ఉద యించును. సూర్యకిరణములు చన్ద్రమణ్డలముపైఁ బడి చల్లఁదనమునొంది. కలువలను వికసింపఁజేయునని జ్యోతిశ్శాస్త్రములు చెప్పుచున్నవి. ॥౮౧॥

శ్లో. భూపేషు తేషు న మనాగపి దత్తచిత్తా
విస్మేరయా వచనదేవతయా తయాఽథ ।
వాణీగుణోదయతృణీకృతపాణి వీణా
నిక్వాణయా పునరభాణి మృగేక్షణా సా॥ 82

ప.వి. భూపేషు - తేషు-న-మనాక్ - అపి - దత్తచిత్తా-విస్మేరయా- వచన దేవతయా - తయా - అథ - వాణీగుణోదయతృణీకృతపాణివీణాని క్వాణయా-పునః-అభాణి-మృగేక్షణా-సా.

అర్థము. మృగేక్షణా=జింక కన్నులవంటి కన్నులుగల యా దమయన్తి, తేషు= ఆ, భూపేషు=ద్వీపాధిపతులగు రారాజులయందు, మనాగపి=కొంచె మైనను, దత్తచిత్తా=ఉంచఁబడిన మనస్సుగలదిగా, న (జాతా)=కాలేదు. అథ=పిదప, అనగా దమయన్తి చిత్తవృత్తినిఁ దెలుసుకొనిన పిదప,

విస్మేరయా = ఆశ్చర్యముఁ బొందిన, వాణీగుణోదయతృణీకృతపాణి వీణానిక్వాణయా; వాణీగుణ=మాధుర్యముతోఁ గూడిన మాటల యతి శయముచే, తృణీకృత = తిరస్కరింపఁబడిన, పాణి=చేతియందలి, వీణా=వీణయొక్క, నిక్వాణయా=శబ్దముకల్గిన, వీణకంటెను మధుర ముగ సంభాషించునట్టి యని యర్థము. తయా=ఆ, వచనదేవతయా = వాగ్దేవతయైన సరస్వతీదేవిచే, సా=ఆ దమయన్తి, అభాణి=చెప్పఁ బడినది.

## సమాసములు :

దత్తచిత్తా :- దత్తం చిత్తం యయాసా = దత్తచిత్తా.

వాణీగుణోదయతృణీకృతపాణివీణానిక్వాణయా :- వాణ్యాః గుణాః= వాణీగుణాః, వాణీగుణస్య ఉదయః=వాణీగుణోదయః, అతృణం తృణం సమ్పద్యమానం కృతః=తృణీకృతః. వాణీగుణోదయేన తృణీకృతః = వాణీగుణోదయతృణీకృతః, పాణౌవీణా=పాణివీణా, పాణివీణాయాః, నిక్వాణః=పాణివీణా నిక్వాణః, వాణీగుణోదయతృణీకృతః, పాణివీణా నిక్వాణః యయాసా=వాణీగుణోదయతృణీకృత పాణివీణా నిక్వాణా, యా=వాణీగుణోదయతృణీకృత పాణివీణా నిక్వాణయా ।

వచనదేవతయా :- వచనస్య దేవతా=వచనదేవతా, తయా=వచన దేవతయా ।

మృగేక్షణా :- మృగస్య ఈక్షణమివ ఈక్షణం యస్యాస్సా=మృగేక్షణా.

## భావము :

ఆ హరిణేక్షణయగు దమయన్తి ద్వీపాధిపతులలో నెవ్వరి యందును కొంచెముఁ గూడ మనస్సు నుంచ లేదు. ఆమె చిత్తవృత్తిని గ్రహించిన విద్యాధి దేవత యగు సరస్వతీదేవి, తన హస్తమందలి వీణానినాదమును సైతము తిరస్కరించిన మధురములగు వచనములతో దమయన్తినిఁ గూర్చి చెప్పినది ॥౮౨॥

శ్లో. యన్మౌలిరత్నముదితాఽసి స ఏష జమ్బూ
ద్వీప స్త్వదర్థమిలితైర్యువభిర్విభాతి ।
దోలాయితేన బహునా భవభీతికమ్ప్రైః
కన్దర్పలోక ఇవ ఖాత్ పతితస్త్రుటిత్వా॥ 83

ప.వి. యన్మౌలిరత్నమ్ - ఉదితా - అసి - సః - ఏషః - జమ్బూద్వీపః - త్వదర్థమిలితైః - యువభిః - విభాతి - దోలాయితేన - బహునా - భవభీతికమ్ప్రైః - కన్దర్పలోకః - ఇవ - ఖాత్ - పతితః - త్రుటిత్వా.

అర్థము. హేభైమి!=ఓదమయన్తీ!, (త్వం=నీవు) యన్మౌలిరత్నమ్, యత్=ఏ జమ్బూద్వీపమునకు, మౌలిరత్నమ్=శిరోమణిగా, ఉదితా=ఉద్భవించిన దానవుగా, అసి=అగుచున్నావో, సః=ఆ, ఏషః=ఈ, జమ్బూద్వీపః=జమ్బూద్వీపము, త్వదర్థమిలితైః, త్వదర్థ = నీకొఱకు, మిలితైః=కలిసిన, యువభిః=యువకులతో, భవభీతికమ్ప్రైః; భవభీతి=శివునివలనిభయముచే, కమ్ప్రైః=కంపమునొందిన (కావుననే) బహునా=అనేకమైన, లేదా ప్రబల మైన, దోలాయితేన=ఊగులాడుటచే, త్రుటిత్వా=తెగి, ఖాత్=ఆకసము నుండి, పతితః = పడినటుపంటి, కన్దర్పలోక ఇవ = మన్మథప్రపఞ్చమో యనునట్లు, విభాతి = ప్రకాశించుచున్నది.

వి. యువకలోకము, మన్మథప్రపఞ్చలోకము కాకపోయినను, అయినట్లు సమ్భావనచేయుటవలన నుత్ప్రేక్ష.

**సమాసములు :**

యన్మౌలిరత్నమ్ :- యస్యమౌలిరత్నమ్=యన్మౌలిరత్నమ్.

భవభీతి కమ్ప్రైః భవాత్ భీతిః=భవభీతిః, భవభీత్యాకమ్ప్రైః = భవభీతి కమ్ప్రైః.

జమ్బూద్వీపః :- జమ్బ్వాపలక్షితః ద్వీపః=జమ్బూద్వీపః ।

త్వదర్థమిలితైః :- త్వదర్థంమిలితాః = త్వదర్థమిలితాః, తైః=త్వదర్థ మిలితైః ।

కన్దర్పలోకః :- కన్దర్పాణాంలోకః = కన్దర్పలోకః ।

**భావము :**

ఓ దమయన్తీ! నీవు జమ్బూద్వీపమునకు శిరోభూషణము. ఆ ద్వీపము నీ కొఱకై విచ్చేసిన యువకులతో, రుద్రుని ఎలని భయముచే వణకుచు, ప్రబలముగా నూగులాడుచు, తెగి, యాకసము నుండి భూమిపైఁ బడిన, మన్మథ ప్రపంచమాయని ప్రకాశించు చున్నది. స్వయంవరసభ యందలి రాజులందఱును మన్మథ సదృశులని యాశయము. ॥౮౩॥

శ్లో. విష్వగ్వృతః పరిజనై రయమ న్తరీపై
స్తేషామధీశ ఇవ రాజతి రాజపుత్రి! ।
హేమాద్రిణా కనకదణ్డమయాతపత్రః
కైలాసరశ్మిచయచామరచక్రచిహ్నః ॥ 84

ప. వి. విష్వక్-వృతః-పరిజనైః - అయమ్-అన్తరీపైః-తేషామ్-అధీశః-ఇవ-రాజతి-రాజపుత్రి-హేమాద్రిణా - కనకదణ్డమయాతపత్రః - కైలాసరశ్మిచయచామరచక్ర చిహ్నః.

అర్థము. హే రాజపుత్రి! = ఓ రాజపుత్రికా!, అన్తరీపైః=లోపల జలములుగల సింహాలము మున్నగు ద్వీపములచేతను, పరిజనైః=పరివారములతో, విష్వక్ = అంతట, వృతః = చుట్టఁబడినదియు, తథా = అట్లే, హేమాద్రిణా = మేరు పర్వతముచే, కనకదణ్డమయాతపత్రః = పసిడి కఱ్ఱతోటి గొడుగునుఁ గల్గిన, కైలాసరశ్మిచయచామర చక్రచిహ్నః. కైలాస = కైలాసపర్వతముయొక్క, రశ్మిచయ=కిరణ సమూహమనెడి, చామరచక్ర=వింజామరల సమూహమును, చిహ్నః= గుఱ్ఱుగాఁగల్గిన, అయం—ఈ జమ్బూద్వీపము, తేషామ్=అన్తరీపములైన సింహళాదిద్వీపములకు అధీశఇవ = ప్రభువువలె, రాజతి = ప్రకాశించు చున్నది.

వి. జమ్బూద్వీపము, సంహళాదిద్వీపములకు ప్రభువు గాక పోయినను ప్రభువువలె సంభావనఁ జేయుటవలన నుత్ప్రేక్ష. ఇవశబ్దప్రయోగముచే నది వాచ్యము.

వి. అన్తరీపములైన సింహళాదులను పరిజనములతోఁడను, మేరు పర్వత మును కనకదణ్డముతోఁ గూడిన కనకాతపత్రముగను, కైలాస కిరణ ములను చామరములుగను, జమ్బూద్వీపమును, ప్రభువుగను రూపించుట వలన రూపకాలఙ్కారము.

**సమాసములు :**

అన్తరీపైః :— అన్తర్గతాః ఆపఃయేషాం తాని = అన్తరీపాణి, తైః = అన్తరీపైః।

రాజపుత్రి :— రాజ్ఞఃపుత్రీ=రాజపుత్రీ, తస్యాః సమ్బుద్ధిః=హే రాజపుత్రి! హేమాద్రిణా :— హేమమయః, అద్రిః=హేమాద్రిః, తేన=హేమాద్రిణా। కనకదణ్డమయాతపత్రః :— కనకమయశ్చాసౌదణ్డశ్చ = కనకదణ్డః, కనకదణ్డస్య వికారః=కనకదణ్డమయమ్, ఆతపాత్త్రాయత ఇతి—ఆత పత్రమ్, కనకదణ్డమయమాతపత్రం యస్యసః=కనకదణ్డమయాతపత్రః। కైలాసరశ్మిచయచామరచక్రచిహ్నః :— కైలాసస్యరశ్మయః=కైలాస రశ్మయః, కైలాసరశ్మీనాంచయః=కైలాసరశ్మిచయః, కైలాసరశ్మిచయ ఏవచామరాః=కైలాసరశ్మిచయచామరాః, కైలాసరశ్మిచయచామరాణాం చక్రం=కైలాసరశ్మిచయచామరచక్రమ్, కైలాసరశ్మిచయచామరచక్రం చిహ్నం యస్యసః=కైలాసరశ్మిచయచామరచక్రచిహ్నః.

**భావము :**

లోన నీరుగల్గినట్టి సింహళము మున్నగు నన్తద్వీపములను పరిజనములు గను, మేరుపర్వతమును, పసిడికఱ్ఱతోఁ గూడిన గొడుగుగను, తెల్లటి కైలాస పర్వతపు కిరణములను చామరసమూహముగను గల్గిన యీ జమ్బూద్వీపము సింహళాదులకు ప్రభువుగా నున్నది. ॥౮౪॥

**శ్లో. ఏతత్తరు స్తరుణి ! రాజతి రాజజమ్బ్వాః**
**స్థూలోఽలానివ ఫలాని విమృశ్య యస్యాః ।**
**సిద్ధస్త్రియః ప్రియమిదం నిగదన్తి దన్తి**
**యూథాని కేన తరుమారురుహుః పథేతి॥ 85**

ప వి. ఏత త్తరుః - తరుణి! - రాజతి - రాజజమ్బ్వాః - స్థూలోపలాన్ - ఇవ - ఫలాని - విమృశ్య - యస్యాః - సిద్ధస్త్రియః - ప్రియమ్ - ఇదం - నిగదన్తి - దన్తి యథాని - కేన - తరుమ్ - ఆరురుహుః - పథా - ఇతి.

అర్థము. హేతరుణి! = ఓ యువతీ ! ఏత త్తరుః; ఏతత్ = ఈ ద్వీపమునకు, తరుః = చిహ్నమైన, రాజజమ్బ్వాః = శ్రేష్ఠమైన, జమ్బూవృక్షము అనగా నేరేడు చెట్టు, రాజతి = విలసిల్లుచున్నది. సిద్ధస్త్రియః = సిద్ధుల స్త్రీలు, యస్యాః = ఏ నేరేడుచెట్టుయొక్క, స్థూలోపలానివ = పెద్ద ఱాళ్ళవలెనున్న, ఫలాని = ఫలములను, దన్తియూథాని = ఏనుగుల గుంపులుగా, విమృశ్య = వివేచించి. కేనపథా = ఏ మార్గముతో, తరుం = చెట్టును, ఆరురుహుః = ఎక్కినవి. ఇతి = అని, ఇదం = ఈ, వచః = మాటను, ప్రియం = రుచిగల దిగా, నిగదన్తి = అడుగుచున్నారు. ఆ నేరేడుపండ్లు ఒక్కొక్కటి ఏనుగంతటి లావునుఁ గల్గియున్నవని యర్థము.

వి. ఇచ్చట జమ్బూఫలములయందు కవి సమ్మతసాదృశ్యముచే నేనుగులను భ్రమ గల్గినది. కానభ్రాన్తిమదలఙ్కారము.

**సమాసములు :**

ఏత త్తరుః :— ఏతస్యతరుః = ఏత త్తరుః ।

రాజజమ్బ్వాః :— జమ్బూనాం రాజా = రాజజమ్బ్వాః ।

స్థూలోపలాన్ :— స్థూలాశ్చతే ఉపలాశ్చ = స్థూలోపలాః, తాన్ = స్థూలో పలాన్ ।

సిద్ధస్త్రియః :— సిద్ధానాం స్త్రియః = సిద్ధస్త్రియః ।

దన్తియూథాని :— దన్తినాం యూథాని = దన్తియూథాని ।

**భావము:**

ఓ యువతీ । ఆ జమ్బూద్వీపమునందు, శ్రేష్ఠమైన, నేరేడుచెట్టు విలసిల్లు చున్నది. ఆ చెట్టునందలి ఫలములు పెద్ద ఱాళ్ళవలె నుండుటవలన వానిని జూచి సిద్ధస్త్రీలు, ఏనుగుల గుంపని భ్రాన్తిపడి, యీ యేనుగు లే మార్గముచే

రా చెట్టునెక్కినవని యడుగుచున్నారు. ఆ నేరేడుచెట్టునందలి ఫలములు మిక్కిలి గొప్పవని యాశయము. ॥౮౫॥

శ్లో. జాంబూనదం జగతి విశ్రుతిమేతి మృత్స్నా
కృత్స్నాఽపి సా తవ రుచా విజితశ్రి యస్యాః ।
తజ్జాంబవద్రవభవాఽస్య సుధావిధాంబు
ర్జంబూః సరిద్వహతి సీమని కంబుకణ్ఠి॥ 86

ప.వి. జాంబూనదం-జగతి-విశ్రుతిమ్ - ఏతి-మృత్స్నా-కృత్స్నా-అపి-సా - తవ-రుచా - విజితశ్రి - యస్యాః - తజ్జాంబవద్రవభవా-అస్య- సుధా విధాంబుః-జంబూః-సరిత్-వహతి-సీమని-కంబుకణ్ఠి.

అర్థము. హేకంబుకణ్ఠి !—శంఖమువంటి కణ్ఠముగల యో దమయన్తీ! అనగా మూడు రేఖలతో శోభించు కణ్ఠముగల దమయన్తీ!, తజ్జాంబవద్రవభవా; తత్=పూర్వము జెప్పఁబడిన, జాంబవద్రవ=నేరేడిపండ్ల రసమునుండి, ప్రభవా=పుట్టిన, సుధావిధాంబుః; సుధావిధ=అమృతమువంటి, అంబుః= ఉదకములు గల్గిన, జంబూః=జంబూ నామముగల, సరిత్=నది అస్య = జంబూద్వీపముయొక్క, సీమని = ఎల్లయందు, వహతి=పారు చున్నది. యస్యాః = ఏ జంబూనదికి సంబంధించిన, కృత్స్నాఽపి= సమస్తమైన, సా=ఆ, మృత్స్నా=శ్రేష్ఠమైన మృత్తిక, తవ=నీ శరీరము యొక్క, రుచా=కాంతిచే, విజితశ్రి, విజిత = ఓడింపఁబడిన, శ్రి=శోభ గలదై, జాంబూనదం=జంబూ నదియందు పుట్టినది కాన జాంబూనద మను, జగతి=ప్రపఞ్చమునందు, విశ్రుతిం=ప్రసిద్ధిని, ఏతి=పొందు చున్నది.

**సమాసములు :**

జాంబూనదమ్ :- జంబూనద్యాం భవం=జాంబూనదమ్ ।
విజితశ్రి :- విజితాశ్రీః యేనతత్=విజితశ్రి ॥
తజ్జాంబవద్రవభవా :- జంబూనాంఫలాని=జాంబవాని, తేషాం జాంబ వాని=తజ్జాంబవాని, తజ్జాంబవానాంద్రవః = తజ్జాంబవద్రవః, తజ్జాం బవద్రవాత్ భవా=తజ్జాంబవద్రవభవా ॥

సుధావిధామ్బుః :- సుధాయాః పిధేవ విధాయేషాస్తాని = సుధావిధాని, సుధాపిధానిఅమ్బూని యస్యాస్సా=సుధావిధామ్బుః ।

కమ్బుకణ్ఠి :- కమ్బునః కణ్ఠ ఇవకణ్ఠః యస్యాస్సా=కమ్బుకణ్ఠీ, తస్యాః సమ్బుద్ధిః=హేకమ్బుకణ్ఠి ।

**భావము :**

ఓ శఙ్ఖకణ్ఠీ! అనగా శఙ్ఖముపైని మూడురేఖలవంటి రేఖలను కణ్ఠమున గల్గిన యదృష్టవస్తురాలా! ముందుఁ చెప్పిన నేరేడుపండ్ల ద్రవమునుండి గల్గిన యమృతమువంటి నీరు ఈ జమ్బూనది యందున్నది. ఈనది యాద్వీపపు టెల్ల యందు ప్రవహించుచున్నది. ఇందలి మట్టియంతయు చాల ప్రశస్తమైనదై, నీ శరీరకాన్తితో నోడింపఁబడినదై జామ్బూనదమని, అనగా బంగారమని ప్రపఞ్చ ప్రసిద్ధినిఁ బొందినది. జమ్బూనదినిఁ గూర్చి–

"తీరభూస్తత్ర సంప్రాప్య శుద్ధవాత విశోధితా ।
జామ్బూనదాఖ్యం భవతి సువర్ణం దేవభూషణమ్"॥

అని విష్ణుపురాణమునఁ జెప్పబడియున్నది. ॥౮౬॥

**శ్లో. తస్మిన్ జయన్తి జగతీపతయః సహస్ర
మస్రాశ్రుసాన్ద్రరిపుతద్వనితేషు తేషు ।
రమ్భోరు! చారు కతిచిత్తవ చిత్తబన్ధి
రూపాన్నిరూపయ ముదాహముదాహరామి॥ 87**

**ప.వి.** తస్మిన్-జయన్తి-జగతీపతయః-సహస్రమ్-అశ్రుసాన్ద్రరిపుతద్వనితేషు-తేషు-రమ్భోరు-చారు - కతిచిత్-తవ-చిత్తబన్ధిరూపాన్ - నిరూపయ-ముదా-అహమ్-ఉదాహరామి.

**అర్థము:** హేరమ్భోరు!=అరటి స్తమ్భములవంటి తొడలు గల యో దమయన్తి!, తస్మిన్=ఆ జమ్బూద్వీపమునందు, సహస్రం = వేలకొలది, జగతీ పతయః=రాజులు, జయన్తి=అందఱిని మించియున్నారు, అస్రాశ్రు సాన్ద్రరిపుతద్వనితేషు; అస్ర=రక్తములచేతను, అశ్రు=కన్నీళ్ళచేతను,

సాన్ద్రీకృతవినీ, రిపు=శత్రువులను, తద్వనితేషు = వారి స్త్రీలను క్రమముగాఁ గల్గిన, తేషు=అట్టి యుత్కృష్టులను, భూపేషు=రాజుల యందు, తవ=నీయొక్క, చిత్తబన్ధిరూపాన్; చిత్త=మనస్సును, బంధి= ఆకర్షించుచున్న, రూపాన్=సౌన్దర్యముగల, కతిచిత్=కొందఱు రాజులను, అహం=నేను, ఉదాహరామి=చెప్పెదను, ముదా=సంతోషముతో, నిరూపయ=చూడుము.

## సమాసములు :

జగతీపతయః :— జగత్యాః పతయః=జగతీపతయః.

అస్రాశ్రుసాన్ద్రిరిపుతద్వనితేషు :— అస్రాణిచ, అశ్రూణి చ=అస్రాశ్రూణి, అస్రాశ్రుభిఃసాన్ద్రాః=అస్రాశ్రుసాన్ద్రాః, తేషాం వనితాః= తద్వనితాః, రిపవశ్చతద్వనితాశ్చ=రిపుతద్వనితాః, అస్రాశ్రుసాన్ద్రాః రిపుతద్వనితాః యేషాం తే=అస్రాశ్రుసాన్ద్రిరిపుతద్వనితాః, తేషు= అస్రాశ్రుసాన్ద్రిరిపుతద్వనితేషు.

రమ్భోరు! :— రమ్భే ఇవ ఊరూయస్యాస్సా=రమ్భోరూః, తస్యాస్సమ్బుద్ధిః=హే రమ్భోరు!.

చిత్తబన్ధిరూపాన్ :— చిత్తం బధ్నన్తీతి = చిత్తబన్ధీని, చిత్తబన్ధీని, రూపాణి యేషాంతే చిత్తబన్ధిరూపాః, తాన్=చిత్తబన్ధిరూపాన్.

## భావము :

"ఓరమ్భోరు! ఆ ద్వీపమునందు వేలకొలఁది రాజులున్నారు. వారు రక్తముచేత శత్రువులను, కన్నీళ్ళచే శత్రుస్త్రీలను తడిపించినవారు. అట్టి మహాశూరులలో నీ మనస్సు నాకర్షింపఁగల కొందఱిని నేను చూపెదను. వారిని నీవు సంతోషముతోఁ జూడుము" అని దమయన్తికి సరస్వతీదేవి చెప్పినది. ॥౮౭॥

శ్లో. ప్రత్యర్థియౌవతపతంసతమాలమాలో
న్మీలత్తమఃప్రకరతస్కరశౌర్యసూర్యే ।
అస్మిన్నవన్తినృపతౌ గుణసన్తతీనాం
విశ్రాన్తిధామని మనో దమయన్తి! కిం తే॥ 88

ప.వి. ప్రత్యర్థియౌవతవతంసతమాలమాలోన్మీలత్తమః ప్రకరతస్కరశౌర్య సూర్యే - అస్మిన్ - అవన్తినృపతౌ - గుణసన్తతీనాం - విశ్రాన్తిధామని - మనః - దమయన్తి ! - కిం - తే.

అర్థము. హే దమయన్తి ! = ఓ దమయన్తీ!, ప్రత్యర్థియౌవతవతంసతమాలమాలోన్మీలత్తమఃప్రకరతస్కరశౌర్యసూర్యే; ప్రత్యర్థి=పరస్పరము పోటీ పడుచున్న రాజులయొక్క, యౌవత=యువతి సమూహమునకు, వతంస=కర్ణభూషణములైన, తమాలమాలా = చీకటి చెట్ల యాకుల సమూహములనెడు, ఉన్మీలత్=ఉద్భవించునట్టి తమఃప్రకర=అంధకార సమూహమును, తస్కర=అపహరించెడి, శౌర్య=పరాక్రమ మనెడి, సూర్యే=సూర్యుఁడుగల లేదా, శౌర్య=పరాక్రమమునకు. సూర్యే= సూర్యుఁడైన, గుణసన్తతీనాం=గుణముల సమూహమునకు, విశ్రాన్తి ధామని=విశ్రాన్తి స్థలమైన, అస్మిన్=ఈ, అవన్తినృపతౌ=అవన్తిదేశపు రాజునందు, తే=నీయొక్క, మనః=మనస్సు (వర్తతే) కిమ్=ఉన్నదా యేమి ?

**సమాసములు :**

ప్రత్యర్థి యౌవతవతంసతమాలమాలోన్మీలత్తమః ప్రకరతస్కరశౌర్య సూర్యే :— యువతీనాం సమూహః=యౌవతమ్, ప్రత్యర్థినాం యౌవతమ్= ప్రత్యర్థియౌవతమ్, ప్రత్యర్థియౌవతస్యవతంసః = ప్రత్యర్థియౌవత వతంసః, ప్రత్యర్థియౌవతవతంసశ్చాసౌ తమాలమాలా= ప్రత్యర్థియౌవత వతంస తమాలమాలా, ఉన్మీలచ్చ తత్ = తమశ్చ = ఉన్మీలత్తమః, ఉన్మీలత్తమ సః ప్రకరః=ఉన్మీలత్తమః ప్రకరః. ప్రత్యర్థియౌవతవతంస శ్చాసౌ, తమాలమాలోన్మీలత్తమఃప్రకరః= ప్రత్యర్థియౌవతవతంస తమాలమాలోన్మీలత్తమఃప్రకరః. ప్రత్యర్థియౌవతవతంసతమాలమాలో న్మీలత్తమఃప్రకరస్యతస్కరం = ప్రత్యర్థియౌవతవతంసతమాలమాలో న్మీలత్తమఃప్రకరతస్కరం, ప్రత్యర్థియౌవతవతంసతమాలమాలోన్మీల త్తమఃప్రకరతస్కరం చ తత్ శౌర్యం చ - ప్రత్యర్థియౌవతవతంస తమాలమాలోన్మీలత్తమఃప్రకరతస్కరశౌర్యమ్ । ప్రత్యర్థియౌవతవతంస తమాలమాలోన్మీలత్తమః ప్రకరతస్కరశౌర్యమేవసూర్యఃయస్య సః=

యవాప్తి, తస్కరశౌర్యసూర్యః = ప్రత్యర్థియౌవతవతంసతమాలమాలో
న్మీలత్తమఃప్రకరతస్కరశౌర్యసూర్యః, తస్మిన్ = ప్రత్యర్థియౌవత
వతంసతమాలమాలోన్మీలత్తమఃప్రకరతస్కరశౌర్యసూర్యే.

అవన్తినృపతౌ :– అవన్తీనాంనృపతిః = అవన్తినృపతిః, తస్మిన్=
అవన్తినృపతౌ.

గుణసన్తతీనామ్ :– గుణానాం సన్తతయః=గుణసన్తతయః తాసాం=
గుణసన్తతీనామ్.

విశ్రాన్తిధామని :– విశ్రాన్తేఃధామ=విశ్రాన్తిధామ, తస్మిన్=విశ్రాన్తి
ధామని.

**భావము :**

ఓ దమయన్తీ ! స్వయంవరమునందు స్పర్థపడుచున్న (పోటీ పడు
చున్న) యీ రాజుల భార్యలకు కర్ణావతంసములైన చీకటిచెట్ల యాకులనెడి
యన్ధకార ప్రపంచమును నివారించునట్టి శౌర్యమునందు సూర్యుడైన యవన్తి
మహారాజు కలడు. ఇతడు గుణముల ప్రోవులకు నెలవు. ఈతనియందు నీ
మనస్సు నుంచెదవా ? ॥౮౮॥

**శ్లో. తత్రా ఒనుతీరవనవాసితపస్వివిప్రా**
**సిప్రా తవోర్మిభుజయా జలకేలికాలే ।**
**ఆలిఙ్గనాని దదతీ భవతా వయస్యా**
**హాస్యానుబన్ధరమణీయసరోరుహాస్యా॥ 89**

ప. వి. తత్ర-అనుతీరవనవాసితపస్విప్రా-సిప్రా-తవ-ఊర్మిభుజయా-జలకేలి
కాలే-ఆలిఙ్గనాని-దదతీ–భవితా - వయస్యా-హాస్యానుబన్ధరమణీయ సరో
రుహాస్యా-

అర్థము. తత్ర=ఆయప్రదేశమందు, అనుతీరవనవాసి తపస్విప్రా; అనుతీర=
గట్టునంచలి, వన=అరణ్యమందు, వాసి=నివసించు, తపస్వి=తపమాచ
రించు, విప్రా=బ్రాహ్మణులు గల, సిప్రా=సిప్రయను నది, తవ = నీ
యొక్క, జలకేలికాలే=జలక్రీడాసమయమందు, హాస్యానుబన్ధ రమణీయ

సరోరుహాస్యా: హాస్యానుబన్ధ=హాస్య=(వికాసముయొక్క) చిఱునగవు యొక్క, అనుబన్ధ = అనువృత్తిచే, రమణీయ=సుందరమైన, సరోరు హాస్యా = తామరపూవనెడి ముఖము గలదై, ఊర్మిభుజయా; ఊర్మి=అల యనెడి, భుజయా=భుజముచే, ఆలిఙ్గనాని=కౌగలింపులను, దధతీ= చేయుచు, తవ=నీకు, వయస్యా=చెలికత్తె, భవితా=కాఁగలదు.

వి. చిఱునగువుతో విలసిల్లు మోముగల చెలికత్తె భుజములతో నెట్లు ఆలిఙ్గ నముఁ గావించుకొనునో, అట్లే సిప్రానదియు నిన్నా లింగనముఁ గావించుకొనునని సఖీవృత్తాన్తము స్ఫురించుటనే నిట సమాసోక్త్య లఙ్కారము.

## సమాసములు :

అనుతీరవనవాసి తపస్విప్రా :- తీరే=అనుతీరం. అనుతీరం వనం= అనుతీరవనం. అనుతీరవనే వాసినః= అనుతీరవనవాసినః, అనుతీరవన వాసినశ్చతేతపస్వినశ్చ = అనుతీరవనవాసితపస్వినః. అనుతీరవనవాసి తపస్వినః, విప్రాఃయస్యాస్సా=అనుతీరవనవాసితపస్వి విప్రా.
ఊర్మిభుజయా :- ఊర్మిరేవభుజా=ఊర్మిభుజా, తయా=ఊర్మిభుజయా.
జలకేలికాలే :- జలేషుకేలిః = జలకేలిః జలకేలేఃకాలః = జలకేలికాలః. తస్మిన్=జలకేలికాలే ।
హాస్యానుబన్ధ రమణీయసరోరుహాస్యా :- హాస్యస్య అనుబన్ధః=హాస్యా నుబన్ధః, హాస్యానుబన్ధేన రమణీయమ్ = హస్యానుబన్ధరమణీయమ్. సరో రుహమేవ ఆస్యమ్ = సరోరుహాస్యమ్, హాస్యానుబన్ధరమణీయం సరోరు హాస్యం యస్యాస్సా=హస్యాను బన్ధరమణీయ సరోరుహాస్యా ॥

## భావము :

ఆయవన్తి దేశమునందు శిప్రానది ప్రవహించును. దాని గట్టు నందలి యరణ్యమందు బ్రాహ్మణులు తపము గావించుచుందురు. ఆ నది యందు నీవు జలక్రీడలాడు సమయమునందు, వికాసముయొక్క (చిఱునగవుయొక్క) అను బంధమువలన సున్దరమైన తామరపూవనెడి మోము గలదై, కెరటమనెడి తన భుజముతో నానది నిన్నుఁ గౌగలించుకొని నీకు చెలికత్తె కాఁగలదు ॥౮౯॥

శ్లో. అస్యాధిశయ్య పురముజ్జయినీం భవానీ
జాగర్తి యా సుభగయౌవతమౌలిమాలా ।
పత్యాఽర్ధకాయఘటనాయ మృగాక్షి! తస్యాం
శిష్యా భవిష్యసి చిరం వరివస్యయాఽపి॥ 90

ప.వి. అస్య-అధిశయ్య-పురమ్-ఉజ్జయినీం-భవానీ-జాగర్తి-యా-సుభగయౌవతమౌలిమాలా-పత్యా-అర్ధకాయఘటనాయ-మృగాక్షి !-తస్యాః-శిష్యా-భవిష్యసి-చిరం-వరివస్యయా-అపి.

అర్థము. భవానీ=పార్వతి, అస్య=ఈయవన్తిరాజుయొక్క, పురం = పట్టణమైన, ఉజ్జయినీం=ఉజ్జయినిని, అధిశయ్య=అధిష్ఠించి, జాగర్తి=వెలియుచున్నది.యా=ఏ పార్వతి,సుభగయౌవతమౌలిమాలా; సుభగ=కాంతులకు ప్రియురాండ్రైన, యౌవత=యువతిసంఘమునకు, మౌలిమాలా=శిరోభూషణము. హేమృగాక్షి = ఓహరిణాక్షీ ! పత్యాసహ=భర్తతోడ, అర్ధకాయఘటనాయ; అర్ధకాయ=శరీరమునందర్థభాగమును, ఘటనాయ=కూర్చుటకు, అనగానుభయుల శరీరము నొక్కటిగాఁ జేయుటకు తస్యాః=ఆపార్వతికి, చిరం=చాలకాలము వరివస్యయా=సేవచే, శిష్యా=శిష్యురాలుగా, భవిష్యసి=కాఁగలవు.

భావము :

పైనఁ జెప్పిన విధముగా సిప్రానదీ విహారములేగావు. మఱేమనగా, సకల సౌభాగ్యములకు మూలమైన భవానికి శిష్యత్వమునుఁ గూడబడయఁ గలవు. పార్వతికి శివునితో క్షణకాలము గూడ నెట్లు విరహము కలుగదో యట్లే నీకును భర్తతో విరహము కలుగ నేరదని భావము. ॥౯౦॥

శ్లో. నిశ్శఙ్కసఙ్కురితతాం రతివల్లభస్య
దేవః స్వచన్ద్రకిరణామృతసేచనేన ।
తత్రావలోక్య సుదృశాం హృదయేషు రుద్రః
తద్దేహదాహఫలమాప స కిం న విద్మః॥ 91

ప. వి. నిశ్శఙ్కమ్-అఙ్కురితతాం-రతివల్లభస్య-దేవః-స్వచన్ద్రకిరణామృతసేచనేన-తత్ర - అవలోక్య - సుదృశాం-హృదయేషు-రుద్రః-తద్దేహదాహఫలమ్=ఆప-సః-కిం-న-విద్మః.

అర్థము. తత్ర=ఆ ఉజ్జయిని యందు, సః = ఆ, దేవఃరుద్రః = మహాదేవుఁడు అనగా మహాకాల నాథుఁడు, సుదృశామ్=అచ్చటనున్న స్త్రీల యొక్క, హృదయేషు = అన్తఃకరణములయందు, స్వచన్ద్రకిరణామృతసేచనేన, స్వ=తనశిరమునందలి, చన్ద్ర=చన్ద్రునియొక్క, కిరణ = కిరణముల నుండి స్రవించెడు, అమృత = అమృతమువలని, సేచనేన=సేకముచే, రతివల్లభస్య=రతికిఁబ్రియుఁడైన మన్మథునకు, నిశ్శఙ్కం=నిర్భయముగా, అఙ్కురితతామ్ = అఙ్కురించుటను ననగా పునరుద్భవమును, అవలోక్య=చూచి, తద్దేహధాహఫలమ్; తత్=ఆ మన్మథునియొక్క, దేహదాహ=దేహమును దహించుటకు, ఫలమ్=ఫలముగా, కిం=దేనిని, ఆప=పొందెను. నవిద్మః = తెలియకయున్నాము. తానుదహించినమన్మథుఁడు తనశిరము నందలి వెన్నెలలచే మఱల వేయి రెట్లుగా పుట్టుట వలన తన పరిశ్రమ నిష్ఫలమైనదని యర్థము.

వి. ఆ యుజ్జయినీ నగర మందలి స్త్రీల హృదయముల యందు స్మరతాప శాంతికై తన శిరశ్చన్ద్రికల యమృతమునుఁ జల్లి నందు వలన మన్మథుడు శమించుటకు బదులు మఱల యుద్భవించుట జరిగినది కాన నమృతసేచనము విరుద్ధఫలము నొసంగుట వలన విషమాలఙ్కారము.

**సమాసములు :**

నిశ్శఙ్కమ్ : నిర్గతా శఙ్కాయస్మిన్కర్మణి తద్యథా భవతి తథా=నిశ్శఙ్కమ్.

అఙ్కురితతామ్ : అఙ్కురః అస్యస ఞ్జాత ఇతి=అఙ్కురితః, అఙ్కురితస్యభావః=అఙ్కురితతా, తామ్ = అఙ్కురితతామ్.

తద్దేహదాహఫలమ్ : తస్యదేహః= తద్దేహః, తద్దేహస్యదాహః=తద్దేహదాహః. తద్దేహదాహ స్యఫలమ్=తద్దేహదాహఫలమ్, తత్=తద్దేహదాహఫలమ్.

**భావము :**

ఆ యుజ్జయిని యందు, మహాకాలనాథుడు తన శిరమునందలి చంద్రుని కిరణామృతముల నచ్చటి స్త్రీల హృదయములపై చల్లి వారికి మన్మథ పీడ కుపశాన్తిఁ జేయఁగోరెను. కాని యాకార్యము మన్మథ బాధనుపశమింపఁ జేయక మఱల పెక్కుమంది మన్మథులనుద్భవింప జేయసాగెను. ఏలయనగా చన్ద్రకిరణములు కామోద్దీపకములు గదా ? ఇట్లు మన్మథుని పునరుజ్జీవనముఁ గావించి నపుడు తత్పూర్వము వానిని దహింపఁ జేయుటకు ఫలమేమి ? కానమన్మథో పశాన్తికై చేసిన ప్రతిక్రియ, మన్మథుని బ్రతికించుటచే విరుద్ధ ఫలము నొసఁగినది. మన్మథుఁడు హృదయమున జన్మించినవాడు. హృదయమున నివసించువాఁడు. కాన స్త్రీల హృదయములపై నమృతమునుఁ జిలుకగనే యమృతము పునరుజ్జీవనము నొసంగునది. కాన నీ హృదయములందు మన్మథుడు వేయి మడుంగులుగా మఱలనుద్భవించెను. చన్ద్రకిరణములు కామోద్దీపితములగుటవలన, స్త్రీల హృదయముల యందు నమృత కిరణ స్పర్శ యేర్పడగనే యందు కామోద్దీపన యేర్పడుటయే కామునకు (మన్మథునకు) పునరుత్పత్తియని యాశయము. ॥౯౧॥

శ్లో. ఆగశ్శతం విదధతోఽపి సమిద్ధకామా
నాధీయతే పరుషమక్షరమస్య వామాః ।
చాన్ద్రీ న తత్ర హరమౌలిశయాలు రేకా
నాఽధ్యాయహేతుతిథికేతురపైతి లేఖా॥ 92

వ, వి. ఆగశ్శతం - విదధతః - అపి - సమిద్ధకామాః - న - అధీయతే - పరుషమ్ - అక్షరమ్ - అస్య - వామాః - చాన్ద్రీ - న - తత్ర - హరమౌలిశయాలుః - ఏకా - న - అధ్యాయహేతుతిథికేతుః - అపైతి - లేఖా.

అర్థము. సమిద్ధకామాః; సమిద్ధ=ప్రతిదినమునుద్దీపితమగుకామముగల, వామాః= వక్రమైనస్వభావముగల స్త్రీలు, ఆగశ్శతం=పెక్కునేరములను, విదధతోఽపి = చేయుచున్నను, అస్య = ఈ రాజునకు, పరుషం=కఠినమైన, అక్షరం=మాటను, నాధీయతే=పఠింపరు (చెప్పరు.) తత్ర=ఆయుజ్జయిని యందు, నాధ్యాయహేతుతిథికేతుః; నాధ్యాయ = పఠింపకుండుటకు,

హేతు=కారణమైన, తిథి=తిథియైన, పాడ్యమికి, కేతుః=గురైన, హర మౌలిశయాళుః=శివునిశిరమందున్న, ఏక=ఒక, చాన్ద్రి=చన్ద్రునికి సంబంధించిన, లేఖా=శుక్లప్రతిపద్రూపమైనకల. నాపైతి=తొలగదు. ఆ నగర మందు శివుడు నిత్యవాసము కల్గియుండుటవలన, నాతని శిరమునందు చన్ద్రికలయొకటి యుండుటవలన, ప్రతిదినమును నన్నితిథులయందును పాడ్యమియను బుద్ధియుండుటవలన పరుషాక్షరములుగల వేదములను బఠింపరాదని యర్థము. మఱియు నిత్యవాసముగల శివుని శిరము నందలి చన్ద్రుని వెన్నెలలచే, గల్గిన మన్మథోద్రేకము వలన ఖణ్డితాది నాయికలు అనగా నాయకునిచే వంచింపబడిన నాయికలు గూడ భర్తపైఁగోపము వహింపక కఠినములగు మాటలను మాట్లాడుటకు నుత్సాహపడరని యర్థము. వీరికి మన్మథోద్రేకముండుట వలన కాన్తునితోటి సంగమాపేక్ష కలుగుట వలనఁ గాంతునిపైఁ గోపము గలుగదని యాశయము.

రామాయణమున హనుమన్తుఁడు సీతను వర్ణించు సందర్భమున— "ప్రతిపత్పాఠశీలస్యవిద్యేవతనుతాంగతా"యని పాడ్యమినాడువిద్యనేర్చెడి వాని విద్యవలె సీతాదేవి కృశించియున్నదని చెప్పెను. కాన ప్రతిపత్తునందు నధ్యయనము చేయరాదు గాన, నా పట్టణమున ప్రతిదినము శివుని శిరము నందు నొక చన్ద్రికల ప్రకాశించుటవలన ప్రతి దినము పాడ్యమి యని భావించి స్త్రీలు తమ భర్తల యొద్ద "శ్రుతి పరుషాక్షర పాఠము"నుఁ జేయరు, "శ్రుతిపరుషాక్షరపాఠమనగా; శ్రుతి=చెవులకు, పరుష=కఠినము లైన, అక్షర=మాటలను, పాఠము=మాట్లాడుటయని యొక యర్థము, శ్రుతి=వేదముల యందలి, పరుషాక్షర=కఠినాక్షరముల. పాఠము=అధ్యయనము" అని మఱియొక యర్థము.

## సమాసములు :

ఆగఃశతమ్ : ఆగసాంశతమ్=ఆగఃశతమ్,-తత్ = ఆగశ్శతమ్ ।

సమిద్ధకామాః :- సమిద్ధఃకామఃయేషాంతే= సమిద్ధకామాః ।

హరమౌలిశయాలుః :- హరస్యమౌలిః = హరమౌలిః, హరమౌలౌశయాలుః=హరమౌలిశయాలుః ।

నాధ్యాయహేతుతిథికేతుః : న అధ్యాయః=నాధ్యాయః, నాధ్యాయస్య హేతుః = నాధ్యాయ హేతుః. నాధ్యాయహేతుశ్చా సౌతిథిశ్చ=నాధ్యాయ హేతుతిథిః. నాధ్యాయహేతుతిథేః కేతుః=నాధ్యాయహేతుతిథి కేతుః ।

**భావము :**

ఆ నగర మందలి స్త్రీలు స్వభావముతో పెంకెతనము గలవారైనను, ప్రతి దినము ప్రవర్ధిల్లు కామమువలన, తమ భర్తలు, పెక్కు నేరములు గావిం నను, వారి యొద్ద కఠినములగు మాటలనుఁ జెప్పరు. పరుషాక్షరములను, బఠింపరు. ఎలయనగా—ఆ నగరమందు శివుఁడు నిత్య సన్నిహితుఁడు. అతని శిరము నందు చంద్రలేఖ యొకటి యెల్లప్పుడునుఁ బ్రకాశించుచుండును. ఆ చన్ద్రి లేఖవలని వెన్నెలలు నిత్యము విరాజిల్లు చుండును. ఆ వెన్నెల ప్రభావముచే వారికి కామోద్రేకము గలుగు చుండును. ఆ కామోద్రేకముచే భర్తతోటి సంగ మాపేక్షగల్గినందువలన నాస్త్రీలు అతని వద్ద కఠినములగు మాటలను మాట్లాడరు. మఱియు పరుషాక్షరములనుఁబఠింపరు. పఠించుటకు ప్రతిపత్తు అనగా పాడ్యమి పనికిరాదు. పరుషాక్షరములతోఁ గూడిన వేదములను పాడ్యమి యందు పఠింప రాదని శాస్త్రము. ఆనగర మందు శివుని శిరస్సు నందలి యొక చన్ద్రి లేఖను గాంచి స్త్రీలు, ప్రతిదినము పాడ్యమి యను భావనతో భర్తల విషయమున పరుషాక్షరములను (కఠినమైన మాటలను- కఠినములైన యక్షరములను) పఠింపరు, అనగా మాట్లాడరు, చదువరు. కాన ప్రకృత మీరాజు విషయమున నితని ప్రియురాంద్రాతని నేరముల సహించి యాతనిని కఠినముగా మాట్లాడరు, దీనికి కారణమాతని సౌన్దర్యముచే నాకర్షింపఁబడుట. కాననట్టి సున్దరుని నీవు వరించుట యుచితమని యాశయము ॥౯౨॥

**శ్లో. భూపం వ్యలోకత న దూరతరానురక్తం**
**సా కుణ్డినావనిపురన్దరనన్దనా తమ్ ।**
**అన్యానురాగవిరసేన విలోకనాద్వా**
**జానామి సమ్యగవిలోకనమేవ రమ్యమ్॥ 93**

ప వి. భూపం—వ్యలోకత—న—దూరతరాను రక్తం—సా—కుణ్డినావనిపు రన్దరన న్దనా—తమ్-అన్యానురాగ విరసేన-విలోకనాత్-వా—జానామి—సమ్యక్-అవిలోకనమ్-ఏవ—రమ్యమ్,

అర్థము. కుణ్డినావని పురన్దరనన్దనా, కుండినావని=కుణ్డిన దేశమునకు, పురన్దర=ఇన్ద్రుడైన భీమరాజు యొక్క, నన్దనా=పుత్రికయైన, సా=ఆ దమయన్తి, దూరతరానురక్తమ్! దూరతర=మిక్కిలి, అనురక్తమపి=అనురాగముకలవాడైనను, తం=ఆ, భూపం = ఆ రాజును, నైక్షత=చూడలేదు. వా=లేదా అన్యానురాగ విరసేన, అన్య=ఇతరుడైన నలుని యందు, అనురాగ=అనురాగముచే, విరసేన=రాగములేక యశ్రద్ధతో, విలోకనాత్=దర్శనము కంటెను, సమ్యక్=అన్ని విధములుగను, అవిలోకనమేవ = చూడకయుండుటయు, రమ్యం=మంచిది, ఇతి=అని, జానామి=తెలుసుకొనుచున్నాను.

**సమాసములు :**

భూపమ్ :— భువంపాతీతి=భూపః, తమ్=భూపమ్.

దూరతరానురక్తం :- అతిశయేనదూరం=దూరతరమ్. దూరతరమనురక్తః=దూరతరానురక్తః, తమ్=దూరతరానురక్తమ్.

కుణ్డినావనిపురన్దర నన్దనా:- కుణ్డినస్య అవనిః=కుణ్డినావనిః. కుణ్డినావనేః పురన్దరః=కుణ్డినావనిపురన్దరః, కుణ్డినావనిపురన్దరస్యనన్దనా=కుణ్డినావని పురన్దనరనన్దనా.

అన్యానురాగవిరసేన:- అన్యస్మిన్, అనురాగః=అన్యానురాగః. అన్యానురాగేణవిరసః=అన్యానురాగవిరసః, తేన = అన్యానురాగవిరసేన.

**భావము :**

కుణ్డిన భూమీన్ద్రుని పుత్రికయైన యాదమయన్తి తన యెడ మిక్కిలి యనురాగము వహించిన యారాజును చూడలేదు. లేదా, మఱియొకని యందు అనురాగము గల్గియుండుటవలన విరక్తితో చూచుట కంటెను, చూడకయుండుటయే శ్రేష్ఠమని తలంతును. ॥౯౩॥

శ్లో. ఖైమీఙ్గితాని శిబికామధరే వహన్తః
సాక్షాన్న యద్యపి కథఞ్చన జానతే స్మ ।
జజ్ఞుస్తథాపి సవిధస్థితసమ్ముఖీన
భూపాలభూషణమణిప్రతిబిమ్బితేన ॥ **94**

ప.వి. భైమీఙ్గితాని-శిబికామ్ -అధరే-వహన్తః-సాక్షాత్-న-యది-అపి-కథం-చన-జానతే-స్మ-జజ్ఞుః-తథా-అపి-సవిధస్థిత సమ్ముఖీన భూపాలభూషణమణిప్రతిబిమ్బితేన.

అర్థము. శిబికామ్=పల్లకిని, అధరే=దిగువభాగమందు, వహన్తః=మోయుచున్నవారు, భైమీఙ్గితాని, భైమీ=దమయన్తి యొక్క, ఇఙ్గితాని=చేష్టలను, యద్యపి కథఞ్చన=ఒకవేళ యేవిధముగను, సాక్షాత్=ప్రత్యక్షముగ, నజానతేస్మ=తెలిసికొని యుండరు. తథా=అయినను, సవిధస్థితసమ్ముఖీనభూపాల భూషణమణి ప్రతిబిమ్బితేన, సవిధస్థిత=సమీపమందున్న, సమ్ముఖీన=ఎట్టఎదురుగానున్న, భూపాల=అవన్తిరాజు యొక్క, భూషణమణి=ఆభరణరత్నముల యందలి, ప్రతిబిమ్బితేన=ప్రతిబిమ్బముచే, జజ్ఞుః = తెలిసికొనిరి, అనగా నూహించిరి

## సమాసములు :

భైమీఙ్గితాని : భైమ్యాః ఇఙ్గితాని=భైమీఙ్గితాని, తాని = భైమీఙ్గితాని. సవిధస్థిత సమ్ముఖీనభూపాలభూషణమణి ప్రతిబిమ్బితేన : సవిధేస్థితాః=సవిధస్థితాః, సమ్ముఖందృశ్యతే ఏష్వితి=సమ్ముఖీనాః, భూపాలస్య భూషణమణయః = భూపాలభూషణమణయః, సమ్ముఖీనాశ్చతే భూపాల భూషణమణయశ్చ =సమ్ముఖీన భూపాల భూషణమణయః, సవిధస్థితాశ్చతే సమ్ముఖీన భూపాల భూషణమణయశ్చ = సవిధస్థిత సమ్ముఖీన భూపాల భూషణమణయః. సవిధస్థిత సమ్ముఖీన భూపాల భూషణమణిషు ప్రతి బిమ్బితమ్=సవిధస్థిత సమ్ముఖీనభూపాల మణి ప్రతి బిమ్బితం, తేన=సవిధస్థితసమ్ముఖీన భూపాల భూషణమణి ప్రతి బింబితేన.

## భావము:

పల్లకిని మోయునట్టి సేవకులు ఒక వేళ ప్రత్యక్షముగా దమయన్తి చేష్టలను తెలిసి కొనక పోయినను, సమీపమందున్న యవన్తి రాజు ధరించిన భూషణముల మణులలో నామె ప్రతిబింబించుట వలన నామె యొక్క చేష్టలనూహించిరి. ॥౯౪॥

శ్లో. భైమీమవాపయత జన్యజన స్తదన్యం
గఙ్గామివ క్షితితలం రఘువంశదీపః ।
గాఙ్గేయపీతకుచకుమ్భయుగాం చ హార
చూడాసమాగమవశేన విభూషితాఞ్చ॥ 95

ప. వి. భైమీమ్-అవాపయత-జన్యజనః - తదన్యం-గంగామ్-ఇవ-క్షితితలం-రఘువంశదీపః-గాఙ్గేయపీతకుచకుమ్భయుగాం-చ-హారచూడాసమాగమవశేన-విభూషితాం-చ.

అర్థము. జన్యజనః=వాహకజనము, గాఙ్గేయపీతకుచకుమ్భయుగామ్. గాఙ్గేయ=బంగారువలె, పీత=పసుపుపచ్చని, కుచకుమ్భయుగాం=కలశములవంటి చనుదోయిగల్గిన, పక్షాన్తరమున-గాఙ్గేయ = భీష్మునిచే, పీత=పానము చేయఁబడిన, కుచకుమ్భయుగామ్=కడవల వంటి చనుదోయి గలదియు. హారచూడాసమాగమవశేన; హార=ముక్తాహారములు, చూడా = బాహుభూషణములు, పక్షాన్తరమున- హారచూడా=హార=హరునకు సంబంధించిన, చూడా = శిరోభాగము, అనువీనియొక్క సమాగమవశేన; సంబంధవశముచే, విభూషితాంచ=అలఙ్కరింపఁబడిన, భైమీం=దమయన్తిని, రఘువంశ ప్రదీపః=రఘువంశమున దీపమైన భగీరథుఁడు, గంగాం = గంగానదిని, క్షితితలమివ=భూతలమునువలె,తదన్యం;తత్=వానికంటెను అన్యం = మఱియొక రాజును, అవాపయత=పొందించినది.

వి. జన్యజనమును భగీరథునితోఁడను, దమయన్తిని గంగానదితోఁడను, తదన్యరాజును భూతలము తోడనుఁ బోల్చుట వలన నుపమాలఙ్కారము-

**సమాసములు :**

భైమీమ్:- భీమస్య అపత్యంస్త్రీ=భైమీ. తామ్=భైమీమ్।

జన్యజనః :- జన్యఇతి జనః=జన్యజనః ।

రఘువంశప్రదీపః:- రఘోఃవంశః=రఘువంశః,రఘువంశస్యప్రదీపః=రఘువంశప్రదీపః. గాఙ్గేయపీత కుచకుమ్భయుగామ్ : గాఙ్గేయవత్ పీతం గాఙ్గేయపీతం, కుచౌకుమ్భావివ=కుచకుమ్భౌ, కుచకుమ్భయోఃయుగమ్=కుచకుమ్భ

యుగమ్, గాఙ్గేయపీతం కుచకుమ్భయుగం, యస్యాస్సా=గాఙ్గేయపీతకుచకుమ్భయుగా, తామ్=గాఙ్గేయపీత కుచకుమ్భయుగామ్ ।

*పక్షాన్తరము నందు—

గఙ్గాయాః అపత్యం పుమాన్, గాఙ్గేయః, గాఙ్గేయేనపీతం=గాఙ్గేయపీతం, కుచకుమ్భయోర్యుగం= కుచకుమ్భయుగమ్, గాఙ్గేయపీతంకుచకుమ్భయుగం, యస్యాస్సా=గాఙ్గేయపీతకుచకుమ్భయుగా, తామ్=గాఙ్గేయపీత కుచకుమ్భయుగామ్ ।

హారచూడాసమాగమవశేన :- హారశ్చ, చూడాచ=హారచూడే, హారచూడయోః సమాగమః = హారచూడసమాగమః. హారచూడా సమాగమస్యవశః = హారచూడాసమాగమవశః, తేన = హారచూడా సమాగమవశేన.

పక్షాన్తరమునందు—(గంగానదీపక్షమందు)

హరస్య ఇయం=హారీ, హారీచసా చూడాచ=హారచూడా, హారచూడాయాః, సమాగమః=హారచూడాసమాగమః,

హారచూడా సమాగమస్యవశః = హారచూడాసమాగవశః, తేన=హారచూడా సమాగమ వశేన ।

**భావము :**

పల్లకి మోయునట్టి వాహకబృన్దము, పసిడి వంటి పచ్చని చనుదోయిగల, ముత్యాలహారములతోడను, భుజభూషణములతోఁడను నలఙ్కరింపఁబడిన దమయన్తిని భీష్మాదులచే పానము చేయఁబడిన చనుదోయి గలదియు శివుని శిరోభాగము నలఙ్కరించినదియు నగు గంగను, భగీరథుడెట్లు భూమినిఁ బొందించెనో యట్లే ఆ రాజు నుండి మఱియొక రాజునొద్దకుఁ గొనిపోయినది. ॥౯౫॥

శ్లో. తాం మత్స్యలాఞ్ఛనదరాఞ్చితచాపభాసా
నీరాజితభ్రువమభాషత భాషితేశా ।
వ్రీడాజడే ! కిమపి రూపయ చేతసా చేత్
క్రీడారసం వహసి గౌడడౌబిడసీహ॥ 96

ప. వి. తాం-మత్స్యలాఞ్ఛన దరాఞ్చితచాపభాసా - నీరాజితభ్రువమ్-అభాషత-భాషితేశా-వ్రీడాజడే ! - కిమ్-అపి-రూపయ-చేతసా-చేత్-క్రీడారసం-వహసి-గౌడబిడౌజసి-ఇహ.

అర్థము. భాషితేశా; భాషిత=వాక్కులకు, ఈశా = అధిదేవత యగు సరస్వతీదేవి, మత్స్యలాఞ్ఛన=మన్మథుని యొక్క, దర=కొంచెము, అఞ్చిత=వంచఁబడిన, చాప=వింటియొక్క, భాసా=కాంతితో, నీరాజితభ్రువమ్; నీరాజిత=నీరాజనమొసంగఁబడి, భ్రువమ్=కనుబొమ్మలుగల, తామ్=ఆదమయన్తిని, అభాషత=పలికినది—ఏమనగా—హే వ్రీడాజడే ! =సిగ్గుచే మొద్దుతనముఁబొందిన ఓ దమయన్తీ, ఇహ=ఈ, గౌడబిడౌజసి;=గౌడదేశమున కింద్రుడైన యీరాజునందు - చేతసా=మనస్సుచే, క్రీడారసం=క్రీడారాగమును, వహసిచేత్ = వహించితివేని, తదా = అప్పుడు, కిమపి=ఏమైనను, (నిఙ్గితాదులచే) రూపయ=సూచింపుము- నీవుచెప్పక పోయినను నిఙ్గితాదులచే గౌడోర్వీశుని యందు నీకుఁగల్గిన భావమును సూచించుమని యర్థము—

వి. ఇచ్చట మన్మథుని వింటిచే దమయన్తి కనుబొమ్మలకు నీ రాజనమిప్పఁబడినట్లు చెప్పుట వలన ఉపమేయములగు కనుబొమ్మలకు నుపమానమగు మన్మథుని వింటి కంటెను నాధిక్యము సిద్ధించినవిగాన వ్యతిరేకాలఙ్కారము.

**సమాసములు :**

మత్స్యలాఞ్ఛనదరాఞ్చితచాపభాసా :- మత్స్యఃలాఞ్ఛనం యస్యసః = మత్స్యలాఞ్ఛనః. దరమఞ్చితః=దరాఞ్చితః, దరాఞ్చితశ్చాసౌచాపశ్చ= దరాంచితచాపః, మత్స్యలాఞ్ఛనస్య దరాఞ్చిత చాపః=మత్స్యలాఞ్ఛన దరాఞ్చితచాపః, మత్స్యలాఞ్ఛదరాఞ్చినతచాపస్యభాః=మత్స్యలాఞ్ఛన దరాఞ్చిత చాపభాః, తయా=మత్స్యలాఞ్ఛనదరాఞ్చిత చాపభాసా ।

నీరాజితభ్రువమ్:— నీరాజితా, భ్రూఃయస్యాస్సా=నీరాజితభ్రూః, తామ్= నీరాజితభ్రువమ్ ।

భాషితేశా:— భాషితానామీశా=భాషితేశా ।

వ్రీడాజడే ! :— వ్రీడయాజడా = వ్రీడాజడా, తస్యాస్సమ్బుద్ధిః = హేవ్రీడాజడే !

క్రీడారసమ్ :- క్రీడాయాం రసః=క్రీడారసః, తమ్=క్రీడారసమ్ ।

గౌడబిడౌజసి :— గౌడానాంబిడౌజాః = గౌడబిడౌజాః, తస్మిన్ = గౌడబిడౌజసి.

**భావము :**

కొంచెము వంచబడిన మన్మథుని వింటికాన్తితో హారతి తీయఁబడిన కనుబొమ్మలతో విలసిల్లు, దమయన్తినిఁ గూర్చి సరస్వతీదేవి యిట్లు చెప్పెను. సిగ్గుచే మొద్దుతనముఁ బొందిన దమయన్తీ ! ఈ గౌడదేశమున కిన్ద్రుఁడైన యీరాజుతో క్రీడింపవలయునను నభిలాష నీ మనస్సునందున్నచో, నీతని గూర్చి నీకనుసైగలు మున్నగు చేష్టలతో నేమైనను సూచింపుము. ॥౯౬॥

శ్లో. ఏతద్యశోభిరమలాని కులాని భాసాం
తథ్యం తుషారకిరణస్య తృణీకృతాని ।
స్థానే తతో వసతి తత్ర సుధామ్బుసింధౌ
రఙ్కుస్తదఙ్కురవనీకబలాభిలాషాత్॥ 97

ప. వి, ఏ తద్యశోభిః—అమలాని=కులాని—భాసాం—తథ్యం—తుషారకిరణస్య—తృణీకృతాని— స్థానే—తతః— వసతి—తత్ర—సుధామ్బుసింధౌ—రఙ్కుః—తదఙ్కురవనీ కబలాభిలాషాత్—

అర్థము. ఏతద్యశోభిః, ఏతత్=ఈ గౌడదేశప్రభువుయొక్క, యశోభిః=కీర్తులచే తుషారకిరణస్య=చన్ద్రునియొక్క, అమలాని=నిర్మలములైన, భాసాం= కాన్తులయొక్క కులాని=సమూహములు, తృణీకృతాని=తిరస్కరింపఁబడినవి. తథ్యమ్=ఇది సత్యము. తతః=ఆ తృణీకరణము వలన, రఙ్కుః = కలఙ్కముగానున్న జింక, తదఙ్కురవనీ కబలాభిలాషాత్, తదఙ్కుర=అట్టి తృణీకారముచే నేర్పడిన, తృణాఙ్కురముల, వనీ= సమూహముయొక్క, కబల=కబళములయందు, అభిలాషాత్=అపేక్ష

వలన లేదా,తదఙ్కుర=ఆ కాంతులయొక్క అఙ్కుర=మొలకలు, వనీ=జలము అనుపీనియొక్క కబల=కబళములయందు, అభిలాషాత్=ఆశ వలన, సుధామ్బు సిన్ధౌ, సుధామ్బు=అమృతమనెడి జలముయొక్క, సిన్ధౌ=సముద్రమైన, తత్ర=ఆచన్ద్రునియందు, వసతి=వసించుచున్నది. స్థానే=ఇదియుక్తము. గడ్డినీరు సమృద్ధముగా నున్నచోట జింకలు నివసించును గదా.

వి : జింక గడ్డిని నీటిని నభిలషించి చన్ద్రునందు వసించుటలేదు. కాని వసించుచున్నట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష.

**సమాసములు :**

తద్యశోభిః : తస్యయశాంసి=తద్యశాంసి, తైః తద్యశోభిః.

తుషారకిరణస్య : తుషారమయాః కిరణాః యస్యసః = తుషారకిరణః, తస్య=తుషారకిరణస్య,

తృణీకృతాని : అతృణాని, తృణాని, సమ్పద్యమానాని, కృతాని=తృణీకృతాని.

సుధామ్బుసిన్ధౌ : సుధామయాని చ తాని అమ్బూని చ=సుధామ్బూని, సుధామ్బూనాం సింధుః=సుధామ్బుసిన్ధుః.

తదఙ్కురవనీ కబలాభిలాషాత్ : తస్యఅఙ్కురాః తదఙ్కురాః= తదఙ్కురాః, తదఙ్కురాశ్చ వన్యశ్చ=తదఙ్కుర వన్యః,తదఙ్కురవనీనాం కబలాని=తదఙ్కురవనీ కబలాని, తదఙ్కురవనీ కబలేషు, అభిలాషః= తదఙ్కురవనీ కబలాభిలాషః, తస్మాత్=తదఙ్కురవనీ కబలాభిలాషాత్

**భావము :**

ఈ గౌడన్నృపతియొక్క యశస్సులచే చన్ద్రుని నిర్మల కాన్తులు తృణీకరింపఁబడినవి. అనగా తిరస్కరింపఁబడినవి. తృణములుగానుఁ జేయఁబడినవి. ఇది సత్యము, ఇట్లు తృణీకరించుటవలననే, యనగా తృణములుగాఁ జేయుటవలననే జింక అటువంటి గడ్డిమొక్కలను తినుటకై యిచ్చగలదై యమృత

సాగరమునకు నాశ్రయమైన చన్ద్రునియందు నివసించుచున్నది. గడ్డి సమృద్ధిగా నున్నచోట గదా మృగములు నివసించును. లేదా, కాంతులనెడి గడ్డి మొలకలు, నీరు అను పీని నపేక్షించి జింక యాయమృత సాగరమునకు నెలవైన చంద్రుని యందు నివసించుచున్నదనియు భావింప వచ్చును. గడ్డినీరు సమృద్ధములై యున్నచో మృగములు నివసింపగలవు. కావుననీ రెండవ పక్షమున "వనీ" శబ్దమునకు నీరని యర్థమును జెప్పవలయును. మొదటి యర్థము నందు, "వనీ" శబ్దము అడవియను నర్థమునను్నది. "తదఙ్కురవని," యను చోట నా తృణాఙ్కురముల వనమని యర్థమును, జెప్పవలయును. అందు వనమనగా సమూహమని యౌపచారికమైన యర్థము. ॥౯౭॥

శ్లో. ఆలిఙ్గితః కమలవత్ కరక స్త్వయాఽయం
శ్యామః సుమేరుశిఖయేవ నవః పయోదః ।
కన్దర్పమూర్ధరుహమణ్డనచమ్పకస్రగ్
దామత్వదఙ్గరుచికఞ్చుకితశ్చకాస్తు॥ 98

ప. వి. ఆలిఙ్గితః–కమలవత్–కరకః–త్వయా–అయం–శ్యామః–సుమేరు శిఖయా–ఇవ-నవః-పయోదః-కన్దర్పమూర్ధరుహమణ్డనచమ్పకస్రగ్ దామత్వదఙ్గ రుచి కఞ్చుకితః-చకాస్తు.

అర్థము:- కమలవత్కరకః; కమలవత్=పద్మరేఖతోగూడిన, కరకః=హస్తము గల్గిన, పక్షాన్తరమున, కమలవత్=జలముతోగూడిన, కరకః=వడగండ్లు కల్గిన, శ్యామః=నల్లనైన, నవః=నూతనమైనన, పయోదః=మేఘము, సుమేరు శిఖయా ఇవ, సుమేరు=పర్వతముయొక్క శిఖయాఇవ = శృంగముచేతనెట్లో, అట్లు, అయం=ఈ గౌడనరపతి, ఆలిఙ్గితః=నీచేత గౌగలింపబడినవాడై, కన్దర్పమూర్ధరుహమణ్డనచమ్పకస్రగ్దామత్వదఙ్గరుచి కఞ్చుకితః; కన్దర్ప=మన్మథునియొక్క, మూర్ధరుహ=కురులకు, మణ్డన= అలఙ్కారమైన, చమ్పకస్రక్దామ=సంపంగెమాల పంటి, త్వదఙ్గ=నీ శరీరముయొక్క, రుచి=కాన్తితో, కఞ్చుకితః=కప్పబడినవడై, పక్షాన్తర మున–చమ్పకస్రగ్దామ=సంపంగె మాలవంటి, త్వదఙ్గ=నీ శరీరము

యొక్క-రుచి=కాన్తిసంటి కాన్తికల్గిన, సుమేరుశిఖయా = మేరుపర్వత
శిఖరముతో, కఞ్చుకితః=కలిసినదై చకాస్తు = ప్రకాశించును గాక.

నల్లని వర్ణముగల క్రొత్తమబ్బు పచ్చని సుమేరు పర్వతముమీఁద పసిమి
శిఖరమునుఁ బొంది శోభించునో యట్లు నల్లనిమైచాయగల యీ రాముఁడు
పలెను చమ్పక పుష్పములవలెను పసిమి పచ్చని మైచాయగల సీతను గూడిన
కాని శోభింపఁగలఁడని యర్థము.

## సమాసములు :

కమలవత్కరకః :-కమలమస్మిన్నస్తీతి=కమలవాన్, కమలవాన్ కరః
యస్యసః=కమలవత్కరకః.

పక్షాన్తరమున.

కమలమేషామస్తీతి=కమలవన్తః, కమలవన్తః కరకాః యస్యాః సః =
కమలవత్కరకః.

సుమేరుశిఖయా :- సుమేరోఃశిఖా=సుమేరుశిఖా, తయా=సుమేరుశిఖయా.
కన్దర్పమూర్ధరుహామణ్డనచమ్పకస్రగ్దామత్వదగ్గరుచికఞ్చుకితః:- మూర్ధ్ని
రోహన్తీతి=మూర్ధరుహాణి.కన్దర్పస్యమూర్ధరుహాణి=కన్దర్పమూర్ధరుహాణి,
కన్దర్పమూర్ధరుహాణాం మణ్డనమ్=కన్దర్పమూర్ధరుహామణ్డనమ్, చమ్ప
కానాంస్రక్=చమ్పకస్రక్, చమ్పకస్రగేవదామ=చమ్పకస్రగ్దామ,కన్దర్ప
మూర్ధరుహామణ్డనంచతత్ చమ్పకస్రగ్దామచ =కన్దర్పమూర్ధరుహామణ్డన
చమ్పకస్రగ్దామ, కన్దర్పమూర్ధరుహామణ్డనచమ్పకస్రగ్దామవత్ త్వదఙ్గమ్ =
కన్దర్పమూర్ధరుహామణ్డనచమ్పకస్రగ్దామత్వదఙ్గమ్, కన్దర్పమూర్ధరుహా
మణ్డనచమ్పకస్రగ్దామత్వదఙ్గస్యరుచిః = కన్దర్పమూర్ధరుహామణ్డనచమ్పక
స్రగ్దామత్వదఙ్గరుచిః, కన్దర్పమూర్ధరుహామణ్డనచమ్పకస్రగ్దామత్వదఙ్గరు
చ్యాకఞ్చుకితః = కన్దర్పమూర్ధరుహామణ్డనచమ్పకస్రగ్దామత్వదఙ్గరుచి
కఞ్చుకితః,

పక్షాన్తరమునందు – కన్దర్పమూర్ధరుహామణ్డన చమ్పకస్రగ్దామత్వదఙ్గ
రుచిరివ రుచిః యస్యాస్సా=కన్దర్పమూర్ధరుహామణ్డన చమ్పకస్రగ్దామత్వ
దఙ్గరుచి,కన్దర్పమూర్ధరుహామణ్డనచమ్పకస్రగ్దామత్వదఙ్గరుచ్యాకఞ్చుకితః
=కన్దర్పమూర్ధరుహామణ్డనచమ్పకస్రగ్దామత్వదఙ్గరుచికఞ్చుకితః.

**భావము :**

నీవు గౌడదేశపు ప్రభువుతో కలిసినచో, మేరుపర్వత శిఖరముతోఁగలసిన మేఘమువలె కానవచ్చును. ఎట్లనగా నా గౌడదేశప్రభువు కమల పత్ర్కాకరకుడు. పద్మరేఖతోఁగూడిన హస్తము కలవాడు. మేఘుడో; జలముతో గూడిన వడ గండ్లు గలవాఁడు. ఆ గౌడదేశపు ప్రభువు నల్లనివాడు. మేఘము నల్లనిది. కాన మేరు శిఖరముతో నట్టి మేఘమునకు కలయిక, నీతోడ గౌడ దేశమున కేర్పడిన కలయిక వంటిది. మఱియు అతనితోని కలయిక, మన్మథుని శిరోజముల యందలి యలంకారమైన చంపక పుష్పమాలవలె నుండును, కాన నల్లనిమైచాయ గల గౌడనృపతి బంగారు మైచాయగల నిన్ను స్వీకరించి పైవిధముగా శోభింపఁ గలడు. కాన వానిని వరింపుము. ॥౯౮॥

శ్లో. ఏతేన సమ్ముఖమిలత్కరికుమ్భముక్తాః
కౌక్షేయకాభిహతిభిర్విబభుర్విముక్తాః ।
ఏతద్భుజోష్మభృశనిఃసహయా వికీర్ణాః
ప్రస్వేదబిన్దవ ఇవారినరేన్ద్రలక్ష్మ్యాః॥ **99**

ప. వి. ఏతేన–సమ్ముఖమిలత్కరికుమ్భముక్తాః – కౌక్షేయకాభిహతిభిః–విబభుః–విముక్తాః, ఏతద్భుజోష్మభృశనిఃసహయా–వికీర్ణాః–ప్రస్వేదబిన్దవః – ఇవ–అరినరేన్ద్రలక్ష్మ్యాః.

అర్థము :- ఏతేన=ఈ గౌడభూపతిచే, కౌక్షేయకాభిహతిభిః; కౌక్షేయక=కత్తి యొక్క, హతిభిః=దెబ్బలచే. విముక్తాః = విడువఁబడిన, అనగాకుమ్భ స్థలముల నుండి భూమిపై వెదఁజల్లఁబడిన, సమ్ముఖ మిలత్కరి కుమ్భ ముక్తాః, సమ్ముఖ=ఎదురెదురుగా, మిలత్=యుద్ధమునకై తలఁబడుచున్న కరి=ఏనుగుయొక్క, కుమ్భ=కుమ్భస్థలముల యందలి, ముక్తాః=ముత్తె ములు, ఏతద్భుజోష్మభృశనిః సహయా; ఏతత్=ఈ రాజుయొక్క, భుజోష్మ=బాహుప్రతాపమునకు, నిః సహయా=సహింపలేని, అరినరేన్ద్ర లక్ష్మ్యాః=శత్రురాజుల లక్ష్మిచే, వికీర్ణాః=విడువఁబడిన, ప్రస్వేదబిన్దవ ఇవ=చెమటబొట్లో యనునట్లు, విబభుః = ప్రకాశించినవి.

వి. ఇచ్చట ఏనుగుల కుమ్భస్థలములనుండి పడిన ముత్తెములను శత్రు రాజుల లక్ష్మియొక్క చెమటబొట్లుగా సమ్భావించుట వలన ఉత్ప్రేక్ష- ఇవశబ్దప్రయోగముచే నది వాచ్యము.

**సమాసములు :**

సమ్ముఖమిలత్కరికుమ్భముక్తాః :- సమ్ముఖం యథా తథా మిలన్తః= సమ్ముఖమిలన్తః, సమ్ముఖమిలన్తశ్చతే కరిణశ్చ=సమ్ముఖమిలత్కరిణః, సమ్ముఖమిలత్కరిణాంకుమ్భాః = సమ్ముఖమిలత్కరికుమ్భాః, సమ్ముఖ మిలత్కరికుమ్భేషుముక్తాః=సమ్ముఖమిలత్కరికుమ్భముక్తాః ।

కౌక్షేయకాభిహతిభిః :- కుక్షేః అభిరూపః=కౌక్షేయకః, కౌక్షేయకస్య అభిహతయః=కౌక్షేయకాభిహతయః, తాభిః = కౌక్షేయకాభిహతిభిః

ఏతద్భుజోష్మభృశనిఃసహయా :- ఏతస్యభుజౌ = ఏతద్భుజౌ. ఏతద్భుజయోరూష్మ=ఏతద్భుజోష్మ. ఏతద్భుజోష్మణాభృశంనిఃసహా= ఏతద్భుజోష్మభృశనిఃసహా, తయా=ఏతద్భుజోష్మభృశనిఃసహయా.

ప్రస్వేదబిన్దవః :- ప్రస్వేదస్యబిన్దవః=ప్రస్వేదబిన్దవః.

అరినరేన్ద్రలక్ష్మ్యా :- అరయశ్చతే నరేన్ద్రాశ్చ = అరినరేన్ద్రాః, అరి నరేన్ద్రాణాం, లక్ష్మీః=అరినరేన్ద్రలక్ష్మీః, తయా=అరినరేన్ద్రలక్ష్మ్యా ।

**భావము :**

ఈ గౌడభూపతి కత్తితో, యుద్ధమున నొకటి పైకి నొకటిగాఁ దలపడిన యేనుగులను కొట్టుటచే వాని కుమ్భస్థలములనుండి ముత్తెములు క్రిందరాలు చున్నవి. ఏనుగుల కుమ్భస్థలములయందు ముత్తెము లుండునని కవి సమయ ప్రసిద్ధి. అట్లు రాలిన ముత్తెములు, యాతని భుజప్రతాపపు వేడిమిని నోర్వ జాలక యాతని భుజలక్ష్మి వదలిపెట్టిన చెమటచొట్లా ? యని భావింపఁదగినవై యున్నవి. అనగా నా గౌడోర్వీపతి మహా ప్రతాపశాలి గాన నీకు వరింప నర్హుఁడు. ॥౯౯॥

శ్లో. ఆశ్చర్యమస్యకకుభామవధీనవాప
దాజానుగాద్భుజయుగాదుదితః ప్రతాపః ।
వ్యాపత్ సదాశయవిసారితసప్తతన్తు
జన్మా చతుర్దశ జగన్తి యశఃపటశ్చ॥ 100

ప.వి. ఆశ్చర్యమ్-అస్య - కకుభామ్-అవధీన్ - అవాపత్-ఆజానుగాత్- భుజయుగాత్-ఉదితః-ప్రతాపః-వ్యాపత్- సదాశయవిసారితసప్తతన్తుజన్మా-చతుర్దశ-జగన్తి-యశఃపటః-చ,

అర్థము. అస్య = ఈ గొప్ప నరపతియొక్క, ఆజానుగాత్ = మోకాళ్ళవరకు వ్రేలాడెడి, భుజయుగాత్=బాహువుల జంటనుండి, ఉదితః = పుట్టిన, ప్రతాపః=ప్రతాపము, కకుభాం=దిక్కులయొక్క, అవధీన్ =ఎల్లలను, అనగా దిక్కుల యంచులను, అవాపత్ = పొందినది, ఏతత్=ఇది, ఆశ్చర్యమ్=ఆశ్చర్యము. (కిఞ్చ=మఱియు). సదాశయవిసారితసప్తతన్తుజన్మా; సదాశయ=పరిశుద్ధమైన మనస్సుచే, విసారిత=ఆచరింపఁబడిన, సప్తతన్తు=యాగములవలన, జన్మా=ఉద్భవించిన, పక్షాన్తరమునందు-సదా=ఎల్లప్పుడు, శయ = ఉరచేతిచే, విసారిత =ప్రసరింపఁబడిన, సప్తతన్తు=ఏడు దారములనుండి, జన్మా = ఉద్భవించిన, యశఃపటః = కీర్తివస్త్రము, చతుర్దశ=పదునాలుగు, జగన్తి=ప్రపఞ్చములను, వ్యాపత్ ఇతి చ = వ్యాపించెననునదియు, ఆశ్చర్యమ్=అద్భుతము ! యాగముల నాచరించుట, దిక్కుల యంచులకు వ్యాపించెడి కీర్తిని సంపాదించుట యాజానుబాహువుగ నుండుటకు ఫలము.

వి. చాల కొద్దిదూరమును వ్యాపించెడి బాహుద్వయమునుండి, దిక్కుల యంచులకు వ్యాపించెడి కీర్తిని సంపాదించుట, ఏడు దారములచేఁ బదు నాలుగు లోకములకు వ్యాపించెడి కీర్తివస్త్రమును నుత్పత్తిచేయుట విరుద్ధములు కాన, కారణవిరుద్ధ కార్యోత్పత్తి లక్షణమైన విరుద్ధాలఙ్కారము.

**సమాసములు :**

ఆజానుగాత్ :- జానుమభివ్యాప్య=ఆజాను, ఆజానుగచ్ఛతీతి=ఆజానుగమ్, తస్మాత్=ఆజానుగాత్ ।

భుజయుగాత్ :- భుజయోఃయుగమ్ = భుజయుగమ్, తస్మాత్=భుజయుగాత్ ।

సదాశయవిసారితసప్తతన్తుజన్మా :- సన్ చాసౌ-ఆశయశ్చ=సదాశయః, సదాశయేనవిసారితాః=సదాశయవిసారితాః, సదాశయవిసారితాశ్చతేసప్తతన్తవశ్చ = సదాశయవిసారితసప్తతన్తవః, సదాశయవిసారితసప్తతన్తుభ్యః జన్మయస్యసః = సదాశయవిసారితసప్తతన్తుజన్మా ।

పక్షాన్తరమునందు-శయేనవిసారితాః=శయవిసారితాః, సదా, శయవిసారితాః= సదాశయవిసారితాః, సప్తచతేతన్తవశ్చ = సప్తతన్తవః, సదాశయవిసారితాశ్చతే సప్తతన్తవశ్చ=సదాశయవిసారితసప్తతన్తవః, సదాశయవిసారితసప్తతన్తుభ్యః జన్మయస్యసః = సదాశయవిసారితసప్తతన్తుజన్మా ।

యశఃపటః :- యశఏవపటః =యశఃపటః ।

**భావము :**

ఆ గౌడమహారాజునకు భుజములు మోకాళ్ళవఱకును వ్రేలాడుచుండును. అట్టి భుజములచే నతడు సమ్పాదించిన ప్రతాపము దిక్కుల యంచులను వ్యాపించుచున్నది. మఱియు శుద్ధమైన హృదయముచే నాతడు ఆచరించిన సప్తతన్తువుల వలన అనగా యాగములవలన, (పక్షాన్తరమున) ఎల్లప్పుడు హస్తముచే జాపఁబడిన యేడు నూలు దారములవలన-జన్మించిన కీర్తివస్త్రము పదునాలుగు లోకములను వ్యాపించినది. సప్తతన్తువు లనగా యాగములు, ఏడుదారములు అని రెండర్థములు. ఇచ్చట యాగము లను నర్థమును పరిగ్రహించినచో, వానివలన కీర్తియు, ఏడుదారము లను నర్థమునుఁ బరిగ్రహించినచో వానివలన వస్త్రము లభించుటవలన, నాతనికి కీర్తివస్త్రము లభించుట సరిపడును. కాన యాగాదుల నాచరించి గొప్ప యశమును సంపాదించిన యా రాజును నీవు వరించుట యుచితమని భావము. ॥౧౦౦॥

> ఔదాస్యసంవిదవలమ్బితశూన్యముద్రా
> మస్మిన్దృశోర్నిపతితామవగమ్య భైమ్యాః ।
> స్వేనైవ జన్యజనతాన్యమజీగమత్తాం
> సుజ్ఞం ప్రతీఙ్గితవిభావనమేవ వాచః॥ 101

ప.వి. ఔదాస్యసంవిదవలమ్బితశూన్యముద్రామ్-అస్మిన్-దృశోః- నిపతితామ్-అవగమ్య-భైమ్యాః-స్వేన-ఏవ - జన్యజనతా - అన్యమ్-అజీగమత్-తామ్-సుజ్ఞం-ప్రతి-ఇఙ్గితవిభావనమ్-ఏవ-వాచః.

అర్థము. జన్యజనతా=దమయన్తి పల్లకిని మోసెడి వాహక జనసమూహము, అస్మిన్=ఈ గౌడరాజునందు, నిపతితాం=పడినటువంటి, భైమ్యాః=దమయన్తియొక్క, దృశోః=నేత్రములకు సంబంధించినదైన, ఔదాస్య సంవిదవలమ్బితశూన్యముద్రామ్; ఔదాస్యసంవిత్=ఉపేక్షాబుద్ధిచే, అవలమ్బిత=పొందఁబడిన, శూన్యముద్రామ్=నిఃస్పృహస్థితిని, అవగమ్య=తెలుసుకొని, స్వేనైవ=స్వయముగనే మాటతో నవసరము లేకయే, తాం = ఆ దమయన్తిని, అన్యం = మఱియొక, నృపం = రాజును, అజీగమత్=పొందించెను, తథాహి=అది యుక్తమే, సుజ్ఞంప్రతి=విజ్ఞత గలవానినిఁ గూర్చి, ఇఙ్గితవిభావనం=కనుసైగలు మున్నగువానిచే హృదయమందలి భావములనుఁ బ్రకటించుటయే, వాచః = ప్రేరక వాక్యములుగా నుండును.

వి. ఇచ్చట విజ్ఞునకు నిఙ్గితవిభావనమే మాటలు అను సామాన్యముచే, దమయన్తి నిస్పృహస్థితి యామెయొక్క యిఙ్గితముతోడనే, తెలుసుకొని యామె మాట నెదురుచూడక మఱియొక రాజుకడకు నామెను గొని పోయిరను విశేషమును సమర్థించుటవలన నర్థాన్తరన్యాసము.

**సమాసములు :**

ఔదాస్యసంవిదవలమ్బితశూన్యముద్రామ్ :- ఉదాస్తే ఇత్యుదాసా, ఉదాసాయాః భావః=ఔదాస్యమ్, ఔదాస్యస్యసంవిత్ = ఔదాస్యసంవిత్, శూన్యస్యముద్రా=శూన్యముద్రా. ఔదాస్యసంవిదా, అవలమ్బితా=ఔదాస్య సంవిదవలమ్బితా, ఔదాస్యసంవిదవలమ్బితా, శూన్యముద్రాయస్యాస్సా = ఔదాస్యసంవిదవలమ్బితశూన్యముద్రా, తామ్ = ఔదాస్యసంవిదవలమ్బితశూన్యముద్రామ్।

జన్యజనతా:- జనీం వహన్తీతి=జన్యాః, జన్యా ఏవజనతా=జన్యజనతా।

సుజ్ఞమ్ :- సుష్ఠుజానాతీతి=సుజ్ఞః, తమ్=సుజ్ఞమ్.

ఇఙ్గితవిభావనమ్ :- ఇఙ్గితస్య విభావనమ్=ఇఙ్గిత విభావనమ్.

**భావము :**

వధువును మోయునట్టి వాహకజనము, దమయన్తి యొక్క కనుసైగలు మున్నగు నిఙ్గితములచేతనే యామెకు గౌడరాజునందుఁ గల్గిన విరక్తి నూహించుకొని, యామెమాట నెదురుచూడ నవసరములేకయే యామెను మఱియొక రాజు దగ్గరకుఁగొనిపోయినది. విషయములనుఁ గూర్చి ప్రేరణఁ జేయుటకు, కనుసైగలు మున్నగు నిఙ్గితములు చాలును. మాటలవసరములేదు. ॥౧౦౦॥

> శ్లో. ఏతాం కుమారనిపుణాం పునరప్యభాణీత్
> వాణీ సరోజముఖి ! నిర్భరమారభస్వ ।
> అస్మిన్నసఙ్కుచితపఙ్కజసఖ్యశిక్షా
> నిష్ణాతదృష్టిపరిరమ్భవిజృమ్భితాని॥ **102**

ప. వి. ఏతాం-కుమారనిపుణాం-పునః-అపి-అభాణీత్-వాణీ-సరోజముఖి-నిర్భరమ్- ఆరభస్వ- అస్మిన్- అసఙ్కుచితపఙ్కజసఖ్యశిక్షానిష్ణాదృష్టిపరిరమ్భవిజృమ్భితాని.

అర్థము :- వాణీ=సరస్వతీదేవి ! కుమారనిపుణాం = బాలికయైనను నిపుణురాలైన, దమయన్తిని,-లేదా-కుమారనిపుణాం;కు=భూమికి, మార=మన్మథుఁడైన నలుని యందు, నిపుణామ్=ఆసక్తి గలదియు,నగు ఏతాం=ఈదమయన్తిని, పునరపి = మరలను, అభాణీత్=పలికినది. హేసరోజముఖి=ఓ పద్మవదనా ! అస్మిన్=ఈ రాజునందు, అసఙ్కుచిత పఙ్కజసఖ్యశిక్షానిష్ణాతదృష్టిపరిరమ్భవిజృమ్భితాని;అసఙ్కుచిత=వికసించిన. పఙ్కజ=తామరపూవుతో, సఖ్య=చెలిమిని, శిక్షా=నేర్పుటయందు' నిష్ణాత=సమర్థమైన, దృష్టి=దృష్టులచే పరిరమ్భవిజృమ్భితాని, పరిరమ్భ=కౌగిలింపులయొక్క, విజృమ్భితాని=చేష్టలను, నిర్భరం=గట్టిగా ఆరభస్వ=చేయుము. వీనినిఁజూడుమని యర్థము.

**సమాసములు :**

కుమారనిపుణామ్ :- నిపుణాచసా కుమారీచ=కుమార నిపుణా, తామ్=కుమారని పుణామ్. లేదా, కోః మారః=కుమారః, కుమారే నిపుణా=కుమారనిపుణా, తాం=కుమార నిపుణామ్.

హేసరోజముఖి :- సరోజమివముఖం యస్యాస్సా—సరోజముఖీ, తస్యాస్స మ్బుద్ధిః=హేసరోజముఖి.

నిర్భరమ్ ;- నిర్గతఃభరః యస్మిన్ కర్మణితద్యథా భవతితథా=నిర్భరమ్.

అసఙ్కుచితపఙ్కజసఖ్యశిక్షానిష్ణాతదృష్టిపరిరమ్భవిజృమ్భితాని :- న సఙ్కుచితమ్, అసఙ్కుచితమ్ అసఙ్కుచితంచతత్ పఙ్కజంచ=అసఙ్కుచితపఙ్కజమ్, సఖ్యుః భావః=సఖ్యమ్, అసఙ్కుచితపఙ్కజేనసఖ్యమ్=అసఙ్కుచితపఙ్కజసఖ్యమ్ అసఙ్కుచితపఙ్కజసఖ్యస్యశిక్షా=అసఙ్కుచితపఙ్కజసఖ్యశిక్షా. అసఙ్కుచితపఙ్కజసఖ్యశిక్షాయాంనిష్ణాతా=అసఙ్కుచితపఙ్కజసఖ్యశిక్షానిష్ణాతా, అసఙ్కుచితపఙ్కజసఖ్యశిక్షానిష్ణాతాచసా దృష్టిశ్చ=అసఙ్కుచితపఙ్కజసఖ్య నిష్ణాతదృష్టిః, అసఙ్కుచితపఙ్కజసఖ్యశిక్షానిష్ణాతదృష్టేఃపరిరమ్భాః= అసఙ్కుచితపసఖ్యశిక్షానిష్ణాతదృష్టిపరిరమ్భాః, అసఙ్కుచితపఙ్కజసఖ్యశిక్షానిష్ణాతదృష్టిపరిరమ్భాణాం విజృమ్భితాని = అసఙ్కుచితపఙ్కజసఖ్యశిక్షానిష్ణాతదృష్టిపరిరమ్భవిజృమ్భితాని. తాని= అసఙ్కుచితపఙ్కజసఖ్య శిక్షానిష్ణాతదృష్టిపరిరమ్భవిజృమ్భితాని.

**భావము :**

ఆ సరస్వతీదేవి, నలుని, తదితరుని, గుర్తించుటలో నేర్పుగల దమయన్తినిఁ గూర్చి మఱల చెప్పదొడగినది. ఓ పద్మవదనా-నీకన్నులు పద్మముల తోఁడ చెలిమిని నెఱపుటలో నేర్పుగలవి కాన నట్టి కన్నులతోనా లిఙ్గనాది చేష్టలను గట్టిగా నీతనియందుఁ జేయుము. అనగా నీతనిఁ జూడుము. ॥౧౦౨॥

శ్లో. ప్రత్యర్థిపార్థివపయోనిధిమాథమన్థ
పృథ్వీధరః పృథురయం మథురాధినాథః ।
అశ్మశ్రుజాతమనుయాతి న శర్వరీశః
శ్యామాఙ్కకర్బురవపుర్వదనాబ్జమస్య॥ 103

ప. వి. ప్రత్యర్థిపార్థివపయోనిధిమాథమన్థపృథ్వీధరః-పృథుః-అయం-మథురాధినాథః-అశ్మశ్రుజాతమ్-అనుయాతి - న-శర్వరీశః- శ్యామాఙ్కకర్బురవపుః-వదనాబ్జమ్-అస్య.

అర్థము. ప్రత్యర్థి పార్థివపయోనిధి మాథమన్థ పృథ్వీధరః ; ప్రత్యర్థి పార్థివ = శత్రురాజులనెడి, పయోనిధి = సముద్రమును, మాథ = చిలుకుటయందు మన్థ పృథ్వీధరః = మన్దర పర్వతమైన, పృథుః = గొప్పవాడైన. అయం = ఈ యెదుటనున్నరాజు, మథురాధి నాథః = మథురకు ప్రభువు. అశ్మశ్రు జాతమ్ = మీసములుగూడ పుట్టని, అస్య = ఈ రాజుయొక్క, వదనాబ్జం = ముఖపద్మమును, శ్యామాఙ్క కర్బురవపుః; శ్యామాఙ్క = నల్లని గుర్తుతో కర్బుర = చిత్రమైన, వపుః = ఆకృతిగల, శర్వరీశః = చన్ద్రుడు, నాను యాతి = అనుకరింపలేడు. కళఙ్కము వహించిన చన్ద్రుడు కళఙ్కర హితమైన ముఖమునెట్లు, అనుకరింపగలడు. బాల్యయౌవన వయస్సుల సంధియందున్న యితనిని నీవు వరించుటయుచితము.

వి. ప్రత్యర్థి పార్థివులను పయోనిధితో రూపించుటవలన తాద్రూప్యరూపకము రాజును మన్దరపర్వముతో నేకము గావించుటవలన నభేదరూపకము.

## సమాసములు :

ప్రత్యర్థి పార్థివ పయోనిధి మాథమన్థ పృథ్వీధరః :- ప్రత్యర్థినశ్చతే, పార్థివాశ్చ = ప్రత్యర్థి పార్థివా, ప్రత్యర్థిపార్థివాపఏవపయోనిధిః = ప్రత్యర్థి పార్థివపయోనిధిః, ప్రత్యర్థి పార్థివపయోనిధేః మాథః = ప్రత్యర్థి పార్థివపయోనిధి మాథః, ప్రత్యర్థి పార్థివ పయోనిధిమాథేమన్థ పృథ్వీధరః = ప్రత్యర్థి పార్థివపయోనిధి మాథమన్థ పృథ్వీధరః ।

మథురాధినాథః :- మథురాయాః అధినాథః, మథురాధినాథః ।

అశ్మశ్రుజాతమ్ :- జాతం శ్మశ్రు. యస్యసః = శ్మశ్రుజాతః, నశ్మశ్రు జాతః = అశ్మశ్రుజాతః తమ్ = అశ్మశ్రుజాతమ్ ।

శర్వరీశః :- శర్వర్యాః ఈశః = శర్వరీశః ।

శ్యామాఙ్క కర్బురవపుః :- శ్యామః అఙ్కః యస్యతత్ = శ్యామాఙ్కమ్, కర్బురంచతత్వపుశ్చ = కర్బురవపుః. శ్యామాఙ్కం కర్బురవపుః యస్యసః = శ్యామాఙ్కకర్బురవపుః.

వదనాబ్జమ్ ;- వదనమ్, అబ్జమివ = వదనాబ్జమ్, తత్ = వదనాబ్జమ్.

**భావము :**

మథురను పాలించెడి యీరాజు, శత్రుసాగరమును మథించుటలో మన్దర పర్వతము. మీసములుగూడ మొలవని యీతనిముఖారవిన్దమును, నల్లని కలఙ్కముతోఁ గూడిన చన్ద్రుఁ డనుకరింపలేడు. కావున నింతగొప్ప వాఁడైన వీనిని నీవు వరించుట యుక్తము ॥౧౦౩॥

శ్లో. బాలే ! ధరాధరితనైకవిధప్రవాలే !
పాణౌ జగద్విజయకార్మణమస్య పశ్య! ।
వ్యాఘాతజేన రిపురాజకధూమకేతు
తారాయమాణముపరజ్య మణిం కిణేన॥ **104**

ప. వి. బాలే-అధరాఽధరనైకవిధప్రవాలే-పాణౌ-జగద్విజయకార్మణమ్-అస్య -పశ్య- వ్యాఘాతజేన- రిపురాజకధూమకేతుతారాయమాణమ్- ఉపరజ్య- మణిం-కిణేన.

అర్థము. అధరాఽధరితనైక విధప్రవాలే !, అధర=పెదవిచే, అధరిత=తిరస్కరింపఁబడిన, నైకవిధ= పలువిధములైన, ప్రవాళే=పగడములు, చిగుళ్లు మున్నగువానిని కల, హే బాలే=ఓ బాలా ! అస్య=ఈ మధురాప్రభువు యొక్క, పాణౌ=హస్తమునందు, జగద్విజయ కార్మణమ్;జగద్విజయ= ప్రపఞ్చ విజయమునకు సాధనమైన, కార్మణం = వశీకరణౌషధము వ్యాఘాతజేన =గాయమువలనఁగల్గిన, కిణేన=మచ్చచే, లేదా, కాయచే, ఉపరజ్య=ఉపరాగమునుఁబొంది,(నలుపువన్నెనుఁబొంది యని యర్థము) (స్థితమ్=ఉన్నది) రిపురాజకధూమకేతుతారాయమాణం: రిపురాజక = శత్రురాజుల సమూహమునకు, ధూమకేతుతా రాయమాణమ్; ధూమకేతు తారా=తోకచుక్కవలె, ఆయమాణం=ఆచరించుచున్న, మణిం=రత్నమును పశ్య=చూడుము.

**సమాసములు :**

అధరాధరిత నైకవిధప్రవాలే :- అధరేణ అధరితాని=అధరాఽధరితాని, నఏకవిధాని=నైకవిధాని,నైకవిధాని చ తాని ప్రవాలానిచ=నైకవిధ ప్రవా

లాని, అధరాధరితాని నైకవిధప్రవాలాని యస్యాస్సా=అధరాధరిత నైక విధప్రవాలా ! తస్యాస్సమ్బుద్ధిః, అధరాధరిత నైకవిధప్రవాలే !

జగద్విజయకార్మణమ్ :- జగతాం విజయః=జగద్విజయః, జగద్విజయస్య కార్మణమ్=జగద్విజయకార్మణమ్, తత్,=జగద్విజయకార్మణమ్.

వ్యాఘాతజేన :- వ్యాఘాతాత్ జాయత ఇతి వ్యాఘాతజః, తేన=వ్యాఘాత జేన ।

రిపురాజకధూమకేతు తారాయమాణమ్ :- రాజ్ఞాం సమూహః=రాజకమ్, రిపుశ్చతత్, రాజకంచ=రిపురాజకమ్. రిపురాజకస్య ధూమకేతుః=రిపు రాజక ధూమకేతుః. రిపురాజక ధూమకేతు రేవతారా=రిపురాజక ధూమ కేతుతారా, రిపురాజక ధూమకేతుతారేవ ఆచరతీతి=రిపురాజక ధూమ కేతుతాతారాయమాణః, తమ్ = రిపురాజక ధూమకేతుతారాయమాణమ్

**భావము:**

పగడములు, చిగుళ్లు మున్నగు పెక్కు విధములగు ప్రవాళములను తిరస్కరించిన పెదవి కల యో బాలా ! ఈ మధురాధిపతి యొక్క హస్తము నందు ప్రపఞ్చ విజయసాధనమైన వశీకరణౌషధమున్నది. యుద్ధములయందలి గాయమువలనఁగల్గి నల్లబడిన కాయగలదు. మఱియు శత్రురాజుల పాలిటికి తోక చుక్కవలె మెఱిసెడి కఙ్కణమణి గూడ నతని హస్తమునఁ గలదు. దానిని జూడుము. ॥౧౦౪॥

**శ్లో.** **ఏతద్భుజారణిసముద్భవవిక్రమాగ్నిం**
**చిహ్నం ధనుర్గుణకిణః ఖలు ధూమలేఖా ।**
**జాతం యయారిపరిషన్మశకార్థయాఽశ్రు**
**విస్రావణాయ రిపుదారదృగమ్బుజేభ్యః॥ 105**

ప. వి. ఏతద్భుజారణిసముద్భవవిక్రమాగ్నిచిహ్నం- ధనుర్గుణకిణః- ఖలు - ధూమలేఖా - జాతం - యయా - అరిపరిషన్మశకార్థయా - అశ్రువిస్రావణాయ - రిపుదారదృగమ్బుజేభ్యః.

**అర్థము.** ఏతద్భుజారణి సముద్భవ విక్రమాగ్ని చిహ్నమ్; ఏతత్ = ఈ రాజు యొక్క, భుజారణి=భుజములనెడి యరణికట్టెయందు, సముద్భవ=జన్మించి

చిన, విక్రమాగ్ని = పరాక్రమాగ్నియొక్క, చిహ్నం = గుర్తైన, ధనుర్గుణ కిణః, ధనుర్గుణ = వింటినారి వలన, కిణః = మచ్చయే, ధూమలేఖా ఖలు = ధూమరాజి గదా ! అరిపరిషన్మశకార్థయా, అరిపరిషత్ = శత్రుసమూహమనెడి, మశక = దోమలను, అర్థయా = తొలగించుటయే ప్రయోజనముగాఁ గల్గిన, యయా = ఏ ధూమరాజిచే, రిపుదారదృగమ్బుజేభ్యః, రిపుదార = శత్రుభార్యలయొక్క, దృగమ్బుజేభ్యః = తామరపూవులవంటి కనులనుండి, అశ్రువి స్రావణాయ; అశ్రు = కన్నీటిని, విస్రావణాయ = స్రవింపఁజేయుటకు, జాతమ్ = సాధనముగానేర్పడుట జరిగినది.

వి. ఇచ్చట భుజములను అరణి కర్రలుగను, పరాక్రమము నగ్నిగను వింటినారివలని మచ్చను ధూమపఙ్క్తిగను, శత్రుసమూహమును దోమలుగను రూపించుటవలన రూపకాలఙ్కారము.

**సమాసములు :**

ఏతద్భుజారణి సముద్భవ విక్రమాగ్ని చిహ్నం :- ఏ తస్య భుజైవ అరణిః = ఏతద్భు జారణిః, ఏతద్భు జారణేః, సముద్భవః యస్యసః = ఏతద్భు జారణి సముద్భవః, ఏతద్భు జారణి సముద్భవశ్చాసౌ విక్రమాగ్నిశ్చ = ఏతద్భుజారణి సముద్భవ విక్రమాగ్నిః, ఏతద్భు జారణి సముద్భవ విక్రమాగ్నేః చిహ్నమ్ = ఏతద్భుజారణి సముద్భవ విక్రమాగ్ని చిహ్నమ్ !

దనుర్గుణకిణః :- ధనుషః గుణః = ధనుర్గుణః. ధనుర్గుణ స్యకిణః = ధనుర్గుణకిణః.

ధూమలేఖా :- ధూమస్యలేఖా = ధూమలేఖా

అరిపరిషన్మశకార్థయా :- అరీణాంపరిషత్ = అరిపరిషత్, అరిపరిషదేవ మశకాః = అరిపరిషన్మశకాః. అరిపరిషన్మశకాః అర్థః యస్యాస్సా = అరిపరిషన్మశకార్థా, తయా = అరిపరిషన్మశకార్థయా.

అశ్రువిస్రావణాయ :- అశ్రూణాం విస్రావణమ్ = అశ్రువిస్రావణమ్, తస్మై = అశ్రువిస్రావణాయ.

రిపుదారదృగమ్బుజేభ్యః :- రిపూణాందారాః = రిపుదారాః, దృశః అమ్బు

జానీవ=దృగమ్బుజాని రిపుదారాణాం దృగమ్బు జాని, రిపుదార దృగమ్బు జాని, తేభ్యః=రిపుదారదృగమ్బుజేభ్యః ।

**భావము :**

ఈ రాజు చేతియందు పింఛినారివలన నేర్పడిన మచ్చయున్నది. అది ఈతని భుజమనెడి యరణి కట్టియందుద్భవించిన పరాక్రమాగ్నికి చిహ్నమైన పొగగా నున్నది. ఆ పొగ, శత్రువులనెడి దోమలను తఱుముటకు వేయఁబడగా నది ఆతని శత్రుస్త్రీల నయనపద్మములనుండి కన్నీటిని కార్పించుటకును సాధనముగా నేర్పడినది. ॥౧౦౫॥

శ్లో. శ్యామీకృతాం మృగమదైరివ మాథురీణాం
ధౌతైః కలిన్దతనయామధిమధ్యదేశమ్ ।
తత్రాఽఽప్తకాలియమహాహ్రదనాభిశోభాం
రోమావలీమివ విలోకయితాసి భూమేః॥ 106

ప.వి. శ్యామీకృతాం - మృగమదైః - ఇవ-మాథురీణాం - ధౌతైః-కలిన్దతనయామ్-అధిమధ్యదేశమ్ - తత్ర - ఆప్తకాలియమహాహ్రదనాభిశోభాం-రోమావలీమ్-ఇవ-విలోకయితాసి-భూమేః.

అర్థము. మాథురీణాం=మథురానగరియందు జన్మించిన స్త్రీలయొక్క, ధౌతైః=కడుగఁబడిన, మృగమదైః రివ=కస్తూరికాలేపములతో ననునట్లు, శ్యామీకృతాం=నల్లనిదిగాఁ జేయఁబడినదియు, అధిమధ్యదేశం= మధ్యదేశమునందు అనగా మధ్యదేశమను దేశ విశేషమునందు, (శరీరమందలి మధ్యభాగమునందు) ఆప్తకాలియమహాహ్రదనాభిశోభాం; ఆప్త=పొందఁబడిన, కాలియమహాహ్రద=కాలియనాగునియొక్క, మహాహ్రద=గొప్ప మడుగనెడి, నాభి=బొడ్డుయొక్క, శోభాం=శోభ గల్గిన (కావుననే) భూమేః=భూమికి. రోమావలీమివ = నూగారో యనునట్లున్న, కలిన్ద తనయామ్=కాళిన్ది యను నదిని, తత్ర=ఆ మథురయందు, విలోకయితాసి=చూడఁగలవు.

వి. మధురయందలి కాలిన్ది యా నగరస్త్రీల కస్తూరికాలేపములతో నల్లబడక పోయినను, నల్లఁబడినట్లు భావించుట వలన నుత్ప్రేక్ష.

ఆట్లే, కాలిన్ది భూమికి నూగారుగా లేకపోయినను, నూగారో యని భావించుటవలన నదియు నుత్ప్రేక్ష. రెండుచోట్లను, వ్యఞ్జకమగు నివ శబ్దమునుఁ బ్రయోగించుటవలన నివి వాచ్యములు.

**సమాసములు :**

శ్యామీకృతామ్ :— అశ్యామా, శ్యామాసమ్పద్యమానాకృతా = శ్యామీకృతా, తామ్=శ్యామీకృతామ్ ।
మాథురీణామ్ :— మథురాయాం జాతాః=మాథుర్యః, తాసామ్=మాథురీణామ్ ।
అధిమధ్యదేశం :— మధ్యదేశే=అధిమధ్యదేశమ్ ।
ఆప్తకాలియమహాహ్రదనాభిశోభా :— కాలియస్యమహాహ్రదః=కాలియమహాహ్రదః, కాలియమహాహ్రద ఏవనాభిః = కాలియమహాహ్రదనాభిః, కాలియమహాహ్రదనాభేః శోభా = కాలియమహాహ్రదనాభిశోభా, ఆప్తా-కాలియమహాహ్రదనాభిశోభాయయాసా = ఆప్తకాలియమహాహ్రదనాభిశోభా, తామ్=ఆప్తకాలియమహాహ్రదనాభిశోభామ్ ।
రోమావలీమ్ :— రోమ్ణామావలీ=రోమావలీ, తామ్ = రోమావలీమ్ ।

**భావము :**

మధ్యదేశమునందు కాలిన్ది యను నది ప్రవహించుచున్నది. అదియే యమున యని ప్రసిద్ధము. అది సహజముగా నల్లనివర్ణము గల్గినదై కానవచ్చును. కాని మధురానగర స్త్రీలు ఆ నదియందు జలకములాడు సమయమున వారిమై పూతయగు కస్తూరి, నదియందు కలియుటచే నది నల్లఁబడినదో యనునట్లు కానవచ్చుచున్నది. ఆ నదియందు కాలియుడను మహాసర్పము నివసించు గొప్ప మడుగుఁ గలదు. ఆ మడుగు ఆ కాలిన్దికి నాభివలె శోభించుచున్నది. అది శరీరమధ్యదేశము వంటి మధ్యదేశమున శోభించుచున్నది. కావుననే యా నది భూమికి నూగారో యనునట్లు వెలయుచున్నది. నీ వా రాజును వరించినచో నా నదిని నీవు చూఁడగల్గుదువు. ॥౧౦౬॥

శ్లో. గోవర్ధనాచలకలాపిచయప్రచార
నిర్వాసితాహిని ఘనే సురభిప్రసూనే ।
తస్మిన్ననేన సహ నిర్విశ నిర్విశఙ్కం
వృన్దావనే వనవిహారకుతూహలాని॥ 107

ప.వి. గోవర్ధనాచలకలాపిచయప్రచారనిర్వాసితాహిని -ఘనే - సురభిప్రసూనే- తస్మిన్-అనేన-సహ-నిర్విశ - నిర్విశఙ్కం-వృన్దావనే-వనవిహారకుతూహలాని.

అర్థము. గోవర్ధనాచలకలాపిచయప్రచారనిర్వాసితాహిని; గోవర్ధనాచల = గోవర్ధనపర్వతమందలి, కలాపిచయ=నెమళ్ళ గుంపుయొక్క, ప్రచార= సఞ్చారముచే, నిర్వాసిత=తఱుమఁబడిన, అహిని = సర్పములు గలిగినదియు (అందువలన నిర్భయవిహారము గల్గిన), ఘనే = దట్టమైన, సురభిప్రసూనే = వాసనతపుష్పములు గల్గిన లేదా సుగన్ధిపుష్పములు గల్గిన, తస్మిన్=ఆ ప్రసిద్ధమైన, వృన్దావనే=వృన్దావనమునందు, అనేన సహ=ఈ రాజుతోడ, నిర్విశఙ్కం=నిర్భయముగా, వనవిహార కుతూహలాని=అరణ్యవిహార సుఖములను, నిర్విశ=అనుభవింపుము.

**సమాసములు :**

గోవర్ధనాచల కలాపి చయప్రచార నిర్వాసితాహిని :- గోవర్ధన ఇతి అచలః=గోవర్ధనా చలః, గోవర్ధనాచలే కలాపినః=గోవర్ధనాచల కలాపినః, గోవర్ధనాచల కలాపినాంచయః=గోవర్ధనాచల కలాపిచయః, గోవర్ధనాచల కలాపిచయస్య ప్రచారః=గోవర్ధనాచల కలాపిచయ ప్రచారః, గోవర్ధనాచల కలాపిచయ ప్రచారేణ నిర్వాసితాః= గోవర్ధనాచల కలాపిచయ ప్రచార నిర్వాసితాః, గోవర్ధనాచల కలాపిచయప్రచార నిర్వాసితాః, అహయః యస్మిన్ తత్=గోవర్ధనాచల కలాపిచయ ప్రచార నిర్వాసితాహి.

సురభిప్రసూనే :- సురభేః ప్రసూనానియస్మిన్ తత్=సురభిప్రసూనం తస్మిన్=సురభిప్రసూనే. సురభీణి ప్రసూనాని యస్మిన్ తత్=సురభి ప్రసూనమ్, తస్మిన్ = సురభిప్రసూనే.

23)

నిర్విశఙ్కమ్ :— నిర్గతా విశఙ్కా యస్మిన్ కర్మణితత్ యథా భవతి తథా=నిర్విశఙ్కమ్.

వనవిహార కుతూహలాని :— వనేవిహారః = వనవిహారః, వనవిహారస్య కుతూహలాని=వనవిహార కుతుహలాని.

**భావము :**

ఈ దేశమందు ప్రసిద్ధమైన గోవర్ధనగిరియు, శ్రీకృష్ణ భగవానుఁడు విహరించిన వృన్దావనము కలవు. ఆ గోవర్ధనగిరియందు నెమళ్లు సంచరించుట వలన వాని భయమునకు సర్పములు తొలగిపోవును. అందు వసన్తములోని సుగన్ధి పుష్పములు మెండుగా నుండును. మఱియు వివిధ వృక్ష లతాగుల్మములచే నచ్చట బృన్దావనము సూర్యకిరణములు చొచ్చుకొనుటకు సాధ్యము కానంత దట్టముగా వెలయుచున్నది. కాన నీవు (మధురాధిపతిని వలచితివేని) ఆతనితో వనవిహార విలాసములను నిర్భయముగా ననుభవింపఁ గలవు. ॥౧౦౭॥

శ్లో. భావీ కరః కరరుహాఙ్కురకోరకోఽపి
తద్వల్లిపల్లవచయే తవ సౌఖ్యలక్ష్యః ।
అన్తస్త్వదాస్యహృతసారతుషారభాను
శోభానుకారి కరిదన్తజకఙ్కణాఙ్కః॥ **108**

ప. వి. భావీ-కరః-కరరుహాఙ్కురకోరకః-అపి-తద్వల్లిపల్లవచయే-తవ-సౌఖ్యలక్ష్యః—అన్తః – త్వదాస్యహృతసారతుషారభానుశోభానుకారికరిదన్తజకఙ్కణాఙ్కః.

అర్థము. త్వదాస్యహృతసారతుషార భానుశోభాను కారికరిదన్తజకఙ్కణాఙ్కః, త్వత్=నీయొక్క, ఆస్య=ముఖముచే, హృత=హరింపఁబడిన, సార=సారముగల, తుషారభాను=చంద్రునియొక్క, శోభా=పరాజయ చిహ్నమైన తెల్లనికాన్తిని, అనుకారి=అనుకరించు, కరిదన్తజ=ఏనుగుదన్తమునుండి యుద్భవించిన, కఙ్కణ=కడియమును, అఙ్కః=గుఱుతుఁగాఁగల్గిన, తవ=నీయొక్క కరః = హస్తము, కరరుహాఙ్కుర కోరకోఽపి = కరరుహాఙ్కుర=నవలపంటి గోరులనెడు, కోరకోఽపి=మొగ్గలుకలదైనను, ఎట్టిగా

నుండుటవలనను మృదువుగా నుండుటవలనను, నిది నఖమా? లేక మొగ్గా? యను సంశయమునకు విషయమైనను, తద్వల్లి పల్లవచయే; తత్=అ వనమందలి, వల్లి=తీగెలు, పల్లవ=చిగుళ్లు అను వీనియొక్క, చయే= సమూహమునందు, అన్తః=మధ్యభాగమున, సౌఖ్యలక్ష్యః; సౌఖ్య=సుఖ ముగా, లక్ష్యః=చూడదగినదిగా, భావీ=ఉండగలదు.

వి. ఇచ్చట చిగుళ్లతోటి సాదృశ్యము వలన, ఇది చిగురా, లేక హస్తమా, యని సందేహింపఁ బడిన దమయన్తి హస్తమును నామె దన్తకఙ్కణ ముచే గుర్తింపఁగలుగుటచే నిశ్చయాన్తమైన సందేహాలఙ్కారము.

**సమాసములు :**

కరరుహాఙ్కుర కోరకః :— కరేరోహ న్తీతి=కరరుహాః, కరరుహాః అఙ్కురా ఇవ=కరరుహాఙ్కురాః, కరరుహాఙ్కురాః కోరకాః యస్యసః =కరరుహాఙ్కుర కోరకః ।

తద్వల్లిపల్లవచయే: వల్లయశ్చ పల్లవాశ్చ=వల్లిపల్లవాః, వల్లి పల్లవానాం చయః=వల్లిపల్లవచయః. తస్మిన్ వల్లిపల్లవచయః=తద్వల్లిపల్లవచయః, తస్మిన్ తద్వల్లివల్లవచయే.

సౌఖ్యలక్ష్యః:- సుఖినః భావః=సౌఖ్యమ్, సౌఖ్యేనలక్ష్యః=సౌఖ్యలక్ష్యః: త్వదాస్యహృతసారతుషార భానుశోభానుకారికరిదన్త జకఙ్కణాఙ్కః: తవ అస్యమ్=త్వదాస్యమ్, త్వదాస్యేనహృతః=త్వదాస్యహృతః, త్వ దాస్యహృతః సారః యస్మాత్సః=త్వదాస్యహృతసారః, తుషారమయా భానవః యస్యసః=తుషారభానుః, త్వదాస్యహృతసారశ్చాసౌ తుషార భానుశ్చ=త్వదాస్యహృతసారతుషారభానుః, త్వదాస్యహృతసార తుషార భానోః శోభా=త్వదాస్యహృతసార తుషారభాను శోభా. త్వదాస్యహృత సార తుషారభానుశోభా మను కరోతీతి=త్వదాస్యహృతసారతుషారభాను శోభానుకారి, కరిణః దన్తః=కరిదన్తః, కరిదన్తాత్ జాయత ఇతి= కరిదన్తజం. కరిదన్తజం చ తత్కఙ్కణంచ=కరిదన్తజకఙ్కణం, త్వదాస్యహృతసారతుషార భానుశోభాను కారిచతత్ కరిదన్తజకఙ్కణం చ=త్వదాస్యహృతసారతుషార భానుశోభాను కారికరిదన్తజకఙ్కణమ్,

త్వద్వాస్యహృతసారతుషారభానుశోభాపుకారికరదన్తజకఙ్కణం అఙ్కాః యస్యాసః=త్వద్వాస్యహృతసారతుషారభాను శోభాపు కారికరదన్తజ కఙ్కణాఙ్కాః॥

**భావము :**

ఓ దమయన్తీ! నీవు బృన్దావనమునందు సంచరించునపుడు నీచేతులు నీగోళ్ళు చిగుళ్ళవలెనున్నను నా వనమందలి చిగుళ్ళమధ్య సుఖముగ కానఁగును. ఏలయనగా—నీ వదనముచే సారముగోల్పోయి తెల్లఁబడి చంద్రునివలె ధవళమైన గజదన్తముతో నిర్మింపఁబడిన కఙ్కణము నీ చేతికిఁదొడిగియుండుటవలన నది తెల్లగానుండి చిగుళ్ళతోఁబాటు కలసిపోయిన నీ హస్తములను గోళ్ళను ప్రత్యేకముగా జూపకలదు. గజదన్తముతో చేయఁబడిన యా కఙ్కణముచుట్టు తెల్లగనుండి మధ్యరన్ధ్రమునుఁగల్గియుండుటవలన సారభూతమగు మధ్యభాగముఁదొలగిన చన్ద్రునివలె కానఁగును. అట్టి కఙ్కణము చిగుళ్ళతో కలసిపోయి భేదము తెలియశక్యముగాని నీ హస్తములను గోళ్ళను, ఆ బృందావనమునందుఁ బ్రత్యేకముగాఁగానవచ్చునట్లు చేయఁగలదని యాశయము॥౧౦౮॥

**శ్లో.** **తజ్జః శ్రమామ్బుసురతాన్తముదానితాన్త**
**ముత్కణ్టకే స్తనయుగే తవ సఞ్చరిష్ణుః ।**
**ఖఞ్జన్ప్రభఞ్జనజనః పథికః పిపాసుః**
**పాతుం కురఙ్గమదపఙ్కిలమప్యశఙ్కమ్॥ 109**

ప. వి. తజ్జః— శ్రమామ్బు— సురతాన్తముదా— నితాన్తమ్- ఉత్కణ్టకే- స్తనయుగే- తవ—సఞ్చరిష్ణుః- ఖఞ్జన్- ప్రభఞ్జనజనః- పథికః- పిపాసుః- పాతుం- కురఙ్గమదపఙ్కిలమ్- అపి—అశఙ్కమ్.

అర్థము. సురతాన్తముదా ; సురతాన్త=సమ్భోగావసానమందు, ముదా=సంతోషముతో, నితాన్తమ్=మిక్కిలి. ఉత్కణ్టకే=పులకములతోఁగూడిన, (ముళ్ళతోఁగూడిన), తవ = నీ యొక్క, స్తనయుగే=చనుదోయిపై, సఞ్చరిష్ణుః=సఞ్చరింపఁగోరినవాడును, ఖఞ్జన్=చెట్లతోఁడను తీగెలతోఁ ఁడుఁగూడియుండుటవలన, మెల్లగా నడచుచువాడును (ముళ్ళతోఁ గూడియుండుటవలన కుంటి కుంటిగా నడచువాడును), పథిక=బాట

సారియు, (కావుననే) పిపాసుః=దప్పిగొనినవాడును, నగు, తజ్జః= ఆ వృన్దావనమందుద్భవించిన, ప్రభఞ్జనజనః=వాయువనెడి జనము, కురఙ్గమదపఙ్కిలమపి; కురఙ్గమద=కస్తూరిచే, పఙ్కిలమపి=అడుసుగమ్మిన దైనను, శ్రమామ్బు=సమ్భోగకాలమందలి చెమట నీటిని, అశఙ్కమ్= సఙ్కోచములేక పాతా=పానముచేయఁగలడు అనగా నీ స్వేదమునుఁ బానముఁజేయును. ఎక్కువశ్రమచే దప్పిగొనిన బాటసారి ముళ్ళతోఁ గూడిన బురదనీటినెట్లుత్రాగునో యట్లే దప్పిగొనిన యా బృన్దావనమందలి వాయువు నీ స్వేదజలమునుఁద్రాగునని యర్థము. అనగా నచ్చటి గాలి నీ చెమటనుఁబోగొట్టును.

**సమాసములు :**

తజ్జః : తస్మాత్ జాయత ఇతి=తజ్జః ।

సురతాన్తముదా : సురతస్య అన్తః= సురతాన్తః, సురతాన్తేముత్= సురతాన్తముత్, తయా=సురతాన్తముదా.

ఉత్కణ్టకే : ఉద్గతాః కణ్టకాః యస్మిన్ తత్=ఉత్కణ్టకమ్, తస్మిన్= ఉత్కణ్టకే.

స్తనయుగే : స్తనయోః యుగమ్= స్తనయుగమ్, తస్మిన్= స్తనయుగే.

ప్రభఞ్జనజనః : ప్రభఞ్జన ఇతిజనః=ప్రభఞ్జనజనః ।

పిపాసుః : పాతుమిచ్ఛుః=పిపాసుః ।

కురఙ్గమదపఙ్కిలమ్ : కురఙ్గస్యమదః=కురఙ్గమదః, కురఙ్గమదేన పఙ్కిలమ్, కురఙ్గమదపఙ్కిలమ్, తత్= కురఙ్గమదపఙ్కిలమ్.

అశఙ్కమ్ : అవిద్యమానాశఙ్కాయస్మిన్ కర్మణితద్యథాభవతి తథా= అశఙ్కమ్.

**భావము :**

సమ్భోగాన్తమందు ఆనన్దముతో నీ శరీరము ఉత్కణ్టకితమగును, అనగా ముళ్ళతోగూడినదిగను పులకములలో గూడినదిగనగును. ఆ బృన్దావనమందు ద్భవించిన వాయువు, బాటసారివలె అలసి, దప్పికనొంది, కస్తూరితో బురద గమ్మినను నీ స్వేదజలమును, పానముగావించి దప్పికఁదీర్చుకొనును. లోక

మున దప్పికొనినవాఁడు ముద్దతోను, బురదతోను, గూడినను, నట్టినీటినిఁ ద్రావి తన దాహమునెట్లో తీర్చుకొనునగదా. బృన్దావనమందు నీవు ఈ రాజుతో సమ్భోగకేళి జరిపినపిదప నీ యొడలియందు పొడమిన చెమటను నందలిమన్ద మారుతము అపహరించునని యాశయము—॥౧౦౯॥

శ్లో. పూజావిధౌ మఖభుజాముపయోగినో యే
విద్వత్కరాః కమలనిర్మలకాన్తిభాజః ।
లక్ష్మీమనేన దధతానుదినం వితీర్ణై
స్తే హాటకైః స్ఫుటవరాటకగౌరగర్భాః॥ 110

ప. వి. పూజావిధౌ- మఖభుజామ్- ఉపయోగినః— యే-విద్వత్కరాః—కమల నిర్మలకాన్తిభాజః— లక్ష్మీమ్—అనేన— దధతా—అనుదినం— వితీర్ణైః— తే- హాటకైః-స్ఫుటవరాటకగౌరగర్భాః.

అర్థము. మఖభుజాం=దేవతలయొక్క, పూజావిధౌ=అర్చనావిధియందును, యాగాదికార్యములయందును, యే విద్వత్కరాః=ఏ విద్వాంసులహస్తములు, కమలనిర్మల కాన్తిభాజః ; కమల=దానజలముచే, నిర్మల=శుద్ధమైన, కాంతి=కాన్తిని, భాజః=పొందినవో, లేదా కమల=పద్మముల యొక్క, నిర్మల=స్వచ్ఛమైన, కాంతి=కాంతిని, భాజః=పొందినవో, తే=ఆ విద్వాంసులహస్తములు, లక్ష్మీం = లక్ష్మిని, దధతా = ధరించుచున్న, అనేన=ఈ రాజుచే, అనుదినం=ప్రతిదినము, వితీర్ణైః= ఈయఁబడిన, హాటకైః=బంగారములచే, స్ఫుటవరాటకగౌరగర్భాః; స్ఫుట=స్పష్టములైన, అనగా ప్రకాశమానములైన, వరాటక=కమలబీజములవలె, గౌర=పసుపువన్నెతోఁగూడిన, గర్భాః=మధ్యప్రదేశమునుఁగలవిగా, కృతాః=చేయఁబడినది.

**సమాసములు :**

పూజావిధౌ=పూజాయాః, విధిః=పూజావిధిః, తస్మిన్=పూజావిధౌ ।
విద్వత్కరాః : విదుషాంకరాః=విద్వాత్కరాః

కమలనిర్మలకాన్తిభాజః : నిర్మలాచసాకాన్తిశ్చ=నిర్మలకాన్తిః, కమలవన్నిర్మలకాన్తిః=కమలనిర్మలకాన్తిః, కమలనిర్మలకాన్తిం, భజన్తీతి=కమలనిర్మలకాన్తిభాజః,

స్ఫుటవరాటకగౌరగర్భాః : స్ఫుటాశ్చతేవరాటకాశ్చ=స్ఫుటవరాటకాః, స్ఫుటవరాటకాఇవగౌరఃగర్భః, యేషాంతే=స్ఫుటవరాటకగౌరకర్భాః।

**భావము :**

ఆ మధురాధిపతి పూజాకాలములయందు దానముపట్టుట కర్హతగల విద్వాంసుల హస్తములను దానజలములచేస్వచ్ఛకాన్తిగలవిగఁజేయును. లేదా విద్వాంసులహస్తములను కమలములవంటి నిర్మలకాన్తులు గలవిగాఁజేయును. కానదానిచే వారిహస్తములు కమలసదృశములై శోభించును. అట్టి విద్వాంసుల హస్తములు లక్ష్మీవస్తుఁడగు నీ రాజు ప్రతిదినమొసంగెడి బంగారములచే ; ప్రకాశవన్తములగు కర్ణికలతోననగా కమల ఫలములనఁబడు బీజకోశములతోఁగూడిన వానివలెఁజేయఁబడును. రాజు దానముజేసెడి బంగారము కమలఫలములుగను వారిహస్తములు కమలములుగనునైనవి. కమల మధ్యమందలి వరాటకము లేదా కర్ణిక, బంగారువలె పసిడివన్నె గలిగియుండును. అనగా నీ మధురాధిపతి మిక్కిలి దానపరుడు కాన నీకు వరింపఁతగిన వాడని యాశయము॥౧౧౦॥

> శ్లో. వైరిశ్రియం ప్రతి నియుద్ధమనాప్నువన్ యః
> కిఞ్చిన్న తృప్యతి ధరావలయైకవీరః !
> స త్వామవాప్య నిపతన్మదనేషువృన్ద
> స్యన్దీని తృప్యతు మధూని పిబన్నివాఽయమ్॥ 111

ప. వి. వైరిశ్రియం-ప్రతి- నియుద్ధం- అనాప్నువన్-యఃకిఞ్చిత్-న-**తృప్యతి**-ధరావలయైకవీరః- సః-త్వామ్- అవాప్య- నిపతన్మదనేషువృన్దస్యన్దీని-తృప్యతు-మధూని-పిబన్-ఇవ-అయమ్.

అర్థము. ధరావలయైకవీరః ; ధరావలయ=భూవలయమునకు, ఏక=సాటిలేని, వీరః=వీరుఁడైన, యః=ఏ మధురాధిపతి, వైరిశ్రియంప్రతి=శత్రువు లక్ష్మినిఁగూర్చి, నియుద్ధం=బాహుయుద్ధమును, అనాప్నువన్=పొందక

కిఞ్చిన=కొంచెమైనను, నతృప్యతి=తృప్తిజెందడో, సః=అట్టిబాహు యుద్ధమునుఁగోరిన, అయం=ఈమథురాధిపతి, త్వామ్=నిన్ను అవాప్య= పొంది, నిపతన్మదనేషు వృన్దస్యన్దీని ; నిపతత్=పైనబడుచున్న, మద నేషు=మన్మథబాణముల యొక్క, వృన్ద=సమూహమునుండి, స్యన్దీని= స్రవించుచున్న, మధూని = మకరన్దములను, పిబన్నివ=పానముఁజేయు చున్నాడోయనునట్లు, తృప్యతు=తృప్తినిఁబొందునుఁగాత.

వి. మన్మథబాణములనుండి స్రవించు మకరన్దమునుఁ బానము జేయకపోయి నను, చేసినట్లుచెప్పుటవలననుత్ప్రేక్ష.వ్యఞ్జకమైన 'ఇవ' శబ్దమునుఁబ్రయో గించుటవలన నది వాచ్యము-ఇందువలన నామన్మథ బాణములు నీ సం యోగము వలన గాఢానందమునుఁగల్గించునను వస్తువు ప్రతీయమాన మగుటవలన నుత్ప్రేక్షాలఙ్కారముచే వస్తుధ్వని.

## సమాసములు :

నియుద్ధమ్ : నితరాంయుద్ధమ్=నియుద్ధమ్ । తత్=నియుద్ధమ్ ।
వైరిశ్రియమ్ : వైరిణాంశ్రీః=వైరిశ్రీః, తామ్=వైరిశ్రియమ్।
ధరావలయైకవీరః : ధరాయాఃవలయః = ధరావలయః, ఏకశ్చాసౌ వీరశ్చ=ఏకవీరః, ధరావలయస్య ఏకవీరః=ధరావలయైకవీరః।
నిపతన్మదనేషువృన్దస్యన్దీని : మదనస్యఇషవః=మదనేషవః, నిపత న్తశ్చతే మదనేషవశ్చ= నిపతన్మదనేషవః, నిపతన్మదనేషూణాంవృన్దః= నిపతన్మదనేషువృన్దః। నిపతన్మదనేషువృన్దాత్ స్యన్దీని=నిపతన్మదనేషు వృన్దస్యన్దీని, తాని=నిపతన్మదనేషు వృన్దస్యన్దీని।

## భావము :

భూతలమున సాటిలేని వీరుఁడైన మధురాధిపతి శత్రురాజులక్ష్మిని వారు తమంతట తాము సమర్పించు కొనినను పుచ్చుకొనఁడు. అతడు శత్రువులతో బాహుయుద్ధమును గావించియే శత్రురాజ్యలక్ష్మిని సంపాదించును. అట్లు కానిచో నతనికిఁ దృప్తి యుండదు. అట్టి యుద్ధప్రియుడైన మధురాధిపతి, నిన్నుఁబడసి తనపైనిఁబడుచున్న మన్మథ బాణములైన పుష్పములనుండి స్రవించెడి మకరన్ద మును పానముచేయు చున్నాడో యనునట్లు తృప్తినిఁ బొందునుఁగాత ॥౧౧౧॥

శ్లో. తస్మాదియం క్షితిపతిక్రమగమ్యమాన
మధ్వానమైక్షత నృపాదవతారితాక్షీ ।
తద్భావబోధబుధతాం నిజచేష్టయైవ
వ్యాచక్షతే స్మ శిబికానయనే నియుక్తాః॥ 112

ప.వి. తస్మాత్ - ఇయం - క్షితిపతిక్రమగమ్యమానమ్ - అధ్వానమ్ - ఐక్షత - నృపాత్ - అవతారితాక్షీ - తద్భావబోధబుధతాం - నిజచేష్టయా - ఏవ - వ్యాచక్షతే - స్మ - శిబికానయనే - నియుక్తాః.

అర్థము. ఇయం = ఈ దమయన్తి తస్మాత్ = ఆ రాజునుండి, అవతారితాక్షీ = దిగువకు మఱలింపఁబడిన నేత్రములు గలదై, క్షితిపతిక్రమ గమ్యమానమ్; క్షితిపతి = పోవలసిన రాజులయొక్క, క్రమ = వరుసచే, గమ్యమానమ్ = పోఁబడుచున్న, అధ్వానమ్ = మార్గమును, ఐక్షత = చూచినది, అథ = పిదప, శిబికానయనే = పల్లకినిఁ గొనిపోవు విషయము, నియుక్తాః = నియమింపఁబడిన వాహకులు, తద్భావబోధ బుధతామ్; తత్ = ఆ దమయన్తి యొక్క, భావ = భావమును, బోధ = తెలుసుకొనుట యందలి, బుధతామ్ = పాణ్డిత్యమును, నిజచేష్టయైన = మఱియొక చోటికిఁ గొనిపోవుటయను తమ చేష్టచేతనే, వ్యాచక్షతేస్మ = జ్ఞప్తిపఱచుచుండిరి.

**సమాసములు :**

క్షితిపతిక్రమ గమ్యమానమ్ :— క్షితీనాం పతయః = క్షితిపతయః, క్షితి పతీనాంక్రమః = క్షితిపతిక్రమః, క్షితిపతిక్రమేణ గమ్యమానః = క్షితిపతి క్రమ గమ్యమానః, తమ్ = క్షితిపతిక్రమ గమ్యమానమ్.

అవతారితాక్షీ :— అవతారితే అక్షిణీయస్యాస్సా = అవతారితాక్షీ ।

తద్భావబోధబుధతామ్ :— తస్యాః భావః = తద్భావః, తద్భావస్య బోధః = తద్భావబోధః, తద్భావబోధే, బుధతా = తద్భావబోధబుధతా, తామ్ = తద్భావబోధబుధతామ్.

నిజచేష్టయా :— నిజాచసా చేష్టాచ = నిజచేష్టా, తయా = నిజచేష్టయా.

శిబికానయనే :— శిబికాయాః నయనమ్ = శిబికానయనమ్, తస్మిన్ = శిబికానయనే ।

భావము :

సరస్వతీదేవి యింత వర్ణించినను దమయన్తికి నా మధురాధిపతి యందు నభిలాష యేర్పడలేదు. కొననామె యాతని నుండి తన దృష్టిని దించుకొని, వరుసగా రాజులనుఁ జూచుట కేర్పడిన త్రోవనుఁ జూచెను. అనగా నిటనుండి మఱియొక రాజుకడకుఁ గొనిపొమ్మని సూచించెను. కాని యా వాహకులు తమ చేష్టలచేతనే యనగా నామెను మఱియొక రాజునొద్దకు కొనిపోవుట చేతనే యామె భావమును గ్రహించుటలోని తమవైదుష్యమునుఁ బ్రకటించుచుండిరి. ॥౧౧౨॥

శ్లో. భూయోఽపి భూపమపరం ప్రతి భారతీ తాం
త్రస్యచ్చమూరుచలచక్షుషమాచచక్షే ।
ఏతస్య కాశినృపతేస్త్వమవేక్ష్య లక్ష్మీ
మక్ష్ణోర్ముదం జనయ ఖఞ్జనమఞ్జునేత్రే॥ 113

ప.వి. భూయః-అపి-భూపమ్-అపరం-ప్రతి-భారతీ-తాం-త్రస్యచ్చమూలరుచల చక్షుషమ్-ఆచచక్షే-ఏతస్య-కాశినృపతేః-త్వమ్-అవేక్ష్య-లక్ష్మీమ్-అక్ష్ణోః-ముదం-జనయ-ఖఞ్జనమఞ్జునేత్రే.

అర్థము. భారతీ=సరస్వతీదేవి, భూయోఽపి = మఱలను, అపరం=మఱియొక, భూపంప్రతి=రాజునుఁ గూర్చి, త్రస్యచ్చమూరుచలచక్షుషమ్; త్రస్యత్= భయపడుచున్న, చమూరు=జింకయొక్క, చలచక్షుషమ్, చంచలమైన నేత్రములవంటి నేత్రములు గల్గిన, తామ్=ఆ దమయన్తిని, ఆచచక్షే=చెప్పినది. (ఏమనగా) హేఖఞ్జనమఞ్జునేత్రే ! ఖఞ్జన=కాటుక పిట్టవంటి, మఞ్జు= రమ్యములైన, నేత్రే=కన్నులుగలయో దమయన్తీ; త్వమ్=నీవు, ఏతస్య =ఈ, కాశి నృపతేః=కాశి రాజుయొక్క, లక్ష్మీం=ఐశ్వర్యమును అవేక్ష్య= చూచి, అక్ష్ణోః=నేత్రములకు, ముదం=సంతోషమును, జనయ=కల్గించు కొనుము.

సమాసములు :

త్రస్యచ్చమూరుచలచక్షుషమ్ :– త్రస్యన్ చాసౌ చమూరుశ్చ=త్రస్యచ్చమూరుః, త్రస్యచ్చమూరోః చలచక్షురివ చక్షుః యస్యాస్సా త్రస్యచ్చమూరుచలచక్షుః తామ్=త్రస్యచ్చమూరు చలచక్షుషమ్,

కాశినృపతేః : కాశ్యాః నృపతిః=కాశినృపతిః, తస్య=కాశినృపతేః.

ఖఞ్జనమఞ్జునేత్రే : ఖఞ్జనస్యేవమఞ్జునీ నేత్రేయస్యాస్సా = ఖఞ్జనమఞ్జునేత్రా, తస్యాస్సమ్బుద్ధిః, హేఖఞ్జనమఞ్జునేత్రే ।

**భావము :**

సరస్వతీదేవి మఱల రాజును గుఱించి, యాచలిత హరిణాక్షియైన దమయన్తికిఁ జెప్పఁదొడగెను- కాటుకపిట్టలకనులవంటి కనులుగల యోదమయన్తీ ! నీవు ఈ కాశిరాజుయొక్క యైశ్వర్యముఁ జూచి కన్నుల కానందమును సంపాదింపుము. ॥౧౧౩॥

**శ్లో.** **ఏతస్య సాఽవనిభుజః కులరాజధానీ**
**కాశీ భవోత్తరణధర్మతరిః స్మరారేః ।**
**యామాగతా దురితపూరితచేతసోఽపి**
**పాపం నిరస్య చిరజం విరజీభవన్తి॥** **114**

ప. వి. ఏతస్య- సా - అవనిభుజః - కులరాజధానీ- కాశీ - భవోత్తరణధర్మతరిః - స్మరారేః - యామ్-ఆగతాః-దురితపూరితచేతసః-అపి-పాపం-నిరస్య-చిరజం-విరజీభవన్తి.

అర్థము. స్మరారేః = (సంసారసాగరమునకు నావికుఁడైన) మహాదేవునకు సంబంధించినదైన, భవోత్తరణధర్మతరిః, భవ = సంసారమును, ఉత్తరణ=దాటుటకు, ధర్మతరిః=ధర్మనౌకయైన, సా=అప్రసిద్ధమైన, కాశీ=కాశి,ఏతస్య=ఈ, అవనిభుజః=రాజునకు,కులరాజధానీ, కుల=వంశపరంపరగా వచ్చిన, రాజధానీ = ప్రధాన నగరము. దురితపూరితచేతసోఽపి; దురిత=పాపములతో, పూరిత=నిండిన, చేతసోఽపి=ఆత్మలుగలవారుగూడ, యాం = ఏకాశినిఁగూర్చి, ఆగతాః=వచ్చినవారై, చిరజం=చాలకాలమునుండి యేర్పడిన, పాపం=పాపమును, నిరస్య=తొలగించుకొని, విరజీభవన్తి=రజోగుణమునుఁ దొలగించుకొను వారగుచున్నారు. అనగా రజోగుణమునుఁ దొలగించుకొని సత్త్వ గుణమును సంపాదించుకొని ముక్తినిఁ బడయుదురు.

**సమాసములు :**

అవనిభుజః : అవనింభునక్తీతి=అవనిభుక్, తస్య=అవనిభుజః,
కులరాజధానీ : కులాగతారాజధానీ=కులరాజధానీ.
భవోత్తరణధర్మతరిః : భవాత్‌ఉత్తరణమ్ = భవోత్తరణమ్, ధర్మారా తరిః=ధర్మతరిః భవోత్తరణే ధర్మతరిః=భవోత్తరణధర్మతరిః।
స్మరారేః : స్మరస్యఅరిః=స్మరారిః, తస్య=స్మరారేః ।
దురితపూరితచేతసః : దురితేనపూరితం=దురితపూరితం, దురిపూరితం చేతఃయేషాంతే=దురితపూరితచేతసః ।
విరజీభవన్తి : అవిరజసః విరజసః సమ్పద్యమానాః భవన్తి=విరజీభవన్తి।

**భావము :**

సంసారసాగరమునకు నావికుఁడైన శ్రీమహాదేవునకు సంబంధించినదియు, సంసారమును దాటుటకు ధర్మనౌకయనగు నా ప్రసిద్ధమైన కాశి యారాజునకు రాజధాని. ఆ నగరమునకు వచ్చిన పాపాత్ములుగూడ, చిరకాలమునుండి కరుడు గట్టిన తమ పాపములను వదలుకొని సంసార బీజమైనరజో గుణమునుఁ బోకార్చు కొని సత్త్వ ప్రధానులై ముక్తినిఁ బడయుదురు. ॥౧౧౪॥

**ఆలోచ్య భావివిధికర్తృక లోకసృష్టి**
**కష్టాని రోదితి పురా కృపయైవ రుద్రః ।**
**నామేచ్ఛయేతి మిషమాత్రమధత్త యత్తాం**
**సంసారతారణతరీ మసృజత్ పురీం సః॥ 115**

ప. వి. ఆలోచ్య-భావివిధికర్తృకలోకసృష్టికష్టాని-రోదితి-పురా-కృపయా-ఏవ-రుద్రః-నామేచ్ఛయా-ఇతి-మిషమాత్రమ్-అధత్త- యత్-తాం-సంసార తారణతరీమ్-అసృజత్-పురీం-సః.

అర్థము. రుద్రః=శివుఁడు భావివిధికర్తృకలోకసృష్టి కష్టాని; భావి=జరుగఁగల, విధికర్తృక = బ్రహ్మకర్తగా గల యనగా బ్రహ్మచేసెడి, లోకసృష్టి = ప్రపఞ్చసృష్టిలో నన్తర్గతములగు ప్రాణిసమూహముయొక్క, కష్టాని = కష్టములను, ఆలోచ్య=ఆలోచించి, కృపయైవ=దయచేతనే, పురా =

పూర్వము, రోదితి = ఏడ్చెను, నామేచ్ఛయా, ఇతియత్=రుద్రుఁడను నామమందలి కోరికతో (రోదించెననుట) ఏదికలదో, తత్=అది, మిష మాత్రమ్=వ్యాజమాత్రమును, అధత్త=ధరించినది. యత్=ఏలయనగా, సః=ఆ రుద్రుఁడు, సంసారతారణతరీం; సంసార=జననమరణ ప్రవాహమును, తారణ=తరింపఁజేయుట యందు, తరీం=నౌకయైన, తాం=ఆ, పురీం=కాశీపట్టణమును, అసృజత్=సృజించెను.

**సమాసములు :**

భావివిధికర్తృక లోకసృష్టి కష్టాని :- విధిః కర్తా యస్యాస్సా=విధికర్తృకా, లోకానాం సృష్టిః=లోకసృష్టిః, విధికర్తృకా, చసాలోకసృష్టిశ్చ=విధికర్తృకలోకసృష్టిః, విధికర్తృకలోకసృష్టే, కష్టాని=విధికర్తృకలోకసృష్టి కష్టాని, తాని=విధికర్తృకలోకసృష్టికష్టాని ।
నామేచ్ఛయా : నామ్ని ఇచ్ఛా=నామేచ్ఛా, తయా=నామేచ్ఛయా
మిషమాత్రమ్ : మిషఏవ=మిషమాత్రమ్, తత్=మిషమాత్రమ్।
సంసారతారణతరీమ్ : సంసారస్యతారణమ్=సంసారతారణమ్, సంసారతారణే తరీ=సంసారతారణతరీ, తామ్=సంసారతారణతరీమ్-

**భావము :**

రుద్రుడు రాఁబోవుకాలమునందు బ్రహ్మగావించు సృష్టియందలి జంతుజాలముల కష్టములను ఆలోచించి, వారియందు దయచేతనే దుఃఖించెను. అట్లు రోదనము చేయుటచేతనే యాతడు రుద్రుఁడని పేరునువంహిచెను. కాని "రుద్రుఁడ"ను పేరు రావలయునను కోరికతో నేడ్చుటవలన నా పేలేర్పడినదని పురాణములు చెప్పుట సరికాదు. కావుననే యనగా దయదోఁడనే యతడు సంసారము నుండి ప్రాణులనుఁదరింపఁజేయుటకై కాశీపురిని నిర్మించెను. దయాళువులు, ఒరుల దుఃఖమునుఁజూచి దుఃఖింతురు. మఱల దానిని నివారించుటకుపాయములనుఁజేయుదురు. కాననిశ్చయముగా దయచేతనే రుద్రుఁడుదుఃఖించి రుద్రుఁడాయెనేగాని రుద్రనామేచ్ఛతో దుఃఖించి రుద్రుఁడుకాలేదు. ఈ సందర్భమున నా పురాణగాథ నిఁటనుదాహరింపఁబడుచున్నది— పూర్వము బ్రహ్మ నొసలినుండి శివుడు జన్మించెననియు, జన్మింపగనే యతడు (శివుడు) రోదనముచేయఁ బ్రారంభించెననియు

నేలదుఃఖింతువని బ్రహ్మ ప్రశ్నింపగా రుద్రుడను నామము వచ్చుటకని యత డుత్తరమిచ్చెననియు పురాణప్రసిద్ధి. కావుననే శ్రుతులుగూడ "సోరోదీత్ యద రోదీత్ తత్‌రుద్రస్య రుద్రత్వమ్" అని రుద్రనామమును నిర్వచించినవి.

వి : రుద్రుడు రుద్రనామేచ్ఛ చేతనే రోదనము గావించెనుగాని ప్రాణివర్గ మందు దయచేత రోదనము గావింపలేదు. అయినను, ప్రాణివర్గము నందు దయతో రోదనము చేసినట్లు భావించుటవలన నుత్ప్రేక్షాలఙ్కా రము॥౧౧౫॥

శ్లో. వారాణసీ నివిశతే న వసున్ధరాయాం
తత్ర స్థితిర్మఖభుజాం భువనే నివాసః ।
తత్తీర్థముక్తవపుషామత ఏవ ముక్తిః
స్వర్గాత్ పరం పదముదేతు ముదే తు కీదృక్ ॥ 116

ప.వి. వారాణసీ- నివిశతే-న-వసున్ధరయాం-తత్ర-స్థితిః-మఖభుజాం-భువనే- నివాసః-తత్తీర్థముక్తవపుషామ్—అతః- ఏవ- ముక్తిః- స్వర్గాత్-పరం- పదమ్—ఉదేతు-ముదే-తు-కీదృక్.

అర్థము. వారాణసీ = కాశి, వసున్ధరాయాం = భూలోకమందు, ననివిశతే= చేరదు, అతఏవ=ఇందువలననే, తత్ర=ఆకాశీక్షేత్రమున, స్థితిః=నివా సము, మఖభుజాం=దేవతలయొక్క, భువనే=లోకమైన స్వర్గమునందు, నివాసః=నివాసముతో సమానము. కాశియందుండుట స్వర్గమునందుం డుటయే. (కావుననే) తత్తీర్థముక్తవపుషామ్ ; తత్తీర్థ=ఆ కాశీతీర్థము నందు, ముక్త=విడువబడిన, వపుషాం=శరీరముగలవారికి, ముక్తి రేవ= మోక్షమేయేర్పడును, తథాహి=అదియుక్తమే, స్వర్గాత్=స్వర్గరూపమైన, కాశికంటె,పరం=ఉత్కృష్టమైనది,కీదృక్ పదం పునః=ఎటువంటిస్థానము, ముదే=సంతోషముకొఱకు, ఉదేతు=ఉద్భవించును, లేదా స్వర్గాత్=అపవర్గ మునకంటెను అనగా మోక్షముకంటెను, పరం=అధికమైన, పదం= స్థానము, కీదృక్‌పునః = ఎట్టిదిగా, ముదే=నీకు ఆనందమొసగుటకు, ఉదేతు=ఉద్భవించును, మఱియెక్కటి ఏదియునుద్భవింపదని యర్థము. భూలోకమందలి జనులు మరణించినచో స్వర్గము, స్వర్గలోకవాసులు

మరణించినచో మోక్షము లభించును. కాననాకాశీక్షేత్రము స్వర్గముకాన నందుమరణించువారికి మోక్షమేలభ్యమగునని యర్థము, కావున కాశీ క్షేత్రము స్వర్గము.

**సమాసములు :**

మఖభుజామ్ : మఖంభుఞ్జతే ఇతి = మఖభుజః,తేషాం=మఖభుజామ్।

తత్తీర్థముక్తవపుషామ్ : తచ్చ తత్ తీర్థంచ=తత్తీర్థం, తత్తీర్థేముక్తం వపుః యేషాంతే=తత్తీర్థముక్తవపుషః, తేషాం=తత్తీర్థముక్తవపుషామ్.

**భావము :**

కాశీక్షేత్రము భూలోకమునకుఁ జెందదు. అది స్వర్గము. అక్కడ నివాసము స్వర్గమందలి నివాసమే. కావుననే యా కాశియందుదేహత్యాగముఁజేయువారికి మోక్షమేలభించును. అట్టి స్వర్గరూపమైన కాశీక్షేత్రమునకంటె నుత్తమ స్థానమెట్టిది. మానవులకు స్వర్గవాసమే కోరదఁగినది. కావున నీవు కాశిరాజును వరించి స్వర్గసుఖముననుభవింపుము.॥౧౧౬॥

> శ్లో. **సాయుజ్యమృచ్ఛతి భవస్య భవాబ్ధియాదః**
> **తాం పత్యురేత్య నగరీం నగరాజపుత్ర్యాః ।**
> **భూతాభిధానపటుమద్యతనీమవాప్య**
> **భీమోద్భవే ! భవతిభావమివాస్తిధాతుః ॥ 117**

ప. వి. సాయుజ్యమ్-ఋచ్ఛతి- భవస్య- భవాబ్ధియాదః -తాం-పత్యుః-ఏత్య- నగరీం-నగరాజపుత్ర్యాః- భూతాభిధానపటుమ్- అద్యతనీమ్- అవాప్య- భీమోద్భవే-భవతిభావమ్-ఇవ-అస్తిధాతుః.

అర్థము. భీమోద్భవే=భీముని పుత్రికయగు నోదమయన్తీ; భవాబ్ధియాదః; భవ=సంసారమనెడు, అబ్ధి=సముద్రముయొక్క, యాదః=జలజంతు సమూహము, నగరాజపుత్ర్యాః=హిమగిరి పుత్రికయగు పార్వతియొక్క, పత్యుః=భర్తయైన పరమశివునియొక్క,తాం=ఆ,నగరీం=కాశీనగరమును ఏత్య=పొంది, అస్తిధాతుః=అస(భువి)యను ధాతువు, భూతాభిధాన

పటుమ్; భూత=కడచిపోయిన కాలమును, అభిధాన=చెప్పుటయందు, పటుం=సమర్థమైన,పక్షాన్తరమున-భూత=సత్యమైన తారకబ్రహ్మమును, అభిధాన ఉపదేశించుటయందు, పటుం-సమర్థమైన, అద్యతనీం="లుఙ్" ను, అవాప్య=పొంది, భవతిభావమివ="అస్తేర్భూః" అను సూత్రమునను సరించి "అస" ధాతువునకు భూధాతుత్వమువలె, భవస్య=శివునియొక్క సాయుజ్యం=తాదాత్మ్యమును, ఋచ్ఛతి=పొందును.

**సమాసములు :**

సయుజః భావః=సాయుజ్యమ్-తత్=సాయుజ్యమ్.

భవాబ్ధియాదః భవఏవ అబ్ధిః = భవాబ్ధిః, భవాబ్ధేః యాదః = భవాబ్ధి యాదః, తత్=భవాబ్ధియాదః ।

నగరాజపుత్ర్యాః : నగానాంరాజా=నగరాజః, నగరాజస్యపుత్రీ=నగరాజ పుత్రీ, తస్యాః = నగరాజపుత్ర్యాః ।

భూతాభిధానపటుమ్ : భూతస్య అభిధానం=భూతాభిదానం, భూతాభినే పటుః=భూతాభిధానపటుః, తామ్=భూతాభిధానపటుమ్

భీమోద్భవే ! భీమాత్ ఉద్భవః యస్యాస్సా=భీమోద్భవా, తస్యాః సమ్బుద్ధిః=భీమోద్భవే !

భవతిభావమ్ : భవతేఃభావః=భవతి భావః, తమ్ = భవతిభావమ్

అస్తిధాతుః : అస్తి ఇతిధాతుః=అస్తిధాతుః ।

**భావము :**

ఓ దమయన్తీ ! సంసారమను సముద్రమందలి జంతు వర్గము పార్వతీ పతియగు శివుని నగరమైన కాశినిఁబొంది - అస్తి ధాతువు "లుఙ్"నందు భూతాభిధానపటువైన అనగా - భూతకాలమును, జెప్పుటకు సమర్థమైన భూధాతు రూపమును స్వీకరించినట్లు, భూతాభిధానపటువైన - అనగా సత్యమైన తారక బ్రహ్మము నుపదేశించుట యందు సమర్థమైన యానగరమందు పరమేశ్వరునితా దాత్మ్యమను ముక్తిని బడయును.

వి. ఇచ్చట "అస్తి" ధాతువునకు, జలజంతు వర్గమునకును, భవతి భావమునకును, సాయుజ్యమునకును నుపమానోపమేయభావమును౸ జెప్పుట వలన నుపమాలఙ్కారము ॥౧౧౭॥

శ్లో. నిర్విశ్య నిర్విరతి కాశినివాసిభోగాన్,
నిర్మాయ నర్మ చ మిథో మిథునం యథేచ్ఛమ్ ।
గౌరీ గిరీశఘటనాధికమేక భావం
శర్మోర్మికఞ్చుకితమఞ్చతి పఞ్చతాయామ్ ॥ 118

ప. వి. నిర్విశ్య–నిర్విరతి–కాశినివాసి–భోగాన్–నిర్మాయ–నర్మ–చ – మిథః-మిథునం-యథేచ్ఛమ్-గౌరీగిరీశఘటనాధికమ్-ఏకభావమ్-శర్మోర్మికఞ్చుకితమ్-అఞ్చతి-పఞ్చతాయామ్.

అర్థము. కాశినివాసి=కాశియందు నివసించుచున్నట్టి, మిథునం=స్త్రీపురుషుల జంట, యథేచ్ఛం=తమకోరికననుసరించి, నిర్విరతి=తెంపులేక, భోగాన్=భోగములను, మిథః=రహస్యమున, నర్మ=కేలిని, నిర్మాయ=అనుభవించి, పఞ్చతాయాం = మృత్యువు ఏర్పడగా, గౌరీగిరీశఘటనాధికం; గౌరీ= పార్వతియొక్క, గిరీశ=శివునియొక్క, ఘటన=సగపాలు మేనులను కలుపుట కంటెను, అధికం=అధికమైన అనగా శ్రేష్ఠమైన, శర్మోర్మికఞ్చుకితమ్; శర్మోర్మి=ఆనందలహరులచే, కఞ్చుకితం=కప్పఁబడిన, ఏకభావమ్=ఐక్యమును, అఞ్చతి=పొందుచున్నది-ఇతర ప్రదేశములయందు సన్న్యాసము మున్నగు కష్టములతో మోక్షము. ఇచ్చటనో భోగముల ననుభవించి శరీరమును వదలుట వలన మోక్షము.

**సమాసములు :**

నిర్విరతి :– నిర్గతా విరతిః యస్మిన్ కర్మణి తత్‌యథాభవతితథా= నిర్విరతి.

కాశినివాసి :– కాశ్యాం నివాసి=కాశినివాసి ।

యథేచ్ఛమ్ :– ఇచ్ఛామనతిక్రమ్య=యథేచ్ఛమ్ ।

గౌరీగిరీశ ఘటనాధికమ్:— గౌరీచ, గిరీశశ్చ=గౌరీగిరీశౌ, గౌరీగిరీశయోః, ఘటనం=గౌరీగిరీశ ఘటనమ్, గౌరీగిరీశఘటనాదధికః = గౌరీగిరీశ ఘటనాధికః, తమ్=గౌరీగిరీశఘటనాధికమ్.

ఏకభావం :— ఏకస్యభావః, ఏకభావః, తమ్=ఏకభావమ్ ।

శర్మోర్మికఞ్చుకితమ్ :— శర్మణామూర్మయః = శర్మోర్మయః, శర్మోర్మిభిః కఞ్చుకితః = శర్మోర్మికఞ్చుకితః, తమ్=శర్మోర్మి కఞ్చుకితమ్.

పఞ్చతాయామ్ :— పఞ్చానాం భావః=పఞ్చతా తస్యాం=పఞ్చతాయామ్.

**భావము :**

కాశియందు నివసించెడి స్త్రీపురుషదంపతులు స్వేచ్ఛగా తెంపులేక భోగములను, రహస్యమున కేలీ విలాసములననుభవించి తుదకు మృత్యువేర్పడగా, అర్ధనారీశ్వరత్వాది రూపమున, పార్వతీ పరమేశ్వరుల కలయిక కంటె నధికమైనదియు, ఆనందప్రవాహముతోఁ గప్పఁబడినదియునైన యైక్యమునుఁ బొందుదురు. పార్వతీపరమేశ్వరుల శరీరఘటన యందు రెండు శరీరములును కానవచ్చును. ఇచ్చటనో శివ శరీరమొక్కటే కాననగును. ఇతర ప్రదేశములయందు సన్న్యాసాదుల వలన మోక్షము. ఈ కాశియందో సకల భోగములననుభవించిన పిదప శరీరత్యాగము చేతనే మోక్షము. ॥౧౧౮॥

**శ్లో. న శ్రద్దధాసి యది తన్మమ మౌనమస్తు**
**కథ్యా నిజాస్తతమయైవ తవాఽనుభూత్యా ।**
**న స్యాత్ కనీయసితరా యది నామ కాశ్యా**
**రాజన్వతీముదితమణ్డనధన్వనా భూః ॥ 119**

ప. వి. న-శ్రద్దధాసి-యది-తత్-మమ-మౌనమ్-అస్తు-కథ్యా-నిజాస్తతమయా-ఏవ-తవ-అనుభూత్యా-న-స్యాత్-కనీయసితరా-యది-నామ-కాశ్యా-రాజన్వతీ-ముదిరమణ్డనధన్వనా-భూః

అర్థము. న శ్రద్దధాసి యది=స్వర్గముకంటెను కాశియధికమను నామాటను నమ్మకపోతివేని, తత్=అప్పుడు, మమ=నాకు, మౌనం=మౌనము. అస్తు=ఉండునుగాత, తవ=నీకు, నిజాస్తతమయా; నిజ=తనకుసంబంధించిన దై

ఆప్తతమయా=మిక్కిలినమ్మఁదగిన, అనుభూత్యైవ=అనుభవముచేతనే, (కిం) కథ్యాఽసి=చెప్పఁదగియున్నావా? ముదిరమణ్డనధన్వనా. ముదిర=మేఘమునే, మణ్డన=అలంకారముగాఁగల్గిన, ధన్వనా=ధనుస్సుగల దేవేన్ద్రునిచే, రాజన్వతీ=మంచి రాజుగాఁగల్గిన, భూః=స్వర్గభూమి, కాశ్యాః=కాశినుండి, కనీయసితరా=మిక్కిలిహీనమైనదిగా, నస్యాన్నామయది=కాక పోదా! అనగా తప్పకయగును. స్వర్గమునకంటె కాశియుత్కృష్టము. అందువలన నిన్ద్రునికంటెను కాశిరాజుశ్రేష్ఠుడు. కాన మాటలతో చాలును. ఇతనిని పరిణయ మాడిన పిదప ననుభవమే నీకు చెప్పఁగలదు.

**సమాసములు :**

నిజాప్తతమయా :- అతిశయేన ఆప్తా=ఆప్తతమా, నిజా చ సా, ఆప్తతమా చ=నిజాప్తతమా, తయా=నిజాప్తతమయా.

కనీయసితరా :- అతిశయేన కనీయసీ=కనీయసితరా,

రాజన్వతీ :-రాజా అస్యాః అస్తీతి=రాజన్వతీ

ముదిరమణ్డనధన్వనా :- ముదిరః మణ్డనం యస్యతత్=ముదిరమణ్డనం, ముదిరమణ్డనం ధనుః యస్యసః=ముదిరమణ్డనధన్వా, తేన=ముదిరమణ్డన ధన్వనా.

**భావము :**

స్వర్గమునకంటె కాశి గొప్పదను నామాటలను నమ్మక పోతివేని పోనిమ్ము! నేను ఊరకయుందును. ఇఁక దీనినిఁ గూర్చి చెప్పను. నీకు మిక్కిలి హితము గూర్చు నీ యనుభవమే నీకుఁ జెప్పగలయునేమో ? మేఘముచే నలంకరింపఁ బడిన వింటిని ధరించిన దేవేంద్రుఁడు పాలించెడి స్వర్గభూమి, కాశికంటెను మిక్కిలి హీనమైనది. కాన స్వర్గముకంటెను కాశియుత్కృష్టముగాన కాశిరాజు గూడ స్వర్గపాలకుఁడగు దేవేంద్రునికంటెను మిక్కిలి శ్రేష్ఠుఁడు. నీవు, ఆ కాశి రాజునుఁ బరిణయమాడితివేని నీ యనుభవమే నీకు జెప్పఁగలదు. నా మాటలతో నేమి ప్రయోజనము. ||౧౦౯||

శ్లో. జ్ఞానాధికాసి సుకృతాన్యధికాశి కుర్యాః
కార్యం కిమన్యకథనైరపి యత్ర మృత్యోః ।
ఏవం జనాయ సతతాఽభయదానమన్యత్
ధన్యే ! వహత్యమృతసత్రమవారితార్థి ॥ 120

ప.వి. జ్ఞానాధికా-అసి-సుకృతాని-అధికాశి-కుర్యాః-కార్యం-కిమ్-అన్యకథనైః-అపి-యత్ర-మృత్యోః-ఏవం-జనాయ-సతతాభయదానమ్ – అన్యత్ - ధన్యే–వహతి–అమృతసత్రమ్–అవారితార్థి.

అర్థము. హేధన్యే=ఓ మెచ్చదగినదమయన్తీ! జ్ఞానాధికా ; జ్ఞాన = జ్ఞానముచే, అధికా=అధికమైనదానవుగా, అసి=అగుచున్నావు, అధికాశి = కాశియందు, సుకృతాని=(ఇతనిని వివాహమాడి) దానము మున్నగు సత్కార్యములను, కుర్యాః=చేయుము. (లేదా) అన్యకథనైః=ఇతరులమాటలతో, కిమ్కార్యమ్ =ప్రయోజనమేమి ? యత్ర=ఏకాశియందు, మృత్యోరపి=మృత్యువునుండి యు, జనాయ=జనులకు, ఏకం = ఎల్లప్పుడుతెగిపోని, సతతా=భయదానమ్ ; సతత=ఎల్లప్పుడును, అభయదాన = మృత్యువును జయింపఁగల మృత్యుంజయత్వమునిచ్చుటయు, అన్యత్=మఱియొకటైన, అవారితార్థి= నిరన్తరయాచకులతోఁకూడిన, అమృత సత్రమ్=మోక్షదానము, గఙ్గా జలదానము, వహతి=నడచుచున్నది. కాశియందు మరణించువారికి శివ సాయుజ్యము, అమృతత్వము సిద్ధించును, ఇంకొకచోట బ్రతుకుటకంటే కాశియందు మరణించుటయు శ్రేష్ఠము.

## సమాసములు :

జ్ఞానాధికా : జ్ఞానేన అధికా=జ్ఞానాధికా.

అధికాశి : కాశ్యామధికాశి.

అన్యకథనైః : అన్యానిచతానికథనానిచ = అన్యకథనాని. తైః=అన్య కథనైః.

సతతాభఽయదానమ్ : అభయస్యదానమ్=అభయధానమ్, సతతమభయ దానమ్=సతతాభయదానమ్-

అమృతసత్రమ్ : అమృతస్య సత్రమ్=అమృతసత్రమ్-
అవారితార్థి : నవారితాః=అవారితాః, అవారితాః అర్థినః, యస్య తత్ = అవారితార్థి

**భావము :**

ఓ దమయన్తీ ! నీవు జ్ఞానముచే నధికురాలవు కాన కాశియందు దానాది సత్కార్యములనుఁజేయుము. కానదాని కై యీతనిఁబరిణయమాడుము. ఇతర కర్తవ్యములనుఁజెప్పుట యందేమి ప్రయోజనము. ఆ కాశియందు జనులకు మృత్యువునుండి యభయదానముచే, మృత్యుఞ్జయత్వప్రాప్తి యెల్లప్పుడును జరుగును. ఇంకనునచ్చట, సద్ధశక్యముగాని యాచకులకు, మోక్షదానము, గంగా జలదానము జరుగును.॥౧౨౦॥

**శ్లో. భూభర్తురస్య రతిరేధి మృగాక్షి ! మూర్తా**
**సోఽయం తవాఽస్తు కుసుమాయుధ ఏవ మూర్తః।**
**భాతం చ తావివ యువాం గిరిశం విరుద్ధ**
**మారాద్ధుమాశు పురి తత్ర కృతావతారౌ ॥ 121**

ప. వి. భూభర్తుః-అస్య-రతిః-ఏధి-మృగాక్షి-మూర్తా-సః-అయం-తవ-అస్తు-కుసుమాయుధః-ఏవ-మూర్తః-భాతం-చ-తే-ఇవ- యువాం- గిరిశం- విరుద్ధమ్-ఆరాద్ధుమ్-ఆశు--పురి-తత్ర-కృతావతారౌ.

అర్థము. హేమృగాక్షి=లేడికన్నులుగల దమయన్తీ! (త్వం=నీవు) **అస్య = ఈ** భూభర్తుః=ఈతేనికి, అనగా కాశిరాజునకు, మూర్తా=శరీరమును **ధరించిన** రతిః = రతీదేవిగా, ఏధి=కమ్ము. సోఽయంచ=ఆ యీ **కాశిరాజును,** తవ=నీకు, మూర్తః=దేహముధరించిన, కుసుమాయుధః ఏవ=మన్మథుఁడుగనే, అస్తు=అగును గాత. (కిఞ్చ=మఱియు) యువాం=మీరు, విరుద్ధం=విరోధముగల్గిన, గిరిశం=శివుని, ఆరాద్ధుం = పూజించుటకు, **తత్ర** పురి=ఆ పట్టణమందు, ఆశు=ఇప్పుడు లేదా శీఘ్రముగా, కృతావతారౌ= అవతరించినవారలై తావివ=రతీమన్మథులవలె, భాతం=వెలుగుడు.

**సమాసములు :**

భూభర్తుః : భువఃభర్తా=భూభర్తా। తస్య-భూభర్తుః.

మృగాక్షి :— మృగస్యేవ అక్షిణీయస్యాస్సా = మృగాక్షీ, తస్యాః సమ్బుద్ధిః=హేమృగాక్షి !

కృతావతారౌ:— కృతః అవతారః యాభ్యాంతౌ = కృతావతారౌ ।

**భావము :**

ఓదమయన్తి ! నీవు ఈ కాశిరాజునకు దేహమును ధరించిన రతీదేవివి కమ్ము. ఈ కాశిరాజు నీకు దేహమును ధరించిన మన్మథుఁడు కానిమ్ము. మీరిఱువురు పూర్వము కోపించిన శివుని బ్రసన్నునిఁ జేయుటకై పూజించుటకు, ఆ కాశియం దిప్పుడవతరించిన రతిమన్మథులవలె వెలుగుఁడు. ॥౧౨౧॥

> శ్లో. కామానుశాసనశతే సుతరామధీతీ
> సోఽయం రహోనఖపదైర్మహతు స్తనౌ తే ।
> రుష్టాద్రిజాచరణకుఙ్కుమపఙ్కరాగ
> సఙ్క్రాన్తశఙ్కరశశాఙ్కకలాఙ్కకారైః 122

ప. వి. కామాను శాసనశతే—సుతరామ్-అధీతీ-సః-అయం—రహః-నఖపదైః-మహతు—స్తనౌ—తే-రుష్టా ద్రిజాచకణకుఙ్కుమపఙ్కరాగ సఙ్క్రాన్త శఙ్కరశశాఙ్క కలాఙ్కకారైః.

**అర్థము** కామానుశాసనశతే=కామానుశాసన=కామశాస్త్రములయొక్క, శతే=నూటియందును, సుతరాం=మిక్కిలి, అధీతీ=పఠించినట్టి, సోఽయం= ఆయీ రాజు, రుష్టాద్రిజాచరణకుఙ్కుమపఙ్కరాగశఙ్క్రాన్తశఙ్కరశశాఙ్కకలాఙ్కకారైః! రుష్ట=రోపముఁజెందిన, అద్రిజా=పార్వతియొక్క, చరణ= పాదములయందలి, కుఙ్కుమపఙ్కరాగ=కుఙ్కుమపూవుమై పూతతో, సఙ్క్రాన్త=అతికిన, శఙ్కర=శివునియొక్క, శశాఙ్క=శిరోభూషణమైన చంద్రునియొక్క, కలా=కళతో, అఙ్కకారైః=కలహము జేసెడి, నఖపదైః=నఖక్షత చిహ్నములతో, తే=నీయొక్క, స్తనౌ= స్తనములను రహః=జనరహితమైన ప్రదేశమునందు, మహతు=పూజించునుగాత, అలఙ్కరించును గాతయని యర్థము.

**సమాసములు :**

కామానుశాసనశతైః కామస్యఅనుశాసనాని=కామానుశాసనాని, కామాను శాసనానాంశతాని=కామానుశాసన శతాని, తైః = కామానుశాసశతై నఖపదైః=నఖానాం పదాని=నఖపదాని, తైః=నఖపదైః
రుష్టాద్రిజాచరణ కుఙ్కుమపఙ్కరాగసఙ్కీర్ణశఙ్కరశశాఙ్కకలాఙ్కకారైః: రుష్టాచసా అద్రిజాచ=రుష్టాద్రిజా, రుష్టాద్రిజాయాః, చరణౌ, రుష్టాద్రిజాచరణౌ. కుఙ్కుమస్యపఙ్కః=కుఙ్కుమపఙ్కః. రుష్టాద్రిజా యాః,చరణయోః కుఙ్కుమపఙ్కః=రుష్టాద్రిజాచరణకుఙ్కుమపఙ్కః, రుష్టాద్రిజాచరణకుఙ్కుమపఙ్కస్యరాగః = రుష్టాద్రిజాచరణకుఙ్కుమ పఙ్కరాగః. రుష్టాద్రిజాచరణకుఙ్కుమపఙ్కరాగేణసఙ్కీర్ణా=రుష్టాద్రిజా చరణకుఙ్కుమపఙ్కరాగసఙ్కీర్ణా, శఙ్కరస్యశశాఙ్కః = శఙ్కరశ శాఙ్కః.శఙ్కరశశాఙ్కస్యకలాశఙ్కరశ శాఙ్క కలా,రుష్టాద్రిజాచరణకు ఙ్కుమపఙ్కరాగసఙ్కీర్ణా చసాశఙ్కర శశాఙ్కకలాచ = రుష్టాద్రి జాచరణకుఙ్కుమపఙ్కరాగసఙ్కీర్ణశఙ్కరశశాఙ్కకలా, రుష్టాద్రిజాచ రణకుఙ్కుమపఙ్కరాగ సఙ్కీర్ణశఙ్కరశశాఙ్కకలయా, అఙ్కకారాణి =రుష్టాద్రిజాచరణకుఙ్కుమ పఙ్కరాగసఙ్కీర్ణశఙ్కరశశాఙ్కకలాఙ్క కారాణి, తైః = రుష్టాద్రిజాచరణకుఙ్కుమపఙ్కరాగ సఙ్కీర్ణశఙ్కరశ శాఙ్కకలాఙ్కకారైః ॥

**భావము:**

ఓ దమయన్తీ! ఆ కాశిరాజు కామశాస్త్రములను బెక్కింటిని జదివిన రసికుడు. అతడు తన నఖక్షతములతో రహస్యమున స్త్రీ స్తనముల నలఙ్కరించును గాత. శివుడు పార్వతికి నేదేని యపరాధము గావించినచో, దానిని క్షమింపఁజేసి యామెను ప్రసన్నురాలుగాఁ జేయుటకతడు, ఆమె పాదములపైఁబడును. ఆమె పాదములుకుఙ్కుమ పఙ్కముతోఁ పూయఁబడినందువలన నాకుఙ్కుమపఙ్కము శివుని శిరోభూషణమగు చన్ద్రకళకంటును, ఆ కాశిరాజు చేసెడి నఖక్షతములు చంద్రుని యాకారముగల్గి చనుదోయిపైని గాయముల రక్తముతో నంటి యున్నందు వలన నవి, కుఙ్కుమ పఙ్కముతో నంటిన, శివున శిరమందలి చంద్రకళనుఁ బోలియుండును అట్టి నఖక్షతములతో కాశిరాజునిన్ను అలఙ్క రించునుగాత. ॥౧౨౨॥

శ్లో. పృథ్వీశ ఏవ నుదతు త్వదనఙ్గతాప
మాలిఙ్గ్య కీర్తిచయచామరచారుచాపః ।
సఙ్గ్రామసఙ్గతవిరోధిశిరోధిదణ్డ
ఖణ్డిక్షురప్రసరసమ్ప్రసరత్ప్రతాపః ॥ 123

ప. వి. పృథ్వీశః-ఏవ-నుదతు-త్వదనఙ్గతాపమ్-ఆలిఙ్గ్య-కీర్తిచయచామరచారు చాపః- సఙ్గ్రామసఙ్గతవిరోధిశిరోధిదణ్డఖణ్డిక్షురప్రసరసమ్ప్రసరత్ప్రతాపః.

అర్థము. ( హే భైమి! = ఓ దమయన్తీ ! ) కీర్తిచయచామరచారుచాపః, కీర్తి చయ = కీర్తి సమూహమనెడు, చామర=చామరమువంటి, చారు=అంద మైన, చాపః=విల్లుగల్గిన, (కావుననే) సఙ్గ్రామసఙ్గతవిరోధి శిరోధిదణ్డ ఖణ్డి క్షురప్రసర సమ్ప్రసర ప్రతాపః, సఙ్గ్రామసఙ్గత=యుద్ధములయందు దల పడిన, విరోధి=శత్రువులయొక్క, శిరోధిదణ్డ=కణ్ఠనాలములను, ఖణ్డి= ఖణ్డించు, క్షురప్ర=బాణవిశేషములయొక్క, సర=వ్యాప్తిచే సమ్ప్రసరత్ =చక్కగాఁ బ్రసరించు, ప్రతాపః=ప్రతాపముగల్గిన. పృథ్వీశఏవ=రాజే, ఆలిఙ్గ్య=కౌగలించుకొని, త్వదనఙ్గతాపమ్, త్వత్=నీ యొక్క, అనఙ్గ తాపమ్=మన్మథ తాపమును, నుదతు=పోగొట్టునుఁగాత. అని యుద్ధమున సురతమున రాజు సమరసుడని యర్థము.

ఇచ్చట అతిశయితమగు ప్రతాపముగల రాజు కౌగలించుటచే దమయన్తికి తాపము వర్ధిల్లునే గాని తగ్గదు. అందువలన నిట విరోధము స్ఫురించుట వలన, విరోధాభాసము, విక్రమప్రతాపము, అనఙ్గతాపము, భిన్నజాతీయ ములుగాన విరోధ పరిహారము.

**సమాసములు :**

పృథ్వీశ :—పృథ్వ్యాః ఈశః=పృథ్వీశః.

త్వదనఙ్గతాపమ్ :— అనఙ్గస్యతాపః = అనఙ్గతాపః. తవ అనఙ్గతాపః= త్వదనఙ్గతాపః. తమ్=త్వదనఙ్గతాపమ్.

కీర్తిచయచామరచారుచాపః :— కీర్తీనాం చయః=కీర్తిచయః, చామర ఇవ చారుః=చామరచారుః, చామరచారుశ్చాసౌ చాపశ్చ=చామరచారుచాపః. కీర్తిచయ ఏవచామరచారుచాపః యస్యసః = కీర్తిచయచామరచారు చాపః. సఙ్గ్రామసఙ్గత విరోధి శిరోధి దణ్డఖణ్డిక్షురప్రసర సమ్ప్ర

సర్త్రప్రతాపః :— సజ్గ్రామే సజ్గతాః=సజ్గ్రామసజ్గతాః, సజ్గ్రామసజ్గతా శ్చతేవిరోధినశ్చ=సజ్గ్రామసజ్గత విరోధినః. సజ్గ్రామసజ్గత విరోధినాంశిరో ధయః = సజ్గ్రామసజ్గత విరోధిశిరోధయః, సజ్గ్రామసజ్గతవిరోధిశిరో ధీనాందణ్డాః=సజ్గ్రామసజ్గత విరోధిశిరోధి దణ్డాః, సజ్గ్రామసజ్గతవిరోధి శిరోధి దణ్డానాం ఖణ్డినః = సజ్గ్రామసజ్గత విరోధి శిరోధిదణ్డ ఖణ్డినః, సజ్గ్రామసజ్గత విరోధిశిరోధిదండ ఖండినశ్చతే క్షుర ప్రాశ్చ=సజ్గ్రామసజ్గత విరోధిశిరోధి దండఖండి క్షురప్రాః, సజ్గ్రామ సజ్గత విరోధిశిరోధి దండఖండి క్షురప్రాణాం సరః=సజ్గ్రామసజ్గత విరోధి శిరోధి దండఖణ్డి క్షురప్రసరః. సజ్గ్రామసజ్గత విరోధిశిరోధిదండఖణ్డి క్షురప్రసరాత్ ప్రసృపరన్ = సజ్గ్రామసజ్గత విరోధిశిరోధిదండఖణ్డిక్షుర ప్రసర సమ్ప్రసరన్.సజ్గ్రామసజ్గత విరోధిశిరోధి దండఖణ్డిక్షురప్రసరస మ్ప్రసరన్, ప్రతాపః యస్యసః=సజ్గ్రామసజ్గత విరోధిశిరోధి దణ్డఖణ్డి క్షురప్రసర సర్త్రప్రతాపః

**భావము:**

ఆ రాజునకు కీర్తి సమూహమే చామరమువలె మనోహరమైన విల్లు, దానిచేతనే యతడు శత్రువులను శిక్షించును. కావుననే యుద్ధములయందు తల పడిన శత్రువుల కణ్ఠనాళములను, క్షురప్రములను బాణములచే ఖణ్డించుటచే, వ్యాపించు ప్రతాపముగలవాడు. అతడే నిన్నుఁ గౌగలించుకొని, నీ మన్మథ తాప మునుఁ బోగొట్టగల్గినవాడు. ఆ రాజు సమరమునందును, సురతమునందును సమ రసుఁడై వ్యవహరించుచున్నాడని యాశయము. ఏలయనగా శత్రువులను సంహ రించుట వలన నేర్పడిన యాతని ప్రతాపము దమయన్తి యొక్క మన్మథ తాప మును శమింపఁజేయునుగదా; ॥౧_౨౩॥

**శ్లో. వక్ష స్త్వదుగ్రవిరహాదపి నాఽస్య దీర్ణమ్**
**వజ్రాయతే పతనకుణ్ఠితశత్రుశస్త్రమ్.**
**తత్కన్దకన్దలతయా భుజయోర్న తేజో**
**వహ్నిర్నమత్సరివధూనయనామ్బునాఽపి ॥ 124**

ప. వి వక్షః-త్వదుగ్ర విరహాత్-అపి-న-అస్య-దీర్ణమ్-వజ్రాయతే-పతనకుణ్ఠి తశత్రుశస్త్రమ్-తత్కన్దకన్దలతయా-భుజయోః-న-తేజోవహ్నిః-నమతి- అరివధూనయనామ్బునా-అపి.

**అర్థము.** హే భైమి = ఓ దమయన్తీ! త్వదుగ్రవిరహాదపి ; త్వత్ = నీ యొక్క, ఉగ్ర = తీవ్రమైన, విరహాదపి = వియోగమువలనను, న,దీర్ణం = ఖణ్డితము గానిదియు (తథా అర్లే) పతనకుణ్ఠితశత్రుశస్త్రమ్ ; పతన = పడుటచే, కుణ్ఠిత = మొక్కపోయిన, శత్రు = శత్రువులయొక్క, శస్త్రం = ఆయుధములుగలదియునగు, అస్య = ఈ కాశిరాజుయొక్క, వక్షః = వక్షఃస్థలము వజ్రాయతే = వజ్రమువలెనాచరించుచున్నది. తత్కన్దకన్దలతయా. తత్ = ఆ వక్షస్థలమను వజ్రముయొక్క, కంద = వేరునకు, కన్దలతయా = మొలకలుగా నుండుటచే, భుజయోః = బాహువులయొక్క, తేజోవహ్నిః = ప్రతాపాగ్ని, అరివధూనయనాగ్నినాఽపి ; అరివధూ = శత్రుస్త్రీలయొక్క, నయనాగ్నినాపి = నేత్రాగ్నిచేతను, నసమతి = శమింపదు, వజ్రాగ్నిశత్రునాశకరము.

**సమాసములు :**

త్వదుగ్రవిరహాత్ : ఉగ్రశ్చాసౌ విరహశ్చ = ఉగ్రవిరహః, తవ ఉగ్రవిరహః = త్వదుగ్రవిరహః, తస్మాత్ = త్వదుగ్రవిరహాత్.

**పతనకుణ్ఠితశత్రుశస్త్రమ్:** పతనేన కుణ్ఠితాని = పతనకుణ్ఠితాని, శత్రూణాం శస్త్రాణి, = శత్రుశస్త్రాణి, పతనకుణ్ఠితాని శత్రుశస్త్రాణి యస్మిన్ తత్ = పతనకుణ్ఠితశత్రుశస్త్రమ్-

తత్కన్దకన్దలతయా : తదేవ కన్దః = తత్కన్దః, కన్దలస్యభావః = కన్దలతా, తత్కన్దస్య కన్దలతా = తత్కన్దకన్దలతా, తయా = తత్కన్దకన్దలతయా – తేజోవహ్నిః : తేజ ఏవవహ్నిః = తేజోవహ్నిః.

అరివధూనయనామ్బునా : అరీణాంవధ్వః = అరివధ్వః, అరివధూనాంనయనాని = అరివధూనయనాని, అరివధూనయనానామమ్బు = అరివధూనయనామ్బు, తేన = అరివధూనయనామ్బునా

**భావము :**

ఓ దమయన్తీ ! నీ తీవ్రమైనవిరహమువలనను, నీ రాజుయొక్క వక్షస్థలము భిన్నముకాలేదు. శత్రువుల బాణములీతని వక్షఃస్థలమునఁబడినవై కుంటుపోయినవి. అందువలననితని వక్షఃస్థలము వజ్రమువలెదృఢముగానున్నది. ఆ

వక్షఃస్థలమనెడి మూలమునుండి యుద్భవించిన ప్రరోహమువలెనున్న యాతని భుజములయందలి ప్రతాపాగ్ని శత్రుస్త్రీలకన్నీటి వెల్లువవలనను శమించదు. ఈ యగ్ని, వక్షఃస్థలమనెడు వజ్రమునకు సంబంధించినదిగాన నీటితోనది చల్లారదు. ॥౧౨౪॥

శ్లో. కిం న ద్రుమా జగతి జాగ్రతి లక్షసఙ్ఖ్యాః
తుల్యోపనీతపికకాకఫలోపభోగాః ।
స్తుత్యస్తు కల్పవిటపీ ఫలసమ్ప్రదానం
కుర్వన్ స ఏవ విబుధానమృతైకవృత్తీన్ ॥ 125

ప. వి. కిం-న-ద్రుమాః-జగతి- జాగ్రతి- లక్షసఙ్ఖ్యాః- తుల్యోపనీతపికకాక ఫలోపభోగాః-స్తుత్యః- తు-కల్పవిటపీ-ఫలసమ్ప్రదానం-కుర్వన్- సః-ఏషః-విబుధాన్-అమృతైకవృత్తీన్.

అర్థము. తుల్యోపనీతపికకాకఫలోపభోగాః ; తుల్య=భేదములేక, ఉపనీత=తేఁబడిన, పిక =కోకిలలకు, కాక =కాకులకుయోగ్యములైన, ఫలోపభోగాః= ఫలానుభవములుగల్గిన, లక్షసఙ్ఖ్యాః=లక్షలకొలదియైన, ద్రుమాః= వృక్షములు, జగతి=భూమియందు, నజాగ్రతికిం=వెలయుటలేదా యేమి? తు= కాని, అమృతైకవృత్తీన్ = అమృతమునేముఖ్యజీవనముగాఁగల్గిన, విబుధాన్=వేల్పులను, (పణ్డితులను) ఫలసమ్ప్రదానం=ఇష్టములైన యర్థములనుగ్రహించువారినిగా. కుర్వన్ = చేయుచు, స ఏషః = ఆ యీ,కల్పవిటపీ=కల్పవృక్షము, స్తుత్యః = స్తుతింపఁదగినవాడు- ఇతరరాజులు పాత్రాఽపాత్రవివేచనలేక దానము చేయుదురు. ఈ కాశిరాజు సత్పాత్రలైన పణ్డితులకు మాత్రము దానముచేయును

వి : అప్రస్తుతమైన కల్పవృక్ష వృత్తాన్తమువలన ప్రస్తుత కాశిరాజవృత్తాన్తము తెలియుటవలన అప్రస్తుతప్రశంసాలఙ్కారము.

సమాసములు :

లక్షసఙ్ఖ్యాః : లక్షంసఙ్ఖ్యాయేషాన్తే=లక్షసఙ్ఖ్యాః

తుల్యోపనీతపికకాకఫలోపభోగః : తుల్యముపనీతః = తుల్యోపనీతః,

పికాశ్చ, కాకాశ్చ=పికకాకాః, ఫలానాముపభోగః=ఫలోపభోగః, పికకా కానాం, ఫలోపభోగః = పికకాకఫలోపభోగః, తుల్యోపనీతః, పికకాక ఫలోపభోగః యైస్తే=తుల్యోపనీతపికాకఫలోపభోగాః।

స్తుత్యః :- స్తోతుం యోగ్యః=స్తుత్యః।

కల్పవిటపీ :- కల్పఇతివిటపీ=కల్పవిటపీ ।

ఫలసమ్ప్రదానం :- ఫలానాం సమ్ప్రదానమ్ = ఫలసమ్ప్రదానం.

అమృతైకవృత్తీన్ :- అమృతమ్, ఏకా, వృత్తిః యేషాన్తే = అమృతైక వృత్తయః, తాన్=అమృతైకవృత్తీన్ ।

**భావము :**

ప్రపఞ్చమునందు, పాత్రాఽపాత్ర వివేచన లేక కోకిలలకు, కాకులకు సమానముగా ఫలోప భోగమునుఁ గల్పించెడి వృక్షములు లక్షలకొలదిగా నున్నవి. కాని సత్పాత్రములై అమృతమునే ముఖ్యజీవనముగా గల దేవతలకు (పణ్డితులకు) కోరిన యిష్టముల నొసంగుచు, కల్పవృక్షమువంటి యీ కాశిరాజొక్కఁడే కొనియాడఁ దగినవాఁడు. ॥౧౨౫॥

శ్లో. **అస్మై కరం ప్రవితరన్తి నృపా న కస్మా**
**దస్యైవ తత్ర యదభూత్ ప్రతిభూః కృపాణః।**
**దైవాత్ యదా ప్రవితరన్తిన తే తదైవ**
**నేదఙ్కృపా నిజకృపాణకరగ్రహాయ ॥ 126**

ప. వి. అస్మై-కరం-ప్రతితరన్తి-నృపాః-న-కస్మాత్-అస్య-ఏవ-తత్ర-యత్ అభూత్-ప్రతిభూః-కృపాణః-దైవాత్-యదా-ప్రవితరన్తి-న-తే-తదా- ఏవ-న-ఇదఙ్కృపా-నిజకృపాణకరగ్రహాయ.

**అర్థము.** అస్మై=ఈ రాజునకు, నృపాః=ఇతరులైన రాజులు, కస్మాత్=ఏ కారణమువలన, కరం=పన్నును, నప్రవితరన్తి?=ఈయరు. తప్పక ఈయఁగలరు. యత్=ఏలయనగా, అస్య=ఇతనియొక్క, కృపాణఏవ=కత్తియే తత్ర=ఆ విషయమందు, ప్రతిభూః=లగ్నకుఁడుగా బాధ్యత వహించునదిగా, అభూత్=ఉండెను. యదా=ఎప్పుడు, దైవాత్=దైవమువలన, తే=ఆ,

నృపాః = రాజులు, కరం = కప్పము, న ప్రవితరన్తి = ఈయరో, తదైవ=అప్పుడే, నిజకృపాణకరగ్రహాయ; నిజ = తనదైన, కృపాణ= కత్తిని, కర=చేతితో, గ్రహాయ =పట్టుకొనుటకు, పక్షాన్తరమున - నిజకృపాణకరగ్రహాయ, నిజ కృపాణ=తనకత్తినుండి, అనగా లగ్నకునిరూపముననున్న కత్తినుండి, కర=పన్నును గ్రహాయ=తీసికొనుటకు, ఇదజ్కృపా=ఈతనికిదయ, నభవతి=కలుగదు, దయలేనివాఁడై కత్తినిఁ జూపి వారివద్దనుండి బలవన్తముగా కప్పమును గ్రహించును.

**సమాసములు :**

ఇదజ్కృపా :— అస్యకృపా=ఇదజ్కృపా.

నిజకృపాణ కరగ్రహాయ :— నిజశ్చాసౌకృపాణశ్చ=నిజకృపాణః, నిజకృపాణాత్ కరగ్రహః=నిజకృపాణ కరగ్రహః, తస్మై=నిజకృపాణ కరగ్రహాయ.

పక్షాన్తరమున :— నిజశ్చాసౌ కృపాణశ్చ=నిజకృపాణః, నిజకృపాణస్య కరేగ్రహః=నిజకృపాణకరగ్రహః, తస్మై=నిజకృపాణకరగ్రహాయ.

**భావము :**

ఈ రాజునకు సామన్త రాజులందఱును కప్పము తప్పక చెల్లింతురు. ఏలయనగా కప్పమునుఁ జెల్లించుటలో నీతని ఖడ్గమే లగ్నకుఁడై వసూలు చేయునదై వ్యవహరించును. ఒకవేళ దైవికముగా కప్పమునుఁ జెల్లింపనిచో అప్పుడు తన ఖడ్గమునుఁ జేతితో పట్టుకొనుటకు, పక్షాన్తరమున లగ్నకరూపమున నున్న తన కత్తినుండి కప్పమును రాఁబట్టుటకును నితనికి దయయుండదు. ఏ మాత్రమును దయనుఁజూపక కత్తిని జళిపించి యా రాజులవద్దనుండి యితఁడు కప్పము బలవన్తముగా రాబట్టును. కత్తిదెబ్బవలని భయముతోఁ గప్పమునిచ్చుట వలన కత్తిలగ్నకుఁడుగా వసూలు చేయునదిగా వ్యవహరింపఁబడుచున్నది.

శ్లో. ఏతద్భల్లైః క్షణికతామపి భూఖురాగ్ర
స్పర్శాయుషాం రయవశాదసమాపయద్భిః।
దృక్ప్రేయకేవలనభఃక్రమణప్రవాహై
ర్వాహైరలుప్యత సహస్రదృగర్వగర్వః ॥ 127

ప. వి. ఏతద్బలైః-క్షణికతామ్-అపి-భూఖురాగ్రస్పర్శాయుషాం-రయరసాత్-అసమాపయద్భిః—దృక్పేయకేవలనభఃక్రమణప్రవాహైః—వాహైః—-అలుప్యత-సహస్రదృగర్వగర్వః.

అర్థము. ఏతద్బలైః = ఈతని సైన్యములచే, రయవశాత్=వేగవశమువలన, భూఖురాగ్రస్పర్శాయుషామ్; భూ = భూమియందు, ఖురాగ్ర=గిట్టలకొనల యొక్క,స్పర్శ=స్పర్శముయొక్క,ఆయుషాం=ఉనికియను జీవితముల యొక్క, క్షణికతామపి=క్షణమాత్రస్థితిని గూడ, అసమాపయద్భిః = పూర్తిచేయనట్టి,అనగా క్షణకాలముగూడ భూమిని తాకనట్టి, దృక్పేయకేవలనభః క్రమణప్రవాహైః,దృక్ పేయ=కంటితోనేచూడదగిన, కేవల=కేవలములైన, నభఃక్రమణప్రవాహైః, నభః=ఆకాశమునందలి,క్రమణ=నడకయొక్క, ప్రవాహైః=పరమ్పరలు గల్గిన, వాహైః=ఈతని గుఱ్ఱములచే, సహస్రదృ గర్వగర్వః, సహస్రదృక్=ఇంద్రునియొక్క, అర్వ=గుఱ్ఱముయొక్క, గర్వః=గర్వము, అలుప్యత = తొలగింపబడినది.

వి. ఇంద్రుని గుఱ్ఱముకంటెను, కాశిరాజు గుఱ్ఱముల కాధిక్యమును జెప్పుట వలన వ్యతిరేకాలఙ్కారము.

## సమాసములు :

ఏతద్బలైః :— ఏతస్యబలాని=ఏతద్బలాని, తైః=ఏతద్బలైః,

క్షణికతామ్ :— క్షణేభవః = క్షణికః. క్షణికస్యభావః=క్షణికతా, తామ్ = క్షణికతామ్.

భూఖురాగ్రస్పర్శాయుషామ్ :— ఖురాణామగ్రాణి=ఖురాగ్రాణి, ఖురాగ్రాణాం స్పర్శాః=ఖురాగ్రస్పర్శాః, భువిఖురాగ్రస్పర్శాః=భూఖురాగ్రస్పర్శాః, భూఖురాగ్రస్పర్శానామాయూంషి=భూఖురాగ్రస్పర్శాయూంషి, తేషాం = భూఖురాగ్రస్పర్శా యుషామ్.

రయవశాత్ :- రయస్యవశః=రయవశః, తస్మాత్=రయవశాత్

అసమాపయద్భిః :- న సమాపయన్తః=అసమాపయన్తః, తైః=అసమాపయద్భిః

దృక్పేయకేవలనభః క్రమణప్రవాహైః : దృశాపేయాని= దృక్పేయాని, నభసిక్రమణాని=నభఃక్రమణాని, కేవలానిచతానినభః క్రమణానిచ = కేవలనభః క్రమణాని, దృక్పేయానిచతానికేవలనభః క్రమణానిచ = దృక్పేయకేవలనభఃక్రమణాని, దృక్పేయకేవలనభఃక్రమణానాం ప్రవాహాః = దృక్పేయకేవలనభఃక్రమణప్రవాహాః, తైః= దృక్పేయకేవలనభః క్రమణప్రవాహైః।

సహస్రదృగర్వగర్వః : సహస్రం దృశఃయస్యసః = సహస్రదృక్, సహస్రదృశఃఅర్వా = సహస్రదృగర్వా, సహస్రదృగర్వణఃగర్వః = సహస్రదృగర్వగర్వః

**భావము :**

ఇతని సైన్యములు వేగవశముచేగిట్టలకొనలతో క్షణకాలముగూడ భూమి నిదాకక, కేవలము నేత్రములతోనే గ్రహింపఁదగిన వేగముగలవై యాకాశమున గతిపరమ్పరలతో, నిన్ద్రునియశ్వమైన యుచ్చైశ్రవముయొక్క గర్వమునుగూడఁ బోగొట్టినవి. ఇన్ద్రునియొద్ద నుచ్చైశ్రవమను గుఱ్ఱమొక్కటేయుండ, ఈతని వద్ద పెక్కుగుఱ్ఱములున్నవనియు సూచితము॥౧౨౭॥

**శ్లో. తద్వర్ణనాసమయ ఏవ సమేతలోక**
**శోభావలోకనపరా తమసౌ పరాసే ।**
**మానీ తయా గుణవిదా యదనాదృతోఽసౌ**
**తద్భూభృతాం సదసి దుర్యశసేవ మమ్లౌ ॥ 128**

ప. వి. తద్వర్ణనాసమయే - ఏవ-సమేతలోకశోభావలోకనపరా - తమ్-అసౌ-పరాసే-మానీ-తయా-గుణవిదా-యత్-అనాదృతః-అసౌ-తత్-భూభృతాం-సదసి-దుర్యశసా-ఇవ-మమ్లౌ.

అర్థము. అసౌ=ఈదమయన్తి, తద్వర్ణనాసమయేఏవ ; తత్ = ఆ కాశిరాజును, వర్ణనా= వర్ణించునట్టి,సమయే, ఏవ = కాలమందే, సమేతలోకశోభామ్ ; సమేత=విచ్చేసిన, లోక= జనులయొక్క, శోభాం=కాన్తిని, అవలోకనపరా ; అవలోకన=చూచుటయందు, పరా = ఆసక్తిగలదై, తమ్=ఆ,

కాశిరాజును, పరాసే=పరిహరించినది, మానీ=అభిమానవన్తు(డైన, అసౌ =ఈరాజు, గుణవిదా=గుణములను[గహించునట్టి, తయా=ఆదమయన్తిచే, యత్=ఎందువలన, అనాదృతః=ఆదరింపబ(డలేదో, తత్=ఆయనాదరణమువలన, భూభృతాం=రాజులయొక్క, సదసి=సభయందు, దుర్యశసేవ=దుష్టకీర్తిచేతనోయనునట్లు మమ్లౌ =కాన్తిహీను(డాయెను.

వి : కాశిరాజు కాంతిహీనతను(బొందుటకు దుష్టకీర్తి కారణముకాకపోయినను, కారణముగా(జెప్ప(బడుటవలనను[త్ప్రేక్ష - వ్యఞ్జకమగు నివశబ్దమును( [బయోగించుటవలన నది వాచ్యము.

## సమాసములు :

తద్వర్ణనాసమయే : తస్యవర్ణనా=తద్వర్ణనా, తద్వర్ణనాయాః సమయః= తద్వర్ణనాసమయః, తస్మిన్ = తద్వర్ణనాసమయే।

సమేతలోకశోభావలోకనపరా : సమేతాశ్చతేలోకాశ్చ = సమేతలోకాః, సమేతలోకానాంశోభా=సమేతలోకశోభా, సమేతలోకశోభాయాః అవలోకనమ్= సమేతలోకశోభావలోకనమ్, సమేతలోకశోభావలోకనేపరా = సమేతలోకశోభావలోకనపరా।

మానీ : మానః అస్యాస్తీతి=మానీ।

గుణవిదా : గుణాన్ వేత్తీతి = గుణవిత్, తయా=గుణవిదా।

అనాదృతః : నఆదృతః=అనాదృతః।

దుర్యశసా : దుష్టంచతత్ యశశ్చ=దుర్యశః, తేన=దుర్యశసా।

## భావము :

ఈదమయన్తి, ఆ కాశిరాజును(గూర్చి సరస్వతీదేవి వర్ణించుసమయమున, నా సభకువిచ్చేసిన జనమును(జూచు నెపముతో నా కాశిరాజును పరిహసించినది. మానవన్తు(డగు నీ రాజుగుణజ్ఞురాలైన దమయన్తిచే(బరిహరింప(బడుట వలన రాజసభయందు దుష్కీర్తిచేతనోయనునట్లు వైవర్ణ్యమును, వర్ణహీనతను( బొందెను॥౧౨౮॥

శ్లో. సాఽనన్తానాప్య తేజస్సఖనిఖిలమరుత్పార్థివాన్ దిష్టభాజః
చిత్తేనాఽఽశాపుషస్తాన్ సమమసమగుణాన్ ముఞ్చతీ
గూఢభావా ।
సోరేవాన్వర్తిమూపం పురుషమనుచిదమ్భోధిమేకం శుభాఙ్గీ
నిఃసీమానన్దమాసీదుపనిషదుపమా తత్ప్రతీభూయ భూయః ।
**129**

ప. వి. సా-అనన్తాన్-ఆప్య- తేజస్సఖనిఖిలమరుత్పార్థివాన్- దిష్టభాజః-చిత్తేన-ఆశాపుషః-తాన్-సమమ్-అసమగుణాన్-ముఞ్చతీ-గూఢభావా.

అర్థము. అనన్తాన్=అపరిమితములైన, దిష్టభాజః = భాగ్యమునుఁబొందిన, ఆశాపుషః = అభిలాషను, అనగా దమయన్తి పైనఁగోరికను పెంచుకొనుచున్న, తాన్=ప్రసిద్ధులైన, అసమగుణాన్ = అసమానములగు పరాక్రమాదిగుణములతోఁగూడిన, తేజస్సఖనిఖిలమరుత్పార్థివాన్ ; తేజస్సఖ=తేజోవన్తులైన, నిఖిల=సకలురగు, మరుత్=దేవతలు, పార్థివాన్=రాజులను, ఆప్య = పొంది ముఞ్చన్తీ = పరిహరించుచున్న, ఉపనిషత్పక్షమున- సానన్తాన్=ఆకాశాదులతోఁగూడిన, దిష్టభాజః=కాలముతోఁగూడిన, చిత్తేనసమం=మనస్సుతోడ, ఆశాపుషః = దిక్కులతోఁగూడిన, అసమగుణాన్=హెచ్చుతగ్గు మున్నగు గుణములుకల్గిన, ఆప్యతేజస్సఖనిఖిలమరుత్పార్థివాన్ ; ఆప్య =జలమయమును, తేజః = అగ్నితో,సఖ = కూడిన నిఖిల = సమస్తములైన, మరుత్=వాయువును, పార్థివాన్=పృథివీవికారములను, ముఞ్చన్తీ = విడచుచున్నదై, అనగా తార్కికసిద్ధాన్తమునను సరించి, పృథివి, జలము, తేజస్సు. వాయువు, ఆకాశము, కాలము- దిక్కు, ఆత్మ, మనస్సు అను తొమ్మిదిద్రవ్యములలో నాత్మకంటె భిన్నములగు నెనిమిదింటిని, "ఏకమేవాఽద్వితీయమ్" "నేతినేతి" ఇత్యాది శ్రుతివాక్యములచే నిషేధించుచున్నదై, గూఢభావా; గూఢ=కప్పఁబడిన, భావా=దమయన్తియందలి యనురాగముగలదై, పక్షాన్తరమున-బ్రహ్మమను గూఢమగునర్థమును ప్రతిపాదించుటచే, గ్రహింపశక్యముకాని యభిప్రాయముకలదై, శుభాఙ్గీ ; శుభ = దోషములేని, అఙ్గీ = దేహము

కిలదై, పక్షాన్తరమున-సకలాఙ్గములతోఁగూడిన, అనగా షడఙ్గములతో గూడిన,సా=అదయుపన్తి, పారేవాగ్వృత్తిరూపం ; పారేవాక్=వాక్కు లకు, ఆవలిగట్టునందు, వృత్తి=ఉన్న-అనగావాక్కులచే వర్ణింపశక్యము కాని, రూపం = సౌన్దర్యమునుగల్గిన, పక్షాన్తరమున-యతోవాచోనివ ర్తన్తే అప్రాప్యమనసానహ "ఇత్యాదిశ్రుతులననుసరించి వాక్కులకతీత మైన స్వరూపముగల్గిన, చిదమ్భోధిం=సకలశాస్త్రముల సారమునుబొందు టవలన, జ్ఞానసాగరమును, పక్షాన్తరమున-చిదమ్భోధిమ్= జ్ఞానసాగర మైనందువలన జ్ఞానఘనమును, ఏకం = తనకు సమానగుణముగల, మఱి యొక వస్తువులేనిదియు, పక్షాన్తరమున-ఏకం = అద్వితీయమైనదియు నిస్సీమానన్దం=ఎల్లలేనియానందముతోఁగూడిన, పక్షాన్తరమున-అనం తసుఖరూపుడునునగు, పురుషం=నలరూపమునసున్న పురుషుని, పరమా త్మను, అను = లక్షించి అనగా గుఱ్తించి, అనగానుద్దేశించి, భూయః= అధికముగా, తత్పరీభూయ = ఆ నలునియందే తాత్పర్యముగలదై, ఉపనిషదుపమా=ఉపనిషత్తులనుఁ బోలినదై, ఆసీత్=ఉండినది.

వి. శ్లేషమూలకముగా, రాజులను దేవతలను పృథివ్యాదినవ ద్రవ్యములతోఁ డను, నలుని పరమాత్మతోఁడను దమయన్తిని ఉపనిషత్తులతోఁడనుఁ బోల్చుట వలన నిట నుపమాలఙ్కారము.

## సమాసములు :

సానన్తాన్ : అవిద్యమానః అన్తః యేషాన్తే=అనన్తాః,అనన్తైః సహితాః= సానన్తాః, తాన్ = సానన్తాన్ ।

తేజస్సఖనిఖిలమరుత్పార్థివాన్: మరుతశ్చ పార్థివాశ్చ= మరుత్పార్థివాః, నిఖిలాశ్చతేమరుత్పార్థివాశ్చ = నిఖిలమరుత్పార్థివాః. తేజః సఖాయేషాన్తే = తేజస్సఖాః, తేజస్సఖాశ్చతే నిఖిలమరుత్పార్థివాశ్చ = తేజస్సఖ నిఖిల మరుత్పార్థివాః, తాన్ = తేజస్సఖనిఖిల మరుత్పార్థివాన్. పక్షాన్త రమున-

ఆప్యతేజస్సఖనిఖిలమరుత్పార్థివాన్:- అపాం వికారః=ఆప్యం, ఆప్యంచ తేజస్సఖాచ, నిఖిలమరుత్పార్థివాశ్చ = ఆప్యతేజస్సఖనిఖిలమరుత్పార్థివాః, తాన్=ఆప్యతేజస్సఖనిఖిలమరుత్పార్థివాన్ ।

ఆశాపుషః అశాంపుష్ణన్తీతి=ఆనాపుషః. తాన్ =ఆనాపుషః

అసముగుణాన్ :- నసమాః=అసమాః, అసమాః గుణాః యేషాన్తే=అస మగుణాః, తాన్ = అసమగుణాన్ ।

గూఢభావా :- గూఢః భావః యస్యాస్సా = గూఢభావా ॥

పారేవాగ్వృత్తిరూపమ్ :- వాచాం=పారే=పారేవాక్, పారేవాక్ వృత్తిః యస్యతత్ = పారేవాగ్వృత్తి, పారే వాగ్వృత్తిచ రూపం యస్యసః= వారేవాగ్వృత్తిరూపః, తమ్ = పారేవాగ్వృత్తిరూపమ్ ।

చిదమ్భోధిమ్ :- చితామమ్భోధిః = చిదమ్భోధిః. తమ్ =చిదమ్భోధిమ్. పక్షాన్తరమున - చిదేవ అమ్భోధిః = చిదమ్భోధిః, తమ్=చిదమ్భోధిమ్

శుభాఙ్గీ :- శుభమ్. అఙ్గం యస్యాస్సా = శుభాఙ్గీ ।

నిస్సీమానన్దమ్ :- నిర్గతాసీమాయస్మాత్సః=నిస్సీమా. నిస్సీమః ఆనందః యస్యసః=నిస్సీమానన్దః, తమ్=నిస్సీమానన్దమ్ ।

ఉపనిషదుపమా :- ఉపనిషదఃఉపమాయస్యాస్సా=ఉపనిషదుపమా ।

తత్పరీభూయ :- అతత్పరా, తత్పరా, సమ్పద్యమానాభూత్వా=తత్పరీ భూయ.

**భావము :**

ఆ దమయన్తి, భాగ్యవన్తులును, తనపైనభిలాషను పెంచుకొనుచున్న వారునునైన ప్రసిద్ధులగు రాజులను దేవతలను, పొంది యొక్కొక్కరిని పరిత్యజించుచుండినది. ఇదియెట్లున్నదనగా - పృథివ్యాదినవద్రవ్యముల యందు నాత్మ కొఱకై తద్భిన్నములగు పృథివి - జలము - తేజస్సు-వాయువు-ఆకాశము- కాలము-దిక్కు-మనస్సు అను నీయెనిమిందింటిని నాత్మకావని నిషేధించుకొని నదే యాత్మ తెలియఁగలడు. ఈ విషయమునే, "నేతి నేతి" యున్నను శ్రుతులు ప్రతిపాదించుచున్నవి. కాన "సానన్త-తేజస్సుఖనిఖిలమరుత్పార్థివాది శబ్దములు శ్లేషవశమున-తేజోవన్తులగు నిన్ద్రాది దేవతలను, రాజులను ఆకాశ పృథివ్యాది నవద్రవ్యములను బ్రతిపాదించుటవలన పైరెండర్థములు- అనగా నిన్ద్రాది దేవత లను, రాజులను పరిహరించి నలుని యందు తత్పరతనుఁ జూపుట ; ఆకాశాది నవద్రవ్యముల నుండి ఆత్మేతరములగు ద్రవ్యములనుఁ బరిహరించుచు వచ్చుట

వలన నాత్మసిద్ధియను పని యాత్మజ్ఞానప్రాప్తియుఁ గాపుట యనునని యేర్పడు చున్నవి. కాని యుపనిషత్తు లుపనిషత్ప్రమాణమై వెలయుచు యుపనిషత్తులు పృథి వ్యాపస్తేజోవాయ్వాకాశముల నుండి యాత్మను వేఱుగావించి, తదితరములను నిషేధించి నట్లు ఇన్ద్రాగ్ని దేవతలను, ఇతర రాజులను నిషేధించి వాక్కులకందని సౌన్దర్య మును గల్గినందువలన పారేవాగ్వృత్తి యును, సకల శాస్త్రపారంగతుడైనందు వలన చిత్ప్రయోనిధియును ఎల్లలేని యానందముఁ గల్గి యుండుటవలన నిస్సీమానందుఁడును నగు నలుఁడను పురుషునుద్దేశించి, వాక్కులకందని స్వ రూపము గల్గినందువలన పారేవాగ్వృత్తి రూపుఁడును, జ్ఞానఘనుఁ డగుటవలన చిత్ప్రయోనిధియును, అనన్తసుఖ స్వరూపుఁ డగుట వలన, నిస్సీమానన్దుఁడును, నగు పరమాత్మనుఁ గూర్చి యుపనిషత్సమూహమువలె యాతనియందాసక్తి గలదై యుండినది ॥౧౨౯॥

శ్లో. శ్రీహర్షం కవిరాజరాజిముకుటాలఙ్కారహీరస్సుతం
శ్రీహీరః సుషువే జితేన్ద్రియచయం మామల్లదేవీ చ యమ్।
శృఙ్గారామృతశీతగావయమగాదేకాదశ స్తన్మహా
కావ్యే చారుణి నైషధీయచరితే సర్గో నిసర్గోజ్జ్వలః॥ 130

ప. వి. శ్రీహర్షం-కవిరాజరాజిముకుటాలఙ్కారహీరః-సుతం-శ్రీహీరః-సుషువే-జితేన్ద్రియచయం-మామల్లదేవీ-చ-యం-శృఙ్గారామృతశీతగౌ- అయమ్-అగాత్ - ఏకాదశః - తన్మహాకావ్యే - చారుణి - నైషధీయచరితే-సర్గః-నిసర్గోజ్జ్వలః.

కవిరాజరాజిముకుటాలఙ్కారహీరః; కవిరాజ=కవిశ్రేష్ఠులయొక్క, రాజిః= పఙ్క్తియొక్క, ముకుట=కిరీటములకు, అలఙ్కార=భూషణమైన, హీరః= వజ్రమణియైన, శ్రీహీరః=శ్రీహీరుఁడను, విద్వాంసుఁడు, జితేన్ద్రియచ యమ్; జిత=జయింపఁబడిన, ఇన్ద్రియచయం=చక్షురాదీన్ద్రియ సమూ హముగల్గిన, శ్రీహర్షం=శ్రీహర్షుఁడను, సుతం=కుమారుని, సుషువే= జన్మింపఁజేసెను. మామల్లదేవీచ=మామల్లదేవియను తల్లియు, యం= ఎవనిని, సుషువే=కనెనో, శృఙ్గారామృతశీతగౌ; శృఙ్గారామృత=శృఙ్గా రమనెడి యమృతమునకు, శీతగౌ=చల్లనికిరణములుగలచన్ద్రుడైనదియు, చారుణి=రమ్యమైనదియు నగు, తన్మహాకావ్యే=ఆ శ్రీహర్షునియొక్క మహా

కావ్యమైన, నైషధీయచరితే = నైషధీయచరితమునందు, నిసర్గోజ్జ్వలః = స్వభావముతో ప్రకాశించుచున్న, ఏకాదశః=పదునొకండవ, సర్గః=సర్గ, అగాత్=సమాప్తి నొందినది.

**సమాసములు :**

కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః — కవీనాంరాజానః = కవిరాజాః. కవిరాజానాంరాజిః=కవిరాజరాజిః, కవిరాజరాజీనాంమకుటాని=కవిరాజరాజిమకుటాని, కవిరాజిరాజమకుటేష్వలఙ్కారః=కవిరాజరాజిమకుటాలఙ్కారః, కవిరాజరాజిమకుటాలఙ్కారశ్చాసౌహీరశ్చ=కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః

జితేన్ద్రియచయమ్ :- ఇన్ద్రియాణాంచయః=ఇన్ద్రియచయః, జితః ఇన్ద్రియచయః, యేనసః=జితేన్ద్రియచయః. తమ్=జితేన్ద్రియచయమ్ ।

శృఙ్గారామృతశీతగౌ :- శృఙ్గార ఏవ అమృతమ్ = శృఙ్గారామృతమ్. శీతాః గావః యస్యసః = శీతగుః, శృఙ్గారామృతస్య శీతగుః=శృఙ్గారామృతశీతగుః. తస్మిన్ = శృఙ్గారామృతశీతగౌ ।

నిసర్గోజ్జ్వలః :- నిసర్గేణ ఉజ్జ్వలః = నిసర్గోజ్జ్వలః

**భావము :**

కవిశ్రేష్ఠులపఙ్క్తి యొక్క మకుటములలో శ్రీ హీరుడు వజ్రమణి వంటి వాఁడు. అతడు, ఇన్ద్రియనిగ్రహపరుడైన శ్రీహర్షుడను కుమారుని మామల్లదేవి యందు జన్మింపఁజేసెను. శృఙ్గారరసమనుసమృతమునకు చంద్రుడైన యాతని మహాకావ్యమైన నైషధీయచరితము నందు స్వభావమనోజ్ఞమై వెలయుచున్న పదునొకండవసర్గ సమాప్తము. ॥౧౩౦॥

ఇట్లు
శ్రీమదాత్రేయగోత్రోద్భవ ఉడాలినరసింహసూరి
తనూజ ఉడాలి సుబ్బరామశాస్త్రి విరచితమగు
శ్రీ హర్షనైషధ వ్యాఖ్యయందు
ఏకాదశసర్గ సమాప్తము
ఓం
— శ మ్ —

# శ్రీ హర్ష నైషధము

## ద్వాదశసర్గ

శ్లో. ప్రియాహ్రియాలమ్భ్య విలమ్బమావిలా
విలాసినః కుణ్డినమణ్డనాయితమ్ ।
సమాజమాజగ్ము రథో రథోత్తమా
స్తమా సముద్రాదపరేపరే నృపాః॥ 1

ప. వి. ప్రియాహ్రియా - అలమ్భ్య - విలమ్బమ్ - ఆవిలాః - విలాసినః - కుణ్డినమణ్డనాయితమ్ - సమాజమ్- ఆజగ్ముః - అథో - రథోత్తమాః, - తమ్ - ఆసముద్రాత్ - అపరే - పరేనృపాః.

అర్థము. అథో = అనన్తరము ప్రియాహ్రియా; ప్రియా = ప్రియురాండ్రనుండి, హ్రియా=సిగ్గుచే, (సహజానురాగమునుఁ జూపినవారిపై, గపటదాక్షిణ్యమునుఁ జూపుటవలన గల్గిన సిగ్గుచే) విలమ్బం = ఆలస్యమును, అవలమ్భ్య = పొంది, ఆవిలాః=కాలుష్యముఁ బొందిన, విలాసినః=విలాసవంతులగు, రథోత్తమాః = మహారథులును, పరే = శ్రేష్ఠులును, అపరే = ఇతరులునగు, నృపాః = రాజులు, ఆసముద్రాత్=సముద్రపుటంచుల నుండి, కుణ్డినమణ్డనాయితఁ; కుణ్డిన=కుణ్డిన నగరమునకు, మణ్డనాయితం = అలఙ్కారమైన, తమ్ = ఆ సమాజం=రాజసభను, ఆజగ్ముః= పొందిరి.

వి. పూర్వార్థమందలి "విలమ్బమావిలా" అను చోటవిల-విల శబ్దములకును, ఉత్తరార్థమందలి 'సమాజమాజ' అనుచోట మాజ-మాజ-శబ్దములకును నియమముగా నొక్కతడవ వ్యఞ్జనములగు 'వ్ల్' అనువానిని 'మ్జ్'అను వానిని ఆవృత్తినిఁజేయుటవలన ఛేకానుప్రాసము. తక్కిన చోట్ల నియమ రహితముగా నావృత్తి యుండుట వలన వృత్త్యను ప్రాసము. ఈరెంటికిని సంసృష్టి.

**సమాసములు :**

ప్రియాహ్రియా :– ప్రియాభ్యః హ్రీః=ప్రియాహ్రీః, తయా = ప్రియాహ్రియా।

కుణ్డినమణ్డనాయితమ్ :- మణ్డనమివ ఆచరితః = మణ్డనాయితః. కుణ్డినస్యమణ్డనాయితః = కుణ్డినమణ్డనాయితః, తమ్ = కుణ్డినమణ్డనాయితమ్।

ఆ సముద్రాత్ : సముద్రమభివ్యాప్య=ఆ సముద్రాత్.

**భావము :**

సహజానురాగమును జూపుచున్న తమకాంతలపై కపటవ్యవహారములను జేయుటవలని సిగ్గుచేతనాలస్యము గావించి దానివలన వ్యథ జెందిన మనస్సులుగల మహారథులలో శ్రేష్ఠులును తదితరులునగు రాజులు సముద్రముల యంచులనుండి యాకుణ్డిన నగరమునకు నలజ్కారమైన యాస్వయంపరమహాసభకు విచ్చేసిరి॥౧॥

శ్లో. తతః స భైమ్యా వవృతే వృతే నృపై
ర్వినిఃశ్వసద్భిః సదసి స్వయంవరః ।
చిరాగతైస్తర్కితతద్విరాగితైః
స్ఫురద్భిరాననమహార్ణవైర్నవైః॥ **2**

ప. వి. తతః-సః-భైమ్యాః-వవృతే - వృతే-నృపైః -వినిఃశ్వసద్భిః - సదసి-స్వయంవరః-చిరాగతైః-తర్కితతద్విరాగితైః- స్ఫురద్భిః -ఆనన్దమహార్ణవైః -నవైః.

అర్థము. తతః=ఇతరరాజులువచ్చిన పిదప, తర్కితతద్విరాగితైః, తర్కిత= ఊహింపబడిన,తత్=ఆ దమయన్తియొక్క, విరాగితైః= వైరాగ్యము గల, (కావునసే) వినిఃశ్వసద్భిః=దుఃఖమువలన దీర్ఘముగా శ్వాసలను వదలుచున్నట్టి, చిరాగతైః = చాలకాలమునకు మును పేవిచ్చేసిన, నృపైః=రాజులచేతను, తథా=అట్లే, స్ఫురద్భిః=స్ఫూర్తిని బొందిన

అనగా సంతోషాతిశయముచే ప్రసన్నముఖములుగల్గిన, ఆనన్దమహార్ణవైః = ఆనన్దమునకు గొప్పసముద్రములైన, నవైః=నూతనులైన-అప్పుడే విచ్చేసినట్టి, నృపైః=రాజులచేతను, వృతే=నిండిన, సదసి = ఆ సభయందు, సః=ఆ, భైమ్యాః = దమయన్తియొక్క, స్వయంవరః= స్వయంవరము, వవృతే=జరిగినది.

**సమాసములు :**

భైమ్యాః :- భీమస్య అపత్యం స్త్రీ = భైమీ. తస్యాః = భైమ్యాః

చిరాగతైః :- చిరాత్ ఆగతాః=చిరాగతాః, తైః=చిరాగతైః।

తర్కితతద్విరాగితైః :- విరాగః అస్యాః అస్తీతి=విరాగిణీ, విరాగిణ్యాః భావః = విరాగితా. తస్యాః, విరాగితా=తద్విరాగితా, తర్కితా, తద్విరాగితా యైస్తే=తర్కితతద్విరాగితాః॥

ఆనన్దమహార్ణవైః :- మహాన్తశ్చ తే అర్ణవాశ్చ = మహార్ణవాః, ఆనన్దస్య మహార్ణవాః, ఆనన్దమహార్ణవాః, తైః=ఆనన్దమహార్ణవైః।

**భావము :**

ఇతరనరపతులు వచ్చినపిదప తత్పూర్వము విచ్చేసినరాజులు దమయన్తికి దమపైని విరక్తిని గ్రహించి దుఃఖముతో, నిట్టూర్పులను వదలుచుండిరి. తర్వాత వచ్చిననరపతులు మంచి ముఖవికాసముతో వెలయుచుండిరి. ఏల యనగా- ముందువచ్చిన రాజులను దమయన్తి వరించలేదు. కాన మనలను తప్పకవరించునను దృఢవిశ్వాసముతోఁ గూడి మహానందభరితులైయుండిరి. ఇట్లు విషాదపూరితులైన పూర్వరాజులతోడను, అనగా ముందువచ్చిన రాజులతోఁడను ఆనందభరితులైన తర్వాతవచ్చిన రాజులతోడను నా స్వయంవరసభ నిండి యుండినది॥౨॥

శ్లో. చలత్పదస్తత్పదయన్త్రిణేఙ్గిత
స్ఫుటాశయామానయతి స్మ రాజకే।
శ్రమం గతా యానగతావపీయమి
త్యుదీర్య ధుర్యాః కపటాజ్జనీం జనః॥ 3

ప. వి. చలత్పదః-తత్పదయన్త్రిణే జ్గితస్ఫుటాశయామ్ - ఆసయతి - స్మ-రాజకే-శ్రమం-గతా-యానగతౌ-అపి-ఇయమ్-ఇతి-ఉదీర్య - ధుర్యః-కపటాత్-జనీం-జనః.

అర్థము. చలత్పదః=(నిలబడిన సమయమందును మంచి జాతికిఁ జెందిన గుఱ్ఱము వలె) చలించుపాదములుగల్గిన, ధుర్యః=పల్లకిమోయునట్టి, జనః=భృత్య జనము, తత్పదయన్త్రిణేజ్గితస్ఫుటాశయామ్ ; తత్=ఆ దమయన్తి యొక్క, పద=పల్లకికిఁ గప్పిన వస్త్రములోపలనున్న పాదముచే, యన్త్రిణ = పల్లకిని మోయువారిని సడుపుటయను, ఇజ్గిత=చేష్టచే, స్ఫుట=స్పష్టమైన, ఆశయాం=రాజులను చూచుటకై యభిప్రాయముగల్గిన, జనీం=వధువైన దమయన్తిని, ఇయం=ఈ అమ్మాయి, యానగతావపి= వాహనముమీద పోయినను, శ్రమం=పరిశ్రమను, గతా = పొందినది, ఇతి=అని, ఉదీర్య=శ్రమనెపముతోఁ జెప్పి, రాజకే = రాజసమూహము మధ్య, ఆసయతిస్మ=కూర్చుండఁ బెట్టెను.

**సమాసములు :**

చలత్పదః :- చలన్తీపదేయస్యసః=చలత్పదః ।

తత్పదయన్త్రిణేజ్గితస్ఫుటాశయామ్ :- తస్యాఃపదమ్= తత్పదమ్, తత్పదస్యయన్త్రిణమ్ = తత్పదయన్త్రిణమ్, తత్పదయన్త్రిణమేవ ఇజ్గితమ్ = తత్పదయన్త్రిణేజ్గితమ్, తత్పదయన్త్రిణేజ్గితేన స్ఫుటః ఆశయః యస్యాస్సా-తత్పదయన్త్రిణేజ్గితస్ఫుటాశయా, తామ్=తత్పదయన్త్రిణేజ్గితస్ఫుటాశయామ్ ।

రాజకే :- రాజ్ఞాంసమూహః=రాజకమ్, తస్మిన్=రాజకే ।

యానగతౌ :- యానస్యగతిః=యానగతిః; తస్యాం యానగతౌ ।

ధుర్యః :- ధురంవహతీతి=ధుర్యః ।

**భావము :**

ఉత్తమాశ్వములు నిలచియున్నను తమ పాదములనుఁ గదలించుచునే యుండును. అట్లే పల్లకిని మోయుసేవకులు గూడ నిలచియున్నను తమ పాదము

లనుఁ కదలించుచునే యుండిరి. వారు, దమయన్తి పల్లకిని కప్పిన వస్త్రము మఱుగున తన పాదములతో నడుపుటచే నామె యింగితమును తెలిసికొనినవారై అనగా పల్లకిని నిలుపవలయుననెడి యామె యభిప్రాయమును గ్రహించినవారై పల్లకియందు తిరుగుచున్నను నీమె యలసినదను నెపముతో, రాజసమాజ మధ్యభాగమునఁ బల్లకినిఁ దించిరి. ॥3॥

శ్లో. నృపానుపక్రమ్య విభూషితాసనాన్
సనాతనీ సా సుషువే సరస్వతీ।
విగాహమారభ్య సరస్వతీః సుధా
సరఃస్వతీవార్ద్రితనూరనూత్థితాః॥ 4

ప. వి. నృపాన్-ఉపక్రమ్య-విభూషితాసనాన్-సనాతనీ-సా-సుషువే-సరస్వతీ విగాహమ్-ఆరభ్య-సరస్వతీః-సుధాసరస్సు-అతీవ-ఆర్ద్రితనూః-అను-ఉత్థితాః.

అర్థము. సనాతనీ=ప్రాచీనురాలైన, సరస్వతీ=సరస్వతీదేవి, విభూషితాసనాన్, విభూషిత=అలఙ్కరింపఁబడిన, ఆసనాన్=ఆసనములు గల్గిన, అనగా సింహాసనములయందు కూర్చొనియున్న, నృపాన్=రాజులను, ఉపక్రమ్య=ఉద్దేశించి, సుధాసరస్సు=అమృతసరస్సులయందు, విగాహమ్=మునుగుటను, ఆరభ్య=ఆరంభించి, అనగా పొంది, అనూత్థితాః; అను=వెంటనే, యనగా నాలస్యములేక, ఉత్థితాః=లేచినటువంటి (కావుననే) అతీవ=మిక్కిలి, ఆర్ద్రితనూః=తడిసిన శరీరముగల అనగా శరీరమం దంతట నమృతమునుఁ గార్చుచున్న, సరస్వతీః=మాటలను, సుషువే=చెప్పినది.

వి. సరస్వతులు, అనగా వాక్కులు, అమృత సరస్సులలో మునిగి తడిసిన శరీరములు కలవి కాకపోయినను, తడిసిన శరీరములు కలవిగాఁ జెప్పుట వలన నుత్ప్రేక్ష. ఇవాదిశబ్దప్రయోగము చేయనందువలన నది గమ్యము.

**సమాసములు :**

విభూషితాసనాన్ :— విభూషితాని, ఆసనానియైస్తే=విభూషితాసనాః, తాన్=విభూషితాసనాన్ ।

సుధాసరస్సు :- సుధానాంసరాంసి=సుధాసరాంసి, తేషు=సుధాసరస్సు.
ఆర్ద్రితనూః :- ఆర్ద్రితనూః యాసాంతాః=ఆర్ద్రితన్వః, తాః=ఆర్ద్రితనూః ।
అనూత్థితాః ;- అనుసృత్య ఉత్థితాః=అనూత్థితాః, తాః=అనూత్థితాః,

**భావము :**

పురాతనురాలగు నా సరస్వతీదేవి, ఆ స్వయంవరమణ్డపము నందు, సింహాసనముల నలఙ్కరించిన రాజుల నుద్దేశించి యమృతంపు కొలంకుల యందు మునిగి వెంటనే లేచినవో, యనునట్లు సుధలను జిలుకుచున్నమాటలను జెప్పినది. ॥4॥

శ్లో. వృణీష్వ వర్ణేన సువర్ణకేతకీ
ప్రసూనపర్ణాదృతుపర్ణమాదృతమ్।
నిజామయోధ్యామపి పావనీమయం
భవన్మయో ధ్యాయతి నాఽవనీపతిః ॥ 5

ప. వి. వృణీష్వ-వర్ణేన-సువర్ణకేతకీ ప్రసూనపర్ణాత్-ఋతుపర్ణమ్-ఆదృతమ్-నిజామ్- అయోధ్యామ్-అపి-పావనీమ్-అయం- భవన్మయః- ధ్యాయతి-న-అవనీపతిః.

అర్థము. వర్ణేన=ఒడలికాంతితో, సువర్ణకేతకీ ప్రసూనపర్ణాత్ (అపి); సువర్ణ కేతకీ ప్రసూన = పసిడిమొగలిపూవు యొక్క, పర్ణాత్ (అపి)= రేకు కంటెను, ఆదృతం=అధికముగాఁగోరఁదగిన. ఋతుపర్ణం=ఋతుపర్ణుఁడను రాజును, వృణీష్వ=వరింపుము. అయం= ఈ, అవనీపతిః=రాజు, భవన్మయః=నీ రూపమును వహించినవాడై, పావనీం = పవిత్రతనుఁ గల్గించునట్టి, నిజాం=స్వాధీనమైన, అనగా పురుషపరమ్పరతో సఙ్క్రమించిన, అయోధ్యామపి=అయోధ్యను సైతము అనగా ముక్తిక్షేత్రమైన యయోధ్యననియర్థము, నధ్యాయతి=స్మరింపఁడు. నీతోటికలయికపరమానందరూపముగా నుండుటవలన, ముక్తికంటెను నధికమైనది. కావనీయం ధీతఁడు మిక్కిలి యనురక్తుఁడు కావలీనిని, నీవు వరించుమని యర్థము.

**సమాసములు :**

సువర్ణకేతకీ ప్రసూన పర్ణాత్:- సువర్ణమయీచసా కేతకీచ=సువర్ణకేతకీ, సువర్ణకేతక్యాః ప్రసూనమ్ = సువర్ణకేతకీప్రసూనమ్, సువర్ణకేతకీ ప్రసూనస్యపర్ణమ్=సువర్ణకేతకీ ప్రసూన పర్ణమ్, తస్మాత్=సువర్ణకేతకీ ప్రసూన పర్ణాత్.

భవన్మయ :- భవతీఏవ=భవన్మయః.

అవనీపతి :- అవన్యాః పతిః=అవనీపతిః.

**భావము :**

అయోధ్యనుఁ బాలించెడి యీ ఋతుపర్ణమహారాజు, దేహకాన్తి యందు మొగలిపూరేకునుఁ గూడమించినవాఁడు. కాన నీ రాజును నీవు వరింపుము. ఈ రాజు నీయందే ఐక్యమునొంది, యందతిని పవిత్రముజేయు నట్టిదియు, పురుష పరమ్పరతో సంక్రమించిన, ముక్తిక్షేత్రమైన యయోధ్యను సైతము స్మరింపఁడు. నీవు పరమానంద స్వరూపురాలవు గాబట్టి నీలో నైక్యమునొందుట ముక్తికంటెను నధికము గాన నిన్నుమిక్కిలి వలచిన యట్టివానిని నీవుతప్పక వరింపవలసినదని యాశయము ॥౫॥

> శ్లో. న పీయతాం నామ చకోరజిహ్వయా
> కథఞ్చిదేతన్ముఖచన్ద్రచన్ద్రికా ।
> ఇమాం కిమాచామయసే న చక్షుషీ?
> చిరం చకోరస్య భవన్ముఖస్పృశీ॥ 6

ప. వి. న- పీయతాం -నామ- చకోరజిహ్వయా- కథం-చిత్- ఏతన్ముఖచన్ద్రచన్ద్రికా- ఇమాం- కిమ్- ఆచామయసే-న- చక్షుషీ- చిరం- చకోరస్య భవన్ముఖస్పృశీ.

అర్థము. ఏతన్ముఖ చన్ద్రికా; ఏతత్ = ఋతుపర్ణుని యొక్క, ముఖచన్ద్ర=ముఖమనెడి చన్ద్రుని యొక్క, చన్ద్రికా=వెన్నెల, చకోరజిహ్వయా; చకోర= చకోరపక్షులయొక్క, జిహ్వయా = నాలుకతో, కథఞ్చిదపి = ఏవిధముగను, నపీయతాంనామ = పానమ్ము చేయఁబడకపోయినచో పోనిమ్ము.

చకోరముల నాలుక నిజమైన వెన్నెలను త్రాగును. నీముఖ చంద్రుని వెన్నెల నిజమైనదిగాదు కాన చకోర జిహ్వ దానిని( ద్రాగ(జాలదు. **తథాఽపి** = అయినను, **భవన్ముఖస్పృశీ; భవత్** = నీయొక్క, ముఖ= ముఖమును, స్పృశీ = తాకుచున్నవైన, అనగా నీ ముఖము నందుండిన వైన, అనగా నీ కన్నులుగా బరిణమించినవైన, చకోరస్య=చకోరము యొక్క, చక్షుషీ= నేత్రములను, ఇమాం = ఈవెన్నెలను, చిరం=చాల కాలము నాఽచామయసే కిం = త్రాగింపవాయేమి ? అనగా నీరాజును చూడవాయేమి యని యర్థము.

వి. దమయన్తి కన్నులనెడి యుపమేయములను చెప్పక యుపమానములగు చకోరనేత్రములనే చెప్పుటవలన వీనితో వానికి నభేదము సిద్ధించినదిగాన నభేదాతిశ యోక్త్యలఙ్కారము.

**సమాసములు :**

చకోరజిహ్వయా : చకోరస్యజిహ్వా = చకోరజిహ్వా, తయా = చకోర జిహ్వయా ।

ఏతన్ముఖచన్ద్రచన్ద్రికా :- ఏతస్యాః ముఖమ్ = ఏతన్ముఖమ్, ఏతన్ముఖ మేవచన్ద్రః = ఏతన్ముఖచన్ద్రః, ఏతన్ముఖచన్ద్రస్య చన్ద్రికా=ఏతన్ముఖ చన్ద్రచన్ద్రికా.

భవన్ముఖస్పృశీ :- భవత్యాఃముఖం = భవన్ముఖం, భవన్ముఖం స్పృశత ఇతి = భవన్ముఖస్పృశీ తే, భవన్ముఖస్పృశీ,

**భావము :**

ఈతని ముఖచన్ద్రుని వెన్నెలను చకోరపక్షుల నాలుక త్రాగకపోయినచో పోనిమ్ము. ఏల యనగా వాని నాలుక సత్యమైన వెన్నెలనే పానము చేయును. ఈతని ముఖచంద్రుని వెన్నెలలు సత్యములుగావు. కానవీనినవి పానము జేయవు, అయినను నీ ముఖమునందలి నీ కన్నులుగా మారిన చకోర నేత్రములను నీ బుతు పర్ణ మహారాజుయొక్క ముఖచన్ద్రచన్ద్రికలను త్రాగింప వాయేల? అనగా నీకన్ను లచే నీ మహారాజును జూడవా? యని భావము ॥౬॥

శ్లో. అపాం విహారే తవ హారవిభ్రమం
కరోతు నీరే పృషదుత్కరస్తరన్।
కఠోరపీనోచ్చకుచద్వయీతటే
త్రుటత్తరః సారవసారవోర్మిజః॥ 7

ప. వి అపాం-విహారే తవ-హారవిభ్రమం-కరోతు - నీరే - పృషదుత్కరః-తరన్ - కఠోరపీనోచ్చ కుచద్వయీతటే - త్రుటత్తరః- సారవసారవోర్మిజః.

అర్థము. హేభైమి ! = ఓదమయన్తీ !, తవ = నీయొక్క, అపాం విహారే = (ఇతనితోడ) జలక్రీడయందు, నీరే=నీటిపైన, తరన్=తేలుచున్నదియు, సారవసారవోర్మిజః, సారవ=ధ్వనులతో గూడిన. సారవ=సరయూనదియందలి, ఊర్మిజః = అలలవలన గల్గిన, పృషదుత్కరః = నీటి బిందువుల సమూహము, కఠోరపీనోచ్చకుచద్వయీతటే, కఠోర=కఠినములైన, పీన = బలిసిన, ఉచ్చ = ఉన్నతమైన, కుచద్వయీ=చనుదోయియొక్క, తటే = ప్రాన్తమందు, త్రుటత్తరః = మిక్కిలితుంటలుగా తెగినవై, హారవిభ్రమం=ముత్యాలహారముపు, భ్రాన్తిని, కరోతు= చేయును గాత.

వి. ఆజలబిందువులు జలక్రీడా సమయమందుఁ దెగిపోయిన ముత్యాల హారమా, యను భ్రాంతిసిఁ గల్గించుటచే నిఁట భ్రాన్తిమదలఙ్కారము.

## సమాసములు :

హారవిమభ్రమ్ :- హారఇతివిభ్రమః=హారవిభ్రమః, తమ్ = హారవిభ్రమమ్: పృషదుత్కర:- పృషతాముత్కరః=పృషదుత్కరః.
కఠోరపీనోచ్చకుచద్వయీతటే:- కఠోరా చ తా పీనౌచ=కఠోరపీనా, కఠోరపీనౌచతా ఉచ్చౌచ = కఠోరపీనోచ్చౌ, కఠోరపీనోచ్చౌచతా కుచౌచ=కఠోరపీనోచ్చకుచౌ, కఠోరపీనోచ్చకుచయోఃద్వయీ=కఠోరపీనోచ్చకుచద్వయీ, కఠోరపీనోచ్చకుచద్వయ్యాః తటమ్=కఠోరపీనోచ్చకుచద్వయీతటమ్. తస్మిన్=కఠోరపీనోచ్చకుచద్వయీతటే.
త్రుటత్తర :- అతిశయేనత్రుటన్ = త్రుటత్తరః.

సారవసారవోర్మిజః:- ఆరవేణసహితా = సారవాః, సరయ్వాంభవాః = సారవాః.సారవాశ్చతాః, ఊర్మయశ్చ=సారవోర్మయః. సారవాశ్చతాః సారవసారవోర్మయశ్చ=సారవ సారవోర్మయః. సారవసారవోర్మిభ్యః జాయతఇతి=సారవసారవోర్మిజః.

**భావము :**

ఓ దమయన్తీ ! నీవు ఋతుపర్ణునితో జలక్రీడ సలుపు సమయమున, సరయూనది యందు గొప్ప మ్రోతతోఁ గూడిన యలలవలన నుద్భవించిన నీటి బిందువుల సమూహము; నీకఠినపీనోన్నతములగు చనుదోయినంటి తుత్తునియలై, తెగిపోయిన నీ ముత్యాలహార మనెడి భ్రాన్తినిఁ జూపరులకుఁ గల్గించునుఁ గాత ॥౭॥

**శ్లో. అఖాని సిన్ధుః సమపూరి గఙ్గయా**
**కులే కిలాఽస్య ప్రసభం స భంత్స్యతే।**
**విలఙ్ఘ్యతే చాస్య యశఃశతైరహో!**
**సతాం మహత్సమ్ముఖధావి పౌరుషమ్॥ 8**

ప. వి. అఖాని-సిన్ధుః-సమపూరి-గఙ్గయా-కులే-కిల-అస్య- ప్రసభం-సః-భంత్స్యతే-విలంఘ్యతే-చ-అస్య-యశశ్శతైః-అహో-సతాం-మహత్సమ్ముఖధావి-పౌరుషమ్.

అర్థము. అస్య=ఈ ఋతుపర్ణునియొక్క, కులే=కులమందు, (జాతైః=పుట్టిన సగరపుత్రులచే) సిన్ధుః = సాగరము, అఖాని-త్రవ్వఁ బడినది, తథా= అట్లే, సః=ఆ సముద్రము, గఙ్గయా = గఙ్గచే, సమపూరి = నింపఁ బడినది, (ఈ వంశమునందు జన్మించిన భగీరథునిచేత), తథా = అట్లే, సః = ఆ సముద్రము.ప్రసభం=బలాత్కారముగా, భంత్స్యతే=రాఁబోవు త్రేతాయుగమునందు రామునిచే సేతువుతో బంధింపఁ బడఁ గలదు, (ఇదానీం=ఇప్పుడు) సః=ఆ సముద్రము, అస్య = ఈ ఋతుపర్ణుని యొక్క, యశఃశతైః=పెక్కుకీర్తులచే, విలఙ్ఘ్యతేచ=లంఘింపఁ బడుచున్నది. తథాహి=అదియుక్తమే ; సతాం = సత్పురుషులయొక్క,

పౌరుషం = పౌరుషము అనగా పరాక్రమము, మహత్సమ్ముఖధావి ; మహత్=గొప్పవారియొక్క, సమ్ముఖ=సమక్షమున, ధావి=ప్రసరించునది, కాని క్షుద్రులయెదుట ప్రసరింపనది కాదు.

వి. సగరపుత్రులు మున్నగువారు సముద్రముపైననే తమపౌరుషమును విజృమ్భింపఁ జేసిరను విశేషమును సత్పురుషుల పౌరుషము గొప్పవారిపైననే విజృమ్భించునను సామాన్యముచే సమర్థించుటవలన నర్థాన్తరన్యాసాలఙ్కారము.

**సమాసములు :**

యశఃశతైః : యశసాంశతాని=యశశ్శతాని, తైః=యశశ్శతైః।

మహత్సమ్ముఖధావి: మహతాంసమ్ముఖం= మహత్సమ్ముఖం, మహత్సముఖంధావతీతి=మహత్సమ్ముఖధావి.

పౌరుషమ్ : పురుషస్యకర్మ=పౌరుషమ్।

**భావము :**

ఈ ఋతుపర్ణుని వంశమునఁ బుట్టిన సగరపుత్రులు, సముద్రమునుఁ ద్రవ్విరి, ఎందుకనగా- ఇంద్రుడు, వీరియాగాశ్వమునపహరించుటవలన నాయశ్వమును వెదకుటకై పాతాలముపరకును భూమినిఁ ద్రవ్వుటవలన నీసముద్రమేర్పడినది. అట్లే యీతనివంశమునందుద్భవించిన భగీరథుఁడు గఙ్గనుభూమికిఁ దెచ్చి సముద్రమును దానితోనింపెను. ఎందుకనగా – సగరపుత్రులు భూమిని త్రవ్వి పాతాలమునకుఁ బోలు యచ్చట తపమాచరించెడి కపిలమునియొద్దకట్టఁబడియున్న యాగాశ్వమునుఁ జూచి కపిలముని యాగాశ్వమునపహరించెనని భావించి యాతనినవమానపఱచిరి- అందులకామునిపుఙ్గవుఁడు కోపించి శపింపగా వీరు కాలిపోయిరి. ఇఁక వీరిభస్మములపై గఙ్గను ప్రవహింపఁ జేసి వీరిని తరింపఁ జేయుటకు భగీరథుడు తపస్సుగావించి దానిని భూమికిఁదెచ్చి వీరిభస్మములపైఁ బ్రవహింపఁ జేసి వీరినిముక్తులఁ గావించెనని పురాణప్రసిద్ధి. మఱియు నీకులమునందు త్రేతాయుగమునందవతరించెడి శ్రీరామచంద్రుడు సేతువుతో నీసముద్రమును బంధింపఁ గలడు. ఇట్లీతని వంశస్థులందఱు నిట్టి ఘనకార్యములనుఁ గావించిన పౌరుషశాలురు. కాన వీనిని నీవువరించుట యుచితము॥౮॥

శ్లో. ఏతద్యశః క్షీరధిపూరగాహి
పతత్యగాధే వచనం కవీనామ్।
ఏతద్గుణానాం గణనాఙ్క పాతః
ప్రత్యర్థికీర్తీః ఖటికాః క్షిణోతి॥ 9

ప. వి. ఏతద్యశఃక్షీరధిపూరగాహి - పతతి - అగాధే - వచనం- కవీనామ్ - ఏతద్గుణానాం-గణనాఙ్కపాతః-ప్రత్యర్థికీర్తీః-ఖటికాః-క్షిణోతి.

అర్థము. ఏతత్=ఈయుతునియొక్క, యశః క్షీరధి=కీర్తియనెడు పాలకడలి యొక్క, పూర=ప్రవాహమును, గాహి=ప్రవేశించునట్టి యనగా దానిని వర్ణించునట్టి, కవీనాం=కవులయొక్క, వచనం = వాక్కు, అగాధే=లోతైన స్థానమందు, పతతి=పడుచున్నది అనగా మునుగుచున్నది. కాని యితని కీర్తిని వర్ణింపలేక యున్నది. (మఱియు) ఏతద్గుణానాం=ఈతని గుణములయొక్క, గణనాఙ్కపాతః, గణనాఙ్క = లెక్కించు గీత యొక్క, పాతః=విన్యాసము, ప్రత్యర్థికీర్తీః=శత్రుకీర్తులనెడు, ఖటికాః= వ్రాతకు సాధనములైన బలపములను, క్షిణోతి=అరగదీయుచున్నది.

వి. "యశఃక్షీరధి" యని కీర్తిని సముద్రముగా రూపించుటవలన రూపకము. ఇతనిని వర్ణింపఁబూనిన కవుల వచనము అగాధమునందు మునుగక పోయినను మునిగినట్లును ఇతని గుణము లెక్కించుచు గీతలను గీయునట్టి బలపము, అరిగిపోక పోయినను నరిగినట్లును, వర్ణించుటవలన సతిశయోక్త్యలఙ్కారము. పై రూపకముచే నీయతిశయోక్తి యను ప్రాణితము.

**సమాసములు :**

ఏతద్యశః క్షీరధిపూరగాహి :- ఏతస్యయశః = ఏతద్యశః, ఏతద్యశ ఏవక్షీరధిః=ఏతద్యశఃక్షీరధిః, ఏతద్యశఃక్షీరధేఃపూరః=ఏతద్యశఃక్షీరధిపూరః, ఏతద్యశఃక్షీరధిపూరంగాహత ఇతి=ఏతద్యశఃక్షీరధిపూరగాహి।
ఏతద్గుణానామ్ :- ఏతస్యగుణాః=ఏతద్గుణాః, తేషామ్=ఏతద్గుణానామ్।

గణనాజ్ఞపాతః :- గణనాయాః ఆజ్ఞా=గణనాజ్ఞా, గణనాజ్ఞాస్య పాతః గణనాజ్ఞపాతః।

ప్రత్యర్థికీర్తీః :- ప్రత్యర్థినాం కీర్తయః=ప్రత్యర్థికీర్తయః, తాః=ప్రత్యర్థికీర్తీః।

**భావము :**

కవులు, ఈఋతుపర్ణుని కీర్తియనెడిపాల్కడలిని వర్ణింపబూనినచో, వారిమాటలు, అడుగుకానరాని స్థానమున మునిగిపోవుచున్నవి. అనగా వర్ణింప లేక యున్నవి. ఇతని శౌర్యాది గుణములను లెక్కించి గీతలనుగీయఁబూనినచో, శత్రువుల కీర్తులనెడు బలపము అరిగి పోవుచున్నవి. అనగా నితని కీర్తియు శౌర్యాదిగుణములు వర్ణింప నలవికానివని యాశయము. ॥౯॥

శ్లో. భాస్వద్వంశ కరీరతాం దధదయం వీరః కథం కథ్యతామ్
అధ్యష్టాపి హి కోటిరస్య సమరే రోమాణి సత్త్వాఙ్కురాః।
నీతః సంయతి వన్దిభిః శ్రుతిపథం యన్నామవర్ణావలీ
మన్త్రైః స్తమ్భయతి ప్రతిక్షితిభృతాం దోః స్తమ్భకుమ్భీనసాన్॥ 10

ప. వి. భాస్వద్వంశకరీరతామ్-దధత్-అయం-వీరః-కథం-కథ్యతామ్-అధ్యష్టా-అపి-హి-కోటిః-అస్య-సమరే-రోమాణి-సత్త్వాఙ్కురాః-నీతః-సంయతి-వన్దిభిః-శ్రుతిపథం--యన్నామవర్ణావలీమన్త్రైః-స్తమ్భయతి-ప్రతిక్షితిభృతామ్-దోః స్తమ్భకుమ్భీనసాన్.

అర్థము. భాస్వద్వంశకరీరతామ్; భాస్వద్వంశ=సూర్యవంశమునకు, కరీరతాం=మొలకగా నుండుటను, ప్రకాశించువెదురుమొలకగా నుండుటను, దధత్=ధరించిన, వీరః=శూరుఁడైన, అయం=ఈఋతుపర్ణుడు, కథమ్=ఎట్లు, కథ్యతామ్=వర్ణింపఁబడును ? వర్ణింపనలవికాఁడని యర్థము. తథాహి=అదియుక్తమే; సమరే=రణరఙ్గమునందు, అస్య = ఈరాజుయొక్క, అధ్యష్టా=మూడున్నర సంఖ్యతో కూడిన, కోటి=కోటి, అనగా మూడున్నరకోటి సంఖ్యగల, రోమాణి = శరీరమందలి వెంట్రుకలు, సత్త్వా

జ్కురాః = వీరరసస్థాయిభావమైన యుత్సాహమునకు, అఙ్కురాః = మొల కలు. వేమరు మొలకలకు చుట్టును వెంట్రుకలవంటి మొలకలుండుట యుక్తమే. (కావుననే, సంయతి = యుద్ధమునందు, వన్దిభిః = స్తుతిపాఠకు లచే, శ్రుతిపథం = కర్ణమార్గమును, నీతః = పొందింపఁబడిన, యన్నామ వర్ణావలీమన్త్రః; యత్ = ఏ ఋతుపర్ణునియొక్క, నామవర్ణావలీ = పేరు నందలి యక్షరపఙ్క్తి యను, మన్త్రః = మన్త్రము, ప్రతిక్షితిభృతాం = శత్రు రాజులయొక్క, దోః స్తమ్భకుమ్భీనసాన్, దోః స్తమ్భ = భుజ స్తమ్భములను, కుమ్భీనసాన్ = క్రూరసర్పములను, స్తమ్భయతి = స్తమ్భింపఁజేయు చున్నది. మాన్త్రికుని, గారుడమన్త్రోచ్చారణముచే సర్పములెట్లు స్తమ్భించిపోవునో, అట్లే యీ ఋతుపర్ణుని పేరులోని యక్షరపఙ్క్తి యను మన్త్రమును వినినవెంటనే భయపడిన శత్రురాజుల భుజములు స్తంభించి పోయినవై యుద్ధమునకై యుత్సాహపడవని యర్థము.

**సమానములు :**

భాస్వద్వంశకరీరతాం :- భాస్వతః వంశః = భాస్వద్వంశః భాస్వద్వంశ స్యకరీరః = భాస్వద్వంశకరీరః, భాస్వద్వంశకరీరస్యభావః = భాస్వ ద్వంశకరీరతా, తామ్ = భాస్వద్వంశకరీరతామ్

పక్షాన్తరమున - భాఃఅస్యఅస్తీతి = భాస్వాన్, భాస్వాంశ్చసౌవంశః = భాస్వ ద్వంశః, భాస్వద్వంశస్యకరీరః = భాస్వద్వంశకరీరః, భాస్వద్వంశ కరీరస్యభావః = భాస్వద్వంశకరీరతా, తామ్ = భాస్వద్వంశకరీరతామ్।

సత్త్వాఙ్కురాః :- సత్త్వస్యఅఙ్కురాః = సత్త్వాఙ్కురాః।

శ్రుతిపథం :- శ్రుతోఃపన్థాః = శ్రుతిపథః, తమ్ = శ్రుతిపథమ్।

యన్నామవర్ణావలీమన్త్రః :- యస్యనామ = యన్నామ, వర్ణానామావలీ = వర్ణావలీ, యన్నామ్నఃవర్ణావలీ = యన్నామవర్ణావలీ, యన్నామవర్ణా వల్యేవమన్త్రః = యన్నామవర్ణావలీమన్త్రః.

ప్రతిక్షితిభృతామ్ :- క్షితింబిభర్తీతి = క్షితిభృతః, ప్రతికూలాశ్చతేక్షితి భృతశ్చ = ప్రతిక్షితిభృతః, తేషామ్ = ప్రతిక్షితిభృతామ్.

దోః స్తమ్భకుమ్భీనసాన్ :- దోషఏవ స్తమ్భాః = దోః స్తమ్భాః. దోః స్తమ్భాఏవకుమ్భీనసాః = దోః స్తమ్భకుమ్భీనసాః, తాన్ = దోః స్తమ్భకుమ్భీనసాన్।

**భావము :**

సూర్యవంశమునకు మౌళికమైన యీ ఋతుపర్ణ మహారాజును వర్ణించుట యసాధ్యము. ఇతడు గొప్పవీరుఁడు. యుద్ధరఙ్గమున నుత్సాహముచే నితని శరీరమందుఁ బొడమినిక్కిన మూడున్నరకోటి రోమములు వీరరసాఙ్కురములా ! యని భావింపవలసియున్నది. ఏలయనగా నితనిపేరునందలి యక్షరపఙ్క్తి యను మన్త్రము స్తుతిపాఠకులవలన చెవికిసోకగనే, శత్రురాజుల భుజ స్తమ్భములనెడి క్రూరసర్పములు స్తమ్భించిపోవును. అనగా శత్రురాజులు భయపడి యుద్ధమునకుఁ దలపడరని యాశయము॥౧౦॥

శ్లో. తాదృగ్దీర్ఘవిరిఞ్చివాసరవిధౌ జానామి యత్కర్తృతాం
శఙ్కే యత్ప్రతిబింబమమ్బుధిపయఃపూరోదరే బాడబః
వ్యోమవ్యాపివిపక్షరాజకయశస్తారాః పరాభావుకః
కాసామస్య న సః ప్రతాపతపనః పారం గిరాం
గాహతే॥ 11

ప. వి. తాదృగ్దీర్ఘవిరిఞ్చివాసరవిధౌ-జానామి-యత్కర్తృతాం - శఙ్కే-యత్ ప్రతిబింబమ్-అమ్బుధిపయఃపూరోదరే-బాడబః - వ్యోమవ్యాపివిపక్షరాజకయశస్తారాః-పరాభావుకః-కాసామ్-అస్య-న-సః-ప్రతాపతపనః-పారం -గిరాం-గాహతే.

అర్థము. తాదృగ్దీర్ఘవిరిఞ్చివాసరవిధౌ; తాదృక్‌దీర్ఘ=అటువంటిఅనగా నాలుగు యుగసహస్రములు బ్రహ్మకుదినమని చెప్పఁ బడిన గొప్పపరిమాణము గల్గిన, విరిఞ్చి=బ్రహ్మయొక్క, వాసర=దినమును, విధి=విధించుట యందు, యత్కర్తృతాం; యత్ = ఎవ్వని ప్రతాప సూర్యునకు, కర్తృతాం = కర్తృత్వమును, జానామి = తెలుసుకొనుచున్నానో, అమ్బుధిపయః పూరోదరే, అమ్బుధి = సముద్రము యొక్క, పయః

పూర=జలప్రవాహము యొక్క, ఉదరే=మధ్యభాగమున, బాడబః= బడబాగ్ని, యత్ప్రతి బిమ్బమ్, యత్=ఏ ప్రతాప సూర్యునకు, ప్రతి బిమ్బం=ప్రతిబిమ్బమని, శఙ్కే=సందేహింతునో, అనగా భావింతునో, వ్యోమవ్యాపి విపక్షరాజక యశస్తారాః, వ్యోమ=ఆకసమును, వ్యాపి= వ్యాపించుచున్న, విపక్ష=శత్రువులైన, రాజక=రాజ సమూహము యొక్క, యశస్తారాః=కీర్తులనెడి నక్షత్రములను (శత్రువుల కీర్తులు స్వల్పములు గాన నక్షత్ర రూపములుగాఁ జెప్పఁబడినది) పరాభావుకః = తిరస్క రించునట్టి; సః = సర్వమును వ్యాపించిన, అస్య=ఈ రాజు యొక్క, ప్రతాపతపనః=ప్రతాప మనెడి సూర్యుఁడు, కాసాం=ఏ, గిరామ్ = మాటలయొక్క, పారం=ఆవలిగట్టును, నగాహతే=ప్రవేశింపదు? అంతటి వాక్కులకును నావలిగట్టునుఁ జేయునని యర్థము.

వి: నాలుగు యుగసహస్రములైన బ్రహ్మ దినమును, ఇతని ప్రతాప సూర్యుఁడు చేయకపోయినను చేయునట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష– "జానామి" యను వ్యఞ్జకమునుఁ బ్రయోగించినందువలన నిది వాచ్యము– బడబాగ్ని, యాతని ప్రతాప సూర్యుని ప్రతిబింబము కాకిపోయినను, ప్రతిబింబమని చెప్పుటవలన నిదియు నుత్ప్రేక్ష, వ్యఞ్జకమైన "శఙ్కే" యనుఁ క్రియను బ్రయోగించుటవలన నిదియు వాచ్యము.

**సమాసములు :**

తాదృక్ దీర్ఘ విరిఞ్చి వాసరవిధౌ :- విరిఞ్చేః వాసరః=విరిఞ్చి వాసరః, తాదృక్ చాసౌ దీర్ఘశ్చ=తాదృక్‌దీర్ఘః, తాదృక్ దీర్ఘశ్చాసౌ విరిఞ్చి వాసరశ్చ=తాదృక్ దీర్ఘ విరిఞ్చి వాసరః, తాదృక్ దీర్ఘ విరిఞ్చి వాసరస్య విధిః = తాదృక్ దీర్ఘ విరిఞ్చి వాసర విధిః, తస్మిన్=తాదృక్ దీర్ఘ విరిఞ్చి వాసర విధౌ।

యత్కర్తృతామ్ :- యస్యకర్తృతా = యత్కర్తృతా, తామ్ = యత్కర్తృతామ్।

యత్ప్రతిబిమ్బమ్ :- యస్యప్రతిబిమ్బమ్ = యత్ప్రతిబిమ్బమ్.

అమ్బుధిపయః పూరోదరే :- అమ్బుధేః పయాంసి, అమ్బుధిపయాంసి, అమ్బుధిపయసాం పూరః= అమ్బుధి పయఃపూరః, అమ్బుధిపయః

పూరస్య ఉదరమ్ = అమ్బుధిపయః పూరోదరమ్, తస్మిన్=అమ్బు ధిపయః పూరోదరే।

వ్యోమవ్యాపి విపక్షరాజక యశస్తారాః :- వ్యోమవ్యాప్నోతీతి=వ్యోమ వ్యాపి, రాజ్ఞాంసమూహః=రాజకం, విపక్షంచతత్ రాజకంచ = విపక్ష రాజకం, విపక్ష రాజకస్యయశాంసి = విపక్షరాజకయశాంసి, విపక్ష రాజకయశాంస్యేవతారాః = విపక్ష రాజకయశస్తారాః, వ్యోమవ్యాపి న్యశ్చాతాః విపక్ష రాజకయశస్తారాశ్చ=వ్యోమవ్యాపి విపక్ష రాజక యశస్తారాః।

ప్రతాతపనః :- ప్రతాప ఏవతపనః=ప్రతాప తపనః।

**భావము :**

నాలుగు యుగసహస్రములు బ్రహ్మకొక్క దివసము, అంతటి గొప్ప పరిమాణము గల్గిన యా దివసమునకు కర్త, యీ రాజు యొక్క ప్రతాప సూర్యుఁడే గాని ప్రసిద్ధమైన సూర్యుఁడు కానేరడు. అందువలన నీతని ప్రతాపము ప్రళయకాలము వరకును స్థిరమై విలసిల్లును. అదిగాక, సముద్రము నందుఁ బ్రకాశించుచున్న బడబాగ్ని, యీ ప్రతాప సూర్యుని ప్రతిబిమ్బమే కాని మఱియొండుగాదు. మఱియు నీతని ప్రతాప సూర్యుఁడు, మింటఁ బ్రకాశించు నీతని శత్రువులకీర్తి తారలను నస్తమింపఁజేయును. అనగా కాంతిరహితములుగాఁ జేయును. సూర్యుఁడు వెలుగుచున్నప్పుడు, ఆకసమున చుక్కలు కానరావు గదా! కాన నీతని ప్రతాప సూర్యుఁడు ప్రపంచమంతటిని వ్యాపించినవాఁడై వాక్కులచే వర్ణింప నెవ్వరికి శక్యుఁడగును? అనగా నెవ్వరికిని వర్ణింప శక్యుడు గాడని యాశయము ॥ ౧౧ ॥

శ్లో. ద్వేష్యాకీర్తికలిన్దశైలసుతయా నద్యాఽస్య యద్దోర్ద్వయీ
కీర్తిశ్రేణిమయీ సమాగమమగాత్ గఙ్గా రణప్రాఙ్గణే.
తత్తస్మిన్ వినిమజ్య బాహుజభటైరారమ్భి రమ్భాపరీ
రమ్భానన్దనికేతనన్దనవనక్రీడాదరాడమ్బరః ॥ 12

ప. వి. ద్వేష్యాకీర్తికలిన్దశైలసుతయా-నద్యా-అస్య-యత్-దోర్ద్వయీకీర్తిశ్రేణి మయీ-సమాగమమ్-అగాత్-గఙ్గా-రణప్రాఙ్గణే-తత్-తస్మిన్-వినిమజ్య

బాహుజభటైః-ఆరమ్భి - రమ్భాపరీరమ్భానన్దనికేతనన్దనవనక్రీడాదరాడ
మ్బరః

అర్థము. యత్ = ఎందువలన, అస్య = ఈ రాజుయొక్క, దోర్ద్వయీకీర్తిశ్రేణి
మయీ; దోర్ద్వయీ=రెండు భుజములయొక్క, కీర్తిశ్రేణిమయీ=కీర్తి
పరమ్పరారూపమైన, గఙ్గా-గఙ్గానది (కీర్తులు తెలుపు కాన గఙ్గారూప
ముగఁ జెప్పఁబడినది) రణప్రాఙ్గణే=యుద్ధరంగమున, ద్వేష్యాऽకీర్తికలిన్ద
శైలసుతయా; ద్వేష్య=శత్రువులయొక్క, అకీర్తి=అపకీర్తియను, కలిన్ద
శైలసుతయా = కలిన్దశైలమునందుద్భవించిన, నద్యా=యమునయను
నదిచే (అపకీర్తినలుపు కాన యమునా రూపమున వర్ణింపఁబడినది) సమా
గమమ్=కూడలిని, ఆగాత్-పొందెనో, తత్=అందువలన, తస్మిన్=
యుద్ధరంగ రూపమునయున్న గఙ్గాయమునల కూడలియందు, వినిమజ్జ్య=
మునిగి దేహమునుఁబరిత్యజించి, బాహుజభటైః = బాహువులయందుద్భ
వించిన క్షత్రియ వీరులతో ననగా శత్రువులైన క్షత్రియవీరులతో,
రమ్భాపరీరమ్భానన్దనికేతనన్దనవనక్రీడాదరాడమ్బరః; రమ్భా=రమ్భ
యను దేవలోకపువేశ్యతో, పరీరమ్భ = ఆలిఙ్గనమందలి, ఆనన్ద=సుఖము
నకు, నికేత=స్థానమైన, నన్దనవన=నన్దనవనమందలి, క్రీడా=కేలియందు
ఆదర=కోరికయొక్క,ఆడమ్బరః=ఆడమ్బరము,ఆరమ్భి=ప్రారంభింపఁ
బడినది. అనగా సీతని శత్రువులకు,తప్పకమరణము గలుగునని యర్థము.

"సితాऽసితే సరితౌయత్రసఙ్గతేతత్రాప్లుతాస్తే దివముత్పతన్తి। యేతన్వం
సృజన్తిధీరాస్తేజనాసో అమృతత్వంభజన్తే" అని తెలుపు వన్నెయు, నలుపు
వన్నెయుఁ గల్గిన గఙ్గాయమునల కూడలి యందు మునిగి శరీరత్యాగముఁ జేయు
ధీరులు మోక్షమునే పొందెదరని శ్రుతివచనము.

వి : ఇచ్చట కీర్తిని గఙ్గగను, అపకీర్తిని యమునగను రూపించుట వలన
రూపకాలఙ్కారము.

**సమాసములు :**

ద్వేష్యాऽకీర్తికలిన్దశైలసుతయా : ద్వేష్టుంయోగ్యాః=ద్వేష్యాః, ద్వేష్యా
ణాంఅకీర్తిః=ద్వేష్యాऽకీర్తిః, కలిన్దఇతిశైలః=కలిన్దశైలః. కలిన్దశైలస్య

సుతా=కలిన్దశైలసుతా, ద్వేష్యాఃకీర్తిరేవకలిన్దశైలసుతా=ద్వేష్యాకీర్తి కలిన్దశైలసుతా, తయా=ద్వేష్యాకీర్తికలిన్దశైలసుతయా.

దోర్ద్వయీకీర్తిశ్రేణిమయీ : దోషోర్ద్వయీ=దోర్ద్వయీ, దోర్ద్వయ్యాః కీర్తయః=దోర్ద్వయీకీర్తయః, దోర్ద్వయీకీర్తీనాంశ్రేణయః=దోర్ద్వయీ కీర్తిశ్రేణయః, దోర్ద్వయీకీర్తిశ్రేణీనాం వికారః = దోర్ద్వయీకీర్తిశ్రేణి మయీ.

రణప్రాఙ్గణే : రణస్యప్రాఙ్గణమ్ = రణప్రాఙ్గణమ్, తస్మిన్=రణప్రాఙ్గణే. బాహుజభటైః : బాహుభ్యాంజాయన్తఇతి = బాహుజాః, బాహుజాఏవ భటాః=బాహుజభటాః, తైః= బాహుజభటైః।

రమ్భాపరీరమ్భానన్దనికేతనన్దనవనక్రీడాఽఽదరాడమ్బరః: రమ్భాయాః పరీరమ్భః= రమ్భాపరీరమ్భః, రమ్భాపరీరమ్భాత్ ఆనన్దః=రమ్భాపరీ రమ్భానన్దః = రమ్భాపరీరమ్భానన్దస్యనికేతః = రమ్భాపరీరమ్భానన్ద నికేతః, నన్దన మితివనమ్ = నన్దనవనమ్, రమ్భాపరీరమ్భానన్దనికేత ఏవనన్దనవనమ్ =రమ్భాపరీరమ్భానన్దనికేతనన్దనవనమ్, రమ్భాపరీ రమ్భానన్దనికేతనన్దనవనే క్రీడా = రమ్భాపరీరమ్భానన్దనికేతనన్దనవన క్రీడా, రమ్భాపరీరమ్భానన్దనికేత నన్దనవన క్రీడాయామాదరః = రమ్భాపరీరమ్భానన్దనికేత నన్దనవనక్రీడాదరః, రమ్భాపరీరమ్భా నన్దనికేతనన్దనవనక్రీడాదరస్య ఆడమ్బరః= రమ్భాపరీరమ్భానన్దనికేత నన్దనవనక్రీడాదరాడమ్బరః।

**భావము :**

యుద్ధరఙ్గమున, నీతని రెండు భుజములనుండి యుద్భవించిన కీర్తియను గఙ్గయు, శత్రువుల యపకీర్తి యను యమునయు కలసినవి. కీర్తి తెల్లగ నుండుట వలన గఙ్గారూపముగను, అపకీర్తి నల్లగానుండుట వలన యమునారూపముగను వర్ణింపఁబడినవి. శత్రువీరులా గఙ్గాయమునల కూడలియందు మునిగి శరీరమును పరిత్యజించి, రమ్భనుఁ గౌగలించుట వలని యానన్దమునకు నిలయమైన నన్దన వనక్రీడల యందు కోరికలతోఁ గూడియుందురు. గఙ్గాయమునల సఙ్గమము చాల పవిత్రమైనది. అందు మునింగి శరీరత్యాగముఁ జేయువారికి మోక్షము గల్గునని శ్రుతులు చెప్పుచున్నవి. ॥౧౨॥

శ్లో. ఇతి శ్రుతిస్వాదితతద్గుణస్తుతిః
సరస్వతీవాఙ్మయవిస్మయోత్థయా.
శిర స్తిరఃకమ్పనయైవ భీమజా
న తం మనోరన్వయమన్వమన్యత॥ 13

ప. వి. ఇతి–శ్రుతిస్వాదితతద్గుణస్తుతిః– సరస్వతీవాఙ్మయవిస్మయోత్థయా- శిర స్తిరఃకమ్పనయా– ఏవ–భీమజా–న– తం–మనోః–అన్వయమ్– అన్వమన్యత.

అర్థము. భీమజా=దమయన్తి, ఇతి=ఇట్లు, శ్రుతిస్వాదితతద్గుణస్తుతిః; శ్రుతి=చెవులచే, స్వాదిత=చవిచూడఁబడిన (చక్కఁగా వినఁబడిన) తద్గుణస్తుతిః, తత్=ఆ రాజుయొక్క, గుణస్తుతిః=గుణములప్రశంసగల్గినదై, సరస్వతీవాఙ్మయవిస్మయోత్థయా. సరస్వతీ=సరస్వతీదేవియొక్క, వాఙ్మయ=వర్ణనాసాహిత్యముచేఁగల్గిన, విస్మయ=ఆశ్చర్యమువలన, ఉత్థయా=ఉద్భవించిన, శిరస్తిరః కమ్పనయైవ; శిరః=తలను, తిరః=అడ్డముగా, కమ్పనయైవ=కదలించుటచేతనే, మనోః=వైవస్వతమనువుయొక్క,అన్వయం=వంశమునఁబుట్టిన ఋతుపర్ణుని, నాఽన్వమన్యత=అంగీకరింపలేదు, ఆశ్చర్యమువలనఁజేసిన తలయూపే, ఆరాజును వలదని నిషేధించుటకునుపయుక్తమైనదని యర్థము.

**సమాసములు :**

శ్రుతిస్వాదితతద్గుణస్తుతిః :- శ్రుతిభ్యాం స్వాదితా=శ్రుతిస్వాదితా, తస్య గుణాః=తద్గుణాః. తద్గుణానాంస్తుతిః=తద్గుణస్తుతిః, శ్రుతిస్వాదితా,తద్గుణస్తుతిః యయాసా=శ్రుతిస్వాదితతద్గుణస్తుతిః।

సరస్వతీ వాఙ్మయవిస్మయోత్థయా :- సరస్వత్యాః వాఙ్మయం=సరస్వతీవాఙ్మయమ్,సరస్వతీవాఙ్మయేన విస్మయః=సరస్వతీవాఙ్మయవిస్మయః, సరస్వతీవాఙ్మయ విస్మయేన ఉత్థా=సరస్వతీ వాఙ్మయవిస్మయోత్థా, తయా=సరస్వతీ వాఙ్మయవిస్మయోత్థయా।

శిర స్తిరఃకమ్పనయా :— తిరః,కమ్పనా=తిరఃకమ్పనా, శిరసః, తిరః కమ్పనా = శిర స్తిరః కమ్పనా, తయా=శిర స్తిరః కమ్పనయా।

**భావము :**

సరస్వతీదేవి ఋతుపర్ణుని గుణములనుఁ గూర్చి గావించిన స్తుతివిని యాశ్చర్యముతో తలను నడ్డముగా నూచినది. ఆ తలయూపు, ఒకవైపు ఆశ్చర్య సూచకముగను, మఱియొకవైపు ఋతుపర్ణుని నిషేధమునకు సూచకముగను నుండినది. కాన నామె వైవస్వత మనువంశమునందు జన్మించిన యాతనిని నంగీకరింపలేదని యాశయము. ॥౧౩॥

శ్లో. యువాన్తరం సా వచసామధీశ్వరా
స్వరామృతన్యక్కృతమత్తకోకిలా ।
శశంస సంసక్తకరైవ తద్దిశా
నిశాకరజ్ఞాతిముఖీమిమాం ప్రతి ॥ 14

ప. వి. యువాన్తరం-సా-వచసామ్-అధీశ్వరా—స్వరామృతన్యక్కృతమత్తకోకిలా-శశంస - సంసక్తకరా—ఏవ-తద్దిశా—నిశాకరజ్ఞాతిముఖీమ్—ఇమాం-ప్రతి.

అర్థము. స్వరామృతన్యక్కృతమత్తకోకిలా; స్వర=కణ్ఠధ్వనియను, అమృత= అమృతముచే, న్యక్కృత=తిరస్కరింపఁబడిన, మత్త కోకిలా=వసన్త కాలమందు హర్షించిన కోకిలగల, వచసాం=వాక్కులకు, అధీశ్వరా= అధినేతయైన, సా=ఆ సరస్వతీదేవి, యువాన్తరం= మఱియొక యువ కునిఁగూర్చి, తద్దిశా=ఆ దిక్కుతో, ననగా నాయువకుఁడున్నదిక్కుతో, సంసక్త కరైవ; సంసక్త=సంబంధించిన, కరైవ=హస్తము కలదిగనే, నిశాకరజ్ఞాతిముఖీం; నిశాకర=చన్ద్రునితో, జ్ఞాతి=సమానమైన, ముఖీం= మోముగల్గిన, ఇమాంప్రతి=ఈమెనుఁగూర్చి, శశంస=చెప్పినది.

**సమాసములు :**

అన్యఃయువా = యువాన్తరం, తత్ = యువాన్తరమ్,
స్వరామృతన్యక్కృతమత్తకోకిలా:- స్వరఏవఅమృతమ్=స్వరామృతం, మత్తశ్చాసౌకోకిలశ్చ = మత్తకోకిలః, స్వరామృతేన, న్యక్కృతః=

స్వరామృతన్యక్కృతః,స్వరామృతన్యక్కృతః, మత్తకోకిలః యయాసా = స్వరామృతన్యక్కృతమత్తకోకిలా ।

సంసక్తకరా :- సంసక్తః, కరఃయస్యాస్సా = సంసక్తకరా ।

తద్దిశా :- తస్యాఃదిక్, = తద్దిక్, తయా = తద్దిశా.

నిశాకరజ్ఞాతిముఖీమ్ :- నిశాకరస్యజ్ఞాతిః = నిశాకరజ్ఞాతిః, నిశాకర జ్ఞాతిః, ముఖంయస్యాస్సా = నిశాకరజ్ఞాతిముఖీ, తామ్ = నిశాకరజ్ఞాతి ముఖీమ్.

**భావము :**

ఆ సరస్వతీదేవి తన కణ్ఠస్వరమను నమృతముతో వసంతకాలాన మదించిన కోకిలనుఁ గూడఁ దిరస్కరించునట్టిది. అట్టియా వాగ్దేవత, మఱి యొక యువకుని తనచేతితోఁ జూపించుచు, చన్ద్రముఖియగు దమయన్తినిఁ గూర్చి చెప్పినది. ॥౧౪॥

శ్లో. న పాణ్డ్యభూమణ్డనమేణలోచనే
విలోచనేనాఽపి నృపం పిపాససి ।
శశిప్రకాశాననమేనమీక్షితుం
తరఙ్గయాఽపాఙ్గదిశా దృశస్త్విషః ॥ **15**

ప. వి. న-పాణ్డ్యభూమణ్డనమ్-ఏణలోచనే-విలోచనేన-అపి-నృపం-పిపాససి-శశిప్రకాశాననమ్-ఏనమ్-ఈక్షితుం - తరఙ్గయ-అపాఙ్గదిశా-దృశః — త్విషః.

అర్థము. హే! ఏణలోచనేః = లేడికన్నులవంటి కన్నులుగల యోదమయన్తీ! పాణ్డ్యభూమణ్డనమ్ ; పాణ్డ్యభూ = పాణ్డ్యదేశమునకు, మణ్డనమ్ = అలఙ్కారమైన, నృపం = ఈరాజును, విలోచనేనాఽపి = కన్నుచేతను, న పిపాససి = సాదరముగఁజూడఁగోరవా ? శశిప్రకాశాననమ్; శశిప్రకాశ=చన్ద్రికాన్తిగల, ఆననమ్=ముఖముతోఁగూడిన, ఏనం= ఈరాజును, అపాఙ్గదిశా = కడకంటి మార్గముచేతనైనను, ఈక్షితుం= చూచుటకు, దృశః = కన్నుయొక్క, త్విషః = కాన్తులను, తరఙ్గయ=

ప్రసరింపఁజేయుము. ఒకవేళ తదేకాసక్తి గల దృష్టితో నీవు ఆతనిని జూడకపోయినను, కడకన్నుతోనైనను నొక్కతడవ చూడుమనియర్థము. "ఏణలోచనే" యనునెడ ఏణస్యలోచనే యస్యాస్సా అనువిగ్రహమునను సరించి ఏణలోచన సాదృశ్యమును దమయన్తీలోచనములయం దారోపించుట వలన నిదర్శనాలఙ్కార భేదము.

**సమాసములు :**

పాణ్డ్యభూమణ్డనమ్ .– పాణ్డ్యానాంభూః = పాణ్డ్యభూః పాణ్డ్యభువః మణ్డనమ్, పాణ్డ్యభూమణ్డనమ్, తత్ = పాణ్డ్యభూమణ్డనమ్,
ఏణలోచనే :- ఏణస్యలోచనే ఇవలోచనే, యస్యాస్సా = ఏణలోచనా, తస్యాస్సమ్బుద్ధిః = హేఏణలోచనే।
శశిప్రకాశాననమ్ :– శశినః ప్రకాశ ఇవప్రకాశః యస్మిన్, తత్ = శశిప్రకాశమ్, శశిప్రకాశమ్, ఆననంయస్యసః=శశిప్రకాశాననః, తమ్ = శశిప్రకాశాననమ్.
అపాఙ్గదిశా :– అపాఙ్గస్యదిక్ = అపాఙ్గదిక్, తయా = అపాఙ్గదిశా

**భావము :**

ఓదమయన్తీ! ఈపాణ్డ్య దేశపురాజును సాదర దృష్టితోఁ జూడఁగోరవా? ఒకవేళ నీవు ఆతనిని సాదర దృష్టితోఁ జూడ నొల్లక పోతివేని యట్లేకానిమ్ము; కాని, కనీసము నీకడకంటి చూపుల కాన్తినైనను చన్ద్రముఖుఁడగు నాతనిపైఁ ప్రసరింపఁజేయుము ॥౧౫॥

శ్లో. భువి భ్రమిత్వాఽనవలమ్బమమ్బరే
విహర్తుమభ్యాసపరమ్పరాపరా ।
అహో! మహావంశమముం సమాశ్రితా
సకౌతుకం నృత్యతి కీర్తినర్తకీ ॥ **16**

ప. వి. భువి-భ్రమిత్వా-అనవలమ్బమ్- అమ్బరే-విహర్తుమ్-అభ్యాసపరమ్పరాపరా-అహో !-మహావంశమ్-అముం-సమాశ్రితా–సకౌతుకం–నృత్యతి–కీర్తినర్తకీ.

అర్థము: కీర్తినర్తకీ = కీర్తియనెడునాట్యకత్తె, భువి = భూమియందు, భ్రమిత్వా= సఞ్చరించి (అథ=పిదప) అమ్బరే = ఆకసమందు, అనవలమ్బం = నిరాధారముగా, విహర్తుం = విహరించుటకు, అభ్యాసపరమ్పరాపరా; అభ్యాస = అలవాట్లయొక్క, పరమ్పరా = వరుసను, పరా = ముఖ్య ముగాఁగలదై, అనగా నాకసమందును నాట్యమునలవాటుచేయఁ గోరినదై, మహావంశం = గొప్పవంశమునందుద్భవించిన (మహావంశం = గొప్ప వెదురుకఱ్ఱను) అముం ఈపాణ్డ్యరాజును, సమాశ్రితా = ఆశ్రయించినదై, సకౌతుకం = కుతూహలముతో, నృత్యతి = నాట్యముఁ జేయుచున్నది. అహో = ఆశ్చర్యము. ఒకఆటకత్తెతొలుతభూమియందాడి పిదప మింట నొకవెదురునుఁ బట్టుకొని యెట్లుఆడునో, యట్లేయీనృపతికీర్తియు నాడు చున్నదనియర్థము. అనగా నీతనికీర్తి భూనభోన్తరాలములను వ్యాపించిన దనిభావము.

వి: కీర్తినినర్తకిగను, మహావంశమును వెదురుగను రూపించుటవలన రూప కాలఙ్కారము.

**సమాసములు :**

అనవలమ్బమ్: అవిద్యమానః, అవలమ్బః యస్మిన్ కర్మణితద్య థాభవతితథా=అనవలమ్బమ్.

అభ్యాసపరమ్పరాపరాః: అభ్యాసానాంపరమ్పరాః = అభ్యాసపరమ్పరాః, అభ్యాసపరమ్పరా పరం యస్యాస్సా = అభ్యాసపరమ్పరాపరా.

మహావంశమ్: మహాన్వంశః యస్యాసః = మహావంశః. తమ్ = మహా వంశమ్, పక్షాన్తరమున మహాంశ్చాసౌవంశశ్చ = మహావంశః, తమ్ = మహావంశమ్।

సకౌతుకమ్: కౌతుకేనసహితంయథాతథా = సకౌతుకం।

కీర్తినర్తకీ: కీర్తిరేవనర్తకీ = కీర్తినర్తకీ।

**భావము :**

ఇతని కీర్తియాటకత్తెరూపునున్నది. అది, తొలుత భూమియందాడినది. పిదప నాకసమందు నెట్టిపట్టులేక యాడుటకునలవాటునుఁ జేయుచున్నదై మహా

వంశమందు జన్మించిన పాణ్డ్యరాజనెడి మహావంశమును(గొప్పవెదురును)పట్టుగాఁ జేసికొని యుత్సాహముతో నాడుచున్నది. ఇది యబ్బురము. అనగా నీనర పాలుని కీర్తి భూమ్యాకాశములను వ్యాపించి యున్నదని యాశయము ॥౧౬॥

శ్లో. ఇతో భియా భూపతిభిర్వనం వనాత్
అటద్భిరుచ్చైరటవీత్వమీయుషీ।
నిజాఽపి సాఽవాపి చిరాత్పునః పురీ
పునః స్వమధ్యాసి విలాసమన్దిరమ్ ॥ 17

ప. వి. ఇతః- భియా- భూపతిభిః- వనం- వనాత్-అటద్భిః-ఉచ్చైః- అటవీత్వమ్-ఈయుషీ-నిజా- అపి-సా-అవాపి-చిరాత్- పునః-పురీ- పునః- స్వమ్-అధ్యాసి-విలాసమన్దిరమ్.

అర్థము. ఇతః= ఈరాజునుండి, భియా = భయముతో, వనాత్ = ఒకవనము నుండి, వనమ్ = మఱియొకవనమును, అటద్భిః = తిరుగుచున్న, భూపతిభిః = భూపాలురచే, అనగా శత్రురాజులచే. ఉచ్చైః = గొప్పదైన, అటవీత్వం = అరణ్యరూపమును, ఈయుషీ = పొందిన, సా = అపూర్వపుటునికిపట్టుగానున్న, నిజా = తమదైన, పురీఅపి = పట్టణము గూడ, చిరాత్ = చాలకాలమునుండి, పరం = తర్వాత, పునః=మఱల. అవాపి = మఱియొకవనమను భ్రాంతిచేఁ బొందఁబడినది. స్వం = తమదైన, విలాసమందిరం=కేళీగృహముగూడ, (పాములపుట్టగూడ) పునః= మఱల (మరియొకవనమనెడిభ్రమతో) అధ్యాసి = అధిష్ఠింపఁ బడినది.

వి. ఇచ్చట నొక శత్రు సమూహమే, పెక్కు వనములయందును, వనములుగా మాఱిన నగరములయందును క్రమముగా నుండుట చేతను, నట్లే పట్టణముల యందును పత్తనత్వమునకును, వనత్వమునకు, క్రమబద్ధమైన సంబంధమునుఁ జెప్పుటచేతను పెక్కింటనొకటి, ఒక్కచోట పెక్కింటినిఁ జెప్పుట యను లక్షణము గల్గిన రెండు పర్యాయాలఙ్కారములు.

**సమాసములు :**

అటవీత్వమ్ :- అటవ్యాః భావః=అటవీత్వమ్, తత్=అటవీత్వమ్।

విలాసమందిరమ్ :— విలాసస్యమందిరమ్=విలాసమందిరమ్, తత్ = విలాసమందిరమ్.

**భావము :**

ఈ రాజు వలసిభయముచే నొకయడవి నుండి మఱియొక యడవికి (దిరుగుచున్న శత్రురాజులు చిరకాలము జనులు లేనందువలన గొప్ప యడవిగా మాఱిన తమ పూర్వపు నెలవైన పట్టణమును సైతము చాలాకాలమునకు తర్వాత చేరుటవలన మఱియొక వనమని భ్రాన్తినిఁ బొందియందు దాగుకొనిరి. అట్లే పూర్వపు తమ విలాసగృహములను గుఱుతింపలేక, వనాన్తరములనెడి భ్రాంతితో నందు నివసించిరి. ఈ రాజు భయమువలన పురమును వదలి పరుగెత్తి పోయిన శత్రురాజులు చిరకాలమునకు వనముగా మాఱిపోయిన విలాస మందిరములను ప్రవేశించి వానిని మఱియొక వనముగనే భ్రమఁజెంది యందు గుప్తవాసముఁ జేసిరని యాశయము. ॥౧౩॥

శ్లో. ఆసీదాసీమభూమీవలయమలయజాలేపనేపథ్యకీర్తిః
సప్తాకూపారపారీసదనజనఘనోద్గీతచాపప్రతాపః ।
వీరాదస్మాత్ పరః కః పదయుగయుగపత్పాతిభూపాతి
భూయ
శ్చూడారత్నోడుపత్నీకరపరిచరణామన్దనన్దన్న
ఖేన్దుః ॥ 18

ప. వి. ఆసీత్—ఆసీమభూమీవలయమలయజాలేపనేపథ్యకీర్తిః-సప్తాకూపారపారీసదనజనఘనోద్గీతచాపప్రతాపః—వీరాత్—అస్మాత్—పరః—కః-పదయుగయుగపత్పాతి, భూపాతిభూయశ్చూడారత్నోడు పత్నీకరపరిచరణామన్దనన్దన్నఖేన్దుః.

అర్థము. వీరాత్=వీరుఁడైన, అస్మాత్=ఈ పాణ్ద్యరాజు కంటె, పరః=ఇతరుడు, కః=ఏ వీరుఁడు, ఆ సీమ భూమీ వలయ మలయ జాలేపనేపథ్య కీర్తిః, ఆసీమ=సముద్రమనెడు ఎల్లను వ్యాపించిన, భూమీవలయ=భూమండలము యొక్క, మలయజ=చన్దనముపలని, ఆలేప=పూతయే, నేపథ్య =

భూషణము వంటి, కీర్తిః = కీర్తిగల్గిన, సప్తాకూపార పారీ సదన జనఘనోద్గీతచాప ప్రతాపః; సప్త = ఏడైన, అకూపారపారీ=సముద్రపు గట్టులే, సదన=నివాసముగాఁ గల్గిన, జన=జనులచే, ఘన=ఘనముగా, ఉద్గీత=గానము చేయఁబడిన, చాప=వింటి యొక్క, ప్రతాపః=ప్రతాపము గల్గిన, పద యుగయుగ పత్పాతి భూపాతి భూయశ్చూడారత్నోడు పత్నీకర పరిచరణామన్దనన్దన్నఖేన్దుః; పదయుగ=రెండు పాదముల యందు, యుగపత్=ఒక్కతడవ, పాతి = పడుచున్న, భూప=రాజుల యొక్క, అతిభూయః=మిక్కిలి యధికములైన, చూడారత్న=శిరస్సుల యందలి యనగా కిరీటముల యందలి, రత్న = రత్నములనెడు, ఉడుపత్నీ = తారలనెడు స్త్రీలయొక్క, కర = కిరణములయొక్క (హస్తముల యొక్క) పరిచరణ=పరిచర్యచే, అమన్ద=అధికముగా, నన్దత్=విలసిల్లు, నఖేన్దుః = కాలిగోళ్ళనెడి చన్ద్రులు గలవాఁడుగా, ఆసీత్=ఉండెను?

వి. ఇచ్చట భూమీ వలయమునకు మలయజాలేపనమును, భూషణమైన కీర్తిగను, సప్తసాగరముల తీర సమూహమును గృహములుగను రాజుల చూడారత్నములను తారలనెడు స్త్రీలుగను, పాదనఖములను చంద్రులుగను రూపించుటచే రూపకాలఙ్కారము.

## సమాసములు :

ఆ సీమ భూమీ వలయమలయజాలేపనేపథ్య కీర్తిః :- సీమా మభివ్యాప్య ఆ సీమమ్, ఆ సీమంచతత్ భూమీ వలయంచ = ఆ సీమ భూమీ వలయమ్, మలయజస్య ఆలేపః=మలయ జాలేపః, ఆ సీమ భూమీ వలయస్య మలయజాలేపః = ఆ సీమ భూమీ వలయమలయజాలేపః, నేపథ్యమివకీర్తిః=నేపథ్యకీర్తిః, ఆ సీమ భూమీ వలయమలయజాలేప ఏవనేపథ్యకీర్తిః యస్యసః=ఆ సీమ భూమీ వలయమలయజాలేప నేపథ్య కీర్తిః।

సప్తాకూపారపారీ సదనజనఘనోద్గీతచాప ప్రతాపః :- అకూపారాణాం పారాణి = అకూపార పారాణి, సప్తానాం అకూపార పారాణాం సమాహారః=సప్తాకూపార పారీ, సప్తాకూపార పార్యేవ సదనంయేషాంతే=

సప్తాకూపారపారీ సదనాః, సప్తాకూపారపారీ సదనాశ్చతే జనాశ్చ= సప్తాకూపారపారీ సదనజనాః, సప్తాకూపారపారీ సదనజనైః ఘనోద్గీతః= సప్తాకూపారపారీ సదనజన ఘనోద్గీతః, చాపస్యప్రతాపః=చాపప్రతాపః, సప్తాకూపారపారీ సదన జనఘనోద్గీతః చాపప్రతాపః యస్యసః=సప్తాకూపారపారీ సదన జనఘనోద్గీత చాపప్రతాపః।

పదయుగ యుగపత్పాతి భూపాతిభూయశ్చూడారత్నోడుపత్నీకర పరిచరణానన్దనన్దన్నఖేన్దుః —

పదయోర్యుగమ్ = పదయుగమ్, యుగపత్ పతన్తీతి = యుగపత్పాతినః, పదయుగేయుగపత్పాతినః=పదయుగయుగపత్పాతినః. పదయుగపత్పాతినశ్చతే భూపాశ్చ = పదయుగపత్పాతిభూపాః, చూడాయాః రత్నాని = చూడారత్నాని. అతిభూయాంసిచతాని చూడారత్నానిచ= అతిభూయశ్చూడారత్నాని, అతిభూయశ్చూడారత్నాన్యేవ ఉడుపత్న్యః= అతి భూయశ్చూడారత్నోడు పత్న్యః. పదయుగయుగపత్పాతి భూపానామతిభూయశ్చూడారత్నోడు పత్న్యః= పదయుగయుగపత్పాతిభూపాతిభూయశ్చూడారత్నోడు పత్న్యః, పదయుగయుగ పత్పాతి భూపాతిభూయశ్చూడారత్నోడు పత్నీనాం కరాఏవకరాః=పదయుగయుగపత్పాతిభూపాతిభూయశ్చూడారత్నోడుపత్నీకరాః, పదయుగయుగపత్పాతిభూపాతిభూయశ్చూడారత్నోడుపత్నీకరైః పరిచరణమ్=పదయుగయుగపత్పాతిభూపాతిభూయశ్చూడారత్నోడుపత్నీకరపరిచరణమ్॥ పదయుగయుగపత్పాతిభూపాతిభూయశ్చూడారత్నోడుపత్నీకరపరిచరణేన ఆనన్దః, = పదయుగయుగపత్పాతిభూపాతి భూయశ్చూడారత్నోడుపత్నీకరపరిచరణానన్దః.పదయుగయుగపత్పాతిభూపాతిభూయశ్చూడారత్నోడు పత్నీకర పరిచరణానన్దేన నన్దన్తః నఖేన్దవః యస్యసః=పదయుగయుగపత్పాతి భూపాతిభూయశ్చూడారత్నోడుపత్నీకరపరిచరణానన్ద నన్దన్నఖేన్దుః॥

**భావము :**

ఆ పాణ్డ్యమహారాజుకీర్తి సముద్రము వరకును వ్యాపించిన భూమీవలయమునకు మైపూతయైన చన్దనాలఙ్కారము. అతని వింటి మహిమ సప్తసాగరతీర

వాసులగు జనులచేఁ జేగీయమానము. ఆతని పాద నఖేన్దువులు, ఆతని పాదము లపై నొక్కమాటేపడిన యనగా క్రమముగాఁగాక నొక్కకాలమందే పడిన రాజుల మిక్కుటములగు కిరీటరత్నములనెడి తారకావధువుల కిరణములనెడి హస్తముల వలని పరిచర్యచే నుల్లసిల్లుచున్నవి. ॥౧౮॥

శ్లో. భఙ్గాఽకీర్తిమసీమలీమసతమప్రత్యర్థిసేనాభట
శ్రేణీతిన్దుకకాననేషు విలసత్యస్య ప్రతాపానలః।
అస్మాదుత్పతితాః స్ఫురన్తి జగదుత్సఙ్గే స్ఫులిఙ్గాః స్ఫుటం
భాలోద్భూతభవాక్షి భానుహుతభుజ్జమ్భారిదమ్భోళయః॥
**19**

ప. వి. భఙ్గాఽకీర్తిమసీమలీమసతమప్రత్యర్థిసేనాభటశ్రేణీతిన్దుకకాననేషు - విలసతి-అస్య- ప్రతాపానలః-అస్మాత్-ఉత్పతితాః-స్ఫురన్తి-జగదుత్సఙ్గే స్ఫులిఙ్గాః-స్ఫుటం-భాలోద్భూతభవాక్షిభానుహుతభుగ్జమ్భారిదమ్భోళయః

అర్థము. అస్య=ఈపాణ్డ్యరాజుయొక్క, ప్రతాపానలః=ప్రతాపాగ్ని, భఙ్గాకీర్తిమసీమలీమసతమప్రత్యర్థిసేనాభటశ్రేణీతిన్దుకకాననేషు, భఙ్గ=పరాజయము వలని, అకీర్తి = అపకీర్తియను, మసీ=మసిచే, మలీమసతమ = మిక్కిలి నల్లబడిన, ప్రత్యర్థి = శత్రువులయొక్క, సేనాభట = సైనిక భటుల, శ్రేణి = వరుసయనెడు, తిన్దుకకాననేషు = తిన్దుకవృక్షముల వనములయందు, అనగా తుమికి చెట్లవనములయందు, విలసతి = ప్రకాశించుచున్నది. భాలోద్భూతభవాక్షిభానుహుతభుక్జమ్భారిదమ్భోళయః, భాల=లలాటమందు, ఉద్భూత=ఉద్భవించిన, భవాక్షి=శివునినేత్రము, భాను=సూర్యుఁడు, హుతభుక్=అగ్ని, జమ్భారిదమ్భోలయః = ఇన్ద్రుని వజ్రాయుధము, అనునివి, అస్మాత్ = ఈవనమునుండి ఉత్పతితాః = పైకిలేచిన, స్ఫులిఙ్గాః = నిప్పురవ్వలుగా, జగదుత్సఙ్గే=ప్రపంచముల మధ్య, స్ఫురన్తి = విలసిల్లుచున్నవి. స్ఫుటం = స్పష్టము.

తె. ఆతనిప్రతాపాగ్నినుండి పైకి లేచిన నిప్పురవ్వలు, శివునిలలాట మందలి నేత్రాగ్నియు, సూర్యుఁడును, అగ్నియునింద్రుని వజ్రమును కాకపోయి

నను, అయినట్లు భావించేయుటచే, ఉత్ప్రేక్ష. "స్ఫుటమ్" అని వ్యఞ్జకమును బ్రయోగించుటచే నదివాచ్యము.

పరాజయముపలని అపకీర్తిని మసిగను, శత్రుసేనాభటులను తిన్దుకవనముగను, ప్రతాపము, నగ్నిగను రూపించుట వలన రూపకాలఙ్కారము. ఆయుత్ప్రేక్ష, రూపకముతో సఙ్కీర్ణము.

**భావము :**

ఆ పాణ్డ్యమహారాజులచే నోడింపఁ బడిన శత్రుసేనాభటులు, అపకీర్తి నొందిరి. ఆ యపకీర్తి యనెడిమసిచే నల్లబడి వారు తిందుకవనములుగా గానఁబడుచుండిరి. వారిమధ్య పై పాణ్డ్యనరపతి యొక్క ప్రతాపాగ్ని వెలుగుచున్నది. ముక్కంటి మూడవకంటియగ్నియు సూర్యుడును, అగ్నిహోత్రుడును, ఇంద్రుని వజ్రాయుధమును నను నీప్రచణ్డాగ్నులు, పైతిందుకవనము నందు జ్వలించు నాతని ప్రతాపాగ్ని నుండి పైకిలేచిన నిప్పురవ్వలనుట స్పష్టము. తిందుక వృక్షములు మండునపుడు అందుండి మాటిమాటికిని నిప్పురవలు రేగిపడుచుండును. కావున పాణ్డ్యమహారాజంతటి ప్రతాపశాలియని యాశయము॥౧౯॥

**శ్లో. ఏతద్దన్తిబలై ర్విలోక్య నిఖిలామాలిఙ్గితాఙ్గీం భువం**
**సఙ్గ్రామాఙ్గణసీమ్ని జఙ్గమగిరిస్తోమభ్రమాధాయిభిః।**
**పృథ్వీన్ద్రైః పృథురేతదుగ్రసమరప్రేక్షోపసమామర**
**శ్రేణీమధ్యచరః పునః క్షితివరక్షేమాయ ధత్తే శ్రియమ్॥20**

వి. ప. ఏతద్దన్తిబలైః :— విలోక్య—నిఖిలామ్—ఆలిఙ్గితాఙ్గీం—భువం—సఙ్గ్రామాఙ్గణసీమ్ని—జఙ్గమగిరిస్తోమభ్రమాధాయిభిః— పృథ్వీన్ద్రైః—పృథుః— ఏతదుగ్రసమరప్రేక్షోపసమామరశ్రేణీమధ్యచరః- పునః—క్షితిధరక్షేపాయ —ధత్తే- ధియమ్.

అర్థము. ఏతదుగ్రసమరప్రేక్షోపసమామరశ్రేణీమధ్యచరః, ఏతత్ = ఈపాణ్డ్య రాజుయొక్క, ఉగ్ర = భయఙ్కరమైన, సమర = యుద్ధమును, ప్రేక్షా =చూచుటకై, ఉపసమ=వచ్చిన, అమరశ్రేణీ = దేవతాపఙ్క్తుల యొక్క, మధ్య = మధ్యభాగమునందు, చరః = సంచరించుచున్న,

ప్పథుః = వైన్యుఁడనురాజు, సఙ్గ్రామాఙ్గణసీమ్ని, సఙ్గ్రామ = యుద్ధము యొక్క, అఙ్గణ = ముంగిలియొక్క, సీమ్ని=ఎల్లయందు, జఙ్గమగిరి స్తోమభ్రమమాధాయిభిః; జఙ్గమ = సంచరించు, గిరిస్తోమ=పర్వతసమూహముయొక్క, భ్రమ= భ్రాన్తిని, ఆధాయిభిః = కల్గించుచున్న,ఏతద్దన్తి బలైః; ఏతత్ = ఈపాణ్డ్యమహారాజుయొక్క, దన్తిబలైః ఏనుగుల సైన్యములచే, నిఖిలాం=సమస్తమైన, భువం = భూమిని, ఆలిఙ్గితాఙ్గీమ్; ఆలిఙ్గిత=కౌగిలింపఁ బడిన, అఙ్గీం=దేహముగలదిగా, విలోక్య= చూచి, పునః=మరల,క్షితిధరక్షేపాయ; క్షితిధర=పర్వతములను, క్షేపాయ= ధనస్సుచే తొలగించుటకు, ధియం = బుద్ధిని, ధత్తే =ధరించుచున్నాఁడు, నూనం (నిశ్చయము.)

వి. సంచరించు గజబలమును చూచిసంచరించు పర్వతములుగా భ్రాన్తినిఁబొందుటవలన భ్రాన్తి మదలఙ్కారము. యుద్ధమునుఁ జూడవచ్చిన వేల్పులలోనున్న పృథు మహారాజు, సఞ్చరించు నేనుగులనెడి పర్వతములను కదలించుటకై రాకపోయినను కదలించుటకై వచ్చెనా యని భావించుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకమునుఁ బ్రయోగించ సందువలన నది గమ్యము. అది పై భ్రాన్తిమదలఙ్కారముచేనుత్థాపితము కాన దానితో దీనికి సఙ్కరము.

**సమాసములు :**

ఏతద్దన్తిబలైః :— దన్తినః ఏవబలాని=దన్తిబలాని, ఏతస్యదన్తిబలాని= ఏతద్దన్తిబలాని, తైః = ఏతద్దన్తిబలైః ।

ఆలిఙ్గితాఙ్గీమ్ :— ఆలిఙ్గితమ్, అఙ్గం యస్యాఃసా=ఆలిఙ్గితాఙ్గీ, తామ్ = ఆలిఙ్గితాఙ్గీమ్.

సఙ్గ్రామాఙ్గణసీమ్ని :— సఙ్గ్రామస్యఅఙ్గణం=సఙ్గ్రామాఙ్గణమ్, సఙ్గ్రామాఙ్గణస్యసీమా=సఙ్గ్రామాఙ్గణసీమా, తస్మిన్ = సఙ్గ్రామాఙ్గణసీమ్ని.

జఙ్గమగిరిస్తోమభ్రమమాధాయిభిః:— జఙ్గమాశ్చతేగిరయశ్చ=జఙ్గమగిరయః, జఙ్గమగిరీణాంస్తోమాః,జఙ్గమగిరిస్తోమా ఇతిభ్రమః=జఙ్గమగిరిస్తోమభ్రమః. జఙ్గమగిరిస్తోమభ్రమమాదధతీతి = జఙ్గమగిరిస్తోమభ్రమమాధాయినః, తైః= జఙ్గమగిరిస్తోమభ్రమమాధాయిభిః ।

ఏతదుగ్రసమరప్రేక్షోపసన్రామామరశ్రేణీమధ్యేచరః :— ఉగ్రశ్చాసౌ సమరశ్చ = ఉగ్రసమరః, ఏతస్య ఉగ్రసమరః = ఏతదుగ్రసమరః, ఏతదుగ్రసమరస్య ప్రేక్షా, ఏతదుగ్రసమరప్రేక్షా, ఏతదుగ్రసమరప్రేక్షాయై ఉపసన్రామాః=ఏతదుగ్రసమరప్రేక్షోపసన్రామాః.అమరాణాం శ్రేణ్యః=అమరశ్రేణ్యః, ఏతదుగ్రసమరప్రేక్షోపసన్రామాశ్చతాః, అమరశ్రేణ్యశ్చ=ఏతదుగ్రసమరప్రేక్షోపసన్రామామరశ్రేణ్యః, ఏతదుగ్రసమరప్రేక్షోపసన్రామామరశ్రేణీనాంమధ్యః=ఏతదుగ్రసమరప్రేక్షోపసన్రామామరశ్రేణీమధ్యః, ఏతదుగ్రసమరప్రేక్షోపసన్రామామరశ్రేణీమధ్యేచరతీతి = ఏతదుగ్రసమరప్రేక్షోపసన్రామామరశ్రేణీమధ్యేచరః।

క్షితిధరక్షేపాయ :— క్షితిధరాణాంక్షేపః = క్షితిధరక్షేపః, తస్మై=క్షితిధరక్షేపాయ.

**భావము :**

ఆపాణ్డ్యుని భయఙ్కరమగు యుద్ధమునుఁ జూచుటకై దేవతలందఱు విచ్చేయుచున్నారు. వారి మధ్య వైన్యమహారాజుఁ గూడ సంచరించుచున్నాడు. ఇతడు భూమినిఁ బరిపాలించి శరీరత్యాగముచేసిన పిదప దేవత్వమునుఁ బొంది స్వర్గమునకేగి దేవతలలో కలసిపోయెను. ఈ వైన్యుఁడు భూమిని పరిపాలించునపుడు—

"తతఉత్సారయామాస, శైలాన్శతసహస్రశః,
ధనుష్కోట్యాతయావైన్యస్తేన శైల వివర్జితా."

అని పరాశరస్మృతి ననుసరించి భూమి నాక్రమించి పెక్కు గ్రామములపై వాలుటవలన జనులకు మిక్కిలి హానినిఁ గల్పించుచున్న పర్వతములను, తన వింటికొనచేఁ దొలగించి ప్రజలకు క్షేమమును, గల్పించెనని తెలియుచున్నది. ఆ వైన్యుడు ప్రకృతము దేవతల మధ్య సంచరించుచు, నా యుద్ధరఙ్గమున, సంచరించు నేనుగులఁగాంచి నడచెడి కొండలా యను భ్రాంతితో వానినిఁ బూర్వము తాను పర్వతములనుఁ దొలగించినట్లు తొలగించుటకై వచ్చె నాయను బుద్ధినిఁ గల్గించుచున్నాడు. ఆ పాణ్డ్యుని ఏనుగులు పర్వతములవంటి ప్రమాణములు గల్గియున్నవని యాశయము ॥౨౦॥

శ్లో. శశంస దాసీఙ్గితవిద్విదర్భజా
మితో నను స్వామిని పశ్య కౌతుకమ్।
యదేష సౌధాగ్రనటే పటాఞ్చలే
చలేఽపి కాకస్య పదార్పణగ్రహః॥ 21

ప.వి. శశంస-దాసీ-ఇఙ్గితవిత్-విదర్భజామ్-ఇతః - నను - స్వామిని - పశ్య-కౌతుకమ్-యత్-ఏషః-సౌధాగ్రనటే-పటాఞ్చలే-చలే - అపి - కాకస్య-పదార్పణగ్రహః.

అర్థము. ఇఙ్గితవిత్=దమయన్తి యభిప్రాయమునుఁ దెలిసిన. దాసీ=పనికత్తె, విదర్భజాం = దమయన్తినిఁ గూర్చి, ననుస్వామిని=ఓయజమానురాలా ఇతః=ఈ వైపు, కౌతుకం=ఆశ్చర్యమును, పశ్య=చూడుము. (అది ఏదనగా) సౌధాగ్రనటే; సౌధాగ్ర=మిద్దెపై భాగమునందు, నటే=నటునకు సమానముగా, చలేఽపి=కదలుచున్నదైనను, పటాఞ్చలే; పట=ధ్వజముయొక్క, అఞ్చలే = అంచునందు, కాకస్య=కాకికి, ఏషః=ఈ, పదార్పణగ్రహః=కాలినుంచుట యందలి పట్టుదల, ఇతి యత్=అనునదేదికలదో, తత్=అది, కౌతుకమ్=ముందు జెప్పిన ఆశ్చర్యము. ఇట్టు చెప్పి పాణ్డ్యవర్ణన నుండి సరస్వతీదేవి బుద్ధినిమఱల్చినది. అందువలనదమయన్తికిఁ బాణ్డ్యునిపైన గొప్పయనాదరణను సఖి సూచించినదని యర్థము.

**సమాసములు :**

ఇఙ్గితవిత్=ఇఙ్గితంవేత్తీతి=ఇఙ్గితవిత్ –

విదర్భజామ్:– విదర్భేషుజాయత ఇతి=విదర్భజా, తామ్=విదర్భజామ్,

సౌధాగ్రనటే :– సౌధస్య, అగ్రం=సౌధాగ్రం, సౌధాగ్రేనటః=సౌధాగ్రనటః, తస్మిన్ = సౌధాగ్రనటే।

పదార్పణగ్రహః ;– పదయోదర్పణం = పదార్పణమ్. పదార్పణేగ్రహః = పదార్పణగ్రహః।

**భావము :**

సరస్వతీదేవి పాణ్డ్యుని నెంత ప్రశంసించినను నామె కాతని పై నభిలాష యేర్పడలేదు. దీనిని గ్రహించిన పరిచారిక సరస్వతీదేవి యొక్క బుద్ధిని నాతని వర్ణన నుండి మరల్చుటకై; దమయన్తితో నిట్లు చెప్పెను — "ఓ దమయన్తీ ! ఈ దిక్కుననొక వింత జరుగుచున్నది చూడుము. ఒక కాకి మేడపై నటునివటె నిటునటు నాడుచున్న బెక్కె పుటంచుపై తన పాదముల నుంచుటకు మిక్కిలి పట్టువహించియున్నది. ఆబెక్కెము గాలికిఁ గదలుచుండుట వలన దాని పాద ములుఆబెక్కె పుటంచు లోనిలుచుట లేదు. ఆయిననునది పట్టుఁదలను వహించు చున్నది. ఇదియే యా వింత యని కాకి సంగతిచే నా పాణ్డ్యునిపై దమయన్తి కేర్పడిన గొప్ప యనాదరమునుపరిచారిక పై విధముగా సూచించినది. ॥౨౧॥

శ్లో, తత స్తదప్రస్తుతభాషితోత్థితైః
సద స్తదశ్వేతి హసైః సదస్సదామ్।
స్ఫుటాఽజని గ్లానిరతోఽస్య భూపతేః
సితే హి జాయేత శితేః సులక్ష్యతా॥ 22

ప. వి. తతః-తదప్రస్తుతభాషితోత్థితైః-సదః-తత్-అశ్వేతి-హసైః-సదఃసదామ్-స్ఫుటా-అజని-గ్లానిః-అతః-అస్య-భూపతేః-సితే-హి-జాయేత-శితేః-సులక్ష్యతా.

అర్థము. తతః=పిదప, తదప్రస్తుతభాషితోత్థితైః; తత్ = ఆ కాకి సంగతితోఁ గూడిన, అప్రస్తుతభాషిత=అప్రకృత సంభాషణముతో, ఉత్థితైః=ఉద్భ వించిన, సదఃసదామ్ = సభాసదులయొక్క, హసైః=నవ్వులచే, తత్ = ఆ, సదః=సభ, అశ్వేతి=తెల్లఁబడినది, అనగాఁ దెల్లగాఁజేయబడినది అతః=ఇట్లు సభతెల్లబడుటవలన, అస్య=ఈ, భూపతేః=పాణ్డ్య మహా రాజునకు, గ్లానిః=ముఖమున కాంతిరాహిత్యము, స్ఫుటా=స్పష్టమైనదిగా, అజని=ఏర్పడినది, తథాహి=అదియుక్తమే, సితే=తెలుపునందు, శితేః = నలుపునకు, సులక్ష్యతా=స్ఫుటత్వము, జాయేతహి=కలుగునుగదా!

వి. సభ నవ్వులచేఁ తెల్లఁబడుటవలన, పాణ్డ్యుని మోమున నేర్పడిన కాంతి రాహిత్యము లేదా నల్లఁదనము స్పష్టమైనదను విశేషార్థము "తెలుపు

నందు నలుపు స్పష్టమగునను'' సామాన్యముచే సమర్థితము కాన సర్థాన్త రన్యాసాలఙ్కారము.

**సమాసములు :**

అప్రస్తుతభాషితోక్తిభిః. =నప్రస్తుతాని= అప్రస్తుతాని, అప్రస్తుతానిచ తానిభాషితానిచ=అప్రస్తుతభాషితాని, అప్రస్తుతభాషితేభ్యః ఉత్థితాః= అప్రస్తుతభాషితోత్థితాః, తైః = అప్రస్తుతభాషితోత్థితైః।
సదఃసదామ్ :- సదసిసీద న్తీతి = సదఃసదః, తేషాం=సదః సదామ్
సులక్ష్యతా :- సుఖేన లక్షయితుంశక్యా=సులక్ష్యా, సులక్ష్యాయాఃభావః = సులక్ష్యతా.

**భావము :**

తర్వాత కాకిసంగతి వలనియప్రస్తుత సంభాషణలతో సభయందలి రాజులు నవ్విరి. అందువలన వారినవ్వుచే సభ యంతయుఁ దెల్లఁబడినది. అనగా శుభ్రమైపోయినది. ఆ సమయమున దమయన్తి తన్ను వలవనందు వలన ఖేదముచే పాణ్డ్యుని మోము నందుఁ గల్గిన నల్లఁదనము స్పష్టమగా కనఁ బడ సాగినది. తెలుపునందు నలుపు స్పష్టముగానగు పడుట సహజమే గదా! ॥౨౨॥

> శ్లో. తతోఽను దేవ్యా జగదే మహేన్ద్రభూ
> పురన్దరే సా జగదేకవన్ద్యయా.
> తదార్జవావర్జితతర్జనీకయా
> జనీ కయాచిత్ పరచిత్స్వరూపయా॥ 23

ప. వి. తతః-అను- దేవ్యా-జగదే- మహేన్ద్రభూపురన్దరే- సా-జగదేకవన్ద్యా- తదార్జవావర్జితతర్జనీకయా-జనీ-కయాచిత్-పరచిత్స్వరూపయా.

అర్థము. తతోఽను = అటుపిదప, మహేన్ద్రభూపురన్దరే, మహేన్ద్ర=మహేన్ద్ర పర్వతమునకు, భూపురన్దరే = భూలోకపుటింద్రుఁడైన, రాజువిషయమున, తదార్జవావర్జితతర్జనీకయా; తత్ = ఆ మహేన్ద్రపర్వతనరపతి

యొక్క, అర్జవ=సరళత్వముచే, ఆవర్జిత=ఆకర్షింపఁబడిన, తర్జనీకయా =చూపుడు వ్రేలుగల్గిన, కయాచిత్=ఒకానొక (అనిర్వాచ్యమైన) పరచిత్స్వరూపయా=పరజ్యోతిస్స్వరూపముగల, జగదేక వన్ద్యయా, జగత్= ప్రపంచములకు, ఏక= ముఖ్యమైన, వన్ద్యయా =నమస్కరింపఁదగిన, దేవ్యా=సరస్వతీదేవిచే, సా = ఆ, జనీ=వధువైనదమయన్తి, జగదే= చెప్పఁబడినది.

**సమాసములు :**

మహేన్ద్రభూపురన్దరే :- భువఃపురన్దరః=భూపురన్దరః, మహేన్ద్రస్య భూపురన్దరః=మహేన్ద్ర భూపురన్దరః, తస్మిన్=మహేన్ద్ర భూపురన్దరే.

జగదేకవన్ద్యయా :- వన్దితుంయోగ్యా=వన్ద్యా. ఏకాచసావన్ద్యాచ = ఏకవన్ద్యా, జగతామేకవన్ద్యా=జగదేకవన్ద్యా, తయా=జగదేకవన్ద్యయా.

తదార్జవావర్జిత తర్జనీకయా :- ఋజోర్భావః=ఆర్జవమ్, తస్య ఆర్జవమ్=తదార్జవమ్, తదార్జవేన, ఆవర్జితా=తదార్జవావర్జితా, తదార్జవావర్జితా, తర్జనీయస్యాస్సా=తదార్జవావర్జితా, తర్జనీకా, తయా=తదార్జవావర్జిత, తర్జనీకయా.

పరచిత్స్వరూపయా : పరాచసాచిత్చ=పరచిత్, పరచిత్ స్వరూపం యస్యాస్సా=పరచిత్ స్వరూపా, తయా=పరచిత్ స్వరూపయా.

**భావము :**

తర్వాత, అనిర్వాచ్యయును పరజ్యోతిస్స్వరూపయును,సకలలోకములకు నద్వితీయయునై వన్దనములనుఁ బొందు సరస్వతేదేవి,తన చూపుడువ్రేలితో మహేన్ద్రగిరి ప్రభువునుఁజూపి, యాతని సరళస్వభావముచే నాకర్షింపఁ బడినదై, దమయన్తితో నిట్లు చెప్పదొడగినది. ॥23॥

శ్లో. స్వయంవరోద్వాహమహే వృణీష్వ హే!
మహేన్ద్రశైలస్య మహేన్ద్రమాగతమ్।
కలిఙ్గజానాం స్వకుచద్వయశ్రియా
కలిం గజానాం శృణు తత్ర కుమ్భయోః॥ 24

ప. వి. స్వయంవరోద్వాహమహే–వృణీష్వ-హే-మహేన్ద్రి శైలస్య - మహేన్ద్రిమ్-ఆగతమ్–కలిఙ్గజానాం-స్వకుచద్వయశ్రియా–కలిం – గజానాం–శృణు–తత్ర–కుమ్భయోః.

అర్థము. హే(భైమి!)= ఓ దమయన్తీ! స్వయంవరోద్వాహమహేః;స్వయంవర= స్వయంవరమను, ఉద్వాహమహే = వివాహోత్సవమునందు, ఆగతం= వచ్చిన,మహేన్ద్రిశైలస్య=మహేద్రి పర్వతమునకు. మహేన్ద్రిమ్=ప్రభువును, వృణీష్వ=వరింపుము. తత్ర=ఆమహేన్ద్రి పర్వతమందు, కలిఙ్గజానాం = కలిఙ్గదేశమునందు జన్మించిన, గజానాం = ఏనుగులయొక్క, కుమ్భయోః=కుమ్భస్థలములకును,స్వకుచ ద్వయశ్రియా,స్వ=తనదియైన; కుచద్వయ=చనుదోయియొక్క, శ్రియా=శోభతో కలిం=జగడమును, అనగా నీచనుదోయి గొప్పదా? లేక యేనుగుల కుమ్భస్థలము గొప్పదా? యను వివాదమును, శృణు=వినుము, ఆ దేశమునందేనుగులు మిక్కుటముగాన, నీకుచకుంభములకును, వాని కుంభస్థలములకును సామ్యము స్ఫుటము కాఁగలదు.

**సమాసములు :**

స్వయంవరోద్వాహమహే :- స్వయంవర ఏవఉద్వాహః = స్వయంవరోద్వాహః, స్వయంవరోద్వాహ ఏవమహ = స్వయంవరోద్వాహమహః, తస్మిన్=స్వయంవరోద్వాహమహే.

మహేన్ద్రిశైలస్య :– మహేన్ద్రిఇతి శైలః=మహేన్ద్రిశైలః, తస్య = మహేన్ద్రిశైలస్య.

కలిఙ్గజానాం :- కలిఙ్గేషు జాయన్తఇతి=కలిఙ్గజాః, తేషాం = కలిఙ్గజానామ్.

స్వకుచద్వయశ్రియా - కుచయోః ద్వయమ్, కుచద్వయమ్, స్వస్య కుచద్వయం=,=స్వకుచద్వయమ్, స్వకుచద్వయస్యశ్రీః = స్వకుచద్వయశ్రీః. తయా=స్వకుచద్వయశ్రియా.

**భావము.**

ఓ దమయన్తీ! మహేన్ద్రి పర్వతమునుండి విచ్చేసిన యీ రాజును నీవు వరింపుము. ఆ మహేన్ద్రిపర్వతమునందు కలిఙ్గ దేశమునందు జన్మించిన

యేనుగుల కుమ్భస్థలములకును నీ చనుదోయికిని మధ్య నీ చనుదోయి పెద్దదా? లేక యా యేనుగుల కుమ్భస్థలములు పెద్దవా? యను వివాదము చెలరేగుచుండును. నీవు ఆ మహేన్ద్రగిరి ప్రభువును వలచితివేని నీవు ఆ వివాదమును వినఁగలవు. ఆ కలిఙ్గ దేశమున యేనుగులు మెండుకాన కుచకుంభములకును, గజకుంభము లకును పోలికలు స్పష్టపడగలవు ॥౨౪॥

శ్లో. అయం కిలాఽఽయాత ఇతీరిపౌరవా
గ్భయాదయాదస్య రిపుర్వృథా వనమ్।
శ్రుతా స్తదుత్ప్రాపగిర స్తదక్షరాః
పఠద్భిరత్రాసి శుకైర్వనేఽపి సః॥ **25**

ప. వి. అయం-కిల-ఆయాతః -ఇతి -ఈరిపౌరవాగ్భయాత్- అయాత్-అస్య-రిపుః-వృథా-వనం -శ్రుతాః -తదుత్ప్రాపగిరః -తదక్షరాః- పఠద్భిః-అత్రాసి-శుకైః-వనే-అపి-సః.

అర్థము. అయంకిల = ఈమహేన్ద్రగిరిప్రభువు, ఆయాతఃకిల=వచ్చెనుగదా, ఇతీరిపౌరవాగ్భయాత్, ఇతి = అని, ఈరి = చెప్పుచున్న, పౌర =పుర జనులయొక్క, వాగ్భయాత్ = వాక్కువలని భయమువలన, అస్య = ఇతనియొక్క, రిపుః = శత్రువు, వృథా =వ్యర్థముగా, వనం=అరణ్యమునుఁగూర్చి, అయాత్=వెళ్లెను. (అని) శ్రుతాః =చిలుకలచేవినఁబడిన, తదక్షరాః = ఆయక్షరములు ఆనగా- "ఈ మహేన్ద్రగిరి ప్రభువు వచ్చెను" అను నక్షరములు గల, తదుత్ప్రాపగిరః, తత్ = ఆశత్రువుల యొక్క, ఉత్ప్రాపగిరః=నిద్రలోనికలవరింపుమాటలను, పఠద్భిః=ఉచ్చరించుచున్న, శుకైః = చిలుకలచే, వనేఽపి = అడవియందును, సః= ఆశత్రువు, అత్రాసి =భయపెట్టఁబడెను.

వి. అరణ్యమున శత్రువునకు భయనిమిత్తము లేకపోయినను శుకవచనములచే భయము గల్గినట్లు చెప్పుటచే, త్రాసనివృత్తికి సమగ్ర కారణము లున్నను, త్రాసనివృత్తిరూపమగు కార్యమేర్పడక పోవుటచే, విశేషోక్త్యలఙ్కారము. శుకవచనములు దానికి నిమిత్తముగా ఉపాత్తముగాన ఉపాత్తనిమిత్తరూపమగు విశేషోక్తి.

**సమాసములు :**

ఇతీరిపౌరవాగ్భయాత్ :- ఇతి ఈరస్తీతి = ఇతీరిణః, ఇతీరిణశ్చతే పౌరాశ్చ =ఇతీరిపౌరాః, ఇతీరిపౌరాణాంవాక్ = ఇతీరిపౌరవాక్, ఇతీరి పౌరవాచః భయం =ఇతీరిపౌరవాగ్భయమ్, తస్మాత్=ఇతీరిపౌరవాగ్భ యాత్.

తదుత్స్వాపగిరః :- ఉత్స్వాపాఏవగిరః=ఉత్స్వాపగిరః, తస్యఉత్స్వాప గిరః = తదుత్స్వాపగిరః, తాః=తదుత్స్వాపగిరః,

తదక్షరాః :- తానిఅక్షరాణి యాసుతాః = తదక్షరాః, తాః = తద క్షరాః।

**భావము :**

ఆ మహేన్ద్రగిరి ప్రభువు దండ యాత్రతో వచ్చెనని పురజనుల మాట లను విని భయముతో నీతని శత్రువు అడవులకు వ్యర్థముగా బారిపోయెను. ఆ యడవియందును వీనికి సుఖము లేదు. ఏలయనగా— "మహేన్ద్రగిరిరాజు వచ్చి నాడను మాటను నీ శత్రువు నిద్రలోకలవరించుట వలన నరణ్యమందలి చిలుకలు ఆ మాటలను నట్లే యను సరించి చెప్పుటవలన, దానిని విని యడవియందును నా శత్రువు భయపడవలసి వచ్చినది. అందువలన మహేన్ద్రగిరి ప్రభువువచ్చి నాడని పౌరులు చెప్పుటవలన భయపడి యడవికి బారిపోయిన శత్రువునకు, మహేన్ద్రగిరి ప్రభువు వచ్చినాడను" వారి కలవరింపుల ననుకరించు చిలుకల పలుకులచే నరణ్యమందును భయమేర్పడుట వలన నరణ్యమునకు వెళ్లుటయు వ్యర్థమే యగుచున్నది ॥౨౫॥

శ్లో. ఇతస్త్రసద్విభ్రమతభూభృదుజ్ఝితా
ప్రియాథ దృష్టా వనమానవీజనైః.
శశంస పృష్టాద్భుతమాత్మదేశదం
శశిత్విషః శీతలశీలతాం కిల॥ 26

ప. వి. ఇతః—త్రసద్విభ్రమతభూభృదుజ్ఝితా—ప్రియా-అథ—దృష్టా—వనమానవీజ నైః-శశంస-పృష్టా-అద్భుతమ్-ఆత్మదేశజం-శశిత్విషః—శీతలశీలతాం— కిల,

అర్థము. ఇతః = ఈ మహేన్ద్రగిరి ప్రభువువలన, త్రసద్విద్రుతభూభృదుజ్ఝితాః; త్రసత్ = భయపడుచున్నటువంటి, (కావుననే) విద్రుత=పారిపోయిన, భూభృత్ = రాజులచే, ఉజ్ఝితా=విడువఁబడిన, ప్రియా = ప్రియురాలు, వనమానవీజనైః; వన=అడవియందలి, మానవీజనైః=మానవస్త్రీ జనములచే, అనగా బోయతలచే, దృష్టా=చూడఁబడినదై, అథ=పిదప, ఆత్మదేశజమ్ = తనదేశమునందున్న, అద్భుతం=వింతనుఁగూర్చి, పృష్టా=అడుగఁబడినదై, శశిత్విషః = చంద్రునికాంతికి, శీతలశీలతాం = చల్లని స్వభావమును, శశంసకిల=చెప్పినదిగదా।

క్రొత్తగా విరహమునుఁ బొందిన ముగ్ధురాలికి, విరహమున చంద్రకిరణములు బాధించునను సంగతి తెలియక, స్వదేశమున నది చల్లని దనియు నడవియందది వేడిమి గలదనియు భ్రాన్తినొందినది. ॥౨౬॥

**సమాసములు :**

త్రసద్విద్రుతభూభృదుజ్ఝితా:- త్రసన్తశ్చతేవిద్రుతాశ్చ=త్రసద్విద్రుతాః, త్రసద్విద్రుతాశ్చతేభూభృతశ్చ=త్రసద్విద్రుతభూభృతః, త్రసద్విద్రుతభూభృద్భిరుజ్ఝితాః=త్రసద్విద్రుతభూభృదుజ్ఝితాః।

వనమానవీజనైః :- వనస్యమానవ్యః=వనమానవ్యః. వనమానవ్య ఏవ జనాః=వనమానవీజనాః; తైః=వనమానవీజనైః.

**ఆత్మదేశజమ్ :- ఆత్మనఃదేశః=ఆత్మదేశః, ఆత్మదేశేజాయతఇతి=ఆత్మదేశజం, తత్=ఆత్మదేశజమ్।**

శశిత్విషః :- శశినః త్విట్ = శశిత్విట్, తస్యాః శశిత్విషః ।

శీతలశీలతామ్ :- శీతలంశీలం యస్యాస్సా=శీతలశీలా, శీతలశీలాయాః భావః=శీతలశీలతా, తామ్=శీతలశీలతామ్।

**భావము :**

ఆ మహేన్ద్రగిరి నరపతివలన భయపడి పాఱిపోయిన శత్రురాజుచే విడువబడిన యాతని ప్రియురాలిని బోయతలు చూచి యామె దేశమునందలి వింతనుఁగూర్చి యడిగిరి. అప్పుడా ముగ్ధురాలగు రాజవనితకు, విరహము క్రొత్తదగుట

వలన విరహకాలమున చన్ద్రకిరణములు పెట్టెడి బాధతెలియక తనదేశమున చన్ద్రకిరణములు చల్లనివనియు వనమందవి వేడిగానున్నవనియు భ్రాన్తిఁజెంది చెప్పినది. వనమందు తనకు ప్రియుని వియోగమేర్పడి యున్నందువలన చన్ద్రకిరణములు వేడిమిఁజెంది తన్ను బాధించుచున్న విషయము నా ముగ్ధురాలు గ్రహింపజాలక పోయినదై, అడవిలో చంద్రకిరణములు వేడిగానుండునని యామె భ్రాన్తిఁజెందినదని భావము. ॥౨౬॥

శ్లో. ఇతోఽపి కిం వీరయసే న కుర్వతో
నృపాన్ధనుర్బాణగుణైర్వశంవదాన్।
గుణేన శుద్ధేన విధాయ నిర్భరం
తమేనముర్వీవలయోర్వశీ వశమ్॥ 27

ప. వి. ఇతః-అపి-కిం-వీరయసే-న-కుర్వతః-నృపాన్-ధనుర్బాణగుణైః-వశంవదాన్-గుణేన-శుద్ధేన-విధాయ-నిర్భరం-తమ్-ఏనమ్-ఉర్వీవలయోర్వశి-వశమ్.

అర్థము (హే భైమి.)=ఓ దమయన్తీ! ఉర్వీవలయోర్వశీ; ఉర్వీవలయ=భూమణ్డలమునకు, ఊర్వశీ=ఊర్వశివైన, త్వం=నీవు, శుద్ధేన=శుద్ధమైన అనగా నిర్దోషమైన, గుణేన=సౌన్దర్యగుణముచే (అల్లెత్రాడుచే)తమ్=ఆ, ఏనం=ఈ మహేన్ద్ర రాజును నిర్భరం=మిక్కిలి, వశం=స్వాధీనునిగా, విధాయ=చేసి, ధనుర్బాణగుణైః, ధనుస్సుచేతను, బాణములచే, అల్లెత్రాడుచేతను, అనగా మూడు సాధనములచే, నృపాన్=రాజులను, వశంవదాన్=వశ్యులనుగా, కుర్వతః=చేయుచున్న, ఇతోఽపి=వీనికంటెను, న వీరయసే -పరాక్రమింపవా! తప్పక పరాక్రమింపఁగలవు.

వి. ఒక సౌందర్యగుణమనువల్లె త్రాటిచే మహేన్ద్రనాథుని స్వాధీనపఱచు కొనిన దమయన్తి, ధనుస్సు, బాణము, అల్లెత్రాడు-అను మూడుసాధనములచే శత్రువులను స్వాధీనపఱచుకొను మహేన్ద్రనాథునిమించినదని చెప్పుటవలన నిటవ్యతిరేకాలఙ్కారము.

**సమాసములు :**

ధనుర్బాణగుణైః : ధనుశ్చ, బాణశ్చ, గుణశ్చ=ధనుర్బాణగుణాః, తైః=ధనుర్బాణగుణైః.

ఉర్వీవలయోర్వశీ ;- ఉర్వ్యాః వలయమ్=ఉర్వీవలయమ్, ఉర్వీవలయే ఊర్వశీ=ఉర్వీవలయోర్వశీ.

**భావము :**

ఓ దమయన్తీ ! నీవు భూమికి నూర్వశివి. నీవు ఒక్కటేయైన శుద్ధమగు నీ సౌందర్యగుణమను నల్లెత్రాడుతో నీ మహేన్ద్రినాథుని వశ్యునిఁగావించుకొని, ధనుర్బాణగుణములనెడి మూడుసాధనములతో, రాజులను వశ్యులఁగావించుకొను నీతని మించి పరాక్రమమునుఁ బ్రదర్శింపవా? తప్పక ప్రదర్శింపఁగలవు. ॥౨౭॥

**శ్లో. ఏతద్భీతారినారీ గిరిబిలవిగలద్వాసరానిఃసరన్తీ**
**స్వక్రీడాహంసమోహగ్రహిలశిశుభృశప్రార్థితోన్నిద్రచన్ద్రా।**
**ఆక్రన్దద్భూరి యత్తన్నయసజలమిలచ్చన్ద్రిహంసానుబిమ్బ**
**ప్రత్యాసత్తిప్రహృష్యత్తనయవిహసితై రాశ్వసీన్న్యశ్వసీచ్చ॥28**

ప. వి. ఏతద్భీతానారీ-గిరిబిలవిగల ద్వాసరా-నిఃసరన్తీ-స్వక్రీడాహంస మోహగ్రహిల శిశుభృశ ప్రార్థితోన్నిద్రచన్ద్రా-ఆక్రన్దత్-భూరి-యత్-తన్నయన జలమిలచ్చన్ద్రిహంసానుబిమ్బ ప్రత్యాసత్తి ప్రహృష్యత్తనయ విహసితైః-అశ్వసీత్-న్యశ్వసీత్-చ.

**అర్థము.** ఏ తద్భీతారినారీ; ఏతత్=ఈమహేన్ద్రినాథునివలన, భీత=భయపడిన, అరి=శత్రువుయొక్క,నారీ=స్త్రీ, గిరిబిలవిగలద్వాసరా; గిరి=పర్వతముల యొక్క, బిల=గుహలయందు, విగలత్=గడచుచున్న, వాసరా=పగలు గలదై, నిఃసరన్తీ=సాయంకాలము గుహనుండి వెలుపలికివచ్చుచున్నదై, స్వక్రీడాహంస మోహగ్రహిల శిశుభృశప్రార్థితోన్నిద్రచన్ద్రా; స్వక్రీడాహంస=తనకేళిహంసయను, మోహ=భ్రాంతిచే, గ్రహిల=పట్టుఁదలగల్గిన, శిశు=బాలకునిచే, భృశ=మిక్కిలి, ప్రార్థిత=ప్రార్థింపబడిన, (పట్టియిమ్మని కోరబడిన) ఉన్నిద్ర=పూర్ణమైన, చన్ద్రా=చన్ద్రినిగలదై, భూరి=బిగ్గరగా, ఆక్రన్దత్=ఏడ్చెనది. యత్=ఏయేడ్పువలన, తన్న

యనజలమిచ్చన్ద్రిహంసాను బిమ్బప్రత్యాసత్తి ప్రహృష్యత్తనయ విహ సితైః; తత్=అ తల్లియొక్క, నయనజల=కన్నీటియందు,మిలత్=లగ్న మైన, చన్ద్రి=చంద్రుండనెడి, హంస=హంసయొక్క, అనుబిమ్బ=ప్రతి బిమ్బముయొక్క, ప్రత్యాపత్తి=సమీపస్థితిచే, ప్రహృష్యత్=సంతసించు, తనయ=కుమారునియొక్క, విహసితైః=కొంచెము బిగ్గరనవ్వులచే, అశ్వ సీత్=ఊరడిల్లినది. న్యశ్వసీత్=తన దీనదశకు శోకముతో నిట్టూర్పును వదలినది. తన కంటినీట పుత్రునకు చంద్రుడనెడిహంసనుఁ గనుబఱ చుటవలన వానికి హంస కావలయుననెడి పట్టు సడలినధి. తనదుర్దశకు దుఃఖము ననుభవించినదని యర్థము.

వి. ఇచ్చట శత్రు స్త్రీబాలకునకు, చన్ద్రిబింబమందును, దాని ప్రతిబింబ మందును హంససామ్యమును ననుసరించి హంసభ్రాంతిని వర్ణించుట వలన భ్రాన్తిమదలఙ్కారము.

**సమాసములు :**

ఏతద్భీతారినారీ: ఏతస్మాత్ భీతః = ఏతద్భీతః, ఏతద్భీతశ్చాసౌ అరిశ్చ= ఏతద్భీతారిః. ఏతద్భీతారేః నారీ=ఏతద్భీతారినారీ.

గిరిబిలవిగలద్వాసరా : గిరేః బిలం=గిరిబిలం, గిరిబిలేవిగలన్ వాసరః యస్యాస్సా = గిరిబిలవిగలద్వాసరా।

స్వక్రీడాహంసమోహగ్రహిలశిశుభృశప్రార్థితోన్నిద్రచన్ద్రా : క్రీడాయాః హంసః = క్రీడాహంసః, స్వస్యక్రీడాహంసః = స్వక్రీడాహంసః, స్వ క్రీడాహంసఇతిమోహః = స్వక్రీడాహంసమోహః, గ్రహఃఅస్యఅస్తీతి= గ్రహిలః, స్వక్రీడాహంసమోహేనగ్రహిలః = స్వక్రీడాహంసమోహ గ్రహిలః. స్వక్రీడాహంసమోహగ్రహిలశ్చాసౌశిశుశ్చ = స్వక్రీడాహంస మోహగ్రహిలశిశుః, స్వక్రీడాహంసమోహగ్రహిలశిశునాభృశంప్రార్థితః= స్వక్రీడాహంసమోహగ్రహిలశిశుభృశప్రార్థితః, ఉద్గతానిద్రాయస్మాత్సః= ఉన్నిద్రః,ఉన్నిద్రశ్చాసౌచన్ద్రిశ్చఉన్ని=ద్రచన్ద్రిః,స్వక్రీడాహంసమోహ గ్రహిలశిశుభృశప్రార్థితః, ఉన్నిద్రచన్ద్రిః యయాసా=స్వక్రీడాహంస మోహగ్రహిలశిశుభృశప్రార్థితోన్నిద్రచన్ద్రా.

తన్నయనజలమిలచ్చన్ద్రిహంసాను బిమ్బ ప్రత్యాసత్తిప్రహృష్యత్తనయ విహసితైః :- తస్యాః నయనజలం=తన్నయన జలమ్, తన్నయనజలే మిలన్=తన్నయన జలమిలన్, చన్ద్రఏవహంసః=చంద్రహంసః, తన్నయనజలమిలంశ్చాసౌ, చంద్రహంసశ్చ = తన్నయనజలమిలచ్చన్ద్రిహంసః, తన్నయనజలమిలచ్చన్ద్రిహంసస్య అను బిమ్బః=తన్నయనజలమిలచ్చన్ద్రిహంసానుబిమ్బః, తన్నయనజలమిలచ్చన్ద్రిహంసాను బిమ్బస్య ప్రత్యాసత్తిః, = తన్నయనజలమిలచ్చన్ద్రిహంసాను బిమ్బప్రత్యాసత్తిః, తన్నయనజలమిలచ్చన్ద్రిహంహనుబిమ్బప్రిత్యాసత్త్యాప్రహృష్యన్=తన్నయనజలమిలచ్చన్ద్రిహంసాను బిమ్బప్రత్యాసత్తిప్రహృష్యన్, తన్నయన జలమిలచ్చన్ద్రిహంసానుబింబ ప్రత్యాసత్తిప్రహృష్యంశ్చాసౌ తనయశ్చ =తన్నయనజలమిలచ్చన్ద్రిహంసానుబింబప్రత్యాసత్తిప్రహృష్యత్తనయః, తన్నయనజలమిలచ్చన్ద్రిహంసానుబిమ్బప్రత్యాసత్తి ప్రహృష్యత్తనయస్య విహసితాని=తన్నయనజలమిలచ్చన్ద్రిహంసాను బిమ్బప్రత్యాసత్తి ప్రహృష్యత్తనయ విహసితాని, తైః=తన్నయనజలమిలచ్చన్ద్రిహంసాను బిమ్బప్రత్యాసత్తి ప్రహృష్యత్తనయ విహసితైః।

**భావము :**

ఈ మహేన్ద్రిగిరి ప్రభువు వలన భయపడిన శత్రువు భార్యయొకతె పర్వత గుహయందు పగటినిఁ గడపుచు సాయంకాలమునకు వెలుపలికి వచ్చుచున్నది. ఆమె, తన పుత్రుఁడు పూర్ణచన్ద్రినిఁ జూచి క్రీడాహంసమనిభ్రాంతిఁ జెంది దానినిఁ దనకుఁదెచ్చియీయమని కోరగా నామెగొల్లుమని యేడ్చినది. అప్పుడు ఆమె కన్నులనుండి కారిన నీటిలో చంద్రబిమ్బమును ఁజూచి అది హంసయని భ్రాన్తిఁజెంది ఆ బిడ్డ సంతోషించి నవ్వనారంభింపగా నామె బిడ్డనుఁ జూచి యూరడిల్లినది. కాని తన యీ యరణ్యవాసస్థితికి దుఃఖముతో నిట్టూర్పును విడచినది ॥౨౮॥

శ్లో. **అస్మిన్ దిగ్విజయోద్యతే పతిరయం మే స్తాదితిధ్యాయతి**
**కమ్పం సాత్త్వికభావమఞ్చతి రిపుక్షోణీన్ద్రిదారా ధరా.**
**అస్యైవాఽభిముఖం నిపత్య సమరే యాస్యద్భిరూర్ధ్వంనిజః**
**పన్థా భాస్వతి దృశ్యతే బిలమయః ప్రత్యర్థిభిఃపార్థివైః॥29**

ప. వి. అస్మిన్ - దిగ్విజయోద్యతే - పతిః - అయం - మే - స్తాత్ - ఇతి - ధ్యాయతి - కమ్పం - సాత్త్వికం - ఇమం - అఞ్చతి - రిపుక్షోణీన్ద్రదారాః - ధరా - అస్య - ఏవ - అభిముఖం - నిపత్య - సమరే - యాస్యద్భిః - ఊర్ధ్వం - నిజః - పన్థాః - భాస్వతి - దృశ్యతే - బిలమయః - ప్రత్యర్థిభిః - పార్థివైః -

అర్థము. అస్మిన్ = ఈమహేన్ద్రనాథుఁడు, దిగ్విజయోద్యతేసతి; దిగ్విజయ = దిగ్విజయముకొఱకు, ఉద్యతేసతి = ప్రయత్నింపగా, రిపుక్షోణీన్ద్రదారాః; రిపుక్షోణీన్ద్ర = శత్రుభూపతులయొక్క, దారాః = భార్యయైన, ధరా= భూమి, అయం = ఈమహేన్ద్రనాథుడే, మే = నాకు, పతిః = భర్తగా, స్తాత్ = ఉండునుఁగాత, ఇతి=అని, ధ్యాయతి = సఙ్కల్పించుచున్నది. కమ్పం=వణకుఅనెడి, సాత్త్వికభావం=స్వాతిక భావమును, అఞ్చతి = పొందుచున్నది, కిఞ్చ=మఱియు, అస్యైవ=ఇతనియొక్కయే, సమరే= యుద్ధమందు,అభిముఖం = సమ్ముఖమును, నిపత్య=పొంది, ఊర్ధ్వం= ఊర్ధ్వలోకమును, యాస్యద్భిః=పోనున్న, ప్రత్యర్థిభిః = శత్రువులైన, పార్థివైః = రాజులచే, భాస్వతి = సూర్యమణ్డలములందు, బిలమయః= రన్ధ్రరూపమైన, పన్థాః = మార్గము, దృశ్యతే = చూడఁబడుచున్నది.

వి. ఇచ్చట సహజమైన భూకమ్పమందు సాత్త్వికభావము ఉత్ప్రేక్షింపఁబడి నది కాన నుత్ప్రేక్ష. వ్యఞ్జకమునుఁ బ్రయోగింపనందు వలన నది గమ్యము.

అట్లే సూర్యమండలమందు కానవచ్చెడి రన్ధ్రమును తమ యూర్ధ్వగమన మార్గముగా భావించుట వలన నిదియునుత్ప్రేక్ష. వ్యఞ్జకమునుఁ జెప్ప నందు వలన నిదియు గమ్యము.

మృత్యువెవ్వరికి సన్నిహితమో వారికి సూర్యమండలమందు రన్ధ్రము కానవచ్చునని శాస్త్రము చెప్పుచున్నది. యుద్ధమున వెన్నుచూపక మర ణించిన వారు సూర్యమణ్డలమును భేదించుకొని యూర్ధ్వలోకములకు వెళ్లుదురు. కావుననే—

"ద్వావిమౌ పురుషౌ లోకే సూర్యమణ్డలభేదినౌ
పరివ్రాట్ యోగయుక్తశ్చ రణేచాభిముఖోహతః"

అని సన్న్యాసియు యోగియు, యుద్ధమున మరణించిన వీరుడును సూర్య మణ్డలమును భేదించుకొని వెళ్లుచురని శాస్త్రము చెప్పుచున్నది.

**సమాసములు:**

దిగ్విజయోద్యతే:— దిశాంవిజయః—దిగ్విజయః, దిగ్విజయస్యఉద్యతః = దిగ్విజయోద్యతః, తస్మిన్—దిగ్విజయోద్యతే.
రిపుక్షోణీన్ద్రదారాః:— క్షోణ్యాఃఇన్ద్రాః = క్షోణీన్ద్రాః.రిపవఏవక్షోణీన్ద్రాః= రిపుక్షోణీన్ద్రాః, రిపుక్షోణీన్ద్రాణాందారాః = రిపుక్షోణీన్ద్రదారాః.

**భావము :**

ఈ మహేన్ద్రగిరి ప్రభువు దిగ్విజయమునకుఁ బ్రయత్నింపగనే, శత్రు భూపతుల కలత్రమైన భూమి, ఈ మహేన్ద్రనాథుడే తనకు పతికావలయునని ధ్యానించును. కమ్పమనెడి అనగా భూకమ్పమనెడి సాత్త్విక భావమును బొందును. ఇతనిని యుద్ధమున నెదుర్కొని మరణించి, పైలోకములకుబో బోవు చున్న రాజులకు సూర్యమణ్డల మందొక బిలముకానవచ్చును. ఆయుద్ధరంగమున మరణించిన వీరులు, ఆ బలమునుండి ఊర్ధ్వలోకములకుఁ బోయెదరని శాస్త్రము చెప్పుచున్నది. ఆ విధముగనే, సన్న్యాసులు యోగులును సూర్యమణ్డల బిలము నుండి యూర్ధ్వ లోకములకు వెళ్లెదరు. అట్టి గొప్పవీరుని నీవు వరించుట యుచితము ॥౨౯॥

శ్లో. విద్రాణే రణచత్వరాదరిగణే త్రస్తే సమస్తే పునః
కోపాత్ కోఽపి నివర్తతే యది భటః కీర్త్యా జగత్యుద్భటః।
ఆగచ్ఛన్నపి సమ్ముఖం విముఖతామేవాధిగచ్ఛత్యసౌ
ద్రాగేతచ్ఛురికారయేణ రణితి ఛిన్నాపసర్పచ్ఛిరాః॥ 30

ప. వి. విద్రాణే—రణచత్వరాత్—అరిగణే—త్రస్తే—సమస్తే—పునః—కోపాత్—కః—అపి—నివర్తతే—యది—భటః—కీర్త్యా—జగతి—ఉద్భటః—ఆగచ్ఛన్—అపి—సమ్ముఖం—విముఖతామ్—ఏవ—అధిగచ్ఛతి—అసౌ—ద్రాగ్—ఏతచ్ఛురికార యేణ—రణ్—ఇతి—ఛిన్నాపసర్పచ్ఛిరాః—.

అర్థము. సమస్తే=సకలమైన, అరిగణే = శత్రుసమూహము, రణచత్వరాత్ = యుద్ధపుముంగిలియందీ, విద్రావేసతి = పరుగిడిపోగా, కీర్త్యా = కీర్తిచే, జగతి = ప్రపఞ్చమునందు ఉద్భటః = ఎదురులేని, కోఽపి = ఆశత్రుగణములలో నొకానొక, భటః = భటుఁడు, కోపాత్ = కోపమువలన, పునర్నివర్తేయది = మఱలినచో, తదా = అప్పుడు, సమ్ముఖం=అభిముఖమును, ఆగచ్ఛన్నపి = వచ్చుచున్నను, అసౌ = ఈ భటుఁడు, ద్రాక్ = వెంటనే, ఏతచ్ఛురికారయేణ;ఏతత్ = ఈ మహేన్ద్రనాథుని యొక్క, ఛురికా=కత్తియొక్క, రయేణ=వేగముచే, రణితి=రణ్-అని, ఛిన్నాపసర్పచ్ఛిరాః; ఛిన్న = తెగిన, అపసర్పత్ = తొలగిన, శిరాః=శిరస్సుకలవాడగుచు, విముఖతామేవ = పరాఙ్ముఖత్వమును వెనుకకుఁ దిరిగిన ముఖమునుఁ గల్గియుండుటనే (తొలగిన ముఖము గల్గియుండుటనే), అధిగచ్ఛతి = పొందును.

వి. ఇచ్చట యుద్ధమున సమ్ముఖముగా వచ్చిన వానికి విముఖత్వము విరుద్ధము కాన విరోధాభాసాలఙ్కారము. విముఖత్వమనగా ముఖము తొలగిపోవుట యనునర్థము చెప్పుటచే విరోధమునకు పరిహారము. యుద్ధమున సమ్ముఖముగా వచ్చిన వానికి శిరస్సు తెగగొట్టఁబడుట వలన విముఖత్వ మేర్పడునని యర్థము. విముఖత్వమనగా-విగతముఖత్వము - అనగా - ముఖము లేకపోవుట.

సమాసములు :

రణచత్వరాత్ :- రణస్యచత్వరం= రణచత్వరమ్. తస్మాత్ = రణచత్వరాత్ -

అరిగణే :- అరీణాంగణః,=అరిగణః, తస్మిన్ = అరిగణే.

విముఖతామ్ :- విగతంముఖంయస్యసః=విముఖః, విముఖస్యభావః = విముఖతా, తామ్=విముఖతామ్ ।

ఏతచ్ఛురికారయేణ :- ఏతస్యఛురికా=ఏతచ్ఛురికా, ఏతచ్ఛురికాయాః రయః=ఏతచ్ఛురికారయః, తేన=ఏతచ్ఛురికారయేణ-

ఛిన్నాపసర్పచ్ఛిరాః :- ఛిన్నమ్, అపసర్పత్, శిరః యస్యసః=ఛిన్నాపసర్పచ్ఛిరాః ।

**భావము :**

యుద్ధరంగమున శత్రుసమూహమంతయు భయముఁ జెందిపారిపోగా, కీర్తితో లోకప్రసిద్ధుఁడైన భటుడొక్కఁడు ఆ శత్రుసమూహమునుండి మరలి వచ్చి సమ్ముఖముగనిలచి అనగా నెదురుగానిలచి యుద్ధమాడినచో వెంటనే యా మహేన్ద్రనాథుని ఖడ్గము వానితలను, "ఠణ్" అను మ్రోతతో ఖండించి వైచును. అప్పుడతఁడు విముఖుడేయగును. అనగా లోకప్రసిద్ధుడైన వీరుడు సమ్ముఖమున పోరాడినను నాతనిఖడ్గాఘాతముచే కణ్ఠము తెగుటవలన విముఖుడే యగును. అనగా ముఖము తొలగినవాడుఁగను (వెనుకకు మరలినవాడుగను నగును) నని యాశయము. ॥30॥

శ్లో. తతస్తదుర్వీన్ద్రగుణాద్భుతాదివ
స్వవక్త్రపద్మే ఒలఙ్గునాలదాయినీ
విధీయతామాననముద్రణేతి సా
జగాద వైదగ్ధ్యమయేఙ్గితైవ తామ్॥ 31

ప. వి. తతః-తదుర్వీన్ద్రగుణాద్భుతాత్-ఇవ-స్వవక్త్రపద్మే--అఙ్గులనాలదాయినీ -విధీయతామ్-ఆననముద్రణా-ఇతి-సా-జగాద-వైదగ్ధ్యమయేఙ్గితా-ఏవ-తామ్.

అర్థము. తతః=ఆ మహేన్ద్రనాథుని దర్శించిన పిదప, తదుర్వీన్ద్రగుణాద్భుతాదివ; తత్=ఆ, ఉర్వీన్ద్ర=మహేన్ద్రనాథుని, గుణ=గుణములయందు, అద్భుతాదివ=ఆశ్చర్యమువలననోయనునట్లు, (వాస్తవములో వానియందలిఅనాదరమువలననని యర్థము.) స్వవక్త్రపద్మే; స్వ=తనదైన, వక్త్రపద్మే=ముఖమనెడి పద్మమునందు, అఙ్గులినాలదాయినీ; అఙ్గులి=వ్రేలనెడి, నాల=తామరకాడను, దాయినీ=ఉంచుచున్న, సా=ఆ దమయన్తి, వైదగ్ధ్యమయేఙ్గితైవ; వైదగ్ధ్యమయ = చాతుర్యముతోనిండిన, ఇఙ్గితైవ=చేష్టకలదియై, తామ్=ఆసరస్వతిని, ఆననముద్రణా=మౌనము, విధీయతాం=చేయఁ బడవలయునని, జగాద=చెప్పినది, మాటతో నవసరములేకయే ముఖమున వ్రేలినుంచుకొనుటవలననే సరస్వతీదేవిని మౌనము వహించవలసినట్లు చెప్పినట్లాయెను, నేర్పరియగు స్త్రీ తన

చేష్టతోనే యితరుని బోధించుసు. మాటలాడవలదని సూచించుటకును, నాశ్చర్యమునభినయించుటకును లోకమున ముఖమునందు వ్రేలుంచుట ప్రసిద్ధము.

వి : సరస్వతీదేవిని మౌనమువహించమని సూచించుటకై మోమునసుంచిన వ్రేలును, మహేన్ద్రనాథుని గుణములవలని యాశ్చర్యముచే నుంచఁబడి నట్లు భావించుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకమైన "ఇవ" శబ్దమునుఁ బ్రయోగించుటవలన నదివాచ్యము.

**సమాసములు :**

ఉర్వీన్ద్రగుణాద్భుతాత్:- ఉర్వ్యాః ఇన్ద్రః = ఉర్వీన్ద్రః, ఉర్వీన్ద్రస్య గుణాః, = ఉర్వీన్ద్రగుణాః, ఉర్వీన్ద్రగుణేషు అద్భుతమ్ = ఉర్వీన్ద్రగుణాద్భుతమ్, తస్మాత్ = ఉర్వీన్ద్రగుణాద్భుతాత్ ।

స్వవక్త్రపద్మే:- స్వస్యాః వక్త్రమ్ = స్వవక్త్రమ్, స్వవక్త్రమేవ పద్మమ్ = స్వవక్త్రపద్మమ్, తస్మిన్ = స్వవక్త్రపద్మే.

అఙ్గులినాలదాయినీ:- అఙ్గులిరేవనాలః = అఙ్గులినాలః, అఙ్గులినాలందదాతీతి = అఙ్గులినాలదాయినీ.

అననముద్రణా:- అననస్యముద్రణా = అననముద్రణా.

వైదగ్ధ్యమయేఙ్గితా:- వైదగ్ధ్యేనప్రచురమ్, = వైదగ్ధ్యమయమ్, వైదగ్ధ్యమయంఇఙ్గితంయస్యాస్సా = వైదగ్ధ్యమయేఙ్గితా.

**భావము :**

ఆ రాజును చూచినపిదప దమయన్తీదేవి యాతని గుణములను విని యాశ్చర్యపడినదో యనునట్లు తన మోమున వ్రేలుపెట్టుకొనినది. వాస్తవమున నాతని గుణములను విని యాశ్చర్యమును నామె పొందలేదు. పైగా నాతనియందు తిరస్కారమునే వహించినది. కాని యామె యాశ్చర్యసూచకముగా తనమోము పైనుంచినవ్రేలు సరస్వతీదేవిని నిఁకనాతని గుణవర్ణనను మాని మౌనమువహింపమని సూచించుట కొరకే కాని యదియాశ్చర్య సూచన కొఱకు గాదు. ఆ దమయన్తి నేర్పరి గాన, తాను మాటలతోఁగాక, చేష్టతోనే చెప్పవలసిన విషయమును సూచించినదని యాశయము ॥30॥

శ్లో. అనన్తరం తామవదన్నృపాన్తరం
తదధ్వదృక్తారతరఙ్గరిఙ్గణా।
తృణీభవత్పుష్పశరం సరస్వతీ
స్వతీవ్రతేజఃపరిభూతభూతలమ్॥ 32

ప. ఛే. అనన్తరం-తామ్- అవదత్-నృపాన్తరం- తదధ్వదృక్తారతరఙ్గరిఙ్గణా- తృణీభవత్పుష్పశరం-సరస్వతీ-స్వతీవ్రతేజఃపరిభూతభూతలమ్.

అర్థము. అనన్తరం = ఆమహేన్ద్రనాథుని వర్ణనమును పేక్షించినతర్వాత, సరస్వతీ = సరస్వతీదేవి, తదధ్వదృక్తారతరఙ్గరిఙ్గణా; తత్ = ఆ, మరి యొకరాజు యొక్క, అధ్వ = త్రోవయందు, దృక్ = నేత్రముల యొక్క, తార = కంటిపాపల, తరఙ్గ = చలనపరమ్పరలోని, రిఙ్గణా= వ్యాపారముగలదై, తామ్ = ఆదమయన్తిని(గూర్చి, తృణీభవత్పుష్ప శరం; తృణీభవత్ = గడ్డిపోచగానైన, పుష్పశరం = మన్మథుని(గల్గిన వాఁడును, స్వతీవ్రతేజఃపరిభూతభూతలమ్; స్వ = తనయొక్క, తీవ్ర తేజః =తీవ్రమైనతేజస్సుచే, పరిభూత=తిరస్కరింపఁబడిన, భూతలం= భూమిపైభాగముఁ గల్గినవాడునునగు, నృపాన్తరం = మరియొకరాజును గూర్చి, అవదత్ = చెప్పినది.

**సమాసములు :**

నృపాన్తరమ్ :- అన్యోనృపః = నృపాన్తరం, తత్ =నృపాన్తరమ్।
తదధ్వదృక్తారతరఙ్గరిఙ్గణా:- తస్యఅధ్వా = తదధ్వా, దృశోఃతారౌ= దృక్తారౌ, దృక్తారయోః తరఙ్గరిఙ్గణాః=దృక్తారతరఙ్గరిఙ్గణాః, తదధ్వని దృక్తారతరఙ్గరిఙ్గణాః యస్యాఃసా= తదధ్వదృక్తారతరఙ్గరిఙ్గణా।
తృణీభవత్పుష్పశరమ్:- అతృణంతృణం సమ్పద్యమానఃభవన్ = తృణీభవన్, పుష్పాణిశరాఃయస్యసః=పుష్పశరః, తృణీభవన్పుష్పశరః యస్యసః = తృణీభవత్పుష్పశరః, తమ్ = తృణీభవత్పుష్పశరమ్।
స్వతీవ్రతేజః పరిభూతభూతలమ్ :- తీవ్రంచతత్తేజశ్చ= తీవ్రతేజః. స్వస్యతీవ్రతేజః=స్వతీవ్రతేజః, స్వతీవ్రతేజసా పరిభూతమ్=స్వతేజః

పరిభూతమ్. స్వతీవ్రతేజః పరిభూతం - భూతలం యస్యసః=స్వతీవ్ర తేజః పరిభూతభూతలః, తమ్ = స్వతీవ్రతేజః పరిభూతభూతలమ్ !

**భావము:**

మహేన్ద్రినాథుని వర్ణనను మాన్పిన పిదప సరస్వతీదేవి, మఱియొక రాజు, ఉండెడి దిక్కునకు తన కంటి పాపలను ప్రసరింపఁజేసి, మన్మథుని తిరస్కరించిన సౌన్దర్యమును, భూతలమును దిరస్కరించెడి తీవ్రమగు ప్రతాపమును వహించిన యా రాజును దమయన్తికిఁ జూపుచుఁ జెప్పఁదొడగినది ॥౩౧॥

**శ్లో. తదేవ కిన్ను క్రియతే న ?కా క్షతిః?**
**యదేవ తద్దూతముఖేన కాఙ్క్షతి ।**
**ప్రసీద కాఞ్చీమయమాచ్ఛినత్తు తే**
**ప్రసహ్య కాఞ్చీపురభూపురన్దరః॥ 33**

ప. వి. తత్-ఏవ-కిం-ను-క్రియతే-న-కా-క్షతిః-యత్-ఏవ-తత్-దూతముఖేన-కాఙ్క్షతి - ప్రసీద - కాఞ్చీమయమ్ – ఆచ్ఛినత్తు – తే – ప్రసహ్య – కాఞ్చీపురభూపురన్దరః.

అర్థము. (హేభైమి = ఓ దమయన్తీ!) ఏషః = ఈ, కాఞ్చీపురభూపురన్దరః; కాఞ్చీపుర = కాఞ్చీనగరమునకు, భూపురన్దరః = భూలోకపుటింద్రుఁడైనరాజు, తద్దూతముఖేన; తత్ = ఆకాఞ్చీనరపాలునియొక్క, దూత ముఖేన = దూతయొక్కముఖముచే, యత్ = దేనిని, కాఙ్క్షతి=కోరునో, తత్ = దానిని అనగానీవరణముమున్నగువానిని, కిన్ను = ఎట్లు, నక్రియతే = చేయబడదు? తప్పకచేయవలసినది, (అతనిని వరించిచో) కాక్షతిః = ఏమిహాని? (హానియేమియులేదు. పైగా మేలేకలుగఁగలదు.) అయం = ఈ కాఞ్చీభూపాలుఁడుఁ(నవసఙ్గమమందు) తే=(సిగ్గుఁజెందిన) నీయొక్క, కాఞ్చీం = (వస్త్రమును గట్టిగాబంధించుటకై కట్టఁబడిన) నీయొక్కమొలనూలును, ప్రసహ్య = (నీవువలదనివారించుచున్నను)బలాత్కారముతో, ఆచ్ఛినత్తు=తెంపునుగాత. (అనగా తెంచి తీసుకొనుఁగాత. కాఞ్చీపతి కాఞ్చినిఁగైకొనుట సముచితమేగదా) (అతఏవ = కావుననే) ప్రసీద = ప్రసన్నవుకమ్ము, అనగా నితనినంగీకరింపుము.

**సమాసములు :**

తద్దూతముఖేన:- తస్యదూతః = తద్దూతః. తద్దూతస్యముఖమ్, తద్దూతముఖమ్, తేన = తద్దూతముఖేన.

కాఞ్చీపురభూపురన్దరః :- కాఞ్చీఇతిపురమ్,=కాఞ్చీపురమ్, భువఃపురన్దరః, =భూపురన్దరః.కాఞ్చీపురస్యభూపురన్దరః=కాఞ్చీపురభూపురన్దరః।

**భావము :**

ఓ దమయన్తీ ! ఈ కాఞ్చీభూపాలుఁడు నీకు తన దూతను పంపి నిన్ను తన్నువలచి వరించుట మున్నగు విషయములను కోరుచున్నాడు. ఆ విషయమునందు నీవేమి చేయుదువు? అతని కోరికనుఁ దీర్చుటలో హాని యేమియున్నది. తప్పక యతని కోరికను తీర్చుటయే యుక్తము. అది మేలునే సమకూర్చును. నీవు అతనిని వలచినచో, నతడు నీ నవసఙ్గమమందు నీవు వారించుచున్నను, నీ వలువను దృఢముగా బంధించియున్న మొలనూలును బలాత్కారముచే తెంపి దానినిఁ దీసికొనుగాత. కాఞ్చీపతికి, కాఞ్చీగ్రహణము సముచితమే గదా? కాన నీవు ప్రలన్నురాలవై యాతని వరింపుము-॥౩౩॥

**శ్లో. మయి స్థితిర్నమ్రతయైవ లభ్యతే**
**దిగేవ తు స్తబ్ధతయా విలఙ్ఘ్యతే।**
**ఇతీవ చాపం దధతాశుగం క్షిప**
**న్నయం నయం సమ్యగుపాదిశత్ ద్విషః॥ 34**

ప.వి. మయి–స్థితిః–నమ్రతయా–ఏవ-లభ్యతే–దిక్–ఏవ-తు–స్తబ్ధతయా–విలఙ్ఘ్యతే– ఇతి-ఇవ- చాపం– దధత్- ఆశుగం– క్షిపన్–అయం–నయం-సమ్యక్-ఉపాదిశత్-ద్విషః.

అర్థము. అయం = ఈ కాఞ్చీనరపతి, చాపం = వింటిని, దధత్=ధరించుచు, ఆశుగం = బాణమును, క్షిపన్ = విసరుచు, ద్విషః = శత్రువులను, మయి = తనసమీపమందు, నమ్రతయైవ= వినయముతోఁడను, వన్దనముతోఁను, స్థితిః =స్వరాజ్యమునఉనికి, ప్రతిష్ఠ, లభ్యతే = పొందఁబడును, స్తబ్ధతయాతు = నమ్రతనువహింపకపోవుటచే, దిగేవ = దిక్కే, విల

ఙ్ఘితే = దాటఁబడుచున్నది. స్వారాజ్యమునుఁ గోల్పోయి వేఱుదిక్కునుఁ బట్టవలసి యుండునని యర్థము. ఇతి =ఇట్లు, నయం=నీతిని, సమ్యక్= చక్కఁగా, ఉపాదిశదివ = ఉపదేశించెనో యనునట్లున్నాడు. ఆకాఞ్చీనరపతి ధనుర్బాణములనుఁ జేతఁబూని, ధనుస్సువలెవంగిన వానికినసగా— వినయవస్తునకు స్వారాజ్యమున స్థితియు నట్లు వంగక బాణముపలెనమ్రత యనగా వంపు—వినయము లేనివానికి బాణమునకువలె స్వారాజ్యభ్రష్టత, దిగన్తర ప్రాప్తికలుగునని యుపదేశముఁ జేయుచున్నట్లు కానవచ్చు చున్నాడు.

వి. కాఞ్చీనరపతి ధనుర్బాణములను ధరించుటచే నుపదేశముఁ జేయక పోయినను, నుపదేశము చేయుచున్నట్లు వర్ణించుటవలన నుత్ప్రేక్ష.

**సమాసములు :**

నమ్రతయా :— నమ్రస్యభావః=నమ్రతా, తయా=నమ్రతయా.
స్తబ్ధతయా :— స్తబ్ధస్యభావః=స్తబ్ధతా, తయా=స్తబ్ధతయా.

**భావము :**

ఆకాఞ్చీ ప్రభువు వింటిని చేత ధరించుచు బాణమును విసరుచు శత్రువులకుపదేశము చేయుచున్నాడో యనునట్లు కానవచ్చుచున్నాడు. ఎవ్వరు ధనుస్సువలె వంగి (నమస్కరించి) నా విషయమున వ్యవహరించునో, అతనికి నిలకడ స్వారాజ్యమందు ప్రతిష్ఠ యుండఁగలదు. అట్లు వంగక (వినయము వహింపక) బాణమువలె నిలువుగ నుండునో, యతడు బాణమువలెనే మఱియొక దిక్కునుఁ బొందును. విసరఁబడిన బాణము స్వస్థానమును వదలి యెట్లు దూరముగా వెళ్ళిపోవునో, అట్లే వినయము లేని శత్రువు స్వారాజ్యమును వదలి దేశాన్తరమును బొందును. ఈ విధముగా నీతిని నతఁడుపదేశించుచున్నాడని యాశయము ॥౩౪॥

శ్లో. అదస్సమిత్సమ్ముఖవీరయౌవత
త్రుటద్ఘుణాకమ్బుభృణాలహారిణీ।
ద్విషద్గణస్త్రైణదృగమ్బునిర్ఝరే
యశోమరాళావళిరస్య ఖేలతి॥ 35

ప. వి. అదస్సమిత్సమ్ముఖవీరయౌవతత్రుటద్భుజాకమ్బుమృణాలహారిణీ—ద్విష
ద్గణస్త్రైణదృగమ్బునిర్ఝరే— యశోమరాళావలిః—అస్య - ఖేలతి

అర్థము. అస్య=ఈకాంచీప్రభువు యొక్క, యశోమరాళావలిః, యశః=కీర్తులు
నెడు, మరాళ=హంసల యొక్క, ఆవలిః=వరుస, అదస్సమిత్సమ్ముఖ
వీర యౌవతత్రుటద్భుజాకమ్బు మృణాలహారిణీ; అదః=ఈకాంచీ నర
పాలునియొక్క, సమిత్=యుద్ధములయందు, సమ్ముఖ=ఎదురుగానిలచు,
వీరయౌవత=వీరుల యువతీసమూహములయొక్క, త్రుటత్=తెగిపోయిన,
భుజా=భుజములయందలి, కమ్బు=శంఖములతో నిర్మితములైన వల
యములనెడు తామరతూండ్లను, హారిణీ=హరించుచున్న, ద్విషద్గణస్త్రైణ
దృగమ్బునిర్ఝరే; ద్విషద్గణ=శత్రుగణములకు సంబంధించిన, స్త్రైణ=
స్త్రీ సమూహము యొక్క, దృగమ్బు నిర్ఝరే;దృగమ్బు=కన్నీటియొక్క,
నిర్ఝరే=ప్రవాహమునందు, ఖేలతి=ఆడుచున్నది.

వి. యశోమరాలావలి - అనియశస్సులతోహంసలను, దృగంబు నిర్ఝరేఅని
కన్నీటిలో ప్రవాహమును రూపించుట వలనను రూపకాలంకారము.

**సమాసములు :**

అదస్సమిత్సమ్ముఖవీరయౌవతత్రుటద్భుజాకమ్బుమృణాలహారిణీ :—
అముష్యసమితః = అదస్సమితః, అదస్సమిత్సుసమ్ముఖాః = అదస్స
మిత్సమ్ముఖాః, అదస్సమిత్సమ్ముఖాశ్చతే వీరాశ్చ = అదస్సమిత్సమ్ము
ఖవీరాః, యువతీనాంసమూహః యౌవతమ్, అదస్సమిత్సమ్ముఖవీరాణాం
యౌవతం=అదస్సమిత్సమ్ముఖవీరయౌవతం, భుజానాంకమ్బూని=భుజా
కమ్బూని, త్రుటన్తిచతానిభుజాకమ్బూనిచ = త్రుటద్భుజాకమ్బూని,
అదస్సమిత్సమ్ముఖవీరయౌవతస్యత్రుటద్భుజాకమ్బూని = అదస్సమిత్స
మ్ముఖవీరయౌవతత్రుటద్భుజాకమ్బూన్యేవమృణాలాని = అదస్సమిత్స
మ్ముఖవీరయౌవతత్రుటద్భుజాకమ్బుమృణాలాని, అదస్సమిత్సమ్ముఖ
వీరయౌవతత్రుటద్భుజాకమ్బుమృణాలానాంహారిణీ = అదస్సమిత్సమ్ము
ఖవీరయౌవతత్రుటద్భుజాకమ్బుమృణాలహారిణీ|

ద్విషద్గణస్త్రైణదృగమ్బునిర్ఝరే :- ద్విషతాంగణః=ద్విషద్గణః, స్త్రీణాం
సమూహః=స్త్రైణం, ద్విషద్గణస్యస్త్రైణం=ద్విషద్గణస్త్రైణం, ద్విషద్గణ

స్త్రైణస్యదృశః=ద్విషద్గణస్త్రైణదృశః, ద్విశద్గణస్త్రైణదృశామమ్బూని=
ద్విషద్గణస్త్రైణదృగమ్బూని, ద్విషద్గణస్త్రైణదృగమ్బూనాం నిర్ఝరః =
ద్విషద్గణస్త్రైణ దృగమ్బునిర్ఝరః, తస్మిన్=ద్విషద్గణస్త్రైణ దృగమ్బు
నిర్ఝరే.
యశోమరాలావలిః :— యశాంస్యేవమరాలాః=యశోమరాలాః, యశో
మరాలానామావలిః=యశోమరాలావలిః।

**భావము :**

ఆ కాఞ్చీభూపాలుని యుద్ధములయందు నెదుట నిలిచి పోరిన వీరుల భార్యలు తమ భర్తలు మృతిఁజెందుటచే వైధవ్యమును బొంది, సుమఙ్గలీ చిహ్నములగు శఙ్ఖవలయాదులను తెంచుకొనిరి. ఆ శఙ్ఖవలయాదులనెడి తామర తూడులను, యాతనికీర్తి హంసలు హరించుచున్నవై శత్రుస్త్రీల కన్నీటి ప్రవాహముల యందు మునుగుచు నాటలాడుకొనుచున్నవి. ॥౩౫॥

శ్లో. **సింధూరద్యుతిముగ్ధమూర్ధని ధృతస్కంధావధిశ్యామికే**
**వ్యోమాన్తఃస్పృశి సింధురేఽస్య సమరారమ్భోద్ధురే ధావతి।**
**జానీమోఽను యది ప్రదోషతిమిరవ్యామిశ్రసన్ధ్యాధియై**
**వాస్తం యాన్తి సమస్తబాహుజభుజాతేజస్సహస్రాంశవః॥**

ప. వి. సింధూరద్యుతిముగ్ధమూర్ధని-ధృతస్కన్ధావధిశ్యామికే-వ్యోమాన్తఃస్పృశి-సింధురే-అస్య-సమరారమ్భోద్ధురే-ధావతి-జానీమః-అను-యది-ప్రదోషతిమిరవ్యామిశ్రసన్ధ్యాధియా-ఏవ-అస్తం-యాన్తి-సమస్తబాహుజభుజాతేజస్సహస్రాంశవః.

అర్థము. సిన్దూరద్యుతిముగ్ధమూర్ధని, సిన్దూర=సిన్దూరముయొక్క, ద్యుతి=కాంతులచే. ముగ్ధ=సుందరమైన, మూర్ధని=తలయందు, ధృతస్కంధావధిశ్యామకే; ధృత=ధరింపఁబడిన, స్కన్ధావధి = భుజశిఖరము వరకు, శ్యామికే = నలుపు గల్గిన వ్యోమాన్తఃస్పృశి=వ్యోమాన్తః=ఆకాశము యొక్క లోభాగమును, స్పృశి=స్పృశించు, అస్య=ఈకాఞ్చీ ప్రభువు యొక్క, సింధురే=ఏనుగ, సమరారమ్భోద్ధురే, సమర=యుద్ధముయొక్క,

ఆరమ్భ—ప్రారంభమందు, ఉద్ధురే = అడ్డములేక, ధావతిసతి=పరుగిడు చుండగా, అను- పిదప, సమస్త బాహుజభుజాతేజస్సహస్రాంశవః; సమస్త=సకలులైన, బాహుజ=క్షత్రియులయొక్క, భుజా = భుజముల యొక్క, తేజః=ప్రతాపములనెడు, సహస్రాంశవః=సూర్యులు, ప్రదోష తిమిరవ్యామిశ్ర సన్ధ్యాధియైవ; ప్రదోషతిమిర=ప్రదోషకాలపు చీకటితో, వ్యామిశ్ర=కలసిన, సన్ధ్యాధియాఏవ=సంధ్యయను బుద్ధిచేతనే అనగా భ్రాన్తిచేతనే, అస్తంయాన్తి = అస్తగిరిని పొందుచున్నవి, ఇతి=అని జానీమో యది = భావింతుమాయేమి?

వి. భుజప్రతాపసూర్యులు, శ్యామారుణ గజములను సన్ధ్యాకాలముగ భ్రాంతి పడి యస్తమింపక పోయినను నస్తమించునేమో యని సమ్భావన చేయుటవలన నుత్ప్రేక్షాలఙ్కారము. "యది" అని సమ్భావనా వాచక మును ప్రయోగించుటవలన నది వాచ్యము.

## సమాసములు :

సిన్దూరద్యుతి ముగ్ధమూర్ధని :- సిన్దూరస్యద్యుతిః=సిన్దూరద్యుతిః, సిన్దూర ద్యుత్యాముగ్ధః=సిన్దూరద్యుతిముగ్ధః, సిన్దూరద్యుతిముగ్ధశ్చాసౌమూర్ధాచ= సిన్దూరద్యుతిముగ్ధమూర్ధా, తస్మిన్=సిన్దూరద్యుతిముగ్ధమూర్ధని।

ధృతస్కన్ధావధిశ్యామికే :- స్కన్ధః అవధిః యస్యాస్సా=స్కన్ధావధిః, స్కన్ధావధిశ్చాసౌశ్యామికాచ = స్కన్ధావధి శ్యామికా, ధృతాస్కన్ధావధ శ్యామికాయేనసః = ధృతస్కన్ధావధిశ్యామికః, తస్మిన్ = ధృతస్కన్ధా వధిశ్యామికే।

వ్యోమాన్తఃస్పృశి :- వ్యోమ్నః అన్తః = వ్యోమాన్తః, వ్యోమాన్తం స్పృశతీతి = వ్యోమాన్తస్పృక్, తస్మిన్=వ్యోమాన్తఃస్పృశి।

సమరారమ్భోద్ధురే :- సమరస్యఆరమ్భః = సమరారమ్భః, సమరా రమ్భేషుఉద్ధురః = సమరారమ్భోద్ధురః తస్మిన్ =సమరారమ్భోద్ధురే.

ప్రదోషతిమిరవ్యామిశ్రసన్ధ్యాధియా:- ప్రదోషేతిమిరం = ప్రదోషతిమి రం, ప్రదోషతిమిరేణవ్యామిశ్రా = ప్రదోషతిమిరవ్యామిశ్రా, ప్రదోషతి మిరవ్యామిశ్రాచసాసన్ధ్యాచ=ప్రదోషతిమిరవ్యామిశ్రసన్ధ్యా, ప్రదోషతిమిర

వ్యామిశ్రసన్ధ్యాఇతిధీః = ప్రదోషతి మిరవ్యామిశ్రసన్ధ్యాధీః, తయా = ప్రదోషతిమిరవ్యామిశ్రసన్ధ్యాధియా.

సమస్తబాహుజభుజాతేజఃసహస్రాంశవః:- బాహోఃజాయన్తఇతి = బాహుజాః, సమస్తాశ్చతేబాహుజాశ్చ =సమస్తబాహుజాః, సమస్తబాహుజానాంభుజాః=సమస్తబాహుజభుజాః, సమస్తబాహుజభుజానాంతేజాంసి= సమస్తబాహుజభుజాతేజాంసి, సమస్తబాహుజభుజాతేజాంస్యేవసహస్రాంశవః=సమస్తబాహుజభుజాతేజఃసహస్రాంశవః.

**భావము :**

ఆ కాఞ్చీభూపాలునకు యుద్ధమునందు గొప్ప మదపుటేనుగు ఉపయోగపడును. ఆ యేనుగునకు తలపైన సిందూరమును పూయుటవలన నాభాగ మెఱ్ఱగానుండును. తక్కిన శరీరము భుజశిఖరముల వరకు నల్లగ నుండును. కాననాయేనుగు శ్యామారుణకాంతి గల్గిన సాయంకాలపు చీకట్లతోఁ గూడినసంధ్యాకాలమను భ్రాంతిఁని గల్గించుచుండును. ఆ గజము ఆకసమంతటి యెత్తుగల్గి యుద్ధమునకు సడ్డులేక యురికినచో, యుద్ధమునకై వచ్చిన క్షత్రియవీరుల భుజప్రతాపములనెడి సూర్యులు, శ్యామారుణకాన్తిగల యాగజమును సన్ధ్యాకాలముగా భావించి యస్తమింతురు. కాన నాకాఞ్చీనరపతి గొప్ప ప్రతాపశాలియని యాశయము ॥౩౬॥

**శ్లో. హిత్వా దైత్యరిపోరురః స్వభవనం శూన్యత్వదోషస్ఫుటా**
**సీదన్మర్కటకీటకృత్రిమసితచ్ఛత్రీభవత్కౌస్తుభమ్.**
**ఉజ్ఝిత్వా నిజసద్మ పద్మమపి తద్వ్యక్తావనద్ధీకృతం**
**లూతాతన్తుభిరన్తరద్య భుజయోః శ్రీరస్య విశ్రామ్యతి॥**

ప. వి. హిత్వా-దైత్యరిపోః- ఉరః- స్వభవనం- శూన్యత్వదోషస్ఫుటాసీదన్మర్కటకీటకృత్రిమసితచ్ఛత్రీభవత్కౌస్తుభమ్-ఉజ్ఝిత్వా - నిజసద్మ - పద్మమ్-అపి-తత్-తద్వ్యక్తావనద్ధీకృతం-లూతాతన్తుభిః-అన్తః- అద్య-భుజయోః-శ్రీః-అస్య-విశ్రామ్యతి.

అర్థము. శ్రీః = లక్ష్మీదేవి, స్వభవనం = తనకువాసస్థానమైన, దైత్యరిపోః = విష్ణువుయొక్క, ఉరః = వక్షస్థలమును, శూన్యత్వదోషస్ఫుటాసీద

న్మర్కటకీటకృత్రిమ సితచ్ఛత్రీభవత్కౌస్తుభమ్; శూన్యత్వ = లక్ష్మిలేకపోవుటవలని, దోష = దోషముచే, స్ఫుట = స్పష్టముగా, ఆసీదత్ = వసించుచున్న, మర్కటకీట = సాలెపురుగులయొక్క, కృత్రిమ సితచ్ఛత్రీభవత్; కృత్రిమ = కల్పితమైన, సితచ్ఛత్రీభవత్ = తెల్లని గొడుగుగాఁజేయఁబడిన, కౌస్తుభమ్ = కౌస్తుభమణిగల్గునట్లుగా, హిత్వా = వదలి, నిజసద్మ = తనకువాసగృహమైన, తత్ = ఆప్రసిద్ధమైన, పద్మమపి = పద్మమునుఁగూడ, లూతాతన్తుభిః = సాలెపురుగుదారములతో, వ్యక్తావనద్ధీకృతమ్; వ్యక్త = స్పష్టముగా, అవనద్ధీకృతం = బంధింపఁబడినదిగా, ఉజ్ఝిత్వా = వదలి, అద్య = ఇప్పుడు, అస్య = ఈకాఞ్చీభూపతియొక్క, భుజయోః = భుజములయొక్క, అన్తః = మధ్యభాగమున, విశ్రామ్యతి = విశ్రమించుచున్నది.

వి. ఇచ్చట నొకలక్ష్మికి క్రమముగా ననేకములగు నాధారముల యందునికి జెప్పుట వలన పర్యాయాలఙ్కారము.

ఆతని భుజములు లక్ష్మిని రక్షింపఁజేయుట యందు విష్ణువక్షః స్థలమును పద్మమును నతిశయించిదను వస్తువు పైపర్యాయాలఙ్కారముచే ధ్వనించుచున్నదికాననలఙ్కారముచే వస్తుధ్వని.

## సమాసములు :

దైత్యరిపోః:- దితేరపత్యాని పుమాంసః = దైత్యాః. దైత్యానాంరిపుః = దైత్యరిపుః. తస్య = దైత్యరిపోః.

స్వభవనం:- స్వస్యభవనం = స్వభవనం, తత్ = స్వభవనమ్.

శూన్యత్వదోషస్ఫుటాసీదన్మర్కటకీటకృత్రిమసితచ్ఛత్రీభవత్కౌస్తుభమ్:- శూన్యస్యభావః = శూన్యత్వం, శూన్యత్వమేవదోషః= శూన్యత్వదోషః, శూన్యత్వదోషేణస్ఫుటమాసీదన్తః = శూన్యత్వదోషస్ఫుటాసీదన్తః, మర్కట ఇతికీటాః = మర్కటకీటాః, శూన్యత్వదోషస్ఫుటాసీదన్తశ్చతేమర్కటకీటాశ్చ = శూన్యత్వదోషస్ఫుటాసీదన్మర్కటకీటాః, అకృత్రిమసితచ్ఛత్రం, కృత్రిమసితచ్ఛత్రంసమ్పద్యమానఃభవన్ = కృత్రిమసితచ్ఛత్రీభవన్, శూన్యత్వదోషస్ఫుటాసీదన్మర్కటకీటానాం

కృత్రిమసితచ్ఛత్రీభవన్ = శూన్యత్వదోషస్ఫుటాసీదన్మర్కటకీటకృత్రిమసితచ్ఛత్రీభవన్. కౌస్తుభఃయస్మిన్ కర్మణితద్యథాభవతితథా, శూన్యత్వదోషస్ఫుటాసీదన్మర్కటకీటకృత్రిమసితచ్ఛత్రీభవత్కౌస్తుభమ్.

వ్యక్తావనద్ధీకృతమ్:- వ్యక్తమవనద్ధీకృతమ్ యస్మిన్కర్మణి తద్యథా భవతి తథా వ్యక్తావనద్ధీకృతమ్.

నిజసద్మ :- నిజంచతత్సద్మచ =నిజసద్మ, తత్ = నిజసద్మ.

లూతాతనుభిః:- లూతానాంతన్తవః = లూతాతన్తవః, తైః = లూతాతనుభిః.

**భావము :**

లక్ష్మీదేవి, తనకు నివాసస్థానమైన, విష్ణువక్షః స్థలమును, పద్మమును వదలి యీ కాశీప్రభువుయొక్క భుజముల మధ్య నివసించుచున్నది. లక్ష్మీదేవి, విష్ణువక్షః స్థలమును వదలుట వలన నందలికౌస్తుభమణి, శూన్యస్థలముల యందు సాలెపురుగులల్లెడి తెల్లని గొడుగుగానై యున్నది. అట్లే యాలక్ష్మీయొక్క నివాసకమలము గూడ సాలెపురుగుల నూలుతో బన్ధింపఁబడినదై యున్నది. అట్లు లక్ష్మీదేవికి నివాసస్థలమైన భుజమధ్య ప్రదేశము గల్గిన యీ కాశీప్రభువును వరింపుము ॥౩౨॥

**శ్లో. సిన్ధోర్జైత్రమయం పవిత్రమసృజత్తత్కీర్తిపూర్తాద్భుతం**
**యత్ర స్నాన్తి జగన్తి సన్తి కవయః కే వా న వాచంయమాః ।**
**యద్బిన్దుశ్రియమిన్దురఞ్చతి జలఞ్చావిశ్య దృశ్యేతరో**
**యస్యాఽసౌ జలదేవతాస్ఫటికభూర్జాగర్తి యాగేశ్వరః॥**

ప. వి. సిన్ధోః-జైత్రమ్-అయం-పవిత్రమ్-అసృజత్-తత్కీర్తిపూర్తాద్భుతం-యత్ర-స్నాన్తి-జగన్తి-సన్తి-కవయః-కే-వా-న వాచంయమాః-యద్బిన్దుశ్రియమ్-ఇన్దుః-అఞ్చతి-జలం-చ-ఆవిశ్య-దృశ్యేతరః-యస్య-అసౌ-జలదేవతాస్ఫటికభూః-జాగర్తి-యాగేశ్వరః.

అర్థము. అయం=ఈకాఞ్చీప్రభువు, సిన్ధోః=సముద్రమునుండి, జైత్రం=జయ శీలమైన, పవిత్రం=పవిత్రమైన, తత్కీర్తిపూర్తాద్భుతమ్, తత్=ప్రసిద్ధ మైన, కీర్తి=కీర్తియనెడి, పూర్త=తటాకమనెడి, అద్భుతం=ఆశ్చర్య మును, అసృజత్=కల్పించెను. యత్ర=ఏతటాకమందు, జగన్తి=లోక ములు, స్నాన్తి=స్నానము చేయుచున్నవి. యత్ర=ఏతటాకవిషయమున కేవాకవయః=ఏ కవులు, వాచంయమాః = వాక్కును నిరోధించుకొనిన వారుగా ననగా మౌనులుగా, నసంతి=కారు. ఇన్దుః=చంద్రుఁడు, యద్బిన్దు శ్రియమ్, యత్=ఏ సముద్రముయొక్క, బిందు=బిందువుయొక్క, శ్రియం=శోభను, అఞ్చతి=పొందుచున్నాడు. అసౌ=ఈ చన్ద్రుఁడు, యస్యా=ఏ తటాకము యొక్క, జలఞ్చ=జలమును, ఆవిశ్య=ప్రవేశించి, దృశ్యేతరః=సమానకాంతి గల్గినందువలన కనఁబడనివాడై, జలదేవతా స్ఫటికభూః, జలదేవతా = జలదేవతయను, స్ఫటికభూః=స్ఫటికమునఁ గల్గిన, యోగేశ్వరస్సన్ = యోగేశ్వరుఁడుగా, జాగర్తి = ప్రకాశించు చున్నాడు, స్ఫటికలిఙ్గమున శివునకు యోగేశ్వరుఁడని ప్రసిద్ధిగలదు.

**సమాసములు :**

తత్కీర్తిపూర్తాద్భుతమ్ :— తస్యకీర్తిః=తత్కీర్తిః, తత్కీర్తిరేవ పూర్తం=తత్కీర్తిపూర్తమ్, తత్కీర్తిపూర్తమేవ అద్భుతమ్=తత్కీర్తి పూర్తాద్భుతమ్ తత్=తత్కీర్తిపూర్తాద్భుతమ్।

వాచం యమాః :— వాచంయచ్ఛన్తీతి=వాచంయమాః।

యద్బిన్దుశ్రియమ్ :— యస్యబిన్దుః=యద్బిన్దుః, యద్బిన్దోఃశ్రీః=యద్బిన్దు శ్రీః, తామ్=యద్బిన్దుశ్రియమ్।

దృశ్యేతరః:- ద్రష్టుంయోగ్యః=దృశ్యః, దృశ్యాత్ ఇతరః=దృశ్యేతరః।

జలదేవతాస్ఫటికభూః :— జలస్యదేవతా=జలదేవతా, స్ఫటికాత్ భవతీతి= స్ఫటికభూః, జలదేవతాచాఽసౌ స్ఫటికభూశ్చ=జలదేవతాస్ఫటికభూః।

**భావము :**

ఈకాఞ్చీప్రభువు సముద్రమును జయించునట్టి కీర్తియను తటాకమును సృజించియున్నాడు. ఈ తటాకము మిక్కిలి ఆశ్చర్యకరము. దీని యందు

మూడు లోకములు జలకణములాడుచున్నవి. ఈ కీర్తి తటాకమును వర్ణించుటలో కవులకు వాక్కు ప్రసరించదు. (ఈ కీర్తి సాగరమునందు కవులు, అనగా పక్షులు తపస్సు చేయుచున్నవి.) చంద్రుడు ఈ కీర్తి సాగరమందు బిందుశోభను వహించుచున్నాడు. ఈ చన్ద్రుడు ఆ జలమును బ్రవేశించి, జలముతో సమానవర్ణము కల్గి యుండుటవలన నదృశ్యుడై జలదేవతా రూపమై స్ఫటికమునందుద్భవించిన యోగేశ్వరుడను శివుడుగా వెలయుచున్నాడు. లేదా! ఆ చన్ద్రుడు ఆ తటాక జలమును బ్రవేశించి మన నేత్రములకు గానబడని స్ఫటికభూమితో గూడిన కైలాసమున యోగేశ్వరుడై అనగా స్ఫటికశోభతో వెలయు శివలింగ రూపముగలవాడై జలదేవతగా ప్రకాశించుచున్నాడు. సముద్రము పర్వకాలములయందు దప్ప తక్కిన కాలములయందు నపవిత్రము. ఈతని కీర్తి తటాకము అధికమైనది. మఱియు సముద్రము భూలోకవాసులకే యందుబాటు నందుండును. ఈతని కీర్తితటాకమో మూడు లోకయులయందలి జనులకు నందుబాటు నందుండును. సముద్రమునకు చంద్రుడే సర్వస్వము. ఈ కీర్తితటాకమునకో ఆ చంద్రుడు బిందురూపముగనుండును. సముద్రమునందు విష్ణురూపమైన జలదేవత నిద్రించుచుండును. ఈ కీర్తితటాకమందో యోగేశ్వర రూపమునందు శివుడు మేల్కొని యుండును. ఇవ్విధముగా నాతని కీర్తితటాకము సముద్రమునతిశయించియున్నది. ఇట్టి కీర్తిగల నీ రాజును నీవు వరించుట యుచితము ॥౩౮॥

శ్లో. అన్తఃసన్తోషబాష్పైః స్థగయతి న దృశస్తాభిరాకర్ణయిష్యన్
నాఙ్గే నాఽనన్తిలోమాఽఽరచయతి పులకశ్రేణిమానన్ద
కన్దామ్।
న క్షోణీభఙ్గభీరుః కలయతి చ శిరఃకమ్పనం తన్న విద్మః
శృణ్వన్నేతస్య కీర్తీః కథమురగపతిః ప్రీతిమావిష్కరోతి॥

ప.వి. అన్తఃసన్తోషబాష్పైః-స్థగయతి-న-దృశః-తాభిః-ఆకర్ణయిష్యన్-న-అఙ్గే-అనన్తిలోమా--ఆరచయతి-పులకశ్రేణిమ్-ఆనన్దకన్దామ్-న-క్షోణీభఙ్గభీరుః-కలయతి-చ-శిరఃకమ్పనం-తత్-న-విద్మః-శృణ్వన్-ఏతస్య-కీర్తీః-కథమ్-ఉరగపతిః-ప్రీతిమ్-ఆవిష్కరోతి.

అర్థము ఏతస్య=ఈ రాజుయొక్క, కీర్తీః=యశస్సులను,శృణ్వన్=వినుచున్న, ఉరగపతిః=సర్పరాజగు శేషుఁడు, తాభిః=ఆ నేత్రములతో, ఆ కర్ణయిష్యన్=వినఁబోవుచు (అతఏవ=ఇందువలననే) అంతస్సన్తోషబాష్పైః, అన్తః=లోపలనుద్భవించిన, సన్తోష=ఆనందమువలన, బాష్పైః=కన్నీళ్లచే, దృశః = నేత్రములను, స్థగయతి=మూయుఁడు. (అట్లు కానిచో కన్నులే చెవులుగాఁ గల్గిన యీ శేషునకు రూపదర్శనము నెట్లు కన్నీళ్లు అడ్డగించునో యట్లే శబ్దగ్రహణమునుఁ గూడనవి యడ్డగింపవలసి యుండును) యతః=ఏలయనగా, సః=ఆ శేషసర్పము, అఙ్గేన=శరీరముచే (లేదా "అఙ్గే-న యను పాఠాన్తరము ననుసరించి) అఙ్గే=శరీరమునందుఅనస్తిలోమా;అనస్తి=లేనటువంటి,లోమా=వెంట్రుకలు గలవాఁడై, అనన్దకన్దామ్=ఆనందమే మూలముగాఁ గల్గిన, పులకశ్రేణిం=రోమాంచములపఙ్క్తిని, నాఽఽ, రచయతి=కల్పింపఁడు, కిఞ్చ=మఱియు క్షోణీభఙ్గభీరుః, క్షోణీభఙ్గ=భూమిపతనమువలన,భీరుః=భయముఁజెందినవాఁడై శిరఃకమ్పనఞ్చ=(సంతోష సూచకముగా) తలనూచుటను గూఁడ, నకలయతి=చేయఁడు. తత్=అందువలన, కథం = ఎట్లు, ప్రీతిం=ప్రేమను, ఆవిష్కరోతి = ప్రకటింపఁగలఁడు, ఇతి=అని, న విద్మః=తెలయక యున్నాము.

**సమాసములు :**

అన్తఃసంతోషబాష్పైః:- అన్తర్గతశ్చాఽసౌసంతోషశ్చ=అన్తఃసంతోషః: అన్తఃసంతోషేణబాష్పాః = అన్తఃసంతోషబాష్పాః, తైః, = అన్తః సన్తోషబాష్పైః.

అనస్తిలోమా :- అస్తిలోమయస్యసః = అస్తిలోమా, అస్తిలోమానభవతీతి = అనస్తిలోమా,

పులకశ్రేణిమ్ :- పులకానాంశ్రేణిః = పులకశ్రేణిః, తామ్ = పులకశ్రేణిమ్.

ఆనన్దకద్దామ్ :- ఆనన్దః కన్దం యస్యాస్సా = ఆనన్దకన్దా, తామ్ఆనన్దకన్థామ్ ।

క్షోణీభఙ్గభీరుః :— క్షోణ్యాః భఙ్గః = క్షోణీభఙ్గః, క్షోణీభఙ్గాత్ భీరుః = క్షోణీభఙ్గభీరుః.

శిరఃకమ్పనమ్ ;— శిరసఃకమ్పనం = శిరఃకమ్పనమ్, తత్ = శిరః కమ్పనమ్.

**భావము :**

ఈ కాంచీ నరపతి యొక్క కీర్తులను వినుచున్న సర్పరాజగు, శేషుఁడు, తన నేత్రములతో వానిని వినఁబోవుచు లోన హర్షవశముచే నేర్పడు కన్నీళ్లచే తన నేత్రములను కప్పఁడు అనగా కన్నీటిని రానీయడని యర్థము. కన్నులే చెవులుగాన రూపమునుఁ జూచునపుడు కన్నీళ్లు దానినడ్డగించును కాన కన్నీళ్ల నడ్డగించుచున్నాడు. అట్లుచేయుట వలన నతనికి కీర్తి శ్రవణమునకు భఙ్గము కలుగదు. మఱియు శరీరమున రోమములు లేనందున, నాకాఙ్క్షి నరపతి కీర్తిని వినుటవలన కల్గిన యానందమునకు సూచకముగా పులకములనుఁగూడ వహింపఁడు. తన తలపై నిలచిన, భూమిపడునను భయము గలవాఁడై సంతోష సూచకముగాఁ దలనుఁగూడ నూచఁడు. కావున సర్పరాజు తన సంతోషమునెట్లు ప్రకటింపఁగలడో తెలియుటలేదు. అనగా నా కాంచీ నృపుని కీర్తి పాతాళము నందలి శేషభగవానునకును సంతోషమునుఁ గలిగ్గించుచున్నది. కాన నతనిని వరించుట యుచితమని భావము. ॥౩౯॥

**శ్లో.** **ఆచూడాగ్రమమజ్జయజ్జయపటుర్యచ్ఛల్యకాణ్డానయం**
**సంరమ్భే రిపురాజకుఞ్జరఘటాకుమ్భస్థలేషు స్థిరాన్ ।**
**సా సేవాఽస్య పృథుః ప్రసీదసి తయా నాస్మైకుతస్త్వత్కుచ**
**స్పర్ధాగర్ధిషు తేషు తాన్ ధృతవతే దణ్డాన్ ప్రచణ్డానపి॥**

ప. వి. ఆచూడాగ్రమ్ — అమజ్జయత్ — జయపటుః — యత్ - శల్యకాణ్డాన్— అయం - సంరమ్భే-రిపురాజకుఞ్జరఘటాకుమ్భస్థలేషు - స్థిరాన్ - సా- సేవా - అస్య - పృథుః- ప్రసీదసి - తయా - న - అస్మై - కుతః- త్వత్కుచస్పర్ధాగర్ధిషు - తేషు-తాన్—ధృతవతే - దణ్డాన్- ప్రచణ్డాన్— అపి.

**అర్థము.** జయపటుః = జయమునందు సమర్థుఁడైన, అయం=ఈ కాఞ్చీప్రభువు సంరమ్భే = యుద్ధము నందు. రిపురాజకుఞ్జరఘటాకుమ్భస్థలేషు; రిపు రాజ = శత్రురాజుల యొక్క, కుఞ్జరఘటా = ఏనుగుల సమూహము యొక్క, కుమ్భస్థలేషు = కుమ్భస్థలముల యందు, స్థిరాన్ = గట్టివైన శల్యకాణ్డాన్ = బాణముల కాడలను, ఆచూడాగ్రం = శీర్షాగ్రము వరకు, అమజ్జయతియత్ = నాటెననుట ఏదిగలదో, సా = అది, అస్య = ఈ రాజు యొక్క, పృథుః = గొప్పదైన, సేవా = నీకు సేవ, తయా = ఆ సేవచే, త్వత్కుచస్పర్ధాగర్ధిషు; త్వత్కుచ = నీ స్తనములతో, స్పర్ధా = సాదృశ్యమును, గర్ధిషు = కోరుచున్న, తేషు = ఆ యేనుగుల కుమ్భ స్థలములనెడి నేరగాండ్రయందు, ప్రచణ్డాన్ = తీవ్రములైన, తాన్ = ఆటువంటి, దణ్డాన్ = శిక్షలను, ధృతవతేఽపి = ధరించిన యీ రాజు నకు, కుతః = ఎందువలన, నప్రసీదసి = ప్రసన్నురాలవు కావు.

**సమాసములు :**

ఆచూడాగ్రమ్ :- చూడాయాః అగ్రం=చూడాగ్రం, చూడాగ్రమభివ్యాప్య= ఆచూడాగ్రమ్.

జయపటుః :— జయేపటుః = జయపటుః ।

శల్యకాణ్డాన్ :— శల్యస్యకాణ్డాః=శల్యకాణ్డాః=తాన్=శల్యకాణ్డాన్।

రిపురాజకుఞ్జరఘటాకుమ్భస్థలేషు :— రిపవశ్చ తేరాజానశ్చ=రిపురాజా న; రిపురాజానాం కుఞ్జరాః=రిపురాజకుఞ్జరాః, రిపురాజకుఞ్జరాణాంఘటాః= రిపురాజకుఞ్జరఘటాః, రిపురాజకుఞ్జరఘటానాం కుమ్భస్థలాని=రిపురాజ కుఞ్జరఘటా కుమ్భస్థలాని, తేషు=రిపురాజకుఞ్జరఘటా కుమ్భస్థలేషు।

త్వత్కుచస్పర్ధాగర్ధిషు :— తవకుచౌ=త్వత్కుచౌ, త్వత్కుచాభ్యాం స్పర్ధా = త్వత్కుచస్పర్ధా. త్వత్కుచస్పర్ధా యాంగర్ధిః యేషాంతే= త్వత్కుచస్పర్ధాగర్ధయః, తేషు=త్వత్కుచస్పర్ధాగర్ధిషు।

**భావము :**

ఆకాంచీప్రభువు జయమును సంపాదించుటలో నేర్పరి. అతఁడు యుద్ధము లయందు శత్రువుల కరికుంభస్థలములయందు బాణములను వాని కాడలు తల

భాగములు లోనికి దిగునట్లు ప్రయోగించి నీకు సేవఁజేసినవాడు. ఆ సేనచే నీ స్తనములతో సామ్యముఁగోరి నేరము గావించిన యా యేనుగుల కుంభస్థలముల యందు తీవ్రములగు శిక్షలను విధించిన యా రాజునకు నీవేల ప్రసన్నురాలవు కావు? నీవు అట్టిరాజును వరించుట యుచితము ॥౪౦॥

శ్లో. స్మితశ్రియా సృక్వణి లీయమానయా
వితీర్ణయా తద్గుణశర్మణేవ సా ।
ఉపాహసత్ కీర్త్యమహత్త్వమేవ తం
గిరాం హి పారే నిషధేన్ద్రవైభవమ్॥ 41

ప. వి. స్మితశ్రియా-సృక్వణి-లీయమానయా—వితీర్ణయా—తద్గుణశర్మణా-ఇవ-సా—ఉపాహసత్-కీర్త్యమహత్త్వమ్-ఏవ-తం-గిరాం-హి-పారే-నిషధేన్ద్ర వైభవమ్।

అర్థము. సా=ఆ దమయన్తి, తద్గుణశర్మణేవ, తత్=ఆ కాఞ్చీప్రభువుయొక్క, గుణ=గుణములను వినుటవలని, శర్మణేవ=సుఖము చేతనో యనునట్లు, వితీర్ణయా=విడవఁబడిన, సృక్వణి=సెలవులయందు, లీయమానయా=దాపఁబడిన, స్మితశ్రియా=చిఱునగవు శోభచే, కీర్త్యమహత్త్వం; కీర్త్య=కీర్తింపఁదగిన, మహత్త్వం = గొప్పఁదనము గల్గిన, తం=ఆ కాఞ్చీప్రభువును, ఉపాహసత్ = పరిహసించినది. హి=ఏలయనగా, నిషధేన్ద్ర వైభవమ్; నిషధేన్ద్ర=నలునియొక్క, వైభవం = మహిమ, గిరాం=వాక్కులకు, పారే=అవలిగట్టు నందున్నది. అనగా వాక్కుల కతీతమైన దని యర్థము.

వి. ఇచ్చట నలానురాగమను కారణముచే కాంచీప్రభువునందు రాగరాహిత్యము సమర్థింపఁబడినది కాన నర్థాన్తరన్యాసాలఙ్కారము.

స్మితశ్రియా :— స్మితస్యశ్రీః = స్మితశ్రీః, తయా = స్మితశ్రియా,

తద్గుణశర్మణ :— తస్యగుణాః=తద్గుణాః, తద్గుణైః శర్మ = తద్గుణశర్మ· తేన = తద్గుణశర్మణా.

కీర్త్యమహత్త్వమ్ :— కీర్తితుంయోగ్యం = కీర్త్యం, కీర్త్యం మహత్త్వం యస్యసః=కీర్త్యమహత్త్వః. తం=కీర్త్యమహత్త్వం.

నిషధేన్ద్రవైభవమ్ :- నిషధానామిన్ద్రః=నిషధేన్ద్రః, విభోర్భావః=వైభవమ్. = నిషధేన్ద్రస్య వైభవమ్ = నిషధేన్ద్రవైభవమ్.

**భావము :**

ఆదమయన్తి సరస్వతీ దేవివలన కాంచీ ప్రభువు యొక్క గుణములను విని యట్లు వినుట వలన గల్గిన సుఖముచేతనో యన్నట్లు ఉద్భవించి, పెదవుల యంచుల యందు దాగినట్లున్న చిఱునగవుతో నా కాంచీ ప్రభువు మహిమ; వాక్కుల కతీతముకాదని పరిహసించినది. ఏల యనగా నలుని మహిమ వాక్కుల కతీతమైనది. ఇతని మహిమ యట్లుగాక వాక్కులకు లోఁబడినదే, కాన నలునికంటె నితడు తక్కువ యైనందు వలన నితనినిఁ బరిహసించినదని యాశయము ॥౪౧॥

**శ్లో. నిజాక్షిలక్ష్మీహసితైణశాబకా**
**మసావభాణీదపరం పరంతపమ్ ।**
**పురేవ తద్దిగ్వలయశ్రియో భువా**
**భ్రువా వినిర్దిశ్య సభాసభాజితమ్॥ 42**

ప. వి. నిజాక్షిలక్ష్మీహసితైణశాబకామ్ - అసౌ - అభాణీత్ - అపరం - పరంతపమ్ - పురా - ఇవ - తద్దిగ్వలయశ్రియః - భువా - భ్రువా - వినిర్దిశ్య - సభాసభాజితమ్.

అర్థము. అసౌ = ఈ సరస్వతి, సభాసభాజితం; సభా = సభలయందు, సభాజితం = పూజింపఁబడిన, పరన్తపం=శత్రువులను సంతాప పఱచెడి, అపరం = మఱియొక రాజును, పురేవ = పూర్వమువలె, తద్దిగ్వలయశ్రియః; తత్ = ఆరాజు యొక్క, దిక్ = దిక్కుయొక్క, వలయ= వలమందిన, శ్రియః= లక్ష్మికి, భువా = స్థానమైన అనగా నాదిక్కునకు మఱలింపఁబడిన, భ్రువా = కనుబొమ్మచే, వినిర్దిశ్య = చూపి, నిజాక్షిలక్ష్మ్యా = తనకంటి శోభచే, హసితైణశాబకాం; హసిత = పరిహసింపఁబడిన, ఏణ = జింక యొక్క, శాబకాం = పిల్లగల్గిన (భైమీం = దమయన్తిఁగూర్చి), అభాణీత్ = పలికెను.

**సమాసములు :**

నిజాక్షిలక్ష్మీహసితైణశాబకామ్ :— నిజేతతే అక్షిణీచ = నిజాక్షిణీ, నిజాక్ష్ణోఃలక్ష్మీః = నిజాక్షిలక్ష్మీః, నిజాక్షిలక్ష్మ్యాహసితః = నిజాక్షిలక్ష్మీ హసితః, ఏణస్యశాబకః =ఏణశాబకః, నిజాక్షిలక్ష్మీహసితః ఏణశాబకః యస్యాస్సా =నిజాక్షిలక్ష్మీహసితైణశాబకా, తామ్=నిజాక్షిలక్ష్మీహసితైణ శాబకామ్ ।

తద్దిగ్వలయశ్రియః :— తస్యాదిక్=తద్దిక్, తద్దిశోవలయః=తద్దిగ్వలయః. తద్దిగ్వలయేశ్రీః=తద్దిగ్వలయశ్రీః, తస్యాః = తద్దిగ్వలయశ్రియః.

సభాసభాజితమ్ :— సభయాసభాజితః = సభాసభాజితః, తమ్ = సభా సభాజితమ్ ।

**భావము :**

సరస్వతీ దేవి సభయందు సమ్మానింపఁబడిన మఱియొక రాజును తన కనుబొమ్మలచే చూపుచు, వైశాల్యముచే, లేడి పిల్లను తనకంటి శోభచే పరిహ సించుచున్న దమయన్తినిఁ గూర్చి చెప్పినది. ॥౪౨॥

**శ్లో. కృపా నరాణాముపరి క్వచిన్న తే**
**నతేన హా హా శిరసా రసాదృశామ్ ।**
**భవన్తు తావత్తవ లోచనాఞ్చలాః**
**నిపేయనేపాలనృపాలపాలయః॥ 43**

ప. వి. కృపా - నరాణామ్ - ఉపరి — క్వచిత్ — న - తే - నతేన - హా - హా-శిరసా - రసాదృశాం - భవన్తు - తావత్ - తవ—లోచనాఞ్చలాః— నిపేయనే పాలనృపాలపాలయః.

**అర్థము.** హే భైమి, = ఓదమయన్తీ, నతేన = వంచబడిన, శిరసా = తలచే' రసాదృశాం; = రసా = భూమిని, దృశాం =చూచుచున్న అనగా నీవు తిరస్కరించుటచేతఁ గల్గిన లజ్జతో తలవంచిన, నృపాణాము పరి=రాజు లపైన, తే=నీకు, క్వచిత్=ఎందును, కృపా=దయ; న=లేదు. హాహా=

కష్టము. తవ=నీయొక్క, లోచనాఞ్చలాః=కన్నులయంచులు అనగా కటాక్షములు, నిపేయ నేపాలనృపాల పాలయః; నిపేయ=చూడదగిన, నేపాల నృపాల=నేపాలప్రభువుయొక్క, పాలయః=దిగ్భాగము గలవిగా. లేదా నిపేయ = ఆదరముతోఁ జూడదగిన, నేపాలనృపాల = నేపాల రాజును, ప=ఆదరముతో జూచెడి, అలయః=తుమ్మెదలుగా, భవన్తు = అగును కాత.

**సమాసములు :**

రసాదృశాం:—రసాంపశ్యన్తీతి=రసాదృశః, తేషాం = రసాదృశాం ।
లోచనాఞ్చలాః :— లోచనస్య అఞ్చలాః=లోచనాఞ్చలాః।
నిపేయ నేపాలనృపాలపాలయః :— నితరాం పేయః=నిపేయః, నేపాలానాం నృపాలః = నేపాలనృపాలః, నిపేయశ్చాసౌ నేపాలనృపాలశ్చ= నిపేయనేపాల నృపాలః, నిపేయనేపాలనృపాలస్య పాలిఃయేషాంతే = నిపేయ నేపాలనృపాలపాలయః।

లేదా

నిపేయనేపాలనృపాలం పిబన్తీతి=నిపేయనేపాలనృపాలపాః, నిపేయ నేపాలనృపాలపాశ్చతే అలయశ్చ=నిపేయ నేపాలనృపాలపాలయః।

**భావము :**

ఓ దమయన్తీ! నీవు నిరాకరించుటవలని లజ్జచే తలవంచి నేలను చూచుచున్న రాజులపైన నీకు దయ లేదా? ఇది కష్టమైన విషయము. నీ కటాక్షములను సుందరుఁడైన నేపాలభూపాలుని వంకకు సారించుము. లేదా యా నేపాలనృపాలుని ప్రీతితోఁ జూచెడి తుమ్మెదలుగా నీ కటాక్షములనుఁ జేయుము. ॥౪౩॥

శ్లో. ఋజుత్వమౌనశ్రుతిసారగామితా
యదీయకేసంతిపరం విహింసితుమ్ ।
అతీవ విశ్వాసవిధాయి చేష్టితం
బహుర్మహీనస్య స దామ్భికః శరః॥ 44

ప. వి. ఋజుత్వమౌనశ్రుతిపారగామితాః - యదీయకే - సంతి - పరం - విహింసితుమ్ - అతి - ఇవ - విశ్వాసవిధాయి - చేష్టితం - బహుః - మహాన్ - అస్య - సః - దామ్భికః - శరః.

అర్థము, యదీయకే=ఎవ్వనికి సంబంధించిన, శరే=బాణమందు, ఋజుత్వమౌనశ్రుతిపారగామితా; ఋజుత్వ=వంకరలేక యుండుట (ఒరుల కోరిక ననుసరించుట) మౌన=శబ్దము లేక యుండుట (వాఙ్నియమము గల్గియుండుట) శ్రుతిపారగామితా=చెవుల కొనవరకు వ్యాపించి యుండుట (వేద పారగత్వము) అను నీ గుణములు, సన్తి=కలవు, (తథా=అట్లే) పరం=శత్రువును, (ఇతరుని) విహింసితుం=చంపుటకు, అపకరింపక యుండుటకు, అతీవ = మిక్కిలి, విశ్వాసవిధాయి; విశ్వాస = శ్వాసరహితములనుగా, అనగా ప్రాణరహితములను గాను (నమ్మకముఁ గల్గించునట్టివిగను) విధాయి = చేయునట్టి, చేష్టితం = నడవడిక, అస్తి = కలదు. అస్య = ఈ రాజునకు, బహుః = పెక్కైన, మహాన్ = అధికమైన (మిక్కిలి పొడవైన) దామ్భికః = కపటము ప్రధానముగాఁ గల్గిన, శరః=బాణము, అస్తి=కలదు. దామ్భికుఁడు చేయునట్టి ప్రతి కార్యమును నీతని బాణము చేయునని యర్థము.

వి. ఇచ్చట బాణమును దాంభికుఁడుగా నుత్ప్రేక్షించుట వలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకముసుఁ బ్రయోగింపనందువలన నది గమ్యము.

**సమాసములు :**

ఋజుత్వమౌనశ్రుతి పారగామితా :- ఋజోర్భావః=ఋజుత్వం, మునేః కర్మ=మౌనం, శ్రుతేఃపారం=శ్రుతిపారం, ఋజుత్వంచ, మౌనంచ, శ్రుతిపారంచ=ఋజుత్వమౌనశ్రుతి పారాణి, ఋజుత్వమౌనశ్రుతిపారాణి గచ్ఛతీతి = ఋజుత్వమౌనశ్రుతిపారగామీ, ఋజుత్వమౌనశ్రుతిపారగామినః భావః=ఋజుత్వమౌనశ్రుతి పారగామితా।

విశ్వాస విధాయి :- విశ్వాసాన్ విధత్తే ఇతి=విశ్వాస విధాయి, పక్షాన్తరమున- విశ్వాసం విధత్తే ఇతి=విశ్వాసవిధాయి।

దామ్భికః :- దమ్భః ప్రయోజనమస్యేతి=దామ్భికః।

**భావము :**

ఇతని యమ్మునందు వంకరలేని తనము (ఒరుల కోరిక ననుసరించుట) మౌనము(శబ్దములేక యుండుట) (మౌనవ్రతము గల్గియుండుట) శ్రుతి పారగామిత్వము చెవుల వరకును విస్తరించియుండుట (వేద పారగత్వము) అను గుణము లున్నవి. మఱియు శత్రువును హింసించునట్టియును (నొరుల కపకారము చేయునట్టిదియును) మిక్కిలి విశ్వాసమును అనగా శ్వాసలేకుండునట్లు చేయునట్టిదియు (విశ్వాసమునుఁ గల్గించునట్టిదియు) నగు చేష్ట ఆ బాణమందుఁ గలదు. మఱియు నాతని బాణము పెక్కుగానుండి అధికమై(పొడవై) లోకవంచకమై యున్నది. అనగా నతని బాణమునందు వఞ్చకుని యందున్న గుణములున్నవని యాశయము. అనగా బాణము ఋజువుగా నుండును. అనగా వంకరలేక యుండును. వంచకుఁడును ఋజువుగా నుండును. అనగా ఇతరులకు అనుకూలముగా నుండును. బాణము నిఃశబ్దముగా నుండును. వంచకుఁడును మౌనముగా నుండును. బాణమును వింటనుంచి లాగినపుడు అది చెవులవరకును విస్తరించును. వంచకుఁడును వేద పారఁగుడై యుండి విశ్వసనీయుడై యుండును. బాణము గూడ విశ్వాసమును గల్గినదిగా ననగా ప్రాణములుతీసి శ్వాసరాహిత్యమునుఁ గల్గించునదిగా నుండును. మఱియు నా బాణము చాల అధికముగా ననగా నక్షయముగా నుండును. వఞ్చకుని యందలి గుణములన్నియు నా బాణమందును గలవు, అట్టి బాణములచే శత్రుసంహారము చేయునట్టి మహాశూరుడైన యా నేపాల ప్రభువును నీవు వరించుట యుచితమని భావము ॥౪౪॥

శ్లో. రిపూనవాప్యాऽపి గతేऽవకీర్ణితా
మయం న యావజ్జనరఞ్జనవ్రతీ ।
భృశం విరక్తావపి రక్తవత్తరాన్
నికృత్య యత్తానసృజాऽసృజద్యుధి॥ 45

ప.వి. రిపూన్-అవాప్య,అపి-గతే-అవకీర్ణితామ్-అయం-న-యావజ్జనరఞ్జనవ్రతీ-భృశం-విరక్తాన్-అపి-రక్తవత్తరాన్-నికృత్య-యత్-తాన్-అసృజా-అసృజత్-యుధి.

అర్థము. యావజ్జనరఞ్జనవ్రతీ; యావజ్జన=సకలజనులను, రఞ్జన=రంజింపఁజేయుటయే, వ్రతీ=వ్రతముగాఁగల్గిన, అయం=ఈ నేపాల ప్రభువు,

రిపూన్ = శత్రువులను, అవాప్యాఽపి = పొందియు, అవకీర్ణితాం = వ్రత భంగమును, నగతః = పొందలేదు. యత్ = ఏలయనగా, భృశం = మిక్కిలి, విరక్తాన్ = శత్రుపక్షమున ద్వేషముతోఁ గూడిన, లేదా యుద్ధకాలము నందు తమ శరీరరక్షణ యందు కోరిక లేనటువంటి లేదా యీతనినిఁ జూచి భయమువలన రక్తముఁ బొలగి పోయినటువంటి, రిపూన్ = శత్రువులను, యుధి = యుద్ధమునందు, నికృత్య = ఖండించి, అసృజా = రక్తముచే, రక్తవత్తరాన్ = మిక్కిలి యెఱ్ఱటివారిగను, (అనురక్తులుగను) అసృజత్ = చేసెను. శత్రుపుంపగూడ రక్తముతో రంజిల్లఁజేయు నేపాళ ప్రభువునకు నెవ్వరి వలనను రంజనవ్రతమునకు భంగము వాటిల్లలేదని యర్థము.

## సమాసములు :

యావజ్జనరఞ్జనవ్రతీ :— యావన్తశ్చతే జనాశ్చ = యావజ్జనాః యావజ్జనానాం రఞ్జనం = యావజ్జనరఞ్జనమ్, యావజ్జనరఞ్జనమేవ వ్రతం = యావజ్జనరఞ్జనవ్రతం, యావజ్జనరఞ్జనవ్రతమస్య అస్తీతి = యావజ్జనరఞ్జనవ్రతీ, రక్తవత్తరాన్ :— రక్తమేషా మస్తీతి = రక్తవన్తః, అతిశయేనరక్తవన్తః = రక్తవత్తరాః. తాన్ = రక్తవత్తరాన్

## భావము :

సకల జనులను రంజిల్లఁజేయుట రాజునకు వ్రతము రఞ్జయతీతి రాజా యని రాజశబ్దమునకు వ్యుత్పత్తి చెప్పఁదగియున్నది. కాన ఈ నేపాలరాజు గూడ పెక్కు శత్రువులనుఁ గల్గియున్నను సకలజనులను రంజిల్లఁజేయుట యను తన వ్రతమునకు భంగమునుఁ గల్పించుకొనలేదు. ఏలయనగా, శత్రు రాజునందుఁగాని యుద్ధరంగమున తమ శరీరరక్షణ విషయమందు గాని మిక్కిలి విరక్తులైన వారిని యుద్ధమున ఛేదించి వారి రక్తముతో నా శత్రువుల నింకను రక్తవంతులను గావించి (రక్తవర్ణము గల వారినిఁగాజేసి) అనగా ననురక్తుల గావించి సకల జనరంజనవ్రతమును రక్షించుకొనెను. ఆనేపాలరాజు శత్రువులను సైతముపై విధముగా రంజిల్లఁజేసి తనపై ననురక్తులఁ గావించెనని యాశయము. ॥౪౨॥

శ్లో. పతత్యేత త్తేజోహుతభుజి కదాచిద్యది తదా
పతఙ్గః స్యాదఙ్గీకృతతమపతఙ్గాపదుదయః ।
యశోముష్యేవోపార్జయితుమసమర్థేన విధినా
కథఞ్చిత్ క్షీరామ్భోనిధిరపి కృత స్తత్ప్రతినిధిః॥ 46

ప. వి. పతతి-ఏత త్తేజోహుతభుజి-కదా-చిత్-యది-తదా-పతఙ్గః-స్యాత్-అఙ్గీకృతతమపతఙ్గాపదుదయః-యశః-అముష్య-ఇవ-ఉపార్జయితుమ్- అసమర్థేన-విధినా-కథం-చిత్. క్షీరామ్భోనిధిః-అపి-కృతః- తత్ప్రతినిధిః.

అర్థము. పతఙ్గః=సూర్యుఁడు, ఏత త్తేజోహుతభుజి ; ఏతత్=ఈ నేపాలప్రభువు యొక్క, తేజోహుతభుజి = ప్రతాపమనునగ్నియందు, కదాచిత్=ఒకప్పుడు, పతతియది=పడినచో, తదా = అప్పుడు, అఙ్గీకృతతమపతఙ్గాపదుదయః ; అఙ్గీకృతతమ=మిక్కిలియంగీకరింపఁబడిన, పతఙ్గ = మిడతయొక్క, ఆపదుదయః; ఆపత్ = శరీరముతగలఁబడుటయను విపత్తుయొక్క, ఉదయః=ప్రాప్తిగలవాఁడుగా, స్యాత్=అగును. (కించ =మఱియు) అముష్య=ఈ రాజుయొక్క, యశః=కీర్తిని, ఉపార్జయితుం=సంపాదించుటకు, అసమర్థేనేవ=అశక్తుడోయనునట్లున్న, విధినా= బ్రహ్మచే, కథంచిదపి = ఏ విధముగనో, తత్ప్రతినిధిః ; తత్=ఆయశస్సునకు, ప్రతినిధిః=ప్రతినిధిగా, క్షీరామ్భోనిధిః = పాలసముద్రము, కృతః = చేయఁబడినది, అనగా క్షీరసముద్రముగూడ ననుకల్పముగా ననగానప్రధానముగా యశస్సునకు ప్రతినిధిగాఁ చేయఁబడినదనియర్థము. ముఖ్యమునకంటె ప్రతినిధి వస్తువు తక్కువకాన నేపాల ప్రభువుయొక్క కీర్తికంటెను బ్రహ్మకీర్తి తక్కువయని యర్థము. అట్లే యారాజు యొక్క ప్రతాపము కంటెను సూర్యుని ప్రతాపము తక్కువయని యర్థము.

**సమాసములు :**

ఏత త్తేజోహుతభుజి :- ఏ తస్యతేజః=ఏత త్తేజః, ఏత త్తేజఏవహుతభుక్= ఏతత్తేజోహుతభుక్, తస్మిన్=ఏత త్తేజోహుతభుజి,

అఙ్గీకృతతమపతఙ్గాపదుదయః:- అతిశమేన అఙ్గీకృతః=అఙ్గీకృతతమః. పతఙ్గస్యఆపత్=పతఙ్గాపత్, పతఙ్గాపదః ఉదయః= పతఙ్గాపదుదయః

అఙ్గీకృతతమః పతఙ్గాపదుపయః యస్యాసః = అఙ్గీకృతతమ పతఙ్గాపదుపయః।

క్షీరామ్భోనిధిః - క్షీరస్య అమ్భోనిధిః=క్షీరామ్భోనిధిః

తత్ప్రతినిధిః :- తస్యప్రతినిధిః-తత్ప్రతినిధిః

**భావము :**

సూర్యుఁడు ఒకవేళ ఈ రాజుయొక్క ప్రతాపాగ్నియందుఁ బడినచో, మిడతవలె నాపదనుఁ బొందగఁడు. ఇతని కీర్తిని సంపాదింపలేని బ్రహ్మ, కష్టముమీద పాలకడలిని ఆ కీర్తికి ప్రతినిధినిఁ గావించెను. కాని ముఖ్యమైనదానికంటె ప్రతినిధి తక్కువకానాపాలకడలియునాతని కీర్తికి సరికాలేదు. ॥౭౭॥

**శ్లో. యావత్పౌలస్త్యవాస్తూభవదుభయహరిల్లోమరేఖోత్తరీయే**
**సేతుప్రాలేయశైలౌ చరతి నరపతేస్తావదేతస్య కీర్తిః।**
**యావత్ప్రాక్ప్రత్యగాశాపరివృఢనగరారమ్భణస్తమ్భముద్రా**
**వద్రీసన్ధ్యాపతాకా రుచిరచితశిఖాశోణశోభావుభౌ చ॥**

ప. వి. యావత్ - పౌలస్త్యవాస్తూభవదుభయహరిల్లోమరేఖోత్తరీయే - సేతుప్రాలేయశైలౌ-చరతి-నరపతేః-తావత్-ఏతస్య-కీర్తిః-యావత్ - ప్రాక్ప్రత్యగాశాపరివృఢనగరారమ్భణస్తమ్భముద్రౌ-అద్రీ-సన్ధ్యాపతాకారుచిరచితశిఖాశోణశోభౌ-ఉభౌ-చ-

అర్థము. పౌలస్త్యవాస్తూభవదుభయహరిల్లోమరేఖోత్తరీయే ; పౌలస్త్య=రావణ కుబేరులయొక్క, వాస్తూభవత్ = గృహభూమియైన, ఉభయహరిత్ = దక్షిణోత్తరములను రెండుదిక్కులయొక్క, లోమరేఖా=రోమపంక్తిగను, ఉత్తరీయే=పైవస్త్రముగనున్న (క్రమముగా దక్షిణోత్తరములుశ్యామల శుక్లవర్ణములను కల్గియుండును.)

సేతుప్రాలేయశైలౌ=సేతుహిమాద్రిపర్వతములు, యావత్=ఎంతదూరము (స్థితౌ = ఉన్నవో) (కించ=మఱియు) ప్రాక్ప్రత్యగాశాపరివృఢనగరారమ్భణస్తమ్భముద్రౌ ; ప్రాక్ప్రత్యగాశా = తూర్పుపడమరదిశల

యొక్క, పరివృఢ=ప్రభువులైన ఇంద్రవరుణులయొక్క. నగర=నగరములయొక్క, ఆరమ్భణ = ప్రాకమ్భమండలి, స్తమ్భ = స్తంభముల యొక్క, ముద్రౌ = సన్నివేశములు గల్గిన, అనగా స్తంభములనుఁ బోలినయాకారములు గల్గిన. సన్ధ్యాపతాకారుచిరచితశిఖాశోణశోభౌ; సన్ధ్యా =సాయం ప్రాతస్సన్ధ్యారూపములైన, పతాకా = రెండుపెక్కములయొక్క, రుచి=రక్తకాంతులతో, రచిత=నిర్మితములైన, శిఖా=కొనలయందలి, శోణశోభా=కెంజాయలుకల్గిన, ఉభౌ=రెండైన, అద్రీ=పర్వతములు అనగా నుదయాస్తశైలములు, యావత్=ఎంతవరకు, తిష్ఠతః= ఉండునో, తావత్–అంతవరకును, ఏతస్య=ఈ నేపాలప్రభువుయొక్క, కీర్తిః=కీర్తి, చరతి = చరించును. ఇతనికీర్తి యన్నిదిక్కులయందును సంచరించునని యర్థము.

**సమాసములు :**

పౌలస్త్యవాస్తూభవదుభయహరిల్లోమ రేఖోత్తరీయే ।
పులస్త్యగోత్రాపత్యేపుమాంసౌ=పౌలస్త్యౌ. అవాస్తూవాస్తూభవన్త్యౌ=వాస్తూభవన్త్యౌ, పౌలస్త్యయోః వాస్తూభవన్త్యౌ=పౌలస్త్యవాస్తూభవన్త్యౌ, ఉభేచతే హరితౌచ = ఉభయహరితౌ, పౌలస్త్యవాస్తూభవన్త్యౌచతౌ ఉభయహరితౌచ=పౌలస్త్యవాస్తూ భవదుభయహరితౌ, లోమ్నాంరేఖా=లీ మరేఖా, లోమరేఖాచ ఉత్తరీయంచ = లోమరేఖోత్తరీయే, పౌలస్త్యవాస్తూభవదుభయహరితా వేవలోమరేఖోత్తరీయే=పౌలస్త్యవాస్తూభవదుభయహరిల్లోమరేఖోత్తరీయే ।

సేతుప్రాలేయశైలౌ:- ప్రాలేయయుక్తః శైలః=ప్రాలేయశైలః, సేతుశ్చ ప్రాలేయశైలశ్చ=సేతుప్రాలేయశైలౌ ।

ప్రాక్ప్రత్యగాశాపరివృఢనగరారమ్భణస్తమ్భముద్రౌ:–ప్రాచీచప్రతీచీచ= ప్రాక్ప్రత్యఞ్చౌ, ప్రాక్ప్రత్యఞ్చౌ ఇతి ఆశే=ప్రాక్ప్రత్యగాశే, ప్రాగ్ప్రత్యగాశయోః పరిబృఢౌ = ప్రాక్ప్రత్యగాశాపరిబృఢౌ, ప్రాక్ప్రత్యగాశాపరిబృఢయోః నగరే = ప్రాక్ప్రత్యగాశాపరివృఢనగరే ప్రాక్ప్రత్యగాశాపరిబృఢనగర్యోః ఆరమ్భణం= ప్రాక్ప్రత్యగాశా పరివృఢనగరారంభణం, ప్రాక్ప్రత్యగాశాపరివృఢనగరారంభణేస్తంభౌ = ప్రాక్ప్రత్యగా

శాపరివృఢనగరారంభస్తంభౌ, ప్రాక్ప్రత్యగాశాపరివృఢనగరారంభణ స్తంభయోరివముద్రాయియోస్తౌ = ప్రాక్ప్రత్యగాశాపరివృఢనగరారమ్భణ స్తంభముద్రౌ !

సన్ధ్యాపతాకారుచిరచితశిఖాశోణశోభౌ;- సన్ధ్యేఏవపతాకే = సన్ధ్యాపతాకే, సన్ధ్యాపతాకయోఃరుచిః = సన్ధ్యాపతాకారుచిః, సన్ధ్యాపతాకారుచ్యారచితే= సన్ధ్యాపతాకారుచిరచితే, సన్ధ్యాపతాకారుచిరచితేచతేశిఖేచ = సన్ధ్యాపతాకారుచిరచితశిఖే, సన్ధ్యాపతాకారుచిరచితశిఖయోఃశోణశోభాయయోస్తౌ = సన్ధ్యాపతాకారుచిరచితశిఖాశోణశోభౌ।

**భావము :**

రావణకుబేరులకు వాసస్థానములైన దక్షిణోత్తర దిక్కులు క్రమముగా నల్లగను తెల్లగను నుండుటవలన నందు దక్షిణదిక్కు వెంట్రుకలుగను, నుత్తర దిక్కుపై వలువగను నున్నవి. దక్షిణదిక్కు యందలి సేతువు శిలలతో గూడి నల్లగ నుండుట వలన నది యాదిక్కునకు రోమపంక్తిగా నున్నది. ఉత్తర దిక్కునందలి హిమాలయము తెల్లగనుండును కాననది యాదిక్కునకు త్తరీయ ముగనున్నది. ఇట్లు దక్షిణోత్తరదిశలకు క్రమముగా రోమరాజిగను, నుత్తరీయ ముగనునున్న సేతుహిమాచలము లెంతదూరము నందున్నవో, అంతదూరమునే పాలప్రభునికీర్తి సంచరించును. అట్లే తూర్పుపడమరలకు ప్రభువులైన యింద్ర వరుణుల నగరములకు ప్రారంభస్తంభముల సన్నివేశములు గల్గినవియు, ప్రాత స్సాయం సన్ధ్యలనెడి రెండు పతాకల రక్తకాంతులతో నిర్మితములైన యగ్రభాగ ముల, కెంజాయలు గల్గినవియు నగునుదయ గిరియును నస్తగిరియు నెంత దూరము వ్యాపించియున్నవో యంతవరకు నా ప్రభునికీర్తి సంచరించును. అనగా నాతనికీర్తి తూర్పుపడమరలకు నెల్లలైనయుదయగిరి నుండి యస్తగిరి వరకును, దక్షిణోత్తరములకు నెల్లలైన సేతువునుండి హిమాచలము వరకు వ్యాపించి సంచరించుచున్నదని యాశయము॥ ౪౩॥

శ్లో. **యుద్ధ్వా చాభిముఖం రణస్య చరణస్యైవాదసీయస్యవా**
**బుద్ధ్వాఽన్తః స్వపరాన్తరం నిపతతా మున్ముచ్య బాణావలీః।**
**ఛిన్నం వాఽవనతీభవన్నిజభియః ఛిన్నం భరేణాథవా**
**రాజ్ఞాఽనేన హఠాద్విలోఠితమభూద్భూమావరీణాం శిరః॥**

ప. వి. యుద్ధ్వా-చ-అభిముఖం- రణస్య- చరణస్య- ఏవ - అదసీయస్య-వా-
బుద్ధ్వా-అన్తః-స్వపరాన్తరం-నిపతతామ్-ఉన్ముచ్య-బాణావలీః-ఛిన్నం-
వా- అవనతీభవన్- నిజభియః- ఖిన్నం- భరేణ- అథ-వా- రాజ్ఞా-
అనేన- హఠాత్ - విలోఠితమ్ - అభూత్-భూమౌ - అరీణాం-శిరః.

అర్థము. అదసీయస్య = ఇతనికిసంబంధించిన, రణస్య = యుద్ధమునకు, అభిముఖం = సమ్ముఖముగా,లేదా, ముఖం= ప్రారంభమును, అభి = గురిగావించుకొని, బాణావలీః=బాణపంక్తిని, ఉన్ముచ్య = వదలి, యుద్ధ్వా= యుద్ధముఁగావించి, నిపతతాం = పడిపోయినట్టి, వా = లేదా, అన్తః= అంతఃకరణమందు, స్వపరాన్తరం;స్వ=తనకును,పర=శత్రువునకునుఁ గల, అన్తరం= తారతమ్యమును, బుద్ధ్వా = తెలిసికొని, అదసీయస్య= ఇతనియొక్క, చరణస్యైవ =పాదమునకే, అభిముఖం=సమ్ముఖముగా, బాణావలీః =బాణపరమ్పరలను, ఉన్ముచ్య=వదలి, నిపతతాం=నిరాయుధులై పోయినట్టి, అనగా నీతనిపాదములయందువాలినట్టి, అరీణాం=శత్రువులయొక్క, ఛిన్నం = బాణములచేతెగఁగొట్టఁబడినదై, వా = లేదా, అవనతీభవత్ = వంగిభూమిపైఁబడినదై, అథవా = లేదా, నిజభియః = తనవలనిభయముయొక్క, భరేణ = ఆధిక్యముచే, ఖిన్నంసత్ = ఖేదమునుఁబొందినదై, అవనతీభవత్ = వంగిన, శిరః= తల, అనేన=ఈ, రాజ్ఞా = రాజుచే, హఠాత్ = బలాత్కారముచే, భూమౌ = భూమియందు, విలోఠితం = పలుమాఱులుపొరలింపఁబడినదిగా, అభూత్ = ఆయెను.

**సమాసములు :**

అదసీయస్య :- అముష్యఅయం = అదసీయః, తస్య = అదసీయస్య।
స్వపరాన్తరం:- స్వశ్చపరశ్చ = స్వపరౌ, స్వపరయోః అన్తరం,= స్వపరాన్తరం, తత్ = స్వపరాన్తరమ్।
బాణావలీః :- బాణానామావల్యః=బాణవల్యః.తాః=బాణావలీః।
అవనతీభవత్ :- అనవనతం అవనతం సమ్పద్యమా నంభవత్=అవనతీభవత్
నిజభియః :- నిజాచసాభీశ్చ=నిజభీః, తస్యాః = నిజభియః।

**భావము :**

ఇతనికి సంబంధించినయుద్ధమునకు ప్రారంభమున, శత్రువులుబాణపరం పరలను వదలి తుదకు నీరాజుచే హతులగుచున్నారు. లేదా మనస్సున తమకును పరునకునుఁ గల తారతమ్యమును గ్రహించి యితని పాదములపైపే బాణములను వదిలిపెట్టి అనగా సమర్పించి నిరాయుధులైన తమ శిరములు బాణములచే తెగఁగొట్టఁబడినవై భూమిపైఁ బడిపోవును. లేదా-ఈతని వలని భయాతిశయముచే ఖేదముఁ జెంది శత్రువుల తలలు వాలిపోవును. ఆ శిరముల నీరాజు బలాత్కారముగా భూమిపై పొరలించును. అనగా నీరాజుతోడ శత్రువులు యుద్ధమాడినచో తప్పకమడియుదురు. వివేకవన్తులును భయశీలురు నగు శత్రువు లీతని శరణుఁబొందుదురు. ఇది తప్పమఱొక మార్గమువారికి లేదు.

శ్లో. న తూణాదుద్ధారే న గుణఘటనే నాశ్రుతిశిఖం
సమాకృష్టౌ దృష్టిర్న వియతి న లక్ష్యే న చ భువి.
నృణాం పశ్యత్యస్య క్వచన విశిఖాన్ కిన్తు పతిత
ద్విషద్వక్షశ్వభ్రైరనుమితిరమూన్గోచరయతి॥ 49

ప. వి. న-తూణాత్-ఉద్ధారే-న-గుణఘటనే - న-ఆశ్రుతిశిఖం -సమాకృష్టౌ-దృష్టిః - న-వియతి - న - లక్ష్యే -న- చ- భువి- నృణాం-పశ్యతి-అస్య-క్వ-చన-విశిఖాన్ - కిం - తు- పతితద్విషద్వక్షః శ్వభ్రైః-అనుమితిః- అమూన్-గోచరయతి-

అర్థము. నృణాం = యుద్ధమును విలోకించెడిజనులయొక్క, దృష్టిః = చూపు అస్య=ఈ రాజుయొక్క, విశిఖాన్=బాణములను, క్వచన = ఎచ్చటను, తూణాత్=అమ్ములపొదినుండి, ఉద్ధారే = ఉద్ధరణముఁ జేయుకాలమునందు, నపశ్యతి = చూడదు. క్వచన=ఎచ్చటను, గుణఘటనే = అల్లెత్రాటినిజోడించుటయందును, నపశ్యతి = చూడదు. ఆశ్రుతిశిఖం = చెవులకొనలవరకు, సమాకృష్టౌ = అల్లెత్రాటినిలాగుటయందును, నపశ్యతి =చూడదు. వియతి = ఆకసమందు (విడిలినపిదప) నపశ్యతి= చూడదు. లక్ష్యే = గుఱియందు, నపశ్యతి = చూడదు. భువి=(శత్రువులనుఁజంపియటనుండివచ్చినిలిచిన) భూమియందును, నపశ్యతి =

చూడదు. కిన్తు = మఱేమనగా—పతితద్విషద్వక్షః శ్వభ్రైః; పతిత = యుద్ధమునఁజంపఁబడిన, ద్విషత్ = శత్రువులయొక్క, వక్షః = వక్షః స్థలమండలి, శ్వభ్రైః = గుంటలచే, అనుమితిః = అనుమానము అనగా ఊహ, గోచరయతి = కనుపఱచును.

ఈ రాజు ప్రయోగించిన బాణము లెచ్చటనుఁ బ్రత్యక్షమునకుఁ గాన వచ్చుట లేదు. కాని శత్రువుల వక్షఃస్థలముల యందలి రంధ్రములు బాణములు పడుటవలనఁ దప్ప మఱియొక విధముగా నేర్పడవు గాన వానినిఁ జూచి బాణములు పడినట్లు ఊహించుకొన వలసి యున్నదని యర్థము. అనగా నతడు కడు వేగముగా బాణములనుఁ బ్రయోగించునని యర్థము.

## సమాసములు :

గుణఘటనే:- గుణేనఘటనం=గుణఘటనం తస్మిన్=గుణఘటనే।

ఆశ్రుతిశిఖమ్:- శ్రుతేఃశిఖా = శ్రుతశిఖా, శ్రుతిశిఖామభివ్యాప్య, ఆశ్రుతి శిఖం।

పతితద్విషద్వక్షఃశ్వభ్రైః- పతితాశ్చతేద్విషన్తశ్చ = పతితద్విషన్తః, పతితద్విషతాంవక్షాంసి = పతితద్విషద్వక్షాంసి, పతితద్విషద్వక్షస్సు శ్వభ్రాణి = పతిద్విషద్వక్షఃశ్వభ్రాణి, తైః =పతితద్విషద్వక్షఃశ్వభ్రైః

## భావము :

యుద్ధరంగమున నానే పాల ప్రభువు గావించెడి బాణప్రయోగములు మిక్కిలి వేగముతో గూడినవి. ఏలయనగా- యుద్ధమునుఁ జూచుటకు వచ్చిన. మనుష్యుల దృష్టి, రాజుతనయమ్ములపొదినుండి బాణమునుఁ దీసినపుడు దేని యందునునానదు. అట్లే యల్లెత్రాటినిఁగూర్చునపుడును దేనియందునునానదు. అట్లే యల్లెత్రాటినిఁ జెవులకొనలవరకును లాగినపుడు దేనిపైననునానదు. అట్లే వారిదృష్టి, రాజుబాణమునుఁ బైకివిసరినప్పుడు దేనినిఁజూడదు. అట్లే వారిదృష్టి బాణముయొక్క గుఱిపైననుఁజూడదు. అట్లే బాణముతో శత్రువులను చంపి దానిని తిరిగివచ్చి యాగిన భూమిపైనను నెచ్చటఁ గూడవారిదృష్టి అనదు. కాని

యుద్ధముసపడిసిన శత్రువుల వక్షఃస్థలములయందు నాటుకొనిన బాణములవలని రంధ్రములచే నా బాణములు పడిన స్థలములను నూహింపవలసియున్నది. కాని ప్రత్యక్షముగా నా బాణములేవంకకు వెళ్లినవో కానరావు. అనగా నా రాజు మిక్కిలి వేగముగా బాణము ప్రయోగించుటలో నేర్పరియని యాశయము॥౪౯॥

శ్లో. దమస్వసుశ్చిత్తమవేత్య హాసికా
జగాద దేవీం కియదస్య వక్ష్యసి ?
భణ ప్రభూతే జగతి స్థితే గుణై
రిహాప్యతే సంకటవాసయాతనా ॥ 50

ప. వి. దమస్వసుః-చిత్తమ్- అవేత్య-హాసికా- జగాద-దేవీం - కియత్-అస్య-వక్ష్యసి-భణ-ప్రభూతే-జగతి-స్థితే-గుణైః-ఇహ-ఆప్యతే-సంకట వాస యాతనా.

అర్థము. హాసికా=నవ్వింపఁజేయునట్టి యొకపరి చారిక, దమస్వసుః=దమయన్తి యొక్క, చిత్తం=మనస్సును, అవేత్య= తెలిసికొని, దేవీం = సరస్వతీ దేవినిఁ గూర్చి, జగాద = పలికినది. (హేదేవి = ఓసరస్వతీ;) అస్య= ఈ రాజునకు సంబంధించి, కియత్ = ఎంత, వక్ష్యసి = చెప్పఁగలవు. సకలగుణములకాశ్రయుఁ డైన యీతని గుణములను ప్రత్యేకముగనెట్లు వర్ణింపఁ గలవని యర్థము. ప్రభూతే=గొప్పదైన, జగతి=ప్రపంచము, స్థితేఽపి=ఉన్నను. గుణైః=సౌన్దర్యాదిగుణముచే, ఇహ=ఈ రాజునందే, సఙ్కటవాసయాతనా ; సఙ్కటవాస=ఇరుకు కొని యుండుటచే నేర్పడిన, యాతనా = తీవ్రమగుబాధ, ఆప్యతే = పొందఁ బడుచున్నది. ఇతి = అని, భణ=చెప్పుము. సకలగుణములు సమస్త ప్రపంచమును వదలి పెట్టి యీ రాజునందే సాంకర్యము నొంది యవకాశములేక యిరుకుకొని నివసించుచున్నవని యొక్కమాటతో చెప్పుమని యర్థము.

**సమాసములు :**

దమస్వసుః :- దమస్యస్వసా=దమస్వసా, తస్యాః=దమస్వసుః ।
హాసికా :- హాసయతీతి = హాసికా ।

సఙ్కటవాసయాతనా :— సఙ్కటేనవాసః = సఙ్కటవాసః. సఙ్కటవాసేనయాతనా=సఙ్కటవాసయాతనా ।

**భావము :**

నవ్వింపఁ జేయు పరిచారిక యొకతె దమయన్తి మనస్సునుఁ దెలిసికొనినదై సరస్వతీదేవితో నిట్లు చెప్పెను. ఓ దేవీ! "ఈ రాజునుఁ గూర్చి యెంత చెప్పఁ గలవు? సకల గుణములకు నాశ్రయముఁ డైన ఈరాజుయొక్క ప్రత్యేక గుణములనుఁ గూర్చి వర్ణించుట యెట్లు సాధ్యము? విశాలమైన ప్రపంచమున్నను సౌందర్యాదిగుణములన్నియు నీ రాజునందే యిరుకుకొని నివసించుచు నొండొంటితో సాంకర్యముఁ బొందుచున్నవని యొక్క మాటతో చెప్పుమని (చెప్పినది) ॥౫౦॥

**శ్లో. బ్రవీతి దాసీహ కిమప్యసఙ్గతం**
**తతోఽపి నీచేయమతిప్రగల్భతే**
**అహో! సభాసాధురితీరిణః క్రుధా**
**న్యషేధదేతత్ క్షితిపానుగాఞ్జనః॥ 51**

ప. వి. బ్రవీతి-దాసీ-ఇహ-కిమ్-అపి-అసఙ్గతం-తతః- అపి-నీచా-ఇయమ్-అతిప్రగల్భతే-అహో! సభా-సాధుః- ఇతీరిణః- క్రుధా-న్యషేధత్-ఏతత్క్షితిపానుగాన్—జనః.

**అర్థము.** ఇహ= ఈసభయందు, దాసీ=దమయన్తియొక్క పరిచారిక; కిమపి= ఏదియో, అసఙ్గతం=అసమ్బద్ధమగు విషయమును, బ్రవీతి=చెప్పినది. తతోఽపి=ఆదాసికంటెను, నీచా = నీచురాలైన, ఇయం = ఈచేటి, అతిప్రగల్భతే=ఇంకనెక్కువప్రసంగించుచున్నది. అహో=ఆశ్చర్యము. సభా=సదస్సు, సాధుః=మంచిది, (వ్యాజస్తుతి) ఇతీరిణః=ఇట్లు తనప్రభువుగుణములను వర్ణించుటను ప్రతిబంధించుటవలన ఆక్రోశించుచున్న, ఏతత్క్షితిపానుగాన్; ఏతత్క్షితిప=ఈ రాజును, అనుగాన్=అనుసరించుచున్నపరిజనమును, జనః=జనము, క్రుధా=కోపముతో, న్యషేధత్=నిషేధించెను.

**సమాసములు :**

అసఙ్గతం : నసఙ్గతం=అసఙ్గతం, తత్=అసఙ్గతం।
ఇతీరిణః ఇతిఈరయన్తీతి ;=ఇతీరిణః తాన్=ఇతీరిణః
క్షితిపానుగాన్: క్షితిపస్య అనుగాః = క్షితిపానుగాః, తాన్ = క్షితిపానుగాన్.

**భావము :**

ఈ సభయందు దాసి లౌల్యత "చలేపి కాకస్య" అను శ్లోకమున నేదియో య సందర్భమునుఁజెప్పినది. ఆ దాసి కంటెను నీచురాలైన యీచేటి (పరిచారిక) ఇంకను విశృంఖలముగా అధికప్రసంగము జేయుచున్నది. ఎంత ఆశ్చర్యము. సభ యెంతమంచిది. అని మాట్లాడు రాజానుచరులను ప్రక్కనున్న జనము వారించినది. ॥౫౧॥

**శ్లో.** **అథాన్యముద్దిశ్య నృపం కృపామయీ**
**ముఖేన తద్దిఙ్ముఖసమ్ముఖేన సా.**
**దమస్వసారం వదతి స్మ దేవతా**
**గిరామిలాభూవదతిస్మరశ్రియమ్. 52**

ప. వి. అథ - అన్యమ్ - ఉద్దిశ్య - నృపం - కృపామయీ - ముఖేన - తద్దిఙ్ముఖసమ్ముఖేన - సా - దమస్వసారం - వదతి - స్మ - దేవతా - గిరాం - ఇలాభూవత్ - అతిస్మరశ్రియమ్.

**అర్థము.** అథ = పిదప, కృపామయీ = దయామయియగు, సా=ఆ, గిరాందేవతా = వాక్కులకు అధిదేవత, ఇలాభూవత్=ఇలా పుత్రుఁడగు పురూరవునితో తుల్యమైన, అతిస్మరశ్రియం = మన్మథుని సౌందర్యమును మించిన సౌందర్యమునుగల్గిన, అన్యంనృపం = మఱియొక రాజునుద్దేశించి, తద్దిఙ్ముఖసమ్ముఖేన ; తత్ = ఆ రాజుయొక్క, దిఙ్ముఖసమ్ముఖేన = దిగ్భాగమునకు నెదురైన, ముఖేన = ముఖముచే, దమస్వసారం = దమయన్తినిఁగూర్చి, వదతిస్మ = చెప్పుచుండినది.

**సమాసములు :**

కృపామయీ :- కృపయా ప్రచురా = కృపామయీ.

తద్దిఙ్ముఖసమ్ముఖేన :- తస్యదిక్ = తద్దిక్, తద్దిక్ సమ్ముఖం యస్య తత్=తద్దిఙ్ముఖసమ్ముఖం, = తేన = తద్దిఙ్ముఖసమ్ముఖేన.

దమస్వసారం :- దమస్యస్వసా=దమస్వసా,తామ్=దమస్వసారం.

ఇలాభూవత్ :- ఇలాయాంభవతీతి = ఇలాభూః, ఇలాభువమివ = ఇలాభూవత్.

అతిస్మరశ్రియమ్ :- స్మరస్యశ్రీః = స్మరశ్రీః, స్మరశ్రియమతిక్రాన్తః = అతిస్మరశ్రీః, తమ్ = అతిస్మరశ్రియమ్.

**భావము :**

దయామయి యగు నా సరస్వతి పురూరవుని మించిన సౌందర్యము గల మఱియొక రాజు నుద్దేశించి దమయన్తిఁగూర్చి చెప్పుచుండినది ॥౫౨॥

**శ్లో.** విలోచనేన్దీవరవాసవాసితైః
సితైరపాఙ్గాధ్వగచన్ద్రికాఞ్చలైః।
త్రపామపాకృత్య నిభాన్నిభాలయ
క్షితిక్షితం మాలయమాలయం రుచః॥ **53**

ప. వి. విలోచనేన్దీవరవాసవాసితైః - సితైః - అపాఙ్గాధ్వగచన్ద్రికాఞ్చలైః - త్రపామ్ - అపాకృత్య - నిభాత్ - నిభాలయ - క్షితిక్షితం - మాలయమ్ - ఆలయం - రుచః -

**అర్థము.** విలోచనేన్దీవరవాసవాసితైః; విలోచనేన్దీవర; విలోచన = నేత్రములనెడి, ఇన్దీవర = నల్లకలువలయందు, వాస = నివాసముచే, వాసితైః = పరిమళముఁబొందింపఁబడినవియు, (కంటి నల్లఁదనముచే నలుపువన్నెనుఁబొందింపఁబడినవియును) సితైః = స్వభావముచే తెల్లనైనవియు, (నలుపు తెలుపు వన్నెలతోఁగూడినవియు,) అపాఙ్గాధ్వగచన్ద్రికాఞ్చలైః, అపాఙ్గ = నేత్రపుటంచులనెడి, అధ్వ = మార్గమునందు, గ = సంచరించు, చంద్రికా = నేత్రమధ్యమందు నలుపుగ్రుడ్డు

యొక్క, అఞ్చలైః=కొనలచే ననగా కటాక్షములచేత, రుచః =కాన్తికి ఆలయం = స్థానమైన, మాలయం =మలయ దేశమునకు సంబంధించిన, క్షితిక్షితం = పృథ్వీపతిని, నిభాత్ = మఱియొకదానిని(జూచు నెపము వలన, త్రపాం = లజ్జను, అపాకృత్య = నిరాకరించి, నిభాలయ = చూడుము.

## సమాసములు :

విలోచనేన్దీవరవాసవాసితైః :- విలోచనే ఏవ ఇన్దీవరే = విలోచనేన్దీవరే, విలోచనేన్దీవర యోఃవాసః = విలోచనేన్దీవరవాసః, విలోచనేన్దీవరవాసేనవాసితాః = విలోచనేన్దీవరవాసవాసితాః, తైః = విలోచనేన్దీవరవాసితైః.

అపాఙ్గాధ్వగచన్ద్రికాఞ్చలైః :- అపాఙ్గానామధ్వా = అపాఙ్గాధ్వా, అపాఙ్గాధ్వానంగచ్ఛతీతి = అపాఙ్గాధ్వగా, అపాఙ్గాధ్వగాచసా చన్ద్రికాచ = అపాఙ్గాధ్వగ చన్ద్రికా, అపాఙ్గాధ్వగచన్ద్రికాయాః, అఞ్చలాః= అపాఙ్గాధ్వగచన్ద్రికాఞ్చలాః, తైః = అపాఙ్గాధ్వగచన్ద్రికాఞ్చలైః.
మాలయమ్ :- మలయానాం రాజా మాలయః, తమ్ = మాలయమ్.

## భావము :

ఓ దమయన్తీ ! నీ నేత్రములనెడి కలువలమధ్యవహించుటచే పరిమళము నొందినవియు, నీలిమను(బొందినవియు, స్వభావముచే తెల్లనివియు ననగా నలుపు తెలుపు వన్నెలతో(గూడినవియునైన కనుల యంచులలెడి మార్గమందుండు నల్లగ్రుడ్డుయొక్క యంచులనెడి కటాక్షములతో, సౌందర్యమునకు నాశ్రయుండైన మలయ దేశపుప్రభువును నేదియోయొక నెపముపెట్టి తిలకింపుము. అనగా నతనిని నేరుగా(జూడక దేనినోయొకదానిని(జూచు నెపమున నతనిని(జూడుమని యాశయము ॥౫౩॥

శ్లో. ఇమం పరిత్యజ్య పరం రణాదరిః
స్వమేవ భగ్నః శరణం ముధాఽవిశత్ ।
న వేత్తి యత్త్రాతుమితః కృతస్మయో
న దుర్గయా శైలభువాఽపి శక్యతే॥ 54

ప వి. ఇమం-పరిత్యజ్య-పరం-రణాత్- అరిః-స్వమ్-ఏవ- భగ్నః- శరణం- ముధా-అవిశత్-స- వే_త్తి-యత్- త్రాతుమ్- ఇతః - కృతస్మయః- న- దుర్గయా-శైలభువా-అపి-శక్యతే.

అర్థము. అరిః - ఇతనిశత్రువు, రణాత్ =యుద్ధమునుండి, భగ్నః=భగ్నుడై, పరం = శత్రువును లేదా శ్రేష్ఠుడునైనయీరాజును, పరిత్యజ్య = వదలి పెట్టి అనగా శరణుఁబొందక, ముధా = వ్యర్థముగా, స్వం = తనదైన, శరణమేవ = గృహమునే (శరణుగా) అవిశత్ = ప్రవేశించెను. యత్= ఏలయనగా, కృతస్మయః; కృత = చేయఁబడిన, స్మయః = అహంకారముగల్గిన, (సః = ఆ, అరిః= శత్రువు.) దుర్గయా = చొరశక్యము గాని, శైలభువా = పర్వతభూమిచే, అనగా పర్వతదుర్గముచే, శైలభువా = హిమాలయపుత్రికయగు, దుర్గయాపి= దుర్గాదేవిచేత ననగా పార్వతిచేతను, ఇతః=ఈరాజునుండి, త్రాతుం=రక్షించుటకు. నశక్యతే= సాధ్యముకాదు, ఇతి = అని, నవే_త్తి = తెలిసికొనడు.

ఎవడు పర్వతదుర్గములయందుఁ బ్రవేశించిన శత్రువునుఁ జంపఁ గలడో, యతడు తన యింటినిఁ బ్రవేశించియున్న శత్రువునెట్లు చంపఁజాలడు ? అనగా సులభముగాఁ జంపఁ గలడని యర్థము. కాననాత్మరక్షణకై తన యింటినిఁబ్రవేశించుటవ్యర్థమని యాశయము.

**సమాసములు :**

కృతస్మయః :- కృతఃస్మయఃయేనసః=కృతస్మయః।

శైలభువా:- శైలాత్భవతీతి = శైలభూః. తయా =శైలభువా.

**భావము :**

శత్రువు యుద్ధమునందోడి తన కంటె నితరుఁడు లేదా యుత్తముఁడైన యీామలయదేశ ప్రభుపును పీడి యనగా నితనిసి శరణుఁబొందక తన శరణమునే యనగా తన గృహమునే వ్యర్థముగా శరణుఁబొందెను. అనగా తన గృహమునుఁ బ్రవేశించెను. ఆ యహంకారియగు రాజు, తన్ను, పర్వతదుర్గము గాని పర్వత పుత్రికయగు దుర్గ లేదా పార్వతి గాని యీరాజు బారినుండి రక్షింపఁజాలదని తెలిసికొనక యున్నాడు. అనగా పర్వత దుర్గముల యందేరక్షణ లేని

వానిని గృహమెట్లు రక్షింపఁగలదు. దుర్గాదేవి చేతనే రక్షణఁబొందలేని వానిని గృహమెట్లు కాపాడఁగలదు. గాన నితడు శత్రుభయం కరుడైన మహాశూరుడు. వీనిని నీవు వరించుట యుచితమని యాశయము॥౫౪॥

శ్లో. అనేన రాజ్ఞాఽర్థిషు దుర్భగీకృతో
భవన్ ఘనధ్వానజరత్నమేదురః ।
తథా విదూరాద్రిరదూరతాం గమీ
యథా స గామీ తవ కేలిశైలతామ్॥ 55

ప. వి. అనేన–రాజ్ఞా–అర్థిషు – దుర్భగీకృతః – భవన్ – ఘనధ్వానజరత్న మేదురః–తథా–విదూరాద్రిః–అదూరతాం – గమీ – యథా – సః – గామీ–తవ–కేలిశైతామ్.

అర్థము. అనేన = ఈ రాజుచే, అర్థిషు = యాచకులవిషయమున, దుర్భగీ కృతః = హీనముగా జేయఁ బడిన, అనగా నుపేక్షింపఁ బడినదిగాఁ జేయఁ బడిన, అనగా రాజు యాచకులకు కోరినంత దానము చేయుటచే వారి వలన నుపేక్షింపఁ బడినదని యర్థము. ఘనధ్వానజరత్న మేదురః ; ఘనధ్వానజ = మేఘగర్జనములచే నుత్పన్నములైన, రత్న = రత్నములచే, మేదురః = పూర్ణుడైన, (రాజుచే నీయఁ బడిన రత్నములచే తృప్తిఁజెందిన యాచకులచే నుపేక్షింపఁ బడుటచే రత్నములు వ్యయముకానందు వలన పూర్ణమైన–యని యర్థము) విదూరాద్రిః = విదూరపర్వతము, తథా = ఆ విధముగా, అదూరతాం = సామీప్యమును, గమీ = పొందఁ బోవుచున్నది. యథా = ఎట్లు, సః = ఆ పర్వతము, తవ = నీకు, కేలిశైలతామ్ = క్రీడాపర్వతముగా నుండుటను, గామీ = పొందఁ బోవుచున్నడో. విదూరపర్వతమునందు నవమేఘ శబ్దముచే రత్న శలాకలుద్భవించునని ప్రసిద్ధి. ఆ రత్నశలాకలను యాచకులు కొనిపోవుచుందురు.

**సమాసములు :**

దుర్భగీకృతః :- అదుర్భగః దుర్భగః సమ్పద్యమానః కృతః = దుర్భగీకృతః ।

ఘనధ్వానజరత్నమేదురః :- ఘనానాంధ్వానః=ఘనధ్వానః, ఘనధ్వానాజ్జాయన్తఇతి = ఘనధ్వానజాని, ఘనధ్వానజానిచతానిరత్నానిచ = ఘనధ్వానజరత్నాని, ఘనధ్వానజరత్నైః మేదురః=ఘనధ్వానజరత్న మేదురః।

విదూరాద్రిః :- విదూరఇతి అద్రిః=విదూరాద్రిః।

అదూరతామ్ :- నదూరః = అదూరః, అదూరస్యభావః = అదూరతా, తామ్ =అదూరతాం।

కేలిశైలతామ్ :- కేలేః శైలః = కేలిశైలః, కేలిశైలస్యభావః =కేలి శైలతా, తామ్ = కేలిశైలతామ్।

**భావము:**

ఈ మలయదేశపు ప్రభువు యాచకులకు కోరినంత దానములు చేయుటచే,తత్పూర్వము విదూరపర్వతమునకుఁ బోయి రత్నములనుఁ దెచ్చుకొను యాచకులచ్చటికి వెళ్ళుట మానిరి. అందువలన నాపర్వతమునందు రత్నములు వ్యయముఁ బొందనందువలన నందు రత్నములు సమృద్ధములై యున్నవి. క్రొక్కారుమేఘములు గర్జించినపుడు విదూరపర్వతము నందు రత్నములుద్భవించును. అవియే వైడూర్యములనియు,ఁ జెప్పఁ బడుచున్నవి. ఆ విదూర పర్వతము మలయదేశమునకు సమీపమందున్నది. ఆ మలయభూపతిని వరించినచో, రత్నపూర్ణమైన యా విదూరపర్వతము నీకు క్రీడాశైలము కాగలదు కావున నాతని నీవు వరించుట యుచితమని యాశయము ॥౫౫॥

**శ్లో. నమ్రప్రత్యర్థిపృథ్వీపతిముఖకమలమ్లానతాభృఙ్గజాత**
**చ్ఛాయాన్తఃపాతచన్ద్రాయితచరణనఖశ్రేణిరైణేయనేత్రే!**
**దృష్టారిప్రాణవాతామృతరసలహరీభూరిపానేన పీనం**
**భూలోకస్యైష భర్తా భుజభుజగయుగం సాంయుగీనం బిభర్తి॥ 56**

ప. వి. నమ్రప్రత్యర్థి పృథ్వీపతి ముఖకమలమ్లానతాభృఙ్గజాతచ్ఛాయాన్తః పాతచన్ద్రాయితచరణనఖశ్రేణిః- ఐణేయనేత్రే- దృష్టారిప్రాణవాతామృత

రస లహరీభూరిపానేన-పీనం-భూలోకస్య-ఏవ-భర్తా-భుజభుజగయుగం
-సాంయుగీనం-బిభర్తి.

అర్థము. ఐణేయనేత్రే=జింక కన్నులవంటి కన్నులు గల యోదమయన్తీ, నమ్ర ప్రత్యర్థిపృథ్వీపతి ముఖకమలమ్లానతా భృఙ్గజాతచ్ఛాయాన్తః పాత చన్ద్రాయిత చరణనఖశ్రేణిః ; నమ్ర = పాదసమీపమందువంగిన, ప్రత్యర్థిపృథ్వీపతి=పరాజితులైన శత్రురాజుల యొక్క, ముఖకమల= ముఖములనెడి పద్మముల యందలి, మ్లానతా=అవమానమువలని వైవర్ణ్య మనెడి, భృఙ్గజాత=తుమ్మెదల సమూహము యొక్క, ఛాయా=నల్లదన మునకు, అన్తఃపాతేన=మధ్యభాగమునఁ బడుటచే (అనగా స్వచ్ఛము లైన నఖములందు ప్రతిబింబించుటచే) చన్ద్రాయిత=(మలినముఖముల నల్లదనము ప్రతిబింబించుట వలన) చంద్రులవలె నాచరించిన, చరణ నఖశ్రేణిః=పాదనఖముల పంక్తిగల్గిన, భూలోకస్యైవ=భూలోకమునకే, భర్తా=పాలకుఁడైన, ఏషః=ఈరాజు, దృప్తారిప్రాణ వాతామృత రసల హరీభూరిపానేన, దృప్త=గర్వించిన, అరి=శత్రువులయొక్క, ప్రాణ వాత=ప్రాణవాయువనెడి, అమృతరస=అమృతరసముయొక్క,లహరీ= తరంగములయొక్క, భూరి=మిక్కుటమైన,పానేన=పానముచే, పీనం= బలిసిన, సాంయుగీనం=యుద్ధములకు సాధనమైన, భుజభుజగ యుగం, భుజ= భుజములనెడి, భుజగయుగం=సర్పముల జంటను, బిభర్తి= ధరించుచున్నాడు.

వి. శత్రు రాజుల ముఖమును కమలముగను నందలి మ్లానతను తుమ్మె దలుగను, శత్రువుల ప్రాణవాయువులను నమృత తరంగములుగను, భుజయుగమును, భుజగ యుగళముగను, రూపించుటచే రూపకము. చరణ నఖశ్రేణిని వెన్నెలతో పోల్చుటవలన నుపమ.

**సమాసములు :**

నమ్రప్రత్యర్థి పృథ్వీపతి ముఖ కమలమ్లా నతాభృఙ్గజాతచ్ఛాయాన్తఃపాత చన్ద్రాయిత చరణనఖశ్రేణిః:

నమ్రాశ్చతే =ప్రత్యర్థినశ్చ = నమ్ర ప్రత్యర్థినః, నమ్రప్రత్యర్థిన ఏవ, పృథ్వీపతయః,=నమ్రప్రత్యర్థి పృథ్వీపతయః, ముఖాన్యేవ కమలాని=

ముఖ కమలాని, నమ్రప్రత్యర్థి పృథ్వీపతీ నాం ముఖకమలాని = నమ్రప్రత్యర్థి పృథ్వీపతి ముఖకమలాని, నమ్రప్రత్యర్థి పృథ్వీపతి ముఖ కమలేషు మ్లానతాః = నమ్రప్రత్యర్థి పృథ్వీపతి ముఖకమల మ్లానతాః. భృఙ్గాణాంజాతం = భృఙ్గజాతం, నమ్రప్రత్యర్థి పృథ్వీపతి ముఖకమల మ్లానతా ఏవ భృఙ్గజాతం = నమ్రప్రత్యర్థి పృథ్వీపతి ముఖ కమల మ్లానతా భృఙ్గజాతం, నమ్రప్రత్యర్థి పృథ్వీపతి ముఖ కమలమ్లానతా భృఙ్గజాతస్య ఛాయాః = నమ్రప్రత్యర్థి పృథ్వీపతిముఖకమలమ్లానతా భృఙ్గజాతచ్ఛాయాః నమ్రప్రత్యర్థి పృథ్వీపతి ముఖ కమలమ్లానతా భృఙ్గజాతచ్ఛాయానామన్తః పాతః = నమ్రప్రత్యర్థి పృథ్వీపతి ముఖకమలమ్లానతా భృఙ్గజాతచ్ఛాయాన్తః పాతః, చంద్రవదాచరితాః = చంద్రాయితాః, చరణానాంనఖాః = చరణనఖాః, చంద్రాయితాశ్చతే చరణనఖాశ్చ = చంద్రాయిత చరణనఖాః, చన్ద్రాయిత చరణనఖా నాంశ్రేణిః=చంద్రాయితచరణనఖశ్రేణిఃనమ్రప్రత్యర్థిపృథ్వీపతిముఖకమల మ్లామ్లానతాభృఙ్గజాతచ్ఛాయాన్తః పాతేన చన్ద్రాయితచరణ నఖశ్రేణిః యస్యసః = నమ్రప్రత్యర్థి పృథ్వీపతి ముఖకమలమ్లానతాభృఙ్గజాతచ్ఛాయాన్తః పాతచంద్రాయిత చరణనఖశ్రేణిః.

ఐణేయనేత్రే :- ఐణ్యాఃఇమే = ఏణేయే। ఐణేయేచతేనేత్రేచ = ఐణేయ నేత్రే, ఐణేయనేత్రేఇవనేత్రేయస్యాస్సా=ఐణేయనేత్రా, తస్యాః సంబుద్ధిః =ఐణేయనేత్రే.

దృప్తారిప్రాణ వాతామృత లహరీ భూరిపానేన :- దృప్తాశ్చతే అరయశ్చ = దృప్తారయః, ప్రాణాఏవవాతాః = ప్రాణవాతాః, దృప్తారీణాం ప్రాణవాతాః దృప్తారిప్రాణవాతాః, అమృతస్యలహరీ = అమృత లహరీ, దృప్తారి ప్రాణావాతా ఏవ అమృతలహరీ = దృప్తారిప్రాణవాతామృతలహరీ, దృప్తారిప్రాణావాతామృతలహర్యాః భూరిపానంచ = దృప్తారిప్రాణవాతామృతలహరీ భూరిపానం, తేన = దృప్తారిప్రాణ వాతామృతలహరీ భూరిపానేన.

## సమాసములు :

భూలోకస్య :- భూరితిలోకః, = భూలోకః, తస్య=భూలోకస్య.

భుజభుజగయుగమ్ :- భుజగయోః యుగమ్ = భుజగయుగమ్,

భుజావేవ భుజగయుగం=భుజభుజగయుగమ్, తత్=భుజభుజగయుగమ్. సాంయుగీనమ్ := సంయుగేసాధు = సాంయుగీనమ్, తత్ = సాంయుగీనమ్ ।

**భావము:**

ఓ హరిణాక్షి ! ఆ ప్రభువు తనకు వంగిన శత్రురాజుల ముఖకమలములు వాడబారుటచే నేర్పడిన నలుపువన్నెలనెడి తుమ్మెదల పంక్తులమధ్య పడుటచే చంద్రులవలె నాచరించు కాలిగోరులు గల్గినట్టివాడు. ఆతని భుజములు రెండును రెండు సర్పములై గర్వితులైన శత్రువుల ప్రాణవాయువులనెడి యమృతతరంగములను పానము గావించి బలసి యుద్ధమునకు తగినవై యున్నవి. అట్టి యాప్రభువు భూలోకమునకే సాటిలేని ప్రభువు. కాన నట్టి మహానుభావుని వరింపుము. పాములు గాలిమేతరులుగాన నీతని భుజసర్పములు శత్రువుల ప్రాణవాయువులను పానము గావించుచున్నవని చెప్పుట యెంతయో యొప్పియున్నది. ॥౩౬॥

**శ్లో. అధ్యాహారః స్మరహరశిరశ్చంద్రశేషస్య శేష**
**స్యాహేర్భూయః ఫణసముచితః కామయష్టినికాయః.**
**దుగ్ధాంమబోధేర్మునిచులుకనత్రాసనాశాభ్యుపాయః**
**కాయవ్యూహః క్వ జగతి న చాగస్త్యదః కీర్తిపూరః?**

ప. వి. అధ్యాహారః—స్మరహరశిరశ్చంద్రశేషస్య – శేషస్య—అహేః – భూయః ఫణ సముచితః – కామయష్టినికాయః – దుగ్ధామ్బోధేః – మునిచులుకనత్రాసనాశాభ్యుపాయః – కాయవ్యూహః – క్వ – జగతి – న – చ— అగస్త్యదః—కీర్తి పూరః.

అర్థము. స్మరహరశిరశ్చంద్రశేషస్య; స్మరహర = మన్మథుని హరించిన శివునియొక్క, శిరః = శిరమునందలి, చంద్రశేషస్య=శేషించిన కలారూపమైన చంద్రునకి, అధ్యాహారః = శేషించిన పదునైదు కలలను నింపునదియు, (అనగా నీతని కీర్తి ప్రవాహము స్వర్గమువరకును వ్యాపించినదని యర్థము.) శేషస్యఅహేః = ఆదిశేషుఁడను సర్ప

మునకు, భూయః ఫణసముచితః ; భూయః = అధికములైన, అనగా వేయి సంఖ్యగల్గిన, ఫణ = పడగలకు, సముచితః = తగిన, (వేయి పడగలకు వేయి శరీరములుండవలయును గదా) కాయయష్టినికాయః; కాయయష్టి = శరీరదండములయొక్క, నికాయః = సమూహమైనదియు, (అనగా కీర్తి ప్రవాహము పాతాళమువరకును వ్యాపించినదని యర్థము.) దుగ్ధాబ్ధేః = పాలకడలికి, మునిచులకన త్రాసనాశాభ్యుపాయః; ముని = అగస్త్యమహర్షి గావించిన, చులకన = అరచేతఁ బానముఁజేయుట వలని, త్రాస = భయమును, నాశ = నాశనముచేయుటకు, అభ్యుపాయః = సాధనమైన, కాయవ్యూహః = దేహసమూహము, (అనగా నీతని కీర్తి ప్రవాహము భూమినంతటిని వ్యాపించుటవలన దాని తెల్లఁదనముచే సమస్త జలములు తెల్లఁబడి పాలవలె కానవచ్చుటచే, నిది పాలకడలి నీరు ఇది మరియొక నీరని వివేచన చేయసాధ్యము కాదని యర్థము.) అటు వంటి, అదః కీర్తి పూరః; అదః = ఇతనియొక్క, కీర్తిపూరః = కీర్తి సమూహము, క్వ = ఎచ్చట, నజాగర్తి = ప్రకాశించుటలేదు. అనగా నంతటను ప్రకాశించుచున్నదని యర్థము.

వి. కీర్తిప్రవాహమంతటను వ్యాపింపకపోయినను, వ్యాపించునట్లు చెప్పుట వలన, **అతిశయోక్తి**. అది చంద్రశేషాధ్యాహారత్యాదిరూప రూపకోత్థా **కితము.**

## సమాసములు :

స్మరహరశిరశ్చంద్రశేషస్య :- స్మరస్యహరః = స్మరహరః, స్మర హరస్య శిరః = స్మరహరశిరః, స్మరహశిరసి చంద్రః = స్మరహర శిరశ్చంద్రః, స్మరహర శిరశ్చంద్రస్య శేషః = స్మరహరశిరశ్చంద్రశేషః. తస్య = స్మరహర శిరశ్చంద్రశేషస్య.

భూయఃఫణసముచితః :- భూయాం సశ్చతేఫణాశ్చ = భూయః ఫణాః. భూయఃఫణానాంసముచితః = భూయః ఫణసముచితః।

కాయయష్టినికాయః :- కాయాః యష్ట్య ఇవ = కాయయష్ట్యః, కాయ యష్టీనాం నికాయః = కాయయష్టినికాయః.

దుగ్ధామ్భోధేః :— దుగ్ధస్య అమ్భోధిః = దుగ్ధామ్భోధిః, తస్య= దుగ్ధామ్భోధేః।

మునిచులకనత్రాసనాశాభ్యుపాయః :— మునినాచులకనం = మునిచులకనం. మునిచులకనాత్ త్రాసః = మునిచులకనత్రాసః, మునిచులకనత్రాసస్యనాశః = మునిచులకనత్రాసనాశః, మునిచులకనత్రాసనాశస్య అభ్యుపాయః = మునిచులకనత్రాసనాశాభ్యుపాయః ।

కాయవ్యూహః :— కాయానాం వ్యూహః=కాయవ్యూహః

అదః కీర్తిపూరః :— కీర్తేః పూరః=కీర్తి పూరః, అముష్య కీర్తిపూరః= అదః కీర్తిపూరః.

**భావము :**

ఈ ప్రభువుయొక్క కీర్తి ప్రవాహము శివుని శిరమున కలామాత్రముగ మిగిలిన చంద్రుని పదునైదు కలలను పూరించునట్టిది. కీర్తి తెల్లనిదిగాన, శివుని శిరమున నొక్క కలగానున్న చంద్రునికి తక్కిన పదునైదు కలలను శుక్లపక్షమున సమకూర్చునట్టిదని యర్థము. అట్లే వేయిపడగలతో పాతాలము వఱకును వ్యాపించిన యాదిశేషునికి కావలసిన వేయి శరీరముల సమూహమై యున్నది. అగస్త్యుఁడు సముద్రమును పానముచేసిన విషయము ప్రసిద్ధముగదా! అందులో పాలకడలి నామహర్షి యరచేతఁబానము చేయునను భయము దొలంగుటకు నాతని కీర్తి ప్రవాహము సాధన మగుచున్నది. ఏలయనగా నాతని కీర్తి ప్రవాహము ప్రపంచము నంతటిని వ్యాపించి యున్నందువలన విశ్వమందలి యుదకములన్నియు తెల్లఁబడుటవలన నేది పాలకడలినీరు, ఏది దానికంటె భిన్నమమైన నీరు, అని వివేచనచేయ శక్యముగాదుగాన బాలకడలికి, తన పాలనంతటిని నగస్త్యులు పానము చేయునను భీతిలేదు. ఇటువంటి యంతని కీర్తి ప్రవాహము మూడులోకములయందును వ్యాపించినది కాన నంతటి కీర్తిశాలిని నీవు వరించుట యుచితము ॥౨౬॥

శ్లో. **రాజ్ఞామస్య శతేన కిం కలయతో హేతిం శతఘ్నీకృతం**
**లక్షైర్లక్షభిదో దృశైవ జయతః పద్మాని పద్మైరలమ్ ।**
**కర్తుం సర్వపరచ్ఛిదః కిమపి నో శక్యం పరార్ధే న వా**
**తత్సంఖ్యాపగమం వినాస్తి నగతిః కాచిద్బతైతద్ద్విషామ్॥**

ప. వి. రాజ్ఞామ్ - అస్య - శతేన - కిం - కలయతః - హేతిం - శతఘ్నీం - కృతం - లక్షైః - లక్షభిదః - దృశా - ఏవ-జయతః - పద్మాని - పద్మైః-అలం-కర్తుం-సర్వపరచ్ఛిదః - కిమ్ - అపి - నో - శక్యం-పరార్థేన-వా-తత్-సంఖ్యాపగమం-వినా-అస్తి-న-గతిః-కా-చిత్-బత-ఏతద్ద్విషామ్.

అర్థము. శతఘ్నీం=శతఘ్నియను, హేతిం = ఆయుధమును (నూరు మందిని చంపునట్టి యాయుధమును) కలయతః = ధరించుచున్న, అస్య = ఈ రాజునకు, రాజ్ఞాం = రాజుయొక్క, శతేన = నూటి సంఖ్యచే, కిం=ఏమిభయము, (ఏమియు భయము లేదని యర్థము) (వందమందిని చంపగల యాయుధమును ధరించిన యీ రాజునకు వందశత్రువులచే నేమిభయముస్నదని యర్థము.) లక్షభిదః; లక్ష=గురిని, (లక్షమందిని) భిదః=భేదించు నీరాజునకు, రాజ్ఞాం=రాజుయొక్క, లక్షైః=లక్షలచే, కృతం = చాలును. లక్షమంది రాజులీతనినేమియుఁ చేయఁ జాలరని యర్థము. దృశైవ=నేత్రముచేతనే, పద్మాని,=కమలములను, (పద్మ సంఖ్యగల శత్రువులను), జయతః=జయించుచున్న,అస్య=ఈరాజునకు, పద్మైః=పద్మ సంఖ్యగలరాజులతో, అలం = చాలును. (పెక్కండ్ర) సర్వపరచ్ఛిదః ; సర్వ=సకలురైన, పర=శత్రువులను, ఛిదః=చంపు చున్న, అస్య = ఈరాజునకు, పరార్థేనవా = పరార్థమను సంఖ్యచేగానీ లేదా, పరార్థేనవా, పర=శత్రువులయొక్క, అర్థేనవా = సగపాలుచే తగాని, కిమపి = ఏమియు, కర్తుం = చేయుటకు, నోశక్యం=సాధ్యము గాదు. తత్=అందువలన, బత=కష్టము. ఏతద్ద్విషాం = ఈతనిశత్రువు లకు, సంఖ్యాపగమం = సంఖ్యతొలగుటను, అనగా నసంఖ్యాకత్వ మును (లేదా) సంఖ్యాపగమం, సంఖ్య=యుద్ధమునుండి, అపగమం = తొలగిపోవుటను, వినా = లేక, కాచిత్ = ఒకానొక లేదా, మఱియొక, గతిః =గతి అనగా త్రోవ, నాఽస్తి=లేదు.

వి. సంఖ్యాపగమమునందు, శ్లేషచే,అసంఖ్యాకత్వమునందును,యుద్ధమునుండి తొలగిపోవుటయందును శత్రువుల గతినిషేధము ప్రాప్తమైనది. అది యొకదానియందు నియమింపఁ బడినది కాన పరిసంఖ్యాలంకారము.

సమాసములు :

లక్షభిదః :- లక్షం భినత్తి = లక్షభిత్, తస్య = లక్షభిదః.
సర్వాపరచ్ఛిదః :- సర్వేచ తే పరాశ్చ = సర్వాపరాః, సర్వాపరాన్ ఛినత్తి = సర్వాపరచ్ఛిత్, తస్య = సర్వాపరచ్ఛిదః.
పరార్ధేన :- అర్ధం పరస్తాత్ = పరార్ధమ్, లేదా, పరేషామర్ధం = పరార్ధమ్, తేన = పరార్ధేన.
సంఖ్యాపగమం :- సంఖ్యాయాః అపగమః, సంఖ్యాపగమః. తమ్ = సంఖ్యాపగమం ।
ఏతద్ద్విషామ్ :- ఏతస్యద్విషః = ఏతద్ద్విషః, తేషాం = ఏతద్ద్విషామ్ ।

భావము :

ఈ రాజు శతఘ్ని యను నాయుధమును ధరించుటవలన నూరుగురు శత్రువులవలన నితనికేమి భయము. శతఘ్ని వందమందిని చంపునుగదా! లక్షను సనగా గురిని చక్కగా గొట్టగల్గిన లేదా, లక్షమందిని చంపగల్గిన యీ రాజునకు లక్ష శత్రువులచే భయమేమియున్నది. తన నేత్రముతోనే వైశాల్యాది గుణములవిషయమున, పద్మమును జయించు నీ రాజునకు, లేదా, తన నేత్రము తోడనే, పద్మసంఖ్యగల శత్రువులను భేదించగల యీ రాజునకు, పద్మసంఖ్యగల శత్రువులచేనేమి భయము. సకలశత్రువులను సహరించునట్టి ఈరాజునకు పరార్ధసంఖ్యగల రాజులతో నేమిభయములేదా శత్రువుల సగపాలుతో నేమిభయము. ఇట్లు, శతఘ్నితో వంద మందిని, లక్షలతో లక్షమందిని, నేత్రమను పద్మముచే, పద్మసంఖ్యగల శత్రువులను సకలురను సంహరించునట్టి వీనికి వందలు లక్షలు, పద్మ సంఖ్య, పరార్ధసంఖ్య గల శత్రువులతోనేమి భయము. కాన నితని శత్రువులకు సంఖ్యా పగము మాత్రమే గతి. అనగా సంఖ్య లేక యుద్ధరంగమున నసంఖ్యాకముగా నుండుటయో లేదా సంఖ్యనుండి తొలగిపోవుటయో గతి యగుచున్నది. ॥58॥

శ్లో. పయస్యయాఽఽకూతవిదా దమస్వసుః
స్మితం వితత్యాఽభిదధేఽథ భావతః ।
ఇతః పరేషామపి పశ్య యాచతాం
భవన్మతేన స్వనివేదనస్వరామ్ ॥ 59

ప. వి. కృతా-అత్ర-దేవీ-వచనాధికారిణీ-త్వముత్తరం-దాసి-దదాసి-కా-సతీ-ఇతి-ఈరిణః-తన్నృపపారిపార్శ్వికాన్-స్వభర్తుః-ఏవ-భ్రుకుటిః-న్యవర్తయత్.

అర్థము. హేదాసి! = ఓసి పరిచారికా! అత్ర = ఈ స్వయంవరమందు, దేవీ= సరస్వతీదేవి, వచనాధికారిణీ; వచన=రాజుల వర్ణనయందు, అధికారిణీ= అధికారముగలదిగా, కృతా=చేయబడినది. త్వం = నీవు, కా=ఎవ్వతెవుగా, సతీ = అగుచు, (ఎవ్వరిచే ప్రేరేపింపఁబడినదానవై) (అసతీ = జారిణివైన, కాత్వమ్ = నీవెవ్వతెవు), ఉత్తరం = సమాధానమును, దదాసి= ఇచ్చుచున్నావు. ఇతి = ఇట్లు, ఈరిణః = చెప్పుచున్న, తన్నృపపారిపార్శ్వికాన్; తన్నృప = ఆ రాజుయొక్క, పారిపార్శ్వికాన్ =భృత్యులను, స్వభర్తురేవ = తమ పాలకుని యొక్కయే, భ్రుకుటిః = బొమముడి, న్యవర్తయత్ = మఱల్చినది.

**సమాసములు :**

వచనాధికారిణీ :- అధికారః అస్యాః అస్తీతి = అధికారిణీ, వచనే అధికారిణీ = వచనాధికారిణీ.

తన్నృపపారిపార్శ్వికాన్ :- సచాసౌన్నృపశ్చ=తన్నృపః. పరిపార్శ్వం వర్తన్తఇతి = పారిపార్శ్వికాః, తాన్ = పారిపార్శ్వికాన్.

స్వభర్తుః :- స్వస్యభర్తా = స్వభర్తా, తస్య = స్వభర్తుః.

**భావము :**

ఓదాసీ! ఈ స్వయంవరమునందు రాజులను వర్ణించుట యందు సరస్వతీదేవి నియమింపఁబడినది. కాన నీవెవ్వతవై బదులు చెప్పుచున్నావు. కులటవైన నీవెవ్వతెవు? ఇట్లు సేవకులు పలుకుచుండగా వారిని ప్రభువు తన బొమముడిపాటు చేత వారించెను. ॥౬౦॥

శ్లో. ధరాధిరాజం నిజగాద భారతీ
తతస్సముత్భేషద్వలితాఙ్గసూచితమ్।
దమస్వసారం ప్రతి సారవత్తరం
కులేన శీలేన చ రాజసూచితమ్॥ **61**

ప. వి. ధరాధిరాజం-నిజగాద-భారతీ-తత్సమ్ముఖేషద్వలితాఙ్గసూచితం-దమస్వ
సారం-ప్రతి-సారవత్తరం-కులేన-శీలేన-చ-రాజసు-ఉచితమ్.

అర్థము. భారతీ = సరస్వతీదేవి, కులేన = వంశ గౌరవము చేతను, శీలేనచ = మంచినడవడికచేతను, రాజసు = రాజులయందు, ఉచితం = తగినట్టిదియు, సారవత్తరం = మిక్కిలి సారము గల్గినదియు ననగా మిక్కిలి శ్రేష్ఠమైనదియును, తత్సమ్ముఖేషద్వలితాఙ్గసూచితం; తత్ = వర్ణింపఁదగిన రాజు యొక్క, సమ్ముఖ = ఎదుటి, ఈషత్ = కొంచెము, వలిత = త్రిప్పఁబడిన, అంగ = దేహముచే, సూచితం = సూచింపఁబడిన, ధరాధిరాజం = రాజును గూర్చి చూపించి, దమస్వసారం = దమయన్తినిఁ గుఱించి, నిజగాద = చెప్పెను.

**సమాసములు :**

ధరాధిరాజం:- ధరాయాః అధిరాజః = ధరాధిరాజః, తమ్ = ధరాధిరాజం.

తత్సమ్ముఖేషద్వలితాఙ్గసూచితమ్:- తస్యసమ్ముఖంయథాతథాఈషద్వలితం = తత్సమ్ముఖేషద్వలితాఙ్గం, తత్సమ్ముఖేషద్వలితాఙ్గేనసూచితం, తత్సమ్ముఖేషద్వలితాఙ్గసూచితః,తమ్=తత్సమ్ముఖేషద్వలితాఙ్గసూచితమ్

దమస్వసారం:- దమస్యస్వసా=దమస్వసా, తాం=దమస్వసారం.

సారవత్తరం:- సారఃఅస్యఅస్తీతి = సారవాన్, అత్యంతంసారవాన్= సారవత్తరః, తమ్ = సారవత్తరమ్-

**భావము :**

సరస్వతీదేవి; వంశగౌరవముచేతను, మంచి నడవడికచేతను రాజుల మధ్యయోగ్యుడై, శ్రేష్ఠుఁడైన యొక రాజువంకకు శరీరమునుఁ ద్రిప్పి, దానిచే సూచింపఁబడిన యారాజునుఁ గూర్చి దమయంతికిఁ చెప్పినది॥౬౧॥

శ్లో. కుతః కృతైవం నవలోకమాగతం
ప్రతి ప్రతిజ్ఞాఽనవలోకనాయ వాం.
అపీయమేనం మిథిలాపురన్దరం
నిపీయ దృష్టిః శిథిలాస్తు తే వరమ్॥ 62

ప. వి. కుతః-కృతా-ఏవం-నవలోకమ్-ఆగతం-ప్రతి-ప్రతిజ్ఞానవలోకనాయ-వామ్=అపి-ఇయస్-ఏనం- మిథిలాపునన్దరం-నిపీయ-దృష్టిః-శిథిలా-అస్తు-తే-వరమ్.

అర్థము. హేభైమి! = ఓదమయన్తీ!, ఆగతం = స్వయంవరమునకై విచ్చేసిన, నవలోకం = క్రొత్తజనమును(గూర్చి, ఏవం = ఈకన(బడినవిధముగా, అనవలోకనాయవా = చూడకయుండుటకై, కుతః = ఏకారణమువలన ప్రతిజ్ఞా = ప్రతిజ్ఞ, కృతా = చేయబడినది? ఇదియుక్తముకాదనిభావము. (భవతు = కానిమ్ము!), ఏనం = ఎదుటనున్న, మిథిలాపురన్దరమపి = మిథిలయొక్క ప్రభువును(గూడ, నిపీయ = చక్క-గా(జూచి, తే = నీయొక్క, ఇయం = ఈ, దృష్టిః = దృష్టి, శిథిలా = శిథిలమైనదిగా, (ఆధారరహితమైనదిగా) అస్తు = కానిమ్ము, వరం = (ఇట్లైనను శ్రేష్ఠము.)

**సమాసములు :**

నవలోకమ్:- నవశ్చాసౌలోకశ్చ=నవలోకః, తమ్=నవలోకమ్.

అనవలోకనాయ:- నఅవలోకనమ్ = అనవలోకనమ్, తస్మై = అనవలోకనాయ.

మిథిలాపురన్దరం :- మిథిలాయాఃపురన్దరః = మిథిలాపురన్దరః, తమ్ = మిథిలాపురన్దరమ్.

**భావము :**

ఓ దమయన్తీ ! క్రొత్తగా విచ్చేసిన జనమును( జూడనని ప్రతిజ్ఞనేల చేసితివి ? ఇది యుక్తముగాదు. ఈ మిథిలాప్రభువును( జూడుము. నీకాదరము లేనిచో తర్వాతమానుకొనుము. ఒక వస్తువును( జూడకవదలుట కంటెను, జక్క-గా(జూచివదలుట యుక్తము.॥౬౨॥

**శ్లో. న పాహి పాహీతి యదబ్రవీరముం**
**మదోష్ఠ! తేనైవమభూదితి క్రుధా।**
**రణక్షితావస్య విరోధిమూర్ధభి**
**ర్విదశ్య దన్తైర్నిజమోష్ఠమాస్యతే॥** **63**

ప. వి. న-పాహి-పాహి-ఇతి -యత్-అబ్రవీత్-అముం- మదోష్ఠ-తేన- ఏవమ్-
అభూత్-ఇతి-క్రుధా-రణక్షితౌ-అస్య- విరోధిమూర్ధభిః-విదశ్య-దన్తైః-
నిజమ్-ఓష్ఠమ్-ఆస్యతే.

అర్థము. హేమదోష్ఠ = ఓనాపెదవీ! యత్ = ఎందువలన, పాహి, పాహీతి = కావుము, కావుమని, అముం =ఈరాజును, నాబ్రవీః=దురంహకారముచే చెప్పకపోతివి. తేన = అట్లుచెప్పకపోవుటచే, ఏవం = ఇటువంటిదశ, అభూత్ = నాకేర్పడినది. ఇతి = ఆకారణములన, క్రుధా = కోపముచే, రణక్షితౌ = యుద్ధభూమియందు, అస్య = ఇతనియొక్క, విరోధి మూర్ధభిః = శత్రువులతలలచే, దన్తైః = దంతములతో నిజం =తమ దైన, ఓష్ఠం = పెదవిని, విదశ్య = కఱచి, ఆస్యతే = ఉండబడుట.

వి : పెదవిని దన్తములతో కఱచి శత్రు శిరములు యుద్ధరంగమునఁ బడి యున్నవి. పెదవిని దన్తములతోఁ కఱచుటకు 'పాహి పాహి' యని పెదవి చెప్పకపోవుట హేతువు కాకపోయినను, హేతువుగాఁ జెప్పుటవలన హేతూత్ప్రేక్ష. వ్యఞ్జకమునుఁ బ్రయోగించనందువలన గమ్యోత్ప్రేక్ష.

## సమాసములు :

మదోష్ఠ:– మమఓష్ఠః = మదోష్ఠః , తస్య సంబుద్ధిః = మదోష్ఠ .

రణక్షితౌ:– రణస్యక్షితిః = రణక్షితిః, తస్యాం=రణక్షితౌ,

విరోధిమూర్ధభిః :- విరోధినాంమూర్ధానః = విరోధిమూర్ధానః, తైః= విరోధిమూర్ధభిః ।

## భావము :

ఓనాపెదవీ ! నీవు "పాహి, పాహి" అనగా కావుము, కావుము, అని యీరాజునుం బ్రార్థింప నందు వలన నిన్ను శత్రువుల తలలు, దంతములతో కఱచి నీకు తగిన దండనము విధించినవి. ఏలయనగా–"పాహి పాహి" అను పదములలో మొదటి యక్షరము పకారము, 'ఉపూపధ్మానీయానా మోష్ఠౌ' యను వ్యాకరణవచనముచే, పెదవి యాపకారమునకు త్పత్తి స్థానము. కాన పెదవి పకారాది యగు "పాహి పాహి" పదముల నుచ్చరించ నందు వలన నీ రాజు యొక్క కోపమునకు గుఱియైనదై యుద్ధమున, "పాహి పాహి" యని తన్ను

వేడక, దురహంకారమును వహించిన రాజులను వధించినపుడు వారితలలు నేలపైఁ బడుచు దన్తములతో పెదవిని కఱచుచుండినవి. సహజముగా చనిపోయి నపుడు మృతులు తమ దన్తములతో పెదవులను కఱచుదురు. ఇచ్చట నావిధముగా దన్తములతోఁ బెదవిని కఱచి శత్రువుల శిరములు నేలపైఁ బడినవి. "పాహి పాహి" యనియారాజును శత్రువుల పెదవులు శరణు వేడనందువలన నాదురహంకారపూరితములగు పెదవులను దన్తములు కఱచి తగినదండమును విధించినట్లు ఆ దృశ్యము కానవచ్చుచున్నదని భావము ॥౬౩॥

శ్లో. భుజేఽపసర్పత్యపి దక్షిణే గుణం
సహేషుణాఽఽదాయ పురఃప్రసర్పిణే।
ధనుః పరీరమ్భమివాస్య సమ్మదా
న్మహాహవే దిత్సతి వామబాహవే॥ 64

ప. వి. భుజే–అపసర్పతి–అపి–దక్షిణే–గుణం–సహ–ఇషుణా–ఆదాయ–పురః–ప్రసర్పిణే–ధనుః–పరీరమ్భమ్–ఇవ–అస్య–సమ్మదాత్–మహాహవే–దిత్సతి–వామబాహవే.

అర్థము. మహాహవే = గొప్పయుద్ధము నందు, అస్య = ఈరాజునకు, ధనుః = ధనుస్సు, దక్షిణే = కుడిదైన (దాక్షిణ్యముగల, అనగా ననుకూలమైన) భుజే = హస్తము, ఇషుణాసహ = అమ్ముతోఁగూడ, గుణం = అల్లెత్రాటిని, ఆదాయ = తీసుకొని, అపసర్పతి = తొలఁగగా, అనగా చెవుల వెనుక భాగమునకుఁ బోగా, (యుద్ధరంగమునుండి పలాయనము జేయగా), పురః = (అల్లెత్రాటి సహాయత లేకపోయినను) ముందుకు పోవుచున్నట్టి, అనగా శత్రువుల సమ్ముఖమునకుఁ బోవుచున్నట్టి, వామబాహవే = ఎడమచేతికిని (ప్రతికూల హస్తమునకును). సమ్మదాత్ = శత్రువుల నాశనమునకై యుద్ధరంగమున ముందుకుపోవలయునను సంతోషము వలన, పరిరమ్భం = ఆలిఙ్గనమును, దిత్సతీవ = ఇవ్వఁగోరినదో యనునట్లున్నది. తటస్థమైనవ్యక్తి తనకనుకూలమైన వాఁడైనను యుద్ధమాడ వచ్చినవాఁడు తన జనమునుదీసుకొని యుద్ధమునుండి పలాయతుఁడు కాగా, యుద్ధమాడుటకు ముందుకుఁ బోవుచున్నవ్యక్తి తనకు ప్రతికూలుఁ

డైనను నతడు నమర్థుడని భావించి సంతోషముతో నాతనినిఁ గౌగలించు కొనును ఇచ్చట నెడమ చేతనున్న ధనుస్సును కుడిచేతితో చెవులకొనల వరకును లాగగా నెడమ చేతియందు, ధనుస్సుయొక్క రెండుకొనలును వంగును. అదియే యిటనాలింగనముగా నుత్ప్రేక్షింపఁబడినది. జయార్థులు తమ కనుకూలుఁడైనను పిఱికి వాడయినచో నాతనిని లెక్కింపరు. అట్లే వారు తమ ప్రతికూలుడైనను ధైర్యశాలియగు శూరుడైన, లెక్కింతురు.

వి. రాజు ధనస్సుతో వామహస్తమునకు నాలిఙ్గన మీయక పోయినను నిచ్చినట్లు చెప్పుట వలన నుత్ప్రేక్ష.

## సమాసములు :

పురఃప్రసర్పిణే :— పురః ప్రసర్పతీతి = పురఃప్రసర్పీ, తస్మై=పురః ప్రర్పిణే.

మహాహవే:— మహాంశ్చాసౌఆహవశ్చ = మహాహవః. తస్మిన్ = మహాహవే.

వామబాహవే:— వామశ్చాసౌబాహుశ్చ = వామబాహుః, తస్మై = వామబాహవే.

## భావము :

గొప్పయుద్ధముల యందు నీరాజు యొక్కవిల్లు, కుడిచేతను నెడమ చేతను వాలునట్టితీరు, ఇట వర్ణింపఁ బడియున్నది. రణరంగమున రాజు యొక్కవిల్లు; దక్షిణమైనదియు (దాక్షిణ్యముగలదియు) (కుడిదైనదియు) (నను కూలమైనదియు) నైనహస్తము,బాణముతోడ నల్లెత్రాడునుఁ దీసికొని వెనుకభాగ మునకురాగా (యుద్ధమునుండి పలాయనమునుఁ జేయగా) (పురోగామియై) యుద్ధ మునకు ముందునడచినదై గుణము ( అల్లెతాడు ) సహాయములేక పోయినను శత్రువునెదుర్కొనునట్టి వామహస్తమునందు (ఎడమచేతిని) (ప్రతికూలహస్త మునకును) శత్రువునెదుర్కొనుటవలని సంతోషమువలన నభినందనచిహ్నముగా గౌగలింపునిచ్చుచున్నది. అనగా- దక్షిణహస్తము దాక్షిణ్యాదిగుణములు గల్గి నందువలన సరళమును ననుకూలముగానున్న దైనను కుడిచేయి ధనుస్సును లాగునపుడు, బాణముతోనల్లెత్రాటిని వెనుకకు లాగుకొని యుద్ధరంగమునుండి

పలాయనము చేయుచున్నదాని వలెనున్నది. కావున దక్షిణహస్తమెంతఅనుకూల మైనను పిఱికివానివలె బాణముతోడను నల్లెత్రాటి తోడను వెనుకకు యుద్ధము నుండి పలాయనము చేయునట్లున్నది. ఎడమచేయివామమైనను (ఎడమదైనను) (ప్రతికూలమైనను,) గుణసహాయము (అల్లెత్రాటిసహాయము) (అర్హతాదిగుణ ములసహాయము) లేనిదైనను నుత్సాహధైర్యములు గల్గిశత్రు వినాశమునకై రణ స్థలియందు ముందుకు నురుకుచుండుటచే నది యభినందనీయమైనది. కాన దానికి రాజచాపము కౌగిలింపునిచ్చునట్లు కానవచ్చుచున్నది. లోకమున, ననుకూలుఁ డైనను, పిఱికియైనచో నాతనిని వీరులులెక్కింపరు. ప్రతికూలుడైనను వీరుఁ డగచో నాతనిని వీరులు గౌరవింతురు. అనగా నిటకుడిచేయి (దక్షిణమైనందు వలన) (దాక్షిణ్యముకల్గినందువలన) ననుకూలమైనను ధనస్సును లాగునపుడు బాణముతోడను,అల్లెత్రాటితోడను వెనుకకు వచ్చినదిగాన నదిపిఱికిగా భావింపఁ బడినది. ఎడమచేయి వామమైనందువలన, ప్రతికూలత గల్గినను, ధనుస్సులాగు నపుడది ముందునకుపోయి శత్రువు నెదుర్కొనుట కుచితమైన ధైర్యోత్సాహము లనుఁగనుఁబఱచినదిగాన నభినందన పాత్రమై ధనస్సు వలని యాలిఙ్గనమును బొందినది ॥౬౪॥

శ్లో. అస్యోర్వీరమణస్య పార్వణవిధుద్వైరాజ్యసజ్జం యశః
సర్వాఙ్గోజ్జ్వలశర్వపర్వతసితశ్రీగర్వనిర్వాసి యత్.
తత్ కమ్బుప్రతిబిమ్బితం కిము? శరత్పర్జన్యరాజ్యశ్రియః
పర్యాయః కిము?దుగ్ధసింధుపయసాంసర్వానువాదః కిము॥

ప. వి అస్య-ఉర్వీరమణస్య -పార్వణవిధుద్వైరాజ్యసజ్జం-యశః-సర్వాఙ్గోజ్జ్వ లశర్వ పర్వతసితశ్రీ గర్వనిర్వాసి-యత్-తత్-కమ్బు ప్రతిబింబితం- కిమ్-ఉ-శరత్పర్జన్యరాజ్యశ్రియః - పర్యాయః-కిమ్-ఉ - దుగ్ధసింధు పయసాం- సర్వానువాదః-కిమ్-ఉ.

అర్థము. అస్య = ఈ, ఉర్వీరమణస్య=రాజునకు సంబంధించిన, పార్వణ విధుద్వైరాజ్యసజ్జం;పార్వణవిధు=పున్నమ చంద్రునియొక్క,ద్వైరాజ్య= రెండురాజులకు సంబంధించిన కార్యము, అనగా రెండు చంద్రులకు సంబంధించిన ట్రెల్లదనమునందు, సజ్జం=సిద్ధమైనదియు, సర్వాఙ్గోజ్జ్వల

శర్వ పర్వత సితశ్రీ గర్వనిర్వాసి; సర్వాఙ్గ=సర్వావయవములయందు, ఉజ్జ్వల=మిక్కిలి ప్రకాశించు, శర్వపర్వత=శివుని పర్వతమైన కైలాసము యొక్క, సితశ్రీ=తెలువు కాంతియొక్క గర్వ=అహంకారమును, నిర్వాసి=తొలగించునట్టి, యత్=ఏ, యశః=కీర్తి గలదో, తత్-అది, కమ్బుప్రతిబిమ్బితం కిము;కమ్బు=శంఖములయొక్క, ప్రతిబిమ్బితం, కిము=ప్రతిబింబమాయేమి? లేదా శరత్పర్జన్యరాజిశ్రియః; శరత్పర్జన్య శరత్కాలపుమేఘములయొక్క, రాజి=వరుసయొక్క, శ్రియః=శోభకు, పర్యాయః కిము=నామాన్తర మాయేమి. దుగ్ధసిన్ధు పయసాం; దుగ్ధసిన్ధు= పాలకడలియొక్క పయసాం=పాలకు,సర్వానువాదః కిము=అంతటికిని పునరుక్తియాయేమి?

వి. ఆభూపతియొక్క యశస్సును శంఖముల ప్రతిబింబముగను, శరత్కాలపు మేఘమాలయొక్క శోభకు నామాన్తరముగను, పాలకడలి పాల కంతటినికి పునరుక్తిగను భావించుటవలన, మూడుఉత్ప్రేక్షలు. ఈమూటి కిని సంసృష్టి.

## సమాసములు :

ఉర్వీరమణస్య:- ఉర్వ్యాఃరమణః = ఉర్వీరమణః, తస్య = ఉర్వీరమణస్య,

పార్వణవిధుద్వైరాజ్యసజ్జమ్:- పర్వణిభవః =పార్వణః, పార్వణశ్చాసౌ విధుశ్చ = పార్వణవిధుః, ద్వయోఃరాజ్ఞోరిదంరాజ్యం = ద్వైరాజ్యం, పార్వణవిధోఃద్వైరాజ్యం = పార్వణవిధుద్వైరాజ్యం. పార్వణవిధు ద్వైరాజ్యేసజ్జం, పార్వణవిధుద్వైరాజ్యసజ్జం॥

సర్వాఙ్గోజ్జ్వల శర్వపర్వతసితశ్రీ గర్వనిర్వాసి:-

సర్వాణిచతాని అఙ్గానిచ= సర్వాఙ్గాణి, సర్వాఙ్గేషు ఉజ్జ్వలా=సర్వాఙ్గోజ్జ్వలా, శర్వస్య పర్వతః =శర్వపర్వతః, సితాచసాశ్రీశ్చ =సితశ్రీః, శర్వ పర్వతస్యసితశ్రీ =శర్వపర్వతసితశ్రీః, సర్వాఙ్గోజ్జ్వలా చసా శర్వపర్వతసితశ్రీశ్చ=సర్వాఙ్గోజ్జ్వల శర్వపర్వత సితశ్రీః, సర్వాఙ్గోజ్జ్వలశర్వ పర్వతసితశ్రియః గర్వః= సర్వాఙ్గోజ్జ్వలశర్వ పర్వత సిత

శ్రీగర్వః, సర్వాఙ్గోజ్జ్వల శర్వ పర్వతసితశ్రీగర్వం నిర్వాసయతీతి= సర్వాఙ్గోజ్జ్వల శర్వపర్వతసితశ్రీ గర్వనిర్వాసి.

కమ్బుప్రతిబిమ్బితమ్ :- కమ్బూనాంప్రతిబిమ్బితమ్ = కమ్బుప్రతిబిమ్బితమ్.

శరత్పర్జన్యరాజిశ్రియః:- శరదాంపర్జన్యాః=శరత్పర్జన్యాః, శరత్పర్జన్యానాంరాజిః=శరత్పర్జన్యరాజిః,శరత్పర్జన్యరాజేఃశ్రీః=శరత్పర్జన్యరాజిశ్రీః, తస్యాః= శరత్పర్జన్యరాజిశ్రియః.

దుగ్ధసింధుపయసామ్:- దుగ్ధస్యసింధుః = దుగ్ధసింధుః, దుగ్ధసింధోః పయాంసి = దుగ్ధసింధుపయాంసి, తేషాం = దుగ్ధసింధుపయసామ్.

**భావము :**

ఈ రాజుయొక్క కీర్తిపున్నమచంద్రుని రెండు రాజ్యములచే నిర్మితమైనది. అనగా నిఱువురి చంద్రులచే నాకీర్తి నిర్మితమని భావము. శరీరమంతటను ప్రకాశించు కైలాసపర్వతమునకు "తానేయందఱికంటెను తెలుపు" అను గర్వమును నా కీర్తి తొలగించును. అట్టికీర్తి, శంఖములకు ప్రతిబింబమాయేమి? లేక శరత్కాలపుమేఘమాలా శోభకు నామాన్తరమాయేమి? లేదాపాలకడలిపాలకు పునరుక్తియాయేమి ? అనగా నా కీర్తిశంఖమాలవలెను, శరత్కాలపుమేఘపంక్తి వలెను, పాలసముద్రపుపాల వలెనుఁదెల్లగా నున్నదని యాశయము ॥౬౫॥

**శ్లో. నిస్త్రింశత్రుటితారివారణఘటాకుమ్భస్థికూటావట**
**స్థానస్థాయుకమౌక్తికోత్కరకిరః కైరస్యనాఽయంకరః।**
**ఉన్నీతశ్చతురఙ్గసైన్యసమరత్వఙ్గత్తురఙ్గఖుర**
**క్షుణ్ణాసు క్షితిషు క్షిపన్నివ యశః క్షోణీజబీజవ్రజమ్॥ 66**

ప. వి. నిస్త్రింశత్రుటితారివారణ ఘటాకుమ్భస్థికూటావట స్థానస్థాయుక మౌక్తికోత్కరకిరః- కైః-అస్య- న-అయం- కరః-ఉన్నీతః-చతురఙ్గ సైన్యసమరత్వఙ్గత్తురఙ్గఖురక్షుణ్ణాసు-క్షితిషు-క్షిపన్-ఇవ-యశఃక్షోణీజ బీజవ్రజమ్,

అర్థము. నిస్త్రింశత్రుటితారివారణ ఘటాకుమ్భాస్థికూటావట స్థానస్థాయుకమౌక్తికోత్కరకిరః; నిస్త్రింశ = ముప్పదిమంగుళములను మించినపొడవు గల ఖడ్గముచే, త్రుటిత = తెగఁగొట్టఁబడిన, అరి = శత్రువులయొక్క, వారణ = ఏనుగులయొక్క, ఘటా = సమూహముయొక్క, కుంభ = కుంభస్థలములయందలి, అస్థికూట = ఎముకల సమూహముయొక్క, అవటస్థాన = గుంతలయందు, స్థాయుక = నిలిచిన, మౌక్తిక=ముత్తెములయొక్క, ఉత్కర = సమూహమును, కిరః = వెదఁజల్లునట్టి, అస్య = ఈరాజుయొక్క, అయం = ఈ, కరః = హస్తము, చతురఙ్గ సైన్యసమరత్వఙ్గత్తురఙ్గఖురక్షుణ్ణాసు ; చతురఙ్గ = ఏనుగులుమున్నగు నాలుగువిధములైన, సైన్య = సైన్యముల యొక్క, సమర = యుద్ధములయందు, త్వఙ్గత్ = సంచరించుచున్న, తురఙ్గ = గుఱ్ఱములయొక్క, ఖుర = గిట్టలచే, క్షుణ్ణాసు = త్రొక్కఁ బడిన, క్షితిషు = భూములయందు, యశఃక్షోణీజబీజవ్రజమ్; యశః = కీర్తియనెడి, క్షోణీజ = వృక్షమునకు, బీజవ్రజం = విత్తనములసమూహమును, క్షిపన్నివ = వెదఁజల్లుచున్నదోయన్నట్లు, స్థితః=ఉన్నదై, కైః = ఎవరిచే, నఊన్నితః = ఊహింపఁబడలేదు.

వి. ఏనుగకుంభ స్థలమందలి ముత్తెములు తెల్లనివిగను చిన్నవిగను నుండుట వలన చెట్టువిత్తనముల వలెనుండును కానవానిని వృక్షబీజములుగను త్ప్రేక్షించుట వలన నుత్ప్రేక్ష. అవిరళ భూమియందు పడుటను వర్షపతనముగా భావించుట వలన నిదియు నుత్ప్రేక్ష. ఇట్లురెండు ఉత్ప్రేక్షలు.

## సమాసములు :

నిస్త్రింసత్రుటితారివారణఘటా కుమ్భాస్థికూటావటస్థానస్థాయుక మౌక్తికోత్కరకిరః :— నిర్గతః త్రింశతోఽఙ్గులిభ్యః = నిస్త్రింశః, నిస్త్రింశేన త్రుటితాః=నిస్త్రింశత్రుటితాః, అరీణాంవారణాః=అరివారణాః, అరివారణానాంఘటాః=అరివారణఘటాః, అరివారణఘటానాంకుమ్భాః=అరివారఘటాకుమ్భాః, నిస్త్రింశత్రుటితాశ్చతే, అరివారణఘటాకుమ్భాశ్చ=నిస్త్రింశత్రుటితారివారణఘటాకుమ్భాః, నిస్త్రింశత్రుటితారివారణఘటాకుమ్భేషు అస్థికూటాని = నిస్త్రింశత్రుటితారివారణఘటాకుమ్భాస్థికూటాని, నిస్త్రింశ

త్రుటితారివారణఘటా కుమ్భాస్థికూటానామవటస్థానాని = నిస్త్రింశత్రుటితారివారణఘటా కుమ్భాస్థికూటావటస్థానాని, నిస్త్రింశత్రుటితారివారణఘటాకుమ్భాస్థికూటావటస్థానేషు స్థాయుకాః = నిస్త్రింశత్రుటితారివారణఘటాకుమ్భాస్థికూటావటస్థానస్థాయుకాః, మౌక్తికానాముత్కరాః=మౌక్తికోత్కరాః, నిస్త్రింశత్రుటితారివారణఘటా కుంభాస్థికూటావటస్థానస్థాయుకాశ్చతే మౌక్తికోత్కరాశ్చ=నిస్త్రింశత్రుటితారివారణఘటా కుంభాస్థికూటావటస్థానస్థాయుక మౌక్తికోత్కరాః. నిస్త్రింశత్రుటి తారివారణఘటా కుంభాస్థికూటావటస్థానస్థాయుకమౌక్తికోత్కరాన్ కిరంతీతి=నిస్త్రింశత్రుటితారివారణఘటా కుంభాస్థికూటావటస్థానస్థాయుక మౌక్తికోత్కరకిరః।
చతురఙ్గసైన్యసమరత్వఙ్గత్తురఙ్గక్షురక్షుణ్ణాసు:-చత్వారి అఙ్గానియేషాం తాని=చతురఙ్గాని, చతురఙ్గానిచతానిసైన్యానిచ=చతురఙ్గసైన్యాని, చతురఙ్గసైన్యానాంసమరాః=చతురఙ్గసైన్యసమరాః, చతురఙ్గసైన్యసమరేషుత్వఙ్గన్తః=చతురఙ్గసైన్యసమరత్వఙ్గన్తః. చతురఙ్గసైన్యసమరత్వఙ్గన్తశ్చతే తురఙ్గాశ్చ=చతురఙ్గసైన్యసమరత్వఙ్గత్తురఙ్గాః, చతురఙ్గసైన్యసమరత్వఙ్గత్తురఙ్గాణాం క్షురాః = చతురఙ్గసైన్యసమరత్వఙ్గత్తురఙ్గక్షురాః, చతురఙ్గసైన్యసమరత్వఙ్గత్తురఙ్గక్షురైః క్షుణ్ణాః=చతురఙ్గసైన్యసమరత్వఙ్గత్తురఙ్గక్షురక్షుణ్ణాః, తాసు=చతురఙ్గసైన్యసమరత్వఙ్గత్తురఙ్గక్షురక్షుణ్ణాసు।
యశఃక్షోణీజబీజవ్రజమ్:- క్షోణ్యాం జాయత ఇతి=క్షోణీజః, బీజానాం వ్రజః=బీజవ్రజః, యశఃక్షోణీజస్యబీజవ్రజః = యశః క్షోణీజబీజవ్రజః, తమ్=యశఃక్షోణీజబీజవ్రజమ్।

**భావము :**

ముప్పదియంగుళములకు మించిన నిస్త్రింశమను ఖడ్గముచే, శత్రురాజులకు సంబంధించిన గజసమూహముల కుంభస్థలములను ఖండింపగా నా కుంభస్థలమందలి యస్థి సమూహముల గుంటలయందున్న ముత్తెముల సమూహములను వెదజల్లెడి యా జేని హస్తము, గజరథ తురగపదాతు లనెడి చతురఙ్గబలముతోఁ గూడిన యుద్ధములయందు సంచరించునట్టి గుఱ్ఱముల గిట్టలచే నలుగునట్లు త్రొక్కఁబడిన భూములయందు కీర్తి వృక్షపు విత్తనముల సమూహమును వెదజల్లుచున్నట్లు ఎవ్వరిచే నూహింపబడదు? అందఱి చేతను నూహింపఁబడును.

అనగా నా రాజుయొక్క హస్తము, ఖడ్గముచే శత్రుగజముల కుమ్భస్థలముల తెగగొట్టి యందలి ముత్తెములను యశోవృక్షములకు విత్తనములుగా గుఱ్ఱముల గిట్టలచే త్రొక్కఁబడి పదును గావింపఁబడిన రణక్షేత్రముల యందు వెదఁ జల్లుచున్నదని యాశయము. ॥౬౬॥

శ్లో॥ అర్థిభ్రంశబహూభవత్ఫలభరవ్యాజేన కుబ్జాయితః
సత్యస్మిన్నతిదానభాజి కథమప్యాస్తాం స కల్పద్రుమః.
ఆస్తే నిర్వ్యయరత్నసమ్పదుదయోదగ్రః కథం యాచక
శ్రేణీవర్జనదుర్యశోనిబిడితవ్రీడస్తు రత్నాచలః॥ **67**

ప. వి. అర్థిభ్రంశబహూభవత్‌ఫలభరవ్యాజేన–కుబ్జాయితః–సతి–అస్మిన్–అతిదానభాజి–కథమ్–అపి–ఆస్తాం–సః–కల్పద్రుమః–ఆస్తే–నిర్వ్యయరత్నసమ్పదుదయోదగ్రః–కథం – యాచకశ్రేణీవర్జనదుర్యశోనిబిడితవ్రీడః–తు – రత్నాచలః.

అర్థము. అస్మిన్=ఈరాజు, అతిదానభాజి=అధికదానములనుఁ జేయుటయందు సమర్థుఁడుగాగా, సః=ప్రసిద్ధమైన, కల్పద్రుమః=మనస్సుతో కల్పించిన యర్థములనొసంగెడి కల్పవృక్షము,అర్థిభ్రంశబహూభవత్ఫలభరవ్యాజేన, అర్థిభ్రంశ = యాచకులు లేనందువలన, బహూభవత్=పెరిగిపోయిన, ఫలభర=ఫలసమూహముయొక్క, వ్యాజేన=నెపముచే, కుబ్జాయితస్సన్ =కుఱుచఁదనమునుఁ బొందినదై (వాస్తవమున లజ్జచే సంకోచించినదై) కథమపి=మిక్కిలి ప్రయాసతో, ఆస్తాం = ఉండునుఁగాత. కిన్తు=కాని, నిర్వ్యయరత్నసమ్పదుదయోదగ్రః;నిర్వ్యయ=వ్యయమునొందని, రత్నసమ్పదుదయోదగ్రః; రత్నసంపత్=రత్నసంపదలయొక్క, ఉదయ= ఆవిర్భావముచే, ఉదగ్రః=ఉన్నతత్వమునుఁ బొందిన, రత్నాచలస్తు= రోహణగిరియో, యాచకశ్రేణివర్జనదుర్యశోనిబిడితవ్రీడః;యాచకశ్రేణీ =యాచకపంక్తి చేత,వర్జన=వదలివేయుటవలనఁ గల్గిన, దుర్యశః = అపకీర్తిచే, నిబిడిత=ఘనమైన, వ్రీడః=సిగ్గుగలదై, కథమ్=ఎట్లు, ఆస్తే=ఉన్నది. రోహణపర్వతము ఉన్నతముగా నుండుటవలన నంద ఱికిని కానవచ్చుటచే, లజ్జవలన మఱుగు పరచుకొను నుపాయము లేక

యున్నది కల్పవృక్షమంత ఎత్తుగా నుండనందు వలన వానికి లజ్జవలన ముడుచుకొని పలసిన బాధ తక్కువయని యర్థము.

౨. ఇప్పుడు వృక్షమునకు, పర్వతమునకు, లజ్జతోటి సమ్బంధము లేకపోయినను, సమ్బంధమునుఁ జెప్పుటవలన సమ్బంధాతిశయోక్తి.

## సమాసములు :

అర్థిభ్రంశబహూభవత్ఫల భరవ్యాజేన :- అర్థినాంభ్రంశః=అర్థిభ్రంశః, అబహుః=బహుఃసమ్పద్యమానః=బహూభవన్, ఫలానాంభరః=ఫలభరః. బహూభవంశ్చాసౌఫలభరశ్చ=బహూభవత్ఫలభరః, అర్థిభ్రంశేన బహూభవత్ఫలభరః=అర్థిభ్రంశ బహూభవత్ఫలభరః, అర్థిభ్రంశ బహూభవత్ఫలభరస్యవ్యాజః=అర్థిభ్రంశ బహూభవత్ఫలభరవ్యాజః, తేన=అర్థిభ్రంశ బహూభవత్ఫలభరవ్యాజేన।

అతిదానభాజి :- అత్యంతందానం= అతిదానం=అతిదానంభజతీతి=అతిదానభాక్, తస్మిన్=అతిదానభాజి।

నిర్వ్యయరత్నసంపదుదయోదగ్రః :- నిర్గతఃవ్యయః యస్యాఃసా = నిర్వ్యయా, నిర్వ్యయాచసా రత్నసంపచ్చ=నిర్వ్యయసమ్పత్, నిర్వ్యయరత్న సంపదాముదయః = నిర్వ్యయరత్న సమ్పదుదయః, నిర్వ్యయరత్న సంపదుదయే ఉదగ్రః=నిర్వ్యయరత్న సంపదుదయోదగ్రః.

యాచకశ్రేణీవర్జనదుర్యశోనిబిడిత వ్రీడః :- యాచకానాంశ్రేణీ=యాచకశ్రేణీ, యాచకశ్రేణ్యాః వర్జనం=యాచకశ్రేణీ వర్జనమ్, యాచకశ్రేణీ వర్జనేన, దుర్యశః=యాచకశ్రేణీ వర్జనదుర్యశః, యాచకశ్రేణీ వర్జనదుర్యశసా నిబిడితా, వ్రీడా యస్యసః=యాచకశ్రేణీవర్జన దుర్యశోని బిడితవ్రీడః।

## భావము :

ఈరాజు అధికముగా దానములనుఁ జేయుచుండుటచే యాచకులు కల్పవృక్షముల కడకు పోవుట మానిరి. ఇట్లు యాచకులు లేకపోవుటచే, కల్పవృక్షముల యందలి ఫలములు వ్యయముఁ బొందనందు వలన నాపండ్ల భారముతో నావృక్షములు నిండిపోయి పొట్టిఁదనమును బొందినట్లు కానవచ్చుచున్నవి. వాస్త

వమున నవి ఫలభారముతో కుఱుచదనమును బొందలేదు. మరేమనగా, యాచకులు తమవద్దకు రానందువలని సిగ్గుతో కుఱుచదనము బొందినవి. కాని యిట్లు కుఱుచఁదనమును బొంది కల్పవృక్షమెట్లైన నుండనిమ్ము. కాని బొత్తిగా యాచకులు రానందు వలన రత్నరాశులు వ్యయము కానందువలన నున్నతముగా పెరిగిపోయి నలుగురికిని కానవచ్చుచున్న రోహణగిరి యొక్క పరిస్థితి యింకను తీవ్రమైనది. యాచకులాపర్వతమును వర్జించుటచే దానికి గొప్పదుర్దశ యేర్పడినది. అందువలన మిక్కిలి లజ్జననుభవించుచు నధికముగా పెరిగి యందఱికి కానవచ్చుటవలన, లజ్జను దాచుకొనుటకును నవకాశములేనిదై యున్నది. యాచకులు రాకపోవుట కల్పవృక్షమునకును, రోహణగిరికిని సమానమే యైనను కల్పవృక్షము కుఱుచదనమును బొంది యెట్లోయొకట్లు లజ్జను దాచుకొనగల యవకాశమును బొందియున్నది. రోహణగిరి రత్నరాశులతోఁ గూడి మిన్నునంటుకొనియుండుట వలన నందఱికిని కానవచ్చుచు లజ్జను దాచుకొనలేకయుండుటవలన రోహణగిరి పరిస్థితి కల్పవృక్ష పరిస్థితికంటెను తీవ్రమైనదని యాశయము॥౬౭॥

శ్లో. సృజామి కిం విఘ్నమిదన్నృపస్తుతా
విత్రీజ్గితైః పృచ్ఛతి తాం సఖీజనే ।
స్మితాయ వక్త్రం యదవక్రయద్వధూ
స్తదేవ వైముఖ్యమలక్షి తన్నృపే॥ 68

ప. వి. సృజామి–కిం – విఘ్నమ్ – ఇదంనృపస్తుతా–ఇతి-ఇజ్గితైః -పృచ్ఛతి - తాం - సఖీజనే - స్మితాయ - వక్త్రం - యత్ - అవక్రయత్ - వధూః - తత్ – ఏవ-వైముఖ్యమ్ - అలక్షి -తన్నృపే.

అర్థము. సఖీజనే = చెలికత్తెజనము, తాం =ఆదమయన్తిని, ఇదన్నృపస్తుతౌ; ఇదన్నృప = ఈ రాజుయొక్క, స్తుతౌ = పొగడ్తయందు, విఘ్నం = విఘ్నమును, సృజామికిం=సృజించుచున్నానాయేమి? ఇతి=అని, ఇజ్గితైః =చేష్టలచే, పృచ్ఛతిసతి = అడుగగా, వధూః=దమయన్తి, స్మితాయ = మందహాసమునుఁ జేయుటకు, వక్త్రం = ముఖమును, అవక్రయత్ =

వంకరిగావించెను, ఇతియత్ = అనునదేదిగలదో, తత్ = అందువలన, తన్నృపే=ఆరాజునందు, వైముఖ్యం=నిరాదరణము, అలక్షి = చూడఁ బడినది.

**సమాసములు :**

ఇదన్నృపస్తుతౌ : -అయంచాఽసౌనృపశ్చ=ఇదన్నృపః, ఇదన్నృపస్య స్తుతిః = తస్యాం=ఇదన్నృపస్తుతౌ.
సఖీజనే :- సఖ్యఏవజనః=సఖీజనః, తస్మిన్=సఖీజనే.
తన్నృపే :-సచాఽసౌనృపశ్చ=తన్నృపః, తస్మిన్=తన్నృపే.

**భావము :**

చెలికత్తెలు తాము ఎదుటనున్న రాజును ప్రశంసించుటలో విఘ్నము నాచరించుచున్నామేమోయని దమయన్తి యిఙ్గితమును గమనించి ప్రశ్నింపగా నాదమయన్తి మందహాసమునుఁ గావించుటకు తన మోమును వంకరగాఁ జేసి కొనినది. అదియే యారాజునందామెకు కల్గిన నిరాదరణమునకు సూచకమైనది॥౬౮॥

> శ్లో. దృశాఽథ నిర్దిశ్య నరేశ్వరాన్తరం
> మధుస్వరావక్తుమధీశ్వరా గిరామ్।
> అనూపయామాస విదర్భజాశ్రుతౌ
> నిజాస్యచంద్రస్య సుధాభిరుక్తిభిః॥ **69**

ప. వి. దృశా - అథ-నిర్దిశ్య - నరేశ్వరాన్తరం - మధుస్వరా - వక్తుమ్ - అధీశ్వరా - గిరామ్ - అనూపయామాస - విదర్భజాశ్రుతౌ - నిజాస్య చంద్రస్య-సుధాభిః-ఉక్తిభిః.

అర్థము. అథ=పిదప, మధుస్వరా = మధురకణ్ఠముగల్గిన, గిరాం= వాక్కులకు, అధీశ్వరా = అధిష్ఠానదేవతయైన సరస్వతి, నరేశ్వరాన్తరం=మఱియొక రాజునుఁ గూర్చి, వక్తుం=వర్ణించుటకు, దృశా = దృష్టిచే, నిర్దిశ్య = చూపించి, విదర్భజాశ్రుతౌ = దమయన్తిచెవియందు, నిజాస్యచంద్రస్య =తనముఖచంద్రునియొక్క, సుధాభిః=అమృతరూపములైన, ఉక్తిభిః=

మాటలతో, అనూపయాపూస = సరసత్వముఁ గావించెను. అనగా చెవులకు రెంటికి నార్ద్రతను గల్గించెను.

**సమాసములు :**

నరేశ్వరాన్తరం:- నరాణామీశ్వరః=నరేశ్వరః, అన్యోనరేశ్వరః=నరేశ్వరాన్తరం, తత్=నరేశ్వరాన్తరమ్.

మధుస్వరా :- మధుః స్వరః యస్యాస్సా = మధుస్వరా.

విదర్భజాశ్రుతౌ :- విదర్భేభ్యః జాయత ఇతి = విదర్భజా, విదర్భజాయాః శ్రుతిః = విదర్భజాశ్రుతిః, తస్యాం=విదర్భజాశ్రుతౌ.

నిజాస్యచంద్రస్య :- నిజంచతత్ ఆస్యంచ = నిజాస్యం. నిజాస్యమేవ చంద్రః=నిజాస్యచంద్రః, తస్య= నిచాస్యచంద్రస్య.

**భావము :**

మధురమైన కణ్ఠముగల వాగ్దేవి, మఱియొక రాజును తన దృష్టితో జూపించి దమయన్తి చెవియందు తనముఖ చంద్రుని యమృత ధారలతో నార్ద్రఁతను సరసత్వమును ననగా తడినిఁ గల్గించినది. అనగా దమయన్తికి వినకుతూహలమునుఁ చేకూర్చినదని భావము. ॥౬౯॥

**శ్లో.** **స కామరూపాధిప ఏష హా!త్వయా**
**న కామరూపాధిక ఈక్ష్యతేఽపి యః।**
**త్వమస్య సా యోగ్యతయా హి వల్లభా**
**సుదుర్లభా యత్ప్రతిమల్లభా పరా॥** **70**

ప. వి. సః- కామరూపాధిపః - ఏషః- హా- త్వయా - న - కామరూపాధికః- ఈక్ష్యతే- అపి- యః- త్వమ్ - అస్య - సా- యోగ్యతయా - హి - వల్లభా- సుదుర్లభా-యత్ప్రతిమల్లభా-పరా.

అర్థము. ఏషః = ఎదుటనున్న, యః= ఎవ్వడు, కామరూపాధికః; కామ=మన్మథునికంటెను, రూప = సౌందర్యమందు, అధికః = అధికుఁడో, సః = ఆప్రసిద్ధుఁడైన, కామరూపాధిపోషి; కామరూప = కామరూపదేశమునకు

అధిపఃఅపి = ప్రభువుఁగూడ, త్వయా = నీచే నేక్ష్యతే = చూడబడుట లేదా, హా = కష్టము, ఇదియుక్తముగాదు. (ఏలయనగా-) యత్ప్రతి మల్లభా; యత్=ఏ, తవ= నీకు, ప్రతిమల్ల = ప్రతిస్పర్థినియగు, భాః = కాంతిగల్గిన, పరా = మఱియొకయువతి, సుదుర్లభా = మిక్కిలిదుర్లభ మైనది, సా=అటువంటి, త్వం = నీవు, అస్య = ఇతినికి, యోగ్యతమా హి = మిక్కిలియర్హురాలవైన. వల్లభా = ప్రియురాలవు. సమానసౌంద ర్యమునుఁ గల్గియుండుటవలన నీకితడు వరింపఁ దగిన వాఁడనియర్థము.

**సమాసములు :**

కామరూపాధిపః:- కామరూపాణామధిపః=కామరూపాధిపః.

కామరూపాధికః:- రూపాత్ అధికః, రూపాధికః, కామాత్రూపాధికః = కామరూపాధికః ।

యోగ్యతమా:- అత్యంతంయోగ్యా = యోగ్యతమా.

సుదుర్లభా :- దుఃఖేనలబ్ధుంశక్యా = దుర్లభా, అత్యంతందుర్లభా = సుదుర్లభా ।

యత్ప్రతిమల్లభా :- యస్యాఃప్రతిమల్లా, భాః యస్యాస్సా= యత్ప్రతి మల్లభా ।

**భావము :**

ఎదుటనున్న యీ రాజు కామరూపదేశమునకేలిక. సౌన్దర్యమునందు మన్మథునిమించినవాఁడు. అతనిని నీవు చూడకుండుట యుక్తముగాదు. ఏల యనగా, నీ సౌందర్యముతో పోటీచేయగల మఱియొకస్త్రీ యెక్కడను లభ్యము గాదు. అట్టి సౌందర్యముగల నీవు, ఈ రాజునకు తగినదానవు. ప్రియురాలవు, సమానమగు సౌందర్యము గల నీకు సమాగమమునకర్హుడైన యీ రాజు చూఁడఁదగినవాఁడు॥౭౦॥

శ్లో. అకర్ణధారాశుగసమ్భృతాఙ్గతాం
గతైరరిత్రేణ వినాస్య వైరిభిః।
విధాయ యావత్తరణేర్భిదామహో
నిమజ్జ్య తీర్ణః సమరే భవార్ణవః॥ 71

ప. వి. అకర్ణధారాశుగసమ్భృతాఙ్గతాం—గతైః- అరిత్రేణ- వినా-అస్య- వైరిభిః- విధాయ- యావత్- తరణేః- భిదామ్- అహో!-నిమజ్జ్య-తీర్ణః- సమరే- భవార్ణవః-

అర్థము. అకర్ణధారాశుగసమ్భృతాఙ్గతాం; అకర్ణ=చెవిపంటిభాగము లేని, ధారా= అంచుగల్గిన, ఆశుగ=బాణములచే, సమ్భృత= నిండిన, అఙ్గతాం=శరీరము గల్గియుండుటను, గతైః= పొందినట్టి. అస్య=ఇతనియొక్క, వైరిభిః= శత్రువులచే, అరిత్రేణ వినా = కవచాదికములేక, సమరే=యుద్ధమునందు, నిమజ్జ్య = పడి, తరణేః = సూర్యుని, భిదాం = భేదించుటను, విధాయ = చేసి, భవార్ణవః = సంసారసాగరము, తీర్ణః=దాటఁబడినది. అహో=ఆశ్చర్యము.

—అర్థాన్తరము—

అకర్ణధారాశుగసమ్భృతాఙ్గతాం; అకర్ణధార = నావికుడులేనందువల్ల, ఆశుగ = గాలిచే, సమ్భృత =కదలింపఁబడిన, అఙ్గతాం= దేహమును, గతైః = పొందినట్టి, జనైః = జనులచే, అరిత్రేణ = ఓడకువెనుక భాగమునకట్టినకొయ్యచే, వినా = లేకుండ, తరణేః= ఓడకు, భిదాం = భంగమును, విధాయ = చేసి, నిమజ్జ్య = సముద్రమందుమునిగి, భవార్ణవః = సంసారసాగరము, తీర్ణః = దాటఁ బడినదనునర్థము సూచితము.

**సమాసములు :**

అకర్ణధారాశుగసమ్భృతాఙ్గతాం :- అవిద్యమానః కర్ణఇవకర్ణః యేషాంతే = అకర్ణాః. ధారాయుక్తాః ఆశుగాః = ధారాశుగాః, అకర్ణాశ్చతే ధారాశుగాశ్చ = అకర్ణధారాశుగాః, అకర్ణధారాశుగైః సమ్భృతమఙ్గం యేషాంతే =అకర్ణధారాశుగ సమ్భృతాఙ్గాః, అకర్ణధారాశుగసమ్భృతాఙ్గానాంభావః= అకర్ణధారాశుగ సమ్భృతాఙ్గతా, తామ్=అకర్ణధారాశుగ సమ్భృతాఙ్గతాం. అరిత్రేణ :- అరిభ్యః త్రాయతఇతి = అరిత్రం తేన=అరిత్రేణ.

భవార్ణవః :- భవఏవఅర్ణవః=భవార్ణవః.

**భావము :**

చెవివంటి యినుపముల్లులేనట్టి వాడి యంచులుగల బాణములతో నింపఁబడిన శత్రుదేహములను కవచాదులు లేక యుద్ధమునందు పడవేయగా వారు సూర్యమండలమును భేదించి సంసార సముద్రమును దాటిరిగదా. ఆశ్చర్యము. యుద్ధరంగమున మడిసినవారు సూర్యమండలమును భేదించుకొని మోక్షము నొందెదరు కాననే,

"ద్వావిమౌ పురుషౌలోకే సూర్యమణ్డల భేదినౌ.
పరివ్రాట్ యోగయుక్తశ్చ రణేచాభిముఖేహతః"

అను శాస్త్రము ననుసరించి లోకమున యోగముతోఁగూడిన సన్న్యాసియు, యుద్ధమున సమ్ముఖమునఁ జంపఁబడినవాడును సూర్యమండలమును భేదించుకొని మోక్షమునుఁ బొందుదురు. కాన యుద్ధరంగమున మడిసిన యాతని శత్రువులు పై విధముగా మోక్షమునుఁ బొందిరని యాశయము ॥౭౧॥

శ్లో. అముష్య భూలోకభుజో భుజోష్మభి
స్తపర్తురేవ క్రియతేఽరివేశ్మని।
ప్రపాం న తత్రారివధూ స్తపస్వినీ
దదాతి నేత్రోత్పలవాసిభిర్జలైః॥ 72

ప. వి. అముష్య-భూలోకభుజః-భుజోష్మభిః-తపర్తుః-ఏవ-క్రియతే-అరివేశ్మని-ప్రపాం-న-తత్ర - అరివధూః- తపస్వినీ-దదాతి - నేత్రోత్పలవాసిభిః-జలైః.

అర్థము. అముష్య=ఈ, భూలోకభుజః=భూలోకమునేలు అనగా సూర్యునివలె నాకసమున సంచరించనట్టి-, రాజ్ఞః=రాజుయొక్క-, భుజోష్మభిః = భుజముల యందలి ప్రతాపములచే, అరివేశ్మని=శత్రుగృహమునందు, తపర్తురేవ=గ్రీష్మర్తువే, క్రియతే=చేయఁబడుచున్నది, అనగా శత్రు గృహమునందు నిరన్తరము సంతాపము చేయఁబడుచున్నది, తత్ర = ఆ శత్రుగృహమునందు, తపస్వినీ=శోచనీయురాలును, ధర్మస్వభావము

గలదియునగు, అరివధూః=శత్రువనిత, నేత్రోత్పలవాసిభిః—తన కలువ కన్నులయందుండెడి, జలైః=కన్నీళ్ళచే, మరియు కలువ నెత్తావి గల యుదకములతో, ప్రపాం = చలిపందిరిని, నదదాతి= ఈయదా? యేమి అనగాచల్లనీళ్ళనిచ్చెడి పానశాలను నడుపదాయేమి? ధర్మబుద్ధిగలవారు గ్రీష్మకాలమందుపరిమళించెడి యుదకములతో చలిపందిరినినడుపుదురు· రాజు శత్రువులనందఱినిఁ జంపుటవలన వారి స్త్రీ లెల్లప్పుడును నేడ్చు చున్నారని యర్థము.

**సమాసములు :**

భూలోకభుజః :- భూరితిలోకః = భూలోకః, భూలోకంభుఙ్క్ఇతి = భూలోకభుక్, తస్య=భూలోకభుజః।

భుజోష్మభిః :- భుజయోరూష్మాణః=భుజోష్మాణః. తైః=భుజోష్మభిః.

అరివేశ్మని :- అరేః వేశ్మ=అరివేశ్మ. తస్మిన్=అరివేశ్మని.

అరివధూః :- అరీణాంవధూః=అరివధూః.

నేత్రోత్పలవాసిభిః :- నేత్రేఉత్పలే ఇవ = నేత్రోత్పలే, నేత్రోత్పలయోః వస న్తీతి = నేత్రోత్పలవాసీని, తైః =నేత్రోత్పలవాసిభిః. లేదా నేత్రోత్పలైఃవాసీని=నేత్రోత్పలవాసీని, తైః=నేత్రోత్పలవాసిభిః.

**భావము :**

సూర్యునివలె నాకసమున సంచరింపకపోయినను, భూలోకవాసియే యైనను, ఈప్రభువుయొక్క బాహువులను వెల్వడు ప్రతాపాగ్నినుండిజ్వాలలచే శత్రువుల గృహములయందు నిరంతరముగ్రీష్మర్తు వేజరుగుచున్నది. అందువలన ఆ గృహములయందు నివసించు శత్రువనితలు తమ కలువకన్నులలో నుత్పన్నములగు కన్నీళ్లచేతను,కలువకన్నులలో నుండుటచే పరిమళభరితములగు చల్లని యుదకములచేతను, చలిపందిరిని నడుపుచున్నారు. ధార్మికులు ఎండకాలమందు పిపాసితులకు పరిమళోపకములనుఁ బోయుటకై చలువపందిళ్ళను వేయించి నడుపుట ప్రసిద్ధముగదా! ఈ తని శత్రువులందఱును సంహరింపఁబడుటవలన శత్రుకాంతలు నిరంతరము దుఃఖించుచున్నారని యాశయము। ౭౨॥

శ్లో. ఏతద్దత్తాసిఘాతస్రవదసృగసుహృద్వంశసార్ద్రేన్ధనైత
ద్దోరుద్దామప్రతాపజ్వలదనలమిలద్భూమధూమభ్రమాయ।
ఏతద్దిగ్జైత్రయాత్రాऽసమసమరభరం పశ్యతః కస్య నాసీ
దేతన్నాసీరవాజివ్రజఖురజరజోరాజిరాజిస్థలీషు॥ 73

ప. వి. ఏతద్దత్తాసిఘాతస్రవదసృగసుహృద్వంశసార్ద్రేన్ధనైతద్దోరుద్దామ ప్రతాప జ్వలదనలమిలద్భూమధూమభ్రమాయ- ఏతద్దిగ్జైత్రయాత్రాऽసమసమర భరం - పశ్యతః - కస్య - న — ఆసీత్ - ఏతన్నాసీరవాజివ్రజఖురజ రజోరాజిః-ఆజిస్థలీషు.

అర్థము. ఆజిస్థలీషు=యుద్ధరంగములయందు, ఏతద్దత్తాసిఘాతస్రవదసృగసుహృ ద్వంశసార్ద్రేన్ధనైతద్దోరుద్దామ ప్రతాపజ్వలదనల మిలద్భూమధూమభ్ర మాయ ; ఏతత్=ఈరాజుచే, దత్త=ఈయఁబడిన, అసిఘాత=కత్తిదెబ్బ లచే, స్రవత్=కారుచున్న, అసృక్=నెత్తురుగల, అసుహృత్=శత్రువుల యొక్క, వంశ=వంశమనెడి వెదుళ్ళ రూపముననున్న, సార్ద్రేన్ధన = పచ్చికట్టెలుగల్గిన, ఏతత్=ఈ రాజుయొక్క, దోః = భుజములయొక్క, ఉద్దామ = తీవ్రమైన, ప్రతాప = ప్రతాపమను, జ్వలదనల=మండునిప్పు నందు, మిలత్=కలియుచున్న, భూమ=అధికమైన, ధూమ=పొగయను, భ్రమాయ = భ్రాన్తికై, ఏతద్దిగ్జైత్రయాత్రాऽసమసమరభరం ; ఏతత్ =ఈతనియొక్క, దిగ్జైత్రయాత్రా=దిగ్విజయయాత్రలయందలి, అసమ =సాటిలేని, సమర=యుద్ధముయొక్క, భరం=భారమును, పశ్యతః=చూచు చున్న, కస్య జనస్య = ఏజనమునకు, ఏతన్నాసీరవాజివ్రజఖురజరజో రాజిః ; ఏతత్ = ఈతనియొక్క, నాసీర = సేనాగ్రమందలి, వాజివ్రజ =గుఱ్ఱపుదండుయొక్క, ఖుర=గిట్టలనుండి, జ = ఉద్భవించిన, రజో రాజిః = ధూళీపటలము, నాऽऽసీత్=కాలేదు. అనగా ధూమభ్రాన్తికి, కారణమేయైనది.

వి. ధూళీపటలమునందలి ధూమభ్రమనుఁ జెప్పుటవలన భ్రాన్తిమదలఙ్కా రము.

సమాసములు :

ఏతద్దత్తాసిఘాత స్రవదసృగసుహృద్వంశ సార్ద్రేర్ష్వనైతద్దోరుద్దామ ప్రతాపజ్వలదనల మిలద్ధూమధూమభ్రమాయ:- ఏతేనదత్తాః = ఏతద్దత్తాః, అసేఃఘాతాః=అసిఘాతాః, ఏతద్దత్తాశ్చతే, అసిఘాతాశ్చ = ఏతద్దత్తాసిఘాతాః, ఏతద్దత్తాసిఘాతైః స్రవదసృజః యేషాంతే = ఏతద్దత్తాసిఘాతస్రవదసృజః, ఏతద్దత్తాసిఘాతస్రవదసృజశ్చతేఅసుహృదశ్చ =ఏతద్దత్తాసిఘాతస్రవదసృగసుహృదః, ఏతద్దత్తాసిఘాతస్రవదసృగసుహృదాం వంశాఏవవంశాః, = ఏతద్దత్తాసిఘాతస్రవదసృగసుహృద్వంశాః, ఏతద్దత్తాసిఘాతస్రవదసృగసుహృద్వంశాఏవసార్ద్రేర్ష్వనాసియస్యసః = ఏతద్దత్తాసిఘాతస్రవదసృగసుహృద్వంశాసార్ద్రేర్ష్వనః, ఏతస్యదోషా = ఏతద్దోషా, ఏతద్దోషోఃఉద్దామప్రతాపః, = ఏతద్దోరుద్దామప్రతాపః, ఏతద్దోరుద్దామప్రతాపఏవజ్వలదనలః = ఏతద్దోరుద్దామప్రతాజ్వలదనలః, ఏతద్దత్తాసిఘాతస్రవదసృగసుహృద్వంశసార్ద్రేర్ష్వనశ్చా సౌఏతద్దోరుద్దామప్రతాపజ్వలదనలశ్చ = ఏతద్దత్తాసిఘాతస్రవదసృగసుహృద్వంశసార్ద్రేర్ష్వనైతద్దోరుద్దామప్రతాపజ్వలదనలః, ఏతద్దత్తాసిఘాతస్రవదసృగసుహృద్వంశసార్ద్రేర్ష్వనైతద్దోరుద్దామప్రతాపజ్వలనేమిలన్ ధూమధూమః=ఏతద్దత్తాసిఘాతస్రవదసృగసుహృద్వంశసార్ద్రేర్ష్వనైతద్దోరుద్దామ ప్రతాపజ్వలనదనలమిలద్ధూమధూమః. ఏతద్దత్తాసిఘాతస్రవదసృగసుహృద్వంశసార్ద్రేర్ష్వనైతద్దోరుద్దామప్రతాపజ్వలదనలమిలద్ధూమధూమస్యభ్రమః= ఏతద్దత్తాసిఘాతస్రవదసృగసుహృద్వంశసార్ద్రేర్ష్వనైతద్దోరుద్దామ ప్రతాపజ్వలదనలమిలద్ధూమధూమభ్రమః, తస్మై = ఏతద్దత్తాసిఘాతస్రవదసృగసుహృద్వంశసార్ద్రేర్ష్వనైతద్దోరుద్దామ ప్రతాపజ్వలదన లమిలద్ధూమధూమభ్రమాయ॥

ఏతద్దిగ్జైత్రయాత్రాఽసమసమరభరమ్:- దిశోజైత్రాః=దిగ్జైత్రాః, దిగ్జైత్రాశ్చతాః యాత్రాశ్చ = దిగ్జైత్రయాత్రాః, ఏతస్యదిగ్జైత్రయాత్రాః = ఏతద్దిగ్జైత్రయాత్రాః, అసమశ్చాసౌసమరశ్చ = అసమసమరః, అసమసమరస్యభరః=అసమసమరభరః,ఏతద్దిగ్జైత్రయాత్రాసు, అసమసమరభరః=

ఏతద్దిగ్జైత్రయాత్రాఽసమసమరభరః, తమ్ =ఏ తద్దిగ్జైత్రయాత్రాఽసమ సమరభరమ్॥

ఏతన్నాసీరవాజివ్రజఖురజరజోరాజిః :— ఏతస్యనాసీరః= ఏతన్నాసీరః, ఏతన్నాసీరే, వాజినః =ఏతన్నాసీరవాజినః, ఏతన్నాసీరవాజినాం వ్రజః = ఏతన్నాసీరవాజివ్రజః, ఏతన్నాసీరవాజివ్రజస్యఖురాః = ఏతన్నాసీరవాజివ్రజఖురాః, ఏతన్నాసీరవాజివ్రజఖురాణాంరజాంసి = ఏతన్నాసీరవాజివ్రజఖురరజాంసి, ఏతన్నాసీరవాజివ్రజఖురరజసాంరాజిః = ఏతన్నాసీరవాజివ్రజఖురరజోరాజిః.

ఆజిస్థలీషు :- ఆజేఃస్థల్యః=ఇజిస్థల్యః. తాసు=ఆజిస్థలీషు.

భావము :

యుద్ధరంగములయందు గుఱ్ఱముల గిట్టలచే నుద్భవించిన ధూళిరేఖ ఈతని జైత్రయాత్రలయందు సాటిలేని యుద్ధవ్యాపారమునుఁజూచు జనమునకు ఈ రాజుయొక్క కత్తిదెబ్బలనుండి కారుచున్న రక్తముగల శత్రువులనెడి వెదుళ్ళను పచ్చి కట్టెలుగా గల్గిన యాతని ప్రతాపాగ్నినుండి యుద్భవించిన మిక్కుటమగు ధూమమనెడి భ్రాన్తినిఁగల్గించుచున్నది. ఈతని కత్తిదెబ్బలనుండి కారిన రక్తముచే శత్రువులనెడి వెదుళ్ళు తడిసినవి. అట్టి వెదుళ్ళు, ఈతని ప్రతాపాగ్నికి కట్టెలైనవి. అవి తడిసినందువలన పొగనుఁగొట్టుచున్నవి గుఱ్ఱము గిట్టలనుండి లేచిన ధూళి చూచువారికి, పైనఁబేర్కొనిన పొగయను భ్రాంతినిఁగల్గించుచున్నదని యాశయము- ॥౭౩॥

**శ్లో. క్షీరోదన్వదపాః ప్రమథ్య మథితాదేశోఽమరైర్నిర్మితే**
**స్వాక్రమ్యం సృజత స్తదస్య యశసః క్షీరోదసింహాసనమ్।**
**కేషాం నాఽజని వా జనేన జగతామేతత్కవిత్వామృత**
**స్రోతఃప్రోతపిపాసుకర్ణకలసీభాజాభిషేకోత్సవః॥ 74**

ప. వి. క్షీరోదన్వదపాః - ప్రమథ్య - మథితాదేశః - అమరైః - నిర్మితే - స్వాక్రమ్యం - సృజతః - తత్ - అస్య - యశసః - క్షీరోద సింహా

సనమ్ – కేషాం-న-అజని-వా-జనేన-జగతామ్ – ఏతత్కవిత్వామృత స్రోతః ప్రోతపిపాసు కర్ణకలసీభాజా-అభిషేకోత్సవః.

అర్థము. అమరైః=దేవతలచే, క్షీరోదన్వదపాః; క్షీరోదన్వత్=పాలకడలియొక్క, అపాః=ఉదకములను, ప్రమథ్య=చిలికి, మథితాదేశే, మథిత=చిలుకుటచే నేర్పడిన మజ్జిగయను నా దేశమువంటి యాదేశమనెడి, మఱియొక రూపము. (పాలకు మజ్జిగ రూపాంతరము గదా), నిర్మితే-నిర్మింపఁ బడగా, (అనగా పాల్కడలినిఁజిలుకుటచే నది మజ్జిగగా నేర్పడి పాలకు, అభావమేర్పడి పాలకడలియే లేకపోగా లేదా, ద్రవము పైన నిలచుటకు వలనుగాదు కావున పాలుగానుండెడి దాని జలము చిక్కఁబడి మిక్కిలి గట్టిగాఁజేయఁబడగా, తత్=ఆ ప్రకారము, క్షీరోదసింహాసనం; క్షీరోద=క్షీరముగాఁ ప్రసిద్ధినొందిన యుదకము గల్గిన పాలకడలియను, సింహాసనం=సింహాసనమును, స్వాక్రమ్య = స్వయముగా నాక్రమించి, లేదా, సుఖముగా నాక్రమించి కూర్చుండుటకు తగినదిగా, సృజతః = చేయుచున్న అనగా గడ్డ కట్టిన పాలసముద్రముపై నాసీనమైన, అస్య= ఈ రాజుయొక్క, యశసః=యశమునకు, ఏతత్క విత్వామృతస్రోతః ప్రోత పిపాసు కర్ణకలసీభాజా: ఏతత్=ఈ రాజునకు సంబంధించిన, కవిత్వ=కావ్యము లేదా కవిచే రచియింపఁబడిన యీ రాజునకు సంబంధించిన కీర్తి వర్ణనరూపమగు కావ్యమును, అమృత=కర్ణరసాయనమైన యమృతముయొక్క, స్రోతః = ప్రవాహముచే, ప్రోత=పూరింపఁబడిన, పిపాసు=ఆదరముతో వినఁగోరిన జనులయొక్క, కర్ణ=చెవులనెడి, కలసీ=కుంభములను, భాజా=పొందిన, కేషాం వా జగతాం=ఏ ప్రపంచములయొక్క, జనేన=జనముచే, అభిషేకోత్సవః = అభిషేకముచేఁ గల్గిన యానందోత్సవమున, న అజని=కల్పింపఁబడలేదు. లోకాంతర మందలి కవులును, పాలకడలివరకు వ్యాపించిన యీతని యశస్సు నంతటను నానందకరముగా వర్ణించుచుండిరి. ఇతని కీర్తి లోక పరమ్పరతో పాలకడలి వరకును పోవుచున్నది. దేవతలు క్షీరసాగరమునుఁ జిలుకగా నందు నీరు లేనందువలన, క్షీరోద సముద్రరూపమైన సింహాసనమును నితని కీర్తియధిష్ఠింపగా, నీతని కీర్తియును క్షీరసాగరమును వర్ణించునట్టి కవులందఱును నభిషేకము చేయువారుగను, కవిత్వమే

జలముగను, శ్రోతలయొక్క చెవులే యభిషేక కలశములుగను నం దుద్భవించిన నదులు పారుటవలన నేర్పడిన ధ్వనియను స్తుతియే అభి షేకముఅయినవి. లేదా ; లోకమునందు నెట్లొక రాజు మఱియొకరాజుచే మథింపఁబడగా ననగా చంపఁబడగా, అతని సింహాసనము నాక్రమించి, యధిష్టించిన మఱియొకనిని ప్రజలు జలపూర్ణ కలశములచే నెట్లభిషేక ముఁజేతురో, యట్లని భావింపలయును.

వి. ఇంమ రాజులయొక్క కీర్తి క్షీరసాగరముగను, కవులసంతతి నభిషేక కర్తలుగను కవిత్వమును జలముగను శ్రోతలకర్ణములను కలశములు గను స్తుతి నభిషేకముగను రూపించుటవలన నంతట రూపకాల ఙ్కారము.

**సమాసములు :**

క్షీరోదన్వదపాః:- క్షీరాణాముదన్వాత్ = క్షీరోదన్వత్, క్షీరోదన్వతః అపః = క్షీరోదన్వదాపః, తాః = క్షీరోదన్వదపాః.

మథితాదేశే :- మథితస్య ఆదేశః = మథితాదేశః, తస్మిన్ = మథితాదేశే.

స్వాక్రమ్యం:- స్వస్య ఆక్రమ్యం = స్వాక్రమ్యం, లేదా, సుష్ఠు ఆక్రమ్యం = స్వాక్రమ్యం, తత్ = స్వాక్రమ్యం.

క్షీరోదసింహాసనమ్ :- క్షీరముదకం యస్యసః = క్షీరోదః, క్షీరోదఏవ సింహాసనమ్ - క్షీరోదసింహాసనం, తత్ = క్షీరోదసింహాసనమ్.

ఏతత్కవిత్వామృతస్రోతః ప్రోతపిపాసు కర్ణకలసీభాజా :- ఏతస్య కవిత్వం = ఏతత్కవిత్వమ్, ఏతత్కవిత్వమేవ అమృతం = ఏతత్కవిత్వా మృతం, ఏతత్కవిత్వామృతస్య, స్రోతః = ఏతత్కవిత్వామృతస్రోతః ఏతత్కవిత్వామృతస్రోతసా, ప్రోతః = ఏతత్కవిత్వామృతస్రోతః ప్రోతః, ఏతత్కవిత్వామృత స్రోతః ప్రోతశ్చాసౌపిపాసుశ్చ = ఏతత్క విత్వామృతస్రోతః ప్రోతపిపాసుః. ఏతత్కవిత్వామృతస్రోతః ప్రోత పిపాసోః, కర్ణౌ = ఏతత్కవిత్వామృతస్రోతః ప్రోతపిపాసుకర్ణౌ, ఏతత్కవిత్వామృతస్రోతఃప్రోతపిపాసు, కర్ణావేవకలస్యౌ = ఏతత్క విత్వామృత స్రోతఃప్రోతపిపాసుకర్ణకలస్యౌ ఏతత్కవిత్వామృతస్రోతః

ప్రోతపిపాసు. కర్ణకలస్యాభజతేతి = ఏతత్కవిత్వామృతస్రోతః ప్రోతపిపాసుకర్ణకలసీభాజే, తే = ఏతత్కవితామృత స్రోతః ప్రోత పిపాసుకర్ణకలసీభాజా.

అభిషేకోత్సవః :- అభిషేక ఏవ ఉత్సవః = అభిషేకోత్సవః.

**భావము:**

దేవతలు పాలసముద్రమునందు, పాలుగానున్న జలమును చిలికిరి. అట్లు చిలుకగా నాపాలకు వికారమైన మజ్జిగ, దానికి, ఆదేశముగా వచ్చినది. అందువలన పూర్వమున్నట్టి క్షీరము పోయి మజ్జిగ యేర్పడినది. ఇట్లు చేయుట వలన పాలకడలికి నభావమేర్పడినది. లేదా, ద్రవపదార్థముపైన నాసీనమగుట యసంభవము కాన క్షీరసాగరమందలి దుగ్ధరూపమైన నీరు మిక్కిలి గట్టిగాఁ జేయఁబడి దానిపైఁ గూర్చుండుటకనుకూలముగాఁ గావింపఁ బడినది. అట్లు గట్టి పడుటవలన, పాలకడలి సింహాసనముగనేర్పడి కీర్తి దానిని సుఖముగా నాక్రమించుటకు వలనుపడినది. ఈతనియశమునకు, నీతనికిని సంబంధించిన కవిత్వమనగా నీతనిని నీతనకి సంబంధించిన కీర్తిని వర్ణించునట్టి కావ్యమనెడి యమృతముయొక్క లేదా కర్ణరసాయనముయొక్క ప్రవాహముచే నింపఁ బడిన తమ కర్ణములనెడి కలశములుగల్గిన అన్ని లోకములయందలి జనముచేత నభిషేకోత్సవము జరిపింపఁ బడలేదా? లోకాన్తరమందలి కవులు, క్షీరసాగర పర్యన్తము వ్యాపించిన నీతని కీర్తిని నానందప్రదముగ వర్ణించుచుండిరి. దేవతలు సముద్రమునుఁ జిలుకగా దానియందలి జలముతొలగిపోయినది. అప్పుడు ఈ నరపతియొక్క కీర్తి యాక్షీరసాగరమును సింహాసనము నలఙ్కరింపగా నీతని యశః క్షీరసాగరమును వర్ణించు కవులందఱును నభిషేకకర్తలుగను, కవిత్వము జలముగను, శ్రోతల కర్ణములు అభిషేక కలశములుగను నా సముద్రమును చేరెడునదులధ్వనియనుస్తుతి యభిషేకక్రియగను నైనవి. లేదాలోకము నందొకరాజు మఱియొకనిచే మథింపఁ బడగా, నాతని సింహాసనము నాక్రమించి యధిష్ఠించిన మఱియొకనికి జనులు జలపూర్ణకుంభములతో నభిషేకింతురు. ఆ విధముగనే కవులు కీర్తి వర్ణనమైన కావ్యామృతముయొక్క ప్రవాహముతో నిండిన, శ్రోతలయొక్క కర్ణకలశములతో నితరలోకములకు సంబంధించిన జన

ముచే నభిషేకోత్సవమేల ఈ రాజునకు కల్పింపఁబడదు ? తప్పక కల్పింపఁ బడునని యాశయము॥౭౪॥

శ్లో. సమితి పతినిపాతాకర్ణనద్రాగదీర్ణ
ప్రతినృపతిమృగాక్షీలక్షవక్షఃశిలాసు।
రచితలిపిరివోరస్తాడనవ్యస్తహస్త
ప్రఖరనఖరటఙ్కైరస్య కీర్తిప్రశస్తిః॥ 75

ప. వి. సమితి- పతినిపాతాకర్ణనద్రాగదీర్ణప్రతినృపతిమృగాక్షీలక్షవక్షః శిలాసు -రచితలిపిః- ఇవ-ఉరస్తాడనవ్యస్తహస్తప్రఖరనఖరటఙ్కైః- అస్య- కీర్తిప్రశస్తిః.

అర్థము. అస్య = ఈరాజుయొక్క, కీర్తి ప్రశస్తిః = యశస్సుయొక్క ప్రశంస, సమితి = యుద్ధమునందు, పతినిపాతాకర్ణనేఽపి = భర్తలమరణమును వినినను, ద్రాగదీర్ణప్రతినృపతిమృగాక్షీలక్షవక్షః శిలాసు; ద్రాగ్ = వెంటనే, ఆదీర్ణ = భిన్నముకాని, ప్రతినృపతి = శత్రురాజులయొక్క, మృగాక్షీ = వనితలయొక్క, లక్ష = లక్షసంఖ్యగల, వక్షఃశిలాసు = వక్షస్థలములను బండలయందు, ఉరస్తాడనవ్యస్త హస్తప్రఖరనఖర టఙ్కైః; ఉరస్తాడన = రొమ్ములనుకొట్టుకొనుటయందు, వ్యస్త = ఆసక్తములైన, హస్త = చేతులయొక్క, ప్రఖర = వాడిమిగల, నఖర = గోరులనెడు, టఙ్కైః = ఉలులచే, రచితలిపిరివ = వ్రాయఁ బడినయక్షరపఙ్క్తిగలదానివలె, భాతి=ప్రకాశించుచున్నది.

వి దుఃఖాతిశయముచే వక్షఃస్థలమునఁజేయఁ బడిన గోళ్లగీతలు కీర్తి ప్రశస్తి యొక్కయక్షరములుగా భావింపఁ బడినవిగాన నుత్ప్రేక్ష.

**సమాసములు :**

పతినిపాతాకర్ణనే:- పతీనాంనిపాతః = పతినిపాతః, పతినిపాతస్య ఆకర్ణనమ్=పతినిపాతాకర్ణనమ్, తస్మిన్ = పతినిపాతాకర్ణనే,

ద్రాగదీర్ణప్రతినృపతిమృగాక్షీలక్షవక్షఃశిలాసు:- ద్రాక్, అదీర్ణాః= ద్రాగదీర్ణాః, ప్రతికూలాః నృపతయః = ప్రతినృపతయః, ప్రతినృపతీనాం

మృగాక్ష్యః = ప్రతినృపతిమృగాక్ష్యః, లక్షాసిచతాని, పక్షాంసిచ = లక్ష పక్షాంసి, లక్షవక్షాంస్యేవశిలాః = లక్షవక్షఃశిలాః, ప్రతినృపతిమృగాక్షీ ణాం లక్షవక్షఃశిలాః = ప్రతినృపతిమృగాక్షీలక్షవక్షఃశిలాః, తాసు = ప్రతినృపతిమృగాక్షీలక్షవక్షఃశిలాసు.

రచితలిపిః:- రచితాచసాలిపిశ్చ=రచితలిపిః.

ఉరస్తాడనవ్యస్తహస్తప్రఖరనఖరటఙ్కైః:- ఉరసాంతాడనాని=ఉరస్తాడ నాని, ఉరస్తాడనేషువ్యస్తాః = ఉరస్తాడనవ్యస్తాః, ఉరస్తాడనవ్యస్తాశ్చతే హస్తాశ్చ=ఉరస్తాడనవ్యస్తహస్తాః,ప్రఖరాశ్చతేనఖరాశ్చ=ప్రఖరనఖరాః, ఉరస్తాడనవ్యగ్రహస్తానాంప్రఖరనఖరాః=ఉరస్తాడనవ్యస్తహస్తప్రఖరన ఖరాః,ఉరస్తాడనవ్యస్తహస్తప్రఖర నఖరాఏవటఙ్కాః= ఉరస్తాడనవ్యస్త హస్త ప్రఖరనఖరటఙ్కాః, తైః = ఉరస్తాడనవ్యస్తహస్తప్రఖరన ఖరటఙ్కైః।

కీర్తిప్రశస్తిః:- కీర్తేఃప్రశస్తిః = కీర్తిప్రశస్తిః।

**భావము :**

యుద్ధమున భర్తలు చనిపోయినను వెంటనే వారి కాంతల హృదయము పగిలిపోలేదు. వారు లక్షలకొలదిగానుండిరి. ఆ హృదయములు పగిలిపోనందు వలన నవి బండలవలె కఠినములైనవి. ఆ స్త్రీలు పతి మరణదుఃఖముచే రొమ్ములుబాదుకొనుచుండిరి. అప్పుడు వారి చేతులలోని వాడిగోరుల నెడియులులు రొమ్మును గీచుకొనుటవలన నాగీతలు, కామరూప దేశప్రభువును గూర్చిరచించిన కీర్తిప్రశస్తికి సంబంధించిన యక్షర పంక్తివలెనున్నవి ॥౭౫॥

శ్లో. విధాయ తామ్బూలపుటీం కరఙ్కగాం
బభాణ తామ్బూలకరఙ్కవాహినీ।
దమస్వసుర్భావమవేత్య భారతీం
నయాऽనయా వక్త్రిపరిశ్రమం శమమ్॥ 76

ప. వి. విధాయ - తామ్బూలపుటీం - కరఙ్కగాం - బభాణ - తామ్బూల కరఙ్కవాహినీ - దమస్వసుః - భావమ్ - అవేత్య - భారతీం - నయ - అనయా - వక్త్రిపరిశ్రమం - శ్రమమ్.

అర్థము తామ్బూలకరఙ్కవాహినీ = తాంబూలపు పెట్టెను మోసెటి పరిచారిక, దమస్వసుః = దమయన్తి యొక్క, భావం = అభిప్రాయమును, - ఆ రాజును వర్ణింపవలదను నభిప్రాయమును, అవేత్య = తెలిసికొని. తామ్బూలపుటీం = తమలపాకు మడతను, కరాఙ్కగాం; కర=హస్తమునకు, అఙ్కగాం = సమీపమందున్న దానినిగా, విధాయ = కావించి, అనయా = ఈతామ్బూలపు మడతచే, వక్త్రిపరిశ్రమం = చాల కాలము కామరూపదేశ ప్రభువును వర్ణించుటవలని శ్రమను, శమం = శాంతిని, నయ = పొందింపుము, ఇతి = అని, భారతీం = సరస్వతీ దేవిని(గూర్చి, బభాణ = పలికినది. తల్లీ! ఇతడు. ఈమె కిష్టుడుకాఁడు, ఇతనిని వర్ణించు పని వ్యర్థము. కాన చాలింపుమని యర్థము.

**సమాసములు :**

తామ్బూలపుటీం :- తామ్బూలానాంపుటీ = తాంబూలపుటీ, తామ్ = తామ్బూలపుటీమ్ ।

కరఙ్కగామ్ :- కరఙ్కంగచ్ఛతీతి = కరఙ్కగా, తామ్ = కరఙ్కగామ్ ।

తామ్బూలకరఙ్కవాహినీ :- తామ్బూలస్య కరఙ్కః = తామ్బూలకరఙ్కః, తామ్బూలకరఙ్కంవహతీతి = తామ్బూలకరఙ్క వాహినీ ।
వక్త్రి పరిశ్రమమ్:- వక్త్రిస్య పరిశ్రమః = వక్త్రిపరిశ్రమః. తమ్= వక్త్రిపరిశ్రమమ్.

**భావము :**

తాంబూలపు పెట్టెను మోసెడి పరిచారిక యారాజును వర్ణింపవలదనెడి దమయన్తియొక్క యాశయము గ్రహించినదై, సరస్వతీదేవిని వర్ణింపకుండు నట్లు చేయుటకై, తామ్బూలపు మడతను నామెచేతనుంచి, దేవీ! మీరు చాల కాలము మాట్లాడితిరి. ఇందువలన మీకు నోటినొప్పి యేర్పడినది. ఈ తాంబూలముచే నానొప్పిని బోకార్చుకొనుమని చెప్పినది. అనగా దమయన్తికి ప్రభువు నచ్చలేదు. కాన వృథాగా నీతని(గూర్చి వర్ణించెడి పరిశ్రమ మీకు వలదని విన్నవించినదని యాశయము ॥౩౬॥

శ్లో. సముస్ముఖీకృత్య బభార భారతీ
రతీశకల్పే౽న్యనృపే నిజం భుజమ్।
తతస్త్రసద్బాలపృషద్విలోచనాం
శశంస సంసజ్జనరఞ్జనీం జనీ॥ 77

ప. వి. సమున్ముఖీకృత్య - బభార - భారతీ - రతీశకల్పే - అన్యనృపే - నిజం - భుజం - తతః - త్రసద్బాలపృషద్విలోచనాం - శశంస - సంసజ్జనరఞ్జనీం - జనీ.

అర్థము. అథ=పిదప, భారతీ=సరస్వతిదేవి, రతీశకల్పే=మన్మథునితో సమానుఁడైన, అన్యనృపే = మఱియొకతేని విషయమందు, నిజం=తనదైన, భుజం = భుజమును, సమున్ముఖీకృత్య= చక్కఁగా నెదుట నుంచి, బభార = పట్టుకొనినది. (దమయన్తి కాతనిఁ జూపుటకు వాని వైపుగ నుంచినదని యర్థము.). తతః=అట్లు చేతిని పైకెత్తినపిద, త్రసద్బాల పృషద్విలోచనాం; త్రసత్=భీతిఁజెందిన, బాలపృషత్ = లేడిపిల్లయొక్క, లోచనాం = కన్నులవంటి కన్నులుగలదియు (కావుననే) సంసజ్జనరఞ్జనీం, సంసత్=సభయందలి, జన=ప్రజలను, రఞ్జనీం=రంజిల్లజేయు, జనీం=వధువైన దమయన్తిని గూర్చి, శశంస= చెప్పెను.

**సమాసములు :**

సమున్ముఖీకృత్య :— అసు న్ముఖమున్ముఖం సమ్పద్యమానం కృత్వా ఉన్ముఖీకృత్య, సమ్యగున్ముఖీకృత్య=సమున్ముఖీకృత్య।

రతీశకల్పే :— రత్యాః ఈశః = రతీశః, రతీశేనఈషత్సదృశః= రతీశకల్పః, తస్మిన్ = లతీశకల్పే।

అన్యనృపే :— అన్యశ్చాసౌనృపశ్చ=అన్యనృపః, తస్మిన్= అన్యనృపే.

త్రసద్బాలపృషద్విలోచనాం :— బాలశ్చాసౌపృషచ్చ = బాలపృషత్. త్రసంశ్చాసౌబాలపృషస్చ = త్రసద్బాలపృషత్, త్రసద్బాలపృషత,

విలోచనే ఇవ విలోచనే యస్యాఃసా = త్రసద్బాలపృషద్విలోచనా, తామ్ = త్రసద్బాలపృషద్విలోచనామ్.

సంసజ్జనరఞ్జనీం:— సంపదిజనాః=సంసజ్జనాః, సంసజ్జనాన్ రఞ్జయతీతి= సంసజ్జనరఞ్జనీ, తామ్ = సంసజ్జనరఞ్జనీమ్.

**భావము :**

తర్వాత సరస్వతీదేవి, మన్మథునితో సమానుఁడైన మఱి యొక రాజు నుద్దేశించి, తనచేతిని వానివైపునకుంచి; లేడిపిల్లవంటి కనుగవ గల్గినదియు నందువలననే, సభను రంజిల్లఁ జేయునదియునగు దమయన్తిఁ గూర్చి యిట్లు చెప్పినది. ॥౭౭॥

> శ్లో. అయం గుణౌఘైరనురజ్యదుత్కలో
> భవన్ముఖాలోకరసోత్కలోచనః।
> స్పృశన్తు రూపామృతవాపి నన్వముం
> తవాఽపి దృక్తారతరఙ్గభఙ్గయః । **78**

ప. వి. అయం - గుణౌఘైః - అనురజ్యదుత్కలః - భవన్ముఖాలోకరసోత్కలోచనః - స్పృశన్తు - రూపామృతవాపి ! - నను - అముం - తవ - అపి - దృక్తారతరఙ్గభఙ్గయః.

అర్థము. నను = ఓ, రూపామృతవాపి; రూప = సౌందర్యమను, అమృత = అమృతమునకు, వాపి = నడబావీ!, గుణౌఘైః= గుణసమూహములచే, అనురజ్యదుత్కలః; అనురజ్యత్ =అను రక్తులైన, ఉత్కలః=ఉత్కల దేశీయులు గల్గిన, అయం=ఈ రాజు, భవన్ముఖాలోకరసోత్కలోచనః; భవత్ = నీయొక్క, ముఖ = ముఖమును, ఆలోక = చూచుటయందలి రస = కోరికచే, ఉత్క = ఔత్సుక్యము గల్గిన, లోచనః=నేత్రములు గల్గినవాడుగా, భవతి = అగుచున్నాడు. తవాఽపి = నీయొక్కయు, దృక్తారతరఙ్గభఙ్గయః; దృక్ = నేత్రములలోని, తార=పాపలయొక్క, తరఙ్గభఙ్గయః=విన్యాసవిశేషములు, అముం=ఈయుత్కల ప్రభువును, స్పృశన్తు = స్పృశించునుఁగాత. తనయెడ ననురాగముగల వానియందు ననురాగముంచుట తగినది కాన నీతని నీ కటాక్షములతోఁ జూడుము.

**సమాసములు :**

గుణౌఘైః :- గుణానామోఘాః=గుణౌఘాః; త్రైః = గుణౌఘైః,

అనురజ్యదుత్కలః :- అనురజ్యన్తః ఉత్కలాః యస్మిన్‌సః = అను రజ్యదుత్కలః ।

భవన్ముఖాలోకరసోత్కలోచనః :- భవత్యాః ముఖం=భవన్ముఖం. భవన్ముఖస్య ఆలోకః = భవన్ముఖాలోకః, భవన్ముఖాలోకేరసః=భవన్ముఖాలోకరసః, భవన్ముఖాలోకరసేఉత్కేలోచనేయస్యసః = భవన్ముఖాలోకరసోత్కలోచనః ।

రూపామృతవాపి:- రూపమేవఅమృతం=రూపామృతం, రూపామృతస్య వాపీ = రూపామృతవాపీ. తస్యాస్సమ్బుద్ధిః, హేరూపామృతవాపి!।

దృక్తారతరఙ్గభఙ్గయః:- దృశోస్తారాః=దృక్తారాః, తరఙ్గాణాంభఙ్గయః= తరఙ్గభఙ్గయః, దృక్తారాణాంతరఙ్గభఙ్గయః = దృక్తారతరఙ్గభఙ్గయః ।

**భావము :**

సౌన్దర్యామృతమునకు నడబావియైన, యో దమయన్తీ! గుణములనుఁ బట్టియనురక్తులైన యుత్కలదేశస్థుల ప్రశంసలకుఁ బాత్రుడైన యీ రాజు నీ ముఖమును సందర్శించుటకుత్సుకతఁ గల్గియున్నాడు. కావున, వానిని నీకంటి పాపలవిలాస విషయములు స్పృశింపనిమ్ము. అనగా వానిని నీనేత్రములతోఁ దిలకింపుము ॥౭౮॥

> **శ్లో. అనేన సర్వార్థికృతార్థతాకృతా**
> **హృతార్థినో కామగవీసురద్రుమౌ ।**
> **మిథః పయఃసేచనపల్లవాశనే**
> **ప్రదాయ దానవ్యసనం సమాప్నుతః॥ 79**

ప. వి. అనేన- సర్వార్థికృతార్థతాకృతా- హృతార్థినౌ- కామగవీసురద్రుమౌ - మిథః- పయఃసేచనపల్లవాశనే-ప్రదాయ- దానవ్యసనం - సమాప్నుతః.

అర్థము. సర్వార్థికృతార్థతాకృతా: సర్వార్థి = సమస్తయాచకులను, కృతార్థతా కృతా, కృతార్థతా = సఫలత్వమును, కృతా = చేయునట్టి, అనేన =

ఈరాజుచే, కృతార్థినౌ = సమస్తమును దానముచేయుటచే యాచక రహితములుగా చేయబడిన, కామగవీసురద్రుమౌ; కామగవీ = కామధేనువును, సురద్రుమౌ = కల్పవృక్షమును, మిథః = ఒండొంటిని(గూర్చి) పయఃసేచనపల్లవాశనే; పయఃసేచన = పాలతోతడపుటను, పల్లవాశనే = చిగుళ్లనాహారముగ భక్షించుటను చేసుకొని (అనగా కామధేనువు కల్పవృక్షమును పాలతోఁ దడుపుచుండగా, కల్పవృక్షము తన చిగుళ్లను కామధేనువునకాహారముగా నొసంగుచున్నదని యర్థము.) దానవ్యసనం = తమతమందాసక్తిని, సమాప్నుతః = పూర్తిగావించుకొనుచున్నవి. అనగా యాచకులులేనందువలన, నొకరికొకరికిచ్చి పుచ్చుకొనుచు, కామధేను కల్పవృక్షములు, తమకున్న దానపుకండూతినిఁ దీర్చుకొనుచున్నవని యర్థము.

**సమాసములు :**

సర్వార్థికృతార్థతాకృతా:- సర్వేచతే, అర్థినశ్చ = సర్వార్థినః, కృతః అర్థఃయేషాంతే = కృతార్థాః, కృతార్థానాంభావః = కృతార్థతా, కృతార్థతాంకరోతీతి = కృతార్థతాకృత్, సర్వార్థినాంకృతార్థతాకృత్ = సర్వార్థికృతార్థతాకృత్, తేన = సర్వార్థికృతార్థతాకతా.

కామగవీసురద్రుమౌ:- సురాణాంద్రుమః = సురద్రుమః, కామనాందాత్రీగౌః = కామగవీ, కామగవీచసురద్రుమశ్చ = కామగవీసురద్రుమౌ.

పయఃసేచనపల్లవాశనే:- పయోభిఃసేచనం = పయఃసేచనం. పల్లవానామశనం = పల్లవాశనం, పయఃసేచనంచపల్లవాశనంచ = పయఃసేచనపల్లవాశనే,

దానవ్యసనం:- దానేవ్యసనం = దానవ్యసనమ్, తత్ = దానవ్యసనమ్ ।

**భావము :**

యాచకుల కందఱికిని సర్వస్వము నొసంగి, యీ రాజుకామధేనువునకు కల్పవృక్షమునకు యాచకులను లేకుండునట్లు గావించెను. ఎల్లప్పుడును దానము చేయు కామధేను కల్పవృక్షముల కిది తీరని కొఱతగా నేర్పడినది. అందువలననవి తమ దానకండూతిని అనగా దానము చేయవలయునను

దురదనుఁ దీర్చుకొనుటకు పరస్పరము యాచకులుగను దాతలుగను మాఱినవై యొండొంటి కిచ్చిపుచ్చు కొనుట కుపక్రమించినవి. ఆ ప్రకారము కామధేనువు తన పాలనుపోసి కల్పవృక్షమునుఁ దడుపగా నా కల్పవృక్షము కామధేనువునకు తన చిగుళ్లనొసంగినది. ఇట్లు పరస్పర దానప్రతిగ్రహవినిమయముల నవి జరుపుకొని తమదానోత్కంఠనుఁ దీర్చుకొనినవి॥౭౯॥

శ్లో. నృపః కరాభ్యాముదతోలయన్నిజే
నృపానయం యాన్పతతః పదద్వయే।
తదీయచూడాకురువిందరశ్మిభిః
స్ఫుటేయమేతత్కరపాదరఞ్జనా॥ 80

ప. వి. నృపః- కరాభ్యామ్- ఉదతోలయత్- నిజే- నృపాన్- అయం-యాన్ -పతతః- పదద్వయే- తదీయచూడాకురువిందరశ్మిభిః- స్ఫుటా-ఇయం ఏతత్కరపాదరఞ్జనా.

అర్థము. అయంనృపః=ఈరాజు, నిజే = తనదగు, పదద్వయే=రెండుపాదముల పైన, పతతః=పడి నమస్కరించు, యాన్=ఏ, నృపాన్=రాజులను కరాభ్యాం=హస్తములతో (కృపయా=దయచే) ఉదతోలయత్=పైకెత్తెను. తదీయచూడాకురువిందరశ్మిభిః; తదీయ=ఆరాజులకు సంబంధించిన, చూడా=శిరమునందలి, కురువింద=పద్మరాగముయొక్క, రశ్మిభిః =కిరణములచే, ఇయం=కనబడు, ఏతత్కరపాదరఞ్జనా, ఏతత్ = ఈరాజుయొక్క. కర = హస్తములకును, పాద = పాదములకును, రఞ్జనా=రంగుపూత. అనగా వారు పాదములమీదఁబడుటవలన వారి శిరమునందలి పద్మరాగములచేత, పాదములకు రంజనము, తలలను లేవనెత్తుటవలనఁ జేతులకును రంజనము, స్ఫుటా = స్పష్టము, లక్ష్యతే= చూడఁబడుచున్నది.

వి. ఇచ్చట హస్తములయందును పాదములయందును రాజునకు సహజముగనే యెఱ్ఱఁదనముండును. గాని యవి రాజకిరీట పద్మరాగములచే నేర్పడినట్లు భానించుటవలన నుత్ప్రేక్ష. అందువలన నీతని కనేక రాజులనుండి విజయము వ్యక్తమైనది కాన నలఙ్కారముచే వస్తుధ్వని. ॥౮౦॥

శ్లో. యత్కస్యామపి భానుమాన్న కకుభి స్థేమానమాలమ్బతే
జాతం యద్ఘనకాననైకశరణప్రాప్తేనదావాగ్నినా।
ఏషైతద్భుజతేజసా విజితయోస్తావత్తయోరౌచితీ
ధిక్తం వాడవమమ్బుని ద్విషి భియా యేన ప్రవిష్టం పునః॥

ప. వి. యత్ - కస్యామ్ - అపి - భానుమాన్ - న - కకుభి - స్థేమానమ్- ఆలమ్బతే - జాతం - యద్ఘనకాననైకశరణప్రాప్తేన - దావాగ్నినా - ఏషా - ఏతద్భుజతేజసా - విజితయోః - తావత్ - తయోః- ఔచితీ- ధిక్ - తం - వాడవమ్ - అమ్బుని - ద్విషి - భియా - యేన - ప్రవిష్టం - పునః.

అర్థము. భానుమాన్= సూర్యుఁడు, కస్యామపి కకుభి = ఏదిక్కునందును, స్థేమానం=స్థైర్యమును, న ఆలమ్బతేఇతియత్=పొందుటలేదనునది యేది కలదో, తథా=అట్లే, దావాగ్నినా = కారుచిచ్చుచే, ఘనకాన నైకశరణ ప్రాప్తేన; ఘన=దట్టమైన, కానన=అరణ్యమును, ఏకశరణ=ముఖ్య రక్షకముగా, ప్రాప్తేన=పొందివాడిగ, జాతమితియత్=సంభవించుట యనునదేది కలదో, ఏషా=ఇవిరెండును, ఏతద్భుజతేజసా; ఏతత్ = ఈరాజుయొక్క, భుజ=భుజములయొక్క, తేజసా=ప్రతాపముచే, విజి తయోః=ఓడింపబడిన, తయోః = ఆ సూర్యునకును దావాగ్నికిని, ఔచితీతావత్=తగినదే. భయపడినవాఁడు కలతఁజెంది యొకచోట నిల కడగా నుండడు. అందువలన వనముల నాశ్రయించును. కింతు=కాని, తం=ఆ, బాడబం=ఆ బడబాగ్నిని(గూర్చి, ధిక్=ఛీ, యేన=ఏ బడ బాగ్నిచే, భియా=భయముతో, ద్విషి=శత్రువైన, అమ్బుని=ఉదకము నందు, పునః=మఱల, ప్రవిష్టం=ప్రవేశము (చేయఁబడినది) శత్రువు నాశ్రయించుట కంటెనింకొకచోటునకు వెళ్ళుట యుక్తముగదా.

వి. ఇచ్చట సూర్యుని పర్యటనాదులు స్వాభావికములు. కాని యివి యీ రాజు వలని భీతిచేనేర్పడినవని భావింపఁబడుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జ కమునుఁబ్రయోగింపనందువలన నిది గమ్యము.

**సమాసములు :**

ఘనకాననైకశరణ ప్రాప్తేన :- ఘనంచ తత్కాననంచ=ఘనకాననమ్, ఏకంచతత్ శరణంచ=ఏకశరణమ్, ఘనకాననమేవ ఏకశరణం=ఘనకాననైకశరణం, ఘనకాననైకశరణం ప్రాప్తః = ఘనకాననైకశరణప్రాప్తః, తేన=ఘనకానన నైకశరణప్రాప్తేన.

ఏతద్భుజతేజసా :- ఏతస్యభుజౌ=ఏతద్భుజౌ: ఏతద్భుజయోః, తేజః= ఏతద్భుజతేజః, తేన = ఏతద్భుజతేజసా ।

**భావము :**

సూర్యుడు నిలకడలేక సంచరించుటకును దావాగ్నియడవినే శరణముగా నాశ్రయించి యుండుటకును, ముఖ్యకారణ మీ రాజుయొక్క భుజప్రతాపములచే నోడింపఁబడుటయే. ఇట్లు సూర్యునికి నిలకడ లేనితనమును, దావాగ్నియడవి శరణుఁబొందుట వానికి తగినవే! ఏల యనగా లోకమునందోడిన వారు, నిలకడలేని స్థితిలోనైన నుందురు. లేదా యడవులలో దాగికొందురు. ఇకబడ బాగ్ని విషయ మింకను హీనమైనది. ఏలయనగా నది యీతని ప్రతాపముచే నోడినదై కడకు తన శత్రువైన నీటియందు మునిగినది. శత్రువు నాశ్రయించుట కంటె నెక్కడికైనను పరుగెత్తి పోవుట శ్రేష్ఠముగదా! అనగా నీరాజు యొక్కభుజ ప్రతాపము సూర్యుని, దావాగ్నిని, బడబాగ్నిని మించినదని యాశయము ॥౮౧॥

శ్లో. అముష్యోర్వీభర్తుః ప్రసృమరచమూసిన్ధురభవై
రవైమి ప్రారబ్ధేపమథుభిరవశ్యాయసమయే।
నకమ్పన్తామన్తః ప్రతిభటనృపాః? మ్లాయతుసతద్
వధూవక్త్రామ్భోజం భవతు న స తేషాం కుదివసః॥ 82

ప. వి. అముష్య - ఉర్వీభర్తుః - ప్రసృమరచమూసిన్ధురభవైః - అవైమి - ప్రారబ్ధే - పమథుభిః - అవశ్యాయసమయే-న - కమ్పన్తామ్ - అన్తః- ప్రతిభటనృపాః - మ్లాయతు - న-తద్వధూవక్త్రామ్భోజం - భవతు - న - సః - తేషాం - కుదివసః.

అర్థము. అముష్య = ఈ, ఉర్వీభర్తుః = భూపాలునియొక్క, ప్రసృమరచమూసిన్ధురభవైః; ప్రసృమర = అంతట వ్యాపించుచున్న, చమూ = సేనయందలి, సిన్ధుర = ఏనుగుల నుండి, భవైః = ఉద్భవించునటు వంటి, వమథుభిః = తొండపురన్ధ్రముల నుండి వెల్వడుతుంపరలచే, అవశ్యాయసమయే; అవశ్యాయ = మంచుయొక్క, సమయే = కాలము, అనగా హేమన్త ఋతువు, ప్రారబ్ధేసతి = ప్రారంభింపఁబడగా, అవైమి = (చెప్పఁబోవు ప్రకారము) తలంతును. (ఏమనగా), ప్రతిభటనృపాః = శత్రు రాజులు, అన్తః=హృదయమందున, కమ్పన్తాం = కంపింపరా? తప్పక రాజువలని భయముచేతను, చలిచేతను వణకఁగలరని యర్థము. తద్వధూవక్త్రామ్భోజం; తత్ = ఆ శత్రురాజుల, వధూ=స్త్రీలయొక్క, వక్త్ర = ముఖమనెడి, అమ్భోజం = పద్మము, నమ్లాయతు = వాడదా? తప్పక వాడును. ఒక పక్షమున శత్రురాజుల వలని భయము చేతను మఱియొక పక్షమున మంచువలనను వాడునని యర్థము, సః = ఆయేనుగుల తొండముల నుండి వెల్వడు తుంపరలచే నేర్పడిన మంచుతో నావరింపఁబడిన దివసము, తేషాం = ఆ శత్రురాజులకును, వారిస్త్రీలకును, కుదివసః = దుర్దినము (మేఘము కప్పిన పగలు) నభవతు = కాదా? తప్పక కాగలదని యర్థము.

వి. ఏనుగ తొండపు తుంపురులను, మంచుగాను, శత్రురాజ స్త్రీముఖములను పద్మముగను, దినమును, దుర్దినముగను (మేఘచ్ఛన్న దినముగను) రూపించుట వలన రూపకాలఙ్కారము.

**సమాసములు :**

ఉర్వీభర్తుః :— ఉర్వ్యాఃభర్తా = ఉర్వీభర్తా, తస్య = ఉర్వీభర్తుః.
ప్రసృమరచమూసిద్ధురభవైః :— ప్రసృమరాచసాచమూశ్చ = ప్రసృమరచమూః, ప్రసృమచమ్వాం సిన్ధురాః = ప్రసృమరచమూసిన్ధురాః, ప్రసృమరచమూసింధురేభ్యః భవాః = ప్రసృమరచమూసిన్ధురభవాః, తైః = ప్రసృమరచమూసిన్ధురభవైః।
అవశ్యాయసమయే :— అవశ్యాయస్యసమయః = అవశ్యాయసమయః, తస్మిన్ = అవశ్యాయసమయే।
ప్రతిభటనృపాః :— ప్రతిభటాశ్చతే నృపాశ్చ = ప్రతిభటనృపాః ।

వధూవక్త్రామ్భోజం ;— వధ్వాః వక్త్రం = వధూవక్త్రం, వధూవక్త్ర మేవ అమ్భోజం = వధూవక్త్రామ్భోజమ్।

కుదివసః :— కుత్సితః దివసః = కుదివసః.

**భావము :**

సేనయందు సంచరించెడి యీ భూపాలుని యేనుగుల తొండపు రంధ్రములనుండి వెల్వడు నీటి తుంపరలచే హేమన్తఋతువు ప్రారంభమైనదని తలంతును. కావుననే శత్రురాజులు, ఈ నరపాలుని వలన భయముతోడను, చలి తోడను వణకుచున్నారు. అట్లే యీ శత్రురాజుల స్త్రీలయొక్క ముఖ పద్మములు ఈ రాజువలన యుద్ధరంగమున తమ భర్తలకేర్పడు కీడునుస్మరించి వాడుచున్నవి. మఱియు మంచు చేతను నలిగి వాడుచున్నవి. మంచునకు తామరలు నశించునుగదా. ఆ యేనుగుల తొండపు రంధ్రముల తుంపురవలని మంచుచే నావరింపఁబడిన దినము. అనగా పగలు, ఆ శత్రురాజులకును, వారి స్త్రీలకును, దుర్దినము, (మేఘావృతమగు దినము) (చెడ్డ దినము) అగుచున్నది. అనగా నీ రాజుయొక్క సేనయందు లెక్కకు నెక్కుడయిన యేనుగులున్నవనియు వాని తొండపు తుంపరలు పగలును మేఘావృత మగునట్లు చేయుచున్నవనియు శత్రురాజుల స్త్రీలు యుద్ధరంగమున నీ రాజువలనఁదమతమ భర్తలకేమి కీడుమూడునో యని బెగడొందుచున్నారనియు సారాంశము ॥౮౨॥

**శ్లో. ఆత్మన్యస్య సముచ్చితీకృతగుణస్యాహోతరామౌచితీ**
**యద్గాత్రాన్తరవర్జనాదజనయద్భూజానిరేష ద్విషామ్।**
**భూయోఽహఙ్క్రియతే స్మ యేన చ హ్రదా స్కన్ధో న యశ్చానమత్**
**తన్మర్మాణి దలం దలం సమిదలంకర్మీణ బాణవ్రజః॥ 83**

ప. వి. ఆత్మని - అస్య - సముచ్చితీకృతగుణస్య - అహోతరామ్ - ఔచితీ - యద్గాత్రాన్తరవర్జనాత్ - అజనయత్ - భూజానిః - ఏషః - ద్విషాం- భూయః - అహఙ్క్రియతే - స్మ - యేన - చ - హ్రదా - స్కన్ధః - స-యః - చ - అనమత్ - తన్మర్మాణి - దలందలం - సమిదలంకర్మీణ బాణవ్రజః.

అర్థము. ఆత్మని=తనయందే, సముచ్చితీకృతగుణస్య, సముచ్చితీకృత=సంగ్రహింపఁబడిన సౌందర్యాది గుణములు గల్గిన, అస్య = రాజుయొక్క, ఔచితీ=ఔచిత్యము, అహోతరామ్=మిక్కిలి యాశ్చర్యము(ఏలయనగా) సమిదలఙ్కర్మీణబాణవ్రజః; సమిత్=యుద్ధమునందు, అలఙ్కర్మీణ=కార్యమునకుచాలిన, బాణవ్రజః = బాణముల సమూహముగల్గిన, అనగా వ్యర్థముకాని బాణసమూహముగల్గిన, ఏషః=ఈ, భూజానిః=ప్రభువు, ద్విషాం=శత్రువులకు సంబంధించిన, యేనచ=ఏ, హృదా=హృదయముతో. భూయః = అధికముగా, అహఙ్క్రియతే స్మ = అహఙ్కారమునుఁ బొందింపబడుట యేర్పడియుండినదో, యశ్చ = ఏ, స్కన్ధః = భుజశిరమున, అనమత్=ప్రణమిల్ల లేదో, గాత్రాన్తర వర్జనాత్; గాత్రాన్తర= ఇతర శరీరావయవములయొక్క అనగా హృదయ స్కంధములకంటె నితరములగు నవయవములయొక్క, వర్జనాత్=త్యాగమువలన, (ఏలయనగానవి నేరముచేయనివి) తన్మర్మాణి = హృదయస్కంధ రూపములగు ప్రాణస్థానములను, దలందలం=మిక్కిలి ఖండించి, యత్=ఏదణ్డనమును, అజనయత్ = కల్గించెనో, తత్=ఆ కార్యము, అనగా నట్టి దణ్డనము రాజునకుఉచితము, మిక్కిలి యాశ్చర్యము. అహంకారము వలన లొంగని శత్రువుచు మూలముతో నే చంపవలయునని యర్థము.

**సమాసములు :**

సముచ్చితీకృతగుణస్య :— అసముచ్చితాః సముచ్చితాః సమ్పద్యమానాః కృతాః = సముచ్చితీకృతాః. సముచ్చితీకృతాః గుణాః యస్యసః =సముచ్చితీకృతగుణః, తస్య=సముచ్చితీకృతగుణస్య।

అహోతరామ్:— అత్యన్తమహో = అహోతరామ్

గాత్రాన్తరవర్జనాత్ :— అన్యానిచతానిగాత్రాణిచ = గాత్రాన్తరాణి, గాత్రాన్తరాణాం వర్జనం= గాత్రాన్తరవర్జనం, తస్మాత్ = గాత్రాన్తరవర్జనాత్ ।

భూజానిః:— భూఃజాయా యస్యసః=భూజానిః ।

తన్మర్మాణి:— తానిచతానిమర్మాణిచ=తన్మర్మాణి,

సమిదలఙ్కర్మీణబాణవ్రజః:— కర్మణేఅలం = అలఙ్కర్మీణః, సమితి అలఙ్కర్మీణః = సమిదలఙ్కర్మీణః, బాణానాంవ్రజః = బాణవ్రజః, సమిదలఙ్కర్మీణః బాణవ్రజః యస్యసః = సమిదలఙ్కర్మీణబాణవ్రజః।

**భావము :**

తనయందే సౌన్దర్యాది సకలగుణములను నిముడ్చుకొనిన యీ రాజు యొక్క యౌచిత్యము మిక్కిలి యాశ్చర్యమైనది. ఏలయనగా— యుద్ధమునందు సమర్థములగు బాణసమూహము గల్గిన యీరాజు, శత్రువులు ఏ హృదయముతో మిక్కిలి యహంకారముఁ జూపిరో, యే భుజశిఖరములను వంచి ప్రణమిల్లలేదో, వానిని మాత్రమే గ్రహించి తక్కిన యవయవముల నన్నింటిని వర్జించి, యా హృదయస్కంధములనెడి మర్మావయవములను తుత్తునియలు గావించి ఎట్టి దండనమును విధించెనో యదియే యీ రాజునకు ఉచితము మిక్కిలియాశ్చర్య కరమునై యున్నది. అహంకారముచే వంగని శత్రువును సమూలఘాతముగాఁ జంపవలయునని యాశయము॥౮౩॥

శ్లో. దూరం గౌరగుణైరహంకృతిమతాం జైత్రాఙ్కారే చర
త్యేతద్దోర్యశసి ప్రయాతి కుముదం బిభ్యన్న నిద్రాం నిశి।
ధమ్మిల్లే తవ మల్లికాసుమనసాం మాలాభియా లీయతే
పీయూషస్రవకైతవాద్ధృతదరః శీతద్యుతిః స్విద్యతి॥ **84**

ప. వి. దూరం - గౌరగుణైః - అహంకృతిమతాం- జైత్రాఙ్కారే - చరతి- ఏతద్దోర్యశసి - ప్రయాతి- కుముదం - బిభ్యత్- న- నిద్రాం- నిశి- ధమ్మిల్లే- తవ- మల్లికాసుమనసాం - మాలా- భియా-లీయతే-పీయూష స్రవకైతవాత్- ధృతదరః- శీతద్యుతిః-స్విద్యతి.

అర్థము. ఏతద్దోర్యశసి; ఏతత్ = ఈరాజుయొక్క, దోర్యశసి = భుజము యొక్కయశస్సు, గౌరగుణైః = తెల్లఁదనపుగుణములచే, దూరం = మిక్కిలి, అహంకృతిమతాం = అహంకారముగల్గిన తెల్లకలువమున్నగు తెల్లవస్తువులలో, జైత్రాఙ్కారే; జైత్ర = జయశీలమైనదియు నంత మను చిత్రయుద్ధమునుచేయునదియు ననగా నాయహంకారముఁఖండించు టకై, జయశీలమగుయుద్ధము గావించునట్టిదై, చరతిసతి = భ్రమించు

చుండగా, కుముదం = కలువ, బిభ్యత్సత్ = భయపడినదై, నిశి = రాత్రి యందు, నిద్రాం = నిద్రను (ముడుచుకొనిపోవుటను) నప్రయాతి = పొందుటలేదు, మల్లికాసుమనసాం = మల్లెపూలయొక్క, మాలా = మాల, భియా = భయముచే, తవ = నీయొక్క, ధమ్మిల్లే = కొప్పునందు, లీయతే = దాగుచున్నది. శీతద్యుతిరపి = చంద్రుడును, ధృతదరః; ధృత = వహింపబడిన, దరః = భయముకలవాడై, పీయూషస్రవకైతవాత్; పీయూష = అమృతమును, స్రవ = స్రవించుటయను, కైతవాత్ = నెపమువలన, స్విద్యతి = చెమర్చుచున్నాడు.

వి. ఇచ్చట భుజయశస్సులు మున్నగువానికి అహంకారసంబంధము లేక పోయినను, నహంకార సంబంధము చెప్పుటవలన నతిశయోక్త్య లంకారము.

**సమాసములు :**

గౌరగుణైః :- గౌరా ఏవగుణాః = గౌరగుణాః. తైః = గౌరగుణైః.

అహంకృతిమతామ్ :- అహంకృతిః ఏషామస్తీతి = అహంకృతిమన్తః. తేషాం అహంకృతిమతాం

జైత్రాఙ్కకారే :- జైత్రంచతత్ అఙ్కకారంచ = జైత్రాఙ్కకారం, తస్మిన్ = జైత్రాఙ్కకారే.

దోర్యశసి :- దోష్ణోఃయశః = దోర్యశః, తస్మిన్ = దోర్యశసి,

మల్లికా సుమనసామ్ :- మల్లికా ఇతిసుమనాంసి = మల్లికా సుమనాంసి, తేషాం = మల్లికాసుమనసామ్।

పీయూషస్రవకైతవాత్ :- పీయూషస్య స్రవః = పీయూషస్రవః, పీయూషస్రవస్యకైతవం = పీయూషస్రవకైతవమ్, తస్మాత్ = పీయూష స్రవకైతవాత్.

ధృతదరః :- ధృతఃదరః యేనసః = ధృతదరః.

**భావము :**

ఈ రాజుయొక్క భుజములు కీర్తి, తెల్లదనము మున్నగుగుణములచే మిక్కిలి యహఙ్కారము గల్గిన తెల్ల కలువలు మున్నగు వాని యహఙ్కార

మును దొలగించుటకై జయశీలమైన విచిత్ర యుద్ధమును జేయుచు సంచరించు చుండగా కలువ భయపడినదై రాత్రి నిద్రను పొందలేదు (ముకుళించుకొనిపోలేదు) మల్లెపూలమాల భయముతో నీయొక్క కొప్పునందు దాగినది. చంద్రుడును భయపడినవాడై అమృతవర్షవ్యాజమున చెమటనుపడలెను. కాన నీరాజు గొప్ప కీర్తి కలవాడు. నీకు వరణీయుడు ॥౮౫॥

శ్లో. ఏతద్గన్ధగజ స్తృషామ్భసి భృశం కణ్ఠా న్తమజ్జ త్తనుః
ఫేనైః పాణ్డురితః స్వదిక్కరిజయక్రీడాయశఃస్పర్ధిభిః ।
దన్తద్వంద్వజలానుబిమ్బనచతుర్ద న్తః కరామ్భోవమి
వ్యాజాదభ్రమువల్లభేన విరహం నిర్వాపయత్యమ్బుధేః॥

ప. వి. ఏతద్గన్ధగజః - తృషా - అమ్భసి - భృశం -కణ్ఠాన్తమజ్జత్తనుః - ఫేనైః - పాణ్డురితః - స్వదిక్కరి జయక్రీడాయశఃస్పర్ధిభిః - దన్త ద్వంద్వజలానుబిమ్బనచతుర్దన్తః - కరామ్భోవమివ్యాజాత్ - అభ్రము వల్లభేన - విరహం - నిర్వాపయతి - అమ్బుధేః.

అర్థము. తృషా=దాహముచే, అంభసి=జలమందు, భృశం=మిక్కిలి, కణ్ఠాన్త, మజ్జత్తనుః; కణ్ఠాన్త=కంఠము వఱకును, మజ్జత్=మునిగిన, తనుః=శరీరముగలదై, స్వదిక్కరి జయక్రీడాయశః స్పర్ధిభిః; స్వ=స్వీయముగా, దిక్కరి=దిగ్గజముల, జయ=జయమువలని, క్రీడా=ఆటవలనఁగల్గిన, యశః=కీర్తితో, స్పర్ధిభిః=స్పర్ధచే సదృశములైన, ఫేనైః=నురుగులతో, పాండురితః=తెలుపుజేయఁబడిన, దన్త ద్వంద్వ జలానుబిమ్బన చతుర్దన్తః, దన్త ద్వంద్వ = రెండు దన్తములు, జలానుబింబన=నీటియందుఁ ప్రతిబింబించుటచే, చతుర్దన్తః=నాలుగు దన్తములుకల్గిన, ఏతద్గన్ధగజః; ఏతత్=ఈ నృపునియొక్క, గన్ధగజః=మదగజము, కరామ్భోవమి వ్యాజాత్; కరామ్భః=తొండపునీటిని, వమి=వెదజల్లుటయను, వ్యాజాత్=నెపమువలన అమ్బుధేః=సముద్రముయొక్క, అభ్రమువల్లభేన; అభ్రము = అభ్రమువను యేనుగునకుపల్లభుడైన ఐరావతముతో, విరహం=విరహబాధను, నిర్వాపయతి=తొలగించుచున్నది.

వి. తొండములోని నీటిని వెదజల్లు నెపమున సముద్రతాపమునుఁదొలంగించుచున్నదని చెప్పుటవలన నపహ్నవాలజ్కారము.
సముద్రమునకు పుత్రవిరహ తాప శాంతిచేయకపోయినను చేయునట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష. పైనఁజెప్పఁబడిన యపహ్నవముతో నిది గూడి యున్నది కాన సాపహ్నవోత్ప్రేక్ష.

**సమాసములు :**

ఏతద్గన్ధగజః :— ఏతస్యగన్ధగజః=ఏతద్గన్ధగజః।
కంఠాన్తమజ్జత్తనుః :— కంఠస్య, అన్తః = కంఠాన్తః, కంఠాన్తే మజ్జన్తీ తనుః యస్యసః=కణ్ఠాన్తమజ్జత్తనుః.
స్వదిక్కరి జయక్రీడాయశఃస్పర్ధిభిః :— దిశాంకరిణః = దిక్కరిణః. జయేనక్రీడా = జయక్రీడా, దిక్కరిణాం జయక్రీడా దిక్కరిజయక్రీడా, స్వేన, దిక్కరిణాం జయక్రీడా = స్వదిక్కరి జయక్రీడా, స్వదిక్కరి జయక్రీడాయాః యశః = స్వదిక్కరి జయక్రీడాయశః, స్వదిక్కరి జయక్రీడాయశః, స్పర్ధినః = స్వదిక్కరి జయక్రీడాశః యశః స్పర్ధినః, తైః=స్వదిక్కరి జయక్రీడాయశ స్స్పర్ధిభిః.
దన్తద్వంద్వజలానుబింబ నచతుర్దన్తః :— దన్తయోః ద్వన్ద్వం=దన్త ద్వన్ద్వం, జలే అను బిమ్బనం = జలానుబిమ్బనమ్, దన్తద్వంద్వస్య జలానుబిమ్బనం = దన్తద్వంద్వజలానుబిమ్బనం, చత్వారః దన్తాః యస్యసః=చతుర్దన్తః, దన్తద్వంద్వ జలానుబిమ్బనేనచతుర్దన్తః !
కరామ్భోవమివ్యాజాత్ :— కరే అమ్భః=కరామ్భః, కరామ్భసః వమిః= కరామ్భోవమిః, కరామ్భోవమి రేవవ్యాజః = కరామ్భోవమివ్యాజః, తస్మాత్=కరామ్భోవమివ్యాజాత్।
అభ్రముపల్లభేన :— అభ్రమోఃవల్లభః=అభ్రమువల్లభః, తేన=అభ్రము వల్లభేన।

**భావము :**

ఈతని మదపుటేనుగ దాహముచే కంఠము వఱకును నీటియందు మిక్కిలి మునింగినదై తనకు దిగ్గజములతోటి జయక్రీడ వలనఁగల్గిన యశస్సుతోఁ

దెల్లఁదనమునందుఁ బోరాడెడి నీటి నురుఁగపులచేఁ దెల్లబడినదై యున్నది. మఱియునామత్త గజము, తన రెండు దన్తములు నీటఁ బ్రతిబింబించుటచే నాల్గుదన్తములు కలదిగా నేర్పడినది ఇట్లు, ఆ మత్తగజము ఐరావతముతోఁ సాదృశ్యమును సంపాదించినది. ఐరావతము తెల్లగ నుండును. ఇదియు నీటి నురుగులు కప్పుటవలన తెల్లగ నున్నది. ఐరావతమునకు నాలుగు దన్తము లున్నవి. దీనియొక్క రెండు దన్తములు నీటఁబ్రతిబింబించుట వలన దీనికి నాలుగుదంతములు యేర్పడినవి. ఇట్లు దీనిచే ఐరావతములేని కొఱత సముద్ర మునకు తీఱినది. ఇంత కాలము పుత్రుఁడైన ఐరావతము దూరమగుటవలన దాని విరహముచే దుఃఖించుచున్న సముద్రునికి, తానైరావతమై యా దుఃఖము నుఁ దొలగించుచు, తన తొండముతో నీరును సముద్రముపై వెదజల్లుచుదాని తాపమునకు శాంతినిఁ గల్గించుచున్నది. ॥౮౫॥

శ్లో. అథైతదుర్వీపతివర్ణనాద్భుతం
న్యమీలదాస్వాదయితుం హృదీవసా ।
మధుస్రజా నైషధనామజాపినీ
స్ఫుటీభవద్ధ్యానపురః స్ఫురన్నలా॥ **86**

ప. వి. అథ –ఏతదుర్వీపతివర్ణనాద్భుతం– న్యమీలత్– ఆస్వాదయితుం-హృది -ఇవ -సా– మధుస్రజా- నైషధనామజాపినీ -స్ఫుటీభవద్ధ్యానపురస్ఫు రన్నలా.

అర్థము. అథ = పిదప, సా = ఆదమయన్తి, మధుస్రజా = స్వయంవరము నకుద్దేశింపఁబడిన, విప్పపూలమాలచే (జపమాలచే) నైషధనామజాపినీ; నైషధనామ = నలునినామమును, జాపినీ = జపించుచున్నదై (కావు ననే) స్ఫుటీభవద్ధ్యానపురఃస్ఫురన్నలా; స్ఫుటీభవత్ = సాక్షాత్కార ముగానేర్పడునట్టి, ధ్యాన = ధ్యానముచే, పురఃస్ఫురత్; పుర = ఎదుట, స్ఫురత్ = ప్రత్యక్షవిషయమగుచున్న, నలా = నలునిగల్గినదై, ఏత దుర్వీపతివర్ణనాద్భుతం; ఏతత్ = ఈ, ఉర్వీపతి = ఉత్కలభూపాలుని యొక్క, వర్ణన = వర్ణనయనెడి, అద్భుతం = ఆశ్చర్యకరసమును, హృది = హృదయమందు, ఆస్వాదయితుమివ = అనుభవించుటకోయను

నట్లు, న్యమీలత్ = కనులనుమూసికొనినది. వాస్తవమున — నలుని సాక్షాత్కారమువలని యానందము ననుభవించుటకే యామెకన్నులు మూసినది.

**సమాసములు :**

ఏతదుర్వీపతివర్ణనాద్భుతం:- ఎషచాసౌఉర్వీపతిశ్చ = ఏతదుర్వీపతిః, ఏతదుర్వీపతేఃవర్ణనం=ఎషదుర్వీపతి వర్ణనం, ఎతదుర్వీపతివర్ణనమేవ, అద్భుతం = ఎతదుర్వీపతివర్ణనాద్భుతం, తత్ = ఎతదుర్వీపతివర్ణనాద్భుతమ్ ।

మధుస్రక్:— మధునఃస్రక్=మధుస్రక్, తయా=మధుస్రధుజా ।

నైషధనామజాపినీ:— నిషధానాంరాజా = నైషధః, నైషధస్యనామ = నైషధనామ, నైషధనామజపతీతి = నైషధనామజాపినీ ।

స్ఫుటీభవద్ధ్యానపురస్ఫురన్నలా:— అస్ఫుటంస్ఫుటం సమ్పద్యమానం భవత్ = స్ఫుటీభవత్, స్ఫుటీభవచ్చతత్ధ్యానంచ= స్ఫుటీభవద్ధ్యానం, స్ఫుటీభవద్ధ్యానేనపురఃస్ఫురన్ = స్ఫుటీభవద్ధ్యానపురస్ఫురన్, స్ఫుటీభవద్ధ్యానపురఃస్ఫురన్నలః యస్యాస్సా = స్ఫుటీభవద్ధ్యానపురః స్ఫురన్నలా.

**భావము :**

తర్వాత నాదమయన్తి, స్వయంవరార్థమైన విప్పపూలమాలచేతను (జపమాలచేతను) నలుని నామమును జపించుచున్నదై, యందుచేతనే ధ్యానమువలన నలుని ప్రత్యక్షమునొందినదై యీ యుత్కలేశ్వరుని గూర్చి సరస్వతిదేవి గావించిన వర్ణనమనెడి యద్భుతరసమును హృదయమునఁగ్రోలఁ గోరినదో యనునట్లు కనులను మూసినది. కాని వాస్తవమున నలుని సాక్షాత్కారమువలని సుఖము ననుభవించుటకే యామె యవ్విధముగాఁ గనులను మూసినదని యాశయము ॥౮౬॥

శ్లో. ప్రశసింతుం ంసదుపాన్తరక్షిణం
శ్రియా జయన్తం జగతీశ్వరం జినం।
గిరః ప్రతస్తార పురావదేవ తా
దినాన్తసన్ధ్యాసమయస్య దేవతా॥ 87

ప. వి. ప్రశంసింతుం – సంసదుపాన్తరఞ్జినం – శ్రియా - జయన్తం – జగతీశ్వరం – జినం – గిరః – ప్రతస్తార – పురావత్ – ఏవ – తాః – దినాన్తసన్ధ్యాసమయస్య – దేవతా.

అర్థము: దినాన్తసన్ధ్యాసమయస్య; దినాంత=సాయంకాలపు, సన్ధ్యాసమయస్య = సంధ్యాకాలమునకు, దేవతా = అధిదేవతయగు సరస్వతీదేవి, సంసదుపాంతరంజినం = సభాప్రాంతమును రంజిల్లచేయు, శ్రియా=సౌందర్యముచే, జినం = జనదేవుని, జయన్తం = జయించుచున్న, జగతీశ్వరం= భూపతిని, ప్రశంసితుం =స్తుతిచేయుటకు, పురావదేవ = ముందువలెనే, తాః = అప్రసిద్ధములైన, గిరః =వాక్కులను, ప్రతస్తార = విస్తరింపజేసెను.

**సమాసములు :**

సంసదుపాంతరఞ్జినం :— సంసదః ఉపాంతః=సంసదుపాంతః, సంసదుపాన్తంరఞ్జయతీతి = సంసదుపాన్తరఞ్జీ, తమ్=సంసదుపాన్తరఞ్జినమ్.
జగతీశ్వరం :— జగత్యాః ఈశ్వరః=జగతీశ్వరః, తమ్ = జగతీశ్వరం.
దినాంతసంధ్యాసమయస్య :— దినస్యఅన్తః = దినాన్తః, దినాన్త స్య స్యంధ్యా = దినాంతసంధ్యా, దినాంతసంధ్యాయాః సమయః = దినాన్త సంధ్యాసమయః తస్య = దినాన్తసంధ్యాసమయస్య.

**భావము:**

సాయంకాలపు సంధ్యకు నధి దేవతయగు సరస్వతిదేవి, సభలో నొక భాగమును రంజిల్లఁ జేయుచున్నట్టి వాఁడును, సౌందర్యముచే జినదేవుని సైతము మించిన వాఁడును నగు నీ భూపతినిఁ బొగడుటకు ముందువలె తన మాటలను విస్తరింపఁజేసినది. జినభగవానుఁడు మిక్కిలి సౌందర్య వన్తుడని ప్రసిద్ధి ॥౮౭॥

శ్లో. తథాధికుర్యా రుచిరే! చిరేప్సితా
యయోత్సుకః సమ్ప్రతి సమ్ప్రతీచ్ఛతి ।
అపాఙ్గరఙ్గస్థలలాస్యలమ్పటాః
కటాక్షధారాస్తవ కీకటాధిపః ॥ 88

ప. వి. తథా - అధికుర్యాః - రుచిరే - చిరేప్సితాః - యయా - ఉత్సుకః - సమ్ప్రతి - సమ్ప్రతీచ్ఛతి - అపాఙ్గరఙ్గస్థలలాస్యలమ్పటాః - కటాక్ష ధారాః - తవ - కీకటాధిపః.

అర్థము. హేరుచిరే=ఓ సుందరీ! ఉత్సుకః = నీయెడనుత్కంఠ గల్గిన, కీకటాదిపః=మగధదేశపు ప్రభువు, చిరేప్సితాః; చిర = చిరకాలమునుండి, ఈప్సితాః=కోరఁబడిన, అపాఙ్గరఙ్గస్థలలాస్యలంపటాః; అపాఙ్గ=కడకన్నెడి, రఙ్గస్థల=రంగస్థలమునందు, లాస్య=నృత్యమునకు, లమ్పటాః= ఆసక్తిగల్గిన, తవ = నీయొక్క, కటాక్షధారాః=కడకన్నుల వరుసలను యథా = ఎట్లు, సమ్ప్రతి = ఇప్పుడు, సమ్ప్రతీచ్ఛతి=చక్కగాఁబొందుటకు నర్హుడో, తథా=అట్లు, అధికుర్యాః=ప్రసరింపఁజేయుము. అనగా కటాక్షములఁ చేతనైనను వీనిని జూడుమని యర్థము.

**సమాసములు :**

చిరేప్సితాః :- చిరమీప్సితాః=చిరేప్సితాః

అపాఙ్గరఙ్గ స్థలలాస్యలమ్పటాః :- అపాఙ్గ ఏవరఙ్గస్థలమ్=అపాఙ్గరఙ్గస్థలం, అపాఙ్గరఙ్గస్థలేలాస్యం = అపాఙ్గరఙ్గస్థలస్యం=అపాఙ్గరఙ్గస్థలలాస్యే, లమ్పటాః = అపాఙ్గరఙ్గస్థలలాస్యలమ్పటాః, తాః=అపాఙ్గరఙ్గస్థలరాస్యలమ్పటాః।

కటాక్షధారాః:- కటాక్షాణాంధారాః=కటాక్షధారాః, తాః=కటాక్షధారాః.
కీకటాధిపః :- కీకటానామధిపః = కీకటాధిపః.

**భావము :**

ఓ సుందరీ! మగధదేశ ప్రభువు చిరకాలమునుండి నీయెడ నాసక్తి గల్గియున్నాడు. అతడు నీ కటాక్ష పరమ్పరకై తహతహలాడుచున్నాడు. కాన

నీ కన్నుల యంచులనెడి రంగస్థలమున, నృత్యముచాతు నీ కటాక్షములను బొందనర్హుడగునట్లు, అతనిపై వానిని ప్రసరింపఁజేయుము. ॥౮౮॥

శ్లో. ఇదంయశాంసి ద్విషతః సుధారుచః
కిమఙ్కమేతద్ద్విషతః కిమాననమ్ ।
యశోభిరస్యాఖిలలోకధావిభి
ర్విభీషితా ధావతి తామసీ మసీ ॥ 89

ప. వి. ఇదంయశాంసి - ద్విషతః - సుధారుచః - కిమ్ - అఙ్కమ్ - ఏతద్ద్విషతః - కిమ్ - ఆననమ్ - యశోభిః - అస్య - అఖిలలోకధావిభిః - విభీషితా - ధావతి - తామసీ - మసీ.

అర్థము. అఖిలలోకధావిభిః; అఖిలలోక=సకల లోకములయందును, ధాఃవిభిః=పరుగిడుచున్నవియు ననగా, మూడు లోకముల యందును వ్యాపించుచున్న, అస్య = ఈ మగధేశ్వరునియొక్క, యశోభిః=కీర్తులతో, విభీషితా=భయపఱుపఁబడిన, తామసీ=చీకటికి సంబంధించిన, మసీ=మసి, అనగా మాలిన్యము, ఇదంయశాంసి=ఇతనికీర్తులను, ద్విషతః=ద్వేషించుచున్న, సుధారుచః=చంద్రునియొక్క, అఙ్కం=కలకమునుఁగూర్చి, కింధావతి=పొందునాయేమి? తథా=అట్లే, ఏతద్ద్విషతః=ఇతని శత్రువు యొక్క, ఆననం=ముఖమును, ధావతికిమ్=పొందునా యేమి? ఈతని కీర్తి చంద్రికల భయముచే చీకటి చంద్రునియందు కలంకరూపము తోడను, ఈతని శత్రువుల ముఖమును మాలిన్యరూపము తోడను ప్రవేశించినదా యేమి? అట్లు కానిచో నీ రెంటికి నెల్లప్పుడీ మాలిన్య మేమిటి? యని యర్థము.

వి. చీకటి యీతని భయముతో చంద్రునియందు కళంకముగను, శత్రు ముఖమునందు మాలిన్యముగను నుండక పోయినను కలఙ్కమాలిన్యములుగా నున్నదో యని భావింపబడుట వలన నిఁట నుత్ప్రేక్ష.

**సమాసములు :**

ఇదంయశాంసి :- అస్యయశాంసి=ఇదంయశాంసి, తాని=ఇదంయశాంసి।

ఏతద్ద్విషతః :- ఏతస్యద్విషన్తః=ఏతద్ద్విషన్తః, తాన్=ఏతద్ద్విషతః।
అఖిలలోకధావిభిః:- అఖిలాశ్చతేలోకాశ్చ=అఖిలలోకాః, అఖిలలోకాన్ ధావన్తీతి=అఖిలలోకధావీని, తైః=అఖిలలోకధావిభిః।
తామసీ :- తమసః ఇయం=తామసీ।

**భావము :**

ఇతని కీర్తి మూడు లోకములయందును సంచరించుచున్నది. దానిని జూచి చీకటివలని మాలిన్యము, ఇతని కీర్తులను ద్వేషించు చంద్రుని కలంక రూపముగను, నితని శత్రువుల ముఖమును మాలిన్యమాపముగనుఁ బ్రవేశించి నదా? యని భావింపవలసియున్నదని యాశయము. ॥౮౯॥

**శ్లో. ఇదన్నృపప్రార్థిభిరుజ్ఝితోఽర్థిభిః**
**మణిప్రరోహేణ వివృధ్య రోహణః ।**
**కియద్దినైరమ్బరమావరిష్యతే**
**ముధా మునిర్విన్ధ్యమరుద్ధ భూధరమ్ 90**

ప. వి. ఇదన్నృప్రార్థిభిః – ఉజ్ఝితః – అర్థిభిః - మణిప్రరోహేణ – వివృధ్య– రోహణః - కియద్దినైః – అమ్బరమ్ – ఆవరిష్యతే – ముధా –మునిః – విన్ధ్యమ్ – అరుద్ధ – భూధరమ్.

అర్థము. ఇదన్నృపప్రార్థిభిః ; ఇదన్నృప=ఈ రాజును, ప్రార్థిభిః=యాచించెడి, అర్థిభిః = యాచకులచే, ఉజ్ఝితః = విడువఁ బడిన, రోహణః = సుమేరు పర్వతము, మణిప్రరోహేణ ; మణి=నూతనములగు రత్నములయొక్క, ప్రరోహేణ = మొలకలచే, వివృధ్య = వ్యయము లేనందువలన వర్ధిల్లి, కియద్దినైః = కొన్నిదినములచేతనే, అమ్బరం=ఆకసమును, ఆవరిష్యతే =ఆచ్ఛాదింపఁ బోవుచున్నది. మునిః = అగస్త్యమహర్షి, ముధా = వ్యర్థముగనే, విధ్యం = వింధ్యమను, భూధరం = పర్వతమును, అరుద్ధ=అడ్డగించెను.

వి : ఇచట రోహణపర్వతముఅంతరిక్షమునాచ్ఛాదించుటలో సంబంధము లేకపోయినను, సంబంధముఁ జెప్పుటవలన సంబంధాతిశయోక్త్య లఙ్కారము.

**సమాసములు :**

ఇదన్నృపప్రార్థిభిః : అయంచాసౌనృపశ్చ = ఇదన్నృపః, ఇదన్నృపం ప్రార్థయన్తీతి ఇదన్నృపప్రార్థినః, తైః=ఇదన్నృపప్రార్థిభిః.

మణిప్రరోహేణ :- మణీనాంప్రరోహః = మణిప్రరోహః, తేన = మణిప్రరోహేణ.

కియద్దినైః :- కియన్తిచతానిదినానిచ = కియద్దినాని, తైః=కియద్దినైః.

**భావము :**

యాచకులందఱును రత్నాంకురములతో వర్ధిల్లు రోహణపర్వతముననగా సుమేరు పర్వతమును వదలిపెట్టి యీ మగధేశ్వరునే యాచింపఁ బ్రారంభించిరి. ఈ మగధేశ్వరుడు యాచకుల కోరికలనన్నింటినిఁ దీర్చుచుండెను. అందువలన సహజముగా యాచకుల కోరికలనీడేర్చు పసిడికొండను యాచించుటకెవ్వరును వెళ్ళకపోయిరి. ఆ పసిడికొండలో ప్రతిదినమును రత్నములు మొలచుచుండును. ఆ రత్నముల నాపర్వతము యాచకులకొసంగుచుండెడిది. ప్రకృతమా పర్వతము నెవ్వరు యాచకులు నాశ్రయింపకపోవుట వలన నా పర్వతమున మొలచు రత్నములకు వ్యయము లేకపోయినది. అందువలన ప్రతిదినము మొలచెడి రత్నాంకురములతో నాపర్వతము పెరిగి యంతరిక్షమునావరింపఁ గలదు. పూర్వమగస్త్యమహర్షి సూర్యచంద్రుల మార్గమునవరోధించిన వింధ్యపర్వతమును తన యాజ్ఞచేఁ బెరుగనీయక తగ్గునట్లు గావించి సూర్యచంద్రుల మార్గమునకు నవరోధమునుఁ దొలగించెనను పురాణప్రసిద్ధిగలదు. కాని యా ఋషి పరిశ్రమ యిఁకవ్యర్థము గాఁ బోవుచున్నది. ఏల యనగా యాచకులు లేనందున రత్నములతో సుమేరుపర్వతము పెరిగి మఱల యాకసమునడ్డగింపఁ గలదు. అనగా నీమగధేశ్వరుని వితరణగుణము, సుమేరుపర్వతమునుఁ గూడ మించినదని యాశయము॥౯౦॥

శ్లో. భూశక్రస్య యశాంసి విక్రమభరేణోపార్జితాని క్రమాత్
ఏతస్య స్తుమహే మహేభదశనస్పర్ధానికైరక్షరైః ।
లిమ్పద్భిః కృతకం కృతోఽపి రజతం రాజ్ఞాం యశఃపారదైః
రస్య స్వర్ణగిరిః ప్రతాపదహనైః స్వర్ణం పునర్నిర్మితః 91

ప. వి. భూశక్రస్య-యశాంసి-విక్రమభరేణ-ఉపార్జితాని-క్రమాత్-ఏతస్య-స్తుమహే-మహేభదశనస్పర్ధీని-కైః-అక్షరైః-లిమ్పద్భిః-కృతకం-కృతే-అపి-రజతం-రాజ్ఞాం-యశఃపారదైః-అస్య-స్వర్ణగిరిః-ప్రతాపదహనైః-స్వర్ణం-పునః-నిర్మితః.

అర్థము. భూశక్రస్య=భూలోకమునకింద్రుఁడైన, ఏతస్య=ఈ రాజునకు సంబంధించినవియు, విక్రమభరేణ=పరాక్రమాతిశయముచే, క్రమాత్=క్రమముగా, ఉపార్జితాని = సంపాదింపఁబడినవియు, మహేభదశనస్పర్ధీని, మహేభ=మహాగజముయొక్క, దశన = దంతములలో, స్పర్ధీని=తెల్లఁదనమున కలహమాడు ననియు ననగా వానితో పోలినవియు,నగు యశాంసి=కీర్తులను,కైః=ఏ, అక్షరైః=అక్షరములతో, స్తుమహే=స్తుతిఁజేయగలము, అనగా వర్ణింపగలము. ఇతని కీర్తులు లెక్కకు మించినవిగాన కేవలము ఏబది సంఖ్యగల యక్షరములతో నెట్లు వర్ణింతుమని భావము. తథాహి=అది యుక్తమే! లిమ్పద్భిః=పసిడికొండకే పూతపెట్టుచున్న, రాజ్ఞాం=శత్రు రాజులయొక్క, యశఃపారదైః=కీర్తులనెడి పాదరసములతో, కృతకం=కృత్రిమమైన, రజతం=వెండిగా, కృతోఽపి=చేయఁబడినను, స్వర్ణగిరిః=పసిడికొండ, అస్య=ఇతనియొక్క, ప్రతాపదహనైః=ప్రతాపాగ్నులచే, పునః=మఱల, స్వర్ణం=పసిడిగా, నిర్మితః=చేయఁబడినది. పాదరసముచే బూయబడిన బంగారు వెండివలె నుండును. మఱల నగ్నితోఁ గాల్చినచో బంగారుగనే యేర్పడును.

వి. ఇచట శత్రురాజుల కీర్తిసంబంధము మగధేశ్వరుని ప్రతాప సంబంధము లేకపోయినను నున్నట్లు చెప్పుటవలన సంబంధాతిశయోక్త్యలంకారము.

**సమాసములు :**

భూశక్రస్య :- భువః శక్రః=భూశక్రః, తస్య=భూశక్రస్య।
విక్రమభరేణ :- విక్రమస్యభరః=విక్రమభరః. తేన = విక్రమభరేణ।
మహేభదశనస్పర్ధీని :- మహాంశ్చాసౌ ఇభశ్చ=మహేభః, మహేభస్య దశనౌ = మహేభదశనౌ। మహేభదశనాభ్యాం స్పర్ధీని = మహేభదశనస్పర్ధీని, తాని=మహేభదశనస్పర్ధీని।

యశఃపారదైః :- యశాంస్యేవ పారదాః=యశఃపారదాః, తైః=యశఃపారదైః।
స్వర్ణగిరిః :- సర్ణమయః గిరిః=స్వర్ణగిరిః।
ప్రతాపదహనైః :- ప్రతాపాఏవదహనాః = ప్రతాపదహనాః, తైః = ప్రతాపదహనైః।

**భావము :**

భూలోకమునకు నింద్రుఁడైన యీ మగధేశ్వరుని కీర్తులు, పరాక్రమాతిశయముచేత సమ్పాదింపఁబడినవి. తెల్లఁదనమున గజేన్ద్రుని దన్తకాంతితోఁ బోరాడునవి. అట్టి యితని కీర్తులెల్లలేనివి. వీనిని వర్ణించుటకు నక్షరములు చాలవు. ఏలయనగా నకారాద్యక్షరములేబదిమాత్రమే యున్నవి. ఇట్టి యేబది యక్షరములతో నాతని యనన్తయశస్సు నెట్లువర్ణింపఁగలము. మఱియు నీతని ప్రతాపమును గూడ సాటిలేనిది. ఏలయనగా- ఈతని శత్రువుల కీర్తులనెడి పాదరసములచే పసిడికొండ వెండిగా మాఱినను, నీతని ప్రతాపాగ్నులచే నాకొండ మఱల బంగారుకొండగనే మాఱినది. కావున నీతని ప్రతాపము ముందు శత్రువుల కీర్తులకించిత్కరములని యాశయము ॥౯౧॥

**శ్లో. యద్భర్తుః కురుతేభిషేణనమయం శక్రో భువః సా ధ్రువం**
**దిగ్గాహైరివ భస్మభిర్మఘవతా సృష్టైర్ధృతోద్ధూలనా.**
**శమ్భోర్మా బత !సాంధివేలనటనం భాజి వ్రతం ద్రాగితి**
**క్షోణీ నృత్యతి మూర్తిరష్టవపుషోఽసృగ్వృష్టిసంధ్యాధియా 92**

ప. వి. యద్భర్తుః - కురుతే - అభిషేణనమ్ - అయం - శక్రః - భువః - సా - ధ్రువం - దిగ్గాహైః - ఇవ - భస్మభిః - మఘవతా - సృష్టైః - ధృతా - ఉద్ధూలనా - శమ్భోః - మా - బత - సాన్ధివేలనటనం - భాజి - వ్రతం - ద్రాక్ - ఇతి - క్షోణీ - నృత్యతి - మూర్తిః - అష్టవపుషః - అసృగ్వృష్టిసంధ్యాధియా.

అర్థము. భువః=భూమికి, శక్రః=దేవేంద్రుడైన, అయం=ఈరాజు, యద్భర్తుః; యత్ = ఏ భూమియొక్క, భర్తుః = పాలకుని, అభిషేణనం =

సేనతో ముట్టడిని, కురుతే = చేయుచున్నాడు, అష్టవపుషః = ఎనిమిది శరీరములుగల శివునికి, మూర్తిః = ఎనిమిది దేహములలో నొక్క దేహమైన, సా=ఆ భూమి, మఘవతా – ఇన్ద్రునిచే, సృష్టైః=సృజింపఁ బడిన దిగ్దాహైః=దిగ్దాహములనుండి యుద్భవించిన, భస్మభిరివ = భస్మముల చేతనోయనునట్లు, ధృతోద్ధూలనా ; ధృత=ధరింపఁ బడిన, ఉద్ధూలనా= మైపూతగలదై (శివుడు భస్మముఁ బట్టించుకొనును కాన నతని శరీరమైన భూమికిని భస్మము పైననురాగముండుట యుచితముగదా.) అసృగ్వృష్టి సంధ్యాధియా = సహజమగు రక్తవర్షము పడగా దానిని సాయంకాలపు సంధ్యయను భ్రాంతితో, శంభోః=శివునియొక్క, సాంధివేలనటనం; సాంధివేల = సంధికాలమందుఁ గల్గిన, నటనం = నాట్యమనెడి, వ్రతం = వ్రతము, మాభాజి=భగ్నముకారాదు, ఇతి=అని, మత్వా = తలంచి, ద్రాక్ = వెంటనే, నృత్యతి = కంపించుచున్నది, ధ్రువం = సత్యము, బత = ఆశ్చర్యము.

వి. ఇచ్చట సేనల కాళ్ళనుండి పైకిలేచిన ధూళిచేఁ గప్పఁ బడినభూమిని భస్మముతోఁ బూయఁ బడినదిగా భావించుటవల నుత్ప్రేక్ష. వ్యఞ్జకమగు నివశబ్దమునుఁ బ్రయోగించుట వలన నది వాచ్యము.

**సమాసములు :**

యద్భర్తుః :- యస్యాః భర్తా=యద్భర్తా, తస్య=యద్భర్తుః।

దిగ్దాహైః :- దిశాం దాహాః=దిగ్దాహాః, తైః=దిగ్దాహైః।

సాంధివేలనటనం :- సంధివేలాయాం భవం=సాంధివేలం, సాంధివేలం చతత్ నటనంచ=సాంధివేలనటనం, తత్=సాంధివేలనటనమ్।

అష్టవపుషః :- అష్ట,వపూంషి యస్యసః=అష్టవపుః, తస్య=అష్టవపుషః

అసృగ్వృష్టిసంధ్యాధియా :- అసృజః వృష్టిః=అసృగ్వృష్టిః, సంధ్యాయాఃధీః=సంధ్యాధీః. అసృగ్వృష్టౌ సంధ్యాధీః=అసృగ్వృష్టిసంధ్యాధీః, తయా, అసృగ్వృష్టిసంధ్యాధియా।

భావము :

ఈ రాజు భూమికి పాలకుడగు రాజుపై దండెత్తునపుడు, ఈ భూమి, శివునియొక్క యెనిమిది శరీరములలో నొక్కటియైనందు వలన, నింద్రుఁడు కల్పించెడి సహజములగు దిగ్దాహములను నుపద్రవములచే నేర్పడిన భస్మముతోఁ బూయఁబడినట్లు సేనాధూలిచేఁ బూయఁబడినదై యుండును. ఈ భూమి శివుని యష్ట శరీరములలో నొక్కటి కాన, శివుడు భస్మప్రియుఁడైనందు వలన దీనికిని భస్మప్రియత్వము దగినది గదా! అనగా నీ రాజు కావించెడి దండయాత్ర యందుఁ బైకెగరిన ధూళి, సాధారణముగా యుద్ధములయందు జరుగు దిగ్దాహము వలన నుద్భవించిన భస్మమువలె నుండుట వలన నా ధూళికమ్మిన భూమి శివుని కాయమునందొకటి యగుటవలన భస్మముపై నాదరముంచి దానిని యొంటికిఁ బట్టించుకొన్నదో యనునట్లు కానవచ్చుచున్నది. మఱియు దండయాత్ర యందు సంభవించు రక్త వర్షము సంధ్యారాగమువలె కానవచ్చుచున్నది. శివుడు సాయం కాలమందలి ప్రదోషమునందు దేహమునకు భస్మమలదుకొని నృత్యము చేయుట ప్రసిద్ధి. ఇచ్చట భూమియు శివుని శరీరములో నొక్కటి గాన నిది సేనారజ మను దిగ్దాహజన్య భస్మమునుఁ బట్టించుకొని, యుద్ధమందలి శత్రుదేహముల నుండి ప్రవహించు రక్త వర్షమునందు సాయంసంధ్య యను భ్రాన్తితో శివుని సంధ్యాకాలపు నృత్యమునకు భంగము రాకూడదను భావముచే భూకమ్ప రూప మున తన నృత్యమునుఁ గనుపఱచుచున్నది. అనగా నీ రాజు దండయాత్ర సలువునపుడు శత్రు పట్టణములను దహించుట వలన నంతటను దిక్కులు దహించుచుండును. సేనారజముపై కెగురుచుండును. శత్రువులు చంపఁబడుట వలన వారి శరీరమునుండి రక్తము ప్రవహించుచుండును. భూకమ్పము లేర్పడు చుండునని యాశయము. ॥౯౨॥

శ్లో. ప్రాగేతద్వపురాముఖేన్దు సృజతః స్రష్టుః సమగ్రస్త్విషాం
కోశః శోషమగాదగాధజగతీశిల్పేఽప్యనల్పాయితః ।
నిఃశేషద్యుతిమణ్డలవ్యయవశాదీషల్లభైరేష వా
శేషః కేశమయః కిమన్ధతమసాంస్తోమైస్తతో నిర్మితాః॥ 93

ప. వి. ప్రాక్ - ఏతద్వపుః - ఆముఖేన్దు – సృజతః – స్రష్టుః – సమగ్రః– త్విషాం – కోశః – శోషమ్ – అగాత్–అగాధజగతీశిల్పే-అపి-అనల్పా యితః - నిఃశేషద్యుతిమణ్డలవ్యయవశాత్ - ఈషల్లభైః - ఏషః - వా- శేషః - కేశమయః - కిమ్ - అన్ధతమసాం - స్తోమైః - తతః-నిర్మితః.

అర్థము. ప్రాక్ = తొలుతననగా సృష్టి ప్రారంభకాలమునందు, ఏతద్వపుః ; ఏతత్ = ఈరాజుయొక్క, వపుః = శరీరము, ఆముఖేందు = ముఖ చంద్రునివరకును, సృజతః = సృజించుచున్న బ్రహ్మకు సంబంధించి నదియు, అగాధజగతీశిల్పేఽపి; అగాధ=అఖిలములగు, జగతీ=ప్రపం చముయొక్క, శిల్పేఽపి=నిర్మాణమందును, అనల్పాయితః = క్షీణము కానిదియును, సమగ్రః = సంపూర్ణమైన, త్విషాం = కాంతులయొక్క, కోశః=రాశి, శోషం=శూన్యత్వమును. అగాత్=పొందినది, తతః=అందు వలన, నిఃశేషద్యుతిమణ్డలవ్యయవశాత్; నిఃశేష=సమగ్రమైన. ద్యుతి మణ్డల = కాంతిమండలమునకు, వ్యయ = నాశమునకు, వశాత్=అధీన తవలననగా, వ్యయమునుఁబొందుట వలన, ఈషల్లభైః = సులభము లైన అనగా న్యాయమతమున తేజస్సామాన్యాభావమే తమస్సుఅగుట వలన, సుఖముగా లభ్యములైన, అన్ధతమసాం=చీకట్లయొక్క, స్తోమైః= సమూహములచే, ఏషః=ఈ, కేశమయః=కేశపాశరూపమైన, శేషః = మిగిలిన శరీరము. నిర్మితోవా = నిర్మింపఁబడినదా యేమి ?

వి. ఈతని కేశపాశము చీకట్ల సమూహములచే నిర్మింపబడక పోయినను నిర్మించినట్లు భావించుట వలన నుత్ప్రేక్షాలఙ్కారము. అందు వలన నా రాజునకు లోకోత్తరమగు తేజస్సు గలదను వస్తువు ధ్వనించుటవలన నలంకారముచే వస్తుధ్వని.

**సమాసములు :**

ఏతద్వపుః :- ఏతస్యవపుః=ఏతద్వపుః. తత్=ఏతద్వపుః.

ఆముఖేన్దు:- ముఖమిందురివ =ముఖేన్దు, ముఖేన్దుమభివ్యాప్య=ఆముఖేన్దు

అగాధజగతీశిల్పే :- అగాధాశ్చాతాఃజగత్యశ్చ = అగాధజగత్యః, అగాధ జగతీనాంశిల్పమ్ = అగాధజగతీశిల్పమ్, తస్మిన్=న్ అగాధజగతీశిల్పే.

అనల్పాయితః:- నఅల్పః = అనల్పః, అనల్పఇవఆచరితః = అనల్పా
యితః ।
నిఃశేషద్యుతిమణ్డలవ్యయవశాత్ :- ద్యుతీనాంమణ్డలం = ద్యుతిమణ్డలమ్,
నిశ్శేషంచతత్ద్యుతిమణ్డలంచ = నిఃశేషద్యుతిమణ్డలం, నిశ్శేషద్యుతి
మణ్డలస్యవ్యయః = నిశ్శేషద్యుతిమణ్డలవ్యయః, నిశ్శేషద్యుతిమణ్డలవ్యయ
స్యవశః = నిశ్శేషద్యుతిమణ్డలవ్యయవశః, తస్మాత్ = నిఃశేషద్యుతి
మణ్డలవ్యయవశాత్.
ఈషల్లభ్యైః:- ఈషత్లభ్యాన్త ఇతి = ఈషల్లభాః, తైః=ఈషల్లభ్యైః।
కేశమయః:- కేశానాంవికారః=కేశమయః।

**భావము :**

సృష్టి ప్రారంభ కాలమునందు బ్రహ్మయీ రాజు శరీరమును నాతని మోమువరకును సృజించెను. అఖిల ప్రపంచములను నాతడు సృజించి నపుడు పోయినట్టి యక్షయమైన కాంతిరాశి, యీ రాజు శరీరమును మోము వరకు నిర్మింపగనే క్షీణమై పోయినది. ఇక నా సమయమున సులభముగా లభింపదగినది యాకాంతి రాశియొక్క యభావమే. అనగా చీకటి. న్యాయమతమున తేజసామాన్యాభావమే యంధకారమని సిద్ధాన్తము. కాన నిచ్చట నీ రాజుయొక్క శరీరసృష్టిలో సకల తేజస్సులు వ్యయపములుగాన కేవల మాతేజస్సుల యభావరూపములైన తమస్సులు అనగా చీకట్లే సులభములైనవి. ఆ చీకట్ల చేతనే యానరపతి యొక్క కేశపాశమనెడి శరీర భాగము సృజింపబడినదా? యని భావింపవలసి యున్నది. ఆ యన్ధకారములచేతనే యాతని కేశపాశమును సృజింప వలసివచ్చి నందువలన వానికంతటిలోకోత్తర సౌభాగ్యశాలిత్వ మేర్పడినదని భావము. ॥౯౩॥

శ్లో. తత్తద్దిగ్జైత్రయాత్రోద్ధురతురగఖురాగ్రోద్ధతైరన్ధకారః
నిర్వాణారిప్రతాపానలజమివ సృజత్యేష రాజా రజోభిః।
భూగోళచ్ఛాయమాయామయగణితవిదున్నేయకాయో
ఖియాఽభూత్
ఏతత్కీర్తిప్రతానైర్విధుఖిరివ యుధే రాహుణాహూయ
మానః ॥ 94

ప. వి. తత్తద్దిగ్జైత్రయాత్రోద్ధ తతురగఖురాగ్రోద్ధతైః – అన్ధకారః–నిర్వాణారి ప్రతాపానలజమ్ – ఇవ–సృజతు–ఏషః–రాజా–రజోభిః–భూగోళచ్ఛాయమాయా మయగణిత విదున్నేయ కాయః–భియః–అభూత్–ఏతత్కీర్తి ప్రతానైః–విధుభిః–ఇవ–యుధే – రాహుః–ఆహూయమానః.

అర్థము. ఏషః=ఈ, రాజా=రాజు, తత్తద్దిగ్జైత్రయాత్రోద్ధుర తురగఖురాగ్రోద్ధతైః, తత్తద్దిక్=తూర్పుమొదలగు నాయాదిక్కుల యొక్క, జైత్రయాత్రా = జైత్రయాత్రలయందు, ఉద్ధుర=విశృంఖులములైన, తురగ= గుఱ్ఱముల యొక్క, ఖురాగ్ర = గిట్టలకొనలనుండి, ఉద్ధతైః =పైకెగురఁ గొట్టఁబడిన, రజోభిః=ధూళులచే, నిర్వాణారి ప్రతాపానలజమివ; నిర్వాణ= చల్లారిన, అరిప్రతాపానల, = శత్రుప్రతాపాగ్నినుండి, జమివ=కల్గినదోయనునట్లున్న, అన్ధకారం =చీకటిని, సృజతి=కల్పించుచున్నాఁడు. ఏతత్కీర్తిప్రతానైః ; ఏతత్ = ఈరాజుయొక్క, కీర్తిప్రతానైః = కీర్తిసమూహములనెడు, విధుభిః= చంద్రులచే, యుధే = యుద్ధమునకు ఆహూయమాన ఇవ = పిలువబడుచున్నాడో యనునట్లున్న, రాహుః = రాహువు, భియా = భయముచే, భూగోళచ్ఛాయమాయామయగణిత విదున్నేయకాయః ; భూగోళ =భూమణ్డలముయొక్క, ఛాయా = నీడయనెడి మాయా=కపటయొక్క, మయ=రూపము కల్గినదియు, గణితవిత్=గణిత శాస్త్రవేత్తచే, ఉన్నేయ = ఊహింపఁదగిన, కాయః = శరీరము గల్గిన వాడుగా, అభూత్=అయెను. జ్యోతిః శాస్త్రమునను సరించి రాహువు భూమియొక్క నీడయని తెలియుచున్నది. కాని యీతని కీర్తి చంద్రుని వలనిభయముచే నారాహువు తనరూపమును భూమియొక్క నీడగాఁజేసు కొనినట్లు భావింపఁబడినది.

వి. ఇచ్చట సాధారణ చంద్రుడు రాహువును భయపఱుపఁ జాలడు. పైగా రాహువునుఁ జూచి యాతనికే భయము. కాని యీతని కీర్తిచంద్రులు రాహువునుభయపఱతురు కానవీనికి ప్రసిద్ధచంద్రుని కంటెను నాధిక్యమునుఁ జెప్పుటవలన వ్యతిరేకాలంకారము పైవిషయముచే ధ్వనించు చున్నది.

**సమాసములు :**

తత్తద్దిగ్జైత్రయాత్రోద్ధుర తురగఖు రాగ్రోద్ధతైః-తాశ్చ, తాశ్చ దిశః = తత్తదిశః, తత్తద్దిశానాంజైత్రయాత్రాః=తత్తదిగ్జైత్రయాత్రాః, తత్తద్దిగ్ జైత్రయాత్రాసు ఉద్ధురాః = తత్తద్దిగ్ జైత్రయాత్రోద్ధురాః, తత్తద్దిగ్ జైత్రయాత్రోద్ధురాశ్చతేతురగాశ్చ= తత్తద్దిగ్జైత్రయాత్రోద్ధురతురగాః, తత్తద్ధిగ్జైత్రయాత్రోద్ధుర ణాంఖురాః=తత్తద్దిగ్జైత్రయాత్రోద్ధురతుర గఖురాః , తత్తద్దిగ్ జైత్రయాత్రోద్ధురతురగఖురాణామగ్రాణి=తత్తద్దిగ్ జైత్రయాత్రోద్ధురతురగ ఖురాగ్రాణి, తత్తద్దిగ్ జైత్రయాత్రోద్ధుర తురగఖురాగ్రేభ్యః ఉద్ధతాని = తత్తద్దిగ్జైత్రయాత్రోద్ధుర తురగఖురా గ్రోద్ధతాని = తైః=తత్తద్దిగ్జైత్రయాత్రోద్ధుర తురగఖురాగ్రోద్ధతైః।

నిర్వాణారిప్రతాపానలజమ్ :- అరీణాంప్రతాపః = అరిప్రతాపః, అరిప్రతాపఏవ అనలః = అరిప్రతాపానలః , నిర్వాణశ్చాసౌ, అరిప్రతా పానలశ్చ = నిర్వాణారిప్రతాపానలః , నిర్వాణారిప్రతాపానలాత్ జాయత ఇతి = నిర్వాణారిప్రతాపానలజః , తమ్ = నిర్వాణారిప్రతాపా నలజమ్.

భూగోలచ్ఛాయమాయామయ గణితవిదున్నేయకాయః : – భూగోలస్య చ్ఛాయా = భూగోలచ్ఛాయం, భూగోలచ్ఛాయమేవమాయా= భూగోల చ్ఛాయమాయా, భూగోలచ్ఛాయమాయాయాః వికారః = భూగోలచ్ఛా యమాయామయః, గణితంవేత్తీతి = గణితవిత్, గణిత విదా ఉన్నేయః = గణితవిదున్నేయః, గణితవిదున్నేయశ్చాసౌకా యశ్చ =గణితవిదున్నేయకాయః, భూగోలచ్ఛాయ మాయామయః, గణితవిదున్నేయః కాయః యస్యసః = భూగోలచ్ఛాయ మాయామయ గణితవిదున్నేయకాయః,

ఏతత్కీర్తిప్రతానైః :- ఏతస్యకీర్తయః = ఏతత్కీర్తయః, ఏతత్కీ ర్తీనాం ప్రతానాః = ఏతత్కీర్తిప్రతానాః, తైః = ఏతత్కీర్తిప్రతానైః.

**భావము :**

ఈ రాజు, తూర్పు మొదలగు దిక్కులలోని, తన జైత్రయాత్రలయందు, విశృంఖలముగా సంచరించెడి గుఱ్ఱముల గిట్టలనుండి పైకెగుర గొట్టఁ బడిన ధూళులచే, శత్రువుల ప్రతాపాగ్ని నుండి యన్ధకారమును కల్పించుచున్నాడు. అగ్ని చల్లారినపుడంధకారముగల్గుట సహజమేగదా ! ఈతని కీర్తి చంద్రులు రాహువును యుద్ధమునకు పిలుచుటచే నారాహువు భయపడి భూమియొక్క నీడను తనరూపముగాఁ జేసికొనెను. కాన చీకటిగానున్న యాతని రూపము కాన రాదు. అది జ్యోతిశ్శాస్త్రపు గణితముఅనుఁ దెలిసికొనినవారికి మాత్రమే యూహింపఁ దగినదై యుండినది. జ్యోతిశ్శాస్త్రముననుసరించి రాహుకేతువులు ఛాయాగ్రహములని చెప్పఁ బడినవి. ఆఛాయయే, భూఛ్ఛాయ. అదియేరాహుకేతు వుల స్వరూపము. కీర్తిచంద్రుల భయముచే రాహువు తసరూపము కానరాక యుండుటకై యన్ధకారపు రూపమునుబొందెనో యనునట్లు సంభావింపఁ బడినది. అనగా నతనికీర్తిచంద్రులు ప్రసిద్ధ చంద్రునికంటెను నతిశయితమగు కాంతిని ధైర్యమునువహించి, తమజన్మశత్రువగు రాహువునెదుర్కొనుచున్నవని యాశ యము॥౯౪॥

**శ్లో. ఆస్తే దామోదరీయామియముదరదరీం యాధిశయ్య త్రిలోకీ,**
**సమ్మాతుం శక్తిమన్తి ప్రథిమభరవశాత్తత్ర నైతద్యశాంసి ।**
**తామేతాం పూరయిత్వా నిరగురివమధుధ్వంసినః పాణ్డుపద్మ**
**చ్ఛద్మాపన్నాని తాని ద్విపదశనసనాభీని నాభీపథేన ॥ 95**

ప.వి. ఆస్తే - దామోదరీయామ్ - ఇయమ్ - ఉదరదరీం - యా - అధిశయ్య - త్రిలోకీ - సమ్మాతుం - శక్తిమన్తి - ప్రథిమభరవశాత్ - తత్ర - న - ఏతద్యశాంసి - తామ్ - ఏతాం - పూరయిత్వా - నిరగుః - ఇవ - మధు ధ్వంసినః - పాణ్డుపద్మచ్ఛద్మాపన్నాని - తాని - ద్విపదశనసనాభీని - నాభీపథేన.

అర్థము. యా = ఏ, ఇయం = ఈ, త్రిలోకీ = మూడులోకములసమూహము, దామోదరీయాం = శ్రీ మహావిష్ణువునకు సంబంధించిన, ఉదరదరీం = ఉదరమనెడి గుహను, అధిశయ్య = అధిష్ఠించి, ఆస్తే = ఉన్నదో, తాని =

ప్రసిద్ధములైన, ద్విపదశనసనాభీని ; ద్విపదశన=ఏనుగదంతములతో, సనాభీని=సమానములైన, ఏతద్యశాంసి=ఈతనికీర్తులు, ప్రథిమభరవశాత్ ; ప్రథిమ = మహత్త్వమువలని, భరవశాత్ = భారవశమువలన, తత్ర = ఆ విష్ణువుయొక్క యుదరమందున్న మూడులోకములయందు, సమ్మాతుం = సుఖముగానుండుటకు, శక్తిమన్తి=శక్తిగలవిగా, న = లేవు, తామ్=ఆ, ఏతాం=ఈ మహావిష్ణునుదర గుహను, పూరయిత్వా= నింపి, మధుధ్వంసినః=విష్ణువుయొక్క, పాండుపద్మచ్ఛద్మాపన్నాని; పాండుపద్మ = నాభియందలితెల్లఁ దామరపూవుయొక్క, ఛద్మ = నెపమును, ఆపన్నాని = పొందినవై, నాభీపథేన ; నాభీ=పొక్కిలియొక్క పథేన = మార్గమగు రంధ్రముచే, నిరగురివ=వెలువడినవోయనునట్లు (రేజుః = ప్రకాశించినవి). అతనికీర్తులు, ఇరుకైన విష్ణునుదరమున నివసింప లేక వెలుపలికివచ్చినవో యనునట్లున్నవని యర్థము.

వి. నాభి పద్మపు నెపమున వెలువడినవో యనునట్లున్నవని చెప్పుట వలన సపహ్నవముతోఁ గూడిన యుత్ప్రేక్ష.

మూడు లోకములకును రాజ యశస్సునకును నాధారాధేయ భావము సరిపడనందువలననగా, నాధారమగు మూడులోకములకంటెను నాధేయమైన యశస్సు పెద్దదిగా నుడుటవలన నాధారాధేయములకు వైలక్షణ్యము వచ్చినది. కావున విలక్షణాలఙ్కారము. ఉత్ప్రేక్షకును దీనికిని సంకరము.

**భావము :**

శ్రీమహావిష్ణు నుదరమునందు మూడు లోకములున్నవి. కాని యీ రాజు యొక్క కీర్తులెక్కువ పరిమాణమునందుఁడుట వలన శ్రీవిష్ణు నుదరమున పట్ట లేకపోయినది. అందువలననవి యావిష్ణువు నాభియందలి తెల్లఁదామర పూవు నెపముతో, పిగిలి వెలుపలికి వెడలివచ్చినవా యని భావింపఁదగియున్నవి. ఆ నృపతి కీర్తులు తెల్లనివి. విష్ణువు నాభికమలము తెల్లనిది. కాన నా తెల్లని పద్మము, ఆ విష్ణు నుదరమునఁబట్టక వెలుపలికి పిగిలివచ్చిన యా నృపతి కీర్తులుగాఁ గాన వచ్చుచున్నదని యాశయము. అనగా నా నృపతి కీర్తు లపరిమితములనియు

నందువలననే ముల్లోకములనుభరించెడి విష్ణు నుదరమునందును పట్టలేక పోయిన వనియు తాత్పర్యము. ॥౮౫॥

శ్లో. అస్యాసిర్భుజగః స్వకోశవివరాకృష్టః స్ఫురత్కృష్ణిమా
కమ్ప్రోన్మీలదరాలలీలవలన స్తేషాం భియే భూభుజామ్ ।
సఙ్గ్రామేషు నిజాఙ్గులీమయమహాసిద్ధౌషధీవీరుధః
పర్వాస్యే వినివేశ్య జాఙ్గులికతా యైర్నామ నాలమ్భితా ॥

ప. వి. అస్య-అసిః-భుజగః- స్వకోశవివరాకృష్టః- స్ఫురత్కృష్ణిమా-కమ్ప్రోన్మీలదరాలలీలవలనః-తేషాం-భియే-భూభుజాం-సఙ్గ్రామేషు-నిజాఙ్గులీమయమహాసిద్ధౌషధీవీరుధః-పర్వ - ఆస్యే-వినివేశ్య-జాఙ్గులికతా-యైః-నామ-న-ఆలమ్భితా.

అర్థము. స్వకోశవివరాకృష్టః; స్వ=తనదైన, కోశ=ఒరయొక్క, వివర=రంధ్రమునుండి (బిలమునుండి) ఆకృష్టః=లాగబడినదియు, స్ఫురత్కృష్ణిమా; స్ఫురత్=ప్రకాశించు, కృష్ణిమా = నల్లదనము గల్గినదియు, కమ్ప్రోన్మీలదరాలలీల వలనః; కమ్ప్ర=శరీరమును విదలించుటచే. ఉన్మీలత్=ప్రకాశించు, అరాల=వంకరతోఁగూడిన, లీల=విలాసముగల్గిన. వలనః=శరీరమును ద్రిప్పుట గలదియునగు, అస్య=ఇతని యొక్క, అసిః = కత్తి, యనెడి, భుజగః=సర్పము, తేషాం=ఆ, భూభుజాం = శత్రు నరపతులకు, భియే=భయమునకై (భవతి=కారణమగుచున్నది.) యైర్నామ=ఏ రాజులచే, సఙ్గ్రామేషు = యుద్ధములయందు, నిజాఙ్గులీమయమహాసిద్ధౌషధీవీరుధః; నిజ=తమదైన, అఙ్గులీమయ=వ్రేళ్లయొక్క రూపముగల, మహా = మహత్త్వము గల్గిన, సిద్ధ=విఫలములుగాని, ఓషధీవీరుధః = ఓషధులైన తీగెలయొక్క, పర్వ=గ్రన్థిని ననగా బొటనవ్రేలి గణుపును, ఆస్యే=ముఖమందు, వినివేశ్య = ఉంచి, జాఙ్గులికతా=విషవైద్యత్వము, నాఽఽలమ్భితా=పొందఁబడలేదు? తప్పక పొందఁబడినది.

వి. ఇచ్చట రాజు ఖడ్గ లతను సర్పముగా చూపించుటచే రూపకము.

సమాసములు :

స్వకోశవివరాకృష్టః :- స్వస్యకోశః = స్వకోశః, స్వకోశస్యవివరః = స్వకోశవివరః, స్వకోశవివరాత్. ఆకృష్టః=స్వకోశవివరాకృష్టః।
స్ఫురత్కృష్ణిమా :- స్ఫురన్ కృష్ణిమా యస్యసః = స్ఫురత్కృష్ణిమా।
కమ్మోన్నిమ్మలదరాలలీలవలనః:- కమ్మేన ఉన్మీల న్తీ కమ్మోన్మీల న్తీ, అరాలాచసాలీలాచ = అరాలలీలా, కమ్మోన్మీల న్తీ అరాలలీలా యస్యతత్= కమ్మోన్మీలదరాలలీలమ్, కమ్మోన్మీలదరాలలీలం, వలనం యస్యసః = కమ్మోన్మీలదరాలలీలవలనః।
నిజాఙ్గులీమయమహాసిద్ధౌషధీపీరుధః.- నిజాచసాఅఙ్గులీచ= నిజాఙ్గులీ, నిజాఙ్గుల్యాఃవికారః = నిజాఙ్గులిమయీ, సిద్ధాచసాఓషధీచ = సిద్ధౌషధీ, మహతీచసాసిద్ధౌషధీచ = మహాసిద్ధౌషధీ, నిజాఙ్గులీమయీచసా మహాసిద్ధౌషధీచ = నిజాఙ్గులీమయమహాసిద్ధౌషధీ, నిజాఙ్గులీమయమహాసిద్ధౌషధ్యాఃపీరుత్ = నిజాఙ్గులీమయమహాసిద్ధౌషధీపీరుత్, తస్యాః=నిజాఙ్గులీమయమహాసిద్ధౌషధీపీరుధః ।

భావము :

ఈ రాజు యుద్ధమునందు తన ఒరనుండి వెలుపలికి తీసినఖడ్గ మనెడి సర్పము నలుపు వన్నెతో మెఱయుచు, దేహమును విదలించుచుకుటిల గతితో నొప్పుచున్నదై శత్రురాజుల కందఱికిని భయముఁగొల్పుచున్నది. యుద్ధమునందు శత్రురాజు లీఖడ్గమను సర్పము నుండి విషమెక్కకుండుటకై తమ చేతిలోని బొటన వ్రేలనెడి గొప్ప మూలికయొక్క ముడిని అనగా (కణుపును) నోటవైచికొని యీ సర్పమునుండి రక్షణముఁ బొందుచున్నారు. సర్పము, నోట మూలిక నుంచుకొనిన విషవైద్యునేమియుఁ జేయఁజాలదు. అట్లే శత్రురాజులీ తనిఖడ్గమనెడి సర్పమునుండి రక్షణముఁ బొందుటకై, తమ బొటన వ్రేలనెడి మూలిక యొక్క గణుపును నోట నుంచుకొని ఖడ్గము నుండి రక్షణముఁబొందుచున్నారు. యుద్ధము నందీరాజు ఖడ్గమును విసరగనే శత్రువులు భయముచే

దైన్యముఁబొంది తమ దీనత్వమునకు సూచకముగా నోటతమ బొటన వ్రేలిని చాని గఱపుల వరకు నుంచుకొని నిశ్చేష్టులగుచున్నారని యాశయము. లోక మున భయగ్రస్తులును, దీనులును, తమ భయాదిసూచకముగా నోట బొటన వ్రేలునుంచుకొనుట ప్రసిద్ధము. ఇతడు రణరంగమున కత్తిని విసరగనే శత్రు లందరు భయగ్రస్తులగు చున్నారని యాశయము.॥౯౬॥

శ్లో. యః పృష్ఠంయుధి దర్శయత్యరిభటశ్రేణీషు యో వక్రతా
మస్మిన్నేవ బిభర్తి యశ్చ కిరతి క్రూరధ్వనిం నిష్ఠురః.
దోషం తస్య తథావిధస్య భజతశ్చాపస్య గృహ్ణాన్ గుణం
విఖ్యాతః స్ఫుటమేక ఏవ నృపతిః సీమా గుణగ్రాహిణామ్॥

ప. వి. యః - పృష్ఠం - యుధి - దర్శయతి - అరిభటశ్రేణీషు - యః - వక్రతామ్ - అస్మిన్ - ఏవ - బిభర్తి - యః - చ - కిరతి - క్రూరధ్వనిం - నిష్ఠురః - దోషం - తస్య - తథావిధస్య - భజతః - చాపస్య - గృహ్ణాన్ - గుణం-విఖ్యాతం - స్ఫుటమ్ - ఏకః-ఏవ - నృపతిః - సీమా - గుణగ్రాహిణామ్.

అర్థము. యః = ఏ విల్లు, (సేనయందున్న యేయొకవ్యక్తి) యుధి = యుద్ధము నందు, అరిభటశ్రేణీషు; అరిభట = శత్రుభటులయొక్క, శ్రేణీషు = వరుసల విషయమున, పృష్ఠం = వెనుకభాగమును, (వింటిని లాగుట చేతను సైనికుడు యుద్ధరంగమునుండి పరుగిడిపోవుటచేతను) దర్శ యతి = చూపునో, యః = ఎవ్వడు, అస్మిన్నేవనృపే = ఈ రాజు విషయమునందు, తన స్వామివిషయమునందు, వక్రతాం = వింటిని లాగుట వలన వంకరను, వక్రస్వభావమును, బిభర్తి = వహించునో, యశ్చ=(ఏది)ఎవ్వడు, అస్మిన్నేవ=ఈతనియందే, నిష్ఠురః=కఠినమును, దయమాలినవాఁడునునై, క్రూరధ్వనిం = శత్రువులకు భయముకలిగిం చెడి టంకార ధ్వనిని, నితనికి నప్రియములగు వచనములను, కిరతి = విస్తరింపజేయునో, దోషం = భుజమును, భజతః = పొందుచున్న, దోషం = అకృత్యమును, భజతః = చేయుచున్న, తథావిధస్య = అటువంటి, తస్య = ఆ, చాపస్య = ధనుస్సుయొక్క, తథావిధస్య=

అటువంటి, తస్య = ఆ సైనికునియొక్క, గుణం = అల్లెత్రాటిని ముందు(బేర్కొన(బడిన శౌర్యధైర్యాది గుణమును, గృహ్ణన్=లాగుచు, వర్ణించుచు, ఏషః = ఈ, నృపతిః = కీకటదేశాధిపతి, ఏకఏవ = ఒక్కడే, గుణగ్రాహిణాం = అల్లెత్రాటిని(బట్టు విలుకాండ్రకును, దోషమును వదలి గుణగ్రహణముచేయు సజ్జనులకును, సీమా = ఎల్లయైనవాడు అనగా శ్రేష్ఠుడని, స్ఫుటం = స్పష్టముగా విఖ్యాతః = ప్రసిద్ధిని(బొందినాడు.

వి. గుణగ్రాహి సీమత్వమునకు పూర్వవాక్యార్థము కారణముగాన వాక్యార్థహేతుకమగు కావ్యలిఙ్గాలంకారము. అనగా ధనుస్సునందు వృష్ఠదర్శనాది దోషములు, సైనికునియందు వృష్ఠదర్శనచే యుద్ధమునుండి పలాయనము మున్నగు దోషములున్నను గుణగ్రాహిత్వ మనగా నల్లెత్రాటిని లాగుట సైనికుని శౌర్య ధైర్యాది గుణములను గ్రహించుటయను ధర్మములచే నితని గుణగ్రాహి సీమత్వమునగా గుణగ్రాహులలో పరమావధిత్వము సమర్థితము కాన కావ్యలిఙ్గాలంకారము.

**సమాసములు :**

అరిభటశ్రేణీషు :- అరీణాంభటాః=అరిభటాః, అరిభటానాంశ్రేణ్యః = అరిభటశ్రేణ్యః, తాసు=అరిభటశ్రేణీషు.

వక్రతామ్ :- వక్రస్యభావః=వక్రతా, తామ్=వక్రతామ్.

క్రూరధ్వనిం :- క్రూరశ్చాసౌధ్వనిశ్చ=క్రూరధ్వనిః, తమ్ = క్రూరధ్వనిం.

తథావిధస్య :- తథావిధాయస్యసః=తథావిధః, తస్య=తథావిధస్య.

గుణగ్రాహిణామ్ :- గుణంగృహ్ణన్తీతి = గుణగ్రాహిణః, తేషాం = గుణగ్రాహిణామ్.

**భావము :**

ఈ కీకట దేశనరపతి, గుణగ్రాహులలో సాటిలేనివాడని, వింటిని నొక సైనికుని, నాధారముగ(జేసికొని శ్లేషతో వర్ణించుచున్నాడు. ఇతని ధనుస్సు శత్రుసైనికుల విషయమున వీపును(జూపుచున్నది. సైనికుడును భయముచే

వీపునుఁ జూపి యుద్ధరంగమునుండి పరుగిడి పోవుచున్నాడు. రెండింటికిని వీపుఁ జూపుట సమానము. విల్లునెక్కుపెట్టినపుడది సైనికులవైపు వెదురు బద్దనుఁ జూపును. అదియే దానికి వీపు. మఱియునావిల్లు, తనకు స్వామియగు ప్రభువు విషయమున నల్లేత్రాటిని లాగుటవలన, వక్రత్వమును (వంకరతనము) చూపుచున్నది. సైనికుడును వక్రత్వమును (అనగా కృతఘ్నత్వాది దోషమును) వహించును. యుద్ధరంగమునుండి పలాయనము చేయువానికి రాజు విషయమునందు కృతజ్ఞతయుండదుగదా. ఆ విల్లు గట్టివెదురుబద్దచే, చేయఁబడుట వలన కఠినమై (దృఢమైనదై) శత్రువులకు భయంకరమగు క్రూర ధ్వనినిఁ బ్రయోగకాలమునఁ జేయును. ఆ కృతఘ్నుఁడగు సైనికుఁడును రాజుతో నప్రియములగు కఠినవచనములనుఁ బలుకును. ఆ విల్లు (దోర వయము) అనగా భుజమునుఁ బొందును. సైనికుడు దోషమునుఁ బొందును. అటువంటి వింటియొక్కయు నటువంటి సైనికునియొక్కయు గుణమును ననగా నల్లేత్రాటిని శౌర్యధైర్యాదిగుణమును గ్రహించుచున్నట్టి యనగా (నల్లేత్రాటి పక్షమున) లాగుచున్నట్టి (శౌర్యాదిపక్షమున) ప్రశంసించుచున్నట్టి యీ కీకట దేశాధిపతి గుణగ్రాహులకు ననగా నల్లేత్రాటిని లాగెడి విలుకాండ్రకును దోషమును వదలి గుణమునే గ్రహించు సజ్జనులకును పరమావధియని యాశయము॥౯౭॥

శ్లో. అస్యారిప్రకరః శరశ్చ నృపతేః సఙ్ఖ్యే పతన్తావుభౌ
సీత్కారఞ్చ నసమ్ముఖౌ రచయతః కమ్పఞ్చ న ప్రాపునతః।
తద్యుక్తం న పునర్నివృత్తిరుభయోర్జాగర్తి యన్ముక్తయో
రేకస్తత్ర భినత్తి మిత్రమపరశ్చామిత్రమిత్యద్భుతమ్॥ 98

ప. వి. అస్య-అరిప్రకరః-శరః-చ-నృపతేః-సంఖ్యే-పతన్తౌ-ఉభౌ-సీత్కారం-చ-న-సమ్ముఖౌ-రచయతః-కమ్పం-చ-న-ప్రాపునతః-తత్-యుక్తం-న-పునః-నివృత్తిః-ఉభయోః-జాగర్తి-యత్-ముక్తయోః-ఏకః-తత్ర-భినత్తి-మిత్రమ్-అపరః-చ-అమిత్రమ్-ఇతి-అద్భుతమ్.

అర్థము. అస్య = ఈ కీకటప్రభువుయొక్క, అరిప్రకరః = శత్రుసమూహము, శరశ్చ=బాణము అనునీ, ఉభౌ=రెండును, సంఖ్యే=యుద్ధమునందు,

సమ్ముఖౌ=ఇతనివైపునకును, శత్రువువైపునకును (నొక్క సమయము నందే) పతంతౌ=పడుచున్నవై, సీత్కారంచ=దుఃఖమును సూచించు నట్టి దంతమధ్యమునుండి వెల్వడు శబ్దమును, బాణముల తెక్కల ధ్వనిని యత్ = ఎందువలన, నరచయతః = చేయరో, కమ్పంచ=వణకును, యత్=ఎందువలనన, నప్రాప్నుతః=పొందరో,(బాణము-పైనపడిన వెంటనే మరణించుటవలన దుఃఖముననుభవించుటకు, వారికిఁ దడవులేదు గాన సీత్కారము సంభవింప లేదని యర్థము) కిఞ్చ=మఱియు, ముక్తయోః= సంసారమునుండియు, ధనుస్సునుండియు విడుపబడిన, ఉభయోః = ఇద్దఱికి ననగా శత్రువునకును బాణమునకును, పునః = మరల, ననివృత్తిః=జన్మము మఱలి వెనుకకు వచ్చుట, యత్ = ఎందువలన. నజాగర్తి = ఉండదో, తత్ = అందువలన, యుక్తం = అంతయు తగినది. ఏలయనగా నా శత్రువును బాణమును సమానధర్మము గల్గి యున్నవి. కిన్తు=కాని, తత్ర = ఆ రెంటిలో, ఏకః = ఒక్కటి, అనగా శత్రు సమూహము, మిత్రం = సూర్యుని (మిత్రుని) భినత్తి=భేదించు చున్నది. అపరః=మఱియొకటి, అనగా బాణసమూహము, అమిత్రం = శత్రువును, భినత్తి=భేదించుచున్నది, ఇతి=ఇట్లు భేదించుట యనునది, అత్యద్భుతం = మిక్కిలి యాశ్చర్యము.సమానధర్మము గల్గిన శత్రువర్గ బాణములలో సమానకార్యత్వము లేనందువలన నాశ్చర్యమని యర్థము.

వి. సమానధర్మములు గల్గిన శత్రువర్గ బాణములలో సమానకార్యకారిత్వము లేక వానిలో నొక్కటియగు శత్రువర్గము మిత్రుని భేదించుట వలనను మఱియొకటి యగు బాణసమూహము అమిత్రులను భేదించుటవలనను విరోధాభాసము. అందు మిత్రశబ్దమునకు సూర్యుడని యర్థము చెప్పుటచే విరోధపరిహారము. అనగా శత్రువులు యుద్ధమున వధింపబడినవారై "ద్వావేతౌపురుషౌ లోకే సూర్యమండల భేదినౌ ! పరివ్రాడ్ యోగ యుక్తశ్చ రణే చాభి ముఖోహతః" యను స్మృతి వచనము ననుసరించి సూర్యుని భేదించుకొని పైలోకములనుఁ బొందుదురని యర్థము.

**సమాసములు :**

అరిప్రకరః :– అరీణాంప్రకరః=అరిప్రకరః।

**భావము :**

యుద్ధమునందు సీతని శత్రువర్గము నీతని బాణసమూహమును నొక్క సమయమందే యితని కెదురుగను, శత్రువర్గమున కెదురుగను బడుచున్నవి. శత్రువులితని కెదురుగ బడిపోవుచున్నారు. బాణములు శత్రువులపై పుగ బడుచున్నవి. ఈ రెండు కార్యములు నొక్క సమయమునందే జరుగుటవలన శత్రువులు తమ బాధను సూచించుచు, దన్త మధ్యమునుండి వదలెడి సీత్కారధ్వనిని బాణసమూహము తమ తెక్కల ధ్వనిని జేయుటలేదు. శత్రువులు బాణములు తమపైఁ బడిన వెంటనే మరణించుచున్నారు. కాన తడవు లేనందువలన వారికి బాణముల వలని దెబ్బలచే బాధ తెలియుటలేదు. బాణములు గుఱిని తప్పక పడుటవలన వానితెక్కల ధ్వనియులేదు. గుఱితప్పినపుడే తెక్కలధ్వనిఏర్పడునని చెప్పుదురు. అట్లే యవికంపమును గూడఁ జేయుట లేదు. ఇట్లుమరణించుటచే సంసారమునుండి ముక్తులైన శత్రువులకును, వింటినుండి విడువఁబడిన బాణములకును పునర్నివృత్తి యనగా మఱలతిరిగివచ్చుటలేదు. రణరంగమున మరణించుటచే సంసారమును వదలినశత్రువులు మఱల వెనుకకురారు. వారు సూర్యమండలమును భేదించుకొని పోయి మోక్షమునొందెదరు. గుఱినిఁ గొట్టిన బాణములుగూడ వెనుకకురావు ఇట్లుశత్రువులకును, గుఱినిఁగొట్టినబాణములకును వెనుకకు రాకపోవుట సమాన ధర్మమైయున్నది. కాని యవిరెండును సమాన ధర్మములనుఁ గల్గియున్నప్పుడు సమానకార్యమునుఁ జేయవలయునుగదా! కాని యట్లుచేయక విభిన్నములును విరుద్ధములు నైనకార్యములనుఁ జేయుచున్నవి, అందు రణరంగమున మరణించిన శత్రువర్గము మిత్రుని భేదించుచున్నది. బాణములు శత్రుని భేదించుచున్నవి, ఇది విరుద్ధముగదా. సమానధర్మముగల శత్రువర్గమునకును, బాణసమూహమునకును, సమానకార్య కారిత్వములేక యందొకటి మిత్రుని భేదించుటయు మరియొకటి శత్రువుల భేదించుటయు సరిపడవుగదా. కానియిట మిత్రశబ్దమునకు సూర్యుడని యర్థమునుఁ జెప్పుటవలన మరణించిన శత్రువులు సూర్యుని భేదింతురు కాన విరోధమునకు పరిహారము.

"ద్వావేతా పురుషౌలోకే సూర్యమండల భేదినౌ
పరివ్రాడ్ యోగయుక్తశ్చరణేచాభిముఖోహతః"

యనుస్మృతిననుసరించి రణరంగమున సమ్ముఖమున చంపఁబడినవీరుడు సూర్యమండలమును భేదించుకొని మోక్షమును బొందును కాన మిత్ర భేదన

మనగా నిటు స్నేహితుని భేదించుట కాదు. అది సూర్యుని భేదించుట యని యాశయము. ఈ విధముగా కీకట దేశాధిపతి విలువిద్య యందు గొప్ప నైపుణ్యము గల్గి శత్రువుల సంహరించునట్టి మహాశూరుఁడు కాన నతఁడు నీకు వరణీయుఁడని భావము. ॥౯౮॥

శ్లో. ధూలీభిర్దివమన్ధయన్ బధిరయన్నాశాః ఖురాణాం రవై
ర్వాతం సంయతి ఖఞ్జయన్ జవజయైః స్తోతౄన్ గుణై
ర్మూకయన్।
ధర్మారాధనసన్నియుక్తజగతా రాజ్ఞాఽమునాధిష్ఠితః
సాన్ద్రోత్ఫాలమిషాత్ విగాయతి పదా స్ప్రష్టుం తురఙ్గోఽపి గామ్॥

ప. వి. ధూలీభిః - దివమ్ - అంధయన్ - బధిరయన్ - ఆశాః - ఖురాణాం - రవైః - వాతం - సంయతి - ఖఞ్జయన్ - జవజయైః - స్తోతౄన్ - గుణైః - మూకయన్ - ధర్మారాధన సన్నియుక్తజగతా - రాజ్ఞా - అమునా - అధిష్ఠితః - సాన్ద్రోత్ఫాల మిషాత్ - విగాయతి - పదా - స్ప్రష్టుం - తురఙ్గః - అపి - గామ్.

అర్థము. సంయతి = యుద్ధమునందు, ఖురాణాం = గిట్టలయొక్క, ధూలీభిః= దుమ్ములచే, దివం = ఆకసమును, అంధయన్ = గ్రుడ్డితనమునుఁ బొందించుచు ననగా నాకసమున సంచరించెడి వారి దృష్టులను ప్రతిబంధించుచు, రవైః = ఆగిట్టలయొక్క శబ్దములచే, ఆశాః = దిక్కులను ననగా నందున్న జనులను, బధిరయన్ = చెవుడ్పడ జేయుచు, జవజయైః = వేగముయొక్క జయములచే, వాతం = వాయువును, ఖఞ్జయన్ = కుంటితనమునుఁ బొందించుచు, గుణైః = దయాదాక్షిణ్యాది గుణములచే, స్తోతౄన్ = స్తుతించు వారిని, మూకయన్ = మూగ వారినిగాఁజేయుచు (గుణములు మిక్కుటముగా నుండుటచే స్తోతలు స్తుతింపలేక యున్నారని యర్థము.) ధర్మారాధన సన్నియుక్తజగతా: ధర్మారాధన=ధర్మము నారాధించుట యందు, సన్నియుక్త=నియమింపబడిన, జగతా = ప్రపంచము గల్గిన, అమునా = ఈ, రాజ్ఞా = రాజు చే అధిష్ఠితః = అధిష్ఠింపఁబడిన, తురఙ్గోఽపి = గుఱ్ఱము గూడ, సాన్ద్రో

త్ఫాలవశాత్=అతిశయిత వేగమను నెపము వలన, ననగా నిరంతరము ముందు కాళ్ళను పైకెగర వేయుట యను నెపమువలన, పదా = ఒక పాదము చేతనైనను, గాం = భూమిని గోవును, స్ప్రష్టుం = స్పృశించు టకు, విగాయతి = నిందించును. అనగా స్పృశింపదని యర్థము. ఈ రాజు, పాపముచేయునట్టి వారు తపస్వులుగా నున్నను శిక్షించును అందు వలన నలనికి వాహకమైన యశ్వము పాపముచే గోస్పర్శమును భూస్పర్శమును చేసినచో పాపము సంభవించుట వలన తాను రాజుచే దండమును బొందవలసి యుండునను భయముతో నీతని యశ్వము భూస్పర్శము చేయకయే, ఊర్ధ్వక్షేపములతో బరుగిడు చున్నదని యర్థము. ఈ రాజు ధర్మపరుడనియు వేగముగల గుఱ్ఱములు గలవా డనియు భావము.

## సమాసములు :

అన్ధయన్ :— అంధంకరోతీతి = అంధయన్।

బధిరయన్ :— బధిరంకరోతీతి=బధిరయన్।

జవజయైః :— జవస్యజయాః=జవజయాః. తైః జవజయైః।

మూకయన్ :— మూకం కరోతీతి = మూకయన్।

ధర్మారాధన సన్నియుక్తజగతా :— ధర్మస్య ఆరాధనం=ధర్మారాధనం, ధర్మారాధనే సన్నియుక్తం, జగత్ యేనసః= ధర్మారాధనసన్నియుక్త జగత్, తేన = ధర్మారాధనసన్నియుక్త జగతా।

సాన్ద్రోత్ఫాలమిషాత్ :— సాన్ద్రశ్చాసౌ ఉత్ఫాలశ్చ = సాన్ద్రోత్ఫాలః, సాన్ద్రోత్ఫాలస్యమిషః=సాన్ద్రోత్ఫాలమిషః, తస్మాత్ = సాన్ద్రోత్ఫాలమి షాత్।

## భావము :

యుద్ధమున ఈ నృపాలుని యశ్వము గిట్టలనుండి పైకెగరెడి ధూళులచే నాకసమునకు నంధత్వమును గల్పించుచున్నది. అనగా నంతరిక్షమున సంచ రించు జనుల దృష్టులనవరోధించుచున్నదని యర్థము. మఱియు నా యశ్వము

తన గిట్టల ధ్వనులచే దిక్కులను ననగా నా యా దిక్కులయందు నివసించు జనమును జెవుడ్పడఁ జేయుచున్నది. ఆ యశ్వము తన వేగాతిశయముచే మిక్కిలి వేగము గల వాయువును సైతము కుంటుపఱచుచున్నది. అసంఖ్యాక గుణములను కల్గి యుండుటచే స్తోతలు స్తుతింప జాలకపోవుటవలన వారిని మూగవారినిఁ గావించుచున్నది. ధర్మారాధన పరుడైన యా నృపతి తనపై నాసీనుఁడగుటవలన తన పాపముచే భూమిని తాకుట కిష్టపడకయున్నది అందువలన నెక్కువ వేగముతోఁ బోవుటయను మిషను వహించి తన పాదములను భూమినిఁ దగులనీయదు. ఏలయనగా– "గోబ్రాహ్మణానలాన్ భూమిం నోచ్ఛిష్టం నపదాస్పృశేత్" యను స్మృతి వచనము ననుసరించి గోబ్రాహ్మణాదులను బాదములతో స్పృశింపరాదు. కాన, నీ యశ్వము భూస్పర్శ వలని పాపమునకు భయపడిన దోయనునట్లు, తన పాదములను భూమికి తాకనీయక వేగాతిశయముతో నాకసము పైననే యుంచుచు వెళ్లుచున్నదని యాశయము. ॥౯౯॥

శ్లో. ఏతేనోత్క్రాన్తకణ్ఠప్రతిసుభటనటారబ్ధనాట్యాద్భుతానాం
కష్టం ద్రష్టైవ నాఽభూద్భువి సమరసమాలోకిలోకా
స్పదేఽపి।
అశ్వైరస్వైరవేగైః కృతఖురఖురలీమఙ్క్షుసఙ్క్షుభ్యమాన
క్ష్మాపృష్ఠోత్తిష్ఠదన్ధఙ్కరణరణధురారేణుధారాన్ధకారాత్॥

ప. వి. ఏతేన–ఉత్క్రాన్తకణ్ఠప్రతిసుభటనటారబ్ధనాట్యాద్భుతానాం–కష్టం–ద్రష్టా–ఏవ–న–అభూత్–భువి–సమరసమాలోకిలోకాస్పదే–అపి–అశ్వైః–అస్వైరవేగైః–కృతఖురఖురలీమఙ్క్షుసఙ్క్షుభ్యమానక్ష్మాపృష్ఠోత్తిష్ఠదన్ధఙ్కరణరణధురారేణుధారాన్ధకారాత్.

అర్థము. సమరసమాలోకిలోకాస్పదేఽపి; సమర = యుద్ధమును, సమాలోకి = చూచుచున్న, లోక = జనమునకు, ఆస్పదేఽపి = స్థానమైనను, భువి = రణభూమియందు, అస్వైరవేగైః = అధికవేగముగల్గిన, అశ్వైః = గుఱ్ఱములచే, కృతఖురఖురలీమఙ్క్షుసఙ్క్షుభ్యమానక్ష్మాపృష్ఠోత్తిష్ఠదన్ధఙ్కరణధురారేణుధారాన్ధకారాత్; కృత = చేయబడిన, ఖుర = గిట్టలయొక్క, ఖురలీ = సంచారములచే, మఙ్క్షు = వెంటనే, సఙ్క్షుభ్యమాన = చూర్ణము

గావింపఁబడిన, క్ష్మా = భూమియొక్క, పృష్ఠ = పైభాగమునుండిఁ ఉత్క్షిప్త = పైకిలేచునట్టి, అంధఙ్కరణరణధురా = గ్రుడ్డితనమును బొందించురణాగ్రమందలి, రేణుధారా = ధూళిపరమ్పరయను, అన్ధకారాత్ = చీకటివలన, ఏతేన = ఈరాజుచే, ఉత్కృత్తకణ్ఠప్రతిసుభటనటారబ్ధనాట్యాద్భుతానాం; ఉత్కృత్త = తెగఁగొట్టఁబడిన, కణ్ఠ = కత్తుకలుగల, ప్రతిసుభట = శత్రుపీరులనెడి, నట = నటులచే, ఆరబ్ధ = ప్రారంభింపఁబడిన, నాట్యాద్భుతానాం = ఆశ్చర్యకరములగు నాటకప్రబంధములకు, ద్రష్టైవ = చూచువాడే, నాభూత్ = లేదు కష్టం = ఇదిమిక్కిలిదుఃఖకరము.

సమాసములు :

ఉత్కృత్తకణ్ఠప్రతిసుభటనటారబ్ధనాట్యాద్భుతానాం:- ఉత్కృత్తాః కణ్ఠాః యేషాంతే = ఉత్కృత్తకణ్ఠాః, ప్రతిసుభటాఏవనటాః = ప్రతి సుభట నటాః, ఉత్కృత్తకణ్ఠాశ్చతే ప్రతిసుభటనటాశ్చ = ఉత్కృత్తకణ ప్రతి సుభటనటాః ఉత్కృత్తకణ్ఠ ప్రతిసుభటనటైః ఆరబ్ధాని = ఉత్కృత్తకణ్ఠ ప్రతిసుభటనటారబ్ధాని, నాట్యాన్యేవఅద్భుతాని = నాట్యాద్భుతాని, ఉత్కృత్తకణ్ఠప్రతిసుభటనటారబ్ధానిచతానినాట్యాద్భుతానిచ = ఉత్కృత్తకణ్ఠ ప్రతిసుభటనటారబ్ధనాట్యాద్భుతాని, తేషాం = ఉత్కృత్తకణ్ఠప్రతిసుభట నటారబ్ధనాట్యాద్భుతానామ్.

సమరసమాలోకిలోకాస్పదే:- సమరస్యసమాలోకినః = సమరసమాలోకినః, సమరసమాలోకినశ్చతేలోకాశ్చ = సమరసమాలోకిలోకాః, సమరసమాలోకిలోకానామాస్పదమ్ = సమరసమాలోకిలోకాస్పదమ్, తస్మిన్ = సమర సమాలోకిలోకాస్పదే !

అస్వైరవేగైః:- నస్వైరః = అస్వైరః. అస్వైరః వేగః యేషాంతే = అస్వైరవేగాః, తైః = అస్వైరవేగైః ।

కృతఖురఖురలీమఙ్క్షుసఙ్క్షుభ్యమానక్ష్మాపృష్ఠోత్క్షిప్తవన్ధం కరణరణధురా రేణుధారాన్ధకారాత్ :- ఖురాణాంఖురల్యః = ఖురఖురల్యః, కృతా శ్చతాః ఖురఖురల్యశ్చ = కృతఖురఖురల్యః । కృతఖురఖురలీభిః మఙ్క్షు సఙ్క్షుభ్యమానః = కృతఖురఖురలీ మఙ్క్షు సఙ్క్షుభ్యమానః, క్ష్మాయాః

=క్ష్మాపృష్ఠః, కృతఖురఖురలీమజ్ఝు సజ్ఝుభ్యమానశ్చాసౌ క్ష్మాపృష్ఠశ్చ, కృతఖురఖురలీ మజ్ఝు సజ్ఝుభ్యమానక్ష్మా పృష్ఠః, కృతఖురఖురలీ మజ్ఝు సజ్ఝుభ్యమానక్ష్మా పృష్ఠా దుత్తిష్ఠన్తీ=కృతఖురఖురలీమజ్ఝుసజ్ఝుభ్యమాన క్ష్మాపృష్ఠోత్తిష్ఠన్తీ, రణస్యధురా=రణధురా, రేణూనాంధారా=రేణుధారా, రణధురాయాంరేణుధారా=రణధురారేణుధారా, అంధః క్రియతే అనయా ఇతిఅన్ధంకరణా,అంధంకరణాచసా రణధురారేణుధారాచ =అంధంకరణ రణధురారేణుధారా ; కృతఖురఖురలీ మజ్ఝుసజ్ఝుభ్యమానక్ష్మా పృష్ఠోత్తిష్ఠన్తీచసా, అంధంకరణ రణధురారేణుధారాచ = కృతఖురఖురలీ మజ్ఝు సజ్ఝుభ్యమానక్ష్మా పృష్ఠోత్తిష్ఠదన్ధంకరణ రణధురారేణుధారా, కృతఖుర ఖురలీ మజ్ఝుసజ్ఝుభ్యమానక్ష్మా పృష్ఠోత్తిష్ఠదన్ధంకరణ రణధురారేణుధారైవ అన్ధకారః = ఖురఖురలీమజ్ఝు సజ్ఝుభ్యమానక్ష్మా పృష్ఠోత్తిష్ఠదన్ధంకరణ రణధురారేణుధారాన్ధకారః, తస్మాత్=కృతఖురఖురలీమజ్ఝు సజ్ఝుభ్యమాన క్ష్మాపృష్ఠోత్తిష్ఠదన్ధంకరణ రణధురా రేణుధారాన్ధకారాత్।

**భావము:**

యుద్ధమునుఁ దిలకించుటకు వచ్చిన జనులకాశ్రయమున్నను, నా యుద్ధ రంగమున నతివేగముగఁ బరుగిడు గుఱ్ఱముల గిట్టలచేఁ ద్రొక్కఁబడిన భూత లమునుండి పైకెగురుచు కన్నులకవరోధముఁ గల్గించుచు, రణాగ్రభూములనుండి పైకిలేచిన తెంపులేని ధూళీపటలమనెడి చీకటి కమ్మినది. యుద్ధరంగమున నీ కీకటాధిపతి శత్రుభటుల కంఠములను తెగనరుకగా నా మొండెములు నృత్యము చేయుచుండినవి. పైనఁ జెప్పిన ధూళీపటలమను చీకటి కమ్ముటవలన చూపరుల కెవ్వరికిని యా కబంధనృత్యపు టద్భుతమును చూడశక్యము కాలేదు. ఇది చాల విషాదకరమైన విషయము. యుద్ధమున పెక్కండ్రు మడిసినపుడు వారి మధ్యనుండి కబంధములు అనగా తలలేని మొండెములు నృత్యములు చేయునని ప్రసిద్ధి. ఈ కీకటాధిపతి యుద్ధరంగమున శత్రుభటుల కుత్తుకలను తెగగొట్టగా కబంధములు నృత్యములు సలుపుచుండినవి. కాని యచ్చట ప్రేక్షకులకు స్థానములున్నను, గుఱ్ఱముల గిట్టలవలనఁ బైకిలేచిన ధూళివలని యన్ధకారము రణరంగమున వ్యాపించుటచే పై కబంధనృత్యపు టద్భుతములనుఁ జూచువారు లేకపోయిరని యాశయము, ॥౧౦౦॥

శ్లో. ఉన్మీలల్లీలనీలోత్పలదలదలనామోదమేదస్విపూర
క్రోడక్రీడద్ద్విజాళీగరుదుదితమరుత్స్ఫాలవాచాలవీచిః।
ఏతేనాఽఖాని శాఖానివహనవహరిత్పర్ణపూర్ణద్రుమాలీ
వ్యాలీఢోపాన్తశాన్తవ్యథపథికదృశాం దత్తరాగస్తడాగః॥

ప. వి. ఉన్మీలల్లీలనీలోత్పలదల దలనామోదమేదస్విపూరక్రోడ క్రీడద్ద్విజాలీ గరుదుదితమరుత్స్ఫాలవాచాలవీచిః- ఏతేన - అఖాని - శాఖానివహనవహరిత్పర్ణపూర్ణద్రుమాలీవ్యాలీఢోపాన్తశాన్తవ్యథపథికదృశాం-దత్తరాగః- తడాగః-

అర్థము. ఉన్మీలల్లీలనీలోత్పలదల దలనామోదమేదస్విపూరక్రోడ క్రీడద్ద్విజాలీ గరుదుదితమరుత్స్ఫాలవాచాలవీచిః; ఉన్మీలత్ = ప్రకాశించు, లీల = విలాసములుగల, నీలోత్పల = నల్లకలువలయొక్క, దల = రేకులు, దలన = వికసించుటచేఁగల్గిన, ఆమోద = పరిమళముచే, మేదస్వి = పుష్టినొందిన, పూర = ప్రవాహముయొక్క, క్రోడ = ఒడియందు, క్రీడత్ = ఆటలాడు, ద్విజాలీ = పక్షిసమూహములయొక్క, గరుత్= ఱెక్కలనుండి, ఉదిత = ఉద్భవించిన, మరుత్=గాలియొక్క, స్ఫాల = తాకిడిచే, వాచాల = శబ్దించు, వీచిః =అలలుకల్గిన, శాఖానివహనవహరిత్పర్ణపూర్ణద్రుమాలీవ్యాలీఢోపాన్తశాన్తవ్యథపథికదృశామ్; శాఖానివహ= కొమ్మలసమూహముయొక్క, నవ = క్రొత్తవైన, హరిత్ = పచ్చని, పర్ణ = చెట్లునరుసచే, వ్యాలీఢ = అంటుకొనఁబడిన, ఉపాన్త = సమీప ప్రదేశములచే, శాన్త = శమించిన, వ్యథ=సంతాపముగల్గిన, పథిక= బాటసారులయొక్క, దృశాం =నేత్రములకు, దత్తరాగః; దత్త=ఈయఁ బడిన, రాగః = అహ్లాదముగల్గిన, తడాగః=చెఱువు, ఏతేన= ఈతనిచే, అఖాని = త్రవ్వఁబడినది.

**సమాసములు :**

ఉన్మీలల్లీలనీలోత్పల దలదల నామోదమేదస్విపూర క్రోడక్రీడద్ద్విజాలీ గరుదుదిత మరుత్స్ఫాలవాచాలవీచిః:- ఉన్మీలన్త్యః లీలాః=యేషాంతాని =ఉన్మీలల్లీలాని, నీలానిచతాని ఉత్పలానిచ=నీలోత్పలాని, ఉన్మీలల్లీ

లానిదళాని నీలోత్పలానిచ = ఉన్మీలల్లీలనీలోత్పలాని. ఉన్మీలల్లీలనీలో
త్పలానాందలాని = ఉన్మీలల్లీలనీలోత్పలదలాని, ఉన్మీలల్లీలనీలోత్పల
దలానాందలనం = ఉన్మీలల్లీలనీలోత్పల దలదలనం, ఉన్మీలల్లీలనీలోత్పల
దలదలనేన ఆమోదః = ఉన్మీలల్లీలనీలోత్పలదలదలనామోదః, ఉన్మీ
లల్లీలనీలోత్పల దలదలనామో దేనమేదస్వీ = ఉన్మీలల్లీలనీలోత్పల
దలదలనామోదమేదస్వీ, ఉన్మీలల్లీలనీలోత్పల దలదలనామోదమేద
స్వీచాఽసౌ పూరశ్చ = ఉన్మీలల్లీలనీలోత్పల దలదలనామోదమేదస్వి
పూరః. ఉన్మీలల్లీలనీలోత్పల దలదలనామో మోదమేదస్విపూరస్యక్రోడః
=ఉన్మీలల్లీలనీలోత్పల దలదలనామోద మేదస్విపూరక్రోడః, ఉన్మీలల్లీల
నీలోత్పలదలదలనామోద మేదస్విపూరక్రోడేక్రీడ న్తః =ఉన్మీలల్లీలనీలో
త్పలదలదలనామోద మేదస్వి పూరక్రోడ క్రీడ న్తః, ఉన్మీలల్లీలనీలోత్పల
దలదలనామోదమేదస్వి పూరక్రోడక్రీడ న్తశ్చతేద్విజాశ్చ=ఉన్మీలల్లీలనీ
లోత్పల దలదలనామోదమేదస్విపూర క్రోడక్రీడద్విజాః, ఉన్మీలల్లీలనీ
లోత్పల దలదలనామోద మేదస్విపూర క్రోడక్రీడద్విజానామాల్యః=ఉన్మీ
లల్లీలనీలోత్పలదలదలనామోదమేదస్విపూర క్రోడక్రీడద్విజాల్యః. ఉన్మీ
లల్లీలనీలోత్పలదలదలనామోమోదమేదస్విపూర క్రోడక్రీడద్విజాలీనాం
గరుతః=ఉన్మీలల్లీలనీలోత్పలదలదలనామోద మేదస్వి పూరక్రోడక్రీడద్వి
జాలీగరుతః, ఉన్మీలల్లీలనీలోత్పలదలదలనామోద మేదస్విపూరక్రోడక్రీడ
ద్విజాలీగరుద్భిః ఉదితాః=ఉన్మీలల్లీలనీలోత్పల దలదలనామోదమేదస్వి
పూరక్రోడక్రీడద్విజాలీగరుదుదితాః, ఉన్మీలల్లీలనీలోత్పలదలదలనామోద
మేదస్విపూరక్రోడక్రీడ ద్విజాలీగరుదుదితాశ్చతేమరుతశ్చ = ఉన్మీలల్లీ
లనీలోత్పల దలదలనామోదమేదస్వి పూరక్రోడక్రీడద్విజాలీగరుదుదిత
మరుతః, ఉన్మీలల్లీలనీలోత్పల దలదలనామోదమేదస్వి పూరక్రోడక్రీడ
ద్విజాలీగరుదుదితమరుతాంస్ఫాలః=ఉన్మీలల్లీలనీలోత్పల దలదలనామో
దమేదస్వి పూరక్రోడక్రీడద్విజాలీ గరుదుదితమరుత్స్ఫాలః, ఉన్మీలల్లీల
నీలోత్పల దలదలనామోదమేదస్విపూరక్రోడక్రీడద్విజాలీగరుదుదితమరు
త్స్ఫాలేనవాచాలాః=ఉన్మీలల్లీలనీలోత్పల దలదలనామోదమేదస్వి పూర
క్రోడక్రీడద్విజాలీగరుదుదితమరుత్స్ఫాల వాచాలాః, ఉన్మీలల్లీలనీలోత్పల
దలదలనామోదమేదస్వి పూరక్రోడక్రీడద్విజాలీగరుదుదితమరుత్స్ఫాల

వాచాలాః. పిచయః యస్యసః = ఉన్మీలన్నీలనీలోత్పల దలదలనామో పమేవస్తి పూరక్రోడక్రీడద్విజాలీగదుదుదితమరుత్పాలవాచాలపిచిః, శాఖానివహనవహరిత్పర్ణ పూర్ణద్రుమాలీవ్యాలీఢోపాన్త శాన్తవ్యథపథిక దృశాం :— శాఖానాంనివహః=శాఖానివహః, హరిన్తిచతానిపర్ణానిచ = హరిత్పర్ణాని, నవానిచతాని హరిత్పర్ణానిచ = నవహరిత్పర్ణాని, శాఖాని వహస్యనవహరిత్పర్ణాని=శాఖానివహనవహరిత్పర్ణాని. శాఖానివహ నవహ రిత్పర్ణైఃపూర్ణాః=శాఖానివహనవహరిత్పర్ణపూర్ణాః, శాఖానివహనవహరిత్ప ర్ణపూర్ణాశ్చతేద్రుమాశ్చ=శాఖానివహ నవహరిత్పర్ణపూర్ణద్రుమాః, శాఖాని వహనవహరిత్పర్ణపూర్ణద్రుమాణా మాలీ=శాఖానివహనవహరిత్పర్ణపూర్ణ ద్రుమాలీ, శాఖానివహ నవహరిత్పర్ణపూర్ణద్రుమాల్యావ్యాలీఢాః=శాఖాని వహ నవహరిత్పర్ణపూర్ణద్రుమాలీవ్యాలీఢాః, శాఖానివహ నవహరిత్పర్ణ పూర్ణ ద్రుమాలీవ్యాలీఢాశ్చతే ఉపాన్తాశ్చ=శాఖానివహ నవహరిత్పర్ణపూర్ణ ద్రుమాలీవ్యాలీఢోపాన్తాః, శాఖానివహ నవహరిత్పర్ణపూర్ణ ద్రుమాలీవ్యాలీ ఢోపాన్తైః శాన్తాః=శాఖానివహ నవహరిత్పర్ణపూర్ణద్రుమాలీవ్యాలీఢోపాన్త శాంతాః=శాఖానివహ నవహరిత్పర్ణపూర్ణ ద్రుమాలీవ్యాలీఢోపాంతశాంతాః వ్యథాః యాసాంతాః=శాఖానివహ నవహరిత్పర్ణపూర్ణ ద్రుమాలీవ్యాలీఢో పాన్త శాంతవ్యథాః, పథికానాందృశః = పథికదృశః, శాఖానివహ నవ హరిత్పర్ణపూర్ణ ద్రుమాలీవ్యాలీఢోపాన్త శాంతవ్యథాశ్చతాః,పథికదృశశ్చ = శాఖానివహ నవహరిత్పర్ణపూర్ణ ద్రుమాలీవ్యాలీఢోపాన్త శాంతవ్యథ పథికదృశః, తాసామ్, శాఖానివహ నవహరిత్పర్ణపూర్ణ ద్రుమాలీవ్యాలీ ఢోపాన్తశాంతవ్యథ పథికదృశామ్,

దత్తరాగః :— దత్తఃరాగః యేనసః=దత్తరాగః,

**భావము :**

ఆ కీకటదేశ నృపాలుడొక చెఱువును ద్రవ్వించెను. ఆచెఱువునందు నల్ల కలువలు వికసించి పరిమళములు వెదజల్లుచున్నవి. ఆ పరిమళములచే నా తటాక ప్రవాహము నిండియున్నది. ఆ ప్రవాహములపై పక్షులు క్రీడించుచుండగా వాని ఱెక్కలనుండి యుద్భవించిన తెమ్మెరలచే యందలి యలలు శబ్దించు

చున్నవి. మఱియు నా తటాక పరిసరము నందు చెట్లు వరుసలు దీరియున్నవి. ఆ చెట్లయందు కొమ్మలు దట్టముగా నున్నవి. అంపలి యాకుపచ్చని క్రౌంజి గురులతోడను నాకులతోడను నా చెట్లు నిండియున్నవి. అట్టి పచ్చని పరిసర ప్రాంతములనుఁ జూచుటచే బాటసారుల నేత్రముల బాధ శమించుచున్నది. ఆ తటాక మట్టి బాటసారుల కన్నులకు విందుఁగొల్పు చున్నది. ఇటువంటి ధర్మ కార్యములయందా రాజునకు నాసక్తి మెండని యాశయము. ॥౧౦౮॥

శ్లో. వృద్ధో వార్ధిరసౌ తరఙ్గవలిభం బిభ్రద్వపుః పాణ్డురం
హంసాలీపలితేన యష్టికలితస్తావద్వయోవంహిమా।
బిభ్రచ్చన్ద్రికయా చ కం వికచయా యోగ్యస్ఫురత్సంగతం
స్థానే స్నానవిధాయి ధార్మికశిరోనత్యాపి నిత్యాదృతః॥

ప. వి. వృద్ధః–వార్ధిః–అసౌ–తరఙ్గవలిభం-బిభ్రత్–వపుః=పాణ్డురం-హంసాలీ పలితేన-యష్టికలితః-తావద్వయోరంహిమా-బిభ్రత్ - చన్ద్రికయా-చ-కం-వికచయా–యోగ్యస్ఫురత్సంగతం - స్థానే - స్నానవిధాయిధార్మిక శిరోనత్యా-అపి-నిత్యాదృతః.

అర్థము. తరఙ్గవలిభమ్ ; తరఙ్గ = కెరటములచే, వలిభం = ముడతలుగల్గి నదియు, హంసాలీపలితేన ; హంసాలి = హంసలవరుసయను,పలితేన= నెరసినవెండ్రుకలచే. పాండురం=తెల్లని, వపుః=శరీరమును, బిభ్రత్ = ధరించుచు, యష్టి=నీటికొలతకొయ్యచే, కలితః = కూడినదియు, యష్టి= చేతికఱ్ఱచే, కలితః=కూడినదియు, అనగా చేతికఱ్ఱపై నూనుకొనినదియు, తావద్వయోరంహిమా ; తావత్ = ఆ కఱ్ఱచేలెక్కింపఁ బడినదియు నా కఱ్ఱచేనూహింపఁబడినదియును, నగు,వయోరంహిమా; వయః = పక్షుల యొక్కయు, వయస్సుయొక్కయు, వంహిమా = ఆధిక్యముగలదియు, వికచయా=స్పష్టముగా ప్రకాశించునదియు, వెండ్రుకలులేనిదియు, నగు, చంద్రికయా = వెన్నెలచేతను చంద్రికయను తలనొప్పిచేతను, యోగ్య స్ఫురత్సంగతం ; యోగ్య=అర్హమైన స్ఫురత్=ప్రకాశించు, సఙ్గతం= సంబంధముగల్గిన అనగా నొకపక్షమున వెన్నెలపెరెసిర్మలమైనదియును, మఱియొక పక్షమున, వెన్నెలతోఁ గూడినదియునని యర్థము. కం =

నీటిని, శిరస్సును బిభ్రత్ = ధరించినదై, స్నానవిధాయిధార్మికశిరో నత్యాఽపి; స్నానవిధాయి=స్నానము గావించు, ధార్మిక = ధార్మికుల యొక్క, శిరోనత్యాఽపి = శిరస్సునువంచుటచేతను, శిరమును వంచినీట మునుగుటచేతను, నమస్కారము చేతను, నిత్యాదృతః = నిత్యము ఆదరింపఁబడిన, అయం=ఈ,వార్ధిః=సాగరమువంటితటాకము, వృద్ధః= వార్ధక్యమునొందినదియు, మిక్కిలి పూర్ణమైనదియునై యున్నది. స్థానే= ఇదియుక్తము.

వి. అలలను శరీరపుముడుతలతోడను, హంసాలిని, పలితముతోడను రూపించుటచే రూపకాలఙ్కారము.

**సమాసములు :**

వార్ధిః :- వారీణిధీయన్తే అస్మిన్నితి = వార్ధిః.
తరఙ్గవలిభం :- తరఙ్గైః వలిభం=తరఙ్గవలిభం.
హంసాలిపలితేన :- హంసానామాలీ=హంసాలీ, హంసాల్యేవపలితమ్= హంసాలీపలితమ్, తేన=హంసాలీపలితేన.
యష్టికలితం :- యష్ట్యాకలితః=యష్టికలితః.
తావద్వయోవంహిమా :- వయసః వంహిమా=వయోవంహిమా, తావాన్ వయోవంహిమా యస్యసః=తావద్వయోవంహిమా.
యోగ్యంస్ఫురత్సంగతం :- యోగ్యంస్ఫురత్ సంగతం యస్యతత్ = యోగ్యంస్ఫురత్సంగతం।
స్నానవిధాయిధార్మికశిరోనత్యా :- స్నానంవిదధతీతి=స్నానవిధాయినః, స్నానవిధాయినశ్చతేధార్మికాశ్చ=స్నానవిధాయిధార్మికాః, స్నానవిధాయి ధార్మికాణాంశిరాంసి=స్నానవిధాయిధార్మికశిరాంసి. స్నానవిధాయిధార్మిక శిరసాంనతిః = స్నానవిధాయిధార్మికశిరోనతిః, తయా = స్నానవిధాయి ధార్మికశిరోనత్యా.
నిత్యాదృతః :- నిత్యమాదృతః=నిత్యాదృతః.

**భావము :**

ఈ కీకటప్రభువు నిర్మించిన తటాకము వృద్ధునితోఁ బోల్పఁ బడుచున్నది. ఇది యలలనెడి ముడుతలతోఁడను, హంసావలియను నెరసిన వెంట్రు

కలతోఁడను గూడినదై, దానిచే తెల్లఁ బడిన శరీరమును ధరించియున్నది. మఱియునిది నీటికొలతను, తెలుపుకఱ్ఱతోడను, నూనుకొనుటకు సాధనమైన కఱ్ఱతోఁడనుఁ గూడియున్నది- ఇంకను నాతటాకము కఱ్ఱతోలెక్కింపఁ దగిన వయోవంహిమను, (పక్షులబాహుల్యమును) కఱ్ఱతోనూహింపఁ దగిన వయస్సు యొక్క ఆధిక్యమును వహించియున్నది. మఱియునాతటాకము వికచమైన యనగా స్ఫుటమైన చంద్రికతోఁడను ననగా వెన్నెలతోఁ డను, (వికచమైన యనగా వెండ్రుకలనుఁ దొలగించు చంద్రికతోఁడను ననగా చంద్రికయను శిరోరోగముతోఁడను) యోగ్యమై వెలయు సంబంధమును గల్గినదై యనగా చంద్రిక వలె (వెన్నెలవలె) నిర్మలమైన జలమును, (చంద్రికయను శిరోరోగముతోఁ గూడిన తలను) వహించినదై స్నానములనాచరించు ధార్మికులయొక్క శిరోమజ్జనములచేతను నమస్కారములచేతను నిత్యమునాదరింపఁ బడిన జలములకు నాధారమైన యీ తటాకము వృద్ధత్వమును, పరిపూర్ణత్వమునుఁ బొందినదై వెలయుచున్నది. ఇది యుక్తము॥౧౦౨॥

**శ్లో.** **తస్మిన్నేతేన యూనా సహ విహర పయఃకేలివేలాసు బాలే!**
**నాలేనాఽస్తు త్వదక్షిప్రతిఫలనభిదా తత్ర నీలోత్పలానామ్।**
**తత్పాథోదేవతానాం విశతు తవ తనుచ్ఛాయమేవాధికారే**
**తత్ఫుల్లాంభోజరాజ్యే భవతు చ భవదీయాననస్యాఽభిషేకః॥**

ప. వి. తస్మిన్-ఏతేన-యూనా-సహ-విహర-పయఃకేలివేలాసు-బాలే-నాలేన-అస్తు-త్వదక్షిప్రతిఫలనభిదా-తత్ర-నీలోత్పలానాం-తత్పాథోదేవతానాం-విశతు-తవ-తనుచ్ఛాయమ్-ఏవ-అధికారే-తత్ఫుల్లాంభోజరాజ్యే-భవతు చ-భవదీయాననస్య-అభిషేకః.

అర్థము. హేబాలే! = ఓ బాలా! తస్మిన్=ఆతటాకమునందు, యూనా=యువకుఁడైన, ఏతేనసహ=ఈతనితోడ, విహర=ఆటలాడుము. పయః కేలివేలాసు=జలక్రీడావేళలయందు, తత్ర=ఆతటాకమునందు, నీలోత్పలానాం = నల్లకలువలకు, త్వదక్షిప్రతిఫలనభిదా ; త్వత్ = నీయొక్క, అక్షి=కన్నులయందు, ప్రతిఫలన = ప్రతిబింబించుటను, భిదాభేదించు,

నాలేన = కాడతో, అస్తు = ఉండునుగాత - అనగా నల్లకలువకాడయే, నీకన్నులకును, నల్లకలువపూలకు భేదముతెలుపునదిగ నుండనిమ్ము - నీకన్నులకు కాడలేదు. నల్లకలువకు కాడయున్నది. ఈ కాడయే నీకన్నులకును నల్లకలువకును భేదమును సూచించునదియైయుండును గాతయని యర్థము అనగా నీకన్నులకును కలువలకును భేదములేదని యర్థము. తవ=నీయొక్క, తనుచ్ఛాయం = శరీరపుకాంతి లేదా శరీర ప్రతిబింబము, తత్పాథోదేవతానాం ; తత్=ఆతటాకముయొక్క, పాథోదేవతానాం=జలదేవతలకు, ఆధిపత్యే = అధికారమునందు ననగా నధికారమును, విశతు=ప్రవేశించునుగాత, భవదీయాననస్య = నీమోమునకు, తత్ఫుల్లామ్భోజరాజ్యే; తత్ = ఆతటాకముయొక్క, ఫుల్ల=వికసించిన, అమ్భోజ = కమములములయొక్క, రాజ్యే = రాజ్యమునందు, అభిషేకశ్చ=పట్టాభిషేకముగూడ, అస్తు = ఉండునుగాత. నీ కన్నులు మున్నగునవి యాతటాకమందలి కలువలు మున్నగువానిని మించియుండునని యర్థము.

సమాసములు :

పయఃకేలివేలాసు:- పయస్సుకేళయః = పయఃకేలయః, పయఃకేళీనాం వేలాః = పయఃకేలివేలాః, తాసు = పయఃకేలివేలాసు.

త్వదక్షిప్రతిఫలనభిదా:- తవఅక్షిణీ=త్వదక్షిణీ, త్వదక్ష్ణోః ప్రతిఫలనం, త్వదక్షిప్రతిఫలనం, త్వదక్షిప్రతిఫలనం, భినత్తీతి = త్వదక్షిప్రతిఫలభిత్, తేన = త్వదక్షిప్రతిఫలనభిదా.

నీలోత్పలానాం:- నీలానిచతానిఉత్పలానిచ = నీలోత్పలాని, తేషామ్ = నీలోత్పలానాం.

తత్పాథోదేవతానాం:- తస్యపాథాంసి = తత్పాథాంసి, తత్పాథసాం దేవతాః = తత్పాథోదేవతాః, తాసాం = తత్పాథోదేవతానామ్.

తనుచ్ఛాయమ్:- తనోఃఛాయా = తనుచ్ఛాయమ్.

తత్ఫుల్లామ్భోజరాజ్యే:- ఫుల్లానిచతానిఅమ్భోజానిచ = ఫుల్లామ్భోజాని, తస్య, ఫుల్లామ్భోజాని = తత్ఫుల్లామ్భోజాని, తత్ఫుల్లామ్భోజానాం రాజ్యమ్ = తత్ఫుల్లామ్భోజరాజ్యం, తస్మిన్ = తత్ఫుల్లామ్భోజరాజ్యే.

భవదీయాననస్య:- భవత్యాఃఇదం = భవదీయం, భవదీయంచతత్.
ఆననంచ = భవదీయాననం, తస్య = భవదీయాననస్య.

భావము :

ఓ దమయన్తీ! ఆతటాకమునందు నీ ప్రియుఁడైన రాజుతో క్రీడింపుము. నీ వాతటాకమునందు జలక్రీడను సలుపునపుడు, నీ కన్నులు నీటఁ బ్రతిబింబించును. అప్పుడు నీ కన్నులకును, దానియందలి నల్ల కలువలకును భేదము తెలియకపోవచ్చును. అట్లు భేదముతెలియుటకై కలువ పూలకాడ సాధనముగ నుండును. కలువ పూలకు కాడ యుండుట వలనను, నీ కన్నులకట్టి కాడలేకపోవుట వలనను భేదమరయ సాధ్యమగును. నీ శరీరకాంతి లేదా నీ శరీరప్రతిబింబము, తటాకమందలి జలదేవతలపై నధికార మును బొందును గాత. ఆతటాక మందలి పూచిన తామర పూలరాజ్యమందు నీ ముఖమునకు పట్టాభిషేకము జరుగును గాత. నీనేత్రాములు, ఆతటాకమందలి కలువపూలు మున్నగు వానిని మించియున్నవని యాశయము ॥౧౦౩॥

శ్లో. ఏతత్కీర్తి వివర్తధౌతనిఖిల త్రైలోక్యనిర్వాసితై
ర్విశ్రాన్తైః కలితా కథాసు జరతాం శ్యామైః సమగ్రైరపి
జజ్ఞే కీర్తిమయాదహో! భయభరైరస్మాదకీర్తేః పునః
సా యన్నాస్య కథాపథేఽపి మలినచ్ఛాయా బబంధ స్థితిమ్॥ 104

ప. వి. ఏతత్కీర్తివివర్తధౌతనిఖిలత్రైలోక్యనిర్వాసితైః - విశ్రాన్తైః-కలితా-కథాసు-జరతా- శ్యామైః-సమగ్రైః-అపి-జజ్ఞే-కీర్తిమయాత్- అహో- భయభరైః-అస్మాత్-అకీర్తేః-పునః-సా - యత్-న-అస్య-కథాపథే - అపి-మలినచ్ఛాయా-బబంధ-స్థితిమ్.

అర్థము. ఏతత్కీర్తివివర్తధౌతనిఖిలత్రైలోక్యనిర్వాసితైః; ఏతత్ = ఈరాజు యొక్క, కీర్తివివర్త=కీర్తివిస్తారములచే, ధౌత=కడుగఁబడిన, నిఖిల సమస్తమైన, త్రైలోక్య = మూఁడులోకములచే, నిర్వాసితైః = తొల గింపఁబడిన, సమగ్రైరపి = సమస్తములైన, శ్యామైః = నల్లనివస్తువు

వచే, జరతాం = వృద్ధులైనపురుషులయొక్క, కథాసు = కథలయందు, విశ్రాన్తిః = విశ్రాంతి అనగా ఉనికి, కలితా = చేయఁబడినది ఇతని కీర్తివ్యాపించుట వలన నల్లని వస్తువులన్నియు తొలఁగిపోయి కథామాత్రావశేషము లైనవని యర్థము. అకీర్తేఃపునః=అపకీర్తికో, కీర్తిమయాత్ = కీర్తిరూపుఁడైన, అస్మాత్ = ఈరాజునుండి, భయభరైః = భయసమూహములచే, జజ్ఞే = పుట్టుట అనగా నపకీర్తికి నీ నృపాలునుండి భయసమూహముద్భవించినదని యర్థము. అనగా కీర్తిస్వరూపుడగు నీ రాజునుండి యపకీర్తి మిక్కిలి భయపడినదని యర్థము. (ఏలయనగా) యత్ = ఎందువలన, మలినచ్ఛాయా = మలినపు కాంతిగల్గిన, సా = ఆయపకీర్తి, అస్య = ఈరాజుయొక్క, కథాపథేఽపి = కథామార్గమునందును, అనగా నీతని వాఙ్మార్గమందును, స్థితిమ్ = ఉనికిని, నబబంధ = పొందలేదు. అపకీర్తిలేశముగూడ నీతనికి లేదు. ఏలయనగా- ఇతని కథనుఁజెప్పునప్పుడు అపకీర్తికథగూడ వినఁబడదు.

**సమాసములు :**

ఏతత్కీర్తివివర్తధౌతనిఖిలత్రైలోక్యనిర్వాసితైః:- ఏతస్యకీర్తయః = ఏతత్కీర్తయః, ఏతత్కీర్తీనాంవివర్తాః=ఏతత్కీర్తివివర్తాః, ఏతత్కీర్తివివర్తైఃధౌతం=ఏతత్కీర్తివివర్తధౌతం, నిఖిలంచతత్ త్రైలోక్యంచని ఖిలత్రైలోక్యం, ఏతత్కీర్తివివర్తధౌతంచతత్నిఖిలత్రైలోక్యంచ = ఏతత్కీర్తివివర్తధౌతనిఖిలత్రైలోక్యం, ఏతత్కీర్తివివర్తధౌతనిఖిలత్రైలోక్యాత్నిర్వాసితాని=ఏతత్కీర్తివివర్తధౌతనిఖిలత్రైలోక్యనిర్వాసితాని, తైః = ఏతత్కీర్తివివర్తధౌతనిఖిలత్రైలోక్యనిర్వాసితైః.

కీర్తిమయాత్ :- కీర్తేః వికారః=కీర్తిమయః, తస్మాత్=కీర్తిమయాత్.

భయభరైః :- భయానాంభరాః=భయభరాః, తైః=భయభరైః.

మలినచ్ఛాయా :- మలినాఛాయా యస్యాస్సా=మలినచ్ఛాయా.

**భావము :**

ఈ రాజుయొక్క విశాలమగు కీర్తులచే, మూడులోకములును క్షాళితమైనవి. అట్లు క్షాళితములైన మూడులోకములనుండి నల్లని వస్తువులు తొలగింపఁ

బడి వృద్ధుల కథలలో నిలచిపోయినవి. అనగా సద్వస్తువులు కథామాత్రావశేషములైనవి. ఇక నపకీర్తికో కీర్తిస్వరూపుడగు నితనినుండి భయమేర్పడినది. ఏలయనగా, మలినకాంతి గల యా యపకీర్తి యితని వాఙ్మార్గమునందుఁ గూడ నిలువలేక పోయినది. ఇతనియందు లేశమాత్రము గూడ నపకీర్తి లేదు. కాన, నితని కథనుఁ జెప్పునపుడు అపకీర్తి కథ గూడ వినఁబడుటలేదు. ॥౧౦౪॥

**శ్లో. అథావదద్భీమసుతేఙ్గితాత్ సఖీ**
**జనైరకీర్తిర్యది వాఽస్య నేష్యతే ।**
**మయాపి సా తత్ ఖలు నేష్యతే పరం**
**సభాశ్రవఃపూరతమాలవల్లితామ్॥ 105**

ప. వి. అథ-అవదత్ - భీమసుతేఙ్గితాత్-సఖీ-జనైః-అకీర్తిః-యది-వా-అస్య-న-ఇష్యతే - మయా-అపి-సా-తత్-ఖలు-న-ఇష్యతే-పరం-సభాశ్రవఃపూరతమాలవల్లితామ్.

అర్థము. అథ=పిదప, సఖీ=చెలికత్తె, భీమసుతేఙ్గితాత్; భీమసుతా=దమయన్తి యొక్క, ఇఙ్గితాత్ = ఒల్లనితనమును సూచించెడి చేష్టనుఁ దెలిసికొని, అవదత్ = చెప్పినది. (కిమితి-ఏమనగా) అస్య = ఈ రాజునకు, అకీర్తిః = అపకీర్తి, జనైః=జనులచే, యదినేష్యతేవా= ఏవిధముగను అంగీకరింపఁబడదు. తత్=అప్పుడు, మయాపి=నాచేతను, సాఖలు = ఇతనియొక్క యపకీర్తియు, నేష్యతే=అభిలషింపఁబడదు. పరంతు = కాని, సభాశ్రవఃపూరతమాలవల్లితామ్ ; సభా=సభకు, శ్రవఃపూర=కర్ణభూషణమైన, తమాలవల్లితాం=చీకటి చెట్టుగానుండుటను, నేష్యతే=అభిలషింపఁబడదా? తప్పక యభిలషింపఁబడును, అపకీర్తి నలుపు కావున, దానిని తమాలలతగా చెప్పుట సముచితమైనది.

**సమాసములు:**

**భీమసుతేఙ్గితాత్:**— భీమస్యసుతా=భీమసుతా, భీమసుతాయాః ఇఙ్గితమ్=భీమసుతేఙ్గితమ్, తస్మాత్=భీమసుతేఙ్గితాత్.

సభాశ్రవఃపూరతమాలవల్లితామ్ :— సభాయాః శ్రవః=సభాశ్రవః, సభాశ్రవసః పూరః=సభాశ్రవఃపూరః, తమాల ఇతివల్లిః=తమాలవల్లిః, లేదా

తమాలస్యవల్లిః = తమాలవల్లీ, సభాశ్రవణఃపూర ఏవ తమాలవల్లిః=సభా శ్రవణఃపూర తమాలవల్లిః, సభాశ్రవణఃపూర తమాలవల్లేః భావః = సభా శ్రవణఃపూర తమాలవల్లితా, తామ్=సభాశ్రవణఃపూర తమాలవల్లితామ్.

**భావము :**

ఇట్లు సరస్వతీదేవి యా రాజును వర్ణించు సందర్భమున చెలికత్తె దమ యన్తి ముఖములోని యనభిమ తత్వ సూచనములగు చేష్టలను( గాంచి సరస్వతీ దేవితో నిట్లనెను— ఓ దేవీ! ఈ రాజున కపకీర్తిని జనులెవ్వరు కోరుట లేదు. నేనును కోరుటలేదు. కాని యాతని కపకీర్తి యున్నది. దానిని సభాసదుల కర్ణ ములకు భూషణస్థానము నలంకరించెడి చీకటి తీగెగా( జేయ(గలను. అనగా వినిపింప(గలనని యర్థము. అపకీర్తి నలుపు గాన తమాలలతగా( జెప్ప(బడి నది. ఇట్లు వర్ణనా మధ్యమున సరస్వతీదేవిని వారించి చెలికత్తె యిట్లు చెప్పు టచే నితని యందభిరుచి లేని దమయన్తి కనుకూలత యేర్పడినది. ॥౧౦౫॥

శ్లో. **అస్య క్షోణిపతేః పరార్ధపరయా లక్షీకృతాః సఙ్ఖ్యయా**
**ప్రజ్ఞాచక్షురవేక్ష్యమాణతిమిరప్రఖ్యాః కిలాఽకీర్తయః ।**
**గీయన్తే స్వరమష్టమం కలయతా జాతేన వన్ధ్యోదరాత్**
**మూకానాం ప్రకరేణ కూర్మరమణీదుగ్ధోదధే రోధసి॥106**

ప. వి. అస్య – క్షోణిపతేః – పరార్ధపరయా – లక్షీకృతాః – సఙ్ఖ్యయా – ప్రజ్ఞాచక్షురవేక్ష్యమాణతిమిరప్రఖ్యాః - కిల - అకీర్తయః – గీయన్తే - స్వరమ్ - అష్టమం - కలయతా - జాతేన - వన్ధ్యోదరాత్ - మూకానాం - ప్రకరేణ - కూర్మరమణీదుగ్ధోదధేః - రోధసి.

అర్థము. పరార్ధపరయాః పరార్ధ = సంఖ్యకు రెండవ యవధియగు పరార్ధమును ననగా సంఖ్యలలో( గడపటి సంఖ్యను; పరయా = మించిన, యనగా దానికంటె నధికమైన సంఖ్యచే, లక్షీకృతాః = విషయము గావించుకొన బడిన యన(గా, లెక్కింప(బడినవియు, ప్రజ్ఞాచక్షురవేక్ష్యమాణతిమిర ప్రఖ్యాః; ప్రజ్ఞా = మేధయే, చక్షుః = నేత్రముగా గల్గిన పుట్టంధులచే, అవేక్ష్యమాణ = చూడ(బడు. తిమిర = చీకటితో, ప్రఖ్యాః = సమాన ములును ననగా మిక్కిలి నల్లని వియులనగు, అస్య=ఈ, క్షోణిపతేః =

భూపాలునియొక్క, అకీర్తయః = అపకీర్తులు, అష్టమం = ఎనిమిదవ, స్వరం = స్వరము ను, కలయతా = ప్రయోగించునట్టి వాడును, వన్ధ్యో దరాత్, వన్ధ్యా = గొడ్డురాలి యొక్క, ఉదరాత్ = గర్భము నుండి, జాతేన = పుట్టిన వాడునునగు, మూకానాం = మూగవారియొక్క, ప్రకరేణ = సమూహముచే, కూర్మరమణీదుగ్ధోదధేః కూర్మరమణీ = ఆడుతాబేలుయొక్క, దుగ్ధ=పాలయొక్క, ఉదధేః=సముద్రముయొక్క, రోధసి = గట్టునందు, గీయతే = గానము చేయఁబడుచున్నది. ఇందు వలన నితనికిని, యపకీర్తులు గలవు. జనుల చేతను వినఁబడుచున్నవని యర్థము తేలుచున్నది.

వి. తొలుత నితని కపకీర్తులున్నట్లు తెలియును. పిదప విచారణ చేయగా పరార్ధమునకు తర్వాత నంకె లెట్లుండవో, యెట్లు పుట్టు చీకులచే చూడఁబడు చీకట్లులేవో, ఇత్యాదిగా తక్కినవియు నసంభవములో, అట్లే యితనికి నపకీర్తులును నసంభవములని చివరకు దేలుట వలన నిఁట, నిందచేస్తుతినిఁ దెలిపెడి వ్యాజస్తుత్యలజ్కారము.

## సమాసములు :

క్షోణిపతేః :- క్షోణేః పతిః = క్షోణిపతిః, తస్య = క్షోణిపతేః.

పరార్ధపరయా :- అర్ధాత్ పరం, పరార్ధం, పరార్ధాత్పరా = పరార్ధ పరా, తయా = పరార్ధపరయా.

ప్రజ్ఞాచక్షురవేక్ష్యమాణతిమిరప్రఖ్యాః:- ప్రజ్ఞైవచక్షుః యేషాంతే,= ప్రజ్ఞాచక్షుషః, ప్రజ్ఞాచక్షుర్భిరవేక్ష్యమాణం = ప్రజ్ఞాచక్షురవేక్ష్యమాణం, ప్రజ్ఞాచక్షురవేక్ష్యమాణంచతత్ తిమిరంచ = ప్రజ్ఞాచక్షురవేక్ష్యమాణతిమిరం, ప్రజ్ఞాచక్షురవేక్ష్యమాణతిమిరస్య ప్రఖ్యేవప్రఖ్యాయేషాంతాః,= ప్రజ్ఞాచక్షురవేక్ష్యమాణతిమిరప్రఖ్యాః.

వంధ్యోదరాత్ :- వంధ్యాయాఃఉదరం = వన్ధ్యోదరం, తస్మాత్ = వంధ్యోదరాత్.

కూర్మరమణీదుగ్ధోదధేః :- కూర్మస్యరమణీ = కూర్మరమణీ, కూర్మరమణ్యాః దుగ్ధం = కూర్మరమణీదుగ్ధం, కూర్మరమణీదుగ్ధస్యఉదధిః= కూర్మరమణీదుగ్ధోదధిః, తస్య = కూర్మరమణీదుగ్ధోదధేః.

**భావము :**

ఈ కీకటాధిపతి కీర్తులు సంఖ్యలలో కడపటి సంఖ్యయగు పరార్థమున కంటెను నధికములుగా లెక్కింపఁబడుచున్నవి. అవి పుట్టంధులు చూచెడి చీకటి వలె మిక్కిలి నల్లనివి. ఆ కీర్తులను గొడ్రాలికి జన్మించిన మూగవాండ్ర సంఘము, అష్టమ స్వరముతో, తాబేటి పాలతో నేర్పడిన సముద్రపు గట్టున గానము చేయుచున్నది. పరార్ధమునకు తర్వాత సంఖ్యలేదు. పుట్టంధులు చీకటిని జూడఁజాలరు. గొడ్డురాలికి సంతానములేదు. స్వరము లేడేకాని యెనిమిదవ స్వరములేరు. తాబేటికి పాలులేదని ప్రసిద్ధి. అవి గుడ్లనే పెట్టును. కాన దాని పాలతోఁ గూడిన సముద్రములేదు. ఇవి యన్నియు నసంభవములుగాన నాతనికి నపకీర్తులు గూడ నసంభవములు. ఆకాశ పుష్పము కుందేటి కొమ్ము మున్నగు నవి యలీకములై యెట్లు లేవో, అట్లే యితనికి నపకీర్తులు గూడ లేవను స్తుతి యందే యా యసంభవ గ్రస్తవిషయములు పర్యవసించుచున్నవి. ॥౧౦౬॥

శ్లో. తదక్షరైః సస్మితవిస్మితాననాం
నిపీయ తామీక్షణభఙ్గిభిః సభామ్ ।
ఇత్యస్య హాస్యం కిమభూన్న వేతి తం
విదర్భజా భూపమపి వ్యభాలయత్॥ 107

ప. వి. తదక్షరైః-సస్మితవిస్మితాననాం-నిపీయ-తామ్-ఈక్షణభఙ్గిభిః-సభామ్-ఇతి-అస్య-హాస్యం-కిమ్-అభూత్-న-వా-ఇతి-తం-విదర్భజా-భూపమ్-అపి-వ్యభాలయత్.

అర్థము. విదర్భజా=దమయన్తి, తదక్షరైః; తత్=ఆచెలికత్తెయొక్క, అక్షరైః=మాటలచే, సస్మితవిస్మిత=చిఱునగవుతోఁ గూడినదియు, విస్మిత=(చిఱునగవులేనిదియు) ఆశ్చర్యముతోఁ గూడినదియునగు, ఆననాం=ముఖములుగల, తాం=ఆ, సభాం = సభను, ఈక్షణభఙ్గిభిః = చూపుల యొక్క విశేషములచే, నిపీయ = ప్రీతితోఁ జూచి, ఇహ = ఈమాట యందు, అస్య=ఈకీకట ప్రభువునకు, హాస్యం=నవ్వు, అభూత్ కిమ్= అయినదాయేమి ? నవాఅభూత్ = కాలేదాయేమి ? ఇతి = అని, తం = ఆ ప్రభువును, వ్యభాలయత్=చూచెను.

**సమాసములు :**

తదక్షరైః :- తస్యాః అక్షరాణి = తదక్షరాణి, తైః=తదక్షరైః.
సస్మితవిస్మితాననాం :- స్మితేనసహితాని = సస్మితాని, స్మితేనవిరహితాని=విస్మితాని, సస్మితానిచతానివిస్మితానిచ = సస్మితవిస్మితాని, సస్మితవిస్మితాని ఆననానియస్యాస్సా = సస్మితవిస్మితాననా, తామ్ = సస్మితవిస్మితాననాం.
ఈక్షణభఙ్గిభిః :- ఈక్షణానాంభఙ్గయః = ఈక్షణభఙ్గయః, తాభిః = ఈక్షణభఙ్గిభిః.

**భావము :**

చెలికత్తె వచనములవలని చిఱునగవుచేతను నాశ్చర్యరసముచేతను వికసిత వదనములుగల సభ్యులను, దమయంతి ప్రీతితోఁ జూచి, చెలికత్తెమాటలచే కీకట ప్రభువునకు నవ్వువచ్చినదా లేదా ? యనువిషయమునకై యా ప్రభువు వంకకు దృష్టిని సారించినది॥౧౦౭॥

**శ్లో.** **నలాన్యవీక్షాం విదధే దమస్వసుః**
**కనీనికాఽఽగః కిల నీలిమాలయః ।**
**చకార సేవాం శుచిరక్తతోచితాం**
**మిలన్నపాఙ్గః సవిధే తు నైషధే॥ 108**

ప. వి. నలాన్యవీక్షాం-విదధే-దమస్వసుః-కనీనికా-ఆగః-కిల-నీలిమాలయః
చకార-సేవాం-శుచిరక్తతోచితాం-మిలన్- అపాఙ్గః-సవిధే-తు-నైషధే

అర్థము. ఖలు=ఎందువలన, దమస్వసుః=దమయన్తియొక్క, కనీనికా = కంటిపాప, నీలిమాలయః; నీలిమా=నల్లఁదనమునకును, మాలిన్యమునకును, ఆలయః = స్థానమో (కావుననే) నలాన్యవీక్షాం ; నల = నలునికంటె, అన్య=మఱియొకరిని, వీక్షాం = చూచుటను, విదధే = చేసినది. మలినాత్ములు మలినకార్యములనే చేతురని యర్థము. అపాఙ్గస్తు=కటాక్షమో, సవిధే=సమీపమందున్న నైషధే = సత్యమైన నలునియందు, మిలన్=లగ్నమగుచు, శుచిరక్తతోచితాం ; శుచిరక్తతా=శ్వేతరక్తముగానుండు

టకుననగా పాటలవర్ణముగా నుండుటకును, శుచిరక్తతా=మంచిరక్త మును గల్గియుండుటకును, ఉచితాం=తగిన, సేవాం = సేవను, ననగా రంజించుటను, చకార = చేసినది. మంచివారు మంచినే చేయుదురని యర్థము. కీకటప్రభువునందు ఋజువైనదృష్టి పడుటవలన నాతనిపై ననురక్తి లేదనియు తెలియుచున్నది. నలునిపై గటాక్షములు పడుట వలన నాతనిపై ననురక్తికలదనియు తెలియుచున్నది. కీకటప్రభువును ఋజుదృష్టితోచూచుటకు, చెలికత్తెమాటల నతని విషయముననసంధా నము గావించుకొనవలయునను చాపల్యమే కారణము. కటాక్షముతో నొరులఁ జూచుట దోషము. ఋజుదృష్టితోఁ జూచుట దోషముకాదని యర్థము.

**సమాసములు :**

నలాన్యవీక్షాం:- నలాదన్యః = నలాన్యః, నలానస్యవీక్షా=నలాన్యవీక్షా, తామ్=నలాన్యవీక్షాం.

నీలిమాలయః:- నీలిమ్నఃఆలయః=నీలిమాలయః.

శుచిరక్తతోచితాం:- శుచిశ్చాసౌరక్తశ్చ =శుచిరక్తః, శుచిరక్తస్యభావః= శుచిరక్తతా, శుచిరక్తతాయాః ఉచితా=శుచిరక్తతోచితా, తామ్ = శుచి రక్తతోచితామ్.

నైషధే:- నిషధానాంరాజా=నైషధః, తస్మిన్=నైషధే.

**భావము :**

కీకటేశ్వరాదులనుఁ జూచుటవలన దమయన్తికి పాతివ్రత్యభఙ్గము కలుగ లేదని చెప్పుచున్నారు. దమయంతి కంటిపాప నల్లఁదనమునకును (మాలిన్యము నకును) నిలయము. అందువలన నలునికంటె నితరునిఁ జూచుట యనునేరమును పాపమును) చేసినది. మలినాత్ములు మలిన కార్యములనే చేతురుగదా. కాని యామె కటాక్షమో సమీపమందున్న నలుని యందేలగ్నమై శుచిరక్తత్వమునకు (శ్వేతరక్తత్వమను పాటలవర్ణమునకు) నిర్మలానురాగమునకును తగిన సేవా రూపమగు ననురంజనమునుఁ గావించినది. మంచివారు మంచి పనినే చేయుదురు గదా ! అనగాఁ కీకటప్రభువులపై ఋజుదృష్టి పడుటవలన నాతనిపై ననురాగము లేదనియు నలునిపై కటాక్షము పడుటవలన, ననురాగ మున్నదనియు తెలియు

చున్నది. ఆ కీకటప్రభువుపై నట్టి ఋజుదృష్టి, సఖీవచనమునను సంధానపఱచు కొనుటచే కాని యనురాగముఁ జేఁబడలేదు. ఋజుదృష్టితోఁ జూచిన, దోషములేదు. కటాక్షముతోఁ జూచినప్పుడే దోషము. ॥౧౦౮॥

శ్లో. దృశా నలస్య శ్రుతిచుమ్బినేషుణా
శరేఽపి చక్రచ్ఛలనమ్రకార్ముకః ।
స్మరః పరాఙ్గైరనుకల్ప్య ధన్వితాం
జనీమనఙ్గః స్వయమార్దయత్తతః॥ **109**

ప. వి. దృశా- నలస్య- శ్రుతిచుమ్బినా- ఇషుణా- కరే-అపి- చక్రచ్ఛలనమ్ర కార్ముకః- స్మరః- పరాఙ్గైః- అనుకల్ప్య- ధన్వితాం- జనీమ్- అనఙ్గః- స్వయమ్-ఆర్దయత్-తతః.

అర్థము. స్వయం = స్వయముగా, అనఙ్గః = దేహములేనివాడు కావుననే, స్మరః = మన్మథుఁడు, నలస్య = నలునియొక్క, దృశా = కటాక్షరూపమగు దృష్టిచేతనే, శ్రుతిచుమ్బినా; శ్రుతి = చెవులను, చుమ్బినా = స్పృశించు, ఇషుణా = బాణముచే, తథా = అట్లే, కరేఽపి = నలునియొక్క, హస్తమునందును, చక్రచ్ఛలనమ్రకార్ముకః; చక్ర = రాజలక్షణమైన చక్రచిహ్నమనురేఖయొక్క, ఛల = నెపముతో, నమ్ర = మిక్కిలి లాగుటవలన వంగిపోయిన, యనగా, వింటినివంచుట వలస రెండు కొనలును చక్రాకారముగా కలసిపోయినట్టి, కార్ముకః = ధనుస్సుగల్గినవాడై, పరాఙ్గైః; పర = ఇతరుడైన నలునియొక్క, అఙ్గైః = కన్ను మున్నగు నవయవములచే (ఇతరుల సాధనముచే) ధన్వితాం = విలుకానితనమును, అనుకల్ప్య = గౌణముగానేర్పఱచుకొని, తతః = పిదప, జనీం = వధువైనదమయన్తిని, ఆర్దయత్ = పీడించెను, దమయన్తియు నలుని కటాక్షముచే కామపీడితురాలాయెనని యర్థము.

**సమాసములు :**

శ్రుతిచుమ్బినా:- శ్రుతీచుమ్బతీతి = శ్రుతిచుమ్బీ, తేన = శ్రుతిచుమ్బినా.
చక్రచ్ఛలనమ్ర కార్ముకః:- చక్రమేవఛలమ్ = చక్రచ్ఛలం, చక్రచ్ఛలేన

నమ్రమం=చక్రకచ్ఛలనమ్రమం, చక్రకచ్ఛలనమ్రమం కార్ముకం యస్యసః=చక్ర చ్ఛలనమ్ర మ కార్ముకః.

పరాజ్ఞైః :— పరస్య అజ్ఞాని = పరాజ్ఞాని. తైః=పరాజ్ఞైః.

ధన్వితాం:— ధనురస్యాస్తీతి=ధన్వీ, ధన్వినో భావః=ధన్వసితా, తామ్= ధన్వితామ్.

**భావము :**

ఆ సమయమున యనగా దమయన్తి నలుని తన కటాక్షముతోఁ జూచిన సమయము నందు నలుఁడును నామెను దన కటాక్షముతో చూచెనని యిందు వర్ణింపఁబడినది. మన్మథుఁడు స్వయముగా దేహములేని వాఁడు. అందువలన నతడు కర్ణాన్తములకు వ్యాపించిన నలుని కన్నులనెడి బాణముతో నసగా నాతని కటాక్షమనెడి బాణముతో, నా నలుని హస్తమునందు రాజ చిహ్నమైన చక్ర రేఖ యను నెపమున, మిక్కిలి వంచుటచే గుండ్రమై రెండు కొనలునుఁ గలసి చక్రరూపమున నుండు ధనుస్సు మున్నగు నలునికి సంబంధించిన సాధనము లతో విలుకానితనమునుఁ గల్పించుకొని యా దమయన్తినిఁ బీడించెను. దమ యన్తియు నలుని కటాక్షముచే కామ పీడితురాలాయె నని యాశయము. ॥౧౦౯॥

శ్లో. ఉత్కణ్టకా విలసదుజ్జ్వలపాత్రరాజీ
రామోదభాగనపరాగతరాఽతిగౌరీ ।
రుద్రక్రుధస్తదరికామధియా నలే సా
వాసార్థితామశ్రిత కాఞ్చనకేతకీవ॥ 110

ప. వి. ఉత్కణ్టకావిలసదుజ్జ్వలపాత్రరాజిః—ఆమోదభాక్ - అనపరాగతగా—అతి గౌరీ-రుద్రక్రుధః - తదరికామధియా - నలే - సా - వాసార్థితామ్ - అధృత - కా ఞ్చనకేతకీ - ఇవ.

**అర్థము.** ఉత్కణ్టకా;=పైకి నిక్కపొడుచుకొనిన పులకములు గలదియు(పక్షాన్త రమున) పైకిలేచిన ముండ్లు గలదియు, విలసదుజ్జ్వల పత్త్రిరాజిః; విల సత్ = ప్రకాశించు, ఉజ్జ్వల = నీలపీతాది వర్ణములతో భాసించునదియు నగు, పత్త్రరాజిః = మకరికాదిపత్త్ర పంక్తి గలదియు, (పక్షాన్తరమున)

ఆకుల వరుస గలదియు, ఆమోదభాక్ = హర్షమునుఁ బొందినదియు, (పక్షాన్తరమున) పరిమళమును బొందినదియు, అనపరాగతరా=అధిక మైన యనురాగము గలదియు, (పక్షాన్తరమున) అధికమైన పుప్పొడి గలదియు, అతిగౌరీ=పార్వతిని మించినదనియు(పక్షాన్తరమున)మిక్కిలి పసిమివన్నె గలదియునగు, సా = ఆ దమయన్తి. రుద్రక్రుధః; రుద్ర= శివుని యందలి, క్రుధః = శాపమువలని పరిత్యాగముచే గల్గిన కోపము వలన,తదరికామధియాః;తత్=అతని శత్రువగు మన్మథుఁడను భ్రాంతిచే, అగతా = వచ్చిన, కాంచనకేతకీవ =పసిడి మొగలిపూవో యనునట్లు, వాసార్థితాం: వాస = స్వయంవరముచే నివసింపవలయునను కోరికను' అధృత =ధరించినది. దమయన్తి నలునభిలషించిన దని యర్థము.

**సమాసములు :**

ఉత్కణ్టకా :— ఉద్గతాః కణ్టకాః యస్యాస్సా=ఉత్కణ్టకా.

విలసదుజ్జ్వలపత్రరాజిః :— విలసన్తిచతాని ఉజ్జ్వలానిచ = విలసదుజ్జ్వలాని, విలసదుజ్జ్వలాని చతానిపత్రాణిచ= విలసదుజ్జ్వలపత్రాణి, విలసదుజ్జ్వలపత్రాణాంరాజిః యస్యాస్సా=విలసదుజ్జ్వలపత్రరాజిః.

ఆమోదభాక్ :— ఆమోదంభజతీతి=ఆమోదభాక్।

అనపరాగతరా :— అతిశయేన అపగతరాగా నభవతీతి = అనపరాగతరా.

అతిగౌరీ :— గౌరీమతిక్రాన్తా = అతిగౌరీ, (పక్షాన్తరమున) అత్యంతం గౌరీ=అతిగౌరీ.

రుద్రక్రుధః :— రుద్రస్యక్రుత్=రుద్రక్రుత్, తస్యాః=రుద్రక్రుధః।

తదరికామధియా :— తస్య అరిః = తదరిః, తదరిశ్చాసౌ కామశ్చ = తదరికామః, తదరికామస్యధీః =తదరికామధీః, తయా=తదరికామధియా.

వాసార్థితామ్ :— వాసస్య అర్థీ=వాసార్థీ, వాసార్థినో భావః=వాసార్థితా, తామ్=వాసార్థితామ్.

కాఞ్చనకేతకీ :— కాఞ్చనమయీచసాకేతకీచ=కాఞ్చనకేతకీ।

**భావము :**

శివలిఙ్గముయొక్క యూర్ధ్వాధోభాగముల యంతమునుఁ గనుగొనుటకు విష్ణువు బ్రహ్మయు పంపఁ బడిరి. బ్రహ్మయూర్ధ్వభాగముయొక్క యంతమును గనుగొనుటకు పంపఁబడెను. కాని బ్రహ్మయెంత దూరముపైకి వెళ్ళినను, దాని యంతమునుఁ గనుఁగొనలేకపోయి, చివరకు దాను లింగము యొక్క యన్త మునుఁజూచినట్లు చెప్పుమని మొగలిపూవును సాక్షిగావించెను కాని యిది యసత్యమగుట వలన దీనియందు సాక్ష్యమును వహించిన మొగలిపూవు తన పూజ కనర్హమగునట్లు శివుడు శాపమొసంగెను. అట్లే బ్రహ్మనెవ్వరు పూజింపరాదనియు శాపమిచ్చెను. అందువలన ప్రస్తుతము మొగలిపూలచే శివునిఁపూజింపరు. బ్రహ్మకును దేవాలయము లేదు.

ప్రకృతము దమయన్తి శివునిచే శాపవశమునఁ బరిత్యక్తమైన మొగలి పూవువలెనున్నదని, యిట వర్ణితము. దమయన్తికి శరీరమందు నలునిఁజూచుట చేతనే పులకములుదయించినవి. మొగలిపూవునకు దేహమంతయు ముండ్లుండును. దమయన్తికి, ఆమోదముండును. అనగా సంతోషముండును. మొగలిపూవునకో యామోదముండుననగా పరిమళముండును. దమయన్తికి నలునిపై ననపరాగతరత్వము-అనగా నతిశయితమగు ననురాగముండును. మొగలిపూవునకో, ననపరాగతరత్వమనగా నతిశయించిన పుప్పొడియుండును. దమయన్తి; గుణములచే నతిగౌరి యనగా గౌరీదేవిని మించినది. మొగలిపూవో మిక్కుటమగు పసిమివన్నెగలది. అట్టి మొగలిపూవోయనునట్లు, ఆదమయన్తి, తన్ను మహాదేవుఁడు వదలెనను క్రోధముతో నితనికి శత్రువైన మన్మథుడను భ్రాంతితో నలునియందు స్వయంవరముచే నివాసముచేయఁ గోరినదని యాశయము ॥౧౧౦॥

**శ్లో. తన్నాలీకనలే చలేతరమనాః సామ్యానన్మనాగప్యభూ
దప్యగ్రే చతురఃస్థితాన్న చతురా పాతుం దృశా నైషధాన్.
ఆసన్నాప్యనిధౌ నిమజ్జ్య నితరాం దూరం గతా తత్త్రలా
లజ్జాకారీభవనాజ్జనాయి దదతీ పాతాలకన్యాభ్రమమ్॥ 111**

ప వి. తన్నాలీకనలే- చలేతరమనాః- సామ్యాత్- మనాక్- అపి- అభూత్-
అపి- అగ్రే- చతురః- స్థితాన్- న- చతురా- పాతుం- దృశా- నైష

ధాన్- ఆనందాంబునిధౌ- నిమజ్జ్య- నితరాం- దూరం- గతా-తత్తలా లజ్కారీభవనాత్- జనాయ- దదతీ- పాతాలకన్యాభ్రమమ్-

అర్థము. (సా = ఆదమయన్తి) తన్నాలీకనలే; తత్ = ఆ, నాలీకనలే = సత్యమైననలునియందు, చలేతరమనాః =అవ్యాపృష్టముచే చలించనిమనస్సు గల్గినదై, అనగా నాతనియందే దృఢమైనయనురక్తి గల్గినదై, ఆనందాంబునిధౌ; ఆనంద =సంతోషమనెడి, అంబునిధౌ=సాగరమందు, నిమజ్జ్య= మునిగి, నితరాం = మిక్కిలి, దూరంగతా = దూరమునుపొందినదై, అనగా లోయనుఁ బొందినదై (ఆనందమునకు కడపటి యెల్లనుఁబొందినదనియర్థము.) పక్షాన్తరమున–ఆనందాంబునిధౌ = ఆనందసముద్రమునందు, నిమజ్జ్య =మునిగి, దూరంగతా=అడుగుభాగమునుఁ బొందినదై, తత్తలాలజ్కారీభవనాత్; తత్తల = దానియడుగుభాగమునకు, అలజ్కారీభవనాత్=భూషణమగుటవలన, పక్షాంతరమున–అచ్చటనుండుటవలన, జనాయ = ప్రేక్షకజనమునకై, పాతాలకన్యాభ్రమం, పాతాలకన్యా =నాగకన్యయను, భ్రమం=భ్రాన్తిని, (మిక్కిలి యందమువలనను, సంతోషాతిరేకముచే తెప్పపాటు లేనందువలనను, సముద్రముయొక్క యడుగుభాగమునుఁ బొందుటవలనను) దదతీ = కల్గించుచు, అగ్రే = ఎదుట, స్థితానపి = ఉన్నను, చతురః = నలుగురైన, నైషధాన్ = ఇంద్రుడు మున్నగుమాయానలులను, సామ్యాత్ = సత్యనలునిసామ్యమువలన, మనాగపి=కొంచెమైనను, దృశా = కటాక్షముచే, పాతుం=చూచుటకు, చతురా =సామర్థ్యముగలదిగా, నాఽభూత్ = కాలేదు. ఆదమయన్తి దూరమందున్నయథార్థమగునలుని, జన్మాన్తరసంస్కారమువలన కటాక్షము చేఁజూడ గల్గినది. కాని ఎదుటనున్న యిన్ద్రాదిమాయానలులను ఋజుదృష్టితోడనే చూచినదని యాశయము.

**సమాసములు :**

నఅలీక:- నాలీకః, సచాసౌ నాలీకశ్చ = తన్నాలీకః, తన్నాలీకశ్చాసౌ నలశ్చ =తన్నాలీకనలః, తస్మిన్=తన్నాలీకనలే.

చలేతరమనాః :- చలాదితరం=చలేతరం చలేతరంమనః యస్యాస్సా =
చలేతరమనాః.

నైషధాన్ః ;—నిషధానాంరాజానః = నైషధాః, తాన్=నైషధాన్.

తత్తలాలఙ్కారభవనాత్ :- తస్యతలం = తత్తలం, అనలఙ్కారస్య అలఙ్కారస్యభవనం=అలఙ్కారీభవనం, తత్తలస్యఅలఙ్కారీభవనం= తత్తలాలఙ్కారీభవనం తస్మాత్ =తత్తలాలఙ్కారీభవనాత్.

పాతాలకన్యాభ్రమమ్ :-పాతాలస్యకన్యా=పాతాలకన్యా, పాతాలకన్యాఇతి భ్రమః=పాతాలకన్యాభ్రమః. తం = పాతాలకన్యా ఇతిభ్రమః = పాతాలకన్యాభ్రమః, తమ్=పాతాలకన్యాభ్రమం,

**భావము :**

ఆ స్వయంవర సభయందు సత్యనలుడును నింద్రాదిమాయానలులును నుండిరి. కాని జన్మాంతర సంస్కారవశమున దమయన్తి సత్యనలునియందే తన మనస్సును నిలిపి యతనియందే దృఢానురాగముగలదై. యానందసాగరమునందు మునిగి చాల దూరము వెళ్లి, దానియెల్లకుఁ జేరినది. మఱియొక పక్షమున- సముద్రముయొక్క యడుగుభాగమునుఁజేరి (పాతాలకన్యగా) దానికి నాభరణముగానుండినది. ఆమె సౌందర్యాతిశయమువలనను, సంతోషాధిక్యముచే జెప్పపాట్లు లేకయుండుటవలనను, సముద్రముయొక్క యడుగుభాగమునుఁ బొందుటవలనను చూపరులకు నాగకన్యయను భ్రాన్తినిఁ గల్గించుచున్నదై, యెదుట మాయానలురైన యింద్రాదులు నలుగురున్నను, సత్యనలుని సాదృశ్యమునుపరించి కొంచెమైనను. తనకటాక్షములతోఁ జూచుటకు సమర్థురాలుకాకపోయినది. ఆదమయన్తి నిజమైననలుడు దూరమునందున్నను ప్రేమసూచకములగు తనకటాక్షములతోఁ జూచుచుండెను. మాయానలురైన యింద్రాదులను సమీపమునందున్నను ఋజుదృష్టితోడనే, (అనురాగరహితమైన దృష్టితోడనే) చూచుచుండెనని యాశయము॥౧౧౧॥

శ్లో. సర్వస్వం చేతసస్తాం నృపతిరపి దృశే ప్రీతిదాయం ప్రదాయ
ప్రాపత్తద్దృష్టిమిష్టాతిథిమమరదురాపామపాఙ్గోత్తరఙ్గామ్।
అనన్దాన్ధ్యేన వన్ధ్యానకృత తదపరాకూతపాతాన్ స రత్యాః
పత్యా పీయూషధారావలనవిరచితేనాఙ్గనాఙ్గలీఢః 112

ప. వి. సర్వస్వం-చేతసః - తాం-నృపతిః - అపి - దృశే - ప్రీతిదాయం-ప్రదాయ - ప్రాపత్ - తద్దృష్టిమిష్టాతిథిమ్-అమరదురాపామ్ - అపాఙ్గోత్తరఙ్గామ్ - ఆనన్దాన్ధ్యేన - వన్ధ్యాన్-అకృత-తదపరాకూతపాతాన్-సః-రత్యాః-పత్యా - పీయూషధారాపలనవిరచితేన-ఆశుగేన-ఆశు - లీఢః.

అర్థము. నృపతిరపి=నలుఁడును, చేతసః=మనస్సునకు, సర్వస్వం=సర్వధనమైన యనగా (మనస్సునుండి తొలగిపోనట్టి) తాం=ఆదమయన్తిని, దృశే=తనదృష్టికి, ప్రీతిదాయం = పారితోషికదానముగా, ప్రదాయ = ఇచ్చి (తొలుత నిరంతరము నామెను ధ్యానించుటచేత మనస్సుచేనామె ప్రత్యక్షముగావించుకొనఁ బడినది. ఇప్పుడో నేత్రములతో నామెను ప్రత్యక్షముగావించుకొనెను) అమరదురాపాం = దేవతలకును దుర్లభమైనట్టి, అపాఙ్గోత్తరఙ్గామ్ ; అపాఙ్గ=కడకన్నులచే, ఉత్తరఙ్గామ్=తరంగములతో గూడినదైన, తద్దృష్టిం ; తత్=ఆదమయన్తియొక్క, దృష్టిం = చూపనెడి, ఇష్టాతిథిం=ప్రియమైన అతిథిని, ప్రాపత్=పొందెను. అథ=పిదప, సః=ఆరాజు, రత్యాః = రతియొక్క, పత్యా = భర్తయైనమన్మథునిచే, పీయూషధారాపలనవిరచితేన ; పీయూషధారా = అమృతధారయొక్క, పలన=స్రావముచే, విరచితేన=నిర్మింపఁ బడిన, ఆశుగేన = బాణముచే, (దమయన్తికటాక్షమను బాణముచే) ఆశు = శీఘ్రముగా, లీఢస్సన్ = కొట్టఁ బడినవాఁడై, ఆనన్దాన్ధ్యేన; ఆనంద =ఆనందమువలని, ఆన్ధ్యేన= మోహముచేత, తదపరాకూతపాతాన్ ; తత్ =ఆదమయన్తిప్రథమదృష్టికి, అపరాన్ = తర్వాతివియగు, ఆకూతపాతాన్ = ప్రేమతోగూడిన దృష్టిపాతములను, వన్ధ్యాన్ = వ్యర్థములైనవిగా, అకృత = చేసెను, మొదటిచూపుతనపైఁ బడుటవలనఁ గల్గిన యానందమునమునిగినవాడై తర్వాత నామెయొక్క సాభిప్రాయములైన దృష్టిపాతములను, జూడ లేదనియర్థము.

**సమాసములు :**

ప్రీతిదాయం :- ప్రీత్యాదాయః = ప్రీతిదాయః, తమ్ = ప్రీతిదాయం.

తద్దృష్టిమ్ :- తస్యాః దృష్టిః = తద్దృష్టిః, తామ్ = తద్దృష్టిమ్.

ఇష్టాతిథిమ్ :- ఇష్టశ్చాసౌ అతిథిశ్చ = ఇష్టాతిథిః, తమ్ = ఇష్టాతిథిమ్.

అమరదురాపామ్:- మఃఖేన అపుంశక్యా=దురాపా, అమరైః దురాపా= అమరదురాపా, తాం అమరదురాపా, తామ్ = అమరదురాపామ్.

అపాఙ్గోత్తరఙ్గామ్ :- అపాఙ్గైః ఉత్తరఙ్గా = అపాఙ్గోత్తరఙ్గా, తామ్ = అపాఙ్గోత్తరఙ్గామ్.

అనన్ధాన్ధ్యేన :- అన్ధస్యభావః=ఆన్ధ్యమ్, అనన్దేన ఆన్ధ్యమ్=అనన్దాన్ధ్యం, తేన = అనన్దాన్ధ్యేన.

తదపరాకూతపాతాన్ :- తస్యాః అపరాః = తదపరాః, ఆకూతేన పాతాః=ఆకూతపాతాః, తదపరాశ్చతే ఆకూతపాతాశ్చ = తదపరాకూత పాతాః, తాన్ = తదపరాకూతపాతాన్.

పీయూషధారావలనవిరచితేన :- పీయూషస్యధారా = పీయూషధారా, పీయూషధారాయాః వలనం = పీయూషధారావలనమ్. పీయూషధారా వలనేన, విరచితః = పీయూషధారావలన విరచితః, తేన = పీయూష ధారావలనవిరచితేన.

**భావము :**

నిజమైన నలుఁడు హృదయమును పీడనట్టి యా దమయన్తిని తన దృష్టికి పారితోషికముగా నొసంగి యనగా పూర్వము మనస్సుచేతను, ఇప్పుడు నేత్రముల తోఁడనుఁ బ్రత్యక్షముఁ గావించుకొనెను. పిదప నతడు తన దృష్టికి, దేవతలకును, దుర్లభమైనట్టి, కటాక్షములతో తరంగితమగు నామె దృష్టిని ప్రియమైన యతిథినిఁ గావించుకొనెను. ఇట్లు ఆమె దృష్టియను, నమృత ధారచే బూయఁబడిన బాణముతో, మన్మథునిచేఁ గొట్టబడి యానందముచే నంధుఁడై, తర్వాత నామె ప్రసరింపఁజేసిన సాభిప్రాయములును, సాభిలాషములునగు దృష్టి పాతములను వ్యర్థములనుఁ గావించెను. మొదటి దృష్టి పాతముచే నతడానంద మున మునుగుట వలన తర్వాతి దృష్టి పాతములను జూడఁజాల నందు వలన నవి వ్యర్థములైనవని యాశయము ॥౧౧౨॥

శ్లో. శ్రీహర్షం కవిరాజరాజిముకుటాలఙ్కారహీరః సుతం
శ్రీహీరః సుషువే జితేన్ద్రియచయం మామల్లదేవీ చయం।
తస్య ద్వాదశ ఏషమాతృచరణామ్భోజాలమౌలేర్మహా
కావ్యేఽయం వ్యగలన్నలస్య చరితే సర్గో నిసర్గోజ్జ్వలః॥

ప. వి. శ్రీహర్షం— కవిరాజరాజిముకుటాలఙ్కారహీరః - సుతం - శ్రీహీరః - సుషువే- జితేన్ద్రియచయం- మామల్లదేవీచ— యం- తస్య - ద్వాదశః- ఏషః- మాతృచరణామ్భోజాలిమౌలేః- మహాకావ్యే—అయం—వ్యగలత్— నలస్య-చరితే—సర్గః—నిసర్గోజ్జ్వలః-



అర్థము. కవిరాజ రాజిమకుటాలఙ్కార హీరః, కవిరాజ=కవిశ్రేష్ఠుల, రాజి = వరుసయొక్క- ముకుట=కిరీటమందలి, అలఙ్కార=అలఙ్కారములగు రత్నములలో, హీరః=వజ్రమణియగు, శ్రీహీరః=శ్రీహీరుఁడను మహాకవి, జితేన్ద్రియచయం, జిత=జయింపఁబడిన, ఇన్ద్రియ=ఇన్ద్రియముల యొక్క, చయం = సమూహము గల్గిన, హర్షం=శ్రీహర్ష మహాకవిని, సుషువే = కనెనో, మామల్లదేవీచ = మామల్లదేవియు, యం=ఎవనిని, సుషువే=కనెనో, మాతృచరణామ్భోజాలిమౌలేః, మాతృచరణ = తల్లి పాదములనెడి, అమ్భోజ=తామరపూవులకు, అలి=తుమ్మెదలుగా నాచరించు, మౌలేః=శిరముగల్గిన, తస్య=ఆశ్రీహర్షునియొక్క- కృతియగు, మహాకావ్యే=మహాకావ్యమైన, నలస్య=నలునియొక్క, చరితే=చరిత్రము నందు, నిసర్గోజ్జ్వలః = స్వభావముచే ప్రకాశమానమగు, ఏషః = ఈ, ద్వాదశః=పండ్రెండవ, సర్గః=సర్గ, అయంవ్యగలత్=ఇదిగో పూర్తి యైనది.



**సమాసములు :**

కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః :— కవీనాం రాజానః=కవిరాజాః, కవిరాజానాం రాజిః=కవిరాజరాజిః, కవిరాజరాజేః మకుటం=కవిరాజరాజిమకుటం, కవిరాజరాజి మకుటస్య అలఙ్కారాః = కవిరాజరాజిమకుటాలఙ్కారాః, కవిరాజరాజి మకుటాలఙ్కారేషు హీరః = కవిరాజ రాజి మకుటాలఙ్కారహీరః।

జితేన్ద్రియచయం :— ఇన్ద్రియాణాంచయః = ఇన్ద్రియచయః, జితః ఇన్ద్రియచయః యేనసః = జితేన్ద్రియచయః, తమ్—జితేన్ద్రియచయమ్.

మాతృచరణామ్భోజాలిమౌలేః :— మాతుః చరణౌ = మాతృచరణౌ, మాతృచరణావేవ, అమ్భోజే=మాతృచరణామ్భోజే, మాతృచరణామ్భో

జనయోః అలిః = మాతృచరణామ్భోజాలిః, మాతృచరణామ్భోజాలి రేవ మౌలిః యస్యసః=మాతృచరణామ్భో జాలిమౌలిః, తస్య=మాతృచరణా మ్భో జాలిమౌలేః।

నిసర్గోజ్జ్వలః :— నిసర్గేణ ఉజ్జ్వలః=నిసర్గోజ్జ్వలః.

**భావము :**

కవిశ్రేష్ఠుల పంక్తి యొక్క కిరీటాలంకారమణులలో వజ్రమణియగు శ్రీహీరకవియు, మామల్లదేవియు శ్రీహర్షకవిని గనిరి. తల్లిపాదములనెడి తామరపూవులకు తుమ్మెదవలె నాచరించు శిరముగల్గిన యాశ్రీహర్షుడు రచియించిన మహాకావ్యమగు నలచరిత్రమునందు పండ్రెండవ సర్గ పరిసమాప్తము ॥౧౧౩॥

ఇట్లు
శ్రీమదాత్రేయగోత్రోద్భవ ఉడాలినరసింహసూరి
తనూజసుబ్బరామశాస్త్రి విరచితమగు
శ్రీహర్షనైషధ వ్యాఖ్యయందు
ద్వాదశసర్గ సమాప్తము
ఓం
శమ్

# శ్రీహర్ష నైషధము

## ఐదవ సంపుటము



తెలుగు వ్యాఖ్యానం

శ్రీ ఉడాలి సుబ్బరామ శాస్త్రి, ఎం. ఏ.

రిటైర్డ్ ప్రిన్సిపాల్, వైదిక సంస్కృత కళాశాల, నెల్లూరు






ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

# శ్రీహర్ష నైషధము

## ఐదవ సంపుటము



తెలుగు వ్యాఖ్యానం

**శ్రీ ఉడాలి సుబ్బరామ శాస్త్రి, ఎం. ఎ.**
రిటైర్డ్ ప్రిన్సిపాల్, వైదిక సంస్కృత కళాశాల, నెల్లూరు






ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

SRI HARSHANAISHADHAM - Volume V (Containing 13th, 14th and 15th Sargas) - A Sanskrit classic by Sri Harsha of 12th century A. D. with Telugu commentary by Udali Subbarama Sastry, Retd. Principal Veda and Sanskrit college, Nellore Dist. Andhra Pradesh

---


ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాదు : 500 004

ప్రచురణ : 384

ప్రథమ ముద్రణ : 1982

ప్రతులు : 1,000

వెల : రూ. 10.00

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్
హైదరాబాదు - 500 004

ముద్రణ :
నాగలక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్,
బషీర్ బాగ్, హైదరాబాదు-500 029. ఫోన్. 220238.


---


Paper used for the Printing of this book was made available by the Government of India at Concessional rate.

# తొలి పలుకు

ప్రసిద్ధమైన సంస్కృత గ్రంథాలలోని మూలస్వరూపాన్ని తెలుగు పాఠకులకు పరిచయం చేయాలనే ఉద్దేశంతో అకాడమీ ఇంతవరకు కొన్ని పుస్తకాలను ప్రచురించింది. మృచ్ఛకటికం, ఉత్తరరామచరిత్ర, ముద్రారాక్షసం, ఆంధ్రరసగంగాధరం, లాంటి పఠనీయ గ్రంథాలకు పండితులచే అర్థ తాత్పర్యాలూ, విశేషాలూ వ్రాయించి అందించింది. సంస్కృతంలో బాగా వ్యాప్తిలోనికి వచ్చి తెలుగులో కావ్యాలుగా అవతరించిన గ్రంథాలు అనేకం. జిజ్ఞాసువులకు మూలంలోని ఆంతర్యాన్ని, అది వేసుకున్న తెలుగువేషాన్ని తెలుసుకొని తులనాత్మకంగా పరిశీలించవలసిన అగత్యం ఉంటుంది. ఉత్తమాధ్యయనానికి ఇది అత్యంతావశ్యకంకూడ.

ఈ ప్రణాళికను అనుసరించి నెల్లూరు వైదిక కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రిగారు శ్రీ హర్షుని నైషధానికి తెలుగు అర్థతాత్పర్యాలు సమకూర్చి అకాడమీకి అందించినారు. ఇంతవరకు శ్రీ హర్షనైషధం నాలుగు సంపుటాలుగా వచ్చింది. మొదటి సంపుటంలో 1, 2, 3 సర్గలకు రెండవ సంపుటంలో, 4, 5, 6 సర్గలకు మూడవ సంపుటంలో 7, 8, 9 సర్గలకు నాల్గవ సంపుటంలో 10, 11, 12 సర్గలకు లఘువ్యాఖ్యానం (మూలశ్లోకం, పదవిభజన, అర్థము, విశేషము, సమాసములు, భావము) ఉన్నది. ఇప్పుడు 13, 14, 15 సర్గలతో ఉన్న అయిదవ సంపుటాన్ని అందిస్తున్నాము. ఇక మిగిలిన సర్గలను త్వరలో పాఠకులు అందుకుంటారు.

శ్రీనాథుని శృంగారనైషధం వల్ల తెలుగు కవితా ప్రపంచం లో విశేష ప్రాచుర్యాన్ని పొందిన శ్రీహర్షుని నైషధం విద్వదౌష ధంగానూ, రసకోశంగానూ వాసికెక్కింది. శ్రీహర్షుని నైషధానికి చక్కని వ్యాఖ్యానం తెలుగులో వెలయించిన శ్రీ ఉదాలి సుబ్బ రామశాస్త్రిగారికి అకాడమి కృతజ్ఞతలను సమర్పించు కుంటున్నది.

హైదరాబాదు
తేది : 7-8-1982

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి



# శ్రీహర్ష నైషధము

## త్రయోదశః సర్గః

శ్లో॥ కల్పద్రుమాన్ పరిమలా ఇవ భృఙ్గమాలా
మాత్మాశ్రయాం నిఖిలనందన శాఖివృన్దాత్।
తాం రాజకాదపగమయ్య విమానధుర్యాః
నిన్యుర్నలాకృతి ధరానథ పఞ్చ వీరాన్. ॥1॥

ప॥వి॥ కల్పద్రుమాన్ - పరిమలాః - ఇవ - భృఙ్గ మాలామ్ - ఆత్మా శ్రయాం - నిఖిలనందన శాఖివృన్దాత్ - తాం - రాజకాత్ - అపగ మయ్య - విమానధుర్యాః - నిన్యుః - నలాకృతి ధరాన్ - అథ పఞ్చ - వీరాన్.

అర్థము॥ అథ = నలునిపైన, గటాక్షములుపడిన పిదప, విమానధుర్యాః = పల్లకిని మోయువారలు, ఆత్మాశ్రయాం; ఆత్మ = తామే, ఆశ్రయాం = ఆధారముగాఁగల్గిన, తాం = ఆదమయన్తిని, పరిమాలాః = నెత్తావులు, ఆత్మాశ్రయాం = తామేఆశ్రయముగాఁగల్గిన, భృఙ్గమాలాం = తుమ్మెదలశ్రేణిని, నిఖిల నన్దనశాఖివృన్దాత్; నిఖిల = సమస్తములైన, నన్దనశాఖి = కల్పవృక్షముల యొక్క, వృన్దాత్ = సమూహమునుండి, అపగమయ్య = తొలగించి, కల్పద్రుమానివ = అయిదుదేవతా వృక్షములనువలె, రాజకాత్ = నృపాలసమూహమునుండి, అపగమయ్య = తొలగించి, నలాకృతి ధరాన్; నల = నలునియొక్క, ఆకృతి = ఆకారమును, ధరాన్ = ధరించుచున్న, పఞ్చ = అయిదుగురైన, వీరాన్ = నలునితోఁ గూడిన, యింద్రాదులను, నిన్యుః = పొందించిరి.

## సమాసములు :

కల్పద్రుమాన్ :- కల్పాః ఇతిద్రుమాః=కల్పద్రుమాః, తాన్= కల్ప ద్రుమాన్.

భృఙ్గమాలామ్ :- భృఙ్గాణాం, మాలా=భృఙ్గమాలా, తామ్=భృఙ్గ మాలామ్.

ఆత్మాశ్రయాం :- ఆత్మానః, ఆశ్రయః, యస్యాస్సా=ఆత్మాశ్రయా, తామ్=ఆత్మాశ్రయామ్.

నిఖిల నందన శాఖి వృన్దాత్:- నందనస్య శాఖినః=నందనశాఖినః; నిఖిల నందన శాఖినాం వృన్దః=నిఖిల నందన శాఖి వృన్దః; తస్మాత్ = నిఖిల నన్దన శాఖి వృన్దాత్.

రాజకాత్ :- రాజ్ఞాం సమూహః = రాజకం, తస్మాత్=రాజకాత్.

విమానధుర్యాః:- ధురం వహన్తీతి = ధుర్యాః, విమానస్య ధుర్యాః = విమానధుర్యాః.

నలాకృతిధరాన్:- నలస్య ఆకృతయః = నలాకృతయః, నలాకృతీః ధరన్తీతి = నలాకృతిధరాః తాన్ = నలాకృతిధరాన్.

## భావము :

నలుని పై దమయంతి కటాక్షములు పడగనే పల్లకిని మోయువారలు తమపై నాసీనురాలగు దమయన్తిని; పరిమలములు తమపై వాలిన తుమ్మెదల వరుసను నందనవనమందలి వృక్షముల నుండి తొలగించి మందారపారిజాత - సన్తాన - కల్పవృక్ష - హరిచందనము లనెడి యైదు దేవతావృక్షముల కడకు గొనిపోవునట్లు రాజ సమూహముల నుండి తొలగించి నలాకృతిని ధరించి నలుడు మున్నగు నైదుగురు వీరుల కడకు గొనిపోయి రని యాశయము ॥౧॥

శ్లో॥ సాక్షాత్కృతాఖిల జగజ్జనతా చరిత్రా
తత్రాఽధి నాథ మధికృత్య దివ స్తథా సా।
ఊచే యథా స చ శచీపతి రభ్యధాయి
ప్రాకాశి తస్య న చ నైషధ కాయ మాయా. ॥2॥

ప॥ వి॥ సాక్షాత్కృతాఖిల జగజ్జనతా చరిత్రా - తత్ర- అధినాథమ్- అధి కృత్య- దివః - తథా — సా - ఊచే- యథా - సః - చ- శచీపతిః- అభ్యధాయి - ప్రాకాశి - తస్య - న - చ - నైషధ కాయ మాయా.

అర్థము :అథ = అయిదుగురు వీరుల కడకు గొనిపోయిన పిదప, సాక్షాత్కృతాఖిల జగజ్జనతా చరిత్రా = సాక్షాత్కృత = ప్రత్యక్షము గావించుకొనబడిన, అఖిల = సమస్తములైన, జగత్ = లోకములయొక్క, జనతా =జనసమూహముయొక్క, చరిత్రా=చరిత్ర గల్గిన, సా = ఆ సరస్వతీ దేవి, తత్ర = ఆ అయిదుగురు మధ్య, దివః=స్వర్గమునకు, అధినాథం =అధిపతి యగు నింద్రుని, అధికృత్య=చూపించి, తథా=ఆ విధముగా, ఊచే=పలికినది, యథా=ఏ విధముగా, స చ=ఆ శచీపతిః=యింద్రుడును, అభ్యధాయి=చెప్పబడునో, తస్య = ఆ యింద్రుని యొక్క, నైషధ కాయ మాయా;నైషధ= నలుని యొక్క, కాయ = శరీరము యొక్క మాయా = మాయ, న ప్రాకాశి = ప్రకాశితము గాదో, అట్లు చెప్పబడినది.

**సమాసములు :**

సాక్షాత్కృతాఖిల జగజ్జనతా చరిత్రా:- అఖిలాని చ తాని జగన్తి చ= అఖిల జగన్తి. జనానాం సమూహః = జనతా. అఖిల జగతాం జనతా= అఖిల జగజ్జనతా. అఖిల జగ జ్జనతాయాః చరిత్రం=అఖిల జగ జ్జనతా చరిత్రం. సాక్షాత్కృత మఖిల జగ జ్జనతా చరిత్రం, యయా సా = సాక్షాత్కృతాఖిల జగ జ్జనతా చరిత్రా.

శచీపతిః :- శచ్యాః పతిః = శచీపతిః.

నైషధ కాయ మాయా :- నిషధానాం రాజా = నైషధః.
కాయః=నైషధకాయః.నైషధ కాయస్య మాయా=నైషధ కా

**భావము :**

ఆ దమయన్తిని నలుడు మున్నగు నైదుగురు వీరుల కి
పిదప సకల ప్రపంచము నందలి ప్రజల చరిత్రమును సందర్శించు
దేవి, ఇంద్రుని జూపించి యాతడు ఇంద్రుడని తెలియునట్లును ఆ
చే వహించిన నలాకృతి బయట పడనట్లును పలికెను.

**శ్లో॥ బ్రూమః కిమస్య వరవర్ణిని వీరసేనో**
**ద్భూతిం ద్విషద్బల విజిత్వర పౌరుషస్య.**
**సేనాచరీ భవది భావన దానవారి**
**వాసేన యస్య జనితా సురభీరణశ్రీః.**

ప॥వి॥ బ్రూమః - కిమ్ - అస్య - వరవర్ణిని - వీరసేనో దూ
ద్విష ద్బల విజిత్వర పౌరుషస్య - సేనాచరీ భవది భావన
వాసేన - యస్య - జనితా సుర భీః - రణశ్రీః.

**అర్థము:** హే వరవర్ణిని ! = ఓ యుత్తమ మగు వనితా! ద్విష ద్బ
పౌరుషస్య=ద్విషత్=శత్రువైన, బల=బలుడను రాక్షసుని, విజిత్వర=
పౌరుషస్య=పౌరుషము గల్గిన, పక్షాన్తరమున-ద్విష ద్బల విజిత్వర
-ద్విషత్=శత్రువులయొక్క,బల=బలమును,విజిత్వర=జయించెడి,
పౌరుషము గల్గిన, అస్య=ఈ వరునియొక్క, వీర సేనో ద్భూతిం, వీర
లగు సేనల యొక్క, ఉద్భూతిం=ఉజ్జృమ్భణమును ననగా శౌర్యము
రించుటను, పక్షాంతరమున - వీరసేనో ద్భూతిం, వీరసేన = వీరసే
రాజు వలని, ఉద్భూతిం=ఉత్పత్తిని, కిం=ఏమని బ్రూమః=చెప్పుద
ఏ - వీరుని యొక్క, రణశ్రీః=యుద్ధలక్ష్మి, సేనాచారీ భవది భావన

వా సేన, సే నావరీ భవత్,=సేనవలె నాచరించు, ఇభానన దానవార్యోః=ఇభానన = గజాననుడగు వినాయకుని యొక్క యు, దానవార్యోః=రాక్షస శత్రువగు విష్ణువు యొక్క యు, వా సేన=వాసము చే, జనితా సురభీః; జనిత=ఉత్పత్తి గావింప బడిన, అసురభీః=రాక్షసులకు భయము కలదిగా (జాతా=ఏర్పడినది.) పక్షాంతరమున - సేనాచరీ భవది భానన దాన వారి వా సేన, సేనా=సేనయందు, చరీభవత్=సంచరించునవి గా, భవత్=ఉన్న, ఇభ=ఏనుగుల యొక్క, ఆనన= ముఖము అందు, దానవారి=మదోదకము యొక్క, వా సేన = నివాసము చే, సురభిః = పరిమళము గలది గా, జనితా=చేయబడినది.

## సమాసములు :

ఇంద్రపక్షమున:-వీరసేనో ద్యూతిం - వీరా చ సా సేనా చ=వీరసేనా, వీరసేనాయాః ఉద్యూతిః = వీరసేనో ద్యూతిః, తామ్ = వీరసేనో ద్యూతిం! నలపక్షమున - వీరసేనస్య ఉద్యూతిః = వీరసేనోద్యూతిః తామ్ = వీరసేనోద్యూతిమ్!

ద్విష ద్బల విజిత్వర పౌరుషస్య:- నలపక్షమున - ద్విషతాం, బలం= ద్విషద్బలం. ద్విషద్బలస్య విజిత్వరం = ద్విషద్బలవిజిత్వరం; పురుషస్య కర్మ=పౌరుషం, ద్విషద్బల విజిత్వరం పౌరుషం యస్య సః= ద్విషద్బల విజిత్వర పౌరుషః, తస్య = ద్విష ద్బల విజిత్వర పౌరుషస్య. పక్షాన్తరమున - ద్విషం శ్చా సౌ బలశ్చ = ద్విషద్బలః. ద్విషద్బలస్య విజిత్వరమ్ ఇత్యాదులు పూర్వము వలెనే.

సేనాచరీ భవది భానన దాన వారి వా సేన:- ఇంద్రపక్షమున - సేనేవ, ఆచరీభవన్తౌ = సేనాచరీ భవన్తౌ. ఇభస్య ఆననం యస్యసః=ఇభాననః. దానవానాం అరిః దానవారిః. ఇభాననశ్చ దానవారిశ్చ = ఇభానన దాన వారీ . సేనాచరీభవన్తౌ చ తౌ ఇభానన దాన వారీ చ = సేనాచరీ భవది భానన దాన వారీ. సేనాచరీ భవది భానన దాన వార్యాః వాసః = సేనాచరీ భవది భానన దాన వారి వాసః. తేన= సేనాచరీ భవది భానన

దాన వారి వాసేన. నలపక్షమున — సేనాయాం చరీ భవన్తః = సేనాచరీభవన్తః. సేనాచరీ భవన్తశ్చ తే ఇభాశ్చ = సేనాచరీ భవదిభాః — సేనాచరీ భవది భానామ్ ఆననాని = సేనాచరీభవది భాననాని. దానాత్ వారీణి=దానవారీణి. సేనాచరీ భవది భాననేమ దాన వారీణి=సేనాచరీభవది భాననదానవారీణి. సేనాచరీ భవదిభానన దానవారీణాం వాసః = సేనాచరీ భవది భానన దాన వారి వాసః. తేన = సేనాచరీ భవది భానన దాన వారి వాసేన.

జనితాసురభీః:- ఇంద్రపక్షమున - అసురాణాం భీః = అసురభీః; జనితా, అసురభీః యయా సా = జనితాసురభీః. నలపక్షమున — జనితా - సురభీః అని పదవిభాగము చేసి సురభిఃజనితాయని అన్వయించుకొనవలెను!

**భావము :**

ఇది మొదలు నాలుగు శ్లోకముల యందు లోకపాలురను నలుని జోడించి శ్లేషభంగి చే వర్ణించుచున్నాడు. స్త్రీలలో నుత్తమ శ్రేణికి జెందిన యో సుందరీ! ఇంద్రపక్షమున — శత్రువగు బలాసురుని జయించెడి పరాక్రమము గల యీ యింద్రునియొక్క వీరులగు సేనలపరాక్రమ విజృంభణము నేమని వర్ణింతుము. ఏల యనగా నీతని యుద్ధలక్ష్మి. సైనికులుగా నాచరించు వినాయక విష్ణువులీతని రథాగ్రము నధిష్ఠించుటచే రాక్షసులకు భయమును గల్గించుచున్నది. నల పక్షమున-శత్రుసేనల జయించునట్టి పరాక్రమము గల్గినట్టి ఈ నలునికి సంబంధించిన వీరసేనుని వలని యుద్భవమును, గూర్చి అనగా నలుని గూర్చియేమని వర్ణింతుము. ఏలయనగా ఈతని సేనయందు సంచరించు నేనుగుల ముఖముల యందలి మదోదకము ల వాసనచే నీతని యుద్ధలక్ష్మి పరిమళము గావింపబడినది.

శ్లో॥ శుభ్రాంశుహారగణహారిపయోధరాజ్క-
చుమ్బీన్ద్రచాపఖచితద్యుమణిప్రభాభిః.
అన్వాస్యతే సమితి చామరవాహినీభి
ర్యాత్రాసు చైష బహులాభరణార్చితాభిః. 8

ప॥వి॥ శుభ్రాంశు హారగణహారి పయోధరాజ్కచుమ్బీన్ద్రచాప ఖచిత ద్యుమణి ప్రభాభిః — అన్వాస్యతే — సమితి — చామరవాహినీభిః — యాత్రాసు — చ, — ఏషః — బహులాభరణార్చితాభిః.

అర్థము : ఇంద్రపక్షమున - ఏషః = ఈ యింద్రుడు; శుభ్రాంశు హారగణహారి పయోధరాజ్క చుమ్బీన్ద్రచాపఖచిత ద్యుమణిప్రభాభిః; శుభ్రాంశు= చంద్రుడును. హార = హరునికి సంబంధించిన, గణ = ప్రమథగణములును, హారి = హరుని పుత్రుడగు కుమారస్వామియు, పయోధరాజ్క= మేఘముల యొడిని, చుమ్బి = స్పృశించు, ఇంద్రచాప = ఇంద్రుని విల్లుచే, ఖచిత = మిశ్రములైన, ద్యుమణిప్రభాభిః; ద్యుమణి = సూర్యుని యొక్క, ప్రభాభిః = కాంతులుగలవియు, బహులాభరణార్చితాభిః- బహు = పెక్కులైన, లాభ = త్రిలోకవిజయములు మున్నగు లాభములు గల్గిన, రణ = యుద్ధములయందు, అర్చితాభిః = పూజింపబడిన. అమరవాహినీభిః = దేవసేనలచే, సమితి = యుద్ధమునందు, యుద్ధక్షేత్రమందని యర్థము, యాత్రాసు = యుద్ధయాత్రలయందును, అన్వాస్యతే = ఉపాసింపబడుచున్నాడు, అనుసరించబడుచున్నాడని యర్థము.
నలపక్షమున నర్థము :— ఏషః = ఈ నలుడు, శుభ్రాంశుహారగణహారిపయోధరాజ్కచుమ్బీన్ద్రచాపఖచితద్యుమణిప్రభాభిః; శుభ్రాంశు = స్వచ్ఛములైన కిరణములు గల, హారగణైః = ముత్తెపుసరముల సమూహముచే, హారి = మనోహరములగు, పయోధర = స్తనములయొక్క అజ్క = ఒడిని, చుమ్బి = స్పృశించు, ఇంద్రచాప = ఇంద్రధనుస్సుతో సమానమ్ముగ ప్రకాశించు ఆభరణములతో, ఖచిత =

మిళితములైన, ద్యుమణి = సూర్యుని యొక్క యనగా సూర్యకాంతమణి యొక్క కాంతులుగల, బహులాభరణార్చితాభిః; బహుల=పెక్కులైన, ఆభరణ = భూషణములచే, ఆర్చితాభిః = భూషింపబడిన, చామర వాహినీభిః = చామర ధారిణులచే, సమితి = సభయందు, యాత్రాసు చ = దేవతా మహోత్సవములయందును, అన్వాస్యతే = సేవింపబడు చున్నాడు,

## సమాసములు :

ఇంద్రపక్షమున:- శుభ్రాంశు హారగణ హారిపయోధరాజ్య చుమ్బిన్ధ్రిచాప ఖచితద్యుమణి ప్రభాభిః;

శుభ్రాః అంశవః యస్యసః=శుభ్రాంశుః. హరస్య ఇమే=హారాః. హారాశ్చ తే గణాశ్చ= హారగణాః, హరస్య అపత్యంపుమాన్=హారిః. శుభ్రాంశుశ్చ, హారగణాశ్చ, హారిశ్చ=శుభ్రాంశు హారగణహారయః, పయోధరస్య, అజ్యః=పయోధరాజ్యః. పయోధరాజ్యం చుమ్బతీతి=పయోధరాజ్యచుమ్బి. పయోధరాజ్యచుమ్బి చాసౌ చాపశ్చ=పయోధరాజ్య చుమ్బిచాపః, పయోధరాజ్య చుమ్బిచాపేన, ఖచితాః = పయోధరాజ్య చుమ్బిచాపఖచితాః, దివః మణిరివ=ద్యుమణిః. ద్యుమణేః ప్రభాః=ద్యుమణి ప్రభాః, శుభ్రాంశుహారగణ హారయశ్చ, పయోధరాజ్యచుమ్బిన్ధ్రిచాప ఖచితద్యుమణిప్రభాశ్చ, యాసు తాః=శుభ్రాంశుహారగణ హారిపయోధ రాజ్యచుమ్బిన్ధ్రిచాప ఖచితద్యుమణిప్రభాః, తాభిః=శుభ్రాంశు హారగణ హారిపయోధరాజ్యచుమ్బిన్ధ్రిచాప ఖచితద్యుమణి ప్రభాభిః.

అమరవాహినీభిః:- అమరాణాం, వాహిన్యః=అమరవాహిన్యః, తాభిః, అమరవాహినీభిః.

బహులాభరణార్చితాభిః:- బహుః, లాభః, యస్మిన్, సః=బహులాభః. బహులాభశ్చాసౌ రణశ్చ=బహులాభరణః బహులాభ [illegible] [illegible] బహులాభరణార్చితాః, తాభిః=బహులాభరణార్చితాభిః.

నలపక్షమున :- శుభ్రాంశుహారగణ హారిపయోధరాజ్కచుమ్బిన్ద్రచాప ఖచితద్యుమణిప్రభాభిః- శుభ్రాః అంశవః, యేషాం, తే=శుభ్రాంశవః, హారాణాం, గణాః=హారగణాః, శుభ్రాంశవశ్చ, తే హారగణాశ్చ= శుభ్రాంశు హారగణాః, హారిణశ్చ, తే, పయోధరాశ్చ=హారిపయోధరాః. హారిపయోధరాణాం, అజ్కః=హారిపయోధరాజ్కః. హారిపయోధ రాజ్కం చుమ్బన్తీతి=హారిపయోధ రాజ్కచుమ్బినః, శుభ్రాంశు హార గణైః, హారిపయోధరాజ్కచుమ్బినః=శుభ్రాంశు హారగణ హారిపయోధ రాజ్కచుమ్బినః. శుభ్రాంశు హారిగణహారిపయోధ రాజ్కచుమ్బినశ్చ తే, ఇన్ద్రచాపాశ్చ=శుభ్రాంశు హారగణ హారిపయోధ రాజ్కచుమ్బిన్ద్రచాపాః, శుభ్రాంశు హారగణహారిపయోధ రాజ్కచుమ్బిన్ద్రచాపైః, ఖచితాః = శుభ్రాంశుహారగణహారిపయోధ రాజ్కచుమ్బిన్ద్రచాప ఖచితాః. ద్యుమణేః, ప్రభాః=ద్యుమణిప్రభాః. పయోధరాజ్కచుమ్బిన్ద్ర చాపఖచితాః ద్యుమణి ప్రభాః యాసాం, తాః=శుభ్రాంశుహారగణహారి పయోధరాజ్కచుమ్బిన్ద్ర చాపఖచిత ద్యుమణిప్రభాః. తాభిః=శుభ్రాంశుహారగణ హారిపయోధ రాజ్కచుమ్బిన్ద్రచాపఖచితద్యుమణి ప్రభాభిః.

చామరవాహినీభిః- చామరాణాంవాహిన్యః = చామరవాహిన్యః, తాభిః చామరవాహినీ భిః.

బహులాభరణార్చి తాభిః- బహులాని, చ, తాని, ఆభరణాని,చ=బహు లాభరణాని, బహులాభరణైః, అర్చితాః=బహులాభరణార్చితాః, తాభి =బహులాభరణార్చి తాభిః!

## భావము :

ఇంద్రపక్షమున - ఈ వీరుడగు నింద్రుడు చంద్రునితోడను, శివునికి సంబంధించిన ప్రమథగణములతోడను శివుని పుత్రుడగు కుమారస్వామి తోడను గూడినవియును మేఘములను స్పృశించు నింద్రధనస్సుతో మిశ్రితములైన సూర్యకాంత మణులుగలవియును ముజ్జగముల విజయము మున్నగు పెక్కు లాభములతో గూడినవియు, యుద్ధమున పూజింపబడు నవియునగు దేవతాసేనలతో వెంబడింపబడుచున్నాడు.

నలపక్షమున :- ఈనలుడు కిరణములతో ప్రకాశించు ముత్తెములసర ములతోడను మనోహరములగు స్తనముల పైభాగములనంటనవియును ఇంద్రచాపముతో సమానములగు పెక్కురంగులుగల ఆభరణముల కాంతులతో లలితములైన సూర్యకాంతమణులతో గూడినవియును పెక్కులగు భూషణములతో నలంకరింపబడిన చామరముల వహించెడి పరిచారికలతో సభయందును దేవతామహోత్సవములయందును సేవింపబడుచున్నాడు ॥4॥

శ్లో॥ భూమీభృతః సపది జిష్ణుమపవ్యపాయం
జానీహి న త్వమఘవన్తమముం కథఞ్చిత్,
గుప్తం ఘటప్రతిభటస్తని బాహునేత్రం
నాలోకసేఽతిశయమద్భుతమేతదీయమ్ ॥ 5

ప॥వి॥ భూమీభృతః - సపది - జిష్ణుమ్ - అపవ్యపాయం - జానీహి - న - తు - అమఘవన్తమ్, (న - త్వమ్ - అఘవన్తమ్) అముం - కథంచిత్ గుప్తం - ఘటప్రతిభటస్తని - బాహునేత్రం - న - ఆలోకసే - అతిశయమ్ - అద్భుతమ్ - ఏతదీయమ్.

అర్థము : ఇంద్రపక్షమున :— ఘటప్రతిభటస్తని; ఘట = కుండలతో, ప్రతిభట=(సాదృశ్యమున) పోట్లాడెడి, స్తని=చనుదోయిగల దమయన్తీ అనగా కుండలతో సమానమైన చనుదోయిగల యోదమయన్తీ! సపది =యుద్ధమునందు, భూమిభృతః=పర్వతములను, జిష్ణుం=జయించునట్టి, అపవ్యపాయం=నిత్యము వజ్రమును హస్తమున గట్టిన, అముం=ఈ వీరుని కంథచిదపి=ఎట్లైనను, అమఘవన్తం=ఇంద్రునికంటె భిన్నమైన వానిని, నతుజానీహి=తెలియకుము. అనగా ఇతనినింద్రునిగనే తెలియుము. గుప్తం=నలరూపమును ధరించుటకై, నిగూహితం=దాచిబడిన, అతిశయం=లోకోత్తరమైన, ఏతదీయమ్=ఇతనికి సంబన్ధ

చిన, అద్భుతం =ఆశ్చర్యకరమైన, బాహునేత్రమ్=వేయి బాహువులను వేయి నేత్రములను, నపశ్యసి = చూడకయున్నావు.

నలపక్షమున : సపది=యుద్ధమునందు, భూమీభృతః=రాజులను, జిష్ణుం =జయించువాడును, అపవ్యపాయం=రణమునుండి పలాయనము జేయనివాడును నగు, అముం=ఈ, వీరం=వీరుడైన నలుని, త్వం=నీవు, కథఞ్చిదపి=ఎట్టినను, అఘవన్తం=పాపముగలవానినిగా, నజానీహి= తెలియకుము. గుప్తం=రక్షింపబడిన, తదీయం=ఈతనికి సంబంధించిన అతిశయం=లోకోత్తరమైన, అద్భుతం=ఆశ్చర్యమైన, బాహునేత్రం పెక్కుమందికి నాయకుడై యుండుటను అనగా రాజాధిరాజుగ నుండుటను, నాలోకసే (కిం) చూడకయున్నావాఏమి!

**సమాసములు :**

ఇంద్రపక్షమున : భూమీభృతః - భూమీం, బిభ్రతీతి=భూమీభృతః తాన్=భూమీభృతః.

అపవ్యపాయం;- పవేః అపాయః=పవ్యపాయః, అవిద్యమానః, పవ్యపాయఃయస్యసః=అపవ్యపాయః, తమ్=అపవ్యపాయమ్.

అమఘవన్తం ; న, మఘవాన్=అమఘవాన్, తం=అమఘవన్తమ్ .

ఘటప్రతిభటస్తని;- ఘటస్య, ప్రతిభటౌ, స్తనౌ, యస్యాస్సా= ఘటప్రతిభటస్తనీ. తస్యాస్సంబుద్ధిః= హే ఘటప్రతిభటస్తని !

బాహునేత్రమ్ - బాహవశ్చ, నేత్రాణిచ= బాహునేత్రమ్, తత్ =బాహునేత్రమ్ .

ఏతదీయమ్:- ఏతస్యఅయం = ఏతదీయః=తమ్ =ఏతదీయమ్ .

నలపక్షమున —భూమీభృతః; భూమింబిభ్రతీతి=భూమీభృతః, తాన్ = భూమీభృతః.

అపవ్యపాయం: అపగతః, వ్యపాయః యస్యసః = అపవ్యపాయః, తమ్ = అపవ్యపాయమ్.

అఘవన్తమ్; అఘః, అస్యఅస్తీతి = అఘవాన్, తమ్ = అఘవన్తమ్.

బాహునేత్రమ్ః బహూనాం, నేతా = బహునేతా, బహునేతుః, భావః = బాహునేత్రమ్, తత్ = బాహునేత్రమ్.

భావము :

ఇంద్రపక్షమున-కుండలను బోలిన చనుదోయిగల యోదమయస్త్రీ యుద్ధమునందు పర్వతములను జయించి వాని ఱెక్కలను తెగనరికినవాడును నెప్పుడు వజ్రాయుధమును వీడనివాడును నగు నీవీరునింద్రునిగా దెలిసికొనుము. కృతయుగమున పర్వతములకు ఱెక్కలుండినవి. అవి స్వేచ్ఛగా గగనమున సంచరించుచు జనపదములపై వాలుచు జనులకు కష్టముల కల్గించుచుండినవి. అప్పుడు ఇంద్రుడు తన వజ్రాయుధముతో వాని ఱెక్కలను దునిమి జనులను సంరక్షించెనను పూరాణగాథ ఇచటననుసంధేయము. కాని యింద్రుడు సహస్రాక్షుడుగదా! ఆ సహస్ర నేత్రములేమైనవనినచో. ఇంద్రుడు నలుని రూపమును దరించుటకై తన సహస్రనేత్రాదులను దాచుకొనెను. కాన నవి నీకు కానరాలేదని యాశయము ॥4॥

నలపక్షమున— యుద్ధమున రాజులను జయించినవాడును రణమునుండి పలాయనము చేయనివాడును నగు నీవీరుని నలునిగా తెలిసికొనుము, మఱియు ఇతడెట్టి పాపమును చేయనివాడుగా గ్రహింపుము. చెక్కు చెవరని యితని బహునాయకత్వమును అనగా రాజాధిరాజిత్వమును చూడుటలేదా? తప్పక చూచుచున్నావని ఆశయము ॥5॥

శ్లో॥ లేఖా నితమ్బని బలాదిసమృద్ధరాజ్య
ప్రాజ్యోపభోగ పిశునా దధతే సరాగమ్.
ఏతస్య పాణిచరణం తదనేన పత్యా
సార్ధం శచీవ హరిణాక్షురముద్వహస్వ. 6

ప|వి॥ లేఖాః - నితమ్బిని - బలాదిసమృద్ధ రాజ్య ప్రాజ్యోపభోగపిశునా - దధతే - సరాగమ్ - ఏతస్య - పాణిచరణం - తత్ - అనేన - పత్యా - సార్ధం - శచీ - ఇవ - హరిణా - ముదమ్ - ఉద్వ హస్వ.

అర్థము॥ ఇంద్రపక్షమున — హే నితమ్బిని! = ఓయుత్తమ కటి పశ్చాద్భాగము గల దమయన్తీ! బలాదిసమృద్ధరాజ్యప్రాజ్యోపభోగ పిశునాః :-బలాది = బలుడు మున్నగు రాక్షసులయొక్క, సమృద్ధ = సమృద్ధితోగూడిన, రాజ్య = రాజ్యములను, ప్రాజ్య = అధికముగా, ఉపభోగ = అనుభవించుటకు, పిశునాః = ఆసకొనువారలైన, లేఖాః = దేవతలు, ఏతస్య= యీ యింద్రునియొక్క, పాణిచరణ = హస్తములను, పాదములను, సరాగం = అనురాగముతోడ, దధతే = శిరముతో ధరించుచున్నారు. అనగా వందన మాచరించుచున్నారని యర్థము. తత్ = అందువలన, అసేన = ఈ, హరిణా = దేవేంద్రునిచే, పత్యాసార్ధం = భర్తతోడ, శచీవ = శచీదేవివలె, ముదం = సంతోషమును, ఉద్వహస్వ = వహింపుము. శచీదేవికి సపత్నివి కమ్మనియర్థము.

నలపక్షమున: సరాగం = ఎఱ్ఱతనముతోగూడిన, ఏతస్య = వీరుడైన ఈ నలునియొక్క, పాణిచరణం = హస్తములు పాదములు, బలాది సమృద్ధరాజ్య ప్రాజ్యోపభోగ పిశునాః; బలాది = "స్వామ్యమాత్యసుహృత్ కోశరాష్ట్ర దుర్గబలాదిచ రాజ్యాంగాని ప్రకృతయః" అనిచెప్పబడిన, స్వామి, మంత్రి, మిత్ర, కోశ, రాష్ట్ర - దుర్గ, బలములని చెప్పబడునట్టి యేడు రాజ్యాంగములతో, సమృద్ధ = నిండిన, రాజ్య = రాజ్యమును, ప్రాజ్య = అధికముగా, ఉపభోగ = అనుభవించుటకు, పిశునాః = సూచకములగు, లేఖాః = చక్ర, ధ్వజాది రేఖలను, దధతే = ధరించుచున్నవి. తత్ = అందువలన అనేన = ఈ వీరునిచే, పత్యా సార్ధం = భర్తతోడ, హరిణా = ఇంద్రునితో, శచీవ = శచీదేవివలె ముదం = సంతోషమును, ఉద్వహస్వ = వహింపుము.!

**సమాసములు :**

ఇంద్రపక్షమున:— బలాదిసమృద్ధ రాజ్యప్రాజ్యోపభోగ పిశునాః.

బలః ఆదిః యేషాంతే = బలాదయః. సమృద్ధాని చ తాని రాజ్యాని చ= సమృద్ధరాజ్యాని. బలాదీనాం, సమృద్ధరాజ్యాని=బలాదిసమృద్ధరాజ్యాని. ప్రాజ్యశ్చాసౌ, ఉపభోగశ్చ = ప్రాజ్యోపభోగః. బలాదిసమృద్ధరాజ్యానాం, ప్రాజ్యోపభోగః = బలాది సమృద్ధరాజ్య ప్రాజ్యోపభోగః, బలాది సమృద్ధరాజ్యప్రాజ్యోపభోగస్య, పిశునాః = బలాదిసమృద్ధరాజ్యప్రాజ్యోపభోగ పిశునాః.

సరాగమ్:- రాగేణ, సహితం, యథా, తథా = సరాగమ్!

పాణిచరణం:- పాణీచ, చరణౌచ = పాణిచరణం, తత్ = పాణి చరణం.

నలపక్షమున :— బలాదిసమృద్ధరాజ్యప్రాజ్యోప భోగపిశునాః :- బలం, ఆదిఃయేషాం, తాని = బలాదీని. బలాదీనిచ, తాని సమృద్ధరాజ్యానిచ= బలాదిసమృద్ధరాజ్యాని. బలాది సమృద్ధ రాజ్యానాం, ప్రాజ్యోపభోగః=సమృద్ధ బలాది సమృద్ధ రాజ్యప్రాజ్యోపభోగః, బలాదిసమృద్ధ రాజ్య ప్రాజ్యోపభోగస్య, పిశునాః = బలాది సమృద్ధ రాజ్యప్రాజ్యోప భోగపిశునాః.

సరాగమ్:- రాగేణ, సహితం, యథా, తథా = సరాగమ్.

**భావము ;**

ఇంద్రపక్షమున :— సుందరమైన కటిపశ్చాద్భాగము గల దమయన్తీ! బలుడు మున్నగు రాక్షసులయొక్క సమృద్ధి మంతములగు రాజ్యముల యనుభవమును జూచి యీర్ష్య వహించిన వేల్పులు ఈ యింద్రుని హస్తములను పాదములను ననురాగముచే శిరముతో వహించుచు వందనము లాచరించుచున్నారు. అందువలన నీ యింద్రునితోడ శచీదేవివలె సంతోషము ననుభవింపుము. అనగా

సీతని వివాహమాడి శచీదేవికి సపత్నివి కమ్మ ని భావము.

నలపక్షమున :— ఎట్టివైన యీ నలుని పాదములు బలము మున్నగు సప్తరాజ్యాంగముల (యుపభోగములకు) సూచకములగు చక్రధ్వజాది రేఖలను ధరించుచున్నవి. కాన భర్తయగు నింద్రునితో శచీదేవివలె నీ నలునితో సంతోషము ననుభవింపుము. 6

శ్లో॥ ఆకర్ణ్య తుల్యమఖిలాం సుదతీలగన్తీ
మాఖణ్డలేపి చ నలేఽపిచ వాచమేతాం.
రూపం సమాన ముభయత్ర విగాహమానా
శ్రోత్రాన్న నిర్ణయ మవాపదసౌ న నేత్రాత్. 7

ప॥వి॥ ఆకర్ణ్య - తుల్యమ్ - అఖిలామ్ - సుదతీ - లగన్తీం - ఆఖణ్డలే - అపి - చ - నలే - అపి - చ - వాచమ్ - ఏతామ్ - రూపం - సమానమ్ - ఉభయత్ర - విగాహమానా - శ్రోత్రాత్ - న - నిర్ణయమ్ - అవాపత్ - అసౌ - న - నేత్రాత్.

అర్థము : సుదతీ = సుందరములగు దంతములు గల, అసౌ = ఈదమయన్తి, ఆఖణ్డలేఽపిచ = ఇంద్రునియందును, నలేఽపి = నలునియందును, తుల్యం = సమానముగా, లగన్తీం =లగ్నమగుచున్న, ఏతాం = ఈ, అఖిలాం =సమగ్రమైన, వాచం = మాటను, ఆకర్ణ్య = విని, ఉభయత్ర = ఇంద్రునియందును, నలునియందును, సమానం = భేదములేని, రూపం = ఆకృతిని, విగాహమానా = ఎదుటచూచుచు ఆలోచించుచున్నదై. శ్రోత్రాత్ = కర్ణేంద్రియములనుండి, నిర్ణయం = నిశ్చయమును, న అవాపత్ = పొందలేదు. సరస్వతి చేసిన వర్ణన వ్యక్తిని ప్రత్యేకించి బోధింపనందువలన ఇతడు ఇంద్రుడా లేక నలుడా యను నిశ్చయమును బొందలేకపోయినది. నేత్రాత్ = చక్షురింద్రియముల నుండియు, నిర్ణయం = నిర్ధారణను, నాఽవాపత్ = పొందలేకపోయి

నది. ఇంద్ర నలు రిఱువురు సమానములగు నాకారములను గ
వలన వారిని జూచియు వ్యక్తి నిర్ణయమును బొందజాలక
యర్థము.

**భావము :**

దమయంతి సరస్వతీదేవిచెప్పెడుమాటలు ఇంద్రునికి నలునికి
యుండుటవలన నామాటలను విని ఇంద్రనలులలో నిద్దఱిని సమాన
ములను గాంచి యాలోచించుచు కర్ణేంద్రియమువలన నిశ్చయమునకు
పోయినది. అనగా సరస్వతీదేవి వచనములు ఉభయులకును సమా
నుండుటవలన నితడింద్రుడా? లేక నలుడా? యను నిశ్చయమునకు
పోయినది. ఇట్లు సరస్వతీ దేవి వచనములను విని యెట్లు నిర్ణయము
లక పోయినదో అట్లే వానిని చూచియు నిర్ణయమునకు రాజాలక
యాశయము

శ్లో॥ శక్రః కిమేష నిషధాధిపతి స్స వేతి
డోలాయమానమనసం పరిభావ్య భైమీమ్.
నిర్దిశ్య తత్ర పవనస్య సఖాయ మస్యాం
భూయోఽసృజద్భగవతీ వచసాం స్రజం

ప॥వి॥ శక్రః - కిమ్ - ఏషః - నిషధాధిపతిః - సః - వా - ఇతి
మానమనసం - పరిభావ్య - భైమీం - నిర్దిశ్య - తత్ర -
సఖాయమ్ - అస్యాం - భూయః - అసృజత్ - భగవతీ -
స్రజం - సా.

అర్థము : అథ = పిదప, సా = ఆ, భగవతీ = పూజ్యురాలగు స
భైమీం = దమయంతినిగూర్చి, ఏషః = ఈ వీరుడు, శ
ఇంద్రుడాయేమి?, సః = ఆ, నిషధాధిపతిఃవా = నిషధ

నలుడా యేమి?. ఇతి = అని, డోలాయమానమనసం = సందేహించు మనస్సు గల్గిన దానినిగా, పరిభావ్య = ఆలోచించి, తత్ర = ఆఅయిదుగురు వీరుల మధ్య, పవనస్య=వాయువునకు, సఖాయం = మిత్రుడైన అగ్నిని, నిర్దిశ్య = చూపి, అస్యాం = ఈదమయన్తి విషయమున, భూయః = మఱల, వచసాం = మాటలయొక్క, స్రజం = మాలను, అనగా పరమ్పరను, అసృజత్ = కల్పించెను, అనగా చెప్పెనని యర్థము.

**సమాసములు :**

నిషధాధిపతిః: నిషధానాం, అధిపతిః = నిషధాధిపతిః.

డోలాయమానమనసం: డోలేవ, అచరత్ = డోలాయమానం, డోలాయమానం, మనః, యస్యాస్సా = డోలాయమానమనాః, తాం = డోలాయమానమనసం.

**భావము :**

పై విధముగా నితడు ఇంద్రుడా? లేక నలుడా?యని సంశయించుచున్న దానినిగా దమయన్తిని గ్రహించి సరస్వతీదేవి మఱల దమయన్తితో అగ్నిదేవుని జూపి చెప్ప దొడగినది. 8

శ్లో॥ ఏష ప్రతాపనిధి రుద్గతిమాన్ సదాఽయం
కిం నామ నార్జితమనేన ధనఞ్జయేన.
హేమ ప్రభూత మధిగచ్ఛ కుచేరముష్మా
న్నాఽస్త్యేవ కస్య చ న భాస్వరరూపమన్యత్. 9

ప॥వి॥ ఏషః - ప్రతాపనిధిః - ఉద్గతిమాన్ - సదా - అయం - కిం - నామ - న - ఆర్జితమ్ - అనేన - ధనఞ్జయేన - హేమ - ప్రభూతమ్ - అధి

గచ్ఛ - శుచేః, అముష్మాత్ - న - అస్తి - ఏవ - కస్యచన - భాస్వ
రూపమ్ - అన్యత్.

అర్థము :— అగ్నిపక్షమున — ఏషః = ఈ వీరుడు, ప్రతాపనిధిః =
స్సునకు నిధి. అయం = ఇతడు, సదా = ఎల్లప్పుడు, ఉద్గతిమాన్
ఊర్ధ్వభాగమునకు వ్యాపించెడి జ్వాలలు గలవాడు. ధనఞ్జయేన; ధన
విచిత్రములగు వస్తువులను సంపాదించెడి ధనఞ్జయుడను పేరుగల అర్జు
డైన యని యర్థము. అనేన = ఇతనిచే, కింనామ = ఏది, నార్జితః
సంపాదింపబడలేదు, ఖాండవవనమును దహించు కాలమున సంతోషిం
అగ్నిదేవునుండి రథము తఱుగని బాణములు గల యమ్ముల పొది గా
వము మున్నగువానిని సంపాదించి యర్జునుడు సమస్తమును సంపాది
నని యర్థము, కొందఱు = ధనఞ్జయేన = అగ్నియైన, అనేన = ఇ
నిచే, కింనామ = ఏపేరును అనగా "అగ్ని" వైశ్వానరము "వహ్ని
మున్నగు పేర్లలో దేనిని, నాఽర్జితం = పొందబడలేదు. హేమ
బంగారు, శుచేః = శుచియను పేరుగల, అముష్మాత్ = ఈయగ్నిను
ప్రభూతం = ఉద్భవించినదని, విద్ధి = తెలిసికొనుము. భాస్వరరు
సంపత్; భాస్వరరూప = ఇతరరూపములను ప్రకాశపఱచు స్వరు
మనెడి, సంపత్ = సంపద, కస్యచన = ఇతనికంటె నితరమైనః
కొక్కనికిని, నాస్త్యేవ = ఏ విధముగను లేదు.

నలపక్షమున :— ఏషః = ఈ నలుడు, ప్రతాపనిధిః; ప్రతాప
బొక్కసము, సైన్యము, అను వీనివలన కల్గిన తేజస్సునకు, నిధిః
నిధి. అయం = ఈ నలుడు, సదా = ఎల్లప్పుడును, ఉద్గతిమాన్
ఉదయము గలవాడు అనగా, అభ్యుదయము కలవాడు. అనేన = ఇ
నిచే, జయేన = జయమనెడి సాధనముతో, కింనామధనం = ఏమిధనమ
నార్జితం = సంసాదింపబడలేదు. జయముచేతనే యిన్నిటిని సంపాది
నని యర్థము. శుచేః = పవిత్రుడైన, అముష్మాత్ = ఈ నలునినుం
ప్రభూతం = అధికమైన, హేమ = బంగారును, అధిగచ్ఛ = పొందుమ

భాస్వరరూపసమ్పత్: భా = కాంతియు, స్వర = కణ్ఠస్వరము, రూప= సౌందర్యము అను వీనియొక్క, సంపత్ = సంపద, కస్యచన = ఇతని కంటె నితరునకెవ్వనికిని, నాస్త్యేవ = ఏ విధముగను లేదు.

**సమాసములు :**

ప్రతాపనిధిః :— ప్రతాపస్య, నిధిః = ప్రతాపనిధిః.

ఉద్గతిమాన్ :—ఊర్ధ్వం, గతిః, అస్యఅస్తీతి = ఉద్గతిమాన్.

ధనఞ్జయేన :— ధనాని, జయతీతి = ధనఞ్జయః, తేన = ధనఞ్జయేన.

భాస్వరరూపసమ్పత్ :— భాస్వరం చ తత్ రూపంచ = భాస్వర రూపం, భాస్వరరూపస్య, సంపత్ = భాస్వరరూపసంపత్. పక్షాన్తర మున భాశ్చ, స్వరశ్చ రూపంచ=భాస్వరరూపాణి, భాస్వరరూపాణాం, సమ్పత్ = భాస్వరరూపసంపత్.

**భావము :**

(అగ్నిపక్షమున) ఈయగ్ని తేజస్సునకు నిధి. పైకి వ్యాపించు జ్వాలలు గలవాడు. విచిత్ర వస్తువులను సంపాదించుటవలన ధనఞ్జయుడను పేరు వహిం చిన యర్జునుడు. ఇతడు దేనిని సంపాదించలేదు? ఖాండవవన దహనకాలమున సంతోషించిన యగ్ని దేవుడు, రథమును తఱుగని యమ్ముల పొదిని, గాండీవా దుల నొసంగెనని, దానిచే, అర్జునుడు జయమంది యన్నిటిని సంపాదించెను. లేదా ఈ యగ్ని - వైశ్వానర, వహ్ని, వీతిహోత్రాది నామధేయములలో దేనిని సంపాదించలేదు. పెక్కు నామములను సంపాదించెనని యర్థము. శుచియను పేరుగల ఈ అగ్నినుండి బంగారు ఉద్భవించినదని తెలియును. ఏలయనగా "అగ్నేరపత్యం సువర్ణ" మని స్మృతి చెప్పుచున్నది. ఇతర వస్తువులను ప్రకాశ పఱచునట్టి స్వరూపసంపద యీయగ్నిదేవునకొక్కనికే గలదు. ఇతరులకు లేదు

నలపక్షమున - ఈ నలుడెల్లప్పుడు నభ్యుదయము పొందువాడు. ఇతడు జయముచేత ధనమునన్నింటిని నార్జించెను. "క్షత్రియస్య విజితమ్" అను స్మృతి నను సరించి క్షత్రియుడు జయము చేతనే సంపాదింపవలయును. పవిత్రుడైన ఈ

నలునినుండి అధికమగు బంగారును సంపాదింపుము. కాంతియు, కంఠధ్వనియు, సౌందర్యము, అను వీని సంపద యితరునకెవ్వనికిని లేదు. 9

శ్లో॥ అత్యర్థహేతి పటుతా కబలీ భవత్తత్
తత్పార్థివాధికరణ ప్రభవస్య భూతిః.
అప్యఙ్గరాగ జననాయ మహేశ్వరస్య
సఞ్జాయతే రుచిరకర్ణి తపస్వినేఽపి. 11

ప॥వి॥ అత్యర్థహేతి పటుతాకబలీ భవత్ తత్ తత్పార్థివాధికరణ ప్రభవస్య - భూతిః - అప్యఙ్గరాగజననాయ - మహేశ్వరస్య - సఞ్జాయతే - రుచిరకర్ణి! తపస్వినే - అపి.

అర్థము : (అగ్నిపక్షమున) హేరుచిరకర్ణి = అందములగు చెవులుగలయో దమయంతీ! అత్యర్థహేతిపటుతాకబలీ భవత్తత్ తత్పార్థివాధికరణప్రభవస్య; అత్యర్థ = అధికమైన, హేతి పటుతా = జ్వాలలయొక్క గట్టితనముచేత, కబలీభవత్ = కబళముగానైన, తత్తత్ — ఆయా, పార్థివ = గడ్డి, కట్టెలు మున్నగు పృథివీ జన్యము లగువస్తువులనే, అధికరణ = ఆలంబనములను, ప్రభవస్య = కారణముగా గల్గిన అగ్నియొక్క, భూతిరపి = భస్మము గూడ, తపస్వినోఽపి = తాపసుడైనట్టి, మహేశ్వరస్య = శివునికిని, అంగరాగజననాయ = మైపూతనుగల్గించుట కొఱకు, సఞ్జాయతే = సాధనమగుచున్నది.

నలపక్షమున :- అత్యర్థహేతిపటుతా కబలీ భవత్ తద్ తత్పార్థివాధికరణప్రభవస్య = అత్యర్థ = అధికమైన, హేతిపటుతా = ఆయుధముల శక్తికి, కబలీభవత్ = బలియగుచున్న, తత్తత్ = ఆయా, పార్థివ = రాజులతో, అధికరణ = అధికమైన యుద్ధములే, ప్రభవస్య = కారణముగా గల్గిన, అస్య = ఈ నలునియొక్క, భూతిః = సంపద, మహేశ్వరస్య = గొప్పయైశ్వర్యము గల్గిన, తపస్వినోఽపి = తాపసునికి ననగా

విరక్తునకు గూడ, రాగజననాయ = అభిలాషను గల్గించుట కొఱకు, భవతి = సాధన మగుచున్నది. హే అంగ = అనిసంబోధనం.

**సమాసములు :**

అత్యర్థ హేతిపటుతాకబలీ భవత్తత్ తత్పార్థి వాధికరణ ప్రభవస్య:— హేతినాం, పటుతా = హేతిపటుతా, అత్యర్థాచసా, హేతిపటుతాచ = అత్యర్థహేతిపటుతా. అత్యర్థహేతిపటుతయా, కబలీభవత్=అత్యర్థహేతి పటుతా కబలీభవత్. అత్యర్థహేతిపటుతా కబలీభవచ్చ, తత్, తత్తత్ పార్థివంచ=అత్యర్థహేతిపటుతా కబలీ భవత్ తత్తత్ పార్థివం. అత్యర్థ హేతిపటుతా కబలీ భవత్ తత్తత్ పార్థివమేవ, అధికరణం = అత్యర్థ హేతిపటుతా కబలీ భవత్ తత్తత్ పార్థివాధికరణమ్. తదేవ ప్రభవః, యస్యసః = అత్యర్థహేతిపటుతా కబలీ భవత్ తత్తత్పార్థివాధికరణ ప్రభవః, తస్య = అత్యర్థహేతి పటుతా కబలీ భవత్ తత్తత్పార్థివాధి కరణ ప్రభవస్య. పక్షాంతరమున -

అత్యర్థహేతి పటుతా కబలీ భవత్ తత్తత్పార్థివాధి కరణ ప్రభవస్య:- హేతీనాం పటుతా = హేతిపటుతా. అత్యర్థం, హేతిపటుతా = అత్యర్థ హేతిపటుతా, అత్యర్థ హేతిపటుతాయాః, కబలీభవన్తః = అత్యర్థహే తిపటుతా కబలీ భవన్తః. అత్యర్థహేతికబలీ భవన్తశ్చ తే, తే, తే, పార్థివాశ్చ = అత్యర్థహేతిపటుతాకబలీ భవత్ తత్తత్పార్థివాః. అత్యర్థ హేతిపటుతాకబలీ భవత్ తత్తత్పార్థివైః, అధికః, రణః = అత్యర్థ హేతిపటుతాకబలీ భవత్ తత్తత్పార్థివాధి కరణః. సః ప్రభవః, యస్యసః = అత్యర్థహేతిపటుతాకబలీ భవత్ తత్తత్పార్థి వాధికరణ ప్రభవః:-

అంగరాగజననాయ:- అంగస్య, రాగః = అంగరాగః, అంగరాగస్య జననమ్ = అంగరాగజననం. తస్మై = అంగరాగజననాయ:

రాగజననాయ:- రాగస్య, జననమ్ = రాగజననమ్, తస్మై = రాగజననాయ:-

రుచిరకర్ణి:- రుచిరౌ, కర్ణౌ, యస్యాసా = రుచిరకర్ణీ, తస్యాస్సం బుద్ధిః = రుచిరకర్ణి!

భావము :

(అగ్నిపక్షమున) ఓ సుందరకర్ణీ! అధికమైన జ్వాలల గట్టితనముచే ఇంధనముగానైన పృథివియందు ద్రవించిన గడ్డికట్టెలు మున్నగునాశ్రయములయందు జన్మించిన అగ్నికి సంబంధించిన బూడిద, పరమశివునికి మైపూతగానున్నది ॥10॥

నలపక్షమున:- ఓ దమయన్తీ! అధికమైన ఆయుధముల గట్టితనమునకు నాహుతులగుచున్న రాజులతోటి యుద్ధమునకు కారణముగా గల్గిన యానలుని విజయలబ్ధమగు నైశ్వర్యము గొప్ప యైశ్వర్యము గల్గి విరక్తుడైన తాపసునకు నభిలాషను గల్గించునుకాన నీవు తప్పక యభిలాషను గల్గించగలవని ఆశయము. ॥10॥

శ్లో॥ ఏతన్ముఖా విబుధ సంసద సావశేషా
మాధ్యస్థ్య మస్య యమతోఽపి మహేన్ద్రితోఽపి।
ఏనంమహాస్వీన ముపైహి సదారుణోచ్చై
ర్యేనాఽమునా పితృముఖి! ధ్రియతే కరశ్రీః. 11

ప-వి॥ ఏతన్ముఖా - విబుధసంసత్ - అసౌ - అశేషా - మాధ్యస్థ్యమ్ - అస్య - యమతః - అపి - మహేన్ద్రితః - అపి - ఏనం - మహస్వినం - ఉపైహి - సదారుణా - ఉచ్చైః - యేన - అమునా - పితృముఖి - ధ్రియతే - కరశ్రీః.

అర్థము :-(అగ్ని పక్షమున) పితృముఖి = తండ్రి ముఖము వంటి ముఖము గల యోదమయన్తీ! "ధన్యాపితృముఖీకన్యా, ధన్యోమాతృముఖః సుతః" అని సాముద్రిక శాస్త్రము ననుసరించి తండ్రి మోము గల్గిన పుత్రిక ధన్యురాలని యర్థము. అశేషా = సమస్తమైన, అసౌ = ఈ విబుధసంసత్ = దేవతల పరిషత్తు, ఏతన్ముఖా = ఈ అగ్నినే ముఖముగా గలది, ఏలయనగా "అగ్నిముఖావైదేవాః" అని స్మృతి చెప్పుచున్నది. అస్య = ఈ అగ్నికి, యమతః = యమునికంటెను,

మహేన్ద్రతోఽపి = ఇంద్రునికంటెను, మాధ్యస్థం = మధ్యస్థానము నందుండుట అనగా మధ్యదిక్కైన ఆగ్నేయము నందునికి యుండుట ప్రసిద్ధము. మహస్వినం = తేజోవంతుడైన, ఏనం = వీనిని, ఉపైహి = పొందుము, సదారుణా = కట్టెతో గూడిన, యేన = ఏ, అమునా = ఈ యగ్నిచే, ఉచ్చైః = గొప్పదైన, కరశ్రీః = కిరణసంపద, ధ్రియతే = ధరింపబడుచున్నది.

నలపక్షమున :- అశేషా = సమస్తమైన, అసౌ = ఈ, విబుధసంసత్ = పండితసభ, ఏతన్ముఖా = ఈ నలుని ప్రధానముగా గల్గినది. తథా = అట్లే, అస్య = ఈ నలునకు, యమతః = యమునినుండియు, మహేన్ద్రతోఽపి = ఇంద్రునుండియు, మాధ్యస్థ్యమ్ = తాటస్థ్యము శత్రువునకు మిత్రునకును సమాన దండము నిచ్చుటవలన పక్షపాతము లేక సమదర్శిత్వమేర్పడినది. మహస్వినం = తేజోవంతుడును నగు ఏనం = వీనిని, ఉపైహి = పొందుము. సదా = ఎల్లప్పుడు, యేన = ఏ, అమునా = ఈ నలునిచే, అరుణా = అరుణ వర్ణము గల్గిన, ఉచ్చైః = అధికమైన, కరశ్రీః = హస్తశోభ, ధ్రియతే = ధరింపబడుచున్నది.

## సమాసములు

ఏతన్ముఖా :- ఏషః, ముఖం యస్యాః సా = ఏతన్ముఖా.

విబుధసంసత్ :- విబుధానాం, సంసత్ = విబుధసంసత్.

మాధ్యస్థ్యమ్ :- మధ్యే, తిష్ఠతీతి = మధ్యస్థః, మధ్యస్థస్య భావః = మాధ్యస్థ్యమ్, తత్ = మాధ్యస్థ్యమ్.

సదారుణా :- దారుణా, సహవర్తత ఇతి = సదారు, తేన = సదారుణా.

పితృముఖి :- పితుర్ముఖమివ ముఖం యస్యాః సా = పితృముఖీ తస్యాః సంబుద్ధిః = హే పితృముఖి.

కరశ్రీః :- కరస్య, శ్రీః = కరశ్రీః.

**భావము**

(అగ్ని పక్షమున) తంద్రి మోము వంటి మోము గల్గినందువలన నదృష్టవంతురాలైన దమయంతీ! సమస్తమైన యీ దేవసభకు అగ్ని ముఖమువంటివాడు. కావుననే "అగ్నిముఖా వై దేవాః"యని శ్రుతిగలదు. ఈ యగ్ని యమునికిని మహేంద్రునకును మధ్యనున్నాడు తేజోవంతుడైన యీ యగ్నిని బొందుము. కట్టెలతో గూడిన యీయగ్ని గొప్ప కిరణ సంపదను వహించును.

నలపక్షమున :- సమస్తమైన పండితసభకు నలుడు ప్రధానుడు. ఈ నలుడు యమునుండియు నింద్రునుండియు తటస్థవైఖరి నవలంబించును. అనగా శత్రుమిత్రుల యందట నిష్పక్షపాతముగ సమదర్శియై యుండును. పరాక్రమవంతుడును. ఉత్సాహవంతుడునగు వీనిని బొందుము. ఇతడెల్లప్పుడును నరుణ కాంతిని వహించిన హస్తములను గల్గినవాడు. 11

శ్లో॥ నైవాల్పమేధసి పటో రుచిమత్త్వమస్య
మధ్యేసమిన్నివసతో రిపవ స్తృణాని.
ఉత్థానవానిహ పరాభవితుం తరస్వీ
శక్యః పునర్భవతి కేన విరోధినాఽయమ్. 12

ప॥వి॥ న - ఏవ - అల్పమేధసి - పటోః - రుచిరమత్త్వమ్ - అస్య-మధ్యేసమిత్ - నివసతః - రిపవః - తృణాని - ఉత్థానవాన్ - ఇహ - పరాభవితుం - తరస్వి - శక్యః - పునః - భవతి - కేన - విరోధినా - అయమ్.

అర్థము :— పటోః = సమర్థుడైన, అస్య = వీరుడైన యగ్నికి, ఏధసి = ఇంధనమందు, రుచిమత్త్వం = దహింపనాశను కల్గియుండుట లేదా, దీప్తితో గూడియుండుట, అల్పా నైవ=అల్పము కాదు. మధ్యేసమిత్ = సమిధల మధ్య, తృణాని = గడ్డిపోచలు, రిపవఃకిమ్ = శత్రువులా యేమి? కట్టెలను గాల్చువానికి గడ్డి పోచలను కాల్చుట లెక్కయేమి?

ఉత్థానవాన్ = ఊర్ధ్వగతి గల్గిన, తరస్వీ = వేగము గల్గిన, అయం = ఈ యగ్ని, ఇహ = ఈ సృష్టియందు, విరోధినా = విరోధియైన, కేన = ఉదకముచే, పరాభవితుం = తిరస్కరించుటకు, శక్యోభవతి = శక్యుఁ డగుచున్నాఁడా యేమి? శక్యుఁడు గాదని యర్థము. దేవత్వముగల యితనినిఁ జల్లార్ప సాధ్యము గాదు.

నలపక్షమున :— పటోః = సమర్థుడైన, అనగా వక్తయైన, అస్య = ఈ నలునికి, అల్పమేధసి = అల్పమైన ప్రజ్ఞ కలవానియందు, రుచిమత్త్వం = అభిలాష గల్గియుండుట, అనగా నాదరము, నైవ = లేదు, మధ్యేసమిత్ = యుద్ధమధ్యమున, నివసతః = ఉన్నట్టి, అస్య = ఇతనికి, రిపవః = శత్రువులు, తృణాని = గడ్డిపోచలు, ఉత్థానవాన్ = ఉద్యమశీలుడును, తరస్వీ = శూరుఁడునునగు, అయంపునః = ఈ నలుఁడో, కేన = ఏ, విరోధినా = శత్రువుచే, పరాభవితుం = పరాభవించుటకు, శక్యఃభవతి = శక్యుఁడగుచున్నాఁడు.

**భావము :**

(అగ్నిపక్షమున) దాహసమర్థుడైన యీ యగ్నికి నింధనమందు ననగా కట్టెలయందు దాహాభిలాష, లేదా, ప్రకాశశీలత్వము మిక్కుటము. కట్టెలమధ్య నివసించు నీ యగ్నికి గడ్డిపోచలు శత్రువులా యేమి? కట్టెలనే కాల్చువానికి గడ్డిపోచలను కాల్చుట లెక్కయేమున్నది. ఊర్ధ్వగతిని, వేగమును, వహించిన యీయగ్ని సృష్టియందు విరోధియైన నీటిచే నెట్లు చల్లార్పబడును. దేవాంశసంభూతుడగు నీయగ్ని చల్లార్పసాధ్యుఁడు గాదని యర్థము. 12

నలపక్షమున :— మంచి వాగ్మిత్వము గల యీ నలునకు మందబుద్ధి యందు నాదరము లేదు. యుద్ధమధ్యము నందున్న యీ నలునకు శత్రువులు గడ్డిపోచలు పౌరుష సంపన్నుఁడును, శూరుఁడునగు నీనలుని విరోధి యెవ్వఁడు తిరస్కరింపగలఁడు? ఎవ్వఁడును తిరస్కరింపఁజాలఁడని యర్థము. 12

సమాసములు :

అల్పమేధసి :— అల్పా, మేధా, యస్యసః = అల్పమేధాః, తస్మిన్= అల్పమేధసి.

రుచిమత్త్వమ్ :— రుచిః, అస్యఅస్తీతి=రుచిమాన్, రుచిమాతో, భావః =రుచిమత్త్వమ్.

మధ్యేసమిత్ :— సమితః, మధ్యే = మధ్యేసమిత్.

ఉత్థానవాన్ :— ఉత్థానమస్యాఽస్తీతి = ఉత్థానవాన్.

తరస్వీ :— తరః, అస్యాస్తీతి =తరస్వీ.

శ్లో॥ సాధారణీం గిరముషర్బుధనైషధాభ్యా
మేతాం నిపీయ న విశేషమవాప్తవత్యాః.
ఊచే నలోఽయమితి తం ప్రతిచిత్తమేకం
బ్రూతేస్మచాన్యదనలోఽయమితీదమీయమ్. 13

ప॥వి॥ సాధారణీం - గిరమ్ - ఉషర్బుధనైషధాభ్యాం - ఏతాం - నిపీయ - న - విశేషమ్ - అవాప్తవత్యాః - ఊచే - నలః - అయమ్ - ఇతి - తం - ప్రతి - చిత్తమ్ - ఏకం - బ్రూతే - స్మ - చ - అన్యత్ - అనలః - అయమ్ - ఇతి - ఇదమీయమ్.

అర్థము : ఉషర్బుధనైషధాభ్యాం, ఉషర్బుధ - అగ్నియు, నైషధాభ్యాం = నలుడును నను నీయిఉవురితో, సాధారణీం = సమానమైన, ఏతాం = ఈ, గిరం = మాటను, నిపీయ = విని, విశేషము = అగ్నికిని, నలునకును భేదమును తెలుపునట్టి ధర్మమును, నాఽవాప్తవత్యాః = పొందనటువంటి, భైమ్యాః = దమయన్తియొక్క, ఏకం = ఒక, చిత్తం = మనస్సు, తంప్రతి = ముందున్నవానిని గూర్చి, అయం = ఇతడు, నలః = నలుడు, ఇతి = అని, ఊచే = చెప్పినది. ఇదమీయ్యం = ఈ దమయన్తికి సంబంధించిన, అన్యత్ = మఱియొక్క, చిత్తం=

బుద్ధి, అయం = ఈ ముందున్న పురుషుడు, అనలఇతి = అగ్నియని-బ్రూతేస్మ = చెప్పుచుండినది. అనల, నల విషయక కోటిద్వయముచే నేర్పడిన సంశయము తీరలేదు.

సమానములు :

ఉషర్బుధనైషధాభ్యాం:- ఉషసి, బుధ్యత ఇతి = ఉషర్బుధః, నిషధానాం, రాజా = నైషధః, ఉషర్బుధశ్చ, నైషధశ్చ = ఉషర్బుధ నైషధౌ, తాభ్యాం = ఉషర్బుధ నైషధాభ్యాం.

ఇదమీయమ్ :- అస్యాః, ఇదమ్ = ఇదమీయమ్.

భావము :

అగ్నికిని, నలునికిని సమానమైన యీసరస్వతిదేవి యొక్క వచనములను విని వారిఱువురికిని భేదముఁదెల్పెడి ధర్మము నరయజాలక దమయన్తి యొక్క యొకమనస్సు అనగా బుద్ధి ముందున్న పురుషుని నలుడని చెప్పినది. ఆమెయొక్క మఱియొక బుద్ధి ముందున్న పురుషుడగ్నియని చెప్పినది. ఇట్లు అనలుడా? నలుడా? యను సందేహముచే నామెమనస్సు డోలాయమానముగా నుండినదని భావము. 13

శ్లో॥ ఏతాదృశీ మథ విలోక్య సరస్వతీ తాం
సందేహచిత్రభయచిత్రితచిత్తవృత్తిమ్।
దేవస్యసూనుమరవిన్దవికాసిరశ్మే
రుద్దిశ్య దిక్పతిముదీరయితుం ప్రచక్రే. 14

ప॥వి॥ ఏతాదృశీమ్ - అథ - విలోక్య - సరస్వతీ - తాం - సందేహచిత్రభయ చిత్రితచిత్తవృత్తిమ్ - దేవస్య - సూనుమ్ - అరవిందవికాసిరశ్మేః - ఉద్దిశ్య - దిక్పతిమ్ - ఉదీరయితుం - ప్రచక్రే.

అర్థము :- అథ = పిదప, సరస్వతీ=సరస్వతీ దేవి, తాం = ఆ దమయన్తిని, ఏతాదృశీం = ఇట్టి, సందేహచిత్రభయచిత్రితచిత్తవృత్తిమ్; సందేహ = అనలుడా నలుడాయను సందేహము, చిత్ర = వారిద్దఱికి నొక్కయాకారమే యుండుటవలన ఆశ్చర్యము, భయ = నలునిప్రాప్తి లేనందువలన భీతియను నీ భావములచే, చిత్రిత = ఆశ్చర్యము పొందింపబడిన, చిత్తవృత్తిమ్ = మనోవృత్తిగలదానినిగా, విలోక్య = చూచి, అరవిందవికాసిరశ్మేః = తామరపూవులను వికసింప జేయు కిరణములుగల, దేవస్య = సూర్య భగవన్తుని యొక్క, సూనుం = కుమారుడైన, దిక్పతిం = దిక్పాలుడైన యముని గూర్చి, ఉదీరయితుం = చెప్పుటకు, ప్రచక్రే = ప్రారంభించెను.

## సమాసములు:

సందేహచిత్ర భయచిత్రిత చిత్తవృత్తిమ్ :- సందేహశ్చ, చిత్రంచ, భయంచ = సందేహచిత్రభయాని సందేహచిత్రభయైః, చిత్రితా = సందేహచిత్రభయచిత్రితా. సందేహచిత్ర భయచిత్రితా, చిత్తవృత్తిః, యస్యాఃసా = సందేహ చిత్రభయచిత్రిత చిత్తవృత్తిః, తాం=సందేహ చిత్రభయ చిత్రితచిత్త వృత్తిమ్.

అరవిందవికాసిరశ్మేః - అరవిన్దం వికాసయన్తీతి = అరవింద వికాసినః. అరవిందవికాసినః, రశ్మయః, యస్యసః =అరవిందవికాసిరశ్మిః, తస్య = అరవింద వికాసిరశ్మేః.

దిక్పతిమ్ :-దిశఃపతిః = దిక్పతిః, తమ్=దిక్పతిమ్.

## భావము:

తర్వాత సరస్వతీదేవి ఆ దమయన్తిని సందేహముతోడను, ఆశ్చర్యముతోడను, భయముతోడను విస్మయమందిన మనోవృత్తి గలదానినిగా గ్రహించినది. ఎదుటనున్న వ్యక్తి నలుడాలేక అనలుడాయని సందేహము, నలుడును, యముడును నొక్కవేషముగనే యుండుటవలన నాశ్చర్యము, నలుడు కానట్లైన

పోవుటవలన భయము వీనినన్నిండితోడను నాశ్చర్యమును (జెందిన మనోవృత్తి కలదాయెను. అట్టి మనోవృత్తి గల్గిన యాదమయన్తిని నాసరస్వతీదేవి గ్రహించి తామరపూలను వికసింపజేయునట్టి సూర్యుని పుత్రుడగు యమునిగూర్చి చెప్ప దొడగినది. 14

శ్లో॥ దండంబిభర్త్యయ మహో జగతస్తతః స్యాత్,
కమ్రాకులస్య సకలస్య న పఙ్కపాతః.
స్వర్వైద్యయోరపి మదవ్యయ దాయినీభి
శ్చేతస్యరుగ్భిరమరః ఖలుకశ్చిదస్తి. 15

ప।వి। దండం - బిభర్తి - అయమ్ - అహో - జగతః - తతః - స్యాత్- కమ్రాకులస్య - సకలస్య - న - పఙ్కపాతః-స్వర్వైద్యయోః - అపి - మదవ్యయదాయినీభిః - ఏతస్య - రుగ్భిః - అమరః - ఖలు - కః - చిత్ - అస్తి.

అర్థము :— (యమపక్షమున) అయం = ఈ యముడు, దండం = దుష్టులను శిక్షించెడి తన యాయుధమును, చేత(బట్టుకొనెడి కఱ్ఱను, బిభర్తి = ధరించును, తతః = ఆ దండమును ధరించుటవలన, కమ్రాకులస్య = వణకుతో(గూడిన, సకలస్య = సమస్తమైన, జగతః = ప్రపంచమునకు, పఙ్కపాతః: పఙ్క = పాపమందును, బురదయందును, పాతః= పడుట, నస్యాత్ = కాదు, అహో = ఆశ్చర్యము. దండధరణము( జేయని జనమునకు పఙ్కమందు పతనము లేకపోవుట యాశ్చర్యము. కఱ్ఱ(బట్టినవారు సాధారణముగా ప్రక్కనున్న బురదలో (బడుట సహజము. అది యిచ్చట లేకపోవుట యాశ్చర్యకరము. కించ = మఱియు స్వర్వైద్యయోరపి = స్వర్గలోక వైద్యులైన అశ్వినీ కుమారుల యొక్కయు, మదవ్యయదాయినీభిః: మద = అహంకారమునకు, వ్యయ = నాశమును. దాయినీభిః = ఇచ్చునట్టి అనగా కర్మజవ్యాధి రోగములు చికిత్సకు సాధ్యములు కావున వారిద్దఱికిని యసాధ్యములునగు, ఏతస్య = ఈ

యమునియొక్క, రుగ్భిః = కర్మవిపాకముననుసరించి య
చిన రోగములనే, అమరః = చావనివాడు, కశ్చిత్ = ఒ
అస్తిఖలు = ఉన్నాడా? లేదని యర్థము. అందఱును మ
చున్నారు.

నలపక్షమున :— అయం = ఈ నలుడు, దండం = దు
చునట్టి దండోపాయమును, బిభర్తి = ధరించును, తతః =
మును ధరించుటవలన, కంపాకులస్య=భయముతోఁ గూడిన
సమస్తమైన, జగతః = ప్రపంచమునకును, పఙ్కపాతః =
పడుట, నస్యాత్ = ఉండదు. రాజు దండోపాయము న
చున్నచో ప్రజలు భయముచే కంపింతురు. పాపమును జేయ
ర్యముచే). స్వర్వైద్యయోః = అశ్వినీ కుమారులయొక్క,
దాయినీభిః ; మద =అహంకారమునకు, వ్యయ = నాశము
నీభిః = ఇచ్చునట్టి, ఏతస్య = ఈ నలునియొక్క, రుగ్భిః
తులచే (ఉపలక్షితః = కూడిన) అమరః = వేల్పు, కశ్చి
డు. అస్తిఖలు = ఉన్నాడా యేమి? వాస్తవమున లేదు.
దేహశోభతో కూడిన వంటివాడు వేల్పులలోను లేదని యర్థ

## సమాసములు :

కమ్పాకులస్య ;— కమ్పేన, ఆకులః = కమ్పాకులః, తః
కులస్య.

పఙ్కపాతః :— పఙ్కే, పాతః = పఙ్కపాతః.

స్వర్వైద్యయోః ;— స్వః, వైద్యౌ=స్వర్వైద్యౌ, తయోః
స్వర్వైద్యయోః.

మదవ్యయదాయినీభిః :- మదస్య, వ్యయః=మదవ్యయః.
దదతీతి = మదవ్యయదాయిన్యః, తాభిః = మదవ్యయ

అమరః :— నమ్రియతేఇత్యమరః.

**భావము :**

(యమపక్షమున) ఈ యముడు తన యాయుధమగు దండమును ధరించుటవలన ప్రపంచము భయముచే వణకును. అందువలన పాపమున బడదు. అనగా పాపమును జేయదు. మఱియు బురదయందు బడదు. ఇది యాశ్చర్యకరము. ఏలయనగా నెవ్వడు దండమును ధరించక వణకుచు నడచునో యతడు ప్రక్కనున్న బురదగుంటలో పడును. కాని యిచ్చట దండధారి యముడు. వణకుచున్నను పఙ్కమున (పాపమున) బడనివారు ప్రజలు దండము లేకపోయినను వీరికి పఙ్కపతనము లేదు. కాన నిది యాశ్చర్యమేగదా! ఇచ్చట పంకమనగా పాపమని యర్థము చెప్పుటచే పై విషయమునకు పరిహారము.

"గురురాత్మవతాం శాస్తా
శాస్తా రాజా దురాత్మనాం.
ఇహ ప్రచ్ఛన్న పాపానాం

శాస్తా వైవస్వతో యమః" అని యముడు గూడ రాజువలెనే, శిక్షించు నధికారము కలవాడు. ఈతడు కర్మవిపాకానుసారముగా కన్పించు రోగములు అశ్వినీదేవతలకు గూడ గర్వభంగము కలిగించును అట్టి రోగములచే మరణించనివారు ఉండరు.

(నలపక్షమున) ఈ నలుడు దండోపాయమును ధరించుటచే ప్రజలెల్లరు భయముచే వణకుచుందురు. అందుచే వారు పాపకార్యములు చేయరు గాన వారికి పంకపతనము (పాపములలోఁబడుట) లేదు. "గురురాత్మవతాంశాస్తా శాస్తా రాజా దురాత్మనామ్." అని చెప్పిన ప్రకారము దురాత్ములను దండించుట వలన నతనికిని దండధారిత్వమున్నది? మరియు సౌందర్యమున నందనుని మించిన యశ్వనీకుమారుల అహంకారమును గూడ తన సౌందర్యముచే నితడు పోగొట్టుట వలనదేవతలలో గూడ నితనికి సమానమైన యందగాడు లేడు. 15

శ్లో॥ మిత్రప్రియోపజననం ప్రతిహేతురస్య
సంజ్ఞా శ్రుతాసు హృదయం న జనస్య కస్య।
ఛాయేదృగస్యచ న కుత్ర విదధ్యగాయి
తప్తం యమేన నియమేన తపోఽమునైవ। 16

ప॥వి॥ మిత్రప్రియా - ఉపజననం - ప్రతి - హేతుః - అస్య - స
శ్రుతా - అసుహృత్ - అయం - న, జనస్య - కస్య - ఛ
ఈదృక్ - అస్య - కుత్ర - చిత్ - అధ్యగాయి - తప్తం
- నియమేన - తపః - అమునా - ఏవ.

అర్థము :- (యమపక్షమున) సంజ్ఞా = సంజ్ఞయని, శ్రుతా = ప్ర
సంజ్ఞాదేవి, మిత్రప్రియా = సూర్యునిభార్య, అస్య = ఈ
ఉపజననంప్రతి = ఉత్పత్తిని గూర్చి, హేతుః = కారణము.
ఈయముడు, కస్యజనస్య = ఏ జనముయొక్క, అసుహృత్
ములను హరించువాడు, న = కాడు? ఇతడందరి ప్రా
హరించువాడని యర్థము, ఛాయా చ = ఛాయయనియు, మిత్ర
సూర్యుని ప్రియురాలు, అస్య = ఈ యమునకు, ఈదృక్ =
ఉత్పత్తిహేతుః = జన్మకారణము, ఇతి = అని, కుత్రచిత్ =
మలదును, నాఽధ్యగాయి = తెలియబడరేదు. సూర్యు
భార్యలు, సంజ్ఞాదేవి, ఛాయాదేవి యని. సంజ్ఞాదేవియే యము
యని తెలియుచున్నది కాన ఛాయాదేవి తల్లియని తెలి
యమేన = యముడను, అమునైవ = ఈతనిచేతనే, నియ
ఇంద్రియ నిగ్రహముతో, తపః = తపస్సు, తప్తం = చేయ
(నలపక్షమున) అస్య = ఈ వీరునకు, సంజ్ఞా = హస్తా
నలుడను పేరు, మిత్రప్రియోపజననం; మిత్ర = మిత్రులకు,
ఇష్టమును, ఉపజననం = సంపాదించుటను గూర్చి, హేతుః
ముగా, శ్రుతా = ప్రసిద్ధమైనది. అయం = ఈనలుడు, కస్య
ఏ జనమునకు, సుహృత్ = మిత్రుడు, న = కాడు.
మిత్రుడేయని యర్థము. అస్య = ఇతనియొక్క, ఈదృక్ =
ఛాయా = శరీరకాంతి, కుత్రచిత్ = మఱియొక పురుషునియ
గూడ, నాఽధ్యగామి = పొందబడలేదు. అమునా = ఈ
యమేన = యమమనెడి యోగాఙ్గముచేతను, తపః =
తప్తమేవ = ఆచరింపబడియేయున్నది. కానిచో నింతమహి
సంభవించినదని యర్థము.

సమాసములు

మిత్రప్రియా :- మిత్రస్య, ప్రియా = మిత్రప్రియా.

మిత్రప్రియోపజననం :- మిత్రాణాం, ప్రియం = మిత్రప్రియం, మిత్రప్రియస్య, ఉపజననమ్ = మిత్రప్రియోప జననం.

అసుహృత్ :- అసూన్హరతీతి = అసుహృత్ ।

భావము

(యమపక్షమున) సూర్యునకు సంజ్ఞయనియు ఛాయయనియు నిద్దఱు భార్యలు. అందు సంజ్ఞాదేవి యీ యమునకుతల్లి. ఈ యముడు ఎవని ప్రాణములను హరింపడు? అందఱి ప్రాణములను తప్పక హరించును. ఆ సూర్యునికి రెండవ భార్యయైన ఛాయాదేవి యీ విధముగా నీతనికి తల్లియని యే శాస్త్రమువలనను దెలియఁబడుటలేదు. ఈ యముడు ఇంద్రియనిగ్రహముతో తపము నాచరించెను. కానిచో నింతటి మహిమ యెట్లు కల్గును. 16

నలపక్షమున :- ఈ వీరుని యొక్క హస్తచేష్టాది సంజ్ఞకాని నలుడను నామముగాని మిత్రులకు నిష్టములను జేకూర్చి పెట్టునని ప్రసిద్ధిగలది. కానీత డెవ్వనికి సఖుడుకాడు? ఇతని శరీరకాంతి మఱియొక పురుషునియందు కాన రాదు. ఇతడు యమ నియమాద్యష్టాంగ యోగముతో తపము గావించెను, కానిచో నింతటి మహిమ యెక్కడిది. 16

శ్లో॥ కిఞ్చ ప్రభావనమితాఖిల రాజతేజా
దేవః పితామ్బురమణీ రమణీయమూర్తిః.
ఉత్క్రాన్తి దానకమను ప్రతిభాతిశక్తిః
కృష్ణత్వమస్యచ పరేషు గదాన్నియోక్తుః. 17

ప॥వి॥ కిం - చ - ప్రభావనమితాఖిల రాజతేజాః - దేవః - పితా - అమ్బురమణీః - రమణీయమూర్తిః - ఉత్క్రాంతిదా - నకమ్ - అను - ప్రతిభాతి - శక్తిః - కృష్ణత్వమ్ - అస్య - చ - పరేషు - గదాన్ - నియోక్తుః.

అర్థము :- (యమపక్షమున) - కిఞ్చ=మఱియు, ప్రభావన మితాఖిల రాజ తేజా ; ప్రభా = కాంతులచే, నమిత = వంచబడిన, అఖిల = సమగ్రమైన, రాజ = చంద్రునియొక్క, తేజాః = కాంతిగలవాడును, రమణీయ = సుంధరమైన, మూర్తిః = శరీరముకల్గిన, దేవః = వేల్పైనది, అమ్బరమణిః = సూర్యుండు, (అస్య = అతనికి) పితా = తండ్రి. అస్య = ఆతనియొక్క, శక్తిః=శక్త్యాయుధము, కమను = ఏజనమును గూర్చి, ఉత్క్రాన్తిదా = ప్రాణోత్క్రమణము నొసంగునది, నప్రతిభాతి = తోచదు. తప్పకతోచును. పరేషు = ఇతరులయందు. గదాన్= రోగములను, నియోక్తుః = కర్మ విపాకము ననుసరించి ప్రేరణజేయుచున్న, అస్య = ఇతనికి, కృష్ణత్వం = కృష్ణ వర్ణమును కల్గియుండుట యేర్పడినది. అనగా నితరులను బాధించుటవలన యపకీర్తిచే నితడు నల్లబడెనని యర్థము.

నలపక్షమున:- దేవః = వేల్పులతో సమానమైన, అమ్బరమణీ రమణీయమూర్తిః; అమ్బరమణీ = సూర్యునివలె, రమణీయమూర్తిః = సుందరశరీరము కల్గిన, అస్య = ఈ నలునియొక్క, పితా = తండ్రియగు వీరసేన మహారాజు, ప్రభావనమితాఖిలరాజతేజాః; ప్రభావ = తన మహిమచే, నమిత=లోఁబఱచుకొనఁబడిన, అఖిల = సమస్త నరపతులయొక్క, తేజాః = ప్రతాపముగలవాడు. అస్య = ఆతనియొక్క శక్తిః = ప్రభుమంత్రోత్సాహరూపమైన సామర్థ్యము, పరేషు = శత్రువులయందు; గదాం = గదయనునాయుధమును, నియోక్తుః = ప్రయోగించెడి, అస్య = ఈనలునకు, కృష్ణత్వం = గదను ధరించుటవలన గదాధరత్వరూపమగు విష్ణుత్వము, సముచితము, తక్కినవి పూర్వముతోసమానములు -హేఅమ్బ = ఓతల్లీ, రమణీరమణీయమూర్తిః; రమణీ = అందమైనవారిలో, రమణీయ = అందమైన, మూర్తిః=శరీరముకల్గినవాడనియు నన్వయము.

## సమాసములు :

(యమపక్షమున) ప్రభావనమితాఖిల రాజతేజాః:-

రాజ్ఞః, తేజః = రాజతేజః, అఖిలంచతత్ రాజతేజశ్చ = అఖిలరాజ

ప్రభావేణ, నమితం = ప్రభావనమితం. ప్రభావనమితం
రాజతేజః, యస్యసః ప్రభావనమితాఖిలరాజతేజాః.

రమణిః :- అమ్బరస్య, మణి = అమ్బరమణిః.

ణీయమూర్తిః :- రమణీయా, మూర్తిః, యస్యసః =రమణీ
మూర్తిః.

క్రాంతిదా:- ఉత్క్రాంతిం, దదాతీతి = ఉత్క్రాంతిదా.

త్వం :- కృష్ణస్య, భావః = కృష్ణత్వమ్.

పక్షమున ;— అమ్బరమణిరమణీయ మూర్తిః :— అంబరస్య,
ః = అంబరమణిః, అమ్బరమణివత్, రమణీయమూర్తిః, యస్య
= అమ్బరమణిరమయణీయమూర్తిః. లేదా - "అమ్బ" - యని
రోధనము కాన రమణిరమణీయమూర్తిః, అని విభజించినచో, రమ
, రమణీయా = రమణిరమణీయా, రమణిరమణీయామూర్తిః,
స్యసః = రమణిరమణీయమూర్తిః!

:

సమపక్షమున) తన కాంతులచే చంద్రుని కాంతులను ధిక్కరించునట్టి
యమునకు తండ్రి. చంద్రుని కాంతి సూర్య కాంతిచే తిరస్కరింప
గాజము. ఇతని శక్త్యాయుధమెవ్వనికి ప్రాణోత్క్రమణ మొసంగదు.
ప్రాణోత్క్రమణము నొసంగునని యర్థము. ఇతరులకు వారివారి
కముల ననుసరించి రోగములను ప్రేరేపించి వారిని బాధించు వీనికి
శరీరమున నల్లదనము యుక్తమే గదా. 17

లపక్షమున) ఇతని తండ్రియగు వీరసేనమహారాజు దేవతుల్యుడు.
వలె నితని శరీరము రమ్యమైనది. ఇతనియొక్క ప్రభుమంత్రోత్సాహ
శక్తి యనగా సామర్థ్యము శత్రువునకెవ్వని ప్రాణములను దీయదు ?
మైన గదాయుధమును ప్రయోగించు నీనలునికి కృష్ణత్వమనగా విష్ణుత్వ
దాధరత్వము యుక్తము. 17

శ్లో॥ ఏకః ప్రభావమయమేతి పరేతరాజౌ
తజ్జీవితేశధియమత్ర విధేహి ముగ్ధే!
భూతేషు యస్య ఖలు భూరి యమస్య వశ్య
భావం సమాశ్రయతి దస్రసహోదరస్య. 18

ప॥వి॥ ప్రభావమ్ - అయమ్ - ఏతి - పరేతరాజౌ - తత్ - జీవితేశధియమ్. అత్ర - విధేహి - ముగ్ధే - భూతేషు - యస్య - ఖలు - భూరి - యమ్ - అస్య - వశ్యభావం - సమాశ్రయతి - దస్రసహోదరస్య.

అర్థము :— (యమపక్షమున) అయమ్ = ఇతడు, ఏకః = ఒకడు, పరేత రాజౌ; పరేత = ప్రేతలయొక్క, రాజౌ = పఙ్క్తియందు, ప్రభావం= అధికారమును, ఏతి = పొందుచున్నాడు, దస్రసహోదరస్య; దస్ర = అశ్వనీకుమారులకు, సహోదరస్య = సోదరుడైన, యస్య = ఏయము నకు, భూతేషు = ప్రాణులయందు, భూరి = అధికమైన, ప్రాణి వర్గము, వశ్యభావం = స్వాధీనముగనుంటను, సమాశ్రయతిఖలు = ఆశ్రయించును గదా. తత్ = అందువలన, అత్ర = ఈ పురుషుని యందు, జీవితేశధియం = యమబుద్ధిని, విధేహి = చేయుము.

(నలపక్షమున) - అయమ్ = ఇతడు, ఏకః = ఒక్కడే, పరేతరాజౌ; పర = శత్రువుల యొక్కయు, ఇతర = వీరికంటె నితరులయొక్క యు ననగా తనవారి యొక్కయు, ఆజౌ = యుద్ధమునందు, ప్రభావం =శక్తిని, ఏతి = పొందును, దస్రసహోదరస్య; దస్ర = అశ్వనీకుమా రులతో, సహోదరస్య = సమానుడైన, అస్య = ఈ నలునకు; భూతేషు = పృథివీజలతేజోవాయ్వాకాశ రూపములగు పంచభూతముల యందును, ఇయం = ఈ, భూః = భూమి, (భూరి, యమస్య అనునెడ భూః, - ఇయమ్, అస్య, - యని పదవిభాగము) వశ్యభావం = స్వాధీ నతను, సమాశ్రయతిఖలు = పొందుచున్నది గదా. తత్ = అందువలన అస్మిన్ = ఇతనియందు, జీవితేశధియం; జీవితేశ = కాంతుడను, ధియం = బుద్ధిని, విధేహి = చేయుము.

**సమాసములు :**

(యమపక్షమున) పరేతరాజౌ ;— పరేతానాం, రాజిః = పరేతరాజిః, తస్యాం = పరేతరాజౌ!

జీవితేశధియం :— జీవితస్య, ఈశః = జీవితేశః. జీవితేశ, ఇతి, ధీః =జీవితేశధీః, తామ్ = జీవితేశధియమ్.

దస్రసహోదరస్య :— దస్రస్య, సహోదరః = దస్రసహోదరః, తస్య = దస్రసహోదరస్య.

(నలపక్షమున) పరేతరాజౌ :- పరే, చ, ఇతరేచ = పరేతరే. పరేతరేషామాజిః = పరేతరాజిః, తస్యాం = పరేతరాజౌ.

దస్రసహోదరస్య :- దస్రస్య, సహోదరః = దస్రసహోదరః, తస్య =దస్రసహోదరస్య.

**భావము**

(యమపక్షమున) ఈ యముఁడొక్కఁడే ప్రేతల పంక్తియందు ప్రాభవమునుఁబొందుచున్నాఁడు. అశ్వినీ కుమారుల సోదరుఁడగు యమునికి ప్రాణులమధ్య యధికమైన ప్రాణివర్గము వశ్యమైయుండునుగదా! ఓ ముగ్ధా! అందువలన నీ పురుషునియందు యమబుద్ధినుంచుము. 18

(నలపక్షమున) ఈ నలుఁడొక్కఁడే, శత్రువులమధ్యను, తనవారిమధ్యను నేర్పరు యుద్ధమున సామర్థ్యమును వహించియున్నాఁడు. అశ్వినీకుమారులతో సమానమైన యీ నలునకు పృథివ్యాది పంచభూతములమధ్యఈ భూమి వశ్యమైయున్నది. కాన, నీ నలుని విషయమున జీవితేశబుద్ధిని ననగా ప్రియుఁడను బుద్ధినుంచుము. 18

శ్లో॥ గుమ్ఫో గిరాం శమననైషధయోః సమానః
శఙ్కామనేకనలదర్శనజాతశఙ్కే.
చిత్తే విదర్భవసుధాధిపతేః సుతాయాః
యన్నిరమ్మే ఖలు తదేష పిపేష పిష్టమ్. 19

ప॥ వి॥ గుమ్ఫః - గిరాం - శమననైషధయోః - సమానః - శఙ్కామ్ - అనేకనలదర్శనజాతశఙ్కే - చిత్తే - విదర్భవసుధాధిపతేః - సుతాయాః - యత్ - నిర్మమే - ఖలు - తత్ - ఏషః - పిపేష - పిష్టమ్.

అర్థము : శమననైషధయోః శమన = యమునికిని, నైషధయోః = నలునికిని, సమానః = సమానమైన, ఏషః = ఈ, గిరాం = మాటలయొక్క, గుమ్ఫః = గుమ్ఫనము, అనేకనలదర్శనజాతశఙ్కే, అనేక = పెక్కండ్రగు, నల = నలులను, దర్శన = చూచుటవలన, జాత = కల్గిన, శఙ్కే = సందేహముతోఁగూడిన, విదర్భవసుధాధిపతేః = విదర్భదేశమునకు ప్రభువైన భీమనలపతియొక్క, సుతాయాః = కుమార్తెయొక్క, చిత్తే = మనస్సునందు, శఙ్కాం = సందేహమును, నిర్మమే ఇతియత్ = కల్గించినదనుటయేదిగలదో, తత్ = అది, పిష్టం = పిండిని, పిపేష = పిసికినది. పిసికిన దానిని పిసుకుట యను పిష్టపేషణ దోషగ్రస్తమైనది.

వి: ఇచ్చట శంకితయైన దమయన్తికి మరల శంకను గల్గించుటయను వాక్యార్థమునకును, పిష్టపేషణ వాక్యార్థమునకును సాదృశ్యమువలన నసంభవద్వస్తుసంబంధమును జెప్పుటవలన నిదర్శనాలఙ్కారము.

## సమాసములు

శమననైషధయోః :- నిషధానాంరాజా = నైషధః శమనశ్చ, నైషధశ్చ = శమననైషధౌ, తయోః = శమననైషధయోః

అనేకనలదర్శనజాతశఙ్కే :- అనేకేచతేనలాశ్చ = అనేకనలాః, అనేకనలానాం, దర్శనం = అనేకనలదర్శనం. అనేకనలదర్శనేన, జాతా, శఙ్కాయస్మిన్ తత్ = అనేకనలదర్శనజాతశఙ్కమ్. తస్మిన్ = అనేకనలదర్శనజాతశఙ్కే.

విదర్భవసుధాధిపతేః :- విదర్భాణాంవసుధా = విదర్భవసుధా, విదర్భ

వసుధాయాః, అధిపతిః = విదర్భవసుధాధిపతిః, తస్య = విదర్భ వసుధాధిపతేః,

భావము

ఈ సరస్వతీదేవియొక్క మాటలు యమునికిని నలునకును సమానముగ నుండినవై పెక్కునలులను చూచుటచే సందేహించిన దమయన్తి చిత్తమునందు మఱల సందేహమును గల్గించి పిష్టపేషణన్యాయమునకీ విషయమును గోచరింపఁ జేసినది పిసికిన వస్తువును మఱల పిసుకుట పిష్టపేషణము. బహునల దర్శనముచే సందేహగ్రస్తమైన దమయన్తి మనస్సున సరస్వతీ వచనములు మఱల సందేహమునుఁగల్గించుట పునరుక్తమై పిష్టపేషణమైనదని యాశయము. 19

శ్లో॥ తత్రాఽపి తత్రభవతీ భృశసంశయాలో
రాలోక్య సా విధినిషేధనివృత్తిమస్యాః.
పాథఃపతిం ప్రతిధృతాభిముఖాఙ్గుళీక
పాణిః క్రమోచితముపాక్రమతాఽభిధాతుం. 20

ప॥వి॥ తత్ర - అపి - తత్ర భవతీ - భృశసంశయాలోః - ఆలోక్య - సా - విధినిషేధనివృత్తిమ్ - అస్యాః - పాథః పతిం - ప్రతి - ధృతాభిముఖాఙ్గుళీక పాణిః - క్రమోచితమ్ - ఉపాక్రమత - అభిధాతుమ్.

అర్థము :- తత్ర భవతీ = పూజ్యురాలైన, సా = ఆ సరస్వతీదేవి, తత్రాఽపి = ఆయమునియందును, భృశసంశయాలోః; భృశ = మిక్కిలి, సంశయాలోః = సందేహించుచున్న. అస్యాః = ఈదమయన్తియొక్క, విధినిషేధయోః = అంగీకార - తిరస్కారములయందు, నివృత్తిం = అభావమును, అనగా నుదాసీనతను, ఆలోక్య = చూచి, క్రమోచితం క్రమముగా ప్రాప్తమైన, పాథః పతింప్రతి = వరుణునిఁగూర్చి, ధృతాభిముఖాఙ్గుళీక = ఎదుట నుంచబడిన వ్రేలుగల, పాణిః = హస్తముతోఁ గూడినదై, అభిధాతుం = చెప్పుటకు, ఉపాక్రమత = ప్రారంభించినది.

**సమాసములు :**

తత్రభవతీ - సాభవతీ = తత్రభవతీ

భృశసంశయాలో:- సంశేతే ఇతి సంశయాలుః, భృశం, సంశయాలుః భృశసంశయాలుః. తస్యాః = భృశసంశయాలోః

విధినిషేధనివృత్తిమ్:- విధిశ్చ, నిషేధశ్చ = విధినిషేధౌ, విధినిషేధయోః, నివృత్తిః = తామ్ = విధినిషేధనివృత్తిమ్.

పాథఃపతిమ్ :- పాథసాం, పతిః = పాథఃపతిః, తమ్ = పాథఃపతిమ్.

ధృతాభిముఖాంగులీకపాణిః :- ధృతాః, అభిముఖాః, అంగుల్యః, యేనసః = ధృతాభిముఖాంగులీః. ధృతాభిముఖాంగులీకః, పాణిః, యస్యాస్సా = ధృతాభిముఖాంగులీక పాణిః.

క్రమోచితమ్ :- క్రమేణ, ఉచితః = క్రమోచితః. తమ్ = క్రమోచితమ్.

**భావము :**

పూజ్యురాలగు సరస్వతిదేవి యమునిఁజూచి మిక్కిలి సందేహించుచున్న యా దమయన్తియొక్క యౌదాసీన్యమును ననగా యముని విషయమున "నౌనని' గాని "కాదని కాని" యేమియు చెప్పక యుండుటను గాంచి జలాధిపతియగు వరుణుని తన వ్రేళ్ళతో ఁజూపి చూపుచు నుడువదొడగెను. 20

శ్లో॥ యా సర్వతోముఖతయా వ్యవతిష్ఠమానా
యాదోరణైర్జయతి నైకవిదారికాయా.
ఏతస్య భూరితరవారినిధిశ్చమూః సా
యస్యాః ప్రతీతివిషయః పరతోనరోధః. 21

ప్ర॥వి॥ యా - సర్వతోముఖతయా - వ్యవతిష్ఠమానా - యాదోరణైః - జయతి

- నైకవిదారికాయా - ఏతస్య - భూరితరవారినిధిః - చమూః - సా - యస్యాః - ప్రతీతివిషయః - పరతః - న - రోధః.

:- (వరుణపక్షమున) యా = ఏ, చమూః = సేన, సర్వతోముఖతయా = జలముగానుండుటచే, వ్యవతిష్ఠమానా = నియతస్థితిని బొందినదై, నైకవిదారికా; నైక = పెక్కైన, విదారికా = నీరునిలచిన గుంటలుగలదై, సముద్రరూపమును వహించినదై. యాదోరణైః; యాదః = జలజంతువులయొక్క, రణైః = శబ్దములచే, జయతి = గోచరించుచున్నది. యస్యాః = సముద్రరూపమైన యేసేనకు, పరతః ఆవల, రోధఏవ = తీరమే, ప్రతీతి విషయఃన = కానరాదు. ఏతస్య ఈ వరుణునియొక్క, సా = ఆసేన, భూరితరః = మిక్కిలి, గొప్పదైన, వారినిధిః= సముద్రము.

(నలపక్షమున) సర్వతోముఖతయా = సర్వవ్యాపకముగా, వ్యవతిష్ఠమానా = ఉన్నదియు, నైకవిదారికాయా; నైక = పెక్కుశత్రువులను, విదారి = సంహరించుచున్నదైన, కాయా = శరీరము గలదియు, యాచమూః = ఏసేన, దోరణైః = భుజములయొక్క యుద్ధములచే, జయతి = జయించుచున్నదో, యస్యాః = ఏ సేనకు, పరతః = శత్రువునుండి, రోధః = ప్రతిరోధము, ప్రతీతివిషయః = జ్ఞానగోచరముగా, న = లేదో, ఏతస్య = ఈ నలునియొక్క, సా = ఆసేన, భూరితరవారినిధిః; భూరి = అధికమైన; తరవారి = ఖడ్గములకు, నిధిః = గనిగానున్నది.

•సములు :

(వరుణపక్షమున) సర్వతోముఖతాయా :- సర్వతోముఖం, యస్యతత్= సర్వతోముఖం. సర్వతోముఖస్య, భావః = సర్వతోముఖతా, తయా = సర్వతోముఖతయా.

యాదోరణైః :— యాదసాం, రణాః = యాదోరణాః, తైః = యాదోరణైః.

నైకవిదారకాః ;— నైకేచతేవిదారకాశ్చ = నైకవిదారకాః!

భూరితరవారినిధిః :— అత్యంతం, భూరి=భూరితరః; భూరితరశ్చాసౌ వారినిధిశ్చ = భూరితరవారినిధిః.

(నలపక్షమున) సర్వతోముఖతయా :— సర్వతః,ముఖాని, యస్యాఃసా =సర్వతోముఖా, సర్వతోముఖాయాః, భావః = సర్వతోముఖతా, తయా = సర్వతోముఖతయా.

దోరణైః :— దోష్ణాం, రణాః = దోరణాః, తైః = దోరణైః.

నైకవిదారకాయాః :— న, ఏకే = అనేకే, నైకాన్, విదారయ న్తీతి = నైకవిదారాః, నైకవిదారాః, కాయాః, యస్యాఃసా = నైకవిదారకాయా.

భూరితరవారినిధిః :— భూర యశ్చతే, తరవారయశ్చ = భూరితరవారయః, భూరితరవారీణాం, నిధిః = భూరితరవారినిధిః.

ప్రతీతివిషయః :— ప్రతీతేఃవిషయః = ప్రతీతివిషయః.

**భావము :**

(వరుణవిషయమున) ఆసేన యనగా వరుణుని సేన జలముగా నుండుటచే నన్నివైపులకు వ్యాపించుచున్నది. ఆ జలసేన పాయిలుచే నక్కడక్కడ చిన్న చిన్న బావులవంటి గుంటలేర్పడి యున్నవి. ఆ సేన సముద్రము వంటిదై జల జన్తువుల ధ్వనులతో గూడియున్నది. ఆ సేనా సాగరమునకు నావలిగట్టు కానరాదు. ఇట్టి వరుణుని సేన గొప్ప సాగరమేయగుచున్నది.

(నలపక్షమున) అనలుని సేన పెక్కు మార్గములలో సంచరించుచున్నది. అది పెక్కు శత్రువులను సంహరింపగల దేహములతో గూడియున్నది. ఆసేన భుజయుద్ధములతో విజయమందుచున్నది. ఆ సేనకు శత్రువులవలన ముట్టడి లేదా అడ్డగింపు కానరాదు. ఇట్టి నలుని సేన పెక్కుఖడ్గములు మున్నగు నాయుధములకు నిధిగానున్నది.

శ్లో॥ నాసీరసీమని ఘనధ్వని రస్య భూయాన్
కుమ్భీరవాన్ సమకరః సహదానవారిః
ఉత్పద్మకాననసఖః సుఖమాతనోతి
రత్నైరలఙ్కరణభావమితై ర్నదీనః 22

ప॥వి॥ నాసీరసీమని - ఘనధ్వనిః - అస్య - భూయాన్ - కుమ్భీరవాన్ - సమకరః - సహదానవారిః - ఉత్పద్మకాననసఖః - సుఖమ్ - ఆతనోతి - రత్నైః - అలంకరణభావమ్ - ఇతైః - నదీనః.

అర్థము (వరుణ పక్షమున) నాసీరసీమని = ఆజలసేనయొక్క ముంగిట, ఘనధ్వనిః = గొప్పధ్వని, భూయాన్ = అధికము, కుంభీరవాన్ = మొసళ్ళు గల్గినదియు, సమకరః = మకరములతోఁగూడినదియు (కుంభీరవములు, మకరములు మొసళ్ళలో జాతిభేదములు) సహదానవారిః = శేషశాయియగు విష్ణువుతోఁగూడినదియు, ఉత్పద్మకానన సఖః; ఉత్పద్మ = వికసితపద్మములయొక్క, కానన = వనములతో, సఖః= కూడినదియునగు, నదీనః = నదులకు నీశుడైనట్టి యనగా భర్తయైనట్టి సముద్రము, అలం = మిక్కిలి, కరణభావం = సాధనత్వమును, ఇతైః = పొందినట్టి, రత్నైః = శ్రేష్ఠవస్తువులచే, అస్య = ఈ వరుణునకు, సుఖం = సుఖమును, ఆతనోతి = చేయుచున్నది.

(నలపక్షమున) ఘనధ్వనిః = మేఘధ్వని వంటి ధ్వనితో గూడినదియు, భూయాన్ = పెక్కైనదియు, సమ - కరః = సమానమైన తొండము కలదియు, ననగా పొడుగు, పొట్టి, లావు, సన్నము కాక మొదలునుండి తుదివరకు సమానమైన తొండమును గలదియు, సహదానవారిః = మదోదకముతోఁగూడినదియు, ఉత్పద్మకాననసఖః; ఉత్పద్మక = పద్మకములను తెల్లనిమచ్చలుగల, ఆనన = ముఖముతో, సఖః = గూడినదియు, అలంకరణభావం = అలంకారముగానుండుటను, ఇతైః= పొందినట్టి, రత్నైః = రత్నములచే, నదీనః=శూన్యము గానిదియునగు, కుంభీ = ఏనుగ, సుఖం = సుఖముగా, నాసీరసీమని = సేనయొక్క

పూర్వభాగమున, రవాన్ = బృంహిత ధ్వనులను, ఆతనోతి = చేయుచున్నది.

**సమాసములు**

(వరుణపక్షమున) నాసీరసీమని :- నాసీరస్య, సీమా = నాసీరసీమా, తస్మిన్ = నాసీరసీమని.

ఘనధ్వనిః :- ఘనశ్చాసౌధ్వనిశ్చ = ఘనధ్వనిః

కుంభీరవాన్ :- కుమ్భీరవాః అస్మిన్సంతీతి = కుమ్భీరవాన్.

సమకరః :- మకరైః సహవర్తత ఇతి = సమకరః.

సహదానవారిః :- సహదానవారిః యస్యసః = సహదానవారిః.

ఉత్పద్మకాననసఖః :- ఉత్ఫుల్లానిచతాని, పద్మానిచ = ఉత్పద్మాని. ఉత్పద్మానాం, కాననాని = ఉత్పద్మకాననాని. ఉత్పద్మకాననానాం, సఖా = ఉత్పద్మకాననసఖః.

నదీనః - నదీనామినః = నదీనః.

(నలపక్షమున) ఘనధ్వనిః :- ఘనస్యేవధ్వనిఃయస్యసః = ఘనధ్వనిః,

కుంభీ :- కుంభఃఅస్య అస్తీతి = కుమ్భీ.

సమకరః :- సమఃకరఃయస్యసః = సమకరః

సహదానవారిః :- దానస్య, వారి=దానవారి. సహదానవారి, యస్యసః =సహదానవారిః.

ఉత్పద్మకాననసఖః :- ఉద్గతాని, పద్మకాని, యస్మిన్ తత్ = ఉత్పద్మకం, ఉత్పద్మకంచతత్ ఆననంచ = ఉత్పద్మకాననం. ఉత్పద్మకాననస్య, సఖా = ఉత్పద్మకాననసఖః

అలంకరణభావమ్ :- అలంకరణస్య, భావః = అలంకరణభావః = తమ్ = అలంకరణభావమ్.

భావము

(వరుణపక్షమున) ముందుభాగము ననగా గట్టుదగ్గర గొప్పధ్వనిని గల్గి నక్రములు, మకరములను జాతులకుఁజెందిన మొసళ్ళతో వరుణుని సేన యనగా జలరాశి గొప్ప ఘోషను (జేయుచున్నది. కడలిగట్టు నంచున్నంత టిరొద కడలి నందుండదు. కావున కడలి గట్టుననే యీ మహాధ్వని వర్ణితము. మఱియు కడలి మధ్య శ్రీమహావిష్ణువు శేషశాయిగా వెలసియున్నాడు. అదిగాక నదీపతియగు సముద్రుడు వికసిత పద్మవనములతోఁ గూడి యమూల్యములగు రత్నాది సాధనములతో నతనికి సుఖమునుఁగల్గించుచున్నాడు. 24

(నలపక్షమున) మేఘధ్వనివంటి ఘీంకారముగల్గినదియు, అనేకమైనది యును, నంతట హెచ్చుతగ్గులు లేక సమమైన తొండముగలదియు, దానోదక ముతో గూడినదియు పద్మకములనెడి తామ్రవర్ణముగల బిందువులతోఁగూడి నదియు, రత్నాద్యలంకారములతో శోభించునదియునగు నీనలుని యేనుగ సుఖ ముగా యుద్ధ ప్రాఙ్గణమున ఘీంకారములనుఁజేయుచున్నది. 22

శ్లో॥ సస్యందనైః ప్రహరణైః ప్రతికూలపాతం
కా వాహినీ న తనుతే పునరస్యనామ·
తస్యా విలాసవతి కర్కశతాశ్రితాయా
బ్రూమః కథం బహుతయా సికతా వయం తాః.

ప॥వి॥ సస్యందనైః - ప్రహరణైః - ప్రతికూలపాతం, కా - వాహినీ - న - తనుతే - పునః - అస్య - నామ - కస్యాః - విలాసవతి! - కర్కశ తాశ్రితాయాః - బ్రూమః - కథం - బహుతయా - సికతాః - వయం- తాః.

అర్థము :— (వరుణపక్షమున) హే విలాసవతి! = ఓ దమయన్తీ, అస్య = ఈ వరుణునికి సంబంధించినదైన, కాపునఃవాహినీ = ఏ నది, సస్యందనైః = ప్రవణముతో గూడిన అనగా, నవిచ్ఛిన్నముగా పాఱు

నట్టి యనీ యర్థము. ప్రవహణైః = ప్రవాహములతో ననగా నలలతో, ప్రతికూలపాతం; ప్రతికూల = ఒక్కొక్క గట్టునందును, పాతం = పడుటను, నతనుతేనామ? = చేయదాయేమి? అనగా నొక్కొక్క గట్టును తప్పక పడవైచునని యర్థము. కించ = మఱియు, తస్యాః = ఆ నదికి సంబంధించినవియును, కర్కశతాశ్రితాః: కర్కశతా = కాఠిన్యమును, శ్రితాః = పొందిన, యాః = ఏ, సికతాః = ఇసుకలు గలవో, తాః = వానిని గూర్చి, బహుతయా = అధిక్యముగానుండుటచే వయం = మనము, కథం = ఎట్లు వాని సంఖ్యను, బ్రూమః = చెప్పగలము?

(నలపక్షమున) సస్యందనైః = రథములతో నుపలక్షితములగు, ప్రవహణైః = చిట్టిబండ్ల తోఁడ, అస్య = ఈ నలునియొక్క, కాపునర్వాహినీ = ఏసేన, ప్రతికూలపాతం: ప్రతికూల = ప్రతికూలురైన శత్రువుల యొక్క, పాతం = నాశమును. నతనుతే = చేయదా? (కించ = మఱియు) కర్కశతాశ్రితాః: కర్కశత = వందలకొలది తెల్ల గుఱ్ఱములను, ఆశ్రితా = పొందిన, తస్యాః = ఆ సేనయొక్క, అసికతాః = ఖడ్గధారిత్వములను గూర్చి, బహుతయా = అధికముగా నుండుటచే, వయం = మనము, కథం = ఎట్లు, బ్రూమః = లెక్కించి చెప్పగలము.

భావము :

(వరుణపక్షమున) ఓ దమయన్తీ! ఈ వరుణునికి సంబంధించిన యేనది యవిచ్ఛిన్నముగా పాఱు ప్రవాహముల తోడను, నలలతోడను, గట్టులను పడగొట్టుట లేదు. తప్పక పడగొట్టుచున్నది. మఱియు నానదికి సంబంధించిన కఠినములగు నిసుకలు లెక్కలేనివి కాన వానిఁగూర్చిన లెక్కను మనమెట్లు చెప్పగలము.

(నలపక్షమున) మహారథములతో గూడిన యుపరథములతో సాగుచున్న యానలునకి సంబంధించిన యేసేన ప్రతికూలురగు శత్రువులను సంహరించదు.

తప్పక సంహరించును. వందలకొలది తెల్లగుఱ్ఱములతో ప్రకాశించు నాసేనలో ఖడ్గధారులు పెక్కులు. వారిని లెక్కించి యెట్లు చెప్పగలము.

శ్లో॥ శోణం పదప్రణయినం గుణమస్యపశ్య
కిఞ్చాస్య సేవనపరైవ సరస్వతీ సా.
ఏనం భజస్వ సుభగం భువనాధినాథం
కేవా భజన్తి తమిమం కమలాశయాన. 24

ప॥వి॥ శోణం - పదప్రణయినం - గుణమ్ - అస్య - పశ్య - కిం - చ - అస్య - సేవనపరా - ఏవ - సరస్వతీ - సా - ఏనం - భజస్వ - సుభగం - భువనాధినాథం - కే - వా - భజన్తి, తమ్ - ఇమం - కమలాశయా - న.

అర్థము :- (వరుణపక్షమున) హేసుభగే = ఓ సౌభాగ్యవతి! అస్య = ఈ వరుణునియొక్క, పదప్రణయినం = పాదముల యందాసక్తి గల్గిన, గుణం = గుణముగల్గిన. యనగా రక్తవర్ణమగు జలముగల్గిన, శోణం = శోణమను పేరుగల్గిన నదమును, పశ్య = చూడుము. కించ = మరియు సా = ఆసరస్వతీ నదియు, అస్య = ఈవరుణునికి, సేవనపరైవ = సేవయందాసక్తి గల్గినదే. తతః = అందువలన, భువనాధినాథం; భువన = ఉదకములకు, అధినాథం = ప్రభువైన, సుభగం = సౌందర్యవంతుడగు వరుణుని, భజస్వ = పొందుము. తమ్ = ఆ, ఇమం = ఈవరుణుని, కేవా = ఎవ్వరు,లేక-ఏ, కమలాశయా, కమల = జలమునకు, ఆశయా = ఆశ్రయములగు కొలనులు, కమల = ఉదకమందలి, ఆశయా = ఆశచే, నభజన్తి = పొందరు లేదా పొందవు.

(నలపక్షమున) = అస్య = ఈ నలునియొక్క, పదప్రణయినం = పాదములయందాసక్తి గల్గిన, అనగా పాదతలమునందు కానవచ్చు, శోణం ఎఱ్ఱటి, గుణం = గుణమును, పశ్య = చూడుము. అది భాగ్య చిహ్నము. (కించ) = మఱియు, సా = ఆసరస్వతీదేవి, అస్యైవ =

ఈనలునియొక్కయే, సేవనపరా = సేవించుటలో నాసక్తిగల్గినది. అనగా నితడు లక్ష్మీ సరస్వతుల కిరువురికిని నివాసస్థానమని యర్థము. తతః = అందువలన, భువనాధి నాథం = లోకములకధిపతియగు. సుభగం = సుందరుడైన ఏనం = వీనిని, భజస్వ పొందుము. కేవా = ఎవ్వరు తమ్ = ఆ. ఇమం = ఈనలుని, కమలాశయా; కమలా = లక్ష్మి యందలి, ఆశయా = ఆశచే, నభజన్తి = పొందరు.

## సమాసములు :

(వరుణపక్షమున) కమలాశయా:-
కమలే, ఆశా = కమలాశా, తయా = కమలాశయా. లేదా కమస్య ఆశయా. = కమలాశయా. (వరుణ నల పక్షములయందు)

పదప్రణయినం :- పదయోః ప్రణయీ = పదప్రణయీ, తమ్ = పదప్రణయినమ్.

సేవనపరా :- సేవనేపరా = సేవనపరా.

భువనాధినాథం :- భువనస్య, అధినాథః = భువనాధి నాథః, తమ్ = భువనాధినాథం.

(నలపక్షమున) కమలాశయా - కమలాయామాశా = కమలాశా, తయా = కమలాశయా.

## భావము :

(వరుణపక్షమున) ఈ వరుణుని పాదములను సేవించునట్టి యెఱ్ఱనీరు గల్గిన శోణనదమును చూడుము. అట్లే సరస్వతినదియు నితని సేవయందే ఆసక్తమైయున్నది. ఏలయనగా – ఇతడు సకలనదీ నదములకును, ప్రభువు గదా? అట్టి జలాధిపతియగు వరుణుని పొందుము. ఇట్టి సౌభాగ్యముగల వరుణుని జలాధారములగు కొలంకులు లేదా జలమందలి యాశచే ప్రజలు ముముక్షుగు వారు ఏలయాశ్రయింపరు. తప్పక యాశ్రయింపగలరు. 24

(నలపక్షమున) — ఈనలుని పాదము క్రింద తామ్రవర్ణము నుజూడుము. ఇట్లు కాలి యడుగు ఎఱ్ఱగనుండుట భాగ్యచిహ్నము. మఱియు వాగ్దేవతయగు సరస్వతియు నితనినాశ్రయించి యున్నది. అనగా నితడు లక్ష్మీ సరస్వతుల కిరువురికిని నివాసస్థానము. అందువలన లోకనాథుండును సుందరుడునగు నీతనినాశ్రయింపుము. ఎవ్వరు ధనకాంక్షచే నితనినాశ్రయింపరు? 24

శ్లో॥ శఙ్కాలతాతతి మనేకనలావలమ్బాం
వాణీ స వర్ధయతు తావదభేదికేయం.
భైమీం ప్రతినలేచ జలేశ్వరేచ
తుల్యం తథాఽపి యవదర్ధయదత్ర చిత్రమ్. 25

ప॥వి॥ శఙ్కాలతాతతిమ్ - అనేకనలావలమ్బాం - వాణీ - న - వర్ధయతు - తావత్ - అభేదికా - ఇయం - భైమీం - ప్రతి - నలే - చ - జలేశ్వరే - చ - తుల్యం - తథా - అపి - యత్ - అవర్ధయత్ - అత్ర - చిత్రమ్.

అర్థము :— జలేశ్వరే = జలాధిపతియగు వరుణునియందును, నలేచ = నలుని యందును, తుల్యం = సమానముగా, (ప్రయుక్తా) ప్రయోగింపబడిన, భైమీంప్రతి = దమయంతిని గూర్చి, అభేదికా = రెంటిలో నొక్కదానిని నిర్ణయించుటకు సాధనముకాని, ఇయం = ఈ సరస్వతీదేవి యొక్క వాక్కు, అనేకనలావలమ్బాం; అనేక = పెక్కైన, నల = నలులను, అవలమ్బాం = ఆశ్రయముగా గల్గిన లేదా, అనేక = పెక్కైన, నల నలమని చెప్పబడు తెగగొట్టుటకు సాధ్యముగాని గడ్డిని నాధారముగా గల్గినదై, శఙ్కాలతాతతిమ్ = సందేహములనెడి తీగెల సంతతిని, న వర్ధయతుతావత్ = ఛేదింపకయుండు గాత - ఏలయనగా సమానధర్మములుగల వస్తువులను జూచినపుడు సందేహము సహజము కాన సమా

నార్థకములైన సరస్వతీ వాక్కులు, వారిలో సత్కనలుడెవ్వడను సందేహమును నివృత్తి చేయక పోవుటలో నాశ్చర్యము లేదు. తథాపి = అయినను, అవర్ధయత్ఇతియత్ = సంశయమును ఛేదించెననుట యేదికలదో, తత్ = అది, అత్ర = ఇచ్చట, చిత్రమ్ = ఆశ్చర్యకరమైనది. ఛేదనార్థకమైనపుడు ఏది ఛేదింపలేదో అదియే యిచ్చట ఛేదించెను గాన విరోధము. కాన నాశ్చర్యకరమైనది. "అవర్ధయత్ వర్ధయామాస" అని వృద్ధ్యర్థమునుఁజెప్పుటవలన విరోధమునకు పరిహారము. నలయను పేరు నలతీగెల సమూహమునువలె నలునినాధారముగాఁజేసుకొనిన ఇతడు నలుడా? ఇతడునలుడా? యను సందేహ పరమ్పరనిది ఖండించలేదు. పైగా వృద్ధినేపొందినది కాన నిది చాలా దయనీయమైనవిషయము. ఇచ్చట నన్వయ భేదముచే నర్థభేదములు పెక్కులుచెప్పఁబడుచున్నవి. -ఇయం= ఈసరస్వతి, భీమోద్భవాం=దయన్తినుద్దేశించి, అనేకనలావమ్బాం;అనేక = పెక్కండ్రైన, వల = నలుఅను, అవలమ్బాం = విషయముగా, గల్గిన, శఙ్కాలతాతతిం = సంశయములనెడి తీగల సమూహమును, నవర్ధయతుతావత్ = పూరింపకయుండునా? అనగా తప్పకవర్ధిల్లజేయునని యర్థము. లేదా - నవర్థయతు = నవర్ధీకరోతు నూతనవృద్ధికలదిగా చేయదా? అనగా చేయుననియర్ధము. యనగా, అభేదికా = నలవరుణులతో విశేషమును చూపనిదై యున్నది. సమాన ధర్మములను, జూచినపుడు సంశయము వర్ధిల్లునేగాని తఱుగదు (కాన) ఈ విషయమునందాశ్చర్యములేదు. అయినను నలునియందును,వరుణుని యందును సమానముగా నొక్కకాలమునందు సంశయలతా పరమ్పరను నభివృద్ధి చేయుటయను విషయమున నాశ్చర్యము గలదు ఏలయనగా నలవరుణులను విషయమునకు సంశయ కర్మత్వమేగానిసంశయకర్తృత్వములేదుగదా! లోకమునందు దూరమందున్న పురుషునియందు పురుషత్వమును, స్థాణుత్వమునుఁతెలిసికొనక, యూర్ధ్వత్వమనగా నెత్తుగా నుండుట యనుధర్మమును తదితర స్తంభసామ్యమును, తెలిసికొని, తటస్థుడగు పురుషుడు'' స్థాణుర్వాపురుషోవా" అనిసందేహించును. కాని యాపురుషుడే" ఎత్తుగనున్నతన్ను 'జూచుకొని" తన్ను "నేనాలేకస్తం

భమా" యని సందేహింపడు. కావున నవవరణుల విషయమున, దమయన్తికి సందేహము సరియైనది. స్థాణ్వాదివిషయములకు సందేహము వచ్చిననే యాశ్చర్యమని యాశయము. విరోధపరిహారము- సమానకాలమందు క్రమముగా, నలునియందు, శజ్కాలతాతతిమ్; శం=సుఖమునకు, కాలతాతతిం = నల్లదనముయొక్క యాధిక్యమును,నవర్ధయతు = వర్ధిల్లజేయదాయేమి? తప్పక వర్ధిల్లజేయునని యర్థము. అదియుక్తమే - సరస్వతీదేవి వీనిని నలుడని చెప్పినచోనప్పుడు నాయెడ ననురక్తురాలగు దమయన్తి నేననెడి భ్రాంతితో వీనినే వరించియుండెడిది. కాని, దానిని సరస్వతీదేవి చేయలేదు. ఏలయనగా; వరుణుని గూడశ్లేష యందిమిడ్చి వర్ణించినది కాన నలునియందు సుఖము కల్గినది ఒకవేళ సరస్వతి నన్ను "నలుడే ఇతడని" చెప్పియున్నచో నప్పుడు నలుడను బుద్ధిచే దమయన్తి నన్నే వరించియుండెడిది. కాని యామెయట్లు చేయలేదు. నాతో గూడినట్లే నలుని వర్ణించినది. కాన దుఃఖముచే వరుణుని యందు, నధికముగా నల్లదన మేర్పడినది. ఆనల్లదనముకూడ తక్కిన నలుగురిని వరించనందువలన పెక్కండ్రు నలులను నాధారముగ జేసికొన్నది. లేదా నాయెడ సందేహముతో నొకవేళ వరుణుని వరించినచో, నల సందేహమువలన నన్నుగూడ వరించవచ్చునని క్రమముగా నల వరుణుల సందేహపరంపరలను వర్ధిల్లజేయుచుండినది. అనేక నలులను విషయీకరించుకొనిన దమయన్తి యొక్క సందేహపరంపరను సరస్వతి వాక్కులు ఛేదింపకయుండును గాత. ఏలయనగా ఆమె యొక్క వాక్కు అభేదికా= నలవరుణుల భేదమును ప్రతిపాదింపజాలనిది. ఛేదించుటలో శక్తి లేని కత్తి మున్నగునవి పెక్కు గడ్డిపోచలతో గూడిన తీగల సమూహమును ఛేదింపక యుండుట యాశ్చర్యకరము గాదు. కాని దమయన్తినుద్దేశించి, నలునివిషయమందును, వరుణుని విషయమందును, సంశయ పరమ్పరను నొక్కకాలమందే తెగగొట్టె ననుట యాశ్చర్యకరము. ఏదితెగగొట్టదో అది తెగగొట్టె ననుట విచిత్రము. నాసందేహమువలన వరుణుని దమయన్తి వరించునని భ్రాంతి. అట్లేనలుడను సందేహముతో తన్ను వరించునని వరుణునికి భ్రాంతి. వరుణునిచెప్ప శబ్దముండుట

వలన, శ్లేష - వక్రోక్తిమున్నగు వానినిఁదెలిసిన దమయన్తి వరుణుని వరించదను నిర్ధారణచే, నలునికి భ్రమ నశించును. నలునియందను రాగముగల దమయన్తి తన్ను చెప్పెడి శబ్దముండుటవలన, తన్ను వరింప నేరదను నిశ్చయముతో వరుణుని భ్రమ నశించును.

సరస్వతీదేవి నా పేరెత్తి నన్ను వర్ణించినది. కాన నన్ను దమయన్తి వరించునోలేదో యను సంశయము, వరుణునికి దీరినది. అట్లే యిప్పుడు నొక్కడనే మిగిలితిని కాన నాయందెయామెయనురక్తురాలు, కాననన్నే వరింపఁగలదని నలుని సందేహము తీరినది. మున్నగు నర్థము లీసందర్భమున నూహ్యములు.

**సమాసములు :**

శఙ్కాలతాతతిమ్ :- శఙ్కా ఏవలతాః = శఙ్కాలతాః, శఙ్కాలతానాం తతిః = శఙ్కాలతాతతిః, తామ్ = శఙ్కాలతాతతిమ్.

అనేకనలావలమ్బాం :- అనేకేచతే, నలాశ్చ = అనేకనలాః. అనేకనలాః, అవలమ్బః, యస్యాస్సా = అనేకనలావలమ్బా, తామ్ = అనేకనలావలమ్బామ్.

**భావము :**

సరస్వతీదేవి వరుణుని విషయమందును నలవిషయమందు సమానముగను, వారి భేదమును వెల్లడిఁజేయ చాలనిదిగను, దమయన్తినుద్దేశించి చెప్పిన వాక్కు పెక్కునలులను (నలమనెడి పెక్కు గడ్డిపోచలను) నాధారముగాగొని సందేహపరమ్పరను ఛేదింపఁజాలదు. ఏలయనగా, సమాన ధర్మములను, అనగా నుచ్చైస్త్వము మున్నగు ధర్మములను, జూచి స్తంభాదులయందు సంశయము గల్గుట సహజముకాని "అవర్ధయత్"ని ఛేదించినట్లు చెప్పుట విరుద్ధము. కాని "వృధు" ధాతువునకు వర్ధనార్థమునుఁజెప్పుటచే, బరిహారము. తక్కిన విశేషార్థములు పైవివరణమున స్పష్టములు.

శ్లో॥ బాలాం విలోక్య విబుధై రపిమాయిభిస్తై
రచ్ఛద్మితామియమలీకనలీకృతస్వైః।
ఆహస్మతాం భగవతీ నిషధాధిరాజం
నిర్దిశ్యరాజపరిషత్పరిశేషభాజమ్॥ **26**

ప॥వి॥ బాలాం - విలోక్య - విబుధైః - అపి - మాయిభిః - తైః - అచ్ఛద్మి తామ్ - ఇయమ్ - అలీకనలీకృతస్వైః - ఆహ - స్మ - తాం - భగవతీ - నిషధాధిరాజం - నిర్దిశ్య - రాజపరిషత్ పరిశేషభాజమ్.

అర్థము - అథ = పిదప, ఇయం = ఈ, భగవతీ = పూజ్యురాలైన సరస్వతి తాం = ఆ, బాలాం = దమయన్తిని, మాయిభిః = మాయావులగు (అతఏవ = కావుననే) అలీకనలీకృతస్వైః అలీకనల = అసత్యనలులుగా, కృత = చేయబడిన, స్వైః = స్వస్వరూపములు గల్గిన, తైః = ఆ, విబుధైరపి = దేవతల చేతను, అచ్ఛద్మితాం = మోసగింపబడని దానినిగా, విలోక్య = చూచి, రాజపరిషత్పరిశేషభాజం, రాజపరిషత్ = రాజసభయందు, పరిశేష = మిగిలియుండుటను, భాజం = పొందిన, నిషధాధిరాజం = నిషధరాజగు నలుని, నిర్దిశ్య = చూపి, ఆహస్మ = చెప్పదొడగినది. "పరివేషభాజమ్" అను పాఠమున నుసరించి, రాజపరిషత్పరివేషభాజం, రాజపరిషత్ = రాజసభయను పరివేషముననగా పరిధిని, భాజం = పొందిన, నలం = నలుని(గూర్చి (ఇందువలన నలునకు చంద్రత్వము ధ్వనించుచున్నది.) ఆహస్మ = చెప్పదొడగెను.

**సమాసములు :**

మాయిభిః :— మాయాఏషాంఅస్తీతి — మాయినః, తైః = మాయిభిః.
అచ్ఛద్మితామ్ :— ఛద్మకరోతీతి = ఛద్మి, ఛద్మినః భావః, ఛద్మితాః న, ఛద్మితా = అచ్ఛద్మితా, తామ్ = అచ్ఛద్మితామ్.
అలీకనలీకృతస్వైః :— అలీకనలీకృతాని, స్వాని, యైః = అలీకనలీకృతస్వాః, తైః = అలీకనలీకృతస్వైః.

నిషధాధిరాజం :— నిషధానాం అధిరాజః = నిషధాధిరాజః. తం = నిషధాధిరాజమ్

రాజపరిషత్పరిశేషభాజమ్ :— రాజ్ఞః, పరిషత్ = రాజపరిషత్, రాజపరిషతః, పరిశేషః = రాజపరిషత్పరిశేషః, రాజపరిషత్పరిశేషం, భజతీతి = రాజపరిషత్పరిశేషభాక్. తమ్ = రాజపరిషత్పరిశేషభాజం,

**భావము :**

పూజ్యురాలగు సరస్వతి, యా దమయన్తిని మాయను ధరించి యసత్య నల స్వరూపమును దాల్చిన యాదిక్పాలురచే వంచింపబడని దానిగనే గ్రహించినది. ఏలయనగా నా దమయన్తి నలబుద్ధిచే వారిని వరించలేదు. ఆ రాజసభ యందుంజి వరకు మిగిలిన నలునిం జేతితో జూపించి యామె చెప్పందొడగినది.

శ్లో॥ **అత్యాజి లబ్ధ విజయప్రసవస్త్వయా కిం**
**విజ్ఞాయతే రుచిపదం న మహీమహేన్ద్రః.**
**ప్రత్యర్థి దానవశతాఽఽహిత చేష్టయాఽసౌ**
**జీమూతవాహన ధియం నకరోతి కస్య॥. 27**

ప॥వి॥ అత్యాజిలబ్ధవిజయప్రసవః - త్వయా - కిం, విజ్ఞాయతే - రుచిపదం - న - మహీమహేన్ద్రః - ప్రత్యర్థిదానవశతాహితచేష్టయా - అసౌ - జీమూతవాహనధియం - న - కరోతి - కస్య.

నలునితో నొక్కొక్క శ్లోకమునందు క్రమముగా సింద్రాదులను శ్లేషతో మటించి 27 నుండి 30 శ్లోకములవరకును వర్ణించుచున్నాడు.

అర్థము :- (నలపక్షమున) అత్యాజిలబ్ధవిజయప్రసవః; అత్యాజి = గొప్పయుద్ధములయందు, లబ్ధ = పొందబడిన, విజయప్రసవః = జయమను ఫలము గల్గిన, రుచిపదం = నీయనురాగస్థానమైన, మహీమహేన్ద్రః = భూమికి దేవేంద్రుడైన (నలుడు), కింనవిజ్ఞాయతే = తెలియబడలేదా యేమి? ప్రత్యర్థిదానవశతాహితచేష్టయా; ప్రత్యర్థి = యాచకుల విషయమున

దానవశతా = దానాధీనతచే, ఆహిత = చేయబడిన, చేష్టయా = చేష్టచే, అనగా దానమనెడి చేష్టచే, అసౌ = ఈ నలుడు, కస్య = ఏవనికి, జీమూతవాహన = జీమూతవాహనుఁడను మహాత్యాగియగు విద్యాధర రాజు అనెడి, ధియం = బుద్ధిని, నకరోతి = చేయఁడు? కాన నితడు నలుడని భావము.

(ఇంద్రపక్షమున) లబ్ధవిజయప్రసవః; లబ్ధ = పొందఁబడిన, విజయ = అర్జునుని, ప్రసవః = పుత్రుడుగాఁగల్గిన, రుచిపదం: రుచి = తేజస్సునకు, పదం = స్థానమైన, మహీ = నితోఽత్కృవము గల్గిన, మహేన్ద్రః= దేవేంద్రుడు, త్వయా = నీచేత, అత్యాజి = విడువబడెను, (ఇతి) = అని, కింనవిజ్ఞాయతే = తెలియబడలేదా యేమి? తప్పక తెలియబడినది. ప్రత్యర్థిదానవశతాఽఽహితచేష్టయా; ప్రత్యర్థి = శత్రువులైన, దానవ శత = వందలకొలది రాక్షసుల విషయమున, ఆహిత = చేయబడిన, చేష్టయా = చేష్టచే ననగా శత్రువులను నాశము చేయుట కనుకూలమైన పౌరుషముచే, అసౌ = ఇతడు, కస్య = ఎవ్వనికి, జీమూతవాహనధియం = మేఘవాహనుడనుబుద్ధిని ననగా నింద్రుడను బుద్ధిని, నకరోతి = చేయడు? అనగా తప్పక చేయగలడు.

**సమాసములు :**

(నలపక్షమున) అత్యాజిలబ్ధవిజయప్రసవః :— అత్యంతాః, ఆజయః= అత్యాజయః అత్యాజిషు లబ్ధః = అత్యాజిలబ్ధః, విజయఏవప్రసవః = విజయప్రసవః, అత్యాజిలబ్ధః విజయప్రసవః, యస్యసః = అత్యాజిలబ్ధ విజయప్రసవః.

రుచిపదం:- రుచేః, పదం = రుచిపదమ్.

మహీమహేన్ద్రః :- మహ్యాః, మహేన్ద్రః = మహీమహేన్ద్రః.

ప్రత్యర్థిదానవశతాఽఽహితచేష్టయా :- అర్థిషు, అర్థిషు, విషయే = ప్రత్యర్థి దానస్యవశతా = దానవశతా, ప్రత్యర్థి, దానవశతా = ప్రత్యర్థి

ప్రసన ర్థిదానవశతా, ప్రత ర్థి దానవశతయా హితా = ప్రత్యర్థిదానవశ తాఒఒహితా, ప్రత్యర్థిదానవశతాహితాచసా, చేష్టాచ = ప్రత్యర్థిదాన వశతాహితచేష్టా, తయా = ప్రత్యర్థిదానవశతాహితచేష్టయా.

జీమూతవాహనధియం :- జీమూతవాహనఇతిధీః = జీమూతవాహనధీః. తామ్ = జీమూతవాహనధియం.

(ఇంద్రపక్షమున) లబ్ధవిజయప్రసవః :- విజయ, ఏవ, ప్రసవః = విజయప్రసవః = విజయప్రసవః, లబ్ధః, విజయప్రసవః, యేనసః = లబ్ధవిజయప్రసవః.

రుచిపదం :- రుచీనాం, పదం = రుచిపదం,

మహీ :- మహః, అస్యాఅస్తీతి = మహీ

జీమూతవాహినధియం :- జీమూతః, వాహనం, యస్యసః = జీమూత వాహనః, జీమూతవాహనఇతి, ధీః, యస్యస, = జీమూతవాహనధీః, తామ్ = జీమూతవాహనధియమ్

**భావము :**

(నలపక్షమున) (ఓ దమయన్తీ) గొప్ప యుద్ధములయందు విజయమును ఫలమును సంపాదించినవాడును, నీయెడ ననురాగము గల్గినవాడను, భూలోక మునకు ఇంద్రుడైన నలమహారాజును నీవు దెలిసికొనలేదా యేమి? యాచకుల విషయమున దాననిష్ఠ గల్గిన యాతని త్యాగము, ఆతనియందు జీమూతవాహను డను మహాదానపరుని బుద్ధినిగల్గించదాయేమి? అనగా తప్పకకల్గించునని యాశయము. జీమూతవాహనుడను విద్యాధరరాజు నాగానంద నాటకమునందు గరుడునికాహారముగా నేర్పడిన శంఖచూడ డను సర్పమునకు బదులు తాను ఆహారమై యాతనిని రక్షించెననెడి గాథ యిట నను సంధేయము. 27

(ఇంద్రపక్షమున) ఓ దమయన్తీ! అర్జునుని పుత్రునిగా బడసినవాడై పరాక్రమములకు స్థానభూతుడై, నిత్యోత్సవము నుం బడయుచున్నవాడై, నీచే వ[illegible] దేవేంద్రుమ నీవు తెలియవా యేమి? తప్పక నీవు తెల్గి

యును. ఇతడు శత్రువులైన రాక్షసులను పదివేలకొలది మందిని సంహరించెడి పౌరుషముచే మేఘవాహనుడనగా నింద్రుడను బుద్ధి నెవ్వరికిఁ గల్గింపడు. అంద ఱికిని కల్గించునని యాశయము.

ఇంద్రపక్షమున ఇతడు ఇంద్రుడుగా నిశ్చయింపదగినవాడు. అర్జునుని కుమారునిగాఁ బొంది వంశ విస్తరణమును సంపాదించుకొనినవాడు. లేదా జయ న్తుడనుఁ బుత్రుని గలవాడు. ఇతడు, రుచిపదం = తేజస్సులకు, స్థానమైన వాడు. మహీ = ఉత్సవములు గలవాడు మఱియు నితడు ప్రత్యర్థి దానవశతా ఽఽహితచేష్టయా; ప్రత్యర్థిదానవ = శత్రువులగు రాక్షసుల విషయమున, అహిత = ప్రతికూలమగు చేష్టలచే, ఇంద్రబుద్ధి నెవ్వరికిని గల్గింపడు. లేదా- అయం = ఈ యింద్రుడు, త్వయా = నీచే, కిమ్ = ఏల, అత్యాజి = విడవఁ బడెను. అయం = ఇతడు, విజ్ఞాయతేన? = విజ్ఞుడువలె నాచరించుట లేదా? తప్పక విజ్ఞుడే. అట్లే రుచిపదం = కాంతికి స్థానము, న = కాడా? మహీన = ఉత్సవవంతుడు కాడా? ఇటువంటి వానినిఁ బరిత్యజించుటలో గారణము తెలియుట లేదు- మహేన్ద్రుడు నీచేఁ దెలియబడియే విడువఁబడెను. కాన నీవు చేసినది యుక్తమే? లబ్ధవిజయప్రసరః: లబ్ధ = పొందఁబడిన, వి = గరుడపక్షితో (అమృతముఁ దెచ్చునపుడు) జయప్రసరః = జయము యొక్క అధిక్యము గల వాడు - అనగా గరుడునిచే నోడింపబడినవాడని యర్థము. అట్లే అరుచిపదం = అననురాగమునకు స్థానము. అట్లే నమహీ = ఉత్సవరహితుడు. ఏల యనగా నెల్లప్పుడును నతనికి రాక్షస భయము. అట్టి మహేన్ద్రుడు నీకుఁ దెలి యదా యేమి? అనగా తెలియబడినవాడే యని యర్థము. లేదా అత్యాజిలబ్ధవిజయ ప్రసరః; అత్యాజి = గొప్పయుద్ధముల యందు, లబ్ధ = పొందబడిన, వి = గరుడపక్షితో, జయప్రసరః = విజయవ్యాప్తి గలవాడని యు నర్థము. గరుడుని తల్లియగు వినత సవతిరాలిచే నోడింపఁబడి యామెకు దాసి గావింపబడినది. అపుడామె పుత్రుడు గరుడుడు స్వర్గమునకుఁ బోయి యింద్రునితో యుద్ధము జేసి యాతని జయించి యమృతముఁదెచ్చి తల్లిని దాస్యము నుండి విడిపించెనను పురాణగాథ యిట నను సంధేయము.

శ్లో॥ యేనామునా బహువిగాఢ సురేశ్వరాధ్వ
రాజ్యాభిషేక వికసన్మహసా బభూవే.
ఆవర్జనం తమనుతే నను సాధు నామ
గ్రాహం మయా నలముదీరిత మేవమత్ర॥ 28

ప॥వి॥ యేన - అమునా - బహువిగాఢసురేశ్వరాధ్వరాజ్యాభిషేక వికసన్మ హసా - బభూవే - ఆవర్జనం - తమ్ - అను - తే - నను - సాధు- నామగ్రాహం - మయా - నలమ్ - ఉదీరితమ్ - ఏవమ్ - అత్ర.

అర్థము :- (నలపక్షమున) యేన = ఏ, అమునా = ఈనలునిచే, బహువిగాఢ సురేశ్వరాధ్వరాజ్యాభిషేక వికసన్మహిమా, బహు = అధికముగా, విగాఢ = అత్యస్తమైన, సురేశ్వర = ఇంద్రులయొక్క. అధ్వ = లోకరక్షణరూపమైన మార్గముగల, రాజ్య = రాజ్యమునందు, అభిషేక = అభిషేకముచే. వికసత్ = వికసించు. మహసా = ఉత్సవములుగల వాడుగాగాని. లేదా తేజస్సులుగలవాడుగా గాని, బభూవే= ఉండఁబడుట యేర్పడినది అత్ర = ఈ సభయందు, మయా = నాచే. నామగ్రాహం =పేరెత్తి. ఏవం = ముందు చెప్పిన ప్రకారముగా, ఉదీరితం = చెప్పఁ బడిన, నలం = నలుడను పేరుగన, తం = వానిని, అను = అనుస రించి, అనగా లక్ష్యమునందుంచుకొని, తే = నీయొక్క, ఆవర్జనం = ఆకర్షణ, సాధునను = యుక్తముగదా! ఇతడే సత్యనలుడు వీనిని వరిం చుట యుక్తమే యని యర్థము.

(అగ్నిపక్షమున) యేన = ఏ, అమునా = ఈఅగ్నిచే, బహువిగాఢ సురేశ్వరాధ్వరాజ్యాభిషేక వికసన్మహసా, బహు = అధికముగా, విగాఢ = పిలువబడిన, సురేశ్వర = ఇంద్రుడుమున్నగు దేవతలుగల్గిన అధ్వర = యాగములందు ఆజ్య = ఘృతములను, అభిషేక = లోపల పోయుటవలన, వికసత్ = వర్ధిల్లు, మహసా = తేజస్సుగలవాడుగా,

బభూవే = ఉండబడుట (కలదు) అత్ర = ఈ సభయందు. మయా = నాచే, నామగ్రాహం = పేరెత్తి, ఏవం = ముందుచెప్పిన ప్రకారము, ఉదీరితం = చెప్పఁబడిన, అనలం = అగ్నిదేవుని, అను = అనుసరించి యనగా లక్ష్యము గావించుకొని, తే = నీయొక్క, ఆవరవం = ఆకర్షణ, సాధునను = యుక్తమేగదా,

**సమాసములు :**

(నలపక్షమున) బహువిగాఢసురేశ్వరాధ్వరాజ్యాభిషేక వికసన్మహసా :- బహు విగాఢః = బహువిగాఢః. సురేశ్వరస్య, అధ్వా = సురేశ్వరాధ్వా. బహువిగాఢః, సురేశ్వరాధ్వా, యస్మిన్ తత్ = బహువిగాఢసురేశ్వ రాధ్వ. బహువిగాఢసురేశ్వరాధ్వ, చ, తద్, రాజ్యంచ = బహువిగాఢ సురేశ్వరాధ్వరాజ్యం, బహువిగాఢ సురేశ్వరాధ్వరాజ్యే, అభిషేకః = బహువిగాఢసురేశ్వరాధ్వరాజ్యాభిషేకః, బహువిగాఢసురేశ్వరాధ్వరాజ్యా భిషేకాత్, వికసంతి, మహాంసి, యస్యసః = బహువిగాఢసురేశ్వరాధ్వ రాజ్యాభిషేకవిక సన్మహాః. తేన = బహువిగాఢసురేశ్వరాధ్వ రాజ్యాభి షేక వికసన్మహసా .

నామగ్రాహం :- నామ, గృహీత్వా = నామగ్రాహమ్.

(అగ్నిపక్షమున):-బహువిగాఢసురేశ్వరాధ్వరాజ్యాభిషేకవికసన్మహసా: బహు, విగాఢాః, = బహువిగాఢాః సురేశ్వరాః, యేషుతే = బహువిగాఢ సురేశ్వరాః, బహువిగాఢసురేశ్వరాశ్చతే, అధ్వరాశ్చ = బహువిగాఢ సురేశ్వరాధ్వరాః బహువిగాఢసురేశ్వరాధ్వరేషు అజ్యాని = బహువిగాఢ సురేశ్వరాధ్వరాజ్యాని, బహువిగాఢసురేశ్వరాజ్యానామభిషేకః = బహు విగాఢ సురేశ్వరాధ్వరాజ్యాభిషేకః. బహువిగాఢ సురేశ్వరాధ్వరాజ్యా భిషేకేన, వికసన్తి మహాంసి, యస్యసః = బహువిగాఢసురేశ్వరాధ్వ రాజ్యాభిషేక వికసన్మహాః. తేన = బహువిగాఢ సురేశ్వరాధ్వరాజ్యాభి షేక వికసన్మహసా

**భావము :**

(నలపక్షమున) ఈ నలుఁడు పెక్కు విధములుగా నత్యసమైన ఇంద్రుని లోకపాలన మార్గముగల రాజ్యమునందలి యభిషేకముచే నుత్సవమునుగాని

ప్రతాపములనుగాని వర్ధిల్లఁజేసికొనినవాడై యుండెను. ఈ సభయందు నాచే పేరెత్తి చెప్పఁబడిన నలుడను పేరు గల్గిన యాతనిని (గూర్చి నీకు ఆకర్షణ యుండుట యుక్తము గదా. కాన నితడే యాసత్యనలుడు. ఇతనిని వరించుట యుక్తము.

(అగ్ని పక్షమున) ఈ యగ్ని పలుమారు పిలువఁబడిన యింద్రాదులుగల యజ్ఞములయందు ఘృతములవలన దడుపబడినవాడై, వర్ధిల్లు తేజస్సు గల్గి యుండెను. ఈ సభయందు పేరు పెట్టి పిలువఁబడిన, అనలుడను పేరుగల యిత నిని(గూర్చి నీయాకర్షణ యుక్తముగదా ఇతడే సత్యనలుడు. వీనిని వరించుట యుక్తమని యర్థము. 28

శ్లో॥ యచ్చణ్డిమారణవిధివ్యసనఞ్చ తత్త్వం
బుద్ధ్వాఽశయాశ్రితమముష్య చ దక్షిణత్వం.
సైషా నలే సహజరాగభరాదముష్మిన్
నాత్మానమర్పయితుమర్హసి ధర్మరాజే. 29

ప॥వి॥ యత్ -చణ్డిమా – రణవిధివ్యసనం - చ - తత్ - త్వం – బుద్ధ్వా - ఆశయాశ్రితమ్ - అముష్య - చ దక్షిణత్వం - సా - ఏషా - నలే - సహజరాగభరాత్ - అముష్మిన్ - న - ఆత్మానమ్ - అర్పయితుమ్ - అర్హసి - ధర్మరాజే

అర్థము :- (నలపక్షమున) అముష్య = ఈ నలునియొక్క, చణ్డిమా = యుద్ధములయందు అధికమైన క్రోధ స్వభావము, రణవిధౌ = యుద్ధము చేయుటయందు, వ్యసనంచ = ఆసక్తియు, ఆశయాశ్రితం, ఆశయ = చిత్తమును, ఆశ్రితం = ఆశ్రయించిన, దక్షిణత్వం = దాక్షిణ్యము, ఇతియత్ = అనునదేదికలదో, తత్ = అదియంతయు, బుద్ధ్వా = విచారించి, సా, ఏషా = ఆ, యీ, త్వం = నీవు, అముష్మిన్ = ఈ, ధర్మరాజే = ధర్మమును ప్రధానముగా గల్గిన, నలే = నలునియందు,

సహజరాగభరాత్, సహజ = స్వభావసిద్ధమైన; రాగ = అనురాగము యొక్క, భరాత్ = అతిశయమువలన, ఆత్మానం = తన్ను, అర్పయితుం = అర్పించుకొనుటకు, నార్హాసి = అర్హురాలవుకావా? తప్పక అర్హురాలవే యని యర్థము,

(యమ పక్షమున) హేచణ్డి = ఒక్రోధస్వభావురాలా! అముష్య = ఈ యమునియొక్క, మారణవిధి వ్యసనంచ, మారణవిధి = చంపెడి కార్యమందలియాసక్తియు, ఆశయా = దిక్కనెడి కారణముచే, శ్రితం = పొందఁబడిన, దక్షిణత్వం = దక్షిణదిక్కున కధిపతియై యుండుటయును, తత్ సర్వం = అదియంతయు, తత్త్వం= యథార్థము, బుద్ధ్వా= దీనిని విచారించి, సైషా = ఆయా, (త్వం = నీవు) అనలే = నలుని కంటె భిన్నమైన, అముష్మిన్ = ఈ, ధర్మరాజే = యమధర్మరాజునందు, సహజరాగభరాత్ = సహజమైన రాగాతిశయము వలన, ఆత్మానం = తన్ను, అర్పయితుం = అర్పించుటకు, నార్హసికిం = అర్హురాలవు కావా యేమి?

**సమాసములు :**

(నలపక్షమున) రణవిధివ్యసనం :- రణస్య, విధిః = రణవిధిః, రణవిధౌ, వ్యసనం = రణవిధివ్యసనం.

చణ్డిమా :- చణ్డస్య, భావః = చణ్డిమా.

ఆశయాశ్రితమ్ :- ఆశయంఆశ్రితం = ఆశయాశ్రితం, తత్ = ఆశయాశ్రితమ్.

సహజరాగభరాత్ :- సహజశ్చాసౌ, రాగశ్చ = సహజరాగః, సహజరాగస్యభరః = సహజరాగభరః, తస్మాత్ = సహజరాగభరాత్.

ధర్మరాజే :- ధర్మప్రధానోరాజా = ధర్మరాజః, తస్మిన్ = ధర్మరాజే.

(యమపక్షమున) ;- మారణవిధివ్యసనం :- మారణస్య, విధిః, = మారణవిధిః. మారణవిధౌ, వ్యసనం = మారణవిధివ్యసనం.

అనలే :- ననలః = అనలః, తస్మిన్ = అనలే.

**భావము :**

(నలపక్షమున) యుద్ధాచరణమునందు అతనికి శత్రువుల ప్రాణములు తీయుటయే వ్యసనము. అనగా నతడు సమస్త శత్రువులను సంహరించునని యర్థము. అనగా నితనికి యుద్ధము చేయుట ఒక వినోదమని భావము. లేదా యాతనికి క్రూరకృత్యమే యుద్ధమునందు వ్యసనము. అట్టినీవు ఈతని మనస్సునందున్న దక్షిణత్వమును, సరళస్వభావమును, తెలిసికొనిగాని యాతని హస్తమున నెలకొనిన దాన శూరత్వమును, దెలిసికొనిగాని ధర్మసహితుడో లేక ధర్మముతో విరాజిల్లువాడోయగు నీనలునియందు సహజమగు ననురాగాతిశయము వలన నీ యాత్మను నర్పించుటకు తగియున్నావు. శూరత్వ - దాతృత్వ-ధార్మికత్వాదు లతనియందమరి యుండుటవలన నితడు నీకు వరణీయుడు. 29

(యమపక్షమున) :- ఓ కోపశీలురాలవగు దమయన్తీ! ఈ యముని యొక్క మారణ వ్యాపారాసక్తిని, దక్షిణ దిగ్వాసమును, తెలిసికొని నీవు నలభిన్నుడును, నలసదృశునగు నీ ధర్మరాజునందు ననగా యముని యందుసహజానురాగముతో కలియనర్హురాలవు. సమస్త జీవరాశి ప్రాణము లతని కధీనములు. దక్షిణ దిక్కున కధిపతి కాన నాదరింప దగినవాడు. నలునికంటె నితరుని పేరును వినినంతటనే కోపించు స్వభావము గల్గుటచే చణ్డియైన యో దమయన్తీ! ఎల్లప్పుడు సమస్త ప్రాణుల ప్రాణములను హరించుట యను వ్యసనమే యితని దోషము. దిక్కుచే దక్షిణుడు, కపటముచే సరళత్వమును, నుదారత్వమును నితడు సంపాదించెను. ఈ విషయములను, దెలిసికొని నీవు నలునికంటె భిన్నుడైన యీతనియందు నాత్మను నర్పించుట తగదు. ఈతనియందు నీకు అసహజరాగభరము అనగా సహజానురాగము లేదు కాన నందువలనను నితడు వరింపదగడని యాశయము. 29

శ్లో॥ కిం తే తథా మతి రముష్యయథాఽఽశయః స్యాత్
త్వత్పాణిపీడన వినిర్మిత యేన పాశః.
కాన్మానవానవతి నో భువనం చరిష్ణు
ర్నాసావముత్ర స రతా భవతీతి యుక్తమ్॥ 30

ప॥వి॥ కిం - తే - తథా - మతిః - అముష్య - యథా - ఆశయః - స్యాత్ - త్వత్పాణిపీడనవినిర్మితయే - అనపాశః - కాన్ - మానవాన్ - అవతి - నో - భువనం - చరిష్ణుః - న - అసౌ - అముత్ర - న - రతా - భవతి - ఇతి - యుక్తమ్.

అర్థము :- (నలపక్షమున) హేవత్సే = ఓ బిడ్డా!, త్వత్పాణిపీడనవినిర్మితయే; త్వత్ = నీయొక్క, పాణిపీడనవినిర్మితయే = పాణిగ్రహణమును చేయుటకొఱకు. అనపాశః = అభిలాషతో గూడిన, తే = నీయొక్క, మతిరపి = బుద్ధియు, తథా = అట్లే అనపాశా = అభిలాష సహితమైనదిగా, స్యాత్ కిం = అగునా యేమి? అభిలాషతో గూడినదైనదో నది యుక్తమే యని యర్థము. అసౌ = ఈ నలుడు, భువనం = లోకమును, చరిష్ణుస్సన్ = సంచారశీలమైనవాడగుచు, కాన్ = ఏ, మానవాన్ = మనుష్యులను, నోఅవతి = రక్షింపడు? అనగా నందఱిని రక్షించుననియే యర్థము. భవతీ = నీవు, అముత్ర = ఈ నలునియందు, రతా = అనురక్తురాలవు, నఇతి = కాకయుండుట, నయుక్తం = తగినదికాదు. ఇటువంటి పురుషునియందెల్లప్పుడును ననురక్తురాలవై యుండవలయునని యాశయము.

(వరుణ పక్షమునందు) అముష్య = ఈ వరుణునికి సంబంధించిన, శయః = అరచేయి, త్వత్పాణిపీడనవినిర్మితయే, త్వత్ = నీయొక్క, పాణిపీడన = పాణిగ్రహణముయొక్క, వినిర్మితయే = నిర్మాణమునకు, నపాశః = పాశాయుధము లేనిదిగా, యథా = ఎట్లు, స్యాత్ = అగునో తథా = అట్లు కావలయునని, తే = నీకు, మతిఃకిం = బుద్ధియున్నదా యేమి? మానవాన్ = మానముగల్గిన, ననగా నున్నతచిత్తము గల్గిన,

అసౌ = ఈ వరుణుడు, భువనం = ఉదకమును, చరిష్ణుః = జలరూప ముతో(దిరుగ(దలచినవాడై, కాన్ = ఎవ్వరిని, నోఅవతి = రక్షింపడు. జలమేయందఱికిని జీవనధారముగాన నితడు జలరూపుడై యందరిని రక్షించునని యర్థము. అముత్ర = ఈ వరుణుని యందు, నరతా = మానవత్వము ( నలత్వము ) నభవతి = ఉండదు, ఇతి = అనునది, యుక్తమ్ = యుక్తము. ఏలయనగా నితడు దేవ జాతికి(జెందినవాడు. లేదా, నః = మనయొక్క, భువనం = భూలోక మును, చరిష్ణూన్ = సంచరించు, మానవాదులను, కాత్ = జీవనహేతు వగునుదకము వలన, రక్షతి = రక్షించుచున్నాడు.

## సమాసములు :

త్వత్పాణిపీడనవినిర్మితయే :- తవ, పాణిః, త్వత్పాణిః, త్వత్పాణేః, పీడనం = త్వత్పాణిపీడనం, త్వత్పాణిపీడనస్య, వినిర్మితిః = త్వత్పాణి పీడదన వినిర్మితిః, తస్యై = త్వత్పాణిపీడన వినిర్మితయే.

అనపాశః :- అపగతా, ఆశా, యస్మాత్సః ఆపాశః. ఆపాశో, నభవ తీతి = అనపాశః.

నపాశః :- నపాశః, యస్యసః = నపాశః.

నరతా :- న,రతా = నరతా, లేదా( నరస్య, భావః = నరతా,

## భావము :

(నలపక్షమున) ఈ నలుని నీ పాణిగ్రహణ విషయమున నభిలాషగల వానినిగా నీవు చేయగలవు గదా! ఈ నలుడు లోకములయందు సంచరించుచు మానవుల నెవ్వరిని రక్షింపడు? తప్పక రక్షింపగలడని యర్థము. లేదా మాన వంతుడగు నలుడెవ్వని రక్షింపడు. కావున నీ నలునియందు నీవు రతిలేనిదాన వగుట యుక్తము కాదు. కాన నీవితనియందు ననురక్తురాలవు కమ్ము. ఇతడు పురుషశ్రేష్ఠుడు. కాన నితనియందు పురుషశ్రేష్ఠత్వము యుక్తము. కాని యిత రులగు వారియందిది యుక్తము కాదు. కాన పురుషశ్రేష్ఠుడగు నితనియందు నీవు అనురక్తురాలవై యుండుట యుక్తము.

(వరుణపక్షమున) — ఈ వరుణుని అరచేయి యెట్లు నీ పాణిగ్రహణ మునందు పాశాయుధరహితముగా నుండవలయునో అట్లు నీవు కోరిక యున్నదా? పాశాయుధమును వదలి నీ పాణిగ్రహణము నతడు చేయవలయునని యర్థము. నీ పాణిగ్రహణము కొఱకు నతనికి హస్తమే యుండునగాని పాశముండదని యర్థము. లేదా నీ పాణిగ్రహణమును ఇతడు ఉదకము నందు (పడవ మున్నగు వానితో) సంచరించు మనుష్యులను నెవ్వరిని రక్షింపడు? అనగా తప్పక రక్షించునని యర్థము. భూమియందు సంచరించు మనలను ఉదకములచే నతడు రక్షించును. ఇతనియందు నీవు అనురక్తురాలవు కాకయుండుట యుక్తము గాదు. ఇతనియందు నరతా = మనుష్యత్వము, నభవతీ = లేకయుండుట యుక్తము. అనగా నితడు దేవుడని యర్థము. లేదా ఇతనియందు నరతా = నరత్వము లేద నుట యుక్తము. అందువలన నితడు, నా, న = పురుషుడు కాడు. కాననితని యందు ననురక్తురాలవగుట యుక్తము గాదు. ఇత్యాది వ్యాఖ్య ఊహ్యము.

శ్లో॥ శ్లోకాదిహ ప్రథమతో హరిణా ద్వితీయా
ద్ధూమధ్వజేన శమనేన సమం తృతీయాత్.
తుర్యాన్నలస్య వరుణేన సమానభావం
సా జానతీ పునరవాదీ తయా విముగ్ధాః 31

ప॥వి॥ శ్లోకాత్ - ఇహ - ప్రథమతః - హరిణా - ద్వితీయాత్ - ధూమధ్వజేన - శమనేన - సమం - తృతీయాత్ - తుర్యాత్ - నలస్య - వరుణేన - సమానభావం - సా - జానతీ - పునః - అవాది - తయా - విముగ్ధా.

అర్థము :— ఇహ = ఇచ్చటి నాలుగు శ్లోకముల యందు, ప్రథమతః = మొదటి శ్లోకమువలన, హరిణాసమం = ఇంద్రుని తోడను, ద్వితీయాత్ శ్లోకాత్ =

రెండవ శ్లోకమువలన, ధూమధ్వజేన = అగ్నితోడను, తృతీయాత్ శ్లోకాత్ = మూడవ శ్లోకమువలన, శమనేనసమం = యముని తోడను, తుర్యాత్శ్లోకాత్ = నాల్గవ శ్లోకమువలన, వరుణేన సమం = వరుణుని తోడను, నలస్య = నలునకు, సమానభావం = సామ్యమును, జానతీ= తెలిసికొనుచు (కావుననే), విముగ్ధా= విశేషముగా మూఢురాలైన, సా= ఆ దమయన్తి, అవాది = చెప్పఁబడినది.

**సమాసములు :**

ధూమధ్వజేన :- ధూమః, ధ్వజః, యస్యసః = ధూమధ్వజః తేన = ధూమధ్వజేన.

సమానభావం :- సమానః, భావః, యస్యసః = సమానభావః, తమ్= సమానభావమ్.

**భావము ;**

ఈ సర్గయందు 27-28-29-30 శ్లోకములలో మొదటిదైన 27వ శ్లోకముతో నలునకు నింద్రుని తోడను, రెండవదైన 28వ శ్లోకముతో నలునకు నగ్నితోడను, మూడవదైన 29వ శ్లోకముతో నలునకు యముని తోడను సమాన రూపమును తెలుసుకొనుచు, సత్యనలుని దెలుసుకొనజాలక కలతఁజెందిన దమయన్తితో సరస్వతీదేవి చెప్పినది. 31

శ్లో॥ త్వం యార్థినీ కిల నలేన శుభాయ తస్యాః
క్వస్యాన్నిజార్పణ మముత్ర చతుష్టయే తే.
ఇన్ద్రాగ్ని నలార్యమ తనూజపయః పతీనాం
ప్రాప్యైక రూపమిహ సంసది దీప్యమానే. **32**

ప॥వి॥ త్వం - యా - అర్థినీ - కిల - నలేన - శుభాయ - తస్యాః - క్వ - స్యాత్ - నిజార్పణమ్ - అముత్ర - చతుష్టయే - తే - ఇన్ద్రాగ్నినలార్యమ

...నూజపయఃపతీనాం - ప్రాప్య - ఐకరూప్యమ్ - ఇహ - సంసది -
దీప్యమానే.

అర్థము :- యా = ఏ, త్వం = నీవు, నలేన — నలుడను నిమిత్తముచే, అర్థినీకిల = అర్థించుదానవు గదా, తస్య = ఆతని నర్థించు, తే = నీకు, ఐకరూప్యం = నలుని సారూప్యమును, ప్రాప్య = పొంది, ఇహ = ఈ, సంసది = స్వయంవర సభయందు, దీప్యమానే = ప్రకాశించుచున్న, అముత్ర = ఈ, ఇంద్రానలార్యమతనూజపయఃపతీనాం; ఇంద్ర = ఇంద్రుడు, అనల = అగ్ని, అర్యమతనూజ = సూర్యపుత్రుడైన యముడు, పయఃపతీనాం = వరుణుండను వీరి, చతుష్టయే = నలుగురి మధ్య, క్వ = ఎవనియందు, నిజార్పణం = ఆత్మను సమర్పించకొనుట యనగా వరించుట, శుభాయ = శుభమునకు, స్యాత్ = అగును? వీరిలో నెవ్వరియందు నీవు ఆత్మను సమర్పించినను నీకు శుభము చేకూరదని యర్థము. ఏలయనగా నీ నలుగురును నలరూపమును ధరించినవారే గాని వారిలో వాస్తవమైన నలుడెవ్వడును లేడు, కాన వారియందు నీ ప్రార్థన సఫలము కాదని యర్థము.

పక్షాంతరమున :- ఐకరూప్యం = నలునితో సారూప్యమును, ప్రాప్య = పొంది, ఇంద్రానలార్యమతనూజపయఃపతీనాం = ఇంద్రాగ్ని యమవరుణుల యొక్క, చతుష్టయే = చతుష్టయము, దీప్యమానేసతి = ప్రకాశించు చుండగా, అముత = ఈ నలునియందు, నిజార్పణం = తన్ను సమర్పించుకొనుట, క్వ = ఎందువలన, శుభాయ = శుభమునకు సాధనముగా, స్యాత్ = అగును? అనగా కానేరదనియే యర్థము ఇంద్రాదులను సంతోషపఱచక నీవు నలుని వరించుట శుభకరమైనది గాదని యర్థము, ఈ విధముగా రెండు అర్థములతో క్రమముగా నలప్రాప్తియందు నైరాశ్యము మున్నగువానిచే దమయన్తిని సరస్వతీదేవి బాధపెట్టెనని సారాంశము.

సమాసములు :

అర్థినీ :- అర్థయతీతి = అర్థినీ.

నిజార్పణమ్ ,- నిజంచ, తత్, అర్పణంచ = నిజార్పణం.

చతుష్టయే :- చతుర్ణాం, సమూహః = చతుష్టయమ్, తస్మిన్ = చతుష్టయే.

ఇంద్రాఽనలార్యమతనూజపయఃపతినాం :- అర్యమ్ణః, తనూజః = అర్యమతనూజః. పయసాం, పతిః=పయఃపతిః. ఇంద్రశ్చ, అనలశ్చ, అర్యమతనూజశ్చ, పయఃపతిశ్చ = ఇంద్రానలార్యమతనూజపయః పతయః, తేషాం = ఇంద్రానలార్యమతనూజపయఃపతీనాం.

ఐకరూప్యమ్ :- ఏకం, రూపం, యస్యసః = ఏకరూపః, ఏకరూపస్య భావః = ఐకరూప్యమ్, తత్ = ఐకరూప్యమ్.

భావము :

మరల సరస్వతీదేవి దేవతలయందలి దాక్షిణ్యముచే దమయంతిని శ్లేష భంగిచే రెండు శ్లోకములయందు తికమక పట్టించుచున్నది. ఓ దమయంతీ! నీవు నలుని నిమిత్తీకరించుకొని వాని ప్రార్థనతో వెతచెందుచున్నావు. ఈ స్వయంవర సభయందు నలసారూప్యమును బొంది ఇంద్రాగ్నియమవరుణులు ఆసీనులై యున్నారు. వీరిలో నెవ్వనియందు నిన్ను వరించుకొందువు? ఏలయనగా వీరందరు నలుని రూపమును ధరించినవారే గాని వారిలో నెవ్వడును వాస్తవిక నలుడు కాడు. కాన నలునుద్దేశించి చేయు నీ ప్రయత్నము సఫలము కాదు.

పక్షాంతరమున :— నలుని రూపము ధరించి స్వయంవర సభయందు ఇంద్రాగ్నియమవరుణులాసీనులై ప్రకాశించుచుండగా నలునియందు నిన్నర్పించుకొనుట నీకు మేలును జేకూర్చదు. కాన వారిని సంతోషపరచవలయును. ఇట్లు నలప్రాప్తియందు నైరాశ్యము నున్నగు వానిచే సరస్వతీదేవి దమయంతిని వేధించినది.

శ్లో॥ దేవః పతిర్విదుషి నైషధరాజగత్యా
నిర్ణీయతే న కిము న వ్రియతే భవత్యా.
నాయం నలః ఖలు తవాతిమహానలాభో
యద్యేనముజ్ఝసి వరః కతరః పునస్తే. 33

ప్ర॥ దేవః - పతిః - విదుషి - న - ఏషః - ధరాజగత్యాః - నిర్ణీయతే - న - కిమ్ - ఉ - న - వ్రియతే - భవత్యా, న - అయం - నలః - ఖలు - తవ - అతిమహాః - నలాభః - యది - ఏనమ్ - ఉజ్ఝసి - వరః - కతరః - పునః - తే.

అర్థము :- (ఇంద్రపక్షమున) హేవిదుషి = నా మాటలలోని వైచిత్ర్యముఁదెలిసికొనఁ గల్గిన నేర్పరితనము గల యోదమయ స్త్రీ!, ఏషః = ఎదుటనున్న వ్యక్తి, ధరాజగత్యాః = భూలోకమునకు, పతిః = ప్రభువు; న = కాడు, కింతు = మఱేమనగా, దేవః = వేల్పు అనగా వీరు భూమిని పాలించువారు కారు. మఱేమనగా దేవతలని యర్థము. భవత్యా = నీచే, కిం = ఎట్లు, న వ్రియతే = వరింపబడుటలేదు? ఇతడే నీకు వరింపదగిన వాడు - "దేవ" శబ్దమునకు "దీవ్యతి" అనువ్యుత్పత్తి ననుసరించి క్రీడించువాడని యర్థము అనగా స్వర్గమున క్రీడించు నింద్రుడని యర్థము. ధరాజగత్యాః = వజ్రమునకు పతిః = పాలకుడగు నింద్రుడనియు నర్థము. ఇంద్రుడైనచో నలునివలె నేల యగుపడుచున్నాడనినచో - ఇతడు నిశ్చయముగా నలుడగుచున్నాడు. ఏలయనగా నితడు నలాభః = నలునికాంతివంటి కాంతి గలవాడు ఎందులకనగా నితడు; అతిమహాః = అతిశయించిన తేజస్సు గలవాడు. అందువలననే వరింపఁదగినవాడు లేదా - అయం = ఇతడు, నలః = నలమను పేరుగల గడ్డివలె నిస్సారమైన వస్తువు, నభవతి = కాడు. కాని మిక్కిలి బలవంతుడు. అందువల నన్ను వరింపదగినవాడు. ఇతనిని వరించినచో, తవ = నీకు, అతిమహా

నలాభః; అతి = అతిశయించి, నమహా = నందనవన క్రీడాద్యుత్సవ ములు, అన = జీవము మున్నగు వానియొక్క, లాభః = ప్రాప్తి (భవిష్యతి=ఉండగలదు) ఇంద్రుని వరించినచో, నందనవన క్రీడలు, అమృత పానము చేత మరణరాహిత్యము మున్నగువానిని పొందగలవు. లేదా, అతిమహానలాభః; అతి = అధికమైన, మహాన = చిరకాలపు జీవనము యొక్క, లాభః = ప్రాప్తి, భవిష్యతి = ఉండగలదు. ఏనం = ఇట్టి గుణములతో గూడిన వీనిని లేదా అ + ఇనం, అ=విష్ణువునకు జ్యేష్ఠసోదరుడుగా, ఇనం = శ్రేష్ఠుడైన, ఇంద్రుని, యదిఉజ్ఝసి = విడిచిపెట్టితివో, అప్పుడు, అన్యః = మఱియొకడు, కః = ఎవ్వడు, వరః = వరుడు, ఎవ్వడును లేడు, లేదా = ఏనం = వీనిని, యదిఉజ్ఝసి = విడిచిపెట్టితివో అప్పుడు, తవ = నీకు, కతరః = మఱియొకడెవ్వడు, వరః = ఇష్టుడు, భవేత్ = అగును? కింతు = కాని, యింకొకడు వరుడు గాక; నరః = శత్రువేయగును. లేదా ఏనం = వీనిని, యదిత్యజసి = వదలితివో, తర్హి = అప్పుడు; తవ = నీకు, పరః = వీని తర్వాతవాడైన యింకొకడు, కేన = గాలిచే, తరతి = ఈదును, కేన = నీటిచే శాంతిని బొందును, యః = ఏ, సః = వాడు, కతరః = అగ్ని. వరో భవతివా = వరుడు కావచ్చును, ఇచ్చట నింద్రత్యాగము గూడ సూచితము ఎట్లనగా — ఏషః = ఈ భూలోకమునకు రక్షకుడగు, దేవః = రాజు, నలః = నలుడు, నేతి = కాదని, నిర్ణీయ = నిశ్చయించి, తేన = నలత్వము లేదను కారణముచే, న్రవియతేకిము = ఇంద్రుడు వరింపబడడా యేమి? ఇది యుక్తమే, ధరాజగత్యాః; ధరాజ = ఇంద్రుడే, గత్యా = గతిగా గల్గిన శచీదేవికి, పతిః = పతి, దేవః = ఇంద్రదేవుడు అని, నిశ్చీయత ఇతిన = నిశ్చయింపబడలేదనుట లేదు. కాని నిశ్చయింపబడినదే. న్రవియతేకిము = వరింపబడవేదా యేమి; కొలదిపాటి సందేహమును తొలగించుటకు సరస్వతీదేవి యథార్థమును జెప్పుచున్నది.

అయం = (ఇతడు) నీకు సంబంధించినవాడై నీ మనస్సును రంజింప జేసెడి, అతిమహాన్ = గొప్ప తేజోవంతుడగు నలుడు కానేరడు. నీవు భావించినది యథార్థమే కాని యితడు, నలాభః = నలునివలె భాసించువాడు, కాని నలుడు కాడు, నలాకారము ధరించినందువలననే ఇతనికింతటి తేజస్సు. సహజముగ నితని కంతటి తేజస్సు లేదు. లేదా; ఎందువలన, అయం = ఇతడు, నలః = నలమనెడి గడ్డివలె నిస్సారుడో, అందువలన నలుడు మిక్కిలి తేజోవంతుడు కాడు. యద్యేనముజ్ఝసి = నీవు వీనిని వదలినచో, అప్పుడు తే=నీకు, కతరః; క=సుఖమునందు, తరః = తేలునట్టి. అనగా సుఖసాగరమున తేలునట్టి, నలః = నలుడే, వరః = వరణీయుడు, భవతి = అగును, లేదా, నైషధరాజగత్యా; నైషధరాజ = నలుడే గత్యా = జీవనోపాయముగా గల్గిన నీచేత, దేవః = ఇంద్రుడు, ననిశ్చీయతేకిమ్ = నిశ్చయింపబడడా యేమి? కాని నిశ్చయింపబడినవాడే యగును. ఏలయనగా పతిః = భర్తగా, నవ్రియతే = వరింపబడడు నీవు నలునియందనురక్తురాలవు. ఇంద్రుడని తెలిసికొనినచో నాతనిని భర్తగా వరింపవు. ఎందువలననగా - ఇతడు నలః = రాక్షసులచే నతిక్రమింప బడినందువలన నలమను గడ్డివలె నిస్సారుడు. యద్యేనముజ్ఝసి = వీనిని వదలిపోతివో, తవ = నీకు, లాభః = లాభము, న = లేదు, లేదా లాభోన? = లాభము లేదా? తప్పక లాభమున్నదని యర్థము.

(అగ్నిపక్షమునందు) :- ధరాజగత్యా, ధర = వాహనమైన, అజ = మేకగల్గిన అగ్నియే, గత్యా = శరణముగాఁగల్గిన ఆగ్నేయదిశకు, పతిః = పాలకుడైన, ఏషః = ఈయగ్ని, ననిర్ధీయతేన = వరింపబడడనుట లేదు అనగా తప్పక వరింపబడును. మర్త్యుని వరించుటకంటె నమర్త్యుని వరించుట శ్రేష్ఠము. తక్కినవి పూర్వముతో సమానములు.

(పక్షాంతరమున)—ధరాజగత్యా, ధర = వాహనమైన మేక. లేదా పర్వతమునకు సమానమైన మేకగల్గిన వానియొక్క గతితో, లేదా భూమి

ందు సంచరించునట్టి గతితోఁగూడిన వాఁడును, ఆహారపదార్థములనుఁ బచనము గావించుటచే లోకరక్షణముఁ జేయుటవలన, పతిః = పాలకుఁడును, దేవః = కాంతిమంతుఁడున వేల్పనఁదగు నగ్ని, నసిశ్చీయతేన = వరుడుగా నిశ్చయింపఁబడదాయేమి. తప్పక నిశ్చయింపబడుననియే యర్థము పరంతు = కాని, ఇంతటిగుణములు కలవాడని తెలిసియు నతడు వరింపబడడు కాని యగ్నియని తెలిసియే వరింపఁదగినవాడు. అగ్నియగుచో నలునివలెనేల ప్రకాశించుచున్నాడనినచో -ఇతడు నిశ్చయముగా నలుడుకాడు. కాని యతనికంటె మిక్కిలి తేజోవంతుడై, నీకు నలునివలె ప్రకాశించుచున్నాడు. కావుననే "నలాభః" యనుట సరిపడినది. అయం = ఇతడు, నలః = నీకు సంబంధించిన నలుడు, న = కాడు. కింతు = మఱేమనగా. అనలః = అగ్నియే, ఏనం = ఇట్టిగుణవంతుని యద్యుజ్ఝసి = వదలితివో, అప్పుడు అగ్నేః = అగ్నికంటె, పరః = శ్రేష్ఠుఁడైన, కః = ఎవ్వడు, తే = నీకు, వరః = వరింపఁదగినవాడగును. అతిమహాః = ఇంతటి తేజోవంతుడు మఱియొక్కడు, న = లేడు. అపితు = కాని, తవ = నీకు అభీష్టుడెవ్వడు - నకోఽపి = ఎవ్వడును లేడనియర్థము. కింతు = కాని, పరః = శత్రువేమిగిలిన వాడగును. ఇచ్చటగూడ నగ్నినిపరిహరించుట సూచితము అదెట్లనగా; అయం = ఇతడు, నా = మనుష్ుడు న = కాదు. కింతు = కాని, దరాజగత్యాః = ఆగ్నేయ దిక్కునకు, పతిః = పాలకుడగు, దేవః = దేవత యగునగ్ని, ఇతి = యని, భవత్యా = నీచేత, నిశ్చీయతే, కిం = నిశ్చయింపఁబడుచున్నదాయేమి? ఏలయనగా నీవు వరింపలేదుగదా. నీవు వాస్తవమైన విషయమునే నిశ్చయించితివి అయంతు = ఇతనో, నీ చిత్తమును రంజింపఁజేసెడి, అతిమహాః = మిక్కిలి తేజస్సు గల్గిన, నలః = నలుడు, న = కాడు. కాని, తదాభః = అతనియాకారము ధరించుటచే నలునికాంతివంటి కాంతి గలవాడు. అనగా నీ కాంతి సహాయముగా లేదా, నలాభః = నలుడను సిద్ధ విషయమును ప్రకాశ

ముగలవాడు. లేదా, ఇతడు నలమనుగడ్డిసిందగుల పెట్టుటయందే కాని రాక్షసులను సంహరించుటలో కాదని గానియర్థము.

లేదా, నైషధరాజగత్యా, నైషధరాజ = నలునే, గత్యా = శరణముగాంగల్గిన, భవత్యా = నీచే, ఏషః = ఈః, ప్రకాశించెడి అగ్ని, కిమునని ర్ణీయతే = అగ్నిగా నిర్ణయింపబడడా యేమి? ఎందువలన నీచే వరింపబడ లేదో యందువలన నగ్నిగానే నిర్ణయింపబడుచున్నాడని యర్థము.

లేదా ఇతడు నీకాంతుడై నలః = నలుడు, న భవతి = కానేరడు కాని రాక్షసులచే దిరస్కృతమగు తేజస్సుగలగడ్డి పోచతో సమానమైన వాడనియర్థము.

(యమపక్షమున) —ఏషః = ఈ, ధరాజగత్యా, ధరా = భూమిని అజ = కొమ్ములలతోగాని, గిట్టలతోగాని పైకెగురగొట్టునట్టి దున్నపోతుయొక్క, గత్యా = నడకతోను పలక్షింపఁబడిన, పతిః = పాలకుడగు, దేవః = ఆటలాడువాఁడును, వేల్పునునైన యముడు, ననిర్ణీయత ఇతిన = యముడుగా నిర్ణయింపఁబడలేదనుటలేదు. అనగా నిర్ణయింపబడెనని యర్థము. పరం = కాని, కిమునవ్రియతే = ఏలవరింపఁబడడు? లేదా, ఏషః = ఈ, దేవః = వేల్పైనయముడు, ధరాజగత్యా, ధరాజ = మహిషముతో, గత్యా = యమునిగతిగల్గిన దక్షిణదిక్కునకు, పతిః = పాలకుడు, న = కాడా? అపితు = కాని, భవత్యేవ = తప్పకకాగలడు. ఇతి = అని. కిమునవిర్ణీయతే = ఏలయముడుగా నిర్ణయింపఁబడడు. వరింపఁబడడు? కాని యముడుగా నిర్ణయింపఁదగినవాడు, వరింపఁదగినవాడనియు నర్థము.

లేదా, అతిమహాః = మిక్కిలితేజస్సుగల్గిన యితడు అనగా నలుడు నిశ్చయముగా, నలఃన = గహనముకాఁడు అనగా (నలగహనే) యని ధాత్వర్థమునకుసరించి గహనమైన వాడు కాదని యర్థము ధర్మమూష

డుగా నుండుటవలన మాత్రమితఁడు గహనమైనవాడే యనగా గ్రహింః నశక్యమైనవాడే ఏనం = వీనిని, యద్యుజ్ఝసి = వదలితివో, అప్పుడ తవ = నీకు, లాభః = లాభము, న = లేదు. పైగా హానియే యేర్ప డును యతః = ఏలయనగా, తవ = నీకు, పరః = ఇతనికంటె భిన్నమైనవాడును శ్రేష్ఠమైనవాడును, కతరః = ఎవ్వడు, వరః = వరుడు? ఎవ్వడునులేడని యర్థము.

లేదా. అయం = ఇతడు. నలః = నలుడు. న = కాడు. కింత = కాని. తవ = నీకు. అతిమహానలాభః; అతిమహా = మిక్కిలి యధికములైన. అన = ప్రాణములయొక్క లాభమునుఁ గల్గించు వాడని యర్థము. అనగా సమస్తములగు జంతువులయొక్క ప్రాణము ఇతనికిలోఁబడినవి. కాననితనిని వరించితివో చిరకాలము నీవు జీవింప గలవు

లేదా. అతిమహానలాభః; అతిమహా = ఇతడుధర్మరూపుడు గాన యధికమైన పూజను కలవాడై, అనలాభః = అగ్నితో సమానమగు కాంతిగలవాడు, యదేనయుజ్ఝసి = వీనిని వదలితివో అప్పుడు, తవ = నీకు, వరః = శ్రేష్ఠమైన యనగా యమునికంటెను నధిక మైన, పరః = శత్రువు కతరః = ఎవ్వడు? ఇతడే నీకు గొప్ప శత్రువగునని యర్థము. మఱియు కతరః; క = నీటియందు. తరః = దాటేవాడగుటవలననో. క = జలములుగా. తర = పాఱుచుండుట వలననో. క తరుడగు వరుణుడు, వరః = వరణీయుడు (కాగలడు) ఇచ్చుటయముని త్యాగము సూచితము.

లేదా. ఏషః = ఇతడు, ధరాజగత్యాః = దక్షిణదిక్కునకు, పతిః = పాలకుడగు, దేవః = వేల్పైన, యమోన = యముడుగాడా? అపితు = కాని, యముడేయని, న నిశ్చీయతే కిం = నిశ్చయింపబడదా యేమి? (తతః = ఆ కారణమువలన) న ప్రివ్రియతేకిము = వరింప బడదాయేమి? ధర్మరాజను బుద్ధిచే యమునేవుడు తప్పక నిర్ణయింపఁ

బడును. (కావుననే) పతిః = భర్తగా, న వ్రియతే కిమ్ = వరింపఁ బడడాయేమి యనిగాని యన్వయము—

లేదా, ఇతడు రాక్షసులచే నాక్రమింపఁబడిన తేజస్సుగలవాడైన, నలః = పితృదేవుడగు, యమః = యముడు, న = కాడా? కాని, యముడే. పరంతు = కాని, తవ = నీకు, నలాభః = (నలునియాకారమును ధరించుటవలన) నలునివలె ప్రకాశించుచున్నాడు. యద్యేనముజ్ఝసి వీనిని = వదలితివో అప్పుడు, పరః = శ్రేష్ఠుడైన, నలః = నలుడు, వరః = వరుడుగా (గాగలడు.)

(వరుణపక్షమున) ;- ఏషః = ఇతడు, ధరాజగత్యాః = భూలోకమునకు, పతిః పాలకుడు, న = కాడు, కింతు = కాని, పాతాలమునకు పాలకుడు. దేవః = కాంతిమంతుడును. వేల్పునునైన యీ వరుణుడు, కింననిశ్చీయతే = వరుణుఁడని నిశ్చయింపఁబడడాయేమి? కిం న వ్రియతే = వరింపఁబడడాయేమి? అయం = ఇతడు, నలః = నలుడు న = కాడు. కింతు = కాని, అతిమహాః = (నలునివలె) గొప్పకాంతి గలిగినవాఁడు, తవ = నీకు, నలాభః = నలుని వంటికొంతికలవాడుగా, భాతి = ప్రకాశించుచున్నాడు. యద్యేనముజ్ఝసి = వీనినిఁబరిత్యజించితివో. అప్పుడు, పరః = వీనికంటెనితరుడును, శ్రేష్ఠుడునగువాడు, కః = ఎవ్వఁడో, తవ = నీకు, వరః = వరింపఁదగినవాడు, భవతి = ఉండును. అపితు = కాని, ఇట్టివాఁడు మఱియొక్కడు లేడు.

లేదా; ధరాజగత్యాః; ధరాజ = భూమియందుఁ బుట్టిన స్థావరజంగమములగు ప్రాణులకు, గత్యాః గతియైన జలమునకుననగా జీవనోపాయమైన జలమునకు, పతిః = పాలకుడు, న = కాడా? అపితు – కాని, జలపతియుగు వరుణఁదేవుడు, కింననిశ్చీయతే = వరుణుఁడని గుర్తింపఁబడలేదా? కాని యీ విధముగా గుర్తింపఁదగినవాడును, వరింపఁగిన వాడును, నైయున్నాడు.

లేదా - అతిమహానలాభః; అతిమహ = మిక్కిలి పూజ్యుడైన; అనల = అగ్నికి; అభః = కాంతిరాహిత్యమును గల్గించువాడు! అనగా నీటిచే నగ్ని చల్లారును గదా, ఏలయనగా - వరుణుడు జలరూపుడు గదా! యద్యేనంత్యజసి = వీని వదలిపోతివో; తవ = నీకు; వరః = శ్రేష్ఠుడైన; పరః = శత్రువు; కః = ఎవ్వడు, అపితు = కాని, అయమేవ = ఇతడే, శత్రుః = శత్రువు.

లేదా - ధరాజగత్యాః; ధర = ప్రపంచములను ధరించుటచేఁ పోషకుడు, అజ = జన్మములేని శ్రీమహావిష్ణువునకు, గత్యాః = మొదటి స్థానమైన జలమునకు, పతిః = పాలకుడు, న = కాడా? కాని, తత్పతిః = ఆ జలమునకు పాలకుడైన వరుణుఁడు, కింననిర్ణీయతే = గుర్తింపబడడా యేమి? తప్పక గుర్తింప, బడగలడు. త్వం = నీవు, ఏనం (అ + ఇనం) అ = విష్ణువును, ఇనం = స్వామిగా గల్గిన భక్తుడగు వరుణుని, యద్యుజ్ఝసి = వదలితివో, తవ = నీకు, లాభః = లాభము, న = లేదు. కింతు = కాని, హానిరేవ = హానియే జరుగును. అందువలన, తవ = నీకు, కతరఏవ = వరుణుడే, పరః = శ్రేష్ఠుడైన, వరః = వరుడు, ఇచ్చట గూడ వరుణుని త్యాగము సూచితము- ఎట్లనగా, ఏషః = ఇతడు, ధరాజగత్యాః = పూర్వము చెప్పబడిన ప్రకారము ఉదకమునకు పడమటి దిక్కునకుఁగాని, పతిః = పాలకుడైన, వరుణఃదేవః = వరుణదేవుడు, న = కాడా?. అపితు = కాని, యతదనియతే, నిశ్చీయతే కిము = నిర్ణయింపబడునా యేమి? కాని నిశ్చయింపఁబడును, యతః = ఎందువలన, నలః = నలుడు, న = కాడు, లేదా-యద్యేనముజ్ఝసి = వీనిని వదలితివో, తవాఽపి = నీకును, అతిమహానలాభః; అతిమహ = మిక్కిలి గొప్పదైన, అన = ప్రాణములయొక్క, లాభః = లాభము అనగా జీవితము గలదానవుగా నయ్యెదవు. యస్మాత్ = ఎందువలన, తే = నీకు, సుఖసముద్ర రూపుడైన, నలః = నలుడు, వరః = వరుడుగా భవితా = కాగలడు. నలప్రాప్తి యైనప్పుడే నీకు జీవితము, కానిచో లేదని యాశయము.

లేదా - అయం = ఇతడు, తవ = (నీవు ప్రార్థించుటచే) నీకు సంబంధించిన, నలోనఖలు = నలుడు కాడుగదా, కింతు = కాని, అతిమహాః = మనుష్యులకంటె గొప్పతేజస్సు గల్గిన, నలాభః = నలునకు సమానుడు అనగా వీరందఱు నలులుకారు. కాని నలతుల్యులు అనియర్థము. యద్యేన ముఞ్చసి = వీరిలో నొక్కనిని వదలితివో, పునః = మరల, తే = నీకు, వరః = వరింపదగినవాడు, కతరః = ఎవ్వడు? ఎవ్వడునులేడు. సత్యనలుడు లభింపడు గదా!

(నలపక్షమున) :- భవత్యాః = నీకు, ధరాజగత్యాః = భూలోకమునకు,పతిః = రక్షకుడైన, దేవః = రాజైన, నైషధరాజగత్యా; నైషధరాజ = నిషధ దేశమునకు సంబంధించిన రాజుయొక్క, గత్యా = జ్ఞానముచే, పతిః = పాలకుడును, దేవః = క్రీడాశీలుడును లేదా ప్రభువునునైన, నా = మనుష్యుడైన, నలః = నలుడు, కింనసిశ్చీయతే = ఏల గుర్తింపబడలేదు, కాని నిషధ ప్రభువైన మనుష్యుడే యీ యైదవ నలుడని నిశ్చయింపదగినవాడు. వరింపదగినవాడు. ఖలు = ఏలయనగా తవ = నీకు, అతిమహానలాభః; అతిమహాన్ = మిక్కిలి యధికమైన, అలాభః = విష్ణులాభము (అ-అనగా విష్ణువు) "నా విష్ణుః పృథివీపతిః" యను న్యాయము ననుసరించి నలుడు విష్ణుస్వరూపుడు. ఉత్కృష్టమైన వరుడు లభింపగలడని వీనిని పరిత్యజించితివో, అప్పుడు వీనికంటె నధికుడైన వరుడెవ్వడు నీకు లభింపగలడు? నలుని వరింపనిచో, భర్తలేని దానివిగా నుండగలవు.

ఏషః = ఇతడు. ధరాజగత్యాః = భూలోకమునకు, పతిః = పాలకుడైన, నా = మనుష్యుడైన, నలఃదేవః = నలదేవుడగు, రాజాన = రాజుకాడా? అపితు = కాని, నలఏవ = నలుడే, ఇతి = అని, కింన నిశ్చీయతే = ఏల నిశ్చయింపబడడు. కాని నిశ్చయింపదగినవాడే, వరింపదగినవాడే. ఏలయనగా, నలుని వరించినచో, నీకు మహానలాభః = గొప్ప లాభప్రాప్తి, ఏనం = (శుభప్రదుడగు దైవస్వరూపుడైన)

వీనిని వదలితివో, తవ = నీకు, కః = ఎవ్వడు, శ్రేష్ఠః = శ్రేష్ఠుడైన, వరః = వరుడు, అపితు = కాని, పరః = మఱియొక్కడు, నాస్తి = లేడు.

లేదా - నైషధరాజగత్యా; నైషధరాజ, నైషధ ప్రభువే, గత్యా = గతిగాఁగల్గిన, భవత్యా = నీచే, నా = మనుష్యుడైన, అయం = ఈ నలః = నలుడు, పతిః = భర్తగా, కింనసిశ్చీయతే = ఏలనిశ్చయింపఁబడడు. కింన్రియతే = ఏలవరింపఁబడడు. కాన రెండును చేయదగినవే. యద్యేనముజ్ఝసి = వీనిని వదలితివో, అప్పుడు, తవ= నీకు, నిశ్చితమితి = నిశ్చయముగా, మహాన్ = అధికమైన, అలాభః = అభాగ్యము. యస్మాత్ = ఎందువలన, ఏతాదృశః = ఇటువంటి, అన్యః = మఱియొకడు, కతరః = ఎవ్వడు, వరః = వరుడు (లభించును) నాస్త్యేవ = అట్టివరుడు లభింపనే లభింపడు, ఏషః = ఇతడు, దేవోన = ఇంద్రాదిరూపమైన వేల్పుకాడు. కింతు = కాని. ధరాజగత్యాః భూలోకమునకు, పతిః = పాలకుడగు. నా = మనుష్యుడైన, నలః = నలుడుగా, కింననిశ్చీయతే = ఏలనిశ్చయింపఁబడడు. కింవాన్రియతే = ఏలవరింపఁబడడు. యద్యేనముజ్ఝసి = దేవస్వరూపడగు వీనిని వదలితివో, అప్పుడు నీకు లాభములేదు కాని హానియేయగును.

ధరాజగత్యా; ధరాజ = మనుష్యులయొక్క, గత్యా = ఱెప్పపాటు మున్నగు చిహ్నములచే, ఏషః = ఇతడు, దేవోన = వేల్పుకాడని, కిమునని ర్ణీయతే = ఏలనిర్ణయింపఁబడడు. తథా = అట్లే, పతిరితి — భర్తగా, కిమితిన్రియతే = ఏలవరింపఁబడడు. నిశ్చయముగా, నలోఽయం = ఈనలుడు: నా = మనుష్యుడు. యద్యేనముజ్ఝసి = వీనినివదలితివో. అప్పుడు, తవ = నీకు, పరః — మఱియొక్కడు. వరః — శ్రేష్ఠమైన, కతరః = ఏ, లాభః = లాభము? అపితు = కాని, పరః = ఇతనినివరించుటకంటె శ్రేష్ఠమైన, లాభః = లాభము, న = లేదు. ఏషః = ఇతడు. ధరాజగత్యా; ధరా = భూప్రపంచమునంతు మిక్కిలి సౌందర్యము కల్గియుండుటవలన. అజః = మన్మథుడును, గత్యా =

బుద్ధిచే[ప్రాణనాథుడగు మనుష్యుడైన నలుడు. కాని వేల్పుకాడు. అని ఏల నిశ్చయింపఁబడడు? ఏలవరింపఁబడడు? ప్రక్కనున్న నలుగురికిని ఇతని యాకారమును ధరించుటచే కృత్రిమమగు సౌందర్యమనియు, నితనిది సహజమైన సౌందర్యమనియు చూచినంతటనే తెలిసికొనియితడు నలుడని నిశ్చయింపదగిన వాడనియు, వరింపఁదగినవాడనియు యర్థము. ఖలు = ఏలయనగా, ఇతనియాకారమును ధరించుటవలన. అతిమ, హాన లాభః; అతి, మాహాం = అతిశక్తిగల యింద్రాదులయొక్క, హాన = పరిత్యాగమందు, లాభః = లాభముకపట సౌందర్యముగల యింద్రాదులు నీకు వరింపదగినవారు కారు. ఇత్యాదివ్యాఖ్య, యథామతి తెలియఁదగినది. విస్తరభయముచేనిటనది వ్రాయఁబడలేదు. ఈ వ్యాఖ్యవలననే సమాసభావాదులునుగలార్థములు. 33

శ్లో॥ ఇంద్రాగ్నిదక్షిణదిగీశ్వరపాశిభిస్తాం
వాచం నలే తరలితాథ సమాం ప్రమాయ.
సా సిన్ధువేణి రివ వాడవవీతిహోత్రం
లావణ్యభూః కమపి భీమసుతాఽథతాపమ్. 34

ప॥వి॥ ఇంద్రాగ్నిదక్షిణ దిగీశ్వరపాశిభిః - తాం - వాచం - నలే - తరలితా - అథ - సమాం - ప్రమాయ - సా - సింధువేణిః - ఇవ - వాడవ వీతిహోత్రం - లావణ్యభూః - కమ్ - అపి - భీమసుతా - అథ - తాపమ్.

అర్థము :— అథ = పిదప, లావణ్యభూః = సౌందర్యభూమియు, పక్షాంతరమున, లావణ్యభూః = లవణరసమునకు నాశ్రయమైనదియునగు, తాం = మొదటచెప్పఁబడిన. వాచం = మాటలు, ఇంద్రాగ్నిదక్షిణదిగీశ్వరపాశిభిః = ఇంద్రుడు, అగ్ని, యముడు, వరుణుడను వారలతో, సమాం = శ్లేషతోగూడియుండుటవలన, సమమైనదిగా, ప్రమాయ = తెలిసికొని, తరలితా = నలనిశ్చయములేనందువలన కంపితురాలై, వాడవ

పీతి హోత్రమివ = బడబాగ్నివలె. కమపి = చెప్పసాధ్యముగాని తాపం = సంతాపమును, ఆప = పొందినది.

**సమాసములు:**

ఇంద్రాగ్ని దక్షిణదిగీశ్వరపాశిభిః :- ఇంద్రశ్చ, అగ్నిశ్చ, దక్షిణదిగీశ్వరశ్చ. పాశీచ = ఇంద్రాగ్నిదక్షిణదిగీశ్వరపాశినః, తైః = ఇంద్రాగ్నిదక్షిణదిగీశ్వరపాశిభిః.

సింధువేణిః :- సింధోః వేణిః = సింధువేణిః.

వాడవపీతిహోత్రం;- వాడవశ్చతిపీతిహోత్రశ్చ = వాడవపీతిహోత్రః, తమ్ = వాడవపీతిహోత్రమ్

లావణ్యభూః :— లావణ్యస్య, భూః = లావణ్యభూః.
భీమసుతా :— భీమస్య, సుతా = భీమసుతా.

**భావము :**

లావణ్యమునకు ననగా సౌందర్యమునకు స్థానమైన ఆ దమయన్తి, ఇంద్రాగ్నియమవరుణులతో సమానముగా నన్వయించునట్టి యా సరస్వతీదేవి యొక్క శ్లిష్టవచనములను విని నలనిశ్చయము లేనందువలన కమ్పిత హృదయురాలై, లవణ రసమునకు స్థానమైన సముద్రము, బడబాగ్ని నెట్లు పొందునో, యట్లు చెప్ప సాధ్యముకాని సంతాపమును బొందినది. 34

శ్లో॥ ప్రాప్తుం ప్రయచ్ఛతి న పక్షచతుష్టయే తాం
తల్లాభ శంసిని న పఞ్చమ కోటిమాత్రే.
శ్రద్ధాం దధే నిషధరాడ్విమతౌ మతానా
మద్వైత తత్త్వ ఇవ సత్యతరోఽపి లోకః 35

ప॥ఛే॥ ప్రాప్తుం — ప్రయచ్ఛతి - న - పక్షచతుష్టయే - తాం - తల్లాభశంసిని - న - పఞ్చమకోటిమాత్రే - శ్రద్ధాం - దధే - నిషధరాడ్విమతౌ - మతానామ్ - అద్వైతతత్త్వే - ఇవ - సత్యతరః - అపి - లోకః.

అర్థము :- పక్షచతుష్టయే = నలుగురైన ఇంద్రుడు మున్నగు మాయా నలుల యందు, తాం = ఆ దమయన్తిని, ప్రాప్తుం = సత్యనలుని బొందుటకు ననగా నతనిని సత్యనలుడుగా నిశ్చయించుటకు, న ప్రయచ్ఛతి సతి = అవకాశమొసంగక పోగా. తల్లాభశంసిని = ఆ దమయన్తి యొక్క ప్రాప్తిని గోరుచున్న, పశ్చాన్తరమున - విద్యాలాభమును కాంక్షించునట్టి, సత్యతరేఽపి = మిక్కిలి పారమార్థికమైనదియును, పఞ్చమకోటిమాత్రే = ఐదవనల వ్యక్తియందు, అద్వైతతత్త్వఇవ = అద్వితీయమైన బ్రహ్మతత్త్వమునందువలె, మతానాం = అయిదుగురు నలుల విషయీకరించు జ్ఞానములకు, నిషధరాడ్విమతౌ, నిషధరాట్ = నలుడను, విమతౌ = "ఇతడే నలుడు, ఇతడే నలుడా" యను విరుద్ధములగు నర్థము లేర్పడగా, లోకః = సత్యనలుని దెలిసికొన గోరిన జనము, శ్రద్ధాం = పారమార్థిక విషయకమగు విశ్వాసమును, నదధే = పొందలేదు, అనగా సత్తుకంటెను నసత్తుకంటెను, సదసత్సమూహాముల కంటెను, సదసద్విలక్షణము కంటెను, విలక్షణమైనదియు. ననగా సత్ - అసత్ - సదసత్సమూహ - సదసద్విలక్షణమను నాల్గు విధములగు ననేకాత్మాదివాదులగు సాంఖ్యాదుల సిద్ధాన్తముల కంటెను భిన్నమైన సిద్ధాన్త గోచరమగు నపరోక్ష సత్యబ్రహ్మ తత్త్వమునందువలె నసత్యనలులు నలుగురును నైదవవాడగు సత్యనలుడు కానవచ్చుచున్నను నితడు సత్యనలుడని ప్రజలు నమ్మజాలక పోయిరని యర్థము—

లేదా— సా = ఆ దమయన్తి, నిషధరాడ్విమతౌ; నిషధరాట్ = నలునికి సంబంధించిన, విమతౌ = వివిధమైన బుద్ధి యేర్పడగా, అనగా నలుని గూర్చిన సందేహమేర్పడగా, పఞ్చమకోటిమాత్రే = ఐదవకోటి యందు ననగా నైదవస్థానమందున్న, సత్యతరేఽపి= మిక్కిలి యథార్థమైన నలుని విషయమందును, తల్లాభశంసిని = దమయన్తీ ప్రాప్తిసపే

క్షించునట్టి, పక్షచతుష్టయే ఽపి = ఇంద్రాగ్నియమవరుణులను నలుగురు నలుల వలన నేర్పడిన, నాల్గు పక్షముల సమూహము, తాం = ఆ, శ్రద్ధాం = సత్యనల విషయకమగు నిశ్చయమును, ప్రాప్తుం = పొందుటకు, న ప్రయచ్ఛతిపతి = అవకాశమీయక పోగా, మతానాం = సాంఖ్యాదిషడ్దర్శనములలో 'ఏకమేవా ద్వితీయం బ్రహ్మ' 'నేహ నానా స్తికిఞ్చన' ఇత్యాది శ్రుతులచే, సత్యేతరే = మిక్కిలి సత్యమైన అనగా పరమార్థ దృష్టియందు సత్యమైన, అద్వైతతత్త్వే=అద్వైత రూపమైన స్వరూపము నందుగాని, బ్రహ్మైక్యజ్ఞానరూపమగు విషయమందు గాని, లోకః = అవిద్య గల్గిన అనగా యుక్తాఽయుక్త జ్ఞానము లేని జనము: అనేకాత్మలను వాదించునట్టి, సాంఖ్యాది దర్శన చతుష్టయము అద్వైత విశ్వాసమును పొందుట కవకాశము నీయకపోగా నెట్లు శ్రద్ధను పొందదో (సత్యనలునియందును విశ్వాసమును బొందజాలక పోయినదని పూర్వముతో నన్వయము).

సాంఖ్యులు-ఒక్కొక్క శరీరమునకొక్కొక్క పురుషునంగీకరింతురు. నైయాయికులు—"నానాత్మానో వ్యవస్థితాః" అనువచనమునను సరించి ఆత్మలకు నానాత్వము నంగీకరింతురు. ఆర్హతులు-దేహ ప్రమాణముగల యాత్మనంగీకరింతురు. బౌద్ధులు - పెక్కు యుక్తులతో, పెక్కు ఆత్మలకే చిత్తసంయోహబాహుల్యము నంగీకరింతురు. నలచతుష్టయముతో పక్ష చతుష్టయ మేర్పడినట్లు, పూర్వముదహరింపఁబడిన. సత్. అసత్. సదసత్, సదసద్విలక్షణమను నాలుగుపక్షములు పైవానితో బోల్పదగినవి. సద్వాదులు సాంఖ్యులు, అసద్వాదులు బౌద్ధులు, సదసద్వాదులు నైయాయికులు. సదసద్విలక్షణత్వవాదులు తదితరులు - ప్రపంచము సత్తుకానేరదు. ఎలయనగా బాధకుపపత్తిలేక పోవును. సత్తైన రజతముగాని గగనముకాని బాధింపబడుటలేదుగదా! అట్లే అసత్స్వరూపముఁగూడగానేరదు. అసత్తైనచో ప్రాతిభాసికత్వమెట్లు సరిపడును? సర్వవిధములలోను సత్తా శూన్యమైన శశశృఙ్గ మొకప్పుడును ప్రతిభాసించుటలేదుగదా!

మరియు ప్రపంచము సదసత్త్వ రూపముగూడ కానేరదు. ఏలయనగా సత్త్వాఽసత్త్వములు పరస్పర విరుద్ధములు. ఇత్యాది విషయములు ఇట ననుసంధేయములు.

సాంఖ్యులు ప్రతి శరీరమునకును భిన్న భిన్నములైన శుద్ధజ్ఞాన స్వభావములు గల పెక్కు ఆత్మల నంగీకరింతురు. నైయాయికులును ప్రతి శరీరమునకును భిన్న భిన్నములును, సర్వ వ్యాపకములును, జ్ఞానమున్నగు తొమ్మిది విశేషగుణములుగల ఆత్మల నంగీకరింతురు. అర్హతులు ప్రతి శరీరమునను భిన్నదేహ పరిమాణములు గల్గిన సంకోచ వికోచములుగల పెక్కు ఆత్మల నంగీకరింతురు. బౌద్ధులు ప్రతి దేహమునకును భిన్నములైన క్షణిక జ్ఞానధారా రూపములైన పెక్కు ఆత్మల నంగీకరింతురు.

ప్రకృతము తల్లా శశంసిని = దమయంతీ లాభమునుఁ గోరుచున్నట్టి, సత్యతరే = మిక్కిలి యథార్థుడైన నలునియందు, నిషధరాట్త్వమతౌ సత్యామపి = నల సంబంధియైన వైమత్య మున్నను. ఆమె శ్రద్ధను వహించలేదా ? తప్పక వహించినదని యర్థము. అనేక నల దర్శనమున్నను సత్యతరమైన ఐదవకోటియందుఁ జేరిన నలునియందు "అవిజ్ఞాతేఽపి బంధౌహిబలాత్ప్రహ్లాదతేమనః" యని చెప్పిన చొప్పున నితడే సాధారణముగా సత్యనలుడు కాగలడని యామెయొక్క మనస్సునందు బుద్ధి యేర్పడినది, అదెట్లనగా మతముల కేకాభిప్రాయము లేక పోయినను సత్యతరమైన, అద్వైత తత్త్వమునందు లోకమునకెట్లు విశ్వాసమేర్పడునో, అట్లే యామెకును బుద్ధి యేర్పడినదని యర్థము.

సమాసములు :

పక్షచతుష్టయే :— చతుర్ణాం, సమూహః, = చతుష్టయం, పక్షాణాం, చతుష్టయమ్ = పక్ష చతుష్టయమ్, తస్మిన్ = పక్ష చతుష్టయే.

తల్లాభశంసిని :— తస్యాః, లాభః = తల్లాభః, తల్లాభస్య, శంసీ = తల్లాభశంసి. తస్మిన్ = తల్లాభశంసిని।

నిషధరాడ్విమతౌ :— నిషధానాం, రాట్ = నిషధరాట్, నిషధరాజః, విమతిః = నిషధరాడ్విమతిః, తస్యాం = నిషధరాడ్విమతౌ.

అద్వైతతత్త్వే :— ద్వితైవ ద్వైతమ్, ద్వైతేన, రహితమ్ = అద్వైతమ్, అద్వైతంచ తత్ తత్త్వంచ = అద్వైత తత్త్వమ్।

సత్యతరే :— అత్యంతం, సత్యః = సత్యతరః, తస్మిన్ = సత్యతరే.

**భావము :**

ఇంద్రాది మాయా నలచతుష్టయ మాదమయన్తికి సత్యనలుని నిశ్చయించుట కవకాశ మొసంగక పోగా, ఆ దమయన్తీ ప్రాప్తి నభిలషించు (విద్యాలాభము నపేక్షించు) నట్టి, మిక్కిలి పారమార్థికమై పంచమకోటియందున్న ఐదవ నలవ్యక్తియందు, సత్ - అసత్ - సదసత్ - సదసద్విలక్షత్వములచే నాల్గు విధములగు నాధ్యాత్మిక శరీరేంద్రియాదులతో, గూడిన యసత్ప్రపంచ సంబంధము నుండి, సాధకుడు నిత్యప్రత్యక్ష సత్యబ్రహ్మతత్త్వము నందెట్లు విశ్వాసము బొందజాలడో యట్లే యసత్య నలచతుష్టయ సంబంధముచే, ఐదవ సత్యనలుడు కానవచ్చుచున్నను జనము విశ్వాసము బడయలేదని యాశయము. ౩౫

శ్లో॥ కారిష్యతే పరిభవః కలినా నలస్య
తాంద్వాపరస్తు సుతనూమ దునోత్పురస్తాత్.
భైమీనలోపయమనం పిశునౌసహేతే
నద్వాపరః కిల కలిశ్చ యుగే జగత్యామ్. 36

ప॥వి॥ కారిష్యతే - పరిభవః - కలినా - నలస్య - తాం - ద్వాపరః - తు - సుతనూమ్ - అదునోత్ - పురస్తాత్ - భైమీనలోపయమనం - పిశునౌ - సహేతే - న - ద్వాపరః - కిల - కలిః - చ - యుగే - జగత్యామ్.

అర్థము :- కలినా = కలహముచే అనగా తిరస్కరింపబడిన దేవతల చేతను రాజుల చేతను, అవమాన భారమునకు ప్రతీకారము లేదను నభిప్రాయముచే నుత్పాదింపబడిన వైరముచే నని యర్థము. (కలియుగము చేతను) నలస్య = నలునకు, పరిభవః = పరాభవము, కారిష్యతే = వివాహమైన పిదప చేయింపబడును, ద్వాపరస్తు = ప్రియుడైన నలునకిటువంటి పరిభవ సందేహము; (ద్వాపర యుగమును), సుతనూం = సుకుమార దేహము గల, తాం = నలుని ప్రియురాలగు దమయన్తిని, పురస్తాత్ = కలికి ముందె, అనగా నిప్పుడే, అదునోత్ = సంతాపపఱచెను. తథాహి = అది యుక్తమే, జగత్యాం = లోకమునందు, పిశునౌ = దుర్జనులైన ద్వాపరము, కలి, యను, యుగే = యుగములు, భైమీనలోపయమనం, భైమీనల = దమయన్తీ నలులయొక్క, ఉపయమనం = వివాహమును, నసహేతేకిం = సహించుటలేదుగదా ? ఏవిధముగా కలి, వివాహము తర్వాత వారి వివాహమును సహింపలేదో, ఆ విధముగనే, ద్వాపరము, జరుగఁబోవు వారి వివాహమును సహింపలేదు. లేదా- కలినా = కలియుగముచే, నలస్య = నలునకు, పరిభవః = అవమానము, కరిష్యతే = చేయఁబడును. ద్వాపరస్తు = ఇతడు నలుడా ఇతడు నలుడా యను సందేహమో లేదా ద్వాపరయుగమో, తాం = ఆ సుతనూం = సుందరిని, పురస్తాత్ = పూర్వమే, అదునోత్ = పీడించెను, కలిః నలుని, దమయన్తి వరించిన పిదప నలుని పరిభవింపఁగలడు. ద్వాపరమో దమయన్తికి నలుని వరించుట కవకాశమునే య్యాయచేసెను. కిల = ఏయ్యఁగా, ద్వాపరః = ద్వాపరము, కలిశ్చ =

కలియుగము అను నీ రెండు, యుగే = యుగములు. జగత్యాం = భూలోకమునందు, భైమీనలోపయమన ; భైమీ = దమయన్తియొక్క, నల = నలునియొక్కయు, ఉపయమనం = వివాహమును, నసహేతే = సహింపరు. (యతః = ఏలయనగా) పిశునే = వారిరువురును దుష్టులు, నల నిశ్చయమేర్పడినచో, వివాహము తప్పక జరుగును. కాన సందేహ రూపమైన ద్వాపరము దానికి ప్రతిబంధకము — కాన కలివలె ద్వాపరముగూడ దానికి ప్రతిబంధకము కాన ద్వాపరము చేత నామె పీడింపఁ బడినదనియర్థము. ద్వాపరము నందును, కలియుగమునందును, నలదమయన్తీ వివాహము లేదు కావున వారి వివాహమును నవి సహించుట లేదనియు నర్థము. నల నిశ్చయము లేనందువలన నామె చాల సంతాపము నొందినదని యాశయము.

వి :- ఇచ్చట పూర్వార్ధమునందు "ద్వాపర" యనువచనమునందు, వాద్యార్థమగు సంశయమునకును, ప్రతీయమానార్థమగు యుగమునకు నభేదాధ్యవసాయముగావించి కవి వ్యాపారమునకంటె ముందు ద్వాపరమునకు దమయన్తీ సంతాప కర్తృత్వమునుత్ప్రేక్షించుటచే నుత్ప్రేక్ష. వ్యంజకమును ప్రయోగించనందు వలన దిగమ్యము. ఉత్తరార్ధమునందు, నలదమయన్తీ వివాహమును ఓర్వలేమి తనమను కారణముచే కార్య సమర్థన రూపమగు నర్థాంతర న్యాసాలంకారము. ఈ రెంటికి నంగాంగి భావముచే సఙ్కరము—

**సమాసములు :**

భైమీనలోపయమనం :— భైమీచ, నలశ్చ = భైమీనలౌ, భైమీనలయోః, ఉపయమనం = భైమీన లోపయమనం,

భావము :

కలియుగము నలునిఁ బరిభవముఁ జేయబోవుచున్నది. ద్వాపరమో, అనగా వీడు నలుడా వీడు నలుడాయను సందేహము (ద్వాపరయుగమును) ఆ సుందరిని, కలికిముందే పీడించెను. కలి స్వయంవరమైన పిదప పీడించును. ద్వాపరమో (నలుడెవ్వడను సందేహమో) నలుని వరించుటకే యవకాశ మొసంగలేదు. ఏలయనగా, ద్వాపరము, కలియు, రెండును భూలోకమందు దమయంతీ నలులయొక్క వివాహమును సహించుట లేదు. జరిగిపోయిన వారి వివాహమును కలి యెట్లు సహింపడో; అట్లే జరుగఁబోవు వారి వివాహమును ద్వాపరముచు సహింపలేదు. ఏలయనగా వారిఉవ్వురు దుష్టులు నలుడని నిశ్చ యింపఁ బడితే, వివాహము తప్పకజరుగును. కాని అతని విషయమున సందే హము ప్రతిబంధకము. కాన కలివలె ద్వాపరము గూడ ప్రతి బంధకమని యర్థము. ద్వాపరయుగిమందును, కలియుగమందును నలదమయన్తులు లేరు. కాన వారి వివాహమును వారు (కలిద్వాపరములు) సహింపలేరు. ఏలయనగా నలదమయన్తులు కృత యుగమునకు సంబంధించిన వారని యభి ప్రాయము. 36

శ్లో॥ ఉత్కణ్ఠయన్ పృథగిమాం యుగపన్నలేష
ప్రత్యేకమేష పరిమోహయమానబాణః.
జానీమహే నిజశిలీముఖశీలసంజ్ఞాం
సాఫల్యమాప స యదా యది పంచబాణః 37

ప॥వి॥ ఉత్కణ్ఠయన్, - పృథక్, - ఇమాం, - యుగపత్, - నలేషు, - ప్రత్యేకమ్, - ఏషు, - పరిమోహయమాణ బాణః, - జానీమహే, - నిజశిలీ ముఖశీలి సజ్ఞ్యా సాఫల్యమ్, - ఆప, - సః, - యధా, - య్యద్ధి, - పంచబాణః,

అర్థము :- పంచబాణః = పంచబాణుడని ప్రసిద్ధిఁబొందిన, సః = ఆ మన్మథుడు, నలేషు (పంచసు) = అయిదుగురు నలుల విషయమునందు, పృథక్ = ప్రత్యేకముగా, ఇమాం = ఈ దమయన్తిని. యుగపత్ = ఏక కాలమునందు, ఉత్కణ్ఠయన్ = ఉత్సుకపఱచుచు, అనగా ఇతడు నలుడా, ఇతడు నలుడా యనుబుద్ధిచే, వారియందు నొక్క కాలమునందే వేఱు వేఱుగాను, నుత్కణ్ఠతో గూడిన దానినిగా చేయించునని యర్థము. దమయన్తి నలబుద్ధిచే నైదుగురియందును ననురక్తమైనదని భావము. తథా - అట్లే. ఏషు = ఈ యైదుగురు నలులయందును, ప్రత్యేకమ్ = ఒక్కొక్కనియందు, పరిమోహయమానబాణః = ప్రత్యేకముగా వీరిని దమయన్తీ విషయమున మోహపఱచుచున్న బాణములు గలవాడై, నిజ శిలీ ముఖశిలి సంఖ్యా సాఫల్యమ్; నిజ = తనవగు, శిలీముఖ = బాణములను, శిలి = యంటిన, సంఖ్యా = అయిదనెడు సంఖ్యకు, సాఫల్యం = సార్థక్యము, ఆపయది = పొందెనచో, తదా = అప్పుడు, జానీమహే = బాణములకున్న పంచత్వసంఖ్య, సరియైనదని తెలునుకొనెదము.

వి :- ఇచ్చట ఉత్కణ్ఠయు, సమ్మోహనము పంచత్వసంఖ్యా సాఫల్యమునకు హేతువులు గాన పదార్థ హేతుక కావ్యలింగము— "సాఫల్యమాపయది" అని సాఫల్యమును సమ్భావన చేయుటచే నుత్ప్రేక్ష. అదిపై కావ్యలింగముచే నత్థాపితము కాన దానికి దీనితో సఙ్కరము—

**సమాసములు :**

ప్రత్యేకమ్ :— ఏకస్మిన్ = ఏ స్మిన్. ప్రద్యేకమ్

పరిమోహయ మానబాణః :— పరిమోహయ మానాః బాణాః, యస్యసః = పరిమోహయబాణః.

నిజశిలీ ముఖశిలి సంఖ్యా సాఫల్యమ్ :— నిజాశ్చతే శిలీముఖాశ్చ, = నిజశిలీముఖాః, నిజశిలీముఖాన్, శిలయ్యతీతి = నిజశిలీముఖశిలినీ, నిజశిలీ

ముఖశిలినీ చ,సా, సంఖ్యాచ, = నిజశిలీముఖశిలి సంఖ్యా. సఫలాయాః, భావః = సాఫల్యం. నిజశిలీ ముఖశిలీ సంఖ్యాయాః, సాఫల్యం=నిజశిలీ ముఖశిలి సంఖ్యా సాఫల్యమ్. తత్=నిజశిలీముఖశిలి సంఖ్యా సాఫల్యమ్.

భావము :

పంచబాణుడని ప్రసిద్ధి బడసిన మన్మథుడు ఐదుగురు నలులయందును ఈ దమయన్తికి నొక్క కాలమందే యుత్కంఠనుఁ గల్గించుచు ననగా వారం దఱు నొక్క రూపమును ధరించియుండుటచే "నితడు నలుడా లేక యితడు నలుడా" యని యీ విధముగా నామె నొక్కకాలమునందే. వేఱువేఱుగా నుత్కంఠరాలను గావించుచు, వారిలో నొక్కొక్కరి యందును ప్రత్యేకముగా దమయన్తీ విషయమున మోహమునుఁ గల్గించుచు, తన బాణములకు సహజముగ నున్న పంచత్వ సంఖ్యను సఫల పఱచుకొనినచో, ననగా నయిదుగురు వరుల యందును నైదు బాణములనుఁ బ్రయోగించుటచే సఫల పఱచుకొనినచో నప్పుడు తన బాణముల యందలి పంచత్వ సంఖ్య సరియైనదని తెలుసుకొనెదము. 37

శ్లో॥ దేవానియం నిషధరాజ రుచ స్త్యజన్తీ
రూపాదరజ్యత నతే నవిదర్భ సుభ్రూః.
జన్మాంతరాధిగత కర్మవిపాకజన్మా
వోన్మీలతి క్వచన కస్యచ నానురాగః. 38

ప॥వి॥ దేవాన్ - ఇయం - నిషధరాజరుచః - త్యజన్తీ - రూపాత్ - అరజ్యత - నతే - న - విదర్భసుభ్రూః - జన్మాంతరాధిగతకర్మవిపాకజన్మా - ఏవ - ఉన్మీలతి - క్వ - చన - కస్య - చన - అనురాగః.

అర్థము : — నిషధరాజరుచః; నిషధరాజ = నలుని సౌందర్యమువంటి సౌంద ర్యము గల్గిన. దేవాన్ = దేవతలను, త్యజన్తీ = వదలిపెట్టుచున్న,

ఇయం = ఈ, విదర్భసుభ్రూః = దమయన్తి, రూపాత్ = సౌందర్యము వలన, నలే = నలునియందు, న అరజ్యత = అనురక్తురాలు కాలేదు, కింతు = కాని, కన్యచన = ఒకనొకనికి, జన్మాంతరాధిగతకర్మవిపాక జన్మా; జన్మాంతరర = ఇతర జన్మములయందు, అధిగత = చేయఁబడిన, కర్మ = కర్మలయొక్క, విపాక = పరిపాకముచే, జన్మా = ఉద్భవించిన, అనురాగఏవ = అనురాగమే, క్వచన = మఱియొక జననము నందు, ఉన్మీలతి = ఉద్భవించును. ఇంద్రాది దేవతలకును నలునికిని రూపమునందు సామ్యమున్నను, దేవతలను వదలి నలునియందే యామెకనురాగము కల్గుట యా దమయన్తియొక్క జన్మాంతర కర్మకు నధీనమైనది. కాని నలుని రూపముచే నేర్పడినదిగాదు. కానిచో యథార్థ నలాన్వేషణము చేయవవసరమేమి? ఇందువలన నీమెకు నలునియందు దృఢమైన వ్రతమున్నట్లు చెప్పఁబడినది.

**సమాసములు**

నిషధరాజరుచః :— నిషధానాం, రాజా = నిషధరాజః నిషధరాజస్య, రుచిఃఇవరుచిః, యేషాంతే=నిషధరాజరుచః, తాన్ = నిషధరాజరుచః

విదర్భసుభ్రూః :— విదర్భాణాం, సుభ్రూః = విదర్భసుభ్రూః.

జన్మాంతరాధిగతకర్మవిపాకజన్మా :— అన్యత్, జన్మ = జన్మాంతరం. జన్మాంతరాధిగతంచతత్కర్మచ = జన్మాంతరాధిగతకర్మ, జన్మాంతరాధిగతకర్మణః, విపాకః=జన్మాంతరాధిగత కర్మవిపాకః, జన్మాంతరాధిగతకర్మవిపాకాత్, జన్మ, యస్యసః = జన్మాంతరాధిగతకర్మవిపాకజన్మా.

**భావము:**

నలరూపమును ధరించిన యింద్రాది దేవతలకును, నలునికిని, సౌందర్య విషయమున భేదము లేదు. కాని దమయన్తి వారినెవ్వరిని ప్రేమింపక నలమహారాజునే ప్రేమించుటలో కేవలము నలసౌందర్యము కారణము గాదు. మఱేమనగా నుభయుల జన్మాంతరకర్మపరిపాకమే కారణముగునన్నది. ఒకరికి మఱియొకరి

యందును రాగమేర్పడుటకు బాహ్య సౌందర్యమే కారణము గాదు. మఱేమనగా వారిఉభరికిని జన్మాంతరములలోని కర్మాధీనమగు సంస్కారమే వారి పరస్పరానురాగమునకు మూలమగుచున్నది. అట్లు కానిచో నలాకారములోనున్న యైదుగురిలోనే యొకరియందైనను ననురాగమేర్పడవచ్చును గదా. అట్లుగాక నలుని యందే యనురాగ మేర్పడుటకు కారణమేమి? కాన నుభయుల జన్మాంతరానురాగమే దీనికి మూలమని భావము. 38

శ్లో॥ క్వ ప్రాప్యతే స పతగః పరిపృచ్ఛ్యతే యః
ప్రత్యేమి తస్య హి పురేవ నలం గిరేతి
సస్మార సస్మరమతిః ప్రతినైషధీయం
తత్రాఽమరాలయ మరాల మరాలకేశీ. 39

ప॥వి॥ క్వ - ప్రాప్యతే - సః, పతగః - పరిపృచ్ఛ్యతే - యః - ప్రత్యేమి - తస్య - హి - పురా - ఇవ - నలం - గిరా - ఇతి - సస్మార - సస్మరమతిః - ప్రతి - నైషధీయం - తత్ర - అమరాలయమరాలమ్ - అరాలకేశీ.

అర్థము :- సస్మరమతిః = మన్మథునిచే, బీడింపబడిన మనస్సుగల్గిన, దమయన్తి, సః = ముందు చూడఁబడిన, పతగః = హంస, క్వ = ఎక్కడ, ప్రాప్యతే = లభ్యమగును. ఏలయనగా- యః = ఏపక్షి, (నలం = నలుని, గూర్చి) పరిపృచ్ఛ్యతే = ప్రశ్నింపఁబడునో, వీరి మధ్య నిజమైన నలుడెవ్వడని ప్రశ్నింపఁబడుట కవకాశముండెడిదని యర్థము. ఇతి = ఇట్లు, పురేవ = ముందువలె, తస్య = ఆ హంస యొక్క, గిరా = మాటచేతనే, నిశ్చయేన = నిశ్చయముగా నలం = నలుని, ప్రత్యేమి = న[illegible]ృదును ఇతి = ఇట్లు, తత్ర = ఆ స్వయంవర సభయందు, నైషధీయం = నిషధ రాజుకు సంబం

డించిన, అమరాలయమరాలమ్ = దేవలోకమున నివసించు హంసను గూర్చి, సస్మార = స్మరించెను,

**భావము :**

మదఃపీడిత చిత్తురాలగు నా వంపులు తిరిగిన కురులుగల దమయన్తి, ముందునలుని సందేశమును దెచ్చిన యా హంస యెక్కడ లభ్యమగును ? ఏల యనగా; అది లభించినచో, నీ యైదుగురియందును వాస్తవమైన నలుదెవ్వడని ప్రశ్నించి దెలిసికొనవచ్చును. ఇట్లు ఆ సభయందు ప్రియునకు దూతయైన దేవలోకపు హంసను గూర్చి యా దమయన్తి స్మరించుచుండినది. 39

శ్లో॥ ఏకైకమైక్షత ముహుర్మహతా దరేణ
భేదం వివేద నహి పంచసు కఞ్చిదేషా.
శఙ్కాశతం వితరతా హరతా పునః స్మ
ఉన్మాదినేవ మనసేయ మిదం తదాహ. 40

ప॥వి॥ ఏకైకమ్ - ఐక్షత - ముహుః - మహతా - ఆదరేణ - భేదం - వివేద - న - హి - పంచసు - కం - చిత్ - ఏషా - శఙ్కాశతం - వితరతా - హరతా - పునః - స్మ - ఉన్మాదినా - ఇవ - మనసా - ఇయమ్ - ఇదం - తదా - ఆహ.

అర్థము :- ఏషా = ఈ దమయన్తి, మహతా = అధికమైన, ఆదరేణ = ఆదరముచేతను, దరేణ = భయముచేతను (అయిదుగురిని జూచినచో పాతివ్రత్య భంగము వచ్చునను భయముతో) ముహుః = పలుమాఱు, ఏకైకం = ఒక్కొక్కని, ఏక్షత = చూచినది. కింతు = కాని, పంచసు = అయిదుగురి మధ్య, కంచిత్ = కొంచమైనను, భేదం = భేదమును, నవివేద = తెలిసికొనలేదు. (కావుననే) శఙ్కాశతం =

నూరు సందేహములను, వితరతా = కల్గించుచున్నదియు. పునః = మరల, తత్ = దానిని ననగా సంశయ శతమును, హరతా = తొలంగించుచున్నదియును, నందువలననే, ఉన్మాదినాఇవ = ఉన్మాదముతో గూడినదో యనునట్లున్న, మనసా = మనస్సుచే, (ఉపలక్షితా = చూడబడుచున్న) ఇయం = ఈ దమయన్తి, ఇదం = చెప్పబడు వికల్ప సమూహమును, ఆ హస్మ = చెప్పదొడగినది.

సమాసములు :

ఏకైకం :— ఏకశ్చ, ఏకశ్చ, అనయోః, పర్యాయః = ఏకైకః, తమ్ = ఏకైకమ్.

శఙ్కాశతం :— శఙ్కానాం శతం = శఙ్కాశతమ్, తత్ = శఙ్కాశతమ్.

ఉన్మాదినా :— ఉన్మాదయతీతి = ఉన్మాది, తేన = ఉన్మాదినా.

భావము :

ఈ దమయన్తి యానల పంచకములో నొక్కొక్కరిని మిక్కిలి ప్రయతోదను, ఆసక్తితోడను పలుమారు వీక్షించినది. మరియు పరపురుషులచే తన ప్రాతివత్యమునకు భఙ్గము గలుగునను భయముతో వారిని సంకోచమును గూడ వహించినది. కాని యా యైదుగురిలో నిసుమంతయు నైతము, ఆమె గ్రహింపలేకపోయినది. కావుననే పెక్కు సందేహములు గల్పించుచును, నివర్తిల్లజేయుచు నున్మాదమును పొందినదో యనునట్లు మనస్సుచే నామె చెప్పబడబోవు ప్రకారము పెక్కు వికల్పములను జేయదొడగినది. 40

శ్లో॥ అస్తి ద్విచంద్రమతి రస్తి జనస్య తత్ర
భ్రాన్తౌ దృగన్త చిపిటీకరణాదిరాదిః.
వ్యచ్ఛేపసర్పణ మపిప్రతి మాభిమానే
భేదభ్రమే పునరమీషు నమే నిమిత్తమ్, 41

ప॥చ॥ అస్తి - ద్విచంద్రమతిః - అస్తి - జనస్య - తత్ర - భ్రాన్తౌ - దృగన్తచిపిటీకరణాదిః - ఆదిః = స్వచ్ఛోపసర్పణమ్ - అపి - ప్రతిమాభిమానే - భేదభ్రమే - పునః - అమీషు - న - మే - నిమిత్తమ్.

అర్థము ;—ద్విచంద్రమతిః=ఇద్దరు చంద్రులనెడి బుద్ధి, అనగానొక్క చంద్రుని యందు నిద్దరు చంద్రులనెడి భ్రమ, అస్తి = ప్రసిద్ధమైయున్నది. కింతు = కాని, తత్ర = ఇద్దరు చంద్రులను విషయీకరించు, భ్రాన్తౌ = భ్రాంతి యందు, జనస్య = జనమునకు, దృగన్త చిపిటీ కరణాదిః; దృగన్త = కన్నుల కొనలను, చపిటీకరణాదిః = నలుపుట మున్నగునది, ఆదిః = మూలకారణము. తథా = అట్లే, ప్రతిమాభిమానే = ప్రతిబింబ భ్రమ యందును, స్వచ్ఛోపసర్పణమ్; స్వచ్ఛ = నిర్మలములగు గాజు స్ఫటికము మున్నగు వస్తువులయొక్క, ఉపసర్పణం = సమీపస్థితి, ఆదిః = మూలము. పునః = కాని, మే = నాకు, అమీషు = ఈ యెదుగురు నలుల విషయమున, భేదభ్రమే = భేదభ్రాన్తియందు, నిమిత్తం = కారణబు, నఅస్తి = లేదు. కావున నొక్క నలునియందే పెక్కు నలులభ్రాంతి పొసగదు. కావున నలునికంటె భిన్నమైన వారు కొందరిందుండగలరని యాశయము.

సమాసములు :

ద్విచంద్రమతిః :— ద్వౌ, చంద్రౌ, ఇతి, మతిః = ద్విచంద్రమతిః; లేదా — ద్వౌచామూ, చంద్రౌచ=ద్విచంద్రౌః, ద్విచంద్రయోః, మతిః = ద్విచంద్రమతిః.

దృగన్త చిపిటీ కరణాదిః :— దృశోః అన్తౌ=దృశన్తౌ, దృగన్తయోః, చిపిటీకరణం=దృగన్త చిపిటీకరణం. దృగన్త చిపిటీకరమ్, ఆదిః, యస్యసః = దృగన్త చిపిటీకరణాదిః.

స్వచ్ఛోపసర్పణమ్ :— స్వచ్ఛానా ముప సర్పణమ్ = స్వచ్ఛోపసర్పణమ్.

ప్రతిమాభిమానే :— ప్రతిమాయాః, అభిమానః ప్రతిమాభిమానః. తస్మిన్ = ప్రతిమాభిమానే,

భేదభ్రమే :— భేదస్య భ్రమః = భేదభ్రమః, తస్మిన్ = భేద భ్రమే.

భావము :

లోకమునందొక్క చంద్రునియందు నిద్దఱు చంద్రులను విషయీకరించు భ్రాంతి కలదు. అట్టి భ్రాన్తికి, జనులు తమ కన్నుల కొనలను మడచుట నలుచుట మున్నగునవి కారణములు :- అట్లే ప్రతిబింబ భ్రమయందును నద్దము స్ఫటికము మున్నగు స్వచ్ఛ వస్తువుల సన్నిధానము మూలమగుచున్నది. కాని యొక్క నలునియందు నైదుగురు నలుల భ్రాంతి యే విధముగను సంభవింప నవకాశము లేదు. కావున వీరిలో కొందఱు నలభిన్నులైన వ్యక్తులుగా నుండఁగలరు. 41

శ్లో॥ కింవాతనోతి మయి నైషధ ఏవ కాయ
వ్యూహం విధాయ పరిహాస మసౌ విలాసీ.
విజ్ఞానవైభవభృతః కిము తస్య విద్యా
సా విద్యతే న తురగాశయవేదితేవ. 42

ప॥వి॥ కిం - వా - తనోతి – మయి - నైషధః - ఏవ - కాయవ్యూహం - విధాయ - పరిహాసమ్ - అసౌ - విలాసీ - విజ్ఞాన వైభవ భృతః - కిమ్ - ఉ - తస్య - విద్యా - సా - విద్యతే - న - తురగాశయ వేదితా - ఇవ .

అర్థము :— వా = లేదా, విలాసీ = విలసించు స్వభావముగల, అసౌ = ఈ, నైషధ ఏవ = నలుడే, కాయవ్యూహం = శరీర సమూహమును, విధాయ = సంపాదించుకొని, మయి = నాయెడ, పరిహాసం = పరి

హాసమును, తనోతికిం = చేయుచున్నాడా యేమి? ఇది సంభవము కావచ్చును. విజ్ఞాన వైభవభృతః; విజ్ఞాన = శిల్పకళయొక్క పరిజ్ఞాన మనెడి, వైభవ = అతిశయమును, భృతః = ధరించుచున్న. తస్య = ఆ నలునికి, తురగాశయ వేదితాఇవ = అశ్వ హృదయమును తెలుసు కొనుటవలె, సావిద్యా = బహు రూపకల్పన రూపమైన కాయవ్యూహ విద్య, యనగా పెక్కు రూపములను గల్గించువిద్య, నవిద్యతే కిమ్ = లేదా యేమి? అనగా తప్పక యున్నది.

## సమాసములు :

నైషధః :— నిషధానాం రాజా = నైషధః.

కాయవ్యూహం :— కాయానాం, వ్యూహః = కాయవ్యూహః తమ్ = కాయవ్యూహం.

విజ్ఞాన వైభవభృతః :— విజ్ఞానస్య, వైభవం = విజ్ఞాన వైభవం, విజ్ఞాన వైభవం, బిభర్తీతి = విజ్ఞాన వైభవ భృత్, తస్య = విజ్ఞాన వైభవ భృతః.

తురగాశయవేదితా :— తురగస్య, ఆశయః = తురగాశయః, తురగాశయం వేత్తీతి = తురగాశయవేదీ తురగాశయ వేదినః భావః = తురగాశయవేదితా.

## భావము :

లేదా, విలాసశీలుడగు నలుడొక్కడే యోగాదిశక్తులచే పెక్కు శరీరములనెత్తి నాయెడ బరిహాసముజేయుచున్నాడా యేమి? ఇది సంభావ్యమే, అశ్వశాస్త్రము దెలిసినట్లే కాయవ్యూహవిద్యగూడ విజ్ఞానవంతుడగు నీ నలునకు దెలియకయుండునా? తప్పక తెలిసియుండునని యభిప్రాయము. 42

శ్లో॥ ఏకోనలః కిమయమన్యతమః కిమైలః
కామో ఒపరః కిము? కిముద్వయమాశ్వినేయౌ.
కింరూపధేయభరసీమతయా సమేషు
తేష్వేవనేహనలమోహమహంవహేవా. 43

ప॥ వి॥ ఏకః – నలః – కిమ్ – అయమ్ – అన్యతమః – కిమ్ – ఐలః –
కామః – అపరః – కిమ్ – ఉ – కిమ్ – ఉ – ద్వయమ్ – ఆశ్వి
నేయౌ – కిం – రూపధేయభరసీమతయా – సమేషు – తేషు – ఏవ
– న – ఇహ – నలమోహమ్ – అహం – వహే – వా.

అర్థము :- వా = లేదా, ఇహ = ఈ యెదురుగురియందును, అయమ్ = ఇతడు,
ఏకః = ఒక, నలఃకిమ్ = నలుడాయేమి? అన్యతమః = వీరిలో నొకటి
యొక్కడు, ఐలఃకిమ్ = పురూరవుడాయేమి? అపరః = మఱి
యొక్కడు, కామఃకిమ్, మన్మథుడాయేమి? ద్వయం = తక్కినయిద్ద
వురు ఆశ్వినేయౌకిమ్ = అశ్వినీకుమారులాయేమి? (కావుననే) రూప
ధేయ భరసీమతయా, రూపధేయభర = సౌందర్యసంపదకు, సీమ
తయా = అవధియగుటచే, సమేషు = సమానులైన, అనగా లోకో
త్తరమైన సౌందర్యమందఱికిని యుండుటచే, వారి పరస్పరభేదము
తెలియసాధ్యముకాని, తేష్వేవ = నలుడున్నగునా యెదురుగురియందే,
అహం = నేను, నలమోహం = నలుడనుమోహమును, కథం = ఎట్లు
నవహే = వహింపను.

సమాసములు :

ఐలః :- ఇలాయాః అపత్యంపుమాన్ = ఐలః.

ఆశ్వినేయౌ :- అశ్విన్యాః అపత్యేపుమాంసౌ = అశ్వినేయౌ.

నలమోహం :- నలఇతిమోహః = నలమోహః, తమ్ = నలమోహమ్.

భావము :

లేదా యీ నలపంచకములందు యీ యొక్కడు నలుడాయేమి? వీరిలో

వతీయొక్కఁడు పురూరవుఁడాయేమి? తక్కిన మరియొక్కఁడు మన్మథుఁడా యేమి? సౌందర్యమునకు నవధిగా లోకోత్తర సౌందర్యమును వహించు టచే నొండురుల భేదము గూడఁదెలియనలవిఁగాకయున్న యాయైదుగురి యందే నలమోహమును నేల నేసుపొందను? తప్పక పొందగలను. సమాన వస్తువులయందు సాదృశ్యముచే భ్రాన్తి యేర్పడుట సహజము గదా. 43

శ్లో॥ పూర్వం మయా విరహనిస్సహయాపి దృష్టః
సోఽయం ప్రియ స్తత ఇతో నిషధాధిరాజః.
భూయః కిమాగతవతీ మమ సా దశేయం
పశ్యామి యద్విలసితేన నలానలీకాన్. **44**

ప॥ వి॥ పూర్వం - మయా - విరహనిస్సహయా - అపి - దృష్టః - సః - అయం - ప్రియః - తతః - ఇతః - నిషధాధిరాజః - భూయః - కిమ్ - ఆగతవతీ - మమ - సా - దశా - ఇయం - పశ్యామి - యద్విల సితేన - నలాన్ - అలీకాన్.

అర్థము:- పూర్వమపి = స్వయంవరకాలమునకు పూర్వముగూడ, విరహనిఃస హయా, విరహ = వియోగబాధను, నిఃసహయా = సహింపజాలని, మయా = నాచేత, సః = ఆ, అయం = ఈ, ప్రియః = ప్రియుడైన, నిషధాధిరాజః ; నిషధ = నిషధదేశమునకు, అధిరాజః = ప్రభువైన నలచక్రవర్తి, తతఃఇతః = ఆ వైపునను ఈ వైపునను అనగా నన్ని దిక్కులయందును, దృష్టః = చూడబడుచున్నాడు. (కావున) మమ = నాకు, ఇయం = ఈ జరుగుచున్న. దశా = విరహమువలనయున్మాద దశ, సాఏవ = పూర్వమనుభవింపఁబడినదేయైన, దశా = అవస్థ, భూయః = మఱల, ఆగతవతీకిం = వచ్చినదాయేమి? యద్విలసితేన, యత్ = ఏ యున్మాదదశయొక్క, విలసితేన = ప్రభావముచే, అలీ కాన్ = అసత్యభూతులైన, నలాన్ = నలులను, పశ్యామి = చూచు చున్నాను.

సమాసములు :

విరహనిః సహయా :— నిః సహతేఇతి = నిస్సహా. విరహస్య, నిస్సహా = విరహనిస్సహా, తయా = విరహ నిస్సహయా.

నిషధాధిరాజః :— నిషధానాం అధిరాజః = నిషధాధిరాజః.

యద్విలసితేన :— యస్యాః విలసితమ్, యద్విలసితమ్, తేన = యద్విలసితేన.

భావము :

స్వయంవం కాలమునకంటె పూర్వము గూడ, వియోగమును దాలజాలని నేను, అయా ప్రియుడగు నలుని నన్ని దిక్కులయందును, గాంచుచుంటిని. ప్రకృత మా యున్మాద దశ తిరిగివచ్చినదాయని తోచు చున్నది. అ యున్మాద దశయొక్క ప్రభావముచే నపత్య నలులను కాంచుచున్నాను. 44

శ్లో॥ ముగ్ధా దధామికథ మిత్థ మథాపశఙ్కాం
సఙ్క్రన్దనాది కపటః స్ఫుటమీదృశోఽయం.
దేవ్యాఽనయాహి రచితా హి తథా తథైషాం.
గాథా యయా దిగధిపానపి తాః స్పృశన్తి 45

ప॥ వి॥ ముగ్ధా - దధామి - కథమ్ - ఇత్థమ్ - అథ - అపశఙ్కాం - సఙ్క్రన్దనాది కపటః - స్ఫుటమ్ - ఈ దృశః - అయం - దేవ్యా - అనయా - ఏవ - రచితాః - హి - తథా - తథా - ఏషాం - గాథాః - యథా - దిగధిపాన్ - అపి - తాః - స్పృశన్తి.

అర్థము :— అథ = లేదా, ముగ్ధా = మూఢురాలైన (అహం = నేను) కథం = ఎట్లు, ఇత్థం = ఈ విధముగా, అపశఙ్కాం = అ భూత మైన సందేహమును, దధామి = ధరింతును. యతః = ఏలయనగా. ఈ దృశః = ఇటువంటి, అయం = ఈ వ్యాపారము, సఙ్క్రన్ద నాదికపటః: సఙ్క్రన్ద నాది=ఇంద్రుడు మున్నదువారియొక్క, కపటః= మాయ, ఇతి = అని, స్ఫుటం = స్పష్టము, తథాహి = అదియుక్తమే,

అస్యయా = ఈ, దేవ్యైవ = సరస్వతీ దేవిచేతనే, తథా = ఆ ప్రకా, రముగా, గాథాః = వర్ణనాశ్లోకములు, రచితాః = రచియింపఁబడి నవి. యథా = ఏ ప్రకారముగా, తాః = వర్ణన శ్లోకరూపములైన గాథలు; దిగధిపానపి = దిక్పాలకులను సైతము. స్పృశన్తి = స్పృశించుచున్నవి అనగా శ్లేష మహిమచే బోధించుచున్నవి. అనగా నలునిఁ గాక దిక్పాలులను సైతమంటుచున్నవని యర్థము. కావున నన్ను వంచించుటకు నలరూపమును ధరించుట యను దేవమాయయే యిది కాని నాకు సంబంధించిన మోహముగాదని యర్థము.

**సమాసములు :**

అపశఙ్కామ్ :— అపకృష్టా, శఙ్కా = అపశఙ్కా, తామ్ = అప శఙ్కామ్.

స్రక్చన్దనాదికపటః ;— స్రక్చన్దనః ఆదిః యేషాంతే = స్రక్చన్ద నాదయః, స్రక్చన్ద నాదీనాం, కపటః = స్రక్చన్ద నాదికపటః.

దిగధిపాన్ : — దిశామధిపాః = దిగధిపాః, తాన్ = దిగధిపాన్.

**భావము :**

లేదా, మూఢురాలైన నేను ఇట్లు అభావ్యమైన సందేహమును వహించు చున్నానా యేమి? ఇట్టి మౌఢ్యము నాకిప్పుడు తగదు. ఈ పని ఇంద్రాదులు కల్పించిన మాయయనిస్పష్టము ఏలయనగా సరస్వతీదేవి ఇంద్రాదివర్ణనా రూపములగు గాథలను శ్లేషమహిమచే కేవలము నలునిగాక, వారిని గూడ నంటునట్లు రచించినది. కాన నన్ను వంచించుటకే దేవతలు కల్పించిన మాయయే యిది. కాని నాకుఁ గల్గిన మోహముగాదు. 45

శ్లో॥ ఏ తన్మదీయమతి వఞ్చక వఞ్చకస్తే
నాథేకథం ను మనుజస్య చకాస్తు చిహ్నమ్.
లక్ష్మాణి తాని కిమమీ నవహన్తి హంత !
బర్హిర్ముఖా ధుతరజస్తనుతాముఖాని. 46

ప॥ వి॥ ఏతన్మదీయ మతివఞ్చక పఞ్చకస్థే - నాథే - కథం - ను - మను జస్య - చకాస్తు - చిహ్నమ్ - లక్ష్మాణి - తాని - కిమ్ - అమీ - న - వహన్తి - హంత - బర్హిర్ముఖాః - ధుతరజస్తనుతాముఖాని.

అర్థము :— ఏతన్మదీయమతివఞ్చక పఞ్చకస్థే; ఏతత్ = ఈ, - మదీయ మతివఞ్చక = నా బుద్ధిని వంచించునట్టి, పఞ్చకస్థే; = ఐదుగురగు నింద్రాదుల మధ్యనున్న, నాథే = నాకు నాథుడైన నలుని విషయ మందు, కథం ను = ఏవిధముగా, మనుజస్య = మానవునియొక్క, చిహ్నం = గుఱ్ఱు, చకాస్తు = ప్రకాశించును? కింతు = కాని, అమీ బర్హిర్ముఖాః = ఈ అగ్నిని ముఖములుగాగల దేవతలు, ధుతర జస్తనుతా ముఖాని; ధుత = విడువబడిన. రజః = ధూళియనగా మట్టి వలని దుమ్ముగల్గిన, తనుతా = దేహమును గల్గియుండుట, ముఖాని = మున్నగునవి యనగా భూమినిఁదాకుట, చెమర్పుట, ఱెప్పపాట్లు మున్నగువానిని లేకయుండుట మొదలగు, లక్ష్మాణి = దేవతా వ్యంజకములగు చిహ్నములను. హంత = అయ్యో! కథం = ఎట్లు, నవహన్తి = ధరించుటలేదు? నా దురదృష్టము వలననే యీ దేవతలు తమ యసాధారణ చిహ్నములను దాచియున్నారు. అందువల ననే, నలుని గుర్తింపలేక యున్నానని యర్థము,

**సమాసములు :**

ఏతన్మదీయమతివఞ్చకపఞ్చకస్థే :- మమఇయం = మదీయా, మదీ యాచసామతిశ్చ = మదీయమతిః, మదీయమతేః, వఞ్చకాః=మదీయమతి వఞ్చకాః, ఏతేచతే, మదీయమతివఞ్చకాశ్చ= ఏతన్మదీయమతివఞ్చకాః. ఏతన్మదీయమతి వఞ్చకానాం, పఞ్చకం = ఏతన్మదీయమతి వఞ్చక పఞ్చకమ్. ఏతన్మదీయమతివఞ్చపఞ్చకే, తిష్ఠతీతి = ఏతన్మదీయమతి వఞ్చకపఞ్చకస్థః, తస్మిన్ = ఏతన్మదీయమతివఞ్చకపఞ్చకస్థే.

బర్హిర్ముఖాః :- బర్హిర్ముఖం, యేషాంతే = బర్హిర్ముఖాః.

ధుతరజస్తనుతాముఖాని :- ధుతంరజఃయస్యాసా = ధుతరజాః. ధుత

రజాః, తనుఃయేషాంతే = ధుతరజస్తనవః. ధుతరజస్తమానాం, భావః = ధుతరజస్తనుతా, ధుతరజస్తమతా, ముఖం యేషాంతాని = ధుతరజస్తనుతాముఖాని, తాని = ధుతరజస్తనుతాముఖాని.

**భావము**

నాబుద్ధిని మోహపఱచి వంచింపనీయైనుగురి మధ్యనున్న నానాథుడైన నలునియందు మానవత్వమును వెల్లడిచేయు చిహ్నములు అనగా, శరీరము చెమర్చుట, ఱెప్పపాట్లు గల్గియుండుట, దుమ్ముకమ్మి యుండుట, ధరించిన పుష్పములు వాడుబారుట మున్నగునవి యెట్లు ప్రకాశింపవు? కాని యవి యింద్రాదుల మాయచే ప్రకాశించుటలేదు. ఇంద్రాదిపంచక మందు నలుడు చేరియున్నందువలన నితనికిని వఞ్చకత్వ మాపాదితమగును. కాని బాటసారులలో కొందఱు గొడుగులు ధరించి, యితరులు ధరింపక పోయినను వారినందఱినిఁగూర్చి "ఛత్రిణోయాన్తి" యని గొడుగులు ధరించినవారు వెళ్ళుచున్నారని చెప్పుట వాడుకయందుగలదు. ఇచ్చట ఛత్రులనగా ఛత్రముగలవారి యొక్కయు, ఛత్రములులేనివారి యొక్కయు సమూహము. కాననిదియే ఛత్రిన్యాయము. ఈ ఛత్రిన్యాయమునను సరించి, నలుడు వంచకుడు కాకపోయినను, వఞ్చకపఞ్చక మధ్యమునందు చేరియున్నాడు. కాన నతనికి వాస్తవిక వఞ్చకత్వము లేకపోయినను, వఞ్చక మధ్యపతనముచే ఛత్రిన్యాయమునను సరించి వఞ్చకత్వ మేర్పడినదని యర్థము. శరీరమున దూళిని, చెమటను, కన్నులయందు ఱెప్పపాట్లను వహింపక యుండుట, ధరించిన పుష్పములు వాడుబారక యుండుట, మున్నగు దేవతాచిహ్నములనునేల ధరించుటలేదు? ఇదికష్టము. నా దురదృష్టవలన దేవతలు తమకున్న సాధారణములైన చిహ్నములను దాచి యీ సభయందున్నారు. కావున నలుని గుర్తింప లేకయున్నాను. 46

శ్లో॥ యాచే నలం కిమమరానథవా తదర్థం
నిత్యార్చనాదపినదత్త ఫలైరలంతైః.
కందర్పశోషణపృషత్క నిపాతపీత
కారుణ్యనీరనిధిగహ్వర ఘోరచిత్తైః. 47

ప॥ వి॥ యాచే - నలం - కిమ్ - అమరాన్ - అథవా - తదర్థం - నిత్యార్చ
నాత్ - అపి - నదత్త ఫలైః - అలం - తైః - కందర్ప శోషణ
పృషత్కనిపాతపీత కారుణ్య నీరనిధిగహ్వర ఘోరచిత్తైః

అర్థము :— అమరాన్ = ఇంద్రాది దేవతలను, నలం = నలుని గూర్చి, యాచేకిం = యాచింతునాయేమి ? అథవా = లేదా, తదర్థం = ఆ నలునికై, నిత్యార్చనాదపి = నిత్యపూజపలనను, నదత్తఫలైః = ఫలము నొసింగనట్టి వారును, కందర్పశోషణ పృషత్కనిపాపపీత కారుణ్యనీరనిధి గహ్వర ఘోరచిత్తైః; కందర్పశోషణ = కామమును శోషింపఁజేయుటచే, కందర్ప శోషణమను పేరుగల, పృషత్క = బాణముయొక్క, నిపాత = పతనముచే, పీత = ఎండింపఁబడిన, కారుణ్యనీరనిధీ = కృపాసముద్రముయొక్క, గహ్వర = లోతైన గుంతలు రూపముగల్గిన. ఘోర = కఠినములైన, చిత్తైః = మనస్సులుగల, తైః = ఆయింద్రాదులచే, అలం = చాలును. ప్రయోజనము లేదు. ఈ దేవతలు కామముచే మోహము నొందినవారై నిత్యపూజలను గావించుచున్నను ప్రార్థనలనుఁదీర్చుటలేదు. వారిప్పుడు కేవలము మ్రొక్కుటచే కోరికను దీర్పరు కానవారిని ప్రార్థించుట వ్యర్థము.

**సమాసములు :**

నిత్యార్చనాత్ :— నిత్యం చతత్, అర్చనంచ = నిత్యార్చనం. తస్మాత్ = నిత్యార్చనాత్.
నదత్తఫలైః :— న, దత్తాని = నదత్తాని నదత్తాని, ఫలాని, యైస్తే = నదత్తఫలాః, తైః = నదత్తఫలైః.
కందర్పశోషణ పృషత్కని పాపపీత కారుణ్య నీరనిధి గహ్వర ఘోర చిత్తైః :— కందర్పస్యశోషణః = కందర్ప శోషణః. కందర్ప శోషణశ్చాసౌ, పృషత్కశ్చ=కందర్పశోషణ పృషత్కః, కందర్ప శోషణ పృషత్కస్యనిపాతః = కందర్ప శోషణ పృషత్కనిపాతః, కందర్ప శోషణ పృషత్కనిపాతేన పీతః = కందర్ప శోషణ పృషత్క నిపాత

పీతః, కారుణ్యస్య నీ నిధిః = కారుణ్యనీరనిధిః, కందర్పశోషణ పృషత్క నిపాత పీతశ్చాసౌ, కారుణ్యనీరనిధిశ్చ = కందర్ప శోషణ పృషత్క నిపాతపీత కారుణ్యనీరనిధిః కందర్ప శోషణ పృషత్క నిపాతపీత కారుణ్యనీరనిధేః, గహ్వరం = కందర్పశోషణ పృషత్క నిపాతపీత కారుణ్య నీరనిధిగహ్వరం. కందర్ప శోషణ పృషత్క నిపాత పీతకారుణ్య నీరనిధి గహ్వరం, ఘోరం, చిత్తం, యేషా తే= కందర్ప శోషణ పృషత్క నిపాతపీత కారుణ్యనీరనిధి గహ్వర ఘోర చిత్తాః, తైః = కందర్పశోషణ పృషత్క నిపాతపీత కారుణ్యనీరనిధి గహ్వర ఘోరచిత్తైః.

**భావము :**

నలునికై దేవతలను ప్రార్థించినా, లేదా దానికై నిత్యపూజలను చేయుచున్నను ఫలముకొసంగక, కామును శుష్కింపజేయు, కందర్పశోషణమును బాణముచే శుష్కించిన కారుణ్యసాగరముయొక్క యడుగున దలి గుంతలైన కఠినపు మనస్సుగల దేవతల వలన ప్రయోజనములేదు. అనగా దిక్పాలకుల హృదయములు దయా సముద్రములు కాని వానిపై శోషణములనెడి బాణములు పడుటచే నవియెండిపోయి ఆ సాగరములయొక్క యడుగు గుంతలు శేషించినవి. కాన నిట్టి కరుణామృతము లేని కఠినములగు చిత్తములుగల దేవతలెట్టి సహకారమునుఁజేయరు. కాన వారి వలన ప్రయోజనము లేదు. నిత్య పూజకే యనుగ్రహింపని దేవతలు కేవలము ప్రార్థన కేమి యనుగ్రహింతురు కాన వారిని ప్రార్థించుట వ్యర్థము. 47

శ్లో॥ ఈశా దిశాం నలభువం ప్రతిపద్యలేఖా
వర్ణశ్రియం గుణవతామపి వః కథంవా ?
మూర్ధాన్ధ కూపపతనాదివ పుస్తకానా
మన్త్రం గతం బత పరోపకృతివ్రతిత్వమ్. 48

ప॥ వి॥ ఈశాః – దిశాం – నలభువం – ప్రతిపద్య – లేఖాః – వర్ణశ్రియం – గుణవతామ్ – అపి – వః – కథం – వా – మూర్ధాన్ధకూపపతనాత్ –

ఇవ - పుస్తకానామ్ - అస్తం - గతం - బత. పరో పకృతి వ్రతి త్వమ్.

అర్థము :— హే దిశామీశాః = ఓ దిక్పాలకులగు, లేఖాః = దేవతలారా! నలభువం = నలుని వలన గల్గిన అనగా నలునియందు నెలకొనిన, వర్ణశ్రియం = పసిమివన్నెయొక్క సంపదను, పక్షాన్తరమున:— నల భువం = నలమనెడి గడ్డిచే నిర్మితమగు కలమునుండి యుద్భవించిన, వర్ణశ్రియం = అక్షరసంపదను, ప్రతిపద్యాఽపి = పొందియు, గుణ వతాం = శుద్ధత్వము సౌందర్యము మున్నగు గుణములు గల్గిన, పక్షాంతరమున, గుణవతాం = కట్టు త్రాళ్ళు గల్గిన, వః = మీకు, మూర్ఖాన్ధకూపపతనాత్; మూర్ఖ = మూఢులనెడి, అంధకూప = నీళ్ళు లేని పాతబావులయందు, పతనాత్ = పడుటవలన, పుస్తకానామివ = పుస్తకములకెట్లో అట్లె, పరోపకృతివ్రతిత్వం; పరోపకృతి = పరోప కారమనెడి, వ్రతిత్వం = నియమము గల్గియుండుట, కథంవా = ఎట్లు, అస్తంగతం = నాశమును బొందినది. బత = నింద్యము. నలుని రూపము ధరించుటచే నతనిగుణములు మీయందు సంక్రమించుచున్నవి. అందువలన నాతని యుపకార స్వభావముగూడ మీ యందు తప్పక సంక్రమించినది. కాని నా విషయమందా యుపకార స్వభావమెట్లు నశించి నది ? ఇదియుక్తముగాదు. పక్షాన్తరమున— మేలైన లిపి గల యక్షర ములతో శోభించు పుస్తకములు మూర్ఖుల హస్తములయందుఁబడినచో నేర్చుకొనఁగోరిన వారికి నుపకారముండదనందువలన వానికి పరోపకారి త్వము ఉండదు.

**సమాసములు :**

నలభువం :— నలాత్ భవతీతి = నలభూః, తామ్ = నలభువమ్

వర్ణశ్రియం :— వర్ణస్య, శ్రీః = వర్ణశ్రీః, తామ్ = వర్ణశ్రియం.

గుణవతామ్ :— గుణః ఏషామస్తీతి = గుణవంతః, తేషాం = గుణవ తామ్.

మూర్ఖాన్ధకూపపతనాత్ :— మూర్ఖా ఏవ అంధకూపాః, = మూర్ఖాన్ధ

కూపాః, మూర్ఖాన్ధకూపేషు పతనం=మూర్ఖాన్ధకూపపతనం, తస్మాత్
= మూర్ఖాన్ధ కూపపతనాత్.

పరోపకృతి వ్రతిత్వమ్ :— పరేషాముపకృతిః=పరోపకృతిః, పరోప
కృతిరేవ వ్రతం=పరోపకృతివ్రతం, పరోపకృతివ్రతం, అస్యాస్తీతి=
పరోపకృతివ్రతీ, పరోపకృతివ్రతినః, భావః = పరోపకృతివ్రతిత్వమ్.

**భావము :**

ఓ దిక్పాలకులగు దేవతలారా! నలుని యందలి పక్షిమి వన్నెను పొందియు, శుద్ధిని సౌందర్యాదిగుణములతో నిండారిన మీకు – నలమనెడి గద్దిచేఁ జేయఁబడిన కలమునుండి యుద్భవించిన యక్షరసంపదను గల్గి, దారము లనెడి గుణములతో కట్టఁబడినవియు, మూర్ఖులనెడి నీళ్ళులేని బావియందుఁ బడ వేయఁబడిన పుస్తకములకువలె - పరోపకారవ్రతమెట్లు నశించినది. నలుని రూపమును ధరించిన మీయందు నా నలుని గుణములు గూడ సంక్రమించినవి కావున నాతని పరోపకారవ్రతము గూడ నిశ్చయముగా మీయెడ సంక్రమించి నది. కాని నా విషయమున నావ్రతమెట్లు నశించినది. ఇది నిందింప దగిన విష యము. పక్షాంతరమున - చక్కని వర్ణ రచనగల్గి వర్ణస్ఖాలిత్యములేని పుస్తక ములు, మూర్ఖుల హస్తమునకుఁబోయినచో, విద్యను నేర్వఁగోరిన జిజ్ఞాసువులకు వాని యుపకారముండదు కానవానికి పరోపకారిత్వము సంభవింపదు. — అట్లే నలుని గుణములన్నియు మీయెడ సంక్రమించినను, నతని పరోపకారిత్వ స్వభావము నా విషయమునందు మీయెడ లేకపోవుట శోచనీయమనిభావము. 48

శ్లో॥ యస్యేశ్వరేణయదలేఖిలలాటపట్టే,
తత్స్యాదయోగ్యమపి యోగ్యమపాస్య తస్య.
కావాననాస్తు బిభృయామిహయాం హృదాఽహం
నారాకృతస్తైర్గలజమేతి హిమైస్తు దాహమ్. 49

ప॥ వి॥ యస్య - ఈశ్వరేణ - యత్ - అలేఖి - లలాటపట్టే - తత్ -
స్యాత్ - అయోగ్యమ్ - అపి - యోగ్యమ్ - అపాస్య - తస్య - కా॥

కా సనా - అస్తు - బిభృయామ్ - ఇహ - యాం - హృదా - అహం -
న - అర్కాతపైః - జలజమ్ - ఏతి - హిమైః - తు - దాహమ్.

అర్థము :— యస్య = ఏ జనమునకు, లలాటపట్టే = నొసలనెడి పలకపైన, ఈశ్వరేణ = దైవముచే, యత్ = శుభము కాని యశుభము కాని అలేఖి = వ్రాయబడినదో, తస్య = ఆ జనమునకు, అయోగ్యమపి= అర్హము కాకపోయినను, తత్ = అదియనగా శుభము అశుభము, యోగ్యం = తగిన ఫలమును, అపాస్య = వదలి, స్యాదేవ = కల్గియే తీరును, ఏవంస్థితే = ఇట్లుండగా, సా = ఆ, వాసనా = ఈశ్వరేచ్ఛచే ననుగ్రహింపఁబడిన కర్మవాసన, లేదా యుక్తి, కాఅస్తు = ఏమికావల యును ? దానిని తెలియజాలకయున్నాను. ఇహ = ఈ నల నిశ్చయ ముువిషయమున, యాం = ఏవాసనను, అహం = నేను, హృదా=హృద యముచే, బిభృయాం=ధరింతునో ! రెంటిలోనొక విషయమునుఁగూర్చి నిశ్చయము కల్గినచో, సందేహముడిగిన దుఃఖముండదు గదా ! కావున నయోగ్యమైనదియు గల్గియే తీరును. ఎట్లనగా - జలజమ్ = పద్మము, అర్కతాపైః = సూర్యుని తాపములచే, దాహం = శోషను, నైతి = పొందదు, కింతు = కాని, హిమైః = మంచులచే, ఏతి = పొందు చున్నది. అందువలన నలుని బడయుట యీశ్వరేచ్ఛతో, గూడిన కర్మ వాసనను ననుసరించినది. అది తెలియ శక్యముగాదు. కాన గతియేమి? అందువలన దేవతలవలన దోషనేమియులేదు.

**సమాసములు :**

లలాటపట్టే :— లలాటమేవ పట్టః = లలాటపట్టః, తస్మిన్ = లలాట పట్టే.
అర్కతాపైః :— అర్కస్య. తాపాః = అర్కతాపాః, తైః = అర్కతాపైః.

**భావము**

ఈశ్వరుడు ఎవని నొసటనేమి శుభాశుభములను, వాని కర్మననుసరించి వ్రాసియుండునో, అదియోగ్యమైనను, నయోగ్యమైనను, జరిగియే తీరును. ఇట్లుం

దగా, నా యీశ్వరుడనుగ్రహించిన యీ కర్మపరిపాకమెట్టిదిగానుండును? అది యనూహ్యము. నలుని విషయమున నేనట్టికర్మవాసననే మనస్సునఁబట్టుకొని యున్నాను. ఏదియో యొకటియనగా నలునిబడయుటయో, లేక పడయలేక పోవుటయో యనునది నిశ్చితమైనచో సందేహము తొలఁగిపోయి సుఖింతును. పద్మము సూర్యతాపముచే వాడదు. అది మంచుచే వాడుచున్నది. దీనికి కారణము తెలియ శక్యముగాదు. అందువలన నీశ్వరేచ్ఛచే ననుగ్రహింపఁబడిన కర్మవాసన ననుసరించి నలప్రాప్తియగును. అదియిప్పుడు తెలియరాకయున్నది. కాన గత్యంతరమేమి? ఈ విషయమున దేవతలదేమియు దోషములేదు. 49

శ్లో॥ ఇత్థం యథేహ మదభాగ్య మనేన మన్యే
కల్పద్రుమోఽపినయథా ఖలుయాచ్యమానః.
సఙ్కోచసంజ్వరదలాఙ్గులిపల్లవాగ్ర
పాణీభవన్ భవతిమాంప్రతిబద్ధముష్టిః. 50

ప॥ వి॥ ఇత్థం - యథా - ఇహ - మదభాగ్యమ్ - అనేన - మన్యే - కల్పద్రుమః - అపి - సః - యథా - ఖలు - యాచ్యమానః - సఙ్కోచసంజ్వరదలాఙ్గులిపల్లవాగ్రపాణీ భవన్ - భవతి - మాం - ప్రతి - బద్ధముష్టిః.

అర్థము :- ఇహ = ఈ సమయమందు, ఇత్థం = ఈ విధముగా మదభాగ్యం; మత్ = నాయొక్క, అభాగ్యం = దురదృష్టము, అభూత్ = ఏర్పడినది, యథా = ఎట్లు, అనేన = ఈ దురదృష్టముచే, సః = అంతటి త్యాగశీలముగల, కల్పద్రుమోఽపి = కల్పవృక్షముగూడ, మయా = నాచే, యాచ్యమానస్సన్ = యాచింపఁబడుచున్నదై, సంకోచసంజ్వరదలాఙ్గులిపల్లవాగ్రపాణీభవన్, సంకోచ = ముకుళించుటయను, సంజ్వర = సంతాపముగల, దల = ఆకులనెడి, అఙ్గులి = వ్రేళ్ళుగల, పల్లవాగ్ర = చిగుళ్ళచివరి భాగమనెడి, పాణీభవన్ = హస్తముగలవాడగుచు, లేదా, పల్లవ = చిగుళ్ళనెడి, అగ్రపాణీభవన్ = ముందఱిచేయిగల వాడై, మాంప్రతి = నన్నుఁగూర్చి. బద్ధముష్టిః = గట్టిపిడికిలిగలవాడు

గాన అనగా లోభిగా, భపతిభలు = అగుచునే యున్నాడు. యాచకుల కోరికలనుఁదీర్చెడి కల్పవృక్షముగానున్నను నా విషయములో నతడు వ్యతిరేక భావముగల్గియున్నాడని యర్థము.

**సమాసములు :**

మదభాగ్యమ్ :- మమ, అభాగ్యమ్ = మదభాగ్యమ్.

సఙ్కోచసంజ్వరదలాఙ్గులి పల్లవాగ్రపాణీభవన్ :- సఙ్కోచ ఏవసం జ్వరః, యేషాంతాని = సఙ్కోచ సంజ్వరాణి, సఙ్కోచసంజ్వరాణి దలాని, అఙ్గు- యఃయస్యసః = సఙ్కోచసంజ్వరదలాఙ్గులిః. పల్లవానా మగ్రమ్ = పల్లవాగ్రమ్, పల్లవాగ్రమేవపాణిః యస్యసః = పల్లవాగ్ర పాణిః, సఙ్కోచసంజ్వరదలాఙ్గులిశ్చాసౌ, పల్లవాగ్రపాణిశ్చ = సఙ్కో చసంజ్వరదలాఙ్గులి పల్లవాగ్రపాణిః, అసఙ్కోచసంజ్వరదలాఙ్గులి పల్ల వాగ్రపాణిః, సఙ్కోచ సంజ్వరదలాఙ్గులి పల్లవాగ్రపాణిః, సమ్పద్య మానఃభవన్ = సఙ్కోచసంజ్వరదలాఙ్గులిపల్లవాగ్రపాణీ భవన్.

బద్ధముష్టిః :- బద్ధాముష్టిఃయస్యసః = బద్ధముష్టిః.

**భావము :**

ఈ సమయమున నా దురదృష్టమింతటిది. కావున మిక్కిలి త్యాగశీలుడైన కల్పవృక్షముగా విరాజిల్లు నలుఁడు నావేత యాచింపఁబడియు నా విషయమున గట్టి పిడికిలిని బట్టియున్నాడు. అతడు కల్పవృక్షము గాననాతని పిడికిలియందు సంకోచ సంతాపముచే ముడుచుకొను కల్పవృక్షపుటాకులను వ్రేళ్ళుగను, చిగు ళ్ళను ముంజేతి చేతులుగను గలవాడై నావిషయమున వర్తించుచున్నాడని భావిం తును. పిడికిలియందు వ్రేళ్ళు ముడుచుకొనియుండుట సహజము గదా. యాచ కుల కోరికలనుఁ దీర్చెడి కల్పవృక్షమైన యీ నలుడు నా విషయమున కఠినము గా నుండుట నా దురదృష్టమని దమయంతి వెతఁ జెందినది. 50

శ్లో॥ దేవ్యాః కరే వరణమాల్య మథార్పయే వాః
యో వైరసేనిరిహ తత్ర నివేశయేతి.
సైషామయా మఖభుజాం ద్విషతీ కృతాస్యాత్
స్వస్మైతృణాయ తువిహన్మి న బంధురత్నమ్. 51

ప॥చ్ఛే॥ దేవ్యాః - కరే - వరణమాల్యమ్ - అథ - అర్పయే - వా - యః - వైరసేనిః - ఇహ - తత్ర - నివేశయ - ఇతి - సా - ఏషా - మయా - మఖభుజాం - ద్విషతీ - కృతా - స్యాత్ - స్వస్మై - తృణాయ - తు - విహన్మి - న - బంధురత్నమ్.

అర్థము :- అథవా = లేదా; ఇహ = ఈ యైదుగురు నలులమధ్య, యః = ఏ, వైరసేనిః = నలుడు కలడో, తత్ర = అతనియందు, నివేశయ = ఉంచుము, ఇతి = అని (ఉక్తా = చెప్పబడినదాననై), దేవ్యాః = సరస్వతీదేవి యొక్క, కరే = చేతియందు, వరణమాల్యం = స్వయంవర మాలను, అర్పయేవా = అర్పింతునా? కాని (ఇది యుక్తము కాదు), సైషా = ఆ యీ సరస్వతీదేవి, మయా = నాచే, మఖభుజాం = దేవతలకు, ద్విషతీ = శత్రువుగా, కృతాస్యాత్ = చేయబడినదగును,- నా ప్రేరణచే సరస్వతీదేవి యథార్థనలుని కణ్ఠమున వరణమాలను వైచినచో నింద్రాదుల నలరూపధారణమను మాయ వెల్లడియగును. అందువలన వారికి సరస్వతీదేవిపైన ద్వేషమేర్పడునని యర్థము. తృణాయ = గడ్డిపోచతో సమానమైన, స్వస్మై = నాకొఱకు, బంధురత్నం = రత్నము వంటి బంధువైన సరస్వతీదేవిని, నవిహన్మి = బాధపెట్టను.

**సమాసములు :**

వరణమాల్యమ్ :— వరణస్య, మాల్యమ్ = వరణమాల్యమ్, తత్ = వరణమాల్యమ్.

వైరసేనిః :— వీరసేనస్యఅపత్యంపుమాన్ = వైరసేనిః.

బంధురత్నమ్ :— బంధుఃరత్నమివ = బంధురత్నమ్, తత్ = బంధురత్నమ్.

**భావము :**

లేదా యీ యైదుగురు నలులమధ్య వీరసేనమహారాజునకు కుమారుడైన నలుని కణ్ఠమందు వరణమాలను వేయమని సరస్వతినిం బ్రేరింతునా? కాని యిది యుక్తము కాదు అట్లు చేసినచో నాసరస్వతి దేవతలకు ద్వేషపాత్రురాలగును.

నా ప్రేరణచే నామె నలుని కణ్ఠమందు వరణమాలను వైచినచో, ఇంద్రాదులు గావించిన నలరూపధారణయను మాయ బయటపడును. కాన గడ్డిపోచకు సమానమైన నా కొఱకు పరమబంధువైన దేవిని బాధపెట్టుట యనుచితము. 51

శ్లో॥ యః స్యాదమీషు పరమార్థనలః స
మాలా మఙ్గీకరోతు వరణాయ మమేతి వైతామ్.
తంప్రాపయామి యది తత్ర విసృజ్య లజ్జాం
కుర్వేకథం జగతి శృణ్వతిహా విడమ్బః. 52

ప॥వి॥ యః, స్యాత్ - అమీషు - పరమార్థనలః - స, - మాలామ్ - అంగీకరోతు - వరణాయ - మమ - ఇతి - వా - ఏతామ్ - తం - ప్రాపయామి - యది - తత్ర - విసృజ్య - లజ్జాం - కుర్వే - కథం - జగతి - శృణ్వతి - హా - విడమ్బః.

అర్థము :— అమీషు = ఈ యైదుగురిమధ్య, యః = ఎవ్వడు. పరమార్థనలః = సత్యనలుడుగా, స్యాత్ = అగునో, సః = ఆ సత్యనలుడు, మమ = నాయొక్క, వరణాయ = వరణమునకై మాలాం = వరణమాలను, అంగీకరోతు = స్వీకరించుగాత. తత్ర = ఆస్వయంవర సభయందు, లజ్జాం = సిగ్గును, విసృజ్య = వదలి, ఇతి = ఈ విధముగా చెప్పిగాని, ఏతాం = ఈమాలను, తం = వానిని అనగా సత్యనలుని, ప్రాపయామియది = పొందించుచో, తదా = అప్పుడు జగతి = సభయందలి సకలజనము, శృణ్వతిసతి = వినుచుండగా, కథం = ఎట్లు. కుర్వే = చేయను. హా = కష్టము. విడమ్బః = పరిహాసము. ఆ విధముగానీను చెప్పినచో నా సిగ్గుతేని తనము బయటపడును. అదివిని సభ్యులందరును నన్ను పరిహసింతురు.

**సమాసములు :**

పరమార్థనలః :- పరోమాయస్మాత్సః = పరమః, పరమశ్చాసౌ, అర్థశ్చ = పరమార్థః, పరమార్థశ్చాసౌ, నలశ్చ = పరమార్థనలః.

భావము :

ఈ యైదుగురి నలులమధ్య సత్యనలుడే, నా వరణమాలను స్వీకరింప వలయునని సభామధ్య నేను జెప్పి, యీ మాలను, సత్యనలునకుఁ జేర్చితినేని దానిని సభయందలి జనులందరును విని యేచో నేనేమి చేతును? కష్టము పరిహా, సము. అదినాకు సిగ్గుచేటు కాగలదు. దానినివిని సభయందలి జనులందరు నన్ను పరిహసింతురు. 52

శ్లో॥ ఇతరనలతులాభాగేషు శేషః సుధాభిః
స్నపయతి మమచేతో నైషధః కస్య హేతోః?
ప్రథమచరమయోర్వా శబ్దయోర్వర్ణసఖ్యే
విలసతిచరమేను ప్రాసభాసాం విలాసః. 53

ప॥వి॥ ఇతరనలతులాభాక్ - ఏషు - శేషః - సుధాభిః - స్నపయతి - మమ - చేతః - నైషధః - కస్య - హేతోః - ప్రథమచరమయోః - వా - శబ్దయోః - వర్ణసఖ్యే - విలసతి — చరమే - అనుప్రాసభాసాం - విలాసః .

అర్థము:- ఏషు=ఈ యైదుగురినడుమ. ఇతరనలతుభాక్; ఇతరనల = తక్కిన నలుగురి నటుల యొక్క, తులా=సామ్యమును, భాక్=పొందిన, శేషః= మిగిలినయైదవవాడుగు, నైషధః = నిషధదేశపు రాజగునలుఁడు, కస్య హేతోః = ఏదియోయొక కారణముచే, మమ = నాయొక్క, చేతః = మనస్సును, సుధాభిః = అమృతములతో, స్నపయతి = తడుపుచు న్నాడు. "సతాంహిసందేహ పదేషువస్తుషు ప్రమాణమంతః కరణప్రవృత్తయః" యను కాలిదాస వచనమునను సరించి సందేహము వచ్చినప్పుడు తనయంతఃకరణమేమని భావించునో యా భావననే ప్రమాణముగా తీసి కొనవలయును. కాన తనకు ప్రస్తుతము ఆనందమును గల్గించునట్టి యా వ్యక్తియే సత్యనలుడుగా నుండనోపునని యర్థము. ప్రథమ చరమయోః ప్రథమ = మొదటిదియును, చరమయోః = కడపటిదియునగు. శబ్దయోః

= శబ్దములకు, వర్ణసత్యే = అక్షరములయందు సామ్యమున్నను, చరమే = కడపటి శబ్దమునందు, అనుప్రాసభాసాం = అక్షరములనావృత్తి చే నేర్పడుచే కానుప్రాసమున్నగు శబ్దాలఙ్కారముల యొక్క శోభలకు, విలాసోవా = చమత్కారమే, విలసతి = స్ఫురించును. అనుప్రాసస్థలము నందు కడపటి శబ్దమందలి వర్ణసాదృశ్యమెట్లు చమత్కారమును, గల్గించునో యట్లే యైదుగురి నలులలో కడపటివాడగు నైషధ మహరాజగు నలునియందలి సాదృశ్యమే నా చిత్తమునకు మిక్కిలి సమ్మోదమును గూర్చుచున్నది. ఈ విషయమున సత్యత్వము కారణముగాదు. ఏల యనగా వీరందరు సమాన రూపముతోనే యొప్పుచున్నారు ఈ శ్లోకము యొక్క నాల్గవపాదమునందు విలస - విలాస - ప్రాస - భాసయను నాల్గుశబ్దములతో నీ యంశము సరిపడుచున్నది. లేదా ప్రథమ శబ్దమును ప్రయోగించిన పిదప కడపటి శబ్దము ప్రయోగింపబడిననే, యచ్చటననుప్రాస మేర్పడుచున్నది. ఎట్లనగా—ప్రకృత శ్లోకమునందే "అనుప్రాసభాసాం విలాసః" యనునెడ సకారములనన్నింటిని లెక్కకు గొనినచో, ననుప్రాసము చివరి సకారమునందు స్ఫురించును. అట్లే కడపటివాడగు నలునియందే నైషధబుద్ధి యేర్పరుచుట యుక్తమని యర్థము.

వి :— అయిదుగురు నలులలో కడపటి వానికి చేతో హరత్వవ్యాకార్థమునకును ప్రథమ చరమ శబ్దములలో కడపటి యనుప్రాసమునకు కాంతి వికాసమను వ్యాకార్థమునకును బింబ ప్రతిబింబ భావాపన్న సామ్యమును జెప్పుటవలన దృష్టాన్తాలఙ్కారము.

**సమాసములు :**

ఇతరనలతులాభాక్ :— ఇతరేచతేనలాశ్చ = ఇతరనలాః; ఇతరనలానాం, తులా = ఇతరనలతులా, ఇతరనలతులాం భజతీతి = ఇతరనలతులాభాక్.

నైషధః :— నిషధానాం, రాజా = నైషధః.

ప్రథమ చరమయోః :— ప్రథమశ్చ చరమశ్చ = ప్రథమ చరమౌ, తయోః = ప్రథమచరమయోః,

వర్ణసఖ్యే :— వర్ణానాం, సఖ్యం = వర్ణసఖ్యం, తస్మిన్ = వర్ణ సఖ్యే.

అనుప్రాసభాసాం :— అనుప్రాసానాం, భాసః = అనుప్రాస భాసః, తాసామ్ = అనుప్రాసభాసామ్.

**భావము :**

ఈ యైదుగురినలులలో తక్కిన నలుగురితో సామ్యమును వహించిన, నైషధ నలుఁడే, నా హృదయమును అమృతములతోఁదడుపుచున్నాడు. కావున నితడే సత్యనలుడుగా నుండవలయును. మొదటి బద్ధమునకును కడపటి శబ్దమునకును నక్షరములలో సామ్యమున్నను నక్షరముల కావృత్తి రూపమైన యను ప్రాసము కడపటి శబ్దమునందే విలసించును. కాన ననుప్రాస స్థలమునందు కడపటి శబ్దమందలి వర్ణ సామ్యమెట్లు చమత్కారమును గల్గియుండునో యట్లే యైదుగురిలో కడపటి వాడగు నైషధునియందే శోభాతిశయము నెలకొనినదై నా హృదయము నాకర్షించు చున్నది. కావున నితడే సత్య నలుడని భావము. 53

**శ్లో॥ ఇతి మనసి వికల్పానుద్యతః సన్త్యజన్తీ**
**క్వచిదపి దమయన్తీ నిర్ణయం నాసపాద.**
**ముఖమథ పరితాపాస్కందితానన్దమస్యా**
**మిహిర విరచితావస్కందమిందుం నినిన్ద. 54**

ప॥ వి॥ ఇతి - మనసి - వికల్పాన్ - ఉద్యతః - సన్త్యజన్తీ - క్వ - చిత్- అపి - దమయన్తీ - నిర్ణయం - న - ఆసపాద - ముఖమ్ - అథ - పరితాపాస్కందితానన్దమ్ - అస్యాః - మిహిర విరచితావస్కందమ్ - ఇందుం - నినింద.

ము : — ఇతి = ఇట్లు, మనసి = మనస్సునందు, ఉద్యతః = ఉద్భ విఁచుచున్న, వికల్పాన్ = పెక్కు సందేహములను, స న్న్యజన్తీ = (దోషములను వెల్లడించుటతో) వదలుచున్న, దమయన్తీ = దమ యన్తి, క్వచిదపి = అయిదుగురిలో నెవ్వనియందును. నిర్ణయం = నిశ్చయమును, నాఽఽససాద = పొందలేదు. అథ = నలనిశ్చయ మేర్పడిన పిదప, పరితాపాస్కందితానన్దం; పరితాప = సంతాప ముచే, ఆస్కందిత = తిరస్కరింపఁబడిన, ఆనందం = ఆనం దము గల్గిన, అస్యాః = ఈమెయొక్క, ముఖం = మోము, మిహిర విరచితావస్కందం; మిహిర = సూర్యునిచేత, విరచిత = చేయఁబడిన, అవస్కందం = తిరస్కారముగల, ఇందుం = చంద్రుని, నినింద = నిందించినది. అనగా దీనమైనదని యర్థము.

— ఇచ్చట "ఇష్టానధిగమాత్ధ్యానం చిన్తా శూన్యత్వతాపకృత్" అను లక్షణమునను సరించి పరితాపమును, శూన్యత్వమును గల్గించునట్టి చింతయను ననుభావము వర్ణితము.

ాసములు

పరితాపాస్కందితానందమ్ :— పరితాపేన, ఆస్కందితః = పరితాపా స్కందితః, పరితాపాస్కందితః ఆనందః యస్యతత్ = పరితాపాస్కం దితానన్దమ్.

వము :

ఈ విధముగా దమయన్తి తన మనస్సునందుద్భవించిన వికల్పములనుఁ ఁముఁ నుద్ఘాటించి పరిహరించుకొనుచు నా యైదుగురియందును నిశ్చయమును ఁలేకపోయినది. తర్వాత సంతాపమునే నానందరహితమగు నామె మోము ర్యకాంతిచే దిరస్కరింపబడిన చంద్రునివలె దీనత్వమును, కాంతిరాహిత్యము వహించినదని భావము.

శ్లో॥ శ్రీహర్షం కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః సుతం
శ్రీహీరః సుషువే జితేంద్రియచయం మామల్లదేవీ చయమ్
స్వాదూత్పాదభృతి త్రయోదశతయా౽౽
దేశ్యస్తదీయే మహా
కావ్యే చారుణి నైషధీయచరితే సర్గోనిసర్గోజ్జ్వలః.

ప॥వి॥ శ్రీహర్షం - కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః - సుతం - శ్రీహీరః - సుషువే - జితేంద్రియచయం - మామల్లదేవీ - చ - యం - స్వాదూత్పాదభృతి - త్రయోదశతయా - ఆదేశ్యః - తదీయే - మహాకావ్యే - చారుణి = నైషధీయచరితే - సర్గః = నిసర్గోజ్జ్వలః.

అర్థము :- కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః; కవిరాజ = కవిశ్రేష్ఠులయొక్క, రాజి = పఙ్క్తియొక్క, మకుట = కిరీటములకు, అలఙ్కార = భూషణములయందు, హీరః = వజ్రమణియగు, శ్రీహీరః = శ్రీహీరుడను విద్వాంసుడు, జితేంద్రియచయం; జిత = జయింపబడిన, ఇంద్రియ చయం = ఇంద్రియ సమూహము గల్గిన, శ్రీహర్షం = శ్రీహర్షుడను, సుతం = కుమారుని, సుషువే = ఉత్పత్తి గావించెనో, మామల్లదేవీచ= మామల్లదేవియను, తల్లియు, యం = ఎవరిని, సుషువే = కనెనో, స్వాదూత్పాదభృతి; స్వాదు = సహృదయుల హృదయములను ఆహ్లాదపఱచు నట్టి మధురరసము యొక్క, ఉత్పాద = ఉత్పత్తిని, భృతి = ధరించిన, తదీయే = ఆతనికి సంబంధించిన, మహాకావ్యే = మహాకావ్యమైన, చారుణి = రమ్యమైన, నైషధీయచరితే = నైషధీయ చరితమునందు, త్రయోదశతయా = పదమూడవదిగా, ఆదేశ్యః = లెక్కింపదగిన, నిసర్గోజ్జ్వలః = స్వభావ రమ్యమైన, సర్గః = సర్గ (వ్యరంసీత్ = సమాప్తమైనది.

౦లు :

గాజరాజిమకుటాలఙ్కారహీరః :- కవీనాంరాజానః = కవిరాజాః, గాజానాం, రాజిః = కవిరాజరాజిః. కవిరాజరాజేః, మకుటాని = గాజరాజిమకుటాని, కవిరాజరాజిమకుటేషు, అలఙ్కారాః = కవిరాజ మకుటాలఙ్కారాః, కవిరాజరాజిమకుటాలఙ్కారేషు, హీరః = కవి రాజిమకుటాలఙ్కారహీరః.

ద్రియచయం :- ఇంద్రియాణాం, చయః = ఇంద్రియచయః. జిత ః ద్రియచయః, యేనసః = జితేన్ద్రియచయః. తమ్ = జితేన్ద్రియ యం.

మాత్పాదభృతి :- స్వాదుశ్చాసౌ, ఉత్పాదశ్చ = స్వాదూత్పాదః, మాత్పాదం, బిభర్తీతి = స్వాదూత్పాదభృత్, తస్మిన్ = స్వాదూ పభృతి.

శ్యః :- ఆదేష్టుం, యోగ్యం = ఆదేశ్యః.

ధీయచరితే :- నిషధానాం, రాజా = నైషధః, నైషధస్య, ఇదం షధీయం, నైషధీయంచతత్, చరితంచ = నైషధీయచరితమ్, స్మిన్ = నైషధీయచరితే.

ర్గోజ్జ్వలః :- నిసర్గేణ, ఉజ్జ్వలః = నిసర్గోజ్జ్వలః.

శ్రేష్ఠుల వరుసల మకుటములలో వజ్రమణియైన శ్రీహీరుడు ఇంద్రియ గావించిన శ్రీహర్షుని జన్మింపజేసెను. మామల్లదేవి యను తల్లి గన్నెను. మధురరసావిర్భావమున కాలవాలమై వెలయుచున్న యాతని

నైషధీ య చరితమను మహాకావ్యమునందు స్వభావభాసురమగు పదమూడవ సర్గ సమాప్తి హొందినది 55

ఇట్లు
శ్రీమదాత్రేయగోత్రోద్భవ ఉడాలి నరసింహసూరి
తనూజ సుబ్బరామశాస్త్రి విరచితమగు
శ్రీహర్షనైషధ వ్యాఖ్యయందు
త్రయోదశసర్గ సమాప్తము
శమ్.

# శ్రీహర్ష నైషధము

## చతుర్దశ సర్గ

శ్లో॥ అథాధిగంతుం నిషధేశ్వరం సా
ప్రసాదనామాద్రియతామరాణామ్.
యతస్సురాణాం సురభిర్నృణాం తు
సా వేధసాసృజ్యత కామధేనుః. 1

ప - అధిగంతుం - నిషధేశ్వరం - సా ప్రసాదనామ్ - ఆద్రియత-
మరణాం - యతః - సురాణాం - సురభిః - నృణాం - తు - సా -
ధసా - అసృజ్యత - కామధేనుః.

. అథ = ఇట్లు యథార్థ నలప్రాప్తికై చింతించిన పిదప; సా = ఆ
మయన్తి, నిషధేశ్వరం = నలుని, అధిగంతుం = పొందుటకు,
మరాణాం = దేవతల యొక్క, ప్రసాదనాం = పూజాదులతో సం
షమునను సాధనముగా, ఆద్రియత = అవలంబించినది, యతః =
లయనగా, పురా = పూర్వము, వేధసా = బ్రహ్మచే, సురాణాం =
వతల యొక్క, కామధేనుః = కోరికలనుఁ దీర్చెడి సురభియనెడి గోవు,
సృజ్యత = సృజింపఁబడినది, నృణాన్తు = మానవులకో, సా =
వతలను సంతోషపఱచుట యనెడి, కామధేనుః = కామధేనువు, అసల
జ్యత = సృజింపఁబడినది. ఏది ఎవ్వని కోరికలనుఁ తీర్చునో, అది
ైననను, గోవు కాకపోయినను వానికి కామధేనువే యగును.

వి:— ఇచ్చట దేవప్రసాధనము కామధేనువుగా రూపింపబడుట వలన రూపకాలఙ్కారము.

**సమాసములు :**

నిషధేశ్వరం :- నిషధానా , ఈశ్వరః = నిషధేశ్వరః, తమ్ = నిషధేశ్వరమ్.

భావము :— యథార్థ నల ప్రాప్తికి చింతించిన పిదప నా దమయన్తి నలునిఁ బొందుటకు దేవతలను పూజలచేఁ బ్రసన్నుఁ బఱచుకొనుటయే సాధనమని తీర్మానించుకొనినది. పూర్వము బ్రహ్మ, దేవతల కోరికలనుఁ దీర్చుటకై సురభి యనబడు కామధేనువును సృజించెను. మానవులకో, యట్టి దేవతలను సంతోష పఱచుటయే వారి కోరికలనుఁ దీర్ప గల కామధేనువు. ఏది యెవ్వరి కోరికలనుఁ దీర్చునో అది వారికి కామధేనువని భావము. 1

శ్లో॥ **ప్రదక్షిణ ప్రక్రమణాల వాల**
**విలేపధూపావరణాప్లు సేకైః।**
**ఇష్టఞ్చ మృష్టఞ్చ ఫలం సువానా**
**దేవా హి కల్పద్రుమ కాననం నః. 2**

ప॥వి॥ ప్రదక్షిణ ప్రక్రమణాలవాల విలే పధూపా వరణాప్లు సేకైః - ఇష్టం - చ - మృష్టం - చ - ఫలం - సువానా - దేవాః - హి - కల్పద్రుమకాననం - నః. 1

అర్థము :- ప్రదక్షిణ ప్రక్రమణ = ప్రదక్షిణముగాఁజుట్టుటయే, ఆలవాల = చెట్ల పాదియు, విలేప = చందనపు పూతయే, గానుగ పిండి పూతయు, ధూప = సాంబ్రాణి మున్నగు వాని వలని ధూపమే, అంబుసేక = మంత్రములతో నభిషేకమే, వేరుల యందు నీళ్ళుపోయుటయును సాధనముంచే, ఇష్టంచ = ప్రియమైనదియు, మృష్టంచ = పరిశుద్ధమైనదియు

గు, ఫలం = ఇష్టమైన వస్తువనెడి సస్యమును, సువానాః = కలిగించు
న్నటువంటి, దేవాహి = దేవతలే, నః = నరులమైన మనకు, కల్ప
ద్రుమ కాననం = కల్ప వృక్షముల వనము.

న్చుట ప్రదక్షిణ క్రమణము మన్నగు వానియందు నాలవాలా ద్యవ
వములను నిరూపించుట వలనను, దేవతల యందు కల్పద్రుమ
పణము వలనను సమస్త వస్తు వివర్తి సావయవ రూపకము.

ములు :-

దక్షిణ ప్రక్రమణాలవాల విలేప ధూపాఽఽవరణామ్బు సేకైః ;-
దక్షిణ రూపేణ ప్రక్రమణం = ప్రదక్షిణ ప్రక్రమణమ్, ప్రదక్షిణ
క్రమణం చ, ఆలవాలంచ, విలేపచ్చ, ధూపచ్చ, ఆవరణంచ,
మ్బుసేకచ్చ = ప్రదక్షిణ ప్రక్రమణాలవాల విలేప ధూపావరణామ్బు
కాః. తైః = ప్రదక్షిణ ప్రక్రమణాలవాల విలేప ధూపా ఽఽ వర
మ్బు సేకైః ।

కాననం ;- కల్పద్రుమాణాం, కాననం = కల్పద్రుమ కాననం.

।

దక్షిణముగ తిరుగుటయే, పాదిగను, చందనము నలదుకొనుటయే
పించుకొనుటగను, సాంబ్రాణిచే చుట్టబడి యుండుటయే. కొమ్మల
ంగను, నీటఁదడపుటయే, యభిషేకముగను గల సాధనములచే, దేవ
ఖ్యులమైన మనకు కల్పవృక్షముల వనముగా నున్నారు. 2

శ్లో॥ శ్రద్ధామయీ భూయ సుపర్వణస్తాన్
నానామ నామగ్రహణాగ్రకం సా.
సురేషు హి శ్రద్దధతాం నమస్యా
సర్వార్థ విధ్యఙ్గమిథః సమస్యా. 3

ప॥వి॥ శ్రద్ధామయీభూయ - సుపర్వణః - తాన్ - ననామ - నామగ్రహణా
గ్రకం - సా - సురేషు - హి - శ్రద్ధధతాం - నమస్యా - సర్వార్థ
విధ్యఙ్గమిథః - సమస్యా.

అర్థము :- సా = ఆ దమయన్తి, శ్రద్ధామయీభూయ = శ్రద్ధాస్వరూపురాలు
గనై, యనగా శ్రద్ధగలదై, తాన్ = ఆ, సుపర్వణః = దేవతలను, నామ
గ్రహణాగ్రకం; "ఈ పేరుగల దేవతకు నమస్కారము" అని పేరును
చ్చరించుట ప్రారంభము నందుండునట్లుగా, ననామ = నమస్కరించెను.
హి = ఎలయనగా, సురేషు = దేవతల విషయమున, శ్రద్ధధతాం =
విశ్వసించెడి వారియొక్క, నమస్యా = నమస్కారము, సర్వార్థవిధ్యఙ్గ
మిథస్సమస్యా: సర్వార్థ = సకలములగు నర్థములను, విధి = పూరించు
విషయమునందు అఙ్గ సాధనములైన వానికి, మిథః=రహస్యమునందు
లేదా పరస్పరము, సమస్యా = పూరణమునకు కారణమైనది.

**సమాసములు :**

శ్రద్ధామయీభూయ :- శ్రద్ధయా, పూర్ణః=శ్రద్ధామయః, అశ్రద్ధామయః,
శ్రద్ధామయఃసమ్పద్య మానోభూత్వా = శ్రద్ధామయీభూయ.
నామగ్రహణాగ్రకం :- నామ్నః గ్రహణం = నామగ్రహణం, నామగ్ర
హణమగ్రం, యస్మిన్‌కర్మణి తద్యథాభవతితథా=నామగ్రహణాగ్రకమ్.
సర్వార్థ విధ్యఙ్గమిథఃసమస్యా :- సర్వేచతే అర్థాశ్చ = సర్వార్థాః, సర్వా
ర్థానాం, నిధిః = సర్వార్థనిధిః, సర్వార్థనిధే, అఙ్గాని = సర్వార్థనిధ్యఙ్గాని
సర్వార్థనిధ్యఙ్గానాం, మిథః, సమస్యా = సర్వార్థవిధ్యఙ్గమిథఃసమస్యా.

వి :- దమయన్తి శ్రద్ధ వహించి యా దేవతలను పేరెత్తి నమస్కరించినది,
యను విశేషార్థము దేవతలకు కావించెడి నమస్కారము సకలార్థ సాధక
మను సామాన్యార్థముచే సమర్థితము గాన నర్థాన్తరన్యాసము.

**భావము :**

ఆ దమయన్తి శ్రద్ధవహించి దేవతల నందఱిని పేరెత్తి నమస్కరించినది.

ఏలయనగా దేవతలను విశ్వసించినవారి నమస్కారము సర్వార్థములను బూరించు విషయమున, సాధనములైన వానిని రహస్యముగ మఱియొకదాని నపేక్షింపకయే సమకూర్చుకొనుటకు సాధకమగుచున్నది. లేదా దేవతలకు గావించెడి నమస్కారమే సర్వకార్యసిద్ధికి నావశ్యకములగు సాధనములకు పరస్పరము పూరించుకొనుటకు కారణమగుచున్నది. అనగా శ్రద్ధతో దేవతలను గౌరవించెడి నమస్కారము సమగ్రకారణ సంపత్తిని చేకూర్చును.

నమస్యయు నొక పాదమీయఁబడగా దానిచే నితర పాదములను బూరించుట కెట్లు సాధనమౌనో యట్లే దేవనమస్యయు ననగా నమస్కారము గూడ సమస్యవలె కార్యమునుఁ బూర్తి చేయునని యాశయము. 3

శ్లో॥ యత్తాన్నిజే సాహృది భావనాయా
బలేన సాక్షాదకృతాఖిలస్థాన్।
అభూదభీష్టప్రతిభూః సతస్యా
వరం హి దృష్టా దదతే పరం తే॥ 4

ప॥వి॥ యత్ - తాన్ - నిజే - సా - హృది - భావనాయాః - బలేన - సాక్షాత్ - అకృత - అఖిలస్థాన్ - అభూత్ - అభీష్టప్రతిభూః - సః - తస్యాః - వరం - హి - దృష్టా - దదతే - పరం - తే.

అర్థము :- సా = ఆ దమయన్తి, భావనాయాః = ధ్యానము యొక్క, బలేన = సామర్థ్యముచే, అఖిలస్థాన్ = అంతటనున్నట్టి, తాన్ = ఆ, దేవాన్ = దేవతలను, నిజే = తనదగు, హృది = హృదయమునందు, యత్ = ఎందువలన, సాక్షాదకృత = ప్రత్యక్షము గావించుకొనెనో, సః = ఆ ప్రత్యక్షమే, తస్యాః = ఆ దమయన్తి యొక్క, అభీష్టప్రతిభూః; అభీష్ట = ఇష్టమునకు, ప్రతిభూః = బాధ్యత వహించినదిగా, అభూత్ = అయ్యెను, హి = ఏలయనగా, దృష్టాశ్చేత్ = ప్రత్యక్ష విషయములైనచో (తదా = అప్పుడు) పరం = తప్పక, వరం = వరమును, దదతే = ఇత్తురు.

వి :- దేవతా సాక్షాత్కారము దమయన్తి యిష్టమునకు బాధ్యతను వహించుట అను కార్యము దేవతల దర్శనమైనచో వరము నిత్తురను కారణముచే సమర్థించుట వలన నర్థాన్తరన్యాసాలఙ్కారము.

**సమాసములు :**

అఖిలస్థాన్ :- అఖిలేషు, తిష్ఠంతీతి = అఖిలస్థాః, తాన్ = అఖిలస్థాన్.
అభీష్టప్రతిభూః :- అభీష్టస్య, ప్రతిభూః = అభీష్టప్రతిభూః.

**భావము :**

ఆ దమయన్తి తన ధ్యానబలముచే విశ్వమంతటనున్నట్టి యా యింద్రాది దేవతల దర్శనమునుఁ బొందినది. ఆ దర్శనమే యామె యిష్టమును సాధించెడి బాధ్యతను వహించినది. ఏలయనగా దేవతలు దర్శింపఁబడినచో "న దాతుం దేవా వరమర్హా న్తిన ప్రత్యక్ష దృష్టామనుష్యేభ్యః" అను శ్రుతిననుసరించి తప్పక వరముల నిత్తురు. కాన దమయన్తి దేవతా దర్శనమునుఁ బొంది వరములనుఁ బొంద నర్హతను — సంపాదించుకొనినది. 4

శ్లో॥ సభాజనం తత్ర ససర్జ తేషాం
సభాజనే పశ్యతి విస్మితే సా.
అముద్యతే యత్ సుమనోభిరేవం
ఫలాయ సిద్ధా సుమనోభిరేవ. 5

ప॥వి॥ సభాజనం - తత్ర - ససర్జ - తేషాం - సభాజనే - పశ్యతి - విస్మితే - సా - అముద్యతే - యత్ - సుమనోభిః - ఏవం - ఫలాయ - సిద్ధా - సుమనోభిః - ఏవ.

అర్థము :— సా = ఆ దమయన్తి, తత్ర = ఆ సభయందు. విస్మితే = (ఆకస్మికముగా, మిక్కిలి యాదరముతో పూజనుఁ బ్రారంభించుటనుఁజూచి) యాశ్చర్యముతో గూడిన, సభాజనే = సభయందలి జనము, పశ్యతిసతి = చూచుచుండగా, తేషాం = ఆ యింద్రాదులకు, సభాజనం = పూజా

ధులచే నానందమును గల్గించుటను మాలత్యాదుల యందు సంస్కార మును, ససర్జ = చేసెను, యత్ = ఏ, సభాజనము వలన, సుమనో భిః = ఉదారహృదయులగు విద్వాంసుల చేతను, లేదా మాలత్యాదిపుష్ప ముల చేతను. లేదా దేవతలచేతను, ఫలస్య = కారణముచే సాధింపదగి నదియును, సస్యమును నను వీనియొక్క, సిద్ధౌ = పరిపూర్తి యేర్ప డ నుండగా ననగా ఫలదాన విషయమునందు, ఏవం = ఇట్లు, అముద్యత ఎవ = సంతోషింపబడితీరును.

**సమాసములు :**

సభాజనే :— సభాయాం, జనః = సభాజనః, తస్మిన్ = సభాజనే,

సుమనోభిః :— శోభనం, మనః, యేషాం తే = సుమనసః, తైః = సుమనోభిః.

**భావము :**

ఆ దమయన్తియు, ఆకస్మికముగా దేవతారాధనను ప్రారంభింపగనే యా సభయందలి జనము విస్మయముతోఁ గూడి చూచుచుండినను, వారిని లెక్కింపక దానినిఁ బూర్తిగావించి యింద్రాదిదేవతలను సంతోషపఱచినది. ఈ విధముగా నారాధించుటవలన సుమనస్సులనగా నుదార హృదయులగు పండితు లును, దేవతలును, ఫలము నొసంగు విషయమున సంతుష్టులగుదురు. సుమన స్సులగు దేవతల నామె సభాజనమును ఆనందపఱచుటను చేసెనని చెప్పుటతో మాలత్యాది లతలు పుష్పించుటకై దోహద సంస్కారమును, గావించినదను నర్థము సూచితము. కాన సభాజనముచే సుమనస్సులనగా విద్వాంసులు. దేవ తలు నెట్లు ఫలము నొసంగుటతో సంతసింతురో, అట్లే దోహద సంస్కారము లచే మాలత్యాదులు పుష్పించుటయందును, ఫలము నొసంగుటయందును, ఆ ముద్యతే = మంచి పరిమళముతో నిండిన వనుట, దేవతాదుల పక్షమున సంతోషింపబడుటయు నేర్పడునని భావము. సుమనశ్శబ్ద వాచ్యములగు మాలత్యాదులయందు, దోహద సంస్కారమనెడి సభాజనము నెట్లు ఫల పుష్ప దానము కానవచ్చుచున్నదో, యట్లే దేవతలుగూడ సుమనశ్శబ్ద వాచ్యులగుట

వలన వారియందును సుమనస్త్వము నెలకొనుటవలన. వారి యామోదమునకై (సంతోషమునకై) వారి సభాజనమును దమయన్తి గావించినది. 5

వి :— ఇచ్చట "సుమనశ్శబ్దము" "మాలత్యాం పండిత పుష్పే దేవేచ సుమనోభిధా" యను నిఘంటువు ననుసరించి, దేవతలను, మాలతీలతను, పుష్పాదులను, బండితులను జెప్పుచున్నది. అట్లే "ఆమోదశబ్దము" "ఆమోదో హర్ష గంధయోః" అను నిఘంటువు ననుసరించి సంతోషమును బరిమళమును జెప్పుచున్నది. కాన రెండువిధములైన పరిమళములకును, సంబంధించిన ఫలములకు నభేదాధ్యవసాయము గావించి యింద్రాది సభాజనమను విశేషమును, "సుమనస్సులచే నామోదింపబడునను" సామాన్యముచే సమర్థించుటవలన నర్థాన్తర న్యాసాలంకారము. 5

శ్లో॥ వైశద్యహృద్యైర్మ్రదిమాభిరామై
రామోదిభిస్తా నథ జాతిజాతైః.
అనర్చ గీత్యన్వితషట్పదైః సా
స్తవప్రసూనస్తబకైర్నవీనైః. 6

ప॥వి॥ వైశద్యహృద్యైః - మ్రదిమాభిరామైః - ఆమోదిభిః - తాన్ - అథ - జాతిజాతైః - అనర్చ - గీత్యన్వితషట్పదైః - సా - స్తవప్రసూనస్తబకైః - నవీనైః,

అర్థము :— అథ = ఇట్లింద్రాదుల పూజముగియగనే, సా = ఆ దమయన్తి, తాన్ = ఆయింద్రాదులను, వైశద్యహృద్యైః; వైశద్య = అర్థముస్ఫుటముగనుండుట, పక్షాన్తరమందు వికాసము. అనుదీనిచే, హృద్యైః = హృదయంగమములును ననగా, రమ్యములును, మ్రదిమాభి రామైః మ్రదిమా = శబ్దార్థములయొక్క మాధుర్యము పక్షాన్తరమున సౌకుమార్యము అనుదీనిచే, అభిరామైః = ప్రీతిని గలిగించునవియును, పక్ష

స్తరమున, పరిమళము గలవియు, జాతిజాతైః; జాతి = ఆర్యాదిఛందములును, మాలతీలతలును, అనువీనినుంచి, జాతైః = పుట్టిన, అనగా నార్యాదిచ్ఛందములయందు వ్రాయఁబడినవియు, మాలతీపుష్పములతో గట్టఁబడినవియును, గీత్యన్వితషట్పదైః; గీతి = గీతిచ్ఛందములయందు వ్రాయబడినవియు, షట్పదైః = ఆరుపాదములుగల గాథాఛందము యందు వ్రాయఁబడినవియును, పక్షాంతరమున - గీత్యన్వితషట్పదైః; గీతి = ఝుఙ్కారముతో, అన్విత = కూడిన, షట్పదైః = తుమ్మెదల చేతను, నవీనైః = నూతనములైన, స్తవప్రసూనస్తబకైః; స్తవ = స్తోత్రములచేతను, ప్రసూన = పుష్పములయొక్క, స్తబకైః = గుత్తులచేతను, ఆనర్చ = పూజించెను. అనగా స్తోత్రములతోను పుష్పములతోడను పూజించెనని యర్థము.

వి:— ఇచ్చట ప్రకృతములైన, స్తోత్రములకును, పూల గుత్తులకును రెండింటికి నొక యర్చన క్రియయందు సంబంధముఁజెప్పుటవలన, ప్రకృతములకు రెంటికినేక క్రియాన్వయిత్వ రూపమగు— తుల్యయోగితాలఙ్కారము.

సమాసములు :

వైశద్యహృద్యైః :— విశదస్య భావః = వైశద్యం, వైశద్యేన హృద్యాః = వైశద్యహృద్యాః.

మ్రదిమాభిరామైః :— మృదునః, భావః = మ్రదిమా, మ్రదిమ్నా, అభిరామాః = మ్రదిమాభిరామాః, తైః = మ్రదిమాభిరామైః.

జాతిజాతైః :- జాతిభిః, జాతాని = జాతిజాతాని, తైః = జాతిజాతైః.

గీత్యన్వితషట్పదైః :- గీత్యా, అన్వితాః = గీత్యన్వితాః, షట్, పదాని యాసాంయేషాం (యేషాంతేచ) = షట్పదాః, గీత్యన్వితాశ్చతాః షట్పదాశ్చ = గీత్యన్వితషట్పదాః, తైః = గీత్యన్వితషట్పదైః.

స్తవప్రసూనస్తబకైః :- ప్రసూనానాం, స్తబకాః = ప్రసూనస్తబకాః, స్తవాశ్చ, ప్రసూనస్తబకాశ్చ = స్తవప్రసూనస్తబకాః, తైః = స్తవప్రసూనస్తబకైః.

భావము :

ఆ యింద్రాది దేవతలకు బూజనుఁ బూర్తిగావించిన పిదప, దమయన్తి యా దేవతలను స్తుతులతోడను, పూలగుత్తుల తోడను — నర్చించినది. అట్లనగా — ఆ స్తుతులు — స్ఫుటములైన యర్థములు గల్గియున్నవి. శబ్దార్థమాధుర్యముతో నొప్పియున్నవి. వినువారికి ప్రీతిని గొల్పుచున్నవి. ఆర్యాదిజాతి ఛందస్సులనుండి యుద్భవించిన జాతిచ్ఛందస్సులయందుఁగూర్చఁబడి యున్నవి. వానిలో కొన్ని గీతిచ్ఛందములయందును, కొని షట్పదములనబడు గాథాఛందములయందునుఁగూర్చఁబడినవి. అట్టి నూతన స్తవములచే నామె వారినారాధించినది. ౮

ఆ పూలగుత్తులు వికసించి రమ్యములై యున్నవి. సౌకుమార్యముచే నొప్పుచున్నవి. పరిమళమును వెదఁజల్లుచున్నవి. మాలతీపూలతో గ్రుచ్చఁబడి యున్నవి. ఝంకారముఁజేయు తుమ్మెదలతోఁగూడి యున్నవి. అప్పుడే కోయుటచే నూతనములై యున్నవి. అట్టి పూలగుత్తులతో నామె దేవతల నర్చించినది. ౮

శ్లో॥ హృత్పద్మసద్మన్యధివాస్య బుద్ధ్యా
దధ్యావథైతానియమేకతానా.
సుపర్వణాం హి స్ఫుటభావనా యా
సా పూర్వరూపం ఫలభావనాయాః.

ప॥వి॥ హృత్పద్మసద్మని - అధివాస్య - బుద్ధ్యా - దధ్యౌ - అథ - ఏతాన్ - ఇయమ్ - ఏకతానా - సుపర్వణాం - హి - స్ఫుటభావనా - యా - సా - పూర్వరూపం - ఫలభావనాయాః

అర్థము :- అథ=పూజయైన పిదప ఇయమ్ = ఈ దమయన్తి, ఏకతానాసతీ= మతియొక వ్యాపకములేక యేకాగ్రతను, గల్గినదై, హృత్పద్మసద్మని= హృత్ పద్మ = హృదయపద్మమనెడి, సద్మని = ఇంటియందు, ఏతాన్ = ఈ యింద్రాదులను, బుద్ధ్యా = బుద్ధిచే ననగా బుద్ధియందు, అధివాస్య

= ఆరోపించుకొని, దధ్యౌ = ధ్యానముఁచేసినది. అంతట దేవతలు హృదయమందు నారోపింపఁబడినవారి, రూపమును ధ్యానముచే దర్శించినదని యర్థము. హి = ఏలయనగా, సుపర్వణాం = దేవతలయొక్క యనగా వారిని విషయీకరించుకొనిన, యా = ఏ, స్ఫుటా = స్పష్టమైన, భావనా = ధ్యానముచే దర్శించుట యేదిగలదో, సా = అది, ఫలభావనాయాః = కార్యసాఫల్యమునకు, పూర్వరూపం = మొదటి స్వరూపము. కారణము కార్యముకంటె ముందు నియతముగా నుండవలయును గాన, కార్యకారణ సామగ్రీ రూపమైన దేవతా ప్రత్యక్షమును ధ్యానముచేఁజేసినదని యర్థము. పూజకు పూర్వోత్తర కాలములయందు ధ్యానమిష్టము కాన నీసర్గయందలి 4వ శ్లోకముతో దీనికి పునరుక్తిలేదు.

**సమాసములు**

హృత్పద్మసద్మని : హృదేవ, పద్మం = హృత్పద్మం. హృత్పద్మమేవ = సద్మ = హృత్పద్మసద్మ తస్మిన్ = హృత్పద్మసద్మని.
ఫలభావనాయాః :- ఫలస్య, భావనా = ఫలభావనా, తస్యాః = ఫలభావనాయాః.

స్ఫుటభావనా :- స్ఫుటాచ సాభావనాచ = స్ఫుటభావనా.

**భావము :**

పూజయైన పిదప నీమె యేకాగ్ర వృత్తి గలదై తన హృదయ పద్మమనెడి గృహమందు నింద్రాదులను తన బుద్ధియందుంచుకొని ధ్యానముఁజేసినది. ఆ యింద్రాదులు వ్యాపకులై విశ్వమందంతట నెలకొనియున్నను, తన హృదయమునందు నారోపించుకొనఁబడిన వారి రూపమును నామె దర్శించినది. ఏలయనగా దేవతలను ధ్యానబలముచే దర్శించుటయే కార్యసిద్ధికి పూర్వరూపము.
గమనిక :- ఈ శ్లోకమును మల్లినాథసూరి వ్యాఖ్యానించలేదు. నారాయణభట్టీయము ననుసరించి వ్యాఖ్యానింపబడినది. కాన మల్లినాథసూరి దృష్టియందిది ప్రక్షిప్తమని తోచుచున్నది.

శ్లో॥ భక్త్యా తయైవ ప్రససాద తస్యా
స్తుష్టం స్వయం దేవచతుష్టయం యత్.
స్వేనాఽనలస్య స్ఫుటతాం యియాసోః
ఫూత్కృత్యపేక్షా కియతీ ఖలు స్యాత్. 7

ప॥వి॥ భక్త్యా - తయా - ఏవ - ప్రససాద - తస్యాః - తుష్టం - స్వయం - దేవచతుష్టయం - యత్ - స్వేన - అనలస్య - స్ఫుటతాం - యియాసోః - ఫూత్కృత్యపేక్షా - కియతీ - ఖలు - స్యాత్.

అర్థము :- స్వయం = స్వయముగనే, అనగా సేవాదులు లేకయే, యామె శీలము యొక్క గట్టితనముచే, తుష్టం = సంతోషింపబడిన, తత్ - ఆ, దేవచతుష్టయం = నలుగురు వేల్పులును, తస్యాః = ఆ దమయన్తి యొక్క, తయైవ = ఆ భక్తిచేతనే అనగా క్షణకాలపు సేవచేతనే, ప్రససాద = ప్రసన్నత నొందినది. తథాహి = అది యుక్తమే! స్వేన = స్వయముగనే, స్ఫుటతాం = ప్రకాశమును, యియాసోః = పొందగోరిన, అనలస్య = అగ్నికి, ఫూత్కృత్యపేక్షా; ఫూత్కృతి= ఫూత్కారము యొక్క అనగా "ఫూ" యని యూదుట యొక్క, అపేక్షా = అవసరము, కియతీఖలు = ఎంతమాత్రము, అనగా కొంచెము చాలునని యర్థము. స్వయముగనే మండుచున్న యగ్నికి కొంచెము ఫూత్కారము శీఘ్రముగ మండునట్లు చేయుట కుపయోగపడును. అట్లే స్వయముగనే దమయన్తి శీలమునకు ప్రసన్నులైన దేవతలకు నామెయొక్క సేవాదులు కూడ నెక్కువ యావశ్యకములు కావు. అవి కేవలము వారిని కొంత శీఘ్రముగ ననుగ్రహింప బురికొల్పుటకు ఉపయోగపడును.

వి :- ఇచ్చట రెండు వాక్యములలో భక్తికిని, ఫూత్కారమునకును, ప్రజ్వలనాది కార్యమునందు నపేక్షితత్వమనెడి సమాన ధర్మమును బురస్కరించుకొని, ఫూత్కార క్రియచ్ఛద్మములకు బిమ్బ ప్రతిబిమ్బ భావమేర్పడుట వలన నిట దృష్టాంతాలఙ్కారము.

**సమాసములు ;**

దేవ చతుష్టయం :- చత్వారః, అవయవాః. యస్యతత్ = చతుష్టయం, దేవానాం, చతుష్టయం, దేవచతుష్టయం.

స్ఫుటతాం :- స్ఫుటస్య, భావః, స్ఫుటతా, తామ్ = స్ఫుటతాం.

యియాసోః :- యాతుమిచ్ఛుః=యియాసుః, తస్య = యియాసోః.

ఫూత్కృత్యపేక్షా ;- ఫూత్కృతేరపేక్షా = ఫూత్కృత్యపేక్షా.

**భావము ;**

సేవాదులతో నిమిత్తము లేక, పూర్వమే యామెయొక్క సౌశీల్యముచేత స్వయముగనే సంతోషించిన, ఆ యింద్రాదిదేవతలు నలుగురును నా దమయన్తి యొక్క భక్తిచేత, క్షణకాలమామె గావించిన పూజకే ప్రసన్నులై యనుగ్రహించిరి. స్వయముగా జ్వలింపబోవునట్టి యగ్నికి ఫూత్కారము యొక్క యావశ్యకత యెంతమాత్రము? కొంచెము ఫూత్కారము చాలునని యాశయము. 7

శ్లో॥ ప్రసాదమాసాద్య సురైః కృతం సా
సస్మార సారస్వత సూక్తి సృష్టేః.
**దేవాహి నాన్యద్వితరన్తి కిన్తు**
**ప్రసద్యతే సాధుధియం దదన్తే.** **8**

ప॥వి॥ ప్రసాదమ్ - ఆసాద్య - సురైః - కృతం - సా - సస్మార - సారస్వతసూక్తిసృష్టేః - దేవాః - హి - న - అన్యత్ - వితరన్తి - కిం, తు - ప్రసద్య - తే - సాధుధియం - దదన్తే.

**అర్థము** :- సా = ఆ దమయన్తి, సురైః = దేవతలచే, కృతం = చేయఁబడిన, ప్రసాదమ్ - అనుగ్రహమును, ఆసాద్య = పొంది, సారస్వత సూక్తిసృష్టేః; సారస్వత = సరస్వతీదేవికి సంబంధించిన, సూక్తి = వెనుకటి సర్గయందు చెప్పబడిన శ్లిష్టవచనముల గుంఫమును, సస్మార= స్మరించినది. అనగా నామె వచనముల యంతలి తత్త్వమునుఁ దెలిసికొనినది. హి=ఏలయనగా, తే = ఆదేవతలు, ప్రసద్య=అనుగ్రహించి,

అస్యాత్ = బుద్ధికంటె నితరమైన దానిని, నప్రతరన్తి = ఈయరు. కింతు = కాని, సాధుధియం = సద్బుద్ధిని, అనగా ఫలమునఁ బొందుటకు సాధనమైన బుద్ధిని, దదన్తే = ఇచ్చుచున్నారు.

**సమాసములు :**

సారస్వత సూక్తి సృష్టేః :— సరస్వత్యాః, ఇయం = సారస్వతీ, సూక్తేః, సృష్టిః = సూక్తిసృష్టిః, సారస్వతీ చసా సూక్తి సృష్టిశ్చ = సారస్వత సూక్తిసృష్టిః, తస్యాః = సారస్వత సూక్తిసృష్టేః.
సాధుధియం :— సాధ్వీచసా, ధీశ్చ = సాధుధీః, తామ్ = సాధుధియం.

**భావము :**

ఆ దమయన్తి దేవతలు గావించిన యనుగ్రహమునుఁబొంది, పూర్వసర్గ యందలి సరస్వతీ వచనముల శ్లిష్ట కల్పనా శిల్పమును స్మరించి యందలి తత్త్వమునుఁదెలిసికొనినది. అది యుక్తమే! ఏలయనగా, ఆ దేవతలు అనుగ్రహించి సద్బుద్ధికంటె నితరమైన దాని నొసంగరు. కాని ఫలమునుఁబొందుటకు సాధనమైన తెలివిని మాత్రము ఇత్తురు. కావుననే —

" నదేవా దణ్డమాదాయ రక్షన్తి పశుపాలవత్
యం హి రక్షితుమిచ్ఛన్తి బుద్ధ్యా సంయోజయన్తితమ్"

అని దేవతలు కఱ్ఱఁజేపట్టి పశువులను కాచినట్లు మనుష్యులను కాపాడరు. మఱేమనగా - ఎవరిని రక్షింపఁగోరెదరో, వారికి దానికనుకూలమైన బుద్ధి నొసంగుదురని స్మృతి చెప్పుచున్నది. 8

శ్లో॥ శేషం నలం ప్రత్యమరేణ గాథా
యాయా సమర్థాఖిలు యేన యేన.
తాం తాం తదన్యేన సహాలగన్తీం
తదా విశేషం ప్రతి సందధే సా. 9

ప॥వి॥ శేషం - నలం - ప్రతి - అమరేణ - గాథా - యా - యా - సమర్థా-ఖలు - యేన - యేక - తాం - తాం - తదన్యేన - సహ - అలగస్తీం-తదా - విశేషం - ప్రతి - సందధే - సా.

అర్థము :— యా = ఏ దమయన్తి, శేషం = మిగిలిన ఐదవవాడగు పరమార్థ నలునిఁగూర్చి (విరచితా = విరచింపబడిన) యా యా = ఏ ఏ "అత్యాజలబ్ధేత్యాదిగా నేయేశ్లోకము, యేన యేన = ఏ, యే, అమరేణ= వేల్పుతో, సమర్థా = సమానార్థము గల్గినదో; (కావుననే) తదన్యేన సహ = ఆయా ముఖ్యార్థరూపమైన యింద్రాదులకంటెను నితరుడై శ్లేషాతిశయముచేఁ దెలియబడుచున్న యథార్థ నలునితో, అలగస్తీం = అతకనటువంటి, తాం తాం = ఆయాగాథను, తదా = వేల్పులయను గ్రహముచే లబ్ధమైన బుద్ధియొక్క వికాసకాలమందు, విశేషం ప్రతి = సత్యనలుని గూర్చి, సందధే = సంధించుకొనినది. అనగా నింద్రాది పరముగానున్న యర్థములను నలపరము గావించుకొనినదని యర్థము. ఆ శ్లోకము లింద్రాదిపరములా ? యను సందేహమును మాని నలపరము లని నిశ్చయించుకొనినది.

భావము :

ఆ దమయన్తి దేవతలను ద్రోసివేయగా మిగిలిన నలునిఁగూర్చి చెప్పఁబడిన యే యే శ్లోకము ఏ ఏ దేవతకు సమానార్థము కల్గినదిగా నుండి యింద్రాదులకంటె నితరుడైన సత్యనలునితో నతుకక యుండినదో, ఆయా గాథను, దేవతానుగ్రహముచే లబ్ధమైన బుద్ధి వికాసమువలన సత్యనలుని యందతికించుకొనినది. అనగాఁదొలుత నింద్రాది పరముగా సందేహముఁ గొల్పుచున్న యా శ్లోకములను వారియెడ సందేహము వీడి నలుని యందన్వయించుకొని నలుని పరముగాఁ నిశ్చయముఁ జేసికొనినది. 9

శ్లో॥ ఏకైకవృత్తేః ప్రతిలోకపాలం
పతివ్రతాత్వం జగృహుర్ద్విశాం యాః.
వేదస్మగాథా మిలితా స్తదాసా
వాశా ఇవైకస్య నలస్య వశ్యాః. 10

ప॥ ఏకైకవృత్తేః - ప్రతిలోకపాలం - పతివ్రతాత్వం - జగృహుః - దిశాం - యాః - వేద - స్మ - గాథాః - మిలితాః - తదా - అసౌ - ఆశా - ఇవ - ఏకస్య - నలస్య - వశ్యాః.

అర్థము :— యాః "అత్యాజి" ఇత్యాది శ్లోకములు, ఏకైకవృత్తేః = ఒక్కొక్క లోకపాలునియందు నుండుటవలన, ప్రతిలోకపాలం = ప్రత్యేక దిక్కుల పాలకుని గూర్చి, దిశాం = తూర్పు మున్నగు దిక్కులయొక్క, పతివ్రతాత్వం = పాతివ్రత్యమును, జగృహుః = గ్రహించినవి. తూర్పుమున్నగు దిక్కులలో, నింద్రుడు మున్నగు ప్రతి నియత దేవతలయందుండ వలసిన పాతివ్రత్యమును "అత్యాజి" మున్నగు శ్లోకములాయా విధముగనే యంగీకరించినవని యర్థము. ఆ గాథలు నాలుగును విశితములై దేవతాప్రసాదమైన పిదప, నీ దమయన్తి కేవలమొక్క నలునికే వశ్యరాలగుట వలన నలుని ప్రతిపాదించునవిగ నీమె కర్థమైనవి. తదా = దేవతా ప్రసాదకాలమందు. అసౌ = ఈ దమయన్తి, మిళితాః = కలసిన, గాథాః = సమస్త శ్లోకములును, ఆశాఇవ = దిక్కులవలె, ఏకస్య = ఒకదేయైన, నలస్య = నలునికి, వశ్యాః = వశ్యములైనవిగా, అనగా నలునిమాత్రమే బోధించునవిగా, వివేద = తెలిసికొనినది. తూర్పు మున్నగు దిక్కులొక్కొక్కలోకపాలుని యధీనములుగనున్నను నా దిక్కులన్నియు చక్రవర్తియగు నలుని నొక్కనికే యెట్లు వశ్యములైనవో యట్లే ఒక్కొక్క లోకపాలునిగూర్చి చెప్పిన గాథలు సాధారణముగా నొక్కొక్క లోకపాలుని పరముగా తెలియుచున్నను సమానార్థములను గల్గి యుండుట వలన నల పరముగనే తెలయసాగినవి ఆ నలుడు సమస్త దిక్కులను జయించుట వలన, దిక్కులన్నియు నాతనికి వశ్యములు. "అత్యాజి" మున్నగు గాథలు సరస్వతీ దేవియొక్క చతురవచనములను పర్యాలోచన చేయగా, దేవతాప్రసాదము వలన నలునికి పరములైనవని యర్థము.

సమాసములు :

ఏకైకవృత్తేః :— ఏకైకస్మిన్ వృత్తిః = ఏకైకవృత్తిః, తస్యాః =

ఏకైకవృత్తేః.

ప్రతిలోకపాలం :— లోకస్యపాలః = లోకపాలః, లోకపాలే, లోక పాలే = ప్రతిలోకపాలం.

పతివ్రతాత్వం :- పత్యౌవ్రతం యస్యాస్సా=పతివ్రతా. పతివ్రతాయాః, భావః = పతివ్రతాత్వమ్, తత్ = పతివ్రతాత్వమ్.

**భావము :**

"అత్యాజి" మున్నగు శ్లోకరూపములైన యే గాథలు ఒక్కొక్క దిక్పాలునియందు నుండుటవలన ననగా, నింద్రునియందును, నగ్నియందును, యమునియందును, వరుణునియందును నుండుట వలన నొక్కొక్క దిక్పాలునిఁగూర్చి తూర్పు మున్నగు దిక్కులకుఁ బాతివ్రత్యము నంగీకరించినవో, అనగా తూర్పు మున్నగు దిక్కులకు నింద్రుడు మున్నగు ప్రతినియత దేవతల విషయమునందే పాతివ్రత్యము గలదో, ఆ పాతివ్రత్యమును, ఆ రూపముగనే పూర్వసర్గయందలి 28వ శ్లోకములో నుపక్రమింపబడిన గాథ అంగీకరించినవో, యాగాథలునాల్గును మిళితములై దేవతా ప్రసాదనము దమయంతికైన పిదప, నీమె కేవలమొక నలునికే వశ్యాలగుట వలన నవి యన్నియు నలపరములుగనే యీమెకు తెలియఁ దొడగినవి. అన్ని దిక్కులును కలిసి చక్రవర్తియగు నలునికెట్లు వశ్యములో, అట్లే ఒక్కొక్కటియు ప్రత్యేక దిక్పాలుర పరమైనను గాథలన్నియు నీతని పరములుగా నర్థమీయదొడగినవి. యాచకుల మనోరథములెట్లు త్యాగియైన నలునకు వశ్యములో, యట్లే గాథలును నలపరములైనవని యర్థము. 10

శ్లో॥ యాపాశినైవాశనిపాణినైవ
గాథా యమేనైన సమాగ్నినైవ.
తామేవ మేనే మిళితాం నలస్య
సైషా విశేషాయ తదా నలస్య. 11

ప॥వి॥ యా - పాశినా - ఏవ - అశనిపాణినా - ఏవ - గాథా - యమేన ఏవ - సమాగ్నినా - ఏవ - తామ్ - ఏవ - మేనే - మిళితాం - నలస్య

- సా - ఏషా - విశేషాయ ० తదా ० నలస్య.

అర్థము :— "కింతే" (13-30) ఇత్యాది యా = ఏ, గాథా = గాథ, పాశి నైవ = వరుణుని తోడనే, సమార్థా = సమానార్థము గల్గినదై ఇంద్రా దులతో సమానార్థము గల్గియుండలేదో, యాచ = ఏ "అత్యాజి" (13-29) ఇత్యాది గాథా, అశనిపాణినైవ = ఇంద్రునితోడనే, సమా= సమానార్థము గల్గియున్నదై. ఇతరులతో సమానార్థమును గల్గియుండ లేదో, యాచ = ఏ "యచ్ఛృణోమాం (13-29)" ఇత్యాదిగాథ యమే నైవ = యమునితోడనే, సమా = సమానార్థముగలదై యితరునితో సమానార్థమును గల్గియుండలేదో. యాచ = ఏ "యేనాముసా" (13-28") ఇత్యాదిగాథ, అగ్నినైవ = అగ్నితోడ, సమా = సమానార్థముగలదై యితరునితో సమానార్థము గల్గియుండలేదో, నలస్య = నలునకు సంబంధించినదై, మిళితాం = కలిపి సముదాయ ముగాఁజేయఁబడినదై నాల్గు గాథల రూపమునను, తామేవ = ఆ గాథనే, తదా = దేవతల ప్రసాదమేర్పడిన పిదప, సైషా = ఆ దమ యన్తి, నలస్య = నలునకు, విశేషాయ = ఇంద్రాదులకంటె భేదముఁ దెలియుటకై సాధనముగా, మేనే = తలంచినది. అనగా ఇంద్రుడు మున్నగు వారొక్కొక్క గాథయందే యుండుట వలన, నలుడిన్ని గాథ లయందు నుండుటవలన "అత్యాజి" (13-27 to 30) మున్నగు నాలుగు గాథలయందును, ప్రతిపాదింపఁబడువాడెవ్వడో, ఆతడే నలుఁ డని యా మిలితమగు గాథనే, నలుని ప్రతిపాదించు దానినిగా ననగా నలుని గుర్తింపఁజేయు దానినిగా నామె— గ్రహించినది.

లేదా, యా = ఏది, నలస్య = నలునియొక్క, గాథా = గాథయో. యా = ఏది, పాశినైవ = వరుణునితోడనే, అశనిపాణినైవ=ఇంద్రుని తోడనే, యమేనైవ = యమునితోడనే, అగ్నినైవ = అగ్నితోడనే, సమా = సమానమైన గాథగలదో, నలస్యమిలితాం = నలునికి సంబం ధించిన గాథతోఁగలసిన, తామేవ = దానినే, అనలస్య = నలునికంటె భిన్నులైన యింద్రాదులయొక్క, విశేషాయ = భేద జ్ఞాపనమునకు

సాధనముగా, మేనే = తలంచెను. లేదా మిలితమైన యాగాథచే నలుడు నిశ్చితుడైనచో దానిచే పరిహరింప సాధ్యముకానందువలన, నలునికంటె భిన్నులైన దేవతలుగూడ దానిచేతనే నిశ్చయింపఁబడిన వారగుదురని యొక వ్యాఖ్య.

లేదా మిలితమైన యాగాథనే నలుని భేదమునకు నలే తరులగు నింద్రాదుల భేదమునకు సాధనముగా తలంచెనని మఱియొక వ్యాఖ్య.

లేదా "యాపాశినైవ" ఇత్యాదిస్థలములయందలి ఏవకారమును పర స్పరసముచ్చయార్థకముగా నంగీకరించి, యా = నలునికి సంబంధించిన గాథ, పాశినాపి = వరుణునితోడను, అశనిపాణినాఽపి = ఇంద్రునితోడను, యమేనాఽపి = యమునితోడను, అగ్నినాఽపి = అగ్నితోడను, సమా = సమానార్థకముగానుండెనో, తాం = ఆ గాథను, "దేవఃపతిః" (13-33) ఇత్యాదిగా మిలితమైన యైదరక్షములు గల గాథను, దేవతా ప్రసాదమైన పిదప నలునియొక్క భేదజ్ఞాన సాధనముగాఁదలంచెను.

దేవతలు ప్రసన్నులై తమ తమ యాకారములను ధరించిన పిదప నైదర్థములు కలదిగా నిది స్ఫురించినను నిది యిప్పుడొక్క నలునే జ్ఞాపకపఱచునదిగా నామెచేఁ దెలియఁబడినదని భావము. "దేవపతిః" (13-33) అను నీ గాథయే ప్రకృత విషయము.

ఈ శ్లోకమునందేవకారముల నవధారణార్థకములుగా తీసుకొనినను, ఇదేగాథనలైక విషయమని వ్యాఖ్యానము చేయవలయును. ఈ శ్లోకము "శేషం నలం" (14-9)" ఏకైకవృత్తేః (14-10) యనుశ్లోకములకు సమానార్థకములు. "అనలస్య" అనునెడనేకవచనము ప్రత్యేకాన్వయ తాత్పర్యముతో నేర్పడినది.

**సమాసములు:**

పాశినా :- పాశః అస్యాస్తీతి = పాశీ. తేన = పాశినా

అశనిపాణినా :- అశనిః, పాణౌ యస్య సః = అశనిపాణిః, తేన = అశనిపాణినా,

**భావము :**

దేవతల ప్రసాదమేర్పడిన పిదప దమయన్తి వరుణునితోడను, నింద్రుని తోడను, యముని తోడను, అగ్ని తోడను సమానార్థములు గల్గినవై, కలుపగా నాలుగైన యా గాథల సముదాయమును నలునికిని, అనలునికిని అనగా నల భిన్నులగు నింద్రాదులకును భేద జ్ఞాన సాధనముగా భావించినది.

గమనిక :- ఈ శ్లోకమును గూడ మల్లినాథసూరి వ్యాఖ్యానించలేదు. కాన నధిక పాఠముగా నిది యుండవచ్చును. నారాయణీయ వ్యాఖ్య ననుసరించి యిది వివరింపబడినది.-

శ్లో॥ నిశ్చిత్య శేషం తమసౌ నరేశం
ప్రమోద మేదస్వితరాఽన్తరా భూత్.
దేవ్యా గిరాం భావిత భఙ్గిరాఖ్య
చ్చిత్తేన చింతార్ణవయాద సేదమ్. 11

ప॥వి॥ నిశ్చిత్య - శేషం - తమ్ - అసౌ - నరేశం - ప్రమోదమేదస్వితరా- అన్తః - అభూత్ - దేవ్యా - గిరాం - భావితభఙ్గీః - అఖ్యత్ - చిత్తేన - చింతార్ణవయాదసా - ఇదమ్

అర్థము ;- అసౌ = ఈ దమయన్తి, శేషం = మిగిలిన యెదవవానిని తం = ప్రసిద్ధుడగు నరేశం = నైషధుడగునతనిగా, నిశ్చిత్య = నిశ్చయించి, ప్రమోదమేదస్వితరాన్తరా: ప్రమోద = ఆనందముచే, మేదస్వితర = పూర్ణమైన, అన్తరా = మనసుగలదిగా, అభూత్ = ఆయెను, అథ = పిదప, దేవ్యాః = సరస్వతీదేవియొక్క, గిరాం = వాక్కులకు, భావిత భఙ్గీః = తెలియబడిన ప్రయోగప్రకారము గలదై, చింతార్ణవయాదసా, చింతార్ణవ = చింతాసాగర మందు, యాదసా = జలజంతువైన, చిత్తేన = మనస్సుచే, ఇదం = దీనిని (చెప్పబోవు దీనిని) అఖ్యత్ = చెప్పినది. నలుని బొందుటకు నుపాయము నాలోచించుట యనెడి చింతాసాగరమున నామె చిత్తము మునిగినదని యర్థము.

వి :- ఇచ్చట మనస్సునందు జలజంతుత్వము నారోపించుటవలన రూపకాలంకారము.

**సమాసములు ;**

మేదస్వితరాన్తరా :- మేదః అస్య అస్తీతి = మేదస్వి, అత్యంతం మేదస్వీ = మేదస్వితరం, మేదస్వితరమన్తరం యస్యాస్సా = మేదస్వితరాన్తరా,

భావితభఙ్గిః :- భావితా భఙ్గిః యయాసా = భావితభఙ్గిః.

చింతార్ణవయాదసా :- చింతైవ అర్ణవః = చింతార్ణవః, చింతార్ణవే, యాదః = చింతార్ణవయాదః, తేన = చింతార్ణవయాదసా.

**భావము :**

ఈ దమయన్తి వారిలో కడపటమిగిలిన యైదవ వానిని నలునిగా నిశ్చయించుకొని మిక్కిలి యానందముతో నిండిన చిత్తముగలదాయెను. తర్వాత సరస్వతీ దేవియొక్క మాటలలోని నేర్పును గ్రహించివద్దె నలునిఁబడయుటకు నుపాయమునాలోచించుచు చెప్పఁబోవు ప్రకారము నుడువసాగినది. 11

**శ్లో॥ సాభఙ్గిరస్యాః ఖలు వాచి కాఽపి**
**యద్భారతీ మూర్తిమతీసతీయం.**
**శ్లిష్టం నిగద్యాదృత వాసవాదీన్**
**విశిష్య మే నైషధమప్యవాదీత్. 12**

ప॥వి॥ సా - భఙ్గిః - అస్యాః - ఖలు - వాచి - కా - అపి - యత్ - భారతీ - మూర్తిమతీ - సతీ - ఇయం - శ్లిష్టం - నిగద్య - ఆదృత, వాసవాదీన్ - విశిష్య - మే - నైషధమ్ - అపి - అవాదీత్.

అర్థము :- అస్యాః = ఈ సరస్వతీ దేవియొక్క, వాచి = మాటయందు, సా = చెప్పఁబడుచున్నది, కాఽపి = అపూర్వమైన, భఙ్గిఃఖలు = ప్రయోగరీతి, గదా, యత్ = ఏ భఙ్గి విశేషమువలన, ఇయం = ఎదుట

భావము :

దేవతల ప్రసాదమేర్పడిన పిదప దమయన్తి వరుణునితోడను, నింద్రుని తోడను, యముని తోడను, అగ్ని తోడను సమానార్థములు గల్గినవై, కలుపగా నాలుగైన యా గాథల సముదాయమును నలునికిని, అనలునికిని అనగా నల భిన్నులగు నింద్రాదులకును భేద జ్ఞాన సాధనముగా భావించినది.

గమనిక :- ఈ శ్లోకమును గూడ మల్లినాథసూరి వ్యాఖ్యానించలేదు. కాన నధిక పాఠముగా నిది యుండవచ్చును. నారాయణీయ వ్యాఖ్య ననుసరించి యిది వివరింపబడినది.-

శ్లో॥ నిశ్చిత్య శేషం తమసౌ నరేశం
ప్రమోద మేదస్వితరాఽన్తరా భూత్.
దేవ్యా గిరాం భావిత భఙ్గిరాఖ్య
చ్చిత్తేన చింతార్ణవయాద సేదమ్. 11

ప॥వి॥ నిశ్చిత్య - శేషం - తమ్ - అసౌ - నరేశం - ప్రమోదమేదస్వితరా-
అన్తః - అభూత్ - దేవ్యా - గిరాం - భావితభఙ్గిః - ఆఖ్యత్ -
చిత్తేన - చింతార్ణవయాదసా - ఇదమ్

అర్థము :- అసౌ = ఈ దమయన్తి, శేషం = మిగిలిన యెదవవానిని తం = ప్రసిద్ధుడగు నరేశం = నైషధుడగునతనిగా, నిశ్చిత్య = నిశ్చయించి, ప్రమోదమేదస్వితరాన్తరా: ప్రమోద = ఆనందముచే, మేదస్వితర = పూర్ణమైన, అన్తరా = మనసుగలదిగా, అభూత్ = ఆయెను, అథ = పిదప, దేవ్యాః = సరస్వతీదేవియొక్క, గిరాం = వాక్కులకు, భావిత భఙ్గీః = తెలియఁబడిన ప్రయోగప్రకారము గలదై, చింతార్ణవయాదసా, చింతార్ణవ = చింతాసాగర మందు, యాదసా = జలజంతువైన, చిత్తేన = మనస్సుచే, ఇదం = దీనిని (చెప్పబోవు దీనిని) ఆఖ్యత్ = చెప్పినది. నలుని బొందుటకు నుపాయము నాలోచించుట యనెడి చింతాసాగరమున నామె చిత్తము మునిగినదని యర్థము.

వి :- ఇచ్చట మనస్సునందు జలజంతుత్వము నారోపించుటవలన రూపకాలఙ్కారము.

**సమాసములు ;**

మేదస్వితరాన్తరా :- మేదః అస్య అస్తీతి = మేదస్వీ, అత్యంతం మేదస్వీ = మేదస్వితరం, మేదస్వితరమన్తరం యస్యాస్సా = మేదస్వితరాన్తరా,

భావితభఙ్గిః :- భావితా భఙ్గిః యయాసా = భావితభఙ్గిః.

చింతార్ణవయాదసా :- చింతైవ అర్ణవః = చింతార్ణవః, చింతార్ణవే, యాదః = చింతార్ణవయాదః, తేన = చింతార్ణవయాదసా.

**భావము :**

ఈ దమయన్తి వారిలో కడపటమిగిలిన యైదవ వానిని నలునిగా నిశ్చయించుకొని మిక్కిలి యానందముతో నిండిన చిత్తముగలదాయెను. తర్వాత సరస్వతీ దేవియొక్క మాటలలోని నేర్పును గ్రహించివద్దె నలునిఁబడయుటకు నుపాయమునాలోచించుచు చెప్పఁబోవు ప్రకారము నుడువసాగినది 11

శ్లో॥ **సాభఙ్గిరస్యాః ఖలు వాచి కాఽపి**
**యద్భారతీ మూర్తిమతీ సతీయం.**
**శ్లిష్టం నిగద్యాదృత వాసవాదీన్**
**విశిష్య మే నైషధమప్యవాదీత్. 12**

ప॥వి॥ సా - భఙ్గిః - అస్యాః - ఖలు - వాచి - కా - అపి - యత్ - భారతీ - మూర్తిమతీ - సతీ - ఇయం - శ్లిష్టం - నిగద్య - ఆదృత, వాసవాదీన్ - విశిష్య - మే - నైషధమ్ - అపి - అవాదీత్.

అర్థము :- అస్యాః = ఈ సరస్వతీ దేవియొక్క, వాచి = మాటయందు, సా = చెప్పఁబడుచున్నది, కాఽపి = అపూర్వమైన, భఙ్గిఃఖలు = ప్రయోగరీతి, గదా, యత్ = ఏ భఙ్గి విశేషమువలన, ఇయం = ఎదుట

నున్న యీమె, మూర్తిమతీ = శరీరమును ధరించిన, సతీ = సత్యము చెప్పునట్టి, భారతీ = సరస్వతీదేవి, శ్లిష్టః = రెండర్థములు గల్గినట్లు, నిగద్య = చెప్పి, వాసవాదీన్ = ఇంద్రుడు మున్నగువారిని, ఆదృత = ఆదరించినది. (అథచ = పిదప) నైషధమపి = నలునిఁగూర్చియు, మే = నాకు విశిష్య = ఇంద్రాదులకంటె విశేషించి, అవాదీత్ = చెప్పినది. (కాని నేనే తెలిసికొన లేకపోతిని.)

సమాసములు :

మూర్తిమతీ :- మూర్తిః అస్యాః అస్తీతి = మూర్తిమతీ.

వాసవాదీన్ :- వాసవః ఆదిః యేషాంతే. వాసవాదయః =తాన్ = వాసవాదీన్.

భావము :

ఆ దమయన్తి యీ విధముగాఁజెప్పుచున్నది :- ఈ సరస్వతీ దేవి యొక్క మాటలయందపూర్వమైన ప్రయోగ కౌశలమున్నది. ఆ కౌశలము వలననే, యెదుటనున్న ఈ దేహము దాల్చినదై యుండు సత్యవాదినియగు సరస్వతీ దేవి, రెండర్థము లేర్పడునట్లు, ఇంద్రాదులను నాదరించినది. పిదపనామె నలుని గూర్చియు నింద్రాదులకంటె విశేష పఱచినది. కాని నేను దానిని గ్రహింపలేకపోతిని. 12

శ్లో॥ జగ్రన్థ సేయం మదనుగ్రహేణ
వచఃస్రజః స్పష్టయితుం చతస్రః.
ద్వే తే నలం లక్షయితుం క్షమేతే
మమైవమోహోఽయమహో మహీయాన్. 13

ప॥వి॥ జగ్రన్థ - సా - ఇయం - మదనుగ్రహేణ - వచః స్రజః - స్పష్టయితుం - చతస్రః - ద్వే - తే - నలం - లక్షయితుం - క్షమేతే - మమ - ఏవ - మోహః - అయమ్ - అహో - మహీయాన్.

- పా = అటువంటి, ఇయం = ఈ సరస్వతీదేవి, మదనుగ్రహేణ ;
ంత్ = నాయందలి, అనుగ్రహేణ = అనుగ్రహబుద్ధిచే, స్పష్టయితుం=
లునిఁబయట బఱచుటకు, చతస్రః = నాలుగైన, వచనస్రజః =
•పుష్పలచేఁజేసిన పుష్పమాలికలను, జగ్రన్థ = కట్టినది. తత్ర =
•నిలో, తే = ఆ, ద్వే = రెండును, తే = ఆయింద్రాగ్నులను వెల్లడి
అచునవి. ద్వే = మొదటివైన రెండవచన మాలికలు, నలం =
ఒని. లక్షయితుం = వ్యక్తపఱచుటకు, క్షమేతే = శక్తికలవిగా నగు
ఉన్నవి. ఆరెఁటి చేతనే స్పష్టముగా నలుడు దెలియుటకు నవకాశముం
గా తక్కిన రెండు మాలలును వ్యర్థములు. కింతు = కాని, మమైవ
= నాకే, అయం = ఈ, మహీయాన్ = మిక్కిలియధికమైన,
ూహః = మోహము (అజ్ఞానము) అహో = అశ్చర్యము! యత్ =
ంయనగా, చతసృభిరపి = నాల్గువచన మాలికలచేతను, న వేద్మి =
ంరినిగ్రహింపలేక యుంటిని.

ములు

ందనుగ్రహేణ :— మయి అనుగ్రహః = మదనుగ్రహః, తేన =
ందనుగ్రహేణ.

:

ః సరస్వతీదేవి నాయందు దయయుంచి నలుని స్పష్టముగాఁగనబడు
ుటకు "అత్యాజి (13-27) మున్నగు నాలుగువచన మాలికలనల్లినది.
ంర్థమునున్న "నామగ్రాహం మయానలమదీరితం" (13-29) "నమే
ంఖరాత్" (13-29) అను రెండువచన మాలికలుగాని "మహీమ
(13-37) నలముదీరితం" (13- 8) అను రెండు శ్లోకములుగాని నలుని
కు సమర్థములే, కాని ఆశ్చర్యము. నాకేయింత కాలము గొప్ప
ం. నలునిగూర్చి స్పష్టముగాఁ జెప్పినను నేను గ్రహింపలేక పోతిని.
ప్పిన నాలుగువచన మాలికల యర్థమును స్పష్ట పఱచుటకు "త్వయా
-34) "దేవఃపతిః" (13-33) అను నీ రెండువచన మాలికలను

సరస్వతీదేవిఁగూర్చినది. ఆ రెండును నలునిఁదెలుపుటకు చాలును. "త్వం యార్థసి" (13-32) యనునది మొదటి వ్యాఖ్యానముచే స్పష్టముగా నలునిఁ బ్రతిపాదించుట మన రెండవ వ్యాఖ్యచే, దేవతలను సంతోషపఱచియో, వద లియో, నలుడే వరింపఁదగినవాఁడని యర్థమంతటితోను చెప్పుటవలన "దేవః పతిః (13-33)" యను దానిచేతను లోకపాలుర యశము గల్గియుండుటవలన నలునికే (యతనితోఁగలసి) యైదుగురి రూపములు సంభవించుట వలనను నింద్రాదులకు సంభవింపనందువలనను, నలునికంటె నితరుదెవ్వడు నీకుపరుడు? కాన మఱియొకడు లేడని చెప్పుటవలనను "యద్యేనమజ్ఝసి" (13-63)చే నలునే స్వీకరింప వలసినదని మాటికిమాటికి సరస్వతీదేవి చెప్పినను, నేనుఁగొప్ప మోహమునఁబడి యామెయొక్క ఆశయమును ఁదెలుసుకొన లేక పోతిని. ఇది గొప్ప ఆశ్చర్యము. 13

శ్లో॥ శ్లిష్యన్తి వాచో యదమూరముష్యాః
కవిత్వ శక్తేః ఖలు తే విలాసాః.
భూపాలలీలాః కిల లోకపాలాః
సమావిశన్తి వ్యతిభేదినోఽపి. 14

ప॥వి॥ శ్లిష్యన్తి - వాచః - యత్ - అమూః - అముష్యాః - కవిత్వ శక్తేః - ఖలు - తే - విలాసాః - భూపలలీలాః - కిల - లోకపాలాః. సమావిశన్తి - వ్యతిభేదినః - అపి.

అర్థము :- అముష్యాః = ఈ సరస్వతీదేవియొక్క, అమూః = ఈ, వాచః = మాటలు, అనగా "అత్యాజి" (13-27) మున్నగు గాథలు, శ్లిష్యన్తి = నలునివలె నింద్రాదులను తాకుచున్నవి, అనునదేది కలదో, తే = అట్టి తాకుటయనునది, కవిత్వశక్తేః = కవనశక్తియొక్క, యనగా కావ్య రచనా కౌశలముయొక్క, విలాసాఃఖలు = విలాసములుగదా! ఒకరిని చెప్పు శబ్దమును మఱియొకరినిఁజెప్పునట్లుచేయుట కవిత్వ ధర్మము. కాని పరమార్థ దృష్టియందు రెండవ యర్థమునందుఁదాత్పర్య ముండదు. శ్లేషచేతను, నింద్రాదులకుఁనల సారూప్యముండుట వలనను సరస్వతీ

వచనములకు నింద్రాది పరత్వము భ్రాన్తి వలన నేర్పడినది. కావుననే- భూపాలలీలాః; భూపాల = నలునియొక్క, లీలాః = లీలలవంటి లీలలు గలిగిన, లోకపాలాః = ఇంద్రాది దిక్పాలురు, వ్యతిభేదినోఽపి = నలునికంటె భేదము క వారైనను. సమావిశన్తి = శ్రోతలబుద్ధియందు లగ్నులగు చున్నారు. కాబట్టి ఇది నా యొక్క భ్రాన్తియేగాని మతి యొకటికాదు.

**సమాసములు :**

కవిత్వ శక్తేః :- కవేర్భావః = కవిత్వం, కవిత్వస్య, శక్తిః = కవిత్వ శక్తిః, తస్యాః = కవిత్వ శక్తేః.

భూపాల లీలాః :— భువం, పాలయతీతి = భూపాలః = భూపాలస్య, లీలాః = భూపాలలీలాః.

లోకపాలాః :— లోకంపాలయన్తీతి = లోకపాలాః.

వ్యతిభేదినః :— విశేషేణ, అతిభేదః ఏషామస్తీతి = వ్యతిభేదినః.

**భావము :**

"అత్యాజి" మున్నగు (13 స, 27, 28, 29, 30) శ్లోకములు వస్తుస్థితి యందు నలునే చెప్పుచున్నవి. కాని—మతియొక విధముగానవి యింద్రాదులను సైతము చెప్పుచున్నవి. ఈ విధముగా నలునిఁజెప్పుచున్నను నలునివలె శ్లేషచే నింద్రాదులను సైతము చెప్పుచుండుట యా సరస్వతీదేవి యొక్క కావ్య నిర్మాణ కౌశలములోని- విలాసములు. కవిత్వశక్తి లేక యనేకార్థముల నొసంగెడి శ్లిష్టపదోరచనయశక్యము. కావుననే నలునికంటే సహస్రనేత్రత్వాది ధర్మములచే విశేషించి భేదముగల్గిన యీ యింద్రాదిదిక్పాలురు నలుని విలాసములను, నలాకారములను, పై శ్లేషమహిమచేఁ బొందింపఁబడి శ్రోతల బుద్ధిని ప్రవేశించు చున్నారు. ఆలఙ్కారికములగు నలసారూప్య ప్రాప్తి మున్నగు విషయములు దిక్పాలురలో వాస్తవికములుగావు. కాననవి వాస్తవికములను భ్రాంతి నాకుఁగల్గినది. పరమార్థమున, నలునిమాత్రమే యాగాథలు స్పృశించు చున్నవని యాశయము.

శ్లో॥ త్యాగం మహేన్ద్రాదిచతుష్టయస్య
కిమభ్యనందత్ క్రమసూచితస్య.
కిం ప్రేరయామాస నలే చ తన్మాం
కా సూక్తిరస్యా మమ కః ప్రమోహః. 15

ప॥వి॥ త్యాగం - మహేన్ద్రాదిచతుష్టయస్య - కిమ్ - అభ్యనందత్ - క్రమ సూచితస్య - కిం - ప్రేరయామాస - నలే - చ - తత్ - మాం. కా - సూక్తిః - అస్యాః - మమ - కః - ప్రమోహః.

అర్థము :- ఇయం = ఈ దమయన్తి, "అత్యాజి (13స 27 - 30) ఇత్యాది నాల్గుశ్లోకములచేతను" త్వం యార్థినీ (13స - 32, 33) ఇత్యాదిరెండు శ్లోకములచేతను, క్రమసూచితస్య = క్రమముగ సూచింపఁబడిన, మహేన్ద్రాదిచతుష్టయస్య = ఇంద్రుడు మున్నగు నలుగురు దిక్పాలుర యొక్క, త్యాగం = వదలి వేయుటను, కిమ్ = ఏల, అభ్యనందత్ = అభినందించినది. మాంచ = నన్ను, కిం = ఏల, నలే = నలుని విషయమున, ప్రేరయామాస = ప్రేరణఁజేసినది. ఈమెనన్నును గ్రహింపవలయునను నాశయము లేనిచో దీనినామె చేసియుండదని యర్థము. తత్ = అందువలన, అస్యాః = ఈ సరస్వతీదేవి యొక్క, సూక్తిః = మంచిమాట అనగా "అత్యాజి" మున్నగు వానిచే సత్యోపదేశము. కా = ఏమి? మమ = నాయొక్క, ప్రమోహః = గొప్పభ్రాంతి. కః = ఏమి? ఆశ్చర్యము. చక్కని త్రోవయందే కాలుజారినది.

సమాసములు :

మహేన్ద్రాది చతుష్టయస్య :— మహేన్ద్రః, ఆదిఃయేషాం, తే = మహేన్ద్రాదయః. చత్వారః, అవయవాః = యస్యతత్ = చతుష్టయం, మహేన్ద్రాదీనాం, చతుష్టయం = మహేన్ద్రాది చతుష్టయం, తస్య = మహేన్ద్రాదిచతుష్టయస్య.

క్రమసూచితస్య :— క్రమేణసూచితః = క్రమసూచితః, తస్య = క్రమసూచితస్య.

భావము :

ఈ సరస్వతీదేవి "అత్యాజి (13 - 27 - 30) యేన (13-31) ఇత్యాది నాలుగు శ్లోకములచే, త్వయా (13-32-33) ఇత్యాది రెండు శ్లోకముల చేతను, క్రమముగా సూచింపఁబడిన యింద్రాదులను నలుగురిని విడిచి వేయుట నేలయభినందించినది? కావున ఈ సరస్వతీ దేవికి నా యెడ ననుగ్రహబుద్ధిగలదని వ్యక్తమగుచున్నది. అందువలన సరస్వతీదేవి చెప్పిన మంచిమాటయెక్కడ? నాకేర్పడిన యజ్ఞానమెక్కడ? ఇంత స్పష్టముగా నామె చెప్పినను నేను దానిని గ్రహింపలేక చక్కటిత్రోవలోనే జారిపడితిని. 15

శ్లో॥ పరస్య దారాన్ ఖలు మన్యమానై
రస్పృశ్యమానా మమరైర్ధరిత్రీం.
భక్త్యేవ భర్తుశ్చరణౌ దధానాం
నలస్య తత్కాల మపశ్య దేషా. 16

ప॥వి॥ పరస్య - దారాన్ - ఖలు - మన్యమానైః - అస్పృశ్యమానామ్ - అమరైః - ధరిత్రీం - భక్త్యా - ఇవ - భర్తుః - చరణౌ దధానాం - నలస్య - తత్కాలమ్ - అపశ్యత్ - ఏషా.

అర్థము :— పరస్య = ఇతరునియొక్క, దారాన్ = భార్యయని, మన్యమానైః ఖలు = తలంచుచున్నారో యనునట్లున్న, అమరైః = ఇంద్రాది దేవతలచే, అస్పృశ్యమానాం = తాకఁబడక యున్నట్టియు, భక్త్యాఇవ= భర్తయందలి భక్తి చేతనో యనునట్లు; భర్తుః = భర్తయగు నలుని యొక్క, చరణౌ = పాదములను, దధానాం = ధరించుచున్న, ధరిత్రీం = భూమిని, ఏషా = ఈ దమయన్తి, తత్కాలం = ఆ సమయమున, అపశ్యత్ = చూచినది.

సమాసములు :

తత్కాలమ్ :— సచాసౌ, కాలశ్చ = తత్కాలః, తమ్ = తత్కాలమ్.

భావము ;

భూస్పర్శ మున్నగు నాలుగు చిహ్నములచే దమయన్తి నలునిఁదెలుసుకొనిన

విధము వర్ణింపఁబడుచున్నది. భూమి పరస్త్రీయని భావించుటచేతనో యననట్లు ఇంద్రాదులు ఆమెను తాకక యుండిరి పరస్త్రీ స్పర్శ నిషిద్ధము గదా! పతిభక్తి చేతనో యనునట్లు నలుని పాదములను ధరించుచున్న భూదేవతను దమయన్తి దర్శించినది. దేవతలు భూమినిఁ దాకరు నలుడో భూమిని స్పృశించుచున్నాడు కాన నీ చిహ్నము నలుని గుర్తించుటకు సాధనమైనదని యర్థము. 16

శ్లో॥ సురేషునాఽపశ్యద వేక్షతాక్ష్ణో
ర్నిమేషముర్వీ భృతిసమ్ముఖేసా.
ఇహ త్వమాగత్య నలే మిలేతి
సంజ్ఞాన దానా దివ భాషమాణమ్. **17**

వ॥వి॥ సురేషు - న - అపశ్యత్ - అవేక్షత - అక్ష్ణోః - నిమేషమ్ - ఉర్వీ భృతి - సమ్ముఖే - సా - ఇహ - త్వమ్ - ఆగత్య - నలే - మిల - ఇతి - సంజ్ఞానదానాత్ - ఇవ - భాష మాణమ్.

అర్థము :— సా = ఆ దమయన్తి, సురేషు = ఇంద్రాది దేవతలయందు, అక్ష్ణోః = నేత్రము యొక్క, నిమేషం = మూయుటను, నాపశ్యత్ = చూడలేరు. సమ్ముఖే = తనయెదుటనిలచిన, ఉర్వీభృతి = రాజైననలుని యందు (హే దమయన్తి = ఓ దమయన్తీ!) త్వమ్ = నీవు, ఇహ = ఇచ్చటికి, ఆగత్య = వచ్చి, నలే = నలునియందు, మిల = కలియుము ఇతి = అని, సంజ్ఞానదానాత్ = సైగచేయుట వలన, భాషమాణమివ స్థితం = మాట్లాడుచున్నదో యనునట్లున్న, నిమేషం = ఱెప్పపాటును, అవైక్షత = చూచినది, ఇది మఱియొక చిహ్నము.

**సమాసములు ;**

ఉర్వీభృతి :— ఉర్వీం; బిభర్తీతి = ఉర్వీభృత్, తస్మిన్ = ఉర్వీ భృతి.

సంజ్ఞానదానాత్ :— సంజ్ఞానస్య దానం = సంజ్ఞానదానం, తస్మాత్ = సంజ్ఞానదానాత్.

భావము :

ఆ దమయన్తి యింద్రాదులయందు ఱెప్పపాటునుఁ జూడలేదు సమీపమందున్న నలునియందో "ఓ దమయన్తి! ఇటువచ్చి నలునియందు గలియమని" సైగ చేయుటవలన మాట్లాడుచున్నదో యనునట్లున్న, ఱెప్పపాటునుఁజూచినది. ఈ ఱెప్పపాటు మఱియొక మానవతా చిహ్నమని భావము. 17

శ్లో॥ నాఽబుద్ధ బాలా విబుధేషు తేషు
క్షోదం క్షితేరైక్షత నైషధే తు.
పత్యే స్పృజన్త్యాః పరిరమ్భ మస్యాః
సమ్భూత సమ్భేదమసంశయం సా. **18**

ప॥వి॥ న - అబుద్ధ - బాలా - విబుధేషు - తేషు - క్షోదం - క్షితేః - ఐక్షత - నైషధే - తు - పత్యే - స్పృజన్త్యాః - పరిరమ్భమ్ - అస్యాః - సమ్భూత సమ్భేదమ్ - అసంశయం - సా.

అర్థము :- సా = ఆ, బాలా = బాలయైనదమయన్తి, తేషు = ఆ, విబుధేషు = దేవతలయందు, క్షితేః = భూమియొక్క, క్షోదం = ధూళిని, న అబుద్ధ = చూడలేదు. తేజోమయులగు నా దేవతలయందు భూపరాగము సోకలేదని యర్థము. నైషధేతు = నలునియందో, పత్యే = పృథివియైన తన భర్తయగు నలునికై, పరిరమ్భం = కౌగలింపును, స్పృజన్త్యాః = సృజించుచున్న అనగా నిచ్చుచున్న, అస్యాః = ఈ భూమియొక్క (సకాశాత్ = సమీపమునుండి) అసంశయం = నిశ్చయముగా, సమ్భూత సమ్భేదం; సమ్భూత = ఏర్పడిన, సమ్భేదమివ = కలయిక గల్గినట్లుగా, స్థితం = ఉండిన, క్షోదం = ధూళిని, ఐక్షత = చూచినది.

సమాసములు :

సమ్భూత సమ్భేదం :- సమ్భూతః, సమ్భేదః, యస్మిన్ కర్మణి తద్యథా భవతితథా = సమ్భూతసమ్భేదమ్

**భావము :**

ఆ దమయన్తి దేవతలపై భూపరాగమును. జూడలేదు. కాని నలుని యందు, తన భర్తయని యాలిఙ్గనము నిచ్చుచున్న యీ భూమినుండి నిశ్చయముగా నా లింగనమువలన సంక్రమించినదో యనునట్లు భూధూళినిఁజూచినది. ఈ భూధూళి యొక మానవతా చిహ్నము. 18

**శ్లో॥ స్వేదః స్వదేహస్య వియోగతాపం**
**నిర్వాపయిష్యన్నివ సంసి సృక్షోః.**
**హీరాఙ్కురశ్చారుణి హేమనీవ**
**నలే తయాఽఽలోకి న దైవతేషు. 19**

ప॥వి॥ స్వేదః - స్వదేహస్య - వియోగతాపం - నిర్వాపయిష్యన్, ఇవ - సంసిసృక్షోః - హీరాఙ్కురః - చారుణి - హేమని - ఇవ - నలే - తయా - ఆలోకి – న - దైవతేషు.

అర్థము :- తయా = ఆ దమయన్తిచే, సంసిసృక్షోః = నలునితో సంసర్గముఁ జేయగోరుచున్న, స్వదేహస్య = తన దేహముయొక్క, వియోగతాపం= విరహతాపమును. నిర్వాపయిష్యన్ = చల్లఁబఱుపగలదో యనునట్లు (ఉద్గతః = ఉద్భవించిన) స్వేదః = చెమట, చారుణి = నల్ల దనము లేక శుద్ధమైన, హేమని = పసిడియందు, హీరాఙ్కుర ఇవ = వజ్రపు మొలకవలె, నలే = నలునియందు, ఆలోకి = చూడఁబడినది. దైవతేషు = దేవతలయందో, నాఽఽలోకి = చూడఁబడలేదు.

వి :- వియోగతాపమును శమింపఁజేయుటకై యుద్భవింపక పోయినను నుద్భవించినట్లు చెప్పుటవలన ఉత్ప్రేక్ష. ఆ స్వేదమును పసిడివన్నె గల నలుని శరీరమునందు వజ్రంపు మొలకితోఁబోల్చుట వలననుపమ. ఈ రెంటికి సంసృష్టి.

**సమాసములు :**

స్వదేహస్య :- స్వస్య. దేహః = స్వదేహః, తస్య = స్వదేహస్య.

వియోగతాపం :- వియోగస్య, తాపః = వియోగతాపః, తమ్ = వియోగతాపమ్.

సంసిస్పృక్షోః :- సంస్ప్రష్టుమిచ్ఛుః = సంసిస్పృక్షుః, తస్య = సంసిస్పృక్షోః.

హీరాఙ్కురః :- హీరస్య. అఙ్కురః = హీరాఙ్కురః.

**భావము :**

ఆ దమయన్తిఁ గౌఁగలియఁ గోరిన నలుని శరీరమందలి విరహతాపమును శమింపఁగలదిగా నుద్భవించునట్లు భావింపఁబడిన చెమట బిందువులు పరిశుభ్రమైనదై నల్లమచ్చ లేని పసిడియందు వజ్రపు మొలకలవలె నలుని దేహమందుఁ జూడఁబడినవి. కాని దేవతల శరీరమందుఁ జూడఁబడలేదు. ఇటఁ జెమట యను మానవతాచిహ్నము వర్ణితము. 19

శ్లో॥ సురేషు మాలా మమలామపశ్యత్
నలేతు బాలా మలినీ భవన్తీం.
ఇమాం కిమాసాద్య నలోఽద్యమృద్వీం
శ్రద్ధాస్యతే మామితి చిన్తయేవ. 20

ప॥వి॥ సురేషు - మాలామ్ - అమలామ్ - అపశ్యత్ - నలేషు - బాలా - మలినీభవన్తీం - ఇమాం - కిం - ఆసాద్య - నలః - అద్య - మృద్వీం - శ్రద్ధాస్యతే - మాం - ఇతి - చిన్తయా - ఇవ.

అర్థము :— బాలా = దమయన్తి, సురేషు = దేవతలయందు, మాలాం = పుష్పమాలను, అమలాం = వాడుబారనిదానినిగా, అపశ్యత్ = చూచినది. నలేతు = నలునియందో, అద్య = ఈ స్వయంవర దినమునందు, నలః = నలుడు, మృద్వీం = తనకంటెను ననగా మాలకంటెను సుకుమారమైన, ఇమాం = ఈ దమయన్తిని, ఆసాద్య = పొంది, కిం = ఏల, మాం = నన్నుఁగూర్చి. శ్రద్ధాస్యతే = శ్రద్ధబడగలడు, ఇతి = అని, చిన్తయేవ = చింతచేతనో యనునట్లు, మలినీభవన్తీం = వాడు

బారుచున్న, మాలాం = మాలను, అపశ్యత్ = చూచెను.

వి :- తనకంటె సుకుమారమగు దమయన్తికి జడయుటచే నలుడు తన్ను, అశ్రద్ధ చేయక పోయినను, జేయగల్గునట్లుత్ప్రేక్షించుట వలన నుత్ప్రేక్షా లఙ్కారము.

**సమాసములు :**

మలినీభవన్తీం :— అమలినా, మలినా, సమ్పద్యమానా భవన్తీ = మలినీభవన్తీ, తామ్ = మలినీభవన్తీం.

**భావము :**

బాలయగు దమయన్తి దేవతలయందు పుష్పమాలను వాడబారనిదిగాఁ జూచినది. కాని నలునియందు, స్వయంవర దివసమున "నలుడు తనకంటెను (మాలకంటెను) సుకుమారురాలగు దమయన్తిఁ బొంది తన్నుపేక్షించునను చింతతోడనో యనునట్లు పుష్పమాలను వాడుబడుచున్న దానినిగాఁ జూచినది. ఇచట పుష్పమాల వాడుటయను మానవతా చిహ్నము వర్ణితము. :0

శ్లో॥ శ్రియం భజన్తాం కియదస్య దేవా
శ్ఛాయా నలాయాస్తి తథాపి నైషామ్.
ఇతీరయన్తీవ తయా నిరైక్షి
సా నైషధే న త్రిదశేషు తేషు. **21**

ప॥వి॥ శ్రియం - భజన్తాం - కియత్ - అస్య - దేవాః - ఛాయా - నలాయ - అస్తి - తథా - అపి - న - ఏషామ్ - ఇతి - ఈరయన్తీ - ఇవ - తయా - నిరైక్షి - సా - నైషధే - న - త్రిదశేషు - తేషు.

అన్వయము :— దేవాః = ఇన్ద్రాది దేవతలు, అస్య = ఈ నలుని యొక్క, శ్రియం = సౌన్దర్యమును, కియత్ = కొంచెముగా, భజన్తాం = పొందుదురుగాత, తథా అపి = నలసౌన్దర్యమును కొలదిగా తీసికొనినను, నలస్య = నలుని యొక్క, ఛాయా = ప్రతిబింబము, ఏషామ్ = ఈ

యింద్రాది దేవతలకు, నాస్తి = లేదు, నలరూపమును ధరించిన దేవతలు తేజోమయులగుట వలన భూస్పర్శ యుండదు. కానఅట్టి ప్రతిబిమ్బ రూపమైన ఛాయ సంభవింపదు. ఇతి = అని ఈరయనీవ = చెప్పుచున్నదో యను నట్లున్న, సా = ఆ ఛాయ, అనగా ప్రతి బింబము, తయా = ఆ దమయన్తిచే, నైషధే = నలునియందు నిరైక్షి = చూడc బడినది. తేషు = ఆ, త్రిదశేషు = దేవతలందరి యందు. ననిరైక్షి = చూడఃబడలేదు, ఆ యింద్రాది దేవతలు, తేజోమూర్తులు గాన గొడుగు మున్నగువాని నీడవలె, వారికెవ్వరికిని శరీరపు నీడ భూమిపై బడదు. నలుని శరీరపు నీడ భూమిపై బడునని యర్థము.

**సమాసములు :**

త్రిదశేషు :— త్రిసః, దశాఃయేషాంతే = త్రిదిశాః తేషు = త్రిదశేషు

**భావము :**

ఇంద్రాది దేవతలీ నలుని సౌందర్యమున యొక లేశ భాగమునుc బొందినచోc బొందవచ్చును. కాని నలుని యొక్క ప్రతిబింబము, అనగా నీడ వీరికి లేదు. నలునికి సమానులు కారని యర్థము. మఱియు వీరు తేజోరూపులు గాన వీరికి భూస్పర్శ లేనందువలన నటువంటి నీడ వీరికి లేదు, ఈ విధముగా జెప్పుచున్నదో యనునట్లున్న, ఆ నీడను దమయన్తి నలునియందుcజూచినదీ. నేలపైన ఎండలో నున్నప్పుడు నీడ పడుట యొక మానవతా చిహ్నముగా వర్ణితము. 21

శ్లో॥ చిహ్నైరమీభిర్నలసంవిదస్యాః
సంవాదమాప ప్రథమోపజాతా.
సా లక్షణవ్యక్తి భిరేవ దేవ
ప్రసాదమాసాదిత మప్యబోధి. **22**

ప॥వి॥ చిహ్నైః – అమీభిః - నలసంవిత్ – అస్యాః - సంవాదమ్ – ఆప - ప్రథమోపజాతా - సా - లక్షణవ్యక్తిభిః - ఏవ - దేవప్రసాదమ్ —

ఆసాదితమ్ - అపి - అబోధి.

అర్థము :— -స్యాః = ఈ దమయన్తికి, ప్రథమోపజాతా; ప్రథమ=తొలుత, ఉపజాతా "ఇతరనలతులాభాక్ (11-5)" ఇత్యాది పూర్వసర్గ యందు జెప్పఁబడిన వికల్పములచే నుత్పన్నమైన, నలసంవిత్ = ఆ యైదుగురిలో మిగిలినవాడే నలుడను జ్ఞానము, ఈభిః = ఈ, చిహ్నైః = చిహ్నములతో. సంవాదమ్ = ఐక్యమును, ఆప= పొందినది, సా = ఆ దమయన్తి, లక్షణవ్యక్తిభిరేవ; లక్షణ = పూర్వోక్త చిహ్నముల యొక్క, వ్యక్తిభిరేవ = కార్యముల వెల్లడింపులచేతనే, దేవప్రసాదమపి = కారణమగు దేవతానుగ్రహమును గూడ, ఆపాదితమ్ = పొందింపఁబడిన దానినిగా, అబోధి = తెలిసికొనెను. నా సేవచే దేవతలు ప్రసన్నులైరి కానిచో నింతకాలము నాకు కానరాని భూస్పర్శాది రూపములగు మానవ సహజ చిహ్నములిప్పుడెట్లు కానవచ్చుచున్నవి? కారణము లేక కార్యము పుట్టదు గదా!

సమాసములు·

నలసంవిత్ :— నలస్య, సంవిత్ = నలసంవిత్.

ప్రథమోపజాతా :— ప్రథమముపజాతా = ప్రథమోపజాతా.

లక్షణవ్యక్తిభిః :- లక్షణానాం, వ్యక్తయః = లక్షణవ్యక్తయః, తాభిః = లక్షణవ్యక్తిభిః

దేవప్రసాదమ్ :— దేవానాం, ప్రసాదః = దేవప్రసాదః, తమ్ = దేవప్రసాదమ్.

**భావము :**

ఈ దమయన్తికి "ఇతరనల తులాభాగేష శేషః" అని మున్నగు వెనుకటి తర్కముతో నేర్పడిన నల విషయకమగు జ్ఞానము, ఈ భూస్పర్శాది చిహ్నములచే సరిపడి దృఢపడినది. ఆ దమయన్తి ముందు చెప్పిన యా చిహ్నములనెడి కార్యములు బయటపడగనే దానికి దేవతానుగ్రహ రూపమగు కారణమును దెలిసికొనినది. ఇంతకాలము వరకు గానరాని భూస్పర్శాది చిహ్నము లిప్పుడు కానవచ్చుటను దేవతల యనుగ్రహమే కారణమని యామె గ్రహించినది. కానిచో కారణము లేనిది కార్యమెట్లు సంభవించునని యాశయము, 22

శ్లో॥ నలే విధాతుం వరణస్రజం తాం
స్మరః స్మరామాం త్వరయత్యథైనాం
అపత్రపా తాం నిషిషేధ తేన
ద్వయానురోధం తులితం దధౌ సా. **23**

ప॥వి॥ నలే - విధాతుం - వరణస్రజం - తాం - స్మరః - స్మ - రామాం - త్వరయతి - అథ - ఏనాం - అపత్రపా - తాం - నిషిషేధ - తేన - ద్వయానురోధం - తులితం - దధౌ - సా.

అర్థము :- అథ = మిగిలినవాఁడు నలుడను నిశ్చయ మేర్పడిన పిదప, స్మరః = మన్మథుడు, తాం = హస్తమందున్నట్టియా, వరణస్రజం= వరణమాలను, నలే = నలునియందు, విధాతుం = వేయుటకు, ఏనాం = ఈ, రామాం = ఆనందపఱచెడు స్త్రీయగు దమయన్తిని, త్వరయతిస్మ = తొందరఁబెట్టుచుండెను. అపత్రపా = అందరి యెదుట నీతని నెట్లు వరింతునను సిగ్గు, తాం = కామునిచే, తొందర పెట్టబడు చున్న యా దమయన్తిని, నిషిషేధ = నివారించినది. తేన = ఆ రెండు కారణములచే, సా = ఆ దమయన్తి, ద్వయానురోధం = మన్మథునియొక్కయు, లజ్జయొక్కయు ననురోధమును, తులితం యథా తథా = సమమగునట్లు, దధౌ = రక్షించెను. వరణమాలను వైచెడి విషయమున ననగా, నామాలను వేయులయా, లేక వేయకపోవుటయాయను విషయమున, నేమిచేయవలసినది తెలియక యామె యుండిపోయినది. "తుల్యా లజ్జా స్మరా మధ్యా" యను లక్షణము ననుసరించి యీామె మధ్యమ నాయికగా నగుచున్నది.

**సమాసములు :**

వరణస్రజమ్ :- వరణస్య, స్రక్ = వరణస్రక్, తాం = వరణస్రజమ్.
ద్వయానురోధం :- ద్వయస్య, అనురోధః = ద్వయానురోధః తమ్= ద్వయానురోధం.

భావము :

ఆ యెదుగురిలో నిగిలినట్టి యితడే నలుడను నిశ్చయ మేర్పడిన పిదప, మన్మథుడు; చేతనున్న యా వరణ మాలికను నలుని కంఠమున వేయుటకీమెను ననగా దమయన్తిని త్వర పెట్టసాగెను. కాని యందఱి సమక్షమున నీ మాలను నలుని కంఠమునందెట్లు వైతుననిసిగ్గు, ఆమెను నివారించినది. ఆ కారణముచే నా దమయన్తి, మన్మథుని యొక్కయు, లజ్జయొక్కయు, ననురోధమును, సమానమగునట్లు రక్షించినది. అనగా వరణమాలను వేయుటయా ? లేక వేయక యుండుటయా ? అని యేమియు జేయలేకయుండి పోయినదని యర్థము. ఇట్లు దమయన్తి, లజ్జా కామములు సమానముగాఁగావించుకొనుట వలన, మధ్యస్థ నాయిక యగుచున్నది.

శ్లో॥ స్రజా సమాలిఙ్గయితుం ప్రియం సా
రసాదధత్తైవ బహు ప్రయాసమ్.
స్తమ్భత్రపాభ్యామభవత్తదీయే
స్పన్దస్తు మన్దోఽపి నపాణి పద్మే. 24

ప॥వి॥ స్రజా - సమాలిఙ్గయితుం - ప్రియం - సా - రసాత్ - అధత్త - ఏవ - బహుప్రయత్నం - స్తమ్భత్రపాభ్యాం - అభవత్ - తదీయే - స్పన్దః - తు - మందః - అపి - న - పాణిపద్మే.

అర్థము :- సా = ఆ దమయన్తి, రసాత్ = అనురాగమువలన, ప్రియం = ప్రియుడైన నలుని, స్రజా = వరణమాలచే, సమాశ్లేషయితుం = చక్కగా నాలింగనముఁగావించుకొనుటకు, బహు ప్రయత్నం = గొప్ప ప్రయత్నమునే, అధత్త = చేసెను. కింతు = కాని, తదీయే = ఆమెకు సంబంధించిన, పాణిపద్మే = హస్త పద్మమునందు, స్తమ్భత్రపాభ్యాం; స్తమ్భ = నిశ్చలత్వముచేతను, త్రపాభ్యాం = సిగ్గుచేతను, మందోఽపి = కొంచమైనను, స్పందః = కదలిక, నఅభవత్ = కాలేదు,

సమాసములు :

బహుప్రయత్నమ్ :- బహుశ్చాసౌ ప్రయత్నశ్చ = బహుప్రయత్నః, తమ్ = బహుప్రయత్నమ్.

స్తమ్భత్రపాభ్యాం :- స్తమ్భశ్చ త్రపాచ = స్తమ్భత్రపే, తాభ్యాం = స్తమ్భత్రపాభ్యాం.

తదీయే :- తస్యాః, ఇదం = తదీయం, తస్మిన్ = తదీయే.

పాణిపద్మే :- పాణిః పద్మమివ = పాణిపద్మం, తస్మిన్ = పాణిపద్మే.

భావము :

ఆ దమయన్తి యనురాగమువలన ప్రియుడగు నలుని వరణమాలచేఁ గౌగలించు కొనుటకు గొప్ప ప్రయత్నముఁ గావించినది. ఆమెయొక్క కేలు తమ్మియందు, నిశ్చలత్వము, లజ్జ, యను సాత్త్విక భావములచే కొంచెమైనను కంపము గలుగలేదు. 24

శ్లో॥ తస్యాహృది వ్రీడ మనోభవాభ్యాం
దోలావిలాసం సమవాప్యమానే.
శ్రితంధృతై ణాఙ్క కులాతపత్రే
శృఙ్గారమాలిఙ్గదధీశ్వరశ్రీః. 25

ప॥వి॥ తస్యాః - హృది - వ్రీడమనోభవాభ్యాం - దోలావిలాసం - సమవాప్యమానే - శ్రితం - ధృతైణాఙ్కకులాతపత్రే - శృఙ్గారమ్ - ఆలిఙ్గత్ - అధీశ్వరశ్రీః.

అర్థము :— వ్రీడమనోభవాభ్యాం; వ్రీడ = సిగ్గుచేతను, మనోభవాభ్యాం = కామముచేతను, దోలావిలాసం; దోలా = ఊయలయొక్క, విలాసం = లీలను, సమవాప్యమానే = పొందింప బడుచున్నదై, ధృతైణాఙ్కకులాతపత్రే; ధృత = ధరింపఁబడి, ఏణాఙ్కకుల = చంద్రవంశమున నుద్భవించిన నలుని, ఆతపత్రే = గొడుగుగాఁగల్గిన, తస్యాః = ఆ

దమయన్తి యొక్క. హృది = హృదయమునందు, శ్రితం = ఆశ్రయించియున్న, శృఙ్గారం = శృఙ్గార రసమును, అధీశ్వరశ్రీః; అధీశ్వర = హృదయేశ్వరుని యొక్క, శ్రీః = సౌందర్యము, ఆలిఙ్గత్ = కౌగలించినది. ఊయెలనుండి పడునట్టి భయమును నివారించుటకుఁ గౌగలించినదని యర్థము. అనగా గట్టిగా నూగుచున్న యూయెలనెక్కిన మనుష్యుని ప్రక్కనున్న పురుషుడు కాని స్త్రీ గాని యెవరైననునెట్లు తమ చేతి నూతగానిచ్చి పడనీయక పట్టుకుందురో, అట్లే నలుని సౌందర్యము ఆమెయందలి శృఙ్గారరసమును పడిపోనీయక పట్టుకొనినదని యర్థము.

**సమాసములు**

వ్రీడమనోభవాభ్యామ్ :— వ్రీడశ్చ, మనోభవశ్చ = వ్రీడమనోభవౌ, తాభ్యాం = వ్రీడమనోభవాభ్యామ్.

దోలావిలాసం :— దోలాయాః, విలాసః = దోలావిలాసః. తమ్ = దోలావిలాసమ్.

ధృతైణాఙ్కకులాతపత్రే :—ఏణః, అఙ్కః, యస్య సః = ఏణాఙ్కః. ఏణాఙ్కస్య, కులం = ఏణాఙ్కకులం, ఏణాఙ్కకులస్య, అతపత్రం, ఏణాఙ్కకులాతపత్రం. ధృతం, ఏణాఙ్కకులాతపత్రం, యేన తత్ = ధృతైణాఙ్కకులాతపత్రం, తస్మిన్ = ధృతైణాఙ్కకులాతపత్రే.

**భావము ;**

లజ్జచేతను, కామముచేతను ఊయెలవలె నిటునటు చలించుచున్నట్టి ననగా వరించుటయా? వరింపక పోవుటయా? యను సంశయగ్రస్తమై యున్నదియు, చంద్రవంశ మందుద్భవించిన నలునే గొడుగుగాఁగల్గిన దమయన్తి యొక్క హృదయమునందున్న శృఙ్గార రసమును, హృదయమునకు నాథుడైన నలుని యొక్క సౌందర్యము, ఉయ్యాలనుండి పడిపోనీయక కౌగలించుకొనెను. నలుని గొడుగుగా రూపించుటవలన గొడుగెట్లు ఎండవలని తాపమునుఁ బోగొట్టునో యట్లే దమయన్తీ విరహతాపమును సతతము పోగొట్టునని యాశయము. ధన్య

యన్తి హృదయమునందు నలవిషయక ప్రేమరూపకమైన శృఙ్గారరసము ఊయెల యూపువంటి యనిశ్చయ స్థితిచే ననగా వరించుటయా? లేక వరింపక పోవుటయా? యను ననిశ్చయ స్థితివలన నా శృఙ్గారరసము అనగా నలునిపైన యామెకున్న ప్రేమ జారిపోవచ్చును. కాని నలుని సౌందర్యమా శృఙ్గారరసమును పడనీయక పట్టుకొనినదని యాశయము. ఉయ్యాల వేగముగా నూగుచున్నప్పుడు అందలి మనుష్యునిఁ బ్రక్కనున్న వ్యక్తి పురుషుడు గాని స్త్రీ గాని పడనీయక పట్టుకొనునట్లు, ఇచ్చట దమయన్తీ హృదయమందలి శృఙ్గారభావమును నల సౌందర్యము సంశయ డోలనుండి పడనీయక రక్షించినదని యర్థము. అనగా నలుని సౌందర్యమే యతనిని వరించుటకు హృదయమున స్థైర్యమును గల్పించినది. "వరించుటయా, వరింపక పోవుటయా" యను సంఘర్షణ వలన నేర్పడిన; యూయెల యూపువంటి యనిశ్చయ పరిస్థితి నివారించినదని యర్థము. ఇచ్చట దమయన్తి యొక్క హృదయము ఊయెల, శృఙ్గారరసము, ఊగునట్టి వ్యక్తి; సంతాపమునుఁ బోగొట్టుట వలన నలుడు గొడుగు. లజ్జయు, కామమును, ఊయెల నూడిచెవాడు. ఇందువలన నలుడు అధిష్ఠించిన తన హృదయమందు దమయన్తి శృంగారరసముయొక్క పరమావధినిఁ బొందినదని భావము.

శ్లో॥ కరః స్రజా సజ్జతర స్తదీయః
ప్రియోన్ముఖీభూయ పునర్వ్యరంసీత్.
తదాననస్యార్ధ పథం యయౌ చ
ప్రత్యాయయౌ చాతిచలః కటాక్షః. 26

ప॥వి॥ కరః - స్రజా - సజ్జతరః - తదీయః - ప్రియోన్ముఖీభూయ - పునః - వ్యరంసీత్ - తదాననస్య, అర్ధపథం - యయౌ - చ - ప్రత్యాయయౌ - చ - అతిచలః - కటాక్షః.

అర్థము :- స్రజా = వరణమాలచే, సజ్జతరః = మిక్కిలి శోభించెడి, తదీయః = ఆ దమయన్తికి సంబంధించినదైన, కరః = హస్తము, ప్రియోన్ముఖీ భూయ; ప్రియ = ప్రియుడైన నలునకు, ఉన్ముఖీ భూయ = ఎదురైనదై, పునః = మరల, వ్యరంసీత్ = విరమించినది. తథా =

ఉన్లే, అతిచలః = మిక్కిలి చంచలమైన, కటాక్షః = కడకన్ను, తదాననస్య = ఆ నలుని ముఖమునకు, అర్ధపథం = సగమైన త్రోవను, యయౌచ = పొందినది. ప్రత్యాయయౌచ = తిరిగియు వచ్చినది. ఇట్లు రాకపోకలు జరుపుటకు లజ్జయే కారణము.

సమాసములు :

సజ్జతరః :- అత్యంతం, సజ్జః = సజ్జతరః.
తదీయః :- తస్యాః = అయం, తదీయః.
ప్రియోన్ముఖీభూయ:- అనున్ముఖః ఉన్ముఖః, సంపద్యమానః = భూత్వా, ఉన్ముఖీభూయ. ప్రియస్య, ఉన్ముఖీభూయ = ప్రియోన్ముఖీభూయ.
తదాననస్య :- తస్య, ఆననం, తదాననం, తస్య = తదాననస్య.
అర్ధపథం ;- అర్ధః, పన్థాః = అర్ధపథం, తత్ = అర్ధపథం.

భావము :

వరణమాలనుఁబట్టుకొని సిద్ధమై శోభించెడి దమయన్తి హస్తము నలుని కెదురై మరల విరమించినది. ఆతని కంఠమున వైచుటకై యెదురేగి సిగ్గుచే విరమించినది. అట్లే మిక్కిలి చంచలమైన యామె కడకన్ను నలుని కెదురేగి సగము త్రోవయందే మఱల సిగ్గుచే వెనుకకు మఱలినది. 26

శ్లో॥ తస్యా ప్రియం చిత్తముదేతుమేవ
ప్రభూ బభూవాక్షి నతుప్రయాతుమ్.
సత్యీకృతః స్పష్టమభూత్తదానీం
తయాఽక్షి లజ్జేతి జన ప్రవాదః. **27**

ప॥వి॥ తస్యాః - ప్రియం - చిత్తమ్ - ఉదేతుం - ఏవ - ప్రభూ బభూవ - అక్షి - న - తు - ప్రయాతుం - సత్యీకృతః - స్పష్టమ్ - అభూత్- తదానీం - తయా - అక్షిలజ్జా - ఇతి - జనప్రవాదః.

అర్థము :- తస్యాః = ఆ దమయన్తియొక్క, చిత్తమేవ = మనస్సే, ప్రియం = ప్రియుడైన నలుని, ప్రయాతుం = పొందుటకు, ప్రభూబభూవ =

సమర్థమైనది. అక్షితు = కన్నో. ప్రయాతుం = నలునిఁబొందుటకు, నప్రభూబభూవ = సమర్థముకాలేదు. మనస్సునందామె ప్రతిక్షణము నలునిఁజూచినది కాని ఎదుటనున్న నా నలుని లజ్జవలన కన్నెత్తుకొని తాను చూడఁజాలకపోయినది. (కావుననే), అక్షిలజ్జా = కంటియందే సిగ్గుకాని మనస్సునందు సిగ్గులేదను, జనప్రవాదః = లోకప్రవాదము. తయా = ఆ దమయన్తిచే, తదానీం = నలునివరించెడి కాలమునందు, స్పష్టం=స్ఫుటముగా, సత్యీకృతః=సత్యముగాఁజేయఁబడినది. లజ్జమనో ధర్మమనుట వాస్తవము. కాని నేత్ర ధర్మమనుట వాస్తవముకాదు. లజ్జ వలన దమయన్తి చిత్తమునకు నలప్రాప్తితగదు. కాని నేత్రమునకే యది తగినది. కాబట్టియట్టి లజ్జయను జనప్రవాదము అసత్యమే కాని దమయన్తి చిత్తనేత్రములయందు దానికి విరుద్ధముగా కార్యము లుత్పన్నములగుట వలన "నక్షిలజ్జ" యను జనప్రవాదము సత్యము గావింపఁబడినదని యర్థము.

సమాసములు :

ప్రభూబభూవ ;- అప్రభుః, ప్రభుః, సమ్పద్య = ప్రభూబభూవ.

సత్యీకృతః:- అసత్యః, సత్యః, సమ్పద్యమానః, కృతః = సత్యీకృతః.

అక్షిలజ్జా :- అక్షి లజ్జా = అక్షిలజ్జా.

జనప్రవాదః :- జనానాం, ప్రవాదః = జనప్రవాదః.

భావము :

ఆ దమయన్తి చిత్తమే నలునిఁజూడగల్గినది. కన్నో యాతనిఁజూడలేక పోయినది. మనస్సునందు ప్రతిక్షణము నలునిఁజూడగల్గినది కాని, యెదుటనున్న నా నలుని కన్నెత్తుకొని చూడఁజాలకపోయినది. కావున "కంటి యందే లజ్జ" మనస్సునందు లజ్జ లేదనులోకప్రవాదము నామె సత్యము గావించినది. లజ్జ వాస్తవములో మనోధర్మము కాని నేత్ర ధర్మముగాదు. కాన లజ్జవలన దమయన్తి చిత్తమునకు నల ప్రాప్తి తగదు. కాన నేత్రమునకే నలప్రాప్తి తగినది. ఏలయనగా – నేత్రమునందు లజ్జయనెడి ప్రతిబంధకము లేదుగదా! కావున నేత్రమునందే లజ్జ యను లోకప్రవాదము గూడ నసత్యమేగాని దమయన్తి చిత్త నేత్రములయందు దానికి విరుద్ధమగు కార్యముల్పద్భవించినందువలన నక్షిలజ్జ

యను ప్రవాదము నామె సత్యమునే గావించినదని భావము. 27

శ్లో॥ కథం కథఞ్చిన్నిషధేశ్వరస్య
కృత్వాఽఽస్య పద్మం దరవీక్షితశ్రి.
వాగ్దేవతాయా వదనేందు బింబం
త్రపావతీసాఽకృతసామి దృష్టమ్. 28

ప॥వి॥ కథం - కథఞ్చిత్ - నిషధేశ్వరస్య - కృత్వా - అస్యపద్మం - దర వీక్షితశ్రి - వాగ్దేవతాయాః - వదనేందుబింబం - త్రపావతీ — సా — అకృత - సామిదృష్టమ్

అర్థము :— త్రపావతీ = సిగ్గుగల్గిన, సా = ఆ దమయన్తి, నిషధేశ్వరస్య = నలుని యొక్క, ఆస్యపద్మం = ముఖారవిందమును, కథంకథఞ్చిత్ = మిక్కిలి కష్టముతో, దరవీక్షితశ్రి; దర = కొంచెము, వీక్షిత = చూడ బడిన, శ్రి = శోభ గల్గినదిగా, కృత్వా = చేసి, అనగా లజ్జచే కొద్దిగాఁ జూచి, వాగ్దేవతాయాః = సరస్వతీదేవియొక్క, వదనేందు బింబం = ముఖచంద్ర మండలమును, సామిదృష్టమ్ = సగపాలు చూడఁబడినదిగా అకృత = చేసినది. దీనికిని లజ్జయే కారణము. నేను నలుని ముఖమును జూడలేను. నీ చేతనే (సరస్వతిదేవి చేతనె) యాతని ముఖ దర్శనము నాకుఁ జేయింపదగినదని యర్థము, దేవీ ముఖ నిరీక్షణమందు తాత్పర్య మని తెలియవలయును.

సమాసములు ;

నిషధేశ్వరస్య :- నిషధానాం, ఈశ్వరః = నిషధేశ్వరః, తస్య = నిషధేశ్వరస్య.

ఆస్యపద్మం :— ఆస్యం, పద్మమివ = ఆస్యపద్మం, తత్ = ఆస్య పద్మం.

దరవీక్షితశ్రి :— దరం వీక్షితా = దరవీక్షితా, దరవీక్షితా, శ్రీః, యస్యతత్ = దరవీక్షితశ్రి, తత్ = దరవీక్షితశ్రి.

వాగ్దేవతాయాః := వాచాందేవతా, అథవా వాగేవదేవతా = వాగ్దేవతా, తస్యాః = వాగ్దేవతాయాః.

వదనేన్దుబిమ్బం :— ఇందోః, బిమ్బః = ఇందుబిమ్బః; వదనమేవఇన్దు బిమ్బః = వదనేందుబిమ్బః; తమ్ = వదనేందుబిమ్బమ్.

సామిదృష్టమ్ :— సామి, దృష్టః = సామిదృష్టః, తమ్ = సామి దృష్టమ్.

భావము :

సిగ్గుగల యా దమయన్తి నలుని ముఖారవిందము నందలి శోభను మిక్కిలి కష్టముతో గొంచెముఁ జూడఁగల్గినది. ఇట్లు కొద్దిగా జూచి పిదప సరస్వతీదేవి యొక్క ముఖ చంద్రమండలమును సగము జూచినది. ఇట్లు నలుని ముఖమును కొద్దిగ జూచి సరస్వతీ ముఖమును సగము జూచుటచే, నామెకు లజ్జ కల్గి తాను నలునిఁ జూడలేక యున్నాను. కాన నీవే యాతని దర్శనమును నాకు జేయింపవలసినదను నాశయము సూచితము. 28

శ్లో॥ న జానతీ వేదమవోచ దేనామ్
ఆకూతమస్యాస్తదవేత్య దేవీ.
భావస్త్రపోర్మి ప్రతిసీరయా తే
వితీర్యతే లక్షయితుం న మేఽపి. 29

ప॥వి॥ న - జానతీ - ఇవ - ఇదమ్ - అవోచత్ - ఏనామ్ - ఆకూతమ్ - అస్యాః - తత్ - అవేత్య - దేవీ - భావః - త్రపోర్మిప్రతిసీరయా - తే - వితీర్యతే - లక్షయితుం న మే - అపి.

అర్థము :- దేవీ = సరస్వతీదేవి, అస్యాః = ఈ దమయన్తి యొక్క, తత్ = ముందుఁజెప్పఁబడిన, ఆకూతం = అభిప్రాయమును, అవేత్య = = తెలిసికొని, నజానతీవ = తెలియనిదానివలె, ఏనాం = ఈ దమయన్తిని, ఇదం = చెప్పఁబోవు మాటను, అవోచత్ = పలికినది. త్రపోర్మిప్రతిసీరయా, త్రపోర్మి = లజ్జయొక్క యలయనెడి, ప్రతి సీరయా = తెరచే, తే = నీ యొక్క, భావః = అభిప్రాయము,

మేఽపి = నాకును, లక్షయితుం = తెలిసికొనుటకు, నవితీర్యతే = అవ కాశము ఈయఁబడుటలేదు. లజ్జచే మఱుగు పడిన నీ భావము, ఎలుగెత్తి చెప్పనిచోఁ దెలియ సాధ్యముగాదనియర్థము.

**సమాసములు**

నజానతీ :- న, జానతీ = నజానతీ.
త్రపోర్మిప్రతిసీరయా :- త్రపాయాః, ఊర్మిః = త్రపోర్మిః, త్రపోర్మి రేవ ప్రతిసీరా = త్రపోర్మిప్రతిసీరా, తయా = త్రపోర్మిప్రతి సీరయా.

**భావము:**

సరస్వతీదేవి, ఈ దమయన్తి యొక్క యభిప్రాయమునుఁ దెలిసికొని తెలియని దానివలెనభినయించుచు నిట్లు చెప్పఁదొడగినది- ఓ దమయన్తీ! లజ్జా తరంగమనెడి తెఱచే మఱుగుపడిన నీ భావము నాకుఁగూడ దెలియ సాధ్యము గాక యున్నది. కావున నెలుగెత్తి చెప్పిననే యది తెలియ సాధ్యము. 29

శ్లో॥ దేవ్యాఃశ్రుతేనేతినలార్థ నామ్ని
గృహీత ఏవత్రపయానిపీతా.
అథాఙ్గుళీరఙ్గులిభిః స్పృశన్తీ
దూరంశిరస్సానమయాఞ్చకార. **30**

ప॥వి॥ దేవ్యాః - శ్రుతౌ - న - ఇతి - నలార్ధనామ్ని — గృహీతే - ఏవ - త్రపయా - నిపీతా - అథ - అఙ్గులిభిః స్పృశన్తీ - దూరం - శిరః - సా - నమయాఞ్చకార.

అర్థము :—అథ = పిదప ననగా, సరస్వతీదేవి మాట్లాడిన పిదప, దేవ్యాః = సరస్వతీదేవి యొక్క, శ్రుతౌ = చెవియందు, నఇతి = న యను, నలార్ధనామ్ని; నల = నలునియొక్క, అర్ధనామ్ని = సగము పేరు (ఉచ్చరింపఁబడినదై) గృహీతే; ఏవ = సరస్వతీదేవిచే కర్ణమందు గ్రహింపఁబడగనే, సా = ఆ దమయన్తి, త్రపయా = సిగ్గుచే, నిపీతా సతీ = పానము చేయఁబడినదై, "ల" యను తక్కిన యర్థభాగమును

చ్చరింప నశక్తురాలగుచు, అఙ్గులీభిః = వ్రేళ్ళతో, అఙ్గులీః = వ్రేళ్ళను, స్పృశన్తీ = తాకుచున్నదై అనగా ముడుచుకొనుచున్నదై, దూరం = మిక్కిలి, శిరః = తలను, నమయాఞ్చకార = వంచినది. కోరికతీరన పుడు చింతచే, వ్రేళ్ళను ముడిచినలుపు కొనుట మానవ సహజ లక్షణము.

**సమాసములు ;**

నలార్ధనామ్ని :—అర్ధంనామ్నః = అర్ధనామ, నలస్యఅర్ధనామ = నలార్ధనామ, తస్మిన్ = నలార్ధనామ్ని.

**భావము :**

ఆ దమయన్తి చెవియందు నలుని పేరులోని సగపాలగు నకారమునుచ్చ రింపగనే, యనగా "న" యనునక్షరము నుచ్చరింపగనే, సిగ్గున మునిగినదై మిగిలిన "ల" యను నక్షరము నుచ్చరింపలేక పోయినదై చింతతోనేమియు తోచనందువలన, తలవాల్చి, తన వ్రేళ్ళను-ముడిచి నలుపుకొనుచుండినది. ౩౦

శ్లో॥ కరే విధృత్యేశ్వరయాగిరాం సా
పాన్థాపథీన్ద్రస్య కృతా విహస్య.
వామేతినామైవ బభాజసార్ధం
పురన్ధ్రిసాధారణ సంవిభాగమ్. **31**

ప॥వి॥ కరే - విధృత్య - ఈశ్వరయా - గిరాం - సా, పాన్థా - పథి - ఇంద్రస్య - కృతా - విహస్య - వామా - ఇతి - నామ - ఏవ - బభాజ - సార్ధం - పురన్ధ్రిసాధారణ సంవిభాగమ్.

అర్థము :- సా = ఆ దమయన్తి, గిరాం = వాక్కులకు, ఈశ్వరయా = అధిపత్యము వహించిన సరస్వతీదేవిచే, కరే = చేతియందు, విధృత్య= పట్టుకొనఁబడినదై, ఇంద్రస్య = ఇంద్రునియొక్క, పథి = మార్గము నందు, పాన్థా=బాటసారిగా, కృతా = చేయబడినదై, పురన్ధ్రిసాధారణ సంవిభాగమ్, పురన్ధ్రి = సకల స్త్రీలకును, సాధారణ = సమానమైన, సంవిభాగమ్ = అంశము గల్గిన, వామాఇతి = వామయను, నసగా

వక్రకులాలను, నామైవ = పేరును, సార్థం = అర్థము గలదిగా, బభాజ = పొందినది, అనగా నింద్రుని వరించుటకై కొనిపోబడుచున్న యా దమయన్తి ప్రతికూలురాలైనదని యర్థము.

**సమాసములు :**

పాన్థా :— పన్థానం గచ్ఛతి నిత్యమితి = పాన్థా.
సార్థం :— అర్థేన సహితం = సార్థం, తత్ = సార్థం,
పురన్ధ్రిసాధారణసంవిభాగమ్ :- పురన్ధ్రీణాం, సాధారణః, సంవిభాగః యస్యతత్ = పురన్ధ్రిసాధారణసంవిభాగం, తత్ = పురన్ధ్రిసాధారణ సంవిభాగమ్.

**భావము :**

సరస్వతీదేవి యా దమయన్తినిఁ జేతబట్టుకొని యింద్రునిఁ కడకు వరించుటకై కొనిపోవుచుండగనే యాతని నొల్లక స్త్రీలకందఱికిని సాధారణమైన "వామ" యనగా వ్యతిరేకించునది యనగా ప్రతికూలించునదియను పేరును సార్థకపఱచుకొనినది. "వామ" యను శబ్దము సాధారణముగా స్త్రీలకందఱికిని వాచకముగా నుపయోగింపబడును. ఆ శబ్దమునకు వక్రురాలనియు, ప్రతికూలురాలనియు నర్థము. దమయన్తి యింద్రుని వరింప నిష్టపడక ప్రతికూలురాలైనదని యాశయము. 31

శ్లో॥ విహస్య హస్తేఽథ వికృష్యదేవీ
నేతుం ప్రయాతాఽభి మహేన్ద్రి మేతామ్.
క్రమాదియం దత్తమివాహి దేహే
తతశ్చమత్కృత్య కరం చకర్ష. 32

ప॥వి॥ విహస్య - హస్తే - అథ - వికృష్య - దేవీ - నేతుం - ప్రయాతా - అభి - మహేన్ద్రిమ్ - ఏతాం - క్రమాత్ - ఇయం - దత్తమ్ - ఇవ - అహిదేహే - తతః - చమత్కృత్య - కరం - చకర్ష.

అర్థము :— అథ = ఇట్లు ప్రతికూలించిన పిదప, దేవీ = సరస్వతీదేవి, విహస్య = నవ్వి, ఏతాం = ఈ దమయన్తిని, వికృష్య = తనహస్త

ముచే లాగి, మహేన్ద్రిముఖీ = ఇంద్రునుద్దేశించి, ప్రయాతా = బయలు దేరినది. తతః = అట్లు ఇంద్రునికడకు గొనిపోవుటకు బ్రయత్నించిన వెంటనే లేదా దేవీహస్తమునుండి, ఇయం = ఈ దమయన్తి, భ్రమాత్ = భ్రాన్తివలన, అహిదేహే = సర్పశరీరమునందు, దత్తమివ = ఉంచ బడినదో యనునట్లుగా, చమత్కృత్య=ఉలికిపడి ఈమె నన్ను నింద్రుని వరించుటకై పురికొల్పుచున్నదా? యను బుద్ధిచే భయపడి, కరం = తన చేతిని, చకర్ష = లాగుకొనినది.

వి :- సర్పముపై నుంచకపోయినను నుంచినట్లు భావించుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకమగు నివశబ్దమునుఁ బ్రయోగించుట వలన నిది వాచ్యము.

## సమాసములు :

అహిదేహే := అహేఃదేహః = అహిదేహః, తస్మిన్ = అహిదేహే.

చమత్కృత్య :— చమత్, కృత్వా = చమత్కృత్య.

## భావము :

ఇట్లు దమయన్తి ప్రతికూలించిన పిదప, సరస్వతిదేవి నవ్వి యామెను తన చేతితో లాగికొని యింద్రునుద్దేశించి బయలు దేరినది. అట్లు బయలుదేరిన పిదప, దమయన్తి యా విషయమును గ్రహించినదై తన కిష్టుడు కాని ఇంద్రుని కడకు బోవుట కొల్లక, భ్రాంతి బుద్ధిచే పాముపై నుంచబడినదో యనునట్లు తన హస్తమును ఆమె చేతినుండి లాగికొనినది.

గమనిక :—ఈ శ్లోకము పూర్వోక్త శ్లోకముతో సమానార్థకముగా నుండుట వలన, మల్లినాథసూరి వ్యాఖ్యానించలేదు. కాని నారాయణభట్టు వ్యాఖ్యానించుటవలన నా విధముగనే యిది-వ్యాఖ్యానింపఁ బడినది.

శ్లో॥ భైమీం నిరీక్ష్యాభిముఖీం మఘోనః
స్వారాజ్యలక్ష్మీ రభృతాభ్యసూయామ్.
దృష్ట్వాతత స్తత్పరిహారిణీం తాం
ప్రీతాంబిడౌజః ప్రవణాఽభ్యపాధి, 33

ప॥వి॥ భైమీం - నిరీక్ష్య - అభిముఖీం - మఘోనః - స్వారాజ్య లక్ష్మీః - అభృత - అభ్యసూయాం - దృష్ట్వా - తతః - తత్పరిహారిణీం - తాం - వ్రీడాం - బిడౌజః ప్రవణా అభ్యపాది.

అర్థము:- భైమీం = దమయన్తిని, మఘోనః = ఇంద్రునకు, అభిముఖీం = ఎదురుగానున్న దానినిగా, నిరీక్ష్య = చూచి, లక్ష్మీః = లక్ష్మి, అభ్యసూయాం = ఇంద్రునియందును, దమయన్తియందును, ఈర్ష్యను, అభృత = వహించినది. తతః = ఈర్ష్య యేర్పడిన పిదప, తాం = ఆ దమయన్తిని, తత్పరిహారిణీం = ఆ యింద్రుని పరిత్యజించు దానినిగా, దృష్ట్వా = చూచి, బిడౌజఃప్రవణా = ఇంద్రునియందు అసక్తి గలదై, వ్రీడాం = సిగ్గును, అభ్యపాది=పొందినది. నేను న్యాయములేక సందేహించితినని యాలోచించి యామె అనగా స్వర్గ రాజ్యలక్ష్మి సిగ్గు పడినది.

సమాసములు

స్వారాజ్యలక్ష్మీః :—స్వః, రాజ్యం = స్వారాజ్యం, స్వారాజ్యస్యలక్ష్మీః = స్వారాజ్యలక్ష్మీః.

తత్పరిహారిణీం :—తస్యపరిహారిణీ = తత్పరిహారిణీ, తాం = తత్పరిహారిణీం.

బిడౌజఃప్రవణా :—బిడౌజసి, ప్రవణా = బిడౌజప్రవణా.

భావము :

స్వర్గ రాజ్యలక్ష్మి; యింద్రునెదుటనున్న దమయన్తిని జూచి, యింద్రునిపైనను, దమయన్తి పైనను నసూయ-వహించినది. తర్వాత, దమయన్తి యింద్రుని బరిత్యజించిన దానినిఁగాంచి మఱల నింద్రునిపై ననురాగము వహించి తన తొందరపాటునకుఁ జింతించి సిగ్గుపడినది. 32

శ్లో॥ త్వత్తః శ్రుతో నేతిన లేమయాతః
పరం వదన్త్వేత్యుదితాఽథ దేవ్యా.
హ్రీమన్మథద్వైరథరఙ్గభూమి
ర్భైమీదృశాభాషిత నైషధాఽభూత్, 33

ప॥వి॥ త్వత్తః - శ్రుతః - న - ఇతి - నలే - మయా - అతః - పరం - వదస్వ - ఇతి - ఉదితా - అథ - దేవ్యా - హ్రీమన్మథ ద్వైరథరఙ్గ భూమిః - భైమీ - దృశా - భాషితనైషధా - అభూత్.

అర్థము:- అథ = పిదప, నలే = నలుని వరించు విషయమునందు. మయా = నాచేత, నేతి = "న" యను నిషేధమును(జెప్పెడి, లేదా నలుని పేరునందు సగమును బోధించునట్టి "న" యను శబ్దమును, త్వత్తఏవ = నీ వలననే, శ్రుతః = విన(బడినది. అతః = ఈ నలుని కంటె, పరం = ఇతరుని, వదస్వ = చెప్పుము. అనగా మఱియొక రాజును(జెప్పుము. లేదా-అతః = నకారమునకంటె, పరం = తర్వాతదైన శబ్దమును, వదస్వ = చెప్పుము. ఇతి = అని, దేవ్యా = సరస్వతీదేవిచే, ఉదితా = పరిహాసముతో( చెప్ప(బడినదై, హ్రీమన్మథ ద్వైరథరంగభూమిః; హ్రీ = సిగ్గు, మన్మథ = కామమను, ద్వైరథ = ఇద్దఱు రథికుల మధ్య జరిగిన యుద్ధనాట్యములకు, రంగభూమిః = రఙ్గస్థలముగా నేర్పడిన, భైమీ = దమయన్తి. దృశా = దృష్టిచేతనే. భాషితనైషధా; భాషిత = సంభాషింప(బడిన, నైషధా = నలుని గలదిగా. అభూత్ = ఆయెను. సిగ్గుచే నలుని(జెప్పలేక దృష్టిచేతనే నలుని(జెప్పినదని యర్థము.

**సమాసములు :**

హ్రీమన్మథద్వైరథరంగభూమి :— హ్రీశ్చ, మన్మథశ్చ = హ్రీమన్మథౌ, ద్వైరథౌయయోస్తౌ = ద్వీరథౌ, దిరథయోరియం=ద్వైరథా, ద్వైరథాచసారఙ్గ భూమిశ్చ = ద్వైరథరఙ్గభూమిః, హ్రీ మన్మథయోః, ద్వైరథరఙ్గభూమిః, హ్రీమన్మథద్వైరథ రంగభూమిః.

భాషిత నైషధా :— భాషితః, నైషధః, యయాసా = భాషిత నైషధా.

**భావము :**

నలుని వరించు విషయమునందు "నేను నీయొద్ద నుండి "న" యను పదమును వింటిని. ఇది నిషేధార్థమో, లేక నలుని నామధేయమందలి పూర్వ

దాగమో తెలియుటలేదు. కాన నీవు మఱియొక రాజును దెలుపుము. లేదా "న" యను నక్షరము తర్వాత మిగిలిన యక్షరమును జెప్పుము. అని సరస్వతీదేవిచే పరిహాస పూర్వకముగా జెప్పబడిన యాదమయన్తి; సిగ్గు, కామము, అనెడి రథికులకు - యుద్ధభూమిగానో, లేదా, అట్టి నటులకు రంగ స్థలముగనో యేర్పడినదై, దృష్టిచేత నిషధ మహారాజగు నలుని గూర్చి చెప్పినది. అనగా నెఱగెత్తినలుని జెప్పక తన కటాక్షము చేతనే నలుని జెప్పినదని భావము. 33

శ్లో॥ హసత్సు భైమీం దివిషత్సు పాణౌ
పాణిం ప్రణీయాప్సరసాం రసాత్ సా.
అలిజ్గ్య నీత్వా ఒకృతపాన్థ దుర్గాం.
భూపాల దిక్పాలకులాధ్వ మధ్యమ్. 38

ప॥వి॥ భైమీం - దివిషత్సు - పాణౌ - పాణిం - ప్రణీయ - అప్సరసాం - రసాత్ - సా అలిజ్గ్య - నీత్వా - అకృత - పాన్థదుర్గాం - భూపాల దిక్పాల కులాధ్వ మధ్యమ్.

అర్థము :- దివిషత్సు = దేవతలు, రసాత్ = అచ్చరల యందలి యనురాగము వలన, అప్సరసాం = అచ్చరలయొక్క, పాణౌ = హస్తమునందు, పాణిం= తమ హస్తమును, ప్రణీయ = ఉంచి, హసత్సు = అయ్యో ! దేవతలనుమాని మానవునియందు, అనురక్తురాలైనదని పరిహసించుచుండగా, సా = ఆ సర స్వతీ దేవి, భైమీం = దమయన్తిని, అలిజ్గ్య = కౌగలించుకొని, భూపాలదిక్పాల కులాధ్వ మధ్యమ్: భూపాల = రాజుల యొక్కయు, దిక్పాల = దిక్పాలుర యొక్కయు, కుల = వర్గముల యొక్క, అధ్వ = మార్గము యొక్క, మధ్యం = మధ్య భూమిని, నీత్వా = పొందించి, పాన్థదుర్గాం; పాన్థ = బాట సారులచే, సింధూరము మున్నగు వానిచే బూజింపబడుచు త్రోవ నడుమనున్న దుర్గాదేవినిగా, అకృత = చేసినది.

**సమాసములు :**

పాన్థ దుర్గాం :- పథిగచ్ఛంతీతి = పాన్థాః, పాన్థానాం, దుర్గా = పాన్థ దుర్గా, తామ్ = పాన్థ దుర్గామ్.

భూపాల దిక్పాలకులాధ్వ మధ్యమ్:- భూపాలాశ్చ, దిక్పాలాశ్చ = భూపాల దిక్పాలాః, భూపాలదిక్పాలానాం కులే = భూపాల దిక్పాలకులే, భూపాల దిక్పాలకులః యోరధ్వా = భూపా లదిక్పాలకులాధ్వా. భూపాల దిక్పాలకులాధ్వనో మధ్యః = భూపాల దిక్పాలకులాధ్వమధ్యః, తమ్ = భూపాల దిక్పాలకులాధ్వ మధ్యమ్.

**భావము :**

దేవతలు, అప్సరసల యందలి అనురాగముతో వారి చేతులయందు తమ చేతులనుఁ జేర్చి, యయ్యో! యీ దమయన్తి దేవతలను వదలి మనుష్యుని వలచి నదని చప్పట్లు తట్టుచు పరిహసించుచుండగా సరస్వతీదేవి యా దమయన్తిని, గౌగలించుకొని రాజవర్గమునకును దిక్పాల వర్గమునకు నున్న త్రోవ నడుమ దమయన్తిని జేర్చి, సిందూరాదులతో త్రోవ నడుమఁ బూజింపబడు దుర్గాదేవినిగా జేసినది. 34

శ్లో॥ ఆదేశి తామప్యవలోక్యమందం
మందం నలస్యైవ దిశా చలన్తీం.
భూయః సురానర్ధ పథాదథాసౌ
తానేవ తాం నేతుమనా నునోద. 35

ప॥వి॥ ఆదేశి తామ్ - అపి - అవలోక్య - మందం - మందం - నలస్య - ఏవ - దిశా - చలన్తీం - భూయః - సురాన్ - అర్ధపథాత్ - అథ - అసౌ - తాన్ - ఏవ - తాం - నేతుమనాః - నునోద.

అర్థము :— అథ = పిదప, అసౌ = ఈ సరస్వతీదేవి, తాం = ఆ దమయన్తి ని, ఆదేశితామపి = నలునియొద్దకు బొమ్మని ప్రేరేపింపబడినదైనను, మందం మందం = మెల్లమెల్లగా, నలస్యైవ = నలునియొక్కయే, దిశా = దిక్కుతో, చలన్తీం = నడచుదానినిగా, అవలోక్య = చూచి, భూయః = మఱలను, తాన్ = ఆ యింద్రాదులనుద్దేశించియే, నేతుమనాః = కొనిపోవమనస్సు గలదై, అర్ధపథాత్ = నలుని సమీపమునకుఁ బోయెడి మార్గమధ్యమునుండి, మఱలించి, నునోద = ఇంద్రాదులనుఁ గూర్చి ప్రేరణఁ జేసినది.

సమాసములు :

అర్థపథాత్ :- పథః అర్థం = అర్ధపథం, తస్మాత్ = అర్ధపథాత్.
నేతుమనాః :— నేతుం, మనః యస్యాస్సా = నేతుమనాః.

భావము :

పిదప నీ సరస్వతీదేవి, యా దమయన్తిని నలుని వైపునకుఁ దీసుకొని యాదేశింపగా నామె యా వైపునకే వెళ్ళుచుండినది. కాని యామె నావైపునకుఁ బోనీయక, మఱల నింద్రాదుల వైపునకే కొనిపోవఁ గోరినదై, నలుని వైపు పోయెడి త్రోవనుండి మఱల్చి, యింద్రాదుల వైపునకు బ్రేరణఁ గావించినది.

శ్లో॥ ముఖాబ్జ మావర్తన లోలనాలం
కృత్వాఽలిహుం హూరవ లక్ష లక్ష్యం.
భీమోద్భవా, తాం నునుదేఽజ్క పాలీం
దేవ్యా నవోఢేవ వృథా వివోఢుః. **36**

ప॥వి॥ ముఖాబ్జమ్ - ఆవర్తనలోలనాలం - కృత్వా - అలిహుంహూరవలక్ష లక్ష్యం - భీమోద్భవా - తాం - నునుదే — అజ్కపాలీం - దేవ్యా - నవోఢా - ఇవ - వృథా - వివోఢుః.

అర్థము :- భీమోద్భవా = భీముని పుత్రికయగు దమయన్తి, ముఖాబ్జం = తన ముఖపద్మమును, ఆవర్తనలోలనాలం; ఆవర్తన = త్రిప్పుటచే, లోలం = చంచలమైన, నాలం = కాడఁ గల్గినదిగను (అట్లే), అలిహుం హూరవలక్షలక్ష్యం; అలి = చెలికత్తెలయొక్క, హుంహూరవ = హుం హూ అనెడి శబ్దముల యొక్కయు, అనగా-వలదువలదనెడి యర్థమిచ్చెడి శబ్దముల యొక్కయు, పక్షాన్తరమున - అలి = తుమ్మెదల యొక్క, హుంహూరవ = ఝుంకార శబ్దములయొక్క, లక్ష = లక్షలచే, లక్ష్యం = చూడఁదగినదిగను, కృత్వా = చేసి, నవోఢా = నూతన వధువు. వివోఢుః = వివాహము గావించు వానియొక్క, అజ్కపాలీంఇవ = ఒడినివలె వృథా = వ్యర్థముగా, దేవ్యాః = సరస్వతీదేవికి సంబంధించిన, తాం = ఒడిలోని బంధమును, నునుదే = పరిత్యజించినది.

**సమాసములు :**

ముఖాబ్జమ్ :- ముఖమబ్జమివ = ముఖాబ్జం, తత్ = ముఖాబ్జమ్.

ఆవర్తనలోలనాలం :- ఆవర్తనేనలోలఃనాలః యస్యతత్ = ఆవర్తన లోలనాలం, తత్ = ఆవర్తనలోలనాలమ్.

అలిహుంహూరవలక్ష లక్ష్యమ్ :- హుంహూ ఇతిరవాః = హుంహూ రవాః; అలీనాం, హుంహూరవాః = అలి హుంహూరవాః, అలిహుంహూ రవాణాం, లక్షాః = అలిహుంహూరవలక్షాః, అలిహుంహూరవలక్షైః లక్ష్యం = అలిహుంహూరవలక్షలక్ష్యమ్, తత్ = అలి హుంహూరవలక్ష లక్ష్యమ్.

భీమోద్భవా :- భీమాత్ ఉద్భవః యస్యాఃసా = భీమోద్భవా.

**భావము ;**

దమయంతి తన ముఖ పద్మమును త్రిప్పుటచే దాని కంఠనాలము, అనగా కంఠమనెడి కాడ తిరిగినది. మఱియు చెలికత్తెలు పరిహాసముతో నలుని వద్దకు పోవలదని హుంహుం శబ్దములను లక్షల సంఖ్యలో చేయుచుండిరి. ఆమె ముఖమును, పద్మమనెడి భ్రాంతిచే తుమ్మెదలుమూగి ఝుంకార ధ్వనులను జేయుచుండినవి. అట్టి ముఖముతో నామె విరాజిల్లుచు, నూతన వధువెట్లు వరుని, గౌగిలిని సిగ్గుచే వదలించుకొనునో, యట్లే యా సరస్వతీదేవి యొక్క కౌగిలిని వదలించుకొనినది. 36

శ్లో॥ దేవీకథ ఞ్చిత్ఖలు తామ దేవ
ప్రదీచీం భవన్తీం స్మితసిక్తసృక్వా ।
ఆహస్మతాం మయ్యపితే భృశంకా
శఙ్కా శశాఙ్కా దధికాస్య బిమ్బే. 35

ప॥వి॥ దేవీ - కథం - చిత్ - ఖలు - తామ్ - అదేవప్రదీచీం - భవన్తీం - స్మితసిక్త సృక్వా - ఆహ - స్మ - తాం - మయి - అపి - తే - భృశం - కా-శఙ్కా - శశాఙ్కాత్ - అధికాస్యబిమ్బే.

**అర్థము :**

దేవీ = సరస్వతీదేవి తాం = ఆ దమయన్తిని, కథఞ్చిత్తలు = ఏవిధముగనో, అదేవద్రీచీం = దేవతల వైపునకుఁ బోనట్టిదిగా, భవన్తీం = అగుచున్న దానినిగా, (దృష్ట్వా = చూచి) స్మిత సిక్త సృక్వా; స్మిత = చిఱునగవుచే, సిక్త = అంటబడిన, సృక్వా = సెలవులు గలదై, శశాఙ్కాత్ = చంద్రుని కంటెను, అధికాస్య బిమ్బే; అధిక = శ్రేష్ఠమైన, ఆస్యబిమ్బే = ముఖ మండలము గల యోదమయన్తీ ! మయ్యపి = నా సమీపమునందును, తే = నీకు, కా, శఙ్కా = ఏమి సందేహము ? అనగా నెట్టి సందేహము నుండరాదు. ఇతి = అని, తాం = ఆ దమయన్తిని, భృశం = మిక్కిలి, ఆహస్మ = పలుకదొడగినది.

**సమాసములు :**

అదేవద్రీచీం :- దేవానఞ్చతీత = దేవద్రీచీ, నదేవద్రీచీ = అదేవద్రీచీ, తామ్ = అదేవద్రీచీం.

స్మితసిక్తసృక్వా :- స్మితేనసిక్తే =స్మితసిక్తే, స్మితసిక్తే, సృక్వణీ యస్యాస్సా = స్మితసిక్త సృక్వా.

అధికాస్య బిమ్బే :- ఆస్యమేవ బింబః = ఆస్యబిమ్బః. అధికః, ఆస్య బిమ్బః యస్యాస్సా = అధికాస్యబిమ్బా, తస్యాః సంబుద్ధిః = అధికాస్య బింబే.

**భావము ;**

ఆ సరస్వతీదేవి యే విధముగా గూడ నాదమయన్తిని దేవతల నొల్లని దానినిగానే గ్రహించి, చిఱునగవుచే పెదవులంకిఱువైపులు శోభించు చుండగా, "ఓ చంద్రవదనా ! నాయెడ, గూడ నీకు సందేహమా ? అది గూడదు" అని యదమయన్తికిఁ జెప్పుచుండెను. 87

శ్లో॥ ఏషామకృత్వా చరణ ప్రణామ
మేషామనుజ్ఞా మనవాప్య సమ్యక్ ।
సుపర్వ వైరే తవవైరసేనిం
వరీతు మీహః కథ మౌచితీయమ్, 36

ప॥వి॥ ఏషామ్ - అకృత్వా -చరణప్రణామమ్ - ఏషామ్ - అనుజ్ఞాం - అనవాప్య - సమ్యక్ - సుపర్వవైరే - కథమ్ - ఔచితీ - ఇయమ్.

అర్థము :- హేవత్సే = ఓ బిడ్డా, ఏషాం = ఈ యింద్రాది దేవతలకు, చరణప్రణామం = పాదవందనమును, అకృత్వా = కావింపక, ఏషాం = వీరి యొక్క, అనుజ్ఞాం = అనుమతిని, అనవాప్య = పొందక, సుపర్వవైరే సతి: సుపర్వ = దేవతలయొక్క, వైరేసతి= ద్వేషమేర్పడినచో, వైరసేనిం = వీరసేనుని కుమారుడగు నలుని, వరీతుం = వరించుటకు, ఇయం = ఈ. ఈహా = కోరిక, కథం = ఎట్లు, ఔచితీ = ఔచిత్యము గలది, ఏ విధముగనుఁ దగదని యర్థము.

**సమాసములు :**

చరణప్రణామం :- చరణయోః, ప్రణామః = చరణప్రణామః, తమ్ = చరణప్రణామమ్.
సుపర్వవైరే :- సుపర్వణాం, వైరం = సుపర్వవైరం, తస్మిన్ = సుపర్వవైరే.

**భావము :**

ఓ బిడ్డా! ఈ యింద్రాది దేవతల పాదములకు వందనమాచరింపక, వారి యనుమతిని బొందక, నీకు నలుని వరింపఁ గోరిక, సముచితము గాదు. 38

శ్లో॥ ఇతీరితే విశ్వసితాం పునస్తా
మాదాయపాణౌ దివిషత్సు దేవీ.
కృత్వా ప్రణమ్రాం వదతిస్మ సాతాన్
భక్తేయమర్హత్యధునానుకమ్పామ్. **39**

ప॥వి॥ ఇతి - ఈరితే - విశ్వసితామ్ - పునః - తాం - ఆదాయ - పాణౌ - దివిషత్సు - దేవీ - కృత్వా - ప్రణమ్రాం - వదతి - స్మ - సా - తాన్ - భక్తా - ఇయమ్ - అర్హతి - అధునా - అనుకమ్పామ్.

అర్థము :- సా = ఆ సరస్వతీదేవి, ఇతి = ఇట్లు, ఈరితేసతి = చెప్పఁబడగా,

విశ్వసితాం = నమ్మకమునుఁ బొందిన, తాం = ఆ దమయన్తిని, పునః = మఱల, పాణౌ=చేతియందు, ఆదాయ = తీసికొని, దివిషత్సు = దేవతల సమీపమునందు, ప్రణమ్రాం = ప్రణమిల్లిన దానినిగా, కృత్వా = చేసి, తాన్ = ఆ యింద్రాదులను, వదతిస్మ = చెప్పినది. భక్తా = మీకు భక్తురాలగు; ఇయం = ఈ దమయన్తి, అధునా = ఇప్పుడు, అనుకమ్పాం = మీదయను, అర్హతి = పొందఁదగియున్నది. మిమ్ముఁలను వరింప నాదేశింపక నలుని వరించుట కనుగ్రహము నొసగు దని యర్థము.

**భావము :**

అ సరస్వతీదేవి ఇట్లు చెప్పగనే నమ్మకమునుఁ బొందిన యా దమయన్తిని మఱల చేతబట్టుకొని యింద్రాదుల సమక్షమునందు ప్రణమిల్లఁజేసి యా యింద్రాదులఁ గూర్చి "ఈ దమయన్తి మీ భక్తురాలు. ఇప్పుడు మీ దయకు నర్హురాలు కాన, మిమ్ముఁలను వరింప నాదేశింపక నలుని వరించుట కనుగ్రహ మొసఁగుడు"— అని పలికినది. 39

శ్లో॥ యుష్మాన్ వృణీతే నబహూన్ సతీయం
శేషావమానాచ్చ భవత్సునైకమ్.
తద్వః సమేతం నృపమంశమేనం
వరీ తుమన్విచ్ఛతి లోకపాలాః. 40

ప॥వి॥ యుష్మాన్ - వృణీతే - బహూన్, సతీ - ఇయం - శేషావమానాత్ - చ - భవత్సు - న - ఏకం - తత్ - వః - సమేతమ్ - నృపం - అంశం - ఏనం - వరీతుమ్ - అన్విచ్ఛతి - లోకపాలాః.

అర్థము :- హే లోకపాలాః = ఓ జగద్రక్షకులారా! సతీ = పతివ్రతయైన, అనగా నొక్కనే భర్తగా గల్గిన, ఇయం = ఈ దమయన్తి, బహూన్ = పెక్కండ్రైన, యుష్మాన్ = మిమ్ముఁలనందఱిని, న వృణీతే = వరింపదు, శేషావమానాత్ = (మీలో నొకరిని వరించినను) శేష = తక్కిన వారికి, అవమానాత్ = అవమానమగుట వలన, భవత్సు = మీలో,

ఏకం = ఒక్కని గూడ, నవృణీతే = వరింపదు. తత్ = అందువలన, వః = మీకు సంబంధించిన, సమేతం = కలసిన, అంశం = అందఱి యెనిమిదంశములకు సమిష్టి రూపమైన, ఎనం = ఈ, నృపం = రాజైన నలుని, వరీతుం = వరించుటకు, అన్విచ్ఛతి = కోరుచున్నది. మీలో నొకని వరించుటకంటె మీ యంశములతోఁ గూడిన నలుని వరించుట శ్రేష్ఠమని యర్థము.

**సమాసములు**

శేషావమానాత్ :- శేషాణాం, అవమానః = శేషావమానః, తస్మాత్ = శేషావమానాత్.

**భావము :**

ఓ జగత్పాలకులారా: పతివ్రత యనగా నొక్కనినే భర్తగా గల యీ దమయన్తి పెక్కండ్రగు మిమ్ములను వరింపదు. అట్లు వరించినచో, పాతివ్రత్యమునకు భంగము గదా! ఒకవేళ మీలో నొక్కరిని వివాహమాడినచో తక్కిన మీకు అవమానము గదా! కాన నీమె, మీకందఱికిని సంబంధించినవాడై "అష్టాభిశ్చ సురేంద్రాణాం మాత్రాభిర్నిర్మితో నృపః" ఇత్యాది స్మృతి ననుసరించి, మీ యందరి యంశములతో గూడి మీకు సమష్టి రూపముగా సృజియింపబడిన నలుని వరింపగోరుచున్నది. కాన నిది యుచితము. 40

శ్లో॥ భైమ్యాస్రజః సఞ్జనయా పథిప్రాక్  
స్వయంవరం సంవరయామ్బభూవ.  
సమ్భోగమాలిఙ్గనయాఽస్య వేధాః  
శేషం తుకం హన్తుమియద్య తధ్వమ్. 41

ప॥వి॥ భైమ్యాః - స్రజః - సఞ్జనయా - పథి-ప్రాక్ - స్వయంవరం - సంవరయామ్బభూవ - సమ్భోగమ్ - ఆలిఙ్గనయా - అస్య - వేధాః - శేషం - తు - కం - హన్తుమ్ - ఇయత్ - యతధ్వమ్.

అర్థము :- (కించ = మఱియు) వేధాః = బ్రహ్మయే, ప్రాక్ = మీ దూత్యము ననుసంధించు కాలమందు, పథి = అంతఃపుర మార్గమున, స్రజః =

పుష్పమాలను, సజ్జయా = కణ్ఠమునందు వైచుటచే, భైమ్యాః=దమయన్తికి, స్వయంవరం = స్వయంవరమును, సంవరయామ్బభూవ = నెరవేర్చెను. తథా = అట్లే, అస్య = ఈ నలునియొక్క, ఆలిఙ్గనయా = ఆలిఙ్గనముచే, సంభోగం = సంభోగమును, సంవరయాంబభూవ = నెరవేర్చెను. శేషం = దీనికి పిదప మిగిలిన, కం = దేనిని, హంతుం = విఘ్నపఱచుటకు, ఇయత్ = ఇంతగా, యతధ్వం = ప్రయత్నము జేతురు? దీనికంటె మిగిలిన దేనిని మీరు ప్రతిబంధింతురు? బ్రహ్మసృష్టి లంఘింప శక్యము గాదు. కావున మీ ప్రయాస వ్యర్థము. అందువలన నాదమయన్తి కనుజ్ఞనిచ్చి నలుని వరింపఁ జేయుటయే యుచితమని యర్థము.

సమాసములు :

భైమ్యాః :- భీమస్య. అపత్యం, స్త్రీ = భైమీ, తస్యాః = భైమ్యాః.

భావము :

ఓ లోకపాలకులారా! దమయన్తి, తల్లిని సేవించి తన యంతఃపురమునకు పోవు సమయమున - షష్ఠసర్గయందు "ప్రసూప్రసాదాధిగతా" (49) ఇత్యాది శ్లోకమునఁజెప్పిన ప్రకారము భ్రాంతిచే, జూడబడిన దూత్యమును వహించిన నలుని కణ్ఠమునందు పుష్పమాలను బ్రహ్మయే వేయించినాడు. అందువలన నామెకు నలునితోటి స్వయంవరము ముందే నడచిపోయినది. అట్లే అ సర్గయందే "పునర్మృథః" (41) ఇత్యాది శ్లోకమున జెప్పబడిన ప్రకారము, ఈ నలుని ఆలిఙ్గనము చేయుటచే బాహ్యరతియగు సంభోగము గూడ జరిగిపోయినది, కావున నీవిధముగా వరణమాలను వైచుట, సంభోగము నొందుట మున్నగునవి ముందే జరిగిపోయినవి, కాన నిటుమిగిలిన వేమియు లేవు. ఉన్నచో వానిని మీరు ప్రతిబంధింప వచ్చును. కావున మీరు వ్యర్థముగా నలరూపధారణచే నాయాస పడుచున్నారు. కాన మీరు, నలుని వరించుటకై యామకాజ్ఞ నొసంగ ప్రార్థితులు.

41

శ్లో॥ వర్ణాశ్రమాచార పథాత్ ప్రజాభిః
స్వాభిస్సహైవాస్ఖలతే నలాయ।
ప్రసేదుషో వే దృశవృత్త భఙ్గ్యా
దిత్సైవ కీర్తేర్భువమానయద్వః.

ప॥వి॥ వర్ణాశ్రమాచారపథాత్ - ప్రజాభిః - స్వాభిః - సహ - ఏవ - అస్ఖలతే - నలాయ - ప్రసేదుషః - వా - ఈదృశవృత్తభఙ్గ్యా - దిత్సా - ఇవ - కీర్తేః - భువమ్ - ఆనయత్ - వః.

అర్థము :- వర్ణాశ్రమాచారపథాత్; వర్ణ = బ్రాహ్మణాది వర్ణములకును, ఆశ్రమ = బ్రహ్మచర్యాద్యాశ్రమములకును, ఆచార = సత్ప్రవర్తన మున్నగువానికి సంబంధించిన, పథాత్ = మార్గము నుండి, స్వాభిః = తనకు సంబంధించిన, ప్రజాభిఃసహైవ = ప్రజలతోడనే, అస్ఖలతే = చలించనటువంటి, నలాయ = నలునికై, ప్రసేదుషః = ప్రసన్నులైన, వః = మిమ్ములను, ఈదృశవృత్త భఙ్గ్యా; ఈదృశ = ఇటువంటి కపటము లేని దూత్యముచే వెల్లడి చేయబడిన, వృత్తభఙ్గ్యాః = నడవడికలోని వైచిత్ర్యముచే కూడిన, నలాయ = నలునికై, కీర్తేః = కీర్తిని, దిత్సైవ = ఈయఁగోరికయే, వః = మిమ్ములను, భువం = భూమినిఁ గూర్చి, ఆనయద్వా = కొనివచ్చినదా యేమి? నలునికి కీర్తి సంపాదించుటకై మీరు భూమికి వచ్చితిరే కాని, దమయన్తిని బాధించుట కొఱకు గాదని యర్థము.

**సమాసములు :**

వర్ణాశ్రమాచారపథాత్ :- వర్ణాశ్చ, ఆశ్రమాశ్చ, ఆచారాశ్చ = వర్ణాశ్రమాచారాః, వర్ణాశ్రమాచారాణాం, పన్థాః=వర్ణాశ్రమాచారపథః, తస్మాత్ = వర్ణాశ్రమాచారపథాత్.

అస్ఖలతే :— నస్ఖలన్ = అస్ఖలన్, తస్మై = అస్ఖలతే.

ఈదృశవృత్తభఙ్గ్యా :— వృత్తస్య, భఙ్గిః = వృత్తభఙ్గిః, ఈదృశీచసా వృత్తభఙ్గిశ్చ = ఈదృశవృత్తభఙ్గిః, తయా = ఈదృశవృత్తభఙ్గ్యా.

దిత్సా :— దాతుమిచ్ఛా = దిత్సా.

భావము :

ఇంతవరకును దేవతలయందు దోషోద్ఘాటనఁ జేయుటకంటెను, వారి గుణములనే గ్రహించి వారిని ప్రసన్నులనుఁ గావించుటయే యుచితమని మఱి యొక విధముగా సరస్వతీదేవి వారలనుఁ బ్రసన్నులను గావించుచున్నది — బ్రాహ్మణాది వర్ణములకును; బ్రహ్మచర్యాద్యాశ్రమములకును సంబంధించిన యాచారమార్గము నుండి తన ప్రజలతోడఁ గూడ పొరబాటుఁ జేయని నలునికి ప్రసన్నులైన మిమ్ములను, ఇటువంటి నిష్కపటమగు దూత్యమును వహించి తన నడవడికయందు గొప్ప వైచిత్ర్యము సంపాదించినట్టి యానలునకు కీర్తినొసంగవలయుననెడి కోరికయే భూమికిఁ దీసికొని వచ్చినదా యేమి? అనగా నలునికీర్తిని నుమడింపఁ జేయ మీరు భూమికి వచ్చితిరే కాని దమయన్తిని బాధించుటకు కాదని యాశయము. 42

శ్లో॥ ఇతిశ్రుతేఽస్యావచనేచ హాస్యాత్
కృత్వా సలాస్యాధరమాస్య బిమ్బమ్.
భ్రూవిభ్రమా కూతకృతాభ్యనుజ్ఞే
ష్వేతేషు తాం సాఽథ నలాయ నిన్యే. 43

ప॥వి॥ ఇతి - శ్రుతే - అస్యాః - వచనే - చ - హాస్యాత్ - కృత్వా - సలాస్యాధరమ్ - ఆస్యబిమ్బమ్ - భ్రూవిభ్రమా కూతకృతాభ్యనుజ్ఞేషు - ఏతేషు - తాం - సా - అథ - నలాయ - నిన్యే.

అర్థము :- కిఞ్చ = మఱియు, దేవ్యాః = సరస్వతీదేవి యొక్క, ఇతి = ఇటువంటి. వచనే = మాట, శ్రుతేసతి = వినబడఁగనే. హాస్యాత్ = దేవతలు ప్రసన్నులగుటవలని నవ్వువలన, ఆస్యబిమ్బం = ముఖమండలమును, సలాస్యాధరం=నృత్యముతోఁ గూడిన పెదవి కల్గునట్లుగా ననగా కదలు పెదవి కలుగునట్లుగా, కృత్వా = చేసి, ఏతేషు = ఈ వేల్పులు, భ్రూవిభ్రమాకూతకృతాభ్యనుజ్ఞేషు; భ్రూవిభ్రమ = కనుబొమ్మల విలాసమనెడి, ఆకూత = అభిప్రాయమునే, ననగా అభిప్రాయమును వ్యక్తపఱచెడి కనుబొమ్మ చేష్టలచే, అభ్యనుజ్ఞేషు = అనుమతి నొసంగినవారు కాగా, అథ = ఆ యనుమతి నొసంగిన పిదప, సా = ఆ సరస్వతీదేవి

తాం = ఆ దమయన్తిని, నలాయ = నలుని కొరకు ననగా నలుని సమీపము నుద్దేశించి, నిన్యే = కొనిపోయినది.

**సమాసములు**

సలాస్యాధరం:— లాస్యేన సహితా = సలాస్యా, సలాస్యా, అధరౌ యస్యాసః = సలాస్యాధరః, తం = సలాస్యాధరం.

ఆస్యబిమ్బమ్:— ఆస్యమేవబిమ్బః = ఆస్యబిమ్బః, తమ్ = ఆస్యబిమ్బమ్ !

భ్రూవిభ్రమాకూత కృతాభ్యను జ్ఞేషు:— భ్రువోః విభ్రమః = భ్రూవిభ్రమః, భ్రూవిభ్రమఏవ, ఆకూతమ్ = భూవిభ్రమాకూతం, భూవిభ్రమాకూతేన, కృతా అభ్యనుజ్ఞాయైస్తే = భూవిభ్రమాకూతకృతాభ్యనుజ్ఞాః. తేషు = భ్రూవిభ్రమాకూత కృతాభ్యనుజ్ఞేషు.

**భావము :**

ఇట్లు సరస్వతీదేవి చెప్పిన మాటను వినగానే ప్రసాదసూచకముగా నా యింద్రాదులకు చిఱునగవు కల్గినది. అందువల్ల వారు తమ పెదవులను కదిలించి కనుబొమ్మల విలాసము చేతనే తమ తమయనుమతిని వ్యక్తపఱచిరి. అనగా నలుని వరించుట కనుమతి నొసంగిరి. పిదప సరస్వతీదేవి దమయన్తిని నలుని సమీపమునకుఁ గొనిపోయినది. 44

శ్లో॥ మన్దాక్షనిష్పన్ద తనోర్మనోభూ
దుర్భేద్యమ ప్యానయతిస్మ తస్యాః.
మధూకమాలా మధురం కరంసా
కణ్ఠోపకణ్ఠం వసుధాసుధాంశోః. 44

ప॥వి॥ మన్దాక్ష నిష్పన్దతనోః - మనోభూదుర్భేద్యం - అపి - ఆనయతి - స్మ - తస్యాః - మధూకమాలామధురం - కరం - సా - కణ్ఠోపకణ్ఠం - వసుధాసుధాంశోః.

అర్థము :- సా = ఆ సరస్వతి, మన్దాక్షనిష్పందతనోః, మన్దాక్ష = సిగ్గుచే, నిష్పన్ద = నిశ్చలమైన, తనోః = శరీరము గల్గిన, తస్యాః = ఆ దమయన్తి యొక్క, మనోభూదుర్భేద్యం; మనోభూ = మన్మథుని చేతను, దుర్భేద్యం=కదలింప సాధ్యముకాని, మధూకమాలామధురం =

మధూకమాలా = విప్పపూలమాలచే, మధురం = మధురమైన, కరం = హస్తమును, వసుధాసుధాంశోః = భూలోక చంద్రుడైన నలుని యొక్క, కణ్ఠోపకణ్ఠం = కంఠసమీపమును గూర్చి, అనయత్ = పొందించెను. ఆ సమయమునందామెకు, కామము కంటెను సిగ్గు ప్రబల ముగా నుండినదని యర్థము.

**సమాసములు :**

మన్దాక్షనిష్పన్దతనోః :- మన్దాక్షేణ, నిష్పన్దా = మన్దాక్షనిష్పన్దా. మన్దాక్ష నిష్పందా తనుః, యస్యాస్సా = మన్దాక్షనిష్పన్దతనుః, తస్యాః = మన్దాక్ష నిష్పందతనోః.

దుఃప్రేరం :- దుఃఖేన ప్రేరయితుంశక్యః = దుఃప్రేరః, తమ్ = దుఃప్రేరం. మధూకమాలామధురం :- మధూకానాం, మాలా = మధూకమాలా, మధూకమాలయామధురః = మధూకమాలామధురః, తమ్ = మధూకమాలామధురమ్.

కణ్ఠోకపణ్ఠమ్ :- కణ్ఠస్య, ఉపకణ్ఠః = కణ్ఠోపకణ్ఠః, తమ్ = కణ్ఠోప కణ్ఠమ్.

వసుధాసుధాంశోః :- వసుధాయాః, సుధాంశుః = వసుధాసుధాంశుః తస్య = వసుధాసుధాంశోః.

**భావము :**

ఆ సరస్వతీదేవి విప్పపూలమాలచే, మనోహరముగా విరాజిల్లినదియు సిగ్గుచే నిశ్చలమై, మన్మథుని చేతను కదలింప శక్యముగానంతటి స్తంభమను సాత్త్వికభావము గలదియునగు నా దమయన్తి హస్తమును భూలోక చంద్రు డైన నలుని యొద్దకు గొనిపోయినది. 44

శ్లో॥ అథాఖిలిఖ్యేవ సమర్ప్యమాణాం
రాజిం నిజస్వీకరణాక్షరాణాం.
దూర్వాఙ్కురాఢ్యాం నలకణ్ఠనాలే
వధూర్మధూకస్రజముత్ససర్జ. 44

ప॥వి॥ అథ – అభిలిఖ్య - ఇవ - సమర్ప్యమాణాం - రాజిం - నిజస్వీకరణాక్షరాణాం - దూర్వాఙ్కురాఢ్యాం - నలకణ్ఠనాలే - వధూః - మధూకస్రజమ్ - ఉత్ససర్జ.

అర్థము :- అథ! = దమయన్తి హస్తము నలుని కణ్ఠమునుఁ జేరిన పిదప, వధూః = దమయన్తి, అభిలిఖ్య = వ్రాసి, సమర్ప్యమాణాం = ఈయబడుచున్న,, నిజస్వీకరణాక్షరాణాం; నిజ = తనదగు, స్వీకరణ = వివాహముచే పరిగ్రహించుటను, తెలుపునట్టి, అక్షరాణాం = అక్షరములకు "నన్ను నీకు భార్యగా వరింపుము" అను వర్ణములకు లేదా "నేను నిన్ను వరింతు" నను వర్ణములకు సంబంధించిన, రాజిమివ=పఙ్క్తియో యనునట్లున్న, దూర్వాఙ్కురాఢ్యాం: దూర్వాఙ్కుర = గరిక మొక్కలచే, ఆఢ్యాం = నిండిన, మధూకస్రజం=విప్పపూల మాలను, నలకణ్ఠనాలే = నలుని కణ్ఠనాలమందు, ఉత్ససర్జ = అర్పించినది.

సమాసములు:

నిజస్వీకరణాక్షరాణాం :- నిజస్య, స్వీకరణం = నిజస్వీకరణం, నిజస్వీకరణస్య, అక్షరాణి = నిజస్వీకరణాక్షరాణి, తేషాం = నిజస్వీకరణాక్షరాణాం.

దూర్వాఙ్కురాఢ్యాం :- దూర్వాయాః, అఙ్కురాః = దూర్వాఙ్కురాః, దూర్వాఙ్కురైః, ఆఢ్యా = దూర్వాఙ్కురాఢ్యా, తామ్ = దూర్వాఙ్కురాఢ్యాం.

నలకణ్ఠనాలే :- కణ్ఠస్య, నాలః = కణ్ఠనాలః, నలస్యకణ్ఠనాలః = నలకణ్ఠనాలః, తస్మిన్ = నలకణ్ఠనాలే.

మధూకస్రజమ్ :- మధూకానాం, స్రక్ = మధూకస్రక్, తాం = మధూకస్రజమ్.

భావము :-

తర్వాత దమయన్తి "నన్ను నీవు భార్యగా వరింపుము" లేదా "నేను నిన్ను భర్తగా వరించుచున్నాను". ఇత్యాది యొతంబడిక పత్రములోంచి యక్షరముల వరుసయో యనునట్లు, గరిక మొలకలతో నిండిన విప్పపూల మాలను నలుని కణ్ఠమున వైచినది.

శ్లో॥ తాం దూర్వయా శ్యామల యాతివేలం
శృఙ్గార భాసన్నిభయా సశోభాం
మాలాం ప్రసూనాయుధ పాశభాసం
కణ్ఠేన భూభృద్బిభరాం బభూవ. **46**

ప॥వి॥ తాం - దూర్వయా - శ్యామలయా - అతివేలం - శృఙ్గారభాసన్నిభయా - సశోభాం - మాలాం - ప్రసూనాయుధ పాశభాసం - కణ్ఠేన - భూభృత్ - బిభరాంబభూవ.

అర్థము :- అతివేలం = మిక్కిలి, శ్యామలయా = ఆకుపచ్చని వన్నెగల్గిన, (కావుననే) శృఙ్గారభాసన్నిభయా; శృఙ్గార = శృఙ్గార రసముయొక్క, భా = కాంతితో, సన్నిభయా = సమానమైన, దూర్వయా = గరికతో, సశోభాం = శోభించునదియును, ప్రసూనాయుధపాశభాసం: ప్రసూనాయుధ=మన్మథునియొక్క, పాశ= పాశాయుధముతో, సమానభానం = సమానమైన కాంతినిఁ గల్గినదియనగు, మాలాం = పుష్పమాలను, భూభృత్ = నలమహారాజు, కణ్ఠేన = తన కణ్ఠముతో, బిభరాం బభూవ = ధరించెను.

సమాసములు :

అతివేలం :- వేలామతిక్రాంతం = అతివేలం.

శృఙ్గార భాసన్నిభయా :- శృఙ్గారస్య, భాః = శృఙ్గారభాః, శృఙ్గార భాసా, సన్నిభా = శృఙ్గారభా సన్నిభా. తయా=శృఙ్గారభాసన్నిభయా.

సశోభాం :- శోభయాసహవర్తత ఇతి = సశోభా, తాం = సశోభాం.

ప్రసూనాయుధపాశభాసం :- ప్రసూనం, ఆయుధః యస్యసః = ప్రసూనాయుధః, ప్రసూనాయుధస్య, పాశః = ప్రసూనాయుధపాశః, ప్రసూనాయుధపాశస్య, భాః = ప్రసూనాయుధపాశభాః, ప్రసూనాయుధ పాశభా ఇవ భాః, యస్యాస్సా = ప్రసూనాయుధపాశభాః, తస్యాః = ప్రసూనాయుధపాశభాసః.

భూభృత్ :- భువం, బిభర్తీతి = భూభృత్.

భావము :

ఆ మధూకమాల గరికవలె మిక్కిలి యాకుపచ్చని వన్నె కల్గినదై శృఙ్గారరసపు కాంతివంటి కాన్తిగలదై శోభించుచుండినది. "శ్యామో భవతి శృఙ్గారః" యను భరత వచనము ననుసరించి శృఙ్గారము ఆకుపచ్చని వన్నె గల్గియుండును. మఱియు నాపుష్పమాల పుష్పబాణుని పాశాయుధమువంటి కాంతినిగూడ వహించియున్నది. అట్టి మధూకమాలను నలుడు తన కణ్ఠమున ధరించెను. 47

శ్లో॥ దూర్వాగ్ర జాగ్రత్పులకావలిం తాం
నలాఙ్గసఙ్గాద్భృశముల్లసన్తీం.
మానేన మన్యే నమితాననా సా
సాసూయమాలోకత పుష్పమాలాం. 47

ప॥వి॥ దూర్వాగ్రజాగ్రత్పులకావలిం - తాం - నలాఙ్గసఙ్గాత్ - భృశమ్ - ఉల్లసన్తీం - మానేన - మన్యే - నమితాననా - సా-సాసూయమ్ - ఆలోకత - పుష్పమాలాం.

అర్థము :- సా = ఆ దమయన్తి, దూర్వాగ్ర జాగ్రత్పులకావలిం; దూర్వాగ్ర= గరికకొనలనెడి, జాగ్రత్ = పైకి నిక్కపొడుచుకొనిన, పులకావలిం = రోమాంచముల పంక్తిని గల్గినదో యనునట్లున్న, నలాఙ్గసంగాత్ = నలుని శరీరము యొక్క సంబంధము వలన, భృశం = మిక్కిలి, ఉల్లసన్తీం = శోభించుచున్నదియును (ఆనందముతో గూడియున్న దియును) నగు తాం = ఆ, పుష్పమాలాం = పుష్పమాలను, మానేన = కోపముచే, నమితాననా = తలవంచినదై, సాసూయం = (పుష్పమాలయను నాయికాన్తర సంబంధము తన కాంతుఁడగు నలునికేర్పడి నందులకు) అసూయతో కూడినట్లుగా, ఆలోకత = చూచినది.ఇతి = అని, మన్యే = తలఁతును.

వి :- ఇచ్చట ప్రస్తుతమైన పుష్పమాలా వృత్తాన్తముచే, నప్రస్తుతమగు సపత్నీ వృత్తాన్తము విశేషణ సామ్యముచేఁ దెలియుచున్నది గాన సమాసోక్తి.

లజ్జావశంవలన తలవంచి, ఎట్టయెదుట కపోలమునను, ప్రణయకోపమును

సపతియందలి యసూయ మున్నగు వానిచేఁ జూడలేదని భావించుట వలన నుత్ప్రేక్ష. ఈ యుత్ప్రేక్షపై సమాసోక్తి నుపజీవించినది. మఱియు వ్యఞ్జకమగు "మన్యే" యను క్రియను ప్రయోగించుటవలననని వాచ్యము. దీనికిని సమాసోక్తి సంగాగి భావము చెప్పుట వలన సంకరము

**సమాసములు :**

దూర్వాగ్ర జాగ్రత్పులకావలిమ్:- దూర్వాయాః, అగ్రం=దూర్వాగ్రం· దూర్వాగ్రే, జాగ్రతీ = దూర్వాగ్ర జాగ్రతీ, పులకానామావలిః = పులకావలిః, దూర్వాగ్రజాగ్రతీ, పులకావలిః, యస్యాస్సా = దూర్వాగ్ర జాగ్రత్పులకావలిః, తామ్, దూర్వాగ్ర జాగ్రత్పులకావలిమ్.

నలాఙ్గసఙ్గాత్:- నలస్య, అఙ్గం = నలాఙ్గం, నలాఙ్గస్య, సఙ్గః = నలాసఙ్గః, తస్మాత్ = నలాఙ్గసజాత్.

నమితాననా:- నమితం, ఆననం, యస్యాస్సా = నమతాననా.

సాసూయమ్:- అసూయయా, సహితం, యథాతథా, = సాసూయమ్.

**భావము :**

ఆ దమయంతి నలునిం కణ్ఠము నందు వైచిన పుష్పమాలను తనకు సవితిగా భావించి యసూయ పడసాగినది, ఏల యనగా, నలుని శరీరము నా పుష్పమాల యంటగనే దానికి పులకములేర్పడినవో యనునట్లు, ఆ మాల యందలి గరిక మొలకలు శోభించినవి. అందువలన నాపుష్పమాల పురుష దేహ సంగముచేయు రతి యుల్లసించినట్లుల్లసిల్లినది. పరిమల భరితమైనది. కావున నామె యాపుష్పమాలను సపతిఁగా భావనఁజేసి యసూయఁజెంది తల వాల్చినదని భావింపఁబడినది. వాస్తవములో నలునియెదుట లజ్జాదుల వలన నామె తల వాల్చినది కాని యసూయా కోపములతోఁ దలను వాల్చలేదని యాశయము. 41

శ్లో॥ సానిర్మమే తస్య మధూకమాలా
హృదిస్థితాచ ప్రతిబింబితాచ
కియత్య మగ్నా కియతీచమగ్నా
పుష్పేషు బాణాలిరివ వ్యలోకి. 48

ప॥వి॥ సా - నిర్మలే - తస్య - మధూకమాలా - హృది - స్థితా - చ - ప్రతిబింబితా - చ - కియతీ - అమగ్నా - కియతీ - చ - మగ్నా - పుష్పేషు బాణాలిః - ఇవ - వ్యలోకి.

అర్థము:- తస్య = ఆ నలుని యొక్క, నిర్మలే = శుద్ధమైన, హృది = వక్షస్థలమునందు, స్థితాచ = ఉన్నదియును ననగా వెలుపల నున్నదియును, ప్రతిబింబితాచ = హృదయము స్వచ్ఛముగానుండుట వలన లోపల ప్రతి బింబించినదియును నగు, సా = ఆ, మధూకమాలా = విప్పపూలమాల, కియతీ = కొద్దిగా, అమగ్నా = పైభాగమునందుండినదియు, కియతీచ = కొద్దిగనే, మగ్నా = లోపలకిఁ బోయినదియునగు, పుష్పేషుబాణా వలిరివ = మన్మథ బాణ పంక్తివలె, వ్యలోకి = చూడఁ బడినది.

**సమాసములు :**

పుష్పేషుబాణావలిః:- పుష్పాణి, ఇషవః, యస్యసః = పుష్పేషుః, పుష్పేషోః = బాణాః = పుష్పేషుబాణాః, పుష్పేషుబాణానామావలిః = పుష్పేషుబాణావలిః.

**భావము :**

స్వచ్ఛమైన నలుని హృదయముపైన వేయఁబడిన మధూకమాల, హృద యముపైనుండియు, హృదయమునందుఁ బ్రతిఫలించిదియునై, కొంచె ముపైభాగమున దిగనదియు, కొంచెము లోనికి డిగినదియు నగు పూవి ల్తుని బాణ పంక్తి వలెఁ జూడబడినది. 48

శ్లో॥ కాఽపి ప్రమోదాస్ఫుటనిర్జిహాన
వర్ణైవయామఙ్గల గీతిరాసామ్.
సైవానసేభ్యః పురసుందరీణా
ముచ్చైరులూలు ధ్వని రుచ్చచార 49

ప॥వి॥ కా - అపి - ప్రమోదాస్ఫుటనిర్జిహానవర్ణా - ఏవ - యా - మఙ్గలగీతిః - ఆసాం - సా - ఏవ - ఆననేభ్యః - పురసుందరీణాం - ఉచ్చైః - ఉలూలుధ్వనిః - ఉచ్చచార.

అర్థము :- ప్రమోదాస్ఫుటనిర్జిహానవర్ణా ఏవ; ప్రమోద = సంతోషముతో, అస్ఫుట = అస్పష్టముగా, నిర్జిహాన = వెల్వడుచున్న, వర్ణైవ = అక్షరములు గల్గినదిగనే, అసాం = ఈ స్వయంవరమునుఁ జూచుటకై విచ్చేసిన, పురసుందరీణాం = పౌరస్త్రీల యొక్క, ఆననేభ్యః = ముఖముల నుండి, కాఽపి = అపూర్వమైన, యా = ఏ, మంగలగీతిః = మంగళ సూచకమగు గీతి, ఉచ్చచార = ఉచ్చరింపబడినదో, సైవ = ఆయస్పష్టమైన మంగళగీతియే, ఉచ్చైః = బిగ్గరగా, ఉలూలుధ్వనిః = "ఉలు ఉలు" అను హర్షసూచకమగు ధ్వనిగా, అభూత్ = ఆయెను. గౌడదేశమందు "ఉలు ఉలు" అను హర్షసూచకమగు ధ్వనిని నుత్సవముల యందును, వివాహాదుల యందును స్త్రీలు ఉచ్చరించుచుందురు. ప్రస్తుతము స్వయంవర మహోత్సవము నందును పుర స్త్రీలు మంగళ గానమునుఁ జేయుచుండగా, ఆ గానము వారి సంతోషముచే నస్ఫుటములగు నక్షరములను గల్గియుండుటచే, నులూలు ధ్వనివలె నుండినదని యర్థము.

## సమాసములు :

ప్రమోదాస్ఫుటనిర్జిహానవర్ణా :— ప్రమోదేన, అస్ఫుటం, నిర్జిహానాః, వర్ణాః, యస్యాఃసా. = ప్రమోదాస్ఫుటనిర్జిహానవర్ణా.

మఙ్గలగీతిః :— మంగలసూచికాగీతిః = మఙ్గలగీతిః.

పురసుందరీణాం :—పురస్య, సుందర్యః = పురసుందర్యః. తాసాం = పురసుందరీణాం.

ఉలూలుధ్వనిః :— ఉలూలురితిధ్వనిః = ఉలూలుధ్వనిః.

## భావము :

ఆ స్వయంవర మహోత్సవమునకు విచ్చేసిన పౌరస్త్రీలు, దమయన్తి, స్వయంవరమాలను నలుని కణ్ఠమునందు వేయగనే, హర్షాతిశయముచే మంగళ గీతికలను పాడఁదొడగిరి. ఆ గీతికలయందలి యక్షరములు సంతోషాతిశయముచే స్పష్టముగా వినబడక పోవుటవలన నది గౌడదేశమునం దుత్సవకాలములయందు స్త్రీలు పాడెడి "యులూలు" ధ్వనివలె నుండినది.

శ్లో॥ రోమాణి సర్వాణ్యపి బాలభావాత్
వరశ్రియం వీక్షితుముత్సుకాని.
తస్యాస్తదా కణ్టకితాఙ్గయష్టే
రుద్గ్రీవికాదానమివాన్వభూవన్. 50

ప॥వి॥ :- రోమాణి - సర్వాణి - అపి - బాలభావాత్ - వరశ్రియం - వీక్షితుం- ఉత్సుకాని - తస్యాః - తదా - కణ్టకితాఙ్గయష్టేః - ఉద్గ్రీవికాదానమ్- ఇవ - అన్వభూవన్.

అర్థము :- తదా = ఆ సమయమునందు, కణ్టకితాఙ్గయష్టేః; కణ్టకిత = పులకములతోఁగూడిన, అఙ్గయష్టేః = శరీరముగల, తస్యాః = ఆ దమయన్తియొక్క, రోమాణి = రోమములు, వాలభావాత్ = వాలత్వము వలన ననగా కేశత్వము వలన "వబయోరభేదః" అను న్యాయము ననుసరించి, శిశుత్వము వలనను, వరశ్రియం; వర = వరుడైన నలుని యొక్క, శ్రియం = సౌందర్యమును, వీక్షితుం = చూచుటకు, ఉత్సుకాని = ఔత్సుక్యము గలవిగానున్నవై, ఉద్గ్రీవికాదానం; = మెడనెత్తి పట్టుకొనుటను, అన్వభూవన్నివ = అనుభవించినవో యనునట్లుండినవి. బాలురు మెడ నిక్కబెట్టి చక్కగాఁ జూతురని యర్థము.

**సమాసములు :**

బాలభావాత్ :- బాలస్య, భావః=బాలభావః, తస్మాత్ = బాలభావాత్.

వరశ్రియం :- వరస్య, శ్రీః = వరశ్రీః. తామ్ = వరశ్రియమ్.

కణ్టకితాఙ్గయష్టేః :- అఙ్గమేవయష్టిః, = అఙ్గయష్టిః, కణ్టకితా, అఙ్గయష్టిః, యస్యాస్సా = కణ్టకితాఙ్గయష్టిః, తస్యాః = కణ్టకితాఙ్గయష్టేః.

ఉద్గ్రీవికాదానమ్ :- ఉన్నమితా, గ్రీవా, యస్యాంసా = ఉద్గ్రీవికా, ఉద్గ్రీవికాయాః, దానమ్ = ఉద్గ్రీవికాదానమ్. తత్ = ఉద్గ్రీవికాదానమ్.

**భావము :**

ఆ సమయమునందు, పులకములతోఁ గూడిన దమయంతి శరీరమునందలి రోమములన్నియు మెట్టుక లపటనందనను, (బాల్యచాపలము వలనను)

నిక్కపొడుచుకొనినవై నలుని సౌందర్యముఁజూడ గోరిక కలవగుచు నిక్కపెట్టుకొనినట్లు కానఁబడినవి.

శ్లో॥ రోమాఙ్కురైర్దన్తురితాఖిలాఙ్గీ
రమ్యాధరాసా సుతరాం విరేజే.
శరవ్యదణ్డైః శ్రితమణ్డనశ్రీః
స్మారీ శరోపాసన వేదికేవ,

పదవి :- రోమాఙ్కురైః - దన్తురితాఖిలాఙ్గీ - రమ్యాధరా-సా - సు విరేజే - శరవ్యదణ్డైః - శ్రితమణ్డనశ్రీః - స్మారీ-శరోపాసన ఇవ.

అర్థము :- రోమాఙ్కురైః = పులకములచే, దన్తురితాఖిలాఙ్గీ; దన్తురి వ్యాప్తమైన, అఖిల = సమస్తమైన, అఙ్గీ = దేహముగల్గిన, రమ రమ్య = అందమైన, అధరా = రెండు పెదవులు గల్గిన, సా దమయన్తి, శరవ్యదణ్డైః; శరవ్య = బాణములకు గుఱియైన, ద నాటఁబడిన కొయ్యలచే, శ్రితమణ్డనశ్రీ; శ్రిత = పొందబడిన, నశ్రీః = అలంకార శోభగల్గిన, స్మారీ = మన్మథునికి సంబంధి శరోపాసన వేదికాఇవ; శరోపాసన = బాణముల నభ్యసించే మను వేదికాఇవ = తిన్నెవలె, సుతరాం = అధికముగా, విరేజే= శించినది. పులకాంకురములతో గూడిన యాదమయన్తిని మన్మ మాటిమాటికిని తన బాణముతో గొట్టుచుండెనని యర్థము. బాణ గముసభ్యసించుటకై వేటకాండ్రు మున్నగువారు గుఱికై కఱ్ఱను తిన్నెను నిర్మించుకొందురని ప్రసిద్ధి.

**సమాసములు :**

రోమాఙ్కురైః :-రోమ్ణామఙ్కురాః = రోమాఙ్కురాః ,తైః = రో ఙ్కురైః.

దన్తురితాఖిలాఙ్గీ :- అఖిలంచ, తదఙ్గంచ= అఖిలాఙ్గం. దన్తురితం, లాఙ్గం, యస్యాస్సా = దన్తురితాఖిలాఙ్గీ.

రమ్యాధరా :- రమ్యః అధరః యస్యాస్సా = రమ్యాధరా.

శరవ్యదణ్డైః :- శరస్య లక్ష్యాః = శరవ్యాః, శరవ్యాశ్చతే దణ్డాశ్చ = శరవ్యదణ్డాః, తైః = శరవ్యదణ్డైః.

శ్రితమణ్డనశ్రీః :- మణ్డనస్య, శ్రీః = మణ్డనశ్రీః; శ్రితా, మణ్డనశ్రీః యయాసా, శ్రితమణ్డనశ్రీః.

స్మారీ :- స్మరస్య, ఇయం = స్మారీ.

శరోపాసన వేదికా :- శరస్య, ఉపాసనం = శరోపాసనం, శరోపాసనస్య, వేదికా = శరోపాసనవేదికా.

భావము :

పులకములతో నిండిన సకల శరీరము గలదియు మనోహరములగు దవులు గలదియు (పులకములనెడి) గుజ్జి కొయ్యలచే జక్కగా నలంకరింపబడినదియునగు నాదమయన్తి, మన్మథునికి సంబంధించినదైన, బాణాభ్యాసమునకు సాధనమగు వేదికవలె మిక్కిలి శోభించినది. 51

శ్లో॥ చేష్టావ్యనేశన్నిఖిలాస్తదాస్యాః
స్మరేషుపాతైరివతా విధూతాః.
అభ్యర్థ్యనీతాః కలినాముహూర్తం
లాభాయ తస్యా బహు చేష్టితుంవా. 52

వి॥ :- చేష్టాః - వ్యనేశన్ - నిఖిలాః - తదా - అస్యాః - స్మరేషుపాతైః - ఇవ - తాః - విధూతాః - అభ్యర్థ్య - నీతాః - కలినా - ముహూర్తం - లాభాయ - తస్యాః - బహు - చేష్టితుం - వా.

ర్థము :- తదా = ఆ కాలమందు, అస్యాః ఈ దమయన్తి యొక్క, తాః = అట్టి, నిఖిలాః = ప్రగల్భములగు చేష్టాన్నియు ననగా కటాక్ష నిశ్వాసములు, అఙ్గ విన్యాసములు, మున్నగునవి, స్మరేషుపాతైః; స్మరేషు = మన్మథ బాణములయొక్క, పాతైః = పాతములతో ననగా దెబ్బలతో, నిరస్తా ఇవ = తొలగింపబడినదో యనునట్లు, వ్యనేశన్ = నశించినవి. వా = లేదా, తస్యాః = అ దమయన్తి యొక్క, లాభాయ = ప్రాప్తికై, బహు = పెక్కు విధములుగా, చేష్టితుం = చేష్టలను జేయుటకు,

కలినా = కలిపురుషునిచే, అర్థ్యర్థః = (నీయొక్క కటాక్ష పాద సములను నాయెడనుంచుము;) అని, ప్రార్థించి, ముహూర్తం = కాలము, నీతాః = కొనిపోబడినవా యేమి? దమయన్తిని, బో పాపిష్ఠుడైన కలి, రాబోవుచున్నాడు. కాన కురూపియగు నాతనికి క్షేముతో గూడిన విధానములు — తెలియవు కాన దమయన్తి యుటకు పలసిన విలాసములను, జూపుటకు నామెయొక్క వి లనే తాత్కాలికమగు నుపయోగమునకై కొనిపోయెనా యేమి యర్థము. అనగా స్తంభమనెడి సాత్త్విక భావముచే నామె నలుని కటాక్షాది విలాసములనుడిగి — నిశ్చేష్టురాలైనదని వస్తుస్థితి.

సమాసములు :

స్మరేషుపాతైః :— స్మరస్య, ఇషవః = స్మరేషవః, స్మరేషూ పాతాః = స్మరేషుపాతాః, తైః = స్మరేషుపాతైః.

భావము :

ఆ సమయమున దమయన్తి యొక్క కటాక్ష పాతాది సకల విలా సము మన్మథుని బాణముల దెబ్బల తాకిడిచే నాగిపోయినవి. లేదా ఆదమయ ంతియుటకై పెక్కు విధములైన చేష్టలచేయుటకై రాబోవు కలి, దమయ ప్రార్థించి కొంతకాలము దాని నుపయోగించుటకై కొనిపోవుట వలన నామె విలాసముల నుడిగి నిశ్చేష్టురాలైనదా! యని యాశయము.

శ్లో॥ తస్మిన్న్యస్త మాల్యస్పృశి తస్య కణ్ఠే
స్వేదం కరే పఞ్చశరశ్చకార.
భవిష్య దుద్వాహ మహోత్సవస్య
హస్తోదకం తజ్జనయాం బభూవ. 5

ప.చ్ఛే. తస్మిన్న్యస్తమాల్యస్పృశి - తస్య — కణ్ఠే - స్వేదం - కరే - పఞ్చశ - చకార - భవిష్యదుద్వాహమహోత్సవస్య - హస్తోదకం - తత్ - జనయాం బభూవ.

అన్వయము :— తస్మిన్న్యస్తమాల్యస్పృశి; తత్ := ఆ దమయన్తిచే, న్యస్త = ఉంచ బడిన, మాల్య = మధూక మాలికలను, స్పృశి = అంటుచున్న, తస్య =

ఆ నలునియొక్క, కణ్ఠే = కణ్ఠమునందును, కరే = చేతియందును, పఞ్చశరః = మన్మథుడు, స్వేదం = చెమటను, చకార = కల్గించెను. తత్ = ఆ చెమటనీరు, భవిష్యదుద్వాహమహోత్సవస్య: భవిష్యత్ = జరుగనున్న, ఉద్వాహమహోత్సవస్య = వివాహ మహోత్సవమునకు సంబంధించిన,, హస్తోదకం = అర్ఘ్యజలమును, జనయామ్బభూవేవ = కలిగించెనేమో యనునట్లుండినది.

**సమాసములు :**

తన్న్యస్తమాల్యస్పృశి :— తయాన్యస్తం = తన్న్యస్తం, తన్న్యస్తంచ తత్ మాల్యంచ = తన్న్యస్తమాల్యం, తన్న్యస్తమాల్యం; స్పృశతీతి = తన్న్యస్తమాల్యస్పృక్, తస్మిన్ = తన్న్యస్తమాల్యస్పృశి.
పఞ్చశరః ;— పఞ్చ, శరాః, యస్యసః = పఞ్చశరః.
భవిష్యదుద్వాహమహోత్సవస్య :- ఉద్వాహఏవమహోత్సవః = ఉద్వాహమహోత్సవః, భవిష్యంశ్చాసౌ ఉద్వాహమహోత్సవశ్చ = భవిష్యదుద్వాహమహోత్సవః, తస్య = భవిష్యదుద్వాహమహోత్సవస్య.

వి :- నలుని స్వేదజలము కాబోవు వివాహ మహోత్సవమునకు సంబంధించిన హస్తోదకముగా నుత్ప్రేక్షింపబడుట వలన నిది యుత్ప్రేక్ష.

**భావము :**

దమయన్తి వైచిన మాలనంటుచున్న నలుని కణ్ఠమునందును, హస్తమునందును, మన్మథుడు చెమట బట్టించెను. ఆ స్వేదజలము జరుగనున్న వివాహమునకు సంబంధించిన హస్తోదకముగా భావింపఁ బడినది. కన్యాదాన కాలమందు హస్తోదకములు వైదిక సంప్రదాయమునఁ బ్రసిద్ధములు. 53

శ్లో॥ తూలేన తస్యాస్తులనా మృదోస్తత్
కమ్రాప్తు సా మన్మథబాణపాతైః.
చిత్రీయితం తత్తునలోయదుచ్చై
రభూత్ సభూభృత్ పృథువేపథుస్తైః. 54

ప॥వి॥ తూలేన - తస్యాః - తులనా - మృదోః - తత్ - కమ్రా - అస్తు - సా – మన్మథబాణపాతైః - చిత్రీయితం – తత్ - తు - నలః -

యత్ - ఉచ్చైః అభూత్ - స - భూభృత్ - పృథువేపథుః - తైః.

అర్థము :— మృదోః = కోమల శరీరము గల్గిన, తస్యాః = ఆ దమయన్తికి, తూలేన = ప్రత్తితో, తులనా = (తేలికతనమందు), సామ్యము. యత్ = ఎందువలననో, తత్ = అందువలన, సా = ఆ దమయన్తి, మన్మథబాణపాతైః; మన్మథబాణ = మన్మథుని బాణముల యొక్క, పాతైః = దెబ్బలచే, కమ్ప్రా = కంపముతో గూడినదిగా, అస్తు = అగుగాక. ప్రత్తి తేలిక గాన నది సామాన్యముగా చలించును. కాన ప్రత్తితో సమానమైన దానికి నా చలనము యుక్తమే యని యర్థము. తు = కాని, ఉచ్చైః = ఉన్నతుడైన, భూభృత్ = రాజైనట్టి (పర్వతమైనట్టి) సః = ఆ నలుడు, తైః = ఆ, బాణపాతైః = బాణముల దెబ్బలచే, పృథువేపథుః = గొప్ప వణకుగలవాడుగా, అభూదితియత్ = అయెనను యేది గలదో, తత్ = అది, చిత్రీయతం = ఆశ్చర్యమైనది, కొద్దిపాటి గాలికి ప్రత్తి కదలుట ఆశ్చర్యము కాదు. అనగా ప్రత్తివంటి దమయన్తి కొద్దిగాలికి చలించుట వింతకాదు. కాని పర్వతము చలించుట ఆశ్చర్యము. ధైర్యవంతుడగు నలుడుంచలించుట యాశ్చర్యమే. గాని భయశీలురాలగు దమయన్తి చలించుటయందు నాశ్చర్యము లేదని యర్థము.

సమాసములు :

మన్మథబాణపాతైః :— మన్మథస్య, బాణాః = మన్మథబాణాః మన్మథబాణానాం, పాతాః = మన్మథబాణపాతాః, తైః = మన్మథబాణపాతైః

పృథువేపథుః :— పృథుః వేపథుః, యస్యసః = పృథువేపథుః.

భావము :

సుకుమార దేహము గల్గిన యా దమయన్తి తేలికతనమందును, మెత్తనమందును, ప్రత్తితోం బోల్చదగినది. కాన నామె మన్మథబాణ పాతములచే జలింపవచ్చును. కాని భూమిని ధరించువాడు (పర్వతమును) నైన ధీరుడగు నలుడు ఆ మన్మథుని బాణ పాతములతో వణకదొడగెననుట యాశ్చర్యము. కాని దమయన్తి కంపించుటలో నాశ్చర్యమేమున్నది.

శ్లో॥ దృశోరపి న్యస్తమివాఽఽస్త రాజ్ఞాం
రాగాత్ దృగమ్బుప్రతిబిమ్బి మాల్యమ్.
నృపస్య తత్పీతవతో రివాక్ష్ణోః
ప్రాలమ్బమాలమ్బత యుక్తమన్తః. **55**

ప॥వి॥ :- దృశోః - అపి - న్యస్తమ్ - ఇవ - ఆస్త - రాజ్ఞాం - రాగాత్ - దృగమ్బుప్రతిబిమ్బి - మాల్యం - నృపస్య - తత్ - పీతవతోః - ఇవ - అక్ష్ణోః - ప్రాలమ్బమ్ - ఆలమ్బత - యుక్తమ్ - అన్తః.

అర్థము :- రాజ్ఞాం - నలునికంటె నితరులగు రాజులకు — రాగాత్=అసూయ వలన, యత్ = ఏ, దృగమ్బుప్రతిబింబి; దృగమ్బు = కన్నీటియందు, ప్రతిబింబి = ప్రతిఫలించిన, మాల్యం = వరణమాల, దృశోరపి = నేత్రములయందును, న్యస్తమివ = ఉంచబడినట్లు, ఆస్త = ఉండినదో యని భావింపఁదగినది. అనగా నలుని వక్షస్థలమునందది యెట్లుంచఁబడినదో, అట్లే రాజుల కన్నులయందును నుంచఁబడినదని యర్థము. అట్లు కానిచో వారి కన్నులనుండి నీరెట్లు వచ్చును? నృపస్యతు = రాజునకో అనగా నలునకో, రాగాత్ = అనురాగము వలన — దృగమ్బు ప్రతిబింబి; దృగమ్బు = కన్నీట, ప్రతిబింబి = ప్రతిఫలించిన, తత్ = ఆ పుష్పమాల్యమును, పీతవతోః = ఆశలో మ్రింగినవో యనునట్లున్న, అక్ష్ణోః = నేత్రములయందు, ప్రాలమ్బం = వంపులేక నేరుగా, లమ్బమానంసత్ = వ్రేలాడుచున్నదై, అంతః = మధ్య (కన్నులమధ్య), ప్రాలమ్బత = వ్రేలాడినది, యుక్తమ్ = యుక్తము.

పక్షాన్తరమున :- దృశోః = కన్నుల యొక్క, అమ్బుని = ఉదకమునందు అనగా కోపముచే నుద్భవించిన జలమునందు, ప్రతిబింబి = ప్రతిబింబించిన, మాల్యం = ఆ మధూకమాల, రాగాత్ = నలవిషయకమగుకోపము వలనను, దానివలన గల్గిన యెఱ్ఱదనము వలనను, సభాసదులగు రాజులయొక్క; దృశోరపి = కన్నులయందును — న్యస్తమివ = ఎవని చేతనో యొకని చేత నుంచఁబడినట్లు, ఆస్త = ఉండినది.

ఎట్లు కోపించినవాడై యొకడు మఱియొకని నేత్రమున బలాత్కార
ముగా వ్రేలు మున్నగువాని నుంచినచో, నది యాతని నేత్రమునకు —
నెఱ్ఱదనమును, కన్నీరును, గల్గించునో, అట్లే కోపముతో చూచినంత
మాత్రము చేతనే, ఆ మాలికయే వారి రెండు కన్నులయందును చీలతో
గ్రుచ్చినట్లుండినది. కావున నా కన్నులలో నెఱ్ఱదనము, కన్నీరు, కల్గి
నవి.

లేదా ! రాగాత్ = నలుని యందలి ప్రీతితో, దమయన్తిచే, మాల్యం =
మధూకమాలిక ఎట్లు నలుని కంఠమునందుంచబడినదో అట్లే, రాగాత్=
కోపము వలన, రాజ్ఞాం = నలుని ద్వేషించుచు నెదుట జూచుచున్న
రాజుల, దృశోః = నేత్రములయందును, న్యస్తం = చీలవలెనుంచఁ
బడినది. అందువలన కన్నీట ప్రతిబింబించిన మాలను సహింపలేని
రాజులందరును, కోపమును, అసూయను, వహించినవారై ముడుచుకొనిన
కన్నులు గలవారలై పెడముఖము పెట్టి, యామెనుఁ జూడకుండిరి.
రాజైన నలునియొక్క కన్నులమధ్య హర్షముచేత విస్తారమేర్పడినది,
ఇది యుక్తము. హర్షముచే నేత్రములయందు విస్తరణ మేర్పడుట —
సహజము. ఆ నేత్రములు మాల్యమును, పితవతోరివ = సాదరముగా
జూచుచున్నవో యనునట్లున్నవి. హర్షముచే నేత్రములయందేర్పడిన
విస్తృతియే, యిట విలోకనము వలన నేర్పడినట్లుత్ప్రేక్షితము. లేదా
నలుని నేత్ర మధ్యభాగమే యా మాల్యమును చక్కగా వ్రేలాడు హార
ముగా నంగీకరించినది. సాదరముగాఁ జూచుటవలన నేత్రముల మధ్య
మాల ప్రతిబింబించుటకు మాల ఋజువుగా వ్రేలాడవలయును. నేత్ర
ములు విస్తారమునుఁ బొందవలయును, నలుఁడు మాలను జూచుచు సంతో
షము వలన వికసిత నేత్రుడాయెను. ఆ మాల ఇతరులకు కోపమువలన
నేత్రములయందుంచఁబడిన శల్యముగా నుండెను. కోపమున జూడఁబడిన
వస్తువు శల్యమువలె నగును. దానిచే కన్నులలో నెఱ్ఱదనము, బాష్ప
ములు కలుగును కాన నిది యుక్తము. ఆ మాల్యమును పానము చేసినవో
యనునట్లున్న నలుని నేత్రములమధ్య, రాగాత్ = ప్రీతివలన, హర్ష
మేర్పడినది. ఇదియును యుక్తము, "రాజ్ఞా" అను పాఠమునను సరించి,

ఆనందబాష్పములయందును, న్యస్తమివ = ఉంచఁబడినట్లుండెను. కేవలము వక్షస్థలమునందే మాల్యముంచబడలేదు. మఱేమనగా నేత్రముల యందుంచఁబడినది. కావుననే, ఆ మాల్యమును పానము జేయుచున్న నలుని నేత్రముల మధ్యభాగమున దానిననుసరించి దీర్ఘత్వమేర్పడిన దనుట యుక్తము. దీర్ఘమైన మాలను నేత్రములమధ్య ధరించుటకు నేత్రముల మధ్యభాగముగూడ దీర్ఘమైనదని యాశయము. దుర్లభమగు దమయంతియొక్క వరణమాల కంఠమునఁబడగనే నలుని కన్నులు విస్ఫారితములైనవనియు భావము.

సమాసములు :

దృగంబుప్రతిబింబి :- దృశాముంబు = దృగమ్బు, దృగంబుని, ప్రతిబింబి = దృగంబుప్రతిబింబి.

భావము :

దమయన్తి యందును, నలునియందును రాగాదిసాత్త్వికభావములుదయించినట్లె సభాసదులగు రాజులకునవి ఉదయించినవిగా వర్ణింపఁబడుచున్నది. నలుని కణ్ఠమున మధూకమాలను వేయగానే, రాజులకు క్రోధమువలన వెల్వడిన కన్నీరులో ప్రతిబింబించి వారి కంటియందును మాల్యము వేయఁబడినట్లుండినది. అందువలననది వారి నేత్రములలో శల్యముగానైనది. అట్లుకానిచో నటనుండి కన్నీరెట్లు ప్రవహించును ? కాని నలమహారాజునకు ననురాగముచే నుద్భవించిన కన్నీటఁ బ్రతిబింబించినదైన యా మాల్యము, సాదరముగాఁ బానముగావింపబడినదై యాతని నేత్రములయందు, దీర్ఘముగా నతని నేత్రముల మధ్యభాగమున వ్రేలాడుట యుక్తము. రాజులమధ్య ద్వేషము వలన కన్నీరు ప్రతిబింబించిన మాల్యము కంటనే యుండిపోయినది. నలుని విషయమున అనురాగాతిశయము వలన కన్నులచే నది మిక్కిలి యాశచే పానము చేయఁబడినదో యనునట్లు భావింపఁబడినది. అనగా తమ్ము వరించనందువలన నసూయ వహించిన రాజుల క్రోధాశ్రువులయందా మాలిక ప్రతిబింబించినది. అందువలన నా మాలికను దమయంతి నలుని వక్షస్థలమున నుంచినట్లు, ఆ రాజుల కన్నుల యందుంచినట్టును భావింపబడినది. అనగా నా దమయన్తి నలుని కంఠమునందు మాలనెట్లు, వైచెనో, యట్లే యితర రాజుల కన్నులయందును వైచినదని

యర్థము. ఆ మాల కన్నులయందుంచఁబడుట వలన వారి కన్నులయందు నీరు ఉద్భవించినది. అనగా మాత్సర్యముచే నేర్పడిన కన్నీళ్లు, మాల తగులుటవలన నేర్పడినవిగా భావింపఁబడినవి.

శ్లో॥ స్తమ్భ స్తథాఽలమ్భి తమాం నలేన
భైమీకరస్పర్శముదః ప్రభావః.
కన్దర్పలక్షీ కరణార్పి తస్య
స్తమ్భస్య దమ్భం సచిరం యథాఽఽపత్. 55

ప॥వి॥ స్తమ్భః - తథా - అలమ్భితమాం - నలేన - భైమీకరస్పర్శముదః - ప్రభావః - కన్దర్పలక్షీకరణార్పితస్య - స్తమ్భస్య - దమ్భం - సః - చిరం - యథా - ఆపత్.

అర్థము :- నలేన = నలునిచే, భైమీకరస్పర్శముదః; భైమీ = దమయన్తి యొక్క, కరస్పర్శ = హస్తస్పర్శముచే గల్గిన, ముదః = సంతోషము యొక్క, ప్రభావః = అనుభావముచే నుత్పన్నమైన, స్తమ్భః = నిశ్చలత్వరూపమగు సాత్త్విక భావము, తథా = అట్లే, అలమ్భితమాం = మిక్కిలి పొందింపఁ బడినది. యథా = ఎట్లనగా, సః = ఆ నలుడు, కన్దర్పలక్ష్మీకరణార్పితస్యః కందర్ప = మన్మథునకు, లక్షీకరణ = గుఱియగుటకై, అర్పితస్య = (శరముల నభ్యసించు కాలమునందు) స్థాపింపఁబడిన, స్తమ్భస్య = స్తంభము యొక్క, దంభం = వ్యాజముగా నుండుటను, చిరాత్ = చాలా కాలమునకు, ఆపత్ = పొందెను.

**సమాసములు :**

**అలమ్భితమాం :— అతిశయేన, అలమ్భి = అలమ్భితమాం.**

భైమీకరస్పర్శ ముదః :— భైమ్యాః, కరస్పర్శః =భైమీకరస్పర్శః, భైమీకరస్పర్శేన, ముత్ = భైమీకరస్పర్శముత్, తస్యాః = భైమీకర స్పర్శముదః.

కందర్పలక్షీకరణార్పితస్య :- కందర్పస్య, లక్షీకరణం = కందర్ప లక్షీకరణం. కందర్పలక్షీకరణాయార్పితః= కందర్పలక్షీకరణార్పితః తస్య = కందర్పలక్షీకరణార్పితస్య.

**భావము :**

పుష్పమాల వేయు సందర్భమున దమయన్తి కరస్పర్శముచే నేర్పడిన సంతోషముచేఁ గల్గినట్టి, నిశ్చలత్వమనంబడు సాత్త్విక భావవిశేషము, ఆ ప్రకారముగా నుండినది; ఏ ప్రకారముగా ఆ నలుడు శరాభ్యాస కాలమందు, మన్మథునకు గుఱిగానుంచఁ బడిన స్తమ్భమునకు నెపముగాఁ జాలకాలముండెనో. అనగా దమయన్తీ కరస్పర్శము కాగానే నలుడు నిశ్చలుడై స్తమ్భమువలె నేమియు తెలియని వాడాయెను. అందువలన నాతడు మన్మథ శరములకు గుఱిగానుంచఁబడిన స్తమ్భముగానాయెను. అనగా నాతడు మన్మథవికారమునకు గుఱియాయెనని యాశయము. 56

శ్లో॥ ఉత్సృజ్య సామ్రాజ్యమివాఽథభిక్షాం
తారుణ్యముల్లఙ్ఘ్య జరామివారాత్
తంచారుమాకారముపేక్ష్య యాతుం
నిజాం తనూమాదధిరే దిగిన్ద్రాః. 57

ప॥వి॥ ఉత్సృజ్య - సామ్రాజ్యమ్ - ఇవ - అథ - భిక్షాం - తారుణ్యమ్ - ఉల్లఙ్ఘ్య - జరామ్ — ఇవ - ఆరాత్ - తం - చారుమ్ - ఆకారమ్ - ఉపేక్ష్య - యాతుం - నిజాం - తనూమ్ - ఆదధిరే - దిగిన్ద్రాః.

అర్థము :- అథ = నలుని వరించిన పిదప, దిగిన్ద్రాః = ఇన్ద్రాది దిక్పాలురు, యాతుం = వెళ్ళుటకు, అనగా స్వర్గమునకు వెళ్ళుటకు, సామ్రాజ్యం = చక్రవర్తి స్థానమును, ఉత్సృజ్య = వదలి, భిక్షామివ = భిక్షనువలె, తారుణ్యం = యౌవనమును, ఉల్లఙ్ఘ్య = అతిక్రమించి, జరామివ = ముదుసలితనము వలె, తం = ఆ, చారుం = సుందరమైన, ఆకారం = నలుని యాకారమును, ఉపేక్ష్య = వదలి, నిజాం = తమవైన వేయి కన్నులు మున్నగు వానితోఁ గూడిన, తనూం = శరీరమును, ఆదధిరే = ధరించిరి.

**సమాసములు ;**

సామ్రాజ్యం :— సమ్రాజఃకర్మ = సామ్రాజ్యం, తత్ = సామ్రాజ్యం, దిగిన్ద్రాః :—దిశామిన్ద్రాః = దిగిన్ద్రాః.

భావము :

నలుని దమయన్తి వరించిన పిదప, నింద్రాది దిక్పాలురు స్వర్గమునకు వెళ్ళుటకై యా సభయందే నలుని సమీపమున సుందరమగు నలుని రూపమును వదలి తమసహస్ర నేత్రత్వాదులతోఁ గూడిన పూర్వ రూపములను ధరించిరి. (అది యెట్లున్నదనగా) చక్రవర్తి పదమును వదలి భిక్షను; యౌవనమును వదలి ముదుసలి తనమును, బొందినట్లున్నది. 57

శ్లో॥ మాయానలత్వం త్యజతో నిలీనైః
పూర్వైరహం పూర్వికయా మఘోనః.
భీమోద్భవాసాత్త్వికభావశోభా
దిదృక్షయే వాఽవిరభావినేత్రైః. 58

ప॥వి॥ మాయానలత్వం - త్యజతః - నిలీనైః - పూర్వైః - అహంపూర్వికయా - భీమోద్భవాసాత్త్వికభావశోభా దిదృక్షయా - ఇవ - ఆవిరభావి - నేత్రైః.

అర్థము :— మాయానలత్వం = అసత్య నలుని రూపమును, త్యజతః = విడుచుచున్న, మఘోనః = ఇంద్రునికి సంబంధించినవియును, నిలీనైః = గోప్యములుగా నుంచబడినవియును, పూర్వైః = స్వాభావిక దశయందున్నవియును, నేత్రైః = వేయి కన్నులచే, భీమోద్భవాసాత్త్వికభావశోభాదిదృక్షయాఇవ; భీమోద్భవా = దమయన్తి యొక్క, సాత్త్వికభావ = నలుని దేహ సంపర్కముచే నేర్పడిన పులకాది సాత్త్విక భావముల యొక్క, శోభా = సౌందర్యమును, దిదృక్షయాఇవ = చూడవలయుననుఁ గోరికచేతనో యనునట్లు, అహంపూర్వికయా = నేనుముందు నేను ముందు నను పోటీతో, ఆవిరభావి = స్పష్టములైనవి. అనగా నుదయించినవి.

సమానములు:

మాయానలత్వం :- మాయాకల్పితః, నలః = మాయానలః, మాయానలస్యభావః = మాయానలత్వం, తత్ = మాయానలత్వమ్.

అహంపూర్వికయా :— అహంపూర్వః, అహంపూర్వః, ఇత్యహమహమికా

యస్యాం క్రియాయాం, సా = అహంపూర్వికా, తయా = అహంపూర్వి
కయా.

భీమోద్భవాసాత్త్వికభావశోభాదిదృక్షయా :— భీమాత్, ఉద్భవః. యస్యాః
స్సా = భీమోద్భవా, భీమోద్భవాయాః, సాత్త్వికభావాః = భీమోద్భ
వాసాత్త్వికభావాః, భీమోద్భవా-సాత్త్వికభావానాం, శోభా = భీమోద్భ
వాసాత్త్వికభావశోభా. ద్రష్టుమిచ్ఛా = దిదృక్షా, భీమోద్భవాయాః,
సాత్త్వికభావశోభా దిదృక్షా = భీమోద్భవాసాత్త్విక భావశోభాదిదృక్షా.
తయా = భీమోద్భవాసాత్త్విక భావశోభాదిదృక్షయా.

భావము :

మాయా నలుని రూపము నింద్రుడు పరిత్యజించునపుడు, తత్పూర్వమా
తనియందు దాగినవియును, స్వభావస్థ యందుండినవియును నగు వేయికన్నులు
నలుని దేహ సంపర్కముచే, దమయంతియందుఁ బొడమిన, పులకములు మున్న
గు సాత్త్విక భావములను, నేను ముందు నేను ముందని, పోటీతో చూచుటకై
యావిర్భవించినవో యనునట్లుండినవి.

"స్తమ్భ ప్రలయరోమాఞ్చాః, స్వేదో వైవర్ణ్యవేపథూ
అశ్రు వైస్వర్యమిత్యష్టౌ సాత్త్వికాః పరికీర్తితాః॥"

అని చెప్పఁబడిన ప్రకారము స్తంభము, ప్రలయము, మున్నగునవి- యెనిమిది
సాత్త్విక భావములు. 58

శ్లో॥ గోత్రానుకూల్యప్రభవే వివాహే
తత్రాప్రతి కూల్యాదివగోత్ర శత్రుః
పురశ్చకార ప్రవరం వరం య
మాయన్ సఖాయం దదృశే తయా సః. 59

ప॥వి॥ గోత్రానుకూల్యప్రభవే - వివాహే - తత్రాప్రతికూల్యాత్ - ఇవ - గోత్ర
శత్రుః - పురః - చకార - ప్రవరం - వరం - యమ్ - ఆయన్ -
సఖాయం – దదృశే - తయా - సః.

అర్థము :— గోత్రానుకూల్యప్రభవే; గోత్ర = వంశము యొక్క, అనుకూల్య
= అభివృద్ధియందు, ప్రభవే = ప్రవర్తిల్లిన, వివాహే = వివాహమ్ము

నందు, తత్ప్రాతికూల్యాదివ; తత్= ఆ యభివృద్ధికి, ప్రాతికూల్యాదివ; = విరోధము వలన, ననగా గోత్రశత్రుత్వము వలన (పర్వత శత్రుత్వము వలన) ఆయన్ = స్వయంవరసభకు వచ్చిన, గోత్రశత్రుః = పర్వత శత్రువును (కులశత్రువును)నగు ఇంద్రుడు, యం = ఏ, ప్రవరం = శ్రేష్ఠుని, వరం = వరుని, (వివాహము చేసుకొను వానిని)సహాయం = స్నేహితునిగా ననగా దూత్యముచే సహాయము జేయువానినిగా, పురశ్చకార = పురస్కరించుకొనెనో, సః = ఆ నలుదే, తయా = దమయన్తిచే, దదృశే = చూడఁబడెను. దేవతలు నలుని రూపమును బరిత్యజించినచో, స్వరూపమునే స్వీకరింతురు. అప్పుడు సత్యనలుడే మిగులును.

కొందఱు ప్రవరుడను పేరుగల యొకని నింద్రుడు సహాయముగాఁ దీసికొనినట్లు చెప్పుదురు కాని యది భారతాదులయందుఁ జెప్పబడనందు వలన నిరాధారము.

**సమాసములు :**

గోత్రానుకూల్యప్రభవే :- అనుకూలస్య, భావః = ఆనుకూల్యం, గోత్రస్య, ఆనుకూల్యం = గోత్రానుకూల్యం, గోత్రానుకూల్యస్య, ప్రభవః = గోత్రానుకూల్యప్రభవః, తస్మిన్ = గోత్రానుకూల్యప్రభవే.

తత్ప్రాతికూల్యాత్ :- ప్రతికూలస్య, భావః = ప్రాతికూల్యం, తస్య, ప్రాతికూల్యం = తత్ప్రాతికూల్యం, తస్మాత్ = తత్ప్రాతికూల్యాత్.

గోత్రశత్రుః :- గోత్రాణాం, శత్రుః = గోత్రశత్రుః.

**భావము :**

వంశవృద్ధికై తలఁబెట్టఁబడిన వివాహమందు దానికి వ్యతిరేకముగా నుండుటవలననో యనునట్లు, గోత్రశత్రువు (వంశశత్రువు లేదా పర్వతశత్రువు) అయిన ఇంద్రుడు స్వయంవర సభకువచ్చి యెవనిని ద్యూతమునకై గైకొనెనో, ఆ నలుడే యా దమయన్తికిఁ గానఁబడెను. దేవతలందఱును నలరూపమును వీడి తమ తమ రూపములను స్వీకరింపగనే సత్యనలుడు పరిశేష న్యాయముతో స్వస్వరూపము తోడనే కానబడెనని యాశయము.

స్వకామ సమ్మోహ మహాన్ధకార
నిర్వాపమిచ్ఛన్నివ దీపికాభిః
ఉద్గత్వరీభి శ్ఛురితం వితేనే
నిజం వపుర్వాయుసఖః శిఖాభిః. **60**

కామ సమ్మోహ మహాన్ధకార నిర్వాపమ్ - ఇచ్ఛన్ - ఇవ - దీపి
- ఉద్గత్వరీభిః - ఛురితం - వితేనే - నిజం - వపుః - వాయు
- శిఖాభిః.

= పిదప, వాయుసఖః = వాయువునకు మిత్రుడైన యగ్ని,
ః = దీపములచే, స్వకామసమ్మోహమహాన్ధకార నిర్వాపమ్; స్వ =
కామ = కామముచే కేర్పడిన, సమ్మోహ = అజ్ఞానమనెడి,
కార = గొప్పచీకటికి, నిర్వాపం = శాంతిని, ఇచ్ఛన్నివ =
న్నాడోయనునట్లున్నవాడై, ఉద్గత్వరీభిః = పైకి వ్యాపించెడి,
= జ్వాలలతో, ఛురితం = వ్యాప్తమైనదానినిగా, నిజం =
, వపుః = శరీరమును, వితేనే = చేసెను.

:

సమ్మోహమహాన్ధకార నిర్వాపమ్ :- స్వస్యకామః = స్వకామః,
న, సమ్మోహః = స్వకామసమ్మోహః। స్వకామసమ్మోహ
మహాన్ధకారః = స్వకామసంమ్మోహ మహాన్ధకారః, స్వకామసమ్మో
న్ధకారస్య, నిర్వాపః = స్వకామసమ్మోహ మహాన్ధకారనిర్వాపః,
= స్వకామసమ్మోహమహాన్ధకారనిర్వాపమ్.
సఖః :— వాయోః, సఖా = వాయుసఖః.

కేవునకు జెలికాడగు నగ్ని: దీపములచే, తనకు గ్రామము వలన
మహాన్ధకారము నుపశమింపగోరెనో యనునట్లు తన శరీరమును
నట్టి జ్వాలలతో వ్యాపింపజేసికొనెను. దమయంతిని వరించుటకై
జేసిన ప్రయత్నమంతయు నజ్ఞాన విలసితముగా భావించి తచ్ఛా
కంటి తన జ్వాలలతో నా యజ్ఞానము దొలగించుకొనెనని యాశ

శ్లో॥ పత్యావృతే భీమజయా న వహ్నౌ
వహ్నా స్వమహ్నాయ నిజుహ్నువే యః.
జనాదపత్రప్య సహా సహాయః
తస్య ప్రకాశో௨భవద ప్రకాశః. **61**

ప॥వి॥ :- పత్యౌ - వృతే - భీమజయా - న - వహ్నౌ - అహ్నా - స్వమ్ - అహ్నాయ - నిజుహ్నువే - యః - జనాత్ - అపత్రస్య - సః - హా - సహాయః - తస్య - ప్రకాశః - అభవత్ - అప్రకాశః.

అర్థము :—భీమజయా=దమయన్తితో, పత్యౌ = భర్తయగు, వహ్నౌ = అగ్ని, నవృతేసతి = వరింపఁబడక పోగా, యః = ఏ ప్రకాశము, జనాత్= జనులవలన, అపత్రస్య = సిగ్గుపడి, అహ్నాయ = శీఘ్రముగా, అహ్నా = దివసముచే, స్వం = తనదగు స్వరూపమును. నిజుహ్నువే= దాచుకొనెనో, పగటిపూట అగ్ని ప్రకాశించదు కదా. తస్య = ఆ యగ్నికి, సహాయః = సహాయుడైన, యనగా ననుచరుడైన, సః = ఆ. ప్రకాశము, అప్రకాశః = ప్రకాశభిన్నముగా, అభవత్ = అయెను. హా = కష్టము. ప్రయత్నము విఫలమైనందువలన నగ్ని సిగ్గుచే, కాంతి రహితుడవలె నాయెనని యర్థము. లేదా - తస్య = ఆతని ప్రకాశమునకు, సహాయః = తన్నుదాచు కొనుటకు సహాయుడైన, సః = ఆ, అప్రకాశః = కాంతిరాహిత్యము, ప్రకాశః = మఱలరగిలింపఁ బడినదై, వహ్నౌ = అగ్ని, ఉద్గత్వరీభిః = పైకి వ్యాపించునట్టి, శిఖాభిః = జ్వాలలచే, ప్రకాశమానేసతి = ప్రజ్వరిల్లు చుండగా, అనుజ్వలః = (అనుచరుడగు ప్రకాశము) కాంతి రహితుడుగా, అభవత్ = ఆయెను. హా = కష్టము, స్వామితన్నుఁ బ్రకాశపఱుపగా భృత్యుడైన ప్రకాశము దానిని మఱుగుఁజేయుటకుఁజేసిన ప్రయత్నము వ్యర్థమైనదని యర్థము.

**సమాసములు :**

అప్రకాశః :— న, ప్రకాశః = అప్రకాశః.

**భావము :**

దమయన్తి (ప్రకాశమునకు) స్వామియగు నగ్నిని వరింపనందువలన నా

యగ్నికి ననుచరుడగు-ప్రకాశము జనులవలన సిగ్గునొంది, శీఘ్రముగా బగటిచే తన్నుమఱుగు పఱచుకొనెను పగటిపూట అగ్ని యొక్క ప్రకాశము తగ్గిపోవును గదా. ఆ యగ్నికి ననుచరుడైనయా, ప్రకాశము పగటినిబట్టి యప్రకాశమైనది కష్టము.

లేదా—ఆ ప్రకాశము తన్ను మఱచుకొనుటకు సహాయభూతుడైన య ప్రకాశము అగ్నిజ్వాలలచే ప్రకాశము (బయలుపడినది) గా నాయెను. అయ్యో! కష్టము.

మొదటి యర్థమునను సరించి—దమయన్తి యగ్నిని వరింపక పోవుట వలన నగ్నికిననుచరత్వము వహించిన ప్రకాశముగూడ సిగ్గుపడినదై తన్ను ప్రకాశితముగా (బయటపడిన దానినిగా) జేయలేదు. ప్రభువునకు మానభంగము గల్గినపుడు, అనుచరుడు బయటపడక (తేజముతగ్గి) యుండుట తగినది. పగటి మహిమవలన నగ్ని ప్రకాశము తగ్గియుండునుగదా.

రెండవ యర్థము ననుసరించి - ఎప్పుడు, అగ్నిదేవుడు, తన వాస్తవ రూపమును ధరించి, బయటపడెనో, అప్పుడు అతనికి సహాయుడగు ప్రకాశము అతనిని దాచుటకుజేయు ప్రయత్నము వ్యర్థమేయైనదని యాశయము. 61

శ్లో॥ సదణ్డమాలక్తకనేత్రచణ్డం
తమఃకిరంకాయమథ త్తకాలః.
తత్కాలమన్తః కరణంనృపాణా
మధ్యాసితుంకోప ఇవోపసన్నః. 62

ప॥వి॥ సదణ్డమ్ - అలక్తకనేత్రచణ్డం - తమఃకిరం - కాయమ్ - అధత్త - కాలః - తత్కాలమ్ - అన్తఃకరణం - నృపాణామ్ - అధ్యాసితుం - కోపః - ఇవ - ఉపసన్నః.

అర్థము :- అథ = పిదప, కాలః = యముడు, తత్కాలం = ఆ సమయమున, నృపాణాం = రాజులయొక్క, అంతఃకరణం = మనస్సును, అధ్యాసితుం = అధిష్టించుటకు, ఉపసన్నః = ఉద్భవించిన, కోపఇవ = దమయన్తి గావించిన యనాదరమువలని కోపమువలె, సదణ్డం = దణ్డము నుజేత వహించిన, అలక్తకనేత్రచణ్డం; ఆలక్తక = ఎఱ్ఱనైన, నేత్ర

= కన్నులచే, చణ్డం = క్రూరమైన, తమఃకిరం = చీకటినివెదజల్లెడి. కాయం = శరీరమును, అధత్త = ధరించెను.

**సమాసములు :**

సదణ్డం :—దణ్డేన. సహవర్తత ఇతి = సదణ్డః, తమ్ = సదణ్డమ్.

ఆలక్తికనేత్రచణ్డం :—ఆలక్తకనేత్రాభ్యాం, చణ్డః = ఆలక్తకనేత్ర చణ్డః, తమ్ = ఆలక్తకనేత్ర చణ్డమ్.

తమఃకిరం :- తమఃకిరతీతి = తమఃకిరః, తమ్ = తమఃకిరం.

తత్కాలమ్ :- సచాసౌ, కాలశ్చ = తత్కాలః, తమ్ = తత్కాలమ్.

**భావము :**

తర్వాత యముడు, ఆ స్వయంవర కాలమందు నారాజుల హృదయమున నెలకొనుటకై, యుద్భవించినట్టి. దమయన్తీ నిరాదరణము వలని క్రోధమో యనునట్లు, దండమునుఁ జేతబూని, యెఱ్ఱని నేత్రములతోఁ గ్రూరమైనదియు, చీకటిని వెదజల్లునదియును అనగా— చీకటివలె నల్లనైనదియునగు శరీరమును ధరించెను. 62

శ్లో॥ దృగ్గోచరోఽభూదథ చిత్రగుప్తః
కాయస్థ ఉచ్చైర్గుణ ఏతదీయః.
ఊర్ధ్వఞ్చ పత్రస్య మషీదఏకో
మషేర్దధచ్చోపరిపత్రమన్యః. **63**

ప॥వి॥ :- దృగ్గోచరః - అభూత్ - అథ - చిత్రగుప్తః - కాయస్థః - ఉచ్చైః - గుణః - ఏతదీయః - ఊర్ధ్వం - చ - పత్రస్య - మషీదః - ఏకః - మషేః - దధత్ - చ - ఉపరి - ప్రతమ్ - అన్యః.

అర్థము :— అథ = పిదప, యముడు తన రూపమును బ్రకటించిన పిదప, ఏతదీయః = ఈ యమునకు సంబంధించిన, ఉచ్చైః = గొప్ప, గుణః ముఖ్య సేవకుడైన, చిత్రగుప్తః=చిత్రగుప్తుడను, కాయస్థః = లెక్కను వ్రాయునట్టివాడు, అనగా కాయస్థ జాతికిఁ చెందిన వ్యక్తి, దృగ్గోచరః = దృష్టికి విషయమైనవాడుగా, అభూత్ = ఆయెను. పక్షాంతరమున-చిత్ర గుప్తః; చిత్ర = ఆశ్చర్యకరముగా, గుప్తః = పూర్వము మఱుగు

పఱువబడిన, కాయస్థః = శరీరమందున్న, ఏతదీయః = కాలునికి సంబంధించిన, ఉచ్చైః = గొప్పదైన, గుణః = నీలగుణము, దృగ్గోచరః = నేత్రములకు విషయమైనదిగా, అభూత్ = ఆయెను, ఏకశ్చ = చిత్రగుప్త నీలగుణములలో నొక్కడైన చిత్రగుప్తుడో, పత్రస్య = కాగితమునకు, ఊర్ధ్వం = పైభాగమున, మషీదః = నల్లని సిరాను నిచ్చువాడుగా, ననగా మసిరూపమందున్న లిపిని వ్రాయువాడుగా నుండెను. అన్యశ్చ = ఆ రెంటిలో మఱియొకడైన నీలగుణమో, మషేః=సిరాకు, ఉపరి = పైన, ననగా మసికంటెను నేననగా సిరాకంటెను నేను నల్లనివాడనే" యని, పత్రం = కాగితమను నాధారమును, దధత్ = ధరించుచునన్నదై, అభూత్ = ఆయెను.

వి :- ఇచ్చట "మషేరు పరిపత్రం" అని మసికి అనగా సిరాకు, పైన కాగితమని చెప్పుటవలన విరోధము. సిరా క్రింద కాగితముండును గాని సిరా పైన కాగితము ఉండదు గదా! కాన విరోధాభాసాలఙ్కారము. సిరాను మించిన నల్లదనము గలవాడని యర్థము చెప్పుటచే బరిహారము.

**సమాసములు :**

దృగ్గోచరః :- దృశోః, గోచరః = దృగ్గోచరః.

చిత్రగుప్తః :- చిత్రం, గుప్తః = చిత్రగుప్తః.

ఏతదీయః :- ఏతస్య, అయం = ఏతదీయః.

**భావము :**

ఇట్లు యముడు తన రూపమును బ్రకటించిన పిదప నతని యనుచరుడగు చిత్రగుప్తుడును బ్రత్యక్షమాయెను. ఇతడు లెక్కలు వ్రాయునట్టి కాయస్థ జాతికి జెందినవాడు.

పక్షాన్తరమున :- ఆశ్చర్యకరముగా పూర్వము మఱుగు పఱుపబడినదై, శరీరమందున్నదై, యీ యమునికి సంబంధించిన, గొప్పదగు నీలగుణము కన్నులకు గోచరించినది. ఆ చిత్రగుప్త నీలగుణములలో నొక్కడైన చిత్రగుప్తుడు కాగితమునకు పైన మసిరూపమున నున్న నల్లసిరాతో లిపిని వ్రాయువాడు. అందులో మఱియొకటైన నీలగుణము ఆ సిరాకు పైన పత్రమును ధరించునదిగా నుండెను. సిరాకు పైన పత్రముండదు కదా, పత్రము పైననే

సిరా యుండవలయును గాన నిది విరుద్ధము. కాని యా నీలగుణము పత్రముపైని సిరాను మించిన నల్లదనము గల్గియుండినదని యాశయము. 63

శ్లో॥ తస్యాం మనోబంధ విమోచనస్య
కృతస్య తత్కాల మివ ప్రచేతాః.
పాశం దధానః కరబద్ధవాసం
విభుర్బ భావాప్యమవాప్య దేహమ్. **64**

ప॥వి॥ తస్యాం - మనోబంధవిమోచనస్య - కృతస్య - తత్కాలమ్ - ఇవ - ప్రచేతాః - పాశం - దధానః - కరబద్ధవాసం - విభుః - బభౌ - ఆప్యమ్ - అవాప్య - దేహమ్.

అర్థము :— విభుః = ప్రభువైన, ప్రచేతాః = వరుణుడు, తత్కాలం = ఆ కాలముననగా నలుని వరించుకాలమునందు, తస్యాం = ఆ దమయన్తి విషయమునందు, కృతస్య = చేయఁబడిన, మనోబంధ విమోచనస్య; మనోబంధ = మనస్సునకేర్పడిన బంధమును, విమోచనస్య = విడిపించుటకు సంబంధించినదియో యనునట్లున్నదై, కరబద్ధవాసం; కర = హస్తమందు, బద్ధ = కట్టబడిన, వాసం = నివాసముగల, పాశం = బంధనసాధనమగు త్రాటిని, పాశాయుధమును, దధానస్సన్= ధరించుచున్నవాడై, ఆప్యం = జలవికారమైన, దేహం = దేహమును, అవాప్య = పొంది, బభౌ = ప్రకాశించెను.

వి:— మనోబంధ విమోచనమునకు సంబంధించినది కాకపోయినను, సంబంధించినదిగాఁజెప్పుట వలన నుత్ప్రేక్షాలఙ్కారము. ఇవశబ్దప్రయోగముచేనది వాచ్యము.

సమాసములు :

మనోబంధ విమోచనస్య :— మనసఃబంధః = మనోబంధః, మనోబంధస్య, విమోచనం = మనోబంధ విమోచనం, తస్య = మనోబంధ విమోచనస్య.

తత్కాలమ్ :— సచాసౌకాలశ్చ = తత్కాలః, తమ్ = తత్కాలమ్.

కరబద్ధవాసం :— కరేబద్ధః = కరబద్ధః, కరబద్ధః, వాసః, యస్యసః = కరబద్ధవాసః తమ్ = కరబద్ధవాసమ్.

**భావము :**

ప్రభువైన వరుణుడా కాలమున, దమయంతి విషయమున పాశముచే తాఁజేసిన మనోబంధమును విడిపించుటకై యనగా, దమయంతి తన్ను వరించుటకై తొలుత నామె మనస్సునితరులవంక పోనీయక బంధించెను. ఆమె నలుని వరించిన పిదప నా మనోబంధనమును తక్షణమే విడిపించుటకై తెచ్చినదో యనునట్లు కనబడు పాశాయుధమును ధరించినవాడై జలరూపమైన తన శరీరమును ధరించెను. అనగా వరుణుడు స్వయంవరమునకుఁబూర్వము దమయన్తి చిత్తమును పాశాయుధముతో బంధించెను. ఆమె నలునివరించిన వెంటనే దానిని విడిపించి, నలునిరూపమును, వదలి పాశాయుధముతో తన రూపమును ధరించెనని యాశయము. 64

శ్లో॥ సహాద్వితీయః స్త్రియమభ్యుపేయా
దేవం సదుర్బుధ్యనయోపదేశం.
అన్యాం సభార్యః కథమృచ్ఛతీతి
జలాధిపోఽభూదసహాయ ఏవ. 65

ప॥వి॥ సహ - ద్వితీయః - స్త్రియమ్ - అభ్యుపేయాత్ - ఏవం - సః - దుర్బుధ్య - నయోపదేశం - అన్యాం - సభార్యః - కథమ్ - ఋచ్ఛతి - ఇతి - జలాధిపః - అభూత్ - అసహాయః - ఏవ.

అర్థము :—జలాధిపః = ఉదకములకు ప్రభువును ("లడయోరభేదః) యను న్యాయమునసుసరించి, జడులకు నాయకుడును) నగు ఆ వరుణుండు, సహద్వితీయః = రెండవ సహచరునితోఁ గూడినవాడై, అభ్యుపేయాత్ = వెళ్ళవలయునను ఏవం = ఇట్లు, నయోపదేశం = నీతివాక్యమును, సభార్యస్సన్ = భార్యతోగూడినవాడై, అన్యాం = మఱియొకస్త్రీని, కథం = ఎట్లు, ఋచ్ఛతి = పొందును. ఇతి = ఇట్లు, దుర్బుధ్య = సహద్వితీయ శబ్దమున ప్రయోగింపబడిన ద్వితీయ శబ్దమునకు, భార్య యను విపరీతార్థమును గ్రహించి, అసహాయఏవ = సహాయము లేని

వాడుగనే, అఘాత్ = ఆయెను. అనగా భార్యాసహితుడగనే యాయెను. దమయన్తినిఁ బొందఁగోరినపుడు సహాయముతోడనే వెళ్ళవలయునను నీతినుల్లంఘించి, తన భార్యను లెక్కింపనందువలన నిప్పుడా భార్యయు, లభింపక పోయినది. అయ్యో! వరుణుని దుర్బుద్ధి! యనియాశయము. అనగా నొకస్త్రీని వరించుటకై వెళ్ళునప్పుడొంటరిగా వెళ్ళరాదు, అట్లు వెళ్ళిచచో కొన్ని యిబ్బందులు కలుగవచ్చును. కాన రెండవ వ్యక్తిని దోడనుంచుకొని వెళ్ళవలయునని నీతియొక్క యర్థమును వరుణుడు గ్రహింపలేదు. ఆతడు తనకు సహచరియగు భార్యను రెండవ వ్యక్తిగాఁ దీసికొని పోవచ్చును. కాని మఱియొక స్త్రీని వరించుటకై వెళ్ళువాడు భార్యతో వెళ్ళుటయనునది యనుచితమని భావించి యాతడామెను లెక్కింపక దమయంతిని వరింప వెళ్ళెను. కాని దమయంతి వరింపనందు వలన, తన భార్యను సహాయముగా తీసికొని రానందు వలనను నతడు చివరకు అసహాయుడాయెనని యర్థము.

## సమాసములు :-

సహద్వితీయః :— సహద్వితీయా, యస్యసః = సహద్వితీయః.

నయోపదేశమ్ :— నయస్య, ఉపదేశః = నయోపదేశః, తమ్ = నయోపదేశమ్.

సభార్యః :- భార్యయా, సహవర్తతఇతి = సభార్యః.

జలాధిపః :- జలానామధిపః = జలాధిపః.

అసహాయః :- అవిద్యమానః, సహాయః, యస్యసః = అసహాయః.

## భావము :

జలాధిపుడును (జడులకు నాయకుడగు) వరుణుడు "స్త్రీ యొద్దకు వెళ్ళునపుడు మఱియొక వ్యక్తితోడ వెళ్ళవలయునను" నీతియొక్క యర్థమును దమయంతి విషయమున విపరీతముగా గ్రహించి "దమయంతి కడకు తాను పోవుచున్నాడు కాన మఱియొక వ్యక్తియైన తన భార్యను వెంటబెట్టుకొని పోలేదు, ఆతడు "లడయోరభేదః" అను న్యాయముచే, జడులకు నాయకుడు గాన నటువంటి విపరీతార్థమును గ్రహించెను. అందువలన తానొంటరిగా వెళ్ళి,

దమయంతి చేత నిరాకరింపఁబడిన కీరంచే, తొలుత తిరస్కరింపఁబడిన తన భార్యయు, దుర్లభమై పోయినందువలన ససహాయుడే యాయెనని యాశయము. ౬౫

శ్లో॥ దేవ్యాఽపి దివ్యాస్వ తనుః ప్రకాశీ
చక్రేముదశ్చక్ర భృతః సృజన్త్యా.
అనిహ్నుతై స్తామధీర్య చిహ్నై
స్తద్వాచి బాలా శిథిలాద్భుతాఽఽభూత్. 66

ప॥వి॥ ;— దేవ్యా - అపి - దివ్యా - స్వతనుః - ప్రకాశీచక్రే - ముదః - చక్రభృతః - సృజన్త్యా - అనిహ్నుతైః - తామ్ - అవధీర్య - చిహ్నైః - తద్వాచి - బాలా - శిథిలాద్భు తా - అభూత్.

అర్థము :- అథ = ఇంద్రాదులు తమ స్వరూపములు ధరించిన తరువాత, చక్ర భృతః = ఆకాశమందున్న విష్ణువునకు, ముదః = సంతోషములను, సృజన్త్యా = కల్పించుచున్న, దేవ్యాఽపి = సరస్వతీదేవిచేతను, దివ్యా = దేవసంబంధము గల, స్వతనుః = తన శరీరము, ప్రకాశీ చక్రే = ప్రకటింపఁ బడినది. అనగా సరస్వతీదేవి మానవ వేషమును వదలి స్వకీయమగు దేవ వేషమును ధరించినదని యర్థము. తదా = అప్పుడు, బాలా = దమయంతి, అనిహ్నుతైః = ప్రకటింపఁబడిన, చిహ్నైః = గుఱుతులతో ననగా వీణా పుస్తకములతో, తాం = ఆమెను, అవధార్య = నిశ్చయించుకొని, తద్వాచి = ఆ శ్లేషను వక్రోక్తిని వ్యక్తపఱచునామె యొక్క వచనమునందు, శిథిలాద్భుతా; శిథిల = సడలిన, అద్భుతా = ఆశ్చర్యము కలదిగా, అభూత్ = ఆయెను. తొలుత మానవాకృతితో నంత వాగ్విజృంభణమును గావించినందువలన నాశ్చర్యము చెందియుండినది. పిదప దేవతగాఁ దెలిసికొని దేవతలయందంతటి శక్తి యుండుటలో నాశ్చర్యమేమియుని భావించి దానిని సడలించుకొనినదని యర్థము.

సమాసములు :

స్వతనుః :- స్వస్యాః, తనుః = స్వతనుః.
చక్రభృతః :- చక్రం, బిభర్తీతి = చక్రభృత్, తస్య = చక్రభృతః.

అనిహ్నుతైః :- ననిహ్నుతాని - అనిహ్నుతాని, తైః = అనిహ్నుతైః.
తద్వాచి :- తస్యాః, వాక్ = తద్వాక్, తస్యాం = తద్వాచి.
శిథిలాద్భుతా :- శిథిలమద్భుతం, యస్యాస్సా = శిథిలాద్భుతా.

**భావము :**

ఇంద్రాది దిక్పతులు నలుని వేషమును వదలి తమ తమ స్వరూపములను బొందిరి. తర్వాత తన్ను పంపిన విష్ణువు ఆకసమునందుండి గమనించుచుండెను. ఆతడు చెప్పిన విధముగా కార్యములను నిర్వహించి యాతనికి సంతోషమును గూర్చుచున్న సరస్వతీదేవియు వీణను, ధవళవస్త్రమును, పుస్తకము ధరించినదై తన స్వరూపమును ధరించినది. అప్పుడు పై చిహ్నములతో నామెను నిశ్చయించుకొని, తొలుత నామె ప్రదర్శించిన వాక్కౌశలమునకు నాశ్చర్యము వహించి యుండి, పిదప నామె దేవరూపమును ధరించుటవలన, తొలుత తనకు గల్గిన యాశ్చర్యమును సడలించుకొనినది. ఏలయనగా— తొలుత మానవాకృతితో నామె గావించిన లోకోత్తర ప్రతిభను వెల్లడించు నామె వాగ్విజృంభణము మిక్కిలి యాశ్చర్యకరమైనది. పిదప నామె తన వాస్తవరూపమును ప్రకటింపగనే, నామె దేవతయని తెలిసినది. అట్లు దేవతగా నామె గావించిన వాగ్విజృంభణములో— నాశ్చర్యమేమి యున్నదని భావించి యా యాశ్చర్యమును సడలించుకొనినది. దేవతల శక్తి యమేయము గదా. 66

శ్లో॥ విలోకకే నాయకమేలకేఽస్మిన్
రూపాన్యథాకౌతుకదర్శిభి స్తైః.
బాధాబతేంద్రాది భిరిన్ద్రజాల
విద్యా విదాం వృత్తి వధాద్ వ్యథాయి. 67

ప॥వి॥ విలోకకే - నాయకమేలకే - అస్మిన్ - రూపాన్యథా - కౌతుకదర్శిభిః - తైః - బాధా - బత - ఇంద్రాదిభిః - ఇంద్రజాల విద్యావిదాం - వృత్తివధాత్ - వ్యథాయి.

అర్థము :- అస్మిన్ = ఎదుటనున్న, నాయకమేలకే = రాజుల సమూహము, విలోకకేసతి = చూచుచుండగా, రూపాన్యథా కౌతుకదర్శిభిః; రూప = రూపములకు, అన్యథా = నానాత్వమనెడి, కౌతుకదర్శిభిః; కౌతుక =

వినోదమును, దర్శిభిః = చూచుచున్నట్టి, తైః = ఇంద్రాదులచే, ఇంద్ర జాల విద్యావిదాం = ఇంద్రజాల విద్యను తెలిసినవారికి, వృత్తివధాత్; వృత్తి = జీవనోపాయమునకు, వధాత్ = భంగము గలుగుటవలన, బాధా = బాధ, వ్యధాయి = చేయబడినది. బత = కష్టము. ఇంద్రా దులు గావించుచుండిన తమ తమ రూపములను జూచుచున్న రాజులకు ఇతరుల యింద్రజాలములయందు నభిరుచి గలుగనందువలన, స్వయం వర సభకు వచ్చిన— ఐంద్రజాలికులకు జీవనభంగి మేర్పడినది. ఇది ఆశ్చర్యము. ఇదియే దేవమాయ.

## సమాసములు:

నాయకమేలకే :- నాయకానాం, మేలకః = నాయకమేలకః, తస్మిన్ = నాయకమేలకే.

రూపాన్యథాకౌతుకదర్శిభిః :— రూపస్య, అన్యథా = రూపాన్యథా, రూపాన్యథైవ, కౌతుకం = రూపాన్యథాకౌతుకం. రూపాన్యథాకౌతుకం, పశ్యన్తీతి = రూపాన్యథాకౌతుకదర్శినః, తైః = రూపాన్యథాకౌతుక దర్శిభిః.

ఇంద్రాదిభిః :- ఇంద్రః, ఆదిః, యేషాంతే = ఇంద్రాదయః, తైః = ఇంద్రాదిభిః.

ఇంద్రజాల విద్యావిదాం :- ఇంద్రజాలమితివిద్యా = ఇంద్రజాలవిద్యా ఇంద్రజాలవిద్యాం, విదన్తీతి = ఇంద్రజాలవిద్యావిదః, తేషాం = ఇంద్ర జాలవిద్యావిదాం.

వృత్తివధాత్ :- వృత్తేః, వధః = వృత్తివధః, తస్మాత్ = వృత్తి వధాత్.

## భావము :

ఎదుటనున్న యీ రాజ సమూహము చూచుచుండగా పెక్కు రూపము లను జూపుచున్న యింద్రాది దిక్పతులచే, తమ జీవికకు భంగమేర్పడుటవలన నైంద్రజాలికులకు బాధ యేర్పడినది. అనగా నింద్రాదులు వివిధ రూపములను ధరించుటయే యింద్రజాలముగా నుండుటవలన దానినే యచ్చటికి విచ్చేసియున్న

రాజులు చూచుచుండిరి. అచ్చటికి వచ్చిన ఐంద్రజాలికులకు నవకాశము లేక పోవుటవలన వారికి వృత్తిభంగము కల్గినదని యాశయము. 67

శ్లో॥ విలోక్య తావాప్తదురాపకామౌ
పరస్పర ప్రేమరసాభిరామౌ
అథప్రభుః ప్రీతమనా బభాషే
జామ్బూనదోర్వీధర సార్వభౌమః. 68

ప॥వి॥ విలోక్య – తౌ ఆప్తదురాపకామౌ - పరస్పరప్రేమరసాభిరామౌ - అథ - ప్రభుః - ప్రీతమానాః - బభాషే - జామ్బూనదోర్వీధర సార్వభౌమః.

అర్థము .- అథ = పిదప, జామ్బూనదోర్వీధర సార్వభౌమః; జామ్బూనద = సువర్ణమయమైన, ఉర్వీధర = పర్వతమునకు, సార్వభౌమః= సర్వభూమికి నధికారము వహించిన, ప్రభుః = ప్రభువైన యింద్రుడు, ఆప్తదురాపకామౌ; ఆప్త = పొందబడిన, దురాప్త = దుర్లభమైన, కామౌ = కోరిక గల్గిన, పరస్పరప్రేమరసాభిరామౌ; పరస్పర = ఒండొరులయొక్క, ప్రేమరస = ప్రీతిరసముచే, అభిరామౌ = మనోహరులైన, తౌ = ఆ దమయంతీ నలులను, విలోక్య = చూచి, ప్రీతమనాః = సంతుష్ట మనస్కుడై, బభాషే = మాట్లాడెను.

సమాసములు :

ఆప్తదురాపకామౌ :— దుఃఖేన, ఆప్తుం శక్యః = దురాపః. అప్తః, దురాపః, కామః, యయోస్తౌ = ఆప్తదురాపకామౌ.

పరస్పరప్రేమరసాభిరామౌ :- ప్రేమఏవరసః = ప్రేమరసః, పరస్పరయోః, ప్రేమరసః = పరస్పరప్రేమరసః. పరస్పరప్రేమరసేన, అభిరామౌ = పరస్పరప్రేమరసాభిరామౌ.

ప్రీతమనాః – ప్రీతం, మనః, యస్యసః = ప్రీతమనాః.

జామ్బూనదోర్వీధరసార్వభౌమః :— జామ్బూనదస్య, వికారః = జామ్బూనదః. జామ్బూనదశ్చాసౌ, ఉర్వీధరశ్చ=జామ్బూనదోర్వీధరః.

సర్వభూమేరధ్యక్షః = సార్వభౌమః, జామ్బూనదోర్వీధరస్య, సార్వభౌమః = జామ్బూనదోర్వీధరసార్వభౌమః.

భావము :

తర్వాత, సుమేరు పర్వతమునకు సార్వభౌముడైన యింద్రుడు, ఒండొరులను బొందుటయను దుర్లభమగు కోరికలను సాధించినటువంటివారును, నొండొరులపై ప్రేమరసముచే వెలయునట్టి వారునుఅగు నా దమయంతీ నలులను వీక్షించి సంతుష్ట చిత్తుడై మాట్లాడ దొడగెను.

శ్లో॥ వైదర్భి! దత్తస్తవ తావదేష
వరో దురాపః పృథివీశ ఏవ.
దూత్యం తు యత్త్వం కృతవానమాయం
నల! ప్రసాదస్త్వయి తన్మయాఽయమ్. 69

ప॥వి॥ వైదర్భి – దత్తః – తవ – తావత్ – ఏషః – వరః – దురాపః – పృథివీశః – ఏవ – దూత్యం – తు – యత్ – త్వం – కృతవాన్ – అమాయం – నల! – ప్రసాదః – త్వయి – తత్ – మయా – అయం.

అర్థము :- హే వైదర్భి = ఓ దమయన్తీ! తవతావత్ = నీకో, ఏషః = ఈ, పృథివీశఏవ = నలభూపతియే, దురాపః = (మా యనుగ్రహము లేక) దుర్లభుడు. ఏషః = ఈ, వరః = వరము, (దుర్లభుడగు నలుడు లభించుట యను వరము) దత్తః = మొత్తముమీద నీయబడినది, ఇక మీ యుభయులకును సమానమైన మఱియొక వరముఁ గూడ నీయఁబడగల దని యర్థము. హే నల! ఓ నలమహారాజా! త్వంతు = నీవో, యత్= ఎందువలన, అమాయం = కపటములేని, దూత్యం = దూత్యమును, కృతవాన్ = చేసితివో, తత్ = అందువలన, త్వయి = నీ విషయమున మయా = నాచే, అయం = ఈ చెప్పఁబడగల, ప్రసాదః = అనుగ్రహము, వరః = వరముగా, దత్తః = ఈయఁబడినది.

సమాసములు :

హే వైదర్భి : — విదర్భేషు, భవా = వైదర్భీ, తస్యాః, సమ్బుద్ధిః = హే వైదర్భి.

దురాపః :— దు ఖేన, ఆప్తుం, శక్యః = దురాపః.
పృథివీశః :— పృథివ్యాః ఈశః = పృథివీశః.
దూత్యం :— దూతస్య, కర్మ = దౌత్యం, తత్ = దూత్యం.
అమాయం :— అవిద్యమానా మాయా యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = అమాయం.

**భావము :**

ఓ దమయన్తీ! నీకు ఈ నలమహారాజు దుర్లభుడు. మాయనుగ్రహము లేనిచో నీతడు లభించియుండడు. కాన నతడు నీకు లభించుటయేయొక వరము. ఇది దమయంతి వరకు మొత్తముపై నొసంగిన వరము. ఉభయ సాధారణముగా వరాన్తర ముండగలదు. ఓ నలమహారాజా! నీవు నిష్కపటముగా దూత్యము వహించినందులకు నీ యెడ చెప్పఁబోవు ప్రకారము ప్రసాదమీయఁబడినది. అనగా నిన్ననుగ్రహించుచున్నానని యాశయము. 69

శ్లో॥ ప్రత్యక్షలక్ష్యా మవలమ్బ్య మూర్తిం
హుతాని యజ్ఞేషు తవోపభోక్ష్యే.
సంశేరతేఽస్మాభిర వీక్ష్యభుక్తం
మఖం హి మన్త్రాధిక దేవభావే. **70**

ప॥వి॥ ప్రత్యక్షలక్ష్యామ్ - అవలమ్బ్య - మూర్తిం - హుతాని - యజ్ఞేషు - తవ - ఉపభోక్ష్యే - సంశేరతే - అస్మాభిః - అవీక్ష్య - భుక్తం - మఖం - హి - మన్త్రాధికదేవభావే.

అర్థము :- హే నల = ఓ నలుడా! తవ = నీయొక్క, యజ్ఞేషు = యాగములయందు, ప్రత్యక్షలక్ష్యాం = ప్రత్యక్షముతోఁ జూడదగిన, మూర్తిం = శరీరమును, అవలమ్బ్య = పొంది, హుతాని=హోమము గావింపబడిన హవిస్సులను, ఉపభోక్ష్యే = భుజింతును. హి = ఏలయనగా, మఖం = యాగమును, అస్మాభిః = మాచే, భుక్తం = భుజింపఁబడినదిగా, అవీక్ష్య = చూడక, మన్త్రాధికదేవభావే; మన్త్ర = శబ్దస్వరూపమైన మంత్రమనకంటెఁ అధిక = వేరైన, దేవభావే = దేవత యున్నదనెడి విషయమున (జనాః = జనులు) సంశేరతే = సందేహించుచున్నారు.

దేవతకు శరీరము లేదని మీమాంసక సిద్ధాంతము. ఆ సందేహమును దొలగించుటకై నీకు శరీరమునుఁ జూపగలను. దానిచే నీకాసంశయము నివృత్తిఁ జెందునని యర్థము,

**సమాసములు :**

ప్రత్యక్షలక్ష్యామ్ :- ప్రత్యక్షేణ, లక్ష్యా = ప్రత్యక్షలక్ష్యా, తామ్ = ప్రత్యక్షలక్ష్యాం.

మన్త్రాధికదేవభావే :- మన్త్రాత్, అధికః = మన్త్రాధికః, మన్త్రాధికశ్చాసౌ దేవశ్చ = మన్త్రాధికదేవః, మన్త్రాధికదేవస్యభావః = మన్త్రాధికదేవభావః, తస్మిన్ = మన్త్రాధికదేవభావే.

**భావము ;**

ఓ నలమహారాజా! నీవు గావించు యజ్ఞముల యందు ప్రత్యక్షముతోఁ జూడగల దేహమును ధరించి హవిస్సులను భుజింతును. ఏలయనగా దేవతలకు శరీరము లేదనియు, మన్త్రములే వారికి శరీరమనియు మీమాంసకుల సిద్ధాంతము. కాన దేవతలకు శరీరమున్నదా లేదాయను సంశయమునుఁ దొలగించుటకై నేను నీకు యాగములయందు నా శరీరమునుఁ జూపగలను. 70

**శ్లో॥ భవానపి త్వద్దయితాఽపి శేషే**
**సాయుజ్య మాసాదయతం శివాభ్యాం.**
**ప్రేత్యాఽస్మికీదృగ్భవితాస్మి చిన్తా**
**సన్తాపమన్తస్తనుతే హి జన్తోః. 71**

ప॥వి॥ భవాన్ - అపి - త్వద్దయితా - అపి - శేషే - సాయుజ్యమ్ - ఆసాదయతం - శివాభ్యాం - ప్రేత్య - అస్మి - కీదృక్ - భవితా - అస్మి - చింతా - సంతాపమ్ - అంతః - తనుతే - హి - జంతోః.

అర్థము :- భవానపి = నీవును, త్వద్దయితాఽపి = నీ భార్యయగు దమయన్తియు, శేషే = ఆయుస్సు పరిసమాప్తి చెందినపుడు, శివాభ్యాం = పార్వతీపరమేశ్వరులతో, సాయుజ్యం = ఐక్యమును ననగా వారి తాదాత్మ్యమును, ఆసాదయతం = పొందుదురుగాక, హి = ఏలయనగా, ప్రేత్య = లోకాన్తరమునుఁబొంది, అస్మి = నేను, కీదృక్ = ఎట్లు,

భవితాస్మి = కాగలను, ఇతి = అను. చింతా = చింత, జంతోః = ప్రాణియొక్క, అంతః = మనస్సునందు, సన్తాపం = సంతాపమును, తనుతే = చేయుచున్నది. ఆ సంశయముం దొలగుటకై యిది చెప్పబడినది.

సమాసములు ;

త్వద్దయితా :- తవ, దయితా = త్వద్దయితా.

సాయుజ్యం :- సయుజః, భావః = సాయుజ్యం, తత్ = సాయుజ్యం.

శివాభ్యాం ;- శివాచ, శివశ్చ = శివౌ, తాభ్యాం = శివాభ్యాం.

భావము ;

నీవును నీ ప్రియురాలగు దమయన్తియు ఆయుస్సు పరిసమాప్తి కాగానే పార్వతీ పరమేశ్వరులతో నైక్యము పొందుదురుగాక. ఏలయనగా -శరీరమును బరిత్యజించి లోకాన్తరమునకు బోవునట్టి జీవుడు- తాను ఏమి కాగలనని చింతతో లోన సంతాపము నొందుచుండును. అట్టి సంతాపము లేకయుండుటకై మీ కుభయులకును సాధారణమైన వరముగా నిది యొసంగబడినదని యాశయము.

శ్లో॥ తవోపవారాణసి నామ చిహ్నం
వాసాయ పారేఽసి పురం పురాస్తే.
నిర్యాతుమిచ్ఛోరపి తన్న భైమీ
సమ్భోగసజ్జోచభియాఽధికాశి. 72

ప॥వి॥ :- తవ - ఉపవారణాసి - నామచిహ్నం - వాసాయ - పారేఽసి - పురం - పురా - ఆస్తే - నిర్యాతుమ్ - ఇచ్ఛోః - అపి - తత్ - న - భైమీ సమ్భోగసజ్జోచభియా - అధికాశి.

అర్థము :- కిఞ్చ = మఱియు, తవ = నీకు, వాసాయ = నివాసమునకై, ఉపవారాణసి = వారాణసీ క్షేత్రమునకు ననగా కాశీ క్షేత్రమునకు సమీపమున, పారేఽసి = అసీనదీతీరమునందు, నామచిహ్నం = నీ పేరుతో గుర్తింపఁబడిన, పురం = నలపురము, పురా = రాబోవు కాలమున, ఆస్తే = ఉన్నది. అనగా ఉండగలదని యర్థము. తత్ = ఆపట్టణము, నిర్యాతుం = వదలుటకు, ఇచ్ఛోరపి = కోరిక గల్గిన, అనగా ముక్తికా

మనగల్గి . (తవ = నీకు) భైమీసమ్భోగసఙ్కోచభియా; భైమీ = దమయంతికోడ, సమ్భోగ = సమ్భోగమునకు, సంకోచ = సంకోచము వలన, భియా = భయముచే. అధికాశి = కాశియందు, న = ఉండదు. అనగా ముముక్షువైనను నీవు యావజ్జీవము దమయన్తితో నలపురమందు విహరింపుము చివరకు కాశియందు శివసాయుజ్యమునొందుమని యర్థము.

**సమాసములు**

ఉపవారాణసి :- వారాణస్యాః, సమీపే = ఉపవారాణసి.

నామచిహ్నం :- నామ, చిహ్నం యస్మిన్తత్ = నామచిహ్నం.

పారేఽసి :- అస్యాః, పారే = పారేఽసి.

భైమీసంభోగసఙ్కోచభియా :- భైమ్యాః, సమ్భోగః = భైమీసంభోగః భైమీసంభోగే, సఙ్కోచః = భైమీసంభోగసంకోచః, భైమీసంభోగ సంకోచాత్, భీః = భైమీసంఙ్కోచసంకోగభీః, తయా=భైమీసమ్భోగ సఙ్కోచభియా.

అధికాశి :- కాశ్యామ్ = అధికాశి.

**భావము :**

ఆ పట్టణమున నీవు ముముక్షువైనను — దమయంతితోడ సమ్భోగమునకు భంగము రావచ్చుననెడి భీతిచే కాశి యందుండదు. ఏలయనగా కాశి కేవలము ముక్తిక్షేత్రము గాన నందు సంభోగాదులు నిషిద్ధములు. అందువలన నా నలపురము కాశికి దూరముననందే యుండును. కాన నీవు బ్రతికినంత కాలమును దమయంతితోడ నలపురముననందే విహరించుము. చివరకు కాశికి వచ్చి యచ్చట పార్వతీపరమేశ్వరుల సాయుజ్యమునుం బొందుము. L2

శ్లో॥ ధూమావలిశ్మశ్రు తతః సుపర్వా
ముఖం మఖాస్వాదవిదాం తమూచే.
కామం మదీశామయ కామధేనోః
పయాయతా మభ్యుదయః స్త్వదీయః. 73

ప॥వి॥ :- ధూమావలిశ్మశ్రు - తతః - సుపర్వా - ముఖం - మఖాస్వాదవిదాం - తమ్ - ఊచే - కామం - మదీశామయకామధేనోః - పయాయతామ్ - అభ్యుదయః - త్వదీయః.

అర్థము :-తతః = ఇట్లు ఇంద్రుడుఁ చెప్పిన పిదప, ధూమావలిశ్మశ్రుః; ధూమావలి = ధూమరేఖయే, శ్మశ్రు = మీసములుగా గల్గిన, మఖాస్వాదవిదాం; మఖాస్వాద = యజ్ఞమందు హవిస్సుల రుచులను, విదాం = తెలిసిన దేవతలకు, ముఖం = ముఖమైన, సుపర్వా = దేవుడైనయగ్ని, తం = అ నలునిఁ గూర్చి, ఊచే = చెప్పెను. హే నల = ఓ నలమహారాజా! త్వదీయః = నీకు సంబంధించిన, అభ్యుదయః = అభివృద్ధి, మదీక్షామయకామధేనోః; మత్ = నాయొక్క, ఈక్షామయ = దృష్టిరూపమైన, కామధేనోః = కామధేనువునకు, కామం = మిక్కిలి, పయాయతాం = పాలవలె నాచరించునుగాక, అనగా నా కటాక్షము చేతనే నీకు సకలార్థములు సిద్ధించునుగాత !

**సమాసములు :**

ధూమావలిశ్మశ్రు :- ధూమానామావలిః = ధూమావలిః. ధూమావలిరేవ, శ్మశ్రు, **యస్యతత్ =** ధూమావలిశ్మశ్రు.

మఖాస్వాదవిదాం :- మఖస్య, ఆస్వాదః = మఖాస్వాదః, మఖాస్వాదం, విదన్తీతి = మఖాస్వాదవిదః – తేషాం = మఖాస్వాదవిదాం.

మదీక్షామయకామధేనోః :- మమ, ఈక్షా = మదీక్షా, మదీక్షైవ = మదీక్షామయీ. మదీక్షామయీచసా, కామధేనుశ్చ = మదీక్షామయకామధేనుః,' తస్యాః = మదీక్షామయకామధేనోః.

పయాయతాం :- పయఇవఆచరతు = పయాయతామ్.

త్వదీయః :- తవ, అయం = త్వదీయః.

**భావము**

ఇంద్రుడు సంభాషించిన పిదప, పొగను మీసముగా గల్గినవాడును యజ్ఞభోక్తలగు దేవతలకు ముఖమైనట్టి యగ్ని చెప్పఁదొడగెను. - ఓ నలమహారాజా! నీ అభివృద్ధి నా దృష్టి యనెడి కామధేనువునకు క్షీరముగా నాచరించునుగాత అనగా నా కటాక్షము చేత నీకు సకలార్థసిద్ధి ఏర్పడును గాత యని యర్థము. "అగ్నిముఖా వైదేవాః" యను శ్రుతి ననుసరించి యగ్ని దేవతలకు ముఖమని ప్రసిద్ధి. ఏలయనగా నగ్నియందు వ్రేల్చబడిన హవిస్సులు దేవతలకు జెందుచున్నవి గదా.

శ్లో॥ యాదాహ పాకౌపయికీ తనుర్మే
భూయా త్త్వదిచ్ఛా వశవర్తినీసా.
తయాపరా భూతతనోర నఙ్గాత్
తస్యాః ప్రభుః సన్నధిక స్త్వమేధి. **74**

ప॥వి॥ :- యా - దాహపాకౌపయికీ - తనుః - మే - భూయాత్ - త్వదిచ్ఛావశవర్తినీ - సా - తయా - పరాభూతతనోః - అనఙ్గాత్ - తస్యాః - ప్రభుః - సన్ - అధికః - త్వమ్ - ఏధి.

అర్థము :- దాహపాకౌపయికీ; దాహ = భస్మముగావించుటకు, పాక = వంట మున్నగువానికిని, ఔపయికీ = సాధనమైన, యా = ఏ, మే = నా యొక్క, తనుః = శరీరముగలదో, సా = అది, త్వదిచ్ఛావశవర్తినీ = నీ కోరికకు లోబడినదై, భూయాత్ = ఉండునుగాత. కిఞ్చ = మఱియు, త్వం = నీవు, తస్యాః = ఆ శరీరమునకు, ప్రభుస్సన్ = నియామకుడవగుచు. తయా = ఆ శివుని నేత్రమునందలి శరీరముచే, పరాభూతతనోః; పరాభూత = తిరస్కరింపబడిన అనగా దహింపబడిన, తనోః = శరీరము గల్గిన, అనఙ్గాత్ = మన్మథుని కంటెను, అధికః = అధికుడవుగా, ఏధి = ఉండుము.

సమాసములు

దాహపాకౌపయికీ :- దాహశ్చ, పాకశ్చ = దాహపాకౌ, దాహపాకయోరౌపయికీ = దాహపాకౌపయికీ.

త్వదిచ్ఛావశవర్తినీ ;- తవ, ఇచ్ఛా=త్వదిచ్ఛా, త్వదిచ్ఛాయాః, వశః= త్వదిచ్ఛావశః, త్వదిచ్ఛావశేవర్తినీ = త్వదిచ్ఛావశవర్తినీ.

పరాభూతతనోః :- పరాభూతా తనుఃయస్యసః = పరాభూతతనుః, తస్య = పరాభూతతనోః.

భావము ;

వస్తువును భస్మము చేయుటకును నుడికించుటకును సాధనమైన నా శరీరము నీ కోరికకు వశమై యుండును. అనగా నీవెట్లు కోరిన యట్లు నెరవేర్చుకొనవచ్చును. మఱియు నీవు ఆ దాహపాకాగ్ని రూపమైన శరీరమునకు నియా

మకుడవై ఆ శరీరముచే దగ్ధము గావింపఁబడిన, మన్మథుని కంటెను - నధికు డవై వెలయుము. నీవు సౌందర్యము చేతనే మన్మథునికంటె నధికుడవు కావు. మఱేమనగా, మన్మథుని దగ్ధము గావించిన యగ్నికి నియామకుఁడవగుట వలనను నా మన్మథునికంటెను నధికుడవగుమని భావము. 74

శ్లో॥ అస్తుత్వయా సాధితమన్నమీన
రసాది[పీయూష రసాతిశాయి.
తద్భూప! విద్మస్తవ సూపకార
క్రియాసు కౌతూహలశాలి శీలమ్. 75

ప॥వి॥ :- అస్తు -త్వయా - సాధితమ్ - అన్నమీనరసాది - పీయూషరసాతి శాయి - తత్ - భూప - విద్మః - తవ - సూపకార క్రియాసు - కౌతూహలశాలి - శీలమ్.

అర్థము :- కిఞ్చ = మఱియు, హేభూప = ఓరాజా! త్వయా = నీచే, సాధితం = వండఁబడిన, అన్నమీనరసాది; అన్న = అన్నము, మీన రసాది = మత్స్యరసము మున్నగునవి, పీయూషరసాతిశాయి, పీయూష రస = అమృతరసమును, అతిశాయి = మించినదిగా, అస్తు = ఉండును గాత. తత్ = నీవంటలు మున్నగునవి యమృత రసమును సైతము మించియుండుట వలన, తవ = నీయొక్క, శీలం = స్వభావమును, సూపకారక్రియాసు; సూపకార = వంటవాండ్ర యొక్క, క్రియాసు = వంట వార్పు మున్నగు కార్యములయందు, సు + ఉపకారక్రియాసు = మంచి యుపకార క్రియలయందును, కౌతూహలశాలి; కౌతూహల = కౌతూహలముతో, శాయి = విలసిల్లినదిగా, విద్మః = తెలిసికొనుచు న్నాను. ఇట్లు పాకక్రియయు నీ కొసంగఁబడినదని యర్థము.

**సమాసములు :**

అన్నమీనరసాది :- మీనస్య, రసః = మీనరసః, అన్నంచ, మీనర సశ్చ = అన్నమీనరసౌ, అన్నమీనరసౌ, ఆదీ, యస్యతత్ = అన్నమీ నరసాది.

పీయూషరసాతిశాయి :- పీయూషస్య, రసః = పీయూషరసః, పీయూ

షరసః, పీయూషరసమతిశేతేఇతి = పీయూషరసాతిశాయి.

సూపకారక్రియాసు ;- సూపం కరోతీతి = సూపకారః, సూపకారస్య, క్రియాః = సూపకారక్రియాః, తాసు = సూపకారక్రియాసు.

కౌతూహలశాలి :- కౌతూహలేన. శాలతఇతి = కౌతూహలశాలి.

**భావము :**

ఓ రాజా! నీవు వండిన యన్నము మత్స్యరసము పప్పురసము మున్నగునవి యమృతరసమును మించియుండునుగాత! మఱియు నీ స్వభావము వంటవార్పులయందును, మంచి యుపకారములనుఁ జేయుటయందును, కుతూహలము గలదిగా తెలియుదుము. కాన నీకు పాకవిద్య యొసంగబడినదని భావము. 75

శ్లో॥ వైవస్వతోఽపి స్వతఏవదేవ
స్తుష్టః సమాచష్ట నరాధిరాజమ్.
వరప్రదానాయ తవావదానై
శ్చిరం మదీయా రసనోద్ధురేయమ్. **76**

ప॥వి॥ :- వైవస్వతః - అపి - స్వతః - ఏవ - దేవః - తుష్టః - తమ్ - ఆచష్ట - నరాధిరాజమ్ - వరప్రదానాయ - తవ - అవదానైః-చిరం = మదీయా - రసనా - ఉద్ధురా - ఇయమ్.

**అర్థము :**- దేవః - దేవుడైన, వైవస్వతోఽపి = యముడును, స్వతఏవ = స్వయముగనే యనగాఁ బ్రార్థింపఁబడకయే, తుష్టః = సంతోషమునొందినవాడై, తం = ఆ, నరాధిరాజమ్ = నరపతియగు నలునిఁగూర్చి, ఆచష్ట = చెప్పెను. (హేనృప=ఓ రాజా!)తవ = నీయొక్క, అవదానైః = దూత్యము మున్నగు నద్భుత కార్యములచే, ఇయం=ఈ, మదీయా= నాదైన, రసనా = నాలుక,చిరం చాలాకాలమునుండి, వరప్రదానాయ = వరమొసంగుటకై, ఉద్ధురా = పట్టుదలఁగల్గియున్నది.

**సమాసములు ;**

వైవస్వతః :- వివస్వతః అపత్యం, పుమాన్ = వైవస్వతః.

నరాధిరాజమ్ :- నరాణాం, అధిరాజః = నరాధిరాజః, తమ్ = నరాధిరాజమ్.

వరప్రదానాయ :— వరస్య, ప్రదానం = వరప్రదానం, తస్మై = వరప్రదానాయ.

ఉద్ధురా :- ఉద్గతా, ధూః = యస్యాస్సా = ఉద్ధురా.

**భావము :**

యమధర్మరాజు సంతుష్టుడై నలుని ప్రార్థన నపేక్షింపక తనయంతట తానే, ఆ నలమహారాజును గూర్చి చెప్పెను. ఓ నలభూపతీ! నీవు గావించిన దూత్యము మున్నగు నాశ్చర్యకరములగు పనులచే, నానాలుక చిరకాలమునుండి వరమొసంగుటకై మిక్కిలి పట్టుదల గల్గియున్నది. 77

శ్లో॥ సర్వాణి శస్త్రాణి సహాఙ్గచక్రై
రావిర్భవన్తు త్వయిశత్రు జైత్రే.
అవాప్య మస్మాదధికం నకిఞ్చి
జ్జాగర్తి వీరవ్రతదీక్షితానాం. 77

ప॥వి॥ సర్వాణి - శస్త్రాణి - సహ - అఙ్గచక్రైః - ఆవిర్భవన్తు - త్వయి - శత్రుజైత్రే - అవాప్యమ్ - అస్మాత్ - అధికం - న - కిం - చిత్ - జాగర్తి - వీరవ్రతదీక్షితానామ్.

అర్థము:- హేనల ఓ నలభూపతీ! సర్వాణి సకలములైన, శస్త్రాణి=శస్త్రములు అఙ్గచక్రైస్సహ = ప్రయోగము, ఉపసంహారము మున్నగు మంత్ర రూపములైన తమతమ యంగములతోడ, శత్రుజైత్రే = శత్రువులను జయించు స్వభావము గల, త్వయి నీ విషయమునందు, ఆవిర్భవన్తు = ఉద్భవించు గాత, వీరవ్రతదీక్షితానాం; వీరవ్రత = యుద్ధములందు మడియలని వ్రతమునందు, దీక్షితానాం=దీక్ష వహించిన నీవంటి వారలకు, అస్మాత్ = ఈ యస్త్రలాభముకంటె, అధికం =శ్రేష్ఠమైనదై, అవాప్యం =పొందదగినది, కిఞ్చిత్ = కొంచెము, నజాగర్తి= ఉండుటలేదు.

వి :— పూర్వార్ధమున జెప్పిన "సర్వశాస్త్రావిర్భావమనెడి విశేషము" ఉత్తరార్ధమునందలి "శూరులకింతకంటె నుత్కృష్టమైనదేది పొందదగి యున్న దను" సామాన్యముచే సమర్థింపబడినది గాన సర్థాన్తరన్యాసాలఙ్కారము.

సమాసములు :

అజ్గచక్రైః :- అజ్గానాం, చక్రాణి = అజ్గచక్రాణి, తైః = అజ్గచక్రైః
శత్రుజైత్రే :— జయతీతి = జైత్రః, శత్రూణాం, జైత్రః = శత్రు
జైత్రః. యద్వా శత్రూన్, జైత్రః = శత్రుజైత్రః. తస్మిన్ = శత్రు
జైత్రే.
వీరవ్రతదీక్షితానాం ;- వీరాణాం, వ్రతం = వీరవ్రతం. వీరవ్రతే,
దీక్షితాః = వీరవ్రతదీక్షితాః, తేషాం = వీరవ్రతదీక్షితానాం.

భావము ;

ఓ నలమహారాజా! సమస్తములగు నాయుధములును ప్రయోగించుట, ఉపసంహరించుట మున్నగు నజ్గకలాపములతోడ, శత్రుంజయుడవైన నీ విషయమున నావిర్భవించును గాత. ఇది యుక్తము. ఏలయనగా యుద్ధములయందు వెనుదీయకుండుట యను వ్రతమును జేపట్టిన నీవంటి వారలకు నిట్టి యస్త్రప్రాప్తికంటె నుత్కృష్టమైనదేదియును పొందఁదగినది లేదు. 77

శ్లో॥ కృచ్ఛ్రం గతస్యాఽపి దశావిపాకం
ధర్మాన్న చేతః స్ఖలతాత్త్వ దీయమ్.
అముఞ్చతః పుణ్యమనన్యభక్తేః
స్వహస్తవాస్తవ్య ఇవ త్రివర్గః. 78

ప॥వి॥ కృచ్ఛ్రం - గతస్య - అపి - దశావిపాకం - ధర్మాత్ - న - చేతః
స్ఖలతాత్ - తవ - ఇదమ్ - అముఞ్చతః - పుణ్యమ్ - అనన్యభక్తేః -
స్వహస్తవాస్తవ్యః - ఇవ - త్రివర్గః.

అర్థము :- కిఞ్చ = మఱియు. కృచ్ఛ్రం = కష్టమును, దశావిపాకం = అవస్థయందు పరిణతిని, గతస్యాఽపి = పొందినవాడవైనను, తవ = నీయొక్క, ఇదం = ఈ, చేతః = మనస్సు, ధర్మాత్ = ధర్మమునుండి, నస్ఖలతాత్ = తప్పక యుండునుగాత. (ఏలయనగా) పుణ్యం = ధర్మమును, అముఞ్చతః = విడవనట్టి, అనన్యభక్తేః = ధర్మేతరమునందు నాసక్తి లేనివానికి, త్రివర్గః = ధర్మార్థకామములు మూడును, స్వహస్తవాస్తవ్యఇవ = తన హస్తమునందున్నవిగనే భావింపవలయును.

వి :- ఇచ్చట "త్రివర్గసిద్ధి" యను కార్యముచే "ధర్మమునం దనన్యభక్తి యుండుట" యను కారణము సమర్థితము కాన, కార్యముచే కారణ సమర్థన రూపమగు నర్థాన్తరన్యాసాలంకారము.

**సమాసములు :**

దశావిపాకం:- దశాయాః, విపాకః = దశావిపాకః, తం=దశావిపాకం.
అనన్యభక్తేః :-అన్యస్మిన్‌భక్తిఃయస్యసః = అన్యభక్తిః, అన్యభక్తిర్న భవతీతి, అనన్యభక్తిః, తస్య=అనన్యభక్తేః.
స్వహస్తవాస్తవ్యః :- స్వస్యహస్తః = స్వహస్తః, స్వహస్తే, వసతీతి = స్వహస్తవాస్తవ్యః.
త్రివర్గః :- త్రయాణాం, వర్గః=త్రివర్గః.

**భావము ;**

కష్టములయందును నీ హృదయము ధర్మమునుండి దప్పక నుండుగాత. ధర్మమును వీడక యధర్మమునకు విముఖుడైన వానికి, ధర్మార్థ కామములు మూడును తన హస్తమునందే నెలకొనియుండును. ౭౮

శ్లో॥ స్మితాఞ్చితాం వాచమవోచదేనం
ప్రసన్నచేతా నృపతిం ప్రచేతాః.
ప్రదాయభైమీ మధునావరాతే
దదామి తద్యౌతక కౌతుకేన. 79

ప॥వి॥ :- స్మితాఞ్చితాం - వాచం - అవోచత్ - ఏనం - ప్రసన్నచేతాః - నృపతిం - ప్రచేతాః - ప్రదాయ - భైమీమ్ - అధునా - వరా - తే- దదామి - తద్యౌతుకకౌతుకేన.

**అర్థము :-** అథ = పిదప, ప్రసన్నచేతాః = నిర్మలచిత్తుడగు, ప్రచేతాః = వరుణుడు, ఏనం = ఈ, నృపతిం = నలమహారాజునుం గూర్చి, స్మితాఞ్చితాం; సిత(మకారం)త = చిఱునగవుచే, అఞ్చితాం = రమ్యమైన, వాచం=మాటను, అవోచత్=పలికెను. అధునా = ఇప్పుడు, తే=కెన్నీ, భైమీం = దమయంతిని, ప్రదాయ = ఇచ్చి, తద్యౌతకకౌతుకేన; తత్= ఆమెనిచ్చుటయందు, యౌతక = వధూవరుల కొసంగందగినదియో, లేక

వివాహకాలమందు, లక్ష్మై సంపదమి, ఇచ్చెడు ద్రవ్యమునందు, కౌతుకేన = కోరిక చేతను, లేదా సంతోషము చేతను, వరౌ = చెప్పఁబోవు వరము లను, దదామి = ఇచ్చుచున్నాను.

## సమాసములు

స్మితాఞ్చితాం :— స్మితేన, అఞ్చితా = స్మితాఞ్చితా, తామ్ = స్మితాఞ్చితామ్.

ప్రసన్నచేతాః :—ప్రసన్నం, చేతః, యస్యసః = ప్రసన్నచేతాః.

తద్యౌతకకౌతుకేన :— యుతకయోః, దేయం = యౌతకం, తస్మిన్, యౌతకం = తద్యౌతకం, తద్యౌతకే కౌతుకం = తద్యౌతకకౌతుకం, తేన = తద్యౌతకకౌతకేన.

## భావము :

ప్రసన్న హృదయుడగు వరుణుడు మందహాస మనోహరమగు మాటను రాజునుఁగూర్చి చెప్పెను. ఓ రాజా! ఇప్పుడు నీకు దమయన్తిని, దానము గావించి, వివాహ కాలమునందిచ్చెడి యరణము పై కోరికతో నీకు రెండు వరములనీయఁబోవు చున్నాను. 79

శ్లో॥ యత్రాభిలాషస్తవతత్రదేశే
నన్వస్తు ధన్వన్యపి తూర్ణ మర్ణః
ఆపోవహన్తీహహి లోకయాత్రాం
యథా న భూతాని తథాపరాణి. 80

ప॥వి॥ యత్ర - అభిలాషః - తవ - తత్ర - దేశే – నను - అస్తు - ధన్వని - అపి - తూర్ణమ్ - అర్ణః - ఆపః - వహన్తి - ఇహ - హి లోకయాత్రాం - యథా - న - భూతాని - తథా - అపరాణి.

అర్థము :-నను = ఓయీ, యత్ర = ఏ దేశమునందు, తవ = నీకు, అభిలాషః = జలమునందుఁ గోరిక కలుగునో, తత్ర = అచ్చట, ధన్వన్యపి = చవిటినేలయందును, తూర్ణం = శీఘ్రముగా, అర్ణః = ఉదకము, అస్తు = ఉద్భవించునుగాత. (ఏలయనగ) ఇహ = ఈ ప్రపఞ్చము

15)

నందు, యథా = ఎట్లు, ఆపః = ఉదకములు, లోకయాత్రాం; లోక = జనమునకు, యాత్రాం = జీవనమును, వహన్తి = పొందించుచున్నవో, తథా = అట్లు, అపరాణి = ఇతరములగు, భూతాని = భూమి మున్నగు భూతములు, నహివహన్తి = పొందించుటలేదు.

**సమాసములు :**

**లోకయాత్రాం** : — లోకస్య, యాత్రా = లోకయాత్రా. తామ్ = లోకయాత్రామ్.

**భావము :**

ఓ నలమహారాజా! ఏ ప్రదేశమునందు నీకు జలాపేక్ష కలుగునో, ఆ ప్రదేశము చవిటినేలయైనను నచ్చట శీఘ్రముగా జలము ఉద్భవించును గాత. ఏలయనగా "పానీయం ప్రాణినాంప్రాణాః విశ్వమేతచ్చ తన్మయమ్" అని వాగ్భటాచార్యుల వచనమునను సరించి యుదకములు ప్రాణుల జీవనము నడుపునట్లు తక్కిన పృథివ్యాది భూతములు నడుపుటలేదు. కాన నీ వరము చాలా శ్రేష్ఠమైనది. 80

**శ్లో॥ ప్రసారితాపః శుచిభానునాఽస్తు**
**మరుః సముద్రత్వమపి ప్రపద్య.**
**భవన్మనస్కారలవోద్గమేన**
**క్రమేలకానాం నిలయః పురేవ. 81**

ప॥వి॥ ప్రసారితాపః - శుచిభానునా - అస్తు - మరుః - సముద్రత్వమ్ - అపి - ప్రపద్య - భవన్మనస్కారలవోద్గమేన-క్రమేలకానాం - నిలయః - పురా - ఇవ.

అర్థము :-కిఞ్చ = మఱియు, మరుః = చవిటినేల అనగా నీరులేని యెడారి. భవన్మనస్కారలవోద్గమేన; భవత్ = నీయొక్క, మనస్కార = సుఖప్రాప్తివాంఛ యొక్క, లవ = లేశభాగము, ఉద్గమేసతి = ఉద్భవింపగా, నక్రమేలకానాం; నక్ర = మొసళ్ళు మున్నగు జలజంతువుల యొక్క, మేలకానాం = సంఘముల యొక్క, నిలయః = నివాసము

గను, (తథా = అట్లే) శుచిభానునా = చంద్రునిచే, ప్రసారితాపః ప్రసారిత = వర్ధిల్లఁజేయఁబడిన, అపః = యుదకములుగలవిగనగుచు, సముద్రత్వం = సాగరత్వమును, ప్రపద్యాఽపి = పొందియు, భవన్మనస్కారలవోద్గమేన; భవత్ = నీయొక్క, మనస్కారలవోద్గమేన = ఇచ్ఛాలేశ మేర్పడుటచేత, క్రమేలకానాం = ఒంటెలకు, నిలయఃసన్ = స్థానమైనదై, శుచిభానునా, శుచి = గ్రీష్మర్తువునందలి, భానునా = సూర్యునిచే, ప్రసారితాపస్సన్; ప్రసారిత = తొలగింపఁబడిన, అపస్సన్ = ఉదకములుగల్గినదై లేదా, ప్రసారితాపఃసన్; ప్రసారి = మిక్కిలి ప్రసరించుటచే తీవ్రమైన, తాపఃసన్ = వేడిగలదై, పురేవ = పూర్వముటవలె, జలములేనిదిగా, అస్తు = అగుగాత.

**సమాసములు**

ప్రసారితాపః :— ప్రసారితాః, ఆపః, యస్యసః = ప్రసారితాపః. పక్షాన్తరమున — ప్రసారీ, తాపః, యస్మిన్సః = ప్రసారితాపః.

సముద్రత్వమ్ :— సముద్రస్య, భావః = సముద్రత్వం, తత్ = సముద్రత్వం.

భవన్మనస్కారలవోద్గమే :— భవతః, మనస్కారః; భవన్మనస్కారః, భవన్మనస్కారస్య, లవః = భవన్మనస్కారలవః, భవన్మనస్కారలవస్య, ఉద్గమః = భవన్మనస్కారలవోద్గమః, తస్మిన్ = భవన్మనస్కారలవోద్గమే.

పక్షాన్తరమున :— భవన్మనస్కారలవోద్గమేన; భవతః, మనస్కారః = భవన్మనస్కారః, భవన్మనస్కారస్యలవః = భవన్మనస్కారలవః, భవన్మనస్కారలవస్య, ఉద్గమః = భవన్మనస్కారలవోద్గమః. తేన = భవన్మనస్కారలవోద్గమేన.

**భావము :**

మఱియు జలశూన్యమగు నెడారి నీయొక్క సుఖేచ్ఛాలేశముచే మొసళ్ళు మున్నగు జలజంతువుల సమూహమునకు నివాస భూమియు, చంద్రునిచే వర్ధిల్లఁజేయబడిన యుదకములు గలదియునగు సాగరముగ నేర్పడియు, నీ యొక్క యిచ్ఛాలేశముచేతనే యొంటెలకు నిలయమును, గ్రీష్మకాలపు సూర్యునిచే

తొలగింపబడిన యుదకములుగలదిగను లేదా తీవ్రమగు తాపముగలదిగను నై పూర్వమువలె నెడారియు కాగలదు. అనగా నీవు కోరినంత మాత్రముననే యెడారి సముద్రముగను, సముద్రమెడారిగనుఁ గాగలదనియు యభిప్రాయము. ఇది మొదటి వరము. 81

శ్లో॥ అమ్లానిరామోద భరశ్చదివ్యః
పుష్పేషు భూయాద్భవ దఙ్గసఙ్గాత్.
దృష్టం ప్రసూనోపమయా మయాన్య
న్నధర్మశర్మోభయ కర్మఠంయత్. 72

ప॥వి॥ :– అమ్లానిః – ఆమోదభరః – చ – దివ్యః – పుష్పేషు – భూయాత్ – భవదఙ్గసఙ్గాత్ – దృష్టం – ప్రసూనోపమయా – అన్యత్ – న – ధర్మశర్మోభయ కర్మఠం – యత్.

అర్థము :– హేనల = ఓ నలుడా! భవదఙ్గసఙ్గాత్; భవత్ = నీయొక్క, అఙ్గ= శరీరము యొక్క, సఙ్గాత్ = సంపర్కమువలన అనగా కరస్పర్శమున, పుష్పేషు = పూలయందు, అమ్లానిః = వాడుబారనితనము, అనగా తేమ, దివ్యః = స్వర్గసంబంధముగల, ఆమోదభరశ్చ = పరిమళ భారము, భూయాత్ = ఏర్పడునుఁ గాత! యత్=ఎందువలన, ప్రసూనోపమయా; ప్రసూన = పుష్పములయొక్క, ఉపమయా = సామ్యముచే, ధర్మశర్మోభయ కర్మఠం; ధర్మ = పుణ్యము, శర్మ = సుఖము అనునీ, ఉభయం = రెంటియందును, కర్మఠం = కర్మశూరమైనది అనగా కోరికలను పూర్తిచేయునది, అన్యత్ = మఱియొక్కటి అనగా, ధనము పుణ్యము మున్నగునవి నదృష్టం=చూడబడలేదు. దేవపూజకును సుఖానుభవమునకును సాధనమగుటచే పుష్పములు ఆముష్మికముగను, నైహికముగను, నుపయుక్తము లగుచున్నవని యర్థము.

సమాసములు ;

అమ్లానిః :– న, మ్లానిః = అమ్లానిః.

ఆమోదభరః :– ఆమోదస్య, భరః = ఆమోదభరః.

దివ్యః :– దివి, భవః = దివ్యః.

భవదఙ్గసఙ్గాత్ :- భవతః, అఙ్గం = భవదఙ్గం, భవదఙ్గేన, సఙ్గః = భవదఙ్గసఙ్గః, తస్మాత్ = భవదఙ్గసఙ్గాత్.

ప్రసూనోపమయా ;- ప్రసూనేన, ఉపమా = ప్రసూనోపమా, తయా= ప్రసూనోపమయా.

ధర్మశర్మోభయ కర్మఠమ్ :- ధర్మశ్చ, శర్మచ = ధర్మశర్మణీ, ధర్మశర్మణోరుభయం=ధర్మశర్మోభయం, కర్మణి, ఘటతఇతి= కర్మఠమ్. ధర్మశర్మోభయస్మిన్ కర్మఠమ్ = ధర్మశర్మోభయకర్మఠమ్.

**భావము :**

ఓ నలమహారాజా ! నీ కరస్పర్శము చేతనే పుష్పములయందు వాడు బారనట్లు చేసెడి తేమయు, దేవలోకపు పరిమళము నేర్పడును. ఏలయనగా – పూల సామ్యముచే, దేవతా పూజాదులచే పుణ్యసిద్ధి రూపమగు నాముష్మిక ఫలము, శరీర సంస్కారముచే నైహికఫలమను నీరెండును లభ్యములగుచున్నవి. ఇట్టి సుకృత సాధనమైనవి మఱియొండులేదు. కావున పుష్పము ధర్మశర్మోభయ ములో కర్మఠమై ఐహికాముష్మిక ఫలసాధనమైనది. కాన నీ రెండవ వరము మొదటి వరమువలె ప్రశస్తమైనది. 72

శ్లో॥ వాగ్దేవతాఽపి స్మితపూర్వముర్వీ
సుపర్వరాజం రభసాద్బభాషే.
త్వత్ప్రేయసీ సమ్మదమాచరన్త్యాః
మత్తోనకిఞ్చిత్ గ్రహణోచితం తే. 73

ప॥వి॥ :- వాగ్దేవతా - అపి - స్మితపూర్వమ్ - ఉర్వీసుపర్వరాజం - రభసాత్ - బభాషే - త్వత్ప్రేయసీ సమ్మదమ్ - ఆచరన్త్యాః-మత్తః -న - కించిత్ - గ్రహణోచితం - తే.

అర్థము :- వాగ్దేవతాఽపి = సరస్వతీదేవియు, ఉర్వీసుపర్వరాజం; ఉర్వీ = భూమికి, సుపర్వరాజం = దేవేంద్రుడైన, నలం = నలమహారాజును గూర్చి, రభసాత్ = సంతోషము వలన, స్మితపూర్వం = మందహాస పూర్వకముగా, బభాషే = పలికెను. త్వత్ప్రేయసీ సమ్మదః; త్వత్ప్రేయసీ = నీ ప్రియురాలైన దమయన్తికి, సమ్మదం = హర్షమును అనగా

నిన్ను వరించుటయను విషయమును. ఆచరన్త్యాః = చేయుచున్న, మత్తః = నా వలన, తే = నీకు, కిఞ్చిత్ = కొంచెము, గ్రహణోచితం = గ్రహింపదగినది, న = లేదా ? అనగా తప్పక యున్నదని యర్థము.

**సమాసములు**

వాగ్దేవతా :- వాగితి దేవతా = వాగ్దేవతా.

స్మితపూర్వం :- స్మితం, పూర్వం, యస్మిన్, కర్మణి, తద్యథా భవతి తథా = స్మితపూర్వమ్.

ఉర్వీసుపర్వరాజం :- సుపర్వణాం, రాజా = సుపర్వరాజః, ఉర్వ్యాః, సుపర్వరాజః = ఉర్వీసుపర్వరాజః, తమ్ = ఉర్వీసుపర్వరాజమ్.

త్వత్ప్రేయసీ సమ్మదమ్ :- తవ, ప్రేయసీ = త్వత్ప్రేయసీ, త్వత్ప్రేయస్యాః సమ్మదః = త్వత్ప్రేయసీ సమ్మదః, తం = త్వత్ప్రేయసీ సమ్మదమ్.

గ్రహణోచితం :- గ్రహణే, ఉచితమ్ = గ్రహణోచితం.

**భావము:**

సరస్వతీదేవియు హర్షముతో నలుని మందహాస పూర్వకముగా పలుకరించినది. ఓ నలమహారాజా ! నీ ప్రేయసియగు దమయన్తికి నిన్ను వరింపఁజేయుట వలన సంతోషమును గూర్చుటచే నేను నీకు అప్పురాలను. కాన నావద్ద నీవు స్వీకరింపఁదగినది లేదా తెలిసికొనదగినది కొంచెము లేదా? తప్పకయున్నదని యాశయము.

73

శ్లో॥ అర్థోవినైవార్థనయోపసీద
న్నాల్పోపి ధీరైరవధీరణీయః।
మాన్యేన మన్యే విధినావితీర్ణః
సప్రీతిదాయోబహు మన్తుమర్హః॥ 74

ప॥వి॥ :- అర్థః - వినా - ఏవ - అర్థనయా - ఉపసీదన్ - న - అల్పః - అపి - ధీరైః - అవధీరణీయః - మాన్యేన - మన్యే - విధినా - వితీర్ణః - సః - ప్రీతిదాయః - బహు, మన్తుమ్ - అర్హః.

అర్థము :- కిఞ్చ = మఱియు, అర్థనయా = యాచించుటతో, వినైవ = లేక, ఉపసీదన్ = తనయంతట లభ్యమైన, అర్థః = హితమగు విషయము, అల్పోపి = కొంచమైనను, ధీరైః = ధీరులచే, అవధీరణీయః = ఉపేక్షింపఁదగినదిగా, న = లేదు, ఏలయనగా, మాన్యేన = పూజ్యుడైన, విధినా = విధిచే, వితీర్ణః = ఈయఁబడిన, ప్రీతిదాయః = ప్రీతితో నొసంగఁబడిన, సః = ఆ యర్థము, బహు = అధికముగా, మన్తుం = తెలిసికొనుటకు, అర్హః = తగినది (ఇతి=అని) మన్యే = తలంతును.

సమాసములు :

ప్రీతిదాయః :- దీయతే ఇతి= దాయః. ప్రీత్యాదాయః = ప్రీతిదాయః.

భావము :

యాచింపకయే, తనంతట తాను లభ్యమైన వస్తువు స్వల్పమైనను, హితమైనది యుపేక్షింపఁదగదు. ఏలయనగా పూజ్యుడగు బ్రహ్మ ప్రీతితో నిచ్చినది యుత్కృష్టముగా భావింపఁదగినదని నేను తలంతును.

శ్లో॥ అవామావామార్ధే సకలముభయాకార ఘటనాత్
ద్విధాభూతం రూపం భగవదభిధేయం భవతియత్.
తదన్తర్మన్త్రం మేస్మరహరమయం సేన్దుమమలం
నిరాకారం శశ్వజ్జప నరపతే! సిద్ధ్యతు స తే. 75

ప॥వి॥ :- అవామా - వామార్ధే - సకలమ్ - ఉభయాకారఘటనాత్ - ద్విధా భూతం - రూపం - భగవదభిధేయం - భవతి - యత్ - తదన్తః - మన్త్రం - మే - స్మర - హరమయం - సేన్దుమ్ - అమలం - నిరాకారం - శశ్వత్ - జప - నరపతే - సిద్ధ్యతు - సః - తే.

అర్థము :- హే నరపతే = ఓ నలమహారాజా !, అర్ధే = ఒక భాగమునందు, అవామా = అస్త్రీరూపమును ననగా పురుషుడును, అర్ధే = మఱియొక భాగమునందు, వామా = స్త్రీయు, (అతఏవ = కావుననే) ద్విధాభూతం = స్త్రీ పురుషరూపముగా రెండుగా నేర్పడినదై, ఉభయాకారఘటనాత్= (రెండు ఆకారములను కలుపుటవలన, సకలం = సంపూర్ణత నొందిన,

భగవదభిధేయం = భగవచ్ఛబ్దముచే జెప్పదగిన, రూపం = రూపము, వినతే = ...దు. సేన్దుం = చంద్రకళతో గూడినదియు, అమలం = నిర్మలమైనదియు, నిరాకారం = ...స్తుస్థితియందు సాకారముగా లేనిదియు ననగా నేకార్థాది విభాగము లేనిదియు. మన్త్రి = మన్త్రరూపమై గోప్య మైనదియును, హరమయం = శివాత్మకమైన, మే = నాయొక్క. తత్ = ఆ స్వరూపమును, అన్తః = అంతఃకరణమునందు, స్మర = ధ్యానిం పుము. శశ్వత్ = ఎల్లప్పుడు, జప = జపింపుము. మంత్రమగుటవలన జపమార్గమున ఉపాసింపుమని యర్థము. సః = ఆ మన్త్రమూర్తియైన భగవన్తుడగు నర్ధనారీశ్వరుడు తే = నీకు, సిధ్యతు = ప్రసన్నుడగు గాక, ఫలము నొసంగుగాకయని యర్థము. ఇది మూర్తిపక్షమున యర్థము.

ఇక మన్త్రపక్షమున :- అర్ధే = పూర్వార్ధమునందు, అవా = ఓ కార ముచే, మా = మకారముచే. ననగా ప్రణవము చేతనని యర్థము. (తథా = అర్ధే) అవామార్ధే = ఉత్తర భాగమునందును, అవా = ఓ కారము చేతను, మా = మకారముచేతను, ననగా ప్రణవముచేత నుపలక్షితమైన దియు ననగా నాద్యంతములయందు ప్రణవముచే సంపుటీకృతమును, ఏవం = ఇట్లు, ఉభయాకారఘటనాత్; ఉభయాకార = రెండు ఆకారము లతో, ఘటనాత్ = చేర్పుట వలన, ద్విధాభూతం "హ" "ర" యని రెండుగా విభజింపబడినదియు, లేదా రెండు ఆకారములచే ప్రణవరూప మునందు, గలుపుట వలన, ద్విధాభూతం = రెండుగా నేర్పడినదియు ననగా రెండు ఆకారములు గలదియు, భగవదభిధేయం; భగవత్ = శివుని, అభిధేయం = వాచ్యార్థముగా గలదియునగు, యత్ = ఏ, రూపం = స్వరూపము, భవతి = ఉన్నదో, అనగా 'ఓంహరఓం' అనియే స్వ రూపమేర్పడుచున్నదో, తత్ = ఆ, హరమయం = హకార రేఫస్వరము గల, నిరాకారం = రహితములైన అకారద్వయము కలదియు ననగా హకారమును. రేఫమును నుచ్చరించుటకై యుపాత్తమైన అకారద్వయము లేనిదియు నందువలననే "హ్ ర్" యను వ్యఞ్జనమాత్ర స్వరూపముగల దియు, తథా = అర్ధే, సేన్దుం = ఈచ, ఇందుశ్చ = ఈన్దూ, ఈన్దూభ్యాం

సహిఎ ర్తత ఇతి సేన్దుం। అనగా తురీయ స్వరమగు "ఈకారము తోడను, బిందువు తోడనుఁ గూడినదియు, అనగా పూర్వోక్తమగు "హ్రక్" యను వ్యఞ్జనద్వయము సేందుత్వమును - అనగా ఈకారము తోడను కూడినచో "హ్రీం" అగుచున్నదని యర్థము. అమలం = దోషము లేనిదియునగు, మే = నాయొక్క, మంత్రం = మంత్రము అనగా రెండు ప్రణవములతో గూడిన "ఓంహ్రీంఓం" అను నాకారము గల మన్త్రమును ననగా సారస్వత చింతామణి మన్త్రమును, అంతః= అంతఃకరణమునందు, స్మర = ధ్యానింపుము. శశ్వత్ = ఎల్లప్పుడు, జప = జపింపుము. ఇత్యాదిపూర్వమువలెఁ జెప్పవలయును.

యన్త్రపక్షమునందు :- భగవదభిధేయం; భగవత్ = యోనివలె, అభిధేయం = కనబడు, యత్ = ఏ రూపం = త్రికోణాత్మకమగురూపము గలదో, ఉభయాకారఘటనాత్; ఉభయాకార = రెండు త్రికోణములను, ఘటనాత్ = చేర్చుటవలన, సకలం = సమగ్రమగు షట్కోణమేర్పడు చున్నది. తదన్తః; తత్ = ఆ షట్కోణములకు, అంతః = మధ్య, మన్త్రం = "ఓం-హ్రీం-ఓం" అను నాకారముగల మన్త్రమేర్పడు చున్నది. తత్ = ఆరూపమును, అంతః = అంతఃకరణమందు, స్మర = ధ్యానింపుము ఇత్యాది ముందువలెనేఁ జెప్పుకొనవలయును.

సమాసములు :

అవామా :- న, వామా = అవామా.

ఉభయాకారఘటనాత్ :- ఉభయశ్చాసౌ, ఆకారశ్చ=ఉభయాకారః, ఉభయాకారస్య, ఘటనం = ఉభయాకార ఘటనం, తస్మాత్ = ఉభయాకారఘటనాత్.

భగవదభిధేయం :- భగవాన్, అభిధేయః, యస్యసః = భగవదభిధేయః, తమ్ = భగవదభిధేయం.

హారమయః :- హారస్య, వికారః = హారమయః, తమ్=హారమయం.

సేన్దుం :- ఇన్దునా, సహితః=సేన్దుః, తం = సేన్దుం.

అమలం :- అవిద్యమానం, మలం యస్యసః = అమలః, తమ్ = అమలం.

నిరాకారం :- నిర్గతః ఆకారః, యస్యసః = నిరాకారః, తమ్ = నిరాకారం.

పక్షాన్తరమందు :- ఉభయాకారఘటనాత్ :- ఉభయశ్చాసౌ, ఆకారశ్చ = ఉభయాకారః, ఉభయాకారస్య, ఘటనం, ఉభయాకారఘటనం, తస్మాత్ = ఉభయాకార ఘటనాత్.

హరమయం :— హశ్చ, రశ్చ = హరౌ, హరయోః, వికారః = హరమయః, తమ్ = హరమయమ్.

నిరాకారం :- అశ్చ, అశ్చ, ఔ, అయోః, అకారః = ఆకారః. నిర్గతః, ఆకారః, యస్మాత్సః = నిరాకారః, తమ్ = నిరాకారమ్,

సేన్దుం ;- ఈచ, ఇన్దుశ్చ = ఈందూ, ఈందుభ్యాం, సహవర్తత ఇతి = సేన్దుః, తమ్ = సేన్దుం.

సకలం ;- కలయా, సహవర్తత ఇతి=సకలః. తమ్ = సకలమ్.

భగవదభిధేయమ్ ;- భగఇవ=భగవత్, భగవత్, అభిధేయం = భగవదభిధేయమ్.

వి:- ఇచ్చట మొదట దేవతాపక్షము. తర్వాత మన్త్రపక్షము, కడపటి యన్త్రపక్షము. ప్రకృతములు కాన కేవల ప్రకృత శ్లేషాలఙ్కారము.

**భావము :**

ఇచ్చట సరస్వతీదేవి యొసంగు వరము యొక్క స్వరూపమును కవి "అవామా" ఇత్యాదిగా నైదు శ్లోకములయందు వర్ణించుచున్నాడు. ఈ శ్లోకమునందు సారస్వత చింతామణి మన్త్రమును సరస్వతీదేవి నల మహారాజునకుపదేశించుచున్నది. ఆ మన్త్రమునే శ్రీహర్షుడు జపించి త్రిపురసుందరీ ప్రత్యక్షమునంది యనన్య దురాసదమగు వైదుష్యము నార్జించెను. ప్రస్తుత మీశ్లోకమునందా మంత్రము దేవతా పక్షమునందు, మన్త్రపక్షము నందును, యంత్రపక్షమునందును వర్ణింపఁబడుచున్నది. అందు తొలుత దేవతా పక్షమున ;—

ఓ నలమహారాజా ? దక్షిణార్ధమందు పురుషుడును, వామార్ధమందు స్త్రీయునునై రెండు విధములుగా నున్నదియు, నీరెండు ఆకారములు కలిగియుండుట వలన సంపూర్ణమైన భగవచ్ఛబ్దముచే. జెప్పఁదగిన రూపము గలిగినదియు చన్ద్రకలతో నొప్పినదియు, నిర్మలమైనదియు, పరమార్థ దృష్టిలో నిరాకారమైన

దియు ననగా దక్షిణార్ధ వామార్ధ భేదములు లేనిదియు మన్త్రస్వరూపమైనదియు లేదా మన్త్రమువలె దాచదగినదియు శివస్వరూపమైన నా స్వరూపమును నంతః కరణమందు ధ్యానింపుము ఆ మన్త్రమూర్తియగు నర్ధనారీశ్వరుడు నీకు ప్రసన్నుఁడగుగాత. ఫలమొసంగును గాత.

మంత్రపక్షమున :—ఆమన్త్రస్వరూపము "ఓం హర ఓం" అని ఇది పూర్వభాగమునందును చివరభాగమునందును ఓంకారములతో సంపుటీకరింపఁ బడియున్నది. "హర" శబ్దము నందనుచ్చారణకై రెండు అకారములు చేర్పఁ బడినందువలననిది "హ, ర" యని రెండు విధములుగా విభక్తమైనది. ఇది భగవన్తుడగు శివునిఁ జెప్పుచున్నది. ఈ హరమయమైనదియు. ననగా హకార రేఫాత్మకమైనదియు, నిరాకార మైనదియు ననగా హ, ర, యనుచోట శ్రూయ మాణములగు "అ" కారద్వయము తొలగుటచే అకారద్వయ రూపమగు నాకృతిచే రహితమైనదియు. ననగా "హ్, ర్" రూపముగనున్నదియు సేందువును ననగా ఈ- యను తురీయ స్వరముతోడను, చన్ద్రకలతోడను. ననగా బిందువు తోడనుఁగూడినదియు కలతో గూడినదియు నిర్దోషమైనదియు ఆద్యంతముల యందు ప్రణవములతో సంపుటీకృతమై "ఓం హ్రీం ఓం" అను రూపములతో నొప్పునదియును, నా యొక్క సారస్వత చింతామణి మంత్రమును ధ్యానింపుము. జపపద్ధతితోనుపాసింపుము, అందువలన నీకు మంత్రమూర్తియగు నర్ధనారీశ్వరుడు అనుగ్రహించునుగాత. ఈ మంత్రమునుగూర్చి యుద్ధారాది వివరమును పారమేశ్వరమను గ్రంథమునఁజెప్పఁబడినది—

"ఉద్ధారాస్తు పరోక్షేణ
పరోక్షప్రియతాశ్రుతేః.
శివాన్త వహ్నిసంయుక్తో, బ్రహ్మద్వితయమన్తరా
తురీయస్వరశీతాంశు రేఖాతారాసమన్వితః.
ఏష చింతామణిర్నామ మన్త్రః సర్వార్థసాధకః
జగన్మాతుః సరస్వత్యాః రహస్యంపరమంమతమ్"

ఇత్యాది. ఇచ్చట శివశబ్దముచే "హకారమును వహ్నిశబ్దముచే రేఫమును" బ్రహ్మద్వయ శబ్దముచే ప్రణవద్వయమును, తురీయస్వర శబ్దము చేత "ఈ కారమును" శీతాంశు రేఖాశబ్దముచేత "అర్ధచన్ద్రుని" తారా శబ్దముచేత బిందు

వును గ్రహింపవలయును. అదియే "ఓం హ్రీం ఓం" అను రూపముననుండును. అనగా "ఓం హర ఓం" అను తొలుత నిర్దేశింపఁబడిన మంత్రమే "ఓం హ్రీ ఓం" రూపముఁజెంది సారస్వత చింతామణిగా వ్యవహరింపఁబడుచున్నదని భావము.

యన్త్రి పక్షమునందు :— తొలుత యోనిరూపముగ కానవచ్చు త్రికోణమును మఱియొక త్రికోణముతోఁ గలుపుటవలన షట్కోణము లేర్పడుచున్నవి. ఈ షట్కోణముల మధ్య "ఓం హ్రీ ఓం" యను మన్త్రమును ధ్యానించి యుపాసించినచో భగవదనుగ్రహ మేర్పడునని భావము. 85

శ్లో॥ సర్వాఙ్గీణరసామృతస్తిమితయా వాచాచవాచస్పతిః
సస్వర్గీయమృగీదృశామపివశీ కారాయమారాయతే.
యస్మైయః స్పృహయత్యనేనసతదేవాఽఽప్నోతికిం భూయసా
యేనాఽయం హృదయేకృతః సుకృతినామన్మన్త్రి చిన్తామణిః. 86

ప॥వి॥ సర్వాఙ్గీణరసామృతస్తిమితయా - వాచా - చసః - వాచస్పతిః - సః - స్వర్గీయమృగీదృశామ్ - అపి - వశీకారాయ - మారాయతే - యస్మై - యః - స్పృహయతి - అనేన - సః - తత్ - ఏవ - ఆప్నోతి - కిం - భూయసా - యేన - అయం - హృదయే - కృతః - సుకృతినా - మన్మన్త్రిచింతామణిః.

అర్థము :— యేన = ఏ, సుకృతినా = పుణ్యవన్తునిచే, అయం = పూర్వము చెప్పఁబడిన, మన్మన్త్రిచింతామణిః; మన్మన్త్రి = నా మన్త్రి మనెడి, చింతామణిః = చింతించినంత మాత్రము చేతనే కోరిన వస్తువుల నొసంగెడి మణియగు నీ మన్త్రము, హృదయే = హృదయమునందు, కృతః = చేయఁబడినదో, అనగా స్మరింపఁబడినదో, సః = ఆస్మరించినవాడు, సర్వాఙ్గీణరసామృతస్తిమితయా; సర్వాఙ్గీణ = అన్నియంగములను వ్యాపించిన, రస = శృంగారము మున్నగు రసములనెడి, అమృత

= అమృతముచే, స్తిమితయా = నిండిన. వాచా = కావ్యాది రూపము లతో వెలసిన వాక్చాతుర్యముతో, వాచస్పతిః = బృహస్పతిగాఁగుచు న్నాడు. ఏవం = ఇట్లు, సః = ఆయుపాసకుడు, స్వర్గీయమృగీదృశా మపి; స్వర్గీయ = స్వర్గలోకమునకుఁజెందిన, మృగీదృశామపి = స్త్రీలను సైతము, వశీకారాయ = వశీకరించుకొనుటకు, మారాయతే = మన్మథు నివలె నాచరించును, యద్వా = లేదా, భూయసా = అధికముగా చెప్పు టచే, కిం = ఏమిప్రయోజనము. యః = ఎవ్వడు, యస్మైస్పృహయతే = దేనినికోరునో, సః = అతడు, తదేవ = దానినే, ఆప్నోతి = పొందును. ఏలయనగా నిది చింతామణికదా కాన గోరినదెల్ల సిద్ధించును.

## సమాసములు :

సర్వాఙ్గీణరసామృత స్తిమితయా :- సర్వాఙ్గాణివ్యాప్నోతీతి = సర్వాఙ్గీణః. సర్వాఙ్గీణశ్చాసౌ, రసశ్చ = సర్వాఙ్గీణరసః, సర్వాఙ్గీణరస ఏవ, అమృతం= సర్వాఙ్గీణరసామృతం, సర్వాఙ్గీణ రసామృతేన, స్తిమితా = సర్వాఙ్గీణరసామృత స్తిమితా, తయా = సర్వాఙ్గీణరసామృత స్తిమితయా. వాచస్పతిః :—వాచాం, పతిః = వాచస్పతిః.

స్వర్గీయమృగీదృశాం :—స్వర్గస్య, ఇమాః = స్వర్గీయాః. మృగాణామివ దృశః, యాసాంతాః = మృగీదృశః, స్వర్గీయాశ్చతాః, మృగీదృశశ్చ = స్వర్గీయమృగీదృశః, తాసాం = స్వర్గీయమృగీదృశాం.

మన్మన్త్రి చింతామణిః :— మమమన్త్రిః = మన్మన్త్రిః, మన్మన్త్రి ఏవ చింతామణిః = మన్మన్త్రిచింతామణిః.

## భావము :

ఇప్పుడు రెండు శ్లోకములచే మన్త్రిమహిమ వర్ణింపఁబడుచున్నది. ఏ పుణ్యవంతుడు నా మన్త్రిమైన చింతామణిని స్మరించుచున్నాడో యతడు సర్వా ఙ్గములను వ్యాపించు శృఙ్గారాదిరసామృతముతో నిండిన, కావ్యాది రూపములగు వాక్కుల యందలి చాతుర్యముతో బృహస్పతియగు చున్నాడు ఇట్లేయతడు స్వర్గలోకపు స్త్రీలను వశీకరించుకొనుటకు మన్మథుడగుచున్నాడు. లేదా ఇంత మాటలేల? ఎవడు దేనిని కోరునో వానికది సిద్ధించును. 86

శ్లో॥ పుష్పైరభ్యర్చ్య గన్ధాదిభిరపిసుభగైశ్చారు హంసేనమాంచే
న్నిర్యాన్తీం మన్త్రమూర్తిం జపతిమయిమతిం న్యస్యమయ్యేవభక్తః.
సమ్ప్రాప్తే వత్సరాంతే శిరసికరమసౌ యస్య కస్యాఽపి ధత్తే
సోఽపిశ్లోకానకాణ్డే రచయతిరుచిరాన్ కౌతుకం దృశ్యమస్య. 87

ప॥వి॥ పుష్పైః - అభ్యర్చ్య - గన్ధాదిభిః - అపి - సుభగైః - చారు - హంసేన - మాం - చేత్ - నిర్యాన్తీం - మన్త్రమూర్తిం - జపతి - మయి - మతిం - న్యస్య - మయి - ఏవ - భక్తః - సమ్ప్రాప్తే - వత్సరాంతే - శిరసి - కరమ్ - అసౌ - యస్య - కస్య - అపి - ధత్తే - సః - అపి - శ్లోకాన్ - అకాణ్డే - రచయతి - రుచిరాన్ - కౌతుకం - దృశ్యమ్ - అస్య.

అర్థము :— కిఞ్చ = మఱియు, మయి = నాయెడ, భక్తః = భక్తిగలవాడై, మయ్యేవ = నాయెడనే, మతిం = బుద్ధిని, న్యస్య = ఉంచి, హంసేన = హంసవాహనముతో, చారు = చక్కగా, నిర్యాన్తీం = సఞ్చరించుచున్న, మన్త్రమూర్తిం = మంత్ర స్వరూపురాలైన, మాం = నన్ను, సుభగైః = మనోజ్ఞములగు, పుష్పైః = పూవుతో, గంధాదిభిః = చందనము మొదలగు పరిమల ద్రవ్యముల తోడను, అభ్యర్చ్య = పూజించి, జపతిచేత్ = జపించినచో, తర్హి = అప్పుడు, వత్సరాన్తే = సంవత్సరము చివర, సమ్ప్రాప్తేసతి = ఏర్పడగా, అసౌ = ఈ జనించిన పురుషుడు, యస్యకస్యాఽపి = ఎవరోయొక యక్షరమురానివాని యొక్కయు, శిరసి = తలపై, కరం = హస్తమును, నిధత్తే = ఉంచుతో, సోఽపి = అతడును, అకాణ్డే = ఆకస్మికముగా, రుచిరాన్ = రమ్యములైన, శ్లోకాన్ = శ్లోకములను, రచయతి = రచయించు

చున్నాడు, అస్య = ఈ మంత్రము యొక్క, ఏతత్ = ఈ. కౌతుకం = ఆశ్చర్యము, దృశ్యం = చూడవలసినది.

**సమాసములు :**

మన్త్రిమూర్తిం :— మన్త్రిమయీ, మూర్తిః యస్యాస్సా = మన్త్రి మూర్తిః, తాం = **మన్త్రిమూర్తిమ్.**

**భావము :**

మఱియు నాయందు భక్తిగల్గినవాడై నాయెడ మనస్సును నిలిపి హంస వాహనముపై జక్కగా సంచరించుమన్న మన్త్రిస్వరూపిణియగునన్ను రమ్య ములైన పుష్పములచేతను, చందనాది పరిమల ద్రవ్యముల తోడను బూజించి జపించినచో, సంవత్సరము నిండగనే, యుపాసకుడు ఎట్టి మూఢునినెత్తిపై చేతినుంచినను నతడు, ఆకస్మికముగా రసవంతములగు శ్లోకములను రచియిం చును. ఈ యద్భుతము తప్పక చూడవలసినది. 87

శ్లో॥ గుణానామాస్థానీం నృపతిలక నారీతివిదితాం
రసస్ఫీతా మన్తస్తవచతవవృత్తే చకవితుః.
భవిత్రీ వైదర్భీ మధికమధికణ్ఠం రచయితుం
పరీరమ్భక్రీడా చరణశరణా మన్వహమహమ్. 88

ప॥వి॥ :- గుణానామ్ - ఆస్థానీం - నృపతిలక! - నారీతివిదితాం - రస స్ఫీతాం - అన్తః - తవ - చ - తవ - వృత్తే - చ - కవితుః - భవిత్రీ - వైదర్భీమ్ - అధికమ్ - అధికణ్ఠం - రచయితుం - పరీరమ్భ క్రీడాచరణశరణామ్ - అన్వహమ్ - అహమ్.

అర్థము :- హేనృపతిలక! = ఓ రాజోత్తమా! గుణానాం = రూపసౌందర్యాది గుణములకును, శ్లేషాదికావ్య గుణములకును, ఆస్థానీం = ఆశ్రయమైన దియు, నారీతివిదితాం; నారీతి = ఉత్తమ స్త్రీయని, విదితాం =తెలియఁ బడినదియు, న+ఆరీతివిదితాం = గౌడీపాంచాల్యాది రీతులమధ్య తెలియఁబడక యుండునదియు, ననగా వానిమధ్య తెలియబడినదియును, అంతః = మనస్సునందును, శ్లోకమధ్యమునందును, రసస్ఫీతాం; రస=

సుకుమార సందర్భముగల వైదర్భియను కన్యకను నీ చరిత్రమను వద్యము కవియొక్క కణ్ఠము నాలింగనము చేసుకొని దానితోడి వినోదమే తనకు రక్షకముగా నుండునట్లు చేయగలను. అదెట్లనగా వైదర్భియగు దమయన్తి రూప సౌందర్యాది గుణములకు నెలవు. వైదర్భీ రీతియు శ్లేషాదిగుణములకు నాశ్రయము. ఆ దమయన్తి నారీతి విదిత. అనగా నుత్తమ స్త్రీయని ప్రసిద్ధి నొందినది. ఆ వైదర్భీరీతి న + అరీతివిదిత కాదు. అనగా రీతులలో తెలియబడనిది గాదు. అనగా చక్కగా తెలియఁబడినది. ఆదమయన్తిరసస్ఫీత —అనగా నలానురాగముతో నిండినది. ఆ వైదర్భీరీతియు శృఙ్గారాది రసములతో నిండినది. అట్టి వైదర్భియగు దమయన్తిని, అట్టి వైదర్భియగు రీతిని క్రమముగా నలుడవైన నీయొక్కయు, నీ చరిత్రను కవనముచేయు శ్రీహర్షుని యొక్కయు కంఠమునందు నెలకొనునట్లు చేసి, యందు క్రీడావినోదములనే ప్రాణత్రాణముగాఁ గలదిగను, ఆ వైదర్భీరీతిని కవియొక్క కంఠము నాలింగముసుఁగావించుకొనియందలి క్రీడావినోదములనుఁ బ్రాణత్రాణగా గలదానినిగను నేను చేయగలనని భావము. ౮8

శ్లో॥ భవద్వృత్తస్తోతుర్మదుపహిత కణ్ఠస్యకవితుః
ముఖాత్పుణ్యైః శ్లోకైస్త్వయి
ఘనముదేయంజనముదే.
తతః పుణ్యశ్లోకః క్షితిభువనలోకాయ భవితా
భవానాఖ్యాతస్సన్ కలికలుషహారీ హరిరివ. 89

ప॥వి॥ :- భవద్వృత్తస్తోతుః - మదుపహితకణ్ఠస్య - కవితుః - ముఖాత్ - పుణ్యైః - శ్లోకైః - త్వయి - ఘనం - ఉదేయం - జనముదే - తతః - పుణ్యశ్లోకః - క్షితిభువనలోకాయ - భవితా - భవాన్ - ఆఖ్యాతః - సన్ - కలికలుషహారీ - హరిః - ఇవ.

అర్థము :- కిఞ్చ = మఱియు, హేనల = ఓ నలమహారాజా! మదుపహితకణ్ఠస్య; మత్ = నాచే, ఉపహిత = అధిష్ఠింపఁబడిన, కణ్ఠస్య = కణ్ఠముగలవాడైన, భవద్వృత్తస్తోతుః = భవత్ =నీయొక్క, వృత్త=

చరితమును, స్తోతుః = కొనియాడునట్టి, కవితుః = కవియొక్క,
ముఖమునుండి, త్వయి = నీవిషయమున, పుణ్యైః = పవి
రమ్యములునునగు, శ్లోకైః = పద్యములచేత, జన
శేషమునకై, ఘనం = నిరంతరము, ఉదేయమ్ =
యును. తతః = అట్లు పుణ్యశ్లోకములచే భవాన్=నీవు,
పవిత్రకీర్తిఁ గల్గినవాడవుగా, భవితా = కాగలవు.

వతః, వృత్తం = భవద్వృత్తం, భవద్వృత్తస్య
తా, తస్య = భవద్వృత్తస్తోతుః.
యా, ఉపహితః = మదుపహితః, మదుప
= మదుపహితకణ్ఠః, తస్య = మదుపహిత

శ్లోకః, యస్యసః = పుణ్యశ్లోకః
క్షితిరేవభువనం = క్షితిభువనం, క్షితిభువనమేవ
కః, తస్య = క్షితిభువనలోకస్య.
, కలుషః = కలికలుషః, కలికలుషం, హర

నధిష్ఠించిన కణ్ఠముగల్గి, నీ చరితమును, గొని
గార్చిన రమ్యములగు పద్యములు లోకమునకు
లువడవలయును. దానివలన పుణ్యశ్లోకుడుగా
వాడుగాఁ బ్రసిద్ధిఁ గడించినవాడవై జనార్దనుని
మున, కలిమాలిన్యమునుఁ దొలగించువాడవు

పుణ్యశ్లోకోయుధిష్ఠిరః
పుణ్యశ్లోకాచవైదేహీ, పుణ్యశ్లోకోజనార్దనః" అని నలమహారాజు, ధర్మ
రాజు, సీతాదేవి, జనార్దనుడు పుణ్యశ్లోకులుగాఁ జెప్పఁబడుచున్నారు.

మఱియు "కర్కోటకస్య నాగస్య, దమయన్త్యానలస్యచ।
ఋతుపర్ణస్యరాజర్షేః, కీర్తనంకలినాశనమ్॥
అని కర్కోటకుడను సర్పమును, దమయన్తిని, నలమహారాజును, ఋతుపర్ణు
దను రాజర్షినిఁ గీర్తించినవో పాపములు నశించుననియుఁ జెప్పఁబడినది. 89

శ్లో॥ దేవీచతేచ జగదుర్జగదుత్తమాజ్గ
రత్నాయతే కథయకం వితరామ కామమ్.
కిఞ్చిత్త్వయానహి పతివ్రతయాదురాపం
భస్మాస్తు యస్తవ బతవ్రతలోపమిచ్ఛుః 90

ప॥వి॥ :- దేవీ - చ - తే - చ - జగదుః - జగదుత్తమాజ్గరత్నాయ - తే-
కథయ - కం - వితరామ - కామం - కిం - చిత్ - త్వయా - న -
హి - పతివ్రతయా - దురాపం - భస్మ - అస్తు - యః - తవ -
బత - వ్రతలోపమ్ - ఇచ్ఛుః.

అర్థము :- దేవీచ = సరస్వతీదేవియు, తేచ = ఇంద్రాదులును, జగదుః =
చెప్పిరి. జగదుత్తమాజ్గరత్నాయ; జగత్ = మూడులోకములకును, ఉత్త
మాజ్గరత్నాయ = శిరోరత్నమైన, తే = నీకై, కం = ఏ, కామం =
ఇష్టమును, వితరామ = ఇత్తుము. కథయ = చెప్పుము. పతివ్రతయా =
పతివ్రతయైన, త్వయా = నీచేత, దురాపం = పొందశక్యము కానిది,
కించిత్ = కొంచెముఁగూడ, నహి = లేదు, ఏలయనగా -పాతివ్రత్యపు
తేజస్సు అడ్డరాని శక్తి గలిగినదిగదా. తథాఽపి = అయినను, యః =
ఎవ్వడు, తవ = నీయొక్క, వ్రతలోపం = పాతివ్రత్యమునకు లోప
మును, ఇచ్ఛుః = కోరుచున్నాడో, సః = అతడు, భస్మ = భస్మము,
అస్తు = అగుఁగాత, బత = కష్టము. అరణ్యమంతు కొండచిలువచే
మ్రింగఁబడిన దమయన్తిని విడిపించి కిరాతుడు, ఆమెను మోహింపగా
నతని వధయందిది ఫలించును కాన, నా భారత ఘట్టమిఁట ననుసంధే
యము —

సమాసములు :

జగదుత్తమాజ్గరత్నాయ :- జగతాం ఉత్తమాజ్గం జగదుత్తమాజ్గం, జగ

దుత్తమాఙ్గే, రత్నం = జగదుత్తమాఙ్గరత్నం, తస్మై = జగదుత్తమాఙ్గ రత్నాయ.

పతివ్రతయా :- పత్యౌ, వ్రతం, యస్యాస్సా = ప్రతివ్రతా, తయా = పతివ్రతయా.

దురాపం :- దుఃఖేన, ఆప్తుం, శక్యం = దురాపం.

వ్రతలోపం :- వ్రతస్య, లోపః = వ్రతలోపః, తమ్ = వ్రతిలోపమ్.

**భావము :**

సరస్వతీదేవియు, నింద్రాది దేవతలు నిట్లు పలికిరి — మూడు లోకములకును శిరోరత్నమైన నీకు, ఏమి ఇష్టమును మేము తీర్చెదము. చెప్పుము. పతివ్రతయగు దమయన్తికి దుర్లభమైన దేదియును లేదు. పాతివ్రత్య తేజోమహిమను నేదియు నెదుర్కొనజాలదు. నీ పాతివ్రత్యమునకు భఙ్గముఁ జేయగోరినవాడు భస్మమగునుగాత. భారతమున దమయన్తిని అజగరము మ్రింగగా, నామెను విడిపించిన కిరాతకు డామెను మోహించి దగ్ధమైన ఘట్టము ఇట ననుసంధేయము.

శ్లో॥ కూటకాయ మపహాయ నోవపు
ర్బిభ్రత స్త్వమసి వీక్ష్యవిస్మితా.
అప్తు మాకృతిమితో మనీషితాం
విద్యయాహృది తవాప్యుదీయతామ్. 91

ప॥వి॥ :- కూటకాయమ్ - అపహాయ - నః - వపుః - బిభ్రతః - త్వమ్ - అసి - వీక్ష్య - విస్మితా - ఆప్తుమ్ - ఆకృతిమ్ - ఇతః - మనీషితాం - విద్యయా - హృది - తవ - అపి - ఉదీయతామ్.

**అర్థము** :- కూటకాయం = కపటశరీరమును, ననగా నలాకృతిని, అపహాయ = వదలి, వపుః = నిజశరీరమును, బిభ్రతః = ధరించుచున్న, నః = మమ్ములను, వీక్ష్య = చూచి, త్వమ్ = నీవు, విస్మితా = ఆశ్చర్యముఁ జెందినదానవుగా, అసి = అగుచున్నావు. అందుచేతనే నీవును స్వేచ్ఛతో రూపాన్తరమునుఁ బొందుటకును వదలుటకును కోరికకల దానవుగా గానవచ్చుచున్నావు.. అతః = ఈకారణమువలన, మనీషితాం = కోరఁబడిన

ఆకృతిం = ఆకారమును, ఆప్తుం = పొందుటకు, తవాఽపి = నీ యొక్కయు, హృది = హృదయమునందు, విద్యయా = కామరూపము నొసంగు విద్యచేత, ఉదీయతాం = ఉదయింపఁబడుట (అగునుఁగాక.)

సమాసము లు :

కూటకాయం :- కూటప్రయుక్తః, కాయః = కూటకాయః, తమ్ = కూట కాయమ్.

భావము :

కపట దేహమైన నలుని ఆకృతి వదలి, నిజనిజ శరీరములను ధరించిన మమ్ములనుఁ జూచి నీవు విస్మయముఁ జెందుచున్నావు. కాన స్వేచ్ఛతో కోరిన రూపము నెత్తుటకును నీకును కోరిక యున్నట్లు—తెలియుచున్నది. కాన నీవును కోరిన రూపమును ధరించుటకు సాధనమైన కామరూపవిద్యనుఁ బడయుదువుగాక యని దేవతలు దమయన్తికి వరమొసఁగిరి. 91

శ్లో॥ ఇత్థం వితీర్యవరమమ్బర మాశ్రయత్సు
తేషు క్షణాదుదల సద్విపులః ప్రణాదః.
ఉత్తిష్ఠతాం పరిజనాలపనై ర్నృపాణాం
స్వర్వాసి వృన్దహత దుందుభినాదసాన్ద్రః. 92

ప॥వి॥ :- ఇత్థం - వితీర్య - వరమ్ - అమ్బరమ్ - ఆశ్రయత్సు - తేషు - క్షణాత్ - ఉదలసత్ - విపులః - ప్రణాదః - ఉత్తిష్ఠతాం - పరిజనాలపనైః - నృపాణాం - స్వర్వాసి వృన్దహతదుందుభినాదసాన్ద్రః.

అర్థము :- తేషు = ఇంద్రాదులగు వేల్పులు, ఇత్థం = ఇట్లు, వరం = వరమును, వితీర్య - ఇచ్చి, అమ్బరం = ఆకసమును, ఆశ్రయత్సుసత్సు = ఆశ్రయింపగా, ఉత్తిష్ఠతాం = ఆసనములనుండి పైకిలేచిన, నృపాణాం = రాజులయొక్క, ప్రణాదః = హర్షధ్వని, పరిజనాలపనైః; పరిజన= పరిజనులయొక్క, ఆలపనైః = మాటలతో, విపుఃస్సన్ = విశాలమైన దగుచు. స్వర్వాసివృన్దహతదుందుభినాదసాంద్రః; స్వర్వాసి =స్వర్గలోక వాసులగు దేవతలచే. హత = కొట్టఁబడిన, దుందుభి = దుందుభివాద్యము లయొక్క, నాద = శబ్దముచే, సాన్ద్రః = దట్టమైనదై, క్షణాత్ = క్షణకాలమున, ఉదలసత్ = పైకివ్యాపించినది,

**సమాసములు :**

పరిజనాలపనైః :— పరిజనానామాలపనాని = పరిజనాలపనాని, తైః = పరిజనాలపనైః.

స్వర్వాసివృన్దహత దుందుభినాదసాంద్రః :— స్వః, వాసినః = స్వర్వాసినః, స్వర్వాసినాం, వృన్దః = స్వర్వాసివృన్దః, స్వర్వాసి వృన్దేన, హతాః = స్వర్వాసివృన్దహతాః, స్వర్వాసివృన్దహతాశ్చతే దుందుభయశ్చ=స్వర్వాసివృన్దహతదుందుభయః, స్వర్వాసివృన్దహత దుందుభీనాం, నాదాః=స్వర్వాసివృన్దహతదుందుభినాదాః. స్వర్వాసివృన్ద హతదుందుభినాదైః. సాన్ద్రః=స్వర్వాసివృన్దహత దుందుభినాదసాంద్రః.

**భావము :**

ఆ ఇంద్రాది దేవతలిట్లు చరమునొసంగి యాకసమునకు జేరగనే, తమ తమ యాపనములను వదలివేసెడి రాజుల హర్షధ్వని, పరిజనుల సల్లాపములచే బెరిగినది. అది స్వర్గమండలి దేవతల దుందుభుల ధ్వనులతో దట్టమై క్షణకాలమునకంతట విజృంభించినది. 92

శ్లో॥ నదోషం విద్వేషాదపి నిరవకాశం గుణమయే
వరేణప్రాప్తాస్తేన సమరసమారమ్భసదృశమ్.
జగుఃపుణ్యశ్లోకం ప్రతినృపతయః కింతువిదధుః
స్వనిశ్వాసైర్భైమీహృదయముదయన్నిర్భరదయమ్. 93

ప॥వి॥ న - దోషం - విద్వేషాత్ - అపి - నిరవకాశమ్ - గుణమయే - వరేణ - ప్రాప్తాః - తే - న - సమరసమారంభసదృశమ్ - జగుః - పుణ్యశ్లోకం - ప్రతి - నృపతయః - కిం - తు - విదధుః - స్వనిశ్వాసైః - భైమీహృదయమ్ - ఉదయన్నిర్భరదయమ్.

అర్థము:—ప్రాప్తాః = స్వయంవరమునకు విచ్చేసిన, తే = ఆ, నృపతయః = రాజులు, గుణమయే = గుణములకు ముఖ్యస్థానమైన, (నలే = నలుని యందు) నిరవకాశం = ఉండుటకవకాశములేని, దోషం = దోషమును, విద్వేషాదపి = దమయన్తిని బడిసినందున కల్గిన ద్వేషమువలనను నజగుః = చెప్పలేదు. అట్టి గుణసంపద దోషరాహిత్యము నలునియందు

న్నదని యర్థము (మఱియు) వరేణ = శచీదేవియొసంగిన వరముచే. పుణ్యశ్లోకం = పవిత్ర చరిత్రుడగు నలునిఁ గూర్చి, సమరసమారమ్భ సదృశమ్ = యుద్ధ ప్రయత్నమున కనుకూలమైన దానిని, కిఞ్చిత్ = కొంచెముఁగూడ, నజగుః = చెప్పలేదు. కింతు = కాని, స్వని శ్వాసైః = దమయంతినిఁబొందలేక పోవుటవలని దుఃఖముచేఁ గల్గిన తమ నిట్టూర్పులచే, భైమీహృదయం = దమయన్తీ హృదయమును, ఉదయన్నిర్భరదయం; ఉదయత్ = ఉదయించు, నిర్భరదయం = అధికమగు దయగలదానినిగా, విదధుః=చేసిరి. బరుల దుఃఖములను సహింపజాలని దమయన్తి తాను—నిరాకరించుటవలన దుఃఖించు రాజులనుఁ జూచి జాలిపడి వారి దుఃఖమునఁబోగొట్టుఁ గోరికగలదాయెను.

**సమాసములు :**

నిరవకాశం :— నిర్గతః, అవకాశః, యస్యసః = నిరవకాశః, తమ్ = నిరవకాశమ్.

గుణమయే :— గుణైః, పూర్ణః = గుణమయః, తస్మిన్ =గుణమయే.

సమరసమారమ్భసదృశమ్ :— సమరస్య, సమారంభః = సమర సమారమ్భః, సమరసమారమ్భస్య, సదృశం = సమరసమారమ్భ సదృశమ్, తత్ = సమరసమారమ్భ సదృశమ్.

పుణ్యశ్లోకం :— పుణ్యః, శ్లోకః, యస్యసః = పుణ్యశ్లోకః, తమ్ = పుణ్యశ్లోకమ్

స్వనిశ్వాసైః :— స్వస్య, నిశ్వాసాః = స్వనిశ్వాసాః, తైః = స్వని శ్వాసైః.

భైమీహృదయమ్ :— భైమ్యాః, హృదయం = భైమీహృదయమ్, తత్ = భైమీహృదయమ్.

ఉదయన్నిర్భరదయమ్ :— ఉదయన్తీ, నిర్భరం, దయా, యస్మిన్ తత్ = ఉదయన్నిర్భరదయం, తత్ = ఉదయన్నిర్భరదయమ్.

**భావము :**

స్వయం వరమునకు విచ్చేసిన రాజులు గుణనిధియగు నలునియందు లేని దోషమును, దమయన్తియందుఁనతను పొందుటవలన ద్వేషము చేతను జెప్పలేదు.

సటువట్టి గుణవంతుడును దోషరహితుడని యాశయము. మఱియు శచీదేవి స్వయంవరమునందు ప్రచ్ఛన్నముగనుండి యొసంగిన వరముచే యుద్ధారంభమునకు ప్రయత్నము జరుగలేదు.

కాని వారు దమయన్తినిఁదాము పొంద జాలనందువలని దుఃఖముచే నిట్టూర్పులు విడుచుచనామె హృదయమును దయామయము గావించిరి. సహజముగా నొరుల దుఃఖములను సహింపఁజాలని దమయన్తియు వారి దుఃఖము నుపశమింప నిచ్ఛగించినది. 93

శ్లో॥ భూభృద్భిర్లమ్భితాఽసౌ కరుణరసనదీ మూర్తిమద్దేవతాత్వం
తా తేనాభ్యర్థ్యయోగ్యాః సపది నిజసఖీర్దాపయామాస తేభ్యః।
వైదర్భ్యాస్తేఽప్యలాభాత్ కృతగమనమనః ప్రాణవాఞ్ఛాం నిజఘ్నుః
సఖ్యాః సంశిక్ష్యవిద్యాం సతతధృతవయస్యామకారాభిరాభిః. 94

ప॥వి॥ భూభృద్భిః - లంభితా - అసౌ - కరుణరసనదీమూర్తిమద్దేవతాత్వం - తాతేన - అభ్యర్థ్య - యోగ్యాః - సపది - నిజసఖీః - దాపయామాస - తేభ్యః - వైదర్భ్యాః - తే - ఽపి - అలాభాత్ - కృతగమనమనః - ప్రాణవాఞ్ఛాం - నిజఘ్నుః - సఖ్యాః - సంశిక్ష్య - విద్యాం - సతతధృతవయస్యామకారాభిః - ఆభిః.

అర్థము :-భూభృద్భిః = రాజులచే, కరుణరసనదీమూర్తిమద్దేవతాత్వం; కరుణరసనదీ = కరుణరస ప్రవాహముగల నదికి, మూర్తిమత్ = దేహమును ధరించిన, దేవతాత్వం = అధిదేవతగ నుండుటను, లమ్భితా = పొందింపఁబడిన, అసౌ = ఈ-దమయన్తి, సపది = వెంటనే, అభ్యర్థ్య = తండ్రినిఁ ప్రార్థించి, తాతేన = తండ్రియగు భీమరాజుచే, యోగ్యాః = కులముచేతను శీలముచేతను సౌందర్యముచేతను రాజులకు దగినట్టి నిజసఖీః = తన చెలికత్తెలను, తేభ్యః = ఆ రాజులకై, దాపయామాస=

ఇప్పించినది. తేపి = ఆ రాజులుగూడ, వైదర్భ్యాః = దమయన్తి యొక్క, ఇలాభాత్ = ప్రాప్తిలేనందువలన, కృతగమనమనః ప్రాణ వాంఛాం; కృత = చేయఁబడిన, గమన = దేహపరిత్యాగమునందు, మనః = మనస్సుగల్గిన, ప్రాణ = ప్రాణములయొక్క, వాంఛాం = కోరికను, అనగా దేహమును విడచి పోవలెయుననెడి కోరికను, సఖ్యాః = దమయన్తివలన, విద్యాం = ఆమెకు నింద్రాదిదేవతలుపదేశించిన కామరూప ధారణవిద్యను, సంశిక్ష్య = నేర్చుకొని, సతతధృతవయస్యాను కారాభిః; సతత = ఎల్లప్పుడు, ధృత = ధరింపఁబడిన, వయస్యా = చెలికత్తెయగు దమయన్తిని, అనుకారాభిః = అనుకరణము గల్గిన, ఆభిః = చెలికత్తెలతో, నిజఘ్నుః = నిలుపుకొనిరి. రాజులు గూడఁ దమయంతి లభింపనందువలన, తమ్మువదలి పెట్టిపోవుచున్న తమ మనస్సును ప్రాణములను, దమయన్తి చెలికత్తెలు లభించుటవలన వదలి పోనీయక నిలుపుకొనిరి. కానిచో వారు వెంటనే మరణించియుం దురు. దమయంతి యొక్క దయాళుత్వము వివేకము ఆశ్చర్యకరములు.

**సమాసములు :**

కరుణరసనదీ మూర్తిమద్దేవతాత్వం :—కరుణఇతిరసః = కరుణరసః, కరుణరసమయీచసానదీచ = కరుణరసదీ, కరుణరసనదీ, మూర్తిః, అస్యాః అస్తీతి = మూర్తిమతీ, మూర్తిమతీచసాదేవతాచ = మూర్తిమద్దేవతా, కరుణరసనద్యాః, మూర్తిమద్దేవతా = కరుణరసనదీమూర్తిమద్దేవతా, కరుణరసనదీమూర్తిమద్దేవతాయాః, భావః = కరుణరసనదీమూర్తిమద్దేవతాత్వం, తత్ = కరుణరసనదీమూర్తిమద్దేవతాత్వమ్.

నిజసఖీః :—నిజాశ్చతాః సఖ్యశ్చ = నిజసఖ్యః, తాః = నిజసఖీః.

కృతగమనమనః ప్రాణవాఞ్ఛామ్ :— కృతం. గమనే, మనః, యైస్తే = కృతగమనమనసః, కృతగమనమనసశ్చతే ప్రాణాశ్చ = కృతగమనమనః ప్రాణాః, కృతగమనమనః ప్రాణానాం, వాఞ్ఛా = కృతగమనమనః ప్రాణవాఞ్ఛా, తాం = కృతగమనమనః ప్రాణవాఞ్ఛామ్.

సతతధృతవయస్యానుకారాభిః :—వయస్యాయాః, అనుకారః = వయస్యానుకారః, సతతం, ధృతః = సతతధృతః, సతతధృతః వయస్యాను

కారః యాభిస్తాః = సతతధృతవయస్యానుకారాః, తాభిః = సతత వయస్యానుకారాభిః.

**భావము :**

రాజుల దుఃఖముచే యా దమయన్తి కరణరసనదికి దేహముదాల్చిన యధిష్ఠాన దేవతయైనది. అందువలన వెంటనే యామె తండ్రిని ప్రార్థించి, కులము చేతను, శీలము చేతను, సౌందర్యము చేతను రాజుల కీడు జోడుగానున్న తన చెలికత్తెలనిప్పించెను దమయంతి లభింపనందువలని దుఃఖము వారికి ప్రశమించినది మఱియు వారు దమయన్తి కింద్రాదులుపదేశించిన కామరూపధారణ విద్యను నామెనుండి నేర్చిన తమ ప్రియరాండ్రు ఎల్లప్పుడు దమయంతి రూపమును ధరించి యుండుటవలన దమయన్తి లభింపనందువలన నేర్పడిన కొఱత లేనివారై, యందువలన దేహపరిత్యాగము చేయనున్న తమ ప్రాణములను నివారించుకొని సంతసమందిరి. ఇట్లు దమయన్తి తన దయాలుత్వమును వివేకమును సరియైన సమయమున బ్రదర్శించి రాజుల ప్రాణముల నాదుకొనుట యాశ్చర్యము. 94

శ్లో॥ అహహ! సహమఘోనా శ్రీ ప్రతిష్ఠానమానే
నిలయమభినలేథ స్వం ప్రతిష్ఠాసమానే.
అపతదమరభర్తు ర్మూర్తిబద్ధేవ కీర్తి
ర్గలదలిమధుబాష్పా పుష్పవృష్టిర్నభస్తః. 95

ప॥వి॥ అహహ - సహ - మఘోనా - శ్రీప్రతిష్ఠాసమానే - నిలయమ్ - అభి - నలే - అథ - స్వం - ప్రతిష్ఠాసమానే - అపతత్ - అమభర్తుః - మూర్తిబద్ధా - ఇవ - కీర్తిః - గలదలిమధుబాష్పా - పుష్పవృష్టిః - నభస్తః.

అర్థము:—అథ = ఇంద్రుడు బయలుదేరిన పిదప, మఘోనాసహ = ఇంద్రుని తోడ. శ్రీప్రతిష్ఠాసమానే; శ్రీప్రతిష్ఠా = ఐశ్వర్య గౌరవముచే, సమానే = సమానుడగు, నలే = నలమహారాజు, స్వం = తనదైన, నిలయం = గృహమును గూర్చి, ప్రతిష్ఠాసమానేసతి = పయనించి గోరుచుండగా, గలదలి మధుబాష్పా: గలత్ = స్రవించుచున్న, అలి = తుమ్మెదలతోఁ గూడిన, మధు = మకరందమనెడి, బాష్పా = కన్నీరుగల్గిన, అనగా

కాటుకతోఁగూడిన కన్నీరు గల్గిన. మూర్తిబద్ధా = శరీరమును ధరించిన, అమరభర్తుః = ఇంద్రునియొక్క, కీర్తిరివ = కీర్తివలె, పుష్పవృష్టిః = పూలవాన, నభస్తః = ఆకసమునుండి, అపతత్ = పడినది. అహహ = ఆశ్చర్యము. ఇంద్రునిదుష్ట వ్యసనమువలని దుఃఖమువలన కీర్తిభ్రష్టమైనదని యర్థము. పూలు తెల్లగానుండుటవలన దానికి కీర్తిత్వము చెప్పఁబడినది. తుమ్మెదలు నల్లగానుండుటవలన కాటుకగా భావింపఁబడినది. స్త్రీలకు కన్నీరు కాటుకతో గలసియుండుట ప్రసిద్ధము, కీర్తియనెడు స్త్రీ యింద్రుని దుర్వ్యసనమునకు దుఃఖించినదై పుష్ప రూపముగా భావింపఁబడిన తన్నుఁగమ్ముకొనిన తుమ్మెదలు నల్లని కాటుకగను, నందుస్రవించు మకరందము కన్నీరును కాగా పైవిధముగా విలపించినదని యర్థము.

**సమాసములు ;**

శ్రీప్రతిష్ఠాసమానే :— శ్రీశ్చ, ప్రతిష్ఠాచ = శ్రీప్రతిష్ఠే, శ్రీప్రతిష్ఠయోః. సమానః = శ్రీ ప్రతిష్ఠాసమానః, తస్మిన్ = శ్రీప్రతిష్ఠాసమానే.

ప్రతిష్ఠాసమానే :— ప్రస్థాతుమిచ్ఛుః = ప్రతిష్ఠాసమానః, తస్మిన్ = ప్రతిష్ఠాసమానే.

అమరభర్తుః :— అమరాణాం, భర్తా = అమరభర్తా, తస్య = అమర భర్తుః.

మూర్తిబద్ధా ;— మూర్త్యా, బద్ధా = మూర్తిబద్ధా.

గలదలిమధుబాష్పా :— అలియుక్తం, మధు =అలిమధు, గలచ్చతత్, అలిమధుచ = గలదలిమధు, గలదలిమధ్వేవ, బాష్పః, యస్యాస్సా = గలదలిమధుబాష్పా.

పుష్పవృష్టిః ;— పుష్పాణాం, వృష్టిః = పుష్పవృష్టిః.

**భావము :**

ఇంద్రుడుఁ బయలుదేరిన పిదప నతనితోడ నైశ్వర్యగౌరవములయందు సమానుడగు నలుడును తన నివాసమునకుఁ బయలుదేరఁగోరగా, తుమ్మెదలతో గూడిన మకరందమనెడి కన్నీరుగః ; దేహమును ధరించిన యింద్రుని కీర్తియో యనునట్లు పూలవాన ఆకసమునుండి పడినది. ఇది ఆశ్చర్యము. ఇంద్రుని శ్రీ

లోలత్వమునకు నాతని కీర్తి దుఃఖించి కాటుకతోఁ గలిసిన కన్నీరును కార్చుచు క్రిందఁబడినట్లు పుష్పవృష్టి భావింపబడినది. పూలు తెల్లగా నుండుటవలన నవి కీర్తిగను, అందలి మకరందమును గ్రాగుటకై ముసురుకొనుచున్న నల్లని తుమ్మెదలు కాటుకగను, పూలలోని మకరందము కన్నీరుగను భావింపఁబడినది. ఇంద్రాదులును నలుఁడును, తమతమ నిలయములకు నయలుదేరుచున్న సమయమున నాకసమునుండి పూలవాన మంగళ సూచకముగాఁ గురిసినదని భావము. 92

శ్లో॥ స్వస్యామరై ర్నృపతిమంశమ ముంత్యజద్భి
రంశచ్ఛిదా కదనమేవ తదాధ్యగాయి.
ఉత్కాస్మ పశ్యతివివృత్త్య వివృత్త్యయాన్తీ
వాగ్దేవతాఽపి నిజవిభ్రమధామ భైమీమ్. 96

ప॥వి॥:- స్వస్య - అమరైః - నృపతిమ్ - అంశమ్ - అముం - త్యజద్భిః - అంశచ్ఛిదాకదనమ్ - ఏవ - తదా - అధ్యగాయి - ఉత్కా - స్మ - పశ్యతి - వివృత్త్య - వివృత్త్య-యాన్తీ -వాగ్దేవతా - అపి - నిజవిభ్రమధామ - భైమీమ్.

అర్థము :- స్వస్య = ఇంద్రాద్యష్టదిక్పాలకసంఘమునకు, అంశం = అంశమున సంభవించిన, అముం = ఈ, నృపతిం = రాజైననలుని, త్యజద్భిః = వదలుచున్న, అమరైః = ఇంద్రాదులచే, అంశచ్ఛిదాకదనమేవ; అంశ= అవయవముయొక్క, ఛిదా = ఛేదనముచేఁ గల్గిన, కదనమేవ = దుఃఖమే, తదా = అప్పుడు, అధ్యగాయి = తెలియఁబడినది. తన అంశమునఁ బుట్టిన జనముతోడనెడబాటు తన యవయవమునుఁ దెగఁగొట్టినంతటి దుఃఖము నొసంగునని యర్థము. కిఞ్చ = మఱియు, నిజం = తనదైన, విభ్రమధామ = విలాసగృహమును గూర్చి. యాన్తీ = వెళ్ళుచున్న, వాగ్దేవతాఽపి = సరస్వతీదేవియు, ఉత్కా = ఉత్కంఠనుఁ జెందినదై, వివృత్త్య వివృత్త్య = మాటిమాటికి వెనుదిరిగి, భైమీం = దమయన్తిని, పశ్యతిస్మ = చూచుచుండినది, "సంధత్తేభృశమరతిం

సుహృద్వియోగః", అని చెప్పిన ప్రకారము, చెలికాండ్రతోటి యెడఁ బాపు మిక్కిలి యుత్సాహరాహిత్యము నొసంగునని యాశయము.

సమానములు:

అంశచ్ఛిదాకదనమ్ :- అంశస్య, ఛిదా = అంశచ్ఛిదా, అంశచ్ఛిదైవ కదనమ్=అంశచ్ఛిదాకదనమ్, తత్ = అంశచ్ఛిదాకదనమ్.

నిజవిభ్రమధామ .- విభ్రమాణాం, ధామ = విభ్రమధామ, నిజంచతత్, విభ్రమధామచ = నిజవిభ్రమధామ, తత్ = నిజవిభ్రమధామ.

భావము :

ఇంద్రాది దిక్పాలురు తమకంశముగా జన్మించిన నలుని విడచిపెట్టివెళ్ళుట వలన, తమ శరీరములో నవయవమునుఁ దెగగొట్టినంతటి బాధను అనుభవించిరి."— "అష్టాభిశ్చ సురేన్ద్రాణాం మాత్రాభిర్నిర్మితో నృపః" అని చెప్పినట్లు నలమహారాజు దిక్పాలుర యంశమున జన్మించినవాడు కదా! లోకమునందు తన యంశమునఁ బుట్టిన వ్యక్తితోటి వియోగము తన యవయవమునుఁ దెగగొట్టినంతటి బాధనొసంగును. కాన దిక్పాలురు నలుని వదలిపెట్టి పోవునపుడు మిక్కిలి వెతఁ జెందిరి. మఱియు తన విలాస భవనమునకు వెళ్ళుచున్న సరస్వతీదేవియు నుత్కంఠజెందినదై మాటిమాటికి వెనుదిరిగి చూచుచు దమయంతినిఁ జూచుచుండినది.మిత్రులతోటి వియోగము మిక్కిలి నిరుత్సాహజనకము గదా. 96

శ్లో॥ సానందం తనుజా వివాహనమహే
భీమః స భూమీపతిః
వైదర్భీ నిషధాధిపౌ నృపజనా నిష్టోక్తి సమ్మృష్టయే.
స్వాని స్వాని ధరాధిపాశ్చ శిబిరాణ్యుద్దిశ్య
యాతాః క్రమా
దేకోద్వాబహ వశ్చకార స్పృజతః
స్మాతేనిరేమఙ్గలమ్ 97

ప॥వి॥ :- సానందం - తనుజావివాహనమహే - భీమః - సః - భూమీపతిః - వైదర్భీనిషధాధిపౌ - నృపజనాన్ - ఇష్టోక్తిసమ్మృష్టయే-స్వాని-స్వాని

-ధరాధిపాః - చ - శిబిరాణి - ఉద్దిశ్య - యాన్తః - క్రమాత్ - ఏకః -
ద్వౌ - బహవః - చకార - స్సృజతః - స్మ - అతేనిరే - మఙ్గలమ్.

**అర్థము** :- తనుజావివాహనమహే; తనుజా = పుత్రికయొక్క, వివాహన = పెండ్లియనెడు, మహే = ఉత్సవమునందు, భూమీపతిః = భూపాలుడగు, సః = ఆ, భీమః = భీముడు, తథా = అట్లే, వైదర్భీనిషధాధిపౌ; వైదర్భీ = దమయంతియు, నిషధాధిపౌ = నిషధదేశపు రాజైన నల మహారాజును, తథా = అట్లే, స్వానిస్వాని = తమతమ, శిబిరాణి = గుడారములను, ఉద్దిశ్య = గురించి, యాన్తః = వెళ్ళుచున్న, ధరాధిపాశ్చ = భూపతులును, ఏకః = ఒక్కడు, ద్వౌ=ఇద్దఱు, బహవః = పెక్కండ్రు, అనునీమూడు రకములైనవారును, నృపజనానిష్టోక్తిసమ్మృష్టయే; నృపజన = దమయన్తిని వరించని రాజులకు సంబంధించిన పరిజనములయొక్క, అనిష్టోక్తిసమ్మృష్టయే; అనిష్టోక్తి =తమతమ రాజులను వరింపనందు వలన చేసెడి కఠిన వచనములను, సమ్మృష్టయే = సమ్మార్జనము అనగా పరిహారము చేసుకొనుట కొఱకు, అనగా నాకఠిన వచనముల వలని దోషమును నివృత్తిం జేసికొనుటకొఱకు, సానందం= ఆనందముతో, గూడినట్లు, మంగళం = నగరమును పుణ్యాహ వచనములతో సంస్కరించుట, ఇష్టదేవతలను స్మరించుట, వాద్యఘోషములు గావించుట; మున్నగు మంగలాచరణమును, క్రమాత్ = క్రమముగా, ఏకః = ఒక్కడైన భీమరాజు, ద్వౌ = ఇద్దఱైన దమయన్తీనలులు, స్సృజతఃస్మ = చేయుచుండిరి. బహవః = పెక్కండ్రగు, ధరాధిపాః= రాజులు, దమయంతి సఖులు లభించుట వలన, మఙ్గలం = మంగలమును, అతేనిరే = చేసిరి.

**సమాసములు** :

సానందం :- ఆనందేన, సహితం, యథాతథా = సానందం.

తనుజావివాహనమహే :- తనుజాయాః, వివాహనం = తనుజావివాహనం, తనుజావివాహనమేవమహః = తనుజావివాహనమహః, తస్మిన్ = తనుజావివాహనమహే.

భూమీపతిః :- భూమ్యాః, పతిః = భూమీపతిః.

వైదర్భీనిషధాధిపౌ :- విదర్భేషు, భవా=వైదర్భీ, నిషధానా అధిపః = నిషధాధిపః, వైదర్భీచనషధాధిపశ్చ = వైదర్భీనిషధాధిపౌ.

నృపజనానిష్టోక్తిసమ్మృష్టయే :- నృపాణాం, జనాః = నృపజనాః, నృపజనానామనిష్టోక్తయః = నృపజనానిష్టోక్తయః, నృపజనానిష్టోక్తీనాం, సమ్మృష్టిః = నృపజనానిష్టోక్తిసమ్మృష్టిః, తస్యై = నృపజనానిష్టోక్తి సమ్మృష్టయే.

ధరాధిపాః :- ధరాయాః, అధిపాః = ధరాధిపాః.

**భావము :**

తన పుత్రికయొక్క వివాహ మహోత్సవమునందు భూపాలుడగు నా భీముడు సంతోషపూర్వకముగా మంగలసూచకములగు వాద్యములను ప్రయోగింప జేసెను. దమయన్తి లభింపనందువలన నీర్ష్యవహించిన రాజుల పరిజనముల నిష్ఠురోక్తులకు శాంతి యొనర్చుటకు, అనగా వానిని వినకుండనుండుటకు, దమయంతియు నలుడును సంతోషపూర్వకముగా మంగళమును నసగా పాటలు, నృత్యము, వాద్యము, మున్నగు మంగళప్రదములగు కృత్యములను గావించిరి. అట్లే తమతమ గుడారములకు వెళ్ళుచున్నట్టివారును, దమయంతి చెలికత్తెలను పరిణయమాడిన వారునునగు రాజులు సంతోషపూర్వకముగా మంగళప్రదములగు పటహ భేర్యాది వాద్యములను వాదించుచుండిరి. ఈ విధముగా నొక్కడగు భీమరాజు, ఇరువురగు దమయన్తియు నలుడును, నట్లే పెక్కండ్రగు రాజులును సంతోషములగు మంగలప్రదములగు కార్యములను గావించిరి. 97

శ్లో॥ శ్రీహర్షం కవిరాజరాజి ముకుటాలఙ్కార హీరః సుతం

శ్రీహీరః సుషువే జితేన్ద్రియచయం మామల్లదేవీ చ యమ్.

యాతస్తస్య చతుర్దశః శరదిజజ్యోత్స్నాచ్ఛసూక్తేర్మహా

కావ్యే చారుణి నైషధీయ చరితే సర్గో నిసర్గోజ్జ్వలః. 98

ప॥వి॥ :- శ్రీహర్షం - కవిరాజరాజిముకుటాలఙ్కారహీరః - సుతం - శ్రీహీరః - సుషువే - జితేంద్రియచయమ్ - మామల్లదేవీ - చ - యం - యాతః - తస్య - చతుర్దశః - శరదిజజ్యోత్స్నాచ్ఛసూక్తేః - మహాకావ్యే - చారుణి - నైషధీయచరితే - సర్గః - నిసర్గోజ్జ్వలః.

అర్థము :- కవిరాజరాజిముకుటాలఙ్కారహీరః; కవిరాజ = కవిశ్రేష్ఠులయొక్క, రాజి = శ్రేణియొక్క, ముకుట = కిరీటములకు, అలంకార = భూషణములలో, హీరః = వజ్రమణియగు, శ్రీహీరః = శ్రీహీరుడను కవిశ్రేష్ఠుడు, జితేంద్రియచయం; జిత = జయింపబడిన, ఇంద్రియచయం = ఇంద్రియ సమూహము గల్గిన, శ్రీహర్షం = శ్రీహర్షుడను, సుతం = కుమారుని, సుషువే = ఉత్పత్తి గావించెనో, మామల్లదేవీచ = మామల్లదేవియను తల్లియు, యం = ఎవనిని, సుషువే = కనెనో, శరదిజజ్యోత్స్నాచ్ఛసూక్తేః; శరదిజ = శరదృతువునందు గల్గిన, జ్యోత్స్నా = వెన్నెలవంటి, అచ్ఛ = స్వచ్ఛములైన, సూక్తేః = సూక్తులుగల్గిన, తస్య = ఆ శ్రీహర్షునియొక్క, చారుణి = సుందరమైన, నైషధీయచరితే = నైషధీయ చరితమను, మహాకావ్యే = మహాకావ్యమునందు, నిసర్గోజ్జ్వలః = స్వభావభాసురమైన, చతుర్దశః = పదునాల్గవదైన, సర్గః = సర్గ, యాతః = కడచిపోయింది.

సమాసములు :

కవిరాజరాజిముకుటాలఙ్కారహీరః :- కవీనాం, రాజానః = కవిరాజాః కవిరాజానాం, రాజిః = కవిరాజరాజిః, కవిరాజరాజేః ముకుటాని = కవిరాజరాజిముకుటాని, కవిరాజరాజిముకుటేషు, అలఙ్కారః = కవిరాజరాజిముకుటాలఙ్కారః, కవిరాజరాజిముకుటాలఙ్కారశ్చాసౌ, హీరశ్చ = కవిరాజరాజిముకుటాలఙ్కారహీరః.

జితేంద్రియచయం :- ఇంద్రియాణాం, చయః = ఇంద్రియచయః, జితః, ఇంద్రియచయః, యేనసః = జితేంద్రియచయః, తమ్ = జితేంద్రియచయమ్.

శరదిజజ్యోత్స్నాచ్ఛసూక్తేః :- శరది, జాయతఇతి = శరదిజా, శరదిజా

శరదిజాచసా జ్యోత్స్నా చేతి=శరదిజజ్యోత్స్నా, శరదిజజ్యోత్స్నేవ, అచ్ఛా సూక్తిః యస్యసః = శరదిజ జ్యోత్స్నాచ్ఛ సూక్తిః, తస్య = శరదిజ జ్యోత్స్నాచ్ఛసూక్తేః.

నిసర్గోజ్జ్వలః:—నిసర్గేణ, ఉజ్జ్వలః, నిసర్గో జ్జ్వలః

**భావము :**

కవిశ్రేష్ఠుల వరుసల ముకుటములలోని యలఙ్కారములలో వజ్రమణి యైన శ్రీహీరుడు ఇంద్రియ నిగ్రహముగల శ్రీహర్షుని జన్మింపఁ జేసెను. మా మల్లదేవి యను తల్లి యతనిని గనెను. శరత్కాలపు వెన్నెలవంటి స్వచ్ఛములగు సూక్తులు గల్గిన యా శ్రీహర్షునికి సంబంధించినదియు, రమ్యమైనదియు నగు నైషధీయ చరితమను మహాకావ్యమునందు స్వభావ భాసురమగు పదునాలుగవ సర్గ గడచినది.

ఇట్లు

శ్రీమదాత్రేయ గోత్రోద్భవ శ్రీమదుడాలి నృసింహశాస్త్రి తనూజ,

ఉడాలి సుబ్బరామశాస్త్రి విరచితమగు శ్రీహర్ష నైషధ వ్యాఖ్యయందు

చతుర్దశ సర్గ సమాప్తము.

ఓం శమ్

# శ్రీహర్ష నైషధము

## పఞ్చదశ సర్గ

శ్లో॥ అథోపకార్యాం నిషధావనీపతిః॥
నిజామయాసీ ద్వరణ స్రజాన్వితః।
వసూనివర్షన్ సుబహూని వన్దినాం
విశిష్య భైమీగుణ కీర్తనాకృతామ్॥

ప॥వి॥ :-అథ – ఉపకార్యాం - నిషధావనీపతిః - నిజామ్ - అయాసీత్ - వరణస్రజా – అన్వితః – వసూని - వర్షన్ - సుబహూని – వందినాం– విశిష్య - భైమీగుణ కీర్తనాకృతామ్-

అర్థము :- అథ = స్వయంవరము గడచిన పిదప, నిషధావనీ పతిః; నిషధావనీ = నిషధదేశమునకు, పతిః = ప్రభువైన నలుఁడు, వరణస్రజా = స్వయంవరవు మాలికతో – అన్వితస్సన్ = కూడినవాడై, వందినాం= స్తుతులనుఁ బఠించువారికి, విశిష్య = విశేషించి, భైమీగుణ కీర్తనాకృతాం, భైమీగుణ=దమయంతి గుణములను, కీర్తనాకృతాం=కీర్తించునట్టి వారికి, సుబహూని = బహువిధములైన, వసూని=ధనములను, వర్షన్ = ఇచ్చుచు, నిజాం=తనదైన, ఉపకార్యాం=భవనమును ననగా గుడారమును, అయాసీత్=పొందెను.

**సమాసములు :**

నిషధావనీపతిః:- నిషధానా మవనీపతిః = నిధధావనీపతిః.

వరణస్రజా:- వరణస్య స్రక =వరణస్రక్, తయా=వరణస్రజా.

భైమీగుణ కీర్తనాకృతామ్:- భైమ్యాః, గుణాః=భైమీగుణాః, భైమీగు

ణానాం, కీర్తనా-భైమీగుణ కీర్తనా, భైమీగుణ కీర్తనాం, కుర్వంతీతి = భైమీగుణకీర్తనాకృతః, తేషాం=భైమీగుణ కీర్తనాకృతామ్.

భావము :

స్వయంవరము గడచిన పిదప నలమహారాజు స్వయంవరపు మాలతోఁ గూడినవాడై, స్తుతులను బఠించువందులకును ముఖ్యముగా దమయన్తి గుణములనుఁ బొగడునట్టి వారికి భూరి ధనములను వర్షించుచు తన గుడారమును, ప్రవేశించెను.

శ్లో॥ తథాపథి త్యాగమయం వితీర్ణవాన్
యథాఽతి భారాధిగమేన మాగధైః.
తృణీకృతం రత్ననికాయ ముచ్చకై
శ్చికాయలోక శ్చిరముఞ్ఛ ముత్సుకః. 2

ప॥వి॥ :- తథా - పథి - త్యాగమ్ - అయం - వితీర్ణవాన్ - యథా - అతి భారాధిగమేన - మాగధైః - తృణీకృతం - రత్ననికాయమ్-ఉచ్చకైః - చికాయ - లోకః - చిరమ్ - ఉఞ్ఛమ్ - ఉత్సుకః.

అర్థము :- అయం = ఈ నలుడు, పథి = మార్గమందు, తథా = ఆ ప్రకారముగా, త్యాగం = ధనపరిత్యాగమును ననగా ధనప్రదానమును, వితీర్ణవాన్ = చేసెను. యథా = ఎట్లనగా, అతిభారాధిగమేన; అతిభార = మిక్కిలి భారమును, అధిగమేన = పొందుటచేత, మాగధైః = స్తుతిపాఠకులచే, తృణీకృతం = మోయుటకు శక్యము కానందువలన నిర్లక్ష్యము చేయఁబడి వదలివేయఁబడిన, ఉచ్చకైః = ఉన్నతమైన, రత్ననికాయం = రత్నరాశిని, లోకః = సామాన్యమైన ప్రజ, ఉత్సుకస్సన్ = కోరికతోఁ గూడినదై, చిరం = చాలకాలము, ఉఞ్ఛం = ఉఞ్ఛముగా (భూమిలో రాలిన ధాన్యాదికణములు "ఉఞ్ఛ" మనబడును,) చికాయ = ఏరుకొనెను.

సమాసములు ;

అతిభారాధిగమేన :- అత్యంతం, భారః = అతిభారః, అతిభారస్య, అధిగమః = అతిభారాధిగమః, తేన = అతిభారాధిగమేన.

తృణీకృతం :- అతృణం, తృణంసమ్పద్యమానం, కృతం = తృణీకృతమ్.

రత్ననికాయం :- రత్నానాం, నికాయః = రత్ననికాయః, తం = రత్ననికాయమ్.

భావము ;

ఈ నలుడు తన గుడారమునకుఁబోవు దారిపొడవున చాల అధికముగా రత్నాదులను వందిమాగధులకు దానము గావించెను. కాని ఆ రత్నరాశులు మిక్కిలి ఎక్కువగా నిచ్చుట వలన నవి భారమైనవి. అందువలన వానిని మోయలేక యచ్చటనే వదలిపెట్టిపోయిరి. అప్పుడు సాధారణ జనము, దానికై యాశపడి యుఞ్ఛవృత్తిలో వడ్లగింజల నేరుకొను విధముగా యేరుకానిరి.

శ్లో॥ త్రపాస్య నస్యాత్ సదసిప్రియాన్వయాత్
కుతోఽతిరూపః సుఖభాజనంజనః.
అమూదృశీ తత్కవివందివర్ణనై
రపాకృతా రాజకరజ్ఞిలోకవాక్. 3

ప॥వి॥ :- త్రపా - అస్య - న - స్యాత్ - సదసి - ప్రియాన్వయాత్ - కుతః - అతిరూపః - సుఖభాజనం - జనః - అమూదృశీ - తత్కవివంది వర్ణనైః - అపాకృతా - రాజకరజ్ఞిలోకవాక్.

అర్థము :- సదసి = సభయందు, ప్రియాన్వయాత్ = ప్రియురాలి సమాగమము వలన, అస్య = ఈనలునికి, త్రపా = సిగ్గు, నభవేత్ = కాదా యేమి? కాఁదగినదే. (తథా = అట్లు) అతిరూపః = మిక్కిలి యందము గల్గిన, జనః = దమయన్తివంటి జనము, కుతః = ఎచ్చట, సుఖభాజనం = రామసీతాదులవలె, సుఖ = సుఖమునకు, భాజనం = స్థాన

ముగా, భవేత్ = ఉండును. ఎచ్చటనుండదని యర్థము. నలుని కింతటి లోకోత్తర సౌందర్యము, దుఃఖకారణమే, అట్లే అంతటి లోకోత్తర సౌందర్యముగల దమయన్తి లభించుటయు దుఃఖకారణమే. అమూదృశీ= ఇటువంటి, రాజక ఞ్జిలోకవాక్; రాజక = రాజసమూహమును, రఞ్జి = రంజింపఁజేసెడి, లోక = జనులయొక్క, వాక్ = నిందావచనము, తత్కవివందివర్ణనైః; తత్ = ఆ నలునియొక్క, కవి = కవులును, వంది = స్తుతిపాఠకులు, అను వీరియొక్క, వర్ణనైః = వర్ణనలచే ననగా — "ఆశ్చర్యము సమస్త రాజసమూహమును వదలి నీవు ఉత్తమ స్త్రీని సంపాదించుకొంటివి. దానిచే నీవు లోకోత్తరుఁడవు". అని యివి మున్నగు పొగడ్తలచే, న్యక్కృతా = వినఁబడనీయక యణగఁగొట్టఁ బడినది. ఆ కవులును వందులును బిగ్గరగా స్తుతించుటచే తొలుతఁజెప్పఁ బడిన లోకనింద వినఁబడక పోయినదని యర్థము.

## సమాసములు :

ప్రియాన్వయాత్ :- ప్రియయా, అన్వయః = ప్రియాన్వయః, తస్మాత్ = ప్రియాన్వయాత్.

తత్కవివందివర్ణనై :- కవయశ్చ, వందినశ్చ = కవివందినః, తస్యకవి వందినః = తత్కవివందినః; తత్కవివందినాం, వర్ణనాని = తత్కవి వందివర్ణనాని, తైః = తత్కవివందివర్ణనైః.

అతిరూపః :- అత్యంతం, రూపం, యస్యసః = అతిరూపః.

సుఖభాజనం :- సుఖస్య, భాజనం = సుఖభాజనం.

అమూదృశీ ;- అసౌఇవదృశ్యతఇతి = అమూదృశీ.

రాజకరఞ్జిలోకవాక్ :- రాజ్ఞాం, సమూహః = రాజకం, రాజకంరఞ్జయ తీతి = రాజకరఞ్జినీ, లోకానాంవాక్ = లోకవాక్ = రాజకరఞ్జినీచసా లోకవాక్చ = రాజకరఞ్జిలోకవాక్.

## భావము :

పెక్కుదేశముల నుండి వచ్చియుండిన రాజులు మున్నగువారితోఁగూడిన స్వయంవరసభయందు ప్రియురాలగు దమయన్తితో సమాగమముఁ బొందుటకు

నలుడు సిగ్గుపడవలయును గదా! కాని అట్లు సిగ్గుపడలేదు. లోకమున మిక్కిలి సౌందర్యముగల జనము స్త్రీయైనను బురుషుడైనను నెక్కడ సుఖింతురు? రాముడు సీత మున్నగువారి చరిత్రనుఁ బరిశీలించుటచే నిది స్పష్టమగుచున్నది. కావున నలుని లోకోత్తర సౌందర్యము, దమయన్తి దివ్యసౌందర్యము దుఃఖకారణములే. ఈవిధముగా దమయన్తిచే వరింపఁబడని రాజసమూహమును రక్షింపఁజేయు ప్రజల వచనములు నలుని చెవులయందు బడలేదు. ఏలయనగా – నలునికి సంబంధించిన కవులు, స్తుతిపాఠకులు – "ఆశ్చర్యము! రాజులకందఱికిని లభింపనట్టి స్త్రీరత్నమును నీవు సంపాదించుకొంటివి. నీవు లోకోత్తరుడవు". అని యివి మున్నగు స్తుతులను బిగ్గరగాఁ జేయుచుండుట వలన రాజులను రంజింపఁజేయుటకై జనము చెప్పెడి నిందావచనము లణగి పోయి నలునకుగాని యితరులకుగాని వినఁబడక పోయినవని యాశయము — లేదా, మిక్కిలి యందముగల వ్యక్తికి సుఖమెక్కడిది? మీరందఱు మిక్కిలి యందగాండ్రు – ఈ నలుడంతటి యందగాడు కాడు. ఇందువలననే గుణజ్ఞురాలు కాని దమయన్తి మిమ్ములను వరించలేదు. అందువలన మీరు దుఃఖింపవలసి వచ్చినది. అనగా లోకమున భార్యయు భర్తయు నిద్దఱు సుందరులుగా నుండుట యరుదు. ఇవి మున్నగుఁ బొగడ్తలచే, దమయన్తి తమ్ము వరింపనందువలన నిరుత్సాహులగు రాజులను ప్రసన్నులను గావించుటకు జనులు నలుని నిందించు చుండగా వారి మాటలు నలుని ప్రశంసించు వందిమాగధుల వచనములు బిగ్గరగా నుండుటవలన వినఁబడక పోయినవని యాశయము. 3

శ్లో॥ అదోషతామేవసతాం వివృణ్వతే।
ద్విషాం మృషాదోషకణాధిరోపణాః॥
న జాతుసత్యే సతిదూషణే భవేద
లీక మాధాతుమవద్య ముద్యమః॥ 4

ప॥వి॥ ;- అదోషతాం - ఏవ - సతాం - వివృణ్వతే - ద్విషాం, మృషాదోష కణాధిరోపణాః - న – జాతు – సత్యే - సతి - దూషణే - భవేత్ - అలీకమ్ - ఆధాతుం - అవద్యమ్ - ఉద్యమః.

**అర్థము :-** ద్విషాం=శత్రువులయొక్క, మృషాదోష కణాధిరోపణాః; మృషా దోష=అసత్య దోషముయొక్క, కణ=లేశముయొక్క, అధిరోపణాః= ఆరోపణలు, సతాం = సజ్జనులకు, అదోషతాం = దోషరాహిత్యమునే, వివృణ్వతే = వెల్లడిగావించును. ఏలయనగా = సత్యే = నిజమైన, దూషణే=దోషము, సతి=ఉన్నచో, అలీకం=అసత్యమైన, అవద్యం = దోషమును, ఆధాతుం = ఆరోపించుటకు, జాతు = ఒకప్పుడును, ఉద్యమః=ప్రయత్నము, అనగా శత్రువులకు, ప్రయత్నము, నభవేత్= కానేరదు. నిజమైన తప్పు ఉన్నప్పుడు శత్రువులు దానినే ఆరోపింతురు కాని నిజము కాని తప్పును ఆరోపింపరు. ఎప్పుడు నిజమైన తప్పులేదో అప్పుడు నిజము కాని తప్పును వారు ఆరోపింతురు. కాన నలునియందు నిజముకాని తప్పును ఆరోపించిరి కాన నతని యందు నిజమైన తప్పు లేదని సిద్ధించుచున్నది.

**సమాసములు**

అదోషతామ్:- అవిద్యమానః, దోషః, యస్మిన్సః=అదోషః, అదోషస భావః=అదోషతా, తాం=అదోషతాం.

మృషాదోష కణాధి రోపణాః;- మృషైవ, దోషః = మృషాదోషః, మృషాదోషస్య, కణః=మృషాదోషకణః, మృషాదోషకణస్య, అధి రోపణాః=మృషాదోషకణాధి రోపణాః.

**భావము:**

శత్రువులు సజ్జనులపై నసత్య దోషలేశము నారోపించినను నది వారి యందు దోషముగా నుండదు. సత్య దోషమున్నప్పుడు, అసత్య దోషమును ఆరోపించుటకు శత్రువులు ప్రయత్నింపరు. కావున నలునిపై నసత్యదోషము నారోపించుట వలన నతని యందు సత్యమగు దోపము లేదని సిద్ధించుచున్నది. కావున పూర్వోక్త దోషములు నిరాధారములని యాశయము. 8

శ్లో॥ విదర్భరాజో౽పి సమం తనూజయా
ప్రవిశ్య హృష్యన్నవరోధ మాత్మనః॥

శశంస దేవీ మనుజాత సంశయాం
ప్రతీచ్ఛ జామాతర ముత్సుకే నలమ్॥ 5

ప॥వి॥:- విదర్భరాజః - అపి - సమం - తనూజయా - ప్రవిశ్య-హృష్యన్-అవరోధమ్ - ఆత్మనః - శశంస - దేవీమ్ - అనుజాత సంశయాం-ప్రతీచ్ఛ - జామాతరమ్ - ఉత్సుకే - నలమ్.

అర్థము:- అథ = పిదప, విదర్భరాజోపి = భీమనృపతియు, హృష్యన్ = అందఱి కంటెను శ్రేష్ఠుడగు నల్లుడు లభించుటచే హర్షించుచు, తనూజయాసమం = పుత్రికయగు దమయన్తితోఁడ, ఆత్మనః=తనయొక్క, అవరోధం=అంతఃపురమును, ప్రవిశ్య=ప్రవేశించి, జాతసంశయాం; జాత=ఉద్భవించిన, సంశయాం=సందేహము గల్గిన అనగా-దమయన్తి సకల గుణములకు నిధియైన నలుని వరించునా ? లేక గుణ హీనుఁడగు మఱి యొకనిని వరించునా? అని సందేహించుచున్న, దేవీం=తన పట్టమహిషిని, అను=గుఱిబెట్టి, ఉత్సుకే = శ్రేష్ఠుడగు వరునియందుఁ గోరికగలదానా ! నలం=నలుని, జామాతరం=కుమార్తెకు భర్తగా, ప్రతీచ్ఛ=తెలిసికొనుము. ఇతి=అని, శశంస=చెప్పెను. అనగా మన కోరిక తీరినదని యర్థము.

**సమాసములు**

విదర్భరాజః :- విదర్భాణాం, రాజా=విదర్భరాజః.

జాతసంశయాం:- జాతః సంశయః యస్యాస్సా = జాతసంశయా, తామ్=జాతసంశయాం.

**భావము :**

భీమరాజును, శ్రేష్ఠుఁడగు వరుడు లభించుటవలన నానందము నొందినవాడై, కుమార్తెయగు దమయన్తితోఁడ తన యంతఃపురము ప్రవేశించి దమయన్తి సకల గుణనిధియగు నలుని వరించినదా? లేక గుణహీనుడగు మఱి యొకనిని వరించినదా? అని సందేహపడుచున్న తన పట్టమహిషి నుద్దేశించి శ్రేష్ఠుడైన వరునియందుఁ గోరిక గలదానా! నలమహారాజును నీ యల్లునిగాఁ దెలిసికొనుము. మన కోరిక సిద్ధించినది అని చెప్పెను. 5

శ్లో॥ తనుత్విషా యస్య తృణం స మన్మథః।
కులశ్రియా యః పవితాఽస్మదన్వయమ్॥
జగత్త్రయీనాయకమేలకే పరం
సుతా వరం వేద వివేక్తుమీదృశమ్॥ 6

ప॥వి॥ :- తను త్విషా - యస్య - తృణం - సః - మన్మథః - కులశ్రియా - యః - పవితా - అస్మదన్వయమ్ - జగత్త్రయీ నాయకమేలకే - పరం - సుతా - వరం - వేద - వివేక్తుమ్ - ఈదృశమ్.

అర్థము :- కిఞ్చ = మఱియు, యస్య=ఎవని, తనుత్విషా=దేహకాంతితో, సః =ఆ ప్రసిద్ధుడగు, మన్మథః=మన్మథుడు, తృణం=గడ్డిపోచకు సమానుడు అనగా మిక్కిలి తక్కువయైనవాడు, యః=ఎవ్వడు, కులశ్రియా = వంశసంపదచే, అస్మదన్వయం = మనవంశమును, పవితా = పవిత్రము గావించువాడు. (కిఞ్చ = మఱియు,) జగత్త్రయీనాయకమేలకే; జగత్త్రయీ = మూడు లోకములయొక్క, నాయక = నాయకుల యొక్క, మేలకే = సంఘమునందుననగా వరసంఘమధ్య, ఈదృశం పరం = ఇట్టి గుణముగల వానిని మాత్రము, సుతా = నీ పుత్రికయే, వివేక్తుం = వివేచనఁ జేయుటకు, వేద = తెలిసికొనియున్నది. ఆహా అదృష్టమువలన నన్నియు ననుకూలమైనవి.

సమాసములు :

తనుత్విషా :- తనోః త్విట్ = తనుత్విట్, తయా = తనుత్విషా.

కులశ్రియా :- కులస్య, శ్రీః = కులశ్రీః, తయా = కులశ్రియా.

అస్మదన్వయం :- అస్మాకమన్వయః = అస్మదన్వయః, తమ్ = అస్మదన్వయం.

జగత్త్రయీనాయకమేలకే :- జగతాం, త్రయీ = జగత్త్రయీ, జగత్త్రయ్యాః, నాయకాః = జగత్త్రయీనాయకాః, జగత్త్రయీనాయకానాం మేలకః = జగత్త్రయీనాయకమేలకః, తస్మిన్=జగత్త్రయీనాయకమేలకే.

భావము ;

మఱియు నా నలుని దేహకాంతితోఁ బోల్చిచూచినచో మన్మథుడు గడ్డిపోచ. అనగా సౌందర్యమున నికృష్టుడు. అతని కులగౌరవమునుఁ బరికించినచో మన వంశము నతడు పవిత్రము గావించును. మఱియు, మూడులోకములలోని వరుల సమ్మేళనమున నిట్టి గుణవంతుని వివేచించుటకు నీ పుత్రికయగు దమయన్తియే సమర్థమైనది. మన యదృష్టవశమున మనకన్నియు చక్కఁగనొనఁ గూడినవి.

శ్లో॥ సృజన్తు పాణిగ్రహమఙ్గలోచితా
మృగీదృశః స్త్రీసమయస్పృశ క్రియాః.
శ్రుతిస్మృతీనాన్తు వయం విదధ్మహే
విధీనితిస్మాహచ నిర్యయావసః. 7

ప॥వి॥ :- సృజన్తు - పాణిగ్రహమఙ్గలోచితాః - మృగీదృశః - స్త్రీ సమయస్పృశః - క్రియాః - శ్రుతిస్మృతీనాం - తు - వయం - విదధ్మహే - విధీన్ - ఇతి - స్మ - ఆహ - చ - నిర్యయౌ - చ - సః.

అర్థము :- సః = ఆ భీమరాజు, మృగీదృశః = స్త్రీలు, పాణిగ్రహమఙ్గలోచితాః; పాణిగ్రహమఙ్గల = వివాహమఙ్గలమునకు, ఉచితాః = తగినటువంటి, స్త్రీసమయస్పృశః; = స్త్రీలయాచారమునకు సంబంధించిన, క్రియాః = కార్యములను, ననగా మఙ్గలకృత్యములను, సృజన్తు = చేయవలయును. వయన్తు = మేమో, శ్రుతిస్మృతీనాం = వేదములకును, స్మృతులకును సంబంధించిన, విధీన్ = కార్యములను, విదధ్మహే = చేయుదుము. ఇతి = అని, ఆహస్మచ = చెప్పెను. నిర్యయౌచ = వెంటనే వెడలెను. రెండు చకారములు చెప్పుట, వెళ్ళుటయను క్రియలకు నేకకాలత్వమును సూచించున్నది క్షణకాలముగూడ జాగు చేయలేదని యర్థము.

సమాసములు:

పాణిగ్రహమఙ్గళోచితాః :- పాణౌగ్రహః = పాణిగ్రహః, పాణిగ్రహస్య,

మఙ్గలం = పాణిగ్రహమఙ్గలం, పాణిగ్రహమఙ్గలస్య, ఉచితాః = పాణిగ్రహమఙ్గలోచితాః తాః = పాణిగ్రహమఙ్గలోచితాః.

మృగీదృశః :- మృగ్యాః, దృగివదృక్ యాసాంతాః = మృగీదృశః.

స్త్రీసమయస్పృశః :- స్త్రీణాం, సమయః = స్త్రీసమయః, స్త్రీసమయం, స్పృశన్తీతి = స్త్రీసమయస్పృశః, తాః = స్త్రీసమయస్పృశః.

శ్రుతిస్మృతీనాం ;- శ్రుతయశ్చ, స్మృతయశ్చ = శ్రుతిస్మృతయః, తాసాం = శ్రుతిస్మృతీనాం.

**భావము :**

ఆ భీమనృపతి — స్త్రీలు, వివాహమునకు సంబంధించినట్టివియు, స్త్రీల యాచారమునకు సంబంధించినవియునగు మంగలకృత్యములను చేయవలసినది. వేదములకును స్మృతులకును సంబంధించిన మంగల కృత్యములను మేము చేయగలమని చెప్పి యన్తఃపురమునుండి వెడలిపోయెను. కాని క్షణకాలముగూడ విలమ్బమును జేయలేదు. 5

శ్లో॥ నిరీయభూపేన నిరీక్షితాననా
శశంస మౌహూర్తిక సంసదంశకమ్,
గుణైరరీణైరుదయాస్త నిస్తుషం
తదాసదాతుం తనయాం ప్రచక్రమే. 8

ప॥వి॥ ;- నిరీయ - భూపేన - నిరీక్షితాననా - శశంస - మౌహూర్తికసంసత్ - అంశకం - గుణైః - అరీణైః - ఉదయాస్తనిస్తుషం - తదా - సః - దాతుం - తనయాం - ప్రచక్రమే.

అర్థము :- భూపేన = భీమరాజుచే, నిరీయ = అంతఃపురమునుండి వెల్వడి, నిరీక్షితాననా; నిరీక్షిత = చూడబడిన, ఆననా = ముఖములుగల, మౌహూర్తికసంసత్; మౌహూర్తిక = ముహూర్తశాస్త్రము నెఱింగిన జ్యోతిషకుల, సంసత్ = పరిషత్తు, అరీణైః = సమగ్రములైన, గుణైః = శుభగ్రహవీక్షణాదులతో (ఉపలక్షితం = కూడినదియు) ఉదయాస్త నిస్తుషం = గ్రహములయొక్క ఉదయాస్తములచేత నిర్దోషమైనదియు

నగు, అంశకం = లగ్నమును, శశంస = చెప్పెను. తదా = అప్పుడు నిజాం=తనదియైన, తనయాం = పుత్రికను, దాతుం = ఇచ్చుటకు, సః = ఆ భీమరాజు, ప్రచక్రమే = ప్రారంభించెను.

**సమాసములు :**

నిరీక్షితాననా :- నిరీక్షితం, ఆననం యస్యాస్సా = నిరీక్షితాననా.

మౌహూర్తిక సంసత్ :- ముహూర్తం, విదన్తీతి = మౌహూర్తికాః. మౌహూర్తికానాం, సంపత్ = మౌహూర్తిక సంసత్.

ఉదయాస్తనిస్తుషం :- ఉదయశ్చ, అస్తశ్చ = ఉదయాస్తౌ, ఉదయాస్తాభ్యాం, నిస్తుషః = ఉదయాస్తనిస్తుషః, తం=ఉదయాస్త నిస్తుషం.

అంశకమ్ :- అంశఏవ = అంశకః, తమ్ = అంశకం.

**భావము :**

తర్వాత భీమరాజు అంతఃపురమునుండి వెడలి వచ్చిన వెంటనే జ్యోతిష కుల పరిషత్తును( జూచి సంజ్ఞ( జేసెను. ఆ పరిషత్తు శుభగ్రహ దృష్టి మున్నగు సమగ్ర గుణములతో( గూడి గ్రహవిశేషములయొక్క యుదయాస్త మయ దోషములు లేనిదియు నగు లగ్నమును( జెప్పినది. అట్టి లగ్నము నందా భీమ భూపతి తన పుత్రికను దానము( జేయుటకు( బ్రారంభించెను. 8

శ్లో॥ అథావద త్తద్ధూతముఖః స నైషధం
కులంచబాలా చ మమానుకమ్ప్యతామ్॥
సపల్లవత్వద్య మనోరథాఙ్కుర
శ్చిరేణ న స్త్వచ్చరణోదకై రితి॥ 9

ప॥వి॥ :- అథ - అవదత్ - దూతముఖః - సః - నైషధం - కులం - చ - బాలా - చ - మమ - అనుకమ్ప్యతాం - సపల్లవతు - అద్య - మనోరథాఙ్కురః - చిరేణ - నః - త్వచ్చరణోదకైః - ఇతి.

అర్థము :- అథ = లగ్నమును నిశ్చయించిన పిదప, దూతముఖః = దూతయే ముఖముగా( గల్గిన, సః=ఆ భీమరాజు, మమ = నాయొక్క, కులంచ -

వంశము, బాలాచ = పుత్రికయగు దమయన్తియు, అనుకమ్ప్యతాం = అనుగ్రహింపఁబడునుగాత. చిరేణ = చాలకాలమునుండియున్న, నః = మా యొక్క, మనోరథాఙ్కురః; = కోరికయను మొలక, అనగా నీతోడ దమయన్తికి వివాహము కావలయుననెడి కోరిక, త్వచ్చరణోదకైః; త్వత్ = నీయొక్క, చరణోదకైః = పాదములనుఁ గడిగెడి యుదకములతో, అద్య = ఇప్పుడు, సపల్లవతు = చిగుళ్ళతోఁ గూడిన దానివలె ఆచరించునుగాత. ఇతి = ఇట్లు నైషధం = నలుని గూర్చి, అవదత్ = చెప్పెను.

**సమాసములు ;**

**దూతముఖః :-** దూతః, ముఖం, యస్యసః = దూతముఖః.

నైషధం :- నిషధానాం, రాజా = నైషధః, తం = నైషధం.

సపల్లవతు :- పల్లవేన సహవర్తత ఇతి = సపల్లవః, సపల్లవ ఇవ ఆచరతు = సపల్లవతు.

మనోరథాఙ్కురః ;- మనోరథ ఏవ అఙ్కురః = మనోరథాఙ్కురః.

త్వచ్చరణోదకైః :- తవ, చరణౌ = త్వచ్చరణౌ, త్వచ్చరణయోరుదకాని = త్వచ్చరణోదకాని, తైః = త్వచ్చరణోదకైః.

**భావము :**

లగ్న నిశ్చయము కాగానే దూతలనే ముఖముగాఁ గల్గిన భీమరాజు నా కులమును, నా కుమార్తెయగు దమయన్తిని ననుగ్రహింప బ్రార్థించుచున్నాను. చాలకాలము నాఁటినుండి యేర్పడినట్టి నీతోడ దమయన్తికి వివాహము కావలయుననెడి మా కోరిక యను మొలక కన్యాదాన కాలమున నీ పాదములనుఁ గడిగిన జలములతో చిగురించునుగాత. అని నలుని గూర్చి (దూతముఖమున) చెప్పి పంపెను. 9

శ్లో॥ తథార్థితం భీమవచః ప్రతిధ్వనిం
నిపీయ దూతస్యసవక్త్రగహ్వరాత్॥

ప్రజామివన్దే చరణౌ గురోరితి
బ్రువన్ప్రదాయ ప్రజిఘాయతం బహు॥ 10

ప॥వి॥ :- తథా - ఉత్థితం - భీమవచః ప్రతిధ్వనిం - నిపీయ - దూతస్య - సః - వక్త్ర గహ్వరాత్ - ప్రజామి - వన్దే, చరణౌ - గురోః - ఇతి - బ్రువన్ - ప్రదాయ - ప్రజిఘాయ - తం - బహు.

అర్థము :- సః = ఆ నలుడు, దూతస్య = దూతయొక్క, వక్త్ర గహ్వరాత్, వక్త్ర = ముఖమనెడి, గహ్వరాత్ = గుహనుండి తథా = ముందుఁ జెప్పిన విధముగా, ఉత్థితం = ఉదయించిన, భీమవచః ప్రతిధ్వనిం; భీమ = భీమరాజుయొక్క, వచః = మాటయొక్క, ప్రతిధ్వనిం = ప్రతి శబ్దమును, నిపీయ = ఆదరముతోవిని, ప్రజామి = ఇప్పుడే వెళ్ళుచున్నాను. గురోః = మామగారైన భీమరాజుయొక్క, చరణౌ = పాదములనుఁ గూర్చి, వందే = నమస్కరించుచున్నాను. ఇతి = అని బ్రువన్ = చెప్పుచు, తం = ఆ దూత నుద్దేశించి, బహు = ఎక్కువ ధనమును, ప్రదాయ = ఇచ్చి, ప్రజిఘాయ = పంపెను.

**సమాసములు ;**

భీమవచః ప్రతిధ్వనిం :- భీమస్య, వచః = భీమవచః, భీమవచసః ప్రతిధ్వనిః=భీమవచః ప్రతిధ్వనిః తం=భీమవచః ప్రతిధ్వనిఁ .
వక్త్రగహ్వరాత్ :- వక్త్రమేవ గహ్వరం = వక్త్రగహ్వరఁ తస్మాత్ = వక్త్ర గహ్వరాత్ .

**భావము :**

ఆ నలుడు భీమరాజు దూత ముఖమున బంపిన సందేశమును నక్షరము తప్పక ప్రతిధ్వనివలె సాదరముగా వినెను. పిదప నే మాత్రము తడవు జేయక "ఇప్పుడే వచ్చుచున్నాను. గురువైన మామగారి పాదములకు వందనము" అని చెప్పి యాతనికి మిక్కిలి ధన మొసంగి పంపెను. 10

శ్లో॥ నిపీత దూతాలపిత స్తతో నలం
విదర్భ భర్త్రాఽఽగమయామ్బ భూవసః॥

నిశావసానే శ్రుతతామ్ర చూడవాక్
యథారథాఙ్గ స్తపనం ధృతాదరః॥ 11

ప॥వి॥ :- నిపీతదూతాలపితః - తతః - నలం - విదర్భ భర్తా - ఆగమయా మ్బభూవ - సః - నిశావసానే - శ్రుతతామ్ర చూడవాక్ - యథా - రథాఙ్గః - తపనం - ధృతాదరః.

అర్థము :- తతః = దూత తిరిగివచ్చిన పిదప, నిపీతదూతాలపితః, నిపీత = సాదరముగా వినఁబడిన, దూత = సందేశహరునియొక్క, ఆలపితః = మాటలుగలవాడైన, సః = ఆ, విదర్భభర్తా = విదర్భ ప్రభువైన భీమరాజు, నిశావసానే = రాత్రి ముగియునపుడు అనగా వేకువన, శ్రుతతామ్ర చూడవాక్; శ్రుత = వినఁబడిన, తామ్రచూడ = కోళ్ళ యొక్క, వాక్ = కూతలుగలవాడై, రథాఙ్గః = చక్రవాకము, తపనం యథా = సూర్యునివలె, ధృతాదరః; ధృత = ధరింపఁబడిన, ఆదరః= ఆదరముగలవాడై, నలం = నలుని, ఆగమయామ్బభూవ = నలునిరాక కెదురుచూచెను. లేదా దూతలచే నా నలుని రప్పించుకొనెను.

సమాసము(లు) :

నిపీతదూతాలపితః :- దూతస్య, ఆలపితం = దూతాలపితం, నిపీతం, దూతాలపితం, యేనసః = నిపీతదూతాలపితః.

విదర్భభర్తా :- విదర్భాణాం, భర్తా = విదర్భభర్తా.

నిశావసానే :- నిశాయాః, అవసానం = నిశావసానం, తస్మిన్ =నిశావసానే.

శ్రుతతామ్రచూడవాక్ :- తామ్రచూడస్య, వాక్ = తామ్రచూడవాక్, శ్రుతా, తామ్రచూడవాక్, యేనసః = శ్రుతతామ్రచూడవాక్.

ధృతాదరః :- ధృతః, ఆదరః, యేనసః = ధృతాదరః.

భావము :

దూత తిరిగివచ్చిన పిదప, నాతడు చెప్పిన మాటలు వినినట్టి భీమరాజు ప్రభాతకాలమున కోళ్ళకూతలను వినినవాడై చక్రవాక మెట్లు సూర్యునెదురు

చూచుచుండునో, అట్లే నలునికై యెదురుచూచుచుండెను. చక్రవాక మిథునములు సూర్యుడున్నంత వఱకే సంతోషముతోఁ గలియుచుండును. సూర్యాస్తమయము కాగానే యివి యొండొఱులనువీడి యెడబాటు దుఃఖము ననుభవించును. కాన చక్రవాకము సూర్యునెట్లెదురు చూచునో, అట్లే భీమరాజు నలుని రాకకై యెదురుచూచు చుండెనని యాశయము. 11

శ్లో॥ కాచిత్తదా లేపనదాన పణ్డితా
కమప్యహఙ్కారమగాత్ పురస్కృతా.
అలమ్భి తుఙ్గాసన సన్నివేశనా
దపూప నిర్మాణ విదగ్ధయాఽఽదరః. 12

ప॥వి॥ :- కా - చిత్ - తదా - ఆలేపనదానపణ్డితా - కమ్ - అపి - అహఙ్కారమ్ - అగాత్ - పురస్కృతా - అలమ్భి - తుఙ్గాసనసన్నివేశనాత్ - అపూపనిర్మాణవిదగ్ధయా - ఆదరః.

అర్థము :- తదా = ఆ కాలమందు, ఆలేపనదానపణ్డితా; ఆలేపనదాన = ఇంటి ముగ్గులు మున్నగువానిని వేయుటయందు, పణ్డితా = సమర్థురాలైన, కాచిత్ = ఒక స్త్రీ, పురస్కృతా = ఆ పనియందు ప్రాధాన్యమొసంగఁబడినదై, కమపి = చెప్ప సాధ్యముకాని, అహంకారం = గర్వమును, అగాత్ = పొందినది. అపూపనిర్మాణవిదగ్ధయా; అపూప = పిండితోఁజేయఁబడు నప్పములు మున్నగువానిని, నిర్మాణ = నిర్మించుట యందు, విదగ్ధయా = నేర్పుగల మఱియొక స్త్రీచే, తుఙ్గాసనసన్నివేశనాత్; తుఙ్గాసన = (అ, భక్ష్యములనుఁ జేయుటకనుకూలముగా) ఎత్తైన ఆసనమునందు, సన్నివేశనాత్ = కూర్చుండునట్లు చేయుటవలన, ఆదరః = ఆత్మాభిమానము, అలమ్భి = పొందింపఁబడినది.

సమాసములు :

ఆలేపనదానపణ్డితా :- ఆలేపనస్యదానం = ఆలేపనదానం, ఆలేపనదానే, పణ్డితా = ఆలేపనదానపణ్డితా.

తుఙ్గాసనసన్నివేశనాత్ :- తుఙ్గం చతత్ ఆసనంచ = తుఙ్గాసనం,

తుఙ్గాసనేసన్నివేశనం = తుఙ్గాసనసన్నివేశనం. తస్మాత్ = తుఙ్గాసన సన్నివేశనాత్.

అపూపనిర్మాణవిదగ్ధయా :- అపూపానాం, నిర్మాణం=అపూపనిర్మాణం, అపూపనిర్మాణే, విదగ్ధా = అపూపనిర్మాణవిదగ్ధా, తయా = అపూప నిర్మాణవిదగ్ధయా.

భావము :

ఆ కాలమందు, ముగ్గులు మున్నగువానిచే గృహమును చిత్రించుట యందు నేర్పుగల్గిన యొకస్త్రీ ప్రాధాన్యమీయ బడుటవలనఁ జెప్పలేని గర్వ మును వహించినది. అప్పములు మున్నగు భక్ష్యములు చేయుటయందు నేర్పు గల్గిన మఱియొక స్త్రీ, ఆ భక్ష్యములనుఁ జేయుట కనుకూలముగ నున్న యున్న తాసనమునఁ గూర్చుండఁ బెట్టుటవలన నాత్మాభిమానమునుఁ దనయెడఁ జూపు కొనినది. 12

శ్లో॥ ముఖాని ముక్తామణి తోరణా త్తదా
మరీచిభిః పాన్థవిలాస మాశ్రితైః॥
పురస్యతస్యాఽఖిలవేశ్మనామపి
ప్రమోదహాసచ్ఛురితాని రేజిరే॥ 13

ప॥వి॥:- ముఖాని - ముక్తామణితోరణాత్ - తదా - మరీచిభిః - పాన్థవిలాసం ఆశ్రితైః - పురస్య - తస్య - అఖిలవేశ్మనామ్ - అపి - ప్రమోదహాస చ్ఛురితాని - రేజిరే.

అర్థము :- తదా = మహోత్సవము సమీపించుచున్న యాకాలమందు, తస్య పురస్య = ఆ పట్టణముయొక్క, అఖిలవేశ్మనామపి = అన్ని గృహ ములయొక్క, ముఖాని = ద్వారములును, ముఖములును, ముక్తామణి తోరణాత్, ముక్తామణి = ముత్తెములతోఁ జేసిన, తోరణాత్ = వెలు పలి ద్వారమునుండి, పాన్థవిలాసమ్ = ప్రతిదినము నడచు బాటసారుల విలాసమువంటి విలాసమును, ఆశ్రితైః = పొందినట్టి, అనగా నిత్యము వీథులయందు ప్రసరించునట్టి, మరీచిభిః = కిరణములతో, ప్రమోద

హాసచ్ఛురితాని, ప్రమోద = సంతోషమువలన. హాస = నవ్వుతో, ఛురితాని = పూయఁబడినవిగా, రేజిరే = ప్రకాశించినవి.

**సమాసములు :**

ముక్తామణి తోరణాత్ :- ముక్తా మణయః, తోరణః = ముక్తామణి తోరణః, తస్మాత్ = ముక్తామణితోరణాత్.

పాన్థవిలాసమ్ :- పథి, గచ్ఛంతీతి = పాన్థాః, పాన్థానాం, విలాసః = పాన్థవిలాసః, తమ్ =పాన్థవిలాసమ్.

అఖిలవేశ్మనామ్ :- అఖిలానిచతాని, వేశ్మానిచ = అఖిల వేశ్మాని, తేషాం = అఖిలవేశ్మనాం.

ప్రమోదహాసచ్ఛురితాని :- ప్రమోదాత్, హాసః = ప్రమోదహాసః, ప్రమోదహాసేన, ఛురితాని = ప్రమోదహాసచ్ఛురితాని.

**భావము :**

ఆ వివాహమహోత్సవము సమీపించుకాలమునందు, ఆ పట్టణములోని గృహము లన్నింటియొక్క ద్వారములు (ముఖములు) ముత్తెములతో నిర్మిత మైన వెలుపలి ద్వారమునుండి, బాటసారుల విలాసమువంటి విలాసమును వహించినట్టి, యనగా నిరంతరము వీథులయందుఁ బ్రసరించునట్టి కిరణములతో సంతోషమువలన నవ్వులతో పూయఁబడినవిగా శోభించినవి. 18

శ్లో॥ పథామనీయన్త తథాధివాసనాత్
మధువ్రతానామపి దత్తవిభ్రమాః॥
వితానతామాతప నిర్భయాస్తదా
పటచ్ఛిదాఽకాలిక పుష్పజాః స్రజః॥ 14

ప॥వి॥ :- పథామ్ - అనీయన్త - తథా - అధివాసనాత్ - మధువ్రతానామ్ - అపి - దత్తవిభ్రమాః - వితానతామ్ - ఆతప నిర్భయాః - తదా - పటచ్ఛిదాఽకాలిక పుష్పజాః - స్రజః.

అర్థము .- తథా = ఆవిధముగా, అనగా నేవిధముగను నెవ్వనిచేతను కృత్రిమ మని తెలియసాధ్యముకాదో ఆవిధముగా, అధివాసనాత్ = కట్టఁబడిన

పుష్పమాలల యందు చమ్పకము మున్నగు సుగంధి పుష్పములతో సంస్కారము ను గల్గించుటవలన, మధువ్రతానామపి = తుమ్మెదలకును, దత్తవిభ్రమాః, దత్త = ఈయఁబడిన, విభ్రమాః = సహజపుష్ప ములతో నిర్మింపఁబడిన మాలిక లనెడి భ్రాన్తిని గల్గించునవియును, ఆ తపనిర్భయాః = ఎండవలన భయములేనివియును, ననగా నెండయందు వాడుబారనవియును, పటచ్ఛిదాఽఽకాలికపుష్పజాః, పటచ్ఛిదా = వస్త్రములను కత్తెరించుటచేనేర్పడిన ముక్కలనెడి, ఆ కాలిక పుష్పజాః ఆకాలిక = అకాలమందు గల్గిన, పుష్ప = పుష్పములతో, జాః = ఏర్పడిన, స్రజః = మాలికలు, తదా = ఆ వివాహమహోత్సవము సమీ పించుచుండగా, పథాం = మార్గములను, వితానతాం = చాందినిలుగా నుండుటను, అనీయన్త = పొందింపఁబడినవి.

వి॥ :- తుమ్మెదలకు భ్రాన్తిని, గల్గించుటవలన భ్రాన్తిమదలఙ్కారము.

## సమాసములు

దత్తవిభ్రమాః:- దత్తః, విభ్రమః, యాభిస్తాః = దత్తవిభ్రమాః .

ఆతపనిర్భయాః :- నిర్గతం, భయం, యాసాంతాః = నిర్భయాః, ఆ తాపత్ నిర్భయాః = ఆ తపనిర్భయాః .

పటచ్ఛిదాఽఽకాలికపుష్పజాః:- పటానాం, ఛిదాః = పటచ్ఛిదాః. అకాలే భవాని = ఆకాలికాని, ఆకాలికాని చతానిపుష్పాణి = ఆ కాలికపుష్పాణి, పటచ్ఛిదాఏవ ఆకాలికపుష్పాణి = పటచ్ఛిదాఽఽకాలిక పుష్పాణి, పటచ్ఛిదాఽఽకాలికపుష్పేభ్యః, జాయన్త ఇతి = పటచ్ఛిదాఽఽకాలిక పుష్పజాః .

భావము :

ఆ నగరవీథులయందు వివిధ వర్ణములుగల వస్త్రముల ముక్కలనెడి పుష్పములతో మాలలు కట్టియున్నారు. వీనియందు మధ్యమధ్య చంపక పుష్ప ములను దురుగుటవలన పరిమళము మిక్కుటముగా నున్నది. అందువలన తుమ్మెదలు సైతము వీనిని సహజ పుష్పములతో నిర్మితములని భ్రాన్తి నొందుచున్నది. వస్త్రఖండములగుటవలన నెండవలన వాడబారునను భయము

లేనివై యవి యున్నవి. అట్టి మాలికలు మార్గములకు చాందినులుగా నాచరించు చుండినవి. 14

శ్లో॥ విభూషణైః కఞ్చుకితా బభుః ప్రజాః
విచిత్రచిత్రైః స్నపితత్విషో గృహాః।
బభూవ తస్మిన్ మణికుట్టిమైః పురే
వపుః స్వముర్వ్యాః పరివర్తితోపమ్॥ 15

ప॥వి॥ :- విభూషణైః - కఞ్చుకితాః - బభుః - ప్రజాః - విచిత్రచిత్రైః - స్నపితత్విషః - గృహాః - బభూవ - తస్మిన్ - మణికుట్టిమైః - పురే - వపుః - స్వమ్ - ఉర్వ్యాః - పరివర్తితోపమం.

అర్థము :- తస్మిన్ = ఆ, పురే = పట్టణమునందు, ప్రజాః = జనులు, విభూషణైః = ఆభరణములతో, కఞ్చుకితాః = శరీరమంతయు అవికతో, దొడిగినట్లు ధరించిన వారుగను, గృహాః =గృహములు, విచిత్రచిత్రైః; విచిత్ర = వివిధములైన, చిత్రైః = బొమ్మలతో, స్నపితత్విషః; స్నపిత = శుద్ధములుఁ గావింపఁబడిన, త్విషః =కాంతులు గల్గినవిగను, బభుః = ప్రకాశించినవి. ఉర్వ్యాః = భూమియొక్క అనగా నచ్చటి భూమియొక్క, స్వం = తనదైన, వపుః = స్వరూపము అనగా మృణ్మయస్వరూపము, మణికుట్టిమైః = రత్ననిబద్ధ భూములచే, పరివర్తితోపమం; పరివర్తిత = మణియొక విధముగా మార్చఁబడిన, ఉపమం= సామ్యము గలదిగా, బభూవ = ఆయెను. అనగా విపరీతముగా మార్చఁబడిన పాతాలము మున్నగు నుపమానములు గల్గినవిగాఁ జేయఁబడినట్లుండినవి.

సమాసములు :

కఞ్చుకితాః :- కంచుకాః ఆసాంసఞ్జాతా ఇతి = కఞ్చుకితాః.

విచిత్రచిత్రైః :- విచిత్రాణి చతాని చిత్రాణిచ = విచిత్రచిత్రాణి, తైః=

స్నపితత్విషః :- స్నపితాః త్విషః, యేషాంతే = స్నపితత్విషః.

మణికుట్టిమైః :- మణిమయాశ్చతే, కుట్టిమాశ్చ = మణికుట్టిమాః, తైః= మణికుట్టిమైః.

పరివర్తితోపమం :- పరివర్తితా, ఉపమా, యస్య, తత్ = పరివర్తితోపమం.

**భావము :**

ఆ పట్టణమున ప్రజలు ఆభరణములను రవికలు మున్నగు కంచుకములుగా తొడిగియున్నారు. అనగా వారి శరీరమునందు నెక్కువగా నాభరణములను ధరించుట వలన నవి కంచుకములను దొడిగినట్లు కానవచ్చుచున్నవి. అచ్చటి గృహములు వివిధములగు చిత్రములచే పరిశుద్ధమైన కాంతిని వహించియున్నవి. అచ్చటి భూమి స్వరూపము అనగా సహజమైన మృత్స్వరూపము మఱియొక విధముగా మాఱిన సామ్యమును వహించియున్నవి. అనగా సహజముగా కానవచ్చు భూమి రత్ననిబద్ధమగుట వలన త్రిప్పివేయబడినట్లేర్పడి పాతాళముగా గానవచ్చుచున్నది. పైన కానవచ్చు భూమి నడుగునకు తిరిగి సహజమగు భూమిగాఁ గానవచ్చుచున్నది లేదా తొలుత స్వర్గపాతాళములు ఉపమానములగను, భూమి ఉపమేయముగను నుండినది. ప్రకృతము రత్ననిబద్ధమై శోభాయమానమగు భూమి యుపమానముగను, స్వర్గపాతాళములు ఉపమేయములుగను నేర్పడి యుపమాన ఉపమేయభావము తలక్రిందులైనదని భావము. 15

శ్లో॥ తదానిసస్వానతమాం ఘనం ఘనం
నసాదతస్మిన్ నితరాం తతం తతం।
అవాపురుచ్చైః సుషిరాణి రాణితా
మమానమానద్ధ మియత్తయాధ్వనీత్. 16

ప॥చ్ఛే॥ :- తదా - నిసస్వానతమాం - ఘనం - ఘనం - ననాద - తస్మిన్ - నితరాం - తతం - తతం - అవాపుః - ఉచ్చైః - సుషిరాణి - రాణితామ్ - అమానం - ఆనద్ధం - ఇయత్తయా - అధ్వనీత్.

అర్థము :- తదా = వివాహమహోత్సవం సమీపించు కాలమున, తస్మిన్ = ఆ పట్టణమునందు. ఘనం = కాంస్యము తాలము మున్నగు వాద్యము, ఘనం = తేంపులేక యెల్లప్పుడును, నిసస్వానతమాం = మిక్కిలి శబ్దించినది. తతం = వీణాదివాద్యము. నితరాం = అతిశయించి, తతం = విస్తృతముగా, ననాద = శబ్దించినది. సుషిరాణి = వేణ్వాదివాద్యములు,

ఉచ్చైః = గట్టిగా, రణితాం = ధ్వనించుటను, అవాపుః = పొందినవి.
ఆనద్ధం = మురజము మున్నను వాద్యము, ఇయత్తయా = ఇంతటిదిగాఁ
జెప్పఁదగిన, అమానం = కొలతతేనిదై, అధ్వనీత్ = ధ్వనించినది.

సమాసములు :

నిసస్వానతమాం :- అతిశయేన, నిసస్వాన = నిసస్వానతమాం.
ఇయత్తయా :- ఇయతః భావః = ఇయత్తా, తయా = ఇయత్తయా.

భావము :

వివాహమహోత్సవము సమీపించుచున్న కాలమున, నా పట్టణమునందు, కాంస్యము తాలము మున్నగు వాద్యములు ఘనము మ్రోగినవి. వీణాదివాద్యములు విస్తారముగా శబ్దించినవి. వేణువు మున్నగువాద్యములు బిగ్గరగా ధ్వనింప సాగినవి. మురజాది వాద్యములు కొలవ సాధ్యముగానంతటి విధముగా శబ్దింప సాగినవి. 16

శ్లో॥ విపఞ్చి రాచ్ఛాది న వేణుభిర్నతే
ప్రణీతగీతైర్నచ తేఽపిఝర్ఝరైః.
న తే హుడుక్కేన న సోఽపిఢక్కయా
నమర్దలైః సాఽపినతేఽపిఢక్కయా. 17

వ॥వి॥ :- విపఞ్చీః - అచ్ఛాది - న - వేణుభిః - న - తే - ప్రణీతగీతైః - న - చ - తే - అపి - ఝర్ఝరైః - న - తే - హుడుక్కేన - న - సః - అపి - ఢక్కయా - న - మర్దలైః - సా - అపి - న తే - అపి - ఢక్కయా.

అర్థము :- విపఞ్చీః = వీణ. వేణుభిః = వేణువాద్యము-చే, న అచ్ఛాది = వినఁబడనీయక మఱుగుఁ జేయఁబడలేదు. తేపి = ఆ గాయకుల ధ్వనులును, ఝర్ఝరైః = ఝర్ఝర వాద్యములచే, నాచ్ఛాదిషత = కప్పఁబడ లేదు. తేఽపి=ఆ ఝర్ఝరవాద్య ధ్వనులును, హుడుక్కేన=హుడుక్క మను వాద్యముచే, న ఆచ్ఛాదయిషత = మఱుగుఁ గావింపబడలేదు. సోఽపి = ఆ హుడుక్కవాద్యము గూడ, ఢక్కయా = ఢక్కచే,

న అచ్ఛాది = మఱుగుజేయబడలేదు సాఽపి = ఆ ఢక్కావాద్యము గూత, మర్దలైః = మృదంగ ధ్వనులచే, నాఽఽచ్ఛాది = మఱుగు గావింపఁబడలేదు. తేఽపి = ఆ మృదంగధ్వనులును, ఢక్కయా = ఢక్కచే, న ఆచ్ఛాదయిషత = మఱుగు జేయబడలేదు—వాద్యములను—వాదించువారు, తమ తమ వాద్యధ్వనులు, ఇతర వాద్యధ్వనులతో మిలితము గాకుండ ప్రత్యేకముగా వినఁబడునట్లు వాదించిరని యర్థము.

**సమాసములు**

ప్రణీతగీతైః :- ప్రణీతాని, గీతాని, యైస్తే = ప్రణీతగీతాః, తైః = ప్రణీతగీతైః.

**భావము :**

అచ్చట వీణాధ్వనులు వేణునాదములతోడను, వేణునాదములు గాయకుల పాటలతోడను, గాయకులపాటలు, ఝర్ఝర వాద్యములతోడను, ఝర్ఝర వాద్యములు హుడుక్క ధ్వనుల తోడను, హుడుక్క ధ్వనులు, ఢక్కాధ్వనిచేతను, ఢక్కా ధ్వని మృదఙ్గాది ధ్వనులచేతను,మృదఙ్గాదిధ్వనులుఢక్కాధ్వని తోడను సంకరమును పొందక వేఱువేఱుగా వినఁబడుచుండె నవనియాశయము. 17

శ్లో॥ విచిత్ర వాదిత్ర నినాదమూర్ఛితః
సుదూర చారీ జనతా ముఖారవః.
మమౌ న కర్ణేషు దిగన్త దన్తినాం
పయోధిపూరప్రతి నాదమేదురః. 18

ప॥వి॥ : విచిత్రవాదిత్ర నినాద మూర్ఛితః, - సుదూర చారీ, - జనతాముఖారవః,-మమౌ,-న, - కర్ణేషు, - దిగన్తదన్తినాం, - పయోధిపూరప్రతి నాదమేదురః, -

అర్థము : విచిత్ర వాదిత్ర నినాద మూర్ఛితః ; విచిత్ర = నానావిధములగు, వాదిత్ర = వీణాది వాద్యములయొక్క,నినాద - ధ్వనులతో,మూర్ఛితః =వర్ధిల్లినదియు, సుదూరచారీ = మిక్కిలి దూరమును వ్యాపించినదియునగు, జనతాముఖారవః; జనతా = జనసమూహముయొక్క, ముఖారవ

= ముఖములయందేర్పడిన, సంభాషణ కోలాహలము, పయోధిపూరప్రతి నాదమేదురః; పయోధిపూర = సముద్ర ప్రవాహము యొక్క, ప్రతినాద = ప్రతిధ్వనితో, మేదురః = మిక్కిలి వర్ధిల్లినదై; దిగన్త దన్తినాః = దిగ్గజ ములయొక్క, కర్ణేషు = చెవులయందు, నమమౌ = పట్టలేదు, దమయన్తి యొక్క మఙ్గలస్నానమునకై మంగల తూర్యాది ధ్వనులనుఁ జేసిరని యర్థము.

**సమాసములు :**

విచిత్రవాదిత్ర నినాద మూర్ఛితః :- విచిత్రాణి చతాని వాదిత్రాణిచ = విచిత్ర వాదిత్రాణి, విచిత్ర వాదిత్రాణాం, నినాదః = విచిత్రవాదిత్ర నినాదః విచిత్ర వాదిత్రనినాదేన మూర్ఛితః = విచిత్ర వాదిత్ర నినాద మూర్ఛితః .

సుదూరచారీ :- సుదూరం, చరతీతి = సుదూరచారీ.

జనతాముఖారవః :- జనానాం, సమూహః = జనతా, జనతాయాః, ముఖాని = జనతా ముఖాని. జనతాముఖేషు, ఆరవః = జనతాముఖారవః

దిగన్త దన్తినాం :- దిశామన్తాః = దిగన్తాః, దిగన్తానాం, దన్తినః=దిగన్తదన్తినః, తేషాం = దిగన్తదన్తినాం .

పయోధిపూరప్రతినాద మేదురః :-పయోధేః, పూరః =పయోధిపూరఃం పయోధిపూరస్యప్రతినాదః = పయోధిపూరప్రతినాదః, పయోధిపూర ప్రతినాదేన, మేదురః = పయోధి పూరప్రతినాద మేదురః .

**భావము :**

ఆచట జనసమూహముల సంభాషణల వలన కోలాహలధ్వని, నానావిధములగు వాద్యధ్వనులతో నతిశయించినదై, చాలాదూరము వ్యాపించినదై, సముద్రతరంగము వలన ప్రతిధ్వనులతో వర్ధిల్లినదై దిగ్గజములచెవుల యందు పట్టరానంతటిదిగా విజృంభించినది.

81

శ్లో॥ ఉదస్యకు మ్భీరథశాతకుమ్భజా
శ్చతుష్కచారుత్విషి వేదికోదరే.

యథాకులా చార మథావనీంద్ర జాం
పురన్ధ్రివర్గః స్నపయాంబభూవతాం. **19**

ప॥వి॥ :- ఉదస్య, - కుమ్భైః, - అథ, - శాతకుమ్భజాః, - చతుష్కచారు త్విషి, - వేదికోదరే, - యథాకులాచారమ్, - అథ, - అవనీంద్రజాం- పురన్ధ్రివర్గః, - స్నపయాంబభూవ, - తాం,-

అర్థము :- అథ = మంగలతూర్యనాదములకు పిదప, పురన్ధ్రివర్గః = పౌర స్త్రీసంఘము శాతకుంభజాః = పసిడితోనిర్మితములగు, కుమ్భైః=పూర్ణ కలశములను, ఉన్నమయ్య = పైకెత్తి, అథ = తర్వాత, మంగల పూర్వకముగా - చతుష్కచారుత్విషి; చతుష్క = నాలుగు స్తంభముల మణ్డపముచే, చారుత్విషి = రమ్యమగు, గాంతిగల్గిన, వేదికోదరే = వేదికయొక్కమధ్యభాగమున, యథాకులాచారం = కులాచారమునతిక్ర మింపక, తామ్ = ఆ, అవనీంద్రజాం = రాజపుత్రికయగు దమయన్తి ని, స్నపయాంబభూవ = జలకములాడించిరి.

సమాసములు ;

శాతకుమ్భజాః :- శాతకుమ్భాత్, జాయంతఇతి = శాతకుమ్భజాః, తాః = శాతకుమ్భజాః.

చతుష్కచారుత్విషి :- చతుష్కేణ, చారుః, త్విట్, యస్యతత్=చతు ష్కచారుత్విట్, తస్మిన్ = చతుష్కచారుత్విషి.

వేదికోదరే :- వేదికాయాః, ఉదరం = వేదికోదరం, తస్మిన్ = వేది కోదరే.

భావము :

మంగళ తూర్య ఘోషలు కాగనే, పౌరస్త్రీవర్గము, సువర్ణపూర్ణకలశము లను, పైకెత్తి పిదప మంగల గీతములతో, నాలుగుస్తంభముల మణ్డపముచే శోభాయమానమగు వేదికయొక్క మధ్య భాగమున, కులాచారములనతిక్రమిం పక యారాజపుత్రికకు మంగళ స్నానము గావించిరి. ॥19॥

శ్లో॥ విజిత్యదాస్యాదివ వారి వాహితా
మవా పితాస్తత్కుచయోర్ద్వయేనే తాః।
శిఖామవాపుః సహకార శాఖిన
స్త్రపా భరమ్లాని మివాన తైర్ముఖైః॥ 20

ప॥వి॥ :- విజిత్య, - దాస్యాత్, - ఇవ, - వారివాహితామ్, - అవాపితాః, - తత్కుచయోః, - ద్వయేన, - తాః, - శిఖామ్, - అవాపుః, - సహకార శాఖినః, - త్రపాభరమ్లానిమ్, - ఇవ, ఆనతైః, - ముఖైః, -

అర్థము :- తత్కుచయోః = ఆదమయన్తి స్తనములయొక్క, ద్వయేన = జంటచే, విజిత్య = జయింపఁబడి, దాస్యాదివ - దాసిస తనము వలననో యనునట్లు, వారిహారితాం = నీళ్ళనుమోయుటను, అవాపితాః = పొందింపఁబడిన, తాః = అకుండలు, ఆనతైః = వంగిన, ముఖైః = ముఖములతో, సహకార శాఖినః = మామిడి చెట్టుయొక్క, శిఖాం = చిగురును త్రపాభరమ్లానిమివ; త్రపాభర = లజ్జాతిశయముచే, మ్లానిమివ = వాడబారుటనువలె, అవాపుః = ధరించినవి, ప్రతిగృహము యొక్క ద్వార సమీపమునందును మామిడి చిగుళ్ళతో. గప్పఁబడిన మూతిగల పూర్ణకుంభములు స్థాపించఁబడిన వని యర్థము. లోకమునందు దాసిసలుగా జేయఁబడినస్త్రీలు తలను వంచు కొనిన వారై, వాడుబారిన ముఖకాంతులు గల వారై నీళ్ళుతెచ్చుట మున్నగు పనులు గావింతురు. ఇచట దమయన్తీస్తన ద్వయముచే నోడింపఁబడినకుండలు దాస్యమునందుంచఁబడినవై యామె జలకములకు నీటినిఁగానిఁతెచ్చుచు మామిడి చిగుళ్ళచే మూతులందుగప్పఁ బడినందువలన లజ్జచే వాడు బారిన మోముగలవిగా కానవచ్చినవని యాశయము.

వి :— కుండలు నీరును గ్రహించుటకుఁగాని మామిడి తెమ్మలచేఁ గప్పఁబడినందులకుఁగాని దాస్యము హేతువు గాకపోయినను, దానిని హేతువుగాఁ జెప్పుట వలన హేతూత్ప్రేక్ష.

మ్లానినిఁ బొందక పోయినను శ్యామలవర్ణములగు మామిడి తెమ్మల కాంతిని, మ్లానిగుణ స్వరూపముగ నుత్ప్రేక్షించుటవలన నిట గుణస్వరూ

పోత్ప్రేక్ష. ఈరెండును సజాతీయములు గాన సజాతీయద్వయసఙ్కరము.

**సమాసములు :**

దాస్యాత్ :- దాసస్య, భావః = దాస్యం, తస్మాత్ = దాస్యాత్.
వారిహారితాం :- వారీణి, హరతీతి = వారిహారీ, వారిహారిణః, భావః = వారిహారితా, తాం = వారిహారితామ్.
సహకారశాఖినః :- సహకారఇతిశాఖీ = సహకారశాఖీ, తస్య=సహకారశాఖినః.
త్రపాభరమ్లానిం :- త్రపాయాః, భరః = త్రపాభరః, త్రపాభరేణ, మ్లానిః = త్రపాభరమ్లానిః, తాం = త్రపాభరమ్లానిం.

**భావము :**

ఆ దమయన్తి చనుదోయిచే యోడింపఁబడి దాస్యము నందుంచుటచే కుండలు, ఆమె జలకములకై నీటిని గ్రహించుచు పనిని జేయుచుండినవి. అవి వంచిన మూతులతోడను (ముఖములతోడను) దాస్యము వలన లజ్జాతిశయముచే నేర్పడిన వాడుబారుతనమును సూచించుటకో యనునట్లు మామిడి లేత కొమ్మలను మూతులపై ధరించియుండినవి. లోకమున నోడింపఁబడినవారు, దాస్యము నందున్నప్పుడు సిగ్గుపడుట, ముఖమును వాడ్చుకొనుట మున్నగువానినిఁ గల్గియుండుట సహజము. ఆ విధముగనే, చనుదోయిచే నోడిపోయిన కుండలు దాస్యమున నుంచఁబడినవై జలగ్రహణము చేయుచు మామిడి కొమ్మలు—మూతులను కప్పియుండుట వలన తమ మ్లానిని సూచించినవి. శుభసూచకముగా నిండ్ల వాకిట పూర్ణకలశములుంచి వానిపై శ్యామలవర్ణముగల లేతమామిడి కొమ్మలనుఁ గప్పుదురు. ఆ మామిడి రెమ్మలు తమ శ్యామలవర్ణముచే జలకలశములకుఁ గల్గిన లజ్జాతిశయమును, మ్లానిని సూచించుచున్నవని భావము. 20

శ్లో॥ అసౌముహూర్తాత జలాభిషేచనా
త్క్రమాద్దుకూలేన సితాంశునోజ్జ్వలా.
ద్వయస్యవర్షా శరదాం సదాతనీం
సనాథితాం సాధు బబంధసంధయా. **21**

ప॥వి॥ :- అసౌ - ముహుః - జాతజలాభిషేచనా - క్రమాత్ - దుకూలేన - సితాంశునా - ఉజ్జ్వలా - ద్వయస్య - వర్షాశరదాం - సదాతనీం - సనాభితాం - సాధు - బబంధ - సంధయా.

అర్థము :- అసౌ = ఈ దమయన్తి, ముహుః = పలుమాఱు, జాతజలాభిషేచనా; జాత = ఏర్పడిన, జలాభిషేచనా = జలాభిషేకము కలదై, (తథా = అట్లే) సితాంశునా = తెల్లని కాంతిగల, దుకూలేన = పట్టువస్త్రము చేతను (సితాంశునా=తెల్లని కిరణముగల్గిన చంద్రునిచేతను) ఉజ్జ్వలా= ప్రకాశించుచున్నదై, క్రమాత్ = క్రమము ననుసరించి, వర్షాశరదాం = వర్షర్తు, శరదృతువుల యొక్క, ద్వయస్య = రెంటియొక్క, సంధయా = సంధిస్థలముచే, ననగా - వర్షర్తు శేషమునకు శరదృతు ప్రాదంభము నకు మధ్యనున్న కాలముచే, సదాతనీం = ఎల్లప్పుడున్న, సనాభితాం= సామ్యమును, సాధు = చక్కగా, బబంధ = ధరించినది. వర్షర్తువు జలముచే నభిషిక్తము. శరదృతువు శీతాంశువుచే (చంద్రునిచే) ప్రకాశ మానము.

వి :— జలాభిషేకము తోడను సితాంశువుతోడను శోభించు దమయన్తి; వర్షా శరదృతువుల సంధితోఁ బోల్చఁబడినది గాన ఉపమాలఙ్కారము.

**సమాసములు ;**

జాతజలాభిషేచనా :- జలేన, అభిషేచనం = జలాభిషేచనం. జాతం, జలాభిషేచనం, యస్యాస్సా = జాతజలాభిషేచనా

సితాంశునా :- సితాః, అంశవః, యస్యసః = సింతాంశుః, తేన=సితాం శునా.

వర్షాశరదాం :- వర్షాశ్చ, శరచ్చ = వర్షాశరదః, తేషాం = వర్షాశరదాం.

**భావము :**

ఈ దమయన్తి పలుమాఱు జలాభిషేకము నొందినది. అట్లే తెల్లని పట్టు వస్త్రమును ధరించినది. వర్షర్తువు, వర్షాజలములచే నభిషిక్తమగును. శరదృతువు సితాంశువగు చంద్రునితో శోభించును. ఆ దమయన్తి పైవిధముగ నభిషేకమునుఁ బొందుట వలనను తెల్లని పట్టువస్త్రమును ధరించుట వలనను వర్షర్తు శేషమునకు

శరదృతు ప్రారంభమునకు మధ్యనున్న కాలముతో—సామ్యమును వహించినదని యాశయము. 21

శ్లో॥ అసౌ ప్రభిన్నామ్బుద దుర్దినీకృతా
నినిన్దచన్ద్రద్యుతి సుందరిందివం.
శిరోరుహౌఘేన ఘనేనసంయుతా
తథా దుకూలేన సితాంశునోజ్జ్వలా. **22**

ప॥వి॥ :- అసౌ - ప్రభిన్నామ్బుదదుర్దినీకృతా - నినిన్ద - చంద్రద్యుతిసుందరీం - దివం - శిరోరుహౌఘేన - ఘనేన - సంయుతా - తథా-దుకూలేన - సితాంశునా - ఉజ్జ్వలా.

అర్థము :- ఘనేన = దట్టమైన, శిరోరుహౌఘేన; శిరోరుహ = కురులయొక్క, ఓఘేన = సమూహముతోడను (ఘనేన = మేఘముతోడను) సంయుతా = కూడినదై, తథా = అట్లే, సితాంశునా = తెల్లని నూలుతో నేయఁబడిన పట్టువస్త్రముతో, ఉజ్జ్వలా = శోభించుచున్నదైన, అసౌ = ఈ దమయన్తి, ప్రభిన్నామ్బుదదుర్దినీకృతాం; ప్రభిన్న = పిగిలినదై వర్షించునట్టి, అంబుద = మేఘములచే, దుర్దినీకృతాం = దట్టమైన కారుమేఘములుగల్గి యంతట వర్షించునదియు, తథా = అట్లే, చంద్రద్యుతి సుందరీం; చంద్రద్యుతి = చంద్రకాంతిచే, సుందరీం = రమ్యమైన, దివం = ఆకసమును, నినింద = నిందించినది.

వి :— నల్లని కురులుగల్గి తెల్లని వలువను దాల్చిన దమయన్తి కారుమేఘములచే వర్షింపఁబడి, చంద్రకాంతితో సుందరముగానున్న యాకసమును నిందించెననగా, నాయాకాశముతో సమానముగా నున్నదని యర్థముగాననుపమాలంకారము.

**సమాసములు :**

ప్రభిన్నామ్బుదదుర్దినీకృతాం :- ప్రభిన్నాశ్చతే, అమ్బుదాశ్చ = ప్రభిన్నామ్బుదాః, ప్రభిన్నామ్బుదైః, దుర్దినీకృతా = ప్రభిన్నామ్బుదదుర్దినీకృతా, తాం = ప్రభిన్నామ్బుదదుర్దినీకృతాం.

చంద్రద్యుతిసుందరీం :- చంద్రస్య, ద్యుతిః = చంద్రద్యుతిః, చంద్ర ద్యుత్యా, సుందరీ = చంద్రద్యుతిసుందరీ, తాం=చంద్రద్యుతిసుందరీం.

శిరోరుహౌఘేణ :- శిరోరుహాణా మోఘః = శిరోరుహౌఘః, తేన=శిరో రుహౌఘేన.

**భావము :**

దట్టమైన కురులగుంపుతోఁ గూడినదియు (మేఘముతోఁ గూడినదియు) నగు నీ అట్టే తెల్లని వలువతో శోభించునదియు (చంద్రునితో శోభించునదియు) నగు నీ దమయన్తి, పిగిలిపోయిన మేఘములచే నంతట వర్షించినదియు చంద్రకాంతితో మనోహరమైనదియునగు నాకసమును నిందించినది. అనగా నట్టియాకసముతోఁ బోలియుండినదని భావము. ఆ దమయన్తి శిరమునందలి దట్టమైన కురులగుంపు వర్షోన్ముఖములగు కారుమేమములను, ఆమెయొక్క సితాంశువైన యనగా తెల్లని నూలుతో నేయఁబడిన పట్టువస్త్రము చంద్రుని బోలియున్నది. ఆమె కురుల గుంపు మేఘముతోఁ బోల్చఁబడుటవలన, వర్షర్తు సంబంధము, ఆమె ధరించిన పట్టువస్త్రము చంద్రునితోఁ బోల్చఁబడుట వలన శరదృతు సంబంధము ఆమె యందేర్పడుచున్నది. వర్షర్తు సంబంధముచే నంతటవృష్టియు, శరదృతు సంబంధ ముచే చంద్రకాంతి సంబంధము ఘటింపఁబడి వెనుకటి శ్లోకమునఁ జెప్పఁబడిన వర్షాశరత్తుల సంధిగా నామెనుఁ గావించిన వర్ణనకుసిది మెఱుగు పెట్టుచున్నది. ఆమె కురులు నల్లగను దట్టముగను నున్నవనియు, నామె తెల్లని దువ్వలువను ధరించినదనియు - సారాంశము. 2

శ్లో॥ విరేజిరే తచ్చికురోత్కరాః కిరాః
క్షణం గలన్నిర్మలవారివిప్రుషాం.
తమః సుహృచ్చామరనిర్జయార్జితాః
సితావమన్తుః ఖలుకీర్తి మౌక్తికాః. 3

ప॥వి॥ :- విరేజిరే, - తచ్చికురోత్కరాః. కిరాః, - క్షణం, -గలన్నిర్మలవారి విప్రుషాం, - తమః సుహృచ్చామరనిర్జయార్జితాః, -సితాః,- వమన్తుః - ఖలు, - కీర్తిమౌక్తికాః.

అర్థము :- క్షణం = క్షణకాలము, గలన్నిర్మలవారివిప్రుషాం; గలత్ = స్రవించుచున్న, నిర్మల = శుద్ధములైన, వారి = ఉదకములయొక్క, విప్రుషాం = బిందువులను, కిరాః = స్రవించునట్టి. తచ్చికురోత్కరాః ; చికుర = కురులయొక్క, ఉత్కరాః = సమూహములు, తమస్సుహృదః; తమః = చీకటిలో, సుహృత్ = సమానమైన, చామర = నల్లనిచామరమును, నిర్జయ = జయించుటచే, అర్జితాః = సంపాదింపబడిన, సితాః తెల్లని, కీర్తిమౌక్తికాః; కీర్తి = యశస్సనెడి, మౌక్తికాః = ముత్తెములను, వమన్తః ఖలు = వమనము, జేయుచున్నవోయనునట్లు, విరేజిరే = శోభించినవి.

**సమాసములు**

తచ్చికురోత్కరాః :- తస్యాః, చికురాః = తచ్చికురాః, తచ్చికురాణాముత్కరాః = తచ్చికురోత్కరాః .

కిరాః :- కిరన్తీతి = కిరాః .

గలన్నిర్మలవారి విప్రుషాం :- వారిణాం, విప్రుషః = వారివిప్రుషః, నిర్మలాశ్చతాః, వారివిప్రుషశ్చ = నిర్మలవారివిప్రుషః, గలన్త్యశ్చతాః నిర్మలవారి విప్రుషశ్చ = గలన్నిర్మలవారి విప్రుషః, తాసాం = గలవారివిప్రుషాం .

తమస్సుహృచ్చామర నిర్జయార్జితాః :- తమసః, సుహృత్ = తమస్సుహృత్, తమస్సుహృచ్చాసౌ, చామరశ్చ = తమస్సుహృచ్చామరః తమస్సుహృచామరస్య, నిర్జయః = తమస్సుహృచ్చామరనిర్జయః, తమస్సుహృచ్చామరనిర్జయేన. అర్జితాః = తమస్సుహృచ్చామర నిర్జయార్జితాః, తాః, = తమస్సుహృచ్చామరనిర్జయార్జితాః .

కీర్తిమౌక్తికాః ;- కీర్తయఏవ మౌక్తికాః = కీర్తిమౌక్తికాః తా, - కీర్తిమౌక్తికాః .

**భావము :**

క్షణకాలము, పరిశుద్ధములగు నుదక బిందువులను, గార్చుచున్న దమయన్తి కురులు, నల్లని చామరమును గాంతిచే నోడించుట వలన సంపాదించిన కీర్తులనెడి ముత్తెములను రాల్చుచున్నట్లు శోభించినవి. దమయన్తి స్నానముం

జేయుట వలన నామెకురులయందు నీటిబిందువులు నిలిచి బొట్టు బొట్టుగా, గారు చున్నవి. ఆకురులు నల్లగనుండుట వలన నల్లని చామరమును తన కాంతితో జయించి కీర్తులను సంపాదించినట్లును, ఆకీర్తులుముత్తెములనుఁ బోలియుండిన ట్లును, అట్టి ముత్తెపుపూసలను, తన కురులలోని నీటిబిందువుల రూపమునఁ గార్చుచున్నట్లు భావింపఁబడినది. ॥ 3 ॥

శ్లో॥ మ్రదీయసా స్నానజలస్యవాససా
ప్రమార్జ నేనాధిక ముజ్జ్వ లీకృతా.
అదభ్ర మభ్రాజత సాఽశ్మశాణనాత్
ప్రకాశ రోచిః ప్రతిమేవ హేమజా. 24

ప॥వి॥ :- మ్రదీయసా - స్నానజలస్య - వాససా - ప్రమార్జనేన - అధికమ్ - ఉజ్జ్వలీకృతా - అదభ్రమ్ - అభ్రాజత - సా - అశ్మశాణనాత్ - ప్రకాశరోచిః - ప్రతిమా - ఇవ - హేమజా.

అర్థము :- మ్రదీయసా=మిక్కిలి మెత్తనైన, వాససా =దేహముఁ దుడుచుకొను వస్త్రముచే, స్నానజలస్య; స్నాన = స్నానముచేయుటచే నొడలనంటిన, జలస్య = నీటిని, ప్రమార్జనేన = తుడుచుటచే, అధికం = మిక్కిలి, ఉజ్జ్వలీకృతా = కాంతియుక్తురాలుగఁ జేయఁబడిన, సా = ఆ దమయన్తి, అశ్మశాణనాత్; అశ్మ = సాతిచే, శాణనాత్ = ఒరయుటవలన, ప్రకాశ రోచిః, ప్రకాశ = ప్రకాశించెడి, రోచిః = కాన్తిఁగల్గిన, హేమజా = బంగారుతోఁ జేయఁబడిన, ప్రతిమేవ = బొమ్మవలె, అదభ్రం = అనేక ముగా, అభ్రాజత = శోభించినది.

**సమానములు :**

మ్రదీయసా :- అత్యంతం, మృదు = మ్రదీయః, తేన = మ్రదీయసా.
స్నానజలస్య :- స్నానస్య, జలం = స్నానజలం, తస్య=స్నానజలస్య.
ఉజ్జ్వలీకృతా :- అనుజ్జ్వలా, ఉజ్జ్వలా, సమ్పద్యమానాకృతా = ఉజ్జ్వలీ కృతా.
అశ్మశాణనాత్ :- అశ్మనా, శాణనం = అశ్మశాణనం, తస్మాత్=అశ్మ శాణనాత్.

ప్రకాశశోభిః- ప్రకాశం = శోభః, యేషాంతాః = ప్రకాశశోభిః.
హేమజా:- హేమ్నః = జాయతఇతి = హేమజా.

**భావము :**

ఆ దమయన్తి స్నానముఁజేసి మెత్తని వస్త్రముతో నొడలునుఁ దుడుచుకొనగనే మిక్కిలి కాంతియుక్తురాలై శోభించినది. అప్పుడామె సానబెట్టుటచే మిక్కిలి కాంతినిఁ బొందిన బంగారు బొమ్మవలె నెక్కువఁ బ్రకాశించినది. బంగారు సహజముగనే కాంతియుక్తమై తేజరిల్లును. ఇక దానికి సానబెట్టినప్పుడు దాని కాంతి మిక్కిలి యతిశయించునుగదా. 24

**శ్లో॥ తదా తదఙ్గస్య బిభర్తి విభ్రమం**
**విలేపనామోదముచః స్ఫురద్రుచః.**
**దరస్ఫుటత్కాఞ్చన కేతకీదలాత్**
**సువర్ణమభ్యస్యతి సౌరభంయది. 25**

ప॥వి॥ :- తదా - తదఙ్గస్య - బిభర్తి - విభ్రమం - విలేపనామోదముచః - స్ఫురద్రుచః - దరస్ఫుటత్కాఞ్చనకేతకీ - దలాత్ - సువర్ణమ్ - అభ్యస్యతి - సౌరభం - యది.

అర్థము :- సువర్ణం = బంగారము, స్ఫుటత్కాఞ్చనకేతకీదలాత్; స్ఫుటత్ = వికసించిన, కాఞ్చనకేతకీ = పసిడిమొగలి చెట్టుయొక్క, దలాత్ = ఱేకునుండి, సౌరభం = పరిమళమును, అభ్యస్యతియది = నేర్చినచో, ననగా సంపాదించుకొనినచో, తదా = అప్పుడు, విలేపనామోదముచః; విలేపన = మైపూతవలన, ఆమోద = పరిమళమును, ముచః = విడచునట్టి, స్ఫురద్రుచః = ప్రకాశించుకాంతి గల్గిన, తదఙ్గస్య=ఆ దమయన్తి శరీరముయొక్క, విభ్రమం = విలాసమువంటి విలాసమును, బిభర్తి = భరించుచున్నది.

వి :- పరిమళ గుణముచే, నామె మొదలిని బంగారుకంటె నధికముగాఁ జెప్పుట వలన వ్యతిరేకాలఙ్కారము.

బంగారునకు పరిమళ సంబంధము లేకపోయినను "యది" శబ్దముచే నున్నట్లు సమ్భావన చేయుటవలన నతిశయోక్త్యలఙ్కారము.

"విలాసమువంటి విలాసమును" అని చెప్పుటవలన – సాదృశ్యమాక్షిప్త మగుటవలన, 'అసమ్భవద్వస్తుసంబంధరూపమైన' నిదర్శనాలఙ్కారము.

ఆమె దేహమునకు సమానముగాఁదగిన బంగారమును నుపమేయముగాఁ జెప్పుటవలనఁ ప్రతీపాలఙ్కారము. వీని కన్నింటికి నఙ్గాఙ్గి భావముచే సఙ్కరము.

**భావము :**

బంగారు, పసిడి మొగలఱేకు నుండి పరిమళమును సంపాదించుకొని నచో, చందనాది పరిమళ ద్రవ్యముల నలదుకొని, నెత్తావిని వదలుచున్న యా దమయన్తి యొడలి విలాసమువంటి విలాసమును వహించును. ఆ దమయన్తి, దేహముచే, బంగారును నతిశయించి యున్నదని యాశయము.

**సమాసములు :**

తదఙ్గస్య :- తస్యాః, అఙ్గం = తదఙ్గం, తస్య = తదఙ్గస్య.
విలేపనామోదముచః :- విలేపనానామామోదః = విలేపనామోదః, విలేపనామోదం, ముంచతీతి = విలేపనామోదముక్, తస్య = విలేపనామోదముచః.

స్ఫురద్రుచః :- స్ఫురన్తీ, రుక్, యస్యతత్ = స్ఫురద్రుక్ = తస్య = స్ఫురద్రుచః.
దరస్ఫుటత్కాఞ్చనకేతకీదలాత్ :- దరం, స్ఫుటత్ = దరస్ఫుటత్, కాఞ్చనమయీచసా, కేతకీచ = కాఞ్చనకేతకీ, కాఞ్చనకేతక్యాః, దలం =కాఞ్చనకేతకీదలం, దరస్ఫుటంచతత్, కేతకీదలంచ = దరస్ఫుటత్ కాఞ్చనకేతకీదలం, తస్మాత్ = దరస్ఫుటత్కాఞ్చనకేతకీదలాత్. 25

శ్లో॥ అవాపితాయాః శుచివేదికాన్తరం
కలాసుతస్యాః సకలాసు పణ్డితాః.
క్షణేన సఖ్యశ్చిర శిక్షణస్ఫుటం
ప్రతిప్రతీకం ప్రతికర్మ నిర్మముః. 26

ప॥వి॥ :- అవాపితాయాః - శుచివేదికాన్తరం - కలాసు - తస్యాః - సకలాసు - పణ్డితాః - క్షణేన - సఖ్యః - చిరశిక్షణస్ఫుటం - ప్రతిప్రతీకం - ప్రతికర్మ - నిర్మముః.

అర్థము :- సకలాసు = సమస్తములైన, కలాసు = శిల్పవిద్యలయందు, పణ్డితాః = నేర్పరులైన, సఖ్యః = చెలికత్తెలు, శుచి = పరిశుభ్రమైన, వేదికాంతరం = మఱియొక వేదికను, అవాపితాయాః = పొందింపఁబడిన, తస్యాః = ఆ దమయన్తియొక్క, ప్రతిప్రతీకం = ఒక్కొక్క యవయవమునందు, ప్రతికర్మ = అలఙ్కారమును, చిరశిక్షణస్ఫుటం; చిర = చాలకాలము, శిక్షణ = నేర్పుటచే, స్ఫుటం = స్పష్టమైనట్లు; క్షణం = క్షణకాలమున, నిర్మముః = చేసిరి.

**సమాసములు :**

శుచివేదికాన్తరం :- అన్యా, వేదికా = వేదికాన్తరం, శుచిచతత్‌వేదికాన్తరంచ = శుచివేదికాన్తరం, తత్ = శుచివేదికాన్తరం.

చిరశిక్షణస్ఫుటం :- చిరం, శిక్షణం = చిరశిక్షణం, చిరశిక్షణేన, స్ఫుటం, యథాతథా = చిరశిక్షణస్ఫుటం.

**భావము :**

శిల్పాది సకల కళలయందును, నేర్పరులైన చెలికత్తెలు, దమయన్తిని పరిశుద్ధమైన మఱియొక వేదికనుఁ బొందించి యామెకు నొక్కొక్క యంగమునందును నలఙ్కారమును చిరకాలమునుండి తాము గావించిన యభ్యాసముచే చక్కగా, క్షణకాలమునఁ గావించిరి. 26

శ్లో॥ వినాపి భూషామవధిః శ్రియామియం
వ్యభూషి విజ్ఞాభిరదర్శిచాఽధికా.
నభూషయైషాఽతిచకాస్తి కిన్తుసాఽ
సయేతి కస్యాఽస్తు విచారచాతురీ. 27

ప॥వి॥ :- వినా - అపి - భూషామ్ - అవధిః - శ్రియామ్ - ఇయమ్ - వ్యభూషి - విజ్ఞాభిః - అదర్శి - చ - అధికా - న - భూషయా -

ఏషా - అతిచకాస్తి - కిం - తు - సా - అనయా - ఇతి - కస్య - అస్తు - విచారచాతురీ.

అర్థము :- భూషాం వినాఽపి = ఆభరణము లేకపోయినను, శ్రియాం=శోభలకు, అవధిః = ఎల్లయైన, ఇయం = ఈ దమయన్తి, విజ్ఞాభిః = అలఙ్కరణమందు నేర్పరులైన చెలికత్తెలచే, వ్యభూషి = అలంకరింపఁబడినది తథా = అట్లే, అధికా = పూర్వపుస్థితికంటె నుత్కృష్టురాలుగా, అదర్శి = భావింపబడినది. వస్తుతస్తు = వాస్తవస్థితియందు, ఏషా = ఈ దమయన్తి, భూషయా = ఆభరణముచే, నఅతిచకాస్తి = ఎక్కువ శోభింపదు. కింతు = కాని, సా = ఆ భూషణము, అనయా = ఈమెచేత, అతిచకాస్తి = మిక్కిలి ప్రకాశించుచున్నది. ఇతి = అని, విచారచాతురీ = విమర్శనా కౌశలము, కస్య = ఎవనికి, అస్తు = ఉండును? ఎవనికి నుండదని యర్థము. ఈమెచేతనే భూషణ మలంకరింపఁబడును. కాని భూషణముచేత నీమె యలంకరింపఁబడదని నిశ్చయించుటకు శక్తి లేనందువలననే "భూషణము లెక్కువశ్శోభనుఁ గల్గించునని" యందరికిని భ్రమ యున్నది.

**సమాసములు :**

విచారచాతురీ :- విచారే, చాతురీ = విచారచాతురీ

**భావము ;**

భూషణములు లేకపోయినను నందములకెల్లయైన యీ దమయన్తిని సమర్థులగు చెలికత్తె లలఙ్కరించిరి. దానిచే నామె పూర్వదశకంటెను నింకనుఁ జక్కగా శోభింపసాగినది. వాస్తవమున నీదమయన్తి భూషణములచే నెక్కువగా శోభింపదు. మఱేమనగా, నీమెచే భూషణములెక్కువ శోభించును. ఈ విధముగా విచారణ గావించి నిర్ణయించునేర్పు ఎవ్వరికున్నది? ఎవ్వరికిని లేదు. కేవలము భూషణములే శోభను గల్గించునని యందరికిని భ్రమ. వాస్తవమున సహజసౌందర్య లక్షణమునకిది విరుద్ధము. ఏలయనగా —"

"ఆవేధ్యారోప్యవిక్షేప్య బంధనీ యైదభూషితం।
యద్భూషితమివాఽఽభాతి తద్రూపమితి కథ్యతే"॥. యను వచనము

గంధఫలీబలిశ్రియమ్ ;- గంధఫల్యాః, బలిః = గంధఫలీబలిః, గంధఫలీబలేః, శ్రీః = గంధఫలీబలిశ్రీః తాం = గంధఫలీబలిశ్రియమ్.

లబ్ధాధరలోచనార్చనమ్ :- అధరశ్చ లోచనంచ = అధరలోచనం, అధరలోచనస్య అర్చనం= అధరలోచనార్చనం, లబ్ధం, అధరలోచనార్చనం, యేనతత్ = లబ్ధాధరలోచనార్చనమ్.

మనశ్శిలాచిత్రకం :- మనశ్శిలయా, చిత్రకం = మనశ్శిలాచిత్రకమ్

తన్ముఖం ;- తస్యాః ముఖమ్ = తన్ముఖమ్.

**భావము :**

పెదవులచేతను, కన్నులచేతను నర్చింపఁబడిన యా దమయన్తిముఖము, అనగా వానికంటెను మనోహరమైన యామె ముఖము మనఃశిలయను పసుపు పచ్చని ధాతువుచే దిలకమునుఁ బొందినదై; బంధూకము లనఁబడు నెఱ్ఱని పూవులచేతను, పద్మములచేతను, బూజించి వానిపై పసుపు పచ్చని చంపకపు మొగ్గలచే చేయఁబడిన పూజింపబడిన చంద్రునిశోభను నిందించినది. అనగా మించినదని యర్థము. అనగా దమయన్తి ముఖమునందలి రెండు పెదవులు బంధూకపుష్పమువలె నెఱ్ఱగను, నందలి రెండు కన్నులు పద్మములవలె రమ్యములుగ నున్నవి, మఱియు నదినొసట తిలకముచేనలఙ్కృతమై, రెండు పెదవుల తోడను, కన్నులతోడనుఁ గూడియుండగానది, బంధూకములను నెఱ్ఱని పూవుల తోడను, పద్మములతోడనుఁ బూజింపఁబడి పైన చంపకపు మొగ్గలచే నర్చన బొందిన చంద్రుని మించియున్నదని భావము. దమయన్తిమోము చంద్రునితో సమానము అ దలియామెయొక్క ఎఱ్ఱని పెదవులును క్రమముగా విశాలమగునేత్రములును చంద్రుని నర్చించిన బంధూక పుష్పములవలెను పద్మములవలెను నున్నవి. మనఃశిలతో నామెనుదుట నుంచఁబడిన తిలకము చంపక ముకుళమును బోలియున్నదని యాశయము అనగా నామె పెదవులనెడి బంధూకపుష్పములు, నామె నేత్రములనెడి పద్మములు నామె ముఖమునుఁ బూజించి నట్లున్నవనియు భావము.

28

శ్లో॥ మహీమఘోనాం మదనాంధతాతమీ

తమః పటూరమ్భణ తంతుసంతతిః।

అబంధితన్మూర్ధజ పాశమఞ్జరీ॥
కయాఽపి ధూపగ్రహధూమకోమలా॥ 29

ప॥వి॥ :- మహీమఘోనాం — మదనాంధతాతమీ తమః పటారమ్భణ తంతు సంతతిః- అబంధి — తన్మూర్ధజ పాశమఞ్జరీ - కయా - అపి - ధూప గ్రహధూమ కోమలా.

అర్థము :— మహీమఘోనాం = భూదేవేంద్రులకు, అనగా రాజులకు, మదనాంధ తాతమీ; మదనాంధతా, మదన = మన్మధునివలన, అంధతా = మోహ మనెడి, తమీ = రాత్రియొక్క, తమఃపట = చీకటియను వస్త్రమును, ఆరంభణ = నిర్మించుటయందలి, తన్తు సంతతిః = దారములయొక్క సమూహమైనదియు, ధూపగ్రహ = సాంబ్రాణి మున్నగు పరిమళ ద్రవ్యముల పొగను గ్రహించుటకు సాధనమైన గిన్నె యందలి, ధూమ = పరిమళముగల పొగతో, కోమలా = రమ్యమైనదియునగు, తన్మూర్ధజపాశమఞ్జరీ, తత్ - ఆ దమయన్తియొక్క, మూర్ధజపాశ = కేశపాశముయొక్క, మఞ్జరీ = సమూహము, కయాఽపి = ఒకానొక చెలికత్తెచే, అబంధి = బంధింపబడినది.

**సమాసములు ;**

మహీమఘోనాం - మహ్యాః, మఘవానః = మహీమఘవానః, తేషాం = మహీమఘోనాం.

మదనాంధతాతమీతమః పటారమ్భణతన్తు సంతతిః :— మదనేన, అంధతా = మదనాంధతా, మదనాంధతైవ తమీ = మదనాంధతాతమీ, మదనాన్ధతా తమ్యాః, తమః = మదనాన్ధతాతమీ తమః, మదనాన్ధతాతమీ తమ ఏవపటః = మదనాన్ధతాతమీ తమః పటః, మదనాన్ధతాతమీ తమః పటస్య, ఆరమ్భణం = మదనాన్ధతాతమీ తమః పటారంభణమ్. మద నాన్ధ తాతమీ తమః పటారమ్భణే, తన్తవః = మదనాన్ధ తాతమీతమః పటారమ్భణ తన్తవః. మదనాన్ధ తాతమీ తమః పటారమ్భణ తన్తూనాం, సంతతిః = మదనాన్ధ తమీతమః పటారమ్భణ తన్తు సన్తతిః

తన్మూర్ధజపాశమఞ్జరీ :- తస్యాః మూర్ధజాః = తన్మూర్ధజాః, తన్మూర్ధజానాం పాశః = తన్మూర్ధజపాశః, తన్మూర్ధజ పాశస్య, మఞ్జరీ = తన్మూర్ధజపాశమఞ్జరీ.

ధూపగ్రహ ధూమకోమలా :- ధూపస్య, గ్రహః = ధూపగ్రహః, ధూప గ్రహస్య, ధూమః=ధూపగ్రహధూమః, ధూపగ్రహధూమేన, కోమలా= ధూపగ్రహధూమకోమలా.

**భావము :**

భూలోకపు దింద్రులగు పెక్కు రాజులయొక్క కామాన్ధత్వ మనెడి రాత్రికి చీకటియనెడి వస్త్రమును నేయుటకు సాధనములగుదారముల సమూహమో యను నట్లున్నదియు ధూపము అనగా సాంబ్రాణి చందనను మున్నగు పరిమళ ద్రవ్యముల పొగను వేయుటకు సాధనమగు ధూపగ్రహమును గిన్నెనుండి వెల్వడు పొగచే మృదువై నదియునగు, నా దమయన్తియొక్క కురులగుంపును నొకానొక చెలికత్తె ముడివేసినది. ఆమె కురులు నల్లగా నుండుటవలన చీకటి యను వస్త్రమును నేయుటకు సాధనములగు నూలుపోగులుగా నున్నవనియు, నా కురులకు సాంబ్రాణి మున్నగు పరిమల ద్రవ్యములచే పొగ వేయుటవలన నవి సుగన్ధభరితములై యున్నవనియు అట్టికురులను ముడివైచెననియు భావము.

శ్లో॥ పునఃపునఃకాచన కుర్వతీకచ
చ్ఛటాధియా ధూపజ ధూమసంయమమ్.
సఖీస్మితైస్తర్కిత తన్నిజభ్రమా
బబంధ తన్మూర్ధజ చామరం చిరాత్. 30

ప॥వి॥ :- పునః - పునః, కా - చన - కుర్వతీ - కచచ్ఛటాధియా - ధూపజ ధూమసంయమమ్ - సఖీస్మితైః - తర్కితతన్నిజభ్రమా - బబన్ధ - తన్మూర్ధజచామరం - చిరాత్.

అర్థము :- కచచ్ఛటాధియా; కచచ్ఛటా = దమయన్తియొక్క కురుల గుంప నెడి, ధియా = బుద్ధిచే, పునః పునః = పలుమారు, ధూపజధూమ సంయమమ్; ధూపజ = సాంబ్రాణి మున్నగు ధూపములవలనం గల్గిన,

ధూమ = పొగను, సంయమమ్ = బంధించటను కుర్వతీ = చేయుచున్న, కాచన = ఒకానొక, సఖీ = చెలికత్తె, సఖీనాం = చెలికత్తెల యొక్క, స్మితైః = చిఱునగవులచే, తర్కితతన్నిజభ్రమా; తర్కిత = ఊహింపఁబడిన, తత్ = పూర్వోక్తమైన, నిజ = తనదగు, భ్రమా = భ్రాన్తిగలదై, చిరాత్ = చాలాకాలమునకు, తన్మూర్ధజచామరం; తత్ = ఆ దమయన్తియొక్క, మూర్ధజ చామరం = చామరమువంటి తలవెండ్రుకలను బబంధ = ముడివైచినది.

వి॥ :- ధూపజధూమమునందు, కురులభ్రాన్తి గల్గిన దువలన భ్రాన్తిమదలఙ్కారము.

## సమాసములు ;

కచచ్ఛటాధియా :- కచానాం, ఛటా = కచచ్ఛటా, కచచ్ఛటాయాః, ధీః = కచచ్ఛటాధీః, తయా = కచచ్ఛటాధియా .

ధూపజధూమసంయమమ్ :- ధూపాజ్జాయత ఇతి = ధూపజః, ధూపజశ్చాసౌ, ధూమశ్చ = ధూపజధూమః, ధూపజధూమస్య = సంయమః, ధూపజధూమసంయమః, తం = ధూపజ ధూమసంయమమ్ .

సఖీస్మితైః :- సఖీనాం, స్మితాని = సఖీస్మితాని. తైః = సఖీస్మితైః .

తర్కితతన్నిజభ్రమా :- నిజశ్చాసౌ, భ్రమశ్చ = నిజభ్రమః, సః, నిజభ్రమః = తన్నిజభ్రమః, తర్కితః, తన్నిజభ్రమః యయాసా = తర్కితతన్నిజభ్రమా .

ధూపగ్రహ ధూమకోమలా :- గృహ్యతే, అస్మిన్ ఇతి = గ్రహః, ధూపస్య గ్రహః = ధూపగ్రహః, ధూపగ్రహస్య, ధూమః = ధూపగ్రహధూమః ధూపగ్రహధూమేన, కోమలా = ధూపగ్రహధూమకోమలా .

## భావము :

ఒక చెలికత్తె ధూపపాత్రనుండి వెల్వడుచున్న పొగను దమయన్తి కురులని భ్రాన్తినిఁ బొంది ముడివేయఁబోయినదై, చెలికతెలు నవ్వుటచే, తన భ్రాన్తిని గ్రహించినదై, పిదప చామరమువంటి యామె కురులనుఁ దెలసికొని బంధించినది. ధూపపాత్రనుండి వెల్వడు పొగకును నామె కురులకును భేదము

తెలియ సాధ్యముకాలేదు. మఱియు నామె కురులు ధూపపాత్రమునుండి వెల్వడు సుగన్ధి ధూమమువలె నల్లగను మెత్తగను నున్నవని భావము. 30

శ్లో॥ బలస్య కృష్టేవహలేన భాతియా
కలిన్దకన్యా ఘనభఙ్గ భఙ్గురా.
తదార్పితైస్తాం కరుణస్యకుడ్మలైః
జహాస తస్యాః కుటిలా కచచ్ఛటా. **31**

ప॥చె॥ :- బలస్య, కృష్టా - ఇవ - హలేన - భాతి - యా - కలిన్దకన్యా - ఘనభఙ్గభఙ్గురా - తదా - అర్పితైః, - తాం - కరుణస్య - కుడ్మలైః జహాస - తస్యాః - కుటిలా - కచచ్ఛటా.

అర్థము :- యా = ఏ, కలిన్దకన్యా = కాళిందీనది, బలస్య = బలరాముని యొక్క, హలేన = నాగలిచే, కృష్టా ఇవ = దున్నఁబడినదో యనునట్లు, అనగా లాగఁబడినదో యనునట్లు, ఘనభఙ్గ భఙ్గురా, ఘన = సందులేని, భఙ్గ = అలలచే, భఙ్గురా = వంకరగలదిగా, భాతి = ప్రకాశించుచున్నదో, తస్యాః = ఆ దమయన్తియొక్క, కుటిలా = వంపులు వంపులు తిరిగిన, కచచ్ఛటా = కేశపాశము. తదా = అలంకరణ సమయమందు, అర్పితైః = ఉంచఁబడిన, కరుణస్య = కరుణవృక్షముయొక్క, కుడ్మలైః = మొగ్గలచే, తాం = ఆ కాళిందీనదిని. జహాస = పరిహసించినది. కాళిన్దీనది బలరామస్వామి వాకి నాగలిచే లాగుటవలన వంపులు తిరిగినది. పుష్పములులేనిది. దమయన్తి కేశపాశమట్లుగాక, సహజముగనే వంపులు తిరిగినది. పుష్పములచే నలంకరింపఁబడినది. గాన కాలిన్దీనదిని పరిహసించుట సముచితమని యాశయము.

**సమాసములు:**

కలిన్దకన్యా :- కలిన్దానాం, కన్యా = కలిన్దకన్యా.

ఘనభఙ్గభఙ్గురా :- ఘనాశ్చతే భఙ్గాశ్చ = ఘనభఙ్గాః. ఘనభఙ్గైః, భఙ్గురా = ఘనభఙ్గ భఙ్గురా !

కేశామ్బుద విద్యుత్ :- కేశఏవఅమ్బుదః =కేశామ్బుదః, కేశామ్బుదస్య విద్యుత్ = కేశామ్బుద విద్యుత్ .

ముఖేన్దుసమ్బన్ధవశాత్ :- ముఖమేవ, ఇన్దుః = ముఖేన్దుః, ముఖేన్దోః, సమ్బన్ధః = ముఖేందుసమ్బన్ధః, ముఖేన్దుసమ్బన్ధస్య, వశః = ముఖేన్దు సమ్బన్ధవశః, తస్మాత్ = ముఖేన్దుసమ్బన్ధవశాత్.

తదాయుషః :- తస్యాః, ఆయుః = తదాయుః, తస్య = తదాయుషః .

**భావము :**

ఈ దమయన్తి తన నొసట ధరించిన పసిడిపట్టె ఆమె నల్లని కురులనెడి మేఘమునకు మెఱపుతీగెయే యైనది. ఆమె ముఖమనెడి చంద్రుని సంబంధమువలన నా మెఱపుతీగె యమృతముఁ గ్రోలి చిరకాలము స్థిరముగనుండుటకు హేతువైన యాయువుఁ బొందినది. అందువలన సాధారణమగు మెఱపుతీగెవలె నది యస్థిరముగాకుండ స్థిరముగ నిలచినది. కావున నా దమయన్తి నొసట నున్న బంగారు పట్టె స్థిరముగాఁ బ్రకాశించుచున్ననునది మెఱపుతీగెయే యగుచున్నది. కాన నామెయొక్క ముఖచంద్రునుండి యమృతమునుఁ బానముఁజేసి యా పసిడితేనెడి మెఱపుతీగె యాయువునకు స్థిరత్వమేర్పడుట వలన మెఱపుతీగెయైనను స్థిరమైనదని యాశయము 32

శ్లో॥ **లలాటికాసీమని చూర్ణకుంతలా**
**బభుస్తమాం భీమనరేన్ద్రజన్మనః.**
**మనఃశిలాచిత్రకదీప సమ్భవా**
**భ్రమీభృతః కజ్జలధూమవల్లయః.** **33**

ప॥వి॥ లలాటికాసీమని - చూర్ణకున్తలాః - బభుస్తమాం - భీమనరేన్ద్రజన్మనః మనఃశిలాచిత్రకదీపసమ్భవాః - భ్రమీభృతః - కజ్జలధూమవల్లయః. .

అర్థము :- భీమనరేన్ద్రజన్మనః; భీమనరేన్ద్ర = భీమరాజు నుండి, జన్మనః = ఉద్భవించిన దమయన్తి యొక్క, లలాటికాసీమని; లలాటికా = నొసటికి సజ్జాఁ మైన దాని యొక్క, సీమని = ప్రాంతమునందు, చూర్ణకుంతలాః = ముంగురులు, మనః శిలాచిత్రక దీపసమ్భవాః;

మనఃశిలా = మనఃశిలయను ధాతువిశేషము యొక్క, చిత్రక = తిలకమనెడి, దీప = దీపమునుండి, సమ్భవాః = ఉద్భవించిన, భ్రమీ భృతః; భ్రమీ = భ్రమణమును, భృతః = ధరించుచున్న, అనగా భ్రమించుచున్న, కజ్జలధూమవల్లయః; కజ్జల = కాటుకను గల్గిచెడి, ధూమవల్లయః = తీగెలవలె ప్రాకెడి ధూమరేఖలుగా, బభుస్తమాం = మిక్కిలి శోభించినవి.

**సమాసములు :**

లలాటికాసీమని :— లలాటస్య, అలఙ్కారః = లలాటికా, లలాటికాయాః, సీమా = లలాటికాసీమా, తస్మిన్ = లలాటికాసీమని.

బభుస్తమాం :— అతిశయేనబభుః = బభుస్తమాం.

భీమనరేన్ద్రజన్మనః :— భీమ ఇతినరేన్ద్రః = భీమ నరేన్ద్రః, భీమ నరేంద్రాత్, జన్మయస్యాస్సా = భీమనరేన్ద్రజన్మా, తస్యాః = భీమ నరేన్ద్రజన్మనః.

మనశ్శిలాచిత్రకదీపసమ్భవాః :— మనః శిలాయాః, చిత్రకః = మన శ్శిలాచిత్రకః, మనశ్శిలాచిత్రక ఏవదీపః = మనశ్శిలాచిత్రకదీపః, మనశ్శిలాచిత్రకదీపాత్సమ్భవః, యాసాన్తాః = మనశ్శిలాచిత్రకదీప సమ్భవాః.

భ్రమీభృతః :— భ్రమీం, బిభ్రతీతి = భ్రమీభృతః.

కజ్జలధూమవల్లయః :— కజ్జలస్య, ధూమః, కజ్జలధూమః, కజ్జల ధూమస్య, వల్లయః = కజ్జలధూమవల్లయః.

**భావము :**

ఆ దమయన్తి నొసట నాభరణమును ధరించియున్నది. దాని సమీపమున నామె ముంగురులు శోభించుచున్నవి. ఆమె తన నొసట మనశ్శిలచే తిలకమును దిద్దుకొని యున్నది. అది దీపమువలె పసుపువన్నెగల్గి ప్రకాశించుచున్నది. కాన నా తిలకమునకు సమీపమునకు ప్రాకిన యామె ముంగురులు, ఆ దీపమునుండి చుట్టలుచుట్టుకొనుచు నుద్భవించిన, కాటుకగల్గించు పొగల తీగెలవలె మిక్కిలి శోభించినవి.

కచచ్ఛటా :- కచానాం, ఛటా = కచచ్ఛటా.

**భావము :**

కాళిన్దీనది యనగా యమునానది బలరామస్వామి తన నాగలిచే లాగఁ బడుటవలననో యనునట్లు సందులేని యలలచే వంపులు తిరిగినదై శోభించు చున్నది. ఆ దమయన్తియొక్క వంపులు తిరిగిన కేశపాశము, అలంకరించు సమయమందుంచఁబడిన కరుణపృష్ప మొగ్గచేనా యమునానదినిఁ బరిహ సించినది. యమునానది బలరామస్వామియొక్క నాగలిచే నీడ్వఁబడుటవలన నేర్పడిన యలలచే వంపుల తిరిగి యున్నది. పుష్పశూన్యమై యున్నది. దమయన్తి కేశపాశమో స్వాభావికముగా వంపులు తిరిగినదై పుష్పములచే నలంకరింపఁ బడినదై యుండుటవలన కాళిన్దీనదిని పరిహసించుట సముచితమని యాశయము.

శ్లో॥ ధృతైతయా హాటకపట్టికాలికే
బభూవ కేశామ్బుద విద్యుదేవసా।
ముఖేన్దుసమ్బన్ధవశాత్ సుధాజుషః
స్థిరత్వమూహే నియతం తదాయుషః॥ 32

ప॥వి॥ :- ధృతా - ఏతయా - హాటకపట్టికా - అలికే - బభూవ - కేశామ్బుద విద్యుత్ - ఏవ - సా - ముఖేన్దుసమ్బన్ధవశాత్ - సుధాజుషః - స్థిరత్వమ్ - ఊహే - నియతం - తదాయుషః.

అర్థము :- ఏతయా = ఈ దమయన్తిచే, అలికే = లలాటమందు, ధృతా = ధరింపబడిన, సా = ఆ. హాటకపట్టికా = మిక్కిలి సుందరమైన బంగారు పట్ట కేశామ్బుదవిద్యుదేవ; కేశామ్బుద = వెండ్రుకలనెడి మేఘమునకు విద్యుదేవ = మెఱుపుతీగెగనే, బభూవ = ఆయెను. ముఖేన్దుసమ్బన్ధవశాత్ ముఖేన్దు = ముఖచంద్రునియొక్క, సమ్బన్ధవశాత్ = సంబంధమువలన సుధాజుషః = చంద్రునియందలి యమృతమును పానము గావించిన, తదాయుషః = ఆ మెఱపుతీగెకు సంబంధించిన ఆయువునకు ననగా జీవితసమయమునకు, నియతం = నియతమైన, స్థిరత్వం = చిరకాల ముండుటను, ఊహే = ఊహింతును.

**సమాసములు :**

హాటకపట్టికా :- హాటకమయీపట్టికా = హాటకపట్టికా.

ననుసరించి భూషణములు లేనపుడు ఏది భూషింపబడినట్లు కానఁబడునో, అదియే సౌందర్యమని తెలియుచున్నది కాన దమయన్తివంటి సహజసౌందర్య శాలినికి, భూషణములనవసరములనియు నాశయము. 27

శ్లో॥ విధాయబంధూక పయోజపూజనం
కృతాంవిధోర్గన్ధ ఫలీబలి|శ్రియం।
నినిన్దలబ్ధాధర లోచనార్చనం
మనః శిలాచిత్రకమేత్య తన్ముఖం॥ 28

ప॥వి॥ :— విధాయ - బంధూకపయోజపూజనం - కృతాం - విధోః - గన్ధ ఫలీబలి|శ్రియం - నినిన్ద - లబ్ధాదరలోచనార్చనం - మనఃశిలాచిత్రకమ్ ఏత్య - తన్ముఖం.

అర్థము :- లబ్ధాధరలోచనార్చనం; లబ్ధ = పొందఁబడిన, అధర = పెదవియు, లోచన = నేత్రములు అను వీనియొక్క, అర్చనం = పూజగల్గిన, అనగా పెదవికంటెను, నేత్రములకంటెను రమ్యమైన, తన్ముఖం = దమయన్తి ముఖము, మనఃశిలాచిత్రకం; మనఃశిలా = మనఃశిలయను పసుపుపచ్చని ధాతువిశేషముచే, చిత్రకం = తిలకమును, ఏత్య=పొంది, విధోః = చంద్రునికి, బంధూకపయోజపూజనం; బంధూక = బంధూక మనెడి యెఱ్ఱని పూలఁతోడను, పయోజ = పద్మములతోడను, పూజనం = అర్చనను, విధాయ = చేసి, కృతాం = చేయఁబడిన, గంధఫలీబలి|శ్రియం; గంధఫలీ = పసుపుపచ్చని చంపకపుమొగ్గతో, బలి= పూజకు సంబంధించిన, |శ్రియం = శోభను, నినింద = నిందించెను. పెదవితోడను, కన్నులతోడనుఁ గూడిన యామె ముఖము, బంధూకాది పుష్పములతో నర్చింపబడిన చంద్రబింబమువలె ప్రకాశించినదని యర్థము.

**సమాసములు :**

బంధూకపయోజపూజనం :- బంధూకంచ, పయోజంచ = బంధూక పయోజే, బంధూకపయోజాభ్యాం, పూజనం = బంధూకపయోజపూజనం, తత్ = బంధూకపయోజపూజనం,

గంధఫలీబలిశ్రియమ్ ;- గంధఫల్యాః, బలిః = గంధఫలీబలిః, ఫలీబలేః, శ్రీః = గంధఫలీబలిశ్రీః తాం = గంధఫలీబలిశ్రియ!

లబ్ధాధరలోచనార్చనమ్ :- అధరశ్చ లోచనంచ = అధరలోచనం, లోచనస్య అర్చనం = అధరలోచనార్చనం, లబ్ధం, అధరలోచనా యేనతత్ = లబ్ధాధరలోచనార్చనమ్.

మనశ్శిలాచిత్రకం :- మనశ్శిలయా, చిత్రకం = మనశ్శిలాచిత్రక

తన్ముఖం ;- తస్యాః ముఖమ్ = తన్ముఖమ్.

**భావము :**

పెదవులచేతను, కన్నులచేతను నర్చింపఁబడిన యా దమయంతి మొ అనగా వానికంటెను మనోహరమైన యామె ముఖము మనశ్శిలయను పచ్చని ధాతువుచేఁ దిలకమునుఁ బొందినదై; బంధూకము లనఁబడు పూవులచేతను, పద్మములచేతను, బూజించి వానిపై పసుపు పచ్చని చం మొగ్గలచే చేయఁబడిన పూజింపఁబడిన చంద్రునిశోభను నిందించినది. మించినదని యర్థము. అనగా దమయంతి ముఖమునందలి రెండు పె బంధూకపుష్పమువలె నెఱ్ఱగను, నందలి రెండు కన్నులు పద్మములవలె ములుగ నున్నవి, మఱియు నదినొసట తిలకముచేనలంకృతమై, రెండు పె తోడను, కన్నులతోడనుఁ గూడియుండగానది, బంధూకములను నెఱ్ఱని పు తోడను, పద్మములతోడనుఁ బూజింపఁబడి పైన చంపకపు మొగ్గలచే న బొందిన చంద్రుని మించియున్నదని భావము. దమయంతిమోము చంద్ర సమానము ఆ దలియామెయొక్క ఎఱ్ఱని పెదవులును క్రమముగా విశాలమగు ములును చంద్రుని నర్చించిన బంధూక పుష్పములవలెను పద్మములు నున్నవి. మనఃశిలతో నామెనుదుట నుంచఁబడిన తిలకము చంపక ముకుళ బోలియున్నదని యాశయము అనగా నామె పెదవులనెడి బంధూక పుష్పవ నామె నేత్రములనెడి పద్మములు నామె ముఖమునుఁ బూజించి నట్లున్నవ భావము.

శ్లో॥ మహీమఘోనాం మదనాంధతాతమీ
తమః పటారమ్భణ తంతుసంతతిః।

అబంధితన్మూర్ధజ పాశమఞ్జరీ॥
కయాఽపి ధూపగ్రహధూమకోమలా॥ 29

ప॥వి॥ :- మహీమఘోనాం – మదనాంధతాతమీ తమః పటారమ్భణ తంతు సంతతిః- అబంధి – తన్మూర్ధజ పాశమఞ్జరీ - కయా - అపి - ధూప గ్రహధూమ కోమలా.

అర్థము :– మహీమఘోనాం = భూదేవేంద్రులకు, అనగా రాజులకు, మదనాంధ తాతమీ; మదనాంధతా, మదన = మన్మధునివలన, అంధతా = మోహ మనెడి, తమీ = రాత్రియొక్క, తమఃపట = చీకటియను వస్త్రమును, ఆరంభణ = నిర్మించుటయందలి, తన్తు సంతతిః = దారములయొక్క సమూహమైనదియు, ధూపగ్రహ = సాంబ్రాణి మున్నగు పరిమళ ద్రవ్యముల పొగను గ్రహించుటకు సాధనమైన గిన్నె యందలి, ధూమ = పరిమళముగల పొగతో, కోమలా = రమ్యమైనదియునగు, తన్మూర్ధజపాశమఞ్జరీ, తత్ - ఆ దమయన్తియొక్క, మూర్ధజపాశ = కేశపాశముయొక్క, మఞ్జరీ = సమూహము, కయాఽపి = ఒకానొక చెలికత్తెచే, అబంధి = బంధింపబడినది.

**సమాసములు ;**

మహీమఘోనాం - మహ్యాః, మఘవానః = మహీమఘవానః, తేషాం = మహీమఘోనాం.

మదనాంధతాతమీతమః పటారమ్భణతన్తు సంతతిః :– మదనేన, అంధతా = మదనాంధతా, మదనాంధతైవ తమీ = మదనాంధతాతమీ, మదనాన్ధతా తమ్యాః, తమః = మదనాన్ధతాతమీ తమః, మదనాన్ధతాతమీ తమ ఏవపటః = మదనాన్ధతాతమీ తమః పటః, మదనాన్ధతాతమీ తమః పటస్య, ఆరమ్భణం = మదనాన్ధతాతమీ తమః పటారంభణమ్. మద నాన్ధ తాతమీ తమః పటారమ్భణే, తన్తవః = మదనాన్ధ తాతమీతమః పటారమ్భణ తన్తవః. మదనాన్ధ తాతమీ తమః పటారమ్భణ తన్తూనాం, సంతతిః = మదనాన్ధ తమీతమః పటారమ్భణ తన్తు సన్తతిః

తన్మూర్ధజపాశమఞ్జరీ :- తస్యాః మూర్ధజాః = తన్మూర్ధజాః, తన్మూర్ధజానాం పాశః = తన్మూర్ధజపాశః, తన్మూర్ధజ పాశస్య, మఞ్జరీ = తన్మూర్ధజపాశమఞ్జరీ.

ధూపగ్రహ ధూమకోమలా :- ధూపస్య, గ్రహః = ధూపగ్రహః, ధూపగ్రహస్య, ధూమః=ధూపగ్రహధూమః. ధూపగ్రహధూమేన, కోమలా= ధూపగ్రహధూమకోమలా.

**భావము :**

భూలోకపు టింద్రులగు పెక్కు రాజులయొక్క కామాన్ధత్వ మనెడి రాత్రికి చీకటియనెడి వస్త్రమును నేయుటకు సాధనములగుదారముల సమూహమో యను నట్లున్నదియు ధూపము అనగా సాంబ్రాణి చందనము మున్నగు పరిమళ ద్రవ్యముల పొగను వేయుటకు సాధనమగు ధూపగ్రహమను గిన్నెనుండి వెల్వడు పొగచే మృదువైనదియునగు, నా దమయన్తియొక్క కురులగుంపును నొకానొక చెలికత్తె ముడివేసినది. ఆమె కురులు నల్లగా నుండుటవలన చీకటి యను వస్త్రమును నేయుటకు సాధనములగు నూలుపోగులుగా నున్నవనియు, నా కురులకు సాంబ్రాణి మున్నగు పరిమళ ద్రవ్యములచే పొగ వేయుటవలన నవి సుగన్ధభరితములై యున్నవనియు అట్టికురులను ముడివైచెననియు భావము.

శ్లో॥ పునఃపునఃకాచన కుర్వతీకచ
చ్ఛటాధియా ధూపజ ధూమసంయమమ్.
సఖీస్మితైస్తర్కిత తన్నిజభ్రమా
బబంధ తన్మూర్ధజ చామరం చిరాత్. 30

ప॥వి॥ :- పునః - పునః, కా - చన - కుర్వతీ - కచచ్ఛటాధియా - ధూపజ ధూమసంయమమ్ - సఖీస్మితైః - తర్కితతన్నిజభ్రమా - బబన్ధ - తన్మూర్ధజచామరం - చిరాత్.

అర్థము :- కచచ్ఛటాధియా; కచచ్ఛటా = దమయన్తియొక్క కురుల గుంపనెడి, ధియా = బుద్ధిచే, పునః పునః = పలుమారు, ధూపజధూమ సంయమమ్; ధూపజ = సాంబ్రాణి మున్నగు ధూపమువలనఁ గల్గిన,

ధూమ = పొగను, సంయమమ్ = బంధించుటను కుర్వతీ = చేయుచున్న, కాచన = ఒకానొక, సఖీ = చెలికత్తె. సఖీనాం = చెలికత్తెల యొక్క, స్మితైః = చిఱునగవులచే, తర్కితతన్నిజభ్రమా; తర్కిత = ఊహింపఁబడిన, తత్ = పూర్వోక్తమైన, నిజ = తనదగు, భ్రమా = భ్రాన్తిగలదై, చిరాత్ = చాలాకాలమునకు, తన్మూర్ధజచామరం; తత్= ఆ దమయన్తియొక్క, మూర్ధజ చామరం= చామరమువంటి తలవెంట్రుకలను బబంధ = ముడివైచినది.

వి॥ :- ధూపజధూమమునందు, కురులభ్రాన్తి గల్గిన దువలన భ్రాన్తిమదలఙ్కారము.

## సమాసములు ;

కచచ్ఛటాధియా ;- కచానాం, ఛటా = కచచ్ఛటా, కచచ్ఛటాయాః, ధీః = కచచ్ఛటాధీః, తయా = కచచ్ఛటాధియా .

ధూపజధూమసంయమమ్ :- ధూపాజ్జాయత ఇతి = ధూపజః, ధూపజశ్చాసౌ, ధూమశ్చ = ధూపజధూమః, ధూపజధూమస్య = సంయమః, ధూపజధూమసంయమః, తం = ధూపజ ధూమసంయమమ్ .

సఖీస్మితైః :- సఖీనాం, స్మితాని = సఖీస్మితాని. తైః = సఖీస్మితైః . తర్కితతన్నిజభ్రమా :- నిజశ్చాసౌ, భ్రమశ్చ = నిజభ్రమః, సః, నిజభ్రమః = తన్నిజభ్రమః, తర్కితః, తన్నిజభ్రమః యయాసా = తర్కితతన్నిజభ్రమా .

ధూపగ్రహ ధూమకోమలా:- గృహ్యతే, అస్మిన్ ఇతి=గ్రహః, ధూపస్య గ్రహః = ధూపగ్రహః, ధూపగ్రహస్య, ధూమః=ధూపగ్రహధూమః, ధూపగ్రహధూమేన, కోమలా = ధూపగ్రహధూమకోమలా .

## భావము :

ఒక చెలికత్తె ధూపపాత్రనుండి వెల్వడుచున్న పొగను దమయన్తి కురులని భ్రాన్తినిఁ బొంది ముడివేయఁబోయినదై, చెలికతెలు నవ్వుటచే, తన భ్రాన్తిని గ్రహించినదై, పిదప చామరమువంటి యామె కురులనఁ దెలిసికొని బంధించినది. ధూపపాత్రనుండి వెల్వడు పొగకును నామె కురులకును భేదము

తెలియ సాధ్యముకాలేదు. మఱియు నామె కురులు ధూపపాత్రమునుండి వెల్వడు సుగన్ధి ధూమమువలె నల్లగను మెత్తగను నున్నవని భావము. 30

శ్లో॥ బలస్య కృష్టేవహలేన భాతియా
కలిన్దకన్యాఘనభఙ్గ భఙ్గురా.
తదార్పితైస్తాం కరుణస్యకుడ్మలైః
జహాస తస్యాః కుటిలా కచచ్ఛటా. 31

ప॥వి॥ :— బలస్య, కృష్టా - ఇవ - హలేన - భాతి - యా - కలిన్దకన్యా - ఘనభఙ్గభఙ్గురా - తదా - అర్పితైః, - తాం - కరుణస్య - కుడ్మలైః జహాస - తస్యాః - కుటిలా - కచచ్ఛటా.

అర్థము :- యా = ఏ, కలిన్దకన్యా = కాళిందీనది, బలస్య = బలరాముని యొక్క, హలేన = నాగలిచే, కృష్టా ఇవ = దున్నఁబడినదో యనున్నట్లు, అనగా లాగఁబడినదో యనునట్లు, ఘనభఙ్గ భఙ్గురా, ఘన = సంములేని, భఙ్గ = అలంచే, భఙ్గురా = వంకరగలదిగా, భాతి = ప్రకాశించుచున్నదో, తస్యాః = ఆ దమయన్తియొక్క, కుటిలా = వంపులు వంపులు తిరిగిన, కచచ్ఛటా = కేశపాశము, తదా = అలంకరణ సమయమందు, అర్పితైః = ఉంచఁబడిన, కరుణస్య = కరుణవృక్షముయొక్క, కుడ్మలైః = మొగ్గలచే, తాం = ఆ కాళిందీనదిని. జహాస = పరిహసించినది. కాళిన్దీనది బలరామస్వామి వాకి నాగలిచే లాగుటవలన వంపులు తిరిగినది. పుష్పములులేనిది. దమయన్తి కేశపాశమట్లుగాక, సహజముగనే వంపులు తిరిగినది. పుష్పములచే నలంకరింపఁబడినది. గాన కాళిన్దీనదిని పరిహసించుట సముచితమని యాశయము.

**సమాసములు:**

కలిన్దకన్యా :- కలిన్దానాం, కన్యా = కలిన్దకన్యా.

ఘనభఙ్గభఙ్గురా :- ఘనాశ్చతే భఙ్గాశ్చ = ఘనభఙ్గాః. ఘనభఙ్గైః, భఙ్గురా = ఘనభఙ్గ భఙ్గురా !

కచచ్ఛటా :- కచానాం, ఛటా = కచచ్ఛటా.

**భావము :**

కాలిన్దీనది యనగా యమునానది బలరామస్వామి తన నాగలిచే లాగఁ బడుటవలననో యనునట్లు సదులేసి యలలచే వంపులు తిరిగినదై శోభించు చున్నది. ఆ దమయన్తియొక్క వంపు లతిరిగిన కేశపాశము, అలంకరించు సమయమందుంచఁబడిన కరుణవృక్షపు మొగ్గచే నా యమునానదినిఁ బరిహ సించినది. యమునానది బలరామస్వామియొక్క నాగలిచే నీడ్వఁబడుటవలన నేర్ప డిన యలలచే వంపులు తిరిగి యున్నది. పుష్పశూన్యమై యున్నది. దమయన్తి కేశపాశమో స్వాభావికముగా వంపులు తిరిగినదై పుష్పములచే నలంకరింపఁ బడినదై యుండుటవలన కాలిన్దీనదిని పరిహసించుట సముచితమని యాశయము.

**శ్లో॥ ధృతైతయా హాటకపట్టికాలికే**
**బభూవ కేశామ్బుద విద్యుదేవసా।**
**ముఖేన్దుసమ్బన్ధవశాత్ సుధాజుషః**
**స్థిరత్వమూహే నియతం తదాయుషః॥ 32**

ప॥వి॥ :- ధృతా - ఏతయా - హాటపట్టికా - అలికే - బభూవ - కేశామ్బుద విద్యుత్ - ఏవ - సా - ముఖేన్దుసమ్బన్ధవశాత్ - సుధాజుషః - స్థిర త్వమ్ - ఊహే - నియతం - తదాయుషః.

అర్థము :- ఏతయా = ఈ దమయన్తిచే, అలికే = లలాటమందు, ధృతా = ధరింపబడిన, సా = ఆ. హాటకపట్టికా = మిక్కిలి సుందరమైనబంగారు పట్ట. కేశామ్బుదవిద్యుదేవ; కేశామ్బుద = వెండ్రుకలనెడి మేఘమునకు విద్యుదేవ = మెఱుపుతీగెగనే, బభూవ =ఆయెను. ముఖేన్దుసమ్బన్ధవశాత్ ముఖేన్దు = ముఖచంద్రునియొక్క, సమ్బన్ధవశాత్ = సంబంధమువలన సుధాజుషః = చంద్రునియందలి యమృతమును బానము గావించిన, తదాయుషః = ఆ మెఱుపుతీగెకు సంబంధించిన ఆయువునకు ననగా జీవితసమయమునకు, నియతం = నియతమైన, స్థిరత్వం = చిరకాల ముండుటను, ఊహే = ఊహించును.

**సమాసములు :**

హాటకపట్టికా :- హాటకమయీపట్టికా = హాటకపట్టికా.

కేశామ్బుద విద్యుత్ :- కేశఏవఅమ్బుదః =కేశామ్బుదః, కేశామ్బుదస్య విద్యుత్ = కేశామ్బుద విద్యుత్ .

ముఖేన్దుసమ్బన్ధవశాత్ :- ముఖమేవ, ఇన్దుః = ముఖేన్దుః, ముఖేన్దోః, సమ్బన్ధః = ముఖేందుసమ్బన్ధః, ముఖేన్దుసమ్బన్ధస్య, వశః = ముఖేన్దు సమ్బన్ధవశః, తస్మాత్ = ముఖేన్దుసమ్బన్ధవశాత్.

తదాయుషః :- తస్యాః, ఆయుః = తదాయుః, తస్య = తదాయుషః.

**భావము :**

ఈ దమయన్తి తన నొసట ధరించిన పసిడిపట్టె ఆమె నల్లని కురులనెడి మేఘమునకు మెఱపుతీగెయే యైనది. ఆమె ముఖమనెడి చంద్రుని సంబంధమువలన నా మెఱపుతీగె యమృతముఁ గ్రోలి చిరకాలము స్థిరముగనుండుటకు హేతువైన యాయువుఁ బొందినది. అందువలన సాధారణమగు మెఱపుతీగెవలె నది యస్థిరముగాకుండ స్థిరముగ నిలచినది. కావున నా దమయన్తి నొసటనున్న బంగారు పట్టె స్థిరముగాఁ బ్రకాశించుచున్నదనది మెఱపుతీగెయే యగుచున్నది. కాన నామెయొక్క ముఖచంద్రునుండి యమృతమునుఁ బానముఁజేసి యా పసిడితేఁనెడి మెఱపుతీగె యాయువునకు స్థిరత్వమేర్పడుట వలన మెఱపుతీగెయైనను స్థిరమైనదని యాశయము 83

శ్లో॥ లలాటికాసీమని చూర్ణకుంతలా
బభుస్తమాం భీమనరేన్ద్రజన్మనః.
మనఃశిలా చిత్రకదీప సమ్భవా
భ్రమీభృతః కజ్జలధూమవల్లయః. 33

ప॥వి॥ లలాటికాసీమని - చూర్ణకున్తలాః - బభుస్తమాం - భీమనరేన్ద్రజన్మనః మనఃశిలాచిత్రకదీపసమ్భవాః - భ్రమీభృతః - కజ్జలధూమవల్లయః.

అర్థము :- భీమనరేన్ద్రజన్మనః; భీమనరేన్ద్ర = భీమరాజు నుండి, జన్మనః = ఉద్భవించిన దమయన్తి యొక్క, లలాటికాసీమని; లలాటికా = నొసటికి నగ్గాఁ మైన దాని యొక్క, సీమని = ప్రాంతమునందు, చూర్ణకుంతలాః = ముంగురులు, మనః శిలాచిత్రక దీపసమ్భవాః;

మనశ్శిలా = మనః శిలయను ధాతువిశేషము యొక్క, చిత్రక = తిలకమనెడి, దీప = దీపమునుండి, సమ్భవాః = ఉద్భవించిన, భ్రమీ భృతః; భ్రమి = భ్రమణమును, భృతః = ధరించుచున్న, అనగా భ్రమించుచున్న, కజ్జల ధూమవల్లయః; కజ్జల = కాటుకను గల్గిచెడి, ధూమవల్లయః = తీగెలవలె వ్రాకెడి ధూమరేఖలుగా, బహుస్తమాం = మిక్కిలి శోభించినవి.

**సమాసములు :**

లలాటికాసీమని :— లలాటస్య, అలఙ్కారః = లలాటికా, లలాటికాయాః, సీమా = లలాటికాసీమా, తస్మిన్ = లలాటికాసీమని.

బహుస్తమాం :— అతిశయేన బహుః = బహుస్తమాం.

భీమనరేన్ద్రజన్మనః :— భీమ ఇతి నరేన్ద్రః = భీమ నరేన్ద్రః, భీమ నరేంద్రాత్, జన్మయస్యాస్సా = భీమనరేన్ద్రజన్మా, తస్యాః = భీమ నరేన్ద్రజన్మనః.

మనశ్శిలాచిత్రక దీపసమ్భవాః :— మనః శిలాయాః, చిత్రకః = మన శ్శిలాచిత్రకః, మనశ్శిలాచిత్రక ఏవదీపః = మనశ్శిలాచిత్రకదీపః, మనశ్శిలాచిత్రకదీపాత్ సమ్భవః, యాసాన్తాః = మనశ్శిలాచిత్రకదీప సమ్భవాః.

భ్రమీభృతః :— భ్రమీం, బిభ్రతీతి = భ్రమీభృతః.

కజ్జలధూమవల్లయః :— కజ్జలస్య, ధూమః, కజ్జలధూమః, కజ్జల ధూమస్య, వల్లయః = కజ్జలధూమవల్లయః.

**భావము :**

ఆ దమయన్తి నొసట నాభరణమును ధరించియున్నది. దాని సమీపమున నామె ముంగురులు శోభించుచున్నవి. ఆమె తన నొసట మనశ్శిలచే తిలకమును దిద్దుకొని యున్నది. అది దీపమువలె పసుపువన్నెగల్గి ప్రకాశించుచున్నది. కాన నా తిలకమునకు సమీపమునకుఁ ప్రాకిన యామె ముంగురులు, ఆ దీపమునుండి చుట్టలుచుట్టుకొనుచు నుద్భవించిన, కాటుకఁగల్గించు పొగల తీగెలవలె మిక్కిలి శోభించినవి.

శ్లో॥ అపాఙ్గ మాలిఙ్గ్య తదీయ ముచ్చకై
రదీపి రేఖాజనితాఞ్జనేనయా.
అపాతిసూత్రం తదివ ద్వితీయయా
వయః శ్రియా వర్ధయితుం విలోచనే. 34

ప॥వి॥ అపాఙ్గమ్ - ఆలిఙ్గ్య - తదీయమ్ - ఉచ్చకైః - అదీపి - రేఖా - జనితా - అఞ్జనేన - యా - అపాతి - సూత్రం - తత్ - ఇవ - ద్వితీయయా - వయః శ్రియా - వర్ధయితుం - విలోచనే.

అర్థము :- అఞ్జనేన = కాటుకచే, జనితా = జన్మింపఁజేయఁబడిన, యా = ఏ, రేఖా = గీత, తదీయం = దమయన్తికి సంబంధించిన, అపాఙ్గం = కడకంటిని, ఆలిఙ్గ్య - స్పృశించి, ఉచ్చైః = అధికముగా, అదీపి = విశాలముగా నుండుటవలన కంటికి వెలుపల దానికొనకు వ్యాపించినదై ప్రకాశించినది. అథవా = లేదా, ద్వితీయయా = రెండవదైన, వయః శ్రియా = యౌవన సమ్పదచే, విలోచనే = నేత్రములను, వర్ధయితుం = పెంచుటకు ననగాఁబొడవు గావించుటకు, తత్ = ఆగీతగాఁగనఁబడుచున్న కాటుక, సూత్రం = దారముగా. అపాతీవ = పడవేయఁబడినదో యనునట్లున్నది. ఇంతవఱకును నా స్థలమని నిశ్చయించి పడవేసినట్టి, యెల్లను సూచించుదారమో యనునట్లు, ఆ కాటుక గీత శోభించినది.

**సమాసములు :**

వయఃశ్రియా :—వయసః శ్రీః = వయఃశ్రీః, తయా = వయ శ్రియా.

**భావము :**

ఆ దమయన్తి కడకన్నులకు సమీపమున కాటుకచే నొకగీత యేర్పడినదై కడకంటిని దాకి విశాలముగా నుండుటవలనఁ గంటి వెలుపలికి వ్యాపించి యుండినది. లేదా ఆ కాటుకగీత; యౌవన వయస్సు, ఆమె నేత్రములనుఁ బొడిగించుటకై, యాకన్నులకు సమీపమందు నూలునుఁబట్టి యింత వఱకును తన స్థలమని యెల్లను సూచించుటకై వేయఁబడిన రేఖయో యనునట్లు, భావింపఁబడినదని యాశయము. 34

శ్లో॥ అనఙ్గలీలాభిరపాఙ్గధావినః
కనీనికానీలమణేః పునః పునః.
తమిస్రవంశ ప్రభవేణ రశ్మినా
స్వపద్ధతిః సా కిమరఞ్జి నాఞ్జనైః. 35

ప॥వి॥ అనఙ్గలీలాభిః - అపాఙ్గధావినః - కనీనికానీలమణేః - పునః - పునః - తమిస్రవంశప్రభవేణ - రశ్మినా - స్వపద్ధతిః - సా - కిమ్ - అరఞ్జి - న - అఞ్జనైః.

అర్థము :-అనఙ్గలీలాభిః = మన్మథవిలాసములచే, ననగా కడకన్నులున్నగు మన్మథవిలాసములచే, పునఃపునః = మాటిమాటికి, అపాఙ్గధావినః = కంటి చివరియంచలను వ్యాపించుచున్న, కనీనికానీలమణేః; కనీనికా = కంటి పాపయనెడి, నీలమణేః = ఇంద్రనీలమణికి సంబంధించిన, తమిస్రవంశప్రభవేణ; తమిస్రవంశ = చీకటివంశమునుండి, ప్రభవేణ = ఉదించిన, అనగానల్లనైన, రశ్మినా = కాంతిచే, సా = కాటుక గీతయొక్క రూపమునన్న, స్వపద్ధతిః = తనకిరణమార్గము, అరఞ్జి కిమ్ = రఞ్జింపఁబడినదాయేమి, అఞ్జనైః కాటుకలచే, నాఽరఞ్జికిం = రంజింపజేయఁబడలేదా యేమి?

## సమాసములు

అనఙ్గలీలాభిః :—అనఙ్గస్య, లీలాః = అనఙ్గలీలాః, తాభిః = అనఙ్గలీలాభిః.

అపాఙ్గధావినః :—అపాఙ్గం, ధావతీతి = అపాఙ్గధావీ, తస్య = అపాఙ్గధావినః.

కనీనికానీలమణేః :—నీలశ్చాసౌ, మణిశ్చ = నీలమణిః, కనీనికైవ, నీలమణిః = కనీనికానీలమణిః, తస్య = కనీనికానీలమణేః.

తమిస్రవంశప్రభవేణ :— తమిస్రస్య,వంశః = తమిస్రవంశః, తమిస్రవంశః ప్రభవః, యస్యసః = తమిస్రవంశ ప్రభవః, తేన = తమిస్రవంశ ప్రభవేణ.

స్వపద్ధతిః :— స్వస్య, పద్ధతిః = స్వపద్ధతిః.

**భావము :**

కదకన్నులను ప్రసరింప జేయుటయను మన్మథ విలాసముచే, నామె కంటిపాపయను నింద్రనీలమణి పలుమారు కంటికొనలకు పోవుచుండుటచే, నాసింద్ర నీలమణికి సంబంధించిన నల్లని కిరణము తాకుటవలన కాటుకగీత యేర్పడి యుండవచ్చును. కాని కాటుక కలుగుటచే నదియేర్పడి యుండక పోవచ్చును. ఆ కాటుకగీతను, కాటుక గీతయని చెప్పక దానిని కంటిపాప యొక్క నల్లని రశ్మిరేఖగా నపహ్నవించి యుత్ప్రేక్షించుటవలన నిట అపహ్నవముతో గూడిన యుత్ప్రేక్ష. 35

శ్లో॥ అసేవిషాతాం సుషమాం విదర్భజా
దృశావవాప్యాఞ్జన రేఖయాఽన్వయమ్।
భుజద్వయజ్యాకిణ పద్ధతిస్పృశోః
స్మరేణబాణీకృతయోః పయోజయోః॥ **36**

ప॥వి॥ అసేవిషాతాం - సుషమాం - విదర్భజాదృశౌ - అవాప్య - అఞ్జన రేఖయా - అన్వయం - భుజద్వయజ్యాకిణ పద్ధతిస్పృశోః - స్మరేణ - బాణీకృతయోః - పయోజయోః.

అర్థము :-విదర్భజాదృశౌ; విదర్భజా = దమయన్తియొక్క, దృశౌ = కన్నులు, అఞ్జనరేఖయా = కాటుకగీతతోడ, అన్వయం = సమ్బన్ధమును, అవాప్య = పొంది, భుజద్వయజ్యాకిణ పద్ధతిస్పృశోః; భుజద్వయ = రెండు భుజములయందలి, జ్యాకిణ = అల్లెత్రాటి మచ్చల, పద్ధతి = మార్గము, స్పృశోః = తాకుచున్న, స్మరేణ = మన్మథునిచే, బాణీకృతయోః = బాణములుగాఁజేయఁబడిన, పయోజయోః = నల్లకలువ పూలయొక్క, సుషమాం = పరమ సౌందర్యమును, అసేవిషాతం = పొందినవి. కాటుక గీతలతోఁగూడిన యామెకన్నులు రెండును నల్లె త్రాటి రాపిడివలని మచ్చలుగల, మన్మథబాణములగు నల్లకలువ పూవులవలె శోభించినవని యర్థము.

వి. అచ్చట కాటుక రేఖలుగల దమయన్తి కన్నులయందు; నల్లత్రాటి మచ్చలు గల, మరుని నీలోత్పల బాణ ధర్మమునుఁ జెప్పుటవలన నిదర్శనాలఙ్కారము. అది యుపమా గర్భము.

**సమాసములు :**

విదర్భజాదృశౌ :—విదర్భేషు, జాయత ఇతి = విదర్భజా, విదర్భజాయాః. దృశౌ = విదర్భజాదృశౌ.

అఞ్జనరేఖయా :—అఞ్జనస్య, రేఖా = అఞ్జనరేఖా, తయా = అఞ్జనరేఖయా.

భుజద్వయజ్యాకిణ పద్ధతిస్పృశోః :—భుజయోః, ద్వయం = భుజద్వయం, జ్యాయాః, కిణౌ = జ్యాకిణౌ, భుజద్వయే జ్యాకిణౌ = భుజద్వయజ్యాకిణౌ, భుజద్వయ జ్యాకిణయోః, పద్ధతిః = భుజద్వయ జ్యాకిణ పద్ధతిః, భుజద్వయజ్యాకిణ పద్ధతిం, స్పృశత ఇతి = భుజద్వయజ్యాకిణ పద్ధతిస్పృశౌ, తయోః = భుజద్వయజ్యాకిణ పద్ధతి స్పృశోః.

బాణీకృతయోః :—అబాణౌ బాణౌ సమ్పద్యమానే కృతే = బాణీకృతే, తయోః = బాణీకృతయోః.

పయోజయోః :- పయసి, జాయేతే ఇతి = పయోజే, తయోః = పయోజయోః.

**భావము :**

కాటుకరేఖతో గూడిన దమయన్తి కన్నులు రెండును, మన్మథుని రెండు భుజములయందును నల్లె త్రాటిరాపిడివలన మచ్చలనుఁ దాకుచున్న యతని బాణములగు నల్ల కలువపూవుల శోభనుఁ బొందినవి. ఆమె కన్నులు నల్ల కలువలవలెను, నా కన్నులయందలి కాటుక గీతలు, మన్మథుని భుజముల యందలి యల్లె త్రాటిరాపిడివలన మచ్చలవలె నున్నవని యర్థము. 36

శ్లో॥ తదక్షి తత్కాల తులాగసానఖం
నిఖాయ కృష్ణాయ మృగాయచక్షుషి.

20)

విధిర్యదుద్ధర్తు మియేష తత్తయో
రదూరవర్తి క్షతతాస్మ శంసతి. 37

ప॥వి॥ :- తదక్షి తత్కాల తులాగసా - నఖం - నిఖాయ - కృష్ణస్య - మృగస్య - చక్షుషీ - విధిః - యత్ - ఉద్ధర్తుమ్ - ఇయేష - తత్ తయోః - అదూరవర్తిక్షతతా - స్మ - శంసతి.

అర్థము :- తదక్షితత్కాల తులాగసా; తదక్షి = ఆ దమయన్తి కన్నులతోడ ననగా జింకకన్నుల కంటెను శ్రేష్ఠమైన యామె కన్నులతోడ నని యర్థము. తత్కాల = ఆ కంటినినలంకరించు సమయమందు, తులా= జింకకన్నులతోటి సామ్యమనెడి, ఆగసా = అపరాధమనెడి హేతువుచే, విధిః = బ్రహ్మ కృష్ణస్య మృగస్య = కృష్ణసారమృగముయొక్క, చక్షుషీ = కన్నులను, నఖం = గోటిని, నిఖాయ = నాటి, ఉద్ధర్తుం = పెరికివేయుటకు, ఇయేష ఇతియత్ = కోరెవనునది యేదిగలదో, తత్ = ఆ కోరికను, తయోః = ఆ జింకకన్నులకు, అదూరవర్తిక్షతతా, అదూరవర్తి = సమీపమందున్న, క్షతతా = గాయమునుగల్గి యుండుట యనునది, శంసతిస్మ = చెప్పుచుండెను. జింకకు కంటి సమీపమున స్వాభావికముగ, గాయపుటాకృతితో గానఁబడుచిహ్నము. పూర్వము చెప్పిన నేరము ననుసరించి బ్రహ్మగోటితో కంటిని పెకలించుటవలన గాయముగా సంభావింపఁబడినది.

వి :- జింకకన్నుల క్రింద స్వాభావికముగా, గాయపుటాకృతితోఁ గానఁబడు చిహ్నములు బ్రహ్మ దాని కన్నులనుఁ బెకలించుటకై గోటితోఁ జేసిన గాయములుగా, సంభావింపఁపఁడుటవలన నుత్ప్రేక్ష.

సమాసములు :

తదక్షితత్కాలతులాగసా :- తస్యాః, అక్షిణీ = తదక్షిణీ, సచాసౌ కాలశ్చ = తత్కాలః, తత్కాలం, తులా = తత్కాలతులా, తదక్షిభ్యాం, తత్కాలతులా = తదక్షి తత్కాలతులా, తదక్షితత్కాలతులైవ ఆగః = తదక్షితత్కాలతులాగః, తేన = తదక్షితత్కాల తులాగసా.

అదూరవర్తిక్షతతా :- న, దూరః = అదూరః, అదూరే వర్తత ఇతి = అదూరవర్తి, అదూరవర్తిక్షతం యయోస్తే = అదూరవర్తిక్షతే, అదూర వర్తిక్షత యోర్భావః = అదూరవర్తిక్షతతా.

భావము :

ఆ దమయన్తి నేత్రముల కలఙ్కారణము గావించుసమయమున, నామె నేత్రములతో జింక కన్నులకు సామ్యమను నపరాధమునకై బ్రహ్మ ఆ జింక కన్నులను రెండిని గోటితో పెఱికివేయుటకై కోరెను. ఆ కోరిక నే, జింకకన్నుల క్రింద గానవచ్చు గాయపుటాకృతిగల చిహ్నములు సూచించుచున్నవని యాశ యము. 37

శ్లో॥ విలోచనాభ్యా మతి మాత్రపీడి తే౽
వతంసనీలామ్బురు హద్వయీంఖలు.
తయోః ప్రతిద్వన్ద్విధియా౽ధిరోపయా
మ్బభూవతుర్భీమసుతా శ్రుతీతతః. 38

ప॥వి॥ :- విలోచనాభ్యామ్ - అతిమాత్రపీడితే - అవతం సనీలామ్బురుహ ద్వయీం - ఖలు - తయోః - ప్రతిద్వన్ద్విధియా - అధిరోపయామ్బ భూవతుః - భీమసుతాశ్రుతీ - తతః.

అర్థము :- భీమసుతాశ్రుతీ, భీమసుతా = దమయన్తియొక్క, శ్రుతీ = చెవులు రెండును, విలోచనాభ్యాం = నేత్రములతో, అతిమాత్రపీడితే, అతి మాత్ర = చాలయెక్కువగా, పీడితే = బాధింపఁబడినవై, తతః = ఆ పీడవలన, అవతంసనీలామ్బురుహద్వయీం; అవతంస = కర్ణ భూషణములైన; నీల = నల్లని, అమ్బురుహద్వయీం = కలువ పూల జంటను, తయోః = ఆ నేత్రములకు, ప్రతిద్వన్ద్విధియా = ప్రతిపక్ష బుద్ధిచే, అధిరోపయామ్బభూవతుః = ఆరోపించుకొనినవి. బలవన్తునిచే బాధింపఁబడినవాడు, అతనికి సమానబలముగల మఱియొకని నాశ్ర యించుట, లోకధర్మముకదా.

వి :- ఆమె చెవులు రెండును, నామె నేత్రములచే, మిక్కిలి బాధింపఁబడుటవలన

నేత్రములకు ప్రతిస్పర్ధగా కలువపూల నుంచకపోయినను, నుంచినట్లు భావింపఁబడుటవలన నుత్ప్రేక్షాలజ్కారము.

**సమాసములు :**

అతిమాత్రపీడితే :- మాత్రామతిక్రాన్తం = అతిమాత్రం, అతిమాత్రం పీడితే = అతిమాత్రపీడితే.

ప్రతిద్వంద్విధియా :- ప్రతిద్వంద్వినః, ధీః= ప్రతిద్వంద్విధీః, తయా= ప్రతిద్వంద్విధియా.

అవతంసనీలామ్బురు హద్వయీం :- నీలేచతే అమ్బురుహేచ = నీలామ్బురుహే, అవతంసౌ, నీలామ్బురుహే = అవతంసనీలామ్బురుహే, అవతంస నీలామ్బురు హయోః, ద్వయీ = అవతం సనీలామ్బురుహద్వయీ, తాం = అవతంస నీలామ్బురుహద్వయీం.

భీమసుతాశ్రుతీ :- భీమసుతాయాః, శ్రుతీ = భీమసుతాశ్రుతీ.

**భావము :**

దమయన్తి చెవులు రెండును మిక్కిలి విస్తరించుచున్న కన్నులచే చాల పీడింపఁబడినవై యా కన్నులకుఁ బ్రతిపక్షములైన నల్లకలువ పూవుల జంటను తమపై నెక్కించుకొని యా కన్నుల నోడింపఁదలచినవో యనునట్లు భావింపఁబడినది. లోకమున బలవంతునిచే బాధింపఁబడినవారు, అతనితో సమానుడైన మఱియొక బలవన్తు నాశ్రయించుట ప్రసిద్ధముగదా. అట్లే దమయన్తి కన్నులచేఁ బీడింపఁబడిన యామె చెవులు, ఆమె కన్నుల నోడింపఁగం నల్లకలువలను సహాయముగాఁ జేసికొని వానిని తమపై నుంచుకొనినవని యాశయము. ౩౮

శ్లో॥ ధృతం వతంసోత్పలయుగ్మమేతయా
వ్యరాజదస్యాంపతితే దృశావివ.
మనోభువాఽఽన్యంగమితాస్యపశ్యతః
స్థితే లగిత్వాతసికస్య కస్యచిత్. 39

ప॥వి॥ ధృతం - వతంసోత్పలయుగ్మం - ఏతయా - వ్యరాజత్ - అస్యాం - పతితే - దృశౌ - ఇవ - మనోభువా - అన్ధ్యం - గమితస్య - పశ్యతః - స్థితే - లగిత్వా - రసికస్య - కస్య - చిత్.

అర్థము :—ఏతయా = ఈ దిమయన్తిచే, ధృతం = ధరింపఁబడిన, వతంసోత్పలయుగ్మం; వతంస = కర్ణభూషణములైన, ఉత్పల = కలవ పూలయొక్క, యుగ్మం = జంట, అస్యాం = ఈ దమయన్తియందు, పతితే = ఉంచఁబడినవై, తథా = అట్లే, లగిత్వా = తగులొ్కని, తత్రైవ = అచ్చటనే, స్థితేచ = ఉన్నట్టియు, పశ్యతః = చూచుచున్న అనగా దమయన్తిని, ఆమెచెవులనుఁ జూచుచున్న (కావుననే) మనోభువా = మన్మథునిచే, అన్ధ్యం = గుడ్డితనమును, గమితస్య = పొందింపఁబడిన. కస్యచిత్ = ఒకానొక, రసికస్య = రాగియొక్క, దృశావివ = కన్నులోయనునట్లు, వ్యరాజత్ = ప్రకాశించినది.

సమాసములు :

వతంసోత్పలయుగ్మం :—వతంసౌ, ఉత్పలే = వతంసోత్పలే, వతంసోత్పలయోః, యుగ్మం = వతంసోత్పలయుగ్మం, తత్ = వతంసోత్పలయుగ్మం.

అన్ధ్యం :—అన్ధస్య, భావః = అన్ధ్యం, తత్ = అన్ధ్యం.

భావము :

ఈ దమయన్తి తన చెవులయందు ధరించిన కర్ణభూషణములగు కలువ పూవులజంట దానినిఁజూచుచు నీమెపైఁబడియందే యాసక్తితో నున్నవియును, ననగా నీమె చెవులయందలి కలవపూల జంటను నీమెనుఁజూచుచున్నట్టివియు, కావుననే మన్మథునిచే, కామాన్ధత్వమునుఁ బొందింపఁబడిన ఒకానొక రాగియొక్క కన్నులో యనునట్లు విరాజిల్లినవి. అనగానామె కర్ణములయందుంచుకొనిన కలువ జంట పూవులు యామెను యామె కర్ణములను, మిక్కిలి యాసక్తితోఁ జూచుచున్న యొక రసికునికి సంబంధించిన, కామాన్ధత్వము నొందిన నేత్రములుగా భావింపఁబడినవి. ఆ నేత్రములు, తదాసక్తితో నామెను ఆమెయొక్క సుందర కర్ణములనుఁజూచుచు మఱియొక దానిఁ జూడనందవలన వాని కన్ధత్వ మారోపితము

శ్లో॥ విదర్భ సుభ్రూశ్రవణావతంసికా
మణీమహః కింశుక కార్ముకోదరే.
ఉదీతనేత్రోత్పల బాణసంభృతి
ర్నల పరం లక్ష్యమవైక్షత స్మరః. 40

ప॥వి॥ విదర్భసుభ్రూశ్రవణావతంసికామణీమహఃకింశుక కార్ముకోదరే - ఉదీతనేత్రోత్పలబాణసమ్భృతిః - నలం - పరం - లక్ష్యమ్ - అవైక్షత - స్మరః.

అర్థము :- స్మరః = మన్మథుడు, విదర్భసుభ్రూశ్రవణావతంసికామణీమహః కింశుకకార్ముకోదరే; విదర్భసుభ్రూ = దమయన్తి యొక్క, శ్రవణ = చెవులకు, అవతంసికా = కర్ణభూషణమైన, మణీ = రత్నముయొక్క, మహః = కాంతియనెడు, కింశుక = మోదుగపూవుయొక్క, ఉదరే = నడుమునందు, ఉదీతనేత్రోత్పలబాణసమ్భృతిః; ఉదీత = ఉదయించిన, నేత్రోత్పల; నేత్ర = నయన రూపమునందున్న, ఉత్పల = కలువలనెడి బాణ = శరములయొక్క, సమ్భృతిః = సంపాదనము గల్గిన వాడై, నలంపరం = నలుని మాత్రము, లక్ష్యం = గురిగా, అవైక్షత = చూచెను. నలుడు వచ్చి దమయన్తి యొక్క భూషింపబడిన చెవులు నేత్రములు నున్నగు వానియందమును చూచుటచేతనే కామబాణముచే గొట్టబడినవాడగునని యర్థము.

**సమాసములు :**

విదర్భ సుభ్రూశ్రవణావతంసికామణీమహః కింశుకకార్ముకోదరే :— శోభనే, భ్రువౌ, యస్యాః సా = సుభ్రూః. విదర్భాణాం, సుభ్రూః = విదర్భసుభ్రూః, విదర్భసుభ్రువః, శ్రవణే = విదర్భసుభ్రూశ్రవణే, విదర్భసుభ్రూశ్రవణయోః, అవతంసికా = విదర్భసుభ్రూశ్రవణావతంసికా, విదర్భసుభ్రూశ్రవణావతంసికాచసామణిశ్చ = విదర్భసుభ్రూశ్రవణావతంసికామణి, విదర్భసుభ్రూశ్రవణావతంసికామణ్యాః, మహః = విదర్భసుభ్రూశ్రవణావతంసికామణీమహః విదర్భసుభ్రూశ్రవణావతంసికామణీమహా

ఏవకింశుక కార్ముకం = విదర్భసుభ్రూశ్రవణావతంసికా మణీ మహః కింశుకకార్ముకం, విదర్భసుభ్రూశ్రవణావతంసికామణీమహః కింశుకకార్ముకస్య, ఉదరం = విదర్భసుభ్రూశ్రవణావతంసికా మణీమహః కింశుకకార్మికోదరం, తస్మిన్ = విదర్భ సుభ్రూశ్రవణావతంసికా మణీమహః కింశుకకార్మికోదరే.

ఉదీతనేత్రోత్పలబాణ సమ్భృతిః :—నేత్రమేవ, ఉత్పలం, నేత్రోత్పలమ్, నేత్రోత్పలమేవ, బాణః = నేత్రోత్పలబాణః, నేత్రోత్పలబాణస్య, సమ్భృతిః = నేత్రోత్పలబాణ సమ్భృతిః, ఉదీతా, నేత్రోత్పలబాణ సమ్భృతిః, యస్యసః = ఉదీతనేత్రోత్పలబాణ సమ్భృతిః.

భావము :

దమయన్తి తన చెవులయందు నెట్టిది రత్నములను ధరించియున్నది. ఆ రత్నకాంతి మోదుగపూవు యొక్క యాకారముగల్గి వింటివలె వంపు తిరిగియున్నది. దాని మధ్యభాగమునందామె యొక్క కలువలవంటి కన్నులంటి యున్నవి. మన్మథుడు పైనఁజెప్పఁబడిన మోదుగ పూవువంటి విల్లునందు కలువ పూలవంటి దమయన్తి కన్నులనెడి బాణములను సంధించినవాడై నలుని మాత్రము దానికి గురికావింప నెదురుచూచుచుండెను. 40

శ్లో॥ అనాచరత్తథ్యమృషా విచారణాం
తదాననం కర్ణలతాయుగేన కిం.
బబంధజిత్వా మణికుణ్డలే విధూ
ద్వి చన్ద్రబుద్ధ్యాకథితావసూయకౌ. 41

ప॥వి॥ అనాచరత్ - తథ్యమృషావిచారణాం - తదాననం - కర్ణలతాయుగేన - కిం - బబంధ - జిత్వా - మణికుణ్డలే - విధూ - ద్విచన్ద్రబుద్ధ్యా -కథితౌ - అసూయకౌ.

అర్థము:-తథ్యమృషా విచారణాం: తథ్య = సత్యము, మృషా = అసత్యము అను విచారణాం = విమర్శను, అనాచరత్ = సౌందర్య గర్వముచే చేయనట్టి, తదాననం, తత్ = ఆదమయన్తి యొక్క, ఆననం = ముఖము, ద్విచన్ద్రబుద్ధ్యా = ఇద్దఱు చంద్రులను భ్రాన్తిలో, కథితౌ =

సూచింపఁబడిన, అసూయకౌ = తన్ను ద్వేషించునట్టి, అనగా ఆమె ముఖమునకు ఆధిక్యమును సహించనట్టి, మణికుణ్డలే = రత్నమయములగు కమ్మలనెడు, విధూ = చంద్రులను, జిత్వా = జయించి, కర్ణలతాయుగేన = తీగెవంటి చెవులజంటచే, బబంధకిం = బంధించినదాయేమి?

వి - చెవిలోని గుండ్రని కమ్మలు చంద్రుల రూపమున నున్నవి. అవి యామె ముఖ సౌందర్యమును సహింపక ద్వేషించుచుండినవి. అట్టి చంద్రుల నిద్దఱిని యామెమోము ఖండించికట్టినదో యనునట్లవి భావింపఁబడినవి కాన నుత్ప్రేక్ష.

సమాసములు ;

అనాచరత్ :-న ఆచరత్ = అనాచరత్.

తథ్యమృషావిచారణాం ;– తథ్యమృషా ఇతి విచారణా = తథ్యమృషా విచారణా తాం=తథ్యమృషావిచారణాం.

తదాననం :-తస్యాః, ఆననం = తదాననం.

కర్ణలతాయుగేన :-లతయోః యుగం = లతాయుగం, కర్ణావేవలతా యుగం = కర్ణలతాయుగం, తేన = కర్ణలతాయుగేన.

మణికుణ్డలే :-మణిమయే చ తే కుణ్డలేచ = మణికుణ్డలే, తే = మణి కుణ్డలే.

ద్విచన్ద్రబుద్ధ్యా :– ద్వౌచతౌ చన్ద్రౌచ = ద్విచన్ద్రౌ, ద్విచన్ద్రావితి, బుద్ధిః = ద్విచంద్రబుద్ధిః, తయా = ద్విచన్ద్రబుద్ధ్యా.

భావము :

సౌందర్య గర్వముచే సత్యాఽసత్యముల విమర్శనుఁజేయని యామె ముఖము, ఆమె చెవులలోని రెండు కమ్మలనుఁ జూచి, యవి యిద్దఱు చంద్రుల నెడి భ్రాన్తినిఁబొందినది. ఆ చంద్రులు తన యాధిక్యమును, అనగా ముఖము యొక్క యాధిక్యమును సహింపక యెల్లప్పుడును ద్వేషించును. గాన నా యిద్దఱిని జయించి, దమయన్తి యొక్క తీగెలవంటి చెవులజంటచే బంధించిన

దాయనునట్లు కమ్మలు రెండును భావి. పఁబడి 'వి. జయింపఁబడిన శత్రువును బంధించుట తగినదని యాశయము. 41

శ్లో॥ అవాది భైమీ పరిధాప్య కుణ్డలే
వయస్యయాఽభ్యామభిత స్సమన్వయః.
త్వదాననేందోః ప్రియాకామజన్మని
శ్రయత్యయం దౌరధురీంధురం ధ్రువమ్॥ 42

ప॥ వి॥ :- అవాది - భైమీ - పరిధాప్య - కుణ్డలే - వయస్యయా - ఆభ్యాం-అభితః - సమన్వయః - త్వదాననేందోః - ప్రియకామ జన్మని - శ్రయతి - అయం - దౌరధురీం - ధురం - ధ్రువమ్.

అర్థము :- వయస్యయా = చెలికత్తెచే, కుణ్డలే = రత్నమములగు కమ్మలను, పరిధాప్య = ధరింపఁజేసి, భైమీ = దమయన్తి, అవాది=చెప్పఁబడినది, హేభైమి! = ఓ దమయన్తి, ఆభ్యాం= ఈ రత్నంపు కమ్మలతో, అభితః = రెండువైపులు, త్వదాననేన్దోః, త్వత్ = నీయొక్క, ఆననేందోః = ముఖచన్ద్రునికి, అయం = ఈ, సమన్వయః = సమావేశము, ప్రియకామజన్మని; ప్రియ = ప్రియుడైన నలునికి, కామ = నీయెడ ప్రేమ, జన్మని = కలుగువిషయమున, దౌరధురీం = దురధురాఖ్యమను జాతకయోగమునకు సంబంధించిన, ధురం = భారమును, అనగా ఫలమునొసంగు భారమును, శ్రయతి = వహించుచున్నది, ధ్రువం = నిశ్చయము, జాతకమున సూర్యుని వదలి, తక్కిన గ్రహములలో నేదియైనను చంద్రునికిఉభయవైపులున్నచో దురధురాయోగమని చెప్పఁబడినది. కావుననే వరాహమిహిరాచార్యులు :-

"హిత్వాఽర్కం సునఫానఫాద్దురధురా
స్స్వాన్త్యోభయస్థైర్గ్రహైః శీతాంశోః" అని వచించిరి.

మఱియు లఘుజాతకమున—

"రవివర్జం ద్వాదశగైరనఫా, చన్ద్రాద్ద్వితీయగైస్సున
ఫా, ఉభయస్థితైర్దురధరా-" యని చంద్రునకిఉ ప్రక్కలలోను

సూర్యుని వర్జించి తక్కిన గ్రహములున్నచో, దురధురా యోగమని
జెప్పఁబడినది.

సమానములు:

త్వదాననేన్దోః :- ఆననమేవఇందుః = ఆననేందుః, తవ ఆననేందుః =
త్వదాననేందుః, తస్య = త్వదాననేందోః.

ప్రియకామజన్మని :- కామస్య, జన్మ = కామజన్మ, ప్రియస్య, కామ
జన్మ = ప్రియకామజన్మ, తస్మిన్ = ప్రియకామజన్మని.

దౌరధురీం :- దురధురాయాః, ఇయం = దౌరధురీ, తాం - దౌరధురీం

భావము :

చెలికత్తె దమయంతికి గమ్మలను దొడిగి ఇట్లు చెప్పినది — ఓ దమ
యంతీ, ఈ రత్నపు కమ్మల కిఱువైపుల గల నీ ముఖచంద్రుని ఈ సమా
యోగము, ప్రియుడగు నలునకునీయెడ ననురాగమేర్పడుటకు జ్యోతిశ్శాస్త్రమున
జెప్పబడిన ధురధరాయోగభావమును వహించి నీకు వరప్రదమైయున్నది. జన్మ
కుండలి యందు చంద్రగ్రహమున కిఱువైపుల ననగా చంద్రునకు ద్వాదశము
నందును, ద్వితీయమునందును, సూర్యుడు తప్ప తక్కిన గ్రహములలో నేవి
యున్నను, ధురధురాయోగమనబడును. ఈ యోగమున జన్మించినవారు జీవి
తాంతము మిక్కిలి సుఖము ననుభవింతురు. కావున నీ ముఖమను చంద్రున
కిఱువైపులు నీ రత్నకుండలములను గ్రహములుండుటవలన నీయెడ నలుని
ప్రేమకు ధురధరాయోగము పట్టినది. గాన జీవితాంతము నలునకు నీపై ప్రీతి
ప్రవర్ధిల్లుచుండునని యాశయము. 42

శ్లో॥ నివేశితం యావకరాగదీప్తయే
లగత్తదీయాధరసీమ్ని సిక్థకం
రరాజతత్రైవనివస్తు ముత్సుకం.
మధూని నిర్ధూయసుధా సధర్మిణీ. 43

ప॥వి॥ :- నివేశితం - యావక రాగదీప్తయే - లగత్ - తదీయాధరసీమ్ని -
సిక్థకం - రరాజ - తత్ర - ఏవ - నివస్తుం - ఉత్సుకం - మధూని -
నిర్ధూయ - సుధాసధర్మిణి.

అర్థము :- తదీయాధరసీమ్ని, తదీయ = ఆ దమయంతికి సంబంధించిన, అధర = పెదవులయొక్క, సీమ్ని = ఎల్లయందు, యావకరాగదీప్తయే, యావకరాగ = లత్తుకవంటి ఎఱ్ఱదనము, దీప్తయే = స్ఫురించుటకొఱకు, నివేశితం = ఉంచబడినదై (కావుననే) ఽగత్ = గట్టిగా నంటుకొనిన, సిక్థకం = తేనెపెట్టిలోని మైనము, మధూని = తేనెలను, నిర్ధూయ = తొలగించి, సుధాసధర్మిణి, సుధా = అమృతముతో, సధర్మిణి = సమానధర్మము గలిగిన, తత్రైవ = ఆయధరపుటెల్లయందు, నివస్తుం = నివసించుటకు, ఉత్సుకం = కోరికగల్గినదై, రరాజ = ప్రకాశించినది.

## సమాసములు :

యావకరాగదీప్తయే :- యావకస్యరాగః = యావకరాగః, యావకరాగస్యదీప్తిః = యావకరాగదీప్తిః, తస్యై = యావకరాగదీప్తయే.

తదీయాధరసీమ్ని :- తస్యాః అయం = తదీయః, తదీయశ్చాసౌ అధరశ్చ = తదీయాధరః, తదీయాధరస్య సీమా = తదీయాధరసీమా, తస్మిన్తదీయాధరసీమ్ని.

సుధాసధర్మిణి :- సమానః, ధర్మః, యస్య సః = సధర్మా, సుధయా, సధర్మా = సుధాసధర్మా, తస్మిన్ = సుధాసధర్మిణి.

## భావము :

ఆ దమయన్తి పెదవుల యంచుల యందు లత్తుకరంగును స్ఫురింపజేయుటకై తేనెమైనము నుంచబడినది. అది చాల గట్టిగా దానినంటుకొనియున్నది. ఆ తేనెమైనము తనకు సహజములైన తేనె రసములను వదలి యమృతపూర్ణమైన యామె పెదవియందే నివసింపగోరిక గల్గినదిగా విలసిల్లినది. తేనెపెట్టియందున్న తేనెకంటెను దమయన్తి పెదవులయందున్న యమృతము మిక్కిలి రుచికరముగదా! అట్లు కానిచో నదియేల యచ్చటనే యుండగోరును. శ్రేష్ఠమైన స్థానము లభించినప్పుడు చాల పరిచయము గల్గినను తన స్థానమును వదలుట సహజముగదా.

శ్లో॥ స్వరేణవీణే త్యవిశేషణంపురా
స్ఫురత్తదీయాఖలుకణ్ఠకందలీ।
అవాప్య తన్త్రీరథసప్త మౌక్తికా
సరా నరాజత్పరివాదినీ స్ఫుటమ్॥ 44

ప॥వి॥ స్వరేణ - వీణేత్యవిశేషణం - పురా - అస్ఫురత్ - తదీయా - ఖలు - కణ్ఠకందలీ - అవాప్య - తన్త్రీః - అథ - సప్త - మౌక్తికాసరాన్ - అరాజత్ - పరివాదినీ - స్ఫుటమ్.

అర్థము :- తదీయా = ఆ దమయన్తికి సంబంధించిన, కణ్ఠకన్దలీ = కణ్ఠనాలము లేదా కణ్ఠమండలి మధురధ్వని, పురా = పూర్వము, స్వరేణ = ధ్వనితో వీణేత్యవిశేషణం = సాధారణముగా వీణెనుండి భేదము లేకయే, అస్ఫురత్ = స్ఫురించినది. ఖలు = నిశ్చయము. అథ = వీణెయేయని నిశ్చయమేర్పడిన పిదప, సప్త = ఏడైన, మౌక్తికసరాన్ = ముత్తెముల సరములనెడి, తన్త్రీః = తంతులను, అవాప్య = పొంది, పరివాదినీ = సప్తతంత్రులతో గూడిన విపంచియను వీణెగా నేర్పడినదై, అరాజత్ = ప్రకాశించినది. స్ఫుటం = స్పష్టము.

సమాసములు :

వీణేత్యవిశేషణం :— వీణా, ఇతి, న విశేషణం, యస్మిన్ కర్మణి - తత్యథా భవతితథా = వీణేత్యవిశేషణం.

కణ్ఠకన్దలీ :— కణ్ఠస్య, కన్దలీ = కణ్ఠకన్దలీ.

భావము ;

ఆ దమయన్తి యొక్క కణ్ఠనాలము పూర్వము స్వరముచే వీణెకంటె భిన్నముగా నుండలేదు. అనగా వీణెగనే ఉండినది. ఇది నిశ్చయము. పిదప వీణెయేయని స్ఫురణ యేర్పడగనే, యేడుముత్తెపుసరములనెడి యేడు తంత్రులను వహించి-సప్తతంత్రులతో గూడిన, పరివాదిని యను వీణెగా నేర్పడినది. దమయన్తి కణ్ఠమునందు ముత్తెపుసరములు తొడుగక ముందు నామె కణ్ఠమునందేడు ముత్తెపుసరములు తొడుగబడగనే నామె కణ్ఠ నాళము, ఏడు తంత్రులతో గూడిన పరివాదిని యను వీణెగా నేర్పడినదని భావము. 44

వి:- ఏడు ముత్తెపు సరములలఙ్కార రూపమున నామె కణ్ఠమునందు తొడుగఁబడినవి అవి తొడుగ బడుటవలన నాకణ్ఠనాళము 'పరివాది' యను వీణెగాక పోయినను నైనట్లు భావింపఁబడుటవలన నుత్ప్రేక్ష. స్ఫుట శబ్దమును వ్యంజకముగా ప్రయోగించుటవలన నది వాచ్యము. 44

శ్లో॥ ఉపాస్య మానావివశిక్షితుం తతో
మృదుత్వ మప్రౌఢ మృణాలనాలయా।
విరేజతు ర్మాఙ్గలికేనసంయుతౌ
భుజౌ సుదత్యా వలయేన కమ్బునః॥ 45

ప॥వి॥ ఉపాస్యమానౌ - ఇవ - శిక్షితుం - తతః - మృదుత్వమ్ - అప్రౌఢ మృణాలనాలయా - విరేజతుః - మాఙ్గలికేన - సంయుతౌ - భుజౌ - సుదత్యాః - వలయేన - కమ్బునః.

అర్థము:-తతః — కణ్ఠమునలఙ్కరించిన పిదప, మాఙ్గలికేన = మంగళసాధనమైన, కమ్బునః = శంఖముయొక్క, వలయేన = కఙ్కణముచే, — సంయుతౌ = కూడిన, సుదత్యాః = దమయన్తి యొక్క, భుజౌ = భుజములు, అప్రౌఢమృణాలనాలయా; అప్రౌఢ = లేతదైన, మృణాలనాలయా = తామర తూడుచే, మృదుత్వం = మెత్తఁదనమును, శిక్షితుం = నేర్చుకొనుటకు, ఉపాస్యమానావివ = సేవింపబడుచున్నవో యనునట్లు, విరేజతుః = ప్రకాశించినది.

వి :- శంఖవలయములచే మంగళార్థముగాఁ జుట్టఁబడిన యా దమయన్తి భుజముల మెత్తదనమును నేర్చుటకై తామరతూండ్లచే నుపాసింపఁబడక పోయినను, నుపాసింపఁ బడుచున్నట్లు భావింపఁబడుటవలన నుత్ప్రేక్ష. ఇవశబ్ద ప్రయోగముచేనది వాచ్యము.

**సమాసములు ;**

మృదుత్వం :—మృదోర్భావః = మృదుత్వం. తత్ = మృదుత్వం.

అప్రౌఢమృణాలనాలయా :—న ప్రౌఢం=అప్రౌఢంఅ, ప్రౌఢంచతత్,

మృణాలంచ = అప్రౌఢమృణాలం, అప్రౌఢమృణాలస్య, నాలా = అప్రౌఢమృణాలనాలా, తయా = అప్రౌఢమృణాలనాలయా.

**భావము :**

దమయన్తి కణ్ఠమును ముత్తెపుసరములు మున్నగువానిచే నలఙ్కరించిన పిదప నామె బాహువులను, శంఖములతో నిర్మితములైన కడియములతో నలఙ్కరించినది. ఆశ్శంఖ కంకణము గుండ్రముగా చుట్టఁబడిన, లేత తామర కాడలవలె నుండినవి. కాన నా లేత తామరకాడలు మెత్తదనమును నేర్చుకొనుటకై యా దమయంతి భుజముల సేవించుచున్నవో యనునట్లు భావింపఁబడినది. లేత తామర కాడలు, బాల మృణాలకములుగాన, లోకమున బాలురు విద్యను నేర్వనర్హులుగాన నవి భుజములనెడి గురువుల నాశ్రయించి మెత్తదనము నేర్చుకొనుచున్నట్లు భావింపఁబడినది. 45

శ్లో॥ పదద్వయేఽస్యానవ యావరఞ్జనా
జనైస్తదానీముదనీయ తార్పితా।
చిరాయ పద్మాత్ పరిరభ్య జాగ్రతీ
నిశీవ విశ్లిష్య నవా రవిద్యుతిః॥ 46

ప॥వి॥ పదద్వయే - అస్యాః - నవయావరఞ్జనా - జనైః - తదానీమ్ - ఉదనీయత - అర్పితా - చిరాయ - పద్మాత్ - పరిరభ్య - జాగ్రతీ - నిశి - ఇవ - విశ్లిష్య - నవా - రవిద్యుతిః.

అర్థము :—తదానీం = దమయన్తి నలఙ్కరించు కాలమందు, అస్యాః = ఈ దమయన్తి యొక్క, పదద్వయే = రెండు పాదములయందును, అర్పితా = ఉంచఁబడిన, నవయావరఞ్జనా; నవ = నూతనమైన, యావ = లత్తుకను, రఞ్జనా = పట్టించుట, అనగా లత్తుకచే రంగు వేయుట, నిశి = రాత్రియందు, (పద్మాత్ = పద్మమునుండి) విశ్లిష్య = విడిపోయి, చిరాయ = చాలకాలమునకు ననగా వేకువన, పరిరభ్య = కౌగిలించి, (పొంది) జాగ్రతీ = ప్రకాశించు, నవా = నూతనమగు రవిద్యుతిరివ = సూర్యకాంతియో యనునట్లు, (స్థితేతి = ఉన్నదని)

జనైః = జనులచే, ఉదనీయత = ఊహింపఁబడినది.

వి:- ఇచ్చట దమయంతి పాదములయందుంచఁ బడిన పారాణి, రాత్రియందు పద్మమునుండి విడదీయఁబడి చాలకాలమైన పిదప ప్రభాతమున పద్మములనుఁగౌగలించు కొనిన బాల సూర్యుని కాంతియో యనునట్లు జనులచే యూహింపఁ బడినది కాన నిటనీ విధముగా పారాణి బాలసూర్య ప్రభగా భావింపఁబడుటవలన నుత్ప్రేక్ష

## సమాసములు

పదద్వయే :— పదయోః, ద్వయం = పదద్వయం, తస్మిన్ = పదద్వయే.

నవయావరఞ్జనా :— నవశ్చాసౌ, యావశ్చ = నవయావః. నవయావస్య రఞ్జనా = నవయావరఞ్జనా.

రవిద్యుతిః :— రవేః, ద్యుతిః = రవిద్యుతిః.

**భావము :**

అలఙ్కరణ సమయమందు దమయంతి పాదములకు పారాణి పూయఁబడినది. అదిరాత్రి విడిపోయి యనగా వియోగమునొంది ప్రభాతమున, పద్మములను (ఁగౌగలించుకొని వియోగబాధతీరి యాశ్వాసము నొందిన) పొందిన బాలసూర్యుని కాంతిగా జనులచే భావింపఁబడినది. ఆమె పాదములు పద్మములవలెను, దానినంటిన పారాణి బాల సూర్యునికాంతివలెను, ననగా రాత్రి ఎడబాపు పొందిన పద్మములనెడి మిత్రములను కౌగలించుకొనిన బాలసూర్యుని కాంతివలె నున్నదని యాశయము.	46

శ్లో॥ కృతాపరాధః సుతనోరనన్తరం
విచిన్త్య కాన్తేనసమం సమాగమః।
స్ఫుటం నిషేవే, కుసుమేషుపావకః
సరాగ చిహ్నైశ్చరణౌ, నయావకః॥	47

ప॥వి॥ కృతాపరాధః - సుతనోః - అనన్తరం - విచిన్త్య - కాన్తేన - సమం - సమాగమం - స్ఫుటం - నిషేవే - కుసుమేషుపావకః - సరాగ చిహ్నైః - చరణౌ - న - యావకః.

అర్థము:- సుతనోః = దమయన్తికి, కృతాపరాధః = పూర్వము విరహకాలము నందు నపరాధముఁ గావించిన, కుసుమేషుపావకః; కుసుమేషు = మన్మథుడను, పావకః = అగ్ని, అనన్తరం = తర్వాత, కాన్తేనసమం = నలునితోడ, సమాగమం = కలయికను, విచిన్త్య = ఆలోచించి, సరాగచిహ్నః = అగ్ని యొక్క యెఱ్ఱతనపు గుర్తును గలవాడై లేదా అనురాగ చిహ్నముతోఁగూడిన వాడై, చరణౌ = దమయన్తి పాదములను, సిషేవే = సేవించెను. స్ఫుటం = స్పష్టము. తన పూర్వపు తప్పునుఁగడిగి వేసుకొనుటకై సేవించెనో యనునట్లుండెను. కాన నా పారాణి అగ్నియే కాని పారాణి కాదని యర్థము.

వి:- ఇచ్చట పారాణిని, పారాణి కాదని నిషేధించి దానియందు నగ్నిత్వము నారోపించి దమయన్తి పాదములను సేవించెనో యమనట్లు భావించుట వలన నపహ్నవముతోఁ గూడినయుత్ప్రేక్ష.

**సమాసములు :**

కృతాపరాధః :—కృతః, అపరాధః, యేనసః = కృతాపరాధః.

సుతనోః ;—శోభనా, తనుః, యస్యాస్సా = సుతనుః, తస్యాః = సుతనోః.

కుసుమేషుపావకః :—కుసుమాని, ఇషవః, యస్యసః, =కుసుమేషుః, కుసుమేషురేవ పావకః = కుసుమేషుపావకః

సరాగచిహ్నః :—రాగఏవచిహ్నం = రాగచిహ్నం = రాగచిహ్నేన, సహవర్తత ఇతి = సరాగచిహ్నః.

**భావము :**

పూర్వము దమయన్తీ విరహకాలమందు నామెను వేధించి యపరాధము గావించిన, మరుడనెడి యగ్ని, తర్వాత ప్రియుఁడగు నలునితోడఁ నామెకు సమాగమము నాలోచించి, యగ్నికి రాగ చిహ్నమగు నెఱ్ఱఁదనము తోడను లేదా యనురాగ చిహ్నము తోఁడనుఁగూడినవాడగుచు, తన తప్పును క్షాలన జేసుకొనుటకై యామెపాదములను సేవించెను. అట్లు కానిచో నగ్నియందట్టి రాగము ఎఱ్ఱఁదనముతేదా యనురాగము, ఏ విధముగా నేర్పడును. ఆ కామాగ్నియే ఇప్పుడామె పాదములపైఁ బడియున్నది కాని యది పారాణికాదు.

శ్లో॥ స్వయం తదఙ్గేషు గతేషు చారుతాం
పరస్పరేణైవ విభూషితేషు చ.
కిమూచిరేఽలఙ్కరణానితాని తత్
వృథైవ తేషాం కరణం బభూవ యత్. **48**

ప॥వి॥ స్వయం - తదఙ్గేషు - గతేషు - చారుతాం - పరస్పరేణ - ఏవ - విభూషితేషు - చ - కిమ్ - ఊచిరే - అలఙ్కరణాని - తాని - తత్ - వృథా - ఏవ - తేషాం - కరణం - బభూవ - యత్.

అర్థము :-స్వయం = తమయంతటనే, చారుతాం = రమ్యముగానుండుటను, గతేషు = పొందినవియు, తథా = అట్లే, పరస్పరేణైవ = ఒండొంటి తోడనే, విభూషితేషు = చక్కగానలఙ్కరింపఁబడినవియును (ననగా ఒకటితో నొకటి కలియుటచే. నాభరణము లేకయే యొకానొక రామణీయకము స్ఫురించుట వలననని యర్థము.) నగు, తదఙ్గేషు = ఆ దమయంతి యొక్క యవయవముల యందు, తేషాం = ముందుఁజెప్పిన, నొసటనుంచఁబడిన, పసిడిపట్టె మున్నగు నాభరణములను, యత్కరణం = ఏ ఉంచుటయనునదేదికలదో, తత్ = అది, వృథైవ = వ్యర్థము గనే, బభూవ = ఆయెను. (ఇతి = యని) తాని = ఆయాభరణములు, ఊచిరేకిం = చెప్పినవాయేమి? ఆ యాభరణములకు, అలఙ్కరణముల నియు నామము గలదు. ఆయలఙ్కరణము దమయన్తి సౌందర్యాపాదనమందు నసమర్థములై నందువలన, తమ్మయామెపై నుంచుట నిష్ప్రయోజనముకాన, "కరణమ్ అలం" అనగా కరణం = తమ్మనుంచి, భూషించుట, అలం = చాలును (వలదు) అని "అలఙ్కరణ" మను తమ పేరును సార్థక పఱచుకొనినవని యర్థము.

సమాసము లు :

చారుతాం :— చారుణః, భావః = చారుతా, తామ్ = చారుతాం.

అలఙ్కరణాని :— అలం, కరణాని = అలఙ్కరణాని.

**భావము :**

ఆ దమయన్తియొక్క యవయవములన్నియుఁ దమయంతట తామే యందముగా నున్నవి. ఆ యవయవములు, ఒండొంటితో కలియుటవలననే వాని యందొక యపూర్వమగు రామణీయక మేర్పడుచున్నది. కావున నట్టి సహజ సుందరములగు నవయవములయందు నొసట పసిడిపట్టె మున్నగు నాభరణము లనుఁ దొడగుట వ్యర్థమే. కాననవివలదని యామె శరీరమందలి యాభరణ ములు చెప్పుచు, తమకు "అలఙ్కారణము"లనుఁ బ్రసిద్ధ నామమును సార్థక పఱచుకొనినవి. కరణం = భూషణములనుఁచుట, అలం = వలదు, అని యా భరణములైన తమ్ములనుంచుటవలదు. కావుననే యవి యలఙ్కారణములైనట్లు ఆయాభరణములు అలఙ్కరణ నామమును సార్థక పఱచుకొనుచు చెప్పినవని యాశయము. 48

శ్లో॥ క్రమాధికాముత్తర ముత్తరం శ్రియం
పుపోష యాం భూషణచుమ్బనైరియమ్।
పురః పురస్తస్థుషి రామణీయకే
తయా బబాధేఽవధి బుద్ధిధోరణిః 49

ప॥వి॥ క్రమాధికామ్ - ఉత్తరమ్ - ఉత్తరమ్ - శ్రియా - పుపోష - యాం - భూషణచుమ్బనైః – ఇయం - పురః - పురః - తస్థుషి - రామణీయకే - తయా - బబాధే - అవధిబుద్ధిధోరణిః,

అర్థము :- ఇయం = ఈ దమయన్తి, భూషణచుమ్బనైః = ఆభరణములను ముద్దిడుకొనుటచే, ఉత్తరముత్తరం = పైనపైన, క్రమాధికాం; క్రమ = వరుసచే, ననగా ముందుముందుంచఁబడిన భూషణములకంటె, వెనుక వెనుకనుంచిన భూషణములచే, అధికాం = ముందుకంటె నధికమైన, యాం = ఏ, శ్రియం = శోభను, పుపోష = పోషించెనో, తయా = ఆ శోభచే, పురఃపురః = ముందుముందు, రామణీయకే = సొబగు, తస్థుషిసతి=ఉండెడి స్వభావముఁగలదికాగా, అవధిబుద్ధిధోరణిః; అవధి, = అందమున "కిదియేఎల్ల యిదియేయెల్ల" యను బుద్ధి పరమ్పర

బాధే = బాధింపఁబడినది. ఆమె సత్కరించుకొనిన కొలది, యా భరణములచే నేర్పడుచున్న యామె సౌందర్యమునకెల్ల నేర్పఱుపవలను కాక పోయినది. ఇదియే సౌందర్యము కెల్లయని తొలుతఁజేయఁబడిన యలఙ్కారములచే భావించుచుండగా, తర్వాత చేయు నలఙ్కరణముల వలననింకను సౌందర్యము వర్ధిల్లసాగినది. అందువలన తత్పూర్వ మేర్పఱుపఁబడిన ఎల్లరద్దు కావలసివచ్చినది. ఈ విధముగా ప్రారంభము నుండి కొనవఱకును నామె కలఙ్కరణము గావించు కాలమున, పూర్వ పూర్వపు సౌందర్యములకంటెను నుత్తరోత్తర సౌందర్యములు ప్రవర్తిల్లు చుండుటవలన మధ్యకాలమున నామెయొక్క సౌందర్యమునకు నెల్లను నిర్ణయింప సాధ్యము కాలేదని యర్థము.

సమాసములు

క్రమాధికాం :—క్రమేణ అధికా = క్రమాధికా, తాం = క్రమాధికాం.
భూషణచుమ్బనైః :—భూషణానాం, చుమ్బనాని = భూషణచుమ్బనాని, తైః = భూషణచుమ్బనైః.
అవధిబుద్ధిధోరణీః : - అవధేః, బుద్ధిః = అవధిబుద్ధిః, అవధీబుద్ధేః, ధోరణీః = అవధిబుద్ధిధోరణీః.

భావము :

ఈ దమయన్తి తనకుఁబెట్టిన యా భరణములను ముద్దిడుకొనుటచే, ముందుముందుంచఁబడిన యా భరణముల వలన నెక్కువ సౌందర్యమును బోషించుకొనినది. అట్లు పూర్వపూర్వ శోభలకంటె నుత్తరోత్తర శోభ ప్రవర్తిల్లుచుండగా, నామె సౌందర్యమునకు నెల్లను నిర్ణయింప సాధ్యము కాకపోయినది. కాన నామె సౌందర్యము అలఙ్కరణ కాలమందు నవధి లేనిదిగా నుండెను. 49

శ్లో॥ మణీసనాభౌ ముకురస్య మణ్డలే
బభౌ నిజాఽఽస్య ప్రతిబిమ్బదర్శినీ
విధేరదూరం స్వముఖం విధాయసా
నిరూపయన్తీవ విశేషమేతయోః. 50

ప॥వి॥ మణిసనాభౌ – ముకురస్య - మణ్డలే - బభౌ - నిజాఽఽస్యప్రతిబిమ్బ దర్శినీ - విధేః - అదూరం - స్వముఖం - విధాయ - సా - నిరూప యన్తీ - ఇవ – విశేషమ్ - ఏతయోః.

అర్థము :-మణిసనాభౌ; మణి = రత్నముతో, సనభౌ = సదృశమైన, ముకు రస్య = అద్దముయొక్క, మణ్డలే = పైభాగమునందు, నిజాఽఽస్య ప్రతిబిమ్బదర్శినీ; నిజ = తనదగు, ఆస్య = ముఖముయొక్క, ప్రతి బిమ్బ = ప్రతిబిమ్బమును, దర్శినీ = చూచుచున్న, సా = ఆ దమ యన్తి, స్వముఖం = తనముఖమును, విధోః = చంద్రునికిగాని, అనగా నద్దమనెడి చంద్రునికిగాని, లేదా అద్దమునందు ప్రతిబింబించిన చంద్రు నికి గాని అదూరం = సారూప్యమును, విధాయ = గావించి, ఏతయోః = తన మోమునకును, చంద్రునకును, విశేషం = భేదమును, నిరూపయన్తీవ = నిరూపించుచున్నదో యనునట్లు, బభౌ = శోభించినది. వస్తువుల తారతమ్యమును బరీక్షించు వారు, రెండు వస్తువుల నొకచోటఁ జేర్చి పరీక్షింతురుగదా!

వి:- ఆమె యద్దమున తన ముఖమునుఁ జూచుటతో తారతమ్య పరీక్ష హేతువు కాక పోయినను, దానిని హేతువుగా సంభావనఁ జేయుటవలననుత్ప్రేక్ష.

**సమాసములు :**

మణిసనాభౌ :—సమానా, నాభిః యస్యసః, సనాభిః, మణ్యాః, సనాభిః = మణిసనాభిః, తస్మిన్ = మణిసనాభౌ.

నిజాస్యప్రతిబింబదర్శినీ :—నిజంచ, తత్, ఆస్యంచ = నిజాస్యం, నిజాస్యస్య, ప్రతిబింబః = నిజాస్యప్రతిబిమ్బః, నిజాస్యప్రతిబిమ్బం, పశ్యతీతి = నిజాస్యప్రతిబింబదర్శినీ.

అదూరం :—అవిద్యమానః, దూరః, యస్మిన్ కర్మణి, తద్యథాభవతి తథా = అదూరం,

**భావము :**

రత్నమువంటి యద్దమున తన మోమునుఁ జూచుచున్న యా దమయన్తి, తన మోమును చంద్రునికి ననగా చంద్రుని రూపముననున్న యద్దమునకు, లేదా, అద్దమునందు ప్రతిబింబించిన చంద్రునికి దగ్గరనుంచి, యీ రెంటికిననగా

తన ముఖమునకును చంద్రునకును భేదమునుఁ బరీక్షించుచున్నదో యనునట్లు శోభించినది. రెండు వస్తువులనుఁ బరీక్షించెడివారు ఆ వస్తువుల నొకచోటఁజేర్చి పరీక్షించుట సహజము. 50

శ్లో॥ జిత స్తదాస్యేనకళానిధిర్దధే
ద్విచన్ద్రధీసాక్షిక మాయకాయతామ్.
తథాఽపి జిగ్యే యుగపత్ సఖీయుగ
ప్రదర్శితాఽఽదర్శబహూభవిష్ణునా. 51

ప॥వి॥ జితః - తదాస్యేన - కళానిధిః - దధే - ద్విచన్ద్రధీసాక్షికమాయకాయ తామ్ - తథా - అపి - జిగ్యే - యుగపత్సఖీ యుగప్రదర్శితాదర్శ బహూభవిష్ణునా.

అర్థము :-కలానిధిః = మాయాది పెక్కు కళలయందు నిధియైన చంద్రుడు, తదాస్యేన; తత్ = ఆ దమయన్తి యొక్క, ఆస్యేన = ముఖముచే, జితస్సన్ = ఓడింపఁబడినవాడై, ద్విచన్ద్రధీ సాక్షికమాయకాయతామ్; ద్విచన్ద్ర = ఇద్దఱు చంద్రులనెడి, ధీ = బుద్ధికి, సాక్షిక = ప్రమాణముగాఁగల్గిన, మాయకాయతామ్ = మాయతో నేర్పడిన శరీరమునుఁ గల్గియుండుటను, దధే = ధరించెను. ఒక్కడుగా చంద్రుడు ఆ మోమును జయింప జాలనందువలన మాయచే నతడిద్దఱుగా నాయెనని యర్థము. తథాఽపి = అట్లు, ఇద్దఱుగానైనను, యుగపత్ = ఏక కాలమున, సఖీయుగప్రదర్శితాదర్శ బహూభవిష్ణునా; సఖీయుగ = ఇద్దఱు చెలికత్తెలచే, ప్రదర్శిత = చూపఁబడిన, ఆదర్శ = అద్దముల రెంటిచే, బహూభవిష్టునా= పెక్కండ్రుగా గానున్న, అనగా రెండు అద్దములయందు రెండు ప్రతిబిమ్బములు బింబమైన తాను కలసి ముగ్గురుగానున్న యామె ముఖముచే, జిగ్యే = జయింపఁబడెను.

సమాసములు :

తదాస్యేన :—తస్యాః, ఆస్యం = తదాస్యం. తేన = తదాస్యేన.

కళానిధిః : – కలానాం, నిధిః = కళానిధిః.

ద్విచన్ద్రధీసాక్షికమాయకాయతాం :— ద్వౌచన్ద్రౌ ఇతిధీః = ద్విచన్ద్రధీః ద్విచన్ద్రధీరేవసాక్షీయస్యాస్సా = ద్విచన్ద్రధీసాక్షికా ద్విచన్ద్రధీసాక్షిక ద్విచంద్రధీ సాక్షకా మాయా యస్యసః = ద్విచంద్రధీ సాక్షిక్షమాయః మాయః, కాయః, యస్యసః = ద్విచన్ద్రధీసాక్షికమాయకాయః, ద్విచన్ద్రధీసాక్షికమాయ కాయస్య, భావః=ద్విచన్ద్రధీ సాక్షికమాయకాయతా, తామ్ = ద్విచన్ద్రధీసాక్షికమాయకాయతామ్.

సఖీయుగ ప్రదర్శితాదర్శబహూభవిష్ణునా :— సఖ్యోః యుగం = సఖీయుగం, సఖీయుగేన, ప్రదర్శితా, సఖీయుగప్రదర్శితా, సఖీయుగప్రదర్శితౌ చతౌ ఆదర్శౌచ = సఖీయుగప్రదర్శితాదర్శౌ, అబహు, బహూభవిష్ణు = సఖీయుగ ప్రదర్శితా దర్శాభ్యాం బహూభవిష్ణు = సఖీయుగ ప్రదర్శితాదర్శబహూభ విష్ణు, తేన = సఖీయుగ ప్రదర్శితా దర్శ బహూభ విష్ణునా.

**భావము :**

కళలకు, అనగా మాయాది కళలకు నిధియగు చంద్రుడు దమయన్తి ముఖముచే నోడింపఁబడినవాడై, "ఇద్దఱు చంద్రులు" అనెడి బుద్ధియే ప్రమాణముగాగల్గిన మాయతో నేర్పడిన శరీరమును ధరించెను. లేదా మాయాకళయందు చతురుడగు చంద్రుడు, ఒకని నేత్రమును వ్రేలితో నలుపు కొనునట్లు చేయుట చేతఁ నాతని హస్తమందలి యద్దమందు ప్రతిబింబించుట చేతగాని యా పురుషునకు ద్విచన్ద్రత్వ బుద్ధినిఁ గల్గింపవచ్చును. అట్టి పురుషుడేయిట ద్విచన్ద్రత్వమునకు ననగా ఇద్దఱుచంద్రులను బుద్ధికి సాక్షిగా నుండును. అతనిని సాక్షిగాఁగల్గిన మాయతో గూడిన చంద్రుడు రెండు దేహములను ధరించినట్లిట భావింపఁబడుచున్నది. ఒంటరిగా చంద్రుడామె ముఖమును జయింపనశక్తుడై పైనఁ జెప్పిన ప్రకారము మాయతో నిద్దఱుగా నాయెను. కాని యతడిట్లిద్దఱుగా నైనను దమయన్తి ముఖము, చెలికత్తెలు తెచ్చిన రెండు అద్దములయందు ప్రతి బింబించి, రెండు ప్రతిబింబములుగనైనది. ముఖబింబమును గలుపుకొనగా మూడుగా నైనది. ఇంకను నామె ముఖముతో సమానములైన యద్దములనుఁగలుపు కొనగా పెక్కులుగా నైనవి. కాన, పై విధముగా మూడును, నింకను నెక్కువ యద్దములంచే కేవలము, ఇద్దఱుగానున్న చంద్రుడు. సుఖముగా జయింపనశక్యుడాయెను. తొలుత సౌందర్యమునే శోకింపోయునను నావంద్రుడను, ముఖముకంటెను

నధికమైన ద్విత్వ సంఖ్యచే నామె ముఖము నోడింప సమర్థుడైను. కాని యామె ముఖము ప్రతిబింబాదులచే నధికసంఖ్య గల్గియుండుట వలన నా విధముగ ముఖము నోడించుటకును, చంద్రునకు శక్యముగాలేదు. అనగా నామె ముఖము చంద్రునికంటెను మిక్కిలి సౌందర్యము గల్గినదని సారాంశము. 51

శ్లో॥ కిమాలియుగ్మార్పిత దర్పణద్వయే
తదాస్యమేకం బహుచాన్యదమ్బుజం
హిమేషు నిర్వాప్య నిశాసమాదిభి
స్తదీయసాలోక్యమితం వ్యలోక్యత. 52

ప॥వి॥ కిమ్ - అలియుగ్మార్పితదర్పణద్వయే - తదాస్యమ్ - ఏకం - బహు - చ-అన్యత్ - అమ్బుజం - హిమేషు - నిర్వాప్య - నిశాసమాదిభిః - తదీయసాలోక్యమ్ - ఇతం - వ్యలోక్యత.

అర్థము :-అలియుగ్మార్పితదర్పణద్వయే; అలియుగ్మ = ఇద్దఱు చెలికత్తెలచే, అర్పిత = ఉంచఁబడిన, దర్పణద్వయే = రెండు అద్దములయందు, ఏకం = ఒక్కటియు, ముఖ్యమైనదియునగు. తదాస్యం = ఆ దమయన్తి ముఖము, అన్యత్ = ఇతరమగు నామెయొక్క ముఖప్రతిబింబము బహు = అనేకమైన, అమ్బుజం = పద్మము మున్నగునవి సూర్యు డొక్కడైనను నాతని ప్రతిబింబములు పెక్కులుగదా, అట్లే బ్రహ్మ యొక్కటైనను నవిద్య యందుఁ బ్రతిబింబించిన బ్రహ్మము అనేక ముగదా. అట్లే ముఖమొక్కటైనను దాని ప్రతిబింబ రూపములగు పద్మ ములు మున్నగునవి పెక్కులగుచున్నవి. కాననట్టి ప్రతిబింబ రూపమై నట్టి పద్మజాతి మున్నగునది, నిశాసు = రాత్రులయందు, సమాధిభిః = ఆమె ముఖమును ధ్యానము చేయుట మున్నగు వానితో (ముడుచుకొని పోవుట మున్నగు వానితో) నుపలక్షితమై, హిమేషు = శిశిర ఋతువుల యందు, నిర్వాప్య = వినాశనుఁబొంది, తదాస్యసాలోక్యం; తత్ = ఆ దమయన్తి యొక్క, ఆస్య = ముఖమునకు, సాలోక్యం = దర్శనీ యత్వమును, అనగా రమణీయత్వమును (ఆమె ముఖముతో సమానత్వ మనఁబడు సాలోక్య రూపమైన ముక్తిని) ఇతం = పొందినదై, వ్యలోక్యతకిల = చూడఁబడినదా యేమి. మోక్షకాలమున నే దేవతను

స్మరింతురో వాని సాలోక్యమునఁ బొందుదురని శాస్త్రము. దమయన్తి ముఖమునకును, నద్దమందలి దాని ప్రతిబింబములకు నొం డొంటికిని సామీప్యముండుటవలన, నద్దమందలి ప్రతిబింబములు శిశిర ఋతువునందు నష్టములై యామె మోముతోఁ బోలికగలవై యా బింబ మునకు సమీపమందున్న పద్మములా? యని జనులు భావించిరని యర్థము.

**సమాసములు :**

ఆలియుగ్మార్పితదర్పణద్వయే:—ఆలోః, యుగ్మం = ఆలియుగ్మం, ఆలియుగ్మేన, అర్పితం = ఆలియుగ్మార్పితం, దర్పణయోః, ద్వయం = దర్పణద్వయం, ఆలియుగ్మార్పితం, చతత్, దర్పణద్వయంచ = ఆలియుగ్మార్పితదర్పణద్వయమ్, తస్మిన్ = ఆలియుగ్మార్పితదర్పణ ద్వయే.

తదాస్యమ్ :—తస్యాః, ఆస్యం = తదాస్యమ్.

నిశాసమాధిభిః ;—నిశాసు, సమాధయః,= నిశాసమాధయః, తైః = నిశాసమాధిభిః.

తదాస్యసాలోక్యం :—తస్యాః, ఆస్యం = తదాస్యం, ఆలోకేనసహ వర్తతఇతి = సాలోకం, సాలోకస్య, భావః = సాలోక్యం, తదాస్యేన, సాలోక్యం = తదాస్య సాలోక్యమ్, తత్ = తదాస్యసాలోక్యమ్.

పక్షాన్తరమున :—సమానః, లోకః, యస్యతత్=సలోకం, సలోకస్య, భావః = సాలోక్యం, తదాస్యేన, సాలోక్యం = తదాస్యసాలోక్యమ్, తత్ = తదాస్య సాలోక్యమ్.

**భావము ;**

చెలికత్తెలు చూపిన యద్దములలో బింబస్థానీయమగు నామె ముఖ మొక్కటియును ప్రధానమైనదియునై యున్నది. దానికంటే భిన్నమై ప్రతిబింబ ము లుపాధులనుఁ బట్టి పెక్కులుగాఁ గాననగును. ఇట్లే బ్రహ్మ మొక్కటైనను నవిద్యాదిరూపములగు నుపాధులనుఁబట్టి దాని ప్రతిబింబములు పెక్కులుగా నున్నవి. అట్లే ప్రకృతము దమయన్తి ముఖము బ్రహ్మస్థానీయమై యొక్కటి

గను, ముఖ్యముగను నున్నది. ఆ ముఖమునకు ప్రతిబింబస్థానీయములగు పద్మాదులు పెక్కులుగా నున్నవి. అందు పద్మము రాత్రులయందు యోగులవలె, దమయన్తి ముఖమును ధ్యానించుట మున్నగు వాని తోడను (బ్రహ్మమును ధ్యానించుట మున్నగు మోక్షోపాయములతోడను) కూడినదై శిశిరఋతువులందు వినాశమునుం బొందినదై (కేదారాది శీతలక్షేత్రములయందు, దపస్సుచే నష్ట దేహముగలదై) దమయన్తి ముఖమునకు నాలోకనీయత్వమను ననగా రమణీయత్వమును, మఱియు, నామె ముఖముతో సమానలోకత్వ రూపమగు ముక్తిని (ఆ ముఖ్యమగు బ్రహ్మతో సమానలోకత్వ రూపమగు ముక్తిని) పొందినదిగా ప్రజలచే చూడఁబడినదా? ఎట్లు బ్రహ్మమొక్కటియే యైనను, పెక్కండ్రు యోగులు, కేదారాదిశీతల క్షేత్రములయందు తపస్సుచే, తమ శరీరములను నష్టములు గావించుకొని తత్ప్రాప్తసాధనమగు సమాధిచే నా బ్రహ్మతో సాలోక్య రూపముక్తినిఁ బడయుచున్నారో అట్లే యొక్కటియు ముఖ్యమును, నగు దమయన్తి ముఖముతో సామ్యముఁ బడయుటకు యోగి చందమున పద్మములు శిశిర ఋతువులందు నష్టములగుచు రాత్రులందు ముడుచుకొనిపోవుచు నద్దములయందలి ప్రతిబింబరూపముల నివి పొందుచున్నవని ప్రజలచే భావింపఁబడినది. 52

శ్లో॥ పలాశదామేతి మిలచ్ఛిలీముఖై
ర్వృతా విభూషా మణిరశ్మిమణ్డలైః.
అలక్షి లక్షైర్ధనుషామసౌ తదా
రతీశ సర్వస్వతయాఽభిరక్షితా. 53

ప॥వి॥:- పలాశదామ - ఇతి - మిలచ్ఛిలీముఖైః - వృతా - విభూషామణిరశ్మిమణ్డలైః - అలక్షి - లక్షైః - ధనుషామ్ - అసౌ - తదా - రతీశ సరస్వతయా - అభిరక్షితా.

అర్థము :- పలాశదామ = మోదుగపుష్పములమాల, ఇతి = మాలయని, (విచిన్త్య = ఆలోచించి) మిలచ్ఛిలీముఖైః; మిలత్ = చేరుచున్న, శిలీముఖైః = తుమ్మెదలను (బాణములను) గ్లిన, విభూషామణిరశ్మి మణ్డలైః: విభూషామణి = ఆభరణములలోని, రశ్మి = కిరణములయొక్క, మణ్డలైః

= సమూహములచే వృతా = ఆవరింపఁబడిన, అసౌ = ఈదమయన్తి తదా = అలఙ్కరణము పూర్తియైన పిదప, రతీశసర్వస్వతయా; రతీశ = మన్మథుని యొక్క, సర్వస్వతయా = సర్వధనముగా, ధనుషాం = ధనస్సులయొక్క అనగా విలుకాండ్రయొక్క ("కున్తాః ప్రవిశన్తి" అనగా బల్లెములు ప్రవేశించుచున్నవని, బల్లెములు గలవారు ప్రవేశించునపుడెట్లు లక్షణ నవలంబించి చెప్పఁబడునో, అట్లే యిచ్చట ధనస్సులచే ధనస్సులను ధరించినవారు చెప్పఁబడుచున్నారు.) లక్షైః = లక్ష సంఖ్యలచే, ననగా లక్షసంఖ్యాకులగు విలుకాండ్రచే అభిరక్షితా = అంతట రక్షింపఁబడినదిగా, అలక్షి = చూడఁబడినది. వింటిరూపమున ప్రసరించు రత్నకాంతులతోఁ జుట్టబడిన యా దమయన్తి లక్షలకొలది విలుకాండ్రతో చుట్టును రక్షింపఁబడినట్లు భావింపఁబడినది. లోకమున రాజధనము సాయుధపాణులగు భటులు రక్షించుట ప్రసిద్ధముగదా.

వి:- ధనస్సులవంటి రత్నకాంతులతోఁ జుట్టఁబడిన దమయన్తి, విలుకాండ్రతో చుట్టఁబడి రక్షింపఁబడినట్లు భావించుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకము ను ప్రయోగించనందు వలన నది గమ్యము.

రత్నమాల కాన్తులను పలాశము లనెడి భ్రాన్తిచే తుమ్మెదలు మూగినట్లు వర్ణించుట వలన భ్రాన్తిమద లఙ్కారము.

**భావము :**

ఆ దమయన్తి కలఙ్కరణ క్రియ పూర్తియైనది. ఆమె శరీరమందు రత్నమాలలను తొడుగుటవలన నవి యామె చుట్టును కాంతులను, బ్రసరింపఁ జేయుచున్నవి. ఆ రత్నకాంతు లెఱ్ఱనివిగా నుండుటవలన నవి మోదుగపూల మాలలనెడి భ్రాన్తితో తుమ్మెదలు మూగుచున్నవి. అట్టి యాభరణ కాంతులతో పరివేష్టింపఁబడిన యా దమయన్తి మన్మథునియొక్క సర్వ ధనముగా వెలయు చుండుటవలన, ధనురాకారముగా వ్యాపించుచున్న యాభరణ కాంతులనెడి విండ్లను ధరించిన లక్షమంది విలుకాండ్రు, రాజధనమునుఁ బోలె నామెను రక్షించుచున్నట్లు కానవచ్చినదని యభిప్రాయము,

## సమాసములు

పలాశదామ:- పలాశానాం, దామ = పలాశదామ.

మిలచ్ఛిలీముఖైః :- మిలన్తః, శిలీముఖాః, యేషుతాని = మిలచ్ఛిలీముఖాని, తైః = మిలచ్ఛిలీముఖైః.

రతీశసర్వస్వతయా :- రత్యాః. ఈశః = రతీశః, రతీశస్య, సర్వస్వం = రతీశసర్వస్వం. రతీశసర్వస్వస్య, భావః = రతీశసర్వస్వతా, తయా = రతీశసర్వస్వతయా. 53

శ్లో॥ విశేషతీర్థై రివ జహ్నునన్దనా
గుణైరి వాజానికరాగ భూమికా.
జగామ భాగ్యై రివనీతిరుజ్జ్వలై
ర్విభూషణై స్తత్సుషమా మహార్ఘతాం॥ 54

ప॥వి॥ :- విశేషతీర్థైః - ఇవ - జహ్నునన్దనా - గుణైః - ఇవ - ఆజానికరాగ భూమికా - జగామ - భాగ్యైః - ఇవ - నీతిః - ఉజ్జ్వలైః - విభూషణైః - తత్సుషమా - మహార్ఘతాం.

అర్థము :- విశేషతీర్థైః = (ప్రయాగాది క్షేత్రములయందు) యమునా సరస్వతీ ప్రభృతి తీర్థములచే, జహ్నునన్దనా = ఇవ = జహ్నుమహర్షికి మాత్రై యగు గఙ్గానదివలె, గుణైః = విద్యావినయాది గుణములచే, ఆజానిక రాగభూమికా ఇవ; ఆజానిక = సహజమైన, రాగ = ప్రేమకు, భూమికా ఇవ = స్థానమువలె ననగా వినయాదిగుణములచే సహజ స్నేహపాత్రులగు పుత్రాదులవలె, భాగ్యైః = అనుకూలదైవాదులచే, నీతిరివ= ఉపాయములకు సాఫల్యమువలెను, ఉజ్జ్వలైః = ప్రకాశవన్తములగు, విభూషణైః = ఆభరణములచే, తత్సుషమా = ఆమెయొక్క కాంతి, మహార్ఘతాం = మిక్కిలి యుత్కర్షను, జగామ = పొందినది

## సమాసములు

విశేషతీర్థైః :- విశేషాః, తీర్థాని = విశేషతీర్థాని = విశేషతీర్థాని తైః = విశేషతీర్థైః.

జహ్నుఁనన్దనా :- జహ్నోః, నన్దనా = జహ్నునన్దనా.

ఆజానికరాగభూమికా :- అజనాత్, ఉత్పన్నః = ఆజానికః, ఆజానికశ్చాసౌ, రాగశ్చ = ఆజానికరాగః, ఆజానికరాగస్య, భూమికా=ఆజాని రా భూమికా.

తత్సుషమా :- తస్యాః, సుషమా = తత్సుషమా.

మహార్ఘతాం:- మహాన్, అర్ఘః, యస్యాస్సా = మహార్ఘా, మహార్ఘాయాః, భావః = మహార్ఘతా, తామ్ = మహార్ఘతామ్.

**భావము :**

ప్రయాగాది క్షేత్రములయందు, యమునా సరస్వతీ నదుల కలయికచే గఙ్గానది గొప్ప మహిమనుఁ బొందుచున్నది. సహజ స్నేహపాత్రులగు పుత్రాదులు, విద్యావినయాది గుణములతో నుత్కర్షనుఁ బొందుదురు. దైవానుకూల్యాదులచే నుపాయములు గూడ ఫలించుచుండను. ఆ విధముగనే దేదీప్యమానములగు నాభరణములచే దమయన్తియొక్క సౌందర్యము మహోత్కర్షనుఁ బొందినది.

54

శ్లో॥ నలాత్ స్వవైశస్త్య మనాప్తుమానతా
నృపస్త్రియో భీమ మహోత్సవాగతాః।
తదఙ్గలాక్షామదధన్త మఙ్గలం
శిరఃసు సిందూరమివ ప్రియాయుషే॥ 55

ప॥వి॥ :- నలాత్-స్వవైశస్త్యమ్ - అనాప్తుమ్-ఆనతాః-నృపస్త్రియః - భీమ మహోత్సవాగతాః - తదఙ్గలాక్షామ్- అవధన్త - మఙ్గలం - శిరస్సు - సిన్దూరమ్ - ఇవ - ప్రియాయుషే.

అర్థము :- నలాత్ = నలునియొద్దనుండి, స్వవైశస్త్యం; స్వ = తమకు, వైశస్త్యం = వైధవ్యమును, అనాప్తుం = పొందక యుండుటకు, ఆనతాః = వంగినవారును - అట్లు వినయముతో దమయన్తియొద్ద వంగకపోయిచో నలుఁడు, వైరముఁ జేసుకొనుచున్న తమ భర్తలను జంపగలడని భయము భీమమహోత్సవాగతాః; భీమ = భీమరాజు

గావి చిన, మహోత్సవ = దమయన్తీ వివాహమహోత్సవమునందు, ఆగతాః = వచ్చిన, నృపస్త్రియః = ఇతర రాజుల కాంతలు, ప్రియాయుషే = తమ భర్తల యాయుస్సునకై, మంగల = మఙ్గళకరమైన, అనగా ఆ వైధవ్యమును సూచించు సిన్దూరమివ = సిందూరమునువలె, తదఙ్ఘ్రిలాక్షాం; తత్ = ఆ దమయన్తియొక్క, అఙ్ఘ్రి = పాదముల యందలి, లాక్షాం = లత్తుకను, దమయన్తికి, వన్దన మాచరించుట వలన లగ్నమైనదానిని, శిరస్సు = తమతమ శిరస్సులలోని పాపటల యందు, అదధన్త = ధరించిరి. స్త్రీలు నొసట సిందూరమును ధరించుట సుమఙ్గలీత్వ సూచకమని యర్థము.

## సమాసములు :

స్వవైశ్వస్త్యం:- విశ్వస్తాయాః, భావః= వైశ్వస్త్యమ్, స్వస్య వైశ్వస్త్యం = స్వవైశ్వస్త్యం, తత్ = స్వవైశ్వస్త్యమ్.

నృపస్త్రియః:- నృపాణాం, స్త్రియః = నృపస్త్రియః.

భీమమహోత్సవాగతాః:- భీమస్య, మహోత్సవః = భీమమహోత్సవః భీమమహోత్సవమ్, ఆగతాః = భీమమహోత్సవాగతాః.

తదఙ్ఘ్రిలాక్షాం:- తస్యాః, అఙ్ఘ్రీ=తదఙ్ఘ్రీ, తదఙ్ఘ్ర్యోః, లాక్షా తదఙ్ఘ్రి= లాక్షా, తామ్ = తదఙ్ఘ్రిలాక్షాం.

ప్రియాయుషే:- ప్రియాణామాయుః = ప్రియాయుః, తస్మై = ప్రియాయుషే,

## భావము :

ఆ దమయన్తీ కళ్యాణమహోత్సవమునకు నేతెంచిన రాజస్త్రీలు, వైరపు కృత్యములఁ జేయు తమ తమ భర్తల నొకవేళ నలుఁడు సంహరించినచో, తమకు వైధవ్యము వచ్చునను భయముతో నది రాకయుండుటకై వినయముతో దమయన్తి ముందు వందన మాచరించిరి. మఱియు వారు తమ తమ భర్తల యాయువు పెరుగుటకై మంగలకరమైనదియును, సుమఙ్గలీత్వమును సూచించునదియు నగు సిందూరమునువలె, నా దమయన్తి పాదములకు వందన మాచ

రించు నపుడంటుకొనిన యామె పాదములలోని పారాణిని తన పాపటల కలదు కొనిరి. స్త్రీలు పాపటలయందు సిందూరమును ధరించుట వారికి సుమఙ్గలీత్వము సూచించునని యాశయము. 55

శ్లో॥ అమోఘభావేన సనాభితాం గతాః
ప్రసన్న గీర్వాణ వరాక్షరస్రజాం
తతః ప్రణమ్యాధిజగామ సాహ్రియా
గురుర్గురు బ్రహ్మ పతివ్రతాశిషః॥ 56

ప॥వి॥ :- అమోఘభావేన - సనాభితాం - గతాః - ప్రసన్న గీర్వాణవరాక్షర స్రజాం - తతః - ప్రణమ్య - అధిజగామ - సా - హ్రియా - గురుః - గురుబ్రహ్మపతివ్రతాశిషః.

అర్థము :- తతః = అలఙ్కరణమైన పిదప, హ్రియా = సిగ్గుచే, గురుః = భారముగల, అనగా మిక్కిలి సిగ్గునొందిన, సా = ఆ దమయన్తి, ప్రణమ్య = గురువు మున్నగు వారికి నమస్కరించి, అమోఘభావేన= వైఫల్యములేనిభావముతో, ప్రసన్న గీర్వాణవరాక్షరస్రజామ్; ప్రసన్న= ప్రసన్నులైన, గీర్వాణ = ఇంద్రాదిదేవతలయొక్క, వర = వరదాన రూపములగు, అక్షరస్రజాం = వర్ణమాలికలకు, సనాభితాం = సామ్యమును, గతాః = పొందిన, అనగానట్లే యమోఘములైన, గురు బ్రహ్మ పతివ్రతాశిషః; గురు = తల్లిదండ్రులయొక్కయు, బ్రహ్మ = బ్రాహ్మణులయొక్కయు, పతివ్రతా = పతివ్రతలగు స్త్రీలయొక్కయు, ఆశిషః = దీవెనలను, అధిజగామ = పొందినది.

**సమాసములు :**

అమోఘభావేన :- న, మోఘః = అమోఘః, అమోఘశ్చాసౌ భావశ్చ= అమోఘభావః, తేన = అమోఘభావేన.

సనాభితాం :- సమానా, నాభిః, యాసాంతాః = సనాభయః, సనాభీనాం భావః = సనాభితా, తాం = సనాభితాం.

ప్రసన్న గీర్వాణవరాక్షరస్రజామ్ :- ప్రసన్నాశ్చ తే గీః ప్రాణాశ్చ = ప్రసన్న గీర్వాణాః, ప్రసన్నగీర్వాణానాం, వరాః = ప్రసన్నగీర్వాణ వరాః, ప్రసన్నగీర్వాణ వరా ఏవ అక్షరస్రజః = ప్రసన్న గీర్వాణ వరాక్షరస్రజః, తాసాం = ప్రసన్నగీర్వాణ వరాక్షరస్రజాం.

గురుబ్రహ్మ పతివ్రతాశిషః :- గురవశ్చ, బ్రహ్మణాశ్చ, పతివ్రతాశ్చ,= గురుబ్రహ్మ పతివ్రతాః, గురుబ్రహ్మ పతివ్రతానామ శిషః= గురుబ్రహ్మ పతివ్రతాశిషః, తాః=గురుబ్రహ్మ పతివ్రతాశిషః.

**భావము :**

అలఙ్కారణము పూర్తియైన పిదప, అధికమగు లజ్జగల యా దమయన్తి గురువులు మున్నగు వారికి నమస్కరించి వైఫల్యములేని భావముతోఁ బ్రసన్నులైన యిన్ద్రాది దేవత లొసంగిన వరరూపములగు నక్షరమాలలకు సమానములగు ననగా నా విధముగనే సఫలమగునట్టి దీవెనలను తల్లిదండ్రులును, బ్రాహ్మణులును, పతివ్రతలును, నను వీరివలన బొందనది. 56

శ్లో॥ తథైవ తత్కాలమథాను జీవిభిః
ప్రసాధనా సఙ్గన శిల్పపారగైః
నిజస్వపాణి గ్రహణ క్షణోచితా
కృతా నలస్యాఽపి విభోర్విభూషణా॥ 57

ప॥వి॥ :- తథా - ఏవ - తత్కాలమ్, అథ, అనుజీవిభిః - ప్రసాధనాసఙ్గన శిల్పపారగైః - నిజస్య - పాణిగ్రహణక్షణోచితా - కృతా - నలస్య- అపి - విభోః - విభూషణా.

అర్థము :- అథ = ఇట్టి యవసరమందు, తత్కాలం = ఆ సమయమున, తథైవ = దమయన్తికెట్లో, అట్లే, ప్రసాధనాసఙ్గన శిల్పపారగైః; ప్రసాధన = అలఙ్కారములను, ఆ సఙ్గన = చేయుటయను, శిల్ప = విద్యకు, పార = అవలిగట్టును, గైః = పొందినట్టి, అనుజీవిభిః = భృత్యులచే, నిజస్య = తమకు సంబంధించిన, విభోః = స్వామియగు, నలస్యాఽపి = నలునకును, పాణిగ్రహణ క్షణోచితా; పాణిగ్రహణ

క్షణ = పెండ్లిసమయమునకు, ఉచితా = తగిన, విభూషణా = అల
ఙ్కారణము, కృతా = చేయఁబడినది.

**సమాసములు :**

తత్కాలమ్:-సచాసౌ, కాలశ్చ=తత్కాలః, తమ్ తత్కాలమ్ లేదా—
సఏవకాలః, యస్మిన్ కర్మణితత్ = తత్కాలం.

ప్రసాధనాసఙ్జన శిల్పపారగైః:- ప్రసాధనా నామాసఙ్జనం, ప్రసాధనా
సఙ్జనం, ప్రసాధనా సఙ్జనమేవ శిల్పః = ప్రసాధనా సఙ్జన శిల్పః,
ప్రసాధనాసఙ్జన శిల్పస్య, పారం=ప్రసాధనాసఙ్జన శిల్పపారం, ప్రసా
ధనాసఙ్జనశిల్పపారం గచ్ఛన్తీతి = ప్రసాధనా సఙ్జనశిల్ప పారగాః,
తైః = ప్రసాధనా సఙ్జనశిల్ప పారగైః.

పాణిగ్రహణోచితా :- పాణౌ, గ్రహణం = పాణిగ్రహణం, పాణిగ్రహ
ణస్య, ఉచితా = పాణిగ్రహణోచితా.

**భావము:**

దమయన్తి కలఙ్కారణము చేయుకాలమునందే యామెకెట్లలఙ్కారణము
జరుపఁబడినదో ఆ విధముగనే, ఆలఙ్కారణ కళయందు నిపుణులగు భృత్యు
లచే తన నాథుడగు నలునికిని, పెండ్లికి తగిన యలఙ్కారణము గావింపఁ
బడినది.
57

శ్లో॥ నృపస్య తత్రాధికృతాః పునః పునః
విచార్య తాన్ బంధ మవాపయన్ కచాన్.
కలాపలీలోప నిధిర్గరుత్మ్యజః
సయైరపాలాపి కలాపి సంపదః॥ 58

ప॥వి॥ :- నృపస్య - తత్ర - అధికృతాః - పునః - పునః - విచార్య - తాన్
బంధమ్ - అవాపయన్ - కచాన్ - కలాపలీలోపనిధిః - గరుత్మ్యజః -
సః - యైః - అపాలాపి - కలాపిసంపదః.

అర్థ ౧ :- తత్ర = ఆ నలమహారాజు నలఙ్కరించుటయందు, అధికృతాః = నియమింపఁబడినవారు, తాన్ = చెప్పఁబడగల, నృపస్య = నలునియొక్క కచాన్ = వెంట్రుకలను, విచార్య = లోపములను విచారించి, పునః పునః = పలుమాఱు, బంధం = ముడిని, అవాపయన్ = పొందించిరి. యైః = ఏ వెంట్రుకలచే, గరుత్త్యజః = ఱెక్కలను వదలునట్టి (శరదృతువునందు నెమళ్ళకు ఱెక్కలు పీడునని ప్రసిద్ధి) కలాపిసంపదః; కలాపి = నెమళ్ళయొక్క, సంపదః = సంఘముయొక్క, సః = ఱెక్కల్లు పీడుకాలమునఁ జేయఁబడిన, కలాపలీలోప నిధిః; కలాప = పింఛములకు, లీలా = విలాసమనెడి, ఉపనిధిః = కుదువ, అనగా పింఛములు విడచుకాలమునఁ జేయఁబడిన కుదువ, అపాలాపి = ఎగవేయఁబడినదో, మఱల ఱెక్కలు మొలచుకాలమునను నా విలాసము తిరిగి యీయఁబడలేదు. అందువలన విలాసములనుఁ బుచ్చుకొని యెగవేసిన కురులకు బంధనము, అనగా బంధించుట, ముడివేయుట యనునవి తగినవి.

సమాసములు

కలాపలీలోపనిధిః :- కలాపస్య, లీలా = కలాపలీలా, కలాపలీలైవ, ఉపనిధిః = కలాపలీలోపనిధిః.

గరుత్త్యజః :- గరుతం, త్యజన్తీతి = గరుత్త్యజః.

కలాపిసంపదః :- కలాపినాం, సంపద్, కలాపిసంపద్, తస్యాః = కలాపిసంపదః.

భావము :

ఆ నలు నలఙ్కరించుటకు నియమింపఁబడిన వారలు, అనగా మంగలి మున్నగు వారలు, మాటిమాటికి విచారించి అనగా ధూపమువలన పొగవేసి చక్కగా కురుల నెండించి దువ్వెనతో దువ్విరి. ప్రక్కన ధూమమువలన, పొగి రేగుచుండుటవలన ఆ నల్లని పొగకును, కురులకును భేదము తెలియనందువలన వానిలో నేద్ది పొగ, యేవి కురులని వారికి చక్కగా నిశ్చయించుకొనవలసి వచ్చినది. మఱియు నే పుష్పములనే వైపు పెట్టవలయును ?

22)

అనియు నుచితానుచితములనుఁ బర్యాలోచించి యా కురులకు దగిన ముడులను వైచిరి. ఆ కుచలు, శరదృతువునందు పింఛములను వదలునట్టి నెమళ్ళ కలాపవిలాసములను దిరస్కరించినవి. "కలాపత్యజః" అని చెప్పక "గరుత్త్యజః"యని చెప్పుటచే నా నెమళ్ళకు తమ కలాపములపైని విరక్తియు సూచితము. ఏనయనగా నలుని కేశములు, ఆ నెమళ్ళ పింఛములలోని విలాసములను, పింఛముల తీరు శరదృతువునందు దాచుటకై తమవద్ద కొని మఱల నా నెమళ్ళకు పింఛములు మొలవనారంభించినను తిరిగి యీయక యెగవేసినవి. ఇట్లు ఒకరి వస్తువును దాచియుంచుటకై అనగా కాపాడుటకై తీసికొని మఱల నీయనివారికి బంధనాది రాజదణ్డము తప్పదుగదా! అట్లే నెమలి పింఛముల విలాసములను గాపాడుటకై తమయొద్ద నుంచుకొనిన నలుని కురులు వానిని కలాపములకై తిరిగి యీయనందువలన మాటిమాటికి బంధనమను శిక్షకు గుఱిచేయఁబడినది. ఇచ్చట బంధనమనగా దీసిన వెంట్రుకలను ముడివేయుట యనియు నర్థము.అనగా కేశప్రసాధనము చేయువారలు నలుని వెంట్రుకలు ముడివైచిరనియు నవి నెమలి పింఛములను మించియున్నవనియు నాశయము. 58

శ్లో॥ పతత్రిణాం ద్రాఘిమశాలినా ధను
ర్గుణేన సంయోగ జుషాం మనోభువః
కచేనతస్యార్జిత మార్జన క్రియా
సమేత్యసౌభాగ్యమలమ్భి కుడ్మలైః॥ 59

ప॥వి॥ :- పతత్రిణాం - ద్రాఘిమశాలినా - ధనుర్గుణేన — సంయోగజుషాం - మనోభవః - కచేన - తస్య - ఆర్జితమార్జన క్రియా - సమేత్య - సౌభాగ్యమ్ - అలమ్భి - కుడ్మలైః.

అర్థము :- కుడ్మలైః = సగము పూచిన మొగ్గలచే, ద్రాఘిమశాలినా; ద్రాఘిమ = పొడవుతో, శాలినా = కూడిన, అర్జితమార్జనక్రియా; అర్జిత = సంపాదింపఁబడిన, మార్జన క్రియా = దువ్వుట మున్నగు సంస్కారసంపదతోఁ గూడిన, తస్య = ఆ నలునియొక్క, కచేన=కురులముడితో, సమేత = కలసి, ద్రాఘిమశాలినా = పొడవుతోఁ గూడిన, ఆర్జిత మార్జనక్రియా;

అర్జిత = సంపాదింపఁబడిన, మార్జనశ్రియా = మైనము మున్నగువానిచే రాచుట మున్నగునవి గల్గిన. ధనుర్గుణేన = తుమ్మెదలబారనెడి యల్లె త్రాటిచే, సంయోగజుషాం; సంయోగ = సంధానమును, అనగా నమ్ము లనుఁ గూర్చుట మున్నగు క్రియను, జుషాం = పొందిన, మనోభువః= మన్మథునియొక, పతత్రిణాం = బాణములయొక్క, సౌభాగ్యం=సౌంద ర్యమువంటి సౌందర్యమును, అలమ్భి = పొందింపఁబడినది.

వి॥ :- నలుని కేశపాశముచే మన్మథుని బాణముల సౌభాగ్యము పొందింపఁబడిన దని చెప్పుటవలన—వాక్యార్థవృత్తి నిదర్శనాలంకారము. నల వాక్యార్థ మునకు, స్మరవాక్యార్థమునకు నైక్యమారోపింపఁ బడినందువలన నిది వాక్యార్థవృత్తి నిదర్శన.

**సమాసములు :**

ద్రాఘిమశాలినా :- దీర్ఘస్య, భావః=ద్రాఘిమ, ద్రాఘిమ్నా, శాలత ఇతి = ద్రాఘిమశాలీ, తేన = ద్రాఘిమశాలినా.

ధనుర్గుణేన :- ధనుషః, గుణః = ధనుర్గుణః, తేన = ధనుర్గుణేన.

సంయోగజుషాం :- సంయోగం, జుషన్తీతి = సంయోగజుషః, తేషాం= సంయోగజుషాం.

ఆర్జితమార్జనశ్రియా :- మార్జనస్య, శ్రీః = మార్జనశ్రీః ఆర్జితా, మార్జనశ్రీః, యేనసః = ఆర్జితమార్జనశ్రీః, తేన = ఆర్జితమార్జనశ్రియా.

**భావము :**

సగము పూచిన మొగ్గలచేఁ గూడినవై, పొడవైనవియు చక్కఁగా దువ్వఁ బడినవై సంస్కారముఁ బొందినవియు నగు నలుని కురులముడి; పొడవైనదియు మైనము రాచుట మున్నగు సంస్కార సంపదగలవై తుమ్మెదల బారనెడి యల్లె త్రాటియందు సంధింపఁబడిన మన్మథ బాణముల సౌందర్యమువంటి సౌందర్యము పొందినది. నలుని తలపై నుంచఁబడిన సగము పూచిన మొగ్గలు మన్మథ బాణములవలెను, దువ్వఁబడుట మున్నగు సంస్కారములచే మెత్తఁబడిన యాతని కురులు, నల్లని తుమ్మెదలనెడి మన్మథుని యల్లె త్రాడువలెను నున్నవి అట్టి వానిని ధరించి నలుడు మన్మథుడు వలె నున్నాడు.

శ్లో॥ అనర్ఘ్య రత్నౌఘ మయేన మణ్డితో
రరాజరాజా ముకుటేన మూర్ధని.
వనీయకానాం సహికల్ప భూరుహ
స్తతో విముఞ్చన్నివ మఞ్జు మఞ్జరీం॥ 60

ప॥వి॥ :- అనర్ఘ్యరత్నౌఘమయేన - మణ్డితః - రరాజ - రాజా - మకుటేన- మూర్ధని - వనీయకానాం - సః - హి - కల్పభూరుహః - తతః - విముఞ్చన్ - ఇవ - మఞ్జుమఞ్జరీం.

అర్థము :- హి = ఏలయనగా, సః = ఆ, రాజా = రాజైననలుడు, వనీయకానాం = యాచకులకు, కల్పభూరుహః=కల్పవృక్షము. తతః = అట్లు కల్పవృక్షముగా నుండుటవలన, అనర్ఘ్య రత్నౌఘమయేన; అనర్ఘ్య = అమూల్యములగు, రత్న = రత్నములయొక్క, ఓఘమయేన = సమూహరూపమైన, ముకుటేన = కిరీటముచే, మూర్ధని = శిరమునందు, మణ్డితః = అలఙ్కరింపఁబడినవాడై, మఞ్జుమఞ్జరీం; మఞ్జు = ఫలప్రద మైనదియు, మనోహరమైనదియు నగు, మఞ్జరీం = మొగ్గలతోఁగూడిన లేత కొమ్మను, విమఞ్చన్నివ = యాచకులకై విడచుచున్నాడో యను నట్లు, రరాజ = శోభించెను.

వి॥ :- ఇచ్చట నలుడు కల్పభూరుహమై మఞ్జు మఞ్జరిని యాచకులకై విడువక పోయినను, విడచుచున్నాడో యనునట్లు భావించుటవలన నుత్ప్రేక్ష.

**సమాసములు :**

అనర్ఘ్యరత్నౌఘమయేన :- న, అర్ఘ్యాణి = అనర్ఘ్యాణి, అనర్ఘ్యాణిచ తాని, రత్నానిచ= అనర్ఘ్యరత్నాని, అనర్ఘ్యరత్నానామోఘః = అనర్ఘ్యరత్నౌఘః. అనర్ఘ్యరత్నౌఘేన, ప్రచురః = అనర్ఘ్యరత్నౌఘమయః, తేన = అనర్ఘ్యరత్నౌఘమయేన.

మఞ్జుమఞ్జరీం :—మఞ్జుశ్చాసౌ, మఞ్జరీచ = మఞ్జుమఞ్జరీ, తాం = మఞ్జుమఞ్జరీం.

భావము :

ఆ నలమహారాజు, యాచకులకు కల్పవృక్షమైనందువలన, నమూల్యము లగు రత్నములతోఁ బొదుగఁబడిన కిరీటముచే శిరమునం దలఙ్కరింపఁబడిన వాడై ఫలప్రదమగు మొగ్గలతో గూడిన లేఁగొమ్మను యాచకులకై విడచుచు న్నాడో యనునట్లు—ప్రకాశించెను. భూమిలో మొలచిన చెట్టుయొక్క కొమ్మలో రత్నము లుండవు కాని కల్పవృక్షము స్వర్గమునఁ బుట్టినందువలన నది రత్న మయమై యుండును. కావుననే యాచకులకు కోరిన వాని నొసంగు నలుడను కల్పవృక్షము, అమూల్యము లగు రత్నములతో ఖచితమైన కిరీటమును ధరించినవాడై నందువలన నట్టి కిరీటమునుండి రత్న ప్రచురమైన లేఁగొమ్మను నిట విడచుట యుచితమేయైనది. 60

శ్లో॥ నలస్య ఫాలే మణివీర పట్టికా
నిభే న లగ్నః పరిధిర్విధోర్బభౌ.
తదా శశాఙ్కాధిక రూపతాంగతే
తదాననే మాతు మశక్తి ముద్వహన్॥ 61

ప॥వి॥ నలస్య, - ఫాలే - మణివీరపట్టికానిభేన - లగ్నః - పరిధిః - విధోః - బభౌ - తదా - శశాఙ్కాధిక రూపతాం - గతే - తదాననే - మాతుమ్ - అశక్తిమ్ - ఉద్వహన్.

అర్థము :-విధోః = చంద్రునియొక్క, పరిధిః = పరివేషము, నలస్య = నలుని యొక్క, ఫాలే = లలాటమందు, మణివీరపట్టికానిభేన; మణి = రత్న మయమైన, వీరపట్టికా = వీరులచే ధరింపఁబడు బిరుద పత్రమనెడి, నిభేన = మిషచే, లగ్నససన్ = తగుల్కొనినదై, తదా = అలఙ్కరణకాలమందు, శశాఙ్కాధిక రూపతాం; శశాఙ్క = చంద్రునికంటె, అధికరూపతాం = అధిక సౌందర్యమునుఁ గల్గియుండుటను, గతే = పొందిన, అనగా చంద్రునికంటెను నధిక వైశాల్యముగలదియును నతి సుందరమునగు, తదాననే = ఆ నలుని ముఖమునందు, మాతుం = పట్టుటకు, అశక్తిం = అశక్తిని, ఉద్వహన్ = వహించుచు, బభౌ = శోభించెను,

**సమానములు :**

మణిపీఠపట్టికానిభేన :— పీఠానాం, పట్టికా, పీఠపట్టికా, మణిమయీచసా పీఠపట్టికాచ = మణిపీఠపట్టికా, మణిపీఠపట్టికాయాః, నిభః = మణిపీఠపట్టికానిభః, తేన = మణిపీఠపట్టికానిభేన.

శశాఙ్కాధికరూపతాం :—శశాఙ్కాత్, అధికం = శశాఙ్కాధికం, శశాఙ్కాధికం, రూపం, యస్యసః = శశాఙ్కాధికరూపః, శశాఙ్కాధికరూపస్య, భావః = శశాఙ్కాధికరూపతా, తాం = శశాఙ్కాధికరూపతాం.

తదాననే ;—తస్య, ఆననం, తదాననం, తస్మిన్ = తదాననే.

అశక్తిం :—న, శక్తిః = అశక్తిః, తామ్ = అశక్తిం.

**భావము :**

నలుని లలాటమునందు రత్నమయమగు పీఠపట్టిక యనగా పీఠుఁడను బిరుదమును సూచించెడి పత్రము కట్టఁబడియున్నది. కాని యా పత్రమనెడి నెపముతో చంద్రుని పరివేషమే యతనినొసట లగ్నమైనట్లు భావింపఁబడినది. కాని యలఙ్కరణ కాలమందు చంద్రుని కంటె నధిక సౌందర్యమును, నధిక వైశాల్యమునుఁ బొందిన యా నలుని ముఖమునందది పట్టజాలదో యనునట్లు శోభించినది.

వి:- ఇచ్చట పీఠపట్టికా వ్యాజమున విలసిల్లు చంద్రపరివేషము నలుని ముఖమునందుఁ బట్టజాలనందువలన నాధారాధేయములకననురూపత్వ వర్ణనము నధికాలఙ్కారము మఱియు నిట మరో పీఠపట్టికనపహ్నవించి చంద్రపరివేషమును నలముఖములో నొకభాగముగ నుత్ప్రేక్షించుటవలన సాపహ్నవోత్ప్రేక్ష. వ్యఞ్జకమునుఁ బ్రయోగింపనందు వలననది గమ్యము.

శ్లో॥ బభూవ భైమ్యాః ఖలు మానసౌకసం
జిఘాంసతో ధైర్యభరం మనోభువః.
ఉపకృతద్వర్తుల చిత్రరూపిణీ
ధనుస్సమీపే గులికేవ సజ్జతా. **62**

ప॥వి॥ బభూవ - భైమ్యాః - ఖలు - మానసౌకసం - జిఘాంసతః - ధైర్య

భరం - మనోభువః - ఉపభ్రు - తద్వర్తుల చిత్రరూపిణీ - ధనుస్స
మీపే - గులికా - ఇవ - సజ్జతా.

అర్థము :— భైమ్యాః = దమయన్తి యొక్క, మానసౌకసం; మానస = మనస్సను, (మానససరోవరమును) ఒకసం = స్థానముగాఁగల్గిన (హంసను) ధైర్యభరం = ధైర్యాతిశయమును, జిఘాంసతః = చంప గోరుచున్న, (హరింపగోరుచున్న) మనోభువః = మన్మథుని యొక్క, ధనుస్సమీపే = వింటియొద్ద, గులికా = పక్షులను, గొట్టుగుండు, ఉపభ్రు = కనుఁబొమ్మల సమీపమునందు, సజ్జతా=మిలితమైన, తద్వర్తుల చిత్రరూపిణీవ, తత్ = ఆ నలునియొక్క, వర్తుల = గుండ్రమైన చిత్ర = తిలకము యొక్క, రూపిణీవ = రూపముగలదియో యను నట్లు, బభూవఖలు = ఉండినదిగదా. నలుఁడువెంటనే దమయన్తి చిత్తము నాకర్షింపగల తిలకమును ధరించెనని యర్థము.

వి:- మన్మథుని వింటియొద్ద నున్నట్టి, పక్షులు మున్నగు వానిని గొట్టెడి గుండు నలుని కనుబొమ్మల సమీపమున నొసట ధరింపఁబడిన గుండ్రమైన తిలకముగా భావింపఁబడుటవలన నుత్ప్రేక్ష.

"త్రిపుణ్డ్రం సురవిప్రాణాం, వర్తులం నృపవైశ్యయోః
అర్ధచన్ద్రన్తు శూద్రాణా మన్యేషామూర్ధ్వ పుణ్డ్రకమ్॥

అను స్మృతి ననుసరించి దేవతలకును, బ్రాహ్మణులకును మూడు పుణ్డ్రములుగను అనగా రేఖలుగను, క్షత్రియ వైశ్యులకు గుండ్రముగను శూద్రులకు నర్ధచన్ద్రాకారముగను, నితరులకు నిలువరేఖలుగను, తిలక ముండవలయును కాన నలుఁడు క్షత్రియుడైనందువలన నతనినొసట వర్తులాకారపు తిలకముండినది.

## సమాసములు :

మానసౌకసం :—మానసం, ఓకః, యస్యసః = మానసౌకాః, తం మానసౌకసం

జిఘాంసతః ;- హంతుమిచ్ఛన్ = జిఘాంసన్, తస్య = జిఘాంసతః.

తద్వర్తులచిత్రరూపిణీ :—వర్తులంచతత్ చిత్రంచ = వర్తులచిత్రం,

తస్యావర్తులచిత్రం = తద్వర్తులచిత్రం, తద్వర్తులచిత్రస్య, రూపమివ రూపమస్యాః అస్తీతి = తద్వర్తులచిత్రరూపిణీ.

ధనుస్సమీపే :—ధనుషః సమీపం= ధనుస్సమీపం. తస్మిన్ = ధనుస్సమీపే !

భావము:-

దమయన్తి మనస్సున నెలకొనిన ధైర్యాతిశయమును మఱియు నామె మనస్సనెడి మానస సరస్సున నివసించు హంసనుఁ జంపగోరుచున్న మన్మథుని వింటి యొద్ద నున్న గుండు నలుని నొసట ధరింపఁబడిన తిలకము యొక్క యాకారమును ధరించినదిగా భావింపఁబడినది. నలుని కను బొమ్మలు మన్మథుని విల్లుగను, నా కనుబొమ్మల మధ్య నొసట ధరింపఁబడిన తిలకము, హంస మున్నగు పక్షులఁ గొట్టెడి గుండుగను దమయన్తి మనస్సునందలి ధైర్యము హంసగను భావింపఁబడినది. అనగా నలజ్ఞరణ సమయమందు నలమహారాజు, తన నొసటఁ దిలకమును ధరించెననియు, నది దమయన్తి నాకర్షించుచున్నదనియు భావము.

శ్లో॥ అచుమ్బి సా చన్దనబిన్దు మణ్డలీ
నలీయవక్త్రేణ సరోజతర్జినా।
శ్రియం శ్రితా కాచన తారకాసఖీ
కృతా శశాఙ్కస్య తయాఽఙ్కవర్తినీ. 63

ప॥వి॥ అచుమ్బి, — సా, చన్దనమ్,- ఇన్దు మణ్డలీ,- నలీయ వక్త్రేణ, - సరోజ తర్జినా, - శ్రియం, - శ్రితా, - కాచన, - తారకా, - సఖీ,- కృతా, - శశాఙ్కస్య, - తయా, - అఙ్కవర్తినీ, -

అర్థము :-సరోజ తర్జినా; సరోజ = పద్మములను, తర్జినా= బెదరించునట్టి, నలీయ వక్త్రేణ; నలీయ = నలునికి సంబంధించిన, వక్త్రేణ = ముఖముతో, ముఖ చంద్రునిచే నని యర్థము ('సరోజ తర్జి' యను విశేషణము చేతను తారకా యోగ సామర్థ్యము చేతను చంద్రుడను యర్థము లభించును) యా =ఏ, చన్దన బిన్దు మణ్డలీ; చన్దన బిందు=

పూర్వము నొసట ధరింపఁబడినట్లు చెప్పఁబడిన చందనపు బొట్టనెడి గుండ్రపు తిలకము, అచుమ్బి = స్పృశింపఁబడినదో, తయా = ఆ చన్దనపు బొట్టుచే, శశాఙ్కస్య = చంద్రునికి, ఉజ్జవర్తినీ=సమీపమందున్నదై, శ్రియం= శోభను. శ్రితా= ధరించుచున్న, కాచన= అశ్విని మున్నగు వానిలో నొక్కటైన తారకా = నక్షత్రము, సఖీ= సహచరిగా, కృతా= చేయఁబడినది. అనగా చందన బిందు తిలకముచే గూడిన నలుని ముఖము, పగలు తారతో గూడిన చంద్రునివలె శోభించినదని యర్థము.

వి:- ఇచ్చట చందన తిలకముచేఁ గూడిన నలుని ముఖము పగలు తారతో గూడిన చంద్రుడుగా భావింపఁ బడుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకమును, ప్రయోగింపనందువలన నది గమ్యము

సమాసములు:-

చన్దన బిందు మణ్డలీ: — చన్దనస్య, బిందుః = చన్దన బిందుః చన్దన బిందోః, మణ్డలీ = చన్దన బిందు మణ్డలీ.

నలీయ వక్త్రేణ:— నలస్య, ఇదం = నలీయం, నలీయంచ తత్, వక్త్రంచ = నలీయ వక్త్రం, తేన = నలీయ వక్త్రేణ.

సరోజ తర్జినా:- సరోజం, తర్జయతీతి=సరోజ తర్జి. తేన=సరోజతర్జినా.

ఉజ్జవర్తినీ:- ఉజ్జే, వర్తత ఇతి= ఉజ్జవర్తినీ

**భావము :**

నలుని ముఖము గుండ్రముగా నుండుటవలననో, లేదా మిక్కిలి పరిమళమును వహించుటవలననో, లేదా చంద్రుని యాకారము గల్గియుండుటవలననో, కమలమును ధిక్కరించుచున్నది. అట్టి యాతని ముఖము గుండ్రపు చందన తిలకముతోఁ గూడినదై పగలు చంద్రునియం దుండెడి శోభాయమానమైన, యొకనొక తారతో సమానముగా నుండినది. లేదా కమలమును దిరస్కరించెడి చంద్రుని నడుమ రోహిణి మున్నగు తారలలో నొక్కటియొకవేళ నెలకొనినచో నప్పుడది చంద్రుని యాకృతిగల నల ముఖమునకు మధ్యనున్న గుండ్రపు చందన తిలకముతో సామ్యము నొంది యుండగలదు. కాని చంద్రుని నడుమ నట్టి రోహిణ్యాది నక్షత్రములు లేనందువలన నట్టి సామ్యము నొందనవకాశము

లేదు. కాన, తిలకముతోగూడిన నలుని ముఖము పద్మమున కంటెను చంద్రుని కంటెను మిక్కిలి శోభాయుక్తమై వెలయుచున్నది. 63

శ్లో॥ నయావదగ్నిభ్రమమేత్యు దూఢతాం
నలస్యభైమీతి హరే ర్దురాశయా,
నబిందురిన్దుః ప్రహితః కిమస్య సా
నవేతి భాలే పఠితుం లిపీమివ॥ 64

ప॥వి॥ :- న - యావత్ - అగ్నిభ్రమమ్ - ఏతి - ఉదూఢతాం - నలస్య - భైమీ - ఇతి - హరేః - దురాశయా - న - బిన్దుః - ఇన్దుః - ప్రహితః - కిమ్ - అస్య - సా - న - వా - ఇతి - పఠితుం - లిపీమ్ - ఇవ.

అర్థము :- సః = ముందుఁజెప్పఁబడిన, బిందుః = గుండ్రమైన చన్దనతిలకము అగ్నిభ్రమం యావత్ = వివాహాగ్నికి ప్రదక్షిణము చేయునంతవరకును అనగా "పతిత్వం సప్తమేపదే" యను స్మృతి ననుసరించి వైవాహికాగ్నికి సమీపమున నెంతవఱకు సప్తపది జరుగదో, యంతవఱకును దమయన్తికి నలుడు భర్తయగుట గాని, యామె నలునకు భార్యయగుట గాని యేర్పడదని యట్టి యగ్నిప్రదక్షిణముఁ జేయునంతవఱకు నని యర్థము. భైమీ = దమయన్తి, నలస్య = నలునకు, ఉదూఢతాం = వివాహసంస్కారమునుఁ బొందుటను ననగా పత్నీత్వమును, నఏతి = పొందదు, ఇతి = అని, హరేః = ఇంద్రునియొక్క, దురాశయా = దుష్టమైన కోరికతో, సా = ఆ దమయన్తి, అస్య = ఈ నలునకు, కింభవేత్ = భార్యయగునా, నవా = కాదా? ఇతి = అని, భాలే = నొసట, లిపిం = బ్రహ్మవ్రాసిన వ్రాతను, పఠితుం = చదువుటకు, ప్రహితః = ఇంద్రునిచేఁ బంపఁబడిన, ఇందురివ = చంద్రుడో యనునట్లు, (ఆభాతి = ప్రకాశించుచున్నది.)

వి :- నలుని ముఖమునందలి గుండ్రపు చందన తిలకము నలుని నొసటనున్న బ్రహ్మలిపిని, జదువుటకు బంపఁబడిన చంద్రుడు కాకపోయినను,

జ్రుడుగా భావింపఁబడుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకమగు "ఇవ" శబ్దమును బ్రయోగించుట వలన నది వాచ్యము.

**సమాసములు:**

అగ్నిభ్రమమ్ :- అగ్నేః, భ్రమః = అగ్నిభ్రమః, తం = అగ్నిభ్రమం.

ఉదూఢతాం :- ఉదూఢస్య, భావః = ఉదూఢతా - తామ్ = ఉదూఢతాం.

దురాశయా :- దుష్టాచసా, ఆశాచ = దురాశా, తయా = దురాశయా.

**భావము ;**

నలుని నొసట నుంచఁబడిన చందన తిలకము, బ్రహ్మ, నలుని నొసట వ్రాసిన లిపిని బట్టి దమయన్తి యతనికి భార్య గాగలదా? లేదా? యను సంశయమును జదువుటకు నింద్రునిచే బంపఁబడిన చంద్రుడాయని భావింపఁబడినది వివాహమున నగ్ని సమీపమున సప్తపది యను నగ్ని ప్రదక్షిణ రూప సంస్కారము జరుగనంతవరకు వరునికి పతిత్వము గాని, వధువునకు భార్యాత్వము గాని యేర్పడవు అందువలన నింద్రుడు, అంత లోపలనే నలుని నొసటి వ్రాతను దెలుసుకొని ఒక వేళ ఆ నొసటి వ్రాతలో నలునికి దమయన్తిని భార్యగాఁ బడయు భాగ్యము లేకపోయినచో నామెను దాను బడయవచ్చునను దురాశతో చంద్రుని యా నలుని నొసటి వ్రాతనుఁ జదువుకొనివచ్చుటకుఁ బంపెనో యను నట్లుండెనని యాశయము. 68

శ్లో॥ కపోల పాలీ జనితాను బిమ్బ యోః
సమాగమాత్ కుణ్డల మణ్డల ద్వయీ ।
నలస్య తత్కాల మవాప చిత్రభూ
రథ స్ఫురచ్చక్ర చతుష్క చారుతామ్॥ 65

ప॥వి॥ -: కపోల పాలీజని తాను బిమ్బయోః - సమాగమాత్, కుణ్డల మణ్డల ద్వయీ – నలస్య,- తత్కాలమ్ - అవాప - చిత్ర భూరథ స్ఫురచ్చక్ర చతుష్క చారుతామ్ -

అర్థము :- నలస్య= నలుని యొక్క, కుణ్డల మణ్డల ద్వయీ; కుణ్డల= కర్ణ భూషణములగు కుండలములయొక్క, ద్వయీ=జంట, కపోల పాలీజని తాను బిమ్బయోః; కపోలపాలీ = గణ్డస్థల మణ్డలములయందు, జనిత= ఏర్పడిన, అనుబిమ్బయోః = ప్రతిబిమ్బములయొక్క, సమాగ, మాత్ = కలయికవలన, తత్కాలం = ఆ కాలమున, చిత్రభూరథస్ఫుర చ్చక్ర చతుష్క చారుతాం; చిత్రభూ = మన్మథునియొక్క, రథ = రథ మందు, స్ఫురత్ = ప్రకాశించు, చక్రచతుష్క = చక్రముల నాలు గింటియొక్క, చారుతాం = అందమును, అవాప = పొందెను. రథము నకు నాలుగు చక్రములుండుటవలన, గుండ్రములుగానున్న కుండలములు రెండును, వాని ప్రతిబింబములు రెండును కలిసి నాలుగుగా నేర్పడి, నాలుగు రథచక్రములుగా నేర్పడినవని యర్థము.

వి॥ :- రథచక్రముల సొబగు కుణ్డలములయందు లేకపోయినను, వాని సొబగు వంటి సొబగు వాని యందున్నదని వర్ణించుటవలన పదార్థవృత్తి నిదర్శ నాలంకారము.

సమాసములు :

కపోలపాలీజనితాను బిమ్బయోః:- కపోలయోః, పాల్యౌ = కపోల పాల్యౌ, కపోలపాల్యోః, జనితౌ = కపోలపాలీ జనితౌ, కపోలపాలీ జనితౌచతౌ, అనుబిమ్బౌచ = కపోలపాలీజనితానుబిమ్బౌ, తయోః = కపోలపాలీ జనితానుబిమ్బయోః.

కుణ్డలమణ్డలద్వయీ :- కుణ్డలయోః, మణ్డలే = కుణ్డలమణ్డలే, కుణ్డల మణ్డలయోః, ద్వయీ = కుణ్డలమణ్డలద్వయీ.

తత్కాలం:- సచాఽసౌ కాలశ్చ = తత్కాలః, తం = తత్కాలమ్.

చిత్రభూరథస్ఫురచ్చక్ర చతుష్కచారుతాం :- చిత్తే, భవతీతి = చిత్త భూః, చిత్తభువః, రథః = చిత్తభూరథః, స్ఫురన్తిచతాని చక్రాణిచ= స్ఫురచ్చక్రాణి, చిత్తభూరథస్య, స్ఫురచ్చక్రాణి = చిత్తభూరథస్ఫుర చ్చక్రాణి. చిత్తభూరథస్ఫురచ్చక్రాణాం, చతుష్కం = చిత్తభూరథ స్ఫురచ్చక్ర చతుష్కం, చిత్త భూరథస్ఫురచ్చక్ర చతుష్కస్య, చారుతా=

చిత్రభూరథస్ఫురచ్చక చతుష్క చారుతా, తామ్ = చిత్రభూరథస్ఫుర
చ్చక్ర చతుష్క చారుతామ్.

భావము:

నలుని కర్ణభూషణములగు కమ్మలు రెండును, అతని స్నిగ్ధములగు కణ
తల యందు ప్రతిఫలించినవి. అందువలన వాని బింబములు రెండును. ప్రతి
బింబములు రెండునుఁ గలసి, నాలుగై, మన్మథుని రథమునకున్న నాలుగు
చక్రముల శోభను వహించినవి. మన్మథుని రథచక్రముల శోభను వహించిన
వని చెప్పుటవలన నవి — కామోద్దీపితములుగా నున్నవని యాశయము. 65

శ్లో॥ శ్రితాస్య కణ్ఠం గురువిప్రవన్దనాత్
వినమ్ర మౌలేశ్చిబుకాగ్ర చుమ్బినీ।
అవాపముక్తావలి రాస్య చన్ద్రమః
స్రవత్సుధాతు న్దిల బిన్దు వృన్దతామ్॥ 66

ప॥వి॥:- శ్రితా - అస్య - కణ్ఠం - గురువిప్రవన్దనాత్ - వినమ్రమౌలేః -
చిబుకాగ్రచుమ్బినీ - అవాప - ముక్తావలిః - ఆస్యచన్ద్రమసః స్రవ
త్సుధాతున్దిలబిన్దు వృన్దతాం.

అర్థము:- గురువిప్రవన్దనాత్; గురు = తల్లిదండ్రులను, విప్ర=బ్రాహ్మణులను,
వన్దనాత్ = నమస్కరించుటవలన, వినమ్రమౌలేః; వినమ్ర = వాలిన,
మౌలేః = శిరస్సుగల, అస్య = ఈ నలునియొక్క, అగ్ర = కొనను,
చుమ్బినీ = తాకుచున్నట్టిదియు, కణ్ఠం = కణ్ఠమును, శ్రితా=పొందినట్టి.
ముక్తావలిః=ముత్తెపుసరము, ఆస్యచన్ద్రమః స్రవత్సుధా తుందిల బిందు
వృన్దతాం; ఆస్యచన్ద్రమః = ముఖచంద్రు నుండి, స్రవత్ = స్రవించు
చున్న, సుధా = అమృతముచే, తుందిల = ఘనమైన, బిందు = బింద
వులయొక్క, వృన్దతాం = సమూహముగా నుండుటను, అవాప =
పొందినది.

వి॥:- కణ్ఠమందలి ముత్తెపు సరమును నమృతబిందువులుగా భావించుటవలన
నుత్ప్రేక్ష. వ్యఞ్జకమునుఁ బ్రయోగింపనందువలన నది గమ్యము.

**సమాసములు :**

గురువిప్రవన్దనాత్ :- గురవశ్చ, విప్రాశ్చ = గురువిప్రాః గురువిప్రే భ్యః, వన్దనం = గురువిప్రవన్దనమ్, తస్మాత్ = గురువిప్రవన్దనాత్.

వినమ్రమౌలేః :- వినమ్రా, మౌలిః, యస్య సః = వినమ్రమౌలిః, తస్య = వినమ్రమౌలేః.

ముక్తావలిః :- ముక్తానాం, ఆవలిః = ముక్తావలిః.

ఆస్యచన్ద్రిమః స్రవత్సుధాతున్దిలబిన్దు వృన్దతాం :- ఆస్యమేవ చన్ద్రిమా, ఆస్యచన్ద్రిమసః, స్రవన్తీ = ఆస్యచన్ద్రిమస్స్రివన్తీ, ఆస్యచన్ద్రిమః స్రవన్తీచసా సుధాచ = ఆస్యచన్ద్రిమ. స్రవత్సుధా, ఆస్యచన్ద్రిమః స్రవత్సుధాయాః, తున్దిలాః, బిన్దవః = ఆస్యచన్ద్రిమః స్రవత్సుధాతు న్దిలబిన్దవః, ఆస్యచన్ద్రిమః స్రవత్సుధాతుందిల బిందూనాం, వృన్దః = ఆస్యచన్ద్రిమః స్రవత్సుధాతుందిల బిందువృన్దః, ఆస్యచన్ద్రిమః స్రవత్సు ధాతుందిల బిందువృన్దస్య, భావః = ఆస్యచన్ద్రిమః స్రవత్సుధాతుందిల బిందువృన్దతా, తామ్ = ఆస్యచన్ద్రిమః స్రవత్సుధాతున్దిల బిందువృన్ద తామ్.

**భావము:**

ఈ నలుడు తన తల్లిదండ్రులు మున్నగు గురువులకును, బ్రాహ్మణుల కును వందన మాచరించు సమయమున నాతని కణ్ఠమండలి ముత్తెపు సరము, ఆతని గడ్డము చివరిభాగమును దాకుచుండును. అప్పుడా ముత్తెపుసర మాతని ముఖచంద్రునుండి స్రవించుచున్న యమృతంపు బిందువు సమూహాశోభను వహించినది. ముత్తెపు పూసలు తెల్లనివై యమృత బిందువుల మాడ్కి కాన వచ్చును. కాన నా విధముగా వర్ణింపబడినది. ౬౬

శ్లో॥ యదుద్ధతా శ్శీర్బలవాన్ బలంద్విషన్
బభూవయస్యోఽఽణిషు వార్ణేనసః
అపూపురత్ తాన్ కమలార్థినో ఘనాన్
సముద్రభావం స బభార తద్భుజః. 67

ప॥వి॥ :- యదుద్ధతా - శ్రీః - బలవాన్ - బలం - ద్విషన్ - బభూవ - యస్య - ఆజిషు - వారణేన - సః - అపూపురత్ - తాన్ - కమలార్థినః - ఘనాన్ - సముద్రభావం - సః - బభార - తద్భుజః.

అర్థము:- శ్రీః = సంపదయు (లక్ష్మియు) యదుద్ధతా; యత్ = ఏ భుజము నుండి, ఉద్ధతాన్ = ఉద్భవించినదో, బలం = సైన్యమును, ద్విషన్ = ద్వేషించుచున్న, సః = ఆ నలుడు, ఆజిషు = యుద్ధములయందు, యస్య = ఏ భుజమునకు సంబంధించిన, వారణేన = శత్రునివారణ క్రియచే, బలవాన్ = బలముగలవాడుగా, బభూవ = ఆయెనో, పక్షాన్తరమున - సః = ఆ ప్రసిద్ధుడగు, బలం = బలాసురుని, ద్విషన్ = ద్వేషించునట్టి యింద్రుడు, యస్య = ఏ సముద్రునికి సంబంధించిన, వారణేన = ఐరావతమను నేనుగచే, ఆజిషు = యుద్ధములయందు, బలవాన్ = బలముగలవాడుగా, బభూవ = ఆయెనో, యః= ఏ భుజము ఘనాన్ = సందులేక యెల్లప్పుడు వచ్చుచున్న, తాన్ = పేదటికమునకు, ప్రసిద్ధివహించిన, కమలార్థినః; కమలా = లక్ష్మిని, అర్థినః = యాచించునట్టివారిని, పక్షాన్తరమున:—కమలార్థినః; కమల = ఉదకములను, అర్థినః = యాచించనట్టి, ఘనాన్ = మేఘములను, (ధనైః = ధనములచేతను, జలైశ్చ=ఉదకములచేతను) అపూపురత్= నింపెనో, సః = అటువంటి, తద్భుజః = ఆ నలునియొక్క భుజము, సముద్రభావం; సముద్ర = ముద్రయనబడు నుంగరముతోడ గూడిన వ్రేలియొక్కయు, చక్కగా విజృంభించునట్టి సాగరముయొకయు, భావం = స్థితిని, బభార = ధరించినది.

వి:- ఇచ్చట శ్లిష్ట విశేషణ విశేష్యములచే నలబాహువునకు సముద్రమునకు సమానత చెప్పబడినది. విశేషణములును విశేష్యము శ్లిష్టమగుట వలన నిట సాగరపరమగు నర్థము ధ్వని యగుచున్నది.

**సమాసములు :**

యదుద్ధతా:- యస్మాత్, ఉద్ధతా = యదుద్ధతా
కమలార్థినః :-కమలా మర్థయ న్తీతి= కమలార్థినః తాన్=కమలార్థినః.
సముద్రభావం:- ముద్రయా సహవర్తత ఇతి = సముద్రః సముద్రస్య భావః = సముద్ర భావః తం = సముద్రభావం,

భావము :

ఇచ్చట నలబాహువును విశేషణ సామ్యముచే సముద్రముతోఁ బోల్చు చున్నారు. శ్రీదేవి యనగా సంపద. నల బాహువునఁ బుట్టినది. శ్రీదేవి సముద్రమునఁ బుట్టినది. నలుడు యుద్ధములయందు శత్రువులను ద్వేషించుచు తన బాహువుచే శత్రువుల నివారించుట యను కారణముచే ప్రబలుడ యెను. బలాసురుని ద్వేషించు నా ప్రసిద్ధుడగు నింద్రుడు ఆ సముద్రమునం దుద్భవించిన యైరావతమను వారణముచే ననగా నేనుగచే యుద్ధముల యందు బలవన్తు డాయెను. ఏ నలుని భుజము నిరన్తరము ఘనములైన - యనగా సందులేనట్టి పేదఱికమునకు ప్రసిద్ధులైన, కమలార్థులైన (ధనార్థులైన) యాచకులను ధనము లతో నింపునో, ఏ సాగరము, కమలార్థులైన (జలమును యాచించునవియైన) ఘనములను ననగా మేఘములను నుదకములతో నింపునో, అటువంటి యా నలుని భుజము ముద్రతో గూడినందువలన సముద్రత్వము నొందినది. సముద్రమో "సమ్యక్ ఉనత్తీతి" వ్యుత్పత్తి ననుసరించి చక్కగా విజృంభించి తడుపుట వలన సముద్రత్వము నొందినది. కాన నలుని భుజము సముద్ర ధర్మములగు శ్రీ ప్రభవత్వాదులతో సముద్ర భావము నొంది శోభించినదని భావము.

శ్లో: కృతార్థ యన్నర్థి జనాననారతం
బభూ వతస్యామర భూరుహః కరః.
తదీయమూలే నిహితం ద్వితీయవత్
ధ్రువం దధే కఙ్కణ మాలవాలతామ్. **68**

ప॥వి॥ కృతార్థయన్ - అర్థి జనాన్ - అనారతం. - బభూవ - తస్య- అమర భూరుహః - కరః - తదీయమూలే, - నిహితం - ద్వితీయవత్ - ధ్రువం - దధే - కఙ్కణమ్ - ఆలవాలతామ్.

అర్థము:- తస్య = ఆ నలుని యొక్క, కరః హస్తము, - అనారతం = ఎల్లప్పుడు, అర్థిజనాన్ = యాచక జనులను, కృతార్థయన్= సార్థక పఱచుచున్న, అమర భూరుహః=కల్ప వృక్షముగా, బభూవ=ఆయెను. తదీయమూలే; తదీయ = ఆ కల్ప వృక్షమునకు సంబంధించిన

మణికట్టు నేదిపాడయందు, నిహితం = ఉంచబడిన ద్వితీయవత్ = రెండవ దానితోఁ గూడిన, కఙ్కణం = పసిడి కడియము, ఆలవాలతాం = పాదిగా నుండుటను, దధే = ధరించినది. ధ్రువం = నిశ్చయము చెట్టు మొదట రెండు పాదులుండును. అట్లె యతని మణి కట్టు పైని కఙ్కణ ములు రెండును కరకల్ప వృక్షమునకు పాదులైనవని యర్థము.

వి:- మణికట్టు నందలి కడియములు, పాదులు గాకపోయినను పాదులుగా భావింపఁబడుట వలనను "ధ్రువ" శబ్దమును వ్యఞ్జకముగాఁ బ్రయోగిం చుట వలనను నిట వాచ్యమైన యుత్ప్రేక్ష.

## సమాసములు ;

కృతార్థయన్ :- అకృతార్థం కృతార్థం కుర్వన్ = కృతార్థయన్.
అర్థిజనాన్ :- అర్థినశ్చతే జనాశ్చ = అర్థిజనాః, తాన్ = అర్థిజనాన్.
అమరభూరుహః:- అమరాణాం, భూరుహః = అమరభూరుహః.
తదీయమూలే :- తస్య, ఇదం = తదీయం తదీయం చ తత్ మూలంచ = తదీయమూలం, తస్మిన్ = తదీయమూలే.
ద్వితీయవత్ :- ద్వితీయమస్య అస్తీతి = ద్వితీయవత్.
ఆలవాలతామ్ :- ఆలవాలస్య, భావః = ఆలవాలతా. తామ్ = ఆలవాల తామ్.

## భావము :

ఆ నలుని హస్తము నిరంతరము యాచకుల కోరికలనుఁ దీర్చుచు కల్ప వృక్షమైనది. ఆ కల్పవృక్షమునకు మూలమైన యాతని మణికట్టునకు కట్టఁ బడిన వివాహకఙ్కణముతోఁ గూడిన యాతని పసిడి కడియము హస్తమనెడి కల్పవృక్షమునకు పాదిగా నేర్పడినది. చెట్టునకు రెండు పాదులున్నట్లు, అతని హస్తమనెడి కల్పవృక్షమునకు రెండు కఙ్కణములు రెండు పాదులుగా నుండిన వని యర్థము.

శ్లో॥ రరాజదోర్మణ్డన మణ్డలీజుషోః
సవజ్రమాణిక్య సితారుణ త్విషోః.
మిషేనవర్షన్ దశదిఙ్ముఖోన్ముఖౌ
యశఃప్రతాపా వవనీజయార్జితౌ. 69

ప॥వి॥ :- రరాజ - దోర్మణ్డనమణ్డలీజుషోః - సః - వజ్రమాణిక్య సితారుణ త్విషోః - మిషేణ - వర్షన్ - దశదిఙ్ముఖోన్ముఖౌ - యశః - ప్రతాపౌ - అవనీ జయార్జితౌ.

అర్థము :- సః = ఆ నలుడు, దోర్మణ్డన మణ్డలీజుషోః; దోః = భుజమునందలి మణ్డన = అలఙ్కారములయొక్క, మణ్డలీ = వరుసను, జుషోః = పొందినవియు, వజ్రమాణిక్య సితారుణత్విషోః; వజ్ర = వజ్రముయొక్క మాణిక్య = పద్మరాగములయొక్కయు, సితారుణత్విషోః = క్రమముగాఁ దెలుపుకాన్తియొక్కయు, నెఱుపు కాంతియొక్కయు, మిషేణ = నెపముచే, దశదిఙ్ముఖోన్ముఖౌ; దశదిఙ్ముఖ= పదిదిక్కుల యంచులకు, ఉన్ముఖౌ = వ్యాపించినవియు, అవనీజయార్జితౌ; అవనీ = భూమిని, జయ = జయించుటచే, అర్జితౌ = సంపాదింపఁబడిన, యశఃప్రతాపౌ= క్రమముగా కీర్తిని ప్రతాపమును, వర్షన్ = వర్షించుచు, అనగా విస్తరింపఁజేయుచు, రరాజ = ప్రకాశించెను.

వి॥ :- "సితారుణ కాంతులయొక్క నెపముచే" ననిమిష శబ్దముచే కాంతుల నపహ్నవము గావించుటవలన నపహ్నవాలఙ్కారము.

సితారుణకాంతుల నెపమున క్రమముగా యశఃప్రతాపములను వర్షించు నట్లు చెప్పుటవలన యథాసఙ్ఖ్య లఙ్కారము. దీనితో నపహ్నవమునకు సఙ్కరము.

యశః ప్రతాపములను వర్షింపకపోయినను, వర్షించుచున్నట్లు భావించుట వలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకముసుఁ జెప్పనందువలన నదిగమ్యము, దానికి నపహ్నవముతో సఙ్కరము.

సమాసములు :

దోర్మణ్డనమణ్డలీజుషోః :- దోషోర్మణ్డనాని = దోర్మణ్డనాని, దోర్మణ్డనానాం, మణ్డలీ = దోర్మణ్డనమణ్డలీ, దోర్మణ్డనమణ్డలీం జుషతఇతి = దోర్మణ్డనమణ్డలీజుషౌ, తయోః = దోర్మణ్డనమణ్డలీజుషోః.

వజ్రమాణిక్య సితారుణత్విషోః :- వజ్రాశ్చ, మాణిక్యానిచ = వజ్రమాణిక్యాని, వజ్రమాణిక్యానాం, సితారుణత్విషౌ = వజ్రమాణిక్య సితారుణత్విషౌ, తయోః = వజ్రమాణిక్యసితారుణ త్విషోః.

దశదిఙ్ముఖోన్ముఖౌ :- దశచతాః దిశశ్చ = దశదిశః, దశదిశాం, ముఖాని = దశదిఙ్ముఖాని, దశదిఙ్ముఖేషు, ఉన్ముఖౌ = దశదిఙ్ముఖోన్ముఖౌ, తౌ = దశదిఙ్ముఖోన్ముఖౌ.

యశఃప్రతాపౌ :- యశశ్చ, ప్రతాపశ్చ = యశః ప్రతాపౌ, తౌ = యశఃప్రతాపౌ.

అవనీజయార్జితౌ :- అవన్యాః, జయః = అవనీజయః, అవనీజయేన, ఆర్జితౌ = అవనీజయార్జితౌ, తౌ = అవనీజయార్జితౌ.

భావము ;

ఆ నలుని భుజములయందుఁ దొడుగబడిన భూషణములలోని వజ్రమాణిక్యము లనెడి రత్నములు క్రమముగా తెల్లని కాంతులను నెఱ్ఱని కాంతులను ప్రసరింపఁజేయుచున్నవి. అతడు ఆ కాంతుల వ్యాజమున, తాను భూవిజయముచే సంపాదించినట్టి పది దిక్కుల యంచులకు వ్యాపించునట్టి కీర్తిని, ప్రతాపమును వర్ణించుచున్నాడో యనునట్లు భావింపఁబడుచుండెను. వజ్రముల కాంతులు తెల్లనివిగ నుండుటవలన నవి కీర్తిరూపములుగను, మాణిక్యముల కాంతి యెఱ్ఱనివిగ నుండుటవలన నవి ప్రతాపరూపముగను నుండినవని భావము. ౬౯

శ్లో॥ ఘనే సమస్తాపఘనావలమ్బినాం
విభూషణానాం మణిమణ్డలేనలః.
స్వరూపరేఖా మవలోక్య నిష్ఫలీ
చకార సే వాచణదర్పణార్పణమ్॥ 70

ప॥వి॥ :- ఘనే - సమస్తాఽపఘనావలమ్బినాం-విభూషణానాం - మణిమణ్డలే- నలః - స్వరూపరేఖామ్ - అవలోక్య - నిష్ఫలీ చకార - సేవాచణ దర్పణార్పణమ్.

అర్థము ;- నలః =నలుఁడు, సమస్తాపఘనావలమ్బినాం; సమ స్త=సకలములైన, అపఘన = అవయవముల యందు, అవలమ్బినాం = వ్రేలాడుచున్న, విభూషణానాం = ఆభరణములయొక్క, మణిమణ్డలే = రత్నములు సమూహమునందు, స్వరూపరేఖాం; స్వ = తనయొక్క, రూప = సౌందర్యముయొక్క, రేఖాం = ప్రతిబింబమును, అవలోక్య = చూచి, సేవాచణదర్పణార్పణం; సేవాచణ = సేవయం దాస క్తిగల భృత్యులు గావించెడి, దర్పణార్పణం = అద్దములను సమీపము నందుంచెడి కార్య మును, నిష్ఫలీచకార = వ్యర్థముగావించెను.

మణిమణ్డలము చేతనే యద్దమువలని పని పూ ర్తియైనది కాన నద్దమునుఁ దెచ్చుట వ్యర్థమైనదని యర్థము.

వి :- కాకతాలీయ న్యాయముతో ననగా తలవనితలంపుగా నొక కారణము కార్య మును సాధింపనున్నప్పుడు మఱియొక కారణము ఆ కార్యమును సాధిం చినచో సమాధ్యలఙ్కారము. ప్రకృతము, అద్దముచేయనున్న పనిని మణిమణ్డలము చేసినది కాన నిట సమాధ్యలఙ్కారము.

**సమాసములు :**

సమస్తాపఘనావలమ్బినాం :- సమస్తాశ్చతే, అపఘనాశ్చ= సమస్తాప ఘనాః, సమస్తాపఘనా నవలమ్బన్త ఇతి = సమస్తాపఘనావ లమ్బిని, తేషాం = సమస్తాపఘనావలమ్బినాం.

మణిమణ్డలే :- మణీనాం, మణలం = మణిమణలం, తస్మిన్ = మణి మణ్డలే.

స్వరూపరేఖాం :- స్వస్య, రూపం =స్వరూపం, స్వరూపస్య, రేఖా = స్వరూపరేఖా, తాం = స్వరూపరేఖామ్.

నిష్ఫలీచకార :- అనిష్ఫలం, నిష్ఫలం సమ్పద్యమానం చకార = నిష్ఫలీచకార.

సేవాచణదర్పణార్పణమ్ :- సేవయా, విత్తాః = సేవాచణాః, దర్పణస్య, అర్పణం = దర్పణార్పణం, సేవాచణానాం, దర్పణార్పణం= సేవాచణదర్పణార్పణమ్, తత్ = సేవాచణదర్పణార్పణమ్.

భావము ;

ఆ నలుడు తన శరీరమందుఁ దొడగఁబడిన యాభరణములోని రత్న మణ్డలమునందు తన సౌందర్య ప్రతిబింబమును చూచుకొనుటవలనఁ బనివారలు తెచ్చిపెట్టిన యద్ద మవసరము లేకపోవుటవలన వ్యర్థముగావించెను. అనగా నాతని యొడలియందుఁ దొడుగఁబడిన యాభరణములలోని రత్నములు మిక్కిలి ప్రకాశముతో గూడినవని యర్థము. 70

శ్లో॥ వ్యలోకి లోకేన న కేవలం చలన్
ముదా తదీయాభరణార్పణద్యుతిః ।
అదర్శి విస్ఫారిత రత్నలోచనైః
పరస్పరేణైవ విభూషణై రపి ॥ 71

ప॥వి॥ వ్యలోకి - లోకేన - న - కేవలం - చలన్ముదా - తదీయాభరణార్పణద్యుతిః - అదర్శి - విస్ఫారిత రత్నలోచనైః - పరస్పరేణ - ఏవ - విభూషణైః - అపి.

అర్థము:- తదీయాభరణార్పణద్యుతిః; తదీయాభరణ = ఆ నలునికి సంబంధించిన యాభరణములను, అర్పణ = నలుని శరీర మందుంచుటచేత నేర్పడిన, ద్యుతిః = కాన్తి, చలన్ముదా; చలత్ = కదలుచున్న అనగా ప్రవహించుచున్న, ముదా= సంతోషము గల్గిన, లోకేన = జనముచే, కేవలం=కేవలము, నవ్యలోకి = చూడఁబడలేదు. కింతు = మఱే మనగా' విస్ఫారిత రత్నలోచనైః; విస్ఫారిత = వెడల్పు గావింపఁబడిన, రత్నలోచనైః=రత్నము లనెడి నేత్రములు గల్గినట్టి, విభూషణై రపి=ఆభరణముల చేతను, పరస్పరేణైవ = ఒండొంటి తోడనే, వ్యలోకి = చూడఁబడినది. అనగా నచేతనము లగు నాభరణములే చూచినపుడు చేతనులగు లోకులు చూచుటలో నాశ్చర్య మేమున్నది.

వి:- "రత్నలోచనైః" అను నెడ రత్నములతో నేత్రములను రూపించుట వలన రూపకము. అచేతనములగు విభూషణములే చూచినప్పుడు చేతనులగు జనులు చూచుట యను నర్థము సిద్ధించుచున్నది గాన నర్థాపత్త్యలంకారము. దీనికి పై రూపకముతో సఙ్కరము.

ఆభరణములు రత్న లోచనములతో జూడకున్నను చూచుచుండునట్లు భావింపఁబడు వలన నుత్ప్రేక్ష వ్యఞ్జకమును జెప్పనందు వలన నది గమ్యము.

**భావము :**

నలుని శరీరమునందు నాభరణముల నంచగనే దాని కాంతిని ప్రజలు పొందెకి యానందముతో తాము మాత్రమే చూడలేదు. మఱే మనగా — ఆయాభరణములు సైతము రత్నములను నేత్రములతో ప్రసరించు నా కాంతిని తమలో తాము చూచుకొను చుండినవి. అచేతనములగు నాభరణములే చూచు చున్నప్పుడు చేతనులగు జనులు చూచుటలో విశేషమేమున్నది.

శ్లో॥ తతోను వార్ష్ణేయ నియన్తృకం రథం
యుధి క్షతారిక్షతి భృజ్జయద్రథః
నృపః పృథాసూను రివాధి రూఢవాన్
స జన్య యాత్రా ముదితః కిరీటవాన్ 72

ప॥వి॥ తతః — అను - వార్ష్ణేయ నియన్తృకం — రథం - యుధి — క్షతారిక్షితి భృజ్జయద్రథః - నృపః — పృథా సూనుః - ఇవ - అధి రూఢవాన్ - సః - జన్యయాత్రాముదితః - కిరీటవాన్.

అర్థము:- తతోఽను=అటు పిమ్మట, అనగా నలఙ్కారణము జరిగిన తర్వాత, యుధి = యుద్ధమునందు, క్షతారిక్షితిభృజ్జయద్రథః; క్షత=గాయపడిన, అరిక్షితి భృత్ = శత్రు రాజులను గల్గిన వాడును, జయత్ = జయశీలమైన, రథః = రథముగలవాడును, పక్షాన్తరమున — క్షత = చంపఁబడిన, అరిక్షితి భృత్ = శత్రు రాజైన, జయద్రథః = జయద్రథుడను సింధు రాజుఁగలవాడును, జన్యయాత్రాముదితః; జన్య =

వరుని మిత్రుల యొక్క, యాత్రా = వివాహయాత్రచే, ముదితః = సంతోషించిన వాడును, పక్షాన్తరమున — జన్యయాత్రా = యుద్ధ యాత్రచే, ముదితః=సంతోషించిన వాడును, కిరీటవాన్ = కిరీటముతో గూడిన వాడును - పక్షాన్తరమున — కిరీటియను పేరుగలవాడును నగు, సః = ఆ, నృపః = నలమహారాజు. పృథా సూనురివ=పృథాదేవి పుత్రుడగు నర్జుననివలె, వార్ష్ణేయనియన్తృకం; వార్ష్ణేయ = వార్ష్ణేయుఁ డగువానిని,పక్షాన్తరమున-వృష్ణి పుత్రుఁడగు శ్రీకృష్ణుని, నియన్తృకం= సారథిగాఁ గల్గిన, రథం = రథమును, అధిరూఢవాన్ = ఎక్కెను.

వి:— శ్లిష్ట విశేషణములతో నలునకు నర్జునునితో సమగ్ర సామ్యమునుఁ జెప్పుట వలన నిటపూర్ణోప మాలఙ్కారము.

## సమాసములు:

వార్ష్ణేయ నియన్తృకం:— (వృష్ణేరపత్యం, పుమాన్ = వార్ష్ణేయః) వార్ష్ణేయః నియన్తాయస్యసః=వార్ష్ణేయ న్తృకః; తం=వార్ష్ణేయనియన్తృకం. క్షతా రిక్షితి భృజ్జయద్రథః :- క్షితిం బిభర్తీతి = క్షితి భృతః. అర యశ్చతే క్షితి భృతశ్చ = అరిక్షితి భృతః. క్షతాః అరిక్షితి భృతః యస్యసః = క్షతారి క్షితిభృత్, జయన్ రథః యస్యసః =జయద్రథః. క్షతారిక్షితి భృచ్చాసౌ జయద్రథశ్చ = క్షతారిక్షితి భృజ్జ యద్రథః. పక్షాన్తరమున :- అరిక్షితి భృచ్చాసౌ జయద్రథశ్చ అరిక్షితి భృజ్జయ ద్రథః క్షతః అరిక్షితి భృజ్జయ ద్రథః యేనసః = క్షతారిక్షితి భృజ్జ యద్రథః.

పృథా సూనుః -- పృథాయాః సూనుః = పృథాసూనుః.
జన్యయాత్రా ముదితః-- జన్యానాం యాత్రా= జన్యయాత్రా. జన్య యాత్రయా ముదితః = జన్యయాత్రా ముదితః.
కిరీటవాన్ :- కిరీట మస్యాస్తీతి = కిరీటవాన్ .

## భావము :

అలఙ్కరణ కార్యము పూర్తి కాగానే నూనఁడు; అర్జునుడు కృష్ణ

సారథ్యముగల రథము నెక్కినట్లు, తాను రథమెక్కెను. ఈ నలుడు —శత్రు రాజులను సంహరించి, జయశీలమగు రథము గల్గుటవలన క్షతారిక్షితి భృజ్జయద్రథుడాయెను అర్జునుడు శత్రురాజును సింధు దేశాధిపతియగు జయద్రథుని సంహరించుటవలన క్షతారిక్షితి భృజ్జయ ద్రథుండాయెను ఈ నలుడు తన మిత్రులు వివాహమునకు విచ్చేయుట వలన సంతోషించి జన్యాయాత్రా ముదితుడాయెను. అర్జునుడు యుద్ధ యాత్ర వలన సంతోషించి జన్యాయాత్రా ముదితుడాయెను ఈ నలుడు కిరీటమును ధరించుటచేత = కిరీటి యాయెను. ఆ యర్జునుడు "కిరీట" యను పేర ప్రసిద్ధుడై "కిరీటి" యాయెను. ఈ నలుని రథమునకు సారథి వార్ష్ణేయుడను పేరుగలవాడు. ఆ యర్జునుని రథమునకు సారథి "వృష్ణి" కుమారుడైన శ్రీకృష్ణ భగవానుడు. ఇట్లు విశేషణము లతో నలునకు నర్జునునితో సామ్యము సంపాదింపబడుటచే నలుడు అర్జునునివలె రథము నారోహించెనని యాశయము. 72

శ్లో॥ విదర్భనామ్నస్త్రి దివస్య వీక్షితుం
రసోదయా దప్స రస స్త ముజ్జ్వలం.
గృహాత్ గృహాదేత్య ధృత ప్రసాధనా
వ్యరాజయ ద్రాజ పథానథాధికమ్. 73

ప॥వి॥ విదర్భనామ్నః - త్రిదివస్య - వీక్షితుం - రసోదయాత్ - అప్సరసః తమ్ - ఉజ్జ్వలం - గృహాత్ - గృహాత్- ఏత్య - ధృతప్రసాధనాః- వ్యరాజయన్ - రాజపథాన్ -అథ - అధికమ్,

అర్థము:- అథ = పిదప, విదర్భనామ్నః=విదర్భమను పేరుగల, త్రిదివస్య= స్వర్గమునకు సంబంధించిన, అప్సరసః = అచ్చెరలు అనగా వారిని బోలిన పుర స్త్రీలు, ఉజ్జ్వలం = వరాలఙ్కరణములతో శోభించు చున్న, తం = ఆ నలమహారాజును, వీక్షితుం=చూచుటకు, రసోదయాత్ = కోరిక యేర్పడుటవలన, ధృత ప్రసాధనాః; ధృత = ధరింపబడిన, ప్రసాధనాః=అలఙ్కారములు గలవారై, గృహాత్ గృహాత్=ఒక్కొక్క యింటి నుండియు, ఏత్య = వచ్చి, రాజపథాన్ = రాజమార్గములను

అధికం = మిక్కిలి వ్యరాజయన్ = శోభిల్ల జేసిరి.

**సమాసములు :**

విదర్భనామ్నః :— విదర్భా ఇతినామ యస్యసః, విదర్భనామా, తస్య = విదర్భనామ్నః.

రసోదయాత్ :—రసస్య, ఉదయః= రసోదయః, తస్మాత్ = రసోదయాత్.

ధృతప్రసాధనాః :—ధృతాని ప్రసాధనాని, యాభిస్తాః = ధృతప్రసాధనాః.

**భావము :**

విదర్భ దేశములనెడి స్వర్గమునకు నచ్చరలవంటి పురస్త్రీలు వివాహ వేషముతో శోభించుచున్న నలమహారాజును దర్శించు కోరికతో నలఙ్కరించుకొని యింటింటనుండి వెల్వడి రాజమార్గములకు మిక్కిలి సొంపునుఁగూర్చిరి.

శ్లో॥ **అజానతీకాఽపి విలోకనోత్సుకా**
**సమీర ధూతార్ధమపి స్తనాంశుకమ్।**
**కుచేన తస్మైచలతేఽకరోత్పురః**
**పురాఙ్గనా మాఙ్గల కుమ్భసంభృతిమ్.** 74

ప॥చ్చి॥ అజానతీ - కా - అపి - విలోకనోత్సుకా - సమీరధూతార్ధమ్ - అపి - స్తనాంశుకమ్ - కుచేన - తస్మై - చలతే - అకరోత్ - పురః - పురాఙ్గనా - మఙ్గలకుమ్భ సమ్భృతిమ్.

అర్థము :- ఇది మొదలు తొమ్మిది శ్లోకములతో నా సందర్భమున పురస్త్రీల యొక్క శృఙ్గార చేష్టలను కవి వర్ణించుచున్నాడు.

విలోకనోత్సుకా; విలోకన = నలునిఁజూచుటకు, ఉత్సుకా = కోరిక గల్గిన (కావుననే) సమీరధూతార్ధం; సమీర = గాలిచే, ధూత = తొలగింపఁబడిన అర్ధం = సగముగల్గిన, స్తనాంశుకం = చనుదోయినిఁ గప్పెడి వస్త్రమును, అజానతీ = తెలిసికొనఁజాలని, కాఽపి = ఒకానొక

పురాఙ్గనా = పురంధ్రీ, కుచేన = తన స్తనముచే. చలతే = ఇంటినుండి వెల్వెడుచున్న, తస్మై = ఆ నలమహారాజునకై, పురః = ఎదుట, మఙ్గళకుంభసంభృతిమ్; మంగళకుంభ = మంగలకలశము యొక్క, సమ్భృతిం = సంభరణమును నగా నుంచుటను. అకరోత్ = చేసెను. సాధారణముగ నుత్సవములయందు నూతన వస్త్రముతోఁగప్పిన పూర్ణ కలశము నెదుటనుంచెదరు.

వి:- మంగళ కలశస్థాపనము శుభసూచకమై యుత్సవమునందు పయోగ పడుటవలన, నామఙ్గళ కలశమునకు స్తనతాదాత్మ్యము నారోపించుటచేత నా స్తనములు మంగళకలశ పరిణతిబొంది ప్రకృత క్రియకుపయుక్తమై నందువలన పరిణామాలంకారము. పూర్ణకలశ దర్శనము రాబోవుశుభ సూచకమను వస్తువు. ఆ పరిణామాలంకారముచే ధ్వనించును కాన నలంకారమూలకవస్తు ధ్వని.

సమాసములు :

అజానతీ :— న, జానతీ = అజానతీ

విలోకనోత్సుకా :—విలోకనే, ఉత్సుకా = విలోకనోత్సుకా.

సమీరధూతార్ధం :— సమీరేణ, ధూతం = సమీరధూతం, సమీరధూతం అర్ధం, యస్య తత్ = సమీరధూతార్ధం, తత్ = సమీరధూతార్ధమ్.

స్తనాంశుకం : — స్తనయోరంశుకం = స్తనాంశుకమ్, తత్ = స్తనాంశుకం.

పురాఙ్గనా : —పురస్య, అఙ్గనా = పురాఙ్గనా.

మఙ్గళకుమ్భసమ్భృతిమ్ :— మఙ్గళస్య, కుమ్భః = మఙ్గలకుమ్భః, మఙ్గళకుమ్భస్య, సమ్భృతిః = మఙ్గలకుమ్భసమ్భృతిః, తాం = మఙ్గల కుమ్భసమ్భృతిమ్.

భావము :

నలునిఁ జూడగోరటచే సగము స్తనాంశుకముఁ దొలఁగి పోవుటను తెలుసు కొనజాలని యొక పురయువతి, ఇంటినుండి బయలుదేరనున్న యా నలునికై

యెదుట మంగళసూచకముగా తనస్తనమును పూర్ణ కలశముగా నుంచినదాయెను. తఱచుగా నుత్సవములయందు, నూతన వస్త్రములతోఁ గప్పిన పూర్ణ కలశమును మంగళ సూచకముగా నుంచుట యాచారము. 51

శ్లో॥ సఖీం నలం దర్శయమానయాఙ్కితో
జవాదుదస్తస్య కరస్య కఙ్కణే।
విషజ్య హారైస్త్రుటితై రతర్కితైః
కృతం కయాఽపి క్షణ లాజమోక్షణమ్. 75

ప॥వి॥ సఖీం - నలం - దర్శయమానయా - అఙ్కితః - జవాత్ - ఉదస్తస్య - కరస్య - కఙ్కణే - విషజ్య - హారైః - త్రుటితైః - అతర్కితైః - కృతం - కయా - అపి - క్షణలాజమోక్షణమ్.

అర్థము ;— అఙ్కితః = తెల్లనిగొడుగు మున్నగు రాజ చిహ్నములతో, నలం = నలమహారాజును, దర్శయమానయా = చూపుచున్న, కయాఽపి = ఒకానొక పురయువతిచే, జవాత్ = వేగము వలన, ఉదస్తస్య = నలుని జూపుటకై యెత్తఁబడిన, కరస్య = హస్తముయొక్క, కఙ్కణే = కడియమందు, విషజ్య = తగుల్కొని, అతర్కితైః = తెలియఁబడనివై అనగా హఠాత్తున, త్రుటితైః = తెగిపోయిన, హారైః = ముత్తెపుసరములచే, క్షణలాజమోక్షణం; క్షణ = క్షణ కాలములేదా ఉత్సవమునకు సంబంధించిన, లాజమోక్షణం = పేలాలను వెదజల్లుటయను మఙ్గళ కార్యము కృతం = చేయఁబడినది. రఘువంశమునందును– "అవాకిరన్ వయోవృద్ధాః, తంలాజైః పౌరయోషితః." అని దిలీపునిపై పేలాలను వెదజల్లినట్లు చెప్పఁబడినది. కాన నుత్సవములయందు రాజులపై పేలాలను వెదజల్లుట యాచారము.

సమాసములు ;

క్షణలాజమోక్షణమ్ ;— లాజానాం, మోక్షణం లాజమోక్షణం = లాజమోక్షణమ్, క్షణం, లేదా క్షణస్య, లాజమోక్షణం = క్షణలాజమోక్షణం,

**భావము :**

శ్వేతచ్ఛత్రము మున్నగు గఱ్ఱులచే చెలికత్తెకు నలుని జూపించుచున్న యొక పురవనిత, యతనినిఁజూపుటకై వేగముగా పైకెత్తిన తన చేతిలోని కఙ్కణము కంఠమునందలి ముత్తెపు సరములకు తగుల్కొనగా, నా సరములు తెగియందలి ముత్తెములు మున్నగు సరములలోని పూసలు రాలినవి అందు వలననామె పేలాలను వెదజల్లునదిగా గానవచ్చినది. రాజులుమున్నగు మహాపురుషులపై వారియుత్సవ కాలములయందు లాజమోక్షణము-అనగా పేలాలను వెదజల్లుట యాచారము ఆ విధముగానే, కణ్ఠమునందలి ముత్తెపు సరములు చేతికంకణములను తగుల్కొని తెగుటచే యందలి పూసలు రాలుట నలునికై, లాజమోక్షణముగా భావింపబడినది. 75

శ్లో॥ లసన్నఖా దర్శముఖామ్బుజస్మిత
ప్రసూనవాణీ మధుపాణి పల్లవం.
యియాసతస్తస్య నృపస్యజజ్ఞిరే
ప్రశస్తవస్తూని తదేవయౌవతమ్. 76

ప॥వి॥ లసన్నఖాదర్శముఖామ్బుజస్మిత ప్రసూనవాణీ మధుపాణి పల్లవం - యియాసతః - తస్య - నృపస్య - జజ్ఞిరే - ప్రశస్తవస్తూని - తత్ - ఏవ - యౌవతమ్.

అర్థము :-లసన్నఖాదర్శముఖామ్బుజస్మిత ప్రసూనవాణీ మధుపాణిపల్లవం; లసత్ = ప్రకాశించుచున్న, నఖాదర్శ; నఖ = గోరులనెడి, ఆదర్శ = అద్దములు, ముఖామ్బుజ; ముఖ=ముఖములనెడు, అమ్బుజ = పద్మము, స్మితప్రసూన; స్మిత = చిఱునగవులనెడి, ప్రసూన = పుష్పములు, వాణీ = మాటలనెడు. మధు = తేనెలు, పాణిపల్లవం; పాణి = హస్తములనెడు, పల్లవం = చిగుళ్ళుగల్గిన, తత్ = ఆ, యౌవతమేవ = యువతుల సమూహమే, యియాసతః = ప్రయాణముచేయగోరుచున్న, తస్య = ఆ. నృపస్య = నలమహారాజునకు, ప్రశస్తవస్తూని = శుభకాలములకు తగిన మఙ్గళవస్తువులుగా, జజ్ఞిరే = ఏర్పడినది

వి॥ :- నఖములు ముక్కుగు వానితో సద్దములు ముక్కగన. రూపించుటవలన రూపకము.

నఖాదుల యందు దారోపింపఁబడిన యాదర్శాది ప్రశస్త వస్తువుల తాదాత్మ్యము ప్రకృతమైన ప్రయాణ క్రియ కుపయుక్తమైనందువలన పరిణామాలంకారము ఈ పరిణామముపై రూపకముచే నను ప్రాణితము.

**సమాసములు :**

లసన్నఖాదర్శ ముఖామ్బుజస్మిత ప్రసూనవాణీ మధుపాణి పల్లవం:- నఖా, ఏవ, ఆదర్శాః, =నఖాదర్శాః, ముఖాన్యేవ, అమ్బుజాని = ముఖామ్బుజాని, స్మితాన్యేవ ప్రసూనాని = స్మితప్రసూనాని, వాణ్యఏవ మధూని = వాణీమధూని, పాణయఏవ పల్లవాః = పాణిపల్లవాః, నఖాదర్శాశ్చ, ముఖామ్బుజానిచ, స్మితప్రసూనానిచ, వాణీ మధూనిచ, పాణిపల్లవాశ్చ = నఖాదర్శ ముఖామ్బుజస్మిత ప్రసూనవాణీ మధుపాణి పల్లవాః, లసన్తః, నఖాదర్శ ముఖామ్బుజ స్మితప్రసూన వాణీమధు పాణి పల్లవాః, యస్మిన్, తత్ = లసన్నఖాదర్శముఖామ్బుజస్మిత ప్రసూన వాణీ మధుపాణిపల్లవం

యియాసతః :- యాతుమిచ్ఛన్ = యియాసన్, తస్య = యియాసతః.

ప్రశస్తవస్తూని :- ప్రశస్తానిచ తాని వస్తూనిచ = ప్రశస్తవస్తూని.

యౌవతమ్ :- యువతీనాం, సమూహః = యౌవతమ్.

**భావము :**

ప్రయాణముఁ జేయగోరిన యా నల మహారాజునకు, ఆ సమయము నందు, అద్దములు, పద్మములు, పూలు, తేనెలు, చిగుళ్ళు, అనెడి మంగల ద్రవ్యములు కావలసియుండినవి. అవి తత్కాలమునకు లభ్యము కాకపోయినను నచట నున్న యువతుల యొక్క గోరులు అద్దములుగను, ముఖములు పద్మములుగను, చిఱునగవులు పూలుగను, మాటలుతేనెలుగను, హస్తములు చిగుళ్ళుగను, పరిణమించి ప్రకృత కార్యమున కుపయుక్తములైనవి. అనగా నచట యువతుల నఖముఖ స్మితాదులంత ప్రశస్తము లనియు, సుందరములనియు నాశయము.

శ్లో॥ కరస్థ తాంబూల జిఘత్సు రేకికా
విలోక నైకాగ్ర విలోచనోత్పలా.
ముఖే నిచిక్షేప ముఖద్విరాజతా
రుషేవ లీలా కమలం విలాసినీ. 77

ప॥వి॥ :- కరస్థతాంబూల జిఘత్సుః - ఏకికా-విలోకనైకాగ్ర విలోచనోత్పలా - ముఖే - నిచిక్షేప - ముఖద్విరాజ తారుషా - ఇవ - లీలాకమలం - విలాసినీ.

అర్థము :- విలోకనైకాగ్రవిలోచనోత్పలా; విలోకన = నలుని దర్శించుటయందు ఏకాగ్ర = మిక్కలి యాసక్తి గల్గిన, విలోచన = నేత్రములనెడి, ఉత్పలా = కలువపూవులు గల్గిన, ఏకికా = ఒకానొక, విలాసినీ = వనిత, కరస్థతాంబూలజిఘత్సుః; కరస్థ = చేతియందున్న, తాంబూల= తమలమును, జిఘత్సుః = నమలఁగోరినదై, ముఖద్విరాజతారుషా ఇవ; ముఖ = ముఖమునకు, ద్విరాజతా = రెండవరాజగుట వలన, యనగా, ముఖమునకు సమానమగుటవలన, రుషాఇవ = రోషముచేతనో యను నట్లు, లీలాకమలం = విలాసపద్మమును, ముఖే = నోట, నిచిక్షేప= ఉంచుకొనినది - తాంబూలమును నోట నమలఁగోరిన యొక నవిత నలుని తదేకదృష్టితో చూచుటవలన నన్యమనస్కురాలై పొరబడున లీలా పద్మమును నోట నుంచుకొనినది. లీలాకమలము ముఖమునకు ప్రత్యర్థి యగుట వలన రోషముతో నట్లు చేసినదా యని అని భావింపఁ బడినది.

వి :- లీలాపద్మమును నోట నుంచుకొనుటకు నది శత్రువనెడి దోషము హేతువు కాకపోయినను నది హేతువుగాఁ జెప్పఁబడుట వలన నుత్ప్రేక్షాలంకారము. వ్యఞ్జకమగు నివ శబ్దము ప్రయోగింపఁబడుటవలన నది వాచ్యము. ఇచ్చట "విభ్రమ స్త్వరయాఽస్థానే, భూషాస్థాన విపర్యయః" యనెడి లక్షణము ననుసరించి విభ్రమమను చేష్టాభావము చెప్పఁబడినది. సరియైన స్థానమును వదలి మఱియొక స్థానమునందు భూషణముల నుంచుట విభ్రమము. ఇచ్చట హస్తమునందుంచఁదగిన లీలాకమల

మును నోట నుంచుకొనుట వలన నీది విభ్రమ సంచేష్ట యగుచున్నది.

సమాసములు

కరస్థ తామ్బూల జిఘత్సుః :- కరే తిష్ఠతీతి = కరస్థః- కః స్థశ్చాసౌ తామ్బూలశ్చ = కరస్థతామ్బూలః - అత్తు మిచ్ఛుః = జిఘత్సుః - కరస్థ తామ్బూలం జిఘత్సుః = కరస్థ తామ్బూల జిఘత్సుః.

ఏకికా :- ఏకా, ఏవ = ఏకికా.

విలోకనైకాగ్ర్య విలోచనోత్పలా :- విలోకనే, ఏకాగ్రే = విలోకనైకాగ్రే; విలోచనే, ఉత్పలే, ఇవ = విలోచనోత్పలే, విలోకనైకాగ్రే, విలోచనోత్పలే, యస్యాః సా = విలోకనైకాగ్ర విలోచనోత్పలా.

ముఖద్విరాజ తారుషా :-- ముఖస్య ద్వితీయః రాజా = ముఖద్విరాజః. ముఖద్విరాజస్య భావః = ముఖద్విరాజతా= ముఖద్విరాజతాయాం రుట్ ముఖద్విరాజ తారుట్, తయా = ముఖద్విరాజతారుషా.

విలాసినీ :- విలాసః అస్యాః అస్తీతి = విలాసినీ.

లీలాకమలం:- లీలాయాః కమలం = లీలా కమలం. తత్= లీలాకమలం

భావము :

నలుని నేకాగ్ర దృష్టితో చూచుచున్న యొకానొక విలాసవతియగు స్త్రీ చేత నున్న తమలమును, దినగోరినదై యేకాగ్రత లేక యన్య మనస్కురాలై తన చేత విలాసార్థము పట్టుకొనియున్న పద్మమును పొరపాటుగా నోట నుంచుకొనినది. లీలా కమలము ముఖమునకు శత్రువగుట వలన దాని పైరోషముతో దానిని నోట నుంచుకొని తినివేయఁదలచినదో యనునట్లు అది భావింపఁబడినది. ముఖమునకు పద్మమునకు సాదృశ్యముండుటవలన నా రెంటికిని శత్రుభావము కల్పితము. అట్టి శత్రుభావముచే ముఖము కమలమును నోట నుంచుకొనినను నమలివేయఁ దలచినదిగా భావింపఁబడినదని యర్థము. అనగా నన్య విషయా

సక్త మనస్కురాలు, అనగా నల దర్శనము నందే అగ్రమైన మనస్సు గల్గిన యా యువతి తాంబూల చర్వణాదులయందును తగు జాగ్రత్తను వహించ లేదనియు నలుని సౌందర్య మా విధముగ నామె దృష్టి నాకర్షించుటచే లోకోత్తరమైనదనియు నాశయము. 77

శ్లో॥ కయాపి వీక్షా విమనస్క లోచనే
సమాజ ఏవోప పతేః సమీ యుషః.
ఘనం సవిఘ్నం పరిరమ్భ సాహసై
స్తదా తదా లోకనమన్వ భూయత. 78

ప॥వి॥ కయా - అపి - వీక్షా విమనస్క లోచనే - సమాజే - ఏవ - ఉపపతేః సమీయుషః - ఘనం = సవిఘ్నం - పరిరమ్భ సాహసైః - తదా - తదాలోకనమ్, - అన్వభూయత.

అర్థము:- కయాపి = ఒకానొక కాంతచే, వీక్షా విమనస్కలోచనే; వీక్షా = తెప్పపాటులేని, విమనస్క = ఇతర విషయములకు విముఖములైన లోచనే = నేత్రములుగల, సమాజే ఏవ = జనసమూహమునందే, సమీయుషః = సమీపించిన అనగా దగ్గరకు వచ్చిన, ఉప పతేః = జారుని, ఘనం = గాఢముగా, పరిరమ్భ సాహసైః = కౌగలింపులు మున్నగు సాహస కృత్యములచే, తదా = ఆ కాలమందు, తదాలోకనం = నలుని దర్శనము, సవిఘ్నం = విఘ్నముతోఁ గూడినట్లు, అన్వభూయత = అనుభవింపఁబడినది. కామాన్ధులు ఏ పనినిఁ చేయరు.

**సమాసములు :**

వీక్షా విమనస్క లోచనే:- విశేషణ ఈక్షా = వీక్షావీక్షయా విమనస్కే లోచనే యస్యాసః = వీక్షా విమనస్క లోచనః. తస్మిన్ = వీక్షా విమనస్క లోచనే.

సవిఘ్నం:- విఘ్నేన సహితం - యథాతథా = సవిఘ్నం.

పరిరమ్భసాహసైః :- పరిరమ్భా ఏవ సాహసాని = పరిరమ్భ సాహసాని, తైః = పరిరమ్భ సాహసైః.

పదాలోకనం :- తస్య, అలోకనం = తదాలోకనం.

**భావము :**

అచ్చటి జనసమూహము రెప్పపాటులేక తదేకాగ్రమముగా నలుని జూచు చుండినది. అందువలన తమ పరిసరముల యందేమి జరుగునదియు జనమునకుఁ దెలియ సాధ్యము కాకపోయినది దాని వలన నా జన సమూహమునందు నొక స్త్రీ నలుని నేకాగ్ర దృష్టితోఁ జూడగోరి యుండగా నామె యొక్క జారుడు ఆట్టి తరుణమున నామెను కౌగలించు కొనుట మున్నగు సాహసకృత్యముల కొడిగట్టెను. అందువలన నామెకు నల దర్శనమునకు విఘ్నము లేర్పడినవి. అనగా నలుని సౌందర్యము లోకోత్తరమై వెలయుచు జనుల హృదయము నాకర్షించి వారిని పర వశులఁ జేయుచుండినదని సారాంశము. 78

శ్లో॥ దిదృక్షు రన్యా వినిమేష వీక్షణా
నృణా మయోగ్యాం దధతీ తను శ్రియం.
పదాగ్రమాత్రేణ యదస్పృశన్మహీం
నతావతా కేవల మప్సరో ఽ భవత్. 79

ప॥వి॥ :- దిదృక్షుః - అన్యా - వినిమేష వీక్షణా - నృణామ్ - అయోగ్యాం- దధతీ - తనుశ్రియం - పదాగ్రమాత్రేణ - యత్ - అస్పృశత్ - మహీం - న - తావతా - కేవలమ్ - అప్సరః - అభవత్.

అర్థము :- దిదృక్షుః = నలునిఁ జూడగోరినదియు కావుననే, వినిమేషవీక్షణా= ఱెప్పపాటు లేని దృష్టి కలదియు, నృణాం = మానవులకు, అయోగ్యాం = తగనటువంటి యనగా సమానుషమైనట్టి, తనుశ్రియం =దేహకాంతిని, దధత్ = ధరించుచున్న, అన్యా = మఱియొక సుందరి, పదాగ్రమాత్రేణ; పదాగ్ర = పాదములకొనతో, మహీం = భూమిని, యత్ = ఎందువలన, అస్పృశత్ = స్పృశించెనో, తావతాకేవలం = ఆ స్పర్శ చేతనే, అప్సరః = అచ్చరగా, నాఽభవత్ = కాలేదు. కానిచో నీమెకు

నచ్చరకును భేదమేమున్నది.

వి:- ఇచ్చట భూమినిఁ దాకుటవలన అప్సరకంటె న్యూనత్వము చెప్పుటచే నుపమానోప మేయములకు విశేషముఁ జెప్పుట వలన వ్యతిరేకా లఙ్కారము.

**సమాసములు :**

దిదృక్షుః :- ద్రష్టు మిచ్ఛుః = దిదృక్షుః.
వినిమేషవీక్షణా :- విగతాః, నిమేషాః, యస్యతత్ = వినిమేషం, వినిమేషం, వీక్షణంయస్యాస్సా = వినిమేషవీక్షణా.
అయోగ్యాం :- న, యోగ్యా = అయోగ్యా, తాం = అయోగ్యాం.
తనుశ్రియం :- తనోః, శ్రీః = తనుశ్రీః, తాం = తనుశ్రియమ్.
పదాగ్రమాత్రేణ :- పదయోరగ్రం= పదాగ్రం, పదాగ్రమేవ = పదాగ్రమాత్రం, తేన = పదాగ్రమాత్రేణ.

**భావము :**

నలునిఁ జూడగోరి తెప్పపాటు లేని చూపు గల్గినదై, యమానుషమగు సౌందర్యమును వహించి వెలయుచున్న యొకసుందరి భూమిని తాకినందువలన నచ్చరగా గాలేకపోయినది. కానిచో నామెకును నచ్చరకును నేమి భేదమున్నది అనగా నామె యంతటి దివ్య సౌందర్యముతో వెలుగుచుండినదని భావము. "నచ్చరలు" మున్నగు వారు దేవతాజాతికి చెందినవారు కాన వారికి భూస్పర్శ యుండదని యాశయము. 78

శ్లో॥ విభూషణ స్రంసన శంసనార్పితైః
కరప్రహారై రపి ధూననై రపి।
అమా న్త మన్తః ప్రసభం పురాపరా
నఖీషు సమ్మాపయతీవ సమ్మదం॥ **80**

ప॥వి॥ :- విభూషణ స్రంసనశంసనార్పితైః, - కరప్రహారైః - అపి - ధూననైః - అపి - అమాన్తమ్ - అన్తః- ప్రసభం - పురా - పరా-

సఖీషు - సమ్మాపయతీ - ఇవ - సమ్మదం.

అర్థము :- పరా = మఱియొకతె, సఖీషు = చెలికత్తెల యందు, అంగే = శరీరములోపల, అమాన్తం = మిక్కిలి యాధిక్యముతో పట్టక వెలుపలికి వచ్చుచున్న, సమ్మదం = సంతోషమును, విభూషణ స్రంసన శంసనార్పితైః; విభూషణ =ఆభరణములయొక్క, స్రంసన = స్థానము నుండి జారిపోవుటను, శంసన = సరియైన స్థానమందుంచమని చెప్పటకై, అర్పితైః = ఈయంబడిన, ప్రసభం = బలాత్కారపు, కరప్రహారైః = చేతిదెబ్బలచేతను, తథా = అట్లే, ధూననైరపి = శరీరమును కదలించుట మున్నగు వాని చేతను, పురాసమ్మాపయతీవ = వారి శరీరమందు నిముడునట్లు గావించెను. అనగా నాయాభరణములను చక్కబఱచుకొనునట్లు చేయించెను. నల దర్శనముచే సఖులయందు ఏర్పడిన ఆనందము వాని యందు బట్టలేదు. కావుననే యొక చెలికత్తె నల దర్శనముచేఁ బరాకు చెందియున్న యా సఖులయొక్క శరీరమునుండి యాభరణములు మున్నగు వానిని జారిపోవుచుండుటను గమనించనట్టి వారిని జేతితోఁదట్టి కదలించి వానినిఁ జక్కగ నుంచుకొనునట్లు చేసినదని యర్థము.

## సమాసములు :

విభూషణస్రంసన శంసనార్పితైః:- స్రంసనస్య, శంసనం = స్రంసన శంసనం, విభూషణానాం, స్రంసన శంసనం =విభూషణ స్రంసన సంసనే, విభూషణ స్రంసన సంసనేన, అర్పితాని = విభూషణ స్రంసన శంసనార్పితాని, తైః = విభూషణ స్రంసన శంసనార్పితైః.

అమాన్తం :- న, మాన్ = అమాన్, తం = అమాంతం.

## భావము :

ఆ సమయమున నల దర్శనముచే కొంతమంది స్త్రీలయందు మేరలేని యానంద మేర్పడి యది వారి శరీరమునందుఁ బట్టలేక యుండినది. అందువలన వారి మనస్సున కేగాగ్రత లేకపోవుటచే వారి శరీరములనుండి యాభరణములు

జారిపోవుచున్నను వారు తెలుసుకొనలేకపోయిరి. అట్టి తరుణమున నొక చెలికత్తె పరధ్యానము నందున్న యా చెలికత్తెను చేతితో దట్టి కదలించి వానిని చక్కగా నుంచుకొనునట్లు గావించినది. అనగా నా చెలికత్తెలయందు కలిగిన యానందము అపరిమితమై వారి శరీరములందు బట్టనట్లు చేసినదని యర్థము. అన్నము మున్నగునవి గిన్నెలోఁ బట్టనపుడు దానిని చేతులతోన జాచి లోపలికి నెట్టి యెట్లు దానియందు పట్టునట్లు చేయుదురో అట్లే వారిని శరీరమునఁ బట్టక పొంగిపొరలి పోవుచున్న నల దర్శనమువలన యానందమును నా చెలికత్తెలని లాగి తట్టి వారి శరీరములయం దిముడునట్లు చెలికత్తె చేసిన దని యాశయము.

శ్లో॥ వతంస నీలామ్బురుహేణ కిం దృశా
విలోకమానే విమనీ బభూవతుః.
అపిశ్రుతీ దర్శన సక్త చేతసాం
నలే న తే శుశ్రు వతుర్మృగీ దృశాం. 81

ప॥వి॥ :- వతంసనీలామ్బురుహేణ - కిం - దృశా - విలోకమానే - విమనీ బభూవతుః – అపి - శ్రుతీ – దర్శన సక్తచేతసాం - న - తేన - తే శుశ్రువతుః - మృగీదృశామ్.

అర్థము :- దర్శనసక్తచేతసాం; దర్శన = నలదర్శనమునందు, సక్త = ఆసక్తమైన, చేతసాం = మనస్సుగల, మృగీదృశాం = స్త్రీలకు, శ్రుతీ అపి = చెవులు రెండునుగూడ, వతంసనీలామ్బురుహేణ; వతంస = కర్ణ భూషణమైన, నీలామ్బురుహేణ = నల్లని కలువపూవనెడి, దృశా = నేత్రములచే, విలోకమానే = నలుని జూచుచు, విమనీబభూవతుఃకిం = మనస్సుతో సంబంధము లేనివిగానైనవా యేమి? తేన = అట్టి మన స్సంబంధరాహిత్యముచే, తే = ఆ చెవులు రెండునుగూడ, నశుశ్రు వతుః = ("సొమ్ములు జారిపోయినవనియు వానిని సరిగ నుంచుకొన వలయుననియు" చెలికత్తె పూర్వ శ్లోకమున చెప్పిన విషయమును) విని యుండలేవు. స్త్రీలు నేత్రములతో నలునిఁ జూచుటయం దాసక్తమగు మనస్సులు గలవారై యెట్లు చెలికత్తె మాటలను వినలేకపోయిరో అట్లే వారి చెవులుగూడ భూషణముగా నుంచఁబడిన కలువపూవులచే నలునిఁ

జూచుచు నన్యాసక్త మనస్కులగుటవలన చెలికత్తె మాటను వినలేక పోయినవని యర్థము. కర్ణావతంసములగు కలువపూవులు నేత్రములనుఁ బోలి యుండునుకదా.

వి:- భూషణములుగా నుంచఁబడిన కలువపూలనెడి కన్నులతో రెండు చెవులును నలుని జూచుటవలన మనస్సంబంధరాహిత్యమునుఁ బొందకపోయిననుఁ బొందినట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకమగు "ఇవ" శబ్దమును బ్రయోగించుటవలన నిది గమ్యము.

**సమాసములు :**

వతంసనీలామ్బురుహేణ — నీలంచతత్, అమ్బురుహంచ = నీలామ్బురుహం, వతంసశ్చతత్ నీలాంబురుహంచ = వతంసనీలామ్బురుహం, తేన = వతంసనీలామ్బురుహేణ.

విమనీ బభూవతుః ,- అవిమనసౌ, విమనసౌ, సమ్పద్యమానౌ, బభూవతుః = విమనీబభూవతుః.

దర్శనసక్త చేతసాం :- దర్శనే, సక్తాని = దర్శన సక్తాని, దర్శన సక్తాని, చేతాంసియాసాంతాః =దర్శనసక్త చేతసః, తాసాం = దర్శన సక్త చేతసాం.

మృగీదృశాం:— మృగ్యాః, ఇవ, దృశౌ, యాసాంతాః = మృగీదృశః, తాసాం = మృగీదృశాం.

**భావము :**

నలుని దర్శించుటలో నాసక్తిగల మనస్సులతోఁ గూడిన స్త్రీల చెవులు తమయందు భూషణములుగా నుంచఁబడిన కలువపూవులనెడి కన్నులతో నలుని జూచుచుండుటవలన నవియును విమనస్కములు, అనగా మనస్సంబంధరహితములైనవా యేమి? కావుననే యవి గూడ సొమ్ములు జారిపోవుచున్నవి. చక్కదిద్దుకొనుమని పూర్వశ్లోకమున చెలికత్తె చెప్పిన మాటలు వినలేకపోయినవని యాశయము.

శ్లో॥ కశ్చిన్నిర్మాయ చక్షుః ప్రసృతి
చులుకితం తాస్వశఙ్కన్తకాన్తా
మౌగ్ధ్యాదా చూడమోఘైర్నిచులిత
మివతం భూషణానాం మణీనాం.
సాహస్రీభి ర్నిమేషాకృతమతిభిరయం
దృగ్భిరాలిఙ్గితః కిం?
జ్యోతిష్టోమాదియజ్ఞశ్రుతఫలజగతీ
సార్వభౌమక్రమేణ. 82

ప॥వి॥ :- కః - చిత్ - నిర్మాయ - చక్షుః - ప్రసృతి చులుకితం = తాసు - ఆశఙ్కన్త = కాన్తాః - మౌగ్ధ్యాత్ - ఆ చూడ మోఘైః - నిచులితమ్ ఇవ - తం - భూషణానాం - మణీనాం - సాహస్రీభిః - నిమేషా కృతమతిభిః - అయం - దృగ్భిః - అలిఙ్గితః - కిం - జ్యోతి ష్టోమాది యజ్ఞ శ్రుతఫల జగతీ సార్వభౌమక్రమేణ.

అర్థము:- తాసు = ఆ నగర స్త్రీల మధ్య, కాశ్చిత్ = కొందరు, కాన్తాః = కాన్తలు, భూషణానాం = ఆభరణములకు సంబంధించిన, మణీనాం = రత్నములయొక్క - ఓఘైః = సమూహములచే, ఆచూడం = శిఖ వరకును, నిచులిత మివస్థితం = కప్పఁబడినదో యనునట్లున్న (శరీర మందలి యవయవములన్నియు మణి భూషణములతో గూడియున్నందు వలన మణులతోఁ గప్పఁబడినదో యనునట్లున్నది) తం = ఆ నలుని, చక్షుః ప్రసృతి చులుకితం; చక్షుః = నేత్రములనెడి, ప్రసృతి = దోసెళ్ళతో, చులుకితం = అరచేతఁ బానముఁ గావింపబడిన వానినిగా, నిర్మాయ = కావించి, మౌగ్ధ్యాత్ = మోహముంచి, మౌగ్ధ్యాత్ = మోహమువలన, ఆశఙ్కన్త = సందేహించిరి (ఏమనగా), అయం = ఈ పురుషుడు, జ్యోతిష్టోమాది యజ్ఞ శ్రుతఫలజగతీ సార్వభౌమ క్రమేణ; జ్యోతిష్టోమాదియజ్ఞ = జ్యోతిష్టోమము మున్నగు యాగము లచే, శ్రుత = తెలియఁబడిన, ఫల = ఫలమైన, జగతీ = స్వర్గలోకము నకు, సార్వభౌమ = చక్రవర్తియగు నింద్రుడను, క్రమేణ = క్రమ

చేత, నిమేషాకృతమతిభిః; నిమేష = ఱెప్పపాట్లయందు, అకృత = ఉంచఁబడని, మతిభిః = బుద్ధులుగల. సాహస్రీభిః = వేలసంఖ్యగల, దృగ్భిః = నేత్రములతో, ఆలిఙ్గితఃకిం = స్పృశింపబడెనాయేమి? ఇతి= అని, ("ఆశఙ్కన్త"యను క్రియతో నన్వయము) రత్నములచే నలఙ్కరింపఁబడిన నలునిగాంచి పౌరస్త్రీలు, ఇతనియందు నింద్రభ్రాన్తిని బొంది, ఇంద్రుని వేయికన్నులీ నలునిఁ బొందినవా? యని భావించిరి.

వి:- నలునిపై నింద్రభ్రాన్తినిఁ బొందుటవలన భ్రాన్తిమదలఙ్కారము. సహస్ర నేత్రములు నలుని బొందకపోయినను బొందినవోయనునట్లు భావించుటవలన నుత్ప్రేక్ష. "కిం" శబ్దప్రయోగముచేనది వాచ్యము. భ్రాన్తి మదలఙ్కారమునకు నుత్ప్రేక్షతో సఙ్కరము.

## సమాసములు

చక్షుఃప్రస్సృతిచులుకితం :- చక్షుష్టీఏవప్రస్సృతీ = చక్షుఃప్రస్సృతీ, చక్షుః ప్రస్సృతిభ్యాం, చులుకితః = చక్షుఃప్రస్సృతచులుకితః, తమ్ = చక్షుః ప్రస్సృతిచులుకితం.

నిమేషాకృతమతిభిః :- నిమేషేషు, అకృతా, మతిః, యాసాంతాః = నిమేషాకృతమతయః, తాభిః = నిమేషాకృతమతిభిః.

జ్యోతిష్టోమాదియజ్ఞశ్రుతఫలజగతీసార్వభౌమక్రమేణ :- జ్యోతిష్టోమః, ఆదిః యేషాన్తే = జ్యోతిష్టోమాదయః జ్యోతిష్టోమాదయశ్చ, తేయజ్ఞాశ్చ = జ్యోతిష్టోమాదియజ్ఞాః, జ్యోతిష్టోమాదియజ్ఞైః, శ్రుతం = జ్యోతిష్టోమాదియజ్ఞశ్రుతం, జ్యోతిష్టోమాదియజ్ఞశ్రుతం చతత్ఫలంచ = జ్యోతి మాదియజ్ఞశ్రుతఫలం, జ్యోతిషోమాదియజ్ఞశ్రుతఫలమేవజగతీ = జ్యోతిష్టోమాదియజ్ఞశ్రుతఫలజగతీ, జ్యోతిష్టోమాదియజ్ఞశ్రుతఫలజగత్యాః, సార్వభౌమః-జ్యోతిష్టోమాదియజ్ఞ శ్రుతఫలజగతీసార్వభౌమ ఇతిక్రమః= జ్యోతిష్టోమాదియజ్ఞశ్రుతఫలజగతీసార్వభౌమక్రమః, తేన = జ్యోతిష్టోమాదియజ్ఞశ్రుతఫలజగతీసార్వభౌమక్రమేణ.

## భావము :

ఆ నగరకాంతల మధ్య కొందఱు సుందరస్త్రీలు, ఆభరణములు చే శిఖ

వరకు కప్పఁబడిన యానలుని నేత్రములనెడి దోసిళ్ళతోఁ బానముగావించి మోహముతో నాతనిని జ్యోతిష్టోమాది యాగములకు ఫలమైన స్వర్గమునకు, చక్రవర్తి యగు నింద్రుడనెడి భ్రాన్తితో ఱెప్పపాటు నెఱుగని వేయికన్నులతో సతనిఁ గాంచిరి. నలుని శరీరమందంతటనున్న రత్నములు నేత్రములవలె నుండుటవలన నతడు వేయికన్నులగల నింద్రుడనెడి భ్రాన్తిని గల్గి చెను. ఆ భ్రాన్తితో నా వేయికన్నులు గలవానిని, వేయికన్నులతోడనే యా స్త్రీలు సాదరముగా చూచిరని యాశయము. 82

శ్లో॥ భవన్ సుద్యుమ్నః స్త్రీ నరపతిరభూత్ యస్య జననీ
తమూర్వశ్యాః ప్రాణానపి విజయమాన స్తనురుచా,
హరారబ్ధక్రోధేన్ధన మదనసింహాసనమసౌ
అలఙ్కర్మీణశ్రీరుద భవదలఙ్కర్తు మధునా. 83

ప॥వి॥ :- భవన్ - సుద్యుమ్నః - స్త్రీ - నరపతిః - అభూత్ - యస్య - జననీ - తమ్ - ఊర్వశ్యాః - ప్రాణాన్ - అపి - విజయమానః - తనురుచా - హరారబ్ధక్రోధేన్ధన మదనసింహాసనం - అసౌ అలఙ్కర్మీణశ్రీః - ఉదభవత్ - అలఙ్కర్తుమ్ - అధునా.

అర్థము :- సుద్యుమ్నః = సుద్యుమ్నుడను, నరపతిః = రాజు, స్త్రీ = (ఇల యను) స్త్రీగా, భవన్ = (ఈశ్వరశాపముచే) అగుచు, యస్య = ఏ పురూరవునకు, జననీ = తల్లిగా, అభూత్ = ఆయెనో, ఊర్వశ్యాః = ఊర్వశికి, ప్రాణానపి = ప్రాణమైన అనగా నా యప్సరస మనస్సును హరించునట్టి, తమపి = అతనిని, అనగా - ఇలయందు బుధుని వలన జన్మించిన యా పురూరవునిగూడ, తనురుచా = దేహకాంతితో, విజయమానః = అతిశయించుచున్న. అసౌ = ఈ నలుడు, హరారబ్ధక్రోధేన్ధనమదన సింహాసనమ్; హర = శివునిచే, ఆరబ్ధ = ఆరంభింపఁబడిన, క్రోధ = కోపమునకు, ఇన్ధన = కట్టెయైన, మదన = మన్మథుని యొక్క, సింహాసనం = సింహాసనమును, అలఙ్కర్తుం = అలఙ్కరించుటకు, అలఙ్కర్మీణశ్రీః; అలఙ్కర్మీణ = కార్యమునకు యోగ్య

మైన, శ్రీః = శోభగలవాడుగా, అధునా = ఇప్పుడు, ఉదభవత్=ఉద్భవించెను. ఆ పురూరవునికంటెను చాల సుందరుడని యర్థము. ఇతి = ఇట్లు, ఆలేపుః = మాట్లాడుచుండిరి. అని యుత్తరశ్లోకముతో నన్వయము. సూర్యునకు పౌత్రుడును, మనువు పుత్రుడునగు సుద్యుమ్నుడను రాజు, వేటకుజని హిమవత్పర్వత పరిసరములయందు బార్వతీవనమునుం బ్రవేశించెను. అప్పుడు శివుడు శపింపగా స్త్రీరూపమునుఁబొంది, బుధుని వలన నతిసుందరుడైన పురూరవుడనుఁ బుత్రునిఁ బడసెనను పురాణ కథ నిట ననుసంధించుకొనవలయును.

## సమాసములు

తనురుచా :- తనోః, రుక్ = తనురుక్, తయా = తనురుచా.

హరారబ్ధక్రోధేన్ధనమదనసింహాసనం :- హరేణఆరబ్ధః = హరారబ్ధః. హరారబ్ధశ్చాసౌ, క్రోధశ్చ = హరారబ్ధక్రోధః, హరారబ్ధక్రోధస్య, ఇన్ధనం = హరారబ్ధక్రోధేన్ధనం, హరారబ్ధక్రోధేన్ధనంచాసౌ, మదనశ్చ= హరారబ్ధక్రోధేన్ధనమదనః, హరారబ్ధక్రోధేన్ధనమదనస్య, సింహాసనం = హరారబ్ధక్రోధేన్ధనమదనసింహాసనం, తత్ = హరారబ్ధక్రోధేన్ధనమదన సింహాసనం.

అలఙ్కర్మీణశ్రీః :- అలం, కర్మణే, అలఙ్కర్మీణా, అలఙ్కర్మీణాశ్రీః యస్యసః = అలఙ్కర్మీణశ్రీః.

## భావము :

పూర్వము సుద్యుమ్నుడను రాజు, పైనఁజెప్పిన పౌరాణిక కథను అనుసరించి శివుని శాపముచే స్త్రీరూపముఁజెంది, "ఇల" యనుఁబేరుఁబొంది, బుధుని వలన, లోకోత్తర సౌందర్యముగల పురూరవునిఁ గొడుకుఁగాఁ బడసెను. ఆ పురూరవుడు ఊర్వశికిఁ బ్రాణభూతుడై యామె ప్రేమకుఁ బాత్రుడాయెను. అట్టి పురూరవునిఁగూడ దేహసౌందర్యముచే నీ నలుడు మించియున్నాడు కాననితడు శివుని క్రోధాగ్నికి బలియైన మన్మథుని సింహాసనమాక్రమింప నర్హుడై యిప్పు డుద్భవించెనాయని తోచుచున్నది. ఆ మన్మథునికంటెను సుందరుడని యాశయము.

శ్లో॥ అర్థీ సర్వసుపర్వణాం పతిరసా
వేతస్య యూనః కృతే
పర్యత్యాజి విదర్భరాజసుతయా
యుక్తం విశేషజ్ఞయా.
అస్మిన్నామ తయా వృతే సుమనసః
సన్తోఽపి యన్నిర్జరా
జాతా దుర్మనసో నసోఢుముచితా
స్తేషాన్తు సాఽనౌచితీ. 84

ప॥వి॥ :- సర్వసుపర్వణాం - పతిః - అసౌ - ఏతస్య - యూనః - కృతే - పర్యత్యాజి-విదర్భరాజసుతయా - యుక్తం - విశేషజ్ఞయా - అస్మిన్-నామ - తయా -వృతే - సుమనసః - సన్తః - అపి - యత్ - నిర్జరాః - జాతాః - దుర్మనసః - న - సోఢుమ్ - ఉచితాః - తేషాం-తు - సా - అనౌచితీ.

అర్థము :- విశేషజ్ఞయా = గుణములయొక్క తారతమ్యమునుఁ దెలసిన, విదర్భ రాజసుతయా = దమయన్తిచే, అర్థీ = యాచకత్వమునుఁ బొందిన యనగా వివాహమునకై యాచించిన, అసౌ = ఈప్రసిద్ధుఁడగు, సర్వ సుపర్వణాం = సకలదేవతలకును, పతిః = పాలకుడైన యింద్రుడు, ఏతస్య = ఈ, యూనఃకృతే = యువకునికొఱకు, అనగా నలునిఁ దానుఁ బడయుట కొఱకు, పర్యత్యాజి = (నలునికంటెఁ దక్కువ గుణ ములు గల్గియుండుటవలన) విడువఁబడెను. (ఇతి = అనునది) యుక్తం = తగినది. కింతు = కాని, అస్మిన్ = ఈనలుడు, తయా = ఆ దమ యన్తిచే, వృతేసతి = వరింపఁబడగా, నిర్జరాః = ఇన్ద్రాది దేవతలు, యత్ = ఎందువలన, సుమనసః = సర్వమునుఁ దెలిసినవారును, మంచి హృదయము గలవారుగను, సన్తోఽపి = ఉండియు, దుర్మనసః = దుఃఖితహృదయము గలవారుగా, జాతానామఇతియత్ = ఏర్పడిరనున దేదిగలదో, సా = అది, తేషాం = ఆ యింద్రాదులకు, అనౌచితీ=తగ నిది, సోఢుం = ఈ విషయమున నోర్చుకొనుటకు, నఉచితాః = తగరు. దమయన్తివంటి విశేషజ్ఞులు, నలునివంటి శ్రేష్ఠమైన వరునెన్నుకొనుట

యుచితమేకాని ఇంద్రాది దేవతలు "సుమనస్సులు" మంచిమనస్సు గల వారని పేరును బొందియు దమయన్తి నలుని వరించు విషయమున దుఃఖితమనస్కులగుట యుచితముకాదు. 84

శ్లో॥ అస్యోత్కణ్ఠితకణ్ఠలో
లవరణస్రక్సాక్షిభిర్దిగ్ధవైః
స్వం వక్షః స్వయమస్ఫుటన్న
కిమదః శస్త్రాదపి స్ఫోటితం.
వ్యావృత్యోపనతేనహా!
శతమఖేనాద్యప్రసాద్యాకథం
భైమ్యాం వ్యర్థమనోరథేనచ
శచీసాచీకృతాస్యామ్బుజా. 85

ప॥వి॥ :- అస్య - ఉత్కణ్ఠితకణ్ఠలోలవరణస్రక్సాక్షిభిః - దిగ్ధవైః - స్వం - వక్షః - స్వయమ్ - అస్ఫుటత్ - న - కిమ్ - అదః - శస్త్రాత్ - అపి - స్ఫోటితం - వ్యావృత్య - ఉపనతేన, హా! - శతమఖేన - అద్య - ప్రసాద్యా - కథం - భైమ్యాః - వ్యర్థమనోరథేన - చ - శచీ - సాచీకృతాఽఽస్యామ్బుజా.

అర్థము :- అస్య = ఈ నలునియొక్క, ఉత్కణ్ఠితకణ్ఠలోలవరణస్రక్సాక్షిభిః; ఉత్కణ్ఠిత =చాలకాలమునుండి దమయన్తి హస్తమునుండి వరణమాలను బొందఁగోరికగల్గినట్టి, కణ్ఠ = కంఠమునందు, లోల = కదలుచున్న, వరణస్రక్ = స్వయంవరమాలను, సాక్షిభిః, = చూచుచున్న, దిగ్ధవైః= దిక్పాలురచే, స్వయం = తనంతట, అస్ఫుటదపి = సిగ్గులేనందువలన పగలకపోయినను, అదః = ఈ, స్వం = తనదైన, వక్షః = వక్షః స్థలము, నలునియొక్క ఆయుధపు దెబ్బవలనను, లేదా తనంతట కత్తి దెబ్బవలనగాని, కిం = ఏల, నస్ఫోటితం = పగులునట్లు చేయఁబడలేదు అనగా దమయన్తికై నలునితో యుద్ధముగావించి యతని యాయుధమా ఘాతగాని, తనయంతట కత్తితోఁ బొడుచుకొనుట వలనగాని పగులఁగొట్ట

కొనవలసినదే గదా! శ్రీః = మఱియు, అత్ర=ఇప్పుడు, భైమ్యాం = దమయన్తి విషయమున, వ్యర్థమనోరథేన; వ్యర్థ = విఫలమైన, మనోరథేన = అభిలాషగల్గిన, (కావుననే) వ్యావృత్త్య = వెనుకకు మఱలి, ఉపనతేన = శచీదేవిని బొందిన, అనగా తన తప్పును క్షాలనఁ జేసికొనుటకై శచీదేవి ముందట సాగిలఁబడిన, శతమఖేన = ఇన్ద్రునిచే, సాచీకృతాఽఽస్యామ్బుజా; సాచీకృత = త్రిప్పఁబడిన, అనగా మఱియొక వంకకు, మఱలింపఁబడిన, ఆస్య = ముఖమనెడి, అమ్బుజా = పద్మముగల్గిన, శచీ = శచీదేవి, కథం = ఎట్లు, ప్రసాద్యా=ఊరడింప సాధ్యమగును? ఏవిధముగను సాధ్యము గాదు. హా = దుఃఖము. శచీదేవి యింద్రునిపై కోపమును వహించి ముఖమును మఱియొకవైపునకుఁ ద్రిప్పుకొనియున్నది గాన నెదుట సాగిలఁబడి ప్రార్థించునట్టి యింద్రుని చూడనందువలన నతడు గావించు వందనాదులను చూడఁబోదు గాన నామెనెట్లు ఊఱడింప సాధ్యమగునని యర్థము.

**సమాసములు :**

ఉత్కణ్ఠితకణ్ఠలోఠివరణస్రక్సాక్షిభిః :- ఉత్కణ్ఠా, అస్యసఞ్జాతా, ఇతి = ఉత్కణ్ఠితః, ఉత్కణ్ఠితశ్చాసౌ, కణ్ఠశ్చ = ఉత్కణ్ఠితకణ్ఠః, ఉత్కణ్ఠితకణ్ఠే లుఠతీతి=ఉత్కణ్ఠితకంఠలోఠినీ, వరణస్య, స్రక్=వరణస్రక్= ఉత్కణ్ఠితకణ్ఠలోఠినీచసా, వరణస్రక్చ = ఉత్కణ్ఠితకణ్ఠలోఠివరణస్రక్, ఉత్కణ్ఠితకణ్ఠలోఠివరణస్రజః, సాక్షిణః = ఉత్కణ్ఠితకణ్ఠలోఠివరణస్రక్సాక్షిణః. తైః = ఉత్కణ్ఠితక లోఠివరణస్రక్సాక్షిభిః.

దిగ్ధవైః :- దిశాం ధవాః = దిగ్ధవాః, తైః = దిగ్ధవైః.

వ్యర్థమనోరథేన :- వ్యర్థః, మనోరథః, యస్యసః = వ్యర్థమనోరథః, తేన = వ్యర్థమనోరథేన.

సాచీకృతాఽఽస్యామ్బుజా :- ఆస్యమేవ, అమ్బుజం = ఆస్యామ్బుజం, సాచీకృతం, ఆస్యామ్బుజం యస్యాస్సా = సాచీకృతాఽఽస్యామ్బుజా.

**భావము:**

చిరకాలమను డి దమయన్తియొక్క వరణమాలకై యుత్కంఠతో నెదురు చూచుచున్న యీ నలుని కంఠమునందలి యా వరణమాలికను చూచుచున్న దిక్పాలుర హృదయము, వారికి సిగ్గు లేనందువలన స్వయముగా పగులలేదు. కాని యా హృదయము నలుని యాయుధపుదెబ్బ వలనఁ గాని స్వయముగా కత్తితోఁ బొడుచుకొనుట వలనఁగాని పగిలియుండవలసినది. అనగా వారు దమయన్తినిఁ బడయఁగోరి నలునితో యుద్ధము చేసియున్నచో నాతని శస్త్రపుదెబ్బల వలన వారి గుండెలు పగిలిపోయి యుండెడివని యర్థము. లేదా యామెనుఁ బడయజాలనందువలన తమకుతామే కత్తితోఁ బొడుచుకొనుట మున్నగువానితో నైనను వారిగుండెలు భగ్నములై పోయి యుండవలసి యుండెడిది. మఱియు దమయన్తిఁ బడయఁజాలక వైఫల్యముఁబొంది మఱల శచీదేవిని నొంది తన తప్పును క్షాలనఁ జేసికొనుటకై యామెకుఁ బ్రణమిల్లిన యింద్రుడు, ముఖము త్రిప్పుకొనిన శచీదేవినెట్లు ఊరడింపగలడు ? ఏవిధముగను నూరడింపలేడని యర్థము. అయ్యో యెంత శోచనీయమిది ? 85

శ్లో॥ మాజానీత విదర్భజా మవిదుషీం
కీర్తిర్ముదః శ్రేయసీ
సేయంభద్రమచీకరత్ మఘవతా
నస్వంద్వితీయాం శచీం.
కః శచ్యా రచయాఞ్చకార చరితే
కావ్యంసనః కథ్యతాం
ఏతస్యాస్తు కరిష్యతే
రసధునీపాత్రే చరిత్రేనకైః. 86

ప॥వి॥ :- మా - జానీత - విదర్భజామ్ - అవిదుషీం - కీర్తిః - ముదః - శ్రేయసీ - సా - ఇయం - భద్రమ్ - అచీకరత్ - మఘవతా - న- స్వం - ద్వితీయాం - శచీం - కః - శచ్యా - రచయాఞ్చకార - చరితే - కావ్యం - సః - నః - కథ్యతాం - ఏతస్యాః - తు - కరిష్యతే - రసధునీపాత్రే - చరిత్రే - న కైః.

అర్థము :- (హే ప్రియసఖ్యః = ఓ యిష్టులైన చెలికత్తెలారా) విదర్భజాం =

దమయన్తిని, అవిదుషీ = విశేషము...నుఁ దెలియని దానినిగా, మాజానీత = తెలియకలండి. దేవతలతోఁ గలసి యానందముల ననుభవించుటకుఁ బూనుకొనని దమయన్తి యెట్లు తెలివిగలదగునని శఙ్కింపవలదు. ఏల యనగా — ముదః = ఆనందముకంటెను, కీర్తిః = కీర్తి. శ్రేయసీ= శ్రేష్ఠమైనది. (కాన) సా = ఆ, ఇయం = ఈదమయన్తి, మఘవతా = ఇంద్రునిచే, స్వం = తన్ను, ద్వితీయాం = రెండవదైన, శచీం = శచీదేవినిగా, నాఽచీకరత్ = చేయలేదు. ఇంద్రుని వరించినచో, తానతనికి భార్యయగుటవలన రెండవ శచీదేవిఁగా గావలసియుండెడిది. అందువలన నింద్రుని వరింపలేదు. కాన, ఇతి = ఈ విధముగా నతనిని వరింపక యుండుట, భద్రం = క్షేమము. ఏలయనగా, కః = ఏ, కవిః = కవి, శచ్యాః = శచీదేవియొక్క, చరితే = చరిత్రమునందు, కావ్యం = కావ్యమును, రచయామాస = రచియించెను. సః = ఆ కవి, నః = మాకు, కథ్యతాం = చెప్పఁబడునుఁగాక. ఏతస్యాస్తు = ఈదమయన్తికి సంబంధించిన, రసధునీపాత్రే; రసధునీ = రసవాహినికి, పాత్రే = రెండు గట్టులమధ్య, అనగా ప్రవాహస్థానమున, ననగా పలువిధములైన రసముల కాధారమైన, చరిత్రే = చరిత్రవిషయమున, కైః = ఏ కవులచే, (కావ్యం = కావ్యము) నకరిష్యతే = చేయఁబడనేరదు. తప్పక చేయఁబడునని యర్థము. అందఱును తప్పక కావ్యమును రచియింపగలరు. దానికి తానే దృష్టాన్తమని కవి తాత్పర్యము. కాన, దమయన్తి కీర్తిదాయక మగుటవలన నలుని వరించినది. ఇట్లు నలవరణమే యామెకు క్షేమదాయకము.

**సమాసములు :**

విదర్భజాం :- విదర్భేభ్యః, జాయత ఇతి = విదర్భజా, తాం = విదర్భజాం.

అవిదుషీం :- న, విదుషీ = అవిదుషీ, తాం = అవిదుషీం.

రసధునీపాత్రే :- రసస్య, ధునీ = రసధునీ = రసధున్యాః, పాత్రం = రసధునీపాత్రం, తస్మిన్ = రసధునీపాత్రే.

**భావము :**

ఓ చెలికత్తెలారా! దమయన్తి వివేచనాశక్తి లేనిదని భావింపవలదు. కాని యింద్రాది దేవతలను వరించి వారి మూలమున దేవానందము ననుభవింప నవకాశమునుఁ బోగొట్టుకొని నలునివంటి మానవుని వరించి, మానవానందమునకుఁ బ్రవర్తించిన యామె యెట్లు వివేకవంతురాలగునని ప్రశ్నింపవలదు. ఏలయనగా; ఆనందముకంటెను కీర్తియే శ్రేష్ఠముగదా ? ఆమె యింద్రుని వరిం యతనికి పత్నియై రెండవ శచీదేవిగా గాకుండుటయే మేలైనది. ఏలయనగా, నే కవి శచీదేవి చరితమునుఁ గూర్చి కావ్యమును రచియించెనో చెప్పుడు. ఎవరును రచియింపలేదని యర్థము. వివిధ రసముల కాశ్రయమైన రసవాహినికిఱు గట్టుల మధ్య ప్రవహించు దమయన్తి చరిత్ర విషయమునందు, కవులెవ్వరు కావ్యమును రచియింపరు ? దానికి నైషధకర్తయగు శ్రీహర్షుడే తార్కాణము. కాన నలవరణము కీర్తిప్రదముగాన నిదియే మేలైనదని యాశయము. 86

శ్లో॥ వైదర్భీబహుజన్మనిర్మిత తపః
శిల్పేన దేహశ్రియా
నేత్రాభ్యాం స్వదతే యువాఽ
యమవనీవాసః ప్రసూనాయుధః.
గీర్వాణాలయసార్వభౌమ సుకృత
ప్రాగ్భారదుష్ప్రాపయా
యోగం భీమజయానుభూయ
భజతామద్వైత మద్య త్విషామ్. 87

ప॥వి॥ :- వైదర్భీబహుజన్మనిర్మితతపఃశిల్పేన - దేహశ్రియా - నేత్రాభ్యాం - స్వదతే - యువా - అయమ్ - అవనీవాసః - ప్రసూనాయుధః - గీర్వాణాలయసార్వభౌమసుకృతప్రాగ్భారదుష్ప్రాపయా - యోగం - భీమజయా - అనుభూయ - భజతామ్ - అద్వైతమ్ - అద్య - త్విషామ్.

అర్థము :- అవనీవాసః = భూమియందు వాసముగల్గిన, ప్రసూనాయుధః = పూవిల్తుడగు మన్మథుడు, అనగా, భూలోకమన్మథుడైన, అయం = ఈ,

యువా = యువకుడగు నలుడు, వైదర్భీబహుజన్మనిర్మితత
వైదర్భీ = దమయన్తియొక్క, బహుజన్మ = పెక్కుజన్మము
నిర్మిత = చేయఁబడిన, తపః = తపస్సనెడి, శిల్పేన = క
ముచే నేర్పడిన, లేదా, తపః = తపమువలన గల్గిన, శిల్పే
నైపుణ్యముచే నేర్పడిన, దేహశ్రియా = శరీరకాంతిచే, నేత్ర
చూచుచున్న మా నేత్రములకు, స్వదతే = ఆనందమునుఁ గల్గి
(కావుననే) గీర్వాణాలయసార్వభౌమసుకృతప్రాగ్భారదుష్ప్ర
గీర్వాణాలయ = దేవలోకమునకు, సార్వభౌమ = చక్ర
నింద్రునియొక్క, సుకృత = పుణ్యములరాశిచే, దుష్ప్రాప
దుర్లభురాలైన, భీమజయా = దమయన్తితో, యోగం =
మును, అనుభూయ = అనుభవించి, త్విషాం = కాంతు
అద్వైతం = ఐక్యమును, భజతాం = పొందునుగాత.

## సమాసములు ;

వైదర్భీబహుజన్మనిర్మితతపశ్శిల్పేన :- విదర్భేషు. భవా =
బహూనిచతానిజన్మానిచ = బహుజన్మాని, వైదర్భ్యాః, బహ
వైదర్భీబహుజన్మాని, వైదర్భీబహుజన్మసు, నిర్మితం = వై
జన్మనిర్మితం, వైదర్భీబహుజన్మనిర్మితం చతత్‌తపశ్చ
బహుజన్మనిర్మితతపః, వైదర్భీబహుజన్మనిర్మితతపసః,
వైదర్భీబహుజన్మనిర్మితతపశ్శిల్పః, తేన = వైదర్భీబహు
తపశ్శిల్పేన.

దేహశ్రియా :- దేహస్య, శ్రీః = దేహశ్రీః, తయా = దేహ
అవనీవాసః :- అవన్యాం, వాసః, యస్యసః = అవనీవాసః.
ప్రసూనాయుధః :- ప్రసూనమాయుధః, యస్యసః = ప్రసూ
గీర్వాణాలయసార్వభౌమసుకృతప్రాగ్భారదుష్ప్రాపయా:-గీ
ఆలయః = గీర్వాణాలయః, గీర్వాణాలయస్య, సార్వభౌమ
ణాలయసార్వభౌమః, గీర్వాణాలయసార్వభౌమస్య, సుకృతా
ణాలయసార్వభౌమసుకృతాని, గీర్వాణాలయసార్వభౌమస

ప్రాగ్భారః = గీర్వాణాలయసార్వభౌమసుకృతప్రాగ్భారః, తేన, ప్రాప్తుం శక్యా=దుష్ప్రాపా గీర్వాణాలయసార్వభౌమసుకృతప్రాగ్భారేణ, దుష్ప్రాపా=గీర్వాణాలయసార్వభౌమసుకృతప్రాగ్భారదుష్ప్రాపా, తయా =గీర్వాణాలయసార్వభౌమసుకృతప్రాగ్భారదుష్ప్రాపయా.

భీమజయా :- భీమాజ్జాయత ఇతి = భీమజా, తయా = భీమజయా.

భావము :

భూలోకమన్మథుడైన యీ నలుడు, దమయన్తి పెక్కుజన్మల తపః ఫలమైన కలాకౌశలమో యనునట్లున్న శరీరశోభతో, నతనిని జూచు మాపంటి వారల, నేత్రములకానందము గొల్పుచున్నాడు. స్వర్లోక సార్వభౌముడగు నింద్రుడు తన పుణ్యరాశిచే పొంద సాధ్యముకాని యీ దమయన్తితో నీనలుడు సంబంధమునుబొంది కాంతులతో నైక్యమును బొందుగాత.

లేదా భూలోక మన్మథుడగు నలుడు స్వయముగ దేహములేనివాడైనను, దమయన్తియొక్క పెక్కుజన్మల తపఃఫలముగా దేహమునొంది మిక్కిలి సుందరుడుగా నందరికి నేత్రపర్వమై భాసిల్లుచుండెను. ఈ నలుడు దమయన్తితో దామ్పత్య సంబంధమును బడసి, యుభయులు కలియుటచే నీ నలుడు కాంతుల కాశ్రయులుగనో, కాంతిస్వరూపులుగనో యగునుగాత. నూరు యజ్ఞములుచేసి గొప్ప పుణ్యరాశి నార్జించిన యింద్రునికి సైతము లభింపని దమయన్తిని పతడు వడసి ఇంద్రునికంటెను సౌభాగ్యాతిశయము పుణ్యాతిశయముగ గలవాడు. భీమజయా = భీమేశ్వరుని యనుగ్రహము వలన గల్గినవిద్య, యోగం = అష్టాఙ్గ యోగముల నాచరించి బ్రహ్మాత్మ స్వరూపమైన యద్వైతమును యోగి వడసినట్లు, ఈ నలుడును దమయన్తితో నట్టి యద్వైతసదృశమగు నద్వైతమును బడయునుగాత.

శ్లో॥ స్త్రీపుంసవ్యతిషఙ్గనం జనయతః
పత్యుః ప్రజానామభూ
అభ్యాసఃపరిపాకిమః కిమనయోర్దామ్పత
సమ్పత్తి
అసంసారపురన్ధ్రిపూరుషమిథః
ప్రేమార్పణక్రీడయ
ప్యేతజ్జమ్పతి గాఢరాగరచనాత్
ప్రాకర్షి చేతోభు

ప॥వి॥ :- స్త్రీపుంసవ్యతిషఙ్గనం - జనయతః - పత్యుః - ప్రజా
- అభ్యాసః - పరిపాకిమః - కిమ్ - అనయోః - దామ్పత
అసంసారపురన్ధ్రిపూరుషమిథఃప్రేమార్పణక్రీడయా - అ
మ్పతిగాఢరాగరచనాత్ - ప్రాకర్షి - చేతోభువః.

అర్థము :- స్త్రీపుంసవ్యతిషఙ్గనం; స్త్రీ = స్త్రీయొక్కయు, పురుష
యొక్కయు, వ్యతిషఙ్గనం = సంయోగమును, జనయ
చున్న, ప్రజానాం = ప్రజలకు, పత్యుః = పాలకుడ
యొక్క, పరిపాకిమః = పరిపాకముచే నెరవేర్పఁబడిన,
మాటిమాటికి స్త్రీపురుషులను గలుపుటయను వ్యాపారము,
ఈ నలదమయన్తులయొక్క, దామ్పత్యసమ్పత్తయే = భా
సంపాదనకై, అభూత్‌కిం = అయినదాయేమి? అట్లుకానిచో
రూపుల కలయునట్లు చేయుట యెట్లు సంభవించును? అట్ల
లేనిచో నిట్లు, ఒండొరులలో ననురాగమునుఁ గల్గించునే
దును? కిఞ్చ = మఱియు, చేతోభువఃఅపి = మన్మథునకు
రపురన్ధ్రిపూరుషమిథఃప్రేమార్పణక్రీడయా, ఆసంసార =
బించి, పురన్ధ్రిపూరుష = స్త్రీపురుషులకు, మిథః =
ప్రేమార్పణ = అనురాగము నుత్పత్తి చేయుటయను, క్రీ
ఆటచేతను, ఏతజ్జమ్పతిగాఢరాగరచనాత్; ఏతత్ = ఈ,

కార్యాంతరర్తలైన నలదమయన్తులలో, గాఢ = అధికమైన, రాగ = అను రాగమును, రచనాత్ = కల్పించుటవలన, ప్రాకర్షి = ఉత్కర్షగా నేర్ప డుట జరిగినది. ఒండొరులలో ననురాగము నుత్పత్తి చేయుటయను క్రీడకు ఉత్కర్ష యీ నలదమయన్తులలోనే విశ్రమించినదని యాశ యము.

**సమాసములు :**

స్త్రీపుంసవ్యతిషఙ్గనం :- స్త్రీచ, పుమాంశ్చ=స్త్రీపుమాంసౌ, స్త్రీపుంసోః, వ్యతిషఙ్గనం, - స్త్రీపుంసవ్యతిషఙ్గనం.
దామ్పత్యసమ్పత్తయే :- జాయాచ, పతిశ్చ = దమ్పతీ, దమ్పత్యోః, భావః = దామ్పత్యం, దామ్పత్యస్య సమ్పత్తిః = దామ్పత్యసంపత్తిః, తస్యై = దామ్పత్యసమ్పత్తయే.
పరిపాకిమః :- పరిపాకేన, నిర్వృత్తః = పరిపాకిమః.
ఆసంసారపురన్ధ్రిపూరుషమిథఃప్రేమార్పణక్రీడయా :- సంసారమారభ్య ఆసంసారం, పురన్ధ్రిశ్చ, పూరుషశ్చ = పురన్ధ్రిపూరుషౌ, పురన్ధ్రిపూ రుషయోఃమిథఃప్రేమార్పణం = పురన్ధ్రిపూరుషమిథఃప్రేమార్పణం, ఆసంసారం, పురన్ధ్రిపూరుషమిథఃప్రేమార్పణమేవ, క్రీడా = ఆసంసార పురన్ధ్రిపూరుషమిథఃప్రేమార్పణక్రీడా, తయా = ఆసంసారపురన్ధ్రి పూరుదేమిథఃప్రేమార్పణక్రీడయా.
ఏతజ్జమ్పతిగాఢరాగరచనాత్ :- జాయాచ,పతిశ్చ = జమ్పతీ, ఏతౌ జతౌ జమ్పతీచ = ఏతజ్జమ్పతీ, రాగస్యరచనం = రాగరచనం, గాఢం చతత్, రాగరచనంచ = గాఢరాగరచనం, ఏతజ్జమ్పత్యోః, గాఢరాగ రచనం = ఏతజ్జమ్పతిగాఢరాగరచనం, తస్మాత్, ఏతజ్జమ్పతిగాఢ రాగరచనాత్.
చేతోభువః :- చేతసి, భవతీతి = చేతోభూః, తస్య = చేతోభువః.

**భావము :**

స్త్రీపురుషులను కలుపుచున్న సృష్టికర్తయైన బ్రహ్మయొక్క పరిపక్వ మగు నభ్యాసము ఈ నలదమయన్తుల దామ్పత్య సంపాదన కుపయుక్తమైనదా

యేమి? కానిచో నాసృష్టికర్త కింతటి యపురూపుం సంయోజించేయు శక్తి యెట్లు గల్గినది? అట్టి అభ్యాసము లేనిచో, నీవిధముగా నొండొరులయం దను రాగమును గల్పించు నేర్పెట్లు వచ్చినది? మఱియు, సృష్టి మొదల్కొని స్త్రీపురుషులయందు పరస్పరానురాగము నుత్పత్తి చేయుటయను నాటచే నీనలదమయన్తులయందు గాఢమగు ననురాగమునుం గల్పించుట వలన మన్మథునకు నుత్కర్ష యేర్పడినది. ఒండొరులలో ననురాగము నుత్పత్తి చేయుటకు అతిశయము; నలదమయన్తులయందే విశ్రమించినదని యాశయము. ౮౮

శ్లో॥ తాభిర్దృశ్యత ఏష యాన్
పథి మహాజ్యైష్ఠీ మహే మన్మహే
యద్దృగ్భిః పురుషోత్తమః పరిచితః
ప్రాక్ మఞ్చమఞ్చన్ కృతః.
సా స్త్రీరాట్ పతయాలుభిః శితిసితైః
స్యాదస్య దృక్చామరైః
సస్నే మాఘమఘాభిఘాతి
యమునా గఙ్గేఘయోగే యయా. 89

ప॥వి॥ :- తాభిః - దృశ్యతే - ఏషః - యాన్ - పథి - మహాజ్యైష్ఠీమహే - మన్మహే - యద్దృగ్భిః - పురుషోత్తమః - పరిచితః - ప్రాక్ - మఞ్చమ్ - అఞ్చన్ - కృతః - సా - స్త్రీరాట్ - పతయాలుభిః - శితిసితైః - స్యాత్ - అస్య - దృక్చామరైః - సస్నే - మాఘమ్ - అఘాభిఘాతియమునాగఙ్గేఘయోగే - యయా.

అర్థము :- తాభిః = ఆస్త్రీలతో, పథి = రాజమార్గమునందు, యాన్ = వెళ్ళుచున్న, ఏషః = ఈనలుడు, దృశ్యతే = చూడఁబడుచున్నాడు. యద్దృగ్భిః; యత్ = ఏస్త్రీలయొక్క, దృగ్భిః = నేత్రములచే, ప్రాక్ = పూర్వజన్మమున, మహాజ్యైష్ఠీమహే; మహా = పూజ్యమైన, జ్యైష్ఠీ = జ్యేష్ఠపూర్ణిమనాటి. మహే = ఉత్సవమునందు, మఞ్చం = మంచను, అనగా మంచమువంటి స్థానమును అనగా శయనమును, అఞ్చన్ = పొందుచు,

ననగా శయనము నధిష్ఠించుచు, పురుషోత్తమః = శ్రీమన్నారాయణుడు, పరిచితః = చూడబడినవాడుగా, కృతిః = చేయఁబడెను. ననగా కన్ను లతో నుపాసింపఁబడెనని యర్థము. గొప్పపుణ్యము లేనిచో నింతటి మహానుభావునిదర్శనమెట్లు లభించును. కావుననే చెప్పఁబడినది —

"డోలారూఢంచగోవిందం. మఞ్చస్థం మధుసూదనం. రథస్థం వామనం దృష్ట్వా. పునర్జన్మనవిద్యతే" అని ఊయెలయందున్న గోవిందుని, శయనమందున్న మధుసూదనుని రథమునందున్న వామనునిఁ జూచినవారికి పునర్జన్మ లేదు. తథా = అట్లే, పతయాలుభిః = పైన బడనున్న, శితిసితైః; శితి = శ్యామల వర్ణమును గలవియు, సితైః = తెల్లని వర్ణము గలవియునగు, అస్య = ఈ నలునియొక్క, దృక్చామరైః = నేత్రములనెడి వింజామరలచే, సా = ఆ, స్త్రీరాట్ = స్త్రీలకు రాణిగ్రా స్యాత్ = అగును. యయా = ఏ స్త్రీచే, అఘాభిఘాతియమునాగఙ్గౌఘయోగే; అఘ = పాపములను, అభిఘాతి = తొలగించుచున్న, యమునా = యమునానది యొక్కయు, గంగా=గంగానది యొక్కయు ఓఘ = ప్రవాహముయొక్క, యోగే = కలయికయందు ననగా గంగా యమునల సంగమముగల ప్రయాగ క్షేత్రమందు, మాఘనక్షత్రముతోటి పున్నమగల మాఘమాసమంతయు, సస్నే = స్నానము - చేయబడుట (ఏర్పడినది).—

ఈ విషయమున స్మృతి :—

"సితాఽసితేషుయోః స్నాతం, మాఘమాసే యుధిష్ఠిర. నతేషాంపునరావృత్తిః, కల్పకోటి శతైరపి".—

ఓ ధర్మరాజా! మాఘమాసమున గంగాయమునల సంగమము గల ప్రయాగ క్షేత్రమున స్నానమాడిన వారికి శతకోటి కల్పములను పునరావృత్తి లేదు. అనగా వారు శాశ్వత ముక్తినిఁ బడయుదురు" అని మన్మహే = తలంతుము.

సమాసములు :

మహాజ్యైష్ఠీమహే :- జ్యేష్ఠయా, యుక్తా. పౌర్ణమాసీ = జ్యైష్ఠీ మహా జ్యైష్ఠ్యామహాః = మహాజ్యైష్ఠీమహాః, తస్మిన్ = మహాజ్యైష్ఠీమహే.

యద్దృగ్భిః :— యాసాం దృశః = యద్దృశః, తాభిః = యద్దృగ్భిః
పురుషోత్తమః :— పురుషాణాం, ఉత్తమః = పురుషోత్తమః
స్త్రీరాట్ :— స్త్రీణాం, రాట్ = స్త్రీరాట్.
సితాసితైః :— సితాశ్చతే అసితాశ్చ = సితాఽసితాః తైః = సితాఽసితైః.
మాఘే :— మఘాభిర్యుక్తా, పౌర్ణమాసీ = మాఘీ, మాఘీ అస్మిన్ ఇతి = మాఘః, తమ్ = మాఘం.
అఘాభిఘాతియమునాగఙ్గౌఘయోగే :— అఘాని, అభిహన్తీతి = అఘాభిఘాతీ, యమునాచగఙ్గాచ = యమునాగఙ్గే, యమునాగఙ్గయోరోఘః = యమునాగఙ్గౌఘః అఘాభిఘాతీచాసౌ, యమునాగఙ్గౌఘశ్చ = అఘాభిఘాతియమునాగఙ్గౌఘః, అఘాభిఘాతిగయమునాగఙ్గౌఘస్య, యోగః = అఘాభిఘాతియమునాగఙ్గౌఘయోగః, తస్మిన్ = అఘాభిఘాతియమునాగఙ్గౌఘయోగే.

**భావము :**

రాజమార్గమున వెళ్ళుచున్న నలుని యా స్త్రీలు గాంచిరి. స్త్రీల నేత్రములకు నితని పూర్వజన్మమందలి "మహాజ్యైష్ఠి" యను మహోత్సవమున శయనస్థుడైన శ్రీమన్నారాయణుని రూపము పరిచయము గావింపబడెను. అనగా నలుని గాంచు స్త్రీలనయనములా శ్రీమన్నారాయణు నుపాసించినవిగా నాయెను. అనగా నీనలుడట్టి శయనస్థుడగు శ్రీమన్నారాయణుని స్మృతికిఁ దెచ్చుచుండెనని యర్థము. పూర్వజన్మమందట్టి పురుషోత్తముడగు, శ్రీమన్నారాయణుడై యీ నలుడుండెనని యాశయము. ఎంత పుణ్యమో లేనిదే యిట్టి మహానుభావుని దర్శన మేర్పడదు గదా! కావుననే దోలాధిరోహణము గావించిన గోవిందుని, శయనస్థుడైన మధుసూదనుని, రథమందలి వామనుని దర్శించువారికి పునర్జన్మ యుండదని స్మృతులు ఘోషించుచున్నవి. ఆ స్త్రీలనందఱికిని రాణియై యలరారు దమయన్తిని నలుడు తన నలుపు వన్నెలు తెలుపు వన్నెలు గల నేత్రములనెడి చామరములతోఁ జూచుచుండెను. అనగా నలుని సితాఽసిత దృష్టులు, ఆమెపై నిధి రాజలాంఛనములగు ధామర మర్యాదను నారాణియగు దమయన్తికిఁ గల్పిం

చినవని యాశయము. అట్లు సితాఽసితదృష్టులు పైబడగా నాదమయన్తి నలుపు వన్నె గల యమునా ప్రవాహము — తోడను గూడిన నదీద్వయసఙ్గమమైన ప్రయాగ క్షేత్రమున నొకదిక్కునుండి గంగయు, మఱియొక దిక్కునుండి యమునయు వచ్చి కలియును. అడుగున సరస్వతీనది యన్తర్వాహినిగాఁ బారు చుండెను. ఇట్లు ఈ మూడు నదులను కలయుటవలన నీ ప్రయాగక్షేత్రమునకు త్రివేణీ సంగమమనియు పేరు గలదు. అనగా నలుడు దమయన్తిపై ననురాగముతో తన సితాఽసిత దృష్టులను ప్రసరింపఁజేసెనని సారాంశము. 89

శ్లో॥ వైదర్భీ విపులానురాగకలనా సౌభాగ్యమత్రాఖిల
క్షోణీచక్రశతక్రతౌ నిజగదే తద్వృత్తవృత్తక్రమైః
కిఞ్చాస్మాక నరేన్ద్రభూసుర
గతాసంభూతయే లగ్నకం
దేవేన్ద్రావరణ ప్రసాదిత శచీ
విశ్రాణి తాశీర్వచః. 90

ప॥వి॥ :- వైదర్భీవిపులానురాగకలనాసౌభాగ్యమ్ - అత్ర - అఖిలక్షోణీచక్రశతక్రతౌ - నిజగదే - తద్వృత్తవృత్తక్రమైః - కిం - చ - అస్మాకనరేన్ద్రభూసుభగతాసమ్భూతయే - లగ్నకం - దేవేన్ద్రావరణప్రసాదితశచీవిశ్రాణితాశీర్వచః.

అర్థము :- అఖిలక్షోణీచక్రశతక్రతౌ; అఖిల = సమస్తమైన, క్షోణీచక్ర = భూమలణ్డమునకు, శతక్రతౌ = ఇంద్రుడైన, అత్ర = ఈ నలునియందు వైదర్భీవిపులానురాగకలనాసౌభాగ్యం; వైదర్భీ = దమయన్తియొక్క, విపులానురాగ = విశేషానురాగముయొక్క, కలనా = సాక్షియనెడు, సౌభాగ్యం = ప్రేమ, తద్వృత్తవృత్తక్రమైః; తత్ = ఆ దమయన్తికి సంబంధించిన, వృత్త = కడచిపోయిన, వృత్త = చరిత్రము యొక్క, క్రమైః = క్రమములతో ననగా నింద్రుని ప్రతిషేధించుట మున్నగు వానితో, నిజగదే = చెప్పబడినది. కిఞ్చ = మఱియు, దేవేన్ద్రాఽవరణ ప్రసాదితశచీవిశ్రాణితాశీర్వచః; దేవేన్ద్ర = ఇంద్రుని, ఆవరణ = దమయన్తిని వరించినందువలన, ప్రసాదిత = ఉత్సాహించిన, శచీ = శచీ

దేవిచే, విశ్రాణిత = ఒసంగఁబడిన. ఆశీర్వచః = దీవెన, ఆస్మాక నరేన్ద్రభూసుభగతాసమ్భూతయే; ఆస్మాక = మాకు సంబంధించిన, నరేన్ద్రభూ = రాజపుత్రికయగు దమయన్తికి, సుభగతా = పతిప్రియత్వము, సంపతయే = కలుగుటకై, లగ్నకం = ప్రమాణముగ, (అభూత్ = ఆయెను.) స్త్రీల సౌభాగ్యము శచీప్రసాదముచే నేర్పడునని యర్థము.

**సమాసములు :**

వైదర్భీవిపులానురాగకలనాసౌభాగ్యమ్ :- విపులశ్చాసౌ, అనురాగశ్చ = విపులానురాగః, వైదర్భ్యాః, విపులానురాగః = వైదర్భీవిపులానురాగః, వైదర్భీవిపులానురాగస్య, కలనా = వైదర్భీవిపులానురాగకలనా. వైదర్భీవిపులానురాగకలనైవ సౌభాగ్యం = వైదర్భీవిపులానురాగకలనాసౌభాగ్యమ్.

అఖిలక్షోణీచక్రశతక్రతౌ :- క్షోణ్యాః, చక్రం = క్షోణీచక్రం, అఖిలంచ తత్ క్షోణీచక్రంచ = అఖిలక్షోణీచక్రం, అఖిలక్షోణీచక్రస్య, శతక్రతుః = అఖిలక్షోణీచక్రశతక్రతుః, తస్మిన్ = అఖిలక్షోణీచక్రశతక్రతౌ.

తద్వ్యావృత్తవృత్తక్రమైః :- వృత్తంచ తత్ వృత్తంచ = వృత్తవృత్తమ్, తస్య, వృత్తవృత్తం = తద్వ్యావృత్తవృత్తం. తద్వ్యావృత్తవృత్తస్య, క్రమాః = తద్వ్యావృత్తవృత్తక్రమాః, తైః = తద్వ్యావృత్తవృత్తక్రమైః.

ఆస్మాకనరేన్ద్రభూసుభగతాసమ్భూతయే :- అస్మాకమియం = ఆస్మాకీ. ఆస్మాకీచసానరేన్ద్రభూశ్చ = ఆస్మాకనరేన్ద్రభూః. ఆస్మాకనరేన్ద్రభువః, సుభగతా = ఆస్మాకనరేన్ద్రభూసుభగతా, ఆస్మాకభూసుభగతాయాః, సమ్భూతిః = ఆస్మాకనరేన్ద్రభూసుభగతాసమ్భూతిః, తస్యై = ఆస్మాకనరేన్ద్రభూసుభగతాసమ్భూతయే.

దేవేన్ద్రావరణప్రసాదితశచీవిశ్రాణితాశీర్వచః:- దేవానామిన్ద్రః = దేవేన్ద్రః. దేవేన్ద్రస్య, అవరణం = దేవేన్ద్రావరణం, దేవేన్ద్రావరణేన, ప్రసాదితా = దేవేన్ద్రావరణప్రసాదితా; దేవేన్ద్రావరణప్రసాదితాచ, సాశచీచ = దేవేన్ద్రావరణప్రసాదితశచీ, దేవేన్ద్రావరణప్రసాదితశచ్యా, విశ్రాణితం = దేవేన్ద్రా

వరణప్రసాదితశచీవిశ్రాణితం, ఆశీరర్థకం, వచః = ఆశీర్వచః. దేవేన్ద్రావరణప్రసాదితశచీవిశ్రాణితంచతత్, ఆశీర్వచశ్చ = దేవేన్ద్రావరణప్రసాదితశచీవిశ్రాణితాశీర్వచః.

భావము ;

సకల భూచక్రమునకు నింద్రుడగు నలునియందు దమయన్తికి గల్గిన యనురాగ విశేషము, ఇంద్ర నిరాకరణము మున్నగుc గడచిపోయిన యామె నడవడికలచే, సూచింపబడినది. మఱియు దమయన్తి దేవేన్ద్రుని వరింపనందు వలన ప్రసన్నురాలైన శచీదేవి యొసంగిన దీవెన యా రాజపుత్రికయందు నలునికి వాల్లభ్యము గలుగుటకై లగ్నకమనగా ప్రమాణముగా నుండినది. 90

శ్లో॥ ఆ సుత్రామమపాసనాన్మఖ
భుజాం భైమ్యేవ రాజవ్రజే
తాదర్థ్యాగమనానురోధపరయా
యుక్తార్థిలజ్జామృజా.
ఆత్మానం త్రిదశప్రసాధఫలితం
పత్యే విధాయాఽనయా
హ్రీరోషాఽపయశః కథానవసరః
సృష్టః సురాణామపి. **91**

ప॥వి॥ :- ఆసుత్రామం - అపాసనాత్ - మఖభుజాం - భైమ్యా - ఏవ - రాజవ్రజే - తాదర్థ్యాగమనానురోధపరయా - యుక్తా - అర్థి - లజ్జామృజా - ఆత్మానం - త్రిదశప్రసాదఫలితం - పత్యే - విధాయ - అనయా - హ్రీరోషాఽపయశః కథానవసరః - సృష్టః - సురాణాం - అపి.

అర్థము :- రాజవ్రజే = రాజసమూహము, తాదర్థ్యాగమనానురోధపరయా; తాదర్థ్య = నలుడనెడి యర్థమును నిమిత్తముc జేసికొని, ఆగమన = వచ్చుట యనగా స్వయంవరమును ప్రవేశించుట ననుసరించుటయే, పరయా = ప్రధానముగాc గల్గిన, అనగా నలునిc బ్రధానముగా జేసికొనిన,

భైమ్యా = దమయన్తిచే, ఆసుత్రామం = ఇంద్రుని వరకును, ఋభుక్షాం = దేవతలను, అపాసనాత్ = నిరాకరించుటవలన, లజ్జామృజా = సిగ్గును యడమకొనుట అనగా క్షాలనఁ జేసికొనుట, యుక్తా = తగినది గనే, అర్జి = సంపాదింపఁబడినది. అథవా = లేదా, భైమ్యాః = దమయన్తికి, త్రిదశప్రసాదఫలితం; త్రిదశ = దేవతలయొక్క, ప్రసాద = అనుగ్రహముచే, ఫలితం = సఫలమైన, ఆత్మానం = తన్ను, పత్యే= వరుడైన నలునకు, విధాయ = ఇచ్చి. సురాణాం=దేవతలకు, హ్రీరోషాఽపయశఃకథానవసరః; హ్రీ = లజ్జయు, రోష = రోషము, అపయశః = అపకీర్తియను వీనితోఁగూడిన, కథా = కథలకు, అనవసరః = అవకాశము లేకయుండుట, అనగా దమయన్తి తిరస్కరించుటవలన నింద్రాది దేవతలకు గల్గినసిగ్గు మున్నగువానితో కూడిన కథలకు నవకాశము లేకయుండుట, సృష్టః = చేయఁబడినది.

సమాసములు :

ఆసుత్రామం :- సుత్రామేణ, అభివ్యాప్య = ఆసుత్రామం.

రాజవ్రజే :- రాజ్ఞాం, వ్రజః = రాజవ్రజః, తస్మిన్ = రాజవ్రజే.

తాదర్థ్యాగమనానురోధపరయా :- సః, అర్థః, = యస్యతత్‌తదర్థం, తదర్థస్య, భావః = తాదర్థ్యం, తాదర్థ్యేన, ఆగమనం = తాదర్థ్యాగమనం, తాదర్థ్యాగమనస్య, అనురోధః = తాదర్థ్యాగమనానురోధః, తాదర్థ్యాగమనానురోధఃపరః, యస్యాస్సా = తాదర్థ్యాగమనానురోధపరా, తయా = తాదర్థ్యాగమనానురోధపరయా.

లజ్జామృజా :- లజ్జాయాః, మృజా = లజ్జామృజా.

త్రిదశప్రసాదఫలితం :- త్రిదశానాం, ప్రసాదః = త్రిదశప్రసాదః, త్రిదశప్రసాదేవఫలితః = త్రిదశప్రసాదఫలితః, తమ్ = త్రిదశప్రసాదఫలితమ్.

హ్రీరోషాపయశఃకథాఽనవసరః :- హ్రీశ్చ = రోషశ్చ, అపయశశ్చ = హ్రీరోషాపయశాంసి, హ్రీరోషాపయశసాం, కథాః = హ్రీరోషాపయశఃకథాః, న, అవసరః = అనవసరః, హ్రీరోషాపయశఃకథానాం అనవసరః = హ్రీరోషాపయశఃకథానవసరః.

**భావము :**

పెక్కంద్రు రాజులున్నను వారిని లెక్కింపక కేవలము నలుని ముఖ్యముగఁ జేసికొని స్వయంవర మణ్డపమునుఁ బ్రవేశించిన దమయన్తి, యింద్రుని వరకు దేవతలను నిరాకరించుటవలన, వారికి లజ్జ యేర్పడుటయు, దానిని వారు యడిచివైచుకొనుట సముచితమే. ఏలయనగా— "ఆహారేవ విహారేచత్యక్తలజ్జః సుఖీభవేత్" అని చెప్పినట్లు ఆహారవిహారాదుల యందు సిగ్గును వీడి వర్తించు వానికే సుఖము గల్గును గాన దేవత యా ప్రవర్తన సముచితము మఱియానీ దమయన్తి దేవతల యనుగ్రహముచే పంచ లీ యమునందు తానెదుర్కొనవలసిన చిక్కుల నధిగమించి, సఫలమైన తన్ను వగుదైన నలునకొసంగి యా దేవతలకు సిగ్గుగాని, రోషముగాని యపకీర్తిగాని కల్గుట కవకాశము లేకుండఁ జేసినది. ఇంద్రాదులను నిరాకరించి నలుని వరించుటచే నాదేవతలకు లజ్జాదులు కల్గియుండెడివి. కాని వారి నారాధించి వారి యనుగ్రహముచే నలుని వరించినందువలన దేవతలకు బైవిధముగా లజ్జాదులు కలుగుట కవకాశము లేకపోయినదని యాశయము. 91

శ్లో॥ ఇత్యాక్షేపురను ప్రతీక
నిలయాలఙ్కారసారశ్రియా
ఽలఙ్కుర్వత్తను రామణీయక
మమూరాలోక్య పౌరస్త్రియః.
సానన్దం కురువిన్దసున్దర కరస్యానన్దనం స్యన్దనం
తస్యాధ్యాస్యయతః శతక్రతు
హరిత్క్రీడాద్రి మిన్దోరివ. **92**

ప॥వి॥ :- ఇతి - ఆక్షేపః - అన్వప్రతీకనిలయాలఙ్కారసారశ్రియా - అలఙ్కుర్వత్తనురామణీయకమ్ - అమూః - ఆలోక్య - పౌరస్త్రియః - సానన్దం - కురువిన్దసున్దరకరస్య - ఆనన్దనం - స్యన్దనం - తస్య - ఆధ్యాస్య - యతః - శతక్రతుహరిత్క్రీడాద్రిమ్ - ఇందోః - అపి.

అర్థము :- కురువిన్దసున్దరకరస్య; కురువింద = పద్మరాగములవలె, సుందర = అందములైన, కరస్య = చేతులుగల, పక్షాన్తరమున— కురువిన్ద = పద్మరాగములవలె, సుందర= అందములైన, కరస్య=కిరణములు గల,

ఆనన్దనం=ఆనందమును గల్గించునట్టి, స్యన్దనం=రథమును, అధ్యాస్య= ఎక్కి, యతః=వెళ్ళుచున్న, ఇందోరివ=చంద్రునికిపలె, అనుప్రతీకనిలయాలఙ్కారసారశ్రియా; అనుప్రతీక=ఒక్కొక్క యవయవమును,నిలయ =ఆశ్రయముగాఁ గల్గిన, అలఙ్కారసారశ్రియాః అలఙ్కారసార=శ్రేష్ఠములైన, భూషణముల యొక్క, శ్రియా =కాన్తితో, అలఙ్కుర్వత్తను రామణీయకం; అలఙ్కుర్వత్ = అలఙ్కరించుచున్న, తన=శరీరము యొక్క, రామణీయకం = అందమును, ఆలోక్య = చూచి, పౌరస్త్రియః = నగర స్త్రీలు, ఇతి = ముందుచెప్పిన విధముగా, సానందం = ఆనందముతోడ, ఆలేపుః = సంభాషించిరి.

## సమాసములు :

అనుప్రతీకనిలయాలఙ్కారసారశ్రియా :- ప్రతీకే, ప్రతీకే = అనుప్రతీకం, అనుప్రతీకం, నిలయః, యేషాన్తే = అనుప్రతీకనిలయాః, సారాశ్చతే, అలఙ్కారాశ్చ = అలఙ్కారసారాః. అనుప్రతీకనిలయాశ్చతే, అలఙ్కారసారాశ్చ = అనుపతీకనిలయాలఙ్కారసారాః, అనుప్రతీకనిలయాలఙ్కారసారాణాం. శ్రీః = అనుప్రతీకనిలయాలఙ్కారసారశ్రీః, తయా = అనుప్రతీకనిలయాలఙ్కారసారశ్రియా.

అలఙ్కుర్వత్తనురామణీయకం :- అలఙ్కుర్వతీచసా తనుశ్చ=అలఙ్కుర్వత్తనుః, రమణీయకస్య, భావః= రామణీయకం, అలఙ్కుర్వత్తనోః, రామణీయకం = అలఙ్కుర్వత్తనురామణీయకం, తత్ = అలఙ్కుర్వత్తనురామణీయకం. తత్ =

పౌరస్త్రియః :- పురే, భవాః = పౌరాః, పౌరాశ్చతా, స్త్రియశ్చ = పౌరస్త్రియః.

కురువిన్దసున్దరకరస్య :- కురువిన్దఇవసున్దరౌకరౌయస్యసః = కురువిన్ద సున్దరకరః, తస్య = కురువిన్దసున్దరకరస్య.

పక్షాన్తరమున :- కురువిన్దాఇవసున్దరాఃకరాః యస్యసః =కురువిన్దసున్దర కరః, తస్య = కురువిన్దరకరస్య.

శతక్రతుహరిత్తీర్థ్యాద్రిమ్ :- శతక్రతోః; హరిత్ = శతక్రతుహరిత్,

యాః, అద్రిః = క్రీడాద్రిః శతక్రతుహరితః, క్రీడాద్రిః = శత
హరిత్క్రీడాద్రిః, తమ్ = శతక్రతుహరిత్క్రీడాద్రిమ్.

రాగములవంటి హస్తములుగల్గి ఆనందము నొసంగెడి రథమునెక్కి
ఉన్న యానలుడు తూర్పుదిక్కులోని క్రీడాశైలమగు నుదయా
వెళ్ళుచున్న చంద్రుని శోభను వహించెను. మఱియు నా నలుని
కట నాభరణములనుఁ దొడగుటవలన వానిశోభ యొక్కొక్క యవ
ను నెలకొని గొప్పశోభను గల్గించుచుండినది. ఆ శోభను పౌర
పూర్వపు శ్లోకములయందు వర్ణింపఁబడిన నలసౌందర్యమును
ందముతో సల్లాపముఁ జేయుచుండిరి. 92

**శ్రీహర్షం కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః సుతం**
**శ్రీహీరః సుషువే జితేంద్రియచయం**
**మామల్లదేవీ చ యం.**
**యాతః పఞ్చదశః కృశేతరరస**
**స్వాదావిహాయం మహా**
**కావ్యే తస్య హి వైరసేని చరితే**
**సర్గో నిసర్గోజ్జ్వలః. 93**

హర్షం - కవిరాజరాజిముకుటాలఙ్కారహీరః - సుతం - శ్రీహీరః
షువే - జితేన్ద్రియచయం - మామల్లదేవీ - చ - యం - యాతః
ఞ్చదశః - కృశేతరరసస్వాదౌ - ఇహ - అయం - మహాకావ్యే-
- హి - వైరసేనిచరితే - సర్గః - నిసర్గోజ్జ్వలః.

రాజరాజిమకుటాలఙ్కారహీరః; కవిరాజ = కవిశ్రేష్ఠులయొక్క,
= పంక్తియొక్క, మకుట = కిరీటములకు, అలఙ్కార = భూష
లో, హీరః = వజ్రమణియగు, శ్రీహీరః = శ్రీహీరుడను విద్వాం
జితేన్ద్రియచయం; జిత = జయింపఁబడిన, ఇంద్రియచయం =
యసమూహము గల్గిన, శ్రీహర్షం = శ్రీహర్షుడను, సుతం =
, సుషువే = ఉత్పత్తి గావించెనో, మామల్లదేవీచ = మామల్ల

దేవి అను తల్లియు, యం = ఏవానిని, సుషువే = కనెనో, తస్య = అతని యొక్క, కృశేతరరసస్వాదౌ; కృశేతర = ఘనమైన, రస = శృఙ్గార రసముచే, స్వాదౌ = రుచియుక్తమైన, మహాకావ్యే = మహాకావ్యరూప కృతియైన, వైరిసేనిచరితే = వీరసేనమహారాజు పుత్రుడగు నలమహారాజుయొక్క, చరితే = చరిత్రమునందు, పఞ్చదశః = పదునైదవదైన, నిసర్గోజ్జ్వలః = స్వభావభాసురమైన, సర్గః = సర్గ, యాతః = కడచి పోయినది.

## సమాసములు:

కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః :- కవీనాం, రాజానః = కవిరాజాః, కవిరాజానాం, రాజిః = కవిరాజరాజిః, కవిరాజరాజేః, మకుటాని = కవిరాజరాజిమకుటాని, కవిరాజరాజిమకుటేషు, అలఙ్కారాః = కవిరాజరాజిమకుటాలఙ్కారాః, కవిరాజరాజిమకుటాలఙ్కారేషు, హీరః = కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః.

జితేన్ద్రియచయం ;- ఇన్ద్రియాణాం, చయః = ఇన్ద్రియచయః, జితః ఇన్ద్రియచయః, యేనసః = జితేన్ద్రియచయః, తమ్ = జితేన్ద్రియచయం.
పఞ్చదశః ;- పఞ్చ దశానాం, పూరణః = పఞ్చదశః.
కృశేతరరసస్వాదౌ :- కృశాత్, ఇతరః = కృశేతరః, కృశేతరశ్చాసౌ, రసశ్చ = కృశేతరరసః, కృశేతరరసేన, స్వాదు = కృశేతరరసస్వాదు, తస్మిన్ = కృశేతరరసస్వాదౌ.
వైరసేనిచరితే ;- వీరసేనస్య, అపత్యంపుమాన్ = వైరసేనిః, వైరసేనేః, చరితం, వైరసేనిచరితమ్, తస్మిన్ = వైరసేనిచరితే.
నిసర్గోజ్జ్వలః :- నిసర్గేణ, ఉజ్జ్వలః = నిసర్గోజ్జ్వలః.

## భావము :

కవిశ్రేష్ఠుల మకుటములలోని విభూషణములలో వజ్రమణియైన శ్రీహీరుడు ఇంద్రియనిగ్రహముఁ గావించిన శ్రీహర్షుని జన్మింపఁచేసెను. మామల్లదేవియను తల్లియు నితనిని గనెను. ఘనమైన శృఙ్గారరసముతో రుచులు గొల్పునట్టి యా

్ౖరీయైన మహాకావ్యముగా నొప్పుచున్న వైరసేని చరిత్రమనియు,
నైషధీయ చరిత్రమునందు స్వభావ భాసురమగు పదునైదవ సర్గ
ందినది 92

ఇట్లు
శ్రీమదాత్రేయగోత్రోద్భవ ఉదాలి నరసింహసూరి
తనూజ సుబ్బరామశాస్త్రి విరచితమగు
శ్రీహర్షనైషధ వ్యాఖ్యయందు
పఞ్చదశసర్గ సమాప్తము.
ఓం
శమ్.

# శ్రీహర్ష నైషధము

## ఆరవ సంపుటము

తెలుగు వ్యాఖ్యానం

శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రి, ఎం. ఏ.,
రిటైర్డ్ ప్రిన్సిపాల్, వైదిక సంస్కృత కళాశాల, నెల్లూరు




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు,
హైదరాబాదు-4

SRI HARSHANAISHADHAM - Volume VI (Containing 16th, 17th, 18th and 19th Sargas) - A Sanskrit classic by Sri Harsha of 12th Century A. D. with Telugu commentary by Sri Udali Subbarama Sastry, Retd. Principal Veda and Sanskrit College, Nellore, Andhra Pradesh.

---

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాదు-500 004

ప్రచురణ : 342

ప్రథమ ముద్రణ : 1983

ప్రతులు : 1000

**వెల: రూ. 20-00**

ప్రతులకు :
**ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి**
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాద్-500 004

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్,
హైదర్‌గూడ, హైదరాబాద్-500 001

---

Paper used partly for the Printing of this book was made available by the Government of India at Concessional rate,

# తొలి పలుకు

ప్రసిద్ధమైన సంస్కృత గ్రంథాలలోని మూలస్వరూపాన్ని తెలుగు పాఠకులకు పరిచయం చేయాలనే ఉద్దేశంతో అకాడమీ ఇంత వరకు కొన్ని పుస్తకాలను ప్రచురించింది. మృచ్ఛకటికం, ఉత్తరరామ చరిత్ర, ముద్రారాక్షసం, ఆంధ్రరసగంగాధరం లాంటి పఠనీయ గ్రంథాలకు పండితులచే అర్థ తాత్పర్యాలూ, విశేషాలూ వ్రాయించి అందించింది. సంస్కృతంలో బాగా వ్యాప్తిలోనికి వచ్చి తెలుగులో కావ్యాలుగా అవతరించిన గ్రంథాలు అనేకం. జిజ్ఞాసువులకు మూలం లోని ఆంతర్యాన్ని, అది వేసుకున్న తెలుగు వేషాన్నీ తెలుసుకొని తులనాత్మకంగా పరిశీలించవలసిన అగత్యం ఉంటుంది.

ఈ ప్రణాళికను అనుసరించి నెల్లూరు వైదిక కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రిగారు శ్రీహర్షుని నైషధానికి తెలుగు అర్థతాత్పర్యాలు సమకూర్చి అకాడమీకి అందించినారు. ఇంత వరకు శ్రీహర్ష నైషధం ఐదు సంపుటాలుగా వచ్చింది. మొదటి సంపుటంలో 1,2,3 సర్గలకు, రెండవ సంపుటంలో 4,5,6 సర్గలకు, మూడవ సంపుటంలో 7,8,9 సర్గలకు, నాల్గవ సంపుటంలో 10,11,12 సర్గలకు, ఐదవ సంపుటంలో 13,14,15 సర్గలకు లఘువ్యాఖ్యానం (మూలశ్లోకం, పదవిభజన, అర్థము, విశేషము, సమాసములు, భావము) ఉన్నది. ఇప్పుడు 16,17,18,19 సర్గలతో ఉన్న ఆరవ సంపుటాన్ని అందిస్తున్నాము. ఇక మిగిలిన సర్గలను త్వరలో పాఠకులు అందు కుంటారు.

శ్రీనాథుని శృంగారనైషధంవల్ల తెలుగు కవితా ప్రపంచంలో విశేష ప్రాచుర్యాన్ని పొందిన శ్రీహర్షుని నైషధం విద్వదౌషధం గానూ, రసకోశంగానూ వాసికెక్కింది. శ్రీహర్షుని నైషధానికి చక్కని వ్యాఖ్యానం తెలుగులో వెలయించిన శ్రీ ఉడాలి సుబ్బరామ శాస్త్రిగారికి అకాడమీ కృతజ్ఞతలను సమర్పించుకుంటున్నది.

హైదరాబాదు.
తేదీ 19-6-1983

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి

# శ్రీహర్ష నైషధము

## షోడశ సర్గ

శ్లో. వృతః ప్రతస్థే స రథై రథో రథీ
గృహాన్ విదర్భాధిపతే ర్ధరాధిపః,
పురోధసం గౌతమ మాత్మవి త్తమం
ద్విధా పురస్కృత్య గృహీతమఙ్గలః. 1

ప. వి. వృతః - ప్రతస్థే-సః - రథైః- అథో - రథీ -గృహాన్-విదర్భాధిపతేః-ధరాధిపః - పురోధసం - గౌతమమ్ - ఆత్మవి త్తమం - ద్విధా - పురస్కృత్య - గృహీతమఙ్గలః.

అర్థము: అథో = అలంకరణములైన పిదప, గృహీతమఙ్గలః - గృహీత = గ్రహింపఁబడిన, మఙ్గలః = శుభసంప్రదాయములు గల్గిన, రథీ = రథము గల్గిన, సః = ఆ, ధరాధిపః = నల మహారాజు, ఆత్మవి త్తమం = ఆత్మ తత్త్వమునుఁ తెలిసిన వారిలో శ్రేష్ఠుడైన, గౌతమం = గౌతమ మహర్షి యను, పురోధసం = పురోహితుని, ద్విధా = రెండు విధములుగా, పురస్కృత్య = పూజించియు; ముందు నుంచికొనియు, రథైః = రథము లతో అనగా రథములయందలి పురుషులతో, వృతః = చుట్టఁబడినవాడై అనగా కూడినవాడై, విదర్భాధిపతేః = విదర్భరాజగు భీమునియొక్క, గృహాన్ = భవనములను గూర్చి, ప్రతస్థే = బయలుదేరెను.

సమాసములు :

రథీ — రథః అస్య అస్తీతి = రథీ.

విదర్భాధిపతేః-విదర్భాణా మధిపతిః=విదర్భాధిపతిః, తస్య=విదర్భాధిపతేః.

ఆత్మవిత్తమం-ఆత్మానం వేత్తీతి=అత్మవిత్. అతిశయేన ఆత్మవిత్=ఆత్మవిత్తమః, తం=ఆత్మవిత్తమం.

గృహీతమఙ్గలః-గృహీతం మఙ్గలం యేన సః=గృహీతమఙ్గలః

భావము :

ఇవ్విధముగా నలున కలంకరణ విధి పూర్తియైనది. తర్వాత సంప్రదాయము ననుసరించి మంగళకృత్యములు గూడ జరుపబడినవి. పిదప రథికుడైన ఆ నలమహారాజు తత్త్వవేత్తలలో నగ్రగణ్యుడైన గౌతమమహర్షియను పురోహితునిఁ బూజించి, ముందు నుంచికొని, విదర్భరాజగు భీముని భవనములకు, రథములతోఁ గూడి బయలుదేరెను. ॥1॥

శ్లో. స్వభూషణాంశు ప్రతిబింబితైః స్ఫుటం
భృశావదాతైః స్వనివాసిభి ర్గుణైః,
మృగేక్షణానాం సముపాసి చామరైః
విధూయమానైః సవిధుప్రభైః ప్రభుః. 2

ప. వి. స్వభూషణాంశు ప్రతిబింబితైః-స్ఫుటం-భృశావదాతైః - స్వనివాసిభిః-గుణైః-మృగేక్షణానాం-సముపాసి-చామరైః-విధూయమానైః - సవిధుప్రభైః-ప్రభుః.

అర్థము: సః=ఆ, ప్రభుః=నలమహారాజు, స్వభూషణాంశుప్రతిబింబితైః-స్వ=తనవైన, భూషణ=ఆభరణములయొక్క, అంశు=కిరణములయందు, ప్రతిబింబితైః = ప్రతిఫలించినవియు, విధూయమానైః = విసరబడుచున్నవియును, విధుప్రభైః=చంద్రుని కాంతివంటి కాంతి కల్గినవియు, మృగేక్షణానాం=లేళ్ల కన్నులవంటి కన్నులుగల స్త్రీలకు సంబంధించినవియునగు, చామరైః=వింజామర లనెడి, భృశావదాతైః; భృశ=మిక్కిలి, అవదాతైః = తెల్లనివియును, అతిశుభ్రము లైనవియును,

స్వనివాసిభిః=తనయందు నెలకొనినవియును, కావుననే, స్వభూషణాంశు ప్రతిబింబితైః- స్వ=తనవైన, భూషణాంశు = ఆభరణ కిరణముల యందు అనగా కిరణములతో కూడిన మణులయందు, ప్రతిబింబితైః= ప్రతిఫలించిన, గుణైః=నలుని శ్రుతము, శీలము మున్నగు గుణములచే, సముపాసి= సేవింపబడెను, స్ఫుటం=స్పష్టము.

వి. భూషణ మణులయందుఁ బ్రతిఫలించిన చామరముల యందు స్వామి సేవకై యావిర్భవించిన తన శీల సౌందర్య గుణత్వము నుత్ప్రేక్షించుట వలన నుత్ప్రేక్ష. వ్యంజకమగు స్ఫుటశబ్ద ప్రయోగముచే నది వాచ్యము.

సమాసములు :

స్వభూషణాంశు ప్రతిబింబితైః:- స్వస్య భూషణాని=స్వభూషణాని, స్వభూషణానా మంశవః=స్వభూషణాంశవః, స్వభూషణాంశుషు ప్రతిబింబితాః=స్వభూషణాంశు ప్రతిబింబితాః, తైః=స్వభూషణాంశు ప్రతిబింబితైః.

స్వనివాసిభిః : స్వస్మిన్ నివసన్తీతి స్వనివాసినః, తైః=స్వనివాసిభిః.

భృశావదాతైః : భృశ మవదాతాః=భృశావదాతాః, తైః=భృశావదాతైః.

మృగేక్షణానాం : మృగస్య ఈక్షణే ఇవ ఈక్షణే యాసాం తాః= మృగేక్షణాః, తాసాం మృగేక్షణానాం.

విధుప్రభైః : విధోః ప్రభేవ ప్రభా యేషాం తే=విధుప్రభాః, తైః విధుప్రభైః.

భావము :

ఆ నలమహారాజునకు తొడిగిన భూషణముల యందు మృగేక్షణలగు పరిచారికలు విసరునట్టి చామరములు ప్రతిఫలించుచున్నవి. అవి చంద్రునివంటి ధవళప్రభలతో నొప్పుచున్నవి. భూషణములయందు ప్రతిబింబించిన యా పరిశుభ్రములగు తెల్లని చామరములు, నలుని యంతరంగమున నుండి యాతని

శరీరమునందలి యాభరణములలోఁ బ్రతిఫలించిన శ్రుతశీలాది గుణములుగా నాతని సేవించుచున్నవో యని భావింపబడినది. అనగా నా తెల్లని చామరము లాతని స్వచ్ఛములగు గుణములుగా భావింపబడినవి. అట్టి చామరముల రూపముగ నాతని శ్రుతశీలాది గుణము లాతనిని సేవించుచున్నవో యని భావము. ॥2॥

శ్లో. పరార్థ్య వేశాభరణైః పురస్సరైః
సహాఽఽజిహానే నిషధావనీభృతి,
దధే సునాసీర పదాభిధేయతాం
స రూఢిమాత్రా ద్యది వృత్రశాత్రవః. 3

ప. వి. పరార్థ్యవేశాభరణైః - పురస్సరైః-సహ- ఆజిహానే - నిషధావనీభృతి- రథే - సునాసీర పదాభిధేయతాం - సః - రూఢిమాత్రాత్ - యది - వృత్రశాత్రవః.

అర్థము: నిషధావనీభృతి=నిషధ దేశపు ప్రభువైన నలుడు, పరార్థ్యవేశాభరణైః - పరార్థ్య=శ్రేష్ఠములైన, వేశ=వస్త్రములు మున్నగువానిని, ఆభరణైః=కిరీటములు, కడియములు మున్నగు భూషణములను ధరించిన వారును, పురస్సరైః=ముందు నడచువారును అగు వరపక్షమునకుఁ జెందిన జనులతో, ఆజిహానే సతి=పోవుచుండగా, సః=ఆ ప్రసిద్ధుడైన, వృత్రశాత్రవః=వృత్రాసురుని శత్రువైన యింద్రుడు, రూఢిమాత్రాత్=సముదాయశక్తిచే, సునాసీర పదాభిధేయతాం- సు= శ్రేష్ఠులైన, నాసీర=ముందు నడచువారు కలవాడను నర్థ మొసంగెడి, పద=పదమునకు, అభిధేయతాం=వాచ్యముగా నుండుటను, యది దధే=ధరించెనో యనునట్లుండెను. కాని యోగముచే ననగా నవయవ వ్యుత్పత్తిచే సునాసీర శబ్ద వాచ్యత్వమునుఁ బొందలేదు. ఏల యనగా- శోభనాః నాసీరాః యస్య సః-యను యోగముచే సునాసీరశబ్దము నలునికే వర్తించును. కాని యింద్రునకు వర్తించదు. ఆ ఇంద్రునకు శోభననాసీరత్వము లేదు. కావున సునాసీరశబ్దము అశ్వకర్ణాదిశబ్దముల వలె రూఢితోడనే యనగా శోభననాసీరత్వమను నర్థమునిచ్చెడి అవయవ వ్యుత్పత్తితో నపసరములేక యింద్రుని బోధించునని యర్థము. ఏల

యనగా నవయవవ్యుత్పత్తిని గైకొనినచో, శోభననాసీరత్వము అనగా శ్రేష్ఠులైన యగ్రేసరులను గల్గియుండుట ఇంద్రునికి నలునిబట్టి చూచినచో సంభవింపదు. అందువలన నలునిముందు నడచువారు, ఇంద్రునిముందు నడచు దేవతలకంటె నుత్కృష్టులని యర్థము.

సమాసములు :

*పరార్థ్యవేశాభరణైః*:- వేశాశ్చ ఆభరణాని చ=వేశాభరణాని, పరార్థ్యాని వేశాభరణాని యేషాం తే=పరార్థ్యవేశాభరణాః, తైః=పరార్థ్యవేశాభరణైః.

*పురస్సరైః* :- పురః సరన్తీతి=పురస్సరాః, తైః=పురస్సరైః.

*నిషధావనీభృతి* : అవనీం బిభర్తీతి = అవనీభృత్, నిషధానా మవనీభృత్=నిషధావనీభృత్, తస్మిన్=నిషధావనీభృతి.

*సునాసీరపదాభిధేయతాం* : శోభనాః నాసీరాః యస్య సః=సునాసీరః, సునాసీర ఇతి పదం=సునాసీరపదం, అభిధాతుం యోగ్యః=అభిధేయః, అభిధేయస్య భావః = అభిధేయతా, సునాసీరపదస్య అభిధేయతా= సునాసీరపదాభిధేయతా, తాం=సునాసీరపదాభిధేయతాం.

*రూఢిమాత్రాత్* : రూఢిరేవ = రూఢిమాత్రం, తస్మాత్ = రూఢిమాత్రాత్.

*వృత్రశాత్రవః* : వృత్రస్య శాత్రవః=వృత్రశాత్రవః.

భావము :

శ్రేష్ఠములైన వస్త్రములను భూషణములను ధరించిన వరుని పక్షమునకుఁ జెందిన జనులు నలునకు ముందు నడచుచుండగా నలుఁడు వెళ్లుచుండెను. అప్పుడు ఇంద్రునికి వర్తించు సునాసీరశబ్దము నలునికే యన్వయింపదగినదై యుండెను. వాస్తవములో 'సునాసీర' శబ్దము 'శోభనాః నాసీరాః యస్య సః' అను వ్యుత్పత్తిచే మంచి సేన గలవాఁ డనెడి యర్థము నొసంగుచున్నది లేదా, శ్రేష్ఠులైన యగ్రేసరులు గలవా డను నర్థమునుఁ జెప్పుచున్నది. ఇంద్రుని ముందు నడచు వారికంటెను, నలుని ముందు నడచునట్టి జనులు శ్రేష్ఠములైన వస్త్రా

భరణములతో శ్రేష్ఠులై యున్నందువలన నలుఁడే సునాసీరుఁడు కావలయును. కాన నవయవ వ్యుత్పత్తి యనెడి యోగమునుఁ బట్టి చూచినచో సునాసీరశబ్దము నలునకే సరిపడును. అవయవ వ్యుత్పత్తి చెప్పక కేవలము రూఢి చేతనే యది యింద్రుని చెప్పుచున్నది. ఒకనికి 'అశ్వకర్ణ' యని పేరు పెట్టినచో నా శబ్ద మావ్యక్తిని రూఢిచేతనే బోధించును. అవయవశక్తిచేత నది 'అశ్వపు కర్ణముల వంటి కర్ణములు గలవానినే బోధింపగల్గును కాని యట్టి కర్ణము లావ్యక్తికి సంభవింపవుగాన నా యవయవ వ్యుత్పత్తితో నది వ్యక్తిని బోధింపజాలదు. అట్లే ప్రకృతము సునాసీరశబ్దము శ్రేష్ఠులైన యగ్రేసరులు (ముందు నడచు జనులు) లేని యింద్రునియందు రూఢిచేతను, ననగా సముదాయశక్తిచేతను, శ్రేష్ఠులైన యగ్రేసరులుకల నలునియందు యోగముచేతను ననగా నవయవ వ్యుత్పత్తిచేతను వర్తించుచున్నదని యాశయము. అనగా నలుడు బయలుదేరగనే యతనిముందు చక్కని వస్త్రములను, భూషణములను ధరించిన జనులు నడువసాగి రని సారాంశము ॥3॥

శ్లో. నలస్య నాసీరసృజాం మహీభుజాం
కిరీటరత్నైః పునరుక్తదీపయా,
అదీపి రాత్రౌ వరయాత్రయా తయా
చమూరజోమిశ్ర తమిస్రసమ్పదా. 4

ప. వి. నలస్య -నాసీరసృజాం - మహీభుజాం-కిరీటరత్నైః-పునరుక్తదీపయా - అదీపి - రాత్రౌ -వరయాత్రయా - తయా - చమూరజోమిశ్రతమిస్ర సమ్పదా.

అర్థము. చమూరజోమిశ్రతమిస్రసమ్పదా-చమూరజః-సేనలధూళులతో,మిశ్ర = కలసిన, తమిస్ర = చీకటియొక్క, సంపదా = అతిశయముకలిగిన అనగా గాఢాంధకారము కలిగినను, నాసీరసృజాం=అగ్రేసరత్వమునుఁ బొందించుకొనుచున్న, మహీభుజాం=రాజులయొక్క, కిరీటరత్నైః= కిరీటములయందలి మణులచే, పునరుక్తదీపయా - పునరుక్త=రెట్టింపు గాఁ జేయఁబడిన, దీపయా=దీపములు గల్గిన యనగా వ్యర్థములు గావింప

బడిన, దీపములు గల్గిన, తయా=ఆ, వరయాత్రయా=వివాహగృహ
మును గూర్చి వరుడు గావించిన ప్రయాణముచే, రాత్రౌ=రాత్రియందు,
అదీపి=శోభించుట జరిగినది. కటికచీకటియందును కిరీటరత్నదీపములచే
నా యాత్ర ప్రకాశించినదని యర్థము.

సమాసములు :

నాసీరసృజాం - నాసీరం సృజన్తీతి=నాసీర సృజః, తేషాం=నాసీర
సృజాం.
కిరీటరత్నైః - కిరీటానాం రత్నాని=కిరీటరత్నాని, తైః=కిరీటరత్నైః.
పునరుక్తదీపయా - పునరుక్తాః దీపాః యస్యాం సా=పునరుక్తదీపా,
తయా.
వరయాత్రయా-వరస్య యాత్రా=వరరాత్రా, తయా=వరయాత్రయా,
చమూరజోమిశ్రతమిస్ర సమ్పదా - చమూనాం రజాంసి = చమూర
జాంసి, చమూరజోభిః మిశ్రం=చమూరజోమిశ్రం, చమూరజోమిశ్రం
చ తత్ తమిస్రం చ=చమూరజోమిశ్ర తమిస్రం, చమూరజోమిశ్రత
మిస్రస్య సంపత్=చమూరజో మిశ్రతమిస్రసంపత్ · తంయా =చమూరజో
మిశ్రతమిస్రసంపదా.

భావము :

నలుఁడు గావిఁచుచున్న వివాహమునకు సంబంధించిన వరయాత్రయందు,
ముందు నడచెడి సేనలవలని ధూళులచే కటిక చీకటి యేర్పడినది. అయినను
ముందుఁ బోవుచున్న రాజుల కిరీటముల యందలి రత్నకాంతులు దీపపు కాంతు
లను వ్యర్థపఱచుచు, నా చీకటినిఁ దొలగించుచు రాత్రి వెలుగుచుండినవి. ॥4॥

శ్లో. విదర్భరాజః క్షితిపా ననుక్షణం
శుభక్షణాసన్నతరత్వ సత్వరః,
దిదేశ దూతాన్ పథి యాన్ యథోత్తరం
చమూ మము ష్యోపచికాయ సత్వరః, 5

ప. వి. విదర్భరాజః - క్షితిపాన్ - అనుక్షణం - శుభక్షణాసన్నతరత్వసత్వరః - దిదేశ - దూతాన్ - పథి - యాన్ - యథోత్తరం - చమూమ్-అముష్య- ఉపచికాయ - సత్వరః.

అర్థము: విదర్భరాజః = విదర్భదేశప్రభువైన భీముడు, శుభక్షణాసన్న తరత్వ సత్వరః - శుభక్షణ = వివాహముహూర్తము, ఆసన్నతరత్వ = మిక్కిలి సమీపించుటవలన, సత్వరః = త్వరతో కూడినవాడై, అనుక్షణం = మాటిమాటికి, యాన్ = ఏ, క్షితిపాన్ = రాజులనెడి, దూతాన్ = దూత లను, యథోత్తరం = ఒకరి వెనుక యొకరుగా, దిదేశ = నలుని బిలుచు కొని వచ్చుటకై ఆదేశించెనో, తచ్చయః = ఆ రాజులయొక్క సమూ హము, పథి = మార్గమునందు, అముష్య = ఈ నలుని యొక్క, చమూం = సైన్యమును, ఉపచికాయ = వర్ధిల్లజేసెను. వివాహలగ్నము దాటిపోవుననెడి భయముచే భీమనృపతి, రాజులనే దూతలుగా గావించు టచే నాతని యందలి త్వరాతిశయము సూచితము.

సమాసములు :

విదర్భరాజః - విదర్భాణాం రాజా = విదర్భరాజః.
క్షితిపాన్ - క్షితిం పాన్తీతి క్షితిపాః, తాన్ = క్షితిపాన్.
యథోత్తరం - ఉత్తరోత్తరం యథా యథోత్తరమ్.
తచ్చయః - తేషాం చయః.

భావము :

విదర్భరాజగు భీముఁడు వివాహముహూర్తము సమీపించుచున్నకొలఁది, మాటిమాటికి రాజులనే దూతలు గావించి, నలునిఁ దోడ్కొని వచ్చుటకై యొకరి వెనుక నొకరుగా పంపుచుండెను. అట్లు పంపబడిన రాజులు మార్గమునఁ గలియు చుండుటచే, నీ వచ్చుచున్న నలుని సేన యా జనసమూహముతో వర్ధిల్లసాగినది. ॥6॥

శ్లో. హరిద్వీపద్వీపిభి రంశుకై ర్నభో
నభస్వదాధ్మాపన పీనితై రభూత్,
తరస్వ దశ్వ ధ్వజినీ ధ్వజై ర్వనం
విచిత్ర చీనాంశుక వల్లి వేల్లితమ్. 6

ప. వి. హరిద్వీపద్వీపిభిః - అంశుకైః - నభః - నభస్వదాధ్మాపన పీనితైః - అభూత్ - తరస్వదశ్వ ధ్వజినీ ధ్వజైః - వనం - విచిత్ర చీనాంశుక వల్లి వేల్లితమ్.

అర్థము: నభః=ఆకసము, నభస్వదాధ్మాపన పీనితైః-నభస్వత్ = గాలిచే, ఆధ్మాపన=నిండించుటవలన, పీనితైః=లావుగాఁ జేయబడిన, (అందు వలననే సజీవములుగాఁ గావింపఁబడినవిగాఁ గానఁబడు), అంశుకైః= వస్త్రములతో నిర్మింపఁబడిన, హరి ద్వీపద్వీపిభిః - హరి=సింహముల చేతను, ద్విప=ఏనుగుల చేతను, ద్వీపిభిః=పులులచేతను (తథా=అట్లే) తరస్వదశ్వ ధ్వజినీ ధ్వజైః-తరస్వత్=వేగముగల, అశ్వధ్వజినీ= గుఱ్ఱపు సైన్యము యొక్క, ధ్వజైః =టెక్కెముల చేతను, విచిత్ర చీనాంశుక వల్లి వేల్లితం-విచిత్ర=నానా విధములగు, చీనాంశుక = చీన దేశములయందు నిర్మింపబడిన సన్నని వలువలనెడి, వల్లి=తీగలచే, వేల్లితం=చుట్టఁబడిన, వనం=అడవిగా, అభూత్=ఆయెను, అడవి ఏవిధముగా సింహములు, ఏనుగులు, పులులు, వృక్షములు మున్నగు వానితోఁ గూడియుండునో అట్లే నలుఁడు వివాహయాత్రను జేయునపు డాతనిపై నున్న యాకసము వలువలతో నిర్మితములగు సింహాదులతో గూడినదై యుండెనని యర్థము.

సమాసములు :

హరిద్వీపద్వీపిభిః- హరిశ్చ ద్వీపశ్చ ద్వీపీ చ = హరిద్వీపద్వీపినః, తైః=హరిద్వీప ద్వీపిభిః.

*నభస్వదాధ్మాపన పీనితైః-* నభస్వతా ఆధ్మాపనం=నభస్వ దాధ్మా పనం,-నభస్వదాధ్మాపనేన పీనితాః=నభస్వ దాధ్మాపన పీనితాః, తైః= నభస్వదాధ్మాపన పీనితైః.

*తరస్వి దశ్వ ధ్వజినీ ధ్వజైః -* తరః ఏషా మస్తీతి తరస్వినః. తరస్వినశ్చ తే అశ్వాశ్చ తరస్విదశ్వాః, తరస్విదశ్వానాం ధ్వజిన్యః= తరస్విదశ్వ ధ్వజిన్యః, తరస్విదశ్వ ధ్వజినీనాం ధ్వజాః-తరస్విదశ్వ ధ్వజినీ ధ్వజాః, తైః=తరస్విదశ్వ ధ్వజినీ ధ్వజైః.

*విచిత్ర చీనాంశుకవల్లి వేల్లితమ్ -* చీనానా మంశుకాని చీనాంశుకాని, విచిత్రాణి చ తాని చీనాంశుకాని విచిత్ర చీనాంశుకాని, విచిత్ర చీనాంశుకా న్యేవ వల్లయః- విచిత్ర చీనాంశుక వల్లయః, విచిత్ర చీనాంశుక వల్లిభిః వేల్లితం=విచిత్ర చీనాంశుక వల్లి వేల్లితమ్.

భావము :

నలుడు వివాహ గృహమునకుఁ బరతెంచునపుడు, అతనిపైన మింట, వలువలతో సింహములను, ఏనుగులను, పులులను, బొమ్మలుగా చేసియుంచి యున్నారు. ఆ బొమ్మలలో గాలి నించుట వలన చాల లావుగా నుండినవై సజీవములుగాఁ గానబడుచుండినవి. మఱియు నా మింటిని నలునితోటి యశ్వ సైన్యమునకు సంబంధించిన ధ్వజములోని చీనాదేశపు విచిత్రములగు పట్టు వలువలు గూడ నంటుచుండినవి. టెక్కెములలోని యీ నునుపైన వలువ లనెడి తీగలతోడను, పూర్వము చెప్పిన వలువతోఁ జేయబడిన సింహ, గజ, వ్యాఘ్రాది చిత్రములతోడను గూడిన యా మిన్ను సజీవములగు సింహాదులతో గూడిన వనమునకు సమానమైనది॥౬॥

శ్లో. భ్రువాఽఽహ్వయ న్తీం నిజతోరణస్రజా
గజాలికర్ణానిలఖేలయా తతః,
దదర్శ దూతీ మివ భీమజన్మనః
స తత్ప్రతీహారమహీం మహీపతిః. 7

ప. వి. భ్రువా-ఆహ్వయ న్తీం-నిజతోరణస్రజా - గజాలికర్ణానిలఖేలయా-తతః - దదర్శ-దూతీమ్ - ఇవ - భీమజన్మనః - సః - తత్ప్రతీహారమహీం - మహీపతిః.

ప.వి. తతః=వివాహశాలకై బయలుదేరిన పిదప, సః=ఆ; మహీపతిః=నలమహారాజు, గజాలి కర్ణానిలఖేలయా-గజాలి = (ద్వారమందున్న) యేనుగుల సమూహము యొక్క, కర్ణానిల=కర్ణములను విసరుటవలన నుద్భవించిన గాలియొక్క, ఖేలయా=ఆటచే, అనగా కదలికచే, నిజ తోరణ స్రజా-నిజ = తనకు సంబంధించిన, తోరణ స్రజా=బహిర్ద్వార మున వ్రేలాడెడు మాలయనెడు, భ్రువా=కనుబొమ్మచే, ఆహ్వయంతీం= పిలుచుచున్న, భీమజన్మనః=దమయంతియొక్క, దూతీ మివ=దూతియో యనునట్లున్న, తస్య=ఆ భీమరాజు యొక్క, ప్రతిహారభూమిం= ద్వారభూమిని, దదర్శ=చూచెను.

వి. ద్వారభూమి దూతిక కాకపోయినను దూతికయో యనునట్లు భావింప బడుటవలన ఉత్ప్రేక్ష. ఇవ శబ్ద ప్రయోగ ముండుటవలన నది వాచ్యము.

సమాసములు :

*నిజతోరణస్రజా* - తోరణస్య స్రక్ = తోరణస్రక్, నిజా చ సా తోరణస్రక్ చ = నిజతోరణస్రక్, తయా-నిజతోరణస్రజా.

*గజాలి కర్ణానిలఖేలయా* - గజానా మాలిః=గజాలిః, గజాలేః కర్ణాః= గజాలికర్ణాః, గజాలికర్ణానా మనిలాః = గజాలి కర్ణానిలాః, గజాలి కర్ణానిలైః ఖేలతీతి=గజాలి కర్ణానలఖేలా, తయా=గజాలి కర్ణానల ఖేలయా.

*భీమజన్మనః*- భీమాత్ జన్మ యస్యాః సా = భీమజన్మా, తస్యాః= భీమజన్మనః

*తత్ప్రతీహారమహీం* - ప్రతీహారస్య మహీ = ప్రతీహార మహీ, తస్య ప్రతీహారమహీ=తత్ప్రతీహారమహీ, తాం=తత్ప్రతీహారమహీమ్.

భావము :

వెనుకఁ జెప్పిన ప్రకారము బయలుదేరిన పిదప, ఆ నలమహారాజు ద్వారమందున్న యేనుగుల విపులములగు కర్ణములనుండి యుద్భవించిన గాడ్పులచే కదలుచున్న బహిర్ద్వారపు మాలయను కనుబొమ్మచే పిలుచుచున్నట్టి దమయంతి దూతికయో యనునట్లున్న భీమరాజునకు సంబంధించిన ద్వారభూమినిఁ జూచెను. అనగా దమయంతి దూతికయో యనునట్లున్న ద్వారభూమి, తన బహిర్ద్వారపు మాల యనెడి కనుబొమ్మచే పిలుచుచున్నట్లున్నదనియు నట్టి ద్వారభూమిని నలుడు చూచెననియు నాశయము. ॥7॥

శ్లో. శ్లథై ర్దలై స్తమ్భయుగస్య రమ్భయో
శ్చకాస్తి చండాతకమండితా స్మ సా,
ప్రియా సఖీ వాఽస్య మనఃస్థితి స్ఫురత్
సుఖాగత ప్రశ్నిత తూర్యనిఃస్వనా. 8

ప.వి. శ్లథైః - దలైః - స్తమ్భయుగస్య - రంభయోః - చకాస్తి - చండాతక మండితా - స్మ-సా-ప్రియా-సఖీ-వా-అస్య - మనఃస్థితి స్ఫురత్సుఖాగత ప్రశ్నిత తూర్యనిఃస్వనా.

అర్థము. రంభయోః = ద్వారశోభకై యిఱువైపుల నిలిపిన అరటి చెట్ల యొక్క, స్తంభయుగస్య = రెండు స్తంభములకు సంబంధించిన, శ్లథైః = వ్రేలాడుచున్న, దలైః = ఆకులనెడి, చణ్డాతక = వేశ్యలు ధరించెడు మేలిముసుఁగు వలువచే, మణ్డితా = అలంకరింపబడిన, సా = ఆ ద్వారభూమి, మనఃస్థితిస్ఫుర త్సుఖాగత ప్రశ్నిత తూర్యనిఃస్వనా - మనః = నలునియొక్క మనస్సునందు, స్థితి = ఎల్లప్పుడు చింతతో నుండుటచే, స్ఫురత్ = వెలుపలికి వచ్చినట్టి, సుఖాగత ప్రశ్నిత = సుఖముగా వచ్చితివా? యను ప్రశ్న రూపమును పొందింపబడిన, తూర్యనిఃస్వనా = తూర్యవాద్య ధ్వనులు గల్గిన వగుచు, అస్య = ఈ నలునికి, ప్రియా సఖీవ = ప్రియమైన చెలికత్తె యగు దమయంతివలె, చకాస్తి స్మ = ప్రకాశించుచుండెను.

వి. అరటియాకనెడి వలువను ధరించిన యా ద్వారభూమి తూర్యధ్వని సంబంధముచే స్వాగతముఁ జెప్పుచున్న దమయంతియో యనునట్లు శోభించినదని చెప్పుటచే దమయంతి గాని ద్వారభూమిని దమయంతిగా భావించుట వలన నుత్ప్రేక్ష.

సమాసములు :

*స్తంభయుగస్య* - స్తంభయోః యుగం=స్తంభయుగం, తస్య=స్తంభ యుగస్య.

*చండాతకమండితా* - చండాతకేన మండితా=చండాతక మండితా.

*మనఃస్థితి స్ఫురత్సుఖాగత ప్రశ్నిత తూర్యనిఃస్వనా* - మనసః స్థితిః = మనఃస్థితిః, మనఃస్థిత్యా స్ఫురన్ = మనఃస్థితిస్ఫురన్, సుఖ మాగతం=సుఖాగతం, సుఖాగతస్య ప్రశ్నః=సుఖాగతప్రశ్నః, మనఃస్థితిస్ఫురం శ్చాసౌ సుఖాగతప్రశ్నశ్చ = మనఃస్థితి స్ఫురత్సుఖా గతప్రశ్నః, సుఖాగతప్రశ్నః కృతః=సుఖాగతప్రశ్నితః, తూర్యస్య నిస్వనః=తూర్యనిస్వనః, మనఃస్థితిస్ఫురత్సుఖాగతప్రశ్నితః తూర్య నిస్వనః యయా సా=మనఃస్థితిస్ఫురత్సుఖాగత ప్రశ్నిత తూర్యనిఃస్వనా.

భావము ;

ఆ భీమరాజ భవనద్వారమున కిఱువైపుల మంగళసూచకములైన రెండు అరటి స్తంభములు నాటబడి యున్నవి. ఆ యరటి స్తంభముల నుండి యాకు లా ద్వారభూమిని దాకుచున్నవి. అందువలన నా ద్వారభూమి మేలిముసుంగు దాల్చిన యువతివలె కానవచ్చుచున్నది. కాన నలుడు నిరంతరము చిత్తమున నుండుటచే నాతనిని సుఖాగమనము నడుగుటకై ప్రశ్నరూపమును పొందిన తూర్యవాద్యముల నాదముతోఁ గూడిన ప్రియసఖియగు దమయంతియో యనునట్లా ద్వారభూమి శోభిల్లినది.

శ్లో॥ వినేత్రు భర్తృద్వయ భీతిదాంతయోః
పరస్పరస్మా దనవాప్తవైశసః,

అజాయత ద్వారి నరేంద్రసేనయోః
సమాగమః స్ఫారముఖారవోద్గమః. 9

ప. వి: వినేతృ భర్తృద్వయ భీతిదాంతయోః – పరస్పరస్మాత్ – అనవాప్త వైశసః–అజాయత-ద్వారి-నరేంద్రసేనయోః-సమాగమః-స్ఫారముఖారవోద్గమః.

అర్థము : వినేతృ=నియామకులగు, భర్తృద్వయ=నలభీము లనెడి యిద్దఱు పాలకులవలని, భీతి=భయముచే, దాంతయోః=శమించిన, నరేంద్ర సేనయోః–నరేంద్ర=నలుడును, భీముడు ననెడి రాజుల, సేనయోః =సేనలయందు, పరస్పరస్మాత్=ఒండొరుల నుండి, అనవాప్తవైశసః- అనవాప్త = పొందబడని, వైశసః = హింసగల్గిన, స్ఫారముఖార వోద్గమః–స్ఫార=బిగ్గరయై, ముఖారవ = ముఖములనుండి వెలువడి ధ్వనిగల్గిన, సమాగమః = సమ్మేలనము, ద్వారి=రాజభవన ద్వారము నందు, అజాయత=ఏర్పడినది.

సమాసములు :

*వినేతృభర్తృద్వయ భీతిదాంతయోః*– వినేతారౌ చ తౌ భర్తారౌ చ= వినేతృభర్తారౌ, వినేతృభర్త్రోః ద్వయం=వినేతృభర్తృద్వయం, వినేతృ భర్తృద్వయాత్ భీతిః=వినేతృ భర్తృద్వయభీతిః, వినేతృభర్తృద్వయ భీత్యా దాన్తౌ=వినేతృభర్తృద్వయభీతిదాన్తౌ, తయోః వినేతృభర్తృద్వయ భీతిదాంతయోః.

*పరస్పరస్మాత్*-పరస్య పరస్య వ్యతిహారః = పరస్పరః, తస్మాత్= పరస్పరస్మాత్.

*అనవాప్త వైశసః*- అనవాప్తం వైశసం యస్మిన్ సః = అనవాప్త వైశసః.

*నరేంద్రసేనయోః* – నరేంద్రయోః సేనే–నరేంద్రసేనే, తయోః= నరేంద్రసేనయోః.

స్ఫారముఖారవోద్గమః— ముఖానా మారవః = ముఖారవః=స్ఫారశ్చ అసౌ ముఖారవశ్చ-స్ఫారముఖారవః, స్ఫారముఖారవాత్ ఉద్గమః యస్య సః=స్ఫారముఖారవోద్గమః.

భావము :

ఆ సమయమున ద్వారమందు నలభీమరాజుల సేనలుగూడ చేరినవి. నియామకులగు వారిరువురు రాజులు సమీపమునం దుండుటవలన, అవి యణగియుండి, యొండొరులతో హింసాకృత్యములకు పూనుకొనలేదు. కాన వాని కంఠములనుండి యట్టి హింసతోకూడిన క్రూరధ్వనులతో వెలసిన సమ్మేళనము వాని కేర్పడలేదు. రాజు లుభయులు నుండుటచే వారికి భయపడి సేన లణగి మణగి యుండినవని యాశయము. ॥9॥

శ్లో. నివేశ్య బంధూ నిత ఇత్యుదీరితం
దమేన గత్వార్ధపథే కృతార్హణం
వినీత మాద్వారత ఏవ పద్గతాం
గతం త మైక్షిష్ట ముదా విదర్భరాట్. 10

ప. వి. నివేశ్య - బంధూన్ - ఇతః- ఇతి - ఉదీరితం - దమేన - గత్వా - అర్ధపథే - కృతార్హణం - వినీతం - ఆద్వారతః - ఏవ - పద్గతాం - గతం - తం - ఐక్షిష్ట - ముదా - విదర్భరాట్.

అర్థము : దమేన=భీమరాజపుత్రునిచే, గత్వా=ఎదుర్కొనబడి, బంధూన్=అల్లుడగు నలుని బంధువులను, నివేశ్య=కూర్చొనబెట్టి, ఇతః ఇతి=ఈ దిక్కునకు రండి యని, ఉదీరితం=చెప్పబడినది, అర్ధపథే=మార్గ మాధ్యమునందు లేదా సగము త్రోవయందు; కృత+అర్హణం=కృత=చేయబడిన, అర్హణం=పూజ కల్గిన, వినీతం=వినయవంతుడును, ఆద్వారతః=ద్వారము నారంభించి, పద్గతాం=రథము నుండి దిగి పాదచారిత్వమును, గతం=పొందిన, తం=ఆ నలమహారాజును, ముదా=సంతోషముతో, ఐక్షిష్ట=చూచెను.

సమాసములు :

అర్థపథే : పథః అర్ధం అర్ధపథం తస్మిన్ = అర్ధపథే.
కృతార్హణం : కృతా అర్హణా యస్య సః = కృతార్హణః, తం, కృతార్హణం.
పద్గతాం : పద్భ్యాం గచ్ఛతి ఇతి = పద్గః, పద్గస్య భావః పద్గతా, తాం పద్గతాం.
విదర్భరాట్ : విదర్భాణాం రాట్ విదర్భరాట్.

భావము :

భీమ నృపాలుని పుత్రుఁ డగు దముఁడు ప్రత్యుత్థానముఁ గావించి, అల్లుఁడగు నలుని బంధువుల నొకచోట కూర్చుండునట్లు ప్రార్థించి కూర్చొనఁబెట్టెను. సగము త్రోవయందు, మర్యాదఁ జేయఁబడినవాడై, ద్వారము నుండి పాదచారిగా వచ్చుచున్న వినయవంతుఁడగు నలుని భీమరాజు సంతోషముతోఁ జూచెను.

శ్లో. అథాయ ముత్థాయ విసార్య దోర్యుగం
ముదా ప్రతీయేష త మాత్మజన్మనః
సురస్రవన్త్యా ఇవ పాత్ర మాగతం
ధృతాభితోవీచిగతిః సరిత్పతిః. 11

ప. వి. అథ-అయం-ఉత్థాయ-విసార్య-దోర్యుగం-ముదా-ప్రతీయేష-తం- ఆత్మజన్మనః- సురస్రవంత్యాః-ఇవ- పాత్రం-ఆగతం- ధృతాభితోవీచిగతిః- సరిత్పతిః.

అర్థము: అథ = నలుని చూచినపిదప, అయం = ఈ విదర్భరాజు, దోర్యుగం = భుజముల జంటను, విసార్య = చాచి, ఆగతం = సమక్షమునకు వచ్చిన, ఆత్మజన్మనః = తన కూతురగు దమయంతికి, పాత్రం = తగిన, వరం = వరునిగా, తం = ఆ నలుని, ధృతాభితోవీచిగతిః - ధృత = ధరింప

బడిన, అభితః = రెండువైపులను, వీచి = అలల యొక్క, గతిః = నడక గల్గిన, సరిత్పతిః = నదులకు భర్తయైన సముద్రుడు, సురస్రవంత్యాః = గంగనుండి, ఆగతం = వచ్చిన, పాత్రం ఇవ = ప్రవాహమునువలె లేదా ఓడనువలె, ముదా = సంతోషముతో, ప్రతీయేష = కౌగిలించుకొనెను.

సమాసములు :

*దోర్యుగం*-దోష్ణోః యుగం = దోర్యుగం, తత్ = దోర్యుగం.

*ఆత్మజన్మనః*- ఆత్మనః జన్మ యస్యాః సా = ఆత్మజన్మా, తస్యాః = ఆత్మజన్మనః.

*సురస్రవంత్యాః*- సురాణాం స్రవంతీ = సురస్రవంతీ, తస్యాః = సురస్రవంత్యాః.

*ధృతాభితోవీచిగతిః*- వీచీనాం గతిః = వీచిగతిః, ధృతా అభితః వీచిగతిః యస్య సః = ధృతాభితోవీచిగతిః.

*సరిత్పతిః*- సరితాం పతిః = సరిత్పతిః.

భావము :

నలుని చూచిన పిదప నా భీమరాజు తన భుజములను రెంటిని చాచి తన యెదుటకు వచ్చిన తన కుమార్తెకు తగిన వరుడగు నలుని సంతోషముతో కౌగిలించుకొనెను. అది ఇరువైపుల అలల కదలికలు గల సముద్రుడు గంగానది నుండి వచ్చిన ప్రవాహమును లేదా యోడను కౌగలించుకొనినట్లున్నది.

శ్లో. యథావ దస్మై పురుషోత్తమాయ తాం
స సాధు లక్ష్మీం బహువాహినీశ్వరః
శివా మథ స్వస్య శివాయ నందినీం
దదే పతిః సర్వవిదే మహీభృతామ్. 12

2)

ప. వి. యథావత్ - అస్మై - పురుషోత్తమాయ - తాం- సః- సాధు లక్ష్మీం - బహువాహినీశ్వరః - శివాం - అథ - స్వస్య - శివాయ - నందినీం - దదే - పతిః - సర్వవిదే - మహీభృతామ్.

అర్థము: అథ = నలుని కౌగలించుకొన్న పిదప, బహువాహినీశ్వరః - బహు = పెక్కులైన, వాహినీ = సేనలకు, ఈశ్వరః = ప్రభువును, మహీభృతాం = రాజులకు, పతిః = పాలకుడునగు, సః = ఆ భీమరాజు, పురుషోత్తమాయ = పురుషులలో శ్రేష్ఠుడును, శివాయ = మంగళ శరీరము కలవాడును, సర్వవిదే = సర్వమును తెలిసినవాడునగు, అస్మై = ఈ నలునికై, సాధులక్ష్మీం = చక్కని శోభకల్గిన, శివాం = మంగళ శరీరము గల్గిన, స్వస్య = తనయొక్క, నందినీం = కూతురును, యథావత్ = శాస్త్రముననుసరించి, దదే = ఇచ్చెను.

పక్షాంతరమున :

బహువాహినీశ్వరః = పెక్కునదులకు భర్తయగు, సః = ఆ సముద్రుడు, పురుషోత్తమాయ = విష్ణువునకు, లక్ష్మీం = లక్ష్మిని, యథావత్ = విధిననుసరించి, దదే = ఇచ్చెను, తచ్చ = అదియు, సాధు = మంచిది.

అట్లే: మహీభృతాం పతిః = పర్వతములకు భర్తయగు, సః = ఆ హిమవంతుడు, స్వస్య = తన యొక్క, నందినీం = కూతురగు, శివాం = పార్వతిని, సర్వవిదే = సర్వజ్ఞుడైన శివునికి, దదే = ఇచ్చెను, తచ్చ = అదియు, సాధు = మంచిది.

వి. ఇచట విశేషణ విశేష్యములు రెండును శ్లిష్టములుగా నుండుటవలనను, అభిధాశక్తి ప్రకృతార్థము ననగా భీమ-నల-దమయంతీ పరమైన యర్థమును బోధించుటచేతనే క్షీణించుటవలనను, వాచ్యార్థమున కనుపపత్తి లేనందువలనను, లక్షణ కవకాశము లేనందువలన వ్యంజనచే ఉపమాలంకారము ధ్వనించుటవలన నిట ఉపమాలంకారధ్వని.

సమాసములు:- యథావత్ -యథార్హం = యథావత్, పురుషోత్తమాయ- పురుషాణా ముత్తమ: = పురుషోత్తమః, తస్మై = పురుషోత్తమాయ.

సాధులక్ష్మీం - సాధ్వీ చ సా లక్ష్మీః చ = సాధులక్ష్మీః, తాం = సాధులక్ష్మీం.

*బహువాహినీశ్వర :* - బహ్వ్యశ్చ తాః వాహిన్యశ్చ = బహువాహిన్యః, బహువాహినీనా మీశ్వరః = బహువాహినీశ్వరః.

*సర్వవిదే:* సర్వం వేత్తి ఇతి = సర్వవిత్, తస్మై = సర్వవిదే.

**మహీభృతాం** - మహీం బిభ్రతి ఇతి = మహీభృత్, తేషాం = మహీభృతాం.



భావము :

**ఇవ్విధముగా** వరుడైన నలమహారాజును, పెక్కు సేనలకు అధిపతియు, రాజులకు రాజును, అగు భీమనృపాలుడు, పురుషులలో శ్రేష్ఠుడును, మంగళ శోభితమగు శరీరము గలవాడును, సర్వజ్ఞుడు నైన నలమహారాజునకు, చక్కని శోభకలదియును, మంగళ స్వరూపిణియు నగు తన పుత్రికయగు దమయంతిని శాస్త్రప్రకారము దానము గావించెను. అదెట్లనగా, బహువాహినీపతి యనగా పెక్కు నదులకు భర్తయగు సముద్రుడు, పురుషోత్తముడైన విష్ణువునకు లక్ష్మిని విధిప్రకారము దానము చేసిన విధముగాను, మహీభృత్పతి యనగా హిమవంతుడు తన పుత్రికయగు *శివ* యనగా పార్వతిని సర్వజ్ఞుడగు శివునికి దానము చేసిన విధముగను ఉన్నది.

శ్లో. అసిస్వద ద్యన్మధుపర్క మర్పితం
స తద్వ్యధా త్తర్క ముదర్కదర్శినాం
యదేవ పాస్యన్ మధు భీమజాధరం
మిషేణ పుణ్యాహవిధిం తదా௨కరోత్. 13

ప. వి. అసిస్వదత్-యత్-మధుపర్కం - అర్పితం-సః-తత్-వ్యధాత్-తర్కం-ఉదర్కదర్శినాం-యత్-ఏషః-పాస్యన్ - మధు-భీమజాధరం-మిషేణ - పుణ్యాహవిధిం-తదా-అకరోత్.

అర్థము: సః=ఆ నలుడు, అర్పితం=భీమరాజుచే నీయబడిన, మధుపర్కం= కంచు గిన్నెయం దుంచబడినట్టి, పెరుగు, తేనె, నేయి, అను మూడు పదార్థముల మిశ్రణముచే నేర్పడిన మధుపర్కమును, అసిస్వదత్=చవి చూచెను, ఇతి యత్=అనగా పానము గావించె ననున దేది గలదో, ఉదర్క దర్శినాం=వివాహమైన పిదప రానున్న ఫలములను గూర్చి తెలిసిన వారికి, తర్కం=ఒక రహస్యమును, వ్యధాత్=కలిగించినది, యత్=ఏలయనగా, ఏషః=ఈ నలుడు, భీమజాధరం- భీమజా= దమయంతి యొక్క, అధరం=పెదవియను, మధు=తేనెను, పాస్యన్= త్రాగబోవుచు, తదా=ఆ కాలమందు, మిషేణ=మధు పర్కమును పానము చేయుట యను నెపముచే, పుణ్యాహవిధిం=కర్మ ప్రారంభ మున కావించు పుణ్యాహమను కార్యమును, అకరోత్=చేసెను.

భావము :

వివాహ దిన మనెడి పుణ్యాహమందు మధుపర్కమును త్రాగుట యను నెపముచే నలుఁడు జరుగబోవునట్టి యధరపానమను కార్యమునకు శుభారంభమును కావించెనని యర్థము. వివాహాది మంగళ కార్యములందు అంతటను తొలుత పుణ్యాహక్రియను చేయుట ప్రసిద్ధము కదా !

వి. ఇచట మధుపర్క వ్యాజముచే అధరపానమునకు పుణ్యాహమును చేసినట్లు చెప్పుట వలన అపహ్నవాలంకారము. అట్టి పుణ్యాహమును చేయక పోయినను, చేసినట్లు చెప్పుట వలన ఉత్ప్రేక్ష. పైన చెప్పబడిన యప హ్నవముతో కూడినందువలన సాపహ్నవోత్ప్రేక్ష.

సమాసములు :

*ఉదర్కదర్శినాం* - ఉదర్కం పశ్యంతి ఇతి = ఉదర్కదర్శినః, తేషాం=ఉదర్కదర్శినాం.

*భీమజాధరం* - భీమజాయాః అధరః = భీమజాధరః, తం = భీమ జాధరం.

**పుణ్యాహవిధిం** - పుణ్యం చ తత్ అహశ్చ = పుణ్యాహం, పుణ్యాహే విధిః = పుణ్యాహవిధిః, తం = పుణ్యాహవిధిం.

భావము :

భీమమహారాజు కంచుగిన్నెయందు పెరుగు, తేనె, నేయి-కలిపి చేసిన మధుపర్కమును నలునకు ఈయగా, అతడు దానిని పానము గావించెను. ఆ మధుపర్కపానము, వివాహానంతరము రాబోవు విషయమును తెలిసినవారి కొక రహస్యమును సూచించినది. అదేమనగా ఈ నలుడు వివాహమైన పిదప, దమయంతి పెదవిని పానము చేయగలడు. ఆ పెదవి తేనెవలె మధురమైనది. అట్టి యధరపానమునకు మధుపర్కపానమను వ్యాజముతో ఆ దినమందు శుభప్రదముగా **పుణ్యాహమను** విధిని చేసికొనెనా! యని ఈ రహస్యమునే ఆ మధుపర్కపానము సూచించిన దని యాశయము.

శ్లో. వరస్య పాణిః పరఘాతకౌతుకీ
వధూకరః పంకజకాంతితస్కరః
సురాజ్ఞి తౌ తత్ర విదర్భమండలే
తతో నిబద్ధౌ కిము కర్కశైః కుశైః. 14

ప. వి. వరస్య-పాణిః-పరఘాతకౌతుకీ-వధూకరః-పంకజకాంతితస్కరః-సురాజ్ఞి-తౌ-తత్ర-విదర్భమండలే-తతః-నిబద్ధౌ-కిము-కర్కశైః-కుశైః.

అర్థము : వరస్య = వరుడైన నలుని యొక్క, పాణిః = హస్తము, పరఘాతకౌతుకీ, పర = శత్రువులను, ఘాత = హింసించుటయందు, కౌతుకీ = కోరిక కల్గినది, వధూకరః = వధువైన దమయంతి హస్తము, పంకజకాంతి తస్కరః, పంకజ = తామరపూవు యొక్క, కాంతి = శోభను, తస్కరః = అపహరించునది, తతః = అట్టి పూర్వాపరాధమువలన అనగా ఒకటి హింసించునది, మఱియొకటి తస్కరించునది అను నేరములవలన, తౌ = ఆ వధువగు దమయంతి యొక్క, వరుడగు నలునియొక్కయు హస్తములను, సురాజ్ఞి = భీముని వంటి మంచిరాజు గల, తత్ర = ఆ,

విదర్భ మండలే = విదర్భ దేశమందు, కర్కశైః = దృఢములైన, కుశైః = దర్భలచే, నిబద్ధౌ హి = కట్టి వేయబడినవా ! ఏమి ? ధార్మికు డగు రాజు పాలించెడి దేశములయందు దుష్టులు బంధింపబడుదురు గదా !

వి :- దేశాచారము ననుసరించి, వధూవరుల హస్తములందలి దర్భబంధ నమునకు, అపరాధము హేతువు కాకపోయినను, అపరాధమును హేతువుగా చెప్పుటవలన ఉత్ప్రేక్ష.

సమాసములు :

పరఘాత కౌతుకీ : పరస్య ఘాతః = పరఘాతః, కౌతుకం అస్య అస్తీతి = కౌతుకీ.
పంకజకాంతి తస్కరః : పంకజస్య కాంతిః = పంకజ కాంతిః పంకజ కాంతేః తస్కరః = పంకజ కాంతి తస్కరః
సురాజ్ఞి : శోభనః రాజా, యస్మిన్ సః = సురాజా, తస్మిన్ = సురాజ్ఞి.
విదర్భమండలే : విదర్భాణాం మండలం = విదర్భమండలం, తస్మిన్ = విదర్భమండలే.

భావము :

ఆ వివాహకాలమునందు దేశాచారము ననుసరించి, వరుని హస్తమునందు దర్భసూత్రముచే కంకణమును కట్టుదురు. దానిని కవి చమత్కరించుచున్నాడు. ఎట్లనగా, ఆ నలుని హస్తము శత్రుహింసయందు ఆసక్తికల్గి హింసయను నేరమును గావించినది. ఆ దమయంతి యొక్క హస్తము తామర పూలను మించిన యందము కల్గియుండుటచే, వాని సౌందర్యమును అపహరించి నేరము గావించినది ఇట్లు వధూవరుల హస్తములు క్రమముగా హింసాచౌర్యము లనెడి నేరములను చేయుట వలన, భీముని విదర్భరాజ్యము ధార్మికరాజ్య మగుటవలన, వారిరువురి హస్తములు గట్టి దర్భలత్రాటితో బంధించబడినవా యని భావింపబడినది. అపరాధులను ధార్మికరాజ్యములలో బంధింతురు కదా! అట్టి బంధనమే వీరికిని జరిగినద్గా యని భావము.

శ్లో. విదర్భజాయాః కరవారిజేన య
న్నలస్య పాణే రుపరి స్థితం కిల
విశంక్య సూత్రం పురుషాయితస్య తత్
భవిష్యతోఽస్మాయి తదా తదాలిభిః. 15

ప. వి. విదర్భజాయాః-కరవారిజేన-యత్-నలస్య-పాణేః-ఉపరి - స్థితం- కిల-విశంక్య - సూత్రం – పురుషాయితస్య - తత్-భవిష్యతః-అస్మాయి - తదా-తదాలిభిః.

అర్థము: విదర్భజాయాః=దమయంతి యొక్క, కరవారిజేన=హస్తపద్మముచే, నలస్య=నలునియొక్క, పాణేః=హస్తమునకు, ఉపరి-స్థితం - ఇతి యత్=పైన యుండుట ఏది గలదో, తత్=ఆ విధముగా పైన ఉండుట, భవిష్యతః=జరుగబోవు, పురుషాయితస్య=విపరీత సురత క్రియ యందు పురుషునివలె స్త్రీ యాచరించు విధానమునకు, సూత్రం= సూచకముగా, విశంక్య=భావించి, తదా=అప్పుడు, తదాలిభిః=ఆ దమయంతి చెలికత్తెలచే, అస్మాయి = మందహాసము గావింపబడినది. విపరీత సురతమందు పురుషునిపై స్త్రీ శయనించును గాన దానికి సూచకముగా నలునిపై దమయంతి హస్తముంచబడినదా! యని భావించి, యచ్చటి చెలికత్తెలు మందహాసము గావించిరని యర్థము.

సమాసములు :

విదర్భజాయాః- విదర్భేభ్యః జాయతే ఇతి=విదర్భజా, తస్యాః= విదర్భజాయాః.

కరవారిజేన - వారిణి జాయత ఇతి=వారిజం, కర ఏవ వారిజం= కరవారిజం, తేన=కరవారిజేన.

పురుషాయితస్య : పురుషస్యేవ ఆచరితం=పురుషాయితం, తస్య= పురుషాయితస్య.

తదాలిభిః- తస్యాః ఆలయః=తదాళయః, తాభిః=తదాలిభిః.

భావము :

వివాహమున వరుని చేతిపైన వధువు చేయి యుండుట యాచారముగాన, నిట నలుని హస్తముపై దమయంతి హస్త మున్నది. ఈ విధముగా నుండుట ఒక విషయమును సూచించుచున్నది. అదేమనగా వివాహానంతరము నల దమయంతుల విపరీత సురతకేళియందు దమయంతి నలునిపై శయనించి పురుషుని వలె నాచరించుట యను పురుషాయితమును చేయఁగల దను నంశము. ఈ విధముగా భావించి, యా వివాహ కాలమందు దమయంతి చెలికత్తెలు మందహాసము గావించిరి.

శ్లో. సఖా యదస్మై కిల భీమసంజ్ఞయా
స యక్షసఖ్యాధిగతం దదౌ భవః
దదే తదేషః శ్వశురః సురోచితం
నలాయ చింతామణిదామ కామదమ్. 16

ప. వి. సఖా-యత్ - అస్మై-కిల-భీమసంజ్ఞయా-సః-యక్షసఖ్యాధిగతం - దదౌ-భవః-దదే-తత్-ఏషః-శ్వశురః- సురోచితం-నలాయ- చింతామణిదామ-కామదమ్.

అర్థము: సః = ప్రసిద్ధుడగు, భవః = భగవంతుడగు శివుడు, యక్ష సఖ్యాధిగతం యక్ష = కుబేరుని తోడి, సఖ్య = చెలిమిచే, అధిగతం = పొందబడిన, యత్ = ఏ, చింతామణిదామ = చింతామణితో కూర్చబడిన మాలను, భీమసంజ్ఞయా, భీమ = భీము డనెడి, సంజ్ఞయా = పేరుచే, సఖా (ఇతి) = చెలికాడను బుద్ధిచే, అస్మై = భీమ నృపతికై, దదౌ = ఇచ్చెనో, సురోచితం-సుర = దేవతలకు, ఉచితం = తగిన, కామదం = కోరికల నిచ్చునట్టి, తత్ = ఆ చింతామణి మాలను, శ్వశురః = పుత్రిక నిచ్చుటచే మామయైన, ఏషః = ఈ భీమరాజు, నలాయ = నల మహారాజునకై, దదే = ఇచ్చెను.

సమాసములు :

భీమసంజ్ఞయా—భీమ ఇతి సంజ్ఞా = భీమ సంజ్ఞా, తయా = భీమ సంజ్ఞయా.

*యక్షసఖ్యాధిగతం:* సఖ్యుః భావః=సఖ్యం, యక్షేణ సఖ్యం= యక్షసఖ్యం, యక్షసఖ్యేన అధిగతం=యక్షసఖ్యాధిగతం, తత్= యక్ష సఖ్యాధిగతం.

*సురోచితం:* సురాణాం ఉచితం=సురోచితం, తత్=సురోచితం.

*చింతామణిదామ :* చింతామణి గ్రథితం దామ = చింతామణిదామ, కామదం-కామాన్ దదాతి ఇతి=కామదం, తత్ కామదం.

**భావము :**

ఇది మొదలు 88 వ శ్లోకము వఱకును భీమరాజు వరుడైన నలమహా రాజున కొసంగిన పెండ్లికానుకలను వర్ణించుచున్నాడు.

పరమ శివుడు తాను కుబేరునితోడి చెలిమి వలన సంపాదించుకొనిన చింతామణిరత్నములతో కూర్చబడినట్టి రత్నహారమును (వ్యోమకేశో భవో భీమః స్థాణు రుద్ర ఉమాపతిః) అను నిఘంటువు ననుసరించి, తన భీమనామమును వహించె నను అభిమానముతో ఆ భీమరాజున కొసంగెను. ఆ రత్నహారమును దేవతలు ధరింప నర్హులు. అది ధరించిన వారికి సకల కామములను సమకూర్చును. అట్టి హారమును భీమరాజు అల్లుడైన నలమహారాజునకు కానుకగా ఒసంగెను.

శ్లో. బహో ర్దురాపస్య వరాయ వస్తున
శ్చిత్తస్య దాతుం ప్రతిబింబకైతవాత్
బభౌతరా మంత రవస్థితం దధ
ద్యదర్థ మభ్యర్థితదేయ మర్థినే. 17

ప. వి. బహోః- దురాపస్య - వరాయ - వస్తునః - చిత్తస్య - దాతుం-ప్రతిబింబ కైతవాత్ - బభౌతరాం - అంతః - అవస్థితం - దధత్-యత్-అభ్యర్థిత దేయం-అర్థినే.

**అర్థము:** యత్ = ఏ చింతామణి మాల్యము, వరాయ= వరునికై, దాతుం= ఇచ్చుటకు, చిత్తస్య= రాశిగా చేయబడిన, దురాపస్య= దుర్లభమైన,

బహోః = పెక్కైన, వస్తునః = వస్తువుల సమూహమునకు, ప్రతిబింబ కైతవాత్ — ప్రతిబింబ = ప్రతిబింబముయొక్క, కైతవాత్ = నెపము వలన, అంతః = మధ్యభాగమందు, అవస్థితం = ఉన్నట్టి, అభ్యర్థిత దేయం- అభ్యర్థిత = యాచింపబడినదై, దేయం = ఈయదగినదిగా నిశ్చయింపబడిన, అర్థం = వస్తు సమూహమును, దధత్ = ధరించు చున్నదో యనునట్లు, బభౌతరాం = మిక్కిలి వెలుగొందుచుండినది.

వి.- ఆ చింతామణిహారమందు కానవచ్చు ప్రతిబింబము యాచకులు దేనిని యాచించిన దాని నొసంగుటకై సమకూర్చుకొనబడిన వస్తు సమూహముగా భావింపబడుటవలన నిట నుత్ప్రేక్ష. వ్యంజకమును ప్రయోగింపనందువలన అది గమ్యము. ప్రతిబింబకైతవాత్-అని కైతవశబ్దముచే అపహ్నవము చేయుటవలన అపహ్నవము. ఈ అపహ్నవముతో నుత్ప్రేక్ష గూడినది గావున సాపహ్నవోత్ప్రేక్ష.

సమాసములు :

దురాపస్య-దుఃఖేన ఆప్తుం శక్యం = దురాపం, తస్య = దురాపస్య.

ప్రతిబింబకైతవాత్ — ప్రతిబింబస్య కైతవం = ప్రతిబింబకైతవం, తస్మాత్ = ప్రతిబింబకైతవాత్.

బభౌతరాం—అతిశయేన బభౌ = బభౌతరాం.

అభ్యర్థితదేయం-అభ్యర్థిత శ్చాసౌ దేయశ్చ = అభ్యర్థితదేయః, తం = అభ్యర్థితదేయం.

భావము :

ఆ చింతామణి మాలయందు పెక్కు వస్తువులు ప్రతిబింబించియున్నవి. అది వరుని కొసంగుటకై చేర్చిపెట్టబడిన యమూల్య వస్తుసంచయముగా భావింపబడినదని యాశయము.

శ్లో. అపిం భవాన్యాః క్షతకాసరాసురం
వరాయ భీమః స్మ దదాతి భాసురం

దదే హి తస్మై ధవనామధారిణే
స శంభుసంభోగనిమగ్నయా౽నయా. 18

ప. వి. అసిం-భవాన్యాః - క్షతకాసరాసురం - వరాయ - భీమః - స్మ - దదాతి-భాసురం - దదే - హి - తస్మై - ధవనామధారిణే - సః - శంభుసంభోగనిమగ్నయా - అనయా.

అర్థము: భీమః = భీమనృపాలుడు, క్షతకాసరాసురం- క్షత = చంపబడిన, కాసరాసురం = మహిషాసురుడు గల్గిన, భాసురం = ప్రకాశించెడి, భవాన్యాః = దుర్గాదేవియొక్క, అసిం = కత్తిని, అనగా దుర్గ భీమరాజున కిచ్చిన కత్తినని భావము, వరాయ = నలునకై, దదాతి స్మ = ఇచ్చుచుండెను, హి = ఏలయనగా, శంభుసంభోగ నిమగ్నయా- శంభు = శివునితోడి, సంభోగ = సురతమందు, నిమగ్నయా = మునింగిన అనగా మహిషాసురుని వధించిన పిమ్మట యుద్ధాసక్తి తొలగిన, కేవలము సంభోగమందు ఆసక్తి గల్గిన, అనయా = ఈ దుర్గచే, ధవనామధారిణే-ధవ = తన ప్రియుడైన శివుని యొక్క, నామ = భీముడను పేరును, ధారిణే = ధరించిన, తస్మై = భీమరాజునకై, సః = ఆ కత్తి, దదే = ఈయబడినది, శత్రువైన మహిషాసురుని చంపిన పిదప ఆ ఖడ్గము తనకు వ్యర్థమని భావించి ఇచ్చినదని భావము.

సమాసములు :

క్షతకాసరాసురం-కాసర ఇతి అసురః = కాసరాసురః; క్షతః కాసరాసురః యేన సః = క్షతకాసరాసురః, తం = క్షతకాసరాసురం.

ధవనామధారిణే, ధవస్య నామ = ధవనామ, ధవనామ ధారయతి ఇతి = ధవనామధారీ, తస్మై = ధవనామధారిణే.

శంభు సంభోగ నిమగ్నయా- శంభునా సంభోగః = శంభుసంభోగః, శంభుసంభోగే నిమగ్నా = శంభుసంభోగ నిమగ్నా. తయా = శంభు సంభోగ నిమగ్నయా.

భావము :

భీమరాజు దుర్గ మహిషాసురుని వధించి తన కొసంగిన ఖడ్గమును వరుడగు నలమహారాజున కొసంగుచుండెను. మహిషాసురుని వధించిన పిమ్మట దుర్గాదేవికి రణాసక్తి తొలగినది. అందువలన శివునితో నేకాంతసురతము ననుభవింప ఆసక్తి కల్గినదై, తన ప్రియుడగు శివుని నామమగు భీముడను పేరును వహించిన భీమనృపతియందు ప్రీతురాలై యా ఖడ్గము నాతని కొసంగినదని యాశయము.

శ్లో. అధారి యః ప్రాఙ్మహిషాసురద్విషా
కృపాణ మస్మై తమదత్త కూకుదః
అహాయి తస్యా హి ధవార్ధమజ్జినా
స దక్షిణార్ధేన పరాంగదారణః. 19

ప. వి. అధారి - యః - ప్రాక్ - మహిషాసురద్విషా - కృపాణం - అస్మై - తం అదత్త - కూకుదః - అహాయి - తస్యాః - హి - ధవార్ధమజ్జినా - సః - దక్షిణార్ధేన - పరాంగదారణః.

అర్థము:- యః = ఏ కత్తి, మహిషాసుర ద్విషా = మహిషాసురుడను రాక్షసునకు శత్రువైన దుర్గాదేవిచే, ప్రాక్ = మునుపు, అధారి = ధరింపబడినదో, తం = ఆ, కృపాణం = కత్తిని, కూకుదః = కన్యాదాతయగు భీమరాజు, అస్మై = ఈ నలమహారాజునకై, అదత్త = ఇచ్చెను, హి = ఏలయనగా, ధవ = ప్రియుడైన భీముడను మఱియొక పేరుగల శివునకు, అర్ధ = ఎడమవైపున సగపాలునందు, మజ్జినా = ప్రవేశించిన, తస్యాః = ఆ దుర్గాదేవియొక్క, దక్షిణార్ధేన = కుడివైపుననున్న సగపు శరీరముచే, పరాంగ దారణః- పర = ఇతరులయొక్క, అంగ = శరీరమును, దారణః = కోయునట్టి, సః = ఆ ఖడ్గము, అహాయి = విడువబడినది. ఖడ్గముతో కూడిన. కుడివైపు శరీరముతో, ప్రియుడగు శంభుని శరీరము ప్రవేశించినచో, దానివలన ఆతని శరీరము కోయబడు నను భావముతో ఆ ఖడ్గము విడువబడినదని యర్థము.

సమాసములు :

మహిషాసురద్విషా-మహిష ఇతి అసురః=మహిషాసురః, మహిషాసురస్య ద్విట్=మహిషాసురద్విట్, తయా=మహిషాసురద్విషా.

కూకుదః-కూకుం దదాతి ఇతి=కూకుదః

ధవార్ధమజ్జినా - ధవస్య అర్ధం = ధవార్ధం, ధవార్ధే మజ్జతి ఇతి = ధవార్ధమజ్జి, తేన=ధవార్ధమజ్జినా.

దక్షిణార్ధేన-దక్షిణం చ తత్ అర్ధం చ = దక్షిణార్ధం, తేన = దక్షిణార్ధేన.

పరాంగదారణః - పరస్య అంగం=పరాంగం, పరాంగం దారయతి ఇతి=పరాంగదారణః.

భావము :

మహిషాసురుని సంహరించిన దుర్గాదేవి ధరించిన ఖడ్గమును కన్యాదాతయగు భీమరాజు నలమహారాజున కొసంగెను. ఆఖడ్గమును దుర్గాదేవి ధరింపక యుండుటకు కారణాంతరము గూడ ఉన్నది. అదేమనగా ఆదుర్గాదేవియొక్క శరీరమందలి దక్షిణార్ధ భాగము, అర్ధ నారీశ్వరత్వముచే శివుని శరీరమందలి వామార్ధభాగమును ప్రవేశించియున్నది. కావున నామె ఖడ్గమును ధరించినచో, ఆ ఖడ్గము ఆమెకు దక్షిణభాగమందున్న శివుని శరీరమునకు తగిలి, దానిని కోయవలయునను భయము. ఆ భయము వలననే ఆమె ఆ ఖడ్గమును విసర్జించి భీమరాజున కొసంగినదని భావము.

శ్లో. ఉవాహ యః సాంద్రతరాంక కాననః
స్వశౌర్యసూర్యోదయపర్వతవ్రతం
సనిర్ఝరః శాణన ధౌత ధారయా
సమూఢసంధ్యః క్షతశత్రుజాసృజా. 20

ప. వి. ఉవాహ-యః- సాంద్ర తరాంక కాననః-స్వ శౌర్య సూర్యోదయ పర్వత వ్రతం-సనిర్ఝరః-శాణన ధౌత ధారయా - సమూఢసంధ్యః-క్షతశత్రు జాసృజా.

అర్థము: సాంద్రతరాంకకాననః; సాంద్రతర = మిక్కిలి దట్టమైన, అంక = నలుపు వన్నెగల రక్త చిహ్నములనెడి, కాననః = అరణ్య స్వరూపము గల్గిన, కత్తికి తగిలిన, ఎండిన రక్తపు మరకలు నల్లగా ఉండుట వలన వానియందు నరణ్యత్వ మారోపింపబడినది. శాణనధౌతధారయా- శాణన = పదను పెట్టుటవలన, ధౌత = ప్రకాశ మానమగు, ధారయా = అంచుచే, సనిర్ఝరః = సెలయేటితో గూడినదిగా కానబడుచున్నట్టి, క్షత శత్రుజా సృజా - క్షత = కొట్టబడిన, శత్రుజ = శత్రువుల నుండి ఉద్భవించిన, అసృజా = రక్తముచే, అనగా ఖడ్గమున కంటిన రక్తముచే నని అర్థము, సమూఢ సంధ్యః-సమూఢ = ధరింపబడిన, సంధ్యః = ఉదయ కాలపు సంధ్యయొక్క శోభను తాల్చిన, యః = ఏ ఖడ్గము, స్వశౌర్య సూర్యోదయ పర్వత వ్రతం- స్వ = తనదగు, శౌర్య = పరాక్రమ మనెడి, సూర్య = సూర్యునకు, ఉదయ పర్వత = ఉదయాద్రి యొక్క, వ్రతం = నియమమును అనగా, నిత్యము సూర్యోదయమును చేయుట అను వ్రతమును అనగా ప్రతిదినము శత్రువులను దండించుటచే, తన ప్రతాపమును వెల్లడి చేయుట అను వ్రతమును, ఉవాహ = వహించెను.

వి. ఖడ్గమందలి రక్తపు మరకలపై అరణ్యత్వమును శౌర్యాదులందు సూర్యత్వాదులను ఆరోపించుట వలన రూపకాలంకారము.

సమాసములు :

సాంద్రతరాంక కాననః-అత్యంతం సాంద్రాః = సాంద్రతరాః, సాంద్రతరాశ్చ తే అంకాశ్చ = సాంద్రతరాంకాః, సాంద్రతరాంకా ఏవ కాననాని యస్య సః = సాంద్రతరాంక కాననః.

స్వశౌర్య సూర్యోదయ పర్వతవ్రతం - స్వస్య శౌర్యం = స్వశౌర్యం, స్వశౌర్యమేవ సూర్యః = స్వశౌర్యసూర్యః, స్వశౌర్య సూర్యస్య ఉదయపర్వతః = స్వశౌర్యసూర్యోదయపర్వతః, స్వశౌర్య సూర్యోదయపర్వతస్య వ్రతం = స్వశౌర్య సూర్యోదయ పర్వత వ్రతం.

శాణన ధౌత ధారయా - శాణనేన ధౌతా = శాణనధౌతా, శాణన ధౌతా చ సా ధారా చ = శాణనధౌతధారా, తయా = శాణనధౌతధారయా

సనిర్ఝరః—నిర్ఝరైః సహ వర్తతే ఇతి=సనిర్ఝరః
సమూఢసంధ్యః—సమూఢా సంధ్యా యేన సః=సమూఢసంధ్యః.
క్షతశత్రుజాసృజా — క్షతాశ్చ తే శత్రవశ్చ=క్షతశత్రవః, క్షత
శత్రుభ్యః జాయతే ఇతి క్షతశత్రుజా, క్షతశత్రుజం చ తత్ అసృక్చ=
క్షతశత్రుజాసృక్, తేన=క్షతశత్రుజాసృజా.

భావము:

ఆ ఖడ్గము నిత్యము శౌర్యమనెడి సూర్యునకు నుదయపర్వతమును చేయు చున్నది. అనగా ప్రతిదినము శౌర్యసూర్యోదయమును చేయుటయను వ్రతము నాచరించుచున్నది. ఎట్లనగా ఆ ఖడ్గముపైన రక్తము ఎండి నల్లని మరకలుగ నున్నవి. ఆ మరకలు, అరణ్యముగ నున్నవి. ఆ ఖడ్గము పదను పెట్టుటవలన తెల్లగ తళతళలాడెడునట్టి యంచులు కల్గియున్నది; ఆ యంచులు సెలయేళ్ళుగా నున్నవి. గాయపఱుపబడిన శత్రువుల శరీరముల నుండి కారునట్టి రక్తమును సంధ్యగా వహించియున్నది. కాన నా ఖడ్గము, పైన చెప్పిన విధముగా నడవుల తోడను, సెలయేళ్ళ తోడను, సంధ్యాకాలపు కెంజాయలతోడను, కూడినదై నిత్యము శౌర్యసూర్యునకు నుదయపర్వతవ్రతము నాచరించుచున్నది.

శ్లో. యమేన జిహ్వే ప్రహితేవ యా నిజా
తమాత్మజాం యాచితు మర్థినా భృశం
స తాం దదేఽస్మై పరివారశోభినీం
కరగ్రహార్హా మసిపుత్రికా మపి. 21

ప. వి. యమేన-జిహ్వే-ప్రహితా-ఇవ-యా-నిజా-తం - ఆత్మజాం-యాచితుం-అర్థినా-భృశం-సః-తాం-దదే-అస్మై-పరివారశోభినీం - కరగ్రహార్హాం-అసిపుత్రికాం-అపి.

అర్థము: భృశం=మిక్కిలి, అర్థినా=యాచించునట్టి, యమేన=యమధర్మ రాజుచే, తం=ఆ భీమరాజును, ఆత్మజాం=ఆతని పుత్రికయైన దమయంతిని, యాచితుం=యాచించుటకు, నిజా=తనదైన, జిహ్వే

నాలుక యోయనునట్లున్న, యా=ఏ, అసిపుత్రికా = కత్తి (దూతిని పంపునపుడు), భీమపుత్రిక, ప్రహితా=పంపబడినదో, పరివారశోభినీం; పరివార=ఒరతోడను, పుత్రిక పక్షమున చెలికత్తెలతోడను, శోభినీం= శోభించునదియు, కరగ్రహార్హాం, కర=చేతితో, గ్రహ=పట్టుకొనుటకు, అర్హాం=తగినదియు, పుత్రికపక్షమున, కరగ్రహ=పాణిగ్రహమునకు అర్హాం=తగినదియు అగు, తాం=ఆ ఖడ్గమును; పుత్రికపక్షమున; అసి పుత్రికను అనగా అసిరూపమున నున్న పుత్రికను అనగా కన్యను, సః=ఆ భీమరాజు, అస్మై=ఇతనికి, దదే=ఇచ్చెను.

వి. ఇక్కడ కత్తియు, కన్యయు ప్రకృతములు గాన ప్రకృత శ్లేషాలంకారము.

సమాసములు:

పరివారశోభినీం-పరివారేణ శోభతే ఇతి=పరివారశోభినీ, తాం= పరివారశోభినీం.

కరగ్రహార్హాం-కరేణ గ్రహః=కరగ్రహః, కరగ్రహాయ అర్హా = కరగ్రహార్హా, తాం=కరగ్రహార్హాం.

అసిపుత్రికాం—అసిరేవ పుత్రికా=అసిపుత్రికా, తాం=అసిపుత్రికాం.

భావము :

భీమనృపాలుడు నలునకు కానుకగా ఖడ్గము నిచ్చెను. ఖడ్గమునకు అసి పుత్రిక యను పేరు కూడ నున్నది. దమయంతిని యాచించుటకై దూతికను పంపునపుడు యమధర్మరాజు, భీమరాజునకై కానుకగా, తన నాలుకవలె తీక్ష్ణమై ప్రాణహరమైనట్టి అసిపుత్రికను ఖడ్గమును పంపెను. దమయంతితో నీయసి పుత్రికను గూడ నలునకు భీమరాజొసంగెను. ఈ యసిపుత్రిక కన్యయై దమ యంతివలె వివాహయోగ్యములగు ధర్మములతో నొప్పుచున్నది. దమయంతి ెకత్తెలు మున్నగు పరివారముతో శోభించుచున్నది. ఈ అసిపుత్రిక యను ్యయు, పరివారముతో అనగా కత్తినుంచుట కుపయుక్తమగు నొరతో శోభించు న్నది. దమయంతి ఎట్లు కరగ్రహమునకు అనగా పాణిగ్రహణమునకు తగినదో

అట్లే ఈ యసిపుత్రికయు కరగ్రహమునకు (చేత బట్టుకొనుటకు) తగియున్నది. భీమరాజు కేవలము తనపుత్రికయగు దమయంతినే నలున కీయలేదు. మఱేమనగా నామెతోడ తనకు యముడు కానుకగా పంపినట్టి, యతని నాలుకవలె తీక్ష్ణమై, శత్రువులకు ప్రాణాంతకమైన యసిపుత్రికను సైత మొసంగెను. తన పుత్రిక ఆసిపుత్రికయను నిరువురు పుత్రికలను నలున కొసంగెనని యాశయము.

శ్లో. యదంగభూమీ బభతుః స్వయోషితా
మురోజపత్రావళి నేత్రకజ్జలే
రణస్థల స్థండిలశాయితా వ్రతే
గృహీతదీక్షై రివ దక్షిణీకృతే. 22

ప. వి. యదంగభూమీ- బభతుః- స్వయోషితాం- ఉరోజపత్రావళి నేత్ర కజ్జలే- రణస్థల స్థండిల శాయితావ్రతే- గృహీతదీక్షైః- ఇవ- దక్షిణీకృతే.

అర్థము. యదంగభూమీ; యత్=ఏ అసిపుత్రిక యొక్క, అంగభూమీ=ఇఱు ప్రాంతములు, రణస్థల స్థండిలశాయితా వ్రతే, రణస్థల=యుద్ధరంగ మండలి, స్థండిల=నేలపై, శాయితా=నిద్రించుట యను, వ్రతే= వ్రతమునందు, గృహీత దీక్షైః, గృహీత=గ్రహింపబడిన, దీక్షైః= కత్తి దెబ్బలచే, మరణశయ్య యందు పరుండుటయను వ్రతమునందు దీక్షను చేపట్టిన శత్రువులచే, దక్షిణీకృతే=ఆ వ్రతమునుపదేశించిన, ఋత్విక్కుగా నున్న యసిపుత్రికకు దక్షిణగా ఈయబడిన, స్వయోషితాం=తమ స్త్రీలయొక్క, ఉరోజ పత్రావళి నేత్ర కజ్జలే, ఉరోజ= స్తనములపైని, పత్రావళి=కస్తూరి మున్నగు వానిచే వ్రాయబడిన మకరి కాది పత్రభంగివలె, నేత్రకజ్జలే=కంటియందలి కాటుకవలె, బభతుః= ప్రకాశించినవి. శత్రుస్త్రీలు వైధవ్యమువలన మకరికాది పత్రభంగిని, కాటుకను విడచిపెట్టిరని భావము.

వి. నలుపు వన్నెగల కత్తియొక్క యిఱుప్రాంతములు, శత్రుస్త్రీల మకరి కారి పత్రముగను కన్నులలోని కాటుకగను భావించుటవలన ఉత్ప్రేక్షా లంకారము.

సమాసములు :

యదంగభూమీ—అంగయోః భూమీ=అంగభూమీ, యస్యాః అంగ భూమీ=యదంగభూమీ.

స్వయోషితాం—స్వేషాం యోషితః=స్వయోషితః, తాసాం=స్వయో షితాం.

ఉరోజపత్రావళి నేత్రకజ్జలే—పత్రాణాం ఆవళిః=పత్రావళిః, ఉరో జయోః పత్రావళిః=ఉరోజపత్రావళిః, నేత్రయోః కజ్జలం=నేత్ర కజ్జలం, ఉరోజపత్రావళిశ్చ, నేత్రకజ్జలం చ = ఉరోజపత్రావళి నేత్రకజ్జలే.

రణస్థల స్థండిల శాయితా వ్రతే—రణస్య స్థలం=రణ స్థలం, రణ స్థలే స్థండిలం=రణ స్థల స్థండిలం, శేతే ఇతి=శాయీ, శాయినః భావః= శాయితా, రణస్థలే స్థండిలశాయితా = రణస్థల స్థండిలశాయితా, రణ స్థల స్థండిలశాయితా ఏవ వ్రతం = రణస్థల స్థండిలశాయితావ్రతం, తస్మిన్=రణస్థల స్థండిలశాయితా వ్రతే.

గృహీతదీక్షైః — గృహీతా దీక్షా యై స్తే=గృహీతదీక్షాః, తైః= గృహీతదీక్షైః.

దక్షిణీకృతే—అదక్షిణే దక్షిణే సంపద్యమానే కృతే=దక్షిణీకృతే.

భావము :

భీమరాజు నలున కొసంగిన యా అసిపుత్రిక కిఱువైపులు నల్లగ నున్నవి. అవి యుద్ధ రంగపు నేలపై పరుండుట యను వ్రతమును చేపట్టిన శత్రువులచే అనగా యుద్ధ రంగమున కత్తి దెబ్బలచే మడిసిన శత్రువులచే తమ కావ్రతము నుపదేశించుటచే పౌరోహిత్యము వహించిన అసిపుత్రికకు దక్షిణ నొసంగబడిన తమ తమ స్త్రీల చనుదోయిలపైని కస్తూరికాదులచే రచితమగు మకరికాది పత్ర ములుగను, కన్నులందు తాల్చిన కాటుకగను వెలయుచుండినవి. కత్తి యొక్క యిఱువైపులు నల్లబారి యుండును. మకరికాది పత్రావళియు, కాటుకయు నల్లగా నుండును. కావున ఆ కత్తి యంచులు అట్లు ఉత్ప్రేక్షింపబడినవి. శత్రు స్త్రీలు

భర్తలు చనిపోవుటచే వైధవ్యమును పొందిరి. కాన వారు మకరికాది పత్రావళిని, కాటుకను వర్జించిరని యాశయము.

శో. పురైవ తస్మిన్ సమదేశి తత్సుతా
భికేన యః సౌహృదనాటినాఽగ్నినా
నలాయ విశ్రాణయతి స్మ తం రథం
నృపః సులంఘ్యాద్రిసముద్రకాపథమ్. 23

ప. వి. పురా-ఏవ-తస్మిన్-సమదేశి - తత్సుతాభికేన-యః-సౌహృదనాటినా - అగ్నినా-నలాయ-విశ్రాణయతి-స్మ- తం-రథం-నృపః - సులంఘ్యాద్రి సముద్రకాపథమ్.

అర్థము: తత్సుతాభికేన, తత్ = ఆ భీమరాజుయొక్క, సుతా = పుత్రికయగు దమయంతికి, అభికేన = కాముకుడైన (కావుననే), సౌహృదనాటినా; సౌహృద = మైత్రిని, నాటినా = నటించుచున్న, అగ్నినా = అగ్నిచే, యః = ఏ రథము, పురా + ఏవ = స్వయంవరమునకు ముందే అనగా దూతిని పంపు సమయమందే, తస్మిన్ = ఆ భీముని విషయమందు, సమదేశి = పంపబడినదో, అనగా ఈయఁబడినదో, సులంఘ్య + అద్రి సముద్రకాపథం; సులంఘ్య = సుఖముగా దాటదగిన, అద్రి = పర్వతములు, సముద్ర = సాగరములు, కాపథం = మెట్టపల్లములైన ఇఱుకు త్రోవలు గల్గిన, తం = ఆ, రథం = రథమును, నృపః = భీమరాజు, నలాయ = నలునకై, విశ్రాణయతి స్మ = ఇచ్చుచుండెను.

సమాసములు :

తత్సుతాభికేన : తస్య సుతా = తత్సుతా, తత్సుతాయాః అభికః = తత్సుతాభికః, తేన = తత్సుతాభికేన.

సౌహృదనాటినా: సుహృదః భావః = సౌహృదం, సౌహృదం నాటయతి ఇతి = సౌహృదనాటీ. తేన = సౌహృదనాటినా.

సులంఘ్యాద్రిసముద్రకాపథం : సుఖేన లంఘయితుం శక్యాః = సులంఘ్యాః, కుత్సితాః పంథానః = కాపథాః, అద్రయశ్చ, సముద్రాశ్చ, కాపథాశ్చ = అద్రిసముద్రకాపథాః, సులంఘ్యాః అద్రిసముద్రకాపథాః యేనః స = సులంఘ్యాద్రిసముద్రకాపథః,తం = సులంఘ్యాద్రిసముద్రకాపథం.

భావము :

భీమసుతయగు దమయంతిని కామించిన, అగ్నిదేవుడు, తనప్రీతికి సూచకముగా స్వయంవరమునకు పూర్వము దూతిని పంపునపుడు రథము నొకదానిని భీమరాజునకు కానుకగా పంపెను. ఆ రథముచే కొండలను, సముద్రములను, మెట్టపల్లములుగల ఇరుకైనమార్గములను సులభముగా దాటవచ్చును. అట్టి రథమును భీమరాజు తనయల్లుడగు నలమహారాజునకు బహూకరించెను.

శ్లో. ప్రసూతవత్తా నలకూబరాన్వయ
ప్రకాశితాఽస్యాపి మహారథస్య యత్
కుబేరదృష్టాంతబలేన పుష్పక
ప్రకృష్టతైతస్య తతోఽనుమీయతే. 24

ప. వి. ప్రసూతవత్తా - నలకూబరాన్వయప్రకాశితా - అస్య - అపి - మహారథస్య - యత్ - కుబేరదృష్టాంతబలేన-పుష్పకప్రకృష్టతా - ఏతస్య - తతః - అనుమీయతే.

అర్థము. యతః = ఎందువలన, అస్యాపి = ఈ, మహారథస్య = గొప్పదైన రథమునకు పక్షాంతరమున, పదివేలమంది విలుకాండ్రతో పోరఁగల్గిన సామర్థ్యముగల ఒక మహారథునకు, ప్రసూతవత్తా = శ్రేష్ఠమైన సారథిని గల్గియుండుట, పక్షాంతరమున. ఉత్తమమగు నుత్పాదకత్వమును గల్గియుండుట అనగా కుబేరునివలె నుత్తమపుత్రుని గల్గియుండుట, అనలకూబరాన్వయప్రకాశితా-అనల = రథమునొసంగిన యగ్నిచేతను, కూబర =

కాడిని కట్టెడి నొగచేతను, పక్షాంతరమున నలకూబరాన్వయ ప్రకాశితా, నలకూబర = నలకూబరుడను కుబేర పుత్రునిచే, అన్వయ = సంబంధమున, ప్రకాశితా = ప్రకటింపబడినది. తతః = అందువలన, ఏతస్య = ఈ మహారథమునకు, కుబేరదృష్టాంతబలేన; కుబేర = కుబేరుడను, దృష్టాంత = ఉదాహరణముయొక్క, బలేన = బలముచేత, పుష్పక ప్రకృష్టతా; పుష్పక = పుష్పక విమానముకంటెను, ప్రకృష్టతా = అధిక్యము, పక్షాంతరమున, పుష్పక = పుష్పకమను విమానముచే, ప్రకృష్టతా = ఇతరదేవతలకంటె నాధిక్యము, అనుమీయతే = ఊహింపబడుచున్నది. అనగా కుబేరునకు పుష్పక విమాన ముండుటవలన నతని కితరదేవలకంటె అధిక్య మూహింపబడునని అర్థము, లేదా పుష్పక విమానముచే అతని, ప్రకృష్టతా ప్ర = ప్రకర్షముతో, కృష్టతా = కొనిపోబడుట ఊహింపబడుచున్నది.

అనగా ఈ మహారథమునకు ఉత్తమ సారథి కల్గి యుండుటచేతను, అగ్నిదేవునిచే నొసంగబడుట చేతను కాడిని వహించు మంచి నొగ యుండుట చేతను కుబేరుని దృష్టాంతముతో పుష్పకవిమానము కంటె నాధిక్యము ప్రకటింపబడినది.

ఈ మహారథునకు నుత్తమ పుత్రుడు కల్గియుండుట యనునది నలకూబరుడను పుత్రుని సంబంధము వలన ప్రకటితమైనది. మఱియు ఆ కుబేరుని దృష్టాంతము కావించుకొనుట వలన నలని మహారథమునకు పుష్పక విమానాదుల కంటె వేగాదులందు అధిక్యము సిద్ధించుచున్నది. ఇందు అనుమాన ప్రకారము-

''అయం మహారథః పుష్పకప్రకృష్టో భవితు మర్హతి.
ప్రసూతవత్త్వాది ధర్మసహిత మహారథత్వాత్, కుబేరవదితి.
''ప్రసూతవత్తా'' యను దానిని పృథక్పదము గావించి నలకూబరేత్యాది పాఠము ననుసరించినచో-

ప్ర సూతవత్తా = ఉత్కృష్టమగు సారథిని కల్గియుండుట, నలకూబరాన్వయప్రకాశితా, నల = నలమహారాజునకు, కూబర = నొగతో,

అన్వయ = సంబంధముచే, ప్రకాశితా = ప్రకటితమైనది, నలునికంటె శ్రేష్ఠుడగు సారథి లేనందువలన, ఆతనిని సారథిగ గల్గియుండుట చేతనే, రథమునకు పుష్పకము కంటెను ప్రకర్ష ఊహింపబడినది.

లేదా

**అర్థము:** అస్యాఽపి = భీమునిచే నలున కొసంగబడిన, మహారథస్య, మహా = గొప్పదైన, అనగా వేగాది గుణములతో గూడిన, రథస్య = రథమునకు ప్రసూతవత్తా = శ్రేష్ఠమైన సారథిని కల్గియుండుట, యత్ = ఎందువలన నలకూబరాన్వయ ప్రకాశితా, నల = నలునకు, కూబర = నొగతోడి, అన్వయ = సంబంధించిన, ప్రకాశితా = ప్రకటితము, శోభితమునై యున్నది. తత్ = ఆ కారణము వలన, ఏతస్య = ఈ మహా రథము నకు, పుష్పక ప్రకృష్టతా - పుష్పక = కోరినట్లు వెళ్ళెడి కుబేరుని విమానమునకు వలె, ప్రకృష్టతా = శ్రేష్ఠత్వము, కుబేర దృష్టాంతబలేన- కుబేర = కుబేరుని యొక్క, దృష్టాంత = ఉదాహరణము యొక్క, బలేన = సామర్థ్యము చేత, అనుమీయతే = ఊహింపబడుచున్నది.

ప్రకాశితాఽస్యాఽపి అనునెడ, అపిశబ్దము సముచ్చయార్థము గావున వ్యాప్తి ప్రదర్శనముతోడి పంచావయవ వాక్యములోని ఉపనయ నిగమన ములను అది సూచించుచున్నది. మహారథుడైన కుబేరునికిని పుష్పక విమానముచే ప్రకర్ష లేదా ప్రకర్షచే కొని పోబడుట యనునది ఏర్పడి నది. ఇట్లు కుబేర దృష్టాంతముచే ముందు ఈ రథమునకు పుష్పకము కంటె ప్రకర్ష ఏర్పడగలదని యూహింపబడుచున్నది, యతః = ఏల యనగా, అస్యాపి = ఈ కుబేరునికిని, నలకూబరాన్వయ ప్రకాశితా, నల కూబరుడను, అన్వయ = సంతానముచే అనగా కుమారునిచే, ప్రకాశితా = శోభితమగు, ప్రసూతవత్తా = జనకత్వము అద్వితీయ సామర్థ్యముచే సాధర్మ్యముతో గూడిన దృష్టాంతము. పై ప్రకార మిచ్చుట ననుమాన ప్రకారము.

వియతః మహారథః పుష్పకప్రకృష్టో భవితు మర్హతి. నలకూబరాన్వయ ప్రకాశితప్రసూతవత్త్వాత్. యో యో నలకూబరాన్వయప్రకాశిత ప్రసూత

వత్తావాన్ స స పుష్పకప్రకృష్టః యథా కుబేరః. అనగా పై యనుమాన ప్రణాళి యందలి విశేషణములు శ్లేషమహిమచే మహారథమందును, మహారథుడైన కుబేరుని యందును సమన్వయ మందును. ఎట్లనగా—

విపక్షమందలి మహారథము పుష్పకమునకంటె నుత్కర్షను పొందుట కర్హమైనది. ఏలయనగా ఆ మహారథము నలునికి నాగతోనున్న సంబంధముచే శోభితమైన మంచి సారథిని కల్గియున్నది. ఏది, ఏది నలుని నాగతోడి సంబంధముచే శోభించిన యుత్తమసారథిని కల్గియున్నదో, అది, అది అనగా అ యా మహారథము పుష్పకమునకంటె శ్రేష్ఠమైనది. కుబేరు డుదాహరణము.

విపక్షమందలి మహారథుడు పుష్పకముచే దేవత లందఱియందు శ్రేష్ఠుడగును. లేదా పుష్పకముచే ప్రకృష్టుడు అనగా చక్కగా కొనిపోబడెడివాడగును. ఏలయనగా ఆ మహారథుడు నలకూబరు డనెడి సంతానముచే శోభించెడి ప్రకృష్టమగు జనకత్వమును గల్గియున్నాడు. ఎవ డెవడు నలకూబరు డనెడి సంతానముచే శోభితమగు జనకత్వమును కల్గియున్నాడో అత డతడు పుష్పక ప్రకృష్టు డగును. అనగా పుష్పకవిమానముచే కొనిపోదగిన వా డగును. అను ననుమానము ననుసరించి పై విషయములు చెప్పబడుచున్నవని కష్టముతో శ్లోకమునకు వ్యాఖ్య చేయవలయును.

వి. పైవిధముగా సాధ్యసాధనాది నిర్దేశము లుండుటవలన నిట ననుమానాలంకారము. రూపక హేతువుగ నిది యుండుటవలన తర్కానుమానముకంటెను విలక్షణమైనది. ప్రసూతవత్త్వాది విశేషణములతో గూడిన మహారథ శబ్దమునందు శ్లిష్టరూపకము.

సమాసములు :

ప్రసూతవత్తా = ప్రకృష్ట శ్చాసౌ సూతశ్చ = ప్రసూతః, ప్రసూతః అస్య అస్తి ఇతి ప్రసూతవాన్, ప్రసూతవతో భావః = ప్రసూతవత్తా. పక్షాంతరమున; ప్రకృష్టం చ తత్ సూతం చ = ప్రసూతం, ప్రసూతం అస్య అస్తి ఇతి = ప్రసూతవాన్, ప్రసూతవతో భావః = ప్రసూతవత్తా

*అనల కూబరాన్వయ ప్రకాశితా* — అనలశ్చ కూబరశ్చ = అనల కూబరౌ, అనలకూబరయో రన్వయః = అనల కూబరాన్వయః, అనల కూబరాన్వయేన ప్రకాశితా = అనల కూబరాన్వయ ప్రకాశితా.

*నలకూబరాన్వయ ప్రకాశితా*, నలకూబర ఇతి అన్వయః = నలకూబ రాన్వయః, నలకూబరాన్వయేన ప్రకాశితా = నలకూబరాన్వయ ప్రకాశితా.

*పక్షాంతరమున* - కూబరస్య అన్వయః = కూబరాన్వయః, నలేన కూబ రాన్వయః = నలకూబరాన్వయః, నలకూబరాన్వయేన ప్రకాశితా = నల కూబరాన్వయ ప్రకాశితా.

*కుబేరదృష్టాంతబలేన*, కుబేర ఏవ దృష్టాంతః = కుబేరదృష్టాంతః, కుబేరదృష్టాంతస్య బలం = కుబేరదృష్టాంతబలం, తేన = కుబేర దృష్టాంతబలేన.

*పుష్పక ప్రకృష్టతా* - పుష్పకాత్ ప్రకృష్టతా = పుష్పకప్రకృష్టతా.

*పక్షాంతరమున* - పుష్పకేన ప్రకృష్టతా = పుష్పకప్రకృష్టతా.

భావము :

మంచి సారథిని కల్గి యుండుట వలన, అగ్ని దేవునిచే నీయబడుట వలన, శ్రేష్ఠమైన నొగను కల్గి యుండుట వలన నీ మహారథమునకు కుబేరుని దృష్టాంతముగా నుంచుకొనుట వలన పుష్పక విమానము కంటెను నుత్కర్ష యూహింప బడుచున్నది.

నలకూబరుడను సంతానము ఉండుటచే కుబేరుడను మహారథునకు శ్రేష్ఠమైన జనకత్వము వెల్లడి యగుచున్నది. ఆ జనకత్వమే ప్రసూతవత్తా శబ్దమున కర్థము. నలకూబరాన్వయశబ్దముచే నలకూబరుని సంబంధమును దీసుకొనుటవలన కుబేరదృష్టాంతకత్వ మేర్పడుచున్నది. అందువలన ఆతని పుష్పకము కంటెను వేగవత్త్వాదిగుణాతిశయము ప్రకృత రథమున కేర్పడును. ఆ కుబేరునకును, ఆ పుష్పకవిమానముచే, ప్ర = చక్కగా, కృష్టతా = కొని పోబడుట, లేదా, ప్రకృష్టతా = దేవత లందఱిలో నాధిక్యము సంభవించును. దేవతలలో నెవ్వరికిని పుష్పకము వంటి విమానము లేదుగదా! అది యీ కుబే రునికి మాత్రమే యున్నది గాన దానిచే నీతనికి ప్రకృష్టత, ఆధిక్యము ఏర్పడును.

నలునిచే, కూబర=నొగకు, అన్వయ=సంబంధముండుట వలన నీ మహా రథమునకు నలునివంటి యుత్కృష్ట సారథిని గల్గియుండుట యను ప్రసూత వత్త ఏర్పడినది. కుబేరునకు నలకూబరుడను పుత్రునిచే, ప్రసూతవత్త్వము రాగా నలుని మహారథమునకు నలునితో నొగకు సంబంధ మేర్పడుట వలన, ప్రకృష్టసారథిమత్త్వరూప, ప్రసూతవత్త ఏర్పడినది. ఈ శ్లిష్టార్థములకు కుబేరదృష్టాంతమే కారణము కాన విమతమైన మహారథము (విమతుడైన మహా రథుడు) పుష్పకప్రకృష్టుడు. ఏల యనగా నల కూబరాన్వయ ప్రకాశిత ప్రసూతవత్త్వమును గల్గియున్నారు. అనగా నలకూబరాన్వయ=నలకూబరు డను సంతానముతో, నలునకు నొగతోడి సంబంధముతో శోభిత ప్రసూత వత్త్వమని యర్థము, ఏది ఏది లేదా ఎవడు ఎవడు నలకూబరాన్వయ ప్రకాశిత ప్రసూతవత్త్వమును గల్గియుందురో, అది అది లేదా అతడు కుబేరుడువలె పుష్పక ప్రకృష్టతను కల్గియుండునని యనుమానముతో కుబేరుని దృష్టాంతము గావించుకొని, శ్లోకార్థమును కష్టముతో గ్రహింపవలయును. ఇట్లే నలుని కొసంగ బడిన మహారథము పుష్పక విమానమును మించి శోభించుచున్నదని యాశయము.

శ్లో. మహేన్ద్రి ముచ్చైఃశ్రవసా ప్రతార్య య
న్నిజేన పత్యాఽకృత సిన్ధు రన్వితం
స త ద్దదేఽస్మై హయరత్న మర్పితం
పురాఽనుబద్ధుం వరుణేన బన్ధుతామ్. 25

ప. వి. మహేన్ద్రిమ్-ఉచ్చైఃశ్రవసా - ప్రతార్య-యత్-నిజేన - పత్యా- అకృత-సిన్ధుః-అన్వితం-సః-తత్-దదే-అస్మై-హయరత్నమ్ - అర్పితం-పురా-అనుబద్ధుం-వరుణేన-బన్ధుతామ్.

అర్థము: సిన్ధుః=సముద్రుండు, ఉచ్చైఃశ్రవసా=ఉచ్చైఃశ్రవస్సనెడి గుఱ్ఱముచే, మహేన్ద్రిం = ఇంద్రుని, ప్రతార్య = వంచించి, యత్ = ఏ, ఉచ్చైః శ్రవస్సుకంటెను శ్రేష్ఠమైన, హయరత్నం=శ్రేష్ఠమైన గుఱ్ఱమును, నిజేన =తనకుసంబంధించిన, పత్యా = పాలకుండైన వరుణునితో, అన్వితం= దానముతోఁ గూడిన ధానినిగా, అకృత = చేసెనో, అనగా వరుణున

కొసంగెనో, పురా = స్వయంవరమునకు మునుపే, బంధుతామ్ = చుట్టరికమును, అనుబద్ధుం = నడపుటకు, వరుణేన = వరుణునిచే, అర్పితం = సమర్పింపఁబడిన అనగా భీముని కొసఁగఁబడిన, తత్ = ఆ యశ్వరత్నమును, సః = ఆభీమరాజు, అస్మై = ఈ నలమహారాజుకొఱకు, దదే = ఇచ్చెను.

సమాసములు ;

హయరత్నం - హయనాం రత్నం- హయరత్నం,-తత్ = హయరత్నం.
బంధుతాం - బంధో ర్భావః = బంధుతా, తాం = బంధుతాం.

భావము ;

సముద్రమునుఁ జిలుకునప్పుడు ఉచ్చైఃశ్రవస్సనెడి గుఱ్ఱము పుట్టెను. దానిని ఆ సముద్రుఁడు దేవేంద్రుని వంచించి యతని కిచ్చెను. తర్వాత దాని కంటెను శ్రేష్ఠమైన మఱియొక గుఱ్ఱమును తనకు ప్రభువైన వరుణదేవుని కొసంగెను. ఆ వరుణుఁ డా గుఱ్ఱమును స్వయంవరమునకు మునుపే, భీమరాజుతో చుట్టరికమునుఁ గలుపుకొనుటకు, నాభీమున కొసంగెను. ప్రకృతము దమయన్తీ వివాహకాలమం దాభీమరా జాగుఱ్ఱమును నలున కొసఁగెను.

శ్లో. జవా దవారీకృతదూరదృక్పథ
స్తథాఽక్షియుగ్మాయ దదే ముదం న యః
దద ద్దిదృక్షాదరదాసతాం యథా
తథైవ తత్పాంసులకజ్జలతామ్. 26

ప. వి. జవాత్ - అవారీకృత దూరదృక్పథః - తథా - అక్షియుగ్మాయ - దదే- ముదం- న - యః - దదత్ - దిదృక్షాదరదాసతాం-యథా - తథా-ఏవ- తత్ - పాంసులకజ్జలతామ్.

అర్థము:- అక్షియుగ్మాయ = ప్రేక్షకుని నేత్రములకు రెంటికిని, దిదృక్షాఽఽదరదాసతాం, దిదృక్షా = చూడగోరిక యందలి, ఆదర = ఆసక్తికి,

దాసతాం = వశమగుటను, దదత్ = కల్గించుచున్న, యః = ఏ గుఱ్ఱము, జవాత్ = వేగమువలన, తథా = ఆ ప్రకారము, అవారీకృత దూరదృక్పథః; అవారీకృత = దగ్గరగా చేయబడిన (జలరహితముగాఁ జేయఁబడిన) దూరదృక్పథః, దూర = దూరముగా ప్రసరించు, దృక్పథః = నయన మార్గము కల్గిన దగుచు అనగా గుఱ్ఱమును చూచువారి దృష్టిమార్గమునకు పెక్కు యోజనముల దూరము లాగికొనిపోయినదగుచు లేదా, అవారీ కృతదూరదృక్పథః, అవారీకృత = అడ్డములేనిదిగ జేయఁబడిన, దూర దృకృథః = దూరముగా ప్రసరించు నయనమార్గము గల్గినదై అనగా చూడవలసిన వస్తువుచే, చూడగోరినవారి దృష్టి కవరోధ మేర్పడును, కాని ప్రకృతము గుఱ్ఱము వేగముగా వెళ్ళుట వలననే దూరదృష్టి ప్రసర మార్గమున కడ్డు కలుగలేదని యర్థము, యథా = ఎట్లు, ముదం = సంతోషమును, న దదే = ఈయలేదో - వేగముగా గుఱ్ఱము పరుగిడు చుండుటవలన, ప్రేక్షకులకు చూచుట కవకాశము లేనందువలన నేత్రము లకు తృప్తి కలుగలేదు, అందువలన వారియందు చూడవలయుననుఁ గోరికనే పెంచినదని యర్థము. తథా = ఆ ప్రకారముగనే, తత్పాంసుల కణ్ఠనాలతాం, తత్ = ఆ గుఱ్ఱముచే, పాంశుల = గుఱ్ఱపుగిట్టనుండి యెగుర గొట్టఁబడిన దుమ్ముతోఁగూడుటచే నిండిన, కణ్ఠనాలతాం = కణ్ఠనాలము కల్గి యుండుటను, దదత్ = కల్గించుచు, ననగా లక్షణతో నుత్కణ్ఠనుఁ గల్గించుచు, ముదం = సంతోషమును, న దదే = ఒసంగలేదు. కణ్ఠశోష నొసంగునది యెట్లు సంతోషము నొసంగును?, ఇచ్చట నయన యుగ్మము పాంసుల కణ్ఠనాలము నెట్లు కల్గియుండుననగా దూరమందుండి ఎగర గొట్టబడిన ధూళిచే, దుమ్ముపడిన యంచులు గల్గియుండుట వలన నుత్కణ్ఠతో వర్తించుటవలన నని యర్థము. ఎల్లప్పుడు నీ గుఱ్ఱము దర్శింపఁదగినదని యర్థము.

వి. ఇచ్చట అవారీకృతదూరదృక్పథ - తత్పాంశుల కణ్ఠనాలత్వ శబ్దములలోని శబ్దశక్తిచే, దాహమును పొంది వానియొక్క దృష్టిపథమునందు క్రమముగా జలరాహిత్యము, శుష్కకణ్ఠనాలత్వములు చేయబడుటవలన హర్షాను త్పత్తియును, వస్తువ్యంజనతో బోషింపబడుచున్నవి గాన - వస్తువుచే

వస్తుధ్వని. అవారీకరణాది సంబంధము లేకపోయినను నాసంబంధమును జెప్పుటవలన సంబంధాతిశయోక్తి.

పక్షాన్తరమున నర్థము :

యః = ఏ గుఱ్ఱము; అక్షియుగ్మాయ = ప్రేక్షకులైన ప్రజలనయన ద్వయమునకు, దిదృక్షారసాదరదాసతాం, దిదృక్షా = తన రూపమును దర్శించుటలోని కోరికయందలి ఆదర = ఆసక్తికి, దాసతాం = లోబడి యుండుటను, దదత్ = కల్పించుచున్నదై, జవాత్ = వేగమువలన, అవారీకృత దూర దృక్పథః, అవారీకృత = సమీపముగా గావింపబడిన, దూర = దూరముకల్గిన, దృక్పథః = నేత్రమార్గము కల్గిన అనగా దూరముగా బోవుటవలన నేత్రములకు విషయముగానిదై, యథా = ఎట్లు కనుల జంటకు, ముదం = ప్రీతిని, న దదే = ఈయలేదో (దర్శనము కల్గినందువలన భీతి కలుగలేదని యర్థము), తథా = అట్లే, మఱల తిరిగినవయ్యు నయనమందును ప్రీతిని కల్గించ లేదని యర్థము. ఏలయనగా, గుఱ్ఱము తిరిగివచ్చు సమయమున నేత్రయుగ్మమును చూడవలయునను నాసక్తి పొందుట కణ్ఠనాళత్వమును ననగా ఉత్కంఠితత్వమును కల్గించు సంతోషము నొసంగలేదు. తమ్ = ఆ, అశ్వం = గుఱ్ఱమును, దదే = నలుని కొసంగెను. ఆ గుఱ్ఱపు సౌందర్యమునుఁ జూడగోరినవారు ఎంతలో గుఱ్ఱమునుఁ జూడగల్గిరో, యింతలోనే వేగముగా దూరము వెళ్ళుటవలన నది కనఁబడలేదా, ఒకవేళ వెళ్లినపు డా గుఱ్ఱము కనబడలేదు. కాని తిరిగివచ్చునపుడైనను దానిని జూడవచ్చునను కుతూహలముతో నితర కార్యములను వదలి దానినిఁ జూడ ప్రజలెప్పుడు వేచియుండిరో అప్పు డా గుఱ్ఱము తిరిగి వచ్చు చున్నప్పుడును దాని గిట్టలనుండి ధూళి వారి కంటబడుటవలన జూడ శక్యము కాకపోయినది. ఇట్లు గుఱ్ఱము కనబడక పోవుటవలన జనుల కుత్కంఠ తగ్గలేదు. అందువలన వారి నేత్రములకు సంతోషము కలుగ లేదు. కాన, జవాత్ = వేగమువలన, అవారీకృతదూరదృక్పథః, అవారీకృత = ప్రతిషేధింపబడని, దూర = దూరమైన, దృక్పథః = నేత్రమార్గముకల్గిన అనగా నేత్రములచే చాల దూరము వెంబడింపఁబడిన

దని యర్థము. ఇట్టి గుజ్జము ప్రజల నేత్రయుగ్మమునకు దర్శనమును, తజ్జన్యమగు సంతోషమును నావిధముగా నీయలేదు. ఏ విధముగా ననగా- తన్ను (గుజ్జమును) జూడఁ గోరికను కల్గించుచున్నదై, ఆ నేత్రయుగ్మ మునకును, ఆ ప్రేక్షకునికి, శుష్కకణ్ఠత్వము నొసంగినది. నిరంతర దర్శనము లేనందువలన పూర్తిగా ప్రీతి కలుగలేదు. కాని పూజ్యులు చెప్పిన విధముగా నేత్రములకును, చూచువానికిని దుమ్మువలన శుష్క- కణ్ఠత్వ మేర్పరచినది. చూడవలసిన వస్తువును చూచుటవలన దృష్టికి నిరోధము వచ్చును. ఇచ్చట అధిక వేగముతో వెళ్ళుటవలన గుజ్జమునుఁ జూడలేక పోవునట్టి దృష్టినిరోధ మేర్పడలేదు. జలరహితమైన దృష్టి గోచరమార్గము పిపాసువైన అనగా దాహము నొందినట్టి ద్రష్టయొక్క నేత్రయుగ్మమునకు సంతోష మొసంగదు. కాని జలమును చూచినచో పారవశ్యమును కల్గించు నను నీ విధముగా నీ శ్లోకమున కర్థమునుఁ జెప్పుకొనవలయును.

సమాసములు ;

అవారీకృత దూరదృక్పథః-అనవారః అవారః సమ్పద్యమానః కృతః= అవారీకృతః, దృశోః పన్థాః దృక్పథః, దూర శ్చాసౌ దృక్పథశ్చ= దూరదృక్పథః, అవారీకృతః దూరదృక్పథః యేన సః=అవారీకృత దూరదృక్పథః, యద్వా-అవారః వారః సమ్పద్యమానః కృతః= వారీకృతః, న వారీకృతః=అవారీకృతః, అవారీకృతః దూరదృక్పథః యేన సః=అవారీకృతదూరదృక్పథః, యద్వా నాస్తి వారి యస్మిన్, సః=అవారిః, అనవారిః అవారిః సమ్పద్యమానః కృతః అవారీకృతః అవారీకృతః దూరదృక్పథః యేన సః=అవారీకృతదూరదృక్పథః

అక్షియుగ్మాయ : అక్ష్ణోః యుగ్మం = అక్షియుగ్మం, తస్మై = అక్షి యుగ్మాయ.

దిదృక్షాదరదాసతాం : ద్రష్టుమిచ్ఛా=దిదృక్షా, దిదృక్షాయా మాదరః =దిదృక్షాదరః, దిదృక్షాదరే దాసః=దిదృక్షాదరదాసః, దిదృక్షాదర దాసస్య భావః=దిదృక్షాదరదాసతా, తాం=దిదృక్షాదరదాసతాం.

తత్పాంసులకణ్ఠనాలతాం: తేన పాంసులః=తత్పాంసులః, తత్పాంసులః కణ్ఠనాలఃయస్య సః=తత్పాంసులకణ్ఠనాలః, తత్పాంసు లకణ్ఠనాలస్యభావః-తత్పాంసుఃకణ్ఠనాలతా, తాం = తత్పాంసులకణ్ఠనాలతాం. లేదా, తస్య పాంసులః=తత్పాంసులః, తత్పాంసుల శ్చాసౌ కణ్ఠనాలశ్చ=తత్పాం సులకణ్ఠనాలః, తత్పాంసులకణ్ఠనాలస్య భావః=తత్పాంసులకణ్ఠనాలతా, తాం=తత్పాంసులకణ్ఠనాలతాం.

భావము ;

ఆ గుఱ్ఱము ప్రజలను చూడఁ గోరికను గల్గించుచు, వేగముగా పరుగిడుట వలన దూరప్రదేశములను సమీపప్రదేశములుగాఁ గావించుచు, దూరముగా పరుగిడిపోవుటవలన ప్రజలదృష్టికి కానరానందుచే వారినేత్రములజంటల కానందమును సమకూర్చలేదు. గుఱ్ఱము నిలచి వారికన్నులకుఁ గనఁబడియున్నచో సంతోషము కల్గియుండెడిది. అట్లు గుఱ్ఱము వేగముగా పోవుసమయమునందు దానినిఁ జూడ లేకపోయినను, తిరిగివచ్చు సమయమునం దైనను దానిని, జూచుటకై నిరీక్షించు చుండిన ప్రజల కాశాభంగ మేర్పడినది. ఏలయనగా ఆ గుఱ్ఱపు గిట్టలనుండి పైకి లేచిన దుమ్ముచే నాగుఱ్ఱము వారిదృష్టులను కంఠనాళములనుఁ గప్పి శుష్కము గావించి, యనగా నుత్కంఠతో నింపి సంతోషమునుఁ గల్గించలేదు. చూడవలసిన విషయముచే దృష్టికి ప్రతిరోధ మేర్పడును. ఇచ్చట చూడవలసిన విషయమైన గుఱ్ఱము వేగముగా వెళ్లిపోవుట వలన దానిచే ప్రతిరోధములు కగలేదు. అందువలన నా గుఱ్ఱము, అవారీకృతదూరదృక్పథమైనది మఱియు నాగుఱ్ఱము నిర్జలీకృతదూర దృక్పథముగూడ నైనది. పాంసులకణ్ఠనాలత్వమునుఁ గల్గించినది. పిపాసువునకు జలరహితమైన మార్గము దృష్టివిషయమైనచో నది వారిదృష్టికి సంతోషమునుఁ గల్పింపదు. ఏలయనగా పిపాసువునకు జలమును వెదకుటయందే పారవశ్య మేర్పడియుండును. మఱియు నందువలన నాతనికి శుష్కకణ్ఠత్వముగూడ సంభ వించును. ఇట్లు గమనకాలమందుగాని యాగమనకాలమందుగాని యాయశ్వము తన వేగాతిశయముచే ప్రజలదృష్టికి విషయము గాకపోవుటవలన నాయశ్వము యొక్క వేగాధిక్యము, ప్రజలకు దానినిఁ జూచుటయందలి యాసక్తినిబట్టి దాని రామణీయకములు సూచితము లైనవి. అట్టి యశ్వమును భీమరాజు నలున కొసంగెనని యాశయము.

శ్లో. దివస్పతే రాదరదర్శినాఽఽదరా
దథౌకి య స్తం ప్రతి విశ్వకర్మణా
తమేకమాణిక్యమయం మహోన్నతం
పతద్గ్రిహం గ్రాహితవాన్ నలేన సః. 27

ప.వి. దివస్పతేః-ఆదరదర్శినా-ఆదరాత్-అఢౌకి-యః-తం-ప్రతి-విశ్వకర్మణా-తమ్ - ఏకమాణిక్యమయం-మహోన్నతం-పతద్గ్రిహం - గ్రాహితవాన్-గతేన-సః.

అర్థము : దివస్పతేః = దమయంతి యం దనురాగము గల్గిన ఇంద్రునకు, ఆదరదర్శినా = భీమరాజునుఁ గూర్చి యాదరమునుఁ జూపుచున్న, విశ్వకర్మణా = దేవలోకపు శిల్పియగు విశ్వకర్మచే, తం ప్రతి = ఆ భీమరాజునుఁ గూర్చి, ఆదరాత్ = ఆదరమునుఁ చూపుట వలన అనగా - తనకు ప్రభువగు నింద్రునకు దమయంతియం దనురాగ ముండుటవలన భీమునియందు నాదరము కానవచ్చుచున్నది. అందువలన తనకును, నామె తండ్రియగు భీమరాజునందు నాదరముచూపుట యుచితమని విశ్వకర్మ భీమునిపై నాదరముఁ చూపెను. యః = ఏ, తాంబూలాదుల యుమ్మిని గ్రహించెడి గిన్నె, అఢౌకి = పంపబడినదో, తం = ఆ విశ్వకర్మచే నొసంగబడినదియు, ఏకమాణిక్యమయం = ఒక్క పద్మరాగమణిచే నిర్మింపబడినదియునునగు, మహోన్నతం = మిక్కిలి శ్రేష్ఠమైనదియునగు, పతద్గ్రిహం = తాంబూలాదుల యుమ్మిని గ్రహించెడి యాగిన్నెను సః = ఆ భీమరాజు, నలేన = నలునిచే, గ్రాహితవాన్ = గ్రహింపచేసెను.

సమాసములు ;

దివస్పతేః – దివః పతిః = దివస్పతిః, తస్య = దివస్పతేః.

ఆదరదర్శినా – ఆదరం దర్శయతీతి = ఆదరదర్శి, తేన = ఆదరదర్శినా.

ఏకమాణిక్యమయం – ఏకశ్చాసౌ మాణిక్యశ్చ = ఏకమాణిక్యః, ఏకమాణిక్యస్య వికారః = ఏకమాణిక్యమయః, తం = ఏకమాణిక్యమయం.

మహోన్నతం — మహాం శ్చాసౌ ఉన్నతశ్చ = మహోన్నతః, తం = మహోన్నతం.

భావము ;

దమయంతిపై ననురాగముగల యింద్రునికి, భీమరాజుపైని యాదరమును గమనించి విశ్వకర్మ, ఆ భీముని గూర్చి యాదరము చూపి తాంబూలాదుల యుమ్మిని గ్రహించెడి పద్మరాగమణిమయమైన తట్టను బహుమతిగా నతనికిఁ బంపెను. అతి శ్రేష్ఠమగు నా పతద్గ్రహ మనఁబడు తట్ట నా భీమరాజు నలునికిఁ బెండ్లి కానుకగా నొసంగెను ॥27॥

శ్లో. నలేన తామ్బూలవిలాసి నోజ్ఝితై
ర్ముఖస్య యః పూగకణై ర్భృతో న వా
ఇతి వ్యవేచి స్వమయూఖమణ్డలా
దుదఞ్చదుచ్చారుణతారుచా చిరాత్. 28

ప. వి. నలేన-తాంబూలవిలాసినా-ఉజ్ఝితైః-ముఖస్య-యః-పూగకణైః- భృతః-న-వా-ఇతి-వ్యవేచి-స్వమయూఖమణ్డలాత్-ఉదఞ్చదుచ్చారుణతారుచా - చిరాత్.

అర్థము. యః = ఏ, పతద్గ్రహము అనగా వీటికాది గండూషపాత్ర, స్వమయూఖ మణ్డలాత్, స్వ = తనవైన, మయూఖ = కిరణములయొక్క, మణ్డలాత్ = సమూహమువలన, ఉదఞ్చదుచ్చారుణతారుచా; ఉదఞ్చత్ = ఉదయించుచున్న, ఉచ్చ = ఉన్నతమైన, అరుణతా = రక్తవర్ణము యొక్క, రుచా = కాంతిచే, తాంబూలవిలాసినా = తాంబూల ప్రియుఁడైన, నలేన = నలునిచే, ఉజ్ఝితైః = ఉమ్మివేయబడిన, ముఖస్య = నోటికి సంబంధించిన, పూగకణైః = పోకముక్కలచే, భృతః = నింపినదా, నవా = లేదా యని, సందిహ్య = సందేహించి, చిరాయ = చాలకాలము నకు, వ్యవేచి = నిశ్చయింపబడినది.

విశే. కిరణముల రక్తకాంతితో నిండిన తాంబూలపు టుమ్మితట్ట, అతఁడు ఉమ్మివేసిన తాంబూలపు ముక్కలతో నిండినదా లేదా యని సంశయించి, చాలకాలమునకు నిండినదని నిశ్చయమునకు వచ్చుటవలన, నిశ్చయముతో ముగియు సందేహాలంకారము.

సమాసములు ;

తాంబూలవిలాసినా – తాంబూలమేవ విలాసః = తాంబూలవిలాసః, తాంబూలవిలాసః అస్యాఽ స్తీతి = తాంబూలవిలాసీ, తేన = తామ్బూల విలాసినా.

పూగఖణ్డైః – పూగస్య ఖణ్డాః-పూగఖణ్డాః, తైః = పూగఖణ్డైః.

స్వమయూఖమండలాత్ – స్వస్య మయూఖాః = స్వమయూఖాః, స్వమయూఖానాం మణ్డలం = స్వమయూఖమణ్డలం, తస్మాత్ = స్వమయూఖమణ్డలాత్.

ఉదఞ్చదుచ్చారుణతారుచా – అరుణస్య భావః = అరుణతా; ఉచ్చా చ సా అరుణతా చ = ఉచ్చారుణతా, ఉదఞ్చన్తీ చ సా ఉచ్చారుణతా చ-ఉదఞ్చదుచ్చారుణతా, ఉదఞ్చదుచ్చారుణతాయాః రుక్ = ఉదఞ్చదుచ్చారుణతారుక్, తయా = ఉదఞ్చదుచ్చారుణతారుచా.

భావము ;

ఆ భీమసేనుడు నలున కొసంగిన పతద్గ్రహ మనబడు గండూషపాత్ర పద్మరాగయుత మైనందువలన దానినుండి యెఱ్ఱని కిరణములు ప్రసరించుచుండినవి. తాంబూలప్రియుడైన నలమహారాజు ఉమ్మివేసిన పోకముక్కలు మున్నగునవియు నెఱ్ఱగా నున్నవి. ఎఱ్ఱని పద్మరాగపు కాంతులతో నివి మిళితములైనందువలన, వీని భేదము తెలియశక్యము గానందువలన, నా పతద్గ్రహ మను నుమ్మిపాత్ర యానలుడు ఉమిసిన పోకముక్కలతో నిండినదా లేదా యని చాలకాలము సందేహించి, పిదప నిండినట్లే నిశ్చయింప సాధ్యమైనది. ॥28॥

శ్లో. మయేన భీమం భగవన్త మర్చతా
నృపేఽపి పూజా ప్రభునామ్ని యా కృతా
అదత్త భీమోఽపి స నైషధాయ తాం
హరిన్మణే ర్భోజనభాజనం మహత్. 29

ప. వి. మయేన-భీమం-భగవన్తమ్- అర్చతా-నృపే-అపి-పూజా-ప్రభునామ్ని-యా- కృతా- అదత్త- భీమః- అపి- సః-నైషధాయ- తాం-హరిన్మణేః-భోజనభాజనం-మహత్.

అర్థము: భగవన్తం = భగవంతుఁడగు, భీమం = భీమనామముతో నొప్పునట్టి శివుని, అర్చతా = పూజించుచున్న, మయేన = మయుఁడను దేవశిల్పిచే, ప్రభునామ్ని = ప్రభువైన శివునియొక్క నామమును దాల్చిన, నృపేఽపి = భీమనృపాలునందును, యా = ఏ, పూజా = పూజ, కృతా = చేయబడినదో అనగా నాస్వామికి కానుకగా యే మరకతమణిమయమగు పాత్ర యొసంగబడినదో, సః = ఆ భీమరాజు, హరిన్మణేః = మరకతమణి యొక్క అనగా గారుడమణియొక్క (గారుడమణినిర్మితము కాన నన్న మందలి విషమును హరించును) మహత్ = గొప్పదైన, భోజనభాజనం = అన్నపాత్రను, అనగా మయకృత పూజా రూపముననున్న దానిని, నైషధాయ = నలునకు, అదత్త = ఇచ్చెను.

సమాసములు :

ప్రభునామ్ని- ప్రభోః నామ యస్మిన్ సః-ప్రభునామా; తస్మిన్ = ప్రభునామ్ని.

నైషధాయ: నిషధానాం రాజా = నైషధః, తస్మై = నైషధాయ.

హరిన్మణేః: హరి చ్చాసౌ మణిశ్చ = హరిన్మణిః, తస్య = హరిన్మణేః

భోజనభాజనం: భోజనస్య భాజనం, తత్ = భోజనభాజనం.

భావము ;

భగవంతుడగు శివుని పూజించు దేవశిల్పియగు మయుఁడు భీముఁడను భగవంతుని నామమును దాల్చిన భీమనృపాలు విషయమున కానుకగా మరకత మణి మయమగు భోజనపాత్ర నొసంగెను. అది గారుడమణినిర్మాతము కాన అన్నమందలి విషములను వారింప గల్గినది. అట్టి గారుడమణిమయమగు భోజన పాత్రమును భీమరాజు నలున కొసంగెను. ॥29॥

శ్లో. ఛదే సదైవ చ్ఛవి మస్య బిభ్రతాం
న కేకినాం సర్పవిషం ప్రసర్పతి
న నీలకణ్ఠత్వ మధాస్య దత్ర చేత్
స కాలకూటం భగవా నభోక్ష్యత. 30

ప. వి. ఛదే - సదా - ఏవ - ఛవిమ్ - అస్య - బిభ్రతాం - న - కేకినాం - సర్పవిషం - ప్రసర్పతి - న - నీలకణ్ఠత్వమ్ - అధాస్యత్ - అత్ర - చేత్ - సః - కాలకూటం - భగవాన్ - అభోక్ష్యత.

అర్థము: అస్య = ఈ గారుడమణిమయమైన పాత్రయొక్క, ఛవిం = కాంతిని, సదైవ = ఎల్లప్పుడు, ఛదే = ఱెక్కయందు, బిభ్రతాం = దాల్చినట్టి, కేకినాం = నెమళ్లయొక్క విషయమందు, సర్పవిషం = పాముల విషము, న ప్రసర్పతి = వ్యాపింపదు, సః = ఆ, భగవాన్ = భగవంతుఁడగు నీశ్వరుఁడును, అత్ర = గరుడపచ్చలపాత్రయందు, కాలకూటం = హాలాహలమును, అభోక్ష్యత యది = భుజించియున్నచో, తదా = అప్పుడు, నీలకణ్ఠత్వం = నల్లని కంఠము గలవాడుగా నుండుటను, న అధాస్యత్ = ధరించి యుండువాడు కానేరడు, కాని యాపాత్రయందు భుజింపనందువలననే కాలకూటవిషము, ఆతని కణ్ఠమును వ్యాపించి నందువలన, నీలకంఠత్వ మేర్పడినది. ఆ పాత్రయొక్క రంగును ధరించుటచేతనే సర్పవిషము నెమలిశరీరమున వ్యాపించుట లేదు. ఇఁక నా పాత్రయందు భుజించినచో విషవ్యాప్తికి ప్రసక్తి యెక్కడిది ?

సమాసములు ;

సర్పస్య విషం=సర్పవిషం.
నీలకణ్ఠత్వం - నీలః కణ్ఠః యస్య సః=నీలకణ్ఠః, నీలకణ్ఠస్య భావః=
నీలకణ్ఠత్వం, తత్=నీలకణ్ఠత్వం.

భావము :

ఈ గారుడమణిమయమగు భోజన పాత్రయొక్క కాంతిని ఱెక్కల యందు ధరించుటచేతనే నెమలియొడలియందు సర్పవిషము ప్రాకుటలేదు. భగవంతుడగు నా యీశ్వరుఁడు, ఈ పాత్రయందు హాలాహలమును భుజించి యున్నచో, నాతని కంఠమందలి విషము తొలగిపోయినదై యతనికి నీల కణ్ఠత్వము అనగా విషమును కంఠమున వహించుటచే నేర్పడిన నల్లని కణ్ఠమును గల్గియుండుట ఏర్పడియే యుండదు. ॥30॥

శ్లో. విరోధ్య దుర్వాసస మస్ఖల ద్దివః
స్రజం త్యజ న్నస్య కి మిన్ద్రసింధురః
అదత్త తస్మై స మదచ్ఛలాత్ సదా
య మభ్రమాతఙ్గతయేవ వర్షుకమ్. 31

ప. వి. విరోధ్య - దుర్వాససమ్ - అస్ఖలత్ - దివః- స్రజం - త్యజన్ - అస్య- కిమ్ - ఇన్ద్రసింధురః - అదత్త - తస్మై - సః- మదచ్ఛలాత్-సదా- యమ్ - అభ్రమాతఙ్గతయా - ఇవ - వర్షుకమ్.

అర్థము: అభ్రమాతఙ్గతయా ఇవ=ఐరావతముగా నుండుట చేతనో యనునట్లు లేదా, అభ్రమాతఙ్గతయా ఇవ, అభ్ర=మేఘమువలె (నల్లని), మాత ఙ్గతయా ఇవ=ఏనుగుగా నుండుటచేతనో యనునట్లు, మదచ్ఛలాత్; మద=మదజలమును స్రవించుటయను, ఛలాత్=నెపమువలన, సదా= ఎల్లప్పుడు, వర్షుకం=వర్షించునట్టి, యం=ఏ, సింధురం=ఏనుగును, తస్మై = ఆ నలునికై, అదత్త=ఇచ్చెనో; సః=ఆ, నలుని కొసంగం

బడిన యేనుగు, దుర్వాససం=దుర్వాసుడను మహర్షిని, విరోధ్య=(పుష్పమాలను పారవేయుటవలననే) కోపింపఁజేసి, అస్య=ఈ దుర్వాసునికి సంబంధించిన (అనగా దుర్వాస మహర్షిచే ఇంద్రుని కొసంగబడినదై, యింద్రునిచే నైరావత కుంభమం దుంచబడిన) స్రజం=మాలను; త్యజన్=తొండముచే భూమియందు పారవైచిన, ఇన్ద్రసింధురః=ఇంద్రుని గజమైన ఐరావతముగా, దివః=స్వర్గమునుండి, అస్ఖలత్ కిం=(ఆ దుర్వాసుని శాపమువలన) భూమిపైఁ బడినదా యేమి ?

వి. నలుని కొసంగబడిన ఏనుగు దుర్వాసుని శాపమువలన భూమిపై బడిన యైరావతముగా భావింపఁబడుట వలన నుత్ప్రేక్షాలంకారము.

"మదచ్ఛలాత్" అని యెల్లప్పుడు మదజలమును వర్షించుటకును నెపముగా చెప్పుటవలన నపహ్నవాలంకారము. ఈ యపహ్నవముతో నా యుత్ప్రేక్ష కూడినది గాన సాపహ్నవోత్ప్రేక్ష.

సమాసములు :

ఇంద్రసింధురః - ఇంద్రస్య సింధురః=ఇంద్ర సింధురః

మదచ్ఛలాత్ – మదస్య ఛలం=మదచ్ఛలం, తస్మాత్=మదచ్ఛలాత్.

అభ్రమాతఙ్గతయా : అభ్ర మివ మాతఙ్గః=అభ్రమాతఙ్గః, అభ్రమాతఙ్గస్య భావః=అభ్రమాతఙ్గతా, తయా=అభ్రమాతఙ్గతయా.

భావము ;

ఆ భీమరాజు నలునకై యొక యేనుగు నొసంగెను. అది యైరావతమగుటచేతనో లేక మేఘమువలె నుండుటచేతనో, మదజలమను నెపముతో నిరన్తరము వర్షించుచున్నదై దుర్వాసుని శాపముచే భూమిపైఁ బడిన యైరావతముగా భావింపబడుచుండినది. పూర్వము ఇంద్రుడు ఐరావతము నెక్కి పోవుచుండగా నాయింద్రు నభినందించుచు దుర్వాసమహర్షి మందారపుష్పములచే మాలనుకట్టి యింద్రుని కొసంగెను. ఇంద్రు డా మాల నైరావతము శిరస్సుపై

నుంచెను. ఆ యైరావత మా మాలను తన తొండముతో లాగి నేల పడవైచినది. అందుల కా దుర్వాసమహర్షి కోపించి, యామాల నెట్లు నేలమీద పడవైచితివో యట్లే నీవును నేలపైఁ బడుమని శాప మిచ్చెనని పౌరాణిక గాథ. ప్రకృత మా నలున కొసంగఁబడిన మదగజ మా యైరావతమా! యని భావింపఁబడినది. ॥31॥

శ్లో. మదాత్ మదగ్రే భవతాఽథ వా భియా
పరం దిగన్తాదపి యాత జీవత
ఇతి స్మ యో దిక్కరిణః స్వకర్ణయో
ర్వినాఽఽహ వర్ణస్రజ మాగతై ర్గతైః. 32

ప. వి. మదాత్-మదగ్రే-భవతా-అథ- వా-భియా-పరం-దిగన్తాత్-అపి-యాత-జీవత-ఇతి-స్మ - యః - దిక్కరిణః - స్వకర్ణయోః - వినా - ఆహ-వర్ణస్రజమ్-ఆగతైః-గతైః.

అర్థము: హే దిక్కరిణః=ఓ దిగ్గజములారా ! మదాత్=బలముచేతి గర్వము వలన, మదగ్రే = నాయెదుట, భవత = యుద్ధమునకు నిలువుఁడు. అథవా = లేదా, భియా = బలములేనందువలన గల్గిన భయముచే, దిగన్తాదపి=దిక్కులయంచులనుండియు, పరం=దూరముగా, యాత= వెళ్ళుడు, జీవత = పరుగిడిపోయి యెట్లో యొక యట్లు ప్రాణములను నిలుపుకొనుఁడు. యః=ఏగజము, ఇతి=ఇట్లు, వర్ణస్రజం=అక్షరముల వరుసను, వినైవ = లేకయే, స్వకర్ణయోః = తన చెవులయొక్క, ఆగతైః = ఆగమనరూపములును, గతైః=గమనరూపములునగు నిటునటు కదలికలచే, ఆహ స్మ=చెప్పుచుండినదో !

వి. ఇచ్చట గజముయొక్క చెవుల కదలికలను మాటలుగా భావించుటవలన నుత్ప్రేక్ష, వ్యంజకమును బ్రయోగింపనందువలన నది గమ్యము.

సమాసములు :

మదగ్రే- మమ అగ్రం=మదగ్రం, తస్మిన్=మదగ్రే
దిగన్తాత్ - దిశా మన్తః=దిగన్తః, తస్మాత్=దిగన్తాత్.

దిక్కరిణః - దిశాం కరిణః = దిక్కరిణః, తస్య సంబుద్ధిః = (హే) దిక్కరిణః.

స్వకర్ణయోః - స్వస్య కర్ణౌ=స్వకర్ణౌ, తయోః=స్వకర్ణయోః

వర్ణస్రజం : వర్ణానాం స్రక్=వర్ణస్రక్, తాం=వర్ణస్రజం.

భావము :

ఆ యేనుగు తన రెండుచెవుల నిటునటు కదలించుచున్నది. అందు వలన నది దిగ్గజములను సంబోధించి - ఓ దిగ్గజములారా! బలముచే గర్వమును వహించి మీరు నాయెదుట యుద్ధమునకైనను నిలువుడు. లేదా బలము లేదను భయముచే, నాదిక్కుల యంచులనుండియు దూరముగా పారివెళ్లుడు. ఎటులైనను ప్రాణములను, గాపాడుకొనుఁడు అని, అక్షర పంక్తియనగా మాటలు లేకయే తన చెవుల కదలికతోడనే దిగ్గజములను బెదరించుచున్నట్లు భావింపఁబడినది ॥32॥

శ్లో. అధత్త బీజం నిజకీర్తయే దదౌ
ద్విషా మకీర్త్యై ఖలు దానవిప్రుషః
శ్రవశ్రమైః కుమ్భకుచాం శిరఃశ్రియం
ముదే మదస్వేదవతీ ముపాస్త యః. 33

ప.వి. అధత్త-బీజం-నిజకీర్తయే-దదౌ-ద్విషామ్-అకీర్త్యై-ఖలు-దానవిప్రుషః - శ్రవశ్రమైః - కుమ్భకుచాం - శిరః శ్రియం - ముదే - మదస్వేదవతీమ్ - ఉపాస్త-యః.

అర్థము:యః=ఏగజము; నిజకీర్తయే = తన కీర్తికై యనగా తన కీర్తుల యంకురములకై,రదౌ=దన్తములనెడి, బీజం=విత్తనమును, తథా= అట్లే, ద్విషాం=శత్రువులకు, అకీర్త్యై=అపకీర్తికి ననగా అపకీర్తుల మొలకలకై, దానవిప్రుషః=మదబిందువు లనెడి, బీజం=విత్తనమును, అధత్త ఖలు=ధరించెనాయేమి?, దంతములచే శత్రువులను చీల్చివేయుట

వలన తనకు కీర్తి గల్గుచున్నది. అట్లే మదగంధముచేతనే శత్రుగజములు పారిపోవుటవలన వానికి నపకీర్తి కల్గుచున్నది, మఱియు, కుమ్భకుచాం, కుమ్భ = కుంభములనెడి, కుచాం = స్తనములుగలదియు, పక్షాన్తరమున కుంభములవంటి కుచములు గలదియునగు, మదస్వేదవతీం = మదజల రూపమైన చెమటగలదియునగు, పక్షాంతరమున మదజలమువంటి స్వేదము గలదియునగు, శిరఃశ్రియం = శిరముయొక్క శోభను, శ్రవశ్రమైః-శ్రవ = చెవులయొక్క, శ్రమైః = వ్యాపారములచే ననగా నిటునటుచేయు కదలి కలచే ననగా చెవు లనెడి విసనకఱ్ఱగాడ్పులచే, ముదే = స్వేదమును ననగా చెమటను తొలగించుటవలని, సంతోషమునకు, ఉపాస్త కిం = సేవించెనా యేమి?

వి:- ఇచ్చట దంతములు తెల్లగానుండుటవలన, తెల్లని కీర్తికి బీజముగను, మదబిందువులు నల్లగా నుండుటవలన నల్లని యపకీర్తికి బీజముగను, భావింపఁబడుటవలన నిట నుత్ప్రేక్ష.

శిరోలక్ష్మి యను స్త్రీకి శరీరమునందు గల్గిన స్వేదజలమును తన కర్ణతాల ములవలని గాడ్పులనెడి, విసనకఱ్ఱగాడ్పులతో దొలగించి హర్షము చేకూర్చ కపోయినను, చేకూర్చినట్లు భావింపబడుటవలనగూడ నుత్ప్రేక్ష. ఇట్లు ఈ మూడు ఉత్ప్రేక్షల కిట తిలతండులన్యాయము ననుసరించి సంసృష్టి.

సమాసములు ;

*నిజకీర్తయే* - నిజా చ సా కీర్తిశ్చ = నిజకీర్తిః, తస్యై = నిజకీర్తయే.

*అకీర్త్యై* - న కీర్తిః = అకీర్తిః, తస్యై = అకీర్త్యై.

*దానవిప్రుషః* - దానస్య విప్రుషః.

*శ్రవశ్రమైః* - శ్రవయోః శ్రమాః = శ్రవశ్రమాః, తైః = శ్రవశ్రమైః

**కుమ్భకుచాం**- కుమ్భావేవ కుచౌ యస్యాస్సా కుమ్భకుచా, పక్షాంతరమున, కుమ్భావివ కుచౌ యస్యాస్సా = కుమ్భకుచా, తాం = కుమ్భకుచామ్.

**శిరశ్శ్రియం** : శిరసః శ్రీః = శిరశ్శ్రీః, తాం = శిరశ్శ్రియం.

మదస్వేదవతీమ్: మద ఏవ స్వేదః = మదస్వేదః, మదస్వేదః అస్యాః అస్తీతి = మదస్వేదవతీ, తాం = మదస్వేదవతీం, పక్షాంతరమున- మదవత్ స్వేదః = మదస్వేదః, మదస్వేదః అస్యాః అస్తీతి = మద స్వేదవతీ, తాం = మదస్వేదవతీం.

భావము :

ఆ గజమున కున్న రెండు దంతములు తెల్లనై యుండుటవలన నవి తన కీర్త్యంకురములకు బీజములుగా నున్నవి. మరియు నాగజము నుండి స్రవించు చున్న మదోదకములు నల్లగ నుండును గాన నవి శత్రువుల యపకీర్తికి బీజము లుగా నున్నవి. అనగా నా గజమునుండి స్రవించు మదగంధమును మూర్కొనిన వెంటనే, శత్రుగజములు పరుగిడిపోవుచున్నవి. కాన నాగజముయొక్క మదో దకములు, శత్రువుల కపకీర్తికి కారణ మగుచున్నవి. ఆ గజముయొక్క శిరో లక్ష్మికి దాని కుమ్భ స్థలములు స్తనములుగా నున్నవి. ఆ లక్ష్మి మదజల మను చెమటను, స్వేదరూప సాత్వికభావముగా వహించియున్నది. అట్టి లక్ష్మి కిరు గడల గజము తన కర్ణములనెడి విసనకర్రలచే వీచుటవలన నా శిరోలక్ష్మి కేర్పడిన చెమట యాఱిపోవుటవలన దానికి హర్షము కూర్చుటకై దానిని సేవించుచున్నదా యనున ట్లది భావింపబడినది. అనగా నాగజమున కున్న దంతములు మిక్కిలి ధవళము లనియు, నది నిరంతరము మదోదకమును వర్షించుచున్నదనియు, దాని శిరస్సు మిక్కిలి శోభించుచున్నదనియు, దాని శిరస్సున కిఱుప్రక్కల కర్ణతాలములు కదలించుటవలన గాలి యేర్పడుచున్న దనియు, వీని నన్నింటిని గల్గిన యాగజము మిక్కిలి శోభించుచున్నదనియు భావము ॥౩౩॥

శ్లో. న తేన వాహేషు వివాహదక్షిణీ
కృతేషు సఙ్ఖ్యానుభవేఽభవత్ క్షమః
న శాతకుమ్భేషు న మత్తకుమ్భిషు
ప్రయత్నవాన్ కోఽపి న రత్నరాశిషు. 34

ప. వి: న-తేన-వాహేషు-వివాహదక్షిణీకృతేషు–సఙ్ఖ్యానుభవే-అభవత్-క్షమః - న-శాతకుంభేషు-న-మత్తకుంభిషు- ప్రయత్నవాన్ - కః - అపి - న - రత్నరాశిషు.

అర్థము: తేన = ఆ భీమనృపాలునిచే, వివాహదక్షిణీకృతేషు; వివాహ = పెండ్లి యందు, దక్షిణీకృతేషు = దక్షిణలుగాఁ గావింపబడిన, అనగా వరునికి దక్షిణలుగా నీయబడిన, వాహేషు = గుఱ్ఱముల విషయమున, సఙ్ఖ్యాను భవే = లెక్కను తెలిసికొనుటయందు, ప్రయత్నవానపి = ప్రయత్నము కల్గియున్నను, కోఽపి జనః = ఏ మనుష్యుడుగూడ, క్షమః = సమర్థుడుగా, న అభవత్ = కాలేదు, తథా = అట్లే, శాతకుంభేషు = పసిడికానుకల యందును, క్షమః = సమర్థుఁడుగా, న అభవత్ = కాలేదు. మత్తకుం భిషు = మదపుటేనుగుల విషయమందును, న క్షమః = శక్తుఁడు కాలేదు, రత్నరాశిషు = రత్నరాసుల యందును, న క్షమః = శక్తుడు కాలేదు, గుఱ్ఱములు మున్నగు పెండ్లికానుకలు లెక్కకు మించిపోయి యుండినవి.

సమాసములు :

వివాహదక్షిణీకృతేషు:- అదక్షిణాః దక్షిణాః సమ్పద్యమానాః కృతాః = దక్షిణీకృతాః, వివాహస్య దక్షిణీకృతాః = వివాహదక్షిణీకృతాః, తేషు = వివాహదక్షిణీకృతేషు.

సఙ్ఖ్యానుభవే :- సఙ్ఖ్యాయాః అనుభవః = సఙ్ఖ్యానుభవః, తస్మిన్ = సఙ్ఖ్యానుభవే.

మత్తకుమ్భిషు: కుంభః ఏషా మస్తీతి = కుమ్భినః, మత్తాశ్చ తే కుమ్భి నశ్చ = మత్తకుమ్భినః, తేషు = మత్తకుమ్భిషు.

ప్రయత్నవాన్ :- ప్రయత్నః అస్య అస్తీతి = ప్రయత్నవాన్.

రత్నరాశిషు: రత్నానాం రాశయః = రత్నరాశయః, తేషు = రత్న రాశిషు.

భావము :

ఆ భీమరాజుచే వివాహకాలమునందు వరునికి దక్షిణలుగా నీయఁబడిన గుఱ్ఱములను గాని పసిడి కానుకలను గాని, మదపుటేనుగులను గాని, రత్న రాసులను గాని లెక్కింప నొక్కఁడును సమర్థుఁడు కాఁజాలఁడు. అనగా నా భీమరాజు, వరుఁడైన నలమహారాజున కిచ్చిన కానుక లసంఖ్యాకములు, నపరి మితములు నైయుండినవి. ॥ 34 ॥

శ్లో. కరగ్రహే వామ్య మధత్త య స్తయోః
ప్రసాద్య భైమ్యాఽను చ దక్షిణీకృతః
కృతః పురస్కృత్య తతో నలేన సః
ప్రదక్షిణ స్తత్క్షణ మాశుశుక్షణిః. 35

ప. వి. కరగ్రహే - వామ్యమ్ - అధత్త - యః - తయోః - ప్రసాద్య - భైమ్యా - అను - చ - దక్షిణీకృతః - కృతః - పురస్కృత్య - తతః - నలేన - సః - ప్రదక్షిణః - తత్క్షణమ్ - ఆశుశుక్షణిః.

అర్థము: యః=ఏ, ఆశుశుక్షణిః=అగ్ని, తయోః=ఆ నలదమయంతుల యొక్క కరగ్రహే=పాణిగ్రహణమునందు, వామ్యం=వక్రత్వమును, ఎడమ వైపునుండుటను, అధత్త=ధరించియుండెనో, అను=వెనుక, భైమ్యా =దమయంతిచే, ప్రసాద్య=స్తుతిమున్నగు వానిచే ప్రసన్నుఁడుగా జేయఁబడి, దక్షిణీకృతః=అనుకూలుఁడు గావింపబడెను, కుడి భాగమునం దుండువాడుగాఁ జేయఁబడెను, తతః=తర్వాత, నలేన=నలునిచే సః=ఆయగ్ని, తత్క్షణం=ఆక్షణమున, ననగా వివాహకాలమున, పురస్కృత్య=ముందుంచుకొనఁబడి, అనగా ఉల్లేఖనాది సంస్కారములచే ముందుంచుకొనఁబడి, ప్రదక్షిణః=మిక్కిలి యనుకూలుఁడుగను, కుడి వైపున నుండువాఁడుగను. కృతః=చేయఁబడెను, పూర్వము ప్రతికూలమైన యగ్ని యిప్పుడు అనుకూలుఁడుగాఁ జేయఁబడెనని యర్థము. అనగా నన్ని ప్రదక్షిణాది వివాహ సంస్కారము లనుష్ఠింప బడినవని యర్థము.

సమాసములు ;

*కరగ్రహే*—కరస్య గ్రహః లేదా కరే గ్రహః=కరగ్రహః, తస్మిన్=
కరగ్రహే.

**ఆశుశుక్షణిః**—ఆశు శోషితు మిచ్ఛతీతి=ఆశుశుక్షణిః

*దక్షిణీకృతః*—అదక్షిణః దక్షిణః సమ్పద్యమానః కృతః=దక్షిణీకృతః

*ప్రదక్షిణః*—ప్రకృష్టశ్చాసౌ దక్షిణః = ప్రదక్షిణః, పక్షాన్తరమున=
ప్రకృష్టా దక్షిణా యస్య సః=ప్రదక్షిణః

భావము ;

అగ్ని, స్వయంవరకాలమునందు నలవేషధారణాదులచే, నలదమయంతుల వివాహమునకు ప్రతికూలుడుగా నుండెను. ఏలయనగా నతడుగూడ దమయంతినిఁ బ్రేమించి యుండెను గదా ! అందువలన నతడు కాముఁడుగా ననగా వ్యతిరేకిగా నుండెను. కాని వెనుక, దమయన్తి తన ప్రార్థనాదులచే నాయగ్నిని ప్రసన్నునిఁ గావించుకొనుటచే నతడు దక్షిణుఁడుగా ననగా ననుకూలుఁడుగాను, దక్షిణ భాగమున ననగా కుడివైపున నుండువాఁడుగను నాయెను. పూర్వము వాముఁడుగా ననగా నెడమవైపుననున్న యగ్ని యిప్పుడు కుడివైపునకు వచ్చెననియు నర్థము. తర్వాత నలునిచే నాయగ్ని ఆ వివాహ కాలమందు ముందుంచుకొనఁబడినవాడై పూర్వము ప్రతికూలుడైన యగ్ని ఇప్పుడు అనుకూలుడు గావించుకొనఁబడినాడని యొక యర్థము. అగ్నిప్రదక్షిణాది వివాహ సంస్కారాది ధర్మశాస్త్ర విహిత క్రియలు చేయబడినవని మఱియొక యర్థము ॥౩౫॥

శ్లో. స్థిరా త్వ మశ్మేవ భవేతి మన్త్రివా
గనేశ దాశాస్య కిమాశు తాం హ్రియా
శిలా చలేత్ ప్రేరణయా నృణామపి
స్థితే స్తు నాచాలి బిడౌజసాఽపి సా. 36

ప. వి. స్థిరా-త్వమ్-అశ్మా-ఇవ-భవ-ఇతి-మన్త్రివాక్ - అనేశత్-ఆశాస్య-కిమ్
ఆశు-తాం-హ్రియా-శిలా - చలేత్ - ప్రేరణయా - నృణామ్-అపి-స్థితేః-
తు-న-అచాలి-బిడౌజసా-అపి-సా,

అర్థము : త్వమ్=నీవు, అశ్మా ఇవ=ఱాతివలె, స్థిరా=చలనము లేనిదానవు, భవ=కమ్ము, ఇతి=అను, మన్త్రివాక్=మన్త్రివచనము, తాం=ఆ దమయన్తిని, ఆశాస్య=ఆశీర్వదించి, హ్రియా ఇవ=హీనమైన శిలను ఉపమానము గావించి తనకు సిగ్గు చేతనో యనునట్లు, ఆశు=శీఘ్రముగా, అనేశత్ కిం=అదృశ్యరాలుగా నైనదా యేమి ? ఏలయనగా నక్షరములు ఉచ్చరించిన పిదపనే ధ్వంసము లగుచున్నవి, శిలా=ఱాయి, నృణా మపి=మనుష్యుల యొక్కయు, ప్రేరణయా=ప్రేరణచే, చలేత్=కదలును, తు=కాని, సా=ఆ దమయంతి, బిడౌజసా అపి=దేవేంద్రుని చేతను, స్థితేః=పతివ్రతాధర్మము నుండి, న అచాలి=కదలింపఁబడ లేదు.

వి. ఇచ్చట మన్త్రివచనము సిగ్గుచే నశ్రవ్య మైపోయినదను వాక్యార్థము, మనుష్యులు కదలించినచో ఱాయి కదలును, కాని యింద్రుఁడు ప్రయత్నించినను నాదమయంతి పాతివ్రత్యమునుండి కదలలే దను ఉత్తర వాక్యార్థముచే సమర్థింపఁబడినది. కాన వాక్యార్థహేతుక కావ్యలింగాలంకారము.

సమాసములు ;

మన్త్రివాక్ - మన్త్రి ఏవ వాక్=మన్త్రివాక్.

భావము :

వివాహమంత్రములో కన్యనుఁగూర్చి "అశ్మేవ త్వగ్గ్ స్థిరా భవ" యను మన్త్రివచనము ఱాయివలె కన్యను పాతివ్రత్యాదిధర్మములనుండి చలింపనీయక స్థిరముగా నుండవలసినదని దీవించుచున్నది. అది యట్లు దీవించి వెంటనే యదృశ్య మనగా నశ్రవ్య మగుచున్నది. అనగా వినఁబడకపోవుచున్నది. శబ్దములు ఉచ్చరించినప్పుడే వినఁబడి తర్వాత నవి వెంటనే నశించుచుండుట వాని స్వభావము. ఆవిధముగనే "అశ్మేవ త్వగ్గ్ స్థిరా భవ" యను మన్త్రివచనము, ఆవిధముగ దీవించి నశించిపోయినది. అనగా నంతర్ధానమై పోయినదని యర్థము. అది యట్లస్తరించుట శబ్దస్వభావమైనను కవి దాని నిట చమత్కరించి చెప్పుచున్నాడు. దమయన్తియొక్క పాతివ్రత్యము మిక్కిలి స్థిరమైనది. దాని

నింద్రుడు సైతము చలింపఁజేయలేకపోయెను. అట్టి యతినిశ్చలమగు పాతివ్రత్యము ''అశ్మేవ త్వగ్గ్ స్థిరా భవ''యను మన్త్రమున, జాతిముక్కతో బోల్చఁబడుటవలన నామన్త్రమే సిగ్గుపడినదో యనునట్లు, మఱుగుపడిపోయిన దని చమత్కరింపఁబడినది. లోకమున సిగ్గుఁజెందినవారు ఎవరికిని తలఁజూపక కానరాక యుందురు. ఆ స్థితినే మన్త్రవచనము వహించినదని భావము. అనగా జాతిముక్కను సామాన్యమానవులే చేతితో నెత్తి పారవేయగలరు. అంతటి చంచలమగు వస్తువుతో, నింద్రునివంటివానిచేతనే కదలింపసాధ్యముకాని దమయంతియొక్క పాతివ్రత్యమును బోల్చుట లజ్జాకరముగదా. ॥౩౬॥

శ్లో. ప్రియాంశుకగ్రన్థినిబద్ధవాససం
తదా పురోధా విదధత్ విదర్భజాం
జగాద విచ్ఛిద్య పటం ప్రయాస్యతః
నలా దవిశ్వాస మివైష విశ్వవిత్. 37

ప. వి. ప్రియాంశుకగ్రన్థి నిబద్ధవాససం-తదా-పురోధాః - విదధత్-విదర్భజాం-జగాద-విచ్ఛిద్య-పటం-ప్రయాస్యతః-నలాత్- అవిశ్వాసమ్- ఇవ-ఏషః-విశ్వవిత్.

అర్థము: తదా=ఆ వివాహసమయమందు, విదర్భజాం=దమయంతిని, ప్రియాంశుకగ్రన్థి నిబద్ధవాససం, ప్రియ=ప్రియుడైన, నలునియొక్క, అంశుక=చీరయొక్క; గ్రన్థి=ముడితో, నిబద్ధ=కట్టఁబడిన, వాససం=వస్త్రము గల దానినిగా, విదధత్=చేయుచున్న, విశ్వవిత్= సర్వమునుఁదెలిసిన, ఏషః=ఈ, పురోధాః = పురోహితుఁడైన గౌతముఁడు, పటం= వస్త్రమును, ద్విధా=రెండు ముక్కలుగా, విచ్ఛిద్య=ఛేదించి, ప్రయాస్యతః =అడవియందు, దమయంతిని వదలివెళ్ళఁబోవుచున్న; నలాత్=నలునుండి, అవిశ్వాసం=విశ్వాసరాహిత్యమును, జగాదేవ=చెప్పెనో యనునట్లుండెను. అనగా రాబోవువిషయమును సూచించుటకో యనునట్లు, వారిరువురికి నట్టి ఎడబాటులేక యుండుటకై వారిఱువురి వస్త్రముల యంచులను పురోహితుఁడు ముడివేసెనో యనునట్లుండెను.

కలివలన బాధింపబడిన నలుఁడు జూదమున తన సర్వస్వమునుఁ గోల్పోయి బంధుపరిత్యక్తుఁడై, తన వస్త్రమును కలి పక్షిరూపమున నపహరింపగాఁ దాను వస్త్రవిహీనుఁడై నిద్రించుచున్న దమయంతియొక్క చీరలో సగముఁ జింపుకొని యామెను మహారణ్యమునందు వదలివైచి వెళ్ళిపోయె నను మహాభారతకథ యిట ననుసంధేయము. ఈవిధముగా వారి కెడబాటు లేకుండుటకై పురోహితుఁడు, వారిఇువురి వస్త్రముల యంచులను ముడివైచెనని యాశయము. వివాహకాలమునందు కొన్ని దేశముల సంప్రదాయముల ననుసరించి వధూవరుల వస్త్రముల యంచులను ముడివైచుట సంప్రదాయము ॥37॥

శ్లో. ధ్రువావలోకాయ తదున్ముఖభ్రువా
నిర్దిశ్య పత్యాఽభిదధే విదర్భజా
కిమస్య న స్యా దణిమాక్షిసాక్షిక
స్తథాఽపి తథ్యో మహిమాఽఽగమోదితః. 38

ప వి. ధ్రువావలోకాయ-తదున్ముఖభ్రువా - నిర్దిశ్య-పత్యా-అభిదధే-విదర్భజా-కిమ్ - అస్య-న-స్యాత్ - అణిమా - అక్షిసాక్షికః- తథా - అపి - తథ్యః-మహిమా-ఆగమోదితః.

అర్థము: "వివాహే ధ్రువ మరున్ధతీఞ్చ దర్శయేత్" అను శాస్త్రము ననుసరించి, ధ్రువావలోకాయ; ధ్రువ=నక్షత్రమును, అవలోకాయ = చూచుటకై, తదున్ముఖభ్రువా; తత్=ఆ ధ్రువనక్షత్రమునకు, ఉన్ముఖ = అభిముఖమైన; భ్రువా=కనుబొమ్మలుగల్గిన, పత్యా=భర్తయగు నలునిచే, నిర్దిశ్య =ధ్రువుని "జూడుము" అని యాదేశించి; విదర్భజా = దమయంతి, అభిదధే=చెప్పఁబడినది. ఏమనగా-అస్య=ఈ ధ్రువనక్షత్రముయొక్క; అణిమా = అణుత్వము, అనగా సూక్ష్మపరిమాణము; అక్షిసాక్షికః = కన్నులు ప్రమాణముగాఁగలదిగా ననగా, కన్నులతో చూడఁదగినదిగా, న స్యాత్ కిం = కాదాయేమి? తథాఽపి = అయినను ననగా నీనక్షత్రము సూక్ష్మపరిమాణముకల దనువిషయమున, కన్నుప్రమాణమైనను,

ఆగమోదితః; ఆగమ = జ్యోతిశ్శాస్త్రమునందు; ఉదితః = చెప్పబడిన; మహిమా = గొప్పపరిమాణము; తథ్యః=సత్యము. దూరత్వదోషముచే కన్నులు ధ్రువనక్షత్రమందు, అణుత్వమునే గ్రహించినను నాకన్నులీవిషయమునందు జ్యోతిశ్శాస్త్రమునకంటె దుర్బలములు గాన జ్యోతిశ్శాస్త్రమున చెప్పిన ప్రకారము ధ్రువనక్షత్రము గొప్ప పరిమాణమునుఁ గల్గియున్నది. చంద్రుడు మానవ నేత్రములకు, అరచేతి పరిమాణమును గల్గినవాఁడుగ కానఁబడును. కాని యతని పరిమాణము వస్తుస్థితిలో జ్యోతిశ్శాస్త్రము ననుసరించి చాల గొప్పదని తెలియుచున్నది గదా! అట్లే ధ్రువుని పరిమాణమును గూర్చియు తెలియ వలయును. దమయన్తి తా జూడగల్గినను "ధ్రువ ముదీక్షస్వ" యను శ్రుతివచనము ననుసరించి భర్త చూపవలసివచ్చె నని యర్థము.

సమాసములు ;

ధ్రువావలోకాయ – ధ్రువస్య అవలోకః=ధ్రువావలోకః, తస్మై= ధ్రువావలోకాయ.

తదున్ముఖభ్రువా – తస్య ఉన్ముఖీ = తదున్ముఖీ, తదున్ముఖీ భ్రూః యస్య సః =తదున్ముఖభ్రూః, తేన=తదున్ముఖభ్రువా.

అక్షిసాక్షికః – అక్షిణీ సాక్షిణీ యస్య సః=అక్షిసాక్షికః.

ఆగమోదితః– ఆగమేన ఉదితః=ఆగమోదితః.

భావము ;

"వివాహమున ధ్రువ మనున్ధతీం చ దర్శయేత్" అను శాస్త్రము ననుస రించి దమయంతికి ధ్రువనక్షత్రమును జూపవలయును. అందువలన తన కను బొమ్మలను ధ్రువుని వంకకు మరలించినవాడై ధ్రువుని జూడు మని దమయింతి నాదేశించి, నలుడు చెప్పఁ దొడగెను. ఈ ధ్రువనక్షత్రముయొక్క యణుపరి మాణ మనగా సూక్ష్మపరిమాణము కంటికి గానవచ్చుచున్నది. కాని యందువలన ధ్రువనక్షత్ర మణువని చెప్పఁదగదు. అది దూరత్వదోషముచే నణువుగాఁ గానవచ్చుచున్నది. చంద్రుఁడు గూడ మన కన్నులకు, అరచేతి పరిమితిగలవాఁ

డుగా కానఁబడును. కాని జ్యోతిశ్శాస్త్రము ననుసరించి యతని పరిమితి చాల పెద్దది. ఆ విధముగనే ధ్రువుని పరిమాణము గూడఁ జాల పెద్దదని జ్యోతి శ్శాస్త్రమువలనఁ దెలియుచున్నది. కన్నుల ప్రామాణ్యము శాస్త్రప్రామాణ్యమున కంటెను దుర్బలమైనది.

ధ్రువనక్షత్రము సూక్ష్మమైనను, కన్నులకు గానవచ్చును. కాని వేదోక్త మైన మహాపరిమాణము దాని కున్నది. అది సత్యమైనదే. మఱియు వేదము "ధ్రువ ముదీక్షస్వ" యని వరునిచే యాదేశింపఁబడి వధువు ధ్రువునిఁ జూడగనే "ధ్రువం పశ్యామి ప్రజాం విందేయ"యని వధువు ధ్రువునిఁ జూచుచు జెప్పవల యును. ఈ విధముగా నాగమోదితమగు ధ్రువదర్శనము ఆమెకు జరిపింపఁ బడిన దని యాశయము॥౩౮॥

శ్లో. ధవేన సాఽదర్శి వధూ రరున్ధతీం
సతీ మిమాం పశ్య గతా మివాణుతామ్,
కృతస్య పూర్వం హృది భూపతేః కృతే
తృణీకృతస్వర్గపతే ర్జనాదితి. 39

ప. వి. ధవేన - సా - అదర్శి - వధూః - అరున్ధతీం - సతీమ్ - ఇమాం - పశ్య - గతామ్ - ఇవ - అణుతాం - కృతస్య - పూర్వం - హృది - భూపతేః - కృతే - తృణీకృతస్వర్గపతేః - జనాత్ - ఇతి.

అర్థము: పూర్వం = పెండ్లికి మునుపు, హృది = హృదయమందు; కృతస్య = భర్తగా నిశ్చయింపబడిన, భూపతేః కృతే = రాజైన నలుని కొఱకు అనగా నలుని వరించుటకై; తృణీకృతస్వర్గపతేః, తృణీకృత = గడ్డి పోచగాఁ జేయఁబడిన, స్వర్గపతేః = స్వర్గపాలకుడగు నింద్రుని గల్గిన, జనాత్ = నీవనెడి జనముకంటె; అణుతాం = సూక్ష్మముగ నుండుటను, పాతివ్రత్య గుణముచే న్యూనతను, గతామివ స్థితాం = పొందినదో యను నట్లున్న, సాధ్వీం = పతివ్రతయైన, ఇమాం = ఈ, అరున్ధతీం = అరున్ధతీ

నక్షత్రమును, పశ్య=చూడుము; ఇతి=అని, ఉక్త్వా=చెప్పి, సా వధూః=ఆ వధువు; ధవేన=భర్తయగునలునిచే; అదర్శి=చూపఁబడినది.

సమాసములు :

అణుతామ్: అణో ర్భావః=అణుతా, తామ్=అణుతామ్.

తృణీకృతస్వర్గపతేః: స్వర్గస్య పతిః=స్వర్గపతిః, అతృణం తృణం సమ్పద్యమానః కృతః=తృణీకృతః; తృణీకృతః స్వర్గపతిః యేన సః=తృణీకృతస్వర్గపతిః, తస్య=తృణీకృతస్వర్గపతేః.

వి. స్వాభావికముగా నరుంధతీ నక్షత్రము సూక్ష్మముగా నున్నది. కాని దాని సూక్ష్మతకు నింద్రుని తృణీకరించిన దమయంతి కారణము గాదు. కాని దానిని కారణముగా జెప్పుటవలన నిఁట నుత్ప్రేక్ష. వ్యంజకములగు ఇవాది శబ్దములను బ్రయోగింపనందువలన నది గమ్యము.

భావము :

వివాహమునకు పూర్వమే మనస్సునందు భర్తగా నిశ్చయింపఁబడిన నల మహారాజునకై యింద్రుని గూడ తృణీకరించిన నీకంటెను సూక్ష్మత్వమును, పాతివ్రత్యగుణముచే తక్కువఁదనమునుఁ బొందినదో యనునట్లు కానవచ్చు చున్న పతివ్రతయగు నీ యరుంధతిని చూడుమని భర్తయగు నలుడు చెప్పి యా నక్షత్రమును దమయంతికిఁ జూపెను. అరుంధతీ నక్షత్ర మాకాశమున నుత్తరపు వైపు వెలుగుచున్న సప్తర్షి మండలములో వసిష్ఠుని ప్రక్క సూక్ష్మముగా వెలుగు చుండును. వివాహకాలమున దానిని వధువునకు వరుఁడు చూపుట సంప్రదాయము. ఆ యరుంధతీ దర్శనముచే వీరి దాంపత్యము చక్కగా వర్ధిల్లునని నమ్మకము. ఆ యరుందతి స్వాభావికముగనే సూది మొనవలె మిక్కిలి సూక్ష్మ ముగా నుండగా, తొలుతనే నలునిఁ బతిగా హృదయమున నిశ్చయించుకొని ఇంద్రుని కూడ తృణీకరించిన దమయంతి కంటె తగ్గుదలను పొందినదో యను నట్లు భావింపబడినది. ॥౪౨॥

శ్లో. ప్రసూనతా తత్కరపల్లవస్థితై
రుడుచ్ఛవి ర్వ్యోమ్ని విహారిభిః పథి,
ముఖేఽమరాణా మనలే రదావలే
రభాజి లాజై రనయోజ్ఝితై ర్ద్యుతిః. 40

ప. వి. ప్రసూనతా-తత్కరపల్లవస్థితైః-ఉడుచ్ఛవిః-వ్యోమ్ని-విహారిభిః- పథి - ముఖే-అమరాణాం-అనలే-రదావలేః-అభాజి-లాజైః-అనయా-ఉజ్ఝితైః-ద్యుతిః.

అర్థము: తత్కరపల్లవస్థితైః; హోమమునకై, తత్ = ఆ దమయంతియొక్క, కరపల్లవ = చిగురుఁ గేలునందు, స్థితైః = ఉన్నట్టి, లాజైః = పేలాలచే, ప్రసూనతా = పుష్పత్వము, అభాజి = పొందబడినది. పేలాలు దమయంతి చేతియందు పూలవలెఁ గానఁబడుచుండినవని యర్థము, అథ = పిదప, అనయా = ఈ దమయంతిచే, ఉజ్ఝితైః = అగ్నియందు, విడుపఁబడినఁ, (కావుననే), పథి = మార్గమునందు, వ్యోమ్ని = ఆకసమునందు, విహారిభిః = తిరుగుచున్న దేవతలు, విద్యాధరులు మున్నగువారిచే, ఉడుచ్ఛవిః, ఉడు = నక్షత్రములతో సమానమైన, ఛవిః = కాంతి, అభాజి = పొందింపబడినది, తతః = తర్వాత, అమరాణాం = దేవతలయొక్క, ముఖే = ముఖమైన అగ్నియందు, "అగ్నిముఖా వై దేవాః" యను శ్రుతి ననుసరించి దేవతల కగ్ని ముఖమని చెప్పబడినది. రదావలేః = దంత పంక్తియొక్క, ద్యుతిః = శోభ, అభాజి = పొందింపబడినది.

వి. పేలా లనెడియొక్క వస్తువునకు క్రమముగా, కరపల్లవము మొదలుగా గల పెక్కు ఆధారములయందు ఉనికి జెప్పుటవలన పర్యాయాలంకారము. అట్లే పేలాలు, పుష్ప - నక్షత్ర - దంతముల శోభను వహించినట్లు చెప్పుటవలన నిదర్శనాలంకారము. ఈ రెంటికిని అంగాంగి భావముచే సంకరము.

సమాసములు :

ప్రసూనతాం-ప్రసూనానాం భావః=ప్రసూనతా, తాం=ప్రసూనతాం.

తత్కరపల్లవస్థితైః - కరావేవ పల్లవౌ = కరపల్లవౌ, తస్యాః కరపల్లవౌ = తత్కరపల్లవౌ, తత్కరపల్లవయోః స్థితాః=తత్కర పల్లవస్థితాః, తైః=తత్కరపల్లవస్థితైః.

ఉడుచ్ఛవిః-ఉడూనాం ఛవిః=ఉడుచ్ఛవిః

రదావలేః-రదానా మావలిః=రదావలిః, తస్యాః=రదావలేః.

భావము :

వివాహమున లాజహోమము సంప్రదాయసిద్ధము. దమయంతి చిగుళ్ల యందు లాజములు ననగా పేలాలనుఁ బట్టియున్నది. అవి తొలుత పుష్పములుగాఁ గానవచ్చినవి. పిదప నాపేలాల నామె యగ్నియందుఁ బడవ్రేయగా నవి మార్గ మధ్యమున ననగా హస్తములకు నగ్నికిని మధ్య నక్షత్రకాంతిని వహించి యున్నవి. తర్వాత దేవతలకు ముఖమైన యగ్నియందు నవి దంతముల కాంతిని వహించినవని భావము. ॥40॥

శ్లో. తయా గృహీతాఽఽహుతిధూమపద్ధతి
ర్గతా కపోలే మృగనాభిశోభితామ్,
యయౌ దృశో రఞ్జనతాం శ్రుతాశ్రితా
తమాలలీలామలికేఽలకాయితా. 41

ప.వి. తయా-గృహీతా-ఆహుతిధూమపద్ధతిః-గతా -కపోలే-మృగనాభిశోభితాం-యయౌ- దృశోః-అఞ్జనతాం-శ్రుతౌ-శ్రితా-తమాలలీలామ్ - అలికే-అలకాయితా.

అర్థము. తయా = ఆ దమయంతిచే, గృహీతా = గ్రహింపబడిన, ఆహుతి ధూమ పద్ధతిః; ఆహుతి ధూమ = లాజహోమముయొక్క; పద్ధతిః = లేఖ; కపోలే = గణ్డ స్థలమునందు, మృగనాభిశోభితాం; మృగనాభి = కస్తూరియొక్క, శోభితాం = శోభను; గతా = పొందినది; తథా = అట్లే, దృశోః = ఆమె కన్నులయందు, అంజనతాం = కాటుకగా నుండుటను, యయౌ = పొందెను; తథా = అట్లే; శ్రుతౌ = కర్ణమునందు, తమాలలీలాం; తమాల = చీకటి చెట్టు పుష్పముయొక్క, లీలాం = శోభను; శ్రితా = పొందినది. అలికే చ = లలాటమందును, అలకాయితా = ముంగురులవలె నాచరించినది.

వి. ఇచ్చట నొక హోమధూమము క్రమముగా ననేకములగు నాధారములను కల్గియున్నందువలన పర్యాయాలంకారము.

ధూమరేఖాదులు కస్తూరికాది ధర్మములను వహించుట ఉపమానిదర్శనములు. ఈ రెంటికిని పై పర్యాయాలంకారముతో సంకరము.

సమాసములు :

ఆహుతిధూమపద్ధతిః- ఆహుతేః ధూమః = ఆహుతిధూమః, ఆహుతి ధూమస్య పద్ధతిః = ఆహుతిధూమపద్ధతిః.

మృగనాభిశోభితాం- మృగనాభిరివ శోభత ఇతి = మృగనాభిశోభినీ, మృగనాభిశోభిన్యాః భావః = మృగనాభిశోభితా, తాం = మృగనాభిశోభితాం.

తమాలలీలాం-తమాలస్య లీలా = తమాల లీలా, తాం = తమాలలీలాం.

అలకాయితా- అలకవత్ ఆచరితా = అలకాయితా.

భావము :

ఆ దమయంతి స్వీకరించిన యనగా నామెపై క్రమ్మిన యా లాజహోమ ధూమము యొక్క లేఖ యామె యొక్క కణతలపై కస్తూరియొక్క శోభను వహించినది. ఆ పొగ నల్లగానుండుటవలన నది యామె కణతలపైఁ గ్రమ్మగనే కస్తూరి వలెఁ గానవచ్చినది. ఆ పొగ కన్నులయందు గ్రమ్మి కాటుకగానైనది. అది కర్ణ

ములపైఁ గ్రమ్మి తమాలపుష్పపు శోభను వహించినది. అది లలాటమందు గ్రమ్మి ముంగురులవలె శోభించినదని భావము ॥41॥

శ్లో॥ అపహ్నుతః స్వేదభరః కరే తయో
స్త్రపాజుషో ర్దానజలై ర్మిలన్ ముహుః,
దృశోరపి ప్రోద్గత మశ్రు సాత్త్వికం
ఘనైః సమాధీయత ధూమలఙ్ఘనైః. 42

**ప. వి.** అపహ్నుతః- స్వేదభరః - కరే - తయోః- త్రపాజుషోః- దానజలైః- మిలన్ - ముహుః- దృశోః- అపి- ప్రోద్గతమ్ - అశ్రు - సాత్త్వికం- ఘనైః- సమాధీయత - ధూమలఙ్ఘనైః.

**అర్థము:** త్రపాజుషోః=సిగ్గునొందిన, తయోః = ఆ వధూవరులయొక్క, కరే=హస్తమందు, స్వేదభరః=సాత్త్విక భావోదయమును సూచించునట్టి యధికమైన చెమట, ముహుః = పలుమాఱు, దానజలైః = ఆ సమయమునకు తగిన, దానములకు సంబంధించిన యుదకములతో, మిలన్=కలియుచు; అపహ్నుతః=ఆచ్ఛాదింపఁబడినది. మఱుగుఁ జేయఁబడినదని యర్థము. దృశోరపి=నేత్రములయందును, ప్రోద్గతం= ఉద్భవించిన, సాత్త్వికం=సత్త్వమను భావముచే నుద్భవించిన, అశ్రు= కన్నీరు, ఘనైః=దట్టములైన, ధూమలఙ్ఘనైః=పొగయొక్క తాకిడులచే, సమాధీయత=సమాధానము గావింపబడినది. అనగా పరిహరింపఁబడినదని యర్థము.

**వి.** ఇచ్చట స్వాభావికములగు స్వేదజలమునకును నశ్రుజలమునకును, నాగంతుకములగు దానోదకములచేతను, పొగతో నేర్పడిన కన్నీళ్లతో తిరోధాన మేర్పడుటవలన మీలనాలంకారము. ఒక వస్తువుచే మఱియొక వస్తువు మఱుగుపడినచో మీలనాలఙ్కారము.

సమాసములు :

*స్వేదభరః*- స్వేదస్య భరః=స్వేదభరః
*త్రపాజుషోః* - త్రపాం జుషేత ఇతి = త్రపాజుషౌ, తయోః = త్రపాజుషోః

దానజలైః- దానస్య జలాని=దానజలాని, తైః=దానజలైః.

సాత్త్వికం- సత్త్వాద్భవం=సాత్త్వికం, తత్=సాత్త్వికం.

ధూమలక్ష్మైః - ధూమస్య లక్ష్మనాని = ధూమలక్ష్మనాని, తైః = ధూమలక్ష్మైః.

భావము :

సిగ్గునొందిన యావధూవరుల హస్తములయందు సత్త్వముచే నేర్పడుచున్న యధికమైన చెమటనీరు, ఆ వివాహకాలమునందు చేయు దానములకు విడువఁబడు నుదకములతోఁ గలసిపోయినది. అందువలన వీరి సాత్త్వికభావము బయటపడలేదు. వారి కన్నులనుండి యుద్భవించిన బాష్పరూపములను సాత్త్విక భావములు, పొగ కమ్ముటవలని కన్నీళ్ళతోఁ గలిసి బయటపడలేదు. ఇట్లు స్వేదాశ్రువులు రెండును ఘర్మజల- ధూమాభిభూత నేత్రజలములచే మిశ్రములై బయటపడక యుండినవని భావము ॥42॥

శ్లో, బహూని భీమస్య వసూని దక్షిణం
ప్రయచ్ఛత స్సత్త్వ మవేక్ష్య తత్క్షణమ్,
జనేషు రోమాఞ్చమితేషు మిశ్రతాం
యయు స్తయోః కణ్టకకుడ్మలశ్రియః. 43

ప. వి. బహూని - భీమస్య - వసూని - దక్షిణం - ప్రయచ్ఛతః - సత్త్వమ్- అవేక్ష్య - తత్క్షణం - జనేషు - రోమాఞ్చమితేషు-మిశ్రతాం- యయుః- తయోః - కణ్టకకుడ్మలశ్రియః.

అర్థము తయోః=ఆ వధూవరులయొక్క, కణ్టకకుడ్మలశ్రియః=పులకాంకురముల సంపదలు, బహూని = పెక్కులైన, వసూని = ధనములను, దక్షిణం=దక్షిణగా, ప్రయచ్ఛతః=ఇచ్చుచున్న, భీమస్య=భీమరాజు యొక్క, సత్త్వం=సత్త్వగుణమును లేదా స్వభావమును, అనగా దానవీరత్వమును, అవేక్ష్య=చూచి తత్క్షణం=ఆకాలమున, రోమాఞ్చం=

పులకములను, ఇతేషు = పొందినట్టి, జనేషు = జనములయందు, ప్రేక్షక జనమునం దని యర్థము. మిశ్రతాం = కలయికను, యయుః = పొందినవి. అంతటి భూరిదక్షిణలను భీము డిచ్చుచుండుటను గాంచి ప్రేక్షకులు ఆశ్చర్యము నొందిరి. అందువలన వారి కందరికిని రోమాఞ్చము లేర్పడినవి. ఆ సందర్భమున వధూవరులకు నన్యోన్యస్పర్శవలన నేర్పడిన సాత్త్వికభావములగు రోమాఞ్చములును నట్టి యాశ్చర్యముచేతనే కల్గినవిగా భావింపఁబడినవై సత్త్వముచేత కల్గినను నావిధముగ భావింపబడక తిరోహితములైనవి.

వి. ఇచ్చటి వధూవరుల సాత్త్వికభావములగు రోమాఞ్చములు, ప్రజలకు విస్మయజన్యములగు రోమాఞ్చములతో సమానములుగ భావింపఁబడుటచే తిరోహితము లైనందువలన మీలనాలంకారము.

సమాసములు :

*కణ్టకకుడ్మలశ్రియః*- కణ్టకా ఏవ కుడ్మలాని = కణ్టకకుడ్మలాని, కణ్టక కుడ్మలానాం శ్రియః = కణ్టకకుడ్మలశ్రియః.

భావము :

వధూవరుల శరీరమందు పరస్పరస్పర్శాదులచే, బులకాంకురము లేర్పడినవి. భీమరాజు అపరిమితముగా ద్రవ్యములను దక్షిణలుగా దానము చేయుచుండగా నాతని దానశూరత్వమునఁ గాంచి యాకాలమున ప్రేక్షకసమాజమునకు ఆశ్చర్యము కల్గి, దానివలన వారి శరీరములయందు పులకము లేర్పడినవి. వధూవరుల శరీరములయందలి పులకములు గూడ నిట్టి యాశ్చర్యముచేతనే యేర్పడినవిగా భావింపఁబడినవై ప్రేక్షకుల పులకములలో మిలితము లైనందువలన వీనికి సాత్త్వికభావత్వము తిరోహితమైనదని యాశయము. ॥43॥

శ్లో॥ బభూవ న స్తమ్భవిజిత్వరీ తయోః
శ్రుతిక్రియారమ్భపరమ్పరాత్వరా

న కమ్పసమ్పత్తి మలుమ్ప దగ్రతః
స్థితోఽపి వహ్నిః సమిధా సమేధితః. 44

ప. వి. బభూవ-న-స్తమ్భవిజిత్వరీ-తయోః-శ్రుతిక్రియారంభ పరమ్పరాత్వరా-న-కమ్పసమ్పత్తిమ్- అలుమ్పత్-అగ్రతః-స్థితః- అపి-వహ్నిః-సమిధా-సమేధితః.

అర్థము. తయోః=ఆ వధూవరులకు, శ్రుతిక్రియారమ్భపరమ్పరాత్వరా; శ్రుతిక్రియా=వేదవిహిత కర్మలను, ననగా లాజహోమము, అగ్ని ప్రదక్షిణము మున్నగువానిని; ఆరంభ=ప్రారంభించుటయందలి, పరమ్పరా=ఒకదానివెనుక మఱియొకదానిని, దానివెనుక మఱియొకదానిని తడవు లేక యారంభించుటయందలి, త్వరా=వేగము, స్తమ్భవిజిత్వరీ- స్తమ్భ=సాత్త్వికభావమువలన గల్గిన నిశ్చలాంగత్వరూపమగు స్థితిని, విజిత్వరీ=మఱియొక నెపముతో నోడించుచున్నదిగా ననగా నపలాపము చేయునదిగా, న బభూవ = కాలేదు, అనగా చాలవేగముగాఁ జేయవలసిన వైదిక కర్మలను వారు స్తంభ మనెడి సాత్త్వికభావమువలన వేగముగాఁ జేయజాలకపోయిరని యర్థము. తథా=అట్లే, సమిధా=సమిధలచే, సమేధితః=రగుల్పఁబడిన, వహ్నిః=అగ్ని, అగ్రతః=ఎదుట, స్థితోఽపి=ఉన్నను, కమ్పసమ్పత్తిం చ=వారిఖువురి కేర్పడిన నధికమగు వణకును, న అలుమ్పత్=లోపింపఁజేయలేదు. మండుచున్న యగ్ని చలివలని వణకును మాత్రమే తగ్గింపఁగలదు గాని సాత్త్వికమగు వణకును తగ్గింపఁజాలదు. గాఢానురాగమువలనఁ గల్గిన వికారములను నిరోధించుట యసాధ్యముగాన వారిఖువురిలోఁ గల్గిన స్తమ్భకమ్పముల నందఱునుఁ దెలిసికొనఁగల్గిరని భావము.

వి. కార్యము ననుష్ఠించుటయందు తొందర, రగుల్పఁబడిన యగ్ని మున్నగు కారణకలాపములున్నను స్తమ్భకమ్పములను నిలుపుట యను కార్యము గలుగనందువలన విశేషోక్త్యలంకారము, సకలకారణము లున్నప్పుడు కార్యము గలుగనియెడల విశేషోక్త్యలంకారము.

సమాసములు :

స్తమ్భవిజిత్వరీ - విజయే శీల మస్యా ఇతి = విజిత్వరీ, స్తమ్భస్య విజిత్వరీ = స్తంభవిజిత్వరీ.

శ్రుతిక్రియారమ్భపరమ్పరాత్వరా - శ్రుతేః క్రియాః = శ్రుతిక్రియాః, ఆరమ్భాణాం పరమ్పరా = ఆరమ్భపరమ్పరా, శ్రుతిక్రియాణా మారమ్భ పరంపరా = శ్రుతిక్రియారమ్భపరంపరా, శ్రుతిక్రియారమ్భపరమ్పరాయాం త్వరా = శ్రుతిక్రియారమ్భపరమ్పరాత్వరా.

కమ్పసమ్పత్తిమ్ - కమ్పస్య సమ్పత్తిః = కమ్పసమ్పత్తిః, తాం = కమ్పసమ్పత్తిమ్.

భావము :

ఆ వధూవరులు, వేదోక్తకర్మలను ననగా వివాహకాలమందలి లాజహోమమును, అగ్నిప్రదక్షిణము మున్నగు కర్మల నాచరించుచు, నొకటి వెనుక నొకటిగా తడవులేక యాచరించుటలోని తొందర, స్తంభమనెడి నిశ్చలత్వరూపమైన సాత్త్విక భావమును మఱుగుపఱచుటకు సమర్థము కాలేదు. ఏలయనగా, వారిరువురిలోను స్తంభమను సాత్త్వికభావ మేర్పడుటవలన వారా వైదిక కర్మలను త్వరగా ననుష్ఠింప లేకపోయిరి. స్తంభమనగా స్తంభమువలె నిశ్చలమగుట. ఆ నిశ్చలత్వము వారి యందేర్పడి వారిని త్వరగా కర్మల నాచరింప నీయలేదని యర్థము. అట్లే సమిధలచే జక్కగా మంటబెట్టఁబడినను, అగ్ని వారి శరీరమందలి సాత్త్వికభావమైన వణకును నిరోధింపలేకపోయినది. ఏలయనగా, చలివలనఁ గల్గిన వణకును అగ్ని తగ్గించును కాని సాత్త్వికభావము వలని వణకునుఁ దగ్గింపజాలదుగదా ! గాఢానురాగముచేఁ గల్గిన వికారములను నిరోధించుట యసాధ్యముగాన వారి యతిశయితమగు ననురాగముచేఁ గల్గిన స్తమ్భమును వణకును వారు నిరోధింపజాలకపోయినందువలన నా ప్రేక్షకజనము దానిని తెలుసుకొనగల్గిరని యాశయము॥44॥

శ్లో. దమస్స్వసుః పాణి మముష్య గృహ్ణతః
పురోధసా సంవిధతేతరాం విధేః

మహర్షిణే వాఽఙ్గిరసేన సఙ్గతా
పులోమజా ముద్వహతః శతక్రతోః. 45

ప. వి. దమస్వసుః – పాణిమ్– అముష్య– గృహ్ణతః– పురోధసా– సంవిధతేతరాం-విధేః- మహర్షిణా- ఇవ- అఙ్గిరసేన- సఙ్గతా- పులోమజామ్-ఉద్వహతః-శతక్రతోః.

అర్థము: దమస్వసుః= దమయంతి యొక్క, పాణిం= హస్తమును, గృహ్ణతః= గ్రహించుచున్న అనగా పెండ్లి యాడుచున్న, అముష్య= ఈ నలునకు, పులోమజాం = శచీదేవిని, ఉద్వహతః = పెండ్లియాడుచున్న, శతక్రతోః=ఇంద్రునికి, మహర్షిణా=మహర్షియగు, అంగిరసేన ఇవ= బృహస్పతిచేత నెట్లో, అట్లే, పురోధసా=పురోహితుడగు గౌతమునిచే, విధేః= వివాహవిధికి, సాఙ్గతా=అఙ్గములతోఁ గూడియుండుట యనగా సమాప్తి, సంవిదధేతరాం= సమ్యగ్గముగా చేయఁబడినది.

భావము :

దమయంతితోఁడ నలుని వివాహమును వారి పురోహితుఁడు గౌతమమహర్షి వేదోక్తవిధి నతిక్రమింపక సమాప్తి గావించెను. అది శచీదేవితో నింద్రునికి వివాహవిధిని బృహస్పతి యెట్లు సాంగముగాఁ గావించెనో, ఆ విధముగా గావింపఁబడినదని భావము॥ ॥45॥

శ్లో. స కౌతుకాఽగార మగాత్ పురన్ధ్రిభిః
సహస్రరన్ధ్రీకృత మీక్షితుం తతః,
అధాత్ సహస్రాక్షతనుత్రమిత్రతా
మధిష్ఠితం యత్ ఖలు జిష్ణునాఽమునా. 46

ప.వి. సః- కౌతుకాఽగారమ్ - అగాత్ - పురన్ధ్రిభిః-సహస్రరన్ధ్రీకృతమ్ - ఈక్షితుం-తతః-అధాత్-సహస్రాక్షతనుత్రమిత్రతామ్–అధిష్ఠితం- యత్ - ఖలు-జిష్ణునా-అమునా.

అర్థము. తతః = వివాహకృత్యము పూర్తియైన పిదప; సః = ఆ నలుఁడు, పురన్ధ్రిభిః = అంతఃపుర స్త్రీలచే, ఈక్షితుం = చూచుటకు, ననగా వధూ వరుల సరస సల్లాపములను, వారి చేష్టలనుఁ జూచుటకు, సహస్ర రన్ధ్రీ కృతం = గడ్డిచేతను, కఱ్ఱలచేతను గూడి పెక్కు గవాక్షులు గలదిగా నిర్మింపబడిన, కౌతుకాగారం = మఙ్గల గృహమును, అనగా వధూవరులు శయనించుటకై రచితమగు శృంగార వేదికతోఁ గూడినదై గరిక గడ్డి యవల గడ్డి మున్నగు నూతనమఙ్గ ద్రవ్యములతోగూడి కుతూహలమును కల్గించెడి గృహమునుఁ గూర్చి, అగాత్ = వెళ్ళెను, యత్ = ఏగృహము, జిష్ణునా = జయశీలుడగు, అమునా = ఈ నలునిచేత (జిష్ణునా = ఇంద్రుని చేతయని ధ్వనించును), అధిష్ఠితం = అధిష్ఠింపఁ బడినదై, సహస్రాక్ష తనుత్ర మిత్రతాం; సహస్రాక్ష = వేయినేత్రములుగల ఇంద్రునియొక్క, తనుత్ర = కవచముయొక్క, మిత్రతాం = సామ్యమును (అనగా వేయి నేత్రములతోఁ జూచుటకై యింద్రుని కవచమందు వేయిరంధ్రములు చేయబడియున్నవని యర్థము) అధాత్ ఖలు = ధరించెను గదా!

సమాసములు :

*కౌతుకాఽగారమ్* - కౌతుకస్య అగారం = కౌతుకాగారం.

*సహస్రరన్ధ్రీకృతం* - సహస్రాణి రన్ధ్రాణి యస్య తత్ = సహస్రరన్ధ్రం అసహస్రరన్ధ్రం సహస్రరన్ధ్రం సమ్పద్యమానం కృతం = సహస్రరంధ్రీ కృతం, తత్ = సహస్ర రన్ధ్రీకృతం,

*సహస్రాక్ష తనుత్ర మిత్రం* - సహస్రాణి అక్షీణి యస్య సః = సహస్రాక్షః, తనుం త్రాయత ఇతి = తనుత్రం, సహస్రాక్షస్య తనుత్రం = సహస్రాక్షతనుత్రం, సహస్రాక్షతనుత్రేణ మిత్రం = సహస్రాక్షతనుత్ర మిత్రం, తత్ = సహస్రాక్షతనుత్రమిత్రం.

భావము :

వివాహవిధి పూర్తియైన పిదపనే యానలుడు అంతఃపురస్త్రీలు చూచుటకై వేయి రన్ధ్రములతోఁ గూడినదిగా నిర్మింపఁబడిన మఙ్గల గృహమునుఁ బ్రవేశించెను. ఆ మంగల గృహము, గడ్డి పుల్లలు మున్నగు వానితో వేయిరన్ధ్రములు

గలదిగా నిర్మింపఁ బడినదై వధూవరులు శయనించుటకు తగిన శృంగారవేదిక గలదై, గరిక, యవాఙ్కురములు మున్నగు మఙ్గలకరములగు ద్రవ్యములతోఁ గూడి శోభించుచున్నది. ఆ మఙ్గల గృహము జిష్ణువైన - జయశీలుఁడైన నలు నితో గూడినదై వేయికన్నులతోఁ జూచుట కనుకూలముగా నిర్మితమైన వేయి రన్ధ్రములుగల యింద్ర కవచమునుఁ బోలియుండినది. ఆ కవచముగూడ జిష్ణుఁ డనఁబడు నింద్రునిచే నధిష్ఠింపఁబడుచున్నది గదా॥46॥

శ్లో. అథాశనాయా నిరశేషి నో హ్రియా
న సమ్యగాలోకి పరస్పరక్రియా
విముక్తసమ్భోగ మశాయి సస్పృహం
వరేణ వధ్వా చ యథావిధి త్ర్యహమ్. 47

ప. వి. అథ-అశనాయా-నిరశేషి-నో-హ్రియా -న-సమ్యక్-ఆలోకి - పరస్పర క్రియా-విముక్తసమ్భోగమ్ - అశాయి - సస్పృహం-వరేణ-వధ్వా-చ- యథావిధి-త్ర్యహం.

అర్థము: అథ=కౌతుకగృహమునుఁ బ్రవేశించిన పిదప, వరేణ=వరుఁడైన నలుని చేతను, వధ్వా చ=వధువైన దమయంతిచేతను, యథావిధి= శాస్త్రము నతిక్రమింపక, త్ర్యహం=మూడు దినములు, అశనాయా= భోజనేచ్ఛ, నో నిరవశేషి=నిశ్శేషము చేయబడలేదు. అనగా కావలసి నంత భుజింపలేదు. హ్రియా=లజ్జచే, పరస్పరక్రియా=ఒండొరుల చేష్ట, సమ్యక్=చక్కఁగా, నాఽలోకి=చూడఁబడలేదు. తథా=అట్లే, విముక్తసమ్భోగం = సంభోగమునకు విముఖముగా, సస్పృహం= అభిలాషతోడనే, అశాయి = శయనింపఁబడుట జరిగినది. ఆపస్తం బుడు-"త్రిరాత్ర ముభయో రధఃశయ్యా బ్రహ్మచర్య మక్షార లవణాశి త్వఞ్చ" ఇత్యాదిగా మూడు రాత్రులు నేలఁ బరుండుట, బ్రహ్మచర్యము, కారము, ఉప్పులేని యాహారమును సేవించుట-మున్నగునవి నూతన వివా హము పొందిన దంపతులకు విహితములు.

సమాసములు :

అశనాయా-అశన మిచ్ఛతీతి=అశనాయా.

పరస్పర క్రియా-పరశ్చ పరశ్చ=పరస్పరౌ, పరస్పరయోః క్రియా =పరస్పరక్రియా,

విముక్తసమ్భోగం-విముక్తః సమ్భోగః యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా=విముక్తసమ్భోగం.

సస్పృహమ్-స్పృహయా సహితం యథా తథా=సస్పృహం

యథావిధి-విధి మనతిక్రమ్య=యథావిధి.

త్ర్యహం-త్రయాణా మహ్నాం సమాహారః=త్ర్యహః, తం=త్ర్యహం

భావము :

ఆ కౌతుక గృహమునుఁ బ్రవేశించిన వెంటనే వధూవరులు మూడు దినములు సిగ్గువలన నాకలి తీరునంతవరకును భుజింపలేదు. ఆ లజ్జ చేతనే యొండొరుల చేష్టలను చక్కఁగా చూచుకొనలేదు. అట్లే సంభోగమును వర్జించి పరస్పరానురాగము తోడనే యొక్కచోట శయనించిరి. ఈ విధముగా శాస్త్రము ననుసరించి త్రిరాత్రదీక్షను నడుపుకొనిరి. ఆపస్తంబుడును-నూతనముగా వివాహితులగు వధూవరులకు మూడు రాత్రులు నేలమీద శయనము, బ్రహ్మచర్యము అనగా నొండొరులకు సంగమము లేకయుండుట, కారము-ఉప్పు లేని యాహారము మున్నగు వానిని విధించెను. కాన నిట్లు యథావిధిగా వారు త్రిరాత్ర దీక్ష నాచరించిరని యాశయము. ॥47॥

శ్లో. కటాక్షణా జ్జన్యజనై ర్నిజప్రజాః
క్వచిత్పరీహాస మచీకర త్తరామ్,
ధరాఽప్సరోభి ర్వరయాత్రయాఽఽగతా
స భోజయత్ భోజకులాఙ్కురః క్వచిత్. 48

ప వి. కటాక్షణాత్ - జన్యజనైః - నిజప్రజాః - క్వచిత్ - పరీహాసమ్ - అచీకరత్తరామ్ - ధరాప్సరోభిః- వరయాత్రయా - ఆగతాన్ - అభోజయత్ - భోజకులాఙ్కురః- క్వ - చిత్.

అర్థము: భోజకులాఙ్కురః-భోజకుల = భోజ వంశమునకు, అఙ్కురః = కుమారుఁడైన, దమః = దమయంతి సోదరు డగు దముఁడు, క్వచిత్ = ఒక ప్రదేశమున, నిజప్రజాః = తన ప్రజలను, కటాక్షణాత్ = కడకంటితో సైగచేయుటవలన, జన్యజనైః = వరునికి సంబంధించిన మిత్ర జనములచే, పరీహాసం = ఎగతాలిని, అచీకరత్తరాం = అధికముగా చేయించెను, తథా = అట్లే, క్వచిత్ = ఒకచోట, వరయాత్రయా = వరునితోటి యుత్సవముతోడ, ఆగతాన్ = వచ్చినట్టి (జనాన్ = జనులను) ధరాప్సరోభిః = భూలోకపు టప్సరలగు, సుందరస్త్రీలతో, అభోజయత్ = భోజనముఁ జేయించెను.

సమాసములు :

జన్యజనైః- జన్యాశ్చ తే జనాశ్చ = జన్యజనాః, తైః = జన్యజనైః.
అచీకరత్తరామ్ - అతిశయేన అచీకరత్ = అచీకరత్తరామ్.

ధరాప్సరోభిః- ధరాయాః అప్సరసః = ధరాఽప్సరసః,తాభిః = ధరాఽప్సరోభిః.

వరయాత్రయా - వరస్య యాత్రా = వరయాత్రా, తయా = వరయాత్రయా.

భోజకులాఙ్కురః- భోజస్య కులం = భోజకులం, భోజకులస్య అఙ్కుర ఇవ, అఙ్కురః = భోజకులాఙ్కురః.

భావము :.

భోజవంశమునకు నంకురమువంటి దముడు, ఒక ప్రదేశమునం దనగా తన తండ్రి దృష్టికి గోచరముగాని చోట నలపక్షమున వచ్చిన మిత్రాదులతో పరిహాస గోష్ఠిని సలుపుటకు తన ప్రజను కంటితో సైగ

చేసెను, ఇచ్చట పరిహాస పాత్రులగు పట్టణములోని ప్రముఖ వేశ్యలను నియోగించెను. ఆ పరిహాసములు శ్లేష-వక్రోక్తి మున్నగువానితో నర్థాన్తరములను ప్రకటించుట మున్నగునవి. వివాహమునందు చిన్నవారిలోనే పరిహాసములు సముచితములు గాన "భోజకులాఙ్కురః" యని దమునికి విశేషణము చెప్పెను - 'క్వచిత్' అని తంత్రిదృష్టి గోచరము గానిచోట దీని నేర్పాటు చేయుటలోను, యువకులమధ్య పెద్దవారి దృష్టిపడని చోట దీనిని జరుపుటలోను ఔచిత్యము భావింపబడినది. అదే విధముగా మఱియొకచోట, నలునితోడ వరయాత్ర గావించిన నలపక్షమునకు జెందిన రాజలోకములను - భూలోకపు అప్సరసలా యనునట్లు దివ్య సౌందర్యముగల దాసీజనముతోడను, స్వైరిణులతోడను, సైరంధ్రుల తోడను తదితరులగు విలాసవతుల తోడను, పురస్త్రీలతోడను, వేశ్యల తోడను, వడ్డనలుఁ జేయించుచు భోజనములను గావింప జేసెనని యాశయము॥48॥

శ్లో. స కఞ్చి దూచే రచయన్తు తే మనో
పహార మత్రాఙ్గ! రుచే ర్యథోచితం
పిపాసతః కాంశ్చన సర్వతోముఖం
తదాఽర్పయన్తామపి కామ మోదనమ్ 49

ప. వి. సః- కం- చిత్- ఊచే- రచయన్తు- తే-మనోపహారం-అత్ర-అఙ్గ-రుచేః యథోచితం- పిపాసతః-కాః- చన-సర్వతోముఖం- తదా-అర్పయన్తామ్- అపి-కామమ్-ఓదనమ్.

అర్థము. సః = ఆ దముఁడు, కఞ్చిత్ = నలునిపక్షమునకుజెందిన యొకనిగూర్చి (తనపరిజనముచే) ఊచే = పలికెను, అఙ్గ! = ఓయీ వరయాత్రలో, బాల్గొనినవాడా! అత్ర = ఈ భోజనపాత్రయందు, లేదా, అత్ర = ఈ వడ్డనఁ జేయువారిమధ్యఁగాని, కాశ్చన = కొందఱుస్త్రీలు, (తవ = నీయొక్క) రుచేః = అభిలాషకు, యథోచితం = ఔచిత్యము నతిక్రమింపక, తేమనోపహారం, తేమన = మజ్జిగపులుసు యొక్క ఉపహారం = సమర్పణమును, రచయన్తు = చేయుదురుగాత; తథా = అట్లే, కామం = వలసినంత, దాహముగల్గిన, తే = నీకు, సర్వతోముఖం =

జలమును, దదతు=ఇత్తురుగాత, పరిహాసపక్షమున-అత్ర=ఈ వడ్డించు స్త్రీలమధ్య, కాఞ్చన=కొందఱు స్త్రీలు, అఙ్గరుచేః=స్తనములు, జఘనములు మున్నగు నవయవముల యందలి యభిలాషకు, ఉచితం = తగినట్లు, తే = నీయొక్క, మనోపహారం=మనస్సు నపహరించుటను, రచయన్తు=చేయుదురుగాత, తథా=అట్లే, పిపాసతః=అధరమును పానముఁ జేయగోరిన, తే=నీకు, కామమోదనం, కామ=మన్మథునకు, మోదనం=హర్షమును కల్గించునట్టి, ముఖం=ముఖమును, సర్వతః= అన్నివిధములుగను, అనగా సంపూర్ణభావముతో, అర్పయన్తాం=అర్పింతురు గాత!

వి. ఇచ్చట భోజనపక్షమునను పరిహాసపక్షమునను జెప్పఁబడిన యర్థములు రెండును ప్రకృతములుగాన కేవలప్రకృతశ్లేష.

సమాసములు :

తేమనోపహారం - తేమనస్య ఉపహారః = తేమనోపహారః, తం= తేమనోపహారం.

మనోపహారం - మనసః అపహారః=మనో౽పహారః, తం=మనోపహారం.

అఙ్గరుచేః - అఙ్గానాం రుచిః=అఙ్గరుచిః, తస్యాః=అఙ్గరుచేః.

యథోచితమ్ - ఉచిత మనతిక్రమ్య=యథోచితమ్.

పిపాసతః - పాతు మిచ్ఛుః=పిపాసుః, తస్య=పిపాసతః

సర్వతోముఖం - సర్వతః ముఖం యస్య తత్ = సర్వతోముఖం, తత్=సర్వతోముఖం.

కామమోదనం - కామస్య మోదనం = కామమోదనం, తత్=కామమోదనం.

భావము :

ఆ దమునియందలి పరిహాసమును శ్లేషభంగితోఁ బలువిధములుగా వర్ణించుచున్నాడు— ఆ దముడు వరునిపక్షమునకుచెందిన యొకనినిఁ జూచి "ఓయి మిత్రమా! ఈ ప్రదేశమందున్న కొందఱు స్త్రీలు దాహముగొన్న నీకు నుదకము నిత్తురు. అట్లే నీయభిలాషకుఁ దగినట్లు మజ్జిగపులుసు వడ్డింతురు. అట్లే వలసినంతటి యన్నమును వడ్డింపగలరు. కాన సుఖముగా భుజింపు" దని భోజనపక్షమున భావము.

పరిహాసపక్షమున— ఆ దముఁడు వరునిపక్షమునకుఁ జెందిన యొకనిని జూచి యిట్లు చెప్పఁదొడగెను. ఈ వడ్డించు వనితలలో కొందఱు తమ స్తనములు, జఘనములు మున్నగు నవయవములను జూపుటవలన నీకభిలాషనుఁ గల్గించిన వారై యథోచితముగా నీ మనస్సును హరింతురు గాత. అట్లే యధరపానముగోరిన లేదా చుమ్బనాదులను గోరిన నీకు నధరములు, నేత్రములు మున్నగు చుంబన స్థానములను జూపి వానితో మిక్కిలి యానందమునుగూర్చు తమ ముఖమును నొసంగుదురుగాత. పెక్కు చుంబనస్థానములు ముఖమునందే యుండుటవలన వారు ముఖమునే నీకిత్తురుగాత. ॥49॥

శ్లో. ముఖేన తేఽత్రోపవిశ త్వసా వితి
ప్రయాచ్య సృష్టానుమతిం ఖలాహసత్,
వరాజ్ఞభాగః స్వముఖం మతోఽధునా
స హి స్ఫుటం యేన కిలోపవిశ్యతే. 50

ప. వి:ముఖేన-తే-అత్ర-ఉపవిశతు-అసౌ-ఇతి-ప్రయాచ్య-సృష్టానుమతిం-ఖలా-అహసత్-వరాజ్ఞభాగః-స్వముఖం-మతః-అధునా - సః - హి - స్ఫుటం-యేన-కిల-ఉపవిశ్యతే.

అర్థము:- హే వరయాత్రిక = వరుని పక్షమునకుఁ జెందిన వాఁడా! అత్ర = ఈ పఙ్క్తియందు, అసౌ = ఈ జనము, తే = నీ యొక్క, ముఖేన = ముఖముతో, ననగా సమ్ముఖమున, ఉపవిశతు = భోజనమునకై

కూర్చుండునుగాత, అనగా భోజనమునకై కూర్చుండ నిమ్ము, ఇతి=ఇట్లు, ప్రయాచ్య=ప్రార్థించి, సృష్టానుమతిం; సృష్ట=ఒసంగఁబడిన, అనుమతిం = అనుజ్ఞ కల్గిన యొక వర పక్షమునఁ జెందిన వ్యక్తిని, ఖలా=ఒక దుష్ట స్త్రీ, అహసత్=పరిహసించినది. హి=ఏలయనగా, యేన=ఏ సాధనముచేననగా, అవయవ ప్రదేశముచే, ఉపవిశ్యతే=కూర్చొనబడునో, సః=ఆవరాఙ్గభాగము, అనగా గుహ్య ప్రదేశము, అమునా=తన సమ్ముఖమున కూర్చుండ ననుమతి నొసంగిన యీ వర పక్షములోని వ్యక్తిచే, స్ఫుటం=స్పష్టముగా, స్వముఖం=తన ముఖముగా, మతః=సమానమైనదిగా సమ్మతమైనది. నీ యెదుట భోజనమునకై యీతడు కూర్చుండు ననుటకై "ముఖేన ఉపవిశతు" అని చెప్పగా దానిలో "ముఖేన"యను పదమునకు, సమ్ముఖము=సమక్షము అను నర్థమునే గ్రహించెను. కాని మోము అను నర్థమును గ్రహింపలేదు. ఆ విధముగ సమ్ముఖ మను నర్థమునే గ్రహించి యాతనిని కూర్చుండ నిత డొప్పుకొనెను. అప్పు డా వక్రోక్తి నిపుణురాలగు నొక పరిచారిక, మోముతోఁ గూర్చుండుటకై యిత డనుమతి యొసంగినట్లు భావించి, కూర్చుండుటకుఁ దగిన శరీరావయవమైన గుహ్యప్రదేశ మితనికి మోముగా నుండుటకు సమ్మతమైనదా యని యుపహసించెనని యర్థము.

వి :- "ముఖేన తేఽత్రోపవిశ త్వసౌ" అను నెడ ముఖశబ్దమునకు సమ్ముఖము, ముఖము అను నర్థద్వయము నాధారముగాఁ గొని పరిహసించుట వలన శ్లేషాలఙ్కారము.

సమాసములు :

సృష్టానుమతిః—సృష్టా అనుమతిః యేన సః=సృష్టానుమతిః, తం=సృష్టానుమతిం.

వరాఙ్గభాగః-వరం చ తత్ అఙ్గం చ = వరాఙ్గం, వరాఙ్గస్య భాగః=వరాఙ్గభాగః.

స్వముఖం-స్వస్య ముఖం=స్వముఖం.

భావము :

ఓయి వరపక్షమునకుఁ జెందిన యతిథీ! ఇతనిని ఈ భోజన పఙ్క్తి యందు నీకు ముఖముతో ననగా సమ్ముఖమునందు గూర్చుండనిమ్ము. అని

ప్రార్థించి యనుమతి నొసంగిన యాయతిథిని, ఒక వక్రోక్తి నిపుణురాలగు వనిత, ఏ గుహ్యభాగముచేఁ గూర్చుండుట ప్రసిద్ధమో, ఆ గుహ్యదేశమును ఈ యనుమతి నొసంగిన వ్యక్తి, తన ముఖమునకు సమానముగా నున్నదిగా సమ్మతించెనా యని పరిహసించెను. ముఖముతోఁ గూర్చుండు మనగా సమ్ముఖమున ననగా సమక్షమునఁ గూర్చుండు మని యర్థము. కాని ముఖముతోఁ గూర్చుండుమని యర్థము వాస్తవికముగా లేదు. కాని ముఖముతోఁ గూర్చుండనిమ్ము అనుచోట యథాశ్రుతార్థమును "మోముతోఁ గూర్చుండుమని యా పరిచారిక చెప్పగా, దాని కర్లే యని యంగీకరించి కూర్చుండుట కత డనుమతి నొసంగగా, నతడు ముఖముతో గూర్చుండుటకు సమ్మతించెను గానఁ గూర్చుండుటకు సాధనమైన గుహ్యప్రదేశమును తన ముఖముగా నుండుటకు సమ్మతించెనని వక్రోక్తి కౌశలముతో వ్యాఖ్యానించి పరిహసించినదని యాశయము ॥50॥

శ్లో. యువా మిమే మే ప్రియతమే ఇతీరిణో
గలే తథోక్తా నిజగుచ్ఛ మేకికా
న భాస్యద స్తుచ్ఛగలో వదన్నితి
న్యధత్త జన్యాయ తతః పరాఽఽకృషత్. 51

ప. వి. యువామ్ - ఇమే - మే - ప్రియతమే - ఇతి- ఈరిణః-గలే-తథా-ఉక్తా-నిజగుచ్ఛమ్-ఏకికా-న-భాసి-అదః-తుచ్ఛగలః-వదన్-ఇతి - న్యధత్త-జన్యస్య-తతః-పరా-ఆకృషత్.

అర్థము: ఇమే = ఈ, యువాం = మీరిరువురు, మే = నాకు, ప్రియతమే = అధికమైన ప్రియలు, అనగా నితరులకంటె మిక్కిలి ప్రియురాండ్రు, ఇతి = అని, ఈరిణః = చెప్పుచున్న, జన్యస్య = వరపక్షమునకు సంబంధించిన పురుషునియొక్క, గలే = కణ్ఠమందు, తథా = చెప్పిన ప్రకారముగా, ఉక్తా = చెప్పఁబడిన, ఏకికా = ఆ యిద్దఱు స్త్రీలలో నొక్కతెయే, హేజన్య = ఓ వరుని మిత్రమా! అదః = ఈ, "మీ రిద్దఱు నాకు ప్రియతము" లనెడి మాటను, వదన్-చెప్పుచున్న, ( త్వమ్ = నీవు ) తుచ్ఛగలః = హారములు లేనందువలన శూన్యమగు కణ్ఠము గలవాడవగుచు, న భాసి = శోభింపవు. ఇతి = అని, (ఉక్త్వా = చెప్పి), నిజం = తనదైన,

గుచ్ఛం=ముప్పది రెండు పేటలు గల హారమును, న్యధత్త = ఉంచెను, తతః=అట్లు హారమునుంచిన తర్వాత, పరా తు=మఱి యొకస్త్రీయో, అదః = ఈ ("ఇమే మే") యను నయుక్తమైన శబ్దమును వదన్ = చెప్పుచు, ఛగలః=మేకగా, నభాసి=కానరావా? అనగా నిన్ను నీవు మేకనే చేసుకొనుచున్నావు, ఇతి=అని, ఆకృషత్ = ఆకర్షించెను. అనగా నీడ్చెను.

వ్యాఖ్యాన్తరము

ఇమే = ఈ ఎదుటనున్న, యువాం = మీరిఉవురు, మే=నాకు, తేన=ఆకారణముచే, ప్రితమే = మిక్కిలి ప్రియురాండ్రైన స్త్రీలు, ఇతి=అని, ఈరిణః=స్తుతి చేయుచున్న లేదా, నాకు మీదుమిక్కిలి ప్రియురాండ్రు కండు అని పరిహాసముగా మాట్లాడుచున్న, జనస్య= వరపక్షమునకుఁ జెందిన జనము యొక్క, గలే=కంఠమునందు, తథా =ఏ విధముగా నీచే జెప్పఁబడుచున్నదో, ఆ విధముగా చెప్పి, ఏకికా= వారిద్దఱిలో నొక్కతెయే, నిజగుచ్ఛం=తన హారమును, రజ్జుస్థానము నందలి హారవిశేషముగా చెప్పి, న్యధత్త=ఉంచెను. ఇతి=ఇట్లగునా ఏమి ? హేజన్య=ఓ మిత్రమా! త్వం=నీవు, అదః=పూర్వము చెప్పఁ బడిన, "ఇమే మే" అను పదమును, వదన్=చెప్పుచు తు= మఱల, ఛగలః=మేకగా, న భాసి=ప్రకాశింపవా? తప్పక ప్రకా శింతువు. మరియు తుచ్ఛగలః, తుచ్ఛ=స్తనశూన్యమైన, గలః=కణ్ఠము గలవాడై, న భాసి=ప్రకాశింపవు. మేకకు కణ్ఠమున స్తనము లుండును. నీవు "ఇమే మే" యని మేకవలె నఱచుచున్నను, కణ్ఠమున స్తనములు లేనందువలన శోభింపవు, మరియు త్రాడులేని కణ్ఠము గలవాడవై శోభింపవు గావున, త్రాటికి బదులు హారమును ధరించుచుంటివి కాన రెండువైపుల వ్రేలాడు హారమే కణ్ఠస్తన స్థానమం దుండును గాత. తతః=తర్వాత; పరా=మఱియొకస్త్రీ త్రాటినివలె నతని హారమునే పట్టుకొని మేకనువలె వానిని దూరమునకు లాగికొనిపోయెను. 'మిమే మే' యని యఱచు మేక త్రాటిచే కణ్ఠమునఁ గట్టి లాగబడుచున్నది. ఆ విధముగా నితడును లాగఁబడుటచే పరిహాసము. మరియు రిక్తకణ్ఠుఁడవై యనగా ఆ హారశూన్య మైన కణ్ఠము గలవాడవై శోభింపవని తనచేతియందున్న, గుచ్ఛం=

చిగుళ్ళపిడికిలిని, న్యధత్త=దాని కణ్ఠమం దుంచినది. పరా=మఱి యొక్కటియో, ఆకృషత్=నోటగట్టి నుంచిన మేకనువలె నాతనిని లాగెనని పరిహాసము. మఱియు ఇట్లు మమ్ములను 'ఇమే మే ప్రితమే' యని కొనియాడుచు, తుచ్ఛగలః=హారము లేనందువలన తుచ్ఛమగు గలః=కణ్ఠము గల్గిన వాడవగు నీవు, న భాసి=శోభింపవు, ఇతి=ఇట్లు చెప్పుచున్నదై, గలే=కణ్ఠమందు, హారం=హారమును పరితోషమువలన, న్యధత్త వా=ఉంచినదా యనిగాని యర్థము. లేదా,మనయందలి ప్రేమచే, మీరిద్దఱు నాకు మిక్కిలి ప్రియురాండ్రు అని చెప్పుచు నీవు తుచ్ఛగలు డవై శోభింపవు, నేనుగూడ నిన్ను వరింపవలసిన దానను, అని వరణమాల యొక్క స్థానమున హారమునే, న్యధత్త=వైచెను. మఱి యొక్కతె, అతనినిఁ బట్టుకొని పరిహాసమను నేరముచే సమ్భోగము కొఱకే లాగెనని యర్థము. లేదా 'మిమేమే' యని పరిహాసపక్షమున, 'యువామ్' అను నెడ బిందువునుఁ జార్చి "యువా"యని స్వీకరించి ఏవం వదన్=ఇట్లు చెప్పుచున్న, యువా=యువకుడవైన, ఛగలః-మేక, లేదా, తారుణ్యము గల మేక యనిగాని యన్వయించుకొనవలయును.

సమాసములు :

ప్రితమే - అతిశయేన ప్రియౌ=ప్రితమే.

నిజగుచ్ఛం- నిజ శ్చాసౌ గుచ్ఛశ్చ=నిజగుచ్ఛః. తమ్=నిజగుచ్ఛమ్.

ఏకికా-ఏకైవ=ఏకికా.

తుచ్ఛగలః- తుచ్ఛః గలః యస్య సః=తుచ్ఛగలః.

భావము ;

వరునిపక్షమున వచ్చిన యువకులలో నొక్క డచ్చట పరివేషణాదులు గావించుచున్న యిరువురు యువతులతో పరిహాసకేళికి దిగెను. ఆ యువకుఁడు ఆ యిఱువురు స్త్రీలను వలచినవాడై మీ రిరువుఱురును నాకు మిక్కిలి ప్రియు రాండ్రు అని అర్థము వచ్చునట్లు "యువా మిమే మే ప్రితమే" యని పలికెను. అట్లు పలికిన యా యువకునిగూర్చి యా యిద్దఱు స్త్రీలలో నొక్కతె 'యోయువ

కుడా! 'ఇమే మే ఇత్యాడి మాట్లాడుచున్న నీవు హారశూన్యకణ్ఠుడవై శోభింపక యున్నావని చెప్పుచు తనకణ్ఠమందలి ముప్పదిపేటలు గల్గిన గుచ్ఛమను హారము నతనికణ్ఠమునందు వైచినది. ఆ విధముగ హారమువైచినపిదప మఱియొక స్త్రీయో 'మేమే' అనెడి యయుక్తమగు శబ్దమునుఁ జెప్పుచు నీవు మేకవై శోభించుట లేదు. 'మేమే' యని మేక యఱచుట ప్రసిద్ధము కదా! అనగా నీవు నిన్ను మేకనుగాఁ జేసికొంటివి—అని చెప్పుచు లాగికొనిపోయినది. ఇది సంభోగమున కని సూచితము.

మఱియొక పక్షమున :

ఆ వరపక్షమునకుఁ జెందిన పురుషుడు – ఈ నా యెదుటనున్న మీరిఱు వురు స్త్రీలును ఉత్తమ స్త్రీలు. మీవంటి స్త్రీరత్నము లెచ్చటనుఁ జూడబడలేదని వారిని స్తుతి గావించెను. లేదా ఎదుటనున్న మీరిఱువురును నాకు సంబంధించిన స్త్రీలు కందని పరిహాసవచనము. ఆ విధముగా పరిహాసముఁ జేయుచున్న యాతని కణ్ఠమున తన ముప్పదిరెండు పేటల హారమును త్రాటికి బదులుగా వైచినదై 'ఓ మిత్రమా! నీవు తొలుత "ఇమే మే" అని యఱచుచు మేకవై శోభించుట లేదు. కాని మేకవలె నఱచుచు మేకగనే శోభించుచున్నావు. నీవు మేకవలె నఱచు చున్నను మేకకుండెడి కణ్ఠమందలి స్తనములు లేనందువలన గూడ నీవు మేక వలె శోభింప లేకయున్నావు. మఱియు మేక కున్నట్లు నీకు కణ్ఠమున త్రాడు లేదు. అందువలనను నీవు శోభింపవు. దానికై నీవు హారమును ధరించినచో నదియే వ్రేలాడుచు మెడత్రాటివలెను మెడలోని స్తనమువలెను నుండఁగలదు. తర్వాత మఱియొక్కతె, మెడత్రాటివలె తన హారమును వాని కణ్ఠమునందు వైచి వానిని మేకను లాగికొని పోయినట్లే చాల దూరము లాగికొని పోయెను. మేక "మిమేమే" శబ్దమునుఁ జేయుచుండగా లాగికొని పోఁబడుచుండును. ఆవిధముగ నితడు లాగికొని పోఁబడె ననుట యొక పరిహాసము. మఱియు కంఠమున లేదా నోట గడ్డి మున్నగు నాహారము లేనందువలన నీవు మేకవలె శోభింప లేదని తలంచి నిజగుచ్ఛమును - తన చేతనున్న చిగురాకు గుత్తిని అతని నోట బల, వంతముగ పెట్టగా ఇంకొక స్త్రీ యాతనిని మేకను లాగికొని పోయినట్లు లాగికొని పోయెననియు పరిహాసము. ఇట్లే మా యిఱువురినిఁ గొనియాడుచు హారము లేనందువలన తుచ్ఛమగు కణ్ఠము గల్గిన నీవు శోభింపవని చెప్పుచు సంతోషవశ

మున నాతని కణ్ఠమున తనహారము నుంచియుండవచ్చు ననిగాని యర్థము, లేదా మాయెడ ప్రేమతో, మీరు నాకు మిక్కిలి ప్రియురాండ్రని చెప్పుచు, నీవు శూన్య కణ్ఠము గలవాడవై శోభించుటలేదు. నేనుగూడ నిన్ను వరింపవలసి యున్నదని పుష్పమాలకు బదులుగా హారమునే యొకతె వైచినది. అప్పుడు మఱియొకతె వానినిఁ బట్టుకొని పరిహాసమును నెపముతో, సంభోగము కొఱకే లాగికొని పోయెను. ''మిమేమే'' యను పరిహాస పక్షమున 'యువామ్' అను నెడ చివరి బిందువును జార్చి ''ఏవం వదన్ యువౌ తరుణ శ్ఛగలః'' అని ఇట్లు మాట్లాడు యువకుఁడు యౌవనముగల మేక యను నర్థమున కనుగుణముగా నన్వయింప వలయును. ఇట్లు వివిధములగు నన్వయములతో నర్థ మీ శ్లోకమందు గ్రాహ్యము ॥51॥

శ్లో. నలాయ వాలవ్యజనం విధున్వతీ
దమస్య దాస్యా నిభృతం పదేర్పితాం
అహాసి లోకైః సరటాత్ పటోజ్ఘినీ
భయేన జఙ్ఘాయతి లఙ్ఘి రంహసః. 52

ప. వి:- నలాయ-వాలవ్యజనం-విధున్వతీ-దమస్య-దాస్యా - నిభృతం - పదే- అర్పితాం - అహాసి-లోకైః - సరటాత్ - పటోజ్ఘినీ - భయేన - జఙ్ఘాయతి లఙ్ఘి రంహసః.

అర్థము. నలాయ = నలునికై, వాలవ్యజనం = చామరమును, విధున్వతీ = విసరుచున్న అనగా వీచుచున్న యొకస్త్రీ, దమస్య = దమయన్తి సోదరుడైన దముని యొక్క, దాస్యా = పరిచారికచే, నిభృతం = రహస్యముగా, పదే = పాదమునందు, అర్పితాత్ = ఉంచఁబడిన, జంఘాయతిలఙ్ఘిరంహసః జంఘా = మోకాలియొక్క; ఆయతి = పొడవును, లంఘి = అతిక్రమించునట్టి, రంహసః వేగముగల్గిన, అనగా మోకాలి పైకెక్కెడి వేగముగల్గిన, సరటాత్ = తొండనుండి, భయేన = భయముచే, పటోజ్ఘినీ పట = వస్త్రమును, ఉజ్ఘినీ = విడచుచున్నదై యనగా వస్త్రము లేనిదై, లోకైః = జనులచే, అహాసి = పరిహసింపఁబడినది.

సమాసములు :

పటోజ్ఝినీ—పట ముజ్ఝతీతి=పటోజ్ఝినీ.

జఙ్ఘాయతిలఙ్ఘిరంహసః—జఙ్ఘాయాః ఆయతిః=జఙ్ఘాయతి:, జఙ్ఘాయతేః లంఘి=జంఘాయతిలంఘి, జంఘాయతిలఙ్ఘీ రంహః యస్య సః=జఙ్ఘాయతిలఙ్ఘిరంహః, తస్మాత్=జంఘాయతిలఙ్ఘిరంహసః.

భావము :

ఒక స్త్రీ నలుని వింజామరతో వీచుచుండినది. అప్పుడు దముని దాసి గుట్టుగా నావింజామరముచే వీచు స్త్రీయొక్క పాదముపై తొండను వదలిపెట్టినది. అది యా స్త్రీయొక్క మోకాలిపైకిఁ బ్రాకుటవలని భయముచే నామె వస్త్రము జారిపోయినది. దానివలన నామె నగ్నత నొందగా జనులందఱు నవ్విరి. ఇది యొక పరిహాసచేష్ట॥52॥

శ్లో. పురఃస్థలాఙ్గూల మదాత్ ఖలా బృషీ
ముపావిశత్ తత్ర ఋజు ర్వరద్విజః,
పున స్తముత్థాప్య నిజాఽమతే ర్వదాఽ
హసచ్చ పశ్చాత్కృతపుచ్ఛతత్పదా. 53

ప వి. పురఃస్థలాఙ్గూలమ్-అదాత్-ఖలా-బృషీమ్-ఉపావిశత్ - తత్ర - ఋజుః-వరద్విజః - పునః - తమ్ - ఉత్థాప్య-నిజాఽమతేః-వదా-అహసత్-చ-పశ్చాత్ కృత పుచ్ఛతత్పదా.

అర్థము : ఖలా=పోకిరియైన ఒక స్త్రీ, బృషీం=వ్రత మాచరించునట్టివారు కూర్చుండెడి దర్భాసనమును, పురఃస్థలాఙ్గూలం;పురఃస్థ=ముందున్నట్టి; లాఙ్గూలం=తోకకదిలగా (వరద్విజాయ=వరుని పక్షమునకుఁ జెందిన బ్రాహ్మణునకు) అదాత్=ఇచ్చినది, తత్ర=ఆ యాసనమునందు, ఋజుః=సరళుఁడైనట్టి అనగా నాస్త్రీయొక్క చాతుర్యమునుఁ దెలియనట్టి, వరద్విజః=వరుని పక్షమునకుఁ జెందిన బ్రాహ్మణుఁడు, ఉపావిశత్=

కూర్చుండెను. పునః = తర్వాత, నిజామతేః-నిజ = తనకు సంబంధించిన, అమతేః = అజ్ఞానమును గూర్చి, అనగా నేను తెలియక, తలక్రిందుగా నాసనమును వైచితి నని తన యజ్ఞానమునుఁగూర్చి. వదా = చెప్పుచున్న (సా) ఆ పోకిరియైన స్త్రీ; తం = ఆ బ్రాహ్మణుని, ఉత్థాప్య = ఆసనము నుండి లేపి, పశ్చాత్కృతపుచ్ఛతత్ప్రదా; పశ్చాత్కృత = వెనుకకు మరలింపఁబడిన, పుచ్ఛ = తోక గల్గిన, తత్ ఆయాసనమును, ప్రదా ఇచ్చినదై, అహసచ్చ = నవ్వినది.

సమాసములు :

పురఃస్థలాఙ్గూలమ్ - పురః తిష్ఠతీతి = పురఃస్థం, పురఃస్థం లాఙ్గూలం యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = పురఃస్థలాఙ్గూలమ్.

వరద్విజః - వరస్య ద్విజః = వరద్విజః.

నిజామతేః - న మతిః = అమతిః, నిజా చ సా అమతిశ్చ = నిజామతిః, తస్యాః = నిజమతేః.

పశ్చాత్కృతపుచ్ఛతత్ప్రదా - పశ్చాత్, కృతః = పశ్చాత్కృతః, పశ్చాత్కృతః పుచ్ఛః యస్యాః సా = పశ్చాత్కృతపుచ్ఛా, పశ్చాత్కృత పుచ్ఛా చాసౌ సా చ = పశ్చాత్కృతపుచ్ఛతత్, తత్ = పశ్చాత్కృత పుచ్ఛాం తాం ప్రదదాతీతి = పశ్చాత్కృతపుచ్ఛతత్ప్రదా, తాం = పశ్చా త్కృతపుచ్ఛతత్ప్రదాం.

భావము :

ఒక పోకిరియైన స్త్రీ, యతులు కూర్చుండెడి ''బృసి'' యను నాసనమును, ముందు దాని తోక యుండునట్లుగా, వరునిపక్షమునకుఁ జెందిన బ్రాహ్మణున కొసంగెను. అమాయకుడగు నాబ్రాహ్మణుఁడు ఆధూర్తురాలియొక్క కౌటిల్యమును, జాతుర్యమునుఁ దెలియనివాడై దానిపైఁ గూర్చుండెను. తర్వాత నాస్త్రీ, ముందు తోకనుంచి యా''బృసి'' యను నాసనమునుఁ బఱచినందులకు, దన యజ్ఞానమునుఁ జెప్పుకొనుచున్నదై యా బ్రాహ్మణుని లేపి, యా యాసనము యొక్క తోకను వెనుకకుఁ ద్రిప్పి, దాని నతని కొసంగి నవ్వినది. ఏల యనగా

ఆ యాసనముయొక్క తోక ముందువైపున నున్నచో నాతని తొడలమధ్యకు నా యాసనపు తోక చొచ్చుకొనుటవలన నది యాతని రహస్యావయవముగాఁ గనఁ బడునని యా తుంటరిస్త్రీ చేసినది. ఆ విషయ మతనికి తెలియనందువలన నా యాసనపు తోకను వెనుకకు మరలించి యాతనిని పశుతుల్యునిగాఁ జేసినది. వెనుక తోకకల్గినది పశువే గదా! ఈ బ్రహ్మణుడును నా యాసనముయొక్క తోకను వెనుకకు మరలించుకొనుటవలన వెనుక తోకను ధరించినవాఁడై పశుతుల్యుడుగాఁ జేయఁబడినవాడై యాతుంటరిస్త్రీయొక్క పరిహాసమునకుఁ బాత్రుఁ డాయెనని యాశయము ॥౫౩॥

శ్లో. స్వయంకథాభి ర్వరపక్షసుభ్రువః
స్థిరీకృతాయాః పదయుగ్మమన్తరా
పరేణ పశ్చా న్నిభృతం న్యధాపయ
ద్దదర్శ చాదర్శతలం హసన్ ఖలః. 54

ప. వి. స్వయం-కథాభిః-వరపక్షసుభ్రువః-స్థిరీకృతాయాః - పదయుగ్మమ్ - అన్తరా-పరేణ-పశ్చాత్-నిభృతం - న్యధాపయత్-దదర్శ - చ-ఆదర్శ తలం-హసన్-ఖలః.

అర్థము : ఖలః = ఒక తుంటరి, స్వయం = తాను, కథాభిః = ఇష్టులతోటి సల్లాపములతో, స్థిరీకృతాయాః = నిశ్చలముగా చేయఁబడిన, వరపక్షసుభ్రువః; వరపక్ష = వరుని పక్షమునకుఁ జెందిన, సుభ్రువః = ఒకానొక స్త్రీయొక్క, పదయుగ్మ మంతరా = పాదముల జంటకు మధ్యభాగమున, పరేణ = మఱియొక పురుషునిచే, పశ్చాత్ = వెనుక, నిభృతం = గూఢముగా, ఆదర్శతలం = అద్దముపై భాగమును ననగా వెల్లకిల బెట్టిన యద్దమును, న్యధాపయత్ = ఉంచునట్లు చేసెను. హసన్ = నవ్వుచు; దదర్శ చ = చూచెను. ఆ యద్దమునందు వరాఙ్గప్రతిబింబము కనబడుట వలన హాసము కల్గినదని భావము.

సమాసములు :

వరపక్ష సుభ్రువః -వరస్య పక్షః = వరపక్షః, వరపక్షస్య సుభ్రూః = వరపక్షసుభ్రూః, తస్యాః = వరపక్షసుభ్రువః.

స్థిరీకృతాయాః-అస్థిరా స్థిరా సమ్పద్యమానా కృతా=స్థిరీకృతా, తస్యాః =స్థిరీకృతాయాః

పదయుగ్మం- పదయోః యుగ్మం=పదయుగ్మం-తత్=పదయుగ్మం

ఆదర్శతలం- ఆదర్శస్య తలం=ఆదర్శతలం, తత్=ఆదర్శతలం.

భావము:

తుంటరి యొకడు, తనంతట నిష్టులతో సల్లాపము చేయుట యందలి యాసక్తిచే నొడలు మఱచి యిటునటు కదలక నిలచియున్న వరపక్షమునకు చెందిన యొక యువిదయొక్క పాదముల జంటకు మధ్యభాగమున మఱియొక పురుషునిచే వెనుభాగమున రహస్యముగా నద్దమును వెల్లకిలగా నుంచెను. తర్వాత నవ్వసాగెను. ఏలయనగా పాదములకు రెంటికి నడుమ నద్దము నుంచగానే, యా యువిదయొక్క వరాఙ్గము అందు ప్రతిబింబించుటచే పరిహాసము గావించెనని యాశయము॥54॥

శ్లో. అథోపచారోద్ధురచారులోచనా
విలాసనిర్వాసితధైర్యసమ్పదః
స్మరస్య శిల్పం వరవర్గవిక్రియా
విలోకకం లోక మహాసయన్ ముహుః. 55

ప. వి. అథ - ఉపచారోద్ధురచారులోచనా విలాస నిర్వాసితధైర్య సమ్పదః—స్మరస్య-శిల్పం- వరవర్గ విక్రియా విలోకకం - లోకమ్-అహాసయత్-ముహుః.

అర్థము: అథ = పిదప, ఉపచారోద్ధురచారులోచనా విలాస నిర్వాసిత ధైర్య సమ్పదః, ఉపచార=సేవలయందు, ఉద్ధుర=ఆసక్తి గల్గిన, చారు లోచనా = అందములైన నేత్రములుగల స్త్రీల యొక్క, విలాస = విలాసములచే, నిర్వాసిత = తొలగింపఁబడిన, ధైర్యసమ్పదః = ధైర్యాతిశయముగల్గిన, స్మరస్య = మన్మథునియొక్క, శిల్పం = సృష్టి, అనగా మన్మథుఁడు గావించిన సృష్టియగు నతిసుందరీజనము,

వరవర్గ విక్రియావిలోకకం; వరవర్గ = నలుని పక్షమునకుఁజెందిన రాజసమూహమునకు, విక్రియా = వికారము కల్గించు నందగత్తెలను, విలోకకం = చూచుజనమును, ముహుః = పలుమాఱు, అహాసయత్ = నవ్వింపఁ జేసినది లేదా, ఉపచార = పరివేషణములయందు, ఉద్ధుర = ఆసక్తిగల్గినవారును, చారులోచనా = అందములైన నేత్రములు గల యువతులయొక్క, విలాస = విలాసములచే, నిర్వాసిత = తొలగింపబడిన, ధైర్యసంపదః = ధైర్యసంపదగల్గిన, స్మరస్య = మన్మథుని యొక్క, శిల్పం = విలసితము, వరవర్గవిక్రియావిలోకకం; వరవర్గ = వరునిపక్షమునకుఁ జెందిన రాజలోకముయొక్క, విక్రియా = వికారమును, విలోకకం = చూచునట్టిజనమును, ముహుః = పలుమాఱు, అహాసయత్ = నవ్వించెను.

సమాసములు :

ఉపచారోద్ధురచారులోచనా విలాస నిర్వాసితధైర్యసంపదః - ఉపచారేషు ఉద్ధురాః = ఉపచారోద్ధురాః, చారూణి లోచనాని యాసాం తాః = చారులోచనాః, ఉపచారోద్ధురాశ్చ తాః చారులోచనాశ్చ = ఉపచారోద్ధుర చారులోచనాః, ఉపచారోద్ధురచారులోచనానాం విలాసాః = ఉపచారోద్ధుర చారులోచనావిలాసాః, ఉపచారోద్ధురచారులోచనావిలాసైః నిర్వాసితా, ఉపచారోద్ధురచారులోచనావిలాసనిర్వాసితా, ధైర్యస్య సంపత్ = ధైర్యసంపత్, ఉపచారోద్ధురచారులోచనానిర్వాసితా, ధైర్యసంపత్ యేన సః, ఉపచారోద్ధురచారులోచనావిలాసనిర్వాసితధైర్యసమ్పత్, తస్య = ఉపచారోద్ధుర చారులోచనావిలాసనిర్వాసిత ధైర్యసంపదః.
వరస్య వర్గః = వరవర్గః, వరవర్గస్య విక్రియాః = వరవర్గవిక్రియాః, వరవర్గవిక్రియాణాం విలోకకః = వరవర్గవిక్రియావిలోకకః, తం = వర వర్గవిక్రియా విలోకకం.

భావము :

ఇంతవరకును కామవిలాస రహితపరిహాసములు జరిగినవి. ప్రకృతము కామవిలాసముతో గూడిన పరిహాసములు వర్ణింపఁబడుచున్నవి.

నలపక్షమునకుఁ జెందిన రాజలోకమునకు నచ్చటి పరిచారకస్త్రీలు మిక్కిలి కామవికారమునుఁ గల్గించుచున్నవారై యచ్చటి ప్రేక్షకులగు నలపక్షపురాజులనుఁ జూచి నవ్వింపసాగిరి. ఆ స్త్రీలు కటాక్షములనుఁ బ్రసరింపఁజేయుచు, తమ యనురాగమును వెల్లడిపఱచునట్టివియు, ప్రీతితో చూచుటయం దాసక్తి కల్గినవియు, మిక్కిలియందములైన నేత్రములుగలవారై, కడకంటిచూపులఁ బర్వుటచే విలాసవంతులగు పురుషుల ధైర్యసంపదను తొలగింపఁజేసెడి మన్మథుని సృష్టికౌశలరూపముగల యతిసుందరీమణులుగా నున్నారు. అట్టి సుందరీ మణులు వరునిపక్షమునకుఁ జెందిన విలాసవంతులకుఁ గల్గునట్టి మన్మథ వికార ములనుఁ జూచుచుండు జనులను నవ్వింపజేయుచుండిరని భావము. అనగా నచ్చటి పరిచారికల సౌందర్యవిలాసదర్శనముచేత నలునిపక్షపు రాజలోకమునకు మన్మథవికారములు కల్గినవని యాశయము. ॥౫౫॥

శ్లో. తిరోవలద్వక్త్రసరోజనాలయా
స్మితే స్మితం యత్ఖలు యూని బాలయా
తయా తదీయే హృదయే నిఖాయ తత్
వ్యధీయతాఽసముఖ్మలక్ష్యవేధితా. 56

ప.వి. తిరోవలద్వక్త్ర సరోజనాలయా — స్మితే - స్మితం — యత్ - ఖలు - యూని - బాలయా - తదీయే - హృదయే-నిఖాయ - తత్ - వ్యధీయత- అసమ్ముఖలక్ష్యవేధితా.

అర్థము: తిరోవలద్వక్త్ర సరోజనాలయా; తిరోవలత్ = అడ్డముగా త్రిప్పబడి నట్టి, వక్త్రసరోజ = ముఖపద్మమునకు, నాలయా = కాడవంటి కంఠము గల్గిన, బాలయా = ఒకయువతిచే, యూని = ఒక యువకుఁడు, స్మితే సతి = మందహాసముచేయగా, యత్ = ఏ, స్మితం, ఖలు = చిఱునగవు నవ్వుట అనగా సిగ్గుచే ముఖముత్రిప్పుకొని, ఏహాస్యము చేయఁబడినదో, తయా = ఆయువతిచే, తదీయే = ఆచిఱునగవు నవ్విన యువకునికి సంబంధించిన, హృదయే = హృదయమందు, తత్ = ఆచిఱునగవు, నిఖాయ = గాఢముగాఁ బ్రవేశించి, అసమ్ముఖలక్ష్యవేధితా; అసమ్ముఖ

=పార్శ్వమందున్న, లక్ష్య = గుఱిని, వేధితా=కొట్టుట, (తనకు) వ్యధీయత=విధింపఁబడినది. ఆచిఱునగవు, ఆమె ప్రక్కనున్న గుఱిని గొట్టు బాణముగా నేర్పడినది.

సమాసములు :

*తిరోవలద్వక్త్రసరోజనాలయా*-తిరః, వలత్ = తిరోవలత్, వక్త్ర మేవసరోజం=వక్త్రసరోజం, వక్త్రసరోజస్య నాలం = వక్త్రసరోజ నాలం, తిరోవలత్ వక్త్రసరోజనాలం యస్యాస్సా = తిరోవలద్వక్త్ర సరోజనాలా, తయా=తిరోవలద్వక్త్రసరోజనాలయా.

**అసమ్ముఖ లక్ష్యవేధితా** - న సమ్ముఖం= అసమ్ముఖం అసమ్ముఖం చ తత్, లక్ష్యం చ = అసమ్ముఖలక్ష్యం, అసమ్ముఖలక్ష్యస్య వేధితా = అసమ్ముఖలక్ష్యవేధితా.

భావము :

ఒకానొక యువకుడు అనురాగముతో నొక యువతినిఁ జూచి చిఱునవ్వును నవ్వగనే, ఆ యువతి తన ముఖకమలనాళమును నడ్డముగా త్రిప్పి గావించిన చిఱునగవు వాని హృదయమునందు నాటుకొనినదై యా యువతికి ప్రక్కనున్నట్టి లక్ష్యమును ననగా నేరుగా నెదుటలేని లక్ష్యమును గొట్టునట్టి సామర్థ్యమును గల్పించినది. పరాఙ్ముఖమైన గుఱిని గొట్టుట విలుకాని నైపుణ్యమునుఁ జాటును. ఆ యువకుఁడు తాను తన యనురాగమును వెల్లడిఁ గావించుటకై యువతినిఁ జూచి చిఱునగవుఁ గావించెను. అప్పు డా యువతి చిఱునగవు గావించి సిగ్గుచెందగా నప్పు డామె తనయెడ ననురక్తురాలని నిశ్చయించుకొనిన యా యువకుని, ఆమెయొక్క చిఱునగవే కామబాణమై పీడించినదని భావము. ఆమె బాల్యయౌవనమధ్యస్థురాలు గాన నామె సమ్ముఖముగా చిఱునగవునుఁ గావించలేకపోయినది. ప్రౌఢయైనచో నెదుటనే నవ్వును. కాన నా యువతి ప్రక్కగా తిరిగి గావించిన చిఱునగవు, ఆ యువకుని హృదయమున బాణమువలె నాటినదని యాశయము. ॥౬౭॥

శ్లో. కృతం యదన్యత్ కరణోచితత్యజా
దిదృక్షు చక్షుర్యదవారి బాలయా
హృద స్తదీయస్య తదేవ కాముకే
జగాద వార్తా మఖిలాం ఖలే ఖలు. 57

ప. వి: కృతం-యత్-అన్యత్-కరణోచితత్యజా-దిదృక్షు-చక్షుః-యత్-అవారి-బాలయా-హృదః-తదీయస్య-తత్ - ఏవ - కాముకే - జగాద - వార్తామ్-అఖిలాం-ఖలే-ఖలు.

అర్థము: కరణోచితత్యజా; కరణ=క్రియకు, ఉచిత=తగినదానిని, ననగా కర్తవ్యమును ననగా పరివేషణాదికమును, త్యజా = విడుచుచున్న, బాలయా=ముందుఁ జెప్పఁబడిన యువతిచే, అన్యత్=చేయఁగూడనిది, యత్=ఏది, కృతం=చేయబడినదో, తథా=అట్లే, దిదృక్షు= చూడగోరికగల్గిన, చక్షుః=తనకన్ను, యత్=ఎందువలన, అవారి= చూడవలసిన విషయము నుండి వారింపఁబడినదై మఱియొక వంకకు మఱలింపఁబడినదో, తదేవ=కర్తవ్యమునుఁ జేయకపోవుట, దృష్టిని మఱలించుటయను రెండే, తదీయస్య=ఆ యువతికి సంబంధించిన, హృదః=హృదయమునకు, అఖిలాం=సమగ్రమైన, వార్తాం= సమాచారమును, ఖలే=ధూర్తుడైన, అనగా నింగితాదులచే నభిప్రాయ మునుఁ దెలుసుకొనుటకు చాతుర్యముగల, కాముకే=కాముకుని విషయము నందు, జగాద ఖలు=చెప్పెనుగదా. కర్తవ్యమునుఁ జేయనందువలన నా యువతికి నితరునియం దాసక్తిని తనవైపునకు జూపనీయక దృష్టిని మఱియొక వైపునకు మఱలించుటవలన లజ్జను నూహించి యాపె తన యెడ నాసక్తురాలై సిగ్గుపడియున్నదని యా కాముకుఁడు ఊహించెనని యర్థము.

సమాసములు :

కరణోచితత్యజా - కరణస్య ఉచితం=కరణోచితం, కరణోచితం త్యజతీతి=కరణోచితత్యక్, తయా=కరణోచితత్యజా.
తదీయస్య-తస్యాః ఇదం=తదీయం, తస్య=తదీయస్య.

భావము :

ఆయువతి చేయవలసిన పరివేషణాదులను( జేయకయుండుటవలనను, మఱొకనిని( జూడ నిచ్ఛగల కంటిని మఱియొకవైపునకు మఱలించుటవలనను, ఆమెహృదయమందలి సమగ్రభావము నాధూర్తుడగు కాముకుడు తెలిసికొని యామెకు తనయందు నాసక్తి యున్నదనియు నందువలననే నామె సిగ్గు( జెంది తనదృష్టిని మఱియొకవైపునకు మరలించినదనియు నూహించుకొనెను. ॥85॥

శ్లో. జలం దదత్యాః కలితానతే ర్ముఖం
వ్యవస్యతా సాహసికేన చుమ్బితుం
పదే పతద్వారిణి మందపాణినా
ప్రతీక్షితోఽన్యేక్షణవఞ్చనక్షణః. 59

ప. వి:- జలం-దదత్యాః-కలితానతేః-ముఖం-వ్యవస్యతా-సాహసికేన-చుమ్బితుం పదే-పతద్వారిణి-మందపాణినా-ప్రతీక్షితః-అన్యేక్షణవఞ్చనక్షణః.

అర్థము:- జలం=ఉదకమును, దదత్యా=పోయుచున్న, (కావుననే) కలితానతేః, కలిత=చేయ(బడిన, ఆనతేః=శరీరమును వంచుట గల్గిన యొకానొక స్త్రీ యొక్క, ముఖం=మోమును, చుమ్బితుం=ముద్దుపెట్టుకొనుటకు, వ్యవస్యతా=ప్రయత్నించుచున్న, (కావుననే) మన్దపాణినా=నీటిని(దీసికొనుట యందు నాలస్యము వహించిన హస్తము గల్గిన, సాహసికేన=వివేచన లేనట్టి ఒకానొక కాముకునిచే, పదే=తన పాదము, పతద్వారిణి సతి; పతత్=జారుచున్న, వారిణి సతి=ముద్దుపెట్టుకొనుటకున్న యాసక్తిచే నాలస్యము జరుగుటకు తనపాదముపై మెల్లమెల్లగా నీటిని వదలుచుండగా, అన్యేక్షణ వఞ్చనక్షణః, అన్య=ఇతర జనులయొక్క, ఈక్షణ=దృష్టిని, వఞ్చన=వంచించుటకు, క్షణః=సమయము, ప్రతీక్షితః=ఎదురుచూడ( బడినది.

సమాసములు :

కలితానతేః-కలితా, ఆనతిః యయా సా=కలితానతిః, తస్యాః=కలితా నతేః.
సాహసికేన-సహసా కృతం=సాహసం,సాహసే ప్రవృత్తః=సాహసికః, తేన=సాహసికేన.
పతద్వారిణి-పతత్ వారి యస్మిన్ తత్=పతద్వారి, తస్మిన్=పత ద్వారిణి.
మన్దపాణినా - మన్దః పాణిః యస్య సః=మన్దపాణిః, తేన=మన్ద పాణినా.
అన్యేక్షణవఞ్చనక్షణః- అన్యేషా మీక్షణాని=అన్యేక్షణాని, అన్యేక్ష ణానాం వఞ్చనం=అన్యేక్షణవఞ్చనం, అన్యేక్షణవఞ్చనే క్షణః = అన్యేక్షణ వఞ్చనక్షణః.

భావము :

ఒక యువతి వంగి నీరు నిచ్చుచున్నది. ఆ స్త్రీయొక్క ముఖము తన కంఠమునకు దాపుగా నుండుటవలన దానిని చుంబనము చేయుటకు నాత డామె పోయు నీటిని గ్రహించుటకు తనహస్తము నుపయోగించుటలో విలమ్బము జేయు చుండెను. లేదా తన హస్తములోని వ్రేళ్ళలో సందులు వచ్చునట్లు చేసి నీటిని త్రాగు నెపమున జారవిడుచుచుండెను. ఇట్లు చేయుటచే కొంత తడవు ఏర్పడును గాన నామెను సమయముం జూచి ముద్దిడుకొనవచ్చునని యతని యుద్దేశము. అట్టి సాహస కృత్యమునకు దిగిన యాకాముకుఁడు నీటిని త్రాగిన పిదప,ఇంకను తడవును సంపాదించుకొనుటకై యామె నీటిని పోయుచుండగా దానిని తనచేతి వ్రేళ్ల సందులనుండి పాదములపై బడునట్లు చేయుచు నామెను ముద్దిడుకొనుటకు నా ప్రక్కయందలి జనుల దృష్టి మఱియొక వైపునకు మఱలుటకై యెదురు చూచుచుండెను. అనగా నతని ప్రక్కనున్న జనులు మఱియొకవైపు చూచుచున్న తరుణమున నాతడా యువతిని ముద్దిడ గోరి యుండె నని భావము. ఆ యువతి పోయు నీ రొకపక్షమునఁ ద్రాగుటకనియు మఱియొక పక్షమున పాదములను, గడుగుకొనుటకనియు భావింపవలసి యున్నది॥౫౮॥

శ్లో॥ యువాన మాలోక్య విదగ్ధశీలయా
స్వపాణి పాథోరుహ నాలనిర్మితః,
శ్లథోఽపి సఖ్యాం పరిధిః కలానిధౌ
దధా వహో తం ప్రతి గాఢబంధతామ్. 59

ప. వి. యువానమ్ - ఆలోక్య - విదగ్ధశీలయా - స్వపాణి పాథోరుహనాల నిర్మితః - శ్లథః - అపి - సఖ్యాం - పరిధిః - కలానిధౌ - దధౌ - అహో - తం - ప్రతి - గాఢబంధతాం.

అర్థము. విదగ్ధశీలయా-విదగ్ధ=గడుసుఁదనము గల్గిన, శీలయా=స్వభావము గల్గిన, కయాచిత్=ఒకానొక, తరుణ్యా=యువతిచే, యువానం=ఒకానొక యువకుని, ఆలోక్య=చూచి. కలానిధౌ=గీతము, వాద్యము మున్నగు నఱువది నాలుగు కళలయందు నిధియైన, సఖ్యా=చెలికత్తె యందు, పక్షాన్తరమున, సఖ్యాం=చెలికత్తెయొక్క రూపముననున్న, కలానిధౌ = చంద్రునియందు, స్వపాణి పాథోరుహనాల నిర్మితః, స్వ=తనయొక్క, పాణి=హస్తములనెడి లేదా భుజములనెడి, పాథోరుహనాల=పద్మపు కాడలచే, నిర్మితః=నిర్మింపఁబడిన, అనగా నా యువకుని నాలింగించుకొనుటకై చేయఁబడిన, పరిధిః=చెలికత్తెను తన భుజములతో చుట్టి పట్టుకొనుటకైన వలయము అనగా చెలికత్తెను, కౌగలించుటకైన వలయము, పక్షాన్తరమున, పరిధిః=చంద్రునిచుట్టు నేర్పడు పరివేషము, శ్లథోఽపి=శిథిమైనను, తం ప్రతి=ఆయువకుని గూర్చి, గాఢబంధతాం=బిగువైన కౌగలింపును, దధౌ=పోషించెను. ఆమె చెలికత్తెను తన భుజములతో చుట్టి పట్టుకొని చేసిన కౌగలింపు, ఆ యువకునకు గాఢాలిఙ్గన సుఖమునుఁ గల్గించినదని యర్థము. అనగా నా యువతి తన్ను, కౌగిలింపగోరి తనకోరికను సూచించుటకై చెలికత్తెను కౌగలించెనని యర్థము.

వి. చెలికత్తెనుఁ గౌగలించుటచే, నా యువకునకు గాఢాలిఙ్గనసుఖము కల్గుట యసఙ్గతము కాన కార్యకారణములకు భిన్నములైన యధికరణము లున్నచో నది యసఙ్గత్యలఙ్కారము.

సమాసములు :

కలితానతేః-కలితా, ఆనతిః యయా సా=కలితానతిః, తస్యాః=కలితానతేః.
సాహసికేన-సహసా కృతం=సాహసం,సాహసే ప్రవృత్తః=సాహసికః, తేన=సాహసికేన.
పతద్వారిణి-పతత్ వారి యస్మిన్ తత్=పతద్వారి, తస్మిన్=పతద్వారిణి.
మన్దపాణినా - మన్దః పాణిః యస్య సః=మన్దపాణిః, తేన=మన్దపాణినా.
అన్యేక్షణవఞ్చనక్షణః- అన్యేషా మీక్షణాని=అన్యేక్షణాని, అన్యేక్షణానాం వఞ్చనం=అన్యేక్షణవఞ్చనం, అన్యేక్షణవఞ్చనే క్షణః = అన్యేక్షణ వఞ్చనక్షణః.

భావము :

ఒక యువతి వంగి నీరు నిచ్చుచున్నది. ఆ స్త్రీయొక్క ముఖము తన కంఠముబాటుగా నుండుటవలన దానిని చుంబనము చేయుటకు నాత-డామె పోయు నీటిని గ్రహించుటకు తనహస్తము నుపయోగించుటలో విలమ్బము జేయుచుండెను. లేదా తన హస్తములోని వ్రేళ్ళలో సందులు వచ్చునట్లు చేసి నీటిని త్రాగు నెపమున జారవిడుచుచుండెను. ఇట్లు చేయుటచే కొంత తడవు ఏర్పడును గాన నామెను సమయముఁ జూచి ముద్దిడుకొనవచ్చునని యతని యుద్దేశము. అట్టి సాహస కృత్యమునకు దిగిన యాకాముకుఁడు నీటిని త్రాగిన పిదప,నింకను తడవును సంపాదించుకొనుటకై యామె నీటిని పోయుచుండగా దానిని తనచేతి వ్రేళ్ల సందులనుండి పాదములపై బడునట్లు చేయుచు నామెను ముద్దిడుకొనుటకు నా పఙ్క్తియందలి జనుల దృష్టి మఱియొక వైపునకు మఱలుటకై యెదురు చూచుచుండెచు. అనగా నతని ప్రక్కనున్న జనులు మఱియొకవైపు చూచుచున్న తరుణమున నాతడా యువతిని ముద్దిడ గోరి యుండె నని భావము. ఆ యువతి పోయు నీ రొకపక్షమునఁ ద్రాగుటకనియు మఱియొక పక్షమున పాదములను, గడుగుకొనుటకనియు భావింపవలసి యున్నది॥౯౮॥

శ్లో॥ యువాన మాలోక్య విదగ్ధశీలయా
స్వపాణి పాథోరుహ నాలనిర్మితః,
శ్లథోఽపి సఖ్యాం పరిధిః కలానిధౌ
దధా వహో తం ప్రతి గాఢబంధతామ్. 59

ప. వి. యువానమ్ - ఆలోక్య - విదగ్ధశీలయా - స్వపాణి పాథోరుహనాల నిర్మితః - శ్లథః - అపి - సఖ్యాం - పరిధిః - కలానిధౌ - దధౌ - అహో - తం - ప్రతి - గాఢబంధతాం.

అర్థము. విదగ్ధశీలయా - విదగ్ధ = గడుసుఁదనము గల్గిన, శీలయా = స్వభావము గల్గిన, కయాచిత్ = ఒకానొక, తరుణ్యా = యువతిచే, యువానం = ఒకానొక యువకుని, ఆలోక్య = చూచి. కలానిధౌ = గీతము, వాద్యము మున్నగు నఱువది నాలుగు కళలయందు నిధియైన, సఖ్యా = చెలికత్తె యందు, పక్షాన్తరమున, సఖ్యాం = చెలికత్తెయొక్క రూపముననున్న, కలానిధౌ = చంద్రునియందు, స్వపాణి పాథోరుహనాల నిర్మితః, స్వ = తనయొక్క, పాణి = హస్తములనెడి లేదా భుజములనెడి, పాథోరుహనాల = పద్మపు కాడలచే, నిర్మితః = నిర్మింపఁబడిన, అనగా నా యువకుని నాలింగించుకొనుటకై చేయఁబడిన, పరిధిః = చెలికత్తెను తన భుజములతో చుట్టి పట్టుకొనుటకైన వలయము అనగా చెలికత్తెను, కౌగలించుటకైన వలయము, పక్షాన్తరమున, పరిధిః = చంద్రునిచుట్టు నేర్పడు పరివేషము, శ్లథోఽపి = శిథిలమైనను, తం ప్రతి = ఆయువకుని గూర్చి, గాఢబంధతాం = బిగువైన కౌగలింపును, దధౌ = పోషించెను. ఆమె చెలికత్తెను తన భుజములతో చుట్టి పట్టుకొని చేసిన కౌగలింపు, ఆ యువకునకు గాఢాలిఙ్గన సుఖమునుఁ గల్గించినదని యర్థము. అనగా నా యువతి తన్ను, కౌగిలింపగోరి తనకోరికను సూచించుటకై చెలికత్తెను కౌగలించెనని యర్థము.

వి. చెలికత్తెనుఁ గౌగలించుటచే, నా యువకునకు గాఢాలిఙ్గనసుఖము కల్గుట యసఙ్గతము కాన కార్యకారణములకు భిన్నములైన యధికరణము లున్నచో నది యసఙ్గత్యలఙ్కారము.

శిథిలమగు గౌగలింపులచే గాఢబంధత్వ మేర్పడుట విషమముకాన విష మాలఙ్కారము ఈ రెండలఙ్కారములకును సఙ్కరము.

భావము :

గడుసుకత్తెయగు సుందరి ఒక యువకుని జూచి యాతనిని దృఢముగా గౌగలించుకొనుటకై తన యభిలాషను సూచించుటకొఱకు, చతుఃషష్టికళలకు నిధియగు తన చెలికత్తెపై షోడశకళలకు నిధియై చెలికత్తెవలె నాచరించు చంద్రునిపై తన బాహువులనెడి తామరకాడలచే పరివేష్టనమును (చుట్టి కట్టుకొనుటను) చంద్రుని చుట్టు పరివేషమువలె చేసినది. ఆ యువతి చంద్రుని చుట్టును పరివేషము వేసినట్టుగా తన చెలికత్తెను తన బాహువులతో పరివేష్టించి కౌగలింపగా నా యువకునకు గాఢాలింగనసౌఖ్య మేర్పడినది. ఈ విధముగా నామె తన చెలికత్తెను కౌగలించుటచే తన కా యువకుని కౌగలించుటవలని సుఖమును తాను కౌగిలించుకొనుట వలన నా యువకునికి సుఖమును గల్గినవి. ఆమె యా చెలికత్తెను చేసిన కౌగిలింపు వదలుగా నున్నను నా యువకుని విషయమున నది దృఢముగనే యుండినది. ఆ యువతి తన బాహు మృణాలములతో కలానిధియైన చెలికత్తెను గౌగలించుకొనుట, చంద్రుఁ డనెడి మిత్రునిఁ జుట్టు తన బాహు మృణాలములతో బరివేష్టించి, చేయఁబడిన పరివేష్టనముగా నైనది. ఆ యువతి యా యువకుని జూచి యట్లు తన చెలికత్తెకుఁ గావించిన పరివేష్టన మతనిని నా విధముగా చేసిన ట్లత డన్వయించుకొనఁగల్గెను. కలానిధియైన చంద్రుని పరివేష్టనముతో రూపించుట వలన నా యువకుడు కలానిధియగు చంద్రునితో రూపింపఁబడుట యేర్పడుచున్నది ॥౫౯॥

శ్లో. నతభ్రువః స్వచ్ఛనఖానుబిమ్బన
చ్ఛలేన కోఽపి స్ఫుటకమ్పకణ్టకః,
పయో దదత్యా శ్చరణే భృశం క్షతః
స్మరస్య బాణైః శరణే న్యవిక్షత. 60

ప.వి:- నతభ్రువః-స్వచ్ఛనఖానుబిమ్బనచ్ఛలేన-కః-అపి - స్ఫుటకమ్పకణ్టకః-పయః-దదత్యాః-చరణే-భృశం-క్షతః-స్మరస్య-బాణైః-శరణే-న్యవిక్షత.

అర్థము:- స్మరస్య = మన్మథునియొక్క, బాణైః = బాణములచే, భృశం = మిక్కిలి, క్షతః = గాయపరుపఁ బడినట్లున్న (కావుననే), స్ఫుటకమ్ప కణ్టకః, స్ఫుట = స్పష్టములైన, కమ్ప = వణకు, కణ్టక = పులకము లను సాత్త్విక భావములు గల్గిన, కోఽపి = ఒకానొక యువకుఁడు, పయః = పాలను, లేదా జలమును, దదత్యాః = ఇచ్చుచున్న, అనగా వడ్డించుచున్న, నతభ్రువః = ఒకానొక సుందరియొక్క, స్వచ్ఛనఖాను బిమ్బనచ్ఛలేన; స్వచ్ఛ = నిర్మలములైన, నఖ = గోళ్ళయందు, అను బిమ్బన = ప్రతిబింబించుటయను, ఛలేన = వ్యాజముచే, చరణే = పాదము లనే, శరణే = రక్షకములుగా, న్యవిక్షత = ప్రవేశించెను.

వి:- యువకుఁడు యువతిగోళ్ళయందు ప్రతిబింబించుట యను వ్యాజమున ఆమె పాతములను శరణుఁ జొచ్చెనో యని భావించుటవలన సపహ్నా వముతో గూడిన యుత్ప్రేక్ష. వ్యఞ్జకమును, ప్రయోగించనందువలన నది గమ్యము.

సమాసములు :

స్వచ్ఛనఖానుబిమ్బనచ్ఛలేన — స్వచ్ఛాశ్చ తే నఖాశ్చ = స్వచ్ఛనఖాః, స్వచ్ఛనఖేషు అనుబిమ్బనం స్వచ్ఛనఖానుబిమ్బనం. స్వచ్ఛనఖాను బిమ్బనస్య ఛలం = స్వచ్ఛనఖానుబిమ్బనచ్ఛలం, తేన స్వచ్ఛనఖాను బిమ్బనచ్ఛలేన.

స్ఫుటకమ్పకణ్టక :- కమ్పశ్చ కణ్టకశ్చ = కమ్పకణ్టకౌ, స్ఫుటౌ కమ్పకణ్టకౌ యస్య సః — స్ఫుటకమ్పకణ్టకః

భావము :

ఆ పఙ్క్తిలో నొక యువకుఁడు మన్మథబాణములచే మిక్కిలి కొట్టబడిన వాని వలె శరీరమున స్పష్టముగా గానవచ్చు వణకు పులకములు గలవాడై పాలనో లేక యుదకమునో వడ్డించుచున్న యొకానొక సుందరియొక్క స్వచ్ఛము లైన కాలి గోళ్ళయందు ప్రతిబింబించుట యను నెపమున నామెయొక్క పాదము లను శరణుఁజొచ్చెనో యను నట్లుండెను. ॥60॥

శ్లో. ముఖం యదస్మాయి విభజ్య సుభ్రువా
హ్రియం యదాలమ్బ్య నతాస్య మాసితమ్।
అవాది వా యన్మృదుగద్గదం యువా
తదేవ జగ్రాహ తదాప్తిలగ్నకమ్. 61

ప. వి. ముఖం-యత్-అస్మాయి-విభజ్య-సుభ్రువా-హ్రియం-యత్-ఆలమ్బ్య-నతాస్యమ్-ఆసితం-అవాది-వా-యత్-మృదు-గద్గదం-యువా-తత్-ఏవ-జగ్రాహ-తదాప్తిలగ్నకం.

అర్థము: సుభ్రువా=ఒకానొక సుందరిచే, ముఖం=మోము, విభజ్య=కుటిలముగావించి, లేదా చిట్లించి, యత్=ఎందువలన, అస్మాయి=నవ్వఁబడినదో, తథా=అట్లే, హ్రియం=సిగ్గును, ఆలమ్బ్య=పొంది, యత్=ఎందువలన, నతాస్యం, నత=వంచబడిన, ఆస్యం=మోము గల్గునట్లుగా, ఆసితం=ఉండుట యేది గలదో, తథా=అట్లే, మృదు=మెల్లగా, గద్గదం=అస్ఫుటాక్షరములు గల్గునట్లుగా, యత్=ఏది, అవాది వా=చెప్పఁబడినదో, యువా=ముందుఁ జెప్పబడిన యువకుఁడు, తదేవ=ఆమాటినే, యనగా ముఖమును వికృతముఁ గావించి నవ్వుట, సిగ్గుతో తలవంచుకొని యుండుట, మెల్లగా, కొతుకుతో మాట్లాడుట యను నీమూటనే, తదాప్తౌ=ఆమెను పొందుటయందు, లగ్నకః=జామీనుగా ననగా ప్రమాణముగా, జగ్రాహ=గ్రహించెను, అ విధమగు ననురాగమును వెల్లడి పఱచుట వలన నీమె నాయెడ గాఢమగు ననురాగము గల్గియున్నది కావున నాకు సుఖముగా లభింపఁగలదని నిశ్చయించుకొనెను.

సమాసములు :

నతాస్యమ్-నతం, ఆస్యం యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా=నతాస్యమ్.
తదాప్తిలగ్నకం-తస్యాః ఆప్తిః=తదాప్తిః, తదాప్తౌ లగ్నకః=తదాప్తిలగ్నకః, తం=తదాప్తిలగ్నకం.

భావము :

ఒకానొక యువతి తన మోమును కొంచెము చిట్లించుకొని నవ్వుటవలనను సిగ్గుచే తలను వంచుకొని యుండుటవలనను, మెల్లగా కౌతుకుగా మాట్లాడుట వలనను, ముందుఁ జెప్పఁబడిన యువకుఁడు ఆ మూడు చేష్టలనే యామెను పొందుటకు సాధనములుగను జామీనుగనుఁ దలంచెను. అనగా నీమె నాయెడ ననురాగమునుఁ బై చేష్టలచే వెల్లడి చేసినది గాన నీమె నాయం దనురక్తురాలు కావున నాకు సుఖముగా లభింపగలదని నిశ్చయించుకొనెను. ॥61॥

శ్లో॥ విలోక్య యూనా వ్యజనం విధున్వతీ
మవాప్త సత్త్వేన భృశం ప్రసిష్విదే
ఉదస్తకణ్ఠేన మృషోష్మనాటినా
విజిత్య లజ్జాం దదృశే తదాననమ్. 62

ప వి. విలోక్య-యూనా-వ్యజనం-విధున్వతీం-అవాప్తసత్త్వేన - భృశం - ప్రసిష్విదే-ఉదస్తకణ్ఠేన- మృషోష్మనాటినా-విజిత్య-లజ్జాం - దదృశే-తదాననమ్.

అర్థము: వ్యజనం = విసనకఱ్ఱను, విధున్వతీం = వేచుచున్న (యొకానొక స్త్రీని) విలోక్య = చూచి, అవాప్త సత్త్వేన; అవాప్త = పైకి యుద్భవించిన, సత్త్వేన = సాత్త్వికభావముగల, యూనా = ఒకానొక యువకునిచే, భృశం = మిక్కిలి, ప్రసిష్విదే = చెమట పొందబడినది. మృషోష్మ నాటినా; మృషా = అసత్యపు; ఊష్మ = వేడిని, నాటినా = నటించునట్టి, అనగా, నా సాత్త్విక భావముచే నేర్పడిన చెమటను మఱుగుపఱచుటకై యసత్యపువేడిమిని వెల్లడి చేసెడి, ఉదస్తకంఠేన = మెడను పైకెత్తిన (ఆ యువకునిచే) లజ్జాం = సిగ్గును, విజిత్య = జయించి, అనగా సిగ్గును వదలి తదాననం; తత్ = ఆ యువతియొక్క, ఆననం = మోము; దదృశే = (విసనకఱ్ఱవలని గాలికొఱకై) చూడఁబడినది.

వి. ఇచ్చట ఆగన్తుకనుగు వేడివలన చెమటచే సహజమగు సాత్త్వికభావజన్య తేన=మగు స్వేదము మఱుగుఁజేయఁబడినది గాన మీలనాలఙ్కారము

సమాసములు :

అవాప్తసత్త్వేన - అవాప్తం సత్త్వం యేన సః=అవాప్తసత్త్వః, అవాప్త సత్త్వేన.
ఉదస్తకణ్ఠేన-ఉదస్తః కణ్ఠః యేన సః=ఉదాస్తకణ్ఠః, తేన=ఉదస్త కణ్ఠేన.
మృషోష్మనాటినా - మృషాఽసౌ ఉష్మా చ=మృషోష్మా, మృషోష్మాణం నాటయతీతి = మృషోష్మనాటీ, తేన=మృషోష్మనాటినా.

భావము :

ఒకానొక యువతి విసనకఱ్ఱను, జేఁబట్టి విసరుచున్నది. ఆమె నొక యువకుఁడు గాంచి స్వేదాది సాత్త్విక భావములచే మిక్కిలి చెమటగొన్నవాఁడాయెను. అతడు దానిని గప్పిపుచ్చుటకై ఎండవేడిమివలన శరీరమునకు సంతాపము గల్గుచున్నదని జెప్పుచు దానివలనఁ జెమట యేర్పడినట్లు ప్రకటించుకొనుచు ఆ చెమటవలననో యనునట్లు తనమెడను పైకి నిక్కబెట్టుకొనినవాడై, యావిసన కఱ్ఱవలని గాలికొఱకో యనునట్లు అమె మోమును వీక్షించెను. 62

శ్లో॥ స తత్కుచ స్పృష్టకచేష్ట దోర్లతా
చలద్దలాభవ్యజనానిలాకులః,
అవాప నానానలనాలశృఙ్ఖలా
నిబద్ధపీడోద్భవ విభ్రమం యువా. 63

ప. వి:-సః-తత్-కుచస్పృష్టకచేష్ట దోర్లతాచలద్దలాభ వ్యజనానిలాకులః-అవాప-నానానలనాల శృఙ్ఖలానిబద్ధ పీడోద్భవ విభ్రమం-యువా.

అర్థము:- సః=ముందుఁ చెప్పఁబడిన యువకుఁడు, తత్కుచస్పృష్ట కచేష్టదోర్లతా చలద్దలాభ వ్యజనానిలాకులః; తత్ =ఆ యువతియొక్క, కుచ=స్తనముల

యొక్క, స్పృష్టక = ఒరిపిడియను, చేష్ట = చేష్టగల్గిన, దోర్లతా = బాహు వనెడి లతయొక్క, చలద్దల = కదలుచున్నయాకువలె, ఆభ = ప్రకాశించు, వ్యజన = విసనఱ్ఱకయొక్క, అనిల = గాలితో, ఆకులః = పరవశుఁడై అనగా నామె కుచములతో నొరయుచున్న భుజములనుఁ జూచుటచే నేర్పడిన భావమువలన చాంచల్యము నొందినవాడై, నానానలనాల శృఙ్ఖలా నిబద్ధ నీడోద్భవ విభ్రమం; నానా = పెక్కు విధములైన, నల = గడ్డి జాతుల యొక్క, నాల = దంటులతోఁ బేనఁబడిన, శృఙ్ఖలా = గొలుసు వంటి త్రాటిచే, నిబద్ధ = బంధింపబడిన, నీడోద్భవ = పక్షియొక్క, విభ్రమం = విలాసమును, అవాప = పొందెను. ఆమె కుచంబుల నొరయు భుజములనుఁ జూపుచు కామాతురయైన యా యువతినిఁ గౌగలింపఁ గోరిక గల్గిన వాడయ్యెను, జనుల యెదుట నవ్విధముగాఁ జేయలేనివాడై గట్టి త్రాటితోఁ గట్టఁబడిన పక్షియొక్క సాదృశ్యమును వహించియుండెనని యర్థము.

సమాసములు :

తత్కుచ స్పృష్టక చేష్టదోర్లతా చలద్దలాభ వ్యజనానిలాకులః-
తస్యాః కుచౌ = తత్కుచౌ, తత్కుచయోః స్పృష్టకం = తత్కుచ స్పృష్టకం, తత్కుచ స్పృష్టక మేవ చేష్టా యస్యాః సా = తత్కుచ స్పృష్టక చేష్టా, దోః లతా ఇవ = దోర్లతా, తత్కుచ స్పృష్టక చేష్టా చ సా దోర్లతా చ = తత్కుచ స్పృష్టక దోర్లతా, చలచ్చ తత్ దలం చ = చలద్దలం, తత్కుచ స్పృష్టక చేష్ట దోర్లతాయాః. చలద్దలం = తత్కుచ స్పృష్టక చేష్టదోర్లతాచలద్దలం, తత్కుచ స్పృష్టక చేష్టదోర్లతా చల ద్దలస్య ఆభేవ ఆభా యస్య తత్ = తత్కుచ స్పృష్టక చేష్టదోర్లతాచల ద్దలాభం, తత్కుచ స్పృష్టకచేష్టదోర్లతా చలద్దలాభం చ వ్యజనం చ = తత్కుచ స్పృష్టక చేష్టదోర్లతా చలద్దలాభవ్యజనం, తత్కుచ స్పృష్టక చేష్టదోర్లతాచలద్దలాభవ్యజనస్య అనిలః = తత్కుచ స్పృష్టక చేష్టదోర్లతా చలద్దలాభవ్యజనానిలః, తత్కుచస్పృష్టకచేష్టదోర్లతాచలద్దలాభవ్యజనాని లేన ఆ కులః = తత్కుచస్పృష్టకచేష్ట దోర్లతా చలద్దలాభ వ్యజనానిలా కులః.

నానానలనాల శృఙ్ఖలానిబద్ధ నీడోద్భవ విభ్రమం -
నానావిధాశ్చ తే నలాశ్చ = నానానలానాం నాలః = నానానలనాలః, నానానలనాలేన శృఙ్ఖలా = నానానలనాలశృఙ్ఖలా, నానానలనాల శృఙ్ఖలయా నిబద్ధః = నానానలనాల శృఙ్ఖలానిబద్ధః, నీడే ఉద్భవః యస్య సః = నీడోద్భవః, నీడోద్భవస్య విభ్రమః = నీడోద్భవవిభ్రమః, నానానలనాలశృఙ్ఖలా నిబద్ధనీడోద్భవస్య విభ్రమ ఇవ విభ్రమః యస్య సః = నానానలనాల శృఙ్ఖలానిబద్ధనీడోద్భవవిభ్రమః. తం = నానానలనాల శృంఖలా నిబద్ధనీడోద్భవ విభ్రమం.

భావము :

ఆ యువకుఁడు విసనకఱ్ఱతో వీచుచున్న యా యువతియొక్క కుచముల నొరయుట యను క్రియ గల్గిన యామె భుజలతల కేర్పడిన చలించునట్టి యాకు వంటి శోభ గల్గిన విసనకఱ్ఱయొక్క గాలిచే పరవశుడై ఆమెకుచముల నొరయు బాహువులనుఁ జూపుచు కామార్తయై యున్న యామెనుఁ గౌగలింప గోరిక గల్గిన వాడైనను ఆ జనుల సమక్షమునం దట్లు చేయ నశక్తుఁడై పలురకములగు గడ్డి జాతులచే గొలుసుగాఁ బేనఁబడిన త్రాటితో బంధింపబడిన పక్షితోటి పోలికను వహించి యామెను సమీపింపలేక యుండెను. ॥63॥

శ్లో. అవచ్ఛటా కాఽపి కటాక్షణస్య సా
తథైవ భఙ్గీ వచనస్య కాచన
యథా యువాభ్యా మనునాయనే మిథః
కృశోఽపి దూతస్య న శేషితః శ్రమః. 64

ప.వి:- అవచ్ఛటా - కా - అపి-కటాక్షణస్య-సా-తథా-ఏవ-భఙ్గీ-వచనస్య-కా-చన-యథా - యువాభ్యామ్- అనునాయనే-మిథః-కృశః-అపి-దూతస్య-న-శేషితః-శ్రమః.

అర్థము:- సా = తత్కాలమునకు సంబంధించిన, కాఽపి = చెప్పసాధ్యముకాని, కటాక్షణస్య = కడకన్నులను చూపుల యొక్క, అవచ్ఛటా = పరమ్పర,

తథా = అట్లే, వచనస్య = పరస్పర సంభాషణము యొక్క, కాచన ఏవ = అనిర్వాచ్యమైన, భఙ్గీ = వక్రోక్తి మున్నగువాని రూపమైన భఙ్గి, (జాతా = ఏర్పడినది), యయా = ఏ, కటాక్షణ పరమ్పరచేతను, వక్రోక్తి మున్నగు వచనముల భంగిచేతను, యువభ్యాం = యువతిచేతను, యువకుని చేతను, మిథః = పరస్పరము, అనునాథనే = ప్రార్థించుకొనుట యందు, దూతస్య = వృత్తాన్తమును, గొనిపోయెడి వానికిని, కృశః = కొంచెమైనను, శ్రమః = ప్రయాస, న శేషితః = మిగులఁబెట్టఁబడలేదు. స్వయముగనే పరస్పర సంభాషణాదులచే కలయిక యేర్పడుటవలన వారి మధ్య సంధానకుశలురగు దూతాదుల యవసరము లేకపోయినదని యర్థము.

సమాసములు ;

కటాక్షణస్య-కటాక్షస్య కరణం = కటాక్షణం, తస్య = కటాక్షణస్య.

భావము ;

యువతీ యువకుల మధ్య తార్పుకాం డ్రెవ్వరు నవసరము లేకయే వారికి పరస్పర సంబంధము లేర్పడినవి. ఏల యనగా ఆకాలమందలి యువతీ యువకుల యనిర్వచనీయములైన కడకన్నుల చూపుల పరమ్పర, వక్రోక్తిగర్భమగు వారి సంభాషణపరమ్పర, ఆ యువతీ యువకులలో నొండొరుల ప్రణయ సంబంధములకు సాధనములైనందువలన, నా విషయమున దూతల యవసరము వారికి లేకపోయినదని యాశయము. అనగా వారి పరస్పర కటాక్షణములు, పరస్పరచతుర సల్లాపములు మిక్కిలి యపూర్వములై యుండినవని యాశయము. ॥64॥

శ్లో. పపౌ న కశ్చిత్ క్షణ మాస్య మీక్షితం
జలస్య గణ్డూష ముదీతసమ్పదః
చుచుమ్బ తత్ర ప్రతిబిమ్బితం ముఖం
పురః స్మర స్త్వాః స్మరకార్ముకభ్రువః. 65

ప. వి. పపౌ-న-కః-చిత్-క్షణమ్- ఆస్యమ్-ఈక్షితం-జలస్య-గణ్డూషమ్- ఉదీతసమ్మదః-చచుమ్బ - తత్ర-ప్రతిబిమ్బితం-ముఖం-పురః-స్ఫురన్త్యాః-స్మరకార్ముకభ్రువః.

అర్థము: ఉదీతసమ్మదః, ఉదీత = ఉదయించిన, సమ్మదః = సంతోషముగల్గిన, కశ్చిత్ = ఒకానొక, యువా = యువకుఁడు, పురఃస్ఫురన్త్యాః, పురః = ఎదుట, స్ఫురన్త్యాః = ఉండుచున్న, స్మరకార్ముకభ్రువః, స్మరకార్ముక = మన్మథుని ధనస్సు వంటి, భ్రువః = కనుబొమ్మలు గల్గిన (కస్యాశ్చిత్ = ఒకానొక జలదాసి యొక్క), ఆస్యలాలితం; ఆస్య = ముఖముతో, లాలితం = మిశ్రితమైన, అనగా ముఖ ప్రతిబింబముతోఁ గూడిన, జలస్య = నీటి యొక్క, గణ్డూషం = పుక్కిలింపును, అనగా పానము చేయుటకై తీసుకొనఁబడిన పుక్కిలింపు జలమును, క్షణం = క్షణకాలము, న పపౌ = త్రాగలేదు, అట్లు త్రాగినచో ఆ దాసియొక్క ముఖ ప్రతిబింబము నిలువదుగదా, కావున క్షణ మాగి యాజలముచే పుక్కిలింపు గావించి పానము గావించెనని యాశయము. అనగా నా జలమందుఁ ప్రతిబింబించిన యా ముఖమును ముద్దిడుకొనెనని యర్థము.

సమాసములు :

ఉదీతసమ్మదః-ఉదీతః సమ్మదః యస్య సః = ఉదీతసమ్మదః.

పురఃస్ఫురన్త్యాః-పురః స్ఫురన్తీ = పురఃస్ఫురన్తీ, తస్యాః = పురఃస్ఫురన్త్యాః.

స్మరకార్ముకభ్రువః-స్మరస్య కార్ముకం = స్మరకార్ముకం, స్మరకార్ముకమివ భ్రూః యస్యాః సా = స్మరకార్ముకభ్రూః, తస్యాః = స్మరకార్ముకభ్రువః.

భావము :

సంతోషము కల్గిన ఒక యువకుఁడు తన యెదుట నున్నదనియు, మన్మథుని విల్లువంటి వంపైన కనుబొమ్మలు కలదియు నగు నొక జలదాసి యనగా నీటినిఁ దెచ్చు స్త్రీయొక్క ముఖప్రతిబిమ్బముతో గూడిన జలమును పుక్కిలించి

పానము చేయుటకు, దీసికొనెను. కాని దానిని క్షణకాల మాగి పానాదులు గావించెను. వెంటనే త్రాగియున్నచో నందున్న యాదాసియొక్క ప్రతిబింబము చెఱిగిపోవును. అందులకై క్షణ మాగి యాప్రతిబింబమును చెఱగనీయక పానము చేసెను.అనగా నాజలమందు ప్రతిబింబించిన యామె ముఖమును ముద్దిడుకొనెనని యాశయము ॥౬౫॥

శ్లో. హరిన్మణే ర్భోజనభాజనేఽర్పితే
గతాః ప్రకోపం కిల వారయాత్రికాః
భృతం న శాకైః ప్రవితీర్ణ మస్తి వః
త్విషేదమేవం హరితేతి బోధితాః. 66

ప. వి: హరిన్మణేః-భోజనభాజనే-అర్పితే-గతాః-ప్రకోపం-కిల-వారయాత్రికాః-భృతం-న-శాకైః-ప్రవితీర్ణమ్-అస్తి-వః-త్విషా-ఇదమ్-ఏవం-హరితా - ఇతి-బోధితాః.

అర్థము: హరిన్మణేః=మరకత మణియొక్క, భోజన భాజనే=భోజనపాత్రము, అర్పితే సతి=ఎదుట నుంచబడగా, ప్రకోపం=మిక్కిలి కోపమును, గతాః = పొందిన, అనగా పచ్చివిస్తరి యను భ్రాంతితో మిక్కిలి కోపమునుఁ జెందిన, వారయాత్రికాః=వరునితోడ వచ్చిన రాజులు, వః=మీకు, ప్రవితీర్ణం=ఈయబడిన, ఇదం=ఈ భోజనపాత్రము, శాకైః=చెట్ల యాకులచే, భృతం=నిర్మింపబడినదిగా, నాస్తి=లేదు, కిన్తు=మఱేమనగా, హరితా=ఆకుపచ్చని వన్నెగల్గిన, త్విషా=కాంతిచే, ఏవం=ఇట్లు, నాతపత్రనిర్మితమని, వః=మీకు [(భ్రాన్తి)], ఇతి=ఇట్లు, బోధితాః=విజ్ఞప్తిచేయఁబడిరి.

వి. ఇచ్చట కవికల్పిత సాదృశ్యము ననుసరించి, మరకతపాత్రమందు పత్రభాజన భ్రాంతినిఁ జేయుటవలన భ్రాన్తిమదలఙ్కారము.

సమాసములు :

హరిన్మణేః—హరిచ్చాసౌ మణిశ్చ = హరిన్మణిః, తస్య హరిన్మణేః.
భోజనభాజనే—భోజనస్య భాజనం = భోజనభాజనం, తస్మిన్ = భోజన భాజనే.
వారయాత్రికాః—వరయాత్రా ప్రయోజన మేషాం తే = వారయాత్రికాః.

భావము :

వివాహమునకు విచ్చేసిన వరపక్షపు రాజులకు మరకతమణిమయములగు భోజన పాత్రల నుంచిరి. కాని యారాజు లవి పచ్చగాఁ గనబడుటవలన, పచ్చని చెట్లయాకులతోఁ గుట్టబడిన విస్తరులుగా భ్రాంతిపడి మిక్కిలి కోపపడిరి. కాని తర్వాత వధూపక్షమువారు,ఇవి కుట్టుడాకులుగావు. ఇవి మరకతమణి పాత్రములు. ఆకుపచ్చని కాంతిచే, పచ్చని కుట్టుడాకులని మాకు భ్రాన్తినిఁ గల్గించుచున్నవని విజ్ఞప్తిఁ జేసుకొనిరని భావము॥౬౬॥

శ్లో॥ ధ్రువం వినీతః స్మితపూర్వవాగ్ యువా
కిమ ప్యపృచ్ఛ న్నవిలోకయన్ ముఖమ్,
స్థితాం పురః స్ఫాటికకుట్టిమే వధూం
తదఙ్ఘ్రియుగ్మావనిమధ్యబద్ధదృక్. 67

ప. వి. ధ్రువం - వినీతః- స్మితపూర్వవాక్ - యువా - కిమ్ - అపి-అపృచ్ఛత్- అవిలోకయన్ - ముఖం - స్థితాం - పురః - స్ఫాటికకుట్టిమే - వధూః- తదఙ్ఘ్రియుగ్మావనిమధ్యబద్ధదృక్.

అర్థము: యువా = ఒకానొక యువకుఁడు, పురః = ఎదుట; స్ఫాటికకుట్టిమే; స్ఫాటిక = స్ఫటికమణులతో, కుట్టిమే = కట్టఁబడిన భూమియందు, స్థితాం = నిలచియున్న,వధూం = మహిలను, తదఙ్ఘ్రియుగ్మ = తత్ = ఆ మహిళయొక్క, అంఘ్రియుగ్మ = పాదముల జంటయొక్క,మధ్య = మధ్యనున్న, అవని = భూమియొక్క, మధ్య = నడుమ; బద్ధ = కట్టఁబడిన, దృక్ = దృష్టిగలవాడై.

అనగా నామెయొక్క పాదములకును, వాని కాధారమైన భూమికిని మధ్య దృష్టిని నిల్పినవాడై యని యర్థము. అనగా నామణి భూమిపై ప్రతిబింబించిన యావధువుయొక్క వరాఙ్గముపై దృష్టిగలవాడై యని భావము. ముఖం= (క్రింది భాగమును చూచుటకొఱకై) యామె ముఖమును, అవిలోకయన్=చూడక, ధ్రువం=నిశ్చయముగా, వినీత ఇవ=సాధువువలె, స్మితపూర్వవాక్=చిఱునగవుతో కూడిన మాట గల్గి, కిమపి=దేనినో యొకదానిని గూర్చి, అపృచ్ఛత్=ప్రశ్నించెను.

వి. ఇచ్చట యువకుడు వధూముఖమును జూడక, పాదములను మాత్రము, జూచి యా స్త్రీతోడ సమ్భాషణ చేయుటచే నవినీతుఁడైనను వినీతుఁడుగా భావింపఁబడుటవలన, నుత్ప్రేక్ష. వ్యఞ్జకమగు ధ్రువశబ్దమును ప్రయోగించుటవలన నది వాచ్యము.

సమాసములు :

స్మితపూర్వవాక్ - స్మితం పూర్వం యస్యా సా = స్మితపూర్వా, స్మిత పూర్వా వాక్ యస్య సః=స్మితపూర్వవాక్.

అవిలోకయన్ - న విలోకయన్=అవిలోకయన్.

స్ఫాటికకుట్టిమే - స్ఫటికానాం వికారః = స్ఫాటికః, స్ఫాటిక శ్చాసౌ కుట్టిమశ్చ=స్ఫాటిక కుట్టిమః, తస్మిన్=స్ఫాటిక కుట్టిమే.

తదఙ్ఘ్రియుగ్మావనిమధ్య బద్ధదృక్-తస్యాః అఙ్ఘ్రీ = తదఙ్ఘ్రీ, తదఙ్ఘ్ర్యోః ఙ్ఘ్ర్యోః యుగం = తదఙ్ఘ్రియుగ్మం, తదఙ్ఘ్రియుగ్మం చ అవనిశ్చ = తదఙ్ఘ్రియుగ్మావనీ, తదఙ్ఘ్రియుగ్మావన్యాః మధ్యః = తదఙ్ఘ్రియుగ్మావనిమధ్యః, తదఙ్ఘ్రియుగ్మావని మధ్యే బద్ధా దృక్ యస్య సః=తదఙ్ఘ్రియుగ్మావని మధ్య బద్ధదృక్.

భావము ;

ఒక యువకుఁడు తన యెదుట స్ఫాటిక మణిబద్ధమైన భూమిపై నిలబడి యున్న స్త్రీని గూర్చి, పాదములకును, భూమికిని మధ్య తన దృష్టిని నిలిపి,

యామె మోముమ, చూడక, వినయరక్షుడో యనునట్లు చిఱునగవుతో మాట్లాడుచు దేనినో యొకదానిని గూర్చి బ్రశ్నించెను. ఆమె స్ఫటికమణిమయమగు భూమియందు నిలఁబడగానే, యామె వరాఙ్గము దానియందు బ్రతిబింబించినది. అందువలన నతడు దానిపై దృష్టి నిలుపుటవలన నామె మోమును జూచుట మానెను. అందువలన తన కిష్టసిద్ధియగుటవలన, ఆమె పాదములనే చూచుచుండెను. ఈ కారణముచే నామె ముఖము నతడు చూడకయుండుటవలనను, చిఱునగవుతో మాట్లాడుటవలనను నతడు మిక్కిలి సాధువుగా గనఁబడెను. ఆమె ముఖము నీతడు చూడనందు వలన నితడు పరస్త్రీపరాఙ్ముఖుడుగను స్మితపూర్వక సంభాషణముఁ జేయుటవలన శాంతమూర్తిగను బ్రేక్షకులకు భ్రాన్తినిఁ గల్గించెను. కాని చివరికి వాస్తవస్థితిలో నతని యవినీతి బయట పడుటవలన నది కేవల మభినయముగా నేర్పడినది. 62

శ్లో॥ అమీ లసద్బాష్పమఖణ్డితాఖిలం
వియుక్త మన్యోన్య మముక్తమార్దవమ్
రసోత్తరం గౌర మపీవరం రసా
దభుఞ్జ తామోదన మోదనం జనాః. 68

ప. వి. అమీ-లసద్బాష్పమ్-అఖణ్డితాఖిలం-వియుక్తమ్ - అన్యోన్యమ్ - అముక్త మార్దవం-రసోత్తరం-గౌరమ్-అపీవరం-రసాత్-అభుఞ్జత-ఆమోదనమ్-ఓదనం-జనాః.

అర్థము:- అమీ = ఈ, జనాః = జనులు అనగా వరపక్షమునకు జెందిన జనులు, లసద్బాష్పం; లసత్ = విలసిల్లుచున్న అనగా పైకివచ్చుచున్న, బాష్పం = వేడిమి గలదియు ననగా నావిరిగలదియు ననగా కొంచెము వేడిమిగలదియు అఖండి తాఖిలం, అఖండిత = నిండు, ముక్కలు గావింపబడని, అఖిలం = సమగ్రమైన స్వరూపముగలదియును అన్యోన్యం = ఒకటితో నొకటి, వియుక్తం = కలియనిదియు, ననగా విడివిడిగా నుండునదియును, (తథాఽపి = అయినను), అముక్త మార్దవం; అముక్త = విడువబడని, మార్దవం = మెత్తదనము గల్గినదియు ననగా మృదువైనదియు, రసోత్తరం = మిక్కిలి రుచియైనదియు, గౌరం = తెల్లనైనదియు, అపీవ

రం=లావుగా నుండక సన్నగా నుండునదియు, ఆమోదనం=సంతోష కరమైనదియు లేదా పరిమళ భరితమునగు, ఓదనం=అన్నమును, రసాత్=ప్రీతితో, అభుఞ్జత=భుజించిరి.

వి:- ఇందు ఓదనమున కీయఁబడిన లసద్బాష్పాదివిశేషణములు సార్థకములు గాన పరికరాలఙ్కారము.

సమాసములు :

లసద్బాష్పం-లసన్ బాష్పః యస్య సః—లసద్బాష్పః, తమ్=లసద్బాష్పం.

అఖణ్డితాఖిలం- న ఖణ్డితః = అఖణ్డితః, అఖణ్డితః, అఖిలః యస్య సః=అఖణ్డితాఖిలః, తమ్, అఖణ్డితాఖిలం.

అముక్తమార్దవమ్-మృదోర్భావః=మార్దవం, న ముక్తం=అముక్తం; అముక్తం మార్దవం యస్య సః=అముక్తమార్దవః, తమ్=అముక్త మార్దవం.

రసోత్తరః-రసః ఉత్తరః యస్య సః=రసోత్తరః, తం=రసోత్తరం.

అపీవరం-న పీవరః—అపీవరః, తమ్=అపీవరమ్,

భావము :

ఈ నలునికి సంబంధించిన జనులు, వేడియైనదియు నూకలు గానిదియు, నొకటి కొకటి యంటుకొననిదియును, మిక్కిలి మెత్తదనము గలదియు, రుచితో నిండినదియు, తెల్లనిదియు, లావుగానిదియు, పరిమళభరితమైనదియు నగు నన్నమునుఁ బ్రీతితో భుజించిరి. ॥68॥

శ్లో. వయోవశస్తోక వికస్వరస్తనీం
తిరస్తిర శ్చుమ్బతి సుందరే దృశౌ।
స్వయం కిల ప్రస్తు మురఃస్థ మమ్బరం
గుపుస్తనీ హ్రీణతరాఽఽ పరాఽఽదధే. 69

ప.వి:- వయోవశస్తోక వికస్వర స్తనీం - తిర స్తిరః-చుమ్బతి-సుందరే- దృశా-
స్వయం-కిల- స్రస్తమ్-ఉరఃస్థమ్- అమ్బరం- గురు స్తనీ- హ్రీణతరా-
అపరా-ఆదధే.

అర్థము:- సుందరే = వర పక్షమునకు చెందిన యందగాఁ డొకడు, వయోవ
శస్తోకవికస్వర స్తనీం; వయోవశ=వయస్సునకు ననగా బాల్యయౌవన
వయస్సుల కధీనమగుటచే, స్తోక = కొంచెము, వికస్వర=వికసించిన,
స్తనీం=స్తనము గల్గిన యొక బాలను, తిర స్తిరః=మిక్కిలి అడ్డముగా
ప్రసరింపఁ జేయబడిన, దృశా=దృష్టిచే ననగా వంపుగా త్రిప్పిన కడ
కన్నుచే, చుమ్బతి సతి=పట్టుదలతో జూఁడగా, గురు స్తనీ= పెద్దచను
దోయి గల్గిన, అపరా=మఱియొక స్త్రీ, హ్రీణతరా=తన్నతడు చూడ
లేదని మిక్కిలి సిగ్గునుఁ జెందినదై, స్వయం=తనంతట; స్రస్తం కిల=
జారినదని యసత్యముఁ జెప్పుచు, ఉరఃస్థం=ఱొమ్ముపైనున్న, అమ్బ
రం=వస్త్రమును, ఆదధే=మఱల ధరించినది. అనగా నాపై వస్త్రమును
తానే జార్చి మఱల యథా స్థానమునకుఁ జేర్చుకొనినదని యర్థము. నా
చనుదోయి పెద్దవి కాన నీకు సమ్భోగమునకుఁ దగిన దాన ననెడి బుద్ధితో
తన చనుదోయినిఁ జూపినదని యర్థము.

సమాసములు :

వయోవశస్తోకవికస్వర స్తనీం - వయసః వశః=వయోవశః, వయో
వశేన స్తోకం వికస్వరౌ స్తనౌ యస్యాస్సా=వయోవశస్తోకవికస్వర స్తనీ,
తాం=వయోవశస్తోక వికస్వర స్తనీం.

ఉరఃస్థమ్ - ఉరసి తిష్ఠతీతి=ఉరఃస్థం, తత్=ఉరఃస్థమ్.

గురు స్తనీ - గురూ స్తనౌ యస్యాస్సా=గురుస్తనీ;

హ్రీణతరా - అతిశయేన హ్రీణా=హ్రీణతరా.

భావము :

వరుని పక్షమునకుఁ జెందిన యొక యంధఁగాడు, బాల్య యౌవనముల
సంధివశమున కొద్దిగా వికసించిన చనుదోయి గల బాలికను నడ్డపు దృష్టితో

మిక్కిలి పట్టుదల వహించి చూచెను. అప్పుడు పెద్ద చనుదోయి గల్గిన మఱి యొక స్త్రీ ఆ పురుషుడు తన్ను జూడలేదని మిక్కిలి సిగ్గుపడినదై యాతనికిఁ దనయెడ ననురాగ మేర్పడుటకై తాను తనంతట తన పైటనుఁ జారవిడచుకొని, అయ్యో! పైట జారిపడినదే యని యభినయించుచు మఱల తొమ్మ్మ పైకి లాగి కొనినది. ఇట్లు తాను వలుద చన్నులు గలదాననుఁ గాన నీకు, సంభోగమునకుఁ దగిన దానననని యా పురుషునికి సూచించినది ॥౬౯॥

శ్లో. యదాదిహేతుః సురభిః సముద్భవే
భవే త్తదాజ్యం సురభి ధ్రువం తతః
వధూభి రేభ్యః ప్రవితీర్య పాయసం
తదోఘ కుల్యాతటసైకతం కృతమ్. 70

ప. వి. యత్ - ఆదిహేతుః - సురభిః - సముద్భవే - భవేత్ - తత్-ఆజ్యం-సురభి - ధ్రువం - తతః- వధూభిః-ఏభ్యః- ప్రవితీర్య - పాయసం - తదోఘకుల్యాతటసైకతం - కృతమ్.

అర్థము : యత్ = ఏకారణమువలన, సముద్భవే = ఉత్పత్తియందు, సురభిః = కామధేనువు లేదా ఆవు, (సుగంధముగల పదార్థము), ఆదిహేతుః = మూలకారణము, తతః = ఆ కారణమువలన, తత్ = ఆ, ఆజ్యం = నేయి, సురభి భవేత్ = పరిమళవస్తమగును, ఏలయనగా కారణ గుణములు కార్యమందు సంక్రమించుచున్నవిగదా, ఇచ్చట సురభినుండి (పరిమళముగల పదార్థమునుండి) యేర్పడిన నేయిగూడ సురభియే అనగా సుగన్ధముతోఁ గూడినదే యగుచున్నదని యర్థము. ధ్రువం = ఇది నిశ్చయము, వధూభిః = వడ్డించుచున్న యువతులచే, ఏభ్యః = ఈవర పక్షమునకు జెందిన రాజులకు, పాయసం = పరమాన్నము, ప్రవితీర్య = ఇచ్చి, అనగా వడ్డించి, తదోఘకుల్యాతటసైకతం, తత్ = సురభి ఘృతముయొక్క, ఓఘ = ప్రవాహమనెడి, కుల్యా = కాలువయొక్క లేదా కృత్రిమమగు నేతియొక్క, తటే = గట్టునందు, సైకతం = ఇసుకదిబ్బ, కృతం = చేయఁబడినది. పాయసమును వడ్డించి దానిపై పోసిన నేయి ప్రవాహమైనది. దానిచే నాపాయసము రెండుగా విభక్త

మైనది. అది తెల్లగా నుండుటవలన నేతికిఁ జుట్టును నిసుక దిబ్బవలె ప్రకాశించినదని యర్థము.

సమాసములు :

ఆదిహేతుః- ఆదౌ హేతుః=ఆదిహేతుః

పాయసమ్-పయసి సంస్కృతం=పాయసమ్.

తదోఘకుల్యాతటసైకతమ్ - తస్య ఓఘః=తదోఘః, తదోఘ ఏవ కుల్యా=తదోఘకుల్యా, తదోఘకుల్యాయాః తటం=తదోఘకుల్యా తటం, తదోఘకుల్యాతటే సైకతం=తదోఘకుల్యాతట సైకతమ్.

భావము:

నేతికి ఉత్పత్తి కారణము సురభి అనగా కామధేనువు లేదా ఆవు... (పరిమళముగల పదార్థము) అగుచున్నది. అట్టి సురభినుండి (పరిమళముగల పదార్థమునుండి) యేర్పడుటనే నేయిగూడ సుగన్ధభరిత మైనది. సురభివలనఁ బుట్టుటచే నేయి సురభియైన దనుట నిశ్చయము. వడ్డించునట్టి యువతులు పాయసమును వడ్డించిరి. ఆ వడ్డింపబడిన పాయసము, నేతియొక్క ప్రవాహముచే నేర్పడిన చిన్నయేటికి నిఱుగట్టులయందు నేర్పడిన యిసుక దిబ్బవలె నేర్పడినది. అనగా తొలుత పాయసమును వడ్డించి దానిపై నేతిని పోయగా నానేయి యాపాయసమును రెండుగా విభజించి, దాని కిరువైపుల గట్టువలె నిలచినది. అది తెల్లగా నుండుటవలన నిసుకగా రూపింపఁబడినది. అనగా నాపాయసము నేతియేటి కిఱువైపున గట్టులపైని ఇసుక దిబ్బగా రూపింప బడినది॥70॥

శ్లో. యదప్యపీతా వసుధాలయైః సుధా
తదప్యదః స్వాదు తతోఽనుమీయతే ।
అపి క్రతూషర్బుధ వర్గ గర్ధినే
స్పృహా యదస్మై దధతే సుధాన్ధసః. 71

ప. వి. యత్-అపి-అపీతా-వసుధాలయైః-సుధా-తత్-అపి-అదః-స్వాదు-తతః-అనుమీయతే-అపి-క్రతూషర్బుధదగ్ధగన్ధినే-స్పృహాం -యత్ - అస్మై-దధతే-సుధాన్ధసః.

అర్థము: యదపి = ఒకవేళ, వసుధాలయైః = భూలోకవాసులచే, ననగా మనుష్యులు మున్నగువారిచే, సుధా = అమృతము, అపీతా = పానము చేయబడలేదు, తదపి = అయినను, అదః - ఈనేయి, తతః = ఆ యమృతముకంటెను, స్వాదు = రుచిగలదిగా, అనుమీయతే = ఊహింపఁబడుచున్నది, యత్ = ఏలయనగా, సుధాన్ధసః = అమృతమే యన్నముగా గల్గిన దేవతలు, క్రతూషర్బుధ దగ్ధగన్ధినే, క్రతు = యజ్ఞముల యందలి, ఉషర్బుధ = అగ్నిహోత్రునిచే, దగ్ధ = కాల్చఁబడిన, గన్ధినే = వాసన గల్గిన, అస్మై = ఈ నేతికై, స్పృహాం = ఆశను; దధతే = వహించుచున్నారు. మనవంటి మానవులకు, అమృతమును, నేతిని పానముచేయననుభవము లేక పోయినను, నమృతమునుఁ దినిన దేవతలకు సైతము యాగములయందు ఘృతపానమునకై యాసక్తి యుండుటవలన దానినిఁ బట్టి నేతికిని, అమృతమునకు గల రుచితారతమ్యము నూహింప నవకాశమున్నది. నిప్పులో కాలుటవలన, వికారపు వాసన గల్గిన నేయి, దేవతలకంత రుచికరముగనున్నప్పు డిఁక, నిప్పులో కాల్పనట్టి నేయి యెంత రుచియో యెంత పరిమళముగలదో! చెప్పనేల. ఇచ్చట నేయి రుచినిట్లు అనుమానముఁ జేయవచ్చును. నేయి-అమృతమున కంటెను రుచిగలది- ఏలయనగా నమృతపానము గావించిన దేవతలచే నధికముగా నభిలషింపఁబడుచున్నది. అని యీ విధముగ ననుమానము చేయుటచే నేతికున్న రుచ్యతిశయము సిద్ధించుచున్నదని యర్థము.

వి. పై విధముగా నేతిరుచి నూహించుట వలన నిఁట ననుమానాలఙ్కారము.

సమాసములు :

అపీతా-న పీతా = అపీతా,

క్రతూషర్బుధదగ్ధగన్ధినే - క్రతుషు ఉషర్బుధః = క్రతూషర్బుధః, క్రతూషర్బుధేన దగ్ధః గన్ధః యస్య = క్రతూషర్బుధదగ్ధనీగన్ధీ, తస్మై = క్రతూషర్బుధ దగ్ధగన్ధినే.

సుధాన్ధసః — సుధైవ అన్ధః యేషాం తే = సుధాన్ధసః.

భావము :-

భూలోకవాసులగు మనుష్యాదు లమృతమును పానము చేయనందు వలన దాని రుచి వీరికి తెలియక పోవచ్చును. కాని నేయి యమృతము కంటెను నధిక మైన రుచిగలదని యూహింపవచ్చును. ఏలయనగా నమృతమునే యాహారముగా గల్గిన దేవతలు యాగములయందు, నగ్నిచే దగ్ధము గావింపఁబడిన నేతి కాశపడు చున్నారు గదా. అందువలన నా దేవతల యనుభవము ననుసరించి అమృతము కంటెను నేయి అధికమైన రుచి గల్గినదని యూహింప వచ్చును. మఱియు యజ్ఞముల యందు హోమమునఁ గాల్చఁ బడిన నేయి వికృత గంధముతో గూడి యున్నది. అట్టి వానినే దేవత లపేక్షించినచో, నిక హోమము చేయబడకయున్న నేతియొక్క పరిమళమును నాస్వాదమునుఁగూర్చి చెప్ప నేల ॥71॥

శ్లో. అబోధి నో హ్రీనిభృతం మదిఙ్గితం
ప్రతీత్య వా నాదృతవ త్యసావితి
లునాతి యూనః స్మ ధియం కియద్గతా
నివృత్య బాలాఽఽదరదర్శనేషుణా. 72

ప. వి:- అబోధి-నో-హ్రీనిభృతం-మదిఙ్గితం-ప్రతీత్య- వా- న - ఆదృతవతీ- అసౌ-ఇతి-లునాతి-యూనః-స్మ-ధియం-కియద్గతా - నివృత్య - బాలా - ఆదరదర్శనేషుణా.

అర్థము:- అసౌ = ఈ; బాలా = స్త్రీ, హ్రీనిభృతం; హ్రీ = లజ్జచే, నిభృతం = నిగూఢమైన, మదిఙ్గితం = నా యొక్క ఇఙ్గితమును, అనగా బొమముడి పాటునుఁ జూపుటచే నా హృదయ మందలి భావములను, నో అబోధి = తెలుసుకొన లేదా ? వా = లేదా, ప్రతీత్య = తెలిసియు, అసౌ = ఈమె,

న ఆదృతవతీ = ఇష్టముకానందువలన లెక్కింప లేదా? ఇతి = ఈ విధముగా, యూనః = ఒకానొక యువకునికి, ధియం = బుద్ధిని ననగా సంశయ బుద్ధిని, కియద్గతా-కియత్ = కొంచెము, గతా = నడచియు, నివృత్య = మఱలి వచ్చి, ఆదరదర్శనేషుణా, ఆదరదర్శన = ఆదరముతో జూచుట యను; ఇషుణా = బాణముచే లేదా దరదర్శనేషుణా; దర = కొంచెము, దర్శన = చూచుట యను, ఇషుణా = బాణముచే ననగా లజ్జచే సంకోచముతో జూచుట యను బాణముచే, లునాతి స్మ = త్రుంచెను, దీనితోడనే యువకునకు ననురాగము లేదనెడి సందేహము తొలగింపఁ బడినదని యర్థము.

సమాసములు :

హ్రీనిభృతం-హ్రియా నిభృతం = హ్రీనిభృతం, తత్ = హ్రీనిభృతం
మదిజ్గితం-మమ ఇజ్గితం = మదిజ్గితం, తత్ = మదిజ్గితం.

భావము :

ఈబాల యనగా ఈస్త్రీ లజ్జచే నిగూఢమయిన బొమముడిపాటు మున్నగు నాయిజ్గితము జూచుటచే నా హృదయమందలి భావమును తెలుసుకొనలేదా? లేదా, తెలిసియు నిష్టము కానందువలన లెక్కింపలేదా? యని యీ విధముగా నొక యువకునకు గల్గిన సందేహమును, నాయువతి కొంచెముదూరము నడచి మఱల వెనుకకుఁ దిరిగినదై ఆదరముతో నతనిని చూచుట లేదా, లజ్జవలని సజ్కోచముతో కొంచెము చూచుట యను బాణముతో నాతని సందేహమును ఖండించి యాతనియందు తన యనురాగమును సూచించెను. ॥72॥

శ్లో. న రాజికారాద్ధ మభోజి తత్రకైః
ముఖేన సీత్కారకృతా దధద్ధధి
ధుతోత్తమాఙ్గైః కటుభావపాటవా
దకాణ్డ కణ్డూయిత మూర్ధతాలుభిః. 73

ప. వి. న-రాజికారాద్ధమ్- అభోజి-తత్ర-కైః-ముఖేన-సీత్కారకృతా-దధద్దధి-ధుతోత్తమాఙ్గైః-కటుభావపాటవాత్-అకాణ్డ కణ్డూయితమూర్ధతాలుభిః.

అర్థము: తత్ర = ఆ భోజనసమయమందు, కైః = ఎవ్వరిచే, దధద్దధి; దధత్ = ధరించిన, దధి = పెరుగుగల్గిన అనగా పెరుగుతో సంస్కరింపఁబడిన, రాజికారాద్ధం;రాజికా = పెద్దఆవాలచే, రాద్ధం = సిద్ధము చేయఁబడిన అనగా నావపిండితోఁ నూఱిన పచ్చడి, కటుభావపాటవాత్; కటుభావ = కారముగా నుండుటవలని, పాటవాత్ = సామర్థ్యమువలన, ననగా కార మధికముగా నుండుటవలన, ధుతోత్తమాఙ్గైః; ధుత = కదలింపఁబడిన, ఉత్తమాఙ్గైః = శిరస్సులు గల్గిన, అకాణ్డ కణ్డూయిత మూర్ధతాలుభిః; అకాణ్డ = అకస్మికముగా ననగా నసమయమైన భోజనకాలమందు, కణ్డూయిత = (స్మృతిచే తలగీరుట నిషిద్ధమైనది,) గీరఁబడిన, మూర్ధతాలుభిః; మూర్ధ = తలలు, తాలుభిః = దౌడలు గల్గినట్లుగా, సీత్కారమును జేయునట్టి,ముఖేన = నోటిచే,నాభోజి = భుజింపబడలేదా?అందఱు పైవిధముగా కారమును తిని బాధపడుచున్నను భుజించిరని యర్థము.

వి: కటురసముతోడి యాహారమును భుజించువారు తలను, దౌడలను గీరెడి స్వభావమును, వారాచరించు స్వాభావికములగు సీత్కారాదులను వర్ణించుటవలన స్వభావోక్త్యలఙ్కారము.

సమాసములు :

రాధికారాద్ధం - రాధికాభిః రాద్ధం = రాధికారాద్ధం.
దధద్ధధి - దధత్ దధి యేన తత్ = దధద్దధి.
సీత్కారకృతా - సీత్కారం కరోతీతి = సీత్కార కృత్, తేన = సీత్కార కృతా.
ధుతోత్తమాఙ్గైః - ధుతాని ఉత్తమాఙ్గాని యై స్తై = ధుతోత్తమాఙ్గాః, తైః = ధుతోత్తమాఙ్గైః.

కటుభావ పాటవాత్ - కటోః భావః = కటుభావః, కటుభావస్య పాటవం = కటుభావ పాటవం, తస్మాత్ = కటుభావ పాటవాత్.

అకాణ్డకణ్డూయిత మూర్ధతాలుభిః - అకాణ్డే కణ్డూయితం = అకాణ్డ కణ్డూయితం, మూర్ధాని చ తాలూని చ తేషాం సమాహారః = మూర్ధతాలు, అకాణ్డకణ్డూయితం మూర్ధతాలు యేషాం తే = అకాణ్డ కణ్డూయిత మూర్ధతాలవః, తైః = అకాణ్డ కణ్డూయిత మూర్ధతాలుభిః.

భావము :

ఆ పెండ్లి భోజన సమయమందు, ఎవ్వరు, పెరుగుతోడను, ఆవ పిండితోడను గూడిన పచ్చడిని తిని, యందలి మిక్కుటమగు కారముచే, తలల నాడించుచు, నాకస్మికముగా భోజన సమయమందు కారమువలన తలలను దౌదలను గీరుకొనుచు, సీత్కారములతోఁ గూడిన నోళ్లతో భుజింపలేదు. ఇంత కారమును సహించియు నందఱు భుజించిరని యర్థము. భోజన కాలమునందు తలను గీరరాదని ధర్మశాస్త్రము చెప్పుచున్నది. అట్లు నిషిద్ధమైనను, నధికమైన కారమునఁ దినుటచే తలను గూడ గీరుకొనిరి. ఈ విధముగా కటురసముతోఁ గూడిన వ్యఞ్జనము వారికి వడ్డింపబడినదని యాశయము ॥73॥

శ్లో. వియోగి దాహాయ కటూభవత్త్విషః
తుషారభానోరపి ఖణ్డ మాహృతం ।
సితం మృదు ప్రాగథ దాహదాయి తత్
ఖలః సుహృత్పూర్వమివాఽహిత స్తతః. 74

ప. వి:- వియోగిదాహాయ - కటూభవత్త్విషః-తుషారభానోః - అపి - ఖణ్డమ్-ఆహృతం-సితం-మృదు- ప్రాగ్-అథ-దాహదాయి-తత్-ఖలః-సుహృత్-పూర్వమ్-అహితః-తతః.

అర్థము:- వియోగిదాహాయ; వియోగి = ప్రియులచేఁ విడువఁబడిన వారికి, దాహాయ = సంతాపమునకై, కటూ భవత్త్విషః; కటూభవత్ = తీక్ష్ణ

మగుచున్న త్విషః = కాంతి కల్గిన, తుషారభానోః = చంద్రునియొక్క, ఖణ్డం = తునుక, ఆహృత మివ స్థితమ్ = తేబడినదో యను నట్లున్న, సితం = (అధికముగా పెరుగు కలియుట వలన) తెల్లనైన, తత్ = ఆ, ఆవపిండితోఁ గూడిన పచ్చడి, పూర్వం = తొలుత, సుహృత్ = ఆప్తుడు గను, తతః = తర్వాత, అహితః = అనాప్తుఁడగు, ఖలం ఇవ = దుష్టుడు వలెను, ప్రాక్ = తొలుత అనగా, స్పృశించు కాలమునందు, మృదు = కోమలముగను, అథ = పిదప, అనగా నోట నుంచుకొనిన పిదప, దాహ దాయి = కార మెక్కువగా నుండుట వలన నాలుకలో మంటనుఁ గల్గించు నదిగను (బభూవ = ఉండినది).

సమాసములు :

వియోగిదాహాయ - వియోగినాం దాహః = వియోగిదాహః, తస్మై = వియోగిదాహాయ.

కటూభవత్త్విషః - అకటు కటుః సమ్పద్యమానా భవన్తీ = కటూభవన్తీ కటూభవన్తీ త్విట్ యస్య సః = కటూభవత్త్విట్, తస్య = కటూభవత్త్విషః.

తుషారభానోః - తుషారమయాః భానవః యస్య సః = తుషారభానుః, తస్య = తుషారభానోః.

దాహదాయి - దాహం దదాతీతి = దాహదాయి.

అహితః - న హితః = అహితః

భావము:

ఆవపిండితోను పెరుగుతోను కలిపి చేసిన యావ్యఞ్జనము, వియోగులను బాధించునట్టి తీక్ష్ణమగు కాన్తిని వహించిన శీతకిరణుఁడగు చంద్రునియొక్క తునుకయా ? యనునట్లుండెను. అది తొలుత చూచుటకు శుభ్రముగను మృదువుగను నుండుటవలన తొలుత మిత్రుఁడుగను, తర్వాత భుజించిన పిదప కారముతో నాలుకను మంటబెట్టి అహితుఁడుగను నుండినదని భావము ॥74॥

శ్లో. నవౌ యువానౌ నిజభావ గోపినౌ
వ భూమిషు ప్రాక్ ప్రహితభ్రమిక్రమమ్
దృశో ర్విధత్తః స్మ యదృచ్ఛయా కిల
విభాగ మన్యోన్యముఖే పునః పునః. 75

ప. వి. నవౌ-యువానౌ-నిజభావగోపినౌ-అభూమిషు-ప్రాక్-ప్రహితభ్రమిక్రమం-దృశోః-విధత్తః-స్మ-యదృచ్ఛయా - కిల - విభాగమ్-అన్యోన్యముఖే-పునః-పునః.

అర్థము: నవౌ=బాల్య యౌవనములయొక్క సంధియం దున్నవారును, కావుననే, నిజభావగోపినౌ, నిజ=తమకు సంబంధించిన, భావ=భావములను, గోపినౌ = కప్పిపుచ్చుకొనువారును నగు. యువానౌ=యువతియు, యువకుఁడును, ప్రాక్=తొలుత, అభూమిషు=దర్శింపయోగ్యములు కాని విషయములయందు, ప్రహితభ్రమిక్రమమ్; ప్రహిత=చేయఁబడిన, భ్రమిక్రమం=సంచారక్రమము గల్గిన అనగా నిటువంటి విషయాంతరములయందు ప్రవర్తించిన, దృశోః=నేత్రముల యొక్క, త్రిభాగం=మూడవ భాగమును, అనగా కడకంటి దృష్టిని, పునః=పలుమాఱులు, అన్యోన్యముఖే =ఒ డొరుల ముఖమునందు, యదృచ్ఛయా కిల=అభిలాషలేని విధముగా ననగా అభిలాషతోడనే. విధత్తః స్మ=ఉంచుకొనిరి. తొలుత సిగ్గుచే నొండొరుల ముఖమును మఱియొక విషయము చూచు నెపమున జూచుకొని, పిదప కటాక్షదృష్టితో మాటిమాటికిని చూచుకొనిరి. కాన నిట చక్షుఃప్రీతియను మొదటి మన్మథావస్థ.

సమాసములు :

యువానౌ - యువా చ యువతి శ్చ=యువానౌ.

నిజభావగోపినౌ – నిజాశ్చ తే భావాశ్చ = నిజభావాః, నిజభావాన్ గోపాయత ఇతి=నిజభావగోపినౌ।

అభూమిషు - న భూమయః=అభూమయః, తాసు=అభూమిషు

*ప్రహితభ్రమిక్రమం* - ప్రహితాశ్చ తాః భ్రమయశ్చ = ప్రహిత భ్రమయః-ప్రహితభ్రమీణాం క్రమః యస్య సః = ప్రహితభ్రమిక్రమః, తం = ప్రహితభ్రమిక్రమం.

*త్రిభాగం*-తృతీయ శ్చాసౌ భాగశ్చ = త్రిభాగః, తం = త్రిభాగం.
అన్యోన్యముఖే-అన్యోన్యయోః ముఖం = అన్యోన్యముఖం, తస్మిన్ = అన్యోన్యముఖే।

భావము :

బాల్యయౌవనముల సంధియం దుండుట వలన తమతమ భావముల కప్పిపుచ్చుకొనుచున్న యువతీయువకులు తొలుత, దర్శింపదగని విషయముల యందును దృష్టిని ప్రవర్తింపఁజేసి, చివర ఒండొరుల కడకంటి చూపులచే పలుమాఱులు ఒండొరుల ముఖమును నభిలాషలేని విధముగాను, వాస్తవమున నభిలాషతోఁ గూడినట్లుగ, చూచుకొనిరి. ॥75॥

శ్లో. వ్యధుస్తమాం తే మృగమాంససాధితం
రసా దసిత్వా మృదు తేమనం మనః।
నిశాధవోత్సఙ్గకురఙ్గజై రదః
పలైః సపీయూషరసైః కి మప్యశపి. 76

ప. వి: వ్యధుస్తమాం-తే-మృగమాంససాధితం - రసాత్ - అసిత్వా - మృదు - తేమనం-మనః-నిశాధవోత్సఙ్గకురఙ్గజైః-అదః-పలైః-సపీయూషరసైః - కిమ్-అశ్రపి.

అర్థము: తే = అవరపక్షపుజనులు, మృగమాంససాధితం; మృగమాంస = జింక యొక్క మాంసముతో, సాధితం = తయారు గావింపబడిన; మృదు = మెత్తనిదైన, తేమనం = మజ్జిగపులుసును రసాత్ = అభిలాష వలన, అశిత్వా = భుజించి, అదః = ఈ మజ్జిగపులుసు, నిశాధవోత్సఙ్గకురఙ్గజైః; నిశాధవ = చంద్రునియొక్క, ఉత్సఙ్గ = ఒడియందున్న, కురఙ్గజైః = అమృతరసముతోఁగూడిన, పలైః = మాంసములచే, అశ్రపి

కిం = వండఁబడినదా యేమి? ఇతి = అని, మనః = మనస్సును లేదా బుద్ధిని, వ్యధు స్తమాం = అధికముగాఁ జేసిరి,

సమాసములు :

వ్యధు స్తమాం-అతిశయేన వ్యధుః = వ్యధు స్తమాం.
మృగమాంససాధితం - మృగస్య మాంసః = మృగమాంసః, మృగ మాంసేన సాధితం = మృగమాంససాధితం, తత్ = మృగమాంససాధితం.
నిశాధవోత్సఙ్గకురఙ్గజైః-నిశాయాః ధవః = నిశాధవః, నిశాధవస్య ఉత్సఙ్గః = నిశాధవోత్సఙ్గః, నిశాధవోత్సఙ్గే కురఙ్గః = నిశాధవోత్సఙ్గ కురఙ్గః, నిశాధవోత్సఙ్గకురఙ్గాత్ జాయ న్త ఇతి = నిశాధవోత్సఙ్గ కురఙ్గ జాని, తైః = నిశాధవోత్సఙ్గకురఙ్గజైః.
సపీయూషరసైః-పీయూషస్య రసః = పీయూషరసః, పీయూషరసేన సహ వర్త న్త ఇతి = సపీయూషరసాని, తైః = సపీయూషరసైః.

భావము :

ఆవరపక్షపు జనులు, జింకయొక్క మాంసముతో వండిన మృదువైన మజ్జిగ పులుసును, అభిలాషతో భుజించి, ఈ మజ్జిగ పులుసు, చంద్రుని యొడి యం దున్న జింకకు సంబంధించినట్టిది కావుననే, యమృతరసముతోఁ గూడినట్టి మాంసములతో వండబడినదా యేమి? యని భావించిరి. అట్లుకానిచో నా మజ్జిగ పులుసు కంతటిరుచి యెట్లు వచ్చునని యాశయము. ॥76॥

శ్లో. పరస్పరాకూతజ దూతకృత్యయో
రనఙ్గమారాద్ధుమపి క్షణం ప్రతి।
నిమేషణేనైవ కియచ్చిరాయుషా
జనేషు యూనో రుదపాది నిర్ణయః. 77

ప.వి: పరస్పరాకూతజదూతకృత్యయోః - అనఙ్గమ్ - ఆరాద్ధుమ్-అపి-క్షణం-ప్రతి - నిమేషణేన - ఏవ-కియచ్చిరాయుషా-జనేషు-యూనోః-ఉదపాది-నిర్ణయః.

అర్థము: పరస్పరాకూతజదూతకృత్యయోః; పరిస్పర = ఒండొరులయొక్క, ఆకూత = అభిప్రాయమును దెలుపునట్టి నేత్రములు మున్నగు వానిచే, జ = కల్గిన, దూతకృత్యయోః = దూత్యము కల్గిన యనగా సంభోగములకు వలసిన యొప్పుదలయు, దానికి సంబంధించిన ప్రశ్నోత్తర పరిజ్ఞాన రూపమగు దూత్యకాదులు గల్గిన, అనగా సంజ్ఞలచేతనే సంగమ నిశ్చయము కల్గినట్టి, యూనోః = యువతీ యువకులకు, అనఙ్గం = మన్మథుని, ఆరాద్ధుం = సేవించుటకు అనగా రమించుటకు, క్షణం ప్రతి = కాలమును గూర్చి, నిర్ణయోఽపి = నిశ్చయముగూడ, జనేషు = ఆ జనులమధ్యనే, కియచ్చిరాయుషా = కొంచెము దీర్ఘ కాలముండెడి, నిమేషణేనైవ = కంటిని మూయుట యను గుఱ్ఱు చేతనే, అనగా సాధారణముగా నేర్పడెడి రెప్పపాటు కాలమునకంటె కొంచెము దీర్ఘముగనుండు ఱెప్పపాటు కాలముగల, కంటిని మూయుటయను గుర్తుచేతనే, ఉదపాది = కల్గింపబడినది. వీరందఱు నిద్రించిన పిదపనే మనకు సమాగమము జరుగునని కాలనిర్ధారణగూడ, కన్నుమూయుట యను నేత్రనిమీలన సంజ్ఞచేతనే చేయఁబడినదని యాశయము.

సమాసములు :

పరస్పరాకూతజదూతకృత్యయోః - పరస్పరస్య ఆకూతః = పరస్పరాకూతః, పరస్పరాకూతేన జాయత ఇతి = పరస్పరాకూతజం, దూతస్య కృత్యం దూతకృత్యం, పరాస్పరాకూతజం దూతకృత్యం యయోస్తే = పరస్పరాకూతజదూతకృత్యౌ, తయోః = పరస్పరాకూతజ దూతకృత్యయోః.

కియచ్చిరాయుషా - కియచ్చ తత్ చిరం చ = కియచ్చిరం కియచ్చిరం ఆయుః యస్య తత్ = కియచ్చిరాయుః, తేన = కియచ్చిరాయుషా.

భావము :

అచ్చట నొక యువతీయువకుల జంట మధ్య వారి యొండొరుల కటాక్షాది చేష్టల చేతనే, దూతలు చేయుపని నెరవేర్పఁబడినందువల్ల వారికి తార్పుకాండ్ర యవసరము తీఱిపోయినది. వారిఱువురు రమించుటకు తగిన సమయమును జన మధ్యమున కొంచెము దీర్ఘకాలము కన్నులను మూయుటచేతచే నిర్ణయించుకొనిరి.

అట్లు కన్నులను మూయుటచే, రాత్రి జనులందఱు నిద్రించినపిదప మనము కలసి కొనెదమని, సమయ నిర్ధారణ నేర్పఱచుకొనిరి. అనగా కనులు మూసికొనుట యను సంజ్ఞచేతనే కాల నిర్ణయమును గావించుకొనిరి. ॥77॥

శ్లో. అహర్నిశా వేతి రతాయ పృచ్ఛతి
క్రమోష్ణశీతాన్నకరార్పణాత్ విటే
హ్రియా విదగ్ధా కిల తన్నిషేధినీ
న్యధత్త సన్ధ్యామధురేఽధరేఽఙ్గులిమ్. 78

ప.వి: అహః-నిశా-వా-ఇతి-రతాయ-పృచ్ఛతి - క్రమోష్ణశీతాన్నకరార్పణాత్-విటే-హ్రియా-విదగ్ధా-కిల-తన్నిషేధినీ-న్యధత్త- సన్ధ్యామధురే-అధరే-అఙ్గులిం.

అర్థము : విటే = ఒకానొకకాముకుడు, క్రమోష్ణ శీతాన్నకర్పారణాత్; క్రమ = వరుసగా, ఉష్ణశీత = వేడిమిగలదియు, జల్లఁదనముగలదియునగు, అన్న = అన్నములపై, కరార్పణాత్ = హస్తమునుంచుటవలన, అనగా నట్టి సజ్కేతమువలన, రతాయ = సమ్భోగమునకై, అహః = సూర్య సంబంధముచే, వేడితోఁగూడిన పగలు సమయమా ? నిశా వా = లేక చంద్రునిసంబంధమువలనఁ జల్లఁదనముతోఁ గూడిన రాత్రిసమయమా ? ఇతి = అని, పృచ్ఛతి సతి = ప్రశ్నింపగా, విదగ్ధా = నేర్పరియైన యనగా నాతని యభిప్రాయమును గ్రహించినదై, హ్రియా = సిగ్గుచే, తన్నిషేధినీ; తత్ = ఆరెండుకాలములను, నిషేధినీ = నిషేధించుచున్నదై, సన్ధ్యామధురే; సన్ధ్యా = సంధ్యవలె, మధురే = ఎఱ్ఱనైనమధురమైన, అధరే = పెదవియందు, అఙ్గులిం = వ్రేలిని, న్యధత్త = ఉంచినది. పెదవిపై వ్రేలినుంచుట లజ్జాసూచకము. అట్లు లజ్జాసూచకముగా పెదవిపై వ్రేలి నుంచిన ట్లభినయించుచు, సఙ్గమమునకు కాలము సంధ్యవలె నెఱ్ఱనైన తన పెదవిని, దాకుటచే, సంధ్యాకాలము మనకు సంగమకాలమని సూచించి నది.

శ్లో. కియ త్త్యజ న్నోదన మానయన్ కియత్
కరస్య పప్రచ్ఛ గతాఽఽగతేన యామ్,
అహం కిమేష్యామి కిమేష్యసీతి సా
వ్యధత్త నమ్రం కిల లజ్జయాఽఽననమ్. 79

ప. వి. కియత్- త్యజన్- ఓదనమ్- ఆనయన్- కియత్- కరస్య- పప్రచ్ఛ- గతాఽఽగతేన- యామ్-అహం-కిమ్-ఏష్యామి-కిమ్-ఏష్యసి-ఇతి-సా-వ్యధత్త-నమ్రం-కిల-లజ్జయా-ఆననమ్.

అర్థము:- కియత్ = కొంచెము, ఓదనం = అన్నమును, త్యజన్ = వదలివేయుట అనగా భోజనపాత్రలో నొకప్రక్కకు నెట్టివేయుచు, కియత్ = కొంచెము, ఓదనం = అన్నమును, ఆనయన్ = ఆ పాత్రనుండియే లాగికొనుచు, గతాఽఽగతేన = అన్నమును నెట్టివేయుట, అన్నమును లాగికొనుట యను యాతాఽఽయాతములచే, కిమ్ = ఏమి, అహం = నేను, ఏష్యామి = (నిన్నుగూర్చి) వత్తునా, లేదా, కిం = ఏమి, ఏష్యసి వా? = నీవు నన్నుగూర్చి వత్తువా? ఇతి = ఇట్లు, యాం = ఏయువతిని, పప్రచ్ఛ = అడిగెనో, సా = ఆ యువతి, లజ్జయా కిల = సిగ్గుచేతనో యనునట్లు అనగా వాస్తవముగ లజ్జలేదు. కాని యాతని ప్రశ్నకు నుత్తర మిచ్చుటకై, ఆనన = ముఖమును, నమ్రం = వంగిన దానినిగా, వ్యధత్త = చేసినది. తలను వంచుటయను సంకేతముచే నీవే నాయొద్దకు రమ్మని సూచించిన దని యర్థము.

సమాసములు :

*గతాఽఽగతేన - గతం చ, ఆగతం చ అనయో స్సమాహారః = గతాఽఽగతం, తేన = గతాఽఽగతేన.*

భావము :

ముందుఁ జెప్పఁబడిన విటుఁడు భోజనపాత్రములోని యొకభాగమునకు కొంచె మన్నమును నెట్టుచు, మఱియు నందుండియే కొంచె మన్నమును లాగి

కొనుచు నిట్టి యాతాऽऽయాతములతో నేను నీవద్దకు వత్తునా? లేక నీవు నా యొద్దకు వత్తువా? యని ఏ యువతినిగూర్చి ప్రశ్నించెనో ఆ యువతి, యాతనికి సమాధాన మొసంగుటకై తనకు లజ్జ కలుగకపోయినను, లజ్జ కలిగినదో యను నట్లు తలను వంచినది. ఈ తలను వంచుటయను సంకేతముచే నీవే నా యొద్దకు రమ్మని యాతని ప్రశ్నకు నుత్తర మొసంగినదాయెను ॥79॥

శ్లో. యథామిషే జగ్మ రనామిషభ్రమం
నిరామిషే చాऽऽమిషమోహ మూహిరే,
తథా విదగ్ధైః పరికర్మనిర్మితం
విచిత్ర మేవం పరిహాస్య భోజితాః. 80

ప. వి. యథా - ఆమిషే - జగ్మః - అనామిషభ్రమం - నిరామిషే-చ-ఆమిష మోహమ్-ఊహిరే-తథా-విదగ్ధైః-పరికర్మనిర్మితం-విచిత్రమ్ - ఏవం - పరిహాస్య-భోజితాః.

అర్థము: ఏతే = ఈ వారయాత్రికులు, యథా = ఏ ప్రకారముగా, ఆమిషే = మాంసమందు, అనామిషభ్రమం = మాంసము కాదనెడి భ్రమమును, జగ్మః = పొందిరో, నిరామిషే చ = ఆమిషముకానివానియందు, ఆమిషమోహం = మాంసమనెడి భ్రాంతిని, ఊహిరే = పొందిరో, తథా = ఆ ప్రకారమే, విదగ్ధైః = పరిహాసమునందు నిపుణులైన వంటవారిచే, పరికర్మనిర్మితం, పరికర్మ = భోజ్యములగు వస్తువులకు తాలింపు మున్నగు సంస్కారములనుఁ గల్గించు ద్రవ్యముచే, నిర్మితం = చేయఁ బడిన (కావుననే), విచిత్రం = ఆశ్చర్యమైన భోజ్యవస్తువును, పరిహాస్య = పరిహసించి, అనగా మాంసము నొసంగునపుడు మాంసము కాని దానిని వడ్డించుట, మాంసముకాని దానిని వడ్డించునపుడు మాంసమును వడ్డించుటయను పరిహాసమును గావించి, భోజితాః = భోజనము చేయింపఁ బడిరి.

సమాసములు :

అనామిషభ్రమం—అవిద్యమానం ఆమిషం యస్మిన్ తత్ = అనామిషం, అనామిషమితి భ్రమః = అనామిషభ్రమః, తమ్ = అనామిషభ్రమం.

నిరామిషే-నిర్గతం ఆమిషం యస్మాత్ తత్ = నిరామిషం, తస్మిన్ = నిరామిషే.

ఆమిషమోహం-ఆమిషమితి మోహః = ఆమిషమోహః,తం, ఆమిషమోహం,

పరికర్మనిర్మితం—పరికర్మణా నిర్మితం = పరికర్మనిర్మితం, తత్ = పరికర్మనిర్మితం.

భావము :

వరపక్షమునకుఁ జెందిన జనులు, మాంసమునందు, అనగా మాంస మిశ్రమగు నాహారమందు మాంసమిశ్రము కాదను భ్రాంతి నెట్లు పొందిరో, ఎట్లు మాంసరహితమగు నాహారమునందు, మాంసమిశ్రమను భ్రాంతినిఁ బొందిరో, అట్లే పరిహాసనిపుణులగు వంటవారిచే తగిన సంస్కారములతో వండఁబడినదై యాశ్చర్యకరమగు భోజ్యపదార్థములతో, మాంస మొసంగునపుడు మాంసము కానిదని పరిహాసమును, మాంసముతో మిశ్రము గాని దానిని వడ్డించునపుడు మాంసముతోఁ గూడిన యాహారమును వడ్డించుటయను పరిహాసము గావించుచు భోజనము చేయింపఁబడిరి. ॥80॥

శ్లో. నఖేన కృత్వాఽధరసన్నిభాం నిభాత్
యువా మృదువ్యఞ్జనమాంసఫాలికామ్
దదంశ దన్తైః ప్రశశంస తద్రసం
విహస్య పశ్యన్ పరిహాసికాఽధరమ్. 81

ప. వి. నఖేన—కృత్వా—అధరసన్నిభాం—నిభాత్—యువా – మృదువ్యఞ్జన మాంసఫాలికాం—దదంశ—దన్తైః-ప్రశశంస - తద్రసం - విహస్య— పశ్యన్—పరిహాసికాఽధరం.

అర్థము: యువా = ఒకయువకుఁడు, మృదువ్యఞ్జనఫాలికాం, మృదు = మెత్తని, వ్యఞ్జనమాంస = మజ్జిగతో చేయఁబడిన పచ్చడివంటి మాంసముయొక్క, ఫాలికాం = ముక్కను, నిభాత్ = భక్షించుటయను నెపమువలన, నఖేన = గోటిచే, (ఛేదించి) అధరసన్నిభాం = (వడ్డించు పరిచారికయొక్క) పెదవితో సమానాకారముగలదిగా, కృత్వా = చేసి, పరివేషికాఽధరం, పరివేషికా = వడ్డించు పరిచారికయొక్క, అధరం = క్రింది పెదవిని, పశ్యన్ = చూచుచు, విహస్య = నవ్వి, దంతైః = దన్తములతో, దదంశ = కొఱికెను, తద్రసం = దానియొక్కరుచిని, ప్రశశంస = పొగడెను. అనగా నామెయొక్క పెదవి యను బుద్ధితో దానినిఁ బొగడెనని యర్థము.

సమాసములు :

*అధరసన్నిభాం* - అధరేణ సన్నిభా = అధరసన్నిభా, తాం = అధరసన్నిభాం.

*మృదువ్యఞ్జనఫాలికాం*-మృదు చ తత్ వ్యఞ్జనం చ = మృదువ్యఞ్జనం, మృదువ్యఞ్జనస్య ఫాలికా = మృదువ్యఞ్జన ఫాలికా, తాం = మృదువ్యఞ్జన ఫాలికాం.

*తద్రసం* - తస్య రసః = తద్రసః, తం = తద్రసమ్.

*పరివేషికాఽధరం* - పరివేషికాయాః అధరః = పరివేషికాఽధరః, తం = పరివేషికాధరం

భావము :

ఒకానొక యువకుఁడు మజ్జితో నిర్మింపఁబడిన మెత్తని మాంసఖండమును తినుట యను నెపముతో గోటఁద్రుంచి, వడ్డించు పరిచారికయొక్క క్రింది పెదవితో సమానాకృతి గలదిగాఁ జేసి యా పరిచారిక యొక్క క్రింది పెదవినిఁ జూచుచు, నామెయొక్క పెదవిగా దానిని భావించుచు కొఱికెను. తర్వాత దాని రుచిని నమృతసమానముగాఁ బొగడెను. ॥81॥

శ్లో. అనేకసంయోజనయా తదా కృతం
నికృత్య నిష్పిష్య చ తాదృ గర్జనాత్
అమీ కృతాఽకాలికవస్తువిస్మయం
జనా బహువ్యఞ్జన మభ్యవాహరన్. 82

ప. వి. అనేకసంయోజనయా - తదా - కృతం - నికృత్య - నిష్పిష్య - చ - తాదృక్ - అర్జనాత్ - అమీ - కృతాకాలికవస్తువిస్మయం - జనాః - బహు - వ్యఞ్జనమ్ - అభ్యవాహరన్.

**అర్థము:** తదా = ఆ భోజనకాలమునందు, అమీ = ఈ, జనాః = జనులు, అనగా భుజించునట్టి జనులు, అనేకసంయోజనయా; అనేక = పెక్కులైన సంస్కారము నొసంగు ద్రవ్యములను, సంయోజనయా = చేర్చుటచే, తథా = ఆ విధముగ, నికృత్య = కోసి, నిష్పిష్య చ = పిసికియు, అర్జనాత్ = మఱియొకవస్తువు యొక్క రూపమును కల్పించుటవలన, తాదృక్ = అటువంటి విచిత్రముగా, కృతం = చేయఁబడినది. యథా = ఎట్లనగా; కృతాఽకాలికవస్తువిస్మయం; కృత = సంపాదింపఁబడిన, అకాలిక = ఆ కాలమందుఁ గల్గిన, వస్తు = వస్తువులయందు, విస్మయం = ఆశ్చర్యమును గల్గించు, బహు = పెక్కైన, వ్యఞ్జనం = శాకములతోడను, మాంసముల తోడను నిర్మితములైన పచ్చళ్ళను కూరలను, అభ్యవాహరన్ = భుజించిరి.

సమాసములు :

అనేకసంయోజనయా - అనేకేషాం సంయోజనా = అనేకసంయోజనా, తయా = అనేకసంయోజనయా.

కృతాఽకాలికవస్తువిస్మయం - అకాలే భవాని = అకాలికాని, ఆకాలికాని చ తాని వస్తూని చ = అకాలికవస్తూని, అకాలికవస్తుషు విస్మయః = అకాలికవస్తువిస్మయః, కృతః అకాలికవస్తువిస్మయః యేన తత్ = కృతాకాలికవస్తువిస్మయం, తత్ = కృతాకాలికవస్తువిస్మయం.

భావము :

భోజనకాలమందలి భోక్తలగు వరునిపక్షమునకుఁ జెందిన జనులు పెక్కు-సంస్కారకములగు ద్రవ్యములనుఁ గలుపుటచేతను, త్రుంచి, పిసికి మఱియొక వస్తువుతో పోలికకల్గినదిగా చేయుటవలనను, నంత విచిత్రముగా తయారుచేయఁబడినవై యా కాలమునకు దుర్లభములగు వస్తువులచే నిర్మింపఁబడుటవలన నాశ్చర్యము గొలుపుచున్న పెక్కు విధములగు శాకమాంసాదులతో నిర్మింపఁ బడిన పచ్చళ్ళను కూరలను, నారగించిరి. ॥82॥

శ్లో. పిపాసు రస్మీతి విబోధితా ముఖం
నిరీక్ష్య బాలా సుహితేన వారిణా।
పునః కరే కర్తుమనా గలన్తికాం
హసాత్ సఖీనాం సహసా న్యవర్తత. 83

ప.వి: పిపాసుః-అస్మి - ఇతి - విబోధితా - ముఖం-నిరీక్ష్య-బాలా-సుహితేన-వారిణా-పునః-కరే-కర్తుమనాః-గలన్తికాం-హసాత్-సఖీనాం - సహసా-న్యవర్తత.

అర్థము :- వారిణా = ఉదకముచే, సుహితేన = తృప్తి చెందిన యొకానొక యువకునిచే, ముఖం = యువతియొక్క మోమును, నిరీక్ష్య = చూచి, పిపాసుః = నీరు త్రాఁగ నభిలాషగలవాడుగా, అస్మి = అగుచున్నాను, ఇతి = అని; విబోధితా = హెచ్చరిక చేయఁబడిన, బాలా = బాలికయై నందువలన దానియందలి గూఢార్థమునుఁ దెలియఁ జాలని యువతి, పునః = మఱల; గలన్తికాం = గిండిని లేక చెంబును, కరే = హస్తము నందు, కర్తుమనాః సతీ = పట్టుకొనఁ గోరిక గలదగుచు, సఖీనాం = చెలికత్తెఁయొక్క, హసాత్ = నవ్వువలన, సహసా = వెంటనే, న్యవర్తత = మఱలినది అనగా నీరు త్రాగి తృప్తిఁ జెందిన యావిటుఁడు పని యేమియు లేక "పిపాసు రస్మి" అనగా త్రాగఁ గోరుచున్నానని చెప్పుటవలన యాయువతి దానిలోని నిగూఢార్థమును అనగా 'నీ పెదవిని పానముఁ జేయగోరుచున్నా'నను నర్థమును గ్రహింపక దాహమువలన నీటిని పానముఁ జేయగోరుచున్నా'డని భ్రాంతిపడి చెంబుతో నీటినిఁ దేఁబ్రయత్నిం

పగా, జెలికత్తె లాయువతి, గూఢార్థమునుఁ దెలిసికొనక యమాయికురాలుగ నీరుఁ దేఁబోయినదని నవ్విరి. ఆ నవ్వుచే నామె యా గూఢార్థమునుఁ దెలిసికొనిఁ చెంబునుఁ జేపట్టుటను మానినదని యాశయము ॥83॥

సమాసములు :

పిపాసుః — పాతు మిచ్ఛుః = పిపాసుః
కర్తుమనాః — కర్తుం మనః యస్యాః సా = కర్తుమనాః

భావము :

నీరు త్రాగి తృప్తిఁ జెందిన యువకు డొకడు బాలయైన యువతియొక్క ముఖమునుఁ జూచి "త్రాగఁ గోరుచున్నాను" అని యడుగగా యామె యాతని మాటలోని గూఢార్థమును, అనగా నీ పెదవినిఁ ద్రాగగోరుచున్నానను నర్థమునుఁ దెలియక బాలిక యైనందువలన నమాయకతతో, చెంబుతో నీటినిఁ దేఁబోగా, నచ్చటి చెలికత్తె లామె యమాయకత్వమునకు నవ్వసాగిరి. అప్పు డామె యా యర్థమును గ్రహించినదై యాపనినుండి మఱలినది. అతడు నీరు త్రాగి తృప్తి నొంది యున్నప్పుడు, మఱల నీటిని త్రాగుట కవసర మేమున్నది? కాన నట్టి స్థితిలో "పిపాసు రస్మి" యను నాతని మాటకు నీరు త్రాగఁగోరుట యర్థము కాదు. మఱేమనగా నా యువతి యధరమును పానము చేయుటయే ॥83॥

శ్లో. యువా సమాదిత్సు రమత్రగం ఘృతం
విలోక్య తత్రైణదృశోఽనుబిమ్బనం,
చకార తన్నివినివేశితం కరం
బభూవ తచ్చ స్ఫుటకణ్టకోత్కరమ్. 84

ప. వి. యువా-సమాదిత్సుః-అమత్రగం-ఘృతం-విలోక్య - తత్ర-ఏణదృశః - అనుబిమ్బనం-చకార-తన్నివినివేశితం-కరం-బభూవ-తత్-చ-స్ఫుటకణ్టకోత్కరం.

**అర్థము.** యువా = ఒకానొక యువకుఁడు, అమత్రగం = పాత్రయందున్న, ఘృతం = నేతిని, సమాదిత్సుః = తీసికొనఁ గోరినవాఁడై, తత్ర = ఆనేతియందు, ఏణదృశః = జింకకన్నులవంటి కన్నులుగల యా పరిచారికయైన యువతియొక్క, అనుబిమ్బనం = ప్రతిబింబమును, విలోక్య = చూచి, కరం = తనచేతిని, తన్నీవినివేశితం; తత్ = ఆ ప్రతి బింబముయొక్క, నీవి = చీరముడియందు, నివేశితం = ఉంచబడినదిగా, చకార = చేసెను, తచ్చ = ఆ ప్రతిబింబముగూడ, స్ఫుటకణ్టకోత్కరం; స్ఫుట = వెల్లడియైన, కణ్టక = పులకములయొక్క, ఉత్కరం = సమూహముగలదిగా, బభూవ = ఆయెను. తన కోకముడిని విప్పుటకై యభిప్రాయమును దెలుపుటకొఱకు తన ప్రతిబింబములోని కోకముడికి సమీపమున నాతడు చేతినుంచుటనుఁ జూచి యాతనికి తన సమ్భోగ మునకై యభిలాష యుండుటనుఁ దెలిసికొని యాతనియందుఁ దాను ననురాగ ముంచుటవలన తాను పులకితురాలైనది. అందువలననే యామె ప్రతిబింబముగూడ పులకితమైనదని యర్థము.

సమాసములు :

సమాదిత్సుః - సమాదాతు మిచ్ఛుః = సమాదిత్సుః
అమత్రగం - అమత్రం గచ్ఛతీతి = అమత్రగం, తత్ = అమత్రగం.
ఏణదృశః - ఏణస్యేవ దృశౌ యస్యా స్సా = ఏణదృక్, తస్యాః = ఏణదృశః.
తన్నీవినివేశితం - తస్య నీవిః = తన్నీవిః, తన్నీవౌ నివేశితః = తన్నీవి నివేశితః, తం = తన్నీవినివేశితం.
స్ఫుటకణ్టకోత్కరం - కణ్టకానా ముత్కరః = కణ్టకోత్కరః, స్ఫుటః కణ్టకోత్కరః యస్య సః = స్ఫుటకణ్టకోత్కరః, తం = స్ఫుటకణ్టకోత్కరం.

భావము :

ఒకానొక యువకుఁడు నేతిగిన్నెనుఁ దీసికొనగోరినవాఁడై, అందలి నేతి యందు నొక హరిణాక్షియొక్క ప్రతిబింబమునుఁ జూచి, తనచేతిని స్త్రీ ప్రతి

బింబముయొక్క కోకముడిపై నుంచెను. అప్పుడా ప్రతిబింబము పులకములతోఁ గూడినదాయెను. అనగా తన కోకముడిని విప్పుటకై తన ప్రతిబింబములోని కోకముడికి సమీపమున నాతడు చేతినిఁ బెట్టుటనుఁ గాంచి యాతనిపై నామె కనురాగము గల్గినది. అందువలన నామె శరీరము పులకితము కాగా, ఆమె ప్రతిబింబమునందును, నా పులకము లేర్పడి యదియు పులకితముగాఁ గాన వచ్చినదని యాశయము. ॥84॥

శ్లో. ప్రలేహజస్నేహకృతానుబిమ్బనాం
చుచుమ్బ కోఽపి శ్రితభోజనస్థలః,
ముహుః పరిస్పృశ్య కరాఙ్గులీముఖైః
తతోఽనురక్తైః స్వమవాపితైర్ముఖమ్. ॥85॥

ప. వి. ప్రలేహజస్నేహకృతానుబిమ్బనాం-చుచుమ్బ-కః-అపి-శ్రితభోజనస్థలః - ముహుః-పరిస్పృశ్య-కరాఙ్గులీముఖైః- తతః- అనురక్తైః- స్వమ్- అవాపితైః-ముఖమ్.

అర్థము: కోఽపి = ఒకానొక, యువా = యువకుఁడు. శ్రితభోజనస్థలః, శ్రిత = ఆశ్రయింపబడిన, భోజనస్థలః = భోజనముచేయు స్థలముగలవాఁడై, ప్రలేహజస్నేహకృతానుబిమ్బనాం, ప్రలేహజ = నాలుకతో నాస్వాదింపఁ దగిన, యల్లము మున్నగువానితోఁ జేయఁబడిన, ద్రవద్రవ్యరూపమున నున్న సాధనమునుండి యేర్పడిన, స్నేహ = తైలము మున్నగువాని యందు, కృతానుబిమ్బనాం; కృత = చేయబడిన, అనుబిమ్బనాం = ప్రతిబింబముగల్గిన, పరివేషణముఁ జేయుఁ బరిచారికను, ముహుః = పలు మాఱులు, పరిస్పృశ్య = వ్రేళ్లకొనలతో తాకి, తతః = తాకినపిదప, స్వం = తనదైన, ముఖం = మోమును, అవాపితైః = పొందింపఁబడిన యనగా ముద్దిడఁబడిన (కావుననే), అనురక్తైః = వేడిగల పదార్థములనుఁ దాకుటవలనగాని, స్వాభావికముగాఁ గాని) ఎఱ్ఱఁబడిన, (అనురాగము వహించిన) కరాఙ్గులీముఖైః = చేతివ్రేళ్ళకొనలచే, చుచుమ్బ = ప్రతి బింబించిన యామెను) ముద్దిడుకొనెను. మాటిమాటికి లేహ్యములగు సాధ

నముల నాస్వాదించునెపమున నెదుటనున్న పరివేషించు పరిచారికయొక్క ప్రతిబింబముచే తాకఁబడిన తనవ్రేలికొనలను నాకుటవలననేయామెయొక్క ప్రతిబింబమును నాస్వాదించుటవలని సుఖము ననుభవించె ననియు నామెపై యనురాగము వహించెనని యు నభిప్రాయము.

సమాసములు :

*ప్రలేహజస్నేహకృతానుబిమ్బనాం* - ప్రలేహేభ్యః జాయత ఇతి = ప్రలేహజః, ప్రలేహజ శ్చాసౌ స్నేహశ్చ = ప్రలేహజస్నేహః, ప్రలేహజ స్నేహే కృతం, అనుబిమ్బనం యస్యా స్సా = ప్రలేహజస్నేహకృతాను బిమ్బనా, తాం = ప్రలేహజస్నేహకృతానుబిమ్బనాం.

*శ్రితభోజనస్థలః*-భోజనస్య స్థలం = భోజనస్థలం, శ్రితం భోజనస్థలం యేన సః = శ్రితభోజనస్థలః.

*కరాఙ్గులీముఖైః* - కరస్య అఙ్గుల్యః = కరాఙ్గుల్యః, కరాఙ్గులీనాం ముఖాని = కరాఙ్గులీముఖాని, తైః = కరాఙ్గులీముఖైః.

భావము :

ఒకానొక యువకుఁడు భోజనస్థలమునుఁ బొందినవాడై లేహ్యములైన యల్లము మున్నగువానిచే నిర్మింపఁబడిన నూనెలతోగూడిన ద్రవపదార్థముల యందు వడ్డించుసమయమున ప్రతిబింబి చినట్టి పరివేషణముఁ జేయుఁ బరిచారికను మాటిమాటికి తనవ్రేళ్ళకొనలచే తాకి, తర్వాత తననోట నుంచుకొనఁబడి యాస్వాదింపఁబడిన యావ్రేళ్లు ఆసాధకముకోని వేడివలననో స్వాభావికముగనో యెఱ్ఱబడినవై (అనురాగము నొందినవై) యుండినవి. అట్టివ్రేళ్ళకొనలతో నాయువకుఁడు స్నేహపదార్థములయందు ప్రతిబింబించిన యాయువతిని ముద్దిడుకొనెను. మాటిమాటికి లేహ్యావ్యఙ్జనమును నాస్వాదించుట యను వ్యాజమున, నెదుటనున్న పరివేషణముచేయు, యువతియొక్క ప్రతిబింబమును తాకుచున్న తనవ్రేళ్ల యొక్క కొనలను చుమ్బనముచేయుటవలననే యామె ప్రతిబింబమును చుమ్బనముఁజేయుటవలని సుఖము ననుభవించెననియు, నామెయం దనురక్తుడాయె ననియు భావము ॥౭౯॥

శ్లో. అరాధి యస్మిన్మృగాజపత్త్రిజైః
ఫలైః మృదుస్వాదుసుగన్ధితేమనమ్,
అశాకి లోకైః కుత ఏవ జేమితుం
న తత్తు సంఖ్యాతుమపి స్మ శక్యతే. 86

ప.వి:- ఆరాధి-యత్-మీనమృగాజపత్త్రిజైః-పలైః-మృదు - స్వాదు-సుగన్ధి - తేమసం-అశాకి - లోకైః-కుతః-ఏవ - జేమితుం-న-తత్-తు - సంఖ్యాతుమ్-అపి-స్మ-శక్యతే.

అర్థము:- మీనమృగాజపత్త్రిజైః, మీన=చేపలు, మృగ=కుందేలు మున్నగు జంతువులు, అజ=మేకలు, పత్త్రిజైః=పక్షులు అనువానినుండియుద్భవించిన, పలైః=మాంసములచే, మృదు=మెత్తందనము గలదియు, స్వాదు=రుచిగలదియు, సుగన్ధి=సువాసన గలదియునగు, యత్=ఏ, తేమనం = మజ్జిగతోటి వ్యఞ్జనము, అరాధి = పక్వము చేయఁబడినదో, తత్ = ఆ వ్యంజనము, లోకైః = భుజించు జనములచే, సఙ్ఖ్యాతుం=లెక్కించుటకుఁగూడ, న శక్యతే స్మ=సాధ్యము కాకయుండినది. తు=కాని, జేమితుం=తినుటకు, కుత ఏవ=ఏవిధముగా అశాకి=శక్యమైనది.

సమాసములు :

మీన మృగాజ పత్త్రిజైః — మీనాశ్చ, మృగాశ్చ అజాశ్చ పత్త్రిణశ్చ =మీనమృగాజ పత్త్రిణః మీనమృగాజ పత్త్రిభ్యః జాయన్త ఇతి=మీన మృగాజ పత్త్రిజాని, తైః=మీనమృగాజపత్త్రిజైః.

భావము :

చేపలు, మృగములు, మేకలు, పక్షులు మున్నగువాని మాంసములచే, మెత్తగాను రుచికరముగను, సువాసనగలదిగను నిర్మింపపడిన మజ్జిగ, పచ్చడి

యను సాధకములు, భోక్తలగు జనములచే లెక్కింప సాధ్యము కాక యుండినవి. ఇఁక వానిని భుజింప వారికి శక్తి యెక్కడిది? ఏల యనగా నాసాధకము లపరిమితములుగా చేయఁబడినది. అందువలన భోక్తల కవి యపరిమితములై లెక్కింప సాధ్యములు కాక యుండినవి. అట్లు లెక్కింప సాధ్యముకాక యుండిన యసంఖ్యాకములగు నాసాధకములను నాభోక్త లెట్లు తినగల్గిరి? వాస్తవములో తినలేక కొన్నింటిని వదలిపెట్టియుందురు ॥86॥

శ్లో॥ కృతార్థన శ్చాటుభి రిఙ్గితైః పురా
పరాసి యః కిఞ్చన కుఞ్చితభ్రువా
క్షిపన్ ముఖే భోజనలీలయాఽఙ్గులీః
పునః ప్రసన్నాననయాఽన్వకమ్పి సః. 87

ప. వి. కృతార్థనః - చాటుభిః - ఇఙ్గితైః- పురా - పరాసి - యః- కిం-చన- కుఞ్చితభ్రువా - క్షిపన్ - ముఖే - భోజనలీలయా - అఙ్గులీః-పునః - ప్రసన్నాననయా - అన్వకమ్పి - సః.

అర్థము: చాటుభిః=అనునయమును సూచించునవియైన. ఇఙ్గితైః = కన్నులు మున్నగు నవయవములయొక్క చేష్టలచే, కృతార్థనః; కృత=చేయబడిన, అర్థనః = సంభోగ ప్రార్థన గల్గిన,యః = ఏ యువకుడు, కిఞ్చన=కొంచెము, కుఞ్చితభ్రువా; కుఞ్చిత=వంకరగాఁ జేయఁబడిన, భ్రువా = కనుబొమ్మలు కల్గిన స్త్రీచే, పూర్వం=తొలుత, పరాసి=నిరాకరింపఁబడెనో, సః=ఆ యువకుఁడు, భోజనలీలయా= భోజన వ్యాపారమను మిషచే,ముఖే=నోట, అఙ్గులీః=ఆమెయొక్క ప్రతిబింబముచే స్పృశింపబడిన వ్రేళ్ళను, క్షిపన్=ఉంచుకొనుచు ననగా ప్రతిబింబముచేఁ దాకఁబడిన వ్రేళ్ళను ముద్దిడుట యను వ్యాజముచే యామెనే ముద్దిడుచు, ప్రసన్నాననయా - ప్రసన్న = అనురాగముతోఁ చూచుటచే ప్రసన్నమైన, ఆననయా = ముఖము గల్గిన యాతరుణిచే, అన్వకమ్పి=సంభోగమునకు దయచూపఁబడెను.

సమాసములు :

కృతార్థదః = కృతమ్, అర్థనం యేన సః = కృతార్థనః
కుఞ్చిత భ్రువా - కుఞ్చితే భ్రువౌ యస్యాః సా = కుఞ్చితభ్రూః, తయా = కుఞ్చితభ్రువా.
భోజనలీలయా - భోజనస్య లీలా = భోజనలీలా, తయా = భోజన లీలయా.
ప్రసన్నాననయా - ప్రసన్నం ఆననం యస్యాః సా = ప్రసన్నాననా; తయా = ప్రసన్నాననయా.

భావము :

తొలుత ననునయాదులతోను గూడిన కన్నులు మున్నగు నవయవముల విలాసములచే సంభోగమునకై ప్రార్థించిన యువకుని చిట్లించిన కనుబొమ్మలతో తిరస్కరించినది. అతడే భోజనమను నెపమున నామె ప్రతిబింబమునుఁ దాకిన వ్రేళ్లను నోట నుంచుకొనుట యను వ్యాజమున నామెను ముద్దిడుకొనుటచే నామె ప్రసన్న వదనము గలదై సానురాగముగా వానినిఁ జూచుచు మఱల వాని నను గ్రహించినదని యర్థము. ॥87॥

శ్లో. అకారి నీహారనిభం ప్రభఞ్జనా
దధూపి యచ్చాగురుసారదారుభిః,
నిపీయ భృఙ్గారకసఙ్గి తచ్చ తై
రవర్ణి వారిప్రతివార మీదృశమ్. 88

ప. వి. అకారి- నీహారనిభం- ప్రభఞ్జనాత్- అధూపి- యత్- చ- అగురుసార దారుభిః-నిపీయ-భృఙ్గారకసఙ్గి- తత్-చ-తైః-అవర్ణి-వారి-ప్రతివారమ్- ఈదృశమ్.

అర్థము:- యత్-ఏ నీరు, ప్రభఞ్జనాత్ = గాలివీచుటవలన, నీహారనిభం = మంచుతో సమానముగా, శీతలముగా, అకారి = చేయఁబడినదో, తథా =

అప్లే, అగురుసారదారుభిః, అరుగు=కృష్ణాగురు వృక్షము యొక్క, సార=లోపలిమేలైన సుగన్ధముగల, దారుభిః=కొయ్యలచే, అధూపి=పొగవేయఁబడినదో, భృఙ్గారకసఙ్గి = అట్టి చిన్న బంగారు పాత్ర యందున్న, తత్= ముందుఁజెప్పబడిన, వారి=నీటిని, నిపీయ=త్రాగి, ప్రతివారం = ఒక్కొక్కమాఱు, తైః=ఆ త్రాగునట్టివారిచే, ఈదృశం=చెప్పఁబోవుప్రకారము, అవర్ణి=వర్ణింపఁబడినది.

సమాసములు :

*నీహారనిభం*- నీహారేణ సదృశం=నీహారనిభం, తత్=నీహారనిభం,
*అగురుసారదారుభిః* - అగురోః సారః యేషాం తాని=అగురుసారాణి, అగురుసారాణి చ తాని దారూణి చ = అగురుసారదారూణి, తైః= అగురుసారదారుభిః.
*భృఙ్గారకసఙ్గి*- భృఙ్గారకేణ సఙ్గి=భృఙ్గారకసఙ్గి, తత్ =భృఙ్గారకసఙ్గి.
*ప్రతివారం*- వారే వారే=ప్రతివారం

భావము :

నీటిని గాలితోఁ జల్లబఱచి, యగురువాసనలనుఁ దగులునట్లు చేసి బంగారు గిన్నెలయం దుంచఁబడగా యానీటిని పలుమాఱులు త్రాగి, యొక్కొక్క తడవఁ ద్రాగినప్పుడును నా పానముగావించినవారు పై శ్లోకమునందు చెప్పఁబోవు ప్రకారము చెప్పిరి. ॥88॥

శ్లో. తథా విధాత ర్యదకారి చామృతం
కృతఞ్చ యజ్జీవన మమ్బు సాధు తత్
వృథేద మారమ్భి తు సర్వతోముఖం
తథోచితః కర్తు మిదంపిబ స్తవ. 89

ప. వి. తథా-విధాతః-యత్-అకారి-చ-అమృతం-కృతం - చ-యత్-జీవనమ్-అమ్బు-సాధు-తత్-వృథా-ఇదమ్-ఆరమ్భి-తు-సర్వతోముఖం - తథా-ఉచితః-కర్తుమ్-ఇదంపిబః-తవ.

అర్థము:- హే విధాతః = ఓ బ్రహ్మ! త్వయా = నీచేత, అమ్బు = ఉదకము, అమృతం = అమృతమని పేరుగలదిగను, జీవనం = జీవనమను పేరు గలదిగను, యత్ = ఎందువలన, అకారి = చేయఁబడినదో, తత్ = ఆ రెండు కార్యములును, సాధు = చక్కఁగా, కృతం = చేయఁబడినది, ఉదకము, అమృతముతో సమానమైన రసము గల్గినందువలనను, జీవనమునకు సాధనమైనందువలనను నా రెండు పేరులును దానికి సార్థకములైనవని భావము. తు = కాని, ఇదం = ఈ యుదకము, సర్వతోముఖం; సర్వతః = అంతట ప్రవాహరూపములగు ముఖములు గలదిగా సర్వతోముఖమును పేరుగలదిగా, వృథైవ = వ్యర్థముగనే, ఆరంభి = చేయఁబడినది. పేయమనగా పానము చేయఁదగిన వస్తువునకు పేరు. దానికి ముఖము అవసరము లేదు గదా. అప్పుడు ముఖపదము దానిపేరుతో నుండుట వ్యర్థము. (అతః = ఇందువలన) ఇదంపిబః; అస్య అంబునః = ఈ యుదకమును. పిబతీతి = త్రాగునని ఇదంపిబః = జలమును త్రాగు మనము మున్నగువారమనియు, తథా = అట్లే, సర్వతోముఖః, సర్వతః = అన్ని స్థానముల యందు ముఖము గల్గిన వారమనియు (సర్వతః ముఖాని యస్య సః), అని కర్తుం = చేయుటకు, తవ = నీకు, ఉచితః = తగినది. నీరు త్రాగువారికి బహుముఖము లున్నయెడల వారికి, దృప్తి కలుగు నంతవరకును నీరు త్రాగుట సంభవించును. కాని ఒక ముఖముతో నది సంభవింపదు కావున వారికే సర్వతోముఖత్వ ముండుట యుచితమని యాశయము. కాని ప్రకృతము పేయమైన జలమునకు జలమునకు సర్వతోముఖమని ముఖశబ్దఘటితమైన పేరుంచుట వ్యర్థమని యర్థము.

సమాసములు ;

సర్వతోముఖం-సర్వతః ముఖాని యస్య తత్ = సర్వతోముఖం.

భావము :

ఓ విధాతా ! నీవు ఉదకమునకు, అమృతము, జీవనము, అను పేర్లనుఁ బెట్టుట సముచితమే. ఏలయనగా నుదకము అమృతములో

సమానమగు రుచినిఁ గల్గియున్నది. ప్రాణములను నిలుపుటకు సాధనమునై యున్నది. కాన నమృత మనియు, జీవన మనియు, పేర్లను నట్టి యుదకమునకుఁ బెట్టుట సముచితమే గాని సర్వతోముఖమను పేరును దాని కుంచుట వ్యర్థము. ఏల యనగా నది యుదకమునకు సార్థకము గాదు. పేయ మైన వస్తువునకు ననగాఁ ద్రాగఁబడు వస్తువునకు ముఖ మెందు కవసరము? కాని త్రాగు వ్యక్తికి ముఖ మవసరము. కాని యవి త్రాగునవి కాకపోయినను సర్వతో ముఖ మను పేరుబెట్టుట వ్యర్థమే యైనది. కాన జలముసుఁ ద్రాగునట్టి ప్రాణులకే 'సర్వతోముఖ' మని 'సర్వతః ముఖాని యస్య సః' అను వ్యుత్పత్తి ననుస రించి శరీరమంతట ముఖములుగలదిగ పేరుంచుట తగినది. నీరు త్రాగునట్టివారికి పెక్కుముఖము లున్నచో, తృప్తి కలుగునంతవరకును నీటినిఁ ద్రాగుట సంభ వించును కాని యొక ముఖ మున్నచో తృప్తిగా నీటినిఁ ద్రాగుట కష్టము. కాన పానము చేయునట్టివారికే సర్వతోముఖమని పేరుంచుట తగినదని యర్థము. అట్లున్నచో మధురజలముల నొక ముఖముతో, శీతలజలములను మఱియొక ముఖముతో త్రాగుట కవకాశ ముండెడిది. ఆ విధముగా నీజలమునుఁ త్రాగు మనవంటి జనమునకు ఇదంపిబః అనగా ఇదం = ఈ నీటిని, పిబతీతి = పిబః అనగా జలపాయి యను పేరెట్లు సరిపడునో అట్లే సర్వతః ముఖాని యస్య సః యని మనకు పేరుంచియున్నచో నాపేరును తగియుండెడిదని భావము. ॥90॥

శ్లో. సరోజకోశాభినయేన పాణినా
స్థితేఽపి కూరే ముహురేవ యాచతే,
సఖి!త్వ మస్మై వితర త్వ మిత్యుభే
మిథో న వాదాత్ దదతుః కిలౌదనమ్. 91

ప.వి: సరోజకోశాభినయేన-పాణినా-స్థితే-అపి-కూరే-ముహుః-ఏవ-యాచతే - సఖి-త్వమ్-అస్మై-వితర-త్వమ్-ఇతి-ఉభే-మిథః-న-వాదాత్- దదతుః -కిల-ఓదనం.

అర్థము: కూరే = అన్నము, స్థితేఽపి = ఉన్నను, అనగా భోజన పాత్రమందు, అన్నమున్నను, సరోజకోశాభినయేన; సరోజ = పద్మముయొక్క, కోశ =

మొగ్గను, అభినయ=అనుకరించుట గల్గిన అనగా తామరపూవుమొగ్గ ననుకరించుచు నామెయొక్క స్తనములను, బట్టుటలోని యభిలాషను సూచించు, పాణినా=హస్తముచే, ముహుః=పలుమాఱులు, యాచతే= యాచించుచున్న యువకునికై, హేసఖి!=ఓ చెలికత్తియా, త్వం=నీవు, అస్మై=యాచించుచున్న యువకునకు, వితర=అన్నమును వడ్డించుము. అని చెప్పగా రెండవ స్త్రీయు, త్వం=నీవు, వితర వడ్డించుము. ఇతి= ఈ విధముగా, ఉభే=ఇద్దఱుస్త్రీలును, మిథః=ఒండొరులు, వివాదాత్= వివాదపడుటవలన, ఓదనం=అన్నమును, న దదతుః కిం=వడ్డించలేదు అతఁడు చేసిన పని జనులలో పరిహాసకరముగా నుండుటచే నొక్కతెయు దాని నంగీకరింపలేదని యర్థము.

సమాసములు :

*సరోజకోశాభినయేన—సరోజస్యకోశః=సరోజ కోశః, సరోజకోశస్య* **అభినయః**=*సరోజకోశాభినయః, తేన=సరోజకోశాభినయేన.*

భావము :

ఒక యువకుఁ డన్నము భోజనపాత్రయం దున్నను తామరమొగ్గ ననుకరించుచు, యామెయొక్క స్తనములనుఁ బట్టుటకై తన యభిలాషను సూచించుచున్న తనహస్తముచే, మాటిమాటికి నన్నమును వడ్డింపఁ గోరుచుండెను. అప్పుడిద్దఱి చెలికత్తెలలో నొక్కతె మఱియొక్కతెనుఁ బిలచి 'చెలీ! నీవతని కన్నము వడ్డింపు'మని చెప్పగా నప్పుడు ఆమె 'నీవే వడ్డింపు'మని చెప్పగా నొండొరులును వివాదపడి యొకరును వడ్డింపలేదు. ఏలయనగా నాయువకుఁడు చేయు పని జనులలో పరిహాసముగ నుండుటనుఁ జూచి యొక్కతెయు వడ్డించుటకు ముందుకు రాలేదని భావము ॥90॥

శ్లో. ఇయం కియచ్చారుకుచేతి పశ్యతే
ప్రియః ప్రదాయా హృదయం సమావృతం,
ధ్రువం మనోజ్ఞా వ్యతర ద్యదుత్తరం
మిషేణ భృఙ్గారధృతేః కరద్వయీ. 91

ప. వి. ఇయం-కియచ్చారుకుచా-ఇతి-పశ్యతే - పయఃప్రదాయాః - హృదయం-సమావృతం-ధ్రువం-మనోజ్ఞా-వ్యతరత్-యత్ - ఉత్తరం - మిషేణ - భృఙ్గారధృతేః-కరద్వయీ.

అర్థము: ఇయం = ఈ యువతి, కియచ్చారుకుచా; కియత్ = ఎంత పరిమితితోఁ గూడిన, చారు = అందముగల, కుచా = చనుదోయితో నొప్పుచున్నది! ఇది = ఈ విధముగా ( విచారించి ), పయఃప్రదాయాః = ఉదకము నొసంగుచున్న యువతియొక్క, సమావృతం = వస్త్రముతో గప్పబడిన, హృదయం = వక్షఃస్థలమును, పశ్యతే = చూచుచున్న అనగా చనుదోయిపరిమితినిఁ దెలిసికొనఁగోరిన విటునకు, కరద్వయీ = ఆమెయొక్క చేతులజంట, భృంగారధృతేః = స్వర్ణమయమగు జలపాత్రమును పట్టుట యొక్క, మిషేణ = వ్యాజముచే, యత్ = ఏ, ఉత్తరం = జవాబును, అనగా నా చనుదోయి యీ స్వర్ణమయమగు పాత్రయొక్క పరిమితిగలదియని జవాబును, వ్యతరత్ = ఇచ్చినది, తేన = దానిచే, ధ్రువం = నిశ్చయముగా, కరద్వయీ = ఈ చేతులజంట, మనోజ్ఞా = పరాభిప్రాయమునుఁ దెలియసమర్థమైనదని యర్థము.

వి పరుని యాశయము తెలిసికొనుట ప్రాణిధర్మము కాని యప్రాణిధర్మము కాదు. ప్రశ్నోత్తరముల నిచ్చుటయు ప్రాణిధర్మమే కాని యప్రాణిధర్మము కాదు. ఈరెంటిని అచేతనమైన హస్తములయందుఁ భావించుటవలన నుత్ప్రేక్షాలఙ్కారము. వ్యఙ్జకమగు ధ్రువశబ్దమునుఁ బ్రయోగించుటవలన నది వాచ్యము.

సమాసములు ;

*కియచ్చారుకుచా*-కియన్తౌ, చారూ కుచౌ యస్యాః సా = కియచ్చారుకుచా.

*పయఃప్రదాయాః* - ప్రయః ప్రదదాతీతి = పయఃప్రదా, తస్యాః = పయఃప్రదాయాః.

*భృఙ్గారధృతేః* - భృఙ్గారస్య ధృతిః = భృఙ్గారధృతిః, తస్యాః = భృఙ్గారధృతేః

*కరద్వయీ* - కరయోః ద్వయీ = కరద్వయీ.

భావము :

ఒక యువకుఁడు,జలమును పోయునట్టియొక యువతి యొక్క వస్త్రముతోఁ గప్పఁబడిన వక్షఃస్థలమును జూచి, యీమెయొక్క చనుదోయి ఎంత పెద్దదో? ఎంత మనోహరమో ? అని దెలియఁగోరి చూచుచుండగా నామె చేతులజంటతో స్వర్ణ పాత్రనుఁ బట్టుట యను నెపముచే, నామె స్తనము లాపాత్రయొక్క పరిమితినిఁ గల్గి దాని స్వర్ణచ్ఛాయతో మనోహరముగా నొప్పుచున్నవని యుత్తర మిచ్చినదని భావింపఁబడినది. అనగా నామె యాతని యాశయమును గ్రహించినదై, తన చేతులలో స్వర్ణపాత్రనుఁ బట్టినది. అందువలన నాచేతులు నామె చనుదోయి స్వర్ణ పాత్రయొక్క కొలతనుఁ గాంతిని గల్గినదని సూచించినవని భావము ॥91॥

శ్లో. అమీభి రాకణ్ఠ మభోజి తద్గృహే
తుషారధారామృదితేవ శర్కరా
వాహద్విషద్బష్కయణీపయఃస్రుతం
సుధాహ్రదాత్ పఙ్క మివోద్ధృతం దధి. 92

ప. వి. అమీభిః - ఆకణ్ఠమ్ - అభోజి - తద్గృహే - తుషారధారామృదితా - ఇవ - శర్కరా-వాహద్విషద్బష్కయణీపయఃస్రుతం-సుధాహ్రదాత్ - పఙ్కమ్ - ఇవ ఉద్ధృతం - దధి.

అర్థము:అమీభిః=వరునికి సంబంధించినబంధువులచే,తద్గృహే=ఆభీమరాజునింట, తుషారధారామృదితా; తుషారధారా=మంచుయొక్క ధారచే, మృదితా= మర్దింపబడిన, శర్కరా ఇవ=కలకండవలె రుచిగల్గినదియుఁ దెల్లనైనది యునై,సుధాహ్రదాత్=అమృతంపుకొలనునుండి,ఉద్ధృతం=ఎత్తఁబడిన, పఙ్కమివ=అమృతంపు బురదయో యనునట్లున్న, వాహద్విషద్బష్కయణీపయఃస్రుతం; వాహ = గుఱ్ఱమును, ద్విషత్=ద్వేషించునట్టి, బష్కయణీ=చాలకాలమునకు ముందు ఈనినట్టి బఱ్ఱెయొక్క, పయః= పాలనుండి, స్రుతం=ఉత్పన్నమైన, దధి=పెరుగు, ఆకణ్ఠం = పీకలవఱకును, అభోజి=తినబడినది.

సమాసములు :

ఆకణ్ఠమ్—కణ్ఠ మభివ్యాప్య＝ఆకణ్ఠం.
తుషారధారామృదితా-తుషారస్య ధారా＝తుషారధారా, తుషారధారయా మృదితా-తుషారధారామృదితా.
వాహ ద్విషద్బష్కయణీపయః స్రుతం-వాహస్య ద్విషన్తీ＝వాహద్విషన్తీ, వాహద్విషన్తీ చ సా బష్కయణీ చ＝వాహద్విషద్బష్కయణీ, వాహద్విషద్బష్కయణ్యాః పయః, వాహద్విషద్బష్కయణీపయః, వాహద్విషద్బష్కయణీపయసః స్రుతం＝వాహద్విషద్బష్కయణీపయస్స్రుతం, తత్＝వాహద్విషద్బష్కయణీపయః స్రుతం.

భావము :

ఈ వరునికి సంబంధించిన బంధువు లా భీమసేనుని గృహమందు మంచులో తడిపి మర్దించిన కలకందవలె మధురమైనట్టిదియు, ధవళమునైనట్టిదియు, నమృతంపు కొలనునుండి యెత్తిన యమృతపు టడుసా? యని భావింపఁ దగినదియునగు చాలకాలమునకు ముందే యీనిన బఱ్ఱెపాలతో నిర్మింపఁబడిన పెరుగును గొంతువఱకును దినిరి ॥92॥

శ్లో. తదన్తరన్తః సుచిరస్య బిందుభిః
కరమ్బితం కల్పయతా జగత్కృతా,
ఇతస్తతః స్పష్ట మచోరి మాయినా
నిరీక్ష్య తృష్ణాచలజిహ్వతాభృతా. 93

ప. వి. తత్-అంతః-అంతః-సుషిరస్య-బిందుభిః-కరమ్బితం- కల్పయితా జగత్కృతా-ఇతః-తతః-స్పష్టమ్-అచోరి-మాయినా - నిరీక్ష్య - తృష్ణాచలజిహ్వతాభృతా.

అర్థము: నిరీక్ష్య＝సృష్టియొక్క ప్రారంభమునందు, తాను సృజించిన పెరుగును చూచి, తృష్ణాచలజిహ్వతాభృతా; తృష్ణా ＝ ఆశచే, అనగా

పెరుగన్నమును దినవలయునను గోరికచే, చల=చఞ్చలమైన, జిహ్వతా =నాలుకను కల్గియుండుటను, భృతా=ధరించిన యనగా పెరుగుపై మిక్కిలి యాశగల్గిన, మాయినా = తన జిహ్వాచాపల్యముచే వంచించుట యందు నేర్పుగల్గిన, అథవా = లేదా, చూచువారలయొక్క దృష్టిని వంచించుటయందు సామర్థ్యముగల్గిన, జగత్కృతా = సృష్టికర్తయగు బ్రహ్మచే, తత్ = ఆపెరుగును, అంతరంతః = మధ్యమధ్య, సుషిరస్య = రన్ధ్రముయొక్క, బిన్దుభిః = మండలములచే, ననగా గుండ్రములగు రంధ్రములచే, కరమ్బితం=మిలితమైనదిగా, కల్పయతా సతా=రచియించువానిచే, స్పష్టం=స్ఫుటముగా, అచోరి=ఆపెరుగు అపహరింపబడినది. నురుసుతో కూడినపాలు పెరుగుగా మారునపుడు, అందు రంధ్రము లేర్పడును. ఆ రంధ్రములు, జనుల కంటికి గనబడకుండ అందలి పెరుగుయొక్క సారము తినుటకై యపహరింపబడినది. కానిచో, నిటు నటు పెరుగునం దక్కడక్కడ రంధ్రము లెట్లు కనబడును? కాన బ్రహ్మనే యాకర్షించినట్టి యాగేదె పెరుగు సామాన్యజనుల నాకర్షించుట యెంత సులభమని యభిప్రాయము.

సమాసములు :

జగత్కృతా- జగత్ కరోతీతి=జగత్కృత్, తేన = జగత్కృతా.
తృష్ణాచలజిహ్వతాభృతా - తృష్ణయా చలా = తృష్ణాచలా, తృష్ణాచలా జిహ్వా యస్య సః = తృష్ణాచలజిహ్వః, తృష్ణాచలజిహ్వస్య భావః=తృష్ణాచలజిహ్వతా, తృష్ణాచలజిహ్వతాం బిభర్తీతి=తృష్ణాచలజిహ్వతాభృత్, తేన=తృష్ణాచలజిహ్వతాభృతా.

భావము :

ఆ వివాహభోజనపఙ్క్తిలో పెరుగు తేబడినది. ఆ పెరుగులో నందందు గుండ్రపు రంధ్రము లున్నవి. నురుగుతో గూడిన పాలను దోడ బెట్టినచో దానివలన నేర్పడు పెరుగులో గుండ్రపు రంధ్రములు వచ్చుట సహజము. కాని

యిక్కడ నారంధ్రములు బ్రహ్మ తా సృజించిన పెరుగులోని సారమును రుచి జూచుటకై యట్టి ప్రేక్షకుల దృష్టులను మఱుగుపఱచి యపహరించుటచే నేర్పడిన రంధ్రములుగా నుత్ప్రేక్షింపఁబడినవి. అనగా నాపంక్తియందలి పెరుగన్నపు వాసనవలన బ్రహ్మజిహ్వకు, దానిని దినవలయునని యాశ యేర్పడగా నత డాపెరుగు సారభాగములను జనుల జన్నులనుఁ గప్పి అపహరించెననియు, నాసారభాగముల నపహరించుటవలన నాపెరుగునందు రంధ్రము లేర్పడినవనియు భావింపఁబడినదని భావము॥93॥

శ్లో॥ దదాసి మే తన్న రుచేర్య దాస్పదం
న యత్ర రాగః సితయాఽపి కిం తయా,
ఇతీరిణే బిమ్బఫలం రుచిచ్ఛలా
దదాయి బిమ్బాధరయాఽరుణం చ తత్. 94

ప. వి. దదాసి-మే-తత్-న-రుచేః-యత్-ఆస్పదం-న-యత్ర-రాగః-సితయా-అపి-కిం-తయా-ఇతి-ఈరిణే-బిమ్బఫలం - రుచిచ్ఛలాత్ - అదాయి - బిమ్బాధరయా-అరుణం-చ-తత్.

అర్థము :- యత్ = ఏద్రవ్యము. రుచేః = అభిలాషకు, ఆస్పదం = స్థానమో లేక విషయమో, తత్ = దానిని, మే = నాకు, న దదాసి = ఈయవు; యత్ర = ఏద్రవ్యమునందు, రాగః = అభిలాష, న = లేదో, తయా = ఆ, సితయా = చక్కెరచేతను, కిం = ఏమి ప్రయోజనము. అనగా రక్త వస్తువునందు రాగము గలవానికి తెల్లని వస్తువుతో నేమి ప్రయోజనమని సూచితము. ఇతి = ఇట్లు. ఈరిణే = చెప్పుచున్న యనగా అధరబింబమును ముద్దిడు గోరికచే నిట్లు సంభాషించుచున్న యనురక్తునకై, రుచిచ్ఛలాత్; రుచి = అభిలాషయొక్క, ఛలాత్ = వ్యాజము వలన, బింబాధరయా = దొండపండువంటి పెదవిగల స్త్రీచే, బింబఫలం = దొండపండు, అనగా తన పెదవి పోలికను వహించిన పండు, అదాయి = ఈయబడినది. ఒక వ్యాజముతో నధరబింబమును కోరగా, మఱియొక వ్యాజముతో దొండపం డీయఁబడినదని యర్థము. ఆదొండపండు, అతని కిష్టమైనది. ఏల యనగా నది ప్రియురాలి యధరమునకు ప్రతినిధియైనది.

సమాసములు :

*బింబఫలం* — బింబమితి ఫలం = బింబఫలం
*రుచిచ్ఛలాత్* — రుచేః ఛలం = రుచిచ్ఛలం, తస్మాత్ = రుచిచ్ఛలాత్,
*బిమ్బాధరయా* :- బిమ్బమివ అధరః యస్యాః సా = బిమ్బాధరా.
తయా = బిమ్బాధరయా.

భావము :

ఏ వస్తువు నాకిష్టమో దాని నీయవు. దేనియందు ననురాగము (ఎఱ్ఱదనము) అభిలాష లేదో అటువంటి యెఱ్ఱదనములేని తెల్లని చక్కెరచే నేమి ప్రయోజనము ? ఎఱ్ఱటివస్తువందనురాగము గలవానికి తెల్లని వస్తువగు చక్కెరతో నేమి ప్రయోజనము ? ఇట్లు అధరబింబమును ముద్దిడగోరి మాట్లాడుచున్నరాగికి, యాతని యభిలాషయొక్క నెపముచే దొండపండువంటి పెదవి గల్గిన యొకస్త్రీ తనపెదవిని పోలిన దొండపండు నొసంగినది. అత డొకవ్యాజముతో తన యధరబింబమును యాచింపగా, మఱియొకమిషతో దొండపండు నొసంగినదని యర్థము. ఆ దొండపండు ప్రియురాలి యధరబింబమునకుఁ బ్రతినిధియగుట వలన తన కిష్టమైనదని భావము ॥94॥

శ్లో. సమం యయో రిఙ్గితవాన్ వయస్యయో
స్తయో ర్విహాయోపహృతప్రతీఙ్గితాం,
అకారి నాకూత మవారి సా యయా
విదగ్ధయా ఽరఞ్జి తథైవ భావవిత్. 95

ప. వి:- సమం- యయోః-ఇఙ్గితవాన్- వయస్యయోః- తయోః- విహాయ-ఉపహృతప్రతీఙ్గితాం-అకారి-న-ఆకూతమ్-అవారి-సా-యయా-విదగ్ధయా-అరఞ్జి-తథా-ఏవ-భావవిత్.

అర్థము. యయోః వయస్యయోః = ఏచెలికత్తెలయొక్క విషయమున, మమ = నాకు, యుగపత్ = ఏకకాలమున, ఇఙ్గితవాన్ = కటాక్షములు మున్నగు

సంజ్ఞలు గల్గిన, భావవిత్ = గూఢాభిప్రాయములనుఁ దెలిసిన, కశ్చిత్ = ఒకవిటుడు, తయోః = వారిఉవురిమధ్య, ఉపహృతప్రతీజ్గితాం; ఉపహృత = ఈయఁబడిన, ప్రతీజ్గితాం = ఆమె కిష్టమైన ఎదురుసంజ్ఞగల్గిన మొదటి చెలికత్తెను, విహాయ = వదలిపెట్టి, (జనసమాజమందు చెలికత్తెలయెదుట నేత్రములతో సంజ్ఞలు మున్నగువానినిఁ జేయుటవలన నీమె చాతుర్యము లేనిదని గ్రహించి యామెయందు, అనురాగమును వహింపక యామెను వదలివేసి యని యర్థము) యయా = ఏచతురురాలిచే, ఆకూతం = ఆమె యిష్టము నంగీకరించుటను సూచించునట్టి యెదురు ఇంగితము, నాఽకారి = చేయఁబడలేదోఁ (పెక్కుజనులయెదుట దానినిఁ జేసినచో వెల్లడియగునను భయముచే నధికమగు సిగ్గునొందుటవల్ల నని యర్థము.) కిన్తు = కాని, సా = మొదటిచెలికత్తె, అవారి = వారింపఁబడినదో, అనగా నిత డీమెయందు విరక్తుఁడు, నాయెడ ననురక్తుఁడు కాన నీమె యెట్లు నాప్రియునిగూర్చి యిజ్గితమును ననగాఁ బ్రణయసూచకమగు సంజ్ఞను చేయునని సవతితనమువలని యసూయచే, జనసమక్షమున నిజ్గితాదులనుఁ జేయుట యనుచిత మను నెపముచే రెండవచెలికత్తెచే యామె యిజ్గితాది చేష్టలవలన నివారింపఁబడినదని యర్థము. కాన, తయైవ = రెండవచెలికత్తెయగు, విదగ్ధయా = నేర్పరిచేతనే, అరఞ్జి = రంజిల్లి యాకర్షింపఁబడెనని యర్థము. రెండవచెలికత్తెయొక్క యట్టి గూఢభావాదులను చూచి సంతుష్టుడై యా విటు డామెయందే యనురక్తుడాయెనని భావము. దీనివలె మొదటిచెలికత్తెకంటెను, రెండవ చెలికత్తె గంభీరురా లనియు నతడును భావములను గ్రహింప శక్తుడనియు నందువల్ల నిది యుక్తమనియు సూచితము.

సమాసములు :

ఇజ్గితవాన్ - ఇజ్గిత మస్య అస్తీతి = ఇజ్గితవాన్.
ఉపహృతప్రతీజ్గితాం - ప్రతి ఇజ్గితం = ప్రతీజ్గితం, ఉపహృతం, ప్రతీజ్గితం యయా సా = ఉపహృతప్రతీజ్గితా, తాం = ఉపహృతప్రతీజ్గితాం.
భావవిత్ - భావం వేత్తీతి = భావవిత్,

భావము :

ఒక విటుఁడు ఇద్దఱి చెలికత్తెల విషయమున నొక్క కాలమునందే కన్నులతోటి సంజ్ఞలను చేయుచు వారి గూఢాభిప్రాయముల తెలియఁగల్గిన నేర్పరిగా నుండెను. ఆ యిద్దఱు చెలికత్తెలలో మొదటి చెలికత్తె జనసమాజమున జెలికత్తెలయెదుట కన్నులతోటి సంజ్ఞలనుఁ జేయరాదను నంశమునుఁ దెలియక విటునికి ప్రతిసంజ్ఞను, అనగా నతఁడు సంజ్ఞ చేయగా దానికి బదులుగా తన సంజ్ఞను నచ్చటి చెలికత్తెల సమక్షమునఁ జేసినది. అందు వలన నామె చాతుర్యము లేనిదని గ్రహించి యామెపై నతడు అనురాగ మును వహింపక విరక్తుఁ డాయెను. రెండవ చెలికత్తె చాతుర్యముకలది యగుట వలన జనసమక్షమున నా యువకునకు ప్రతిసంజ్ఞనుఁ జేసినచో వెల్లడి యగునను భయమువలన సిగ్గుపడి యూరకయుండినది. కాని, ఆమె మొదటి చెలికత్తెను విటునిఁగూర్చి సంజ్ఞలనుఁ జేయనీయక యడ్డగించినది. ఏలయనగా యా విటు డామె చతురురాలు కాదని యామెపై విరక్తి వహించి రెండవ చెలికత్తె యగు తనపై ననురాగము వహించియున్నాడు. కావున నతని కీమె, కనులతోటి సంజ్ఞలను చేయుట యనుచితమని సవతితనమువలని యసూయను వహించినదై, జనసమక్షమున నిఙ్గితాదులనుఁ జేయుట యుచితముకాదను నెపముచే రెండవది యగు నీమె యామెను నిఙ్గితాదిచేష్టలనుండి వారించినది. అట్టి నేర్పరియగు రెండవ చెలికత్తెచే నా విటుడు రంజిల్లఁజేయబడి యాకర్షింపఁబడినాడు. రెండవ చెలికత్తె లోని యట్టి చాతుర్యమునుఁ గాంచి యావిటు డామెయందే యనురక్తుఁ డాయె ననియు, నా రెండవ చెలికత్తె గంభీరురాలనియు, విదగ్ధ యనియు నావిటుఁడు చక్కటి భావజ్ఞుడనియు భావము. ॥95॥

శ్లో. సఖీం ప్రతి స్మాహ యువేఙ్గితేక్షిణీ
క్రమేణ తేఽయం క్షమతే న దిత్సితాం,
విలోమతద్వ్యఞ్జన మర్ప్యతే త్వయా
వరం కిమస్మై న నితాన్తమర్థినే. 96

ప.వి. సఖీం-ప్రతి-స్మ-ఆహ-యువేఙ్గితేక్షిణీ- క్రమేణ-తే-అయం-క్షమతే-న-దిత్సితాం- విలోమ- తత్- వ్యఞ్జనం-అర్ప్యతే- త్వయా- వరం- కిమ్- అస్మై-న-నితాన్తమ్-అర్థినే.

అర్థము: యువేఙ్గితేక్షిణీ; యువ=యువకులయొక్క, ఇఙ్గిత=అభిప్రాయమును ననగా యువాభిప్రాయమును సూచించునట్టి నేత్రసంజ్ఞలు మున్నగు చేష్టలను, ఈక్షిణీ=చూచునట్టి, ఒక యువతి, సఖీం ప్రతి=పరివేషణము చేయుచున్న చెలికత్తెనుఁగూర్చి,ఆహ స్మ=పలికెను,ఏమనగా-అయం= ఈయువకుఁడు, తే=నీకు సంబంధించిన, క్రమేణ=పారంపర్యముగా, దిత్సుతాం=పరివేషణము అనగా వడ్డించుటలోని కోరికను,న క్షమతే= సహింపడు. అనగా ఒక వస్తువును వడ్డించినపిదప నింకొకదానిని వడ్డించుట యను క్రమమువలని యాలస్యమును సహింపఁడని యర్థము. అతః= ఇందువలన, త్వయా=నీచే, నితాంతం=మిక్కిలి, అర్థినే=సాధకమును వడ్డింపగోరుచున్న, అస్మై=ఈ యువకునికొఱకు, వరం=శ్రేష్ఠమైన వ్యఞ్జనం=సాధకమును, విలోమ యథా=క్రమముతో నిమిత్తము లేకుండ, కిమ్=ఏల,న అర్ప్యతే=వడ్డింపఁబడదు? అయం=ఈ యువ కుఁడు, క్రమేణ=క్రమముగా, అనగా ఆలింగనము, స్తనమర్దనము, చుమ్బనము,మున్నగు వ్యాపారక్రమముచే, దిత్సుతాం=మైథునముఁగూర్చి వరాఙ్గము నొసంగుటకైన కోరికను ననగా నందలి విలమ్బమును, న క్షమతే=ఓర్వఁడు, అతః=ఇందువలన,త్వయా=నీచే, విలోమ=రోమము లేని, వరం=శ్రేష్ఠమైన,వ్యఞ్జనం=స్త్రీ చిహ్నమగు నవయవము, నితాన్తం =అధికముగా; అర్థినే=యాచించు నీవిటునకు, కిం=ఏల, న అర్ప్యతే= ఈయఁబడదు? కావున శీఘ్రముగా నిమ్ము.

వి :- ఇచ్చట విలోమశబ్దము క్రమాభావమును, రోమరాహిత్యమును, వ్యఞ్జన శబ్దము భోజన సాధకమును, స్త్రీ చిహ్నమగు నవయవమును శ్లేషచే చెప్పుటవలన శ్లేషాలఙ్కారము. రెండర్థములును ప్రకృతము లగుటవలనఁ బ్రకృతశ్లేష.

సమాసములు :

యువేఙ్గితేక్షిణీ - యూనః ఇఙ్గితం = యువేఙ్గితం, యువేఙ్గిత మీక్షత ఇతి = యువేఙ్గితేక్షిణీ.

భావము :

ఒక యువతి అచ్చటి యువకుల యభిప్రాయములను సూచించునట్టి కడ కన్నులు మున్నగువాని సంజ్ఞల గ్రహించుచున్నదై యా భోజనపఙ్క్తియందు వడ్డించునట్టి చెలికత్తెనుఁ గూర్చి యిట్లు చెప్పఁ దొడగెను - "ఓ చెలీ ! యీ యువకుఁడు నీవు ఒక వ్యఞ్జనము తర్వాత, మఱియొక వ్యఞ్జనము క్రమముగా చేయు వడ్డెన పద్ధతిని సహించుటలేదు. ఏలయనగా నా పద్ధతివలన మిక్కిలి ఆలస్యము కలుగుచున్నది. ఈ యాలస్యము నతడు సహింపలేకయున్నాడు. కావున నట్లు తొందరపడువానికి వరమైన అనగా శ్రేష్ఠమైన వ్యఞ్జనమును అనగా భోజన సాధకమును విలోమముగా అనగా క్రమమును తప్పించి యేల వడ్డింపరాదు ? కానఁ దొందరపడువానికి శీఘ్రముగా వడ్డింప వలయునని మిషతో చెప్పుచున్నది. అర్థాన్తరము :- ఇతఁడు వరుసగా నాలిఙ్గనము, కుచమర్దనము, చుమ్బనము మున్నగు వ్యాపారత్రయముతో మైథునమునకై నీ వరవ్యఞ్జనమును, ననగా వర = శ్రేష్ఠమైన వ్యఞ్జనమును = స్త్రీ జాతికి చిహ్నమైన యవయవమును ననగా వరాఙ్గమను నీవు ఇచ్చునట్టి కోరికను సహింపఁడు. కాన నీవు విలోమ = రోమ రహితముగా చేసి యా వరాఙ్గమును నధికముగాఁ గోరుచున్న యీ యువకున కేల యీయవు. శీఘ్రముగా దానిని వాని కొసంగుము. అని భోజన పదార్థములోని శ్రేష్ఠమైన వ్యఞ్జనము నొసంగు మను వ్యాజముతో స్త్రీయొక్క యవయవపరమగు నర్థము ద్యోతితమగునట్లు తన చెలికత్తెను చెప్పినదని యాశయము ॥96॥

శ్లో. సమాప్తిలిప్స్యేవ భుజిక్రియావిధే
ర్దలోదరం వర్తులయాఽఽలయాకృతమ్ ।
అలఙ్కృతం క్షీరవటైస్తదాశ్రితాం
రరాజ పాకార్పితగైరికశ్రియా. 97

ప. వి:- సమాప్తిలిప్స్యా-ఇవ - భుజిక్రియావిధేః-దలోదరం-వర్తులయా-ఆలయా కృతం-అలఙ్కృతం-క్షీరవటైః-తదా-ఆశ్రితాం-రరాజ-పాకార్పిత గైరిక శ్రియా.

**అర్థము** :- తదా = ఆకాలమునందు భుజించుచున్న వర పక్షమునకుఁ జెందిన జనుల యొక్క, దలోదరం, దల=అరటియాకు మున్నగు విస్తరాకుల యొక్క, ఉదరం=మధ్యభాగము, పాకార్పిత గైరిక శ్రియా; పాక= పెక్కు విధములగు సంస్కారకములగు ద్రవ్యములను పాకము చేయుట వలన, అర్పిత=ఏర్పడిన, గైరిక=పర్వతములయందుఁ గల్గిన నెఱ్ఱటి ధాతువుయొక్క కాంతివంటి కాంతి గల్గిన, అనగా పాకము చేయబడిన పదార్థములను వడ్డించుటచే నెఱ్ఱఁదనమునుఁ బొందినవియును(తథా=అట్లే) వర్తులయా=గుండ్రములైన, క్షీరవటైః=పాలలో వండఁబడిన మినప వడియములచే, అలఙ్కృతం=శోభింపబడినదై, పక్షాన్తరమున :- పాకార్పితగైరిక శ్రియా; పాక=వంటయందు, ఎఱ్ఱటిరంగును గల్గించుటకై అర్పిత = ఉంచబడిన, గైరిక = ఎఱ్ఱనివన్నెగల రంగువస్తువుచే, శ్రియా=రక్తకాన్తి గల్గిన, తథా=అట్లు, వర్తులయా=గుండ్రమైనట్టి, భుజిక్రియావిధేః; భుజిక్రియా = భుజిధాత్వర్థమైన భోజనము యొక్క, విధేః = ఆచరణకు, సమాప్తిలిప్యా ఇవ; సమాప్తి = సమాప్తిని సూచించు, లిప్యా ఇవ=అక్షరవిశేషమును ఉంచుటచే, ఆలయీకృతం= స్థానముగాఁ జేసుకొనఁబడిన, అనగా నావిధముగా నెఱ్ఱటి యక్షరపు గుర్తుగాఁ జేయఁబడిన, దలోదరమివ; దల=అక్షరములను వ్రాయుట కుపయుక్తములైన తాలపత్రాదులయొక్క, ఉదరమివ=మధ్యభాగము వలె, రరాజ = శోభించినది, ఆ రక్తవర్ణపు వడియములను వడ్డించిన పిదపనే వరపక్షపుజనులకు నితరవ్యఞ్జనములను దినుటయందు ప్రవృత్తి యాగిపోయినది. ఏలయనగా నితరవ్యంజనము లంతరుచియుక్తములుగా లేవని యర్థము.

సమాసములు :

సమాప్తిలిప్యా - సమాప్తేః లిపిః=సమాప్తిలిపిః, తయా=సమాప్తిలిప్యా.

*భుజిక్రియావిధేః*- భుజి రితి క్రియా = భుజిక్రియా, భుజిక్రియాయాః విధిః=భుజిక్రియావిధిః, తస్య=భుజిక్రియావిధేః.

*దలోదరం*- దలస్య ఉదరం=దలోదరం.

అర్థము:- హే విధాతః = ఓ బ్రహ్మ! త్వయా = నీచేత, అమ్బు = ఉదకము, అమృతం = అమృతమని పేరుగలదిగను, జీవనం = జీవనమను పేరు గలదిగను, యత్ = ఎందువలన, అకారి = చేయఁబడినదో, తత్ = ఆ రెండు కార్యములును, సాధు = చక్కఁగా, కృతం = చేయఁబడినది, ఉదకము, అమృతముతో సమానమైన రసము గల్గినందువలనను, జీవనమునకు సాధనమైనందువలనను నా రెండు పేరులును దానికి సార్థకములైనవని భావము. తు = కాని, ఇదం = ఈ యుదకము, సర్వతోముఖం; సర్వతః = అంతట ప్రవాహరూపములగు ముఖములు గలదిగా సర్వతోముఖమను పేరుగలదిగా, వృథైవ = వ్యర్థముగనే, ఆరంభి = చేయఁబడినది. పేయమనగా పానము చేయఁదగిన వస్తువునకు పేరు. దానికి ముఖము అవసరము లేదు గదా. అప్పుడు ముఖపదము దానిపేరుతో నుండుట వ్యర్థము. (అతః = ఇందువలన) ఇదంపిబః; అస్య అంబునః = ఈ యుదకమును. పిబతీతి = త్రాగునని ఇదంపిబః = జలమును త్రాగుమనము మున్నగువారమనియు, తథా = అట్లే, సర్వతోముఖః, సర్వతః = అన్ని స్థానముల యందు ముఖము గల్గిన వారమనియు (సర్వతః ముఖాని యస్య సః), అని కర్తుం = చేయుటకు, తవ = నీకు, ఉచితః = తగినది. నీరు త్రాగువారికి బహుముఖము లున్నయెడల వారికి, తృప్తి కలుగు నంతవరకును నీరు త్రాగుట సంభవించును. కాని ఒక ముఖముతో నది సంభవింపదు కావున వారికే సర్వతోముఖత్వ ముండుట యుచితమని యాశయము. కాని ప్రకృతము పేయమైన జలమునకు జలమునకు సర్వతోముఖమని ముఖశబ్దఘటితమైన పేరుంచుట వ్యర్థమని యర్థము.

సమాసములు ;

సర్వతోముఖం-సర్వతః ముఖాని యస్య తత్ = సర్వతోముఖం.

భావము :

ఓ విధాతా ! నీవు ఉదకమునకు, అమృతము, జీవనము, అను పేర్లనుఁ బెట్టుట సముచితమే. ఏలయనగా నుదకము అమృతములో

సమానమగు రుచినిఁ గల్గియున్నది. ప్రాణములను నిలుపుటకు సాధనమునై యున్నది. కాన నమృత మనియు, జీవన మనియు, పేర్లను నట్టి యుదకమునకుఁ బెట్టుట సముచితమే గాని సర్వతోముఖమను పేరును దాని కుంచుట వ్యర్థము. ఏల యనగా నది యుదకమునకు సార్థకము గాదు. పేయ మైన వస్తువునకు ననగాఁ ద్రాగఁబడు వస్తువునకు ముఖ మెందు కవసరము? కాని త్రాగు వ్యక్తికి ముఖ మవసరము. కాని యవి త్రాగునవి కాకపోయినను సర్వతో ముఖ మను పేరుబెట్టుట వ్యర్థమే యైనది. కాన జలమునుఁ ద్రాగునట్టి ప్రాణులకే 'సర్వతోముఖ' మని 'సర్వతః ముఖాని యస్య సః' అను వ్యుత్పత్తి ననుస రించి శరీరమంతట ముఖములుగలదిగ పేరుంచుట తగినవి. నీరు త్రాగునట్టివారికి పెక్కుముఖము లున్నచో, తృప్తి కలుగునంతవరకును నీటినిఁ ద్రాగుట సంభ వించును కాని యొక ముఖ మున్నచో తృప్తిగా నీటినిఁ ద్రాగుట కష్టము. కాన పానము చేయునట్టివారికే సర్వతోముఖమని పేరుంచుట తగినదని యర్థము. అట్లున్నచో మధురజలముల నొక ముఖముతో, శీతలజలములను మఱియొక ముఖముతో త్రాగుట కవకాశ ముండెడిది. ఆ విధముగా నీజలమునుఁ ద్రాగు మనవంటి జనమునకు ఇదంపిబః అనగా ఇదం = ఈ నీటిని, పిబతీతి = పిబః అనగా జలపాయి యను పేరెట్లు సరిపడునో అట్లే సర్వతః ముఖాని యస్య సః యని మనకు పేరుంచియున్నచో నాపేరును తగియుండెడిదని భావము. ॥90॥

శ్లో. సరోజకోశాభినయేన పాణినా
స్థితేఽపి కూరే ముహురేవ యాచతే,
సఖి!త్వ మస్మై వితర త్వ మిత్యుభే
మిథో న వాదాత్ దదతుః కిలౌదనమ్. 91

ప.వి: సరోజకోశాభినయేన-పాణినా-స్థితే-అపి-కూరే-ముహుః-ఏవ-యాచతే-సఖి-త్వమ్-అస్మై-వితర-త్వమ్-ఇతి-ఉభే-మిథః-న-వాదాత్- దదతుః -కిల-ఓదనం.

అర్థము: కూరే=అన్నము, స్థితేఽపి=ఉన్నను, అనగా భోజన పాత్రమందు, అన్నమున్నను, సరోజకోశాభినయేన; సరోజ=పద్మముయొక్క, కోశ=

మొగ్గను, అభినయ=అనుకరించుట గల్గిన అనగా తామరపూవుమొగ్గ ననుకరించుచు నామెయొక్క స్తనములను, బట్టుటలోని యభిలాషను సూచించు, పాణినా=హస్తముచే, ముహుః=పలుమాఱులు, యాచతే=యాచించుచున్న యువకునికై, హేసఖి!=ఓ చెలికత్తియా, త్వం=నీవు, అస్మై=యాచించుచున్న యువకునకు, వితర=అన్నమును వడ్డించుము. అని చెప్పగా రెండవ స్త్రీయు, త్వం=నీవు, వితర వడ్డించుము. ఇతి=ఈ విధముగా, ఉభే=ఇద్దఱుస్త్రీలును, మిథః=ఒండొరులు, వివాదాత్=వివాదపడుటవలన, ఓదనం=అన్నమును, న దదతుః కిం=వడ్డించలేదు అతఁడు చేసిన పని జనులలో పరిహాసకరముగా నుండుటచే నొక్కతెయు దాని నంగీకరింపలేదని యర్థము.

సమాసములు :

*సరోజకోశాభినయేన—సరోజస్యకోశః=సరోజ కోశః, సరోజకోశస్య అభినయః=సరోజకోశాభినయః, తేన=సరోజకోశాభినయేన.*

భావము :

ఒక యువకుఁ డన్నము భోజనపాత్రయం దున్నను తామరమొగ్గ ననుకరించుచు, యామెయొక్క స్తనములనుఁ బట్టుటకై తన యభిలాషను సూచించుచున్న తనహస్తముచే, మాటిమాటికి నన్నమును వడ్డింపఁ గోరుచుండెను. అప్పుడిద్దఱి చెలికత్తెలలో నొక్కతె మఱియొక్కతెనుఁ బిలచి 'చెలీ! నీవతని కన్నము వడ్డింపు'మని చెప్పగా నప్పుడు ఆమె 'నీవే వడ్డింపు'మని చెప్పగా నొండొరులును వివాదపడి యెకరును వడ్డింపలేదు. ఏలయనగా నాయువకుఁడు చేయు పని జనులలో పరిహాసముగ నుండుటనుఁ జూచి యొక్కతెయు వడ్డించుటకు ముందుకు రాలేదని భావము ॥90॥

శ్లో. ఇయం కియచ్చారుకుచేతి పశ్యతే
ప్రియః ప్రదాయా హృదయం సమావృతం,
ధ్రువం మనోజ్ఞా వ్యతర ద్యదుత్తరం
మిషేణ భృఙ్గారధృతేః కరద్వయా. 91

ప. వి. ఇయం-కియచ్చారుకుచా-ఇతి-పశ్యతే - పయఃప్రదాయాః - హృదయం-సమావృతం-ధ్రువం-మనోజ్ఞా-వ్యతరత్-యత్ - ఉత్తరం - మిషేణ - భృఙ్గారధృతేః-కరద్వయీ.

అర్థము: ఇయం = ఈ యువతి, కియచ్చారుకుచా; కియత్ = ఎంత పరిమితితోఁ గూడిన, చారు = అందముగల, కుచా = చనుదోయితో నొప్పుచున్నది! ఇది = ఈ విధముగా ( విచారించి ), పయఃప్రదాయాః = ఉదకము నొసంగుచున్న యువతియొక్క, సమావృతం = వస్త్రముతో గప్పబడిన, హృదయం = వక్షఃస్థలమును, పశ్యతే = చూచుచున్న అనగా చనుదోయిపరిమితినిఁ దెలిసికొనఁగోరిన విటునకు, కరద్వయీ = ఆమె యొక్క చేతులజంట, భృంగారధృతేః = స్వర్ణమయమగు జలపాత్రమును పట్టుట యొక్క, మిషేణ = వ్యాజముచే, యత్ = ఏ, ఉత్తరం = జవాబును, అనగా నా చనుదోయి యీ స్వర్ణమయమగు పాత్రయొక్క పరిమితిగలదియని జవాబును, వ్యతరత్ = ఇచ్చినది, తేన = దానిచే, ధ్రువం = నిశ్చయముగా, కరద్వయీ = ఈ చేతులజంట, మనోజ్ఞా = పరాభిప్రాయమునుఁ దెలియసమర్థమైనదని యర్థము.

వి పరుని యాశయము తెలిసికొనుట ప్రాణిధర్మము కాని యప్రాణిధర్మము కాదు. ప్రశ్నోత్తరముల నిచ్చుటయు ప్రాణిధర్మమే కాని యప్రాణిధర్మము కాదు. ఈరెంటిని అచేతనమైన హస్తములయందుఁ భావించుటవలన నుత్ప్రేక్షాలఙ్కారము. వ్యఞ్జకమగు ధ్రువశబ్దమునుఁ బ్రయోగించుటవలన నది వాచ్యము.

సమాసములు ;

కియచ్చారుకుచా-కియన్తౌ, చారూ కుచౌ యస్యాః సా = కియచ్చారుకుచా.

పయఃప్రదాయాః - ప్రయః ప్రదదాతీతి = పయఃప్రదా, తస్యాః = పయఃప్రదాయాః.

భృఙ్గారధృతేః - భృఙ్గారస్య ధృతిః = భృఙ్గారధృతిః, తస్యాః = భృఙ్గారధృతేః

కరద్వయీ - కరయోః ద్వయీ = కరద్వయీ.

భావము :

ఒక యువకుఁడు, జలమును పోయునట్టియొక యువతి యొక్క వస్త్రముతోఁ గప్పఁబడిన వక్షఃస్థలమును జూచి, యీమెయొక్క చనుదోయి ఎంత పెద్దదో? ఎంత మనోహరమో ? అని దెలియఁగోరి చూచుచుండగా నామె చేతులజంటతో స్వర్ణ పాత్రనుఁ బట్టుట యను నెపముచే, నామె స్తనము లాపాత్రయొక్క పరిమితినిఁ గల్గి దాని స్వర్ణచ్ఛాయతో మనోహరముగా నొప్పుచున్నవని యుత్తర మిచ్చినదని భావింపఁబడినది. అనగా నామె యాతని యాశయమును గ్రహించినదై, తన చేతులలో స్వర్ణపాత్రనుఁ బట్టినది. అందువలన నాచేతులు నామె చనుదోయి స్వర్ణ పాత్రయొక్క కొలతనుఁ గాంతిని గల్గినదని సూచించినవని భావము ॥91॥

శ్లో. అమీభి రాకణ్ఠ మభోజి తద్గృహే
తుషారధారామృదితేవ శర్కరా
వాహద్విషద్బష్కయణీపయఃస్రుతం
సుధాహ్రదాత్ పఙ్క మివోద్ధృతం దధి. 92

ప. వి. అమీభిః - ఆకణ్ఠమ్ - అభోజి - తద్గృహే - తుషారధారామృదితా - ఇవ - శర్కరా-వాహద్విషద్బష్కయణీపయఃస్రుతం-సుధాహ్రదాత్ - పఙ్కమ్ - ఇవ ఉద్ధృతం - దధి.

అర్థము:అమీభిః=వరునికి సంబంధించినబంధువులచే,తద్గృహే=ఆభీమరాజునింట, తుషారధారామృదితా; తుషారధారా=మంచుయొక్క ధారచే, మృదితా= మర్దింపబడిన, శర్కరా ఇవ=కలకండవలె రుచిగల్గినదియుఁ దెల్లనైనది యునై,సుధాహ్రదాత్=అమృతంపుకొలనునుండి,ఉద్ధృతం=ఎత్తఁబడిన, పఙ్కమివ=అమృతంపు బురదయో యనునట్లున్న, వాహద్విషద్బష్కయణీపయఃస్రుతం; వాహ = గుఱ్ఱమును, ద్విషత్=ద్వేషించునట్టి, బష్కయణీ=చాలకాలమునకు ముందు ఈనినట్టి బఱ్ఱెయొక్క, పయః= పాలనుండి, స్రుతం=ఉత్పన్నమైన, దధి=పెరుగు, ఆకణ్ఠం = కుత్తుకవఱకును, అభోజి=తినబడినది.

సమాసములు :

ఆకణ్ఠమ్‌-కణ్ఠ మభివ్యాప్య=ఆకణ్ఠం.

తుషారధారామృదితా-తుషారస్య ధారా=తుషారధారా, తుషారధారయా మృదితా-తుషారధారామృదితా.

వాహ ద్విషద్బష్కయణీపయః ప్రసుతం-వాహస్య ద్విషన్తి=వాహద్విషన్తీ, వాహద్విషన్తీ చ సా బష్కయణీ చ=వాహద్విషత్బష్కయణీ, వాహద్విషద్బష్కయణ్యాః పయః, వాహద్విషద్బష్కయణీపయః, వాహద్విషద్బష్కయణీపయసః ప్రసుతం = వాహద్విషద్బష్కయణీపయప్రస్సుతం, తత్=వాహద్విషద్బష్కయణీపయః ప్రసుతం.

భావము :

ఈ వరునికి సంబంధించిన బంధువు లా భీమసేనుని గృహమందు మంచులో తడిపి మర్దించిన కలకండవలె మధురమైనట్టిదియు, ధవళమునైనట్టిదియు, నమృతంపు కొలనునుండి యెత్తిన యమృతపు టడుసా? యని భావింపఁదగినదియునగు చాలకాలమునకు ముందే యీనిన బఱ్ఱెపాలతో నిర్మింపఁబడిన పెరుగును గొంతువఱకునుఁ దినిరి ॥92॥

శ్లో. తదన్తరన్తః సుచిరస్య బిందుభిః
కరమ్బితం కల్పయతా జగత్కృతా,
ఇతస్తతః స్పష్ట మచోరి మాయినా
నిరీక్ష్య తృష్ణాచలజిహ్వతాభృతా. 93

ప. వి. తత్-అంతః-అంతః-సుషిరస్య-బిందుభిః-కరమ్బితం- కల్పయితా జగత్కృతా-ఇతః-తతః-స్పష్టమ్-అచోరి-మాయినా - నిరీక్ష్య - తృష్ణాచలజిహ్వతాభృతా.

అర్థము: నిరీక్ష్య=సృష్టియొక్క ప్రారంభమునందు, తాను సృజించిన పెరుగును చూచి, తృష్ణాచలజిహ్వతాభృతా; తృష్ణా = ఆశచే, అనగా

పెరుగన్నమును దినవలయుననుఁ గోరికచే, చల=చఞ్చలమైన, జిహ్వతా =నాలుకను కల్గియుండుటను, భృతా=ధరించిన యనగా పెరుగుపై మిక్కిలి యాశగల్గిన, మాయినా = తన జిహ్వాచాపల్యముచే వంచించుట యందు నేర్పుగల్గిన, అథవా = లేదా, చూచువారలయొక్క దృష్టిని వంచించుటయందు సామర్థ్యముగల్గిన, జగత్కృతా = సృష్టికర్తయగు బ్రహ్మచే, తత్ = ఆపెరుగును, అంతరంతః = మధ్యమధ్య, సుషిరస్య = రన్ధ్రముయొక్క, బిన్దుభిః = మండలములచే, ననగా గుండ్రములగు రంధ్రములచే, కరమ్బితం=మిలితమైనదిగా, కల్పయతా సతా=రచియించువానిచే, స్పష్టం=స్ఫుటముగా, అచోరి=ఆపెరుఁగు అపహరింపఁబడినది. నురుసుతో కూడినపాలు పెరుగుగా మారునపుడు, అందు రంధ్రము లేర్పడును. ఆ రంధ్రములు, జనుల కంటికిఁ గనఁబడకుండ అందలి పెరుగుయొక్క సారము తినుటకై యపహరింపబడినది. కానిచో, నిటు నటు పెరుగునం దక్కడక్కడ రంధ్రము లెట్లు కనబడును? కాన బ్రహ్మనే యాకర్షించినట్టి యాగేదె పెరుగు సామాన్యజనుల నాకర్షించుట యెంత సులభమని యభిప్రాయము.

సమాసములు :

జగత్కృతా- జగత్ కరోతీతి=జగ త్కృత్, తేన = జగత్కృతా. తృష్ణాచలజిహ్వాతాభృతా - తృష్ణయా చలా = తృష్ణాచలా, తృష్ణాచలా జిహ్వా యస్య సః = తృష్ణాచలజిహ్వః, తృష్ణాచలజిహ్వస్య భావః=తృష్ణాచలజిహ్వతా, తృష్ణాచలజిహ్వతాం బిభర్తీతి=తృష్ణాచలజిహ్వతాభృత్, తేన=తృష్ణాచలజిహ్వతాభృతా.

భావము :

ఆ వివాహభోజనపఙ్క్తిలో పెరుగు తేఁబడినది. ఆ పెరుగులో నందందు గుండ్రపు రంధ్రము లున్నవి. నురువుతోఁ గూడిన పాలనుఁ దోడఁ బెట్టినచో దానివలన నేర్పడు పెరుగులో గుండ్రపు రంధ్రములు వచ్చుట సహజము. కాని

యిక్కడ నారంధ్రములు బ్రహ్మ తా సృజించిన పెరుగులోని సారమును రుచి జూచుటకై యట్టి ప్రేక్షకుల దృష్టులను మఱుగుపఱచి యపహరించుటచే నేర్పడిన రంధ్రములుగా నుత్ప్రేక్షింపఁబడినవి. అనగా నాపంక్తియందలి పెరుగన్నపు వాసనవలన బ్రహ్మజిహ్వకు, దానిని దినవలయునని యాశ యేర్పడగా నత డాపెరుగు సారభాగములను జనుల జన్నులనుఁ గప్పి అపహరించెననియు, నాసారభాగముల నపహరించుటవలన నాపెరుగునందు రంధ్రము లేర్పడినవనియు భావింపఁబడినదని భావము॥93॥

శ్లో॥ దదాసి మే తన్న రుచేర్య దాస్పదం
న యత్ర రాగః సితయాఽపి కిం తయా,
ఇతీరిణే బిమ్బఫలం రుచిచ్ఛలా
దదాయి బిమ్బాధరయాఽరుణం చ తత్. 94

ప. వి. దదాసి-మే-తత్-న-రుచేః-యత్-ఆస్పదం-న-యత్ర-రాగః-సితయా - అపి-కిం-తయా-ఇతి-ఈరిణే-బిమ్బఫలం - రుచిచ్ఛలాత్ - అదాయి - బిమ్బాధరయా-అరుణం-చ-తత్.

అర్థము :- యత్ = ఏద్రవ్యము, రుచేః = అభిలాషకు, ఆస్పదం = స్థానమో లేక విషయమో, తత్ = దానిని, మే = నాకు, న దదాసి = ఈయవు; యత్ర = ఏద్రవ్యమునందు, రాగః = అభిలాష, న = లేదో, తయా = ఆ, సితయా = చక్కెరచేతను, కిం = ఏమి ప్రయోజనము. అనగా రక్త వస్తువునందు రాగము గలవానికి తెల్లని వస్తువుతో నేమి ప్రయోజనమని సూచితము. ఇతి = ఇట్లు, ఈరిణే = చెప్పుచున్న యనగా అధరబింబ మును ముద్దిడు గోరికచే నిట్లు సంభాషించుచున్న యసురకునకై, రుచిచ్ఛ లాత్; రుచి = అభిలాషయొక్క, ఛలాత్ = వ్యాజము వలన, బింబా ధరయా = దొండపండువంటి పెదవిగల స్త్రీచే, బింబఫలం = దొండ పండు, అనగా తన పెదవి పోలికను వహించిన పండు, అదాయి = ఈయబడినది. ఒక వ్యాజముతో నధరబింబమును కోరగా, మఱియొక వ్యాజముతో దొండపం డీయఁబడినదని యర్థము. ఆదొండపండు, అతని కిష్టమైనది. ఏల యనగా నది ప్రియురాలి యధరమునకు ప్రతినిధియైనది.

సమాసములు :

బింబఫలం — బింబమితి ఫలం = బింబఫలం
రుచిచ్ఛలాత్ — రుచేః ఛలం = రుచిచ్ఛలం, తస్మాత్ = రుచిచ్ఛలాత్,
బిమ్బాధరయా :- బిమ్బమివ అధరః యస్యాః సా = బిమ్బాధరా.
తయా = బిమ్బాధరయా.

భావము :

ఏ వస్తువు నాకిష్టమో దాని నీయవు. దేనియందు ననురాగము (ఎఱ్ఱదనము) అభిలాష లేదో అటువంటి యెఱ్ఱదనములేని తెల్లని చక్కెరచే నేమి ప్రయోజనము ? ఎఱ్ఱటివస్తువునం దనురాగము గలవానికి తెల్లని వస్తువగు చక్కెరతో నేమి ప్రయోజనము ? ఇట్లు అధరబింబమును ముద్దిడగోరి మాట్లాడుచున్నరాగికి, యాతని యభిలాషయొక్క నెపముచే దొండపండువంటి పెదవి గల్గిన యొకస్త్రీ తనపెదవిని పోలిన దొండపండు నొసంగినది. అత డొకవ్యాజముతో తన యధరబింబమును యాచింపగా, మఱియొకమిషతో దొండపండు నొసంగినదని యర్థము. ఆ దొండపండు ప్రియురాలి యధరబింబమునకుఁ బ్రతినిధియగుట వలన తన కిష్టమైనదని భావము ॥94॥

శ్లో. సమం యయో రిఙ్గితవాన్ వయస్యయో
స్తయో ర్విహాయోపహృతప్రతీఙ్గితాం,
అకారి నాకూత మవారి సా యయా
విదగ్ధయాఽరఞ్జి తథైవ భావవిత్. 95

ప. వి:- సమం- యయోః-ఇఙ్గితవాన్- వయస్యయోః- తయోః- విహాయ-ఉపహృతప్రతీఙ్గితాం-అకారి-న-ఆకూతమ్-అవారి-సా-యయా-విదగ్ధయా - అరఞ్జి-తథా-ఏవ-భావవిత్.

అర్థము. యయోః వయస్యయోః = ఏచెలికత్తెలయొక్క విషయమున, మమ = నాకు, యుగపత్ = ఏకకాలమున, ఇఙ్గితవాన్ = కటాక్షములు మున్నగు

సంజ్ఞలు గల్గిన, భావవిత్ = గూఢాభిప్రాయములను దెలిసిన, కశ్చిత్ = ఒకవిటుడు, తయోః = వారిఱువురిమధ్య, ఉపహృతప్రతీజ్గితాం; ఉపహృత = ఈయఁబడిన, ప్రతీజ్గితాం = ఆమె కిష్టమైన ఎదురుసంజ్ఞగల్గిన మొదటి చెలికత్తెను, విహాయ = వదలిపెట్టి, (జనసమాజమందు చెలికత్తెలయెదుట నేత్రములతో సంజ్ఞలు మున్నగువానినిఁ జేయుటవలన నీమె చాతుర్యము లేనిదని గ్రహించి యామెయందు, అనురాగమును వహింపక యామెను వదలివేసి యని యర్థము) యయా = ఏచతురురాలిచే, ఆకూతం = ఆమె యిష్టము నంగీకరించుటను సూచించునట్టి యెదురు ఇంగితము, నాఽకారి = చేయఁబడలేదో (పెక్కుజనులయెదుట దానినిఁ జేసినచో వెల్లడియగునను భయముచే నధికమగు సిగ్గునొందుటవల్ల నని యర్థము.) కిన్తు = కాని, సా = మొదటిచెలికత్తె, అవారి = వారింపఁబడినదో, అనగా నిత డీమెయందు విరక్తుఁడు, నాయెడ ననురక్తుఁడు కాన నీమె యెట్లు నాప్రియునిగూర్చి యిజ్గితమును ననగాఁ బ్రణయసూచకమగు సంజ్ఞను చేయునని సవతితనమువలని యసూయచే, జనసమక్షమున నిజ్గితాదులనుఁ జేయుట యనుచిత మను నెపముచే రెండవచెలికత్తెచే యామె యిజ్గితాది చేష్టలవలన నివారింపఁబడినదని యర్థము. కాన, తయైవ = రెండవచెలికత్తెయగు, విదగ్ధయా = నేర్పరిచేతనే, అరజ్జి = రంజిల్లి యాకర్షింపఁబడెనని యర్థము. రెండవచెలికత్తెయొక్క యట్టి గూఢభావాదులను చూచి సంతుష్టుడై యా విటు డామెయందే యనురక్తుడాయెనని భావము. దీనివలె మొదటిచెలికత్తెకంటెను, రెండవ చెలికత్తె గంభీరురా లనియు నతడును భావములను గ్రహింప శక్తుడనియు నందువల్ల నిది యుక్తమనియు సూచితము.

సమాసములు :

ఇజ్గితవాన్ - ఇజ్గిత మస్య అస్తీతి = ఇజ్గితవాన్.
ఉపహృతప్రతీజ్గితాం - ప్రతి ఇజ్గితం = ప్రతీజ్గితం, ఉపహృతం, ప్రతీజ్గితం యయా సా = ఉపహృతప్రతీజ్గితా, తాం = ఉపహృతప్రతీజ్గితాం.
భావవిత్ - భావం వేత్తీతి = భావవిత్.

భావము :

ఒక విటుఁడు ఇద్దఱి చెలికత్తెల విషయమున నొక్క కాలమునందే కన్నులతోటి సంజ్ఞలను చేయుచు వారి గూఢాభిప్రాయముల తెలియఁగల్గిన నేర్పరిగా నుండెను. ఆ యిద్దఱు చెలికత్తెలలో మొదటి చెలికత్తె జనసమాజమున జెలికత్తెలయెదుట కన్నులతోటి సంజ్ఞలనుఁ జేయరాదను నంశమునుఁ దెలియక విటునికి ప్రతిసంజ్ఞను, అనగా నతఁడు సంజ్ఞ చేయగా దానికి బదులుగా తన సంజ్ఞను నచ్చటి చెలికత్తెల సమక్షమునఁ జేసినది. అందు వలన నామె చాతుర్యము లేనిదని గ్రహించి యామెపై నతడు అనురాగ మును వహింపక విరక్తుఁ డాయెను. రెండవ చెలికత్తె చాతుర్యముకలది యగుట వలన జనసమక్షమున నా యువకునకు ప్రతిసంజ్ఞనుఁ జేసినచో వెల్లడి యగునను భయమువలన సిగ్గుపడి యూరకయుండినది. కాని, ఆమె మొదటి చెలికత్తెను విటునిఁగూర్చి సంజ్ఞలనుఁ జేయనీయక యడ్డగించినది. ఏలయనగా యా విటు డామె చతురురాలు కాదని యామెపై విరక్తి వహించి రెండవ చెలికత్తె యగు తనపై ననురాగము వహించియున్నాడు. కావున నతని కీమె, కనులతోటి సంజ్ఞలను చేయుట యనుచితమని సవతితనమువలని యసూయను వహించినదై, జనసమక్షమున నిఙ్గితాదులనుఁ జేయుట యుచితముకాదను నెపముచే రెండవది యగు నీమె యామెను నిఙ్గితాదిచేష్టలనుండి వారించినది. అట్టి నేర్పరియగు రెండవ చెలికత్తెచే నావిటుడు రఁజిల్లఁజేయబడి యాకర్షింపఁబడినాడు. రెండవ చెలికత్తె లోని యట్టి చాతుర్యమునుఁ గాంచి యావిటు డామెయందే యనురక్తుఁ డాయె ననియు, నా రెండవ చెలికత్తె గంభీరురాలనియు, విదగ్ధ యనియు నావిటుఁడు చక్కటి భావజ్ఞుడనియు భావము. ॥95॥

శ్లో. సఖీం ప్రతి స్మాహ యువేఙ్గితేక్షిణీ
క్రమేణ తేఽయం క్షమతే న దిత్సతాం,
విలోమతద్వ్యఞ్జన మర్ప్యతే త్వయా
వరం కిమస్మై న నితాన్తమర్థినే. 96

ప.వి. సఖీం-ప్రతి-స్మ-ఆహ-యువేఙ్గితేక్షిణీ- క్రమేణ-తే-అయం-క్షమతే-న-దిత్సతాం- విలోమ- తత్- వ్యఞ్జనం-అర్ప్యతే- త్వయా- వరం- కిమ్- అస్మై-న-నితాన్తమ్-అర్థినే.

అర్థము: యువేఙ్గితేక్షిణీ; యువ=యువకులయొక్క, ఇఙ్గిత=అభిప్రాయమును ననగా యువాభిప్రాయమును సూచించునట్టి నేత్రసంజ్ఞలు మున్నగు చేష్టలను, ఈక్షిణీ=చూచునట్టి, ఒక యువతి, సఖీం ప్రతి=పరివేషణము చేయుచున్న చెలికత్తెను గూర్చి, ఆహ స్మ=పలికెను, ఏమనగా-అయం= ఈయువకుఁడు, తే=నీకు సంబంధించిన, క్రమేణ=పారంపర్యముగా, దిత్సుతాం=పరివేషణము అనగా వడ్డించుటలోని కోరికను, న క్షమతే= సహింపడు. అనగా ఒక వస్తువును వడ్డించినపిదప నింకొకదానిని వడ్డించుట యను క్రమమువలని యాలస్యమును సహింపఁడని యర్థము. అతః= ఇందువలన, త్వయా=నీచే, నితాంతం=మిక్కిలి, అర్థినే=సాధకమును వడ్డింపగోరుచున్న, అస్మై=ఈ యువకునికొఱకు, వరం=శ్రేష్ఠమైన వ్యఞ్జనం=సాధకమును, విలోమ యథా=క్రమముతో నిమిత్తము లేకుండ, కిమ్=ఏల,న అర్ప్యతే=వడ్డింపఁబడదు? అయం=ఈ యువ కుఁడు, క్రమేణ=క్రమముగా, అనగా ఆలింగనము, స్తనమర్దనము, చుమ్బనము,మున్నగు వ్యాపారక్రమముచే, దిత్సుతాం=మైథునముఁగూర్చి వరాఙ్గము నొసంగుటకైన కోరికను ననగా నందలి విలమ్బమును, న క్షమతే=ఓర్వఁడు, అతః=ఇందువలన,త్వయా=నీచే, విలోమ=రోమము లేని, వరం=శ్రేష్ఠమైన,వ్యఞ్జనం=స్త్రీ చిహ్నమగు నవయవము, నితాన్తం =అధికముగా; అర్థినే=యాచించు నీవిటునకు, కిం=ఏల, న అర్ప్యతే= ఈయఁబడదు? కావున శీఘ్రముగా నిమ్ము.

వి :- ఇచ్చట విలోమశబ్దము క్రమాభావమును, రోమరాహిత్యమును, వ్యఞ్జన శబ్దము భోజన సాధకమును, స్త్రీ చిహ్నమగు నవయవమును శ్లేషచే చెప్పుటవలన శ్లేషాలఙ్కారము. రెండర్థములును ప్రకృతము లగుటవలనఁ బ్రకృతశ్లేష.

సమాసములు :

యువేఙ్గితేక్షిణీ - యూనః ఇఙ్గితం = యువేఙ్గితం, యువేఙ్గిత మీక్షత ఇతి=యువేఙ్గితేక్షిణీ.

భావము :

ఒక యువతి అచ్చటి యువకుల యభిప్రాయములను సూచించునట్టి కడ కన్నులు మున్నగువాని సంజ్ఞల గ్రహించుచున్నదై యా భోజనపఙ్క్తియందు వడ్డించునట్టి చెలికత్తెనుఁ గూర్చి యిట్లు చెప్పఁ దొడగెను - "ఓ చెలీ! యీ యువకుఁడు నీవు ఒక వ్యఞ్జనము తర్వాత, మఱియొక వ్యఞ్జనము క్రమముగా చేయు వడ్డెన పద్ధతిని సహించుటలేదు. ఏలయనగా నా పద్ధతివలన మిక్కిలి ఆలస్యము కలుగుచున్నది. ఈ యాలస్యము నతడు సహింపలేకయున్నాడు. కావున నట్లు తొందరపడువానికి వరమైన అనగా శ్రేష్ఠమైన వ్యఞ్జనమును అనగా భోజన సాధకమును విలోమముగా అనగా క్రమమును తప్పించి యేల వడ్డింపరాదు ? కానఁ దొందరపడువానికి శీఘ్రముగా వడ్డింప వలయునని మిషతో చెప్పుచున్నది.
అర్థాన్తరము :- ఇతఁడు వరుసగా నాలిఙ్గనము, కుచమర్దనము, చుమ్బనము మున్నగు వ్యాపారత్రయముతో మైథునమునకై నీ వరవ్యఞ్జనమును, ననగా వర=శ్రేష్ఠమైన వ్యఞ్జనమును=స్త్రీ జాతికి చిహ్నమైన యవయవమును ననగా వరాఙ్గమును నీవు ఇచ్చునట్టి కోరికను సహింపఁడు. కాన నీవు విలోమ=రోమ రహితముగా చేసి యా వరాఙ్గమును నధికముగాఁ గోరుచున్న యీ యువకున కేల యీయవు. శీఘ్రముగా దానిని వాని కొసంగుము. అని భోజన పదార్థములోని శ్రేష్ఠమైన వ్యఞ్జనము నొసంగు మను వ్యాజముతో స్త్రీయొక్క యవయవపరమగు నర్థము ద్యోతితమగునట్లు తన చెలికత్తెకు చెప్పినదని యాశయము ॥96॥

శ్లో. సమాప్తిలిప్సోర్వ భుజిక్రియావిధే
ర్దలోదరం వర్తులయాఽఽలయీకృతమ్ ।
అలఙ్కృతం క్షీరవశైస్తదాశ్రితాం
రరాజ పాకార్పితగైరికశ్రియా. 97

ప. వి:- సమాప్తిలిప్స్యా-ఇవ - భుజిక్రియావిధేః-దలోదరం-వర్తులయా-ఆలయీ కృతం-అలఙ్కృతం-క్షీరవశైః-తదా-ఆశ్రితాం-రరాజ-పాకార్పిత గైరిక శ్రియా.

**అర్థము** :- తదా = ఆకాలమునందు భుజించుచున్న వర పక్షమునకుఁ జెందిన జనుల యొక్క, దలోదరం, దల=అరటియాకు మున్నగు విస్తరాకుల యొక్క, ఉదరం=మధ్యభాగము, పాకార్పిత గైరిక శ్రియా; పాక= పెక్కు విధములగు సంస్కారకములగు ద్రవ్యములను పాకము చేయుట వలన, అర్పిత=ఏర్పడిన, గైరిక=పర్వతములయందుఁ గల్గిన నెఱ్ఱటి ధాతువుయొక్క కాంతివంటి కాంతి గల్గిన, అనగా పాకము చేయబడిన పదార్థములను వడ్డించుటచే నెఱ్ఱఁదనమునుఁ బొందినవియును(తథా=అట్లే) వర్తులయా=గుండ్రములైన, క్షీరవటైః=పాలలో వండఁబడిన మినప వడియములచే, అఙ్కృతం=శోభింపబడినదై, పక్షాన్తరమున :- పాకా ర్పితగైరిక శ్రియా; పాక=వంటయందు, ఎఱ్ఱదిరంగును గల్గించుటకై అర్పిత = ఉంచబడిన, గైరిక = ఎఱ్ఱనివన్నెగల రంగువస్తువుచే, శ్రియా=రక్తకాన్తి గల్గిన, తథా=అట్లు, వర్తులయా=గుండ్రమైనట్టి, భుజిక్రియావిధేః; భుజిక్రియా = భుజిధాత్వర్థమైన భోజనముయొక్క, విధేః = ఆచరణకు, సమాప్తిలిప్యా ఇవ; సమాప్తి = సమాప్తిని సూచించు, లిప్యా ఇవ=అక్షరవిశేషమును ఉంచుటచే, ఆలయీకృతం= స్థానముగాఁ జేసుకొనఁబడిన, అనగా నావిధముగా నెఱ్ఱటి యక్షరపు గుర్తుగాఁ జేయఁబడిన, దలోదరమివ; దల=అక్షరములను వ్రాయుట కుపయుక్తములైన తాలపత్రాదులయొక్క, ఉదరమివ=మధ్యభాగము వలె, రరాజ = శోభించినది, ఆ రక్తవర్ణపు వడియములను వడ్డించిన పిదపనే వరపక్షపుజనులకు నితరవ్యఞ్జనములను దినుటయందు ప్రవృత్తి యాగిపోయినది. ఏలయనగా నితరవ్యంజనము లంతరుచియుక్తములుగా లేవని యర్థము.

సమాసములు :

సమాప్తిలిప్యా - సమాప్తేః లిపిః=సమాప్తిలిపిః, తయా=సమాప్తి లిప్యా.

*భుజిక్రియావిధేః*- భుజి రితి క్రియా = భుజిక్రియా, భుజిక్రియాయాః విధిః=భుజిక్రియావిధిః, తస్య=భుజిక్రియావిధేః.

*దలోదరం*- దలస్య ఉదరం=దలోదరం.

అలయీకృతమ్ - అనాలయః ఆలయః సమ్పద్యమానం కృతం=ఆలయీ కృతమ్.
పాకార్పితగైరికశ్రియా - పాకేన అర్పితా = పాకార్పితా, గైరికాణాం శ్రీః=గైరికశ్రీః, పాకార్పితా చ సా గైరికశ్రీశ్చ=పాకార్పితగైరిక శ్రీః, తయా=పాకార్పితగైరికశ్రియా.
క్షీరవటైః=క్షీరపక్వాః వటాః=క్షీరవటాః, తైః క్షీరవటైః

భావము :

ఆ భోజనసమయమునందు, భుజించువారికి నరటియాకులు మున్నుగునవి వేయబడినవి. ఆ యాకులమధ్య నానావిధములగు సంస్కారద్రవ్యములతో పాకము గావించుటవలన నెఱ్ఱనివన్నెగలవియు, గుండ్రములైనవియును, పాల యందు వండబడినవియునగు మినపవడియములు వడ్డింపఁబడినవి. వానిలో నెఱ్ఱ దనము వచ్చుటకై యెఱ్ఱటి గైరికధాతువు చేర్చబడియున్నది. తాలపత్రాది గ్రంథములయందు రచన ముగియునపుడు సమాప్తిని సూచించునట్టి గుండ్రపు టక్షరములు ॥౦॥౦॥౦॥ అను నాకారములుగలవిగా వ్రాయబడు వాడుకగలదు. ఇక నీవిధములగు చిహ్నములు వ్రాయబడిన పిదప లిపి యాపివేయఁబడును. అట్లే యమితరుచిగల్గిన యెఱ్ఱనివడియములు ఆయరటియాకులయందు సమాప్తి సూచకములగు భక్ష్యములుగా నుండినవి. అది సమాప్తి సూచకములగు నక్షరము వలె గుండ్రముగా నుండుటవలన వీనిని తినుటచేతనే యితరభక్ష్యములపై గోరిక తొలగి భోజనసమాప్తిని సూచించునవిగా నుండెనని భావము. ॥97॥

శ్లో. చుచుమ్బ నోర్వీవలయోర్వశీం పరం
పురోఽధిపారి ప్రతిబిమ్బితం విటః,
పునః పునః పానకపానకైతవా
చ్చకార తచ్చుమ్బనచుఙ్కృతా న్యపి. 98

ప. వి:- చుచుమ్బ-న-ఉర్వీవలయోర్వశీం-పరం-పురః-అధిపారి-ప్రతిబిమ్బితం-విటః-పునః- పునః- పానకపానకైతవాత్- చకార-తచ్చుమ్బనచుఙ్కృ-తాని-అపి.

అర్థము :- విటః=ఒక కాముకుఁడు, పురః=ఎదుట, అధిపారి=జలపాత్రయందు, ప్రతిబిమ్బితాం=ప్రతిఫలించిన, ఉర్వీవలయోర్వశీం; ఉర్వీవలయ=భూవలయమునకు, ఊర్వశీం=అతి సౌందర్యముగల యొక స్త్రీని, పరం=కేవలము, చుచుమ్బ=ముద్దిడుకొనలేదు, కిన్తు=కాని, పునః పునః=పలుమాఱు, పానక పానకైతవాత్; పానక=మంచినీటిని, పాన=త్రాగుటయొక్క, కైతవాత్=నెపమువలన, తచ్చుమ్బనచుజ్కృతాన్యపి-తత్=ఆ భూమండల మందలియూర్వశిని యనగా నాదివ్యసుందరిని, చుమ్బన=అధరపానము చేయుటవలన నేర్పడు, చుజ్కృతాన్యపి=చుంకార ధ్వనులనుగూడ, చకార=చేసెను.

సమాసములు :

*ఉర్వీవలయోర్వశీం* - ఉర్వ్యాః వలయః=ఉర్వీవలయః, ఉర్వీవలయస్య ఊర్వశీ=ఉర్వీవలయోర్వశీ, తాం=ఉర్వీవలయోర్వశీం.

*అధిపారి* - పార్యామ్=అధిపారి.

*పానకపానకైతవాత్* - పానకస్య పానం=పానకపానం, పానకపానస్య కైతవం=పానకపానకైతవం, తస్మాత్=పానకపాన కైతవాత్.

*తచ్చుమ్బనచుజ్కృతాని* - తస్యాః చుమ్బనం=తచ్చుమ్బనం, తచ్చుమ్బనే చుజ్కృతాని=తచ్చుమ్బన చుజ్కృతాని, తాని=తచ్చుమ్బన చుజ్కృతాని.

భావము :

కాముకుఁ డొక్కడు, భోజనకాలమందు ముందున్న జల పాత్రయందు ప్రతిబింబించిన భూమండలమునకు ఊర్వశియా యనునట్లు దివ్యసౌందర్యముతో వెలయునట్టి యొక యువతిని కేవలము ముద్దు పెట్టుకొనలేదు. మఱేమనగా తడవ తడవకు మంచినీటినిఁ దెమ్మని చెప్పుచు, ఆ నీటఁ బ్రతిబింబించిన యా భూగోళపు టూర్వశి యొక్క యధరమునుఁ బానము చేయుట వలని చుజ్కార ధ్వనులను, జేయుచుండెను ॥౭౮॥

ప. వి. కియత్-బహు-వ్యఞ్జనమ్-ఏతత్-అర్ప్యతే-మమ- ఇతి-తృప్తేః-వదతాం-పునః-పునః-అమూని- సఙ్ఖ్యాతుమ్- అసౌ-అఢౌకి-తైః- ఛలేన- తేషాం-కరినీ-ఇవ-భూయసీ.

అర్థము: మమ = నాకు, ఏతత్ = ఈ, వ్యఞ్జనం = వ్యఞ్జనము, కియత్ = ఎంత, బహు = అధికముగా, అర్ప్యతే = వడ్డింపఁబడును, మేము తృప్తిఁ జెందితిమి కాన మాకు నిక వేతేమియు నవసరము లేదు. కాన వడ్డింపవల దని యర్థము. తృప్తేః = భోజనమువలనఁ గల్గిన సంతోషమువలన, ఇతి = ఈవిధముగా, పునః పునః = పలుమాఱు, వదతాం = చెప్పుచున్న, తేషాం = ఆభోక్తలయొక్క, ఛలేన = నెపముచే, అమూని = ఈవ్యఞ్జనములను, సఙ్ఖ్యాతుం = ఎన్నివ్యఞ్జనములను వడ్డించితి మను విషయమును లెక్కించుటకు, భూయసీ = మిక్కిలి యధికమై, కరినీ ఇవ = బలపములవలె, తైః = ఆ వడ్డించువారిచే, అసౌ = ఈ, గోలకావలిః = గుండ్రపుభక్ష్యములయొక్క రాశి, అఢౌకి = సమర్పింపఁబడినది. మేము వంటకములను, లెక్కింటిని వడ్డించితిమని భోక్తలగు మీరు చెప్పుచున్నారు. కావున వానిని, బలపములతో లెక్కింపు డనెడి నెపముతో, నధికమైన బలపములరాశివంటి వ్యఞ్జనరాశి యర్పింపఁబడినదో యనునట్లుండినది.

వి. ఇచ్చట వడ్డింపఁబడిన వ్యఞ్జనములు, సంఖ్యను లెక్కించుటకై బలపములుగా గుండ్రపు భక్ష్య విశేషములు వడ్డింపఁబడకపోయినను, వడ్డింపఁబడినట్లు భావించుటవలన నుత్ప్రేక్షాలఙ్కారము. వ్యఞ్జకమగు నివశబ్దమునుఁ బ్రయోగించుటవలన నది వాచ్యము.

భావము :

మాకెంత నధికముగా కూరలు మున్నగుసాధనములను వడ్డింతురు? మాకు తృప్తి గలిగినది కాన నిఁక వడ్డింపవలదు. అని యీ విధముగా జెప్పుచున్న భోక్తలకు తమ కెన్ని వంటకములు వడ్డింపఁ బడినవో యను సంశయముఁ దెలియుట కను నెపముతో, నాసాధకములను లెక్కించుటకై పెక్కు బలపములో యనునట్లు, గుండ్రములైన పెక్కు భక్ష్యములను వడ్డించిరని యాశయము॥100॥

శ్లో॥ విదగ్ధ బాలేఙ్గిత గుప్తి చాతురీ
ప్రవహ్లి కోద్ఘాటన పాటవే హృదః,
నిజస్య టీకాం ప్రబబంధ కాముకః
స్పృశద్భి రాకూతశతై స్తదౌచితీమ్. 101

ప. వి. విదగ్ధబాలేఙ్గిత గుప్తిచాతురీ ప్రవహ్లి కోద్ఘాటన పాటవే- హృదః-నిజస్య-టీకాం - ప్రబబంధ - కాముకః- స్పృశద్భిః - ఆకూతశతైః - తదౌచితీం.

అర్థము. విదగ్ధ బాలేఙ్గిత గుప్తి చాతురీ ప్రవహ్లి కోద్ఘాటన పాటవే; విదగ్ధ=నేర్పరియైన, బాలా=స్త్రీయొక్క, ఇఙ్గిత=కనుబొమ్మలను ద్రిప్పుట మున్నగు చేష్టలను, గుప్తి = దాచుట యందలి, చాతురీ=సామర్థ్య మనెడు, ప్రవహ్లికా = ప్రహేలికయను గూఢార్థములనుఁ జెప్పునట్టి వాక్య విశేషమును, ఉద్ఘాటన=బయలుపఱచుట యందలి, పాటవే= సామర్థ్య విషయమున, తదౌచితీం; తత్=అట్టి గూఢార్థమును బహిరంగ పఱచుట యందలి, ఔచితీం=అనుకూలతను, స్పృశద్భిః=పొందిన, అనగా ఇఙ్గితములను మఱుగుపఱచుటలోని నీసామర్థ్యము నాకు దెలియు నని దాని యర్థమును వెల్లడి పఱచునట్టి యామెకు సంబంధించిన యింగితముల కనురూపములైనట్టి, ఆకూతశతైః=అభిప్రాయములను వెల్లడిఁ జేయునట్టి పెక్కులైన యిఙ్గితములచే, కాముకః=ఒకానొక విటుడు, నిజస్య=తనదగు, హృదః=హృదయమునకు, టీకాం = వ్యాఖ్యను, అనగా నభిప్రాయమును వెల్లడి పఱచుటను, ప్రబబంధ= చక్కగాఁ జేసెను. అనగా తన హృదయమును నామెకుఁ బ్రకాశపఱచెనని యర్థము. తగిన యుత్తరము నొసంగుటచేత, ప్రశ్నార్థమును వెల్లడి పఱచుటవలన నదియే దానికి వివరణమైనదని యర్థము.

సమాసములు :

*విదగ్ధ బాలేఙ్గిత గుప్తిచాతురీ ప్రవహ్లికోద్ఘాటనపాటవే - విదగ్ధా చ సా బాలా చ=విదగ్ధబాలా, ఇఙ్గితానాం గుప్తిః=ఇఙ్గితగుప్తిః, ఇఙ్గిత*

గుప్తేః చాతురీ = ఇఙ్గితగుప్తిచాతురీ, విదగ్ధబాలాయాః ఇఙ్గిత గుప్తిచాతు
ర్యేవ ప్రవహ్లికా = విదగ్ధబాలేఙ్గిత గుప్తిచాతురీ ప్రవహ్లికా, విదగ్ధబాలే
ఙ్గిత గుప్తిచాతురీ ప్రవహ్లికాయాః ఉద్ఘాటనం = విదగ్ధబాలేఙ్గిత గుప్తి
చాతురీ ప్రవహ్లికోద్ఘాటనం, విదగ్ధ బాలేఙ్గిత గుప్తిచాతురీ ప్రవహ్లి కోద్ఘాటనే
పాటవం = విదగ్ధబాలేఙ్గిత గుప్తిచాతురీ ప్రవహ్లికోద్ఘాటన పాటవం,
తస్మిన్ = విదగ్ధబాలేఙ్గిత గుప్తిచాతురీ ప్రవహ్లి కోద్ఘాటన పాటవే.
ఆకూతశతైః — ఆకూతానాం శతాని = ఆకూతశతాని, తైః = ఆకూత
శతైః = ఆకూతశతైః
తదౌచితీమ్ — ఉచితస్య భావః = ఔచితీ, తస్మిన్ ఔచితీ = తదౌచితీ,
తాం = తదౌచితీం.

భావము :

ఒకానొక యువతి, తన కనుబొమ్మలను త్రిప్పుట మున్నగు నిఙ్గితములను దాచుటయందు మిక్కిలి నేర్పరితయై యున్నది. అట్లు ఇఙ్గితములను దాచుట యనగా, గూఢార్థముల కల్గిన చేష్టాదులను బ్రయోగించుట యందలి చాతుర్య మనెడి ప్రహేలిక యను పేరుగల నిగూఢార్థములతోఁ గూడిన వాక్యవిశేషమును, బహిరంగ పఱచుటయందలి సామర్థ్యము విషయమున (ఇఙ్గితములను దాచుట యందలి) ఆమెయొక్క నేర్పును గ్రహించినట్లు వెల్లడి పఱచునట్టి తనయొక్క పెక్కులైన యిఙ్గితములచే, విటు డొక్కఁడు తన యభిప్రాయమును వెల్లడి గావించెను. అనగా నొకయువతి తన కనుబొమ్మలనుఁ ద్రిప్పుట మున్నగు విలాస ములతో తనభావమును మఱుగు పఱచుటలో గొప్పనేర్పునుఁ బ్రకటించుచుండి నది. ఆమెయొక్క యా నిగూహనచాతుర్యము నొకవిటుడు గ్రహించి, యతడును నట్టి పెక్కువిధముల నిఙ్గితములతోడనే యామెకు తన హృదయమును, బ్రకాశ పఱచి యుత్తర మొసంగెనని యాశయము ॥101॥

శ్లో. ఘృతప్లుతే భోజనభాజనే పురః
స్ఫురత్పురన్ధ్రి ప్రతిబిమ్బితాకృతేః,
యువా నిధాయోరసి లడ్డుకద్వయం
నఖై ర్లిలేఖాఽథ మమర్ద నిర్దయమ్. 102

ప వి. ఘృతప్లుతే-భోజనభాజనే - పురః- స్ఫురత్పురన్ధ్రీ ప్రతిబిమ్బితాకృతేః- యువా - నిధాయ - ఉరసి-లడ్డుకద్వయం-నఖైః- లిలేఖ-అథ-మమర్ద-నిర్దయం.

అర్థము: యువా=ఒకానొక యువకుఁడు. పురః = ఎదుట, ఘృతప్లుతే, ఘృత=నేతిచే, ప్లుతే=తడుపఁబడిన, భోజనభాజనే=అన్నపాత్ర యందు. స్ఫురత్పురన్ధ్రీ ప్రతి బిమ్బితాకృతేః—స్ఫురత్=ప్రకాశించు, పురన్ధ్రీ = స్త్రీయొక్క, ప్రతిబింబిత=ప్రతిబింబించిన, ఆకృతేః= శరీరముయొక్క, ఉరసి=వక్షఃస్థలమునందు, లడ్డుకద్వయం=రెండు లడ్డులను, నిధాయ=ఉంచి, నఖైః=గోళ్లచే, లిలేఖ=గిల్లెను, అథ= పిదప, నిర్దయం=గట్టిగా, మమర్ద=మర్దించెను, ఆమెయొక్క కుచ కుంభము లనెడి యభిప్రాయముచే నట్లు చేసెనని యర్థము.

సమాసములు :

ఘృతప్లుతే—ఘృతేన ప్లుతం=ఘృతప్లుతం, తస్మిన్=ఘృతప్లుతే.
భోజనభాజనే—భోజనస్య భాజనమ్=భోజనభాజనం, తస్మిన్=భోజన భాజనే.
స్ఫురత్పురన్ధ్రీ ప్రతిబింబితాకృతేః-ప్రతిబిమ్బితా చ సా ఆకృతిశ్చ= ప్రతిబిమ్బితాకృతిః, పురన్ధ్ర్యాః ప్రతిబింబితాకృతిః=పురన్ధ్రీ ప్రతిబిమ్బితా కృతిః, స్ఫురన్తీ చ సా ప్రతిబిమ్బితాకృతిశ్చ=స్ఫురత్పురన్ధ్రీ ప్రతి బిమ్బితాకృతిః. తస్యాః=స్ఫురత్పురంధ్రీ ప్రతిబింబితాకృతేః
లడ్డుకద్వయం-లడ్డుకయోః ద్వయం=లడ్డుకద్వయం, తత్=లడ్డుక ద్వయం,
నిర్దయమ్-నిర్గతా దయా యస్మిన్ కర్మణి తద్యథా భవతి, తథా= నిర్దయం.

భావము :

ఒక యువకుడు తన భోజనపాత్రయందు నేతిని వడ్డింపగా నందొక యువతియొక్క శరీరము ప్రతిబింబించినది. అప్పు డాశరీరముయొక్క వక్షః స్థలమునందు గుండ్రములైన లడ్డులను రెంటి నుంచి, యారెంటిని స్తనములుగా భావించినవాడై వానిని గిల్లి మర్దించెను. ॥102॥

శ్లో. విలోకితే రాగితరేణ సస్మితం
హ్రియాఽథ వైముఖ్య మితే సఖీజనే
తదాలి రానీయ కుతోఽపి శార్కరీం
కరే దదౌ తస్య విహస్య పుత్రికామ్. 103

**ప. వి.** విలోకితే-రాగితరేణ-సస్మితం-హ్రియా-అథ-వైముఖ్యమ్-ఇతే-సఖీజనే-తదాలిః-ఆనీయ-కుతః-అపి-శార్కరీం-కరే-దదౌ-తస్య-విహస్య-పుత్రికామ్.

**అర్థము:** సఖీజనే = తనచెలికత్తె యను జనము, రాగితరేణ = మిక్కిలి యనురాగమును వహించిన యొకానొక విటునిచే, సస్మితం = చిఱునగవుతోఁగూడినట్లు, విలోకితే సతి = చూడఁబడగా, అథ = చూచిన పిదప, హ్రియా = సిగ్గుచే, వైముఖ్యం = ముఖమునుఁ ద్రిప్పుకొనుటను, ఇతే సతి = పొందగా, అనగా సిగ్గుచే ముఖమును త్రిప్పుకొనగా, తదాలిః, తత్ = ఆ చెలికత్తెయొక్క, ఆలిః = సఖి, కుతః అపి = ఏదియో యొక స్థానమునుండి, శార్కరీం = చక్కెరతో నిర్మితమైన, పుత్రికాం = బొమ్మను, ఆనీయ = తెచ్చి, ఆ యనురాగాతిశయము గల్గిన విటుని యొక్క, కరే = హస్తమందు, విహస్య = నవ్వి, దదౌ = ఇచ్చెను. అనగా ముఖమును మఱియొక వైపునకు త్రిప్పినందువలననే, యనురాగమున్నదో లేదో యని సందేహింపరాదు. కాని ఈ చక్కెర బొమ్మను నీ చేత నెట్లిచ్చితినో యట్లే యా నీ చెలికత్తెను గూడ నీ చేతికి దొరకునట్లు చేయగలనని సూచించినది.

సమాసములు :

*రాగితరేణ*-అత్యంతం రాగీ = రాగితరః, తేన = రాగితరేణ.
*వైముఖ్యం*-విముఖాయాః భావః = వైముఖ్యం, తత్ = వైముఖ్యమ్.
*సఖీజనే*-సఖ్యేవ జనః = సఖీజనః, తస్మిన్ = సఖీజనే.
*తదాలిః*-తస్యాః ఆలిః = తదాలిః
*శార్కరీ*-శర్కరాయాః వికారః = శార్కరీ, తాం = శార్కరీం.
*పుత్రికాం*-పుత్రీవ ప్రతికృతి రస్యాః ఇతి = పుత్రికా, తాం = పుత్రికాం.

భావము :-

ఒకానొకతె యొక్క చెలికత్తెయందు మిక్కిలి యనురాగమును వహించిన కాముకుఁ డొకఁడు, ఆమెను చిఱునగవుతోఁ జూడగా నామె సిగ్గుచే ముఖమును మఱియొక వైపునకుఁ ద్రిప్పుకొనినది. అప్పు డాప్రియురాలి చెలికత్తె యెక్కడ నుండియో చక్కెర బొమ్మనుఁ దెచ్చి దానిని వడ్డించు నెపముతో నాతని చేత చిఱునగవుతో నుంచినది. అందువలన - నీ ప్రియురాలు సిగ్గుచే ముఖమును మఱియొక వైపునకుఁ ద్రిప్పుటకు లజ్జయే కారణము. కాన నామెకు నీ యెడ ననురాగ మున్నదో లేదో యని శంకింపకుము. ఆమెను ఈ చక్కెర బొమ్మవలెనే నీ చేతికి వచ్చునట్లు చేయఁగలనని సూచించిన దాయెను. ॥103॥

శ్లో. నిరీక్ష్య రమ్యాః పరివేషికా ధ్రువం
న భుక్త మేవైభి రవాప్తతృప్తిభిః,
అశక్నువద్భి ర్బహుభుక్తవత్తయా
యథోజ్ఝితా వ్యఞ్జనపుఞ్జరాజయః. 104

ప. వి. నిరీక్ష్య-రమ్యాః-పరివేషికాః-ధ్రువం-న-భుక్తమ్-ఏవ- ఏభిః - అవాప్త తృప్తిభిః-అశక్నువద్భిః-బహుభుక్తవత్తయా-యథా-ఉజ్ఝితాః - వ్యఞ్జన పుఞ్జరాజయః.

అర్థము :- బహుభుక్తవత్తయా = మిక్కుటముగా భుజించుటవలన, అశక్నువద్భిః = శేషములేకుండ భుజింప నశక్తులగు నితరజనులచే, యథా = ఏవిధముగా, వ్యఞ్జనపుఞ్జరాజయః, వ్యఞ్జనపుఞ్జ = శాకమాంసాదిసాధకముల సమూహముయొక్క, రాజయః = పఙ్క్తులు, ఉజ్ఝ్యన్తే = (ఎక్కువగా వండించుటవలన) వదలివేయఁ బడుచున్నవో, తథా = అట్లే, ఏభిః = ఈవరునికిసంబంధించిన భోక్తల చేతను, రమ్యాః = అందగత్తెలగు, పరివేషికాః = వడ్డించునట్టి స్త్రీలు, నిరీక్ష్య = చూడఁబడియే, అవాప్తతృప్తిభిః; అవాప్త = పొందబడిన, తృప్తిభిః = తృప్తి గలిగిన వారిచే, వ్యఞ్జనపుఞ్జరాజయః = శాక మాంసాదిసాధకముల యొక్క పఙ్క్తులు, ఉజ్ఝితాః = విడువఁబడినవి,న భుక్తం = తినబడలేదు. ధ్రువం = నిశ్చయము.

వి : వ్యఞ్జనపుఞ్జములను తినక వదలివేయుటకు వడ్డించునట్టి సుందరీమణుల దర్శనము కారణము కాకపోయినను కారణముగా జెప్పుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకమగు ధ్రువశబ్దమునుఁ బ్రయోగించుట వలన నది వాచ్యము.

**సమాసములు :**

అవాప్తతృప్తిభిః-అవాప్తా తృప్తిః యైః తే=అవాప్తతృప్తయః, తైః= అవాప్తతృప్తిభిః.

*అశక్నువద్భిః :-* న శక్నువన్తః=అశక్నువన్తః, తైః=అశక్నువద్భిః

*బహుభుక్తవత్తయా :-* బహు భుక్తవన్తః=బహుభుక్తవన్తః, బహు భుక్తవతాం భావః=బహుభుక్తవత్తా, తయా=బహుభుక్తవత్తయా.

*వ్యఞ్జనపుఞ్జరాజయః -* వ్యఞ్జనానాం పుఞ్జాః=వ్యఞ్జనపుఞ్జాః, వ్యఞ్జన పుఞ్జానాం రాజయః=వ్యఞ్జనపుఞ్జరాజయః.

**భావము :**

మిక్కుటముగా భుజించుటవలన. శేషములేకుండా భుజింప నశక్తులగు నితర జనులు శాకమాంసాది సాధకరాశుల నెట్లు విడచిపెట్టిరో, అట్లే వరునిపక్ష మునకుఁ జెందిన జనులును వడ్డించునట్టి యందగత్తెలగు యువతులనుఁ జూచుట చేతనే, తృప్తినొందినవా రగుటవలన, శాకమాంసాదిసాధకరాశులపై రుచిని వీడి వానిని దినక విడచిపెట్టిరి. ఇది తథ్యము. ॥104॥

శ్లో. పృథక్ప్రకారేఙ్గిత శంసితాశయో
యువా యయోదాసి తయాఽపి తాపితః,
తతో నిరాశః పరిభావయ న్పరా
మయే! తయాఽతోషి సరోషయైవ సః. 105

ప వి: పృథక్ప్రకారేఙ్గితశంసితాశయః, యువా-యయా-ఉదాసి-తయా-అపి-తాపితః-తతః-నిరాశః-పరిభావయన్-పరాన్-అయే-తయా - అతోషి- సరోషయా-ఏవ-సః

అర్థము: యయా = ఏ యువతిచే. పృథక్ప్రకారేఙ్గితశంసితాశయః. పృథక్ప్రకార = నానావిధములగు, ఇఙ్గిత = చేష్టలచే, శంసిత = ప్రకటింపఁబడిన, ఆశయః = అభిప్రాయముగల్గిన యువా = యువకు డొక్కఁడు, ఉదాసి = ఉత్తరరూపములైన యిఙ్గితముల నొసంగనందువలన, ఉదాసి = ఉదాసీన భావమునుఁ బొందిఁపఁబడెనో, తయాపి = ఆమెచేతను, అనగా రోషమువలన ననాదరణము చేయవలసినదైనను, నామెచేతనే, తాపితః = దుఃఖము నొందింపఁబడెను. ఉత్తరరూపములైన యిఙ్గితముల నొసంగనందువలన తనయిష్టము నెరవేరలేదను నైరాశ్యముచే మిక్కిలి దుఃఖితుఁడాయెనని యర్థము. ఎవడు దేనియందు, ఔదాసీన్యమును వహించునో, వాని కది లభింపకపోవుటవలన దుఃఖము కలుగదు. ప్రకృతమో ఆమెయం దౌదాసీన్యము వహించిన వానికిని యామెవలన దుఃఖము కల్గింపబడినదని విరోధమును "తయాఽపి" అనునెడ నపిశబ్దము సూచించుచున్నది. తతః = ఆయౌదాసీన్యము వలన, నిరాశః = ఆమెనుఁ బడయు విషయమున నాశలేనట్టివాఁడై, పరాం = మఱియొకదానిని, పరిభావయన్ = ఇంగితాదులచే పలికించుచు ననగా ననురాగముతోఁ జూచుచు, సః = ఆయువకుఁడు, సరోషయా = రోషముతోఁ గూడిన, అనగా మఱియొక స్త్రీనిఁ జూచుటవలన రోషముతోఁగూడిన తయైవ = ఆ మొదటి స్త్రీ చేతనే, అతోషి = సంతోషము నొందింపఁబడెను. రెండవ స్త్రీచేతఁ బొందింపఁబడలేదని యర్థము. అయే! = ఆశ్చర్యము.

ఔదాసీన్యమును గల్గించియు దుఃఖమును గల్గించినది. రోషముతో గూడి సంతోషమునుఁ గల్గించినదను విరుద్ధార్థములకు రెంటికిని సమావేశము ఆశ్చర్యకరమైనదని యర్థము. మొదటి యువతి యతనియందనురాగము గల్గినదైనను జనుల యెదుట నిఙ్గితాదులనుఁ జేయుట యయుక్తమను బుద్ధిచే నా యువకుని కామె యుత్తరరూపముగా నిఙ్గితాదికము నొసంగ లేదు. అందువలన నా యువకుఁడు దుఃఖముఁ జెందెను. కాని యామె యొక్క గూఢాభిప్రాయము నిత డెఱుంగక, యీామె నాయెడ ననురక్తురాలు కాదను నిశ్చయముతో మఱియొక యువతి ననురాగముతోఁ జూచుచుండగా దానిని మొదటి యువతి చూచి రోషము చెందెను. "అనురాగముతోఁ గూడిన యువతియే రోషముతోఁడనుఁ గూడినదగు"

వి : వ్యఞ్జనపుఞ్జములను తినక వదలివేయుటకు వడ్డించునట్టి సుందరీమణుల దర్శనము కారణము కాకపోయినను కారణముగా జెప్పుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకమగు ధ్రువశబ్దమునుఁ బ్రయోగించుట వలన నది వాచ్యము.

సమాసములు :

అవాప్తతృప్తిభిః-అవాప్తా తృప్తిః యైః తే=అవాప్తతృప్తయః, తైః= అవాప్తతృప్తిభిః.

*అశక్నువద్భిః* :- న శక్నువన్తః=అశక్నువన్తః, తైః=అశక్నువద్భిః

*బహుభుక్తవత్తయా* :- బహు భుక్తవన్తః=బహుభుక్తవన్తః, బహుభుక్తవతాం భావః=బహుభుక్తవత్తా, తయా=బహుభుక్తవత్తయా.

*వ్యఞ్జనపుఞ్జరాజయః* - వ్యఞ్జనానాం పుఞ్జాః=వ్యఞ్జనపుఞ్జాః. వ్యఞ్జనపుఞ్జానాం రాజయః=వ్యఞ్జనపుఞ్జరాజయః.

భావము :

మిక్కుటముగా భుజించుటవలన. శేషములేకుండా భుజింప నశక్తులగు నితర జనులు శాకమాంసాది సాధకరాశుల నెట్లు విడచిపెట్టిరో, అట్లే వరునిపక్షమునకుఁ జెందిన జనులును వడ్డించునట్టి యందగత్తెలగు యువతులనుఁ జూచుట చేతనే, తృప్తినొందినవా రగుటవలన, శాకమాంసాదిసాధకరాశులపై రుచిని వీడి వానిని దినక విడచిపెట్టిరి. ఇది తథ్యము. ॥104॥

శ్లో. పృథక్ప్రకారేఙ్గిత శంసితాశయో
యువా యయోదాసి తయాఽపి తాపితః,
తతో నిరాశః పరిభావయ న్పరా
మయే! తయాఽతోషి సరోషయైవ సః. 105

ప.వి: పృథక్ప్రకారేఙ్గితశంసితాశయః, యువా-యయా-ఉదాసి-తయా-అపి-తాపితః-తతః-నిరాశః-పరిభావయన్-పరాన్-అయే-తయా - అతోషి-సరోషయా-ఏవ-సః

అర్థము: యయా=ఏ యువతిచే. పృథక్ప్రకారేఙ్గితశంసితాశయః. పృథక్ప్రకార=నానావిధములగు, ఇఙ్గిత=చేష్టలచే, శంసిత=ప్రకటింపఁబడిన, ఆశయః=అభిప్రాయముగల్గిన యువా=యువకు డొక్కఁడు, ఉదాసి= ఉత్తరరూపములైన యిఙ్గితముల నొసంగనందువలన, ఉదాసి=ఉదాసీన భావమునుఁ బొందింపఁబడెనో, తయాపి=ఆమెచేతను, అనగా రోషమువలన ననాదరణము చేయవలసినదైనను, నామెచేతనే, తాపితః= దుఃఖము నొందింపఁబడెను. ఉత్తరరూపములైన యిఙ్గితముల నొసంగ నందువలన తనయిష్టము నెరవేరలేదను నైరాశ్యముచే మిక్కిలి దుఃఖితుఁ డాయెనని యర్థము. ఎవడు దేనియందు, ఔదాసీన్యమును వహించునో, వాని కది లభింపకపోవుటవలన దుఃఖము కలుగదు. ప్రకృతమో ఆమెయం దౌదాసీన్యము వహించిన వానికిని యామెవలన దుఃఖము కల్గింపబడినదని విరోధమును "తయాఽపి" అనునెడ నపిశబ్దము సూచించుచున్నది. తతః=ఆయౌదాసీన్యము వలన, నిరాశః= ఆమెనుఁ బడయు విషయమున నాశలేనట్టివాఁడై, పరాం=మఱియొకదానిని, పరిభావయన్= ఇంగితాదులచే పలికించుచు ననగా ననురాగముతోఁ జూచుచు, సః= ఆయువకుఁడు, సరోషయా=రోషముతోఁ గూడిన, అనగా మఱియొక స్త్రీనిఁ జూచుటవలన రోషముతోఁగూడిన తయైవ = ఆ మొదటి స్త్రీ చేతనే, అతోషి = సంతోషము నొందింపఁబడెను. రెండవ స్త్రీచేతఁ బొందింపఁబడలేదని యర్థము. అయే! = ఆశ్చర్యము.

ఔదాసీన్యమును గల్గించియు దుఃఖమును గల్గించినది. రోషముతో గూడి సంతోషమునుఁ గల్గించినదను విరుద్ధార్థములకు రెంటికిని సమావేశము ఆశ్చర్యకరమైనదని యర్థము. మొదటి యువతి యతనియం దనురాగము గల్గినదైనను జనుల యెదుట నిఙ్గితాదులనుఁ జేయుట యయుక్తమను బుద్ధిచే నా యువకుని కామె యుత్తరరూపముగా నిఙ్గితాదికము నొసంగ లేదు. అందువలన నా యువకుఁడు దుఃఖముఁ జెందెను. కాని యామె యొక్క గూఢాభిప్రాయము నిత డెఱుంగక, యీామె నాయెడ ననురక్తురాలు కాదను నిశ్చయముతో మఱియొక యువతి ననురాగముతోఁ జూచుచుండగా దానిని మొదటి యువతి చూచి రోషము చెందెను. "అనురాగముతోఁ గూడిన యువతియే రోషముతోఁడనుఁ గూడినదగు"

నను వ్యాప్తిఁబట్టి యామె యొక్క దోషమునుఁ జూచి యామెకు తన యందలి యనురాగము నూహించి సంతోషముఁ జెందె నని యర్థము.

సమాసములు :

పృథక్ప్రకారేఙ్గితశంసితాశయః - పృథక్ ప్రకారాః యేషాం తాని= పృథక్ప్రకారాణి, పృథక్ప్రకారాణి చ తాని ఇఙ్గితాని చ=పృథక్ప్రకారేఙ్గితాని. పృథక్ప్రకారేఙ్గితైః శంసితః ఆశయః యేన సః=పృథక్ప్రకారేఙ్గితశంసితాశయః.

నిరాశః- నిర్గతా ఆశా యస్మాత్సః నిరాశః.

సరోషయా - రోషేణ సహ వర్తత ఇతి-సరోషా, తయా =సరోషయా.

భావము:

యువకు డొక్కఁడు మొదట నొక స్త్రీనిఁ జూచి పెక్కు విధములగు నిఙ్గితములతో తన యాశయము సూచించెను. కాని యామె యాతని యిఙ్గితాదులకు బదులుగా తన యిఙ్గితములతో తన భావమునుఁ జూపక యాతని నుపేక్షించినది. అట్లు ఆ యువకునిపైన నాదరము వహించియు రోషముతో నామెయే యాతనిని సంతాపపఱచినది. అనగా నా యువకుఁడు చూపిన యిఙ్గితాదులకు ప్రతీఙ్గితాదులనుఁ జూపనందువలన నాతనికి తనయిష్టము నెరవేరదను భయముచే దుఃఖము గల్గినది. ఎవడు దేనియందు నుదాసీనుడో, వానికి అది లభింపకపోయినను దుఃఖము కలుగదు. ప్రకృతమో, యామెయం దౌదాసీన్యమును వహించినను నామెవలననే తనకు దుఃఖము గల్గినదనుట విరుద్ధము. ఈ విరోధమునే "తయాపి" అనునెడ నపిశబ్దము సూచించుచున్నది. ఇతడుఁ తొలుతటి యువతికలసి యౌదాసీన్యముచే హతాశుడై మఱియొక యువతిని ఇఙ్గితాదులచే ననురాగయుక్తుఁడై చూచుచుండగా నీతడు తనపైఁ గినుక వహించి రోషముతోఁగూడిన తొలుతటి స్త్రీచేత సంతోషము నొందింపబడెను. ఇది యాశ్చర్యకరమైన విషయము. తొలుత నౌదాసీన్యమునుఁ గల్గించి యీమె యాతనికి దుఃఖమునుఁ గల్గించినది. ఆమెయే రోషముఁ జెంది యీతనికి సంతోషమును గల్గించినది. ఆ విరుద్ధార్థములు రెండును నొకచోట

సమావేశ మగుటవలన నాశ్చర్యము అనగా పూర్వము ఆ స్త్రీ యీ యువకుని౯ గూర్చి జనసమక్షమున ప్రతీజ్గితాదులచే భావప్రకటనను౯ జేయుట యనుచిత మని వానిని౯ జేసి వీనిని ఆదరించలేదు. అందువలన నీయువకుఁడు దుఃఖితు డాయెను. కాని యామెయొక్క గూఢాభిప్రాయమును, దెలిసికొనక, యీమె తన యెడ ననురక్తురాలు కాదని నిశ్చయించుకొని మఱియొకతెను నను రాగముతో చూచుచుండగా దానిని గమనించి మొదటి యువతి రోషము౯ జెందిన దాయెను. "అనురాగవతియగు యువతియే రోషము చెందునను నియమము ననుసరించి యామెయొక్క రోషమును౯ జూచి యామె తనయెడ ననురక్తురాలని గమనించి సంతుష్టు డాయెనని భావము. అనగా, జనసమక్షమున నాయువకు డా యువతిని గూర్చి యిజ్గితాదులచే తన భావ ప్రకటనను౯ జేసినను, నామె జనసమక్షమున నట్లు చేయుట యనుచితమని భావించి యతనిని గూర్చి ప్రతీజ్గితాదులచే భావప్రకటనను౯ జేయక యాతని నుపేక్షించినది. తర్వాత నామె తన్ను నుపేక్షించినందువలన నాయువకుఁడు మఱియొకస్త్రీని అను రాగముతో౯ జూడ౯ దొడగెను. దానిని౯ గాంచి యా తొలుతటి స్త్రీ రోషము చెందినది. ఆమె రోషమును యువకుఁడు గాంచి యామె తనయెడ ననురక్తు రాలని గ్రహించి సంతుష్టు౯ డాయెనని సారము॥150॥

శ్లో॥ పయఃస్మితా మణ్డపమణ్డలామ్బరా
వటాననేన్దుః పృథులడ్డుకస్తనీ
పదం రుచే ర్భోజ్యభుజాం భుజిక్రియా
ప్రియా బభూ వోజ్జ్వల కూరహారిణీ. 106

ప. వి.పయఃస్మితా-మణ్డపమణ్డలామ్బరా-వటాననేన్దుః-పృథులడ్డు కస్తనీ-పదం-రుచేః-భోజ్యభుజాం-భుజిక్రియాప్రియా-బభూవ -ఉజ్జ్వల కూరహారిణీ.

అర్థము: పయఃస్మితా; పయః=ఉదకము లేదా పాలు స్మితా=చిఱునగవుగా౯ గల్గినదియు, మణ్డపమణ్డలామ్బరా; మణ్డప=వరపక్షమునకుజెందిన జనులకు నాశ్రయములయొక్క, మణ్డల=సమూహము అనగా వెన్నెల సమూహము, అమ్బరా=వస్త్రముగా౯గలదియు, వటాననేన్దుః; వట= పూర్వము౯ జెప్పఁబడిన పాలలో మినుపపిండితో నిర్మింపబడిన వడియము

లనే, ఆననేన్దుః=ముఖచంద్రునిగాఁ గలదియు,పృథులడ్డుకస్తనీ;పృథు=పెద్దవైన, లడ్డుక=లడ్డులనే, స్తనీ=స్తనములుగాఁ గలదియు, రుచేః=అభిలాషకు, అందమునకు, పదం = స్థానమైనదియు, ఉజ్జ్వలకూరహారిణీ; ఉజ్జ్వల=శుభ్రములగు, కూర=శాకాదులచే, హారిణీ=మనోహరమైనదియు, హారముతోఁ గూడినదియునగు, భుజిక్రియా=భోజనక్రియ, భోజ్యభుజాం=భోక్తలకును, భోగులకును, ప్రియా=తృప్తినిఁగూర్చునదిగను, ప్రియురాలుగను, బభూవ=ఆయెను.

వి. ఇచ్చట పాలను చిఱునగవుతోడను, మణ్డపమణ్డలమును వస్త్రముతోడను, వడియములను ముఖచంద్రునితోడను, లడ్డులను స్తనముల, తోడను, ప్రకాశమానములగు శాకాదులను హారములతోడను రూపించుట వలన రూపకాలఙ్కారము.

సమాసములు :

పయఃస్మితా - పయః ఏవ స్మితం యస్యాః సా=పయఃస్మితా.

మణ్డపమణ్డలామ్బరా - మణ్డపస్య మణ్డలం = మణ్డపమణ్డలం, మణ్డపమణ్డలం అమ్బరం యస్యాఃసా=మణ్డపమణ్డలామ్బరా.

వటాననేన్దుః- ఆనన మేవ ఇన్దుః=ఆననేన్దుః, వట ఏవ ఆననేన్దుః యస్యాఃసా=వటాననేన్దుః.

పృథులడ్డుకస్తనీ- పృథూ, లడ్డుకావేవ స్తనౌ యస్యాః సా పృథులడ్డుకస్తనీ.

భోజ్యభుజాం - భోజ్యం భుఞ్జత ఇతి =భోజ్యభుజః తేషాం = భోజ్యభుజాం.

భుజిక్రియా - భుజిరితి క్రియా=భుజిక్రియా.

ఉజ్జ్వలకూరహారిణీ - ఉజ్జ్వలాని చ తాని కూరాని=ఉజ్జ్వలకూరాణి. ఉజ్జ్వలకూరైః హారిణీ, ఉజ్జ్వలకూరహారిణీ,

భావము :

ఇచ్చట రూపకముచే భోజనక్రియను స్త్రీగా వర్ణించుచున్నాడు. ఆ భోజన క్రియ యను యువతికి పాలు, చిఱునగవుగను, వరపక్షపు జనుల ఆశ్రయ సమూహమే వస్త్రముగను పాలతో నుడికించిన మినప పిండితోఁ జేసిన వడియములే ముఖచంద్రుఁడుగను, పెద్దలడ్డులు రెండు స్తనద్వయముగను, నున్నవై, రుచికిని, అందమునకును స్థానమైనదియు, శుభ్రములగు శాకాదులచే మనోహరమైనదై శోభించుచు భోక్తలను, భోగులను, సక్రమముగా తృప్తిపఱచుచు, సంతోషపఱచుచు నుండినది. ॥106॥

శ్లో. చిరం యువాఽఽకూతశతైః కృతార్థన
శ్చిరం సరోషేఙ్గితయా చ నిర్ధుతః,
సృజన్ కరక్షాలనలీలయాఽఞ్జలిం
న్యషేచి కిఞ్చిద్విధుతామ్బుధారయా. 107

ప: వి. చిరం- యువా- ఆకూతగతైః - కృతార్థనః- చిరం - సరోషేఙ్గితయా- చ-నిర్ధుతః-సృజన్- కరక్షాలనలీలయా- అఞ్జలిం- న్యషేచి- కిఞ్చిద్విధుతామ్బుధారయా.

అర్థము: చిరం=చాలకాలము వ్యాపించి, ఆకూతశతైః=పెక్కులగు నిఙ్గితములచే, కృతార్థనః: కృత=చేయఁబడిన, అర్థనః=ప్రార్థన కల్గినవాడై, (తతః=తర్వాత) సరోషేఙ్గితయా; సరోష=రోషమును వ్యక్తపఱచునట్టి, ఇఙ్గితయా=యిఙ్గితములుగల్గిన, యొక యువతిచే, నిర్ధుతశ్చ=నిరాకరింపఁబడిన వాడునైన, యువా=ఒక యువకుఁడు, కరక్షాలనలీలయా; కర=చేతులను, క్షాలన=కడుగుటయను, లీలయా=నెపముచే, చిరం=చాలకాలము, అఞ్జలిం=దోసిలిని, సృజన్=చేయుచు, ననగా జేతులు మోడ్చి చాలాకాలము ప్రార్థించుచు, కిఞ్చిద్విధుతామ్బుధారయా; కిఞ్చిత్=కొంచెము, విధుత=కదలింపఁబడిన, అమ్బుధారయా=ఉదకధారచే. ననగా నుదకధారను వదలించుట యను నెపముచే, న్యషేచి=తడుపఁబడెను, ఇట్లు నీటితో, తడుపుటచే, నామెకు కోపశాన్తి గల్గినట్లు సూచితము.

సమాసములు :

అకూతశతైః—ఆకూతానాం శతాని=ఆకూతశతాని, తైః=ఆకూత శతైః.
కృతార్థనః—కృతం, అర్థనం యేన సః=కృతార్థనః.
సరోషేఙ్గితయా—రోషస్య ఇఙ్గితం=రోషేఙ్గితం, రోషేఙ్గితేన సహ వర్తత ఇతి=సరోషేఙ్గితా, తయా=సరోషేఙ్గితయా,
కరక్షాలనలీలయా—కరయోః క్షాలనం = కరక్షాలనం, కరక్షాలనమేవ లీలా=కరక్షాలనలీలా, తయా=కరక్షాలనలీలయా,
కిఞ్చిద్విధుతామ్బుధారయా—కిఞ్చిత్ విధుతా=కిఞ్చిద్విధుతా, అమ్బునః ధారా=అమ్బుధారా, కిఞ్చిద్విధుతా చ సా అమ్బుధారా చ=కిఞ్చిద్విధుతామ్బుధారా, తయా=కిఞ్చిద్విధుతామ్బుధారయా.

భావము :

ఒక యువకుఁడు, ఒక యువతిని గూర్చి చాలకాలము అనేకములగు నాకూతలములచేఁ బ్రార్థించెను. తర్వాత నా యువతి రోష సూచకములగు నిఙ్గితములతోఁ గూడినదై యతనినిఁ దిరస్కరించినది. అప్పు డా యువకుఁడు తన చేతులను కడుగుచున్నట్లు నటించుచున్నవాఁడై చాలకాలము తన రెండు చేతులను దోసిలిగాఁ గావించి ప్రార్థించుచుండగా నారోషముఁ జెందిన యువతి, తాను పోయునట్టి నీటియొక్క ధారనుఁ జెదరునట్లు చేసి యా చెదరిన జలముచే నాతని తడిపి తనకు కోప శాంతి యేర్పడినట్లు సూచించినది ॥107॥

శ్లో. న షడ్విధః షిఙ్గజనస్య భోజనే
తథా యథా యౌవత విభ్రమోద్భవః,
అపారశృఙ్గారమయః సమున్మిషన్
భృశం రసస్తోష మధత్త సప్తమః. 108

ప. వి:- న-షడ్విధః-షిఙ్గజనస్య-భోజనే-తథా-యథా-యౌవత విభ్రమోద్భవః-అపారశృఙ్గారమయః - సమున్మిషన్- భృశం-రసః - తోషమ్- అధత్త-సప్తమః.

అర్థము : షిఙ్గజనస్య=విటజనము యొక్క, భోజనే=భోజన సమయ మందు, షడ్విధః=ఆరు విధములుగల, అనగా, మధురామ్ల లవణ కటుకషాయ తిక్తభేదములు గల, రసః=రసము, తథా=ఆ విధముగా, తోషం= సంతోషమును, నాఽధత్త=పోషింపలేదు, యథా=ఏ విధముగా, యౌవతవిభ్రమోద్భవః, యౌవత=యువతుల సమూహముయొక్క, విభ్రమ=విలాసములచే,ఉద్భవః=ఉద్భవించినదియు,భృశం=మిక్కిలి, సమున్మిషన్=వర్ధిల్లిన; అపారశృంగారమయః; అపార=అపరిమిత మైన, శృంగారమయః=శృంగార రూపమైన, సప్తమః=ఏడవదైన, ఆలఙ్కారిక సమయ సిద్ధమైన శృంగార రసము,తోషం=సంతోషమును, అధత్త=కల్గించినదో.

సమాసములు :

షడ్విధః - షట్ విధాః యస్య సః=షడ్విధః.

షిఙ్గజనస్య - షిఙ్గ ఏవ జనః=షిఙ్గజనః, తస్య=షిఙ్గజనస్య.

యౌవత విభ్రమోద్భవః - యువతీనాం సమూహః = యౌవతం, యౌవతస్య విభ్రమాః = యౌవతవిభ్రమాః, యౌవతవిభ్రమేభ్యః ఉద్భవః యస్య సః=యౌవతవిభ్రమోద్భవః.

అపారశృంగారమయః – అవిద్యమానం పారం యస్య సః=అపారః, శృఙ్గారస్య వికారః=శృఙ్గారమయః, అపార శ్చాసౌ శృఙ్గారమయశ్చ= అపారశృఙ్గారమయః.

భావము :

విటులు భోజనముచేయు సమయమందు మధురామ్లలవణ కటుకషాయ తిక్త భేదములచే నారుతెఱంగులు గల్గిన పాకరససమూహ మంతటి ప్రీతిని గల్గించలేదు. ఎంతటి ప్రీతిని, యువతుల విలాసములచే నుద్భవించినదై యపార మగు శృఙ్గారరూపమును ధరించి వర్ధమానమగు శృఙ్గార మను, నేడవరసము గల్గించునో, ఆలఙ్కారిక సమయసిద్ధమగు నీ శృంగారరసము ప్రకృతకవికల్ప నచే షడ్రసములలోనే యంతర్భవించును.

భావము :

విటజనుల భోజనపఙ్క్తియందు మధురాదిరూపములుగల యారు రసముల కంటెను, యువతుల విలాసములచే నుద్భవించినదై మిక్కిలి వర్ధిల్లుచున్న అపార మైన శృఙ్గారరూపమగు నేడవరసము మిక్కిలి సంతోషమును గల్గించినది ॥108॥

శ్లో. ముఖే నిధాయ క్రముకం నలానుగై
రథౌజ్ఝి పర్ణాలి రవేక్ష్య వృశ్చికం,
దమార్పితాన్తర్ముఖవాస నిర్మితం
భయానిలైః స్వభ్రమహాసితాఖిలైః. 109

ప. వి. ముఖే- నిధాయ- క్రముకం-నలానుగైః- అథ- ఔజ్ఝి -పర్ణాలిః-అవేక్ష్య- వృశ్చికం- దమార్పితాన్తర్ముఖవాసనిర్మితం- భయానిలైః- స్వభ్రమహా సితాఖిలైః.

అర్థము:- అథ = చేతులు కడిగికొనిన పిదప, నలానుగైః = నలునివెంబడి జను లచే, క్రముకం = వక్కపండు, ముఖే = నోట, నిధాయ = ఉంచుకొని, దమార్పితాన్తర్ముఖవాసనిర్మితం; దమ = దమునిచే, అర్పిత = ఈయఁ బడిన, అన్తర్ముఖ = నోటిలోపల, వాస = పరిమళించుటకై, నిర్మితం = నిర్మింపబడిన, వృశ్చికం = తేలుయొక్క ఆకారమువంటి యాకారముతో చుట్టబడిన తాంబూలమును, అవేక్ష్య = చూచి, భయావిలైః; భయ = తమ్ములగుట్టుసను భయముచే, అవిలైః = కలతనొందినవారును, (కావు ననే) స్వభ్రమహాసితాఖిలైః, స్వ = తమయొక్క, భ్రమ = భ్రాంతిచే, హాసిత = నవ్వింపబడిన, అఖిలైః = అందఱును గల్గినవారిచే, పర్ణాలిః = తమలపాకులవరుస, ఔజ్ఝి = విడువఁబడినది.

సమాసములు :

నలానుగైః - నల మనుగచ్ఛన్తీతి = నలానుగాః, తైః = నలానుగైః. దమార్పితాన్తర్ముఖవాసనిర్మితం - దమేన అర్పితం = దయార్పితం, అన్తః, ముఖస్య = అన్తర్ముఖం, అన్తర్ముఖం వాసయతీతి = అన్తర్ముఖ వాసః, అన్తర్ముఖవాసేన నిర్మితం = అన్తర్ముఖవాసనిర్మితం, దమార్పితం

చ తత్ అన్తర్ముఖవాసనిర్మితం చ = దమార్పితాన్తర్ముఖవాసనిర్మితం, తత్ = దమార్పితాన్తర్ముఖవాసనిర్మితం.
భయావిలైః - భయేన ఆవిలాః = భయావిలాః, తైః = భయావిలైః.
స్వభ్రమహాసితాఖిలైః - స్వేషాం భ్రమః = స్వభ్రమః, స్వభ్రమేణ హాసితాః అఖిలాః యేషాం తే = స్వభ్రమహాసితాఖిలాః, తైః = స్వభ్రమహాసితాఖిలైః.

భావము :

భోజనము గావించి చేతులు కడుగుకొనినపిదప నలునికి సంబంధించిన పెండ్లిజనులు వక్కలను నోట నుంచుకొని దమయంతి సోదరుఁడగు, దముడు నోటిలోపల సువాసననుఁ గల్పించునట్టి లవంగములు, ఏలక్కాయలు మున్నగు వానిచే నిర్మింపఁబడినదై, వృశ్చికాకారమునఁ గానవచ్చునట్టి తాంబూలపు ద్రవ్యముల పొట్లముఁ గాంచి యది కుట్టునని భయముఁ జెందినవారై, తమభ్రాంతిచే నందఱిని నవ్వించినవారై తాంబూలమును వదలిపెట్టిరి. ॥109॥

శ్లో. అమీషు తథ్యానృతరత్నజాతయో
ర్విదర్భరాట్ చారునితాంతచారుణోః,
స్వయం గృహాణైక మిహే త్యుదీర్య తత్
ద్వయం దదౌ శేషజిఘృక్షవే హసన్. 110

ప.వి:-అమీషు-తథ్యానృతరత్నజాతయోః-విదర్భరాట్- చారునితాన్తచారుణోః- స్వయం-గృహాణ-ఏకమ్-ఇహ- ఇతి-ఉదీర్య- తద్ద్వయం-దదౌ- శేషజిఘృక్షవే-హసన్.

అర్థము: విదర్భరాట్ = విదర్భదేశప్రభువైన భీమనృపాలుఁడు, చారునితాన్తచారుణోః; చారు = క్రమముగా రమ్యమైనదియు, నితాన్తచారుణోః = మిక్కిలిరమ్యమైనదియునగు, ఇహ = ఇచ్చటనున్న, అనయోః = ఈ, తథ్యానృతరత్నజాతయోః; తథ్య = సత్యములైనవియు, అనృత =

అసత్యములైనవియునగు, రత్నజాతయోః=రత్నసమూహములకుమధ్య, ఏకం=ఒక్కదానిని, స్వయం=స్వయముగా, గృహాణ=గ్రహించుము, అమీషు=ఈవరునికి సంబంధించిన జనులమధ్య, ఇతి=ఇట్లు, ఉదీర్య=చెప్పి, శేషజిఘృక్షవే; శేష=అసత్యమైన రత్నరాశినే, జిఘృక్షవే=గ్రహింపఁగోరినవానికై, హసన్=నవ్వుచు ననగా నతనికి స్వకీయమగు జ్ఞానము లేనందువలన హాస్యముఁ జేయుచు, ద్వయం=రెంటిని, అనగా సత్యాఽసత్యరత్నముల సమూహమును, దదౌ=ఇచ్చెను.

సమాసములు :

తథ్యానృతరత్నజాతయోః-తథ్యాని చ అనృతాని=తథ్యానృతాని,తథ్యానృతాని చ తాని రత్నాని చ=తథ్యానృతరత్నాని,తథ్యానృతరత్నానాం జాతే=తథ్యానృతరత్నజాతే, తయోః=తథ్యానృతరత్నజాతయోః. చారునితాన్తచారుణోః-నితాన్తం చారు=నితాన్తచారు, చారు చ నితాన్తచారు, చ=చారునితాన్తచారుణీ, తయోః=చారునితాన్తచారుణోః.

తద్ద్వయం—తయోః ద్వయం=తద్ద్వయం, తత్=తద్ద్వయమ్.

శేషజిఘృక్షవే— గ్రహీతు మిచ్ఛుః=జిఘృక్షుః, శేషం జిఘృక్షుః=శేషజిఘృక్షుః. తస్మై=శేషజిఘృక్షవే.

భావము :

ఆ విదర్భరాజు అసలు రత్నములను, నకలు రత్నములను రెండు రాసులుగాఁ బోసి యారత్నరాసులలో ఎవరు కోరినదానిని వారే స్వయముగా తీసికొను డని వరునిపక్షపుజనుల మధ్య చెప్పెను. అప్పుడు నకలు రత్నములు, అసలు రత్నములకంటెను మిక్కిలి కాంతితో మెఱయుచుండగా వానినే తీసికొనఁ గోరినవానిని, రత్నజ్ఞానము లేనందువలన హాస్యము జేయుచు, నా రెండు రకములైన రత్నములను వాని కొసంగెను. అం దసత్యరత్నములను వినోదము కొఱకును, సత్యరత్నముల నౌచిత్యముకొఱకు నిచ్చెను ॥110॥

శ్లో. ఇతి ద్వికృత్వః శుచిమిష్టభోజినాం
దినాని తేషాం కతిచి న్ముదా యయుః,
ద్విరష్టసంవత్సరవారసున్దరీ
పరీష్టిభి స్తుష్టి ముపేయుషాం నిశి. 111

ప. వి. ఇతి - ద్వికృత్వః - శుచిమిష్టభోజినాం - దినాని - తేషాం-కతి - చిత్ - ముదా - యయుః - ద్విరష్ట సంవత్సరవారసున్దరీ పరీష్టిభిః - తుష్టిమ్-ఉపేయుషాం-నిశి.

అర్థము: ఇతి=ఇవ్విధముగా, ద్వికృత్వః=రెండుమాఱులు, అనగా,పగలు,రాత్రి, శుచిమిష్టభోజినాం, శుచి=పరిశుద్ధమును, మిష్ట = మధురమునగు లడ్డు మున్నగు వానిని, భోజినాం=భుజించునట్టి, (తథా=అట్లే) నిశి =రాత్రియందు, ద్విరష్టసంవత్సరవార సుందరీ పరీష్టిభిః; ద్విరష్ట = రెంటిచే గుణించిన ఎనిమిదియగు ననగా పదునాఱు సంవత్సరముల వయస్సుగల్గిన, వారసుందరీ=వేశ్యలయొక్క, పరీష్టిభిః=పరిచర్యలచే, తుష్టిం=ప్రీతిని, ఉపేయుషాం=పొందుచున్న, తేషాం=ఆ నలునికిఁ జెందిన జనులకు, కతిచిత్=కొన్ని, దినాని=దినములు, ముదా=సంతోషముతో, యయుః=కడచినవి.

సమాసములు :

*శుచిమిష్టభోజినాం* - శుచి చ తత్ మిష్టం చ=శుచిమిష్టం, శుచిమిష్టం భుఙ్క్తే ఇతి = శుచిమిష్టభోజినః, తేషాం=శుచిమిష్టభోజినాం.

*ద్విరష్ట సంవత్సర వారసున్దరీ పరీష్టిభిః*-ద్వి ర్గుణితా అష్టౌ=ద్విరష్టౌ, ద్విరష్టౌ సంవత్సరాః యాసాం తాః=ద్విరష్టసంవత్సరాః, ద్విరష్టసంవత్సరాశ్చ తాః వారసున్దర్యశ్చ = ద్విరష్ట సంవత్సరవారసున్దర్యః, ద్విరష్ట సంవత్సర వారసుందరీణాం పరీష్టయః=ద్విరష్ట సంవత్సరవార సుందరీ పరీష్టయః, తాభిః=ద్విరష్ట సంవత్సరవారసుందరీ పరీష్టిభిః.

భావము :

ఇవ్విధముగా పగలును రాత్రియు రెండు మాఱులు, పరిశుద్ధమును, మధురము నగు నాహారమును భుజించుచు రాత్రులయందు పదునాఱు సం వత్సరముల వయస్సు కల్గిన వేశ్యల శుశ్రూషలతో సంతోషమునుఁ బొందుచున్న నలపక్షపు జనులు కొన్ని దినములను సంతోషముగాఁ గడపిరి. ॥111॥

శ్లో॥ ఉవాస వైదర్భ గృహేషు పఞ్చషా
నిశాః కృశాఙ్గీం పరిణీయ తాం నలః,
అథ ప్రతస్థే నిషధాన్ సహోఽనయా
రథేన వార్ష్ణేయగృహీతరశ్మినా. 112

ప. వి. ఉవాస-వైదర్భగృహేషు- పఞ్చషాః-నిశాః- కృశాఙ్గీం- పరిణీయ-తాం-నలః-అథ-ప్రతస్థే-నిషధాన్-సహ-అనయా - రథేన - వార్ష్ణేయగృహీత రశ్మినా.

అర్థము: నలః=నలమహారాజు, కృశాఙ్గీం=సన్నని మేను గల్గిన, తాం=ఆ దమయంతిని, పరిణీయ=పెండ్లాడి, వైదర్భగృహేషు=భీముని భవనములయందు, పఞ్చషాః=ఐదారు, నిశాః=రాత్రులు, ఉవాస= నివసించెను, అథ=తర్వాత నేడవ దినమున, అనయా సహ=ఈదమ యంతితోడ, వార్ష్ణేయ గృహీతరశ్మినా; వార్ష్ణేయ=వార్ష్ణేయుఁ డను పేరు గల సారథిచే, గృహీత=పట్టుకొనఁబడిన, రశ్మినా=పగ్గములు గల్గిన, రథేన=రథముచే, నిషధాన్=నిషధదేశములను గుఱించి, ప్రతస్థే= బయలుదేరెను.

సమాసములు :

వైదర్భగృహేషు - విదర్భాణాం రాజా=వైదర్భః, వైదర్భస్య గృహాః =వైదర్భగృహాః, తేషు=వైదర్భగృహేషు.

పఞ్చషాః:- పఞ్చ వా షడ్ వా=పఞ్చషాః, తాః=పఞ్చషాః.
కృశాఙ్గీం - కృశ మఙ్గం యస్యాస్సా=కృశాఙ్గీ, తాం=కృశాఙ్గీం.
వార్ష్ణేయగృహీతరశ్మినా - వృష్ణేః అపత్యం పుమాన్=వార్ష్ణేయః, వార్ష్ణేయేన గృహీతాః రశ్మయః యస్య సః=వార్ష్ణేయగృహీతరశ్మిః, తేన=వార్ష్ణేయగృహీతరశ్మినా.

భావము :

నలమహారాజా దమయంతిని పెండ్లియాడి భీమరాజు భవనములయందునై దారురాత్రు లుండెను. పిదప నేడవదినమునందు దమయంతినిఁ దోడ్కొని, వార్ష్ణేయుఁడు సారథిగాఁ గల్గిన రథముతో నిషధదేశమునుఁ గూర్చి బయలుదేరి వెళ్ళెను ॥112॥

శ్లో. పరస్య న స్ప్రష్టు మిమా మధిక్రియా
ప్రియా శిశుః ప్రాంశు రసా వితి బ్రువన్ ।
రథే స భైమీం స్వయ మధ్యరూరుహత్
న తత్ కిలాశ్లిక్ష దిమాం జనేక్షితః. 113

ప.వి:- పరస్య-న-స్ప్రష్టుమ్-ఇమామ్-అధిక్రియా - ప్రియా-శిశుః - ప్రాంశుః-అసౌ-ఇతి-బ్రువన్-రథే-సః-భైమీం - స్వయం - అధ్యరూరుహత్-న-తత్-కిల-అశ్లిక్షత్-ఇమాం-జనేక్షితః.

అర్థము: పరస్య=నాకంటె భిన్నమైన పురుషునకు, ఇమాం = పతివ్రతయగు నీదమయంతిని, స్ప్రష్టుం=తాకుటకు, అధిక్రియా=అధికారము, న=లేదు, ప్రియా=ప్రియురాలైన దమయంతి,శిశుః=బాలిక యగుటచే కుఱుచనిది. అసౌ=ఈరథము,ప్రాంశుః=ఎత్తైనది. (కావున) తానుగనే రథము నెక్కజాలదు,ఇతి=ఇట్లు,బ్రువన్ కిల=చెప్పుచున్నాడో యనునట్లు, సః=ఆ నలుఁడు స్వయం=తానుగనే, భైమీం=దమయంతిని, రథే=రథమునందు, అధ్యరూరుహత్= (ఆమెయొక్క శరీరస్పర్శసుఁ గోరి) ఎక్కించెను. కిన్తు=కాని, తత్=అప్పుడు,

జనేక్షితస్సన్ = జనులచే చూడఁబడినవాఁడై, ఇమాం = ఈదమయంతిని, నాశ్లిక్షత్ = ఆలింగనము గావింపలేదు.

సమాసములు :

జనేక్షితః- జనై రీక్షితః = జనేక్షితః.

భావము :

పతివ్రతయగు నీదమయంతని నాకంటె నితరు డెవ్వడును స్పృశింప నర్హుఁడు కాడు. ప్రియురాలైన యాదమయంతి చిన్నది.కుఱుచనిది.రథము ఎత్తైనది కాన దానినిఁ దానెక్కఁ జాలదు అని చెప్పుచున్నాడో యనునట్లు, నలుడు తానే యాదమయంతిని నామెయొక్క శరీరస్పర్శనుఁ గోరుచున్నాడో యనునట్లు రథము నెక్కించెను.కాని,ఆ సమయమందు జనులు చూచుచుండుటచే నామెనుఁ గౌగలించుకొనలేదు.॥113॥

శ్లో. ఇతి స్మరః శీఘ్రమతి శ్చకార తం
వధూఞ్చ రోమాఞ్చభరేణ కర్కశౌ,
స్ఖలిష్యతి స్నిగ్ధతనుః ప్రియా దియం
ప్రమదీయసీ పీడనభీరుదోర్యుగాత్. 114

ప వి. ఇతి—స్మరః—శీఘ్రమతిః—చకార-తం-వధూం—చ—రోమాఞ్చభరేణ - కర్కశౌ-స్ఖలిష్యతి - స్నిగ్ధతనుః- ప్రియాత్ - ఇయం - ప్రమదీయసీ- పీడనభీరుదోర్యుగాత్.

అర్థము: స్నిగ్ధతనుః = నునుపైన యొడలు గల్గిన, ప్రమదీయసీ = మిక్కిలిమెత్తనైన ఇయం = ఈదమయంతి,పీడనభీరుదోర్యుగాత్; పీడన = పట్టుకొనుటచే, దేహము నలుగుటవలన,భీరు = భయమునొందిన, దోర్యుగాత్ = బాహువుల జంట గల్గిన, ప్రియాత్ = ప్రియుడైన నలునుండి,స్ఖలిష్యతి = జారిపడును,ఇతి = అను కారణమువలన,శీఘ్రమతిః = సమయస్ఫూర్తితోఁ

గూడిన బుద్ధి గల్గిన, స్మరః = మన్మథుఁడు, తం = ఆనలుని, వధూం చ = దమయంతిని, రోమాఞ్చభరేణ; రోమాఞ్చ = పులకములయొక్క, భరేణ = సమూహముచే, కర్కశౌ = కఠిన స్పర్శగలవారుగ, చకార = చేసెను.

వి. ఇచ్చట వీరిఉవురి రోమాఞ్చములు ఒండొరుల శరీరస్పర్శవలనఁ గల్గినవి. కాని యవి దమయంతి జారిపడకుండ నుండుటకై యేర్పడినవని చెప్పుటవలన నుత్ప్రేక్ష.

సమాసములు :

శీఘ్రమతిః - శీఘ్రా మతిః యస్య సః = శీఘ్రమతిః
రోమాఞ్చభరేణ - రోమాఞ్చానాం భరః = రోమాఞ్చభరః, తేన = రోమాఞ్చభరేణ.
స్నిగ్ధతనుః - స్నిగ్ధా తనుః యస్యాః సా = స్నిగ్ధతనుః.
మ్రదీయసీ - అత్యంతం మృద్వీ = మ్రదీయసీ.
పీడనభీరుదోర్యుగాత్ - పీడనాత్ భీరు = పీడనభీరు, దోషోర్యుగం = దోర్యుగం, పీడనభీరు దోర్యుగం యస్య సః = పీడనభీరుదోర్యుగః, తస్మాత్ = పీడనభీరుదోర్యుగాత్.

భావము :

నునుపును మృదువునునగు శరీరముగల యీ దమయంతిని నలుఁడు తన రెండు భుజములతోఁ దనుఁ బట్టుకొనెను. ఆమె శరీరము నునుపుగను మృదువుగను నుండుటవలన నామె యీ బాహువులనుండి జారిపడవచ్చును. అందువలన నామెను బాహువులతో గట్టిగా పట్టుకొనవలయును. అట్లు గట్టిగా బట్టుకొనినచో నాపట్టువలని బాధను నామెయొక్క స్నిగ్ధకోమల శరీరము భరింపఁజాలదను భయముతో, నలుఁడు, ఆమెను వదలుగనే పట్టుకొనెను. కాని అట్లు పట్టుకొనుటవలన నామె జారిపడవచ్చునను భయముతో సమయస్ఫూర్తిగల మన్మథుఁడు వారిఉవురి శరీరములయందునుఁ బులకములనుఁ గల్గించి యా శరీరముల లోని నునుపుతనమ్ముఁ దొలగించి గట్టిపఱచి జారనట్లు చేసెనని భావము. ||114||

శ్లో. తథా కి మాజన్మ నిజాఙ్కవర్ధితాం
ప్రహిత్య పుత్రీం పితరౌ విషేదతుః,
విసృజ్య తౌ తం దుహితుః పతిం యథా
వినీతతాలక్షగుణీభవద్గుణమ్. 115

ప. వి. తదా-కిమ్-ఆజన్మ-నిజాఙ్కవర్ధితాం - ప్రహిత్య - పుత్రీం - పితరౌ - విషేదతుః-విసృజ్య-తౌ-తం-దుహితుః-పతిం-యథా- వినీతతాలక్షగుణీభవద్గుణమ్.

అర్థము: పితరౌ=తల్లిదండ్రులు, ఆజన్మ=పుట్టినదిమొదలు, నిజాఙ్కవర్ధితాం, నిజ=తమదైన, అఙ్క=ఒడియందు, వర్ధితాం=పెంచఁబడిన, పుత్రీం=పుత్రికను, ప్రహిత్య=ప్రయాణముఁ జేయించి, తథా=ఆవిధముగా, విషేదతుః కిం=దుఃఖించిరా యేమి? అనగా దుఃఖింపలేదని యర్థము. యథా=ఏ విధముగా, తౌ=ఆ దమయంతియొక్క తల్లిదండ్రులు, వినీతతాలక్షగుణీభవద్గుణం; వినీతతా=వినయసంపదచే, లక్షగుణీభవత్ గుణం=లక్షగుణములుగా నేర్పడు శౌర్యాది గుణములు గల్గిన, దుహితుః=కుమార్తెకు, పతిం=భర్తయైన, తం=ఆ నలుని, విసృజ్య=వదలి, విషేదతుః=దుఃఖము నొందిరి. పుత్రికయొక్క వియోగమున కంటెను గుణశాలియగు నల్లుని తోటి వియోగము వారికి మిక్కిలి దుఃఖకరముగా నుండినదని యర్థము.

సమాసములు :

ఆజన్మ-జన్మనః ఆరభ్య=ఆజన్మ.

నిజాఙ్కవర్ధితాం-నిజౌ చ తౌ అఙ్కౌ చ=నిజాఙ్కౌ, నిజాఙ్కయోః వర్ధితా=నిజాఙ్కవర్ధితా, తామ్=నిజాఙ్కవర్ధితాం.

పితరౌ- మాతా చ పితా చ=పితరౌ.

వినీతతాలక్షగుణీభవద్గుణం- వినీతస్య భావః=వినీతతా, అలక్షాః లక్షా గుణాః భవన్తః=లక్షగుణీభవన్తః, వినీతతయా లక్షగుణీభవన్తః=

విసీతతాలక్షగుణీభవన్తః, విసీతతాలక్షగుణీభవన్తః గుణాః యస్య సః = విసీతతాలక్షగుణీభవద్గుణః, తమ్ = విసీతతాలక్షగుణీభవద్గుణమ్.

భావము :

దమయంతియొక్క తల్లిదండ్రులు, ఆమె పుట్టినది మొదలు తమ యొడు లయం దుంచుకొని పెంచిన పుత్రికయగు నామెను భర్తయొక్క యింటికిఁ బ్రయాణము చేయించి యట్లు దుఃఖపడలేదు. ఎట్లనగా-వినయసంపదచే లక్షలుగా నేర్పడిన శౌర్యాది గుణములు గల్గిన యానలుని విడచిపెట్టినపుడు ఎంత దుఃఖపడిరో? అనగా పుత్రికతోటి వియోగమున కంటెను గుణశాలియైన యల్లుని తోటి వియోగము వారికి మిక్కిలి విషాదమునుఁ గల్గించినదని భావము. ॥115॥

శ్లో. నిజా దనువ్రజ్య స మణ్డలావధేః
నలం నివృత్తౌ చటులాపతాం గతః,
తడాగకల్లోల ఇవానిలం తటాత్
ధృతాఽఽనతి ర్వ్యావవృతే విదర్భరాట్. 116

ప. వి. నిజాత్-అనువ్రజ్య-సః-మణ్డలావధేః-నలం-నివృత్తౌ - చటులాపతాం - గతః-తడాగకల్లోలః-ఇవ-అనిలం-తటాత్ - ధృతానతిః - వ్యావవృతే - విదర్భరాట్.

అర్థము: నలం = నలమహారాజును, అనువ్రజ్య = వెంటఁబోయి (సాగనంపి), నివృత్తౌ = మఱలివచ్చు సమయమందు, చటులాపతాం, చటు = ప్రియ వాక్యమును, లాపతాం = పలుకుటను, గతః = పొందిన, సః = ఆ, విదర్భరాట్ = విదర్భప్రభువైన భీమరాజు, ధృతానతిః, ధృత = స్వీకరింపబడిన, ఆనతిః = నలుని నమస్కారముగలవాఁడై; అనిలం = గాలిని, అనువ్రజ్య = వెంటనడచి, చటులాపతాం; చటుల = చంచలములైన, ఆపతాం = ఉదకముడు కల్గియు డుటను, గతః = పొందిన, తడాగకల్లోలః, తడాగ = కొలనియొక్క, కల్లోలః = గొప్ప తరంగము, ధృతానతిః, ధృత = పొందఁబడిన, ఆనతిః = గట్టుతోటి

యొరిపిడివలన వంగుట గల్గినదై, తటాదివ = గట్టునుండి యెట్లో యట్లు, నిజాత్ = తనదైన, మణ్డలావధేః = రాష్ట్రపు టెల్లయొక్క యంచుల నుండి, వ్యావవృతే = మఱలెను.

సమాసములు :

మణ్డలావధేః- మణ్డలస్య అవధిః = మణ్డలావధిః, తస్మాత్ = మణ్డలావధేః।
చటులాపతాం- చటు, లపతీతి = చటులాపః, చటులాపస్య భావః = చటులాపతా, తాం = చటులాపతాం.
పక్షాన్తరమున-చటులాః ఆపః యస్య సః = చటులాపః, చటులాపస్య భావః = చటులాపతా, తాం = చటులాపతాం.
తడాగకల్లోలః- తడాగస్య కల్లోలః = తడాగకల్లోలః.
ధృతాఽఽనతిః-ధృతా ఆనతిః యేన సః = ధృతాఽఽనతిః.

భావము :

నలుని వెంబడించి కొంతదూరము అతనిని సాగనంపి తిరిగివచ్చు సమయమున, (చటులాపత్వమును) చటుల సంభాషణమును, ననగా చమత్కార యుక్త సంభాషణమునుఁ గావించిన యాభీమరాజు, నలునుండి నమస్కారము గైకొనినవాడై (ధృతానతియై, వాయువును వెంబడించి చటులాపత్వమును) చంచలమగు జలమును కల్గియుండుటను పొందినట్టి యనగా గాలిచేఁ గదలింపఁ బడినట్టి కొలనియొక్క గొప్పకెరటము (ధృతానతియై.) గట్టున కొరయుటచేఁ గల్గినట్టి వంగుట గల్గినదై తీరప్రదేశము నుండియో యనునట్లు తన రాష్ట్రపు టెల్లయొక్క యంచునుండి మఱలెను. ॥116॥

శ్లో॥ పితాఽఽత్మనః పుణ్య మనాపదః క్షమా
ధనం మనస్తుష్టి రథాఽఖిలం నలః,
అతః పరం పుత్రి ! న కోఽపి తేఽ హమి
త్యుదశ్రు రేష వ్యసృజ న్నిజౌరసీమ్, 117

ప. వి. పితా-ఆత్మనః-పుణ్యమ్-అనాపదః-క్షమా-ఃధనం-మనఃస్తుష్టిః-అథ-అఖి
లం-నలః-అతః-పరం-పుత్రి -న-కః-అపి - తే-అహమ్-ఇతి-ఉదశ్రుః-
ఏషః-వ్యసృజత్-నిజౌరసీం.

అర్థము: పుత్రి ! = ఓ పుత్రికా ! ఆత్మనః = నీయొక్క, పుణ్యం = పుణ్యమే, పితా = తండ్రి, ఏల యనగా నతఁడు హితమునుఁ జేయును, అహితమును వారించును. క్షమాః = ఓర్పులు. అనాపదః = ఆపదలను వారించునవి, మనస్తుష్టిః = మనస్సునందలి సంతోషమే అనగా తృప్తియే, ధనం = ధనము, అథ = పిదప, అతః = వీనికంటె, పరం = మఱి యొకటి, కిం = ఏమి? (బహు = అధికము, వచ్మి = చెప్పుదును) అఖిలం = ఇప్పుడు చెప్పఁబడినదియు, చెప్పఁబడనిదియు నగున దంతయు, నలః = నలుఁడే (నీకు సర్వస్వము) అతః = ఈ నలునికంటె, అన్యత్ = మఱియొకటి, న = లేదు. అహం తు = నేనో, తవ = నీకు, కోఽపి = ఎవ్వడనో ! అనగా సంబంధము లేనివాఁడను, ఇతి = ఇట్లు (ఉక్త్వా = చెప్పి) ఏషః = ఈ భీముఁడు, ఉదశ్రుః = పైకిఁ బొంగిన కన్నీరు గల వాఁడై, నిజాం = తనదగు, ఔరసీం = పుత్రికను, వ్యసృజత్ = విసర్జించెను. అనగా పుత్రికకు వీడ్కోలొసంగెనని యర్థము.

సమాసములు :

అనాపదః - న విద్యన్తే ఆపదః యాభ్యస్తాః = అనాపదః.

మనస్తుష్టిః - మనసః తుష్టిః = మనస్తుష్టిః.

ఉదశ్రుః-ఉద్గతాని అశ్రూణి యస్య సః = ఉదశ్రుః

నిజౌరసీం - ఉరసా నిర్మితా = ఔరసీ, నిజా చ సా ఔరసీ చ - నిజౌరసీ, తాం = నిజౌరసీం.

భావము :

ఓ బిడ్డా ! నీయొక్క పుణ్యఫలమే తండ్రి యనఁబడును. ఏ యనగా, దండ్రి హితముఁ జేయును. అహితమును వారించును. ఓర్పులు ఆపదలను

నివారించును. మనస్తృప్తియే ధనము. ఇఁక చెప్పవలసిన దేమియున్నది ? నలుడే నీకు సర్వస్వము. అతడే నీవు కోరిన దొసగును. నేను ఎవ్వతనో ! నాతో నీకు సంబంధము లేదు. ఇట్లు చెప్పి, భీముఁడు పొంగివచ్చు కన్నీరు గలవాడై తన పుత్రికకు వీడ్కో లొసంగెను. 117

శ్లో. ప్రియః ప్రియైకాచరణా చ్చిరేణ తాం
పితుః స్మరన్తీ మచికిత్స దాధిషు,
శశామ సో௨మ్బావిరహౌర్వపావకః
న తు ప్రియప్రేమమహాம்బుధావపి. 118

ప. వి. ప్రియః-ప్రియైకా చరణాత్-చిరేణ-తాం-పితుః-స్మరన్తీమ్-అచికిత్సత్-ఆధిషు-శశామ-సః-అమ్బావిరహౌర్వపావకః-న-తు-ప్రియప్రేమ మహాம்బుధౌ-అపి.

అర్థము. ప్రియః = ప్రియుఁడైన నలుఁడు, ప్రియైకాచరణాత్ = కేవలము ప్రీతినిఁ గల్గించు వ్యవహారమువలన ననగా దుఃఖమునుఁ దొలఁగించుటకై, మనస్సునకు ప్రసాదమునుఁ గల్గించు వ్యవహారమునుఁ జేసి, పితుః = తండ్రిని, స్మరన్తీం = స్మరించుచున్న, తండ్రికై శోకించుచున్న, తాం = ఆదమయంతిని. చిరేణ = బహుకాలముగా, ఆధిషు = తండ్రితోటి యెడఁబాటువలని, దుఃఖముల విషయమున, అచికిత్సత్ = చికిత్స చేసెను. తు = కాని. సః = ఆ, అమ్బావిరహౌర్వపావకః; అమ్బా = తల్లితోటి, విరహ = విరహమువలనఁ గల్గిన, ఔర్వపావకః = బడబాగ్ని, ప్రియప్రేమ మహాம்బుధావపి = ప్రియుఁడగు నలుని యనురాగసాగరమందును న శశామ = చల్లారలేదు. కన్యలకు తండ్రియందలి అనురాగముకంటెను తల్లులయందలి యనురాగమే యధికము. కాన తల్లి ఎడబాపు మిక్కిలి సాధ్యముగాక యుండినదని యర్థము.

సమాసములు :

ప్రియైకాచరణాత్-ప్రియమేవ = ప్రియైకం, ప్రియైకస్య ఆచరణాత్ = ప్రియైకాచరణాత్,

అమ్బావిరహౌర్వపావకః-అమ్బయా విరహః=అమ్బావిరహః, అమ్బా విరహ ఏవ ఔర్వపావకః=అమ్బావిరహౌర్వపావకః.

ప్రియప్రేమమహామ్బుధౌ - ప్రియస్య ప్రేమ=ప్రియప్రేమ, ప్రియ ప్రేమైవ మహామ్బుధిః=ప్రియప్రేమమహామ్బుధిః, తస్మిన్=ప్రియ ప్రేమ మహామ్బుధౌ.

భావము :

నలుఁడు ప్రీతిని కల్గించు పనులచే ననగా మనస్సునకుఁ బ్రసన్నతనుఁ గల్గించు పనులనుఁ గావించి, తండ్రికై దుఃఖించు దమయంతిని చాల కాలమునకు నూరటపఱచెను. కాని యా యతిదుస్సహమగు తల్లితోటి వియోగమువలని దుఃఖమను బడబాగ్ని నలానురాగసముద్రమందును చల్లారలేదు. కన్యలకు తండ్రియందలి యనురాగముకంటెను తల్లియందలి యనురాగ మధికము. కాన తల్లితోటి విరహదుఃఖము శమింపలేదని యాశయము ॥118॥

శ్లో. అసౌ మహీభృ ద్బహుధాతుమణ్డితః
తయా నిజోపత్యకయేవ కామపి
భువా కురఙ్గేక్షణదన్తిచారయోః
బభార శోభాం కృతపాదసేవయా. 119

ప. వి. అసౌ- మహీభృత్- బహుధాతుమణ్డితః- తయా- నిజోపత్యకయా- ఇవ- కామ్- అపి-భువా-కురఙ్గేక్షణదన్తిచారయోః- బభార - శోభాం-కృతపాద సేవయా.

అర్థము:- బహుధాతుమణ్డితః, బహుధాతు = బంగారము మున్నగు పెక్కు ధాతువులచే మణ్డితః=అలఙ్కరింపఁబడిన వాడును,పక్షాంతరమున-ఆయా ధాతువులయొక్క గనులతోఁ కూడినదియునగు,అసౌ=ఈ,మహీభృత్= నలమహారాజు (పర్వతము), కురఙ్గేక్షణదన్తిచారయోః, కురఙ్గేక్షణ= జింక కన్నులవంటి కన్నులు, పక్షాన్తరమున- జింకలయొక్క దృష్టి, దన్తిచారయోః=గజగమనమువంటి నడక, పక్షాన్తరమున- ఏనుగుల

నడక అను నీ రెంటికిని, భువా = స్థానమైన అనగా జింకకన్నులవంటి కన్నులకును, గజగమనమువంటి గమనమునకును అశ్రయమైన మృగాక్షి తోడను, గజగామినితోడను, పక్షాన్తరమున మృగములు గజములు అక్కడ నుండుటవలన వాని దృష్టికిని నడకకును స్థానమైనదియు, కృత పాదసేవయా; కృత = చేయబడిన, పాదసేవయా = పాదసేవగల్గిన, అనగా పతిపాదసేవగల్గిన, పక్షాన్తరమున- కృతపాదసేవయా; కృత = చేయబడిన, పాద = ప్రత్యంత పర్వతములయొక్క, సేవయా = సాన్నిధ్యము గల్గిన, అట్టి, నిజోపత్యకయేవ, నిజ = తనదగు, ఉపత్యకయా ఇవ = పర్వత సమీపభూమిచేతనో యనునట్లు, తయా = ఆ దమయన్తిచే కామపి = అనిర్వాచ్యమైన, శోభాం = శోభను, బభార = ధరించెను.

సమాసములు:

మహీభృత్ -మహీం బిభర్తీతి-మహీభృత్.
*బహుధాతుమణ్డితః*- బహవశ్చ తే ధాతవశ్చ = బహుధాతవః, బహుధాతుభిః మణ్డితః = బహుధాతుమణ్డితః.
*నిజోపత్యకయా*- నిజా చ సా ఉపత్యకా చ = నిజోపత్యకా, తయా = నిజోపత్యకయా.
*కురఙ్గేక్షణదన్తిచారయోః*- కురఙ్గస్య ఈక్షణ మివ ఈక్షణం = కురఙ్గేక్షణం, కురఙ్గస్య ఈక్షణం = కురఙ్గేక్షణం, దన్తిన ఇవ చారః = దన్తిచారః, దన్తినాం చారం దన్తిచారః, కురఙ్గేక్షణం చ, దన్తిచారశ్చ = కురఙ్గేక్షణదన్తిచారౌ, తయోః = కురఙ్గేక్షణదన్తిచారయోః.
*కృతపాదసేవయా* - పాదయోః సేవా = పాదసేవా, పాదానాం సేవా = పాదసేవా, కృతా పాదసేవా యయా సా = కృతపాదసేవా, తయా = కృతపాదసేవయా.

భావము :

ఈ నలుడు, బంగారు మున్నగువానిచే నిర్మింపఁబడిన యాభరణములతో నలంకరింపఁబడినవాడు. పర్వతమో బంగారు మున్నగువాని గనులతో నలంకరింపబడినది. మఱియు నీనలమహారాజును, ఈపర్వతమును, జింకకన్నులవంటి కన్నుల

కును, జింకయొక్క కన్నులకును, గజగమనము వంటి గమనమునకును, గజముల సంచారమునకును నాశ్రయమైనదియు, పతిపాదసేవ చేసినదియు, ప్రత్యన్త పర్వతముల సాన్నిధ్యము గలదియునగు పర్వతాసన్న భూమివలెనున్న యాదమయంతిచే ననిర్వాచ్యమగు శోభను ధరించెను. దమయంతి జింక కన్నుల వంటి కన్నులుగలది, గజగమనమువంటి గమనము కల్గినది. కాన కురఙ్గేక్షణ దన్తిచారయైనది. పర్వతముయొక్క ఆసన్నభూమియైన యుపత్యకయు జింకల దృష్టులకును, గజసంచారమునకు స్థానమైనందువలన నదియు కురఙ్గేక్షణదన్తి చారములకు స్థానమైనది. మఱియు నాదమయంతి పతిపాదసేవ చేయుటచేత కృతపాదసేవ యైనది. ఉపత్యకయు ప్రత్యన్త పర్వతసాన్నిధ్యముచే కృతపాద సేవయైనది. ఇట్టి యుపత్యకవంటి దమయంతితో పర్వతము వంటి నలుడు అపూర్వ శోభనుఁ జెందెనని యాశయము. ॥119॥

శ్లో. తదేకతానస్య నృపస్య రక్షితుం
చిరోఢయా భావ మివాత్మని శ్రియా,
విహాయ సాపత్న్య మరఙ్జి భీమజా
సమగ్రతద్వాఞ్ఛితపూర్తివృత్తిభిః. 119

ప. వి. తదేకతానస్య - నృపస్య-రక్షితుం-చిరోఢయా-భావమ్ - ఇవ-ఆత్మని - శ్రియా -విహాయ-సాపత్న్యం-అరఙ్జి-భీమజా-సమగ్రతద్వాఞ్ఛిత పూర్తి వృత్తిభిః.

అర్థము: చిరోఢయా; చిర=చాలా కాలమునుండి, ఊఢయా = ధరింపబడిన దియు, వివాహము చేయబడినదియును, శ్రియా=రాజ్యలక్ష్మిచే, తదేకతానస్య, తదేక = ఆ దమయంతి యందే, తానస్య = ఆసక్తి గల్గిన, నృపస్య=నలునియొక్క, భావ=మనోవృత్తిని ననగా నను రాగమును, ఆత్మని=స్వవిషయమున, రక్షితుమివ = స్థిరపఱచు కొనుటకో యనునట్లు, సాపత్న్యం=సవతి పగను, విహాయ = వదలి, భీమజా=దమయంతి, సమగ్ర తద్వాంఛితపూర్తి వృత్తిభిః; సమగ్ర= అన్నిరకములైన, తద్వాంఛిత=ఆమె కోరికలను, పూర్తి=పూరించుట యందలి, వృత్తిభిః = వ్యాపారములచే, అరఙ్జి = రంజింపఁబడినది.

పతివ్రతలగు స్త్రీలు భర్తలయొక్క మనస్సు రంజిల్లఁజేయుటకు సవతులనుఁగూడ సేవింతురు.

సమాసములు :

తదేకతానస్య - తస్యా మేకతానః = తదేకతానః, తస్య = తదేకతానస్య.
చిరోఢయా - చిరాత్ ఊఢా = చిరోఢా, తయా = చిరోఢయా.
సాపత్న్యమ్ - సమానః పతిః యస్యా స్సా = సపత్నీ, సపత్న్యాః భావః = సాపత్న్యం, తత్ = సాపత్న్యం.
భీమజా - భీమా జ్జాయత ఇతి = భీమజా.
సమగ్రతద్వాఞ్ఛితపూర్తి వృత్తిభిః - తస్యాః వాఞ్ఛితాని = తద్వాఞ్ఛితాని, సమగ్రాణి చ తాని తద్వాఞ్ఛితాని చ = సమగ్రతద్వాఞ్ఛితాని, సమగ్రతద్వాఞ్ఛితానాం పూర్తిః = సమగ్రతద్వాఞ్ఛితపూర్తిః, సమగ్రతద్వాఞ్ఛితపూర్తి రేవ వృత్తిః యేషాం తే = సమగ్రతద్వాఞ్ఛితపూర్తి వృత్తయః, తాభిః = సమగ్ర తద్వాఞ్ఛిత పూర్తి వృత్తిభిః.

భావము :

రాజ్యలక్ష్మి చిరకాలమునుండి నలునిచే వహింపబడినదియు, పెండ్లియాడబడినదియునై యుండినది. ఆ రాజ్యలక్ష్మి, నలుడు దమయంతిని పరిణయమాడుట వలన నామె, యారాజ్యలక్ష్మికి సవతియైనది. ఆ రాజ్యలక్ష్మి నలునకు తన యెడ ననురాగము స్థిరపడుటకై, సవతితనపు పగను మాని, దమయంతికి వలసిన సర్వ విధములగు కోరికలను, తీర్చుచు నలుని యెప్పు బడయుటకై యాదమయంతిని రంజింపజేయుచుండినది. పతిహృదయమును రంజిల్లజేయుటకై పతివ్రతలు సవతులను, గూడ సేవింతురు. 120

శ్లో. మసారమాలావలితోరణాం పురీం
నిజా ద్వియోగాదివ లమ్బితాలకాం,
దదర్శ పశ్యామివ నైషధః పథా
మథాశ్రితోద్గ్రీవక మున్నతై ర్గృహైః. 121

ప. వి: మసారమాలావలితోరణాం-పురీం-నిజాత్- వియోగాత్-ఇవ- లమ్బితాలకాం-దదర్శ- పశ్యామ్- ఇవ నైషధః- పథాం-అథ- ఆశ్రితోద్గ్రీవకం-ఉన్నతైః-గృహైః.

అర్థము: అథ=పిదప, మసారమాలావలితోరణాం - మసారమాలా=ఇంద్రనీల మాలలయొక్క, ఆవలి=పంక్తులచే, తోరణాం=వెలుపలి ద్వారముల యందు గలది యనగా నింద్రనీలమణులచే నలంకరింపఁబడిన తోరణముగలదియు, (కావుననే) నిజాత్=తనదైన, వియోగాత్=ఎడబాపు వలన నగా నలుని విరహమువలన, లమ్బితాలకాం, (దువ్వుట మున్నగు సంస్కారములు లేనందువలన) లమ్బిత=వ్రేలాడు,అలకాం= ముంగురులుగలదియో యనున ట్లున్నదియు, ఉన్నతైః = ఎత్తైన, గృహైః=మేడలచే, ఆశ్రితోద్గ్రీవకం, ఆశ్రిత=అవలంబింపఁబడిన, ఉద్గ్రీవకం యథా తథా=మెడను నిక్కించినట్లుగా, పథాం=నలుఁడు వచ్చెడు మార్గములను, పశ్యామివ=చూచునదియో యనునట్లున్న, పురీం=పట్టణమును, దదర్శ=చూచెను.

సమాసములు :

మసారమాలావలితోరణాం— మసారాణాం మాలాః=మసారమాలాః, మసారమాలానా మావలిః=మసారమాలావలిః, మసారమాలావలిః తోరణేషు యస్యాః సా=మసారమాలావలితోరణా, తాం=మసారమాలావలితోరణాం.

లమ్బితాలకాం—లమ్బితాః అలకాః యస్యాః సా=లమ్బితాలకా,తాం= లమ్బితాలకాం.

పశ్యాం—పశ్యతీతి=పశ్యా, తాం=పశ్యాం.

ఆశ్రితోద్గ్రీవకం—ఉత్థితా చ సా గ్రీవా చ=ఉద్గ్రీవా, ఉద్గ్రీవైవ ఉద్గ్రీవికా, ఆశ్రితా ఉద్గ్రీవికా యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా= ఆశ్రితోద్గ్రీవకం.

భావము :

ఇవ్విధముగా దమయంతి నూరడించిన పిదప నలుఁడు, ఇంద్రనీలమణుల మాలతో శోభించు బహిర్ద్వారములు గలదియై, నలుని వియోగముచే జారిపోయిన కురులు గలదియో యనునట్లున్నదియును, ఎత్తైన మేడలతో మెడను నిక్కించి నలుఁడు వచ్చెడి మార్గములను చూచుచున్నట్లున్న తనపట్టణమును చూచెను. అనగా ప్రోషితభర్తృక తన తలను దువ్వుకొనక భర్తవచ్చెడి మార్గముల నెట్లు చూచుచుండునో, అట్లే యా పట్టణమును చూచుచుండినదని యాశయము ॥121॥

శ్లో. పురీం నిరీక్ష్యాఽన్యమనా మనాగితి
ప్రియాయ భైమ్యా నిభృతం విసర్జితః,
యయౌ కటాక్షః సహసా నివర్తినా
తదీక్షణే నార్ధపథే సమాగమమ్. 122

ప. వి. పురీం-నిరీక్ష్య-అన్యమనాః-మనాక్-ఇతి-ప్రియాయ-భైమ్యా-నిభృతం-విసర్జితః- యయౌ- కటాక్షః- సహసా- నివర్తినా-తదీక్షణేన-అర్ధపథే-సమాగమామ్.

అర్థము:- పురీం=ఆ పట్టణమును, నిరీక్ష్య=చూచి, మనాక్=కొంచెము అన్యమనాః; అన్య=ఇతర విషయములయందు లగ్నమైన, మనాః= మనస్సు గల్గినవాడు (తనకాంతుఁ డని ఆలోచించి) భైమ్యా=దమయంతిచే, ప్రియాయ=నలునికై, నిభృతం=గూఢముగా, విసర్జితః= పంపబడిన, కటాక్షః=కడకన్ను, సహసా=వెంటనే, నివర్తినా= మఱలించుచున్న అనగా దమయంతిఁ జూచుటకై విషయాన్తరమునుండి దృష్టిని మరలించుచున్న, తదీక్షణేన; తత్=ఆ నలుని యొక్క, ఈక్షణేన=దృష్టితో, అర్ధపథే=సగము త్రోవయందు, సమాగమం= సంయోగమును, యయౌ=పొందెను. దమయంతి లజ్జాతిశయమువలన నలుని యెదుట యాతనిముఖమునుఁ చూడజాలలేదు. ఆ నలుఁడు పట్టణమునుఁ జూచుటచే నన్యమనస్సునుఁ గల్గినట్లుగా వివేచించి తన కడ కన్నును నతనివైపు ప్రసరింపఁజేసెను. అప్పుడే నలుఁడుకూడ తన

దృష్టిని మరలించుటవలన నతని దృష్టితో నామెదృష్టి కలియుటచే నామె సిగ్గునొందెను. అనగా నుభయులు నొండొరుల యాశయమును తెలిసికొనగల్గిరని యర్థము.

సమాసములు :

అన్యమనాః- అన్యస్మిన్ మనః యస్య సః=అన్యమనాః.

తదీక్షణేన - తస్య ఈక్షణం=తదీక్షణమ్, తేన=తదీక్షణేన.

అర్ధపథే - అర్ధం పథః=అర్ధపథం, తస్మిన్=అర్ధపథే

భావము :

ఆ నలుఁడు పట్టణమును చూచి కొంచెము విషయాన్తరమందు లగ్నమైన మనస్సు గలవాడాయెను. ఆ యవకాశమునుఁ జూచుకొని దమయంతి నలుని ముఖమును గూఢముగాఁ చూచుటకు తనదృష్టిని పంపెను. ఆమె సిగ్గుచే నతనిని నేరుగాఁ జూడలేకపోయినది. కాని యానలుఁడు వెంటనే తనదృష్టిని మరల్చగా దమయన్తి కటాక్షము త్రోవనడుమ నాతనిదృష్టితో గలసినది.అందువలన నామె సిగ్గుపడినది. ॥22॥

శ్లో. అథ నగరధృతైరమాత్యరత్నైః
పథి సమియాయ స జాయయాభిరామః,
మధురివ కుసుమశ్రియా సనాథః
క్రమమిలితై రలిభిః కుతూహలోత్కైః. 123

ప. వి. అథ- నగరధృతైః-అమాత్యరత్నైః-పథి-సమియాయ-సః-జాయయా-అభిరామః-మధుః- ఇవ-కుసుమశ్రియా- సనాథః-క్రమమిలితైః-అలిభిః-కుతూహలోత్కైః.

అర్థము:- అథ=పట్టణమునుఁ జూచిన పిదప, జాయయా=భార్యతో, అభిరామః=మనోహరుడైన, సః=ఆ నలుఁడు, కుసుమశ్రియా=పుష్ప

సంపదతో, సనాథః = కూడిన, మధుః = వసంతుఁడు, క్రమేణ = వరుసగా, మిలితైః = ఒకచోటఁ గలసిన, కుతూహలోత్కైః, కుతూహల = మధుపానమువలని యానందమున, ఉత్కైః = ఔత్సుక్యముగల్గిన, పక్షాన్తరమున, దమయన్తితో గూడిన నలుని జూచుటకై పట్టుదలతోడను, నాశ్చర్యముతోడను, ఉత్కైః = ఔత్సుక్యమునుఁ బొందిన, అలిభిరివ = తుమ్మెదలవలె, నగరధృతైః; నగర = పట్టణమందు, ధృతైః = సంరక్షణకై యున్న, అమాత్యరత్నైః = మన్త్రిశ్రేష్ఠులతోడ, పథి = నగరమార్గమందు, సమియాయ = కలసెను.

సమాసములు :

నగరధృతైః- నగరే ధృతాః = నగరధృతాః, తైః = నగరధృతైః.

కుసుమశ్రియా—కుసుమస్య శ్రీః = కుసుమశ్రీః, తయా = కుసుమశ్రియా.

క్రమమిలితైః-క్రమేణ మిలితాః = క్రమమిలితాః, తైః = క్రమమిలితైః.

కుతూహలోత్కైః— కుతూహలాయ ఉత్కాః = కుతూహలోత్కాః, తైః = కుతూహలోత్కైః.

భావము :

ఇట్లు నగరదర్శనమును, గావించిన పిదప నానలుఁడు భార్యతోఁడ మనోహరుడై పుష్పలక్ష్మితోఁ గూడిన వసంతుడువలె క్రమముగ నొకచోట కలసినవియును, మధుపానమందలి కుతూహలము కొఱకు నౌత్సుక్యముగలవియు నగు తేనెటీగలవలె నున్నవారును, నగరరక్షణమునకై పట్టణమందే యున్నవారును నగు మంత్రి పుంగవులతో రాజమార్గమునందు కలసెను. 123

శ్లో. కియదపి కథయన్ స్వవృత్తజాతం
శ్రవణ కుతూహల చఞ్చలేషు తేషు,
కియదపి నిజదేశవృత్త మేభ్యః
శ్రవణపథం స నయన్ పురీం వివేశ. 124

ప. వి. కియత్-అపి-కథయన్-స్వవృత్తజాతం - శ్రవణకుతూహలచఞ్చలేషు-తేషు-కియత్-అపి-నిజదేశవృత్తమ్-ఏభ్యః-శ్రవణపథం - సః-నయన్-పురీం-వివేశ.

అర్థము: సః=ఆనలుఁడు, శ్రవణకుతూహలచఞ్చలేషు; శ్రవణ=స్వయంవర వృత్తాంతమును వినుటకు కోరికతో, చంచలేషు=ఆసక్తులైన, తేషు=ఆ మంత్రుల విషయమున, స్వవృత్తజాతం; స్వ=తనదగు, వృత్త=సమాచారము యొక్క, జాతం=సమూహమును, ఇంద్రాదులకు తాను దూత్యమును వహించుటమున్నగు ముఖ్యవిషయములను, కియదపి=కొంచెము, కథయన్=వర్ణించుచు, తథా=అట్లే, నిజదేశవృత్తం=తనదేశ సమాచారమును, ఏభ్యః=ఈ మంత్రుల నుండి, కియదపి=కొంచెము, శ్రవణపథం=కర్ణమార్గమును, నయన్=పొందించుచు అనగా వినుచు, పురీం=నగరమును, వివేశ=ప్రవేశించెను.

సమాసములు :

స్వవృత్తజాతం-స్వస్య వృత్తాని=స్వవృత్తాని, స్వవృత్తానాం జాతం=స్వవృత్తజాతం=తత్, స్వవృత్తజాతం.
శ్రవణకుతూహలచఞ్చలేషు-శ్రవణే కుతూహలం=శ్రవణకుతూహలం, శ్రవణకుతూహలే చఞ్చలాః=శ్రవణకుతూహలచఞ్చలాః, తేషు = శ్రవణకుతూహలచఞ్చలేషు.
నిజదేశవృత్తం-నిజ శ్చాసౌ దేశశ్చ=నిజదేశః, నిజదేశస్య వృత్తం=నిజదేశవృత్తం.
శ్రవణపథం- శ్రవణయోః పన్థాః=శ్రవణపథః, తం=శ్రవణపథం,

భావము :

ఆ నలమహారాజు స్వయంవరవృత్తాంతమును వినుటయందు, ఆసక్తి గల్గిన మంత్రులకు, ఇంద్రాదులకై తాను దూత్యము వహించుట మున్నగు ముఖ్య విషయములను కొంచెము చెప్పుచు, ఆ విధముగనే, తన దేశ వృత్తాంతము మంత్రులవలన కొద్దిగా వినుచు నగరమును ప్రవేశించెను. ॥124॥

శ్లో. అథ పథి పథి లాజై రాత్మనో బాహువల్లీ
ముకులకులసకుల్యైః పూజయన్త్యో జయేతి,
క్షితిపతి ముపనేము స్తం దధానా జనానా
మమృతజలమృణాలీసౌకుమార్యాః కుమార్యః. 125

ప. వి. అథ-పథి-పథి-లాజైః-ఆత్మనః-బాహువల్లీముకులకులసకుల్యైః - పూజయన్త్యః-జయ-ఇతి-క్షితిపతిమ్-ఉపనేముః-తం-దధానాః - జనానామ్ - అమృతజలమృణాలీ సౌకుమార్యాః-కుమార్యః.

**అర్థము:** అథ = నగరమునఁ బ్రవేశించిన పిదప, పథి పథి = ప్రతిమార్గము నందును, అమృతజలమృణాలీసౌకుమార్యాః; అమృతజల = అమృతోదకమునందలి, మృణాలీ = తామరతీగె వంటి సౌకుమార్యాః = మృదుత్వము గల్గిన, కుమార్యః = యువతులు అనగా వివాహముఁ జేసికొనని స్త్రీలు, ఆత్మనః = తమయొక్క, బాహువల్లీముకులకులసకుల్యైః; బాహువల్లీ = భుజములనెడి తీగెలయొక్క, ముకులకుల = మొగ్గల సమూహములతో, సకుల్యై = సమానములైన, లాజైః = బొరుగులచే, జయ = జయింపుము, ఇతి = అని, జయ శబ్ద పూర్వకముగా, పూజయన్త్యః సత్యః = పూజించుచున్నవారై, జనానాం = జనులమధ్య, తం = ఆ, క్షితిపతిం = నలమహారాజును, ఉపనేముః = కొనియాడిరి లేదా స్తుతించిరి.

సమాసములు :

బాహువల్లీముకులకులసకుల్యైః- బాహవ ఏవ వల్ల్యః = బాహువల్ల్యః, బాహువల్లీనాం ముకులాః = బాహువల్లీముకులాః, బాహువల్లీముకులానాం కులం = బాహువల్లీముకులకులం, బాహువల్లీముకులకులేన సకుల్యం యేషాం తే = బాహువల్లీముకులకులసకుల్యాః, తైః = బాహువల్లీముకులకులసకుల్యైః. అమృతజలమృణాలీసౌకుమార్యాః- అమృతమేవ జలం = అమృతజలం, అమృతజలస్య మృణాల్యః = అమృతజలమృణాల్యః, అమృతజలమృణాలీనాం సౌకుమార్యమివ సౌకుమార్యం యాసాం తాః = అమృతజలమృణాలీ సౌకుమార్యాః.

ము :

ఆ నలమహారాజు నగర ప్రవేశముఁ గావించిన వెనుక, త్రోవలయందు ఎతంపు నీటఁ బెరిగిన తామరతీగెలవంటి మెత్తఁదనముగల యవివాహితలగు కలు, తమ తమ భుజము లనెడి తీగెలయందలి మొగ్గల సమూహమునకు •నములైన బొరుగులచే "విజయుఁడవు కమ్మని" జయశబ్దపూర్వకముగా ర్యఁ జేయుచు, జనులమధ్య నా నలమహారాజు నభినందించిరి. ॥125॥

శ్లో. అభినవ దమయన్తీ కాన్తి జాలావలోక
ప్రవణపురపురన్ధ్రీ వక్త్రచన్ద్రాన్వయేన,
నిఖిలనగరసౌధాట్టావలీచన్ద్రశాలాః
క్షణమివ నిజసంజ్ఞాం సాన్వయా మన్వభూవన్. 126

వి. అభినవ దమయన్తీ కాన్తి జాలావలోక ప్రవణపురపురన్ధ్రీ వక్త్రచన్ద్రాన్వయేన-నిఖిలనగర సౌధాట్టావలీ చన్ద్రశాలాః-క్షణమ్-ఇవ-నిజసంజ్ఞాం సాన్వయామ్-అన్వభూవన్.

ము. అభినవదమయంతీ కాంతి జాలావలోక ప్రవణపురపురన్ధ్రీ వక్త్రచంద్రాన్వయేన, అభినవ=అప్పుడే వచ్చిన, దమయన్తీ=దమయంతియొక్క, కాన్తిజాల=సౌందర్యరాశిని, అవలోక=చూచుటయందు, ప్రవణ=ఆసక్తిగల్గిన, పురపురన్ధ్రీ=నగరస్త్రీలయొక్క, వక్త్రచన్ద్ర=ముఖచంద్రులయొక్క, అన్వయేన=సంబంధముచే, నిఖిలనగరసౌధాట్టావలీ చంద్రశాలాః; నిఖిల=సమస్తములైన, నగర=పురమందలి, సౌధ=మేడలపైని,అట్టావలీ=పై మిద్దెల వరుసల యందున్న, చన్ద్రశాలాః=శిరోగృహములు, క్షణమివ=క్షణకాలము, అనగా నా ముఖచంద్రుల సంబంధ మున్నంతవరకును, నిజసంజ్ఞాం=చంద్రశాలయను తమ పేరును, సాన్వయాం=అర్థయుక్తముగా ననగా "చంద్రాణాం శాలా" అని చంద్రులకు సంబంధించిన శాల యను విధముగా, అన్వభూవన్=అనుభవించినవి,

**సమాసములు :**

*అభినవ దమయన్తీ కాన్తి జాలావలోక ప్రవణపురపురస్త్రీ వక్త్ర చన్ద్రాన్వయేన*- అభినవా చ సా దమయన్తీ చ = అభినవ దమయన్తీ. అభినవ దమయన్త్యాః కాన్తయః = అభినవ దమయన్తీ కాన్తయః, అభినవదమయన్తీకాన్తీనాం జాలం = అభినవ దమయన్తీ కాన్తి జాలం, అభినవ దమయన్తీ కాన్తిజాలస్య అవలోకః = అభినవ దమయన్తీ కాన్తి జాలావలోకః, అభినవ దమయన్తీ కాన్తిజాలావలోకే ప్రవణాః = అభినవ దమయన్తీ కాన్తి జాలావలోక ప్రవణాః, పురస్య పురస్త్రియః = పురపురస్త్రియః, అభినవ దమయన్తీ కాన్తి జాలావలోక ప్రవణాశ్చ తాః పుర పురస్త్రియశ్చ = అభినవదమయన్తీ కాన్తిజాలావలోక ప్రవణ పుర పురస్త్రియః, అభినవ దమయన్తీ కాన్తిజాలావలోక ప్రవణ పుర పురస్త్రీణాం వక్త్రాణ్యేవ చన్ద్రాః = అభినవ దమయన్తీ కాన్తి జాలావలోక ప్రవణ పుర పురంధ్రీ వక్త్రచంద్రాః, అభినవ దమయన్తీ కాన్తి జాలావలోక ప్రవణపుర పురస్త్రీ వక్త్రచంద్రాణా మన్వయః = అభినవ దమయన్తీ కాన్తి జాలావలోక ప్రవణ పుర పురస్త్రీ వక్త్ర చన్ద్రాన్వయః, తేన = అభినవ దమయన్తీ కాన్తి చన్ద్రావలోక ప్రవణ పుర పురస్త్రీ వక్త్రి చన్ద్రాన్వయేన.

*నిఖిల నగర సౌధాట్టావలీ చన్ద్రశాలాః* - నగరస్య సౌధాః = నగర సౌధాః, నగరసౌధేషు అట్టాః = నగర సౌధాట్టాః, నగర సౌధాట్టానామావల్యః = నగర సౌధాట్టావల్యః, నిఖిలాశ్చ తాః నగర సౌధాట్టావల్యశ్చ = నిఖిల నగర సౌధాట్టావల్యః నిఖిల నగర సౌధాట్టావలీషు చన్ద్రశాలాః = నిఖిల నగర సౌధాట్టావలీ చన్ద్రశాలాః.

*నిజసంజ్ఞాం* - నిజా చ సా సంజ్ఞా చ = నిజసంజ్ఞా, తాం = నిజసంజ్ఞాం.

*సాన్వయాం* - అన్వయేన సహితా = సాన్వయా. తాం సాన్వయాం.

**భావము :**

క్రొత్తగా వచ్చిన దమయన్తియొక్క సౌందర్యాతిశయ జూచుటకై యాసక్తులగు నగరస్త్రీ లందఱును మేడలపై కట్టఁబడిన చంద్రశాలల నెక్కి

యుండిరి. ఆ చంద్రశాలలయం దుండి వారు ఆమెను జూచుచుండిరి. వారు, ఆ విధముగా నా చంద్రశాలలయం దుండుటవలన వారి ముఖచంద్ర సంబంధము వాని కేర్పడి యాచంద్రశాలలకు ఆ పేర్లు చంద్రులయొక్క శాలలని సార్థకము లైనవి. అనగా వారి ముఖములే యందు చంద్రులై, అవి యుండుటచే వానికి చంద్రశాలలను పేరును సార్థకము గావించినవని యాశయము॥126॥

శ్లో. నిషధనృపముఖేన్దుశ్రీసుధాం సౌధవాతా
యనవివరగరశ్మిశ్రేణినాలోపనీతాం,
పపు రతులపిపాసాపాంశులత్వోపరాగా
న్యఖిలపురపురన్ధ్రినేత్రనీలోత్పలాని. 128

ప. వి. నిషధనృపముఖేన్దుశ్రీసుధాం - సౌధవాతాయనవివరగరశ్మి శ్రేణినా లోపనీతాం - పపుః - అతుల పిపాసా పాంశులత్వోపరాగాని - అఖిల పురపురన్ధ్రి నేత్రనీలోత్పలాని.

అర్థము:- అతులపిపాసాపాంశులత్వోపరాగాని; అతుల=సాటిలేని, పిపాసా = దాహముచే ననగా చూడఁగోరికచే, పాంశులత్వ=కాలుష్యమువలన అనగా పరపురుషుని చూచుటయందలి పట్టుదలవలని పాపవాసన కల్గియుండుటచే (కావుననే) ఉపరాగ = దుర్నీతికల్గిన, అఖిలపురపురన్ధ్రి నేత్రనీలోత్పలాని, అఖిల=సకలురైన, పురపురన్ధ్రి=పురస్త్రీలయొక్క, నేత్ర నీలోత్పలాని=కన్నులనెడి కలువలు, సౌధవాతాయన వివరగ రశ్మిశ్రేణి నాలోపనీతాః, సౌధ=మేడలయొక్క, వాతాయన = గవాక్షముల యందలి, వివర=రంధ్రములను, గ=పొందునట్టి, రశ్మి=నేత్ర కాంతులయొక్క, శ్రేణి=వరుసయనెడి, నాల=రంధ్రములు గల నల్ల కాలువలకాడలచే, ఉపనీతాం = తేఁబడిన అనగా నేత్రసమీపమును పొందింపబడిన, నిషధనృపముఖేన్దు శ్రీసుధాం, నిషధనృప = నిషధ ప్రభువగు నలునియొక్క, ముఖేన్దు = ముఖచంద్రుని యొక్క, శ్రీ సుధాం=శోభయను నమృతమును, పపుః=పానము గావించినవి.

సమాసములు :

*నిషధనృపముఖేందుశ్రీసుధాం* - నిషధానాం నృపః = నిషధనృపః, ముఖమేవ ఇన్దుః = ముఖేన్దుః, నిషధనృపస్య ముఖేన్దుః = నిషధనృపముఖేన్దుః, నిషధనృప ముఖేన్దోః శ్రీః = నిషదనృపముఖేన్దుశ్రీః =, నిషధనృపముఖేన్దుశ్రీరేవ సుధా = నిషధనృపముఖేన్దు శ్రీసుధా, తాం = నిషధనృపముఖేన్దుశ్రీసుధాం.

*సౌధవాతాయనవివరగరశ్మిశ్రేణినాలోపనీతాం* - సౌధానాం వాతాయనాని = సౌధవాతాయనాని, సౌధవాతాయనానాం వివరాః = సౌధవాతాయనవివరాః, సౌధవాతాయనవివరాత్ గచ్ఛన్తీతి = సౌధవాతాయనవివరగాః, సౌధవాతాయనవివరగాశ్చ తే రశ్మయశ్చ = సౌధవాతాయనవివరగరశ్మయః, సౌధవాతాయనవివరగరశ్మీనాం శ్రేణిః = సౌధవాతాయనవివరగరశ్మిశ్రేణిః = సౌధవాతాయనవివరగరశ్మిశ్రేణిరేవ నాలః = సౌధవాతాయనవివరగరశ్మిశ్రేణినాలః, సౌధవాతాయనవివరగరశ్మిశ్రేణినాలేన ఉపనీతా = సౌధవాతాయన వివరగరశ్మిశ్రేణినాలోపనీతా, తాం = సౌధవాతాయనవివరగరశ్మి శ్రేణినాలోపనీతాం.

*అతులపిపాసాపాంశులత్వోపరాగాణి* - పాతు మిచ్ఛా = పిపాసా, అతులా చ సా పిపాసా చ = అతులపిపాసా, పాంశులస్య భావః = పాంశులత్వం, అతులపిపాసయా పాంశులత్వం, అతులపిపాసాపాంసులత్వం, అతులపిపాసాపాంశులత్వేన ఉపరాగః యేషాం తాని = అతులపిపాసాపాంశులత్వోపరాగాణి.

*అఖిలపురపురన్ధ్రినేత్రనీలోత్పలాని* - పురస్య పురన్ధ్య్రః = పురపురన్ధ్య్రః, అఖిలాశ్చ తాః పురపురన్ధ్య్రశ్చ = అఖి పురపురన్ధ్య్రః, నేత్రాణ్యేవ నీలోత్పలాని = నేత్రనీలోత్పలాని, అఖిలపురపురన్ధ్రినేత్రాణ్యేవ నీలోత్పలాని అఖిలపురపురన్ధ్రినేత్రనీలోత్పలాని.

భావము :

అతిప్రబలమైన పానేచ్ఛచేత నననగా నితరులను జూడవలయుననుం గోరికచే, నననగా పరపురుషదర్శనేచ్ఛచే పాపవాసన నొంది, దుర్వ్యసనములలన

నల్లబారిన ఆనగరమందలి స్త్రీలందఱియొక్క కన్నులనెడి కలువ పూలు మేడల గవాక్షముల రంధ్రములనుండి ప్రవేశించు వారి నేత్రకిరణములనెడి రంధ్రములతోఁ గూడిన కలువకాడల శ్రేణియను గొట్టములచేఁ దేఁబడిన యనగా నేత్రసమీప మునుఁ బొందింపఁబడిన, నలుని ముఖశోభయను నమృతమును పానము గావించి నవి. అనగా నాస్త్రీలనేత్రములు పరపురుషదర్శనముచే పాపమునొంది నల్లబారి కలువలవలె నున్నవి. మేడల గవాక్షముల రంధ్రములనుండి వారు చూచుటవలన, వారి నయనములనుండి ప్రసరించు కిరణములనెడి కలువకాడల గొట్టములు, ఆనలుని ముఖచంద్రశోభయను నమృతమును దేగా దానిని యా స్త్రీ నేత్రములు పానముఁజేసినవి. అనగా నా స్త్రీలు ఆనలుని ముఖశోభను మిక్కిలి యాశతో జూచిరని భావము ॥128॥

శ్లో. అవనిపతి రథోర్ధ్వస్త్రైణపాణిప్రవాల
స్ఖలితసురభిలాజవ్యాజభాజః ప్రతీచ్ఛన్।
ఉపరికుసుమవృష్టీ రేష వైమానికానా
మభినవకృతభైమీ సౌధభూమిం వివేశ. 128

ప. వి: అవనిపతిః-అథ-ఊర్ధ్వ-స్త్రైణపాణి ప్రవాల స్ఖలిత సురభిలాజవ్యాజభాజః-ప్రతీచ్ఛన్-ఉపరి-కుసుమవృష్టీః-ఏషః-వైమానికానామ్ - అభినవకృత భైమీ సౌధభూమిం-వివేశ.

అర్థము: అథ = నగరము బ్రవేశించినపిదప, ఏషః = ఈ, అవనిపతిః = నల మహారాజు, ఊర్ధ్వస్త్రైణపాణి ప్రవాలస్ఖలిత సురభిలాజ వ్యాజ భాజః; ఊర్ధ్వ = ఉపరి గృహముల యందున్న, స్త్రైణ = స్త్రీ సమూహము యొక్క, పాణి ప్రవాల = చిగురువంటి హస్తములనుండి, స్ఖలిత = పడి నటువంటి, సురభి = సువాసనగల్గిన, లాజ = పేలాలు లేదా అక్షతలు అనువానియొక్క, వ్యాజ = నెపమును, భాజః = పొందిన, వైమాని కానాం = విమానములచే చరించు దేవతలయొక్క, ఉపరిష్టాత్ = పైనకు; సుమవృష్టీః ఇవ = పుష్పవర్షములవలె నున్న లాజవర్షములను, ప్రతీచ్ఛన్ = స్వీకరించుచు, అభినవకృతభైమీ సౌధభూమిం; అభినవకృత = క్రొత్తగా నిర్మింపబడిన, భైమీసౌధభూమిః = దమయంతియొక్క భవన ప్రదేశ మునుఁగూర్చి. వివేశ = ప్రవేశించెను,

సమాసములు :

అవనిపతిః- అవనేః పతిః = అవనిపతిః.

ఊర్ధ్వస్త్రైణపాణి ప్రవాల స్ఖలిత సురభిలాజ వ్యాజభాజః- స్త్రీణాం సమూహః = స్త్రైణాః, ఊర్ధ్వేషు స్త్రైణాః = ఊర్ధ్వస్త్రైణాః, పాణిః ప్రవాలః ఇవ = పాణిప్రవాలః, స్త్రైణానాం పాణిప్రవాలః = స్త్రైణపాణిప్రవాలః, ఊర్ధ్వస్త్రైణ పాణిప్రవాలేభ్యః స్ఖలితాః = ఊర్ధ్వస్త్రైణపాణి ప్రవాల స్ఖలితాః, సురభయశ్చ తే లాజాశ్చ = సురభిలాజాః, ఊర్ధ్వస్త్రైణ పాణి ప్రవాలస్ఖలితాశ్చ తే సురభిలాజాశ్చ = ఊర్ధ్వస్త్రైణ పాణి ప్రవాల స్ఖలిత సురభిలాజాః; ఊర్ధ్వస్త్రైణ పాణి ప్రవాల స్ఖలితసురభిలాజానాం వ్యాజః = ఊర్ధ్వస్త్రైణ పాణిప్రవాల స్ఖలిత సురభిలాజవ్యాజః, ఊర్ధ్వస్త్రైణపాణి ప్రవాల స్ఖలిత సురభిలాజవ్యాజం, భజన్తీతి = ఊర్ధ్వ స్త్రైణపాణి ప్రవాల స్ఖలిత సురభిలాజవ్యాజభాజః, తాః = ఊర్ధ్వస్త్రైణపాణి ప్రవాల స్ఖలిత సురభిలాజవ్యాజభాజః.

కుసుమవృష్టీః- కుసుమానాం వృష్టయః = కుసుమవృష్టయః, తాః = కుసుమవృష్టీః.

అభినవకృత భైమీసౌధభూమిం- అభినవం కృతః = అభినవకృతః, భైమ్యాః సౌధః = భైమీసౌధః, అభినవకృతశ్చాసౌ భైమీసౌధశ్చ = అభినవకృతభైమీసౌధః, అభినవకృతభైమీసౌధస్య భూమిః = అభినవకృత భైమీసౌధభూమిః, తాం = అభినవకృతభైమీసౌధభూమిం.

భావము :

నలుఁడు నగరమునుఁ బ్రవేశించిన పిదప పై మిద్దెల నుండి స్త్రీ సమూహము తమతమ చిగురుఁగేలుంచే పరిమళవంతములగు పేలాలను లేదా అక్షతలనుఁ గురిపించిరి. కాని ఆలాజము లను నెపముచే విమానములపై సంచరించు దేవతలు కురిపించిన పుష్పవర్షముల నానలుఁడు స్వీకరించుచు, దమయంతి విడిసిన నూతనభవన ముండెడి ప్రదేశమును ప్రవేశించెను. ॥128॥

శ్లో. ఇతి పరిణయ మిత్థం యాన మేకత్ర యానే
దరచకితకటాక్షప్రేక్షిత ఞ్చానయో స్తత్,

దివి దివిషదధీశాః కౌతుకే నావలోక్య
ప్రణిదధు రథ గన్తుం నాకమానన్దసాన్ద్రాః. 129

ప. వి. ఇతి-పరిణయమ్-ఇత్థం-యానమ్-ఏకత్ర - యానే - దరచకిత కటాక్ష ప్రేక్షితం-చ-అనయోః-తత్-దివి-దివిషదధీశాః-కౌతుకేన - అవలోక్య-ప్రణిదధుః-అథ-గన్తుం-నాకమ్-ఆనన్దసాన్ద్రాః.

అర్థము: దివిషదధీశాః-స్వర్గమందలివారి కధిపతులగు దేవతలు, దివి = ఆకసమందు, స్థిత్వా=ఉండి, అనయోః = ఈ దమయంతీ నలులయొక్క, ఇతి = ఈ విధమైన, పరిణయం = వివాహమును, ఇత్థం = ఇట్లు చెప్పిన విధముగా, ఏకత్ర = ఒక, యానే = రథమందు, యానం = ప్రయాణమును, తత్ = ముందుఁ జెప్పబడిన, దరచకితకటాక్షప్రేక్షణం చ; దర = కొంచెము, చకిత = భయపడిన, కటాక్ష = కడ కన్నులతోటి ప్రేక్షితం చ = చూపును, ఒండొరులదృష్టి కలయుటలోని సిగ్గువలన గల్గిన భయముచే నట్టి చూపును: కౌతుకేన = కుతూహలముతో, అవలోక్య = చూచి, అథ = దమయంతియు, నలుఁడును భవనమును, ప్రవేశించిన పిదప, ఆనందసాన్ద్రాః = ఆనందముతో నిండినవారై; గంతుం = వెళ్ళుటకు, ప్రణిదధుః = ఆలోచించిరి.

సమాసములు :

*దరచకిత కటాక్షప్రేక్షితం* - దరం చకితః = దరచకితః, దరచకితశ్చాసౌ కటాక్షః = దరచకిత కటాక్షః, దరచకితకటాక్షేణ ప్రేక్షితం = దరచకిత కటాక్ష ప్రేక్షితం.

*దివిషదధీశాః* - దివిషదా మధీశాః = దివిష దధీశాః,

*ఆనన్దసాన్ద్రాః* - ఆనన్దేన సాన్ద్రాః = ఆనన్దసాన్ద్రాః.

భావము :

దేవతల కధిపతులు, మింటనుండి, దమయంతీనలులయొక్క యీ వివాహమును, ముందుఁజెప్పిన విధముగా నొకరథమునందు ప్రయాణమును, అట్లే ముందు జెప్పిన విధముగా, వారిఱువురి దృష్టులు కలయుటచే కలుగు సిగ్గువలన భయమొందిన కటాక్షదృష్టిని కుతూహలముతో జూచి, పిదప దమయంతి

యానలుఁడును భవనమునుఁ బ్రవేశింపగా నానందముతోఁ గూడినవాడై స్వర్గలోకమునకు వెళ్ళుట కాలోచించిరి. 129

శ్లో॥ శ్రీ హర్షం కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః సుతం
శ్రీహీరః సుషువే జితేన్ద్రియచయం మామల్లదేవీ చ యం
కాశ్మీరైర్మహితే చతుర్దశతయీం విద్యాం విదద్భిర్మహా
కావ్యే తద్భువి నైషధీయచరితే సర్గోఽగమత్ షోడశః. 130

ప. వి. శ్రీహర్షం - కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః - సుతం-శ్రీహీరః - సుషువే - జితేన్ద్రియచయం - మామల్లదేవీ - చ-యం-కాశ్మీరైః- మహితే-చతుర్దశతయీం - విద్యాం-విదద్భిః - మహాకావ్యే - తద్భువి - నైషధీయచరితే-సర్గః-అగమత్-షోడశః.

అర్థము :- కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః, కవిజరాజరాజి = కవిశ్రేష్ఠుల పఙ్క్తి లోని, మకుట = శ్రేష్ఠమైన వారికి, అలఙ్కార = భూషణమైన, హీరః = వజ్రమణియగు, శ్రీహీరః = శ్రీహీరుఁడు, జితేన్ద్రియచయిం, జిత = జయింపఁబడిన ఇన్ద్రియచయం = ఇంద్రియ సమూహము గల్గిన, శ్రీహర్షం = శ్రీహర్షుఁడను పేరుగల, యం = ఏ, సుతం = కుమారుని, సుషువే = ఉత్పత్తి గావించెనో, మామల్లదేవీ చ = మామల్లదేవి యను తల్లియు, యం సుతం = ఏ కుమారుని, సుషువే = కనెనో, చతుర్దశతయీం = పదునాలుగు విధములు గల, విద్యాం = విద్యను, విదద్భిః = తెలిసికొనిన, కాశ్మీరైః = కాశ్మీర దేశమందలిఁ, విద్వద్భిః = విద్వాంసులచేఁ, మహితే = పూజింపఁబడిన, తద్భువి = ఆ శ్రీహర్షుని వలన నుద్భవించిన యనగా నా శ్రీహర్షునిచే విరచితమైన, నైషధీయచరితే = నైషధీయ చరితమను, మహాకావ్యే = మహాకావ్యమందు, షోడశః సర్గః = పదునాఱవ సర్గ, అగమత్ = కడచినది.

సమాసములు :

కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః - కవీనాం రాజానః = కవిరాజాః, కవిరాజానాం రాజిః = కవిరాజరాజిః, కవిరాజరాజేః మకుటం =

కవిరాజరాజిమకుటం, కవిరాజరాజిమకుటే అలఙ్కారః = కవిరాజ రాజి మకుటాలఙ్కారః, కవిరాజరాజి మకుటాలఙ్కార శ్చాసౌ హీరశ్చ = కవిరాజరాజి మకుటాలఙ్కారహీరః.

**జితేన్ద్రియచయం** – ఇన్ద్రియాణాం చయః = ఇన్ద్రియచయః, జితః- ఇన్ద్రియచయః యేన సః = జితేన్ద్రియచయః, తం = జితేన్ద్రియచయం,

**చతుర్దశతయీం** - చతుర్దశ అవయవాః యస్యాః సా = చతుర్దశతయీ తాం = చతుర్దశతయీ.

**తద్భువి** – తస్మాత్ భవతీతి = తద్భూః, తస్మిన్ = తద్భువి.

**నైషధీయచరితే** – నిషధానాం రాజా = నైషధః, నైషధస్య ఇదం = నైషధీయం, నైషధీయం,చ తత్ చరితం చ = నైషధీయ చరితం, తస్మిన్ = నైషధీయచరితే.

**షోడశః** - షోడశానాం పూరణః = షోడశః.

భావము :

కవిరాజుల పంక్తిలో కిరీట స్థానము నంకరించిన వారికి భూషణమై యల రారు శ్రీ హీరకవి, యింద్రియ విజయము గావించిన శ్రీ హర్షుఁడను సుతుని జని యింపఁ జేయగా తల్లియైన మామల్లదేవి యా సుతునిఁ గనెను. చతుర్దశ విద్యా స్థానములయం దారితేరిన కాశ్మీర విద్వాంసులచే గౌరవింపఁబడినదై యా శ్రీహర్షు నిచే విరచితమైన నైషధీయ చరితమను మహా కావ్యమునందు పదునాఱవ సర్గ కడచినది ॥130॥

ఇట్లు

శ్రీ మదాత్రేయ గోత్ర శ్రీమదుదాలి నృసింహ శాస్త్రి తనూజ

విక్రమ సింహపురీ వేద సంస్కృత కలాశాలా

భూతపూర్వ ప్రధానోపాధ్యాయ శ్రీ సుబ్బరామశాస్త్రి

విరచితమగు నైషధాన్ధ్ర వ్యాఖ్యకు

షోడశ సర్గ

సమాప్తము.

# శ్రీహర్ష నైషధము

## సప్తదశ సర్గః

శ్లో. అథారభ్య వృథాప్రాయం ధరిత్రీధావనశ్రమం,
సురాః సరస్వదుల్లోలలీలా జగ్ము ర్యథాగతమ్. 1

ప. వి :- అథ- ఆరభ్య-వృథాప్రాయం-ధరిత్రీధావనశ్రమం - సురాః - సరస్వదుల్లోలలీలాః-జగ్ముః-యథాగతం.

అర్థము :- అథ = స్వర్గలోకమునకు వెళ్ళుటకు కోరికకలిగిన పిదప, లేదా నల దమయంతులు భవనమును ప్రవేశించిన పిదప, సురాః = ఇంద్రాది దేవతలు, ధరిత్రీ ధావనశ్రమం = భూలోకమునకు వచ్చుట వలన శ్రమను, వృథాప్రాయం = వ్యర్థముగనే (దమయంతి లభింపకపోయినను నలదమయంతులకు వరము లొసంగుటవలన గల్గిన యాత్మగౌరవమును రక్షించుకొనుటవలన "ప్రాయ" శబ్దము ప్రయుక్తము. కాన అన్ని విధములలో వ్యర్థము కాలేదని గ్రహింపవలయును.) ఆరభ్య = చేసి, అనగా తలచి, సరస్వదుల్లోలలీలాః, సరస్వత్ = సాగరము యొక్క, ఉల్లోల = గొప్ప కెరటముల యొక్క, లీలాః = లీలావంటి లీలను గలవారై, యథాగతం = ఎక్కడి నుండి వచ్చిరో లేదా ఎట్లు వచ్చిరో అక్కడికే లేదా అట్లే, జగ్ముః = వెడలిరి.

సమాసములు :

వృథాప్రాయం - వృథేవ వృథాప్రాయం = తం వృథాప్రాయం.
*ధరిత్రీధావనశ్రమం* - ధరిత్ర్యాః ధావనం = ధరిత్రీధావనం, ధరిత్రీధావనేన శ్రమః = ధరిత్రీధావనశ్రమః, తం = ధరిత్రీధావనశ్రమం.

సరస్వదుల్లోలలీలాః - సరస్వతః ఉల్లోలాః=సరస్వదుల్లోలాః, సర స్వదుల్లోలానాం లీలేవ లీలా యేషాం తే=సరస్వదుల్లోలలీలాః.

యథాగతం-ఆగత మనతిక్రమ్య=యథాగతం.

భావము :

స్వర్గలోకమునకుఁ బోవలయునని కోరిక గల్గిన వెంటనే, ఇంద్రాది దేవతలు భూలోకమునకు వచ్చిన తమ పనియగు దమయంతీవరణము జరుగనందువలన, తమ భూలోకాగమనము వ్యర్థమైన శ్రమగా భావించిరి. కాని దమయంతిని నలునకు వరము లొసంగుటవలన నాత్మగౌరవము రక్షితమైనందువలన నీ లోకమునకు తమరాక పూర్తిగా వ్యర్థము కాలేదు. అయినను తమపని పూర్తిగా నెరవేరనందు వలన సముద్రములో పెద్ద కెరటములవలె నాందోళనతో గూడిన మనస్సు గలవారై వచ్చిన విధముగనే వెళ్ళిరి. అనగా పయనము గావించిరి ॥1॥

శ్లో. భైమీం పత్యే భువ స్తస్మై చిరం చిత్తే ధృతామపి,
విద్యామివ వినీతాయ న విషేదుః ప్రదాయ తే. 2

ప. వి. భైమీం-పత్యే-భువః-తస్మై- చిరం-చిత్తే-ధృతామ్-అపి-విద్యామ్-ఇవ-వినీతాయ-న-విషేదుః-ప్రదాయ-తే.

అర్థము: తే=ఆ దేవతలు, చిరం=చాలాకాలము, చిత్తే=మనస్సునందు, ధృతామపి=స్థాపింపబడినదైనను అనగా కోరబడినదైనను, భైమీం= దమయంతిని, భువః=భూమికి, పత్యే=పాలకుడగు, తస్మై=ఆ నలుని కొఱకు, వినీతాయ=వినయయుక్తుడైన శిష్యునికై, విద్యామివ = జ్ఞానమునువలె, ప్రదాయ = ఇచ్చి, న విషేదుః = దుఃఖింపలేదు. గొప్పవారు యిచ్చి పశ్చాత్తాపము నొందరు. వారికి ఈయఁదగనిది లేదు.

సమాసములు :

భైమీ-భీమస్య అపత్యం స్త్రీ=భైమీ.

భావము :

ఆదేవతలు చాలకాలము తమ హృదయమందు కాంక్షింపఁబడిన ఆ దమయంతిని నలమహారాజుకొఱకు, వినయవంతునకు విద్యనుఁబోలె నొసంగి పశ్చాత్తాపము నొందలేదు. మహాత్ములు దానముగావించినపిదప పశ్చాత్తాపము నొందరు. వారికి ఈయదగని దేదియు లేదు. ॥2॥

శ్లో. కాన్తిమన్తి విమానాని భేజిరే భాసురాః సురాః,
స్ఫటికాద్రే స్తటానీవ ప్రతిబిమ్బా వివస్వతః. 3

ప. వి: కాన్తిమన్తి-విమానాని-భేజిరే-భాసురాః-సురాః-స్ఫటికాద్రేః-తటాని-ఇవ-ప్రతిబింబాః-వివస్వతః.

అర్థము: వివస్వతః=సూర్యునియొక్క, ప్రతిబింబాః=ప్రతిబింబములు, స్ఫటికాద్రేః=కైలాసముయొక్క, తటానీవ=చఱియలనువలె, భాసురాః=తేజోమూర్తులు గలిగిన, సురాః=ఇంద్రాదులు, కాన్తిమన్తి=కాంతితోఁగూడిన, విమానాని=విమానములను, భేజిరే=పొందిరి. అనగా నెక్కిరని యర్థము. దీనిచే విమానములు వాని నెక్కిన యింద్రాదులు గొప్పతేజస్సంపత్తి గలవారని చెప్పబడినది.

సమాసములు :

కాన్తిమన్తి-కాన్తిః ఏషా మస్తీతి=కాన్తిమన్తి, తాని కాన్తిమన్తి.
స్ఫటికాద్రేః-స్ఫటికమయ శ్చాసౌ అద్రిశ్చ=స్ఫటికాద్రిః, తస్య=స్ఫటికాద్రేః.

భావము :

సూర్యుని ప్రతిబింబములు కైలాసపర్వతముయొక్క చఱియలనుఁ బ్రవేశించినట్లు తేజోమూర్తులగు నింద్రాదిదేవతలు కాన్తియుక్తములైన విమానముల నెక్కిరి. సూర్యు డొక్కడైనను కైలాసపర్వతపు చఱియ లనెడి యుపాధులు పెక్కులు కావున నాతని ప్రతిబింబములును పెక్కులుగా జెప్పబడినవి ॥3॥

శ్లో. జవా జ్జాతేన వాతేన బలాకృష్టవలాహకైః,
శ్వసనా త్స్వస్య శీఘ్రత్వం రథై రేషా మివాఽకథి. 4

ప.వి: జవాత్-జాతేన-వాతేన-బలాకృష్టవలాహకైః-శ్వసనాత్ - స్వస్య - శీఘ్రత్వం-రథైః-ఏషామ్-ఇవ-అకథి.

అర్థము: జవాత్=తమవేగమువలన, జాతేన=కలిగిన, వాతేన=గాలిచే, బలాకృష్టవలాహకైః, బలం=బలమువలన, ఆకృష్ట=లాగబడిన, వలాహకైః=మేఘములుగలిగిన, ఏషాం=ఈ ఇంద్రాదులయొక్క, రథైః=విమానములచే, స్వస్య=తమకు, శ్వసనాత్=గాలికంటెను, శీఘ్రత్వం=త్వరితముగావెళ్ళుట, అకథి ఇవ = చెప్పబడినదో యనునట్లుండినది.

సమాసములు :

బలాఽఽకృష్టవలాహకైః—, బలాత్ ఆకృష్టాః వలాహకాః యై స్తే = బలాకృష్టవలాహకాః, తైః = బలాకృష్టవలాహకైః.

భావము :

ఆవిమానముల వేగమువలనఁ గలిగిన గాలి యాకసమందలి మేఘములను లాగికొనిపోవుటవలన వానివేగము వాయువేగమును మించినట్లు కనబడినది. ॥4॥

శ్లో. క్రమా ద్దవీయసాం తేషాం తదానీం సమదృశ్యత,
స్పష్ట మష్టగుణై శ్వర్యాత్ పర్యవస్య న్నివాణిమా. 5

ప.వి: క్రమాత్-దవీయసాం-తేషాం-తదానీం-సమదృశ్యత-స్పష్టమ్ - అష్టగుణైశ్వర్యాత్-పర్యవస్యన్-ఇవ-అణిమా.

అర్థము: క్రమాత్=క్రమముగా నవగా ముమ్ముందు పోవుటవలన, దవీయసాం=మిక్కిలి దూరమున నుండిపోయిన, తేషాం=ఆ యింద్రాదులకు, తదానీం

=దూరస్థితి యేర్పడిన కాలమందు, అణిమా=అణుత్వము, అనగా ఎనిమిది విధములగు ఐశ్వర్యములలో మొదటిదైన ఐశ్వర్యము, అష్ట గుణైశ్వర్యాత్—అష్టగుణ=ఎనిమిది గుణముల స్వరూపముగల, ఐశ్వర్యాత్=వైభవమునకంటెను, అనగా అష్టగుణాత్మకమగు ఐశ్వర్యము కంటెను, అనగా నా యెనిమిది యైశ్వర్యముల సముదాయమునుండి, పర్యవసన్నివ=వేరైనదై శేషించినట్లు, స్పష్టం=స్పష్టముగ, సమదృశ్యత=చూడబడినది. అనగా నింద్రాదులు అణిమాద్యష్టైశ్వర్య సంపన్నులుగాన, వారియందు దాగియున్న యా యెనిమిది గుణములలో నా సమయమున అణిమ యను నైశ్వర్యము ప్రకటితమైనదని యర్థము. వాస్తవముగా వారు దూరమగుట వలననే వారియందు అణిమ గోచరమైనది. ఏ వస్తువైనను దూరమైనకొలది తుది సూక్ష్మముగాఁ గనఁబడుట ప్రసిద్ధము.

వి. వాస్తవమున నింద్రాదులయందు దూరత్వము చేతనే యణుత్వము గోచరమైనది. దానిని వారి యష్టైశ్వర్యములలోఁ జేరిన యణిమగా భావించుట వలన నుత్ప్రేక్ష.

సమాసములు :

దవీయసాం-అతిశయేన దూరాః=దవీయాంసః, తేషాం=దవీయసాం.
అష్టగుణైశ్వర్యాత్-అష్ట గుణాః యస్య తత్=అష్టగుణం, అష్టగుణం చ తత్ ఐశ్వర్యం చ =అష్టగుణైశ్వర్యం, తస్మాత్=అష్టగుణైశ్వర్యాత్.
అణిమా-అణోః భావః=అణిమా.

భావము :-

ఆ యింద్రాదులు విమానములలో మున్ముందు పోవుటవలన చాల దూరమునకు పోయి, సూక్ష్మరూపమును జెందినవారుగాఁ గనఁబడఁ జొచ్చిరి. అందువలన వారియందున్న అష్టైశ్వర్యములని చెప్పబడు అణిమ, మహిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశత్వము, వశిత్వ, మను ఎనిమిదింటిలోను అణిమ వేఱుపడినదై వ్యక్తమైనదా యని భావింపఁబడినది. ॥౮॥

శ్లో. తతాన విద్యుతా తేషాం రథే పీతపతాకతామ్,
లబ్ధకేతుశిఖోల్లేఖా లేఖా జలముచః క్వచిత్. 6

ప. వి. తతాన-విద్యుతా-తేషాం-రథే-పీతపతాకతాం-లబ్ధకేతుశిఖోల్లేఖా-లేఖా-జలముచం-క్వచిత్.

అర్థము: క్వచిత్=ఒకయెడ ననగా మింట నొక ప్రదేశమున, జలముచః=మేఘముయొక్క, లేఖా=వరుస, లబ్ధకేతుశిఖోల్లేఖా, లబ్ధ=పొందబడిన, కేతు=ధ్వజములయొక్క, శిఖా=కొనలతోటి, ఉల్లేఖా=ఒరిపిడిని గల్గినదై, తేషాం=ఆ యింద్రాదులయొక్క, రథే=రథమునందు అనగా విమానములయందు, విద్యుతా=మెఱుపుతీగచే, పీతపతాకతాం, పీత=పసుపురంగుగల, పతాకతాం=ధ్వజమును గలిగియుండుటను, తతాన=విస్తరింపఁ జేసినది. ధ్వజములు కట్టిన కొయ్యల కొనలతోటి యొరిపిడిచే నుద్భవించిన మెఱుపులు వారి విమానములయందు పసుపుపచ్చని ధ్వజములవలె ప్రకాశించినవని యర్థము.

సమాసములు :

పీతపతాకతాం-పీతాః పతాకాః యేషాం తే=పీతపతాకాః, పీతపతాకానాం భావః=పీతపతాకతా, తాం=పీతపతాకతాం.

లబ్ధకేతుశిఖోల్లేఖాః-కేతునాం శిఖాః=కేతుశిఖాః, కేతుశిఖానాం ఉల్లేఖః=కేతుశిఖోల్లేఖః. లబ్ధః కేతుశిఖోల్లేఖః యయా సా=లబ్ధకేతుశిఖోల్లేఖా.

భావము:

వారు విమానములయందు వెళ్లునపుడు వారి విమానములకుఁ గట్టబడి ధ్వజదండముల కొనలు మింట నొక ప్రక్కనున్న మేఘపంక్తి నొరయుటవలన మెఱుపు లేర్పడినవి. ఆ మెఱుపులచే నా ధ్వజములు పసుపుపచ్చని వర్ణము నొందినవి॥6॥

శ్లో. పునః పున ర్మిల న్తీషు పథి పాథోదప జ్క్తిషు,
నాకనాథరథాలమ్బి బభూవాభరణం ధనుః. 7

ప. వి:- పునః-పునః-మిల న్తీషు-పథి-పాథోదప జ్క్తిషు - నాకనాథరథాలంబి - బభూవ-ఆభరణం-ధనుః.

**అర్థము:**-నాకనాథరథాలంబి, నాకనాథ=ఇంద్రునియొక్క, రథ=విమానమున, ఆలంబి=వ్రేలాడునట్టి, ధనుః=విల్లు, పథి=ఆకాశమార్గమునందు, పునః పునః = పలుమాఱులు, మిల న్తీషు=కలియుచున్న, పయోద ప జ్తిషు = మేఘ పంక్తులయందు, ఆభరణం=భూషణముగా, బభూవ= ఉండినది. ఏ యే మేఘములు విమానముతోఁ గలియునో నాయా మేఘ బృందమున కిందుని ధనస్సు భూషణముగా నుండినదని యర్థము. పూర్వము సూర్య కిరణ సంబంధముచే నేర్పడిన కృత్రిమమగు నింద్ర ధనుస్సుచే మేఘములకు సంబంధ మేర్పడినది. ప్రకృతము వాస్తవమైన యిన్ద్రధనుస్సుతో వానికి సంబంధ మేర్పడినదని యర్థము.

సమాసములు :

పయోదపం క్తిషు -పయోదానాం ప జ్క్తయః=పయోద ప జ్క్తయః, తాసు=పయోద ప జ్క్తిషు.
నాకనాథరథాలంబి-నాకస్య నాథః=నాకనాథః, నాకనాథస్య రథః= నాకనాథరథః, నాకనాథరథం ఆలమ్బత ఇతి=నాకనాథరథాలంబి.

భావము :

ఇంద్రుని విమానమున వ్రేలాడునట్టి యాతని విల్లు గగన మార్గమునందు మాటిమాటికిఁ దగులుచున్న మేఘపంక్తులకు ఆభరణమై శోభించినది. పూర్వము ఆ మేఘములకు సూర్య కిరణ సంబంధముచే నేర్పడిన కృత్రిమ మగు నింద్ర ధనుస్సుతో యోగ మేర్పడగా, ప్రకృతము వాస్తవమగు నింద్ర ధనుస్సుతో యోగ మేర్పడినదని భావము ॥7॥

శ్లో. జలే జలదజాతానాం వజ్రివజ్రానుబిమ్బనైః,
జానే తత్కాలజై స్తేషాం జాతాఽశనిసనాథతా. 8

ప. వి:- జలే- జలదజాతానాం-వజ్రివజ్రానుబింబనైః - జానే - తత్కాలజైః - తేషాం-జాతా-అశనిసనాథతా.

అర్థము:- జలదజాతానాం=మేఘ సమూహములయొక్క, జలే=ఉదకమునందు, తత్కాలజైః, తత్కాల=ఇంద్రాదులు వెళ్ళు సమయమునందు, జైః= కల్గినటువంటి, వజ్రివజ్రానుబిమ్బనైః, వజ్రి=ఇంద్రునియొక్క, వజ్ర= వజ్రాయుధము నందలి, అనుబిమ్బనైః=ప్రతిబింబములచే, తేషాం= ఆ మేఘ సమూహములకు, అశనిసనాథతా = పిడుగుతో కలయిక, జాతా=ఏర్పడినది. (ఇతి=ఇట్లు) జానే=తలంతును.

వి. మేఘజలము లందు వజ్రాయుధ ప్రతిబింబనములచే నశనిసహితత్వము లేకపోయినను, నది గల్గినట్లు చెప్పుటవలన నిది యుత్ప్రేక్ష.

సమాసములు :

జలదజాతానాం - జలదానాం జాతాని=జలదజాతాని, తేషాం = జలదజాతానాం, వజ్రివజ్రానుబిమ్బనైః, వజ్రిణః వజ్రః = వజ్రివజ్రః, వజ్రివజ్రస్య అనుబింబనాని = వజ్రివజ్రానుబింబనాని, తైః = వజ్రివజ్రానుబింబనైః
తత్కాలజైః - స చాసౌ కాలశ్చ = తత్కాలః, తత్కాలే జాయన్తే ఇతి = తత్కాలజాః, తైః = తత్కాలజైః.
అశనిసనాథతా - సనాథస్య భావః = సనాథతా, అశనినా సనాథతా = అశనిసనాథతా

భావము :

మేఘములలోని నీట నింద్రుని వజ్రాయుధము ప్రతిబింబించుచుండినది. అందువలన నా మేఘములకు పిడుగుతో కలయిక ఏర్పడినదని భావము. అశని యనగా వజ్రమనియు పిడుగనియు నర్థము ॥8॥

శ్లో॥ స్ఫుటం సావర్ణివంశ్యానాం కులచ్ఛత్రం మహీభుజాం,
చక్రే దణ్డభృత శ్చుమ్బన్ దణ్డ శ్చణ్డరుచిం క్వచిత్. 9

ప. వి. స్ఫుటం-సావర్ణివంశ్యానాం-కులచ్ఛత్రం-మహీభుజాం-చక్రే-దణ్డభృతః-చుమ్బన్-దణ్డః-చణ్డరుచిం-క్వచిత్.

**అర్థము:** క్వచిత్ = ఒకానొక ప్రదేశమునందు, దణ్డభృతః = యమునియొక్క, దణ్డః = దండమను నాయుధము, చణ్డరుచిం = తీక్ష్ణకిరణములుగల సూర్యుని, చుమ్బన్ = స్పృశించుచు, సావర్ణివంశ్యానాం, సావర్ణి = సూర్యుని పుత్రుడైన సావర్ణియను నెనిమిదవ మనువుయొక్క, వంశ్యానాం=వంశమున జన్మించిన, మహీభుజాం=రాజులకు, కులచ్ఛత్రం= వంశముయొక్క గొడుగుగా, చక్రే = చేసెను. స్ఫుటం = స్పష్టము. దిగువ దండాయుధ ముండుటవలన, సూర్యమండల మాదండము నాధారముగా చేసుకొనినదై, సూర్యవంశమందలి రాజులకు గొడుగుగాఁ బ్రకాశించినది. ఇంద్రాదులు మేఘమండలమును దాటి సూర్యమండలమునుఁ బొందిరని యర్థము.

వి. యముని దండాయుధముపై నూనిన సూర్యమండలము అతని వంశమందలి రాజులకు ఛత్రముగాక పోయినను ఛత్రముగా భావింపబడినది, గాన నుత్ప్రేక్ష. వ్యంజకమగు స్ఫుటశబ్దము బ్రయోగించుటవలన నది వాచ్యము.

సమాసములు :

సావర్ణివంశ్యానాం - సావర్ణేః వంశే భవాః=సావర్ణివంశ్యాః, తేషాం సావర్ణివంశ్యానాం.

కులచ్ఛత్రం - కులస్య ఛత్రం=కులచ్ఛత్రం, తత్=కులచ్ఛత్రం.

దండభృతః- దండం బిభర్తి ఇతి=దండభృత్. తస్య=దండభృతః.

చండరుచిం - చండా రుచిః యస్య సః = చండరుచిః, తం=చండరుచిం,

భావము :

ఇంద్రాదులు ఆకసమునఁ బోవుచుండగా వారిలో యముని దండాయుధము సూర్యమండలమును దాకుచున్నది. అందువలన నా సూర్యమండలము నా దండముపై నూనినదై యాతని కుమారుడగు సావర్ణి మున్నగువారి వంశస్థులకు ఛత్రముగా నుండెను ॥9॥

శ్లో॥ నలభీమభువోః ప్రేమ్ణి విస్మితాయా దధౌ దివః,
పాశిపాశః శిరఃకమ్పస్రస్త భూషశ్రవఃశ్రియమ్. 10

ప. వి. నలభీమభువోః-ప్రేమ్ణి - విస్మితాయాః - దధౌ-దివః-పాశిపాశః- శిరః కమ్పస్రస్త భూషశ్రవఃశ్రియమ్.

అర్థము: పాశిపాశః-పాశి=వరుణునియొక్క, పాశః=వలయరూపమున నుండెడు పాశాయుధము, నలభీమభువోః = నలదమయంతులయొక్క, ప్రేమ్ణి= పరస్పరానురాగవిషయమునందు, విస్మితాయాః = ఆశ్చర్యమునొందిన, దివః = మిన్ననెడి స్త్రీయొక్క, శిరఃకంపస్రస్త భూషశ్రవఃశ్రియం- శిరఃకంప = తలనుఁ గదలించుటవలన, స్రస్త = జారిన, భూష = భూషణములు గలిగిన, శ్రవః = చెవియొక్క, శ్రియం = శోభవంటి శోభను, దధౌ = ధరించినది.

సమాసములు :

*నలభీమభువోః* - భీమాత్ భవతీతి = భీమభూః, నలశ్చ భీమభూశ్చ = నలభీమభువౌ, తయోః = నలభీమభువోః.

*శిరఃకంపస్రస్త భూషశ్రవఃశ్రియం* శిరసః కంపః = శిరః కంపః, శిరఃకంపాత్ స్రస్తాః భూషాః యస్మిన్ తత్ = శిరఃకంపస్రస్తభూషం. శిరఃకంపస్రస్తభూషం చ తత్ శ్రవశ్చ = శిరఃకంపస్రస్తభూష శ్రవః, శిరః కంపస్రస్త భూషశ్రవసః శ్రీరివ శ్రీః = శిరఃకంపస్రస్త భూషశ్రవః. శ్రీః తాం = శిరఃకంపస్రస్తభూషశ్రవఃశ్రియం.

భావము :

వలయాకారముగ నుండెడి వరుణుని పాశాయుధము, నలదమయంతుల పరస్పరాగ విషయమునం దాశ్చర్యపడి తలనూచుచున్న దివి యను స్త్రీకి కమ్మలు జారిపోయిన చెవియొక్క శోభను వహించెను.

శ్లో. పవనస్కన్ధ మారుహ్య నృత్యత్తరకర శ్శిఖీ
అనేన ప్రాపి భైమీతి భ్రమఞ్చక్రే నభస్సదామ్. 11

ప. వి. పవనస్కన్ధమ్-ఆరుహ్య-నృత్యత్తరకరః-శిఖీ-అనేన-ప్రాపి-భైమీ-ఇతి-భ్రమం-చక్రే-నభస్సదామ్.

అర్థము: పవనస్కన్ధం = వాయుమార్గ మను పేరుగల్గిన యాకసమందలి యొక ప్రదేశముయొక్క పైభాగమును, ఆరుహ్య = ఎక్కి, నృత్యత్తరకరః, నృత్యత్తర = మిక్కిలినృత్యముగావించు, కరః = కిరణము అను హస్తములుగల, శిఖీ = అగ్ని, అనగా వాయువేగముచే మిక్కిలి కదులుచున్న జ్వాలలు కలిగిన యగ్ని, నభస్సదాం = ఆకసమున సంచరించుచున్నవారికి, అనేన = ఈ అగ్నిచే, భైమీ = దమయంతి, ప్రాపి = పొంద బడినది కానిచో ఇంత హస్తముల విజృంభణ ఎట్లు వచ్చినది, ఇతి = అని, భ్రమం = భ్రాంతిని, చక్రే = కలిగించెను.

సమాసములు :

పవనస్కన్ధం- పవనస్య స్కన్ధః = పవనస్కన్ధః, తం = పవనస్కన్ధం.
నృత్యత్తరకరః- అతిశయేన నృత్యన్తః = నృత్యత్తరాః, నృత్యత్తరాః కరాః యస్య సః = నృత్యత్తరకరః.
నభస్సదాం- నభసి సీదన్తీతి = నభస్సదః, తేషాం = నభస్సదాం.

భావము :

ఇంద్రాదులలో నొకడైన అగ్ని వాయుపథము నెక్కినవాడై, ఆ వాయువు తన హస్తము లనెడి జ్వాలలను మిక్కిలి యటునిటు కదలించుచుండగా, నతడు

దమయంతిని బడసి సంతోషముతో తనచేతులను కదలించుచున్నాడని భ్రాంతిని ఆకాశమున సంచరించువారికి కల్గించెను.

శ్లో. తతర్ణ్కౌ భారతీ దూనౌ విరహాత్ భీమజాగిరాం,
అధ్వని ధ్వనిభిర్వైణై రనుకల్పై ర్వ్యనోదయత్. 12

ప. వి. తత్కర్ణౌ-భారతీ-దూనౌ-విరహాత్-భీమజాగిరాం - అధ్వని - ధ్వనిభిః - వైణైః-అనుకల్పైః-వ్యనోదయత్.

అర్థము: భారతీ=సరస్వతీదేవి, భీమజాగిరాం, భీమజా = దమయంతియొక్క, గిరాం = మాటలయొక్క, విరహాత్ = అభావమువలన అనగా దమయంతిమాటలు వినబడకపోవుటవలన, దూనౌ=సంతాపముచెందిన, తత్కర్ణౌ—తత్ = ఆ ఇంద్రాదులయొక్క, కర్ణౌ = చెవులను, అధ్వని = ఆకాశమార్గమునందు, అనుకల్పైః = దమయన్తిమాటలకు సమానము లైనను వానికంటె గుణవిహీనములగు, వైణైః = వీణనుండి వెల్వడు, ధ్వనిభిః = ధ్వనులచే, వ్యనోదయత్ = వినోదపరిచినది.

సమాసములు :

*తత్కర్ణౌ* = తేషాం కర్ణౌ = తత్కర్ణౌ, తౌ = తత్కర్ణౌ.
*భీమజాగిరాం* = భీమజాయాః గిరః = భీమజాగిరః, తాసాం = భీమ జాగిరాం.
వైణైః = వీణాయాః భవాః = వైణాః, తైః = వైణైః.

భావము :

ఆ యింద్రాదిదేవతలు స్వయంవరసభయందున్నపుడు దమయంతియొక్క మధురవచనములచే తమచెవులకు పండుగ చేసుకొనుచుండిరి. వారు మింట స్వర్గమునుగూర్చి పయనించుచుండుటవలన వారి చెవుల కట్టి మధురనాదములు దుర్లభము లైనవి. అందువలన ఖిన్ను లగుచుండిరి అపుడు సరస్వతీదేవి తన వీణాధ్వనులచే వారిచెవులకు వినోదము కల్గించినది. కాని యాధ్వనులు దమయంతి వచనములవలె మధురములు కాక కొంత మాధుర్యమున తగ్గి యుండినవి.

శ్లో. అథాఽఽయాన్త మపైక్షన్త తే జనౌఘ మసిత్విషం.
తేషాం ప్రత్యుద్గమప్రీత్యా మిలద్వ్యోమేవ మూర్తిమత్. 13

ప. వి. అథ-ఆయాన్తమ్-అపైక్షన్త-తే-జనౌఘం-అసిత్విషం- తేషాం- ప్రత్యుద్గమప్రీత్యా-మిలత్-వ్యోమ-ఇవ-మూర్తిమత్.

అర్థము: అథ=ఆ సరస్వతీదేవి వీణాధ్వనిని వినిన పిదప, తే=ఆ ఇంద్రాదులు, ఆయాన్తం=వచ్చుచున్న, అసిత్విషం=కత్తి యొక్క కాంతివంటికాంతి కలిగిన, జనౌఘం=జనసంఘమును, అనగా నల్లని మైచాయ గలిగిన జనసమూహమును, తేషాం = ఆ ఇంద్రాదులకు, పత్యుద్గమప్రీత్యా, ప్రత్యుద్గమ = ప్రత్యుత్థానమందలి అనగా ఎదుర్కొనుట యందలి, ప్రీత్యా=అభిలాషచే, మిలత్=వచ్చిన, మూర్తిమత్=దేహమును ధరించిన, వ్యోమేవ=ఆకాశమో యనునట్లు, అపైక్షన్త=చూచిరి.

వి. ఇచ్చట నల్లనిదేహచ్ఛాయగలిగిన జనసమూహమును,ఇంద్రాదులకు బ్రత్యుత్థానముఁ జేయుటకు వచ్చిన దేహధారి యగు నాకసముగా భావించుట వలన నుత్ప్రేక్ష. ఇవశబ్ద ప్రయోగము వలన నది వాచ్యము

సమాసములు :

జనౌఘం-జనానాం ఓఘః=జనౌఘః,తం జనౌఘం.
అసిత్విషం-అసేః త్విడివ త్విట్ యస్య సః=అసిత్విట్,తం=అసిత్విషం.
ప్రత్యుద్గమ ప్రీత్యా-ప్రత్యుద్గమే ప్రీతిః=ప్రత్యుద్గమప్రీతిః, తయా= ప్రత్యుద్గమప్రీత్యా. మూర్తిమత్ = మూర్తిరస్య అస్తీతి = మూర్తిమత్.

భావము :

ఇంద్రాదిదేవతలు వీణాధ్వనిని వినినవెంటనే యాకాశమున నొకవైపు, కత్తివలె నల్లని మైచాయగలిగిన యొకజనసంఘమునుఁ జూచిరి. అది నల్లగా నుండుటవలన నింద్రాదులకు ప్రత్యుత్థానమను మర్యాదను చేయుటకై శరీరమును ధరించి విచ్చేసిన యాకాశముగా భావించబడినది.

శ్లో. అద్రాక్షు రాజిహానం తే స్మర మగ్రేసరం సురాః,
అక్షావినయశిక్షార్థం కలినేవ పురస్కృతమ్. 14.

ప. వి. అద్రాక్షుః-ఆజిహానం-తే-స్మరం-అగ్రేసరం-సురాః-అక్షావినయశిక్షార్థం-కలినా-ఇవ-పురస్కృతం.

అర్థము: తే = ఆ, సురాః = ఇంద్రాదులగు వేల్పులు, ఆజిహానం = వచ్చుచున్న, అగ్రేసరం = ఆజన సమూహమునకు ముందు నడుచుచున్న, కావుననే, అక్షావినయశిక్షార్థం; అక్ష = ఇంద్రియములయొక్క, అవినయ = గర్వమును పక్షాంతరమున, అక్ష = పాచికలకు, ఆ = మిక్కిలి, వినయ = వశీకరణమును, శిక్షార్థం—అభ్యాసమునకై, కలినా = కలిపురుషునిచే, పురస్కృతమివ = పూజింపబడెనో లేదా ముందుంచుకొనబడెనో యను నట్లున్న, స్మరం = మన్మథుని, అద్రాక్షుః = చూచిరి.

సమాసములు :

అక్షావినయశిక్షార్థం = అక్షాణాం అవినయః = అక్షావినయః, అక్షావినయే శిక్షా = అక్షావినయశిక్షా, అక్షావినయశిక్షాయై = అక్షావినయశిక్షార్థం. పక్షాంతరమున, అక్షాణాం అవినయః అక్షావినయః, అక్షావినయే శిక్షా = అక్షావినయశిక్షా. అక్షావినయశిక్షాయై = అక్షావినయశిక్షార్థమ్.

భావము :

ఆ ఇంద్రాదిదేవతలు తమవైపునకు నడుచు జనసమూహమునకు నాయకుడై వచ్చుచున్నట్టి మన్మథుని గాంచిరి. ఆమన్మథుడు ఇంద్రియముల యహంకారమును శిక్షించుటకును, పక్షాంతరమున, పాచికలను వశీకరించుటలో శిక్ష నొసంగుటకును కలిపురుషునిచే ముందుంచుకొనబడెనో యనునట్లుండెను.

శ్లో. అగమార్థం తృణప్రాణాః పృష్ఠస్థీకృతభీహ్రియః,
శష్కులీభుక్తసర్వస్వా జనా యత్పారిపార్శ్వకాః. 15

ప. వి:- అగమ్యార్థం - తృణప్రాణాః - పృష్ఠస్థీకృతభీహ్రియః - శమ్భలీభుక్త సర్వస్వాః - జనాః - యత్పారిపార్శ్వకాః.

అర్థము:- అగమ్యార్థం = అగమ్యయైన స్త్రీని అనగా పొందఁదగనిపరస్త్రీప్రభృతులను పొందుటకై, తృణప్రాణాః = గడ్డిపోచతో సమానముగా నిర్లక్ష్యము గావించబడిన ప్రాణములుగలవారై, పృష్ఠస్థీకృతభీహ్రియః, పృష్ఠస్థీకృత = వెనుకనుంచబడిన యనగా లెక్కింపబడని, భీ = భయము, హ్రియః = సిగ్గుగలవారును, శమ్భలీభుక్తసర్వస్వాః, శంభలీ = వేశ్యలచే, భుక్త = అనుభవింపబడిన, సర్వస్వాః = సర్వధనములుగలవారునగు, జనాః = జనులు, యత్పారిపార్శ్వకాః యత్ = ఏమన్మథునకు, పారిపార్శ్వకాః = పరిజనులు అనగా మిత్రులు.

సమాసములు :

అగమ్యార్థం - గంతుం యోగ్యా = గమ్యా, న గమ్యా = అగమ్యా, అగమ్యాయై = అగమ్యార్థమ్.

తృణప్రాణాః - తృణమివ ప్రాణాః యేషాం తే = తృణప్రాణాః.

పృష్ఠస్థీకృతభీహ్రియః - పృష్ఠే తిష్ఠత ఇతి పృష్ఠస్థే, అపృష్ఠస్థే పృష్ఠస్థే కృతే ఇతి పృష్ఠస్థీకృతే, భీశ్చ హ్రీశ్చ = భీహ్రియౌ, పృష్ఠస్థీకృతే భీహ్రియౌ యేషాం తే = పృష్ఠస్థీకృతభీహ్రియః.

శమ్భలీభుక్తసర్వస్వాః - శమ్భలీభిః భుక్తం = శమ్భలీభుక్తం. సర్వం చ తత్ స్వం చ = సర్వస్వం, శమ్భలీభుక్తం సర్వస్వం యేషాం తే = శమ్భలీ భుక్తసర్వస్వాః.

యత్పారిపార్శ్వకాః - పరిపార్శ్వే వర్తన్త ఇతి = పారిపార్శ్వకాః, యస్య పారిపార్శ్వకాః = యత్పారిపార్శ్వకాః.

భావము:

పొందకూడని స్త్రీని పొందుటకై తమప్రాణములను గడ్డిపోచలతో సమానములు గావించుకొనినవారును, భయమును సిగ్గును విడిచిపెట్టినవారును,

వేశ్యలచే ననుభవింపబడిన తమ సర్వస్వములు గలవారునగు జనులు ఆమన్మథునికి బరిజనులై యుండిరని యాశయము ॥15॥

శ్లో. బిభర్తి లోకజిద్భావం బుద్ధస్య స్పర్ధయేవ యః,
యస్యేశతులయేవాత్ర కర్తృత్వ మశరీరిణః. 16

ప.వి. బిభర్తి-లోకజిద్భావం-బుద్ధస్య-స్పర్ధయా-ఇవ-యః-యస్య-ఈశతులయా-ఇవ-అత్ర-కర్తృత్వం-అశరీరిణః.

అర్థము:- యః=ఏ మన్మథుడు, బుద్ధస్య=తన్ను అనగా మన్మథుని జయించుటచే మారజిత్తైన బుద్ధునికి సంబంధించిన, స్పర్ధయా ఇవ—జయింప గోరికచేతనో యనునట్లు, లోకజిద్భావం=సర్వలోకములను జయింపగలిగి యుండుటను, బిభర్తి=ధరించుచున్నాడు. యస్య=ఏ మన్మథునకు, ఈశతులయా ఇవ = ఈశ్వరునితోటి సామ్యము నపేక్షించుటచేతనో యనునట్లు, అనగా తన దేహమును దహించిన ఈశ్వరునిపై వైరము చేతనో యనునట్లు, అశరీరిణః = దేహము దగ్ధమైనందువలన శరీరము లేక యున్నవానికి, అత్ర = ఈ లోకమందు, కర్తృత్వం = జయశీలత్వము పక్షాంతరమున సృష్టికర్తృత్వము సిద్ధమైనది. పరాభవముపొందినవారు, తమ్ము పరాభవించినవారిపై ఈర్ష్యవహించినవారై వారిసామ్యమును బడయుటకై వారివలె వ్యవహరింతురు. ఈశ్వరునకు ప్రపంచసృష్టికై శరీర మవసరములేదు. ఉపాదానములైన పరమాణువుల ప్రత్యక్షాదులున్న చాలునని తార్కికసిద్ధాంతము.

సమాసములు :

లోకజిద్భావం- లోకం జయతీతి = లోకజిత్, లోకజితః భావః= లోకజిద్భావః, తం=లోకజిద్భావం, ఈశతులయా, ఈశేన తులా= ఈశతులా, తయా = ఈశతులయా.

అశరీరిణః - శరీరం అస్యాస్తి ఇతి=శరీరీ, న శరీరీ = అశరీరీ, తస్య=అశరీరిణః.

భావము :

బుద్ధదేవుడు మారుని అనగా కాముని అనగా కామమును జయించుట వలన, మారజిత్తను పేరును బొందెను. అనగా మన్మథుని జయించినవా డను పేరును బొందెను. అందువలన అతనిపై మన్మథుడు అసూయ వహించి యాతనివలె లోకజిత్తుడుగా నుండుటను వహించెను. అట్లే ఈశ్వరునితో సామ్యమును వహించుటకో యనునట్లు, శరీరములేని తాను ఈ లోకమున కర్తృత్వమును అనగా మన్మథుని పక్షమున లోకమును జయించుటను, ఈశ్వర పక్షమున సృష్టికర్తృత్వమును వహించెను. ప్రపంచసృష్టికి ఈశ్వరునికి పరమాణువుల ప్రత్యక్షజ్ఞానాదులున్న చాలును, కాని శరీర మవసరము లేదు. అట్లే శరీరములేని యామన్మథు నకు ప్రపంచజేతృత్వమనెడి కర్తృత్వము సరిపడినదని యాశయము ॥16॥

శ్లో. ఈశ్వరస్య జగత్ కృత్స్నం సృష్టి మాకులయ న్నిమాం,
అస్తి యోఽస్త్రీకృతస్త్రీక స్తస్య వైర మనుస్మరన్. 17

ప. వి. ఈశ్వరస్య-జగత్-కృత్స్నం-సృష్టిం-ఆకులయన్- ఇమాం-అస్తి-యః-అస్త్రీకృతస్త్రీకః - తస్య-వైరం-అనుస్మరన్.

అర్థము: యః=ఏ మన్మథుడు, వైరం=ద్వేషమును అనగా అంగీకరింపక యుండుటను, అనుస్మరన్=మనస్సునందు ఉంచుకొనినవాడై, అస్త్రీ కృతస్త్రీకః, అస్త్రీకృత=స్త్రీ భిన్నులుగాజేయబడిన, స్త్రీకః = స్త్రీలు కలవాడై, పక్షాంతరమున, అస్త్రీకృత = అస్త్రములుగా చేయబడిన, స్త్రీకః=స్త్రీలు కలవాడై, ఈశ్వరస్య=ఈశ్వరునియొక్క, ఇమాం= ఈస్త్రీపురుషాత్మకమైన, సృష్టిం=సృష్టియగు, కృత్స్నం=సకలమైన, జగత్=ప్రపంచమును, ఆకులయన్=అస్థిరపరచుచు, అస్తి=ఉన్నాడు.

సమాసములు :

అస్త్రీకృతస్త్రీకః- న స్త్రియః=అస్త్రియః, అస్త్రియః కృతాః=అస్త్రీ కృతాః, అస్త్రీకృతాః స్త్రియః యేన సః=అస్త్రీకృతస్త్రీకః, పక్షాంతర మున, న అస్త్రాణి=అనస్త్రాణి, అనస్త్రాణి అస్త్రాణి సంపద్యమానాః కృతాః=అస్త్రీకృతాః, అస్త్రీకృతాః స్త్రియః యేన సః=అస్త్రీకృతస్త్రీకః,

భావము :

మన్మథుడు ఈశ్వరునిపైని వైరమును స్మరించుచు, ననగా సతని సృష్టి నొప్పుకొనరాదను భావమును హృదయమునం దుంచుకొనినవాఁడై, యీశ్వరుడు సృజించిన స్త్రీలను నస్త్రీలుగా ననగా స్త్రీభిన్నులుగాఁ జేయుచున్నాడు. పక్షాంతరమున వారిని తన కార్యములందు నస్త్రములుగా ననగా నాయుధములుగాఁ జేయుచున్నాడు. స్త్రీలు లేనిచో మన్మథుని కార్యములు నెగ్గవుకదా ! ఈ విధముగా ఈశ్వరుని సృష్టియైన యీ ప్రపంచము నంతటిని, తారుమారు చేయుచున్నాడు. అనగా నీశ్వరుడు స్త్రీలను వేరుగా పురుషులను వేరుగా సృజింపగా నీ మన్మథు డది యట్లుండరాదను భావముతో స్త్రీభిన్నులను గూడ స్త్రీలుగాఁ జేయుచు ఈశ్వరసృష్టినిఁ గలతబెట్టుచున్నాడని యాశయము. త్రిపురాసురులను వధించు నపుడు ఈశ్వరుడు విష్ణువుయొక్క మోహినీమూర్తిని అస్త్రముగాఁ జేసుకొనుట వలన ఉభయులకును సామ్యము. ॥17॥

శ్లో॥ చక్రే శక్రాదినేత్రాణాం స్మరః పీత నలశ్రియాం,
అపి దైవత వైద్యాభ్యా మచికిత్స్య మరోచకమ్. 18

ప. వి. చక్రే - శక్రాదినేత్రాణాం - స్మరః- పీతనలశ్రియాం - అపి - దైవత వైద్యాభ్యామ్-అచికిత్స్యమ్-అరోచకమ్.

అర్థము. స్మరః=మన్మథుడు, పీతనలశ్రియాం, పీత=పానము గావింపబడిన, నలశ్రియాం=నలసౌందర్యము కలిగిన, అనగా, ప్రత్యక్షము గావింపఁ బడిన నలసౌందర్యము గల్గిన, శక్రాదినేత్రాణాం = ఇంద్రుడు మున్నగు దిక్పాలుర నేత్రములకు, దైవత వైద్యాభ్యామపి=దేవతలకు వైద్యులైన అశ్వినీ కుమారులచేతను, అచికిత్స్యం = చికిత్స చేయ సాధ్యముగాని, అరోచకం= రోగవిశేషమును, చక్రే=కల్గించెను.

సమాసములు ;

శక్రాదినేత్రాణాం- శక్రః ఆదిః యేషాం తే-శక్రాదయః, శక్రాదీనాం నేత్రాణి=శక్రాదినేత్రాణి, తేషాం=శక్రాదినేత్రాణాం.

పీతనల శ్రియాం-నలస్య శ్రీః=నలశ్రీః, పీతా నలశ్రీః యైస్తాని=పీతనలశ్రీణి, తేషాం=పీతనలశ్రియాం.

దైవత వైద్యాభ్యాం- దైవతానాం వైద్యౌ=దైవతవైద్యౌ, తాభ్యాం=దైవత వైద్యాభ్యాం.

అచికిత్స్యం - చికిత్సితుం శక్యం=చికిత్స్యం, న చికిత్స్యం=అచికిత్స్యం, తత్=అచికిత్స్యమ్.

భావము :

ఇంద్రాది దేవతల నేత్రములు నలుని సౌందర్యమును గాఢముగాఁ జూచుటవలన వారి నేత్రములయందు మన్మథుడు అశ్వినీకుమారులచేతనుఁ గుదుర్చుటకు సాధ్యముకాని యరోచకమను వ్యాధిని గల్గించెను. అరోచకమనగా రుచినిఁ దొలగించునట్టి వ్యాధి. వారు నలుని సౌందర్యమును జూచుటతో, మన్మథుని రూపమునుఁ జూచుటకు కోరిక వారికి కలుగలేదని యర్థము. అనగా నలుని సౌందర్యము మన్మథుని సౌందర్యము నతిశయించినదని భావము ॥18॥

శ్లో. యత్తత్ క్షిపన్త ముత్కమ్ప ముత్థాయుక మథారుణం,
బుబుధు ర్విబుధాః క్రోధ మాక్రోశాక్రోశ ఘోషణమ్. 19

ప. వి. యత్ - తత్ - క్షిపన్తమ్ - ఉత్కమ్పమ్- ఉత్థాయుకమ్-అథ-అరుణం-బుబుధుః-విబుధాః-క్రోధమ్-ఆక్రోశాక్రోశఘోషణమ్.

అర్థము. అథ = మన్మథుని జూచిన పిదప, విబుధాః = దేవతలు, యత్తత్ = ఏవియో యొక మట్టిపెళ్లవంటి వస్తువును, క్షిపంతం = దూరముగా విసరుచున్న అనగా నితరులను గొట్టుటకై విసరుచున్న, ఉత్కంపం = కోపాదులచే నధికమైన వణకు గలిగిన, ఉత్థాయుకం = యుద్ధమునకై పురికొల్పుచున్న, ఆక్రోశాక్రోశ ఘోషణం, ఆక్రోశ = కోసుదూరము వరకును, ఆక్రోశఘోషణం - పరనిందతో గూడిన తిరస్కారమునకు సంబంధించిన గట్టి యుచ్చారణగల్గిన, అరుణం = ఎఱ్ఱనైన, క్రోధం = దేహమును ధరించిన కోపమనెడు శత్రువును, బుబుధుః = తెలిసికొనిరి. చెప్పబడిన గుర్తులచే క్రోధమును శత్రువుగా గ్రహించిరని యర్థము.

సమాసములు :

ఉత్కమ్పు - ఉద్గతః కమ్పః యస్య సః = ఉత్కమ్పః, తం = ఉత్కమ్పం.
ఉత్థాయుకం-ఉత్థాపయతీతి = ఉత్థాయుకః, తం = ఉత్థాయుకం.
ఆక్రోశాక్రోశ ఘోషణం- క్రోశ మభివ్యాప్య = ఆక్రోశం, ఆక్రోశస్య ఘోషణం = ఆక్రోశ ఘోషణం, ఆక్రోశం ఆక్రోశ ఘోషణం యస్య సః = ఆక్రోశ ఘోషణః, తం = ఆక్రోశాక్రోశ ఘోషణం.

భావము :

ఇట్లు మన్మథునిఁ జూచిన పిదప దేవతలు కొట్టుటకై దూరమునుండి మట్టి పెల్లలు మున్నగువానిని విసరుచున్న, కోపముచే వణుకుచు, యుద్ధమునకు పురికొల్పుచున్నట్టిదై కోసుదూరము వరకు వినపడునట్టి తిరస్కారభాషణములు గల్గిన, యెఱ్ఱనివన్నె గల్గినట్టి దేహధారియగు క్రోధ మను శత్రువును గాంచిరి. పై చిహ్నములచే క్రోధమే శరీరమెత్తుకొని వచ్చిన దానినిగా దేవతలు భావించి రని యాశయము. ॥౧౯॥

శ్లో. య ముపాసత దన్తౌష్ఠక్షతాసృక్ శిష్యచక్షుషః
భ్రుకుటీఫణినీనాద నిభనిఃశ్వాసఫూత్కృతాః. 20

ప. వి. యమ్- ఉపాసత - దన్తౌష్ఠక్షతాసృక్శిష్యచక్షుషః - భ్రుకుటీఫణినీనాద నిభనిఃశ్వాసఫూత్కృతాః.

అర్థము: యం = ఏక్రోధుని, దన్తౌష్ఠక్షతాసృక్ శిష్య చక్షుషః, దన్త=దంతముల చేత, ఓష్ఠ = పెదవులను, క్షత = కొఱకుటచేత నేర్పడిన, అసృక్ = నెత్తురునకు, శిష్య = సమానములైన, చక్షుషః = కన్నులుగల, భ్రుకుటీ ఫణినీనాదనిభనిఃశ్వాస ఫూత్కృతాః, భ్రుకుటీ = బొమముడి పాట్లనెడి, ఫణినీ = ఆడసర్పములయొక్క, నాద = ధ్వనితో, నిభ = సమానమైన, నిఃశ్వాస = నిట్టూర్పులయొక్క, ఫూత్కృతాః = ఫూత్‌యను ధ్వనులు గల్గిన పరిజనులు, ఉపాసత = సేవించిరి.

సమాసములు :

దన్తౌష్ఠక్షతాసృక్ శిష్య చక్షుషః - దన్తైః ఓష్ఠానాం క్షతాని=దన్తౌష్ఠ క్షతాని, దన్తౌష్ఠక్షతైః అసృక్=దన్తౌష్ఠక్షతాసృక్, దన్తౌష్ఠక్షతాసృజా శిష్యాణి=దన్తౌష్ఠక్షతాసృక్ శిష్యాణి, దన్తౌష్ఠక్షతాసృక్శిష్యాణి చక్షూంషి యేషాం తే=దన్తౌష్ఠక్షతాసృక్ శిష్య చక్షుషః.

భ్రుకుటీఫణినీనాదనిభనిఃశ్వాస ఫూత్కృతాః— భ్రుకుట్య ఏవ ఫణిన్యః=భ్రుకుటీఫణిన్యః. భ్రుకుటీఫణినీనాం నాదః=భ్రుకుటీఫణినీ నాదః, భ్రుకుటీఫణినీనాదేన సదృశాః = భ్రుకుటీఫణినీనాదనిభాః, భ్రుకుటీఫణినీనాదనిభాశ్చ తే నిఃశ్వాసాశ్చ = భ్రుకుటీఫణినీనాదనిభనిః శ్వాసాః, భ్రుకుటీఫణినీనాదనిభనిఃశ్వాసానాం ఫూత్కృతాని యేషాం తే = భ్రుకుటీఫణినీనాదనిభనిఃశ్వాసఫూత్కృతాః.

భావము :

ఆక్రోధుని పరిజనులు తమ దంతములచే పెదవులను కొఱుకుటవలన ఏర్పడిన గాయములనుండి యుద్భవించిన రక్తముతో సమానమగు నెఱ్ఱనికనులు గలవారై, బొమముడిపాట్లనెడు యాఁడుసర్పముల బుసలతో సమానములగు నిట్టూర్పుల ఫూత్కారధ్వనులు గలవారై యాతనిని సేవించిరి. అనగా నాక్రోధు డెట్టివాడో అతని పరిజనులును నట్టిక్రూరులుగనే యుండిరని యాశయము ॥20॥

శ్లో. దుర్గం కామాశుగేనాఽపి దుర్లంఘ్య మవలంబ్య యః,
దుర్వాసోహృదయం లోకాన్ సేన్ద్రానపి దిధక్షతి. 20

ప.వి. దుర్గం-కామాశుగేన-అపి- దుర్లంఘ్యమ్- అవలంబ్య- యః- దుర్వాసోహృ దయం- లోకాన్- సేన్ద్రాన్-అపి-దిధక్షతి.

అర్థము: యః = ఏక్రోధుడు, కామాశుగేనాఽపి = మన్మథునిబాణముచేతను, దుర్లంఘ్యం=లంఘింపశక్యముకాని, దుర్వాసోహృదయం-దుర్వాసః= దుర్వాసమహర్షియొక్క, హృదయం=హృదయమనెడి, దుర్గం=దుర్గ

మును, అవలంబ్య = ఆశ్రయించి, సేన్ద్రాన్నపి = ఇంద్రునితోకూడిన, లోకాన్ = లోకములను అనగా మూడులోకములను, దిధక్షతి = దహింప గోరుచున్నది. నిత్య కోపియగు దుర్వాసమహర్షి ఎవ్వరికిని ధర్షింప శక్యుడుగాడని ప్రసిద్ధి.

సమాసములు :

దుర్గం - దుఃఖేన గంతుం శక్యం = దుర్గం, తం = దుర్గం.
కామాశుగేన - కామస్య ఆశుగః = కామాశుగః, తేన = కామాశుగేన.
దుర్లంఘ్యం - దుఃఖేన లంఘయితుం శక్యః = దుర్లంఘ్యః, తం = దుర్లంఘ్యం.
దుర్వాసోహృదయం - దుర్వాససః హృదయం = దుర్వాసోహృదయం, తత్ = దుర్వాసోహృదయం.
సేన్ద్రాన్ - ఇన్ద్రేణ సహ వర్తన్త ఇతి = సేన్ద్రాః, తాన్ = సేన్ద్రాన్.

భావము :

ఆక్రోధుడు మన్మథుని బాణమునకును లంఘింప శక్యముకాని దుర్వాసుని హృదయమువంటి హృదయమను దుర్గమును బొంది ఇంద్రునితో కూడిన లోకములను దహింప గోరుచుండెను ॥21॥

శ్లో. వైరాగ్యం యః కరోత్యుచ్చైః రఞ్జనం జనయన్నపి,
సూతే సర్వేన్ద్రియాచ్ఛాది ప్రజ్వలన్నపి యస్తమః. 22

ప. వి:- వైరాగ్యం - యః - కరోతి - ఉచ్చైః - రంజనం - జనయన్ - అపి - సూతే - సర్వేన్ద్రియాచ్ఛాది - ప్రజ్వలన్ - అపి - యః - తమః.

అర్థము:- యః = ఏక్రోధుడు, ఉచ్చైః = అధికముగా, రఞ్జనం = రక్తవర్ణమును జనయన్నపి = కల్గించుచున్నను, వైరాగ్యం = రక్త వర్ణత్వము లేకయుండుటను, విరక్తిని, కరోతి = చేయుచున్నాడు. అనగా కోపము వచ్చిన వానికి దేనియందును గోరిక యుండదు. తథా = అట్లే, యః = ఏక్రోధుడు

ప్రజ్వలన్నపి = మండుచున్నను, అనగా ప్రకాశించుచున్నను, అనగా లోన సంతాపమును కల్గించుచున్నను, సర్వేన్ద్రియాచ్ఛాది, సర్వేన్ద్రియ = కన్ను ముక్కు మొదలగు జ్ఞానేన్ద్రియములను, ఆచ్ఛాది = ఆవరించునట్టి, తమః = మోహమును, అంధకారమును, సూతే = కలిగించుచున్నాడు. క్రోధముచే నంధుడైన వాని కేదియును కానరాదు.

వి. 1) రక్త వర్ణత్వమునుఁ గల్గించుచును, వైరాగ్యమును ననగా రక్తవర్ణ రాహిత్యమును, కల్గించునని చెప్పుటవలన విరోధాభాసాలంకారము. వైరాగ్య మనగా విరక్తియని చెప్పుటవలన విరోధమునకు పరిహారమగును.

2) ప్రకాశమానుఁడైనను అంధకారము కల్గించునని చెప్పుట వలన విరోధాభాసము, అంధకార మనగా మోహమని చెప్పుటవలన విరోధమునకు పరిహారము.

సమాసములు :

వైరాగ్యం - విరాగిణో భావః = వైరాగ్యం.
సర్వేన్ద్రియాచ్ఛాది- సర్వాణి చ తాని ఇంద్రియాణి = సర్వేన్ద్రియాణి.
సర్వేన్ద్రియాణి ఆచ్ఛాదయతీతి = సర్వేన్ద్రియాచ్ఛాది, తత్ = సర్వేన్ద్రియాచ్ఛాది.

భావము :

ఆక్రోధుడు ఎక్కువ రాగమును అనగా రక్త వర్ణత్వమును కలిగించుచున్నను, వైరాగ్యమును (రక్తవర్ణ రాహిత్యమును) విరక్తిని కలిగించుచున్నాడు. అట్లే లోన సంతాపము కలిగించుటచే ప్రజ్వలించుచున్నను (ప్రకాశించుచున్నను) అంధకారమును (మోహమును) గలిగించుచున్నాడు ॥22॥

శ్లో. పంచేషువిజయాసక్తౌ భవస్య క్రుధ్యతో జయాత్,
యేనాన్యవిగృహీతారి జయకాలనయ శ్రితః. 23

ప. వి:- పంచేషువిజయాసక్తౌ-భవస్య-క్రుధ్యతః-జయాత్ - యేన-అన్య-విగృహీతారిజయకాలనయః శ్రితః.

అర్థము:- పంచేషువిజయాసక్తౌ, పంచేషు = మన్మథునియొక్క, విజయ = విజయమందలి విషయమున, ఆసక్తౌ సత్యాం = పట్టుదల లేనందునవలన అశక్తి యేర్పడగా, క్రుధ్యతః = కోపించునట్టి, భవస్య = శివుని, జయాత్ = జయించుటవలన, అనగా తన్ను వశీకరించుటయను కారణము వలన, యేన = ఏక్రోధునిచే, అన్యవిగృహీతారిజయకాలనయః, అన్య = ఇతరులచే, విగృహీత = నిగ్రహింపబడిన, అరి = శత్రువును, జయ = జయించుటకు, కాల = తగిన కాలమనెడు, నయః = ఉపాయము శ్రితః = ఆశ్రయింపబడినది.

సమాసములు :

పంచేషువిజయం, పంచ ఇషవః యస్య సః = పంచేషుః, పంచేషోః విజయః = పంచేషువిజయః, పంచేషువిజయే ఆసక్తిః = పంచేషువిజయాసక్తిః, తస్యాం = పంచేషువిజయాసక్తౌ.
అన్యవిగృహీతారిజయకాలనయః-అన్యేన విగృహీతః = అన్యవిగృహీతః. అన్యవిగృహీతశ్చాసౌ అరిశ్చ = అన్యవిగృహీతారిః, అన్యవిగృహీతారేః జయః = అన్యవిగృహీతారిజయః, అన్య విగృహీతారిజయస్య కాలః = అన్యవిగృహీతారి జయకాలః. అన్యవిగృహీతారిజయకాలస్య నయః = అన్యవిగృహీతారి జయకాలనయః.

భావము :

పూర్వము మన్మథు నోడించుటలో పట్టుదల లేనందువలన నశక్తిచే కోపించుచున్న శివుని తనకు తాను వశీకరించుకొనెను. అందువలన నొంటరిగా తాను శత్రువును జయింప లేకపోయినపుడు, మరియొకనితో నాతడు యుద్ధమాడు సమయమున, అతని నోడించుటకు అవకాశము చేసికొనుట యను ఉపాయమును ఆ క్రోధుడు పన్నెను. మరియొక్క సమయమున నోడింపశక్యముకాని శివుని మన్మథునితోటి యుద్ధకాలమున క్రోధుడు జయింపగలిగెనని యర్థము ॥23॥

శ్లో. హస్తౌ విస్తారయ న్నిభ్యే బిభ్య దర్ధపథస్థవాక్,
సూచయన్ కాకు మాకూతై ర్లోభ స్తత్ర వ్యలోకి తైః. 24

ప. వి. హస్తౌ-విస్తారయన్-ఇభ్యే-బిభ్యత్-అర్ధపథస్థవాన్- సూచయన్-కాకుమ్-ఆకూతైః-లోభః-తత్ర-వ్యలోకి-తైః.

అర్థము: ఇభ్యే=ధనవస్తు విషయమునందు, హస్తౌ=రెండుచేతులను, విస్తారయన్=లోభముతో చాచుచు, బిభ్యత్=ఇచ్చునో ఇయ్యడోయను కారణము వలన, భయపడుచు, కావుననే అర్ధపథస్థవాక్=హృదయమునుండి వెల్వడి కంఠమునకు వచ్చి బయటికి వెల్వడక మార్గమధ్యమున నిలిచిన వాక్కు గలిగినవాడై (తథా=అట్లే) ఆకూతైః=తన దీనత్వమును ప్రకటించు చేష్టలచే, కాకుం=శోకభయాదులచే గలిగిన వికృతధ్వనిని, సూచయన్=సూచించుచు, (తథా=అట్లే) వ్రేళ్ళను నోట నుంచుకొనుట మున్నగు చేష్టలచే "దేహి, దేహి" అని భయదైన్యములతో వికృతమైన మాట నుచ్చరించుచు, లోభః=శరీరమును ధరించిన లోభము, తత్ర = ఆజన మధ్యమున, తైః = ఆ దేవతలచే, వ్యలోకి = చూడబడెను.

సమాసములు :

అర్ధపథస్థవాక్—పథః అర్ధం = అర్ధపథం, అర్ధపథే తిష్ఠతీతి = అర్ధ పథస్థా, అర్ధపథస్థా వాక్ యస్య సః = అర్ధపథస్థవాక్.

భావము :

ఆ వచ్చుచున్న జనసమూహమునందు ఇంద్రాదిదేవతలు దేహమును ధరించిన లోభమును అనగా లోభుని గాంచిరి. ఆ లోభుడు ధనవంతుని చూచి, చేయి చాచుచు, అత డిచ్చునో ఈయడోయని భయపడుచు, అందు వల్లనే మనస్సు నుండి వచ్చిన మాటను లోపలనే అణచుకొనుచు తన దైన్యాదులను సూచించు చేష్టలచే శోకాదులవలన గల్గునట్టి వికృతధ్వను లను వ్యక్తపఱచుచు ననగా నోటవేళ్ళ నుంచుకొనుట మున్నగు చేష్టలచే

"దేహి దేహి" (ఇమ్ము-ఇమ్ము) అని భయముచేతను, దుఃఖముచేతను వికృతమైన ధ్వనిని చేయుచుండెను. ॥24॥

శ్లో. దైన్య స్తైన్యమయా నిత్య మత్యాహారామయావినః,
భుంజాన జనసాకూతపశ్యా యస్యానుజీవనః. 25

ప. వి. దైన్యస్తైన్యమయాః - నిత్యం - అత్యాహారామయావినః - భుంజాన జన సాకూతపశ్యాః-యస్య-అనుజీవినః.

అర్థము: నిత్యం = ఎల్లపుడు, దైన్యస్తైన్యమయాః = దైన్యముతోడను చౌర్యము తోడను నిండిన, అత్యాహారామయావినః; అత్యాహార — అధికముగా నాహారమును భుజించుటచేత, ఆమయావినః = అజీర్ణరోగము గలవారును, భుంజానజనసాకూతపశ్యాః - భుంజానజన = భోజనము చేయుచున్న జనులను, సాకూత = తమకు పెట్టక తినుచున్నారనెడి దురభిప్రాయము లతో, పశ్యాః = చూచునట్టివారు, యస్య = ఏ లోభునికి, అనుజీవినః = సేవకులు. అట్టిలోభుడు, వ్యలోకి = చూడబడెను అని వెనుకటి శ్లోకముతో అన్వయము.

సమాసములు :

దైన్యస్తైన్యమయాః- దీనస్య భావః = దైన్యం, స్తేనస్య భావః స్తైన్యం. దైన్యం చ స్తైన్యం చ = దైన్యస్తైన్యే, దైన్యస్తైన్యే ప్రచురే యేషు తాః = దైన్యస్తైన్యమయాః.

అత్యాహారామయావినః— అత్యంత మాహారః = అత్యాహారః, అత్యాహా రేణ ఆమయః ఏషా మస్తీతి అత్యాహారామయావినః.

భుంజానజనసాకూతపశ్యాః— భుంజానాశ్చ తే జనాశ్చ = భుంజాన జనాః, ఆకూతేన సహితం యథా తథా పశ్యన్తీతి = సాకూతపశ్యాః, భుంజానజనానాం సాకుతపశ్యాః = భుంజానజనసాకూతపశ్యాః.

భావము :

ఎల్లపుడు దీనత్వమును చౌర్యమును వహించినవారును, అమితముగా తినుటచే అజీర్ణవ్యాధుల నొందినవారును, భోజనము చేయు జనులను చూచి వీరే యంతటిని తినుచున్నారే మనకేమియు బెట్టుటలేదే ఇవి మున్నగు దుష్టాశయములతో, తిను జనమును సాభిప్రాయముగాఁ జూచునట్టి లోభుని సేవకులను నింద్రాది దేవతలు గాంచిరి. ॥౬౭॥

శ్లో. ధనిదానామ్బువృష్టే ర్యః పాత్రపాణా వవగ్రహః
స్వా న్దాసా నివ హా నిస్స్వా ద్విక్రీణీతేఽర్థవత్సు యః. 26

ప. వి. ధనిదానామ్బువృష్టేః-యః-పాత్రపాణౌ-అవగ్రహః-స్వాన్ - దాసాన్-ఇవ-హా-నిఃస్వాత్-విక్రీణీతే-అర్థవత్సు-యః.

అర్థము: పాత్రపాణౌ = దానార్హులగు బ్రాహ్మణాదుల హస్త విషయమున, ధనిదానామ్బువృష్టేః, ధని = ధనికులయొక్క, దానామ్బు = దానము చేసెడి సమయమున వదలిపెట్టు జలముయొక్క, వృష్టేః = వర్షమునకు, యః = ఏ లోభుఁడు, అవగ్రహః = ప్రతిబంధకుడో, తథా = అట్లే, నిఃస్వాత్ = నిర్ధనునినుండి, స్వాన్ = తనకు సంబంధించిన పుత్రదారాదులను, దాసానివ = సేవకులనువలె, యః = ఏ లోభుఁడు, అర్థవత్సు = ధనికుల విషయమున, విక్రీణీతే = విక్రయించుచున్నాడో (అట్టి లోభుడు చూడబడెను), హా = కష్టము.

సమాసములు :

ధనిదానామ్బువృష్టేః- దానస్య అమ్బూని = దానామ్బూని, ధనినాం దానామ్బూని = ధనిదానామ్బూని. ధనిదానామ్బూనాం వృష్టిః = ధనిదానామ్బువృష్టిః, తస్యాః ధనిదానామ్బువృష్టేః.

పాత్రపాణౌ-పాత్రస్య పాణిః = పాత్రపాణిః, తస్మిన్ = పాత్రపాణౌ.
నిఃస్వాత్ -నిర్గతం స్వం యస్మాత్ సః = నిఃస్వః, తస్మాత్ = నిఃస్వాత్.

భావము :

ఆలోభుఁడు పాత్రులగు బ్రాహ్మణాదుల హస్తమున దానము చేసెడి కాలమున వదలునట్టి జలవృష్టికి ప్రతిబంధకుడు. లోభగుణముగలవాడు ఎంత ధనవంతుడైనను దానము చేయడుకదా ! ధనములేని వాడు తన బిడ్డలయందును భార్యయందును నభిమానము లేనివాడై వారిని తన సేవకులకు విక్రయించినట్లు విక్రయించును. దీనికిని ధనమునందలి లోభమే కారణము. అట్టి లోభుని ఇంద్రాదులు గాంచిరి. ॥26॥

శ్లో. ఏకద్వికరణే హేతూ మహాపాతకపఞ్చకే
న తృణే మన్యతే కోపకామౌ యః పఞ్చ కారయన్.27

ప. వి. ఏకద్వికరణే- హేతూ-మహాపాతపంచకే-న-తృణే-మన్యతే- కోపకామౌ-యః-పఞ్చ-కారయన్.

అర్థము: మహాపాతక పఞ్చకే = బ్రహ్మహత్య, మద్యపానము, చౌర్యము, గురుస్త్రీగమనము, కృతఘ్నత, అను అయిదు మహాపాపములందు, ఏకద్వికరణే- ఏక-ఒక పాతకమును, లేదా, ద్వి = రెంటిని, కరణే = చేయుటయందు, హేతూ = కారణములైన, కోపకామౌ = కోపము, కామము అను రెంటిని, యః = ఏ లోభుఁడు, పంచ = అయిదు మహాపాతకములను, కారయన్ = చేయించుచు, తృణే = ఆ కోపకామములను, గడ్డిపోచలుగా, న మన్యతే = తలచడో, అట్టి లోభుడు చూడబడెనని యర్థము. అనగా పంచమహాపాతకములలో కోపము బ్రహ్మహత్యను మాత్రము చేయించవచ్చును. కామము గురుస్త్రీగమనమును, దానికై ఆ గురువు వధను చేయింపవచ్చును. కాన కోపము ఒక పాతకమును కామము రెండు పాతకములను చేయింపగలవు. కాని లోభము పంచ మహాపాతకములను చేయింపగలదని యర్థము.

సమాసములు :

*ఏకద్వికరణే—ఏకం చ ద్వే చ = ఏకద్వే, ఏకద్వయోః కరణం =* ఏకద్వికరణం, తస్మిన్ ఏకద్వికరణే.

మహాపాతకపంచకే-మహాన్తి చ తాని పాతకాని చ=మహాపాతకాని, మహాపాతకానాం పంచకం=మహాపాతకపంచకం, తస్మిన్ = మహాపాతకపంచకే.

కోపకామౌ-కోపశ్చ, కామశ్చ=కోపకామౌ, తౌ=కోపకామౌ.

భావము :

బ్రహ్మహత్యాది పంచమహాపాతకములలో కోపము బ్రహ్మహత్య అను ఒక్క పాతకమును చేయింపవచ్చును. కామము గురుస్త్రీగమనము, దానికై గురువధ యను రెండు పాతకములను చేయింపవచ్చును. కాని లోభము ధనము ధనమునందలి యాశతో బ్రహ్మహత్యను, సువర్ణచౌర్యమును, రుచి యందలి యాశతో మద్యపానమును, స్త్రీయందలి యాశచే గురుస్త్రీగమనమును, ఇష్ట సంపాదనేచ్ఛచే పై నాలుగు పాతకములతో సంబంధముగల ఐదవ పాతకమును చేయించును. కాన లోభము కోపకామములను గడ్డిపోచగా కూడా లెక్కించుట లేదు. ఇట్లు పంచ మహాపాతకములకు కారణభూతుడగు లోభుని ఇంద్రాదులు చూచిరి.

శ్లో. యస్సర్వేంద్రియసద్మాపి జిహ్వాం బహ్వవలంబతే,
తస్యా మాచార్యకం యాచ్ఞావటవే పాటవేఽర్జితుమ్. 27

ప. వి. యః-సర్వేన్ద్రియసద్మా-అపి-జిహ్వాం- బహు-అవలంబతే- తస్యాం-ఆచార్యకం-యాచ్ఞావటవే-పాటవే-అర్జితుమ్.

అర్థము: యః-ఏ లోభుడు, సర్వేన్ద్రియసద్మాపి, సర్వేన్ద్రియ=సకలేన్ద్రియములను, సద్మాపి=స్థానముగా కలిగియున్నను, బహు=అధికముగా, జిహ్వాం-నాలుకను, తస్యాం=ఆ నాలుకయందు, యాచ్ఞావటవే= యాచన యను బ్రహ్మచారికై యనగా శిష్యునికై, పాటవే=పటుత్వ విషయమునందు అనగా యాచనయందు మాటల నేర్పును గల్గించు విషయమునందు, ఆచార్యకం=గురుత్వమును, అర్జితుం=సంపాదించుటకు, అవలంబతే=ఆశ్రయించుచున్నది.

సమాసములు :

సర్వేన్ద్రియసద్మా - సర్వాణి చ తాని ఇన్ద్రియాణి చ = సర్వేన్ద్రియాణి, సర్వేన్ద్రియాణి సద్మ యస్య సః = సర్వేన్ద్రియసద్మా.

యాఞ్చాపటవే- యాఞ్చైవ వటుః = యాఞ్చావటుః, తస్మై = యాఞ్చావటవే.
పాటవే-పటోః భావః = పాటవం, తస్మిన్ = పాటవే.

భావము :

ఆలోభుడు సర్వేన్ద్రియములందు నివాసము గలిగియున్నను, అనగా గంధమందు లోభముచే ఘ్రాణేన్ద్రియమునందును, రసాదులయందు లోభముచే రసనాదీన్ద్రియములందును నివాసము గలిగియున్నదును, ముఖ్యముగా జిహ్వేన్ద్రియమునందు నివాసమును గలిగియున్నది. ఏలయనగా యాచన జిహ్వనుండి యేర్పడును. ఆయాచన యను శిష్యునికి చక్కగా మాట్లాడుటయందు నేర్పును గలిగించుటకై యాలోభుడు, దానికి గురు స్థానమునువహించి జిహ్వయందు నెలకొని యున్నాడని యాశయము ॥28॥

శ్లో, పథ్యం తథ్యా మగృహ్ణన్త మన్ధం బన్ధు ప్రబోధనమ్,
శూన్య మాశ్లిష్య నోజ్ఝన్తం మోహ మైక్షన్త హన్త తే. 29

ప. వి. పథ్యాం - తథ్యామ్- అగృహ్ణన్తం - అన్ధం - బన్ధుప్రబోధనం- శూన్యమ్- ఆశ్లిష్య-న-ఉజ్ఝన్తం-మోహం-ఐక్షన్త-హన్త-తే.

అర్థము: పథ్యాం = హితమైన, తథ్యాం-సత్యమైన, బన్ధుప్రబోధనం, బంధు = తల్లిదండ్రులు మున్నగువారిచే చేయబడిన, ప్రబోధనం = ప్రబోధమును, అగృహ్ణన్తం = గ్రహించనట్టి, అన్ధం = గుడ్డియైన అనగా అజ్ఞానముతో నిండిన, శూన్యం = అసత్యప్రాయమైన దానిని, ఆశ్లిష్య = సత్యముగా భావించి, న ఉజ్ఝన్తం = విడువనట్టి, మోహం = మోహమును, తే = ఆ ఇంద్రాదులు, ఐక్షన్త = చూచిరి. హన్త = కష్టము.

సమాసములు :

పథ్యాం- పథి భవా = పథ్యా, తాం = పథ్యాం.

అగృహ్ణన్తం- న గృహ్ణన్ = అగృహ్ణన్, తం = అగృహ్ణన్తం. బన్ధు ప్రబోధనం = బన్ధూనాం ప్రబోధనా యేన సః = బంధుప్రబోధనః, తం = బంధు ప్రబోధనం.

భావము :

ఆ ఇంద్రాదులు మోహమును జూచిరి. ఆమోహము తలిదండ్రులు మున్నగు బంధువులు చెప్పునట్టి సత్యములైన యుపదేశములను విననిదియు, అసత్యములైన విషయములను నంటిపెట్టుకొని వానిని విడువనిదియునై యుండినది. అట్టి మోహమును వారు చూచుట కష్టమైన విషయము ॥29॥

శ్లో. శ్వః శ్వః ప్రాణప్రయాణేఽపి న స్మరన్తి స్మరద్విషః
మగ్నాః కుటుంబజమ్బాలే బాలిశా యదుపాసినః. 30

ప. వి. శ్వః-శ్వః-ప్రాణప్రయాణే- అపి - న - స్మరన్తి - స్మరద్విషః-మగ్నాః-కుటుంబజమ్బాలే-బాలిశాః-యదుపాసినః.

అర్థము: యదుపాసినః - యత్ = ఏమోహమును, ఉపాసినః - సేవించునట్టి, బాలిశాః = మూర్ఖులు, అనగా స్వయం ప్రజ్ఞులమను నహంకారముచే పరోపదేశమును పెడచెవిన పెట్టునట్టి జనులు, కుటుంబజమ్బాలే, కుటుంబ - పుత్రులు, భార్య మున్నగు కుటుంబమనెడి, జమ్బాలే = బురదయందు, మగ్నాః = మునిగినవారై, శ్వః శ్వః = మరుసటి దినములందు, ప్రాణప్రయాణేఽపి = ప్రాణములు వెడలిపోవుట అనగా మరణించుట నిశ్చయమైనను, స్మరద్విషః = మన్మథ శత్రువైన శివుని, న స్మరన్తి = స్మరింపరు, బురదలో మునిగినవారు దేనిని స్మరింపలేరు గదా!

సమాసములు :

ప్రాణప్రయాణే-ప్రాణానాం ప్రయాణం=ప్రాణప్రయాణం, తస్మిన్ = ప్రాణప్రయాణే.
స్మరద్విషః-స్మరస్య ద్విట్ = స్మరద్విట్, తస్య = స్మరద్విషః
కుటుమ్బజమ్బాలే - కుటుమ్బ ఏవ జమ్బాలః = కుటుంబజమ్బాలః, తస్మిన్ = కుటుమ్బజమ్బాలే.
యదుపాసినః-యం ఉపాసత ఇతి = యదుపాసినః.

భావము :

ఆమోహునికి సేవకులు స్వయంప్రజ్ఞాభిమానులై పెద్దల యుపదేశములను వినని మూర్ఖులు. వీరు పుత్రకలత్రాదిరూపమైన కుటుంబ మనెడి బురదయందు బడినవారై ఎల్లపుడును సన్నిహితమైన మరణమునుఁ దెలిసియు సంసారసాగర మును దరింపజేసెడు పరమశివుని స్మరింపరు. 30

శ్లో. పుంసా మలబ్ధనిర్వాణ జ్ఞానదీపమయాత్మనాం,
అన్తర్గ్లాపయతి వ్యక్తం యః కజ్జలవదుజ్జ్వలమ్. 31

ప. వి. పుంసాం - అలబ్ధనిర్వాణజ్ఞానదీపమయాత్మనాం - అంతః - గ్లాపయతి-వ్యక్తం-యః-కజ్జలవత్-ఉజ్జ్వలం.

అర్థము: యః = ఏమోహుఁడు, అలబ్ధనిర్వాణజ్ఞానదీపమయాత్మనాం, అలబ్ధ = పొందబడని, నిర్వాణ = వినాశముగల్గిన, జ్ఞాన = జ్ఞానరూపమైన, దీప మయ = దీపముతో నిండిన, ఆత్మనాం = మనస్సుగల్గిన వసిష్ఠుడు మున్నగు, పుంసాం = జ్ఞానులైన పురుషులకు, ఉజ్జ్వలం = నిర్మలమైన, అంతః = అంతఃకరణమును, కజ్జలవత్ = కాటుకవలె, వ్యక్తం = స్పష్ట ముగా, గ్లాపయతి = మలినపరచుచున్నాడు.

సమాసములు :

అలబ్ధనిర్వాణజ్ఞానదీపమయాత్మనాం-న లబ్ధః = అలబ్ధః, అలబ్ధః నిర్వాణః యేన సః = అలబ్ధనిర్వాణః, జ్ఞానమేవ దీపః = జ్ఞానదీపః, అలబ్ధ

నిర్వాణశ్చాసౌ జ్ఞానదీపశ్చ = అలబ్ధనిర్వాణజ్ఞానదీపః, అలబ్ధనిర్వాణ జ్ఞానదీపేన ప్రచురః = అలబ్ధనిర్వాణజ్ఞానదీపమయః, అలబ్ధనిర్వాణజ్ఞాన దీపమయః ఆత్మా యేషాం తే = అలబ్ధనిర్వాణజ్ఞానదీపమయాత్మానః, తేషాం = అలబ్ధనిర్వాణ జ్ఞానదీపమయాత్మనాం.
కజ్జలవత్-కజ్జలమివ = కజ్జలవత్.

భావము :

ఆమోహుడు ఆరని జ్ఞానదీపముతో వెలుగొందు మనస్సుగల వసిష్ఠాదులగు జ్ఞానుల నిర్మలమైన యంతఃకరణమును కాటుకవలె మలిన పరుచుచున్నాడు. విశ్వామిత్రాదులగు జ్ఞానులుసైతము మేనకాదుల మోహమునకు గురియైనవారై నిర్మలమైన తమమనసును మలినపఱచుకొనిరిగదా. కావున విశ్వామిత్రాదుల హృదయమున వెలుగొందు జ్ఞానదీపముకూడా మోహమను మసిచే మలినమగుచున్నదని యాశయము. 31

శ్లో, బ్రహ్మచారివనస్థాయియతయో గృహిణం యథా,
త్రయో య ముపజీవన్తి క్రోధలోభమనోభవాః. 32

ప. వి. బ్రహ్మచారివనస్థాయియతయః-గృహిణం-యథా-త్రయః- యం - ఉప జీవన్తి-క్రోధలోభమనోభవాః.

అర్థము: బ్రహ్మచారివనస్థాయియతయః, బ్రహ్మచారి = బ్రహ్మచారియు, వనస్థాయి = అరణ్యవాసముజేయునట్టి వానప్రస్థుడును, యతయః = సన్యాసి యనువీరలు, త్రయః = ముగ్గురు, గృహిణం = గృహస్థుని, యథా = ఎట్లు ఉపజీవన్తి = అన్నపానాదులపై యాశ్రయించుచున్నారో, తథా = అట్లే, క్రోధలోభమనోభవాః = కోపము లోభము కామము అను నీమూడు, యం = ఏమోహమును, ఉపజీవన్తి = ఆశ్రయించుచున్నవి. అనగా మోహము జెందినవాడే క్రోధమును లోభమును కామమును పొందునని యర్థము.

**సమాసములు :**

బ్రహ్మచారివనస్థాయియతయః — బ్రహ్మచారీ చ వనస్థాయీ చ యతిశ్చ = బ్రహ్మచారి వనస్థాయియతయః
క్రోధలోభమనోభవాః- మనసి భవతీతి = మనోభవః, క్రోధశ్చ లోభశ్చ మనోభవశ్చ = క్రోధలోభమనోభవాః.

**భావము :**

బ్రహ్మచారియు, వానప్రస్థుడును, సన్న్యాసియు నెట్లు తమ తమపోషణకై గృహస్థు నాశ్రయింతురో అట్లే క్రోధలోభకామములను నీ మూడు గుణములును తమ తమ యభివృద్ధికి మోహము నాశ్రయించును. అనగా మోహముగలవాడే క్రోధమును, లోభమును, కామమును పొందును. కాన మోహము క్రోధలోభకామ ములకు నుత్తేజకము ॥32॥

శ్లో. జాగ్రతామపి నిద్రా యః పశ్యతామపి యోఽన్ధతా,
శ్రుతే సత్యపి జాడ్యం యః ప్రకాశేఽపి చ యస్తమః 33

ప. వి. జాగ్రతామ్-అపి-నిద్రా-యః-పశ్యతామ్-అపి-యః-అన్ధతా-శ్రుతే-సతి-అపి-జాడ్యం-యః-ప్రకాశే-అపి-చ-యః-తమః.

అర్థము: యః = ఏమోహము, జాగ్రతామపి = మేల్కొలుపుగలవారికిని, నిద్రా = అవివేకరూపమైన జడత్వమువంటిది. తథా = అట్లే, యః = ఏమోహము, పశ్యతామపి = నేత్రములతో చూచువారికిని, అంధతా = గ్రుడ్డితనము వంటిది అనగా సంసార మనిత్య మనియు, దుఃఖరూప మనియు తెలిసినను దానిని వదలనీయకుండఁ జేయుటవలన నామోహము అజ్ఞాన రూపము. తథా = అట్లే, యః = ఏమోహము, శ్రుతే సత్యపి = శాస్త్ర జ్ఞానమున్నను, జాడ్యం = కర్తవ్యాకర్తవ్య నిర్ణయమును జేసుకొననీయని యసామర్థ్యము వంటిది. తథా = అట్లే, యశ్చ = ఏమోహము, ప్రకాశే సత్యపి = సూర్యాదుల వెలుగు ఉన్నను, తమః = చీకటివంటిది. చూడదగిన

ఘటపటాదుల నాచ్ఛాదించుటవలన చీకటి వంటిది. అనగా స్పష్టముగా గానవచ్చుచున్నను గాననీయకుండ జేయునది యని యర్థము.

సమాసములు :

అన్ధతా: అన్ధస్య భావః = అన్ధతా.

భావము :

ఆమోహము మేల్కొనినవారికి నిద్ర వంటిది. నేత్రములతో చూచుచున్న వారికి గ్రుడ్డితనమువంటిది. శాస్త్రజ్ఞానము గలవారికి జడత్వము వంటిది. సూర్యాదుల వెలుగున్నచోట చీకటి వంటిది. ॥౩౪॥

శ్లో. కురుసైన్యం హరేణేవ ప్రాగలజ్జత నార్జునః,
హతం యేన జయన్ కామ స్తమోగుణజుషా జగత్.

ప. వి. కురుసైన్యం-హరేణ-ఇవ-ప్రాక్-అలజ్జత-న-అర్జునః- హతం-యేన-జయన్-కామః- తమోగుణజుషా-జగత్.

అర్థము: తమోగుణజుషా = అజ్ఞానరూపమైన తమోగుణమును బొందిన, యేన = ఏమోహముచే, హతం = కొట్టబడిన, జయన్ = జయించుచున్న, కామః — మన్మథుడు, తమోగుణజుషా = తమోగుణమును వహించిన, హరేణ = సంహారమును చేయునట్టి రుద్రునిచే, ప్రాక్ = పూర్వము, హతం = హతము గావింపబడిన, కురుసైన్యం - కురువంశస్థుల సైన్యమును, జయన్ = జయించునట్టి, అర్జున ఇవ = అర్జునుడు వలె, నాఽలజ్జత = సిగ్గుపడలేదు.

సమాసములు :

కురుసైన్యం = కురూణాం సైన్యం = కురుసైన్యం, తత్ కురుసైన్యం.
తమోగుణజుషా = తమ ఇతి గుణః = తమోగుణః, తమోగుణం జుషతీతి = తమోగుణజుట్, తేన = తమోగుణజుషా.

భావము :

అజ్ఞానరూపమగు తమోగుణమును సేవించునట్టి మోహము ప్రపంచమును నాశము గావించినది. అట్లు నాశము చేయఁబడిన ఈప్రపంచమును కామము జయించుచు సిగ్గుపడలేదు. ఒకరు హతము చేసిన దానిని మఱియొకడు హతము చేయుటలో అతని సామర్థ్య మేమియు నుండదు గాన నత డాపనికి సిగ్గుపడవల యును కదా! కాని సిగ్గుపడలేదు. ఏల యనగా తమోగుణముగల రుద్రుడు తొలుత తనశూలముతో కురుసైన్యము నుక్కడంచినను తరువాత నర్జునుడు ఆ సైన్యమును హతమార్చెను. కాని ఆపని కర్జునుడును సిగ్గుపడలేదు. అట్లే యిచ్చ టను కామము, మోహము హతము గావించిన ప్రపంచమును హతమార్చియు సిగ్గుపడలేదు. ద్రోణపర్వ కథ ననుసరించి తొలుత రుద్రుడు తన శూలముతో కురు సైన్యమును సంహరింపగా తర్వాత నర్జునుడు దానిని నిశ్శేషము గావించెనని తెలియుచున్నది. అనగా మోహముఁ జెందినవాడే కామపరవశు డగుననియర్థము.॥34॥

శ్లో. చిహ్నితాః కతిచి ద్దైవైః ప్రాచః పరిచయా దమీ,
అన్యే న కేచనాచూఢ మేనఃకంచుక మేచనాః. 35

ప. వి. చిహ్నితాః-కతిచిత్-దేవైః-ప్రాచః-పరిచయాత్-అమీ-అన్యే-న-కే-చన-ఆచూడం-ఏనఃకంచుక మేచకాః.

అర్థము: అమీ = ఈకామాదులు, కతిచిత్ = కొందఱైన, దేవైః = ఇంద్రాదివేల్పులతో, ప్రాచః = పూర్వమేర్పడిన, పరిచయాత్ = దృఢమైనపరిచయము వలన, చిహ్నితా = గుర్తులతో నిశ్చయింపఁబడిరి. దేవతలకును కామాదిపర వశత్వ ముండుటవలననే వారికి పూర్వపరిచయము. అన్యే = వారి నాశ్ర యించిన బౌద్ధాదులు, కేచన = కొందఱు, న(జ్ఞాతాః) = తెలియబడలేదు. యతః = ఏలయనగా, ఆచూడం = శిఖవఱకును, ఏనఃకంచుక మేచకాః; ఏనః = పాపమనెడి, కంచుక = కవచముతో, మేచకాః = నీలవర్ణము గలవారై యుండిరి. ఎవ్వరు నల్లనివస్త్రముతోఁ గప్పబడియుందురో వారు స్పష్టముగా గుర్తింప నశక్యులు. అట్లే వీరును నల్లగానుండుటవలన గుర్తింపబడరైరి.

సమాసములు :

అచూడం- చూడా మభివ్యాప్య = ఆచూడం.
ఏనఃకంచుకమేచకాః- ఏన ఏవ కంచుకః = ఏనఃకంచుకః, ఏనః కంచుకేన మేచకాః = ఏనఃకంచుకమేచకాః.

భావము :

ఈకామక్రోధలోభములకు దేవతలతో పూర్వపరిచయ మున్నందువలన వారిని వారు గుర్తింపగలిగిరి. వారిలో మిగిలినవారు పాపమనెడి కవచముచే నల్లనివన్నెను బొందినందువలన వారిని దేవతలు గుర్తింపజాలకుండిరి. పాపము నల్లగ నుండునుగాన వారు పాపముచే నలుపువన్నెను బొందిరని యర్థము. నల్లని వస్త్రముతోఁ గప్పబడినవారు స్పష్టముగా తెలియరుగదా. ॥35

శ్లో. తత్రోద్ఘూర్ణ ఇవార్ణోఘే సైన్యేఽభ్యర్ణ ముపేయుషి,
కస్యా ప్యాకర్ణయామాసు స్తే వర్ణాన్ కర్ణకర్కశాన్. 35

ప. వి. తత్ర-ఉద్ఘూర్ణే-ఇవ-అర్ణౌఘే - సైన్యే-అభ్యర్ణమ్ - ఉపేయుషి - కస్య-అపి-ఆకర్ణయామాసుః-తే-వర్ణాన్-కర్ణకర్కశాన్.

అర్థము: ఉద్ఘూర్ణే=మర్యాదను వదలిన (ఎల్లను దాటిన), అర్ణౌఘే ఇవ=సముద్రమువలె చాలా లోతైనట్టి, సైన్యే=ఆకలిసైన్యము, అభ్యర్ణం=సమీపమును, ఉపేయుషి సతి=పొందగా, తత్ర=అచ్చట, తే=ఆ దేవతలు, కస్యాపి=కనబడనియాకృతిగల ఒకానొకనియొక్క. అనగా చార్వాకుని యొక్క, కర్ణకర్కశాన్ = కర్ణ కఠోరములైన, వర్ణాన్ = అక్షరములను, ఆకర్ణయామాసుః=వినిరి.

సమాసములు :

అర్ణౌఘే-అర్ణసామ్ ఓఘః=అర్ణౌఘః, తస్మిన్=అర్ణౌఘే.
కర్ణకర్కశాన్-కర్ణయోః కర్కశాః = కర్ణకర్కశాః, తాన్ = కర్ణకర్కశాన్.

భావము :

మర్యాదను (ఎల్లను) దాటిన సముద్రమువలె మిక్కిలి గంభీరమైన ఆ కలి సైన్యము సమీపమునకు రాగానే, యాదేవతలు ఆ సైన్యమందు శరీరమును గనఁబఱచక కర్ణకఠోరముగా మాట్లాడుచున్న నాస్తికుడగు చార్వాకుని మాటలను వినిరి. ॥36॥

శ్లో. గ్రావోన్మజ్జనవ ద్యజ్ఞఫలేఽపి శ్రుతిసత్యతా,
కా శ్రద్ధా తత్ర ధీవృద్ధాః కామాధ్వా యత్ఖిలీకృతః. 37

ప.వి. గ్రావోన్మజ్జనవత్-యజ్ఞఫలే - అపి-శ్రుతిసత్యతా - కా - శ్రద్ధా - తత్ర-ధీవృద్ధాః - కామాధ్వా - యత్ - ఖిలీకృతః.

అర్థము: గ్రావోన్మజ్జనవత్ = ''గ్రావాణః ప్లవన్తే'' యని చెప్పబడిన విధముగా ఱాళ్ళు తేలియాడు నను వాక్యమునకు వలె, యజ్ఞఫలేఽపి = జ్యోతిష్టోమాది యజ్ఞములకుఫలమైన స్వర్గము మున్నగువాని యందును, శ్రుతిసత్యతా = ''జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత'' మున్నగు వేదములకు సత్యత్వము ఏర్పడును. అనగా ''గ్రావాణః ప్లవన్తే'' యను వాక్య మెట్లు సత్యము కాదో, అట్లే స్వర్గఫలమునకు జ్యోతిష్టోమాది యాగములను విధించు శ్రుతివాక్యములు కూడ సత్యముకాదని యర్థము. ఱాళ్ళు తేలుచున్నవని చెప్పినను ఱాళ్ళు ఎట్లు తేలుటలేదో అట్లే జ్యోతిష్టోమాది యజ్ఞములను గావించినను, ఫలము వెంటనే కానవచ్చుటలేదు గాన యాగప్రతిపాదక శ్రుతులు కూడ నప్రమాణములని యర్థము. హే ధీవృద్ధాః = బుద్ధిమంతులైన యోవేల్పులారా, తత్ర = ఆ యాగఫలమునందు, దానిని ప్రతిపాదించు వేదమునందును (యుష్మాకం = మీకు) కా శ్రద్ధా = ఏమి శ్రద్ధ? అనగా దానియందు శ్రద్ధ యనావశ్యకము. యత్ = ఏకారణము చేత ననగా వేదోక్త విధుల నతిక్రమించుటవలని భయముచే, కామాధ్వా = స్వేచ్ఛా సంచారమార్గము, ఖిలీకృతః = బంధింపబడినది. అనగా పాడుఁ జేయబడినది.

సమాసములు :

గ్రావోన్మజ్జనవత్ - గ్రావ్ణా మున్మజ్జనం=గ్రావోన్మజ్జనం, గ్రావోన్మజ్జన మివ = గ్రావోన్మజ్జనవత్.

యజ్ఞఫలే - యజ్ఞస్య ఫలం=యజ్ఞఫలం, తస్మిన్=యజ్ఞఫలే.

శ్రుతిసత్యతా - సత్యాయాః భావః=సత్యతా, శ్రుతేః సత్యతా=శ్రుతి సత్యతా.

కామాధ్వా - కామస్య అధ్వా=కామాధ్వా.

ఖిలీకృతః - అఖిలః ఖిలః సమ్పద్యమానః కృతః=ఖిలీకృతః.

భావము :

ఱాళ్ళు తేలియాడుచున్న వను నర్థముగల "గ్రావాణః ప్లవన్తే" యను వాక్యము ఱాళ్ళు తేలియాడనందువలన నసత్యార్థమును జెప్పి యెట్లు ప్రమాణము కాదో, అట్లే "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" ఇత్యాదిగా, స్వర్గఫలమునకై జ్యోతిష్టోమాది యజ్ఞములను చేయవలయునని చెప్పు శ్రుతివాక్యములును ప్రమాణ ములు కావు. ఏల యనగా యజ్ఞముచేసిన పిదప, స్వర్గరూపమగు ఫలము కానరాదు. ఎట్లనగా "యాగశ్రుతిః అప్రమాణం - ప్రత్యక్ష విరుద్ధత్వాత్ - గ్రావోన్మజ్జన శ్రుతివత్" అని యనుమానముచే జ్యోతిష్టోమాదియాగ ప్రతి పాదకములగు శ్రుతులు అప్రమాణము లగుచున్నవి. కాన బుద్ధిమంతులగు నోవేల్పులారా! అ స్వర్గఫలమునందును, దానిని ప్రతిపాదించు శ్రుతియందును మీకేల నమ్మకము? ఇట్లు వేదోక్త విధుల నతిక్రమించుటవలని భయముచేతనే జనులకు స్వేచ్ఛాసంచారమార్గము నశించినది. ॥37॥

శ్లో. కేనాఽపి బోధిసత్త్వేన జాతం తత్త్వేన హేతునా,
యద్వేదమర్మభేదాయ జగదే జగదస్థిరమ్. 38

ప.వి. కేన-అపి-బోధిసత్త్వేన-జాతం-తత్త్వేన - హేతునా - యత్ - వేదమర్మ భేదాయ-జగదే-జగత్-అస్థిరమ్.

అర్థము: కేనాఽపి=ఒకానొక పేరు తెలియనట్టి, బోధిసత్త్వేన=అతిప్రాజ్ఞుడగు జినభట్టారకునిచే, వేదమర్మభేదాయ; వేద=వేదముయొక్క, మర్మ= రహస్యములను, భేదాయ=భేదించుటకై, జాతం=ఉద్భవింపఁబడినది. అనగా వేదముల రహస్యభేదనము చేయుట కారంభింపబడిన దని యర్థము. యత్ = ఏల యనగా, సత్త్వేన=సత్త్వము అనగా భావత్వ మనెడి, హేతునా=కారణముచే, జగత్=ప్రపంచము, అస్థిరం=అస్థిరముగా, జగదే=చెప్పబడినది. "యత్సత్ తత్ క్షణికః" అను బౌద్ధసిద్ధాంతము ననుసరించి లోకమున నేది సత్త్వమును అనగా భావత్వమును అనగా ఉనికినిగలిగియున్నదో అది క్షణికము అనగా క్షణకాల ముండి మఱుక్షణ మున నశించునదిగానుండును. కనుక నీసిద్ధాంతము ననుసరించి యుభయ లోకములయందును స్థిరముగా నున్నట్టి యొక ఈశ్వరుడను కర్త నాధార ముగా జేసికొని వేదములు విధించిన విధినిషేధములు, నిరాధారము లగుట వలన, వేదము లప్రమాణము లగుటచే వేదమర్మభేదము సంభవించును. బౌద్ధసిద్ధాంతము, ఇతరగ్రంథములవలన తెలియదగినది. ఇచ్చట చార్వాకు డను నాస్తికుడు తన మతమందలి వేదాప్రామాణ్యమును బౌద్ధసిద్ధాంత ముతో సరిపడఁజేసి దాని నిట గట్టిపఱచుచున్నాడు. ఈవిధముగా భావ ప్రపంచమున కంతటికిని క్షణభంగురత్వము సిద్ధింపగా ఎవడు పాపము చేయునో అతడును క్షణికుడగుటవలన నశించెను గాన పాపమువలన భయ మేమున్నదని యర్థము.

సమాసములు :

వేదమర్మభేదాయ - వేదస్య మర్మాణి=వేదమర్మాణి, వేదమర్మణాం భేదః=వేదమర్మభేదః, తస్మై=వేదమర్మభేదాయ.

అస్థిరం - నస్థిరం=అస్థిరం.

భావము :

గొప్పప్రజ్ఞగల బోధిసత్త్వుడు వేదమర్మములను భేదించుటకై యవతరిం రించెను. అతడు లోకమున నేది యేది యునికిని (సత్త్వమును) గల్గియున్నదో

యదిక్షణికమని అనగా క్షణముండి, మరుక్షణమున నశించునదిగాసిద్ధాంతపఱచెను. అందువలన నుభయలోకములయందును స్థిరుడుగా భావింపబడి వేదములకు కర్తగానున్న యీశ్వరుడును క్షణికుఁడగుటవలన అతని నాధారము గావించుకొని వేదములు విధించిన విధినిషేధములకు ఆశ్రయము లేనందువలన వేదములకు ప్రామాణ్యము తొలగిపోయినదిగాన వేదముల రహస్యము భేదింపబడిన దాయెను.

శ్లో. అగ్నిహోత్రం త్రయీతన్త్రం త్రిదండం భస్మపుణ్డ్రకం
ప్రజ్ఞాపౌరుషనిఃస్వానాం జీవో జల్పతి జీవికా. 39

ప.వి. అగ్నిహోత్రం-త్రయీతన్త్రం-త్రిదణ్డం-భస్మపుణ్డ్రకం - ప్రజ్ఞాపౌరుష నిఃస్వానాం-జీవః-జల్పతి-జీవికా.

అర్థము : అగ్నిహోత్రం=సాయంప్రాతఃకాలములయందు నిత్యముగను కామ్యముగను ననుష్ఠింపఁబడెడి అగ్నిహోత్ర మను కర్మయు, త్రయీతన్త్రం = మూడువేదములకు సంబంధించిన కర్మప్రయోగములను బోధించు కల్పతంత్రము, త్రిదండం=త్రిదండ మనెడు పాశుపతవ్రతము, భస్మపుండ్రకం = నొసట విభూతిరేఖలు దిద్దుకొనుట అనునది యంతయు, ప్రజ్ఞాపౌరుషనిఃస్వానాం; ప్రజ్ఞా=మేధాశక్తి, పౌరుష=సామర్థ్యము అను వీనిచే, నిఃస్వానాం = శూన్యులైనవారికి, అనఁగా వంచనచేతను దొంగతనముచేతను బలముచేతను సంపాదించుట కశక్తులగు పురుషులకు, జీవికా=జీవనోపాయము అని, జీవః=బృహస్పతి యను నాస్తిక దర్శన కర్త, జల్పతి=చెప్పుచున్నాడు. అనగా అగ్నిహోత్రాదులను చేయుట, విభూతులను బట్టించుకొనుట మున్నగునవి బ్రతుకుతెరువులే కాని పరలోక సాధనములగు తాత్త్వికములగు ధర్మములు కావు. కావుననే- 'అగ్నిహోత్రం త్రయో వేదా స్త్రిదండం భస్మపుండ్రకం, బుద్ధి పౌరుష హీనానాం జీవికేతి బృహస్పతిః' అను బృహస్పతి వచనము పై విషయము దృఢపఱచుచున్నది. కావున అగ్నిహోత్రాదు లప్రమాణములనియే భావము.

సమాసములు :

త్రయీతన్త్రం-త్రయాణాం సమూహః=త్రయీ, త్రయ్యాః తన్త్రం =త్రయీతన్త్రం.

త్రిదండం-త్రయః దండాః యస్మిన్ తత్=త్రిదణ్డం.

భస్మపుండ్రకం-భస్మనాం పుణ్డ్రకం=భస్మపుణ్డ్రకం.

ప్రజ్ఞాపౌరుషనిఃస్వానాం - పురుషస్య కర్మ=పౌరుషం, ప్రజ్ఞా చ పౌరుషం చ=ప్రజ్ఞాపౌరుషే, ప్రజ్ఞాపౌరుషాభ్యాం నిఃస్వాః = ప్రజ్ఞా పౌరుషనిఃస్వాః, తేషాం=ప్రజ్ఞా పౌరుషనిఃస్వానాం.

భావము :

బ్రతికి యున్నంత కాలము ఉదయసాయంకాలములయందు ఫలాపేక్ష లేక కాని, ఫలాపేక్ష గలిగి కాని, యాచరింపబడు కర్మ అగ్నిహోత్ర మన బడును. మూడు వేదములలోను విహితములగు కర్మలను గూర్చి ప్రయోగము లను బోధించునట్టి కల్ప సూత్ర గ్రంథముల సిద్ధాంతములు, పాశుపతులకు సంబంధించిన త్రిదండవ్రతము, భస్మధారణ యను నిది యంతయు, వంచన, దొంగతనము, బలవంతము మొదలగు నుపాయములతో ద్రవ్యార్జన చేయలేనివారికి జీవనోపాయము లని బృహస్పతి వచించెను. ॥౩౯॥

శ్లో. శుద్ధి ర్వంశద్వయీశుద్ధా పిత్రోః పిత్రో ర్యదేకశః,
తదానన్తకులా దోషా దదోషా జాతి రస్తి కా. 40

ప. వి. శుద్ధిః-వంశద్వయీశుద్ధా-పిత్రోః-పిత్రోః - యత్-ఏకశః-తత్ - అనన్త కులా-దోషాత్-అదోషా-జాతిః-అస్తి-కా.

అర్థము :- శుద్ధిః-పరిశుద్ధులగు తల్లిదండ్రులవలన జన్మించుటయే బ్రాహ్మణత్వ క్షత్రియత్వ వైశ్యత్వాదుల లక్షణము. అటువంటి శుద్ధి, యత్=ఎందు వలన, పిత్రోః=తల్లిదండ్రులకు, పిత్రోః=తల్లితండ్రులైన అనగా మాతామహపితామహులు, మాతామహి, పితామహియు అనువీరికి, ఏకశః

=ప్రత్యేకముగా, వంశద్వయీ శుద్ధౌ సత్యాం-రెండు వంశముల శుద్ధి యుండగా, ఈ విధముగానే వారికిని అనగా మాతామహునకును, మాతామహికిని పితామహునకును, పితామహికిని యిట్లే బ్రహ్మవరకును నున్న వెనుకటి వారికిని శుద్ధియుండగా నేర్పడును. అది పరీక్షింపఁదగినది. తదా=అప్పుడు, అనన్తకులా = అపరిమిత వంశ భేదము కలిగిన, దోషాత్ = అశుద్ధి నిశ్చయము వలన, అనగా తెలియ సాధ్యము గాని శుద్ధితో కూడిన స్త్రీ పురుషసంతాన పరంపర గలిగి యుండుటచే సంతాన శుద్ధి సందేహింపబడుటవలనను, ఇంద్రచంద్రాదులకును పురాణముల ననుసరించి వ్యభిచారము తెలియుటవలనను, అశుద్ధినిశ్చయ మేర్పడుట వలన, జాతిసంకరరూపమగు దోషముండుటవలన, కా = ఏ, జాతి =జాతి, అదోషా=దోషరహితమై, అస్తి=ఉన్నది, మరియు — 'అప్యేకపంక్త్యాం నాశ్నీయాత్ సంయుతైః స్వజనై రపి, కోహి జానాతి కిం కస్య ప్రచ్ఛన్నం పాతకం భవేత్' అని ఏక పంక్తిలో స్వజనులతో గూడ భుజింపరా దనియు-'అనాదా విహ సంసారే దుర్వారే మకరధ్వజే, కులే చ కామినీమూలే కా జాతిపరికల్పనా?'' అని సంసార మనాది యగుటవలన, కామము దుర్నిరోధ మగుటవలన, కులములకు కామినులు మూల మగుటవలన శుద్ధమగు జాతిని కల్పింప సాధ్యము కాదనియు జెప్పుట వలన, అందఱును సంకరులగుట వలన, జాతులన్నియు సాంకర్యముతో గూడిన వగుట వలన, జాతిధర్మములను వదలి స్వేచ్ఛగా వ్యవహరించుటయే సముచితమని నాస్తికాశయము.

సమాసములు :

వంశద్వయీశుద్ధౌ-వంశయోః ద్వయీ=వంశద్వయీ, వంశద్వయ్యాః శుద్ధిః=వంశద్వయీశుద్ధిః తస్యాం = వంశద్వయీశుద్ధౌ,
పిత్రోః-మాతాచ పితా చ =పితరౌ, తయోః, పిత్రోః,
అనన్తకులా – అవిద్యమానః అన్తః యస్య తత్ = అనన్తం, అనన్తం కులం యస్యాః సా=అనన్తకులా.
అదోషా—అవిద్యమానః దోషః యస్యాః సా=అదోషా.

**భావము :**

జాతిశుద్ధి తల్లి వంశముయొక్కయు, తండ్రి వంశముయొక్కయు, వెనుకటి పరంపరయొక్కయు, శుద్ధిపై నాధారపడినది. కావున జాతి, తలిదండ్రులనుండి వెనుకకు బ్రహ్మవఱకును లెక్కవేసికొనినచో నసత్తము లేనిది. ఇటువంటి సుదీర్ఘమగు వంశపరంపరలో వ్యభిచారాది దోషములు ఉండవని చెప్పసాధ్యము కాదు. ఏల యనగా ? పురాణములలో ఇంద్ర చంద్రాదులకును వ్యభిచారదోష మేర్పడియున్నట్లు తెలియుచున్నది. కాన నీ యనంతజాతి, ప్రపంచజాతి శుద్ధినిగూర్చి ప్రసంగించుట వ్యర్థము. కాన జాతులన్నియు పెక్కు దోషములతో సంకీర్ణములు గాన జాతిధర్మమును వదలి స్వేచ్ఛగా వ్యవహరించుట మంచిదని యాశయము. ॥40॥

శ్లో. కామినీవర్గసంసర్గై ర్న కః సఙ్క్రాన్తపాతకః,
నాశ్నాతి స్నాతి హా మోహాత్ కామక్షామవ్రతం జగత్. 41

ప.వి. కామినీవర్గసంసర్గైః-న-కః-సంక్రాన్తపాతకః-న-అశ్నాతి-స్నాతి-హా-మోహాత్-కామక్షామవ్రతం-జగత్.

అర్థము: కామినీవర్గసంసర్గైః—కామినీవర్గ=నానా జాతులకు చెందిన స్త్రీలయొక్క, సంసర్గైః=సంబంధములచే, కః=ఏ పురుషుడు, సంక్రాన్తపాతకః= సంక్రమించిన పాపము గలవాడుగా, న = కాడు, ''సంవత్సరాత్తు పతతి పతితేన సహాచరన్'' అని చెప్పినట్లు పాతకముగల స్త్రీతోటి సంసర్గమువలన సంవత్సరములోపల పతనము చెందును. (అందువలన) కామక్షామవ్రతం, కామ=ఫలములతో, క్షామ=శూన్యమైన, వ్రతం= వ్రతములుగలిగిన, (ఇట్టి పాతకము లాచరించెడివారి వ్రతాదులు సైతము నిష్ఫలములని యర్థము ) జగత్ = ప్రపంచము, మోహాత్ = మోహమువలన, నాశ్నాతి=ఏకాదశ్యాదులందు భుజింపదు. స్నాతి= తీర్థాదులందు స్నానమాడుచున్నది. హా=కష్టము.

సమాసములు :

కామినీవర్గసంసర్గైః — కామినీనాం వర్గః=కామినీవర్గః, కామినీవర్గస్య సంసర్గాః=కామినీవర్గ సంసర్గాః, తైః=కామినీవర్గసంసర్గైః.

సంక్రాన్తపాతకః — సంక్రాన్తాని పాతకాని యస్మిన్ సః = సంక్రాన్త పాతకః.

కామక్షామవ్రతం — కామేన క్షామం=కామక్షామం. కామక్షామం వ్రతం యస్య తత్=కామక్షామవ్రతం.

భావము :

పురుషునికంటె కామినులకు నెనిమిదంతలు కామమని శాస్త్రములు చెప్పుచున్నవి. అట్టి నానాజాతులకు చెందిన స్త్రీల సంసర్గముచే, పురుషునకు పాతకము సంక్రమించును. పాతకము గల స్త్రీసంసర్గముచే అందరును పాతకులే యగుదురు. కాన నట్టివా రాచరించెడి ఏకాదశ్యుపవాసాది వ్రతములన్నియు నిష్ఫలములే. పురుషుడు స్వయముగా దోషరహితుడైనను వ్యభిచారముచే దోషి యగును. స్త్రీలు తాము శుద్ధులైనను దుష్టపురుషసంసర్గముచే దోషయుక్తమగుదురు. కాన ఈ విధముగా అందరును పాతకులగుటవలన వారు చేయునుపవాసాదివ్రతము లన్నియు వ్యర్థములే యగుచున్నవి. ఇది తెలియక మోహముతో వారు ఏకాదశ్యాదులందు భుజింపరు. తీర్థములయందు స్నానము చేతురు. కాని ఇవి వ్యర్థములు స్వేచ్ఛగా జీవించుటయే యుచితమని యాశయము. ॥41॥

శ్లో. ఈర్ష్యయా రక్షతో నారీ ర్ధి క్కులస్థితిదాంభికాన్,
స్మరాన్ధత్వాఽవిశేషేఽపి తథా నర మరక్షతః. 42

ప. వి. ఈర్ష్యయా—రక్షతః—నారీః—ధిక్—కులస్థితిదాంభికాన్ -స్మరాన్ధత్వావిశేషే -అపి -తథా- నరమ్- అరక్షతః.

అర్థము: ఈర్ష్యయా = అసహనముచే, నారీః — స్త్రీలను, రక్షతః = రక్షించునట్టి అనగా పరపురుషదర్శనాదులను జేయనీయక కాపాడునట్టి, కులస్థితి

దామ్బికాన్, కులస్థితి = బ్రాహ్మణాదిజాతులను సాంకర్యములేక కాపాడుట యను, దాంభికాన్ = దంభముకలిగిన, స్మరాన్ధత్వాఽవిశేషేఽపి, స్మరాన్ధత్వ = కామాన్ధత్వ మను విషయమున స్త్రీపురుషుల కిరువురికిని, అవిశేషేఽపి = భేదములేకపోయినను, నరం = పురుషుని, తథా = స్త్రీని వలె, అరక్షతః = రక్షింపనట్టివారినిగూర్చి, ధిక్ = ఛీ! అనగా వారు నింద్యులని యర్థము.

సమాసములు :

**కులస్థితిదాంభికాన్**, కులస్య స్థితిః = కులస్థితిః, కులస్థితౌ దాంభికాః = కులస్థితిదాంభికాః, తాన్ = కులస్థితిదాంభికాన్.
స్మరాన్ధత్వావిశేషే- స్మరేణ అన్ధః = స్మరాన్ధః, స్మరాన్ధస్య భావః = స్మరాన్ధత్వం, న విశేషః = అవిశేషః, స్మరాన్ధత్వేన అవిశేషః యస్య సః = స్మరాన్ధత్వావిశేషః, తస్మిన్ = స్మరాన్ధత్వావిశేషే.
అరక్షతః- న రక్షన్తః = అరక్షన్తః, తాన్ = అరక్షతః.

భావము :

బ్రాహ్మణాదిజాతులకు సాంకర్యము కలుగునను దంభముతో పరపురుషదర్శనాదులనుండి స్త్రీనిమాత్రము రక్షించుచున్నారు. కామాన్ధత్వ మనునది స్త్రీజాతికి మాత్రమే కాదు. పురుషులకును నిది సమానము. అట్టిసందర్భమున స్త్రీని మాత్రమే రక్షించుట పురుషులను స్వేచ్ఛగా వ్యవహరింప వదిలిపెట్టుట సముచితము కాదు. జాతిసంకరము స్త్రీలు వ్యభిచరించుటవలననే కాదు. పురుషులు వ్యభిచరించినను సంభవించును. కావ ఉభయులను రక్షింపవలయును. అట్లు ఉభయులను రక్షించినపుడే జాతిసాంకర్యము వారింపసాధ్యము కాని, అందొకరిని రక్షించుట కేవలము ఓర్వలేనితనమువలన నేర్పడినది. మరియు పురుషుని రక్షింపక స్త్రీనిమాత్రమే రక్షించుట వర్ణసాంకర్యనివృత్తి కని భావించుట కేవలము దంభమే కాని మరియొకటి కాదు. అట్టి దాంభికులు నింద్యులు. ॥42॥

శ్లో. పరదారనివృత్తిర్యా సోఽయం స్వాయ మనాదృతః,
అహల్యాకేలిలోలేన దమ్భో దమ్భోలిపాణినా, 43

ప. వి. పరదారనివృత్తిః-యా-సః-అయం-స్వయమ్ - అనాదృతః - అహల్యా కేలిలోలేన-దమ్భః-దమ్భోలిపాణినా.

అర్థము: యా=ఏ, పరదారనివృత్తిః,పరదార=పరస్త్రీలనుండి, నివృత్తిః=ముఖ దర్శనాదులను జేయక మఱలియుండుట, అనగా "తా స్సాదరం న ద్రష్టవ్యాః కిం పునస్స్ప్రష్టవ్యాః"ఇత్యాదిశాస్త్రము ననుసరించి వర్తించుట, సోఽయం=ఆయీవిషయము, వంచనరూపమైన, దమ్భః=దమ్భము, అహల్యాకేలిలోలేన- అహల్యా = అహల్యతో, కేలి=కామకేలియందు, లోలేన=ఆసక్తికలిగిన, దమ్భోలిపాణినా=వజ్రాయుధముచేత ధరించిన యింద్రునిచే, స్వయం=స్వయముగా, అనాదృతః=అలక్ష్యము చేయ బడినది, పరస్త్రీగమన ప్రాయశ్చిత్తవిభాగముకూడ నితనిచే దూషింప బడినది. మఱియు నితరులకు పరదారగమనము చేయరాదని యుపదే శింతురుకాని తాముమాత్రము పరదారగమనము చేయుచునే యుందురని పరిహాసముకూడ నతనిచే సూచితము. కాన ఇంద్రు డిట్టి దంభమును వదలియే పరదారగమనము జేసి ఇతరులు చెప్పునట్టి యుపదేశము లన్నియు దంభములని సూచించెనని యర్థము.

సమాసములు :

పరదారనివృత్తిః-పరేషాం దారాః=పరదారాః,పరదారేభ్యః నివృత్తిః= పరదారనివృత్తిః.

అనాదృతః-న ఆదృతః=అనాదృతః.

అహల్యాకేలిలోలేన- అహల్యయా కేలిః=అహల్యాకేలిః, అహల్యాకేలౌ లోలః=అహల్యాకేలిలోలః, తేన=అహల్యాకేలిలోలేన.

దంభోలిపాణినా-దమ్భోలిః పాణౌ యస్య సః =దంభోలిపాణిః,తేన= దంభోలిపాణినా.

భావము :

పరస్త్రీల సంపర్కము చేయరాదని చెప్పెడు శాస్త్రములన్నియు పరవం చనారూపమైన దంభమే. ఈ దంభమును అహల్యతో సంపర్కము గావించిన

ఇంద్రుడు ఉపేక్షించెను. పరదారసంపర్కము చేయరాదని యొరులకు చెప్పుచు తాము మాత్రము చేయుచునే యుందురు. కాన నిది దంభమనియు, పరిహసింప దగినదనియు ఇంద్రుడు అహల్యాసంపర్కము చేసి సూచించెను. ॥43॥

శ్లో. గురుతల్పగతౌ పాపకల్పనాం త్యజత ద్విజాః,
యేషాం వః పత్యు రత్యుచ్చై ర్గురుదారగ్రహే గ్రహః 44

ప. వి. గురుతల్పగతౌ-పాపకల్పనాం - త్యజత-ద్విజాః - యేషాం-వః-పత్యుః-అత్యుచ్చైః-గురుదారగ్రహే-గ్రహః.

అర్థము: భో ద్విజాః = ఓ ద్విజులారా! గురుతల్పగతౌ = గురుస్త్రీసంపర్కము నందు, పాపకల్పనాం = పాపమును కల్పించుటను, త్యజత = విడువుడు. యేషాం = ఏ, వః = మీయొక్క, పత్యుః = రాజైన అనగా ద్విజరాజైన చంద్రునికి, గురుదారగ్రహే, గురుదార = గురువైన బృహస్పతి భార్య యగు తారను, గ్రహే = సంభోగమునకై గ్రహించుటయందు, ఉచ్చైః = అధికమైన, గ్రహః = పట్టుదల వినబడుచున్నది.

సమాసములు :

*గురుతల్పగతౌ* – గురోః తల్పం = గురుతల్పం, గురుతల్పస్య గతిః = గురుతల్పగతిః, తస్యాం = గురుతల్పగతౌ.
*పాపకల్పనాం*–పాపస్య కల్పనా = పాపకల్పనా, తాః = పాపకల్పనాం.
*గురుదారగ్రహే*-గురోః దారాః = గురుదారాః, గురుదారాణాం గ్రహః = గురుదారగ్రహః, తస్మిన్ = గురుదారగ్రహే.

భావము :

"బ్రహ్మహా మద్యపః స్తేనః తథైవ గురుతల్పగః, ఏతే మహాపాతకినః" అను ధర్మశాస్త్రవచనము ననుసరించి గురుస్త్రీగమనము చేయుటవలన మహాపాతక మేర్పడుచున్నది. కాని ఈ విషయమును మీరు వదిలిపెట్టుడు. ఏల యనగా ద్విజులైన మీ అందరికిని "ద్విజరాజః శశధరః నక్షత్రేశః క్షపాకరః" అని

ప్రభువైన ద్విజరాజగు చంద్రుడు, గురువైన బృహస్పతియొక్క భార్యయగు తారతో రమించుటయందు ఎక్కువ పట్టుదల గలవాడు. కాన "రాజ్ఞి ధర్మిణి ధర్మిష్ఠాః పాపే పాపాః సమే సమాః, రాజాన మనువర్తన్తే యథా రాజా తథా ప్రజాః" అను ధర్మశాస్త్ర వచనము ననుసరించి రాజు ఏ విధముగా నుండునో ప్రజలు నట్లే యుందురు గాన, మీరాజైన చంద్రు డెట్టి పాపభీతి లేక గురుస్త్రీ గమనము జేసినప్పుడు మీరును నట్లే చేయవచ్చును. పూర్వము చంద్రునికి గురువైన బృహస్పతియొక్క భార్యతో సంపర్క మేర్పడగా బ్రహ్మ యాతని నామెనుండి విడిపించెను. కాని యా చంద్రునికి జన్మించిన పుత్రుని మాత్రము గ్రహించె నను కథ యిట ననుసంధేయము. ॥44॥

శ్లో. పాపాత్తాపాః ముదః పుణ్యాత్ పరాసో స్స్యురితి శ్రుతిః,
వైపరీత్యం ధ్రువం సాక్షాత్ తదాఖ్యాత బలాబలే. 45

ప. వి. పాపాత్-తాపాః-ముదః - పుణ్యాత్ - పరాసోః - స్యుః - ఇతి - శ్రుతిః-వైపరీత్యం-ధ్రువం-సాక్షాత్-తత్-ఆఖ్యాత-బలాబలే.

అర్థము: పరాసోః=ప్రాణములు తొలగిన అనగా మరణించినవానికి, పాపాత్= ఐహిక పాపములనాచరించుటవలన, తాపాః=నరక దుఃఖములు, పుణ్యాత్= ఐహికములగు పుణ్యముల నాచరించుటవలన, ముదః=సంతోషములు, అనగా స్వర్గసుఖములు, స్యుః ఇతి=కలుగునని, శ్రుతిః=వేదము, ఆహ=చెప్పుచున్నది. కిన్తు=కాని, వైపరీత్యం=పైశ్రుతికి విపరీతము, అనగా మద్యపానముచేతను, పొందరాని స్త్రీని పొందుటచేతను, తదితర నిషిద్ధకార్యములచేతను, సుఖము, అట్లే యజ్ఞాదిపుణ్యకార్యములచేత దుఃఖము, ధ్రువం=సత్యముగా, సాక్షాత్=ప్రత్యక్షముగా, దృశ్యతే= చూడబడుచున్నది. తత్=ఆప్రత్యక్ష ఆగమములకు, బలాబలే; బల =బలము, అబలే=దౌర్బల్యము, ఆఖ్యాత=చెప్పుడు. గ్రావప్లవనవాక్యము వలె, ప్రత్యక్షవిరోధ ముండుటవలన, శ్రుతిప్రత్యక్షములకు విరోధ మేర్పడినపుడు, ప్రత్యక్షమే ప్రబలమగును గాన, శ్రుతి యిచ్చట దుర్బలమైనది. కాన పాపజన్యమగు సుఖము ప్రత్యక్షము గాన, అందరును పాపమునే చేయవలయునని యర్థము.

సమాసములు :

వైపరీత్యం - విపరీతస్య భావః=వైపరీత్యం.
బలాబలే - బలం చ అబలం చ=బలాబలే, తే=బలాబలే.

భావము :

చనిపోయినవానికి ఇహలోకమున పాపములు చేయుటవలన పరలోకమున నరకప్రాప్తియు, ఇహలోకమున పుణ్యములు చేయుటవలన స్వర్గసుఖములు పరలోకమున నేర్పడుచున్నవని శ్రుతి చెప్పుచున్నది. కాని దానికి విరుద్ధముగా పాపకార్యములవలన సుఖము, యాగాది పుణ్యకార్యములవలన దుఃఖము నిజముగా ప్రత్యక్షముచే గాంచుచున్నాము. గాన నో ద్విజులారా! రాళ్ళు తేలియాడుచున్నవను వాక్యమువలె ప్రత్యక్ష విరోధమువలన శ్రుతికంటె ప్రత్యక్షమే ప్రబలము కాన, పాపమువలన సుఖము ప్రత్యక్షము కాన అందరును పాపమునే చేయవలయును. ॥45॥

శ్లో. సందేహా దన్యదేహాప్తే ర్వివర్జ్యం వృజినం యది,
త్యజత శ్రోత్రియా స్సత్రం హింసాదూషణసంశయాత్. 46

ప. వి. సందేహాత్ - అన్యదేహాప్తేః - వివర్జ్యం - వృజినం - యది - త్యజత - శ్రోత్రియాః - సత్రం - హింసాదూషణసంశయాత్.

అర్థము: అన్యదేహాప్తేః, అన్యదేహ= మరణించినవ్యక్తి మఱియొక దేహమును, ఆప్తేః=పొందుటవలన, సందేహేఽపి = సందేహమున్నను, అనగా పాపము చేసినవాడైనచో మరణించి దేహాంతరమును పొంది, నరకమును అనుభవించునని, వాదించు వానికిని, ఎవ్వడు పాపము చేయునో వాడు దహింపబడెను గాన, వానికి మరియొక దేహమును పొందు నవకాశము లేదు గాన నరకానుభవముకూడ లేదని వాదించువానికిని యీవిరుద్ధ వాక్యద్వయముచే అనగామరణించినవాడు దేహాంతరమునుబొంది నరకము

ననుభవించు నను వాక్యము చేతను, మరణించినవాడు దహింపబడెను కాన దేహాంతరము లేదు. అందువలన నరకానుభవము కూడ లేదను నీవాక్యము చేతను సంశయ మేర్పడినను, వృజినం = పరదారగమనాదులవలన పాపము, యది వివర్జ్యం = విడువదగినదే యైనచో ననగా పాక్షిక దోషము పరిహరింపదగినదే యైనను అప్పుడు, హే శ్రోత్రియాః = ఓ వేదాధ్యయన పరులారా! హింసాదూషణ సంశయాత్ — హింసా = జీవహింస యను, దూషణ = దోషమువలన పాపముగల్గునను, సంశయాత్ = సంశయమువలన, (వేదవిహిత హింసలవలనను పాపము గల్గునని సాంఖ్యులు చెప్పుచుండుటచే) సత్రం = యజ్ఞమును, త్యజత = వదలుడు. అనగా సర్వయాగములను వదిలిపెట్టుడు. ఏలయనగా పాక్షిక దోష మున్నందువలన వదిలిపెట్టుడు. కాని పరదాంగమనాదులు అహింసాత్మకములు పైగా సుఖకరములు. కాన వీనియందు పాపము లేదని యర్థము.

సమాసములు :

అన్యదేహాప్తేః - అన్యశ్చాసౌ దేహశ్చ = అన్యదేహః, అన్యదేహస్య ఆప్తిః = అన్యదేహాప్తిః, తస్యాః = అన్యదేహాప్తేః.

హింసాదూషణ సంశయాత్ - హింసైవ దూషణం = హింసాదూషణం, హింసాదూషణేన సంశయః = హింసాదూషణ సంశయః. తస్మాత్ = హింసాదూషణసంశయాత్.

భావము :

దేహమే యాత్మయనియు దేహభిన్నమే యాత్మ యనియు వాదమున రెండు పక్షములున్నవి. దేహమే యాత్మయని చెప్పువారి పక్షమే నాస్తిక పక్షము. ఈ పక్షమున పాపముచేసినవాడు మరణించినపిదప దహింపబడెను కాన వానికి నరకప్రాప్తి లేదని యాశయము. దేహాంతరము ఆత్మయని చెప్పువాని పక్షమున, పాపము చేసినవాడు మరణించిన పిదప దేహాంతరమును పొందును. కాన వాడు చేసిన పాపమువలన నరకము ననుభవించును. అని

ఇట్లు విరుద్ధముగా వాదించుటవలన సందేహము వచ్చుచున్నది. ఇట్లు దేహాన్తర ప్రాప్తి సందిగ్ధమైనను పరదారగమనాదులవలని పాపము వర్జింపదగినదైనప్పుడు జీవహింసచే పాపము గలుగునని సంశయ ముండుటవలన యజ్ఞములను గూడ వర్జించుట న్యాయ్యము. వేదవిహిత హింసయందును పాపమున్నదని సాంఖ్యులు చెప్పుచున్నారు. పరదారగమనాదికము హింసారూపముకాదు. పైగా సుఖ సాధనము. కాన దానివలన నెట్టి పాపములేదు. ॥46॥

శ్లో. య స్త్రివేదీవిదాం వర్యః స వ్యాసో౽పి జజల్ప వః,
రామాయా జాతకామాయాః ప్రశస్తా హ స్తధారణా. 47

ప. వి. యః– త్రివేదీవిదాం – వర్యః–వ్యాసః–అపి–జజల్ప-వః- రామాయాః– జాతకామాయాః–ప్రశస్తా–హ స్తధారణా.

అర్థము: (కించ = మఱియు) త్రివేదీవిదాం, త్రివేదీ = మూడువేదములను, విదాం = తెలిసినవారికి, యః = ఎవడు, వర్యః = పూజ్యుడో, సః = ఆ, వ్యాసో౽పి = వ్యాసమహర్షియు, జాతకామాయాః = రమించుటకు కామము కలిగిన, రామాయాః = కాముకురాలియొక్క హ స్తధారణా = హ స్తములయందు పట్టుకొనుట ప్రశస్తా = శ్రేష్ఠమైనది. (ఇతి = అని) వః = మీకు, జజల్ప = చెప్పెను కావుననే

స్మరార్తాం విహ్వలాం దీనాం యో న కామయతే స్త్రియం,
బ్రహ్మహా స తు విజ్ఞేయో వ్యాసో వచన మబ్రవీత్.

అను మహాభారత వచనము ననుసరించి కాముకురాలగు స్త్రీయొక్క కోర్కెను దీర్పని పురుషుడు బ్రహ్మహత్యాదోషమును పొందును. మరియు వ్యాసమహర్షి విచిత్రవీర్యుని భార్యను బొంది పుత్రోత్పత్తిని గూడ జేసియుండును.

సమాసములు:

త్రివేదీవిదాం–త్రయాణాం వేదానాం సమాహారః = త్రివేదీ, త్రివేదీం విద న్తీతి = త్రివేదీవిదః, తేషాం = త్రివేదీవిదాం.

జాతకామాయాః-జాతః కామః యస్యా స్సా=జాతకామా, తస్యాః= జాతకామాయాః.

హస్తధారణా-హస్తయోః. ధారణా=హస్తధారణా.

**భావము:**

మఱియు ఋగ్యజుస్సామము లనఁబడు మూడు వేదములు నేర్చిన వారికి, ఋజ్యుడైన వ్యాసమహర్షి కామముతో రమింపగోరిన స్త్రీయొక్క యభిలాషను దీర్చుట యుక్తమని చెప్పెను. అట్లు చేయని పురుషుడు బ్రహ్మహత్య నొడిగట్టుకొనుననియు వ్యాసుడు విచిత్రవీర్యుని భార్యతో రమించి యావిధముగనే పుత్రోత్పత్తిని గావించెననియు భారతమువలన తెలియుచున్నది. ॥47॥

శ్లో. సుకృతే వః కథం శ్రద్ధా సురతే చ కథం న సా,
తత్కర్మ పురుషః కుర్యాత్ యేనాన్తే సుఖ మేధతే. 48

ప. వి. సుకృతే-వః-కథం-శ్రద్ధా-సురతే-చ-కథం-న-సా-తత్-కర్మ-పురుషః-కుర్యాత్-యేన-అన్తే-సుఖం-ఏధతే.

అర్థము: సుకృతే=తపము, యజ్ఞము మొదలగు పుణ్యకర్మలయందు, వః= మీకు, కథం=ఏ ప్రకారము, శ్రద్ధా=విశ్వాసము, సురతే = సంభోగమునందు, సా=ఆ శ్రద్ధ, కథం=ఎట్లు, న = లేదు. అనగా నిందే శ్రద్ధ కలిగియుండవలయునని యర్థము. ఏలయనగా ? పురుషః=పురుషుడు, తత్=ఆ, కర్మ=కార్యమును, కుర్యాత్ = చేయవలయును, యేన=ఏ కార్యముచే, అంతే=చివరకు, సుఖం=సుఖము, ఏధతే= వర్ధిల్లుచున్నదో. కావున సుఖము కొఱకే కార్యమును జేయవలయును. అట్టి సురతమే యనుభవసిద్ధమైనది. కాని సుకృత మట్టిది గాదు. ఏల యనగా నది దుఃఖకరమైనదని యర్థము.

**భావము:**

తపోయజ్ఞాది పుణ్యకర్మలయం దెందుల కంతటి శ్రద్ధ? స్త్రీ సంభోగాదులయందు ఎందుల కాశ్రద్ధ లేదు ? అందే శ్రద్ధ ముఖ్యముగా నుండవల

యను పురుషుడు చివర నేది సుఖమిచ్చునో అట్టి కార్యమునే చేయవలయును. అట్టిది సురతమేకాని తపోయజ్ఞాదిరూపమైన సుకృతము కాదు. ॥48॥

శ్లో. బలాత్ కురుత పాపాని సన్తు తాన్యకృతాని వః,
సర్వా న్బలకృతా నర్థా నకృతా న్మను రబ్రవీత్. 49

ప. వి. బలాత్- కురుత - పాపాని - సన్తు- తాని- అకృతాని - వః- సర్వాన్- బలకృతాన్-అర్థాన్-అకృతాన్-మనుః-అబ్రవీత్.

అర్థము: (కించ=మఱియు) బలాత్=బలవంతముగా, అనగా శాస్త్రవచనము నుపేక్షించి, పాపాని=పాపములను, కురుత=చేయుడు. తాని=ఆ బలవంతముగా చేయబడిన పాపములు, అకృతాని = చేయబడనివిగా, వః=మీకు, సన్తు=ఉండవలయును. సర్వాన్=సమస్తములైన, బలకృతాన్ = బలవంతముగా చేయబడిన, అర్థాన్ =వ్యాపారములను, అకృతాన్=చేయబడనివిగా, మనుః=మనువు, అబ్రవీత్ = పలికెను. కాన బలవంతముగా చేయబడినది దోషముకాదు. కావుననే-

"బలా ద్దత్తం బలాద్భుక్తం బలా ద్యచ్చాపి లేఖితం,
సర్వా న్బలకృతా నర్థా నకృతా న్మను రబ్రవీత్" యని బలవంతముగా నీయబడినవి, భుజింపబడినవి, వ్రాయబడినవి మున్నగువాని నన్నింటిని, అట్లుచేయబడనివిగనే భావింపవలసినట్లు మనువు వచించెను.

సమాసములు :

అకృతాని - న కృతాని=అకృతాని.
బలకృతాన్ - బలేన కృతాః=బలకృతాః, తాన్=బలకృతాన్.
అకృతాన్ - న కృతాః=అకృతాః, తాన్=అకృతాన్.

భావము :

శాస్త్రవచనము లెక్కింపక బలవంతముగానైనను పాపములను చేయుడు. బలవంతముగా చేయబడిన వన్నియు చేయబడనట్లే భావింపతగినవని మనువు

చెప్పెను కాని యిట మనువు తాత్పర్యము వేరు. ఏమనగా బలవంతము చేయ బడిన వ్యవహారపత్రములోని వ్రాతలు చెల్లనేరవని వారి యాశయము. కాని ఇది చార్వాకుని ప్రలపనము గాన దాని నీవిధముగా పరివర్తించి యతడు చెప్పె నని గ్రహింపవలయును. ॥58॥

శ్లో. స్వాగమార్థేఽపి మా స్థాస్మిం స్తీర్థికా విచికిత్సవః,
తం త మాచరతానన్దం స్వచ్ఛన్దం యం యమిచ్ఛథ. 59

ప.వి. స్వాగమార్థే-అపి-మా-స్థ-అస్మిన్ - తీర్థికాః - విచికిత్సవః-తం - తం-ఆచరత-ఆనన్దం-స్వచ్ఛన్దం-యం-యం-ఇచ్ఛథ.

అర్థము: హే తీర్థికాః = ఓశాస్త్రజ్ఞులారా! అస్మిన్ = ఈమనువుచెప్పినట్టి, స్వాగమార్థేఽపి=బలాత్కారరూపమగు తన శాస్త్రార్థమందును, విచికిత్సవః=సందేహము కలిగినవారుగా, మా స్థ=కాకయుండుడు. అతః =ఇందువలన, యం యం=ఏ యే, ఆనన్దం=పరస్త్రీగమనరూపమగు సుఖమును, ఇచ్ఛథ = కోరుదురో, తం తం=ఆ యా యానన్దమును, స్వచ్ఛన్దం=యథేచ్ఛగా, ఆచరత=అనుభవింపుడు.

సమాసములు :

స్వాగమార్థే - స్వస్య ఆగమః = స్వాగమః, స్వాగమస్య అర్థః = స్వాగమార్థః, తస్మిన్=స్వాగమార్థే.
తీర్థికాః - తీర్థేన చరన్తీతి=తీర్థికాః.

భావము :

ఓ శాస్త్రజ్ఞులారా! మనువు చెప్పిన బలాత్కారరూప శాస్త్రార్థవిషయమున సంశయింపకుడు. మీరు పరస్త్రీగమనాదిరూపమగు నే యే సుఖమును కోరుదురో, వాని నన్నింటిని నిర్భయముగా ననుభవింపుడు. ॥50॥

శ్లో. శ్రుతిస్మృత్యర్థబోధేషు క్వైకమత్యం మహాధియాం,
వ్యాఖ్యా బుద్ధిబలాపేక్షా సా నోపేక్ష్యా సుఖోన్ముఖీ. 51

ప. వి. శ్రుతిస్మృత్యర్థబోధేషు-క్వ-ఐకమత్యం-మహాధియాం-వ్యాఖ్యా- బుద్ధిబలాపేక్షా-సా-న-ఉపేక్ష్యా-సుఖోన్ముఖీ.

అర్థము : మహాధియాం=సునిశితబుద్ధిగలవారికి, శ్రుతిస్మృత్యర్థబోధేషు, శ్రుతి =వేదములయొక్క, స్మృతి=ధర్మశాస్త్రములయొక్క, అర్థ=విషయముల యందలి, బోధేషు=జ్ఞానములయందు, ఐకమత్యం=ఏకాభిప్రాయము, క్వ=ఎక్కడిది? ఎక్కడను లేదు. అంతట నభిప్రాయభేదమే యుండును. కిన్తు=కాని, వ్యాఖ్యా=పదవాక్యార్థవివరణము, బుద్ధిబలాపేక్షా=బుద్ధి బలము ననుసరించినది. జ్ఞానముయొక్క యతిశయము ననుసరించి వివిధవ్యాఖ్యలు గావించి, పరమతములను నిరాకరించి తనమతమును స్థాపించుకొనవచ్చును. కాన, సుఖోన్ముఖీ=సుఖమువంకకు సరిపడునట్టి, సా = ఆ వ్యాఖ్య, నోపేక్ష్యా = ఉపేక్షింపదగినదికాదు. కాన నదియే గ్రహింపదగినదని యర్థము.

సమాసములు :

శ్రుతిస్మృత్యర్థబోధేషు-శ్రుతయశ్చ స్మృతయశ్చ=శ్రుతిస్మృతయః, శ్రుతిస్మృతీనాం అర్థాః=శ్రుతిస్మృత్యర్థాః, శ్రుతిస్మృత్యర్థానాం బోధాః =శ్రుతిస్మృత్యర్థబోధాః, తేషు=శ్రుతిస్మృత్యర్థబోధేషు.

ఐకమత్యం - ఏకం మతం యేషాం తే = ఏకమతాః, ఏకమతానాం భావః=ఐకమత్యం.

మహాధియాం - మహతీ ధీః యేషాం తే=మహాధియః, తేషాం=మహాధియాం.

బుద్ధిబలాపేక్షా - బుద్ధేః బలం = బుద్ధిబలం, బుద్ధిబలే అపేక్షా యస్యాః సా=బుద్ధిబలాపేక్షా.

ఉపేక్ష్యా-ఉపేక్షితుం యోగ్యా=ఉపేక్ష్యా.

సుఖోన్ముఖీ-ఉద్ధృతం ముఖం యయా సా=ఉన్ముఖీ, సుఖస్య ఉన్ముఖీ =సుఖోన్ముఖీ.

భావము :

బలవంతముగా వ్యవహారములకు చెందిన పత్రాదులను విషయీకరించిన మనువువచనమునకు పై జెప్పబడిన బలాత్కారణాదులు విషయములు కావని శంకింపగా సమాధాన మిందొసగుచున్నాడు. సునిశితబుద్ధిగలవారికి వేదార్థముల యందును, ధర్మశాస్త్రార్థములయందును ఏకాభిప్రాయ మెప్పుడును కుదురదు. వేదధర్మశాస్త్రములకు గావించెడి వివరణములు కూడా బుద్ధిబలము ననుసరించి యుండును. కాన మన సుఖమునకు పర్యవసానము బొందెడి వాఖ్యనే మన మనుసరింప వలయును. కాన మనువు చెప్పిన బలాత్కారణాదు లన్నియు మన కనుకూలముగనే వ్యాఖ్యానింపదగినవి కాని వ్యవహారపరముగా వ్యాఖ్యానింప నవసరములేదు.

శ్లో. యస్మి న్నస్మీతి ధీ ర్దేహే త ద్దాహే వః కి మేనసా ?
క్వాపి కిం తత్ ఫలం న స్యా దాత్మేతి పరసాక్షికే. 52

ప. వి. యస్మిన్-అస్మి-ఇతి-ధీః-దేహే-తద్దాహే-వః-కిమ్ - ఏనసా - క్వ-అపి-కిం-తత్-ఫలం-న-స్యాత్-ఆత్మా-ఇతి-పరసాక్షికే.

అర్థము: యస్మిన్ = ఏ దేహమందు, అస్మీతి = నేను అను, ధీః = బుద్ధి యున్నదో, తద్దాహే – తత్ = ఆ శరీరమునకు, దాహే = దహన మేర్పడగా, వః = మీకు, ఏనసా = పాపముతో, కిం = ఏమి? "గౌరోఽహం, కృశోఽహం" అని నేను తెల్లగా నున్నాను. కృశుడనై యున్నాను అను వ్యవహారముల ననుసరించి దేహమున కంటె భిన్నమైన యాత్మ లేదను నభిమానము. ఏ దేహముతో పాపము చేయబడెనో ఆ దేహము దగ్ధము కాగా దేహాత్మవాదులగు మీకు పాపనరకములు లేవు. పరసాక్షికే–పర = వేదములు మున్నగు వానిని, సాక్షికే = ప్రమాణముగా గలిగిన, అనగా దేహమున కంటె భిన్నముగా వేదములచే ప్రతిపాదింపబడిన, క్వాఽపి = ఏ యితరాత్మయందును, ఆత్మేతి = ఆత్మత్వమను ధర్మముచే భేదములేనందు వలన, తత్ = ఆ నరకాది రూపమైన, ఫలం = ఫలము అనగా పాప పరిణామము, కిం = ఎట్లు, న స్యాత్ = కలుగదు ? తప్పక కలుగ వల

యును. ఏల యనగా ఒక యాత్మ పాపము గావించినపుడు ఆత్మత్వ మనెటి యాత్మయందలి ధర్మము ఆ యాత్మయందును నుండుటవలన దీనితో నది యభిన్నమై యా యాత్మ గావించిన పాపఫలమును నదియు నేల యనుభవింపదు ? దేహాతిరిక్తమగు నాత్మ ఫలము ననుభవింపదు గాన నీ దేహము నశించినచో పాపఫలము ననుభవించు ప్రసక్తి లేనందు వలన స్వేచ్ఛగా చరింపవచ్చునని యర్థము.

సమాసములు :

పరసాక్షికే-పరః సాక్షీ యస్య సః=పరసాక్షికః, తస్మిన్=పరిసాక్షికే.

భావము :

ఏ దేహమునందు నేను అను వ్యవహార మున్నదో ఆ దేహము భస్మమై నపుడు పాపముతో పని యేమున్నది? దేహము భస్మమైనపుడు పాపము కూడా భస్మమైపోయినది కదా. "నేను తెల్లగా నున్నాను. నేను కృశుడనై యున్నాను" అను వ్యవహారముల ననుసరించి దేహమే యాత్మయని సిద్ధించుచున్నది కదా. ఏ దేహమందు గావించిన పాపము ఆ దేహముతోడనే పోవుచున్నది. ఒకవేళ వేదాది ప్రమాణముల ననుసరించి దేహాతిరిక్తమగు నాత్మయున్నచో, నాత్మ యను నామము అన్ని యాత్మలకును సమానముగాన ఒక యాత్మ గావించిన పాపము మరియొక యాత్మకును అన్వయింపవలసి వచ్చుటచే ఒక యాత్మ గావించిన పాపమును మరియొక యాత్మ యనుభవింపవలసి వచ్చును. ఏలయనగా నీ యాత్మ లకన్నింటికిని యాత్మత్వమను ధర్మము సమానమైనది. కాన దేహాతి రిక్తమగు నాత్మయే లేదు గాన దేహనాశముచే పాపఫలానుభవము లేనందు వలన స్వేచ్ఛగా పాపకార్యములను జేయవచ్చును అని నాస్తికుని యాశయము.

శ్లో. మృతః స్మరతి కర్మాణి మృతే కర్మఫలోర్మయః,
అన్యభుక్తై ర్మృతే తృప్తి రిత్యలం ధూర్తవార్తయా. 53

ప. వి. మృతః- స్మరతి- కర్మాణి-మృతే- కర్మఫలోర్మయః- అన్యభుక్తైః-మృతే- తృప్తిః-ఇతి-అలం-ధూర్తవార్తయా.

అర్థము:- మృతః = చనిపోయినవాడు, కర్మాణి = తాను చేసిన కర్మలను, స్మరతి = స్మరించును. మృతే = మరణించిన వానియందు, కర్మఫలోర్మయః, కర్మ = పాపపుణ్యాది కర్మలయొక్క, ఫల = ఫలముయొక్క, ఊర్మయః = సంతానములు కలుగుచున్నవి. అన్యభుక్తైః, అన్య = శ్రాద్ధాదులయందు బ్రాహ్మణులచే, భుక్తైః = భోజనములతో, మృతే = మరణించినవారి విషయమున, తృప్తిః = సంతోషము, భవతి = ఏర్పడును ఇతి = అను, ధూర్తవార్తయా = దుష్టులు గావించెడి వంచనచే ననగా తమకు వృత్తిని కల్పించుకొనువారి మాటలచే, అలం = ప్రయోజనము లేదు. కాన శాస్త్రముకూడనొకని వ్యర్థవచనమే. అందువలన దానిని నమ్మవలదు. దేహమే యాత్మయని చెప్పునట్టివాని మతమున దేహము నశించినచో, స్మృతియు, అనుభవము సంతోషము నశించుటవలన నట్టిశాస్త్రవచనములు ప్రమాణములు కావు.

సమాసములు :

కర్మఫలోర్మయః - కర్మణాం ఫలాని = కర్మఫలాని, కర్మఫలానాం ఊర్మయః = కర్మఫలోర్మయః, అన్యభుక్తైః - అన్యైః భుక్తాని = అన్య భుక్తాని, తైః = అన్యభుక్తైః.
ధూర్తవార్తయా - ధూర్తానాం వార్తా = ధూర్తవార్తా, తయా = ధూర్త వార్తయా.

భావము :

ప్రాణి చనిపోయినపిదప తాను చేసిన కర్మల స్మరించుననియు, అతనికి తన పుణ్యపాపకర్మల ఫలము లనుభవమునకు వచ్చుననియు, అతనినిగూర్చి గావించిన శ్రాద్ధాదులయందు బ్రాహ్మణులు భుజించుటవలన అతనికి తృప్తి కలుగుననియు చెప్పెడి యాగమవచనములు పరులను వంచించి జీవనముచేయు దుష్టులు వచించునట్టి వంచనావచనములు అవి యెన్నటికి ప్రమాణములు గావు.

శ్లో. ఏకం సన్దిగ్ధయో స్తావత్ భావి తత్రేష్టజన్మని,
హేతూ నాహు స్స్వమన్త్రాదీ నసంగా నన్యథా విటాః. 54

ప. వి ఏకం- సన్దిగ్ధయోః- తావత్-భావి- తత్ర-ఇష్టజన్మని- హేతూన్-ఆహుః- స్వమన్త్రాదీన్-అసంగాన్- అన్యథా-విటాః.

**అర్థము:-** సందిగ్ధయోః=సంభవించును సంభవింపదు అను సంశయవిషయములైన యంశములయందు, ఏకం = ఇష్టమైన ఫలమునుకాని, అనిష్టమగు ఫలమునుకాని, తావత్=తప్పక, భావి=జరుగును. తత్ర=ఆ రెంటిలో, ఇష్టజన్మని సతి=ఇష్టము సిద్ధింపగా, విటాః=దుష్టులు, స్వమన్త్రాదీన్, స్వ = తమకు సంబంధించిన, మన్త్రాదీన్ = మన్త్రప్రయోగములు మున్నగువానిని, హేతూన్=కారణములుగా, ఆహుః=చెప్పుదురు. నేను మన్త్రజపములు గావించితిని. అందువలననే నీకు పుత్రాదిరూపములగు నిష్టములు చేకూరినవని తమ్ము బొగడుకొందురు. అన్యథా=అట్లు ఇష్టసిద్ధి ఏర్పడనిచో, అసంగాన్ = అసంబద్ధములగు హేతువులను, ఆహుః=చెప్పుదురు. కార్యసాధనములగు నాయా వస్తువులు లేనందువలననే ఫలము సంభవింపలేదని గృహస్థునిపై దోషమును ప్రకటింతురు.

సమాసములు :

ఇష్ట జన్మని–ఇష్టస్య జన్మ=ఇష్టజన్మ, తస్మిన్=ఇష్టజన్మని.
స్వామన్త్రాదీన్– స్వస్య మన్త్రః = స్వమన్త్రః, స్వమన్త్రః ఆదిః యేషాం తే=స్వమన్త్రాదయః, తాన్=స్వమన్త్రాదీన్.
అసఙ్గాన్–అవిద్యమానః సంగః యేషాం తే అసఙ్గాః, తాన్=అసఙ్గాన్.

భావము :

గృహస్థునకు ఇష్టానిష్టఫలములు రెంటిలోను నేదియో యొకటి సంభవించును. అందు ఇష్టము సంభవించినచో వంచకులు తమ మంత్రప్రభావమని తమ్ము పొగడుకొనెదరు. ఒకవేళ ఆవిధముగా నిష్టము సంభవింపనిచో జపాదులకు సాధనములైన వస్తువులు సమగ్రముగా లభింపలేదని వంకలుపెట్టుచు గృహస్థుమీదనే దోషము నారోపింతురు. ॥54॥

శ్లో. జనేన జానతాస్మీతి కాయం నాయం త్వమిత్యసౌ,
త్యాజ్యతే గ్రాహ్యతే చాన్య దహో శ్రుత్యాతిధూర్తయా. 54

ప. వి. జనేన-జానతా-అస్మి-ఇతి-కాయం-న-అయం-త్వమ్ - ఇతి - అసౌ - త్యాజ్యతే-గ్రాహ్యతే-చ-అన్యత్-అహో-శ్రుత్యా- అతిధూర్తయా.

అర్థము: అతిధూర్తయా=మిక్కిలి వంచించెడి, శ్రుత్యా=వేదముచే, కాయం =దేహమును, అస్మి=నేను, ఇతి=అని, జానతా=తెలుసుకొనుచున్న అనగా నేను తెల్లగా నున్నాను "నేను కృశించినవాడనై యున్నాను" ఇత్యాది వ్యవహారములయందు గోచరించునది దేహమే కాని దానికంటె భిన్నమైన ఆత్మకాదని తెలుసుకొనిన, జనేన=పురుషునిచే, అయం= ఈదేహము, త్వం=నీవు, న=కాదు, ఇతి=ఇట్లు, అసౌ=ఈదేహము, త్యాజ్యతే = విడిపింపబడుచున్నది. అనగా "నేను" అనెడి అహం ప్రతీతినుండి విడిపింపబడుచున్నది. అన్యత్ = దేహముకంటె వేరైన ఆత్మరూపమైన వస్తువు, గ్రాహ్యతే=గ్రహింపజేయబడుచున్నది. అనగా తత్త్వమసీ" త్యాదివాక్యముచే స్వీకరింపచేయబడుచున్నదని యర్థము. అహో!=ఆశ్చర్యము. అనగా సత్యము నసత్యముగను, అసత్యమును సత్యముగను చేయుటవలన నాశ్చర్యమని యర్థము.

సమాసములు :

అతిధూర్తయా-అత్యన్తం ధూర్తా=అతిధూర్తా, తయా=అతిధూర్తయా.

భావము :

ఈవిధముగా కర్మకాండను పరిహసించి ప్రకృతము జ్ఞానకాండను పరిహసించుచున్నాడు. వంచనశీలముగ గలది వేదము. పురుషుడు, "నేను తెల్లగా నున్నాను" "నేను కృశించినవాడనై యున్నాను" ఇత్యాది వ్యవహారములలో దేహమే నేననియు, దానికంటె భిన్నమైన దేదియు నేను కాదనియు తెలుసుకొను చున్నను, ఈ దేహము నీవు కాదు అని దేహము, పై వ్యవహారము నుండి

తప్పింపబడినదై, దేహమునకంటె భిన్నమైన యాత్మ గ్రహించునట్లు చేయబడు చున్నది. అనగా "తత్త్వమసి" మున్నగు మహావాక్యములచే గ్రహించునట్లు చేయబడుచున్నది. ఇట్లు సత్యమైన దేహాత్మబుద్ధిని అసత్యముగను, అసత్యమైన దేహేతరాత్మబుద్ధిని సత్యముగను చేయుటవలన నాశ్చర్య మని యర్థము. ॥55॥

శ్లో. ఏకస్య విశ్వపాపేన తాపేఽనన్తే నిమజ్జతః,
కః శ్రౌత స్యాత్మనో భీరో భరస్స్యా ద్దురి తేనః. 56

ప.వి. ఏకస్య- విశ్వపాపేన—తాపే-అనన్తే-నిమజ్జతః-కః-శ్రౌతస్య-ఆత్మనః - భీరో-భరః-స్యాత్—దురితేన-తే.

అర్థము: విశ్వపాపేన = ఎంతమంది సంసారు లున్నారో వారి కందరికిని సంబంధించిన పరస్త్రీగమనాదిరూపమగు వివిధపాతకజాలముచే, అనంతే = ఎల్లలేని లేదా క్షీణముగాని, తాపే = నరకాదిదుఃఖమునందు, నిమజ్జతః = మునిగినటువంటి, అనగా జనులందరు గావించిన యనంతపాపము ననుభవించుచున్న, శ్రౌతస్య = వేదసిద్ధమైన. అనగా ఏకమే వాద్వితీయం బ్రహ్మ" "నేహ నానాస్తి కించన" ఇత్యాది వేదములచే సిద్ధమైన ఏకస్య = పరమార్థదృష్టియందు రెండవది లేనటువంటి అనగా సమస్త దేహములయందును నాత్మ యొక్కటియే యగుటవలన నన్ని దేహము లందును చేసిన పాపములవలని ఫలమునకు భోక్త యతడే యగుచున్నాడని యర్థము. తే = నీకు అనగా నీవు చెప్పిన, ఆత్మనః = పరమాత్మ యను పేరుగల, దాసియొక్క, దురితేన = పాపముచే, అనగా పరస్త్రీగమన రూపమగు నొక్క పాపముచే, భీరో = పాపమునకు భయపడు స్వభావము గలవాడా! కః = ఏమి, భరః = భారము, స్యాత్ = అగును. దేహాతిరిక్తమగు నొక్క యాత్మ నంగీకరించువాని మతమునందు నానాదేహములవలన నేర్పడు నానాపాపసంబంధములవలె నాత్మ కొక్క పాపముచే భార మేమి యున్నది? కాన యథేచ్ఛముగా పాపమును చేయుడని యర్థము.

సమాసములు :

విశ్వపాపేన-విశ్వస్య పాపం=విశ్వపాపం, తేన=విశ్వపాపేన.
అనన్తే-అవిద్యమానః అన్తః యస్య తత్=అనన్తం, తస్మిన్=అనన్తే

భావము:

సంసారు లందరు గావించిన పరస్త్రీసంపర్కాది రూపములగు వివిధ పాపములచే క్షీణముకాని నరక దుఃఖమున మునిగిన "ఏకమే వాద్వితీయం బ్రహ్మ" "నేహ నానాస్తి కించన" ఇత్యాది శ్రుతులచే అద్వితీయముగా చెప్పబడిన పరమాత్మకు ఒక పరస్త్రీగమనమువలన గలిగిన పాపము భారమగుచున్నదా ? నీమతమున ఆత్మ యొక్కటియే కదా ! అదియే పరమాత్మయనియు చెప్పబడు చున్నది. ఆయాత్మ ప్రపంచములోని సంసారులు గావించెడి వివిధపాపములను మోయుచున్నదిగదా ! అట్టి సకలుర పాపభారమును మోసెడి యాయాత్మకు పరదారగమనమను నొక్కపాపము భారమగుచున్నదా ? అది భారము కాదు. కాన యథేచ్ఛగా పాపము నాచరించవచ్చునని యాశయము.

లేదా, ఆత్మ యొక్కటియే యైనపుడు ఇతరులు చేసెడు పుణ్యమువలని సుఖమును కూడా నీయాత్మ యొక్కటియే గదా అనుభవించును. అట్టితరి ఎవ్వడో యొకడు గావించిన పరస్త్రీ గమనాది రూపమగు కొలదిపాపమును మోయుటలో బాధ యేమున్నది ? లేదా ఆత్మ యొక్కటియే యగుచో ప్రపంచ మున రెండవ వస్తు వేదియు లేదు. ఇట్టి దశలో నెవ్వతెయు పరస్త్రీ కానేరదు. కాన స్వేచ్ఛతో సమస్తస్త్రీలతో సంభోగము చేసినను పాపము కాదు. కాన నాపాపము వలన నీవు భయపడవలసిన అవసరము లేదని సారాంశము. ।56॥

శ్లో. కిం తే వృన్తహృతాత్ పుష్పాత్ తన్మాత్రే కిం ఫలత్యదః,
న్యస్య తన్మూర్ధ్న్యనన్యస్య న్యాస్యమే వాశ్మనో యది. 57

ప వి. కిం-తే-వృన్తహృతాత్-పుష్పాత్-తన్మాత్రే-కిం-ఫలతి - అదః-న్యస్య-తత్-మూర్ధ్ని-అనన్యస్య-న్యాస్యమ్-ఏవ-అశ్మనః-యది.

అర్థము: (హే అర్చక !=ఓ పూజారీ!) వృన్తహృతాత్=తొడిమనుండి కోయబడిన, పుష్పాత్=చంపకాది పుష్పములవలన (అనగా పూవును తొడిమ లేనిదిగా గావించి యని యర్థము.) తే = నీచే, కిం = కుత్సితమైన కార్యము, కృతం=చేయబడినది. హి=ఏలయనగా ? అదః=ఈ పుష్పము, తన్మాత్రే=ఆ తొడిమయందే, ఫలతి = పండుగా పరిణమించును. (పూవును తొడిమనుండి తొలగించి నీవు దానిలో నేర్పడవలసిన ఫలమునకు భంగము గావించి దోషము చేసితి వని యర్థము.) అథ=ఒకవేళ, ఆశ్మనః=దేవత కాశ్రయమైన సాలగ్రామాది రూపమగు శిలయొక్క, మూర్ధ్ని=తలపై, న్యాస్యమేవ యది=సమర్పింప తగియుండుటయే కారణమైనచో, తత్=అపుడు, అనన్యస్య=ఆశిలకంటె నభిన్నమైన, మూర్ధ్ని = తనతలయందే, న్యస్య = ఉంచుకొనుము. సర్వం విష్ణుమయం జగత్'' ఇత్యాదిగ-చెప్పిన నీమతమునందు భేదము కల్పితమేకాని వాస్తవికము కాదు. కావున అంతట విష్ణువుండుట వలన నావిష్ణుశిలకంటె నీశిరస్సు భిన్నము కానందువలన నింకొకచోట నుంచుట కంటె నీశిరస్సునందే యుంచుకొని పూజించుకొనుటే యుత్తమమని యర్థము.

సమాసములు:

వృన్తహృతాత్ - వృన్తం హృతం యస్మాత్తత్ = వృన్తహృతం, తస్మాత్=వృన్తహృతాత్. తన్మాత్రే-తదేవ=తన్మాత్రం, తస్మిన్= తన్మాత్రే.

అనన్యస్యా-అన్యః న భవతీతి=అనన్యః, తస్య=అనన్యస్య.

భావము:

ఓయీ అర్చకా! పూవును తొడిమనుండి త్రుంచి యేమి కుత్సితమైన కార్యము చేసితివి. ఏల యనగా ? నీపూవు ఆ తొడిమయందే ఫలరూపమగు పరిణామ మందును కాని మరి దేనియందును, నది ఫలరూప పరిణామము నొందదు. అట్టి తొడిమనుండి పూవును తొలగించి ఫలమునకు భంగము-

కలిగించుటచే నీవు దోషమును గావించితివి. ఒకవేళ దేవతలతో కూడిన శాల గ్రామాదిశిలపై నుంచుట కట్టు చేయవలసి వచ్చినచో, అపుడు ఆ శిలకంటే నభిన్నమైన నీతలపైననే యాపుష్పము నుంచుకొనుము. ఏల యనగా "సర్వం విష్ణుమయం జగత్" అని చెప్పు నీమతమునందు భేదము కల్పితము గాన, అంతట విష్ణు వుండుటవలన విష్ణుశిలకంటె నీ శిరస్సునకు భేదము లేనందున నింకొకదాని నుపాసించుటకంటె, నీ శిరము నుపాసించుకొనుట యుత్తమము గదా ?

శ్లో. తృణానీవ ఘృణావాదాన్ విధూనయ వధూ రను,
తవాఽపి తాదృశస్యైవ కా చిరం జనవంచనా. 58

ప.వి. తృణాని–ఇవ – ఘృణావాదాన్ - విధూనయ-వధూః - అను-తవ-అపి-తాదృశస్య–ఏవ-కా-చిరం-జనవంచనా.

అర్థము: వధూః=స్త్రీలను, అను = గుఱియందుంచుకొని అనగా స్త్రీ విషయమందు, ఘృణావాదాన్ = ఏవగింపు కలిగించు మాటలను అనగా.

హాస్యోక్తి సందర్శన మక్షియుగ మత్యుజ్జ్వలం తత్ కలుషం వసాయాః,
స్తనౌ చ పీనౌ పిశితౌ చ పిండౌ స్థానాన్తరే కిం నరకోఽపి యోషిత్.

అని స్త్రీల హాసాదులను నస్థిసందర్శనాదులతో బోల్చి ఏవగింపు కలిగించెడి మాటలను, తృణానీవ=నిస్సారమగుటవలన గడ్డిపోచలుగా, విధూనయ= విదలింపుము. అనగా త్యజింపుము. తవాఽపి=నీకును, తాదృశస్యైవ= అటువంటి స్త్రీ వలె, నిస్సారముగాను ఏవగింపు బొందదగిన యవయవ సన్నివేశములు గలవానికి, చిరాత్=చాలాకాలమునుండి, జనవంచనా= స్త్రీ విషయమున విరక్తి కలిగించెడి మాటలతో లోకమును మోసగించుట, కా=ఏమి? అనగా ఎందుకొఱకు ? స్త్రీలను గూర్చి చెప్పదగిన నిందావచనములన్నియు నీకును నన్వయించును. కాన స్త్రీ నిందతో లోకవంచన చేయుట తగదని యర్థము.

సమాసములు :

ఘృణావాదాన్ - ఘృణాయాః వాదాః = ఘృణావాదాః, తాన్ = ఘృణా వాదాన్.

జనవంచనా - జనస్య వంచనా = జనవంచనా.

భావము :

స్త్రీలను గూర్చి "వారి చిఱునగవు, బొమికలను జూపుట, వారి కన్నులు శరీరమందలి వసయొక్క కాలుష్యము, వారి వలుదచన్నులు మాంసపిండములు, కాన స్త్రీ యనునది మఱియొక స్థానమందేర్పడిన నరకము" ఇత్యాదిగా జెప్పెడు ఏవగింపు మాటలను దృణీకరింపుడు. ఏల యనగా స్త్రీకివలెనే పురుషునికి నిట్టి మాటలు కల్పింపదగును కాన నీ స్త్రీదూషణ కేవలము లోకవంచనయే. కాని న్యాయ్యమైనది కాదు. అట్టి లోకవంచన తగదు. 58

శ్లో. కురుధ్వం కామదేవాజ్ఞాం బ్రహ్మాద్యైర ప్యలంఘితాం,
వేదోఽపి దేవకీయాజ్ఞా తత్రాజ్ఞాః కాధికార్హణా ? 59

ప. వి. కురుధ్వం-కామదేవాజ్ఞాం-బ్రహ్మాద్యైః-అపి - అలంఘితాం - వేదః-అపి-దేవకీయాజ్ఞా-తత్ర-అజ్ఞాః-కా-అధికా-అర్హణా.

అర్థము: హే అజ్ఞాః = ఓ మూఢులారా! బ్రహ్మాద్యైరపి = బ్రహ్మ మున్నగువారి చేతను, అలంఘితాం = అతిక్రమింపబడని, కామదేవాజ్ఞాం, కామ = మన్మథు డనెడు, దేవ = దేవతయొక్క, ఆజ్ఞాం = ఆదేశమును, కురుధ్వం = చేయుడు. వేదోఽపి = వేదము గూడను, దేవకీయాజ్ఞా; దేవకీయ = దేవతలకు సంబంధించిన, ఆజ్ఞా = ఆజ్ఞయే, ఏల యనగా, "శ్రుతిః స్మృతి ర్మమైవాజ్ఞా" అని భగవద్వచన మున్నది. తత్ర = ఆదేవాజ్ఞారూపమైన వేదమునందు, అధికా = కామదేవుని యాజ్ఞకంటెను అధికమైన, అర్హణా = పూజ అనగా నాదరము, కా = ఏమి? ఎందుకొఱ

క.ని యర్థము. ఇట్లు కామదేవాజ్ఞయు దేవకీయాజ్ఞయు సమానములైనను కామదేవాజ్ఞయే యాచరింపదగినది. ఏల యనగా - బ్రహ్మాదులు దీని నంగీకరించుటవలన, శిష్టులచే పరిగ్రహింపబడుట యను ప్రామాణ్యము దీని కేర్పడినది. మఱియు నిది ప్రత్యక్ష సుఖమునకు కారణమైనది.

సమాసములు :

కామదేవాజ్ఞాం - కామ ఇతి దేవః=కామదేవః, కామదేవస్య ఆజ్ఞా= కామదేవాజ్ఞా, తాం=కామదేవాజ్ఞాం.
అలంఘితాం-న లంఘితా=అలంఘితా, తాం=అలంఘితాం.
దేవకీయాజ్ఞా-దేవానాం ఇయం=దేవకీయా, దేవకీయా చ సా ఆజ్ఞా చ= దేవకీయాజ్ఞా.
అజ్ఞాః - జానన్తీతి = జ్ఞాః, న జ్ఞాః=అజ్ఞాః, తేషాం సమ్బుద్ధిః= హే అజ్ఞాః.

భావము :

బ్రహ్మ మున్నగువారందరును కామదేవుని శాసనము నతిక్రమింప లేరు. అతని శాసనము ననుసరించి స్త్రీవశమునం దుండుటను జేయుడు. ఇది యవైదికాచార మనకుడు. ఏల యనగా వేదముకూడా దేవతాశాసనమే. "శ్రుతిః స్మృతి ర్మమైవాజ్ఞా" అని భగవంతుడు చెప్పియున్నాడు. రెండును దేవాజ్ఞ లైనపుడు వేదమునం దంత శ్రద్ధ యెందులకు? కాన రెంటిలోను కామదేవుని శాసనమే పాటింపదగినది. ఏల యనగా, బ్రహ్మాదులు దీని నంగీకరించుటవలన శిష్టపరిగ్రహణరూపమగు ప్రామాణ్యము దీని కేర్పడినది. అట్లే యా కామదేవుని శాసనము ప్రత్యక్షసుఖమునకును సాధనము. కాన నిదియే యాదరణీయము.59

శ్లో. ప్రలాపమపి వేదస్య భాగం మన్యధ్వమేవ చేత్,
కేనాభాగ్యేన దుఃఖా న్న విధీనపి తథేచ్ఛథ. 60

ప. వి. ప్రలాపం-అపి-వేదస్య-భాగం-మన్యధ్వం - ఏవ - చేత్-కేన-అభాగ్యేన-దుఃఖాన్-న-విధీన్-అపి-తథా-ఇచ్ఛథ.

అర్థము: హే మూఢాః=ఓమూఢులారా! వేదస్య=వేదముయొక్క, భాగం=అంశమైనట్టి యర్థవాదమును, ప్రలాపం=వ్యర్థవచనము, అపి మన్యధ్వమేవ చేత్=తలంచునట్టివారేయైనచో, (తదా=అప్పుడు) కేన=ఏ, అభాగ్యేన=దురదృష్టముచే, దుఃఖాన్=శ్రమను గలిగించెడి యర్థము గల, విధీనపి=విధివాక్యములను సైతము, తథా=అర్థవాదములవలె, ప్రలాపాన్=వ్యర్థవచనములుగా, నేచ్ఛథ=తలంపరు? అన్నరాశిలో కొంతభాగము దోషయుక్తమైనపు డన్నరాశియంతయు పరిత్యజింపుదుము కదా? అట్లే వేదములో నొకభాగమైన యర్థవాదము ప్రలాపమై యుపేక్షింపదగినదైనపుడు దానితో గూడిన వేదరాశియంతయు నుపేక్షణీయమేకదా.

సమాసములు :

అభాగ్యేన-న భాగ్యమ్=అభాగ్యమ్, తేన=అభాగ్యేన.

దుఃఖాన్ - దుఃఖయన్తీతి=దుఃఖాః, తాన్=దుఃఖాన్.

భావము :

వేదరాశిలో నొక యంశమైన యర్థవాదములు ద్రవ్యదేవతాది ప్రశంసాపరమై పురుషులను యాగాది కర్మలయందు ప్రవర్తిల్ల జేయుచున్నవి. కాని అవి యెలాంటి కర్మలను విధించుటలేదు. అందువలన, నవి నాస్తికునిచే నిరర్థకములుగా భావింపబడుచున్నవి. వేదములో నొకభాగము నిరర్థకముగా నంగీకరింపబడినపుడు శ్రమసాధ్యములైన యాగాదులను విధించెడి "సోమేన యజేత" ఇత్యాది విధివాక్యములనుకూడా నట్లే నిరర్థక వచనములుగా నేల భావింపరాదు? ఏదురదృష్టముచే విధివాక్యముల నట్లు భావించుటలేదు? అన్నరాశిలో నొక భాగమున దోష మేర్పడినపుడు రాశియంతయు పరిత్యజింపబడుచున్నది కదా? అట్లే వేదరాశిలో నర్థవాదములు నిరర్థకములై హేయములుగా నేర్పడినపుడు తక్కిన వేదరాశియు హేయ మేలగాదు? కాన పైన్యాయము ననుసరించి వేదరాశి పరిత్యాజ్యమే కాని ప్రమాణము కాదు.

శ్లో. శ్రుతిం శ్రద్ధధ్వం విక్షిప్తాః ప్రక్షిప్తాం బ్రూత చ స్వయం,
మీమాంసామాంసలప్రజ్ఞా స్తాం యూపద్విపదాపినీమ్. 61

ప. వి. శ్రుతిం-శ్రద్ధధ్వం-విక్షిప్తాః-ప్రక్షిప్తాం-బ్రూత-చ-స్వయం - మీమాంసా మాంసలప్రజ్ఞాః-తాం-యూపద్విపదాపినీం.

అర్థము : హే మీమాంసామాంసలప్రజ్ఞాః, మీమాంసా = జైమిని రచించిన తత్త్వనిర్ణాయక గ్రంథముల నధ్యయనము చేయుటచే, మాంసల = పరిపుష్టి జెందిన, ప్రజ్ఞాః = ప్రజ్ఞగలిగిన వారలారా అనగా స్థూలబుద్ధులారా! (అని పరిహాస వచనము), విక్షిప్తాః = వాదిచే నిరాకరించబడిన వారై. భ్రాన్తిని జెందినవారగుచు, శ్రుతిం = వేదమును, శ్రద్ధధ్వం = నమ్మడు, (అథ చ = ఇంకను) యూపద్విపదాపినీం-యూప = యూప స్తంభములకు సంబంధించిన, ద్విప = ఏనుగులను, దాపినీం = దానము చేయుటనుఁ బ్రతిపాదించెడి అనగా ''యూపే యూపే హస్తినో బధ్వా ఋత్విగ్భ్యో దద్యాత్" ఇత్యాది దానమును జెప్పెడి, తాం = ఆ, శ్రుతిం = శ్రుతిని, స్వయం = తానుగనే, ప్రక్షిప్తాం = ఒకానొక బుద్ధునిచే వేదమందు ప్రవేశపెట్టబడినదానినిగా, బ్రూతచ = చెప్పుడు. అందువలన వేదమునకుఁ బ్రామాణ్య మెక్కడిదని యర్థము.

సమాసములు :

మీమాంసామాంసలప్రజ్ఞాః - మీమాంసయా మాంసలా ప్రజ్ఞా యేషాం తే = మీమాంసామాంసలప్రజ్ఞాః.

యూపద్విపదాపినీం - యూపే ద్విపాః = యూపద్విపాః, యూపద్విపాన్ దాపయతీతి = యూపద్విపదాపినీ, తాం = యూపద్విపదాపినీం.

భావము :

జైమిని రచించిన గ్రంథముల నధ్యయనము చేయుటచే బలిసినట్టి (మొద్దుబారిన) బుద్ధిగలవారా! వాదిచే నోడింపబడి భ్రాంతిజెందినవారై వేదమును

నమ్మఁడు. మఱియు యాగమునం దొక్కొక్క యూపస్తంభమున కొక్కొక్క యేనుగు చొప్పున కట్టి దానము చేయవలయునని చెప్పెడి శ్రుతిని వేదమధ్యమునం దొకలోభిచే ప్రవేశపెట్టబడిన ప్రక్షిప్తముగనుఁ జెప్పుడు. కాన నీవిధముగా ప్రక్షిప్తములతోఁ గూడిన వేదమునకు ప్రామాణ్య మెక్కడిదని భావము.

శ్లో. కో హి వేత్తా స్త్యముష్మిన్ వా లోక ఇత్యాహ యా శ్రుతిః,
తత్ప్రామాణ్యా దముం లోకం లోకః ప్రత్యేతి వా కథమ్. 62

ప. వి. కః-హి-వేత్తా - అస్తి - అముష్మిన్-వా-లోకే - ఇతి-ఆహ-యా-శ్రుతిః-తత్ప్రామాణ్యాత్-అముం-లోకం-లోకః-ప్రత్యేతి-వా-కథం.

అర్థము : కించ=మఱియు, కో హి వా=ఏ పురుషుడు, అముష్మిన్ లోకే=పరలోకవిషయమున, వేత్తా=తెలిసికొనినట్టివాడు, అస్తి=ఉన్నాడా ? ఒకరును పరలోకమునుగూర్చి తెలిసినవాడు లేడని యర్థము. ఇతి = ఇట్లు, యా=ఏ, శ్రుతిః=వేదము, ఆహ=చెప్పుచున్నదో, తత్ప్రామాణ్యాత్, తత్=అట్లు సందేహించెడు శ్రుతికి, ప్రామాణ్యాత్=ప్రమాణత్వమువలన, అముం లోకం=పరలోకమును, లోకః=జనము, కథం వా=ఏవిధముగా, ప్రత్యేతి=నమ్ముచున్నది. పరలోకము నమ్మదగినది కాదు. కావున నావిధముగా సందేహించు శ్రుతిని నమ్మరాదు.

సమాసములు :

తత్ప్రామాణ్యాత్ - ప్రమాణస్య భావః = ప్రామాణ్యం, తస్య ప్రామాణ్యం=తత్ప్రామాణ్యం, తస్మాత్=తత్ప్రామాణ్యాత్.

భావము :

ఎవ్వఁడు పరలోకమును గూర్చి తెలిసికొనినవాఁ డున్నాఁడు ? ఎవ్వఁడును లేడు. ఈవిధముగా సందేహించెడి శ్రుతిని, ప్రమాణము గావించుకొని పరలోకము నెవ్వఁడు నమ్మగలఁడు ? కాన పరలోక మున్నదని నమ్మరాదు. అది యున్నదని చెప్పు వేదముకూడ నమ్మదగినది కాదు.

శ్లో. ధర్మాధర్మౌ మనుర్జల్ప న్నశక్యార్జనవర్జనౌ,
వ్యాజా న్మండలదణ్డార్థీ శ్రద్ధధాతు ముధా బుధైః. 63

ప.వి. ధర్మాధర్మౌ-మనుః-జల్పన్-అశక్యార్జనవర్జనౌ-వ్యాజాత్-మండలదండార్థీ-శ్రద్ధధాయ-ముధా-బుధైః.

అర్థము : వ్యాజాత్ = కపటమున అనగా ధర్మాధర్మముల బోధను మిషగాఁ బెట్టుకొని, మండలదణ్డార్థీ, మణ్డల=రాష్ట్రమందలిప్రజలను, దణ్డ= శాసించుటను, అర్థీ=కోరుచున్నవాడై, ప్రజలు విధినిషేధముల నతిక్రమించుటవలని యపరాధములను నిమిత్తము గావించుకొని ప్రాయశ్చిత్తాదులచే ధనమునుఁ గోరుచున్నవాడగుచు నని యర్థము. అశక్యార్జనవర్జనౌ అశక్య=అసాధ్యములైన, అర్జన=ఆచరణము, వర్జనౌ=అనాచరణములు గల్గినవిగా, ధర్మాధర్మౌ=పుణ్యపాపములను అనగా యాగము మున్నగువానిని అధికధనసాధ్యముకాన నాచరింప నసాధ్యము. పరస్త్రీగమనాదికము ఇంద్రియనిగ్రహముచేయుట కశక్యమగుటవలనను సుఖముగా జేయసాధ్యమగుటవలనను విడచుట కశక్యమైనదని యర్థము) జల్పన్= చెప్పుచు, అనగా క్రమముగా యాగాదులను అర్జ్యములుగను అనగా నాచరణీయములుగను, పరస్త్రీగమనాదిరూపపాపమును వర్జ్యముగను అనగా విడువదగినదిగను నుపదేశించుచు, మనుః = మొదటి స్మృతిని రచించిన మనువు, ముధైవ=వ్యర్థముగనే, శ్రద్ధధాయి=ఆదరింపబడెనని యర్థము. పరస్త్రీగమనరూపమగు ధర్మము, ప్రత్యక్షముగా సుఖసాధనముగాన దాని నందఱును ఆచరింతురని తెలుసుకొని దానివలన గలుగు కృత్రిమపాపమును తొలఁగించుకొనుటను వ్యాజముగా జేసి ధనసంపాదనకై ప్రాయశ్చిత్తరూపమైన దండమును మనువు విధించెను. కాని వాస్తవస్థితిలో నాపరదారగమన మధర్మము కాదు. కాన మనువుచనము మూలముగా గల స్మృతి ప్రమాణము గాదని యర్థము.

సమాసములు :

ధర్మాధర్మౌ - ధర్మశ్చ అధర్మశ్చ=ధర్మాధర్మౌ, తౌ=ధర్మాధర్మౌ.
అశక్యార్జనవర్జనౌ - ఆర్జనం చ వర్జనం చ=అర్జనవర్జనౌ, న శక్యే

=అశక్యే, అశక్యే ఆర్జనవర్జనే యయో స్తౌ = అశక్యార్జనవర్జనౌ, తౌ = అశక్యార్జనవర్జనౌ.

మణ్డలదండార్థీ - మణ్డలస్య దండః = మణ్డలదణ్డః. మణ్డలదణ్డం అర్థ యతీతి మణ్డలదణ్డార్థీ.

భావము :

ఇంతవఱకును వేదము ప్రమాణము కాదని చెప్పి, ఇపుడు తన్మూలకమగు స్మృతియును ప్రమాణము కాదని నాస్తికుడు చెప్పుచున్నాడు. ధర్మాధర్మముల నుపదేశించుటను మిషగా బెట్టుకొని రాష్ట్రమందలి జనులను శాసించుటకై ప్రజలు ప్రజలు విహితములను నిషిద్ధములను నతిక్రమించినచో వారి యపరాధమును నిమిత్తము గావించుకొని, ప్రాయశ్చిత్తాదులచే ధనము నభిలషించుచు చేయ సాధ్యములుకాని ధర్మములను, వర్జింపసాధ్యముగాని పరస్త్రీగమనాదిరూపములగు నధర్మములనుఁ జెప్పుచున్న మనువును పండితులు వ్యర్థముగనే నమ్మిరి. పరస్త్రీ గమనాది రూపమగు నధర్మము ప్రత్యక్షముగా సుఖమునే కలిగించుటవలన, నందరు నాచరింతురని తెలిసికొని దానివలన కలుగునని భావింపబడిన యభూత మగు పాపమును హరించుటకని నెపముపెట్టి ధనసంపాదనకై ప్రాయశ్చిత్తమును విధించెను. కాని వాస్తవస్థితిలో యది యధర్మముకాదు. కాన మనువచనము నాధారము గావించుకొనిన స్మృతియు ప్రమాణము కాదని యాశయము.

శ్లో. వ్యాసస్యైవ గిరా తస్మిన్ శ్రద్ధేత్యద్ధా స్థ తాన్త్రికాః,
మత్స్యస్యా ప్యుపదేశ్యాన్ వః కో మత్స్యానపి భాషతామ్. 63

ప. వి. వ్యాసస్య - ఏవ- గిరా- తస్మిన్- శ్రద్ధా- ఇతి- అద్ధా- స్థ- తాన్త్రికాః- మత్స్యస్య-అపి-ఉపదేశ్యాన్-వః-కః-మత్స్యాన్-అపి-భాషతాం.

అర్థము: వ్యాసస్యైవ=బెస్తల జాతికి జెందిన కన్యతో పరాశరమహర్షి వ్యభిచ రించుటవలన నుత్పన్నుడైనట్టి వాడును, సోదరుని భార్యయందు సంతానముఁ గల్గించినట్టి, వ్యభిచారాసక్తి కలిగినట్టివాడైన వ్యాసునియొక్క గిరా=పురాణవచనముచే, అనగా మనువు చెప్పిన దానిని ఆచరింప వలయునను వచనముచే, తస్మిన్=ఆ పరలోకమందు లేదా ధర్మము

నందు, శ్రద్ధా=ఆదరము, ఇతి=అని, తాన్త్రికాః=శాస్త్రవేత్తలారా, స్థ=ఉన్నారు, ఇతి=అనుట, అద్ధా=సత్యము, మత్స్యస్యాపి=మత్స్య రూపము ధరించిన విష్ణువు యొక్క వచనమైన మత్స్యపురాణమునకును, ఉపదేశ్యాన్=ఉపదేశింపదగినవారైన, కావుననే, మత్స్యాన్=మత్స్య శిష్యులైన, వః=మిమ్ములను, కః=ఏ పండితుడు, అపి భాషతాం= మాట్లాడును? మత్స్యము లెవ్వరికిని ఆదరార్హములు గావు. మత్స్యము ఉపదేశించునట్టిదని స్వకపోల కల్పితమును జెప్పుచున్న వ్యాసుని వచనము నమ్మదగినది కాదు అని యర్థము.

సమాసములు :

తాన్త్రికాః-తన్త్రం విదన్తీతి=తాన్త్రికాః.
ఉపదేశ్యాన్-ఉపదేష్టుం యోగ్యాః= ఉపదేశ్యాః, తాన్ = ఉపదేశ్యాన్.

భావము :

ఓ శాస్త్రవేత్తలారా ! వ్యాసుఁడు మనువు చెప్పినదానిని గ్రహింపవలయునని చెప్పుటచే, అనగా పురాణముల ద్వారా చెప్పుటచే, ఆ పరలోకమునందును ధర్మమునందును మీరు విశ్వాస ముంచుచున్నారు. ఆ వ్యాసుడు బెస్తజాతికిఁ జెందిన సత్యవతితో పరాశరుఁడు వ్యభిచరించుటవలన జన్మించినవాడు. మరియు నాతడు తన సోదరుని భార్యయందు సంతానముఁ గల్గించినవాడు, అట్టి వ్యభిచార శీలుని వచనమును మీరు నమ్ముచున్నారు. ఇది యెంతవరకుఁ దగియున్నది. ఇది పురాణ సామాన్యమును గూర్చిన విషయము. అందులో విశేషమైన మత్స్య పురాణ విషయము ఆశ్చర్యకరమైనది. మత్స్య రూపము ధరించిన విష్ణువు యొక్క వచనమే మత్స్య పురాణము ఆ మత్స్యము గురువగుట దాని యుపదేశమును వినుటకు, మీరు దానికి శిష్యులగుట యను విషయము నే పండితుఁడు గౌరవించును ? ఎవ్వఁడును గౌరవింపఁడు. మత్స్యముల నెవ్వరు గౌరవింతురు? మత్స్య ముపదేశించినది యని స్వకపోలకల్పితమును జెప్పుచున్న వ్యాసుని వచనము నమ్మదగినదికాదని యాశయము.

శ్లో. పణ్డితః పాణ్డవానాం స వ్యాస శ్చాటుపటుః కవిః,
నినిన్ద తేషు నిన్దత్సు స్తువత్సు స్తుతనా న్న కిం ? 64

ప. వి. పణ్డితః-పాణ్డవానాం- సః- వ్యాసః- చాటుపటుః - కవిః - నినిన్ద-తేషు-
నిన్దత్సు-స్తువత్సు-స్తుతవాన్-న-కిం.

అర్థము: పాండవానాం - ధర్మరాజు మున్నగు వారికి, చాటుపటుః; చాటు =
అసత్యపు స్తుతులను చేయుటయందు, పటుః=సమర్థుడైన, కవిః=
ఊహింపబడిన యర్థములను వర్ణించునట్టి, పండితః=పండితుఁడనను నభి
మానము గల్గినట్టి, వ్యాసోఽపి=వ్యాసమహర్షియు, తేషు=ఆ పాండ
వులు, నిందత్సు సత్సు=దుర్యోధనాదులను నిందించుచుండగా, న నినిన్ద
కిం =నిందింపలేదా యేమి? స్తువత్సు సత్సు=శ్రీకృష్ణాదులనుఁ బొగడు
చుండగా, న స్తుతవాన్ కిం?=స్తుతి చేయలేదా యేమి? పాండవులు ఎవ
రిని నిందించిరో వారిని నిందించుచు, వారెవరిని స్తుతిజేసిరో వారిని
స్తుతించుచున్న వ్యాసమహర్షి పాండవపక్షపాతియైనవాడే కాని సత్య
వాది కాడని యాశయము.

సమాసములు :

చాటుపటుః-చాటుషు పటుః=చాటుపటుః.

భావము :

వ్యాసమహర్షి ధర్మరాజు మున్నగు పాండవులను ముఖస్తుతులు జేసిన
కవి. పండితుడ నను నభిమానము గలవాడు. అతడు మీ కందఱికిని ఆప్తుడు.
అతడు మహాభారతమును రచించినను పాండవ పక్షపాతమునే వహించి, పాండవు
లెవ్వరిని నిందింతురో వారిని అనగా దుర్యోధనాదులను నిందించును. వారెవరిని
పొగడుదురో అట్టి శ్రీకృష్ణాదులను బొగడును కాని సత్యవాది కానేరడు. ॥64॥

శ్లో. న భ్రాతుః కిల దేవ్యాం స వ్యాసః కామాత్ సమాసజత్,
దాసీరత స్తదాసీద్య న్మాత్రా తత్రాప్యదేశి కిమ్ ? 65

ప. వి. న-భ్రాతుః-కిల-దేవ్యాం-సః-వ్యాసః-కామాత్-సమాసజత్-దాసీరతః-తదా-ఆసీత్-యత్-మాత్రా-తత్ర-అపి-అదేశి-కిమ్.

అర్థము:- సః = పరస్త్రీగమనమందు ప్రసిద్ధి వహించిన యా వ్యాసమహర్షి, భ్రాతుః=సోదరుడగు విచిత్రవీర్యునియొక్క, దేవ్యాం = పట్టపురాణి యందు, కామాత్ = కామమువలన, న సమాసజత్ కిం?=ఆసక్తుడు కాలేదా ఏమి? తదా = ఆకాలమునందు, అనగా విచిత్రవీర్యునిభార్య యందు సంతానమును గల్గించుసమయమున, దాసీరతః = దాసియగు విదురునితల్లియందు నాసక్తిగలవాడై, ఆసీత్ యత్ = ఉండె ననునది యేది గలదో, తత్రాపి = ఆవిషయమునందును, మాత్రా=సత్యవతిచే, అదేశి కిం?=ఆదేశింపబడినాడా? కాని యాదేశింపబడలేదు. కాన రెండు చోటులయందును కామముచేతనే ప్రవర్తించుటయను దుష్ప్రవర్తనగలిగిన వ్యాసుడు ఆప్తుడుకాడు. కావున అతనివచనములును ప్రమాణములు కావు.

సమాసములు :

దాసీరతః-దాస్యాం రతః=దాసీరతః.

భావము :

ఆవ్యాసుడు మిక్కిలి కామాన్ధుడు. అతడు తనసోదరుడగు విచిత్రవీర్యుని భార్యయందు కామావేశముతో గూడియుండలేదా? తల్లియగు సత్యవతి యాదేశించుటవలన దోషములే దనినచో దాసియైన విదురునితల్లితో సంపర్కముచేసిన విషయమునకూడా తల్లియొక్క యాదేశ మున్నదా? వస్తుస్థితియందది లేదు. కాని ఇట్లు కామపరవశుడై పరస్త్రీగమనాదిదోషములకు స్థానమైన వ్యాసమహర్షి యాప్తు డెట్లగును? అతని మాట లెట్లు ప్రమాణము లగును? కాన నాతనిమాటలు ప్రమాణములు కావు. ఇచ్చట మహాభారతములోని కథ యనుసంధేయము. ॥65॥

శ్లో. దేవైర్ద్విజైః కృతా గ్రన్థాః పన్థా యేషాం తదాదృతౌ,
గాం నతైః కిం నతైర్వ్యక్తం తతోఽప్యాత్మాఽధరీకృతః. 66

ప. వి. దేవైః-ద్విజైః-కృతాః-గ్రన్థాః-పన్థాః-యేషాం-తదాదృతౌ-గాం-నతైః-కిం-న-త్తైః-వ్యక్తం-తతః-అపి-ఆత్మా-అధరీకృతః.

అర్థము:- (హేమూఢాః=ఓ మూఢులారా!) యేషాం = ఏ మీకు, దేవైః= బ్రహ్మాదిదేవతలచేతను, ద్విజైః = వ్యాసాదిద్విజులచేతను, కృతాః= రచింపఁబడిన, గ్రన్థాః = గ్రంథములు అనగా "గాం ప్రణమేత్" ఇత్యాదిస్మృతులు, పన్థాః = ప్రమాణము, అనగా ధర్మాధర్మముల నుపదేశించునవి. తదాదృతౌ, తత్=ఆగ్రన్థములను, ఆదృతౌ=ఆద రించుట నిమిత్తముఁ గావించుకొని, గాం=గోవు నుద్దేశించి, నతైః= నమస్కరించునట్టి, త్తైః=అటువంటి మీచేత, తతోఽపి = ఆగోవు కంటెను, ఆత్మా=స్వాత్మ అనగా మీయాత్మ, వ్యక్తం=స్ఫుటముగా, అధరీకృతః = వినాశము గావింపబడినది, న కిం=కాలేదా? తప్పక యైనదని యర్థము. పశువును నమస్కరించునచో దానికంటెను హీనత్వ మేర్పడునే కాని దానివలన నేమియు ఫల మేర్పడదని యర్థము.

సమాసములు :

తదాదృతౌ—తేషాం ఆదృతిః=తదాదృతిః, తస్యాం=తదాదృతౌ.

అధరీకృతః—అనధరః అధర స్సమ్పద్యమానః కృతః = అధరీకృతః.

భావము :

ఓ మూఢులారా! మీకు బ్రహ్మాదిదేవతలును, వ్యాసాదిద్విజులును వ్రాసిన గ్రంథములు ధర్మాధర్మ నిర్ణయమున ప్రమాణములు. ఆ గ్రంథములయందు గోవును జూచిన నమస్కరింపవలయునని వ్రాయబడియున్నది. కాన నాగ్రంథము నాదరించుటకై మీరు గోవు నుద్దేశించి వందన మాచరింపవలయును. అందు వలన మీరు ఆగోవుకంటె హీనము గావింపబడుచున్నారు. పశువును నమస్క రించుటవలన పశువుకంటెను హీనత్వమే యేర్పడును కాని మఱియొకవిధమైన ఫలము చేకూరదు.

శ్లో. సాధు కాముకతా ముక్తా శాన్తస్వాన్తై ర్మఖోన్ముఖైః,
సారంగలోచనాసారాం దివం ప్రేత్యాఽపి లిప్సుభిః. 68

ప. వి. సాధు- కాముకతా- ముక్తా- శాన్తస్వాన్తైః- మఖోన్ముఖైః-సారంగలోచనా సారాం-దివం-ప్రేత్య-అపి-లిప్సుభిః.

అర్థము:- శాన్తస్వాన్తైః, శాన్త = రూపరసాది విషయములనుండి మఱలిన, స్వాన్తైః = మనస్సులు గల్గిన, మఖోన్ముఖైః, మఖ = యాగములయందు, ఉన్ముఖైః = ఆసక్తి గలిగినవారిచే, ప్రేత్యాపి = మరణించియు, సారంగ లోచనాసారాం, సారంగలోచనా = జింకకన్నులు కలిగిన స్త్రీలే, సారాం = సారముగా గలిగిన, దివం = స్వర్గమును, లిప్సుభిః = సంపా దింపగోరినవారిచే, కాముకతా = కాముకత్వము అనగా స్త్రీలయందలి రతి, సాధు = చక్కగా, ముక్తా = విడువబడినదా యేమి ? అనగా విడువబడిన దని యర్థము. భూలోకమున సిద్ధమైన పరస్త్రీగమనాదిసౌఖ్యమును వదలి, పరలోకమున సిద్ధముగానట్టి యా స్త్రీసౌఖ్యముకకై ప్రయత్నిం చుట హాస్యాస్పదముగదా! కావున యాగకాలమునందు బ్రహ్మచర్యము మున్నగువానిని వహించుట యాత్మవంచనయేకాని మరియొండు గాదని యర్థము.

సమాసములు :

కాముకతా-కాముకస్య భావః = కాముకతా.

శాన్తస్వాన్తైః- శాంతం స్వాన్తం యేషాం తే = శాన్తస్వాన్తాః, తైః = శాన్తస్వాన్తైః.

మఖోన్ముఖైః-మఖే ఉన్ముఖాః = మఖోన్ముఖాః, తైః = మఖోన్ముఖైః.

సారంగలోచనాసారాం-సారంగస్యేవ లోచనే యాసాం తాః = సారంగలోచనాః, సారంగలోచనాః సారః యస్యాః సా = సారంగలోచనా సారా, తాం = సారంగలోచనాసారాం.

లిప్సుభిః-లబ్ధుమిచ్ఛవః = లిప్సవః, తైః = లిప్సుభిః.

భావము :

రూపాదివిషయములనుండి మఱలిన చిత్తవృత్తిగలిగిన యాజ్ఞికులు చని పోయినపిదపకూడా స్త్రీకాముకులై యుందురు. ఇతరు లీజన్మమందే పరస్త్రీకాము కులై యుందురు. జింకకన్నులుకలిగిన దివ్యసుందరస్త్రీలే సారముగాగలిగిన స్వర్గమును వారు కోరి యాగము లాచరింతురు. అట్టివారిచే కామాసక్తి విడువ బడినదా? అనగా విడువబడనే లేదు. కాన సిద్ధమైన భూలోకములోని పరస్త్రీ సంగమును వదలిపెట్టి, అసిద్ధమైన స్వర్గస్త్రీసంగమము నపేక్షించి, యాగాదులకై బ్రహ్మచర్యాదులను వహించుట కేవలము ఆత్మవంచనయే కాని మరియొండు కాదని యాశయము.

శ్లో. ఉభయీ ప్రకృతిః కామే సజ్జేదితి మునేర్మతం,
అపవర్గే తృతీయేతి భణతః పాణినేరపి. 69

ప. వి. ఉభయీ-ప్రకృతిః-కామే-సజ్జేత్-ఇతి-మునేః-మతం-అపవర్గే-తృతీయా-ఇతి-భణతః-పాణినేః-అపి.

అర్థము: "అపవర్గే తృతీయా" ఇతి భణతః = "అపవర్గే తృతీయా" అని చెప్పుచున్న, పాణినేరపి మునేః = పాణినియను ప్రసిద్ధనామముగల వ్యాకరణదర్శనప్రవర్తకుడగు ఋషికిని, ఉభయీ = స్త్రీపుంసరూపమైన, ప్రకృతిః = ప్రకృతి, నామే = కామమను పురుషార్థమందు, అనగా ధర్మార్థకామములను పురుషార్థములలో మూడవపురుషార్థమైన కామము నందు అనగా మైథునమునందు, సజ్జేత్ ఇతి = ఆసక్తిగలదియైయుండునని మతం = అభిప్రాయము(స్పష్టము) తథా = అట్లే, తృతీయా = మూడవదైన ప్రకృతి అనగా నపుంసకప్రకృతి. అపవర్గే = మోక్షమందు, అనగా నపుంసకముగా నుండుటవలన, మైథునమందు శక్తిలేక యుండుట వలన బ్రహ్మచర్యముచే మోక్షమునందు, సజ్జేదితి = సిద్ధమగునని పాణిని సూత్రార్థముచే, ఉభయీ = స్త్రీపుంసాత్మకమగు ప్రథమద్వితీయ ప్రకృతి, కామే = కామమందు, సజ్జేదితి = సక్తమగునని పారిశేష్యమున ననుసరించి తెలియుచున్నది. అనగా "అపవర్గే తృతీయా" అను సూత్రము నను సరించి మోక్షమునందు మూడవదగు నపుంసకప్రకృతి ప్రవర్తిల్లినచో,

పరిశేషన్యాయము ననుసరించి మొదటిదియు రెండవదియునగు స్త్రీపురుష ప్రకృతికామమునందు ప్రవర్తించునని తెలియుచున్నది. సూత్రమునందున్న ఆపవర్గ'' శబ్దచ్ఛలముచే షండప్రకృతిరూపమగు వికృతరూపమైన యర్థమును నాస్తికుడు సమర్థించెను కాని వస్తుస్థితియందు ''అపవర్గే=ఫల ప్రాప్తియందు, తృతీయా=తృతీయావిభక్తి యనియే పాణిని సమ్మతమగు నర్థము. కాన ఇచట నాస్తికునిమతములో, వ్యర్థముగా కామపురుషార్థమును వదలిపెట్టి అపవర్గమైన మోక్షమందు ప్రవర్తించుచున్న మీరు నపుంసకులనియే యర్థము.

భావము :

''అపవర్గే తృతీయా'' యను సూత్రమును రచించిన ప్రసిద్ధవైయాకరణుడగు పాణికినికి, స్త్రీపుంసాత్మకమైన ప్రథమద్వితీయప్రకృతి, కామమను పురుషార్థమునందు నాసక్తమగు నను నభిప్రాయము స్పష్టమగుచున్నది. అట్లే మూడవప్రకృతియైన షండుడు అపవర్గ మనబడు మోక్షమునందు నాసక్తమగుననియు నభిప్రాయము. ఏలయనగా షండప్రకృతికి మైథునాదులయందు శక్తి లేనందువలన నది మోక్షమందే యాసక్తమగును. కాన మూడవప్రకృతియగు నపుంసకము మోక్షమం దాసక్తమైనచో పరిశేషన్యాయముచే ప్రథమద్వితీయ ప్రకృతిరూపమైన స్త్రీపుంసప్రకృతి కామమందు నాసక్తమగునని సిద్ధించును. ఇట్లు ''అపవర్గే తృతీయా'' అను సూత్రమందలి యపవర్గాది శబ్దచ్ఛలముచే నట్టి వికృతమగు నర్థమును గల్పించి, చార్వాకుడు తన మతమును సమర్థించుకొనెను. కాని వాస్తవమున ''అపవర్గే తృతీయా'' యను సూత్రమున నపవర్గ మనగా ఫలప్రాప్తి. ఫలప్రాప్తి యందు తృతీయ వచ్చునని సూత్రార్థము. కాని ఇచట కామమును వ్యర్థము గావించుకొని అపవర్గ మనెడి మోక్షమందు ప్రవర్తిల్లుచున్న మీరు నపుంసకులై పొడగుచున్నారని యాశయము.69

శ్లో. భిత్త్వా తృప్యపరియానాయ జనాః జనితమజ్జనాః,
విగ్రహాయాగ్రతః పశ్చాద్గత్వారోర భ్రవిభ్రమమ్. 70

ప.వి. భిభ్రతి-ఉపరి యానాయ-జనాః-జనితమజ్జనాః-విగ్రహాయ - అగ్రతః - పశ్చాద్గత్వరోరభ్రవిభ్రమమ్.

అర్థము: ఉపరి=పైలోకములకు, యానాయ = వెళ్ళుటకై; జనితమజ్జనాః=, జనిత=అనుష్ఠింపబడిన, మజ్జనాః=తీర్థస్నానములు గలిగిన, అనగా క్రిందికి పోవుచున్నట్టి, జనాః=జనులు, అనగా స్వర్గమును గాంక్షించునట్టి జనులు, అగ్రతః=ఎదుట, విగ్రహాయ = సమ్ముఖ యుద్ధము కొఱకై, పశ్చాద్గత్వరోరభ్రవిభ్రమం, పశ్చాత్=వెనుకకు, గత్వర= పోవునట్టి, ఉరభ్ర = మేకలయొక్క, విభ్రమం = చేష్టవంటి చేష్టను, బిభ్రతి=ధరించుచున్నవి.

వి. ఊర్ధ్వలోకమును బొందుటకై తీర్థస్నానములు గావించునట్టి జనులు సమ్ముఖయుద్ధముచేయు మేషముల ధర్మమును వహించుచున్నారని చెప్పుటవలన నిదర్శనాలంకారము. ఊర్ధ్వలోకమును బొందుటకై క్రిందనున్న తీర్థస్నానములచే దిగువకు బోవుచున్నారను స్థూలబుద్ధి ప్రయాస రూపమైన విచిత్రాలంకారముచే, నాయలంకార ముత్థాపితము. కాన దానితో దీనికి సంకరము. ఆ సంకరాలఙ్కారముచే అవిమృష్ట కారిత్వమను వస్తువు ధ్వనించుసుగాన నలంకారముచే వస్తుధ్వని.

సమాసములు :

*జనితమజ్జనాః*— జనితం మజ్జనం యైస్తే జనితమజ్జనాః.
పశ్చాద్గత్వరోరభ్రవిభ్రమం — పశ్చాద్గత్వరాశ్చ తే ఉరభ్రాశ్చ = పశ్చాద్గ త్వరోరభ్రాః పశ్చాద్గత్వరోరభ్రాణాం విభ్రమ ఇవ విభ్రమః= పశ్చాద్గత్వరోరభ్రవిభ్రమః, తం=పశ్చాద్గత్వరోరభ్రవిభ్రమం.

భావము :

ఊర్ధ్వలోకములను బొందుటకై, తీర్థస్నానాదులాచరించుటకై యధో భాగములకు బోవుచున్నట్టి స్వర్గకాములగు జనులు, ఎదుట నొకదాని నొకటి ఢీకొని యుద్ధము గావించుటకై వెనుకకు జరుగుచున్న మేకలపోరుయొక్క

విభ్రమమును ధరించుచున్నారు. మేకలు ముందుకు వచ్చి యొక దాని నొకటి నెట్టుకొనుచు యుద్ధము చేయుటకై, యెట్లు వెనుకకు జరుగుచున్నవో అట్లే పై లోకములకు బోగోరిన జనులు దిగువనున్న తీర్థములయందు గ్రుంకులిడుట కానవచ్చుచున్నది. అనగా పైకి బోగోరినవారు దిగువకు బోవుచున్నారని యాశయము.

శ్లో. కశ్శమః క్రియతాం ప్రాజ్ఞాః ప్రియాప్రాప్తౌ పరిశ్రమః,
భస్మీభూతస్య దేహస్య పునరాగమనః కుతః ? 71

ప. వి కః-శమః-క్రియతాం-ప్రాజ్ఞాః-ప్రియాప్రాప్తౌ-పరిశ్రమః-భస్మీభూతస్య-దేహస్య-పునః-ఆగమనం-కుతః.

అర్థము: హే ప్రాజ్ఞాః=ఓ ప్రాజ్ఞులారా! ( పరిహాసవచనము ) అనగా ప్రజ్ఞలేని వారలారా! శమః=శాన్తి అనగా వైరాగ్యము. కః=ఏది? అనగా దాని వలన నేమియు ఫలము లేదు. ప్రియాప్రాప్తౌ, ప్రియా = ఇష్టమైన స్త్రీ యొక్క, ప్రాప్తౌ = ప్రాప్తియందు, పరిశ్రమః = పరిశ్రమము, క్రియతాం=చేయబడునుగాత. ఆ పాపముచే నరకప్రాప్తి యేర్పడునని భయపడవలదు. భస్మీభూతస్య = దగ్ధమైన, దేహస్య=ఆత్మయను దేహమునకు, పునః=మఱల, ఆగమనం = పరలోకమునకు వచ్చుట, కుతః=ఎట్లు సంభవించును? దేహమే యాత్మయని చెప్పువాని మతము నందు పరలోకమున్నను నేదేహమునందు బాపము చేయబడినదో యా దేహము భస్మమగుట వలన పాపఫలము ననుభవించుట యెట్లు సాధ్యము? దేహమున కంటె భిన్నమగు ఆత్మను జెప్పెడివారి మతము నందు పర లోకమే లేనందువలన పాపము ననుభవించుటకై క్రిమి కీటకాదుల దేహ మెట్లు వచ్చును ? కాన పునర్జన్మయే భ్రమయని యర్థము.

సమాసములు :

ప్రియాప్రాప్తౌ – ప్రియాయాః ప్రాప్తిః=ప్రియాప్రాప్తిః, తస్యాం= ప్రియాప్రాప్తౌ.

భస్మీభూతస్య—అభస్మ భస్మ సమ్పద్యమానం భూతం=భస్మీభూతం, తస్య=భస్మీభూతస్య.

భావము :

ఓ ప్రాజ్ఞులారా! అనగా ప్రజ్ఞలేనివారలారా! శాంతి లేదా వైరాగ్య మన నేమి? అది యేమియు కాదు. దాని వలన ప్రయోజనము కూడా లేదు. ఇష్టమైన స్త్రీని సంపాదించుటకు పరిశ్రమను చేయుడు, దానివలన నెట్టి పాపమును లేదు. ఆత్మయైన శరీరము భస్మమైన పిదప పరలోకమున కెట్లు వెళ్ళును? దేహమే యాత్మయని చెప్పువాని మతమునందు పరలోకమున్నను నేదేహమునందు పాపము చేయబడినదో యది భస్మమైపోయినందువలన పరలోకములకు రాదు. దేహేతరమే యాత్మయని చెప్పువారి మతమునందు పరలోకమే లేదు కాన పాపఫల మనుభవించుటకు క్రిమికీటకాదిదేహప్రాప్తి యెట్లు సంభవించును? కాన పునర్జన్మమే భ్రమయని యాశయము. ॥71॥

శ్లో. ఏనసాఽనేన తిర్యక్స్యా దిత్యాదిః కా విభీషికా,
రాజిలోఽపి హి రాజేవ స్వైః సుఖీ సుఖహేతుభిః. 72

ప. వి. ఏనసా-అనేన-తిర్యక్-స్యాత్-ఇత్యాదిః-కా-విభీషికా-రాజిలః-అపి-హి-రాజా-ఇవ-స్వైః-సుఖీ-సుఖహేతుభిః.

అర్థము: అనేన=ఈ, ఏనసా=పాపముచేత, తిర్యక్=క్రిమికీటకాది నరక శరీరము, స్యాత్=అగును, ఇత్యాదిః=ఇవి మున్నగునది, కా=ఏమి, విభీషికా=బెదరింపు? అట్టివి జరుగవు. కాన నిది యర్థములేనిది. హి= ఏల యనగా? రాజిలః=రాజిలమని చెప్పఁబడు విషములేని పాము, స్వైః=తన జాతికి సంబంధించిన, సుఖహేతుభిః=నీట విహరించుట, కప్పలనుఁ దినుట. సజాతీయములగు స్త్రీలతో సంభోగించుట మున్నగు సుఖసాధనములతో, రాజా ఇవ=రాజువలె, సుఖీ=సుఖముగలదిగా నున్నది. కాన, తిర్యగ్జంతువులకును, శరీరేంద్రియాభిమానములు

కలవు. వానికి సుఖానుభవ మున్నది. అందు తిర్యక్ జాతిలో పుట్టినను దానికిఁ దగిన సుఖము దానికున్నది గాన నాపాపమువలన భయపడవలసిన అవసరము లేదని యర్థము.

**సమాసములు:**

సుఖహేతవః- సుఖస్య హేతవః=సుఖహేతవః, తైః =సుఖహేతుభిః.

**భావము :**

నరకము ననుభవించుటకై సర్పాదిరూపమైన యాతనాశరీరము కలుగునని భయపడ నవసరము లేదు. ఈపాపముచే సర్పాదిరూపము వచ్చుననుట ఏమి బెదిరింపు ? దీనివలన నేవిధమైన యనిష్టము కలుగదు. గాన దీనికి భయపడ నావశ్యకత లేదు. ఏల యనగా ? విషములేని రాజిలమను సర్పము అనగా నీటిపాము, సుఖసాధనములైన జలవిహారము, కప్పలను భక్షించుట, సజాతీయములగు కాంతలతో సంభోగములు మున్నగువానితో రాజువలె సుఖము ననుభవించుచున్నది. కాన తిర్యగ్జంతువులైనను వానికి శరీరేంద్రియాభిమానము లుండుటవలన సుఖానుభవ మున్నది. అందువలన పాపముచే తిర్యగ్జాతిలో జన్మించినను దానివలన పాపమునకు భయపడ నవసరములేదని యాశయము.

శ్లో. హతాశ్చే ద్దివి దీవ్యన్తి దైత్యా దైత్యారిణా రణే,
తత్రాఽపి తేన యుధ్యన్తాం హతా అపి తథైవ తే. 73

ప. వి. హతాః-చేత్-దివి-దీవ్యన్తి- దైత్యాః- దైత్యారిణా- రణే-తత్ర-అపి-తేన-యుధ్యన్తాం-హతాః-అపి-తథా-ఏవ-తే.

అర్థము: రణే=యుద్ధమునందు, హతాః=చంపబడిన శూరులు, దివి=స్వర్గమునందు, దీవ్యన్తి చేత్ = దివ్యదేహమును ధరించి యాడుకొనినచో, నప్పుడు, దైత్యారిణా=విష్ణువుచే, హతాః=చంపబడిన, దైత్యాః=రాక్షసులు అనగా పాపము గావించినవారలు, తత్రాపి=ఆస్వర్గమునందును, తేన = ఆవిష్ణువుతో, యుధ్యన్తాం=యుద్ధమాడెదరు. యుద్ధమునఁ

జంపబడుటవలన దివ్యదేహమును ధరించి యుద్ధమాడెదరని యర్థము. ఆ యసురులు యుద్ధమున జంపబడినను, సమ్ముఖరణమునందు జంపబడుటవలన స్వర్గమునందు జీవనముతోఁ గూడినవారుగనే యుందురు. మరణసమయమునందు విష్ణువుతోటి వైరము వారి హృదయమునందు ఉండుటవలన, స్వర్గమునకుపోయినను, వారికి రాక్షసత్వ ముండుటవలన అచ్చటగూడ నాతనితో వారు యుద్ధము నాడవలసియే యుండును. కాని అదిలేదు గాన వానిని గూర్చి చెప్పు శాస్త్రము అసత్యము.

సమాసములు :

దైత్యారిణా - దైత్యానాం అరిః = దైత్యారిః, తేన = దైత్యారిణా.

భావము :

యుద్ధమునందు జనిపోయిన వీరులు స్వర్గమునందు క్రీడింతురు అను శాస్త్రము ననుసరించి విష్ణువుచే జంపబడిన రాక్షసులు, యుద్ధమునందు జంపబడుటవలన, దివ్యదేహములను ధరించి, మరణకాలమందు, రాక్షస భావముతో గూడియుండుటవలన, మఱల వారు స్వర్గమందును, విష్ణువుతో యుద్ధము జేయవలసి యున్నది. కాని యిట్లు ఏ పురాణమందును గానరానందువలన, యుద్ధమునందు జనిపోవుటవలన వీరులు స్వర్గమునుఁ జేరి యచ్చట క్రీడింతురను మాట సత్యమైనది కాదు. ఇది కేవలము భ్రమయే యని యర్థము. కాన నిట్టి విషయములను జెప్పెడి శాస్త్రము విశ్వసనీయము కాదు. ॥73॥

శ్లో. స్వం చ బ్రహ్మ చ సంసారే ముక్తౌతు బ్రహ్మ కేవలం,
ఇతి స్వోచ్ఛిత్తిముక్త్యుక్తి ర్వైదగ్ధీ వేదవాదినామ్. 74

ప. వి. స్వం - చ - బ్రహ్మ - చ - సంసారే - ముక్తౌ - తు - బ్రహ్మ - కేవలం - ఇతి - స్వోచ్ఛిత్తి ముక్త్యుక్తిః వైదగ్ధీ - వేదవాదినాం.

అర్థము : సంసారే = సంసారదశయందు, అనగా ముక్తిపొందుటకు మునుపు, స్వం చ = జీవాత్మప్రపంచము, బ్రహ్మ చ = అనాదియగు నవిద్యావిలా

సనమందున్న భేదముతోకూడిన బ్రహ్మము ననునవి రెండు, ముక్తౌ తు = మోక్షము నందినపుడు, కేవలం = జీవాత్మప్రపంచములేనట్టి, ఏకం=ఒకబ్రహ్మయు నున్నది. ఆకాశమునకు నుపాధులైన ఘటాకాశాదులు తొలగి కేవలమైన యాకాశరూపమున స్థితియుండునో, అట్లే బ్రహ్మాత్మకు సంసారమగు నుపాధి తొలగినపుడు, జీవాత్మ తొలగి కేవలము "ఏకమే వాద్వితీయం బ్రహ్మ" యని చెప్పినవిధమున బ్రహ్మాత్మ స్వరూపముతోడనే స్థితి యుండును. ఇతి=ఈ విధముగా, వేదవాదినాం=వేదాంతశాస్త్రజ్ఞులయొక్క, స్వోచ్ఛిత్తి ముక్త్యుక్తి వైదగ్ధీ =, స్వ=జీవముయొక్క, ఉచ్ఛిత్తి=వినాశమే, ముక్తి=మోక్షమని, ఉక్తి=చెప్పుటయందు, వైదగ్ధీ=చాతుర్యము (దృశ్యతే=చూడబడుచున్నది) ఏ జీవాత్మకై యీసర్వ మేర్పడినదో, అట్టి జీవాత్మకే వినాశము చెప్పబడినది. ఆహా! ఏమి ఈ మాటల నేర్పు? అని పరిహాసము.

**సమాసములు :**

స్వోచ్ఛిత్తిముక్త్యుక్తి వైదగ్ధీ — స్వస్య ఉచ్ఛిత్తిః = స్వోచ్ఛిత్తిః, స్వోచ్ఛిత్తిరేవ ముక్తిః=స్వోచ్ఛిత్తిముక్తిః. స్వోచ్ఛిత్తిముక్తేః ఉక్తిః= స్వోచ్ఛిత్తిముక్త్యుక్తిః, స్వోచ్ఛిత్తిముక్త్యుక్తౌ వైదగ్ధీ=స్వోచ్ఛిత్తిముక్త్యుక్తి వైదగ్ధీ.

వేదవాదినాం- వేదం వదన్తీతి=వేదవాదినః, తేషాం=వేదవాదినాం.

**భావము :**

మాయావాదులయొక్క వేదాన్తసిద్ధాన్త విశేషములను పరిహసించుచున్నాడు. సంసారదశయందు జీవాత్మప్రపంచము అనాద్యవిద్యా విలాసవాసనయందలి భేదముతోగూడిన పరబ్రహ్మయు ననునివి రెండును నుండును. అట్లే మోక్షదశయందు, జీవాత్మప్రపంచముతో శూన్యమైన యొక్కబ్రహ్మమే యున్నది. అదెట్లనగా, ఘటాకాశమఠాకాశములను వ్యవహారములు ఉపాధులైన ఘటాదులు తొలగిపోయినచో, తొలగిపోయి కేవలమగు నాకాశరూపమున స్థితి

యెట్లేర్పడునో, అట్లే బ్రహ్మాత్మకు సంసారరూపమగు నుపాధి తొలగిపోగా జీవాత్మ తొలగిపోయి "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అను నుపనిషద్వచనము ననుసరించి కేవలబ్రహ్మాత్మ స్వరూపమున స్థితి యేర్పడుచున్నది. ఇట్లు వేదాన్తులు జీవమున కుచ్ఛేదమే మోక్షమని చెప్పుటలోని చాతుర్యము కనఁబడుచున్నది. కాని ఏ జీవమునకై సర్వము నేర్పడినదో అట్టి జీవమున కుచ్ఛేదమే మోక్షమని చెప్పుట యేమి నేర్పు? ఇదియెంత హాస్యాస్పదమని యాశయము. 74

శ్లో. ముక్తయే యః శిలాత్వాయ శాస్త్రమూచే సచేతసాం.
గోతమం తమవేత్యైవ యథా విత్థ తథైవ సః. 75

ప వి. ముక్తయే-యః-శిలాత్వాయ-శాస్త్రం-ఊచే-సచేతసాం-గోతమం - తం-అవేత-ఏవ-యథా-విత్థ-తథా-ఏవ-సః.

అర్థము: యః=శాస్త్రమురచించిన ఎవ్వడు, సచేతసాం=ప్రాణులకు, శిలాత్వాయ=సుఖదుఃఖస్వరూప జ్ఞానము లేక పాషాణదశారూపమైన మోక్షమునకు, శాస్త్రం=న్యాయశాస్త్రమును, ఊచే=చెప్పెనో, అనగా తత్త్వజ్ఞానముచే మిథ్యాజ్ఞానదోషాదులు క్రమముగా నశించుటవలన 'తదత్యన్తవిమోక్షోఽపవర్గః' అను సూత్రము ననుసరించి ఆత్యన్తిక దుఃఖనివృత్తి రూపమైన మోక్షము గౌతమునిచే స్థాపితము. దానిచే నవవిధములగు నాత్మగుణము లుచ్ఛిన్నతను బొందుటయను మోక్షము ప్రతిపాదింపబడినది. కాన ముక్తుడు పాషాణకల్పుడనుట సిద్ధమైనది. తం=ఆవిధముగా రచించిన మునిని, గోతమమేవ="అతిశయేన గోః గోతమః"అను వ్యుత్పత్తి ననుసరించి, శ్రేష్ఠమైన గోవుగనే, అవేత=తెలుసుకొనుడు. ఏవం చ సతి=ఇట్లు కాగా, తం=వానిని, యథా=ఏ ప్రకారముగా, విత్థ=తెలుసుకొనుచున్నారో, సః=అతడు, తథైవ=ఆవిధముగనే, సః=అర్థము ననుసరించి గోపశుశ్రేష్ఠుడుగనే యగుచున్నాడు. పాషాణదశలో నుండిపోవుట యను మోక్షము నుపదేశించుటవలన గోతముడు, పశుతముడై మిక్కిలి మూఢుడే యగుచున్నాడు. కాన గోతమశబ్దము యౌగికమేకాని ఇట యోగరూఢము కాదని యర్థము వైశేషికులుగూడా న్యాయమతానుసారులు గాన వారును నట్టివారే యగుచున్నారు.

సమాసములు :

శిలాత్వాయ- శిలాయాః భావః=శిలాత్వం, తస్మై=శిలాత్వాయ.

గోతమం-అత్యంతం గౌః=గోతమః, తం=గోతమం.

భావము :

ప్రాణులు సుఖదుఃఖ సంవేదనము లేక కేవలము శిలావస్థయం దుండుటయే మోక్షమని తన న్యాయ శాస్త్రమున గోతమ మహర్షి చెప్పెను. తత్త్వజ్ఞానముచే మిథ్యాజ్ఞానదోషాదులు క్రమంగా నశించుటవలన "తదత్యన్త విమోక్షోఽపవర్గః'' అను సూత్రము ననుసరించి యాత్యన్తిక దుఃఖ నివృత్తిరూపమైన మోక్షము నతడు స్థాపించెను. అట్లే యతడు తొమ్మిది విధములగు నాత్మ విశేష గుణముల నాశమును సైతము ముక్తియని నిర్వచించెను. దీని ననుసరించి పాషాణకల్పస్థితియే మోక్షమని సిద్ధించుచున్నది. ఆ విధముగా మోక్షస్వరూపమునుఁ జెప్పిన గోతముడు పేరుతోనే గాక యర్థము తోడను గోతముడే. అనగా "అత్యంతం గౌః గోతమః'' అను వ్యుత్పత్తి ననుసరించి శ్రేష్ఠమైన గోవు అని యర్థ మేర్పడుచున్నది. కాన శిలాత్వరూపమైన మోక్షమును జెప్పుటవలన అతడు శ్రేష్ఠమైన పశువే యగుచున్నాడు. వైశేషికులు కూడా న్యాయమతము ననుసరించుటవలన వారును నట్టివారే యని యర్థము. ॥75॥

శ్లో. దారా హరిహరాదీనాం తన్మగ్నమనసో భృశం.
కిం న ముక్తాః పున స్సంతి కారాగారే మనోభువః. 76

ప. వి. దారాః-హరిహరాదీనాం-తన్మగ్నమనసః-భృశం-కిం-న-ముక్తాః-పునః-సన్తి-కారాగారే-మనోభువః

అర్థము: హరిహరాదీనాం=విష్ణుశివాదుల యొక్క, దారాః=భార్యలు, భృశం=మిక్కిలి, తన్మగ్నమనసః-తత్=ఆహరిహరాదులయందు, మగ్న=మునిగిన, మనసః=మనస్సు గలవారైనను, కిం=ఏల, న ముక్తాః=ముక్తిని బడయలేదు. ముక్తి నట్లుంచుము పైగా వారు, మనోభువః=

మన్మథునియొక్క, కారాగారే=బంధనాలయమునందు, అనగా చెరసాల యందు, పునః=మరల, సన్తి=ఉన్నారు. అనగా వారెల్లపుడును కామపరవశులుగనే యున్నారు. కాన హరిహరహిరణ్యగర్భుల నుపాసించుటవలన ముక్తి గలుగునని చెప్పు శాస్త్రముగూడ ప్రమాణము కాదు.

సమాసములు :

హరిహరాదీనాం–హరిశ్చ హరశ్చ = హరిహరౌ, హరిహరౌ ఆదీ యేషాం తే=హరిహరాదయః, తేషాం=హరిహరాదీనాం.

తన్మగ్నమనసః – తేషు మగ్నాని=తన్మగ్నాని, తన్మగ్నాని మనాంసి యాసాం తాః=తన్మగ్నమనసః.

భావము :

హరిహరబ్రహ్మల నుపాసించుటవలన ముక్తికలుగు ననుటయు సరికాదు. ఏల యనగా హరిహరాదుల భార్యలగు లక్ష్మి మున్నగువార లెల్లప్పుడు వారి భర్తలయందే లగ్నములైన మనసులను గల్గినవార లైనను నేల మోక్షమును బొందలేదు? మోక్షముమాటను దూరమున నుంచుము. పైగా మన్మథుని చెరసాల యందు బంధింపబడియున్నారు. అనగా నెల్లప్పుడు కామపరవశలై యున్నారు. కాన హరిహరాదుల నుపాసించుట వలనను భక్తి కలుగునను శాస్త్రము గూడ ప్రమాణము కాదు.

శ్లో. దేహశ్చే దస్తి సర్వజ్ఞః కరుణాభా గవస్థ్యవాక్,
తత్కిం వాగ్వ్యయమాత్రా న్నః కృతార్థయతి నార్థినః. 77

ప వి. దేహః-చేత్-అస్తి-సర్వజ్ఞః - కరుణాభాక్ - అవస్థ్యవాక్ - తత్ - కిం-వాగ్వ్యయమాత్రాత్-నః-కృతార్థయతి-న-అర్థినః.

అర్థము: సర్వజ్ఞః = భూతభవిష్యద్వర్తమానము వస్తువులను తెలిసిన, కరుణాభాక్=దయకు స్థానమైన, అవస్థ్యవాక్=సత్యవచనము కలిగిన అనగా

వేదము ననెడి సత్యవచనములు గలిగిన లేదా చెప్పిన విషయమును నెర వేర్చెడి వాక్కులు గలిగిన, దేవః=ఈశ్వరుడు, అస్తి చేత్=ఉన్నచో, తత్=అపుడు, అర్థినః=మోక్షమునుగోరిన, నః=మనను, వాగ్వ్యయ మాత్రాత్-వాగ్వ్యయ=మీరు ముక్తులుకండు అను వాక్కును, వ్యయ మాత్రాత్=ఉచ్చరించినంతమాత్రమున, కిం=ఎట్లు, న కృతార్థయతి= కృతార్థులను జేయడు. అనగా ముక్తులను గావింపడు. సర్వజ్ఞత్వ కరుణా లయత్వ సఫలవాక్యములను మూడు విశేషణములతో గూడియు విమో చనము చేయుటయందు సమర్థుడుగానిచో నపు డతడు లేనట్లే యర్థము.

సమాసములు :

సర్వజ్ఞః-సర్వం జానాతీతి=సర్వజ్ఞః.
కరుణాభాక్-కరుణాం భజతీతి=కరుణాభాక్.
వాగ్వ్యయమాత్రాత్-వాచః వ్యయః=వాగ్వ్యయః, వాగ్వ్యయ ఏవ= వాగ్వ్యయమాత్రం, తస్మాత్=వాగ్వ్యయమాత్రాత్.

భావము :

న్యాయమతసిద్ధమైన ఈశ్వరుడును లేడు. అత డున్నచో అతని యను గ్రహమువలన ముక్తి నొందెడివారము. సర్వజ్ఞుడును అనగా భూతభవిష్యద్వర్త మానములను తెలిసినవాడును, కరుణకు నెలవైనవాడును, సత్యవచనము కలవాడును అగు నీశ్వరుడున్నచో మోక్షమును గోరునట్టి మనలను నొక మాటను చెప్పినంతమాత్రమున ఏల ముక్తిని బొందింపలేడు? సర్వజ్ఞత్వాది విశేషణములతో గూడియు మనలను ముక్తిని బొందింపలేకపోయినచో నపు డతడు లేనట్లేనని యభిప్రాయము. ॥77॥

శ్లో. భవినాం భావయన్ దుఃఖం స్వకర్మజ మపీశ్వరః,
స్యాదకారణవైరీ నః కారణా దపరే పరే. 78

ప.వి. భవినాం - భావయన్- దుఃఖం - స్వకర్మజం -అపి- ఈశ్వరః- స్యాత్- అకారణవైరీ-న-కారణాత్-అపరే-పరే.

అర్థము: భవినాం=సంసారులయొక్క, స్వకర్మజం=తమకర్మవలన గలిగిన దైనను, దుఃఖం=కష్టమును, భావయన్ = ఉపేక్ష వహింపక యనుభవింపచేయుచు, ఈశ్వరః=భగవంతుడు, నః=మనకు, అకారణవైరీ= అకారణశత్రువుగా, స్యాత్ = అగును. అపరే = ఇతరులు, కారణాత్=అపకారాదికారణములవలన, పరే=శత్రువులుగా, భవన్తి= అగుచున్నారు. అందువలన నా భగవంతుడును నమ్మదగిన వాడు కాడు.

సమాసములు:

*భవినాం* - భవః ఏషాం అస్తీతి=భవినః, తేషాం=భవినాం.
*స్వకర్మజం*-స్వస్యకర్మ = స్వకర్మ, స్వకర్మణః జాయత ఇతి = స్వకర్మజం, తత్=స్వకర్మజం.
*అకారణవైరీ*-న కారణం=అకారణం. అకారణాత్ వైరీ=అకారణవైరీ.

భావము :

సంసారులను వారి వారి కర్మలవలన కలుగు దుఃఖముల విషయమున నుపేక్ష వహింపక పైగా నిమిత్తమగుచున్న ఈశ్వరుడు మనకు నకారణశత్రువగుచున్నాడు. ఇతరులు లోకమునందు అపకారము మున్నగువానిని జేయుట వలన శత్రువు లగుదురు. కాన నా ఈశ్వరుడును విశ్వసింపదగినవాడు కాడు.

శ్లో. తర్కాప్రతిష్ఠయా సామ్యా దన్యోన్యస్య వ్యతిఘ్నతా,
నాప్రామాణ్యం మతానాం స్యాత్ కేషాం సత్ప్రతిపక్షవత్. 79

ప.వి. తర్కాప్రతిష్ఠయా-సామ్యాత్ - అన్యోన్యస్య - వ్యతిఘ్నతాం-న - అప్రామాణ్యం-మతానాం-స్యాత్-కేషాం-సత్ప్రతిపక్షవత్.

అర్థము: తర్కాప్రతిష్ఠయా=తర్కమునకు, అప్రతిష్ఠయా = ప్రామాణ్యము చెప్పెడి హేతువునకు అంతము లేకపోవుటచే, యత్=ఏ, సామ్యాత్=

పోలిక అనగా వ్యాప్తి పక్షతలు మున్నగువాని రూపమున నుండెడి సమ బలత్వ మనెడి కారణమువలన, అన్యోన్యస్య=ఒండొంటిని, వ్యతిఘ్నతాం=దూషించుకొనుచున్న, కేషాం=ఏ, మతానాం=మతములకు అనగా దర్శనములకు, సత్ప్రతిపక్షమువలె, విరుద్ధసాధ్యములను సాధించు హేతువులకు వలె, అప్రామాణ్యం = వ్యభిచారదోషము, న స్యాత్=ఉండదు. తప్పకయుండుననియే యర్థము.

సమాసములు :

తర్కాప్రతిష్ఠయా-తర్కస్య అప్రతిష్ఠా = తర్కాప్రతిష్ఠా, తయా= తర్కాఽప్రతిష్ఠయా. సత్ప్రతిపక్షవత్-సన్ ప్రతిపక్షః యస్య సః= సత్ప్రతిపక్షః, సత్ప్రతిపక్షస్యేవ=సత్ప్రతిపక్షవత్.

భావము :

మఱియు, సమస్తములైన ఆస్తికమతములు పరస్పరవిరోధమువలన నప్రయాణములు. ఏల యనగా తర్కమునకు అంతము లేనందున వ్యాప్తి పక్షతాదిబలము లంతట సమానముగా నుండుటవలన నొండొంటిని దూషించుకొనెడి యేమతములకు పరస్పరవిరుద్ధ సాధ్యములను సాధించు సత్ప్రతిపక్షము లనెడి హేతువులకువలె నప్రామాణ్య ముండదు ? తప్పక యుండగలదనియే యర్థము. ఏల యనగా "శబ్దః అనిత్యః- కార్యత్వాత్ - ఘటవత్" యని వైశేషికాదులు శబ్దమునకు అనిత్యత్వమును సాధించుచున్నారు. మీమాంసకులు "శబ్దః నిత్యః-నిరవయవత్వాత్-ఆకాశాదివత్" యని శబ్దమునకు నిత్యత్వమును సాధించుచున్నారు. ఇట్లు రెండు మతములకు సమబలత్వ ముండుటవలన వానిలో నేది ప్రమాణమని నిశ్చయింప సాధ్యము కానందువలన మధ్యస్థునకు శబ్దము నిత్యమా కాదా ? యను సంశయ మేర్పడును. కాని నిశ్చయరూపమగు ఫలము కలుగనందువలన నారెండు మతములందు నప్రామాణ్యజ్ఞాన మేర్పడునని భావము. ॥79॥

శ్లో. అక్రోధం శిక్షయన్త్యన్యాన్ క్రోధనా యే తపోధనాః,
నిర్ధనాస్తే ధనాయేవ ధాతువాదోపదేశినః. 80

ప.వి. అక్రోధం-శిక్షయన్తి-అన్యాన్ - క్రోధనాః-యే- తపోధనాః-నిర్ధనాః-తే-
ధనాయ-ఇవ-ధాతువాదోపదేశినః.

అర్థము: క్రోధనాః=కోపస్వభావము గలిగిన, తపోధనాః=తపస్సే ధనముగా గలిగిన దుర్వాసుడు మున్నగువారలు, మూల అన్యాన్=ఇతరులను గూర్చి, అక్రోధం = సమస్తములగు ననిష్టములకు రూపమగుటవలన కోపము కూడదని, శిక్షయన్తి=ఉపదేశించుచున్నారు. తే=ఆమునులు, నిర్ధనాః=తాము ధనములేనివారై, ధనాయ=ధనమునకై, ధాతువాదోప దేశినః ఇవ=లోహమును బంగారముగా మార్చునట్టి ధాతువాదమును నేర్పుచున్నవారో యనునట్లు (ఉపహాస్యాః = పరిహసింపదగినవారుగా, భవన్తి=అగుచున్నారు)

సమాసములు :

అక్రోధం - న క్రోధః=అక్రోధః, తం=అక్రోధం.
తపోధనాః - తప ఏవ ధనం యేషాం తే=తపోధనాః.
ధాతువాదోపదేశినః - ధాతోః వాదః=ధాతువాదః, ధాతువాదం ఉప దిశన్తీతి=ధాతువాదోపదేశినః.

భావము :

కోపస్వభావము గలిగిన దుర్వాసుడు మున్నగు తాపసులు ఇతరులను గూర్చి క్రోధము సకలానర్థములకు మూలమైనది. అది కూడదని యుపదేశింతురు. కాని తామున్మాత్రము కోపమును వదిలిపెట్టరు. ఆ విధముగనే యామునులు తాము ధనములేనివారైనను నితరులను ధనవంతులగునట్లు చేయుటకై లోహమును బంగారుగా మార్చునట్టి ధాతువిద్య నుపదేశించుచున్నారు. ఆ ధాతువిద్య ఫలప్రదమైనచో తామఃగూడా నావిద్య నుపయోగించి, ధనవంతులు కావచ్చును గదా? కావుననే వారు పరిహాసపాత్రు లగుచున్నారు.

శ్లో. కిం విత్తం దత్త తుష్టేయ మదాతరి హరిప్రియా,
దత్త్వా సర్వం ధనం ముగ్ధో బంధనం లబ్ధవాన్ బలిః. 80

ప. వి. కిం-విత్తం-దత్త-తుష్టా-ఇయం-అదాతరి-హరిప్రియా - దత్త్వా- సర్వం-
ధనం - ముగ్ధః-బంధనం-లబ్ధవాన్-బలిః.

అర్థము: (ఓ త్యాగులారా!) విత్తం=ధనమును, కిం=ఏల, దత్త=ఇత్తురు, ఈయవలదని యర్థము. యతః=ఏలయనగా, ఇయం-ఈ ధనరూపురాలైన, హరిప్రియా=లక్ష్మి, అదాతరి=దానముచేయనట్టి లోభియందే, తుష్టా = సంతుష్టిఁ బొందియున్నది. అది యుక్తమే. ముగ్ధః = మూఢుడైన, అనగా దానము చేయుటయను పిచ్చిగల్గిన, బలిః=బలి చక్రవర్తి, సర్వం ధనం=సమస్తమైన ధనమును, దత్త్వా=వామన రూపుడైన విష్ణువున కిచ్చి, బంధనం=త్రివిక్రముడగు నావిష్ణువుచే బంధనమును, లబ్ధవాన్=పొందెను, కాన దానము చేయరాదు.

సమాసములు :

అదాతరి - న దాతా=అదాతా, తస్మిన్=అదాతరి.

హరిప్రియా - హరేః ప్రియా=హరిప్రియా.

భావము :

ఓ దాతలారా! మీరు ధనము నేల దానము చేతురు? అట్లు చేయవలదు. దానము చేయనిచో లక్ష్మీదేవి బాధపడునని శంకింపకుడు. ఏల యనగా? లక్ష్మీదేవి, దానముచేయనట్టి లుబ్ధునియందే ప్రీతిని బొంది యచ్చటనే నివసించును. ఇది యుక్తమైన విషయము. కావుననే బలిచక్రవర్తి దానమును వ్యసనముగా బెట్టుకొని వామనావతార మెత్తిన విష్ణువుచే మూడడుగుల భూమికై యాచించబడి బంధనమును బొందెను. రాక్షసరాజగు బలి యజ్ఞము చేయుచుండెను. అతనివలన భయపడిన యింద్రుడు ప్రార్థింపగా విష్ణువు వామన రూపమును ధరించి యాయజ్ఞశాలకువెళ్ళి బలిచక్రవర్తిని మూడున్నర యడుగుల నేలను యాచించెను. అపుడు శుక్రాచార్యుడు వలదని నిషేధించుచున్నను యజ్ఞమునకు విచ్చేసిన బ్రాహ్మణుకు ఆశాభంగము జెంది మఱలుట యనుచితమని భావించి, బలిచక్రవర్తి యంతటి భూమిని దానము చేయగా అపుడు వామనుడు

నిరాడ్రూపమును ధరించి, మూడు పాదములచే మూడు లోకములను గొలిచెను. తర్వాత మిగిలిన యర్ధపాదమునకు స్థానము లేనందువలన దానిస్థానమున బలి చక్రవర్తియొక్క పీఠము నాక్రమించి యతనిని పాతాళమునకు పంపివైచెను. ఆపురాణగాధ యిట ననుసంధేయము.॥80॥

శ్లో. దోగ్ధా ద్రోగ్ధా చ సర్వోఽయం ధనిన శ్చేతసా జనః,
విసృజ్య లోభసంక్షోభ మేకద్వా యద్యుదాసతే. 81

ప. వి. దోగ్ధా-ద్రోగ్ధా-చ-సర్వః-అయం-ధనినః- చేతసా- జనః- విసృజ్య- లోభ సంక్షోభం-ఏకద్వా-యది-ఉపాసతే.

**అర్థము:** అయం = ఈకనబడునట్టి, సర్వః = సమస్తమైన, జనః = లోకము, ధనినః = ధనికులను, దోగ్ధా = పిదుకునట్టిది. పరోపకారము చేయవలయు నని మిషపెట్టి, ధనమును ధనవంతులనుండి సంగ్రహించును. తథా = అట్లే, చేతసా = మనస్సుచే, ద్రోగ్ధా = ద్రోహము చేయునది. అనగా ననిష్టము చేయునది. ఒకప్పు డిది తప్పుట గూడ నున్నది. ఎట్లనగా, లోభసంక్షోభం, లోభ = ధనకాంక్షచే నేర్పడిన, సంక్షోభం = కలతను, విసృజ్య = విడిచి, ఏకద్వాః = ఒకరో ఇద్దరో, యది ఉదాసతే, ఉదాసీనత వహించి యాధనమునందు కాంక్షలేక యుందురేమో! కాని వారిసంఖ్య చాలా తక్కువ. గాన వంచకులను పోషించెడి దానమనెడి ధర్మము సరియైన పాత్ర లేనందువలన విడువదగినదే.

సమాసములు :

*లోభసంక్షోభం*- లోభస్య సంక్షోభః = లోభసంక్షోభః, తం = లోభ సంక్షోభం.

*ఏకద్వాః* - ఏకః ద్వౌ వా యేషాం తే = ఏకద్వాః.

భావము :

ఈ జనులందరును ధనికులనుండి ధనమును పిదుకుటయే వృత్తిగలవారై పరోపకారము చేయుదుమని నెపము పెట్టి, వారినుండి ధనమును సంపాదింతురు.

కాని వారా విధముగా చేయక, నిట్లు మోసముతో ధనము సంపాదించుకొనుట కెత్తుగడలు వేయుచు, దాతలకు ద్రోహము చేతురు. ఈ జనులలో అట్టి లోభ బుద్ధిని వదిలి, మెలగువా రొక్కరో లేక యిద్దరో యుందురు. కాని మూడవవారు లేరు. కాన నట్టి వంచకులను బోషించుటకై దానము చేయరాదు. సత్పాత్రులు లేరు గాన దానము వర్జింపదగినదే. 83

శ్లో. దైన్యస్యాయుష్య మస్తైన్య మభక్ష్యం కుక్షివంచనా,
స్వాచ్ఛన్ద్య మృచ్ఛతాఽనన్దకన్దలీకన్ద మేకకమ్. 83

ప వి. దైన్యస్య-ఆయుష్యం-అస్తైన్యం-అభక్ష్యం - కుక్షివంచనా-స్వాచ్ఛన్ద్యం-ఋచ్ఛత-ఆనన్దకన్దలీకన్దం-ఏకకమ్.

అర్థము: అస్తైన్యం — దొంగతనము చేయకుండుట, దైన్యస్య=దీనత్వమునకు, అనగా దారిద్ర్యమునకు, ఆయుష్యం=వృద్ధి నొసగునది. అనగా దొంగతనము చేయనియెడల దారిద్ర్యము తొలగదు. అభక్ష్యం=భుజింప రాని యెట్టిగడ్డలు మున్నగువానిని భుజింపకుండుట, కుక్షివంచనా— కుక్షి=కడుపునకు, వంచనా=మోసమే. రుచికరమగు వస్తువును తిననందువలన కడుపునకు వంచనయేకాని దానివలన నెట్టి ధర్మమును చేకూరదు. కాన ఆనన్దకన్దలీకన్దం, ఆనన్దకన్దలీ=ఆనందమను మొలకకు, కన్దం=మూలమైన, ఏకకం=ఒకటియేయైన, స్వాచ్ఛన్ద్యం=స్వేచ్ఛను, ఋచ్ఛత=పొందుడు.

సమాసములు :

దైన్యస్య—దీనస్య భావః=దైన్యం, తస్య=దైన్యస్య.

ఆయుష్యం-ఆయుషే హితం=ఆయుష్యం.

అభక్ష్యం-న భక్ష్యం=అభక్ష్యం.

కుక్షివంచనా-కుక్షేః వంచనా=కుక్షివంచనా.

స్వాచ్ఛన్ద్యం-స్వచ్ఛన్దస్య భావః=స్వాచ్ఛన్ద్యం. తత్=స్వాచ్ఛన్ద్యం.

ఆనన్దకన్దలీకన్దం - ఆనన్దస్య కన్దలీ = ఆనన్దకన్దలీ, ఆనందకన్దల్యాః కందం = ఆనన్దకన్దలీకన్దం.

ఏకకం-ఏకమేవ = ఏకకం. తత్ = ఏకకమ్.

భావము :

దొంగతనము చేయనిచో దారిద్ర్యము వర్ధిల్లును. భుజింపకూడదని చెప్ప బడిన యుల్లిగడ్డలు మున్నగువానిని వర్జించుటవలన కడుపునకు వంచనయే కాని దానివలన ధర్మము చేకూరదు. కావున ఆనందమునకు ఒక్కటే మూలమైన స్వేచ్ఛాచారమును జేపట్టుడు. అందువలన సుఖమునొందుడు. వేదములయందును, స్మృతులయందును, పురాణాదులయందును జెప్పబడిన నిషేధములను లెక్కింపక సమస్త సుఖములకు సాధనమైన స్వేచ్ఛాచారమును జేయుడు. 83

శ్లో. ఇత్థమాకర్ణ్య దుర్వర్ణాన్ శక్రః సక్రోధతాం దధే,
అవోచదుచ్చైః కఃకోఽయం ధర్మమర్మాణి కృన్తతి. 84

ప. వి. ఇత్థం-ఆకర్ణ్య-దుర్వర్ణాన్-శక్రః-సక్రోధతాం - దధే-అవోచత్-ఉచ్చైః-కః-కః-అయం-ధర్మమర్మాణి-కృన్తతి.

అర్థము: శక్రః = ఇంద్రుడు, ఇత్థం = ఈ విధములైన, దుర్వర్ణాన్ = వేదాదులను దూషించెడి చార్వాకుని దుష్టవాక్యములను, ఆకర్ణ్య = విని, సక్రోధతాం = క్రోధముతో కూడియుండుటను, దధే = ధరించెను. ఈ విధముగా వేదాదులను దూషించునట్టి నరుడు, కః = ఎవ్వడు? కః = ఎవ్వడు? ధర్మమర్మాణి = ధర్మసారములను లేదా ధర్మరహస్యములను, కృన్తతి = ఖండించుచున్నాడు. ఇతి = అని, ఉచ్చైః = బిగ్గరగా, అవోచత్ = పలికెను.

సమాసములు :

దుర్వర్ణాన్-దుష్టాశ్చ తే వర్ణాశ్చ = దుర్వర్ణాః, తాన్ = దుర్వర్ణాన్.

సక్రోధతాం-క్రోధేన సహ వర్తత ఇతి=సక్రోధః, సక్రోధస్య భావః= సక్రోధతా తాం=సక్రోధతాం.

ధర్మమర్మాణి-ధర్మస్య మర్మాణి ధర్మమర్మాణి. తాని=ధర్మమర్మాణి.

భావము :

ఇంద్రుడు ఈ విధముగా వేదాదులను దూషించునట్టి నాస్తికుడైన చార్వాకుని దుష్టవాక్యములను విని, కోపము చెందినవాడై, ఈ విధముగా వేదాదులను దూషించెడి నరు డెవ్వడు? ఎవ్వడీ విధముగా ధర్మరహస్యములను ఖండించుచున్నాడు అని బిగ్గరగా అఱచెను. ॥84॥

శ్లో. లోకత్రయీం త్రయీనేత్రాం వజ్రవీర్యస్ఫురత్కరే,
క ఇత్థం భాషతే పాకశాసనే మయి శాసతి. 85

ప. వి. లోకత్రయీం-త్రయీనేత్రాం-వజ్రవీర్యస్ఫురత్కరే-కః-ఇత్థం-భాషతే-పాకశాసనే-మయి-శాసతి.

అర్థము: త్రయీనేత్రాం=త్రయీ=ఋగ్యజుస్సామము లనెడి మూడు వేదములను, నేత్రాం=నేత్రముగా గలిగిన అనగా బహిరిన్ద్రియములవలన ప్రత్యక్షమునకు విషయములుకాని వస్తువులను తెలిపెడి మూడు వేదములను కన్నులుగా గలిగిన, లోకత్రయీం=మూడు లోకములను, వజ్రవీర్యస్ఫురత్కరే=వజ్రవీర్య=వజ్రాయుధముయొక్క, ప్రభావముచే, స్ఫురత్ = ప్రకాశించు, కరే = హస్తము కలిగిన, పాకశాసనే = పాకాసురుని శిక్షించిన, మయి = దేవేన్ద్రుడనగు నేను, శాసతి=పాలించుచుండగా, అనగా ధర్మమును స్థాపించి పాలించుచుండగా, కః=ఎవ్వడు, ఇత్థం=ఇట్లు, భాషతే=మాట్లాడుచున్నాడు? అనగా ధర్మనిందను చేయుచున్నాడు ?

సమాసములు :

లోకత్రయీం-త్రయాణాం సమూహః=త్రయీ, లోకానాం త్రయీ= లోకత్రయీ, తాం లోకత్రయీం.

త్రయీనేత్రాం - త్రయాణాం సమూహః = త్రయీ, త్రయీ నేత్రే యస్యాః స్సా=త్రయీనేత్రా తాం=త్రయీనేత్రాం.
పాకశాసనే - పాకం శాస్తీతి=పాకశాసనః, తస్మిన్ =పాకశాసనే.

భావము :

మూడు వేదములను కన్నులుగా గలిగిన మూడు లోకములను, వజ్రాయుధముయొక్క ప్రభావముతో ప్రకాశించు హస్తము గలిగినట్టివాడను, పాకాసురుని చంపిన వాడను నైన నేను ధర్మస్థాపనపూర్వకముగా పరిపాలించుచున్నాను. అట్టితరి యెవ్వడీ విధముగా ధర్మదూషణమును జేయునని యింద్రుడు పలికెను. ॥85॥

శ్లో. వర్ణాసంకీర్ణతాయాం వా జాత్యలోపేఽన్యథాపి వా
బ్రహ్మహాదేః పరీక్షాసు భఙ్గ మఙ్గ ప్రమాణయ. 86

ప.వి. వర్ణాఽసంకీర్ణతాయాం-వా-జాత్యలోపే-అన్యథా-అపి-వా-బ్రహ్మహాదేః-పరీక్షాసు-భంగమ్-అంగ-ప్రమాణయ.

అర్థము: వర్ణాసంకీర్ణతాయాం వా, వర్ణ=బ్రాహ్మణాది వర్ణములకు, అసంకీర్ణతాయాం=సాంకర్యము లేకయుండుట యందుకాని, అన్యథాపిఽవా=మఱియొక విధముగా గాని అనగా నిషేధింపఁబడిన వ్యాపారము మున్నగు వృత్తుల నవలంబించుటవలనఁగాని, జాత్యలోపే=జాతిభ్రంశము కాలేదను విషయమున అనగా జాతిశుద్ధిని గూర్చిన విషయమున, బ్రహ్మహాదేః=బ్రహ్మహత్య గావించిన వారియొక్క, పరీక్షాసు = తులాది దివ్యకరణములయందలి, భంగం=పరాజయమును, హే అంగ = ఓయీ! ప్రమాణయ=ప్రమాణముగాఁ జేసికొనుము. అనగా బ్రాహ్మణత్వాది జాతిశుద్ధి లేనిచో, జలాగ్నితులాది రూపములగు దివ్యకరణ పరీక్షల యందు పరాజయ మేర్పడును. కాన అట్టి పరీక్షలతో బ్రాహ్మణాదుల యందు అసాంకర్యమును నిర్ణయింపవచ్చును. కాని స్వేచ్ఛగా జాతుల కన్నింటికిని సాఙ్కర్యము చెప్పదగదు.

సమాసములు :

వర్ణాఽసఙ్కీర్ణతాయాం-సఙ్కీర్ణానాం భావః=సఙ్కీర్ణతా, న సఙ్కీర్ణతా = అసఙ్కీర్ణతా, వర్ణానాం అసఙ్కీర్ణతా=వర్ణాఽసఙ్కీర్ణతా, తస్యాం=వర్ణాసఙ్కీర్ణతాయాం.

జాత్యలోపే - న లోపః=అలోపః. జాతేః అలోపః=జాత్యలోపః, తస్మిన్=జాత్యలోపే.

బ్రహ్మహాదేః - బ్రహ్మ హన్తీతి=బ్రహ్మహా. బ్రహ్మహా ఆదిః యస్య సః=బ్రహ్మహాదిః, తస్య=బ్రహ్మహాదేః.

భావము :

వెనుక 40-41 శ్లోకములలో సమస్తజాతులకును సాఙ్కర్యమును నాస్తికుడగు చార్వాకుడు చెప్పెను. కాని జన్మసాఙ్కర్యములవలన కాని, నిషిద్ధములగు వాణిజ్యాదివృత్తులను జేపట్టుటవలన కాని జాతిభ్రంశ సంశయ మేర్పడినచో, బ్రహ్మహత్యాదులను గావించి లేదని వాదించు పాపి స్మృతులయందును, శాస్త్రములయందును విధింపఁబడిన జలాగ్నితులాది దివ్యశోధన ప్రమాణములయందు పరాజయము నెట్లు పొందుచున్నాడు ? కావున హత్యచేయబడినవానియందు బ్రాహ్మణత్వము సిద్ధమగుచున్నది. బ్రాహ్మణత్వమే లేనిచో నది బ్రహ్మహత్య గాదు గావున జలాదిదివ్యశోధనల యందు భంగముకూడ వాటిల్లకపోయెడిది. కాన దానివలన జాతిశుద్ధి నిర్ణయ మేర్పడును గాని సకలజాతులు సంకరము నొందిన వను చార్వాకునివచనము నిరాధారము. ॥86॥

శ్లో. బ్రాహ్మణ్యాది ప్రసిద్ధాయా గన్తా యన్నేక్షతే జయమ్,
తద్ధి శుద్ధి మశేషస్య వర్ణవంశస్య శంసతి. 87

ప.వి. బ్రాహ్మణ్యాదిప్రసిద్ధాయాః-గన్తా - యత్ - న - ఈక్షతే-జయం-తత్-హి-శుద్ధిమ్-అశేషస్య-వర్ణవంశస్య-శంసతి.

అర్థము: (కించ=మఱియు) బ్రాహ్మణ్యాది ప్రసిద్ధాయాః=బ్రాహ్మణస్త్రీ, క్షత్రియస్త్రీ యను ప్రసిద్ధిఁగాంచిన స్త్రీని, గన్తా=సంభోగించిన పురుషుడు,

జయం=(జలాది దివ్యకరణములయందు)జయమును, నేక్షతే ఇతి యత్= చూడ దనుట యేది కలదో యదియే, తత్=ఆ పరాజయమే, అనగా జయమును దర్శింపకుండుట యనునది, అశేషస్య = సకలమైన, వర్ణ వంశస్య = బ్రాహ్మణాదికులమునకు అనగా తల్లిదండ్రుల పరంపరకు, విశుద్ధిం=పరిశుద్ధిని అనగా అసఙ్కరమును, శంసతి=చెప్పుచున్నది. అట్లుకానిచో నట్టిస్త్రీని పొందినవానికి పాపమును సూచించునట్టి పరాజయ మెట్లేర్పడు చున్నది? కాన తలిదండ్రుల పరంపరలో నొక్కరు సాఙ్కర్యము పొందినను వారి దోషము తరువాతివారికి సంక్రమించుట వలన, పైన చెప్పబడిన దివ్యపరీక్షలలో పాపికి పరాజయ మేర్పడదు. కాని పరాజయ మేర్పడుచున్నది. కాన మాతాపితృపరంపరలో నెవ్వరి లోను సంకరదోష మేర్పడలేదని సిద్ధమగుచున్నది.

సమాసములు :

బ్రాహ్మణ్యాదిప్రసిద్ధాయాః-బ్రాహ్మణస్య స్త్రీ=బ్రాహ్మణీ, బ్రాహ్మణీ ఆదిః యస్యాః సా=బ్రాహ్మణ్యాదిః. బ్రాహ్మణ్యాదిశ్చ అసౌ ప్రసిద్ధా చ=బ్రాహ్మణ్యాదిప్రసిద్ధా, తస్యాః = బ్రాహ్మణ్యాదిప్రసిద్ధాయాః. వర్ణవంశస్య-వర్ణానాం వంశః=వర్ణవంశః, తస్య=వర్ణవంశస్య.

భావము :

బ్రాహ్మణస్త్రీ మున్నగువారితో సంభోగించిన పురుషుడు దివ్యపరీక్ష యందు విజయమునుఁ బొందుట లేదనుట స్పష్టము. అట్లు విజయమునుఁ జూడక యుండుటయే బ్రాహ్మణాది వర్ణవంశములకు శుద్ధిని చెప్పుచున్నది. ఆ పరంపరలో నేయొక్కరియందు సాఙ్కర్యమున్నను నది తర్వాతివారికి సంక్రమించును. గాన నట్టితరి పైవిధముగా బ్రాహ్మణస్త్రీ మున్నగువారితో సంపర్కము చేసినవారు దివ్యపరీక్షయందు తప్పక నెగ్గవలయును. అట్లు నెగ్గక పోవుటయే బ్రాహ్మణాదివర్ణములకు శుద్ధినిఁ జెప్పుచున్నది. ॥87॥

శ్లో. జలానలపరీక్షాదౌ సంవాదో వేదవేదితే,
గలహస్తితనాస్తిక్యాం ధిక్ ధియం కురుతే న తే. 88

సమాసములు :

వర్ణాఽసఙ్కీర్ణతాయాం—సఙ్కీర్ణానాం భావః=సఙ్కీర్ణతా, న సఙ్కీర్ణతా = అసఙ్కీర్ణతా, వర్ణానాం అసఙ్కీర్ణతా=వర్ణాఽసఙ్కీర్ణతా, తస్యాం=వర్ణాసఙ్కీర్ణతాయాం.

జాత్యలోపే - న లోపః=అలోపః. జాతేః అలోపః=జాత్యలోపః, తస్మిన్=జాత్యలోపే.

బ్రహ్మహాదేః - బ్రహ్మ హన్తీతి=బ్రహ్మహా. బ్రహ్మహా ఆదిః యస్య సః=బ్రహ్మహాదిః, తస్య=బ్రహ్మహాదేః.

భావము :

వెనుక 40-41 శ్లోకములలో సమస్తజాతులకును సాఙ్కర్యమును నాస్తికుడగు చార్వాకుడు చెప్పెను. కాని జన్మసాఙ్కర్యములవలన కాని, నిషిద్ధములగు వాణిజ్యాదివృత్తులను జేపట్టుటవలన కాని జాతిభ్రంశ సంశయ మేర్పడినచో, బ్రహ్మహత్యాదులను గావించి లేదని వాదించు పాపి స్మృతులయందును, శాస్త్రములయందును విధింపఁబడిన జలాగ్నితులాది దివ్యశోధన ప్రమాణములయందు పరాజయము నెట్లు పొందుచున్నాడు? కావున హత్యచేయబడినవానియందు బ్రాహ్మణత్వము సిద్ధమగుచున్నది. బ్రాహ్మణత్వమే లేనిచో నది బ్రహ్మహత్య గాదు గావున జలాదిదివ్యశోధనల యందు భంగముకూడ వాటిల్లకపోయెడిది. కాన దానివలన జాతిశుద్ధి నిర్ణయ మేర్పడును గాని సకలజాతులు సంకరము నొందిన వను చార్వాకునివచనము నిరాధారము. ॥86॥

శ్లో. బ్రాహ్మణ్యాది ప్రసిద్ధాయా గన్తా యన్నేక్షతే జయమ్,
తద్ధి శుద్ధి మశేషస్య వర్ణవంశస్య శంసతి. 87

ప.వి. బ్రాహ్మణ్యాదిప్రసిద్ధాయాః-గన్తా - యత్ - న — ఈక్షతే-జయం-తత్-హి-శుద్ధిమ్-అశేషస్య-వర్ణవంశస్య-శంసతి.

అర్థము: (కించ=మఱియు) బ్రాహ్మణ్యాది ప్రసిద్ధాయాః=బ్రాహ్మణస్త్రీ, క్షత్రియస్త్రీ యను ప్రసిద్ధిఁగాంచిన స్త్రీని, గన్తా=సంభోగించిన పురుషుడు,

జలదివ్యపరీక్షా యనగా : పాపియగు పురుషుఁడు జలమునందు మునిగిన వాఁడై జలమునందు మునిగిన మఱియొక పురుషునిచే వింటినుండి విడువబడిన బాణమునుఁ బట్టుకొని పైకి లేచినచో నతడు శుద్ధుఁడు. అట్లు కానిచో నతడు శుద్ధుఁడు కాడని నిర్ణయించుటకు సాధనమైన పరీక్ష.

అగ్ని దివ్యపరీక్ష యనగా : బాగుగా కాల్చబడిన లోహాదులను బట్టుకొనిన పురుషునికి చేయికాలుట మున్నగునవి లేనిచో నప్పుడతడు పాపరహితుడు, శుద్ధుడు నని నిర్ణయించుటకు సాధనమైన పరీక్ష. "జలానలపరీక్షాదౌ" అనునెడ నాది శబ్దముచే వృష్టిసాధనములగు కారీర్యాదియాగములు "కారీర్యా యజేత వృష్టి కామః" అని వేదము వర్షమునకై కారీరీయాగమును విధించినది. ఆ వేద వచనమును నమ్మి కారీరీయాగమునుఁ జేసినచో వృష్టి తప్పక వచ్చుచున్నది. కాన పై విధముగా బరిశీలన గావించినచో చార్వాకుని నాస్తిక్యమునకు తావు లేదని యాశయము. ॥88॥

శ్లో. సత్యేవ పతియోగాదౌ గర్భాదే రధ్రువోదయాత్,
ఆక్షిప్తం నాస్తికాః కర్మ న కిం మర్మ భినత్తి వః. 89

ప.వి. సతి-ఏవ-పతియోగాదౌ-గర్భాదేః-అధ్రువోదయాత్-ఆక్షిప్తం-నాస్తికాః-కర్మ-న-కిం-మర్మ-భినత్తి-వః.

అర్థము:- హే నాస్తికాః = ఓ పరలోకజ్ఞానము లేనివారలారా!, పతియోగాదౌ సత్యేవ=భర్తతో సంబంధమున్నను అట్లే మేఘోదయము మున్నగు ప్రత్యక్షవిషయములైన వర్షకారణములున్నను, గర్భాదేః = గర్భము వర్షము మున్నగువానికి, అధ్రువోదయాత్=ఉత్పత్తి యనిశ్చితముగా నుండుటవలన, అనగా నెప్పుడో యొకప్పుడు ఏర్పడిన గర్భాదిరూప కార్యమువలనను, వర్షాదిరూపకార్యమువలనను, ఆక్షిప్తం=ఆక్షేపింపఁ బడిన యనగా నర్థాపత్తిచే సిద్ధమైన, కర్మ=ధర్మాధర్మరూపమైన జన్మాన్తరమునకు సంబంధించిన యదృష్టము, వః = నాస్తికులైన మీయొక్క, మర్మ=హృదయమందలి సందేహమును, కిం న భినత్తి=భేదించుట లేదా ఏమి? అనగా స్త్రీ పురుష సంయోగరూపమగు ప్రత్యక్షకారణ

ప వి. జలానలపరీక్షాదౌ- సంవాదః- వేదవేదితే- గలహస్తితనాస్తిక్యాం- ధిక్-ధియం-కురుతే-న-తే.

అర్థము : (కించ=మఱియు) వేదవేదితే=వేదములచేఁ దెలుపఁబడిన, జలానల పరీక్షాదౌ=జలాగ్ని పరీక్షలు మున్నగు వానియందు, సంవాదః = శుద్ధి, అశుద్ధి మున్నగునది సరిపడియుండుట, తే=నీయొక్క, ధియం = బుద్ధిని, గలహస్తితనాస్తిక్యాం; గలహస్తిత=మెడపైఁ జేతినుంచి నెట్టివేయఁబడిన, నాస్తిక్యాం = 'పరలోకము లే'దను బుద్ధిని గలదాని నిగా అనగా ఆస్తిక్యబుద్ధి గలదానినిగా, న కురుతే=చేయదా యేమి ? తప్పక చేయునని యర్థము. త్వాం=నిన్నుగూర్చి, ధిక్=ఛీ (నింద.)

సమాసములు :

జలానలపరీక్షాదౌ - జలం చ అనలశ్చ = జలానలౌ, జలానలయోః పరీక్షా=జలానలపరీక్షా, జలానలపరీక్షా ఆదిః యస్య సః = జలానల పరీక్షాదిః, తస్మిన్=జలానలపరీక్షాదౌ.

వేదవేదితే-వేదేన వేదితః=వేదవేదితః, తస్మిన్=వేదవేదితే.

గలహస్తితనాస్తిక్యాం - అస్తి పరలోక మితి జ్ఞానం యస్య సః = ఆస్తికః, ఆస్తికస్య భావః=ఆస్తిక్యం, న ఆస్తిక్యం=నాస్తిక్యం, గలే హస్తః=గలహస్తః, గలహస్తేన తుల్యం గలహస్తితం, గలహస్తితం నాస్తిక్యం యస్యాః సా = గలహస్తితనాస్తిక్యా, తాం=గలహస్తిత నాస్తిక్యాం.

భావము :

వేదము బోధించిన జలదివ్యపరీక్షయందును నగ్నిదివ్యపరీక్షయందును తదితరవిషయములయందును సంవాద మనగా సరిపడుట యేర్పడినచో నీ నాస్తిక్యబుద్ధి మెడపట్టి గెంటివేయబడినట్లు గెంటివేయబడును. కాన నిట్టి నాస్తికతావాదమును చేయు నీవు నింద్యుఁడవు.

జలదివ్యపరీక్షా యనగా : పాపియగు పురుషుఁడు జలమునందు మునిగిన వాఁడై జలమునందు మునిగిన మఱియొక పురుషునిచే వింటినుండి విడువబడిన బాణమునుఁ బట్టుకొని పైకి లేచినచో నతడు శుద్ధుఁడు. అట్లు కానిచో నతడు శుద్ధుఁడు కాదని నిర్ణయించుటకు సాధనమైన పరీక్ష.

అగ్ని దివ్యపరీక్ష యనగా : బాగుగా కాల్చబడిన లోహాదులను బట్టుకొనిన పురుషునికి చేయికాలుట మున్నగునవి లేనిచో నప్పుడతడు పాపరహితుడు, శుద్ధుడు నని నిర్ణయించుటకు సాధనమైన పరీక్ష. "జలానలపరీక్షాదౌ" అనునెడ నాది శబ్దముచే వృష్టిసాధనములగు కారీర్యాదియాగములు "కారీర్యా యజేత వృష్టి కామః" అని వేదము వర్షమునకై కారీరీయాగమును విధించినది. ఆ వేద వచనమును నమ్మి కారీరీయాగమునుఁ జేసినచో వృష్టి తప్పక వచ్చుచున్నది. కాన పై విధముగా బరిశీలన గావించినచో చార్వాకుని నాస్తిక్యమునకు తావు లేదని యాశయము. ॥88॥

శ్లో. సత్యేవ పతియోగాదౌ గర్భాదే రధ్రువోదయాత్,
ఆక్షిప్తం నాస్తికాః కర్మ న కిం మర్మ భినత్తి వః. 89

ప.వి. సతి-ఏవ-పతియోగాదౌ-గర్భాదేః-అధ్రువోదయాత్-ఆక్షిప్తం-నాస్తికాః-కర్మ-న-కిం-మర్మ-భినత్తి-వః.

అర్థము:- హే నాస్తికాః = ఓ పరలోకజ్ఞానము లేనివారలారా!, పతియోగాదౌ సత్యేవ=భర్తతో సంబంధమున్నను అట్లే మేఘోదయము మున్నగు ప్రత్యక్షవిషయములైన వర్షకారణములున్నను, గర్భాదేః = గర్భము వర్షము మున్నగువానికి, అధ్రువోదయాత్=ఉత్పత్తి యనిశ్చితముగా నుండుటవలన, అనగా నెప్పుడో యొకప్పుడు ఏర్పడిన గర్భాదిరూప కార్యమువలనను, వర్షాదిరూపకార్యమువలనను, ఆక్షిప్తం=ఆక్షేపింపఁ బడిన యనగా నర్థాపత్తిచే సిద్ధమైన, కర్మ=ధర్మాధర్మరూపమైన జన్మాన్తరమునకు సంబంధించిన యదృష్టము, వః = నాస్తికులైన మీయొక్క, మర్మ=హృదయమందలి సందేహమును, కిం న భినత్తి=భేదించుట లేధా ఏమి? అనగా స్త్రీ పురుష సంయోగరూపమగు ప్రత్యక్షకారణ

మున్నను గర్భము నియతముగా నేర్పడుటలేదు గాన, గర్భోత్పత్తికి నీ ప్రత్యక్షకారణములకంటె భిన్నమైన జన్మాన్తరమందలి పుణ్యరూపమగు ధర్మము పాపరూపమగు నధర్మము కారణముగా నర్థాపత్తిప్రమాణముచే సిద్ధించుచున్నదిగాన నీవట్టి ధర్మాధర్మరూపములగు నదృష్టకారణములను సైతమంగీకరింపవలయునని యర్థము.

సమాసములు :

పతియోగాదౌ - పత్యుః యోగః = పతియోగః, పతియోగః ఆదిః యస్య సః=పతియోగాదిః, తస్మిన్=పతియోగాదౌ.

గర్భాదేః - గర్భః ఆదిః యస్య సః=గర్భాదిః, తస్య=గర్భాదేః.

అధ్రువోదయాత్- న ధ్రువః=అధ్రువః, అధ్రువశ్చాసౌ ఉదయశ్చ= అధ్రువోదయః, తస్మాత్=అధ్రువోదయాత్.

భావము :

ప్రత్యక్షములైన స్త్రీపురుషసంయోగాదికారణము లున్నను, గర్భ మేర్పడుటలేదు. అది యెప్పుడో ఒకప్పు డేర్పడును. అట్లే యాకసమున మేఘాడంబరములను ప్రత్యక్షకారణము లున్నను వర్షము సంభవించుటలేదు. కాన నివి యన్నియు కాదాచిత్కములుగా నున్నవి. కాన నీగర్భాదులకు ప్రత్యక్షకారణములేగాక పరోక్షములగు జన్మాన్తరమునందలి ధర్మాధర్మరూపకారణములు కూడ నావశ్యకములు. అట్టి ధర్మాధర్మములను నీవు సైత మంగీకరింపవలయునని యాశయము. ॥౮౯॥

శ్లో. యాచతః స్వం గయాశ్రాద్ధం భూత స్యావిశ్య కంచన,
నానాదేశజనోపజ్ఞాః ప్రత్యేషి న కథాః కథమ్. 90

ప. వి. యాచతః-స్వం-గయాశ్రాద్ధం-భూతస్య-ఆవిశ్య-కం-చన-నానాదేశజనోపజ్ఞాః-ప్రత్యేషి-న-కథాః-కథం?

అర్థము:- కంచన=ఒకనిని, ఆవిశ్య=ఆవేశించి, అనగా పూని, స్వం=తన దగు, గయాశ్రాద్ధం=గయాక్షేత్రమునం దాచరించిన శ్రాద్ధమునందలి పిండప్రదానమును, యాచతః=ప్రార్థించుచున్న, అనగా నేను పాపము వలన ప్రేతజన్మము నెత్తితిని. కాన నాకు మంచిగతి కలుగుటకు నీవు గయాక్షేత్రమునందు శ్రాద్ధమును చేయవలయునని ప్రార్థించుచున్న, భూతస్య = భూతముగా జన్మించిన ప్రేతకు సంబంధించిన, నానాదేశ జనోపజ్ఞాః; నానాదేశ=పెక్కు దేశములయందలి, జన=జనులకు, ఉపజ్ఞాః=తొలుత తెలియబడిన, కథాః=కథలను, కథం=ఎట్లు, న ప్రత్యేషి?=నమ్మవు. ఆకథలను తప్పక నమ్మవలయును అని యర్థము.

సమాసములు :

*గయాశ్రాద్ధం* - గయాయాం శ్రాద్ధం=గయాశ్రాద్ధం.

నానాదేశజనోపజ్ఞాః - నానావిధాశ్చ తే దేశాశ్చ=నానాదేశాః. నానా దేశేషు జనాః=నానాదేశజనాః. నానాదేశజనానాం ఉపజ్ఞాః=నానాదేశ జనోపజ్ఞాః.

భావము :

"అన్యభుక్తై ర్మృతే తృప్తి రిత్యలం ధూర్తవార్తయా" (17-52) అను శ్లోకముచే శ్రాద్ధాదులయం దొకరు భుజించినచో మఱియొకరికి తృప్తికలుగునని చెప్పు దుష్టు వచనములు పనికిరావని యాక్షేపించెను. దానికిట సమాధాన మొసంగఁబడుచున్నది. మృతిఁజెందిన వ్యక్తి జీవించిన యొకానొకనిపైఁ బూని, తనకు పాపమువలన వచ్చిన ప్రేతజన్మము దొలఁగి సద్గతి గలుగుటకై గయా శ్రాద్ధమును జేయఁ బ్రార్థించుచున్న ప్రేతలకు సంబంధించిన వివిధదేశపు జను లలో నేర్పడిన కథలు సత్యములనియే నమ్మవలయును. ఏలయనగా నివి ప్రామా ణికములగు నితరాంశములతో సరిపడుచున్నవి. ॥90॥

శ్లో. సీతానాం యమదూతేన నామభ్రాన్తై రుపాగతౌ,
శ్రద్ధసే సంవదన్తీం న పరలోకకథాం కథమ్. 91

ప. వి. నీతానాం-యమదూతానాం-నామభ్రాన్తేః-ఉపాగతౌ-శ్రద్ధసే-సంవదన్తీం-న-పరలోకకథాం-కథం?

అర్థము:- యమదూతేన=యమకింకరునిచే, నామభ్రాంతేః = పేరులోని పొరబాటువలన మరణించెడివారి పేరు లొక్కవిధముగా నుండుటవలని భ్రాన్తివలన, నీతానాం=స్థూలశరీరమునుండి లింగశరీరమును బట్టుకొని యముని సన్నిధికి గొనిపోబడినవారియొక్క, ఉపాగతౌ=మఱల మానవ లోకమును పొందెడి విషయమున, సంవదన్తీం=సరిపడుచున్న, పరలోక కథాం=పరలోకకథను, కథం=ఎట్లు, న శ్రద్ధసే=నమ్మవు.

సమాసములు :

యమదూతేన - యమస్య దూతః=యమదూతః, తేన=యమదూతేన, నామభ్రాన్తేః-నామని భ్రాన్తిః=నామభ్రాన్తిః. తస్యాః=నామభ్రాన్తేః, పరలోకకథాం- పర శ్చాసౌ లోకశ్చ=పరలోకః, పరలోకస్య కథా పరలోకకథా, తాం=పరలోక కథాం.

భావము :

"కో హి వేత్తా స్త్వముష్మిన్" (17-62) అని పరలోక విషయమును తెలిసినవాడు లేడను వాదమును ఖండించుచున్నాడు. మరణ మనగా, స్థూల శరీరమునుండి లింగమయ శరీరము తొలగిపోవుట. యమధర్మరాజు మరణించువాని పేరు చెప్పి యాతని శరీరమునుండి లింగమయ శరీరమును తెమ్మని తన దూతనాదేశించినపు డాదూత, ఒక పేరే ఒకరిద్దరి కుండుటవలన, నొక లింగమయ శరీరమును తెచ్చుటకు బదులుగా పొరపాటుచే మఱియొకని లింగమయ శరీరమును గొనిపోవుట తరువాత, భ్రాంతిని తెలుసుకొని యా లింగమయ శరీరమును మఱల మరణమాసన్నముగాని వాని శరీరమునందు ప్రవేశపెట్టి, మరణించువాని శరీరమునుండి లింగమయశరీరమును గొనిపోవుట మున్నగు పరలోక విషయములను గూర్చిచెప్పెడి కథల నేల నమ్మరాదు? తప్పక నమ్మవలయును అని యర్థము. భ్రాంతిచే స్వర్గమునకుఁ గొనిపోఁబడి మఱలివచ్చిన జీవులు చెప్పెడి

కథలు స్వర్గ నరకము లున్నవని నిరూపించుచున్నవి. శ్రుతి స్మృతి పురాణా దులయందు చెప్పబడిన విషయములతోడను సంవదించుచున్నవి. కాన వానిని దప్పక విశ్వసింపుమని యాశయము. ॥91॥

శ్లో. జజ్వాల జ్వలనః క్రోధా దాచఖ్యౌ చాక్షిపన్నముం,
కిమాత్థరే కిమాత్థేద మస్మదగ్రే నిరర్గలమ్. 92

ప. వి. జజ్వాల- జ్వలనః- క్రోధాత్- ఆచఖ్యౌ-చ- ఆక్షిపన్- అముం-కిం-ఆత్థ-రే-కిమ్- ఆత్థ- ఇదమ్- అస్మదగ్రే- నిరర్గలమ్.

అర్థము : అథ=పిదప, జ్వలనః=అగ్ని, క్రోధాత్=కోపమువలన, జజ్వాల=మండిపడెను, తథా=అట్లే, అముం=ఈచార్వాకుని, ఆక్షిపన్=కఠిన వచనములతో నిందించుచు, ఆచఖ్యౌ చ=చెప్పెను, రే చార్వాక=ఓరీ చార్వాకా! కిం ?=దేనిని, ఆత్థ ! = చెప్పుచున్నావు ? అస్మదగ్రే=మా యెదుట, నిరర్గలం=అడ్డులేక, కిం=దేనిని, ఆత్థ=చెప్పుచున్నావు ?

సమాసములు :

అస్మదగ్రే-అస్మాకం అగ్రం=అస్మదగ్రం, తస్మిన్=అస్మదగ్రే, నిరర్గలం-నిర్గతః అర్గలః యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా=నిరర్గలం

భావము :

తర్వాత అగ్నిదేవుడు చార్వాకుని మాటలను వినుచు మండిపడసాగెను. ఓరీ చార్వాకా ! యేమి మా యెదుట చెప్పుచున్నావు ? అడ్డులేక మా యెదుట ఏమి మాట్లాడుచున్నావు ? అని కోపముతో ప్రశ్నించెను. ॥92॥

మహాపరాకిణః శ్రౌతధర్మైకబలజీవనః,
క్షణాభక్షణమూర్చాల స్మరన్ విస్మయసేఽపి న. 93

ప.వి. మహాపరాకిణః- శ్రౌత ధర్మైక బల జీవినః-క్షణాభక్షణమూర్చాల-స్మరన్-విస్మయసే-అపి-న.

**అర్థము :** హే క్షణా భక్షణ మూర్ఛాల ! క్షణ = కొంచెము సమయము, అభక్షణ = భుజింపకపోయినచో, మూర్ఛాల=మూర్ఛను బొందువాడా ! శ్రౌత ధర్మైక బలజీవినః; శ్రౌత=శ్రుతులయందు ప్రతిపాదింపబడిన, ధర్మ = ఆచారమనెడి,ఏక = ముఖ్యమైన, బల = శక్తిచే, జీవినః=జీవించునట్టి, మహాపరాకిణః = పంద్రెండు దినములు మొదలు పెక్కు దినములు ఉపవాసములు చేయుటచే సాధ్యములగు ''మహాపరాకము'' అనెడి వ్రతమును ఆచరించునట్టి మహాత్ములను, స్మరన్ = స్మరించుచు అపి, న విస్మయసే=ఆశ్చర్యమును బొందవా? ధర్మబలము చేతనే జీవించునట్టి వైదికులు చిరకాలము భోజనము లేకపోయినను ధర్మముల ననుష్ఠించుటచే నేర్పడిన మనోబలమువలననే జీవించుచున్నారు. కాన ధర్మము కలదను విషయమున సందేహ మనవసరము.

**సమాసములు :**

మహాపరాకిణః- మహాంశ్చాసౌ పరాకశ్చ=మహాపరాకః, మహాపరాకః ఏషా మస్తీతి=మహాపరాకిణః, తాన్=మహాపరాకిణః.

*శ్రౌత ధర్మైక బలజీవినః-* శ్రుతిషు అయం=శ్రౌతః, శ్రౌత శ్చాసౌ ధర్మశ్చ=శ్రౌతధర్మః, శ్రౌతధర్మ ఏవ=శ్రౌత ధర్మైకం, శ్రౌత ధర్మైకమేవ బలం=శ్రౌత ధర్మైక బలం, శ్రౌతధర్మైకబలేన జీవ న్తీతి= శ్రౌతధర్మైకబలజీవినః, తాన్=శ్రౌత ధర్మైక బలజీవినః.

*క్షణాభక్షణ మూర్ఛాల!-* న భక్షణం=అభక్షణం, క్షణం అభక్షణం= క్షణాభక్షణం,క్షణాభక్షణేన మూర్ఛాం లాతీతి=క్షణాభక్షణ మూర్ఛాలః, తస్య సంబుద్ధిః=హే క్షణాభక్షణ మూర్ఛాల !

**భావము :**

వెనుక ''అగ్నిహోత్రం త్రయీ'' ఇత్యాదులచే అగ్నిహోత్రాది యాగములను చార్వాకుఁడు ఖండించెను. దానిని నిరాకరించుచున్నాడు. ఓయీ చార్వాకా ! నీవు ప్రతిక్షణము భోజనము చేయుచునే యుండవలయును. అట్లు కానిచో నీవు ఆకలితో సొమ్మసిల్లి పోఁగలవు. అటువంటి నీవు పంద్రెండుదినములు

మొదలు నెలలు తరబడి ఉపవాసము చేయుచు మహాపరాకము మున్నగు వ్రతముల నాచరించుచు, భోజనము లేకపోయినను నావ్రతానుష్ఠానమువలని మనోబలము చేతనే జీవించుచున్న యావైదికధర్మపరులను స్మరించుచు నాశ్చర్యపడవా ఏమి? క్షణకాల మాహారము లేనిచో మూర్ఛనొందెడి నీవు నెలలకొలది యాహారములేక ధర్మాచరణపరులైన వైదికులను స్మరించినచో తప్పక యాశ్చర్యపడగలవని యర్థము. కాన ధర్మమున్నదను విషయమున సంశయముతో పని లేదు. ॥93॥

శ్లో. పుత్రేష్టిశ్యేనకారీరీముఖా దృష్టఫలా మఖాః,
న వః కిం ధర్మసన్దేహమన్దేహజయభానవః. 94

ప. వి. పుత్రేష్టిశ్యేనకారీరీముఖాః- దృష్టఫలాః- మఖాః-న-వః-కిం- ధర్మసన్దేహ మన్దేహజయభానవః.

అర్థము:-(హే నాస్తికాః! ఓనాస్తికులారా!) పుత్రేష్టిశ్యేనకారీరీముఖాః, పుత్రేష్టి= పుత్రసాధనమైన యాగము, శ్యేన=శత్రుసంహారసాధనమైన యాగము, కారీరీ = వర్షసాధనమైన క్రతువు, ముఖాః = మొదలుగా గల్గినవి, దృష్టఫలాః=ప్రత్యక్షఫలములుగలిగిన, మఖాః=యాగములు, వః= మీయొక్క, ధర్మసందేహమన్దేహజయభానవః, ధర్మసందేహ = ధర్మ మున్నదా లేదా యను సందేహములనెడి, మన్దేహ = సూర్యుని రెండు సంధ్యలయందును మ్రింగుటకై వచ్చెడి మందేహులను రాక్షసులకు, జయభానవః=జయించుటయందు సూర్యులుగా, వః=మీకు, న కిం= కావా యేమి! తప్పక కాగలవని యర్థము.

సమాసములు :

పుత్రేష్టిశ్యేనకారీరీముఖాః - పుత్రేభ్యః ఇష్టిః=పుత్రేష్టిః, పుత్రేష్టిశ్చ శ్యేనశ్చ కారీరీ చ=పుత్రేష్టి శ్యేనకారీర్యః. పుత్రేష్టిశ్యేనకారీర్యః ముఖం యేషాం తే=పుత్రేష్టిశ్యేనకారీరీముఖాః.

దృష్టఫలాః - దృష్టం ఫలం యేషాం తే=దృష్టఫలాః.

ధర్మసందేహమన్దేహజయభానవః - ధర్మే సందేహాః=ధర్మసందేహాః, ధర్మసందేహా ఏవ మన్దేహాః = ధర్మసందేహమందేహాః, ధర్మసందేహమందేహానాం జయః = ధర్మసందేహమందేహజయః, ధర్మసందేహమందేహజయే భానవః=ధర్మసందేహమందేహజయభానవః.

భావము :

ఓ నాస్తికులారా! పుత్రకామేష్టి, శ్యేనయాగము, కారీరి మున్నగునవి, ప్రత్యక్షముగా ఫలములను ఒసంగుచున్నవి. పుత్రకామేష్టికి ఫలము పుత్రుడు. పుత్రుడులేనివాడు పుత్రునిబడయుట కీ యాగము జేసినచో, తప్పక పుత్రుని బడయగలడు. కాన దీనికి ఫలమయిన పుత్రుడు ప్రత్యక్షము. అట్లే శత్రుబాధగలవాడు శత్రుసంహారము గావించుటకు ''శ్యేనే నాభిచరన్ యజేత'' యను శ్రుతివిహితమగు శ్యేనయాగమును జేయవలయును. శ్యేనమనగా డేగ. ''యథా వై శ్యేనో నిపత్య ఆదత్తే ఏవమయం ద్విషన్తం భ్రాతృవ్యం నిపత్య ఆదత్తే'' యను శ్రుతివచనము ననుసరించి డేగ యేవిధముగా భూమికి దిగి కోడిపిల్లలు మున్నగువానినిఁ దన్నుకొని వెళ్ళిపోవునో అట్లే యీయాగముకూడా శత్రువును తన్నుకొని పోవునని యీయాగమునకు శ్యేనమని పేరు ఏర్పడినది. దీని ననుష్ఠింపగనే శత్రువు వశ్యుడై సంహరింపబడునుగాన దీనికి ఫలమును దృష్టమే. ఇట్లే వర్షములేనపుడు ''కారీర్యా యజేత వృష్టికామః'' యను శ్రుతివిహితమైన కారీరీష్టి ననుష్ఠించినచో వెంటనే వర్షమువచ్చుట ప్రత్యక్షమే. ఇట్లు పైయాగముల కన్నింటికిని ఫలములు ప్రత్యక్షములే. ఈవిధముగా ఫలములు ప్రత్యక్షములుగా నుండగా నట్టియాగములు మీసందేహములనెడి మందేహులను రాక్షసులకు సంహారకములగు సూర్యులు కావా? అనగా మీసందేహమును నివర్తింపలేవా? యని యర్థము. మందేహులను రాక్షసులు ఉభయసంధ్యలయందు సూర్యునితో యుద్ధమాడుటకు ప్రజాపతినిగూర్చి ''రక్షాగ్ంసి హరా తపోఽతప్యన్త తాన్ ప్రజాపతి ర్వరేణోపామన్త్రయత, తాని వర మవృణీత్వాఽఽదిత్యో నో యోద్ధా ఇతి తాన్ప్రజాపతి రబ్రవీ ద్యోధయధ్వ మితి'' ఇత్యాది శ్రుతివచనము ననుసరించి, తపస్సు గావించి వరమును బొందినట్లును, ''తస్మా దుత్తిష్ఠగ్ం హవా తాని రక్షాగ్ం స్యాదిత్యం యోధయన్తి యావదస్త మన్వగాత్తాని హవా

ఏతాని రక్షాగ్ంసి గాయత్రియాఽభిమన్త్రితే నామ్బసా శామ్యన్తి తదుహ వా ఏతే బ్రహ్మవాదినః పూర్వాభిముఖాః సన్ధ్యాయాం గాయత్రియాఽభిమన్త్రితా అప ఊర్ధ్వం విక్షిపన్తి తా ఏతా ఆపో వజ్రీ భూత్వా తాని రక్షాగ్ంసి మన్దేహారుణే ద్వీపే ప్రక్షిపన్తి'॥ ఇత్యాదిగా వారు ఉదయించు సూర్యునితోడను,అస్తమించు సూర్యునితోడను యుద్ధమాడుదు రనియు, అట్టి రాక్షసులు గాయత్రీమంత్రముతో నభిమన్త్రింపబడిన యుదకముతో నణగిపోవుదురనియు, నందువల్లనే బ్రహ్మ వాదులు తూర్పునకు మరలి సంధ్యాకాలమందు గాయత్రితో నభిమంత్రితములగు నుదకములను పైకి నర్ఘ్యముగా వెదజల్లుదురనియు నాయుదకములు వజ్రములై యారాక్షసులను మాందేహారుణద్వీపమునందు బడవేయుచున్నవనియు ననగా నిట్టి వజ్రముల సహకారముతో సూర్యు డారాక్షసులను నాద్వీపమునకు నెట్టివేయు చున్నాడనియు శ్రుతి చెప్పుచున్నది. కావుననే గాయత్రీమంత్రముతోఁ గూడిన యర్ఘ్యములు సంధ్యావందనకాలమందు వదలుచున్నారు. అట్లే "తిస్రః కోట్యోఽర్ధకోటీ చ మందేహా నామ రాక్షసాః, ఉదయన్తం సహస్రాంశు మభియుధ్యన్తి తే సదా॥ గాయత్ర్యా చాభిమన్త్ర్యైర్ఘ్యజలం త్రిః సంధ్యయోః క్షిపేత్ తేన శామ్యన్తి తే దైత్యా వజ్రీభూతేన వారిణా'' అని యా మందేహులను రాక్షసులు మూడున్నర కోటి యున్నారనియు మూడుసంధ్యలయందును గాయత్రితో నభిమంత్రించి యర్ఘ్యమును జల్లినచో వారు శమింతురనియు పురాణవచనము. కాన గాయత్రీ మన్త్రముచే నభిమన్త్రించి యర్ఘ్యములను వదిలిన పిదపనే సూర్యుడుదయించుట వలన సూర్యుడే వారిని నాశము చేయుచున్నాడని చెప్పబడుచున్నది. ఆవిధము గనే పైన చెప్పబడిన యాగములు మీసందేహములను నివర్తింపచేయును గాత. దృష్టఫలములైన యాగములకు ఫల మెట్లు ప్రత్యక్షమో యట్లే యదృష్టఫలములగు యాగములకును ఫలము లవశ్యములుగా నుండునని యూహింపవచ్చును. కాన ధర్మవిషయమున ఫలసందేహ మనవసరమని యాశయము. ॥94॥

శ్లో. దండతాండవనైః కుర్వన్ స్ఫులింగాలింగితం నభః
నిర్మమేఽథ గిరా మూర్మి ర్భిన్నమర్మేవ ధర్మరాట్. 95

ప.వి. దణ్డతాణ్డవనైః- కుర్వన్ - స్ఫులింగాలింగితం- నభః- నిర్మమే- అథ- గిరాం- ఊర్మిః- భిన్నమర్మా- ఇవ- ధర్మరాట్.

అర్థము : అథ = పిదప అనగా అగ్నిదేవుడు మాట్లాడిన పిదప, ధర్మరాట్ = ధర్మప్రభువైన యముఁడు, భిన్నమర్మా; భిన్న = చార్వాకుని వచనముంచే భేదింపబడిన, మర్మా ఇవ = ప్రాణస్థానములు గల్గినవాఁడో యనునట్లున్న వాడై, దణ్డతాణ్డవనైః; దణ్డ = తనయాయుధమను దణ్డమును, తాణ్డవనైః = త్రిప్పుటములతో, నభః = ఆకాశమును, స్ఫులింగాలిఙ్గితం, స్ఫులిఙ్గ = నిప్పురవ్వలతో, ఆలింగితం = వ్యాప్తమైనదిగా, కుర్వన్ = చేయుచు, గిరాం = వాక్కులయొక్క, ఊర్మీః = పరమ్పరలను, నిర్మమే = నిర్మించెను.

సమాసములు :

*దణ్డతాణ్డవనైః* - దణ్డస్య తాణ్డవనాని = దణ్డతాణ్డవనాని, తైః = దణ్డతాణ్డవనైః.
*స్ఫులింగాలింగితం*- స్ఫులిఙ్గైః ఆలిఙ్గితం = స్ఫులిఙ్గాలిఙ్గితం.
*భిన్నమర్మా*- భిన్నాని మర్మాణి యస్య సః = భిన్నమర్మా.

భావము :

అగ్నిదేవుడు మాట్లాడినపిదప యమధర్మరాజు నాస్తికవచనములతో భేదింపబడిన ప్రాణస్థానములు గలిగినవాడో యనునట్లు కనబడుచు, తన దండాయుధమును త్రిప్పుచు, దానినుండి వెల్వడు నిప్పురవ్వలతో నాకసము నంటించుచు వాక్పరమ్పరలను సృజించెను. అనగా సంభాషించెనని యర్థము. ॥౯౫॥

శ్లో. తిష్ఠ! భో స్తిష్ఠ!కణ్ఠోష్ఠం కుణ్ఠయామి హఠాదహమ్,
అపష్ఠు పఠతః పాఠ్య మధిగోష్ఠి శఠస్య తే. 96

ప.వి. తిష్ఠ- భోః- తిష్ఠ- కణ్ఠోష్ఠం- కుణ్ఠయామి- హఠాత్- అహమ్ - అపష్ఠు- పఠతః- పాఠ్యమ్- అధిగోష్ఠి-శఠస్య- తే.

అర్థము : భోః! = ఓ పాపీ! తిష్ఠ తిష్ఠ = ఉండుము. ఉండుము అనగా క్షణకాలము ఓపిక పట్టుము. అధిగోష్ఠి = ఇంద్రాదుల సభయందు, అపష్ఠు = ప్రతి

కూలముగా, పాఠ్యం=పఠింపదగిన విషయమును, పఠతః=పఠించు చున్న, శఠస్య=దుష్టుడవైన, తే= నీ యొక్క, కంఠోష్ఠం; కణ్ఠ= కణ్ఠమును, ఓష్ఠ= పెదవులను, అహం=నేను హఠాత్=బలవన్తముగా కుణ్ఠయామి=కుంటుపరచుచున్నాను అనగా స్తంభింపచేయుచున్నాను.

సమాసములు :

కణ్ఠోష్ఠం- కణ్ఠశ్చ ఓష్ఠౌ చ=కణ్ఠోష్ఠమ్. తత్=కణ్ఠోష్ఠం.
అధిగోష్ఠి- గోష్ఠ్యాం=అధిగోష్ఠి
అపష్ఠు- అప్రతిష్ఠతీతి=అపష్ఠు

భావము :

ఓయి నాస్తికా! కొంచెము కాలము ఓపిక పట్టుము. ఇంద్రాదిదేవసభ యందు ప్రతికూలవాదమును గావించుచున్న దుష్టుడవైన నీయొక్క కంఠమును పెదవులను బలవంతముగా మాట్లాడనీయక కుంటుపరచగలను. ॥96॥

శ్లో. వేదై స్తద్ద్వేషిభి స్తద్వత్ స్థిరం మతశతైః కృతం,
పరం కస్తే పరం వాచా లోకం లోకాయత త్యజేత్. 97

ప.వి. వేదైః- తద్ద్వేషిభిః- తద్వత్- స్థిరం- మతశతైః- కృతం- పరం- కః- తే- పరం- వాచా- లోకం- లోకాయత- త్యజేత్.

అర్థము : లోకాయత-లోక = లోకములయందు, ఆయత=సుఖసాధ్యముగా నుండుటచే విస్తరించిన మ[illegible]ముగల యోనాస్తికా! లేదా,లోక =లోకముల యందు, ఆయత=నిర్బంధము లేనట్టి యనగా స్వేచ్ఛాచారముగల యోనాస్తికా ! వేదైః=వేదములచే అనగా వేదములచే చెప్పబడిన, తద్ద్వేషిభిః=ఆ వేదములను ద్వేషించు బౌద్ధులు మున్నగు వారిచేతను, తద్వత్=ఆ విధముగనే వేదతుల్యములైన ఇతర సిద్ధాన్తములతో గూడిన వియున్నైన, మతశతైః=పెక్కు మతములచే, స్థిరం=స్థిరమైనదిగా, కృతం=చేయబడిన, పరం లోకం=స్వర్గాదిరూపమైన పరలోకమును,

పరం=కేవలము, తే=నీయొక్క, వాచా=మాటచే అనగా ననర్థక వచనముచే, కః=ఎవ్వడు, త్యజేత్=విడుచును. ఎవ్వడును విడువడు. నాస్తికులైన మీ సంఖ్య చాలా తక్కువ. కాబట్టి మీ వచనములు ప్రమాణములు కావు. చాలామంది ఆచరించిన మతమే ప్రమాణమైనదని యర్థము.

సమాసములు :

మతశతైః— మతానాం శతాని = మతశతాని, తైః=మతశతైః. లోకాయత-లోకేషు ఆయతం(మతం)యస్య సః=లోకాయతః తస్య= సంబుద్ధిః=హేలోకాయత లేదా.న యతః = అయతః, లోకేషు అయతః లోకాయతః,తస్య సంబుద్ధిః=హే లోకాయత !

భావము :

ఓయి లోకాయతా ! వేదములయందు జెప్పబడినవియు, వేదములను ద్వేషించు బౌద్ధాదులకు సంబంధించినవియు, తదితరులకు సంబంధించినవియు నగు పెక్కు మతములచే స్థాపించబడిన పరలోకమును నీప్రలాపములను విని యెవడు వదిలిపెట్టగలడు? అనగా నెవ్వడును వదిలిపెట్టడు. పెక్కుజను లాదరించిన మతమే ప్రామాణికముకాని కొద్దిమంది సమ్మతిగలిగిన నీమతము నెవ్వడు నమ్మగలడు? ॥97॥

శ్లో. అసజ్జ్ఞానాల్ప భూయిష్ఠపాన్థవై మత్య మేత్య యం,
లోకం ప్రయాసి పన్థానం పరలోకే న తం కుతః? 98

ప. వి. అసజ్జ్ఞానాల్ప !- భూయిష్ఠపాన్థవై మత్యమ్-ఏత్య-యం-లోకం-ప్రయాసి-పన్థానం-పరలోకే-న-తం-కుతః ?

అర్థము : అసజ్జ్ఞానాల్ప ! అసజ్జ్ఞాన=అసద్విషయకమగు జ్ఞానముచే ననగా సత్యదూరమగు విషయమును గ్రహించెడి బుద్ధిచే, అల్ప!=నీచుడా ! లోకే=

ఈ లోకమునందు,భూయిష్ఠపాన్థవైమత్యం;భూయిష్ఠ=అధికులైన,పాన్థ=పరలోకయాత్రికులయొక్క,వైమత్యం=త్రోవను గూర్చిన విషయమున విరోధమును, ఏత్య=పొంది, యనగా నందఱికిని సమ్మతమైన త్రోవను వదలిపెట్టి,యం=ఏ, పన్థానం=దుష్టమైన మార్గమును, ప్రయాసి=వెళ్ళుదువో,తం=ఆదుష్టమైనమార్గమును,పరలోకే=పరలోకమునందును, కుతః=ఎందువలన,న ప్రయాసి?=అనుసరించి వెళ్ళవు.ఇహలోకమందు పెక్కండ్రు పోయెడు మార్గమును వదలిపెట్టి యల్పసంఖ్యాకుల కభిమతమైన మార్గమును బట్టినపుడు, పరలోకమందును నట్లే చేయుము. ఆ విధముగా చేసి దానిఫలము ననుభవింపగలవని యర్థము.

సమాసములు :

అసజ్జ్ఞానాల్ప-న సత్=అసత్, అసతః జ్ఞానం=అసజ్జ్ఞానం, అసజ్జ్ఞానేన అల్పః=అసజ్జ్ఞానాల్పః,తస్య సమ్బుద్ధిః=హే అసజ్జ్ఞానాల్ప.

భూయిష్ఠపాన్థవైమత్యం - పథి గచ్ఛన్తీతి=పాన్థాః, విమతస్య భావః వైమత్యం, భూయిష్ఠాశ్చ తే పాన్థాశ్చ=భూయిష్ఠపాన్థాః, భూయిష్ఠపాన్థానాం వైమత్యం=భూయిష్ఠపాన్థవైమత్యం, తత్=భూయిష్ఠపాన్థవైమత్యం.

పరలోకే-పరశ్చాసౌ లోకశ్చ=పరలోకః, తస్మిన్=పరలోకే.

భావము :

అసత్య విషయములనే గోచరించుకొనెడి జ్ఞానముచే క్షుద్రభావములు గల యోనాస్తికా ! ఈలోకమునందు పెక్కండ్రు జను లాదరించెడి మార్గమును వదలి యే దుష్టమార్గమును నీవు అనుసరింతువో పరలోకమునందును నట్టి మార్గమునే నీవేల యనుసరింపవు? అట్లు దుష్టమార్గమును బరలోకమునం దనుసరించి దానికి దగిన శిక్ష ననుభవింపఁగలవని యాశయము. లేదా,అసజ్జ్ఞానాల్ప భూయిష్ఠ యను పాఠము యొక్క స్థానమునందు ''సమజ్ఞానాల్పభూయిష్ఠ'' పాఠమును జెప్పుకొనినచో, లేదా ఒక్కయూరినిగూర్చి, ఒక్క విషయమును గూర్చి సమానమగు

జ్ఞానము గలవారిలో నల్పసంఖ్యాకులగు బాటసారులును నధికసంఖ్యాకులగు బాట సారులును జెప్పెడి విషయములు విరుద్ధములై, సరిపడకపోయినచో నధిక సంఖ్యా కులు జెప్పెడి విషయమునే వినెదవుగదా? కాశికిఁ ద్రోవ నడిగినపుడు అయిదారుగురు ఎడమ వైపును, నేబదిమంది కుడివైపునుఁ జూపినపుడు, పెక్కండ్రు జూపిన కుడివైపునకే నడువవలయునుగదా! నట్లే పరలోకవిషయమునందు నల్పసంఖ్యా కుల యభిప్రాయమును వీడి యధికసంఖ్యాకుల యభిప్రాయమునే పాటించుట న్యాయ్యముగదా! కాన బహువాదిసమ్మతమైన పరలోక మను ధర్మమును నీవు వ్యతిరేకించుట పాడిగాదు. కావున "బహూనాం వచనం గ్రాహ్యం" అను న్యాయము ననుసరించి నీవు పరలోకాదుల నవశ్య మంగీకరింపక తప్పదని యాశయము. "తర్కా ప్రతిష్ఠయా" ఇత్యాదిశ్లోకములచే నాస్తికుడు గావించిన వాదమున కిది సమాధానము. ॥98॥

శ్లో. స్వకన్యా మన్యసా త్కర్తుం విశ్వానుమతిదృశ్వనః,
లోకే పరత్ర లోకస్య కస్య న స్యాత్ దృఢం మనః. 99

ప. వి. స్వకన్యామ్-అన్యసాత్కర్తుం - విశ్వానుమతిదృశ్వనః- లోకే - పరత్ర- లోకస్య-కస్య-న-స్యాత్-దృఢం-మనః.

అర్థము : స్వకన్యాం=తన పుత్రికను, అన్యసాత్కర్తుం=మఱియొకని కిచ్చు టకు, విశ్వానుమతిదృశ్వనః=విశ్వ = అందఱియొక్క, అనుమతి= అనుజ్ఞను, దృశ్వనః=చూచుచున్న యనగా కోరుచున్నట్టి, కస్య = ఏ,లోకస్య=మనుజునకు,మనః=మనస్సు, పరత్ర లోకే=పరలోకవిషయ మునందు, దృఢం=గట్టినమ్మకముకలదిగా, న స్యాత్=కాదు, తప్పక యగునని యర్థము.

సమాసములు :

స్వకన్యామ్ - స్వస్య కన్యా=స్వకన్యా, తాం=స్వకన్యాం.

అన్యసాత్కర్తుం - అన్యస్య అధీనా=అన్యసాత్, అన్యసాత్ కర్తుం= అన్యసాత్కర్తుం.

విశ్వానుమతిదృశ్వనః - విశ్వస్య అనుమతిః=విశ్వానుమతిః, విశ్వాను మతిం పశ్యతీతి=విశ్వానుమతిదృశ్వా, తస్య=విశ్వానుమతిదృశ్వనః.

భావము :

పురుషుడు తన పుత్రికను మరియొకని కిచ్చుటలో సర్వలోకసమ్మతి నపేక్షించుచున్నాడు. "బ్రాహ్మే వివాహే ఆహూయ దీయతే శక్త్యలఙ్కృతా, తజ్జః పునా త్యుభయతః పురుషా నేకవింశతిమ్. త్రీణ్యాహూ రతిదానాని కన్యా పృథ్వీ సరస్వతీ" యని కన్యాదాత, సకలశాస్త్రముల సమ్మతినిఁ గోరును. యథా శక్తిగా నలఙ్కరింపబడిన కన్యను దానముచేయుట బ్రాహ్మవివాహము. ఈబ్రాహ్మ వివాహమునొందిన వధూవరులకుఁ గల్గిన పుత్రుడు తల్లిదండ్రులపార్శ్వములలో నిరువదితరములవారిని బవిత్రపఱచును. లోకమున భూదానము, కన్యాదానము, విద్యాదాన మను నీమూడును నన్నిదానములను మించినదానములుగా చెప్పబడు చున్నవి. ఈ విధముగా పరిశీలించి, కన్యాదానము చేయుపద్ధతి చిరకాలముగా ననువర్తించుచున్నది గదా! కాన నిట్లు కన్యాదానము చేయువానికి పరలోకమందు గట్టివిశ్వాసముండునుకదా! అట్లు కానిచో నతడు తన పుత్రికను మఱియొకని కీయక తాను పరిణయమాడవచ్చును కదా! కాని తన పుత్రికనుఁ దాను పరిణయ మాడుట సృష్టిలోనే లేదుగదా! కాన నిందువలన నాతని పరలోకవిశ్వాసము అచ్చటి నరకభీతి మున్నగునవి సిద్ధించుచున్నవి గదా! కాన నందఱు నాదరించుట వలన పరలోకాదు లంగీకరింపక తప్పదని యాశయము. ॥99॥

శ్లో. కస్మిన్నపి మతే సత్యే హతాః సర్వమతత్యజః,
తద్దృష్ట్యా వ్యర్థతామాత్ర మనర్థస్తు న ధర్మజః. 100

ప.వి. కస్మిన్-అపి - మతే-సత్యే-హతాః - సర్వమతత్యజః-తద్దృష్ట్యా-వ్యర్థతా మాత్రమ్-అనర్థః-తు-న-ధర్మజః.

అర్థము:- కస్మిన్నపి=ఆస్తికమతములలో నేదైనను, మతే-కన్యాదానాదిరూప మగు పరలోకసాధనమైన ధర్మము, సత్యే సతి=సత్యమైనచో, ననగా ప్రమాణముగా నంగీకరింపబడినచో, సర్వమతత్యజః=అన్నిమతములలో

కొన్నింటికి విరోధ ముండుటవలన, నా యన్నిమతములను వదలుకొనిన (నాస్తికాః=నాస్తికులు), హతాః = నష్టులై అనగా పరలోకమునుండి భ్రష్టులై, స్యుః=ఉందురు. ఒకవేళ పరలోకమే యున్నచో నాస్తికులైన మీ రేమతమును నొప్పుకొననందువలన నట్టి పరలోకసుఖానుభవమునుఁ బొందలేక వంచితు లయ్యెద రని యర్థము. తద్దృష్ట్యా సకలములగు ఆస్తికమతములు అప్రమాణములనెడి దృష్టితో, వ్యర్థతామాత్రం = యాగాదులయొక్క యాచరణకు ఫలరాహిత్యము మాత్రమే యేర్పడును. ధర్మజః = అట్లనుష్ఠింపబడిన యాగములు మున్నగు ధర్మములచే నేర్పడిన, అనర్థస్తు=అనర్థమో యనగా అనిష్టమో, న=లేదు.

సమాసములు :

సర్వమతత్యాజః - సర్వాణి చ తాని మతాని చ =సర్వమతాని, సర్వ మతాని త్యజన్తీతి=సర్వమతత్యాజః.

తద్దృష్ట్యా - తస్య దృష్టిః=తద్దృష్టిః, తయా=తద్దృష్ట్యా.

వ్యర్థతామాత్రం - విగతః అర్థః యస్మాత్ సః=వ్యర్థః, వ్యర్థస్య భావః=వ్యర్థతా, వ్యర్థతైవ=వ్యర్థతామాత్రం.

అనర్థః - న అర్థః=అనర్థః.

ధర్మజః - ధర్మాత్ జాయత ఇతి=ధర్మజః.

భావము :

పరలోకమే లేనందువలన పరలోకము నుద్దేశించి యాగాదిధర్మముల ననుష్ఠించుట లేనందువలన నాస్తికులకు సుఖము దక్కినది. ఆస్తికులకో, యాసుఖముగూడ దక్కదు. పరలోకవిషయముతో సందేహము గూడినది. కాన సందిగ్ధమైన ఫలము నుద్దేశించి యాగాద్యనుష్ఠానమునకు కేవలము పరిశ్రమయే ఫలమగుచున్నదని నాస్తికుడు శంకింపగా, సమాధాన మొసంగు చున్నారు. ఆస్తికమతములమధ్య ఏదియో యొకటి ప్రమాణముగా నంగీకరింప బడినచో పరస్పరవిరోధము లుండుటవలన ఆస్తికమతము లేవియు ప్రమాణములు కావని యామతము లన్నింటిని పరిత్యజించిన నాస్తికులు నష్టపడుచున్నారు.

ఒకవేళ పరలోకమే యున్నచో నది నాస్తికులకు లభ్యము కాదు. ఏలయనగా వారు పరలోకమే లేదని నిశ్చయముతో ఆస్తికమతములను విడనాడిరి. అందువలన వారికి పరలోకసుఖప్రాప్తి లేనందువలన వారు వంచితులు కావలసియున్నది. ఒకవేళ పరలోకమే లేనిచో ఆస్తికులకుమాత్రము యాగానుష్ఠానాదులు వ్యర్థము లగునేకాని మరియొక యనిష్ట మేమియు నేర్పడదుగదా? ఏలయనగా పరలోక మున్నదను విశ్వాసముతోడను ప్రామాణ్యబుద్ధితోడను కర్మానుష్ఠానమును ఆస్తికులు గావించిరి. ఒకవేళ లేనిచో కర్మానుష్ఠానముచే ననిష్ట మేర్పడదు. కాని ఫలరాహిత్యమే యేర్పడును. ఒకవేళ పరలోక మున్నచో దానిని బొందగల యవకాశము ఆస్తికున కుండుటవలన, నతని కేవిధమగు ననిష్టము సంభవింపదు. కాని నాస్తికునకు పరలోకప్రాప్తి లేకపోవుటవలన పరలోకభ్రంశరూపమగు ననిష్ట మేర్పడును. ఏలయనగా నతడు పరలోకసాధనములగు కర్మల ననుష్ఠింపడుగదా! ఇదియు నొకపక్షము నవలంబించి చెప్పుటయే కాని వస్తుస్థితిలో పరలోకసుఖములు ప్రామాణికములుగాన ఆస్తికులమతమే యనుసరణీయమని యాశయము. ॥100॥

శ్లో. క్వాపి సర్వై రవైమత్యాత్ పాతిత్యా దన్యథా క్వచిత్,
స్థాతవ్యం శ్రౌత ఏవ స్యా ద్ధర్మే శేషేఽపి తత్కృతే. 101

ప.వి. క్వ- అపి - సర్వైః - అవైమత్యాత్ - పాతిత్యాత్ - అన్యథా-క్వచిత్-స్థాతవ్యం-శ్రౌతే-ఏవ-స్యాత్-ధర్మే-శేషే-అపి-తత్కృతే.

అర్థము: క్వాపి=ఎచ్చటనైనను అనగా అహింసయందును కన్యాదానాది విషయమందును తదితరములగు కర్మలయందును అనగా నిట్టి వైదిక కర్మానుష్ఠాన విషయమునందును, అవైమత్యాత్=ఐకమత్య ముండుటవలన, తథా=ఆ విధముగనే, క్వచిత్=కొన్ని విషయములందు, అన్యథా=మరియొక విధముగా, నైకమత్యము లేకపోయినను, పాతిత్యాత్=వేద విహితములగు కర్మల నాచరింపకపోవుటవలనను, వేదనిషిద్ధములగు కర్మల నాచరించుటవలనను పాపభీతిచే, శేషేఽపి=నిత్య నైమిత్తికముల కంటె భిన్నమైన జ్యోతిష్టోమాదికమందును లేదా వేదవిహితములకంటె భిన్నమైన స్మృతి విహితమగు ధర్మమునందును, తత్కృతే=వేద

విహితమగు, శ్రౌతే ఏవ ధర్మే=శ్రౌత ధర్మమునందు అనగా వైదిక మతమునందు, సర్వైః=నాస్తికులందరిచేతను, స్థాతవ్యం=ఉండవలసి యున్నది. అనగా నదియే గ్రహింపదగి యున్నది. అనగా వేదవిహిత ములగు అహింసాదులను తదితరములను మీరును అనుష్ఠించుట వలనను, వేదనిషిద్ధములగు మాతృగమనాదులను తదితరములను మీరును వర్జించుటవలనను, నవ్విధముగనే శ్రుతి స్మృతులచే విధింపబడిన, తక్కిన విహిత నిషిద్ధములును శ్రౌతస్మార్తములుగా నుండుటవలననే వానిని గూడ మీరు ఆచరింపవలసి యుండును. అట్లే వేదవిహితములగు తక్కిన ధర్మములను గూడ మీరు తప్పక యాచరింపవలసి యున్నదని యర్థము.

సమాసములు :

వైమత్యాత్-విరుద్ధం మతం యస్య సః=విమతః, విమతస్య భావః= వైమత్యం, తస్మాత్=వైమత్యాత్.

పాతిత్యాత్-పతితస్య భావః=పాతిత్యం, తస్మాత్=పాతిత్యాత్.

తత్కృతే-తేన కృతః=తత్కృతః, తస్మిన్=తత్కృతే.

భావము :

నాస్తికుల కందరికిని యాస్తికులతోబాటు వేదవిహితములగు అహింస యందు, కన్యాదానాదులయందును, నైకమత్య ముండును. అట్లే వేదనిషిద్ధము లగు మాతృగమనాదుల విషయమందును నైకమత్యము గలదు. కావున తక్కిన శ్రుతి స్మృతి విహితములును, నా శ్రుతిస్మృతి నిషిద్ధములు నగు వానియందును ఆస్తికులతోబాటు నాస్తికులకును నైకమత్య ముండవలసియున్నది. వేదవిహిత ములును, వేదనిషిద్ధములును నగు కొన్నిటియందు నుభయులకు నైకమత్య మున్నపుడు తక్కిన వేదవిహిత నిషిద్ధకర్మలయం దైకమత్యము లేకపోవుట సముచితము గాదు. వేదవిహితములును వేదనిషిద్ధములు నగు వానియం దెట్లో అట్లే స్మృతిమూలకములగు విహితనిషిద్ధములయందును నట్లే వ్యవహరింప వలయును. తన్నిషిద్ధములైన కొన్ని కర్మల నాచరించినచో పాపభీతి యెట్లుండునో

మాతృగమనాదులు చేయుటవలనను పాపభీతి యెట్లు గలదో, అట్లే తక్కిన నిషిద్ధాచరణమునందును నాస్తికునకును పాపభీతి యుండవలయునుగదా! అట్లు కానిచో నాస్తికు డేల మాతృగమనాదులను చేయడు? కావుననే యాతనికిని నిషిద్ధకర్మాచరణముచే పాపము కలుగునని భీతి యున్నదని గ్రహింపవచ్చును. కావున వేదవిహితములును, వేదనిషిద్ధములును అగు కొన్ని కర్మలయం దైకమత్య మున్నపుడు ఆ దృష్టాన్తముతోడనే తక్కిన వేదవిహిత నిషిద్ధ కర్మలయందు నైకమత్య ముండక తప్పదని యాశయము. ॥101॥

శ్లో. బభాణ వరుణః క్రోధా దరుణః కరుణోజ్ఝితం,
కిం న ప్రచణ్డాత్ పాషణ్డపాశ! పాశాత్ బిభేషి నః. 102

ప.వి. బభాణ - వరుణః - క్రోధాత్ - అరుణః - కరుణోజ్ఝితం — కిం - న- ప్రచణ్డాత్- పాషణ్డపాశ- పాశాత్-బిభేషి-నః.

అర్థము : అథ = పిదప, వరుణః = వరుణుడు, క్రోధాత్ = కోపమువలన, అరుణః=ఎఱ్ఱనివాడై, కరుణోజ్ఝితం యథా=కరుణను వదలినట్లుగా, హే పాషణ్డపాశ=ఓయి నీచుడైన దేవదూషకా! ప్రచండాత్=తీవ్రమైన, నః=మాయొక్క, పాశాత్=పాశాయుధము నుండి, న బిభేషి కిం= భయపడవా యేమి?

సమాసములు :

కరుణోజ్ఝితం- కరుణా ఉజ్ఝితా యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా= కరుణోజ్ఝితం.
పాషణ్డపాశ - దుష్టః పాషణ్డః = పాషణ్డపాశః, తస్య సంబుద్ధిః = హే పాషణ్డపాశ!

భావము :

తరువాత వరుణదేవుడు కోపముతో నెఱ్ఱబారిన ముఖము గలవాడై కఠినముగా నాస్తికుని 'ఓయీ! నీచుడైన వేదదూషకా! మిక్కిలి తీవ్రమైన నా పాశా

యుధమువలన భయపడవా యేమి? నీచుడవైన నీయొక్క వాదములను మానుకొను'' మని యాశయము. ॥102॥

శ్లో. మానవాశక్యనిర్మాణా కూర్మాద్యఙ్కబిలా శిలా,
న శ్రద్ధాపయతే ముగ్ధా స్తీర్థికాధ్వని వః కథమ్. 103

ప.వి. మానవాశక్యనిర్మాణా- కూర్మాద్యఙ్కబిలా - శిలా- న- శ్రద్ధాపయతే- ముగ్ధాః- తీర్థికాధ్వని- వః- కథం?

అర్థము : హే ముగ్ధాః = ఓమూఢులైన నాస్తికులారా! మానవాశక్యనిర్మాణా, మానవ = మనుష్యులకు, అశక్య = నిర్మింపసాధ్యముకాని, నిర్మాణా = నిర్మాణము గలిగిన, కూర్మాద్యఙ్కబిలా = కూర్మ కూర్మావతారమందును, వరాహాద్యవతారములందు నున్న శ్రీ మహావిష్ణువుయొక్క అఙ్క = చిహ్నముల వంటి, బిలా = రంధ్రములు గలిగిన, శిలా = శాలిగ్రామపుశిల అనగా గండకీనదియం దుద్భవించిన శాలిగ్రామపు శిల, వః = మిమ్ములను, తీర్థికాధ్వని = వైదికమార్గమునందు, కథం = ఎట్లు, శ్రద్ధాపయతే = విశ్వాసమును గల్గింపదు? శాస్త్రోక్తములైన దేవతా చిహ్నములతోఁ గూడిన శాలిగ్రామశిలలు తప్పక మీకు నమ్మకమునుఁ గలిగింపగలవని యర్థము.

సమాసములు :

మానవాశక్యానిర్మాణా-న శక్యం = అశక్యం, మానవానాం అశక్యం = మానవాశక్యం, మానవాశక్యం నిర్మాణం యస్యాస్సా = మానవాశక్య నిర్మాణా.

కూర్మాద్యఙ్కబిలా - కూర్మః ఆదిః యేషాం తే = కూర్మాదయః, కూర్మాదీనాం అఙ్కః = కూర్మాద్యఙ్కః, కూర్మాద్యఙ్కః బిలం యస్యాః సా = కూర్మాద్యఙ్కబిలా.

తీర్థికాధ్వని- తీర్థికానాం అధ్వా = తీర్థికాధ్వా, తస్మిన్ = తీర్థికాధ్వని.

భావము :

ఓ మూఢులారా! వైదికులు తమ తమ యిండ్లలో దేవతార్చనా పీఠముల యందు పంచాయతన పూజలు చేయుదురు. ఆ పంచాయతన పూజ శివునిమధ్య నుంచినచో శివపంచాయతన మనియు, విష్ణువును మధ్య నుంచినచో విష్ణుపంచా-యతన మనియు చెప్పబడుచుండును. ఈ పంచాయతనమం దుంచబడు దేవతలు శాలిగ్రామశిలారూపమున నుందురు. ఈ శాలిగ్రామశిలలు నేపాలదేశమున ప్రవహించు గండకీ నదియందు లభించును. ఈ శిలలోని చక్రాకారపు రంధ్రములు కూర్మవరాహాద్యాకారములతో గూడియుండును. దానిని బట్టి యా యాదేవతల పేర్లతో నవి ప్రసిద్ధి నొందియుండును. ఈ శాలిగ్రామశిలలను శిష్టుల సంప్రదాయము ననుసరించి తెలియనగును. ప్రకృతము ముఖ్యవిషయ మేమనగా గండకీనది యందు బుట్టి ప్రవాహవేగముతో దొరలి వచ్చెడి ఈ శిలలయందు కూర్మవరాహాద్యాకారములతో గూడిన చక్రాకారపు బిలచిహ్నము లెట్లేర్పడినవి? దీనిని మానవులు నిర్మింపలేరు గదా ! కాన నివి దైవమహిమచేతనే యేర్పడియుండవలయును. కావున నిట్టిశిలలే మీకు వైదికమార్గమందు విశ్వాసమునుఁ దప్పక గల్గింపగలవని యాశయము. ॥103॥

శ్లో. శతక్రతూరుజాద్యాఖ్యా విఖ్యాతి ర్నాస్తికాః కథం?
శ్రుతివృత్తాన్తసంవాదై ర్న వశ్చమదచీకరత్. 104

ప. వి. శతక్రతూరుజాద్యాఖ్యావిఖ్యాతిః- నాస్తికాః-కథం-శ్రుతివృత్తాన్తసంవాదైః -న-వః-చమదచీకరత్.

అర్థము:- హే నాస్తికాః=ఓయి పరలోకములేదని వాదించెడి మూఢులారా! శతక్రతూరుజాద్యాఖ్యావిఖ్యాతిః, శతక్రతు = నూరుయాగములు జేసిన యింద్రుడు, ఊరుజ=శ్రీమహావిష్ణువుయొక్కతొడయందు బుట్టిన వైశ్యుడు, ఆది=మొదలుగా గల్గిన బ్రాహ్మణాదివర్ణములయొక్క, ఆఖ్యా= పేర్ల యొక్క, విఖ్యాతిః=ప్రసిద్ధి, శ్రుతివృత్తాన్తసంవాదైః, శ్రుతి=వేదముల యందలి, వృత్తాన్త=సమాచారములతోటి, సంవాదైః=కలయికలచే, ననగా వేదములయందలి ''శతాశ్వమేధకారీ ఇంద్రో భవతి'' ''బ్రాహ్మ

జోఽస్యముఖ మాసీత్'' అను వచనముతో సంవాదమునొంది యుండుట వలన, వః=మీకు, న చమదచీకరత్=ఆశ్చర్యము గల్గింపదా? వేదముల యందు జెప్పబడిన శతక్రతుత్వము బ్రాహ్మణాదివర్ణముల వ్యవహారములు, లోకవ్యవహారములతో సరిపడుటవలన వేదము నేల మీరు ప్రమాణము లని చెప్పరు?

సమాసములు :

**శతక్రతూరుజాద్యాఖ్యావిఖ్యాతిః** - శతం క్రతవః యస్య సః=శతక్రతుః, ఊరుభ్యాం జాయత ఇతి=ఊరుజః, శతక్రతుశ్చ ఊరుజశ్చ= శతక్రతూరుజౌ, శతక్రతూరుజౌ ఆదీ యేషాం తే = శతక్రతూరుజాదయః, శతక్రతూరుజాదీనాం ఆఖ్యాః = శతక్రతూరుజాద్యాఖ్యాః, శతక్రతూరు జాద్యాఖ్యానాం విఖ్యాతిః=శతక్రతూరుజాద్యాఖ్యావిఖ్యాతిః. **శ్రుతివృత్తాన్తసంవాదైః** - శ్రుతిషు వృత్తాన్తాః=శ్రుతివృత్తాన్తాః, శ్రుతి వృత్తాన్తైః సంవాదాః=శ్రుతివృత్తాన్తసంవాదాః, తైః=శ్రుతివృత్తాన్త సంవాదైః.

భావము :

ఓ నాస్తికులారా! ఇంద్రుడు నూరు యాగములను జేసినవాడు. వైశ్యుడు శ్రీ మహావిష్ణువుయొక్క తొడలనుండి జన్మించినవాడు. బ్రాహ్మణుడు ఆ విష్ణువు యొక్క ముఖమునుండి జన్మించినవాడు, ఇవి మున్నగునవి వేదములయందు జెప్పబడినవి. ఇవి లోకవ్యవహారమునకును సరిపోయి యున్నవి. కాన లోక విషయములన్నియు వైదికవిషయములతో నేకీభవించినవి. కాన మీరు వేదములు ప్రమాణములు కావని చెప్పుట సముచితము గాదు. ॥104॥

శ్లో. తత్తజ్జనకృతావేశాన్ గయాశ్రాద్ధాదియాచినః,
భూతా ననుభవన్తోఽపి కథం శ్రద్ధత్త న శ్రుతీః. 105

ప. వి. తత్తజ్జనకృతావేశాన్- గయాశ్రాద్ధాదియాచినః-భూతాన్- అనుభవన్తః- అపి-కథం-శ్రద్ధత్త-న-శ్రుతీః,

అర్థము:- తత్తజ్జనకృతావేశాన్—తత్తజ్జన=ఆయా జనులయందు, కృత= చేయబడిన, ఆవేశాన్=పూనికగలిగిన అనగా దేనినైనను యాచించుటకు నొకరియందుఁ బూనినటువంటి, గయాశ్రాద్ధాదియాచినః=తమ కేర్పడిన ప్రేతత్వము దొలగుటకై చేయవలసిన కర్మలను యాచించునట్టి, భూతాన్ = ప్రేతములను, అనుభవన్తోఽపి=ప్రత్యక్షముగా చూచు చున్నను, శ్రుతీః=వేదములను, కథం=ఎట్లు, న శ్రద్ధత్థ=నమ్మరు.

సమాసములు :

తత్తజ్జనకృతావేశాన్ - తే చ తే చ జనాశ్చ=తత్తజ్జనాః, తత్తజ్జనేషు కృతః ఆవేశః యైః తే=తత్తజ్జనకృతావేశాః, తాన్=తత్తజ్జనకృతావే శాన్.

*గయాశ్రాద్ధాదియాచినః* - గయాయాం శ్రాద్ధాని = గయాశ్రాద్ధాని, గయాశ్రాద్ధాని ఆదిః యేషాం తాని=గయాశ్రాద్ధాదీని, గయాశ్రాద్ధాదీని యాచన్తీతి=గయాశ్రాద్ధాదియాచినః.

భావము :

వేదములు ముమ్మాటికి ప్రమాణములే. ఏలయనగా చనిపోయినవారికి కర్మాదిలోపములచే ప్రేతత్వము తొలగదు. అట్లు ప్రేతత్వము తొలగనివారికి లోకములు లేవు. కాన వారు జీవించియున్న జనులపై నావేశించి తమకుఁ బ్రేతత్వము తొలగి సద్గతి వచ్చుటకై గయాశ్రాద్ధాదులను జేయుడని యాచిం తురు. ఇటువంటి విషయములు నాస్తికులైన మీకును ప్రత్యక్షములే. కాన దీని ననుసరించి వేదములయొక్క ప్రామాణ్యము నేల మీరు నమ్మరు ? తప్పక నమ్మవలసిన విషయము. ॥105॥

శ్లో. నామత్రభమా ద్యమం నీతా నథ స్వతను మాగతాన్,
సంవాదవాదినో జీవాన్ వీక్ష్య మా త్యజత శ్రుతీః. 106

ప. వి. నామత్రభమాత్- యమం- నీతాన్- అథ- స్వతనుం-ఆగతాన్- సంవాద వాదినః-జీవాన్-వీక్ష్య-మా-త్యజత-శ్రుతీః.

అర్థము:- (కించ=మరియు) నామభ్రమాత్=పేరునందలి పోలికవలని భ్రమవలన, యమం=యమధర్మరాజును, నీతాన్=పొందింపబడిన, అథ=భ్రాంతితొలగిన పిదప, స్వతనుం = తమ శరీరమును, ఆగతాన్=పొందిన, సంవాదవాదినః=వేదోక్తవిషయములతో సరిపడునట్లు యమలోకవిషయములనుఁ జెప్పునట్టి, జీవాన్=ప్రాణులను, వీక్ష్య=చూచి, శ్రుతీః=వేదములను, మా త్యజత=వదలకుడు. కావున నిట్టి యుదాహరణములచే పరలోకవిశ్వాసమును, వేదములయందు విశ్వాసమును నుంచుట సముచితము.

సమాసములు :

నామభ్రమాత్-నామసు భ్రమః = నామభ్రమః, తస్మాత్ = నామభ్రమాత్.
స్వాతనుం-స్వస్య తనుః=స్వతనుః, తాం=స్వతనుం.
సంవాదవాదినః- సంవాదం వదన్తీతి = సంవాదవాదినః, తాన్ = సంవాదవాదినః.

భావము :

మఱియు యమదూతలు యముని యాదేశము ననుసరించి భూలోకములోని జీవులను గొనిపోవుచుందురు. ఒకప్పుడు ఒకనినిఁ దెమ్మని పంపినపుడు పేరొక్కటిగా నున్నచో మరియొకనిని భ్రాంతితో గొనిపోవుట సంభవింపవచ్చును. అపుడు యము డాపొరబాటును గ్రహించి యావిధముగా దెచ్చిన జీవుని మఱల భూలోకమునకుఁ ద్రిప్పి పంపించి నిజమైన జీవుని తెప్పించుకొనును. అట్లు యమలోకము నుండి తిరిగి వచ్చి బ్రతికిన జీవులు చెప్పెడి విషయములు వేదోక్తము లగు యమలోకాది విషయములకు సరిపోవుచున్నవి. కాన నిట్టి జీవులనుఁ గాంచి వేదములయందును పరలోకమందును విశ్వాసముంచుట యుక్తము. ॥106॥

శ్లో. సంరమ్భై ర్జమ్భజైత్రాదే స్తస్యమానా ద్భలా ద్వలన్,
మూర్ధ్ని బద్ధాంజలి ర్దేవా నథైవం కశ్చి దూచివాన్. 107

ప. వి. సంరమ్భైః-జమ్భజైత్రాదేః-స్తభ్యమానాత్-బలాత్-వలన్-మూర్ధ్ని-బద్ధాంజలిః-దేవాన్-అథ-ఏవం-కశ్చిత్-ఊచివాన్.

అర్థము:- అథ=వరుణుడు మాట్లాడిన పిదప, జమ్భజైత్రాదేః=జమ్భాసురుని జయించిన యింద్రుడు మున్నగు దేవతలయొక్క, సంరమ్భైః=క్రోధములచే, స్తభ్యమానాత్=ముందు నడచుటకు ప్రతిబంధింపఁబడిన, బలాత్=కలిపురుషుని సైన్యమునుండి, వలన్=వెలుపలికి వచ్చిన, కశ్చిత్=ఒక దుష్టుఁడు, మూర్ధ్ని=తలయందు, బద్ధాంజలిస్సన్=బద్ధ=కట్టబడిన, అంజలిస్సన్=చేతుల జోడింపు గలవాడై, దేవాన్=ఇంద్రాదులను గూర్చి, ఏవం=చెప్పబోవు ప్రకారముగా, ఊచివాన్=పలికెను.

సమాసములు :

జమ్భజైత్రాదేః-జంభం జయతీతి=జంభజైత్రః, జంభజైత్రః ఆదిః యస్య సః=జమ్భజైత్రాదిః, తస్య=జంభజైత్రాదేః.
బద్ధాంజలిః-బద్ధః అంజలిః యేన సః=బద్ధాంజలిః.

భావము :

వరుణదేవుడు మాట్లాడిన పిదప ఇంద్రాదుల కోపముచే ముందు నడుచుటకు కాలాడని కలిసైన్యమునుండి వెలుపలికి వచ్చిన దుష్టు డొకడు తలపై చేతులను మోడ్చి దిగువ చెప్పబోవు ప్రకారముగా చెప్పఁదొడగెను. ॥107॥

శ్లో. నాపరాధీ పరాధీనో జనోఽయం నాకనాయకాః,
కాలస్యాహం కలే ర్వన్దీ తచ్చాటుచటులాననః. 108

ప. వి. న-అపరాధీ-పరాధీనః-జనః-అయం-నాకనాయకాః - కాలస్య - అహం-కలేః-వన్దీ-తచ్చాటుచటులాననః.

అర్థము:- హే నాకనాయకాః !=స్వర్గమునకు నాయకులైన ఓ దేవతలారా ! అయం జనః=ఈ జనమైన నేను, పరాధీనః-పరతంత్రుడను, అతః=

ఇందువలన, నాఽపరాధీ=దోషిని గాను, కలేః కాలస్య= కలియుగాధిష్ఠానదేవతకు, తచ్చాటు చటులాననః. తత్=ఆ కలిపురుషునికి, చాటు = ప్రియవచనములచే, చటుల = చంచలమైన యనగా చపలమైన, ఆననః = నోరుగల వాడనైన, వన్దీ = స్తుతిపాఠకుడను, ప్రభువు చిత్తమును రంజిల్ల జేయుటకై నేను వేదాదులను దూషించితిని కాని స్వయముగా నుద్దేశపూర్వకముగా దూషించలేదు. కాన నేను మీకు దండ్యుడను కానని యర్థము.

సమాసములు :

అపరాధీ-అపరాధః అస్యాస్తీతి=అపరాధీ.
పరాధీనః-పరస్య అధీనః=పరాధీనః.
నాకనాయకాః-నాకస్య నాయకాః=నాకనాయకాః.తేషాం సంబుద్ధిః=హే నాకనాయకాః.
తచ్చాటు చటులాననః - తస్య చాటూని = తచ్చాటూని, తచ్చాటుషు చపలం ఆననం యస్య సః=తచ్చాటు చటునాననః.

భావము :

ఓ స్వర్గ పాలకులారా ! ఆ కలిపురుషునకు నేను స్తుతిపాఠకుడ నగుట వలన పరాధీనుడను. కలియుగాధిదేవతయైన యాతనిని రంజింపజేయుటకై యాతనికి ప్రియవచనమును చెప్పుటయందు నా నోటికిఁ జాపల్యము. భృత్యుడు స్వామి చిత్తము ననుసరింపవలయును గదా ! కాన నేను దోషిని గాను. అతనిని రంజింపఁజేయుటకై వేదాదులను దూషించితిని గాని యుద్దేశపూర్వకముగా నేను వానిసి జేయలేదు. కాన నన్ను మీరు క్షమింపుడు. నన్ను శిక్షింపకుడు. ॥108॥

శ్లో. ఇతి తస్మిన్ వదత్యేవ దేవాః స్యన్దన మన్దిరం,
కలి మాకలయాఞ్చక్రు ర్ద్వాపరం చాపరం పురః. 109

ప. వి. ఇతి-తస్మిన్-వదతి-ఏవ-దేవాః-స్యన్దన మందిరం - కలిం - ఆకలయాం చక్రుః-ద్వాపరం-చ-అపరం-పురః.

అర్థము : తస్మిన్=ఆ వంది. ఇతి=ఇట్లు, వదతి సత్యేవ=చెప్పగనే. దేవాః= ఇంద్రాదులు, స్యందనమందిరం, స్యన్దన = రథమునే, మందిరం = గృహముగా గలిగిన, అనగా రథమధ్యము నందున్న, కలిం = కలి యుగాధి దేవతను, అపరం=మఱియొకడైన, ద్వాపరం చ = ద్వాపర యుగాధిదేవతను, పురః=ఎదుట, ఆకలయాంచక్రుః=దర్శించిరి.

సమాసములు :

స్యన్దనమన్దిరం-స్యన్దనః మన్దిరం యస్య సః=స్యన్దనమన్దిరః, తం= స్యన్దనమన్దిరం.

భావము :

ఇవ్విధముగా కలియుగాధి దేవతయొక్క వంది మాట్లాడగనే ఇంద్రాది దేవతలు రథమధ్యమందున్న కలియుగాధిదేవతను, ద్వాపరయుగాధిదేవతను ఎదుట గాంచిరి. ॥109॥

శ్లో. సన్దద ర్శోన్నమద్గ్రీవః శ్రీబహుత్వకృతాద్భుతా౯,
తత్తత్పాపపరీత స్తా౯ నాకీయాన్ నారకీవ సః 110

ప. వి. సన్దదర్శ-ఉన్నమద్గ్రీవః-శ్రీబహుత్వకృతాద్భుతాన్ - తత్తత్పాపపరీతః- తాన్-నాకీయాన్-నారకీ-ఇవ-సః.

అర్థము: నారకీవ=నరకమందున్న జనమువలె, తత్తత్పాపపరీతః, తత్తత్పాప= బ్రహ్మహత్య మున్నగు వివిధ పాపములతో, పరీతః = చుట్టబడిన, సః=ఆ కలి, శ్రీబహుత్వకృతాద్భుతాన్, శ్రీబహుత్వ=సౌందర్యాతి శయముచే, కృత=కల్గింపబడిన, అద్భుతాన్=ఆశ్చర్యముగల్గిన, నాకీయాన్=స్వర్గవాసులగు, తాన్=ఆ ఇంద్రాదులను, ఉన్నమద్గ్రీవః= నిక్కబెట్టిన మెడగలవాడై, సందదర్శ=చూచెను.

సమాసములు :

ఉన్నమద్గ్రీవః - ఉన్నమన్తీ గ్రీవా యస్య సః = ఉన్నమద్గ్రీవః.
శ్రీబహుత్వాకృతాద్భుతాన్ - శ్రీణాం బహుత్వం = శ్రీబహుత్వం, శ్రీబహుత్వేన కృతం అద్భుతం యైస్తే = శ్రీబహుత్వకృతాద్భుతాః, తాన్ = శ్రీబహుత్వకృతాద్భుతాన్.
నాకీయాన్ - నాకస్య ఇమే = నాకీయాః, తాన్ = నాకీయాన్.
నారకీ - నరకః అస్య అస్తీతి = నారకీ.

భావము :

నరకమందలి జనమువలె బ్రహ్మహత్యాది వివిధ పాపములతో జుట్టబడిన యా కలి పురుషుడు సౌందర్యాతిశయముచే జనుల కాశ్చర్యము కలిగించుచున్న స్వర్గవాసులైన యా యింద్రాదులను జూచెను. ॥110॥

శ్లో. గురువ్రీడావలీఢః ప్రాగభూ న్నమితమస్తకః,
స త్రిశఙ్కురివాక్రాన్త స్తేజసైవ బిడౌజసః. 111

ప. వి. గురువ్రీడావలీఢః - ప్రాక్ - అభూత్ - నమితమస్తకః - సః - త్రిశఙ్కుః - ఇవ - ఆక్రాన్తః - తేజసా - ఏవ - బిడౌజసః.

అర్థము: సః = ఆకలి పురుషుడు, ప్రాక్ = తొలుత, అనగా చూచిన వెంటనే, గురువ్రీడావలీఢః, గురు = గొప్పదైన, వ్రీడా = సిగ్గుచే, అవలీఢః = గ్రహింపబడినవాడై (పశ్చాత్ = వెనుక) బిడౌజసః = దేవేంద్రునియొక్క, తేజసైవ = ప్రభావముచేతనే, ఆక్రాన్తస్సన్ = ఆక్రమింపబడినవాడగుచు, నమితమస్తకః = వంచబడిన తలగలిగిన, త్రిశంకురివ = స్వర్గమునుండి త్రోయబడిన త్రిశంకుడను సూర్యవంశపు రాజువలె, నమితమస్తకః = వంచబడిన తల కలవాడుగా, అభూత్ = ఆయెను.

సమాసములు :

*గురువ్రీడావలీఢః* - గుర్వీ చ సా వ్రీడా చ = గురువ్రీడా, గురువ్రీడయా అవలీఢః = గురువ్రీడావలీఢః.

నమితమస్తకః - నమితః మస్తకః యస్య సః=నమితమస్తకః
బిడౌజసః - వేవేష్టీతి = బిట్, బిట్ ఓజః యస్య సః = బిడౌజాః,
తస్య=బిడౌజసః.

భావము :

ఆ కలిపురుషుడు ఇంద్రాదులను జూడగనే తొలుత సిగ్గుతో గప్పబడిన వాడై పిదప నింద్రుని ప్రభావముచే నాతని ప్రభావము తిరస్కరింపఁబడగా, ఇంద్రుని ప్రభావముచే స్వర్గమునుండి భువికిఁ ద్రోయఁబడిన త్రిశఙ్కుడను సూర్య వంశపు రాజువలె వంచిన తలగలవాడుగా నాయెను. త్రిశంకుడను ఇక్ష్వాకు వంశపు రాజు మొదట తన గురువగు వసిష్ఠునిచే శపింపబడినవాడై చండాలు డాయెను. పిదప శరీరముతోనే స్వర్గమును బొందగోరి యజ్ఞమునుఁ జేసెను. దీనికి విశ్వామిత్రుని ఆచార్యునిఁ గావించుకొనెను. ఆ విశ్వామిత్రుని మంత్ర బలముచే తన శరీరముతోనే స్వర్గమునకు వెళ్ళెను. కాని చండాలుఁ డగుటవలన స్వర్గమున నుండుట కర్హత లేకపోవుటచే నింద్రుఁ డతనిని తలక్రిందులుగా భూమిపై త్రోయించె ననెడి మహాభారత కథ యిట ననుసంధేయము. ॥111॥

శ్లో. విముఖాన్ ద్రష్టు మప్యేనం జనఙ్గమ మివ ద్విజాన్,
ఏష మత్తః సహేలం తా నుపేత్య సమభాషత 112

ప. వి. విముఖాన్-ద్రష్టుమ్-అపి-ఏనం-జనఙ్గమమ్-ఇవ-ద్విజాన్-ఏషః-మత్తః-సహేలం-తాన్-ఉపేత్య-సమభాషత.

అర్థము: జనఙ్గమం=చండాలుని, ద్రష్టుమపి=చూచుటకును, విముఖాన్= ఇచ్ఛ లేక ముఖమును త్రిప్పుకొనిన, ద్విజానివ = బ్రాహ్మణులవలె, ఏనం= ఈ కలిని, ద్రష్టుమపి=చూచుటకును, విముఖాన్=విముఖులైన, తాన్=ఆ యింద్రాదులను, మత్తః=మదించినవాడైన, ఏషః= ఈ కలిపురుషుడు, సహేలం=నిర్లక్ష్యభావముతో, ఉపేత్య=పొంది, సమభాషత=సంభాషించెను.

22)

సమాసములు:

జనఙ్గమం-జనం గచ్ఛతీతి=జనఙ్గమః, తం=జనంగమం.

భావము :

చండాలుని చూచుటకు కోరికలేక ద్విజు లేవిధముగా ముఖములను(త్రిప్పు కొందురో అట్లే యీ కలిపురుషుని జూచుటకును కోరికలేని యింద్రాదులు అతనిఁ జూడక తమ ముఖములను త్రిప్పుకొనియుండగా మదాంధుఁడగు నీకలి పురుషుడు నిర్లక్ష్యభావముతో వారియొద్దకు జేరి మాట్లాడసాగెను.

శ్లో. స్వస్తి వాస్తోష్పతే తుభ్యం శిఖిన్నస్తి న ఖిన్నతా!
సఖే! కాల సుఖేనాసిః పాశహస్త ముదస్తవ. 113

ప. వి. స్వస్తి-వాస్తోష్పతే-తుభ్యం-శిఖిన్!-అస్తి-న-ఖిన్నతా-సఖే-కాల-సుఖేన-అసి-పాశహస్త-ముదః-తవ.

అర్థము: హే వాస్తోష్పతే!=ఓ యింద్రా! తుభ్యం=నీకై, స్వస్తి=శుభమేనా? హే శిఖిన్=ఓ యగ్ని! ఖిన్నతా=కష్టము, నాస్తి=లేదుకదా? సఖే!=చెలికాడవైన, కాల=యమా! సుఖేన=సుఖముతో, అసి=ఉన్నావా? హే పాశహస్త!=పాశాయుధము హస్తమందు గల ఓ వరుణా! తవ=నీకు, ముదః=సంతోషములేనా ?

సమాసములు:

వాస్తోష్పతే-వాస్తోః పతిః=వాస్తోష్పతిః, తస్య సంబుద్ధిః= హే వాస్తోష్పతే!
శిఖిన్-శిఖా అస్య అస్తి ఇతి శిఖీ. తస్య సంబుద్ధిః, హే శిఖిన్!
పాశహస్త-పాశః హస్తే యస్య సః=పాశహస్తః, తస్య సంబుద్ధిః=హే పాశహస్త!

భావము:

ఓ యింద్రా! నీకు శుభమేనా? ఓ యగ్ని! నీకు కష్టము లేదు గదా? మిత్రుడవైన ఓ యముడా! నీవు సుఖముగా నున్నావా? పాశధారివైన ఓ వరుణా! నీకు సంతోషములే యున్నవిగదా? యని కలిపురుషుడు సంభాషించెను.

శ్లో. స్వయంవరమహే భైమీ వరణాయ త్వరామహే,
తదస్మా ననుమన్యధ్వ మధ్వనే తత్ర ధావినే. 114

ప.వి. స్వయంవరమహే-భైమీవరణాయ - త్వరామహే-తత్-అస్మాన్ - అనుమన్యధ్వం-అధ్వనే-తత్ర-ధావినే.

అర్థము: హే దేవాః = ఓదేవతలారా! స్వయంవరమహే = తానుగా భర్తను వరించెడి యుత్సవమునందు, భైమీవరణాయ=దమయన్తిని వరించుటకు, త్వరామహే=తొందరపడుచున్నాము. తత్=అందువలన, తత్ర=ఆ స్వయంవరము జరుగు ప్రదేశమునకు, ధావినే=వెళ్ళుచున్న, అధ్వనే=త్రోవకొఱకు, అస్మాన్=మమ్ములను, అనుమన్యధ్వం=అనుమతించుడు.

సమాసములు :

స్వయంవరమహే - స్వయం వ్రియతే అస్మి న్నితి = స్వయంవరః, స్వయంవర ఏవ మహః=స్వయంవరమహః,తస్మిన్=స్వయంవరమహే. భైమీవరణాయ–భీమస్య అపత్యం స్త్రీ=భైమీ. భైమ్యాః వరణం=భైమీవరణం. తస్మై=భైమీవరణాయ.

భావము:

ఓ దేవతలారా ! స్వయంవరమహోత్సవమున దమయన్తిని వరించుటకై వెళ్ళుచున్నాము. అందువలన ఆ ప్రదేశమునకు వెళ్ళెడు మార్గమునకు మీ రనుమతించుడు.

శ్లో. తేఽవజ్ఞాయ త మస్యోచ్చై రహఙ్కార మకారణమ్,
ఊచిరేఽతిచిరే ణైనం స్మిత్వా దృష్టముఖా మిథః. 115

ప.వి. తే-అవజ్ఞాయ–తం–అస్య-ఉచ్చైః- అహంకారమ్-ఊచిరే - అతిచిరేణ - ఏనం-స్మిత్వా-దృష్టముఖాః-మిథః.

అర్థము: తే＝ఆ యింద్రాదులు, అస్య＝ఈ కలియొక్క, తం＝ముందు జెప్పిన, ఉచ్చైః＝మిక్కుటమైన, అకారణం＝కారణములేని, అహఙ్కారం＝గర్వమును, అవజ్ఞాయ＝లెక్కింపక, (కావుననే), అతిచిరేణ＝మిక్కిలి యాలస్యముగా, మిథః＝ఒండొరులు, దృష్టముఖాః＝మోమునుఁ జూచుకొనినవారై, స్మిత్వా＝నవ్వి, ఏనం ＝ ఈ కలిని గూర్చి, ఊచిరే＝పలికిరి.

సమాసములు :

అకారణం–అవిద్యమానం కారణం యస్య సః＝అకారణః, తం＝అకారణం.
దృష్ట ముఖాః-దృష్టం ముఖం యై స్తే＝దృష్టముఖాః.

భావము:

ఆ యింద్రాదులు ఈ కలియొక్క అపూర్వపు మిక్కుటమగు నకారణమైన గర్వమును లెక్కింపలేదు. కావుననే యతనికి వెంటనే సమాధాన మీయక కొంత తడ వౌనర్చి యనగా నీ మహాపాపి కెట్లు ఉత్తరమిత్తుమని యాలస్యము గావించి యొండొరుల మోమునుఁ జూచి నవ్వుకొనిరి. అనగా నీమూఢులు స్వయంవరవార్త నెత్తుచున్నారే, అది యెపుడో గడిచిపోయినది కదా! యను తలంపుతో నవ్వుకొనిరి. తర్వాత నిట్లు చెప్పఁదొడగిరి.

శ్లో. పున ర్వక్ష్యసి మా మైవం కథ ముద్వక్ష్యసే ను సః,
స్పృష్టవాన్ పరమేష్ఠీ యం నైష్ఠికబ్రహ్మచారిణమ్. 116

ప.వి. పునః-వక్ష్యసి-మా-మా-ఏవం-కథమ్-ఉద్వక్ష్యసే-ను-సః-స్పృష్టవాన్ - పరమేష్ఠీ-యం-నైష్ఠికబ్రహ్మచారిణమ్.

అర్థము: (హే కలే!＝ఓ కలీ!) పునః＝మఱల, ఏవం＝ఈ విధముగా స్వయంవరమునకై వెళ్ళుచున్నానని, మా మా వక్ష్యసి＝చెప్పకుము, చెప్పకుము. పరమేష్ఠీ＝బ్రహ్మదేవుడు, యం＝ఎవనిని, నైష్ఠికబ్రహ్మచారిణం＝

యావజ్జీవము గురుశుశ్రూష చేయుచు వేదాధ్యయనపరుడై వివాహ మాడక యుండవలసిన బ్రహ్మచారిగా, సృష్టవాన్=సృజించెనో, సః= అట్టి నీవు, కథం=ఎట్లు, ఉద్వక్ష్యసే=వివాహమాడెదవు? ఈ విధ ముగనే కృతయుగాదులుకూడా నైష్ఠికబ్రహ్మచారులుగనే బ్రహ్మచే సృజి యింపబడినవి. కావున నీవు స్వయంవరమునుగూర్చి మాట్లాడరాదు. అందువలన నీనైష్ఠికబ్రహ్మచర్యమునకు భంగము వాటిల్లును కదా!

సమాసములు :

పరమేష్ఠీ- పరమే తిష్ఠతీతి=పరమేష్ఠీ.
నైష్ఠికబ్రహ్మచారిణి- నిష్ఠాపర్యంతం తిష్ఠతీతి=నైష్ఠికః, నైష్ఠికశ్చాసౌ బ్రహ్మచారీ చ నైష్ఠికబ్రహ్మచారీ, తం=నైష్ఠికబ్రహ్మచారిణం.

భావము :

ఓ కలీ! నీవు మరియొకసారి ఈ విధముగా చెప్పకుము. నిన్ను బ్రహ్మ నైష్ఠికబ్రహ్మచారిగా సృజించెను. కాన నీవెట్లు వివాహమాడెదవు? ఈ విధముగానే కృతయుగాదులనుకూడా బ్రహ్మ నైష్ఠికబ్రహ్మచారులుగనే సృజించెను. కావున నీవు స్వయంవరవార్త జెప్పకుము. దానిని జెప్పినచో నీనైష్ఠికబ్రహ్మచర్యమునకే భంగము వాటిల్లగలదు. ధర్మశాస్త్రములలో ఉపకుర్వాణుడనియు, నైష్ఠికుడనియు బ్రహ్మచారి యిరుతెఱంగులు గల్గియున్నారు. ఉపకుర్వాణుడు బ్రహ్మచర్యము నందుండి వేదాధ్యయనాదులను గావించి స్నాతకుడై పరిణయమాడవచ్చును. నైష్ఠికుడు నిత్యము గురుసమీపమున వసించుచు, గురువుగారి కార్యములను చేయుచు వారి యవకాశములయందు వేదాధ్యయనాదులను జేయుచు, తన జీవిత మును గడపవలయునేకాని యాతనికి వివాహయోగ్యత లేదు.

శ్లో. ద్రౌహిణం ద్రుహిణో వేత్తు త్వా మాకర్ణ్యావకీర్ణినమ్,
త్యజన్నైరపి వా ధాతుః సేతు ర్లంఘ్య స్త్వయా న కిమ్? 116

ప.వి. ద్రౌహిణం-ద్రుహిణః-వేత్తు-త్వామ్-ఆకర్ణ్య-అవకీర్ణినం-త్యజన్నైః-అపి-వా-ధాతుః-సేతుః-లంఘ్యః-త్వయా-న-కిమ్.

అర్థము : వా = లేదా, త్వజ్జనైరపి = నీ భృత్యులైన కామక్రోధాదులచేతను, ధాతుః = బ్రహ్మయొక్క, సేతుః = మర్యాద యనగా నాజ్ఞ, లంఘ్యః = అతిక్రమింపసాధ్యము, సుతరాం = ఇంకను అధికముగా, త్వయా = వారికి నాయకుడవైన నీచేత, సః = ఆ మర్యాద, కిం న లంఘ్యః = అతిక్రమింప సాధ్యముకాదా? తప్పక సాధ్యము. ఎవని భృత్యులు సృష్టికర్తయొక్క యాజ్ఞల నుల్లంఘించినపుడు, ఆ భృత్యులపై అధికారము వహించిన నాయకు డుల్లంఘించుట యింకను సులభమే కదా! కింతు = కాని, ద్రుహిణః = బ్రహ్మ, త్వాం = నిన్ను, అవకీర్ణినం = వ్రతభంగము నొందిన వానినిగా, ఆకర్ణ్య = విని, ద్రోహిణం = ఆజ్ఞను లంఘించిన వానినిగా, వేత్తు = తెలియనిమ్ము, అట్లు తెలుసుకొని యేమి చేయవలయునో దానిని చేయనిమ్ము.

సమాసములు :

ద్రోహిణం - ద్రుహ్యతీతి ద్రోహీ, తం = ద్రోహిణం.
అవకీర్ణినం - అవకీర్ణ మస్య అస్తీతి = అవకీర్ణీ, తం = అవకీర్ణినం.
త్వజ్జనైః - తవ జనాః = త్వజ్జనాః, తైః = త్వజ్జనైః.
లంఘ్యః - లంఘయితుం శక్యః = లఙ్ఘ్యః.

భావము :

లేదా నీకు భృత్యులైన కామక్రోధాదులచేతను బ్రహ్మయొక్క యాజ్ఞ యుల్లంఘింప సాధ్యముకాగా వారిపై నధికారము వహించు నీ కాపని ఇంకను సులభము. కాని బ్రహ్మ నిన్ను వ్రతభంగము నొందినవానినిగా విని తనయాజ్ఞ నుల్లంఘించినవానినిగా తెలిసికొని దానికై చేయవలసినది నీకు చేయునుగాత.

శ్లో. అతివృత్త స్స వృత్తాన్త స్త్రైలోక్యయువగర్వనుత్,
ఆగచ్ఛతా మపాదానం న స్వయంవర ఏవ నః. 118

ప.వి. అతివృత్తః-సః-వృత్తాన్తః-త్రైలోక్యయువగర్వనుత్-ఆగచ్ఛతామ్-అపాదానం-న-స్వయంవరః-ఏవ-నః.

అర్థము: (భవతు తావత్=అగునుగాత) త్రైలోక్యయువగర్వనుత్, త్రైలోక్య= మూడులోకములయందలి, యువ=యువకులయొక్క, గర్వ=అహం కారమును, నుత్=పోగొట్టునట్టి, అనగా దమయన్తి యువకుల నందరిని తిరస్కరించుటవలన అని యర్థము. సః=ఆ స్వయంవరము,అతివృత్తః= గడచిపోయినది, ఆగచ్ఛతాం=వచ్చుచున్న, నః=మాకు, సః= ఆ ప్రసిద్ధమైన, స్వయంవర ఏవ = స్వయంవరము జరిగిన స్థానమే, అపాదానం=మా రాకకు ప్రారంభ స్థలము. అనగా అక్కడనుండియే మేము బయలుదేరి వచ్చుచున్నామని యర్థము.

సమాసములు ;

త్రైలోక్య యువగర్వనుత్ - త్రిలోకా ఏవ త్రైలోక్యం, త్రైలోక్యే యువానః = త్రైలోక్యయువానః, త్రైలోక్యయూనాం గర్వః = త్రైలోక్యయువగర్వః, త్రైలోక్యయువగర్వం నుదతీతి = త్రైలోక్య యువగర్వనుత్.

భావము :

ఈ విషయము లుండనిమ్ము. మూడులోకములయందలి యువకుల గర్వమును పోగొట్టునట్టి యా స్వయంవర ప్రసంగము గడిచిపోయినది. ఆ స్వయంవరమందు దమయన్తి మూడు లోకములయందలి యువకుల సౌందర్య గర్వము నణగగొట్టినది. ఆ స్వయంవరప్రదేశమే మేమందరము బయలుదేరినట్టి స్థలము.

శ్లో. నాగేషు సానురాగేషు పశ్యత్సు దివిషత్సు చ,
భూమిపాలం నలం భైమీ వరం సావవరత్ వరమ్. 119

ప. వి. నాగేషు - సానురాగేషు - పశ్యత్సు - దివిషత్సు - చ-భూమిపాలం-నలం- భైమీ-వరం-సా-అవవరత్-వరమ్.

అర్థము :-సానురాగేషు = అనురాగముతోగూడిన, నాగేషు=నాగకుమారులు, దివిషత్సు=దేవతలు, పశ్యత్సు సత్సు=చూచుచుండగా, సా=ఆ, భైమీ=దమయన్తి, వరం = నాగకుమారులు మున్నగువారికంటె శ్రేష్ఠుడైన, భూమిపాలం=చక్రవర్తియగు, నలం=నిషధరాజును, వరం=వరునిగా, అవవరత్=వరించినది.

సమాసములు :

**సానురాగేషు** - అనురాగేణ సహ వర్తన్త ఇతి=సానురాగాః, తేషు= సానురాగేషు.

**భూమిపాలం**-భూమిం పాలయతీతి=భూమిపాలః. తం=భూమిపాలం.

భావము :

ఆ దమయన్తి అనురాగముతో నాగకుమారులు, దేవతలు చూచుచుండగా వారి నందరిని గణింపక చక్రవర్తియైన నిషధ దేశపు రాజగు నలుని వరునిగా వరించినది ॥119॥

శ్లో. భుజగేశా నసద్వేశాన్ వానరా నితరాన్ నరాన్,
అమరాన్ పామరాన్ భైమీ నలం వేద గుణోజ్జ్వలమ్. 120

ప. వి. భుజగేశాన్ - అసద్వేశాన్ - వానరాన్ - ఇతరాన్ - నరాన్- అమరాన్- పామరాన్-భైమీ-నలం-వేద-గుణోజ్జ్వలమ్.

అర్థము :-భైమీ=దమయన్తి, భుజగేశాన్=వాసుకి మున్నగు మహానాగులను, అసద్వేశాన్=హీనవేషము గల వారినిగా అనగా విరూపులగుట వలన మనోహరముకాని రూపముగలవారుగను, ఇతరాన్ = నలునికంటె భిన్నులైన, నరాన్=నరులను, వానరాన్=చాపల్యము గుణహీనత్వము అను లోపముల వలన కోతులుగను, అమరాన్ = ఇంద్రాదులగు వేల్పులను, పామరాన్=నీచులుగను, వేద=తెలుసుకొనుచుండెనది, నలం చ=నలుని, గుణోజ్జ్వలం=గుణములచే ప్రకాశించువానినిగా, వేద=తెలుసుకొనినది.

సమాసములు :

భుజగేశాన్-భుజగానాం ఈశాః=భుజగేశాః, తాన్=భుజగేశాన్.
అసద్వేశాన్-న సన్=అసన్, అసన్ వేశః యేషాం తే=అసద్వేశాః, తాన్=అసద్వేశాన్.
గుణోజ్జ్వలం--గుణైః ఉజ్జ్వలః=గుణోజ్జ్వలః, తం=గుణోజ్జ్వలం.

భావము :

ఆ దమయన్తి స్వయంవర కాలమందు వాసుకి మున్నగు మహానాగులు మంచి యుడుపులు లేనందువలన కురూపులుగను, తక్కిన నరులను వానరులుగను దేవతలను పామరులుగను తెలుసుకొనినది. వారిలో నలుని మాత్రము గుణవంతునిగా తెలుసుకొనినది.

శ్లో. ఇతి శ్రుత్వా స రోషాన్ధః పరమ శ్చరమం యుగం,
జగన్నాశనిశారుద్రముద్ర స్తా నుక్త్వా నదః. 121

ప. వి. ఇతి - శ్రుత్వా - సః-రోషాన్ధః-పరమః-చరమం-యుగం-జగన్నాశనిశా రుద్రముద్రః-తాన్-ఉక్తవాన్-అదః.

అర్థము :-ఇతి=ఈ విధముగా, శ్రుత్వా=విని, పరమః=ఉద్ధతి నొందిన, రోషాన్ధః=రోషముచే దృష్టిశక్తి లేనటువంటి అనగా మంచి చెడులను వివేచింప శక్తిలేనటువంటి, చరమం యుగం=కడపటి యుగమైన, సః=ఆ కలి పురుషుడు, జగన్నాశనిశారుద్రముద్రః, జగన్నాశ= మూడు లోకములను ధ్వంసముగావించు, నిశా=ప్రలయరాత్రి యందు, రుద్ర=సంహారకారకుడైన శివునియొక్క, ముద్ర=ఆకారము గలిగినవా డగుచు, తాన్=ఆ ఇంద్రాదులను, అదః=చెప్పబోవు మాటను, ఉక్తవాన్=చెప్పెను.

సమాసములు :

రోషాన్ధః-రోషేణ అన్ధః=రోషాన్ధః.

*జగన్నాశనిశారుద్రముద్రః*-జగతాం నాశః=జగన్నాశః, జగన్నాశస్య నిశా, జగన్నాశనిశా, జగన్నాశనిశాయాం రుద్రః=జగన్నాశనిశా రుద్రః, జగన్నాశనిశారుద్రస్య ముద్రేవ ముద్రా యస్య సః=జగన్నాశనిశారుద్రముద్రః.

భావము :

ఈవిధముగా నింద్రుడు చెప్పిన మాటలను విని రెచ్చినవాడై రోషముచే వివేచనాశక్తి లేనటువంటి కలిపురుషుడు, మూడులోకములను సంహరింప నుద్యుక్తుడైన ప్రళయకాలరాత్రియందలి రుద్రుని భీకరాకారము గలవాడై యా యింద్రాదులనుగూర్చి క్రింది విధముగా చెప్పఁ దొడగెను.

శ్లో. కయాఽపి క్రీడతు బ్రహ్మ దివ్యాః స్త్రీ ర్దీవ్యతు స్వయమ్,
కలిస్తు చరతు బ్రహ్మ ప్రైతు చాతిప్రియాయ వః. 122

ప. వి. కయా-అపి-క్రీడతు-బ్రహ్మ-దివ్యాః-స్త్రీః-దీవ్యతు-స్వయం-కలిః-తు-చరతు-బ్రహ్మ-ప్రైతు-చ-అతిప్రియాయ-వః.

అర్థము:- హే దేవాః=ఓదేవతలారా! బ్రహ్మ=బ్రహ్మ, కయాఽపి=సంగతింప దగని స్త్రీతో అనగా "ప్రజాపతి ర్వై స్వాం దుహితరం అన్వగాత్" అను శ్రుతి ననుసరించి సంగమింపఁదగని స్త్రీతో, క్రీడతు=రమింప వలయును, స్వయం=తాము, దివ్యాః=స్వర్గమందలి వేశ్యలను గలిసి, దీవ్యతు=క్రీడింపవలయును, కలిస్తు=కలిపురుషుడైన నేనో, వః= మీకు, అతిప్రియాయ=మిక్కిలిప్రియముఁ గొలుపుటకై, బ్రహ్మ చరతు = బ్రహ్మచర్యము నవలంబింపవలయును, ప్రైతు = మరణింప వలయును.

సమాసములు :

*అతిప్రియాయ* - అత్యన్తం ప్రియం = అతిప్రియం, తస్మై = అతి ప్రియాయ.

భావము :

"పున ర్వక్ష్యసి'' ఇత్యాదిగా చెప్పబడిన రెండు శ్లోకములలోని విషయములకు దెప్పి పొడుచుచు నుత్తర మిచ్చుచున్నాడు. ఓ దేవతలారా ! సృష్టికర్త యగు బ్రహ్మ పొందగూడని తన కుమార్తెతో రమింపవచ్చును. మీరు రంభాదిదేవవేశ్యలతో సంగమింపవచ్చును. కాని మీకందరికిని ప్రీతి గల్పించుచు నేను మాత్రము నైష్ఠికబ్రహ్మచర్యము నాచరింపవలయును. తర్వాత చావవలయును అని కలిపురుషు డుత్తరమిచ్చెను.

శ్లో. చర్యేవ కతమేయం వః పరస్మై ధర్మదేశినామ్,
స్వయం తత్ కుర్వతాం సర్వం శ్రోతుం యత్ బిభితః శ్రుతీ.

ప.వి. చర్యా-ఇవ - కతమా - ఇయం-వః - పరస్మై - ధర్మదేశినాం - తత్ - కుర్వతాం-సర్వం-శ్రోతుం-యత్-బిభితః-శ్రుతీ.

అర్థము:-పరస్మై=ఇతరునికై, ధర్మదేశినాం=తన పుత్రికతో సంగమింపరాదు ఇత్యాదిగా ధర్మముల నుపదేశించుచు, స్వయం తు=తామో, యత్=ఏకార్యమును అనగా బ్రహ్మహత్యను, గురుస్త్రీగమనము మున్నగువానిని, శ్రోతుం=వినుటకు, శ్రుతీ=రెండుచెవులుకూడా, బిభితః=భయపడుచున్నవో, తత్ సర్వం=ఆ బ్రహ్మహత్యా, పరస్త్రీగమనాదికము నంతటిని, కుర్వతాం=చేయుచున్న, వః=మీకు, ఇయం=ఈ, చర్యా నడవడిక లేదా రీతి, కతమేవ=ఎట్టిది? తాము మాత్ర మాచరింపక యితరులకు మాత్ర ముపదేశము చేయుచున్న మీ మాటలు వినదగినవి కావని యర్థము.

సమాసములు :

*ధర్మదేశినాం* - ధర్మం దిశ న్తీతి=ధర్మదేశినః, తేషాం=ధర్మదేశినాం.

భావము :

ఇతరులకు మాత్రము "తన పుత్రికతో సంగమము చేయరాదనియు బ్రహ్మహత్యను చేయరాదనియు'' నుపదేశము గావించుచు తాము మాత్రము

చెవులతో వినుటకును భయపడుచున్న యా బ్రహ్మహత్యాదులను చేయుచున్న మీపద్ధతి యెట్టిది? అనగా నవాచ్యమైనదని యర్థము. మీరు ఆచరింపకపోయినను పరోపదేశమును మాత్రము గావింతురు. అవి వినదగినవికావు.

శ్లో. తత్ర స్వయంవరేఽలమ్భి భువః శ్రీ ర్నైషధేన సా,
జగతో హ్రీశ్చ యుష్మాభి ర్లాభ స్తుల్యాభ ఏవ వః. 124

ప.వి. తత్ర-స్వయంవరే- అలమ్భి-భువః-శ్రీః- నైషధేన-సా-జగతః-హ్రీః-చ-యుష్మాభిః-లాభః-తుల్యాభః-ఏవ-వః.

అర్థము:- హే దేవాః = ఓ దేవతలారా! తత్ర = ఆ, స్వయంవరే = దమయన్తీ స్వయంవరమునందు, భువః = భూలోకమునకు, శ్రీః = లక్ష్మియైన, సా = ఆదమయన్తి, నైషధేన = నలునిచే, అలమ్భి = పొందబడినది, యుష్మాభిశ్చ = మీచేతనో, జగతః = మూడులోకములకు, హ్రీః = సిగ్గు, అలమ్భి = పొందింపబడినది. అనగా మీరు చేసినపని, యన్ని లోకములకు లజ్జను కల్గించెడి అవమానము, వః = మీయొక్కయు, నలునియొక్కయు, లాభః = ఫలలాభము, తుల్యాభ ఏవ = సమానమైన రూపముగలిగినదే. అనగా శ్రీ హ్రీశబ్దములలో, శకా రహాకారములను దొలగించినచో మిగిలిన "రీ"కారము సమానమని యర్థము.

సమాసములు :

నైషధేన - నిషధానాం రాజా = నైషధః, తేన = నైషధేన.

భావము :

"అతివృత్త స్సవృత్తాన్తః"(17:118-120)ఇత్యాదిగా మూడు శ్లోకముల యందు జెప్పబడిన యంశములకు నుత్తర మీయబడుచున్నది. ఓ దేవతలారా! ఆ స్వయంవరమునందు భూలోకలక్ష్మియైన దమయన్తి నలునికి లభించినది. మూడు లోకములలోని సిగ్గు అంతయు మీకు లభించినది. కాన మీకు నలునకును లాభము సమానరూపమే. కాని శ్రీ హ్రీశబ్దములలోని శకారహారములను తొలగించినచో "రీ" కారము సమానమే యగుచున్నది.

శ్లో. దూరా న్నః ప్రేక్ష్య యౌష్మాకీ యు క్తేయం వక్త్రవక్రణా,
లజ్జయై వాసమర్థానాం ముఖ మాస్మాక మీక్షితుమ్. 125

ప. వి. దూరాత్-నః-ప్రేక్ష్య-యౌష్మాకీ-యుక్తా-ఇయం-వక్త్రవక్రణా-లజ్జయా-ఇవ-అసమర్థానాం-ముఖమ్-ఆస్మాకమ్-ఈక్షితుమ్.

అర్థము : హే దేవాః=ఓ దేవతలారా, దూరాత్=దూర ప్రదేశమునుండి, నః=మమ్ములను, ప్రేక్ష్య=చూచి, యుష్మాకం=మీకు సంబంధించిన, ఇయం=ఈ, వక్త్ర వక్రణా=ముఖమును వంకరగా బెట్టుట, లజ్జయైవ=దమయంతిచే వరించబడనందువలని సిగ్గుచేతనే యేర్పడినదై, అస్మాకం=మాకు సంబంధించిన, ముఖం = ముఖమును, ఈక్షితుం=చూచుటకు, అసమర్థానాం=అశక్తులైన, యుష్మాకం=మీకు, యుక్తా=తగినదే.

సమాసములు :

యౌష్మాకీ-యుష్మాక మిదం=యౌష్మాకీ.
వక్త్రవక్రణా-వక్త్రాణాం వక్రణా=వక్త్రవక్రణా.
అసమర్థానాం-న సమర్థాః=అసమర్థాః, తేషాం=అసమర్థానాం.
ఆస్మాకం-అస్మాక మిదం=ఆస్మాకం, తత్=ఆస్మాకం.

భావము :

ఓ దేవతలారా! దూరమునుండి మిమ్ములను చూచి యీ మీ ముఖముల యందలి వంకరతనము మిమ్ములన దమయన్తి వరింపనందువలన నేర్పడినదిగా తెలుసుకొంటిమి. అందువలననే మీరు మా ముఖములను జూడ జాలకపోవుట తగినదే.

శ్లో. స్థితం భవద్భిః పశ్యద్భిః కథం భో స్తదసామ్ప్రతం
నిర్దగ్ధా దుర్విదగ్ధా కిం సా దృశా న జ్వలత్రుకా్ధా. 126

ప.వి. స్థితం-భవద్భిః-పశ్యద్భిః-కథం-భోః-తత్ - అసాంప్రతం-నిర్దగ్ధా-దుర్వి దగ్ధా-కిం-సా-దృశా-న-జ్వలత్క్రుధా.

అర్థము : భో దేవాః=ఓదేవతలారా!, పశ్యద్భిః=నలుని దమయన్తి వరించుటను చూచుచున్న, భవద్భిః=మీచే, కథం=ఎట్లు, స్థితం = ఉదాసీనముగా నుండుట (ఏర్పడినది), తత్ = ఆ యుదాసీనత, అసాంప్రతం = తగదు, దుర్విదగ్ధా=వినయము లేనటువంటి, సా=ఆ దమయన్తి, జ్వలత్క్రుధా=కోపముచే జ్వలించు, దృశా=దృష్టిచే, కిం=ఏల, న దగ్ధా =దహింపబడలేదు, తప్పక దహింపదగినది.

సమాసములు :

అసాంప్రతం—న సాంప్రతం=అసాంప్రతం.

జ్వలత్క్రుధా-జ్వలన్తీ క్రుత్ యస్యా స్సా=జ్వలత్క్రుత్, తయా= జ్వలత్క్రుధా.

భావము :

ఓ దేవతలారా ! దమయన్తి నలుని వరించుటను చూచుచున్న మీరెట్లు ఊరకయుంటిరి ? అట్లు మీరు ఊరకయుండుట తగినది కాదు. వినయములేని యా దమయన్తిని కోపముచే మండెడి దృష్టితో మీరేల దహింపలేదు ? అట్లు దహించుట యుచితము.

శ్లో. మహేన్ద్రవంశా ననాదృత్య మహేన్త మభిలాషుకా,
స్వీచకార కథఙ్కార మహో సా తరలం నలమ్. 127

ప.వి. మహేన్ద్రవంశాన్-అనాదృత్య-మహేన్తం-అభిలాషుకా-స్వీచకార-కథఙ్కారం-అహో !-సా-తరలం-నలం.

అర్థము : మహేన్తం=శ్రేష్ఠుడైన వరుని, అభిలాషుకా=కోరుచున్న, సా= ఆ దమయన్తి, మహేన్ద్రవంశాన్ =గొప్ప వంశమును, సర్వలోకముల చేతను

వరింపదగిన కశ్యప ప్రజాపతి పుత్రులగు మిమ్ములను, అనాదృత్య=గణింపక, తరలం=చపలుడైన, నలం=నలుడను రాజును (నలమను గడ్డిపోచను), కథఙ్కారం=ఎట్లు, స్వీచకార=స్వీకరించినది, అహో! =ఆశ్చర్యము. గొప్ప నదీ ప్రవాహమున వంశమనగా వెదురనెడి పట్టుగట్టను వదిలి నలమనెడి గడ్డిపోచను పట్టుకొనుట ఎంత నవ్వుబాటో అట్లే నలుని వరించుటయు నవ్వుబాటైనదని యర్థము.

సమాసములు :

మహావంశాన్-మహాన్ వంశః యేషాం తే = మహావంశాః, తాన్= మహావంశాన్, లేదా మహాన్తశ్చ తే వంశాశ్చ=మహావంశాః, తాన్= మహావంశాన్.

భావము :

గొప్పవరుని యభిలషించుచున్న యా దమయన్తి సర్వలోకములయందును శ్రేష్ఠులైన కశ్యపప్రజాపతి పుత్రులైన మిమ్ములను (గొప్ప వెదుళ్ళను) నిరాకరించి చపలుడైన నలుని (నలమను గడ్డిపోచను) ఎట్లు వరించెను? ఆశ్చర్యము. ప్రబలమైన నదీ ప్రవాహ వేగముచే కొనిపోబడుచున్నవానికి వెదురనెడి పట్టుగట్టను వీడి గడ్డిపోచను పట్టుగా చేసుకొనుట ఎంత నవ్వుబాటో అట్లే దమయన్తికి మహావంశమున బుట్టినవారని వదిలి నలునివంటి వానిని వరించుటయు నంత నవ్వుబాటైన దనియు యాశయము.

శ్లో. భవాదృశైర్దిశామీశైర్మృగ్యమాణాం మృగేక్షణాం,
స్వీకుర్వాణః కథం సోఢః కృతరీధస్తృణం నలః. 128

ప.వి. భవాదృశైః-దిశామ్-ఈశైః-మృగ్యమాణాం-మృగేక్షణాం-స్వీకుర్వాణః -కథం-సోఢః-కృతరీధః-తృణం-నలః.

అర్థము: భవాదృశైః=మీవంటి, దిశాం ఈశైః=దిక్పాలురచే, మృగ్యమాణాం= అన్వేషింపబడుచున్న, మృగేక్షణాం=జింక కన్నులవంటి కన్నులు కలి

గిన దమయన్తిని, స్వీకుర్వాణః=స్వీకరించుచున్న (కావుననే), కృత రీఢః=మీవంటి వారికి చేయబడిన అవమానము గలిగిన, తృణం= గడ్డిపోచకు సమానుడైన, నలః=నలుడు, కథం = ఎట్లు, సోఢః= ఓర్వబడినాడు? గొప్పవాడు అవమానము సహింపరాదు.

సమాసములు:

మృగేక్షణాం-మృగస్య ఈక్షణే ఇవ ఈక్షణే యస్యాః సా=మృగేక్షణా, తాం=మృగేక్షణాం.

కృతరీఢః-కృతా రీఢా యేన సః=కృతరీఢః.

భావము:

మీ వంటి దిక్పాలురు కోరుచున్నట్టి యాలేడిగంటియగు దమయన్తిని స్వీకరించుచు మీ కవమానము గావించిన గడ్డిపోచతో సమానుడైన యానలుడు ఏ విధముగా మీచే సహింపబడెను? గొప్పవారు అవమానమును సహింపరాదు.

శ్లో. దారుణః కూట మాశ్రిత్య శిఖీ సాక్షీ భవన్నపి,
నావహాత్ కిం తదుద్వాహే కూటసాక్షిక్రియా మయమ్. 129

ప.వి. దారుణః-కూటం-ఆశ్రిత్య-శిఖీ-సాక్షీభవన్ - అపి - న - అవహాత్-కిం - తదుద్వాహే-కూటసాక్షిక్రియాం-అయమ్.

అర్థము: అయం=ఈ యెదుటనున్న, శిఖీ=అగ్ని, దారుణః=కట్టెయొక్క, కూటం = సమూహమును, ఆశ్రిత్య = ఆశ్రయించి (పక్షాంతరమున) దారుణః = పాపకార్యమును చేయుటవలన క్రూరకృత్యములు గల్గిన పురుషుడు, కూటం=కపటమును, (ఆశ్రిత్య=పొంది,) సాక్షీభవన్నపి= ప్రత్యక్షముగా చూచినవాడైనను, అనగా నగ్నిసాక్షికమగు వివాహము నందును వ్యవహారమునందును సాక్షియగుచున్నను, తదుద్వాహే, తత్= ఆ దమయన్తీనలుల యొక్క, ఉద్వాహే=వివాహమునందు, కూటసాక్షి

క్రియాం=అసత్యపుసాక్షియొక్క, క్రియాం=కార్యమును, అనగా నలుడు దమయంతిని పెండ్లియాడలేదు. మఱియొకడు పెండ్లియాడెను అని యసత్య కథనమును, కిం= ఏల, నావహత్=వహించలేదు. అగ్ని యావిధముగా నసత్య సాక్షిత్వమును వహించినచో, మీకు దమయన్తి లభింపగలదు. అసత్యసాక్షి ఒకరివస్తువును మరియొకరి కిప్పించగల డని యర్థము.

సమాసములు:

సాక్షీభవన్- అసాక్షీ సాక్షీ సమ్పద్యమానః భవన్ = సాక్షీభవన్. తదుద్వాహే-తయోః ఉద్వాహః=తదుద్వాహః తస్మిన్=తదుద్వాహే. కూటసాక్షిక్రియాం-కూటశ్చాసౌ సాక్షీ చ=కూటసాక్షీ, కూటసాక్షిణః క్రియా=కూటసాక్షిక్రియా, తాం=కూటసాక్షిక్రియాం.

భావము:

ఈయెదుటనున్న యగ్ని కట్టెలరాశి నాశ్రయించి వివాహమున జ్వలించుచు సాక్షి యగును. అట్లే క్రూరకృత్యములు గలవాడై కపటము నాశ్రయించి సాక్షియగును. ఇట్లు అగ్నిసాక్షికమైన వివాహమందును, వ్యవహారమందును సాక్షియైనను, ఆ దమయన్తీనలుల వివాహమందు అసత్యపుసాక్షియొక్క క్రియను అనగా నలుడు దమయంతిని పరిణయ మాడలేదు. మరియొకడే యామెను పరిణయమాడెను అని ఎందుకు చెప్పలేదు? అగ్ని ఈ విధముగా నసత్య సాక్ష్యమును చెప్పినచో మీకు దమయన్తి లభ్యము కాగలదు. ఏలయనగా కూటసాక్షి ఒరుల సొమ్మును మరియొకరి సొమ్మునుగా జేయగలడు కాన దమయన్తిని మీకు లభింపజేయగలడు.

శ్లో. అహో మహస్పృహాయానాం సమ్భూతా భవతామపి,
క్షమైవాస్మై కలజ్ఞాయ దేవస్యేవాఽమృతద్యుతేః 130

ప.వి. అహో - మహస్పృహాయానాం-సమ్భూతా - భవతామ్-అపి-క్షమా-ఏవ-అస్మై-కలజ్ఞాయ-దేవస్య-ఇవ-అమృతద్యుతేః.

అర్థము: హే దేవాః = ఓ దేవతలారా ! మహస్సహాయానామపి = తేజస్సుతో గూడినవారైనను, భవతాం = మీకు, అమృతద్యుతేః = అమృతకిరణు డైన, దేవస్య ఇవ = చంద్రునకువలె, క్షమైవ = ఓర్పే, పక్షాన్తరమున, క్షమైవ = భూమియే, అస్మై = ఈ, కలఙ్కాయ = అపయశస్సునకై అనగా నింద్రాదిదేవత లున్నను దమయన్తి నలునే వరించిన దను నపయశమునకై, పక్షాంతరమున, కలఙ్కాయ = నల్లని వన్నెగల గుర్తునకై, సమ్భూతా = ఏర్పడినది, అహో = కష్టము, చంద్రుని యందలి నలుపు వన్నె భూమియొక్క నీడయని కొందరు చెప్పుదురు.

సమాసములు:

మహస్సహాయానాం - మహః సహాయః యేషాం తే = మహస్సహాయాః, తేషాం = మహస్సహాయానాం.

భావము:

ఓ దేవతలారా ! మీరెంత తేజోవంతులైనను నమృతకిరణుడైన చంద్రునకు క్షమ (భూమి) ఎట్లు కళంకమైనదో అట్లే మీయందలి క్షమ (ఓర్పు) మీ యపయశమునకు కారణమైనది. అనగా చంద్రునియందలి నలుపు వన్నె భూమియొక్క నీడయని యందురు. కావున చంద్రునియందు క్షమ (భూమి) యతనికి కళంకమైనది. అట్లే మీయందలి క్షమ యనగా ఓర్పు మీయొక్క యపయశస్సునకు కారణమైనది. తేజోవంతులైన మీరు ఓర్పు వహించుటవలననే దమయంతి మిమ్ములను లెక్కింపక నలుని వరించినది. ఓర్పు గుణమేయైనను నొక సమయమందు నోర్పును చూపించినచో స్త్రీలు సైతము లెక్కింపరని యాశయము.

శ్లో. సా వవ్రే యం సముత్సృజ్య మహ్యా మీర్ష్యాజుషః స్థ కిమ్,
బ్రూతాఽఽగస్సద్మన స్తస్మా చ్ఛద్మనాఽద్యాఽఽచ్ఛినద్మి తామ్.

ప. వి. సా-వవ్రే-యం-సముత్సృజ్య-మహ్యాం-ఈర్ష్యాజుషః-స్థ-కిం - బ్రూత-ఆగస్సద్మనః-తస్మాత్-ఛద్మనా-అద్య-ఆచ్ఛినద్మి-తామ్.

అర్థము: హే దేవాః!＝ఓ దేవతలారా! సా＝ఆ దమయన్తి, యం-ఏ నలుని, వవ్రే＝భర్తగా వరించెనో, తం＝ఆ యపరాధియగు నలుని, ఉత్సృజ్య＝వదిలి, కిం＝ఏల, మహ్యం＝నన్నుగూర్చి, ఈర్ష్యాజుషః స్థ＝అసూయను వహించినవారుగా ఉన్నారు? బ్రూత＝చెప్పుడు. (అస్తు తావత్＝ఇది యట్లుండుగాత) ఆగస్సద్మనః, ఆగః＝నేరమునకు, సద్మనః＝స్థానమైన, తస్మాత్＝ఆ నలునినుండి, అద్య＝ఈ దినమే, తాం＝ఆ దమయంతిని, ఛద్మనా＝కపటముతో, ఆచ్ఛినద్మి＝అపహరింతును.

సమాసములు :

ఈర్ష్యాజుషః - ఈర్ష్యాం జుషన్తీతి＝ఈర్ష్యాజుషః.
ఆగస్సద్మనః-ఆగసః సద్మ＝ఆగస్సద్మ, తస్మాత్＝ఆగస్సద్మనః.

భావము :

ఓ దేవతలారా! ఆ దమయన్తిచే వరింపబడిన నలుని వదలి నాయెడ మీరేల యసూయ వహించెదరు? చెప్పుడు? ఇది యుండుగాత. అపరాధము గావించిన యా నలునినుండి యా దమయన్తిని ఈ దినమే నేను కొనితెత్తును.

శ్లో. యతధ్వం సహకర్తుం మాం పాంచాలీ పాణ్డవైరివ,
సాఽపి పంచభి రస్మాభిః సంవిభజ్యైవ భుజ్యతామ్. 132

ప. వి. యతధ్వం-సహకర్తుం - మాం-పాంచాలీ - పాండవైః - ఇవ-సా - అపి-పంచభిః-అస్మాభిః-సంవిభజ్య-ఏవ-భుజ్యతామ్.

అర్థము: (తతశ్చ＝కపటముతో దమయన్తిని గొనితెచ్చిన తరువాత) పాంచాలీ＝ద్రౌపది, పాండవైరివ＝ధర్మరాజాదులగు నైదుగురిచేత నెట్లో యట్లు, సాఽపి＝ఆ దమయన్తియు, పంచభిః＝అయిదుగురైన, అస్మాభిః＝మనచే, సంవిభజ్య＝పంచుకొనఁబడి, అనగా వేఱువేఱు సముదాయము లేర్పఱచుకొని, భుజ్యతామ్＝అనుభవింపఁబడుగాత (అతః＝ఇందువలన) మాం＝నన్ను, సహకర్తుం ＝ దమయన్తిని గొనితెచ్చుటలో సహకార మొనర్చుటకు, యతధ్వం＝ప్రయత్నింపుడు. దమయన్తిని గొనితెచ్చుటకు నాకు ననుమతి యొసంగు డని యర్థము.

భావము :

నేను ఆ విధముగా దమయన్తిని గపటముతో గొనితెచ్చిన పిదప, పాండవు లైదుగురును ద్రౌపదిని బంచుకొని యనుభవించిన విధముగా మన మా దమయన్తిని బంచుకొని వేర్వేరు సమయముల నేర్పఱచుకొని యనుభవింతము. కాన మీరా దమయన్తిని గొనితెచ్చు విషయమున సహకార మొసంగుచు నా కనుమతి యొసంగుడని యాశయము.

శ్లో. అథాపరివృఢా సోఢుం మూర్ఖతాం ముఖరస్య తాం,
చక్రే గిరా శరాఘాతం భారతీ సారతీవ్రయా. 133

ప. వి. అథ-అపరివృఢా-సోఢుం-మూర్ఖతాం- ముఖరస్య- తాం- చక్రే- గిరా-శరాఘాతం-భారతీ-సారతీవ్రయా.

అర్థము: అథ=ఆ కలిపురుషుడు వదరినపిదప, భారతీ=సరస్వతి, ముఖరస్య=అప్రియమును వాగుచున్న, కలేః = కలిపురుషునియొక్క, తాం=ఆటువంటి, మూర్ఖతాం = మౌఢ్యమును, సోఢుం = సహించుటకు, అపరివృఢా=అసమర్థమైనదగుచు, సారతీవ్రయా, సార=న్యాయము చేతను, సత్యముచేతను, తీవ్రయా=తీవ్రమైన లేదా, సార =గొప్ప యర్థమును ప్రతిపాదించుటచే శ్లేష్మమైనదియు, తీవ్రయా=కఠినముగా నుండుటవలన సహింప సాధ్యముకానిదియునగు, గిరా=మాటచేతనే, శరాఘాతం=బాణముయొక్క దెబ్బను, చక్రే=చేసినది. అనగా వాగ్బాణముచే నా కలిపురుషని గొట్టినదని యర్థము.

సమాసములు :

అపరివృఢా-న పరివృఢా=అపరివృఢా.

మూర్ఖతాం-మూర్ఖస్య భావః=మూర్ఖతా, తాం=మూర్ఖతాం.

శరాఘాతం-శరస్య ఆఘాతం=శరాఘాతః, తం=శరాఘాతం.

సారతీవ్రయా-సారేణ తీవ్రా=సారతీవ్రా, తయా=సారతీవ్రయా.

భావము :

కలి ప్రసంగించిన పిదప సరస్వతీదేవి యప్రియముగా వదరుచున్న కలియొక్క యా మౌఢ్యమును సహింపనేరనిదై న్యాయసత్యములచే తీవ్రమైన వాగ్బాణముచే నా కలిపురుషుని గొట్టినది. అనగా నతనికి న్యాయ సత్యములతో తీక్షణమైన వెలుగునట్టి మాటలతో నుత్తరమిచ్చినదని భావము.

శ్లో. కీర్తిం భైమీం వరాం శ్చాస్మై దాతు మేవాగమ న్నమీ,
న లీఢే ధీరవైదగ్ధీం ధీరగమ్భీరగాహినీ. 134

ప. వి. కీర్తిం-భైమీం-వరాన్-చ-అస్మై-దాతుం-ఏవ-అగమన్-అమీ-న-లీఢే-ధీరవైదగ్ధీం-ధీః-అగమ్భీరగాహినీ.

అర్థము: హేశఠ=ఓయీ దుష్టా! అమీ=ఈ వేల్పులు, అస్మై=ఈ నలునికై, కీర్తిం=పవిత్రమైన కీర్తిరూపమున వెలసిన, భైమీం=దమయన్తిని, తథా=అట్లే, వరాంశ్చ=వరములను, దాతుమేవ = ఇచ్చుటకొఱకే, అగమన్ = స్వయంవరసభనుగూర్చి వెళ్ళిరి. కాని తాము పరిణయ మాడుటకు వెళ్ళలేదు. తథా హి=అది యుక్తమే, ఎట్లనగా, అగమ్భీరగాహినీ=లోతును తాకక పైపైవిషయములనే యంటెడి, యనగా గూఢార్థములను గ్రహింపజాలని, ధీః=బుద్ధి, అనగా నీవంటివారియొక్క బుద్ధి, ధీరవైదగ్ధీం, ధీర = బుద్ధిమంతులయొక్క, వైదగ్ధీం=నేర్పును, న లీఢే=అంటదుగదా!

సమాసములు :

ధీరవైదగ్ధీం - విదగ్ధస్య భావః=వైదగ్ధీ, ధీరాణాం వైదగ్ధీ = ధీర వైదగ్ధీ, తాం=ధీరవైదగ్ధీం.

అగమ్భీరగాహినీ-గమ్భీరం గాహత ఇతి=గమ్భీరగాహినీ, న గమ్భీర గాహినీ=అగమ్భీరగాహినీ,

భావము :

ఓయి దుష్టాత్మా ! ఇంద్రాదిదేవతలు సచ్చరిత్రముగలిగి కీర్తిస్వరూపిణియై వెలుగొందిన దమయంతిని కోరినవరములను నలున కొసంగుటకొఱకే స్వయంవరభూమికి వెళ్ళిరి కాని దమయంతిని వరించుకొఱకు కాదు. లోతైన విషయమువంకకు జొరలేని మీవంటివారియొక్క బుద్ధి బుద్ధిమంతుల చాతుర్యము నెట్లు స్పృశింపగలదు? కాన నీవిషయమును గ్రహింపజాలని మందబుద్ధివి నీవు.

శ్లో. వాగ్మినీం జడజిహ్వాస్తాం ప్రతివక్తు మశక్తిమాన్,
లీలావహేలతాం కృత్వా దేవానేవావదత్ కలిః. 135

ప. వి. వాగ్మినీం-జడజిహ్వః- తాం-ప్రతివక్తుం-అశక్తిమాన్-లీలావహేలతాం-కృత్వా-దేవాన్-ఏవ-అవదత్-కలిః.

అర్థము:- జడజిహ్వః, జడ = ప్రాగల్భ్యములేని, జిహ్వః=వాక్కుగలిగిన, కలిః=కలిపురుషుడు, వాగ్మినీం=ప్రగల్భవచనములు గలిగిన, తాం= ఆ భారతి నుద్దేశించి, ప్రతివక్తుం=సమాధాన మొసంగుటకు, అశక్తిమాన్=శక్తిలేనివాడై, లీలావహేలతాం, లీలా = అనాయాసముగా, అవహేలితాం=అవహేలన నొందింపబడిన దానినిగా, కృత్వా=చేసి, దేవానేవ=దేవతల నుద్దేశించియే, అవదత్=పలికెను.

సమాసములు :

*వాగ్మినీం* - వాక్ అస్యాః అస్తీతి=వాగ్మినీ, తాం=వాగ్మినీం.
*జడజిహ్వః* - జడా జిహ్వా యస్య సః=జడజిహ్వః.
*లీలావహేలితాం* - లీలయా అవహేలితా = లీలావహేలితా, తాం= లీలావహేలితాం.

భావము :

మాటలలో నేర్పు లేనందువలన నాసరస్వతీదేవికి ప్రతివచన మీయజాలనియాకలిపురుషుడు, ఆమెను విలాసముతో నుపేక్షించినవాడై దేవతలతోడనే మాట్లాడెను.

శ్లో. ప్రోజ్ఝి వాఞ్ఛిత మస్మాభిరపి తాం ప్రతి సమ్ప్రతి,
తస్మిన్ నలే న లేశోఽపి కారుణ్య స్యాస్తి నః పునః. 136

ప. వి. ప్రోజ్ఝి-వాఞ్ఛితం-అస్మాభిః-అపి-తాం-ప్రతి-సమ్ప్రతి-తస్మిన్-నలే-న-లేశః-అపి-కారుణ్యస్య-అస్తి-నః-పునః.

అర్థము:- సంప్రతి=ఇపుడు, అస్మాభిరపి=మాచేతను, తాం ప్రతి=ఆ దమయన్తినిగూర్చి, వాఞ్ఛితం=కోరిక, ప్రోజ్ఝి=తుడిచి వేయబడినది. పునః=కాని, తస్మిన్=అటువంటి దుష్కార్యము చేసినటువంటి, నలే=నలునియందు, నః=మాకు, కారుణ్యస్య=కనికరముయొక్క, లేశోఽపి=కొంచెముకూడా, నాస్తి=లేదు.

భావము :

ప్రకృతము మేముకూడా దమయన్తిపైని కోరికను మానుకొంటిమి. కాని దమయన్తివంటి దివ్యసుందరిని సామాన్యుడైన తాను పరిణయమాడుట యను దుష్కార్యమును జేసిన యానలునిపైన మాకు లేశమైన కనికరములేదు.

శ్లో. వృత్తే కర్మణి కుర్మః కిం తదా నాఽభూమ తత్ర యత్,
కాలోచిత మిదానీం నః శృణు తాలోచితం సురాః. 137

ప. వి. వృత్తే-కర్మణి-కుర్మః-కిం-తదా-న-అభూమ-తత్ర-యత్-కాలోచితం-ఇదానీం-నః-శృణుత-ఆలోచితం-సురాః.

అర్థము:- హే సురాః!=ఓ దేవతలారా! వృత్తే=గడిచిపోయిన, కర్మణి=దమయన్తీవరణమను కార్యమందు, కిం కుర్మః = ఏమి చేయుదుము. అనగా నేమియును చేయజాలము. యత్=ఏలయనగా, తదా=ఆ కాలమునందు, తత్ర = ఆ స్వయంవరమందు, నాభూమ=ఉండకపోతిమి, భవతు=అది యట్లుండుగాత, ఇదానీం=ఇపుడు, నః=మనకు, కాలోచితం = దమయన్తి నలుని వరించినను, ఈ సమయమునకు తగినట్టి విచారమును, శృణుత=వినుడు.

సమాసములు :

కాలోచితం - కాలస్య ఉచితం=కాలోచితం, తత్=కాలోచితం.

భావము :

ఓ దేవతలారా! జరిగిపోయిన దమయన్తియొక్క స్వయంవరణక్రియ విషయమున నేమి చేయుదుము? అనగా నేమియు చేయలేము. ఏలయనగా, నా స్వయంవరకాలమందు మేము లేము. కాని ఇపుడు మనకు ఈ సమయమునకు దగిన కర్తవ్యమేమిటో దానినిగురించి విచారింతము. వినుడు.

శ్లో. ప్రతిజ్ఞేయం నలే విజ్ఞాః కలే ర్విజ్ఞాయతాం మమ,
తేన భైమీం చ భూమిం చ త్యాజయామి జయామి తమ్. 138

ప. వి. ప్రతిజ్ఞా-ఇయం-నలే- విజ్ఞాః-కలేః-విజ్ఞాయతాం-మమ-తేన-భైమీం-చ-భూమిం-చ-త్యాజయామి-జయామి-తమ్.

అర్థము : హే విజ్ఞాః!=ఓ విజ్ఞానవంతులగు సురులారా! నలే=నలుని విషయమునందు, కలేః=కలియుగాధిదేవతయగు, మమ=నాయొక్క, ఇయం=ఈ, ప్రతిజ్ఞా=ప్రతిజ్ఞ, విజ్ఞాయతాం=తెలియబడునుగాత, (అదేమనగా) తేన=ఆ నలునిచేత, భైమీం చ=దమయన్తిని, భూమిం చ=భూలోకరాజ్యమును, త్యాజయామి = వదిలింపగలను. తం = ఆ నలుని, జయామి=జయింతును. అనగా నాయధీనము గావించుకొనెదను.

భావము :

ఓ దేవతలారా! నలుని విషయమున కలియుగాధి దేవతయగునా ప్రతిజ్ఞను వినుడు. ఆదేమనగా, నేను ఆ నలునిచే దమయన్తిని విడిపింపచేతును. అట్లే అతని రాజ్యమును వదలింపచేయగలను. తర్వాత నాతని జయించి నా యధీనమునందు వాని నుంచుకొనగలను.

శ్లో. నైషధేన విరోధం మే చండతామండితౌజసః,
జగన్తి హన్త గాయన్తు రవేః కైరవవైరవత్. 139

ప.వి. నైషధేన - విరోధం - మే - చండతామండితౌజసః - జగన్తి - హన్త-
గాయన్తు-రవేః- కైరవవైరవత్.

అర్థము : చండతామణ్డితౌజసః, చండతా=క్రూరత్వముచే, మణ్డిత=భూషిత
మగు, ఓజసః=పరాక్రమము కలిగిన, మే=కలియైన నాకు, నైషధేన=
నలునితో, విరోధం=వైరమును, రవేః=సూర్యునకు, కైరవవైరవత్,
కైరవ=కలువలతోటి, వైరవత్=వైరమునువలె, జగన్తి=లోకములు
గాయన్తు=గానము చేయునుగాత. హన్త=సంతోషము.

సమాసములు :

నైషధేన—నిషధానాం రాజా=నైషధః, తేన=నైషధేన,
చణ్డతామణ్డితౌజసః—చండతయా మణ్డితం=చణ్డతామణ్డితం, చండతా
మండితం ఓజః యస్య సః=చణ్డతామణ్డితౌజాః. తస్య=చణ్డతామణ్డి
తౌజసః.
కైరవవైరవత్- కైరవైః వైరం=కైరవవైరం, కైరవవైరమివ=
కైరవవైరవత్.

భావము :

క్రూరభావముతో పురస్కరింపబడిన పరాక్రమముగల నాకు నలునితోటి
వైరమును సూర్యునకు కలువలతో వైరమునువలె లోకములు గానము చేయుగాత.
అదే నాకు సంతోషము.

శ్లో. ద్వాపరః సాధుకారేణ తద్వికార మదీదిపత్,
ప్రణీయ శ్రవణే పాణి మవోచ న్నముచే రిపుః. 140

ప.వి. ద్వాపరః - సాధుకారేణ – తద్వికారం- అదీదిపత్- ప్రణీయ - శ్రవణే-
పాణిం- అవోచత్- నముచేః- రిపుః.

అర్థము : ద్వాపరః=కలికి సహచరుడైన, మూడవ యుగమున కధిదైవమైన ద్వాపరుడు, సాధుకారేణ = "సాధు" అను శబ్దము నుచ్చరించుటచే, అనగా "చక్కగ నున్నది" "శభాష్" అని చెప్పుటచే, తద్వికారం= ఆ కలి యొక్క వాగుడును, అదీదిపత్=వర్ధిల్లజేసెను, అథ=పిదప, నముచేః=నముచియను రక్కసునకు, రిపుః=శత్రువైన ఇంద్రుడు, శ్రవణే=చెవియందు, పాణిం=హస్తమును, ప్రణీయ=పొందించి, యనగా చెవులను మూసికొని, అవోచత్=పలికెను,

సమాసములు :

సాధుకారేణ- సాధోః కారః=సాధుకారః, తేన=సాధుకారేణ.

భావము :

కలిపురుషుని ప్రలాపములను విని ద్వాపరయుగపురుషుడు "లెస్స" "లెస్స" యని మెచ్చుచుండగా నాకలి పురుషునకు నింకను నుత్సాహము పెరిగి ఇంకను వాగుడు పెరుగజొచ్చెను. ఆ సమయమున నింద్రుడు ఆ కఠిన సంభాషణమును వినలేక చెవులను మూసుకొనెను.

శ్లో. విస్మేయమతి రస్మాసు సాధు వైలక్ష్య మీక్షసే
యద్దత్తేఽల్ప మనల్పాయ తద్దత్తే హ్రియ మాత్మనః. 141

ప.వి. విస్మేయమతిః-అస్మాసు-సాధు-వైలక్ష్యం-ఈక్షసే-యత్-దత్తే-అల్పం-అనల్పాయ- తత్- దత్తే- హ్రియం– ఆత్మనః.

అర్థము : (హే కలే!=ఓయీ కలీ!) విస్మేయమతిః, విస్మేయ=ఆశ్చర్యమును బొందదగిన,మతిః=బుద్ధిగల్గిన నీవు,అస్మాసు=మాయెడ,వైలక్ష్యం= సిగ్గును, ఈక్షసే=చూతువు. సాధు!=అది సరియైనదే. ఏలయనగా, అనల్పాయ=గొప్పవానికై, అల్పం=కొంచెమైన, యత్=దేనిని, దత్తే=ఇచ్చునో, తత్=అది, ఆత్మనః= ఆ దాన మొసంగిన తనకే, హ్రియం=సిగ్గును, దత్తే=కలిగించుచున్నది.

సమాసములు :

విస్మేయమతిః- విస్మేయా మతిః యస్య సః=విస్మేయమతిః
వైలక్ష్యం- విలక్షస్య భావః=వైలక్ష్యం.

భావము :

ఓ కలిపురుషా! నీ బుద్ధి యాశ్చర్యకరమైనది. నీవు "జగతో హ్రీస్తు యుష్మాభిః" అని మాచే ప్రపంచమునకు సిగ్గు కలుగుచున్నదనిన సంగతి సరియైనదే! ఏలయనగా, గొప్పవానికి అల్పమును దానము చేసినచో అది యాదాతకే సిగ్గు కలిగించును. మేము గొప్పవాడగు నలునికి కీర్తిమున్నగు నల్పవస్తువులనే యిచ్చితిమి. కాన నది మాకు లజ్జాకరమే. కాన నితరుల మనోగతమును నీవు తెలిసికొనుట యాశ్చర్యకరమైనది. అనగా మాహృదయమందలి లజ్జను నీవు గ్రహించితివి కాన నీబుద్ధి యాశ్చర్యకరమైనదని యాశయము. లేదా తుచ్ఛులలో నతితుచ్ఛుడవైనందువలన గొప్పవాడవగు నీకు కస్కోఽయం ధర్మమర్మాణి కృన్తతి"ఇత్యాదిగా నొనరించిన నింద చాలా స్వల్పమైనది. దానికంటె నధికమైన నిందకు పాత్రుడవైన నీకు కొలదిపాటి నింద నొసంగినందులకు మేము సిగ్గుజెందుచున్నాము.

లేదా ! అతిహీనునకు దేనినైనను కొంచె మొసంగినచో నది దాతకు సిగ్గును కల్గించును. ప్రకృతము సంభాషణకును(దగని నీకు మేము నింద నొసంగినాము.కాని యట్లు చేయుట యయుక్తము. కాని యట్లు చేసి సిగ్గుపడుచున్నాము. దీనిని గ్రహించిన నీ తెలివిని చూచి యాశ్చర్య పడుచున్నాము' అని కాని యాశయము.

శ్లో. ఫలసీమాం చతుర్వర్గం యచ్ఛతాంశోఽపి యచ్ఛతి,
నలస్యాస్మదుపఘ్నా సా భక్తిర్భూతావకేశినీ. 142

ప. వి. ఫలసీమాం—చతుర్వర్గం—యచ్ఛతాశః— అపి—యచ్ఛతి—నలస్య—అస్మదుపఘ్నా—సా—భక్తిః-భూతా-అవకేశినీ.

అర్థము: యచ్ఛతాంశః అపి,యత్=ఏ భక్తియొక్క, శతాంశః అపి=నూఅవ భాగముకూడా, ఫలసీమాం=ఫల=చివరిఫలముయొక్క, సీమాం=

ఎల్లయైన, చతుర్వర్గం=ధర్మార్థకామ మోక్షములను నాల్గింటిని, యచ్ఛతి= నలుని-కీయఁదగినదో, అస్మత్=మమ్ములను, ఉపఘ్నా=ఆశ్రయము గావించుకొనిన అనగా మాయందు నెలకొనిన అనగా మమ్ములను విషయము గావించుకొనిన, నలస్య=నలునియొక్క, సా=ఆయతిశయించిన, భక్తిః=భక్తి, అవకేశినీ=నిష్ఫలమైనదిగా, భూతా=ఏర్పడినది.

సమాసములు :

ఫలసీమాం-ఫలస్య సీమా=ఫలసీమా, తాం=ఫలసీమాం.

యచ్ఛతాంశః- శతం అంశః = శతాంశః, యస్య శతాంశః = యచ్ఛతాంశః.

అస్మదుపఘ్నా- వయం ఉపఘ్నః యస్యాస్సా=అస్మదుపఘ్నా.

అవకేశినీ- అవక మీష్టే ఇతి=అవకేశినీ.

భావము :

నలునికి మాయెడ నున్న యత్యధికమగు భక్తిలోని నూరవభాగమునకే యతడు సకలఫలములకు చివరియెల్లయైన యనగా పరమఫలమైన ధర్మార్థకామ మోక్షము లనెడి చతుర్వర్గము నిచ్చుటకే అర్హుడు. కాని యాచతుర్వర్గమునకంటె నధికఫలము ప్రపంచమున లేనందువలన నతని నిస్సీమభక్తికి తగినదానిని మేమీయలేకపోయినందువలన నాతనికి నింద్రాదులగు మాయెడనున్న భక్తి వ్యర్థమై పోయినది. అతని ఘనమైన భక్తికి ధర్మార్థకామ మోక్షములను నాల్గింటి నిచ్చినను చాలదు. ఇక నాతనికి దమయన్తి నొసంగుట యెంత మాత్రము. కాన నాతని భక్తికి ఋణపడిన మాకు సిగ్గు తగినదని యాశయము.

శ్లో. భవ్యో న వ్యవసాయస్తే నలే సాధుమతౌ కలే !
లోకపాలవిశాలోఽసౌ నిషధానాం సుధాకరః. 143

ప. వి. భవ్యః-న-వ్యవసాయః-తే-నలే-సాధుమతౌ-కలే ! -లోకపాలవిశాలః—అసౌ-నిషధానాం-సుధాకరః,

అర్థము: హేకలే ! = ఓకలీ, సాధుమతౌ; సాధు = రాగద్వేషములు లేనందున పవిత్రమైన, మతౌ = హృదయము గల్గిన, నలే = నలుని విషయమున, తే = నీయొక్క, వ్యవసాయః = ప్రయత్నము, భవ్యః = యుక్తమైన దిగా, న = లేదు, నిషధానాం = నిషధదేశములకు, సుధాకరః = చన్ద్రుడైన అనగా నిషధదేశ ప్రజలకు చన్ద్రునివలె నాహ్లాదకరుడైన, అసౌ = ఈ నలుడు, లోకపాలవిశాలః; లోకపాల = దిక్పాలకులవలె, విశాలః = విశేషముగా ప్రకాశించునట్టివాడు, ఏలయనగా ! నతడు వారియంశముతో జన్మించినవాడు.

సమాసములు :

సాధుమతౌ-సాధ్వీ మతిః యస్య సః = సాధుమతిః, తస్మిన్ = సాధుమతౌ
లోకపాలవిశాలః—లోకాన్ పాలయ న్తీతి = లోకపాలాః, లోకపాలా ఇవ విశేషే శాలత ఇతి = లోకపాలవిశాలః

భావము :

ఓ కలీ ! రాగద్వేషములులేక పరిశుద్ధహృదయుడగు నలుని విషయమున నీ ప్రయత్నము యుక్తము కాదు. ఆ నలుడు నిషధదేశ ప్రజలను చన్ద్రునివలె నానన్దపరచువాడు. దిక్పాలురయంశమున నుద్భవించినందు వలన వారివలె విశేషముగా ప్రకాశించువాడు. అట్టివాని కపకరించుట తుదకు నీకు శ్రేయస్కరమైనది గాదు.

శ్లో. న పశ్యామః కలే స్తస్మి న్నవకాశం క్షమాభృతి,
నిచితాఖిలధర్మే చ ద్వాపరస్యోదయం వయమ్. 144

ప. వి. న-పశ్యామః-కలేః-తస్మిన్-అవకాశం-క్షమాభృతి-నిచితాఖిలధర్మే-చ-ద్వాపరస్య-ఉదయం-వయమ్.

అర్థము: (కించ = మఱియు) క్షమాభృతి = భూపాలుడును (ఓర్పునకు నెలవునైన) తస్మిన్ = ఆనలునియందు, కలేః = కలియుగపురుషునకును (కలహాము

నకును) అవకాశం=ఎడమును, వయం=మేము, నపశ్యామః=చూడము, ధర్మముతో భూమిని పాలించెడి క్షమాశీలుడగు రాజునకు కలిదోషముకాని కలహము కాని ఎక్కడిది? కించ=మరియు, నిచితాఖిలధర్మేచ,నిచిత= సంపాదింపబడిన, అఖిలధర్మే=సకలధర్మములుకలిగినయానలునియందు, ద్వాపరస్య=నీమిత్రుడైన మూడవయుగమునకును (సందేహమునకును) ఆక్రమించు నవకాశమును,ప్రకాశమును; వయం=మేము, న పశ్యామః= కోరము.

సమాసములు :

క్షమాభృతి - క్షమాం బిభర్తీతి=క్షమాభృత్, తస్మిన్=క్షమాభృతి.

నిచితాఖిలధర్మే-అఖిలాశ్చ తే ధర్మాశ్చ=అఖిలధర్మాః, నిచితాః అఖిల ధర్మాః యేన సః=నిచితాఖిలధర్మః, తస్మిన్=నిచితాఖిలధర్మే.

భావము :

భూమిని భరించుచు క్షమాశీలుడై మెలగు నలునివిషయమున కలియుగాధి పతికిని (కలహమునకును) తావును మేము వాంఛింపము. మరియు సమస్తపుణ్య కార్యములను గావించినవాడును నుపనిషదర్థములను వేదములోని గూఢార్థము లను చక్కగా నెఱింగినవాడును నగు నలునివిషయమున నీమిత్రుడైన ద్వాపర యుగాధిపతికిని సంశయమునకును నాక్రమణావకాశమును ప్రకాశమును మేము వాంఛింపము. అనగా క్షమాశీలుడైన నలునియందు కలహమున కవకాశములేదు. సకలధర్మరహస్యముల నెఱింగిన నలునియందు ధర్మసందేహము లుదయింపను నవకాశము లేదని యాశయము.

శ్లో. సా వినీతతమా భైమీ వ్యర్థాఽనర్థగ్రహై రహో!
కథం భవద్విధై ర్బాధ్యా ప్రమితి ర్విభ్రమై రివ. 145

ప. వి. సా-వినీతతమా- భైమీ- వ్యర్థానర్థగ్రహైః- అహో! కథం-భవద్విధైః- బాధ్యా-ప్రమితిః-విభ్రమైః-ఇవ.

అర్థము:- కించ=మఱియు, వినీతతమా=మిక్కిలి వినయవతియును, పక్షాంతరమున, వినీత=తొలగింపబడిన, తమా=అజ్ఞానముకలదియు, అనగా భ్రమను నిరాకరించునదియునగు, సా=ఆ, భైమీ=దమయన్తి, వ్యర్థానర్థగ్రహైః; వ్యర్థ=ఫలములేనట్టి, అనర్థగ్రహైః=వైరము నాచరించుటయను పనియందు బట్టుదల గలవియును, పక్షాన్తరమున, వ్యర్థ=ఫలములేనట్టి, అనర్థ=ముత్తెపుచిప్పయందు వెండిని విషయీకరించిన ప్రయోజనరహితమగు, గ్రహైః=జ్ఞానముగలిగిన, భవద్విధైః=మీవంటివారిచే, ప్రమితిః = యథార్థజ్ఞానము, విభ్రమైరివ=అయథార్థజ్ఞానములచేత నెట్లో యట్లు, కథం=ఎట్లు, బాధ్యా=పీడింపదగినది. పీడింప సాధ్యముకాదని యర్థము. అహో!=ఆశ్చర్యము. పాతివ్రత్యము వలని ప్రభావము తిరస్కరింప నశక్యమని యర్థము.

సమాసములు :

వినీతతమా - అతిశయేన వినీతా = వినీతతమా. (పక్షాంతరమున) వినీతం తమః యయా సా=వినీతతమా.

వ్యర్థానర్థగ్రహైః - వ్యర్థః అనర్థగ్రహః యేషాం తే = వ్యర్థానర్థగ్రహాః, తైః=వ్యర్థానర్థగ్రహైః. (పక్షాంతరమున) అనర్థస్య గ్రహః= అనర్థగ్రహః, వ్యర్థః అనర్థగ్రహః యేషాం తే=వ్యర్థానర్థగ్రహాః తైః= వ్యర్థానర్థగ్రహైః.

భావము :

మఱియు ఆదమయంతి మిక్కిలివినయము గలిగినది. కాన ప్రయోజనము లేని వైరాచరణమున బట్టుదల గలిగిన మీవంటివారిచే, అజ్ఞానమును నిరాకరించునదియును ముత్తెపుచిప్పయందు వెండి మున్నగు ప్రయోజన మెట్లు బాధింపబడదో అట్లే ఆమెయు బాధింపబడదు. ఆమె ప్రమితి యనగా యథార్థజ్ఞానముతో సమానము. మీరు అయథార్థజ్ఞానములతో సమానము. అనగా నామెయొక్క పాతివ్రత్యప్రభావము తిరస్కరింప సాధ్యముకాదు. కాన నిది యాశ్చర్యకరము.

శ్లో. తం నాసత్యయుగం తాం వా త్రేతా స్పర్ధితు మర్హతి,
ఏకప్రకాశధర్మాణం న కలిద్వాపరౌ యువామ్. 146

ప. వి. తం-నాసత్యయుగం- తాం- వా-త్రేతా- స్పర్ధితుం-అర్హతి- ఏకప్రకాశ ధర్మాణం-న-కలిద్వాపరౌ-యువామ్.

అర్థము:- హే కలిద్వాపరౌ=ఓకలియుగద్వాపరయుగాధిపతులారా, ఏకప్రకాశ ధర్మాణం, ఏక=కేవలము, ప్రకాశ=ప్రకాశించునట్టి, లేదా ప్రసిద్ధమై నట్టి, ధర్మాణం=ధర్మముగలిగిన, లేదా న్యాయవిచారముగలిగిన లేదా పుణ్యము గలిగిన, లేదా స్వభావము గలిగిన, తం = ఆనలుని, తాం వా=ఆ దమయన్తినికాని, నాసత్యయుగం, నాసత్య = అసత్యము కానట్టి యనగా సత్యమేయైనట్టి, యుగం = సత్యయుగము అనగా కృతయుగము, తథా=అట్లే, త్రేతా=త్రేతాయుగమును, స్పర్ధితుం= పోల్చుటకు, అర్హతి = తగినది, కాని జయించుటకు తగినదికాదు, యువాం=కలిద్వాపరములను మీరిద్దరు, తం=అనలుని, తాం వా= ఆదమయన్తిని కాని, స్పర్ధితుం=పోల్చుటకు, నార్హతః=తగినవారలు గారు. లేదా, అసత్యయుగం=కృతయుగముకంటెను అధర్మయుగమైన, త్రేతా=త్రేతాయుగము (అగ్నిత్రయము) స్పర్ధితుం = పోల్చుటకు, నార్హతి=తగదు.(నాసత్య=అశ్వనీకుమారులయొక్క, యుగం=జంట, తం=ఆనలుని,స్పర్ధితుం=సౌందర్యమును బోలుటకు,అర్హతి= తగునని యర్థము సూచితము)(సుతరాం = అన్నివిధముల, కలిద్వాపరౌ = కలి ద్వాపరములైన, యువాం=మీరు, స్పర్ధితుం=పోలుటకును, నార్హథః= తగరని యర్థము లేదా!అశ్వినీకుమారులజంటయు,గార్హపత్య ఆహవనీయ దక్షిణాగ్నులనెడి త్రేతాగ్నులు, ఏకప్రకాశధర్మాణం=ప్రసిద్ధమగు ప్రకాశశీలమగు శరీరసౌందర్యము లేదా తేజస్సు అనెడి గుణములుగల యానలునికాని,యాదమయన్తిని కాని,మిళితములై పోలునుకాని ప్రత్యే కముగా బోలలేవు.అనగా అశ్వినీకుమారు లిరువురును త్రేతాగ్ని లనబడు మూడగ్నులును కలిసినచో శరీరసౌందర్యము తేజస్సు అను ధర్మములతో అనగా గుణములతో గూడిన నలుని,దమయన్తిని బోలగలవని యర్థము. కాని యవి యేవియు వారిని జయింపలేవనియు నర్థము.కలిద్వాపరములైన

మీరిఉవురును అధిక పాపముతో గూడినవారుగాన, వారిని బోలుటకును అర్హులుకారని యర్థము.
లేదా, పురుషులైన కలిద్వాపరములు నలునితోడను, స్త్రీయైన త్రేత, దమయంతితోడను పోలజాలవు. లేదా విరుద్ధములును ననిశ్చితములును నగు ధర్మములున్నచోటనే కలహములు సందేహములు కలుగుచుండును. అట్టితావులయందే కలిద్వాపరములగు మీకు ప్రసక్తి. కాని నలదమయంతులు శాస్త్రానుగుణములగు నిశ్చితములగు ధర్మములచే గూడినవారుగాన నచ్చట కలిద్వాపరములగు మీయిఉవురి యావశ్యకత లేదుగాన వారితో మీరేవిధముగను బోలజాలరని గాని యర్థము.

సమాసములు :

నాసత్యయుగం-న సత్యం=అసత్యం, న అసత్యం=నాసత్యం,నాసత్యమితి యుగం=నాసత్యయుగం.
*ఏకప్రకాశధర్మాణం*-ఏకః ప్రకాశః యస్య సః=ఏకప్రకాశః, ఏకప్రకాశః ధర్మః యస్య సః, యస్యాః సా వా=ఏకప్రకాశధర్మా.తం వా తాం వా=ఏకప్రకాశధర్మాణం.
*కలిద్వాపరౌ*-కలిశ్చ ద్వాపరశ్చ=కలిద్వాపరౌ.

భావము :

ఆనలుని కాని, యా దమయంతిని కాని సత్యయుక్తమైన కృతయుగము, కొంత సత్యము తఱిగిన త్రేతాయుగము కొంత పోలఁదగినవి. ఏలయనగా, వారిరువురు కేవలము దేదీప్యమానమగు ధర్మము న్యాయవిచారము పుణ్యశీలము గలవారలు. కాని పాపపూర్ణములగు కలిద్వాపరములు వారిని పోలుటకును నర్హులు కారు. కృత త్రేతాయుగము లొకవేళ వారిని బోలినను వారిని జయింపలేవు. ఇక కలిద్వాపరముల విషయములు ప్రత్యేకముగా జెప్పనేల? ॥146॥

శ్లో. కరిష్యేఽవశ్య మిత్యుక్త్వా కరిష్యన్నపి దుష్యసి,
దృష్టాఽదృష్టా హి నాయత్తాః కార్యేయా హేతవ స్తవ. 147

ప వి. కరిష్యే-అవశ్యమ్-ఇతి-ఉక్త్వా-కరిష్యన్(అకరిష్యన్)-అపి - దుష్యసి-దృష్టాదృష్టాః-హి-వా-న-ఆయత్తాః-కార్యేయాః- హేతవః-తవ.

అర్థము: హే కలే! = ఓకలీ! అవశ్యం = నిశ్చితముగా, కరిష్యే = చేయబోవుచున్నాను, ఇత్యుక్త్వా = ఇట్లుచెప్పి, కరిష్యన్నపి = చేయగోరినను, లేదా అకరిష్యన్నపి = చేయకపోయినను, దుష్యసి = దుష్టుడవయ్యెదవు. ఇక చేసినచో నెంత దుష్టత్వ మేర్పడునో! హి = ఏలయనగా, కార్యేయాః = కార్యోత్పత్తికితగిన, హేతవః = కారణములైన, దృష్టాఽదృష్టాః, దృష్ట = కంటితో చూడబడిన దండాదులు, అదృష్టాః = కంటితో చూడబడనికాలము కర్మ ఈశ్వరేచ్ఛ మున్నగునవి, తవ = నీకు, న ఆయత్తాః = స్వాధీనములు కావు అనగా నాయాకార్యములను బుట్టింపజేసెడి కారణసామగ్రి కాలము వలనకాని, యదృష్టమువలనకాని, స్వయముగాకాని, యేర్పడును. వానిని నీవు ఏర్పఱుచలేవు. కాన నిశ్చితముగా చేయగలనని ప్రతిజ్ఞచేసి పాప కార్యమును జేయకపోయినను, మనసున దానిని జింతించుటచేతను నోట దానిని పలుకుటచేతను మీవంటివారికి పాపమేర్పడును.

సమాసములు :

దృష్టాఽదృష్టాః-దృష్టాశ్చ అదృష్టాశ్చ = దృష్టాఽదృష్టాః.
కార్యేయాః-కార్యస్య ఇమే = కార్యేయాః

భావము :

ఓకలీ! నిశ్చితముగా పాపకార్యమును చేయుదునని ప్రతిజ్ఞ గావించి చేయ గోరినను దోష మేర్పడుచున్నది. ఇక చేసినచో నెంతదోష మేర్పడుచున్నది. ఇక చేసినచో నెంతదోష మేర్పడునో చెప్పనేల? లేదా అట్లు ప్రతిజ్ఞచేసి చేయక పోయినను దోష మేర్పడుచున్నది. ఇక చేసినచో నెంత దోష మేర్పడునో చెప్పనవసరమే లేదు. లోకమున నొక కార్య మేర్పడుటకు సాధన సామగ్రులలో కొన్ని దృష్టములై యుండును. అనగా కంటితో చూడబడియుండును. అనగా ఘటా దులకు సంబంధించిన కారణసామగ్రిలో దండము మృత్తు మున్నగునవి దృష్టములు. ఇక కాలము కర్మ ఈశ్వరేచ్ఛ మున్నగుకారణములు, అదృష్టములై

యుండును. అవి యేవియు నీవశమునం దుండవు. ఆ, దృష్టకారణములు కాని యదృష్టకారణములు కాని కాలవశముచే కాని యదృష్టవశముచే కాని లేదా స్వయముగా కాని యేర్పడును. వానిని నీ వేర్పరుపజాలవు. కాని చేయగలనని ప్రతిజ్ఞ కావించి పాపమును జేయకపోయినను నాపాపచింతనముచేత మనస్సు, వాక్కు దూషితములై, నిన్ను పాతకునిగా జేసినవని యాశయము. ॥147॥

శ్లో. ద్రోహం మోహేన య స్తస్మి న్నాచరే దచిరేణ సః,
తత్పాపసంభవం తాప మాప్నుయా దనయా త్తతః. 148

ప.వి. ద్రోహం-మోహేన-యః - తస్మిన్ - ఆచరేత్-అచిరేణ - సః-తత్పాపసంభవం-తాపమ్-ఆప్నుయాత్-అనయాత్-తతః.

అర్థము : కించ=మఱియు, యః = ఎవ్వడు, మోహేన = అజ్ఞానముచే, తస్మిన్=ఆనలునివిషయమున, ద్రోహం= అపకారమును, ఆచరేత్= ఆచరించునో, సః=అతడు, అచిరేణ=శీఘ్రముగనే, తతః=ఆ, అనయాత్=అవినీతివలన, తత్పాపసంభవం, తత్పాప=ఆ నలద్రోహమనెడి పాపముచే, సంభవం=పుట్టిన, తాపం=తీవ్రబాధను, ఆప్నుయాత్=పొందును.

సమాసములు !

తత్పాపసంభవం - తస్య పాపం = తత్పాపం, తత్పాపేన సంభవః యస్య సః=తత్పాపసంభవః, తం=తత్పాపసంభవం.

అనయాత్ - న నయః=అనయః, తస్మాత్=అనయాత్.

భావము :

మఱియు నజ్ఞానముచే నలుని విషయమున నపకారము నెవ్వడు చేయునో అతడు శీఘ్రముగనే యీ యవినీతివలన ఆనలద్రోహ మనెడి పాపముచే సంభవించు తీవ్రబాధనుఁ బొందగలడు. ॥148॥

శ్లో. యుగశేష! తవ ద్వేష స్తస్మిన్నేష న సామ్ప్రతం,
భవితా న హితాయైత ద్వైరం తే వైరసేనినా. 149

ప. వి. యుగశేష-తవ-ద్వేషః - తస్మిన్ - ఏషః - న-సాంప్రతం-భవితా-న - హితాయ-ఏతత్-వైరం-తే-వైరసేనినా.

అర్థము : హే యుగశేష=కృతాదియుగములలో శేషించిన కడపటి యుగమున కధిపతివైన ఓకలీ! తస్మిన్=ఆనలునియందు, తవ=నీకు, ఏషః= ఈ, ద్వేషః=వైరము, న సాంప్రతం=యుక్తము కాదు. వైరసేనినా =వీరసేనుని కుమారుడగు నలునితో, ఏతత్ = ఈ, వైరం= విరోధము, తే=నీకు, హితాయ=మేలునకై, న భవితా=కాబోదు.

సమాసములు :

యుగశేష - యుగేషు శేషః = యుగశేషః, తస్య సంబుద్ధిః = హేయుగశేష.

వైరసేనినా - వీరసేనస్య అపత్యం పుమాన్ = వైరసేనిః, తేన= వైరసేనినా.

భావము :

కృతాదినాలుగుయుగములలో శేషించిన యో కలీ! ఆనలునియందు నీకీ ద్వేషము తగదు. వీరసేనమహారాజు పుత్రుడైన నలునితోటి వైరము నీకు మేలును కలిగించదు. ॥149॥

శ్లో. తత్ర యామీ త్యసజ్జ్ఞానం రాజసంపరిహార్యతాం,
ఇతి తత్ర గతో మాగా రాజసంసది హాస్యతామ్. 150

ప. వి. తత్ర-యామి-ఇతి-అసజ్జ్ఞానం-రాజసం-పరిహార్యతాం-ఇతి-తత్ర-గతః-మాగాః-రాజసంసది-హాస్యతామ్.

అర్థము : హేకలే!=ఓకలీ!, తత్ర=అస్వయంవరమందు, యామి=పోవు చున్నాను, ఇతి = ఇటువంటి, రాజసం=రజోగుణముచే నేర్పడిన, అసజ్జ్ఞానం=చెడ్డబుద్ధి, పరిహార్యతాం=వర్జింపబడునుగాత, ఇతి= ఈ దుష్టబుద్ధివలన, తత్ర=అచ్చట, రాజసంసది=రాజసభయందు, గతః=పోయినవాడవై, హాస్యతాం = పరిహసింపదగియుండుటను, మాగాః=పొందకుము.

సమాసములు :

అసజ్జ్ఞానం - న సత్=అసత్, అసచ్చ తత్ జ్ఞానం చ =అసజ్జ్ఞానమ్.
రాజసంసది - రాజ్ఞః సంసత్=రాజసంసత్, తస్యాం=రాజసంసది.
హాస్యతాం - హసితుం యోగ్యః = హాస్యః, హాస్యస్య భావః= హాస్యతా, తాం=హాస్యతాం.

భావము :

ఓ కలీ! ఆ స్వయంవరమునకు బోగలనని రజోగుణముచే నేర్పడిన దుర్బుద్ధిని మానుకొనుము. ఇట్టి దుర్బుద్ధితో నచ్చటి రాజసభ కేగి పరిహాస పాత్రుడవు కాకుము. ॥150॥

శ్లో. గత్వాన్తరా నలం భైమీం నాఽకస్మాత్త్వం ప్రవేక్ష్యసి,
షణ్ణాం చక్ర మసంయుక్తం పశ్యమానం డకారవత్.

ప.వి. గత్వా-అన్తరా-నలం-భైమీం-న-అకస్మాత్-త్వం-ప్రవేక్ష్యసి-షణ్ణాం-చక్రం-అసంయుక్తం-పశ్యమానం-డకారవత్.

అర్థము : హేకలే!=ఓకలీ!, గత్వా=నిషధదేశములకు బోయి, నలం భైమీం అన్తరా=నలదమయంతులకుమధ్య, అకస్మాత్=వెంటనే, లేదా పాప మనెడి కారణములేకయే, త్వం=నీవు, న ప్రవేక్ష్యసి=ప్రవేశింపవు. నలుడు పుణ్యచరిత్రు డగుటవలన దమయంతి పాతివ్రత్యధర్మముతో

గూడినదగుటవలనను వారిద్దరిని నీవు పరాభవింపజాలవు. ఎట్లనగా, అసంయుక్తం = పూర్వము సంధిలేక వేరు గావింపబడిన ప్రకృతి ప్రత్యయముల విభాగము కలదియు పిదప కలుపబడి ప్రయోగార్హముగా పఠింపబడు, షణ్ణాం = షట్ శబ్ద షష్ఠీ బహువచనముయొక్క, చక్రం అన్తరా = వర్ణ సమూహమునకు మధ్య, డకారవత్ = డకారమువలె, శాస్త్ర విధిలేక డకారమెట్లు "షణ్ణా" మను శబ్దఘటన వర్ణముల మధ్య ప్రవేశింపదో, అట్లే నీవును వారిద్దరి మధ్య ప్రవేశమును బొందజాలవు అని సాధర్మ్యోపమ. "షష్" శబ్దమునకంచె "షట్ చతుర్భ్యశ్చ"యను సూత్రముచే "ఆమ్" పరమైనపుడు నుడాగమము రాగా "నామ్"పరము కాగా "స్వాది ష్వసర్వనామస్థానే" యను సూత్రముచే పూర్వమునకు పదత్వ మేర్పడగా, "ఝలాం జశోఽన్తే" యను సూత్రము వలన షకారమునకు డకారము రాగా "న పదాన్తాత్" యను నిషేధనమునకు "అనామ్నవతి" యను నిషేధ ముండుటవలన "ష్టునా ష్టుః" అను సూత్రమువలన "ష్టుత్వము"చే "నామ్" లోని నకారమునకు ణత్వము రాగా, "యరోఽనునాసికే" త్యాది సూత్రముచే అననునాసికమగు డకారమునకును వ్యవస్థితవికల్పము ననుసరించి, నిత్యముగా ణకారము రాగా, ఏ విధముగను "షణ్ణాం" అను పదమధ్యమున డకారము స్వస్వరూపముతో ప్రవేశమును బొందజాలదు. ఆ విధముగనే వారిరువురి మధ్య నీవును డకారమువలె వికృతిని బొందక ప్రవేశమును బొందలేవు. కావున "షణ్ణాం చ క్రమసంయుక్తం పఠ్యమానం డకారవత్" అని "క్రమసంయుక్త"ముగా పదవిభాగము గావించుకొని, క్రమసంయుక్తం = క్రమముగా సంయుక్తమైన, యనగా కలసిపోయిన "షణ్ణామ్" అను శబ్దస్వరూపమునకు మధ్య డకారమెట్లు ప్రవేశింపదో అట్లే నీవును ప్రవేశింపజాలవని యర్థము. "షణ్ణామ్"అను పదఘటక వర్ణములు, కలియక ముందు "డకారము" స్వస్వరూపముతో నుండదని యర్థము. లేదా "షణ్ణామ్" అనునెడ ప్రకృతిప్రత్యయదశయందు నాకస్మికముగా "ఆగన్తుకాదేశ రూపముగా, డకారమెట్లు ప్రవేశించునో అట్లు నీవు ప్రవేశింపజాలవని వైధర్మ్యోపమ యైనను చెప్పవచ్చును. "టకారవత్" అనియు పాఠము గలదు.

ఈ శ్లోకము ప్రక్షేపము. ప్రకాశవ్యాఖ్యాకారునిచే నిది పరిగ్రహింపబడినది. కావున మల్లినాథసూరి దీనిని వ్యాఖ్యానింపలేదు. ప్రకాశ వ్యాఖ్యతో నిది యిట స్వీకరింపబడినది.

సమాసములు :

అసంయుక్తం - న సంయుక్తం = అసంయుక్తం, తత్ = అసంయుక్తం. క్రమసంయుక్తం - క్రమేణ సంయుక్తం = క్రమసంయుక్తం, తత్ = క్రమసంయుక్తం. "చక్రమ సంయుక్తం" అను నెడ, "చ" కారము "భైమీం" అనునెడ నన్వయింపదగినది.

భావము :

ఓ కలీ! నీవు నిషధదేశములకు బోయి నలదమయంతుల మధ్య వెంటనే ప్రవేశింపజాలవు. లేదా పాపమనెడి కారణములేక ప్రవేశింపజాలవు. నలుడు పుణ్య చరిత్రుడు. దమయన్తి పాతివ్రత్యముతో గూడినది. కాన నీవు వారిరువురిని పరాభవింపజాలవు. దీనికి దృష్టాంతము:- "షణ్ణాం" అను శబ్దము తొలుత ప్రకృతి విభాగముతో గూడి వెనుక సంహితతో ననగా వర్ణముల నన్నింటిని కలిపి పఠించునపుడు ఆ వర్ణముల మధ్య "షడ్" అను డకారము, విధి ననుసరించి వికృత రూపము నొందక యెట్లు ప్రవేశింపదో, అట్లే నీవును వికృతరూపము నొందక ప్రవేశింపజాలవని యాశయము. తక్కిన విషయములు పైన వివరింపబడినవి.

శ్లో. అపరేఽపి దిశా మీశా వాచ మేనాం శచీపతేః,
అన్వమన్యన్త కిన్త్వేనాం నాదత్త యుగయో ర్యుగమ్. 151

ప. వి. అపరే-అపి-దిశాం-ఈశాః- వాచం- ఏనాం- శచీపతేః- అన్వమన్యన్త-కిం-తు-ఏనాం-న-ఆదత్త-యుగయోః-యుగం.

అర్థము: దిశాం = దిక్కులకు, అపరే = ఇతరులైన, ఈశాః = అధిపతులు, అనగా అగ్నిదేవుడు మున్నగువారలు, శచీపతేః = ఇంద్రునియొక్క, ఏనాం = ఈ, వాచం = ఉపదేశ వచనమును, అన్వమన్యన్త

దించిరి. అనగా నింద్రుని వాక్యము యుక్తము అని యభినందించిరి. కింతు = కాని, ఏనాం = ఈ మాటను, యుగయోః = కలిద్వాపరముల యొక్క, యుగం = జంట, కర్తుం = ఆచరించుటకు, న ఆదత్త = గ్రహింపలేదు, అనగా ఈ మాటను వినలేదు.

సమాసములు :

శచీపతేః-శచ్యాః పతిః = శచీపతిః, తస్య = శచీపతేః.

భావము :

అగ్ని మున్నగు ఇతర దిక్పాలురు గూడా నింద్రుని యుపదేశవచనములను ఆమోదించిరి. ఇంద్రుని మాట యుక్తమైనదని యభినందించిరి. కాని కలి ద్వాపరములజంట యీ యింద్రుని మాట నాచరించుటకు నంగీకరింపలేదు. ॥151॥

శ్లో. కలిం ప్రతి కలిం దేవాః దేవాన్ ప్రత్యేకశః కలిః,
సోపహాసం సమైర్వర్ణై రిత్థం వ్యరచయ న్మిథః. 152

ప. వి. కలిం-ప్రతి-కలిం-దేవాః-దేవాన్-ప్రతి-ఏకశః-కలిః-సోపహాసం-సమైః-వర్ణైః--ఇత్థం-వ్యరచయన్-మిథః.

అర్థము:- దేవాః = ఇంద్రాదిదేవతలు, కలిం ప్రతి = కలియుగమును గూర్చి, కలిశ్చ = కలియుగమును, దేవాన్ ప్రతి = దేవతలను గూర్చి, ఏకశః = ప్రత్యేకముగా, సమైః = సమానములైన, వర్ణైః = ఉభయార్థకములగు శబ్దములచే, ఇత్థం = చెప్పబోవు ప్రకారము, మిథః = ఒండొరులను గూర్చి, సోపహాసం = పరిహాసముతోడ, కలిం = కలహమును, వ్యరచయన్ = కావించిరి.

సమాసములు :

సోపహాసం - ఉపహాసేన సహితం యథా తథా = సోపహాసం.

భావము :

ఇంద్రాదిదేవతలు కలినిగూర్చియు, కలి ఇంద్రాదులనుగూర్చియు, నుభ యార్థకములగు శబ్దములచే చెప్పబోవుప్రకారము పరస్పరము పరిహాసపూర్వక ముగా తగవులాడుకొనిరి. ॥152॥

శ్లో. తత్రాఽగమన మేవార్హం వైరసేనే తయా వృతే,
ఉద్వేగేన విమానేన కిమనేనాఽపి ధావతా. 153

ప. వి. తత్ర-ఆగమనం-ఏవ- అర్హం-వైరసేనే-తయా-వృతే- ఉద్వేగేన-విమా నేన-కిం-అనేన-అపి-ధావతా.

అర్థము:- హే కలే=ఓ కలీ! తయా=ఆ దమయంతిచేత, వైరసేనే=వీర సేనునికుమారుడగు నలుడు, వృతే సతి=వరింపబడగా, తత్ర=ఆ స్వయంవరమందు, అగమనమేవ=పోకయుండుటయే, వరం=శ్రేష్ఠము, అతఏవ=ఇందువలననే, ఉద్వేగేన=మిక్కిలివేగముతో, ధావతా= శీఘ్రముగా వెళ్ళుచున్న, అనేన=ఈ, విమానేన=విమానముచే, కిం= ఏమి ప్రయోజనము? ఇపు డచటికి వెళ్ళుట నిష్ఫలము. పక్షాంతరమున:- హే ఇంద్ర!=ఓ ఇంద్రా! తత్ర=ఆ స్వయంవరమందు, తయా=ఆ దమయంతిచే, వైరసేనే = నలుడు, వృతే సతి = వరింపబడగా, అగమనమేవ=స్వర్గమునకు వెళ్ళక యుండుటయే, అర్హం=తగినది, దమయంతికై భూమికి వచ్చిన మీరు, దమయంతిచే వరింపబడనందు వలన గలిగిన యవమానముతో శచీదేవి మున్నగువారియెదుట ముఖమును జూపనసమర్థులు గాన స్వర్గమున కేమాత్రము పోరాదు. తథా=అట్లే, అపి ధావతా=ఆచ్ఛాదనముకలిగిన, విమానేన=మానములేనటువంటి, అనేన=ఈ ముఖదర్శనముచే నూహింపబడిన, ఉద్వేగేన=అవమానము వలన కలిగిన మనః సంక్షోభముచే, కిం?=ఏమి ప్రయోజనము? కాన నది చాలును. అనగా దానిని మఱుగుపరచుట వ్యర్థము. ధైర్యమును వహించి యొకవేళ దమయంతి లభించనందువలని దుఃఖమును మీరు కప్పిపుచ్చుకొన్నను నేను మీ భావములను జూచి చక్కగా నూహించితిని. కావున మీరు మీదుఃఖమును కప్పిపుచ్చుకొనుట వ్యర్థము.

సమాసములు :

వై రసేనే - వీరసేనస్య అపత్యం పుమాన్=వైరసేనిః, తస్మిన్= వైరసేనే.

అవిధావతా - అపిధా అస్యాస్తీతి=అపిధావాన్, తేన=అపిధావతా.

భావము :

ఇంద్రాదులతో కలిపురుషునకు జరిగిన కలహప్రకారమును వర్ణించుచున్నాడు.

ఓ కలీ! దమయంతి నలుని వరించిన పిదప నచ్చటికి వెళ్ళకయుండుట యుక్తము. కావున మిక్కిలి వేగముతో బరుగిడు నీవిమానముతో బ్రయోజన మేమి? ఇపు డచటికి వెళ్ళుట వ్యర్థము. పక్షాంతరమున:— ఓ యింద్రా! అ స్వయంవరమునందు దమయంతి నలుని వరించినపిదప అచ్చటినుండి మరలి వచ్చుటయే మీకు తగినపని. లేదా స్వర్గమునకు వెళ్ళకయుండుటయైనను తగినదే. ఏలయనగా, దమయంతిచే వరింపబడగలమని మీరు భూమికి వచ్చితిరి. కాని యామెచే మీరువరింపబడనందువలన స్వర్గమునకు మగిడిపోతిరేని శచీదేవి మున్నగువారి యెదుట మోము జూపుటకూడా మీకు శక్యముకాదు. ఏలయనగా, మీరు అవమానమునకు బాల్పడితిరి. కాన స్వర్గమునకు వెళ్ళకయుండుటయే మీకును తగినది. కాన నవమానభరముచే ముసుగువేసుకొని చిత్తచాంచల్యముతో బాధపడనేల? అనగా నీయవమానముచే నేర్పడిన వికారములను గప్పిపుచ్చుట వ్యర్థము. ధైర్యమును వహించి దమయంతి లభింపనిదానివలని యవమానమును మీరుకప్పిపుచ్చినను నేను మీభావములను చూచి యూహించుకొనుచున్నాను. కాన మీరిట్లు కప్పిపుచ్చుకొనుట వ్యర్థము. ॥153॥

ఇచ్చట రెండర్థములును ప్రకృతములే గాన ప్రకృతశ్లేషాలఙ్కారము.

శ్లో. పురా యాసి వరీతుం యా మగ్ర ఏవ తయా వృతే,
అన్యస్మిఞ్ భవతో హాఽఽస్యం వృత్తమేత త్త్రిపాకరమ్.154

ప. వి. పురా-యాసి- పరీతుం-యామ్-అగ్రే-ఏవ - తయా-వృతే-అన్యస్మిన్ - భవతః-హా-ఆస్యం-వృత్తమ్-ఏతత్-త్రపాకరం.

అర్థము: హే కలే!=ఓ కలీ, యాం=ఏ దమయంతిని, వరీతుం = భార్యగా వరించుటకు, పురా =శీఘ్రముగా, యాసి=పోగలవు. అనగా, పురా యాస్యసి=పోబోవుచున్నావు అని యర్థము. తయా = ఆ దమయంతిచే, అగ్రే=ముందే, అనగా నీవు వచ్చుటకు ముందే, అన్యస్మిన్=మరియొక పురుషుడు, వృతే సతి=వరింపబడగా, త్రపాకరం, త్రపా=సిగ్గునకు, ఆకరం = గనివంటిదిగా, వృత్తం=ఏర్పడిన, ఏతత్ = ఈయెదుట నున్న, భవతః=నీయొక్క, ఆస్యం=మోమునుగూర్చి, హా=శోచనీయ మైనది.

పక్షాంతరమున: హే వహ్నే!=ఓ అగ్నీ, పురా = పూర్వము, యాం=ఏ దమయంతిని, వరీతుం=వరించుటకు, యాసి=పోతివో, తయా = ఆ దమయంతిచే, అగ్రే ఏవ=నీసమక్షమునందే, అన్యస్మిన్=మరియొక డైన నలుడు, వృతే సతి = వరింపబడగా, భవతః = నీయొక్క, ఏతత్=ప్రత్యక్షముగా గనబడు, వృత్తః=గుండ్రమైన, ఆస్యం= ముఖము, త్రపాకరం=లజ్జాకరముగా, జాతం=ఏర్పడినది. హా= దుఃఖము.

సమాసములు :

త్రపాకరము - త్రపాయాః ఆకరః=త్రపాకరః, తం=త్రపాకరం, పక్షాంతరమున, త్రపాం కరోతీతి=త్రపాకరం.

భావము :

ఓ కలీ! దమయంతిని భార్యగా వరించుటకు పోబోవుచున్నావు. కాని నీవు పోకమునుపే దమయంతి మరియొకడైన నలుని వరించుటవలన సిగ్గుకు గనిగా నేర్పడిన నీ మోమునుగూర్చి దుఃఖము గలుగుచున్నదని అగ్నిదేవుడు కలికి జెప్పెను.

పక్షాంతరమున-ఓ అగ్నీ! పూర్వము దమయంతిని వరించుటకు వెళ్ళితివి. కాని ఆ దమయంతి నీ సమక్షమునందే మరియొకడైన నలుని వరింపగా నీ గుంద్ర మైన ముఖము లజ్జను గల్గించునదిగా నేర్పడినది. ఇది యెంత కష్టమైన విషయము? అని కలి, అగ్నిదేవునిగూర్చి పలికెను. ॥154॥

శ్లో. పత్యౌ తయా వృతేఽన్యస్మిన్ యదర్థం గతవానసి,
భవతః కోపరోధ స్స్యా దక్షమస్య వృధారుషః. 155

ప. వి. పత్యౌ - తయా-వృతే - అన్యస్మిన్ - యదర్థం - గతవానసి-భవతః - కోపరోధః -స్యాత్-అక్షమస్య-వృధారుషః.

అర్థము: హేకలే!=ఓకలీ!, యదర్థం=ఏభార్యకొఱకు, గతవాన్=పోయిన వాడవుగా, అసి=అగుచున్నావో, తయా=ఆ దమయంతిచే, అన్యస్మిన్ =మఱియొకడు, వృతే సతి=వరింపబడగా, ననగా భర్తగా వరింప బడగా, అక్షమస్య= దానికిబదులు చేయుట కసమర్థుడవైన (కావుననే) వృధారుషః=వ్యర్థమైన రోషముగలిగిన, భవతః=నీకు, కోపరోధః= క్రోధము, శమించుట స్యాత్ = అవునుగాత అని యముడు కలికి జెప్పెను.

పక్షాంతరమున: హే యమ!=ఓ యమా!, యదర్థం=దేనికొఱకు, గతవానసి= ముందు వెడలితివో, అక్షమస్య=ఓర్పులేని, భవతః=నీకంటె, అధ స్స్యాత్=హీనుడు, అపరః=మరియొకడు, నీకంటె హీనుడు ఎవ్వడును లేడని యర్థము. అని కలిపురుషుడు యమునకు చెప్పెను.

సమాసములు :

యదర్థం- యస్మై=యదర్థం,
కోపరోధః- కోపస్యరోధః=కోపరోధః,
అక్షమస్య- న క్షమా యస్య సః=అక్షమః, తస్య=అక్షమస్య.

భావము :

ఓ కలీ! ఏ దమయంతిని భార్యగా వరించుటకు వెళ్ళితివో, ఆ దమయంతి మరియొకనిని భర్తగా వరింపగా, దానికి ప్రతీకారము జేయుట కసమర్థుడవై,

వ్యర్థముగా రోషపడుచున్న నీయొక్క రోషము శమించునుగాత యని యముడు కలికి జెప్పెను.

ఓ యమా! దేనికొఱకు పోతివో, ఆ దమయంతి మరియొకడైన నలుని వరింపగనే యోర్వలేని నీకంటె నధముడు మరియొక డుండునా? ఎవ్వడు లేడు. ॥155॥

శ్లో. యాసి స్మ రంజయన్ కాంత్యా యోజనౌఘం మహార్వతా,
స మూఢ స్త్వం వృతేఽన్యస్మిన్ కిం న హ్రీ స్తేఽత్ర పామర.

ప. వి. యాసి-స్మరం-జయన్-కాంత్యా-యోజనౌఘం-మహార్వతా-సః-మూఢః-త్వం-వృతే-అన్యస్మిన్-కిం-న-హ్రీః-తే-అత్ర-పామర.

అర్థము: హే పామర!=ఓనీచుడైన కలీ! త్వం=నీవు, కాన్త్యా=సౌందర్యముచే స్మరం=మన్మథుని, జయన్=జయించుచు, ననగా నలజ్కార విశేషములచే మన్మథునికంటె నధికసౌందర్యవంతుడ వగుచు, మహార్వతా=గొప్ప అశ్వమువంటిదైన విమానముచే, సమూఢస్సన్=బాగుగా మోయబడినవాడ వగుచు, యోజనౌఘం, యోజన=నాలుగుకోసుల, ఓఘం=సమూహమును, అనగా బెక్కుకోసుల దూరమును, యాసి=వెళ్ళుచున్నావు, కిన్తు=కాని, అత్ర = ఈ స్వయంవరమునందు, అన్యస్మిన్=మరియొకడగు నలుడు, వృతే సతి=వరింపబడగా, తే=నీకు, హ్రీః=సిగ్గు, న కిం?=లేదా యేమి? అనగా తప్పక కలుగగలదు అని వరుణుడు కలినిగూర్చి చెప్పెను.
పక్షాంతరమున :- హే అత్రప!=ఓ సిగ్గులేని, అమర!=సురుడవైన వరుణా! యః=ఏ, త్వం=నీవు, కాన్త్యా=నీ దేహ సౌందర్యముచే, జనౌఘం=జనసమూహమును, రంజయన్=రంజిల్లజేయుచు, మహార్వతా=గొప్పగుఱ్ఱముచే, యాసి స్మ=పోవుచుంటివో, సః=అటువంటి త్వం=నీవు, మూఢః=మూర్ఖుడుగా, అసి=అగుచున్నావు. అత్ర=ఈ స్వయంవరమునందు, అన్యస్మిన్=మరియొకడగు నలుడు, వృతే సతి=వరించబడగా, తవ = నీకు, హ్రీః=సిగ్గు, న, కిం?=లేదా యేమి? తప్పక యుండగలదు.

వి. ఇచ్చట నర్మములను రెండును ప్రకృతములే గాన కేవల ప్రకృతశ్లేష. ఇట్లే అగ్నియముల గూర్చిన శ్లోకములయందును గ్రహింపవలయును.

సమాసములు :

అత్రప-అవిద్యమానా త్రపా యస్య సః=అత్రపః, తస్య సంబుద్ధిః= హే అత్రప!
యోజనౌఘం- యోజనానాం ఓఘః=యోజనౌఘః, తం=యోజనౌఘం.
మహార్వతా- మహాంశ్చాసౌ అర్వా చ=మహార్వా, తేన=మహార్వతా.

భావము :

వరుణుడు కలినిగూర్చి చెప్పుచున్నాడు. ఓ నీచుడవైన కలీ! నీవు అలంకారములు చేసుకొనుట వలన నేర్పడిన కాంతిచే, మన్మథునికంటెను అధిక సౌందర్యవంతుడుగా వెలుగుచు, గొప్ప గుఱ్ఱమువలె వేగము గలిగిన విమానముతో పెక్కుయోజనముల దూరము కొనిపోబడుచు, వెళ్ళుచున్నావు. కాని ఈ స్వయంవరమందు నీ కంటె భిన్నుడైన నలుడు దమయంతిచే వరింపబడగా, మరల దమయంతిని వరింపగోరుటలో సిగ్గులేదా యేమి? తప్పక సిగ్గు కలుగగలదు అని ఆశయము.

పక్షాంతరమున:- కలి వరుణునిగూర్చి చెప్పుచున్నాడు. ఓయీ సిగ్గులేని సురుడవైన వరుణా! నీవు నీ దేహకాంతిచే జన సమూహమును రంజింపచేయుచు గొప్ప గుఱ్ఱముపై స్వయంవరమును గూర్చి వెళ్ళుచుంటివి. అటువంటి నీవు మూఢుడవు. ఈ స్వయంవరమున దమయన్తి నలుని వరించగా నీకు సిగ్గు గలుగదా యేమి? తప్పక కలుగవలయును. ॥156॥

శ్లో. నలం ప్రత్యనపేతార్త్రి తార్త్రీయీక తురీయయోః,
యుగయో ర్యుగలం బుద్ధ్వా దివి దేవా ధియం దధుః. 157

ప.వి. నలం-ప్రతి-అనపేతార్త్రి-తార్త్రీయీక తురీయ యోః-యుగయోః-యుగలం బుద్ధ్వా-దివి-దేవాః-ధియం-దధుః.

అర్థము : అథ = పిదప, దేవాః=ఇంద్రాదులగు వేల్పులు, తార్తీయీకతురీయయోః, తార్తీయీక=మూడవదైన ద్వాపరము, తురీయయోః=నాలుగవదైన కలి, యుగయోః=యుగములయొక్క, యుగలం=రెంటిని, నలంప్రతి=నలునిగూర్చి, అనపేతార్తి, అనపేత=తొలగనటువంటి, ఆర్తి=బాధింపగోరికగలదిగా, బుద్ధ్వా=తెలిసికొని, దివి=స్వర్గమునందు, ధియం=బుద్ధిని, దధుః=చేసిరి. అనగా స్వర్గమునకు వెళ్ళ నిశ్చయించిరి.

సమాసములు :

అనపేతార్తి-న అపేతా=అనపేతా, అనపేతా ఆర్తిః యస్య తత్=అనపేతార్తి.
తార్తీయీకతురీయయోః - తార్తీయీకశ్చ తురీయశ్చ, తార్తీయీకతురీయౌ, తయోః=తార్తీయీకతురీయయోః.

భావము :

తరువాత నింద్రాదిదేవతలు మూడవయుగమైన ద్వాపరము నాలుగవ యుగమైన కలి యను రెండు యుగములకును తామెంత చెప్పినను నాయుగములకు నలుని పీడింపవలయునను గోరిక తొలగనందువలన వారు ఆ రెండు యుగములను వదలి స్వర్గమునకు బోవ నిశ్చయించుకొనిరి. ॥157॥

శ్లో. ద్వాపరైకపరీవారః కలిర్మత్సరమూర్ఛితః,
నలనిగ్రాహిణీం యాత్రాం జగ్రాహ గ్రహిలః కిల. 158

ప. వి. ద్వాపరైకపరీవారః-కలిః-మత్సరమూర్ఛితః-నలనిగ్రాహిణీం-యాత్రాం-జగ్రాహ-గ్రహిలః-కిల.

అర్థము : మత్సరమూర్ఛితః=నలునిపై వర్ధిల్లిన యసూయగలిగిన (కావుననే) గ్రహిలః=పట్టుదల గలిగిన, కలిః = నాల్గవయుగము, ద్వాపరైకపరీవారః, ద్వాపర=మూడవ యుగమే, ఏక=ముఖ్యమైన, పరీవారః=

పరిజనము గలవాడై, అనగా ద్వాపరయుగమే సహాయముగా గలవాడై, నలనిగ్రాహిణీం = నలుని పీడించుటయే ప్రయోజనముగా గలిగిన, యాత్రాం=ప్రయాణమును, జగ్రాహ=పట్టుకొనెను. అనగా నలుని పీడించుటకై పయనించెనని యర్థము.

సమాసములు :

ద్వాపరైకపరీవారః-ద్వాపరః ఏకః పరీవారః యస్య సః = ద్వాపరైక పరీవారః.
మత్సరమూర్ఛితః-మత్సరః మూర్ఛితః యస్య సః=మత్సరమూర్ఛితః.
గ్రహిలః-గ్రహః అస్యాస్తీతి=గ్రహిలః.

భావము :

తరువాత నాకలిపురుషుడు నలునియందు బగ పెరుగుటచే పట్టుదల గలిగి ద్వాపరయుగమును మాత్రమే సహాయము చేసికొని నలుని పీడించుటకై పయన మాయెను. ॥158॥

శ్లో. నలేష్టాపూర్త సమ్పూర్తే ర్దూరదుర్గా నముం ప్రతి,
నిషేధన్ నిషధాన్ గన్తుం విఘ్న స్సంజఘటే ఘనః. 159

ప. వి. నలేష్టాపూర్తసంపూర్తేః-దూరదుర్గాన్-అముం - ప్రతి-ప్రతినిషేధన్ - నిషధాన్-గన్తుం-విఘ్నః-సంజఘటే-ఘనః.

అర్థము: నలేష్టాపూర్త సంపూర్తేః, నల=నలుని యొక్క, ఇష్టా=యాగముల ననుష్ఠించుట, పూర్త=తటాకాదుల నిర్మించుట యను ధర్మములచే, సమ్పూర్తేః=నిండియుండుటవలన, అనగా పెక్కు ధర్మములను నను ష్ఠించుటచే నేర్పడిన చిహ్నములతో నిండియుండుటవలన, అముం ప్రతి =ఈ కలిని గూర్చి, దూరదుర్గాన్, దూర=మిక్కిలి, దుర్గాన్= ప్రవేశింప శక్యములుగాని, నిషధాన్=నిషధదేశములను, గన్తుం = వెళ్ళుటకు, నిషేధన్=వారించునట్టి, ఘనః=ఘనమైనటువంటి, విఘ్నః=

= విఘ్నము, సంజఘటే= ఘటిల్లినది. ధర్మముచే రక్షితములైన నిషధదేశములు కలిపురుషునకు ప్రవేశింప నశక్యములైనవని యర్థము.

సమాసములు :

నలేష్టాపూర్తసమ్పూర్తేః - ఇష్టం చ పూర్తం చ=ఇష్టాపూర్తే, నలస్య ఇష్టాపూర్తే=నలేష్టాపూర్తే, నలేష్టాపూర్తయోః సమ్పూర్తిః = నలేష్టాపూర్తసమ్పూర్తిః, తస్యాః=నలేష్టాపూర్తసమ్పూర్తేః.

దూరదుర్గాన్-దూరం దుర్గాః=దూరదుర్గాః, తాన్=దూర దుర్గాన్.

భావము :

నలుడు గావించిన యాగములవలనను నలుడు నిర్మించిన తటాకాదుల వలనను గల్గిన పుణ్యములచే నిషధదేశములు వ్యాప్తములై యా పుణ్యములనెడి ధర్మములచే రక్షితములుగా నుండుటచే, పాపరూపమైన కలికి నిషధదేశములు మిక్కిలి ప్రవేశింప సాధ్యములుగానివై వాని నచ్చట వారించునట్టి ఘనమైన విఘ్నము సంభవించినది. ॥158॥

శ్లో. మణ్డలం నిషధేన్ద్రస్య చన్ద్రస్యే వామలం కలిః,
ప్రాప మ్లాపయితుం పాపః స్వర్భానురివ సంగ్రహాత్. 159

ప. వి. మణ్డలం-నిషధేన్ద్రస్య-చన్ద్రస్య-ఇవ-అమలం-కలిః-ప్రాప-మ్లాపయితుం పాపః-స్వర్భానుః-ఇవ-సంగ్రహాత్.

అర్థము: పాపః=పాపియైన, కలిః=కలిపురుషుఁడు, పాపః=పాపగ్రహముల మధ్య పతింపబడుటవలన పాపియగు, స్వర్భానురివ=రాహువువలె, అమలం=నిర్మలమైన, అనగా పాపరహితమైన, నిషధేన్ద్రస్య = నిషధ రాజగు నలునియొక్క, మణ్డలం=రాష్ట్రమును, అమలం = నిర్మలమైనదై పరిపూర్ణ ప్రకాశము గల్గిన, చన్ద్రస్య=చంద్రునియొక్క, మండల

మివ = బింబమునువలె, సంగ్రహాత్ = పట్టుదలవలనను, గ్రహణ యోగమువలనను, మ్లాపయితుం = నాశము గావించుటకు, ప్రాప = పొందెను.

సమాసములు :

నిషధేన్ద్రస్య-నిషధానాం ఇన్ద్రః=నిషధేన్ద్రః, తస్య=నిషధేన్ద్రస్య.

భావము :

పాపియగు కలిపురుషుడు పాపియగు రాహువువలె, పాపములేని నలుని రాజ్యమును, నిర్మలమైన చంద్రమండలమును వలె, మొండితనముతోడను, గ్రహణ యోగమువలనను నాశము చేయుటకు నాదేశమును ప్రవేశించెను. అనగా పాపియగు రాహువు పున్నమనాడు నిర్మలమై పూర్ణమై వెలుగొందు చంద్రమండల మును గ్రహణయోగమువలన బట్టుకొని ఎట్లు నాశము జేయునో, అట్లే కలి పురుషుడును పాపములేని పవిత్రమైన నలుని నిషధరాజ్యమును హఠముతో నాశము గావించుటకు ప్రవేశించెను.

ఈ శ్లోకము ప్రక్షేపము. ప్రకాశకారుడగు నారాయణభట్టుతు వ్యాఖ్యా నించుటవలన ఇట జేర్పబడినది. ॥1౫౯॥

శ్లో. కియతాథ చ కాలేన కాలః కలి రుపేయివాన్,
భైమీభర్తు రహంమానీ రాజధానీం మహీభుజః. 160

ప. వి. కియతా-అథ-చ-కాలేన-కాలః-కలిః-ఉపేయివాన్-భైమీభర్తుః - అహం మానీ-రాజధానీం-మహీభుజః.

అర్థము: అథ=ఇంద్రాది దేవతల సమక్షమునుండి బయలుదేరిన పిదప, కియతా చ కాలేన=కొద్ది కాలముచేతనే, అహంమానీ-అహంకారము గలిగిన, కలిః కాలః=యుగరూపమైన, కాలముయొక్క స్వరూపము గలిగిన, లేదా పాపాత్ముడగుటవలన నల్లని వన్నె గలిగిన కలియుగ పురుషుడు,

భైమీభర్తుః = దమయంతికి భర్తయైన, మహీభుజః = నలమహారాజు యొక్క, రాజధానీం=ప్రధాన నగరమును, ఉపేయివాన్ = చేరెను.

సమాసములు :

భైమీభర్తుః - భైమ్యాః భర్తా=భైమీభర్తా, తస్య=భైమీభర్తుః.
అహంమానీ - అహమితి మానీ=అహంమానీ.

రాజధానీం - రాజానః ధీయన్తే అస్మిన్నితి = రాజధానీ, తాం = రాజధానీం.

భావము :

ఆ దేవతల సన్నిధినుండి పయనించిన పిదప కొలదికాలము గడువగనే, యా యహంకారియైనట్టి యుగస్వరూపుడైన కలిపురుషుడు, లేదా పాపియగుట వలన నల్లనివన్నెగలిగిన కలిపురుషుడు, దమయంతిభర్తయగు నలమహారాజు యొక్క రాజధానిని ప్రవేశించెను. ॥160॥

శ్లో. వేదా నుచ్చరతాం తత్ర ముఖా దాకర్ణయన్ పదమ్,
న ప్రసారయితుం కాలః కలిః పద మపారయత్. 161

ప. వి. వేదాన్ - ఉచ్చరతాం - తత్ర - ముఖాత్ - ఆకర్ణయన్ - పదమ్-న-ప్రసారయితుం-కాలః-కలిః-పదం-అపారయత్.

అర్థము : తత్ర=ఆ రాజధానియందు, వేదాన్=వేదములను, ఉచ్చరతాం= పఠించుచున్న వైదికులయొక్క, ముఖాత్=వదనమునుండి, పదం= మంత్రముయొక్క నాల్గవభాగమనెడి పదసమూహమును, ఆకర్ణయన్= వినుచున్నట్టి, కాలః=కలిసమయస్వరూపుడైన, కలిః=పాపాత్ముడైన కలిపురుషుడు, పదం = అడుగును, ప్రసారయితుం = విస్తరింప జేయుటకు, న అపారయత్=సమర్థుడు కాలేదు.

అర్థము: సః=ఆ కలిపురుషుడు, తత్ర=ఆ నగరమందు, ఉపసన్నాయాః= ఉపాసకుని యొద్దకు తనంతట వచ్చిన, విశ్వాయాః=సజాతీయురాలును విజాతీయురాలును బోదగినదియు బోదగనిదియు నగు స్త్రీని, కమం= కామించునట్టి యొక పురుషుని, వీక్ష్య=చూచి, తుష్టవాన్ = సంతోషించెను. అతడు మహాపాపి యగుటవలన తన కాశ్రయ మీయగలడను కోరికతో సంతోషించెనని యర్థము. అథ=పిదప, ననగా నా పురుషుని జూచిన పిదప, తం=ఆ కామించు పురుషుని, వామదేవాభ్యుపాసకం, వామదేవ = వామదేవుడను శివాంశమగు దైవమును, ఉపాసకం = పూజించువానినిగా, విభావ్య=గ్రహించి, మమ్లౌ=దుఃఖించెను. వామదేవోపాసకులు ''న కాఞ్చన స్వయ మాగతాం పరిహరేత్'' యను శాస్త్రమును అనుసరించి తన యంతట వచ్చిన స్త్రీని వలదని పరిహరింపగూడదు కాన నా స్త్రీతోటి సంగమము దోషము కానందువలన నా కలి పురుషుడు దుఃఖించెను.

సమాసములు :

వామదేవాభ్యుపాసకం - వామదేవస్య అభ్యుపాసకః = వామదేవాభ్యుపాసకః, తం=వామదేవాభ్యుపాసకం.

భావము :

ఆ కలిపురుష డానగరమందు తన యంతట తానుగా వచ్చి కామేచ్ఛను ప్రకటించిన స్త్రీ పొందదగినదా ? పొందదగనిదా ? యను వివేచన లేకయే సంగమించు చున్న యొకనిని జూచి, యతడు మహాపాతకియని భావించి యతడు తన కాశ్రయము గాగలడని సంతోషించెను. కాని యతని వివరములు తెలియగా నతడు వామదేవోపాసకు డనియు నా వామదేవోపాసకులకు ''న కాంచన స్వయ మాగతాం పరిహరేత్'' యను శాస్త్రము ననుసరించి తన యంతట తానుగా వచ్చిన స్త్రీని జాతి వివేచన లేక సంగమింప వచ్చును గాన నది యాతనికి పాపముగానందువలన నితడు మిక్కిలి వగచెను. ఇచట ''వామదేవ్యభ్యుపాసకమ్'' అను పాఠాంతరము ననుసరించి వామదేవియను స్త్రీ దేవత నితడుపాసించునని తెలియవలెను.

శ్లో. వైరిణీ శుచితా తస్మై న ప్రవేశం దదౌ భువి,
న వేదధ్వని రాలమ్బ మమ్బరే వితతార చ. 193

ప. వి. వైరిణీ-శుచితా-తస్మై-న-ప్రవేశం-దదౌ-భువి-న-వేదధ్వనిః-ఆలమ్బం-అంబరే-వితతార-చ.

అర్థము:- వైరిణీ = ఆ కలిపురుషునకు గిట్టనటువంటి, శుచితా = ప్రజలు తమ లోపలను తమ వెలుపలను శుద్ధి కలిగియుండుటయు, గోమయాదులచే నలికి యింటిని, వాకిలిని శుభ్రముగా నుంచుకొనుట యనునది, తస్మై = ఆ కలిపురుషునకు, భువి = నిషధభూమియందు, ప్రవేశం = ప్రవేశమును, న దదౌ = ఈయలేదు. తథా = అట్లే, అమ్బరే చ = ఆ నగరమునకు జెందిన యాకసమునందును, వేదధ్వనిః = వేదనాదము, ఆలమ్బనం = ఆశ్రయమును, న వితతార = ఈయలేదు.

సమాసములు :

వైరిణీ - వైర మస్యాః అస్తీతి వైరిణీ.
వేదధ్వనిః - వేదానాం ధ్వనిః = వేదధ్వనిః.

భావము ;

కలికి గిట్టనటువంటి శుద్ధి యనగా ప్రజలలోని యంతశ్శుద్ధియు, బాహ్యశుద్ధియు, గోమయాదులచే నిండ్ల నలుకుటచే నేర్పడిన లోపలి వెలుపలి శుద్ధియు నాకలిపురుషునకు నిషధభూమియందు ప్రవేశ మీయలేదు. అట్లే యానగరమునకు సంబంధించిన యాకాశమందు వ్యాపించిన బ్రహ్మఘోష మచ్చట నెలకొనుటకును నవకాశ మొసంగలేదు. ॥193॥

శ్లో. దర్శస్య దర్శనాత్ కష్ట మగ్నిష్టోమస్య చాఽఽనశే
జుఘూర్ణే పౌర్ణమాసేక్షీ సోమం సోఽమన్య తాంతకమ్. 194

ప. వి. దర్శస్య- దర్శనాత్-కష్టం-అగ్నిష్టోమస్య-చ-ఆనశే- జుఘూర్ణే-పౌర్ణమాసేక్షీ-సోమం-సః-అమన్యత-అంతకమ్.

అర్థము:- సః = ఆ కలిపురుషుడు, దర్శస్య = దర్శమనెడు యమావాస్యయం దనుష్ఠింపబడు యాగమును, అగ్నిష్టోమస్య=అగ్నిష్టోమమను యాగమును, దర్శనాత్=చూచుటవలన, కష్టం=గొప్పకష్టమును, ఆనశే=పొందెను. తథా=అట్లే, పౌర్ణమాసేక్షీ=పూర్ణిమయం దనుష్ఠింపబడు యాగమును చూచినవాడై, జుఘూర్ణే=భ్రమించెను. అనగా మూర్ఛను బొందెనని యర్థము. తథా = అట్లే, సోమం = సోమయాగమును, అంతకం=యమునిగా, అమన్యత=తలచెను.

సమాసములు :

పౌర్ణమాసేఒక్షీ - పూర్ణమాసే భవః=పౌర్ణమాసః, పౌర్ణమాసం ఈక్షత ఇతి=పౌర్ణమాసేఒక్షీ.

భావము :

ఆ కలిపురుషుడు అమావాస్యయం దాచరించెడి దర్శయాగమును, అగ్నిష్టోమయాగమును గాంచి దుఃఖము నొందెను. పూర్ణిమయం దాచరించెడి పౌర్ణమాసయాగమును గాంచి యాతడు మూర్ఛనొందెను. సోమయాగమును యమునితో సమానముగా జూచెను. ॥194॥

శ్లో. తేనాదృశ్యన్త వీరఘ్నాః న తు వీరహణో జనాః,
నాఒపశ్యత్ సోఒభినిర్ముక్తాన్ జీవన్ముక్తా నవైక్షత. 195

ప. వి. తేన-అదృశ్యన్త- వీరఘ్నాః-న-తు-వీరహణః-జనాః-న-అపశ్యత్-సః-అభినిర్ముక్తాన్-జీవన్ముక్తాన్-అవైక్షత.

అర్థము:- తేన=ఆ కలిపురుషునిచేత, వీరఘ్నాః=క్షత్రియధర్మము ననుసరించి యుద్ధమునందు వీరులను జంపెడి (జనాః=జనులు) అదృశ్యన్త=చూడ

బడిరి. తు=కాని, వీరహణః=క్షత్రియులను జంపెడి, జనాః=భట్ట భాస్కరుడుమున్నగు నగ్నిత్యాగులు, న అదృశ్యన్త = చూడబడలేదు, సః=ఆ కలిపురుషుడు, అభినిర్ముక్తాన్ = సూర్యు డస్తమించునపుడు నిదురించెడి యాచారవిహీనులను, నాపశ్యత్=చూడలేదు. కింతు=కాని, జీవన్ముక్తాన్ = జీవన్ముక్తులనబడు నాత్మానందమునొందు జ్ఞానులను, అవైక్షత=చూచెను.

**సమాసములు :**

*వీరఘ్నాః* - వీరాన్ ఘ్నన్తీతి=వీరఘ్నాః.
*వీరహణః* - వీరాన్ హన్తీతి=వీరహణః.
*అభినిర్ముక్తాన్* - అభినిర్ముక్తాః = అభినిర్ముక్తాః, తాన్ = అభినిర్ముక్తాన్.
*జీవన్ముక్తాన్* - జీవన్తశ్చ తే ముక్తాశ్చ = జీవన్ముక్తాః, తాన్= జీవన్ముక్తాన్.

**భావము :**

ఆ కలిపురుషుడు యుద్ధరంగమున వీరులను జంపెడి జనులను ఆ నగరమందు గాంచెను. కాని క్షత్రియులను జంపెడి జనులైన భట్టభాస్కరులను చూడలేదు. లేదా అగ్నిహోత్రమును బరిత్యజించుటచే వీరఘ్ను లనబడువారిని జూడలేదు. మరియు నా కలిపురుషుడు సూర్యాస్తమయకాలమందు నిదురించునట్టి యాచారహీనుల నచ్చట జూడలేదు. మఱేమనగా జీవించియు మోక్షమునొందిన జీవన్ముక్తు లనబడు నాత్మానందానుభూతిగలవారిని అనగా జీవిత దశయందే రూపాది విషయములను బరిత్యజించి యాత్మయందే యానంద మనుభవించెడి బ్రహ్మజ్ఞానులను జూచెను. ॥195॥

శ్లో. స తతో షాశ్నతో విప్రాన్ దృష్ట్వా స్పృష్టపరస్పరాన్,
హోమశేషీభవత్సోమభుజ స్తాన్వీక్ష్య దూనవాన్. 196

ప.వి. సః-తుతోష-అశ్నతః-విప్రాన్-దృష్ట్వా-స్పృష్టపరస్పరాన్ - హోమశేషీ భవత్సోమభుజః-తాన్-వీక్ష్య-దూనవాన్.

అర్థము : సః=ఆ కలిపురుషుడు, స్పృష్టపరస్పరాన్=, స్పృష్ట = తాకబడిన, పరస్పరాన్ = ఒండొరులు గల్గినవారై, అశ్నతః = భుజించుచున్న, విప్రాన్=బ్రాహ్మణులను, దృష్ట్వా=చూచి, తుతోష=సంతోషించెను, భోజనకాలమం దొండొరులను దాకికొనరాదను నిషేధమునకు వ్యతిరిక్తమును వారాచరించుటవలన పాపులై తనకాశ్రయ మిత్తురని భావించి సంతోషించెనని యర్థము. అథ=పిదప, తాన్=అవ్విధముగా భుజించు విప్రులను, హోమశేషీభవత్సోమభుజః, హోమశేషీభవత్=హోమశేషమైన, సోమ=సోమలతయొక్క చూర్ణమును, భుజః=భుజించువారినిగా, వీక్ష్య=చూచి, దూనవాన్=పరితపించెను.

సమాసములు :

స్పృష్టపరస్పరాన్ - పరే చ పరే చ ఏషాం వ్యతిహారః = పరస్పరే, స్పృష్టాః పరస్పరే యేషాం తే=స్పృష్టపరస్పరే, తాన్=స్పృష్టపరస్పరాన్.

హోమశేషీభవత్సోమభుజః- అశేషః శేషః సమ్పద్యమానః భవన్=శేషీభవన్, హోమస్య శేషీభవన్=హోమశేషీభవన్, హోమశేషీభవంశ్చాసౌ సోమశ్చ=హోమశేషీభవత్సోమః,హోమశేషీభవత్సోమం భుఞ్జత ఇతి=హోమశేషీభవత్సోమభుజః, తాన్= హోమశేషీభవత్సోమభుజః.

భావము :

ఆ కలిపురుషుడు, ఒండొరుల నంటుకొనుచు భుజించుచున్న విప్రులను గాంచి సంతోషించెను. ఏల యనగా, భుజించుకాలమున నొండొరుల నంటుకొనరాదనెడి నిషేధము నుల్లంఘించినందువలన వారు పాపులై తన కాశ్రయ మీయగలరని యతని తలంపు. కాని వారు హోమము జేయగా మిగిలిన సోమలతా చూర్ణమును భుజించుటను చూచి దుఃఖించెను. "న సోమే నోచ్ఛిష్టో భవతి"

యను శ్రుతి ననుసరించియు, "ఇక్షుదణ్డే,తిలే, సోమే నోచ్ఛిష్టో మను రబ్రవీత్" యనుస్మృతి ననుసరించియు సోమమును భక్షించునవుడు ఒండొరులను స్పృశించు కొనినచో దోషములేదు, కాన వారికి పాపము కలుగనందువలన కలి దుఃఖించె నని యాశయము. ॥196॥

శ్లో. దృష్ట్వా జనం రజోజుష్టం తుష్టిం ప్రాప్నో ఝటి త్యసౌ,
తం పశ్యన్ పావనస్నానావస్థం దుఃస్థ స్తతోఽభవత్. 197

ప.వి. దృష్ట్వా-జనం-రజోజుష్టం-తుష్టిం-ప్రాప్నోత్ - ఝటితి - అసౌ-తం - పశ్యన్-పావనస్నానావస్థం-దుఃస్థః-తతః-అభవత్.

అర్థము : అసౌ = ఈ కలిపురుషుడు, రజోజుష్టం = ధూళిచే వ్యాప్తుడైన, జనం=జనమును, దృష్ట్వా=చూచి, ఝటితి=వెంటనే, తుష్టిం=సంతోషమును, ప్రాప్నోత్=పొందెను, అట్టి జనమును జూచి యితడు నిషేధింప బడిన మేకలు గాడిదలు మున్నగువాని గిట్టలనుండి పైకిలేచిన ధూళితో గూడియున్నాడని నిశ్చయించుకొని, యితడు తన కాశ్రయ మీయగలడని భావించి సంతోషించెనని యర్థము. తతః=అతనిని, జక్కగా జూచిన పిదప, తం=ఆ ధూళితో గూడిన జనుని, పావనస్నానావస్థం, పావన= పవిత్రపఱచెడి, స్నాన=గోధూళితోటి స్నానము యొక్క, అవస్థం = దశగల వానినిగా, పశ్యన్=చూచుచు, దుఃస్థః=దుఃఖము నొందిన వాడుగా, అభవత్=ఆయెను. గోధూళితో స్నానము వాయవ్యస్నానము. అట్టి గోధూళి నొంటనలదుకొనుచున్నవానిని, తొలుత మైలసోకిన వానినిగా భావించి పిదప గోధూళిస్నానము గావించుచున్నాడని యెఱింగి యతడు పవిత్రత నొందినందువలన దుఃఖింపదొడగెనని యర్థము.

సమాసములు :

రజోజుష్టం - రజోభిః జుష్టః=రజోజుష్టః, తం=రజోజుష్టం.

పావనస్నానావస్థం - పావనం చ తత్ స్నానం చ = పావనస్నానం, పావనస్నానమేవ అవస్థా యస్య సః = పావనస్నానావస్థః, తం = పావనస్నానావస్థం.

దుఃస్థః - దుఃఖే తిష్ఠతీతి = దుఃస్థః.

భావము :

ఈ కలిపురుషుడు ఒంటి దుమ్ముకమ్మిన మనుష్యునిజూచి సంతోషించెను. ఏలయనగా, నతడు నిషిద్ధములైన మేకలు గాడిదలు మున్నగువాని ధూళిచే నొంట నింపుకొనియున్నాడు. కాన పాపి. అతని యాశ్రయము తనకు లభింపగలదని సంతోషించెను. కాని యాతనిని జక్కగా జూడగా నతడు మనువు చెప్పిన పంచవిధస్నానములలో నొక్కటియైన వాయవ్యస్నానమునకై, గోవుల గిట్టల నుండి రేగిన దుమ్ముతో నొడలి నలదుకొనుచు జేయుచున్నాడని గ్రహించి యిత డాస్నానముచే పవిత్రత నొందుటవలన తనకాశ్రయము నొసంగడని యా కలి దుఃఖించెను. మనువు "వారుణం తు జలస్నానం ఆపోహిష్ఠేతి మాన్త్రికం, వాయవ్యం గోరజోస్నాన మాగ్నేయం భస్మనోదితం, యత్తు సాతపవర్షేణ దివ్యం తదితి పంచధా" యని 1. వారుణస్నానము 2. "ఆపోహిష్ఠామయో భువః" యను వానితోటి మన్త్రస్నానము, 3. వాయవ్యస్నానము, 4. ఆగ్నేయ స్నానము, 5. దివ్యస్నానము అనెడి యైదువిధములగు స్నానములను జెప్పి యున్నారు. అందు జలముతోటి స్నానము వారుణము. "ఆపోహిష్ఠామే"త్యాది మంత్రములతో జలమును జల్లుకొనుట మన్త్రస్నానమనియు, గోవులయొక్క గిట్టలనుండి రేగెడి దుమ్ము నొంట బట్టించుకొనుట వాయవ్యస్నానమనియు, శరీర మందు భస్మము నలదుకొనుట యాగ్నేయస్నానమనియు, వర్షముతోడను నెండతోను శరీరమును దాకించుకొనుట దివ్యస్నాన మనియు నెఱుంగవలయును.

శ్లో. అధావత్ క్వాఽపి గాం వీక్ష్య హన్యమానా మయం ముదా,
అతిథిభ్య స్తు తాం బుద్ధ్వా మందం మందో న్యవర్తత. 198

ప. వి. అధావత్-క్వ- అపి-గాం - వీక్ష్య - హన్యమానాం - అయం - ముదా- అతిథిభ్యః-తు-తాం-బుద్ధ్వా-మందం-మందః-న్యవర్తత.

అర్థము : మందః = మూఢుడైన, అయం = ఈ కలిపురుషుడు, క్వాపి = ఒక్క యెడ, గాం = ఆవును, హన్యమానాం = చంపబడుచున్నదానినిగా, వీక్ష్య = చూచి, ముదా = సంతోషముతో, అధావత్ = పరుగిడెను, తు = కాని, తాం = ఆ గోవును, అతిథిభ్యః = అతిథులకొఱకై, హన్యమానాం = చంపబడుదానినిగా, బుద్ధ్వా = తెలిసికొని, మందం = మెల్లగా, న్యవర్తత = మరలెను. ॥198॥

భావము :

మూఢుడైన యీ కలి ఒక ప్రదేశమునందు గోవు చంపబడుచున్నట్లు చూచి, తనకది పాపభూమియగుటవలన సంతసించి యచ్చటికి వేగముగా వెడలెను. కాని యాగోవు యతిథులకై చంపబడుచున్నదని తెలిసికొని కష్టముతో మఱలివచ్చెను. అతిథులకై వడ్డించుటకు గోవధ దోషముకాదు కావున నతడు నిరాశుడాయెను. కావుననే "మహోక్షం వా మహాజం వా శ్రోత్రియా యోపకల్పయేత్" యని శ్రుతి వైదికు నుద్దేశించి యతనికి వడ్డించుటకై గోవును వధించవచ్చునని చెప్పుచున్నది. ॥198॥

శ్లో. హృష్టవాన్ స ద్విజం దృష్ట్వా నిత్యనైమిత్తికత్యజం,
యజమానం నిరూప్యైనం దూరం దీనముఖోఽద్రవత్. 199

ప. వి. హృష్టవాన్-సః-ద్విజం-దృష్ట్వా - నిత్యనైమిత్తికత్యజం - యజమానం-నిరూప్య-ఏనం-దూరం-దీనముఖః-అద్రవత్.

అర్థము : సః = ఆ కలిపురుషుడు, నిత్యనైమిత్తికత్యజం, నిత్య = నిత్యములైన దానాదులను, నైమిత్తిక = నైమిత్తికములైన అగ్నిహోత్రహోమాదులను, త్యజం = వదలుచున్న, ద్విజం = బ్రాహ్మణుని, దృష్ట్వా = చూచి, హృష్టవాన్ = సంతోషించెను. అథ = పిదప, ఏనం = వీనిని, యజమానం = యజ్ఞమందు దీక్షవహించినవానిగా, నిరూప్య = తెలిసికొని, దీనముఖః = దుఃఖితవదనుడై, దూరం = దూరప్రదేశమునకు, అద్రవత్ = పరుగెత్తెను.

భావము :

ఆ రాజధానియందు వేదపఠనముగావించుచున్న వైదికుల ముఖములనుండి వెల్వడు పదసమూహమును వినుచున్న కాలస్వరూపుడగు కలిపురుషుడు అడుగును కూడా పెట్టలేకపోయెను. ఇతడు పాపాత్ముడు కాన వేదశ్రవణముచే నీతనిశక్తి కుంఠితమైపోయినందువలన ముందుకు నడుగుపెట్టలేక పోయెనని యాశయము.

శ్లో. శ్రుతిపాఠకవక్త్రేభ్య స్తత్రాకర్ణయతః క్రమమ్,
క్రమ స్సంకుచిత స్తస్య పురే దూర మవర్తత. 162

ప. వి. శ్రుతిపాఠకవక్త్రేభ్యః-తత్ర-ఆకర్ణయతః-క్రమమ్-క్రమః - సంకుచితః-తస్య-పురే-దూరమ్-అవర్తత.

అర్థము:- తత్ర పురే = ఆ నిషధేశ్వరుని పట్టణమునందు, శ్రుతిపాఠకవక్త్రేభ్యః, శ్రుతిపాఠక = వేదపాఠముచేయువారియొక్క, వక్త్రేభ్యః = ముఖముల నుండి, క్రమం = క్రమపాఠమును, ఆకర్ణయతః = వినుచున్న, తస్య = ఆ కలికి, క్రమః = పాదవిన్యాసము, సంకుచితః = ప్రతిబంధింపబడినదై, దూరం = దూరముగా, అవర్తత = ఉండినది.

సమాసములు :

శ్రుతిపాఠకవక్త్రేభ్యః - శ్రుతేః పాఠకాః = శ్రుతిపాఠకాః, శ్రుతి పాఠకానాం వక్త్రాణి = శ్రుతిపాఠకవక్త్రాణి, తేభ్యః = శ్రుతి పాఠకవక్త్రేభ్యః.

భావము :

ఆ నలునిపట్టణమునందు వేదాధ్యయనము చేయువారి ముఖములనుండి, వెల్వడు క్రమపాఠమును వినుచున్న యాకలిపురుషునికి, పాదములు ప్రతిబంధింప బడినవై, ప్రవేశింప శక్తిలేక, దూరమున నుండిపోయినవి. వేదములయొక్క క్రమపాఠప్రభావముచే నీవిధముగా నేర్పడినదని యాశయము. ॥162॥

శ్లో. తావ ద్గతి ర్ధృతాటోపా పాదయో స్తేన సంహితా,
న వేదపాఠికంఠేభ్యో యావదశ్రావి సంహితా. 163

ప. వి. తావత్-గతిః - ధృతాటోపా - పాదయోః - తేన-సంహితా-న-వేదపాఠి కంఠేభ్యః-యావత్-అశ్రావి-సంహితా.

అర్థము : తావత్ = అంతవఱకును, తేన = ఆ కలిపురుషునిచే, పాదయోః = పాదములయందు, ధృతాటోపా = ఆడంబరముతోగూడిన, గతిః = నడక, సంహితా = ధరింపబడినది. అనగా నవలంబింప సాధ్యమైనదని యర్థము, యావత్ = ఎంతవరకు, వేదపాఠికంఠేభ్యః; వేదపాఠి = వేదములను పఠించువారియొక్క, కంఠేభ్యః = కంఠములనుండి, సంహితా = పదక్రమములనెడి వేదపాఠములకంటె విలక్షణమైన ఋగాది రూపములుగా కలిసి యుచ్చరింపబడు వాక్యసముదాయము, నాశ్రావి = వినబడలేదో.

సమాసములు :

ధృతాటోపా - ధృతః ఆటోపః యయా సా = ధృతాటోపా.
వేదపాఠికంఠేభ్యః - వేదం పఠ న్తీతి = వేదపాఠినః, వేదపాఠినాం కంఠాః = వేదపాఠికంఠాః, తేభ్యః = వేదపాఠికంఠేభ్యః.

భావము :

ఆకలిపురుషుడు, వేదములో సంహితాపాఠమును విననంతవఱకును నాటోపముతో నడువకలిగెను. కాని యెప్పుడు వేదపాఠమును చేయువారి కంఠమునుండి సంహితను వినెనో అపుడుతనపాదములను కదల్పలేకపోయెనని యాశయము. సంహిత యనగా విరామములు లేకుండ వేదములోని పదవాక్యము లను కలిపి పఠించుట. ॥163॥

శ్లో. తస్య హోమాజ్యగంధేన నాసా నాశ మివాగమత్,
తత్రాతతదృశౌ నాసా క్రతుధూమకదర్థితే. 164

ప. వి. తస్య-హోమాజ్యగంధేన-నాసా-నాశం-ఇవ-అగమత్-తత్ర - ఆతత - దృశౌ-న-అసౌ-క్రతుధూమకదర్థితే.

అర్థము: తత్ర=ఆ పట్టణమందు, హోమాజ్యగంధేన, హోమ=హోమమునకు సంబంధించిన, ఆజ్య=నేయియొక్క, గంధేన=పరిమళముచే, తస్య= ఆ కలియొక్క, నాసా = ముక్కు, నాశం=వినాశమును, అగమదివ =పొందినదో యనునట్లుండెను. తథా=అట్లే, అసౌ=ఈ కలి, క్రతుధూమకదర్థితే; క్రతుధూమ=యాగధూమముచేత, కదర్థితే= పీడింపబడిన, దృశౌ=కన్నులు, నాతత=తెఱచుటకు శక్తుడు కాలేదు.

సమాసములు :

హోమాజ్యగంధేన - హోమస్య ఆజ్యం=హోమాజ్యం, హోమాజ్యస్య గంధః=హోమాజ్యగంధః, తేన=హోమాజ్యగంధేన.
క్రతుధూమకదర్థితే - క్రతోః ధూమః=క్రతుధూమః, క్రతుధూమేన కదర్థితే=క్రతుధూమకదర్థితే, తే=క్రతుధూమకదర్థితే.

భావము :

ఆ పట్టణమందు హోమముచేయబడిన ఘృతములయొక్క పరిమళములచే నీకలిపురుషునియొక్క ఘ్రాణేంద్రియము నాశము నొందినది. యజ్ఞమందలి పొగచే, గ్రుడ్డితనమును పొందిన కన్నులనుగూడ, నా కలిపురుషుడు తెఱచుటకు శక్తుడు కాలేదు.

శ్లో. అతిథీనాం పదామ్భోభి రిమం ప్రత్యతిపిచ్ఛిలే,
అఙ్గణే గృహిణా మత్ర ఖలేనానేన చస్ఖలే. 165

ప. వి. అతిథీనాం-పదామ్భోభిః-ఇమం-ప్రతి-అతిపిచ్ఛిలే-అఙ్గణే - గృహిణాం - అత్ర-ఖలేన-అనేన-చస్ఖలే.

అర్థము: అత్ర=ఈ పట్టణమందు, అతిథీనాం=గృహములకు వచ్చినట్టి బాట సారులయొక్క, పదామ్భోభిః=పాదములను కడిగిన యుదకములచే,

ఇమం=ఈ కలిపురుష నుద్దేశించి, (యనగా ధార్మికుల నుద్దేశింపక) అతిపిచ్ఛిలే=నీట తడియుటచే నునుపైనట్టి, గృహిణాం=గృహస్థుల యొక్క, అజ్గణే=ముంగిట, ఖలేన=దుష్టుడైన, అనేన = ఈ కలి పురుషునిచే, చస్ఖలే=జారిపడుట యేర్పడినది.

సమాసములు :

పదామ్భోభిః-పదేషు అంభాంసి=పదాంభాసి, తైః=పదామ్భోభిః.
అతిపిచ్ఛిలే-అత్యంతం పిచ్ఛిలం=అతిపిచ్ఛిలం, తస్మిన్=అతిపిచ్ఛిలే.

భావము :

ఆ పట్టణమందు గృహమునకు వచ్చునట్టి బాటసారులయొక్క పాదములను కడుగుటచే పారెడు నుదకములచే, నిత్యము తడిసి నునుపైనట్టి గృహస్థుల ఇండ్లముంగిలియందు నితడు జారిపడుచుండెను. ధార్మికుల విషయమున నాముంగిళ్ళు నునుపెక్కక యుండుటవలన వారీవిధముగా జారిపడుట లేదు. అధార్మికుడగు కలిపురుషునికి మాత్రమే యిట్టి పతనము లేర్పడుచుండినవి.

శ్లో. పుటపాక మివ ప్రాప క్రతుశుష్మమహోష్మభిః,
తత్రత్యజ్గ మివాకర్తి పూర్తోర్మివ్యజినానిలైః. 166

ప. వి. పుటపాకమ్-ఇవ-ప్రాప-క్రతుశుష్మమహోష్మభిః, - తత్రత్యజ్గం-ఇవ - అకర్తి-పూర్తోర్మివ్యజినానిలైః.

అర్థము: క్రతుశుష్మమహోష్మభిః; క్రతు=యాగములయందలి, శుష్మ=అగ్ని యొక్క, మహోష్మభిః=అధిక సంతాపములచే, (కలిః=కలిపురుషుడు) పుటపాకం=పైన క్రింద మూతపెట్టి కల్గించెడి మంటను, ప్రాపేవ= పొందెనో యనునట్లుండెను, తథా=అట్లే, పూర్తోర్మివ్యజనానిలైః, పూర్త=నడబావులు తటాకములు మున్నగువానియందలి, ఊర్మి= కెరటము లనెడి, వ్యజన=విసనకఱ్ఱలయొక్క, అనిలైః= తెమ్మెరలచే,

తత్ప్రత్యఙ్గం—, తత్ = ఆ కలియొక్క, ప్రత్యఙ్గం = అవయవ సమూహము, అకర్తి ఇవ = కోయబడుచున్నదో యనునట్లుండినది.

సమాసములు :

పుటపాకం -పుటయోః పాకః = పుటపాకః, తం = పుటపాకం.
క్రతుశుష్మమహోష్మభిః-క్రతుషు శుష్మాః = క్రతుశుష్మాః, క్రతు శుష్మాణాం మహోష్మాణః = క్రతుశుష్మమహోష్మాణః, తైః-క్రతు శుష్మమహోష్మభిః,
తత్ప్రత్యఙ్గం-అఙ్గ మఙ్గం = ప్రత్యఙ్గం, తస్య ప్రత్యఙ్గం = తత్ప్రత్యఙ్గం.
పూర్తోర్మివ్యజనానిలైః - పూర్తానాం ఊర్మయః = పూర్తోర్మయః, పూర్తోర్మయ ఏవ వ్యజనాః = పూర్తోర్మివ్యజనాః, పూర్తోర్మివ్యజనానాం అనిలాః = పూర్తోర్మివ్యజనానిలాః, తైః = పూర్తోర్మివ్యజనానిలైః.

భావము :

ఆ నగరమందలి యాగములలోని యగ్నులవలని గొప్పవేడిచే, నా కలి పురుషుడు పుటపాకమువలని తాపమును బొందినట్లు తీవ్రతాపమునను గుఱియా యెను. పుటపాక మనగా అడుగుభాగమున పైభాగమున సంపుటము లుంచి వాని సందులలో మన్నును పూసి, చేసెడి మందుల వంట పుటపాక మనబడును. ఇది మిక్కిలి వేడిని పుట్టించి మందును బక్వము గావించును. ఆ విధమగు పుటపాకము కలిపురుషున కేర్పడినట్లుండినది. అట్లే యానగరమందలి నడబావులు చెరువులు మున్నగువానియందలి, కెరటము లనెడి విసనకఱ్ఱలనుండి వచ్చెడి గాలికి యా కలిపురుషుని శరీరమందలి యవయవములన్నియు కోయబడుచున్న ట్లుండినవని యాశయము. ॥166॥

శ్లో. పితౄణాం తర్పణే వర్ణైః కీర్ణాత్ వేశ్మని వేశ్మని,
కాలాదివ తిలాత్ కాలా ద్దూర మత్రసదత్ర సః. 167

ప. వి. పితౄణాం-తర్పణే- వర్ణైః- కీర్ణాత్- వేశ్మని- వేశ్మని- కాలాత్- ఇవ- తిలాత్-కాలాత్-దూరం-అత్రసత్-అత్ర-సః.

అర్థము: సః=ఆ కలిపురుషుడు, అత్ర=ఈ పట్టణమందు, వేశ్మని వేశ్మని= ఇంటింటను, వర్ణైః=బ్రాహ్మణులు మున్నగు నాలుగు వర్ణముల వారిచే, పితౄణాం=పితృ పితామహ ప్రపితామహులకును, అగ్నిష్వాత్తాది పితృ లోకములకును, తర్పణే = వారి నుద్దేశించి వారి తృప్తికై చేయు జలప్రదానకర్మయందు, కీర్ణాత్=రాలినట్టి, కాలాత్=నల్లని, తిలాత్= నువ్వునుండి, కాలాదివ=యమునినుండి యెట్లో యట్లు, అత్రసత్= భయపడెను.

సమాసములు :

పితౄణాం-పితా చ పితామహశ్చ ప్రపితామహశ్చ=పితరః, తేషాం= పితౄణాం.

భావము :

ఆ కలి పురుషు డీ పట్టణమందు బ్రాహ్మణులు మున్నగు నాలుగు వర్ణములవారును తండ్రులకును, తాతలకును, ముత్తాతలకును, నగ్నిష్వాత్తాదుల కును తృప్తి గల్గించుటకై వదిలిపెట్టు తర్పణములనుండి రాలినట్టి నల్లని నువ్వుల నుండి మృత్యువునుండి యెట్లో యట్లు భయపడెను. అనగా నామంత్రపూతము లగు నువ్వులు పవిత్రములై ప్రభావముతో గూడి యా యపవిత్రుడగు కలిని భయపఱచినవని యర్థము. ॥167॥

శ్లో. స్నాతౄణాం తిలకైర్మేనే స్వమన్తర్దీర్ణమేవ సః,
కృపాణీభూయ హృదయం ప్రవిష్టైరివ తస్య తైః 168

ప. వి. స్నాతౄణాం-తిలకైః-మేనే-స్వమ్-అన్తః-దీర్ణం-ఏవ-సః-కృపాణీ భూయ-హృదయం-ప్రవిష్టైః-ఇవ-తస్య-తైః.

అర్థము: కృపాణీభూయ=ఖడ్గముగా నేర్పడి, తస్య=ఆ కలిపురుషునియొక్క, హృదయం=వక్షఃస్థలమును, ప్రవిష్టైః=ప్రవేశించినవో యనునట్లున్న,

స్నాతౄణాం=స్నానము చేయువారియొక్క, తిలకైః=నామములు మున్నగువానిచే, సః=ఆ కలిపురుషుడు, స్వం=తన్ను, అంతః=వక్షఃస్థలమునందు, దీర్ణమేవ=చీల్చబడినవానినిగనే, మేనే=తలంచెను.

సమాసములు :

స్నాతౄణాం - స్నాన్తీతి=స్నాతారః, తేషాం=స్నాతౄణాం.
కృపాణీభూయ - అకృపాణః కృపాణః సమ్పద్యమానః భూత్వా = కృపాణీభూయ.

భావము :

ఊర్ధ్వపుండ్రములు అనగా నిలువుగా నుండెడి కత్తులవలె నుండెడు, ముఖము నందలి నామముల వంటి తిలకములు స్నానకాలములో తొలగిపోయి యా కలిపురుషునియందు ప్రవేశించి యాతని వక్షఃస్థలమును చీల్చెనో యనునట్లు ఆతడు తలంచెనని యాశయము. ॥168॥

శ్లో. పుమాంసం ముముదే తత్ర విందన్ మిథ్యావదావదమ్,
స్త్రియం ప్రతి తథా వీక్ష్య తమథ మ్లానవా నయమ్. 169

ప. వి. పుమాంసం-ముముదే-తత్ర-విందన్-మిథ్యావదావదమ్- స్త్రియం- ప్రతి- తథా-వీక్ష్య-తం-అథ-మ్లానవాన్-అయం.

అర్థము:- అయం- ఈ కలిపురుషుడు, తత్ర=ఆ పట్టణమునందు, మిథ్యావదావదం, మిథ్యా=అసత్యమును, వదావదం=చెప్పుచున్న, పుమాంసం=పురుషుని, విందన్=పొందుచు అనగా నసత్యమును చెప్పెడి జనమును జూచుచు, ముముదే=సంతోషించెను, అనగా నట్టి యసత్యవాదుల ద్వారమున ప్రవేశింపగోరెను అని యర్థము. అథ = సంతోషించిన పిదపనే, తం=ఆ పురుషుని, స్త్రియం ప్రతి=స్త్రీని గురించి, తథా=ఆవిధముగ నసత్యము జెప్పువానినిగా,వీక్ష్య=చూచి,యనగా యాస్త్రీనిగూర్చి పరిహాస వచనముగా తెలిసికొని, మ్లానవాన్= దుఃఖించెను. స్త్రీలోడ నర్మసల్లాప

మం దసత్యము దోషము కాదు కాన కలి, తనప్రవేశమున కవకాశములు లేనందువలన దుఃఖించెనని యర్థము.

సమాసములు :

మిథ్యావదావదం - మిథ్యా వదతీతి=మిథ్యావదావదః, తం=మిథ్యావదావదం.

భావము :

ఈ కలిపురుషుడు, ఆ నగరమందు అసత్యము జెప్పు పురుషుని బొంది, తన ప్రవేశమునకు ద్వారము దొరికినది గదా యని సంతసించెను. కాని తర్వాత యాపురుషుడు స్త్రీతో నర్మాలాపములు చేయునప్పుడే యసత్యము చెప్పుటవలన తన ప్రవేశమున కవకాశములేదని గ్రహించి దుంఖించెను. పురుషుడు స్త్రీతో నర్మాలాపసమయమునందు అసత్యము జెప్పినను దోషము లేదు. కావున అచ్చట కలికి ప్రవేశించుట కవకాశము లేకపోవుటవలన నతడు విషాదము నొందెనని యాశయము. ॥169॥

శ్లో. యజ్ఞయూపఘనాం జజ్ఞౌ స పురం శఙ్ఖసంకులాం,
జనై ర్ధర్మఘనైః కీర్ణాం వ్యాలక్రోడీకృతాంచితామ్. 170

ప. వి. యజ్ఞయూపఘనాం-జజ్ఞౌ-సః-పురం-శఙ్ఖసంకులాం-జనైః-ధర్మఘనైః-కీర్ణాం-వ్యాలక్రోడీకృతాం-చ-తామ్.

అర్థము:- సః=ఆ కలిపురుషుడు,యజ్ఞయూపఘనాం=యజ్ఞయాగములకు సంబంధించిన, యూప=యజ్ఞపశువును గట్టుటకు సాధనమైన స్తంభములచే, ఘనాం=సందులేనిదైన, పురం=ఆ నలునిపట్టణమును,శంఖసంకులాం=శంఖములను నాయుధములతోఁ గూడినదో యనువిధముగను, తథా=అట్లే, ధర్మఘనైః=ధర్మాచరణముతో నిండినట్టి, జనైః=జనములతో, కీర్ణాం=వ్యాపింపబడిన, తాం=ఆ పురమును, వ్యాలక్రోడీకృతామివ, వ్యాల=పాములచే, క్రోడీకృతా మివ చ=అంకముగా చేయబడినదానినిగను, జజ్ఞౌ=తెలిసికొనెను.

సమాసములు :

యజ్ఞయూపఘనాం- యజ్ఞస్య యూపాః=యజ్ఞయూపాః, యజ్ఞయూపైః ఘనాః=యజ్ఞయూపఘనాః, తాం=యజ్ఞయూపఘనాం.
శఙ్ఖసంకులాం - శఙ్ఖైః సంకులా=శఙ్ఖసంకులా, తాం=శఙ్ఖసంకులాం.
ధర్మఘనైః - ధర్మేణ ఘనాః=ధర్మఘనాః, తైః=ధర్మఘనైః.
వ్యాలక్రోడీకృతాం- వ్యాలైః క్రోడీకృతా=వ్యాలక్రోడీకృతా, తాం=వ్యాలక్రోడీకృతాం.

భావము :

ఆ నలుని నగరము యజ్ఞపశువును బంధించెడి యూప స్తంభములతో నిండియున్నవి. దానిని చూచి కలిపురుషుడు శంఖాయుధములతో గూడిన దానినిగా భావించెను. అట్లే ధర్మాచరణపరులగు జనులతో నిండిన యానగరమును జూచి క్రూరసర్పములతో గూడినదానినిగా భావించెను. ఆ కలిపురుషుని దృష్టియందు మంచివిషయము లన్నియు చెడ్డవిగా గానబడుచుండినవని యాశయము. ॥170॥

శ్లో. స పార్శ్వ మశకత్ గన్తుం న వరాకః పరాకిణాం,
మాసోపవాసినాం ఛాయాలంఘనే ఘన మస్ఖలత్. 171

ప. వి. సః-పార్శ్వం-అశకత్-గన్తుం-న-వరాకః-పరాకిణాం-మాసోపవాసినాం-ఛాయాలంఘనే-ఘనమ్-అస్ఖలత్.

అర్థము:- వరాకః=నీచుడైన, సః=ఆ కలిపురుషుడు, పరాకిణాం=పండ్రెండు దినము లుపవాసముతో గావించెడి పరాకమను వ్రతము నాచరించువారి యొక్క, పార్శ్వం=ప్రక్కను గురించి, గన్తుం=వెడలుటకు, న అశకత్=శక్తుడు కాలేదు. తథా=అట్లే, మాసోపవాసినాం=నెలదినము లుపవసించి వ్రతమునాచరించువారియొక్క, ఛాయాలంఘనే, ఛాయా=నీడను, లంఘనే=దాటుటయందును, ఘనం=మిక్కిలి, అస్ఖలత్=పడెను, తాపసులనీడ నతిక్రమించుటయు నసాధ్యము.

సమాసములు :

పరాకిణాం-పరాకః ఏషా మస్తీతి = పరాకిణః, తేషాం = పరాకిణాం.

మాసోపవాసినాం-మాసం ఉపవసన్తీతి = మాసోపవాసినః, తేషాం = మాసోపవాసినాం.

ఛాయాలంఘనే-ఛాయాయాః లంఘనం = ఛాయాలంఘనం, తస్మిన్ = ఛాయాలంఘనే.

భావము :

నీచుడైన యా కలిపురుషుడు, పంద్రెండు దినము లొక్కపొద్దులు గావించి పరాకవ్రతమును గావించువారి చెంతలకును పోలేకపోయెను. అట్లే నెలదినము లొక్కప్రొద్దులుండి వ్రతము నాచరించు వారియొక్క నీడను కూడా దాటుటకు సమర్థుడు కాకపోయెను. ॥171॥

శ్లో. ఆవాహితాం ద్విజై స్తత్ర గాయత్రీ మర్కమండలాత్,
న సన్నిదధతీం పశ్యన్ దృష్టనష్టోఽభవ ద్భియా. 172

ప. వి. ఆవాహితాం-ద్విజైః-తత్ర-గాయత్రీం- అర్కమణ్డలాత్ - న - సన్నిదధతీం-పశ్యన్-దృష్టనష్టః-అభవత్-భియా.

అర్థము: సః = ఆ కలిపురుషుడు, తత్ర = ఆ నగరమందు, ద్విజైః = విప్రులచే, ఆవాహితాం = ఆవాహనము గావించబడిన యనగా పిలువబడిన, (కావుననే) అర్కమండలాత్ = సూర్యబింబమునుండి, సన్నిదధతీం = సమీపించుచున్న, గాయత్రీం = గాయత్రీదేవిని, పశ్యన్ = చూచుచు, భియా = ఆ దేవత యొక్క ప్రభావమువలని భయముచే, దృష్టనష్టః, దృష్ట = తొలుత చూడబడినవాడై, నష్టః = పిదప నంతర్ధానము జెందినవాడుగా, అభవత్ = ఆయెను.

సమాసములు :

అర్కమణ్డలాత్ - అర్కస్య మణ్డలం = అర్కమణ్డలం, తస్మాత్ = అర్కమణ్డలాత్.
దృష్టనష్టః-దృష్ట శ్చాసౌ నష్టశ్చ=దృష్టనష్టః.

భావము :

ఆ కలిపురుషుడు, ఆ నగరమందు విప్రులు ఆవాహనము గావించిన గాయత్రీదేవి సూర్యమణ్డలమునుండి వారియొద్దకు సమీపించు చుండినది. ఆమెను ఆ కలిపురుషుడు గాంచుచు నామెయొక్క ప్రభావముచే భయము జెంది తొలుత కనపడియు, పిదప గనపడక మఱుగు చెందెను. ॥172॥

శ్లో. స గృహే గృహిణాం పూర్ణే ఘనే వైఖానసై ర్వృతే,
యత్యాధారేఽమరాగారే క్వాపి న స్థాన మానశే. 173

ప. వి. సః-గృహే-గృహిణాం-పూర్ణే-ఘనే-వైఖానసైః-వృతే - యత్యాధారే - అమరాగారే-క్వ-అపి.న-స్థానం-ఆనశే.

అర్థము: సః=ఆ కలిపురుషుడు, గృహిణాం=గృహస్థులచే, పూర్ణే=నిండిన, గృహే=ఇంటను, వైఖానసైః=వైఖానసులను వనవాసులైన తాపసులచే, వృతే=పరివేష్టితమైన, ఘనే=ఘనమైన ప్రదేశమందును, లేదా, ''వనే'' యను పాఠాంతరము ననుసరించినచో, వనే = వనమునందు, తథా=అట్లే, యత్యాధారే, యతి=సన్న్యాసులకు, ఆధారే = నివాస స్థలమునందును, అమరాగారే = దేవాలయమందును, క్వాఽపి = ఎచ్చటను, స్థానం=స్థితిని, న ఆనశే=పొందలేదు.

సమాసములు :

గృహిణాం-గృహ మేషా మస్తీతి గృహిణః, తేషాం=గృహిణాం.
యత్యాధారే-యతీనాం ఆధారః=యత్యాధారః, తస్మిన్-యత్యాధారే.

అమరాగారే-అమరాణాం ఆగారం = అమరాగారం, తస్మిన్=అమరాగారే.

భావము :

ఆ కలిపురుషుడు, గృహస్థుల ఇండ్లయందును, తాపసులచే గూడిన వనమునందును, సన్న్యాసుల నిలయములయందును, దేవాలయము లందును, నెచ్చటను స్థితిని బొందలేదు. ॥173॥

శ్లో. హింసాగవీం మఖే వీక్ష్య రిరంసు ర్ధావతి స్మ సః
సా తు సౌమ్య వృషాసక్తా ఖరం దూరం నిరాస తమ్. 174

ప.వి. హింసాగవీం- మఖే- వీక్ష్య- రిరంసుః - ధావతి- స్మ- సః- సా- తు- సౌమ్యవృషాసక్తా-ఖరం-దూరం-నిరాస-తమ్.

అర్థము : సః=ఆ కలిపురుషుడు, మఖే=గోమేధమను యజ్ఞమందు, హింసాగవీం=హింసింపబడుటకై యున్న గోవును, వీక్ష్య=చూచి, రిరంసుః=తన మనస్సునకు వినోదము గోరినవాడై, అనగా నిషేధింపబడిన గోహింస నాకు ఇష్టమని, ధావతి స్మ=పరుగిడుచుండెను. సా తు=ఆ చంపబడు గోవో, సౌమ్యవృషాసక్తా, సౌమ్య = సోమదేవతాకమైన, వృష=ధర్మమందు, ఆసక్తా=సంబంధము కల్గినదై, లేదా, సౌమ్య=అభిచారము మున్నగు దుష్టకర్మలు లేనందువలన రమణీయమైన, పారలౌకికమగు, వృష=ధర్మమునకు. ఆసక్తా=సాధనముగా సంబంధించినదై, ఖరం=పాపరూప మైనందువలన సహింపసాధ్యముకాని, లేదా— ''రలయోరభేదః'' అను న్యాయము చొప్పున, ఖలం = దుష్టుని, దూరం=దూరముగా, నిరాస=నిరాకరించెను. తొలుత నధర్మసాధకమగు గోహింసను గాంచి ప్రవర్తించి, పిదప ధర్మసాధకమగు వైదిక పశుహింసాదికముగా చూచి యిది నాకు ప్రియమైన హింసగాదని దూరముగా పోయెనని యర్థము. ''మఖే'' యను స్థానమున, ''ముఖే'' యను పాఠము ననుసరించినచో, హింసాగవీం=హింసను ప్రతిపాదించెడి

వాక్కును, ముఖే = యజ్ఞమును చేయువారి ముఖమునందు, వీక్ష్య = చూచి, అనగా వారి ముఖమునుండి విని, రిరంసుః = ఆనందింపగోరువాడై, ధావతి, స్మ = పరుగిడుచుండె నని యర్థము. సా తు = ఆ వాక్కు, సౌమ్యవృషాసక్తాసతీ = సౌమ్యమైన ధర్మమందు ఆసక్తిగల్గినదై, తం = వానిని, అఖరం = తేజోరహితునిగా, నిరాస = నిరాకరించినది. లేదా, రిరంసుః = క్రీడయందు గోరిక కల్గిన, ఖరః = గాడిద, (హింసా) గవీం = (హింసింపదగిన) గోవును, వీక్ష్య = చూచి, యద్యపి = ఒకవేళ, ధావతి = పరుగిడును, సా = ఆ గోవు, సౌమ్యవృషాసక్తా, సౌమ్య = అందమైన, వృష = ఎద్దుపైన, ఆసక్తా = ఆసక్తిగలదై, తం = అ గాడిదను, దూరం = దూరముగా, నిరాస = నిరాకరించెను.

భావము :

ఆ కలిపురుషుడు గోమేధమను యజ్ఞమునందు హింసించుటకై తేబడియున్న యావును జూచి, దానితో మనసునకు వినోదము బొందగోరినవాడై (దానితో విహరింపగోరినవాడై) దాని యొద్దకు పరుగిడుచుండెను. ఏలయనగా, గోవధ తన కిష్టమైనదని ప్రథమ పక్షమున, తన పశుస్వభావముచే గోవుతో రమింపగోరుట తన కిష్టమైనదని ద్వితీయపక్షమున యభిప్రాయము. ఆ గోవో, సోమదేవతాకమగు ధర్మమునందు, యాగమునందు సంబంధము గల్గినదై, యనగా ధర్మాభిలాషగలిగినదై (సుందరవృషభముచే సాంగత్యము నొందినదై) ఖరుడైన యనగా "రలయో రభేదః" యను న్యాయము ననుసరించి రాకును లాకును భేదములేదు కావున, ఖలుడైన, యనగా దుష్టుడు లేదా క్రూరుడునైన, (ఖరమైన యనగా గార్దభమైన) యా కలిపురుషుని దూరముగా బడునట్లు తన్నినది. ఎద్దుతో సంగమించెడి యావు, తనకంటె వేఱొక జాతికి జెందిన గాడిదను నిరాకరించుట యుక్తమే గదా? అనగా నా కలిపురుషుడు గోవధ నభినందింపగోరుటవలన జాతిహీనుడనియు, నా గోవుతో సంగమింపబూనుటచే, పశుప్రవృత్తి గలవా డనియు ద్యోతితము.

శ్లో. క్వాఽపి నాఽపశ్య దన్విష్యన్ హింసా మాత్మప్రియా మసౌ,
స్వమిత్రం తత్ర న ప్రాప దపి మూర్ఖముఖే కలిమ్. 175

ప.వి. క్వ-అపి-న-అపశ్యత్-అన్విష్యన్ - హింసామ్- ఆత్మప్రియాం-అసౌ -
స్వమిత్రం-తత్ర-న-ప్రాపత్-అపి-మూర్ఖముఖే-కలిమ్.

అర్థము : అసౌ = ఈ కలిపురుషుఁడు, క్వాఽపి = ఏ స్థానమందును, ఆత్మనః = తనకు, ప్రియాం = ప్రియమైన, హింసాం = హింసను, అన్విష్యన్ = వెదకుచున్నను, నాఽపశ్యత్ = చూడలేదు, తథా = అట్లే, మూర్ఖముఖే = మూఢునినోటను, స్వమిత్రం = . స్వ = కలియైన తనకు, మిత్రం = సఖుడైన, కలిం చ = కలహమును, న ప్రాపత్ = పొందలేదు. ప్రజలు చక్కగా పరిపాలింపబడుటవలన కలహమునకు ప్రసక్తిలేదని యర్థము.

సమాసములు :

ఆత్మప్రియాం-ఆత్మనః ప్రియా = ఆత్మప్రియా, తాం = ఆత్మప్రియాం.
స్వామిత్రం-స్వస్య మిత్రం = స్వామిత్రం, తత్ = స్వమిత్రమ్.
మూర్ఖముఖే-మూర్ఖస్య ముఖం = మూర్ఖముఖం, తస్మిన్ = మూర్ఖముఖే.

భావము:

ఈ కలిపురుషుడు, ఆ నగరమందెచట వెదికినను తనకు ప్రియమైన హింసను చూడలేదు. అట్లే మూర్ఖునినోట కూడా తనకు చెలికాడైన కలహమును బొందలేదు. అనగా నా యూరియందు మంచి పరిపాలనచే ప్రశాంతి నెలకొని యుండుటవలన ప్రజలలో కలహము లేదని యాశయము. కలిపురుషునకు కలహము ప్రియసఖుడు. అనగా నెచ్చట కలియుండునో యచ్చట కలహముండు నని యభిప్రాయము ॥175॥

శ్లో. మౌనేన వ్రతనిష్ఠానాం స్వాక్రోశం మన్యతే స్మ సః,
వన్ద్యవన్ద్యారుభి ర్జజ్ఞౌ స్వశిరశ్చ పదాహతమ్. 176

ప. వి. మౌనేన-వ్రతనిష్ఠానాం-స్వాక్రోశం-మన్యతే-స్మ- సః- వన్ద్యవన్ద్యారుభిః-జజ్ఞౌ-స్వశిరః-చ-పదా-హతమ్.

అర్థము :-సః=ఆ కలిపురుషుడు, వ్రతనిష్ఠానాం, వ్రత=నియమములయందు, నిష్ఠానాం=ఆసక్తి కలిగిన, వారియొక్క మౌనేన=వాక్కును నియమించుకొనుటచే, స్వాక్రోశం, స్వ=తనకు, ఆక్రోశం=శాపముగా, మన్యతే స్మ=తలచుచుండెను, తథా=అట్లే, వన్ద్యవన్దారుభిః, వన్ద్య=నమస్కరింపదగినవారిని, వన్దారుభిః=నమస్కరించునట్టి వారిచే, స్వశిరశ్చ=తన తలను, పదాహతం=పాదములచే కొట్టబడిన దానినిగా, జజ్ఞౌ=తెలుసుకొనెను. ఇవి యన్నియు శాస్త్రోక్త విషయములను పరిపాలించుట యగుచున్నవి. కాని యట్లు శాస్త్రవిధిపాలన యతని కావిధముగా దుఃఖమును కల్గించుచుండినదని యర్థము.

సమాసములు :

వ్రతనిష్ఠానాం - వ్రతే నిష్ఠా యేషాం తే=వ్రతనిష్ఠాః, తేషాం=వ్రతనిష్ఠానాం.
స్వాక్రోశం-స్వస్య-ఆక్రోశః=స్వాక్రోశః, తం=స్వాక్రోశం.
వన్ద్యవన్దారుభిః - వన్ద్యానాం వన్దారవః=వన్ద్యవన్దారవః, తైః = వన్ద్యవన్దారుభిః.
స్వశిరం - స్వస్య శిరః=స్వశిరః, తత్=స్వశిరః.
పదాహతమ్-పదేన ఆహతం=పదాహతం, పత్=పదాహతం.

భావము :

వ్రతాచరణకై మౌనము వహించిన యుపాసకులను గాంచి, యీ కలి పురుషుడు, వారు తన్ను శపించుచున్న వారినిగా భావించెను. పెద్దలకు వందనము చేయువారిచే తన శిరము వారి పాదముచే కొట్టబడినదిగా భావించెను. అనగా శాస్త్రోక్తవిధు లన్నియు నితనికి దుఃఖప్రదములుగా నుండినవని యాశయము. ॥176॥

శ్లో. మునీనాం స బృసీః పాణౌ పశ్య న్నాచామతా మపః,
మేనే ఘనై రమీ హస్తం శప్తుం మా మద్భి రుద్యతాః. 177

ప. వి. మునీనాం-సః-బృసీః-పాణౌ-పశ్యన్-ఆచామతాం - అపః-మేనే-ఘనైః-
అమీ-హన్తుం-శప్తుం-మాం-అద్భిః-ఉద్యతాః.

అర్థము:-సః-ఆ కలిపురుషుడు, మునీనాం=మునులయొక్క, పాణౌ=హస్తము నందు, బృసీః=కూర్చుండుటకై తీసికొనబడిన ఆసనములను, తథా= అట్లే, ఆచామతాం=ఆచమనము చేయుచున్న, ఏషాం=వీరియొక్క, పాణౌ=హస్తమందలి, అపః=ఉదకములను, పశ్యన్=చూచుచు, అమీ=ఈ మునులు, మాం=నన్ను, ఘనైః=ముద్గరములనెడి యాయుధ ములతో, హన్తుం=కొట్టుటకు, తథా=అట్లే, అద్భిః=ఉదకములతో, శప్తుం చ=శపించుటకును, ఉద్యతా ఇతి=ప్రయత్నించిరా యని, మేనే=తలంచెను.

భావము :

ఆ కలిపురుషుడు ఋషులు కూర్చుండుటకై యాసనములను చేత బట్టుటను జూచి, వారు తన్ను ముద్గరాయుధములతో కొట్టుటకు ప్రయత్నించిరా యనియు, నట్లే యాచమనమును గావించుటకు వారిచేత నున్న యుదకములను గావించి, తన్ను వారు శపించుటకుఁ బూనిరా యనియు భావించెను. ॥177॥

శ్లో. మౌఞ్జీభృతో ధృతాషాఢా నాశశఙ్కే స వర్ణినః,
రజ్జ్వాఽమీ బద్ధుమాయాన్తి హన్తుం దండేన మాం తతః.

ప. వి. మౌఞ్జీభృతః-ధృతాషాఢాన్ - ఆశశఙ్కే - సః-వర్ణినః-రజ్జ్వా-అమీ-బద్ధుమ్-ఆయాన్తి-హన్తుం-దండేన-మాం-తతః.

అర్థము :-సః= ఆ కలిపురుషుడు, మౌఞ్జీభృతః; మౌఞ్జీ = ముంజత్రాటితో పేనిన మొలత్రాటిని, భృతః = ధరించినట్టివారును, ధృతాషాఢాన్, ధృత=ధరించబడిన, ఆషాఢాన్ = మోదుగ కఱ్ఱలు కల్గినవారునగు, వర్ణినః = బ్రహ్మచారులును, (దృష్ట్వా=చూచి) అమీ=ఈ బ్రహ్మ చారులు, మాం=నన్ను, రజ్జ్వా=త్రాటితో, బద్ధుం=బంధించుటకు తతః=బంధించినపిదప, దండేన=మోదుగు కఱ్ఱతో, హన్తుం=కొట్టుట

కును, ఆయాన్తి=వచ్చుచున్నారు, ఇతి=అని, ఆశశఙ్కే=సందే హించెను.

సమాసములు :

మౌఞ్జీభృతః - ముంజస్య వికారః = మౌఞ్జీ, మౌఞ్జీం బిభ్రతీతి = మౌఞ్జీభృతః.
ధృతాషాఢాన్ - ధృతః ఆషాఢః యై స్తే = ధృతాషాఢాః, తాన్= ధృతాషాఢాన్.

భావము :

ఆ కలిపురుషుడు, ముంజత్రాటితో పేనబడిన మొలనూలు ధరించినట్టి వారును, పలాశదండమును ధరించువారును నగు బ్రహ్మచారులను జూచి వీరు తన్నుత్రాటితో గట్టివేయుటకును, పలాశదండముతో కొట్టుటకును వచ్చుచున్నా రని సందేహించి బాధపడెను.॥178॥

శ్లో. దృష్ట్వా పురః పురోడాశ మాసీ దుత్త్రాసదుర్మనాః,
మన్వానః ఫణినీ స్త్రస్తః స ముమోచా శ్రు చ స్రుచః. 179

ప. వి. దృష్ట్వా-పురః-పురోడాశం-ఆసీత్-ఉత్త్రాసదుర్మనాః-మన్వానః-ఫణినీః-త్రస్తః-సః-ముమోచ-అశ్రు-చ-స్రుచః.

అర్థము:- సః=ఆ కలిపురుషుడు, పురః=ఎదుట, పురోడాశం=యజ్ఞమునకు సంబంధించిన పిండిముద్దను, దృష్ట్వా = చూచి, ఉత్త్రాసదుర్మనాః, ఉత్త్రాస=భయముచే, దుర్మనాః=కలతచెందిన మనస్సుగలవాడుగా, ఆసీత్ = ఆయెను. తన్ను గొట్టుటకై సిద్ధముచేయబడిన జాయి యని భ్రమించి భయపడెనని యర్థము. తథా=అట్లే, స్రుచశ్చ=హోమ పాత్రములను, ఫణీనీః=ఆడపాములనుగా, మన్వానః=తలంచుచున్న వాడై, త్రస్తః=భయము చెందినవాడగుచు, అశ్రు = కన్నీటిని, ముమోచ=వదలిపెట్టెను.

వి. పురోడాశమును కొట్టుటకు సాధనమైన శిలయనియు, హోమపాత్రములగు స్రుక్కులను నాదపాములుగాను భ్రాంతిపడుటవలన భ్రాంతిమదలజ్జారము.

సమాసములు :

ఉత్త్రాసదుర్మనాః - ఉత్త్రాసేన దుష్టం మనః యస్య సః = ఉత్త్రాస దుర్మనాః.
ఫణినీః - ఫణాః ఆసాం సన్తీతి = ఫణిన్యః, తాః = ఫణినీః.

భావము :

ఆ కలిపురుషుడు ఎదుట యాగమునందు వ్రేల్చెడి పురోడాశ మనెడి పిండి ముద్దను జూచి తన్ను గొట్టుటకై సిద్ధపరచబడిన జాయిగా భావించి బెగడొంది వ్యధ చెందెను. మఱియు హోమపాత్రలైన స్రుక్కులను గాంచి యాడపాములని భయముజెంది కన్నీటిని విడిచిపెట్టెను. ॥179॥

శ్లో. ఆనంద న్మదిరాదానం విన్ద న్నేష ద్విజన్మనః
దృష్ట్వా సౌత్రామణీ మిష్టిం తం కుర్వ న్త మదూయత. 180

ప. వి. ఆనందత్-మదిరాదానం-విన్దన్-ఏష-ద్విజన్మనః-దృష్ట్వా-సౌత్రామణీం-ఇష్టిం-తం-కుర్వన్తం-అదూయత.

అర్థము:- ఏషః = ఈ కలిపురుషుడు, ద్విజన్మనః = బ్రాహ్మణునియొక్క, మదిరాదానం; మదిర = మద్యమును, ఆదానం = పుచ్చుకొనుటను జూచి, ఆనందత్ = ఆనందించెను. అథ = పిదప, తం = ఆ మద్యమును బుచ్చుకొనిన బ్రాహ్మణుని, సౌత్రామణీం = సౌత్రామణి యను పేరుగల్గిన, ఇష్టిం = యాగమును, కుర్వంతం = చేయువానినిగా, దృష్ట్వా = చూచి, అదూయత = వెత చెందెను. "సౌత్రామణ్యాం సురాం పిబేత్" యను విధియుండుటవలన, సౌత్రామణీష్టియందు మద్యపానము దోషము లేదు. అందువలన నాబ్రాహ్మణుడు పాపరహితమను కృత్యమును జేసినందువలన కలిపురుషునకు ఆశాభంగ మేర్పడినదని యర్థము.

సమాసములు :

మదిరాదానం - మదిరాయాః ఆదానం మదిరాదానం, తత్=మదిరాఽదానం.

ద్విజన్మనః - ద్వే జన్మనీ యస్య సః=ద్విజన్మా, తస్య=ద్విజన్మనః.

భావము :

యాగశాలయందు మద్యమును బుచ్చుకొనుచున్న బ్రాహ్మణుని గాంచి యీ కలిపురుషుడు, ఆ బ్రాహ్మణుడు "న సురాం పిబేత్" యను విధి నుల్లంఘించి పాపము చేయుచున్నాడని భావించి, సంతోషించెను. కాని తర్వాత యా బ్రాహ్మణుడే సౌత్రామణి యని చెప్పబడు యాగమును చేయుచుండుటను గాంచి వెత చెందెను. "న సురాం పిబేత్" యని మద్యపానము నిషేధింపబడినను "సౌత్రామణ్యాం సురాం పిబేత్" యని విధి ననుసరించి సౌత్రామణి యందు మద్యపానము చేయవలయునని విధియుండుటవలన నా బ్రాహ్మణుడు చేసిన సురాపానము పాపము కానందువలన కలిపురుషున కాశాభంగ మేర్పడుట వలన నతడు దుఃఖించెనని యాశయము. ॥180॥

శ్లో. అపశ్యత్ యావతో బ్రహ్మవిదాం బ్రహ్మాఞ్జలీ నసౌ,
ఉదడీయన్త తావన్త స్తస్యాస్రాఞ్జలయో హృదః. 181

ప. వి. అపశ్యత్- యావతః-బ్రహ్మవిదాం- బ్రహ్మాఞ్జలీన్- అసౌ-ఉదడీయన్త-తావన్తః-తస్య- అస్రాఞ్జలయః -హృదః.

అర్థము: అసౌ=ఈ కలి, బ్రహ్మవిదాం=వేదవేత్తలయొక్క, యావతః=ఎంత సంఖ్యగల్గిన, బ్రహ్మాఞ్జలీన్=బ్రహ్మాఞ్జలులను అనగా వేదాధ్యయనకాలమందు రెండుహస్తముల సంపుటములను, అపశ్యత్=చూచెనో, తస్య=ఆ కలియొక్క, హృదః = హృదయమునుండి, తావన్తః=అంత సంఖ్యగల్గిన, అస్రాఞ్జలయః = రక్తపుదోసిళ్ళు, ఉదడీయన్త=వెడలివచ్చినవి.

సమాసములు :

బ్రహ్మవిదాం-బ్రహ్మ విద న్తీతి=బ్రహ్మవిదః, తేషాం=బ్రహ్మవిదాం.
బ్రహ్మాఞ్జలీన్-బ్రహ్మణః అఞ్జలయః = బ్రహ్మాఞ్జలయః, తాన్ = బ్రహ్మాఞ్జలీన్.

అస్రాఞ్జలయః-అస్రాణాం అఞ్జలయః=అస్రాఞ్జలయః.

భావము :

వేదపాఠకులు వేదాధ్యయనము జేయునపుడు రెండు హస్తములను జోడించి యధ్యయనము జేయవలయును. అట్లు రెండుహస్తములను జోడించి యుంచుట బ్రహ్మాఞ్జలి యని "సంహత్య హస్తా వధ్యేయం స హి బ్రహ్మాఞ్జలిః స్మృతః" యని స్మృతి చెప్పబడినది. ఆ కలి పురుష డెన్ని బ్రహ్మాఞ్జలులను గాంచెనో అన్ని రక్తపుదోసిళ్ళను వెడలగ్రక్కెను. ॥181॥

శ్లో. స్నాతకం ఘాతుకం జజ్ఞే జజ్ఞౌ దాన్తం కృతాన్తవత్,
వాచం యమస్య దృష్ట్యైవ యమస్యేవ బిభాయ సః. 182

ప. వి. స్నాతకం-ఘాతుకం-జజ్ఞే-జజ్ఞౌ - దాన్తం - కృతాన్తవత్ - వాచం - యమస్య-దృష్ట్యా-ఏవ-యమస్య-ఇవ-బిభాయ-సః.

అర్థము: సః=ఆ కలి పురుషుడు, స్నాతకం=వేదములను సమాప్తి గావించినవానిని, ఘాతుకం=తనకు హన్తకునిగా, జజ్ఞే=తలంచెను, దాన్తం= తపములవలని కష్టముల నోర్చెడి తాపసుని, కృతాన్తవత్=యమునితో సమానమైనవానినిగా, జజ్ఞౌ=తెలుసుకొనెను, తథా=అట్లే, వాచం యమస్య=మౌనవ్రతము గలవానియొక్క, దృష్ట్యైవ = దర్శనము చేతనే, యమస్యేవ=యమునియొక్క దర్శనముచేత నెట్లో యట్లు, బిభాయ=భయపడెను. అంతట వీరి తపఃప్రభావ మెదిరింప సాధ్యము కానందువలన భయపడెనని యర్థము.

భావము :

ఆ కలి పురుషుడు వేదాధ్యయనము సమాప్తి గావించుకొనిన స్నాతకుని తనకు ఘాతకునిగా దలంచెను. తపస్సువలని కష్టములను సహించు దాంతుని యమునిగా దలంచెను. మౌనవ్రతము గలవాని దర్శనమును యమదర్శనము వలె తలంచి భయపడెను. ॥182॥

శ్లో. స పాషణ్డజనాన్వేషీ ప్రాప్నువన్ వేదపండితం,
జలార్థీ వానలం ప్రాప్య పాప స్తాపా దపాసరత్. 184

ప.వి. సః-పాషణ్డజనాన్వేషీ-ప్రాప్నువన్-వేదపండితం-జలార్థీ - ఇవ-అనలం-ప్రాప్య-పాపః-తాపాత్-అపాసరత్.

అర్థము: పాపః = క్రూరుడైన, సః = ఆ కలిపురుషుడు, పాషణ్డజనాన్వేషీ, పాషణ్డజన = శాస్త్రములను దూషించెడి జనములను, అన్వేషీ సన్= వెదకుచున్నవాడై, వేదపండితం= వేద విద్వాంసుని, ప్రాప్నువన్= పొందుచున్నవాడై, జలార్థీ = ఉదకమును గోరుచున్నవాడు, అనలమివ= అగ్నినివలె, ప్రాప్య= పొంది, తాపాత్ = దానివలన గలిగిన వేడిమివలన, అపాసరత్= తొలగిపోయెను. బ్రహ్మతేజము పాషణ్డులను దహింపజేయునని యర్థము.

సమాసములు :

**పాషణ్డజనాన్వేషీ** - పాషణ్డ ఇతి జనః = పాషణ్డజనః, పాషణ్డజనం, అన్విష్యతీతి = పాషణ్డజనాన్వేషీ.
**వేదపండితం** - వేదే పణ్డితః = వేదపణ్డితః, తం = వేద పణ్డితం.
**జలార్థీ** - జలం అర్థయతీతి = జలార్థీ.

భావము :

క్రూరుడైన యాకలిపురుషుడు శాస్త్రమును దూషించెడి జనమును వెదకుచు వారిని బొందలేక వేదపండితుని గలసి, నీటిని గోరువా డగ్నిని బొంది

దాని తాపముతో దొలగిపోయినట్లు ఆ వేదపండితుని బ్రహ్మతేజస్సుతో దాపము బొంది తొలగిపోయెను. ॥183॥

శ్లో. తత్ర బ్రహ్మహణం పశ్య న్నతిసంతోష మానశే
నిర్వర్ణ్య సర్వమేధస్య యజ్వానం జ్వలతి స్మ సః 184

ప.వి. తత్ర-బ్రహ్మహణం-పశ్యన్-అతిసంతోషమ్- ఆనశే-నిర్వర్ణ్య- సర్వమేధస్య-యజ్వానం-జ్వలతి-స్మ-సః.

అర్థము: సః=ఆ కలిపురుషుడు, తత్ర=ఆ నగరమందు, బ్రహ్మహణం= బ్రహ్మహత్యను జేయుచున్న జనమును, పశ్యన్ = చూచుచు, అతి సంతోషం=మిక్కిలి సంతోషమును, ఆనశే=పొందెను, అథ =పిదప, తం= ఆ బ్రహ్మఘ్నుని, సర్వమేధస్య=సర్వమేధమను యజ్ఞమునకు, యజ్వానం=శాస్త్రప్రకారము హోమము గావించువానినిగా, నిర్వర్ణ్య= చూచి, జ్వలతి స్మ=తాపము బొందుచుండెను.

సమాసములు :

బ్రహ్మహణం- బ్రహ్మ హన్తీతి=బ్రహ్మహా, తం=బ్రహ్మహణం.
అతిసంతోషం-అత్యన్తం సంతోషః=అతిసంతోషః,తం=అతిసంతోషం.

భావము :

ఆ కలిపురుష డానగరమందు బ్రాహ్మణుని జంపుచున్న మనుష్యుని జూచి మిక్కిలి సంతోషించెను. కాని తర్వాత నా బ్రహ్మహత్యను గావించిన పురుషుడు ''సర్వమేధ''మను యజ్ఞమునందు హోమము చేయుచుండుటను జూచి మిక్కిలి పరితపించెను. ''బ్రహ్మణే బ్రాహ్మణ మాలభేత'' యను శ్రుతి ననుసరించి సర్వమేధమను యాగమందు బ్రహ్మకు ఆహుతిగా బ్రాహ్మణుని హోమము చేయవలయును. ॥184॥

శ్లో. యతిహ స్తస్థితై స్తస్య రామైర్భ రారమ్భి తర్జనా,
దుర్జన స్యాజని క్లిష్టి ర్గృహిణాం వేదయష్టిభిః. 185

ప. వి. యతిహస్తస్థితైః-తస్య-రామ్భైః- ఆరమ్భి- తర్జనా- దుర్జనస్య- అజని-
క్లిష్టిః-గృహిణాం- వేదయష్టిభిః.

అర్థము: దుర్జనస్య=దుష్టుడైన, తస్య=ఆ కలిపురుషునికి, యతిహస్తస్థితైః, యతి=సన్న్యాసులయొక్క, హస్త=చేతులయందు, స్థితైః=ఉన్నటువంటి, రామ్భైః=వెదురు కర్రలచే, తర్జనా=భయము, ఆరంభి కల్గింపబడినది, గృహిణాం=గృహస్థాశ్రమమునం దున్నవారియొక్క, వేదయష్టిభిః=దర్భలచే గట్టబడిన క్రమజటారూపములగు వేద దండములచే, క్లిష్టిః=కష్టము, అజని=కల్గినది.

సమాసములు :

యతిహస్తస్థితైః - యతీనాం హస్తాః=యతిహస్తాః, యతిహస్తేషు స్థితాః=యతిహస్తస్థితాః, తైః=యతిహస్తస్థితైః.
వేదయష్టిభిః - వేదమయ్యః యష్టయః = వేదయష్టయః, తాభిః= వేదయష్టిభిః.

భావము :

దుర్జనుడైన యా కలిపురుషునికి, సన్న్యాసుల హస్తముల యందున్న వెదురుకర్రలచే భయ మేర్పడినది. అట్లే గృహస్థుల దర్భమయములైన వేద యష్టులగు క్రమజటాది పాఠములచేత కష్ట మేర్పడినది. ॥185॥

శ్లో. అపశ్య జ్జిన మన్విష్య న్నజినం బ్రహ్మచారిణాం,
క్షపణార్థీ సదీక్షస్య స చాక్షపణ మైక్షత. 186

ప. వి. అపశ్యత్- జినం- అన్విష్యన్ - అజినం - బ్రహ్మచారిణం. - క్షపణార్థీ-
సదీక్షస్య-సః-చ-అక్షపణమ్- ఐక్షత.

అర్థము: సః=ఆ కలిపురుషుడు, జినం=జినుడను పేరుగల బౌద్ధ దేవతను, అనగా తన మిత్రుని, అన్విష్యన్=వెదకుచు, బ్రహ్మచారిణాం=

బ్రహ్మచర్యమందు ఆసక్తిగలవారికి, అజినం = ఆసనమునకై జింక చర్మమును (జినుడు లేకయుండుటను) అపశ్యత్=చూచెను. కించ= మరియు, క్షపణార్థీ; క్షపణ=తన మిత్రుడైన బౌద్ధసన్న్యాసిని, అర్థీ= కోరుచున్నవాడై, సదీక్షస్య=దీక్షతో గూడిన, రాజ్ఞః=రాజునకు, అక్షపణం = పాచికలతో నాడుటను (క్షపణకుడు లేకయుండుటను), ఐక్షత=చూచెను, రాజసూయమందు నభిషేచనీయేష్టియందు నెనమండు గురు పాచికలతో నాడవలయునని విధి యున్నది. కాన నది దోషము కాదు. అందువలన నిదియు, జినరాహిత్యము కలికి దుస్సహముగా నుండినవి.

సమాసములు :

అజినం- న జినః=అజినః, తం=అజినం.
క్షపణార్థీ - క్షపణం అర్థయతీతి=క్షపణార్థీ.
సదీక్షస్య- దీక్షయా సహ వర్తత ఇతి=సదీక్షః, తస్య=సదీక్షస్య.
అక్షపణం- నక్షపణః=అక్షపణః, తం=అక్షపణం, అక్షాణాం పణః= అక్షపణః, తం=అక్షపణం.

భావము :

ఆ కలిపురుషుడు తన మిత్రుడైన జిను డనెడి బౌద్ధదేవతను వెదకుచు నాతనిఁ గాంచక బ్రహ్మచారులు ధరించెడి అజినమును అనగా జింక చర్మమును (జినాభావమును) జూచెను. మఱియు క్షపణుఁ డనబడు తన మిత్రుని వెదకుచు అక్షపణుని అనగా రాజు పాచికలతో నాడుటను (క్షపణకా భావమును) గాంచెను. రాజసూయయాగమందు నభిషేచనీయమున రాజు ఎనమండు గురితో పాచికలచే నాడవలయునని విధి యున్నందువలన వారి యాటను కలి గాంచెను. కాని క్షపణకుని గాంచలేదు. జినుడును క్షపణకుడును బౌద్ధమతమునకు జెందిన నాస్తికులు. కలిపురుషున కట్టి బౌద్ధమతావలంబకులతో మైత్రి యుండునేకాని తద్భిన్నులతో మైత్రియుండదు. జినుని గాంచలేక బ్రహ్మచారుల వస్త్రమైన యజినమును అనగా జింక చర్మమును గాంచుట

వలనను క్షపణకుని గాంచలేక వైదికకర్మయందలి అక్షపణమును అనగా పాచికల తోడి యాటను గాంచుటవలనను కలిపురుషున కాశాభంగమై దుఃఖమైనది. ॥186॥

శ్లో. జపతా మక్షమాలాసు బీజాకర్షణదర్శనాత్,
స జీవాకృష్టికష్టాని విపరీతదృగన్వభూత్. 187

ప. వి. జపతామ్-అక్షమాలాసు - బీజాకర్షణదర్శనాత్- సః - జీవాకృష్టికష్టాని-విపరీత దృక్-అన్వభూత్.

అర్థము : విపరీతదృక్=వేదవిరుద్ధవిషయములను (జూచునట్టి, సః=ఆ కలిపురుషుడు, జపతాం=తమకు తమకు నిష్టములైన మంత్రములను పలుమారు ఉచ్చరించుచున్నట్టి (జనులయొక్క), అక్షమాలాసు=జపమాలికలయందున్నట్టి, బీజాకర్షణదర్శనాత్, బీజ=పద్మముల విత్తనములు మున్నగు పూసలను, ఆకర్షణ=పలుమారు త్రిప్పుచుండుటను, దర్శనాత్=చూచుట వలన, జీవాకృష్టికష్టాని, జీవ=తన ప్రాణములను, ఆకృష్టి=లాగుట వలన నేర్పడు, కష్టాని=కష్టములను, అన్వభూత్=అనుభవించెను.

సమాసములు :

అక్షమాలాసు-అక్షాణాం మాలాః=అక్షమాలాః, తాసు=అక్షమాలాసు.
బీజాకర్షణదర్శనాత్- బీజానాం ఆకర్షణం=బీజాకర్షణం, బీజాకర్షణస్య దర్శనం=బీజాకర్షణ దర్శనమ్. తస్మాత్=బీజాకర్షణ దర్శనాత్.
జీవాకృష్టికష్టాని - జీవానాం ఆకృష్టిః = జీవాకృష్టిః, జీవాకృష్టేః కష్టాని=జీవాకృష్టికష్టాని, తాని=జీవాకృష్టికష్టాని.
విపరీతదృక్-విపరీతా దృక్ యస్య సః=విపరీతదృక్.

భావము :

వేదవిరుద్ధ విషయములను జూచునట్టి యాకలిపురుషుడు, తమకు తమకు గావలసిన మంత్రములను జపించుచున్న జనులు తమ యక్షమాలలయందలి పూసలను లాగుచు త్రిప్పుచునుండగా తన ప్రాణములనే లాగిన విధముగా భావించి

బాధపడజొచ్చెను. అనగా వైదిక కృత్యములగు జపమాలాకర్షణములను వీడు సహింపలేక బాధపడ జొచ్చెను అని యాశయము. ॥188॥

శ్లో. త్రిసన్ధ్యం తత్ర విప్రాణాం స పశ్య న్నఘమర్షణం,
పరమైచ్ఛ ద్దృశోరేవ నిజయో రపకర్షణమ్. 189

ప. వి. త్రిసన్ధ్యం-తత్ర-విప్రాణాం-సః-పశ్యన్-అఘమర్షణం-పరమ్- ఐచ్ఛత్-దృశోః-ఏవ-నిజయోః-అపకర్షణం.

అర్థము : సః=ఆ కలిపురుషుడు, తత్ర=ఆ పట్టణమందు, త్రిసంధ్యం=మూడు సంధ్యలయందును, విప్రాణాం=బ్రాహ్మణులయొక్క, అఘమర్షణం=పాపము హరించుటకై యా యామంత్రములను జపించుచు నరచేత నీరుంచుకొని ముక్కును దాకించుటయను క్రియను, పశ్యన్=చూచుచు, పరం=కేవలము, నిజయోః=తనకు సంబంధించిన, దృశోరేవ=నేత్రములకే, అపకర్షణం=లాగివేయుటను, ఐచ్ఛత్=కోరెను. ఆయఘర్షణ క్రియను జూచి తన కన్నులనే పెరికివేయవలసినంతటి దుఃఖము ననుభవించెనని యర్థము.

సమాసములు :

త్రిసన్ధ్యం- తిసృణాం సంధ్యానాం సమాహారః=త్రిసంధ్యం. తత్=త్రిసన్ధ్యం.

భావము :

ఆ కలిపురుష డానగరమందలి బ్రాహ్మణులు ప్రాతర్మధ్యాహ్నసాయం సంధ్యలయందు తమ యఱచేత నీరుంచుకొని తగిన మంత్రములతో నభిమంత్రించి ముక్కునకు దాకించి వదలివేయుట యను పాపహరమగు నఘమర్షణక్రియను జేయుచుండగా చూచి తన కన్నులనే పెఱికి పారవేయవలసినంతటి దుఃఖము ననుభవించెను. ॥189॥

శ్లో. అద్రాక్షీ త్తత్ర కంచి న్న కలిః పరిచితం క్వచిత్,
భైమీనల వ్యలీకాణు ప్రశ్నకామః పరిభ్రమన్. 190

ప. వి. అద్రాక్షీత్-తత్ర-కంచిత్- న-కలిః-పరిచితం-క్వచిత్- భైమీనలవ్యలీకాణుప్రశ్నకామః-పరిభ్రమన్.

అర్థము:- కలిః = కలిపురుషుడు, భైమీనలవ్యలీకాణుప్రశ్నకామః, భైమీ = దమయంతికిని, నల = నలునకు సంబంధించిన, వ్యలీక = అప్రియముతోని, అణు = సూక్ష్మాంశములను సైతము, ప్రశ్న = అడుగుటయందు, కామః = కోరిక గలవాడై, తత్ర = ఆ నగరమందు, పరిభ్రమన్ = తిరుగుచు, క్వచిత్ = ఎక్కడను, కంచిదపి = ఒకనిని, పరిచితం = పరిచయము గలవానిని, న అద్రాక్షీత్ = చూడలేదు.

సమాసములు :

భైమీనలవ్యలీకాణుప్రశ్నకామః- భైమీ చ నలశ్చ = భైమీనలౌ భైమీనలయోః వ్యలీకం = భైమీనలవ్యలీకం, భైమీనలవ్యలీకస్య అణుః = భైమీనలవ్యలీకాణుః, భైమీనలవ్యలీకాణోః ప్రశ్నః = భైమీనలవ్యలీకాణుప్రశ్నః, భైమీనలవ్యలీకాణుప్రశ్నస్య కామః యస్య సః = భైమీనలవ్యలీకాణుప్రశ్నకామః.

భావము :

కలిపురుషుడు దమయంతీనలులకు ననిష్టలేశము దొరికినను వారిని వేధింపగోరినవాడై, దానిని ప్రశ్నింప గోరిక కలిగినవాడై యా నగరమంతట గలయఁదిరుగుచు నెచ్చటను పరిచయము గలవాని నెవ్వనిని గానలేదు. ॥190॥

శ్లో. తపః స్వాధ్యాయ యజ్ఞానా మకాణ్డద్విష్టతాపసః
స్వవిద్విషాం శ్రియం తస్మిన్ పశ్య న్నుపతతాప సః. 191

ప. వి. తపస్స్వాధ్యాయ యజ్ఞానాం-అకాణ్డద్విష్టతాపసః-స్వవిద్విషాం-శ్రియం-తస్మిన్-పశ్యన్-ఉపతతాప-సః.

అర్థము: అకాణ్డద్విష్టతాపసః, అకాణ్డ=ఆకస్మికముగా, ద్విష్ట = ద్వేషింపబడిన, తాపసః=తాపసులు గలిగిన, సః = ఆ కలిపురుషుడు, తస్మిన్=ఆపట్టణమందు, స్వవిద్విషాం=తనకు శత్రువులైన వైదికులయొక్క, తపస్స్వాధ్యాయ యజ్ఞానాం, తపః=తపము, స్వాధ్యాయ=సశాఖాధ్యయనము, యజ్ఞానాం = సోమాది యాగముల యొక్క, శ్రియం = సమృద్ధిని, పశ్యన్=చూచుచు, ఉపతతాప=సంతాపము నొందెను.

సమాసములు :

తపస్స్వాధ్యాయ యజ్ఞానాం-తపశ్చ స్వాధ్యాయశ్చ యజ్ఞశ్చ = తపస్స్వాధ్యాయయజ్ఞాః, తేషాం=తపస్స్వాధ్యాయయజ్ఞానాం.

అకాణ్డ ద్విష్టతాపసః-అకాణ్డే ద్విష్టాః = అకాణ్డద్విష్టాః అకాణ్డద్విష్టాః తాపసాః యేన సః=అకాణ్డద్విష్టతాపసః.

స్వవిద్విషాం-స్వస్య విద్విషః=స్వవిద్విషః, తేషాం=స్వవిద్విషాం.

భావము :

ఆకారణముగా తాపసులను ద్వేషించునట్టి యా కలిపురుషుడు, ఆ నగరమందు తన విరోధులైన వైదికులయొక్క చాంద్రాయణాది తపశ్చర్యలయొక్క స్వశాఖాధ్యయనముయొక్క సోమాది యాగములయొక్క నభివృద్ధి గాంచి సంతాపము నొందుచుండెను. ॥19॥

శ్లో. క్రమం తత్రోపనమ్రాయాః విశ్వాయా వీక్ష్య తుష్టవాన్,
స మమ్లౌ తం విభావ్యాఽథ వామదేవాఖ్యపాసకమ్. 192

ప. వి. క్రమం-తత్ర-ఉపనమ్రాయాః-విశ్వాయాః - వీక్ష్య - తుష్టవాన్-సః-మమ్లౌ-తం-విభావ్య-అథ-వామదేవాఖ్యపాసకం.

సమాసములు :

నిత్యనైమిత్తికత్యజం- నిత్యాని చ నైమిత్తికాని చ = నిత్యనైమిత్తికాని, నిత్యనైమిత్తికాని త్యజతీతి = నిత్యనైమిత్తికత్యక్, తం = నిత్యనైమిత్తికత్యజం.

దీనముఖః - దీనం ముఖం యస్య సః = దీనముఖః.

భావము :

ఆ కలిపురుషుడు, నిత్యములని నైమిత్తికములని పిలువబడు దానహోమాది కర్మలను బరిత్యజించిన బ్రాహ్మణుని గాంచి యట్టి బ్రాహ్మణుడు కర్మభ్రష్టుడై పాపి యగుటవలన నాతని యాశ్రయము బొందవచ్చునని భావించి సంతోషించెను. కాని తర్వాత నతడు యజ్ఞమందు దీక్ష వహించినవాడని తెలిసికొని "దీక్షితో న దదాతి న జుహోతి" యను శ్రుతి ననుసరించి యాగమందు దీక్ష వహించిన యజమానుడు దానహోమాదులను జేయరాదు గాన దానిననుసరించి యతడు దానాదులు చేయకపోవుట పాపము కాదు కావున కలి పురుషునికి ఆశాభంగ మేర్పడినది. ॥199॥

శ్లో. ఆననంద నిరీక్ష్యాయం పురే తత్రాత్మఘాతినం,
సర్వస్వారస్య యజ్వాన మేనం దృష్ట్వాఽథ వివ్యథే. 200

ప. వి. ఆననంద-నిరీక్ష్య-అయం-పురే-తత్ర - ఆత్మఘాతినం - సర్వస్వారస్య-యజ్వానమ్-ఏనం-దృష్ట్వా-అథ-వివ్యథే.

అర్థము :- అయం- ఈ కలిపురుషుడు, తత్ర = ఆ నగరమందు, ఆత్మఘాతినం = ఆత్మహత్య జేసుకొనుచున్న వానిని, నిరీక్ష్య = చూచి, ఆననంద = తన కాశ్రయము దొరికినదని సంతోషించెను, అథ = పిదప, ఏనం = ఈ యాత్మహత్య గావించుకొనువానిని, సర్వస్వారస్య = సర్వస్వార మనెడి యజ్ఞమునకు ననగా నాత్మాహుతి గలిగిన యాయజ్ఞమునకు, యజ్వానం = యాగకర్తగా, దృష్ట్వా = చూచి, వివ్యథే = వ్యథ చెందెను.

"సః అన్వేష్టా సర్వస్వారాఖ్యే యజ్ఞే ఆత్మానమేవ పశుమన్త్రైః సంస్కృతం ఘాతయిత్వా యజ్ఞభాగ మర్పయతి" యను శ్రుతి ననుసరించి యజ్ఞమున నాత్మహత్య విధివిహితముగాన దోషము లేనందువలన కలిపురుషుడు తన కాశ్రయము కాదని దుఃఖించెనని యర్థము.

సమాసములు :

ఆత్మఘాతినం - ఆత్మానం ఘాతయతీతి=ఆత్మఘాతీ, తం=ఆత్మఘాతినం.

భావము :

ఆ కలిపురుషుడు ఆ నగరమందు నాత్మహత్య గావించుకొనుచున్న యొకనిని గాంచి, తన కాశ్రయము దొరకునని యాశతో సంతోషించెను. ఆత్మహత్యచే పాతకము ఘటిల్లునుగాన నతడు పాపమునందుటచేత తన కాశ్రయము కాగలడని కలియొక్క యభిప్రాయము. కాని యా యాత్మహత్య గావించుకొన నుద్యమించుచున్న యాతనిని యాత్మాహుతియే ముఖ్యముగా గలిగిన "సర్వస్వార" యాగమునందు యాగకర్తనుగా తెలిసికొని విధివిహితమగు నాత్మహత్య దోషము కానందువలన నాతడు పాపి కాకపోవుటచే నైరాశ్యము చెందెను.॥200॥

శ్లో. క్రతౌ మహావ్రతే పశ్యన్ బ్రహ్మచారీత్వరీరతం,
జజ్ఞౌ యజ్ఞక్రియా మజ్ఞః స భాణ్డాకాణ్డ తాణ్డవమ్. 201

ప. వి. క్రతౌ-మహావ్రతే-పశ్యన్-బ్రహ్మచారీత్వరీరతం-జజ్ఞౌ- యజ్ఞక్రియాం-అజ్ఞః-సః-భాణ్డాకాణ్డతాణ్డవమ్.

అర్థము :-అజ్ఞః=మూర్ఖుడైన, సః=ఆ కలిపురుషుడు, మహావ్రతే=మహావ్రతమను పేరుగల, క్రతౌ=యాగమందు, బ్రహ్మచారీత్వరీరతం, బ్రహ్మచారి=బ్రహ్మచారికిని, ఇత్వరీ=జారిణికిని గల, రతం=మైథునమును, లేదా బూతు మాటలను, పశ్యన్=చూచుచు, యజ్ఞ

క్రియాం=యాగవ్యాపారమును, భాణ్డాకాణ్డతాణ్డవం, భాణ్డ=బూతులు మాట్లాడువారియొక్క, అకాణ్డతాణ్డవం = అకాలమందలి యుద్ధత నృత్యముగా, జజ్ఞౌ=తెలిసికొనెను. అనగా యాగక్రియను బూతులు మాట్లాడువారి చేష్టగా భావించెను అని యర్థము.

సమాసములు :

*బ్రహ్మచారీత్వరీరతం* - బ్రహ్మ చరతీతి=బ్రహ్మచారీ, ఏతీతి= ఇత్వరీ, బ్రహ్మచారీ చ ఇత్వరీ చ=బ్రహ్మచారీత్వర్యౌ, బ్రహ్మచారీ త్వర్యయోః రతం = బ్రహ్మచారీత్వరీరతం, తత్=బ్రహ్మచారీత్వరీ రతమ్.

*యజ్ఞక్రియాం*-యజ్ఞ ఏవ క్రియా=యజ్ఞక్రియా, తాం=యజ్ఞక్రియాం. *అజ్ఞః*- న జానాతీతి=అజ్ఞః.

*భాణ్డాకాణ్డతాణ్డవమ్*-భణ్డానా మిదం=భాణ్డం, అకాణ్డే తాణ్డవం=అకాణ్డ తాణ్డవం, భాణ్డం చ తత్ అకాణ్డ తాణ్డవం చ=భాణ్డాకాణ్డతాణ్డవం.

భావము :

ఆ కలిపురుషుడు మహావ్రతమనెడి యాగమందు బ్రహ్మచారి కులటల యొక్క సురతము చూచుచు యజ్ఞక్రియ అశ్లీలపరుల యకాలపు టుద్ధత తాణ్డవమని తెలిసికొనెను. కాని "మహావ్రతే బ్రహ్మచారిపుంశ్చల్యోః సమ్ప్రవాదః" యను శ్రుతి ననుసరించి బ్రహ్మచారికిని వ్యభిచారిణితో రతముగాని గ్రామ్య సంభాషణముగాని యాగాఙ్గము గాన దోషము లేదని గ్రహించెను.॥201॥

శ్లో. యజ్వభార్యాశ్వమేధాశ్వలిఙ్గాలిఙ్గివరాఙ్గతాం,
దృష్ట్వాఽచష్ట స కర్తారం శ్రుతేర్భణ్డ మపణ్డితః. 202

ప. వి. యజ్వభార్యాశ్వమేధాశ్వలిఙ్గాలిఙ్గివరాఙ్గతాం - దృష్ట్వా - అచష్ట - సః - కర్తారం-శ్రుతేః-భణ్డమ్-అపణ్డితః.

అర్థము: అపణ్డితః = మూర్ఖుడైన, సః = ఆకలిపురుషుడు, యజ్వభార్యాశ్వమేధాశ్వలిఙ్గాలిఙ్గివరాఙ్గతాం, యజ్వ=యాగకర్తయొక్క, భార్యా=భార్యకు, అశ్వమేధాశ్వ = అశ్వమేధయాగమందలి యశ్వముయొక్క, లిఙ్గ=లింగముచే, ఆలిఙ్గి=చేర్చబడిన, వరాఙ్గతాం=యోని గల్గియుండుటను, దృష్ట్వా=చూచి, శ్రుతేః=వేదముయొక్క, కర్తారం=కర్తను, చణ్డం=దుర్జనునిగా అనగా నశ్లీలములగు విషయముల నుపదేశించెడి వానిగా, ఆచష్ట=చెప్పెను.

సమాసములు :

యజ్వాభార్యాశ్వమేధాశ్వాలిఙ్గాలిఙ్గివరాఙ్గతాం - యజ్వనః భార్యా = యజ్వభార్యా, అశ్వమేధస్య అశ్వః=అశ్వమేధాశ్వః, అశ్వమేధాశ్వస్య లిఙ్గం=అశ్యమేధాశ్వలిఙ్గం, అశ్వమేధాశ్వలిఙ్గేన ఆలిఙ్గి=అశ్వమేధాశ్వలిఙ్గాలిఙ్గి, అశ్వమేధాశ్వలిఙ్గాలిఙ్గివరాఙ్గం యస్యా స్సా=అశ్వమేధాశ్వలిఙ్గాలిఙ్గివరాఙ్గా, అశ్వమేధాశ్వ లిఙ్గాలిఙ్గివరాఙ్గాయాః భావః=అశ్వమేధాశ్వలిఙ్గాలి ఙ్గివరాఙ్గతా, యజ్వభార్యాయాః అశ్వమేధాశ్వ లిఙ్గాలిఙ్గివరాఙ్గతా=యజ్వభార్యాశ్వమేధాశ్వలిఙ్గాలిఙ్గివరాఙ్గతా. తాం = యజ్వభార్యాశ్వమేధాశ్వలిఙ్గాలిఙ్గి వరాఙ్గతాం.

అపణ్డితః-న పణ్డితః=అపణ్డితః.

భావము :

మూఢుడైన యాకలిపురుషుడు అశ్వమేధయాగమందు అశ్వముయొక్క లిఙ్గముచే యాగకర్తయొక్క భార్యకు సంబంధించిన యోనిని చేర్చబడినదానినిగా జూచి వేదకర్తను నసజ్జనునిగా లేదా యశ్లీలవ్యవహారముగల వానినిగా జెప్పెను. కాని "నిరాయస్యాశ్వస్య శిశ్నం మహిష్యుపస్థే నిధత్తే" యను శ్రుతి ననుసరించి యశ్వమేధయాగాఙ్గముగా నిది యాచరింపదగినది గాన ధర్మకము. ॥202॥

శ్లో॥ అథ భీమజయా జుష్టం వ్యలోకత కలి ర్నృపమ్,
దుష్టదృగ్భి ర్దురాలోకం ప్రభయేవ ప్రభావిభుమ్. 203

ప.వి. అథ-భీమజయా-జుష్టః - వ్యలోకత - కలిః - నృపమ్ - దుష్టదృగ్భిః-దురాలోకం-ప్రభయా-ఇవ-ప్రభావిభుమ్.

అర్థము: అథ=ముందు జెప్పిన యాకారములను జూచిన పిదప, కలిః=కలి పురుషుడు, భీమజయా=దమయంతిచే, జుష్టం=సేవింపబడిన, దుష్ట దృగ్భిః=పాపదృష్టులచేతను, పక్షాంతరమున దోషముచే దెబ్బతినిన దృష్టులు గలవారిచేతను, దురాలోకం=చూడశక్యముకాని, నలం=నలమహారాజును, ప్రభయా=కాంతిచేతను, సూర్యపత్ని యగు సంజ్ఞాదేవి చేతను, జుష్టం=సేవింపబడిన, ప్రభావిభుం ఇవ=ప్రభాకరుడైన సూర్యునివలె, వ్యలోకత=చూచెను.

సమాసములు :

దుష్టదృగ్భిః-దుష్టా దృక్ యేషాం తే=దుష్టదృశః, తైః=దుష్టదృగ్భిః, దురాలోకం-దుఃఖేన ఆలోకయితుం శక్యః=దురాలోకః, తం=దురాలోకం.

ప్రభావిభుం - ప్రభాయాః విభుః=ప్రభావిభుః, తం=ప్రభావిభుం.

భావము :

ముందు బేర్కొనబడిన దృశ్యములను జూచినపిదప యాకలిపురుషుడు, దమయంతితో సేవింపబడినవాడై దుష్టదృక్కులతో చూడశక్యముకాని నలమహారాజును, కాంతితోడను పత్నియగు సంజ్ఞాదేవితోడను సేవింపబడుచున్న సూర్యునివలె గాంచెను. అనగా నానలమహారాజుయొక్క తేజస్సు సూర్యుని తేజస్సు కీడగుచున్నదని యాశయము. ॥203॥

శ్లో॥ తయో స్సౌహార్దసాన్ద్రిత్వం పశ్యన్ శల్య మివానశే,
మర్మచ్ఛేద మివానర్ఛ స తన్నర్మోక్తిభి ర్మిథః. 204

ప.వి. తయోః-సౌహార్ద సాన్ద్రిత్వం-పశ్యన్-శల్యం-ఇవ-ఆనశే-మర్మచ్ఛేదం-ఇవ-ఆనర్ఛ-సః-తత్-నర్మోక్తిభిః-మిథః

అర్థము: సః = ఆ కలిపురుషుడు, తయోః = ఆ నలదమయంతులయొక్క, సౌహార్దసాన్ద్రిత్వం, సౌహార్ద = ప్రేమయొక్క, సాన్ద్రిత్వం = నిబిడత్వమును, పశ్యన్ = చూచుచు, శల్యం = అస్త్రవిశేషముచే దెబ్బను, ఆనశే ఇవ = పొందెనో యనునట్లుండెను, తథా = అట్లే, మిథః = ఒండొరులలో, తన్నర్మోక్తిభిః, తత్ = ఆ నలదమయంతులయొక్క, నర్మోక్తిభిః = పరిహాస వచనములచే, మర్మచ్ఛేదం = మర్మస్థానములయందు అనగా హృదయాదిస్థానములయందు గాయమును, ఆనర్ఛ ఇవ = పొందెనో యనునట్లుండెను.

సమాసములు :

సౌహార్దసాన్ద్రిత్వం - సుహృదః భావః = సౌహార్దం, సౌహార్దస్య సాన్ద్రిత్వం = సౌహార్దసాన్ద్రిత్వం తత్ = సౌహార్దసాన్ద్రిత్వం.
మర్మచ్ఛేదం - మర్మణః ఛేదః మర్మచ్ఛేదః, తం = మర్మచ్ఛేదం.
తన్నర్మోక్తిభిః నర్మగర్భాః ఉక్తయః = నర్మోక్తయః, తయోః నర్మోక్తయః, = తన్నర్మోక్తయః, తాభిః = తన్నర్మోక్తిభిః.

భావము:

ఆ కలిపురుష డాదమయంతీనలుల గాఢప్రేమను చూచి శల్యాస్త్రపు దెబ్బవంటి దెబ్బ ననుభవించెను. అట్లే వారిరువురి పరిహాసవచనములను విని, హృదయాదిమర్మస్థానములందు గాయము నొందెనో యనున ట్లుండెను. ॥204॥

శ్లో. అమర్షా దాత్మనో దోషాత్ తయోః తేజస్వితాగుణాత్
ప్రస్పష్టం దృశా ప్యనీశస్తౌ తస్మాద ప్యచలత్ కలిః. 205

ప. వి. అమర్షాత్- ఆత్మనః - దోషాత్ - తయోః- తేజస్వితాగుణాత్-ప్రస్పష్టం-దృశా-అపి-అనీశః-తౌ-తస్మాత్-అపి-అచలత్-కలిః.

అర్థము:- కలిః = కలియుగాధిపతి, అమర్షాత్ = కోపమువలన, ఆత్మనః = తనయొక్క, దోషాత్ = పాపిష్ఠియైయుండుట యను నపరాధమువలన,

తయోః=ఆ దమయంతీనలులయొక్క, తేజస్వితాగుణాత్, తేజస్వితా= ప్రభావముతోగూడుట యను, గుణాత్ = గుణమువలనను, తౌ=ఆ దమయంతీనలులను, దృశాఽపి=నేత్రముతోడను, స్ప్రష్టుం=తాకుటకు అనగా చూచుటకు కూడనని యర్థము, అనీశః=అశక్తు డగుచు, తస్మా దపి=ఆ స్థానమునుండియు, అచలత్=కదలెను.

సమాసములు :

**తేజస్వితాగుణాత్** - తేజః అనయోః అస్తీతి= తేజస్వినౌ, తేజస్వినో ర్భావః=తేజస్వితా, తేజస్వితైవ గుణః=తేజస్వితాగుణః, తస్మాత్= తేజస్వితాగుణాత్.

**అనీశః** - న ఈశః=అనీశః.

భావము :

ఆ కలియుగము కోపమువలనను తన యపరాధమువలనను, దమయంతీ నలులయొక్క ప్రభావసంపదవలనను వారిద్దరిని, కంటదాకుటకు ననగా చూచుట కును శక్తుడు కానివాడై యాస్థలమునుండి కదిలిపోయెను. ॥205॥

శ్లో. అగచ్ఛ దాశ్రయాన్వేషీ నలద్వేషీ స నిఃశ్వసన్,
అభిరామం గృహారామం తస్య రామసమశ్రియః. 206

ప. వి. అగచ్ఛత్-ఆశ్రయాన్వేషీ-నలద్వేషీ-సః-నిఃశ్వసన్-అభిరామం-గృహా రామం-తస్య-రామసమశ్రియః.

అర్థము:- నలద్వేషీ=నలుని ద్వేషించునట్టి, అత ఏవ=ఇందువల్లనే, ఆశ్రయా న్వేషీ=ఉండుటకు స్థానము నన్వేషించునట్టి, సః=ఆ కలి, నిఃశ్వసన్= ఎచ్చటను నెలవు లభింపనందువలన, నిట్టూర్పులు విడుచుచు, రామ సమశ్రియః=శ్రీరామచన్ద్రునితో సమానమైన కాంతిగలిగిన, తస్య= ఆ నలునియొక్క, గృహారామం=భవనమునకు సమీపమందలి యుద్యాన మును, అగచ్ఛత్=పొందెను.

సమాసములు :

ఆశ్రయాన్వేషీ - ఆశ్రయ మన్విష్యతీతి=ఆశ్రయాన్వేషీ.

నలద్వేషీ - నలం ద్వేష్టీతి=నలద్వేషీ.

గృహారామం - గృహస్య ఆరామః=గృహారామః, తం=గృహారామం.

రామసమశ్రియః - రామేణ సమా=రామసమా, రామసమా శ్రీః యస్య సః=రామసమశ్రీః, తస్య= రామసమశ్రియః.

భావము ;

నిషధదేశప్రభువగు నలునకు శత్రువైన యా కలిపురుషుడు నలునిపై పగదీర్చుకొనుటకు, నివాస స్థలమును గోరుచు, నెచ్చటను నెలవు లభింపనందు వలన నిట్టూర్పులు నిగుడ్చుచు శ్రీరామచంద్రునితో సమానశోభగలిగిన యా నలుని భవనమునకు సమీపమందలి యుద్యానమును ప్రవేశించెను. ॥206॥

శ్లో. రక్షిలక్షవృతత్వేన బాధనం న తపోధనైః
మేనే మానీ మనాక్ తత్ర స్వానుకూలం కలిః కిల. 207

ప. వి. రక్షిలక్షవృతత్వేన-బాధనం-న-తపోధనైః-మేనే-మానీ-మనాక్-తత్ర-స్వానుకూలం-కలిః-కిల.

అర్థము:- రక్షిలక్షవృతత్వేన, రక్షి=గృహరక్షకుల యొక్క, లక్ష=లక్ష సంఖ్యతో, వృతత్వేన=పరివేష్టింపబడుటచే, తపోధనైః= తాపసులచే, (స్వస్య=తనకు) బాధనం=పీడన, న=లేదు (కావుననే) మానీ= అభిమానవంతుడును నహంకారియు నగు, కలిః = కలిపురుషుడు, మనాక్=కొంచెము, స్వానుకూలం=తనకు ప్రియమైన స్థానముగానే, మేనే=తలంచెను.

సమాసములు :

రక్షిలక్షవృతత్వేన- రక్షిణాం లక్షః=రక్షిలక్షః, రక్షిలక్షేణ వృతం= రక్షిలక్షవృతం, రక్షిలక్షవృతస్య భావః=రక్షిలక్షవృతత్వం, తేన= రక్షిలక్షవృతత్వేన.

తపోధనైః-తప ఏవ ధనం యేషాం తే=తపోధనాః, తైః=తపోధనైః.

స్వానుకూలం-స్వస్య అనుకూలం=స్వానుకూలం, తత్=స్వానుకూలం.

భావము :

ఆ యుద్యానము లక్షలకొలది రక్షకులచే పరివేష్టితమై యుండుటవలన, నచ్చట శాంతి కాములగు తాపసు లుండరు. కాన వారివలన తనకు బాధ యుండదు. ఆ ప్రదేశములు బహుజనాక్రాంతములు గాన నిత్యము ధర్మ నిరతులై నిర్జన ప్రదేశమును గోరునట్టి తాపసు లచ్చట నుండజాలరు. కాన ధర్మద్వేషియైన తనకు వారిబాధ యుండదని భావించిన యహంకారియగు కలి యా యుద్యానమునే తనకు ప్రియమును, తన కార్యసాధనస్థానముగను నేర్పరచుకొనెను. వేదోక్తుల విధుల నాచరించెడి వారున్నచో వారి ధర్మకార్యము లను సహింపజాలని కలికి యుండసాధ్యము కాదు. రక్షకులు లక్షలుగా నున్నను వారి కంటబడక యదృశ్యుడుగా దానుండగలడు. కాన నీవిషయమున ధర్మాలోచనాప్రసక్తి లేదు. అందువలన నెట్టి బాధలేకుండ నలుని యుద్యాన మందే నివసించుటకు కలి నిశ్చయించుకొనెనని యాశయము. ఆ నలోద్యానము తప్ప తక్కిన యే ప్రదేశము ధర్మాచరణతో కూడియుండుటవలన తనకు వాసయోగ్యము కాలేదని సారాంశము. ॥207॥

శ్లో. దలపుష్పఫలైర్దేవద్విజపూజాభిసంధినా,
స నలేనార్జితాన్ప్రాప తత్ర నాక్రమితుం ద్రుమాన్. 208

ప. వి. దలపుష్పఫలైః-దేవద్విజపూజాభిసంధినా - సః-నలేన- అర్జితాన్-ప్రాప- తత్ర-న-ఆక్రమితుం-ద్రుమాన్.

అర్థము :-సః=ఆ కలి, తత్ర = ఆ భవనోద్యానమందు, దలపుష్పఫలైః, దల=ఆకులతోకూడను, పుష్ప=పూలతోడను, ఫలైః=ఫలములతోడను,

దేవద్విజపూజాభిసంధినా, దే=దేవతలయొక్కయు, ద్విజ=బ్రాహ్మణుల యొక్కయు, పూజా = పూజకు, అభిసంధినా = అభిప్రాయముతో, నలేన=నలునిచే, అర్జితాన్=నాటబడిన, ద్రుమాన్=విభీతకభిన్నము లైన వృక్షములను, ఆక్రమితుం=ఆక్రమించుటకు, న ప్రాప=పొంద లేకపోయెను. ఏలయనగా, నవి ధర్మకార్యోపయుక్తము లగుటవలన తాను పాపరూపు డగుటవలనను, వానిని పొందలేకపోయెనని యర్థము.

సమాసములు :

దలపుష్పఫలైః - దలం చ పుష్పం చ ఫలం చ = దలపుష్పఫలాని, తైః=దలపుష్పఫలైః.

దేవద్విజపూజాభిసంధినా, దేవాశ్చ ద్విజాశ్చ=దేవద్విజాః, దేవద్విజేభ్యః పూజా=దేవద్విజపూజా, దేవద్విజపూజాయామ్ అభిసంధిః=దేవద్విజ పూజాభిసంధిః, తేన=దేవద్విజపూజాభిసంధినా.

భావము :

ఆ కలిపురుషుడు, ఆ భవనోద్యానమందు ఆకులతోడను పుష్పముల తోడను ఫలములతోడను దేవతలను ద్విజులను పూజింపనిచ్ఛతో నాటిన వృక్షము లలో విభీతకము తప్ప, అనగా తాండ్రచెట్టుతప్ప తక్కినవానిని కలిపురుషు డాక్రమింప సమర్థుడు కాలేదు. ఏలయనగా, నావృక్షములలోని పత్రపుష్పఫలా దులు దేవద్విజపూజారూపధర్మసాధనము లగుటవలన పాపియగు కలికి వాని నాక్ర మింప సాధ్యము కాలేదు. ॥203॥

శ్లో. అథ సర్వోద్భిదాసత్తిపూరణాయ స రోపితం,
విభీతకం దదర్శైకం కుటం ధర్మేఽప్యకర్మఠమ్. 210

ప. వి. అథ-సర్వోద్భిదాసత్తిపూరణాయ-సః-రోపితం-విభీతకం-దదర్శ-ఏకం-కుటం-ధర్మే-అపి-అకర్మఠమ్.

స్థానదానాత్=స్థలము నిచ్చుటవలన,
=కలిసంబంధి వృక్షము, న అసీత్=
కల్పద్రుమోఽపి=కల్పవృక్షముకూడ,

నిర్గతం పదం యస్మాత్సః=నిష్పదః, తస్య=నిష్పదస్య,
- స్థానస్య దానం=స్థానదానం, తస్మాత్=స్థానదానాత్.
కలేః ద్రుమః=కలిద్రుమః.

ందు వాసము చేయుటవలన ప్రసిద్ధి చెందిన తాండ్రచెట్టు,
బొందని కలిపురుషునకు నా యుద్యానమందు స్థానమొసంగుట
సంబంధించిన వృక్షము కాలేదు. మఱేమనగా నెచ్చటను
లికి స్థానమిచ్చి కల్పవృక్షము గూడ నైనది. ॥211॥

న ధర్మస్య స్థాతు మేకేన యత్ బలిః,
పి తదా తస్య పదం మన్యేఽమిలత్ తతః. 212

ధర్మస్య-స్థాతుం-ఏకేన-యత్-బలిః-ఏకః-సః-అపి-తదా-
మన్యే-అమిలత్-తతః.

యత=ఎందువలన, కలిః=కలియుగాధిపతి, ధర్మస్య=పుణ్యము
యొక్క, ఏకేన=ఒక, పదేన=కాలితో ననగా నాలుగవ భాగముతో,
స్థాతుం = ఉండుటకు, దదౌ=అవకాశ మొసంగెనో (అనగా సృష్టి
యనాది యగుట వలన, తొంటి కలియుగమునందు కలియుగాధిపతి
ధర్మమున కొక్కపాదముతో నిలుచుట కవకాశ మొసంగెనని యర్థము)
తతః=అందువలన, తదా=ఆ నల రాజ్య కాలమందు, ఏకః=కేవలమైన,
సోఽపి= ఆ తాండ్రచెట్టే, తస్య= ఆ కలియుగమునకు అధిపతియైన

నిష్కుటి=ఆ యుద్యానమునకు, ధ్వజం=చిహ్నరూపమైన, తం=
ఆ తాండ్రచెట్టనెడి, నిజం=తనకు సంబంధించినదైన, ఆలమ్బనం=
ఆశ్రయమును, బహు=అధికముగా, మేనే=తలంచెను.

**సమాసములు:**

నైషధసౌధస్య- నిషధానాం రాజా=నైషధః, నైషధస్య సౌధః =
నైషధసౌధః, తస్య-నైషధసౌధస్య.
*నిష్కుటధ్వజం*- నిష్కుటస్య ధ్వజః=నిష్కుటధ్వజః, తం=నిష్కుట
ధ్వజం.

**భావము :**

ఆ కలిపురుష డాయుద్యానమునుఁ బ్రవేశించిన పిదప దేవద్విజ పూజాది
రూపములగు ధర్మకార్యములకు నేనికిని యుపయోగపడనిదైనను ప్రపంచములోని
యన్ని జాతులకుఁ జెందిన వృక్షములన్నియు నీయుద్యానమునం దుండుటకై నాటఁ
బడినదై నలుని భవనమునకు సమీపమునం దున్నదై యా యుద్యానమునకు
ధ్వజముగా నున్న యా తాండ్రచెట్టును తన కాశ్రయము గావించుకొని దానిని
గొప్పగా భావించెను. ధర్మకార్యములకు వేనికిని యా చెట్టు పనికిరానందు
వలన నందు సుఖముగా నుండుటకును నది యా యుద్యానమునకు ధ్వజమువలె
నెత్తుగా నుండుటవలన దానియందు నివసించుచు నలుని దోషములనుఁ గనిపెట్ట
వచ్చుననియు భావించి యా చెట్టును తనకాశ్రయము గావించుకొనెను. ॥210॥

శ్లో. నిష్పదస్య కలే స్తత్ర స్థానదానాత్ విభీతకః,
కలిద్రుమః ఫలం నాసీ దాసీత్ కల్పద్రుమోఽపి సః. 211

ప.వి. నిష్పదస్య-కలేః-తత్ర-స్థానదానాత్-విభీతకః-కలిద్రుమః - ఫలం-న -
ఆసీత్- కల్పద్రుమః-అపి-సః.

అర్థము : సః-కలిపురుషునకు వాసస్థానముగాఁ బ్రసిద్ధినొందిన యా తాండ్రచెట్టు,
నిష్పదస్య = ఎక్కడను స్థానము లభించని, కలేః=కలిపురుషునకు,

తత్ర=ఆ యుద్యానమునందు, స్థానదానాత్=స్థలము నిచ్చుటవలన, పరం=కేవలము, కలిద్రుమః=కలిసంబంధి వృక్షము, న ఆసీత్=కాలేదు, కింతు = కాని, కల్పద్రుమోఽపి=కల్పవృక్షముకూడ, ఆసీత్=ఆయెను.

సమాసములు :

నిష్పదస్య-నిర్గతం పదం యస్మాత్సః=నిష్పదః, తస్య=నిష్పదస్య, స్థానదానాత్- స్థానస్య దానం=స్థానదానం, తస్మాత్=స్థానదానాత్. కలిద్రుమః- కలేః ద్రుమః=కలిద్రుమః.

భావము :

ఆ కలిపురుషుడు వాసము చేయుటవలన ప్రసిద్ధి చెందిన తాండ్రచెట్టు, ఎచ్చటను స్థానముఁ బొందని కలిపురుషునకు నా యుద్యానమందు స్థానమొసంగుట వలన కేవలము కలికి సంబంధించిన వృక్షము కాలేదు. మఱేమనగా నెచ్చటను స్థానము బొందలేని కలికి స్థానమిచ్చి కల్పవృక్షము గూడ నైనది. ॥211॥

శ్లో. దదౌ పాదేన ధర్మస్య స్థాతు మేకేన యత్ బలిః,
ఏక స్సోఽపి తదా తస్య పదం మన్యేఽమిలత్ తతః. 212

ప.వి. దదౌ-పాదేన-ధర్మస్య-స్థాతుం-ఏకేన-యత్-బలిః-ఏకః-సః-అపి-తదా-తస్య-పదం-మన్యే-అమిలత్-తతః.

అర్థము : యత్=ఎందువలన, కలిః=కలియుగాధిపతి, ధర్మస్య=పుణ్యము యొక్క, ఏకేన=ఒక, పదేన=కాలితో ననగా నాలుగవ భాగముతో, స్థాతుం = ఉండుటకు, దదౌ=అవకాశ మొసంగెనో (అనగా సృష్టి యనాది యగుట వలన, తొంటి కలియుగమునందు కలియుగాధిపతి ధర్మమున కొక్కపాదముతో నిలుచుట కవకాశ మొసంగెనని యర్థము) తతః=అందువలన, తదా=ఆ నల రాజ్య కాలమందు, ఏకః=కేవలమైన, సోఽపి= ఆ తాండ్రచెట్టే, తస్య= ఆ కలియుగమునకు అధిపతియైన

మహిమచే నిట్లు వర్ణితము. గడ్డిగాదము మున్నగువానితో నిల్లు గట్టుకొనిన యొకానొక పురుషుడు, కడుపునందు నిప్పుగలిగిన, యగ్నిని తిను పావురాయి యనెడి పక్షిని యింటిపై జూచి, నిప్పును తగిలించునేమో యని యెట్లు భయ పడునో ఆ విధముగా కలిపురుషుడు నలునివలన భయపడుచుండెను.

ఇచ్చట ''సాగ్నేః'' ''దీక్షితాత్'' అను రెండువిశేషణములను రాజునకు నుపయోగించుటవలన నలుడు తనతపోమహిమచే కలిని శపింపగలడనెడి యాతని సామర్థ్యము, ''రాజ్ఞః'' ''ద్విజాత్'' అను రెండు విశేషణము లుపయోగించుట వలన నతనికి క్షత్రియరాజునకుఁ దగినట్టి దండమొసంగెడి సామర్థ్యమున్నట్లును సూచితము. ॥213॥

శ్లో, విభీతక మధిష్ఠాయ తథాభూతేన తిష్ఠతా,
తేన భీమభువోఽభీక స్స రాజర్షి రధర్షి న. 214

ప. వి. విభీతకమ్-అధిష్ఠాయ-తథాభూతేన-తిష్ఠతా-తేన-భీమభువః-అభీకః-సః-రాజర్షిః-అధర్షి-న.

అర్థము : తథాభూతేన=నలుని లోపములను వెదకునట్టి, (కావుననే), విభీతకం =తాండ్రచెట్టును, అధిష్ఠాయ=ఎక్కి, తిష్ఠతా=ఉన్నటువంటి, తేన= ఆ కలిపురుషునిచే, భీమభువః = భీమపుత్రికయగు దమయంతియొక్క, అభీకః=కాముకుడగు, సః=ఆ, రాజర్షిః=ఋషితుల్యుడగు నలమహా రాజు, న అధర్షి=పీడింపఁబడలేదు.

సమాసములు :

*భీమభువః* - భీమాత్ భవతీతి=భీమభూః, తస్యాః=భీమభువః.
*అభీకః*-అభికామయతే ఇతి=అభీకః,

భావము:

నలుని లోపములను వెదకుచు, తాండ్రచెట్టుపై నివాసము గలిగిన యాకలి పురుషుడు దమయంతిని కామించిన రాజర్షియైన యానలుని పీడింపఁజాలకపోయెను.

లేదా భూతావాసమనియు పేరుగల్గి భూతములకు నివాసమైన యాతాండ్రచెట్టు నెక్కిన మహాభూతమైన యాకలిపురుషుడు. భీమభువః=భయంకరస్థానమునుండి భయము చెందక బుషితుల్యుడును కావుననే ధార్మికుడేగాక భూతముల నుచ్చాటనముచేయగల మంత్రముల నెఱింగిన యానలమహారాజును పీడింపలేక పోయె ననియు నర్థము చెప్పవచ్చును. తథా భూతేన యనగా నట్టి భూతముగా నున్న యని కలిపురుషునకు విశేషణము. ॥214॥

తమాలమ్బన మాసాద్య వైదర్భీనిషధేశయోః,
కలుషం కలి రన్విష్య న్నవాత్సీ ద్వత్సరాన్ బహూన్. 215

. వి. తం-ఆలమ్బనమ్-ఆసాద్య- వైదర్భీనిషధేశయోః - కలుషం - కలిః - అన్విష్యన్-అవాత్సీత్-వత్సరాన్-బహూన్.

తి. తం=ఆ తాండ్రచెట్టును, ఆలమ్బనం= =పొంది, వైదర్భీనిషధేశయోః, వైదర్భీ= ధేశయోః=నిషధప్రభువైన నలునియొక్కయు, అనగా పాపాచరణమును, అన్విష్యన్=వెదకుచు, పెక్కు, వత్సరాన్=వత్సరములకాలము, అవాత్సీత్=

సమాసములు ;

వైదర్భీనిషధేశయోః-విదర్భేషు భవా=వైదర్భీ, నిషధానాం ఈశః= నిషధేశః, వైదర్భీ చ నిషధేశశ్చ=వైదర్భీనిషధేశౌ, తయోః= వైదర్భీనిషధేశయోః.

భావము :

ఆ కలిపురుషు డా తాండ్రచెట్టు నాశ్రయము గావించుకొని దమయంతి యొ్రనను నలుడైనను పాపమేమైన చేతురా యని కనిపెట్టుచు పెక్కుసంవత్సరము లుండెను. ॥215॥

శ్లో. యథాసీత్ కాననే తత్ర వినిద్రకలికాలతా
తథా నలచ్ఛలాసక్తివినిద్రకలికాలతా. 216

ప. వి. యథా-ఆసీత్-కాననే-తత్ర-వినిద్రకలికా-లతా-తథా - నలచ్ఛలాసక్తి వినిద్రకలికాలతా.

అర్థము:- తత్ర=ఆ, కాననే=నలోద్యానమందు, యథా=ఎట్లు, వినిద్రకలికా, వినిద్ర=వికసించిన, కలికా=మొగ్గలుగలిగిన, లతా=తీగె, ఆసీత్=ఉండెనో, తథా=అట్లే, నలచ్ఛలాసక్తివినిద్రకలికాలతా, నల=నలుని యొక్క, ఛల=వంచనయందు, ఆసక్తి=పట్టుదలచే, వినిద్ర=నిద్ర లేని యనగా మెలకువగలిగిన, కలి=కలియనెడి, కాలతా=సమయము గలిగియుండుట, ఆసీత్=ఏర్పడినది.

సమాసములు :

*వినిద్రకలికా* - విగతా నిద్రా యాసాం తాః = వినిద్రాః, వినిద్రాః కలికాః యస్యాః సా=వినిద్రకలికా.
*నలచ్ఛలాసక్తివినిద్రకలికాలతా* - నలస్య ఛలం = నలచ్ఛలం, నలచ్ఛలే ఆసక్తిః=నలచ్ఛలాసక్తిః నలచ్ఛలాసక్త్యా వినిద్రః=నలచ్ఛలాసక్తి వినిద్రః, నలచ్ఛలాసక్తివినిద్రః కలిః కాలః యస్మిన్ తత్ = నలచ్ఛలాసక్తివినిద్రకలికాలం, నలచ్ఛలాసక్తివినిద్రకలికాలస్య భావః = నలచ్ఛలాసక్తివినిద్రకలికాలతా.

భావము :

ఆ యుద్యానవనమందు పూవులనెడి కన్నులు తెఱచుకొనిన తీగె యెట్లుండునో ఆవిధముగనే నలుని వంచించుటయందాసక్తి గలిగినవాడై నిద్రమాని కన్నులు తెఱచుకొని కలియనెడి కాలముకూడ నుండినదని యాశయము. ॥216

శ్లో. ద్రోషం నలస్య జిజ్ఞాసు ర్బభ్రాజ ద్వాపరః క్షితౌ,
న దోషః కోఽపి లోకస్య ముఖేఽస్తీతి దురాశయా. 217

ప. వి. దోషం-నలస్య- జిజ్ఞాసుః-బభ్రాజ-ద్వాపరః- క్షితౌ-న-దోషః-కః-అపి-
లోకస్య-ముఖే-అస్తి-ఇతి-దురాశయా.

అర్థము:- అథ=పిదప, ద్వాపరః=ద్వాపరయుగముగూడా, నలస్య=నలుని
యొక్క, దోషం = అనాచారమును, జిజ్ఞాసుః=తెలియగోరినవాడై,
లోకస్య=జనముయొక్క, ముఖే = నోట, అదోషః=దోషాభావము,
కోఽపి=ఏదియు, నాస్తీతి=ఉండదని, అనగా దోషము తప్పక యుండ
గలదని, దురాశయా=దుష్టమైనకోరికతో, క్షితౌ = భూమియందు,
బభ్రాజ=ప్రకాశించెను. అనగా తిరిగెనని యర్థము.

సమాసములు :

జిజ్ఞాసుః - జ్ఞాతుమిచ్ఛుః=జిజ్ఞాసుః.
దురాశయా - దుష్టా ఆశా=దురాశా, తయా=దురాశయా.

భావము :

పిదప ద్వాపరయుగపురుషుడు గూడ, కలికి సాహాయ్య మొసంగగోరిన
వాడై నలుని దోషము తెలియగోరినవాడై లోకులనోట నలునిగూర్చి యేదైన
దోషలేశము ఉండవచ్చు నను పట్టుదలతో భూమియందు దిరుగజొచ్చెన ..217..

శ్లో. అముష్మి న్నారామే సతతనిపతద్దోహదతయా,
ప్రసూనై రున్నిద్రై రనిశ మమృతాంశుప్రతిభటే,
అసౌ బద్ధాలమ్బః కలి రజని కాదమ్బవిహగ
చ్ఛదచ్ఛాయాభ్యఙ్గోచితరుచితయా లాంఛనమృగః. 218

ప. వి. అముష్మిన్- ఆరామే-సతతనిపతద్దోహదతయా-ప్రసూనైః-ఉన్నిద్రైః-
అనిశం- అమృతాంశుప్రతిభటే- అసౌ-బద్ధాలమ్బః-కలిః-అజని-కాదమ్బ
విహగచ్ఛదచ్ఛాయాభ్యఙ్గోచితరుచితయా-లాంఛనమృగః.

అర్థము:- సతతనిపతద్దోహదతయా, సతత=ఎల్లపుడు, నిపతత్=సంభవించెడి, దోహదతయా=అకాలమున పుష్పఫలముల నొసంగుటకై కల్పితములైన ధూపాదిదోహదసంస్కారములు గల్గియుండుటచే, ఉన్నిద్రైః=వికసితములైన, ప్రసూనైః=పుష్పములచే, అనిశం=ఎల్లపుడు, అమృతాంశుప్రతిభటే, అమృతాంశు=చంద్రునితో, ప్రతిభటే=స్పర్ధ చేసెడి, యనగా సమానమైన, అముష్మిన్=ఈ, ఆరామే=ఉద్యానమందు, బద్ధాలమ్బః=ఆశ్రయమును గల్పించుకొనిన, అసౌ=ఈ కలి, కాదమ్బవిహగచ్ఛదచ్ఛాయాభ్యఙ్గోచితరుచితయా, కాదమ్బవిహగ = నలుపు వన్నెగల హంసయొక్క, ఛద=ఱెక్కలయొక్క, ఛాయా=కాంతిచే, అభ్యఙ్గ = పూయుటయందు, ఉచిత=అలవడిన, రుచితయా=కోరిక కలిగియుండుటచే, ననగా కాదంబహంసవలె నల్లగా నుండుటచే, లాఞ్ఛన మృగః=కళంకమైన జింకగా, అజని=ఏర్పడెను.

**సమాసములు :**

*సతతనిపతద్దోహదతయా* - సతతం నిపతన్=సతతనిపతన్, సతత నిపతన్ దోహదః యస్య సః=సతత నిపతద్దోహదః, సతతనిపతద్దోహదస్య భావః=సతతనిపతద్దోహదతా, తయా=సతతనిపతద్దోహదతయా.

*అమృతాంశుప్రతిభటే* - అమృతాంశునా ప్రతిభటః=అమృతాంశుప్రతిభటః తస్మిన్=అమృతాంశుప్రతిభటే.

*బద్ధాలమ్బః* - బద్ధః ఆలమ్బః యేన సః=బద్ధాలమ్బః.

*కాదమ్బ విహగచ్ఛదచ్ఛాయాభ్యఙ్గోచిత రుచితయా* - కాదమ్బ ఇతి విహగః= కాదమ్బవిహగః, కాదమ్బ విహగస్య ఛదః = కాదమ్బవిహగచ్ఛదః కాదమ్బవిహగచ్ఛదస్య ఛాయా=కాదమ్బవిహగచ్ఛదచ్ఛాయా, కాదమ్బ విహగచ్ఛదచ్ఛాయయా అభ్యఙ్గః = కాదమ్బవిహగచ్ఛదచ్ఛాయాభ్యఙ్గః, కాదమ్బ విహగచ్ఛదఛాయాభ్యఙ్గస్య ఉచితా=కాదమ్బ విహగచ్ఛదచ్ఛాయాభ్యఙ్గోచితా, కాదమ్బవిహగచ్ఛదచ్ఛాయాభ్యఙ్గోచితా రుచిః యస్య సః = కాదమ్బ విహగచ్ఛదచ్ఛాయాభ్యఙ్గోచిత రుచిః, కాదమ్బవిహగచ్ఛదచ్ఛాయాభ్యఙ్గోచితరుచేః భావః = కాదమ్బవిహగచ్ఛదచ్ఛాయాభ్యఙ్గోచిత రుచితా, తయా=కాదమ్బవిహగచ్ఛదచ్ఛాయాభ్యఙ్గోచితరుచితయా.

*లాఞ్ఛనమృగః*- లాఞ్ఛనం చాసౌ మృగశ్చ=లాఞ్ఛనమృగః.

భావము :

ఆ యుద్యానవనమునందు నిరంతరము అకాలమునందు పుష్పఫలము లేర్పడుటకై యచ్చటి చెట్లకు సంస్కారధూపములు వేయఁబడుచున్నవి. అందు వలన నావనమందు పుష్పము లంతటను వికసించి యుండుటవలన నావనము తెల్లని వన్నెనుఁ బొంది చంద్రునితో సమానముగా నున్నది. ఆ వనమందు నివసించెడి, యా కలిపురుషుడు నల్లని హంసయొక్క ఱెక్కలవంటి ధూమ్రవర్ణము గలవాడై యుండుటవలన నా యుద్యానమనెడి చంద్రునిలో నల్లని కలఙ్కమైన జింకగా నుండెనని యాశయము. ॥218॥

శ్లో. స్ఫారే తాదృశి వైరసేనినగరే పుణ్యైః ప్రజానాం ఘనం
విఘ్నం లబ్ధవత శ్చిరా దుపనతి స్తస్మిన్ కిలాసీత్ కలేః,
ఏతస్మి న్పున ర న్తరేఽ న్తరమితానందః స భైమీనలా
నారాద్ధుం వ్యథితస్మరః శ్రుతిశిఖావన్దారుచూడం ధనుః. 219

ప.వి. స్ఫారే-తాదృశి-వైరసేనినగరే-పుణ్యైః-ప్రజానాం- ఘనం-విఘ్నం - లబ్ధవతః-చిరాత్-ఉపనతిః-తస్మిన్-కిల-ఆసీత్-కలేః -ఏతస్మిన్ - పునః-అన్తరే-అంతరమితానన్దః-సః-భైమీనలౌ-ఆరాద్ధుం-వ్యథితస్మరః - శ్రుతిశిఖావన్దారుచూడం-ధనుః.

అర్థము : తాదృశి=అటువంటి, స్ఫారే=విశాలమైన-వైరసేనినగరే = నలుని నగరమందు, ప్రజానాం=జనులయొక్క, పుణ్యైరేవ=పుణ్యములచేతనే, ఘనం=నిరన్తరము, విఘ్నం=విఘ్నమును, లబ్ధవతః=పొందినట్టి, కలేః=కలిపురుషునకు, ఏతస్మిన్=ఈ, అంతరే=ఆవకాశమునందు, అంతరమితానన్దః, అంతః=లోపల, అమితానన్దః=అమితమగు సంతోషము కలిగిన, స్మరః=మన్మథుడు, భైమీనలౌ=దమయంతీ నలులను, ఆరాద్ధుం=వశీకరించుటకు, శ్రుతిశిఖావన్దారు చూడం, శ్రుతి=కర్ణములయొక్క, శిఖా=కొనలకు, వందారు=వాలిన, చూడం=కొనలు గలిగిన దానినిగా, ధనుః=వింటిని, వ్యథిత=చేసెను. అనగా బాణముతో సంధించెనని యర్థము. కలి యాక్రమించుటకు మునుపు యథేచ్ఛగా కామ సుఖము ననుభవించిరని యర్థము.

సమాసములు :

వైరసేనినగరే - వీరసేనస్య అపత్యం పుమాన్ = వైరసేనిః, వైరసేనేః నగరం = వైరసేనినగరం, తస్మిన్ = వైరసేనినగరే.

అంతరమితానన్దః - అమితశ్చాసౌ ఆనందశ్చ-అమితానన్దః, అంత అమితానన్దః యస్య సః = అంతరమితానన్దః.

భైమీనలౌ-భైమీ చ నలశ్చ = భైమీనలౌ, తౌ = భైమీనలౌ.

శ్రుతిశిఖా వన్దారు చూడం-శ్రుత్యోః శిఖే = శ్రుతిశిఖే, శ్రుతిశిఖయోః వందారుః శ్రుతి శిఖావన్దారుః, శ్రుతిఖావన్దారుః చూడా యస్య తత్ = శ్రుతిశిఖావన్దారుచూడం, తత్ = శ్రుతిశిఖావన్దారుచూడం.

భావము :

అట్టి ధర్మపరిపూర్ణమైన నలుని నగరమందు, ప్రజల పుణ్యములచే, నెల్లపుడు విఘ్నములు బొందుచున్న కలియుగ పురుషునకు నాయుద్యాన వనము నందు చాలాకాలము నుండుట యేర్పడినది. ఇంతలో లోన మిక్కిలి సంతోషించిన మన్మథుడు దమయంతీ నలులను వశీకరించుటకు కర్ణాగ్రములకు తాకిన తన వింటిని బాణముతో సంధించెను. కలి పట్టుకొనునంతవరకును వారిరువురు యథేచ్ఛగా కామసుఖము ననుభవించిరని యాశయము. ॥29॥

శ్లో. శ్రీహర్షం కవిరాజరాజిముకుటాలంకారహీరస్సుతం
శ్రీహీరః సుషువే జితేన్ద్రియచయం మామల్లదేవీ చ యం
యాత స్సప్తదశ స్స్వసు స్సుసదృశి చ్ఛన్దఃప్రశస్తేర్మహా
కావ్యే తద్భువి నైషధీయచరితే సర్గో నిసర్గోజ్జ్వలః.

ప.వి. శ్రీహర్షం-కవిరాజరాజముకుటాలంకారహీరః-సుతం-శ్రీహీరః-సుషువే-జితేన్ద్రియచయం-మామల్లదేవీ-చ -యం -యాతః - సప్తదశః-స్వసుః-సుసదృశి - ఛన్దఃప్రశస్తేః - మహాకావ్యే-తద్భువి - నైషధీయచరితే సర్గః-నిసర్గోజ్జ్వలః.

అర్థము:కవిరాజరాజిముకుటాలఙ్కారహీరః,కవిరాజ=కవిశ్రేష్ఠులయొక్క,రాజి= పంక్తికి, ముకుట=శ్రేష్ఠులైనవారికి, అలఙ్కార=భూషణమైన, హీరః= వజ్రమణియైన, శ్రీహీరః=శ్రీహీరుడు, జితేన్ద్రియచయం=జయింప బడిన ఇంద్రియవర్గములు గలిగిన, శ్రీహర్షం = శ్రీహర్షుడను పేరుగల, యం సుతం=ఏకుమారుని, మామల్లదేవీ చ=మల్లదేవియను తల్లియు, సుషువే=కనెనో, త ద్భువి=అట్టిశ్రీహర్షునివలన నుద్భవించినదియు, స్వసుః=సోదరియగు, ఛందఃప్రశస్తేః=ఛందఃప్రశస్తి యను గ్రంథ మునకు, సుసదృశి = మిక్కిలి సాదృశ్యము గలిగినదియునగు, మహాకావ్యే = మహాకావ్యమైన, నైషధీయచరితే=నైషధీయచరితము నందు, నిసర్గోజ్జ్వలః = స్వభావముచే రమ్యమగు, సప్తదశః = పదునేడవ, సర్గః=సర్గ, యాతః=గడచినది.

భావాదులు పూర్వశ్లోకములకువలె గ్రహించునది.

ఇతి

శ్రీమదాత్రేయసగోత్ర శ్రీమదుడాలినృసింహశాస్త్రితనూజ విక్రమసింహపురీ
వేదసంస్కృతకళాశాలా భూతపూర్వప్రధానోపాధ్యాయ
శ్రీసుబ్బరామశాస్త్రి విరచితమగు
నైషధాంధ్రవ్యాఖ్యకు
సప్తదశసర్గ సమాప్తము.

# శ్రీ హర్ష నైషధము

## అష్టాదశ సర్గ

శ్లో. సోఽయ మిత్థ మథ భీమనందినీం
దారసార మధిగమ్య నైషధః,
తం తృతీయపురుషార్థవారిధేః
పారలమ్భనతరీ మరీరమత్. 1

ప. వి. సః-అయమ్-ఇత్థమ్-అథ-భీమనన్దినీం-దారసారమ్- అధిగమ్య-నైషధః-తం-తృతీయపురుషార్థవారిధేః-పారలమ్భనతరీమ్-అరీరమత్.

అర్థము: అథ = పిదప, సః = ప్రసిద్ధుడైన, అయం = ఈ, నైషధః = నలమహారాజు, ఇత్థమ్ = ఈవిధముగా అనగా పూర్వము వర్ణించిన ప్రకారముగా, దారసారం; దార = భార్యలయందు, సారం = శ్రేష్ఠమైన యనగా స్త్రీరత్నమైన, భీమనన్దినీం = భీమరాజుపుత్రికయగు దమయంతిని, అధిగమ్య = పొంది, తృతీయపురుషార్థవారిధేః = మూడవ పురుషార్థమగు కామసముద్రముయొక్క, పారలమ్భనతరీం; పారలమ్భన = ఆవలిగట్టును బొందించుటయందు, తరీం = నావయైన యాదమయంతిని, అరీరమత్ = రమింపజేసెను.

వి: ఈసర్గయందు "రో నరా విహ రథోద్ధతా లగా" అని రనరలగములు కల్గిన రథోద్ధతావృత్తము.

సమాసములు :

భీమనన్దినీం - భీమస్య నందినీ = భీమనందినీ, తాం = భీమనందినీం.

దారసారం - దారేషు సారః=దారసారః, తం=దారసారమ్.

నైషధః - నిషధానాం రాజా=నైషధః.

తృతీయపురుషార్థవారిధేః - తృతీయ శ్చాసౌ పురుషార్థశ్చ=తృతీయ పురుషార్థః, తృతీయపురుషార్థస్య వారిధిః=తృతీయపురుషార్థవారిధిః, తస్య=తృతీయపురుషార్థవారిధేః.

పారలమ్భనతరీమ్ - పారస్య లమ్భనం=పారలమ్భనం, పారలమ్భనే తరీ=పారలమ్భనతరీ, తాం=పారలమ్భనతరీమ్.

భావము :

ప్రసిద్ధుఁడగు నలమహారాజు పూర్వము వర్ణించినవిధముగా భార్యలలో మిన్నయైన స్త్రీరత్నమగు నాదమయన్తిని పొంది ధర్మార్థకామమోక్షములలో మూడవదైన కామమనెడి పురుషార్థమను సముద్రముయొక్క యావలిగట్టునుఁ బొందించుటలో నౌకయైన యాదమయన్తిని రమింపఁజేసెను. అనగా నాదమయన్తితో కామసౌఖ్యము ననుభవించెనని యాశయము. ॥1॥

శ్లో. ఆత్మవి త్సహ తయా దివానిశం
భోగభాగపి న పాప మాప సః,
ఆహృతా హి విషయైకతానితా
జ్ఞానధౌతమనసం న లిమ్పతి. 2

ప. వి. ఆత్మవిత్-సహ-తయా-దివానిశం-భోగభాక్ - అపి-న-పాపమ్-ఆప-సః-ఆహృతా-హి-విషయైకతానతా-జ్ఞానధౌతమనసం-న-లిమ్పతి.

అర్థము: ఆత్మవిత్=ఆత్మజ్ఞానము కల్గిన (అనగా జీవ బ్రహ్మలకు భేదము లేదనెడి బుద్ధి కల్గిన, సః=ఆ నలుడు, తయా సహ=ఆ దమయంతి తోడ, దివానిశం=పగలు రాత్రియు, భోగభాక్ అపి=విషయ సుఖముల ననుభవించుచున్నను, పాపం=ఇంద్రియములను నిగ్రహింపనందు వలని పాపమును, న ఆప=పొందలేదు, హి=ఏల యనగా, ఆహృతా = కల్పితమైన యనగా స్వభావ సిద్ధముగాని, విషయైకతానతా,

శ్లో. న్యస్య మన్త్రిషు స రాజ్య మాదరా
దారరాధ మదనం ప్రియాసఖః,
నైకవర్ణమణి కోటికుట్టిమే
హేమభూమిభృతి సౌధభూధరే. 3

ప. వి. న్యస్య-మన్త్రిషు-సః-రాజ్యమ్-ఆదరాత్-ఆరరాధ-మదనం - ప్రియా సఖః-నైకవర్ణమణికోటికుట్టిమే-హేమభూమిభృతి-సౌధభూధరే.

అర్థము: సః=ఆ నలమహారాజు, మన్త్రిషు = మంత్రులయందు, రాజ్యం= రాజ్యము యొక్క పరిపాలనా భారమును, న్యస్య=ఉంచి, నైకవర్ణమణి కోటికుట్టిమే, నైకవర్ణ=అనేక వర్ణములతో కూడిన, మణికోటి=పెక్కు మణులు గల్గిన, కుట్టిమే=కట్టబడిన భూమి కలదియు, హేమ భూమి భృతి=బంగరు నేలను ధరించిన, సౌధభూధరే=పర్వతముతో సమాన మైన మిక్కిలి యెత్తైన మేడయందును, ప్రియాసఖః = ప్రియురాలగు దమయంతిని చెలికత్తెగా కల్గినవాడై, మదనం=మన్మథుని, ఆరరాధ= సేవించెను. (శచీదేవితో నింద్రుడు మేరుపర్వతమునందు సుఖము ననుభవించినట్లు తన మేడయందు దమయంతితో రతిసుఖము ననుభ వించెనని అర్థము.)

సమాసములు :

ప్రియాసఖః-ప్రియా సఖీ యస్య సః=ప్రియాసఖః.
నైకవర్ణమణికోటికుట్టిమే - నైకః వర్ణః యేషాం తే = నైకవర్ణాః, నైకవర్ణాశ్చ తే మణయశ్చ = నైకవర్ణమణయః, నైకవర్ణమణీనాం కోటయః = నైకవర్ణమణికోటయః, నైకవర్ణమణి కోటీనాం కుట్టిమః =నైకవర్ణమణి కోటి కుట్టిమః, తస్మిన్=నైకవర్ణమణి కోటి కుట్టిమే.
హేమభూమిభృతి - హేమమయీ భూమిః = హేమభూమిః, హేమ భూమిం బిభర్తీతి=హేమభూమిభృత్, తస్మిన్ = హేమభూమిభృతి.
సౌధభూధరే - సౌధ ఏవ భూధరః = సౌధభూధరః, తస్మిన్= సౌధభూధరే.

వీరసేనసుతస్య కణ్ఠభూషణీభూతా = వీరసేనసుతకణ్ఠభూషణీభూతా, దివ్యాశ్చ తే మణయశ్చ = దివ్యమణయః, దివ్యమణీనాం పఙ్క్తిః = దివ్యమణిపఙ్క్తిః, వీరసేనసుతకంఠభూషణీభూతా చ సా దివ్యమణిపంక్తిశ్చ = వీరసేనసుతకణ్ఠభూషణీభూతదివ్యమణిపఙ్క్తిః, వీరసేనసుత కంఠభూషణీభూతదివ్యమణిపఙ్క్తేః శక్తయః = వీరసేనసుతకణ్ఠభూషణీభూతదివ్యమణిపఙ్క్తిశక్తయః, తాభిః = వీరసేనసుతకణ్ఠభూషణీభూతదివ్యమణిపఙ్క్తిశక్తిభిః.

కామనోపనమదర్థతాగుణాత్ - కామనయా ఉపనమన్తః = కామనోపనమన్తః, కామనోపనమన్తః అర్థాః యస్య సః = కామనోపనమదర్థః, కామనోపనమదర్థస్య భావః = కామనోపనమదర్థతా, కామనోపనమదర్థతైవ గుణః = కామనోపనమదర్థతాగుణః, తస్మాత్ = కామనోపనమదర్థతాగుణాత్.

తృణీకృతసుపర్వపర్వతః - అతృణం తృణం సమ్పద్యమానః కృతః = తృణీకృతః, సుపర్వణాం పర్వతః = సుపర్వపర్వతః, తృణీకృతః సుపర్వపర్వతః యేన సః = తృణీకృతసుపర్వపర్వతః.

**భావము :**

ఆ మేడ నలమహారాజునకు కణ్ఠభూషణమై దివ్యమణిమాలయొక్క ప్రభావములచే కోరినవస్తువులను సమకూర్చుచు సుమేరుపర్వతమునుకూడ నావిషయమునందు తృణీకరించినదై యున్నది.

శ్లో. ధూపితం యదుదరామ్బరం చిరం
మేచకైరగురుసారదారుభిః।
జాలజాలధృతచన్ద్రచన్దన
క్షోదమేదుర సమీరశీతలమ్. 5

ప. వి. ధూపితం-యదుదరామ్బరం-చిరం-మేచకైః- అగురుసారదారుభిః- జాలజాలధృతచన్ద్రచన్దనక్షోదమేదురసమీరశీతలమ్.

గావింపఁబడినది. మఱియు ప్రతిగవాక్షమునందును పచ్చకర్పూరము, చందనము మున్నగువాని చూర్ణములను పట్టించుటవలన నందుండి లోపలకువచ్చు గాలి యా చూర్ణములతో దట్టములై యుండెడివి. అట్టిగాలితో నాభవనము చల్లనై యున్నదని యాశయము. ॥5॥

శ్లో. క్వాఽపి కామశర వృత్తవర్తయో
యం మహాసురభితైలదీపికాః,
తేనిరే వితిమిరం స్మరస్ఫుర
ద్దోఃప్రతాప నికరాఙ్కురశ్రియః. 6

ప.వి. క్వ-అపి-కామశరవృత్తవర్తయః-యం- మహాసురభితైలదీపికాః-తేనిరే-వితిమిరం-స్మరస్ఫురద్దోఃప్రతాపనికరాఙ్కురశ్రియః.

అర్థము:- కామశరవృత్తవర్తయః, కామశర = మామిడిమొగ్గనుండిగాని లేదా కర్పూరమునుండిగాని, వృత్త = ఏర్పడిన, వర్తయః = వత్తులుకలిగిన, మహాసురభితైలదీపికాః, మహాసురభి = మిక్కిలి పరిమళముకల్గిన, తైల దీపికాః = నువ్వులనూనెతో కూడిన దీపములు, స్మరస్ఫురద్దోఃప్రతాపనిక రాఙ్కురశ్రియః, స్మర = మన్మథునియొక్క, స్ఫురత్ = దమయంతీ నలుల బాధించుటకై కదలుచున్న, దోః = భుజములయొక్క, ప్రతాప నికర = తేజోరాశియొక్క, అఙ్కురశ్రియః = అఙ్కురములవంటి శోభ గలవై, యం = ఏమేడను, క్వాపి = ఒకచోట (ననగా దమయంతీనలులు, అలంకరించిన ప్రదేశమున) వితిమిరం = చీకటి లేకయుండుటను, వితే నిరే = చేసినవి.

సమాసములు :

కామశర వృత్తవర్తయః - కామస్య శరః = కామశరః, కామశరాత్ వృత్తాః = కామశరవృత్తాః; కామశరవృత్తాః వర్తయః యాసాం తాః = కామశరవృత్త వర్తయః.

ప. వి. కుఙ్కుమైణపద పఙ్కలేపితాః, క్షాలితాః, చ, హిమవాలుకామ్బుభిః, రేజుః, అధ్వతత శైలజస్రజః, యస్య, ముగ్ధమణికుట్టిమాః, భువః.

అర్థము : కుఙ్కుమైణపద పఙ్కలేపితాః, కుఙ్కుమ = కుఙ్కుమ పూవు, ఏణ మద = కస్తూరియను వీనియొక్క, పఙ్క = అడుసుచే, లేపితాః = పూయబడినవియును, హిమవాలు కామ్బుభిః, హిమవాలుకా = కర్పూరముతో మిలితములైన, అమ్బుభిః = ఉదకములచే, క్షాలితాః = కడగబడినది యును, తథా = అట్లే, అధ్వతత శైలజస్రజః, అధ్వ = ప్రవేశమార్గ ములయందు, తత = పఱుచబడిన, శైలజ = జాతి పూవుల, స్రజః = మాలలు కల్గినవియును, తథా = అట్లే, ముగ్ధమణికుట్టిమాః, ముగ్ధ = సుందరములైన, మణికుట్టిమాః = రత్నములతో బొదుగబడిన నేలలు గలవియునై, యస్య = ఏభవనముయొక్క, భువః = ముంగిళ్ళు, రేజుః = శోభించినవో.

విశే - సమృద్ధిగల వస్తువులను వర్ణించుటవలన ఉదాత్తాలఙ్కారము.

సమాసములు :

*కుఙ్కుమైణపద పఙ్కలేపితాః* - కుఙ్కుమం చ ఏణమదశ్చ = కుఙ్కుమైణమదే, కుఙ్కుమైణమదయోః పఙ్కః = కుఙ్కుమైణమదపఙ్కః, కుఙ్కుమైణమదపఙ్కేన లేపితాః = కుఙ్కుమైణమదపఙ్కలేపితాః.

**హిమవాలుకామ్బుభిః** - హిమవాలుకామయాని చ తాని అమ్బూని చ హిమవాలుకామ్బూని, తైః = హిమవాలుకామ్బుభిః.

*అధ్వతత శైలజస్రజః* - శైలజానాం స్రజః = శైలజస్రజః, అధ్వని తతాః = అధ్వతతాః, అధ్వతతాః శైలజస్రజః యాసు తాః = అధ్వతత శైలజస్రజః.

భావము :

ఆ భవనముయొక్క ముంగిళ్ళు, కుఙ్కుమపూవుయొక్కయు, కస్తూరి యొక్కయు, లేపములచే నలుకబడినవి. మఱియు నా ముంగిళ్ళు కర్పూరపు

నైషధాఙ్గపరిమర్దేన మేదురా మోదః=నైషధాఙ్గ పరిమర్ద మేదురా మోదః, నైషధాంగ పరిమర్ద మేదురామోదశ్చ మార్దవం చ మనోజ్ఞవర్ణశ్చ యస్యాః సా=నైషధాఙ్గపరిమర్ద మేదురామోద మార్దవ మనోజ్ఞవర్ణా, తయా=నైషధాఙ్గపరిమర్దమేదురామోద మార్దవ మనోజ్ఞవర్ణయా.

యద్భువః-యస్య భువః=యద్భువః.

సూనశయ్యయా-సూనానాం శయ్యా=సూనశయ్యా, తయా=సూన శయ్యయా.

ఫాలతిలక ప్రగల్భతా-ఫాలే తిలకః=ఫాలతిలకః, ఫాలతిలకస్య ప్రగల్భతా=ఫాలతిలక ప్రగల్భతా.

భావము :

నలుని శరీరమర్దనముచే దట్టమైన పరిమళము, మెత్తదనము, మనోహర మగు వర్ణములు కల్గినపూల పడకచే యా మేడలో నలుని పడకయున్న ప్రదేశ మచ్చటి నొసట దిద్దుకొనిన బొట్టుయొక్క శోభను వహించినదని యాశయము. ॥8॥

శ్లో. క్వాపి యన్నికట నిష్కుట స్ఫుట
 త్కోరక ప్రకర సౌర భోర్మిభిః,
 సాంద్ర మద్రియత భీమనందినీ
 నాసికాపుటకుటీకుటుమ్బితామ్. 9

ప. వి. క్వ - అపి - యన్నికటనిష్కుటస్ఫుటత్కోరక ప్రకర సౌరభోర్మిభిః- సాన్ద్రం-అద్రియత-భీమనందినీనాసికాపుట కుటీ కుటుమ్బితామ్.

అర్థము : క్వాపి=ఒక ప్రదేశమున, యన్నికటనిష్కుటస్ఫుటత్కోరకప్రకరసౌర భోర్మిభిః, యత్ = ఏ భవనముయొక్క, నికట = సమీపమందలి, నిష్కుట=ఉద్యానవనమున, స్ఫుటత్ = వికసించుచున్న, కోరక= మొగ్గల యొక్క, ప్రకర=సమూహముయొక్క, సౌరభ=పరిమళముల యొక్క, ఊర్మిభిః = తరంగములచేత, సాన్ద్రం = దట్టముగా,

ప. వి. రుద్ధసర్వబుతువృక్షవాటికాకీరకృత్తసహకారశీకరైః - యజ్జుషః - స్మ-కులముఖ్యమ్-ఆశుగః-ఘ్రాణవాతమ్-ఉపదాభిః-అఞ్చతి.

అర్థము : ఆశుగః=వాయువు అనగా వెలుపల సంచరించెడి గాలి, కులముఖ్యం =వంశమధ్యమునందు శ్రేష్ఠమైనదియు, యజ్జుషః, యత్=ఏ మేడను, జుషః = పొందిన, (జనస్య = జనముయొక్క), ఘ్రాణవాతం= ముక్కునందలిగాలిని, (అనగా నిట్టూర్పును), రుద్ధ సర్వబుతువృక్ష వాటికాకీరవృత్త సహకార శీకరైః, రుద్ధ = అడ్డగింపబడిన, (అనగా నొకచోటనే చేరియున్న, (ఋద్ధ యను పాఠాంతరమునుబట్టి, ఋద్ధ= సమృద్ధములైన యని యర్థము), సర్వబుతు = సమస్తబుతువులు కల్గిన, వృక్షవాటికా = ఇంటికి సంబంధించిన యుద్యానవనమందలి, కీర=చిలుకలచే, కృత్త=ఖండింపబడిన, సహకార = మామిడిచెట్లు యొక్క, శీకరైః=నీటిబిందువులచే ననగా నుదకబిందువులతోఁగూడిన మెత్తనిపరిమళములు అనెడి, ఉపదాభిః = కానుకలచే, అఞ్చతి స్మ= పూజించుచుండెను.

సమాసములు :

రుద్ధ సర్వబుతువృక్ష వాటికా కీరవృత్త సహకార శీకరైః - సర్వే చ తే బుతవశ్చ=సర్వబుతవః, రుద్ధాః సర్వబుతవః యస్యాం సా= రుద్ధసర్వబుతుః, వృక్షాణాం వాటికా=వృక్షవాటికా, రుద్ధసర్వబుతు శ్చాసౌ వృక్షవాటికా చ=రుద్ధసర్వబుతువృక్షవాటికా, వృక్షవాటి కాయాం కీరాః=వృక్షవాటికాకీరాః, సహకారాణాం శీకరాః=సహకార శీకరాః, వృక్షవాటికాకీరైః వృత్తాశ్చ తే సహకారశీకరాశ్చ=రుద్ధసర్వ బుతువృక్షవాటికాకీరవృత్తసహకారశీకరాః, తైః=రుద్ధసర్వబుతువృక్ష వాటికాకీరవృత్తసహకారశీకరైః.

యజ్జుషః, యం జుషతీతి=యజ్జుః, తస్య=యజ్జుషః.

సమాసములు :

*కనకనిర్మితాఖిలః,* కనకేన నిర్మితం=కనకనిర్మితం, కనకనిర్మితం అఖిలం యస్య సః=కనకనిర్మితాఖిలః.

*విమలరత్నజః,* విమలాని చ తాని రత్నాని చ=విమలరత్నాని, విమల-రత్నేభ్యః జాయత ఇతి=విమలరత్నజః,

*రచితచిత్రశాలికః,* రచితాః చిత్రశాలాః అస్మిన్ స న్తీతి=రచితచిత్ర-చిత్రశాలికః.

భావము :

ఆ మేడలో కొన్ని భాగములు బంగారుతో నిర్మింపబడినవి. మరికొన్ని భాగములు ప్రకాశమానములగు రత్నములతో పొదుగబడినవి. కొన్ని ప్రదేశములు చిత్రశాలలతో గూడియున్నవి. తక్కిన ప్రదేశములు క్షణ క్షణము మారుచు వింతలు గొల్పునట్టి యింద్రజాలప్రదర్శనముల తో గూడి యున్నవి. ॥ 11 ॥

శ్లో. చిత్రతత్తదనుకార్యవిభ్రమా-
ధాయినైకవిధరూపరూపకమ్,
వీక్ష్య యం బహు ధువన్ శిరో జరా
వాతకీ విధి రకల్పి శిల్పిరాట్. 12

ప.వి. చిత్రతత్తదనుకార్య విభ్రమాధాయినైక విధరూప రూపకమ్, వీక్ష్య, యం, బహు, ధువన్, శిరః, జరావాతకీ, విధిః, అకల్పి, శిల్పిరాట్.

అర్థము:- చిత్రతత్తదనుకార్య విభ్రమాధాయినైకవిధరూపరూపకమ్, చిత్ర = చిత్తరువులయందు, తత్తత్=ఆయాపక్షాంతరమున, ప్రసిద్ధములైన, అనుకార్య=అనుకరించుటకు తగినట్టి రాజర్షులయొక్కయు, మనుష్యులు మున్నగువానియొక్కయు, విభ్రమ=విలాసములను, అధాయ=కల్గించు నట్టి, నైకవిధ = పెక్కువిధములైన, రూప = రూపములనెడి,

శ్లో. భిత్తిగర్భగృహగోపితై ర్జనై
ర్యః కృతాద్భుత కథాదికౌతుకః,
సూత్రయ న్త్రజ విశిష్ట చేష్టయా
ఽఽశ్చర్యసజ్జి బహుశాలభఞ్జికః. 13

ప.వి. భిత్తిగర్భగృహగోపితైః-జనైః-యః-కృతాద్భుతకథాదికౌతుకః- సూత్రయంత్రజవిశిష్టచేష్టయా-ఆశ్చర్యసజ్జిబహుశాలభఞ్జికః.

అర్థము : సః = ఆ భవనము, భిత్తిగర్భ గృహగోపితైః, భిత్తి = గోడలయొక్క, గర్భ = మధ్య భాగములయందలి, గృహ = గృహములయందు, గోపితైః = గుప్తముగా నుంచబడిన, జనైః = జనులచేత, కృతాద్భుత కథాదికౌతుకః, కృత = చేయబడిన, అద్భుత = ఆశ్చర్యమును కలిగించెడి, కథాది = సంభాషణాదులయందలి, కౌతుకః = కుతూహలము కల్గియున్నది. అనగా మేడయే స్వయముగా మాట్లాడుచున్నదని భ్రాంతిని కల్గించుచున్నది అని యర్థము. (కిఞ్చ = మఱియు) సూత్రయంత్రజ విశిష్టచేష్టయా, సూత్ర = దారములచే నిర్మించబడిన, యంత్ర = యంత్రములచే, జ = ఏర్పడిన, విశిష్ట చేష్టయా = నవ్వుట, కన్నులు మూయుట, తెఱచుట మున్నగు నపూర్వములగు కార్యములచే, ఆశ్చర్యసజ్జి బహుశాలభఞ్జికః, ఆశ్చర్య = ఆశ్చర్యమును, సజ్జి = కల్గించు, బహు = పెక్కు అయిన, శాలభఞ్జికః = కొయ్యబొమ్మలు కల్గినదిగ నున్నది.

సమాసములు :

భిత్తిగర్భగృహగోపితైః- భిత్తేః గర్భాః = భిత్తిగర్భాః, భిత్తిగర్భేషు గృహాః = భిత్తిగర్భగృహాః, భిత్తిగర్భగృహేషు గోపితాః = భిత్తిగర్భ గృహ గోపితాః, తైః = భిత్తిగర్భగృహ గోపితైః.

కృతాద్భుత కథాదికౌతుకః- అద్భుతోత్పాదికాః కథాః = అద్భుతకథాః, అద్భుతకథాః ఆదయః యాసాం తాః = అద్భుత కథాదయః, కృతాశ్చ తే అద్భుతకథాదయశ్చ = కృతాద్భుతకథాదయః- కృతాద్భుత కథాదిషు కౌతుకం యస్య సః = కృతాద్భుత కథాదికౌతుకః.

తపేఽపి = గ్రీష్మర్తువునందును, జలయన్త్రపాతుకాసారదూరధుత తాపచన్ద్రికః, జలయన్త్ర=నీటిని విడిచిపెట్టెడి, యంత్ర=యంత్రముల నుండి, పాతుక=పడునట్టి, ఆసార=ధారలచే, దూర=దూరముగా, ధుత=తొలగింపబడిన, తాప=తాపము, తన్ద్రికః=కునుకుపాటుకల్గినదై యున్నది.

సమాసములు :

ప - తమః ఆసు అ స్తీతి = తామస్యః, తాసు = తామసీషు,
 - భిత్తిం గచ్ఛన్తీతి = భిత్తిగాః, తైః = భిత్తిగైః,
 - రత్నానాం రశ్మయః = రత్నరశ్మయః, తైః =

-ఆమన్దా చన్ద్రికా యస్య సః = అమన్దచన్ద్రికః.
ుకాసార దూరధుతతాపతన్ద్రికః - జలస్య యన్త్రాః = జలయంత్రేభ్యః పాతుకాః = జలయంత్రపాతుకాః, జల శ్చ తే ఆసారాశ్చ జలయన్త్రపాతుకాసారాః, జలయన్త్ర దూరం ధుతే తాపతంద్రికే యస్మిన్ సః = జలయంత్ర దూరధుతతాపతంద్రికః.

ంయందును గోడలయందు పొదుగబడిన రత్నముల ను పొందుచున్నది. మఱియు నా మేడ గ్రీష్మర్తువు నందును, జలయం ములనుండి వెల్వడు నీటి ధారలచే తాపమును కునుకు పాటును తొలగింపక దై యున్నది. ॥14॥

శాస్త్రకారికా
షిత నాగదన్తికా,
మయోః
రతే కృతాకృతే.

కామశాస్త్ర కర్తగా భావింపబడినదై దమయంతీనలులయొక్క సురతకేళియందు కామశాస్త్రమందు విధింపబడిన విషయములలో వారు, వేనిని పాటించిరో, వేనిని పాటించలేదో, చక్కగా తెలుసుకొనుచుండినది. ॥15॥

శ్లో. యత్ర మత్త కలవిఙ్క శారికా
శ్లేష్యకేలి పునరుక్తి వత్తయోః,
క్వాఽపి దృష్టిభి రవాపి వాపికో
త్తంస హంస మిథునస్మరోత్సవః. 16

ప. వి. యత్ర - మత్తకలవిఙ్కశారికాశ్లేష్యకేలిపునరుక్తివత్ - తయోః - క్వ-అపి-దృష్టిభిః-అవాపి-వాపికోత్తంసహంసమిథునస్మరోత్సవః.

అర్థము :-యత్ర = ఏ భవనమునందు, క్వాఽపి= ఒక ప్రదేశమునందలి, తయోః=ఆ దమయంతీనలులయొక్క, దృష్టిభిః=చూపులచే, వాపికోత్తంస హంసమిథున స్మరోత్సవః, వాపికా = నదబావులకు, ఉత్తంస=భూషణములైన, హంసమిథున=అంచల జంటలయొక్క, స్మరోత్సవః = మన్మథక్రీడ, మత్తకలవిఙ్కశారికాశ్లేష్యకేలి పునరుక్తివత్, మత్త=మదించిన, కలవిఙ్క=పిచ్చుక యొక్కయు, శారికా=గోరువంక యొక్కయు, ఆశ్లేష్యకేలిభిః=ఆశ్లేషపుటాటలచే, పునరుక్తివత్=పునరుక్తివలె, అవాపి= పొందబడిన అనగాఁ జూడబడిన దని యర్థము.

సమాసములు :

మత్తకలవిఙ్క శారికా శ్లేష్యకేలిపునరుక్తివత్ - కలవిఙ్కశ్చ శారికా చ=కలవిఙ్కశారికే, మత్తే చ తే కలవిఙ్కశారికే చ=మత్తకలవిఙ్కశారికే, మత్తకలవిఙ్కశారికయోః ఆశ్లేష్యకేలయః = మత్తకలవిఙ్కశారికాశ్లేష్యకేలయః, మత్తకలవిఙ్కశారికాశ్లేష్యకేళిభిః పునరుక్తిః=మత్తకలవిఙ్క శారికాశ్లేష్య కేలిపునరుక్తిః, మత్తకలవిఙ్క శారికాశ్లేష్యకేలి పునరుక్తి రివ=మత్తకలవిఙ్క శారికాశ్లేష్య కేలిపునరుక్తివత్.

వారియందు నసిగా దమయంతీనలులయందు రహస్య భాషణములకు భంగము రాలేదని యర్థము.

సమాసములు :

వైణరవవైణవస్వరైః- వీణాసు భవాః వైణాః, వేణుభ్యః భవాః = వైణవాః, వైణవశ్చ తే రవాశ్చ = వైణరవాః, వైణరవాశ్చ తే స్వరాశ్చ = వైణవస్వరాః, వైణరవాశ్చ వైణవస్వరాశ్చ = వైణరవ వైణవస్వరాః, తైః = వైణరవవైణవస్వరైః.

ఉపవనీపికాలినాం- పికాశ్చ అలయశ్చ = పికాలయః, ఉపవన్యాం పికాలయః = ఉపవనీపికాలయః, తేషాం = ఉపవనీపికాలినామ్.

కఙ్కణాలికలహైః - కఙ్కణానాం అలయః = కఙ్కణాలయః, కఙ్కణాలీనాం.
కలహాః = కఙ్కణాలి కలహాః, తైః = కఙ్కణాలికలహైః
సురతకూజితం-సురతే కూజితం = సురతకూజితమ్.

భావము:

సౌధమందు నొకవైపు వీణాధ్వనులు, మఱియొక వైపు మురళీనాద లరేగియున్నవి. అట్లే యుద్యానవనమందలి కోయిలలయొక్కయు, యొక్కయు, హుంకారములు నతిశయించి యున్నవి. ఇంక నొక త్యక తెలయొక్క హస్తమందలి కఙ్కణముల కలకలధ్వనులు యున్నవి. ఈ ధ్వనుల మధ్య నలదమయంతుల సురతములోని ధ్వనులు వినఁబడక యణగిపోయినవై, వారి రహస్య భాషణములను బయటకు వినబడనీయక చేసినవి. ॥17॥

శ్లో. సీత్కృతాన్యశృణుతాం విశఙ్కయో
ర్యత్ప్రతిష్ఠితరతిస్మరార్చయోః,
జాలకైరపవరాన్తరేఽపి తౌ
త్యాజితైః కపటకుడ్యతాం నిశి. (అధిక పాఠము)

యత్ప్రతిష్ఠితరతిస్మరార్చయోః- యస్మిన్ ప్రతిష్ఠితౌ = యత్ప్రతిష్ఠితౌ, రతిశ్చ స్మరశ్చ = రతిస్మరౌ, యత్ప్రతిష్ఠితౌ చ రతిస్మరౌ చ = యత్ప్రతిష్ఠిత రతిస్మరౌ, యత్ప్రతిష్ఠిత రతిస్మరయోః అర్చే = యత్ప్రతిష్ఠిత రతిస్మరార్చే, తయోః = యత్ప్రతిష్ఠితరతిస్మరార్చయోః, అపవరాన్తరే - అపవరస్య అన్తరం = అపవరాన్తరం, తస్మిన్ = అపవరాన్తరే.

కపటకుడ్యతాం - కపటకృతం కుడ్యం = కపటకుడ్యం, కపటకుడ్యస్య భావః = కపటకుడ్యతా, తాం = కపటకుడ్యతాం.

భావము :

ఆ మేడయొక్క గర్భగృహమందు ఒక గదిలో రతిమన్మథుల ప్రతిమలు ఉంచబడియున్నవి. మఱియొక గదిలో భైమీనలులు నివసించుచున్నారు. ఆ గోడయందు గవాక్షములున్నను, గోడలు వెండి, రత్నములు మున్నగువానిచే నిర్మింపబడియుండుటవలన పగలు సూర్యప్రకాశములు వానిపైబడినందువలన వాని కాంతి విరజిమ్ముటచే నాగవాక్షములనుండి వచ్చెడి వెలుగులు, ఆ గోడల కాంతులతో కలిసిపోవుటవలన, గవాక్షములు ప్రత్యేకముగా కానబడుటలేదు. అందువలన గదిలోనున్నవారికి చుట్టును గోడలే యుండినట్లు కానబడుచుండినవి. ఒక గదిలో రతిమన్మథుల విగ్రహములకు పురోహితుడు మంత్రములచే, ప్రాణ ప్రతిష్ఠను చేయుటవలన అవి చైతన్యవంతములై యాగదికి నలుప్రక్కల గవాక్షములు కానరానందువలన వారు సురతక్రీడ చేయ దొడగిరి. ఆ క్రీడా కాలమున నఖక్షత, దంతక్షతములవలనిబాధను సూచించునట్టి సీత్కారధ్వనులు గవాక్షములనుండి వెల్వడుచుండగా వానిని దమయంతీనలులు వినిరి. ఇది పగలు జరిగినది. కాని రాత్రియందు వెండి మణులు ప్రకాశింపవు కాన గవాక్షములు గోడలలో కలిసిపోక భిన్నముగా ప్రకాశించుచుండును. రతిమన్మథులవిగ్రహముల యందు మంత్రములచే ప్రాణప్రతిష్ఠ గావింపగా నవి చేతనములైనవని చెప్పుట వలన మంత్రప్రభావము కూడ నిట సూచితము. కృత్రిమపు గోడ లనగా 'బియ్యపుపిండి నుడికించి దానిగంజితో పూయబడిన బొమ్మలగుడ్డలతో నేర్పరుప బడిన తెఱలు. పగలు ఎండవేడిమిని చొఱనీయక గవాక్షములయందు బొమ్మలు వేయబడిన గుడ్డలు కట్టబడుచుండును. రాత్రియందు గాలివచ్చుటకై అవి తొలగింపబడుచుండును.

*ఉజ్జ్వలరసైకసారణిః* - ఉజ్జ్వల ఇతి రసః=ఉజ్జ్వలరసః, రసస్య ఏకసారణిః=ఉజ్జ్వలరసైకసారణిః.
*యత్పురః*- యైవ పూః=యత్పూః, తస్యాః=యత్పురః.
*కిన్నరీవికటగీతిఝుఙ్కృతిః* - వికటా చ సా గీతిశ్చ=వికటగీతిః, కిన్నరీణాం వికటగీతిః = కిన్నరీవికటగీతిః, కిన్నరీవికటగీతి రేవ ఝుఙ్కృతిః=కిన్నరీవికటగీతిఝుఙ్కృతిః.

భావము :

ఆ మేడకు ఎదుట కృష్ణసారమను జింకయొక్క కొమ్ములవలె వంపులు తిరిగినదై, శృఙ్గారరసమును ప్రవహింపచేయునట్టి చిన్ననదివలె నుండునదియును మధురమైనట్టి, యక్షాంగనల గానములకు సంబంధించిన ఝుఙ్కారస్వరము నిరంతరము వినబడుచుండినది. ॥18॥

శ్లో. భిత్తిచిత్రలిఖితాఖిలక్రమా
యత్ర తస్థు రితిహాస సఙ్కథాః
పద్మనందన సుతారిరంసుతా
ఽమందసాహస హసన్మనోభువః. 19

ప.వి. భిత్తిచిత్రలిఖితాఖిలక్రమాః-యత్ర-తస్థుః-ఇతిహాససఙ్కథాః-పద్మనందన సుతారిరంసుతాఽమన్దసాహసహసన్మనోభువః.

అర్థము: యత్ర=ఏ మేడయందు, భిత్తిచిత్రలిఖితాఖిలక్రమాః, భిత్తి=గోడల యందలి, చిత్ర=చిత్తరువుల రూపమున, లిఖిత=వ్రాయబడిన, అఖిల= సమస్తములై, క్రమాః=పూర్వకాలమునందును, తర్వాతి కాలమునందు జరిగిన సంఘటనలు గలవియు, పద్మనందనసుతారిరంసుతాఽమంద సాహసహసన్మనోభువః, పద్మనందన=పద్మమునందు జన్మించినట్టి బ్రహ్మకు, సుతా=పుత్రికయగు సరస్వతీదేవితో, రిరంసుతా=రమింప గోరుటయను, అమన్ద=అధికమైన, సాహస=సాహస కార్యమునకు, హసత్=నవ్వుచున్న, మనోభువః=మన్మథుడుగలదియునగు, ఇతిహాస సఙ్కథాః=పురాణములలోని సమాచారములు, తస్థుః=ఉండినవి.

ఘోషించెడి, డిండిమ=డిండిమవాద్యమువలె, ఆయితం=ఆచరించినట్టి, గౌతమకలత్రగామినః, గౌతమ=గౌతమునియొక్క, కలత్ర=భార్య యగు నహల్యను, గామినః=పొందినట్టి, దేవభర్తుః=ఇంద్రునియొక్క, పారదారికవిలాససాహసం, పారదారిక=పరస్త్రీలను పొందువానియొక్క, విలాస=విజృమ్భణమనెడి, సాహసం=సాహసకార్యము, ఉదటఙ్కి=గుర్తింపబడినది. బ్రహ్మ మొదలు పురుగు వరకును ప్రపంచము కామోన్మాదముతో గూడినదను విషయమును జ్ఞప్తిపఱచుటకును దంపతులకు సంతోషము కలుగుటకును ఈ వృత్తాంతము గోడలపై చిత్రింపబడిన దని అర్థము.

సమాసములు:

*పుష్పకాణ్డజయడిండిమాయితం* - పుష్పాణి కాణ్డాః యస్య సః = పుష్పకాణ్డః, పుష్పకాణ్డస్య జయః=పుష్పకాణ్డజయః, పుష్పకాణ్డజయస్య డిండిమః = పుష్పకాణ్డజయడిండిమః, పుష్పకాణ్డజయడిండిమ ఇవ ఆచరితం=పుష్పకాణ్డజయడిండిమాయితం.

*గౌతమకలత్రగామినః*-గౌతమస్య కలత్రం=గౌతమకలత్రం, గౌతమకలత్రం గచ్ఛతీతి=గౌతమకలత్రగామీ, తస్య=గౌతమకలత్రగామినః, *పారదారికవిలాససాహసం*- పరదారాన్ గచ్ఛతీతి = పారదారికః, పారదారికస్య విలాసః = పారధారికవిలాసః, పారదారికవిలాస ఏవ సాహసం=పారదారికవిలాససాహసం.

*దేవభర్తుః*- దేవానాం భర్తా=దేవభర్తా, తస్య=దేవభర్తుః.

భావము :

ఆ మేడయందలి గోడలపై మన్మథుని విజయమునకు డిండిమవాద్యమైనట్టి అహల్యాదేవేంద్రుల సంగమసాహసము చిత్రింపబడినది. బ్రహ్మాది స్తంబపర్యంతము సకల ప్రపంచము కామోన్మాదము కల్గినదని సూచించుటకును, దంపతులకు సంతోషము కల్గించుటకును అట్టివృత్తాంతము గోడలపై చిత్రింపబడినదని ఆశయము.

భావము :

కార్తిక శుద్ధపూర్ణిమనాటి రాత్రి శరదృతువగుటవలన వెన్నెల చక్కగా గాయును. అట్టి పున్నమకు సమానమైనదియు, ఇంద్రుని భవనమగు వైజయంత మును మించుటచే నేర్పడిన యాప్రసిద్ధమైన కీర్తి, పైకెగురుచున్న పావురముల నెపమువలన లోకమును శుభ్రపఱచుచుండెను. మేడపై నెగురుచున్న పావురములు వాస్తవముగా పారావతములు గావు. మఱేమనగా ఈ భవనమునకు సంబంధించిన, శరదృతువు నందలి వెన్నెలవంటి కీర్తి యని ఆశయము.

శ్లో. గౌరభాను గురుగేహినీ స్మరో
ద్భూతభావ మితివృత్త మాశ్రితా,
రేజిరే యదజిరేఽభినీతిభి
ర్నాటికా భరతభారతీసుధాః. 22

ప వి. గౌరభానుగురుగేహినీస్మరోద్భూతభావమ్-ఇతివృత్తమ్-ఆశ్రితాః- రేజిరే- యదజిరే-అభినీతిభిః-నాటికా-భరతభారతీసుధాః.

అర్థము : యదజిరే; యత్ = ఏ మేడయొక్క, అజిరే = ముంగిలి, గౌరభాను గురు గేహినీ స్మరోద్భూత భావమ్, గౌరభాన = తెల్లని కిరణములుగల చంద్రునియొక్క, గురుగేహినీ = గురువగు బృహస్పతి భార్యయందు, స్మర = కామునిచే, ఉద్భూత = ఏర్పడిన, భావం = ప్రాకారమనెడి, ఇతివృత్తం = వర్ణింపదగిన విషయమును, ఆశ్రితాః = ఆశ్రయించినట్టి, భరత భారతీ సుధాః, భరత భారతీ = నాట్య శాస్త్రముయొక్క, సుధాః = సారాంశమలైన, (అమృతము వంటి నాలుగంకములు కల్గిన నాటికలు,) అభినీతిభిః = అభినయములచే, రేజిరే = ప్రకాశించినవి.

సమాసములు :

*గౌరభానుగురుగేహినీ స్మరోద్భూత భావం:* గౌరాః భానవః యస్య సః = గౌరభానుః, గౌరభానోః గురుః = గౌరభానుగురుః, గౌరభానుగురోః

గేహినీ=గౌరభానుగురుగేహినీ, స్మరేణ ఉద్భూతః=స్మరోద్భూతః, స్మరోద్భూత శ్చాసౌ భావశ్చ = స్మరోద్భూతభావః, గౌరభాను గురుగేహిన్యాః స్మరోద్భూతభావః=గౌరభానుగురుగేహినీ స్మరోద్భూత భావః, తం = గౌరభానుగురుగేహినీస్మరోద్భూతభావమ్.

***యదజిరే*** - యస్య అజిరం=యదజిరం, తస్మిన్=యదజిరే,

***భరతభారతీసుధా*** - భరతస్య భారతీ = భరతభారతీ, భరతభారత్యాః సుధా=భరతభారతీసుధా.

**భావము :**

ఆ మేడముంగిట చంద్రునికి గురుభార్యయగు తారయందు సంభవించిన కామముచే నేర్పడిన వ్యాపారమునే ప్రతిపాద్యముగా కల్గిన యనగా నట్టివిషయ మును వర్ణించెడి భరతనాట్యశాస్త్రమునకు సారభూతములైన అమృతతుల్యము లగు చతురఙ్కనాటిక లభినయములచే శోభించినవి. అనగా చంద్రునకు గురు భార్యయందు కల్గిన కామావేశమును వర్ణించెడి నాటికలు ఆ భవనముయొక్క ముంగిట కానబడుచుండినవని ఆశయము.

శ్లో. శమ్భుదారువనసమ్భుజిక్రియా
మాధవవ్రజవధూవిలాసయోః
గుమ్ఫితై రుశనసా సుభాషితై
ర్యస్య హాటకవిటఙ్కమఙ్కితమ్. 23

ప. వి. శమ్భుదారువనసమ్భుజిక్రియామాధవవ్రజవధూవిలాసయోః, గుమ్ఫితైః - ఉశనసా-సుభాషితైః-యస్య-హాటకవిటఙ్కమ్-అఙ్కితమ్.

అర్థము: యస్య=ఏమేడయొక్క, హాటకవిటఙ్కం, హాటక=సువర్ణమయమైన, విటఙ్కం=పావురాయిగూడు, శమ్భుదారువనసమ్భుజక్రియా మాధవ వ్రజవధూవిలాసయోః, శమ్భు=శివునియొక్క, దారువన=దేవదారు వనమండలి, సమ్భుజక్రియా=పార్వతితో వేయిదివ్యవర్షములు గావించిన సంభోగకేళి, మాధవ=శ్రీకృష్ణునియొక్క, వ్రజవధూ=గోపికలతో,

విలాసయోః = విహారముల విషయమున, ఉశనసా = శుక్రునిచే, గుమ్ఫితైః = రచియింపబడిన, సుభాషితైః = సూక్తులతో, అఙ్కితం = చిత్రింపబడినది.

సమాసములు :

*శమ్భుదారువనసమ్భుజిక్రియా మాధవవ్రజవధూవిలాసయోః*-దారోః వనం = దారువనం దారువనేసమ్భుజిః = దారువనసమ్భుజిఃదారువనసమ్భుజిరేవ క్రియా = దారువనసమ్భుజిక్రియా, శమ్భోః దారువనసమ్భుజిక్రియా = శమ్భుదారువనసమ్భుజిక్రియా, వ్రజస్యవధ్వః = వ్రజవధ్వః, వ్రజవధూనాం విలాసః = వ్రజవధూవిలాసః, మాధవస్యవ్రజవధూవిలాసః = మాధవ్రజవధూ విలాసః, శమ్భుదారువన సమ్భుజిక్రియా చ మాధవ వ్రజవధూ విలాసశ్చ = శమ్భుదారు వనసమ్భుజిక్రియా మాధవవ్రజవధూవిలాసౌ, తయోః = శమ్భుదారు వనసమ్భుజిక్రియా మాధవవ్రజవధూ విలాసయోః.
*హాటకవిటఙ్కం* - హాటకమయం చ విటఙ్కం చ = హాటకవిటఙ్కం.

భావము :

ఆ మేడలో పావురాళ్ళు నివసించుటకు నిర్మింపబడిన బంగారు గూడుల వరుసలపై, దేవదారువనమునందు వేయిదివ్యవర్షములు శివపార్వతులు సంభోగ కేళిని గూర్చిన విలాసమును, శ్రీకృష్ణుని గోపికావిహారములనుగూర్చినవియునగు విషయములయందు శుక్రాచార్యులచే రచియింపబడిన శివకృష్ణుల మహిమల వర్ణనలు చిత్రింపబడినవి. ॥ 23 ॥

శ్లో॥ అహ్ని భానుభువి దాశదారికాం
యచ్చరః పరిచరన్త ముజ్జిగౌ,
కాలదేశవిషయాసహస్మరా
దుత్సుకం శుకపితామహం శుకః. 24

ప. వి. అహ్ని - భానుభువి - దాసదారికాం - యచ్చరః-పరిచరన్తమ్-ఉజ్జిగౌ, కాలదేశవిషయాసహస్మరాత్ - ఉత్సుకం - శుకపితామహం - శుకః.

అర్థము:- యచ్చరః=ఏమేడయందు సంచరించెడి, శుకః = చిలుక, కాలదేశ విషయాసహస్మరాత్, కాల=రాత్రిమున్నగు కాలము, దేశ=నిర్జనమైన దేశము, విషయ=భోగింపఁదగినస్త్రీయొక్క అవస్థ మున్నగునవి యను వానిని, అసహ = సహింపలేని యనగా యోగ్యాఽయోగ్యవిచారము చేయుటలోని, ఆలస్యమును సహింపజాలని, స్మరాత్=మన్మథునివలన, ఉత్సుకం = కోరికఁ దీర్చుకొనుటకై యుద్యమించిన, (కావుననే), అహ్ని=పగటివేళ, భానుభువి=సూర్యుని పుత్రికయగు యమునయందు అనగా దానియందలి దీవియందు, దాశదారికాం = బెస్తకులమునకు చెందిన కన్యను అనగా సత్యవతిని, పరిచరన్తం=సేవించుచున్న అనగా రమింపచేయుచున్న, శుకపితామహం=శుకునితాతయు వ్యాసునితండ్రియు నైన, పరాశరమహర్షినిగూర్చి, ఉజ్జగౌ=గానముచేయుచుండినది, పరాశరమహర్షికి బెస్తజాతికిచెందిన సత్యవతితోటి సమాగమమునుఁగూర్చి పురాణాదులయందు చెప్పబడినవిషయమును పలుమాఱులు బిగ్గఱగా పాడుచుండెనని యర్థము.

సమాసములు :

భానుభువి - భానోః భవతీతి=భానుభూః, తస్యాం భానుభువి.

దాశదారికాం - దాశస్య దారికా=దాశదారికా, తాం=దాశదారికాం.

యచ్చరః - యస్మిన్ చరతీతి=యచ్చరః.

కాలదేశవిషయాసహస్మరాత్ - కాలశ్చ దేశశ్చ విషయశ్చ=కాలదేశ విషయాః, కాలదేశవిషయాణాం అసహః=కాలదేశవిషయాసహః, కాల దేశవిషయాసహ శ్చాసౌ స్మరశ్చ = కాలదేశవిషయాసహస్మరః, తస్మాత్=కాలదేశవిషయాసహస్మరాత్.

శుకపితామహం - పితుః పితా = పితామహః, శుకస్య పితామహః= శుకపితామహః, తం శుకపితామహం.

**భావము :**

ఆ మేడయందు సంచరించెడి చిలుక యొక్కటి, రాత్రి మున్నగుకాలమును గూర్చికాని, నిర్జనప్రదేశమునుగూర్చికాని, స్త్రీయొక్క అర్హతనుగూర్చి కాని విచారించుటకును తడవొసంగుటకు నోపికలేని మన్మథునివలని యుద్రేకముచే జెస్తలరాజుకూతురగు సత్యవతితో రమించుచున్న శుకమహర్షితాతయగు పరాశర మహర్షినిగూర్చి గానము చేయుచుండెను. ఈ విషయము లన్నియు పురాణప్రసిద్ధములు. ॥24॥

శ్లో. నీతమేవ కరలభ్యపారతా
మప్రతీర్య మునయ స్తపోర్ణవమ్,
అప్సరః కుచఘటావలమ్బనాత్
స్థాయినః క్వచన యత్ర చిత్రగాః. 25

ప. వి. నీతం-ఏవ-కరలభ్యపారతామ్-అప్రతీర్య-మునయః-తపోర్ణవమ్-అప్సరః కుచఘటావలమ్బనాత్-స్థాయినః-క్వ-చన-యత్ర-చిత్రగాః.

అర్థము:- యత్ర=ఏ మేడయందు, క్వచన=ఒక ప్రదేశమునందు, కరలభ్యపారతాం, కర=చేతులతో, లభ్య=పొందదగిన, పారతాం=కడపటి యవధి, (శీఘ్రముననే) పొందబోవు ఫలము, నీతమేవ=పొందింపబడిన దే యైనది, తపోర్ణవం=తపస్సు అనెడి సాగరమును, అప్రతీర్య=దాటక అనగా తపస్సునుండి విరమించి, అప్సరఃకుచఘటావలమ్బనాత్, అప్సరః = అప్సరలయొక్క, కుచఘట=స్తనము లనెడి కుండలను, అవలమ్బనాత్=ఆశ్రయించుటవలన, స్థాయినః=నిలచినవారైన విశ్వామిత్రుడు మున్నగు మహర్షులు, చిత్రగాః=చిత్రములను పొందియుండిరి.

సమాసములు :

*కరలభ్యపారతాం* - కరేణ లభ్యం = కరలభ్యం, కరలభ్యం పారం యస్మిన్ తత్=కరలభ్యపారం, కరలభ్యపారస్య భావః=కరలభ్యపారతా, తాం కరలభ్యపారతాం.

అప్రతీర్యా- ప్రకర్షేణ తీర్య=ప్రతీర్య, న ప్రతీర్య=అప్రతీర్య.

తపోర్ణవం- తప ఏవ అర్ణవః=తపోర్ణవః, తం=తపోర్ణవం.

అప్సరః కుచఘటావలమ్బనాత్ - అప్సరాణాం కుచే=అప్సరః కుచే, అప్సరఃకుచయోః అవలమ్బనం=అప్సరఃకుచావలమ్బనం, తస్మాత్= అప్సరఃకుచావలమ్బనాత్.

స్థాయినః- తిష్ఠన్తీతి=స్థాయినః

చిత్రగాః- చిత్రం గచ్ఛన్తీతి=చిత్రగాః.

భావము :

ఆ మేడయందు ఒక ప్రదేశమున చేతులకే యందెడి ఫలము శీఘ్రముగనే పొందింపబడినది. విశ్వామిత్రాదులు కొన్నివేల సంవత్సరములును, తపస్సు అనెడి సాగరమును దాటియే యనగా తీవ్రవతపము నాచరించియే పొందవలయునుగాని, వారట్లు తపస్సాగరమును దాటకమునుపే మేనకాద్యప్సరసల స్తనములనెడి కుండలను బట్టుకొని యా సముద్రమున మునుగక కొంతకాలము నిలచి తపస్సు నుండి విశ్రాంతిని గైకొనిరి. అట్టి విశ్వామిత్రాదులందఱు ఆ చిత్రములయందు గానబడుచుండిరి. అనగా తీవ్రవతపముచే ఇంద్రపదవిని అందగోరిన విశ్వామిత్రా దుల తపమునకు ఇంద్రుడు మేనక మున్నగు నచ్చరలచే భంగము కల్పింపగా, వానిచేతనే తపఃఫలములగు అప్సరః సంభోగసుఖుల బొంది తపః సముద్రమున వారి కుంభములచే విశ్రాంతి నొందిరని భావము.

శ్లో. స్వామినా చ వహతా చ తం మయా
స స్మరః సురతవర్ణనా జ్జితః,
యోఽయ మీదృగితి నృత్యతే స్మ యత్
కేకినా మురజనిస్వనై ర్ఘనైః. (అధికపాఠము)

ప.వి. స్వామినా-చ-వహతా-చ-తం-మయా-సః-స్మరః-సురతవర్ణనాత్-జితః-యః-అయమ్-ఈదృక్-ఇతి-నృత్యతే-స్మ-యత్-కేకినా-మురజనిస్వనైః ఘనైః.

**అర్థము** : యత్ = ఏ మేడకు సంబంధించిన, కేకినా = ఆట కుపయోగించెడి నెమలి యను కారణముచే, ఘనైః=ఘనములైన, స్వనైః=మృదఙ్గము లచే, (మఱియు) మృదఙ్గధ్వనులనెడి మేఘనాదములచే, నృత్యతే స్మ ఇతి కిం?=నాట్యమాడబడుచుండెనా ఏమి?, యో ఽయం=బ్రహ్మాదులను సైతము వశీకరించుకొను గొప్ప ప్రభావము కల్గిన, ఈదృక్=ఇటు వంటి, స్మరః=మన్మథుడు, స్వామినా=కుమారస్వామిచేతను, ప్రభువు చేతను, తం=ఆ కుమారస్వామిని, వహతా = వీపుపై మోయునట్టి, మయా=నెమలియైన నాచేతను, సురతవర్ణనాత్=సురతమును వర్ణించుట వలన, జితః=జయింపబడెను, కుమారస్వామి నైష్ఠికబ్రహ్మచారి యగుట వలనను నెమళ్ళు వర్షఋతువునందు కామము నొందుటవలన వాని కన్నులయంచులయందలి రంధ్రములనుండి వెల్వడునట్టి కన్నీటి బొట్టు లను నాడనెమళ్ళు తమనోట బెట్టుకొనుటచే గర్భము కల్గుటవలన, స్త్రీ పురుష లిఙ్గఘర్షణరూపమగు సురతము లేదు గాన మన్మథుడు జయింప బడెనని చెప్పబడెను. నెమళ్ళు మృదఙ్గధ్వనులను మేఘగర్జనమని భ్రాంతి చెంది నృత్యము చేయుట ప్రసిద్ధము.

**సమాసములు :**

సురతవర్ణనాత్-సురతస్య వర్ణనం = సురతవర్ణనం, తస్మాత్ = సురతవర్ణనాత్.

మురజనిఃస్వనైః -మురజస్య నిఃస్వనాః = మురజనిఃస్వనాః, తైః = మురజనిఃస్వనైః.

**భావము ;**

ఆ మేడయందు నెమలి యున్నది. అది క్రీడార్థ ముపయోగపడుట వలన, క్రీడామయూరమై యా భవనమున కుపయుక్త మగుచున్నది. ఆ భవన మందు మృదంగములను వాయించునప్పుడు, ఆ మృదఙ్గధ్వనిని మేఘ గర్జన మని భ్రాంతి చెంది యా నెమలి నృత్యము చేయుచున్నదా యని భావింపదగినది. బ్రహ్మాదులను సైతము వశీకరించుకొనెడి మహాప్రభావము కల్గిన మన్మథుడు

కుమారస్వామి చేతను, (నెమలియైన నాయొక్క ప్రభువుచేతను) ఆ కుమార స్వామిని వీపుచే మోయునట్టి నెమలియగు నాచేతను జయింపబడినాడు. ఏల యనగా కుమారస్వామి నైష్ఠికబ్రహ్మచారి యగుటవలన నాతడు సురత మెఱుంగడు. నెమళ్ళకు వర్షర్తువునందు కామము కల్గును. అప్పుడు ఆ మొగ నెమళ్ళ కన్నుల కొసలోని రంధ్రముల నుండి కన్నీళ్ళ రూపమున నుండెడి శుక్రమును నాడనెమళ్ళు త్రాగుటవలన వానికి గర్భము కలుగుచున్నది. కాని స్త్రీపురుషలిఙ్గసంపర్కరూపమగు సురతము లేదు. అందువలననే మన్మథుడు నైష్ఠికబ్రహ్మచారి యగుటవలన సురతము లేని కుమారస్వామిచేతను మగ నెమలియొక్క యశ్రుబిందువు లనెడి శుక్రముచేతనే యాడనెమలి గర్భమును ధరించుటచే వీనికిని సురతసంబంధము లేనందువలనను, సురతసంబంధ మున్నప్పుడే పరాక్రమము చూపెడి మన్మథుడు నెమళ్ళచేతను జయింపబడెనని యాశయము.

శ్లో. యత్ర వీక్ష్య నలభీమసమ్భవే
ముహ్యతో రతిరతీశయో రపి,
స్పర్ధయేవ జయతో ర్జయాయ తే
కామకామరమణీబభూవతుః. 26

ప. వి. యత్ర-వీక్ష్య-నలభీమసమ్భవే - ముహ్యతోః- రతిరతీశయోః - అపి - స్పర్ధయా-ఇవ-జయతోః-జయాయ-తే-కామకామరమణీబభూవతుః.

అర్థము: యత్ర=ఏ మేడయందు, నలభీమసమ్భవే, నల=నలమహారాజును, భీమసమ్భవే = భీమరాజపుత్రికయగు దమయంతిని, వీక్ష్య=చూచి, ముహ్యతోః=మోహము చెందుచున్న, అనగా వారి సౌందర్యమును చూచి యాశ్చర్యపడుచున్న (కావుననే), స్పర్ధయేవ=సాదృశ్యము చేతనో యనునట్లు, జయతోః=తమ్ము తిరస్కరించుచున్న, రతిరతీశయోః అపి, రతి = రతీదేవియు, రతీశయోః అపి = రతికి పతియగు మన్మథుడు మున్నగు వారిని, జయాయ=జయించుటకై, తే=ఆ నలదమయంతులు కామకామరమణీ బభూవతుః, కామ=మన్మథుడును, కామరమణీ= మన్మథుని ప్రియురాలగు రతీదేవియు, బభూవతుః=అయిరి,

సమాసములు :

నలభీమసమ్భవే - భీమాత్ సమ్భవః యస్యాః సా = భీమసమ్భవా, నలశ్చ భీమసమ్భవా చ = నలభీమసమ్భవే, తే = నలభీమసమ్భవే.
రతిరతీశయోః-రతేః ఈశః = రతీశః, రతిశ్చ రతీశశ్చ = రతిరతీశౌ, తయోః = రతిరతీశయోః.
కామకామరమణీబభూవతుః - కామస్య రమణీ = కామరమణీ, కామశ్చ కామరమణీ చ = కామకామరమణ్యౌ, కామకామరమణ్యౌ బభూవతుః = కామకామరమణీబభూవతుః.

భావము :

ఆ భవనమందలి నలదమయంతులను చూచి రతిమన్మథులు సైతము మోహము చెందుచున్నారు. అనగా వారి సౌందర్యమున కాశ్చర్యము చెందుచున్నారు. ఆ రతిమన్మథులు తమ రూపముతో నలదమయంతులకు సామ్యయుండుటవలన వారి నిరువురిని జయింపగోరియుండిరి. అందువలన నారతీమన్మథులను జయించుటకై వారిరువురును క్రమముగా మన్మథమన్మథులుగను, రతీరతులుగను నైరి. అనగా సౌందర్యమున, వారిని మించి యుండిరని అర్థము. ॥26॥

శ్లో. తత్ర సౌధసురభూధరే తయో
రావిరాసు రథ కామకేలయః,
యే మహాకవిభి రప్యవీక్షితాః
పాంశులాభి రపి యే న శిక్షితాః. 27

ప. వి. తత్ర-సౌధసురభూధరే-తయోః - ఆవిరాసు - అథ-కామకేలయః-యే-మహాకవిభిః-అపి-అవీక్షితాః-పాంశులాభిః-అపి-యే-న-శిక్షితాః.

అర్థము : తత్ర = ఆ, సౌధసురభూధరే, సౌధ = మేడ యనెడి, సురభూధరే = మేరుపర్వతమునందు, తయోః = ఆ నలదమయంతులయొక్క, కామకేలయః

=మన్మథక్రీడలు, అథ = ఆరంభముగగాని, సమగ్రముగగాని, ఆవిరాసుః = ఆవిర్భవించినవి, అనగా విహారమునకు ప్రారంభమో, లేదా సమగ్రప్రవృత్తియో యేర్పడినదని యర్థము. యే = ఏ మన్మథ కేలులు, మహాకవిభిః = వాత్స్యాయనుడు మున్నగు శాస్త్రజ్ఞులచే, అవీక్షితాః = చూడబడనివిగను, యనగా వర్ణింపసాధ్యముకానివిగను, తథా=ఆట్లే, పాంశులాభిః = వ్యభిచారిణులచేతను, న శిక్షితాః = అభ్యసింపబడనివిగ నుండినవి. అనగా వారిఉవుటి కామక్రీడ లపూర్వములని తెలియుచున్నవి.

సమాసములు :

సౌధసురభూధరే - సురాణాం భూధరః = సురభూధరః, సౌధ ఏవ సురభూధరః, తస్మిన్=సౌధసురభూధరే.
కామకేలయః - కామస్య కేలయః=కామకేలయః.
మహాకవిభిః - మహాన్తశ్చ తే కవయః=మహాకవయః.
అవీక్షితాః - న వీక్షితాః=అవీక్షితాః.

భావము :

ఆభవన మనెడి మేరుపర్వతమునందు దమయన్తీనలులయొక్క మన్మథ క్రీడలు కొలదిగనో, సమగ్రముగనో, ఆవిర్భవించినవి. ఆక్రీడలను మహాకవులుకూడ నెన్నటికిని చూచియుండరు. పలురకములగు విలాసములతో పురుషలను దృప్తిపఱచునట్టి వ్యభిచారిణులగు స్త్రీలచేతను అభ్యసింపబడలేదు. అనగా నాక్రీడలు అపూర్వములైనవని యాశయము. ॥27॥

శ్లో. పౌరుషం దధతి యోషితా నలే
స్వామిని శ్రితతదీయభావయా,
యాని శైశవ మతీర్ణయా కియ
త్ప్రాపి భైమిసుతయా న సాధ్వసమ్. 28

ప. వి. పౌరుషం-దధతి-యోషితా-నలే-స్వామిని-శ్రితతదీయభావయా-యాని-శైశవమ్-అతీర్ణయా-కియత్-ప్రాపి-భైమిసుతయా-న-సాధ్వసమ్.

అర్థము:- పౌరుషం=పురుషత్వమును, దధతి=ధరించిన, యూని=యువకు డైన, స్వామిని=భర్తయగు, నలే=నలునివిషయమునందు, క్రమాత్=క్రమముగా, యోషితా=భయస్వభావము కల్గినట్టి, శైశవం=బాల్యమును, అతీర్ణయా=దాటనటువంటి, శ్రితతదీయభావయా, శ్రిత=పొందఁబడిన, తదీయ=నలునికి సంబంధించిన, భావయా = అభిప్రాయము లేదా అనురాగము, లేదా అధీనత్వము గల్గిన, భీమసుతయా=భీమపుత్రికయగు దమయంతిచే, సాధ్వసం = సంగమించుటయందలి భయము, కియత్=కొంచెమే, న ప్రాపి=పొందబడలేదు. అనగా అధికముగా భయము పొందబడినదని యర్థము. ఇట్టి భయము రసముగా పరిణమించుచున్న శృఙ్గారస్థాయిభావమగు రతికి అఙ్గమగుచు ప్రియునకానన్దప్రదమగుచున్నది.

వి. భయకారణములగు నలునియందలి పురుషత్వ, తరుణత్వ, స్వామిత్వములు మూడును దమయంతియందలి స్త్రీత్వ-శైశవ-అధీనత్వములతో క్రమముగా అన్వయించినందువలన యథాసఙ్ఖ్యాలఙ్కారము.

సమాసములు :

పౌరుషం - పురుషస్య భావః=పౌరుషం, తత్ పౌరుషం.

*శ్రితతదీయభావయా* - తస్య అయం = తదీయః, తదీయ శ్చాసౌ భావశ్చ=తదీయభావః, శ్రితః తదీయభావః యయా సా=శ్రితతదీయభావా, తయా=శ్రితతదీయభావయా.

అతీర్ణయా - న తీర్ణా=అతీర్ణా, తయా=అతీర్ణయా, భీమసుతయా: భీమస్య సుతా=భీమసుతా, తయా భీమసుతయా.

భావము :

పురుషత్వమును, యౌవనమును, పతిత్వమును ధరించిన నలుని విషయమున, క్రమముగా స్త్రీత్వమును, బాల్యమును, నధీరత్వము వహించిన దమయంతి ప్రథమ సంగమకాలమందు నధికముగా భయపడినది. బలవంతుడును, యువకు

డును నగు యజమానునుండి భయమును, బాల్యదశను, సేవకత్వమును పొందిన వ్యక్తి యెట్లు మిక్కుటయగు భయమును బొందునో, అట్లే దమయంతి నలునితో ప్రథమసంభోగమందు స్త్రీత్వాదిగుణములు కల్గియున్నందువలన భయ పడినది. ॥28॥

శ్లో. దూత్యసఙ్గతిగతం యదాత్మనా
ప్రాగశిశ్రియ దియం ప్రియా గిరః,
తం విచిన్త్య వినయవ్యయం హ్రియా
న స్మ వేద కరవాణి కీదృశమ్. 29

ప. వి. దూత్యసఙ్గతిగతం- యత్-ఆత్మనా-ప్రాక్-అశిశ్రియత్-ఇయం-ప్రియా-గిరః-తం-విచిన్త్య-వినయవ్యయం-హ్రియా-న-స్మ-వేద-కరవాణి-కీదృశమ్.

అర్థము:- ఇయం=ఈ దమయంతి, ప్రాక్=స్వయంవరమునకంటే ముందు, దూత్యసఙ్గతిగతం; దూత్య = ఇంద్రునకు దూత్యము గావించునపుడు, సఙ్గతి = సమాగమమును, గతం = పొందిన, ప్రియం = నలుని, ఆత్మనా=స్వయముగా, గిరః=తొమ్మిదిసర్గలలో చెప్పబడిన మాటలను ననగా హృదయమం దుంచుకొనబడిన ప్రేమతోఁగూడిన మాటలను, అశిశ్రియత్=వినిపించుచుచుండెను. ఇతి యత్=అనున దేది కలదో, తం=ఆ, వినయవ్యయం=వినయరాహిత్యమును, అనగా గడుసుదన మును, విచిన్త్య=ఆలోచించి, హ్రియా=సిగ్గుతో, సా=ఆ దమయంతి, కీదృశం=దేనిని, కరవాణి=చేయవలయునో, న వేద స్మ=తెలియక యుండెను. సంకోచమును వదలి యా విధముగా తాను వర్తించిన విష యమును దమయంతి స్మరించి సిగ్గు చెందినదై, యేమి చేయవలయునో తెలియకయుండినది.

సమాసములు :

*దూత్యసఙ్గతిగతం*- దూతస్య కర్మ=దూత్యం, దూత్యే సఙ్గతిః= దూత్యసఙ్గతిః, దూత్యసఙ్గతిం గతః = దూత్యసఙ్గతిగతః, తం = దూత్యసఙ్గతిగతం.

వినయవ్యయం - వినయస్య వ్యయః=వినయవ్యయః, తం=వినయ వ్యయం.

భావము :

ఆ దమయంతి స్వయంవరమునకు పూర్వము, ఇంద్రునకు దూత్యమును నిర్వహించు సమయమున సమాగమము పొందిన ప్రియుడగు నలుని తొమ్మిది సర్గలలో చెప్పబడిన ప్రేమమధురములగు మాటలను వినిపించెను. పిదప నావిధముగా గడుసుతనమును వహించి వర్తించిన తన విషయమును స్మరించు కొనినదై సిగ్గుపడి ఏమి చేయునది తెలియక ఆ దమయంతి యుండినది. ॥29॥

శ్లో. యత్తయా సదసి నైషధః స్వయం
ప్రాగ్వృతః సపది పీతలజ్జయా,
తం నిజం మనసి కృత్య చాపలం
సా శశాక న విలోకితుం నలమ్. 30

ప.వి. యత్-తయా-సదసి-నైషధః-స్వయం-ప్రాగ్వృతః-సపది-పీతలజ్జయా-తం-నిజం-మనసికృత్య-చాపలం-సా-శశాక-న-విలోకితుం-నలం.

అర్థము :- కిఞ్చ=మఱియు, ప్రాక్=పూర్వము, అనగా స్వయంవర కాలమందు, సదసి=స్వయంవర సభయందు, సపది=వెంటనే, పీతలజ్జయా, పీత=తొలగిపోయిన, లజ్జయా=సిగ్గు కల్గిన తనచే, నైషధః=నలుడు, స్వయం=స్వయముగా, ననగా నలుడు కోరకపోయినను, వృతః=భర్తగా వరింపబడెను, ఇతి యత్=అనున దేది కలదో, తత్=అట్లు స్వయముగా వరించుట యను, నిజం=తనదైన, చాపలం=చంచల స్వభావమును, మనసి కృత్య=మనస్సునం దుంచుకొని, సా=ఆ దమయంతి, నలం=నలుని, విలోకితుం=చూచుటకును, న శశాక=శక్తురాలు కాలేదు.

సమాసములు :

వీతలజ్జయా-వీతా లజ్జా యస్యాః సా = వీతలజ్జా, తయా = వీత లజ్జయా.
మనసికృత్య-మనసి కృత్వా=మనసి కృత్య.
చాపలం-చపలస్య కర్మ=చాపలం.

భావము :

మఱియు నా దమయంతి పూర్వము స్వయంవరసభయందు ముందు వెనక లాలోచింపక సిగ్గు వీడినదై నలుడు తన్ను కోరకపోయినను అతనిని తనకు భర్తగా వరించినది. అట్లే గడుసుతనమును మనస్సునం దుంచు కొనినదై సిగ్గుపడి నలుని చూచుటకు శక్తురాలు కాలేదు. ॥30॥

శ్లో. ఆసనే మణిమరీచిమాంసలే
యాం దిశం స పరిరభ్య తస్థివాన్.
తా మసూయితవతీవ మానినీ
న వ్యలోకయ దియం మనాగపి. 31

ప. వి. ఆసనే-మణిమరీచిమాంసలే-యాం-దిశం - సః - పరిరభ్య - తస్థివాన్-తామ్-అసూయితవతీ-ఇవ-మానినీ-న-వ్యలోకయత్ - ఇయం-మనాక్-అపి.

అర్థము : సః = ఆనలుడు, మణిమరీచిమాంసలే, మణిమరీచి = రత్నకిరణములతో, మాంసలే=దట్టమై ప్రకాశించునట్టి, ఆసనే=రత్నపీఠమందు, యాం= ఏ, దిశం=దిక్కును, పరిరభ్య=ఆశ్రయించి, తస్థివాన్= కూర్చుండెనో, అనగా నేదిక్కున కెదురుగా కూర్చుండెనో యని అర్థము, మానినీ=మానవతి యగు, ఇయం=ఈదమయంతి, తాం= ప్రియునిచే గౌగిలింపబడిన అనగా ఆశ్రయించబడిన యాదిక్కును, అసూయితవతీవ=ఓర్వలేమితనమును పొందినదో యనునట్లు, మనాగపి

= కొంచెమైనను, న వ్యలోకయత్ = చూడలేదు, ఇక నలునివంక చూడలేదని చెప్పనేల?

సమాసములు :

మణిమరీచిమాంసలే - మణీనాం మరీచయః = మణిమరీచయః, మణిమరీచిభిః మాంసలం = మణిమరీచిమాంసలం, తస్మిన్=మణిమరీచి మాంసలే.

భావము :

ఆ నలమహారాజు రత్నకిరణములతో నిండిన రత్నపీఠమున ఏ దిశను గౌగిలించుకొని యనగా నాశ్రయించి కూర్చుండెనో, యా దిశపై యసూయ వహించెనో యనునట్లు మానవతియగు ఆ దమయంతివైపు కొంచెముకూడ చూడ లేదు. ఇక నలుని చూచుటకు ప్రసక్తి ఎక్కడిది ? అనగా దిశ స్త్రీకాన దానిని నలుడు కౌగిలించుకొనుటవలన సవతిని కౌగిలించుకొనినట్లుగా భావనచేయుట వలన దమయంతియందు యసూయ యేర్పడినట్లుగను, దానివలననే నామె యా దిశను చూడనట్లును ఇచ్చట భావింపబడినది. ॥31॥

శ్లో. హ్రీసరిన్నిజనిమజ్జనోచితం
మౌలిదూరనమనం దధానయా,
ద్వారి చిత్రయువతిశ్రియా తయా
భర్తృహూతిశత మశ్రుతీకృతమ్. 32

ప. వి. హ్రీసరిన్నిజనిమజ్జనోచితం-మౌలిదూరనమనం-దధానయా-ద్వారి - చిత్ర యువతిశ్రియా-తయా-భర్తృహూతిశతం-అశ్రుతీకృతమ్.

అర్థము : హ్రీసరిన్నిజనిమజ్జనోచితం, హ్రీసరిత్ = సిగ్గు అనెడి నదియందు, నిజ = తన్ను, నిమజ్జన = ముంచుటకు, ఉచితం = తగిన, మౌలిదూర నమనం, మౌలి = తలను, దూర = మిక్కిలి, నమనం = వంచుటను

దధానయా = ధరించునట్టి, (కావుననే), ద్వారి = కడపయందు, చిత్రయువతిశ్రియా, చిత్ర = చిత్తరువునందలి, యువతి = తరుణి యొక్క, శ్రియా=శోభకల్గిన, తయా=ఆ దమయంతిచే, భర్తృహూతి శతమ్, భర్తృ=భర్తయైన నలునియొక్క, హూతి=పిలుపులయొక్క, శతం=వంద, అనగా పలుమారు పిలుపులు, అశ్రుతీకృతమ్=వినబడ నిదిగా చేయబడినది. వినినను సిగ్గుచే ప్రత్యుత్తరము నొసంగనందువల నను, దగ్గఱకు వెళ్ళనందువలనను, వినబడనిదిగ చేసెను. సిగ్గుచే ప్రియున కెట్టి యుత్తరము నీయలేదని యర్థము.

సమాసములు :

*హ్రీసరిన్నిజనిమజ్జనోచితం* - హ్రీరేవ సరిత్ = హ్రీసరిత్, నిజం నిమజ్జనం=నిజనిమజ్జనం, హ్రీసరితి నిజనిమజ్జనం = హ్రీసరిన్నిజ నిమజ్జనం, హ్రీసరిన్నిజనిమజ్జనస్య ఉచితం = హ్రీసరిన్నిజనిమజ్జనో చితం, తత్=హ్రీసరిన్నిజనిమజ్జనోచితం.

*మౌలిదూరనయనం*- దూరం నయనం=దూరనయనం, మౌలేః దూర నయనం=మౌలిదూరనయనం, తత్=మౌలిదూరనయనం.

*చిత్రయువతిశ్రియా* - చిత్రే యువతిః=చిత్రయువతిః, చిత్రయువతేః శ్రీః=చిత్రయువతిశ్రీః, తయా=చిత్రయువతిశ్రియా.

*భర్తృహూతిశతమ్*- హూతీనాం శతమ్=హూతిశతమ్, భర్తుః హూతి శతమ్=భర్తృహూతిశతమ్.

*అశ్రుతీకృతమ్* - అశ్రుతం శ్రుతం సమ్పద్యమానం కృతం=శ్రుతీ కృతమ్, న శ్రుతీకృతమ్= అశ్రుతీకృతమ్.

భావము :

ఆ దమయంతి, సిగ్గనెడి యేటి తన్ను ముంచదగినట్లు, తన తలను మిక్కిలి వంచినదై పడకటింటి కడపయొక్క చిత్తరువులోని యువతివలె నిశ్చ యముగా నిలిచినదై ప్రియుడు తన యొద్దకు రమ్మని గావించిన, పెక్కు పిలుపు లను వినియు సిగ్గుచే విననట్లు గావించి యతనియొద్దకు వెడలక యుండినది॥82॥

శ్లో. వేశ్మ పత్యు రవిశ న్న సాధ్వసాత్
వేశితాఽపి శయనం బభాజ న,
భాజితాఽపి సవిధం న సాఽస్వపత్
స్వాపితాఽపి న చ సమ్ముఖోఽభవత్ ॥ 33

వ.వి. వేశ్మ-పత్యుః-అవిశత్-న-సాధ్వసాత్-వేశితా-అపి-శయనం-బభాజ-న-భాజితా-అపి-సవిధం-న-సా-అస్వపత్-స్వాపితా-అపి-న-చ-సమ్ముఖః-అభవత్.

అర్థము : సా=ఆ దమయంతి, సాధ్వసాత్=భయమువలన, పత్యుః=భర్త యొక్క, వేశ్మ = గృహమును, న అవిశత్=ప్రవేశింపలేదు, వేశితాఽపి = చెలికత్తెంచే ఒకవేళ బలవంతముగా ప్రవేశపెట్టబడినను, శయనం=పడకను, న బభాజ=పొందలేదు, భాజితాఽపి=చెలికత్తెలచే నూరడింపబడినదై పడకను పొందింపబడినను, సవిధం=సమీపమున, న అస్వపత్=నిదురించలేదు, స్వాపితాఽపి=చెలికత్తెలచే సమీపము నందు పండబెట్టబడినను, సమ్ముఖా = ఎదుట నున్నది, నాఽభవత్ = కాలేదు. కొత్తగా పెండ్లిఅయిన యువతి యగుటవలన ముగ్ధత్వముచే లజ్జా విజిత మన్మథత్వము ఆమెయందు కనబడెనని అర్థము సూచితము.

భావము :

అ దమయంతి భయముచే ప్రియుడున్నగదికి ప్రవేశింపలేదు. చెలికత్తెలు బలవంతపరిచి యా గదిలోనికి కొనిపోయినను పడకయొద్దకు పోలేదు. చెలికత్తెలూరడించి పడకయొద్దకు గొనిపోయినను సమీపమున పరుండలేదు. చెలికత్తెలు బలవంతముగా పరుండబెట్టినను ఎదుట ముఖమును పెట్టుకొని యుండ లేదు. ఇది యంతయు కొత్తగా పెండ్లి అయిన వధువున కేర్పడిన లజ్జాతిశయము. ''ఉదయద్యౌవనా ముగ్ధా లజ్జావిజితమన్మథా'' అని చెప్పబడిన లక్షణమునకు దమయంతి లక్ష్యమైనదని ఆశయము. ॥33॥

శ్లో. కేవలం న ఖలు భీమనందినీ
దూర మత్రపత నైషధం ప్రతి,
భీమజాహృది జితః స్త్రియా హ్రియా
మన్మథోఽపి నియతం స లజ్జితః. (అధికపాఠము)

ప.వి. కేవలం-న-ఖలు-భీమనన్దినీ-దూరమ్-అత్రపత-నైషధం-ప్రతి - భీమజా హృది-జితః- స్త్రియా-హ్రియా-మన్మథః - అపి-నియతం-సః-లజ్జితః.

అర్థము: భీమనందినీ=భీముని పుత్రికయగు దమయంతి, కేవలం=కేవలమా, నైషధం ప్రతి=నలు నుద్దేశించి, దూరం=మిక్కిలి, న అత్రపత ఖలు =సిగ్గుపడలేదు, కిన్తు=మరేమనగా!, భీమజాహృది = దమయంతి యొక్క మనస్సునందున్న, హ్రియా=సిగ్గనెడి, స్త్రియా=స్త్రీచేత, జితః ఖలు=జయింపబడినవాడే యైన, సః=ప్రసిద్ధుడైన, మన్మథోఽపి =హృదయమందున్న మన్మథుడుకూడ, నియతం=నిశ్చయముగా చాలా కాలము, లజ్జితః=సిగ్గుపడెను.

సమాసములు :

*భీమనందినీ* - భీమస్య నందినీ=భీమనన్దినీ,

*భీమజాహృది* - భీమా జ్జాయత ఇతి=భీమజా, భీమజాయాః హృత్= భీమజాహృత్, తస్మిన్ = భీమజాహృది

భావము :

కేవలము దమయంతి నలు నుద్దేశించి మిక్కిలి సిగ్గుపడలేదు. మఱేమనగా దమయంతి హృదయమునం దుండెడి లజ్జయను స్త్రీచే నోడింపబడినట్టి, యామె హృదయమునం దున్న యా జగత్ప్రసిద్ధపరాక్రమశాలియగు మన్మథుడుకూడ చాలకాలము సిగ్గుపడియుండెను.

(ఇది ప్రక్షిప్తము నారాయణీయ వ్యాఖ్య ననుసరించి వ్యాఖ్యానింపబడినది)

శ్లో. ఆత్మనాఽపి హరదారసుందరీ
యత్కిమ ప్యభిలలాష చేష్టితుం,
స్వామినా యది తదర్థ మర్థితా
ముద్రిత స్తదనయా తదుద్యమః. 34

ప.వి. ఆత్మనా-అపి-హరదారసుందరీ-యత్-కిమ్- అపి - అభిలలాష-చేష్టితుం-స్వామినా-యది-తదర్థమ్-అర్థితా- ముద్రితః-తత్-అనయా-తదుద్యమః.

అర్థము: హరదారసుందరీ, హరదార = శివుని భార్యయగు పార్వతి వలె, సుందరీ=అందగత్తెయగు, (సా=ఆ దమయంతి), ఆత్మనాఽపి= తనయంతట తానుగా, యత్కిమపి = ఏదైన ఒక కటాక్షవీక్షణాదిక మును, చేష్టితుం=చేయుటకు, అభిలలాష=అభిలషించెను, కిన్తు=కాని, స్వామినా=భర్తచే, తదర్థం=దానిని నిమిత్తీకరించుకొని, అర్థితా= ప్రార్థింపబడినదో, తత్=అప్పుడే, అనయా= ఈ దమయంతిచే, తదు ద్యమః; తత్=ఆ నలునియొక్క, ఉద్యమః= చేష్ట, లేదా, తన కటాక్ష వీక్షణాది చేష్ట, ముద్రితః=నిరోధింపబడినదగుచున్నది.

సమాసములు :

హరదారసున్దరీ-హరస్య దారాః=హరదారాః, హరదారా ఇవ సున్దరీ= హరదారసున్దరీ.
తదర్థం-తస్మై=తదర్థం.
తదుద్యమః-తస్మై ఉద్యమః=తదుద్యమః.

భావము :

పార్వతివలె యందకత్తెయగు నా దమయంతి తనంతట తాను కటాక్ష వీక్షణాదిరూపమగు శృఙ్గారచేష్టను చేయగోరినది. కాని భర్తయగు నలుడు అట్టి చేష్టలకై కోరినచో అప్పుడే యతనియొక్క ప్రయత్నము నిరోధింపబడుచుండి నది. లేదా అట్టి కటాక్షవీక్షణాదిరూపమగు చేష్ట యాగిపోవుచుండెడిది. ఆమె

ఆటువంటి శృఙ్గారచేష్టను చేయగోరినను లజ్జవలన చేయజాలకపోవుచుండిన దని యాశయము. ॥34॥

శ్లో. హ్రీభరాత్ విముఖయా తయా భియం
సఞ్చితా మననురాగశఙ్కిని,
న స్వచేతసి లులోప సంస్మరన్
దూత్యకాలకలితం తదాశయమ్. 35

ప.వి. హ్రీభరాత్-విముఖయా-తయా-భియం-సఞ్చితాం- అననురాగశఙ్కిని-న-స్వచేతసి-లులోప-సంస్మరన్-దూత్యకాలకలితం-తదాశయమ్.

అర్థము: సః=ఆ నలుడు, హ్రీభరాత్=లజ్జాధిక్యమువలన, విముఖయా= ప్రతికూలురాలైన, తయా = ఆ దమయంతిచే, అననురాగశఙ్కిని, అననురాగ = అనురాగము లేదను విషయమును, శఙ్కిని=సందేహించుచున్న, స్వచేతసి=తన మనస్సునందు, సంచితాం = రాశిగా చేయబడిన, భియం=అనురాగములేదను నూహతో నేర్పడిన భయమును, దూత్యకాలకలితం; దూత్యకాల=దూత్యమును నడపు సమయమునందు, కలితం=తెలియఁబడిన, తదాశయం; తత్=ఆ దమయంతియొక్క, ఆశయం=అభిప్రాయమును, సంస్మరన్=స్మరించుచు, లులోప= తొలగించుకొనెను.

సమాసములు :

హ్రీభరాత్-హ్రియః భరః=హ్రీభరః, తస్మాత్=హ్రీభరాత్,
అననురాగశఙ్కిని-న అనురాగః=అననురాగః, అననురాగం శఙ్కత ఇతి=అననురాగశఙ్కీ, తస్మిన్=అననురాగశఙ్కిని.
దూత్యకాలకలితం - దూతస్య కర్మ = దూత్యం, దూత్యస్య కాలః= దూత్యకాలః, దూత్యకాలే కలితః=దూత్యకాలకలితః, తం=దూత్యకాలకలితం.
తదాశయం-తస్యాః ఆశయః=తదాశయః, తం=తదాశయం.

భావము :

ఆ దమయంతి మిక్కిలి సిగ్గుచే ప్రతికూలభావమును ప్రదర్శించుటవలన నలుడు, తనపై నామె కనురాగము లేదా ! అని సందేహింపఁజొచ్చెను. కాని దూత్యమును నిర్వహించునప్పు డాత డాదమయంతి యాశయము నెఱింగి యున్నందువలన, దాని నిప్పుడు జ్ఞప్తికి తెచ్చుకున్నవాడై యా సందేహము నివర్తిల్లచేసుకొనెను. ॥౩౫॥

శ్లో. పార్శ్వ మాగమి నిజం సహాలిభి
 స్తేన పూర్వ మథ సా తయైకయా,
 క్వాఽపి తామపి నియుజ్య మాయినా
 స్వాత్మమాత్రసచివాఽవశేషితా. 36

ప. వి. పార్శ్వమ్-ఆగమి-నిజం-సహ-ఆలిభిః-తేన-పూర్వం-అథ-సా-తయా-ఏకయా-క్వ-అపి-తామ్-అపి-నియుజ్య-మాయినా-స్వాత్మమాత్రసచివా-అవశేషితా.

అర్థము: మాయినా=కపటమందు నేర్పరియగు, తేన=ఆ నలునిచే, సా=ఆ దమయంతి, పూర్వం=తొలుత, ఆలిభిః సహ=చెలికత్తెలతోడ, నిజం=తనదగు, పార్శ్వం=పార్శ్వమును, ఆగమి=పొందింపబడినది, అథ=పిదప, అనగా తక్కిన చెలికత్తెలకు పనులనుఁ బెట్టెడి నెపముచే, వారిని పంపిన పిదప, ఏకయా=ఒక్కతెయే యైన, తయా సహ = ఆ చెలికత్తెతోడ, అవశేషితా=మిగిలింపబడినది, అథ=తర్వాత, తామపి=ఒక్కతెయే యైన యామెను కూడ, క్వాఽపి = తాంబూలమును తెచ్చుట మున్నగు నొకానొక కార్యమునందు, నియుజ్య=నియమించి, స్వాత్మమాత్ర సచివా=కేవలము తానే సహాయము గలదిగా, చక్రే=చేయబడినది. అనగా నామె యొంటరిగాఁ జేయఁబడినదని యర్థము.

సమాసములు :

స్వాత్మమాత్రసచివా - స్వాత్మైవ స్వాత్మమాత్రం, స్వాత్మమాత్రం సచివః యస్యాః సా=స్వాత్మమాత్రసచివా.

**భావము:**

యుక్తియందు నేర్పరియగు నా నలుడు తొలుత చెలికత్తెలచే నా దమయంతిని తనయొద్దకు చేర్పించుకొని పిదప నాచెలికత్తెల నేదియో పనినిఁబెట్టి పంపివేయగా పిదప నాదమయంతియొద్ద నొక చెలికత్తె మిగిలినది. తర్వాత నామెను తాంబూలము మున్నగువానినిఁ దెచ్చు నెపమున పంపివేయగా దమయంతి యొక్కతయే మిగిలినది. ఇట్లు ఆనలు డాదమయంతిని తన పడకగది యందు నొంటరిగా చేసి యుంచెను. ॥36॥

శ్లో. సన్నిధావపి నిజే నివేశితా
మాలిభిః కుసుమశస్త్రశాస్త్రవిత్
ఆనయ ద్వ్యవధిమా నివ ప్రియా
మఙ్కపాలివలయేన సన్నిధిమ్. 37

ప.వి. సన్నిధౌ- అపి- నిజే-నివేశితామ్-ఆలిభిః- కుసుమశస్త్రశాస్త్రవిత్- ఆనయత్- వ్యవధిమాన్- ఇవ-ప్రియామ్-అఙ్కపాలివలయేన - సన్నిధిమ్.

అర్థము: కుసుమశస్త్రశాస్త్రవిత్; కుసుమశస్త్ర=కామునికి సంబంధించిన, శాస్త్ర=శాస్త్రమును, విత్=తెలిసిన నలమహారాజు, నిజే=తనదైన, సన్నిధౌ=సమీపమునందు, నివేశితామపి=స్థాపింపబడినదైనను, ప్రియాం=దమయంతిని, వ్యవధిమా నివ=దూరమందున్న వానివలె, అఙ్కపాలివలయేన; అఙ్కపాలి=పృష్ఠదేశమును స్పృశించుటచే నారంభింపబడిన నాలింగన మనెడి వలయాకారపు చుట్టడముతో, సన్నిధిం = తన సమీపమును, ఆనయత్=తెప్పించుకొనెను.

"ఆదౌ రతం బాహ్యమేవ ప్రయోజ్యం
తత్రాపి చాలిఙ్గన మేవ పూర్వమ్"

అనియు

"తథా సామీప్యగాం భీరుం నవోఢాం సన్నిధాపయేత్
విశ్వాసచ్ఛద్మనా గాఢాలిఙ్గనాత్ త్యాజయే ద్భయమ్"

అనియు కామశాస్త్రమున చెప్పినప్రకారము తొలుత బాహ్యరతిని చేయవలయును. అందులోను నాలింగనమును తొలుత గావింపవలయును. అప్పుడు భయపడుచున్న నవోఢయగు వధువును దగ్గఱకు చేర్చుకొని యామెకు నమ్మకము కల్గుటకై గాఢాలింగనము గావించుకొని భయమును తొలగింపవలయునని అర్థము.

**సమాసములు :**

కుసుమశస్త్రశాస్త్రవిత్–కుసుమం శస్త్రం యస్య సః=కుసుమశస్త్రః, కుసుమశస్త్రస్య శాస్త్రం = కుసుమశస్త్రశాస్త్రం; కుసుమశస్త్రశాస్త్రం వేత్తీతి=కుసుమశస్త్ర శాస్త్రవిత్.

వ్యవధిమాన్; వ్యవధిః అస్య అస్తీతి=వ్యవధిమాన్.

అఙ్కపాలివలయేన; అఙ్కపాలి రితి వలయః = అఙ్కపాలివలయః, తేన=అఙ్కపాలివలయేన.

**భావము :**

కామశాస్త్రవేత్తయగు నలుడు, చెలికత్తెలు తనయొద్దకు చేర్చిన ప్రియురాలగు దమయంతిని, తాను దూరముగా నున్నట్లుగా భావించి ఆమెయొక్క కటిప్రదేశమును తాకుచు గావించెడి యాలింగనమునకై యంకపాలిచే, వలయాకారముగాఁ జుట్టి తనయొద్దకు తెప్పించుకొనెను. ॥37॥

శ్లో. ప్రాగచుమ్బ దలికే హ్రియా నతాం
తాం క్రమా ద్దరనతాం కపోలయోః,
తేన విశ్వసితమానసాం ఝటి
త్యాననే స పరిచుమ్బ్య సిష్మియే. 38

ప.వి. ప్రాక్-అచుమ్బత్ - అలికే-హ్రియా-నతాం-తాం-క్రమాత్-దరనతాం-కపోలయోః-తేన-విశ్వసితమానసాం-ఝటితి - ఆననే-సః-పరిచుమ్బ్య - సిష్మియే.

అర్థము: సః=ఆ నలుడు, హ్రియా = సిగ్గుచే, నతాం = ముఖమును వంచు కొనిన, తాం=ఆదమయంతిని, ప్రాక్ = మొదట, అలికే=నొసట, అచుమ్బత్=ముద్దు పెట్టుకొనెను, అథ=పిదప, క్రమాత్=క్రమముగా, దరనతాం; దర=కొద్దిగా, నతాం=వంగిన, అనగా పూర్వమువ కంటె కొద్దిగా వంగిన యనగా కొంచెము తలను పైకెత్తిన, తాం= ఆమెను, కపోలయోః = కణతలయందు, అచుమ్బత్ = ముద్దుపెట్టు కొనెను. తేన=అటువంటి మృదువ్యవహారముచే, విశ్వసితమానసాం; విశ్వసిత=భయము తొలగిన, మానసాం=మనస్సు కల్గిన, తాం = ఆమెను, ఝటితి=శీఘ్రముగా, ఆననే=ముఖమునందు, పరిచుమ్బ్య= ముద్దిడుకొని, సిష్మియే=మందహాసము గావించెను. అధరచుంబనము వలని సంతోషముతో చిరునగవు గావించెనని అర్థము.

సమాసములు :

*దరనతాం*-దరం నతా=దరనతా, తాం=దరనతాం.
*విశ్వసితమానసాం*- విశ్వసితం మానసం యస్యాః సా = విశ్వసిత మానసా, తాం=విశ్వసితమానసాం.

భావము :

ఆ నలుడు సిగ్గుచే తలను వంచుకొనిన ఆ దమయంతిని తొలుత నొసట ముద్దిడుకొనెను. అందువలన నామెకు కొద్దిగా భయము తగ్గినది. పిదప నామె తలను ముందువలె నధికముగా వంచక కొంచెము తగ్గించి వంచినది. అప్పుడు నలు డామెను కణతలయందు ముద్దు పెట్టుకొనెను. తర్వాత భయము పూర్తిగా తగ్గి ఆమెకు విశ్వాస మేర్పడగనే అతడామెను వెంటనే ముఖమున ముద్దిడుకొని అధరచుంబనము గావించి చిరునగవు గావించెను. అనగా ఈ విధముగా నలున కామెయెడ చనువు కల్గినదని యాశయము. ॥౫౨॥

శ్లో. లజ్జయా ప్రథమ మేత్య హృజ్కృతః
సాధ్వసేన బలినాథ తర్జితః,
కిఞ్చి దుచ్ఛ్వసిత ఏవ తద్ధృది
న్యగ్బభూవ పునరర్భకః స్మరః.

ప. వి. లజ్జయా-ప్రథమమ్-ఏత్య-హుఙ్కృతః-సాధ్వసేన-బలినా-అథ-తర్జితః-కిం-చిత్-ఉచ్ఛ్వసితే-ఏవ-తద్ధృది-న్యగ్భభూవ-పునః-అర్భకః-స్మరః.

అర్థము :- అర్భకః=శైశవమందున్న అనగా ప్రారంభదశయందున్న. అనగా గడుసుతనమును వహించని, స్మరః=మన్మథుడు, తద్ధృది, తత్=ఆ దమయన్తియొక్క, హృది = హృదయమునందు, కిఞ్చిత్ = కొంచెము, ఉచ్ఛ్వసిత ఏవ=ముందు చెప్పిన చుమ్బనాదులచే విలసిల్లగనే, ప్రథమం = మొదట, లజ్జయా= సిగ్గుతో, ఏత్య=వచ్చి, హుఙ్కృతః=''హుం'' అను ధ్వనితో నడ్డగింపబడినవాడై, అథ= పిదప, బలినా=దానికంటెను దృఢమైన, సాధ్వసేన = భయముచే, తర్జితః సన్=భయపెట్టఁబడినవాడై, పునః=మఱల, న్యగ్భభూవ= అణగెను.

సమాసములు ;

తద్ధృది-తస్యాః హృత్=తద్ధృత్, తస్మిన్=తద్ధృది.

భావము :

బాల్యావస్థయందు, అనగా ప్రారంభదశయందు కాముడు ఆ దమయంతి యొక్క హృదయమున పూర్వోక్త చుమ్బనాదులచే కొంచెము విలసిల్లినవాడై, పిదప నామెకు లజ్జ కలుగుటచే నామె గావించిన నిషేధసూచకమగు హుంకార ధ్వనిచే వారింపబడినవాడై పిదప నధికమగు భయముచే బెదరింపఁబడిన వాడగుచు నణగిపోయెను. అనగా నలుడు గావించినట్టి యాలిఙ్గనాదులచే దమయంతి హృదయమునందు కొలదిగా కామ ముత్పన్నమైనది. కాని తొలుత సిగ్గుచే నది కొంచె మణగినది. పిదప నధికమగు భయముచే నది యధికముగా నణగి పోయినది. చిన్న బాలుడు తల్లి యొద్దకు వచ్చి, తొలుత యామె హుంకారము తోడను, తర్వాత నామె గట్టిగా బెదరించుటవలనను, గలగిన భయముచే సంకోచము నొందును. అట్లే మన్మథుడును తొలుత దమయంతి హృదయమం

దేర్పడి శిశుదశయం దుండెను. తర్వాత నలుని యాలిఙ్గనాదులచే నామె హృదయ మందేర్పడిన యాశిశుప్రాయమందలి కాముడు సిగ్గుచేతను, మిక్కుటమగు భయము చేతను నణగిపోయెనని యాశయము. ॥39॥

శ్లో. వల్లభస్య భుజయోః స్మరోత్సవే
దిత్సతోః ప్రసభ మఙ్కపాలికామ్,
ఏకక శ్చిర మరోధి బాలయా
తల్పయన్త్రణనిరన్తరాలయా. 40

ప. వి. వల్లభస్య-భుజయోః-స్మరోత్సవే-దిత్సతోః-ప్రసభం- అఙ్కపాలికామ్-ఏకకః-చిరమ్-అరోధి-బాలయా-తల్పయన్త్రణనిరన్తరాలయా.

అర్థము: స్మరోత్సవే = ఆ సురతోత్సవమునందు, అనగా సంభోగోత్సవము నందు, ప్రసభం=బలాత్కారముగా, అఙ్కపాలికాం=పూర్వము చెప్పబడినట్టి కౌగిలింపును, దిత్సతోః=ఈయగోరుచున్న, అనగా నాలింగనమునకు పూనిన, వల్లభస్య=ప్రియునియొక్క, భుజయోః = బాహువులయందు, ఏకకః=ఒకటియేయైన భుజము, తల్పయన్త్రణనిరన్తరాలయా, తల్ప=పడకను, యన్త్రణ=నిరోధించుటయందు, అనగా కట్టుకొనుటయందు, నిరన్తరాలయా = సందులేనిదిగా, అనగా గట్టిగా పడకను గట్టుకొని, బాలయా=బాలయైన దమయంతిచే, చిరం = చాల కాలము, అరోధి = అడ్డగింపబడినది ఆ దమయంతి పడకనంటుకొని ప్రియుని యొక చేతిని రానీయక యుండినదని అర్థము. దమయంతి పాన్పుపై పరుండి యున్నప్పుడు, ఆమె వీపు గట్టిగా పడకనంటుకొని యుండుటవలన, ఆమె వీపునకు, పడకకు మధ్య సందు లేనందువలన నలుడు తన యొక్క చేతిని ఆ రెంటికి మధ్య జొనిపి యామెను కౌగిలించుకొనలేక పోయెనని యర్థము.

సమాసములు :

స్మరోత్సవే-స్మరస్య ఉత్సవః=స్మరోత్సవః, తస్మిన్ =స్మరోత్సవే.

తల్పయన్త్రణనిరన్తరాలయా-తల్పస్య యంత్రణం=తల్పయంత్రణం, తల్పయన్త్రణే నిరంతరః ఆలయః యస్యాః సా = తల్పయన్త్రణ నిరన్తరాలయా.

**భావము :**

సంభోగప్రారంభమునందు బలవంతముగా నంకపాలిక యనబడు నాలింగనమును, అనగా వీపును వలయాకారపు భుజములోనికి తెప్పించుకొని దగ్గఱకు లాగుకొని చేసెడి కౌగలింపును చేయబూనిన నలుని భుజములలో ఒక భుజమును దమయంతి గట్టిగా తన వీపుచే పడక కదిమి పెట్టుకొని పరుండుట వలన తన వీపునకు పడకకు మధ్య సందు లేనందువలన వాని మధ్య జొనుపుటకు నవకాశము లేకుండునట్లు చేసినదని యాశయము. ॥40॥

శ్లో. హారసాధిమవిలోకనే మృషా
కౌతుకం కిమపి నాటయ న్నయమ్
కణ్ఠమూల మదసీయ మస్పృశత్
పాణినోపకుచధావినా ధవః. 41

ప. వి. హారసాధిమవిలోకనే–మృషాకౌతుకం-కిమ్-అపి - నాటయన్ - అయం-కణ్ఠమూలమ్-అదసీయమ్-అస్పృశత్-పాణినా-ఉపకుచధావినా-ధవః.

అర్థము: ధవః=భర్తయైన, అయం=ఈ నలుడు, హారసాధిమవిలోకనే, హార = ముత్తెపుహారముయొక్క, సాధిమ=అధికమైన శ్రేష్ఠత్వమును, విలోకనే=చూచుటయందు, అనగా పరీక్షయందు, కిమపి = ఏదియో యొక, మృషా=అసత్యపు, కౌతుకం=కుతూహలమును, నాటయన్= నటించుచు. ఉపకుచధావినా, ఉపకుచ=స్తనసమీపమునకు, ధావినా= శీఘ్రముగాబోవునట్టి, పాణినా = హస్తముచే, అదసీయం = ఈ దమయంతికి సంబంధించిన, కణ్ఠమూలం=కణ్ఠము యొక్క దిగువ భాగమును అనగా తొమ్మును, అస్పృశత్=తాకెను.

సమాసములు:

హారసాధిమవిలోకనే- అతిశయేన సాధుతా = సాధిమా. హారస్య సాధిమా=హారసాధిమా, హారసాధిమ్నః విలోకనం=హారసాధిమ విలోకనం, తస్మిన్=హారసాధిమవిలోకనే,

కణ్ఠమూలం- కణ్ఠస్య మూలం=కణ్ఠమూలం, తత్=కణ్ఠమూలం.

అదసీయం- అముష్యాః ఇదం=అదసీయం, తత్=అదసీయం.

ఉపకుచధావినా- కుచయోః సమీపం=ఉపకుచం, ఉపకుచం ధావతీతి=ఉపకుచధావీ, తేన =ఉపకుచధావినా.

భావము :

ప్రియుడైన నలుడు దమయంతి కణ్ఠమందలి ముత్తెపుహారముయొక్క శ్రేష్ఠత్వమును పరీక్షించుటకై యసత్యపు కుతూహలము నభినయించుచు, నామెయొక్క చనుదోయిపైపునకు చేతిని పోనిచ్చుచు నామెయొక్క బొమ్మను దాకెను. అనగా నామె చనుదోయిని మర్దించుట ముఖ్యమైన కోరిక. కాని ఆ కోరికను నేరుగా ప్రదర్శింప సంకోచము వహించినవాడై యానలుడు ఆమెయొక్క కంఠహారమును పరీక్షించునెపమున నామెయొక్క బొమ్మలను దాకుచు చనుదోయిని తనచేత బట్టెను.॥41॥

శ్లో. యత్ త్వయాఽస్మి సదసి స్రజాఽఞ్చిత
స్తన్మయాఽపి భవదర్హణాఽర్హతి,
ఇత్యుదీర్య నిజహార మర్పయ
న్నస్పృశత్ స తదురోజకోరకౌ. 42

ప. వి. యత్- త్వయా- అస్మి- సదసి- స్రజా- అఞ్చితః-తత్-మయా-అపి-భవదర్హణా- అర్హతి- ఇతి- ఉదీర్య- నిజహారం- అర్పయన్ - అస్పృశత్- సః- తదురోజకోరకౌ.

అర్థము: హే ప్రియే != ఓ ప్రియురాలా ! యత్ = ఎందువలన, త్వయా = నీచే, సదసి = స్వయంవరసభయందు, స్రజా = వరించుట కేర్పడిన పూలమాలచే, అర్చితః = పూజింపబడినవాడనుగా, అస్మి = అగుచున్నానో, తత్ = అందువలన, మయాఽపి = నాచేతను, భవదర్హణా; భవత్ = నీయొక్క, అర్హణా = పూజ, అర్హతి = తగియున్నది; ఇతి = ఇట్లు, ఉదీర్య = చెప్పి, నిజహారం; నిజ = తనదైన, హారం = కంఠభూషణమును, అర్పయన్ = కంఠమునం దుంచుచు, సః = ఆనలుడు, తదురోజకోరకౌ; తత్ = ఆదమయన్తియొక్క, ఉరోజ = స్తనములనెడి, కోరకౌ = మొగ్గలను, అస్పృశత్ = తాకెను.

సమాసములు :

భవదర్హణా-భవత్యాః అర్హణా = భవదర్హణా,
నిజహారం-నిజశ్చాసౌ హారశ్చ = నిజహారః, తం = నిజహారం,
తదురోజకోరకౌ - తస్యాః ఉరోజౌ = తదురోజౌ, తదురోజా వేవ కోరకౌ = తదురోజకోరకౌ.

భావము:

ఓ ! ప్రేయసీ ! నీవు స్వయంవరసభయందు పుష్పమాలచే నన్ను వరించి గౌరవించితివి. కాన నేను నిన్ను బూజించుట ఉచితమని చెప్పి తన కణ్ఠమందలి హార మామె కొసంగుచు నామె చనుదోయిని నలుడు స్పృశించెను. 42

శ్లో. నీవిసీమ్ని నిహితం సనిద్రయా
సుభ్రువో నిశి నిషిద్ధసంవిదః,
కల్పితం శయ మపాసయ న్నిజం
దోలనై ర్జనితబోధయాఽనయా. 43

ప.వి:- నీవిసీమ్ని-నిహితం-సః-నిద్రయా-సుభ్రువః - నిశి - నిషిద్ధసంవిదః - కల్పితం-శయం-అపాసయన్-నిజం-దోలనైః-జనితబోధయా-అనయా.

అర్థము: సః = ఆ నలుడు, నిశి = రాత్రియందు, నిద్రయా = నిద్రచే, నిషిద్ధ సంవిదః, నిషిద్ధ = ఆగిపోయిన, సంవిదః = సంజ్ఞలు కలిగిన, సుభ్రువః = అందమైన కనుబొమ్మ కల్గిన దమయంతియొక్క, నీవిసీమ్ని — నీవి = కోకముడియొక్క, సీమ్ని = సమీపప్రదేశమునందు, నిహితం = ముడిని విప్పుటకై యుంచబడిన, (కావుననే), కమ్పితం = వణకనెడి సాత్త్విక భావముతోకూడిన, నిజం = తనదైన, కరం = హస్తమును, దోలనైః = వణకులచే, జనితబోధయా; జనిత = ఉద్భవించిన, బోధయా = మెలకువకల్గిన, అనయా = దమయంతిచే, అపాసయత్ = తొలగింప చేసుకొనెను.

సమాసములు :

నీవిసీమ్ని - నీవేః సీమా = నీవిసీమా, తస్మిన్ = నీవిసీమ్ని,
సుభ్రువః - శోభనే భ్రువౌ యస్యాః సా = సుభ్రూః, తస్యాః = సుభ్రువః
నిషిద్ధసంవిదః - నిషిద్ధా సంవిత్ యస్యాః సా = నిషిద్ధసంవిత్, తస్యాః = నిషిద్ధసంవిదః
జనితబోధయా - జనితః బోధః యస్యాః సా = జనితబోధా, తయా = జనితబోధయా.

భావము :

ఆదమయంతి రాత్రియందు నిద్రించుటవలన సంజ్ఞ యనగా చైతన్యము లేక యుండినది. ఆసమయమునందు నలు డామెయొక్క కోకముడిని విప్పుటకై తనచేతినిఁ బోనిచ్చెను. అప్పు డతనికి సత్త్వ ముదయించి చేతియందు వణకు కలుగ ప్రారంభించినది. ఆవణకుచే దమయంతికి మెలకువవచ్చి యాతనిచేతిని తొలగించినది. ॥48॥

శ్లో. స ప్రియోరుయుగకఞ్చుకాంశుకే
న్యస్య దృష్టి మథ సిస్మియే నృపః,
ఆవవార తదథామ్బరాఞ్చలైః
సా నిరావృతిరివ త్రపావృతా.

ప వి:-సః-ప్రియోరుయుగకఞ్చుకాంశుకే-న్యస్య-దృష్టిమ్-అథ-సిస్మియే-నృపః -ఆవవార-తత్-అథ-అమ్బరాఞ్చలైః-సా-నిరావృతిః-ఇవ-త్రపావృతా.

అర్థము: సః=ఆనలమహారాజు, ప్రియోరుయుగకఞ్చుకాంశుకే; ప్రియ=ప్రియురాలియొక్క, ఊరుయుగ=తొడలకు రెంటికిని, కఞ్చుక=కప్పునట్టి, అంశుకే=వలువయందు, దృష్టిం = నేత్రమును, న్యస్య = ఉంచి, సిస్మియే=నవ్వెను, పలుచని వలువనుండి లోపల తొడల రెంటియొక్క సౌందర్యమును చూచి యానందించెనని యర్థము. అథ=అట్లు చూచిన పిదప, సా=ఆదమయంతి, నిరావృతి రివ=ఆతొడలను రెంటిని కప్పెడి వలువలేనిదానినిగా భావించుకొని, త్రపావృతా = సిగ్గుతో కూడినదై, తత్=ఆతొడలను రెంటిని, అమ్బరాఞ్చలైః, అమ్బర=చీరయొక్క, అఞ్చలైః=కొనలచే, ఆవవార=కప్పినది, ఆతొడలు కప్పబడియున్నను, కప్పబడనివిగా భావించి కప్పినదని యర్థము.

సమాసములు :

*ప్రియోరుయుగకఞ్చుకాంశుకే*- ఊర్వోః యుగం = ఊరుయుగం, ప్రియాయాః ఊరుయుగం = ప్రియోరుయుగం, ప్రియోరుయుగస్య కంచుకః = ప్రియోరుయుగకంచుకః, ప్రియోరుయుగకంచుక ఏవ అంశుకం = ప్రియోరుయుగకంచుకాంశుకమ్, తస్మిన్ = ప్రియోరుయుగకఞ్చుకాంశుకే.

అమ్బరాఞ్చలైః- అమ్బరస్య అఞ్చలాః=అమ్బరాఞ్చలాః, తైః = అమ్బరాఞ్చలైః.

నిరావృతిః- నిర్గతా వృతిః యస్యాః స్సా నిరావృతిః.

*త్రపావృతా*-త్రపయా ఆవృతా=త్రపావృతా.

భావము :

ఆ నలుడు ప్రియురాలి తొడలకు రెంటికిని తొలగిన పలుచని వలువనుండి వాని సౌందర్యమును గాంచి యానందించెను. తర్వాత దమయంతి సిగ్గు చెందినదై,

తన తొడలకు రెంటికిని తొడుగున్నను లేనట్లు భావించి, తన కోకయొక్క యంచులచే వానిని గప్పుకొనినది. ॥44॥

శ్లో. బుద్ధిమాన్ వ్యధిత తాం క్రమా దయం
కిఞ్చి దిత్థ మపనీతసాధ్వసామ్,
కిఞ్చ తన్మనసి చిత్తజన్మనా
హ్రీ రనామి ధనుషా సమం మనాక్. 45

ప. వి. బుద్ధిమాన్-వ్యధిత - తాం-క్రమాత్- అయం-కిఞ్చిత్- ఇత్థం - అపనీత సాధ్వసాం- కిం - చ- తన్మనసి—చిత్తజన్మనా-హ్రీః -అనామి-ధనుషా-సమం—మనాక్.

అర్థము: బుద్ధిమాన్ = ఉపాయములను తెలిసిన, అయం = ఈ నలమహారాజు, తాం = ఆ ప్రియురాలిని, క్రమాత్ = క్రమముగా, ఇత్థం = చెప్పిన ప్రకారము, కించిత్ = కొంచెము, అపనీతసాధ్వసాం, అపనీత = తొలగింపబడిన, సాధ్వసాం = భయముగలదానినిగా, వ్యధిత = చేసెను, కించ = మఱియు, చిత్తజన్మనా = మన్మథునిచేతను, తన్మనసి = ఆ దమయంతియొక్క మనస్సునందు, హ్రీః = సిగ్గు, ధనుషా సమం = వింటితోడ, మనాక్ = కొంచెము, అనామి = తగ్గింపబడినది, పక్షాంతరమున వంచబడినది.

వి. సిగ్గుచే వంగుటకును, ధనుస్సు వంగుటకును కార్యకారణభావముండుట వలన ఆ రెంటిని ఏకకాలమందే సంభవించినవిగా వర్ణించుటవలన సహోక్త్యలంకారము.

సమాసములు :

బుద్ధిమాన్-బుద్ధిః అస్య అస్తీతి = బుద్ధిమాన్.
అపనీతసాధ్వసాం - అపనీతం సాధ్వసం యస్యాస్సా = అపనీత సాధ్వసా, తాం = అపనీతసాధ్వసాం,

తన్మనసి-తస్యాః మనః=తన్మనః, తస్మిన్=తన్మనసి.
చిత్తజన్మనా - చిత్తే జన్మ యస్య సః=చిత్తజన్మా, తేన=చిత్తజన్మనా.

భావము :

బుద్ధిమంతు డనగా ఉపాయశాలియగు నలుడు పైన చెప్పినట్లు, క్రమముగా దమయంతికి సిగ్గును కొలదిగా తొలగించెను. మఱియు, మన్మథుడు గూడ నా దమయంతి మనస్సునందలి సిగ్గును తన ధనుస్సుతోడ వంచెను. అనగా నా మన్మథుడు కూడ నామెయందు సిగ్గును తగ్గించెను. తన ధనుస్సును వంచుటచే ఆమెయందు కామమును వర్ధిల్లచేసెను. కాన నా దమయంతి పూర్వపు ముగ్ధత్వము నుండి మధ్యమనాయికాదశ నందుకొనినదని యాశయము. ॥45॥

శ్లో. సిష్మియే హసతి తేన న స్మ సా
ప్రీణితాఽపి పరిహాసభాషణైః,
స్వే హి దర్శయతి తే పరేణ కా
ఽనర్ఘ్యదన్త కురువిన్దమాలికే. 46

ప. వి. సిష్మియే- హసతి- తేన-న- స్మ సా-ప్రీణితా-అపి- పరిహాసభూషణైః
స్వే- హి- దర్శయతి- తే - పరేణ-కా-అనర్ఘ్యదన్తకురువిన్దమాలికే.

అర్థము: సా=ఆ దమయంతి, తేన=ఆ నలునితో, పరిహాసభాషణైః=పరిహాస పూర్వకమగు సల్లాపములచే, ప్రీణితాఽపి=సంతోషము పొందింపబడిన దైనను, సిష్మియే=చిరునవ్వునే చేసినదిగాని, న హసతి స్మ=గట్టిగా నవ్వలేదు. ఇట్లు ఆమె గాంభీర్యమునే వహించియుండినది. చిరునగవులో దంతములు కానరావు. హసితమనెడి గట్టినవ్వు నందవి కనబడును. కాన నారెంటకిని భేదము. హి=ఏలయనగా, కా=ఎవ్వతె, అనగా నేసుందరి, స్వే = తనవైన, అనర్ఘ్యదన్తకురువిన్దమాలికే, అనర్ఘ్యే = మిక్కిలి యందముగా యుండుటవలన అమూల్యములైన, దన్త=దన్తము లనెడి, కురువిన్ద=పద్మరాగముల యొక్క, మాలికే=పంక్తులను, ఇంకొకనితో, దర్శయతి=చూపును ? అనగా చూపదని అర్థము.

సమాసములు :

*పరిహాసభూషణైః* - పరిహాసగర్భాణి భూషణాని = పరిహాసభూషణాని, తైః = పరిహాసభూషణైః.
**అనర్ఘ్యదన్తకురువిన్దమాలికే** - న అర్ఘ్యాః = అనర్ఘ్యాః, అనర్ఘ్యాశ్చ తే దన్తాశ్చ = అనర్ఘ్యదన్తాః, అనర్ఘ్యదన్తా ఏవ కురువిన్దాః = అనర్ఘ్యదన్త కురువిన్దాః, అనర్ఘ్యదన్తకురువిన్దానాం మాలికే = అనర్ఘ్యదన్తకురువిన్ద మాలికే, తే = అనర్ఘ్యదన్తకురువిన్దమాలికే.

భావము :

ఆ నలుడు దమయంతిని తన పరిహాసవచనములతో మిక్కిలి సంతోష పెట్టుచుండెను. అట్టి సమయములయందు ఆదమయంతి యామాటలను విని చిరు నగవు నవ్వినదేకాని గట్టిగా నవ్వలేదు. ఇట్లు ఆమె గాంభీర్యమును వహించి యుండినది. లోకమునందు ఏస్త్రీయు, అమూల్యములగు తన దంతములనెడి పద్మరాగములమాలలను రెంటిని, పైపళ్ళవరుసను క్రింది పల్లువరుసను పరు నకు చూపదుగదా! తాంబూలమును వాడుటచే దంతములు కొద్దిగా ఎఱ్ఱబారినవై పద్మరాగముతో పోలికను వహించియుండును. అట్టి దంతపంక్తిని గాననీయక ఆమె నలుని నర్మోక్తులను, చిరునగవును మాత్రమే చేయుచు గాంభీర్యమును వహించియుండినదని యాశయము. ॥46॥

శ్లో. వీక్ష్య భీమతనయా స్తనద్వయం
మగ్నహారమణిముద్రయాఽఙ్కితమ్,
సోఢకాన్త పరిరమ్భగాఢతా
సా త్వమాని సుముఖీ సఖీజనైః. 47

ప. వి. వీక్ష్య-భీమతనయా-స్తనద్వయం-మగ్నహారమణిముద్రయా-అఙ్కితం-సోఢకాన్తపరిరమ్భగాఢతా-సా-తు-అమాని-సుముఖీ-సఖీజనైః.

అర్థము:- సఖీజనైః = చెలికత్తెలచే, భీమతనయా స్తనద్వయం; భీమతనయా = దమయంతియొక్క, స్తనద్వయం = చనుదోయి, మగ్నహారమణి

ముద్రయా; మగ్న = నలుడు వక్షఃస్థలముచే గట్టిగా గౌగలించుటచే, లోనికి నొత్తుకొనిన, హారమణి = కంఠభూషణములయందలి రత్నముల యొక్క, ముద్రయా = చిహ్నముచే, అఙ్కితం = గుర్తింపబడినదానినిగా, వీక్ష్య = చూచి, సుముఖీ = అందమైనమొగముకల్గిన, సా = ఆదమయంతి, సోఢకాంతపరిరమ్భగాఢతా; సోఢ = సహింపశక్తికల్గిన, లేదా సహింప బడిన, కాంత = ప్రియునియొక్క, పరిరంభ = కౌగలింపుయొక్క, గాఢతా = దృఢత్వముకల్గినదిగా, సా = ఆమె, అమాని = తలంపబడినది.

సమాసములు :

*భీమతనయాస్తనద్వయం* - భీమస్య తనయా = భీమతనయా స్తనయోః ద్వయం = స్తనద్వయం, భీమతనయాయాః స్తనద్వయం = భీమతన యా స్తనద్వయం.

*మగ్నహారమణిముద్రయా* - హారాణాం మణయః = హారమణయః, మగ్నాశ్చ తే హారమణయశ్చ = మగ్నహారమణయః, మగ్నహారమణీనాం ముద్రా = మగ్నహారమణిముద్రా, తయా = మగ్నహారమణిముద్రయా.
*సోఢకాంత పరిరమ్భగాఢతా*- కాంతస్య పరిరమ్భః = కాంతపరిరమ్భః, కాంతపరిరమ్భస్య గాఢతా = కాంతపరిరమ్భగాఢతా, సోఢా కాంతపరిర మ్భగాఢతా యయా సా = సోఢకాంతపరిరంభగాఢతా.

భావము :

చెలికత్తెలు దమయంతిచనుదోయిని, నలుడు దృఢముగా కౌగలించుట వలన లోనికి నొత్తుకొనిపోయి హారమణుల చిహ్నములతో కూడినదానినిగా చూచి ఆదమయంతి ప్రియుని గాఢమగు కౌగలింపును సహించినదానినిగా భావించిరి. కాంతుని దృఢాలింగనము లేనిచో చనుదోయిపై నట్టిచిహ్నము సంభవింప నవకాశము లేదని యాశయము. ॥47॥

శ్లో. యాచతే స్మ పరిధాపితాః సఖీః
సా స్వనీవినిబిడక్రియాం యథా,
అన్వమిన్వత తథా విహస్యతా
వృత్త మత్ర పతిపాణిచాపలమ్. 48

ప. వి. యాచతే-స్మ-పరిధాపితాః-సఖీః-సా - స్వనీవినిబిడక్రియాం - యథా - అన్వమిన్వత-తథా-విహస్య-తాః-వృత్తమ్-అత్ర-పతిపాణిచాపలమ్.

అర్థము: సా=ఆ దమయంతి, పరిధాపితాః=వస్త్రమును కట్టెడి, సఖీః= చెలికత్తెలను, యథా=ఎట్లు, స్వనీవినిబిడక్రియాం; స్వ = తనదైన, నీవి = కోకముడియొక్క, నిబిడక్రియాం = గట్టిపరచడమునుగూర్చి, యాచతే స్మ=కోరుచుండెనో!, తథా=ఆప్రకారమే, తాః=చెలికత్తెలు, విహస్య=నవ్వి, అత్ర=ఈ ముడియున్న ప్రదేశమునందు, పతిపాణి చాపలం; పతి=భర్తయొక్క, పాణిచాపలం=హస్తచాంచల్యము, అనగా కోకముడినిద్పుట, వృత్తం=ఏర్పడినది, (ఇతి=అని) అన్వమిన్వత= ఊహించిరి. కానిచో నీవిధముగా ముడిని గట్టిగా వేయుదని ఆమె చెలికత్తెలను కోరుటే సంభవింపదు.

సమాసములు :

స్వనీవినిబిడక్రియాం-స్వస్యాః నీవిః=స్వనీవిః, స్వనీవేః నిబిడక్రియా= స్వనీవినిబిడక్రియా, తాం స్వనీవినిబిడక్రియాం.
పతిపాణిచాపలం- పత్యుః పాణిః = పతిపాణిః, చపలస్య కర్మ = చాపలం, పతిపాణౌ చాపలం=పతిపాణిచాపలం.

భావము :

ఆ దమయంతి తనకు వస్త్రధారిణులైన చెలికత్తెలను చూచి, వారిని తన చీరముడిని గట్టిగా వేయుమని ప్రార్థించినది. అప్పుడు వా రా మాటను విని

నవ్వినవారై, ఈ ముడియున్నచోటనే భర్త లాగుట మున్నగు హస్తచాపల్యము జరిగియుండును. అట్లు కానిచో నామె యాముడిని గట్టిగా వేయదని కోరదని యూహించిరి. ॥48॥

శ్లో. కుర్వతీ నిచులితం హ్రియా కియత్
సౌహృదాత్ వివృతసౌరభం కియత్,
కుడ్మలోన్మిషితసూనసేవినీం
పద్మినీం జయతి సా స్మ పద్మినీ. 49

ప. వి. కుర్వతీ-నిచులితం-హ్రియా-కియత్ - సౌహృదాత్ - వివృతసౌరభం - కియత్-కుడ్మలోన్మిషితసూనసేవినీం-పద్మినీం-జయతి-సా-స్మ-పద్మినీ.

అర్థము: పద్మినీ=పద్మినియను జాతియం దుద్భవించిన, సా=ఆ దమయంతి, కియత్=కొంచెము, రాత్రియందు జరిగిన సంగతిని, హ్రియా = సిగ్గుచే, నిచులితం = చెలికత్తెలయెదుటకూడ కప్పిపుచ్చబడినదిగను, కియత్=కొంచెము, సౌహృదాత్ = చెలిమివలన, వివృతసౌరభం; వివృత=వెల్లడింపబడిన, సౌరభం=మనోజ్ఞత్వము, (పుష్పపక్షమున) పరిమళము కల్గినదిగను, కుర్వతీ = చేయుచున్నదై, కుడ్మలోన్మిషిత సూనసేవినీం; కుడ్మల = మొగ్గలను, ఉన్మిషితసూన = వికసించిన పూలను, సేవినీం= సేవించు, పద్మినీం= తామరపూదీగెను, జయతి స్మ=జయించుచుండినది.

సమాసములు :

సౌహృదాత్-సుహృదః భావః=సౌహృదం, తస్మాత్=సౌహృదాత్.
వివృతసౌరభం-సురభిణః భావః=సౌరభం, వివృతం సౌరభం యస్య తత్=వివృతసౌరభం.
కుడ్మలోన్మిషితసూనసేవినీం-ఉన్మిషితాని చ సూనాని చ=ఉన్మిషిత సూనాని, కుడ్మలాని చ ఉన్మిషితసూనాని చ=కుడ్మలోన్మిషితసూనాని, కుడ్మలోన్మిషితసూనాని సేవత ఇతి = కుడ్మలోన్మిషితసూనసేవినీ, తాం = కుడ్మలోన్మిషిత సూనసేవినీం.

భావము :

పద్మిని యను నుత్తమస్త్రీజాతికి చెందిన యా దమయంతి రాత్రియందు జరిగిన విషయములలో కొంత చెలికత్తెకు సైతము చెప్పక దాచుకొనుచును, కొంత దాని మనోజ్ఞత్వమును (పరిమళమును) వెల్లడిపఱచుచు, మొగ్గలతోడను, వికసిత పుష్పములతోడను కూడిన కమలిని ననగా తామరతీగెను జయించు చుండినది. ఆమె దాచిన విషయములు పద్మముకులములతోడను, ఆమె వివరించిన విషయములు వికసించిన పద్మములతోడను సమానములై యామెయొక్క పద్మినీత్వమును సార్థకము గావించినవి. పద్మిని యైనందువలననే ఆమె పద్మముల యందలి పరిమళమునుకూడ వెదజల్లినదని యాశయము.॥49॥

శ్లో. నాఽవిలోక్య నల మాసితుం స్మరో
 హ్రీ ర్న వీక్షితు మదా న్మృగీదృశః,
తద్దృశః పతిదిశాఽచలన్నథ
 వ్రీడితాః సమకుచన్ ముహుః పథః. 50

ప.వి. న- అవిలోక్య - నలం - ఆసితుం-స్మరః-హ్రీః-న-వీక్షితుం - అదాత్-మృగీదృశః-తద్దృశః-పతిదిశా-అచలన్ -*అథ - వ్రీడితాః-సమకుచన్-ముహుః-పథః.

అర్థము: స్మరః=మన్మథుడు, మృగీదృశః = లేడిగంటియగు దమయంతి యొక్క సంబంధమున, నలం=నలుని, అవిలోక్య = చూడక, ఆసితుం=ఉండుటకు, న అదాత్ = అవకాశ మొసంగలేదు. హ్రీః= సిగ్గు, వీక్షితుం = చూచుటకు, న అదాత్ = అవకాశ మొసంగలేదు. (కావుననే), తద్దృశః=ఆ దమయంతియొక్క చూపులు, పతిదిశా= భర్తవంకకే, ముహుః=పలుమారులు, అచలన్=వెదలినవి. అథ= పిదపనే, వ్రీడితాః=సిగ్గును పొందినవై, పథః=ఆ మార్గమునుండి, సమకుచన్ =సంకోచము నొందినవి.

సమాసములు :

మృగీదృశః - మృగ్యాః దృశౌ ఇవ దృశౌ యస్యా స్సా=మృగీదృక్, తస్యాః=మృగీదృశః.

భావము :

మన్మథుడు నలుని చూడక యొకక్షణము కూడ దమయంతి యుండుట కవకాశ మొసంగలేదు. కాని యామెయం దేర్పడిన లజ్జ యామె అతనిని చూడనీయలేదు. కావుననే దమయంతియొక్క చూపులు పతియున్న వంకకే పలుమారులు పరుగులిడినవి. కాని లజ్జవలన, త్రోవనడుమనే మరలి పోయినవి. అనగా కామము, లజ్జయు, సమానబలము కల్గియుండుటవలన, దమయంతియందు లజ్జా కామము లనబడు భావముల సంధి వర్ణితము. ॥50॥

శ్లో. నాఽనయా పతి రనాయి నేత్రయో
ర్లక్ష్యతామపి పరోక్షతామపి,
వీక్ష్యతే స ఖలు యద్విలోకనే
తత్ర తత్ర నయనే దదానయా. 51

ప. వి. న-అనయా-పతిః-అనాయి-నేత్రయోః-లక్ష్యతామ్-అపి - పరోక్షతామ్-అపి-వీక్ష్యతే-సః-ఖలు-యద్విలోకనే-తత్ర-తత్ర-నయనే-దదానయా.

అర్థము: అనయా = ఈ దమయంతిచే, పతిః = భర్తయగు నలమహారాజు, నేత్రయోః=కన్నులకు, లక్ష్యతామపి=విషయముగా నుండుటను, న అనాయి=(సిగ్గువలన) పొందింపఁబడలేదు, తథా=అట్లే, పరోక్షతామపి=కన్నులకు కానరాక యుండుటను, న అనాయి=అనురాగమువలన పొందింపబడలేదు, యత్=ఏలయనగా, విలోకనే=దర్శనము నిమిత్తమైనప్పుడు, తత్ర తత్ర=ఆయా విషయములయందు, ననగా నద్దము మున్నగు వానియందు, నయనే = నేత్రములను, దదానయా = ఇచ్చుచున్న, తయా = ఆ దమయంతిచే, సః = ఆ నలుడు, వీక్ష్యతే స్మ

ఖలు=ప్రతిబింబ రూపముగా చూడబడుచుండెను. అనగా నలుడు నేరుగా చూడబడక పోయినను, ప్రతిబింబరూపముగా తప్పనిసరిగా చూడబడు చునే యుండెను అని అర్థము.

సమాసములు :

పరోక్షతాం- అక్ష్ణః పరస్తాత్=పరోక్షం; పరోక్షస్య భావః=పరోక్షతా, తాం=పరోక్షతాం.

యద్విలోకనే-యస్య విలోకనం=యద్విలోకనం, తస్మిన్ = యద్వి లోకనే.

భావము :

ఆ దమయంతి భర్తయగు నలుని సిగ్గువలన కన్నులెత్తి చూడలేక పోయి నది. అట్లే యాతనిని చూడకయు నుండుట లేదు. ఏలయనగా, నితనిని చూచు టకు అద్దము మున్నగు వానిపై నామె దృష్టినిఁ బఱచుచు ప్రతిబింబాదిరూపములో నాతనిని చూచుచుండినది. ॥51॥

శ్లో. వాసరే విరహనిస్పృహా నిశాం
కాన్తయోగసమయం సమైహత,
సా హ్రియా నిశి పున ర్దినోదయం
వాఞ్ఛతి స్మ పతికేలిలజ్జితా. 52

ప. వి. వాసరే-విరహనిస్పృహా-నిశాం-కాన్తయోగసమయం - సమైహత - సా హ్రియా-నిశి-పునః-దినోదయం-వాఞ్ఛతి-స్మ-పతికేలిలజ్జితా.

అర్థము: సా=ఆ దమయంతి, వాసరే=పగటిపూట, విరహనిస్పృహా, విరహ= వియోగమునందు, నిస్పృహా=ఓర్వలేనిదై, నిశాం = ప్రియునితో కలి యుట కనుకూలమైన రాత్రి కాలమును, సమైహత = కోరినది, నిశి పునః=రాత్రియందు, పతికేలిలజ్జితా. పతి=భర్తయొక్క, కేలి=

మన్మథ క్రీడయందు, లజ్జితా = సిగ్గు నొందినదై, హ్రియా = స్వాభావికమగు సిగ్గుచే, దినోదయం = పగటియొక్క ఆవిర్భావమును, వాఞ్ఛతి స్మ = కోరుచుండినది. నూతన వివాహము నొందిన వధువుల మనోవృత్తి విచిత్రమని యర్థము.

సమాసములు :

విరహానిస్సహా- విరహస్య నిస్సహా = విరహానిస్సహా, కాన్తయోగసమయం, కాన్తస్య యోగః = కాన్తయోగః, కాన్తయోగస్య సమయః = కాన్తయోగసమయః, తం = కాన్తయోగసమయం.

దినోదయం - దినస్య ఉదయః = దినోదయః, తం = దినోదయం.

పతికేలిలజ్జితా - పత్యుః కేలిః = పతికేలిః, పతికేల్యా లజ్జితా = పతికేలిలజ్జితా.

భావము :

ఆ దమయంతి పగటపూట విరహము నోర్వజాలకపోయినదై రాత్రి సమయము రావలయునని కోరినది. రాత్రియందు భర్తయొక్క మన్మథక్రీడయందు సిగ్గుపడినదై సహజమగు సిగ్గుచే ప్రొద్దుపొడుచుటకై కోరుచుండినది. నూతన వివాహము నొందిన వధువుల మనోవృత్తి విచిత్రమైనది. ॥52॥

శ్లో. తత్కరోమి పర మభ్యుపైషి య
న్మా హ్రియం వ్రజ భయం పరిత్యజ,
ఆలివర్గ ఇవ తేఽహ మిత్యమూం
శశ్వ దాశ్వసన మూచివాన్ నలః. 53

ప. వి. తత్-కరోమి-పరమ్-అభ్యుపైషి-యత్-మా-హ్రియం-వ్రజ-భయం-పరిత్యజ-ఆలివర్గః-ఇవ-తే-అహమ్-ఇతి-అమూం - శశ్వత్-ఆశ్వసనమ్ - ఊచివాన్-నలః,

అర్థము:- హే! ప్రియే!=ఓ ప్రియురాలా!, యత్=ఎందువలన, (చుమ్బనాదిషు = ముద్దు పెట్టుకొనుట మున్నగువానియందు) యత్కిఞ్చిత్ = ఏదియో కొంచెము, అభ్యుపైషి=అంగీకరించుచున్నావు, పరం = కేవలము, తత్=దానినే, కరోమి=చేయుదును, కాని నీకభిమతము కానిదానిని, చేయను, (కావుననే) హ్రియం=లజ్జను, మా వ్రజ=పొందకుము, భయం=భయమును, పరిత్యజ = వదలి పెట్టుము, అహం=నేను, తే=నీకు, అలివర్గః ఇవ=చెలికత్తెలవర్గమువలె, నమ్మదగినవాడను ఇతి=అని ఇట్లు, నలః=నలుడు, శశ్వత్=పలుమాఱులు, ఆశ్వసనం=ఓదార్పును, ఊచివాన్=చెప్పెను.

సమాసములు :

అలివర్గః-అలినాం వర్గః=అలివర్గః.

భావము :

ఓ ప్రియురాలా! చుంబనము మన్నగు విషయములయందు నీవు ఎంత వఱకు అంగీకరింతువో, అంతవఱకే నేను చేయగలను. కాని నీకిష్టము కానిదానినెంతమాత్రము చేయజాలను. కావుననే, లజ్జ పడకుము. భయమును వదలి పెట్టుము. నేను నీ చెలికత్తెలవలె విశ్వాస పాత్రుడను. ఇట్లు నలుడు దమయంతిని ఓదార్చెను. ॥౫౩॥

శ్లో. యేన తన్మదనవహ్నినా స్థితం
హ్రీమహౌషధి నిరుద్ధశక్తినా,
సిద్ధిమద్భి రుదతేజి తైః పునః
స ప్రియః ప్రియవచోభిమన్త్రితైః. 54

ప. వి. యేన- తత్- మదనవహ్నినా- స్థితం- హ్రీమహౌషధినిరుద్ధశక్తినా- సిద్ధిమద్భిః-ఉదతేజి-తైః-పునః-సః-ప్రియః-ప్రియవచోఽభిమన్త్రితైః.

అర్థము :-యేన = ఏ, తన్మదనవహ్నినా-తత్ = ఆ దమయన్తియొక్క, మదన వహ్నినా, మదన=కామము వలని, వహ్నినా = అగ్నిచే, హ్రీమహౌషధినిరుద్ధశక్తినా, హ్రీ = సిగ్గనెడి, మహౌషధి = గొప్ప మూలికచే, నిరుద్ధ=అడ్డగింపబడిన, శక్తినా=శక్తి కల్గినదిగా, స్థితం= ఉండబడుట (జరిగినది), సః=ఆ మదనాగ్ని, సిద్ధిమద్భిః=సఫలత్వ మును కల్గించెడి శక్తితో కూడిన, తైః=పూర్వోక్తములైన, ప్రియప్రియ వచోభిమన్త్రైః, ప్రియ=ప్రియునియొక్క, ప్రియ వచః=ప్రియము లగు మాటలనెడి, మంత్రకైః=మంత్ర ప్రయోగములచే, ఉదతేజి=ఉత్తే జము పొందింపబడినది.

సమాసములు :

తన్మదనవహ్నినా-మదనస్య వహ్నిః=మదనవహ్నిః, తస్యాః మదన వహ్నిః=తన్మదనవహ్నిః, తేన=తన్మదనవహ్నినా.

హ్రీమహౌషధినిరుద్ధశక్తినా-మహతీ చ సా ఓషధిశ్చ=మహౌషధిః, హ్రీః ఏవ మహౌషధిః=హ్రీమహౌషధిః, హ్రీమహౌషధ్యా నిరుద్ధా శక్తిః యస్య సః=హ్రీమహౌషధి నిరుద్ధశక్తిః, తేన=హ్రీమహౌషధి నిరుద్ధ శక్తినా.

ప్రియప్రియవచోభిమన్త్రైః-ప్రియాణి చ తాని వచాంసి చ= ప్రియవచాంసి, ప్రియస్య ప్రియవచాంసి = ప్రియప్రియవచాంసి, ప్రియప్రియ వచాంస్యేవ అభిమన్త్రణాని=ప్రియవచోఽభిమన్త్రణాని, తైః=ప్రియప్రియవచోభిమన్త్రైః.

భావము :

ఆ దమయంతియందలి మన్మథాగ్ని, సిగ్గనెడి గొప్ప మూలికచే శక్తి నిరోధము కల్గియున్నది. కాని ఆ మదనాగ్ని ప్రియుడైన నలునియొక్క ప్రేమతో కూడిన మాటలనెడి సఫలములగు మంత్రప్రయోగములచే మఱల నుద్దీపింపబడినది. అనగా లజ్జచే బయటపడని దమయంతియొక్క కామము నలుని ప్రియవచనములచే ప్రబలమగుచుండినదని యాశయము. ॥54॥

శ్లో. యద్విధూయ దయితార్పితం కరం
దోర్ద్వయేన విదధే కుచౌ దృఢమ్,
పార్శ్వగం ప్రియ మపాస్య సా హ్రియా
తం హృదిస్థిత మివాలిలిఙ్గ తత్. 55

ప. వి. యత్- విధూయ- దయితార్పితం-కరం- దోర్ద్వయేన- పిదధే- కుచౌ-
దృఢం- పార్శ్వగం- ప్రియమ్- అపాస్య-సా-హ్రియా- తం- హృది-
స్థితమ్-ఇవ- ఆలిలిఙ్గ-తత్.

అర్థము: సా = ఆ దమయంతి, దయితార్పితం, దయిత = ప్రియునిచే,
అర్పితం = బొమ్మ్మనం దుంచబడిన, కరం=హస్తమును, విధూయ =
తొలగించి, దోర్ద్వయేన = రెండు భుజములచే, కుచౌ = స్తనములను,
దృఢం=గట్టిగా, యత్ = ఎందువలన, పిదథే = కప్పెనో, తత్ =
అందువలన, అట్లు కుచములను గప్పుటచే నని యర్థము. హ్రియా =
సిగ్గుచే, పార్శ్వగం=వెలుపలనున్న, ప్రియం = నలుని, అపాస్య=
వదలి, హృది = హృదయమధ్యమందున్న, తం=ప్రియుని, ఆలిలిఙ్గ
ఇవ=కౌగిలించుకొనెనో యనునట్లుండెను. అంతరంగము నందున్న
వానిని కౌగిలించుకొనినచో ఇతరులు చూడ నవకాశము లేనందువలన,
లజ్జ ఏర్పడదు కాన నామె, హృదయమధ్యమందున్న నలుని దృఢముగా
గౌగలించుకొనెనో యనునట్లు తన స్తనములను గట్టిగా తన భుజములతో
కప్పుకొనినదని యర్థము.

సమాసములు :

*దయితార్పితం* - దయితేన అర్పితః = దయితార్పితః, తం = దయి
తార్పితమ్.
దోర్ద్వయేన-దోషోః ద్వయం=దోర్ద్వయం, తేన=దోర్ద్వయేన.
*పార్శ్వగం*-పార్శ్వం గచ్ఛతీతి=పార్శ్వగః, తం పార్శ్వగం.

భావము :

ఆ దమయంతి ప్రియుడగు నలుడు తన బొమ్ముపై నుంచిన హస్తమును నెట్టివైచి, తన రెండు భుజములచేతను తన స్తనములను గట్టిగా కప్పివైచెను. అట్లు గప్పుటవలన తెలియున దేమనగా, నా దమయంతి సిగ్గుచే వెలుపలనున్న నలుని వదలి, హృదయమందున్న వానిని, కౌగలించుకొనెనో యన్నట్లుండెను. హృదయమందున్న వానిని కౌగలించుకొనినచో ఇతరులు చూడజాలరు కాన లజ్జ కలుగదని యెంచి వానిని గట్టిగా కౌగలించుకొనెనో యన్నట్లుండెను. ॥55॥

శ్లో. అన్యదస్మి భవతీం న యాచితా
వారమేక మధరం ధయామి తే,
ఇత్యసిస్వద దుపాంశు కాకువాక్
సోపమర్దహతవృత్తి రేవ తమ్. 56

ప. వి. అన్యత్-అస్మి-భవతీం-న-యాచితా-వామ్-ఏకం-మధురం-ధయామి - తే-ఇతి-అసిస్వదత్-ఉపాంశు-కాకువాక్-సోపమర్దహతవృత్తిః-ఏవ-తమ్.

అర్థము: హే ప్రియే!=ఓ ప్రియురాలా!, భవతీం=నిన్ను, అన్యత్= వేఱొక దానిని, యాచితా=యాచించువాడనుగా, నాఽస్మి=కాఁజాలను, (కిన్తు= కాని) వారమేకం=ఒక తడవమాత్రము, తే=నీయొక్క, అధరం=పెద విని, ధయామి=పానము చేయుదును, ఇతి=ఇట్లు, ఉపాంశు=రహస్యము నందు, కాకువాక్, కాకు=అనునయముతో కూడిన, వాక్ = మాటలు గలవాడై, సోపమార్దహతవృత్తిః= స్తనమర్దనమునందు నామె కోరక పోయినను బలాత్కారముతో నేర్పడిన ప్రవృత్తికలవాడై, అసిస్వదత్= పానము గావించెను.

సమాసములు :

కాకువాక్-కాకుః వాక్ యస్య సః=కాకువాక్.

సోపమర్దహతవృత్తిః- హతేన వృత్తిః=హతవృత్తిః, ఉపమర్దే హత వృత్తిః = ఉపమర్దహతవృత్తిః, ఉపమర్దహతవృత్త్యా సహ వర్తత ఇతి=సోపమర్దహతవృత్తిః.

భావము :

ఓ ప్రియురాలా ! నేను నిన్ను తప్ప, మఱియొక వస్తువును దేనినికూడ యాచింపను. ఒక్కమాఱు నీ పెదవిని మాత్రము పానము చేయుదును. అని రహస్యముగా ననునయవచనములు చెప్పుచు నామె కోరకపోయినను బలాత్కారముగా నామెయొక్క స్తనములను మర్దించి యధరపానము చేసెను. ॥56॥

శ్లో. పీతతావక ముఖాసవోఽధునా
భృత్య ఏష నిజకృత్య మర్హతి,
తత్కరోమి భవదూరు మిత్యసౌ
తత్ర సన్న్యధిత పాణిపల్లవమ్ ॥ప్రక్షిప్తము॥

ప. వి.- పీతతావకముఖాసవః-అధునా - భృత్యః-ఏషః- నిజకృత్యమ్- అర్హతి- తత్-కరోమి-భవదూరుమ్-ఇతి-అసౌ-తత్ర-సన్న్యధిత-పాణిపల్లవమ్.

అర్థము: హే భైమి=ఓ దమయంతీ ! ఏషః = ఈ నేననెడి, భృత్యః= దాసుడు, పీతతావకముఖాసవః; పీత=పానము చేయఁబడిన, తావక= నీదైన, ముఖ=నోటియందలి, ఆసవః=మద్యముకలవాడై, అధునా = ఇప్పుడు, నిజకృత్యం=తనకర్తవ్యమైన, పాదములు పట్టుట మున్నగు కార్యమునకు, అర్హతి=తగినవాడైయున్నాడు. తత్ = అందువలన, భవదూరుం=గృహమునందును, ఉద్యానమునందును పూవులుకోయుట వలన అలసినట్టి నీ తొడలను, కరోమి=పట్టెదను, ఇతి=అని, తత్ర= ఆమెయొక్క తొడలయందు, పాణిపల్లవం = చిగురుతో సమానమగు హస్తమును, సన్న్యధిత=చక్కగానుంచెను.

సమాసములు :

పీతతావకముఖాసవః- తవ ఇదం=తావకం, తావకం చ తత్ ముఖం చ=తావకముఖం, తావకముఖే ఆసవః = తావకముఖాసవః, పీతః తావకముఖాసవః యేన సః=పీతతావకముఖాసవః.

నిజకృత్యం- నిజం చ తత్ కృత్యం చ=నిజకృత్యం.

భవదూరుం- భవత్యాః ఊరుః=భవదూరుః, తం=భవదూరుం.

పాణిపల్లవమ్- పాణిః పల్లవ ఇవ=పాణిపల్లవః, తం=పాణిపల్లవమ్.

భావము :

ఓ దమయంతీ! నేను అనెడి దాసుడు నీనోటియందలి మద్యమును పానముచేసినవాడనై యిప్పుడు తన కర్తవ్యమైన నీపాదసంవాహనరూపమగు భృత్యకార్యమును చేయుటకు తగినవాడను. కావున గృహమందు పనులచేతను, ఉద్యానమందు పూలుకోయుట మున్నగువానిచేతను నలసిన నీతొడలను బట్టెదను. ఇంకొక భృత్యుడుకూడ నట్లే ముఖోచ్ఛిష్టమును సేవించి పాద సంవాహనము చేయుట సహజమే కదా!

(ఇది ప్రక్షేపము. ప్రకాశవ్యాఖ్యననుసరించి వ్యాఖ్యాతము)

శ్లో. చుమ్బనాదిషు బభూవ నామ కిం
తద్వృథా భయ మిహాఽపి మా కృథాః,
ఆలపన్నితి తదీయ మాదిమం
స వ్యధత్త రసనావలివ్యయమ్. 57

ప. వి. చుమ్బనాదిషు-బభూవ-నామ-కిం-తత్-వృథా-భయమ్-ఇహ-అపి-మా-కృథాః-ఆలపన్-ఇతి-తదీయమ్-ఆదిమం - సః - వ్యధత్త - రసనావలివ్యయమ్.

అర్థము :- హే ప్రియే! = ఓ ప్రియురాలా, చుమ్బనాదిషు = అధరపానము మున్నగునవి, (కృతేషు=చేయబడినను) తే=నీకు, కిం నామ= ఏల

యనిష్టము, బభూవ = కల్గినది, (ఏమియు కలుగలేదు) తత్ = అందు వలన, ఇహ అపి = చేయబోవు సురతమందును, వృథా = వ్యర్థముగా, భయం = భయమును, మా కృథాః = చేయకుము, ఇతి = ఇట్లు, ఆలపన్ = చెప్పుచునే, సః = ఆ నలుడు, తదీయం = దమయంతికి సంబంధించిన, ఆదిమం = మొదటిదైన, రసనావలివ్యయం, రసనా = మొలనూలియొక్క, ఆవలి = సరముల వరుసను, వ్యయం = విప్పుటను, వ్యధత్త = చేసెను.

సమాసములు :

**చుంబనాదిషు** - చుమ్బనం ఆదిః యేషాం తే చుమ్బనాదయః. తేషు = చుమ్బనాదిషు

**తదీయం** - తస్యాః అయం = తదీయః, తం తదీయం.

**రసనావలివ్యయం** - రసనాయా ఆవలిః = రసనావలిః, రసనావలేః వ్యయః = రసనావలివ్యయః, తం = రసనావలివ్యయం.

భావము :

ఓ! ప్రియురాలా! అధరపానము మున్నగుపనులయందు నీకేమి యనిష్టము వాటిల్లినది. అనగా నేమియు వాటిల్లలేదు. అనగా చేయబోవు సంభోగమునందును నీకెట్టి యనిష్టము వాటిల్లదు. కాన వ్యర్థముగా భయపడవలదు. అని చెప్పుచునే యా నలుడు రమించుటకై యాదమయంతియొక్క మొలనూలు పేటలను విప్పెను. ॥57॥

శ్లో. అస్తివామ్యభర మస్తికౌతుకం
సాఽస్తిఘర్మజల మస్తివేపథు,
ఆస్తిభీతిరత మస్తివాంఛితం
ప్రాప దస్తిసుఖ మస్తిపీడనమ్. 58

ప. వి. అస్తివామ్యభరమ్-అస్తికౌతుకం-సా- అస్తిఘర్మజలమ్ - అస్తివేపథు- అస్తిభీతి-రతమ్-అస్తివాఞ్ఛితం- ప్రాపత్- అస్తిసుఖమ్- అస్తిపీడనమ్.

అర్థము :- సా= ఆ దమయంతి, అస్తివామ్యభరం, అస్తి= ఉన్నటువంటి, వామ్య=ప్రతికూలతయొక్క, భరం=అతిశయము కల్గినదియు, అస్తి కౌతుకం-అస్తి=ఉన్నటువంటి, కౌతుకం=కుతూహలము కలదియు, అస్తిఘర్మజలం, అస్తి=ఉన్నటువంటి, ఘర్మజలం=చెమట నీరు కలదియు, అస్తివేపథు; అస్తి=ఉన్నటువంటి, వేపథు = వణుకు గలదియు, అస్తిభీతి, అస్తి=ఉన్నటువంటి, భీతి=భయము కలదియు, అస్తి వాఞ్ఛితం, అస్తి = ఉన్నటువంటి, వాఞ్ఛితం = కోరిక గలదియు, అస్తిసుఖం; అస్తి = ఉన్నటువంటి, సుఖం= సుఖము కలదియు. అస్తిపీడనం; అస్తి=ఉన్నటువంటి, పీడనం=నఖ, దంత క్షతము వలని బాధ కల్గినదియు నగు, రతం = సంభోగమును, ప్రాపత్=పొందెను.

సమాసములు :

అస్తివామ్యభరం- వామ్యస్య భరః = వామ్యభరః. అస్తి వామ్యభరః యస్మిన్ తత్=అస్తివామ్యభరం.
అస్తికౌతుకం-అస్తి కౌతుకం యస్మిన్ తత్=అస్తికౌతుకం.
అస్తిఘర్మజలం - ఘర్మస్య జలం = ఘర్మజలం, అస్తి ఘర్మజలం యస్మిన్ తత్=అస్తిఘర్మజలమ్.
అస్తివేపథు-అస్తి వేపథు యస్మిన్ తత్=అస్తివేపథు.
అస్తిభీతి-అస్తి భీతిః యస్మిన్ తత్=అస్తిభీతి.
అస్తివాఞ్ఛితం-అస్తి వాఞ్ఛితం యస్మిన్ తత్=అస్తివాఞ్ఛితమ్.
అస్తిసుఖం-అస్తి సుఖం యస్మిన్ తత్=అస్తిసుఖమ్
అస్తిపీడనం-అస్తి పీడనం యస్మిన్ తత్=అస్తిపీడనం

భావము :

ఆ దమయంతి తొలుత సంభోగమునకు సంబంధించిన వ్యాపారములయం దానుకూల్యము వహించినది. తర్వాత సంభోగప్రారంభమునందు కుతూహలముతో కూడియుండినది. తర్వాత సంభోగకాలమునందు సత్వమువలన ఏర్పడిన స్వేదజలముతోడను, వణకుతోడను కూడిన దాయెను. తర్వాత భయముతో కూడిన దాయెను. ఆ భయము తొలగిపోయిన పిదప తనకు నిష్ట మేర్పడినందు

వలన నానందముతో కూడినదై నఖక్షతదంతక్షతాదులతో నేర్పడిన బాధ ననుభ వించినది. ఇట్టి కామ్యభారకౌతుకాదులతో కూడిన సురత సంభోగము నామె యనుభవించినది. ॥౫౮॥

శ్లో. హ్రీ స్తవేయ ముచితైవ యన్నవ
స్తావకే మనసి మత్సమాగమః,
తత్తు నిస్త్రప మజస్రసఙ్గమాత్
వ్రీడ మావహతి మామకం మనః. 59

ప. వి. హ్రీః-తవ-ఇయమ్-ఉచితా-ఏవ-యత్-నవః-తావకే - మనసి-మత్సమా గమః-తత్-తు-నిస్త్రపం-అజస్రసఙ్గమాత్-వ్రీడమ్-ఆవహతి-మామకం- మనః.

అర్థము: హే ప్రియే = ఓ ప్రియురాలా, యత్ = ఎందువలన, తావకే = నీదైన, మనసి = మనస్సునందు, మత్సమాగమః = నా కలయిక, నవః=నూతనమో, తత్=అందువలన, తవ=నీకు, ఇయం = ఈ, హ్రీః=సిగ్గు, ఉచితైవ=తగినదే, తు = కాని, అజస్రసఙ్గమాత్ = ఇంతకాలము నిరంతరము మనస్సుతో కలయిక యుండుటవలన, నిస్త్రపం=సిగ్గులేని, మామకం=నాదైన, మనః=మనస్సుకూడ, వ్రీడం = లజ్జను, ఆవహతి = పొందుచున్నది. నీతోడ బాహ్యమైన కలయిక ఏర్పడుటవలన సిగ్గు నొందుచున్నదని యర్థము.

సమాసములు :

తావకే-తవ ఇదం=తావకం, తస్మిన్=తావకే.

మత్సమాగమః-మమ సమాగమః=మత్సమాగమః.

నిస్త్రపం-నిర్గతా త్రపా యస్మా త్తత్=నిస్త్రపం.

అజస్రసఙ్గమాత్ - అజస్రం సఙ్గమః=అజస్రసఙ్గమః, తస్మాత్ = అజస్రసఙ్గమాత్.

భావము :

ఓ ప్రియురాలా! నీమనస్సునందు నాకలయిక క్రొత్తది కాన నీకు సిగ్గును కలిగించుచున్నది. ఇది తగినదే. కాని నిరంతరము ఇంతకాలము మనస్సుతో నీకలయిక యుండుటవలన క్రొత్తదనము లేకపోవుటచే నామనస్సుకు సిగ్గు గలుగక యుండినది. కాని అది ఆంతరంగికమైన కలయిక. ప్రకృతము మనకేర్పడిన కలయిక బాహ్యమును, నూతనమునై యున్నది. కాన ఇది లజ్జను కల్గించు చున్నది. ॥59॥

శ్లో, ఇత్యుపాలభత సమ్భుజిక్రియా-
రమ్భవిఘ్నఘనలజ్జితైర్జితామ్,
తాం తథా స చతురో న సా యథా
త్రప్తుమేవ తమను త్రపామయాత్. 60

ప వి. ఇతి- ఉపాలభత- సమ్భుజిక్రియారంభవిఘ్నఘనలజ్జితైః- జితాం- తాం- తథా-సః- చతురః-న- సా-యథా- త్రప్తుం-ఏవ-తం-అను- త్రపాం- అయాత్.

అర్థము:- సమ్భుజిక్రియారంభవిఘ్నఘనలజ్జితైః; సంభుజిక్రియా = సంభోగ క్రియయొక్క, ఆరంభ = ప్రారంభమునకు, విఘ్న = ప్రీతిబంధకము లైన, ఘనలజ్జితైః = గాఢములైన లజ్జలచే, జితాం = జయింపబడిన, తాం = ఆ ప్రియురాలిని, చతురః = పరిహాసమందు నిపుణుడగు, సః = ఆ నలుడు, తథా = ఆవిధముగా, ఉపాలభత = నిందించెను. యథా = ఏవిధముగా, సా = ఆ ప్రియురాలు, తమను = నలు నుద్దేశించి, త్రప్తుమేవ = సిగ్గు చెందుటకే, త్రపాం = లజ్జను, అయాత్ = పొందినది, అనగా సిగ్గు చెందుటకే సిగ్గు పడినది. అనగా నలుడు పైవిధముగా విమర్శించుటవలన మరల నతని విమర్శకు లోనుకావలసివచ్చు ననెడి సిగ్గును మాని సంభోగమునకు దిగినదని యర్థము.

సమాసములు :

సమ్భుజిక్రియారంభవిఘ్నఘనలజ్జితైః- సమ్భుజిరేవ క్రియా=సమ్భుజిక్రియా, సమ్భుజిక్రియాయాః ఆరంభః = సంభుజిక్రియారంభః, సమ్భుజిక్రియారంభస్య, విఘ్నాః = సమ్భుజిక్రియారంభవిఘ్నాః, సంభుజిక్రియారంభవిఘ్నాః ఏవ ఘనలజ్జితాని=సమ్భుజిక్రియారంభ ఘనలజ్జితాని, తైః=సమ్భుజిక్రియారంభవిఘ్నఘనలజ్జితైః.

భావము :

ఆ దమయంతి సంభోగక్రియకు ప్రతిబంధకములైన మిక్కుటములగు సిగ్గులచే పరవశమై పోయినది. కాని పరిహాసనిపుణుడైన యా నలుడు ఆమెను పెక్కువిధములుగా సిగ్గువిషయమందు విమర్శించుటచే నామె సిగ్గుచెందుటకే సిగ్గుపడినది. అనగా సిగ్గును మాని సంభోగమున కవకాశ మొసంగినదని యాశయము. ॥60॥

శ్లో. బాహువక్త్రజఘనస్తనాక్షిత
ద్బంధగంధరతసజ్ఞతానతీః,
ఇచ్ఛు రుత్సుకజనే దినే స్మితే
వీక్షితేతి సమకేతి తేన సా.

ప. వి. బాహువక్త్రజఘనస్తనాక్షితద్బంధగంధరతసజ్ఞతానతీః-ఇచ్ఛుః- ఉత్సుకజనే-దినే-స్మితే-వీక్షితా-ఇతి-సమకేతి-తేన-సా.

అర్థము:- హే భైమి! = ఓదమయంతీ!, ఉత్సుకజనే=తమతమ కార్యములను చేయుటయందు కుతూహలముకల్గిన జనులుగాని, రాత్రివృత్తాంతము వినుటకు కుతూహలముకల్గిన చెలికత్తెలు మున్నగుజనము, దినే = పగటి యందును, తే=నీకు సంబంధించినట్టి, బాహువక్త్రజఘనస్తనాక్షిత ద్బంధగంధరతసజ్ఞతానతీః, బాహు =భుజములకును, వక్త్ర=ముఖము

నకును, జఘన = జఘనమునకును, స్తన = స్తనములకును, అఙ్ఘ్రి =
పాదములకును సంబంధించిన కామశాస్త్రములందు ప్రసిద్ధములైన,
బంధ = నాగపాశము మున్నగు బంధములయొక్క, గంధ = లేశము
కల్గిన, రత = సురతకేలితో, సంగత = సంబంధించిన, ఆనతీః =
అవయవముల యొక్క మిక్కుటములగు నమ్రత్వములను ననగా
మిక్కిలి నేర్పుతో నాయా యవయవములను వంగునట్లు చేయు పద్ధతు
లను లేదా, సంగతా = సంబంధించిన, నతీః-నతులను, అనగా నాయా
యవయవములను వంచి చేసెడి బంధములను, ఇచ్ఛుః = కోరినవాడనుగా,
అస్మి = అగుచున్నాను, స్మితే = ఓ చిఱునవ్వుగల దమయంతీ! అని
సంబోధనకూడ కావచ్చును. రాత్రి జరిగిన బంధములతో కూడిన సురత
ముయొక్క స్మృతి యేవిధముగా కల్గునో ఆ విధముగా దృష్టితోడనే
సూచించి యనురాగాతిశయముచే, పగటియందును తన యా సురతాభి
లాషను స్మరింపజేసెనని భావము.

లేదా, క్రమముగా బాహువులయొక్క బంధము, పద్మినీజాతియగుటచే
ముఖముయొక్క పరిమళము, జఘనముయొక్క సురతము, స్తనముల
యొక్క కౌగిలింపు, పాదములయందు పడుట మున్నగువానిని, ఉత్సుక
జనే = తమతమ కార్యములయందు ఆసక్తిగల జనముకల్గిన, దినేఽపి =
పగటియందును, ఇచ్ఛు రస్మి ఇతి = కోరికగలవాడనై యున్నానని,
తేన = ఆ నలునిచే, వీక్షితా = చూడబడిన, సా = ఆ దమయంతి, సమ
కేలి = సంజ్ఞ చేయబడినది.

లేదా, ఉత్సుకజనే = కుతూహలముగల జనముతో కూడిన, దినే =
పగటిపూట, వీక్షితా = చూడబడిన, సా = దమయంతి, ఇచ్ఛుః = సంభోగేచ్ఛ
కలవాడనుగా, అస్మి = ఉన్నానని, సమకేతి = సంకేతము గావింపబడినది.
"ఉత్సుకసఖీజనేఽస్మి తే వ్రీడితా" యను పాఠము ననుసరించి రాత్రిజరి
గిన విషయములను గూర్చిన ప్రశ్నలయందలి కోరికను మఱుగుపరచు
టకై, దానివలన లజ్జ కలుగక యుండుటకై, అస్మితే = చిరునగవులేనిదియు,
విషయమును తెలిసికొనుటకై కుతూహలముకల్గిన చెలికత్తెలయెదుట
ముందుచెప్పినప్రకారము ఆదమయంతి నలునిచే సంకేతము గావింపబడి
నది. అనగా రాత్రియందు చేయబడిన బాహుబంధములు మున్నగువాని
నిప్పుడుకూడ గోరుచున్నానని రాత్రిజరిగిన విషయములను జ్ఞప్తిపఱచు
టకై చెలికత్తెలయెదుట నిట్లు చెప్పెనని యర్థము. అందువలననే యామె

సిగ్గుపడినది. లేదా, కుతూహలముకల్గిన చెలికత్తెలు నవ్వ నారంభింపగనే యామె సిగ్గుపడినదని కాని యర్థము.

లేదా, ఓ దమయంతీ! నీ బాహుబంధాదులను పగటిపూట చూడగలను. ఏలయనగా, రాత్రియందు వానిని చేసినను నేను చూడలేదు. కాన పగటి యందు వానిని చూడగోరుచున్నానని యానలునిచే ఆమె చెప్పబడినది. నేనొక్కడనే చూడడము కాదు, నీ చెలికత్తెలు కూడ చూడగలరని 'ఉత్సుక' శబ్దముచే సూచితము. (ఇంకను నీశ్లోకముపై వ్యాఖ్య లున్నవి. కాని గ్రంథగౌరవభయముచే చెప్పబడలేదు).

భావము :

ఓ దమయంతీ! తమ తమ కార్యములను చేసికొనుటకు కాని రాత్రి జరిగిన విషయములను వినుటకు గాని కుతూహలముగల చెలికత్తెలు కూడిన పగటియందును నీకు సంబంధించిన బాహువులు, ముఖము, జఘనము, స్తనములు, పాదములనెడి అవయవముల యొక్క నాగపాశాది బంధముల లేశము కల్గిన సురతముతో కలసినట్టి నేర్పుతో, అవయవములను వంచునట్టి విధములను చూడగోరుచున్నాను. అనగా రాత్రి జరిగిన నాగపాశాది బంధములతో కూడిన సురతమును స్మరించునట్లు తన చూపులతోడనే తెలియునట్లు గావించి, యనురాగాధిక్యముచే పగటియందును, నట్టి సురతమందలి తన యభిలాషను ఆ దమయంతికి సూచించెనని యాశయము.

ఈ శ్లోకము ప్రక్షిప్తము. నారాయణభట్టు వ్యాఖ్యానించుటవలన నిందు చేర్చబడినది.

శ్లో. ప్రాత రాత్మశయనా ద్వినిర్యతీం
సన్నిరుధ్య యదసాధ్య మన్యదా,
తన్ముఖార్పణముఖం సుఖం భువో
జమ్భజిత్ క్షితిశచీ మచీకరత్.

ప. వి. ప్రాతః- ఆత్మశయనాత్ - వినిర్యతీం - సన్నిరుధ్య- యత్- అసాధ్యం- అన్యథా-తత్-ముఖార్పణముఖం-సుఖం-భువః- జమ్భజిత్- క్షితిశచీమ్ - అచీకరత్.

అర్థము :- భువః = భూమికి, జమ్భజిత్=ఇంద్రుడైన నలుడు, ప్రాతః= ఉదయమున, ఆత్మశయనాత్=తన పడకనుండి, వినిర్యతీం= వెడలు చున్న, క్షితిశచీం=భూలోకపు శచీదేవిని, అనగా తన ప్రియురాలిని, సన్నిరుధ్య=అడ్డగించి, అనగా చేతులతో లాగి, అన్యదా=మఱియొక సమయమునందు, అనగా నింటినుండి వెడలిన పిదప, యత్=ఎటువంటి సుఖము, అసాధ్యం = అశక్యమో, తత్=అటువంటి, ముఖార్పణ ముఖం=ముఖమును ముద్దిడుట మున్నగు రూపమునందున్న, సుఖం= సుఖమును, అచీకరత్=చేయించెను. దమయంతిని లాగి పట్టుకొని యామెచే, తన ముఖమును ముద్దిడుకొనునట్లు చేయించెనని యర్థము.

సమాసములు :

ఆత్మశయనాత్-ఆత్మనః శయనం = ఆత్మశయనం, తస్మాత్ = ఆత్మశయనాత్.
అసాధ్యం-న సాధ్యం=అసాధ్యం, తత్=అసాధ్యం.
ముఖార్పణముఖం-ముఖస్య అర్పణం యస్మిన్ తత్=ముఖార్పణం, ముఖార్పణం చ తత్ ముఖం చ=ముఖార్పణముఖం.
జమ్భజిత్- జమ్భం జయతీతి=జమ్భజిత్.
క్షితిశచీం- క్షితేః శచీ=క్షితిశచీ, తామ్=క్షితిశచీమ్.

భావము :

భూలోకమునకు ఇంద్రుడైన నలుడు, ఉదయమునందు పడకనుండి వెడలుచున్న భూలోకపు శచీదేవి యగు దమయంతిని చేతులతో లాగికొని, మఱియొక సమయమున ననగా నింటిని విడచినప్పుడు చేయుట కసాధ్యమైనట్టి, దమయంతి చేతి ముద్దును చేయించుకొనెను. అనగా ఆమెను లాగిపట్టుకొని యామె తనను ముద్దిడునట్లు చేసుకొనెను. ॥61॥

శ్లో. నాయకస్య శయనా దహర్ముఖే
నిర్గతా ముద ముదీక్ష్య సుభ్రువాం.
ఆత్మనా నిజనవస్మరోత్సవ
స్మారిణీయ మహ్రీణీయత స్వయమ్. 62

ప. వి. నాయకస్య-శయనాత్-అహర్ముఖే-నిర్గతా-ముదమ్-ఉదీక్ష్య-సుభ్రువామ్-ఆత్మనా-నిజనవస్మరోత్సవస్మారిణీ-ఇయమ్-అహ్రీణీయత-స్వయమ్.

అర్థము: అహర్ముఖే=ఉషఃకాలమునందు, నాయకస్య=భర్తయొక్క, శయనాత్=పడకనుండి, నిర్గతా=వెడలిన, ఇయం=ఈ దమయంతి, సుభ్రువాం = చెలికత్తెలకు, ముదం = తన సంభోగచిహ్నములను చూచుటచే కల్గిన సంతోషమును, ఉదీక్ష్య=చూచి, ఆత్మనా=మనస్సుచే, నిజనవస్మరోత్సవ స్మారిణీ, నిజ = తనదైన, నవ = నూతనమగు స్మరోత్సవ=సంభోగమువలని యానందమును, స్మారిణీ = స్మరించుచున్నదై, స్వయమేవ=తానుగనే, అహ్రీణీయత=సిగ్గుపడెను.

సమాసములు :

అహర్ముఖే—అహ్నః ముఖం=అహర్ముఖం, తస్మిన్=అహర్ముఖే.
*నిజనవస్మరోత్సవస్మారిణీ* - స్మరస్య ఉత్సవః = స్మరోత్సవః, నిజశ్చాసౌ స్మరోత్సవశ్చ = నిజస్మరోత్సవః, నిజస్మరోత్సవస్య స్మారిణీ=నిజస్మరోత్సవ స్మారిణీ.

భావము :

ఉషఃకాలమునందు భర్తయొక్క పడకనుండి లేచి వెల్వెడుచున్న ఆ దమయంతి తన సంభోగ చిహ్నములను చూచుటచే చెలికత్తెలకు కల్గిన యానందమును గాంచి, తన మనస్సుచేతనే, తన సంభోగోత్సవమును స్మరించుచున్నదై తానుగనే సిగ్గు చెందినది. ॥62॥

శ్లో. తాం మిథోఽభిదధతీం సఖీః ప్రియ
స్యాత్మనశ్చ స నిశావిచేష్టితం,
పార్శ్వగః సురవరాత్ పిధాం దధత్
దృశ్యతాం శ్రుతకథో హసన్ గతః. 63

ప.వి. తాం-మిథః-అభిదధతీం-సఖీః-ప్రియస్య-ఆత్మనః-చ-సః-నిశావిచేష్టితం-పార్శ్వగః-సురవరాత్-పిధాం-దధత్-దృశ్యతాం- శ్రుతకథః - హసన్-గతః.

అర్థము:- పార్శ్వగః=సమీపమందున్నను, సురవరాత్ = ఇంద్రాదిదేవతల యొక్క వరమువలన, పిధాం=అంతర్ధానమును, దధత్ = ధరించుచున్న, సః=ఆ నలుడు, ప్రియస్య=ప్రియుడైన నలునియొక్కయు, ఆత్మనశ్చ=తనయొక్కయు, నిశావిచేష్టితం; నిశా=రాత్రియందలి, విచేష్టితం=పనిని, మిథః=రహస్యమునందు, సఖీః=చెలికత్తెలను గూర్చి, అభిదధతీం=చెప్పుచున్న, తాం=ఆ ప్రియురాలిని, శ్రుతకథః= అంతర్ధానమందు వినబడిన ప్రియురాలివచనములు గలవాడై, (కావుననే) హసన్=నవ్వుచు, దృశ్యతాం=వారికన్నులకు కనబడుటను, గతః= పొందెను.

సమాసములు :

*నిశావిచేష్టితం* - నిశాయాం విచేష్టితం=నిశావిచేష్టితం, తత్ = నిశావిచేష్టితం.
*పార్శ్వగః* - పార్శ్వం గచ్ఛతీతి=పార్శ్వగః.
*సురవరాత్* - సురాణాం వరః=సురవరః, తస్మాత్=సురవరాత్.
*శ్రుతకథః* - శ్రుతా కథా యేన సః=శ్రుతకథః.

భావము :

నలుడు చెంతనున్నను నింద్రాదుల వరప్రసాదమువలన నంతర్ధానము చెందినవాడై, ప్రియునకును, తనకును సంబంధించిన రాత్రియందలి వ్యాపార

మును చెలికత్తెలకు వినిపించుచున్న ప్రియురాలిమాటలను విని బిగ్గఱగా నవ్వుచు వారి కచ్చట నగపడెను. ॥38॥

శ్లో. చక్రదార విరహేక్షణక్షణే
భిభ్యతీ ధవహసాయ సాఽభవత్.
క్వాపి వస్తుని వద త్యనాగతం
చిత్త ముద్యదనిమిత్తకౌతుకమ్. 64

ప. వి. చక్రదారవిరహేక్షణక్షణే- బిభ్యతీ-ధవహసాయ-సా-అభవత్-క్వ-అపి-వస్తుని-వదతి-అనాగతం-చిత్తం-ఉద్యదనిమిత్తకౌతుకమ్.

అర్థము:- చక్రదారవిరహేక్షణక్షణే; చక్రదార=రాత్రియందు చక్రవాకియొక్క, విరహ = వియోగమును, ఈక్షణక్షణే = చూచునట్టికాలమునందు, బిభ్యతీ=తనకును ఒకప్పుడు నలునితో వియోగము కలుగుననెడి భావముతో భయపడుచున్న, సా=ఆ దమయంతి, ధవహసాయ=ప్రియుని హాస్యమునకై, అభవత్=నిమిత్తముగా నేర్పడినది, లేదా, ఈ భయము యుక్తమే!, క్వాపి=ఒకానొక, వస్తుని=వస్తువువిషయమున, ఉద్యదనిమిత్తవైకృతం; ఉద్యత్=ఉద్భవించిన, అనిమిత్త=ఆకస్మికమగు, వైకృతం=వికారము కల్గిన, చిత్తం=మనస్సు. అనాగతం= రాబోవు శుభాశుభములు మున్నగువానిని, వదతి=జ్ఞప్తిపఱచుచున్నది.

సమాసములు :

చక్రదారవిరహేక్షణక్షణే - చక్రస్య దారాః = చక్రదారాః, చక్రదారాణాం విరహః=చక్రదారవిరహః, విరహస్య ఈక్షణం=విరహేక్షణం, చక్రదారవిరహేక్షణస్య క్షణః=చక్రదారవిరహేక్షణక్షణః, తస్మిన్= చక్రదారవిరహేక్షణక్షణే.

ధవహసాయ - ధవస్య హసః=ధవహసః, తస్మై=ధవహసాయ,

ఉద్యదనిమిత్తవైకృతం - అవిద్యమానం నిమిత్తం యస్య తత్ = అనిమిత్తం, అనిమిత్తం చ తత్ వైకృతం చ = అనిమిత్తవైకృతం, ఉద్యత్ అనిమిత్తవైకృతం యస్య తత్ = ఉద్యదనిమిత్తవైకృతమ్

భావము :

ఆ దమయంతి రాత్రియందు చక్రవాకాంగనయొక్క వియోగమును చూచి, తనకును ఒకప్పుడు నలునితో వియోగము కల్గునేమో యని భయపడుచు ప్రియుని హాస్యమునకు పాత్రయైనది. అనగా నీమెకు ఆకస్మికముగా భయమేర్పడుటవలన అతడు నవ్వెనని యర్థము. లేదా, యిది యుక్తమే ! ఏల యనగా, ఏదియో ఒక వస్తువు విషయమునందు ఆకస్మికముగా వికారము చెందిన మనస్సు రాబోవు శుభాశుభములను సూచించును. కానిచో చక్రవాకియొక్క విరహమును చూచి నంతటనే దమయంతి చిత్తము ఏల వికృతి చెందును? అని యాశయము. ॥౬౪॥

శ్లో. చుమ్బితం న ముఖ మాచకర్ష యత్
పత్యు ర న్త రమృతం వవర్ష తత్,
సా నునోద న భుజం య దర్పితం
తేన తస్య కిమభూ న్న తర్పితమ్. 65

ప.వి. చుమ్బితం- న-ముఖం-ఆచకర్ష-యత్-పత్యుః-అంతః-అమృతం-వవర్ష తత్- సా- నునోద- న- భుజం - యత్-అర్పితం-తేన-తస్య- కిమ్- అభూత్- న- తర్పితమ్.

అర్థము:- సా = ఆ దమయంతి, చుమ్బితం = నలుడు ముద్దిడుటకు ప్రారంభింప బడిన, ముఖం = తన ముఖమును, న ఆచకర్ష = లాగుకొనలేదు· ఇతి యత్ = అనునది ఏది కలదో, తత్ = అది, అనగా ముద్దిడబడు ముఖమును లాగుకొనక యుండుటయే, పత్యుః = భర్తయగు నలునకు, అంతః = మనస్సునందు, అమృతం = అమృతమును, వవర్ష = వర్షించినదో యనున ట్లుండినది. దానితో సమానమగు నానందమును కల్గించినదని యర్థము. తథా = అట్లే, అర్పితం = చనుదోయిపై నుంచబడిన, భుజం =

నలుని భుజమును, యత్ = ఎందువలన, న నునోద = నెట్టలేదో, తేన = దానిచే, తస్య = ఆ నలునికి సంబంధించిన, కిం = ఏ వస్తువు, అనగా అవయవము గాని, మనస్సుకాని, న తర్పిత మభూత్ = తృప్తి నొందినది గాలేదు? అనగా నాతని సర్వావయవములును నానందము నొందినవని యర్థము.

భావము :

ఆ దమయంతి తన మోమును నలుడు ముద్దుపెట్టుకొనుటకు ప్రారంభింప గనే తన మోమును లాగకపోవడ మనునది యతని కమృతవర్షముగా నుండి గొప్ప యానందమును చేకూర్చినది. అట్లే యా నలుడు తన చనుదోయిపై చేతి నుంచినను ఆ దమయంతి దానిని దొలగింపకుండుటచేత నా నలునికి సంబం ధించిన యే యవయవము గాని మనస్సుగాని యాప్యాయితత్వము నొందక పోలేదు. అనగా నాతని సర్వావయవములును దమయంతి స్పర్శచే నాప్యాయి తము లైనవని యాశయము. ॥65॥

శ్లో. నీతయోః స్తనపిధానతాం తయా
దాతు మాప భుజయోః కరం పరమ్,
వీతబాహుని తతో హృదంశుకే
కేవలేఽప్యథ స తత్కుచద్వయే. 66

ప.వి. నీతయోః- స్తనపిధానతాం- తయా- దాతుమ్ - ఆప-భుజయోః-కరం- పరం-వీతబాహుని- తతః-హృదంశుకే - కేవలే - అపి - అథ - సః- తత్కుచద్వయే.

అర్థము : సః = ఆ నలుడు, తయా = ఆ దమయంతిచే, స్తనపిధానతాం; స్తన = కుచములకు, పిధానతాం = కప్పుగా నుండుటను, నీతయోః = పొందింప బడిన, భుజయోః పరం = (తొలుత కేవలము భుజములపైన) భుజముల యందే, (తతః = ఆ తర్వాత) వీతబాహుని, వీత = తొలగింపబడిన, బాహుని = భుజములు కల్గిన, అనగా నలుడు మెల్లమెల్లగా తొలగించిన

భుజముగల యని యర్థము. హృదంశుకే = స్తనములను కప్పెడి వలువ పైనను, అథ = పిదప, కేవలేఽపి = కప్పుగానున్న వలువను తొలగించిన పిదప నెట్టి యావరణము లేనటువంటి, తత్కుచద్వయే; తత్ = ఆ దమయంతి యొక్క, కుచద్వయే = చనుదోయి పైనను, కరం = హస్తమును, దాతుం = ఉంచుటకు, ఆప = పొందెను. అనగా శక్తుడాయెను. దమయంతికిని క్రమముగా కామ ముదయించుటవలన సిగ్గువలని సంకోచము తొలగిపోయినదని యర్థము.

వి. నలునియొక్క యొకహస్తము క్రమముగా దమయంతియొక్క భుజములు, స్తనావరణము, కుచము లనెడి, యనేకములగు విషయములపై నున్నట్లు చెప్పుటవలన ''క్రమేణైక మనేకస్మిన్'' అను లక్షణముగల పర్యాయాలఙ్కారము.

సమాసములు :

స్తనపిధానతాం- పిధానస్య భావః = పిధానతా, స్తనయోః పిధానతా = స్తనపిధానతా, తాం = స్తనపిధానతాం.

వీతబాహుని - వీతౌ బాహూ యస్మాత్తత్ = వీతబాహు, తస్మిన్ = వీతబాహుని.

హృదంశుకే- హృదః అంశుకం = హృదంశుకం, తస్మిన్ = హృదంశుకే.

భావము :

ఆ నలుఁడు, దమయంతి తన చనుదోయికిఁ గప్పుగా నుంచిన భుజములపై తొలుత తన హస్తమును బెట్టి యా భుజములను తొలగించెను. తర్వాత నా చనుదోయిని గప్పిన వలువపైకి తన హస్తములను బోనిచ్చి యా వలువను తొలగించెను. తర్వాత నెట్టి కప్పులేని యా చనుదోయిపైకి తన హస్తము నుంచ కల్గెను. దమయంతికి గ్రమముగా కామము గలుగుటచే సిగ్గు సన్నగిల్లినదని యాశయము. ॥86॥

శ్లో. యాచనాన్న దదతీ నఖార్పణం
తాం విధాయ కథయాఽన్యచేతసామ్,
వక్షసి న్యసితు మాత్తతత్కరః
స్వం బిభేద ముముదే స తన్నఖైః. 67

ప.వి. యాచనాత్-న-దదతీ-నఖార్పణం-తాం-విధాయ-కథయా-అన్యచేతసాం-వక్షసి-న్యసితుం-ఆత్తతత్కరః-స్వం-బిభేద-ముముదే-సః-తన్నఖైః.

అర్థము : సః=ఆ నలుడు, యాచనాత్=నన్ను గోట గాయపఱపుమని ప్రార్థించుట వలనను, నఖార్పణం, నఖ=గోరును, అర్పణం=ఉంచుటను అనగా దానితో గాయపఱచుటను, న దదతీం=చేయనటువంటి, అనగా స్నేహము వలన గోట గీఱనటువంటి, తాం=ఆ ప్రియురాలిని, కథయా=వివిధ విషయముల సంభాషణలచే, అన్యమానసాం=మఱియొకదాని యందు లగ్నమైన మనస్సుగలదానినిగా, విధాయ=చేసి, వక్షసి=తన ఱొమ్ముపై, న్యసితుం=ఉంచుటకు, ఆత్తతత్కరః-ఆత్త=గ్రహింపబడిన, తత్కరః=ఆ దమయంతియొక్క హస్తము గలవాడై, తన్నఖైః=ఆ ప్రియురాలియొక్క గోళ్ళచే, స్వం=తనను, బిభేద=గీచుకొనెను, ముమోద చ=సంతోషించెను.

సమాసములు :

అన్యచేతసాం-అన్యస్మిన్ చేతః యస్యాః సా=అన్యచేతాః, తాం=అన్యచేతసామ్.

ఆత్తతత్కరః-తస్యాః కరః=తత్కరః, ఆత్తః తత్కరః యేన సః=ఆత్తతత్కరః.

తన్నఖైః-తస్యాః నఖాః=తన్నఖాః, తైః=తన్నఖైః.

భావము :

ఆ నలుడు ''తన్ను గోట గీరు''మని ప్రార్థించినను నా దమయంతి యతనియందలి స్నేహముచే నట్లు చేయ నొల్లలేదు. అప్పుడా నలుడు ఆ విషయమును గ్రహించి మాట్లాడునట్టి ప్రసంగమున యన్యమనస్కురాలై యున్న ఆ దమయంతియొక్క హస్తమును పట్టుకొని తన బొమ్మపై నుంచుకొని అందలి గోరులతోఁ దన్ను గీరుకొనెను. అందువలన ఆ నలుడు ఆనందమును కూడ పొందెను. ॥67॥

శ్లో. స ప్రసహ్య హృదయాపవారకం
హర్తు మక్షమత సుభ్రువో బహిః,
హ్రీమయం న తు తదీయ మాంతరం
తద్వినేతు మభవత్ ప్రభుః ప్రభుః. 68

ప. వి. సః-ప్రసహ్య-హృదయాపవారకం-హర్తుం-అక్షమత-సుభ్రువః-బహిః - హ్రీమయం-న-తు-తదీయమ్- ఆన్తరం- తత్- వినేతుమ్ - అభవత్ - ప్రభుః-ప్రభుః.

అర్థము: ప్రభుః=పాలకుడైన, సః=ఆ నలుడు, సుభ్రువః = చక్కని కనుబొమ్మలు గల ప్రియురాలి యొక్క, బహిః = వెలుపల, హృదయాపవారకం, హృదయ=వక్షః స్థలమును, అపవారకం=కప్పునట్టి వలువను, ప్రసహ్య=బలాత్కారముగా, హర్తుం=తొలగించుటకు, అక్షమత=శక్తుడాయెను, తు=కాని, తదీయం=ఆ దమయంతికి సంబంధించిన, ఆంతరం=లోపలనున్న, హ్రీమయం=లజ్జయొక్క రూపమున నున్న, తత్=ఆ కప్పువలువను, వినేతుం=తొలగించుటకు, ప్రభుః= సమర్థుడు, నాభవత్=కాలేదు.

సమాసములు :

హృదయాపవారకం-హృదయస్య అపవారకం = హృదయాపవారకం, తత్ = హృదయాపవారకమ్.

**తదీయం**-తస్యాః ఇదం=తదీయం, తత్=తదీయం.

**ఆన్తరం**-అన్తః భవం=ఆన్తరం, తత్=ఆన్తరం.

భావము :

ప్రభువైన నలుడు బలాత్కారముగా సుందరి యగు ప్రియురాలి చను దోయి కప్పును దొలగింప కల్గెనే కాని, ఆమె లోపలనున్న సిగ్గనెడి కప్పును తొలగింపలేకపోయెను. ఏల యనగా, అది స్వాభావికమైనందువలన తొలగింప సాధ్యము కాకపోయినదని యర్థము. ॥68॥

శ్లో. సా స్మరేణ బలినాఽ ప్యహాపితా
ప్రీక్షమే భృశ మశోభతాఽబలా,
భాతి చాఽపి వసనం వినా న తు
వ్రీడధైర్య పరివర్జనే జనః. 69

ప. వి. సా-స్మరేణ-బలినా-అపి-అహాపితా-ప్రీక్షమే-భృశమ్-అశోభత-అబలా భాతి-చ-అపి-వసనం-వినా-న-తం-వ్రీడధైర్యపరివర్జనే-జనః.

అర్థము :- బలినాఽపి=బలవంతుడైనను, స్మరేణ=మన్మథునిచేతి, ప్రీక్షమే, ప్రీ=లజ్జ, క్షమే=ధైర్యము అను ఈరెంటిని, అహాపితా=విడిపింపబడని, అబలా=దుర్బలురాలగు, సా=ఆ దమయంతి, భృశం=మిక్కిలి, అశోభత=శోభించినది, తథాహి=అది యుక్తమే, జనః=లోకము, వసనం వినా=వస్త్రము లేకయు, భాతి=శోభించుచున్నది, తు=కాని, వ్రీడధైర్య పరివర్జనే; వ్రీడ=సిగ్గును, ధైర్య=ధైర్యమును, పరివర్జనే సతి=పరిత్యాగము చేసినప్పుడు, న చ భాతి=శోభింపదు.

సమాసములు :

**అహాపితా**-న హాపితా=అహాపితా.

ప్రీడధైర్యపరివర్జనే - ప్రీడశ్చ ధైర్యంచ = ప్రీడధైర్యే, ప్రీడ ధైర్యయోః పరివర్జనం = పీడధైర్య పరివర్జనం, తస్మిన్ = ప్రీడధైర్య పరివర్జనే.

భావము :

బలవంతుడగు మన్మథుడు కూడ ఆ దమయంతియొక్క లజ్జను, ధైర్యమును వదలింపలేక పోయెను. అట్టి లజ్జతోడను, ధైర్యముతోడను కూడిన ఆ దమయంతి మిక్కిలి శోభించినది. అది యుక్తమే. జనము వస్త్రములేక పోయినను శోభించును. కాని లజ్జయు, ధైర్యము లేనిచో శోభింపజాలదు. ॥69॥

శ్లో. అత్థ నేతి రతయాచితం న య
న్మామతోఽనుమతవత్యసి స్ఫుటమ్,
ఇత్యముం తదభిలాపనోత్సుకం
ధూనితేన శిరసా నిరాస సా. 70

ప. వి. అత్థ-న-ఇతి-రతయాచితం-న-యత్-మామ్-అతః-అనుమతవతీ-అసి-స్ఫుటమ్-ఇతి-అముం-తదభిలాపనోత్సుకం-ధూనితేన-శిరసా-నిరాస-సా.

అర్థము :- హే ప్రియే! = ఓ ప్రియురాలా, మాం = నన్ను, రతయాచితం; రత = సురతమనెడి, యాచితం = భిక్షను, న ఇతి = ఈయనని, న అత్థ = చెప్పవు. అనగా నేను సంభోగమును యాచించినచో ఈయనని చెప్పవు. అతః = ఇందువలన, స్ఫుటం = స్పష్టముగా, అనుమతవతీ అసి = స్వీకరించిన దానవుగా నగుచున్నావు. ఏల యనగా, "అప్రతిషిద్ధం పరమత మనుమతం భవతి" అను న్యాయము ననుసరించి ప్రతిషిద్ధము కానిది అంగీకృతమే యగునని యర్థము. ఇతి = ఇట్లు, తదభిలాపనోత్సుకం, తత్ = ఆ దమయంతిని, అభిలాపన = మాట్లాడించుటయందు, ఉత్సుకం = కుతూహలము కల్గిన, అముం = ఈ ప్రియుని, సా = ఆ దమయంతి, ధూనితేన = కంపముతో కూడిన, శిరసా = తలచే, అనగా నిషేధమును సూచించు శిరఃకంపముచే, నిరాస = తిరస్కరించినది.

సమాసములు :

*రతయాచితం*-రతమేవ యాచితం=రతయాచితం, తత్=రతయా
చితం.

*తదభిలాపనోత్సుకం* - తస్యాః అభిలాపనం= తదభిలాపనం, తదభి
లాపనే ఉత్సుకః=తదభిలాపనోత్సుకః, తం=తదభిలాపనోత్సుకం.

భావము :

ఓ ప్రియురాలా! నీవు నాకు సంభోగభిక్షను కాదని చెప్పవు. కాన దానిని నీవు అంగీకరించినట్లే భావింతును. "ప్రతిషేధింపబడనిది అంగీకరించినట్లే భావింపవలసి యున్నది". ఇట్లు ఆ దమయింతిని మాట్లాడింప సమకట్టిన ప్రియుడగు నలుని, ఆ దమయంతి ప్రతిషేధసూచకమగు తలయూపుచే నిరాకరించినది. ఆశ్చర్యము! మిక్కిలి ప్రియమైన విషయమందును స్త్రీలకు నిరాకరణ స్వభావము అనగా నింకను నామెయందు లజ్జాశీలము తగ్గలేదని యాశయము.॥70॥

శ్లో. యా శిరోవిధుతి రాహ నేతి తే
సా మయా న కిమియం సమాకలి,
తన్నిషేధసమసఙ్ఖ్యతా విధిః
వ్యక్తమేవ తవ వక్తి వాంఛితమ్. 71

ప. వి. యా-శిరోవిధుతిః-ఆహ-న-ఇతి-తే-సా-మయా-కిమ్-ఇయం- సమాకలి-
తన్నిషేధసమసఙ్ఖ్యతావిధిః-వ్యక్తమ్-ఏవ-తవ-వక్తి-వాఞ్ఛితమ్.

అర్థము: హే ప్రియే!=ఓ ప్రియురాలా!, యా=ఏ, శిరోవిధుతిః=నిషేధ
సూచకపు తలయూపు, న ఇతి=ఈయనని, ఆహ = నిషేధమును
చెప్పుచున్నది, సా=అట్టి, ఇయం=ఈ శిరఃకంపము అనగా తలయూపు,
మయా=నాచేత, న సమాకలి కిం? = చక్కగా నాలకింపబడలేదా!
ఏమి? చక్కగానే యాలకింపబడినది, ఏల నీచేత గ్రహించబడినదని
ప్రశ్నించినచో చెప్పబడుచున్నది, తన్నిషేధసమసఙ్ఖ్యతావిధిః; తత్=
ఆ తలయూపుల రెంటియొక్క రూపమైన, నిషేధ=ప్రతిషేధమును,

సమసఙ్ఖ్యతావిధిః=సమసంఖ్యతో ప్రతిషేధమును చెప్పునట్టి నఞ్లనకును రెండుమాఱులుగా ప్రతిపాదించుట యను విధియే, తవ=నీయొక్క, వాఞ్ఛితం=కోరికను, అనగా "ద్వౌ నఞౌ ప్రకృతమర్థం గమయతః" అను న్యాయము ననుసరించి సంభోగాంగీకారమగు నీయొక్క కోరికను, వక్తి=చెప్పుచున్నది. నీవు నిషేధించుటకై రెండుమాఱులు తలనూపుట వలన అది నీ సమ్మతినే సూచించునదైనది. నఞ్లు రెండు ప్రకృతార్థము నెట్లు సూచించునో అట్లే రెండుమాఱులు గావించిన తలయూపులు కూడ నిషేధనిషేధములై సమ్మతినే సూచించునని యర్థము.

సమాసములు :

*శిరోవిధుతిం* — శిరసః విధుతిః=శిరోవిధుతిః, తాం=శిరోవిధుతిం.

*తన్నిషేధసమసంఖ్యాతావిధిః* — తస్య నిషేధః=తన్నిషేధః, తన్నిషేధస్య సమా సంఖ్యా యస్యాః సా=తన్నిషేధసమసంఖ్యా, సంఖ్యాయాః భావః=సంఖ్యతా, సంఖ్యతాయాః విధిః=తన్నిషేధసమసంఖ్యతావిధిః, తస్మాత్=తన్నిషేధసమసంఖ్యతావిధేః.

భావము :

నీవు నిషేధసూచకముగా రెండుమాఱులు తలయూపితివి. అనగా కాదు కాదు అను నర్థమున రెండుమాఱులు తల యూపితివి. కాని అట్లు రెండుమాఱులు తల యూపుటలోని యర్థము నాకు తెలియలేదా యేమి? తప్పక తెలిసినది. రెండుమాఱులు కాదు కాదు అను నర్థమున గావించిన తలయూపులు అంగీకారమునే ధ్రువపరచును. "ద్వౌ నఞౌ ప్రకృత మర్థం గమయతః" అను న్యాయము ననుసరించి నీవు సురతమునకై దృఢముగ నంగీకరించినట్లుగ భావింతును. ॥71॥

శ్లో. నాత్థ నాత్థ శృణవాని తేన కిం
తేన వాచమితి తాం నిగద్య సః,
సా స్మ దూత్యగత మాహ తం యథా
తజ్జగాద మృదుభి స్తదుక్తిభిః. 72

ప. వి. న-ఆత్థ-న-ఆత్థ-శృణవాని-తేన-కిం-తే-న-వాచమ్-ఇతి-తాం-నిగద్య-సః-సా-స్మ-దూత్యగతమ్-ఆహ-తం-యథా-తత్ - జగాద-మృదుభిః-తదుక్తిభిః.

అర్థము : హే ప్రియే!=ఓ ప్రియురాలా!, న ఆత్థ=నాతోడ నీవు సంభాషింపవు, న ఆత్థ = చెప్పవు, తేన = అట్లు సంభాషింపక పోవుటచే, తే = నీయొక్క, వాచం = మాటను, న శృణవాని కిం?= విననా ఏమి?, కాని వినెదను, సః= ఆ నలుడు, తాం= ఆ ప్రియురాలిని, ఇతి= ఇట్లు, నిగద్య=చెప్పి, సా= ఆ దమయంతి, దూత్యగతం, దూత్య= దూత్యముతో, గతం=దమయంతివద్దకు పోయిన, తం= ఆ నలుని, యథా= ఎట్లు. (నవమసర్గయందు) ఆహ స్మ=చెప్పినదో, తత్= దానినంతను, మృదుభిః=సుకుమారము లగు మఱియు వినయపూర్వకములగు, తదుక్తిభిః= ఆ దమయంతియొక్క మాటలతో, జగాద= చెప్పెను. దూత్యకాలమున నాతోడ మాటలాడి, యిప్పుడు మాటలాడక పోవుటయందు ఫలము లేదు. కాన నాతో తప్పక సంభాషింపగలవు.

సమాసములు :

*దూత్యగతం* - దూతస్య కర్మ=దూత్యం, దూత్యేన గతః=దూత్యగతః, తం=దూత్యగతం.
*తదుక్తిభిః* - తస్యాః ఉక్తయః=తదుక్తయః, తైః=తదుక్తిభిః.

భావము :

ఓ ప్రియురాలా! నీవు నాతో సంభాషింపవు. నాకు విషయములను చెప్పవు. నీవట్లు మాటలాడకయుండినను నీ మాటలను నేను వినక యుండను. తప్పక వినగలను. ఇట్లు నలుడు తన ప్రియురాలినిగూర్చి చెప్పి నవమసర్గయందు దూతగా నలుడు పోయినప్పుడు, ఆదమయంతి వినయయుక్తములుగను, మార్దవయుక్తములుగను చెప్పినమాటలను చెప్పెను. ॥72॥

శ్లో. నీవిసీమ్ని నిబిడం పురాఽరుణత్
పాణినాఽథ శిథిలేన తత్కరమ్,
సా క్రమేణ న న నేతి వాదినీ
విఘ్న మాచర దముష్య కేవలమ్. 73

ప. వి. నీవిసీమ్ని-నిబిడం-పురా-అరుణాత్-పాణినా-అథ-శిథిలేన - తత్కరం-సా-క్రమేణ-న-న-న-ఇతి-వాదినీ-విఘ్నమ్-ఆచరత్-అముష్య-కేవలమ్.

అర్థము : సా=ఆ దమయంతి, నీవిసీమ్ని, నీవి=కోకముడియొక్క, సీమ్ని= సమీపప్రదేశమునందు, తత్కరం=ఆ ప్రియునియొక్క హస్తమును, పురా = మొదట, పాణినా = తన హస్తముతో, నిబిడం = గట్టిగా, అరుణత్ = వారించెను. అథ = కొన్నిదినములపిదప, శిథిలేన= వదులైన, పాణినా=హస్తముతో, అరుణత్=అడ్డగించెను, క్రమేణ= క్రమముగా, అనగా భయము తగ్గినపిదప, న న న ఇతి = వలదు, వలదు, వలదని, చెప్పుచు, కేవలం=కేవలము మాటలచే నిషేధించుచు, అముష్య = ఈ ప్రియుని హస్తముయొక్క కార్యమునకు, విఘ్నం= చీరముడిని విప్పుటకు ప్రతిబంధమును, ఆచరత్=చేసినది.

వి. ఇచ్చట నొక కోకముడియొద్ద క్రమముగా ననేక వ్యాపారముల సంబంధ మును చెప్పుటచే పర్యాయాలఙ్కారము.

సమానములు :

నీవిసీమ్ని - నీవేః సీమా=నీవిసీమా, తస్మిన్=నీవిసీమ్ని.
తత్కరం - తస్య కరః=తత్కరః, తం=తత్కరం.

భావము :

ఆ దమయంతి కోకముడియొద్ద దానిని విప్పుటకై దూర్చిన ప్రియుని హస్తమును గట్టిగా వారించినది. కొన్ని దినములు గడచిన పిదప నా హస్తమును

వదులైన హస్తముతో వారించినది. క్రమముగా నామెకు సిగ్గు, భయము తొలగగా, కేవలము వలదు, వలదు, వలదను మాటలతో నిషేధించుచు క్రమముగా లజ్జ తొలగిపోవగనే మాటలతోనే యతని హస్తము చేసెడి కార్యమునకు విఘ్నము కల్గించుచుండినది. ॥73॥

శ్లో. రూపవేషవసనాఙ్గవాసనా
భూషణాదిషు పృథగ్విదగ్ధతాం,
సాఽన్యదివ్యయువతిభ్రమక్షమా
నిత్య మేత్య తమగా న్నవా నవా. 74

ప. వి. రూపవేషవసనాఙ్గవాసనాభూషణాదిషు-పృథక్-విదగ్ధతాం-సా-అన్యదివ్య యువతిభ్రమక్షమా-నిత్యమ్-ఏత్య-తమ్-అగాత్-నవా-నవా.

అర్థము:- రూపవేషవసనాఙ్గవాసనాభూషణాదిషు; రూపవేష=వేషము, అనగా పలురకములగు భూషణాదులచే నలంకరించుకొనుట, వసన = వలువ, అఙ్గవాసనా=ధూపాదులచే శరీరమునకు పరిమళము కల్పించుట, భూషణాదిషు = చేతికడియములు మున్నగువానితో కూడిన పలురకములగు నలంకరణవిషయములయందు, నిత్యం=ప్రతిదినము, పృథగ్విదగ్ధతాం; పృథక్=ప్రత్యేకమైన, విదగ్ధతాం=నేర్పును, ఏత్య=పొంది, యనగా ప్రతిదినము క్రొత్త క్రొత్త వేషరచనలను గావించుకొనుచు నని యర్థము. (కావుననే), నవా నవా=క్రొంగ్రొత్తదై విరాజిల్లు, సా=ఆ దమయంతి, అన్యదివ్యయువతిభ్రమక్షమా; అన్య = మఱియొకతెయగు, దివ్య = స్వర్గమునకు సంబంధించిన, యువతి=తరుణియైన, ఊర్వశిమున్నగు దానియొక్క, భ్రమ=భ్రాంతిని కల్గించుటయందు, క్షమా=శక్తికలదై, తం=ఆ నలుని, అగాత్=పొందినది.

సమాసములు :

రూపవేషవసనాఙ్గవాసనాభూషణాదిషు - రూపం చ, వేశశ్చ, వసనం చ, అఙ్గవాసనా చ, భూషణం చ=రూపవేషవసనాఙ్గవాసనాభూషణాని, రూపవేషవసనాఙ్గవాసనాభూషణాని ఆదిః యేషు తే=రూపవేషవసనాఙ్గ భూషణాదయః, తేషు=రూపవేషవసనాఙ్గవాసనాభూషణాదిషు.

పృథగ్విదగ్ధతాం - విదగ్ధాయాః భావః=విదగ్ధతా, పృథక్ విదగ్ధతా= పృథగ్విదగ్ధతా, తాం=పృథగ్విదగ్ధతాం.

అన్యదివ్యయువతిభ్రమక్షమా - దివ్యా చ సా యువతిశ్చ = దివ్య యువతిః, అన్యా చ సా దివ్యయువతిశ్చ=అన్యదివ్యయువతిః, యువతేః భ్రమః = యువతిభ్రమః, అన్యదివ్యయువతిభ్రమే క్షమా=అన్యదివ్య యువతిభ్రమక్షమా.

భావము :

సౌందర్యమునందును, వివిధములగు వేషములను కల్పించుకొనుట యందును, వలువల విషయమునందును, శరీరమునకు పరిమళద్రవ్యముల నలదు కొను విషయమునందును, కంకణాది భూషణ ధారణముల యందును ప్రత్యేక మైన నేర్పును పొంది ప్రతిదినము క్రొంగ్రొత్తదై విలసిల్లు నాదమయంతి ఊర్వశి వంటి మరియొక దేవతాస్త్రీయో యను భ్రాంతిని కల్పించుచునానలుని బొందు చుండినది. ॥74॥

శ్లో. ఇఙ్గితేన నిజరాగసాగరం
సంవిభావ్య చటుభి ర్గుణజ్ఞతామ్
భక్తతాం చ పరిచర్యయాఽనిశం
సాధికాధికవశం వ్యధత్త తమ్ 75

ప. వి. ఇఙ్గితేన-నిజరాగసాగరం-సంవిభావ్య-చటుభిః-గుణజ్ఞతాం-భక్తతాం-చ-పరిచర్యయా-అనిశం-సా-అధికాధికవశం-వ్యధత్త-తమ్.

అర్థము: సా=ఆ దమయంతి, అనిశం = ఎల్లప్పుడు, ఇఙ్గితేన = కడకంటి చూపులు మున్నగు చేష్టలచే, నిజరాగసాగరం, నిజ = తనదైన, రాగ సాగరం = అనురాగ మనెడి కడలిని, అనగా కడలివలె ఎల్లలేని యను రాగాతిశయమును, చటుభిః=ప్రియములైన వచనములచే, గుణజ్ఞతాం= నలునియొక్క గుణగ్రహణ స్వభావమును, తథా=అట్లే, పరిచర్యయా= సేవచే, భక్తతాం చ=భక్తి కల్గియుండుటను, సంవిభావ్య=చక్కగా నలునకు తెలియునట్లు చేసి, తం = ఆ ప్రియుని, అధికాధికవశం = ఉత్తరోత్తరము మిక్కిలి యధీనునిగా, వ్యధత్త=చేసినది.

సమాసములు :

*నిజరాగసాగరం* - నిజ శ్చాసౌ రాగశ్చ = నిజరాగః, నిజరాగ ఏవ సాగరః=నిజరాగసాగరః, తం=నిజరాగసాగరం.

*గుణజ్ఞతాం*- గుణం జానాతీతి=గుణజ్ఞః, గుణజ్ఞస్య భావః=గుణజ్ఞతా, తాం=గుణజ్ఞతాం.

*అధికాధికవశం*-అధికాత్ అధికః = అధికాధికః, అధికాధికం వశః = అధికాధికవశః, తం=అధికాధికవశం.

భావము :

ఆ దమయంతి నిరంతరము తన కడగంటిచూపులు మున్నగువానిచే తనకు నలునిపైనున్న యనురాగాతిశయమును, ప్రియవచనములచే నాతని గుణజ్ఞతను, సేవచే తన కాతనియందలి భక్తిభావమును నాతనిచే గ్రహింపచేసి యాతనిని పోను పోను క్రమముగా మిక్కిలి వశుని చేసుకొనినది. ॥75॥

శ్లో. స్వాఽఙ్గ మర్పయితు మేత్య వామతాం
రోషితం ప్రియ మథానునీయ సా,
ఆతదీయ హఠ సమ్బుభుక్షితం
నాఽన్వమన్యత పున స్తమర్థినమ్. 76

ప. వి. స్వాఙ్గమ్-అర్పయితుమ్-ఏత్య-వామతాం-రోషితం-ప్రియమ్-అథ-అనునీయ-సా-ఆతదీయహఠసంబుభుక్షితం-న-అన్వమన్యత-పునః - తమ్-అర్థినమ్.

అర్థము: సా=ఆ దమయంతి, స్వాఽఙ్గం=తనదైన వరాఙ్గము మున్నగువానిని, అర్పయితుం=నలుడు గావించెడి స్పర్శ మున్నగువానికై ఇచ్చుటకు, వామతాం = ప్రాతికూల్యమును, ఏత్య = పొంది, అథ = పిదప, రోషితం=కోరికను తీర్పనందువలన కోపించిన, ప్రియం=ప్రియుడైన నలుని, అనునీయ=పాదములు పట్టుకొనుట మున్నగువానితో నూరడించి,

పునః = మఱల, అర్థినం = వరాఙ్గాదుల నీయమని కోరుచున్న, తం = ఆ నలుని, ఆతదీయహఠసంబుభుక్షుతం; తదీయ = ప్రియునకు సంబంధించిన, హఠ = బలాత్కారముతో, (ఆ) సంబుభుక్షుతం = సంభోగించునంతవరకును, నాఽన్వమన్యత = అంగీకరింపలేదు.

సమాసములు :

**ఆతదీయహఠసమ్బుభుక్షతం** – తస్య ఇయం = తదీయా, సంభోక్తుః ఇచ్ఛతా = సంబుభుక్షుతా, హఠాత్ సంబుభుక్షుతా = హఠసంబుభుక్షుతా, తదీయా చ సా హఠసంబుభుక్షుతా చ = తదీయహఠసంబుభుక్షుతా, తదీయహఠసంబుభుక్షుతాం అభివ్యాప్య = ఆ తదీయహఠసంబుభుక్షుతం.

భావము :

ఆ దమయంతి తన వరాంగము మున్నగు నవయవములను నలున కొసంగుటకు ప్రాతికూల్యమును వహించి, పిదప నందువలని రోషము చెందిన నలుని, పాదములను బట్టుకొనుట మున్నగువానిచే ప్రసన్నుని గావించెను. పిదప నతడు ఆ వరాంగము మున్నగు వాని నిమ్మని కోరగా నతడు బలాత్కారముగా లాగి సంభోగించునంతవఱకును, వరాంగాదుల నొసంగుటకు నంగీకరించలేదు. ॥76॥

శ్లో. ఆద్యసంగమ సమాదరా ణ్యధాత్
 వల్లభాయ దధతీ కథఞ్చన,
 అఙ్గకాని ఘనమానవామతా
 వ్రీడలమ్బితదురాపతాని సా. 77

ప.వి. ఆద్యసంగమసమాదరాణి- అధాత్ - వల్లభాయ-దధతీ- కథం - చన- అఙ్గకాని–ఘనమానవామతావ్రీడలమ్బితదురాపతాని- సా.

అర్థము: సా = ఆ నలుని ప్రియురాలగు దమయంతి, ఘనమాన వామతావ్రీడలమ్బిత దురాపతాని, ఘన = ప్రగాఢములగు, మాన = ప్రణయకోపము వలని, వామతా = ప్రాతికూల్యమును, వ్రీడ = సిగ్గుఅనువానిచే, లంబిత =

పొందింపబడిన, దురాపతాని=దుర్లభత్వము కల్గిన, అఙ్గకాని=సుకుమారంలును, కావుననే దయతో ననుభవింపదగినట్టి యవయవములను, వల్లభాయ=ప్రియుడైన నలునికై, కథంచన=లజ్జ వలన మిక్కిలి ప్రయాసతో, దధతీ=ధరించుచు, (దదతీ=ఇచ్చుచు), ఆద్యసంగమ సమాదరాణి; ఆద్యసంగమ=మొదటి సంయోగకాలముతో, సమ=సమానమైన, ఆదరాణి=ఆదరము కల్గినవిగా, అధాత్=ధరించెను.

సమాసములు :

*ఆద్యసంగమ సమాదరాణి*- ఆద్యశ్చాసౌ సంగమశ్చ=ఆద్యసఙ్గమః, ఆద్యసంగమేన సమః=ఆద్య సంగమసమః, ఆద్యసంగమసమః ఆదరః యేషాం తాని=ఆద్యసంగమసమాదరాణి, తాని=ఆద్యసంగమ సమాదరాణి.

*అఙ్గకాని*-మృదూని అఙ్గాని=అంగకాని, తాని=అఙ్గకాని.

*ఘనమానవామతా ప్రీడ లంభిత దురాపతాని*- ఘనశ్చాసౌ మానశ్చ=ఘనమానః, వామాయాః భావః=వామతా, ఘనమానశ్చ, వామతా చ, ప్రీడశ్చ = ఘనమానవామతాప్రీడాః, ఘనమానవామతాప్రీడైః లమ్భితా=ఘనమానవామతాప్రీడలమ్భితా, దుఃఖేన ఆప్తుం శక్యాని=దురాపాణి, దురాపాణాం భావః=దురాపతా, ఘనమానవామతా ప్రీడ లమ్భిత దురాపతా యేషాం తాని=ఘనమానవామతాప్రీడ లమ్భిత దురాపతాని, తాని=ఘనమాన వామతాప్రీడ లమ్భిత దురాపతాని.

భావము :

ఆ దమయంతి ప్రగాఢమైన ప్రణయకోపముచేతను, ప్రాతికూల్యముచేతను, లజ్జచేతను, దుర్లభత్వము పొందింపబడిన తన సుకుమారములగు అవయవములను ప్రియుడైన నలుని కొఱకు, లజ్జవలని మిక్కిలి ప్రయాసచే ధరించుచు, మొదటి సంభోగము జరిగిన కాలముతో సమానమైన యాదరమునకు పాత్రములైన యాయవయవములను ప్రియున కర్పించినది. అనగా నాయవయవములు ప్రథమ సంభోగమునా డెట్లు నవనవత్వాదిగుణములతో కూడియుండినవో యట్లే యిప్పుడు నుండినవని యాశయము.

శ్లో. పత్యు రాగిరిశ మాతరు క్రమాత్
స్వస్య చాగిరిజ మాలతం వపుః,
తస్య చాఽర్హ మఖిలం పతివ్రతా
క్రీడతి స్మ తపసా విధాయ సా. 78

ప.వి. పత్యుః-ఆగిరిశమ్-ఆతరు-క్రమాత్-స్వస్య-చ-ఆగిరిజమ్-ఆలతం-వపుః-తస్య-చ - అర్హమ్-అఖిలం-పతివ్రతా-క్రీడతి-స్మ-తపసా-విధాయ-సా.

అర్థము :-పతివ్రతా=పతివ్రతయగు, సా=ఆ దమయంతి, తపసా=పతిసేవ యనెడి తపఃప్రభావముచే, క్రమాత్=క్రమముగా, ఔచిత్యము ననుసరించి, పత్యుః=భర్తయగు నలునకు, ఆగిరిశం= శివు నారంభించి, ఆతరు=వృక్షము వఱకు, స్వస్య చ= తనకును, ఆగిరిజం=పార్వతి నారంభించి, ఆలతం = తీగవరకును, వపుః = దేవగంధర్వోరగ మృగ విహగాది శరీరమును, తథా=అట్లే, తస్య=ఆ శరీరమునకు, అర్హం=తగిన, అఖిలం చ=సమస్తమైన క్రీడాసాధనమును, విధాయ= చేసి, క్రీడతి స్మ=ఆడుచుండెను. భర్త శంకరుని రూపమైనచో, తాను పార్వతిరూపమును, భర్త వృక్షరూపమైనచో, తాను తీగ రూపమును కల్పించుకొని యాడెను.

సమాసములు :

ఆగిరిశం - గిరిశ మారభ్య=ఆగిరిశం.
ఆతరు - తరు మభివ్యాప్య=ఆతరు.
ఆగిరిజం - గిరిజ మభివ్యాప్య=ఆగిరిజం.
ఆలతం - లతా మభివ్యాప్య=ఆలతం.
పతివ్రతా - పత్యౌ వ్రతం యస్యా స్సా=పతివ్రతా.

భావము :

పతివ్రతయగు నా దమయంతి పతిసేవ యనెడి తపః ప్రభావము చేతను, దేవతలు తనకు కోరిన రూపమును ధరించుటకై యిచ్చిన వరముయొక్క ప్రభావము

చేతను, నౌచిత్యము ననుసరించి నలునకు శివుని శరీరమును కల్పించినప్పుడు; తనకు పార్వతీ శరీరమును, నలునకు వృక్ష శరీరము కల్పించినప్పుడు, తనకు లతా శరీరమును, నట్లే యా నలునకు దేవగంధర్వాది శరీరములను కల్పించి నప్పుడు తనకు దాని కనుగుణములగు శరీరములను వానికి తగిన వేషములను కల్పించుకొనుచు కోరినవిధముగా క్రీడించుచుండినది. పాతివ్రత్యాదుల మహిమ నెవ రడ్డగలరు?

శ్లో. న స్థలీ న జలధి ర్న కాననం
నాఽద్రిభూ ర్న విషయో న విష్టపమ్
క్రీడితా న సహ యత్ర తేన సా
సా విధైవ న యథా యథా న వా. 79

ప. వి. న-స్థలీ-న-జలధిః-న-కాననం-న-అద్రిభూః-న-విషయః-న-విష్టపం-క్రీడితా-న-సహ-యత్ర-తేన-సా-సా-విధా-ఏవ-న-యథా-యథా-న-వా.

అర్థము :- సా=ఆ దమయంతి, తేన సహ=ఆ నలునితో, యత్ర=ఏ ప్రదేశమందు, న క్రీడితా=క్రీడించలేదో, సా=అటువంటి, స్థలీ=ఆ కృత్రిమమగు భూమి, న=లేదు, సః=అది, జలధిః=నదికాని, సముద్రము కాని, చెఱువు మున్నగు జలాధారము కాని, న=కాదు, తత్=అది, కాననం=అరణ్యము, న=కాదు, సా=అది, అద్రిభూః=పర్వత భూమి, న=కాదు, సః=అది, విషయః=దేశము, న=కాదు, (కించ=మఱియు) సా=అటువంటి, విధైవ=విధమే, న=లేదు, యథా యథా=ఏయేవిధముగా, నున్న ధేనుకాదులగు కామశాస్త్ర బంధములతో (సా=ఆమె) న క్రీడితా = క్రీడింపలేదో, అనగా నతనితో నంతట నామె విహరించెనని యర్థము.

సమాసములు :

అద్రిభూః - అద్రేః భూః=అద్రిభూః.

భావము :

ఆ దమయంతి నలునితో క్రీడించని ప్రదేశమే లేదు. ఆమె నలునితో క్రీడించని నది లేదు. సముద్రము లేదు. చెఱువు లేదు. అట్లే యామె క్రీడించని యడవియు లేదు. ఆమె క్రీడించని పర్వతభూమియు లేదు. ఆమె క్రీడించని దేశము లేదు, ఆమె క్రీడించని ప్రపంచము లేదు. ఎట్టి విధమైన కామశాస్త్ర ప్రసిద్ధమైన దేనుకాది బంధములతో నామె నలునితో క్రీడింపలేదో అట్టి విధమే లేదు. అనగా నామె యంతటను నలునితో క్రీడించెనని ఆశయము. ॥79॥

శ్లో. నమ్రయాంశుకవికర్షిణి ప్రియే!
వక్త్రవాతహతదీప్రదీపయా,
భర్తృమౌలిమణిదీపితా స్తయా
విస్మయేన కకుభో నిభాలితాః. 80

ప. వి. నమ్రయా-అంశుకవికర్షిణి-ప్రియే-వక్త్రవాతహతదీప్రదీపయా - భర్తృ మౌలిమణిదీపితాః-తయా-విస్మయేన-కకుభః-నిభాలితాః.

అర్థము : ప్రియే = నలుడు, అంశుకవికర్షిణి సతి = కట్టబడిన చీరను లాగగనే; నమ్రయా = లజ్జచే వరాంగమును కనబడకుండ చేయుటకై వంగినట్టి, వక్త్రవాతహతదీప్రదీపయా, వక్త్ర = ముఖముయొక్క, వాత = గాలిచే, హత = చల్లార్చబడిన, దీప్ర = ప్రకాశించెడి, దీపయా = దీపముకల్గిన, తయా = ఆ దమయంతిచే, భర్తృమౌలిమణిదీపితాః, భర్తృ = భర్తయైన నలునియొక్క. మౌలి = కిరీటమందలి, మణి = మణికాంతులతో, దీపితాః = ప్రకాశితములైన, కకుభః = దిక్కులు, విస్మయేన = ఆశ్చర్యముతో, నిభాలితాః = చూడబడినవి.

సమాసములు :

*అంశుకవికర్షిణి* .- అంశుకం వికర్షతీతి = అంశుకవికర్షీ, తస్మిన్ = అంశుకవికర్షిణి.

వక్త్రవాతహతదీప్రదీపయా - వక్త్రస్య వాతః = వక్త్రవాతః, వక్త్ర వాతేన హతః = వక్త్రవాతహతః, వక్త్రవాతహతః దీపః యయా సా = వక్త్రవాతహతదీపా, తయా = వక్త్రవాతహతదీపయా.

భర్తృమౌళిమణిదీపితాః - భర్తుః మౌళిః = భర్తృమౌళిః, భర్తృ మౌళౌ మణయః = భర్తృమౌళిమణయః, భర్తృమౌళిమణిభిః దీపితాః = భర్తృమౌళిమణిదీపితాః.

భావము :

ప్రియుడైన నలుడు దమయంతి ధరించిన వలువను లాగగనే యామె లజ్జతో తన వరాంగమును దాచుటకై తన పూర్వశరీరమును వంచి నోటితో దీపము నార్పినది. అప్పుడు నలుని కిరీటమందలి రత్నకాంతులు పఱువగనే వెలుతురు యథాప్రకారముగా వ్యాపింపగనే యామె యాశ్చర్యముతో దిక్కులు చూచినది.

శ్లో. కాన్తమూర్ధ్ని దధతీ పిధత్సయా
తన్మణేః శ్రవణపూర మున్పలమ్,
రన్తు మర్చన మివాఽఽచరత్ పురః
సాస్య వల్లభతనో ర్మనోభువః. 81

ప. వి. కాన్తమూర్ధ్ని-దధతీ-పిధత్సయా- తన్మణేః- శ్రవణపూరమ్- ఉత్పలం- రన్తుమ్-అర్చనమ్ - ఇవ- ఆచరత్- పురః- సా- అస్య- వల్లభతనోః- మనోభువః.

అర్థము : సా = ఆ దమయంతి, తన్మణేః, తత్ = ఆ భర్తయొక్క, మణేః = తలయందున్న రత్నమును, పిధత్సయా = కప్పిపుచ్చవలెనను కోరికచే, కాంతమూర్ధ్ని, కాంత = ప్రియుడైన నలునియొక్క, మూర్ధ్ని = తల యందు, శ్రవణపూరం, శ్రవణ = తన చెవికి, పూరం = భూషణమైన, ఉత్పలం = నల్లకలువను, దధతీ = ఉంచుచున్నదై, రంతుం = సురత కేళిని జరుపుటకు, పురః = తొలుత ననగా ప్రారంభమున, స్వవల్లభతనోః,

స్వవల్లభ = తన ప్రియుడైన నలునియొక్క, తనోః = శరీరముకల్గిన, మనోభువః = మన్మథునకు, అర్చనం = పూజను, ఆచరదివ = ఆచరించెనో యనునట్లుండెను.

సమాసములు :

కాన్తమూర్ధ్ని - కాన్తస్య మూర్ధా = కాన్తమూర్ధా, తస్మిన్ = కాన్తమూర్ధ్ని.

తన్మణేః - స చాసౌ మణిశ్చ = తన్మణిః, తస్య = తన్మణేః.

పిధిత్సయా - పిధాతుం ఇచ్ఛా = పిధిత్సా, తయా = పిధిత్సయా.

స్వవల్లభతనోః - స్వస్యాః వల్లభః = స్వవల్లభః, స్వవల్లభ ఏవ తనుః యస్య సః = స్వవల్లభతనుః, తస్య = స్వవల్లభతనోః.

భావము :

ఆ దమయంతి తన భర్తయొక్క తలపై నున్న రత్నమును కప్పివుచ్చుటకు కోరుచు, తన కర్ణమునకు భూషణమైన నల్లకలువను ప్రియుని శిరమునందుంచుచున్నదై సురతప్రారంభమున, తన ప్రియునే శరీరముగా కల్గిన మన్మథునకు పూజ చేసినదో యనున ట్లుండినది. ॥81॥

శ్లో. తం పిధాయ ముదితాఽథ పార్శ్వయోః
వీక్ష్య దీప ముభయత్ర సా స్వయోః,
చిత్త మాప కుతుకాద్భుతత్రపా
తఙ్కసఙ్కట నివేశితస్మరమ్. 82

ప.వి. తం-పిధాయ-ముదితా-అథ-పార్శ్వయోః - వీక్ష్య-దీపం-ఉభయత్ర-సా-స్వయోః-చిత్తమ్-ఆప-కుతుకాద్భుతత్రపాతఙ్కసఙ్కటనివేశితస్మరమ్.

అర్థము : సా = ఆ దమయంతి, తం = వెలుగు నొసంగెడి తలలోని రత్నమును, పిధాయ = తన చెవియందలి కలువపూవుచే కప్పి, ముదితా = చీకటి

ఏర్పడుటవలన సంతోషించిన దాయెను. అథ=పిదప, స్వయోః=తనవి యగు, ఉభయత్ర=రెండైన, పార్శ్వయోః=ప్రక్కలయందు, దీపం= వెలిగింపబడిన రెండు దీపములను, వీక్ష్య=చూచి, కుతుకాద్భుతత్ర పాతజ్కాసంకట నివేశితస్మరం, కుతుక = ఆకస్మికముగా దీపమును చూచుటవలన కౌతుకము, అద్భుత=ఆశ్చర్యము, అనగా వార్పి వేయబడి నను మఱల వెలిగినందువలన ఆశ్చర్యమును, త్రపా=సిగ్గు, అనగా భర్త తన వస్త్రము తొలగించుటవలన సిగ్గు, ఆతజ్క = ఏమి ఇది? ఎప్పుడు చూడని పనిగా నున్నదే! యను సందేహము అను వీనియొక్క సజ్కట=సంఘర్షణమునందు, నివేశిత=ఉంచబడిన, స్మరం=మన థుని కల్గిన, చిత్తం=మనస్సును, ప్రాప=పొందినది.

సమాసములు :

కుతుకాద్భుతత్రపాతజ్కసజ్కటనివేశితస్మరం- కుతుకం చ అద్భుతం చ త్రపా చ, ఆతజ్కశ్చ = కుతుకాద్భుతత్రపాతజ్కాః, కుతుకాద్భు తత్రపాతజ్కానాం సజ్కటం = కుతుకాద్భుతత్రపాతజ్కసజ్కటం, కుతుకాద్భుతత్రపాతజ్క సజ్కటే నివేశితః స్మరః యస్మిన్ తత్ = కుతుకాద్భుతత్రపాతజ్కసజ్కట నివేశితస్మరం.

భావము :

ఆ దమయంతి తన శరీరమును ప్రకాశపరచెడి యా నలుని శిరోరత్న మును తన కర్ణభూషణమగు కలువతో కప్పి, పిదప తన కిరుప్రక్కల వెలుగు చున్న దీపమును చూచి ఆకస్మికముగా దీపములు వెలుగుచున్నందులకు కౌతు కముతో ఆర్పినదైనను, వెలుగుచున్నందులకు ఆశ్చర్యముతోడను, ప్రియుడు వస్త్రమును విప్పినందులకు సిగ్గుతోడను, ఎప్పుడు ఎరుగని ఈ పని ఏమిటి? అను సందేహముతోడను కూడినదై, యాకౌతుకాది భావములయొక్క సంఘర్షణ యందు ఉంచబడిన కామముతో కూడిన మనస్సును వహించినది. అనగా అంత మిక్కుటముగా ఆమెకు కామము వర్ధిల్లినను, అది ఆ సమయమునందు కొలదిగా తగ్గినదని యాశయము. ॥82॥

శ్లో. ఏకకస్య శమనే పరం పున
ర్జాగ్రతం శమిత మప్యవేక్ష్య తమ్,
జాతవహ్నివరసంస్మృతిః శిరః
సా విధూయ నిమిమీల కేవలమ్. 83

ప.వి. ఏకకస్య-శమనే-పరం-పునః-జాగ్రతం-శమితమ్-అపి -అవేక్ష్య-తం -జాతవహ్నివరసంస్మృతిః-శిరః-సా-విధూయ-నిమిమీల-కేవలమ్.

అర్థము: ఏకకస్య = ఆ దీపములలో ఒక్క దీపమును, శమనే = ఆర్పగా, పరం = మఱియొక, తం = దీపమును, పునః = మఱల, జాగ్రతం = వెలుగుచున్న దానినిగా, అవేక్ష్య = చూచి, జాతవహ్నివర సంస్మృతిః, జాత = పుట్టిన (కల్గిన) వహ్నివర సంస్మృతిః = అగ్నిదేవు డొసగినట్లు వర దానమును స్మరించినదై. అనగా స్వయంవరకాలమందు అగ్నిదేవుడు (4-74) శ్లోకమునందు "యా దాహతా పౌపయికీ తను ర్మే" అను వచనముచే దాహతాపములకు సాధనమగు తన దేహము నలునకు స్వాధీనమై యుండునని ఇచ్చిన వరమును స్మరించినదై, శిరః = తన శిరస్సును, విధూయ = స్మరించుట నభినయించు విధమున కంపింపచేసి, కేవలం = కేవలము, నిమిమీల = కన్నులను మూసినది అని అర్థము.

సమాసములు :

జాతవహ్నివరసంస్మృతిః-వహ్నేః వరః = వహ్నివరః, వహ్నివరస్య స్సంస్మృతిః = వహ్నివరసంస్మృతిః, జాతా వహ్నివరసంస్మృతిః యస్యాస్సా = జాతవహ్నివరసంస్మృతిః

భావము :

ఆ దమయంతి ఒక దీపము నార్పగనే మఱియొక దీపము వెలుగ జొచ్చినది. ఇట్లు దీపము లార్పుచున్నను మఱల నలుని మాయతో అది వెలుగుచునే యుండెను. అప్పుడు దమయంతి స్వయంవరకాలమందు అగ్నిదేవుడు దాహ

తాపములకు సాధనమగు తన శరీరమును నలుని వశమం దుండునట్లు వర మొసంగిన విషయమును తల నాడించి జ్ఞప్తికి తెచ్చుకొనినదై యా యగ్నిదేవుని వర ప్రభావముచే నలుడు దీపముల నార్పనీయక వెలిగించుచున్నాడని గ్రహించి ఏమియు చేయునది లేక సిగ్గుతో కన్నులను మూసుకొనినది.

శ్లో. పశ్య ! భీరు ! న మయాఽపి దృశ్యసే
యన్నిమేషితవతీ దృశావపి,
ఇత్యనేన పరిదృశ్య సా తమః
సంవిధాయ సమభోజి లజ్జయా. 84

ప. వి. పశ్య-భీరు-న-మయా-అపి-దృశ్యసే-యత్-నిమేషితవతీ- దృశౌ-అపి-ఇతి-అనేన-పరిదృశ్య-సా-తమః-సంవిధాయ-సమభోజి-లజ్జయా.

అర్థము: హే భీరు !=ఓ భయస్వభావముగల ఉత్తమ స్త్రీజాతికి చెందిన దమయంతీ !, యత్=ఎందువలన, దృశౌ=నేత్రములను రెంటిని, నిమేషితవతీ=సిగ్గుచే మూసికొనినదానవుగా, అసి=అగుచున్నావో, తత్=అందువలన, మయా=నాచే, అపి న దృశ్యసే = చూడబడవా ఏమి ? నీవు కన్నులను మూసికొనినచో నేను నిన్ను చూడలేకపోయెదనా ! తప్పక చూడగలనని యర్థము. పశ్య=చూడుము, ఇతి=ఇట్లు, అనేన ఈ నలునిచే, పరిహాస్య=పరిహసించి, తమః=చీకటి, సంవిధాయ= కల్పింపబడి, లజ్జితా=సిగ్గుపడిన, సా=ఆ దమయంతి, సమభోజి= సంభోగింపబడినది.

సమాసములు :

లజ్జితా-లజ్జా అస్య సంజాతా ఇతి=లజ్జితా

భావము :

లజ్జయే భూషణముగాగల ఉత్తమ స్త్రీ జాతికి చెందిన ఓ దమయంతీ ! నేను చూచెదనని సిగ్గుతో కన్నులను రెంటిని మూసుకొంటివి. కాని నాకు నీవు

కనబడక పోయెదవా! తప్పక కనబడగలవు. లేదా, నీవు నీ శరీరమును కన బడకుండునట్లు చేయుటకు శరీరమును వస్త్రములతో కప్పుకొనుట యుచితమే. కాని నీవు కన్నులను మూసుకొనుటచే ప్రయోజనము లేదు. కాన కన్నులను తెఱచి చూడుము అని నలుడు పరిహాసము గావించి తన ఇచ్ఛచేతనే దీపము లార్పి చీకటిని కల్పించి సిగ్గుపడుచున్న దమయంతిని సంభోగించెను. ॥84॥

శ్లో. చుమ్బ్యసేఽయ మయ మజ్క్యసే నఖైః
శ్లిష్యసేఽయ మయ మర్ప్యసే హృది,
నో పునర్న కరవాణి తే గిరం
హుం త్యజ త్యజ తవాఽస్మి కింకరా. 85

ప. వి. చుమ్బ్యసే-అయమ్-అయమ్ - అజ్క్యసే - నఖైః-శ్లిష్యసే-అయమ్ - అయమ్-అర్ప్యసే-హృది-న-పునః-న-కరవాణి-తే-గిరం-హుం- త్యజ- త్యజ-తవ-అస్మి-కిజ్కరా.

అర్థము: హే ప్రియతమ!=మిక్కిలి ప్రియుడవైన ఓ మహారాజా, అయం= ఈనీవు, చుమ్బ్యసే=ముద్దిడబడుచున్నావు. అయం= ఈనీవు, నఖైః= గోరులచే, అజ్క్యసే=గిల్లుటవలన గుర్తింపబడుచున్నావు. అయం= ఈనీవు, శ్లిష్యసే=కౌగలింపబడుచున్నావు అయం=ఈనీవు, హృది= ఱొమ్మునందు, అర్ప్యసే=చేర్చుకొనబడుచున్నావు. తే=నీయొక్క, గిరం=మాటను అనగా ముద్దు పెట్టుకొనుట మున్నగు మాటను, పునః= మఱల, న కరవాణి=చేయనా ఏమి?, ఇతి=అనునది, నో న=లేదనుట లేదు. అనగా తప్పక చేయగలనని యర్థము. హుం=అట్లే, త్యజ త్యజ=వదలుము, వదలుము. తే=నీకు, కిజ్కరా=దాసినిగా, అస్మి=అగుచున్నాను. కాన నీ కోరికను అంతయు నేను తీర్చవలయు నని యర్థము.

భావము :

ఓ ప్రియతమా! నిన్ను ముద్దిడుకొనుచున్నాను. నిన్ను గోరులతో గిల్లు

చున్నాను. ముద్దులు మున్నగువానిని నీవు కోరినచో మరల నేను తప్పక చేయ గలను. నేను నీ దాసిని. కాన నీ యభిలషితములను తీర్చగలను. ॥85॥

శ్లో. ఇత్యలీకరతకాతరా ప్రియం
విప్రలభ్య సురతే హ్రియం చ సా,
చుమ్బనాది వితతార మాయినీ
కిం విదగ్ధమనసా మగోచరః. 86

ప. వి. ఇతి-అలీకరతకాతరా-ప్రియం-విప్రలభ్య-సురతే-హ్రియం - చ - సా-చుమ్బనాది-వితతార-మాయినీ-కిం-విదగ్ధమానసామ్-అగోచరః.

అర్థము: ఇతి = ఇట్లు, అలీకరతకాతరా; అలీక = అసత్యముగా, రత = సురత కేళియందు, కాతరా = భయముచెందినదై, అనగా సురతమందు నసత్యపు భీతి నభినయించుచు వాస్తవమగు భీతి లేనిదై, మాయినీ = మాటలలో నేర్పు మున్నగు కపటములయందు సమర్థురాలైన, సా = ఆ దమయంతి, సురతే = సంభోగక్రీడయందు, ప్రియం = ప్రియుడైన నలుని, హ్రియం చ = సిగ్గును, విప్రలభ్య = వంచించి, చుమ్బనాది = ముద్దిడుట మున్నగు దానినే, వితతార = నలునికై యిచ్చినది. తథాహి = అది యుక్తమే. విదగ్ధమనసాం = సమయమునకు దగిన వ్యవహారముల యందు నేర్పు గల మనస్సుతో కూడినవారికి, కిం = ఎయ్యది, అగోచరః = విషయము కాదు. అన్ని విధములైన నేర్పులు వారికి గోచరించునని యర్థము.

సమాసములు :

అలీకరతకాతరా — అలీకం చ తత్ రతం చ = అలీకరతం, అలీకరతే కాతరా = అలీకరతకాతరా.
చుమ్బనాది— చుమ్బనం ఆదిః యస్య తత్ = చుమ్బనాది.
విదగ్ధమనసాం-విదగ్ధం మనః యాసాం తాః = విదగ్ధమనసః, తాసాం = విదగ్ధమానసాం.
అగోచరః— న గోచరః = అగోచరః.

భావము :

ఇవ్విధముగా సంభోగమునందు కృత్రిమపు భయము నభినయించుచున్నట్టి, వాక్చాతుర్యము గల యా దమయంతి ప్రియుడగు నలుని లజ్జను వంచించి కేవలము అధరపానము మున్నగువానినే నలున కిచ్చెను. ఆమె మధ్యమ నాయికగా నుండినను ముగ్ధాస్వభావమును వెల్లడించుటవలన సురతమును చేయనందువలన ప్రియునకు వంచన జరిగినది. మఱియు చుంబనము మున్నగు వానియందు నధికముగా సిగ్గు సంభవించినను నట్టి సిగ్గును పొందనందువలన లజ్జకును వంచన జరిగినది. లోకమున నేర్పుకత్తెల మనస్సులకు విషయము కానిదేది కలదు? ॥86॥

శ్లో. స్వేప్సితోద్గమిత మాత్రలుప్తయా
దీపికాచపలయా తమోఘనే,
నిర్విశఙ్కరతజన్మతన్ముఖా
కూతదర్శనసుఖా న్యభుఙ్క్త సః. 87

ప.వి. స్వేప్సితోద్గమితమాత్రలుప్తయా-దీపికాచపలయా-తమోఘనే-నిర్విశఙ్కరతజన్మతన్ముఖాకూతదర్శనసుఖాని-అభుఙ్క్త-సః.

అర్థము:- సః=ఆ నలుడు, తమోఘనే; తమః=చీకటియనెడి, ఘనే=మేఘమందు, స్వేప్సితోద్గమితమాత్రలుప్తయా; స్వేప్సిత=తనయిచ్ఛచేతనే, ఉద్గమితమాత్ర=జ్వలించినక్షణమందే, లుప్తయా=ఆరినట్టి, దీపికాచపలయా; దీపికా=దీపమనెడి, చపలయా=మెఱపుతీగచే, నిర్విశఙ్కరతజన్మతన్ముఖాకూతదర్శనసుఖాని; నిర్విశఙ్క=చీకటివలన భయములేనట్టి, రత=సంభోగముచే, జన్మ=ఏర్పడిన, తన్ముఖ=ఆ దమయంతి ముఖమండలి, ఆకూత=చేష్టలను, దర్శన=చూచుటవలని, సుఖాని=సుఖములను, అభుఙ్క్త=అనుభవించెను.

సమాసములు :

స్వేప్సితోద్గమితమాత్రలుప్తయా - స్వస్య ఈప్సితం = స్వేప్సితం, స్వేప్సితస్య ఉద్గమితం = స్వేప్సితోద్గమితం, స్వేప్సితోద్గమిత మేవ = స్వేప్సితోద్గమితమాత్రం, స్వేప్సితోద్గమితమాత్రేణ లుప్తా = స్వేప్సితోద్గ మితమాత్రలుప్తా, తయా = స్వేప్సితోద్గమితమాత్రలుప్తయా.

దీపికాచపలయా - దీపికైవ చపలా = దీపికాచపలా, తయా = దీపికా చపలయా, తమోఘనే - తమ ఏవ ఘనః = తమోఘనః, తస్మిన్ = తమోఘనే.

నిర్వ్రీశఙ్కరతజన్మతన్ముఖాకూతదర్శనసుఖాని - నిర్గతా శఙ్కా యస్మిన్ తత్ = నిర్వ్రీశఙ్కం, నిర్వ్రీశఙ్కం చ తత్ రతం చ = నిర్వ్రీ శఙ్కరతం, నిర్వ్రీశఙ్కరతాత్ జన్మ యేషాం తాని = నిర్వ్రీశఙ్కరత జన్మాని, తస్యాః ముఖం = తన్ముఖం, తన్ముఖే ఆకూతాని = తన్ముఖా కూతాని, నిర్వ్రీశఙ్కరతజన్మతన్ముఖాకూతానాం దర్శనం = నిర్వ్రీశఙ్కర తజన్మతన్ముఖాకూతదర్శనం, నిర్వ్రీశఙ్కరతజన్మతన్ముఖాకూతదర్శనేన సుఖాని = నిర్వ్రీశఙ్కరతజన్మతన్ముఖాకూతదర్శనసుఖాని, తాని = నిర్వ్రీ శఙ్కరతజన్మతన్ముఖాకూతదర్శనసుఖాని.

భావము :

ఆ నలమహారాజు చీకటియను మేఘమునందు తన ఇచ్ఛామాత్రము చేతనే వెలిగింపబడినదై, యప్పుడే యారిపోవునట్టి దీపమనెడి మెఱపుతీగచే భయసంకోచములులేక దమయంతితో రమించుచు నాదీపపు క్షణిక కాంతులచే సంభోగకాలమందు నామెయొక్క ముఖమునందలి మధురవిలాసములను చూచుచు దానివలని సుఖముల ననుభవించెను. దీపము స్థిరముగా వెల్గినచో నిస్సంకోచ ముగా సురతమును జరుపుటకు భంగము కలుగును. కాన క్షణకాలము దీపము వెల్గినచో నామెయొక్క విలాసమధురమగు వదనమును చూచుటకును చీకటి యుండుటవలన నిస్సంకోచముగా రమించుటకు అవకాశము కల్గినదని యాశయము. ॥87॥

శ్లో. యద్భ్రువౌ కుటిలితే తయా రతే
మన్మథేన తదనామి కార్ముకమ్,
యత్తు హుం హుమితి సా తథా వ్యధా
త్తత్ స్మరస్య శరముక్తిహుఙ్కృతమ్. 88

ప. వి. యత్-భ్రువౌ-కుటిలితే-తయా-రతే-మన్మథేన-తత్-అనామి-కార్ముకం-యత్-తు-హుం-హుం-ఇతి-సా-తథా-వ్యధాత్-తత్-స్మరస్య-శరముక్తిహుఙ్కృతమ్.

అర్థము: తయా = ఆ దమయంతిచే, రతే = సంభోగకాలమునందు, యత్ = ఎట్లు, భ్రువౌ = కనుబొమ్మలు, కుటిలితే = వంకరగా త్రిప్పపడినవో, తత్ = ఆ విధముగా వంచుటయే, మన్మథేన = మన్మథునిచే, కార్ముకం = ధనుస్సు, అనామి = వంచబడుట యని యర్థము. అనగా నా కనుబొమ్మలు రెండును మన్మథుని విల్లువలె మనోహరములని భావము. కించ = మరియు, సా = ఆ దమయంతి, తథా = అట్లు రమించుకాలము నందు, హుంహుమితి = సుఖాధిక్యముచే "హుంహుం" అను శబ్దమును, యత్ = ఎందువలన, వ్యధాత్ = చేసెనో! తత్ = ఆ హుంకారమే, స్మరస్య = మన్మథునియొక్క, శరముక్తిహుఙ్కృతం, శర = బాణము లను, ముక్తి = విడచిపెట్టునప్పుడు ఏర్పడు, హుఙ్కృతం = హుంకార ముగా, అభూత్ = ఆయెను.

**సమాసములు :**

శరముక్తిహుఙ్కృతమ్-శరాణాం ముక్తిః = శరముక్తిః, శరముక్తేః హుఙ్కృతమ్ = శరముక్తిహుఙ్కృతమ్.

**భావము :**

సంభోగకాలమందు దమయంతి తన కనుబొమ్మలను వంకరగా చేయుటయే మన్మథుడు విల్లువంచుట యగుచున్నది. అట్లే యామె సంభోగకాలము

నంపు కల్గునట్టి సుఖాధిక్యము వలన చేసెడి ''హుంహుం'' ధ్వనులు మన్మథుడు బాణములు వదలునప్పుడు కల్గెడి హుంకార ధ్వనులుగా నేర్పడినవని యాశయము.

శ్లో. ఈక్షి తోపదిశతీవ న ర్తితుం
తత్క్షణోదితముదం మనోభవమ్
కా న్తద న్త పరిపీడితాఽధరా
పాణిధూనన మియం వితన్వతీ. 89

ప. వి. ఈక్షితా - ఉపదిశతి - ఇవ-న ర్తితుం-తత్క్షణోదితముదం-మనోభవం - కా న్తద న్తపరిపీడితాధరా-పాణిధూననమ్-ఇయం-వితన్వతీ.

అర్థము: కా న్తద న్తపరిపీడితాఽధరా, కా న్త = ప్రియునియొక్క, ద న్త = దంతములచే, పరిపీడిత = నొప్పింపబడిన, అధరా = పెదవి కల్గినదై, (కావుననే) పాణిధూననం, పాణి = చేతితో, ధూననం= నెట్టుటను, వితన్వతీ=చేయుచున్న, ఇయం=ఈ దమయంతి, తత్క్షణోదిత ముదం, తత్క్షణ=ఆ క్షణమునందే, ఉదిత=ఉద్భవించిన, ముదం= సంతోషముకల్గిన, అనగా సంభోగకాలమందు తన మహిమను చూపుట వలన హర్షించిన, మనోభవం = మన్మథుని, న ర్తితుం=నాట్యము చేయుటకు, ఉపదిశతీవ = బోధించుచున్నదో యను నట్లుండినదిగా, ఈక్షితా=చూడబడినది. మన్మథా ! నీవు ఈ విధముగా నాట్యము చేయ వలయునని యతనికి నాట్యము నేర్పుచున్నాదా యనునట్లు ఆ దమయంతి చూడబడినదని యర్థము.

సమాసములు :

తత్క్షణోదితముదం-స చాసౌ క్షణశ్చ = తత్క్షణః, తత్క్షణం ఉదితా = తత్క్షణోదితా, తత్క్షణోదితా ముత్ యస్య సః=తత్క్షణోదితముత్, తం= తత్క్షణోదితముదమ్.
కా న్తద న్తపరిపీడితాధరా-కా న్తస్య ద న్తాః=కా న్తద న్తాః, కా న్తద న్తైః పరి పీడితః అధరః యస్యాః సా=కా న్తద న్తపరిపీడితాధరా,
పాణిధూననం - పాణ్యోః ధూననం = పాణిధూననం, తత్ = పాణి ధూననం,

భావము :

సంభోగకాలమునందు ప్రియుడగు నలుడు దంతములతో ప్రియురాలగు దమయంతియొక్క పెదవిని కొఱకుట వలన నామె బాధపడినదై తన చేతులను విదలించుచు నతనిని నెట్టివేయుచుండినది. అది సంభోగ కాలమందు తన ప్రభావమునుఁ జూచి హర్షించుచున్న మన్మథునికి నృత్యమును నేర్పున ట్లుండినది. నాట్యమును హస్తనృత్యముతోడనే గురువులు శిష్యులకు బోధించుట ప్రసిద్ధము.

శ్లో. సా శశాక పరిరంభదాయినీ
గాహితుం బృహదురః ప్రియస్య న,
చక్షమే స చ న భఙ్గురభ్రువ
స్తుఙ్గపీనకుచదూరతాం గతమ్. 90

ప. వి. సా-శశాక-పరిరమ్భదాయినీ - గాహితుం-బృహత్-ఉరః-ప్రియస్య-న-చక్షమే-సః-చ-న-భఙ్గురభ్రువః-తుఙ్గపీనకుచదూరతాం-గతమ్.

అర్థము : పరిరమ్భదాయినీ, పరిరమ్భ=ఆలింగనమును, దాయినీ=ఇచ్చునట్టి, సా=ఆ దమయంతి, ప్రియస్య=ప్రియుడగు నలునియొక్క, బృహత్=విశాలమైన, ఉరః=ఱొమ్మును, గాహితుం=ప్రవేశించుటకు, న శశాక=శక్తురాలు కాలేదు. ఏలయనగా నలుని వక్షఃస్థలముకంటె తనది స్వల్పమైనది. స చ = ఆ నలుడును, భఙ్గురభ్రువః, భఙ్గుర=వంపులు తిరిగిన, భ్రువః=కనుబొమ్మలుకల్గిన, తుఙ్గపీనకుచదూరతాం, తుఙ్గ=ఎత్తైన, పీన=బలసిన, కుచ స్తనములచే, దూరతాం=వ్యవధానమును, గతం=పొందిన, ఉరః=వక్షఃస్థలమును, గాహితుం=ప్రవేశించుటకును, న చక్షమే=శక్తుడు కాలేదు. ఏలయనగా చనుదోయి ఎత్తుగను స్థూలముగను నుండి వ్యవధానమును గల్గించినది.

సమాసములు :

*పరిరమ్భదాయినీ* - పరిరంభం దదాతీతి=పరిరంభదాయినీ.
*భఙ్గురభ్రువః* - భఙ్గురే భ్రువౌ యస్యాః సా = భఙ్గురభ్రూః, తస్యాః=భఙ్గురభ్రువః.

తుఙ్గపీనకుచదూరతాం - తుఙ్గౌ చ తౌ పీనౌ చ=తుఙ్గపీనౌ, తుఙ్గపీనౌ చ తౌ కుచౌ చ = తుఙ్గపీనకుచౌ, దూరస్య భావః = దూరతా, తుఙ్గపీనకుచాభ్యాం దూరతా=తుఙ్గపీనకుచదూరతా, తాం=తుఙ్గపీనకుచదూరతాం.

భావము :

ఆ దమయంతి నలుని కౌగిలించుటకు పూనుకొనినదైనను నాతని విశాల వక్షఃస్థలమును ఆమె ప్రవేశింపలేకపోయినది. అట్లే ఆనలుడును నామె వక్షఃస్థలమున ఎత్తైనవియు, లావైనవియునగు నామె స్తనములతో వ్యవహితమైనందు వలన దానిని ప్రవేశింపలేకపోయెను.

వి. (1) ఆధేయమైన దమయంతి యొడలకంటెను నాధారమగు నలుని వక్షఃస్థలము నధికముగా చెప్పుటవలన నధికాలఙ్కారము.

(2) చనుదోయియొక్క ఔన్నత్యస్థూలత్వములు వక్షఃస్థలముతో సంబంధము కల్పించుకొనుచున్నను, నది లేదనుటవలన అసంబంధాతిశయోక్తి. ॥190॥

శ్లో. బాహువల్లి పరిరంభమణ్డలీ
యా పరస్పర మపీడయ త్తయోః,
ఆస్త హేమనలినీ మృణాలజః
పాశ ఏవ హృదయేశయస్య సః. 91

ప. వి. బాహువల్లిపరిరంభమణ్డలీ-యా-పరస్పరమ్-అపీడయత్-తయోః-ఆస్త-హేమనలినీమృణాలజః-పాశః-ఏవ-హృదయేశయస్య-సః.

అర్థము : తయోః=ఆ దమయంతీనలులయొక్క, యా=ఏ, బాహువల్లిపరిరంభమణ్డలీ, బాహువల్లి=భుజములనెడి తీగలచే, పరిరంభ=ఒండొరులను కౌగలించుకొనుటనే నేర్పడిన, మండలీ=పరివేష్టనము అనగా చుట్టుకొని యుండుట, యనగా నాలుగు భుజములచే ఒండొరులను చుట్టిపట్టుకొనుట వలన నేర్పడిన గుండ్రపుటాకారము, పరస్పరం=ఒండొరులను, అపీడ

యత్ = పీడించినది, సః = ఆ యాలింగనవ్యాపారము, హృదయేశయస్య = హృదయమందు శయనించు మన్మథునకు, హేమనలినీ మృణాలజః, హేమనలినీ = పసిడితామరతీగల, మృణాల = కాడనుండి, జః = ఏర్పడినదిగా కనబడెడి, పాశ ఏవ = బంధనసాధనమగు త్రాడుగా ఆస్త = ఉండినది.

వి. బాహువులతో నొండొరులఁ గౌగలించుకొనుటవలన నేర్పడిన మండలాకారము పాశము గాకపోయినను, పాశముగా భావింపబడుట వలన ఉత్ప్రేక్ష. వ్యఞ్జకముగా "ఏవ" కారమును ప్రయోగించుట వలన అది వాచ్యము.

సమాసములు :

బాహువల్లి పరిరంభమణ్డలీ - బాహూ వల్లీ ఇవ = బాహువల్లీ, బాహువల్లిభ్యాం పరిరంభః = బాహువల్లి పరిరంభః, బాహువల్లి పరిరంభేణ మణ్డలీ = బాహువల్లి పరిరంభమండలీ.

హేమనలినీ మృణాలజః - హేమమయీ నలినీ = హేమనలినీ, హేమనలిన్యాః మృణాలం = హేమనలినీమృణాలం, హేమనలినీ మృణాలాత్ జాయత ఇతి = హేమనలినీమృణాలజః.

హృదయేశయస్య - హృదయే శేత ఇతి = హృదయేశయః, తస్య = హృదయేశయస్య.

భావము :

ఆ దమయంతి నలుల తీగలవంటి తమ తమ భుజముల జంటతో, ననగా నాలుగు భుజములతో ఒండొరులను కౌగలించుకొనుటవలన నేర్పడిన వర్తులాకారము, పసిడి తామర కాడలతో నేర్పడిన మన్మథునియొక్క పాశాయుధము, అనగా బంధించెడి త్రాడుగ నుండినది. ॥91॥

శ్లో, వల్లభేన పరిరంభపీడితౌ
ప్రేయసీ హృది కుచా వవాపతుః,
కేలతీమదనయో రుపాశ్రయే
తత్ర వృత్తమిలతోపధానతామ్. 92

ప. వి. వల్లభేన-పరిరంభపీడితౌ- ప్రేయసీహృది - కుచౌ - అవాపతుః - కేలతీ మదనయోః-ఉపాశ్రయే-తత్ర-వృత్తమిలతోపధానతామ్.

అర్థము :- వల్లభేన = ప్రియుడగు నలునిచే, పరిరంభపీడితౌ; పరిరంభ= ఆలింగనముచే, పీడితౌ=నలుపబడిన, ప్రేయసీహృది; ప్రేయసీ= మిక్కిలి ప్రియురాలగు దమయంతి యొక్క, హృది=రొమ్ముపైని, కుచౌ = స్తనములే, కేలతీమదనయోః = రతీ, మన్మథులకును, ఉపాశ్రయే=ఆధారమైన, తత్ర=ఆ దమయంతి రొమ్మునందు, వృత్త మిలితోపధానతాం; వృత్త=గుండ్రములై, మిలిత = ఒంటొంటితో గలసిన, ఉపధానతాం=దిండుగా నుండుటను, అపతురివ= పొందినవో యనునట్లుండినవి.

వి. దమయంతి వక్షఃస్థలము నందలి స్తనములు ఉపధానములు కాక పోయినను ఉపధానత్వము పొందినవో యని భావించుట వలన ఉత్ప్రేక్ష.

సమాసములు :

*పరిరంభపీడితౌ* - పరిరంభేణ పీడితౌ=పరిరంభపీడితౌ.
*ప్రేయసీహృది* - ప్రేయస్యాః హృత్= ప్రేయసీహృత్, తస్మిన్= ప్రేయసీహృది.
*కేలతీమదనయోః* - కేలతీ చ మదనశ్చ= కేలతీమదనౌ, తయోః= కేలతీమదనయోః,

వృత్తమిలితో పధానతాం - వృత్తే చ తే మిలితే చ = వృత్తమిలితే, వృత్తమిలితే చ తే ఉపధానే చ = వృత్తమిలితోపధానే, వృత్తమిలితో పధానస్య భావః = వృత్తమిలితోఽఉపధానతా, తాం = వృత్తమిలితో పధానతామ్.

భావము :

ప్రియుడగు నలుని దృఢాలింగనములతో నలుపబడిన ప్రియురాలి కుచములు రెండును, రతీకాముకులకు తలల కాధారమైన యామె వక్షఃస్థలము నందు నొండొంటిని దగ్గఱకు చేర్చబడిన దిండులుగా నేర్పడినవో యను నట్లుండినవి. ॥92॥

శ్లో. తత్ ప్రియోరుయుగలం నలార్పితైః
పాణిజస్య మృదులైః పదై ర్బభౌ,
ఉత్ప్రశస్తి రతికామయో ర్జయ
స్తమ్భయుగ్మమివ శాతకుంభజమ్. 92

ప. వి. తత్- ప్రియోరుయుగలం- నలార్పితైః-పాణిజస్య- మృదులైః- పదైః- బభౌ- ఉత్ప్రశస్తి-రతికామయోః- జయ స్తంభయుగ్మమ్-ఇవ-శాతకుంభ జమ్.

అర్థము:- తత్=ఆ మిక్కిలి మనోహరమగు, ప్రియోరుయుగం; ప్రియ= ప్రియురాలియొక్క, ఊరుయుగం=తొడలజంట, నలార్పితైః; నల= నలునిచే, అర్పితైః = ఉంచబడిన, మృదుభిః=మెత్తనైన, అనగా చిన్నచిన్నవియగు, పాణిజస్య = గోటియొక్క, పదైః=గురుతులచే, అనగా నఖక్షతములచే, ఉత్ప్రశస్తి; ఉత్=చెక్కబడిన, ప్రశస్తి= ప్రశంసాపద్యముగల, శాతకుంభజం = పసిడినుండి యుద్భవించిన, రతికామయోః=రతీమన్మధులయొక్క, జయ స్తంభయుగ్మమివ; జయ స్తంభ=జయసూచక స్తంభముల, యుగ్మమివ=జంటయో యనునట్లు, బభౌ=ప్రకాశించినది.

వి. దమయంతియొక్క తొడలు రతీకామకుల జయ స్తంభములు కాకపోయి నను, జయ స్తంభములుగా భావింపబడుటవలన ఉత్ప్రేక్ష.

సమాసములు :

*ప్రియోరుయుగం* – ఊర్వోః యుగళం=ఊరుయుగళం, ప్రియాయాః ఊరుయుగళం=ప్రియోరుయుగళం.

*నలార్పితైః* – నలేన అర్పితాని=నలార్పితాని, తైః=నలార్పితైః.

*ఉత్ప్రశస్తి* - ఉత్కీర్ణా ప్రశస్తిః యస్మిన్ తత్=ఉత్ప్రశస్తి.

*రతికామయోః*- రతిశ్చ కామశ్చ=రతికామౌ, తయోః=రతికామయోః.

*జయ స్తంభయుగ్మం* - జయసూచకౌ స్తంభౌ = జయ స్తంభౌ, జయ స్తంభయోః యుగ్మం=జయ స్తంభయుగ్మం.

*శాతకుంభజం*– శాతకుంభాత్ జాయత ఇతి=శాతకుమ్భజమ్.

భావము :

మనోహరములగు నా దమయంతియొక్క తొడలు రెండును, నలుడు గావించిన కోమలములగు నఖక్షతములతో కూడినవై, ప్రశంసాపద్యములతో కూడిన రతీకాముకుల ప్రపంచవిజయమును జాటెడి జయ స్తంభములో యన్నట్లుండినవి.

శ్లో. బహ్వమాని విధినాఽపి తావకం
నాభి మూరుయుగ మన్తరాఙ్గకమ్,
స వ్యధా దధికవర్ణకై రిదం
కాఞ్చనై ర్యదితి తాం పురాఽఽహ సః. 94

ప. వి. బహు-అమాని-విధినా-అపి-తావకం- నాభిమ్- ఊరుయుగమ్-అన్తరా-అఙ్గకం-సః-వ్యధాత్-అధికవర్ణకైః-ఇదం-కాంచనైః- యత్-ఇతి-తాం-పురా-ఆహ-సః.

అర్థము: హే ప్రియే! = ఓ ప్రియురాలా! తావకం = నీదైన, నాభిం= పొక్కిలికి, ఊరుయుగం=తొడలజంటకు, అంతరా=మధ్యనున్న, అజ్గకం=అధికముగా అభిలషింపబడిన యవయవము, అనగా వరాఙ్గము, విధినాఽపి=బ్రహ్మచేతను, బహు=అధికముగా, అమాని=భావింప బడినది. (ఏల యనగా) యత్=ఎందువలన, సః=ఆ బ్రహ్మ, ఇదం=ఈ వరాంగమును, అధికవర్ణకైః=మిక్కిలి ప్రకాశమానము లగు వర్ణములుగల, కాంచనైః=సువర్ణములచే, వ్యధాత్=సృష్టించెను. ఇతి=ఈ విధముగా, సః=ఆ నలుడు, తాం = ఆ ప్రియురాలిని, పురా=సంభోగప్రారంభమునకు మొదట, ఆహ=చెప్పెను.

సమాసములు :

అధికవర్ణకైః- అధికః వర్ణః యేషాం తే = అధికవర్ణకాః, తైః= అధికవర్ణకైః.

భావము :

ఓ ప్రియురాలా! నీ పొక్కిలికిని, తొడలకును, మధ్య నున్నదై, మిక్కిలి యభిలషింపదగిన వరాంగము, అనగా కామమందిరము బ్రహ్మచేతను గొప్పగా భావింపబడి యాదరింపబడినది. ఏలయనగా నాబ్రహ్మ యీ కామమందిరమును మిక్కిలి ప్రకాశవంతములగు సువర్ణములతో సృజించెనా యని భావింపదగి యున్నది. ఇట్లు నలుడు దమయంతిని సురతకేళికి పూర్వము వక్కాణించెను॥94॥

శ్లో. పీడనాయ మృదునీ విగాహ్య తౌ
కాన్తపాణినలినే స్పృహావతీ,
తత్కుచౌ కలశపీననిష్ఠురౌ
హారహాసవిహతే వితేనతుః. 95

ప. వి. పీడనాయ-మృదునీ - విగాహ్య - తౌ - కాన్తపాణినలినే - స్పృహావతీ- తత్కుచౌ-కలశపీననిష్ఠురౌ-హారహాసవిహతే-వితేనతుః,

అర్థము: కలశపీననిష్ఠురౌ; కలశ = కుండలవలె, పీన = పెద్దవియు, నిష్ఠురౌ = కఠినములునునగు, తత్కుచే = ఆ దమయంతియొక్క స్తనములు, మృదునీ = మెత్తనివైనను, తౌ = ఆ కఠినములగు స్తనములను, విగాహ్య = ప్రవేశించి, యనగా పొంది, పీడనాయ = పీడించుటకు అనగా నలుపుటకు, స్పృహావతీ = అభిలాషకల్గిన, కాంతపాణినలినే; కాంత = ప్రియుడైన నలునియొక్క, పాణినలినే = హస్తపద్మములను, హారహాస విహతే; హార = స్తనములపై వ్రేలాడు ముత్తెపుసర మనెడి, హాస = నవ్వుతో, విహతే = తిరస్కరింపబడినవానినిగా, వితేనతుః = చేసినవి.

సమాసములు :

కాన్తపాణినలినే - కాన్తస్య పాణీ = కాన్తపాణీ, కాన్తపాణీ ఏవ నలినే = కాన్త పాణినలినే.
స్పృహావతీ - స్పృహా అస్యాః అస్తీతి = స్పృహావతీ.
తత్కుచౌ - తస్యాః కుచౌ = తత్కుచౌ.
కలశపీననిష్ఠురౌ - పీనౌ చ తౌ నిష్ఠురౌ చ = పీన నిష్ఠురౌ, కలశవత్ పీన నిష్ఠురౌ = కలశపీననిష్ఠురౌ.
హారహాసవిహతే - హార ఏవ హాసః = హారహాసః, హారహాసేన విహతే = హారహాసవిహతే.

భావము :

కుండలవలె పెద్దవియును, గట్టివియునగు ఆ దమయంతియొక్క స్తనములు, మెత్తనివైనను చూచుటకు మిక్కిలి కఠినములగు నాకుచములను పొంది వానిని నలుపుటకు అభిలాషకల్గిన ప్రియుడగు నలునియొక్క పాణిపద్మములను ముత్యాలహార మనెడి నవ్వుతో హాస్యము గావించి కొట్టినవో యన్నట్లుండినవి. నలుని పాణిపద్మములు కోమలములు కావున నవి దుర్బలములు. అట్టి దుర్బల ములగు నాతని పాణిపద్మములు పెద్దవియును, కఠినములు నగు దమయంతి స్తనములను నలుపుటకు పోగా నవి ముత్యాలహారపు కాంతి యను నవ్వుతోడను, నా హారము పాణిపద్మములకు దగులుట యను దెబ్బతోడను తిరస్కరించినవి.

బలహీనుడు బలవంతుని పైకి బోయినపుడు హాస్యము, దెబ్బలు తప్పవు కదా! అసాధ్యములగు విషయములకు ప్రయత్నించువారు పరిహాస పాత్రులగుట నిశ్చయము. ॥95॥

శ్లో. యౌ కురఙ్గ మదకుఙ్కుమాఞ్చితౌ
నీలలోహితరుచౌ వధూకుచౌ,
స ప్రియోరసి తయో స్స్వయమువో్ఛ
రాచ చార నఖకింశుకార్చనమ్. 96

ప. వి. యౌ-కురంగమదకుఙ్కుమాఞ్చితౌ- నీలలోహితరుచౌ-వధూకుచౌ-సః - ప్రియోరసి-తయోః-స్వయంభువః-ఆచచార-నఖకింశుకార్చనమ్.

అర్థము: యౌ=ఏ, వధూకుచౌ=దమయంతీ స్తనములు, కురఙ్గమదకుఙ్కుమాంచితౌ, కురంగమద=కస్తూరి చేతను,కుఙ్కుమ=కుఙ్కుమ పూవు చేతను, అఞ్చితౌ = పూజింపబడినవై, అనగా వానిని మూయుటచే మిక్కిలి శోభించినవై, కావుననే, నీలలోహితరుచౌ, నీల = నల్లని, లోహిత=ఎఱ్ఱని, రుచౌ = కాంతులుగలవై, పక్షాంతరమున, నీల = కణ్ఠమునందు నల్లనివాడును, లోహిత=కేశములయం దెర్రని వాడును నగు శివునియొక్క, రుచౌ=కాంతులు గలవై, (బభూవతుః=ఉండినవి) ప్రియోరసి=ప్రియురాలి రొమ్ముపై, స్వయంభువోః = యౌవనమేర్పడినప్పుడు స్వయముగ నేర్పడిన, పక్షాంతరమున-స్వయమ్భువోః = స్వయంభూదేహముకల్గిన అనగా సృజింపబడనివై, తమంతట తాముగా నుద్భవించిన మూర్తులు కల్గిన, తయోః = ఆ దమయంతి యొక్క కుచములకు, సః=అ నలుడు, నఖకింశుకార్చనం, నఖ = గోరులనెడి, అనగా నఖక్షతములనెడి, కింశుక = మోదుగుపూలచే, అర్చనం=పూజను, ఆచచార=ఆచరించెను.

సమాసములు :

కురఙ్గమదకుఙ్కుమాంచితౌ- కురఙ్గస్య మదః = కురఙ్గమదః, కురఙ్గమదశ్చ కుఙ్కుమం చ = కురఙ్గమదకుఙ్కుమే, కురఙ్గమదకుఙ్కుమాభ్యాం అఞ్చితౌ=కురఙ్గమదకుఙ్కుమాఞ్చితౌ.

**నీలలోహితరుచౌ**- నీలా చ సా లోహితా చ=నీలలోహితా, నీలలోహితా రుక్ యయో స్తౌ=నీలలోహితరుచౌ.
వధూకుచౌ- వధ్వాః కుచౌ=వధూకుచౌ.
ప్రియోరసి- ప్రియాయాః ఉరః=ప్రియోరః, తస్మిన్=ప్రియోరసి.
స్వయమ్భువోః-స్వయం భవత ఇతి=స్వయంభువౌ, తయోః=స్వయంభువోః.
**నఖకింశుకార్చనమ్**- నఖా ఏవ కింశుకాని=నఖకింశుకాని, నఖకింశుకైః అర్చనం=నఖకింశుకార్చనమ్.

భావము :

కస్తూరిచేతను, కుంకుమపుష్పముల చేతను పూయబడినవియు, (పూజింపబడినవియు) కస్తూరిచే నలుపు వన్నెను, కుంకుమ పుష్పముచే నెఱుపు వన్నెను పొందినవియు (కంఠమున నీలవర్ణము, వెంట్రుకలపై ఎరుపు వర్ణము కల్గిన మహాదేవునిపై యభిలాష కల్గినవియు,) నై యుండినవి. ప్రియురాలి యొక్క వక్షఃస్థలమునందు స్వయంభువులైనవి యనగా యౌవన మేర్పడినప్పుడు ఉద్భవించినవియు (స్వయముగా నుద్భవించిన మూర్తులు కలవియు) నగు దమయంతి యొక్క స్తనములపై నలుడు నఖక్షతము లనెడి మోదుగుపూలతో పూజను గావించెను. అనగా ఆ దమయంతియొక్క స్తనములు కస్తూరిని, కుంకుమ పూవును పూయుటవలన ఎఱుపుగను, నలుపుగను ఉండినవి. కస్తూరి నలుపుగా నుండుటవలన దానిని పూయుటచే నలుపుగను, కుంకుమపుష్ప మెఱ్ఱగా నుండుట వలన దానిని పూయుటచే ఎఱుపుగను నుండినవని యర్థము. అందువలన నవి నీలలోహితకాంతు లైనవి. శివుడును కంఠమునందు విషము వలన నలుపు వన్నెను కల్గియున్నాడు. అట్టి శివునిపైన అభిరుచిని కల్గిన యా స్తనములు నీలలోహితరుక్కు లైనవి. ఆ స్తనములు ప్రియురాలి వక్షఃస్థలమున యౌవనము రాగానే ఉద్భవించినందువలన స్వయంభువులైనవి. మరియు నవి బ్రహ్మసృష్టి లేక స్వయముగా నుద్భవించిన మూర్తులు కల్గినవి. అట్టి స్తనములకు నలుడు తన నఖక్షతములు, అనగా గోటి గాట్లనెడి మోదుగుపూలచే పూజను గావించెను. నఖక్షతములు ఎఱ్ఱవిగను, వంపులు తిరిగినవిగను నుండును. అట్లే మోదుగుపూవులను నుండును. నఖక్షతములు స్తనములపైన నేర్పడును; కాన నవి పూజార్థము

లైన మోదుగుపూలను పోలియుండును. ఆ స్తనములు పైన చెప్పిన విధముగా స్వయంభూ మూర్తులుగా వెలసినందువలన నవి దేవతా రూపము లగుటచే వానికి పూజ సల్పుట సముచితమని యాశయము.

శ్లో. అమ్బుధేః కియదనుత్థితం విధుం
స్వానుబింబమిలితం వ్యడమ్బయత్,
చుమ్బదమ్బుజముఖీముఖం తదా
నైషధస్య వదనేన్దుమణ్డలమ్. 97

ప.వి. అమ్బుధేః-కియత్-అనుత్థితం-విధుం-స్వానుబింబమిలితం-వ్యడంబయత్-చుమ్బదమ్బుజముఖీముఖం-తదా-నైషధస్య-వదనేందుమణ్డలమ్

అర్థము: తదా=వారిరువురి సంగమకాలమునందు, అంబుజముఖీముఖం; అంబుజముఖీ = పద్మముఖియగు దమయంతియొక్క, ముఖం = మోమును, చుమ్బత్=ముద్దిడుకొనుచున్న, నైషధస్య=నలునియొక్క, వదనేన్దుమణ్డలం=ముఖమనెడి చంద్రమణ్డలము, అమ్బుధేః=సముద్రమునుండి, కియత్ = కొంచెము, అనుత్థితం = ఉదయించని, అనగా సముద్రమున కొలదిభాగముగా మింట నధికభాగముగా నుదయించిన, స్వానుబిమ్బమిలితం; స్వ = తనయొక్క, అనుబింబ=ప్రతిబింబముతో, మిలితం= కూడిన, అనగా సముద్రమందలి ప్రతిబింబముతో కూడిన, విధుం= చంద్రుని, వ్యడమ్బయత్=అనుకరించెను.

సమాసములు :

స్వానుబింబమిలితం- స్వస్య అనుబింబః=స్వానుబింబః, స్వానుబింబేన మిలితః=స్వానుబింబమిలితః, తం=స్వానుబింబమిలితం.
అమ్బుజముఖీముఖం-అమ్బుజ మివ ముఖం యస్యాస్సా =అమ్బుజముఖీ, అమ్బుజముఖ్యాః ముఖం = అమ్బుజముఖీముఖం, తత్ = అమ్బుజముఖీముఖం.
వదనేన్దుమణ్డలమ్- ఇందోః మణ్డలం = ఇన్దుమణ్డలం, వదన మేవ ఇన్దుమణ్డలమ్=వదనేన్దుమణ్డలమ్.

భావము :

ఆ దమయంతీనలుల సంగమకాలమందు, ప్రియురాలి ముఖమును ముద్దిడు కొనుచున్నట్టి అనగా ప్రియురాలి పెదవిని చుమ్బనము చేయుచున్నట్టి నలుని ముఖమనెడి చంద్రబింబము సముద్రమునుండి కొద్దిభాగముమాత్ర ముదయింపక, ఎక్కువభాగ ముదయించినదై, తన ప్రతిబింబముతో, ననగా నీటనున్న తన ప్రతిబింబముతో కలసిన చంద్రుని బోలియుండినది. ఆ యిద్దఱి ముఖములు నొండొంటితో కలియుటవలన పూర్తిగా రానందువలన నీవిధముగా బోల్చ బడినది. నలుని యధరము దమయంతియొక్క యధరమును పానము చేయుట వలన నలుని ముఖములో పెదవినుండి దిగువభాగము కానరాదు కాన సముద్రము నుండి యుదయించక నిలిచిపోయిన చంద్రమండలముయొక్క కొంలది భాగముగా నున్నది. నలుని ముఖమునకు దిగువనున్న దమయంతి ముఖము, దానికి ప్రతిబింబముగానుండి సముద్రమునందలి చంద్రమండలపు ప్రతిబింబమైనది. కాన చంద్రమండల మెట్లు కించిదనుదితమై స్వానుబింబముతో కూడియున్నదో, యట్లే నలుని ముఖచంద్రమండలముఁగూడ, నధరబింబచుమ్బనముతో కించిద నుదిత భాగమును, దమయంతి ముఖమనెడి స్వానుబింబమును కల్గియుండినదని యాశయము. ॥97॥

శ్లో. పూగభోగబహుతాకషాయితై
ర్వాసితై రుదయభాస్కరేణ తే,
చక్రతు ర్నిధువనేఽధరామృతై
స్తత్ర సాధు మధుపానవిభ్రమమ్. 98

ప. వి. పూగభోగబహుతాకషాయితైః - వాసితైః - ఉదయభాస్కరేణ - తౌ - చక్రితుః-నిధువనే-అధరామృతైః-తత్ర-సాధు-మధుపానవిభ్రమమ్.

అర్థము : తౌ = ఆ దమయంతీనలులు, నిధువనే = సంభోగమందు, పూగభోగ-బహుతాకషాయితైః; పూగభోగ = వక్కలను తినుటలో, అనగా తాంబూ

లము సేవించుటలోని,బహులతా=ఆధిక్యముచే,కషాయితైః=ఎఱ్ఱబారిన, తథా=అట్లే,ఉదయభాస్కరేణ=ఒకవిధమైన కర్పూరముచే,వాసితైః= పరిమళము పొందింపబడిన, అధరామృతైః=ఒండొరుల యధరముల లోని యమృతములయొక్క పానములచే, సాధు=చక్కగా, మధుపానవి భ్రమం, మధుపాన=మద్యపానముయొక్క, విభ్రమం=విలాసమును, చక్రతుః=ఆచరించిరి.

వి :- "పూగభాగ" అను పాఠమున భాగమనగా మాదక ద్రవ్యవిశేషమని గ్రహింపవలయును.

"అధరామృతములచే మధుపాన విభ్రమములను చేసి రని చెప్పుటవలన పదార్థవృత్తిరూపనిదర్శనాలఙ్కారము.

భావము :

ఆ దమయంతీనలులు, సంభోగకాలమందు, మాదకద్రవ్యములు మున్నగు వానితో కూడిన తాంబూలమును మితిమీరి సేవించుటవలన నెఱ్ఱదనమును, నొక విధమగు కర్పూరమును తాంబూలమున వాడుటవలన సువాసనను వహించినట్టి ఒండొరుల సుధారసములను పానముగావించి మద్యపానవిలాసము నాచరించిరి. మాదకద్రవ్యములతో కూడిన మద్యమును పానము చేసినచో ఎట్లు మత్తు ఏర్పడునో, యట్లే అధరములయందలి మద్యమును గ్రోలి వారు మత్తుచెందినవారై యొక రెఱుంగక సురతమును గావించిరని యాశయము. ॥98॥

శ్లో. అహ నాథవదనస్య చుమ్బతః
సా స్మ శీతకరతా మనక్షరమ్,
సీత్కృతాని సుదతీ వితన్వతీ
సత్త్వద త్తపృథువేపథు స్తదా. 99

ప. వి. అహ-నాథవదనస్య-చుమ్బతః-సా-స్మ-శీతకరతామ్-అనక్షరం-సీత్కృతాని-సుదతీ-వితన్వతీ-సత్త్వద త్తపృథువేపథుః-తదా.

అర్థము:- సుదతీ = అందమైనదంతములుగల, సా=ఆ దమయంతి, తథా = అధరపానము చేయుసమయమున, సీత్కృతాని=దంతములచే కొరుకుట వలన బాధచే 'సీ' యను సీత్కారధ్వనులను, వితన్వతీ = చేయుచు, తథా=అద్లే, సత్త్వదత్తపృథువేపథుః; సత్త్వ=సత్త్వగుణము అతిశయించుటచే, దత్త=ఈయబడిన, పృథు=అధికమైన, వేపథుః=వణకు గలదై, చుమ్బతః=అధరపానము గావించు, నాథవదనస్య; నాథ= నాథుడైన నలునియొక్క, వదనస్య = ముఖమునకు, శీతకరతాం= చల్లనికిరణములుగల చంద్రుడుగానుండుటను, అనక్షరం = వచనము లేకయే, ఆహ స్మ=చెప్పినది. అతని ముఖము శీతకరుడగు చంద్రుడు కానిచో, చలివలన కల్గెడు సీత్కారములు, వణకు, దమయంతి కెట్లు సంభవించును?

సమాసములు :

*నాథవదనస్య*–నాథస్య వదనం=నాథవదనం, తస్య=నాథవదనస్య, *శీతకరతాం*-శీతాః కరాః యస్య సః=శీతకరః, శీతకరస్య భావః= శీతకరతా, తాం=శీతకరతాం.

*అనక్షరమ్*- అవిద్యమానాని, అక్షరాణి యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా=అనక్షరమ్.

*సత్త్వదత్తపృథువేపథు*-సత్త్వేన దత్తః=సత్త్వదత్తః, పృథుశ్చాసౌ వేపథుశ్చ=పృథువేపథుః, సత్త్వదత్తః పృథువేపథుః యస్యాః సా= సత్త్వదత్త పృథువేపథు.

భావము :

మంచి దంతములుగల ఆ దమయంతి యధరపానకాలమందు సీత్కారము లను చేయుచు సత్వగుణముయొక్క ఉద్రేకముచే వణకుచు నుండినది. అందు వలన నామె తన ప్రియుని ముఖమును చల్లని కిరణములు గల చంద్రుడని మాటలు లేకయే చెప్పినది. ఆ సీత్కారములు వణకు చలివలననే కలుగును. ప్రకృతము నలునికి ముఖము చంద్రుడగుటవలన నతడు చల్లని కిరణములు

కల్గినవాడగుటచే నీమెకు చలి ఏర్పడి యందువలన సీత్కారములతో వణకు చుండినదని యాశయము. ॥99॥

శ్లో. చుమ్బనాయ కలితప్రియాకుచం
వీరసేనసుత వక్త్రమణ్డలమ్
ప్రాప భర్తు మమృతైః సుధాంశునా
సక్తహాటకఘటేన మిత్రతామ్. 100

ప. వి. చుమ్బనాయ- కలితప్రియాకుచం- వీరసేనసుతవక్త్రమణ్డలమ్- ప్రాప- భర్తుం-అమృతైః-సుధాంశునా-సక్తహాటకఘటేన-మిత్రతామ్.

అర్థము : చుమ్బనాయ=స్తనములపై ముద్దిడుకొనుటకై, కలితప్రియాకుచం, కలిత=ముఖముచే బట్టుకొనబడిన, ప్రియాకుచం=ప్రియురాలి స్తనములు కల్గిన, వీరసేనసుతవక్త్రమణ్డలం, వీరసేనసుత=వీరసేనమహారాజు పుత్రుడగు నలునియొక్క, వక్త్రమణ్డలం=ముఖమండలము, అమృతైః =అమృతములచే, భర్తుం=నింపుటకు, సక్తహాటకఘటేన, సక్త= పట్టుకొనబడిన, హాటకఘటేన=పసిడికుండలు కల్గిన, సుధాంశునా= చంద్రునితో, మిత్రతాం = మైత్రిని, అనగా పోలికను, ప్రాప = పొందినది. నలునిముఖము చంద్రునితో సమానముగా నుండుటవలన పైవిధముగా వర్ణితము.

వి. పసిడికుండయందు అమృతము నింపుటకు వచ్చిన చంద్రుడో యనునట్లు, స్తనమును ముఖమున బట్టుకొనిన నలుని ముఖము భావింపబడుటవలన నుత్ప్రేక్ష.

సమాసములు :

కలితప్రియాకుచం - ప్రియాయాః కుచః = ప్రియాకుచః, కలితః ప్రియాకుచః యేన తత్ =కలితప్రియాకుచమ్.

వీరసేనసుతవక్త్రమణ్డలమ్ - వీరసేనస్య సుతః = వీరసేనసుతః, వీరసేనసుతస్య వక్త్రం = వీరసేనసుతవక్త్రం, వీరసేనసుతవక్త్రస్య మణ్డలం=వీరసేనసుతవక్త్రమణ్డలమ్.

భావము :

స్తనములపై ముద్దిడుకొనుటకు నలుడు దమయంతి స్తనమును ముఖముతో బట్టుకొనెను. అట్టి నలుని ముఖమండలము, అమృతములతో నింపుటకు పసిడికుండలను పట్టుకొనిన చంద్రునితో సమానముగా నుండెను. నలుని ముఖము చంద్రునితో సమానముగను, దమయంతి స్తనము పసిడికుండతో సమానమని యర్థము. దమయంతి స్తనములను బట్టుకొనిన నలుడు అమృతముతో నింపుటకై పసిడికుండను బట్టుకొనిన చంద్రుడా యన్నట్లు భావింపబడెను. అట్టి చంద్రునితో నలుడు సమానముగా శోభించెనని యర్థము. ॥100॥

శ్లో. వీక్ష్య వీక్ష్య పునరైక్షి సాఽమునా
పర్యరమ్భి పరిరభ్య చాఽసకృత్,
చుమ్బితా పున రచుమ్బి చాఽదరా
త్తృప్తిరాపి న కథఞ్చనాఽపి చ. 101

ప. వి. వీక్ష్య - వీక్ష్య - పునః - ఐక్షి- సా-అమునా-పర్యరమ్భి-పరిరభ్య-చ-అసకృత్-చుమ్బితా-పునః-అచుమ్బి-ఆదరాత్- తృప్తిః- ఆపి- న-కథఞ్చన-అపి-చ.

అర్థము: అమునా = ఈ నలునిచే, సా = ఆ దమయంతి, ఆదరాత్ = మిక్కిలి ఆదరమువలన, వీక్ష్య వీక్ష్య = చూడబడియు, చూడబడియు, అనగా పలుమారులు చూడబడియు, ఐక్షి = చూడబడినది. అసకృత్ = పలు మాఱులు, ఆదరాత్ = మిక్కిలి ఆదరమువలన, పరిరభ్య = ఆలింగనము చేయబడియు, పర్యరమ్భి = కౌగలించబడినది, తథా = అట్లే, ఆదరాత్ = మిక్కిలి ఆసక్తివలన, చుమ్బితా = ముద్దిడబడియు, పునః = మఱల, అచుమ్బి = ముద్దిడుకొనబడినది, కథఞ్చన అపి = ఏ విధముగ కూడ, తృప్తిః = ఆశ తీరుట, న ఆపి = పొందబడలేదు,

భావము :

ఈ నలుడు ఆ దమయంతిని ఆసక్తితో పలుమారులు చూచినను మఱల చూచుచునే యుండెను. అట్లే యా నలుడు పట్టుదలతో ఆమెను పలుమాఱులు కౌగలించుకొనినను, మఱల కౌగిలించుచునే యుండెను. అవ్విధముగనే యాత డామెను పలుమాఱులు ముద్దిడుకొనినను, మఱల ముద్దిడుకొనుచునే యుండెను. ఆమెను ఆ విధముగా నలుడు ఎన్నిమాఱులు అనుభవించినను తనివితీరక యుండెను.

శ్లో. ఛిన్న మప్యతనుహారమణ్డలం
ముగ్ధయా సురత లాస్యకేలిభిః,
న వ్యతర్కి సుదృశా చిరాదపి
స్వేదబిన్దుకితవక్షసా హృది. 102

ప. వి. ఛిన్నమ్- అపి- తనుహారమణ్డలం- ముగ్ధయా- సురతలాస్యకేలిభిః- న- వ్యతర్కి-సుదృశా-చిరాత్-అపి-స్వేదబిన్దుకితవక్షసా-హృది.

అర్థము: ముగ్ధయా=సంభోగముచే మోహము చెందిన, సుదృశా = మంచి కన్నులుగల దమయంతిచే, సురతలాస్యకేలిభిః, సురత=సంభోగము లనెడి, లాస్యకేలిభిః=సంభోగక్రీడలచే, హృది=ఱొమ్ముపైనున్న, అతను= పెద్దదైన, హారమణ్డలం = ముత్తెపుసరముల సమూహము, ఛిన్నమపి=తెగినను, స్వేదబిందుకితవక్షసా; స్వేదబిందుకిత=చెమట బొట్టులతో కూడిన, వక్షసా=ఱొమ్ముగల్గిన యామెచే, న వ్యతర్కి= తెగినదిగా గ్రహింపబడలేదు, చెమటబొట్టులు ముత్తెపు దండలుగా భావింప బడినవి.

సమాసములు:

అతను- న తను=అతను.

*హారమణ్డలం- హారాణాం మణ్డలం=హారమణ్డలమ్.*

సురతలాస్యకేలిభిః- లాస్యస్య కేలయః=లాస్యకేలయః, సురతాన్యేవ లాస్యకేలయః=సురతలాస్యకేలయః, తాభిః=సురతలాస్యకేలిభిః.
స్వేదబిన్దుకితవక్షసా-స్వేదస్య బిందవః=స్వేదబిందవః, స్వేదబిందవః అస్య సంజాతా ఇతి=స్వేదబిందుకితం, స్వేదబిందుకితం వక్షః యస్యాః సా=స్వేదబిందుకితవక్షాః, తయా=స్వేదబిందుకితవక్షసా.

భావము :

సంభోగముచే మోహము చెందిన మనస్సుగల యా దమయంతి సంభోగము లనెడి నాట్యక్రీడలయందు తన రొమ్ముపై నుండిన ముత్తెపు సరముల సమూహము తెగినను, తన రొమ్ముపై సురతమునందు ఏర్పడిన స్వేదబిందువులను ముత్తెపుసరములని భ్రాంతిచెంది తెగిన విషయమును తెలుసుకొనలేక పోయినది.

శ్లో. యత్ తదీయహృది హారమౌక్తికై
రాసి తత్ర గుణ ఏవ కారణమ్,
అన్యథా కథ మముత్ర వర్తితుం
తైరశాకి న తదా గుణచ్యుతైః 103

ప. వి. యత్-తదీయహృది-హారమౌక్తికైః-ఆసి-తత్ర-గుణః- ఏవ-కారణమ్-అన్యథా-కథమ్-అముత్ర-వర్తితుం-తైః-అశాకి-న-తదా-గుణచ్యుతైః.

అర్థము: తదీయహృది; తదీయ=ఆ దమయంతికి సంబంధించిన, హృది=రొమ్మునందును, మనస్సునందును, హారమౌక్తికైః; హార=ముత్తెపు దండల యందలి, మౌక్తికైః=ముత్తెములచే, యత్=ఎందువలన, ఆసి=ఉండబడుట ఏర్పడెనో, తత్ర=ఆ యునికియందు, గుణ ఏవ చ=ఆ ముత్తెముల రంధ్రములలో ప్రవేశించిన దారమే, పక్షాంతరమున–ఆ ముత్తెములయొక్క ప్రకాశరూపమగు గుణమే, కారణం=హేతువు. అన్యథా=అట్లు కానిచో, తదా=ఆ సురతకాలమునందు, గుణచ్యుతైః; గుణ=దారమునుండి, చ్యుతైః=జారినట్టి, హారమౌక్తికైః=హారముల

లోని ముత్తెములచే, అముత్ర=ఆ వక్షఃస్థలము నందును, వర్తితుం=ఉండుటకు, కథం=ఎట్లు, న అశాకి=సాధ్యము కాదు?

**సమాసములు :**

*తదీయహృది* - తస్యాః ఇదం=తదీయం, తదీయం చ తత్ హృచ్చ=తదీయహృత్, తస్మిన్=తదీయహృది.
*హారమౌక్తికైః* - హారస్య మౌక్తికాని=హారమౌక్తికాని, తైః=హారమౌక్తికైః.
*గుణచ్యుతైః* - గుణాత్ చ్యుతాని=గుణచ్యుతాని, తైః=గుణచ్యుతైః.

**భావము :**

దమయంతియొక్క ఱొమ్మునందును, నంతరంగమునందును హారముల యందలి ముత్తెములుండుటకు గుణమే, అనగా ముత్తెముల రంధ్రములయందలి దారమే కారణము. పక్షాంతరమున-కాంతిమున్నగు గుణమే కారణము. ముత్తెముల రంధ్రములో దారము వానిని పడనీయక పట్టుకొనినదని మొదటిపక్షమున అర్థము. ముత్తెములలోని ప్రకాశగుణమే వానిని పడనీయక యూచినదని మరియొకపక్షమునందు అర్థము. గుణయుక్తములగు వానిని ఎవ్వరు తొలగింపరు గదా! అట్లు గుణములేకపోయినచో ననగా నొకపక్షమున దారము లేకపోయినచో మఱియొకపక్షమున – ప్రకాశరూపమగు గుణము లేకపోయినచో నా ముత్తెములు దమయంతియొక్క యక్కునందును, (మనస్సునందును) నెట్లుండగలవు? కాని దారముతెగని కొన్నిముత్తెములు మాత్రమే యామెఱొమ్మునందు ఉండినవి. కాని దారముతెగిన కొన్ని ముత్తెములు అందుండలేదు. దానికి గుణమే, (దారమే) ప్రకాశమే కారణము. అవిగుణరహితములై యున్నచో తప్పక పడిపోవలసిన స్థితియు, పరిగ్రహింపరానిస్థితియు నేర్పడి యుండెడిది. లోకమున గుణముతో, ననగా త్రాటితో గుచ్చని పూసలు జారిపోవును కదా ! అట్లే గుణముతో కూడని అనగా ప్రకాశము మున్నగు గుణముతో కూడని వాని నెవ్వరు పరిగ్రహింపరు కదా! ॥108॥

శ్లో. ఏకవృత్తిరపి మౌక్తికావలి
శ్ఛిన్నహారవితనౌ తదా తయోః,
ఛాయయాఽన్యహృదయేఽపి భూషణం
శ్రాన్తివారిభరభావితేఽభవత్. 104

ప. వి. ఏకవృత్తిః-అపి - మౌక్తికావళిః- ఛిన్నహారవితనౌ - తదా - తయోః- ఛాయయా-అన్యహృదయే - అపి - భూషణం - శ్రాన్తివారిభరభావితే- అభవత్.

అర్థము : తదా=దమయంతీ నలుల సంభోగకాలమునందు, తయోః=వారిరువురికిని మధ్య, ఏకవృత్తిః, ఏక=ఒక్కనలునియందే, వృత్తిః అపి=ఉనికికలిగియున్నగు, అనగా నలుని వక్షఃస్థలమునందున్నను, మౌక్తికావలిః=ముత్తెపుదండ, ఛిన్నహారవితతౌ, ఛిన్న=తెగిన, హారవితతౌ =హారములసమూహము కల్గిన, శ్రాంతివారిభరభావితే, శ్రాంతివారిభర= సంభోగకాలమున చెమటనీటివెల్లువచే, భావితే = తడుపబడిన, అన్య హృదయేఽపి, అన్య = మఱియొకతెయగు దమయంతియొక్క, హృదయేఽపి=వక్షఃస్థలమునందును, ఛాయయా =ప్రతిబింబముచే, భూషణం=అలఙ్కారముగా, అభవత్=ఆయెను.

వి. ఒక్క హారము ఇఱువురికి సంబంధము లేకపోయినను సంబంధమున్నట్లు చెప్పుటవలన సంబంధాఽతిశయోక్తి.

సమాసములు :

*ఏకవృత్తిః* - ఏకస్మిన్నేవ వృత్తిః యస్యాః సా=ఏకవృత్తిః
*మౌక్తికావలిః* - మౌక్తికానాం ఆవలిః=మౌక్తికావలిః.
*ఛిన్నహారవితతౌ* - హారాణాం వితతిః=హారవితతిః, ఛిన్నా హారవితతిః యస్మిన్ తత్=ఛిన్నహారవితతిః, తస్మిన్=ఛిన్నహారవితతౌ.
*అన్యహృదయే* - అన్యస్యాః హృదయం=అన్యహృదయం, తస్మిన్= అన్యహృదయే,

*శ్రాంతివారిభరభావితే* - వారీణాం భారః = వారిభారః, శ్రాంతేః వారిభారః=శ్రాంతివారిభారః, శ్రాంతివారిభరేణ భావితః=శ్రాంతివారిభరభావితః, తస్మిన్=శ్రాంతివారిభరభావితే.

భావము :

ఆ సంభోగకాలమందు దమయంతినలులమధ్య నొక్కడైన నలుని వక్షఃస్థలమునందే ముత్యాలదండ లున్నను అట్టి దండలు తెగిపోవుటవలన శూన్యమైనదియు, చెమటనీటివెల్లువచే దడిసినదియు నగు దమయంతివక్షఃస్థలమున నానలుని యక్కుపైని ముత్యాలదండలు ప్రతిబింబించినవై భూషణములుగా నైనవి. అనగా నలునివక్షఃస్థలములోని ముత్యాలదండలు దమయంతి వక్షఃస్థలములోని స్వేదజలమునందు బ్రతిబింబించి యావక్షఃస్థలమునకు భూషణములుగా నేర్పడినవని యాశయము. ॥104॥

శ్లో. వామపాదతలలుప్తమన్మథ
 శ్రీమదేన ముఖవీక్షిణాఽనిశమ్,
భుజ్యమాననవయౌవనాఽమునా
 పారసీమని చచార సా ముదామ్. 105

ప. వి. వామపాదతలలుప్తమన్మథశ్రీమదేన-ముఖవీక్షిణా- అనిశమ్ - భుజ్యమాననవయౌవనా-అమునా-పారసీమని-చచార-సా-ముదామ్.

అర్థము: వామపాదతలలుప్తమన్మథశ్రీమదేన; వామపాద = ఎడమకాలియొక్క, తల=అడుగుచే, అనగా చాలా విశాలమైన అంగముచే, లుప్త=అపహరింపబడిన, మన్మథశ్రీ=మన్మథుని సౌందర్యముయొక్క, మదేన = గర్వముగలిగిన, అనిశం = ఎల్లప్పుడు, ముఖవీక్షిణా = దమయంతి మోమును జూచుచున్న, అమునా=ఈ నలునిచే, భుజ్యమాననవయౌవనా, భుజ్యమాన=అనుభవింపబడుచున్న,నవయౌవనా=నూతనపు యౌవనము గలిగిన, సా=ఆ దమయంతి, ముదాం=సంతోషములకు, పారసీమని= కడపటిదశయందు, చచార=తిరిగినది, నల సంభోగమువలన పరమానంధము ననుభవించినదని యర్థము.

సమాసములు :

**వామపాదతలలుప్తమన్మథశ్రీమదేన**- వామశ్చాసౌ పాదశ్చ = వామపాదః, వామపాదస్య తలం=వామపాదతలం, వామపాదతలేన లుప్తః= వామపాదతలలుప్తః, మన్మథస్య శ్రీః = మన్మథశ్రీః, మన్మథశ్రియః మదః = మన్మథశ్రీమదః, వామపాదతలలుప్తః మన్మథశ్రీమదః యేన సః=వామపాదతలలుప్తమన్మథశ్రీమదః, తేన = వామపాదతలలుప్తమన్మథశ్రీమదేన.

**ముఖవీక్షిణా**- ముఖం వీక్షత ఇతి=ముఖవీక్షి, తేన=ముఖవీక్షిణా.

**భుజ్యమాననవయౌవనా**- నవం చ తత్ యౌవనం చ=నవయౌవనం, భుజ్యమానం నవయౌవనం యస్యాః సా=భుజ్యమాననవయౌవనా.

**పారసీమని**- పారస్య సీమా=పారసీమా, తస్మిన్=పారసీమని.

భావము :

మన్మథుని సౌందర్యగర్వమును తన యెడమకాలి యడుగుభాగముచేతనే యపహరించినట్టి మిక్కిలి యందగాడును, నెల్లప్పుడును దమయంతిమోమును జూచునట్టి నలుడు తన నూతనపుయౌవనమును అనుభవించుచుండగా నా దమయంతి యానందపరమావధియందు సంచరించినదని యాశయము. ॥105॥

శ్లో. అన్తరానపి తదఙ్గసంగమై
స్తర్పితా నవయవా నమన్యత,
నేత్రయో రమృతసారపారణం
తద్విలోకన మచింతయ న్నలః. 106

ప. వి. అన్తరాన్-అపి-తదఙ్గసంగమైః-తర్పితాన్ - అవయవాన్ - అమన్యత - నేత్రయోః-అమృతసారపారణం-తద్విలోకనమ్-అచింతయత్-నలః.

అర్థము: నలః=నలుడు, తదఙ్గసఙ్గమైః, తత్=ఆ దమయంతియొక్క, అఙ్గ= దేహముయొక్క, లేదా అవయవములయొక్క, సంగమైః=సంపర్కముచే, అంతరానపి=జొమ్మ మున్నగు వెలుపలి యవయవములనేకాక అంతః

కరణము మున్నగు లోపలియవయవములను సైతము, తర్పితాన్ = ఆనందపూర్ణములుగా, అమన్యత = తలంచెను, తథా = అట్లే, తద్విలోకనం = ఆమెను దర్శించుటను, నేత్రయోః = నేత్రములకు, అమృతసారపారణం,అమృతసార=అమృతములోని శ్రేష్ఠమగుభావముచే, పారణం=ఉపవాసముతరువాత చేసెడి భోజనవిధిగా, అచిన్తయత్ = ఆలోచించెను.

**సమాసములు :**

ఆన్తరాన్ - అన్తరే భవాః=ఆన్తరాః, తాన్=ఆన్తరాన్.

తదఙ్గసఙ్గమైః - తస్యాః అఙ్గాని=తదఙ్గాని, తదఙ్గానాం సఙ్గమాః= తదఙ్గసఙ్గమాః, తైః=తదఙ్గసఙ్గమైః.

అమృతసారపారణాం - అమృతస్య సారః=అమృతసారః, అమృత సారేణ పారణా=అమృతసారపారణా, తాం=అమృతసారపారణాం.

తద్విలోకనం - తస్యాః విలోకనం= తద్విలోకనం, తత్ = తద్వి లోకనం.

**భావము :**

నలుడు దమయంతియొక్క వెలుపలి యవయవములగు వక్షఃస్థలము మున్నగువానినే యానంద పఱచలేదు. మఱేమనగా లోపల యవయవములగు అన్తఃకరణము మున్నగువానిని కూడా నానందపఱచెను. అట్లే దమయంతీ దర్శనమును నేత్రములకు అమృతసారముచే ఉపవాసానంతర భోజన విధిగా భావించెను.

శ్లో. బహ్వామన్యత విదర్భజన్మనో
భూషణాని సదృశా న చేతసా,
తైరభావి కియదఙ్గదర్మనే
యత్పిధానమయ విఘ్నకారిభిః. 107

ప. వి. బహు-అమన్యత- విదర్భజన్మనః- భూషణాని- సః- దృశా-న-చేతసా-
తైః-అభావి-కియదఙ్గదర్శనే-యత్-పిధానమయ విఘ్నకారిభిః.

అర్థము :- సః=ఆ నలుడు, విదర్భజన్మనః=విదర్భ దేశమునందు జన్మించిన దమయంతియొక్క, భూషణాని=ఆభరణములను, దృశా=దృష్టి చేతనే, బహు=అధికముగా, అమన్యత=తలచెను. అనగా నాదరించెనని యర్థము. ఏలయనగా, నాయాభరణములు దమయంతియొక్క దేహావయవస్పర్శను బొందినవి గదా. చేతసా=మనస్సుచే, న బహు అమన్యత=అధికముగా నాదరించలేదు, యత్=ఎందువలన, తైః=ఆయాభరణములచే, కియదంగదర్శనే, కియదఙ్గ=కొన్ని యవయవములను, దర్శనే=చూచుటయందు, పిధానమయ విఘ్నకారిభిః, పిధానమయ=మఱుగుపరుచుట యను, విఘ్న=విఘ్నమును, కారిభిః=చేయునదిగా, అభావి=ఉండబడుట (ఏర్పడినది), ఇందువలన భూషణములకు నాదరము తక్కువగా నుండినదని యర్థము.

సమాసములు :

*విదర్భజన్మనః* - విదర్భేభ్యః జన్మ యస్యాస్సా = విదర్భ జన్మా, తస్యాః=విదర్భజన్మనః.
*కియదఙ్గ దర్శనే* - కియన్తి చ తాని అఙ్గాని = కియదఙ్గాని, కియదంగానాం దర్శనం=కియదఙ్గదర్శనం, తస్మిన్ = కియదఙ్గదర్శనే.
*పిధానమయవిఘ్నకారిభిః* - పిధానస్య వికారః = పిధానమయః, పిధానమయ శ్చాసౌ విఘ్నశ్చ = పిధానమయ విఘ్నః, పిధానమయ విఘ్నం కుర్వన్తీతి= పిధానమయ విఘ్నకారీణి, తైః=పిధానమయ విఘ్నకారిభిః.

భావము :

ఆ నలుడు దమయంతియొక్క భూషణములు ఆమెయొక్క సుంధరములగు నవయవములను దాకుటవలన వానిని తన దృష్టిచేతనే యాదరించెను. అనగా వానిని ఆదరముగా జూచెను. కాని మనస్సు చేత వాని నాదరింపలేదు.

ఏలయనగా నాయాభరణములు ఆ దమయంతియొక్క కొన్ని సుందరావయవ ములను గప్పుటవలన వానిని జూచుటకు విఘ్నములను గల్గించినవి. కాన వానిని మనసుచే నాదరింపలేదని యాశయము. ॥107॥

శ్లో. యోజనాని పరిరమ్భణేఽన్తరం
రోమహర్షజమపి స్మ బోధతః,
తౌ నిమేషమపి వీక్షణే మిథో
వత్సరవ్యవధి మధ్యగచ్ఛతామ్. 108

ప. వి. యోజనాని-పరిరమ్భణే-అన్తరం-రోమహర్షజమ్-అపి-స్మ-బోధతః-తౌ-నిమేషమ్-అపి-వీక్షణే-మిథః-వత్సరవ్యవధిమ్-అధ్యగచ్ఛతాం.

అర్థము : తౌ=ఆ దమయంతీ నలులు, పరిరమ్భణే = ఆలింగనకాలమందు, రోమహర్షజం=గగుర్పాటు వలన గలిగిన, అంతరమపి=వ్యవధినిగూడా, యోజనాని=యోజనముల దూరముగా, బోధతః స్మ=తెలుసుకొను చుండిరి, తథా=అట్లే, మిథః=ఒండొరులను, వీక్షణే=చూచుకొనుట యందు, నిమేషమపి=తెప్పపాటుకాలమునుగూడా అనగా కనులు మూసి కొని తెరచునంతటి కాలమును గూడా, వత్సరవ్యవధిం=సంవత్సరకాల వ్యవధానముగా, అధ్యగచ్ఛతాం=తెలిసికొనిరి.

సమాసములు :

*రోమహర్షజం*- రోమ్ణాం హర్షః=రోమహర్షః, రోమహర్షాత్ జాయత ఇతి=రోమహర్షజః, తం=రోమహర్షజం.
*వత్సరవ్యవధిమ్*- వత్సర ఏవ వ్యవధిః యస్య సః=వత్సరవ్యవధిః, తం=వత్సరవ్యవధిమ్.

భావము :

ఆ దమయంతీ నలులు ఒండొరులను గౌగిలించుకొనుటవలన నేర్పడిన గగుర్పాటులచే గలిగిన దూరమును సైతము యోజనముల దూరముగా భావించిరి.

అన్లే యొండొరులను జూచుకొనుటలో జెప్పపాట్ల వలన గలిగిన విప్నపుకాల మును సైతము సంవత్సరమంతటి వ్యవధానముగా భావించిరి. అనగా వారికి పరస్పరానురాగ మధిక మగుటవలన కొంది దూరమునుకూడా యోజనముల దూరముగను, కొలది యాలస్యమును కూడా సంవత్సరపు టాలస్యముగను భావించిరని యాశయము.

శ్లో. వీక్ష్య భావ మధిగన్తు ముత్సుకాం
పూర్వమచ్ఛమణికుట్టిమే మృదుమ్,
కో౽య మిత్యుదితసమ్భ్రమీకృతాం
స్వానుబిమ్బ మదదర్శ తై ష తామ్. 109

ప. వి. వీక్ష్య-భావం- అధిగన్తుమ్- ఉత్సుకాం- పూర్వమ్- అచ్ఛమణికుట్టిమే- మృదుం- కః- అయం- ఇతి- ఉదితసంభ్రమీకృతాం - స్వానుబింబమ్- అదదర్శత-ఏషః-తామ్.

అర్థము : ఏషః=ఈ నలుడు, తాం=ఆ ప్రియురాలిని, మృదుం=కోమలమైన దానినిగా, అనగా శ్రమ నోర్వలేనందువలన సడలిన యవయవములు గల దానినిగా (కావుననే) పూర్వం=తనకంటె మునుపు, భావం=త్యతిసుఖా వస్థను, అధిగన్తుం=పొందుటకు, ఉత్సుకాం=కోరిక గలిగిన దానినిగా వీక్ష్య=చూచి, అనగా గాఢాలింగనము మున్నగువానిచే తెలిసికాని, ''కో౽యం(సమాగతః)''ఈ వచ్చినవా డెవ్వడు? ఇతి=అని, ఉక్త్వా= పలికి, ఉదితసమ్భ్రమీకృతాం,ఉదిత=ఉద్భవించిన, సమ్భ్రమీకృతాం= భయముచే నదిరిన భావముగల ప్రియురాలిని గూర్చి, అచ్ఛమణికుట్టిమే, అచ్ఛ=స్వచ్ఛమైన, మణికుట్టిమే=రత్ననిబద్ధభూమియందు, స్వాను బింబం, స్వ=తనయొక్క, అనుబింబం=ప్రతిబింబమును, అదదర్శత= చూపించెను.

సమాసములు :

అచ్ఛమణికుట్టిమే- మణిమయ శ్చాసౌ కుట్టిమశ్చ=మణికుట్టిమః, అచ్ఛ శ్చాసౌ మణికుట్టిమశ్చ=అచ్ఛమణికుట్టిమః, తస్మిన్=అచ్ఛమణికుట్టిమే.

ఉదితసంభ్రమీకృతాం - ఉదితః సంభ్రమః యస్యాః సా=ఉదిత సమ్భ్రమా,అనుదితసమ్భ్రమా ఉదితసమ్భ్రమా సమ్పద్యమానా కృతా= ఉదితసమ్భ్రమీకృతా, తాం=ఉదిత సమ్భ్రమీకృతాం.

స్వానుబింబం- స్వస్య అనుబిమ్బః = స్వానుబిమ్బః, తం=స్వాను బింబం.

భావము :

వీరిరువురికిని సంభోగకాలమున చ్యుతిసుఖ మను దశ యనగా సుఖముపై నొక విధమైన విసుగు గలిగినదని యైదు శ్లోకములతో కవి వర్ణించుచున్నాడు. ఈ నలుడు కోమలములగు నవయవములు గలిగిన ప్రియురాలి శరీరము సంభోగ శ్రమచే బడలికను గొని సడలినందువలన నామెను తనకంటె బూర్వమే చ్యుతి సుఖమనెడి దశను బొందగోరిన దానినిగా గ్రహించి, యామెకు భయాశ్చర్యము లను గలిగించుటచే పతనమగుచున్న భావమును బంధించుటకై "ఈత డెవ్వ డిట వచ్చె"నని చెప్పెను. ఆ మాట వినగనే అతిగోప్యమైన సంభోగకాలమందు మఱి యొక పురుషుడు వచ్చుట విని, యామె భయమును నాశ్చర్యమును బొందగా, నా ప్రియురాలికి, రత్నసిబద్ధభూమియందు తన ప్రతిబింబమును జూపి ప్రతి బింబమున తనకు మరియొకడని భ్రాంతి కలిగినదని చెప్పి యామెయొక్క భయాశ్చర్యములను తొలగించెను. ఈ విధముగా నామెకు భావబంధనమును నలుడు గావించెను.

శ్లో. తత్క్షణావహిత భావభావిత ద్వాదశాత్మసిత దీధితిస్థితిః
ఆత్మనోనభిమతక్షణోదయాం భావలాభలఘుతాం నునోద సః. 110

ప.వి. తత్క్షణావహితభావభావితద్వాదశాత్మసితదీధితిస్థితిః - ఆత్మనః-అనభిమత క్షణోదయాం-భావలాభలఘుతాం-నునోద-సః.

అర్థము: సః = ఆ నలుడు, తత్క్షణావహితభావ భావిత ద్వాదశాత్మసితదీధితి స్థితిః, తత్క్షణ=సమీపించిన బీజచ్యుతి సమయమునందు, అవహితభావ=

ఏకాగ్రతచే, భావిత = ధ్యానింపఁబడిన, ద్వాదశాత్మ = సూర్యుని యొక్కయు, సితదీధితి = చంద్రుని యొక్కయు, స్థితిః = ఆకసమందలి వారి యునికి గలవాడై (అట్లు విషయాంతరమందు బుద్ధి నుంచుటచే చ్యుతికి నిరోధము గలిగిన), ఆత్మనః=తనయొక్క, అనభిమత క్షణోదయా, అనభిమత=ఇష్టముకాని, క్షణోదయా=కాలమందు ప్రాదుర్భావము గలిగిన, భావలాభలఘుతామ్; భావలాభ = చ్యుతి సుఖమును బడయుటకు లఘుతాం=వేగమును, నునోద=పోగొట్టెను. రతి రహస్యమునందు "తత్కాలే హృది సోమార్కధారణాత్" అని సూర్యచంద్రులను హృదయమునందు దలంచుటచే చ్యుతికి నిరోధము జరుగునని చెప్పబడినది.

**సమాసములు:**

*తత్క్షణావహితభావ భావితద్వాదశాత్మసితదీధితిస్థితిః-* స చాసౌ క్షణశ్చ =తత్క్షణః, అవహితశ్చాసౌ భావశ్చ=అవహిత భావః, తత్క్షణే అవహిత భావః=తత్క్షణావహితభావః, తత్క్షణావహితభావేన భావితా = తత్క్షణావహిత భావభావితా, ద్వాదశాత్మా చ సితదీధితిశ్చ=ద్వాదశాత్మ సితదీధితీ, ద్వాదశాత్మసితదీధిత్యోః స్థితిః=ద్వాదశాత్మసితదీధితి స్థితిః, తత్క్షణావహితభావభావితా ద్వాదశాత్మసితదీధితిస్థితిః యేన సః = తత్క్షణావహిత భావభావిత ద్వాదశాత్మసిదదీధితిస్థితిః.

*అనభిమతక్షణోదయాం-*న అభిమతః=అనభిమతః, అనభిమత శ్చాసౌ క్షణశ్చ=అనభిమతక్షణః, అనభిమతక్షణే ఉదయః యస్యాః సా= అనభిమతక్షణోదయా, తాం=అనభిమత క్షణోదయాం.

*భావలాభలఘుతాం-*భావస్య లాభః=భావలాభః, భావలాభే లఘుతా = భావలాభలఘుతా, తాం=భావలాభలఘ్నుతాం.

**భావము :**

ఆ నలుడు సురతకాలమునందు శీఘ్రముగా బీజస్ఖలనము గలుగకుండుటకై యేకాగ్రభావముతో నాకసమందున్న సూర్య చంద్రులను ధ్యానించెను. ౩౪)

లేదా సూర్య చంద్ర సంజ్ఞలుగల యిడాపింగళలనెడి నాడులలో వాయువును నిరోధించెను. తొలుత దమయంతికి బీజస్ఖలనమును వారించిన పిదప తనకు నామెకంటె మునుపే బీజస్ఖలనము ప్రారంభమగుచో నపుడు నలుడు ఆకస మందలి సూర్యచంద్రులను ధ్యానించుటచే తన మనస్సును మరియొక విషయము వైపు మరలించినవా డాయెను. "అన్యచిత్తతయా సమ్భ్రమజననేన భావబంధం కుర్యాత్" అని కామశాస్త్రవచనము ననుసరించి తన బీజస్ఖలనము నతడు నిరోధించుకొనెను. లేదా సూర్యసంజ్ఞగల ఇడానాడియందును చంద్రసంజ్ఞగల పింగళనాడియందును వాయువును నిరోధించుటవలన బీజనిరోధ మగును. అందులో "దక్షిణా నాసా ముద్రణే పురుషస్య, వామనాసా ముద్రణే యోషితః బిందుస్తమ్భో భవతి" యను కామశాస్త్రవచనము ననుసరించి పురుషుడు కుడి ముక్కునందును స్త్రీ యెడమ ముక్కునందును వాయువును బిగించినచో బీజస్ఖలన నిరోధ మేర్పడును. కాన నీవిధముగా నతడు తనకును దమయంతికి సురత మందు బీజనిరోధమును గావించెనని భావము. ॥110॥

శ్లో. స్వేన భావభజనే స తు ప్రియాం
బాహుమూలకుచనాభి చుమ్బనైః,
నిర్మమే రతిరహస్సమాపనా
శర్మసార సమసంవిభాగినీమ్. 111

ప.వి. స్వేన - భావభజనే-సః-తు - ప్రియాం-బాహుమూలకుచనాభిచుమ్బనైః- నిర్మమే-రతిరహస్సమాపనాశర్మసారసమసంవిభాగినీమ్.

అర్థము: తు=మరల, సః=ఆ నలుడు, భావభజనే=చ్యుతి సుఖమును బొందు విషయమున, బాహుమూల కుచ నాభి చుమ్బనైః, బాహుమూల=కక్షముల యందును, కుచ=స్తనములపైనను, నాభి=బొక్కిలియందును, చుమ్బనైః = వరల కామోద్దీపనము గలుగుటకై ముద్దులిడుటయను నుపాయములచే, స్వేన = తనతోడ, ప్రియాం = ప్రియురాలైన దమయంతిని, రతిరహస్సమాపనాశర్మసార సమసంవిభాగినీం, రతి రహః=సంభోగ రహస్యమును, సమాపనా=ముగించునప్పటి, శర్మ సార = చ్యుతిసుఖముయొక్క యాధిక్యమునందు, సమసంవిభాగినీం= సమానసుఖమును బొందుదానినిగా, నిర్మమే = చేసెను.

**సమాసములు :**

భావభజనే-భావస్య భజనం=భావభాజనం, తస్మిన్ భావభాజనే.
బాహుమూల కుచ నాభి చుమ్బనైః-బాహుమూలం చ కుచౌ చ నాభిశ్చ= బాహుమూలకుచనాభి, బాహుమూల కుచ నాభేః చుమ్బనాని = బాహు మూలకుచనాభిచుమ్బనాని, తైః=బాహుమూలకుచనాభి చుమ్బనైః.
రతిరహస్సమాపనా శర్మసార సమసంవిభాగినీం- రతేః రహః=రతి రహః, రతిరహసః సమాపనా=రతిరహస్సమాపనా, శర్మణః సారః= శర్మసారః, రతిరహస్సమాపనాయాం శర్మసారః=రతిరహస్సమాపనా శర్మసారః, రతిరహస్సమాపనాశర్మసారే సమః సంవిభాగః అస్యాః అస్తీతి=రతిరహస్సమాపనా శర్మసార సమసంవిభాగినీ. తాం=రతి రహస్సమాపనా శర్మసార సమసంవిభాగినీం.

**భావము :**

మఱల నా నలుడు చ్యుతిసుఖమును బొందు విషయమున బాహుమూల ములయందును, స్తనముల యందును, పొక్కిలియందును ముద్దులిడుట యను కామోద్దీపనపు టుపాయములచే తనతోడ ప్రియురాలగు దమయంతిని చ్యుతి సుఖాతిశయమునందు సమాన సుఖము కలదానినిగా జేసెను. ఒక్క సమయము నందే యుభయులకు బీజనిస్సరణము గలుగుట వలన సమాన సుఖ మేర్పడును. విప్రలంభమందు వారికి సమానశక్తి యెట్లు అవసరమో సంభోగమునందును నది యవసరమని గ్రహింపవలయును.

శ్లో. విశ్లథై రవయవై ర్నిమీలయా
లోమభిర్ద్రుతమితై ర్వినిద్రతామ్,
సూచితం శ్వసిత సీత్కృతైశ్చ తౌ
భావమక్రమజ మధ్యగచ్ఛతామ్. 112

ప. వి. విశ్లథైః-అవయవైః-నిమీలయా- లోమభిః- ద్రుతమ్-ఇతైః-వినిద్రతాం- సూచితం-శ్వసితసీత్కృతైః-చ-తౌ-భావం-అక్రమజం- అధ్యగచ్ఛతాం.

అర్థము : తాః = ఆ దమయంతీ నలులు, విశ్లథైః = సడలినటువంటి, అవయవైః = చేతులు మున్నగు నవయవములచే, నిమీలయా = అధిక సుఖము ననుభవించుటవలన గలిగిన కన్నుల మోడ్పు చేతను, ద్రుతం = వెంటనే, వినిద్రతాం = వికాసమును, ఇతైః = పొందినటువంటి, లోమభిః = రోమములచేతను, తథా = అట్లే, శ్వసిత సీత్కృతైశ్చ; శ్వసిత = నిట్టూర్పులచేతను, సీత్కృతైశ్చ = సీత్కారములచేతను, సూచితం = సూచింపబడిన, అక్రమజం = క్రమములేక యేర్పడునట్టి, భావం = చ్యుతి సుఖమును, అధ్యగచ్ఛతాం = పొందిరి, లేదా తెలుసుకొనిరి.

సమాసములు :

వినిద్రతాం - విగతా నిద్రా యేషాం తాని = వినిద్రాణి, వినిద్రాణాం భావః = వినిద్రతా, తాం = వినిద్రతాం.

శ్వసిత సీత్కృతైః - శ్వసితాని చ సీత్కృతాని చ = శ్వసిత సీత్కృతాని, తైః = శ్వసిత సీత్కృతైః.

అక్రమజం - అవిద్యమానః క్రమః యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = అక్రమం, అక్రమం జాయత ఇతి = అక్రమజః, తం = అక్రమజం.

భావము :

ఆ దమయంతీనలులు సంభోగముచే సడలిన హస్తాద్యవయవముల చేతను రతిసుఖము ననుభవించుట వలన నేర్పడినట్టి కనుమోడ్పు చేతను శీఘ్రముగా నిక్కికొనిన రోమములచేతను, నట్లే శ్రమవలన నేర్పడిన నిట్టూర్పుల చేతను, దంతక్షతాదుల వలని సీత్కారముల చేతను సూచింపబడినదై, యొక్క కాలమందే యేర్పడిన చ్యుతిసుఖము నిరువురును తెలిసికొనిరి. ఇందువలన నుభయుల యందును సమానురాగము యేర్పడుచున్నది. అట్లు కానిచో నొక్కరికి పూర్వమే చ్యుతి యేర్పడినచో తరువాత చ్యుతి యేర్పడిన వ్యక్తి యందు విరక్తి గలుగును గాన సమానురాగమునకు భంగ మేర్పడును.

శ్లో. ఆస్త భావ మధిగచ్ఛతో స్తయో
స్సమ్మదేషు కరజప్రసర్పణా,
ఫాణితేషు మరిచావచూర్ణనా
సాస్ఫుటం కటురపి స్పృహావహా. 113

ప. వి. ఆస్త-భావం-అధిగచ్ఛతోః - తయోః - సమ్మదేషు - కరజప్రసర్పణా-ఫాణితేషు-మరిచావచూర్ణనా-సా-స్ఫుటం-కటుః-అపి-స్పృహావహా.

అర్థము : భావం=చ్యుతి సుఖమును, అధిగచ్ఛతోః=పొందుచున్న, తయోః= ఆ దమయన్తీ నలులయొక్క, కరజప్రసర్పణా=మరల నొండొరుల యొక్క నఖక్షత వ్యాపారము, సమ్మదేషు= ఆనంద లాభములయందు, ఆస్త=ఉండినది, సా = ఆ నఖక్షత మనెడి క్రియ, కటురపి= తీక్ష్ణ మైనను (కారమైనను), ఫాణితేషు=పానకము, పాలు మున్నగు మధుర ద్రవ్యములయందు, మరిచావచూర్ణనా, మరిచ=మిరియముల యొక్క, అవచూర్ణనా (ఇవ)=పొడులను చేర్చునట్లు, స్ఫుటం = స్పష్టముగా, స్పృహావహా=రుచిని గొల్పునది గదా! అనందమును చేకూర్చునట్టి వానిలో చేరిన నఖక్షతము మధుర సాధకములయందు మిరియాల పొడిని చేర్చుట వంటిదై రుచికరమైదని యర్థము.

వి. ''యా ఇయం సమ్మదేషు నఖార్పణా'' అను వాక్యార్థమునకును ''సా ఫాణితేషు మరిచావచూర్ణవత్ ఇష్టా ఇవాభూత్'' అను వాక్యార్థ మునకును సాదృశ్యముండుట వలన అసమ్భవ ద్వస్తుసమ్బన్ధ రూపమగు వాక్యార్థ వృత్తి నిదర్శనాలంకారము.

సమాసములు :

*కరజప్రసర్పణా-కరజానాం ప్రసర్పణా=కరజప్రసర్పణా.*
*మరిచావచూర్ణనా* - మరిచానామ్, అవచూర్ణనా = మరిచావచూర్ణనా,
*స్పృహావహా*-స్పృహాం ఆవహతీతి=స్పృహావహా.

భావము :

చ్యుతిసుఖము ననుభవించునట్టి యా దంపతులు మఱల నఖక్షతములు గావించుకొనుట యానందప్రదములగు వ్యాపారములలోనే చేరినది. ఏల యనగా, పాలు పానకములు మున్నగు మధుర పదార్థములయందు కారమైనను మిరియాల పొడిని చేర్చుట రుచికరము కదా ? అట్లే మధురములగు వారి సుఖములయందు పీడాకరమగు నఖక్షతముకూడా జేరి సుఖకరముగనే యుండినదని యాశయము. ॥118॥

శ్లో. అర్ధమీలిత విలోలతారకే
సాదృశౌ నిధువనక్లమాలసా
యన్ముహూర్త మవహన్న తత్పున
స్తృప్తిరాస్త దయితస్య పశ్యతః. 114

ప. వి. అర్ధమీలిత విలోలతారకే-సా-దృశౌ-నిధువనక్లమాలసా-యత్ - ముహూర్తమ్-అవహత్-న-తత్-పునః-తృప్తిః-ఆస్త-దయితస్య-పశ్యతః.

అర్థము: నిధువనక్లమాలసా = నిధువన – సురతము వలన, క్లమ - శ్రమచే, అలసా=సడలిన, సా=ఆ దమయంతి, ముహూర్తం=కొంతకాలము, యత్=ఏ, అర్ధమీలితవిలోలతారకే, అర్ధ=సగము, మీలిత=మూయబడిన, విలోల=చంచలములగు, తారకే=పాపలు గలిగిన, దృశౌ= నేత్రములను, అవహత్=వహించినదో, తత్=దానిని, పశ్యతః = చూచుచున్న, దయితస్య = ప్రియుడైన నలునకు, పునః = మరల, తృప్తి=కోరిక తీరుట, నాస్త=ఉండలేదు,మిక్కిలి యందముగా నుండుట వలన మాటిమాటికి నా స్థితిని నలుడు చూచెను.

భావము :

ఆ దమయంతి సురతశ్రమచే కొంతకాలము తన కన్నులను సగము పాలు మూసుకొని చంచలములగు కనుపాపలు గలదిగా నుండినది. ఆ దశ ఎంతనో రమ్యముగా నుండుటవలన దానిని పలుమారు చూచుచున్నను నలునకు తనివి తీరలేదు.

శ్లో. తత్క్లమ స్త మదిదీక్షత క్షణం
తాలవృన్తచలనాయ నాయకమ్
తద్విధాధిభవధూననక్రియా
వేధసోఽపి విదధాతి చాపలమ్. 115

ప. వి. తత్క్లమః-తమ్-అదిదీక్షత-క్షణం - తాలవృన్తచలనాయ - నాయకం-తద్విధాధిభవధూననక్రియా-వేధసః-అపి-విదధాతి-చాపలమ్.

అర్థము: తత్క్లమః, తత్=ఆ దమయంతియొక్క, క్లమః=శ్రమ, తం=ఆ, నాయకం=నాయకుడగు నలుని, తాలవృన్తచలనాయ; తాలవృన్త=విసనకఱ్ఱను, చలనాయ=కదలించుటకై, అనగా విసనకఱ్ఱతో వీచుటకై, అదిదీక్షత = ప్రవర్తింపఁ జేసినది, తథాహి=అది యుచితమే, ఏల యనగా- తద్విధాధిభవధూననక్రియా, తద్విధ = అటువంటి, ఆధి=శ్రమ భయముచే, భవ=ఏర్పడిన సంతాపమందు, ధూననక్రియా=విసరునట్టి పని, వేధసోఽపి=బ్రహ్మకును, చాపలం=చాంచల్యమును, విదధాతి=కలిగించుచున్నది. అనగా జితేంద్రియుడగు బ్రహ్మకే యది చాంచల్యమును గల్గించునపుడు తక్కినవారికి గల్గింపదని చెప్పనేల ?

వి. బ్రహ్మకే చాపల్యమును గల్గించినది. ఇతని కేల గల్గింపదని చెప్పుటచే నర్థాపత్త్యలంకారము.

సమాసములు :

తత్క్లమః-తస్యాః క్లమః, తాలవృన్తచలనాయ-తాలవృన్తస్య చలనం=తాలవృన్తచలనం, తస్మై=తాలవృన్తచలనాయ.

తద్విధాధిభవధూననక్రియా-సా విధా యస్య సః=తద్విధః, తద్విధశ్చాసౌ ఆధిశ్చ=తద్విధాధిః, తద్విధాధేః భవః=తద్విధాధిభవః, తద్విధాధిభవే ధూననం = తద్విధాధిభవదూననం, తద్విధాధిభవధూననమేవ క్రియా=తద్విధాధిభవధూననక్రియా.

భావము :

ఆ దమయంతి కేర్పడిన యా బడలిక యా మెయొక్క నాథుడగు నలుని కొంతకాలము విసనకఱ్ఱతో విసురునట్లు పురికొలిపినది. ఇది యుక్తమే. ఏల యనగా - నట్టి సురతజన్య శ్రమను బోగొట్టుటకై విసనకఱ్ఱచే వీచునట్టి పని బ్రహ్మకుగూడఁ జిత్తచాపల్యమునుఁ గల్గించునట్టిది. ఇఁక మానవుడగు నలునకు చిత్త చాంచల్యము గలుగునని చెప్పనేల ? ॥115॥

శ్లో. స్వేదబిందుకితనాసికాశిఖం
తన్ముఖం సుఖయతి స్మ నైషధమ్,
ప్రోషితాధరశయాలుయావకం
సంవిలుప్తతిలకం కపోలయోః. 116

ప.వి. స్వేదబిన్దుకితనాసికాశిఖం—తన్ముఖం-సుఖయతి—స్మ-నైషధం- ప్రోషితాధరశయాలుయావకం—సంవిలుప్తతిలకం—కపోలయోః.

అర్థము: స్వేదబిన్దుకితనాసికాశిఖం, స్వేదబిన్దుకిత = చెమట బొట్టులతో గూడిన, నాసికాశిఖం = ముక్కుకొన గల్గిన, ప్రోషితాధరశయాలు యావకం, ప్రోషిత = అధరపానాదులచే దొలఁగిన, అధర = పెదవియందలి, యావకం = లత్తుకగల్గిన, కపోలయోః = కణతలయందు, సంవిలుప్త తిలకం, సంవిలుప్త = లోపించిన, తిలకం = బొట్టు గలిగిన, తన్ముఖం = ఆ దమయంతియొక్క మోము, నైషధం = నలుని, సుఖయతి స్మ = సుఖపఱచుచుండినది.

సమాసములు :

*స్వేదబిన్దుకితనాసికాశిఖం*— స్వేదస్య బిందవః = స్వేదబిందవః, స్వేదబిన్దవః, ఆస్యాస్సంజాతా ఇతి = స్వేదబిన్దుకితా, నాసికయాః శిఖా = నాసికాశిఖా, స్వేదబిన్దుకితా నాసికా శిఖా యస్య తత్ = స్వేదబిన్దుకితా నాసికాశిఖం.

*తన్ముఖం*— తస్యాః ముఖం = తన్ముఖం.

నైషధం– నిషధానాం రాజా=నైషధః, తం=నైషధం.

ప్రోషితాధరశయాలు యావకం- అధరే శేతే ఇతి=అధరశయాలుః, అధరశయాలు శ్చాసౌ యావకశ్చ=అధరశయాలు యావకః, ప్రోషితః అధరశయాలు యావకః యస్య తత్=ప్రోషితాధరశయాలుయావకం. సంవిలుప్తతిలకం – సంవిలుప్తః తిలకః యస్య తత్=సంవిలుప్త తిలకం.

భావము :

చెమట బొట్టులతో గూడిన ముక్కుకొన గలిగినదియు, నధరపానాదులచే దొలగిపోయిన పెదవులపైని లత్తుకగలదియు, ముద్దిడుటచే కణతలయందు దొలగిపోయిన తిలకము గలదియునగు నా దమయంతి మోము, నలుని సంతోష పఱచినది.

శ్లో. హ్రీణమేవ పృథు సస్మయం కియత్
క్లాన్తమేవ బహునిర్వృతం మనాక్,
కాన్తచేతసి తదీయ మాననం
తత్తదాఽలభత లక్ష మాదరాత్. 117

ప వి. హ్రీణమ్-ఏవ-పృథు-సస్మయం-కియత్-క్లాన్తమ్-ఏవ-బహు-నిర్వృతం-మనాక్-కాన్తచేతసి-తదీయమ్-ఆననం-తత్-తదా- అలభత - లక్షమ్-ఆదరాత్.

అర్థము: పృథుఏవ=అధికముగానే, హ్రీణం=(సురతకాలమందు దానేసిన పనులను స్మరించుటచే) సిగ్గునొందినదియు, కియత్=కొంచెము, సస్మయం =(సురత కాలమందు ప్రియుని సంతోషపఱచుటకు తన సామర్థ్యమును స్మరించుటచే) గర్వముతో గూడినదియు,(తథా=అట్లే) బహు= అధికముగా, క్లాన్తం = చాలకాలము సురతపరిశ్రమవలన బడలిక గొన్నదియును, మనాక్ = కొంచెము, నిర్వృతం = (కామ వేగము కొంచెము మందగించుట వలన) సుఖించినదియు నగు, తదీయం = ఆ

దమయంతికి సంబంధించినదైన, తత్ = లజ్జయు, గర్వము మున్నగు భావములు చేరుటవలన మనోహరమైన యా, ఆననం=ముఖము, తదా= ఆ కాలమునందు ననగా సురతము ముగిసిన పిదప, కాన్తచేతసి = ప్రియుడగు నలుని మనస్సునందు, ఆదరాత్ = మఱల ప్రియుని చిత్తమున నాదరమును గలిగించుటవలన, లక్ష్మం=నెపమును అనగా నుద్దీపకముగా నుండుటచే మఱల సురతకేళికి కారణమగుటను, అలభత = పొందినది. అన్ని దశలయందును నామె మోము మనోహరమై యుండినదని యర్థము.

సమాసములు :

సస్మయం-స్మయేన సహ వర్తత ఇతి=సస్మయం.
కాన్తచేతసి-కాన్తస్య చేతః=కాంతచేతః, తస్మిన్=కాన్తచేతసి.

భావము :

ఆ దమయంతి మోము సురతకాలమునందు తా జేసిన పనులను స్మరించుటచే అధికముగా సిగ్గును బొందినదియు నట్లే సురత కాలమందు ప్రియుని సంతోషపరచుటకు తాచేసిన పనులను స్మరించుటచే గర్వము నొందినదియు, నట్లే సురతమందలి పరిశ్రమచే మిక్కిలి బడలిక గొన్నదియు, కామ వేగము మందగించుట వలన కొంచెము సుఖము నందినదియునై మఱల ప్రియునికి నాదరము గల్గించుటవలన నతనికి నుద్దీపకముగా నుండినది.

శ్లో. స్వేదవారిపరిపూరితం ప్రియా
రోమకూపనివహం యథా యథా
నైషధస్య దృగపాత్ తథా తథా
చిత్రమాప దపతృష్ణతాం న సా. 118

ప. వి. స్వేదవారిపరిపూరితం - ప్రియారోమకూపనివహం - యథా - యథా - నైషధస్య - దృక్ - అపాత్ - తథా - తథా - చిత్రం - ఆపత్ - అపతృష్ణతాం - న - సా.

అర్థము: నైషధస్య=నలునియొక్క, దృక్=దృష్టి, స్వేదవారిపరిపూరితం; స్వేదవారి= చెమటనీటితో, పరిపూరితం=నిండిన, ప్రియారోమకూపనివహం, ప్రియా=ప్రియురాలియొక్క, రోమకూప=రోమరంధ్రముల యొక్క, నివహం=సమూహమును, యథా యథా=ఏయే విధముగా అనగా నెంతెంత పరిమాణముతో, అపాత్=పానము గావించెనో, సా= ఆ దృష్టి, తథా తథా=అంతంత పరిమాణముతోడనే, అపతృష్ణతాం= దాహమును శమించుకొనియుండుటను, ఆపత్=పొందలేదు. ఇతి= అనునది, చిత్రం=ఆశ్చర్యము. పెక్కురోమకూపములయందలి యనగా పెక్కు బావులయందలి నీరును ద్రాగినను దాహము శమింపలేదని యర్థము.

వి. పెక్కుబావుల నీటిని త్రాగినను దాహము తీరలేదనుట విరుద్ధము. కాన విరోధాభాసాలంకారము. లోకోత్తర వస్తు దర్శనముచే తృష్ణ యనగా నాశ వర్ధిల్లును గాన విరోధమునకు పరిహారము.

సమాసములు :

స్వేదవారిపరిపూరితం-స్వేద ఏవ వారి= స్వేదవారి, స్వేదవారిణా పరిపూరితః=స్వేదవారిపరిపూరితః, తం=స్వేదవారిపరిపూరితం.
ప్రియారోమకూపనివహం-రోమ్ణాం కూపాః = రోమకూపాః, రోమ కూపానాం నివహః = రోమకూపనివహః, ప్రియాయాః రోమ కూపనివహః = ప్రియారోమకూపనివహః, తం = ప్రియా రోమ కూపనివహం.
అపతృష్ణతాం-అపగతా తృష్ణా యస్యాః సా=అపతృష్ణా, అపతృష్ణాయాః భావః=అపతృష్ణతా, తాం=అపతృష్ణతాం.

భావము :

నలుని దృష్టి చెమటనీటితో నిండిన దమయంతియొక్క రోమకూపముల నెంతెంత పరిమితితో బానము గావించినదో యనగా నాదరముతో జూచినదో యంతంత దాహమునే యది పొందినది. ఇది యాశ్చర్యకరమైన విషయము.

ఏలయనగా - రోమకూపము లనెడి పెక్కు బావులలో నీరు త్రాగినను నలుని దృష్టికి దాహము తీరలేదు. ఆ నలుడు చెమటతో నిండిన యా దమయంతియొక్క రోమకూపములను నెంతకాలము చూచినను తనివి తీరలేదని యాశయము.

శ్లో. వాన్తమాల్యకచహస్తసంయమ
న్యస్త హస్త యుగయా స్ఫుటీకృతం,
బాహుమూల మనయా సముజ్జ్వలం
వీక్ష్య సౌఖ్యజలధౌ మమజ్జ సః. 119

ప వి. వాన్తమాల్యకచహస్తసంయమన్యస్తహస్తయుగయా-స్ఫుటీకృతం- బాహుమూలమ్-అనయా-సముజ్జ్వలం-వీక్ష్య-సౌఖ్యజలధౌ-మమజ్జ-సః.

అర్థము : సః = ఆ నలుడు, వాన్తమాల్యకచహస్తసంయమన్యస్తహస్తయుగయా, వాన్త = విడువబడిన, మాల్య = పుష్పమాలలు గలిగిన, కచహస్త = కేశపాశమును, సంయమ = ముడివేయుటకై, న్యస్త = ఉంచబడిన, హస్తయుగయా = చేదోయి గలిగిన, అనయా = ఈ దమయంతిచే, స్ఫుటీకృతం = కనుబరచబడిన, ఉజ్జ్వలం = రమణీయమైన, బాహుమూలం = కక్షదేశమును, వీక్ష్య = చూచి, సౌఖ్యజలధౌ = ఆనందసాగరమునందు, మమజ్జ = మునిగెను. బాహుమూలదర్శనము కామోద్దీపకమని యర్థము.

సమాసములు :

వాన్తమాల్యకచహస్త సంయమన్యస్త హస్తయుగయా - వాన్తం మాల్యం యేన సః = వాన్తమాల్యః, వాన్తమాల్య శ్చాసౌ కచహస్తశ్చ = వాన్తమాల్యకచహస్తః, వాన్తమాల్య కచహస్తస్య సంయమః = వాన్త మాల్య కచహస్త సంయమః, వాన్తమాల్య కచహస్తసంయమే న్యస్తంహస్తయుగం యయా సా = వాన్తమాల్య కచహస్త సంయమ న్యస్త హస్తయుగా, తయా = వాన్త మాల్య కచహస్త సంయమన్యస్త హస్తయుగయా,

స్ఫుటీకృతం - అస్ఫుటః స్ఫుట స్సమ్పద్యమానః కృతః = స్ఫుటీకృతః, తం=స్ఫుటీకృతం.
సౌఖ్యజలధౌ-సౌఖ్యమేవ జలధిః = సౌఖ్యజలధిః, తస్మిన్ = సౌఖ్య జలధౌ.

భావము :

సంభోగవేగముచే దమయంతి కొప్పునందలి పూలు జారి ముడి వీడిపోయినది. దానిని ముడివైచుకొనుటకై తన చేదోయిని పైకెత్తుచుండగా రమణీయమగు నామెయొక్క బాహుమూలమును జూచి నలుడు ఆనందసాగరమందు మునిగెను. బాహు మూలదర్శనము కామోద్దీపకమని ప్రసిద్ధి. ॥119॥

శ్లో. వీక్ష్య పత్యు రధరం కృశోదరీ
బంధుజీవ మివ భృఙ్గసఙ్గతం,
మఞ్జులం నయనకజ్జలై ర్నిజై
స్సంవరీతు మశకత్ స్మితం న సా. 120

ప. వి. వీక్ష్య-పత్యుః-అధరం-కృశోదరీ-బంధుజీవమ్ - ఇవ - భృఙ్గసఙ్గతం - మఞ్జులం-నయనకజ్జలైః-నిజైః-సంవరీతుం-అశకత్-స్మితం-న-సా.

అర్థము: కృశోదరీ = పలుచని యుదరము కలిగిన, సా = ఆ దమయంతి, మఞ్జులం=రమ్యమైన, పత్యుః=భర్తయగు నలునియొక్క, అధరం= పెదవిని, నిజైః=తనవియైన, నయనకజ్జలైః, నయన = నేత్రముల యందలి, కజ్జలైః=కాటుకలచే, భృఙ్గసఙ్గతం-భృఙ్గ = తుమ్మెదలతో, సఙ్గతం=కూడిన, బంధుజీవమివ=దాసానిపూవువలె, స్థితం=ఉన్నదిగా, వీక్ష్య=చూచి, స్మితం=చిరునగవును, సంవరీతుం=కప్పిపుచ్చుటకును, న అశకత్=శక్తురాలు కాలేదు.

సమాసములు :

కృశోదరీ-కృశం ఉదరం యస్యాః సా=కృశోదరీ.

భృఙ్గసఙ్గతం-భృఙ్గైః సంగతః=భృఙ్గసఙ్గతః, తం=భృఙ్గసంఙ్గతం. నయనకజ్జలైః- నయనస్య కజ్జలాని=నయనకజ్జలాని, తైః=నయన కజ్జలైః.

భావము :

పలుచని యుదరము కలిగిన దమయంతి తన కాటుకకన్నులను నలుడు ముద్దిడుకొనునపుడు కాటుక తగిలి నల్లనిమరకలు గలిగిన యాతని యెఱ్ఱని పెదవిని, నల్లని తుమ్మెదలతో గూడిన యెఱ్ఱని దాసానిపూవువలె నున్నదానినిగా జూచి, తనకు గలిగిన చిరునగవును గప్పిపుచ్చుటకు శక్తురాలు కాలేదు. కాటుక యంటిన యాతని పెదవిని చూడగనే యామెకు నవ్వు వచ్చినది. కాని దానిని గప్పిపుచ్చ ప్రయత్నించినను శక్యము కాలేదు. ॥120॥

శ్లో. తాం విలోక్య విముఖశ్రితస్మితాం
పృచ్ఛతో హసితహేతు మీశితుః,
హ్రీమతీ వ్యతర దుత్తరం వధూః
పాణి పఙ్కరుహి దర్పణార్పణామ్. 121

ప. వి. తాం-విలోక్య-విముఖశ్రితస్మితాం-పృచ్ఛతః-హసితహేతుమ్-ఈశితుః-హ్రీమతీ-వ్యతరత్-ఉత్తరం-వధూః-పాణిపఙ్కరుహి-దర్పణార్పణామ్.

అర్థము: తాం=ఆ దమయంతిని, విముఖశ్రితస్మితాం, విముఖ=పెడముఖముగా, శ్రితస్మితాం=చిఱునగవు గలదానినిగా, విలోక్య=చూచి, హసిత హేతుం; హసిత=నవ్వునకు, హేతుం=కారణమును, పృచ్ఛతః= అడుగుచున్న, ఈశితుః=భర్తయగు నలునియొక్క, పాణిపఙ్కరుహి= హస్తపద్మమునందు, హ్రీమతీ=లజ్జగలిగిన, వధూః=దమయంతి, దర్పణార్పణాం; దర్పణ=అద్దమును, అర్పణాం=ఉంచుటను, ఉత్తరం =బదులుగా, వ్యతరత్=ఇచ్చెను, అతని పెదవిపైని కాటుక మరకను జూచుకొనుటకై యద్దము నుంచినదని యాశయము.

సమాసములు :

**విముఖ్రశితస్మితాం**-విముఖం శ్రితం స్మితం యస్యాస్సా=విముఖశ్రిత స్మితా, తాం=విముఖశ్రితస్మితాం.
**హసితహేతుం**-హసితస్య హేతుః = హసితహేతుః; తం=హసిత హేతుం.
**హ్రీమతీ**-హ్రీః అస్యాః అస్తీతి=హ్రీమతీ.
**పాణిపఙ్కరుహి**-పాణిః పఙ్కరుడివ=పాణిపఙ్కరుట్, తస్మిన్= పాణిపఙ్కరుహి.
**దర్పణార్పణాం** - దర్పణస్య అర్పణా = దర్పణార్పణా, తాం= దర్పణార్పణాం.

భావము :

ఆ దమయంతి ముఖమును వెనుకకు మరలించి నవ్వుటను జూచి, యట్లు నవ్వుటకు కారణమును నలు డడుగగా యామె బదులు చెప్పక, యాతని హస్తమునందు నద్దమునుంచి దానినే బదులుగా జేసినది. అనగా నీ ముఖము నద్దమునందు జూచుకొనుము. అపుడు నీకే దాని కారణ మవగత మగును అని ఆమె భావము. అద్దమునందు ముఖమును జూచినచో నతని పెదవికంటిన కాటుక గీత లతనికే కనబడును. అవి యామెయొక్క కన్నులను ముద్దిడుకొనుటచే తన పెదవి కంటినవని యతడు గ్రహింపగలుగుననియు, నా కాటుక గీతలే నవ్వునకు కారణమనియు నాశయము.॥121॥

శ్లో. లాక్షయాఽఽత్మచరణస్య చుమ్బనా
చ్చారుభాల మవలోక్య తన్ముఖమ్,
సా హ్రియా నతనతాననాఽస్మర
చ్ఛేషరాగముదితం పతిం నిశః. 122

ప. వి. లాక్షయా-ఆత్మచరణస్య-చుమ్బనాత్-చారుభాలం-అవలోక్య-తన్ముఖం-సా-హ్రియా-నతనతాననా-అస్మరత్-శేషరాగమ్-ఉదితం-పతిం-నిశః.

అర్థము: సా = ఆ దమయంతి, ఆత్మచరణస్య = తనపాదముయొక్క, చుమ్బనాత్ = రతిప్రార్థనలో ముద్దిడుకొనుట వలన నంటిన, లాక్షయా = లత్తుకచే, చారుఖాలం; చారు = రమ్యమైన, ఖాలం = నొసలుగల్గిన, తన్ముఖం; తత్ = ఆ నలునియొక్క, ముఖం = మోమును, అవలోక్య = చూచి, హ్రియా = భర్త తన పాదములపై బడిన విషయము స్మరణకు వచ్చి నందువలన సిగ్గుచే, నతనతాననా; నతనత = మిక్కిలివాలిన, ఆననా = ముఖముగల్గినదై, ఉదితం = ఉదయించిన, శేషరాగం = ఇంకను మిగిలిన యుదయకాలపు ఎఱ్ఱతనము గల్గిన, నిశః = రాత్రియొక్క, పతిం = భర్తయగు చంద్రుని, అస్మరత్ = స్మరించెను.

వి. నలుని లలాట మర్ధచన్ద్రాకారముగా నుండుటవలన, నందు దమయంతి పాదములలోని పారాణి తగులుటచే నలుని ముఖము అట్టి చంద్రునితో సమానముగా నుండినది. అట్టి నలుని ముఖమును చూచి చంద్రుని స్మరించుటవలన స్మరణాలఙ్కారము.

సమాసములు :

ఆత్మచరణస్య - ఆత్మనః చరణః = ఆత్మచరణః, తస్య = ఆత్మచరణస్య.
చారుఖాలం - చారు ఖాలః యస్య తత్ = చారుఖాలం, తత్ = చారుఖాలం.
తన్ముఖం - తస్యముఖం = తన్ముఖం, తత్ = తన్ముఖం.
నతనతాననా - అత్యన్తం నతం = నతనతం, నతనతం ఆననం యస్యాః సా = నతనతాననా.
శేషరాగం - శేషః రాగః యస్య సః = శేషరాగః, తం = శేషరాగం.

భావము :

ఆ నలుడు పారాణితో నలంకరింపబడిన దమయంతి పాదములను రతి ప్రార్థనకై ముద్దిడుకొనెను. అపుడాతని నొసటికి నా పారాణి యంటుకొనినది. అపుడా ముఖమును జూచుటచే తన పాదములపై భర్త పడిన విషయమును స్మరించి యా దమయంతి సిగ్గుపడినదై తన తలను మిక్కిలి వాల్చినదై

యుదయించి కొలదిపాటి యుదయరాగముతోఁ గూడిన చంద్రుని స్మరించినది. ఆ నలుని నొసలు అర్ధచంద్రాకృతిగ నుండుటవలన దానికంటిన పారాణి యుదయ రాగమువలె నుండుటవలన నామె యా పోలిక ననుసరించి యుదయచంద్రుని స్మరించినదని యాశయము. ॥122॥

శ్లో. స్వేదభాజి హృదయేఽనుబిమ్బితం
వీక్ష్య మూర్తమివ హృద్గతం ప్రియం,
నిర్మమే ధుతరతశ్రమం నిజైః
హ్రీనతాఽతిమృదునాసికానలైః. 123

ప. వి. స్వేదభాజి-హృదయే-అనుబిమ్బితం - వీక్ష్య-మూర్తమ్-ఇవ- హృద్గతం- ప్రియం-నిర్మమే - ధుతరతశ్రమం - నిజైః- హ్రీనతా- అతిమృదునాసి కానలైః.

అర్థము : స్వేదభాజి = చెమర్చిన, హృదయే = వక్షఃస్థలమునందు, అను బిమ్బితం = ప్రతిబింబించిన (కావుననే), హృద్గతం = ఎల్లప్పుడు చింతిం చుటచే మనస్సు నందున్న, ప్రియం = ప్రియుడగు నలుని, మూర్తమివ = శరీరమును ధరించిన వానినివలె, వీక్ష్య = చూచి, హ్రీనతా, హ్రీ = సిగ్గుచేత, నతా = వాలిపోయిన దమయంతి, నిజైః = తనవియగు, అతిమృదునాసికానలైః, అతిమృదు = మిక్కిలి కోమలములైన, యనగా వేగము తగ్గిన, నాసికానలైః = నిట్టూర్పుగాలులచే, ధుతరతశ్రమం, ధుత = పోగొట్టబడిన, రతశ్రమం = సురతము వలని శ్రమగలవానినిగా, నిర్మమే ఇవ = చేసెనో యనునటు లుండెను.

వి. దమయంతి తన నిట్టూర్పులచే నలుని సురతశ్రమను బోగొట్టక పోయినను బోగొట్టెనో యనునట్లు వర్ణించుటచే నుత్ప్రేక్ష.

సమాసములు :

స్వేదభాజి - స్వేదం భజతీతి-స్వేదభాక్, తస్మిన్ = స్వేదభాజి.

ధుతరత(శమం-రతస్య శ్రమః = రతశ్రమః, ధుతః రతశ్రమః యస్య
సః = ధుతరతశ్రమః, తం = ధుతరతశ్రమం.
హ్రీనతా-హ్రియా నతా = హ్రీనతా.
అతిమృదునాసికానలైః-నాసికాయాః అనిలాః = నాసికానిలాః, అతి
మృదవశ్చ తే నాసికానలాశ్చ = అతిమృదునాసికానిలాః, తైః = అతి
మృదునాసికానిలైః.

భావము :

సంభోగశ్రమచే నా దమయంతి శరీరము చెమర్చినదై, యామె వక్షఃస్థల
మందలి చెమట నీటిపై నలుని బింబము ప్రతిఫలించినది. అందువలన నలుని
నిరంతరము చింతించుటచే, నతడు హృదయమునం దున్నవాడుగను, ప్రతిబింబ
రూపమున నుండుటచే శరీరము లేనందువలన భావింపదగిన శరీరముగల
వాడుగా నుండెను. అట్టి చింతనీయ శరీరము గల ప్రియుడగు నలుని శరీరముగల
వానినిగాఁ జూచి లజ్జచే వాలిపోయిన దమయంతి మెల్లగ వెలువడు తన నిట్టూ
ర్పులచే నతని సురతశ్రమనుఁ బోఁగొట్టినది.

శ్లో. సూనసాయక నిదేశ విభ్రమై
రప్రతీతతర వేదనోదయమ్,
దన్తదంశ మధరేఽధిగాముకా
సాఽస్పృశ న్మృదు చమచ్చకార చ. 124

ప. వి. సూనసాయకనిదేశవిభ్రమైః - అప్రతీతతరవేదనోదయం - దన్తదంశం-
అధరే-అధిగాముకా-సా-అస్పృశత్-మృదు-చమచ్చకార-చ.

అర్థము : సా- ఆ దమయన్తి, సూనసాయకనిదేశవిభ్రమైః, సూనసాయక =
పుష్పబాణునియొక్క, నిదేశవిభ్రమైః = ఆజ్ఞలనెడి విలాసములచే,
అప్రతీతతరవేదనోదయం, అప్రతీతతర = పూర్వ మేమియు తెలియబడని,
వేదనా = బాధయొక్క, ఉదయం = ఉత్పత్తి కలిగిన, అనగా మన్మథ
పారవశ్యమువలనఁ దొలుత బాధ తెలియని, అధరే = తన పెదవియందలి,

దన్తదంశం=నలుని దంతముచే నేర్పడిన కాటును, అధిగాముకా= తెలిసికొనుచున్నదై, అనగా బాధతో ననుభవించుచున్నదగుచు, మృదు= మెల్లగా, అస్పృశత్=తాకెను, చమచ్చకార చ = ఇదియేమి? ఎప్పు డేర్పడినది? అని ఆశ్చర్యముతో గూడిన దాయెను.

సమాసములు :

*సూనసాయక నిదేశవిభ్రమైః* - సూనం సాయకః యస్య సః=సూన సాయకః, సూనసాయకస్య నిదేశాః = సూనసాయకనిదేశాః, సూన సాయకనిదేశా ఏవ విభ్రమాః=సూనసాయకనిదేశవిభ్రమాః, తైః= సూనసాయకనిదేశవిభ్రమైః.
*అప్రతీతతరవేదనోదయం* - అత్యన్తం ప్రతీతా = ప్రతీతతరా, న ప్రతీతతరా = అప్రతీతతరా, అప్రతీతతరా చ సా వేదనా చ = అప్రతీతతరవేదనా, అప్రతీతతరవేదనాయాః ఉదయః యస్య సః= అప్రతీతతరవేదనోదయః, తం=అప్రతీతతరవేదనోదయం.
*దన్తదంశం*-దన్తస్య దంశః=దన్తదంశః, తం=దన్తదంశం.
*అధిగాముకా*-అధిగచ్ఛతీతి అధిగాముకా.

భావము :

ఆ దమయంతి మన్మథుని యాదేశరూపములగు విలాసములను జూపి నలుని సుఖపరచుచు, కామాతిశయమువలన నొడ లెఱుంగక యుండుటవలన నాతడు తన పెదవిపై వేసిన పంటిగాటును తెలిసికొనజాలక యుండినదై మెల్లగా తన పెదవిని తాకినది. అట్లు తాకిన వెంటనే యా పెదవిపైని గాయము తెలియుటచే ఇది యేమిటి? ఇది యెట్లు కలిగినది? యని యచ్చెరువందినది.॥124॥

శ్లో. వీక్ష్య వీక్ష్య కరజస్య విభ్రమం
ప్రేయసార్జిత మురోజయో రియమ్,
కాన్త మైక్షత హసస్పృశం క్రియ
త్కోపసఙ్కుచితలోచనాఞ్చలా. 125

ప. వి. వీక్ష్య-వీక్ష్య-కరజస్య-విభ్రమం - ప్రేయసా-అర్జితమ్- ఉరోజయోః - ఇయం-కాన్తం - ఐక్షత-హాసస్పృశం - కియత్కోపసఙ్కుచితలోచనాఞ్చలా.

అర్థము: ఇయం=ఈ దమయంతి, ప్రేయసా=మిక్కిలి ప్రియుడైన నలునిచే, అర్జితం=చేయబడిన, ఉరోజయోః=తన స్తనముల యందలి, కరజస్య=నఖము యొక్క, విభ్రమం=విలాసమును, అనగా నఖక్షతమును, వీక్ష్య వీక్ష్య=చూచి చూచి,కియత్కోపసఙ్కుచితలోచనాఞ్చలా,కియత్=కొంచి పాటి, కోప=క్రోధముచే, సఙ్కుచిత=వంపు తిరిగిన, లోచన=నేత్ర ముల యొక్క, అఞ్చలా=కొనలుగలదై, హాసస్పృశం=హాస్యమును స్పృశించుచున్న అనగా నవ్వుచున్న, కాన్తం = నలుని, ఐక్షత = చూచినది.

సమాసములు :

కరజస్య-కరయోః జాయత ఇతి=కరజః, తస్య=కరజస్య.
హాసస్పృశం-హాసం స్పృశతీతి=హాసస్పృక్, తం=హాసస్పృశం,
కియత్కోపసఙ్కుచితలోచనాఞ్చలా - కియాంశ్చాసౌ కోపశ్చ=కియత్కోపః, కియత్కోపేన సఙ్కుచితౌ=కియత్కోపసఙ్కుచితౌ, లోచనయోః అఞ్చలౌ = లోచనాఞ్చలౌ, కియత్కోపసఙ్కుచితౌ లోచనాఞ్చలౌ యస్యాః సా=కియత్కోపసఙ్కుచితలోచనాఞ్చలా.

భావము :

ఆ దమయంతి తనకు మిక్కిలి ప్రియుడైన నలుడు తన చనుదోయిపై కల్పించిన మన్మథవిలాసమైన గోటిగాటును జూచి కొంచెపాటి కోపముచే వంపు తిరిగిన కటాక్షములు కలదై నవ్వుచున్న యా నలుని జూచినది. ॥125॥

శ్లో. రోష భూషిత ముఖీమివ ప్రియాం
వీక్ష్య భీతిదర కమ్పితాక్షరమ్,
తాం జగాద స న వేద్మి తన్వి తం
బ్రూహి శాస్మి తవ కోపరోపకమ్. 126

ప.వి. రోష భూషిత ముఖీమ్-ఇవ-ప్రియాం-వీక్ష్య-భీతిదరకమ్పితాక్షరమ్-తాం-జగాద-సః-న-వేద్మి-తన్వి-తం-బ్రూహి-శాస్మి-తవ-కోపరోపకమ్.

అర్థము: సః = ఆ నలుడు, తాం = ముందు చెప్పబడిన విధముగా కోపముతో వంపు తిరిగిన కనులయంచులు గల, ప్రియాం = ప్రియురాలైన దమయంతిని, రోషభూషితముఖీమివ, రోష=రోషముచే, భూషిత = అలంకరింపబడిన, ముఖీమివ (స్థితాం) = ముఖముగలదానివలె, అనగా రోషముచే నెఱ్ఱబారుటవలన నలంకరింపబడిన ముఖము గల దానివలె నున్నదానినిగా, వీక్ష్య=చూచి, భీతిదరకంపితాక్షరం, భీతి = భయముచే, దర = కొంచెము, కమ్పిత=చలించిన, అక్షరం= అక్షరములు గలదిగా, జగాద=చెప్పెను. (ఏమనగా) హే తన్వి! = ఓ కృశించిన శరీరము గలదానా ! తవ=నీకు, కోపరోపకం, కోప = కోపమును, రోపకం = కలిగించిన జనమును, న వేద్మి = తెలియకయున్నాను. తం=ఆ జనమును, బ్రూహి=చెప్పుము, శాస్మి=శిక్షింతును.

సమాసములు :

*రోష భూషితముఖీం* - రోషేణ భూషితం = రోషభూషితం, రోష భూషితం ముఖం యస్యా స్సా = రోషభూషితముఖీ, తాం = రోష భూషితముఖీం.

*భీతిదరకంపితాక్షరం*-దరం కమ్పితాని=దరకమ్పితాని, భీత్యా దర కమ్పితాని=భీతిదరకమ్పితాని, భీతిదరకమ్పితాని అక్షరాణి యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా=భీతిదరకమ్పితాక్షరం.

*కోపరోపకం*-కోపస్య రోపకః=కోపరోపకః, తం=కోపరోపకం.

భావము :

ఆ నలుడు ఆ విధముగా కోపముచే వంకర తిరిగిన కనుల కొనలు గలిగిన ప్రియురాలగు దమయంతిని రోషముచే నెఱ్ఱబారినందువలన నలఙ్కరింపబడిన ముఖము గల దానినిగాఁ జూచి భయముతో కొంచెము తొట్రుపాటుపడిన మాటలతో,

ఓ కృశాఙ్గీ, నీకు కోపమును గలిగించిన జన మెవ్వరో నాకు తెలియక యున్నది. ఆ యపరాధిజనమును చెప్పుము. నేను దండింతును అని చెప్పెను. ॥126॥

శ్లో. రోషకుఙ్కుమవిలేపనాన్మనాక్
నన్వవాచి కృశతన్వవాచి తే
భూ దయుక్త సమయైవ రఞ్జనా
మాఽఽననే విధువిధేయమాననే. 127

ప. వి. రోషకుఙ్కుమవిలేపనాత్-మనాక్-నను - అవాచి-కృశతను-అవాచి-తే - భూత్-అయుక్తసమయా-ఏవ-రఞ్జనా-మా-ఆననే-విధువిధేయమాననే.

అర్థము: నను=ఓ, కృశతను!=కృశాఙ్గీ!, అవాచి = వంగిన, అవాచి = మాటలులేని, తథా = అట్లే, విధువిధేయమాననే, విధు = చంద్రునిచే, విధేయ=చేయదగిన, మాననే=పూజగల, తే = నీయొక్క, ఆననే = ముఖము నందు, అయుక్తసమయా, అయుక్త=తగనటువంటి, సమయా =కాలము గలిగిన, (అనగా సురతకేళిపై గోరిక తీరనందువలన నిప్పుడు ప్రసన్నతయే యవసరమని యర్థము) రోషకుఙ్కుమవిలేపనాత్, రోష=కోపమనెడి, కుఙ్కుమవిలేపనాత్ =కాశ్మీర కుసుమము నలదుట వలన, మనాక్=కొంచమైనను, రఞ్జనా=ఎఱ్ఱదనము, మా భూత్ = ఉండరాదు, కలఙ్కరహితమగు నీ ముఖమునందు నిపుడు రోషము వలని కలఙ్కమునకు కాలము గాదు.

సమాసములు :

రోషకుఙ్కుమవిలేపనాత్ - రోష ఏవ కుంకుమం=రోషకుంకుమమ్. రోషకుంకుమస్య విలేపనం=రోషకుంకుమ విలేపనం. తస్మాత్ = రోష కుఙ్కుమ విలేపనాత్.

అవాచి-అవాఞ్చతీతి=అవాక్, తస్మిన్=అవాచి.

అవాచి-అవిద్యమానా వాక్ యస్య తత్=అవాక్, తస్మిన్=అవాచి.

కృశతను-కృశా తనుః యస్యా స్సా=కృశతనుః, తస్యా స్సమ్బుద్ధిః= కృశతను.

అయుక్తసమయా - న యుక్తః = అయుక్తః, అయుక్తః సమయః యస్యాః సా = అయుక్తసమయా.

విధువిధేయమాననే-విధునా విధేయా = విధు విధేయా, విధువిధేయా మాననా యస్య తత్ = విధువిధేయమాననం, తస్మిన్ = విధువిధేయమాననే.

భావము :

ఓ కృశాంగి ! వినయముచే వాలినదియు, మౌనము వహించినదియు, చంద్రునిచే బూజను గొనదగినదియు, అనగా చంద్రుని కంటెను శ్రేష్ఠమైనదియు నగు నీ ముఖమునందు రోషమనెడి కుంకుమపూవుచే బూతవైచుట కొంచెము కూడ తగదు. ఏలయనగా, గెలియందలి కోరిక యింకను దీరలేదు. కాన నిపుడు నీకు ముఖమున ప్రసన్నత యవసరము. కాన కలంకరహితమైన నీ ముఖము నందు రోషముచే కలంకము తగదు.

శ్లో. క్షిప్ర మస్యతు రుజా న ఖావిజా
స్తావకీ రమృతశీకరం కిరత్,
ఏత దర్థ మిద మర్జితం మయా
కణ్ఠచుమ్బి మణిదామ కామదమ్. 128

ప. వి. క్షిప్రమ్-అస్యతు-రుజాః-నఖాదిజాః-తావకీః-అమృతశీకరం-కిరత్- ఏతదర్థమ్-ఇదమ్-అర్జితం-మయా-కణ్ఠచుమ్బి-మణిదామ-కామదమ్.

అర్థము: హే ప్రియే! = ఓ ప్రియురాలా! కణ్ఠచుమ్బి = మెడయందు వ్రేలాడెడి, కామదం = కోరికలను దీర్చెడి, ఇదం = ఈ కనబడుచున్న, మణిదామ = రత్నహారము, అమృతశీకరం = అమృతబిందువును, కిరత్ = వర్షించునదై, నఖాదిజాః = నఖములు, దంతములు మున్నగువానిచే నేర్పడిన, తావకీః = నీకు సంబంధించిన, రుజాః = బాధలను, క్షిప్రం = శీఘ్రముగా, అస్యతు = దూరములైన వానినిగా జేయునుగాత, మయా = నాచేత, ఏతదర్థం = నఖక్షతాదుల వలని బాధ తొలగుటకై, ఇదం = ఈ రత్నహారము, అర్జితం = సంపాదించబడినది.

సమాసములు :

*నఖాదిజాః* - నఖః ఆదిః యేషాం తాని = నఖాదీని, నఖాదిభ్యః జాయన్తే ఇతి=నఖాదిజాః, తాః-నఖాదిజాః.
**తావకీః** - తవ ఇమాః=తావక్యః, తాః=తావకీః.
**అమృతశీకరం** - అమృతస్య శీకరః= అమృతశీకరః, తం=అమృత శీకరం.
*ఏతదర్థం* - ఏతస్మై=ఏతదర్థం.
*కణ్ఠచుమ్బి* - కణ్ఠం చుమ్బతీతి=కణ్ఠచుమ్బి.
**మణిదామ** - మణీనాం దామ=మణిదామ.
*కామదం* - కామాన్ దదాతి ఇతి కామదమ్.

భావము :

ఓ ప్రియురాలా! నీ కంఠమునం దున్నట్టి యీ రత్నహారము కోరికలను దీర్చునది. అది అమృత బిందువులను వర్షించుచున్నదై, నఖదన్తక్షతాదులచే కలిగిన నీ బాధలను దొలగించును గాత. ఆ కార్యమునకై నేను దీనిని సంపాదించితిని. ॥128॥

శ్లో. స్వాపరాధ మలుపత్ పయోధరే
మత్కర స్సురధనుః కర స్తవ,
సేవయా వ్యజన చాలనాభువా
భూయ ఏవ చరణౌ కరోతు వా. 129

ప. వి. స్వాపరాధమ్-అలుపత్-పయోధరే-మత్కరః- సురధనుః-కరః-తవ-సేవయా-వ్యజనచాలనాభువా-భూయః-ఏవ-చరణౌ-కరోతు-వా.

అర్థము : హే ప్రియే! = ఓ ప్రియురాలా! తవ=నీయొక్క, పయోధరే= స్తనమునందు (మేఘమునందు), సురధనుః కరః=ఇంద్ర ధనుస్సువంటి యాకృతిగల గోటి గుర్తును (ఇంద్రధనుస్సును జేయునట్టి), మత్కరః=

నా హస్తము (సూర్యకిరణము), వ్యజనచాలనాభువా, వ్యజన = విసన కఱ్ఱయొక్క, చాలనా = కదలింపుచే, భువా = పుట్టిన వాయువును ప్రవహింపజేయుటచే నేర్పడిన, సేవయా = పరిచర్యచే, స్వాపరాధం = స్వ = తనదగు, అపరాధం = నేరమును అనగా నఖక్షతము వలన గలిగిన నేరమును, అలుపత్ = ముందే తొలగించినది, భూయ ఏవ = మరలగూడ, చరణౌ వా = నీపాదములను కాని, కరోతు వా = సేవించును గాత.

సమాసములు :

స్వాపరాధం - స్వస్య అపరాధః = స్వాపరాధః, తం = స్వాపరాధం.
మత్కరః - మమ కరః = మత్కరః.
సురధనుఃకరః - సురస్య ధనుః = సురధనుః, సురధనుః కరోతీతి = సురధనుఃకరః, పక్షాన్తరమున, సురధను రివ కరః = సురధనుఃకరః.
వ్యజనచాలనాభువా - వ్యజనస్య చాలనా = వ్యజనచాలనా, వ్యజన చాలనయా భవతీతి = వ్యజనచాలనాభూః, తయా = వ్యజనచాలనా భువా.

భావము :

ఓ ప్రియురాలా! నీ పయోధరముపై ననగా స్తనముపై (మేఘముపై) ఇంద్ర ధనురాకారముగల నఖక్షతచిహ్నమును (ఇంద్రధనుస్సును) చేయునట్టి నాహస్తము (సూర్య కిరణము) విసనకఱ్ఱచే వీచుటచే (గాలిని ప్రవహింప చేయుటచే) నేర్పడిన పరిచర్యతో తాను గావించిన నఖక్షతాపరాధమును ముందే తొలగించుకొనినది. మఱల నీ పదముల నది సేవించును గాత. అనగా మేఘము నందు సూర్యకిరణముచే నింద్రధనుస్సు ఏర్పడుచున్నది. అట్లే స్తనమునందు నింద్రధనుస్సువలె వంపుతిరిగిన నఖక్షతము నలుని హస్తముచే నేర్పడుచున్నది. ఆ నఖక్షతమువలని బాధ నతని హస్తము విసనకఱ్ఱచే వీచుటవలన తొలగినది. అనగా నలుడు సురతమునందు దమయంతికి విసనకఱ్ఱలతో విసిరి శిశిరోపచార ములను గావించునని యర్థము. అట్లే గాలిగొట్టుటవల్లన మేఘములపై ఇంద్ర

ధనుస్సు మాసిపోవును. ఇట్లు నలుడు తన హస్తములతో దమయంతికి శిశిరో పచారములను గావించిన పిదప నామె పాదములను తన హస్తములతో నొత్తి సేవ చేయగోరుచున్నాడని యాశయము.

శ్లో. అననస్య మమ చే దనౌచితీ
నిర్దయం దశనదంశదాయినః,
శోష్యతే సుదతి వైర మస్య తత్
కిం త్వయా వద విదశ్య వాఽధరమ్, 130

ప. వి. అననస్య-మమ-చేత్-అనౌచితీ- నిర్దయం-దశనదంశదాయినః- శోష్యతే-సుదతి-వైరమ్-అస్య-తత్-కిం-త్వయా-వద-విదశ్య-వా-అధరమ్.

అర్థము : హే ప్రియే! = ఓ ప్రియురాలా! నిర్దయం=దయలేక, దశనదంశం, దశన=పంటితో, దంశం=కాటును, దాయినః=చేయునట్టి, అనగా నీ పెదవిని గట్టిగా కొఱుకునటువంటి, మమ=నా యొక్క, అననస్య= నోటికి, అనౌచితీ చేత్ = అన్యాయమున్నచో (తర్హి = అపుడు) హే సుదతి = ఓ అందములైన దంతములు గలదానా, త్వయా= నీచేత, అధరం=పెదవిని, విదశ్య=కొఱికి, అస్య= ఈ నా నోటి యొక్క, తత్=ఆ, వైరం=శత్రుత్వము, కిం=ఏల, న శోష్యతే= తొలగించుకొనబడదు, వద=చెప్పుము, నేను చేసిన దంతక్షతమునకు నీవు మరల నాకు దన్తక్షతమును జేయుటయే ప్రతీకారము.

సమాసములు :

అనౌచితీ-ఉచితస్య భావః=ఔచితీ, న ఔచితీ=అనౌచితీ.
*దశనదంశదాయినః*-దశనైః దంశః = దశనదంశః, దశనదంశం దదాతీతి=దశనదంశదాయీ, తస్య=దశనదంశదాయినః.

భావము :

ఓ ప్రియురాలా ! కఠినమగు నా పంటితో నీ పెదవిని కొఱికి నీకు బాధను కలిగించిన నా నోరు అన్యాయమే గావించినచో, ఓ చక్కని దంతములు

గలదానా! నీవు నా పెదవిని ఆ విధముగనే కొఱికి, నా నోటిపై పగను తీర్చు కొనరాదా ? చెప్పుము. నేను నా పంటితో నీ పెదవిని కొఱికినపుడు నీవు నీ పంట నా పెదవిని గొఱకుటయే తగిన ప్రతిక్రియ యని యాశయము.

శ్లో. దీపలోప మఫలం వ్యధత్త య
స్తే పటాహృతిషు మచ్ఛిఖామణిః,
నో తదాగసి పరం సమర్ధనా
సోఽయమస్తు పదపాతుక స్తవ. 131

ప. వి. దీపలోపమ్-అఫలం-వ్యధత్త-యః- తే-పటాహృతిషు- మచ్ఛిఖామణిః - నో-తదాగసి-పరం-సమర్ధనా-సః-అయం-అస్తు-పదపాతుకః-తవ.

అర్థము: హే ప్రియే=ఓ ప్రియురాలా !, తే = నీ యొక్క, పటాహృతిషు, పట=వస్త్రమును, ఆహృతిషు=లాగునట్టి సమయములందు, యః = ఏ, మచ్ఛిఖామణిః, మత్=నా యొక్క, శిఖా=శిఖయందలి, మణిః= రత్నము, దీపలోపం=నీవు దీపము నార్పుటను, అఫలం = వ్యర్థము, వ్యధత్త=చేసినదో, అనగా నా తల యందలి మణి వెలుగును గలిగించి, నీ ప్రయత్నమును వ్యర్థము గావించినదని యర్థము. తదాగసి = ఆ యపరాధమునందు, పరం = సరియైన, యనగా శ్రేష్ఠమైన, సమర్ధనా=సమర్థన, నో=లేదు, (కావుననే) సః=ఆ, అయం=ఈ శిఖామణి, తవ=నీయొక్క, పదపాతుకః=పాదములయందు పడునదిగా అస్తు=అగును గాత. అనగా తన నేరమును పాదములపై బడి శోధించు కొనుగాత.

సమాసములు :

దీపలోపం-దీపస్య లోపః=దీపలోపః, తం=దీపలోపం.
పటాహృతిషు- పటస్య ఆహృతయః=పటాహృతయః, తాసు= పటాహృతిషు.

మచ్ఛిఖామణిః-శిఖాయాః మణిః = శిఖామణిః, మమ శిఖామణిః = మచ్ఛిఖామణిః.
తదాగసి-తదేవ ఆగః = తదాగః, తస్మిన్ = తదాగసి.
పదపాతుకః-పతతీతి = పాతుకః, పదయోః పాతుకః = పదపాతుకః.

భావము :

ఓ ప్రియురాలా! రతి కాలమున నీ వస్త్రమును లాగునపుడు, నీవు దీపమును ఆర్పివేయగా నా కిరీటమందలి రత్నము వెలుగు నిచ్చుటచే నీవు గావించిన పనిని వ్యర్థపరచినది. వస్త్రమును లాగుటచే నీ శరీరభాగములు కానరాక యుండుట కొఱకు నీవు దీపము నార్పితివి. కాని నా కిరీటమందలి రత్నము వెలుగు నిచ్చుటచే యథాప్రకారముగా నీ శరీరభాగములు కనపడినవి. అందువలన నీ ప్రయత్నము వ్యర్థమైనదని యర్థము. అట్టి నేరమును సరిగ సమర్థింప సాధ్యము కాదు. కావుననే ఆ శిరోరత్న మిపుడు నీ పాదములపై బడిన యపరాధమునకు క్షమను గోరునుగాత. అనగా నలుడు ఆమె పాదములపై బడినచో నాతని శిరో రత్నము కూడ నామె పాదముల నంటి తన నేరమును శోధించుకొనుగాత యని యాశయము.

శ్లో. ఇత్థ ముక్తి ముపహృత్య కోమలాం
తల్పచుమ్బిచికుర శ్చకార సః,
ఆత్మమౌలి మణికాన్తిభఙ్గినీం
తత్పదారుణ సరోజసఙ్గినీమ్. 132

ప. వి. ఇత్థమ్-ఉక్తిమ్-ఉపహృత్య-కోమలాం - తల్పచుమ్బిచికురః-చకార-సః-ఆత్మమౌలిమణికాన్తిభఙ్గినీం-తత్పదారుణ సరోజసఙ్గినీమ్.

అర్థము: సః = ఆ నలుడు, ఇత్థం = చెప్పిన విధముగా, కోమలాం = మృదు పదములతో గూడిన, ఉక్తిం = మాటను, ఉపహృత్య = కానుకగావించి, అనగా ఆమెకు సంతోషమును గల్గించుటకై కానుక గావించి, తల్పచుమ్బి చికురః, తల్ప = పరుపను, చుమ్బి = తాకునట్టి, చికురః = తల వెంట్రు

కలు గలవాడై, (అనగా పడకపై పరుండిన యామెయొక్క పాదములపై బడుటవలన పడకనంటిన వెంట్రుకలు గలవాడై), ఆత్మమౌళి మణికాన్తి భఙ్గినీం; ఆత్మ=తనయొక్క, మౌళి=శిరమునందలి, మణి=రత్నములయొక్క, కాంతి=వెలుగనెడి, భంగినీం = నదిని, తత్పదారుణ సరోజ సంగినీం-తత్=ఆమెయొక్క, పద=పాదములనెడి, అరుణ సరోజ=కెందామరలను, సంగినీం=కూడిన దానినిగా, చకార=చేసెను.

సమాసములు :

తల్పచుమ్బి చికురః, తల్పం చుమ్బతీతి = తల్పచుమ్బీ, తల్పచుమ్బీ చికురః యస్య సః=తల్పచుమ్బిచికురః.

ఆత్మమౌలిమణికాన్తి భఙ్గినీం-ఆత్మనః మౌలిః=ఆత్మమౌలిః, ఆత్మ మౌళేః మణిః=ఆత్మమౌలిమణిః, ఆత్మమౌలిమణేః కాన్తిః=ఆత్మమౌలి మణికాన్తిః, ఆత్మమౌలిమణి కాన్తిరేవ భఙ్గినీ = ఆత్మమౌలిమణికాన్తి భఙ్గినీ, తాం=ఆత్మమౌలిమణికాన్తిభఙ్గినీం.

తత్పదారుణసరోజసఙ్గినీం - తస్యాః పదే = తత్పదే, అరుణే చ తే సరోజే చ=అరుణసరోజే, తత్పదే ఏవఅరుణసరోజే=తత్పదారుణసరోజే, తత్పదారుణసరోజాభ్యాం సఙ్గచ్ఛత ఇతి = తత్పదారుణసరోజసఙ్గినీ, తాం=తత్పదారుణసరోజసఙ్గినీమ్.

భావము :

ఆ నలు డివ్విధముగా సుకుమారపదములతో విరాజిల్లు తన మాట నామెకు సంతోషము గల్గించుటకై కానుక కావించి, సెజ్జపై పరుండియున్న యామెయొక్క పాదములపై దన శిరమును వాల్చి తన శిరోజముల నా పడక కంటించినవాడై తన శిరమునందలి రత్నపుకాంతు లనెడి నదిని ఆ దమయంతి యొక్క పాదము లనెడి కెందామరలతో గూడినదానిగా జేసెను. అనగా నామె పాదములకు నమస్కరించెనని యాశయము. నదులలో కెందామరలును, నల్లదామరలు నుండునని కవి సమయము.

శ్లో. తత్పదాఖిల నఖానుబిమ్బనైః
సైన్వ స్వమేత్య సమతా మియాయ సః,
రుద్రభీతివిజిగీషయా రతి
స్వామినోపదశమూర్తితాభృతా.

ప. వి. తత్పదాఖిలనఖానుబిమ్బనైః–స్వైః-సమేత్య-సమతామ్-ఇయాయ - సః-రుద్రభీతివిజిగీషయా-రతిస్వామినా-ఉపదశమూర్తితాభృతా.

అర్థము: సః = ఆ నలుడు, స్వైః = తనవైన, తత్పదాఖిలనఖానుబిమ్బనైః, తత్ = ఆ దమయంతియొక్క, పద = పాదముల యందలి, అఖిల = సమస్తములైన, నఖ = గోరులయందలి, అనుబిమ్బనైః = ప్రతిబింబములతో, సమేత్య = కలసి, అనగా పదివేళ్ళ గోరులపై ప్రతిఫలించిన పది ప్రతిబింబములతో గలియుటచే పదునొకండు సంఖ్య గలవాడుగ నేర్పడి, రుద్రభీతివిజిగీషయా, రుద్ర = ఏకాదశరుద్రుల నుండి, భీతి = భయమును, విజిగీషయా = జయింప గోరికచే, అనగా శివునుండి రక్షింపగోరికచే, ఉపదశమూర్తితా, ఉపదశ = పదికి సమీపముననున్న, పదకొండు, మూర్తితా = మూర్తులను గలిగియుండుటను, భృతా = ధరించిన, రతిస్వామినా = మన్మథునితో, సమతాం = సాదృశ్యమును, ఇయాయ = పొందెను.

సమాసములు :

తత్పదాఖిలనఖానుబిమ్బనైః-తస్యాః పదే = తత్పదే, అఖిలాశ్చ తే నఖాశ్చ = అఖిలనఖాః; తత్పదయోః అఖిలనఖాః = తత్పదాఖిలనఖాః; తత్పదాఖిలనఖేషు అనుబిమ్బనాని = తత్పదాఖిలనఖానుబిమ్బనాని, తైః = తత్పదాఖిలనఖానుబిమ్బనైః.

రుద్రభీతివిజిగీషయా-రుద్రేభ్యః భీతిః = రుద్రభీతిః, విజేతు మిచ్ఛా = విజిగీషా, రుద్రభీతేః విజిగీషా = రుద్రభీతివిజిగీషా, తయా = రుద్రభీతి విజిగీషయా.

రతిస్వామినా-రతేః స్వామీ = రతిస్వామీ, తేన = రతిస్వామినా.

ఉపదశమూర్తితాభృతా-దశానాం సమీపే యే సన్తి తే = ఉపదశాః, ఉపదశాః మూర్తయః యస్య సః = ఉపదశమూర్తిః, ఉపదశమూర్తేః భావః = ఉపదశమూర్తితా, ఉపదశమూర్తితాం బిభర్తీతి = ఉపదశమూర్తితాభృత్, తేన = ఉపదశమూర్తితాభృతా.

భావము :

ఆ నలుడు దమయంతి పాదములపై బడినపుడు ఆమెయొక్క పది కాలి గోరులలో ప్రతిబింబించుట చేత పది రూపముల నొందెను. తన బింబముతో నా పదిని గూడుటవలన నతడు పదునొకండు రూపములు గలవా డాయెను. అట్లు పదునొకండు దేహములను ధరించినవాడై పదునొకండు రుద్రులనుండి భయమును తొలగించుకొనగోరి పదునొకండు దేహములను ధరించిన మన్మథునితో సామ్యమును వహించెను.

శ్లో. ఆఖ్య తైష కురు కోపలోపనం
పశ్య నశ్యతి కృశామధో ర్నిశా,
ఏవమేవ తు నిశా న్తరే వరం
రోషశేష మనురోత్స్యసి క్షణమ్. 134

ప. వి. ఆఖ్యత-ఏషః- కురు- కోపలోపనం- పశ్య-నశ్యతి- కృశా-మధోః-నిశా-ఏవమ్-ఏవ-తు-నిశా న్తరే-వరం-రోషశేషమ్-అనురోత్స్యసి-క్షణమ్.

అర్థము : హే ప్రియే=ఓ ప్రియురాలా! కోపలోపనం, కోప = కోపమును, లోపనం=తొలగించుటను, కురు=చేయుము, (యతః=ఏలయనగా) కృశా=కృశించిన, మధోః = వసంతముయొక్క, నిశా = రాత్రి, నశ్యతి=తొలగుచున్నది, పశ్య=చూడుము, నిశా న్తరే తు=మరియొక రాత్రియందో, ఏవమేవ=ఇట్లే, క్షణం=క్షణకాలమే, రోషశేషం= మిగిలిన కోపమును, అనురోత్స్యసి=అనుసరింపగలవు, వరం = అది శ్రేష్ఠము, (అని) ఏషః=ఈ నలుడు, ఆఖ్యత=చెప్పెను.

సమాసములు :

కోపలోపనం - కోపస్య లోపనం=కోపలోపనం, తత్=కోపలోపనం.
నిశా న్తరే - అన్యా నిశా=నిశా న్తరం, తస్మిన్=నిశా న్తరే.
రోషశేషం - శేషశ్చాసౌ రోషశ్చ=రోషశేషః, తం=రోషశేషం.

భావము :

ఓ ప్రియురాలా! కోపమును వదలుము. ఏలయనగా, వసంతకాలపు రాత్రియొక్క పరిమితి చాల తక్కువ. కాన నది గడచిపోవుచున్నది చూడుము. వసంతకాలపురాత్రికంటె భిన్నమైన రాత్రియందు ఈ కోపము కొంతకాలము వహింపుము. అదియే శ్రేష్ఠము. ఎండకాలమున రాత్రిపరిమితి తక్కువ. శీతకాలము నందు రాత్రిపరిమితి ఎక్కువ. వసంతకాలము ఎండకాలమునకు సంబంధించినది. కాన రాత్రిపరిమితి తక్కువయగుటవలన నాకొందిపాటికాలమును సైతము కోపముతోనే గడపినచో నిక సుఖించుటకు కాల మెక్కడ నున్నది? కాన నిపుడు కోపము తగదు. శీతకాలపురాత్రులు దీర్ఘములుగాన నపుడు కొంతకాలము నీవు కోపము వహించినను నష్టములేదు. అనగా రాత్రి దీర్ఘమైనదిగాన కోపము కొంది కాలములో తీరినచో తర్వాత కొంతకాలము సుఖించుట కవకాశముండును. మఱియు కోపమంతటిని నొక్కరాత్రియందే చూపినచో తక్కిన రాత్రులలో కోప మెట్లు చేయగలవు? అందువలన నీవు కోపము చేయరాదని యాశయము.

శ్లో. సాఽథ నాథ మనయ త్కృతార్థతాం
పాణిగోపిత నిజాఙ్ఘ్రిపఙ్కజా,
తత్ప్రణామధుతమాన మాననం
స్మేర మేవ సుదతీ వితన్వతీ. 135

ప. వి. సా-అథ-నాథమ్-అనయత్-కృతార్థతాం- పాణిగోపితనిజాఙ్ఘ్రిపఙ్కజా-తత్ప్రణామధుతమానమ్-ఆననం-స్మేరమ్-ఏవ-సుదతీ-వితన్వతీ.

అర్థము. అథ=ప్రియుడు నమస్కరించినపిదప, పాణిగోపితనిజాఙ్ఘ్రిపఙ్కజా, పాణి=హస్తములతో, గోపిత=మూయబడిన, నిజ=తనవగు, అఙ్ఘ్రి పఙ్కజా=పాదపద్మములుగల్గిన, సుదతీ=చక్కనిపలువరుసతో శోభిల్లు, సా=ఆ దమయంతి, తత్ప్రణామధుతమానం, తత్=ఆ నలునియొక్క, ప్రణామ=నమస్కారముతో, ధుత=తొలగింపబడిన, మానం=కోప చిహ్నము గలిగిన, ఆననం= ముఖమును, స్మేరం = చిరునవ్వుతో గూడినదానినిగా, వితన్వత్యేవ=చేయుచున్నదేయగుచు, నాథం=నాథు

డైన నలుని, కృతార్థతాం = కోరికతీరినవానినిగా, అనయత్ = పొందించినది.

సమాసములు :

కృతార్థతాం- కృతః అర్థః యస్య సః=కృతార్థః, కృతార్థస్య భావః= కృతార్థతా, తాం=కృతార్థతామ్.

*పాణిగోపితనిజాఙ్ఘ్రిపఙ్కజా-* అఙ్ఘ్రీ పఙ్కజే ఇవ=అఙ్ఘ్రిపఙ్కజే, నిజే చ తే అఙ్ఘ్రిపఙ్కజే చ=నిజాఙ్ఘ్రిపఙ్కజే, పాణినా గోపితే=పాణి గోపితే, పాణిగోపితే నిజాఙ్ఘ్రిపఙ్కజే యస్యాః సా=పాణిగోపితనిజాఙ్ఘ్రి పఙ్కజా.

*తత్ప్రణామధుతమానం-*తస్య ప్రణామః=తత్ప్రణామః, తత్ప్రణామేన ధుతః మానః యస్య తత్=తత్ప్రణామధుతమానం.

*సుదతీ-*శోభనాః దన్తాః యస్యాః సా=సుదతీ.

భావము :

ప్రియుడు తనకు నమస్కారము గావించిన పిదప నా దమయంతి మరల నా నలుడు తన పాదములను స్పృశించునేమో యనెడి భయముచే తన పాదము లను తన చేతులతో గప్పిపుచ్చుచు, తొలుత నా నలుడు తన పాదములపై బడుటవలన తొలగిపోయిన క్రోధ చిహ్నములు గల తన మోమునందు జిరు నగవు నేర్పరచుచున్నదై, తన ప్రియుని సంభోగసుఖముతో సఫలుని గావించెను. ॥135॥

శ్లో. తౌ మిథోరతిరసాయనా త్పునః
సమ్ప్రభుక్తమనసౌ బభూవతుః,
చక్షమే న తు తయో ర్మనోరథం
దుర్జనీ రజని రల్పజీవితా. 136

40)

ప. వి. తౌ-మిథోరతిరసాయనాత్-పునః - సమ్బుభుక్షుమనసౌ - బభూవతుః - చక్షమే-న-తు-తయోః-మనోరథం-దుర్జనీ-రజనిః-అల్పజీవితా.

అర్థము: తౌ=ఆ దమయంతీనలులు, మిథః = ఒండొరులయందలి, రతి = అనురాగ మనెడి, రసాయనాత్=ముదుసలితనము వలన గల్గెడి ముదుతలు మున్నగు వానిని బోగొట్టునట్టి యౌషధవిశేషము వలన, అనగా మొదటి సంభోగమువలని బడలికను దొలగించునట్టి యౌషధ విశేషమును సేవించుటవలన నని యర్థము. పునః = మరల, సమ్బుభుక్షుమనసౌ; సమ్బుభుక్షు=సంభోగమును కోరెడి, మనసౌ=మనస్సుగంవారుగా, బభూవతుః=అయిరి, తు=కాని, దుర్జనీ=పరసుఖమును ద్వేషించుటచే, దుష్టజన్మము గల్గిన, అల్పజీవితా=వసంతకాలమునకు సంబంధించుట వలన కొలదిపాటి జీవితము అనగా పరిమితిగల్గిన, రజనిః=రాత్రియు (ఒకానొక స్త్రీ), తయోః=ఆ దమ్పతులయొక్క, మనోరథం=కోరికను, న చక్షమే=ఓర్వలేదు.

సమాసములు :

మిథోరతిరసాయనాత్ - మిథః రతిః = మిథోరతిః, మిథోరతి రేవ రసాయనం=మిథోరతిరసాయనం, తస్మాత్=మిథోరతిరసాయనాత్. సమ్బుభుక్షమనసౌ-సమ్భోక్తు మిచ్ఛత ఇతి=సమ్బుభుక్షుణీ, సమ్బుభుక్షిణీ మనసీ యయో స్తౌ=సమ్బుభుక్షుమనసౌ.

దుర్జనీ - దుష్టా జనిః యస్యా స్సా=దుర్జనీ.

అల్పజీవితా - అల్పం జీవితం యస్యా స్సా=అల్పజీవితా.

భావము :

వారొండొరుల యనురాగ మనెడి ముదిమినిఁ దొలగించు నౌషధముచే మరల సంభోగింపగోరిరి. కాని యొరుల సుఖమును సహింపజాలని దుష్టజన్మము, అల్ప జీవితము గలిగిన రాత్రి దానిని సహింపలేదు. అది వసంతము గాన వసంత కాలపు రాత్రికి జీవితము అనగా పరిమితి తక్కువ కాన వీరి సంభోగప్రవృత్తికి

మునుపే రాత్రి గడచిపోయినదని యర్థము. లోకమున దుర్జనుడు పరుల శ్రేయమును సహింపనివాడుగను, అల్పాయుష్కుడుగను నుండును. అట్లే వసంతకాలపు రాత్రియు నాచరించినదని యాశయము. ॥136॥

శ్లో. స్వప్తు మాత్తశయనీయయో స్తయో
నైస్వైర మాఖ్యత వచః ప్రియాం ప్రియః,
ఉత్సవై రధరదానపానజై
స్సాన్తరాయపద మన్తరాఽన్తరా. 137

ప.వి. స్వప్తుం-ఆత్తశయనీయయోః-తయోః-స్వైరం-ఆఖ్యత-వచః-ప్రియాం-ప్రియః-ఉత్సవైః-అధరదానపానజైః-సాన్తరాయపదం-అన్తరా-అన్తరా.

**అర్థము :** స్వప్తుం=నిద్రించుటకు, ఆత్తశయనీయయోః; ఆత్త=పొందబడిన, శయనీయయోః = పడకలు గలిగిన, తయోః=ఆ ప్రియుల మధ్య, ప్రియః=ప్రియుడగు నలుడు, ప్రియాం=ప్రియురాలగు దమయంతిని, అధరదానపానజైః; అధరదాన = ఒండొరుల పెదవుల నొండొరులు ముద్దుకొనుటకై యిచ్చుటవలనను, పానజైః=అట్లు ముద్దుకొనుట వలన కలిగినట్టి, ఉత్సవైః=సంతోషములతో, అన్తరా న్తరా=మధ్యే మధ్య అనగా అధరదానపానములకుమధ్య, సాన్తరాయపదం; సాన్తరాయ =దానపానము లనెడి విఘ్నములతో కూడి మధ్య మధ్య తెగిపోయినవిగా ప్రయోగింపబడిన, పదం=సుబన్తతిఙన్తరూపములగు పదములుగలిగిన, వచః=తన ప్రేమను తెలియజేయునట్టి వాక్యమును, స్వైరం=స్వేచ్ఛగా, ఆఖ్యత=చెప్పెను.

సమాసములు :

ఆత్తశయనీయయోః- శయితుం యోగ్యం శయనీయం, ఆత్తం శయనీయం యాభ్యాం తౌ=ఆత్తశయనీయౌ, తయోః=ఆత్తశయనీయయోః.

అధరదానపానజైః—దానం చ పానం చ = దానపానే, అధరస్య దానపానే=అధరదానపానే, అధరదానపానాభ్యాం జాయన్తే ఇతి= అధరదానపానజాః, తైః = అధరదానపానజైః.
సాన్తరాయపదం -అన్తరాయేణ సహ వర్తన్తే ఇతి = సాన్తరాయాణి, సాన్తరాయాణి పదాని యస్మిన్ తత్ =సాన్తరాయపదం.

భావము :

ఆ ప్రియు లిరువురు పడకలపై బరుండిరి. కాని యా సమయమున వారొండొరుల పెదవుల నొండొరులు చుంబనములకై యిచ్చుటచేతను చుంబనములను జేయుటచేతను మధ్య మధ్య విఘ్నము లేర్పడుటవలన పరస్పర సంభాషణములు మధ్య మధ్యఁ దెగిపోవుట వలన తమ తమ ప్రేమల నావిష్కరించు సల్లాపములను నసంబద్ధముగా స్వేచ్ఛతోఁ జేయుచుండిరి. అనగా పై విఘ్నముల వలన వారి సంభాషణములు క్రమబద్ధముగా నుండలేదని యాశయము. ॥137॥

శ్లో॥ దేవదూత్య ముపగత్య నిర్దయం
ధర్మభీతికృత తాదృశాగసః,
అస్తు సేయ మపరాధమార్జనా
జీవితావధి నలస్య వశ్యతా. 138

ప. వి. దేవదూత్యం-ఉపగత్య-నిర్దయం-ధర్మభీతికృతతాదృశాగసః — అస్తు-సా-ఇయమ్-అపరాధమార్జనా-జీవితావధి-నలస్య-వశ్యతా.

అర్థము: హే ప్రియే!=ఓ ప్రియులారా!, దేవదూత్యం = దేవతలకు దూతకృత్యమును, ఉపగత్య=పొంది, అనగా దేవతలకు దూతగా నుండుట కంగీకరించి, నిర్దయం=దయలేక, ధర్మభీతికృతతాదృశాగసః, ధర్మభీతి= ప్రతిజ్ఞ చేయబడిన విషయమును భంగపరచుటచేనైన ధర్మలోపము వలని భయముచే, కృత=చేయబడిన, తాదృశ=అట్టి, అనగా ఇంద్రాదులను వరించుటకొఱకై ప్రతికూలమగు నాచరణ మనెడి, ఆగసః= అపరాధము గల్గిన, నలస్య=నలుడైన నాకు సంబంధించిన, జీవితావధి=

బ్రతికినంతకాలము, సా=ఆ, ఇయం=ఈ, వశ్యతా=నీకు వశమై నీ యాజ్ఞ ననుసరించుట, అపరాధమార్జనా=నా యా యపరాధమునకు పరిహారముగా, అస్తు=ఉండునుగాత.

సమాసములు :

దేవదూత్యం-దూతస్య కర్మ=దూత్యం, దేవానాం దూత్యం=దేవ దూత్యం, తత్=దేవదూత్యం, నిర్దయం-నిర్గతా దయా యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా=నిర్దయం.

ధర్మభీతికృతతాదృశాగసః - ధర్మాత్ భీతిః=ధర్మభీతిః, ధర్మభీత్యా, కృతం=ధర్మభీతికృతం, తాదృశం చ తత్ ఆగశ్చ=తాదృశాగః, ధర్మభీతికృతం తాదృశాగః యేన సః = ధర్మభీతి కృతతాదృశాగాః, తస్య=ధర్మభీతికృతతాదృశాగసః.

అపరాధమార్జనా-అపరాధస్య మార్జనా=అపరాధమార్జనా.

జీవితావధి-జీవితం అవధిః యస్మిన్ కర్మణి యద్యథా భవతి తథా = జీవితావధి.

వశ్యతా=వశే వర్తత ఇతి=వశ్యః, వశ్యస్య భావః=వశ్యతా.

భావము :

పూర్వ శ్లోకమున నలుడు దమయంతిని గూర్చి చెప్పిన మాటలను కవి వివరించుచున్నాడు. 'ఓ ప్రియురాలా! దేవతలకు దూతకృత్యము నంగీకరించి, కఠినముగా ధర్మమునకు వెఱచి, యింద్రాదులకు దమయంతీవరణ విషయమున దా గావించిన ప్రతిజ్ఞను పాలించుకొనుటకై దమయంతి విషయమున దా వహించిన ప్రతికూలవైఖరి యనెడి యపరాధమునకు పరిహారము బ్రతికినంతకాలము ఆమెకు వశమునందుండి యామె యాజ్ఞను పరిపాలించుటయే యగుగాక యని నలుడు నిర్ణయించుకొనెను. ॥138॥

శ్లో. స క్షణ స్సుముఖి! య త్త్వదీక్షణం
తచ్చ రాజ్య మురు యేన రజ్యసి,
తన్నలస్య సుధయా ఽభిషేచనం
య స్త్వదఙ్గపరిరమ్భవిభ్రమః.

ప.వి. సః-క్షణః-సుముఖి-యత్-త్వదీక్షణం-తత్-చ-రాజ్యమ్-ఉరు-యేన-రజ్యసి-తత్-నలస్య-సుధయా-అభిషేచనం-యః-త్వదఙ్గపరిరమ్భవిభ్రమః

అర్థము: హే సుముఖి!=ఓ సువదనా! యత్=ఏ, త్వదీక్షణం=నీయొక్క దర్శనము, అనగా నిన్ను దర్శించుట, నలస్య = నలుడైన నాకు, సః = అది, క్షణః = ఆనందము యేన = ఏపనిచేతకాని, ఏ వస్తువు చేతకాని, రజ్యసి = అనురక్తురాల వయ్యెదవో, తచ్చ = అదియును, ఉరు=గొప్పదైన, రాజ్యం = రాజ్యము అనగా రాజత్వము. నీ ప్రసన్నవదనము జూచుటవలని సుఖము రాజ్యసుఖము కంటెను నధికమైనది, యః=ఏ, త్వదఙ్గపరిరమ్భవిభ్రమః, త్వత్=నీయొక్క, అఙ్గ=శరీరము యొక్క, పరిరమ్భ=కౌగిలింపనెడి, విభ్రమః = లీల, తత్=అదియే, సుధయా=అమృతముతో, అభిషేచనం=అభిషేకము.

సమాసములు :

సుముఖి—శోభనం ముఖం యస్యాః సా = సుముఖీ, తస్యాః సమ్బుద్ధిః =సుముఖి.
త్వదీక్షణం- తవ ఈక్షణం=త్వదీక్షణం.
త్వదఙ్గపరిరమ్భవిభ్రమః- తవ అఙ్గం=త్వదఙ్గం, త్వదఙ్గస్య పరిరమ్భః =త్వదఙ్గపరిరమ్భః, త్వదఙ్గపరిరమ్భ ఏవ విభ్రమః= త్వదఙ్గపరిరమ్భవిభ్రమః.

భావము :

ఓ సుముఖీ! నిన్ను దర్శించుట నలుడనయిన నాకు నానందము. నీకు సంతోషమును గూర్చెడి పని నాకు గొప్ప రాజ్యము. నీ వక్షఃస్థలము మున్నగువానిని కౌగిలించుకొనుట నాకు అమృతముతోటి యభిషేకము. అనగా నమృతముతోటి యభిషేక మెట్లు శరీరమున కాప్యాయన మొసంగునో అట్లు నీ కౌగిలింపు ఆప్యాయనమును గల్గించునని యర్థము. మఱియు సడలిపోయిన శరీరమునకు అమృతాభిషేచన ము తేజ మొసఁగును. నీసంబంధములేని దేదియు నాకు రుచింపదని యాశయము.

శ్లో. శర్మ కిం హృది హరేః ప్రియార్పణం
కిం శివార్ధఘటనం శివస్య వా,
కామయే తవ మయేహ తన్వి తం
నన్వహం సరి దుదన్వదన్వయమ్. 140

ప.వి. శర్మ-కిం-హృది-హరేః-ప్రియార్పణం-కిం-శివార్ధఘటనం-శివస్య-వా - కామయే-తవ-మయా-ఇహ-తన్వి-తం-నను-అహం - సరిత్ - ఉదన్వదన్వయమ్.

అర్థము : హరేః=విష్ణువుయొక్క, హృది=వక్షఃస్థలమునందు, ప్రియార్పణం; ప్రియా=ప్రియురాలగు లక్ష్మిని, అర్పణం=నెలకొల్పుట, కిం శర్మ= సుఖమా యేమి? సుఖకరము గాదు. ఏల యనగా నన్ని విధములలో నేకీభావము కుదురదుగదా, వా=లేదా, శివస్య=శివునకు, శివార్ధఘటనం, శివా=పార్వతియొక్క, అర్ధ=సగపాలుతో, ఘటనం=కూర్చుట, అనగా నర్ధనారీశ్వరత్వము నేర్పరచుట, కిం శర్మ=సుఖమా యేమి? అదియు సుఖకరము గాదు. మరి నీవు కోరెడి సుఖ మేది యనినచో చెప్పుచున్నాడు. నను తన్వి=ఓకృశాఙ్గీ, ఇహ=ఈ లోకమునందు, అహం=నలుడైన నేను, మయా సహ=నాతోడ, తవ=నీకు, తం = ఆప్రసిద్ధమైన యనగా అన్ని విధములుగా గోరదగిన, సరిదుదన్వయం, సరిత్=నది యొక్క, ఉదన్వత్=సముద్రము యొక్క, అన్వయం=మేళనము, అనగా ఏకరూపమైన కలయికను, కామయే=కోరుదును. లక్ష్మీనారాయణుల యొక్కయు, పార్వతీ పరమేశ్వరుల యొక్కయు కలయికలలో భేదము కానవచ్చును. కాని నదీ సముద్రముల కలయికయం దది కానరాదని యర్థము.

సమాసములు :

శివార్ధఘటనం- అర్ధస్య ఘటనం=అర్ధఘటనం, శివయా అర్ధఘటనం =శివార్ధఘటనం,

సరిదుదన్వదన్వయం - సరిచ్చ ఉదన్వాంశ్చ = సరిదుదన్వన్తౌ, సరి దుదన్వతోః అన్వయః = సరిదుదన్వదన్వయః, తం = సరిదుదన్వదన్వయం.

భావము :

విష్ణువు వక్షః స్థలమున లక్ష్మిని నెలకొల్పుటకాని, శివుని యర్ధదేహమున పార్వతిని సంధిల్లజేయుటగాని సుఖకరములుకావు. ఏల యనగా? ఇచ్చట స్త్రీ పురుషుల కలయికలలో భేదము స్పష్టముగా గానవచ్చుచుండును. అందువలన మన ఇరువురి కలయిక యీ విధముగా నుండుట సమ్మతమైనది కాదు. మరే మనగా, మన యిరువురి కలయిక నదీ సముద్రముల కలయికవలె నేకీభావమును బొందియుండవలయును. నది సముద్రమున కలసినచో రెండును జలములే యగుటవలన వానిని భేదింప సాధ్యము కాదు. ఆ విధముగనే మన యిరువురి సంబంధ ముండవలయును. ॥140॥

శ్లో. దీయతాం మయి దృఢం మమేతిధీ
ర్వక్తుమేవ మవకాశ ఏవ కః,
యద్విధూయ తృణవ ద్దివస్పతిం
క్రీతవత్యసి దయాపణేన మామ్. 141

ప. వి. దీయతాం-మయి - దృఢం-మమ- ఇతి-ధీః-వక్తుమ్ - ఏవం-అవకాశః- ఏవ- కః - యత్ - విధూయ - తృణవత్ - దివస్పతిం- క్రీతవతీ-అసి దయాపణేన-మామ్.

అర్థము:- హే ప్రియే-ఓ ప్రియురాలా ! మయి = నా విషయమునందు, అనగా నన్నుగూర్చి, మమేతి ధీః = మమత్వబుద్ధి, దృఢం = గట్టిగా, దీయతాం = అర్పింపబడవలయును, ఏవం = ఇట్లు, వక్తుం = చెప్పుటకు, అవకాశ ఏవ = అవసరమే, కః = ఎక్కడిది? లేదని యర్థము. ఏల యనగా- లభ్యము కాని విషయమునే జనము కోరును. కాన లభ్యమైన విషయ మును గోరుటలో నౌచిత్యము లేదని యర్థము. యత్ = ఏల యనగా, దివస్పతిం = ఇంద్రుని గూడ, తృణవత్ = గడ్డిపోచవలె, విధూయ =

నిరసించి, దయాపణేన=దయా=దయయనెడి, పణేన=శుల్కముచే అనగా వెలచే, మాం=నన్ను, క్రీతవతీ=కొనినదానవుగా, అసి=అగు చున్నావు. కాన కొనబడిన సేవకుడనగు నాయెడ ప్రభువైన నీకు మమత్వ బుద్ధి గలుగు విషయమున ప్రార్థింప నవకాశము లేదని యర్థము.

సమాసములు :

తృణవత్—తృణమివ=తృణవత్.
దివస్పతిం - దివః పతిః=దివస్పతిః, తం=దివస్పతిమ్.
దయాపణేన— దయైవ పణః=దయాపణః, తేన=దయాపణేన.

భావము :

ఓ ప్రియురాలా ! నా విషయమున నీకు మమకారము గట్టిగా నేర్పడ వలయునని చెప్పనవసరము లేదు. ఏలయనగా నది యేర్పడియే యున్నది. లోకమున సిద్ధమైన విషయమును గూర్చి ప్రార్థన యవసరములేదు. ఏల యనగా- నీవు ఇంద్రుని గూడ తృణీకరించి దయయనెడి వెలతో నన్ను గొంటివి. కాన నేను నీకు క్రీతదాసుడను. అట్టి నా విషయమునందు ప్రభువైన నీకు మమకార మేర్పడుటకు నా ప్రార్థనయొక్క యవసర మేమి యున్నది? ఏ విధముగను లేదని యర్థము.

శ్లో. శృణ్వతా నిభృతమాలిభి ర్భవ
ద్వాగ్విలాస మసకృ న్మయా కిల
మోఘరాఘవవిసర్జ్యజానకీ
శ్రావిణీ భయచలాఽసి వీక్షితా. 142

ప. వి. శృణ్వతా-నిభృతం- ఆలిభిః- భవద్వాగ్విలాసం- అసకృత్-మయా-కిల- మోఘరాఘవవిసర్జ్యజానకీశ్రావిణీ-భయచలా-అసి-వీక్షితా.

అర్థము : హే ప్రియే != ఓ ప్రియురాలా, ఆలిభి స్సహ= చెలికత్తెలచే, భవ ద్వాగ్విలాసం, భవత్=నీ యొక్క, వాగ్విలాసం=మాటలలోని లీలను,

అసకృత్=పలుమాఱులు, నిభృతం=గూఢముగా, అనగా అంతర్భావ విద్యతో నాకసము నందుండి శరీరమును మఱుగు పఱుచుకొని, శృణ్వతా= వినుచున్న, మయా= నలుడనైన నాచే, మోఘరాఘవ విసర్జ్యజానకీ శ్రావిణీ, మోఘ=వ్యర్థముగా,రాఘవ=శ్రీరామచంద్రునిచే విసర్జ్య=విడువవలసిన, జానకీ=సీతను, శ్రావిణీ కిల=చెవులవలన వినుచున్న (కావుననే) భయచలా = భయముచే ననగా తనకు గూడ సీతయొక్క గతి పట్టునేమో యను భయముచే, చలా=కంపించుచున్న నీవు, వీక్షితాసి=చూడబడితిని కావున నీకు నా విషయమున మమ కారము లేదని చెప్పుట కవకాశము లేదని యర్థము.

సమాసములు :

భవద్వాగ్విలాసం—వాచాం విలాసః= వాగ్విలాసః, భవత్యాః వాగ్విలాసః=భవద్వాగ్విలాసః, తం=భవద్వాగ్విలాసం.

మోఘరాఘవ విసర్జ్య జానకీ శ్రావిణీ - రఘూణాం గోత్రాపత్యం పుమాన్=రాఘవః, విస్రష్టుం శక్యా=విసర్జ్యా, మోఘం రాఘవేణ విసర్జ్యా=మోఘరాఘవవిసర్జ్యా, జనకస్య అపత్యం స్త్రీ=జానకీ, మోఘ రాఘవవిసర్జ్యా చ సా జానకీ చ=మోఘ రాఘవ విసర్జ్య జానకీ, మోఘ రాఘవ విసర్జ్యజానకీం శృణోతీతి = మోఘరాఘవవిసర్జ్యజానకీశ్రావిణీ. భయచలా-భయేన చలా=భయచలా.

భావము :

ఓ ప్రియురాలా! నీవు చెలికత్తెలతోఁ గలసి కథలను చెప్పుకొనుచుండుటను నేను ఇంద్రాదు లిచ్చిన వరప్రభావముచే కనబడక యంతరాళము నందుండి వినుచుంటిని. అట్టు కథా శ్రవణ కాలమునందు రాబోవు త్రేతా యుగమునందు నగ్ని పరీక్షచే బరిశుద్ధురాలుగా నిర్ణయింపబడిన సీతాదేవిని శ్రీరామచంద్రుడు వ్యర్థముగా నసత్యములగు లోకాపవాదములతో వదలి పెట్టబోవుచున్నాడని త్రికాలజ్ఞులగు మునులు చెప్పిన కథలను జెలికత్తెలు జెప్పుచుండగా నీవు విని నీకును నట్టి పరిస్థితి యేర్పడునేమో యని భయకంపితురాలవుగా నాకు కనపడి

తివి. కాన నీకు నా యెడ మమకారము లేదని చెప్పుట కవకాశము లేదని యాశయము. ॥142॥

॥యుగ్మమ్॥

శ్లో. ఛుప్తపత్ర వినిమీలితక్షుపాత్
కచ్ఛపస్య ధృతచాపలాత్ పలాత్,
తత్సఖీషు సరటా చ్ఛిరోధుతః
స్వం భియోఽభిదధతీషు వైభవమ్. 143

శ్లో. త్వం మదీయవిరహా న్మయా నిజాం
భీతి భీ రితవతీ రహః శ్రుతా,
నోఙ్ఝితాఽస్మి భవతీం తదిత్యయం
వ్యాహర ద్వర మసత్యకాతరః. 144

ప. వి. ఛుప్త పత్ర వినిమీలితక్షుపాత్ - కచ్ఛపస్య-ధృతచాపలాత్ - పలాత్ - త్వత్సఖీషు-సరటాత్-శిరోధుతః-స్వం-భియః-అభిదధతీషు-వైభవమ్.

త్వం-మదీయవిరహాత్- మయా-నిజాం-భీతిభిః- ఇతవతీ-రహః-శ్రుతా-న-ఉఙ్ఝితా-అస్మి-భవతీం-తత్-ఇతి-అయం-వ్యాహరత్-వరమ్- అసత్య కాతరః.

అర్థము: ఛుప్త పత్ర వినిమీలితక్షుపాత్, ఛుప్త=తాకబడినట్టి, పత్ర=ఆకుల యందు, లేదా ఛుప్తపత్ర= తాకబడిన యాకులుగనే, వినిమీలిత = ముడుచుకొనబడిన, క్షుపాత్ = పొట్టి కొమ్మలు గలిగిన యొకనొక క్షుద్ర వృక్ష విశేషమువలనను ననగా "లజ్జాలు" వనగా సిగ్గుపడునది యని చెప్పబడు వృక్షము వలనను, తథా = అట్లే, ధృత చాపలాత్, ధృత=వహింపబడిన, చాపలాత్=చపలకర్మ గలిగిన, యనగా లోప లికి పోవుట, వెలుపలికి వచ్చుట యను కార్యము గలిగిన, కచ్ఛపస్య= తాబేటియొక్క, పలాత్ = మాంసఖండమువలన, ననగా తొండము వంటి యవయవము వలనను, తథా=అట్లే, శిరోధుతః=తలను విద ళించుచున్నట్టి, సరటాత్=కోడివలనను, స్వం=తమదైన, భియః=

భీతి యొక్క, వైభవం = ఆధిక్యమును, రహః = రహస్యమున, అఖిదధ
తీషు సతీషు = చెప్పుచుండగా.

మదీయవిరహాత్ = నాదగు వియోగమువలన, నిజాం = తన
దైన, భీతిం = భయమును, ఈరితవతీ = చెప్పిన, త్వం = నీవు,
మయా = నాచేత, శ్రుతా = వినబడితివి, తత్ = అట్లు నీ భయస్మర
ణము వలన, భవతీం = నిన్ను, న ఉజ్ఝితాస్మి = విడువబోను, అసత్య
కాతరః = అసత్యముచే భయము చెందిన, అయం = ఈ నలుడు, ఇతి =
ఇట్లు, వరం = వదిలిపెట్టబోనను వరమును, వ్యాహరత్ = చెప్పెను,
అనగా దమయంతికి వర మొసంగెను.

సమాసములు :

ఛుప్తపత్ర వినిమీలితక్షుపాత్ - ఛుప్తాని పత్రాణి యస్య సః = ఛుప్త
పత్రః, ఛుప్తపత్ర ఏవ వినిమీలితః = ఛుప్తపత్రవినిమీలితః, ఛుప్త
పత్ర వినిమీలిత శ్చాసౌ క్షుపశ్చ = ఛుప్తపత్ర వినిమీలిత క్షుపః,
తస్మాత్ = ఛుప్తపత్ర వినిమీలిత క్షుపాత్.

ధృతచాపలాత్ - చపలస్య కర్మ = చాపలం, ధృతం చాపలం యేన సః
= ధృతచాపలః, తస్మాత్ = ధృతచాపలాత్.

త్వత్సఖీషు - తవ సఖ్యః = త్వత్సఖ్యః, తాసు = త్వత్సఖీషు.

శిరోధుతః - శిరః ధునోతీతి = శిరోధుత్, తస్మాత్ = శిరోధుతః.

మదీయవిరహాత్ - మమ అయం = మదీయః, మదీయ శ్చాసౌ విర
హశ్చ = మదీయ విరహః, తస్మాత్ = మదీయవిరహాత్.

అసత్యకాతరః - అసత్యాత్ కాతరః = అసత్యకాతరః.

భావము :

ఒకానొక సమయమందు చెలికత్తెలతో కలిసి దమయంతి సల్లాపము
చేయుచుండగా నెవరు దేనివలన భయపడెదరని ప్రశ్న యుదయింపగా, నొక
చెలికత్తె తాను మానవస్పర్శచేతనే ముడుచుకొనిపోవునట్టి చిన్నచెట్టువలన

భయపడెదనని చెప్పినది. మరియొకతె లోపలికి వెలుపలికి పోవుచు వచ్చుచు నుండెడి తాబేటి తొండమును చూచి భయపడెదనని చెప్పినది. ఇంకొకతె మాటి మాటికి దలను విదిలించుచు వికృత రూపమును ప్రదర్శించెడి కోడివలన భయ పడెదనని చెప్పెను.

అపుడు దమయంతి తాను నలుని విరహము వలన భయపడెద నని చెప్పెను. ఆ మాటను నలుడు వినినవాడై 'నిన్ను నేను వదలి' పెట్టనని అసత్యభీతుడై దమయంతికి వర మొసంగెను. అసత్య భీతుడనగా అసతీ = అపతివ్రతలవలన, అభీతుడు=భయము జెందని వాడు అని యర్థము. అనగా నలుడు అపతివ్రతలవలన భయపడడు. పతివ్రతలవలననే భయపడు నని యర్థము. అనగా నసత్యమువలన భయపడువాడనియు, నసతులవలన భయము జెందినవాడనియు నర్థము. (14-11)వ శ్లోకమున నింద్రాదులొసంగిన వర ప్రభావమువలన, నంతర్ధానవిద్యచే నదృశ్యుడైయుండి ''నేను నిన్ను వదలన''ని నలుడు వరమొసంగెనని యర్థము. ఇట్లు వర మొసంగియు తర్వాత నామెను వదిలిపెట్టి ప్రతిజ్ఞను నలుడు పాలింపలేక పోయెను కాని యది దైవాధీన మైనందువలన దప్పక జరుగవలసినదైయుండి జరిగినదేకాని దానివలన నలు నకు నసత్యదోషము వాటిల్లదని భావింపవలయును. ॥144॥

శ్లో. సజ్గమయ్య విరహేఽస్మి జీవికా
యైవ వామథ రతాయ తత్క్షణమ్,
హన్త దత్థ ఇతి రుష్టయాఽఽవయో
ర్నిద్రయాఽద్య కిము నోపసద్యతే. 145

ప.వి. సజ్గమయ్య-విరహే-అస్మి-జీవికా-యా-ఏవ-వామ్-అథ-రతాయ-తత్క్షణం-హన్త-దత్థ-ఇతి-రుష్టయా-ఆవయోః-నిద్రయా-అద్య-కిమ్-ఉ-న-ఉపసద్యతే.

అర్థము: యైవ=ఏ, అహం=నేనైన నిద్ర, విరహే=వివాహమునకు పూర్వ మేర్పడిన వియోగదశయందు, వాం=మిమ్ముల నిద్దరిని, సజ్గమయ్య= కలిపి, యనగా సజ్గమసుఖము ననుభవింపజేసి, జీవికా=మీకిరువురికిని జీవనమును అనగా బ్రతుకు నొసంగిన దాన నగుచున్నాను. అథ=

పిదప, ననగా వివాహమైన పిదప, తత్క్షణం, తత్=ఆ నిద్రయగు నాకు, క్షణం=రాత్రిరూపమైన కాలమును, రతాయ=సురతమునకై, దత్త= మీరిరువురు నొసంగితిరి. ఆ సమయమున మీరు నన్ను వదలి సురతమును గావించితిరి. హన్త = కష్టము, ఇతి = ఈ కారణమువలన, కిము=ఏమో యనునట్లు, రుష్టయా=రోషముఁజెందిన, నిద్రయా= నిద్రచే, అద్య=ఈ రాత్రియందు, ఆవయోః=మన యిరువురికిని, నోపసద్యతే=సమీపమున రాకపోవుట (ఏర్పడుచున్నది). నిద్రపోవుటకు ప్రయత్నించినను నిద్ర రానందువలన నలుడు పై విధముగా జెప్పెను.

సమాసములు :

**తత్క్షణం** - తస్యాః క్షణః=తత్క్షణః, తం=తత్క్షణం.

భావము :

దమయంతీనలులు తెంపులేక రేయింబవలు సురతకేళి జరుపుచు నిద్రపోకయుండిరి. వారు ప్రయత్నించినను వారికి నిదుర రాలేదు. అది యిచ్చట కవిచే చమత్కారముతో వర్ణింపబడినది. దమయంతీ నలులైన మీరిరువురికిని వివాహము జరుగుటకు పూర్వము వియోగదశయందు నిద్రయగు నేను మిమ్ముల నిద్దరిని గలిపి సంగమసుఖమును కల్పించి మీ జీవనమునకు గారణముగా నుంటిని. వివాహమైన పిదప నాయొక్క సమయమగు రాత్రికాలము నంతటిని సురతకేళి కొసంగి నన్ను వదిలిపెట్టితిరి. ఇది కష్టమైన విషయము. ఇట్లు తన్ను పరిత్యజించుటవలన రోషము జెందినదో యనునట్లు నిద్ర మన ఇరువురి యొద్దకును రాకయున్నది యని నలుడు చెప్పెను. ఎంత ప్రయత్నించినను వారిరువురికిని నిద్ర రాలేదని యర్థము. నలుడును దమయంతియును రాత్రి నంతటిని సురతముతో గడిపిరని యాశయము. ॥145॥

శ్లో. ఈదృశం నిగదతి ప్రియే దృశౌ
సమ్మదాత్ కియదియం న్యమీలయత్,
ప్రాత రాలపతి కోకిలే కలం
జాగరాదివ నిశః కుముద్వతీ. 146

ప.వి. ఈదృశం-నిగదతి-ప్రియే-దృశౌ-సమ్మదాత్-కియత్ - ఇయం - న్యమీల యత్-ప్రాతః-ఆలపతి-కోకిలే-కలం-జాగరాత్-ఇవ-నిశః - కుముద్వతీ.

అర్థము: ప్రియే = ప్రియుడగు నలుడు, సమ్మదాత్ = సంతోషము వలన, ఈదృశం=ఈ విధముగా, నిగదతి సతి=చెప్పుచుండగనే, ప్రాతః= తెల్లవారగనే, కోకిలే=కోయిల, కలం=మధురముగను నస్ఫుటముగను, ఆలపతి సతి=ఆలపింపగా, ననగా కూయగా, నిశః=రాత్రియొక్క, జాగరాత్=మెలకువ వలన, కలువపూవు పక్షమున రాత్రియందు వికసించుటవలన, పక్షాన్తరమున సురతవ్యాపారమున నిదురపోనందు వలన, కుముద్వతీవ=కలువతీగవలె, ఇయం=ఈ దమయంతి, కియత్ =కొంచెము, దృశౌ=నేత్రములను, న్యమీలయత్=మూసెను.

భావము :

ప్రియుడగు నలు డీవిధముగా దమయంతి ననుభవించుటచే నేర్పడిన యానందముతో నిట్లు నిదుర రాలేదని చెప్పగనే, వేకువనే కోకిల మధురముగా కూయగనే రాత్రి జాగరణమువలన ననగా రాత్రి వికసించుటవలన, పక్షాంతర మున సురత వ్యాపారముచే రాత్రి నిదుర లేకపోవుటవలన, కలువ తీగవలె నీ దమయంతి కొంచెము కన్నులను మూసినది. ఇందువలన నలుని కంఠస్వరము కోకిలధ్వనివలె మధురముగను దమయంతి కన్నులు కలువపూవులవలె నున్నట్లును సూచితము. రాత్రియంతయు కలువపూవు వికసించి ప్రాంతఃకాలమున ముడుచు కొనును. అట్లే దమయంతి సంభోగ కేళివలన రాత్రియంతయు మేల్కొని ప్రాతః కాలమున కన్నులను మూసి నిదురించినది కాన నామె కలువతీగెతో బోల్చ బడినది. ॥146॥

శ్లో. మిశ్రితోరు మిలితాధరం మిథః
స్వప్నవీక్షిత పరస్పరక్రియం,
తౌ తతోఽను పరిరమ్భసమ్పుటే
పీడనాం విదధతౌ నిదద్రతుః. 147

ముద్రితోర్వీన్ద్ర వక్షశ్చిహ్న ఖ్యాతైక భావోభయ హృదయం; బాలా = పదునారేండ్ల ప్రాయముగల ప్రియురాలగు దమయంతి యొక్క, వక్షోజ = చనుదోయిపై, పత్రాఙ్కుర = కుంకుమ పుష్పము మున్నగువానిచే వ్రాయబడిన చిన్న చిన్న తిలక రచనలయందలి కరిమకరీ = కస్తూరి మున్నగువానిచే వ్రాయబడిన యేనుగుల యొక్క మొసళ్ళ యొక్కయు శరీరములచే, ముద్రిత = గుర్తింపబడిన, ఉర్వీన్ద్ర = భూపతియగు నలునియొక్క, వక్షః = రొమ్మునందలి, చిహ్న = గుర్తులచే, ననగా దమయంతిని గట్టిగా కౌగిలించుకొనుటచే నంటిన యేనుగులు మున్నగువాని యాకృతిచే, కథిత = చెప్పబడిన, ఏకభావ = ఐక్యము కల్గిన, ఉభయ = ఒండొరుల యొక్క, హృదయం = వక్షఃస్థలములుగల, తత్ = ఆ నలదమయంతీ రూపముగల, ద్వంద్వం = జంట, ఆనన్దనిద్రాం = సుఖనిద్రను, అగాత్ = పొందినది.

సమాసములు :

*యాతాయాత రంహశ్ఛల కలితరతిశ్రాన్తినిఃశ్వాసధారాజస్రవ్యామిశ్రభావస్ఫుటకథిత మిథః ప్రాణభేదవ్యుదాసం* - యాతం చ ఆయాతం చ = యాతాయాతే, యాతాయాతయోః రంహః = యాతాయాతరంహః, యాతాయాతరంహసః ఛలం = యాతాయాతరంహశ్ఛలం, యాతాయాత రంహశ్ఛలేన కలితా = యాతాఽఽయాత రంహశ్ఛలకలితా, రతేః శ్రాన్తిః రతిశ్రాన్తిః, యాతాయాత రంహశ్ఛలకలితా రతిశ్రాన్తిః యాసాం తాః = యాతాయాత రంహశ్ఛలకలిత రతిశ్రాన్తయః. నిఃశ్వాసానాం ధారాః = నిఃశ్వాసధారాః, యాతాయాతరంహశ్ఛలకలిత రతిశ్రాన్తయశ్చ తాః నిఃశ్వాసధారాశ్చ = యాతాయాతరంహశ్ఛలకలిత రతిశ్రాన్తినిఃశ్వాస ధారాః, వ్యామిశ్రస్య భావః = వ్యామిశ్రభావః, అజస్రం వ్యామిశ్రభావః = అజస్రవ్యామిశ్రభావః, యాతాయాతరంహశ్ఛలకలిత రతిశ్రాన్తినిః శ్వాసధారాణాం అజస్రం వ్యామిశ్రభావః = యాతాయాతరంహశ్ఛలకలిత రతిశ్రాన్తినిఃశ్వాసధారాజస్రవ్యామిశ్రభావః, యాతాయాత రంహశ్ఛల కలిత రతిశ్రాన్తినిఃశ్వాసధారాజస్రవ్యామిశ్రభావేన స్ఫుటం కథితః = యాతాయాతరంహశ్ఛలకలితరతిశ్రాన్తినిఃశ్వాసధారాజస్రవ్యామిశ్రభావ

స్ఫుటకథితః, మిథః ప్రాణయోః భేదః=మిథఃప్రాణభేదః, మిథఃప్రాణ భేదస్య వ్యుదాసః=మిథఃప్రాణభేదవ్యుదాసః, యాతాయాతరంహాశ్చలకలిత రతిశ్రాన్తి నిఃశ్వాసధారాజస్రవ్యామిశ్రభావస్ఫుట కథితః మిథః ప్రాణభేదవ్యుదాసః యస్య తత్= యాతాయాతరంహాశ్చలకలిత రతిశ్రాన్తినిఃశ్వాసధారాజస్రవ్యామిశ్రభావస్ఫుటకథిత మిథః ప్రాణభేద వ్యుదాసం.

*బాలావక్షోజపత్రాఙ్కురకరిమకరీ ముద్రితోర్వీన్ద్రవక్షశ్చిహ్నఖ్యాతైకభావోభయహృదయం*-బాలాయాః వక్షోజౌ=బాలావక్షోజౌ, బాలా వక్షోజయోః పత్రాఙ్కురాః=బాలావక్షోజపత్రాఙ్కురాః, కరిణశ్చ మకర్యశ్చ=కరిమకర్యః, బాలావక్షోజపత్రాఙ్కురేషు కరిమకర్యః=బాలా వక్షోజపత్రాఙ్కుర కరిమకర్యః, బాలావక్షోజపత్రాఙ్కురకరిమకరీభిః ముద్రితాని=బాలావక్షోజపత్రాఙ్కురకరిమకరీముద్రితాని, ఉర్వ్యాః ఇన్ద్రః =ఉర్వీన్ద్రః, ఉర్వీన్ద్రస్య వక్షః=ఉర్వీన్ద్రవక్షః, ఉర్వీన్ద్రవక్షసి చిహ్నాని =ఉర్వీన్ద్రవక్షశ్చిహ్నాని, బాలావక్షోజపత్రాఙ్కురకరిమకరీముద్రితాని చ తాని ఉర్వీన్ద్రవక్షశ్చిహ్నాని=బాలావక్షోజపత్రాఙ్కురకరిమకరీముద్రితో ర్వీన్ద్రవక్షశ్చిహ్నాని, బాలావక్షోజపత్రాఙ్కురరకరిమకరీముద్రితోర్వీన్ద్ర వక్షశ్చిహ్నైః ఆఖ్యాతః=బాలావక్షోజపత్రాఙ్కురకరిమకరీ ముద్రితోర్వీ న్ద్రవక్షశ్చిహ్నఖ్యాతః, బాలావక్షోజపత్రాఙ్కురకరిమకరీముద్రితోర్వీన్ద్ర వక్షశ్చిహ్నఖ్యాతః ఏకభావః యయోః తే=బాలావక్షోజపత్రాఙ్కురకరి మకరీముద్రితోర్వీన్ద్ర వక్షశ్చిహ్నఖ్యాతైకభావే, ఉభయస్య హృదయే= ఉభయహృదయే, బాలావక్షోజపత్రాఙ్కురకరిమకరీముద్రితోర్వీన్ద్రవక్ష శ్చిహ్నఖ్యాతైకభావే ఉభయహృదయే యస్య తత్ = బాలావక్షోజపత్రా ఙ్కురకరిమకరీముద్రితోర్వీన్ద్రవక్షశ్చిహ్నఖ్యాతైకభావోభయ హృదయం. ఆనన్దనిద్రాం- ఆనన్దయుక్తా నిద్రా= ఆనన్దనిద్రా, తాం=ఆనన్దనిద్రాం.

భావము :

ఆ దమయంతీనలు లిరువురు నిద్రపోవుచుండగా వారిరువురికిని నిట్టూర్పులు వచ్చుచు పోవుచు నుండినవి. అవి సురత ఖేదమును తెలుపుచుండినవి. ఆ యిద్దరిని నిట్టూర్పులు రెండును నొండొరులతో గలిసిపోవుటవలన వారిరువురి

ప్రాణములకును భేదము తొలగిపోయినది. వారిద్దరి ప్రాణములు నొక్కటిగ నైనవి. మరియు దమయంతియొక్క చనుదోయిపై కుంకుమ పుష్పములతో వ్రాయబడిన పత్త్రాఙ్కురములయందు కస్తూరి మున్నగువానిచే వ్రాయబడిన కరిమకరికాదిమూర్తు లుల్లసిల్లుచున్నవి. నలుడు తన వక్షఃస్థలముచే నామె వక్షఃస్థలమును గట్టిగా కౌగలించుకొనుటవలన నా మకరికాదిరచనలు అతని వక్షఃస్థలమున కంటుకొనినవి. అందుచే వారిరువురి వక్షఃస్థలములు వేరుగాక యొకటే యని చాటబడినది. అట్టి వక్షఃస్థలములు గలిగిన వారి జంట యానంద నిద్రను బొందినది. అనగా వారిరువురు నొండొరులను గట్టిగా గౌగలించుకొని పరుండి యున్నందువలన వారిరువురి నిట్టూర్పు లొండొంటితో గలయుటచే, వారిరువురిలో ప్రాణ భేదము తొలగినది. అట్లే మకరికాది పత్త్ర రచనలతో విల సిల్లు నా దమయంతి చనుదోయిని నలుడు తన వక్షఃస్థలముతో బిగువుగా నదిమి కౌగిలించుకొనుటవలన నా చనుదోయిపైని మకరికాది రచన లతని రొమ్మున కంటుకొనుట వలన వారిరువురి వక్షఃస్థలములు నొక్కటే యైనవనియు నా విధ మగు దృఢతర పరిరంభములతో వారిరువురును సుఖనిద్ర జెందిరనియు నాశయము. ॥148॥

శ్లో. శ్రీహర్షం కవిరాజరాజి మకుటాలఙ్కార హీర స్సుతం
శ్రీహీర స్సుషువే జితేన్ద్రియచయం మామల్లదేవీ చ యం,
యాతోఽస్మిన్ శివశక్తి సిద్ధిభగినీ సౌభ్రాత్రభవ్యే మహా
కావ్యే తస్య కృతౌ నలీయచరితే సర్గోఽయ మష్టాదశః.

ప. వి. శ్రీహర్షం-కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః-సుతం - శ్రీహీరః-సుషువే-జితేన్ద్రియచయం-మామల్లదేవీ-చ-యం-యాతే- అస్మిన్ - శివశక్తి సిద్ధి భగినీ సౌభ్రాత్ర భవ్యే- కావ్యే-తస్య-కృతౌ - నలీయచరితే - సర్గః - అయమ్-అష్టాదశః.

అర్థము: కవిరాజరాజి మకుటాలఙ్కారహీరః, కవిరాజరాజి=కవిశ్రేష్ఠుల వరుసలకు, మకుట=శ్రేష్ఠమైన, అలఙ్కార=భూషణమైన, హీరః = వజ్ర మణియైన, శ్రీహీరః=శ్రీహీరుడు, జితేన్ద్రియచయం = జయింపబడిన

ఇంద్రియ సమూహము గల్గిన, శ్రీహర్షం=శ్రీహర్షుడను పేరుగల, యం =ఏ, సుతం=కుమారుని, సుషువే=ఉత్పత్తి గావించెనో, మామల్ల దేవీ చ=మామల్ల దేవియను తల్లియు, యం=ఏ పుత్రుని, సుషువే = కనెనో, తస్య=ఆ శ్రీహర్షునియొక్క, కృతౌ = కృతియు, శివశక్తి సిద్ధి భగినీ సౌభ్రాత్ర భవ్యే, శివశక్తి సిద్ధి=శివశక్తి సిద్ధియను కృతికి, భగినీ=సోదరి యగుటవలన, సౌభ్రాత=సౌభ్రాత్రముచే, భవ్యే = రమ్యమైన, నలీయచరితే = నైషధీయచరిత మను, మహాకావ్యే = మహాకావ్యమందు, అష్టాదశః = పదునెనిమిదవ, అయం సర్గః=ఈ సర్గ, యాతః=కడచినది.

## సమాసములు :

*శివశక్తి సిద్ధిభగినీ సౌభ్రాత్రభవ్యే*-శివశక్తిసిద్ధేః భగినీ = శివశక్తి సిద్ధి భగినీ, శివశక్తిసిద్ధిభగిన్యాః సౌభ్రాత్రం = శివశక్తిసిద్ధి భగినీ సౌభ్రాత్రమ్; శివశక్తి సిద్ధిభగినీ సౌభ్రాత్రేణ భవ్యం=శివశక్తి సిద్ధి భగినీ సౌభ్రాత్రభవ్యం. తస్మిన్=శివశక్తిసిద్ధి భగినీసౌభ్రాత్రభవ్యే.

తక్కిన భావాదులన్నియు పూర్వ శ్లోకములకు వలె చూచుకొనునది.

శ్రీ మదాత్రేయస గోత్ర శ్రీమదుడాలి నృసింహ శాస్త్రి తనూజ,
విక్రమపురీ వేద సంస్కృత కళాశాలా భూత పూర్వ
ప్రధానోపాధ్యాయ శ్రీ సుబ్బరామశాస్త్రి
విరచితమగు నైషధాంధ్ర వాఖ్యకు
అష్టాదశ సర్గ సమాప్తము.

—శమ్—

# శ్రీ హర్ష నైషధము

## ఊనవింశ సర్గ

శ్లో. నిశి దశమితా మాలిఙ్గన్త్యాం విబోధవిధిత్సుభిః
నిషధవసుధామీనాఙ్కస్య ప్రియాఙ్క ముపేయుషః,
శ్రుతిమధుపదస్రగ్వైదగ్ధీవిభావితభావిక
స్ఫుటరసభృశాభ్యక్తా వైతాలికై ర్జగిరే గిరః. 1

ప వి. నిశి-దశమితామ్-ఆలిఙ్గన్త్యాం-విబోధవిధిత్సుభిః-నిషధవసుధామీనాఙ్కస్య-ప్రియాఙ్కమ్ - ఉపేయుషః - శ్రుతిమధుపదస్రగ్వైదగ్ధీవిభావితభావిక స్ఫుటరసభృశాభ్యక్తాః-వైతాలికైః-జగిరే-గిరః.

అర్థము: నిశి = రాత్రి, దశమితాం = కడపటిదశ అనగా ప్రభాతదశను, ఆలిఙ్గన్త్యాం సత్యాం = స్పృశించుచుండగా ననగా తెల్లవారుచుండగా, ప్రియాఙ్కం, ప్రియా = ప్రియురాలి యొక్క, అఙ్కం = ఒడిని, ఉపేయుషః = పొందిన అనగా ప్రియురాలినిఁ గౌగలించి నిదురించిన, నిషధవసుధామీనాఙ్కస్య; నిషధవసుధా=నిషధదేశమునకు, మీనాఙ్కస్య =మన్మథుడగు నలునకు, విబోధవిధిత్సుభిః; విబోధ=మేలుకొలుపును, విధిత్సుభిః=చేయగోరిన, వైతాలికైః=వైతాలికులచే, శ్రుతిమధుపద స్రగ్వైదగ్ధీ విభావితభావిక స్ఫుటరసభృశాభ్యక్తాః; శ్రుతి=చెవులయందు, మధు=తియ్యనైన, పద=సుబన్తతిఙన్త పదములయొక్క, స్రక్= మాలికలయొక్క యనగా వరుసలయొక్క, వైదగ్ధీ=నిర్మాణమందలి నేర్పు అనగా కైశికి మున్నగువానియొక్క అతిశయముచే, విభావిత= వ్యక్తపఱుపబడిన, భావిక=స్థాయి మున్నగు భావములు గల్గిన అనగా రసవ్యఞ్జకములగు విభావానుభావ సాత్త్విక వ్యభిచారి భావములు కల్గిన (కావుననే), స్ఫుట=వ్యక్తమైన యనగా సంవేద్యమైన, రస=శృంగా

రాదిరసముచే, భృశ=మిక్కిలి, అభ్యక్తాః=తడుపబడిన యనగా రసభరితములైన, గిరః=మాటలు అనగా చెప్పబోవు గీతివచనములు, జగిరే=పాడఁబడినవి.

వి. ఈ సర్గయందు హరిణీవృత్తము.

సమాసములు :

*దశమితామ్* - దశమః అస్యాః అస్తీతి=దశమినీ, దశమిన్యాః భావః =దశమితా, తాం=దశమితామ్.

*విబోధవిధిత్సుభిః*-విధాతు మిచ్ఛవః =విధిత్సవః, విబోధస్య విధిత్సవః =విబోధవిధిత్సవః, తైః=విబోధవిధిత్సుభిః.

*నిషధవసుధామీనాఙ్కస్య* - నిషధానాం వసుధా = నిషధవసుధా, మీనః అఙ్కః యస్య సః=మీనాఙ్కః, నిషధవసుధాయాః మీనాఙ్కః= నిషధవసుధామీనాఙ్కః, తస్య=నిషధవసుధామీనాఙ్కస్య.

*శ్రుతిమధుపదస్రగ్వైదగ్ధీ విభావిత భావికస్ఫుటరస భృశాభ్యక్తా* - మధూని చ తాని పదాని చ=మధుపదాని, శ్రుతౌ మధుపదాని=శ్రుతి మధుపదాని, శ్రుతిమధుపదానాం స్రక్=శ్రుతిమధుపదస్రక్, విదగ్ధస్య భావః=వైదగ్ధీ, శ్రుతిమధుపదస్రజః వైదగ్ధీ=శ్రుతిమధుపదస్రగ్వైదగ్ధీ, శ్రుతిమధుపదస్రగ్వైదగ్ధ్యా విభావితాః= శ్రుతిమధుపదస్రగ్వైదగ్ధీ విభావితాః, శ్రుతిమధుపదస్రగ్వైదగ్ధీవిభావితాః భావాః అస్య సన్తీతి = శ్రుతిమధుపదస్రగ్వైదగ్ధీ విభావితభావికః, శ్రుతిమధుపదస్రగ్వైదగ్ధీ విభావిత భావిక శ్చాసౌ స్ఫుటరసశ్చ=శ్రుతిమధుపదస్రగ్వైదగ్ధీ విభావిత భావిక స్ఫుటరసః, శ్రుతిమధుపదస్రగ్వైదగ్ధీ విభావిత భావిక స్ఫుటరసేన భృశ మభ్యక్తాః = శ్రుతిమధుపదస్రగ్వైదగ్ధీ విభావిత భావిక స్ఫుటరస భృశాభ్యక్తాః.

భావము :

ఇచ్చట కవి ప్రభాతమును వర్ణించుట కుపక్రమించుచున్నాడు. రాత్రి ముదిమినిఁ బొందినది. ఆ ముదిమియే దశమిత్వ మనబడును. ఇట్లు

రాత్రి ముదిమినిఁ బొందగనే తెల్లవారఁ జొచ్చినది. అప్పుడు ప్రియురాలగు దమయంతి యొక్క యొడియందు నిదురించిన నలుని మేల్కొలుపఁ గోరిన వైతాలికులు చెవుల కింపు గొల్పెడి మధురములగు పదముల పంక్తులనుఁ గూర్పుటలోని నేర్పుతో వ్యక్తము గావింపబడినట్టి విభావానుభావ సాత్త్విక వ్యభిచారి భావములతోఁ గూడినందువలనఁ బ్రకటిపఁబడిన, శృంగారాది రసమనెడి స్నేహరసముచేఁ దడుపఁబడి స్నిగ్ధములు గావింపఁబడిన యనగా రసభరితములు గావింపఁబడిన గేయములనుఁ బాడఁ దొడగిరి. అనగా నా నలమహారాజును మేల్కొల్పుటకై తేనెలొలుకు పదముల పంక్తులతో రచితములగు రసస్నిగ్ధములగు గేయములనుఁ బాడఁదొడంగి రని యాశయము

శ్లో. జయ! జయ! మహారాజ! ప్రాభాతికీం సుషమా మిమాం
సఫలయతమాం దానా దక్ష్ణో ర్దరాలసపక్ష్మణోః,
ప్రథమశకునం శయ్యోత్థాయం తవాఽస్తు విదర్భజా
ప్రియజనముఖామ్భోజాత్ తుఙ్గం యదఙ్గన మఙ్గలమ్. 2

ప. వి. జయ - జయ - మహారాజ - ప్రాభాతికీం - సుషమామ్ - ఇమాం - సఫలయతమాం - దానాత్ - అక్ష్ణోః - దరాలసపక్ష్మణోః - ప్రథమశకునం - శయ్యోత్థాయం - తవ - అస్తు - విదర్భజా - ప్రియజనముఖామ్భోజాత్ - తుఙ్గం-యత్-అఙ్గ-న-మఙ్గలమ్.

**అర్థము :** హే మహారాజ = ఓ నలమహారాజా!, జయ జయ = పలుమారు అందరిని మించి వర్ధిల్లుము; దరాలసపక్ష్మణోః; దర=కొంచెము, అలస= నిద్రవలన నిశ్చలములైన, పక్ష్మణోః= ఱెప్పలు గల్గిన, అక్ష్ణోః= కన్నులను, దానాత్ = ఇచ్చుటవలన ననగా దృష్టి నుంచుటవలన, ఇమాం = ఈ, ప్రాభాతికీం = ప్రభాతకాలమునకు సంబంధించిన, సుషమాం= శోభను, సఫలయతమాం=మిక్కిలి సఫలము గావించుము. ప్రభువు చూచినచో ప్రభాతశోభ సఫలముఁ నొందునని యర్థము, విదర్భజా = దమయంతి, శయ్యోత్థాయం, శయ్యా= పడకనుండి, ఉత్థాయం=లేచి, తవ=నీకు, ప్రథమశకునం; ప్రథమ= మొదటిదైన,

శకునం = మంగళహేతువగు దృశ్యము, అస్తు = అగునుగాత, యత్ = ఏల యనగా, ప్రియ = ఇష్టమైన, జన = జనముయొక్క, ముఖామ్భో జాత్ = ముఖపద్మమునకంటె ననగా ముఖపద్మదర్శనమునకంటె, తుఙ్గం = అధికమైన, మఙ్గళం = శుభము, న = లేదు.

వి. ప్రియజన ముఖ దర్శనమునకంటె నధికమగు మఙ్గలము లేదనెడి సామాన్యార్థముతో దమయంతీ ముఖదర్శనము మంగళకర మను విశేషార్థము సమర్థితము గాన నర్థాన్తరన్యాసాలఙ్కారము.

సమాసములు :

*ప్రాభాతికీం* - ప్రభాతే భవా = ప్రాభాతికీ, తాం = ప్రాభాతికీమ్.
*సఫలయతమాం* - అతిశయేన సఫలయ = సఫలయతమామ్.
*దరాలస పక్ష్మణోః* - దర మలసే = దరాలసే, దరాలసే పక్ష్మణీ యయోస్తే = దరాలసపక్ష్మణీ, తయోః = దరాలసపక్ష్మణోః.
*ప్రథమశకునం* - ప్రథమం చ తత్ శకునం చ = ప్రథమశకునం.
*శయ్యోత్థాయం* - శయ్యాయాః ఉత్థాయ = శయ్యోత్థాయం.
*విదర్భజా* - విదర్భేభ్యః జాయత ఇతి = విదర్భజా.
*ప్రియజన ముఖామ్భోజాత్* - ప్రియశ్చాసౌ జనశ్చ = ప్రియజనః, ముఖ మమ్భోజ మివ = ముఖామ్భోజమ్, ప్రియజనస్య ముఖామ్భోజమ్ = ప్రియజన ముఖామ్భోజం, తస్మాత్ = ప్రియజన ముఖామ్భోజాత్.

భావము :

ఓ నలమహారాజా! నీవు పెక్కుమాఱు లందరిని మించినవాడవై వర్ధిల్లుము. నిద్రవలనఁ గొలదిగా మాంద్యము వహించిన ఱెప్పలు గల్గిన నీ కన్నులను తెఱచి యీ ప్రభాతకాల ప్రశోభను సఫల పఱుపుము. రాజ దర్శనము చేతనే శోభకు సార్థక్య మేర్పడును. ఈ దమయంతి పడకనుండి లేచి అనగా "చరమ మపి శయిత్వా పూర్వమేవ ప్రబుద్ధా" యని చెప్పిన విధముగా చివర పరుండి ముందు మేల్కొనునట్టి యుత్తమ స్త్రీ లక్షణము ననుసరించి నీ కంటె

వెనుకఁ బరుండి నీవు మేల్కొనుట కంటె మునుపే మేల్కొనినదై నీకు మొదటి మంగల దృశ్యమగును గాత! ఏలయనగా, ఇష్టజనముయొక్క ముఖ పద్మ దర్శనమున కంటె గొప్పదగు మంగళము మఱియొండు లేదు.

శ్లో. వరుణగృహిణీ మాశా మాసాదయన్త మముం రుచీ
నిచయ సిచయాంశాంశ భ్రంశ క్రమేణ నిరంశుకమ్,
తుహినమహసం పశ్యన్తీవ ప్రసాదమిషా దసౌ
నిజముఖమివ స్మేరం ధత్తే హరే ర్మహిషీ హరిత్. 3

ప.వి. వరుణగృహిణీమ్-ఆశామ్-ఆసాదయన్తమ్-అముం-రుచీనిచయసిచయాం శాంశభ్రంశక్రమేణ-నిరంశుకం-తుహినమహసం-పశ్యన్తీ-ఇవ-ప్రసాద మిషాత్-అసౌ-నిజముఖమ్-ఇవ-స్మేరం-ధత్తే-హరేః- మహిషీ- హరిత్.

అర్థము: అసౌ = ఈ కనఁబడునట్టి, హరేః=ఇంద్రునియొక్క, మహిషీ=పట్టపు రాణియగు, హరిత్=దిక్కైన తూర్పు, (ఒకానొకరాజు భార్య) వరుణ గృహిణీం=వరుణుని భార్యయైన, ఆశాం=దిక్కైన పడమటిని (ఒకా నొక పురుషుని భార్యను), ఆసాదయన్తం=అస్తమించనున్నందువలన పొందుచున్న (సఙ్గమించుచున్న అనగా సమ్భోగమునకై పరిగ్రహించు చున్న), రుచీనిచయ సిచయాంశాంశభ్రంశక్రమేణ; రుచీనిచయ=కాంతి సమూహ మనెడి, సిచయ=వస్త్రముయొక్క, అంశాంశ=కొలది కొలది భాగములు, భ్రంశ=జారుటయొక్క, క్రమేణ = క్రమముచే నొక పక్షమున రాత్రి యస్తమై తెల్లవార నున్నందున, మఱియొక పక్షమున దెసమొల యగుటకై, నిరంశుకం=కిరణములు లేని (వస్త్రములేని), అముం =ఎదుటనున్న, తుహినమహసం = చల్లని కిరణములుగల చంద్రుని (మరియొక పురుషుని), పశ్యన్తీవ = చూచుచున్నదో యనునట్లున్న, ప్రసాదమిషాత్=తెల్లవారెడి సమయమునం దేర్పడు వెలుగు నెపము వలన (కుతూహలము వలనఁ గల్గిన ప్రసన్నత్వము యొక్క నెపమువలన), నిజముఖం=తనముంగిటి ప్రదేశమును (తన మోమును), స్మేరం= నవ్వుతోఁగూడిన దానినిగా, ధత్తే ఇవ=చేయుచున్నదో యన నట్లున్నది.

వి. ఇచ్చట మిష శబ్దముచే ప్రసాదమును మఱుగుపఱచి పరస్త్రీతోఁగూడిన పరపురుషుని దర్శించుటవలన గల్గిన చిఱునగవు నుత్ప్రేక్షించుటవలన నపహ్నవముతోకూడిన యుత్ప్రేక్షాలఙ్కారము.

సమాసములు :

*వరుణగృహిణీం* - వరుణస్య గృహిణీ = వరుణగృహిణీ, తాం = వరుణగృహిణీం.

*రుచీనిచయనిచయాంశాంశభ్రంశక్రమేణ* - రుచీనాం నిచయః= రుచీ నిచయః, రుచీనిచయ ఏవ నిచయః=రుచీనిచయ నిచయః, అంశాశ్చ అంశాశ్చ = అంశాంశాః, రుచీనిచయానా మంశాంశాః = రుచీ నిచ యాఃశాంశాః, రుచీనిచయ నిచయాంశాంశానాం భ్రంశః=రుచీనిచయ నిచయాంశాం శభ్రంశః, రుచీనిచయనిచయాంశాంశభ్రంశస్య క్రమః= రుచీనిచయ నిచయాంశాంశ భ్రంశ క్రమః, తేన = రుచీనిచయనిచ యాంశాంశభ్రంశక్రమేణ.

*నిరంశుకం* - నిర్గతాః అంశవః యస్య సః = నిరంశుకః, తం = నిరంశుకం, పక్షాన్తరమున-నిర్గతః అంశుకః యస్య సః=నిరంశుకః, తం=నిరంశుకమ్.

*తుహినమహసమ్* - తుహినం మహః యస్య సః = తుహినమహాః, తం=తుహినమహసమ్.

*ప్రసాదమిషాత్* - ప్రసాదస్య మిషః=ప్రసాదమిషః, తస్మాత్ = ప్రసాదమిషాత్.

*నిజముఖం* - నిజం చ తత్ ముఖం చ=నిజముఖమ్.

భావము :

ఇచ్చట చంద్రాస్తమయ ముత్ప్రేక్షింపఁబడుచున్నది. ఇంద్రుని పట్టపు రాణియైన యీ తూర్పుదెస యనెడి యొక రాజపత్ని, వరుణుని గృహిణియైన పడమటి దెసను (ఒక పరస్త్రీని) పొందుచున్నవాడును ననగా నస్తమింపనున్నందు వలనఁ జేరుచున్నవాడును (సంభోగమునకై పట్టుకొనుచున్నవాడును) కాంతి

**సమూహ** మనెడి వస్త్రము కొలది కొలదిగా జారుటవలన గాంతిరహితుఁడును (వస్త్ర రహితుఁడును) నగు ననగా నొక పక్షమునఁ దెల్లవారుచుండుటవలనఁ గాంతి తఱిగినవాఁడును మఱియొక పక్షమున నగ్నత్వము నొందుటకై వస్త్రరహితుఁడు నగు జంద్రుని (ఒకానొక పురుషుని) చూచుచున్నదో యనునట్లు, ఉదయకాలపు వెలుగు నెపము వలన (కుతూహలము వలనఁ గల్గిన ప్రసన్నతయొక్క నెపమువలన) తన యెదుటనున్న ప్రదేశమును (తన మోమును) చిఱునగవుతోఁ గూడినదిగాఁ జేయుచున్నదో యనునట్లున్నది. అనగా చంద్రుడు పడమటిదెస కేగి యస్తమింపనుండుట, పరస్త్రీతో సంభోగింపనుండునట్లు, అతని కిరణములు తఱిగిపోవుట వస్త్రము జారిపోవునట్లు భావింపఁబడినదై యప్పటి యుదయకాలపుఁ దెల్లఁదనము దీని నంతటినిఁ జూచుచున్న తూర్పుదెస యనెడి రాజమహిషియొక్క నవ్వువలెను భావింపఁబడినది.

శ్లో. అమహతితరా స్తాదృక్ తారా న లోచనగోచరా
స్తరణికిరణా ద్యా మఞ్చన్తి క్రమా దపరస్పరాః,
కథయతి పరిశ్రాన్తిం రాత్రితమః సహయుధ్వనామ్
మయమపి దరిద్రాణప్రాణ స్తమీదయిత స్త్విషామ్. 4

ప వి. **అమహతితరాః-తాదృక్- తారాః- న- లోచనగోచరాః- తరణికిరణాః - ద్యామ్-అఞ్చన్తి-క్రమాత్-అపరస్పరాః- కథయతి-పరిశ్రాన్తిమ్-రాత్రితమః- సహయుధ్వనామ్-అయమ్-అపి- దరిద్రాణప్రాణః-తమీదయితః-త్విషామ్.**

**అర్థము:** **అమహతితరాః**=సూక్ష్మములైన, **తారాః**=నక్షత్రములు, **అనగా** అరుంధతి మున్నగు నక్షత్రములు, **తాదృక్**=పూర్వమువలె ననగా రాత్రియందువలె, **లోచనగోచరాః;** **లోచన**=నేత్రములకు, **గోచరాః**= విషయములుగా, న (భవంతి)=అగుటలేదు, పోను పోను సూర్యునికాంతి వర్ధిల్లుటవలనఁ గనఁబడుటలేదని యర్థము. అపరస్పరాః=దూరములు గాక ఎల్లప్పుడును విచ్ఛేదము లేక ప్రసవించుచున్న, **తరణికిరణాః**= సూర్యునియొక్క కిరణములు, క్రమాత్=క్రమముగా, ద్యాం=**ఆకాశ**మును, అఞ్చన్తి=వ్యాపించుచున్నవి. దరిద్రాణప్రాణః; దరిద్రాణ=

క్షీణమైన, ప్రాణః=ప్రాణము కల్గిన, అయం=ఈ కనఁబడుచున్న, తమీదయితో ఽపి=రాత్రికిఁ బ్రియుఁడగు చంద్రుఁడును, రాత్రీతమస్సహయుధ్వనాం; రాత్రీ=రాత్రియందలి, తమః=చీకట్లతో, సహ=కూడి, యుధ్వనాం=యుద్ధము చేయుచున్న, త్విషామ్=కాంతులకు, పరిశ్రాన్తిం=పరిశ్రమను, కథయతి=చెప్పుచున్నది. తెల్లవారినది పడక నుండి లెమ్మని యర్థము.

## సమాసములు :

అమహాతితరాః- అతిశయేన మహత్యః=మహాతితరాః, న మహాతితరాః=అమహాతితరాః.

లోచనగోచరాః- లోచనయోః గోచరాః=లోచనగోచరాః.

తరణికిరణాః- తరణేః కిరణాః=తరణికిరణాః.

అపరస్పరాః- పరే పరే న భవన్తీతి=అపరస్పరాః.

రాత్రీతమస్సహయుధ్వానామ్ - రాత్ర్యాం తమాంసి=రాత్రీతమాంసి, రాత్రీతమోభి స్సహ యుధ్యన్తీతి=రాత్రీతమస్సహయుధ్వానః, తాసాం=రాత్రీతమస్సహయుధ్వనామ్

దరిద్రాణప్రాణః- దరిద్రాణాః ప్రాణాః యస్య సః=దరిద్రాణప్రాణః.

తమీదయితః - తమ్యాః దయితః=తమీదయితః.

## భావము :

తెల్లవారుచున్నది. సూక్ష్మములైన యరుంధత్యాది నక్షత్రములు కన్నులకుఁ గనఁబడుటలేదు. తెంపులేక యేకకాలమునఁ బ్రసరించునట్టి సూర్యకిరణములు క్రమముగా నాకాశమును వ్యాపించుచున్నవి. క్షీణించిన శక్తిగల రాత్రికిఁ బ్రియుడగు చంద్రుఁడును, రాత్రియందలి చీకట్లతో యుద్ధము చేయుచున్న తన కాంతులకుఁ దన పరిశ్రమనుఁ జెప్పుచున్నాఁడు. అనగా తెల్లవారినది. పడకనుండి లెమ్మని యాశయము.

శ్లో. స్ఫురతి తిమిరస్తోమః పఙ్కప్రపఞ్చ ఇవోచ్చకైః
పురుసితగరుచ్చఞ్చచ్చఞ్చూపుట స్ఫుటచుమ్బితః,
అపి మధుకరీ కాలిమ్మన్యా విరాజతి ధూమల
చ్ఛవి రివ రవే ర్లాక్షాలక్ష్మీం కరై రభిపాతుకైః. 5

ప.వి. స్ఫురతి-తిమిరస్తోమః - పఙ్కప్రపఞ్చః-ఇవ-ఉచ్చకైః-పురుసితగరుచ్చ ఞ్చూపుటస్ఫుటచుమ్బితః - అపి - మధుకరీ - కాలిమ్మన్యా - విరాజతి- ధూమలచ్ఛవిః-ఇవ-రవేః-లాక్షాలక్ష్మీం-కరైః-అభిపాతుకైః.

అర్థము: తిమిరస్తోమః; తిమిర=చీకటియొక్క, స్తోమః=రాశి, లాక్షాలక్ష్మీం= లాక్షా=లత్తుకయొక్క, లక్ష్మీం=శోభను, అభిపాతుకైః=జయింపఁ గోరిన అనగా లత్తుకరంగుకంటెను మిక్కిలి యరుణవర్ణములు కల్గిన, రవేః=సూర్యునియొక్క, కరైః=కిరణములచే, పురుసితగరుచ్చఞ్చచ్చ ఞ్చూపుటస్ఫుటచుమ్బితః; పురు=మిక్కిలి, సిత=తెల్లని, గరుత్= రెక్కలుగల్గిన హంసలయొక్క, చఞ్చత్=చంచలములగు, చఞ్చూపుట= ముక్కులసంపుటములచే,స్ఫుట=స్పష్టముగా, చుమ్బితః=లోడబడిన,పఙ్క ప్రపఞ్చః=పఙ్క=బురదయొక్క, ప్రపఞ్చ ఇవ=సమూహము వలె, ఉచ్చకైః=అధికముగా, స్ఫురతి=శోభించుచున్నది, (తథా=అట్లే) కాలిమ్మన్యా=తన్ను మిక్కిలి నలుపుగా భావించెడి, మధుకర్యపి = ఆడ తుమ్మెదయు, లాక్షాలక్ష్మీః = లత్తుక కాంతిని, అభిపాతుకైః = జయింపఁగోరిన, రవేః=సూర్యుని యొక్క, కరైః = కిరణములచే, ధూమలచ్ఛవిరివ = నలుపును నెఱుపును నగుఁ గాంతి గలదాని వలె, విరాజతి=ప్రకాశించుచున్నది.

వి. ఇచ్చట నల్లని తుమ్మెద సూర్యకిరణముల యందలి యెఱ్ఱదనము మున్నగు నుత్కృష్ట గుణములను గ్రహించినచో తద్గుణాలఙ్కారము. ఆ యల ఙ్కారముచే ధూమలత్వోత్ప్రేక్ష యుత్థాపితముగాన దానితో దీనికి సఙ్కరము.

సమాసములు :

తిమిరస్తోమః-తిమిరాణాం స్తోమః=తిమిరస్తోమః.
పఙ్కప్రపఞ్చః-పఙ్కస్య ప్రపఞ్చః=పఙ్కప్రపఞ్చః.
పురుసిత గరుచ్చఞ్చు చ్చుఞ్చు పుటస్ఫుట చుమ్బితః - పురుసితాః గరుతః యేషాం తే = పురుసిత గరుతః, చఞ్చవశ్చ తే చఞ్చు పుటాశ్చ = చఞ్చుచ్చుఞ్చుపుటాః, పురుసితగరుతాం చఞ్చుచ్చుఞ్చు పుటాః = పురుసితగరుచ్చఞ్చుచ్చుఞ్చుపుటాః, పురుసితగరుచ్చఞ్చు చ్చుఞ్చుపుటైః స్ఫుటం చుమ్బితః = పురుసిత గరుచ్చ ఞ్చు చ్చు ఞ్చు పుటస్ఫుట చుమ్బితః.
కాలిమ్మన్యా-కాలీ మాత్మానం మన్యత ఇతి=కాలిమ్మన్యా.
ధూమలచ్ఛవిః-ధూమలా ఛవిః యస్య సః=ధూమలచ్ఛవిః.
లాక్షాలక్ష్మీం-లాక్షాయాః లక్ష్మీః=లాక్షాలక్ష్మీః, తాం=లాక్షాలక్ష్మీం.
అభిపాతుకైః-అభిపత న్తీతి=అభిపాతుకాః, తైః=అభిపాతుకైః.

భావము :

రాత్రియందు చీకట్ల సముదాయము లత్తుకకాంతిని జయింపగోరి, దాని కంటెను మిక్కిలి యరుణవర్ణము గల్గిన సూర్యకిరణములచేఁ గలియఁబెట్టఁ బడినదై తెల్లని ఱెక్కలుగల హంసలయొక్క ముక్కులతోఁ బాగుగాఁ గలియఁ బెట్టఁబడిన బురదయొక్క సమూహమువలె శోభించుచున్నది. ఉదయించు సూర్యునికిరణములు మిగుల నరుణవర్ణములై యుండును. చీకట్లు నల్లనై యుండుటవలన బురదవలె నున్నది. సూర్యుడు హంసవలెను నాతని కిరణము లరుణవర్ణములై యుండుటవలన హంసల ముక్కులవలె నున్నవి. సూర్య కిరణములు చీకట్లను గలియఁ బెట్టుట, హంసల ముక్కులు బురదనుఁ గలియఁ బెట్టిన ట్లున్నవని యర్థము. తన్నుఁ జాల నల్లని వర్ణము గల దానినిగా భావిం చెడి యాడు తుమ్మెద సైతము, లత్తుక కాంతినిఁ జయింపఁ గోరిన సూర్యకిరణ ములచే కృష్ణలోహితకాంతినిఁ బొందినదో యనునట్లున్నది. అనగా నరుణము లగు సూర్యకిరణముల నుండి నల్లని తుమ్మెద యరుణకాంతినిఁ బొందియున్న దని యర్థము. ఇట్లు సూర్యోదయముచే చీకట్లనెడి బురద తొలగిపోవుచున్న

దనియు, నల్లని తుమ్మెద సూర్యకిరణ కాంతి సంపర్కముచే కృష్ణలోహిత వర్ణము నందుకొనినదనియు, ప్రభాత సౌభాగ్య మిట వర్ణింపఁ బడినది.

శ్లో. రజనివమథుం ప్రాలేయామ్బుఃకణక్రమ సమ్భృతైః
కుశకిసలయ స్యాచ్ఛై రగ్రేశయై రుదబిందుభిః,
సుషిర కుశలే నాయః సూచీ శిఖాఙ్కుర సఙ్కరం
కిమపి గమితా న్యన్తర్ముక్తాఫలా న్యనుమేనిరే. 6

ప.వి. రజనివమథుప్రాలేయామ్బుఃకణక్రమసమ్భృతైః - కుశకిసలయస్య - అచ్ఛైః - అగ్రేశయైః - ఉదబిందుభిః - సుషిరకుశలేన-అయఃసూచీశిఖాఙ్కుర సఙ్కరం-కిమ్-అపి - గమితాని-అన్తర్ముక్తాఫలాని-అనుమేనిరే.

అర్థము: రజనివమథుప్రాలేయామ్బుః కణక్రమసమ్భృతైః; రజని = రాత్రి యనెడి యాఁడు ఏనుగయొక్క, వమథు = తొండపు తుంపుర లనెడి, ప్రాలేయామ్బుః = మంచు నీటియొక్క, కణ = బిందువులచే, క్రమ = క్రమముగా అనగా కొంచెము కొంచెముగా, సమ్భృతైః = చేర్చి పెట్ట బడిన యనగా యట్లు చేర్చి పెట్టుటచే స్థూలములైన, కుశకిసలయస్య = లేతదర్భ యొక్క, యనగా సూదికొనవలె వాడికొనలు గల్గిన, లేత దర్భలయొక్క, అగ్రేశయైః = కొనలయందు నిలచిన, ఉదబిందుభి = నీటి తుంపురలచే, సుషిరకుశలేన; సుషిర = ముత్తెములు మున్నగు వానియందు రంధ్రములను వేయుటయందు, కుశలేన = నిపుణుడగు శిల్పిచే, కిమపి = కొంచెము, అంతః = మధ్య, అయఃసూచీ శిఖాఙ్కుర సఙ్కరం; అయఃసూచీ = ఇనుప సూదులయొక్క, శిఖాఙ్కుర = కొనలనెడి మొలకలతో, సఙ్కరం = సంబంధమును, గమితాని = పొందింపబడిన, ముక్తాఫలాని = సగము తొలచబడిన ముత్తెములుగా ననగా హీనములుగా, అనుమేనిరే = ఊహింపబడినవి. సూర్యకిరణ సంబంధము వలన లోన నౌజ్జ్వల్య మనెడి సమాన ధర్మముచే ముత్తెములు తిరస్కరింపబడినవి.

వి. ఇచ్చట దర్భల కొనలపై నిలచిన జలబిందువులకు రంధ్రము వేయునట్టి సూదికొనయందున్న ముత్తియములతో సామ్యముం జెప్పుటవలన నుపమాలఙ్కారము.

మంచుయొక్క బిందువులను తుంపురులుగా జిమ్ముటవలన, రాత్రికి హస్తినీత్వము సిద్ధించును గాన నేకదేశవివర్తి రూపకము. ఈ రెంటికిని అంగాంగిభావము వలన సఙ్కరము.

## సమాసములు :

*రజని వమథు ప్రాలేయాంభః కణక్రమ సమ్భృతైః*—రజనేః వమథవః = రజనివమథవః, ప్రాలేయమేవ అంభః = ప్రాలేయాంభః, ప్రాలేయామ్బసః కణాః = ప్రాలేయామ్బుః కణాః. క్రమేణసంభృతాః = క్రమసమ్భృతాః, రజనివమధుః ఏవ ప్రాలేయాంభఃకణాః = రజనివమధు ప్రాలేయాంభఃకణాః, రజనివమధు ప్రాలేయామ్బుఃకణైః క్రమసమ్భృతాః = రజనివమధు ప్రాలేయామ్బుఃకణక్రమసమ్భృతాః, తైః = రజనివమధు ప్రాలేయామ్బుః కణక్రమ సమ్భృతైః.

*కుశకిసలయస్య*—కుశానాం కిసలయః = కుశకిసలయః, తస్య = కుశకిసలయస్య.

*అగ్రేశయైః*—అగ్రే శేరత ఇతి = అగ్రేశయాః, తైః = అగ్రేశయైః.

*ఉదబిందుభిః*—ఉదకానాం బిందవః = ఉదబిందవః, తైః = ఉదబిందుభిః.

*సుషిరకుశలేన*—సుషిరే కుశలః = సుషిరకుశలః, తేన = సుషిరకుశలేన.

*అయఃసూచీశిఖాఙ్కురసఙ్కరం* — అయోమయీ సచీ = అయఃసూచీ, అయఃసూచ్యాం శిఖా = అయఃసూచీశిఖా, అయఃసూచీశిఖైవ అఙ్కురః = అయఃసూచీశిఖాఙ్కురః, అయః సుచీ శిఖాఙ్కురేణ సఙ్కరః = అయఃసూచీశిఖాఙ్కురసఙ్కరః, తం = అయఃసూచీశిఖాఙ్కురసఙ్కరమ్.

## భావము:

రాత్రియనెడి యాడుఏనుగ తన తొండపు రంధ్రములనుండి విరజిమ్మెడి మంచునీటియొక్క బిందువులతో క్రమముగా వర్ధిల్లి పెద్దలైనట్టివియు, లేతదర్భల

కొనలపై నిలిచినట్టి స్వచ్ఛములగు జల బిందువులచే, రంధ్ర నిర్మాణ చతురుడగు శిల్పివలన నినుప సూది కొనలతో సంబంధపఱుపఁబడిన ముత్తెములు, హీనములుగా దెలిసికొనబడినవి. అనగా శిల్పి ఇనుప సూదితో బెజ్జములు వేయుటకై సగము తొలచిన ముత్తెములు, దర్భలకొనలపై రాత్రియందు నిలిచిన మంచు బిందువులకంటెను హీనములుగా భావింపబడినవి అని యర్థము. ॥౬॥

శ్లో. రవిరుచిఋచా మోఙ్కారేషు స్ఫుటాఽమల బిన్దుతాం
గమయితు మమూ రుచ్ఛ్రియన్తే విహాయసి తారకాః,
స్వరవిరచనాయాసా ముచ్చై రుదాత్తతయాఽఽహృతాః
శిశిరమహసో బిమ్బా దస్మా దసంశయ మంశవః. 7

ప.వి. రవిరుచిఋచాం - ఓఙ్కారేషు- స్ఫుటాఽమల బిన్దుతాం- గమయితుం - అమూః-ఉచ్ఛ్రియన్తే-విహాయసి-తారకాః - స్వరవిరచనాయ- ఆసామ్ - ఉచ్చైః-ఉదాత్తతయా-ఆహృతాః-శిశిరమహసః-బిమ్బాత్ - అస్మాత్ - అసంశయం-అంశవః.

అర్థము: రవిరుచిఋచాం; రవి=సూర్యునియొక్క, రుచి = ఉదయకాలపు కిరణములనెడి, ఋచాం = (దినపూర్వభాగ మగుటవలన) "ఋగ్భిః పూర్వాహ్ణే దివి దేవ ఈయతే," ఇత్యాదిశ్రుతి ననుసరించి ఋగ్వేద మంత్రములకు సంబంధించిన, ఓఙ్కారేషు = మొదట నుచ్ఛరింపబడు ప్రణవములయందు, స్ఫుటామలబిందుతాం; స్ఫుట = స్పష్టములైన, అమల=శుద్ధములైన, బిందుతాం = అక్షరమునకు పైనుంచెడి బింద రూపములైన వర్ణముల యునికిని అనగా వర్ణముల రూపమును, గమయితుం = పొందించుటకు ననగా నోఙ్కారములకు పైభాగమున బిందువుల నుంచుటకు, విహాయసి=ఆకసమునందు, అమూః = ఈ కనబడుచున్న, తారకాః=నక్షత్రములు, ఉచ్ఛ్రియన్తే = సంగ్రహింపబడుచున్నవి. ప్రభాతకాలపు వెలుగుచే స్వల్పములై కానబడుటవలనను గుండ్రముగా నుండుటవలనను నట్లు బిందువులరూపమున కానబడుచున్నవని యర్థము. కిఞ్చ =మరియు, ఆసాం= ఈ ఋక్కులకు, ఉదాత్తయా=

హృదయంగమత్వ ముండుటచేతను, "ఉచ్చై రుదాత్తః" అని చెప్పిన విధముగా నుదాత్తస్వర ముండుటచేతను, ఉచ్చైః = అధికముగ, స్వరవిరచనాయ=ఉదాత్త స్వరకల్పనకై, అస్మాత్ = ఈకానబడుచున్న శిశిరమహసః=చల్లని కిరణములుగల చంద్రునియొక్క, బిమ్బాత్ = మండలమునుండి, అంశవః=కిరణములు, అసంశయం=నిశ్చయముగా, ఆహృతాః = ఒకానొకనిచే సంగ్రహింపబడినది. అట్లు కానిచో చంద్ర కిరణములును, నక్షత్రములును నెచ్చటికి పోయినవి? అని అర్థము.

వి. నక్షత్రములును, చంద్రకిరణములును, స్వరకల్పనకై గ్రహింపబడక పోయినను, గ్రహింపబడినట్లు భావింపబడుటవలన నుత్ప్రేక్ష. అసంశయ మని వ్యఞ్జకమును ప్రయోగించుటవలన నది వాచ్యము.

సమాసములు :

*రవిరుచిఋచాం* - రవేః రుచయః = రవిరుచయః, రవిరుచయ ఏవ ఋచః=రవిరుచిఋచః, తాసాం=రవిరుచిఋచామ్.

*స్ఫుటామలబిన్దుతామ్* - స్ఫుటాశ్చ తే అమలాశ్చ=స్ఫుటాఽమలాః, స్ఫుటాఽమలాశ్చ తే బిందవశ్చ=స్ఫుటాఽమలబిన్దవః, స్ఫుటాఽమల బిన్దూనాం భావః=స్ఫుటాఽమలబిన్దుతా, తాం=స్ఫుటాఽమలబిన్దుతామ్.

*స్వరవిరచనాయ*- స్వరాణాం విరచనం = స్వరవిరచనం, తస్మై = స్వరవిరచనాయ.

*ఉదాత్తతయా*- ఉదాత్తస్య భావః=ఉదాత్తతా, తయా=ఉదాత్తతయా.

*శిశిరమహసః*- శిశిరం మహః యస్య సః=శిశిరమహాః, తస్య=శిశిర మహసః.

*అసంశయం*- అవిద్యమానః సంశయః యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = అసంశయమ్.

భావము :

ఉదయకాలపు సూర్యకిరణము లనెడి ఋక్శ్రుతి విశేషములకు ప్రారంభ మున దప్పక చెప్పదగిన "ఓం"కార రూపములగు ప్రణవములయందు స్పష్టము

లును, స్వచ్ఛములును నగు ననుస్వార రూపములైన బిందువులను గల్పించుటకు మింట కనబడు నక్షత్రము లొకొక్కటిగా నేరి చేర్చి పెట్టబడుచున్నవో యను నట్లు అవి ప్రభాతకాలమునందు గానబడకపోవుచున్నవి. ''ఋగ్భిః పూర్వాహ్ణే దివ దేవ ఈయతే'' యను శ్రుతి ననుసరించి దినపూర్వభాగమగు నుదయకాలమందు 'ఋక్కు'లచే భగవంతుడగు సూర్యు డుపాసింపబడును. వేదపఠన ప్రారంభమునందు నోఙ్కారములు పఠింపబడును. నక్షత్రములు గుండ్రముగా బిందువుయొక్క యాకృతి గల్గియున్నవి. తెల్లవారు సమయమునందునక్షత్రములు మఱుగుపడుట సహజము. కాని కవి బింద్వాకృతిగల యా నక్షత్రముల నొక్కడు, ఋక్కులకు ముందు పఠింపవలసిన యోఙ్కారములయందు జేర్చుటకై ఏరి సంగ్రహించెనో యనునట్లు భావింపబడుచున్నవి. అట్లే యా మంత్రములకు పైన నుదాత్తాది స్వర చిహ్నములను గల్పించుటకై చంద్రకిరణములు కూడా పై విధముగానే సంగ్రహింపబడుచున్నవి. ఉదాత్తాది స్వరములు నిలువు గీతలతోడను, నడ్డగీతలతోడను, సూచింపబడుటవలన, చంద్రకిరణములు రేఖాకృతి గల్గియుండుటవలన నవి యాస్వరచిహ్నకల్పనకు సంగ్రహింపబడినవో యనునట్లు భావింపబడుచున్నవి. అట్లు కానిచో నా నక్షత్రములును, చంద్రకిరణములును, నెక్కడికి బోయినవని యాశయము.

శ్లో. వ్రజతి కుముదే దృష్ట్వా మోహం దృశో రపిధాయకే
భవతి చ నలే దూరం తారాపతౌ చ హతౌజసి,
లఘు రఘుపతే ర్జాయాం మాయామయీ మివ రావణిః
తిమిరచికురగ్రాహం రాత్రిం హినస్తి గభస్తిరాట్. 8

ప. వి. వ్రజతి-కుముదే-దృష్ట్వా-మోహం-దృశోః-అపిధాయకే-భవతి-చ-నలే-దూరం-తారాపతౌ-చ-హతౌజసి-లఘు-రఘుపతేః - జాయాం-మాయామయీం - ఇవ-రావణిః-తిమిరచికురగ్రాహం-రాత్రిం-హినస్తి - గభస్తిరాట్.

అర్థము: దృష్ట్వా=రాత్రియొక్క అవసాన ప్రారంభమును చూచి పక్షాంతరమున-మేఘనాదునిచే సీతావధయొక్క ప్రారంభమును చూచి, కుముదే=కలువయు, పక్షాంతరమున-కుముదుడను వానరుడును, మోహం=సంకోచ

మును. ఒక పక్షమున- పగలు ముకులించుటవలన, మరియొక పక్షమున- దుఃఖమువలన, వ్రజతి సతి=పొందుచుండగా, భవతి=నీవును, నలే చ = నలుడును, దృశోః=దర్శనసాధకములైన నేత్రమండలములను, అపిధాయకే సతి = నిద్ర యింకను దొలగనందువలన మూసికొనగా, పక్షాంతరమున-నలే=నలుడనెడి వానరుడు, దృశోః=నేత్రములను, అపిధాయకే=చేతులతో దుఃఖముచే కన్నులను మూసికొనగా ననగా మేఘనాదుని సీతావధోద్యమమును విని దుఃఖముచే కన్నులను మూసి కొనగా, తథా=అట్లే, తారాపతౌ=చంద్రుడును పక్షాంతరమున-సుగ్రీవుడును, దూరం=మిక్కిలి, హ తౌజసి సతి=అస్తమింపనున్నందువలన చంద్రుడును, సీతావధోద్యమము వలని శోకముచే సుగ్రీవుడును కాంతి రహితులు కాగా, రావణిః=రావణుని కుమారుడైన ఇంద్రజిత్తు, మాయామయీం=మాయచే కల్పింపబడిన,రఘుపతేః=శ్రీరామచంద్రునియొక్క, జాయామివ=భార్యయగు సీతను వలె, (కల్పాంతరమందలి సీతావధోద్యమ వృత్తాంతము నాధారముగా గొని ఇట్లు పోల్చబడినది), గభస్తిరాట్ =సూర్యుడు, రాత్రిం=రాత్రిని, లఘు=శీఘ్రముగా, తిమిరచికుర గ్రాహం, తిమిర=చీకట్లనెడి, చికుర=వెంట్రుకలయందు, గ్రాహం= పట్టుకొని, పక్షాంతరమున, తిమిర=చీకట్లవలె నల్లని, చికుర=వెంట్రుకలయందు, గ్రాహం=పట్టుకొని, హినస్తి=హింసించుచున్నాడు.

సమాసములు :

తారాపతౌ- తారాణాం పతిః=తారాపతిః, పక్షాంతరమున-తారాయాః పతిః=తారాపతిః, తస్మిన్=తారాపతౌ.

హతౌజసి- హత మోజః యస్య సః=హతౌజాః, తస్మిన్=హతౌజసి.

మాయామయీమ్- మాయాయాః వికారః=మాయామయీ, తాం= మయామయీం.

రావణిః- రావణస్య అపత్యం పుమాన్=రావణిః.

తిమిరచికురగ్రాహం- తిమిరాణ్యేవ చికురాః=తిమిరచికురాః, తిమిర చికురేషు గృహీత్వా=తిమిరచికురగ్రాహం. పక్షాంతరమున-తిమిరాణీవ

చికురాః=తిమిరచికురాః, తిమిరచికురేషు గృహీత్వా = తిమిరచికుర గ్రాహమ్.

*గభస్తిరాట్ - గభస్తీనాం రాట్=గభస్తిరాట్.*

**భావము :**

ఆ సమయమునందు రాత్రి గడిచి పోవుచున్నది. దానినిఁ జూచి కుముదము కలువ ముడుచుకొనినది. ఆ విధముగనే సీతయొక్క వధను విని కుముదుడను వానరుడును దుఃఖించెను. అట్లే నీవును నలుడును నిద్ర యింకను దొలగనందువలన గనులను మూసుకొనియుండిరి. పక్షాంతరమున-నలుడను వానరుడును నింద్రజిత్తు గావింపనున్న సీతావధోద్యమమును విని, దానినిఁ జూచుటకు సహించుటకు నశక్తుడై దుఃఖముతో తన చేతులచే గన్నులను మూసుకొనెను. అప్పుడా ఇంద్రజిత్తు, మాయచేఁ గల్పింపబడిన సీత నెట్లు చీకట్లవలె నల్లనైన కురులయందుఁ బట్టుకొని హింసించుచుండెనో యట్లే సూర్యుడు రాత్రిని చీకట్లనెడి కురులయందుఁ బట్టుకొని హింసించుచుండెను. అనగా ప్రభాతకాలమగుటవలన సూర్యోదయముచే చీకట్లుఁ దొలగిపోయెనని యభిప్రాయము. ఇంద్రజిత్తు మాయా సీతనుఁ గల్పించి చేయనెంచిన హింస కల్పాంతరమునకు సంబంధించినదిగా భావింపవలయును. ॥8॥

శ్లో. త్రిదశమిథున క్రీడాతల్పే విహాయసి గాహతే
నిధువనధుతస్రగ్భ్రగ్నశ్రీభరం గ్రహసంగ్రహః,
మృదుతరకరాఒఒకారై స్తూలోత్కరై రుదరమ్భరిః
పరిహరతి నాఖండో గణ్డోపధానవిధాం విధుః. 9

ప.వి. త్రిదశమిథునక్రీడాతల్పే - విహాయసి - గాహతే - నిధువనధుతస్రగ్భ్రగ శ్రీభరం- గ్రహసంగ్రహః- మృదుతరకరాఒఒకారైః- తూలోత్కరైః- ఉదరమ్భరిః-పరిహరతి-న-అఖండః-గణ్డోపధానవిధాం-విధుః.

అర్థము: గ్రహసంగ్రహః, గ్రహ=తారలును శుక్రాదిగ్రహములు మున్నగువాని యొక్క, సంగ్రహః = సమూహము, త్రిదశమిథునక్రీడాతల్పే,

త్రిదశ = దేవతలయొక్క, మిథున=దంపతులకు, క్రీడాతల్పే = కేలికి పడకవంటిదైన, విహాయసి = ఆకసమందు, నిధువనధుతస్రగ్భాగ శ్రీధరం, నిధువన=సురతకాలమందలి కదలికలచే, ధుత=ఇటునటు విసరబడిన, స్రక్=పుష్పమాలలయొక్క, భాగ=అంశములయొక్క, శ్రీధరం=కాంతిభారమువంటి కాంతిభారమును, గాహతే=పొందుచున్నది, కిఞ్చ=మఱియు, అఖణ్డః=పూర్ణమణ్డలము గలిగిన, విధుః=చంద్రుడు, మృదుతరకరాఽఽకారైః; మృదుతర=చాలామెత్తని, కర=కిరణములనెడి, ఆకారైః=ఆకారముగల్గిన, తూలోత్కరైః, తూల=దూదియొక్క ఉత్కరైః=సమూహములచే, ఉదరమ్భరిః=పొట్టను నింపుకొనినవాడై, గణ్డోపధాన విధాం; గణ్డ=కణతలకు, ఉపధాన = గుండ్రపు దిండు యొక్క, విధాం=సామ్యమును, న పరిహరతి=వదలుటలేదు, అనగా దిండు పోలికను వహించియున్నా డని యర్థము.

వి. శుక్రాదిగ్రహములు మాల్యఖండశోభను, చంద్రుడు దిండుశోభను వహించినట్లు చెప్పుటవలన నిదర్శనాలఙ్కారము.

సమాసములు :

*త్రిదశమిథున క్రీడాతల్పే*- త్రిదశానాం మిథునాని=త్రిదశమిథునాని, క్రీడాయాః తల్పం=క్రీడాతల్పం, త్రిదశమిథునానాం క్రీడాతల్పం= త్రిదశమిథునక్రీడాతల్పం, తస్మిన్=త్రిదశమిథునక్రీడాతల్పే.

*నిధువనధుతస్రగ్భాగశ్రీధరం*- నిధువనే ధుతాః = నిధువనధుతాః, నిధువనధుతాశ్చ తాః స్రజశ్చ=నిధువనధుతస్రజః, నిధువనధుతస్రజాం భాగాః=నిధువనధుతస్రగ్భాగాః, శ్రీణాం ధరః=శ్రీధరః, నిధువనధుతస్రగ్భాగానాం శ్రీధర ఇవ శ్రీధరః = నిధువనధుతస్రగ్భాగ శ్రీధరః, తం=నిధువనధుతస్రగ్భాగశ్రీధరమ్.

*గ్రహసంగ్రహః*- గ్రహాణాం సంగ్రహః=గ్రహసంగ్రహః.

*మృదుతరకరాఽఽకారైః*- అత్యంతం మృదవః = మృదుతరాః, మృదుతరాశ్చ తే కరాశ్చ=మృదుతరకరాః, మృదుతరకరా ఏవ ఆకార మేషాం తే=మృదుతరకరాఽఽకారాః, తైః=మృదుతరకరాఽఽకారైః.

తూలోత్కరైః- తూలానా ముత్కరాః = తూలోత్కరాః, తైః= తూలోత్కరైః.

ఉదరమ్భరిః- ఉదరం బిభ ర్తీతి= ఉదరమ్భరిః.

అఖణ్డః- న ఖణ్డః = అఖణ్డః.

గణ్డోపధానవిధాం- గణ్డస్య ఉపధానం= గణ్డోపధానం, గణ్డోపధానస్య విధా= గణ్డోపధానవిధా, తాం= గణ్డోపధానవిధాం.

**భావము :**

శుక్రాదిగ్రహముల యొక్కయు, తదితర గ్రహముల యొక్కయు సమూహము దేవతామిథునములు తమ సురత కేళి సెజ్జయైన యాకసమునందు సంభోగ సమయమునందలి ప్రబలములగు కదలికలచే నిటునటు విసరిన పుష్ప మాలల తునుకల యొక్క శోభను వహించుచున్నవి. మెత్తని కిరణము లనెడి దూదితోఁ బొట్టను నింపుకొనిన గుండ్రమగు పూర్ణ చంద్రుడు, ఆ దేవతామిథున ములు తమ కణతల కానించుకొనిన దిండుయొక్క పోలికను వహించు చున్నాడు. ॥9॥

శ్లో. దశశత చతుర్వేదీశాఖా వివ ర్తన మూ ర్తయః
సవిధ మధునాఽలఙ్కుర్వ న్తి ధ్రువం రవిరశ్మయః,
వదనకుహరే ష్వధ్యేతౄణా మయ న్తదుదఞ్చతి
శ్రుతిపదమయ స్తేషామేవ ప్రతిధ్వని రధ్వని. 10

ప.వి. దశశత చతుర్వేదీశాఖావివ ర్తనమూ ర్తయః-సవిధం- అధునా - అలఙ్కుర్వ న్తి-ధ్రువం-రవిరశ్మయః-వదనకుహరేషు- అధ్యేతౄణామ్-అయం - తత్-ఉదఞ్చతి-శ్రుతిపదమయః-తేషామ్-ఏవ- ప్రతిధ్వనిః-అధ్వని.

**అర్థము :** దశశత చతుర్వేదీ శాఖావివ ర్తన మూ ర్తయః; దశశత = వేయైన, చతుర్వేదీ = నాలుగు వేదములయొక్క, శాఖా = శాఖలయొక్క, వివ ర్తన= పరిణతియొక్క, మూ ర్తయః = శరీరములు కల్గిన, రవి రశ్మయః-రవి= సూర్యునియొక్క, రశ్మయః = కిరణములు, అధునా= ఇప్పుడు అనగా ఉదయ కాలమునందు, ధ్రువం= ఎల్లప్పుడు, సవిధం=

మన సమీప ప్రదేశమును, అలఙ్కుర్వన్తి=భూషించుచున్నవి. అనగా సమీపమునకు వచ్చుచున్నవని యర్థము, తత్= అందువలన అనగా సూర్యకిరణములు దగ్గఱగా వచ్చుటవలన, తేషామేవ = ఆ కిరణములచే, అయం= ఈ వినబడుచున్న, శ్రుతిపదమయః = వేదాక్షర స్వరూపము గల్గిన, ప్రతిధ్వని = ప్రతిధ్వని అనగా సూర్యకిరణముల నాశ్రయించి ఈ లోకమున వచ్చిన సూర్యలోకపు వేదధ్వనియొక్క ప్రతిశబ్దము, అధ్యేతౄణాం=ఇచ్చట వేదపాఠముఁ జేయునట్టి జనుల యొక్క, వదనకుహరేషు=ముఖరంధ్రములయందును, తథా=అట్లే, అధ్వని=శబ్దగుణ స్వరూపమైన ఆకాశమార్గమునందును, ఉదఞ్చతి= పైకి వచ్చుచున్నది. "ఋగ్భిః పూర్వాహ్ణే దివి దేవ ఈయతే" ఇత్యాది వేదముచే సూర్యకిరణములు శ్రుతిపదస్వరూపములే. సూర్యలోక వాసులుకూడ నిప్పుడు వేదముల నధ్యయనము గావించుచున్నారు. "ద్వితీయే చ తథా భాగే వేదాభ్యాసో విధీయతే" యను వచనము దానికి ప్రమాణము. ఇప్పుడు వేదాధ్యయనము గావించు మానవులయొక్క ముఖరంధ్రములయందుఁ బైకివచ్చెడి ధ్వని సూర్యలోకవాసులయొక్క వేదాధ్యయన ప్రతిధ్వనియే. అది సూర్యకిరణముల నాధారము గావించు కొని వచ్చినదని యాశయము.

సమాసములు :

*దశశతచతుర్వేదీ శాఖావివర్తన మూర్తయః* - దశ శతాని యాసు తాః = దశశతాః, చతుర్ణాం వేదానాం సమాహారః = చతుర్వేదీ, చతుర్వేద్యాః శాఖాః=చతుర్వేదీశాఖాః, దశశతాశ్చ తాః చతుర్వేదీ శాఖాశ్చ = దశశత చతుర్వేదీ శాఖాః, దశశతచతుర్వేదీశాఖానాం వివర్తనాని=దశశతచతుర్వేదీ శాఖా వివర్తనాని, దశశత చతుర్వేదీ శాఖావివర్తనాని మూర్తయః యేషాం తే= దశశత చతుర్వేదీ శాఖా వివర్తన మూర్తయః.

*రవిరశ్మయః* - రవేః రశ్మయః=రవిరశ్మయః.

*వదనకుహరేషు* - వదనస్య కుహరాణి=వదనకుహరాణి, తేషు = వదనకుహరేషు.

శ్రుతిపదమయాః - శ్రుతేః పదాని = శ్రుతిపదాని, శ్రుతిపదానాం వికారాః = శ్రుతిపదమయాః.

**భావము :**

నాలుగు వేదములకుఁ జెందిన వేరు శాఖల పరిణతులే స్వరూపముగాఁ గల్గిన వేయి సూర్య కిరణములు ప్రాతఃకాలమున మన సమీపభూమి నలఙ్కరించు చున్నవి. అట్లు సూర్య కిరణములు సమీపమునకు వచ్చుటవలన ఆ సూర్య కిరణములకు సంబంధించినదే ఈ వేదమయమగు ప్రతిధ్వని; ఇచ్చటి వేదపాఠకుల యొక్క ముఖరంధ్రముల యందును అట్లే శబ్దగుణ స్వరూపమైన యాకాశ మార్గమునందును పైకి వచ్చుచున్నది. "ఋగ్భిః పూర్వాహ్ణే దివి దేవ ఈయతే" యను శ్రుతి ననుసరించి సూర్యకిరణములు శ్రుతి వాక్యములలోని పద స్వరూపములు గలవి. సూర్య లోకవాసులుగూడ నిప్పుడు వేదాధ్యయన మునుఁ గావింతురు. ఇప్పుడు వేదాధ్యయనముఁ గావించెడి మానవులయొక్క కంఠ రంధ్రములనుండి వెలువడునట్టి ధ్వని సూర్య లోకవాసులయొక్క వేదా ధ్యయన ప్రతిధ్వనియే. ఆ ప్రతిధ్వని సూర్యకిరణములనుండి యిటఁ దేబడిన దని యాశయము. ॥10॥

శ్లో. నయతి భగవా నమ్భోజ స్యానిబంధనబాన్ధవః
కిమపి మఘవత్ప్రాసాదస్య ప్రఘాణ ముపఘ్నతామ్,
అపసరదరి ధ్వాన్త ప్రత్యగ్గ్రీవ్యయత్పృథ మణ్డలీ
లగన ఫలదశ్రాన్త స్వర్ణాచలభ్రమ విభ్రమః. 11

ప. వి. నయతి-భగవాన్- అమ్భోజస్య- అనిబంధన బాంధవః- కిమ్-అపి- మఘ మత్ప్రాసాదస్య- ప్రఘాణం- ఉపఘ్నతామ్- అపసరదరి ధ్వాన్త ప్రత్యగ్గ్రీవ్యయత్పృథ-మణ్డలీలగన-ఫల దశ్రాన్త స్వర్ణాచలభ్రమ విభ్రమః.

**అర్థము:** అమ్భోజస్య = పద్మమునకు, అనిబంధనబాన్ధవః - అనిబన్ధన = ఎలాంటి నెపములేని, బాంధవః = చుట్టమైన, భగవాన్ = భగవంతుడగు సూర్యుడు అపసరదరిధ్వాన్త ప్రత్యగ్గ్రీవ్యయత్పృథమణ్డలీలగన ఫలదశ్రాన్తస్వర్ణాచల

భ్రమ విభ్రమః- అపసరత్=తొలగిపోవుచున్న, అరి=ప్రతిబంధకము లైన, ధ్వాన్త=చీకట్లు గలిగిన, ప్రత్యక్=పడమటిదైన, వియత్పథ మణ్డలీ = ఆకాశమార్గమునందు, లగన=సంపర్కము కల్గించుటచే, ఫలత్=సఫలమగుచున్న, అశ్రాన్త=నిరన్తరము, స్వర్ణాచల=మేరు పర్వతముయొక్క, భ్రమ=ప్రదక్షిణముగావించుట యిను, విభ్రమః= విలాసము కలవా డగుచు, కిమపి=ఎందువలననో, మఘవత్ప్రాసాదస్య= ఇంద్రభవనమగు వైజయన్తము యొక్క, ప్రఘాణం = ముంగిలినిం గూర్చి, ఉపఘ్నతాం=సమీపభూమి నాశ్రయించి యుండుటను, నయతి =పొందుచున్నాడు.

సమాసములు :

*అనిబంధన బాన్ధవః*- అవిద్యమానం నిబన్ధనం యస్య సః=అనిబన్ధనః అనిబన్ధన శ్చాసౌ బాంధవశ్చ=అనిబంధనబాంధవః.

*మఘవత్ప్రాసాదస్య* - మఘవతః ప్రాసాదః = మఘవత్ప్రాసాదః, తస్య=మఘవత్ప్రాసాదస్య.

*అపసర దరిధ్వాన్త ప్రత్యగ్వియత్పథ మణ్డలీలగన ఫలదశ్రాన్త స్వర్ణాచలభ్రమ విభ్రమః*- అపసరన్తి చ తాని అరీణి చ = అపసర దరీణి, అపసరదరీణి ధ్వాన్తాని యస్యాం సా=అపసరదరిధ్వాన్తా చ సా ప్రతీచీ చ=అపసరదరిధ్వాన్త ప్రత్యక్, వియతః పన్థాః=వియత్పథః, వియత్పథస్య మణ్డలీ, = వియత్పథమండలీ, అపసర దరిధ్వాన్తప్రతీచీ చ సా వియత్పథ మణ్డలీ చ=అపసరదరిధ్వాన్త ప్రత్యగ్వియత్పథ మణ్డలీ, అపసరదరిధ్వాన్త ప్రత్యగ్వియత్పథమణ్డల్యాం లగనం = అపసరదరి ధ్వాన్త ప్రత్యగ్వియత్పథమణ్డలీ లగనం, అపసరదరిధ్వాన్త ప్రత్యగ్వి యత్పథ మణ్డలీ లగనేన ఫలన్=అపసరదరి ధ్వాన్త ప్రత్య గ్వియత్పథ మణ్డలీ లగనఫలన్, స్వర్ణాచలస్య భ్రమః = స్వర్ణాచలభ్రమః, అశ్రాన్తం స్వర్ణాచలభ్రమః = అశ్రాన్త స్వర్ణాచలభ్రమః, అశ్రాన్త స్వర్ణాచలభ్రమ ఏవ విభ్రమః=అశ్రాన్తస్వర్ణాచలభ్రమ విభ్రమః. అప సరదరిధ్వాన్త ప్రత్యగ్వియత్పథ మణ్డలీ లగనఫలన్ అశ్రాన్త స్వర్ణాచల

భ్రమ విభ్రమః యస్య సః=అపసర దరిధ్వాన్తప్రత్యగ్వియత్ప్రభమణ్డలీ ఫలదభ్రాన్త స్వర్ణాచల భ్రమవిభ్రమః.

భావము :

పద్మముల కవ్యాజబంధువైన సూర్యభగవానుఁడు పశ్చిమాకాశపు వీధి యందుఁ దన కిరణములనుఁ బ్రసరింపఁ జేయుటచేఁ జీకట్లనుఁ దొలగించుట వలన సఫలుఁడై ఎల్లప్పుడు మేరు పర్వతమునుఁ బ్రదక్షిణముగాఁ జుట్టుచున్న వాడై యేదియో యొక కారణముచే నింద్రభవనమైన వైజయన్తముయొక్క ముంగిలినిఁ జేరి దాని సమీపము నాశ్రయించి యున్నాడు. బంగారుతో నిండిన ఖజానానుఁ గాపాడుటకు నియమింపఁబడిన రక్షకుఁ డా ఖజానాచుట్టునుఁ దిరుగుచు నందే గూఢముగా నున్న శత్రువును వెంట నంటుచు నా బొక్కసము నందుండి వానిని దూరముగాఁ దరిమి, బొక్కసము చుట్టును తన పరిభ్రమణమును సఫలపఱచుకొనుచున్నవాడై యెట్లు విశ్రాంతి కొరకు నా బొక్కసపు ముంగిలినిఁ బ్రవేశించునో యట్లే యీ సూర్యుఁడు బంగారు కొండనుఁ గాపాడుటకై దాని చుట్టును బ్రదక్షిణముఁ గావించుచు దొంగల కవకాశ మొసంగుటచే శత్రువైన అంధకారమును దూరముగాఁ దఱిమి యింద్ర భవనము యొక్క ముంగిట విశ్రాంతిఁ బుచ్చుకొనెనని యాశయము. అనగా సూర్యుడు శత్రువు వంటి చీకటినిఁ దఱిమి క్షణకాలమున నుదయ పర్వతమునుఁ జేరెనని యభిప్రాయము.

శ్లో. నభసి మహసాం ధ్వాన్త ధ్వాఙ్క్ష ప్రమాపణ పత్రిణా
మిహ విహరణైః శ్యైనమ్పాతాం రవే రవధారయన్,
శశవిశసన త్రాసాదాశా మగా చ్చరమాం శశీ
తదధిగమనా త్తారాపారావతై రుదపీయత. 12

ప. వి. నభసి - మహసాం-ధ్వాన్త ధ్వాఙ్క్ష ప్రమాపణ పత్రిణామ్ - ఇహ-శ్యైనమ్పాతాం-రవేః-అవధారయన్ - శశవిశసనత్రాసాత్-ఆశామ్-అగాత్ - చరమాం-శశీ-తదధిగమనాత్-తారాపారావతైః-ఉదపీయత.

**అర్థము:** శశీ=చంద్రుఁడు, ధ్వాన్త ధ్వాఙ్క్షప్రమాపణ పత్రిణాం - ధ్వాన్త = చీకట్లనెడి, ధ్వాఙ్క్ష = కాకులను, ప్రమాపణ = చంపుటయందలి, పత్రిణాం = బాణములైన, మహసాం = సూర్యకిరణములకు, ఇహ = ఈ, నభసి = ఆకసమందు, విహరణైః = విహారములచే, రవేః = సూర్యుని యొక్క, శ్యైనంపాతాం = (డేగలయొక్క పతనక్రియగల్గిన) వేటను, అవధారయన్నివ = నిశ్చయించుకొనుచున్నాఁడా యనునట్లు, శశవిశసన త్రాసాత్ - శశ = కుందేలును, విశసన = హింసించుట వలన, చరమాం = పడమటి, ఆశాం = దిక్కును(గూర్చి), అగాత్ = వెళ్లెను, తదధిగమనాత్-తత్ = ఆ సూర్యునివేటను, అధిగమనాత్ = తెలుసుకొనుటవలన, తారాపారావతైః-తారా = నక్షత్రము లనెడి, పారావతైః = పావురాళ్ళచే, ఉదపీయత = ఎగిరివెళ్ళుట (జరిగినది), అనగా సూర్యకిరణములు ఆకసమున వ్యాపించుచున్నవి. చంద్రుడు పడమటి దిక్కునకు వెళ్ళెను. నక్షత్రము లస్తమించినవని యర్థము.

సమాసములు :

ధ్వాన్తధ్వాఙ్క్షప్రమాపణ పత్రిణామ్ – ధ్వాన్తాన్యేవ ధ్వాంక్షాః = ధ్వాన్త ధ్వాంక్షాః, ధ్వాన్తధ్వాంక్షాణాం ప్రమాపణం = ధ్వాన్త ధ్వాంక్షప్రమాపణం, ధ్వాన్తధ్వాంక్ష ప్రమాపణే పత్రిణః = ధ్వాన్తధ్వాంక్ష ప్రమాపణ పత్రిణః, తేషాం = ధ్వాన్తధ్వాంక్ష ప్రమాపణ పత్రిణామ్.

శ్యైనమ్పాతాం – శ్యేనపాతః అస్యాం క్రియాయా మితి = శ్యైనమ్పాతా, తామ్ = శ్యైనమ్పాతాం.

శశవిశసన త్రాసాత్ – శశస్య విశసనం = శశవిశసనం, శశవిశసనాత్ త్రాసః = శశవిశసన త్రాసః, తస్మాత్ = శశవిశసన త్రాసాత్.

తదధిగమనాత్ – తస్య అధిగమనం = తదధిగమనం, తస్మాత్ = తదధిగమనాత్.

తారాపారావతైః – తారా ఏవ పారావతాః = తారాపారావతాః, తైః = తారాపారావతైః.

వి. ఇచ్చటఁ జీకట్లనుఁ గాకులుగను, సూర్యకిరణములను బాణములుగను, నాకసమునందు సూర్యుని విహారమును శ్యైనంపాతముగను ననగా డేగల

పతనక్రియగను, నక్షత్రములను పావురములుగను రూపించుట వలన రూపకాలఙ్కారము.

**భావము:**

చంద్రుడు చీకట్లనెడి కాకులను సంహరించెడి బాణములైన సూర్యకిరణము లాకాశమునందు విహరించుటను, సూర్యునివేట యని నిశ్చయించుకొనెనో యను నట్లు, తన యొడియందలి కుందేటి నా సూర్యుడు వేటాడి చంపునేమో యను భయమువలనఁ బడమటి దిక్కునకుఁ బరుగిడెను. ఆ వేటనుఁ గూర్చి తెలిసికొని నందువలన నక్షత్రము లనెడి పావురములును మింటి కెగిరిపోయినవి. ఆ పావురములు సైతము సూర్యుడు తమ్ముల వేటాడునేమో యను భయముచే వెడలి పోయినవని యర్థము. అనగా సూర్యకిరణము లాకసమునందుఁ బ్రసరించు చున్నవి. చంద్రుడు పడమట నస్తమించుచున్నాడు. నక్షత్రములును నస్తమించి నవని యర్థము.

శ్లో. భృశ మబిభరు స్తారా హారాచ్చ్యుతా ఇవ మౌక్తికాః
సురరతక్రీడాలూనాత్ ద్యుసద్వియదఙ్గణం
బహుకరకృతాత్ ప్రాతః సమ్మార్జనా దధునా పున
ర్నిరుపధినిజావస్థాలక్ష్మీ విలక్షణ మీక్షతే. 13

ప.వి. భృశమ్ – అబిభరుః – తారాః – హారాత్ – చ్యుతాః – ఇవ – మౌక్తికాః – సుర సురతక్రీడాలూనాత్ – ద్యుస ద్వియ దఙ్గణం – బహుకరకృతాత్ – ప్రాతః – సమ్మార్జనాత్ – అధునా – పునః – నిరుపధినిజాఽవస్థా లక్ష్మీవిలక్షణం – ఈక్షతే.

అర్థము: తారాః = నక్షత్రములు, సురసురత క్రీడాలూనాత్ - సుర = దేవతల యొక్క, సురతక్రీడా = సంభోగకేళియందు, లూనాత్ = తెగిన, హారాత్ = హారములైన ముత్తెముల సరములనుండి, చ్యుతాః = జారి పోయిన, మౌక్తికా ఇవ = ముత్తెములో యనునట్లు, ద్యుసద్వియదఙ్గణం – ద్యుసత్ = దేవతలయొక్క, వియత్ = నివాసమైన యాకాశమనెడి,

అఙ్గణం=ముంగిలిని, భృశం=మిక్కిలి, అబిభరుః=నింపినవి. అనగా రాత్రియందు నింపినవని యర్థము. అధునా = ఇప్పుడు, ప్రాతః = ఉదయముననో, బహుకరకృతాత్, బహుకర = పెక్కుకిరణములు గల్గుటచే సహస్రకిరణుడైన సూర్యుడనెడి యూడ్పుగానిచే, కృతాత్= చేయబడిన, సమ్మార్జనాత్ = ఊడ్పువలన, నిరుపధినిజావస్థాలక్ష్మీ విలక్షణం, నిరుపధి=అవ్యాజమైన యనగా సహజమైన, నిజ=తనదగు, అవస్థా=స్వరూపమైన, లక్ష్మీ=నీలవర్ణ ప్రశోభకంటె, విలక్షణం= వేరుగా, ఈక్ష్యతే=చూడబడుచున్నది. ఊడ్పుగాడు ఊడ్చినపిదప స్థల మెట్లు శుద్ధముగా గానబడునో, యట్లే బహుకరుడగు సూర్యుడనెడి బహుకరుడు ( ఊడ్పుకాడు ) ఆకసము నూడ్వగనే యాయాకసము పూర్వముకంటె విలక్షణముగా గానఁబడినదని యర్థము.

## సమాసములు :

*సురసురతక్రీడాలూనాత్* - సురతమేవ క్రీడా=సురతక్రీడా, సురాణాం సురతక్రీడా=సురసురతక్రీడా, సురసురతక్రీడయా లూనం= సురసురత క్రీడాలూనం, తస్మాత్=సురసురతక్రీడాలూనాత్.

*ద్యుసద్వియదఙ్గణం*- దివి సీద న్తీతి=ద్యుసదః, వియదేవ అఙ్గణం = వియదఙ్గణం, ద్యుసదాం వియదఙ్గణం=ద్యుసద్వియదఙ్గణం.

*బహుకరకృతాత్* -బహవః కరాః యస్య సః=బహుకరః, బహుకర ఏవ బహుకరః, బహుకరేణ కృతం=బహుకరకృతం, తస్మాత్=బహుకర కృతాత్.

*నిరుపధినిజావస్థాలక్ష్మీవిలక్షణమ్* -నిర్గతః ఉపధిః యస్యాః సా=నిరుపధిః, నిజా చ సా అవస్థా చ=నిజావస్థా, నిరుపధి శ్చాసౌ నిజావస్థా చ = నిరుపధినిజావస్థా, నిరుపధినిజావస్థాయాః లక్ష్మీః = నిరుపధి నిజావస్థాలక్ష్మీ, నిరుపధినిజావస్థాలక్ష్మ్యాం విలక్షణం=నిరుపధినిజావస్థా లక్ష్మీవిలక్షణమ్.

## భావము :

రాత్రియందు మింట నక్షత్రములు, దేవతా మిథునముల సంభోగకాలము నందుఁ దెగిపోయిన ముత్తెపు హారములనుండి విడిపోయిన ముత్తెములో యను

నట్లు, ఆకసమును మిక్కుటముగా నిండినవి. ఇప్పు డుదయము కాగనే పెక్కు కిరణములు గల్గినందువలన బహుకరుఁడగు సూర్యునిచే (ఊడ్చెడి వానిచే) చిమ్మఁబడుటవలన ననగా సూర్యుని కాంతులతో నక్షత్రములు తొలగింపఁబడుటవలనను (నూడ్చువానిచే ధూళి మున్నగునవి తొలగింపఁబడుటవలనను) సహజమగు తన శోభకంటెను ననగా రాత్రియందలి నీల నిర్మల శోభకంటెను భిన్నమైన శోభనుఁ గలదిగా నాకాశము జూడఁబడుచున్నది. అనగా నూడ్చెడి వానిచే చిమ్మఁబడి శుద్ధము చేయఁబడిన ప్రదేశము దాని ముందటి స్థితికంటెను నెక్కువ శోభగలదిగా నెట్లు శోభించునో, యట్లే బహుకరుడగు సూర్యునిచే శుభ్రపఱుచబడిన యంతరిక్షము సైతము పూర్వస్థితి కంటెను. నెక్కువ శోభగలదిగా గనఁబడు చున్నదని యర్థము.

శ్లో. ప్రథమ ముపహృత్యార్ఘ్యం తారై రఖణ్డితతండులైః
తిమిరపరిషద్దూర్వా పర్వావలీ శబలీకృతైః,
అథ రవిరుచాం గ్రాసాతిథ్యం నభః స్వవిహారిభిః
సృజతి శిశిరక్షోదశ్రేణిమయై రుదసక్తుభిః. 14

ప.వి. ప్రథమమ్-ఉపహృత్య-అర్ఘ్యం-తారైః- అఖణ్డితతణ్డులైః- తిమిర పరిష ద్దూర్వాపర్వావలీశబలీకృతైః-అథ-రవిరుచాం-గ్రాసాతిథ్యం-నభః- స్వవిహారిభిః-సృజతి-శిశిరక్షోదశ్రేణీమయైః- ఉదసక్తుభిః.

అర్థము: నభః=ఆకసము, తిమిర పరిషద్దూర్వాపర్వావలీ శబలీకృతైః- తిమిర పరిషత్=చీకట్లగుం పనెడి, దూర్వాపర్వ = గరిక కణుపులయొక్క, అనగా గరిక తునకలయొక్క, ఆవలీ=వరుసచే ననగా శ్యామలవర్ణము లగు చీకట్లచే, శబలీకృతైః=చిత్రవర్ణములు గలవిగా ననగా మిశ్రితము లుగాఁ జేయఁబడిన, తారైః=నక్షత్రము లనెడి, అఖణ్డితతణ్డులైః=పొట్ట లేనట్టివియు విఱుగనట్టివియునగు బియ్యపు గింజలచే ననగా నక్షత్రము లచే, ప్రథమం=మొదట, రవిరుచాం=సూర్యకిరణములకు,అర్ఘ్యం= పూజాసాధనమును, ఉపహృత్య=ఇచ్చి, అథ=పిదప, స్వవిహారిభిః- స్వ=తనయందు, అనగా నాకాశమునందు, విహారిభిః=సంచరించెడి, శిశిరక్షోదశ్రేణీమయైః; శిశిర=మంచుయొక్క, క్షోద=తుంపురుల

యొక్క, శ్రేణీమయైః=వరుసల రూపముననున్న, ఉదసక్తుభిః=నీటితోఁ గలుపఁబడిన పేలపిండితో, గ్రాసాతిథ్యం, గ్రాస=గ్రాసరూపమైన, ఆతిథ్యం=అతిథిసత్కారమును, సృజతీవ=కల్పించుచున్నదో యను నట్లున్నది.

వి. ఇచ్చట నక్షత్రములను నక్షతలుగను, చీకట్లగుంపును గరికతునుకలు గను, మంచు తుంపురులను నీటితోఁ గలిసిన పేలపిండిగను రూపించుట వలన రూపకాలఙ్కారము.

సమాసములు :

అఖణ్డితతణ్డులైః-న ఖణ్డితాః = అఖణ్డితాః, అఖణ్డితాశ్చ తే తణ్డులాశ్చ =అఖణ్డితతణ్డులాః, తైః=అఖణ్డితతణ్డులైః.

తిమిరపరిషద్దూర్వాపర్వావలీశబలీకృతైః- తిమిరాణాం పరిషత్ = తిమిరపరిషత్, దూర్వాణాం పర్వాణి=దూర్వాపర్వాణి, తిమిరపరిషదేవ దూర్వాపర్వాణి=తిమిరపరిషద్దూర్వాపర్వాణి, తిమిరపరిషద్దూర్వాపర్వాణా మావలీ = తిమిరపరిషద్దూర్వాపర్వావలీ, తిమిపరిషద్దూర్వాపర్వావల్యా శబలీకృతాః = తిమిరపరిషద్దూర్వాపర్వావలీ శబలీకృతాః, తైః = తిమిరపరిషద్దూర్వా పర్వావలీ శబలీకృతైః.

రవిరుచాం-రవేః రుచః=రవిరుచః, తాసాం=రవిరుచాం.

గ్రాసాతిథ్యం- అతిథయే ఇదం=ఆతిథ్యం, గ్రాస ఏవ ఆతిథ్యం= గ్రాసాతిథ్యం, తత్=గ్రాసాతిథ్యం.

స్వవిహారిభిః- స్వస్మిన్ విహర న్తీతి=స్వవిహారిణః, తైః=స్వవిహారిభిః.
శిశిరక్షోదశ్రేణీమయైః- శిశిరస్య క్షోదాః=శిశిరక్షోదాః, శిశిరక్షోదానాం శ్రేణ్యః=శిశిరక్షోదశ్రేణ్యః, శిశిరక్షోదశ్రేణీనాం వికారాః = శిశిరక్షోద శ్రేణీమయాః, తైః=శిశిరక్షోదశ్రేణీమయైః.

ఉదసక్తుభిః - ఉదకమిశ్రితాః సక్తవః = ఉదసక్తవః, తైః = ఉదసక్తుభిః.

భావము :

ఆకసము ప్రభాతమున తనయందలి చీకట్లగుం పనెడి గరికల దలములచే కలుపఁబడి చిత్రవర్ణము గలవిగాఁ జేయఁబడిన నక్షత్రము లనెడి విఱుగని బియ్యపు గింజలచే ననగా నక్షత్రలచే మొదట రవికిరణముల కర్ఘ్య మొసంగి పిదప తనయెడ వ్యాపించి తిరుగుచున్న మంచు తుంపర లనెడి నీటఁ దడిపిన పేలాల చూర్ణములతో నాహారరూపమైన యతిథిసత్కారముఁ జేయుచున్నది. ఇంటికి విచ్చేసిన యతిథికై తొలుత నర్ఘ్యము నిచ్చి పిదప నన్నదానము చేయుట గృహస్థధర్మము గదా. ॥14॥

శ్లో. అసురహితమ ప్యాదిత్యోత్థాం విపత్తి ముపాగతం
దితిసుతగురుః ప్రాజ్ఞై ర్యోక్తుం న కిం కచవత్తమః,
పఠతి లుఠతీ కణ్ఠే విద్యా మయం మృతజీవనీ
యది న వహతే సన్ధ్యామౌనవ్రతవ్యయభీరుతామ్. 15

ప. వి. అసురహితమ్-అపి-ఆదిత్యోత్థాం- విపత్తిమ్-ఉపాగతమ్- దితిసుతగురుః- ప్రాజ్ఞైః-యోక్తుం-న-కిం-కచవత్- తమః-పఠతి-లుఠతీ-కణ్ఠే-విద్యామ్-అయం-మృతజీవనీ-యది-న- వహతే- సన్ధ్యామౌనవ్రతవ్యయభీరుతామ్.

అర్థము : దితిసుతగురుః-దితిసుత=దితికుమారులగు రాక్షసులకు, గురుః = గురువైన శుక్రాచార్యుఁడు, అసురహితమపి=రాక్షసులకు హితముఁ గావించునదైనను, పక్షాంతరమున-అసు=ప్రాణములతో, రహితమపి= శూన్యుఁడైనను, ఆదిత్యోత్థాం; ఆదిత్య=సూర్యునివలన, ఉత్థాం= ఉద్భవించిన, పక్షాంతరమున, ఆదిత్య=దేవతలచే, ఉత్థాం=ఏర్పడిన (దేవతలు పంపుటచేతనే, కచుడు వెళ్లుటవలన నతనికిఁ గల్గిన యాపద దేవతా మూలకమని యర్థము) విపత్తిం = ఆపదను, (వినాశమును) ఉపాగతం=పొందిన, తమః = చీకటిని, కచవత్ = బృహస్పతి కుమారుడగు కచునివలె. (బృహస్పతిపుత్రుడు కచుఁడు. దేవతలచేఁ బ్రేరేపింపఁబడినవాడై సంజీవని యను విద్యను నేర్పుటకు శుక్రుని

చెంతకుఁ బోయెను, అతఁడు రాక్షసులచేఁ జంపబడినవాడై మరల, శుక్రునిచే బ్రతికింపఁబడెనని భారత కథ), ప్రాణైః=ప్రాణములతో, యోక్తుం=చేర్చుటకు, కణ్ఠే=కుత్తుకయందు, లుఠతీం=ఆడుచున్న, మృతసఞ్జీవనీం = మృత సంజీవని యను, విద్యాం = విద్యను (మంత్రమును), న పఠతి కిం = చదువడా యేమి? అనగా తప్పక చదువునని యర్థము, అయం = ఈ శుక్రుడు, సంధ్యామౌనవ్రత వ్యయభీరుతాం - సంధ్యా = సంధ్యాకాలమందలి, మౌనవ్రత = మౌనమైన వ్రతమునకు, వ్యయాత్=భంగమువలన, భీరుతాం = భయశీలత్వమును, న వహతే యది=వహించుట లేక పోయినచో యని యర్థము. అట్లు కానిచో, నెదుటనున్నట్టి తనశిష్యులగు నా రాక్షసులకు మేలునుఁ గల్గించు నంధకారము నశించుట నెట్లు ఉపేక్షించును?

## సమాసములు :

*అసురహితమ్* - అసురాణాం హితం=అసురహితం, తత్=అసురహితమ్, పక్షాంతరమున - అసునా రహితః=అసురహితః, తమ్=అసురహితమ్.

*దితిసుతగురుః* - దితేః సుతాః=దితిసుతాః, దితిసుతానాం గురుః= దితిసుతగురుః.

*కచవత్* - కచమివ=కచవత్.

*సంధ్యామౌనవ్రతవ్యయభీరుతామ్* - సంధ్యాయాం మౌనం=సంధ్యామౌనం, సంధ్యామౌనమేవ వ్రతం=సంధ్యామౌనవ్రతమ్. సంధ్యామౌనవ్రతస్య వ్యయః=సంధ్యామౌనవ్రతవ్యయః, సంధ్యామౌనవ్రత వ్యయాత్ భీరుతా, సంధ్యామౌనవ్రతవ్యయభీరుతా, తామ్ = సంధ్యామౌనవ్రతవ్యయభీరుతామ్.

## భావము :

రాక్షసులకు గురువైన శుక్రాచార్యుడు అసురహితమున ననగా రాత్రి రాక్షసులకు హితమును గూర్చునదియును, (అసువులతో శూన్యమైనవాడును

ననగా (ప్రాణములు తొలగినవాడును) ఆదిత్యునివలనఁ గల్గినదియు, చీకటి పక్షమున-సూర్యునివలనఁ గల్గినదియును, కచపక్షమున-దేవతలవలన గల్గినదియు నగు నాపద నొందిన చీకటిని కచునివలెఁ బ్రాణములతో సంధిల్లఁ జేయుటకు, తన కుత్తుకయందు నిరంతరము తిరుగుచున్న మృతసంజీవని యను విద్యను ననగా మంత్రమును పఠింపడా యేమి? తప్పక చదువఁగలడు. కాని యా శుక్రుడు తన సంధ్యాచరణమందలి మౌనవ్రతమునకు భంగము కలుగునని భయపడకయుండుట యవసరము. అతడు తన మౌన వ్రతభంగమువలన భయపడకయున్నచో, నామృతసంజీవనీమంత్రమునుఁ బఠించి, తన శిష్యులైన రాక్షసులకు హితముఁ గూర్చునట్టి యంధకారము నశించుట నుపేక్షించును.

శ్లో. ఉదయశిఖరప్రస్థా న్యహ్నా రణేఽత్ర నిశః క్షణే
దధతి విహరత్పూషా ణ్యుష్మద్రుతాశ్మజతుస్రవాన్,
ఉదయదరుణ ప్రహ్వీభావాదరా దరుణానుజే
మిలతి కిము తత్సఙ్గా చ్ఛఙ్కయా నవేష్టకవేష్టనా. 16

ప.వి. ఉదయశిఖరప్రస్థాని-అహ్నా-రణే-అత్ర-నిశః-క్షణే-దధతి - విహరత్పూషాణి - ఉష్మద్రుతాశ్మజతుస్రవాన్ - ఉదయదరుణప్రహ్వీభావాదరాత్-అరుణానుజే-మిలతి-కిమ్-ఉ-తత్సఙ్గాత్-శఙ్కయా-నవేష్టకవేష్టనా.

అర్థము: అత్ర=ఈ, క్షణే=సమయమందు, ననగా నుదయకాలమునందు, నిశః=రాత్రికి, అహ్నా (సహ)=పగటితోడ, రణే సతి=యుద్ధము జరుగగా, విహరత్పూగాణి- విహరత్=యుద్ధము చూచుటకై సంచరించు, పూషాణి=సూర్యుడు గల్గిన, ఉదయశిఖరిప్రస్థాని-ఉదయశిఖరి=ఉదయ పర్వతముయొక్క, ప్రస్థాని=సానుప్రదేశములు, ఉష్మద్రుతాఽశ్మజతుస్రవాన్- ఉష్మ=వేడిచే, ద్రుత=కఱగిన, అశ్మజతు=శిలాజతువనెడి ధాతువులయొక్క, స్రవాన్=ప్రవాహములను, దధతి = రక్తప్రవాహ ములవలె ధరించుచున్నవి. తేన=దానిచే, ఉదయదరుణప్రహ్వీభావాత్-ఉదయత్=ఉదయించుచున్న, అరుణ=సూర్యసారథియైన యనూరుని యొక్క, ప్రహ్వీభావ=వందనమునందు, ఆదరాత్=ఆసక్తివలన, అరుణానుజే=అరుణుని సోదరుఁడగు రక్తవర్ణముగల్గిన గరుడుఁడు,

మిలతి సతి=కలియుచుండగా, నవేష్టకవేష్టనా; నవ=నూతనములైన, ఇష్టక=ఇటుకలు కల్గిన, వేష్టనా=ప్రాకారము, శఙ్క్యా కిము=శంకింపఁదగినదాయేమి? ఏల యనగా, రక్తవర్ణుఁడగు గరుడుని కాంతి కొండకు సమీపమున నున్నది. అందువలన కొండకు నెఱ్ఱని యిటుకలతో ప్రాకారము గట్టిన ట్లున్నదని యర్థము.

## సమాసములు :

*ఉదయశిఖరిప్రస్థాని*-ఉదయస్య శిఖరీ=ఉదయశిఖరీ, ఉదయశిఖరిణః ప్రస్థాని=ఉదయశిఖరిప్రస్థాని.

*విహరత్పూషాణి* - విహరన్ పూషా యేషు తాని=విహరత్పూషాణి.

*ఉష్మద్రుతాశ్మజతుస్రవాన్* - ఉష్మణా ద్రుతాని = ఉష్మద్రుతాని, అశ్మనః జతూని=అశ్మజతూని, ఉష్మద్రుతాని చ తాని అశ్మజాతూని చ=ఉష్మద్రుతాశ్మజతూని, ఉష్మద్రుతాశ్మజతూనాం స్రవాః=ఉష్మద్రుతాగ్మజతుస్రవాః; తాన్=ఉష్మద్రుతాశ్మజతుస్రవాన్.

*ఉదయదరుణప్రహ్వీభావాదరాత్* - ఉదయం శ్చాసౌ అరుణశ్చ=ఉదయదరుణః, ఉదయదరుణస్య ప్రహ్వీభావః = ఉదయదరుణప్రహ్వీభావః, ఉదయదరుణప్రహ్వీభావే ఆదరః; ఉదయదరుణప్రహ్వీభావాదరః, తస్మాత్=ఉదయదరుణప్రహ్వీభావాదరాత్.

*అరుణానుజే* - అరుణస్య అనుజః=అరుణానుజః, తస్మిన్=అరుణానుజే.

*నవేష్టకవేష్టనా* - నవాః ఇష్టకాః యస్యాం సా=నవేష్టకా, నవేష్టకా చ సా వేష్టనా చ=నవేష్టకవేష్టనా.

## భావము :

ఈ యుదయకాలమునందు తమ తమ యధికారమును స్థాపించుకొనుటకై రాత్రికిఁ బగటితో యుద్ధమేర్పడుచున్నది. ఆయుద్ధమునుఁ జూచుటకై సూర్యుఁడు, ఉదయపర్వతపు చఱియలయందు సంచరించుచున్నాడు. ఆ చఱియలయందు, సూర్యకిరణములచే కఱగిన శిలాజతుద్రవములు ప్రవహించుచున్నవి. ఆ ప్రవాహములు ఉదయరాగములచే నెఱ్ఱబారియున్నవి. ఆ సమయమున, రక్తవర్ణముగల్గిన

గరుడుఁడు సూర్యసారథియైన తనయన్నయగు నరుణునికి నమస్కరింప రాగా నాతని యొడలిర క్తపువన్నెనుఁబట్టి యెఱ్ఱనియిటుకలతో గట్టిన ప్రాకార మచ్చట యేర్పడినదా యని భావింపఁదగియున్నది. ॥16॥

శ్లో. రవి రథహయా నశ్వస్య న్తి ధ్రువం బడబాబల
ప్రతిబలబలావస్థాయిన్యః సమీక్ష్య సమీపగాన్,
నిజపరిబృఢం గాఢప్రేమా రథాఙ్గవిహఙ్గమీ
స్మరశరపరాధీనస్వాన్తా వృషస్యతి సమ్ప్రతి. 17

ప. వి. రవిరథహయాన్- అశ్వస్యన్తి- ధ్రువం- బడబాపి- బలప్రతిబలబలావస్థాయిన్యః - సమీక్ష్య - సమీపగాన్ - నిజపరివృఢం - గాఢప్రేమా-రథాఙ్గవిహఙ్గమీ-స్మరశర పరాధీనస్వాన్తా-వృషస్యతి-సమ్ప్రతి.

అర్థము: బలప్రతిబల బలావస్థాయిన్యః- బల=బలుడను రాక్షసులకు, ప్రతిబల= శత్రువైన యింద్రునియొక్క, బల=సైన్యములయందు, స్థాయిన్యః= ఉన్నటువంటి, బడబాః=ఆడుగుఱ్ఱములు అనగా తూర్పు దెసయందున్న గుఱ్ఱములని యర్థము, సమీపగాన్ = దగ్గరనున్న, రవిరథహయాన్- రవిరథ=సూర్యరథముయొక్క, హయాన్=గుఱ్ఱములను, సమీక్ష్య= చూచి, అశ్వస్యన్తి = సంభోగమునకై కోరుచున్నవి, ధ్రువం = నిశ్చయము, తథా=అట్లే, గాఢప్రేమా=గట్టి యనురాగము గల్గిన, (కావుననే) స్మరశర పరాధీనస్వాన్తా; స్మరశర = మన్మథబాణములకు, పరాధీన=స్వాధీనమైన, స్వాన్తా=చిత్తముగల్గిన, రథాఙ్గవిహఙ్గమీ = ఆడుచక్రవాకపక్షి, నిజపరిబృఢం- నిజ = తనకు సంబంధించిన, పరిబృఢం = ప్రభువును నగా ప్రియుని, సమ్ప్రతి = ఈ యుషః కాలమునందు, వృషస్యతి=సంభోగమునకై కోరుచున్నది. రాత్రి యెడ బాపు గల్గిన చక్రవాకములు పగటియందే సంభోగించును.

సమాసములు :

*రవిరథహయాన్ - రవేః రథః=రవిరథః, రవిరథస్య హయాః= రవిరథహయాః, తాన్=రవిరథహయాన్.*

*అశ్వస్యన్తి* - మైథునార్థ మశ్వ మిచ్ఛన్తీతి=అశ్వస్యన్తి.
*బలప్రతిబల బలావస్థాయిన్యః* - బలస్య ప్రతిబలః=బలప్రతిబలః, బలిప్రతిబలస్య బలం=బలప్రతిబలబలం-బలప్రతిబలబలే అవతిష్ఠన్తీతి= బలప్రతిబల బలావస్థాయిన్యః.
*సమీపగాన్* - సమీపం గచ్ఛన్తీతి=సమీపగాః, తాన్=సమీపగాన్.
*నిజపరిబృఢం* - నిజశ్చాసౌ పరిబృఢశ్చ = నిజపరిబృఢః, తం = నిజపరిబృఢమ్.
*గాఢప్రేమా* – గాఢం ప్రేమ యస్యాః సా=గాఢప్రేమా.
*రథాఙ్గవిహఙ్గమీ* - రథాఙ్గ ఏవ విహఙ్గమః=రథాఙ్గవిహంగమః, రథాంగ విహంగమస్య స్త్రీ=రథాంగవిహఙ్గమీ.
*స్మరశరపరాధీనస్వాన్తా* - స్మరస్య శరాః=స్మరశరాః; స్మరశరాణాం పరాధీనంస్వాన్తం యస్యాః సా=స్మరశరపరాధీనస్వాన్తా.
*వృషస్యతి*–వృషం మైథునార్థ మిచ్ఛతీతి=వృషస్యతి.

భావము :

బలాసురుని శత్రువైన యింద్రుని సైన్యమునందలి యాడుగుఱ్ఱములు, అనగా తూర్పుదిక్కునందలి యాడుగుఱ్ఱములు, సమీపమందున్న సూర్యుని రథమును లాగెడి యేడు గుఱ్ఱములనుఁ జూచి సంభోగమునకై కోరుచున్నవి. అట్లే గాఢమైన యనురాగము గల్గినదై మన్మథబాణములకు గురియైన యాడు చక్రవాకము తన ప్రియుని యుషఃకాలమున సంభోగమునకై కోరుచున్నది. చక్రవాకపక్షులు రాత్రులు వియోగమునొంది పగటియందే కలియుచున్నవి.॥17॥

శ్లో. ఉడుపరిషదః కిం నార్హత్వం ? నిశః కిము నౌచితీ ?
పతి రిహ న యత్తాభ్యాం దృష్టో గణేశరుచీగణః,
స్ఫుట ముడుపతే రాశ్మం వక్షః స్ఫురన్మలినాశ్మన
చ్ఛవి యదనయో ర్విచ్ఛేదేఽపి ద్రుతం న మృతం బత. 18

ప. వి. ఉడుపరిషదః-కిం-న-అర్హత్వం-నిశః-కిమ్-ఉ-న- ఔచితీ-పతిః-ఇహ - న-యత్-తాభ్యాం-దృష్టః-గణేశరుచీగణః-స్ఫుటమ్-ఉడుపతేః-ఆశ్మం-

వక్షః-స్ఫురన్మలినాశ్మనచ్ఛవి-యత్-అనయోః-విచ్ఛేదే-అపి-ద్రుతం -న-మృతం-బత.

**అర్థము:** ఉడుపరిషదః=నక్షత్ర సమూహమునకు, అర్హాత్వం = పూజ్యులై యుండుట, యనగాఁ బ్రశంసింపఁదగియుండుట, న కిమ్=లేదా యేమి? అనగా తప్పక యున్నదని యర్థము. నిశః = రాత్రికిని, ఔచితీ = ఔచిత్యము, న కిమ్=లేదా యేమి? అనగా తప్పకయున్నది, యత్= ఎందువలన, ఇహ = ఈ ప్రభాతకాలమునందు, గణేయరుచిగణః, గణేయ=గణింపఁదగిన, (పరిమితమైన) రుచిగణః=కాంతిచయము గల్గిన, అనగా క్షీణమైన కాంతిచయము గల్గిన, పతిః = భర్తయగు చంద్రుఁడు, తాభ్యాం=ఆ నక్షత్ర సమూహము చేతను, రాత్రిచేతను, న దృష్టః = చూడఁబడలేదు. ("ధన్యా స్తాత! న పశ్యన్తి పతిభఙ్గం కులక్షయమ్" అని చెప్పిన ప్రకారము) ధన్యులైనవారు తమ భర్త యొక్క మరణమును, వంశనాశమునుఁ జూడరు. కాన తారల సమూహము, రాత్రి తమ భర్తయగు చంద్రునియొక్క అస్తమయరూప వినాశమునుఁ జూడలేదు. ఏలయనగా, చంద్రాస్తమయమునకు మును పే నక్షత్రము లస్తమించుచున్నవి. రాత్రియుఁ గడచిపోవుచున్నది) కిఞ్చ= మఱియు, స్ఫురన్మలినాశ్మనచ్ఛవి, స్ఫురత్=(కుందేటిని కళఙ్కముగాఁ గల్గియుండుట వలన) నల్లగాఁ బ్రకాశించు, మలిన=నలుపువన్నెగల్గిన, అశ్మన=శిలారూపమైన, యనగా శిలవలె కఠినమైన, ఛవి = కాంతిఁ గల్గిన, ఉడుపతేః=చంద్రునియొక్క, వక్షః=హృదయము, అశ్మం= బండతోఁ జేయఁబడినది, స్ఫుటం=స్పష్టము, యత్ = ఏలయనగా, అనయోః=తన ప్రియురాండ్రగు తారలయొక్కయు రాత్రియొక్కయు, విచ్ఛేదేఽపి=వియోగమందును, ద్రుతం=శీఘ్రముగా, న మృతం = పగిలిపోలేదు, బత=కష్టము, ప్రియురాండ్ర వియోగముచే చంద్రుడు గుండె పగిలి మరణింపవలసినది. అట్లు జరుగనందువలన నతని హృదయము బండవంటిది.

సమాసములు :

*ఉడుపరిషదః*—ఉడూనాం పరిషత్ = ఉడుపరిషత్, తస్యాః = ఉడు పరిషదః.
*అర్హత్వం*—అర్హతీతి = అర్హాన్తీ, అర్హాన్త్యాః భావః = అర్హత్వం.
*ఔచితీ*—ఉచితస్య భావః = ఔచితీ.
*గణేయరుచీగణః*—గణయితుం యోగ్యాః = గణేయాః, గణేయాశ్చ తాః రుచ్యశ్చ = గణేయరుచ్యః, గణేయరుచీనాం గణః యస్య సః = గణేయ రుచీగణః.
*ఉడుపతేః*—ఉడూనాం పతిః = ఉడుపతిః.
*ఆశ్మం*—అశ్మనః వికారః = ఆశ్మమ్.
*స్ఫురన్మలినాశ్మనచ్ఛవి*—అశ్మనః ఇయం = ఆశ్మనీ, ఆశ్మనీ చ సా ఛవిశ్చ = ఆశ్మనచ్ఛవిః, మలినా చ సా ఆశ్మనచ్ఛవిశ్చ = మలినాశ్మన చ్ఛవిః; స్ఫురన్తీ మలినాశ్మచ్ఛవిః యస్య తత్ = స్ఫురన్మలినాశ్మనచ్ఛవి.

భావము :

చంద్రుఁ డస్తమింపక మునుపే, తారల సంఘ మస్తమించుటయందును, రాత్రి గడచిపోవుట యందును నౌచిత్య మున్నది. చంద్రుఁ డస్తమింపఁబోవు నప్పు డతని కాంతి యంతయు తఱిగిపోయినది. కాన నతడు క్షీణమగుచున్న దశయం దున్నాడు. ఇట్టి దశయం దున్న భర్తను భార్యలగు తారలును రాత్రి యునుఁ జూడకయుండుట వారి భాగ్యము. భర్తయగు చంద్రు డస్తమింపక మునుపే భార్యలైన తారానిశ లస్తమించిరి. అందువలన వారు భర్తయగు చంద్రుని దుర్దశనుఁ జూడలేక పోయిరి. అందువలన వారు ధన్యులైరి. ఎవరు భర్త యొక్క వినాశమును వంశక్షయముఁ జూడరో వారు ధన్యులని స్మృతులు చెప్పుచున్నవి. కాని కుందేటిని కళంకముగా వహించుటచే నల్లనివన్నె గల్గి ఱాయివలె కఠినమగు కాంతిగల చంద్రుని హృదయము ఱాయివంటిది. కావుననే యది యతని ప్రియురాండ్రగు తారానిశలు నశించినను, వారివియోగముచే పగిలిపోక నిలిచియున్నది. అట్లు కానిచో నతని హృదయ మీ తరుణమున భగ్నమైపోవుట యుచితముగదా! ॥19॥

శ్లో॥ అరుణకిరణో వహ్నౌ లాజా నుడూని జుహోతి యా
పరిణయతి తాం సన్ధ్యా మేతా మవైమి మణి ర్దివః
ఇయమివ స ఏవాగ్నిభ్రాన్తిం కరోతి పురా యతః
కరమపి న క స్తస్యైవోత్కః సకౌతుక మీక్షితుమ్. 20

**ప.వి.** అరుణకిరణః-వహ్నౌ-లాజాన్ - ఉడూని-జుహోతి - యా - పరిణయతి-తాం-సన్ధ్యామ్-ఏతామ్-అవైమి-మణిః-దివః - ఇయమ్-ఇవ-సః - ఏవ-అగ్నిభ్రాన్తిం-కరోతి-పురా - యతః - కరమ్-అపి-న-కః-తస్య - ఏవ-ఉత్కః-సకౌతుకమ్-ఈక్షితుమ్.

**అర్థము:** యా=ఏ ప్రాతఃకాలపు సంధ్య, అరుణకిరణే; అరుణ=అనూరు వనెడి సూర్య సారథియొక్క, కిరణే=కిరణమనెడి, వహ్నౌ=అగ్నియందు, ఉడూని=నక్షత్రములనెడి, లాజాన్=పేలాలను, జుహోతి=ఆహుతులుగా నిచ్చుటవలన కానరానివానినిగాఁ జేయుచున్నాడు. (హోమమునుఁ గావించుచున్నది) ఉదయకాలపు వెలుగులచే నక్షత్రములు క్షీణమగుచున్నట్లును, శుభ్రముగా నున్నట్లునుఁ గానఁబడుచున్నందువలనఁ బేలాలతోఁ బోలిక సరిపడుచున్నది. తాం=ముందుఁ జెప్పబడిన, ఏతాం=ఈ కానఁబడుచున్న, సన్ధ్యాం=ప్రాతఃసంధ్యయను వధువును, దివః=ఆకాశమునకు, మణిః=రత్నమైన సూర్యుఁడు, పరిణయతి; పరి=అంతట, నయతి=కొనిపోవుచున్నాడు. (పెండ్లియాడుచున్నాడు) అని భావింతును, యతః=ఏలయనగా, ఇయమివ=ఈ సంధ్య యను పడుచువలె, సోఽపి=ఆ వరుడైన సూర్యుఁడును, పురా=ముందు (రాబోవు కాలమందు) (తొలుత సంధ్య, రాబోవు కాలమందు సూర్యుఁడని యర్థము) అగ్నిభ్రాన్తిం=ఎఱ్ఱగా నుండుటవలనఁ దనయెడ యగ్నియను భ్రాంతిని (లాజహోమమైన పిదప నగ్నినిఁ బ్రదక్షిణముగాఁ దిరుగుటను) కరోతి=చేయును (చేయఁబోవుచున్నాడు), ఒక పక్షమున, సంధ్యయు సూర్యుఁడును నగ్నియొక్క వర్ణమువంటి వర్ణమునుఁ గల్గి యుండుటవలన నుభయులును తమయెడ నట్టి భ్రాన్తిని కల్గింతురు. మఱియొక పక్షమున, మొదట కన్యయు, ఆమె వెనుక వరుడును నగ్నికిఁ బ్రదక్షిణముఁ

గావింతురని యర్థము. (కాన) క ఏవ జనః=ఏ జనము, సకౌతుకం=కుతూహలముతోఁ (కఙ్కణ సూత్రము తోడను) తస్య=ఆ వివాహ మాడునట్టి సూర్యునియొక్క, కరమపి=కిరణమును (హస్తమును), ఈక్షితుం=చూచుటకు. నైవ ఉత్కః=ఔత్సుక్యముగలవాడు గాడు. ఒక పక్షమున అరుణోదయకాలపు హోమములు మున్నగు నిత్యకర్మలనుఁ జేయుటకును, మఱియొక పక్షమున- మనస్సును వినోదపఱచుట కని యర్థము. కాన నందఱు నౌత్సుక్యము గల్గిన వారుగనే యుందురని యర్థము. అనగా నరుణోదయమైనది. నక్షత్రము లరుణుని కాంతియందు లీనములై పోయినవి. సంధ్యాకాల మేర్పడినది. ఇఁక సూర్యు డుద యింపఁ బోవుచున్నాడని యర్థము.

**సమాసములు :**

*అరుణకిరణే*- అరుణస్య కిరణః=అరుణకిరణః, తస్మిన్=అరుణకిరణే.
*అగ్నిభ్రాన్తిం*- అగ్నేః భ్రాన్తిః=అగ్నిభ్రాన్తిః, తాం=అగ్నిభ్రాన్తిం.
*సకౌతుకం*- కౌతుకేన సహితం యథా తథా=సకౌతుకం.

**భావము :**

ప్రాతస్సంధ్య యను కన్యక యరుణుని కిరణము లనెడి యగ్నియందు నక్షత్రము లనెడి లాజములను ననగా పేలాలను వ్రేల్చుచున్నది. అనగా నావిధముగా వ్రేల్చుటచే నానక్షత్రములను దృష్టిపథమునుండి దూరము చేయు చున్నదని యర్థము. అట్టి సంధ్యయను నీకన్యకను, వరుడైన సూర్యు డన్ని ప్రదేశములకునుఁ గొనిపోవుచున్నాడు (పరిణయమాడుచున్నాడు)అని భావింతును. ఏలయనగా, నీ సంధ్యాకన్యవలె యావరుడైన సూర్యుడును పూర్వమునందును, రాఁబోవుకాలమందును నెఱ్ఱగానుండుటవలన నగ్ని యను భ్రాన్తిని గల్గించుచున్నాడు ( అగ్నిచుట్టును ప్రదక్షిణము గావించుటను గల్గియున్నాడు). అనగా నీసంధ్యయు, సూర్యుడు నెఱ్ఱగా నుండుటవలనఁ జూపరుల కగ్నియను భ్రాన్తినిఁ గల్గించుచున్నారు. పక్షాంతరమున-నగ్నిభ్రాన్తిని వివాహకాలమునందుఁ దొలుత కన్యకయు వెనుక వరుడును నగ్నిని ప్రదక్షిణముగాఁ జుట్టుట చేయు

దురు. కావున నెవ్వడు కుతూహలముతోఁ బరిణయ మాడెడి యాసూర్యుని యొక్కయు కఙ్కణసూత్రముతోఁ గూడిన వరునియొక్కయు కిరణమును (హస్తమును) జూచుట కుత్కంఠగలవాడు కాడు? ఒక పక్షమున నరుణోదయ కాలమునఁ గావించెడి హోమాదులనుఁ జేయుటకును, మఱియొక పక్షమున, మనో వినోదమునకును నౌత్సుక్యముగలవాడుగాఁ గాడు? అనగా తప్పక యగునని యర్థము.

అనగా నరుణుని కిరణమనెడి యగ్నియందు ప్రాతస్సంధ్యయను కన్యక, సూర్యుఁ డనెడు వరుని వివాహమాడు సందర్భమున నక్షత్రము లనెడి పేలాలతో లాజహోమము గావించుచున్నది. అట్టి హోమమునందలి భస్మములై పోవుటవలన నదృశ్యములై పోయినవి. ఆ ప్రాతస్సంధ్యయను కన్యక నాసూర్యుఁడు పరిణయ మాడుచున్నాడు. పరి = అంతట, నయతి = కొనిపోవుచున్నాడని యర్థము. ఏలయనగా- ఈ సంధ్యాకన్యక యెట్లు పూర్వము తానెఱ్ఱగానుండుటవలన నగ్ని భ్రాంతినిఁ గల్గించినదో, యట్లే యీసూర్యుడును నెఱ్ఱగా నుండుటవలన భావి కాలమునందును నగ్నిభ్రాంతినిఁ గల్గింపఁగలడు. (వివాహ మగుచున్న యీ సందర్భమున పూర్వము సంధ్యాకన్యకయు వెనుక వరుడైన సూర్యుడును (అగ్నిభ్రమ) నగ్నియను భ్రాన్తిని నగ్నిచుట్టునుఁ బ్రదక్షిణముగాఁ దిరుగుట చేయుచున్నారు. కావున నెవ్వడు కుతూహలముతోకూడిన (కఙ్కణసూత్రముతోఁ గూడిన) కరమును (సూర్యకిరణమును, హస్తమును) జూచుట కౌత్సుక్యము గల్గియుండఁడు ?

శ్లో. రతిరతిపతిద్వైతశ్రీకౌ! ధురం బిభృమ స్తమాం
ప్రియవచసి య న్నగ్నాచార్యా వదామ స్తమాం తతః,
అపి విరచితో విఘ్నః పుణ్యద్రుహః కిల నర్మణః
పరుష మరుషే నైకస్యై వా ముదేతు ముదేఽపి తత్.

ప.వి. రతిరతిపతిద్వైతశ్రీకౌ-ధురం-బిభృమ స్తమాం-ప్రియవచసి-యత్-నగ్నాచార్యాః-వదామ స్తమాం-తతః-అపి-విరచితః-విఘ్నః - పుణ్యద్రుహః - కిల-నర్మణః-పరుషమ్-అరుషే-న-ఏకస్యై-వామ్-ఉదేతు-ముదే-అపి - తత్.

**అర్థము:** రతిరతిపతిద్వైతశ్రీకౌ; రతి=రతీదేవియు, రతిపతి=మన్మథుడు నను వీరియొక్క, ద్వైత=ద్వితీయత్వము గల్గినటువంటి, శ్రీకౌ=సౌంద ర్యముగల్గిన అనగా నట్టి రెండవ రతీమన్మథులారా! అనగా నట్టి దమయన్తీ నలులారా! ప్రియవచసి=స్తోత్రరచనమునందు, ధురం= భారమును, బిభృమ స్తమాం=చక్కగా వహింతుము. మిమ్ములను సంతోష పఱచెడి మాటలనుఁ జెప్పుటకే మేము నియమింపఁబడితి మని యర్థము. తథాపి=అయినను, యత్=ఎందువలన, నగ్నాచార్యాః; నగ్న= వందులకు అనగా స్తుతిపాఠకులకు, ఆచార్యాః = ఉపదేశముఁజేయు గురువులమైన మేము, తతః=అందువలన, వదామ స్తమాం=లెస్సగా చెప్పుచున్నాము. ఔచిత్యము ననుసరించి ప్రియము గాకపోయినను హితమునుఁ జెప్పుచున్నాము. పుణ్యద్రుహః = సన్ధ్యాదేవతార్చనాది పుణ్యకార్యములకు భంగము గల్గించునట్టి, నర్మణః=మీ యిరువురి సుఖ విహారమునకు, విఘ్నః=విఘ్నము, అపి విరచితః = చేయఁబడినదే యగుచున్నది, అతః = ఇందువలన, తత్=అటువంటి, పరుషం = సుఖ విహారమునకు భంగము గల్గించెడి కఠినవచనమును, వాం = మీ యిరువురిలో, ఏకస్యై=ఒక్కతెయగు దమయన్తికి, అరుషే= రోషము లేక యుండుటకై, న ఉదేతి=ఏర్పడదు, ఆ దమయంతి దీక్ష స్వీకరింపనందువలన సంధ్యాదులు చేయ నవసరము లేనందువలన నామెకు మాత్రము మా మాట కోపమునే గలిగించును, ముదేఽపి = సంతోషముకొఱకు ననగా - సంధ్యాపూజాదులకుఁ బ్రేరకమైయుండుట వలన సంతోషముకొఱకును మామాట కారణముగా, ఉదేతు = అగునుఁగాత. అప్రియముగానున్నను హితమునే చెప్పవలయునని యాశయము.

**సమాసములు :**

*రతిరతిపతిద్వైతశ్రీకౌ - రతిశ్చ రతిపతిశ్చ = రతిరతిపతీ, రతి రతిపత్యోః ద్వైతం యస్యాం సా = రతిరతిపతిద్వైతా, రతిరతిపతి ద్వైతా శ్రీః యయో స్తౌ=రతిరతిపతిద్వైత శ్రీకౌ !*

బిభ్రమ స్తమాం- అతిశయేన బిభ్రమః=బిభ్రమ స్తమాం.
ప్రియవచసి - ప్రియం చ తత్ వచశ్చ = ప్రియవచః, తస్మిన్= ప్రియవచసి.
నగ్నాఽఽచార్యాః- నగ్నానా మాచార్యాః = నగ్నాచార్యాః.
పుణ్యద్రుహః- పుణ్యాయ ద్రుహ్యతీతి = పుణ్యద్రుట్, తస్య = పుణ్యద్రుహః.

భావము ;

రతీదేవికిని కామదేవునకు రెండవస్థానము నాశ్రయించిన సౌందర్యముగల యో దమయన్తీనలులారా ! మీకు ప్రియమగు వచనమునుఁ జెప్పవలసిన భారమును నెక్కువగా మేము వహించుచున్నాము. అయినను మేము స్తుతిపాఠకులకు గురువులమై యుండుటవలన నౌచిత్యము ననుసరించి మీకు, ప్రియము కాకపోయినను హితమునే యెక్కువగా వచింతుము. దమయన్తీ నలులైన మీ యిఱువురి యొక్క సుఖ విహారములు, సంధ్యా దేవపూజాది పుణ్యములకు భంగమునుఁ గల్గించుచున్నవి. అట్టి పుణ్య విఘాతకములగు మీ సుఖ విహారములకు మా వచనములు భంగకరములు కాన మిక్కిలి కఠినములు. మీ యిఱువురిలోను దమయన్తికి మావచనములు క్రోధ హేతువులు. ఏలయనగా, నామె కర్మదీక్షనుఁ బొందనందువలన నామెకు సంధ్యా పూజాది ప్రసక్తి లేదు. సన్ధ్యా దేవపూజలు చేయవలసిన నీకుఁ బ్రేరకములుగా ననగా నలుఁడవైన నీకు ప్రేరకములు గాన నీకు సంతోషదాయకములు కాన నప్రియమైనను హితముగాన మేము చెప్పెదము ॥21॥

శ్లో. భవ లఘు యుతాకాన్తః సంధ్యా ముపాస్య తపోమయ
త్వరయతి కథం సంధ్యేయం త్వాం ననామ నిశానుజా?
ద్యుతిపతి రథావశ్యజ్యాకారీ దినోదయ మాసితా
హరిపతి హరిత్పూర్ణ భ్రూణాయితః కియతః క్షణమ్॥ 22

ప. వి. భవ- లఘుయుతాకాన్తః- సంధ్యామ్- ఉపాస్య- తపోమయ-త్వరయతి- కథం- సంధ్యా - ఇయం - త్వాం-ననామ- నిశానుజా - ద్యుతిపతిః- అథ- ఆవశ్యజ్కారీ- దినోదయమ్- అసితా - హరిహరిత్పూర్ణ భ్రూణాయితః- కియతః- క్షణమ్.

అర్థము :- హే తపోమయ = ఓ తపోనిష్ఠ గల్గిన మహారాజా! (కావుననే విధింపఁబడిన సమయమునందు సంధ్యాద్యనుష్ఠానమునందు శ్రద్ధను వహింపుమని యర్థము), లఘు = శీఘ్రముగా, లఘు యుతాకాన్తః, లఘు=శీఘ్రముగా, యుత = వియుక్తమైన, కాన్తః = ప్రియురాలిని గల్గిన వాడవుగా, భవ=కమ్ము, సన్ధ్యాం= ప్రాతస్సన్ధ్యను, ఉపాస్వ= ఉపాసించుము, ఇయం = ఈ సమీపించినట్టి, నిశానుజా = రాత్రికిఁ దర్వాతిదైన ప్రాతస్సంధ్య, త్వాం = నిన్ను, కథం నామ=ఎట్లు, న త్వరయతి= తొందర పెట్టదు. (సంధ్యోపాసన కెట్లు త్వర పెట్టదని యర్థము) యతః=ఎందువలన, అథ = వెంటనే, దినోదయం=దినము యొక్క ప్రారంభమును, ఆవశ్యజ్కారీ= తప్పక చేయనున్న, హరిపతి హరి త్పూర్ణ భ్రూణాయితః — హరిపతి = ఇంద్రుడనే భర్తగాఁ గల్గిన, హరిత్ = తూర్పునకు, పూర్ణభ్రూణాయితః – పూర్ణభ్రూణ= నిండుగర్భముగా, ఆయితః=ఆచరించినట్టి, ద్యుతిపతిః = సూర్యుడు, కియతః = ఎన్ని, క్షణాన్=క్షణములు, ఆసితా= ఉండగలడు-ఒక క్షణము గూడా నుండలేడని యర్థము. శీఘ్రముగనే సూర్యుడు దయించును కాన సూర్యోదయమునకు మునుపే సంధ్య నుపాసించుటకు లెమ్మని యర్థము.

సమాసములు :

లఘుయుతాకాన్తః—లఘు యుతా కాన్తా యస్య సః=లఘుయుతాకాన్తః
నిశానుజా—నిశాయాః అనుజా=నిశానుజా
ద్యుతిపతిః—ద్యుతీనాం పతిః=ద్యుతిపతిః
అవశ్యజ్కారీ-అవశ్యం కరిష్యతీ త్యవశ్యజ్కారీ
దినోదయమ్-దినస్య ఉదయః=దినోదయః, తమ్=దినోదయం.

హరిపతి హరిత్పూర్ణ భ్రూణాయితః-హరిః పతిః యస్యాః సా=హరి పతిః. హరిపతి శ్చాసౌ హరిచ్చ = హరిపతిహరిత్, పూర్ణ శ్చాసౌ భ్రూణశ్చ = పూర్ణభ్రూణః, హరిపతిహరితః పూర్ణభ్రూణ ఇవ ఆచ రితః=హరిపతిహరిత్పూర్ణభ్రూణాయితః.

**భావము :**

తపోనిష్ఠగల యో నలమహారాజా! నీవు విహితకాలమునందు సంధ్యో పాసనాది ధర్మము నాచరించెడివాడవు కాన శీఘ్రముగా ప్రియురాలి యెడబాపుఁ బొందుము. ప్రాతస్సంధ్య నాచరింపుము. ఈ సమీపించునట్టి ప్రాతస్సంధ్య నిన్నేల త్వరపెట్టదు ? ఏలయనగా, వెంటనే, దినము ప్రారంభించెడి సూర్యుడు తూర్పు దిక్కనెడి స్త్రీకి పూర్ణ గర్భముగా నాచరించుచున్నవాడై శీఘ్రముగా వచ్చుచున్నాడు. కాన నా సూర్యోదయమున కంటెఁ బూర్వము సంధ్యోపాసనకై శీఘ్రముగా లెమ్మని యర్థము. ॥22॥

శ్లో. ముషితమనస శ్చిత్రం భైమి! త్వయాఽద్య కలాగృహై
ర్నిషధవసుధానాథస్యాఽపి శ్లథశ్లథతా విధోః,
అజగణదయం సన్ధ్యాం వన్ధ్యాం విధాయ న దూషణం
నమసితు మనా యన్నామ స్యా న్న సమ్ప్రతి పూషణమ్. 23

ప. వి. ముషితమనసః-చిత్రం-భైమి-త్వయా-అద్య-కలాగృహైః- నిషధవసుధా నాథస్య - అపి - శ్లథశ్లథతా-విధోః-అజగణత్ -అయం-సన్ధ్యాం-వన్ధ్యాం విధాయ - న - దూషణమ్ - నమసితుమనాః-యత్ - నామ-స్యాత్-న- సమ్ప్రతి-పూషణమ్.

అర్థము: హే భైమి=ఓ దమయన్తీ! అద్య = నేడు, కలాగృహైః, కలా= ముద్దిడుకొనుట, కౌగలించుకొనుట మున్నగు కామక్రీడలకు, గృహైః= నెలవైన; త్వయా= నీచే, ముషితమనసం, ముషిత = అపహరింపఁ బడిన, మనసః=మనస్సుగల్గిన, నిషధ వసుధా నాథస్యాపి = నిషధ దేశప్రభులైన నల మహారాజునకును ననగా పరమధార్మికునకును,

విధౌ = వేదవిహితములగు సంధ్యోపాసన మున్నగు నిత్యకర్మల ననుష్ఠించు విషయమున, శ్లథశ్లథతా = మిక్కిలి శైథిల్యము, చిత్రం = ఆశ్చర్యకర మైనది. యత్ = ఏలయనగా, అయం = ఈ నలుఁడు, సమ్ప్రతి = ఇప్పుడు (అనగా నింతకు పూర్వము కాదని యర్థము) సన్ధ్యాం = ప్రాతః కాలపు పూజను, వన్ధ్యాం = వ్యర్థముగా, విధాయ = చేసి, దూషణం = దానివలని దోషమును, న అజగణత్ = లెక్కింపలేదు. తథా = అట్లే, పూషణం = వెంటనే యుదయింపనున్న సూర్యుని, నమసితుమనాః = నమస్కరింపఁ గోరిక గలవాడుగను, న స్యాన్నామ = కాకను పోవచ్చును.

**సమాసములు :**

*ముషితమనసః*-ముషితం మనః యస్య సః = ముషితమనాః, తస్య = ముషితమనసః.

*కలాగృహైః*-కలానాం గృహాః = కలాగృహాః, తైః = కలాగృహైః

*నిషధ వసుధానాథస్య*-నిషధానాం వసుధా = నిషధవసుధా, నిషధవసుధాయాః నాథః = నిషధవసుధానాథ, తస్య = నిషధవసుధానాథస్య.

*శ్లథశ్లథతా*-అతిశయేన శ్లథః = శ్లథశ్లథః, శ్లథశ్లథస్య భావః = శ్లథశ్లథతా.

*నమసితుమనాః*-నమసితుం మనః య స్యసః = నమసితుమనాః.

**భావము :**

ఓ దమయన్తీ! నేడు, ముద్దిడుకొనుట, కౌగలించుకొనుట మున్నగు కామ కలలకు స్థానమైన నీవు తన చిత్తము నపహరించుటవలనఁ బరమ ధార్మికుడుగా నుండి నప్పటికిని, ఆ నలమహారాజునకు, వేదవిహితములగు సంధ్యోపాసనాది కర్మల ననుష్ఠించు విషయమున శ్రద్ధ మిక్కిలి తగ్గిపోయినది. ఇది యాశ్చర్య కరము. ఏల యనగా-నీనలమహారాజు ఇప్పుడు ప్రాతఃకాలిక సంధ్యోపాసననుఁ గావింపక దానివలని దోషమును సైతము లెక్కించుట లేదు. అట్లే వెంటనే యుదయింపఁబోవు సూర్యభగవానుని సైతము నమస్కరింపఁ గోరికను వహింపక పోవచ్చును. ॥౨౪॥

శ్లో. న విదుషితరా కాఽపి త్వత్త స్తతో నియతక్రియా
పతనదురితే హేతు ర్భర్తు ర్మనస్విని! మా స్మ భూః!
అనిశభవదత్యాగా దేనం జనః ఖలు కాముకీ
సుభగ మభిధాస్య త్యుద్దామాఽపరాజ్ఞ్యవదావదః. 24

ప. వి. న-విదుషితరా-కా - అపి - త్వత్తః - తతః - నియతక్రియాపతనదురితే-హేతుః-భర్తుః-మనస్విని-మా-స్మ-భూః- అనిశభవదత్యాగాత్ - ఏనం-జనః-ఖలు-కాముకీసుభగమ్- అభిధాస్యతి-ఉద్దామా-అపరాజ్ఞ్యవదావదః.

అర్థము: మనస్విని = ఓ పరిశుద్ధ హృదయురాలా ! (కావుననే నీవు భర్తను, విహితకర్మల ననుష్ఠింపనందువలని పాపమునుండి రక్షింతువని యర్థము) త్వత్తః=నీకంటె, విదుషితరా=గొప్ప విద్వాంసురాలు, కాఽపి= ఒక్కతెయు, న=లేదు, తతః=అందువలన, భర్తుః=భర్తకు, నియతక్రియాపతనదురితే; నియతక్రియా=సంధ్యాదినిత్యకర్మలయొక్క, పతన=భ్రంశమువలని, దురితే=పాపము విషయమున, హేతుః= కారణముగా, మా స్మ భూః=కావలదు, తథాహి=అది యుక్తమే, ఉద్దామా = విశృంఖలమైన యనగా నడ్డులేని, అపరాజ్ఞ్యవదావదః; అపర=ఒరులపై, అజ్ఞ్య=అపవాదమును, వదావదః=అతిశయించి చెప్పుచున్న, జనః=జనము, ఖలు=నిశ్చితముగా, అనిశభవదత్యాగాత్; అనిశ=ఎల్లప్పుడు, భవత్=నిన్ను, అత్యాగాత్=వదలిపెట్టనందువలన, ఏనం=ఈ నలుని, కాముకీసుభగం; కాముకీ=పురుషునిఁ గోరెడి స్త్రీకి, సుభగం=ప్రియమైనవానినిగా, అభిధాస్యతి=చెప్పఁగలదు. అనగా నీ నలుని స్త్రీలోలునిగాఁ జెప్పగలదు. కాన, క్షణకాలము వానిని వదిలి పెట్టుము.

సమాసములు :

విదుషితరా—అతిశయేన విదుషీ= విదుషితరా.

*నియతక్రియాపతనదురితే*–నియతా చ సా క్రియా చ = నియతక్రియా, నియతక్రియాయాః పతనం = నియతక్రియాపతనం, నియతక్రియాపతనాత్ దురితం = నియతక్రియాపతనదురితం, తస్మిన్ = నియతక్రియా పతనదురితే.

*అనిశభవదత్యాగాత్*–భవత్యాః అత్యాగః = భవదత్యాగః, అనిశం భవదత్యాగః = అనిశభవదత్యాగః; తస్మాత్ = అనిశభవదత్యాగాత్.

**కాముకీసుభగం**–కాముక్యాః సుభగః = కాముకీసుభగః, తం = కాముకీ సుభగమ్.

*ఉద్దామా*–ఉద్గతం దామ యస్య సః = ఉద్దామా.

*అపరాజ్ఞవదావదః* – అపరేషు అజ్ఞః = అపరాజ్ఞః, అతిశయేన వదతీతి = వదావదః, అపరాజ్ఞస్య వదావదః = అపరాజ్ఞవదావదః.

**భావము :**

ఓ పరిశుద్ధహృదయురాలవగు దమయన్తీ! నిన్ను మించిన గొప్ప విద్వాంసురాలు మఱియొక్కతె లేదు. కావున భర్తను, సంధ్యోపాసనాది నిత్య కర్మల ననుష్ఠింపనందువలనఁ గల్గెడి పాపమునకు కారణము కాక యుండుము. ఇది యుక్తమైన విషయము. ఏలయనగా-విశృఙ్ఖలమై యొరులపై నపవాదము లను వైచెడి జనము, ఆ నలుడు నిరంతరము నిన్ను వీడనందువలన నతనిని స్త్రీలోలునిగాఁ జెప్పఁగలరు. కాన వీని నొక క్షణము వదలిపెట్టుము. ॥24॥

శ్లో. రహ సహచరీ మేతాం రాజన్నపి శ్రితరాం క్షణం
తరణికిరణైః స్తోకోన్ముక్తైః సమాలభతే నభః
ఉదధినిరయద్భాస్వత్స్వర్ణోదకుమ్భ దిదృక్షుతాం
దధతి నలినం ప్రస్థాయిన్యః శ్రియః కుముదా న్ముదా. 25

ప. వి. రహ-సహచరీమ్-ఏతాం-రాజన్-అపి-శ్రితరామ్-క్షణం-తరణికిరణైః-స్తోకోన్ముక్తైః-సమాలభతే - నభః - ఉదధినిరయద్భాస్వత్స్వర్ణోదకుమ్భ దిదృక్షుతాం-దధతి-నలినం-ప్రస్థాయిన్యః-శ్రియః-కుముదాత్-ముదా.

అర్థము: హే రాజన్ = ఓ రాజా; స్త్రీతరామపి = ఉత్తమస్త్రీయైనను, సహచరీం = సహచరియగు, ఏతాం = ఈమెను, క్షణం = కొంచెముకాలము, రహ = వదలుము, నభః = ఆకసము, స్తోకోన్ముక్తైః; స్తోక = కొంచెము, ఉన్ముక్తైః = ప్రకటితములైన, తరణికిరణైః = సూర్యకిరణములచే, సమాలభతే = కుంకుమ పుష్పముతో నెట్లో యట్లు తన్నలదుకొనుచున్నది. కిఞ్చ = మఱియు, కుముదాత్ = కలువనుండి, నలినం = తామరపూవును(గూర్చి, ప్రస్థాయిన్యః = బయలుదేరుచున్న, శ్రియః = శోభలు (ఉదయకాలమందు కలువపూలు ముడుచుకొనుటవలన నందలి శోభ లప్పుడే వికసించుచున్న పద్మములకుఁ (బోయినట్లుండుదును) ముదా = సంతోషముతో, ఉదధినిరయద్భాస్వత్స్వర్ణోదకుంభదిదృక్షుతాం; ఉదధి = సముద్రము నుండి, నిరయత్ = వెలుపలికి వచ్చుచున్న, భాస్వత్ = సూర్యు డనెడి, స్వర్ణోద కుంభ = పసిడి నీటిపంటిని, దిదృక్షుతాం = చూడఁగోరి యుండుటను, దధతి = దాల్చుచున్నవి. ప్రయాణకాలమందు పూర్ణకుంభదర్శనము మంగళకరమని యర్థము.

**సమాసములు :**

సహచరీం - సహ చరతీతి = సహచరీ, తాం = సహచరీం.
స్త్రీతరామ్ - ఉత్కృష్టా స్త్రీ = స్త్రీతరా, తాం = స్త్రీతరామ్.
తరణికిరణైః - తరణేః కిరణాః = తరణికిరణాః, తైః = తరణికిరణైః.
స్తోకోన్ముక్తైః - స్తోక మున్ముక్తాః = స్తోకోన్ముక్తాః, తైః = స్తోకోన్ముక్తైః.
ఉదధినిరయద్భాస్వత్స్వర్ణోదకుమ్భ దిదృక్షుతాం - ఉదధేః నిరయన్ = ఉదధినిరయన్, ఉదధినిరయం శ్చాసౌ భాస్వాంశ్చ = ఉదధినిరయద్భాస్వాన్, ఉదకస్య కుమ్భః = ఉదకుమ్భః, స్వర్ణమయ శ్చాసౌ ఉద కుమ్భశ్చ = స్వర్ణోదకుంభః, ఉదధినిరయద్భాస్వా నేవ స్వర్ణోదకుంభః = ఉదధినిరయద్భాస్వత్స్వర్ణోదకుంభః, ద్రష్టు మిచ్ఛవః = దిదృక్షవః, ఉదధినిరయద్భాస్వత్స్వర్ణోదకుంభం దిదృక్షవః = ఉదధినిరయద్భాస్వత్స్వర్ణోదకుంభ దిదృక్షవః, ఉదధినిరయద్భాస్వత్స్వర్ణోదకుంభ దిదృక్షూణాం భావః = ఉదధినిరయద్భాస్వత్స్వర్ణోదకుంభ దిదృక్షుతా, తామ్ = ఉదధినిరయద్భాస్వత్స్వర్ణోదకుమ్భ దిదృక్షుతామ్.

భావము :

ఓ రాజా! నీ ప్రియురాలగు దమయన్తి యుత్తమజాతికిఁ జెందినదైనను క్షణకాలము విడచిపెట్టుము. అట్లు చేసినచో నీవు నీ సంధ్యోపాసనాది నిత్యకృత్యములనుఁ జేసికొనగలవు. ఆకసము కొద్దికొద్దిగా వెలువడుచున్న సూర్యకిరణములచే కుంకుమపూవుతో నలదుకొనునట్లు తన్నలదుకొనుచున్నది. మఱియు కలువపూలనుండి శోభలు పద్మములవంకకు బయలుదేరుచున్నవి. అనగా నుదయకాలమందు కలువలు ముకుళించుటచేతను పద్మములు వికసించుటచేతను కలువల శోభలు పద్మము నుద్దేశించి వెళ్లుచున్నట్లున్నవై, సముద్రమునుండి వెల్వడు సూర్యుఁడనెడి పసిడినీటికుండను చూడగోరిక గల్గియున్నవి. అనగా నప్పుడే సూర్యుడు నుదయించుటవలన కలువలశోభలు పద్మములవైపునకు బయలుదేరి, ప్రయాణకాలమందు ఉదయసూర్య దనెడి జలపూర్ణస్వర్ణకలశములను శుభశకున మను భావనతోఁ జూడఁగోరుచున్నవని యాశయము. ॥25॥

శ్లో. ప్రథమకకుభః పాన్థత్వేన స్ఫుటేక్షితవృత్రహా
ణ్యనుపద మిహ ద్రక్ష్యన్తి త్వాం మహాంసి మహఃపతేః,
పటిమవహనా దూహాపోహక్షమాణి వితన్వతా
మహహ! యువయో స్తావ ల్లక్ష్మీవివేచనచాతురీమ్. 26

ప. వి. ప్రథమకకుభః- పాన్థత్వేన- స్ఫుటేక్షితవృత్రహాణి- అనుపదమ్- ఇహ- ద్రక్ష్యన్తి- త్వాం- మహాంసి- మహఃపతేః- పటిమవహనాత్- ఊహాపోహక్షమాణి- వితన్వతాం- అహహ- యువయోః- తావత్- లక్ష్మీవివేచనచాతురీమ్.

అర్థము: మహఃపతేః, మహః = వెలుగులకు, పతేః = ప్రభువైన సూర్యుని యొక్క, మహాంసి = వెలుగులు, ప్రథమకకుభః = మొదటిదిక్కైన తూర్పునకు, పాన్థత్వేన = ఎల్లకాలపు బాటసారియగుటచే, స్ఫుటేక్షితవృత్రహాణి, స్ఫుట = స్పష్టముగాఁ జూపఁబడిన, వృత్రహాణి = ఇంద్రుని గల్గినవియు, అనుపదం = ఇంద్రుఁడు జూచినవెంటనే, ఇహ = ఈ ప్రదేశమందు, త్వాం = నలుడైన నిన్ను, ద్రక్ష్యన్తి = చూడగలవు, పటిమవహనాత్, పటిమ = తీక్ష్ణత్వమును, వహనాత్ = వహించుటవలన,

పశ్చాత్తరమున, పటిమ = చాతుర్యమును అనగా నిశితమైన ప్రజ్ఞను, వహనాత్=వహించుటవలన, ఊహాపోహక్షమాణి; ఊహ = ఊహాలో సరియైన విషయములను గ్రహించుట, అపోహ=సరికాని విషయములను బరిత్యజించుట యను కార్యములందు, క్షమాణి=శక్తిగల్గిన, తాని=ఆ, మహాంసి = వెలుగులు, యువయోః = ఆ యింద్రునకును, నీకును, లక్ష్మీవివేచన చాతురీం; లక్ష్మీ = శోభయొక్క, వివేచన=తారతమ్య విచారణయందలి, చాతురీం=నేర్పును, తావత్ =సంపూర్ణముగా, వితన్వతాం=విస్తరింపఁజేయును గాత, అహహ =ఆశ్చర్యము.

**సమాసములు:**

*ప్రథమకకుభః* - ప్రథమా చ సా కకుప్చ=ప్రథమకకుప్, తస్యాః= ప్రథమకకుభః.

*పాన్థత్వేన* - పన్థానం గచ్ఛతీతి=పాన్థః, పాన్థస్య భావః=పాన్థత్వం, తేన=పాన్థత్వేన.

*స్ఫుటేక్షితవృత్రహాణి* - స్ఫుట మీక్షితః=స్ఫుటేక్షితః, స్ఫుటేక్షితః వృత్రహా యై స్తాని=స్ఫుటేక్షితవృత్రహాణి.

*మహఃపతేః* - మహసాం పతిః=మహఃపతిః, తస్య=మహః పతేః.

*పటిమవహనాత్* - పటిమ్నః వహనం=పటిమవహనం, తస్మాత్ = పటిమవహనాత్.

*ఊహాపోహక్షమాణి* - ఊహశ్చ అపోహశ్చ=ఊహాపోహౌ, ఊహాపోహయోః క్షమాణి=ఊహాపోహక్షమాణి.

*లక్ష్మీవివేచనచాతురీం* - లక్ష్మ్యాః వివేచనం=లక్ష్మీవివేచనం, లక్ష్మీ వివేచనే చాతురీ=లక్ష్మీవివేచన చాతురీ, తాం=లక్ష్మీవివేచన చాతురీం.

**భావము :**

సూర్యునివెలుగులు మొదటిదిక్కైన తూర్పున సంచరించుటచే నింద్రునివలనఁ జక్కగా చూడఁబడినవై, పిదప నీభూమియందు సంచరించుటవలన ననగా వ్యాపించుటవలన నలుడివైన నిన్నునుఁ జూడగలవు. ఆ వెలుగులు,

తీక్ష్ణత్వమునుఁ (నిశితమైన ప్రజ్ఞను) వహించుటవలన శ్రేష్ఠమైన వస్తువును, శ్రేష్ఠముకాని వస్తువును, వివేచించి యందు శ్రేష్ఠమైన వస్తువును పరిగ్రహించుట యందును, శ్రేష్ఠముకాని వస్తువునుఁ బరిత్యజించుటయందును శక్తి గల్గినవి. కాన నావెలుగులు మీయొక్క యనగా నింద్రుని యొక్కయు, నలునియొక్కయు శోభాతారతమ్యమును విచారించుటయందలి నేర్పును పూర్తిగా విస్తరింపఁ జేయునుఁ గాత. ॥26॥

శ్లో. అనతిశిథిలే పుమ్భావేన ప్రగల్భబలాః ఖలు
ప్రసభమలయః పాథోజాస్యే నివిశ్య నిరిత్వరాః,
కిమపి ముఖతః కృత్వాఽఽనీతం వితీర్య సరోజినీ
మధురస ముషోయోగే జాయాం నవాన్న మచీకరన్. 27

ప. వి. అనతిశిథిలే - పుమ్భావేన - ప్రగల్భబలాః - ఖలు - ప్రసభమ్-అలయః-పాథోజాస్యే-నివిశ్య-నిరిత్వరాః-కమ్-అపి- ముఖతః- కృత్వా- ఆనీతం-వితీర్య-సరోజినీమధురసమ్-ఉషోయోగే-జాయాం-నవాన్నమ్-అచీకరన్.

అర్థము : పుమ్భావేన = పుంస్త్వము అనగా మగతనమనెడి కారణముచే, ప్రగల్భబలాః = పెంటి తుమ్మెదలకంటెను నధికబలముగల, అలయః = తుమ్మెదలు, అనతిశిథిలే = కొంచెము వికసించిన, పాథోజాస్యే; పాథోజ = పద్మముయొక్క, ఆస్యే = ముఖమునందు, అనగా పైభాగమునందు, ప్రసభం = బలవంతముగా, నివిశ్య = నెలకొని, నిరిత్వరాః = వెడలివచ్చుచున్నవై, ముఖతః = ముఖమువలన ననగా ముఖమునందు ధరించి, ఆనీతం = తేఁబడిన, సరోజినీమధురసం; సరోజినీ = తామరయొక్క, మధురసం = మకరన్దరసమును, వితీర్య = ఇచ్చి, ఉషోయోగే = ప్రాతఃకాలమునందు, జాయాం = తన ప్రియురాలగు పెంటితుమ్మెదను, కిమపి = అనిర్వాచ్యమగు రుచిగల్గిన, నవాన్నం = నూతనాహారమును, అచీకరన్ = చేయించినవి అనగా భుజింపఁజేసినవని యర్థము. అనగా బలవంతుఁడగు పురుషుఁడు మఱియొక స్త్రీయొక్క నోటనున్న యిష్టమైన యాహారమును లాగి తన ప్రియురాలికిచ్చునని యర్థము.

సమాసములు :

*అనతిశిథిలే* - అత్యన్తం శిథిలం=అతిశిథిలం, న అతిశిథిలమ్= అనతి శిథిలమ్, తస్మిన్=అనతిశిథిలే.
*పుమ్భావేన* - పుంసః భావః=పుమ్భావః, తేన=పుమ్భావేన.
*ప్రగల్భబలాః* - ప్రగల్భం బలం యేషాం తే=ప్రగల్భబలాః.
*పాథోజాస్యే* - పాథసి జాయత ఇతి = పాథోజం, పాథోజస్య ఆస్యం=పాథోజాస్యం, తస్మిన్=పాథోజాస్యే.
*నిరిత్వరాః* - నిష్క్రమ్య యన్తీతి=నిరిత్వరాః.
*సరోజినీమధురసం* - సరోజిన్యాః మధురసః = సరోజినీమధురసః, తం=సరోజినీమధురసం.
*ఉషోయోగే* - ఉషసః యోగః=ఉషోయోగః, తస్మిన్=ఉషోయోగే.
*నవాన్నం* - నవం చ తత్ అన్నం చ=నవాన్నం, తత్=నవాన్నం.

భావము :

మగతనమువలనఁ దుమ్మెదలలోని స్త్రీ జాతులకంటె నధికబలము గల్గిన తుమ్మెదలు కొలదిగా వికసించిన పద్మముయొక్క ముఖమునందు (పై భాగమునందు) బలవంతముగాఁ గూర్చుండి వెలుపలికి వచ్చుచున్నవై, నోటఁ బట్టుకొని వచ్చునట్టి తామరపూవులయొక్క తియ్యని మకరన్దరసము నొసంగి, ప్రాతఃకాలమునందు, తమ ప్రియురాలగు నాడు తుమ్మెదను నెప్పుడునుఁ జవి చూడనట్టి మిక్కిలి చవిగల్గిన మధురమగు నూతనాహారమునుఁ దినిపించినవి. ॥27॥

శ్లో. మిహిరకిరణాభోగం భోక్తుం ప్రవృత్తతయా పురః
కలితచులుకాపోశానస్య గ్రహార్థ మియం కిము ?
ఇతి వికసితే నైకేన ప్రాగ్దలేన సరోజినీ
జనయతి మతిం సాక్షాత్కర్తుర్జనస్య దినోదయే. 28

ప. వి. మిహిరకిరణాభోగం- భోక్తుం- ప్రవృత్తతయా- పురః- కలితచులుకాపోశానస్య-గ్రహార్థమ్-ఇయం-కిమ్- ఉ- ఇతి- వికసితేన- ఏకేన-ప్రాగ్దలేన-సరోజినీ-జనయతి-మతిం-సాక్షాత్కర్తుః-జనస్య-దినోదయే.

అర్థము: ఇయం=కొలదిగా వికసించిన, సరోజినీ=తామరతీగె, దినోదయే=ఉదయకాలమునందు, ప్రాక్ = మఱియొక దలము వికసించుట కంటె పూర్వము, వికసితేన=వికసించిన, ఏకేన=ఒక, దలేన=దలముచే, అనగా కలసియున్న మఱియొక దలముచే, మిహిరకిరణాభోగం = మిహిరకిరణ=సూర్యరశ్మి యనెడి, ఆభోగం=భోజ్యమైన యాహారమును, భోక్తుం = తినుటకై, ప్రవృత్తతయా = ప్రారంభించుటచే, పురః = ఆ భోజనమున కంటె ముందు, అపోశానస్య=అపోశనమునకు అనగా-భోజన ప్రారంభమున- ''అమృతోప స్తరణమసి స్వాహా'' యను మన్త్రముతో జలమునుఁ బానము గావించి యన్నమునకుఁ గావించెడి యమృతాస్తరణ రూపకార్యమును, గ్రహార్థం=చేయుటకు, కలితచులుకా, కలిత=చేయఁబడిన, చులుకా=చిటికెన ప్రేలిని వదిలి తక్కిన ప్రేళ్లతో నరచేతిని గుంటగాఁజేసి పెట్టుకొనుటను గల్గినదిగా, కిము=(అయినదా) యేమి?, ఇతి=ఇట్లు, సాక్షాత్కర్తుః=చూచునట్టి, జనస్య=జనమునకు, మతిం=బుద్ధిని, జనయతి = కల్గించుచున్నది, అపోశనమునుఁ బట్టెడి వ్యక్తి, చేతి చిటికెన ప్రేలినిఁ జాపి, తక్కిన ప్రేళ్లను ముడిచి యరచేత జలముఁ ద్రాగుట సంప్రదాయము. తొలుత వికసించిన యాకు విడిపోయిన చిటికెన ప్రేలికి సమానముగా నుండుట చేతను, పద్మము చాపిన యఱచేయివలె నుండుటచేతను, పోలిక సరిపడుచున్నది.

సమాసములు :

*మిహిరకిరణాభోగం* - మిహిరస్య కిరణాః, మిహిరకిరణాః, ఆభుజ్యత ఇతి=ఆభోగః, మిహిరకిరణ ఏవ ఆభోగః= మిహిరకిరణాభోగః, తం=మిహిరకిరణాభోగం.

*కలితచులుకా*-కలితం చులుకం యస్యా సా=కలితచులుకా.

*గ్రహార్థం*-గ్రహాయ=గ్రహార్థం.

*దినోదయే*-దినస్య ఉదయః=దినోదయః, తస్మిన్=దినోదయే.

భావము :

కొలదిగా వికసించిన యీ తామరతీగె నేటి యుదయమున, తొలుత వికసించిన యనగాఁ దొలుత విడిపోయిన యొక యాకుచే, సూర్యరశ్మి యను నాహారమునుఁ దినుటకుఁ బ్రారంభించుటచే, భోజనమునకు పూర్వము, ప్రారంభమునఁ జేయవలసిన యాపోశనమునకు ననగా సమన్త్రిక జలపానమునకు నరచేతినిఁ జాపినదో యనునట్లు చూచుజనమునకు బుద్ధిని గల్గించుచున్నది. ॥28॥

శ్లో. తటరుహఖగశ్రేణీ సాంరావిణైరివ సాంప్రతం
సరసి విగలన్నిద్రాముద్రాఽజనిష్ట సరోజినీ,
అధరసుధయా మధ్యే మధ్యే వధూముఖలబ్ధయా
ధయతి మధుపః స్వాదుఙ్కారం మధూని సరోరుహమ్. 29

ప. వి. తటరుహఖగశ్రేణీసాంరావిణైః-ఇవ-సాంప్రతం- సరసి - విగలన్నిద్రాముద్రా - అజనిష్ట - సరోజినీ-అధరసుధయా-మధ్యే-మధ్యే- వధూముఖలబ్ధయా-ధయతి-మధుపః-స్వాదుఙ్కారం-మధూని-సరోరుహమ్.

అర్థము: సాంప్రతం = ఇప్పుడు, సరసి = కొలనియందు, సరోజినీ = తామరతీగె, తటతరు ఖగశ్రేణీసాంరావిణైః, తట = గట్టునందలి, తరు = చెట్లయందున్న, ఖగశ్రేణీ = పక్షుల సమూహముయొక్క, సాంరావిణైః = గట్టికూతలచేతనో యనునట్లు, విగలన్నిద్రాముద్రా, విగలత్ = తొలగినట్టి, నిద్రా = నిద్రవంటి, ముద్రా = ముడుచుకొనుట కల్గినదిగా, అజనిష్ట = ఏర్పడినది, (తథా = ఇట్లే) మధుపః = తుమ్మెద, సరోరుహాం = పద్మములయొక్క, మధూని = మకరందములను, మధ్యే మధ్యే = మధ్యమధ్య, వధూముఖే = ప్రియురాలినోట, లబ్ధయా = పొందఁబడిన, అధరసుధయా = పెదవియందలి యమృతముచే, స్వాదుఙ్కారం = రుచిగలవిగాఁజేసి, ధయతి = త్రాగుచున్నది.

సమాసములు :

*తటతరుఖగశ్రేణీ సాంరావిణైః- తటే తరవః = తటతరవః, ఖగానాం శ్రేణ్యః = ఖగశ్రేణ్యః, తటతరుషు ఖగశ్రేణ్యః = తటతరుఖగశ్రేణ్యః,*

తటతరుఖగ శ్రేణీనాం సాంరావిణాః, తటతరుఖగశ్రేణిసాంరావిణాః, తైః = తటతరుఖగశ్రేణీసాంరావిణైః.
విగలన్నిద్రాముద్రా- నిద్రా ఇవ ముద్రా = నిద్రాముద్రా, విగలన్తీ నిద్రాముద్రా యస్యాః సా = విగలన్నిద్రాముద్రా.
అధరసుధయా- అధరస్య సుధా = అధరసుధా, తయా = అధర సుధయా.
వధూముఖలబ్ధయా-వధ్వాః ముఖం = వధూముఖం, వధూముఖే లబ్ధా = వధూముఖలబ్ధా, తయా = వధూముఖలబ్ధయా.
స్వాదుఙ్కారం-స్వాదూన్ కృత్వా = స్వాదుఙ్కారం,

భావము :

ఇప్పుడు కొలనియందున్న తామరతీగె, గట్టునందలి చెట్లయందు నివసించు పక్షుల గట్టికూతలచేతనో యనునట్లు నిద్రవంటి దలముల మోడ్పును వీడినదై వికసించినది. తుమ్మెద తామరపూవుల మకరందములను, నడుమ నడుమ తన ప్రియురాలి పెదవియందలి యమృతముతోఁ గలిపి రసవంతములనుఁ గావించి పానము చేయుచున్నది. ॥29॥

శ్లో. గతచరదినస్యాయుర్భ్రంశే దయోదయ సఙ్కుచ
త్కమలముకులక్రోడే నీడే ప్రవేశ ముపేయుషామ్,
ఇహ మధులిహాం భిన్నే ష్వంభోరుహేషు సమాయతాం
సహ సహచరై రాలోక్యన్తేఽధునా మధుపారణాః. 30

ప.వి. గతచరదినస్య - ఆయుర్భ్రంశే - దయోదయసఙ్కుచత్కమల ముకుల క్రోడే-నీడే-ప్రవేశమ్ - ఉపేయుషాం - ఇహ - మధులిహాం - భిన్నేషు-అంభోరుహేషు-సమాయతాం-సహ-సహచరైః - ఆలోక్యన్తే - అధునా - మధుపారణాః.

అర్థము: గతచరదినస్య, గతచర = పూర్వము గడిచిపోయిన, దినస్య = దినమునకు, ఆయుర్భ్రంశే సతి; ఆయుః = జీవితమునకు, భ్రంశే సతి = పతన

మేర్పడగా, అనగా నవసాన మేర్పడగా ననగా సాయంకాలమునందు, దయోదయ సఙ్కుచత్కమలముకుల క్రోడే; దయోదయ=కనికరము గల్గుటవలననో యనునట్లు, సఙ్కుచత్ = ముడుచుకునిపోవుచున్న యనగాఁ గనికరముచే వాడుబారుచు ముడుచుకొని పోవుచున్నదో యను నట్లున్న, కమల = పద్మములయొక్క, ముకుల=మొగ్గలయొక్క, క్రోడే=లోపలి ప్రదేశమును, నీడే=గూడునందు, ప్రవేశం=ప్రవేశ మును, ఉపేయుషాం=పొందుచున్న అనగా రాత్రులందు, నచ్చటనే బంధింపఁబడినవియు కావుననే యచ్చట నుపవాసములనుఁ గావించిన, ఇహ = ఈ యుదయమున, భిన్నేషు=వికసించిన, అంభోరుహేషు= తామరపూలయందు, సమాయతాం=వచ్చుచున్న అనగా నిటు నటు తిరుగుచున్న, మధులిహాం= తుమ్మెదలకు, అధునా=ఇప్పుడు, సహ చరైః = చెలికాండ్రతో, మధుపారణాః, మధు = మకరందముచే, పారణాః=ఉపవాసము తర్వాతి భోజనములు, ఆలోక్యన్తే=చూడఁబడు చున్నవి.

సమాసములు :

*గతచరదినస్య-పూర్వం* గతం=గతచరం, గతచరం చ తత్ దినం చ=గతచరదినం, తస్య=గతచరదినస్య.

*ఆయుర్భ్రంశే*–ఆయుషః భ్రంశః=ఆయుర్భ్రంశః, తస్మిన్=ఆయు ర్భ్రంశే.

*దయోదయసఙ్కుచత్కమలముకులక్రోడే*– దయాయాః ఉదయః = దయోదయః, దయోదయేన సఙ్కుచన్తి = దయోదయసఙ్కుచన్తి, దయోదయసఙ్కుచన్తి చ తాని కమలాని చ=దయోదయసఙ్కుచత్క మలాని, దయోదయ సఙ్కుచత్కమలానాం ముకులాః=దయోదయ సఙ్కుచత్కమలముకులాః, దయోదయ సఙ్కుచత్కమలముకులానాం క్రోడః = దయోదయ సఙ్కుచత్కమలముకులక్రోడః, తస్మిన్= దయోధయసఙ్కుచత్కమల ముకులక్రోడే.

*మధుపారణాః*–మధునా పారణాః=మధుపారణాః.

భావము :

కడచిన దినమునకు జీవిత మంతమొందగా ననగా నాటిసాయంకాలము నందు దాని దుర్దశను జూచి కనికరముచేతనో యనునట్లు వెతఁ జెంది, రాత్రి, స్వభావముచే ముకుళించిన తామరమొగ్గల లోపలి ప్రదేశములను ప్రవేశించుచున్నవియు, రాత్రియందు వానియందే బంధింపఁబడినందువలననే యుపవాసము చేసినవో యనునట్లున్నవియును, ప్రభాతకాలమునందు వికసించిన తామరపూవులపై నిటునటు తిరుగుచున్న తుమ్మెదల కిప్పుడు వెలుపలనుండిన తమ చెలికాండ్రతో మకరందరసముచే ఉపవాస సమాప్తి కాలమందలి భోజనమునైన పారణలను జనులు గాంచిరి.

శ్లో. తిమిర విరహాత్ పాణ్డుాయన్తే దిశః కృశతారకాః
కమల హసితైః శ్యేనీ వోన్నీయతే సరసీ న కా,
శరణ మిలిత ధ్వాంతధ్వంసి ప్రభాఽఽదరధారణా
ద్గగనశిఖరం నీల త్యేకం నిజై రయశోభరైః. 31

ప.వి. తిమిరవిరహాత్-పాణ్డుాయన్తే-దిశః-కృశతారకాః-కమలహసితైః- శ్యేనీ-ఇవ-ఉన్నీయతే-సరసీ-న-కా-శరణమిలిత ధ్వాన్తధ్వంసి ప్రభాఽఽదరధారణాత్-గగనశిఖరం- నీలతి- ఏకం-నిజైః-అయశోభరైః.

అర్థము: దిశః = తూర్పు మున్నగు డిక్కులు, తిమిరవిరహాత్ = చీకటితో చ్ఛేదముఁ బొందుటవలన, కృశతారకాః, కృశ = క్షీణించిన, తారకాః=నక్షత్రములుగలవై, పాణ్డుాయన్తే=పాణ్డువర్ణమునుఁ బొంది నవిగా నాచరించుచున్నవి. విరహముచే పాణ్డు వర్ణము గల్గును గదా. కా=ఏ, సరసీ = కొలను, కమలహసితైః= వికసిత కమలములనెడి నవ్వులచే లేదా కమలము యొక్క వికాసములనెడి నవ్వులచే, శ్యేనీ ఇవ=తెలుపువన్నె గలదానివలె, న ఉన్నయతే= చూడఁబడదు? అనగా తప్పక చూడఁబడునని యర్థము. కిన్తు= కాని, ఏకం=ఒక్కటియగు, గగన శిఖరం=ఆకాశముయొక్క పై భాగము అనగా నెత్తైన గగన మండలము, శరణమిలిత ధ్వాన్త ధ్వంసి ప్రభాఽఽదరధారణాత్; శరణ=

రక్షకుడుగా, మిలిత=లభించిన, ధ్వాన్త=చీకట్లను, ధ్వంసి=నాశము చేయు, ప్రభా=వెలుగులైన సూర్య కిరణములను, ఆదర=పట్టుదలతో, ధారణాత్=ధరించుటవలన ననగా సూర్యకిరణములకు తన యెడ స్థానము నిచ్చుటవలన, నిజైః=తనవియగు, అయశోభరైః=అపకీర్తి భారములతో, నీలతి=నల్లగ నున్నది. శరణాగతులను రక్షింపనందు వలని యపకీర్తితో నల్లదైన దని యర్థము.

**సమాసములు :**

*తిమిరవిరహాత్* - తిమిరాణాం విరహః = తిమిరవిరహః, తస్మాత్= తిమిరవిరహాత్.
*పాణ్డూయన్తే*- పాణ్డవ ఇవ ఆచరన్తి=పాణ్డూయన్తే.
*కృశతారకాః*- కృశాః తారకాః యాసాం తాః=కృశతారకాః
*కమలహసితైః* — కమలాన్యేవ హసితాని=కమలహసితాని, లేదా, కమలానాం హసితాని= కమలహసితాని, తైః= కమలహసితైః.
*శరణమిలిత ధ్వాన్త ధ్వంసి ప్రభాఽదరధారణాత్* — శరణం మిలితాని=శరణమిలితాని, శరణమిలితాని చ తాని ధ్వాన్తాని చ= శరణమిలిత ధ్వాన్తాని, శరణమిలితధ్వాన్తానాం ధ్వంసిన్యః=శరణమిలిత ధ్వాన్త ధ్వంసిన్యః, శరణమిలిత ధ్వాన్తధ్వంసిన్యశ్చ తాః ప్రభాశ్చ= శరణమిలిత ధ్వాన్తధ్వంసిప్రభాః, శరణమిలిత ధ్వాన్త ధ్వంసి ప్రభాసు ఆదరః= శరణమిలిత ధ్వాన్తధ్వంసి ప్రభాదరః, శరణమిలిత ధ్వాన్త ధ్వంసి ప్రభాదరస్య ధారణం=శరణమిలితధ్వాన్త ధ్వంసి ప్రభాఽఽదర ధారణం, తస్మాత్=శరణమిలిత ధ్వాన్త ధ్వంసి ప్రభాదరధారణాత్।
*గగనశిఖరం* - గగనస్య శిఖరం = గగన శిఖరం
*అయశోభరైః*— అయశసాం భరాః= అయశోభరాః, తైః= అయ శోభరైః.

**భావము :**

తూర్పు మున్నగు దిక్కులు, చీకట్లు తొలగిపోవుట వలన క్షణములైన నక్షత్రములు గల్గి పాణ్డువర్ణములు గలవిగా నాచరించుచున్నవి. సరస్సులు

వికసిత కమలము లనెడి నవ్వులచే తెల్లఁబడి యున్నవి. అనగా ప్రియుడైన సూర్యుని సమాగమముఁ బొందుటవలన, నవ్వులచే వికసించిన ముఖములు గలవిగా నున్నవని యర్థము. కాని యెట్టైన యాకాశమణ్డలము, తన్ను శరణుఁ జొచ్చిన చీకట్లను నాశము గావించెడి సూర్యకిరణములయం దెక్కువ పట్టుదలనుఁ జూపుటవలన నపకీర్తులను బొందినదై వానిచే నల్లబారి యుండినది. ॥31॥

శ్లో. సరసిజఘనా న్యుద్యత్పక్షార్యమాణి హసన్తు న?
క్షతరుచిసుహృచ్చన్ద్రాం తన్ద్రాం ముపైతు న కైరవమ్?
హిమగిరిదృషద్దాయాదశ్రీ ప్రతీతముదః స్మితం
కుముదవిపినస్యాధో పాథోరుహై ర్నిజనిద్రణా. 32

ప. వి. సరసిజఘనాని-ఉద్యత్పక్షార్యమాణి-హసన్తు-న-క్షతరుచిసుహృచ్చన్ద్రాం-తన్ద్రామ్-ఉపైతు-న-కైరవమ్-హిమగిరి దృషద్దాయాదశ్రీప్రతీతముదః-స్మితం-కుముదవిపినస్య-అధో-పాథోరుహైః-నిజనిద్రణా.

అర్థము: ఉద్యత్పక్షార్యమాణి; ఉద్యత్ = ఉదయమునుఁ బొందుచున్న, పక్ష = సహాయుఁడైన, అర్యమాణి = సూర్యుని గల్గిన, సరసిజవనాని = కమల వనములు, న హసన్తు = వికసింపవా లేదా హాస్యముఁ జేయవా? చెలి కాంద్రయొక్క యభ్యుదయమందు నందఱును నవ్వుదురు గదా!, క్షతరుచిసుహృత్; క్షత = నశించిన, రుచి = కాన్తిగల్గిన, సుహృత్ = మిత్రుఁడైన, చంద్రం = చంద్రుని గల్గిన, కైరవం = కలువ, తన్ద్రాం = కునుకుపాటువంటి మోడ్పును అనగా దుఃఖమును, న ఉపైతు = పొందదా? తప్పక పొందునని యర్థము, అధో = మఱియు, పాథోరుహైః = పద్మములతో, హిమగిరి దృషద్దాయాదశ్రీప్రతీతముదః; హిమగిరి = చలిమలయొక్క, దృషత్ = ఱాళ్లయొక్క, దాయాద = భాగమును హరించెడి, శ్రీ = కాంతిచే, ప్రతీతముదః, ప్రతీత = వెల్లడియైన, ముదః = సంతోషముగల, కుముదవిపినస్య = కలువల యడవికి సంబంధించిన, నిజనిద్రయా = తమ నిద్రచే ననగా రాత్రియందు తాము ముడుచుకొని పోవుట యనెడి నిద్ర యిప్పుడు కలువల వనమునకు

బోవుటను హేతువుచే, స్మితం=నవ్వు, వికాసము స్వీకరింపఁబడినదని యర్థము.

సమాసములు :

*సరసిజవనాని* - సరసి జాయన్త ఇతి = సరసిజాని, సరసిజానాం వనాని=సరసిజవనాని.

*ఉద్యత్పక్షార్యమాణి*-ఉద్యచ్చాసౌ పక్షశ్చ=ఉద్యత్పక్షః, ఉద్యత్పక్షః అర్యమా యేషాం తాని=ఉద్యత్పక్షార్యమాణి.

*క్షతరుచి సుహృచ్చన్ద్రం* - క్షతా రుచిః యస్య సః=క్షతరుచిః, క్షత రుచి శ్చాసౌ సుహృచ్చ=క్షతరుచిసుహృత్, క్షతరుచిసుహృత్ చంద్రః యస్య తత్=క్షతరుచి సుహృచ్చన్ద్రం.

*హిమగిరిదృషద్దాయాదశ్రీప్రతీతముదః* - హిమగిరేః దృషదః = హిమగిరిదృషదః, హిమగిరిదృషదాం దాయాదా = హిమగిరిదృషద్దా యాదా, హిమగిరిదృషద్దాయాదా చ సా శ్రీశ్చ = హిమగిరిదృషద్దాయా దశ్రీః, హిమగిరిదృషద్దాయాదశ్రియాప్రతీతా ముత్ యస్య తత్ = హిమ గిరిదృషద్దాయాదశ్రీప్రతీతముత్, తస్య = హిమగిరిదృషద్దాయాదశ్రీ ప్రతీతముదః.

*కుముదవిపినస్య* - కుముదానాం విపినం = కుముదవిపినం, తస్య= కుముదవిపినస్య.

*పాథోరుహైః* - పాథసి రోహన్తీతి=పాథోరుహాణి, తైః=పాథోరుహైః.

*నిజనిద్రయా*-నిజా చ సా నిద్రా చ=నిజనిద్రా, తయా=నిజనిద్రయా.

భావము :

ఉదయించు సూర్యుని సహాయముగాఁ గల్గిన కమలవనములు నవ్వవా ? అనగా వికసింపవా ? హాస్యము చేయవా ? స్నేహితు లభ్యుదయముఁ బొంది నప్పుడు వారి స్నేహితు లందఱును నానందముతో నవ్వెదురని యర్థము. ఇచ్చట మిత్రుఁడైన సూర్యుని యభ్యుదయముచే కమలవనములు హర్షముతో నవ్వగలవనియు, సూర్యకిరణములవలన వికసింపగలవనియు నర్థము. కాంతి

రహితుఁడైన మిత్రుడగు చంద్రునితోఁ గూడిన కలువ కునుకుపాటువంటి ముకుళ నమునుఁ బొందదా? తప్పక పొందఁగలదు. తన మిత్రుఁడగు చంద్రుని దుర్దశనుఁ జూచి తానును దుఃఖించునని యర్థము. అనగా మిత్రుడగు చంద్రుడు, ఆపదనుఁ బొందగనే కలువల వనములుగూడా దుఃఖముతో కన్నులను మూయఁగలవనియు, చంద్రాస్తమయము కాగనే కలువపూలు ముడుచుకొనిపోవుననియు నర్థము. అనగా రాత్రియందు కలువల వనమునకు హర్షము, కమల వనమునకు నిద్ర యుండినది. ఇప్పుడు యనగా ప్రభాతమున, కమలములు రాత్రియందలి తమ నిద్రను కలువల పైకిఁ బోనిచ్చి వాని హర్షమును (వికాసమును)గ్రహించి పరిహసించుచున్నట్లున్న దని యర్థము. "హిమగిరిదృషద్దాయాదశ్రీ ప్రతీష్టమదః స్మితం" అను పాఠము ననుసరించి- పాథోరుహైః=పద్మములచే, నిజనిద్రయా=తను నిమీలనమను నిద్రనిచ్చి, హిమగిరిదృషద్దాయాదా=హిమాచలముయొక్క శిలలతో సమానమైన శోభ గల్గిన, కుముదవనస్య=కలువల వనముయొక్క, అదః=ఈ, స్మితం= రాత్రియందలి వికాసము, హాస్యము, ప్రతీష్టం=గ్రహింపఁబడినది అని యర్థ మునుఁ జెప్పుకొనవలయును. ॥32॥

శ్లో. ధయతు నలినే మాధ్వీకం వా న వాఽభినవాగతః
కుముదమకరన్దౌఘైః కుక్షిమ్భరి భ్రమరోత్కరః
ఇహ తు లిహతే రాత్రీతర్షం రథాఙ్గవిహఙ్గమా
మధు నిజవధూవక్త్రామ్భోజేఽధునాఽధరనామకమ్. 33

ప. వి. ధయతు- నలినే- మాధ్వీకం- వా- న-వా- అభినవాగతః-కుముదమకర న్దౌఘైః- కుక్షిమ్భరిః- భ్రమరోత్కరః- ఇహ-తు- లిహతే-రాత్రీతర్షం- రథాఙ్గవిహఙ్గమాః-మధు-నిజవధూవక్త్రామ్భోజే-అధునా-అధరనామకమ్.

అర్థము: కుముదమకరన్దౌఘైః, కుముద = కలువలయొక్క, మకరన్దౌఘైః= పుష్పరసముల ప్రవాహముచే, కుక్షిమ్భరిః=కడుపునింపుకొనునదియు, నలినే=పద్మమందు, అభినవాగతః=అప్పుడే వచ్చిన, భ్రమరోత్కరః=

తుమ్మెదలసంఘము, మాధ్వీకం=కమలమకరందమును, ధయతు వా= త్రాగిన త్రాగుగాత, న ధయతు వా = త్రాగకపోయినచో త్రాగక పోవును గాత. రాత్రియందుఁ గడుపునిండ కలువల మకరన్దములనుఁ ద్రాగినందువలనఁ దృప్తినొందిన యతిథికి మఱల మకరన్దపానము లేనందువలన హాని యేమియును లేదు. తు=కాని, రథాఙ్గవిహఙ్గమాః= చక్రవాకపక్షులు, రాత్రీతర్షం=రాత్రియంతయు దాహబాధ ననుభవించి, యనగా ప్రియురాలివిరహముచే నేర్పడిన పిపాసలచే రాత్రినిఁ గడపి ఇహ =ఈ, నిజవధూవక్త్రామ్బుజే, నిజ = తనవైన, వధూ=, ప్రియురాండ్రయొక్క, వక్త్రామ్బుజే = ముఖపద్మముల యందలి, అధునా=ఈ ప్రభాతమందలి, అధరనామకం = పెదవి యను పేరు గల్గిన, మధు=మకరన్దమును, లిహతే=ఆస్వాదించుచున్నవి. ప్రభాత కాలమున చక్రవాక దంపతులు కలియును గదా. భుజించిన వ్యక్తి మఱల భుజించుటకంటె, భుజింపనివాడు భుజించుట సముచితము గదా!

సమాసములు :

అభినవాగతః—అభినవ మాగతః= అభినవాగతః.

కుముదమకరన్దౌఘైః – కుముదానాం మకరన్దాః = కుముదమకరన్దాః, కుముదమకరన్దానా మోఘాః, కుముదమకరన్దౌఘాః, తైః = కుముద మకరన్దౌఘైః.

కుక్షిమ్భరిః-కుక్షిం బిభర్తీతి=కుక్షిమ్భరిః.

భ్రమరోత్కరః-భ్రమరాణా ముత్కరః=భ్రమరోత్కరః.

రాత్రీతర్షం—రాత్రిం వ్యాప్య తృషిత్వా=రాత్రీతర్షం.

రథాఙ్గ విహఙ్గమాః-రథాఙ్గా ఇతి విహఙ్గమాః=రథాఙ్గవిహఙ్గమాః.

నిజవధూవక్త్రామ్బుజే-నిజాశ్చ తాః వధ్వశ్చ=నిజవధ్వః, వక్త్రమేవ అమ్బుజం=వక్త్రామ్బుజం, నిజవధూనాం వక్త్రామ్బుజం=నిజవధూ వక్త్రామ్బుజం, తస్మిన్=నిజవధూవక్త్రామ్బుజే.

అధరనామకమ్ -అధర ఇతి నామ యస్య తత్=అధరనామకం, తత్= అధరనామకమ్.

భావము :

తుమ్మెదల గుంపు రాత్రియందు కలువల మకరందవాహినులచేఁ బొట్ట నింపుకొనినవి. కాన నది కమల మకరందమునుఁ ద్రాగినను ద్రాగకపోయినను హాని లేదు. కాని చక్రవాక దంపతులు, రాత్రి యెంతయు నొండొరుల నెడ బాయుటచే, దాహతాపములకు గుఱియై యిప్పుడు తెల్లవారగనే ప్రియురాలి ముఖకమలమందలి పెదవి యగు మకరందమునుఁ బానము చేయుచున్నవి. ఇది సముచితమైనది. రాత్రియంతయు నెడబాటుచే నిరాహారములై సొక్కి సోలిన చక్రవాక దంపతులు భుజించుట యుక్తము. అవి యుదయకాలమందే తిరిగి కలుసుకొనుచున్నవి. కాన వాని భోజనమే వాంఛనీయమని యాశయము. ॥33॥

శ్లో. జగతి మిథునే చక్రావేవ స్మరాగమపారగౌ
నవమివ మిథః సమ్భుఞ్జాతే వియుజ్య వియుజ్య యౌ
సతత మమృతాదేవాఽఽహారాత్ యదాప దరోచకం
తదమృతభుజాం భర్తా శమ్భుర్విషం బుభుజే విభుః॥ 34

ప.వి. జగతి-మిథునే-చక్రౌ-ఏవ-స్మరాగమపారగౌ-నవమ్ - ఇవ-మిథః-సమ్భుఞ్జాతే-వియుజ్య-వియుజ్య-యౌ-సతతమ్- అమృతాత్-ఏవ - ఆహారాత్-యత్-ఆపత్-అరోచకం-తత్-అమృతభుజాం - భర్తా-శమ్భుః - విషం-బుభుజే-విభుః.

అర్థము : జగతి=ప్రపంచమునందు, మిథున=స్త్రీ పురుషుల దంపతులయందు, చక్రావేవ=చక్రవాకదంపతులే, స్మరాగమపారగౌ; స్మరాగమ=కామ శాస్త్రముయొక్క, పార=ఆవలిగట్టును, గౌ=పొందినవి. అనగా కామ శాస్త్ర పారంగతములు (ఏలయనగా), యౌ=ఏ దంపతులు, మిథః= ఒండొరులను, వియుజ్య వియుజ్య=విడచి, విడచి యనగా ప్రతి రాత్రియు నొండొరులను స్వేచ్ఛతోడనే వదిలి వదిలి, నవమివ=ప్రతి దినము క్రొత్తదో యనునట్లు, సమ్భుఞ్జాతే=సంభోగించుకొనుచున్నవి. అట్లు కానిచో ప్రతిదినము విడవక సంభోగించినందువలన విసుగు కలిగి యరోచకమను నరుచి యేర్పడును. యత్=ఏలయనగా, అమృత

భుజాం=అమృతమునుఁ ద్రాగెడి దేవతలకు, భర్తా = ప్రభువైన, విభుః=సమర్థుఁడైన, శమ్భుః=శివుడు, సతతం=ఎల్లప్పుడు, అమృతాత్ =అమృత మనెడి, ఆహారాత్ = ఆహారమువలన, అరోచకం= అరుచి యనెడి రోగమును,అపత్=పొందెనో,'తత్=అందువలన, విషం విషమును, బుభుజే=తినెను. ప్రతిదినము తీపుగల పిండి వంటలను తినినచో నరుచి యేర్పడును. దానినిఁ బోగొట్టుకొనుటకై తీపునకు విపరీతములైన కారము, చేదుగల్గిన పదార్థములను భక్షించుట లోక ప్రసిద్ధము.

సమాసములు :

స్మరాగమపారగౌ-స్మరస్య ఆగమః = స్మరాగమః, స్మరాగమస్య పారం గచ్ఛత ఇతి=స్మరాగమ పారగౌ.

అమృతభుజాం-అమృతం భుఞ్జత ఇతి=అమృతభుజః, తేషా మమృత భుజామ్.

భావము :

మూడు లోకములయందునుఁ బరిశీలించినచో చక్రవాకపక్షుల దంపతులే కామశాస్త్ర పారంగతులు. ఏలయనగా, నవి ప్రతిదినము రాత్రులయందు నొండొరులను వీడి, పీడి పగలు కలియుచున్నవి. అందువలన వాని కలయిక ప్రతిదినము క్రొత్తదనమునుఁ గల్గియుండును. అందువలన వానికి తమ సంగమమునందు అరోచకము లేదు. అమృతమునుఁ బానముచేయు దేవతలకుఁ బ్రభువైన శివుడు, ఎల్లప్పుడును తాను పానము చేయునట్టి యమృతమువలన విసుగుఁజెందినవాడై యరోచకమను రోగమునకు గురియాయెను. అందువలన నాయరోచకమునుఁ దొలగించుకొనుటకై విషమునుఁ బానము గావించెను. లోకమునఁ దీపుగల్గిన పిండివంటలనుఁ దినెడివారలు దానివలనఁ గల్గెడి యరుచినిఁ దొలగించుకొనుటకై దానికి విపరీతములైన కారము, చేదు మున్నగు రసములుగల పదార్థమునుఁ దినుట ప్రసిద్ధము గదా! ॥84॥

శ్లో. విశతి యువతిత్యాగే రాత్రీముచం మిహికారుచం
దినమణిమణిం తాపే చిత్తా న్నిజాచ్చ యియాసతి,
విరహతరలం జిహ్వే బహ్వాహ్వాయ న్త్యతివిహ్వాలా
మిహ సహచరీం నామగ్రాహం రథాఙ్గవిహఙ్గమాః. 35

ప. వి. విశతి-యువతిత్యాగే-రాత్రీముచం-మిహికారుచం-దినమణిమణిం-తాపే-చిత్తాత్-నిజాత్- చ-యియాసతి- విరహతరలజిహ్వా-బహు-ఆహ్వాయ న్తి-అతివిహ్వాలామ్-ఇహ-సహచరీం-నామగ్రాహం-రథాఙ్గవిహఙ్గమాః.

అర్థము. ఇహ=ఈ యుదయకాలమందు, రథాఙ్గవిహఙ్గమాః=పురుష చక్రవాకములు, యువతిత్యాగే=తమ తరుణియగు ప్రియురాలియొక్క, త్యాగే=వియోగమునందు, రాత్రీముచం=ఇప్పుడే రాత్రియను భార్యను విడుచుచున్న, మిహికారుచం = మంచుయొక్క కాంతివంటి కాంతి యనగా విరహమువలని తెల్లని కాంతిగల్గిన చంద్రుని, విశతి సతి=ప్రవేశింపఁగనే, తాపే=వేడిమి, విరహమువలన గల్గిన చిత్తసంతాపము, నిజాత్=చక్రవాకమునకు సంబంధించిన, చిత్తాచ్చ = మనస్సునుండియు, దినమణిమణిం=సూర్యకాంతమణిని, యియాసతి సతి=ప్రవేశింపఁగోరుచుండగా, విరహతరలజిహ్వా, విరహ = వియోగముచే, తరల = చంచలమైన, జిహ్వాః=నాలుకలుగలవై, అతివిహ్వాలాం=చాలాకాలము కానరానందువలన మిక్కిలి దుఃఖించిన, సహచరీం = ప్రియురాలగు చక్రవాకిని, నామగ్రాహం=పేరును గ్రహించి, బహు=పలుమారులు, ఆహ్వాయ న్తి=పిలుచుచున్నవి. సూర్యుడుదయించెను, శీఘ్రముగా లెమ్మని చెప్పుచున్నవని యర్థము.

భావము :

ఈ యుదయకాలమందు చక్రవాకపక్షులు అనగా మగచక్రవాకములు రాత్రియందలి వియోగబాధచే, చంచలములగు నాలుకలుగలవై చాలకాలము కానరానందువలన మిక్కిలి దుఃఖించుచున్న ప్రియురాలినిఁ బేరెత్తి పిలచుచు, ''సూర్యు డుదయించెను. శీఘ్రముగా మేల్కొని లెమ్మని'' చెప్పుచున్నవి. ఆ

సమయమునందే యాచక్రవాకముకు, తమప్రియురాలితోటి వియోగము, రాత్రి యనెడి భార్యను విడచుచున్న చంద్రునిఁ బ్రవేశించుచున్నది. ఆ చంద్రుఁడు మంచువంటి కాంతిగల్గి తనప్రియురాలగు రాత్రివలని విరహముచే నేర్పడిన పాండువర్ణమును ధరించినట్లు కానవచ్చుచున్నాడు. రాత్రి, చంద్రునికిఁ బ్రియురాలని ప్రసిద్ధి. ఇఁక నాచక్రవాకముల విరహమువలని వేడిమి, తమ మనస్సుల నుండి తొలగి సూర్యకాంతమణినిఁ బ్రవేశింపఁగోరుచున్నది. సూర్యకాంతమణులు పగలు సూర్యకిరణసంపర్కముచే జ్వలించుట ప్రసిద్ధమైనది. చక్రవాకపక్షులు రాత్రియందు దెడఁబాపు పొందుట ప్రసిద్ధి. సూర్యు డస్తమింపగనే యవి యొండొంటితోఁ గలియఁజాలవు. మఱల సూర్యు డుదయింపగనే యవి యొండొంటితోఁ గలియుచుండును. కాన నిక్కడ సూర్యు డుదయింపఁగనే రాత్రి యెడఁబాసిన చక్రవాకములు కలిసినవి. వానికి రాత్రియందలి వియోగము చంద్రునిఁ బ్రవేశించినది. ఏలయనగా, నత డస్తమించుటవలన నతనికి ప్రియురాలగు రాత్రితో నెడఁబాపు గల్గినది. అతనిని తెల్లనిమంచు కమ్ముటవలన నాయెడఁబాపువలని తెల్లఁదనముగూడ నతని కంటినట్లు భావింపఁబడినది. ఇక నాచక్రవాకములకు రాత్రి యేర్పడిన విరహాగ్నిజ్వాలలు, పగలు సూర్యకాంతిచే మండుచున్న సూర్యకాంతమణులనుఁ బ్రవేశించినవనియు నాశయము. ॥౩౫॥

శ్లో. స్వముకులమయై ర్నేత్రై రన్ధంభవిష్ణుతయా జనః
కిము కుముదినీం దుర్వ్యాచష్టే రవే రనవేక్షికామ్,
లిఖితపఠితా రాజ్ఞో దారాః కవిప్రతిభాసు యే
శృణుత శృణుతాఽసూర్యమ్పశ్యా న సా కిల భావినీ. 36

ప. వి. స్వముకులమయైః-నేత్రైః-అన్ధమ్భవిష్ణుతయా-జనః-కిమ్-ఉ-కుముదినీం-దుర్వ్యాచష్టే- రవేః - అనవేక్షికాం - లిఖితపఠితా - రాజ్ఞః-దారాః - కవిప్రతిభాసు - యే-శృణుత-శృణుత-అసూర్యమ్పశ్యా-న-సా-కిల-భావినీ.

అర్థము : జనః = లోకము, స్వముకులమయైః, స్వ = తనయొక్క, ముకులమయైః = మొగ్గల రూపముననున్న యనగా ముడుచుకొనిపోయిన, నేత్రైః = కన్నులతో, అన్ధంభవిష్ణుతయా = గ్రుడ్డితనమునుఁ బొందిన

దగుటచే, రవేః=సూర్యుని, అనవేక్షికాం=చూడనట్టి, కుముదినీం= కలువతీగెను అనగా నొకరాజ భార్యను, కిము=ఏమని, దుర్వ్యాచష్టే= నిందించును? కలువ జగములను పవిత్రపఱచునట్టి సూర్యునిఁ జూడదు, ఆశ్చర్యము. ఇది మిక్కిలి యనుచితము. అని యీ విధముగ నూరక యపవాదము నేర్పఱచుచున్నది. కవిప్రతిభాసు, కవి= కవులయొక్క, ప్రతిభాసు=ప్రజ్ఞలయందు ననగా వారి ప్రతిభచే నుల్లసిల్లు కావ్యముల యందు, యే=ఏకుముదిని యను పేరుతో ప్రసిద్ధినొందిన, రాజ్ఞః=రాజు యొక్కయు, చంద్రునియొక్కయు, దారాః=భార్యలు, లిఖితపఠితాః- లిఖిత=కవులచే లిపిరూపముగా చేయఁబడినవారై, పఠితాః=పాఠకులచేఁ జదువఁబడిరో కవులు ఎవతెను రాజభార్య యని చెప్పుదురో వారి శిష్యులును నట్లే తెలిసికొనుచున్నారని యర్థము. సా=ఆ రాజభార్యగా వర్ణింపఁబడిన కుముదిని, అసూర్యమ్పశ్యా=సూర్యునిఁ జూడనిదిగా, న భావినీ కిం= కాఁబోదు గదా, శృణుత శృణుత=(ఓ దుర్వాదము చేయు జనులారా!) వినుఁడు, వినుఁడు, రాజభార్యలు రాజనీతి ననుసరించి యసూర్యంపశ్యలై యుండుట యుక్తమైనచో నప్పుడు చంద్రునకు 'రాజ' నెడి పేరుండుటవలన చంద్రుని దర్శించినంత మాత్రముననే వికసించెడి స్వభావము గల్గిన కలువను చంద్రపత్నిగాఁ గవులు చెప్పుటవలన కలువ గూడ రాజభార్య యనియే సిద్ధించుచున్నది. కాన- రాజభార్య యగుట వలన నామె సూర్యునిఁ జూడక యుండుట యుక్తమేకాన, సూర్యునిఁ జూడకపోవుటవలన జనులు చేసెడి నిందయు నసంబద్ధమగుచున్నది. కాని వాస్తవ స్థితిలో ''అసూర్యమ్పశ్యత్వ'' మనగా సూర్యునిఁ జూడక యుండుట గాదు. మఱేమనగా, పరపురుషునిఁ జూడక యుండుట. కాన సూర్యదర్శన నిషేధము తాత్పర్య విషయము గాదు.

సమాసములు :

స్వముకులమయైః - స్వస్య ముకులాః=స్వముకులాః, స్వముకులానాం రూపాణి=స్వముకులమయాని, తైః=స్వముకులమయైః.
అన్ధంభవిష్ణుతయా - అనన్ధా అన్ధా భూతా = అన్ధంభవిష్ణుః, అన్ధంభవిష్ణోః భావః=అన్ధంభవిష్ణుతా, తయా=అన్ధంభవిష్ణుతయా.

అనవేక్షికాం - న ఆవేక్షికా=అనవేక్షికా, తాం=అనవేక్షికాం.

లిఖితపఠితాః - లిఖితాశ్చ తే పఠితాశ్చ=లిఖితపఠితాః.

కవిప్రతిభాసు - కవీనాం ప్రతిభాః = కవిప్రతిభాః, తాసు = కవి ప్రతిభాసు.

అసూర్యమ్పశ్యా - సూర్యం పశ్యతీతి=సూర్యమ్పశ్యా, న సూర్యం పశ్యా=అసూర్యమ్పశ్యా.

భావము :

జనము, కలువ పగటియందు తన పూవులనెడి కన్నులు ముడుచుకొనుటచే గుడ్డితనమునుఁ బొంది సూర్యునిఁ జూడక పాపము నొడిగట్టుకొనుచున్నదని, యాకలువను నిందించుచున్నది. ఏలయనగా-

"లోకేఽస్మిన్ మంగలాన్యష్టౌ బ్రాహ్మణో గౌ ర్హుతాశనః
హిరణ్యం సర్పి రాదిత్య ఆపో రాజా తథాష్టమః,
ఏతాని సతతం పశ్యే న్నమస్యే దర్చయేత్తు యః
ప్రదక్షిణఞ్చ కుర్వీత తస్య చాఽఽయు ర్న హీయతే" అని.

బ్రాహ్మణుడు-గోవు-అగ్ని-బంగారు-నేయి-సూర్యుడు - ఉదకము - రాజు - అని యెనిమిది మంగలపదార్థములు.వీని నెవ్వ డెల్లప్పుడు దర్శించునో, నమస్కరించునో లేదా పూజించునో లేదా ప్రదక్షిణము గావించునో అతని కాయుస్సు వర్ధిల్లునని ధర్మశాస్త్ర వచనము ననుసరించి సూర్యదర్శనము గూడ విధింపఁ బడియున్నది గాన దాని నాచరింపకపోయినచో కలువ నింద్యమగుచున్నది. కాని కవిప్రతిభచే నుల్లసితములగు కావ్యములయందు కుముదిని యనుపేరఁ బ్రసిద్ధమైన రాజభార్య యనగా నృపుని భార్య, చంద్రుని భార్య గలదో యామె వాస్తవస్థితిలో రాజభార్యయే యగుటవలన-అసూర్యంపశ్యయే కావలయును గాన నా రాజభార్యయగు కుముదిని యనగా కలువ, సూర్యునిఁ జూడకపోవుట దోషము గాదు. "రాజ"శబ్దమునకు నృపుడనియు, చంద్రుడనియు నర్థము లుండుటవలన, కలువ చంద్రు డుదయించునపుడు వికసించుట వలన నా చంద్రునికిఁ బ్రియురాలై రాజభార్యయై తక్కిన రాజపత్ను లెట్లు అసూర్యంపశ్యలుగ నున్నారో యట్లే యీయామెయు, పగటిపూట సూర్యకిరణములచే తన పూవు లనెడి కన్నులు

ముడుచుకొనిపోవుటవలన నసూర్యమ్పశ్య యైనది. కాన నామె సూర్యదర్శనమునుఁ జేయకపోవుట దోషముగాదని యర్థము. ప్రజలు తమ నేత్రములు ముడుచుకొని పోవుటవలన నంధులై కలువపై నిట్టి యపవాదమును వేయుచున్నారనియు నర్థము.

వాస్తవ స్థితిలో 'అసూర్యమ్పశ్య' యనగా సూర్యునిఁ జూడకపోవునది గాదు. మఱేమనగా, కైముతిక న్యాయము ననుసరించి సూర్యునే చూడనపుడు మఱియొకరినిఁ జూచుట కవకాశమే లేదు కావున పరపురుషదర్శనము చేయనిది యని యర్థము. కాన కలువపూవు విషయమునందును నదియే తాత్పర్యము కాన దానికి సూర్యదర్శనాభావము దోషముగాదు. ఆ యర్థమునందే 'ఖశ్' ప్రత్యయము విహితము మఱియు కౌశికయందు గూడ "గుప్తిపరం చైతత్" యని చెప్పఁ బడినది. ॥36॥

శ్లో. చులుకితతమస్సింధో ర్భృఙ్గైః కరాదివ శుభ్యతే
నభసి బిసినీబంధో రన్ధ్రిచ్యుతై రుదబిందుభిః,
శతదలమధుస్రోతః కచ్ఛద్వయీ పరిరమ్భణా
దనుపద మదః పఙ్కాశఙ్కా మమీ మమ తన్వతే. 37

ప. వి. చులుకితతమస్సింధోః-భృఙ్గైః-కరాత్-ఇవ-శుభ్యతే-నభసి-బిసినీబంధోః-రన్ధ్రిచ్యుతైః-ఉదబిందుభిః - శతదలమధుస్రోతః కచ్ఛద్వయీపరిరమ్భణాత్-అనుపదమ్-అదః-పఙ్కాశఙ్కాం-అమీ-మమ-తన్వతే.

అర్థము: నభసి = ఆకాశమునందు, భృఙ్గైః = ఎగురుచున్న తుమ్మెదలచే, చులుకితతమస్సింధోః- చులుకిత = పానముచేయుటకై యరచేతఁ బట్టుకొనఁబడిన, తమస్సింధోః = చీకటి యనెడి కడలి గల్గిన, బిసినీబంధోః- బిసినీ=పద్మములకు, బంధోః=చుట్టమైన సూర్యునియొక్క, కరాత్=కిరణము నుండి (హస్తమునుండి), రంధ్రచ్యుతైః- రంధ్ర= వ్రేళ్ళ సందులనుండి, చ్యుతైః=జారినటువంటి, ఉదబిందుభిరివ=నీటి బొట్టులో యనునట్లు, శుభ్యతే= తెలియఁబడుట (సంభవించుచున్నది)

(తుమ్మెదలు చీకటితో సమానమగు రంగును గల్గియుండుటవలనను, తుమ్మెదలు నల్లని వన్నెగల్గిన పెద్దవగు నీటిబిందువులవలె నుండుట వలనను నిట్లు చెప్పఁబడినది), కిఞ్చ=మరియు, అమీ=ఈ తుమ్మెదలు, అనుపదం=ప్రతిక్షణమంతును, (పోల్చఁబడిన ప్రకారముఁ దెలియఁబడిన వెంటనే) శతదల మధుస్రోతః కచ్ఛద్వయీ పరిరమ్భణాత్- శతదల= పద్మములయొక్క, మధు=మకరందములయొక్క, స్రోతః=ప్రవాహ ములవలని, కచ్ఛద్వయీ=తేమనేలలను రెంటిని, పరిరమ్భణాత్= తాకుటవలన ననగా మకరంద ప్రవాహము రెండు వైపుల ప్రవహించుట వలన, అదః పఙ్కాశఙ్కాం- అదః=ఈ మకరన్ద ప్రవాహముయొక్క, పఙ్కాశఙ్కాం=అడుసనెడి భ్రమను, మమ=స్తుతిపాఠకుఁడనైన నాకు, తన్వతే=కలిగించుచున్నది.

సమాసములు :

చులుకిత తమస్సింధోః- తమ ఏవ సింధుః=తమస్సింధుః; చులుకితః తమస్సింధుః యేన సః=చులుకిత తమస్సింధుః, తస్య=చులుకిత తమస్సింధోః.

*బిసినీబంధోః* - బిస మాసా మ స్తీతి=బిసిన్యః, బిసినీనాం బంధుః= బిసినీబంధుః, తస్య=బిసినీబంధోః.

*రంధ్రచ్యుతైః*-రంధ్రేభ్యః చ్యుతాః = రంధ్రచ్యుతాః, తైః = రన్ధ్ర చ్యుతైః.

*ఉదబిందుభిః*- ఉదకానాం బిందవః=ఉదబిందవః, తైః=ఉదబిందుభిః.

*శతదలమధుస్రోతః కచ్ఛద్వయీ పరిరమ్భణాత్* - శతం దలాని యస్య తత్=శతదలం, శతదలస్య మధూని=శతదలమధూని, శతదల మధూనాం స్రోతాంసి=శతదల మధుస్రోతాంసి, శతదల మధు స్రోత సాం కచ్చౌ=శతదల మధుస్రోతః కచ్చౌ, శదదల మధుస్రోతఃకచ్ఛయో, ద్వయీ=శతదలమధు స్రోతఃకచ్ఛద్వయీ, శతదల మధుస్రోతః కచ్ఛ ద్వయ్యా పరిరమ్భణం = శతలమధుస్రోతః కచ్ఛద్వయీ పరిరమ్భణం, తస్మాత్=శతదలమధుస్రోతః కచ్ఛద్వయీ పరిరమ్భణాత్.

*అనుపదమ్* -పదే పదే=అనుపదమ్.

అదఃపఙ్కాశఙ్కాం- అముష్య పఙ్కః=అదఃపఙ్కః, అదః పఙ్కస్య ఆశఙ్కా=అదఃపఙ్కాశఙ్కా, తాం=అదఃపఙ్కాశఙ్కామ్.

భావము :

ఉదయకాలమందు నాకసమునం దెగురుచున్న తుమ్మెదలు, సూర్యుఁడు తన కిరణము లనెడి యరచేయిచేతఁ జీకటి యనెడి సముద్రమునుఁ బానము చేయగా నాతని వ్రేళ్ళ సందులనుండి జారిపడిన నీటి బొట్టులుగాఁ భావింపఁబడి నవి. (తుమ్మెదలును చీకట్లు సమానమగు వన్నెనుఁ గల్గియుండుట వలనను తుమ్మెదలు నల్లని నీటి బిందువులవలె నుండుటవలనను నిట్టిభావన యేర్పడినది) మఱియు నీ తుమ్మెద లీ విధముగాఁ దెలియఁబడిన పిదప, పద్మమకరన్ద ప్రవాహముల కిఱుగెడలునుఁ గూర్చుండుట వలన నవి యీ మకరంద ప్రవాహము వలన గల్గిన యడుసనెడి భ్రమను స్తుతి పాఠకుడనగు నాకుఁ గల్గించుచున్నది.॥37॥

శ్లో॥ ఘుసృణసుమనః శ్రేణి శ్రీణా మనాదరిభిః సరః
పరిసరచరై ర్భాసాం పత్యుః కుమారతరైః కరైః,
అజని జలజామోదానందోత్పతిష్ణు మధువ్రతా
వలిశబలనా ద్గుఞ్జా పుఞ్జశ్రియం గృహయాలుభిః. ॥38॥

ప. వి. ఘుసృణసుమనఃశ్రేణీశ్రీణాం- అనాదరిభిః- సరఃపరిసరచరైః-భాసాం- పత్యుః – కుమారతరైః- కరైః- అజని - జలజామోదానందోత్పతిష్ణు మధువ్రతావలి శబలనాత్-గుఞ్జాపుఞ్జశ్రియం- గృహయాలుభిః.

అర్థము: ఘుసృణ సుమనః శ్రేణి శ్రీణాం; ఘుసృణసుమనః=కుఙ్కుమపూల యొక్క, శ్రేణీ=వరుసలయొక్క, శ్రీణాం=శోభలను, అనాదరిభిః= తిరస్కరించుచున్న అనగా కుఙ్కుమపూలవన్నె కంటెను నధికమైన యెఱ్ఱఁదనము గల్గినవియు, సరఃపరిసరచరైః; సరఃపరిసర = కొలని చుట్టు ప్రక్కల, చరైః=సంచరించుచున్న, కుమారతరైః = అప్పుడే యుదయించుటవలన మిక్కిలి లేతదఁనము గల్గిన, భాసాం పత్యుః= కాంతులకు ప్రభువైన సూర్యునియొక్క, కరైః=కిరణములచే, జలజా

మోదా నన్దోత్పతిష్ణు మధు వ్రతావలి శబలనాత్; జలజ = పద్మముల యొక్క, ఆమోద=సువాసనచే నేర్పడిన, ఆనంద=సంతోషమువలన, ఉత్పతిష్ణు = పైకెగురునట్టి, మధువ్రతావలి = తుమ్మెదల బారువలన, శబలనాత్ = చిత్రవర్ణముఁ బొందించుటవలన, గుఞ్జాపుఞ్జశ్రియం; గుఞ్జా=గురువిందలయొక్క, పుఞ్జ=రాశియొక్క, శ్రియం=శోభను, గ్రహయాలుభిః=గ్రహించునవిగా, అజని=ఏర్పడుట (యైనది). నల్లని తుమ్మెదలతోఁ గలసిన యెఱ్ఱని బాల సూర్యుని కిరణము లట్లు శోభించిన వని యర్థము. గురువిందలు పైన నల్లగను దిగువ యెఱ్ఱగను నుండుట వలనఁ బైన తిరుగు నల్లని తుమ్మెదల సంసర్గముచే దిగువనున్న యెఱ్ఱని బాల సూర్యకిరణములు గురువిందల పోలికనుఁ బొందినవని యర్థము.

## సమాసములు :

ఘుసృణసుమనః శ్రేణిశ్రీణాం- ఘుసృణస్య సుమనాంసి=ఘుసృణ సుమనాంసి, ఘుసృణసుమనసాం శ్రేణయః, = ఘుసృణ సుమనః శ్రేణయః, ఘుసృణ సుమనః శ్రేణీనాం శ్రియః=ఘుసృణ సుమనః శ్రేణిశ్రియః, తాసాం=ఘుసృణసుమనఃశ్రేణిశ్రీణామ్.

అనాదరిభిః- న ఆదరః=అనాదరః, అనాదరః ఏషా మస్తీతి=అనాదరిణః, తైః=అనాదరిభిః.

సరఃపరిసరచరైః- సరసః పరిచరాః=సరఃపరిచరాః, సరః పరిసరేషు చరన్తీతి=సరఃపరిసరచరాః, తైః=సరఃపరిసరచరైః.

కుమారతరైః- అత్యంతం కుమారాః,కుమారతరాః, తైః=కుమారతరైః.

జలజామోదానన్దోత్పతిష్ణు మధువ్రతావలి శబలనాత్ - జలజానామామోదః=జలజామోదః, జలజామోదాత్ ఆనన్దః=జలజామోదానన్దః, జలజామోదానన్దేన ఉత్పతితుం శీల మేషా మస్తీతి = జలజామోదానన్దోత్పతిష్ణవః, జలజామోదానన్దోత్పతిష్ణవశ్చ తే మధువ్రతాశ్చ = జలజామోదానన్దోత్పతిష్ణు మధువ్రతాః, జలజా మోదానన్దోత్పతిష్ణు మధువ్రతానామావలిః = జలజామోదానందోత్పతిష్ణుమధువ్రతావలిః, జలజామోదానన్దోత్పతిష్ణు మధువ్రతావల్యా శబలనం = జలజామోదానన్దోత్పతిష్ణు

మధువ్రతావలి శబలనం, తస్మాత్=జలజామోదానన్దోత్పతిష్ణు మధువ్రతావలి శబలనాత్.

*గుఞ్జాపుఞ్జశ్రియం* - గుఞ్జానాం పుంజః = గుఞ్జాపుఞ్జః, గుఞ్జాపుఞ్జస్య శ్రీః=గుఞ్జాపుఞ్జశ్రీః, తాం=గుఞ్జాపుఞ్జశ్రియం.

భావము :

కుంకుమపూవుకంటెను నెఱ్ఱని బాలసూర్యుని కిరణము లచ్చటి తామర కొలని పరిసరములలోఁ బడుచుండగా నా కిరణముల మధ్య నల్లని **తుమ్మెదలు**, **పద్మ** గంధముల **పరిమళముల** వలని యానందముతోఁ బైకెగురు **చుండినవి**. **బాల** సూర్యుని కిరణము లరుణ వర్ణములుగను, తుమ్మెదలు నీలవర్ణములుగను నుండుటవలన నవి రెండును కలియుట వలన పైన నలుపు వన్నెయు నడుగున నెఱుపు వన్నెయు గల్గిన గురువిందల రాశియొక్క శోభ గలవిగా నుండినవి. ॥38॥

శ్లో. రచయతి రుచిః శోణీ మేతాం కుమారితరా రవేః
యదలిపటలీ నీలీకర్తుం వ్యవస్యతి పాతుకా
అజని సరసీ కల్మాషీ తద్ధ్రువం ధవలస్ఫుట
త్కమల కలికాషణ్డైః పాణ్డూకృతోదర మణ్డలా. 39

ప. వి. రచయతి-రుచిః-శోణీమ్-ఏతామ్ - కుమారితరా-రవేః-యత్-అలిపటలీ-నీలీకర్తుం-వ్యవస్యతి-పాతుకా-అజని-సరసీ-కల్మాషీ- తత్ - ధ్రువం - ధవలస్ఫుటత్కమలకలికాషణ్డైః - పాణ్డూకృతోదరమణ్డలా.

అర్థము: యత్=ఎందువలన, కుమారితరా = మిక్కిలి లేతదైన, రవేః = సూర్యునియొక్క, రుచిః=కాన్తి, ఏతాం=ఈ, సరసీం=కొలనును, శోణీం=ఎఱ్ఱని వన్నెగలదానినిగా, రచయతి=చేయుచున్నదో, తథా= అట్లే, పాతుకా = సరస్సునకుఁ బైన పడనున్న, అలిపటలీ; అలి = తుమ్మెదల యొక్క, పటలీ = సమూహములు, నీలీకర్తుం = తమ

కాంతిచే సరస్సును నీలి వర్ణముగల దానినిగా జేయుటకు, వ్యవస్యతి = ప్రయత్నించుచున్నదో, తత్ = అందువలన, సరసీ = కొలను, ధవలస్ఫుటత్కమల కలికాషణ్డైః; ధవల = తెల్లని, స్ఫుటత్ = వికసించిన, కమలకలికా = తామర మొగ్గల యొక్క, షణ్డైః = సమూహములచే, పాణ్డూకృతోదరమణ్డలా, పాణ్డూకృత = తెల్లఁబరుచఁబడిన, ఉదర మణ్డలా = మధ్యభాగములను గల్గినదై, కల్మాషీ = వివిధ వర్ణములు గలదిగా, అజని = ఏర్పడినది.

సమాసములు :

కుమారితరా - అతిశయేన కుమారీ, కుమారితరా.

అలిపటలీ - అలీనాం పటలీ = అలిపటలీ.

నీలీకర్తుం - అనీలాం నీలాం సమ్పద్యమానాం కర్తుం = నీలీకర్తుం.

ధవలస్ఫుటత్కమల కలికాషణ్డైః - స్ఫుటన్తి చ తాని కమలాని = స్ఫుటత్కమలాని, ధవలాని చ తాని స్ఫుటత్కమలాని = ధవలస్ఫుటత్కమలాని, ధవలస్ఫుటత్కమలానాం కలికాః = ధవలస్ఫుటత్కమల కలికాః, ధవలస్ఫుటత్కమల కలికానాం షణ్డాః = ధవలస్ఫుటత్కమల కలికాషణ్డా, తైః = ధవళస్ఫుటత్కమలకలికాషణ్డైః.

పాణ్డూకృతోదరమణ్డలా - అపాణ్డు, పాణ్డు సమ్పద్యమానం కృతం = పాణ్డూకృతం, ఉదరస్య మణ్డలం = ఉదరమణ్డలం, పాణ్డూకృత ముదర మణ్డలం యస్యాః సా = పాణ్డూకృతోదరమణ్డలా.

భావము :

బాల సూర్యునిచే లేత యెండవలన కొలనును నెఱ్ఱబాఱునట్లును, తుమ్మెదల బారు తమ నల్లకాంతిచే కొలనును నల్లబారునట్లును, వికసించిన తెల్లదామర పూవులు కొలని మధ్యభాగమునుఁ దెల్లఁబడునట్లునుఁ జేయుటవలన నీ వివిధ కాంతులచే నా కొలను చిత్రవర్ణము గలదిగా నేర్పడినది. ॥89॥

శ్లో. కమలకుశలాధానే భానో రహో పురుషవ్రతం
యదుపకురుతే నేత్రాణి శ్రీగృహత్వ వివక్షుభిః
కవిభి రుపమాదానా దమ్భోజతాం గమితా న్యసా
వపి యదతథాభావా న్ముఞ్చ త్యులూకవిలోచనే. 40

ప. వి. కమలకుశలాధానే-భానోః-అహో - పురుషవ్రతం-యత్ - ఉపకురుతే - నేత్రాణి-శ్రీగృహత్వవివక్షుభిః-కవిభిః - ఉపమాదానాత్-అమ్భోజతాం-గమితాని-అసౌ-అపి-యత్-అతథాభావాత్-ముఞ్చతి - ఉలూకవిలోచనే.

అర్థము: కమలకుశలాధానే, కమల = పద్మములకు, కుశల = క్షేమమును, ఆధానే=కల్పించుటయందు, అనగా వికాసమునుఁ గల్పించుటయందు, భానోః= సూర్యునియొక్క, పురుషవ్రతం = పురుషాభిమానము గల వాని యొక్క, వ్రతం=నియమము అనగా దృఢ నిశ్చయము, అనగా పౌరుషము, అహో =ఆశ్చర్యకరము, లేదా- అహోపురుష=పురుషాభిమానము గల్గిన వానియొక్క, వ్రతం = వ్రతము, అనగా దృఢ నియమము, యత్=ఎందువలన, అసౌ=ఈ సూర్యుఁడు, శ్రీగృహత్వం = శోభకు నెలవగుటను, నేత్రములయొక్క సౌందర్యమును వర్ణించుటయందు నుపమానమై యుండుటను, వివక్షుభిః = చెప్పగోరుచున్న, కవిభిః = కవులచే, ఉపమాదానాత్, ఉపమా = నేత్రములకు సాదృశ్యము గలదిగా వర్ణించినంత మాత్రము వలన, అంభోజతాం = తామరపూవుగా నుండుటను, గమితాని=పొందింపఁబడిన, నేత్రాణ్యపి= కన్నులనుగూడ అనగా, సౌందర్యాతిశయమునుఁ బ్రకటించుటకై పద్మములతో సమానములుగా వర్ణింపఁబడిన జనుల నేత్రములనుగూడ, ఉపకురుతే = వికసింపఁ జేయుటచే నుపకరించుచున్నాడు. వెలుగుతోఁ గూడినపుడే జనుల నేత్రములు విషయములనుఁ జూడఁగలవు. సూర్యోదయమునందు సమస్త ప్రాణులును నిద్రను వదలి కనులనుఁ దెఱచుటవలన సూర్యుడు కమలములతోఁ బోల్చబడిన కన్నులకు క్షేమమునుఁ గల్పించుచున్నాడు. ప్రకృతములైన పద్మములకు వికాసమునుఁ గల్పించి క్షేమమును సమకూర్చుచున్నాడు. యదపి=ఏ కారణము వలనను, అతథా

భావాత్ = ఉపమానమునకు సంబంధించిన కమలత్వము లేకపోవుటవలన, ఉలూకవిలోచనే; ఉలూక = గుడ్లగూబయొక్క, విలోచనే = నేత్రములను ననగా గుండ్రములును చిన్నవియునగు నేత్రములను, ముఞ్చతి = వదలుచున్నది, కాని వికసింపఁజేయుటచే నుపకరించుట లేదు. సూర్యకిరణములను సహింపనందువలన కనులను గుడ్లగూబ మూసియే యుండును. పద్మములతో సమానములైన జనుల నేత్రములను వికసింపఁజేసి యుపకారమునుఁ జేకూర్చుటవలనను నాకమలములతో సాటికాని గుడ్లగూబ కన్నులకు వికాసమునుఁ గల్గింపనందువలన క్షేమమును సమకూర్చక పోవుటవలనను సూర్యభగవానునకు పద్మములకు క్షేమమునుఁ గల్పించుటయను వ్రతమునుఁ గూర్చి చెప్పవలసిన దేమియున్నది! ఉదయకాలమున కమలములను కమలమువంటి జనుల నేత్రములను సూర్యభగవానుఁడు వికసింపఁజేయుచున్నాడని యర్థము.

సమాసములు :

కమలకుశలాధానే - కమలానాం కుశలం = కమలకుశలం, కమలకుశలస్య ఆధానం = కమలకుశలాధానం, తస్మిన్ = కమలకుశలాధానే.

పురుషవ్రతం - పురుషస్య వ్రతం = పురుషవ్రతం.

శ్రీగృహత్వవివక్షుభిః - శ్రియః గృహం = శ్రీగృహం, శ్రీగృహస్య భావః = శ్రీగృహత్వం, వక్తుమిచ్ఛవః = వివక్షవః, శ్రీగృహత్వస్య వివక్షవః = శ్రీగృహత్వవివక్షవః, తైః = శ్రీగృహత్వవివక్షుభిః.

ఉపమాదానాత్ - ఉపమాయాః దానం = ఉపమాదానం, తస్మాత్ = ఉపమాదానాత్.

అమ్భోజతాం-అమ్భసి జాయత ఇతి = అమ్భోజం, అమ్భోజస్య భావః = అమ్భోజతా, తాం = అమ్భోజతాం.

అతథాభావాత్ - తథా-భావః = తథాభావః, న తథాభావః = అతథాభావః, తస్మాత్ = అతథాభావాత్.

ఉలూకవిలోచనే - ఉలూకస్య విలోచనే = ఉలూకవిలోచనే, తే = ఉలూకవిలోచనే.

భావము :

సూర్యుడు కమలములకు క్షేమమును గల్పించుటయందలి దృఢమగు వ్రతము ఆశ్చర్యకరము. ఏలయనగా, నీ సూర్యుడు, కవులచే, నేత్రముల సౌందర్యమును వర్ణించుటయందు నుపమానముగాఁ జేకొనఁబడిన కమలముల ధర్మమును, బొందింపఁబడిన జనుల నేత్రములను సైతము వికసింపఁజేసి యుపకరించుచున్నాడు. అనగా సూర్యోదయమందు ప్రాణులన్నియు నిద్రను వదలి కన్నులను తెఱచుచున్నవి. కాన నీ విధముగా కమలములకు సమానము లైన ప్రాణుల నేత్రములను, కమలములను వికసింపఁజేయుటచే సూర్యభగవానుని క్షేమమును సమకూర్చుట యను వ్రతము స్పష్టమగుచున్నది. ఉపమానమగు కమలత్వము లేనందువలన, గుడ్లగూబయొక్క గుండ్రని చిన్న కన్నులను వికసింపఁజేయుట లేదు. ఏలయనగా, గుడ్లగూబ కన్నులు సూర్య కిరణములను సహింపఁజాలవు. కమలములవలెనున్న జనుల లోచనములను వికసింపఁజేయుట వలనను నట్లు కాని గుడ్లగూబ కన్నులను వికసింప జేయకపోవుట వలనను సూర్యభగవానుని కమలకుశలాధాయకత్వ వ్రతము సిద్ధమగుచున్నది. అనగా సూర్యోదయ కాలమున, తామరపూవులను వలె జనుల నేత్రములనుఁగూడ సూర్యుడు వికసింపఁజేయుచున్నాడని యాశయము. ॥40॥

శ్లో, యదతిమహతీ భక్తి ర్భానౌ తదేన ముదిత్వరం
త్వరిత ముపతిష్ఠ స్వాధ్వన్య! త్వ మధ్వరపద్ధతేః,
ఇహ హి సమయే మన్దేహేషు వ్రజ న్త్యుదవజ్రతాం
అభి రవి ముపస్థానోత్క్షిప్తా జలాఞ్జలయః కిల. 41

ప. వి. యత్‌- అతిమహతీభక్తిః - భానౌ- తత్‌- ఏనం- ఉదిత్వరం- త్వరితమ్‌ - ఉపతిష్ఠస్వ-అధ్వన్య-త్వం-అధ్వరపద్ధతేః- ఇహ- హి - సమయే- మన్దేహేషు-వ్రజన్తి- ఉదవజ్రతామ్‌- అభి - రవిమ్‌- ఉపస్థానోత్క్షిప్తాః- జలాఞ్జలయః - కిల.

అర్థము : అధ్వర పద్ధతేః, అధ్వర=యజ్ఞముయొక్క, పద్ధతేః=మార్గమునకు, అధ్వన్య=నిత్యపు బాటసారీ! అనగా నిరన్తరము యజ్ఞము నాచరించు

ఓ మహారాజా! యత్ = ఎందువలన, త్వం = నీవు, భానౌ = సూర్యుని యందు, అతిమహతీభక్తిః – అతిమహతీ = మిక్కిలి మెండైన, భక్తిం = భక్తిగలవాడవుగ నున్నావో, తత్ = అందువలన, ఉదిత్వరం = ఉదయించుచున్న, ఏనం = ఈ సూర్యుని, త్వరితం = శీఘ్రముగా, ఉపతిష్ఠస్వ = కొలువుము, హి = ఏలయనగా, ఇహ = ఈసమయమునందు ననగా నీ సూర్యోదయకాలమందు, రవిమభి = సూర్యు నుద్దేశించి, ఉపస్థానోత్క్షిప్తాః; ఉపస్థాన = ఉపాసనయందు, ఉత్క్షిప్తాః = పైకిఁ జల్లఁ బడిన, జలాఞ్జలయః = జలముతో నిండిన దోసెళ్లు, మన్దేహేషు = మన్దేహు లను రాక్షసులయందు, ఉదవజ్రతాం = ఉదకరూపమైన వజ్రాయుధ ముగ నుండుటను, వ్రజన్తి కిల = పొందుచున్నవిగదా? ఈ విషయమున- ''తదుహ వా ఏతే బ్రహ్మవాదినః పూర్వాభిముఖాః సంధ్యాయాం గాయత్ర్యాఽభిమన్త్రితా ఆప ఊర్ధ్వం విక్షిపన్తి తా ఏతా ఆపో వజ్రీ భూత్వా తాని రక్షాంసి మందేహారుణే ద్వీపే ప్రక్షిపన్తి'' అను శ్రుతి పైనఁ జెప్పిన యర్థమునే చెప్పుచున్నది.

సమాసములు :

అతిమహతీభక్తిః - అత్యన్తం మహతీ = అతిమహతీ, అతిమహతీ, భక్తిః యస్య సః = అతిమహతీభక్తిః.

ఉదిత్వరం - ఉదేతీతి = ఉదిత్వరః, తం = ఉదిత్వరం.

హే అధ్వన్య - అధ్వాన మలం గచ్ఛతీతి = అధ్వన్యః, తస్య సంబుద్ధిః = హే అధ్వన్య.

అధ్వరపద్ధతేః - అధ్వరస్య పద్ధతిః = అధ్వరపద్ధతిః, తస్యాః = అధ్వరపద్ధతేః.

ఉదవజ్రతాం - ఉదకమయః వజ్రః = ఉదవజ్రః, ఉదవజ్రస్య భావః = ఉదవజ్రతా, తామ్ = ఉదవజ్రతామ్.

ఉపస్థానోత్క్షిప్తాః - ఉపస్థానే ఉత్క్షిప్తాః = ఉపస్థానోత్క్షిప్తాః.

జలాఞ్జలయః - జలానా మఞ్జలయః = జలాఞ్జలయః.

భావము :

నిత్యము యజ్ఞమార్గ నిరతుఁడవైన యో నల మహారాజా! నీవు సూర్య భగవానుని యందు మిక్కిలి గొప్ప భక్తి గలవాడవు, కావున నుదయించు నీ సూర్యుని శీఘ్రముగాఁ గొలువుము. ఏలయనగా, సూర్యోదయకాలమందు సూర్యు నుద్దేశించి యుపాసనాకాలమందు పైకి వెదఁజల్లఁబడిన యుదకాఞ్జలులు మన్దేహాలను రాక్షసుల పై వజ్రాయుధత్వమును వహించి పడుచున్నవి. ప్రతి దినము సూర్యు నుపరోధించుటకై వచ్చెడి యారాక్షసులను మన్దేహారుణ మనెడి ద్వీపమునందు బడద్రోయుచు సూర్య మార్గమునకుఁ బ్రతిబంధకములనుఁ దొలగించుచున్నవి. ఇట్లు ప్రతిసంధ్యయందును గాయత్రీమన్త్రముతో నభి మంత్రితములగు నుదకములు వజ్రాయుధములై సూర్యమార్గము నవరోధించు రాక్షసులనుఁ బారద్రోలునని శ్రుతి చెప్పుచున్నది. ॥41॥

శ్లో. ఉదయశిఖరిప్రస్థావస్థాయినీ ఖనిరక్షయా
శితతరమహోమణిక్యానా మహర్మణిమణ్డలీ,
రజనిదృషదం ధ్వాన్తశ్యామాం విధూయ పిధాయికాం
న ఖలు కతమే నేయం జానే జనేన విముద్రితా. 42

ప. వి. ఉదయశిఖరిప్రస్థావస్థాయినీ- ఖనిరక్షయా- శితతరమహోమాణిక్యానాం - అహర్మణిమణ్డలీ-రజనిదృషదం-ధ్వాన్తశ్యామాం-విధూయ-పిధాయికాం- న-ఖలు-కతమేన-ఇయం-జానే-జనేన-విముద్రితా.

అర్థము. ఇయం = ఈ కనఁబడు, అహర్మణిమణ్డలీ, అహర్మణి = సూర్యుని యొక్క, మణ్డలీ=బిమ్బమనెడి, ఉదయశిఖరిప్రస్థావస్థాయినీ, ఉదయ శిఖరి = ఉదయపర్వతము యొక్క, ప్రస్థ=సానువులయందు, అవస్థా యినీ=నెలకొనిన, అక్షయా =నాశములేని, శితతరమహోమాణిక్యానాం, శితతర=మిక్కిలి లేతనైన, మహః=కాన్తులనెడి, మాణిక్యానాం= పద్మరాగములనెడి రత్నములయొక్క, ఖని=గని, ధ్వాన్తశ్యామాం, ధ్వాన్త=చీకటిచే, శ్యామాం=నల్లనైన, పిధాయికాం = గనియొక్క ద్వారమునుఁ గప్పునట్టి, రజనిదృషదం; రజని = రాత్రియనెడు,

దృషదం=రాతిని, విధూయ=తొలగించి, కతమేన=ఏ, జనేన=జనముచే, విముద్రితా=తెఱువఁబడినది? ఇతి=అని, న జానే ఖలు=తెలియక యున్నాను గదా!

వి. ఇచ్చట సూర్యమండలాదులయందు ఖనిత్వము నారోపించుటవలన రూపకాలఙ్కారము.

సమాసములు :

*ఉదయశిఖరి ప్రస్థావస్థాయినీ* - ఉదయస్య శిఖరీ=ఉదయశిఖరీ, ఉదయశిఖరిణః ప్రస్థాః = ఉదయశిఖరిప్రస్థాః, ఉదయశిఖరిప్రస్థేషు, అవతిష్ఠతీతి=ఉదయశిఖరి ప్రస్థావస్థాయినీ.

*అక్షయా* - అవిద్యమానః క్షయః యస్యాః సా=అక్షయా.

*శివతరమహోమాణిక్యానాం* - అత్యన్తం శివాని = శివతరాణి, శివతరాణి చ తాని మహాంసి చ=శివతరమహాంసి, శివతరమహాంస్యేవ మాణిక్యాని=శివతరమహోమాణిక్యాని, తేషాం=శివతరమహోమాణిక్యానాం.

*అహర్మణిమణ్డలీ* - అహ్నః మణిః=అహర్మణిః, అహర్మణేః మణ్డలీ=అహర్మణి మణ్డలీ.

*రజనిదృషదం* - రజని రేవ దృషత్ = రజనిదృషత్, తాం=రజనిదృషదం.

*ధ్వాన్తశ్యామాం* - ధ్వాన్తేన శ్యామా=ధ్వాంతశ్యామా, తాం=ధ్వాన్తశ్యామాం, లేదా ధ్వాన్తమివ శ్యామా = ధ్వాన్తశ్యామా, తాం = ధ్వాన్తశ్యామాం.

భావము :

ఈ సూర్యమండలము, ఉదయపర్వతపు చఱియలయందు నెలకొనినట్టి, తఱుగులేని, మిక్కిలి లేతకాన్తులనెడి పద్మరాగములకు గనివంటిది. ఇది చీకటిచే నల్లనిదియును, (చీకటివలె నల్లనిదియును), ప్రపంచపుగనికి ప్రవేశద్వారమును మూయునదియునగు రాత్రియనెడి శిలనుఁ దొలగించి యెవనిచే వెలుపలికిఁ

దేఁబడినదో తెలియుటలేదు. గనికి శిలను అడ్డముగా వేయునట్లు సూర్యమండల మనెడి కాంతిరత్నములగనికి నల్లనిరాత్రియను శిల యడ్డము వేయఁబడినదనియు నది యుదయ కాలమున నెవ్వనిచే వెలుపలికిఁ దేఁబడినదో తెలియదనియు సారాంశము. ॥42॥

శ్లో. సురపరివృఢః కర్ణాత్ ప్రత్యగ్రహీత్ కిల కుణ్డల
ద్వయ మథ ఖలు ప్రాచ్యై ప్రాదా న్ముదా సహి తత్పతిః,
విధు రుదయభా గేకం తత్ర వ్యలోకి విలోక్యతే
నవతరకరస్వర్ణస్రావి ద్వితీయ మహర్మణిః. 43

ప. వి. సురపరివృఢః-కర్ణాత్- ప్రత్యగ్రహీత్-కిల- కుణ్డలద్వయమ్-అథ-ఖలు-ప్రాచ్యై-ప్రాదాత్- ముదా-సః- హి-తత్పతిః-విధుః-ఉదయభాక్-ఏకం-తత్ర-వ్యలోకి-విలోక్యతే-నవతరకరస్వర్ణస్రావి-ద్వితీయమ్-అహర్మణిః.

అర్థము: సురపరివృఢః; సుర=దేవతలకు, పరివృఢః=రాజైన ఇంద్రుఁడు, కర్ణాత్ = కర్ణునుండి, కుణ్డలద్వయం=కుండలముల జంటను అనగా సూర్యు డొసంగిన సహజము నక్షయమునగు కుండలముల జంటను, ప్రత్యగ్రహీత్ కిల=కోరిపుచ్చుకొనెను గదా, అథ=పుచ్చుకొనినపిదప, ప్రాచ్యై=తూర్పుదిక్కునకై, ముదా=సంతోషముతో, ప్రాదాత్ ఖలు= ఆ మండలములను రెంటి నిచ్చెను. హి=ఏలయనగా, సః=ఆ ఇంద్రుడు, తత్పతిః; తత్=ఆ తూర్పు దెసకు, పతిః=భర్త, భార్యకు భర్త సొమ్ము నొసంగుట యుక్తము గదా, తత్ర=ఆ కుణ్డలములకు రెంటికిని మధ్య, ఏక=ఒక కుణ్డలము, ఉదయభాక్=ఉదయమునుఁ బొందిన, విధుః (ఇవ)=చంద్రుడు వలె, వ్యలోకి=చూడఁబడుచున్నది. నవతరకరస్వర్ణస్రావి; నవతర=మిక్కిలి నూతనములై, కర=కిరణములను, స్వర్ణ=బంగారులను, స్రావి=కార్చునట్టి, ద్వితీయం=రెండవకుణ్డలము, అహర్మణిః (ఇవ)=సూర్యుడువలె, విలోక్యతే=చూడఁబడుచున్నది.

సమాసములు :

సురపరివృఢః- సురాణాం పరివృఢః=సురపరివృఢః.

కుణ్డలద్వయమ్ - కుణ్డలయోః ద్వయం=కుణ్డలద్వయమ్, తత్=కుణ్డలద్వయమ్.

తత్పతిః- తస్యాః పతిః=తత్పతిః.

ఉదయభాక్ - ఉదయం భజతీతి=ఉదయభాక్.

నవతరకరస్వర్ణస్రావి- అత్యంతం నవాః=నవతరాః, నవతరాశ్చ తే కరాశ్చ=నవతరకరాః, నవతరకరా ఏవ స్వర్ణాని, నవతరకరస్వర్ణాని నవతరకరస్వర్ణాని స్రావయతీతి=నవతరకరస్వర్ణస్రావి.

అహర్మణిః-అహ్నః మణిః= అహర్మణిః.

భావము :

దేవతలకు ప్రభువైన యింద్రుడు కర్ణునిఁ బ్రార్థించి యతనికి సూర్యు డొసఁగిన (కవచమును) కుణ్డలద్వయమును సంపాదించెను. ఈ కవచకుణ్డలము లా కర్ణుని శరీరమునందు సహజముగా నతికినవి. కాన వానిని కర్ణుఁడు వాడిమి గల కత్తితో కోసి శరీరమునుండి తీసి యింద్రున కొసంగెను. ఆ విషయమే- "తతో నికృత్య గాత్రాణి శస్త్రేన నిశితేన సః, ప్రాయచ్ఛ ద్దేవరాజాయ దివ్యం వర్మ సకుణ్డలమ్" అని భారతమునఁ జెప్పఁబడినది. అట్లు కుండలములనుఁ దీసికొనిన పిదప నింద్రుడు, ఆ రెంటిని, తన భార్యయగు తూర్పు దిక్కున కిచ్చెనేమో యని భావింపఁబడుచున్నది. భర్త భార్యకు సొమ్ము లొసంగుట యుచితముగదా! ఆ కుణ్డలములలో నొకటి యుదయకాలపు చంద్రుడువలెను, క్రొత్తవెలుగులను పసిడిధారలను స్రవింపఁజేయుచున్న మరియొక కుణ్డలము సూర్యుడువలెను జనులచేఁ జూపఁబడినది ॥43॥

శ్లో. దహన మవిశ ద్దీప్తి ర్యాఽస్తఙ్గతే గతవాసర
ప్రశమసమయప్రాప్తే పత్యౌ వివస్వతి రాగిణీ ।
అధరభువనాత్ సోద్ధృత్యైషా హఠా త్తరణేః కృతా
ఽమరపతిపురప్రాప్తి ర్ధత్తే సతీవ్రతమూర్తితామ్. 44

ప వి. దహనమ్-అవిశత్-దీప్తిః-యా-అస్తం-గతే - గతవాసర ప్రశమసమయ ప్రాప్తే-పత్యౌ-వివస్వతి-రాగిణీ-అధరభువనాత్-సా-ఉద్ధృత్య - ఏషా - హఠాత్-తరణేః-కృతామర పతిపుర ప్రాప్తిః-ధత్తే-సతీవ్రతమూర్తితాం

అర్థము: రాగిణీ = సాయంకాలమునకు సంబంధించినందువలన నెఱ్ఱనైనది యును, (అనురాగము గలదియు) నగు, యా=ఏ, దీప్తిః=సూర్యుని కాంతి, (ఒకానొక స్త్రీ) గతవాసరప్రశమ సమయప్రాప్తే; గతవాసర= కడచిన దినమునందు, ప్రశమ సమయ = తేజస్సునకును (జీవనమున కును) నవసాన సమయమును, ప్రాప్తే = సమీపింపగా, పత్యౌ = పాలకుఁడును (భర్తయు) నగు, వివస్వతి = సూర్యుడును, (ఒకానొక పురుషుడును), అస్తం=అస్త పర్వతమును, (కానరాక యుండుటను), గతే సతి=పొందగా, దహనం=అగ్నిని, అవిశత్ = ప్రవేశించినదో, సా=అట్టి, ఏషా=ఈ, దీప్తిః = కాన్తియు (ఒకానొక పతివ్రతయు) హఠాత్ = బలము వలన ననగా తన పుణ్యముయొక్క ప్రభావము వలన, అధరభువనాత్ = దిగువ లోకము నుండి అనగా పాతాలము నుండియు (నరకము నుండియు) ఉద్ధృత్య=పైకెత్తి, తరణేః=భర్త యగు పురుషుని యొక్క, (ఒకానొక పురుషుని యొక్క) కృతామరపతి పురప్రాప్తిః; కృత=సంపాదింపఁబడిన, అమరపతి=ఇంద్రునియొక్క, పురప్రాప్తిః=తూర్పునందలి నగర లాభము (స్వర్గ లాభము) గల్గినదై, సతీవ్రతమూర్తితాం; సతీవ్రత = తీవ్రత్వముతోఁ గూడిన, సతీ = పతివ్రత యొక్క, వ్రత = ధర్మము లేదా నియమము గల్గిన, మూర్తితాం = అకారమును, రూపమును, గల్గియుండుటను, ధత్తే = ధరించుచున్నది.

వి. ఇచ్చట ప్రస్తుతమైన సూర్యదీప్తి యొక్క విశేషణముల సామ్యముచే నప్రస్తుతమగు పతివ్రత, ప్రతీయమాన మగుటవలన సమాసోక్త్య లఙ్కారము.

సమాసములు :

*గతవాసర ప్రశమ సమయప్రాప్తే* - గత శ్చాసౌ వాసరశ్చ = గత వాసరః, గతవాసరే, ప్రశమః = గతవాసరప్రశమః, గతవాసరప్రశ

మస్య సమయః = గతవాసర ప్రశమ సమయః, గతవాసర ప్రశమ సమయం ప్రాప్తః=గతవాసర ప్రశమ సమయ ప్రాప్తః, తస్మిన్ = గతవాసర ప్రశమసమయప్రాప్తే.

*రాగిణీ*-రాగః అస్యాః అస్తీతి=రాగిణీ

*అధరభువనాత్* - అధరం చ తత్ భువనం చ = అధర భువనం, తస్మాత్ = అధరభువనాత్.

*కృతామర పురప్రాప్తిః*-అమరాణాం పతిః=అమరపతిః, అమరపతేః పురం = అమరపతిపురం, అమరపతిపురస్య ప్రాప్తిః = అమరపతి పురప్రాప్తిః, కృతా అమరపతిపురప్రాప్తిః యయా సా = కృతామర పతిపురప్రాప్తిః.

*సతీవ్రతమూర్తితాం*- తీవ్రతయా సహ వర్తత ఇతి=సతీవ్రతా, సత్యః వ్రతం యస్యాః సా = సతీవ్రతా,సతీవ్రతా చ సా సతీవ్రతా చ = సతీవ్రతా, సతీవ్రతా మూర్తిః యస్యా సా=సతీవ్రతామూర్తిః, సతీవ్రతా మూర్తేః భావః=సతీవ్రతమూర్తితా, తాం=సతీవ్రతమూర్తితాం.

**భావము :**

రాగిణి యనగా రక్తవర్ణము గల్గినదియు ననురక్తురాలైనదియు నగు సూర్యదీప్తియు (ఒకానొకస్త్రీయు) నిన్నటిదినమున సాయంకాలము (అవసాన కాలము) ప్రాప్తింపగా, భర్తయైన సూర్యుడు (తన పురుషుడు) అస్తాద్రిని (కానరాకపోవుటను) బొందగా నగ్నినిఁ బ్రవేశించినది. ''అగ్నిం వా ఒఒదిత్యః సాయం ప్రవిశతి"యను శ్రుతి ననుసరించి సాయంకాలమున సూర్యు డనగా సూర్యునిదీప్తి యగ్నినిఁ బ్రవేశించును. అట్లే ''మృతే భర్తరి బ్రహ్మచర్యం తదన్వారోహణం వా'' అను స్మృతి ననుసరించి సహగమనమునుఁ గావింప వలయును. ఇచ్చట సూర్యు డస్తమింపగనే సూర్యదీప్తి యను నతని కాంత యగ్నినిఁ బ్రవేశించినది. అట్లే సూర్యకాన్తి యను స్త్రీ తన పురుషుడు మరణింపగా నతనితోడ తాను సహగమనముఁ గావించినదని యర్థము. పిదప నాసూర్యుని దీప్తియు నాసహగమనము గావించిన పతివ్రతయు తన పుణ్యప్రభావ బలమువలన తన భర్తయగు సూర్యుని పైకెత్తుకొని, తూర్పు దెసయందలి యింద్రలోకమునుఁ (స్వర్గలోకమును) బొందించుటనుఁ జేయగల్గినదై తీవ్రమైన పతివ్రతా ధర్మము

యొక్క రూపమును ధరించుచున్నది. ఇచ్చట సూర్యకాంతి పతివ్రతయగు స్త్రీ వలె నుండి భర్తయగు నా సూర్యుడు, అస్తమించుటయను మరణమునుఁ బొందగా నా కాంతి సహగమనముఁ జేయుటకై యగ్నినిఁ బ్రవేశించినది. పూర్వము భర్తలు మరణించినపుడు భార్యలు సహగమనము చేయుట ప్రసిద్ధము. సాయంకాలము సూర్యుని దీప్తి యగ్నినిఁ బ్రవేశించునని శాస్త్రము. అది యిచ్చట సహగమనము చేయునట్లుభావింపఁబడినది. ఆ కాంతి యనెడి పతివ్రత మఱుదినము తన పాతివ్రత్య ప్రభావముచే పాతాలమునఁ బడిన సూర్యుని (నరకమునుఁ బొందిన తన భర్తను) నుద్ధరించినది. ఆ సూర్యుని భార్యయగు కాంతి తన భర్తయగు సూర్యు నుద్ధరించి తూర్పుదెసయందలి యింద్రనగరమునుఁ బొందింపఁ జేసినది. పతివ్రత యగు నాస్త్రీ తన భర్తను స్వర్గమును బొందింపఁజేసినది. కావుననే—

"వ్యాలగ్రాహీ యథా సర్పం బలా దుద్ధరతే బిలాత్ ।
తద్వ ద్భర్తార మాదాయ తేనైవ సహ మోదతే". యని స్మృతి వచనము ననుసరించి, పాములఁబట్టువాఁ డెట్లు పామునుఁ బుట్టనుండి పైకెత్తి దానితోడ సంతోషించునో యట్లే పతివ్రతయు తన భర్త నుద్ధరించి యతనితో నానందించునని తెలియుచున్నది. ఇట్లు సూర్యకాంతియు పతివ్రతా ధర్మమును వహించినదై సూర్యునిఁ బాతాలము నుండి యుద్ధరించి మఱుదినము తూర్పుదెస యందలి యింద్రనగరమునఁ బ్రతిష్ఠితునిఁ జేయుచున్నదనియు, క్రమముగా సూర్యుడు మింటిపైకిఁ బోఁగొలఁది యా కాంతియు రాగిణియగుచు ననగా రక్త వర్ణము నొందుచు సతీవ్రతమూర్తిత్వ మనగా తీక్ష్ణమగు దేహమునుఁ గల్గియుండు టను దాల్చుచున్నదనియు నాశయము ॥44॥

శ్లో. బుధజనకథా తథ్యైవేయం తనౌ తనుజన్మనః
పితృశితిహరిద్వర్ణాద్వ్యాహారజః కిల కాలిమా,
శమన యమునా క్రోడైః కాలై రిత స్తమసాం పిబా
దపి యదమలచ్ఛాయాత్ కాయా దభూయత భాస్వతః ॥45॥

ప. వి. బుధజనకథా-తథ్యా-ఏవ-ఇయం-తనౌ-తనుజన్మనః- పితృశితిహరిద్వర్ణా ద్వ్యాహారజః-కిల-కాలిమా-శమనయమునాక్రోడైః-కాలైః-ఇత-తమసాం- పిబాత్-అపి-యత్-అమలచ్ఛాయాత్-కాయాత్- అభూయత - భాస్వతః.

అర్థము: తనుజన్మనః;తను=శరీరమునుండి,జన్మనః=సంభవించిన బిడ్డకు, తనౌ =శరీరమునందు,కాలిమా=నల్లఁదనము,పితృశితిహరిద్వర్ణా ద్యాహారజః; పితృ=తల్లిదండ్రులయొక్క, శితిహరిద్వర్ణాది = నలుపు, ఆకు పచ్చ యను, వర్ణ=రంగులు, ఆది=మొదలైనవిగల, ఆహారజః = ఆహారము వలన నేర్పడినవి. ఇయం కిల=ఇటువంటి, బుధజనకథా=పండితుల వచనము, తథ్యైవ=సత్యమైనదే. యత్= ఎందువలన, అమలచ్ఛాయాత్, అమల=మిక్కిలి నిర్మలమైన, ఛాయాత్ = కాంతిగల్గిన, తమసాం=చీకట్లను, పిబాత్ =పానము చేసెడి, ఇతః=ఈ కనబడుచున్న, భాస్వతః = సూర్యునియొక్క, కాయాత్ = శరీరమునుండి, కాలైః=నల్లనైన, శమనయమునాక్రోడైః=యముడును, యమునయు, శనైశ్చరుడను వారిచే, అభూయత=ఉద్భవింపఁబడుట (అభూ నది).నల్లని చీకటిని ఆహారముగాఁగల్గిన వాడగుటచేతనే స్వచ్ఛకాంతిగల సూర్యునకును సంతానములైన యముడును, యమునయు, శనైశ్చరుడును, నల్లని మైచాయతోడనే జన్మించిరి. కాన తల్లిదండ్రుల శరీరకాంతివలన బిడ్డలకు శరీరమునఁ గాంతి గలుగదు. మఱేమనగా - వారు తినెడి యాహారము నుండియే బిడ్డలకు శరీరకాంతి గలుగుచున్నది. సూర్యుడు తెల్లనివాడైనను నతని యాహారమైన చీకటి నల్లనైనందువలన నతని సంతానము నల్లని వన్నెతోఁ బుట్టినదని యాశయము.

వి. యమాదుల శరీరముల నల్లఁదనమునకు సూర్యునితమోభక్షణము కారణము కాకపోయినను కారణముగా నుత్ప్రేక్షించుటవలన నుత్ప్రేక్షాలఙ్కారము.

సమాసములు :

*బుధజనకథా* - బుధా ఏవ జనాః=బుధజనాః, బుధజనానాం కథా= బుధజనకథా.

*తనుజన్మనః*-తనోః జన్మ యస్య సః=తనుజన్మా, తస్య=తనుజన్మనః.

*పితృశితిహరిద్వర్ణాద్యాహారజః*-శితిశ్చ హరిచ్చ=శితిహరితౌ, శితిహరితౌ చ తౌ వర్ణౌ చ=శితిహరిద్వర్ణౌ, శితిహరిద్వర్ణౌ ఆదీ యస్య సః=శితిహరిద్వర్ణాదిః, శితిహరిద్వర్ణాది శ్చాసౌ ఆహారశ్చ=శితిహరిద్వర్ణాద్యాహారః, శితిహరిద్వర్ణాద్యాహారాత్ జాయతే ఇతి= శితిహరిద్వర్ణాద్యాహారజః,

శమనయమునా క్రోడైః- శమనశ్చ యమునా చ క్రోడశ్చ= శమన యమునా క్రోడాః, తైః=శమనయమునాక్రోడైః.
అమలచ్ఛాయాత్ - అమలా ఛాయా యస్య సః = అమల ఛాయః, తస్మాత్=అమలచ్ఛాయాత్ ।

భావము :

బిడ్డ యొడలియందు నల్లదనమునకు తల్లిదండ్రులు తినెడి నలుపు పసుపు మున్నగు వన్నెలుగల యాహారమే కారణముకాని తల్లిదండ్రుల శరీర కాంతి కారణముగాదని పండితులు చెప్పెడి విషయము సత్యమే యగుచున్నది. ఏలయనగా స్వచ్ఛమైన కాంతి గల్గిన సూర్యునకుఁ బుట్టిన యముడును, యమునయు శనైశ్చరుడును స్వచ్ఛముగా నుండక నల్లగనే యున్నారు. ఇందు లకు కారణము సూర్యుని యాహారమగు చీకటి నల్లగ నుండుటయే. నల్లని చీకటినిఁ డిండిగాఁ గల్గిన సూర్యునికి నల్లని బిడ్డలు పుట్టుట యుక్తమే యగు చున్నది. ॥45॥

శ్లో. అభజత చిరాభ్యాసం దేవః ప్రతిక్షణదాఽత్యయం
దినమయమయం కాలం భూయః ప్రసూయ తథా రవిః
న ఖలు శకితా శీలం కాలప్రసూతి రసౌ పురా
యమయమునయో ర్జన్మాధానేఽప్యనేన యథోజ్ఝితమ్. 46

ప. వి. అభజత - చిరాభ్యాసం-దేవః-ప్రతిక్షణదాత్యయం-దినమయమ్-అయం- కాలం - భూయః - ప్రసూయ-తథా-రవిః-న-ఖలు-శకితా-శీలం- కాల ప్రసూతిః - అసౌ - పురా-యమయమునయోః-జన్మాధానే-అపి-అనేన- యథా-ఉజ్ఝితం.

అర్థము : అయం = ఈ యుదయించుచున్న, దేవః =ప్రకాశించు, రవిః = సూర్యుఁడు, ప్రతిక్షణదాత్యయం = ప్రత్యేక రాత్రియొక్క ముగింపు నందు, దినమయం=దివసరూపమైన, కాలం = సమయమును (నలుపు వన్నెను) భూయః=మఱల మఱల, ప్రసూయ = ఉత్పాదించి, తథా=

అటువంటి, చిరాభ్యాసం=బహుకాలపు వాడుకను, అభజత=పొందెను, యథా=ఏ విధముగా, అనేన=ఈ సూర్యునిచే, అసౌ=ఈ చాలాకాలము అభ్యసింపఁబడిన, శీలం = స్వభావముగా నేర్పడిన, కాలప్రసూతిః, కాల=సమయమునకును (నలుపు వన్నెకును), ప్రసూతిః=ఉత్పాదన, పురా=పూర్వము అనగా వర్తమానమున కంటెను పూర్వము (సమయ మునుఁ బుట్టించుటకుఁ దర్వాతను) యమ యమునయోః=తన బిడ్డలగు యమధర్మరాజునకు, యమునకును, జన్మాధానే=పుట్టుక నేర్పఱచుట యందును, ఉజ్ఝితుం = విడచుటకు, న శకితా ఖలు=సమర్థుఁడు కాని వానివలె నున్నాఁడు.

వి. కాలశబ్దముచే వాచ్యమగు సమయమునకును, ప్రతీయమానమగు కృష్ణ వర్ణమునకు నభేదము నధ్యవసించి సూర్యభగవానుడు ప్రతిదినము కాలము నుత్పాదించి సంపాదించిన, యభ్యాసముచే, తన బిడ్డలగు యమ యమునలయందు కాలమును (నల్లఁదనమును) నుత్పాదించినట్లు భావించుట వలన నుత్ప్రేక్ష కాలశబ్ద వాచ్యములగు సమయమునకును, కృష్ణవర్ణము నకు నభేదాధ్యవసాయముఁ జేయుటవలన అతిశయోక్తి. ఈ రెండిటిని నాశ్రయమొక్కటి యగుటవలన సఙ్కరము.

సమాసములు :

చిరాభ్యాసం - చిర మభ్యాసః=చిరాభ్యాసః, తం=చిరాభ్యాసం.

ప్రతిక్షణదాత్యయం- క్షణదానా మత్యయః = క్షణదాత్యయః, క్షణ దాత్యయే క్షణదాత్యయే=ప్రతిక్షణదాత్యయం.

దినమయం - దినస్య రూపం యస్య సః=దినమయః, తమ్ = దిన మయమ్.

కాలప్రసూతిః - కాలస్య ప్రసూతిః=కాలప్రసూతిః.

యమయమునయోః-యమశ్చ యమునా చ=యమ యమునే, తయోః= యమ యమునయోః.

జన్మాధానే - జన్మనః ఆధానం=జన్మధానం, తస్మిన్=జన్మాధానే.

భావము :

ఉదయించుచున్న సూర్యభగవానుఁడు ప్రతి రాత్రియొక్క యవసానము నందును దినరూపమైన కాలమును, అనగా సమయమును ( నలుపు వన్నెను ) పలుమాఱు లుత్పాదించి గొప్ప యనుభవమును సంపాదించెను. ఆ యనుభవ మతనికి స్వభావముగనే యేర్పడినది. ఆ వాడుక పూర్వము తన బిడ్డలగు యముని యమున నుత్పత్తిచేయు సమయమందు విడువజాలక పోయినవాడై వారి యందును నట్టి కృష్ణవర్ణమునే కల్పించెను. ॥46॥

శ్లో. రుచిరచరణః పూతోరుశ్రీ సనాథరథః శనిం
శమనమపి స త్రాతుం లోకా నసూత సుతావితి,
రథపద కృపాసింధు ర్బంధు ర్దృశామపి దుర్జనై
ర్యదుపహసితో భాస్వా న్నాస్మాన్ హసిష్యతి కః ఖలః . 47

ప.వి. రుచిరచరణః-సూతోరుశ్రీసనాథరథః-శనిం-శమనమ్-అపి-సః-త్రాతుం-లోకాన్-అసూత-సుతౌ-ఇతి-రథపదకృపాసింధుః - బంధుః - దృశామ్-అపి-దుర్జనైః-యత్-ఉపహసితః-భాస్వాన్-న - అస్మాన్ - హసిష్యతి-కః-ఖలః.

అర్థము: రుచిరచరణః; రుచిర=రమ్యమైన, చరణః=ఆచరణ గల్గిన, అనగా లోకమునకు నాహ్లాదమునుఁ గల్గించు స్వభావము గల్గిన, విపరీత లక్షణ ననుసరించి, రుచిరచరణః; రుచిర=తీవ్రమైన యనగా సంతాపజనక మైన, చరణః=కిరణములు గల్గిన, సూతోరుశ్రీసనాథరథః; సూత= ఉత్పాదింపఁబడిన యనగా నుదయించిన పిదప ప్రకాశితమగు, ఉరు= గొప్పదైన, శ్రీ=శోభతోడను, పక్షాన్తరమున- సూత=సారథియైన అరుణుని యొక్క, ఊరు=తొడల రెంటియొక్క, శ్రీ=శోభతో (పరిహాస వచనము), సనాథ=కూడిన, రథః=రథముగలవాడును, రథా=అట్టే, రథపదకృపాసింధుః; రథపద=చక్రవాక పక్షులయందు, కృపాసింధుః=దయాసముద్రుఁడును (అనగా తాను ఉదయించుటవలనఁ

జక్రవాక దమ్పతులనుఁ గలుపుటచే నుపకరించువాడని యర్థము). తథా= అట్లే, దృశాం=జనుల నేత్రములకు, బంధుః=చుట్టమును, (తన యుదయముచే వానిని వికసింపఁజేయును), సః=జనులందఱి చేతను నమస్కరింపఁబడునట్టి, భాస్వాన్=సూర్యుడును, శనిం=శనైశ్చరుని, (క్రూరగ్రహమై లోకముల కనిష్టమునుఁ గల్గించుటచే మిక్కిలి చెడ్డ పనులనుఁ జేయుటవలనను, కుంటివాడై నడచునపుడు వికారముగా గాన వచ్చుటచేతను సూర్యభగవానుని వంటి తండ్రికి తగనివానిని), తథా= అట్లే, శమనమపి=యముని (దమ్పతులలో నొక్కరి ప్రాణమును హరించి వారిమధ్య నెడబాపునుఁ గల్గించుటచేతను, దయలేనివా డగుట చేతను, జనుల ప్రాణములను హరించి వారికి నిరంతరము దుఃఖమునుఁ గల్గించి వారి కంధత్వమును గల్గించుటచే జనుల నేత్రములకు హానికరు డగుటవలన సూర్యభగవానునికిఁ దగిన పుత్రుడు కాని), సుతౌ=ఇద్దఱు పుత్రులను, లోకాన్=ప్రపంచమును, త్రాతుం=రక్షించుటకు అనగా విపరీత లక్షణముచే నాశముఁ జేయుటకు, అసూత=ఉత్పత్తిఁ గావించెను. ఇతి=ఇట్లు, దుర్జనైః=దుష్టులచే, యత్=ఎప్పుడు, ఉపహసితః= పరిహసింపఁబడెనో, తదా=అప్పుడు, కః ఖలః=ఏ దుష్టుడు, అస్మాన్=వన్దులైన, మమ్ములను, న హసిష్యతి=పరిహసింపఁడు. అనగా నందఱు మేము సూర్యుని వర్ణించినందువలన తప్పక పరిహ సింతురని యర్థము కాని దానివలన మాకేమియు హాని లేదు.

వి. సూర్యభగవానుడే యుపహసింపఁబడినప్పుడు వందులమైన మమ్ముల నెవ్వ డుపహసింపడని కైముతిక న్యాయముచే నర్థాంతరము సిద్ధించు చున్నది కాన నర్థాపత్త్యలఙ్కారము.

సమాసములు :

రుచిరచరణః- రుచిరాని చరణాని=రుచిరా శ్చరణాః, వా యస్య సః= రుచిరచరణః; లేదా రుచిరౌ చరణౌ యస్య సః=రుచిరచరణః.

సూతోరుశ్రీసనాథరథః- ఉర్వీ చ సా శ్రీశ్చ=ఉరుశ్రీః, సూతా చ సా ఉరుశ్రీశ్చ=సూతోరుశ్రీః, సూతోరుశ్రియా సనాథః రథః యస్య సః= సూతోరుశ్రీసనాథరథః.

పక్షాన్తరమున - సూతస్య ఊరూ = సూతోరూ, సూతోర్వోః శ్రీః = సూతోరుశ్రీః, సూతోరుశ్రియా సనాథ రథః యస్య సః = సూతోరుశ్రీ సనాథరథః.

రథపదకృపాసింధుః- రథస్య పదాని = రథపదాని, రథపదేషు కృపా = రథపదకృపా, రథపదకృపాయాః సింధుః = రథపదకృపాసింధుః.

దుర్జనైః- దుష్టాశ్చ తే జనాశ్చ = దుర్జనాః, తైః = దుర్జనైః,

భావము :

సూర్యుడు జనుల కానందమునుఁ గల్గించుటవలన రమ్యమైన యాచరణ గలవాడు. రమ్యములైన పాదములు గలవాఁడు. మనోహరములైన కిరణములు గలవాడు. విపరీతలక్షణచే తీవ్రములైన కిరణములు గలవాడు. మఱియు నా సూర్యు డుదయించునపుడే యేర్పడిన గొప్ప శోభగల రథము గలవాడు. అది గాక సారథియగు నరుణుని యొక్క తొడల రెంటివలనఁ గల్గిన శోభతో నల రారు రథము కలవాడు. ఇది పరిహాసవచనము. ఇంకను, చక్రవాకపక్షుల దంప తులను తా నుదయించిన వెంటనే కలుపుటవలన వానికి మేలొనరించిన దయా సముద్రుఁడు. అట్లే తా నుదయించుట వలన జనుల నేత్రములు విప్పారుటవలన వారి నేత్రములకు మిత్రుడు. అట్టి మహనీయుడగు సూర్యుడు శనైశ్చరుని, యముని లోకములను రక్షించుటకై యుత్పత్తిఁ చేసినాడు. విపరీత లక్షణచే లోకములను నాశముఁ జేయుటకై యుత్పత్తిఁ జేసినాడు. అంతటి గొప్పతనము గల సూర్యు డిట్టి వారినిఁ బుత్రులుగాఁ బడయుట హాస్యాస్పదము. ఏలయనగా, నతని పుత్రుఁడు శనైశ్చరుడు క్రూరగ్రహమై జనుల కెప్పుడు ననిష్టమునే గల్గించును. తండ్రియగు సూర్యు డెంత "రుచిర చరణుడో" వీడంత రుచి రహిత చరణుడు. క్రూర కృత్యముల నాచరించుటచేతను, కుంటివా డగుట చేతను వీ డరుచిర చరణుఁడు. కుంటివాడై నడచునపుడు వికారముగా నుండును. ఇట్టి వేవియుఁ దండ్రియగు సూర్యుని యందు లేవు. కాన తండ్రికి విపరీతమైన వాడు. ఇఁక రెండవ పుత్రుఁడగు యముఁడు దమ్పతులలో నొక్కరి ప్రాణము లను హరించి వారి కెడఁబాపును గల్గించుటచే క్రూర హృదయుఁడు, అట్లే జనుల ప్రాణములనుఁ దీయుచు వారిని నిత్యదుఃఖమునకు గురిఁజేయుచు, నా దుఃఖముచే వారి నంధులను గావించి వారి నేత్రములకు శత్రువగుచు, తండ్రి

యగు సూర్యునకు విపరీత స్వభావమునుఁ గల్గియున్నాడు. ఇటువంటి పుత్రులను లోకములను రక్షించుటకై యా సూర్యభగవాను డుత్పత్తి గావించెను. ఇదియు హాస్యాస్పదము. ఈ క్రూరు లిరువురు లోకమును రక్షింపరు గదా, పైపెచ్చు లోకమును నాశము గావింతురు. ఈ విధముగా దుర్జనులు సూర్యభగవానునే యపహసించునప్పుడు స్తుతిపాఠకులమైన మమ్ముల నేల యపహసింపరు. తప్పక యపహసింపఁగలరని యర్థము. కాని దానివలన మా కెవ్వరికిని హాని లేదు. కాన వారి యపహాస్యమును మేము లెక్కింపమని యాశయము. ॥47॥

శ్లో. శిశిరజరుజాం ఘర్మం శర్మోదయాయ తనూభృతా
మథ ఖరకరాశ్యానాస్యానాం ప్రయచ్ఛతి యః పయః,
జలభయజుషాం తాపం తాపస్పృశాం హిమ మిత్యయం
పరహితమిలత్కృత్యా వృత్తిః స భాను రుదఞ్చతి. 48

ప. వి. శిశిరజరుజాం-ఘర్మం-శర్మోదయాయ-తనూభృతాం-అథ - ఖరకరాశ్యానాస్యానాం-ప్రయచ్ఛతి-యః- పయః - జలభయజుషాం-తాపం - తాపస్పృశాం-హిమమ్-ఇతి-అయం-పరహిత మిలత్కృత్యా వృత్తిః - సః - భానుః-ఉదఞ్చతి.

అర్థము: యః=ఏ సూర్య భగవానుఁడు, శిశిరజరుజాం; శిశిరజ=శిశిర ఋతువు నందుఁ గల్గిన, రుజాం=రోగముగల, తనూభృతాం = దేహధారులగుఁ బ్రాహ్మణులకు, శర్మోదయాయ; శర్మ = సుఖము, ఉదయాయ = కలుగుటకై, ఘర్మం=వేడిమిని, అనగా వసంతగ్రీష్మకాలపు వేడిమిని, అథ = పిదప, ఖరకరాశ్యానాస్యానాం; ఖర = తీక్ష్ణములైన, కర = కిరణములచే, ఆశ్యాన=వాడిన, ఆస్యానాం=ముఖములు గల్గిన, తనూభృతాం = శరీరధారులకు, శర్మోదయాయ = సుఖము గలుగుటకై, పయః=ఉదకమును, ననగా వర్షర్తువునందు జలమును, తథా=అట్లే, జలభయజుషాం; జలభయ = వర్షర్తువునందు నుదకములచే భీతిని, జుషాం=పొందిన, తనూభృతాం = ప్రాణులకు, శర్మోదయాయ = సుఖము గలుగుటకై, తాపం=వేడిమిని ననగా శరదృతువు నందలి వేడిమిని, తాపస్పృశాం = శరదృతువు నందుఁ దాపమును పొందిన,

తనూభృతాం = శరీరధారులకు, శర్మోదయాయ = సుఖము గలుగుటకై, హిమం = హేమంతఋతువు నందలి చల్లదనమును, ప్రయచ్ఛతి = ఇచ్చుచున్నాడు. అనగా కాల చక్రమును ద్రిప్పుచు నాయా సమయములకుఁ దగినట్లు సుఖముల నొసంగుచున్నాడని యర్థము. ఇతి = ఈ విధముగా, పరహిత మిలత్కృత్యావృత్తిః; పర = ఒరులయొక్క, హిత = మేలునకై, మిలత్ = కూడినట్టి, కృత్య = పనులయొక్క, ఆవృత్తిః = ఆవృత్తి గల్గిన అనగా పలుమాఱు చేయుటను గల్గిన, సః = ఆ ప్రసిద్ధుఁడైన, అయం = ఈ కానఁబడునట్టి, భానుః = సూర్యుఁడు, ఉదఞ్చతి = ఉదయించుచున్నాడు.

వి. ఇచ్చట ప్రధానార్థకమగు 'ప్రయచ్ఛతి' అను క్రియను ఘర్మాదులనెడి కర్మలకై యావృత్తిచేయుటవలన క్రియాసముచ్చయాలఙ్కారము.

సమాసములు :

*శిశిరజరుజాం* - శిశిరాత్ జాయన్త ఇతి = శిశిరజాః, శిశిరజాః రుజః యేషాం తే = శిశిరజరుజః, తేషాం = శిశిరజరుజాం.

*శర్మోదయాయ* - శర్మణః ఉదయః = శర్మోదయః, తస్మై = శర్మోదయాయ.

తనూభృతాం - తనూం బిభ్రతీతి = తనూభృతః, తేషాం = తనూభృతాం.

*ఖరకరాశ్యానాస్యానాం* - ఖరాశ్చ తే కరాశ్చ = ఖరకరాః, ఖరకరైః ఆశ్యానాని ఆస్యాని యేషాం తే = ఖరకరాశ్యానాస్యాః, తేషాం = ఖరకరాశ్యానాస్యానాం.

*జలభయజుషాం* - జలాత్ భయం = జలభయం, జలభయం జుషత ఇతి = జలభయజుషః, తేషాం = జలభయజుషాం.

తాపస్పృశాం - తాపం స్పృశన్తీతి = తాపస్పృశః, తేషాం = తాపస్పృశాం.

*పరహిత మిలత్కృత్యావృత్తిః* - పరేభ్యః హితం = పరహితం, పరహితాయ మిలన్తి = పరహితమిలన్తి, కృత్యానా మావృత్తిః = కృత్యావృత్తిః, పరహితమిలన్తీ కృత్యావృత్తిః యస్య సః = పరహితమిలత్కృత్యావృత్తిః.

భావము :

ఏ దైవము శిశిరఋతువువలనఁ గల్గెడి రోగములతో బాధపడు ప్రాణులకు సుఖము గలుగుటకై వసంతగ్రీష్మములయందలి వేడిమి నొసంగునో, ఏ దైవము తన వాడికిరణములచే శుష్కించిన వదనములుగల ప్రాణులకు వర్షర్తువునందలి యుదకముల నొసంగునో, ఏ దైవము, వర్షర్తువునందలి జలములనుఁ జూచి భయపడు ప్రాణులకు శరదృతువునందలి తాపము నొసంగునో, ఏదైవము శరదృతువునందలి తాపముచే సొక్కిన ప్రాణులకు, హేమంతఋతువునందలి మంచు వలని చల్లఁదనము నొసంగునో, అట్టి పరోపకారశీలుఁడగు సూర్యభగవానుఁ డుదయించుచున్నాడు. ॥48॥

శ్లో. ఇహ న కతర శ్చిత్రం ధత్తే తమిస్రతతీ ర్దిశా
మపి చతసృణా ముత్సఙ్గేషు శ్రితా ధయతాం క్షణాత్,
తరుశరణతా మేత్య ఛాయామయం నివస త్తమః
శమయితు మభూ దానైశ్వర్యం యదర్యమరోచిషామ్. 49

ప. వి. ఇహ-న-కతరం-చిత్రం-ధత్తే-తమిస్రతతీః-దిశామ్-అపి-చతసృణామ్-ఉత్సఙ్గేషు-శ్రితాః- ధయతాం- క్షణాత్-తరుశరణతామ్- ఏత్య- ఛాయామయం-నివసత్- తమః-శమయితుమ్- అభూత్- అనైశ్వర్యం-యత్-అర్యమరోచిషాం.

అర్థము. చతసృణాం=నాలుగైన, దిశాం = దిక్కులయొక్క, ఉత్సఙ్గేషు= సమీపములయందు, శ్రితాః=ఉన్నటువంటి, తమిస్రతతీః, తమిస్ర= చీకట్లయొక్క, తతీః=సమూహములను, క్షణాత్=కొలదికాలమువలన, ధయతాం = పానము చేయునట్టి, అనగాఁ దొలగించునట్టి, అర్యమరోచిషాం = సూర్యకాంతులకు, తరుశరణతాం; తరు = వృక్షములనే, శరణతాం=రక్షకములుగాఁ గల్గియుండుటను, ఏత్య = పొంది, నివసత్=నెలకొనిన, ఛాయామయం = నీడయొక్క రూపము గల్గిన, తమః=చీకటిని, శమయితుం=సంహరించుటకు, యత్=ఏ, అనైశ్వర్యం=అసామర్థ్యము, అభూత్=ఏర్పడినదో, ఇహ=ఈ యసామర్థ్య

విషయమునందు, కతరః= ఎప్పుడు, చిత్రం=ఆశ్చర్యమును, న ధత్తే= మనస్సునందు ధరింపఁడు. తప్పక ప్రతిజనము ధరించును.

వి. తమోరాశిని నాశముచేయగల సూర్యునకు చెట్లనీడ లనెడి తమస్సును నాశము చేయుటలో సామర్థ్యము లేదని చెప్పుటచే విరోధాభాసాలంకారము. ఆ తమస్సు నీడయగుటవలన నాశము చేయ సాధ్యము కాలేదని చెప్పుటచే విరోధమునకు పరిహారము.

సమాసములు :

తమిస్రతతీః - తమిస్రాణాం తతయః = తమిస్రతతయః, తాః = తమిస్రతతీః.

తరుశరణతాం- తరవః శరణం యేషాం తే = తరుశరణాః, తరుశరణానాం భావః = తరుశరణతా, తాం=తరుశరణతాం.

ఛాయామయం- ఛాయా, రూపం యస్య తత్=ఛాయామయం, తత్= ఛాయామయం.

అనైశ్వర్యం- ఈష్టే ఇతి = ఈశ్వరః, న ఈశ్వరః=అనీశ్వరః, అనీశ్వరస్య భావః=అనైశ్వర్యం, తత్=అనైశ్వర్యం.

అర్యమరోచిషాం- అర్యమ్ణః రోచీంషి=అర్యమరోచీంషి, తేషా మర్యమరోచిషామ్.

భావము :

నలుదెసలయందును నెలకొనిన చీకట్లగుంపును క్షణమునఁ బానముఁ జేసి తొలగించునట్టి సూర్యకిరణములకు, చెట్ల దిగువ భాగములను శరణుఁ జొచ్చి నీడల రూపమున నెలకొనిన చీకట్లనుఁ దొలగించుటలోని యసామర్థ్య మెవ్వనికి చిత్తమునం దాశ్చర్యమునుఁ గల్గింపదు ? తప్పక గల్గించును. ॥49॥

శ్లో. జగతి తిమిరం మూర్ఛా మజ్జ్రవజేఽపి చికిత్సతః
పితురివ నిజా దస్మా ద్ద్రసా వధీత్య భిషజ్యతః
అపి చ శమన స్యాసౌ తాత స్తతః కిమనౌచితీ
యదయ మదయః కహ్లారాణా ముదే త్యపమృత్యవే ॥50॥

ప. వి. జగతి-తిమిరం - మూర్ఛాం - అబ్జవ్రజే-అపి-చికిత్సతః-పితుః - ఇవ-నిజాత్-అస్మాత్-దస్రౌ-అధీత్య-భిషజ్యతః-అపి-చ - శమనస్య-అసౌ-తాతః-తతః-కిమ్ - అనౌచితీ-యత్ - అయమ్-అదయః-కహ్లారాణాం-ఉదేతి - అపమృత్యవే.

**అర్థము:** దస్రౌ=అశ్వినులు, జగతి = లోకమునందు, తిమిరం=చీకటిని (కంటిజబ్బును), తథా=అట్లే, అబ్జవ్రజేఽపి=పద్మముల సమూహము నందును, మూర్ఛాం=ముడుచుకొని పోవుటను (మూర్ఛ యను రోగమును), చికిత్సతః=చికిత్స చేయుచున్న, నిజాత్ = తమకు సంబంధించిన, పితుః = తండ్రియైన, అస్మాత్=ఈ కనఁబడుచున్న సూర్యుని నుండి, అధీత్య (ఇవ)=చదివియో యనునట్లు అనగా నాయుర్వేదమునుఁ జదివియో యనునట్లు, భిషజ్యతః= (స్వర్గమునందు) చికిత్సఁ జేయుచున్నారా యేమి? అట్లు కానిచో వారి కది యెట్లలవడినది? అపి చ= మఱియు, అసౌ=ఈసూర్యుడు, యత్=ఎందువలన, శమనస్య= యమునకు, తాతః=తండ్రియో, తత ఇవ=అందువలననో యనునట్లు, అయం= ఈ సూర్యుడు, అదయః=దయలేనివాఁడై, కహ్లారాణాం= కలువలకు, అపమృత్యవే = అపమృత్యువునకై యనగా ముడుచుకొని పోవుట యను నకాల మరణమునకై, ఉదేతి=ఉదయించుచున్నాడు. సా=అది, అనౌచితీకిం=అన్యాయమా యేమి? ''కారణ గుణములు కార్యమునందు సంక్రమించునను న్యాయము ననుసరించి యెల్లప్పుడు ప్రాణులను సంహరించెడి పుత్రునికిఁ దండ్రియగు యమునకును నట్టి గుణములుండుట యుచితము కాన నందేమియు నన్యాయము లేదు. అశ్వినుల తండ్రివలె సర్వోపకారత్వ ముచితము. యముని తండ్రియగు రవికో కలువలను సంహరించుట యనుచితము కాదు.

వి. సూర్యుడు యముని తండ్రి యైనందువలన కలువలను సంహరింపక పోయినను నా విధముగా సంహరించునట్లు భావించుట వలన నుత్ప్రేక్షాలఙ్కారము.

**సమాసములు :**

అబ్జవ్రజే- అబ్జానాం వ్రజః=అబ్జవ్రజః, తస్మిన్=అబ్జవ్రజే.
అనౌచితీ- ఉచితస్య భావః=ఔచితీ, న ఔచితీ=అనౌచితీ.

**భావము :**

అశ్వినులు లోకమందు చీకటికి, కంటిజబ్బునకు, పద్మములయందలి ముడుచుకొని పోవుటకు - మూర్ఛయను వ్యాధికి - చికిత్స చేయునట్టి తమ తండ్రియైన యీ కనఁబడు సూర్యునుండి యాయుర్వేదము నభ్యసించి స్వర్గమునందు చికిత్సఁ జేయుచున్నారా యేమి ? అట్లుకానిచో వారి కా నేర్పు ఎట్లు వచ్చినది ? మఱియు నీ సూర్యుడు యమునకుఁ దండ్రియైనందు వలననో యనునట్లు దయలేనివాఁడై కలువలకు ముడుచుకొనిపోవుట యనెడి యాకస్మిక మరణమునుఁ గల్గించుటకై యుదయించుటలో ననౌచిత్య మేమి యున్నది. "కారణమందలి గుణములు కార్యమందు గుణములను గల్గించు"నను న్యాయము ననుసరించి యెల్లప్పుడును ప్రాణిసంహారముఁ జేయు యమునకుఁ దండ్రియైన సూర్యునకును నట్టి గుణము లుండుట యుచితమేకాని యనుచితము గాదు. అశ్వినులకుఁ దండ్రి యైనందువలన సర్వోపకారిత్వ మెట్లతని కుచితమో, యమునికి తండ్రి యైనందువలన సర్వ సంహారకత్వము నతని కుచితమే. సూర్యు డుదయించినందువలన చీకటి తొలగినది. పద్మములు వికసించినవి. కలువలు ముడుచుకొని పోయినవని సారాంశము. ॥50॥

శ్లో॥ ఉడుపరివృఢః పత్యా ముక్తాం సతీం యదపీడయ
ద్యదపి బిసినీ భానో ర్జాయాం జహాస కుముద్వతీ,
తదుభయ మతః శఙ్కే సఙ్కోచితం నిజశఙ్కయా
ప్రసరతి నవార్కే కర్కన్ధూకణారుణరోచిషి. 51

ప. వి. ఉడుపరివృఢః-పత్యా- ముక్తాం- సతీం-యత్- అపీడయత్- యత్- అపి- బిసినీం-భానోః-జాయాం-జహాస- కుముద్వతీ- తత్- ఉభయమ్- అతః- శఙ్కే- సఙ్కోచితం- నిజశఙ్కయా- ప్రసరతి- నవార్కే- కర్కన్ధూకణారుణరోచిషి.

**అర్థము :** ఉడుపరివృఢః = తారలకు భర్తయగు చంద్రుడు, పత్యా = భర్తయైన సూర్యునిచే, ముక్తాం = విడువఁబడిన యనగా సాయంకాలమునం దస్తమించుటవలన విడువఁబడిన, సతీం = పతివ్రతయైన, బిసినీం = పద్మినిని, యత్ = ఎందువలన, అపీడయత్ = పీడించెనో అనగా రాత్రి ముడుచుకొనునట్లు చేయుటచే బాధించెనో, తథా = అట్లే, కుముద్వతీ అపి = కలువయు, భానోః = సూర్యునియొక్క, జాయాం = భార్యయైన, బిసినీం = పద్మినిని, యత్ = ఎందువలన, జహాసేవ = పరిహసించెనో యనునట్లుండెనో అనగా రాత్రియందు తాము వికసించుటచేత నని యర్థము, అతః = ఈ కారణము వలన, కర్కన్ధూకణారుణ రోచిషి; కర్కన్ధూ = రేగిపండుయొక్క, కణ = చూర్ణమువలె, అరుణ = ఎఱ్ఱని, రోచిషి = కాన్తి గల్గిన, నవార్కే = బాలసూర్యుడు, ప్రసరతి సతి = ఆకాశమున వ్యాపింపగనే, తదుభయం; తత్ = ఆ చంద్రుని యొక్కయు, కలువయొక్కయు, ఉభయం = రెండును, నిజ శఙ్కయా = తాము పద్మినికిఁ గావించిన యపచారము వలని భయముచే, సఙ్కోచితం = తేజోరహితముగను, ముడుచుకొని పోయినదిగను నైనది. అందుఁ జంద్రుడు తేజోరహితుఁ డాయెను. కలువ ముకుళించు కొని పోయినది. (ఇతి = ఇట్లు) శఙ్కే = నేను తలంతును. అందఱు తమ తమ దుష్ట వ్యవహారములచే తమ్ముల కలుషితులను గావించు కొనెదరు.

వి. చంద్రుడును కలువయు క్రమముగా కాన్తి రహితు డగుటకును, ముడుచు కొని పోవుటకును, నవి పద్మినికిఁ గావించిన యపహాస్యాదులు కారణ ములు కాకపోయినను వాని నిటఁ గారణములుగాఁ జెప్పుటచే నుత్ప్రేక్ష. 'శఙ్కే' యని వ్యఞ్జకమునుఁ బ్రయోగించుట వలన నిది వాచ్యము.

**సమాసములు :**

ఉడుపరివృఢః - ఉడూనాం పరివృఢః = ఉడుపరివృఢః.

తదుభయం - తయో రుభయం = తదుభయం.

నిజశఙ్కయా - నిజా చ సా శఙ్కా చ=నిజశఙ్కా, తయా=నిజ శఙ్కయా.

నవార్కే - నవ శ్చాసౌ అర్కశ్చ=నవార్కః, తస్మిన్=నవార్కే.

కర్కన్ధూకణారుణ రోచిషి - కర్కన్ధ్వాః కణః = కర్కన్ధూకణః, కర్కన్ధూకణ ఇవ అరుణం రోచిః యస్య సః = కర్కన్ధూ కణారుణ రోచిః, తస్మిన్=కర్కన్ధూ కణారుణ రోచిషి.

**భావము :**

తారాపతియగు చంద్రుడు సాయంకాలమునం దస్తమించుటచే భర్తచే విడువఁబడిన పతివ్రతయగు పద్మినిని ముకుళింపఁజేయుటచే పీడించుట వలనను నట్టే కలువయు తాను రాత్రి వికసించుటచే, సూర్యుని భార్యయగు పద్మిని ముకుళించుటవలన దానినిఁ బరిహసించుట చేతను, నందువలని కోపముచేతనో యనునట్లు రేగుపండు చూర్ణమువలె నెఱ్ఱని కాంతిగల బాలసూర్యుడు గగనమధి రోహింపగనే, తాము రాత్రి పద్మినికిఁ జేసిన యపచారమువలని భయము చేతనో యనునట్లు చంద్రుడు కాంతిరహితుడై తెల్లబడిపోయెను. కలువయు, కాంతి రహితమై ముడుచుకొని పోయినది. అందఱును తాము చేసిన దుష్ట వ్యవహారము లచే కలుషితు లగుదురని యాశయము. ॥॥51॥

శ్లో. శ్రుతిమయతరో ర్భానోఽర్జానే వనే రధరాధ్వనా
విహరణకృతః శాఖాః సాక్షా చ్ఛతాని దశ త్విషామ్
నిశి నిశి సహస్రాభ్యాం దృగ్భిః శృణోతి సహస్వరాః
పృథ గహిపతిః పశ్య త్యస్యాఽక్రమేణ చ భాస్వరాః. 52

ప. వి. శ్రుతిమయతరోః-భానోః-జానే-అవనేః-అధరాధ్వనా - విహరణకృతః - శాఖాః-సాక్షాత్-శతాని-దశత్విషాం-నిశి-నిశి-సహస్రాభ్యాం - దృగ్భిః-శృణోతి-సహస్వరాః-పృథక్-అహిపతిః-పశ్యతి-అస్య-అక్రమేణ- చ - భాస్వరాః,

అర్థము: అవనేః=భూమియొక్క, అధరాధ్వనా = క్రింది మార్గముచే ననగా పాతాల మార్గముచే, విహరణకృతః = విహారముఁ జేసెడి, శ్రుతిమయ తరోః = వేద రూపమైన వృక్షమగు, శ్రుతిమయతనోః అను పాఠము ననుసరించి-శ్రుతిమయ=వేదరూపమైన, తనోః=శరీరము గల్గిన యని యర్థము. అస్య = ఉదయము నొందుచున్న, భానోః = సూర్యుని యొక్క, త్విషాం=కాంతులయొక్క, దశశతాని = సహస్రముగా పరిణమించిన, సహస్వరాః = ఉదాత్తాది స్వరములతోఁ గూడినవై, పృథక్=వేరుగా, భాస్వరాః=ప్రకాశించెడి, శాఖాః=వేద భాగములను చెట్ల కొమ్మలను, అహిపతిః=ఆదిశేషుఁడు, నిశి నిశి=ప్రతిరాత్రియు, సహస్రాఖ్యాం=రెండువేలైన, దృగ్భిః=నేత్రములతో, అక్రమేణ= ఏక కాలమున, సాక్షాత్=ప్రత్యక్షముగా అనగా నేరుగా, శృణోతి= వినుచున్నాడు. పశ్యతి చ=చూచుచు నున్నాడు. (శేషనాగునకు వేయి పడగ లుండుట వలనను, నొక్కొక్క పడగకు రెండు కన్ను లుండుట వలన వేయి పడగలకు కలిసి రెండువేలు నేత్రములున్నవి కాన, రెండు వేల నేత్రములతో నతడు వినఁగలడు. శేషనాగునకు నేత్రములే చెవులు కాన వేదశాఖలు శబ్ద స్వరూపము లగుటవలన వినుట యుక్తమైనది. మఱియు నా వేదశాఖలు కిరణ పరిణామములని చెప్పుటవలన నేత్రము లతోఁ జూచుటయు సముచితమైనది) ఇతి=అని, జానే = తెలుసుకొను చున్నాను.

వి. వేదమయ వృక్షము సూర్యుని సహస్ర కిరణములుగాఁ బరిణమింపక పోయినను, బరిణమించినట్లు చెప్పుట వలనను, శేషనాగుడు సహస్ర నేత్రములతో సహస్ర శాఖలను ప్రతి రాత్రియు వినకపోయినను విని నట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష. "జానే" యని వ్యఞ్జకమునుఁ బ్రయో గించుటవలన నది వాచ్యము. వేదమును వృక్షముగా రూపించుట వలన రూపకము. ఆ యుత్ప్రేక్షకును రూపకమునకు నిట సఙ్కరము.

విశ్వేశ్వర భట్టారకుఁడు ఒక వేయి నేత్రములఁతో జూచునని వ్యాఖ్యానించెను. కాని యది చిన్త్యము. ఏలయనగా రెండువేల నేత్రము లను వినుటకును చూచుటకును వలసిన శక్తితోఁ గూడినవి. అనగా

నొక్కొక్క నేత్రమునకును శ్రవణశక్తియు దర్శనశక్తియు నుండుట వలన వానిలో నొక వేయిచే చూచుట, మఱియొక్క వేయిచే వినుటయు సంభవింపవు. కాన గ్రాహకములగు నేత్రములకు శ్రవణశక్తియు దర్శనశక్తియు నుండుటవలనను గ్రాహ్యములగు విషయములు శబ్ద రూపముగను, తేజోరూపముగ నుండుటవలనను సమస్త నేత్రములచే సమస్త వేదశాఖలను నేకకాలము నందే శేషనాగుఁడు చూచుననియు విననినియు చెప్పుటయే యుచితము.

సమాసములు :

శ్రుతిమయతరోః-శ్రుతిః స్వరూపం యస్య సః=శ్రుతిమయః, శ్రుతి మయ శ్చాసౌ తరుశ్చ=శ్రుతిమయతరుః, తస్య = శ్రుతిమయతరోః.
అధరాధ్వనా-అధర శ్చాసౌ అధ్వా చ = అధరాధ్వా, తేన = అధ రాధ్వనా.
విహరణకృతః-విహరణం కరోతీతి=విహరణకృత్, తస్య=విహరణ కృతః.
సహస్వరాః-సహ స్వరః యాసాం తాః=సహస్వరాః.

భావము :

భూమికి దిగువనున్న పాతాలాది లోకములలో నంచరించుచున్న వేద రూపమగు వృక్షమైన లేదా వేదరూపమగు శరీరము గల యీ యుదయించు సూర్యునియొక్క వేయి కిరణముల రూపముగ పరిణమించిన, యుదాత్తాది స్వర ములతోఁ గూడినట్టి సంకరము లేక వేరువేరుగా ప్రకాశించుచున్న వేదశాఖలను ప్రతిరాత్రియు శేషనాగుడు తన రెండువేల నేత్రములనెడి చెవులతోఁ జూచు చున్నాడు. వినుచు నున్నాడు. పాతాలాది లోకములకు సూర్యుడు పోయి నపుడు, అచ్చట నున్న శేషనాగునకు నా సూర్యభగవానుని వేయి కిరణముల రూపమున పరిణతి నొందిన వేదశాఖలను వినుటకు సౌకర్యము. ఆ సూర్యభగ వానుడు పాతాలమునం దున్నప్పుడు అచ్చట రాత్రి యుండదు. అప్పుడు భూలోకాదులయందే రాత్రి యుండును. కాన భూలోకమునందు రాత్రియున్న

ప్పుడు, అట్టి ప్రతిరాత్రియు పాతాలమున శేషనాగుడు వేదశ్రవణము గావిం చును. ఒకవేళ పాతాలమందు రాత్రి యున్నప్పుడు శేషనాగుడు వేదశ్రవణము చేయరాదా యనుట సరిగాదు. ఏల యనగా, పాతాలమందు రాత్రి యున్నచో నచ్చట సూర్యసంచార ముండదు. సూర్య సంచార మచట లేనపుడు, ఆ సూర్యుని సహస్ర కిరణ పరిణామ రూపములగు వేదములను శ్రవణము చేయుట కవకాశము లేదు గదా! కానఁ బాతాలమున సూర్యసంచార మున్నప్పుడే శేషనాగునకు వేద శ్రవణమున కవకాశమని యంగీకరింపవలయును. ॥52॥

శ్లో. బహునఖరతా యేషా మగ్రే ఖలు ప్రతిభాసతే
కమల సుహృద స్తేమీ భానోః ప్రవాలరుచః కరాః
ఉచిత ముచితం జాతే ష్వన్తః ప్రవేశిభి రాయతైః
కియదవయవై రేషా మాలిఙ్గితాఽఙ్గులివల్గుతా. 53

ప. వి. బహునఖరతా-యేషామ్-అగ్రే-ఖలు - ప్రతిభాసతే - కమలసుహృదః-తే-అమీ-భానోః-ప్రవాలరుచః-కరాః-ఉచితమ్ - ఉచితం - జాలేషు-అన్తః-ప్రవేశిభిః-ఆయతైః-కియదవయవైః-ఏషామ్-ఆలిఙ్గితా-అఙ్గులివల్గుతా.

అర్థము: యేషాం=ఏ కిరణముల యొక్క, అగ్రే=ఎదుట ననగా నూతన దశ యందు అనగా ప్రభాతమునందు, బహునఖరతా; బహు=అధికమైన, నఖరతా=తీక్ష్ణత్వము లేకయుండుట. పక్షాన్తరమున-అగ్రే = అగ్ర దేశమున, బహునఖరతా; బహు=అధికములైన, నఖరతా = గోళ్ళనుఁ గల్గియుండుట, ఖలు=నిశ్చయింపబడినదిగా, ప్రతిభాసతే = తెలియు చున్నది. కమల సుహృదః; కమల=పద్మములకు, సుహృదః=మిత్ర లైన, ప్రవాలరుచః=పగడపు కాంతులు గల్గిన, భానోః=సూర్యుని యొక్క, తే=అటువంటి, అమీ=ఈ కానవచ్చెడి, కరాః=కిరణములు (హస్తములు) (ప్రసర్పన్తి=ప్రసరించుచున్నవి. కావుననే) జాలేషు= గవాక్షములయందు,అంతః=లోపల,ప్రవేశిభిః=ప్రవేశించునట్టి,ఆయతైః పొడవైన, కియదవయవైః=కొన్ని యంశములచే, ఉచిత ముచితం= మిక్కిలి తగినట్లు, అఙ్గులి వల్గుతా; అఙ్గులి=వ్రేళ్ళయొక్క, వల్గుతా=

అందము, ఆలిఙ్గితా=పొందఁబడినది. కిరణములు హస్తరూపములుగా నుండుటవలన, కిరణాంశములు వ్రేళ్ళరూపములు గలవిగా భావింపఁ బడినవి.

వి. వ్రేళ్ళ సౌందర్యము సూర్యకిరణముల యొక్క కొన్ని భాగములచే వహింపఁబడినదని చెప్పుటవలన నిదర్శనాలఙ్కారము, నఖరత-కరాది శబ్దములు నానార్థ సంశ్రయములగుటవలన శ్లేషాలఙ్కారము. ఈ శ్లేష నిదర్శనలకు సఙ్కరము.

సమాసములు :

బహునఖరతా - న, ఖరతా=నఖరతా, బహ్వీ చ సా నఖరతా చ= బహునఖరతా. పక్షాన్తరమున-బహవః నఖరాః యస్య సః=బహునఖరః, బహునఖరస్య భావః=బహునఖరతా.

కమలసుహృదః - కమలానాం సుహృదః=కమల సుహృదః.

ప్రవాలరుచః - ప్రవాలస్య రుగివ రుక్ యేషాం తే=ప్రవాలరుచః.

కియదవయవైః - కియన్తశ్చ తే అవయవాశ్చ=కియదవయవాః, తైః =కియదవయవైః.

అఙ్గులివల్గుతా - అఙ్గులీనాం వల్గుతా=అఙ్గులివల్గుతా.

భావము :

(ఆ సూర్యుని) కరములు-కిరణములు ప్రభాతమందు బహునఖరతలు. అనగా మిక్కిలి సుకుమారములు. కరములు-హస్తములు బహునఖరతలు-అనగా పెక్కు గోళ్లతోఁ గూడినవి. సూర్యకిరణములు మిక్కిలి సుకుమారములు. హస్తములు అగ్రభాగమందు పెక్కుగోరులతోఁ గూడినవి. మఱియు నా సూర్య కిరణములు కమలములను వికసింపఁజేయుటచే వానికి చుట్టములు. అందువలననే నఖరతలు అనగా మార్దవము గలవి. హస్తములు సౌందర్యము చేతను, మృదుత్వముచేతను, కమలములకు మిత్రములు. అనగా సదృశములు. ఇంకను నాకిరణములు పగడపు కాంతులు గలవి. హస్తములు పగడపు కాంతులు గలవి.

అద్ది సూర్యునికిరణములు ప్రసరించుచున్నవి. గవాక్ష రంధ్రముల యందు లోనఁ జొచ్చుకొనిన యీ కిరణములయొక్క (హస్తములయొక్క) పొడవైన యంశములచే, మిక్కిలి తగినట్లు వ్రేళ్ల సౌందర్యము పొందఁబడినది. అసలిట్టిదిగా సూర్యకిరణములకు, హస్తముల సౌందర్య మబ్బినట్లు వర్ణింపఁబడినది. ॥౮౩॥

శ్లో. నయ నయనయో ర్ద్రాక్ పేయత్వం ప్రతిష్ఠవతీ రమూ
భవన వలభీజాలాన్నాలా ఇవార్క్యకరాఙ్గులీః,
భ్రమదణుగణ క్రాన్తా భాన్తి భ్రమన్త్య ఇవాశు యాః
పునరపి ధృతాః కున్దే కిం వా న వర్ధకినా దివః. 54

ప. వి. నయ-నయనయోః-ద్రాక్-పేయత్వం- ప్రవిష్టవతీః- అమూః-భవన వలభీజాలాత్- నాలాః- ఇవ-అర్కకరాఙ్గులీః-భ్రమదణుగణక్రాన్తాః-భాన్తి-భ్రమన్త్యః-ఇవ-ఆశు-యాః-పునః-అపి- ధృతాః- కున్దే- కిం- వా-న-వర్ధకినా- దివః.

అర్థము: భవనవలభీజాలాత్; భవన=ఏ మేడయొక్క, వలభీ=పైభాగమందలి చంద్రశాలలయొక్క, జాలాత్=గవాక్షరంధ్రమునుండి, ప్రవిష్టవతీః= లోపలికిఁ బ్రవేశించిన, నాలా ఇవ=తామరతూండ్లవలెనున్న, అమూః= ఎదుటనున్న, అర్కకరాఙ్గులీః; అర్క=సూర్యునియొక్క, కర=కిరణములనెడి హస్తములయొక్క, అఙ్గులీః=వ్రేళ్ళవలెనుండెడి యవయవములను, ద్రాక్=వెంటనే, నయనయోః=నేత్రములకు, పేయత్వం = పానము చేయఁదగియుండుటను, నయ=పొందింపుము, యాః=ఏసూర్యకిరణములనెడి హస్తముల వ్రేళ్ళు; భ్రమదణుగణక్రాన్తాః; భ్రమత్=తిరుగుచున్న అణుగణ=త్ర్యణుక సమూహములచే, క్రాన్తాః=చుట్టఁబడినవై, ఆశు= శీఘ్రముగా, భ్రమన్త్య ఇవ=తిరుగుచున్నవో యనునట్లు, భాన్తి= ప్రకాశించుచున్నవి, పునరపి=మఱలను ననగా ముందువలె నిప్పుడును, దివః=స్వర్గముయొక్క, వర్ధకినా=చెక్కడపు పనిచేసెడి దేవతలశిల్పిచే, కుందే=సానపెట్టెడి యంత్రమునందు,ధృతాః వా న కిం?=చెక్కుటకై యుంచఁబడలేదా యేమి? ఒకసారి పూర్వము త్రోపుడు పట్టఁబడినవి. మఱల త్రోపుడు పట్టుటకై యుంచఁబడినవా? యని యర్థము. తప్పక

యుంచఁబడినవనియే యర్థము. మాటిమాటికిని తరిమిణి పట్టుటవలన నందుండి లేచిన సూక్ష్మములగు నంశములు తిరుగుచున్నట్లు కానఁబడు చున్నది. కావున తిరుగుట యుచితము.

పూర్వము స్వర్గమునందు సూర్యుని భార్యయైన సంధ్యాదేవికి సూర్యుడు తాకుట కశక్యముగా నుండెను. అప్పుడామె విశ్వకర్మను పిలచి యాసూర్యుని శాణయన్త్రమున, చెక్కించి, మెత్తదనము గలవానినిగాఁ జేయించుకొనినదని పురాణ కథ.

సమాసములు :

పేయత్వం - పాతుం యోగ్యం = పేయం, పేయస్య భావః = పేయత్వం, తత్ = పేయత్వమ్.

భవనవలభీజాలాత్ = భవనస్య వలభ్యః = భవనవలభ్యః, భవన వలభీనాం జాలం = భవనవలభీజాలం = భవనవలభీజాలం; తస్మాత్ = భవనవలభీజాలాత్,

అర్కకరాఙ్గులీః - అర్కస్య కరా ఏవ కరాః = అర్కకరాః, అర్కకరాణా మఙ్గుల్యః = అర్కకరాఙ్గుల్యః, తాః = అర్కకరాఙ్గులీః,

భ్రమదణుగణక్రాన్తాః - భ్రమన్తశ్చ తే అణవశ్చ = భ్రమదణవః, భ్రమ దణూనాం గణాః = భ్రమదణుగణాః, భ్రమదణుగణైః క్రాన్తాః = భ్రమ దణుగణక్రాన్తాః.

భావము :

ఓ మహారాజా! నీ భవనముపైని చంద్రశాలలయొక్క గవాక్షరంధ్రముల నుండి, తామర తూండ్లవలెఁ బొడుగైన, సూర్యకిరణము లనెడి హస్తాంగులులు లోనఁ బ్రవేశించినవి. వానిని వెంటనే నీ నేత్రములతోఁ బానము చేయుము. ఆసూర్యకిరణములయందు త్ర్యణుకము లనఁబడు ధూళిరేణువులు తిరుగుచుండుట వలన వానితో నాకరాంగులులు చుట్టఁబడినవై తిరుగుచున్నవో యనునట్లు కనఁబడుచున్నవి. ఆ కరాంగుళులు పూర్వమువలె నిప్పుడును దేవశిల్పియగు విశ్వకర్మచే శాణయన్త్రమునందు నునుపుగలుగుటకై యుంచఁబడినవి గావా

యేమి? తప్పక కాగలవు. పూర్వము సూర్యుని శరీరము మిక్కిలి తీక్ష్ణముగా నుండుట వలనఁ దాకుటకు సాధ్యము గాకపోవుటవలన నతనిభార్యయగు సంధ్యాదేవి విశ్వకర్మకుఁ జెప్పి శాణయన్త్రముచే పలుమాఱులు సానఁబెట్టించి మృదువు గావించుకొన్నదని పురాణములు చెప్పుచున్నవి. ఇప్పుడు మఱల నావిధముగా నా సూర్య కరాగ్రములను సానబెట్టుటకై శాణయన్త్రమునం దుంచుట వలన రాలెడి పొడిగా యాత్రసరేణువులు కానవచ్చున్నవి. గవాక్షరంధ్రము నుండి లోనఁ బ్రవేశించిన సూర్యకిరణములలో తిరుగుచున్న కణములు త్రసరేణువులని చెప్పఁబడును. ॥54॥

శ్లో. దినమివ దివాకీర్తి స్తీక్ష్ణైః క్షురైః సవితుః కరై
స్తిమిర కబరీ లూనీం కృత్వా నిశాం నిరదీధరత్
స్ఫురతి పరితః కేశస్తోమై స్తతః పతయాలుభిః
ధ్రువ మధవలం తత్తచ్ఛాయచ్ఛలా దవనీతలమ్. 55

ప. వి. దినమ్-ఇవ -దివాకీర్తిః - తీక్ష్ణైః-క్షురైః- సవితుః - కరైః - తిమిరకబరీ లూనీం-కృత్వా- నిశాం- నిరదీధరత్-స్ఫురతి-పరితః-కేశస్తోమైః-తతః-పతయాలుభిః-ధ్రువమ్-అధవలం - తత్తచ్ఛాయచ్ఛలాత్ - అవనీతలమ్-

అర్థము : దినం=పగలు, దివాకీర్తి రివ=మంగలివలె, తీక్ష్ణైః=పదునైన, (తీక్ష్ణములైన), సవితుః=సూర్యునియొక్క, కరైః=కిరణము లనెడి, క్షురైః=కత్తులచే, నిశాం=రాత్రిని (వ్యభిచరించు భార్యనువలె), తిమిర కబరీలూనీం; తిమిరకబరీ=కొప్పువంటి చీకటిని, లూనీం=తెగగొట్టఁబడిన దానితోఁ గూడిన దానినిగా, కృత్వా=చేసి, నిరదీధరత్ (ఇవ)=వెడలఁగొట్టెనో యనునట్లున్నది. తత్తచ్ఛాయ చ్ఛలాత్; తత్తత్=ఆయా గృహములు మున్నగువాని యొక్క, ఛాయా=నీడయొక్క, ఛలాత్=నెపమువలన, పరితః=చుట్టును, పతయాలుభిః=పడునట్టి, కేశస్తోమైః=కురుల మొత్తములచే, అవనీతలం = భూమియొక్క పైభాగము, అధవలం = నల్లనిదిగా, స్ఫురతి = ప్రకాశించుచున్నది, ధ్రువం = నిశ్చయము.

వి. ఇండ్లు మున్నగువాని నీడలు కురులు గాకపోయినను కురులుగా భావింపఁ బడుటవలన నుత్ప్రేక్ష. ఆయా గృహములు మున్నగువాని నీడల'ఛలము' వలన నని చెప్పుటచే నపహ్నవాలఙ్కారము. ఈ యపహ్నవముచే నాయుత్ప్రేక్ష యనుప్రాణితము.

సమాసములు :

దివాకీర్తిః - దివా కీర్తిః యస్య సః=దివాకీర్తిః.
తిమిరకబరీలూనం-తిమిరం కబరీవ=తిమిరకబరీ, తిమిరకబరీ లూనా యస్యాస్సా=తిమిర కబరీ లూనీ, తాం=తిమిర కబరీలూనీం.
కేశస్తోమైః - కేశానాం స్తోమాః=కేశస్తోమాః, తైః=కేశస్తోమైః.
అధవలం - న ధవలం=అధవలం.
తత్తచ్ఛాయచ్ఛలాత్ - తేషాం తేషాం ఛాయా = తత్తచ్ఛాయం. తత్తచ్ఛాయస్య ఛలం = తత్తచ్ఛాయచ్ఛలం, తస్మాత్=తత్తచ్ఛాయ చ్ఛలాత్.
అవనీతలం - అవన్యాః తలం=అవనీతలమ్.

భావము :

పగలనెడి మంగలి పదునైనవియు, తీక్ష్ణములైనవియునగు సూర్యకిరణము లనెడి కత్తులచే వ్యభిచరించెడి భార్యయో యనునట్లున్న రాత్రిని, కొప్పువంటి చీకటిని క్షౌరము గావించి యనగాఁ దలను ముండనము గావించి యింటినుండి వెడలఁగొట్టెను. పిదప నాయా గృహాదులయొక్క నీడల నెపమున చుట్టునుఁ బడుచున్న కురుల మొత్తములచే, భూతలము నల్లఁబడినదై ప్రకాశించుచున్నది. ఇది నిశ్చయము. ॥౬౬॥

శ్లో. బ్రూమ శ్శఙ్ఖం తవ నల! యశః శ్రేయసే సృష్టశబ్దం
యత్సోదర్యః స దివి లిఖితః స్పష్ట మస్తి ద్విజేంద్రః,
అద్ధా శ్రద్ధాకర మిహ కరచ్ఛేద మప్యస్య పశ్య
మ్లానిస్థానం తదపి నితరాం హారిణేయః కలఙ్కః. 56

ప. వి. బ్రూమః-శఙ్ఖం-తవ-నల- యశః- శ్రేయసే- సృష్టశబ్దం-యత్సోదర్యః-సః-దివి-లిఖితః-స్పష్టమ్- అస్తి- ద్విజేన్ద్రః- అద్ధా- శ్రద్ధాకరమ్- ఇహ-కరచ్ఛేదమ్-అపి-అస్య-పశ్య-మ్లానిస్థానం-తత్- అపి-నితరాం-హారిణే-యః-కలఙ్కః.

అర్థము : నల=ఓ నలమహారాజా! తవ = నీయొక్క, యశః = కీర్తిని, శ్రేయసే=మంగలము కొఱకు, సృష్టశబ్దం = సృజింపఁబడిన ధ్వని గల్గిన యనగా దేవపూజ మున్నగు శుభకర్మలయందు శబ్దముఁ జేసిన, శఙ్ఖం = శంఖమునుగా ననగా శఙ్ఖముతో సమానమైన దానినిగా, బ్రూమః=చెప్పుదుము, శఙ్ఖధ్వని మఙ్గలప్రద మగుటవలన నలుఁడు పవిత్రమగు కీర్తి గలవాఁ డగుటవలన నతని కీర్తి లోకములకు శుభ దాయకము. మఱియు, శంఖము, నలునికీర్తి యను నీరెందును సమాన మైన తెల్లఁదనమునుఁ గల్గియున్నవి.

లేదా-శ్రేయసే=స్వర్గప్రాప్తికై, సృష్ట=సృజింపఁబడిన శబ్దము గల, శంఖం=శంఖమును, యశః=తన కీర్తిగా, బ్రూమః=చెప్పుదుము. యత్సోదర్యః; యత్= ఏ కీర్తిని, సోదర్యః=సహోదరుడగు (శంఖ మును, చంద్రుడును సముద్రములో పుట్టినవారు),సః=ఆ ప్రసిద్ధుఁడగు, చంద్రః=చంద్రుఁడు, దివి=ఆకసమునందు, లిఖితః=చిత్రింపఁబడిన వాడుగా, స్పష్టం=స్పష్టముగా, అస్తి=కలదు, (అనగా సూర్యోదయ కాలమందు కిరణములు పోవుటవలన నా చంద్రుఁడు కాన్తిరహితుడై యాకసము చిత్తరువువలె వ్రాయఁబడెనని యర్థము), ఇహ=ఇప్పుడు అనగా నీ ప్రభాతకాలమునందు, అశ్రద్ధాకరం = కాంతి లేనందువలన నశ్రద్ధనుఁ గల్గించునట్టి లేదా శ్రద్ధాకరం=ప్రత్యక్షముగా నుండుటవలన విశ్వాసమును గల్గించు, అస్య=ఈ చంద్రునికి, అద్ధా=సత్యమైన, అనగా సూర్యకాన్తిచే తిరస్కరింపబడుటవలన యథార్థమైన, కర చ్ఛేద=కిరణనాశమును, పశ్య=చూడుము, కిఞ్చ=మఱియు, హారిణః= హరిణరూపమైన, యః=ఏ, కలఙ్కః=చిహ్నము (అత్ర=ఇచ్చట; విద్యతే=కలదు) తదపి = ఆ చిహ్నమును, నితరాం=మిక్కిలి, మ్లానిస్థానం, మ్లాని = మాలిన్యమునకు, స్థానం=స్థానము, ఏలయనగా

దానియందును ప్రభావము లోపించినది. పశ్య=చూడుము, ఇందువలన శీఘ్రముగా పడకనుండి లెమ్ము.

మఱియు, శ్రేయసే=ధర్మోపదేశరూపమైన మంగలమునకై, సృష్ట శబ్దం; సృష్ట=రచియింపఁబడిన, శబ్దం = స్మృతిగ్రంథము గల్గిన, శఙ్ఖం=శంఖుడని పేరుగల మునిని, తవ=నీ యొక్క, యశః= కీర్తితో సమానమైన వానిని, లేదా - శఙ్ఖం=శంఖుడను మునిని, తవ= నీయొక్క, యశఃశ్రేయసే; యశః=కీర్తియొక్క యుత్కర్షరూప మైన, శ్రేయసే=మంగలము కొఱకు, (అతడు రచియించిన విధి ననుస రించి కర్మ ననుష్ఠించుటవలన యశము వర్ధిల్లుటవలన) సృష్టశబ్దం= రచియింపబడిన ధర్మశాస్త్రమును, బ్రూమః=చెప్పెదము, యస్య=ఏ శంఖుని యొక్క, సోదర్యః=సోదరుఁడు, సః=అ ప్రసిద్ధుడైన, ద్విజేన్ద్రః = బ్రాహ్మణోత్తముఁడు, లిఖితః=లిఖితుడని పేరుగల ముని, దివి=స్వర్గమునందు, స్పష్టం=అందఱిచే దెలియఁబడి నందు వలన స్ఫుటముగా, అస్తి=ఉన్నాడు, ఇతి=ఇది, అద్ధా=సత్యము, కిఞ్చ=మఱియు, అస్మిన్=ఈ శంఖలిఖితుల చరిత్రము విషయమున, శ్రద్ధాకరం= విశ్వాసమును గల్గించెడి, అస్య=ఈ లిఖితునియొక్క, కరచ్ఛేదమపి=హస్తచ్ఛేదమును గూఁడ, ననగా దొంగతనమను నేర మునకు రాజాజ్ఞచేఁ జేయఁబడిన హస్తచ్ఛేదమును సైతము, పశ్య= చూడుము అనగా వివేచించుము. ఇది పురాణ ప్రసిద్ధమైనది. హారిణః= జ్యేష్ఠ సోదరుఁడైన శంఖమునియొక్క యాశ్రమమందు ఫలములను నపహరించిన లిఖితునకు, యః=ఏ, కలఙ్కః=ఫలములనుఁ జౌర్యముఁ జేయుటయను నపవాదము గలదో, తదపి=అదియు, నితరాం=మిక్కిలి, మ్లానిస్థానం = దుఃఖమునకు కారణమైనది. అని (జానీహి=తెలిసి కొనుము)

వి. ఇచ్చట విశేషణ విశేష్యములు రెండును శ్లేషతోఁ గూడినందువలన, నభిధా వృత్తి ప్రకృతార్థముచే నియంత్రితమైనందువలన నప్రకృతార్థము ధ్వని యగుచున్నది.

48)

''మహాభారతమందలి శాంతిపర్వగత సుద్యుమ్నోపాఖ్యానమున.

''తతః స పృథివీపాలో లిఖితస్య మహాత్మనః ।
కరౌ ప్రచ్ఛేదయామాస ధృతదండో జగామ సః॥

యని ఫలములను దొంగిలించిన లిఖితమునికి రాజు కరచ్ఛేదమునుఁ జేయించెను. ఆ లిఖితు డా దండమును స్వీకరించి వెళ్ళెనని చెప్పఁబడినది.

**సమాసములు :**

సృష్టశబ్దం- సృష్టః శబ్దః యేన సః=సృష్టశబ్దః, తం=సృష్టశబ్దం.
యత్సోదర్యః- యస్య సోదర్యః= యత్సోదర్యః.
ద్విజేన్ద్రః- ద్విజానా మిన్ద్రః=ద్విజేన్ద్రః.
శ్రద్ధాకరం- శ్రద్ధాం కరోతీతి=శ్రద్ధాకరః, తం=శ్రద్ధాకరం.
కరచ్ఛేదం- కరాణాం కరయోః వా ఛేదః=కరచ్ఛేదః, తం= కరచ్ఛేదం.
గ్లానిస్థానం- గ్లానేః స్థానం=గ్లానిస్థానం, తత్=గ్లానిస్థానమ్.
హారిణః- హరిణస్య అయం=హారిణః.

**భావము :**

ఓ నలమహారాజా! నీ కీర్తిని, దేవపూజాది శుభకార్యములందు మంగళమునకై ధ్వని నొసంగెడి శంఖముతో సమానముగాఁ జెప్పెదము. లేదా స్వర్గ సాధనమైన శబ్దముగల శంఖమును నీ కీర్తిగా వర్ణింతుము. నీ యా కీర్తికి ధావల్యము మున్నగు గుణముల చేతను, సముద్రమునందు శంఖముతోఁబాటు పుట్టుటవలనను సహోదరుఁడగు నా ప్రసిద్ధుడైన చంద్రు డాకసమునందు సూర్యకాంతిచేఁ బరాభూతుఁడై ప్రాణములేని చిత్రరువుగా వ్రాయఁబడియున్నాడు. మఱియు నీ ప్రభాతకాలమునందు నమ్మదగిన విషయ మేమనగా, నీ చంద్రుడు సూర్యకాన్తిచేఁ దిరస్కృతుఁడై కరచ్ఛేదమును ననగా కిరణనాశమునుఁ బొంది యున్నాడు. మఱియు నాతనియందు జింక యనెడి కలంకము గూడ నున్నది. అదియు మిక్కిలి మాలిన్యమునకు కారణమైనది చూడుము. కాన శీఘ్రముగా సెజ్జనుండి లెమ్ము.

పక్షాంతరమున-ధర్మోపదేశ రూపమగు మంగలమునకై సృష్టశబ్దుడనగా స్మృతి గ్రంథమును రచియించిన శంఖముని నీయశస్సునకు తుల్యమైన యశస్వి. లేదా యాశంఖమునిని నీకీర్తియొక్క యాధిక్యరూపమగు మంగలము నకై ధర్మశాస్త్రమును రచియించిన వానినిగా జెప్పెదము. ఆశంఖుని సోదరుడగు నా ప్రసిద్ధుడైన లిఖితుడను బ్రాహ్మణోత్తముడు స్వర్గమునం దుండుట యందఱికిని విదితమైన విషయము. ఈ శంఖలిఖితుల చరిత్ర విషయమున విశ్వసింపదగిన దొకటి కలదు. ఆలిఖితుడు సోదరుడగు శంఖుని యాశ్రమమునందు ఫలముల నపహరించుటవలన నతనికి రాజాజ్ఞచే గరచ్ఛేదము జరిగినది. అది కలఙ్కమై మిక్కిలి విషాద హేతువైన దనియు దెలిసికొనుము ॥56॥

శ్లో. తారాశఙ్ఖ విలోపకస్య జలజం తీక్ష్ణత్విషో భిన్దతః
సారమ్భం చలతా కరేణ నిబిడాం నిష్పీడనాం లంభితః,
ఛేదార్థోపహృతామ్బుకమ్బుజ రజోజమ్బాల పాణ్డూభవ
చ్ఛఙ్ఖచ్ఛిత్కరపత్రతా మిహ వహ త్యస్తంగతార్ధో విధుః.

ప. వి. తారాశఙ్ఖ విలోపకస్య-జలజం-తీక్ష్ణత్విషః- భిన్దతః- సారమ్భం-చలతా - కరేణ-నిబిడాం - నిష్పీడనాం - లమ్భితః - ఛేదార్థోపహృతామ్బుకమ్బుజ రజో జమ్బాల పాణ్డూభవచ్ఛఙ్ఖచ్ఛిత్కరపత్రతామ్- ఇహ - వహతి- అస్తం-గతార్ధః-విధుః.

అర్థము: తారాశఙ్ఖ విలోపకస్య; తారా = నక్షత్రములనెడి, శంఖ = శంఖములను, విలోపకస్య = ప్రభాత కాంతులచే నశింపజేయువాడును, (భేదించు వాడును), జలజం = పద్మమును, శంఖమును, భిన్దతః = భేదించు వాడును నగా శంఖములను ఖండించువాడును, పద్మమును వికసింప జేయువాడును, శంఖమును జేతికి కంకణాది భూషణములుగా జేయుటచే రంధ్రములు వేసి మఱచువాడును, తీక్ష్ణత్విషః = తీక్ష్ణమైన కాంతిగలవాడు, తీక్ష్ణమగు సాధనమును దాల్చిన యొక శంఖకారునికిని, సారమ్భం = ప్రయత్నముతో, చలతా = ప్రసరించెడి, అనగా ఛేదించు కార్యమున లగ్నమై యుండుటవలన ముందుకు వెనుకకు మాటిమాటికి

గదులుచున్నట్టి, కరేణ=కిరణము చేతను, హస్తముచేతను, నిబిడాం= గట్టి, నిష్పీడనాం=బాధించుటను, పట్టుకొనుటను, లమ్భితః=పొందింపఁ బడిన, అస్తం = కనఁబడకపోవుటను, గతార్ధః, గత = పొందిన, అర్ధః=సగపాలు గల్గిన, విధుః=చంద్రుఁడు, ఇహ=ఈ యర్ధాస్త మయపు సమయమునందు, ఛేదార్థోపహృతామ్బుకమ్బుజరజో జమ్బాల పాణ్డుభవచ్ఛఙ్ఖచ్ఛిత్కరపత్రతాం; ఛేదార్థ = నక్షత్రరూపములైన శంఖములను ఛేదించుటకై, ఉపహృత = సమీపమునకుఁ దేఁబడిన, అంబు = ఉదకముతోడ, కమ్బుజ = ఛేదింపఁబడు శంఖములనుండి యేర్పడిన, రజః=అంపముతోఁ గోయుట వలన నేర్పడు పొడియొక్క, జమ్బాల=అడుసుతో, పాణ్డుభవత్=తెల్లఁబడుచున్న, శంఖచ్ఛిత్= శంఖములను ఛేదించునట్టి, కరపత్రతాం = అంపముగా నుండుటను, వహతి ఇవ=వహించుచున్నాడో యనునట్లున్నాడు. శంఖచ్ఛేదకమగు అంపము, అర్ధచంద్రాకారముగా నుండుటవలన నర్ధాస్తమయముఁ బొందిన చంద్రుడు ఆ అంపమువలె నున్నాడని యర్థము.

వి. అర్ధచంద్రుఁడు, శంఖచ్ఛేదకమగు అంపము గాకపోయినను నట్టి అంపముగా భావింపఁబడుటవలన నుత్ప్రేక్ష. వ్యఞ్జకమునుఁ బ్రయోగింప నందువలన నది గమ్యము.

**సమాసములు :**

తారాశఙ్ఖవిలోపకస్య - తారా ఏవ శఙ్ఖాః=తారాశఙ్ఖాః, తారాశఙ్ఖానాం విలోపకః=తారాశఙ్ఖ విలోపకః, తస్య=తారాశఙ్ఖవిలోపకస్య.

తీక్ష్ణత్విష - తీక్ష్ణా త్విట్ యస్య సః=తీక్ష్ణత్విట్, తస్య=తీక్ష్ణత్విషః.

సారమ్భం - ఆరమ్భేన సహితం యథా తథా=సారమ్భమ్.

ఛేదార్థోపహృతామ్బుకమ్బుజరజోజమ్బాల పాణ్డుభవచ్ఛఙ్ఖ చ్ఛిత్కరపత్రతాం - ఛేదాయ=ఛేదార్థం, ఛేదార్థ ముపహృతం= ఛేదార్థోపహృతం; ఛేదార్థోపహృతం చ తత్ అమ్బు చ=ఛేదార్థోపహృ తామ్బు, ఛేదార్థోపహృతామ్బునా కమ్బుజం = ఛేదార్థోపహృతామ్బు కమ్బుజం, ఛేదార్థోపహృతామ్బుజస్య రజః = ఛేదార్థోపహృతామ్బు

కమ్బుజరజః, ఛేదార్థోపహృతామ్బుకమ్బుజరజసః జమ్బాలః=ఛేదార్థోపహృతామ్బు కమ్బుజ రజోజమ్బాలః, అపాణ్డు పాణ్డు సమ్పద్యమానం భవత్ = పాణ్డూభవత్, ఛేదార్థోపహృతామ్బుకమ్బుజరజోజమ్బాలేన పాణ్డూభవత్ = ఛేదార్థోపహృతామ్బుకమ్బుజరజోజమ్బాలపాణ్డూభవత్, శంఖం ఛినత్తీతి=శంఖఛిత్, శంఖచ్ఛిచ్చ తత్ కరపత్రం చ=శంఖచ్ఛిత్కరపత్రం, ఛేదార్థోపహృతామ్బుకమ్బుజరజోజమ్బాలపాణ్డూభవచ్చ తత్ శంఖచ్ఛిత్కరపత్రం చ=ఛేదార్థోపహృమ్బుకమ్బుజరజోజమ్బాలపాణ్డూభవచ్ఛంఖచ్ఛిత్కరపత్రం, ఛేదార్థోపహృతామ్బుకమ్బుజరజోజమ్బాలపాణ్డూ భవచ్ఛఙ్ఖచ్ఛిత్కరపత్రస్య భావః = ఛేదార్థోపహృతామ్బుకమ్బుజ రజోజమ్బాలపాణ్డూ భవచ్ఛఙ్ఖచ్ఛిత్కర పత్రతా, తాం = ఛేదార్థోపహృతామ్బుకమ్బుజరజోజమ్బాలపాణ్డూభవచ్ఛఙ్ఖచ్ఛిత్కర పత్రతామ్.

**భావము :**

సూర్యోదయముచే నక్షత్రములు లోపించినవి. అట్లు నక్షత్రములను నన్తర్థానము గావించువాడును (ఛేదించువాడును) అట్లే పద్మమును, శంఖమును, భేదించువాడును ననగా పద్మమును వికసింపఁజేయువాఁడును, శంఖమును కఙ్కణములు మున్నగు భూషణములకై ఛేదించి రంధ్రములు వేయువాడుననగు తీక్ష్ణాంశువునకు - ననగా తీక్ష్ణకిరణములుగల సూర్యునకును (తీక్ష్ణమగు సాధనమును ధరించిన శంఖకారునకును) సంబంధించినదియు, ఛేదించు కార్యమందు ముందుకు వెనుకకు చలించునదియనగు కరముచే ననగా కిరణముచే (హస్తముచే) గట్టియైన బాధను పట్టుఁబొందింపఁబడినవాడై యస్తమయమునుఁ బొందిన తన యర్ధభాగముగల్గిన చంద్రుడీసమయమున నక్షత్రములనెడి శంఖములను ఖండించుటకు సౌకర్య మేర్పడుటకై తేఁబడిన జలముతోఁగూడిన శంఖపు పొదుల యడుసుతోఁ దెల్లఁబడిన శంఖచ్ఛేదకమగు అంపమై యున్నాడు. అనగా సూర్యుఁ డుదయింపగనే నక్షత్రము లన్తర్ధానము నొందినవి. చంద్రుఁడును నస్తమింపఁ దొడగెను. అందులోను నతని మండలమున నగపాలు అస్తమించినది. సూర్యుఁ డనెడి శంఖకారుఁడు నక్షత్రము లనెడి శంఖమును చెక్కి రంధ్రములను చేసి

భూషణములను నిర్మించుచున్నాడు. దాని కాశంఖములను కోయుటకుఁ దేఱిడిన నీటితోఁ గలసిన శంఖచూర్ణముతో నదుసైనది. ఆయదుసు, ఆ అంపముపైఁ బడుటచే తెల్లఁబడినది. శంఖాదులనుఁ గోసెడి అంపము అర్ధచంద్రాకృతినిఁ గల్గి యుండును. కాన నిప్పుడా యస్తమించు చంద్రుని యర్ధభాగ మాయదుసుపడిన అంపముగా నున్నదని యాశయము ॥67॥

శ్లో. జలజభిదురీభావం ప్రేప్సుః కరేణ నిపీడయ
త్యశిశిరకర స్తారాశఙ్ఖప్రపఞ్చవిలోపకృత్,
రజనిరమణ స్యా_స్త క్షోణీధరార్ధపిధావశా
ద్దధత మధునా బిమ్బం కమ్బుచ్ఛిదః కరపత్రతామ్. ॥1॥

ప. వి. జలజభిదురీభావం- ప్రేప్సుః- కరేణ- నిపీడయతి- అశిశిరకరః-తారాశఙ్ఖ ప్రపఞ్చవిలోపకృత్ - రజనిరమణస్య - అస్తక్షోణీధరార్ధపిధావశాత్ - దధతమ్-అధునా-బిమ్బం-కమ్బుచ్ఛిదః-కరపత్రతామ్.

అర్థము : తారాశఙ్ఖప్రపఞ్చవిలోపకృత్; తారా = నక్షత్రములయొక్కయు, శఙ్ఖ = శంఖములయొక్కయు, ప్రపఞ్చ = ప్రపఞ్చమునకు, విలోపకృత్ = అన్తర్ధానముగావించిన, అశిశిరకరః = సూర్యుడు, జలజభిదురీభావం; జలజ = కమలమునకును శంఖమునకును, భిదురీభావం = వికాసత్వమును, విదారకత్వమును (వజ్రత్వమును) కరేణ = కిరణముచే, హస్తముచే, ప్రేప్సుః = పొందఁగోరినవాఁడై, నిపీడయతి = పీడించుచున్నాడు. మిక్కిలి ధారణఁ జేయుచున్నాడు. రజనిరమణస్య = రాత్రికి ప్రియుడైన చంద్రునియొక్క, బిమ్బం = మణ్డలము, అస్తక్షోణీధరార్ధపిధావశాత్; అస్తక్షోణీధర = అస్తాచలమునందు, పిధావశాత్ = మఱుగుపడుటవలన, కమ్బుచ్ఛిదః = శంఖమునుఁ గోయువానియొక్క, కరపత్రతాం = అంపముగానుండుటను, దధతం = వహించుచున్నాడని యర్థము.

సమాసములు :

*జలజ భిదురీభావం* — అభిదురస్య భిదురస్య సమ్పద్యమానస్య భావః = భిదురీభావః, జలజస్య భిదురీభావః = జలజభిదురీభావః, తం = జలజభిదురీభావం.

తారాశఙ్ఖ ప్రపఞ్చ విలోపకృత్ - తారాశ్చ శంఖాశ్చ=తారాశంఖాః, తారాశంఖానాం ప్రపఞ్చః = తారాశంఖప్రపఞ్చః, తారాశంఖ ప్రపఞ్చస్య విలోపః = తారాశంఖప్రపఞ్చవిలోపః, తారాశంఖ ప్రపంచవిలోపం కరోతీతి=తారాశంఖ ప్రపంచ విలోపకృత్.

రజనిరమణస్య - రజనేః రమణః = రజనిరమణః, తస్య=రజని రమణస్య.

అస్తక్షోణీధరార్ధ పిధావశాత్ - క్షోణీం ధరతీతి = క్షోణీధరః, అస్త ఇతి క్షోణీధరః=అస్తక్షోణీధరః, అర్ధస్య పిధా=అర్ధపిధా, అస్తక్షోణీ ధరే అర్ధపిధా = అస్తక్షోణీధరార్ధపిధా, అస్తక్షోణీధరార్ధపిధాయాః వశః = అస్తక్షోణీధరార్ధపిధావశః, తస్మాత్ = అస్తక్షోణీధరార్ధ పిధావశాత్.

కమ్బుచ్ఛిదః - కమ్బూనః చ్ఛిత్=కమ్బుచ్ఛిత్, తస్య కమ్బుచ్ఛిదః.

కరపత్రతాం - కరపత్రస్య భావః=కరపత్రతా, తాం=కరపత్రతామ్.

భావము :

తార లనెడి శంఖములను నాకసమునందు లోపింపఁజేసెడి సూర్యుడు జలజమునకు - అనగా పద్మమునకును, శంఖమునకును, భిదురత్వమును అనగా కమలమునకు వికాసకత్వముచేతను, శంఖమునకు విదారకత్వముచేతను, వజ్రత్వమును వహించును. వజ్రము భేదకము గదా ! చంద్రబింబ మస్తపర్వతమున సగపాలు మఱుగుపడినందువలన నది శంఖకారుని అంపపు టాకారమును వహించుచున్న చంద్రబింబము నా సూర్యుడు పీడించుచున్నాడు. అనగా తన కిరణములచే నతని కాన్తినిఁ దిరస్కరించుచున్నాడని యర్థము. ॥1॥

ఈ శ్లోకమును ప్రకాశ వ్యాఖ్యాకారుడు వ్యాఖ్యానించెను. ఇచ్చటి 57 వ శ్లోకముతో సమానార్థకము. కాన ప్రక్షేపమని తోచుచున్నది ॥1॥

శ్లో. యత్పాథోజవిముద్రణప్రకరణే నిర్నిద్రయ త్యంశుమాన్
దృష్టీః పూరయతి స్మ యజ్జలమహోమక్ష్ణి సహస్రం హరిః,

సాజాత్యం సరసీరుహామపి దృశా మప్యస్తి తద్వాస్తవం
యన్మూలాఽఽద్రియతేతరాం కవితృభిఃపద్మోపమా చక్షుషః.

ప. వి. యత్పాథోజ విముద్రణ ప్రకరణే-నిర్నిద్రయతి- అంశుమాన్-దృష్టీః-పూరయతి-స్మ-యత్-జలరుహాం-అక్ష్ణా-సహస్రం- హరిః - సాజాత్యం-సరసీరుహామ్-అపి-దృశామ్- అపి-అస్తి -తత్ - వాస్తవం-యన్మూలా-ఆద్రియతేతరాం-కవితృభిః-పద్మోపమా-చక్షుషః.

**అర్థము :** యత్=ఎందువలన, అంశుమాన్ = సూర్యుడు, పాథోజవిముద్రణ ప్రకరణే; పాథోజ=తామర పూవుల యొక్క, విముద్రణ=వికసింప జేయుటయొక్క, ప్రకరణే=ప్రసక్తియందు, దృష్టీః=జనుల నేత్రములను, నిర్నిద్రయతి=నిద్రలేని వానినిగాఁ జేయుచున్నాడు. తథా= అట్లే యత్=ఎందువలన, హరిః=విష్ణువు, జలరుహాం=శివపూజకై తెచ్చిన తామర పూవుల యొక్క సహస్రం=వేయిని, అక్ష్ణా=తన నేత్రముచే పూరయతి స్మ=(ఒకటి తక్కువకాగా) తన కంటితోఁ నింపుచునుండెనో అనగా తన కన్నులు గూడ పద్మముల వంటివి గాన నొకటి కొఱవ యైనప్పుడు దానికై తన కన్నులనుంచి యాకొఱతను దీర్చుచుండెనని యర్థము. కావుననే శివమహిమ్న స్తోత్రమునందు 'హరిస్తే సాహస్రం కమలబలి మాధాయ పదయోః, యదేకోనే తస్మిన్ నిజ ముదహర న్నేత్ర కమలమ్" అని చెప్పఁబడి యున్నది. తత్=అందువలన; సరసీరుహామపి=కమలములకును, దృశామపి=నేత్రములకును వాస్తవం= నిజమైన, సాజాత్యం=సమానజాతిని కల్గియుండుట, అస్తి=ఉన్నది.హరియు సూర్యుడునుఁ జేసిన పైకార్యములనుఁ బట్టి పద్మములకు నేత్రములకును సమాన జాతీయత యున్నదను విషయమునందు సంశయము లేదు. కానిచో పద్మ వికాస ప్రకరణముతో బాధ యేర్పడును. అట్లు సాజాత్యమే లేనిచో పద్మములకు బదులు కన్నులనుంచుటయు సరిపడదు. బంగారు కొఱవ యైనప్పుడు బంగారునే పెట్టవలయును కాని సీసము నుంచము గదా ? కవితృభిః=కవులచే, యన్మూలా, యత్=ఏసమాన జాతీయత్వము, మూలా= మూలముగా గల్గిన, చక్షుషః= నేత్రమునకు పద్మోపమా; పద్మ=కమలములతో, ఉపమా=సామ్యము, ఆద్రియతే

తరాం=మిక్కిలి యాదరింపఁబడు చున్నది. మంచి వస్తువులైన బంగారు నకును, వెండికిని, వైజాత్యముచే, సామ్యము కుదురదు గదా ! జను లందఱును మేల్కొనిరి. నీవును మేల్కొనుమని యర్థము.

**సమాసములు :**

*పాథోజవిముద్రణ ప్రకరణే* - పాథస్సు జాయన్త ఇతి=పాథోజాని, పాథోజానాం విముద్రణం=పాథోజవిముద్రణం, పాథోజవిముద్రణస్య ప్రకరణం=పాథోజవిముద్రణ ప్రకరణం, తస్మిన్=పాథోజవిముద్రణ ప్రకరణే.

*నిర్నిద్రయతి* - నిర్గతా నిద్రా యాభ్య స్తాః=నిర్నిద్రాః; నిర్నిద్రాం కరోతీతి=నిర్నిద్రయతి.

*సాజాత్యం* - సమానా జాతిః యేషాం తే=సజాతయః, సజాతీనాం భావః=సాజాత్యం.

*యన్మూలా* - యత్ మూలం యస్యా స్సా=యన్మూలా.

*పద్మోపమా* - పద్మైః ఉపమా=పద్మోపమా.

**భావము :**

సూర్యుడు పద్మములను వికసింపఁజేయు సందర్భమునందే జనుల నేత్రములను సైతము వికసింపఁజేయుచున్నాడు. అనగా వానినిద్రనుఁ తొలగించుచున్నాడు. అట్లే విష్ణువు శివపూజకై తెచ్చిన కమలములలో వేయింటి కొకటి కొఱవఁబడినదోఁ తనకంటినుంచి పూర్తిచేయుచున్నాడు. కావుననే-

హరి స్తే సాహస్రం కమలబలి మాధాయ పదయోః ।
యదేకోనే తస్మి న్నిజ ముదహర న్నేత్రకమలమ్ ॥ అని శివమహిమ్నః స్తోత్రమునందుఁ జెప్పఁబడినది. అట్లు సూర్యుడును విష్ణువును చేయుటవలన పద్మములకును, నేత్రములకు వాస్తవికమైన సాజాత్యము సిద్ధించుచున్నది. అట్లు కానిచో, సూర్యుడు పద్మములను వికసింపఁజేయుసందర్భమున జనుల నేత్రములలోని నిదురనుఁ దొలగించి వానిని సైతము వికసింపఁజేయుటయు, విష్ణువు శివుని

పాదపూజఁ జేయుసందర్భమున పద్మమొకటి కొఱవఁబడినచో తననేత్రముచే దానినిఁ బూరించుటయు, సరిపడదు. కాన నా పద్మములకును, నేత్రములకును, సాజాత్యము సిద్ధించినదని యర్థము. కవులు సైత మీ సాజాత్యము ననుసరించియే నేత్రములకు పద్మములతోటి సామ్యమును తమవర్ణనలయందుఁ గల్పించు చున్నాడు. కావున పద్మములు వికసించినవి. జనులు మేల్కొనిరి. నీవును మేల్కొనుమని యాశయము ॥58॥

శ్లో. అవైమి కమలాకరే నిఖిలయామినీయామిక
శ్రియం శ్రయతి యత్ పురా వితతపత్త్రినేత్రోదరమ్।
తదేవ కుముదం పునర్దిన మవాప్య గర్భభ్రమ
ద్ద్విరేఫరవఘోరణాఘన ముపైతి నిద్రాముదమ్. 59

ప. వి. అవైమి- కమలాకరే- నిఖిలయామినీయామికశ్రియం- శ్రయతి- యత్- పురా-వితతపత్త్రినేత్రోదరం- తత్- ఏవ-కుముదం- పునః- దినమ్- అవాప్య-గర్భభ్రమ ద్ద్విరేఫరవ ఘోరణాఘనమ్- ఉపైతి-నిద్రాముదమ్.

అర్థ:- యత్ = ఏ, కుముదం = కలువ, పురా = దీనికంటెఁ బూర్వము, కమలా కరే = తామరకొలనియందు, పక్షాన్తరమున, కమలా = ధనధాన్యరూప మైన లక్ష్మికి, ఆకరే = వసతిస్థానమగు ధనగృహమునందు, వితతపత్త్రి నేత్రోదరం, వితత = విస్తరించిన, పత్త్రి = దలములనెడి, నేత్ర = కన్నుల యొక్క, ఉదరం = మధ్యభాగమునుఁ గల్గిన, నిఖిలయామినీ యామిక శ్రియం; నిఖిల = సమగ్రమైన, యామినీ = రాత్రియందలి, యామిక = జాము జామునకు మేల్కొని గంటలు కొట్టెడివానియొక్క, శ్రియం = శోభను, శ్రయతి స్మ = పొందుచుండెను. తదేవ = ఆ కలువయే, పునః = మఱల నిపుడు, దినం = పగటిని, అవాప్య = పొంది, గర్భభ్రమ ద్ద్విరేఫ రవ ఘోరణాఘనం; గర్భ = లోపల, భ్రమత్ = తిరుగుచున్న, ద్విరేఫ = తుమ్మెదలయొక్క, రవ = శబ్ద మనెడి, ఘోరణా = నిద్ర లోని గురకచే, ఘనం = గాఢముగా, నిద్రాముదం, నిద్రా = నిద్రవలని కనుమోడ్పు యొక్కయు, నిద్ర యొక్కయు, ముదం = సుఖమును, ఉపైతి = పొందుచున్నదని, అవైమి = ఇట్లు తెలుసుకొనుచున్నాను. అనగా

తలంచు చున్నాను. రాత్రియందు మేల్కొనిన వ్యక్తి పగటియందు నిద్రించును గదా !

వి. కలువ, రాత్రియందలి కావలివానియొక్క శోభను వహించుచున్నదని చెప్పుటవలన నిదర్శనాలఙ్కారము. ఒక్క కలువయందు ననేకములగు నిద్రా జాగరణములను క్రమముగాఁ జెప్పుటచే పర్యాయాలఙ్కారము. కలువ తుమ్మెదల రొదయను గురకచే నిద్ర పోకపోయినను, నట్లు చెప్పుటవలన నుత్ప్రేక్ష. "అవైమి" అని వ్యఞ్జకమునుఁ జెప్పుటవలన నది వాచ్యము. ఈయలఙ్కారముల కన్నిటికి నిట సఙ్కరము.

సమాసములు :

*కమలాకరే* - కమలానా మాకరః=కమలాకరః, తస్మిన్=కమలాకరే.
*నిఖిల యామినీ యామిక శ్రియం* - నిఖిలా చ సా యామినీ చ=నిఖిల యామినీ, నిఖిల యామిన్యాం యామికః = నిఖిల యామినీయామికః, నిఖిల యామినీ యామికస్య శ్రీ రివ శ్రీః = నిఖిల యామినీ యామిక శ్రీః; తాం=నిఖిల యామినీ యామిక శ్రియమ్.

*వితత పత్త్రి నేత్రోదరం* - వితతాని చ తాని పత్రాణి చ వితత పత్రాణి, నేత్రాణా ముదరాణి=నేత్రోదరాణి, వితత పత్రాన్యేవ నేత్రోదరాణి యస్య తత్=వితత పత్త్రి నేత్రోదరం.

*గర్భ భ్రమ ద్ద్విరేఫ రవ ఘోరణా ఘనం.* - గర్భే భ్రమన్తః = గర్భ భ్రమన్తః, గర్భ భ్రమన్తశ్చ తే ద్విరేఫాశ్చ=గర్భ భ్రమ ద్ద్విరేఫాః, గర్భభ్రమద్ద్వి రేఫాణాం రవః=గర్భభ్రమ ద్ద్విరేఫరవః, గర్భభ్రమ ద్ద్విరేఫ రవ ఏవ ఘోరణా=గర్భభ్రమ ద్ద్విరేఫ రవఘోరణా, గర్భ భ్రమ ద్ద్విరేఫ రవ ఘోరణయా ఘనం యథా తథా=గర్భభ్రమ ద్ద్విరేఫ రవ ఘోరణాఘనం.

*నిద్రాముదం* - నిద్రాయాః ముత్=నిద్రాముత్, తాం నిద్రాముదం.

భావము :

కలువ యింతకంటె పూర్వము కమలాకరమందు ననగా తామర కొలని యందును, ధన సంపత్తి రూపమగు కమలకు, ననగా లక్ష్మికి వసతి స్థానమగు బొక్కసము నందును, తన దళములనెడి నయన మధ్య భాగములు గల్గినదై రాత్రి యంతయు జాము కావలివాడుగ మేల్కొనినదై, యాతని శోభనుఁ బొందుచున్నది. ఆ కలువయే యిప్పుడు పగటినిఁ బొంది తనలోని భాగమునఁ దిరిగెడి తుమ్మెదల రొదయనెడి గురకలచే గాఢ నిద్రవలని సుఖమునుఁ బొందు చున్నదని భావింతును. రాత్రి యంతయు లక్ష్మినివాస స్థానమైన బొక్కసముగా నున్న తామర కొలనికిఁ గావలి యుండినందువలన కలువ నిదురపోలేదు. అందు వలన పగలు నిద్రపోవ నారంభించినది. ఆ కలువ రాత్రి పూచి యున్నందు వలన నందు తుమ్మెదలు జొరఁబడి పగలు ముడుచుకొని పోవుటచే నందు తుమ్మెద లట్లే యుండి రొదఁ జేయుచుండినవి. ఆ తుమ్మెదల రొదయే, ఆ కలువ నిద్రలోని గురకగా భావింపబడినది. అట్లు గురక లిడుచు గాఢ నిద్రాసుఖము నాకలువ యనుభవించుచుండినదని యాశయము ॥59॥

శ్లో. ఇహ కిముషసి పృచ్ఛాశంసికింశబ్దరూప
ప్రతి నియమిత వాచా వాయసే నైష పృష్టః,
భణ ఫణిభవశాస్త్రే తాతజః స్థానినౌ కా
వితి విహితతుహీవాగుత్తరః కోకిలోఽభూత్. 60

ప. వి. ఇహ- కిమ్- ఉషసి- పృచ్ఛాశంసికింశబ్దరూపప్రతినియమితవాచా-వాయసేన-ఏషః- పృష్టః- భణ- ఫణిభవశాస్త్రే- తాతజః- స్థానినౌ- కౌ-ఇతి-విహితతుహీవాగుత్తరః-కోకిలః-అభూత్.

అర్థము : ఇహ = ఈ, ఉషసి = వేకువన, పృచ్ఛాశంసికింశబ్దరూపప్రతినియమిత వాచా; పృచ్ఛా = ప్రశ్నను, శంసి = సూచించు, కింశబ్ద = 'కిమ్' అనెడు సర్వనామశబ్దముయొక్క, రూప = రూపమైన, ''కౌ'' యను ప్రథమాద్వివచనాన్తపదనిష్పత్తియందు, ప్రతినియమిత = ఎల్లప్పుడును నియమింపఁబడిన, వాచా = వాక్కుగల్గిన అనగా ''కౌ'' యను వ్యక్త

మగు వాక్కుగల్గిన, వాయసేన = కాకిచే, ఫణిభవశాస్త్రే; ఫణి = శేషునివలన, భవ = ఏర్పడిన, శాస్త్రే = శాస్త్రమునందు ననగా పాణినీయ మహాభాష్యమునందు, తాతఙః = 'తాతఙ్' అను నాదేశమునకు, స్థానినౌ = స్థానులైనవి, కౌ = ఏవి? భణ = చెప్పుము. ఇతి = ఇట్లు, పృష్టః ఇవ = ప్రశ్నింపఁబడినవాఁడో యనునట్లు, ఏషః = ఎదుట జెట్టుపైనున్న, కోకిలః = కోకిల, విహితతుహీవాగుత్తరః; విహిత = విధింపఁబడిన యనగా ప్రయుక్తమైన, 'తుహీ' = 'తు' అనెడి 'హి' యనెడి, వాక్ = తన ధ్వనియే, యుత్తరః = బదులుగాఁ గల్గినదై, అభూత్ కిం = అయినదా యేమి? "తుహ్యోస్తాతఙ్ఙాశి ష్యన్యతరస్యాం" యను పాణినిసూత్రము నందు తు-హి యనువానియొక్క స్థానమున "తాతఙ్" యని యాదేశము విధింపఁబడియున్నది. ఉదయమున కాకి తన "కౌ" యను శబ్దముచే "తాతఙ్ఙనకు స్థాను లెవ్వి యని ప్రశ్నించుచున్నదా యేమి? కోకిలయు 'తు హీ' యను తనశబ్దముచే నాప్రశ్నకు సమాధాన మిచ్చుచున్నదా యేమి? యని యర్థము. పక్షులు మున్నగునవి చేయునట్టి యస్ఫుటధ్వనులు ఎవని కెట్లు వినఁబడునో యత డట్లే తనమనస్సుచేఁ గల్పించి వెల్లడి పఱచును. కాన నీకవి - కాకధ్వనిని 'కౌ' యనియు, కోకిలధ్వనిని 'తుహీ' యనియుఁ గల్పించి 'కౌ' యనెడి కాకికూతచేతను, 'తుహీ' యను కోకిలకూతచేతను, ముందుఁజెప్పిన ప్రశ్నను దాని కీయఁబడిన యుత్తరమును కల్పించి యుత్ప్రేక్షించెనని యర్థము. తెల్లవారినది, కాకులు మొదలగు పక్షులు కూయుచున్నవని యాశయము.

సమాసములు :

పృచ్ఛాశంసికింశబ్దరూపప్రతినియమితవాచా - పృచ్ఛాం శంసతీతి = పృచ్ఛాశంసీ, కిమితి శబ్దః = కింశబ్దః, పృచ్ఛాశంసీ చాసౌ కింశబ్దశ్చ = పృచ్ఛాశంసికింశబ్దః, పృచ్ఛాశంసికింశబ్దస్య రూపం యస్యాస్సా = = పృచ్ఛాశంసికింశబ్దరూపా, ప్రతినియమితా చ సా వాక్ చ = ప్రతినియ మితవాక్, పృచ్ఛాశంసికింశబ్దరూపా చ సా ప్రతినియమితవాక్చ = పృచ్ఛాశంసికింశబ్దరూపప్రతినియమితవాక్, తయా = పృచ్ఛాశంసికింశబ్ద రూపప్రతినియమితవాచా.

ఫణిభవశాస్త్రే - ఫణినః భవతీతి = ఫణిభవం, ఫణిభవం చ తత్ శాస్త్రం చ=ఫణిభవశాస్త్రం, తస్మిన్ = ఫణిభవశాస్త్రే.
విహితతుహీవాగుత్తరః - తుశ్చ హిశ్చ=తుహీ, తుహీ ఇతి వాక్ = తుహీవాక్, తుహీవాగేవ ఉత్తరం = తుహీవాగుత్తరం, విహితం తుహీవాగుత్తరం యేన సః=విహితతుహీవాగుత్తరః.

**భావము :**

ఈ ప్రభాతకాలమునందు ప్రశ్నవాచకమగు కింశబ్దమునకు ప్రథమా ద్వివచనరూపమైన ''కౌ'' యనెడి తనశబ్దముచే కాకి పాతఞ్జలమహాభాష్యముతోఁ గూడిన పాణినివ్యాకరణమందలి ''తాతఙ్'' నకు స్థాను లెవ్వి యని ప్రశ్నింపగా నెదుట చెట్టునందున్న కోకిల ''తు హీ'' యను తనశబ్దముచే నుత్తర మొసంగుచున్నది. అనగా పాణిని వ్యాకరణమునందు 'తు-హి' యను ప్రత్యయములకు, ఆశీరర్థమునందు ''తుహ్యోస్తాతఙ్ఙాశిష్యన్యతరస్యాం'' (7-1-35) అను పాణిని సూత్రముచే, ''తాతఙ్'' ఆదేశముగా విధింపఁబడియున్నది. ఉదయకాలము కాకి 'కౌ' 'కౌ' యను ప్రశ్నవాచకశబ్దముచే ''తాతఙ్'' వేనికి ఆదేశముగా వచ్చునని ప్రశ్నింపగా నెదుటనున్న కోకిల "తుహీ'' ''తుహీ'' యను తన కూతలచే ''తు-హి'' అనువాని కాదేశముగా వచ్చునని యుత్తరమిచ్చినట్లు కాకధ్వనిని కోకిలధ్వనిని కవి యుత్ప్రేక్షించుచున్నాడు. తెల్లవారినది. కాకులు మున్నగు పక్షులు కూయుచున్నవి. మేల్కొనుమని యాశయము ॥60॥

శ్లో. దాక్షీపుత్రస్య తన్త్రే ధ్రువ మయ మభవత్ కోఽప్యధీతీ కపోతః
కణ్ఠే శబ్దౌఘసిద్ధిక్షతబహుకఠినీశేష భూషానుయాతః,
సర్వం విస్మృత్య దైవాత్ స్మృతి ముషసి గతాం ఘోషయన్ యో ఘు-సంజ్ఞాం
ప్రాక్సంస్కారేణ సమ్ప్రత్యపి ధువతి శిరః పట్టికాపాఠనేన ॥61॥

ప. వి. దాక్షీపుత్రస్య- తన్త్రే- ధ్రువమ్- అయమ్- అభవత్- కః- అపి-అధీతీ- కపోతః- కణ్ఠే- శబ్దౌఘసిద్ధిక్షతబహుకఠినీశేషభూషానుయాతః - సర్వం

విస్మృత్య - దైవాత్ - స్మృతిం- ఉషసి- గతాం- ఘోషయన్- యః- ఘుసంజ్ఞాం- ప్రాక్సంస్కారేణ- సప్రమృతి- అపి- ధువతి- శిరః- పట్టికా పాఠనేన.

అర్థము : అయం = ఈ కానఁబడు. కో పి = ఒకానొక, యనగా పూర్వ వృత్తాంతము తెలియని, కపోతః = పావురము, దాక్షీపుత్రస్య = దక్షగోత్రమున జన్మించి యామెకు పుత్రుఁడైన లేదా దాక్షియనెడి యామెకు పుత్రుడైన పాణినియొక్క, తన్త్రే = శాస్త్రమైన వ్యాకరణమునందు, ధ్రువం = నిశ్చయముగా, అధీత = అధ్యయనము గావించినదిగా, అభవత్ = ఉండినది. యః = ఏ పావురము, కణ్ఠే = కుత్తుకయందు, శబ్దౌఘసిద్ధిక్షత బహుకఠినీ శేష భూషానుయాతః; శబ్దౌఘ = శబ్దరాసుల యందు ననగా 'రామః' 'రామౌ' 'రామాః' ఇత్యాది శబ్ద సమూహముల యందు, సిద్ధి = అభ్యాసముఁ బడయుటకై, క్షత = విఱిగిపోయిన, బహు = పెక్కులైన, కఠిన = బలపములకు, శేష = మిగిలిన మొటిక లనెడి, భూషా = ఆభరణములచే, అనుయాతః ఇవ = కూడినదో యనునట్లున్నదై అనగా బలపములపిండిచే కంఠమునందుఁ బూయఁబడినదో యనునట్లున్నదై, (పావురము మెడచుట్టును కొంచెము తెల్లనైన పట్టి వంటి గీత యుండును. అది బలపపు ఱాయిరంగుగా నధ్యవసానము చేయఁబడినది). సర్వం = పఠింపఁబడిన శాస్త్రమునంతటిని, విస్మృత్య = మఱచి, (తిర్యగ్జంతువుగా జన్మించినందువలన మఱచి యని యర్థము) ఘట్టికా పాఠనేన; ఘట్టికా = ఱాతిపలకలయందు, పాఠనేన = వ్రాయఁబడిన విషయములనుఁ జదివించుటచే నేర్పడిన, ప్రాక్సంస్కారేణ = పూర్వజన్మపు సంస్కారముచే, దైవాత్ = దైవమువలన ననగా హఠాత్తుగా, స్మృతిం = స్మరణమును, గతాం = పొందిన, ఘుసంజ్ఞాం = 'ఘు' యని ''దాదా ఘ్వదాప్' యను పాణినిసూత్రముచే విధింపఁబడిన పేరును, ఘోషయన్ = 'ఘు' 'ఘు' యను ధ్వనిని బిగ్గరగాఁ గూయుచు, సప్రమృత్యపి = ఈ వేకువయందు గూడ, శిరః = తలను, ధువతి = విదలించుచున్నది లోకమునందు, మఱచిన విషయము జ్ఞప్తికి రాగనే మనుష్యుడు తలను విదలించుట ప్రసిద్ధము.

సమాసములు :

దాక్షీపుత్రస్య - దక్షస్య గోత్రాపత్యం స్త్రీ=దాక్షీ, దాక్ష్యాః పుత్రః= దాక్షీపుత్రః, తస్య=దాక్షీపుత్రస్య.

అధీతీ - అధీత మస్య అ స్తీతి= అధీతీ.

శబ్దౌఘ సిద్ధిక్షత బహుకఠినీ శేష భూషానుయాతః - శబ్దానామోఘః= శబ్దౌఘః, శబ్దౌఘస్య సిద్ధిః=శబ్దౌఘసిద్ధిః=శబ్దౌఘసిద్ధ్యై క్షతాః= శబ్దౌఘ సిద్ధిక్షతాః, శబ్దౌఘసిద్ధిక్షతాశ్చ తాః కఠిన్యశ్చ=శబ్దౌఘసిద్ధిక్షత కఠిన్యః. శబ్దౌఘ సిద్ధిక్షత కఠినీనాం శేషః=శబ్దౌఘసిద్ధిక్షత కఠినీశేషః శబ్దౌఘ సిద్ధిక్షత కఠినీ శేష ఏవ భూషా=శబ్దౌఘ సిద్ధిక్షత కఠినీశేష భూషా, శబ్దౌఘ సిద్ధిక్షతకఠినీ శేషభూషయా అనుయాతః=శబ్దౌఘ సిద్ధిక్షతకఠినీ శేషభూషానుయాతః.

ప్రాక్సంస్కారేణ - ప్రాక్ చాసౌ సంస్కారశ్చ = ప్రాక్సంస్కారః, తేన=ప్రాక్సంస్కారేణ.

పట్టికాపాఠనేన - పట్టికాయాం పాఠనం=పట్టికాపాఠనం, తేన=పట్టికా పాఠనేన

భావము :

తనపూర్వవృత్తాంతమునుఁ దెలియని, యీయెదుటనున్న పావురము. జన్మాంతరమున,పాణినివ్యాకరణమును నిశ్చయముగా నధ్యయనముఁ గావించినది, ఏలయనగా నాపావురము 'రామః రామౌ రామాః' ఇత్యాది శబ్దరాశులయందు నభ్యాసము గలుగుటకై జాతిపలకలపై వ్రాసి వ్రాసి విఱిగిపోయిన బలపముల చూర్ణముచే మెడచుట్టునుఁ బట్టె రూపమున నలదుకొనినదై చదివినదంతయు మఱచి పలకయందు వ్రాయఁబడిన విషయములనుఁ బఠించుటచే, బూర్వజన్మమందలి సంస్కారముయొక్క యుద్బోధమునుఁ బొందినది. అందువలన తనకు జ్ఞప్తికి వచ్చిన 'దాదాఘ్వదాప్' అను సూత్రముచే విధింపఁబడిన "ఘు" సంజ్ఞను "ఘు" "ఘు" అని బిగ్గరగాఁ గూయుచు నీయుషఃకాలమునందును, దీనిని జ్ఞప్తికి తెచ్చు కొనుటవలనఁ దలను విదలించుకొనుచున్నది. లోకమున మఱచిన విషయము జ్ఞప్తికి రాగనే తలను విదలించుట సహజముగదా. పావురము సహజముగా "ఘు"

''ఘు'' యని కూయుచుండును. పాణినివ్యాకరణమున కొన్నిశబ్దములకు ''ఘు'' సంజ్ఞ విధింపఁబడినది. పూర్వ జన్మమున పలకపై బలపముచే శబ్దమును వ్రాసి వ్రాసి యా చూర్ణమును మెడకుఁ బూసుకొనినది. చక్కగా కంఠమున శబ్దోచ్చారణ యేర్పడుట కాబలపముల పొడినిఁ గంఠమున కలదుకొను పద్ధతి యుండినట్లు తెలియుచున్నది. జన్మాంతరమం దావిధముగా మెడకు పట్టించిన బలపపు పొడియొక్క పూత యట్లే యీజన్మమున దాని కనువర్తించి కానఁబడుచున్నది. ఆ పావురమునకు దైవవశమున పూర్వజన్మపు సంస్కార ముద్బుద్ధమైనందు వలన నప్పుడు తా పఠించిన 'ఘు' సంజ్ఞ జ్ఞప్తికిరాగా, వేకువన దానిని గట్టి పఱచుకొనుచున్నది. లోకమున చదివిన పాఠములను గట్టిపడుటకై వేకువన చింతనఁ జేయుట గలదు గదా ! అవ్విధముగనే యీపావురము జ్ఞప్తికి వచ్చిన 'ఘు' సంజ్ఞాది వ్యాకరణాంశములను బిగ్గరగా నఱచి చింతన చేయుచున్నది. కాన నీవు మేల్కొను మని యాశయము ॥61॥

శ్లో. పౌరస్త్యాయాం ఘుసృణ సుమనః శ్రీజుషో వైజయన్త్యా
స్తోకై శ్చిత్తం హరతి హరితి క్షీరకణ్ఠై ర్మయూఖైః,
భాను ర్జామ్బూనదరుచి రసౌ శక్రసౌధస్య కుమ్భః
స్థానే పానం తిమిరజలధే ర్భాభి రేతద్భవాభిః. 62

ప. వి. పౌరస్త్యాయాం-ఘుసృణసుమనః శ్రీజుషః-వైజయన్త్యాః-తోకైః-చిత్తం-హరతి- హరితి - క్షీరకణ్ఠైః- మయూఖైః - భానుః- జామ్బూనదరుచిః - అసౌ-శక్రసౌధస్య- కుమ్భః- స్థానే- పానం- తిమిరజలధేః- భాభిః- ఏతద్భవాభిః.

అర్థము : జామ్బూనద=ఉదయించుటచే పసిడియొక్క, రుచిః = కాంతివంటి కాన్తిగల్గిన, శక్రసౌధస్య=ఇంద్రుని మేడయగు వైజయన్తమునకు, కుమ్భః=మేడపై కొనయం దుంచఁబడిన కలశమైన, అసౌ=ఈకానఁబడు, భానుః=సూర్యుఁడు, పౌరస్త్యాయాం=ముందునున్న తూర్పునెడి, హరితి=దిక్కునందు, ఘుసృణ సుమనః శ్రీజుషః; ఘుసృణ=కుంకుమ

యొక్క, సుమనః=పుష్పములయొక్క, శ్రీ=కాన్తిని, జుషః=పొందు చున్న యనగా నెట్టిటి వన్నె గల్గిన, వైజయన్త్యాః = ధ్వజముయొక్క, తోకైః=బిడ్డలైన, క్షీరకణ్ఠైః=పాలు త్రాగునట్టి యనగా లేతవైన, మయూఖైః=కిరణములచే, చిత్తం=మనస్సును, హరతి=ఆకర్షించు చున్నది, కిఞ్చ=మఱియు, ఏతద్భవాభిః; ఏతత్ = కలశరూపమైన సూర్యునుండి, భవాభిః=కల్గినట్టి, ఛాభిః=కాన్తులచే, తిమిరజలధేః= చీకటి యను కడలిని, పానం=త్రాగుట, స్థానే=యుక్తము, కుంభమునఁ బుట్టిన యగస్త్యుడు ఎట్లు తన యరచేతఁ గడలినిఁ ద్రాగెనో యట్లే యాకుమ్భసమ్భవుడుగూడ చీకటి కడలినిఁ ద్రావుట యుచితమని యర్థము.

వి. ఇచ్చట సూర్యుని ఇంద్రభవనము యొక్క కలశముగను, చీకటి సముద్రముగను రూపించుటవలన రూపకాలఙ్కారము.

సమాసములు :

పౌరస్త్యాయాం - పురః భవా=పౌరస్త్యా, తస్యాం=పౌరస్త్యాయాం.
ఘుసృణసుమనఃశ్రీజుషః - ఘుసృణస్య సుమనాంసి = ఘుసృణ సుమనాంసి, ఘుసృణసుమనసాం శ్రీః=ఘుసృణసుమనఃశ్రీః, ఘుసృణ సుమనఃశ్రియం జుష్టే ఇతి = ఘుసృణసుమనఃశ్రీజుట్, తస్యాః= ఘుసృణసుమనఃశ్రీజుషః.
క్షీరకణ్ఠైః - క్షీరం కణ్ఠే యేషాం తే=క్షీరకణ్ఠాః, తైః=క్షీరకణ్ఠైః.
జామ్బూనదరుచిః - జామ్బూనదస్య రుచిరివ రుచిః యస్య సః = జామ్బూనదరుచిః.
శక్రసౌధస్య - శక్రస్య సౌధః=శక్రసౌధః, తస్య=శక్రసౌధస్య.
తిమిరజలధేః - తిమిరాణాం జలధిః=తిమిరజలధిః, తస్య = తిమిర జలధేః.
ఏతద్భవాభిః - ఏతస్మాద్భవన్తీతి = ఏతద్భవాః, తాభిః = ఏతద్భ వాభిః.

భావము :

పసిడి కాంతులను విరజిమ్మట వలననే యింద్రుని మేడయగు వైజయంత మునకు శిఖర భాగమునందలి సువర్ణ కలశమైన యీ కనఁబడునట్టి సూర్యుడు తూర్పు దిక్కునందు, కుఙ్కుమ కుసుమ కాంతులుగల వైజయన్తియను ధ్వజమునకు బిడ్డలో యనునట్లున్న లేత కిరణములతో మనస్సు నాకర్షించు చున్నాడు. మఱియు నీ సువర్ణ కలశ రూపమగు సూర్యునుండి యుద్భవించిన ప్రభలచే చీకటి కడలినిఁ బానముచేయుట యుక్తము. పూర్వము కుంభసంభ వుఁడగు నగస్త్య మహర్షి సముద్రపానము గావించెను. నేడీ సూర్యుడనెడి సువర్ణకుంభమునుండి యుద్భవించిన కిరణములు గూడ చీకట్ల సముద్రమును పానము చేయుట సముచితమే యని యాశయము ॥62॥

శ్లో. ద్విత్రై రేవ తమస్తమాల గహన గ్రాసే దవీభావుకై
రుస్రై రస్య సహస్రపత్ర సదసి వ్యశ్రాణి ఘస్రోత్సవః,
ఘర్మాణాం రయచుమ్బితం వితనుతే తత్ప్రిష్ట పిష్టీకృత
క్ష్మాదిగ్వ్యోమ తమోఽఘమోఘమధునా మోఘం నిదాఘద్యుతిః.

ప. వి. ద్విత్రైః-ఏవ-తమస్తమాలగహనగ్రాసే- దవీభావుకైః- ఉస్రైః- అస్య- సహస్రపత్రసదసి-వ్యశ్రాణి-ఘస్రోత్సవః-ఘర్మాణాం-రయచుమ్బితం- వితనుతే-తత్ప్రిష్టపిష్టీకృతక్ష్మాదిగ్వ్యోమతమోఽఘమ్- ఓఘమ్- అధునా- మోఘం-నిదాఘద్యుతిః.

అర్థము:- తమస్తమాల గహనగ్రాసే; తమః=చీకటియనెడి, తమాల=చీకటి చెట్లయొక్క, గహన = అరణ్యమును, గ్రాసే = కబళించుటయందు ననగాఁ దొలగించుటయందు, దవీభావుకైః = కారుచిచ్చుగా నున్నట్టి, అస్య=ఈ సూర్యునియొక్క, ద్విత్రైరేవ = రెండు లేదా మూడగు, ఉస్రైః=కిరణములచే, సహస్రపత్రసదసి = కమలముల సభయందు ననగా పద్మసమూహమునందు, యస్మాత్=ఎందువలన, ఘస్రోత్సవః= దినోత్సవము, అనగా వికాసమునుఁ బొందుటవలనఁ గల్గిన యానన్దము నాచరించుట, వ్యశ్రాణి = ఈయఁబడినదో, తత్=అందువలన ననగా

రెండు మూడు కిరణములచేతనే సకలకార్యములను సాధించుటవలన, నిదాఘద్యుతిః = సూర్యుఁడు, పిష్టపిష్టీకృత......తమోఘం; పిష్టపిష్టీకృత; పిష్ట = పిండిని, పిష్టీకృత = మఱలపిండిగాఁ జేయునట్లు, అనగా రెండుమూడు కిరణములచేఁ జీకటిఁ దొలగింపబడినను, మఱల నితర కిరణములచే, నినుమడింపుగాఁ దొలగింపబడిన, క్ష్మాదిగ్వ్యోమ తమోఽఘం; క్ష్మ = భూమి యొక్కయు, దిక్ = దిక్కులయొక్క, వ్యోమ = ఆకసము యొక్కయు, తమః = చీకటియనెడి, అఘం = పాపముగల్గిన, రయ చుమ్బితం; రయ = వేగముచే, చుమ్బితం = స్పృశింపఁబడిన యనగా వేగముగా ప్రసరించు స్వభావముగల్గిన, ఘర్మాణాం = ఎండలయొక్క, ఓఘం = సమూహమును, అధునా = ఇప్పుడు, అనగా నీయుదయమున, మోఘం = వ్యర్థముగనే, వితనుతే = విస్తరింపఁజేయుచున్నాడు. గాఢాన్ధకారనాశమును, కమలవికాసమును, ప్రభాతకాలపు రెండుమూడు కిరణములచేతనే చేయుటవలన సూర్యుడు కిరణసమూహమును వ్యాపింపఁజేయుట పిష్టపేషణమువలె వ్యర్థమని భావము.

సమాసములు :

ద్విత్రైః - ద్వౌ వా త్రయో వా = ద్విత్రాః, తైః = ద్విత్రైః.
తమస్తమాల గహనగ్రాసే - తమాలానాం గహనం = తమాలగహనం; తమ ఏవ తమాలగహనం = తమస్తమాలగహనం, తమస్తమాలగహనస్య గ్రాసః = తమస్తమాల గహనగ్రాసః, తస్మిన్ = తమస్తమాలగహనగ్రాసే.
దవీభావుకైః - అదవాః దవాః సమ్పద్యమానాః భవన్తీతి = దవీభావుకాః, తైః = దవీభావుకైః.
సహస్రపత్రసదసి - సహస్రం పత్రాణి యేషాం తాని = సహస్రపత్రాణి, సహస్రపత్రాణాం సదః = సహస్రపత్రసదః, తస్మిన్ = సహస్రపత్రసదసి.
ఘస్రోత్సవః - ఘస్రేణ ఉత్సవః = ఘస్రోత్సవః.
రయచుమ్బితం - రయేణ చుమ్బితః = రయచుమ్బితః, తం = రయచుమ్బితం.

పిష్టపిష్టీకృత క్ష్మాదిగ్వ్యోమతమోఽఘం - అపిష్టం పిష్టం సమ్పద్య మానం కృతం = పిష్టీకృతం, పిష్టస్య పిష్టీకృతం=పిష్టపిష్టీకృతమ్, తత్=పిష్టపిష్టీకృతమ్, క్ష్మా చ దిశశ్చ, వ్యోమ చ=క్ష్మాదిగ్వ్యోమాని, క్ష్మాదిగ్వ్యోమ్నాం తమః, క్ష్మాదిగ్వ్యోమతమః, క్ష్మాదిగ్వ్యోమతమ ఏవ అఘం = క్ష్మాదిగ్వ్యోమతమోఽఘం, పిష్టపిష్టీకృతం క్ష్మాదిగ్వ్యోమ తమోఘం యస్య సః=పిష్టపిష్టీకృత క్ష్మాదిగ్వ్యోమ తమోఘః, తం= పిష్టపిష్టీకృత క్ష్మాదిగ్వ్యోమ తమోఽఘం.

నిదాఘద్యుతిః - నిదాఘః ద్యుతిః యస్య సః=నిదాఘద్యుతిః

భావము :

సూర్యుని రెండు మూడు కిరణములే దావాగ్నియై చీకట్లనెడి యడవిని గబళించి కమలసమూహములకు పగటిపండుగ నిచ్చుచున్నవి. అట్టిసందర్భమున నాసూర్యుఁడు, వేగముతోఁ గూడిన తనకిరణములతో భూమియందును, దిక్కుల యందును, నాకసమునందును నలముకొనిన చీకటియనెడి పాపమునుఁ దొల గించుటకై తనకిరణములను విస్తరింపఁజేయుట పిష్టపేషణమువంటిదై వ్యర్థమగు చున్నది. చేత నలిపి ముద్దఁజేసిన పిండిని మరల నలిపి ముద్దఁజేయుట యెట్లు వ్యర్థమో, అట్లే సూర్యుఁడు రెండుమూడుకిరణములచే దొలగింపఁగల్గిన చీకటిని నశింపఁజేయుటకై తనకిరణముల నంతటిని వినియోగించుట నిష్ప్రయోజనమని యాశయము. ॥63॥

శ్లో. దూరారూఢ స్తిమిరజలధే ర్బాడబ శ్చిత్రభానుః
భాను స్తామ్యద్వనరుహవనీకేలివైహాసికోఽయమ్,
న స్వాత్మీయం కిమితి దధతే భాస్వర శ్వ్యేతిమానం
ద్యా మద్యాఽపి ద్యుమణికిరణశ్రేణయః శోణయన్తి. 64

ప. వి. దూరారూఢః-తిమిరజలధేః- బాడబః-చిత్రభానుః- భానుః- తామ్యద్వనరుహవనీకేలివైహాసికః- అయం-న-స్వాత్మీయం-కిమ్- ఇతి-దధతే-భాస్వర శ్వేతిమానం-ద్యామ్-అద్య-అపి-ద్యుమణికిరణశ్రేణయః-శోణయన్తి.

అర్థము: తిమిరజలధేః = చీకటియను కడలికి, బాడబః = సముద్ర మధ్యమందున్న గుఱ్ఱము ముఖమునుండి యుద్భవించిన, చిత్రభానుః = అగ్నియు, తథా = అట్లే, తామ్యద్వనరుహావనీ కేలివైహాసికః; తామ్యత్ = కష్టపడుచున్న అనగా రాత్రి, భర్తయగు సూర్యుని యెడబాపుచే కష్ట మనుభవించుచున్న, వనరుహ = తామరలయొక్క, వనీ = వనముయొక్క, కేలి = ఆటల యందు, వైహాసికః = విహాసమనెడి మధ్యమహాసము గల్గిన యనగా తామరపూవులకు వికాసరూపమగు హాసముఁగల్గించువాఁడును నగు, అయం = ఈకానఁబడు, భానుః = సూర్యుఁడు, దూరారూఢః; దూర = ఆకసమున దూరదేశమును, అరూఢః = ఎక్కెను. ద్యుమణి కిరణ శ్రేణయః; ద్యుమణి = ఆ సూర్యునియొక్క, కిరణ = కిరణములయొక్క, శ్రేణయః = పంక్తులు, అద్యాపి = ఇప్పుడును, ద్యాం = ఆకసమును, శోణయన్తి = ఎఱ్ఱఁబఱచుచున్నవి. ఇతి = ఇట్లైనను ననగా నాకసము నెఱ్ఱఁబరచినను, స్వాత్మీయం = తనకు సహజమైన, భాస్వరశ్వేతి మానం; భాస్వర = మిక్కిలి ప్రకాశించు, శ్వేతిమానం = తెల్లఁదనమును, న దధతే కిం = ధరించుట లేవా యేమి ? అనగా శీఘ్రముగనే ధరించు చున్నవని యర్థము. కావున నీవు పడకనుండి లేచుట కిది సరియైన సమ యమని యర్థము.

సమాసములు :

దూరారూఢః – దూర మారూఢః = దూరారూఢః ।

తిమిరజలధేః – తిమిరాణాం జలధిః = తిమిరజలధిః, తస్య = తిమిర జలధేః.

బాడబః – బడబా ముఖాత్ భవతీతి = బాడబః ।

తామ్యద్వనరుహ వనీ కేలివైహాసికః – తామ్యన్తి చ తాని వనరుహాణి చ = తామ్యద్వనరుహాణి, తామ్య ద్వనరుహాణాం వనీ = తామ్యద్వన రుహవనీ, తామ్య ద్వనరుహవన్యాః కేలయః = తామ్యద్వనరుహ వనీ కేలయః, తామ్య ద్వనరుహ వనీకేలిషు విహాసః (ప్రయోజనం) యస్య యస్య సః తామ్యద్వనరుహవనీకేలి వైహాసికః।

స్వాత్మీయం-స్వ శ్చాసౌ ఆత్మా చ = స్వాత్మా, స్వాత్మనః అయం= స్వాత్మీయః, తమ్=స్వాత్మీయం।

భాస్వరశ్వేతిమానం - భాస్వరశ్చాసౌ శ్వేతిమా చ=భాస్వరశ్వేతిమా, తం=భాస్వరశ్వేతిమానం।

ద్యుమణి కిరణశ్రేణయః - ద్యుమణేః కిరణాః = ద్యుమణికిరణాః, ద్యుమణికిరణానాం శ్రేణయః=ద్యుమణికిరణశ్రేణయః।

భావము :

చీకట్లు కడలికి బడబాగ్నియు, రాత్రి భర్తయైన సూర్యుని యెడ బాపుచే బాధపడు కమలవనములకు వికాసమనెడి హాసము నొసంగువాడునునగు నీ సూర్యుడు మింట దూరమునకుఁ బోయెను. సూర్యుని కిరణ పంక్తు లప్పటికిని గగనము నెల్లఁబఱచుచున్నవి. ఇట్లు గగనము నెల్లఁబఱచినను నా కిరణములు, తమకు సహజమైన యయ్యుజ్జ్వలమగుఁ దెల్లఁదనమును ధరింపవా యేమి? అనగా శీఘ్రముగనే ధరింపఁగలవు. కాన నీవు పడకనుండి లేచుట కిది తగిన సమయ మని యాశయము ॥64॥

శ్లో. ప్రాతర్వర్ణనయానయా నిజవపుర్భూషా ప్రసాదానదాద్
దేవీ వః పరితోషితేతి నిహితా మన్తఃపురీభిః పురః,
సూతామణ్డన మణ్డలీ పరిదధు ర్మాణిక్యరోచిర్మయ
క్రోధావేగ సరాగలోచనరుచా దారిద్ర్య విద్రావిణీమ్. ॥65॥

ప. వి. ప్రాతర్వర్ణనయా-అనయా- నిజవపుః- భూషాప్రసాదాన్ - అదాత్-దేవీ- వః-పరితోషితా -ఇతి నిహితామ్ - అన్తఃపురీభిః-పురః-సూతా - మణ్డన మణ్డలీ - పరిదధుః - మాణిక్యరోచిర్మయక్రోధావేగసరాగలోచనరుచా - దారిద్ర్యవిద్రావిణీమ్।

అర్థము : హే వందినః=ఓస్తుతిపాఠకులారా!, అనయా=ఈ మీచేఁ జెప్పఁబడిన, ప్రాతర్వర్ణనయా=ఉదయకాలపువర్ణనముచే, పరితోషితా=సంతోష పెట్టఁబడిన, దేవీ=దేవియగు దమయంతి, వః=మీకొఱకు, నిజవపు

ర్భూషాప్రాసాదాన్; నిజ=తనదగు, వపుః=శరీరముయొక్క, భూషా ప్రసాదాన్=ఆభరణము లనెడి పారితోషికములను, అదాత్=ఇచ్చినది. దేవి యిచ్చినదని చెప్పుటవలన నలుడు, భవనమును వీడి సంధ్య నుపాసించుటకై దానికి ముందే వెళ్లెనని సూచితము. ఇతి=ఇట్లు, ఉక్త్వా=చెప్పి, అన్తఃపురీభిః=అంతఃపురమందు నియమింపఁబడిన చెలికత్తెలతో, పురః=స్తుతిపాఠకులయొక్క యెదుట, నిహితాం=ఉంచఁబడిన, మాణిక్యరోచిర్మయక్రోధావేగసరాగలోచనరుచా; మాణిక్య=పద్మరాగములయొక్క, రోచిర్మయ=కాన్తిరూపమైన, క్రోధావేగ=దారిద్ర్యమునుఁ గూర్చిన కోపవశముచేతనో యనునట్లు, సరాగ=ఎఱ్ఱఁదనముతోఁ గూడిన, లోచనరుచా=నేత్రకాన్తిచే, (ననగా భూషణములయందలి కాన్తిచే నని యర్థము) దారిద్ర్యవిద్రావిణీం; దారిద్ర్య=పేదరికమును, విద్రావిణీం=తఱుమగొట్టునదియో యనునట్లున్న, మణ్డనమణ్డలీం=భూషణముల సమూహమును, సూతాః=స్తుతిపాఠకులు, పరిదధుః=తమశరీరమునందు దాల్చిరి.

సమాసములు :

*ప్రాతర్వర్ణనయా* - ప్రాతః వర్ణనా = ప్రాతర్వర్ణనా, తయా = ప్రాతర్వర్ణనయా.

*నిజవపుర్భూషాప్రసాదాన్* -నిజం చ వపుశ్చ = నిజవపుః, నిజవపుషః భూషాః=నిజవపుర్భూషాః, నిజవపుర్భూషా ఏవ ప్రసాదాః=నిజవపుర్భూషాప్రసాదాః, తాన్=నిజవపుర్భూషాప్రసాదాన్.

*మణ్డనమణ్డలీం* - మణ్డనానాం మణ్డలీ=మణ్డనమణ్డలీ, తాం=మణ్డనమణ్డలీం.

*మాణిక్యరోచిర్మయక్రోధావేగసరాగలోచనరుచా* - మాణిక్యానాం రోచీంషి=మాణిక్యరోచీంషి, మాణిక్యరోచిషాం రూపం యస్యాః సా=మాణిక్యరోచిర్మయీ, క్రోధస్య ఆవేగః=క్రోధావేగః, రాగేణ సహ వర్తన్త ఇతి = సరాగాణి, సరాగాణి చ తాని లోచనాని చ=సరాగలోచనాని, సరాగలోచనానాం రుక్ = సరాగలోచనరుక్, క్రోధావేగేన సరాగలోచనరుక్=క్రోధావేగసరాగలోచనరుక్, మాణిక్యరోచిర్మయీ,

నిర్గమః = మేడనుండి వెలుపలికి వచ్చుట గల్గిన, భూపతిః = నలమహా రాజు, స్వర్గఙ్గామ్బుని; స్వర్గఙ్గా = ఆకాశగంగయొక్క, అమ్బుని = ఉదకమునందు; కృతదినారమ్భాప్లుతిః, కృత = చేయఁబడిన, దినారమ్భ = ప్రాతఃకాలమందలి, ఆప్లుతిః = స్నానము గలవాడై, ప్రియాయౌతుక ప్రాప్తం; ప్రియా = ప్రియురాలగు దమయంతియొక్క, యౌతుక = వివాహకాలమందలి యరణముగాఁ, ప్రాప్తం = లబ్ధమైన, అతిపుష్పకం = పుష్పకవిమానము నతిశయించిన, రథం = రథమును, అధిష్ఠాయ = ఎక్కి, ఆనన్దాత్ = ఆనందమువలన దమయంతితోటి సమాగమమువలని సంతోషముతో, ఆగచ్ఛన్ = తిరిగివచ్చుచున్నవాడై, ఉషః = వేకువయందు, భణతాం = అట్లే వర్ణించుచున్న, వన్దినాం = స్తుతిపాఠకుల యొక్క; దృశాం = నేత్రములకు, ఆతిథ్యం = విషయమును, క్షణం = కొంచెముకాలము భవనములోపలికిఁ బ్రవేశించుటకు పూర్వమువరకును, ఆనశే = పొందెను, అనగా వారిచేఁ జూడఁబడెనని యర్థము. కావుననే నలుడు స్నానమునకై వెళ్లుటవలన, పూర్వశ్లోకమునందు దేవియగు దమయన్తియే వందులకుఁ బారితోషికము నిచ్చెనని చెప్పఁబడినది.

సమాసము :

**ఆతిథ్యం** - అతిథేః భావః = ఆతిథ్యం, తత్ = ఆతిథ్యమ్.

స్వర్గఙ్గామ్బుని - స్వః గఙ్గా = స్వర్గఙ్గా, స్వర్గఙ్గాయాః అమ్బు, స్వర్గ ఙ్గామ్బు, తస్మిన్ = స్వర్గఙ్గామ్బుని.

కృతదినారమ్భాప్లుతిః - దినస్య ఆరమ్భః = దినారమ్భః, దినారమ్భే ఆప్లుతిః = దినారమ్భాప్లుతిః, కృతా దినారమ్భాప్లుతిః యేన సః = **కృతదినారమ్భాప్లుతిః.**

**భూపతిః** - భువః పతిః = భూపతిః.

**అతిపుష్పకం** - పుష్పక మతిక్రాన్తః = అతిపుష్పకః, తం = అతిపుష్పకం.

ప్రియాయౌతుకప్రాప్తః - ప్రియాయాః యౌతుకం = ప్రియా యౌతుకం, ప్రియాయౌతుకే ప్రాప్తః = ప్రియాయౌతుకప్రాప్తః, తం = ప్రియాయౌతుకప్రాప్తం.

అవరాగతైః- అవర మాగతాః=అవరాగతాః, తైః=అవరాగతైః.
అవిదిత ప్రాసాదతో నిర్గమః- ప్రాసాదతః నిర్గమః = ప్రాసాదతో నిర్గమః, న విదితః=అవిదితః, అవిదితః ప్రాసాదతో నిర్గమః యస్య సః=అవిదితప్రాసాదతోనిర్గమః.

భావము :

దమయంతి స్తుతిపాఠకులకుఁ బారితోషికము నిచ్చిన పిదప స్నానమునకై నలుడు భవనము వెలుపలికి పోయిన తర్వాత వచ్చినట్టి వైతాళికులకు తెలియకుండ వెలుపలికి వచ్చిన నలమహారాజు గంగా ప్రవాహమునందుఁ బ్రాతః స్నానము గావించినవాఁడై, ప్రియురాలగు దమయంతియొక్క వివాహకాలమందర్శనముగా సంపాదింపఁబడినట్టిదియు పుష్పకవిమానమును మించినదియు నగు తేరునెక్కి, దమయంతితో సమాగమము గల్గుననెడి యాశచే నేర్పడిన యానన్దము వలనఁ దిరిగి వచ్చుచున్నవాఁడై తాను భవనములోపలికిఁ బ్రవేశించునంతవరకు ప్రభాతకాలమును వర్ణించెడి వైతాళికు దృష్టియందుఁ బడెను. ॥66॥

శ్లో. శ్రీహర్షం కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః సుతం
శ్రీహీరః సుషువే జితేన్ద్రియచయం మామల్లదేవీ చ యమ్.
ఏకాం న త్యజతో నవార్థఘటనా మేకాన్నవింశో మహా
కావ్యే తస్య కృతౌ నలీయచరితే సర్గోఽయ మస్మి న్నగాత్.
॥67॥

ప. వి. శ్రీహర్షం- కవిరాజరాజిమకుట అఙ్కారహీరః- సుతం-శ్రీహీరః-సుషువే-జితేన్ద్రియచయం-మామల్లదేవీ-చ- యం- ఏకాం- న- త్యజతః- నవార్థఘటనాం-ఏకాన్నవింశః-మహాకావ్యే-తస్య-కృతౌ- నలీయచరితే- సర్గః-అయమ్-అస్మిన్-అగాత్.

అర్థము: కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః; కవిరాజ = కవిశ్రేష్ఠులయొక్క, రాజి = పఙ్క్తిలో, మకుట = శ్రేష్ఠులైనవారికి, అలఙ్కార = భూషణమైన, హీరః = వజ్రమణియగు, శ్రీహీరః=శ్రీహీరుడు, జితేన్ద్రియచయం=

జిత=జయింపఁబడిన, ఇంద్రియచయం = ఇన్ద్రియసమూహముగల్గిన, శ్రీహర్షం=శ్రీహర్షుడను పేరుగల, యం=ఏ, సుతం=కుమారుని, సుషువే=ఉత్పత్తి గావించెనో, మామల్లదేవీ చ = మామల్లదేవియను తల్లియు, యం=ఎవనిని, సుషువే=కనెనో, ఏకాం=ముఖ్యమైన, నవార్థఘటనాం = అపూర్వమగు సృష్టిని, న త్యజతః=విడువనట్టి, తస్య=ఆశ్రీహర్షుని యొక్క, కృతౌ=కృతియైన, మహాకావ్యే=మహాకావ్యమైన, అస్మిన్=ఈ, నలీయచరితే = నైషధీయచరిత్రమునందు, ఏకాన్నవింశః=ఊనవింశమైన, స్వర్గః=సర్గ, అగాత్=కడచినది.

సమాసము :



నవార్థఘటనాం- నవాశ్చ తే అర్థాశ్చ=నవార్థాః, నవార్థానాం ఘటనా=నవార్థఘటనా. తాం=నవార్థఘటనాం.
ఏకాన్నవింశః- ఏకేన న వింశః=ఏకాన్నవింశః. తక్కిన సమాసములు భావములు పూర్వశ్లోకములకు వలెనే గ్రహించునది. ॥62॥

ఇతి



శ్రీమదాత్రేయగోత్ర శ్రీముదుడాలి నృసింహశాస్త్రి తనూజ
విక్రమసింహపురీ వేదసంస్కృత కళాశాలా
భూతపూర్వప్రధానోపాధ్యాయ
శ్రీ సుబ్బరామశాస్త్రి
విరచితమగు
నైషధాంధ్రవ్యాఖ్యకు
ఊనవింశసర్గ
సమాప్తము.
॥శమ్॥

# శ్రీహర్ష నైషధము

## ఏడవ సంపుటము

తెలుగు వ్యాఖ్యానం

శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రి, ఎం. ఏ.,
రిటైర్డ్ ప్రిన్సిపాల్, వైదిక సంస్కృత కళాశాల, నెల్లూరు




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫా   దు,
హై   బాదు-4

SRI HARSHANAISHADHAM: Volume VII(Containing 20th, 21st and 22nd Sargas) - A Sanskrit Classic by Sri Harsha of 12th Century A.D. with Telugu Commentary by Sri Udali Subbarama Sastry, Retd. Principal, Veda and Sanskrit College, Nellore, Andhra Pradesh.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాద్-500 004

ప్రచురణ : 354

ప్రథమ ముద్రణ : 1984

ప్రతులు : 1000

వెల : రూ. 23-00

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాద్-500 004.

ముద్రణ :

సహజ ప్రింటర్స్,
1-7-166, బాకారం, ముషీరాబాద్,
హైదరాబాద్-500 048.

# తొలి పలుకు

ప్రసిద్ధమైన సంస్కృత గ్రంథాలలోని మూల స్వరూపాన్ని తెలుగు పాఠకులకు పరిచయం చేయాలనే ఉద్దేశంతో అకాడమీ ఇంతవరకుకొన్ని పుస్తకాలను ప్రచురించింది. మృచ్ఛకటికము, ఉత్తరరామచరిత్ర, ముద్రారాక్షసం, ఆంధ్రరసగంగాధరం లాంటి పఠనీయగ్రంథాలకు పండితులచే అర్థతాత్పర్యాలు, విశేషాలూ వ్రాయించి అందించింది. సంస్కృతంలో బాగా వ్యాప్తిలోనికివచ్చి తెలుగులో కావ్యాలుగా అవతరించిన గ్రంథాలు అనేకం. జిజ్ఞాసువులకు మూలంలోని ఆంతర్యాన్నీ, అది వేసుకున్న తెలుగువేషాన్నీ తెలుసుకొని తులనాత్మకంగా పరిశీలించవలసిన అగత్యం ఉంటుంది.

ఈ ప్రణాళికను అనుసరించి నెల్లూరు వైదిక కళాశాల ప్రిన్సిపాల్ శ్రీ ఉడాలి సుబ్బరామ శాస్త్రి గారు శ్రీహర్షుని నైషధానికి తెలుగు అర్థ తాత్పర్యాలు సమకూర్చి అకాడమీకి అందించినారు. ఇంతవరకు శ్రీహర్షు నైషధం ఆరు సంపుటాలుగ వచ్చింది. మొదటిసంపుటంలో 1,2,3 సర్గలకు, రెండవ సంపుటములో 4,5,6 సర్గలకు, మూడవ సంపుటములో 7,8,9 సర్గలకు, నాల్గవ సంపుటములో 10,11,12 సర్గలకు, ఆరవ సంపుటములో 16,17,18,19 సర్గలకు, లఘు వ్యాఖ్యానం (మూల శ్లోకం, పదవిభజన, అర్థము, విశేషము, సమాసములు, భావము)ఉన్నది. ఇప్పుడు 20,21,22 సర్గలతో ఉన్న ఏడవ సంపుటాన్ని అందిస్తున్నాము.

శ్రీనాథుని శృంగారనైషధం వల్ల తెలుగు కవితాప్రపంచంలో విశేష ప్రాచుర్యాన్ని పొందిన శ్రీహర్షుని నైషధం విద్వదౌషధం గానూ, రసకోశం గానూ వాసికెక్కింది. శ్రీహర్షుని నైషధానికి చక్కని వ్యాఖ్యానం తెలుగులో వెలయించిన శ్రీ ఉడాలి సుబ్బరామశాస్త్రి గారికి అకాడమీ కృతజ్ఞతలను సమర్పించు కుంటున్నది.

శ్రీ ఉడాలి సుబ్బరామ శాస్త్రి గారు ఇటీవలనే దివంగతులైనారు. ఆయన అపారమైన పాండిత్యానికీ, అమేయమైన ప్రతిభకూ ఈ హర్ష నైషధ వ్యాఖ్యానం అజరామరంగా అమ్లానంగా నిలిచిపోతుంది. ఆయన యశః కాయానికి ప్రతీకగా నిలిచిపోతుంది.

హైదరాబాదు

తేదీ 18-1-84

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి

# శ్రీ హర్ష నైషధము

## ఆంధ్ర వ్యాఖ్య

## వింశ సర్గ

శ్లో. సౌధాద్రి కుట్టిమానేక ధాతుకాధిత్యకాతటమ్ ।
స ప్రాప రథపాథోభృద్వాత జాతజవో దివః॥ 1

వ. వి. సౌధాద్రి కుట్టిమానేక ధాతుకాధిత్యకాతటమ్ - సః - ప్రాప - రథపాథోభృత్ - వాతజాతజవః - దివః.

అర్థము: వాతజాతజవః, వాత = గాలివలె, జాత = ఏర్పడిన, జవః = వేగముగల్గిన పక్షాన్తరమున, వాత = గాలినుండి, జాత = కల్గిన, జవః = వేగముగల, సః = పూర్వము చెప్పఁబడిన, అతిపుష్పకమగు రథము అనెడి, పాథోభృత్ = మేఘము, దివః = స్వర్గము నుండియు, ఆకసమునుండియు, సౌధాద్రి కుట్టిమానేక ధాతుకాధిత్యకాతటమ్; సౌధ = మేడయనెడి, అద్రి = పర్వతముయొక్క, కుట్టిమ = వివిధరత్నములచేఁగట్టబడిన, మేడపైని గృహముల యందలి భూమియనెడి, అనేక ధాతుక = పెక్కు గైరికాదిధాతువులు గల్గిన, అధిత్యకా = పై భూమియొక్క, తటమ్ = సమీప భూమిని (శిఖరమును) ప్రాప = పొందెను.

సమాసములు ।

సౌధాద్రి కుట్టిమానేక ధాతుకాధిత్యకాతటమ్: సౌధ ఏవ అద్రిః = సౌధాద్రిః, సౌధాద్రేః కుట్టిమః = సౌధాద్రి కుట్టిమః, అనేకధాతవః యస్యాః సా = అనేక ధాతుకా, అనేక ధాతుకా చ సా అధిత్యకాచ =

అనేక ధాతుకాధిత్యకా, అనేక ధాతుకాధిత్యకాయాః తటః = అనేక ధాతుకాధిత్యకాతటః, సౌధాద్రికుట్టిమ ఏవ అనేక ధాతుకాధిత్యకాతటః = సౌధాద్రి కుట్టిమానేక ధాతుకాధిత్య కాతటః, తమ్ = సౌధాద్రి కుట్టిమానేక ధాతుకాధిత్యకాతటమ్.

రథపాథోభృత్ : పాథాంసి బిభర్తీతి = పాథోభృత్, రథఏవ పాథోభృత్ = రథపాథోభృత్.

వాతజాతజవః : వాత ఇవ జాతః = వాతజాతః, వాతజాతః జవః యస్య సః = వాత జాత జవః, పక్షాన్తరమున - వాతాజ్జాతః = వాత జాతః, వాతజాతః జవః యస్యసః = వాతజాతజవః.

భావము :

గాలివలె వేగముగలదియు, గాలినుండి గల్గిన వేగముగలదియు నగు నా యొక పుష్పకమైన రథమనెడి మేఘము స్వర్గమునుండియు, నాకసమునుండియు, మేఘమనెడి పర్వతముయొక్క యుపరి గృహముల యందలి రత్నభూమియనెడి పలురకములగు గైరికాది ధాతువులు గల్గిన పైనున్న భూమియొక్కయు సమీప ప్రదేశమును, శిఖరమును, చేరినది. ॥1॥

శ్లో. తతః ప్రత్యుదగాత్ భైమీ కాన్తమాయాన్త మన్తికమ్ ।
ప్రతీచీ సింధు వీచీవ దినోఙ్కారే సుధాకరమ్ ॥ 2

ప. వి. తతః - ప్రత్యుదగాత్ - భైమీ - కాన్తం - ఆయాన్తం - అన్తికం - ప్రతీచీ సింధువీచీ - ఇవ - దినోఙ్కారే - సుధాకరమ్ ॥

అర్థము: తతః = రథము రత్ననిబద్ధమగు పై ప్రదేశమును జేరినపిదప, భైమీ = దమయన్తి, దినోఙ్కారే; దినముయొక్క, ఓఙ్కారే = ప్రారంభమునందు, (గాయత్రీ ప్రభృతి మన్త్రముల ప్రారంభమునందు ఓఙ్కారము ప్రయోగింపబడుటవలన నది యిచ్చట ప్రారంభవాచకము) ప్రతీచీ సింధువీచీవ; ప్రతీచీ = పడమట దిక్కునందలి, సింధు = సముద్రము యొక్క, వీచీవ = కెరటమువలె, అన్తికం = సమీపమునుగూర్చి,

ఆయాన్తం = వచ్చుచున్న, కాన్తం = రమ్యమైన, సుధాకరమివ = చంద్రునివలె, (వేకువసమయమునందే చంద్రుఁడు, అస్తమింప నున్నందు వలన, పడమటి కడలియందుఁదగుల్కొనిన విధముగాఁ దెలియుచున్నాడు), కాన్తం = ప్రియుడైన నలుని, ప్రత్యుదగాత్ = ఆదరముతో నెదుర్కొనెను.

**సమాసములు :**

ప్రతీచీ సింధువీచీ: ప్రతీచ్యాం సింధుః = ప్రతీచీసింధుః, ప్రతీచీసింధోః వీచీ = ప్రతీచీసింధు వీచీ.

దినోజ్కారే : దినస్య ఓజ్కారః = దినోజ్కారః, తస్మిన్ = దినోజ్కారే.

**భావము ;**

ఆ రథము, నలుని సౌధముయొక్క పై గృహముల యందలి రత్ననిబద్ధ భూమినిఁజేరగనే, పడమటి సముద్రమునందలి యల, దినప్రారంభమునందు, చంద్రునెదుర్కొని యాదరించిన విధముగా నా దమయన్తి నలుని సాదరముగా నెదుర్కొని గౌరవించినది. ॥2॥

శ్లో. స దూర మాదరం తస్యా వదనే మదనైకదృక్ ।
దృష్ట మన్దాకినీ హేమారవిన్ద శ్రీరవిన్దత ॥ 3

ప. వి. సః - దూరం - ఆదరం - తస్యాః - వదనే - మదనైక దృక్ - దృష్ట మన్దాకినీ హేమారవిన్ద శ్రీః - అవిన్దత.

అర్థము: దృష్టమన్దాకినీ హేమారవిన్ద శ్రీః, దృష్ట = చూడఁబడిన, మన్దాకినీ = గంగలోని, హేమారవిన్ద = పసిడి తామరలయొక్క, శ్రీ = శోభగల్గిన, (అనగా దమయన్తీ ముఖారవిన్దమునకును, గంగయందలి తామరలకును నుత్కర్షను, అపకర్షను నిర్ణయింప సమర్థుడైన యని యర్థము). మదనైకదృక్; మదనైక = మన్మథునే, దృక్ = దృష్టియందుగల్గిన

యనగా కామాసక్తమగు చిత్తముగల్గిన, సః = ఆ నలుఁడు, తస్యాః = ఆ దమయన్తియొక్క, వదనే = ముఖమునందు, దూరం = మిక్కిలి, ఆదరం = పట్టుదలను, అవిన్దత = పొందెను. గంగయందలి పసిడితమ్మి కంటెను దమయన్తి మోమే మిక్కిలి సుందరముగా నుండుటవలన దాని యందే యధికమగు నాదరమునుఁ జూపెనని యర్థము.

**సమాసములు ;**

మదనైకదృక్ : మదనః ఏకః దృశి యస్యసః = మదనైకదృక్.
దృష్టమన్దాకినీ హేమారవిన్ద శ్రీః : హేమమయం చ తత్ అరవిన్దం చ = హేమారవిన్దం, మన్దాకిన్యాః హేమారవిన్దం = మన్దాకినీ హేమారవిన్దం, మన్దాకినీ హేమారవిన్దస్య శ్రీః = మన్దాకినీ హేమారవిన్ద శ్రీః, దృష్టా, మన్దాకినీహేమారవిన్ద శ్రీః యేన సః = దృష్టమన్దాకినీ హేమారవిన్ద శ్రీః.

**భావము :**

ఆ నలమహారాజు గంగయందలి పసిడి తామర సొంపునుఁ జూచినందు వలన, దమయన్తియొక్క మోము తమ్మికిని, గంగయందలి పసిడి తామర లకునుఁ దారతమ్యమును గ్రహింపఁగలవాఁడుగను, కామాసక్త చిత్తుఁడుగ నుండుట వలనను, దమయన్తి మోమునందే మిక్కిలి యాదరమునుఁ జూపెను. ॥3॥

శ్లో. తేన స్వర్దేశ సన్దేశ మర్పితం సా కరోదరే ।
బభ్రాజ బిభ్రతీ పద్మం పద్మేవోన్నిద్ర పద్మదృక్ ॥ 4

ప. వి. తేన - స్వర్దేశ సన్దేశం - అర్పితం - సా - కరోదరే - బభ్రాజ - బిభ్రతీ - పద్మం - పద్మా - ఇవ - ఉన్నిద్ర పద్మ దృక్.

అర్థము: ఉన్నిద్ర పద్మ దృక్; ఉన్నిద్ర = వికసించిన, పద్మ = తామరపూవుం వంటి, దృక్ = నేత్రములు గల్గిన, సా = ఆ దమయన్తి, తేన = ఆ ప్రియుఁడగు నలునిచే, అర్పితం = సమర్పింపఁబడిన, స్వర్దేశసన్దేశం;

స్వర్దేశ = స్వర్గలోకమునకు, సన్దేశం = సూచకమైన. "అనగా నీవు స్వర్గలోకమునకుఁ బోవుచున్నావు. కాన నా లోకమందున్న యొక పద్మమును నా కొఱకై తెమ్ము" అని దమయన్తి కోరిన విధముగా తెచ్చినట్టి, పద్మం = కమలమును, కరోదరే = చేతిమధ్య, బిభ్రతీ = ధరించుచున్నదై, పద్మా ఇవ = లక్ష్మీవలె, బభ్రాజ = శోభించినది.

సమాసములు :

స్వర్దేశసన్దేశం : స్వః దేశః = స్వర్దేశః. స్వర్దేశస్య సన్దేశః = స్వర్దేశసన్దేశః, తం = స్వర్దేశ సన్దేశం.
కరోదరే : కరస్య ఉదరం = కరోదరం, తస్మిన్ = కరోదరే.
ఉన్నిద్ర పద్మ దృక్: ఉన్నిద్రే పద్మే దృశౌ యస్యాః సా = ఉన్నిద్ర పద్మ దృక్.

భావము :

వికసిత కమలములవంటి కన్నులుగల యా దమయన్తి, నలుఁడు స్వర్గమునకుఁ బోవునపుడ, అక్కడికిఁ జిహ్నముగాఁ దానుఁ దెమ్మనిన స్వర్గ పద్మము నతడీయగా, దానినిఁ జేతి మధ్య ధరించినదై లక్ష్మీదేవి వలె శోభించినది. లక్ష్మియు నున్నిద్ర పద్మ నయన కాన నిరువురికి నౌపమ్యము కుదిరినది ॥౪॥

శ్లో. ప్రియేణాల్ప మపిప్రత్తం బహూమేనేతరామసౌ ।
హ్యేకలక్షతయా దధ్యౌ దత్తమేకవరాటకమ్ ॥ ౫

ప. వి. ప్రియేణ - అల్పం - అపి - ప్రత్తం - బహూ - మేనేతరామ్ - అసౌ - హి - ఏకలక్షతయా - దధ్యౌ - దత్తం - ఏకవరాటకమ్.

అర్థము: అసౌ = ఈ దమయన్తి, ప్రియేణ = ప్రియుఁడైన నలుని చేతను ఇష్టజనము చేతను, ప్రత్తం = ఈయఁబడినది, అల్పమపి = కొంచెమైనను, బహూ = అధికముగా, మేనేతరాం = మిక్కిలి భావించెను, హి = ఏలయనగా, ఏకవరాటకం; ఏక = ఒకటైన, వరాటకం = పద్మములోని దుద్దును లేదా ఒక గవ్వను, ఏకలక్షతయా = ఒక లక్ష సంఖ్యగలదిగా,

దధ్యౌ = తలంచెను. ఇష్టుడిచ్చిన గవ్వయు రత్నముకంటె నతిశయించిన దగును.

సమాసములు :

మేనేతరాం : అతిశయేన మేనే = మేనేతరాం.

ఏకలక్షతయా : ఏకం చ తత్ లక్షం చ = ఏకలక్షం, ఏక లక్షస్య భావః = ఏకలక్షతా, తయా = ఏకలక్షతయా.

ఏకవరాటకం: ఏకః వరాటకం యస్య తత్ = ఏకవరాటకం, తత్ = ఏకవరాటకం; ఏకశ్చాసౌ వరాటకశ్చ = ఏకవరాటకం, తం = ఏకవరాటకం.

భావము :

ఈ దమయన్తి ప్రియుడొసంగిన (ఇష్ట జనమిచ్చిన) కొద్ది వస్తువును సైతము మెండైనదిగా మిక్కిలి భావించినది. ఏలయనగా ఒక్క బీజకోశము గల్గిన పద్మమును, గవ్వను ఇచ్చినను ఒకలక్ష సంఖ్యగలదిగా (ఒక లక్ష ధనముగా) నామె భావించినది. ॥5॥

శ్లో. ప్రేయసాऽవాది సా తన్వీ త్వదాలిఙ్గన విఘ్నకృత్ ।
సమాప్యతాం విధిః శేషః క్లేశశ్చేతసి చేన్నతే ॥ 6

ప. వి. ప్రేయసా - అవాది - సా - తన్వీ - త్వదాలిఙ్గన విఘ్నకృత్ - సమాప్యతాం - విధిః - శేషః - క్లేశః - చేతసి - చేత్ - న - తే.

అర్థము: ప్రేయసా = మిక్కిలి ప్రియుడైన యా నలునిచే, తన్వీ = కృశించిన దేహము గల, సా = ఆ దమయన్తి, "తే = నీ యొక్క, చేతసి = మనస్సునందు, క్లేశః = కష్టము, న చేత్ = లేనిచో, త్వదాలిఙ్గన విఘ్న కృత్, త్వత్ = నీ యొక్క, ఆలిఙ్గన = కౌగిలింపునకు, విఘ్నకృత్ = విఘ్నమును గల్గించెడి, శేషః = ప్రాతస్సన్ధ్యను బూర్తి చేసిన పిదప మిగి లిన నిత్యాగ్ని హోత్రాదుల నాచరించుట (మయా = నాచే) సమాప్యతాం =

సమాప్తి యగునట్లు చేయుము. అనగా నీ అగ్ని హోత్రాదులను సమాప్తి జేయుట కనుజ్ఞ నొసంగుమని యర్థము.

సమాసములు :

త్వదాలిఙ్గన విఘ్నకృత్ : తవ ఆలిఙ్గనం = త్వదాలిఙ్గనం, త్వదాలిఙ్గనస్య విఘ్నః = త్వదాలిఙ్గనవిఘ్నః, త్వదాలిఙ్గన విఘ్నం కరోతీతి = త్వదాలిఙ్గన విఘ్నకృత్.

భావము :

ఆ దమయన్తినిఁగూర్చి మిక్కిలి ప్రియుడైన నలుడిట్లు చెప్పెను. ఓ ప్రియురాలా! నీ మనస్సునందు నా రాకలోని యాలస్యమువలనఁ గల్గిన దుఃఖము లేనిచో నిప్పుడు, నిన్నుఁగౌగిలించుకొనుటకు విఘ్నమునుఁ గల్గించెడి నిత్యాగ్ని హోత్రాదికర్మలను సమాప్తి గావించుటకు నా కనుమతి నొసంగుము. ॥6॥

శ్లో. క్వైతావాన్నర్మ మర్మావిద్విద్యతే విధిరద్యతే ।
ఇతి తం మనసా రోషాదవోచద్వచసా న సా ॥ 7

ప. వి. క్వ - ఏతావాన్ - నర్మమర్మావిత్ - విద్యతే - విధిః - అద్యతే - ఇతి - తం - మనసా - రోషాత్ - అవోచత - వచసా - న - సా.

అర్థము: అద్య = ఇప్పుడును, (నీ యెడ నాకున్న గాఢానురాగముఁ దెలిసి, తెల్లవారి, వేకువన లేచి స్నానమునకు వెళ్ళితివి. తర్వాత చాల కాలము గడచిపోయినది. కాన నిప్పటికిని యని యర్థము) తే = నీకు, ఏతావాన్ = ఇంతటి, నర్మమర్మావిత్; నర్మ = క్రీడయందలి సుఖముయొక్క. మర్మ = మర్మము, విత్ = కొట్టెడి యనగా కష్టమొసంగెడి ప్రతిబంధకమైన, విధిః = నిత్యకర్మానుష్ఠానము, క్వ = ఎందులకు, విద్యతే = ఉన్నది. చాలాకాలము నీతో నెడబాపునుఁ బొందితిని. ఇక నిప్పుడు ఆలస్యమును సహింపఁజాలను. నీ నిత్యకర్మానుష్ఠానముండనిమ్ము. నా సమీపమునకు రమ్ము" అని యీ విధముగా, సా = ఆ దమయన్తి, రోషాత్ = కోపము

వలన, తం = ఆ నలుని, అవోచత్ = పలికినది. లజ్జతోడను, మోమోటమి తోడను దమయన్తి యిట్లు పలికినదని యర్థము.

సమాసములు :

నర్మమర్మావిత్ : నర్మణః మర్మ = నర్మ మర్మ, నర్మమర్మ అవిన్దతీతి = నర్మమర్మావిత్.

భావము ;

నీ యెడ నాకున్న గాఢానురాగమును దెలిసికొనియు, లేదా వేకువన లేచితివి. స్నానమునకై వెళ్ళితివి. తర్వాత చాలకాలము గడచిపోయినది. ఇట్లు గడచిపోయినను మన క్రీడా సుఖమును భంగపఱచెడి నిత్యక్రియానుష్ఠాన మెందులకు? నీతో చాలకాలము విడువఁబడితిని. ఇఁక నాలస్యమును సహింపఁ జాలను. నీ నిత్యకర్మానుష్ఠానముండనిమ్ము. నా సమీపమునకు రమ్మని యా దమయన్తి కోపముతో గూడినదై తన మనస్సుచేఁజెప్పినది. మాటతో స్పష్టముగాఁ జెప్పలేదు. ఏలయనగా లజ్జయు మోమోటమియు నామెన డ్డగించినవి. ॥7॥

శ్లో. క్షణ విచ్ఛేద కాదేవ విధేర్ముగ్ధే! విరజ్యసి।
విచ్ఛేత్తాహే చిరం ను త్వా హృదాఽఽహస్మ తదా కలిః॥

ప.వి. క్షణ విచ్ఛేదకాత్ - ఏవ - విధేః - ముగ్ధే - విరజ్యసి - విచ్ఛేత్తాహే - చిరం - ను-త్వా - హృదా- ఆహ - స్మ - తదా - కలిః.

అర్థము. హే ముగ్ధే = ఓ మూఢురాలా! క్షణవిచ్ఛేదకాదేవ = క్షణకాలము విరహము గల్గించెడి, విధేః = కర్మానుష్ఠానమువలన; విరజ్యసి = విరక్తురాలగుచున్నావు, కిన్తు = కాని. ను = ఓ ప్రేయసీ, త్వా = నిన్ను. చిరం = చాలకాలము, విచ్ఛేత్తాహే = విచ్ఛేదనఁజేయబోవుచున్నాను ఇతి = ఇట్లు, తదా = ఆ కాలమందు, అనగా దమయన్తి తన మోమును మలిన పఱచుకొనిన సమయమునందు, కలిః = కలి పురుషుఁడు, హృదా: = తన మనస్సుచే, ఆహస్మ = పలికెను. ఇప్పుడు నేనేవిధమైన

యనిష్టమును జేయఁజాలను. అయినను మీ కనిష్టముఁ జేయుటకై యవ
కాశమును వెదకుచున్నానని యర్థము. నలునియొక్క పాపమును
వెదకుచు ననూయగల్గిన కలిపురుషుడు వారిరువురియొక్క భవన
సమీపమందలి తాండ్ర చెట్టునందు నివసించి యుండెనని పూర్వముఁ
జెప్పఁబడినది. అందు నివసించుచునే యతడు నల దమయన్తుల సంభా
షణను విని, నల వియోగముచే దైన్యము నొందియున్న దమయన్తిఁ
జూచి యిట్లు చెప్పెనని తలంపవలసి యున్నది.

శ్లో. సావజ్ఞేవాఽథ సా రాజ్ఞః సఖీం పద్మముఖీమగాత్।
లక్ష్మీః కుముద కేదారాదారాదమ్భోజినీ మివ॥ 9

ప. వి. సావజ్ఞా - ఇవ - అథ - సా-రాజ్ఞః - సఖీం - పద్మముఖీం - అగాత్
లక్ష్మీః - కుముదకేదారాత్ - ఆరాత్ - అమ్భోజినీం - ఇవ.

అర్థము. అథ = నలునిమాటను వినినపిదప, సా = ఆ దమయన్తి, సావజ్ఞా
ఇవ = తిరస్కారముతో గూడిన దానివలె ననగా తన్నువదలి నలుడు
హోమాదుల ననుష్ఠించుటకై వెళ్ళఁదలపెట్టినందువలన నవమానముతోఁ
గూడినదో యనునట్లున్నదై, లక్ష్మీః = శోభ, కుముదకేదారాత్ =
కుముద = కలువలయొక్క, కేదారాత్ = క్షేత్రమునుండి యనగాఁ
గలువలక్షేత్రమును వదలి, ఆరాత్ = సమీపమందలి, పద్మముఖీం ;
పద్మ = పద్మమునే, ముఖీం = మోముగా గల్గిన, అమ్భోజినీమివ =
తామరతీగనుఁబోలె. రాజ్ఞః = నలుని సమీపమునుండి యనగా రాజును
వదిలి, ఆరాత్ = సమీపమందున్న పద్మముఖీం = పద్మమువంటి
ముఖము గల్గిన, సఖీం = చెలికత్తెను, అగాత్ = పొందెను. అవమానితు
లగు వారు, అవమానించిన వారిని వదలి వెళ్ళుదురుగదా! లక్ష్మి
తొలగినచో కలువల క్షేత్రమున కెట్లు మాలిన్యమో, ఆ లక్ష్మి
సంబంధముచే పద్మములకెట్లు వికాసమేర్పడునో, అట్లే దమయన్తి
విరహమువలన నల ముఖమునకు మాలిన్యము, దమయన్తీ సమాగమ

ముచే చెలికత్తెయొక్క ముఖమునకు నవ్వుచే వికాసమును నీ యుపమ సూచించుచున్నది.

**సమాసములు :**

సావజ్ఞా: అవజ్ఞయా సహవర్తత ఇతి = సావజ్ఞా।
పద్మముఖీం: పద్మం ముఖం యస్యాస్సా = పద్మముఖీ, తాం = పద్మముఖీం.
పక్షాన్తరమున - పద్మమివ ముఖం యస్యాస్సా = పద్మముఖీ, తాం = పద్మముఖీం.
కుముదకేదారాత్ : కుముదానాం కేదారః = కుముదకేదారః, తస్మాత్ = కుముదకేదారాత్।
అమ్భోజినీమ్: అమ్భోజమస్యాః అస్తీతి = అమ్భోజినీ, తాం = అమ్భోజినీం।.

**భావము :**

నలుని వాక్యమును వినినవెంటనే, దమయన్తి యానలుఁడు తన్ను వదలి కర్మానుష్ఠానమునకుఁ బోవ నున్నందువలన తన్ను తిరస్కరింపఁ బడినదానినిగా భావించి, లక్ష్మి కలువల క్షేత్రమును వదలి సమీపమందలి పద్మములను ముఖముగా గల్గిన తామర తీగలనుఁ బొందినట్లు, తాను రాజును వదలి సమీపమందున్న పద్మము వంటి మోము గల్గిన చెలికత్తెను జేరెను. అవమానింపఁ బడినవారు, అవమానించినవారిని వదలి వెళ్ళుదురు. లక్ష్మి వెడలిపోయినచో కలువల క్షేత్రమునకు నెట్లు మాలిన్యమో యాలక్ష్మి చేరుటవలన పద్మములకెట్లు వికాసమో, అట్లే దమయన్తివియోగముచే నలునకు మాలిన్యమును. ఆమెయొక్క సమాగమముచే చెలికత్తె మోమునకు మందహాస శోభయు, గల్గినదని యా యుపమచే సూచితము॥

శ్లో. మమాసావపి మా సమ్భూత్ కలిద్వాపరవత్ పరః।
ఇతీవ నిత్యసత్రే తాం స త్రేతాం పర్యతూతుషత్॥ 10

ప. వి. మమ - అసౌ - అపి - మా-సమ్భూత్ - కలిద్వాపరవత్ - పరః - ఇతి - ఇవ - నిత్యసత్రే - తాం - సః త్రేతాం - పర్యతూతుషత్-

అర్థము. అసౌ అపి = ఈ త్రేతయు, కలిద్వాపరవత్ = కలియుగ ద్వాపరయుగ ముల కధీశ్వరులవలె, మమ = నాకు, పరః = శత్రువు, మాసమ్భూత్ = కారాదు. ఇతీవ = ఇట్లు తలంచెనో యనునట్లు, సః = ఆ నలుఁడు, నిత్యసత్రే = ప్రతిదినమునుఁ దాననుష్ఠించెడి యజ్ఞమందు ననగా నగ్ని హోత్రమునందు, తాం = ఆహవనీయమనియు, గార్హపత్యమనియు, దక్షిణాగ్నియనియుఁ బ్రసిద్ధమైన రామరావణాదులయొక్క వివిధ వ్యాపారముల కాశ్రయముగా బ్రసిద్ధమైన. త్రేతాం = మూడగ్నులను, రెండవయుగమును, పర్యతూతుషత్ = హవిస్సుచే సంతోషపఱచెను.

సమాసములు :

కలద్వాపరవత్: కలిశ్చ, ద్వాపరశ్చ = కలిద్వాపరౌ, కలిద్వాపరా వివ = కలిద్వాపరవత్।

నిత్యసత్రే: నిత్యం చతత్ సత్రంచ = నిత్యసత్రం; తస్మిన్ = నిత్య సత్రే!

భావము :

ద్వితీయ యుగమైన త్రేత కధీశ్వరుడు, కలిద్వాపరయుగముల కధీ శ్వరులవలె శత్రువు కారాదని తలంచెనో యనునట్లు. ఆ నలుఁడు, ప్రతిదిన మనుష్ఠింపవలసినందువలన, నిత్యయాగమైన యగ్నిహోత్రమునందు నాత్రేతను ననగా, ఆవహనీయ, గార్హపత్య, దక్షిణాగ్నులనెడి యగ్నిత్రయమును త్రేతా యుగాధీశ్వరుని సంతోషపఱచెను.॥10॥

శ్లో. క్రియాం ప్రాహ్ణేతనీం కృత్వా నిషేధన్ పాణినా సఖీం।
కరాభ్యాం పృష్ఠగస్తస్యాన్యమీ మిలదసౌ దృశౌ॥ 11

శ్లో. దమయన్త్యా వయస్యాభిః సహాస్యాభిః సమీక్షితః।
ప్రసృతిభ్యా మివాఽఽయామం మాపయన్ ప్రేయసీదృశో॥

ప. వి. క్రియాం - ప్రాహ్వేతనీం - కృత్వా - నిషేధన్ - పాణినా - సఖీం - కరాభ్యాం - పృష్ఠగః - తస్యాః - న్యమీమిలత్ - అసౌ - దృశౌ॥

వ. వి. దమయన్త్యాః - వయస్యాభిః - సహాస్యాభిః - సమీక్షితః - ప్రసృతిభ్యామ్ - ఇవ - ఆయామం - మాపయన్ - ప్రేయసీ దృశోః.

అర్థము. అసౌ = ఈ నలుఁడు, ప్రాహ్వేతనీం = దినపూర్వభాగమందుఁ జేయవలసిన, క్రియాం = క్రియను, కృత్వా = చేసి సఖీం = పూర్వముఁ జెప్పఁబడిన చెలికత్తెను, పాణినా = చేతిసైగచే, నిషేధన్ = వారించుచు, ననగా తన రాకను సూచించుటకో యనునట్లు వారించుచు, తస్యాః = ఆ దమయన్తి యొక్క, పృష్ఠగః = వెనుకనున్నవాఁడై, కరాభ్యాం = చేతులచే, దృశౌ = దమయన్తి యొక్క కన్నులు, న్యమీమిలత్ = మూసెను. ప్రసృతభ్యాం = అయిదు వ్రేళ్ళను గలిపి గుంతగాఁజేయఁబడిన హస్తములచే, ప్రేయసీ దృశోః, ప్రేయసీ = ప్రియురాలగు దమయన్తి యొక్క, దృశోః = కన్నులయొక్క, ఆయామం = పొడవును, మాపయన్నివ = కొలచుచున్నాడో యనునట్లు (స్థితః = ఉండెను)తథా = అట్లే. సహాస్యాభిః = హాస్యముతోఁగూడిన, దమయన్త్యాః = దమయన్తి యొక్క వయస్యాభిః = చెలికత్తెలచే, సమీక్షితః = చూడఁబడెను.

**సమాసములు :**

ప్రహ్వేతనీం: ప్రహ్వేభవా = ప్రహ్వేతనీ, తాం = ప్రహ్వేతనీం।
పృష్ఠగః: పృష్ఠేగచ్ఛతీతి = పృష్ఠగః॥
సహాస్యాభిః: హాస్యేన సహ వర్తన్త ఇతి = సహాస్యాః, తాభిః = సహాస్యాభిః.
ప్రేయసీదృశోః : అత్యంతం ప్రియా = ప్రేయసీ, ప్రేయస్యాః దృశౌ = ప్రేయసీదృశౌ, తయోః = ప్రేయసీదృశోః।

**భావము :**

ఈ నలుఁడు దినపూర్వభాగమందు ననగా మధ్యాహ్నమునకు పూర్వము చేయవలసిన కృత్యమును సమాప్తిగావించి పూర్వము చెప్పఁబడిన చెలికత్తెను

చేత సైగచే వారించుచు దమయన్తికి వెనుకనున్నవాడై తన చేతులతో నామె కన్నులను హాస్యమునకై మూసెను.

ఇంతగా ముడిచిన యరచేతులచే ప్రియురాలి కన్నుల పొడవునుఁగొలచుటకో యనునట్లు ఆమె కన్నులను మూయుచున్నవాఁడై, యతని చేతలకు మందహాసము గావించెడి దమయన్తియొక్క చెలికత్తెలచేఁ జూడఁబడెను. ॥11॥॥12॥

శ్లో. తర్కితాలి। త్వమిత్యర్ధ వాణీకా పాణిమోచనాత్।
జ్ఞాతస్పర్శాన్తరా మౌనమానశే మానసేవినే॥. 3

ప. వి. తర్కితా - ఆలి! - త్వమ్ - ఇతి - అర్ధవాణీకా - పాణిమోచనాత్ - జ్ఞాత స్పర్శాన్తరా - మౌనమ్ - ఆనశే - మానసేవినే।.

అర్థము. హే ఆలి! = ఓ చెలీ, త్వం = నీవు అనగా కన్నులను గట్టినట్టి నీవు, అవధారితా = ఊహతో తెలిసికొనఁబడితివి. ఇతి = ఇట్లు, అర్థవాణీకా, అర్ధ = అసమగ్రమైన, వాణీకా = మాటగలదై, పాణిమోచనాత్ = కన్నులను మూసిన చేతులను తన చేతులతోఁ దొలగించుటవలన, జ్ఞాతస్పర్శాన్తరా; జ్ఞాత = తెలియఁబడిన, స్పర్శాన్తరా = మఱియొక స్పర్శగలదై, అనగా చెలికత్తెయొక్క స్పర్శమునకంటె విలక్షణమైన నతని స్పర్శగల్గినదై, మానసేవినీ; మాన = తనకంటె భిన్నమైన స్త్రీతాగ్నులయందాదరముంచి తన్ను నాదరించనందువలన నభిమానమును ననగా బెట్టును వహించినదై, మౌనం = మాటలాడక యుండుటను, ఆనశే = పొందెను. అనగా కోపముతో నేమియుఁ జెప్పలేదని యర్థము.

సమాసములు :

అర్థవాణీకా : అర్ధా వాణీ యస్యాస్సా = అర్ధవాణీకా!

పాణిమోచనాత్ : పాణ్యోః మోచనం = పాణిమోచనం, తస్మాత్ = పాణిమోచనాత్।

జ్ఞాతస్పర్శాన్తరా : అన్యః స్పర్శః=స్పర్శాన్తరం, జ్ఞాతం స్పర్శాన్తరం యయా సా=జ్ఞాతస్పర్శాన్తరా.
మానసేవినీ : మౌనం సేవత ఇతి=మానసేవినీ.

భావము :

ఓ చెలీ! నీవు నా కన్నులను గప్పితివని యనుమానముచేఁ దెలిసికొంటివి. అని సగముఁజెప్పినదై "కావున నన్ను వదలుము" అని తక్కిన సగమునుఁ జెప్పనందువలన నసమగ్రముగాఁజెప్పినట్టి యా దమయన్తి; తన కన్నులనుఁ గప్పిపట్టిన యా చేతులనుఁదాకి నెట్టివైచిన పిదప నాచేతుల స్పర్శ తనకుఁ దగులుటవలన నాస్పర్శ చెలికత్తెదిగాక మఱియొక్కనిదిగా ననగా నలునిదిగా తెలిసికొనినది. అప్పుడా దమయన్తి, నలుఁడు నన్నాదరింపక త్రేతాగ్నుల నాదరించినందువలన కినుక వహించినదై ఙట్టుగానుండి యేమియు నతనితోఁ బలుకక యుండిపోయినది. ॥13॥

శ్లో. సాఽవాచి సుతనుస్తేన కోపస్తే నాయమౌచితీ।
త్వాం ప్రాపం యత్ప్రసాదేన ప్రియే! తన్నాద్రియే! తపః॥ 14

ప. వి. సా - అవాచి - సుతనుః - తేన - కోపః - తే - న - అయం - ఔచితీ - త్వాం - ప్రాపం - యత్ - ప్రసాదేన - ప్రియే! - తత్ - న - ఆద్రియే - తపః.

అర్థము. తేన=ఆ నలునిచే, సుతనుః=చక్కని శరీరము గల్గిన, సా=ఆ దమయన్తి "హే ప్రియే=ఓ ప్రియురాలా! తే=నీకు, అయం=ఈ, కోపః=కోపము, ఔచితీ=న్యాయముగాదు. తథాహి=అదియుక్తమే, యత్ప్రసాదేన ; యత్=ఏ తపముయొక్క. ప్రసాదేన=అనుగ్రహముచే, త్వాం=నిన్ను, ప్రాపం=పొందితినో, తత్=ఆ మహోపకారము చేసిన తపమును ననగా నగ్నిహోత్రాది కర్మానుష్ఠానమును, న ఆద్రియే=ఆదరింపఁగూడదా (అనగాఁదప్పక యాదరింపవలయునని యర్థము) అని అవాచి=చెప్పఁబడినది.

సమాసములు :

ఔచితీ: ఉచితస్య భావః ఔచితీ :
యత్ప్రసాదేన: యస్య ప్రసాదః = యత్ప్రసాదః, తేన = యత్ప్రసాదేన.

భావము ;

ఆ నలమహారాజు, సౌబగైన యొదలు గల్గిన యా దమయన్తినిగూర్చి- "ఓ ప్రియురాలా! ఈ కోపము నీకుఁ దగదు. ఏలయనగా, ఏ యగ్నిహోత్రాది కర్మానుష్ఠానరూపమగు తపమువలని యనుగ్రహముచే నిన్ను నేను బడసితినో యట్టి తపమునాచరించి దాని నాదరించుట ముఖ్యముగదా! కాన నీవు రమ్మని పిలచినను దాని నాదరించితిని. ॥14॥

శ్లో. నిశి దాస్యం గతోఽపి త్వాం స్నాత్వాయన్నాభ్యభీవదమ్ ।
తం ప్రవృత్తాఽసి మన్తుంచేన్మన్తుం తద్వదవన్ద్యసే॥ 15

ప. వి. నిశి - దాస్యం - గతః - అపి - త్వాం - స్నాత్వా - యత్ - న - అభ్యభీవదం - తం - ప్రవృత్తా - అసి - మన్తుం - చేత్ - మన్తుం తత్ - వద - వన్ద్యసే -

అర్థము. హేప్రియే = ఓప్రియురాలా! నిశి = రాత్రియందు, దాస్యం = నీకు బానిసతనమును, (అనగా, నీ పాదములనుఁబట్టుట, సురతశ్రమనొందిన నీకు విసరుట మున్నగువానిచే) గతః = పొందితిని, స్నాత్వా = స్నానముఁగావించి వచ్చి, త్వాం = నిన్ను, యత్ = ఎందువలన, నాభ్యభీవదం = నేను అభివాదమును (గావింపఁబోతినో, తం = ఆ యభివాదము గావింపక పోవుటయను, మన్తుం = అపరాధమును, మన్తుం = ఆలోచించుటకు, ప్రవృత్తా అసిచేత్ = ప్రయత్నించిన దానవై యున్నచో; తత్ = అప్పుడు, వద = చెప్పుము. వన్ద్యసే = నమస్కరింపఁబడుచున్నావు. ప్రణిపాతముచేత నపరాధమును క్షమింపవచ్చును గదా! యని యర్థము.

సమాసములు ;

దాస్యం : దాసస్యభావః = దాస్యం, తల్ = దాస్యం.

భావము :

ఓ ప్రియురాలా ! రాత్రియందు నీ పాదములనుఁబట్టుట. సురతశ్రమ దొలగించుటకు విసనకఱ్ఱచే విసరుట మున్నగు పనులనుఁగావించుటచే నీకు దాసుఁడనైతిని. స్నానము గావించి వచ్చి నీకభివాదనము చేయనందు వలని యపరాధము గూర్చి నీవు విచేచించినచో నా యపరాధము గూర్చి చెప్పవచ్చును. ఇప్పుడే నీకు వందన మాచరించుచున్నాను. "దాసుని తప్పు దండముతో సరి" యను లోకోక్తి ప్రకారము నా దండముచేతనే నీవు నా యపరాధమును క్షమింపఁదగును ॥15॥

శ్లో. ఇత్యేతస్యాః పదాసక్త్యై పత్యై ప్రేరితౌ కరౌ ।
రుద్ధ్వా సకోపం సాతఙ్కం తం కటాక్షై రమూముహమ్॥ 16

ప.వి. ఇతి - ఏతస్యాః - పదాసక్త్యై - పత్యా - ఏషా - ప్రేరితౌ - కరౌ - రుద్ధ్వా - సకోపం - సాతఙ్కం - తం - కటాక్షైః - అమూముహమ్ ।

అర్థము: ఏషా = ఈ దమయన్తి, పత్యా = భర్తయగు నలునిచే, ఇతి = ఇవ్విధముగా (చెప్పి) ఏతస్యాః = ప్రియురాలగ దమయన్తియొక్క, పదాసక్త్యై = పాదములఁబట్టుటకై; ప్రేరితౌ = చాచఁబడిన, కరౌ = హస్తములను రుద్ధ్వా = తన చేతులలో నడ్డగించి, సకోపం = (పాదగ్రహణ మనెడి యనుచిత కార్యమునుఁజేయుటచే) కోపముతోఁగూడినట్లును, సాతఙ్కం = తన పాదములను భర్తతాకుట యనుచితమగుటవలన భయముతోఁగూడినట్లును, కటాక్షైః = కడకన్నులచే, తం = ఆభర్తను, అమూముహత్ = మోహింపఁజేయుచుండెను. అనగా కామపీడితునిఁ గావించెనని యర్థము.

సమాసములు :

సకోపం : కోపేన సహితం యథా తథా = సకోపమ్.

సాతఙ్కం : ఆతఙ్కేన సహితం యథాతథా = సాతఙ్కం.

భావము :

ఈ దమయన్తి = తన భర్తయిట్లు చెప్పి పాదములకు వందనము గావించుటకై, వానినిఁబట్టుటకుఁ జేతులనుఁజాపగా నా చేతులను వారించి తన భర్త తన పాదములనుఁబట్టుట యను ననుచితకృత్యమునకై కోపించి, బెగడొంది, తన కడకన్నులచే నలనివి మోహింపఁజేసి, యతని యందు కామము నుద్దీపింపఁజేసినది. ॥16॥

శ్లో. అవోచత తత స్తన్వీం నిషధానా మధీశ్వరః ।
తదపాఙ్గ చల త్తారా ఝులత్కార వశీకృతః ॥ 17

ప.వి. అవోచత - తతః - తన్వీం - నిషధానాం - అధీశ్వరః - తదపాఙ్గ-
చలత్తారా ఝులత్కార వశీకృతః ;

అర్థము: తతః = ఆమె కడకన్నులచే మోహమునుఁజెందిన పిదప, తదపాఙ్గ చలత్తారా ఝులత్కార వశీకృతః; తత్ = ఆ దమయన్తియొక్క, అపాఙ్గ = కడకన్నులయందు, చలత్ = కదలుచున్న, తారా = పాపయొక్క, ఝులత్కార = మెఱపుచే, వశీకృతః = స్వాధీనము చేసికొనఁబడినవాడై నఁ నిషధానాం - నిషధదేశములకు, అధీశ్వరః = ప్రభువైన నలుఁడు, తన్వీం = సుందరియగు ప్రియురాలిని, అనగా కృశించిన దేహము గల్గిన దమయన్తిని, అవోచత = పలికెను.

సమాసములు :

తదపాఙ్గ చలత్తారా ఝులత్కార వశీకృతః

తస్యాః అపాఙ్గం = తదపాఙ్గం, తదపాఙ్గే చలన్తీ = తదపాఙ్గ చలన్తీ, తదపాఙ్గ చలన్తీచ సా తారాచ = తదపాఙ్గ చలత్తారా, తదపాఙ్గ చలత్తారాయా,

ఘులత్కారః = తదపాఙ్గ ఘులత్కారః, అతశః వశః సమ్పద్యమానః కృతః వశీకృతః, తదపాఙ్గ చలత్తారా ఘులత్కారేణ వశీకృతః = తదపాఙ్గ చలత్తారా ఘులత్కార వశీకృతః.

**భావము :**

ఇట్లు ప్రియురాలి కడకన్నులచే మోహముఁజెందినపిదప, నా ప్రియురాలి కంటి పాపయొక్క మెఱుపుచే వశమైన యా నలమహారాజు, ఆమెతో నిట్లు చెప్పెను. ॥17॥

**శ్లో. కటాక్ష కపటారబ్ధ దూరలంఘన రంహసా.**
**దృశాం భీత్యా నివృత్తం తే కర్ణకూపం నిరూప్య కిమ్॥ 18**

**ప.వి.** కటాక్ష కపటారబ్ధ దూరలంఘనరంహసా - దృశాం - భీత్యా - నివృత్తం - తే - కర్ణకూపం - నిరూప్య - కిమ్.

**అర్థము:** హే ప్రియే = ఓ ప్రియురాలా! కటాక్ష కపటారబ్ధ దూరలంఘన రంహసా; కటాక్షకపట = కడకన్నులఁ జూపుటయనెడివెపముచే, ఆరబ్ధ = ప్రారంభింపఁబడిన, దూరలంఘనరంహసా - దూరలంఘన = దూరదేశ మందు, పడుటవలని, రంహసా = వేగముగల్గిన, తే = నీయొక్క, దృశా = కంటిచే, కర్ణకూపం = చెలియనుబావిని, నిరూప్య = చూచి, భీత్యా = భయముతో, వనగా పడెదననెడి భయముతో, నివృత్తం కిం = మఱల ఐడుట యేర్పడినదా యేమి? లోకమునందుఁగూడ దూరము నకు దాటుటకు ఁగోరికగల్గి జనము సమీపమున బావియున్నచోనందుఁ బడెదమను భయముతో నా ప్రయత్నమును విరమించుచునుగదా! దమ యన్తియొక్క కన్నులు కర్ణములకు వ్యాపించి సువిశాలములును సుదీర్ఘములునై యున్నవని యర్థము.

సమానములు :

కటాక్ష కపటారబ్ధ దూరలంఘన రంహసా :

కటాక్షస్య కపటః కటాక్ష కపటః, కటాక్ష కపటేన ఆరబ్ధం = కటాక్ష కపటారబ్ధం, దూరం లంఘనం = దూరలంఘనం. దూరలంఘనస్య రంహః = దూరలంఘన రంహః, కటాక్ష కపటారబ్ధం, దూరలంఘనరహః యస్యాస్సా = కటాక్ష కపటారబ్ధ దూరలంఘనరంహః, తయా = కటాక్ష కపటారబ్ధదూర లంఘన రంహసా.

కర్ణకూపం కర్ణ ఏవ కూపః = కర్ణకూపః; తం = కర్ణకూపమ్.

**భావము :**

ఓ ప్రియురాలా ! నీకన్ను, కడకంటిని జూపుటయను నెపముచేఁ దూరమునకు దూకుటకై యుపక్రమించినదై యెదుట కర్ణరంధ్రమనెడి బావిని, జూచి యందు పడెదననెడి భయముతో మఱలినదా యేమి ? అనగా లోకమున దూరమునకు దూకుటకై సాహసించెడి వ్యక్తి, యెదుట బావియున్నచో నా పని నుండి విరమించును. అట్లే యీ దమయన్తి కన్ను కడకంటినిఁజూపుటకై చెవి వరకునుఁబొడిగించిన తన్ను వింకనుఁబొడిగింపఁబ్రయత్నింపగా నెదుట చెవియనెడి బావి యుండుటవలన నందు పడెదనను భయముతో నా ప్రయత్నమునుండి విరమించినదని యర్థము. ఈ దమయన్తి కన్నులు కర్ణములవరకు వ్యాపించి పొడవై యున్నవని సారాంశము ॥18॥

శ్లో. సరోషాఽపి సరోజాక్షి ! త్వముదేషి ముదే మమ।
తప్తాఽపి శతపత్రస్య సౌరభాయైవ సౌరభా॥ 19

వ.వి. సరోషా - అపి - సరోజాక్షి - త్వమ్ - ఉదేషి - ముదే - మమ - తప్తా- అపి - శతపత్రస్య - సౌరభాయ - ఏవ - సౌరభా -

**అర్థము:** హే సరోజాక్షి = ఓ తమ్మికంటీ ! సరోషాఽపి = నీవు రోషముగల దానివైనను, మమ = నాకు, ముదే = సంతోషమునకే, ఉదేషి = అగు చున్నావు. తాత్కాలికపు సౌందర్యము కన్నులకు మిక్కిలి యానన్దదాయకముగదా ! తథాహి = అదియుక్తమే, తప్తాఽపి = తాపముఁజెంది

నను, సూర్యస్య = సూర్యునియొక్క ఇయం = ఈ, సౌరభా, సౌర = సూర్యసంబంధముగల, భా = కాంతి, శతపత్రస్య = కమలముయొక్క, సౌరభాయ = పరిమళమునకే-యనగా వికసింపఁజేయుటచేఁబరిమళము నొసంగుటకే, (భవతి = కారణమగుచున్నది) కాని ఎండించుటకు కారణముగాదు.

వి. సరోషయగు దమయన్తి నలుని వికాసమునకై హేతువనెడి వాక్యార్థమున కును, సూర్యకాన్తి తాపము కల్గినదైనను కమలమును వికసింపఁజేయు టకు గారణమనెడి వాక్యార్థమునకు బిమ్బ ప్రతిబిమ్బ భావముఁజెప్పుట వలన దృష్టాన్తాలఙ్కారము.

సమాసములు :

సరోషా : రోషేణ సహవర్తత ఇతి = సరోషా.

సరోజాక్షి : సరోజే ఇవ అక్షిణీ యస్యాస్సా = సరోజాక్షీ, తస్యాః సమ్బుద్ధిః. సరోజాక్షి :

సౌరభాయ : సురభిణః భావః = సౌరభం, తస్మై = సౌరభాయ.

సౌరభా : సూర్యస్య ఇయం = సౌరీ, సౌరీచ సా భాశ్చ = సౌరభా.

భావము ;

ఓ తమ్మికంటివగు దమయన్తీ! నీవు రోషపడినను, నాకు నేత్ర పర్వమై యానన్దమునే చేకూర్తువు. సూర్యకాన్తి యెంత వేడియైననుఁ గమలము లనుఁ గమలిపోనీయక వికసింపఁజేసి వాని నెత్తావిని నలుగడల వ్యాపింపఁ జేయునుగదా! ॥19॥

శ్లో. ఛేత్తుమిందౌ భవద్వక్త్రబిమ్బవిభ్రమ విభ్రమమ్।
కృత్తై కళాబ్జ మానజ్ఞ భిన్నభిన్న విధిర్విధిః॥ 20

ప.వి. భేత్తుం - ఇందౌ - భవద్వక్త్రబిమ్బవిభ్రమవిభ్రమం - శఙ్కే - శశాఙ్కమ్ - అనఙ్కే - భిన్నభిన్న విధిః - విధిః.

అర్థము; హే ప్రియే = ఓ ప్రియురాలా! భిన్నభిన్నవిధిః = భిన్నభిన్న = మిక్కిలి విలక్షణమైన, విధిః = నిర్మాణ ప్రకారముగల్గిన, విధిః = బ్రహ్మ, భవద్వక్త్రబిమ్బ విభ్రమ విభ్రమం; భవత్ = నీయొక్క, వక్త్రబిమ్బ = ముఖమణ్డలముయొక్క, విభ్రమ = సౌందర్యముయొక్క, విభ్రమం = భ్రమను, భేత్తుం = తొలగించుటకు, శశాఙ్కం; శశ = కుందేటియొక్క, అఙ్కం = చిహ్నమును అనఙ్కే = గుఱ్ఱుగాఁజేసెను. ఇతి = అని, శఙ్కే = సందేహించుచున్నాను.

వి. చంద్రునియందు దమయన్తీ ముఖసౌందర్య భ్రాన్తి నిరాకరణము లేకపోయినను నా నిరాకరణమును శంకించుటవలనన్నుత్ప్రేక్ష, వ్యఞ్జకమగు 'శఙ్కే'యను క్రియ నుపయోగించుటవలన నది వాచ్యము.

సమాసములు :

భవద్వక్త్రబిమ్బ విభ్రమ విభ్రమమ్ : భవత్యాః వక్త్రబిమ్బం = భవద్వక్త్రబిమ్బం - భవద్వక్త్రబిమ్బస్యవిభ్రమః = భవద్వక్త్రబిమ్బ విభ్రమః, భవద్వక్త్రబిమ్బ విభ్రమస్య విభ్రమః = భవద్వక్త్రబిమ్బ విభ్రమవిభ్రమః, తం = భవద్వక్త్రబిమ్బ విభ్రమమ్.
భిన్నభిన్నవిధి : భిన్నాశ్చ భిన్నాశ్చ = భిన్నభిన్నాః, భిన్నభిన్నానాం విధిః = భిన్నభిన్నవిధిః.

భావము :

ఓప్రియురాలా ! విలక్షణములగు నిర్మాణములనుఁజేయునట్టి యాబ్రహ్మ, చన్ద్రునియందు నీ ముఖ సౌందర్యభ్రాన్తి గలుగక యుండుటకై - యనగా నట్టి భ్రమను వారించుటకై - యా చంద్రునియందుఁగుందేటిని గుఱ్ఱుగా నుంచెనని నేను శంకింతును. ఈ విధముగా కుందేలును చంద్రునియందుఁగుఱ్ఱుగా యుంచనిచో

ద్విజులకు చంద్రునియందు నీ ముఖబిమ్బభ్రాన్తి గల్గి యుండెడిది. అనగా దమయన్తియొక్క ముఖసౌందర్యము చంద్రుని సౌందర్యమును మించినదని యాశయము ॥20॥

శ్లో. తామ్రపర్ణీ తటోత్పన్నైర్మౌక్తికైరిన్దుకుక్షిజైః।
బద్ధస్పర్ధతరావర్ణాః ప్రసన్నాః స్వాదవస్తవ॥ 21

ప.వి. తామ్రపర్ణీ తటోత్పన్నైః - మౌక్తికైః - ఇందుకుక్షిజైః - బద్ధస్పర్ధ తరాః - వర్ణాః - ప్రసన్నాః - స్వాదవః - తవ.

అర్థము: ప్రసన్నాః = నిర్మలములైన, స్వాదవః = మనోహరములైనవియు, ననగా వినుటకుఁగోరికనుఁబెంచునట్టివియు, (మిక్కిలి మధురములైనవి యును) తవ = నీ యొక్క, వర్ణాః = అక్షరములు, అనగా నీవు ఉచ్చ రించునట్టి యక్షరములు, తామ్రపర్ణీ తటోత్పన్నైః; తామ్రపర్ణి యనెడి నిర్మల జలములుగల నదియొక్క, తటే = గట్టునందు, ఉత్పన్నైః = ఉద్భవించిన, కావుననే స్వచ్ఛములైన, ఇందుకుక్షిజైః, ఇందు = చంద్రునియొక్క కుక్షిజైః = గర్భమునుండి యుద్భవించినవైనఁ కావు ననే యమృత సమ్పన్నముచే మధురములైనవియునగు, మౌక్తికైః = ముత్తియములతో, బద్ధ స్పర్ధతరాః; బద్ధ = కట్టఁబడిన, స్పర్ధతరాః = అధికమగు కలహము గల్గిన అనగా పోటీ గల్గినవిగా (భవన్తి = అగు చున్నవి) ఆ ముత్తెముల కంటెను, నీ పలుకులలోని యక్షరములు మిక్కిలి స్వచ్ఛములును మధురములునై యున్నవి.

సమాసములు :

తామ్రపర్ణీ తటోత్పన్నైః : తామ్రపర్ణ్యాః తటం = తామ్రపర్ణీతటే ఉత్పన్నాని = తామ్రపర్ణీ తటోత్పన్నాని, తైః = తామ్రపర్ణీ తటోత్పన్నైః.

ఇందుకుక్షిజైః : ఇందోః కుక్షిః = ఇందుకుక్షిః; ఇందుకుక్షేః జాయన్తే ఇతి = ఇందు కుక్షిజాని, తైః = ఇందుకుక్షిజైః.

బద్ధస్పర్ధతరాః : బద్ధాస్పర్ధా యేషాం తే—బద్ధస్పర్ధాః, అతిశయేన బద్ధస్పర్ధాః—బద్ధస్పర్ధతరాః.

**భావము ;**

నీవు మాట్లాడెడి యక్షరములు ప్రసాదగుణముతోడఁ గూడినవై, స్వచ్ఛములై రుచియుక్తములై యనగా వినుటకుఁగోరికను వర్ధిల్లఁజేయుచున్నవై ; స్వచ్ఛజలములు గలదిగాఁ బ్రసిద్ధినొందిన తామ్రపర్ణియను నదియొక్క గట్టున నుద్భవించినవియును, చంద్రుని గర్భమునుండి యుద్భవించినవియునగు ముత్తెములతో మిక్కిలి కయ్యమునుఁ గట్టినవై యనగా నైర్మల్యమునందు నా ముత్తెములను సైతము మించినవై యున్నవి. ॥21॥

శ్లో. త్వద్గిరః క్షీరపాథోధేః సుధయైవ సహోత్థితః ।
అద్యయావదహో! ధావద్దుగ్ధలేప లవస్మితాః ॥ 22

వ. వి. త్వద్గిర - క్షీరపాథోధేః - సుధయా - ఏవ - సహ - ఉత్థితః - అద్య-యావత్ - అహో - ధావద్దుగ్ధలేపలవస్మితాః.

అర్థము: హే ప్రియే—ఓ ప్రియురాలా! త్వద్గిరః—నీ మాటలు సుధయాసహ—అమృతముతోడ, క్షీరపాథోధేః—పాలకడలినుండి, ఉత్థితా (ఇవ)—లేచినవోయనునట్లున్నవి. ఇందువలన వాటితో నీ మాటలకు సంపర్క-ముండుటవలన నమృతమువలె నా మాటలకుఁ దియ్యఁదనముఁ దెలియఁ బడుచున్నది. అద్యయావత్—నేటివరకును, ధావద్దుగ్ధ లేపలవస్మితాః—ధావత్—పారుచున్న, దుగ్ధలేప—(పాలకడలియందుండుటవలన) నంటుకొనిన పాలయొక్క, లవ—బిందువులనెడి, స్మితాః—మన్దహాసములు గల్గినవిగా లేదా, ధావత్—స్రవించుచున్న, దుగ్ధ—పాలయొక్క, లేప—లేపమునకునంటిన, లవ—బిందువులనెడి, స్మిత—చిఱునగవులుగలవిగా (పరిలక్ష్యన్తే—చూడఁబడుచున్నవి) అహో—ఆశ్చర్యము, చిఱునగ వనెడి నెపముచేఁ బాలతోఁ బూయఁబడినందువలన నీ మాటలు అమృతముతోఁడను, పాలతోఁడనుఁ, బాల్కడలినుండి యుద్భవించినట్లు ఊహింపఁ బడుచున్నవి. అట్లు కానిచో నవి యా విధముగా నుండనేరవు. ॥22॥

శ్లో. పూర్వపర్వత మాశ్లిష్ట చన్ద్రికశ్చన్ద్రమా ఇవ ।
అలఙ్చక్రే స పర్యఙ్క మఙ్క సఙ్క్రమిత ప్రియః ॥ 23

ప. వి. పూర్వపర్వతం - ఆశ్లిష్టచన్ద్రికః - చన్ద్రమాః - ఇవ - అలఙ్చక్రే - సః - పర్యఙ్కమ్ - అఙ్కసఙ్క్రమితప్రియః -

అర్థము: ఆశ్లిష్ట=స్పృశింపఁబడిన, చన్ద్రికః=వెన్నెలగల్గిన, చన్ద్రమాః=చన్ద్రుఁడు, పూర్వ పర్వతమివ=ఉదయాద్రినివలె, అఙ్క సఙ్క్రమిత ప్రియః, అఙ్క=ఒడియందు, సఙ్క్రమిత=కూర్చుండ బెట్టుకొనిన, ప్రియః=ప్రియురాలగు దమయన్తినిఁ గల్గినవాడై, సః=ఆ నలుఁడు. పర్యఙ్కం=మంచమును, అలఙ్చక్రే=అలంకరించెను.

సమాసములు :

పూర్వపర్వతం : పూర్వస్యాం పర్వతః=పూర్వపర్వతః, తం=పూర్వపర్వతం.
ఆశ్లిష్ట చన్ద్రికః : ఆశ్లిష్ట చన్ద్రికా యేన సః=ఆశ్లిష్ట చన్ద్రికః.
అఙ్కసఙ్క్రమితప్రియః : అఙ్కే సఙ్క్రమితా=అఙ్కసఙ్క్రమితా, అఙ్కసఙ్క్రమిత ప్రియా యస్య సః=అఙ్కసఙ్క్రమితప్రియః.

భావము :

వెన్నెలతోఁగూడిన చంద్రుడు, ఉదయ పర్వతము నెట్లలఙ్కరించునో యట్లే యా నలమహారాజు, తన ప్రియురాలగు దమయన్తి నొడియందుఁ జేర్చుకొని మంచము నలఙ్కరించెను. ॥23॥

శ్లో. ప్రావృడారమ్భణామ్భోదః స్నిగ్ధోద్యామివ స ప్రియామ్ ।
పరిరభ్య చిరాయాఽస్య విశ్లేషాఽఽయాస ముక్తయే ॥ 24

ప. వి. ప్రావృడారమ్భణామ్భోదః - స్నిగ్ధః - ద్యామ్ - ఇవ - సః - ప్రియామ్ - పరిరభ్య - చిరాయ - అస్య - విశ్లేషాఽఽయాసముక్తయే.

అర్థము: స్నిగ్ధః = దమయన్తింగూర్చి ప్రీతిగలవాఁడును (పక్షాన్తరమున - జలమును లోనఁగల్గినందువలన నును పై నదియును) నగు, సః = ఆ నలుడు. ప్రావృడారమ్భణామ్భోదః; ప్రావృట్ = వర్ష ఋతువు యొక్క, ఆరమ్భ = ప్రారంభమందలి, అమ్భోదః = మేఘము, ద్యామివ = ఆకసమునువలె, విశ్లేషాఽఽయాసముక్తయే; విశ్లేష = వియోగము యొక్క, ఆయాస = కష్టమును, ముక్తయే = వదలుటకై, ప్రియాం = ప్రియురాలగు దమయన్తిని, పరిరభ్య = కౌగలించుకొని, చిరాయ = చాలా కాలమువరకు, ఆస = ఉండెను. చాలకాలము కౌగలించుకొని యుండెనని యర్థము.

సమాసములు :

ప్రావృడారమ్భణామ్భోదః : ప్రావృషః ఆరంభణం = ప్రావృడారంభణం, ప్రావృడారమ్భణే అమ్భోదః = ప్రావృడారమ్భణామ్భోదః. విశ్లేషాయాసముక్తయే : విశ్లేషస్య ఆయాసః = విశ్లేషాయాసః, విశ్లేషాయాసస్య ముక్తిః = విశ్లేషాయాస ముక్తిః, తస్యై = విశ్లేషాయాస ముక్తయే.

భావము :

స్నిగ్ధుడనగా దమయన్తిపై ప్రీతిగలవాడైన యా నలుడు (స్నిగ్ధమైన యనగా నీటినిలోనఁగల్గియున్నందువలన నునుపైన మేఘము వర్షర్తు ప్రారంభమున ఆకాశమునువలె) వియోగకష్టమునుఁ దొలగించుటకై ప్రియురాలైన దమయన్తినిఁ గౌగలించుకొని చిరకాలము శోభించెను. అనగా వర్షర్తు ప్రారంభమున, నీటితో నిండిన మేఘమాకాశము నంటియున్నట్లు, నలుడు దమయన్తినిఁ గౌగిలించుకొని యుండెనని యర్థము. ॥24॥

శ్లో. చుచుమ్బాస్య మసౌ తస్య రసమగ్నః శ్రితస్మితమ్ ।
నభోమణిరివామ్భోజం మధుమధ్యాను బిమ్బితః ॥ 25

ప. వి. చుచుమ్బ - ఆస్యమ్ - అసౌ - తస్య - రసమగ్నః - శ్రితస్మితం - నభోమణిః - ఇవ - అమ్భోజం - మధుమధ్యానుబిమ్బితః.

అర్థము. రసమగ్న, రస = అనురాగసాగరమందు, మగ్నః = మునిగిన, అసౌ = ఈ నలమహారాజు, శ్రితస్మితం = నవ్వుతోఁగూడిన (యనగా నాలింగనము చేసుకొనుట వలని యానందముచేఁ గోపము తొలగిన) తస్యాః = ఆ దమయన్తియొక్క, ఆస్యం = ముఖమును, మధుమధ్యానుబిమ్బితః, మధుమధ్య; మధు = పద్మ మకరన్దముయొక్క, మధ్య = మధ్యభాగమున, అనుబిమ్బితః = ప్రతిబింబించిన, నభోమణిః = సూర్యుడు అమ్భోజమివ = పద్మమునువలె, చుచుమ్బ = ముద్దిడుకొనెను. సూర్యునకును కమలమునకును దూరమున్నను ప్రతిబింబరూపమున దగ్గర నుండుటవలన ముద్దిడుకొనుటలో ననుపపత్తి లేదు.

సమాసములు :

రసమగ్నః : రసేమగ్న = రసమగ్నః.

శ్రితస్మితం : శ్రితం స్మితం యేన తత్ = శ్రితస్మితం, తత్ = శ్రితస్మితమ్.

నభోమణిః : నభసః మణిః = నభోమణిః.

మధుమధ్యానుబిమ్బితః : మధునః మధ్యః = మధుమధ్యః, మధుమధ్యే అనుబిమ్బితః = మధుమధ్యానుబిమ్బితః.

భావము :

అనురాగ సాగరమునందు మునిగిన యీ నలుఁడు తాను గట్టిగాఁ గౌగలించుకొనుటవలనఁ గోపము తొలగి మన్దహాసముతోఁ గూడిన యీ దమయన్తి మోమును, పద్మమకరన్దమునందుఁ బ్రతిబిమ్బించిన సూర్యుడు పద్మమునువలె ముద్దిడుకొనెను. సూర్యుడు పద్మమునకు దూరమునందున్నను నాతని ప్రతిబిమ్బము దగ్గర నుండుట వలన ముద్దిడుకొనుట యందనుపపత్తి లేదు. ॥26॥

శ్లో. అథాఽఽహూయ కలాం నామ పాణినా స ప్రియాసఖీమ్ ।
పురస్తాద్వేశితామూచే కర్తుం నర్మణి సాక్షిణీమ్ ॥ 26

ప. వి. అథ - ఆహూయ - కలాం - నామ - పాణినా - సః - ప్రియాసఖీమ్-
పురస్తాత్ - వేశితాం - ఊచే - కర్తుం - నర్మణి - సాక్షిణీమ్.

అర్థము: అథ=అట్లు ముద్దిడుకొనిన పిదప, సః=ఆ నలుఁడు, కలాంనామ=
కలయను పేరుగల్గిన, ప్రియాసఖీం; ప్రియా=ప్రియురాలగు దమయన్తి
యొక్క, సఖీం = చెలికత్తెను, నర్మణి = పరిహాసకేళియందు,
సాక్షిణీం=ప్రత్యక్షముగా దర్శించు దానినిగా; కర్తుం=చేయుటకు,
పాణినా=చేతిసంజ్ఞచే, ఆహూయ = పిలచి, పురస్తాత్=ఎదుట,
వేశితాం=కూర్చున్న దానినిగా (కృత్వా=చేసి) ఊచే=పలికెను.

సమాసములు ;

ప్రియాసఖీం: ప్రియాయాః సఖీ=ప్రియాసఖీ, తాం=ప్రియాసఖీమ్.

భావము ;

నలుడు దమయన్తిని ముద్దిడుకొనిన పిదప, కలయను, ప్రియురాలి
చెలికత్తెను, పరిహాసకేళినిఁ జూచుదానినిగాఁ జేయుటకుఁ జేతితోఁ బిలచి యెదుటఁ
గూర్చుండఁ బెట్టి పలికెను. ॥26॥

శ్లో. కస్మాదస్మాకమబ్జాస్యా వయస్యా దయతే న వః ।
ఆసక్తా భవతీష్వన్యం మన్యే న బహుమన్యతే ॥ 27

ప. వి. కస్మాత్ - అస్మాకమ్ - అబ్జాస్యా - వయస్యా - దయతే - న -వః-
ఆసక్తా - భవతీషు - అన్యం - మన్యే - న బహు - మన్యతే-

అర్థము. హే కలే=ఓ కలా! అబ్జాస్యా=పద్మముఖియగు, వః=మీయొక్క,
వయస్యా=చెలికత్తె, కస్మాత్=ఎందువలన. అస్మాకం=నన్ను,

నదయతే = దయపెట్టదు. మన్యే = నేను ఆలోచించుచున్నాను. భవతీషు = మీయెడ, ఆసక్తా = అనురాగము గల్గినదై, అన్యం = మఱియొకని, న బహుమన్యతే = ఆదరించుటలేదు.

సమాసములు ;

అబ్జాస్యా : అబ్జమివ ఆస్యం యస్యాస్సా = అబ్జాస్యా.

భావము ;

ఓ కలా! తమ్మిమోముగల మీ చెలికత్తెయగు నీ దమయన్తి యెందువలన నాయెడ దయఁజూపదు! మీయెడ ననురక్తురాలై మఱియొకని నాదరించుటలేదు.

శ్లో. అన్వగ్రాహి మయా ప్రేయా న్నిశి స్వోపనయాదితి।
న విప్రలభతే తావదాలీ రియమలీకవాక్॥ 28

ప. వి. అన్వగ్రాహి - మయా - ప్రేయాన్ - నిశి - స్వోపనయాత్ - ఇతి - న - విప్రలభతే - తావత్ - ఆలీః - ఇయం - అలీకవాక్.

అర్థము. మయా = నాచే ననగా దమయన్తిచే, నిశి = రాత్రియందు, స్వోపనయాత్; స్వ = తన్ను, ఉపనయాత్ = సమర్పించుటవలన ననగాఁ దన శరీరమును దానము చేయుటవలన, ప్రేయాన్ = మిక్కిలి ప్రియుఁడైన నలుఁడు, అన్వగ్రాహి = అనుగ్రహింపఁబడెను, ఇతి = అని, అలీకవాక్ = అసత్యమునుఁ జెప్పునట్టి, ఇయం = ఈ చెలికత్తె, తావత్ = సకలురైన, ఆలీః = చెలికత్తెలను, న విప్రలభతే (కిం) = మోసగించదా యేమి? తప్పక మోసగించును. అందువలన తాను రాత్రి మిక్కిలి ప్రియుఁడగు నలునకై తన దేహము నర్పించితినని చెప్పెడి మాటను నమ్మకుఁడు.

సమాసములు :

ప్రేయాన్ : అత్యంతం ప్రియః = ప్రేయాన్।

స్వోపనయాత్ : స్వస్యాః ఉపనయం = స్వోపనయం, తస్మాత్ = స్వోపనయాత్.

అలీకవాక్ : అలీకం వాచి యస్యాస్సా = అలీకవాక్।

భావము :

దమయన్తినైన నేను రాత్రియందు నాదేహమును సమర్పించి నాకు మిక్కిలి ప్రియుడైన నలునను్రగహించితినని చెప్పెడి యీ ప్రేయసి, చెలికత్తె లగు మిమ్ములనందఱిని ననత్య వచనముచే మోసగించుటలేదా యేమి? తప్పక మోసగించుచున్నదని యాశయము. కాన నామె మాటలు నమ్మఁదగినవికావు. 28

శ్లో. ఆహస్మైషానలాదన్యం నజుషే మనసేతి యత్ ।
యౌవనేనానుమితే నాస్యాస్తన్మృషాఽభూన్మనోభువా॥ 29

ప. వి. ఆహ - స్మ - ఏషా - నలాత్ - అన్యం - న - జుషే - మనసా - ఇతి - యత్ - యౌవనేన - అనుమితేన - అస్యాః - తత్ - మృషా అభూత్ - మనోభువా -

అర్థము. ఏషా = ఈ మీ చెలికత్తెయగు దమయన్తి, నలాత్ = నలుని కంటె, అన్యం = మఱియొక పురుషుని, మనసా (అపి) = మనస్సుచేతను, నజుషే = సేవించను. ఇతి యత్ ఆహస్మ = అని దేనిని చెప్పినదో, అస్యాః = ఈ మీ చెలికత్తె యొక్క, తత్ = ఆమాట, యౌవనాను మితేన; యౌవన = యౌవనముచే, అనుమితేన = ఊహింపఁబడిన, మనో భువా = మనస్సునందుద్భవించిన కామునిచే(ననగా- ఏషా మనోభూమతీ- యౌవనవత్త్వాత్; యా యూ యౌవనవతీ సా సా మనోభూమతీ = అని యనుమానముచే విషయీకరింపఁబడిన కామునిచేనని యర్థము) మృషా = అసత్యముగా, అభూత్ = ఆయెను.

వి. నాకంటె నితరుని మనస్సుచేతను సేవింపనని చెప్పి నాకంటె నితరుఁడైన మన్మథుని మనస్సునందు సేవించుట వలన నామాట యసత్యమైనదని

యర్థము. ఇట్లు నిందను నెపముగానించి యీయామె నాయందేయనురక్తురాలని స్తుతించుటచే, నిట వ్యాజస్తుత్యలఙ్కారము.

సమాసములు ;

యౌవనానుమితేన : యౌవనేన అనుమితః = యౌవనానుమితః, తేన = యౌవనానుమితేన।

మనోభువా : మనసి భవతీతి = మనోభూః, తేన = మనోభువా।

భావము ;

మీ చెలికత్తెయగు నీ దమయన్తి నలునికంటె నితరుని మనస్సుచేతను సేవింపనని చెప్పినమాట, యౌవనముచే నామె మన్మథునితోఁ గూడినదని యూహించుటవలన నసత్యమైనది. ఏలయనగా యౌవనమువలన నామె నాకంటె భిన్నుడైన మన్మథుని, సేవించుచున్నదని యనుమాన ప్రమాణముచే సిద్ధించు చున్నది. ఇట్లు నిందించి యామె తనయెడనే యనురక్తురాలని స్తుతిగా నిందను పర్యవసానముఁ జెందునట్లు చెప్పి యామెను నలుడు ప్రశంసించెను.

శ్లో. ఆస్యసౌన్దర్య మేతస్యాః శృణుమో యది భాషసే ।
తద్ధి లజ్జానమన్మౌలేః పరోక్షమధునాఽపి నః ॥ 30

ప.వి. ఆస్య సౌన్దర్యమ్ - ఏతస్యాః - శృణుమః - యది - భాషసే - తత్ - హి - లజ్జానమన్మౌలేః - పరోక్షం - అధునా - అపి - నః.

అర్థము: ( హేకలే = ఓకలా! ) ఏతస్యాః = ఈ నీ చెలికత్తెయొక్క, ఆస్యసౌన్దర్యం = ముఖశోభను గూర్చి, యది భాషసే = వర్ణించితివో; (తదా = అప్పుడు) శృణుమః = మేము వినెదము. ఏమనగా - నామె నీ యొడియందే కూర్చొని యున్నది గదా! కాన మా వలన వినుట యెందులకు? మీకు కనబడుట లేదా యేమి? యని అనినచో చెప్పుచుము- హి = ఏలయనగా, లజ్జానమన్మౌలేః; లజ్జా = సిగ్గుచే, నమత్ = వంగిన, మౌలేః = శిరముగల్గిన, (ఏతస్యాః = ఈ దమయన్తి యొక్క) తత్ =

అముఖశోభ, అధునాఽపి — ఇప్పటికిని అనగా వివాహమునకు తర్వాతఁ గూడ, నః — మాకు, పరోక్షం — నేత్రములకు దూరమైనది. అనగా కానరాదని యర్థము. కాన నీమె లజ్జను వదలి తన ముఖపద్మమును మాకు చూపునట్లు చేయుమని యర్థము.

సమాసములు ;

ఆస్యసౌన్దర్యం : ఆస్యస్య సౌన్దర్యం — ఆస్యసౌన్దర్యం, తత్ — ఆస్య సౌన్దర్యమ్:
లజ్జానమన్మౌలేః : లజ్జయా నమన్మౌలిః యస్యాః సః — లజ్జానమన్మౌలిః, తస్య — లజ్జానమన్మౌలేః:
పరోక్షం: అక్ష్ణోః పరస్తాత్ — పరోక్షమ్:

భావము:

ఓ కలా! ఈమె ముఖ సౌందర్యమును గూర్చి నీవు వర్ణించినచో మేము వినగలము. కాని నా యొడి యందే యున్నప్పుడామెయొక్క ముఖ సౌందర్యమునుఁగూర్చి మావలన వినవలసినయవసర మేమియని ప్రశ్నింపకుము. ఏలయనగా నామె నాయొడి యందున్నను, లజ్జతో ముఖమును వాల్చి యున్నందువలన నిప్పటికిని అనగా వివాహమైన పిమ్మట గూడ నామె ముఖమును మేము చూడ జాలక పోవుట వలన నామె ముఖ సౌందర్యము మాకు నేత్రగోచరము కాలేదు. కాన లజ్జ నీమె వదలి తన ముఖపద్మము నెట్లు చూపగలదో యావిధముగా నీవు చేయవలసినదని యాశయము ॥30॥

శ్లో. పూర్ణయైవ ద్విలోచన్యాస్సైషాలీ రవలోకతే ।
ద్రాగ్దృగన్తాణునా మాన్తు మన్తుమన్తమివేక్షతే ॥ 31

ప.వి. పూర్ణయా - ఏవ - ద్విలోచన్యా - సా - ఏషా - ఆలీః - అవలోకతే - ద్రాక్ - దృగన్తాణునా - మాం - తు - మన్తుమన్తమ్ - ఇవ - ఈక్షతే -

అర్థము: సా = ఆ విధముగా లజ్జచే తలను వాల్చిన, ఏషా = ఈ దమయన్తి, పూర్ణయైవ = సమగ్రమే యైన, ద్విలోచన్యా = రెండు కన్నులచే, ఆలీః = చెలికత్తెలను, అవలోకతే = చూచుచున్నది, మాన్తు = నన్నో, మన్తుమన్తమివ = నేరము గావించిన వానినివలె, ద్రాక్ = క్షణకాలము, దృగన్తాణునా; దృక్ = ఒక నేత్రముయొక్క, అన్త = కటాక్షము యొక్క, అణునా = స్వల్ప భాగముచే, ఈక్షతే = చూచుచున్నది, నేరము చేసిన వానిని జనము అసూయతో కటాక్షలేశముతో నెట్లుచూచునో యట్లు దమయన్తి తన్నుఁజూచుచున్నదని యర్థము.

సమాసములు :

ద్విలోచన్యా : ద్వయోః లోచనయోః, సమాహారః = ద్విలోచనీ, తయా = ద్విలోచన్యా :
దృగన్తాణునా : దృశః అన్తః = దృగన్తః, దృగన్తస్యఅణుః = దృగన్తాణుః, తేన = దృగన్తాణునా.
మన్తుమన్తమ్ ; మన్తుః అస్యఅస్తీతి = మన్తుమాన్, తం = మన్తుమన్తమ్.

భావము :

ఆ విధముగా సిగ్గుచే తలవాల్చిన యీ దమయన్తి రెండు కన్నులతో, సమగ్రముగాఁ జెలికత్తెలనుఁ జూచుచున్నది. నన్నో యపరాధునివలె కటాక్ష లేశముతోఁ జూచుచున్నది. లోకమున జనము నేరము చేసినవానిని జుగుప్సచే, కటాక్షలేశముతో, జూచుటగలదు గదా. ॥81॥

శ్లో. నాఽఽలోకతే యథేదానీం మామియం తేన కల్పయే।
యోఽహం దూత్యేఽనయా దృష్టః సోఽపి వ్యస్మారిషీదృశా॥

ప. వి. న - ఆలోకతే - యథా - ఇదానీం - మామ్ - ఇయం - తే - న - కల్పయే - యః - అహం - దూత్యే - అనయా - దృష్టః - సః - అపి - వ్యస్మారిషి - ఈదృశా -

అర్థము. ఇయం = ఈ దమయన్తి, యథా = ఏ విధముగా, ఇదానీం = ఇప్పుడు, మాం = నలుడైన నన్ను, నాఽఽలోకతే = చూచుటలేదో, తేన = అట్లు చూడకపోవుటచే, కల్పయే = ఇట్లు ఊహించుచు. యత్ = ఏమనగా, యః = ఏ, అహం = నేను, అనగా నలుడను, దూత్యే = ఇంద్రాదులకు దూత్యము చేయుకాలమునందు, అనయా = మీ దమయన్తిచే, దృష్టః = (సమగ్ర దృష్టిగల నేత్రముల జంటచే) చూడఁబడితిని. సోఽపి = అటువంటి, అహం = నేను, ఈదృశా = ఇప్పుడిటువంటి వ్యాపారముచే, మాం = నన్ను, అవశ్యన్త్యా = చూడనటువంటి, అనయా = ఈ దమయన్తిచే, వ్యస్మారిషి = మఱువఁబడితిని. మఱువకయున్నచో నీమె నన్ను పూర్వమువలె నాదరముతో చూచెడిది.

సమాసములు ;

దూత్యే : దూతస్యకర్మ = దూత్యం, తస్మిన్ = దూత్యే।

భావము ;

ఈ దమయన్తి యిప్పుడు నన్నుఁ జూడనందువలన - నింద్రాదులకు దూత్యముఁ జేయునపుడు నన్ను సమగ్రదృష్టిగల నేత్రములతోఁ జూచిన యీమె యిప్పుడిట్టి వ్యవహారముచే నన్ను మఱచిపోయినది. అట్లు కానిచో నీమె ముందు వలె నన్ను సాదరముగా స్మరించెడిది. ॥31॥

శ్లో: రాగం దర్శయతే సైషా వయస్యాః సూనృతాఽమృతైః ।
మమ త్వమితి వక్తుం మాం మానినీ మౌనినీ పునః॥ ॥33

ప.వి. రాగం-దర్శయతే-సా-ఏషా-వయస్యాః-సూనృతామృతైః-మమ-త్వమ్-ఇతి-వక్తుం-మాం-మానినీ-మౌనినీ-పునః।.

అర్థము: సా = అటువంటి, ఏషా = ఈమె, సూనృతామృతైః = సత్యములును ప్రియములునగు వచనములచే, వయస్యాః = చెలికత్తెలనుద్దేశించి, రాగం = మైత్రిని, దర్శయతే = వెల్లడిఁజేయుచున్నది, మానినీ = మానవంతురాలగు నీదమయన్తి, మాం పునః = నన్నో, "త్వం = నీవు, మమ = నాకు సంబంధించిన వాడవు" ఇతి = అని, వక్తుం = చెప్పుటకు, మౌనినీ = మౌనము వహించినదై యున్నది. ఈమె చాల దయ మాలిన దని నిందయు, బిడియము గలదని స్తుతియుఁజేయఁబడినది.

**సమాసములు :**

సూనృతామృతైః సూనృతాన్యేవ, అమృతాని = సూనృతామృతాని, తైః = సూనృతామృతైః।
మానినీ : మానః అస్యాః అస్తీతి = మానినీ,
మౌనినీ: మౌనమస్యాః అస్తీతి = మౌనినీ॥

**భావము :**

అట్టి యీ ప్రియురాలు, సత్యప్రియ వచనములచే, చెలికత్తెలకు మైత్రిని, జూపుచున్నది. వారికి తన రహస్యములనుఁ జెప్పుకొనుచున్నది. కాని మానవతి యగు నీ దమయన్తి, నన్ను "నీవు నాకు సంబంధించినవాడవ"ని చెప్పుటకు మౌనము దాల్చియున్నది. అనగా నొకవిధముగ నీమె నిర్దయురాలనియు, మఱి యొక విధముగ నీమె లజ్జాళువనియు నాశయము. ॥83॥

**శ్లో: కాం నామన్త్రయతే నామ, నామగ్రాహ మియం సఖీ।**
**కలేః నలేతి నాఽస్మాకం స్పృశత్యాహ్వాంతు జిహ్వయా॥ 84**

ప. వి. కాం-న-ఆమన్త్రయతే-నామ-నామగ్రాహమ్-ఇయం-సఖీ-కలే - నల ఏ ఇతి-న-అస్మాకం-స్పృశతి-ఆహ్వాం-తు-జిహ్వయా-

అర్థము: హేకలే = ఓకలా! ఇయం = ఈ, సఖీ = నీ చెలికత్తె, కాంనామ = ఏ - చెలికత్తెను, నామగ్రాహం = పేరును గ్రహించిన, ఆమన్త్రయతే = పిలువదు? అనగా చెలికత్తెలందఱిని పిలుచునని యర్థము, తు = కాని,

అస్మాకీం = మనకు సంబంధించిన, 'నల' ఇతి = నల! యనెడి, ఆహ్వాం = పేరును, జిహ్వాయా(అపి) = నాలుకచేతను, నస్పృశతి = అంటదు. నన్ను పేరుపెట్టి పిలువనపుడు, రహస్య సంభాషణమున కవకాశమే లేదని నిందయు, భర్తనుఁబేరుపెట్టి పిలువకుండుట యుచిత మని స్తుతియు చేయఁబడినవి.

**సమాసములు :**

**నామగ్రాహమ్:** నామ, గృహీత్వా = నామగ్రాహమ్
**అస్మాకీమ్:** అస్మాకమియమస్మాకీ, తాం = అస్మాకీమ్।

**భావము ;**

ఓ కలా! మీ చెలికత్తెయగు దమయన్తి తన చెలికత్తెలతో నెవ్వతెనుఁ బేరుపెట్టి పిలువదు? అనగా నందఱినిఁ బేరుపెట్టియే పిలుచుచున్నది. కాని 'నల' యను నాపేరును మాత్రము నాలుకతో నంటనేయంటదు. ఇఁక నామె నాతో రహస్య సంభాషణ లేవి చేయును? అనగా వాని కవకాశము లేదని యర్థము. రహస్య సంభాషణములఁ జేయదని చెప్పుటవలన దమయన్తికి నిందయు, భర్తనుఁ బేరుపెట్టి పిలువరాదుకాన నట్లు పిలువనందువలన స్తుతియు నేర్పడినవి.॥84॥

**శ్లో: అస్యాః పీనస్తనవ్యాప్తే హృదయేఽస్మాసు నిర్దయే।**
**అవకాశలవోఽప్యస్తి నాత్ర కుత్ర బిభర్తు నః॥ 85**

ప. వి. అస్యాః - పీనస్తనవ్యాప్తే - హృదయే - అస్మాసు - నిర్దయే - అవకాశలవః - అపి - అస్తి - న - అత్ర - కుత్ర - బిభర్తు - నః.

అర్థము: పీనస్తనవ్యాప్తే : పీన = బలసిన, స్తన = స్తనములచే, వ్యాప్తే = సమగ్రముగా నాక్రమింప బడినదియు, అస్మాసు = మాయెడ, నిర్దయే = దయలేనట్టి, అనగా వెలుపలను లోపలను నవకాశలేశముగూడా లేనట్టి, అస్యాః = ఈ దమయన్తియొక్క, హృదయే = వక్షఃస్థలము

నందు, అవకాశలవోపి, అవకాశ = నాయకునికిఁ గావలసిన స్థానము నను, లవోఽపి = లేశముగూడ, నాస్తి = లేదు, (కావుననే) అత్ర = ఈ హృదయమందు, కుత్ర = ఎచ్చట, నః = మమ్ములను ననగా నన్ను, బిభర్తు = ధరించును, ఎచ్చటను ధరింపజాలదని యర్థము. ఎత్తైన స్తనములతో వ్యాపధానమునొందిన హృదయముతోడనే నన్ను ధరించునని యర్థము. నన్ను ధరింపజాలదని చెప్పుటవలన నిందయు, స్తనములు ఎత్తైనవని చెప్పుటవలన స్తుతియుఁజేయఁబడినవి.

**సమాసములు :**

**పీనస్తనవ్యాప్తే :** పీనౌచ తౌ స్తనౌచ = పీనస్తనౌ, పీనస్తనాభ్యాం వ్యాప్తం = పీనస్తనవ్యాప్తం, తస్మిన్ = పీనస్తనవ్యాప్తే।
**నిర్దయే :** నిర్గతా దయా యస్మాత్ తత్ = నిర్దయం, తస్మిన్ = నిర్దయే
**అవకాశలవః :** అవకాశస్య లవః = అవకాశలవః।

**భావము :**

బలువ చనుగవచే సందులేక నిండినదియు, మాయెడ దయలేనిదియునగు, నా దమయన్తి యొక్క హృదయమందు నాయునికికిఁదగిన స్థానమునకు నవకాశము లేశమైనను లేదు. హృదయమును బయట బలుచనుగవ యాక్రమించి యున్నందువలన నవకాశ లేశముగూడ లేదు. అట్లే లోన దయలేనందు వలన నచ్చటగూడ నవకాశము లేదు. ఇట్లామెయొక్క హృదయమునకు వెలుపల గాని లోపలగాని యుండుటకు నాకవకాశము లేశముగూడ లేదు. అనగా నున్నతములగు స్తనములు వక్షఃస్థలమునకు వెలుపలి ప్రదేశము నాక్రమించుటవలన నామె నాలింగనముఁ జేయు సమయమున నామెయొక్క స్తనములపైననే తానుండవలయునని యర్థము. నాపై నామెకు దయలేనందు వలన లోపలగూడ నాకు స్థానము లేదని యర్థము. ఇట్లు దయలేదని చెప్పుట వలన దమయన్తికి నిందయు, నున్నత స్తనములను వర్ణించుటవలన స్తుతియు నేర్పడినవి॥౩౫॥

శ్లో. అధిగత్యే దృగే తస్యా హృదయం మృదుతాముచోః।
ప్రతీమ ఏవ వైముఖ్యం కుచయోర్యుక్త వృత్తయోః॥ 35

ప. వి. అధిగత్య-ఈదృక్-ఏతస్యాః-హృదయం-మృదుతాముచోః-ప్రతీమః-ఏవ-వైముఖ్యం-కుచయోః-యుక్త వృత్తయోః.

అర్థము: ఏతస్యాః = ఈ దమయన్తియొక్క, హృదయం = హృదయము, ఈదృక్ = ఇట్లు కఠినమైన దానినిగా, అధిగత్య (ఇవ) తెలిసికొన్నట్లు, మృదుతాముచోః = మెత్తదనము వదలుచున్నవి (అనగా సంతతి కఠిన హృదయముయొక్క సంపర్కముతో తామునుఁగాఠిన్యమునుఁ బొందు చున్నవో యనునట్లున్న యనగా కఠినమైన వారి విషయమున కాఠిన్యముఁజూపడము నీతిగాన కఠినమైన హృదయము ననుసరించి స్తనములు తాము కఠినములుగా నుండ నేర్చినవని యర్థము) కావుననే యుక్త వృత్తయోః, యుక్త = తగినట్టి, వృత్తయోః = వ్యవహారము గల్గిన, (అనగా కఠినుల విషయమున కఠినముగా నుండుట యుక్తముగదా) పక్షాన్తరమున-యుక్తవృత్తయోః, యుక్త = బంధింపబడి నొండొంటి నంటుకొనినవియు, వృత్తయోః = గుండ్రముగా నున్నవియునగు కుచయోః(అపి) = స్తనములకుఁగూడ, వైముఖ్యమేవ = కఠినమైన హృదయమునుండి వెడముఖమును గల్గియుండుటనే లేదా యుపేక్ష గల్గి యుండుటనే, ప్రతీమః = తెలిసికొనెదము. ఈమెయొక్క దయలేని హృదయమునుండి తన యవయవములగు స్తనములుగూడ విముఖము లైనవి. అనగా మొనలనుఁ ద్రిప్పియుంచుకొనినవి. ఇట్లు తన యవయవములకే వైముఖ్యమునుఁ గల్గించిన యా హృదయమున, వెలుపలనున్న మనకుఁ బ్రవేశింప నెట్లు సాధ్యమగును? అనగా సాధ్యము కాదని యర్థము. లేదా ఆ స్తనములకు నాయెడ వైముఖ్యమే యనగా వ్యతిరేకి భావమే. ఏలయనగా నవి యెత్తుగానుండి కౌగలింపునకు విఘ్నమును కల్గించుచున్నవి. పక్షాన్తరమున క్రొత్తగా నుద్భిన్నమైనందువలన తొడిమెనుఁ గూడఁ దొడగనందువలన మనోహరముగానే యున్నవని యర్థము॥

**సమాసములు :**

**మృదుతాముచోః** : మృదోర్భావః = మృదుతా, మృదుతాముంచతీతి = మృదుతాముచౌ, తయోః = మృదుతాముచోః।
**వైముఖ్యం:** విపరీతం ముఖం యయోస్తౌ = విముఖౌ, విముఖయోర్భావః = వైముఖ్యం, తత్ = వైముఖ్యమ్।
**యుక్తవృత్తయోః** : యుక్తం వృత్తం యయోస్తౌ = యుక్తవృత్తౌ, తయోః = యుక్తవృత్తయోః। పక్షాన్తరమున-యుక్తౌచ తౌ వృత్తౌచ = యుక్తవృత్తౌ, తయోః = యుక్తవృత్తయోః।

**భావము :**

ఈ దమయన్తి హృదయమిట్టి కఠినమైనదా! యని తెలుసుకొనినట్లు, స్తనములు గూడ నట్టి కఠిన హృదయముయొక్క సంపర్కమువలన కఠినములైనవి. అట్లుగాక, కఠినుల విషయమున మెత్తదనమును జూపించినచో "మృదుర్హి పరిభూయతే" యను న్యాయము ననుసరించి చులకన ఏర్పడును గదా! కావుననే యుక్తమైన నడవడిక గల్గినవియైన (యుక్తములును = నొండొంటితోఁ గలసినవై, వృత్తములు = గుండ్రములు నైనవియునగు) స్తనములకును, కఠినమగు నా హృదయము విషయమున వైముఖ్యము- అనగా ముఖములను ననగా కొనలను విపరీతముగా ద్రిప్పుకొని యుండుట. ఏలయనగా స్తనముల కొనలెప్పుడు హృదయమున కభిముఖములు గాక విపరీతముఖములై యుండునుగదా! అట్టి వైముఖ్యమును హృదయ కాఠిన్యమునుఁబట్టి దానిపై నౌదాసీన్యమును వహించుటనుగా దెలిసికొనుచున్నాము. ఈమెయొక్క దయమాలిన హృదయము విషయమునందెప్పుడు దాని కంగభూతములైన స్తనములే, విముఖములైనవో, ఇఁక దాని కంగములు కాక, వెలుపలనున్న మేము దానియందెట్లు ప్రవేశింపగలమని భావము. లేదా వైముఖ్యమనగా నిష్టపడక పెదముఖమును గల్గియుండుట. స్తనములెత్తుగా నుండుటవలనఁ గౌగలించుకొనుటకు సౌకర్యము గల్గియుండకపోవుటయే యీ వైముఖ్యము. పక్షాన్తరమున-అప్పుడే యుద్భిన్నమగుటవలన కొనలేర్పడకపోవుట వలనను తొడిమ కట్టనందువలనను మనోహరమై యుండుట. ॥౩౬॥

శ్లో. ఇతి ముద్రిత కణ్ఠేఽస్మిన్ సోల్లుణ్ఠమభిధాయతామ్।
దమయన్తీ ముఖాధీత స్మితయాఽసౌ తయా జగే. 37

ప. వి. ఇతి-ముద్రితకణ్ఠే-అస్మిన్-సోల్లుణ్ఠమ్-అభిధాయ-తాం-దమయన్తీ ముఖాధీత స్మితయా-అసౌ-తయా-జగే-

అర్థము: అస్మిన్ = ఈ నలమహారాజు, తాం = ఆ కలను, సోల్లుణ్ఠమ్ = పరిహాసముతో, ఇతి = ఇట్లు, అభిధాయ = చెప్పి, ముద్రితకణ్ఠే = నిరోధింపఁబడిన కణ్ఠము గలవాడు కాగా, అనగా పలుకక యుండగా. తయా = కలయను చెలికత్తెచే, దమయన్తీ ముఖాధీతస్మితయా, దమయన్తీ = దమయన్తియొక్క, ముఖ = ముఖమునుండి, అధీత = నేర్పఁబడిన యనగా గ్రహింపఁబడిన, స్మితయా = మందహాసము గల్గినదై, అనగా దమయన్తి నవ్వుచుండగాఁ దానునుఁ నవ్వఁ దొడగినదై అస్మై = ఈ నలునికై, జగే = చెప్పఁబడెను. ''అస్మై'' అను పాఠమునకు బదులు ''అసౌ''యను పాఠము ననుసరించినచో, అసౌ = ఈ నలుఁడు, జగే = చెప్పబోవుమాట చెప్పఁబడెను.

**సమాసములు :**

**ముద్రితకణ్ఠే:** ముద్రితః కణ్ఠః యస్య సః = ముద్రిదకణ్ఠః, తస్మిన్ = ముద్రితకణ్ఠే।

**దమయన్తీ ముఖాధీత స్మితయా:** దమయన్త్యాః ముఖం = దమయన్తీ ముఖం, దమయన్తీ ముఖాదధీతం = దమయన్తీ ముఖాధీతం = దమయన్తీ ముఖాధీతం స్మితం యస్యాస్సా = దమయన్తీ ముఖాధీతస్మితా తయా = దమయన్తీ ముఖాధీత స్మితయా।

**భావము :**

ప్రియుఁడగు నలుఁడు, ఆ కల యను సఖికి పరిహాసముతో నిట్లు చెప్పి యూరకయుండగా, నా కల యను చెలికత్తె దమయన్తి మందహాసముఁ జేయుటనుఁగాంచి తానును మందహాసము చేయుచు నలునిఁగూర్చి చెప్పినది. ॥37॥

శ్లో. భావితేయం త్వయా సాధు నవరాగా ఖలు త్వయి।
చిరన్తనానురాగార్హం వర్తతే నః సఖీః ప్రతి॥ 38

ప. వి. భావితా-ఇయం-త్వయా-సాధు-నవరాగా- ఖలు - త్వయి - చిరన్తనాను రాగార్హం-వర్తతే-నః-సఖీః-ప్రతి-

అర్థము: (హే మహారాజా = ఓ నలమహారాజా!) త్వయా = నీచే, ఇయం = ఈ, సఖీ = చెలికత్తెయగు దమయన్తి, సాధు = చక్కగా, భావితా ఖలు = ఊహింపఁబడినది, (యతః = ఎందువలన) త్వయి = నీయెడ, నవరాగా = నూతనమగు పరిచయమువలన, నూతనమగు ననురాగము గలదై యున్నది. కాన దాని కనుగుణముగా నామె యున్నది. సఖీః = చెలికత్తెలైన, నః ప్రతి తు = మమ్ముల నుద్దేశించియో, చిరన్తనానురాగార్హం: చిరన్తన = ప్రాచీనమైన, అనురాగ = అనురాగమునకు, అర్హం = తగినట్లుగా, వర్తతే = ఉన్నది.

**సమాసములు :**

నవరాగా: నవః అనురాగః యస్యాస్సా = నవరాగా।
చిరన్తనాను రాగార్హం: చిరన్తనశ్చాసౌ అనురాగశ్చ = చిరన్తనానురాగః, చిరన్తనానురాగస్య అర్హం = చిరన్తనానురాగార్హమ్।

**భావము :**

కస్మాదస్మాకమ్-(స.20-శ్లో. 27) శ్లోకమునుండి గావించిన ప్రశ్నకు నుత్తరమిట నొసంగబడుచున్నది. ఓ నలమహారాజా! నీవు దమయన్తిని గూర్చి గావించిన యూహ సరియైనది. ఈమె నీయెడ నూతన పరిచయముచే నూతనానురాగము వహించినది. చెలికత్తెలగు మా విషయమునఁ బాతఁబడిన యనురాగమునకుఁ దగినట్లు వర్తించుచున్నది. మాతో బాల్యమునుండియు స్నేహముండుటవలన మాయెడ సఙ్కోచము లేక యామె వర్తించుచున్నది. నీయెడనో నూతన స్నేహముగాన నట్లు సఙ్కోచముతో వ్యవహరించుచున్నది. కాన నామను నిందించుట తగదని యాశయము. ॥38॥

**శ్లో. స్మరశాస్త్రవిదా సేయం నవోఢా న స్త్వయా సఖీ।**
**కథం సమ్భుజ్యతే బాలా కథమస్మాసు భాషతామ్. 39**

ప. వి. స్మరశాస్త్ర విదా-సా-ఇయం-నవోఢా-నః-త్వయా-సఖీ-కథం - సమ్భు జ్యతే-బాలా-కథమ్-అస్మాసు-భాషతామ్.

అర్థము: నవోఢా; నవ = క్రొత్తగా, ఊఢా = పెండ్లి గావించుకొనఁబడిన, బాలా = బాలయును, ననగా క్రొత్తగా పెండ్లియాడఁబడుటవలన, లజ్జా సంకోచము గలదియును, అట్లే బాలయగుటవలన నేర్పరితనము లేనిది యును, ననగా కామశాస్త్రమునుఁ దెలియనదియును, సా = నీచే నింద మోపఁబడిన, ఇయం = నీ ఎదుటనున్న, నః = మాయొక్క, సఖీ = చెలికత్తెయగు దమయన్తి, స్మరశాస్త్రవిదా = కామశాస్త్రమునుఁదెలిసిన, త్వయా = నీచే, కథం = ఎట్లు, సమ్భుజ్యతే = చక్కగా భోగింపఁ బడును? ఏవిధముగను సంభోగింపఁబడదు. ఈమెకున్న లజ్జయే యన్నింటికిని ప్రతిబంధకమైనది. కథం = ఎట్లు, అస్మాసు = మా సమీపమునందు, భాషతాం = మాట్లాడును. అనగా రాత్రి మీమధ్య జరిగిన విషయమునెట్లు చెప్పగలదు? బాలయగుటవలన సిగ్గుచే మాకు తన విషయములనుఁ జెప్పదని యర్థము. కావున నీమె యసత్య వాక్కుగాదు. మఱియు మనలను వంచించుటలేదు. మఱియుఁగ్రొత్తగా పెండ్లియాడిన వారికుండెడి లజ్జ యీమెకున్నది. కాన కామశాస్త్రమును నేర్చిన నీవు ఈమెనిట్లు నిందెంచుట తగదని యర్థము.

**సమాసములు :**

**స్మరశాస్త్రవిదా:** స్మరస్యశాస్త్రం = స్మరశాస్త్రం, స్మరశాస్త్రం వేత్తీతి = స్మరశాస్త్రవిత్, తేన = స్మరశాస్త్రవిదా।
**నవోఢా:** నవం ఊఢా = నవోఢా।

**భావము :**

"అన్వగ్రాహి" (20-28) యను శ్లోకముచే చేసిన నిందకు, ఉత్తర మీయఁబడు చున్నది- ఈ దమయన్తి నూతనముగా పెండ్లియాడినదిగాన లజ్జను సంకోచమును వహించినది. అట్లే బాలయగుటవలన కామశాస్త్రము తెలియనిది గాన, కామశాస్త్రవేత్తవగు నీచే నెట్లు చక్కగా సంభోగింపబడును? మఱియు రాత్రి జరిగిన విషయములను మాతో నెట్లు చెప్పును? కాన నీమె యసత్యవచన గాదు. మనలను మోసగింపదు. కామశాస్త్రమును నేర్చిన నీవు బాలయగు నీమె యొక్క లజ్జాస్వభావమునుఁదెలిసియు నిట్లు నిందింపఁదగదని యాశయము. 38

**శ్లో. నాఽసత్యవదనం దేవ। త్వాగాయన్తి జగన్తి యమ్।**
**ప్రియా తస్య సరూపా స్యా దన్యథాలాపనా న తే॥ 40**

ప. వి. న- అసత్యవదం- దేవః-త్వా-గాయన్తి-జగన్తి-యం - ప్రియా-తస్య-సరూపా-స్యాత్-అన్యథాలాపనా-న-తే।

అర్థము: హే దేవ = ఓ మహారాజా! జగన్తి = ప్రపంచములు, యం = ఏ, త్వా = నిన్ను న అసత్యవదనం = అసత్యవచనము లేనివానినిగా ననగా సత్యవాదిగా, గాయన్తి = చెప్పుచున్నవి. తస్య = అట్టి సత్యవాదియగు, తే = నీకు, ప్రియా = ప్రియురాలు, సరూపా = అనురూపమై సత్య వాదిని యేయగుచున్నది, అన్యథాలాపనా = అట్లుకాక అసత్యవాదినియే, నైవ = కానేరదు, పక్షాన్తరమున-యం = ఏ, త్వాం = నిన్ను, అసత్య వదనం = అసత్యముఁ జెప్పువానినిగా, నగాయన్తి = చెప్పరా? కాని తప్పక చెప్పెదరు. తస్య = అట్లు అసత్యవాదిగాఁ జెప్పఁబడిన, తే = నీకు, ప్రియా = ప్రియురాలు, సరూపా = అనురూపయైనదేయగును. అతః = ఇందువలన, అన్యథాలాపనా = అసత్యవాదిని, నస్యాత్? = కాదా! అనగా తప్పక యసత్యవాదినియే యగును. ఇట్లు నీవు ఈమెను సంభోగించియు, సంభోగింపలేదని యెట్లు బొంకుచున్నావో, అట్లే యీమెయు, తన్ను నీకు సమర్పింపకపోయినను సమర్పించినట్లు

మాటలాడినది. కాన నిద్దఱు సమానముగా బొంకుచుండుటవలన నీవు దమయన్తిపైఁ జేసిన ధోషారోపణ తగదని భావము. పక్షాన్తరమున- యం = ఏ, త్వా = నిన్ను, నా సత్యవదనం; నాసత్య = అశ్వినీ కుమారులకు వలె, వదనం = ముఖముగల వానినిగా గాయన్తి = చెప్పుచున్నారో, తస్య = అంతటి అందగాడవైన, తే = నీకు, సరూపా = అనురూపమైన సుందరముఖము గలదియే, ప్రియా = ప్రియురాలుగా నుండును. అన్యధాలపనా; అన్యథా = మఱియొక విధమైన అనగా వికృతమైన, లపనా = ముఖముగలది, ప్రియా = ప్రియురాలుగ, న = కానేరదు, యోగ్యమైనది యోగ్యమైనదానితోడనే కలియునుగదా!

**సమాసములు ;**

**నాసత్యవదనం :** నసత్యం = అసత్యం, న అసత్యం = నాసత్యం, నాసత్యం వదనం యస్యసః = నాసత్యవదనః, తం = నాసత్యవదనమ్, పక్షాన్తరమున- నా సత్యయోరివ వదనం యస్య సః = నాసత్యవదనం। తం = నాసత్యవదనం।

**అన్యధాలపనా :** అన్యధాలపనం యస్యాస్సా = అన్యధాలపనా।

**భావము ;**

ఓ మహారాజా! నిన్నుఁ బ్రపంచము సత్యవాదిగాఁ జెప్పుచున్నది. అట్టి సత్యవాదివైన నీకు ప్రియురాలుగూడ యనురూపయై సత్యవాదిగనేయుండును. అసత్యవాదినిగా నుండదు. పక్షాన్తరమున- నిన్ను అసత్యవాదిగా జనులు చెప్పరా! తప్పక చెప్పఁగలరు. అట్టి యసత్యవాదివైన నీకుఁ బ్రియురాలును నను రూపయై యసత్యవాదినిగనే యుండఁగలదు. అందువలన నామె యసత్యభాషిణిగాదా? అనగాఁ దప్పకకాఁగలదు. కాన నీవు ఎట్లు ఈమె ననుభవించియు ననుభవింపలేదని బొంకుచున్నావో, అట్లే యీమెయు తన్ను నీకు సమర్పింపక పోయినను సమర్పించినట్లు బొంకుచున్నది. అందువలన నుభయులు సమానముగా నసత్యమునుఁ జెప్పుటవలన నామె పై నీవు నేరమును మోపుట యుచితము గాదని భావము॥

పశ్చాత్తాపమున నే నిన్ను అశ్వినీకుమారులయొక్క ముఖమువంటి సుందర ముఖముగల వానినిగాఁ జెప్పుచున్నారో, అట్టి నీకు ననురూపయగు ప్రియురాలును నట్టి సుందరముఖిగనే యుండును; కాని మఱియొకవిధముగా వికృతమైన ముఖము గలదిగానుండదు. యోగ్యమైనది, యోగ్యమైన దాని తోడనే కూడును. మీ యిఱువురియొక్క కూడిక తగినదని భావము. ఇట్లు 'అలిపయపలీకవాక్'' (20-28వ) శ్లోకార్థమునకు ఉత్తరమిచ్చినది. ॥40॥

**శ్లో. మనోభూరస్తి చిత్తేఽస్యాః కిన్తుదేవ! త్వమేవ సః।**
**త్వదవస్థితి భూర్యస్మాన్మనః సఖ్యా దివానిశమ్. 41**

ప. వి. మనోభూః - అస్తి - చిత్తే - అస్యాః - కిం - తు - దేవ - త్వం - ఏవ - సః - త్వదవస్థితిభూః - యస్మాత్ - మనః - సఖ్యాః - దివానిశమ్।

అర్థము: దేవ = ఓ రాజా! అస్యాః = ఈ దమయన్తియొక్క, చిత్తే = మనస్సునందు, మనోభూః = మనస్సునందుఁ బుట్టిన మన్మథుడు, అస్తి = ఉన్నాడు, ఇది సత్యము. కిన్తు = కాని, సః = ఆ మన్మథుడు, త్వమేవ = నీవే, యస్మాత్ = ఎందువలన, సఖ్యాః = చెలికత్తెయగు దమయన్తియొక్క, మనః = మనస్సు, దివానిశం = రేయింబవలు, త్వదవస్థితిభూః, త్వత్ = నీయొక్క, అవస్థితి = ఉనికికి, భూః = స్థానమైనది, మనః భూః (ఆశ్రయః) యస్యయను వ్యుత్పత్తి ననుసరించి నీవే మనోభవుఁడనియు, ''మనసి భవతి'' అను వ్యుత్పత్తి ననుసరించి నిన్ను కోరుచున్న యీమెయొక్క కామమునకు నీవే విషయమగుట వలన నీవే యా మన్మథుడవనియుఁ దెలియుటచే రెండు విధములలోను నామెకు, మఱియొక పురుషుని సేవింప నుద్దేశమున్నదని సంశయ లేశమునకు నవకాశములేదని యర్థము.

.. ఇచ్చట నలుఁడు కామార్థమునందుఁ బ్రయోగించిన మనసః భూః (ఉత్పత్తిః) ''యస్య''యను వ్యుత్పత్తి లభ్యమైన 'మనోభూ' పదమును కల, ''మన ఏవ, భూః = వసతి స్థానం యస్య'' యను

వ్యుత్పత్తిచే నలునియందుఁ బ్రయోగించుటవలన, శ్లేష వక్రోక్త్య లఙ్కారము.

**సమాసములు :**

**మనోభూః:** మనః భూః యస్యసః = మనోభూః।
పక్షాన్తరమున-మనసి భవతీతి = మనోభూః లేదా మన ఏవ భూః యస్య సః = మనోభూః।

**త్వదవస్థితి భూః:** తవ అవస్థితిః, త్వదవస్థితేః భూః = త్వదవస్థితిభూః।

**భావము :**

"ఆహస్మ" (20-29) యను శ్లోకమునఁ జెప్పబడిన యంశములకు నిట మూడు శ్లోకములలో నుత్తర మొసంగఁబడుచున్నది. ఓరాజా! ఈ దమయన్తి మనోభవుఁడైన స్మరుఁడున్నాడనుట సత్యమే కాని యాస్మరుఁడు నీవే యగు చున్నావు. ఎలయనగా-నీ చెలికత్తె యగు దమయన్తి యొక్క మనస్సు రేయిం బవలును ననగా నెల్లప్పుడును నీకు నివాసస్థలము. మనఃభూః (ఆశ్రయః) అను వ్యుత్పత్తిచే నీవే మన్మథుడవు. "మనసి భవతీతి" వ్యుత్పత్తి ననుసరించినను, నిన్ను వలచిన యామె యొక్క కామమునకు నీవే విషయముగాన నామెకు మఱి యొక పురుషుని సేవింపఁదలంపును శంకించుటకు స్వల్పమైనయవకాశము గూడ లేదు. ॥41॥

**శ్లో. సత స్తేఽథ సఖీచిత్తే ప్రతిచ్ఛాయా న మన్మథః।**
**త్వయాఽస్య సమరూపత్వ మతనోరన్యథా కథమ్॥ 42**

ప. వి. సతః-తే-అథ-సఖీచిత్తే-ప్రతిచ్ఛాయా-సః-మన్మథః-త్వయా - అస్య-సమరూపత్వం-అతనోః-అన్యథా-కథమ్-

అర్థము: అథ = లేదా, సః = నీవు చెప్పిన'మనోభూ' పదమునకర్థమైన మన్మథః = కాముఁడు, సఖీచిత్తే, సఖీ = చెలికత్తె యగు దమయన్తి

యొక్క చిత్తే = మనస్సునందు, సతః = నివసించుచున్న, తే = నీయొక్కయే అనగా నలునియొక్కయే, ప్రతిచ్ఛాయా = ప్రతిబింబము అన్యథా = ఇట్లుకానిచో, అతనోః = శరీరములేని, అస్య = ఈ మన్మథునికి, త్వయా = నీతో, సమరూపత్వం = సమానమగు నాకారమునుఁ గల్గి యుండుట, కథం = ఎట్లు (భవితుం = అగుటకు, అర్హతి = తగును) ధర్మిలేనపుడు ధర్మముగూడ నుండదు, స్వచ్ఛమైన యద్దమందు ప్రతిబింబించిన ముఖమునకు ధర్మియగు ముఖము లేనిచో నెట్లు స్థితి యుండదో, అట్లే అతి స్వచ్ఛమైన నీ చెలికత్తెయగు దమయన్తి యొక్క మనస్సునందు, నీవు లేనిచో నీప్రతిబింబముగానున్న కామునకు స్థితిలేదు. ఏలయనగా నా కాముఁడు శరీరము లేనివాడు. కాన నీమెకు మఱియొక పురుషుని సేవింపనవసరము లేదని యర్థము.

**సమాసములు :**

**సఖీచిత్తే :** సఖ్యాః చిత్తం = సఖీచిత్తం, తస్మిన్ = సఖీచిత్తే।

**సమరూపత్వాత్ :** సమం రూపం యస్య సః = సమరూపః, సమరూపస్య భావః = సమరూపత్వం, తస్మాత్ = సమరూపత్వాత్।

**అతనోః :** అవిద్యమానా, తనుః యస్య సః = అతనుః, తస్య = అతనోః।

**భావము :**

లేదా నీవు చెప్పిన 'మనోభూ' పదమున కర్థమైన కాముఁడు చెలికత్తెయగు దమయన్తి యొక్క చిత్తమునందు నెలకొనిన నీకు ప్రతిబింబమే. అట్లు కానిచో; శరీరములేని యా మన్మథునకు నీవు సమానరూపమునుఁ గల్గియుండుట యెట్లు సంభవించును? ఏలయనగా శరీరములేని వానికిఁ బ్రతిబింబమెట్లువచ్చును? ధర్మియైన బింబము లేనపుడు ధర్మమగు ప్రతిబింబమెట్లు సంభవించును? స్వచ్ఛమైన యద్దమునఁ గనబడుఁ బ్రతిబిమ్బమైన ముఖమునకు వాస్తవికమైన ముఖమనెడి బింబము లేనిచో నెట్లు సంభవము లేదో; అట్లే యతి స్వచ్ఛమగు

నీచెలికత్తెయైన దమయన్తియొక్క మనస్సునందు నీవులేనిచో నీప్రతిబిమ్బమైన కామునకు శరీరము లేనందువలనఁ బ్రత్యేకముగా స్థితియేలేదు. కాన నీదమయన్తి మఱియొక పురుషుని సేవింపనవసరము లేదని యాశయము ॥42॥

శ్లో. కః స్మరః కస్త్వమత్రేతి సందేహే శోభయోభయోః।
త్వయ్యేవార్థితయా సేయం ధత్తే చిత్తేఽథవా యువామ్॥ 43

ప. వి. కః-స్మరః-కః-త్వమ్-అత్ర-ఇతి-సందేహే - శోభయో - ఉభయోః- త్వయి-ఏవ-అర్థితయా-సా-ఇయం-ధత్తే-చిత్తే-అథవా-యువామ్-

అర్థము: అథవా = లేదా, హేదేవ = ఓప్రభూ, ఉభయోః = ఇరువురైన నీకును మన్మథునకును, శోభయా = సమానమగు సౌందర్యముండుటచే, అత్ర = మీయిరువురి మధ్య, స్మరః = మన్మథుఁడు, కః = ఎవ్వడు? త్వం = నీవు, కః = ఎవ్వడవు? ఇతి = అని, సందేహసతి = సంశయమురాగా, సేయం = ఆ యీ దమయన్తి, త్వయ్యేవ = నీయందే, అర్థితయా = కోరికగల్గి యుండుటచే, చిత్తే = మనస్సునందు, యువాం = నిన్ను, మన్మథుని, ధత్తే = ధరించుచున్నది. నీవును మన్మథుఁడును నొక్కరూపముతోనే యుండుటవలన మీయిద్దఱిలో నీవెవ్వడవు? అని సంశయమురాగా మన్మథుని వదలినచో, నిన్నును వదలవలసి వచ్చుననెడి భయముతో నిన్ను వదలకుండుటకై నిన్నభిలషించుచు నీ దమయన్తి మిమ్ముల నిఱువురినిఁ జిత్తమునందుఁ దాల్చుచున్నది. అదెట్లనగా- రెండు రత్నములలో నేది కృత్రిమము, ఏది వాస్తవికము అని సంశయమురాగా వానిలో దేనిని వదలినను, సత్యరత్నమే వదలిపోవునేమో యను భయముతో, రెంటిని దాల్చినట్లు, నీకొఱకే మన్మథుని చిత్తమున ధరించుచున్నది కాని మన్మథునికై మన్మథుని ధరించుటలేదని యర్థము.

**సమాసములు :**

**అర్థితయా :** అర్థయత ఇతి = అర్థీ, అర్థినః భావః = అర్థితా, తయా = అర్థితయా।

**భావము :**

లేదా ఓనలమహారాజా! నీవును, మన్మథుఁడును సమాన సౌందర్యమునుఁ గల్గియుండుటచే మీ యిరువురి మధ్య నెవ్వడు మన్మథుడు? ఎవ్వడునీవు? అని సందేహమురాగా,నీ దమయన్తి, నిన్నుఁ బడయఁగోరిక గల్గినదిగనుకనే తన మనస్సునందు నిన్ను మన్మథుని వహించి యున్నది. ఏలయనగా మీ యిద్దఱిలో నెవ్వడు నలమహారాజో, యెవ్వడు మన్మథుడో, యామెకుఁ దెలియుటలేదు. మీలో వ్యక్తినిర్ణయములేక యెవ్వనిఁ బరిత్యజించినను ప్రమాదమే యగును. ఏలయనగా-వ్యక్తినిర్ణయము లేనందున ముఖ్యమైన వ్యక్తియే యనగా నలమహారాజువైన నీవే విడువబడవచ్చునుగదా! కావున నిన్ను వీడకుండుటకొఱకే యామె మన్మథుని తన చిత్తమున ధరించుచున్నదిగాని మన్మథుని వలచి వానిని జిత్తమున ధరించుటలేదు ॥43॥

శ్లో. త్వయి న్యస్తస్య చిత్తస్య దురాకర్షత్వ దర్శనాత్।
శఙ్కయా పఙ్కజాక్షీత్వం దృగంశేన స్పృశత్యసౌ॥ 44

ప. వి. త్వయి-న్యస్తస్య-చిత్తస్య-దురాకర్షత్వదర్శనాత్ - శఙ్కయా - పఙ్కజాక్షీ-త్వం-దృగంశేన-స్పృశతి-అసౌ-

అర్థము: పఙ్కజాక్షీ; పఙ్కజ=పద్మములవంటి, అక్షీ=కన్నులుగల్గిన అసౌ=ఈ దమయన్తి, త్వయి=నీయెడ, న్యస్తస్య=ఉంచఁబడిన, చిత్తస్య=మనస్సునకు, దురాకర్షత్వదర్శనాత్, దురాకర్షత్వ=ఆకర్షింప సాధ్యముగాకయుండుట, దర్శనాత్=కనఁబడుటవలన, శఙ్కయా=భీతిచే, త్వాం=నిన్ను, దృగంశేన, దృక్=నేత్రముయొక్క, అంశేన=కొలదిభాగముచే ననగా,కడకంటిచే స్పృశతి=తాకుచున్నది. అనగాఁ జూచుచున్నదని యర్థము. సమగ్రదృష్టితో చూచినచో పద్మమువలె సుందరమగు కనుగవకూడ మనస్సువలె వెనుకకు మఱలింప సాధ్యము కాకపోవుటచే, దానివలె నామెయొక్క కన్నులుగూడ నీయెడ లగ్నమగునను సంశయముచే, కర్ణాన్త విశ్రాన్తమగు నామె యొక్క

నేత్రముయొక్క కొంలది భాగము నీయొద్దనుండి వెనుకకులాగ సాధ్యము కాకపోయినను "సర్వనాశే సముత్పన్నే అర్థం త్యజతి పణ్డితః" యను న్యాయము ననుసరించి విశేషమైన హాని యుండదని యాలోచించి నిన్నామె నిండుకన్నులతోం జూడక, యా కంటియొక్క కొంలది భాగము తోడనే చూచుచున్నది. కాన 'పూర్ణయైవ' (20-31) అను శ్లోకములో చెప్పిన ప్రకారము బూర్ణ దృష్టితో నిన్ను గాంచుటలేదనెడి దూషణము సరికాదు.

**సమాసములు :**

దురాకర్షత్వదర్శనాత్ : దుఃఖేన ఆకృష్టుం శక్యం = దురాకర్షం దురాకర్షస్య భావః = దురాకర్షత్వం, దురాకర్షత్వస్య దర్శనం = దురాకర్షత్వదర్శనం, తస్మాత్ = దురాకర్షత్వ దర్శనాత్।

పఙ్కజాక్షీ : పఙ్కజే ఇవ అక్షిణీ యస్యాస్సా = పఙ్కజాక్షీ।

దృగంశేన : దృశోః అంశః = దృగంశః, తేన = దృగంశేన।

**భావము :**

"పూర్ణయైవ ద్విలోచనస్య" (20-31) యను శ్లోకముచే నామె తన్ను పూర్ణదృష్టిచే చూచుట లేదని నలుండు గావించిన నిందారోపణకు సమాధాన మిట నీయంబడుచున్నది. పద్మములవంటి కన్నులు గల్గిన యా దమయన్తియొక్క చిత్తము నీయందే లగ్నమైనది. దానిని కష్టముతోంగూడ వెనుకకు రప్పించుట యసాధ్యమని భయపడి, నిన్ను రెండు కన్నులతో చూడక కన్నులయొక్క భాగములతో నవగా కడకన్నులతో చూచుచున్నది. అట్లుకాక రెండుకన్నులతోడను నిన్నుంజూచినచో నవిగూడ నీయందే మనస్సువలె నతికిపోయి, మఱలిరాక పోవచ్చును గదా! కర్ణాన్త విశ్రాన్తములగు నామెయొక్క నేత్రములలో కడకన్నులనెడి కొంలదిభాగములు నీ యెడ నతికిపోయినను తక్కిన నేత్రములు తనకు దక్కును. "సర్వనాశే సముత్పన్నే అర్థం త్యజతి పణ్డితః" అను శాస్త్రమునను నేత్రములు రెండును నీలో లగ్నముగావించి, రెంటిని నీయెడనుండి మఱలిరాకుండం జేసి

కొనుట కంటెను, వానిలో నొకభాగము మాత్రము నీలో నతికిపోయినందువలన గొప్ప హాని లేదుగదా! కావున నా దమయన్తి నిన్ను నయనైకదేశములగు కటాక్షములతోఁ జూచినది కాని నిన్ను రెండు కన్నులతోఁ జూడరాదనెడి యుద్దేశముతో నట్లు చేయలేదు. కాన నామె నిందార్హురాలు గానేరదు. ॥44॥

శ్లో. విలోకనాత్ ప్రభృత్యస్యా లగ్న ఏవాసి చక్షుషోః।
స్వేనాఽఽలోకయ శఙ్కా చేత్ ప్రత్యయః పరవాచికః 45

వ. వి. విలోకనాత్ - ప్రభృతి - అస్యాః - లగ్నః - ఏవ - అసి - చక్షుషోః - స్వేన - ఆలోకయ - శఙ్కా - చేత్ - ప్రత్యయః - పరవాచికః।

అర్థము. విలోకనాత్ ప్రభృతి = దూత్యకాలమునందు తొలుత చూచినది మొదలు, అస్యాః = ఈ దమయన్తియొక్క, చక్షుషోః = కన్నులయందు, లగ్న ఏవ = అంటికినవాడవుగనే, అసి = ఉన్నావు. శఙ్కా చేత్ = నా మాట యందు సందేహమున్నచో (తదా = అప్పుడు) స్వేన = స్వయముగా, ఆలోకయ = ఆమె కంట లగ్నుఁడవైతివో లేదో పరీక్షించుకొనుము. పరవాచి = ఇతరుల వచనమునందు, కః ప్రత్యయః = ఏమి శ్రద్ధ! శ్రద్ధఁ జూపరాదని యర్థము. ఎదుటనున్న వస్తువుయొక్క ప్రతిబింబము కంటి పాపయందు నేరుగాఁ గనఁబడును. నలుఁడు పైవిధముగాఁ జూచినచో తన ప్రతిబిమ్బమామెయొక్క కంటిపాపయందు ప్రతిఫలితమై యుండు టనుఁజూచి యందు తాను లగ్నమైయుండుటను నేరుగనే చూచునని ఛలముతో స్వయముగా చూడుమను యర్థమున 'స్వేనాలోకయ' యని చెప్పఁబడినది.

సమాసములు :

పరవాచి : పరస్యవాక్ = పరవాక్, తస్యాం = పరవాచి।

భావము :

దిక్పాలకుల యాదేశము ననుసరించి దూత్యమును నడుపునపుడే నీవు దమయన్తి యొక్క కన్నులలోఁబడియే యున్నావు. నీకు నావంటి యొరులమాట

యందు సందేహమున్నచో నీవు నేరుగా నీ కన్నులతో నామె కన్నులను గాంచి నచో నామె కంటిపాపయందు నీ ప్రతిబింబమునుఁ జూచి యామె కన్నులయందు నీవు లగ్నమైనది కానిది తెలిసికొనగలవని ఛలముతో 'నాఽఽలోకతే' ఇత్యాది శ్లోకముతోఁ జేసిన నిందకు నుత్తరమీయఁబడినది. ॥45॥

శ్లో. పరిరమ్భేఽనయాఽఽ రభ్య కుచకుఙ్కుమ సఙ్క్రమమ్।
త్వయి మే హృదయస్యైవం రాగ ఇత్యుదితైవవాక్॥ 46

ప. వి. పరిరమ్భే - అనయా - ఆరభ్య - కుచకుఙ్కుమ సఙ్క్రమమ్ - త్వయి. మే - హృదయస్య - ఏవం - రాగః - ఇతి - ఉదితా - ఏవ - వాక్.

అర్థము. హే మహారాజ = ఓ నలమహారాజ! అనయా = ఈ చెలికత్తెచే, పరిరమ్భే = గట్టి కౌగలింపు సమయమునందు, కుచకుఙ్కుమ సఙ్క్రమమ్: కుచ = స్తనములపైని, కుఙ్కుమ = కాశ్మీర పుష్పముయొక్క, సఙ్క్రమమ్ = వ్యాప్తిని, ఆరభ్య = ప్రారంభించి, అనగా తన చనుదోయిపైని కుఙ్కుమ పుష్పముయొక్క ఎఱ్ఱఁదనమును నీ హృదయముపై నలదినది మొదలు, త్వయి = నలుఁడవైన నీ విషయమునందు, హృదయస్య = అంతఃకరణమునకు, రాగః = అనురాగము, ఎఱ్ఱదనము, ఏవం = ఇట్లు, అనగా హృదయముపై సఙ్క్రమింపఁజేయబడిన, చనుదోయిపైని కుంకుమపు పూతచే, ఇతి = ఈ, వాక్ = మాట, ఉదితైవ = చెప్పఁబడినదే యైనది. కాన చెలికత్తెల యందే యనురక్తురాలు కాని నాయెడ ననురక్తురాలు కాదనెడి యారోపణ యుక్తము గాదు.

సమాసములు :

కుచకుఙ్కుమ సఙ్క్రమం : కుచయోః కుఙ్కుమం = కుచకుఙ్కుమం, కుచకుఙ్కుమస్య సఙ్క్రమః = కుచకుఙ్కుమ సఙ్క్రమః, తం = కుచకుఙ్కుమ సఙ్క్రమమ్।

భావము :

"రాగం దర్శయతే" (20-33) యను శ్లోకముచేఁజేయఁబడిన యారోపణ కిట నుత్తర మొసఁగఁబడుచున్నది. ఓ నలమహారాజా! ఈ నీ చెలికత్తెను

గట్టిగాఁగౌగలించుకొనినపుడు, ఆమె చనుదోయిపైని కుఙ్కుమ లేపము నీ హృదయమున కతికినది మొదలు, నీ విషయమున నామె హృదయము యొక్క యనురాగము (ఎఱ్ఱఁదనము) ఇట్టిదను మాట నీకుఁ జెప్పఁబడినట్లే యగుచున్నది. కావ నీయెడ ననురాగము (జూపక చెలికత్తెల యెడ ననురాగము జూపుచున్న నను నింద యుక్తమైనది కాదు. ॥46॥

శ్లో. మనసాఽయం భవన్నామ కామసూక్త జపవ్రతీ ।
అక్షసూత్రం సఖీ కణ్ఠ శ్చుమ్బత్యేకావలిచ్ఛలాత్ ॥ 47

వ. వి. మనసా - అయం - భవన్నామ కామ సూక్త జపవ్రతీ - అక్షసూత్రం- సఖీకణ్ఠః - చుమ్బతి - ఏకావలిచ్ఛలాత్ :

అర్థము: అయం = ఈ, సఖీకణ్ఠః = చెలికత్తెయొక్క కణ్ఠము, అనగా దమయన్తి యొక్క కణ్ఠము. మనసా = మనస్సుచే, భవన్నామ కామ సూక్త జపవ్రతీ; భవత్ = నీయొక్క, నామ = పేరనెడి, కామసూక్త = కామముగల్గుటకై మన్మథునిఁ బ్రతిపాదించెడి ప్రధాన మన్త్రమును, జప = జపించుటయందు, వ్రతీ = వ్రతము గల్గినదై (మనస్సుచేతఁజేయు జపము నకు వేయిమడుగులు ఫలము గలదు. లేదా స్త్రీలు భర్త యొక్క పేరునుఁజెప్పరాదు కాన మనస్సు చేత భర్తయొక్క నామమును ధ్యానిం చుటను వ్రతమునుగల్గి నాలుకతో దానినుచ్చరించినదై) ఏకావలిచ్ఛలాత్; ఏకావలి = ఒక్కపేట గల ముత్తెపు సరము యొక్క, ఛలాత్ = మిషవలన, అక్షసూత్రం = జపమాలికను, చుమ్బతి = స్పృశించుచున్నది. ఆమె తన చెలికత్తెలనుఁబేరుబెట్టి పిలుచుట యెప్పుడో యొకప్పుడుండును. కాని నిన్ను పేరుపెట్టి పిలువకపోయినను నీనామమునే యామె మనస్సుతో నిరంతరము జపించుచున్నదని యర్థము.

సమాసములు :

భవన్నామ కామ సూక్త జపవ్రతీ : భవతః నామ = భవన్నామ, కామస్య సూక్తం = కామసూక్తం, భవన్నామైవ కామసూక్తం = భవ

న్నామ కామసూక్తం, భవన్నామ కామసూక్తస్య జపః = భవన్నామ కామసూక్త జపః, భవన్నామ కామసూక్త జపఏవ వ్రతమస్య అస్తీతి =, భవన్నామ కామసూక్త జపవ్రతీ .

అక్షసూత్రం : అక్షాణాం సూత్రం = అక్షసూత్రం, తత్ = అక్ష సూత్రమ్ .

సఖీకణ్ఠః: సఖ్యాః కణ్ఠః = సఖీకణ్ఠః .

ఏకావలిచ్ఛలాత్ : ఏకా ఆవలిః యస్య సః = ఏకావలిః, ఏకావలేః ఛలం = ఏకావలిఛలం, తస్మాత్ = ఏకావలిచ్ఛలాత్ .

**భావము :**

"కాం నామ స్త్రియతే"(20-34) యను శ్లోకములో దమయన్తి తన్నుఁ బేరుపెట్టి పిలుచుట లేదను నారోపణ కిట నుత్తర మీయఁబడుచున్నది- ఈ దమయన్తి యొక్క కణ్ఠనాలము మనస్సుచే నీపేరనెడి కామమన్త్రమును జపించుట యను వ్రతమునుఁ బూని యున్నది, "సాహస్రీ మనసోజపః" యను స్మృతి ననుసరించి నాలుకతోఁజేయు జపము కంటెను మనస్సుతోఁ జేయు జపము వేయి మడుంగులు ఫల మొసంగు చున్నది. లేదా స్త్రీలు తమ భర్తల పేరునుఁ జెప్పరాదు గాన దమయన్తి యొక్క కణ్ఠము మనస్సు చేతనే నీ నామమన్త్రమును జపించు చున్నదని యర్థము. అట్లు నీయొక్క నామమన్త్రమును జపించుట యను వ్రతమును వహించినదై జపించునామములను లెక్కించుటకై యామె కణ్ఠమున ఒక్కపేట గల ముత్యాల హారమును ధరించు నెపమున, జపమాలికను ధరించియున్నది. కాన నామె చెలికత్తెలనే పేరుపెట్టి పిలుచుచు నిన్నుఁబేరుపెట్టి పిలుచుట లేదను నీయారోపణ యుక్తముగాదు. ఆమె చెలికత్తెల నెప్పుడో యొకప్పుడు పేరుతోఁ బిలుచును నిన్ను మనస్సుతో ధ్యానించుచు నీ పేరును నిరంతరమును జపించుచున్నది. ॥47॥

శ్లో. అధ్యాసితే వయస్యాయాః భవతా మహతా హృది ।
స్తనావన్తర సమ్మాన్తౌ నిష్క్రాన్తౌ బ్రూమహే బహిః ॥48

ప. వి. ఆధ్యాసితే - వయస్యాయాః - భవతా - మహతా - హృది - స్తనౌ - అంతః - అసమ్మాన్తౌ - నిష్క్రాన్తౌ - బ్రూమహే - బహిః ।

అర్థము : హే మహారాజ = ఓ నలమహారాజ!, వయస్యాయాః = చెలికత్తె యొక్క, హృది = రొమ్మువైన, మహతా = గొప్పదైన యాకారము గల, భవతా = నీ చేత, అధ్యాసితే సతి = అధిష్ఠింపఁబడగా అనగా సమగ్రముగా నాక్రమింపఁబడగా, స్తనౌ = ఆమె యొక్క చనుదోయి, అంతః = వక్షఃస్థల మధ్యభాగమున, అసమ్మాన్తౌ = పట్టనివై, బహిః = హృదయము యొక్క పైభాగమునకు నిష్క్రాన్తౌ = వెల్వడినవని, బ్రూమహే = చెప్పుచున్నాము.

సమాసములు :

అసమ్మాన్తౌ : న సమ్మాన్తౌ = అసమ్మాన్తౌ .

భావము :

"అస్యాః పీనస్తన వ్యాప్తే (20-85) యను శ్లోకముతో నామె వలుద చనుదోయితో నిండిన యామె వక్షఃస్థలమున తనకు తావులేదనెడి యారో పణకు నుత్తరమీయఁబడుచున్నది. ఓ మహారాజా! ఆ దమయన్తి యొక్క వక్షఃస్థలపు మధ్యదేశమును, భారముతోడను, బృహదాకృతి తోఁడను గూడిన నీవు, నందును విడువక యాక్రమించి యధిష్ఠించినవు డామె యొక్క చనుదోయి లోననిముడక, వెలుపలికి వచ్చినవని మేము భావించుచున్నాము. లోకమునందు బలవన్తుడొక స్థానము నాక్రమించు కొని నపుడు బలహీనుడు వెలుపలికి వచ్చుట సహజము గదా! కాన వలుద చనుగవచే నాక్రమింపఁబడిన నామె వక్షఃస్థలమున నీకు స్థలము లేదను నారోపణ యుక్తము గాదు. ఏల యనగా నామె వక్షఃస్థలము నీవు ఆక్రమించుకొనుటవలన నామె చనుదోయికే యచ్చట తావు లేదని యాశయము. ॥48॥

శ్లో. కుచౌ దోషోజ్ఝితా వస్యాః పీడితౌ వ్రణితౌ త్వయా।
కథం దర్శయతామాస్యం బృహన్తావావృతౌ హ్రియా॥ 49.

వ. వి. కుచౌ - దోషోజ్ఝితౌ అస్యాః - పీడితౌ - వ్రణితౌ - త్వయా - కథం-
దర్శయతాం - ఆస్యం - బృహన్తౌ - ఆవృతౌ - హ్రియా.

అర్థము. బృహన్తౌ = మిక్కిలి బలసినవియు, (మహాశయులును) తథా = అట్లే,
దోషోజ్ఝితౌ: దోష = వదులుతనము మున్నగు దోషములచే, ఉజ్ఝితౌ =
విడువఁబడినవియును, ననగా నతికఠినములును, దోషా = రాత్రియందు
ఉజ్ఝితా = వస్త్రముచే విడువఁబడినవియును నగు, అస్యాః = ఈ దమ
యన్తి యొక్క కుచౌ = చనుదోయి, పీడితౌ = పీడింపఁబడినవిగను
ననగాఁజేతితో మర్దింపఁబడినవిగను(నిష్కారణముగా గష్టపెట్టబడినవారై)
తథా = అట్లే, వ్రణితౌ = గోళ్ళచే గాయపఱుపఁబడినవియు (కత్తిచే
గాయఱుపఁబడినవారై) హ్రియా (ఇవ) = సిగ్గుచేతనే యనునట్లు,
ఆవృతౌ = గుడ్డతోఁగప్పఁబడినవై (గుడ్డతోఁగప్పఁబడినవారై) కథం =
ఎట్లు, ఆస్యం = ముఖమును ననగా చన్నుల మొనలను (ముఖమును).
దర్శయతాం = చూపగలరు? చూపఁజాలరని యర్థము. గొప్పవారు
పరులచే నిష్కారణముగా దూషింపఁబడినను, సిగ్గుఁజెందినవారై ముఖ
మునుఁ జూపరని యర్థము.

సమాసములు ;

దోషోజ్ఝితౌ : దోషైరుజ్ఝితౌ = దోషోజ్ఝితౌ।

భావము ;

"అధిగత్యే దృగేతస్యాః" (20-36) యను శ్లోకముచె నామె యొక్క
కఠినములగు స్తనములు తనకు విముఖములై యున్నవని చేసిన యారోపణకిది
యుత్తరమీయఁబడుచున్నది. ఓరాజా! ఆ దమయన్తియొక్క స్తనములు చాల
పెద్దవి. వదులుగ నుండుట మున్నగు దోషములు లేనివి. ఇట్టి స్తనములను నీవు
చేతితో మర్దించి గోళ్ళతో గాయపఱచితివి. లోకమున నిర్దోషులైన మహాత్ములు,

నిష్కారణముగా నైనను బాధింపఁబడి, కత్తితో గాయపఱుపఁబడినచో, వారు తమ మోమును గుడ్డతోఁ గప్పుకొని, యెట్లు ఇతరులకుఁ జూపఁజాలరో, అట్లే యా స్తనములును గొప్పతనము గల్గి దోషములు లేనివైనను మర్దనాదులచే సిగ్గు పడినవో యనునట్లు తమ చనుమొనలనెడి ముఖమును గుడ్డతోఁ గప్పుకొని యున్నవి. అవి యెట్లు తమ ముఖములను నీకుఁ జూపగలవు? ఏ విధముగనుఁ జూపలేవు. గొప్పవారు నిష్కారణముగ నైనను నొరులచే దూషింపఁబడినచో సిగ్గుచే తమ ముఖములనుఁ జూపరుగదా! కాన నిచ్చట నీ వా స్తనముల నా విధముగా బాధపెట్టినట్టి యపరాధివి. అట్టి నీకుఁ దమ ముఖము నా స్తనములు చూపఁ జాలకయున్నవని యాశయము. ॥49॥

శ్లో. ఇత్యసౌ కలయా సూక్తైః సిక్తః పీయూషవర్షిభిః
ఈదృగేవేతి పప్రచ్ఛ ప్రియామున్నమితాననామ్॥ 50

ప. వి. ఇతి - అసౌ - కలయా - సూక్తైః - సిక్తః - పీయూషవర్షిభిః - ఈదృక్ - ఏవ - ఇతి - పప్రచ్ఛ - ప్రియామ్ - ఉన్నమితాననామ్।

అర్థము. ఇతి = ఇట్లు, కలయా = ప్రియురాలి చెలికత్తెయగు కలచే, పీయూషవర్షిభిః = అమృతమును వర్షించెడి, సూక్తైః = ప్రియ వచనములతో, సిక్తః = తడుపఁబడిన యనగా సంతోషపఱుచఁబడిన. అసౌ = ఈ నల మహారాజు, ఉన్నమితాననాం; ఉన్నమిత = తన చేతులతోఁ బైకెత్తఁ బడిన, ఆననాం = ముఖముగల్గిన. ప్రియాం = ప్రియురాలైన దమయన్తిని, ఈదృగేవ = కలచే చెప్పబడినది యీ విధమే యగునా? అనగా సత్యమేయగునా? ఇతి = అని, పప్రచ్ఛ = అడిగెను.

సమాసములు ;

పీయూషవర్షిభిః : పీయూషం వర్షతీతి = పీయూష వర్షీ, తైః = పీయూషవర్షిభిః।

ఉన్నమితాననాం : ఉన్నమితమాననం యస్యాః సా = ఉన్నమితాననా, తాం = ఉన్నమితాననాం।

భావము :

ఇట్లు దమయన్తికిఁ బ్రియసఖియగు 'కల' చెప్పినట్టి యమృతమును వర్షించు ప్రియవచనములచే, సంతోషపెట్టఁబడిన యా నలమహారాజు; లజ్జచే తలవంచిన దమయన్తి యొక్క ముఖమునుఁ బైకెత్తి; కల చెప్పిన మాటలు, సత్యములగునా! యని ప్రశ్నించెను.

శ్లో. బభౌ చ ప్రేయసీ వక్త్రం పత్యురున్నమయన్ కరః।
చిరేణ లబ్ధ సన్ధాన మరవిన్ద మివేన్దునా॥ 5।

ప. వి. బభౌ - చ - ప్రేయసీవక్త్రం - పత్యుః - ఉన్నమయన్ - కరః- చిరేణ - లబ్ధ సన్ధానం - అరవిన్దం - ఇవ -ఇన్దునా.

అర్థము. ప్రేయసీ వక్త్రం; ప్రేయసీ = మిక్కిలి ప్రియురాలగు దమయన్తి యొక్క, వక్త్రం = ముఖమును, ఉన్నమయన్ = పైకెత్తెడి, పత్యుః = భర్తయొక్క, కరః = చేయి, చిరేణ = చాలకాలము తర్వాత, ఇన్దునా = చంద్రునితో లబ్ధసన్ధానం; లబ్ధ = పొందఁబడిన, సన్ధానం = సహజవైరము శమింపుటచే స్నేహముగల్గిన; అరవిన్దమివ = పద్మమువలె; బభౌ = ప్రకాశించినది.

వి. పద్మమునకు చంద్రునకును నసంభవమగు వైరశాంతి ప్రయుక్తమగు మైత్రినిఁ జెప్పుటవలన నభూతోపమయని దండి. మిక్కిలి యసంభవమగు సంబంధమునుఁ జెప్పుటవలన నతిశయోక్తి ప్రభేదమని తదితరులు.

సమాసములు :

ప్రేయసీవక్త్రం : అత్యన్తం ప్రియా = ప్రేయసీ, ప్రేయస్యాః వక్త్రం = ప్రేయసీ వక్త్రం. తత్ = ప్రేయసీవక్త్రం।
లబ్ధసన్ధానం : లబ్ధం సన్ధానం యేనతత్ = లబ్ధసన్ధానం।

భావము :

పై విధముగాఁ బ్రియురాలి ముఖమునుఁ బైకెత్తెడి నలుని హస్తము చంద్రునితో శాశ్వత వైరముగల్గి చిరకాలమున కావైరము శమించుటచే మైత్రినిఁ బడసిన పద్మమువలె శోభించినది. పద్మమునకును చంద్రునకును శాశ్వత వైరముగదా! పద్మమువంటి యా నలుని హస్తము, చంద్రుని వంటి యా దమయన్తి మోమును బైకెత్తునపుడు పద్మము చంద్రునితోఁ మైత్రినిఁ జేసినట్లు కానవచ్చినదని యాశయము. ॥౭౧॥

శ్లో. హ్రీణా చ స్మయమానా చ నమయన్తీ పునర్ముఖమ్।
దమయన్తీ ముదే పత్యు రత్యుచ్చైరభవత్తదా॥ 52

ప. వి. హ్రీణా - చ - స్మయమానా - చ - నమయన్తీ - పునః - ముఖమ్ - దమయన్తీ - ముదే - పత్యుః - అత్యుచ్చైః - అభవత్ - తదా।

అర్థము. తదా = ఆ కాలమునందు, అనగా నలుడు దమయన్తి మోమును పైఁకెత్తు కాలమునందు, హ్రీణా = సిగ్గువడినదియును, స్మయమానా = మందహాసము గావించునదియును నగు, దమయన్తీ = దమయన్తి, పునః = మరల, ముఖం = మోమును, నమయన్తీ = వంచుచున్నదై, పత్యుః = భర్తయగు నలునకు, అత్యుచ్చైః = మిక్కిలి గొప్పదగు, ముదే = సంతోషమునకై, అభవత్ = కారణమైనది.

సమాసములు ;

అత్యుచ్చైః : అత్యన్తముచ్చైః = అత్యుచ్చైః।

భావము :

నలుడావిధముగా దమయన్తి మోమునుఁ బైకెత్తిన సమయమందు, సిగ్గుఁజెంది, మందహాసము గావించుచున్న యా దమయన్తి మరల తనముఖమును వాల్చుచు, తన ప్రియునకు మిక్కుటమగు నానందమునకుఁ గారణముగా నేర్పడినది. ॥౭౨॥

శ్లో. భూయోఽపి భూపతి స్తస్యాః సఖీమాహస్మ స స్మితమ్ ।
పరిహాస విలాసాయ స్పృహయాలుః సహప్రియః ॥ 53

ప. వి. భూయః - అపి - భూపతిః - తస్యాః – సఖీమ్ - ఆహస్మ - సస్మితమ్ - పరిహాస విలాసాయ - స్పృహయాలుః - సహప్రియః.

అర్థము: సహప్రియః = ప్రియురాలితో కూడిన, భూపతి = నలమహారాజు, పరిహాస విలాసాయ = నర్మకేలులకై, స్పృహయాలుః = కోరిక గల్గిన వాఁడై, భూయోఽపి = మఱలను, తస్యాః = ఆ ప్రియురాలియొక్క, సఖీం = చెలికత్తెయగు కలను, సస్మితం = చిఱునగవుతో, ఆహస్మ = చెప్పెను.

**సమాసములు :**

సస్మితం : స్మితేనసహితం యథాతథా = సస్మితం.

పరిహాస విలాసాయ : పరిహాసస్య విలాసః = పరిహాస విలాసః తస్మై = పరిహాస విలాసాయ.

సహప్రియః : సహప్రియా యస్య సః = సహప్రియః

**భావము :**

ప్రియురాలగు దమయన్తితోఁగూడిన నలమహారాజు, ఆమెతో నర్మకేళి సలిపి, వినోదించుటకై యభిలాష పడినవాడై, మఱల, ప్రియురాలి చెలికత్తె యగు కలకు మందహాస పూర్వకముగాఁ జెప్పఁ దొడగెను. ॥౫౩॥

శ్లో. క్షన్తుం మన్తుం దినస్యాస్య వయస్యేయం వ్యవస్యతాత్ ।
నిశీవ నిపిధాత్వర్థం యదా చరతి నాత్ర నః ॥ 54

ప. వి. క్షన్తుం - మన్తుం - దినస్య - అస్య - వయస్యా - ఇయం - వ్యవస్యతాత్ - నిశి - ఇవ - నిసిధాత్వర్థం - యత్ - ఆచరతి - న - అత్ర - నః.

అర్థము: ఇయం = ఈ, వయస్యా = మీ చెలికత్తె, అస్య = జరుగుచున్న, దినస్య = దినముయొక్క, మన్తుం = అపరాధమును, క్షన్తుం = క్షమించుటకు, వ్యవస్యతాత్ = ప్రవర్తించుచుండుఁగాత. యత్ = ఏలయనగా, నిశీవ = రాత్రియందువలె, అత్ర = ఈ దినమందు, నః = మాయొక్క, నిసిధాత్వర్థం = "నిసి చుమ్బనే" యని నిసిధాతువుయొక్క అర్థమైన చుమ్బనమును (లజ్జయా = సిగ్గుచే), నాచరతి = చేయదు. పగటియందు వెలుతురుండుటవలన చేయదని యర్థము. ఆ పగటియొక్క వెలుతురే దానియొక్క నేరము. ఆ నేరము నీమె క్షమింప నర్హురాలు.

సమాసములు :

నిసిధాత్వర్థం : నిసీతిధాతుః = నిసిధాతుః, నిసిధాతోరర్థః = నిసిధాత్వర్థః, తం = నిసిధాత్వర్థమ్.

భావము :

ఈ మీ చెలికత్తెయగు దమయన్తి రాత్రియందు చుమ్బనముగావించునట్లు పగలునందు వెలుతురుండుటవలన సిగ్గుచే చుమ్బనము గావింపదు. కాన నా పగటియొక్క యపరాధమైన వెలుతురును క్షమించుట యుచితము. ॥54॥

శ్లో. **దినేనాస్యా ముఖస్యేన్దుః సఖా యది తిరస్కృతః ।**
**తత్కృతాః శతపత్త్రాణాం తన్మిత్రాణామపి శ్రియః ॥ 55**

ప. వి. దినేన - అస్యాః - ముఖస్య - ఇన్దుః - సఖా - యది - తిరస్కృతః - తత్కృతాః - శతపత్త్రాణాం - తన్మిత్రాణామ్ - అపి - శ్రియః.

అర్థము: దినేన = పగటిచే, అస్యాః = మీ చెలికత్తెయొక్క, వదనస్య = ముఖమునకు, సఖా = మిత్రుడైన, అనగా సమానుఁడైన, ఇన్దుః = చంద్రుఁడు, యది తిరస్కృతః = సూర్యోదయముచే ప్రకాశము లేనివాడుగాఁజేయఁబడినచో, ననగా పగలు తప్పుచేసినదైనచో, తర్హి = అప్పుడు, తన్మిత్రాణామపి = ఆ ముఖమునకు మిత్రములైన, శతపత్త్రాణాం = పెక్కుపద్మములయొక్క, శ్రియః అపి = శోభలుగూడ ననగా వికాసముచే

నేర్పడిన శోభలుగూడ, తత్కృతాః, తత్ = ఆ పగటిచేతనే, కృతాః = చేయబడినవి. పగలు నీమె ముఖమున కొక్క మిత్రమైన చంద్రునకు అపకారము చేసెనన పెక్కు మిత్రములైన కమలములకు నుపకారము గూడ చేసినది. రాత్రియో, యొక చంద్రునిచే యుపకరించినది. కాన పెక్కండ్ర కుపకరించిన పగటియొక్క యొక యపరాధము లెక్కింపఁ దగినదికాదు. కాన పగటియందును చుమ్బనము యుక్తమే యని యర్థము.

సమాసములు :

తన్మిత్రాణామ్ : తస్య మిత్రాణి = తన్మిత్రాణి, తేషాం = తన్మిత్రాణామ్.

భావము :

పగలు, దమయన్తి మోమునకుఁ జెలికాడైన ననగా సమానమైన చంద్రునిఁ దన కాంతిలో ప్రకాశరహితునిఁగాఁ జేయుటవలన నపరాధియైన దనినచో, నా ముఖమునకే మిత్రములైన యనగా సమానములైన, పెక్కు పద్మములకు నుదయశోభనుఁగల్గించి యుపకారిగూడనగుచున్నది. రాత్రియో యొక చంద్రునికే శోభనుఁగల్గించి యుపకరించుచున్నది. పగలు-అనునది ముఖమునకుఁ బెక్కు మిత్రములైన పద్మములకు నుపకరించినది. ఒక చంద్రునికే యుపకరించినది కాన నీ యొక యపరాధము లెక్కింపఁదగినది కాదని యాశయము. ॥౫౮॥

శ్లో. లజ్జితాని జితాన్యేవ మయి క్రీడితయాఽనయా ।
ప్రత్యావృత్తాని తత్తాని పృచ్ఛ సమ్ప్రతి కం ప్రతి ॥ 59

ప. వి. లజ్జితాని - జితాని - ఏవ - మయి - క్రీడితయా - అనయా - ప్రత్యావృత్తాని - తత్ - తాని - పృచ్ఛ - సమ్ప్రతి - కం - ప్రతి.

అర్థము: క్రీడితయా = రాత్రియందు సంభోగము గావించిన, అనయా = మీ చెలికత్తెయగు దమయన్తిచే, మయి = నా విషయమున, లేదా నా సమీప

మునందు లేదా; పయి = నా వక్షఃస్థలమునందుండి లేచి, క్రీడితయా = విపరీత సంభోగ క్రీడగల్గిన, అనయా = ఈ దమయన్తిచే, లజ్జితాని = సిగ్గులు, జితాన్యేవ = పరిత్యజింపఁబడినవే, స్మ్రతిపునః = ఇప్పుడో, కంప్రతి = ఎవని నుద్దేశించి, తాని = ఆ సిగ్గులు, ప్రత్యావృత్తాని = తిరిగి వచ్చినవి, తత్ = అట్లు తిరిగివచ్చుటకు కారణమును, పృచ్ఛ = అడుగుము. నా విషయమున ముందే సిగ్గును వదలినందు వలన, నేను ఈమె యొక్క సిగ్గునకు నిమిత్తము గానేరను. చెలికత్తెలైన మీ సమీపము నందే, యీమెకు సిగ్గుగల్గినందువలన, మీరే యీమెయొక్క సిగ్గునకు కారణ భూతులగుచున్నారు.

భావము :

లజ్జవలన నీ దమయన్తి పగలు చుమ్బనము చేయుట లేదనుట తగదు. ఏలయనగా- స్వయముగనే సంభోగమునకు దిగిన యీ దమయన్తికి నా విషయము నందుగాని, నా సమీపము నందుగాని సిగ్గులేదు. లేదా నా వక్షఃస్థలము నందుండి విపరీత సంభోగము గావించిన యీమెకు, సిగ్గెప్పుడో తొలఁగి పోయినది. కాన నెవరినిఁజూచి యీమె సిగ్గుపడుచున్నదో తెలిసికొనుము. చెలికత్తెలైన మీ యందఱి సమీపమున సిగ్గుపడుటచే మీరే ఈమె సిగ్గునకు కారణభూతులని భావింతును. ॥56॥

శ్లో, నిశి దష్టాధరాయాఽపి సైషా మహ్యం న రుష్యతి ।
క్వ ఫలం దశతే బిమ్బీలతా కీరాయ కుప్యతి ॥ 57

ప. వి. నిశి - దష్టాధరాయ - అపి - సా - ఏషా - మహ్యం - న - రుష్యతి - క్వ - ఫలం - దశతే - బిమ్బీలతా - కీరాయ - కుప్యతి.

అర్థము: సా = ఆ, ఏషా = ఈ దమయన్తి, నిశి = రాత్రియందు, దష్టాధరాయ; దష్ట = కొఱకఁబడిన, అధరాయ = పెదవిగల్గిన, మహ్యం = నాకై, న రుష్యతి = రోషపడుట లేదు. తథాహి = అది యుక్తమే, బిమ్బీలతా = దొండతీగె, ఫలం = తనపండును, దశతే = కొఱకుచున్న,

కీరాయ=చిలుకకై, క్వ=ఎక్కడ, కుప్యతి=కోపించును? ఎప్పటి
కిని కోపింపదు.

వి. దష్టాధరుఁడగు నలునిఁజూచి దమయన్తి కోపింపదు అనెడి వాక్యార్థమున
కును తన పండును కొఱకుచున్న చిలుకనుఁజూచి దొండతీగె కోపింప
దనెడి వాక్యార్థమునకును బింబ ప్రతిబింబ భావము చెప్పుటవలన
దృష్టాన్తాలఙ్కారము-కొందఱు ఇచ్చట ప్రతివస్తూపమయని చెప్పుదురు.

సమాసములు :

దష్టాధరాయ : దష్టః అధరః యేన సః=దష్టాధరః, తస్మై=దష్టా
ధరాయ.

బిమ్బలతా : బిమ్బేతి లతా=బిమ్బలతా.

భావము :

ఇది మొదలు నాలుగు శ్లోకములతో, నధరదంశనము మున్నగు తన
తప్పులనుఁగడిగి వైచుకొనుచున్నాడు - ఆ యీ దమయన్తి, రాత్రి యధర
దంశనము గావించిన నాకై కోపింపదు. ఇది యుక్తమే - ఏల యనగా దొండ
తీగె తన పండును కొఱకు చున్న చిలుకకై కోపించదు గదా ॥57॥

శ్లో. శృణీపదసుచిహ్నౌ శ్రీశ్చోరితా కుమ్భి కుమ్భయోః ।
పశ్యైతస్యాః కుచాభ్యాం తన్నృపస్తౌ పీడయామి నః ॥ 58

ప. వి. శృణీపదసుచిహ్నౌ - శ్రీః - చోరితా - కుమ్భి కుమ్భయోః - పశ్య -
ఏతస్యాః - కుచాభ్యాం - తత్ - నృపః - తౌ - పీడయామి - న-

అర్థము : ఏతస్యాః= ఈ దమయన్తి యొక్క, కుచాభ్యాం = స్తనములచే,
కుమ్భి కుమ్భయోః, కుమ్భి = ఏనుగుయొక్క, కుమ్భయోః = గణ్డ
స్థలముల యందలి, శృణీపదసుచిహ్నౌ; శృణీ = అంకుశము యొక్క,
పద = గాయపు మచ్చలనెడి, సుచిహ్నౌ = మంచి గుఱ్ఱులు గల్గిన,

శ్రీః = శోభ (సంపద) చోరితా = అపహరింపఁబడినది. పశ్య = చూడుము (అంకుశము వలని గాయపు మచ్చలవలె నఖక్షతముల వలని మచ్చలు కాన నగును) తత్ = అందువలన ననగా అట్లు దొంగతనమనెడి యపరాధము వలన, నృపః = (దొంగతనమునకుఁదగిన శిక్ష విధించు) రాజునైన నేను, తౌ = ఆ, కుచౌ = స్తనములను, న పీడయామి = మర్దింప కుండెదనా యేమి? తప్పక మర్దింతును. దుష్టశిక్షణాధికారము రాజులకే గదా!

సమాసములు :

శృణీపదసుచిహ్నౌ : శృణ్యాః పదాని = శృణీపదాని, శోభనాని చతాని చిహ్నానిచ = సుచిహ్నాని; శృణీ పదాన్యేవ సుచిహ్నాని యస్యాస్తౌ = శృణీపదసుచిహ్నౌ ।
కుభిభ కుమ్భయోః : కుమ్భినః కుమ్భౌ, తయోః = కుమ్భికుమ్భయోః।

భావము :

"కుచౌ దోషోజ్ఝితౌ" (20-49) అను శ్లోకముచే నిరపరాధములగు దమయన్తి యొక్క స్తనములను నీవు మర్దించి గోరులతో గాయపఱచితివనెడి యారోపణ కిఁట సమాధాన మీయఁబడినది. ఆ దమయన్తి యొక్క స్తనములను మర్దించి గాయపఱచుట యుచితమే. ఏల యనగా నవి ఏనుగుల కుమ్భ స్థలముల యందలి యంకుశపు గాయముల యొక్క మచ్చలనెడి రమణీయములగు చిహ్నములతోఁ గూడిన శోభను (సంపదను) అపహరించినవి. ఇట్లు నపహరించుట వలన నవి యపరాధముఁ గావించినవి. ఆ యపరాధమునకు రాజునైన నేను వానిని మర్దించుటచే శిక్షను విధింపవలదా? తప్పక శిక్షను విధింప వలయును. కాన నిర్దోషములైన స్తనములను నేను మర్దించి గాయపఱచితి ననుట యుచితము గాదు. ॥58॥

శ్లో. అధరామృత పానేన మమాఽస్య మపరాధ్యతు ।
మూర్ధ్నా కిమపరాద్ధం యః పదౌ నాప్నోతి చుమ్బితుమ్॥ 59

ప. వి. అధరామృత పానేన - మయా - ఆస్యమ్ - అపరాధ్యతు - మూర్ధ్నా- కిమ్ - అపరాద్ధం - యః - పాదౌ - న - ఆప్నోతి - చుమ్బితుం.

అర్థము : మమ = నాయొక్క, ఆస్యం = ముఖము, అధరామృత = పెదవి యందలి అమృతమును, పానేన = త్రాగుటచే, అపరాధ్యతు = ఇష్టము కాని పనిని జేయుటవలన నేరము చేసినది కానిమ్ము, కావుననే నేరము గావించిన దగుట చేత ఈ ముఖమునకామె శిక్షను విధింప వలయును. కాని, మూర్ధ్నా = నాతలచే, కిమ్ = ఏమి, అపరాద్ధం = నేరము చేయఁ బడినది. యః = ఏ తల, పాదౌ = ఈమె యొక్క పాదములను, చుమ్బితుం = స్పృశించుటకు, నాఽఽప్నోతి = అవకాశమునుఁ బొందుట లేదు. (తత్ = దానికి కారణము, పృచ్ఛ = అడుగుము)

సమాసములు :

అధరామృతపానేన : అధరస్య అమృతం = అధరామృతం, అధరామృతస్య పానం = అధరామృతపానం, తేన = అధరామృతపానేన।

భావము :

ఓకళా! నా నోరు, ఆ దమయన్తియొక్క పెదవియందలి యమృతమునుఁ ద్రాగుటచే, నేరముచేసినదే కానిమ్ము. కాని, నాతల యేమి నేరము గావించినది. ఎందువలననగా, నది యామె పాదములనుఁ దాకుట కవకాశమునుఁ బొందుటలేదు.

శ్లో. అపరాద్ధం భవద్వాణీ శ్రావిణా పృచ్ఛ కిం మయా।
వీణాఽఽహ పరుషం యన్మాం కలకణ్ఠీ చ నిష్ఠురమ్॥ 60

ప. వి. అపరాద్ధం-భవద్వాణీశ్రావిణా-పృచ్ఛ-కిం-మయా-వీణా-ఆహ-పరుషం-యత్-మాం-కలకణ్ఠీ-చ-నిష్ఠురమ్-

అర్థము: యత్ = ఎందువలన, వీణా = వీణయనెడి వాద్యము, మాం = నలుడనైన నన్ను, పరుషం = కఠినముగను, అప్రియమునునగు వాక్యమును, ఆహ = పలుకుచున్నదో, కలకణ్ఠీ చ = కోయిలయు, మాం = నన్ను,

నిష్ఠురం = కఠినముగా (తిరస్కారముతో) ఆహ = పలుకుచున్నదో, తత్ = అందువలన (హే కళే = ఓకళా!) పృచ్ఛ = నీవు నీ చెలికత్తెయగు దమయన్తి నడుగుము. భవద్వాణీశ్రావిణా, భవత్ = దమయన్తివైన నీ యొక్క, వాణీ = వాక్యమును, శ్రావిణా = వినుచున్న, మయా = నలుడనైన నాచే, కిమ్ = ఏమి, అపరాద్ధం = నేరము గావింపబడినది? ఒక్క నేరముఁగూడఁ జేయఁబడలేదని యర్థము. లోకమున కఠినములును, తిరస్కారముతోఁ గూడినవియునగు మాటలను వినిన పిదప దానివలని విసుగునుఁబోగొట్టు కొనుటకై తియ్యని మాటలను వినఁగోరికయేర్పడుట సహజము. ఇప్పుడు వీణావాద్యము యొక్కయు, కోకిలయొక్కయు వచనములు చాల పరుషములు తిరస్కారిస్వభావములు గలవి. వానిని వినిన నాకు విసుగేర్పడినది. దానినిఁ దొలగించు కొనుటకై నీ చెలికత్తెయగు దమయన్తి యొక్క మధురాలాపములను వినఁగోరుచున్న నేను, ఆమెచే నను గ్రహింపబడఁగోరితినని యర్థము.

**సమాసములు :**

భవద్వాణీశ్రావిణా : భవత్యాః వాణీ = భవద్వాణి, భవద్వాణీం శృణోతీతి భవద్వాణీశ్రావీ, తేన = భవద్వాణీ శ్రావిణా।

**భావము :**

వీణ మ్రోగుచున్నను, కోయిల కూయుచున్నను, వాని శబ్దములు నాకు కర్ణకఠోరములై యున్నవి. లేదా-వీణయు, కోయిలయు నన్నెందులకుఁ గఠినముగాను తిరస్కారయుక్తముగను మాటాడుచున్నవి? కావున నీవు చెలికత్తెను ఈ విషయమును గూర్చి అడుగుము. దమయన్తివైన నీ మాటలను వినుచున్న నేను తప్పేమి గావించితిని? వాస్తవములో నేనేమియు తప్పు చేయలేదు. ॥60॥

**శ్లో.** **నేయ మాలిజనే స్వస్య త్వయి విశ్వాస్య భాషతామ్।**
**మమతాఽనుమతాఽస్మాసు పునః ప్రస్మర్యతే కుతః॥ 61**

ప. వి. సా - ఇయం - ఆలిజనే - స్వస్య - త్వయి - విశ్వస్య - భాషతాం-
మమతా - అనుమతా - అస్మాసు - పునః - పరిస్మర్యతే - కుతః.

అర్థము: హే కళే = ఓ కళా! సా = అట్టి, ఇయం = ఈ దమయన్తి, స్వస్య = తనయొక్క, ఆలిజనే = సఖీజనమైన, త్వయి = నీ యందు, విశ్వాస్య = నమ్మకముంచి, భాషతాం = మాట్లాడునుఁగాత, నిన్ను, ఆమె నమ్మి

తప్పక యీ విషయమునుఁ జెప్పనుగాత. (అదేమనగా) అస్మాసు = మా విషయమునందు, అనుమతా = అంగీకరింపఁబడిన, మమతా = మమకారము, అనగా ఆత్మీయభావము, (రాత్రియందు తన కనుకూల విషయము నాచరించుటవలన) కుతః = ఏల, పునః = మఱలనిప్పుడు పరిస్మర్యతే = మఱువఁ బడుచున్నది. రాత్రియంత ఆత్మీయభావముతో మాట్లాడి పగలు మీయెదుట నావంక చూపునుఁ గూడఁ బ్రసరింపఁ జేయక నన్నెట్లీమె మఱచినదో యడుగుమని యర్థము. నాయెడ నాత్మీయ భావమునుఁ జూపనిచో నేనెట్లు జీవింపఁగలనని భావము.

**సమాసము :**

**ఆలిజనే :** ఆలిరేవజనః = ఆలిజనః, తస్మిన్ = ఆలిజనే।

**భావము :**

ఈ దమయన్తి తన చెలికత్తెయైన నీ యెడ నమ్మకముంచి యీ విషయమునుఁ దప్పక చెప్పనుగాత. అదేమనగా - రాత్రి తన కనుకూలభావమునుఁ జూపుటవలన నామె నాయెడ నెంతయో యాత్మీయభావమును నెరపినది. కాని పగటిపూట మీయెదుట నన్నుఁ గన్నెత్తిఁగూడ జూడక దానినెట్లు మఱచినదో? యడుగుము. ॥61॥

**శ్లో. అథోపవదనే భైమ్యాః స్వకర్ణోపనయచ్ఛలాత్।**
**సన్నిధాప్య శ్రుతౌ తస్యా నిజాస్యం సా జగాద తామ్ ॥ 62**

ప. వి. అథ - ఉపవదనే - భైమ్యాః - స్వకర్ణోపనయచ్ఛలాత్ - సన్నిధాప్య- శ్రుతౌ - తస్యాః - నిజాస్యం - సా - జగాద - తామ్-

అర్థము: అథ = రాజవచనమును వినినపిదప, సా = ఆ కల, భైమ్యాః = దమయన్తియొక్క, ఉపవదనే = ముఖమునకు సమీపమున, స్వకర్ణోప నయచ్ఛలాత్, స్వ = తనయొక్క, కర్ణ = చెవిని, ఉపనయ = సమీపమునకుఁ గొనిపోవుట యనెడి, ఛలాత్ = నెపమువలన, తస్యాః = ఆ దమయన్తియొక్క, శ్రుతౌ = చెవియందు, నిజాస్యం = తన

మోమును, సన్నిధాప్య = దగ్గరకుఁజేర్చి, తాం = ఆ దమయన్తినిఁ గూర్చి, జగాద = పలికెను.

**భావము :**

నలమహారాజా విధముగ చెప్పినపిదప చెలికత్తెయగు కళ, దమయన్తి ముఖమునకు సమీపమున తన చెవినిఁజేర్చు నెపముతో, నామెయొక్క చెవి యందు, తన ముఖమునుఁజేర్చి యామెతోఁబలికినది. ॥62॥

**శ్లో. అహో! మయిరహోవృత్తం ధూర్తే! కిమపినాభ్యధాః ।**
**ఆస్స్వసత్యమిమం తత్తే భూపమే వాభిధాపయే ॥ 63**

ప. వి. అహో - మయి - రహోవృత్తం - ధూర్తే - కిమ్ - అపి - న - అభ్యధాః - ఆస్స్వ - సత్యం - ఇమం - తత్ - తే - భూపం - ఏవ - అభిధాపయే -

అర్థము: హే ధూర్తే = ఓ తుంటరిదానా! లేదా ఓసి మోసగత్తా? మయి = మా యెదుట, రహోవృత్తం = రహస్య చేష్టితములగు చుమ్బనాలిఙ్గనాదిక మును, కిమపి = కొంచెమైనను, నాభ్యధాః = చెప్పకయున్నావు, అహో = ఇది ఆశ్చర్యకరము కానిమ్ము, ఆస్స్వ = ఉండుము, ఇమం = ఈ, భూపమేవ = ఈ భూపాలుడైన నలునే, తే = నీయొక్క, తత్ = ఆ, రాత్రి చేష్టితమును, సత్యం = ఉన్నదున్నట్లుగా, అభిధాపయే = చెప్పించెదను. అని చెలికత్తె దమయన్తి ననుచున్నది.

**సమాసములు :**

రహోవృత్తం : రహసివృత్తం = రహోవృత్తం, తత్ = రహోవృత్తమ్।

**భావము :**

మోసగత్తెవైన యో దమయన్తీ! నీవు చెలికత్తెలమైన మాయొద్ద, రాత్రి నీ ప్రియునితో జరుపుకొనిన, చుమ్బనాలిఙ్గనాదిరూపమైన, విషయము నొక్క

దానిని చెప్పకయున్నావు. ఇది చాల యాశ్చర్యకరము. కానిమ్ము. రాత్రి జరిగిన విషయమునంతటిని, జరిగినదానిని జరిగినట్టుగా నలమహారాజు చేతనే చెప్పింపఁగలను. ॥౮౩॥

శ్లో. **స్మరశాస్త్ర మధీయానా శిక్షితాఽసిమయైవయమ్।**
**అగోపి సోఽపి కృత్వా కిం దామ్పత్యవ్యత్యయ స్త్వయా॥ ౮౪**

ప. వి. స్మరశాస్త్రమ్ - అధీయానా - శిక్షితా - అసి - మయా - ఏవ-యం- అగోపి - స - అపి - కృత్వా - కిం - దామ్పత్యవ్యత్యయః-త్వయా-

అర్థము: స్మరశాస్త్రం = వాత్స్యాయన మహర్షి రచియించిన కామశాస్త్రమును, అధీయానా = చదువుచు, ననగా నా యొద్ద నభ్యసించుచు (త్వం = నీవు) యం = ఏ దాంపత్యములోని విపరీతస్థితిని, మయైవ = నా చేతనే, శిక్షితా = నేర్పఁబడిన దానవుగా, అసి = అగుచున్నావో, త్వయా = నీచే, సః = నాచే నుపదేశింపఁబడిన, దామ్పత్యవ్యత్యయః, దామ్పత్య = స్వాభావికమగు దామ్పత్య వ్యవహారమునకు, వ్యత్యయః = వైపరీత్యము, అనగా విపరీత సంభోగము అనగా పురుషాయితము, కృత్వాఽపి = చేయఁబడియు, కిం = ఏల, అగోపి = దాచఁబడినది. నీకు నుపదేశించిన నాకే నీవిట్లు దాచఁగోరినపుడు నీకు సాధ్యము గాని దేదియును లేదని యర్థము. "లజ్జితాని జితాన్యేవ" ఇత్యాదిగా నలుడు చెప్పిన మాట ననుసరించియే చెలికత్తె చెప్పినదని భావింపవలయును. మిక్కిలి గడుసుతనము నవలంబించి నేను నేర్పిన విపరీత సంభోగమునుఁ గావించియు నా యెదుటనే గావింపలేదని చెప్పుటనుఁ బట్టి నీవు చాల నేర్పరివిగా నున్నావని యర్థము.

**సమాసములు :**

**స్మరశాస్త్రమ్ :** స్మరస్యశాస్త్రం = స్మరశాస్త్రం, తత = స్మరశాస్త్రమ్।
**దామ్పత్య వ్యత్యయః :** జాయాచ పతిశ్చ = దమ్పతీ, దమ్పత్యోః

భావః = దాంపత్యం, దాంపత్యస్య వ్యత్యయః = దాంపత్యవ్యత్యయః।

**భావము :**

ఓ దమయన్తీ! నీవు నాయొద్ద వాత్స్యాయనుని కామశాస్త్రము నభ్యసించుచు నా చేతనే, విపరీత సురతమనెడి విషయమును నేర్పఁబడితివి. అట్టి విపరీత సురతమును గావించియు నీవు దానినేల నా సమీపమునందే దాచితివి? ఆ విద్యను నేర్పిన నాకే నీవు విషయములను దాచఁగోరినపుడు నీవిక నే పనినిఁ జేయఁజాలవు. ॥64॥

**శ్లో. మౌనిన్యామేవ సా తస్యాం తదుక్తీరివ శృణ్వతీ।**
**వాదం వాదం ముహుశ్చక్రే హుం హు మిత్యన్తరాన్తరా॥ 65**

ప. వి. మౌనిన్యాం - ఏవ - సా - తస్యాం - తదుక్తీః - ఇవ - శృణ్వతీ - వాదం వాదం-ముహుః - చక్రే - హుం - హుం - ఇతి - అన్తరా - అన్తరా -

అర్థము: సా = ఆ కల, తస్యాం = ఆ దమయన్తి, మౌనిన్యామేవ = ఊరక యుండగనే, యనగా నేమియుఁజెప్పక యుండగనే, తదుక్తీః, తత్ = ఆ దమయన్తియొక్క, ఉక్తీః = మాటలను, శృణ్వతీవ = వినుచున్నదో యనునట్లు, అన్తరాన్తరా = మధ్యమధ్య, వాదం వాదం = ప్రత్యుత్తరమిచ్చునట్లు, ముహుః = పలుమారులు, హుం హుం ఇతి = అంగీకార సూచకమగు శబ్దమును, చక్రే = చేసినది. పలుమారులు "హుంహుం" అని శబ్దము చేయుటచే, ననగా ఊఁ గొట్టుటచే నామెయొక్క మాటకు నంగీకారమునుఁ జేసినది. ఇందుచే నీమె చాల పరిహాస ప్రియురాలని సూచితము.

**సమాసములు :**

మౌనిన్యాం : మునేః కర్మ = మౌనం, మౌనం అస్యాః అస్తీతి = మౌనినీ, తస్యాం = మౌనిన్యాం।

**భావము :**

ఆ కళ, యా దమయన్తి యేమియు నుత్తరమీయక మౌనము వహించి యుండగా, ఆ దమయన్తి తనతో మాట్లాడుచున్నట్లు నామెయొక్క మాటలను వినుచున్నట్లభినయించుచు, మధ్యమధ్య నామె మాటలకు ప్రత్యుత్తర మిచ్చునట్లు పలుమారు "హుంహుం" అని ఆమె మాటల కంగీకారమును గావించునట్లు వ్యవహరించినది. దీనిచే నా కళయొక్క పరిహాస ప్రియత్వము సూచితము॥౯౫

శ్లో. **అథాసావభిసృత్యాస్యా రతిప్రాగల్భ్య శఙ్కినీ।**
**సఖ్యా లీలామ్బుజాఘాత మనుభూయాలపన్నృపమ్॥** ౯౬

ప. వి. అథ-అసౌ-అభిసృత్య-అస్యాః-రతి ప్రాగల్భ్యశఙ్కినీ - సఖ్యాః - లీలా మ్బుజా ఘాతమ్-అనుభూయ-ఆలపత్-నృపమ్-

అర్థము: అథ = చెప్పఁబడినవిధముగాకళ, భంగులనుఁజూపిన పిదప, అస్యాః = ఈ దమయన్తి యొక్క, రతి ప్రాగల్భ్య శఙ్కినీ, రతి = సురతమందలి, ప్రాగల్భ్య = నేర్పును, శఙ్కినీ = సందేహించుచున్న, అసౌ = కళ, అభిసృత్య = దమయన్తి యొద్దకుఁబోయి, సఖ్యాః = చెలికత్తెయైన దమ యన్తియొక్క, లీలామ్బుజాఘాతం, లీలాంబుజా = హస్తమందలి విలాస పద్మములయొక్క, ఆఘాతం = దెబ్బను, అనుభూయ = అనుభవించి, నృపం = రాజును, ఆలపత్ = పలికినది.

**సమాసములు :**

రతిప్రాగల్భ్య శఙ్కినీ : రతౌ ప్రాగల్భ్యం = రతిప్రాగల్భ్యం, రతి ప్రాగల్భ్యం శఙ్కత ఇతి = రతిప్రాగల్భ్య శఙ్కినీ।
**లీలామ్బుజా ఘాతం :** లీలార్థమమ్బుజాని = లీలామ్బుజాని, లీలామ్బు జానాం ఆఘాతః = లీలామ్బుజాఘాతః, తం = లీలామ్బుజాఘాతమ్।

**భావము :**

పై విధముగా చెప్పఁబడిన భంగులను కళ చేసిన పిదప, సురతక్రీడ

యందు దమయన్తి నేర్పరి యైనదని వివేచించుచు దమయన్తి కడకు వచ్చి యామె వలన లీలాకమలముల దెబ్బలను గ్రహించి రాజునుఁ గూర్చి పలికినది॥ 66

**శ్లో. దృష్టం! దృష్టం! మహారాజ! త్వదర్థాభ్యర్థనా క్రుధా।**
**యత్తాడయతి మామేవం యద్వా తర్జయతి భ్రువా॥ 67**

ప. వి. దృష్టం-దృష్టం-మహారాజ-త్వదర్థాభ్యర్థనాక్రుధా - యత్ - తాడయతి- మాం-ఏవం-యత్-వా-తర్జయతి-భ్రువా.

అర్థము: హే మహారాజ! = ఓ మహారాజా! దృష్టం! దృష్టం! = చూడఁబడినది, చూడఁబడినది, అదేదనగా-త్వదర్థాభ్యర్థనాక్రుధా, త్వదర్థ = నీకొఱకైన అభ్యర్థనా = ప్రార్థనమువలని. క్రుధా = కోపముచే, యత్ = ఎందువలన, మాం = నన్ను, ఏవం = ఈ ప్రకారముగా, తాడయతి = కొట్టుచున్నదో యద్వా = ఎందువలన, భ్రువా = కనుబొమ్మచే, తర్జయతి = బెదిరించు చున్నదో, తత్ = ఆరెండును, దృష్టం ఖలు = చూడఁబడినదిగదా, ఇది యంతయు తానురహస్య వాక్యమును వినుటవలన నేర్పడినదని యర్థము.

**సమాసములు :**

**త్వదర్థాభ్యర్థనాక్రుధా** : తుభ్యం = త్వదర్థం, త్వదర్థమభ్యర్థనా = త్వదర్థాభ్యర్థనా, త్వదర్థాభ్యర్థనాయాం క్రుత్ = త్వదర్థాభ్యర్థనాక్రుత్, తయా = త్వదర్థాభ్యర్థనాక్రుధా!

**భావము :**

ఓమహారాజా! నీయభిలాషను దీర్చుటకైన నా ప్రార్థనపైని కోపముతో, నన్నెట్లు కనుబొమ్మలను విఱచి చూచుచున్నదో యారెంటిని నీవు చూచితివా?॥

**శ్లో. వదత్యచిహ్నా చిహ్నేన త్వయా కేనైష నైషధః।**
**శఙ్కే శక్రః స్వయం కృత్వా మాయామాయాతవానయమ్॥ 68**

ప. వి. వదతి-అచిహ్ని-చిహ్నేన-త్వయా-కేన-ఏషః-నైషధః-శఙ్కే-శక్రః-
స్వయం-కృత్వా-మాయామ్-ఆయాతవాన్-అయమ్-

అర్థము: హేరాజన్ = ఓరాజా! (భైమీ = దమయన్తి, మాం = నన్ను, వదతి = చెప్పుచున్నది) ఏమనగా-హేకలే = ఓకలా! త్వయా = నీచే, ఏషః = ఈ జనము, కేనచిహ్నేన = ఏగుఱ్ఱుచే, నైషధః = నలుఁడు (ఇతి = అని) అచిహ్ని = గుఱ్ఱింపఁబడెను, శఙ్కే = ఇట్లు నేను తలంతును-ఎట్లనగా-అయం = ఇతడు, స్వయం = సాక్షాత్తుగా వచ్చిన, శక్రః = ఇంద్రుడే మాయాం = మాయను, అనగా మాయతో నలవేషము, కృత్వా = చేసి, ఆయాతవాన్ = వచ్చెను.

**సమాసములు :**

నైషధః : నిషధానాం రాజా = నైషధః।

**భావము :**

ఓ రాజా! నీతోటి రతికై నేను యాచింపగా నీ దమయన్తి నాకుఁజెప్పుచున్నది. ఏమనగా - ఓకళా! ఏగుఱ్ఱుచే నలుఁడు నీచే తెలిసికొనబడెను? నేనను కొనెదను-ఇతడు మాయచే నలుని వేషమునుఁబూని సాక్షాత్తుగా వచ్చిన యింద్రుడే, కాన నీవీ పరపురుషునితో రమించుటకు నన్నేలకోరెదవు॥ 68

**శ్లో. స్వర్ణదీస్వర్ణ పద్మిన్యాః పద్మదానం నిదానతామ్।**
**నయతీయం త్వదిన్ద్రిత్వే దివశ్చాగమనం చ తే॥ 69**

ప. వి. స్వర్ణదీస్వర్ణ పద్మిన్యాః-పద్మదానం-నిదానతాం-నయతి-ఇయం-త్వత్ - ఇన్ద్రిత్వే-దివః-చ-ఆగమనం-చ-తే-

అర్థము: కిఞ్చ = మఱియు, హే మహారాజ = ఓ నలమహారాజా! ఇయం = ఈ దమయన్తి, స్వర్ణదీస్వర్ణపద్మిన్యాః; స్వర్ణదీ = ఆకాశగఙ్గయందలి, స్వర్ణ పద్మిన్యాః = పసిడితామరయొక్క, పద్మదానం = పసిడి తమ్మిని, తన

కొసంగుటను, తథా = అస్లే, దివశ్చ = ఆకాశము నుండియు, తే = నీ యొక్క, అగమనం = భూలోకమునకు వచ్చుటను, త్వదిన్ద్రిత్వే = త్వత్ = నీకు, ఇన్ద్రిత్వే = ఇన్ద్రిత్వసంశయమునందు, నిదానతాం = కారణముగానుండుటను, నయతి = పొందించుచున్నది. మానవునికి నాకాశ గఙ్గనుండి పసిడి పద్మమును దెచ్చియిచ్చుటయు, నందుండి భూలోకము నకు వచ్చుటయు సంభవింపవుగదా!

**సమాసములు :**

స్వర్ణదీ స్వర్ణ పద్మిన్యాః : స్వః నదీ = స్వర్ణదీ, స్వర్ణమయీ పద్మినీ = స్వర్ణ పద్మినీ, స్వర్ణద్యాః స్వర్ణ పద్మినీ = స్వర్ణదీ స్వర్ణ పద్మినీ, తస్యాః = స్వర్ణదీ స్వర్ణపద్మిన్యాః।

పద్మదానం : పద్మస్యదానం = పద్మదానం, తత్ = పద్మదానమ్।

నిదానతాం : నిదానయోర్భావః = నిదానతా, తాం = నిదానతామ్।

త్వదిన్ద్రిత్వే : ఇన్ద్రిస్య భావః = ఇన్ద్రిత్వం, తవ ఇన్ద్రిత్వం = తదిన్ద్రిత్వమ్, తస్మిన్ = త్వదిన్ద్రిత్వే.

**భావము :**

ఓ మహారాజా! ఆమెకు నీవు ఇంద్రుడవనెడి సందేహము గల్గుటకు నీవు ఆకాశగంగనుండి పసిడి పద్మము నామె కొసంగుటయు, నీవు అంతరిక్షమునుండి దిగివచ్చుటయు మూలకారణములుగా నామె భావించుచున్నది॥ 69 ॥

**శ్లో. భాషతే నైషధచ్ఛాయా మాయాఽమాయిమయా హరేః।**
**ఆహచాహ మహల్యాయాం తస్యాఽఽకర్ణిత దుర్ణయా॥ 70**

ప. వి. భాషతే-నైషధచ్ఛాయా-మాయా-అమాయి-మయా-హరేః-ఆహ-చ-అహం-ఆహల్యాయాం-తస్య-ఆకర్ణితదుర్ణయా.

అర్థము: హే మహారాజ = ఓ మహారాజా! భాషతే = దమయన్తి యింకనుఁ జెప్పు చున్నది. (ఎందుకనగా) కలే = ఓకళా! మయా = నాచే, నైషధ చ్ఛాయా = నలునిరూపమును ధరించిన, హరేః = ఇంద్రునియొక్క, మాయా = మాయ, అమాయి = ఊహింపఁబడినది. (స్వయంవర కాలము నందాయింద్రుడట్టి పనిని చేసియున్నాఁడు కావున) ఆహచ = దీనినిఁగూడఁ జెప్పుచున్నది. అహం = దమయన్తినైన నేను, అహల్యాయాం = అహల్య యనెడి గౌతముని భార్యయందు, తస్య = ఆ యింద్రునియొక్క, ఆక ర్ణిత = పురాణాదులయందు వినఁబడిన, దుర్ణయా = అవినీతిని గల్గిన దాననై (మాయతో గౌతమ మహర్షియొక్క యాకారముధరించి యాతని భార్యయగు నహల్యయొక్క సతీత్వమునుఁబాడుచేసిన యవినీతినిఁదెలుసు కొనిన దాననుగా) అస్మి = అగుచున్నాను. ఆ యింద్రునికి పరదారల పొందువలని భయము గూడ లేనందువలన నిప్పుడుగూడ నతడు నల రూపమును ధరించి వచ్చుట యసంభవము గాదు.

**సమాసములు :**

నైషధచ్ఛాయా : నిషధానాంరాజా = నైషధః, నైషధస్యఛాయా = నైషధచ్ఛాయా।

**ఆకర్ణిత దుర్ణయా** : ఆకర్ణితః దుర్ణయః యయాసా = ఆకర్ణితదుర్ణయా

**భావము :**

ఓ మహారాజా! దమయన్తి యింకను జెప్పుచున్నది. ఏమనగా-ఓ కళా! ఇతడు నిజమైన నలుడుకాడు. నలరూపము ధరించిన యింద్రునిమాయ. స్వయం వర కాలమందును నాయింద్రుడిట్టి మాయలు పన్నియున్నాఁడు. స్వయంవర కాలమునందు నేను కన్యను గాబట్టి యతడు మాయనుఁబన్నుట దోషముగాదు. ఇప్పుడు నేను పరస్త్రీనిగాన నతడా మాయనిప్పుడు ప్రదర్శింపడని చెప్పవీలులేదు' పురాణములలో నితడు మాయతో గౌతమ మహర్షి రూపమును దాల్చి యాతని భార్యయగు నహల్యతో సంగమించినట్లు చెప్పబడియున్నది. కాన నితనికిఁబరస్త్రీ

సంగమ భీతిలేదు. కాన నితడు నలరూపమును ధరించి వచ్చుట యసంభవము గాదు॥ 70 ॥

**శ్లో. సంభావయతి వైదర్భీ దర్భాగ్రాభమతి స్తవ।**
**జమ్భారిత్వం కరామ్భోజాద్దమ్భోలి పరిరమ్భిణః॥ 71**

ప. వి. సంభావయతి - వైదర్భీ - దర్భాగ్రాభమతిః - తవ - జమ్భారిత్వం- కరామ్భోజాత్ - దమ్భోలిపరిరమ్భిణః.

అర్థము: (కిఞ్చ=మఱియు) దర్భాగ్రాభమతిః, దర్భాగ్ర=దర్భకొనకు, ఆభ=సమానమైన, మతిః=బుద్ధిగల్గిన అనగా సూక్ష్మబుద్ధియైన, వైదర్భీ=దమయన్తి, దమ్భోలి పరిరమ్భిణః; దమ్భోలి=వజ్రాయుధమును వజ్రరేఖను, పరిరమ్భిణః=ధరించిన, వజ్రాయుధమును ధరించిన, వజ్ర చిహ్నమును ధరించిన, కరామ్భోజాత్=హస్తపద్మము వలన, ననగా హస్తపద్మమును గాంచి, తవ=నీకు, జమ్భారిత్వం= ఇంద్రత్వమును, సంభావయతి = తర్కించుచున్నది. ''వజ్రహస్తః పురన్దరః'' యను శ్రుతి ననుసరించియు, నలుని హస్తమునందు వజ్రము మున్నగు నానావిధములగు చక్రవర్తి చిహ్నములుండుట వలననుఁ బైవిధముగా సంభావన యేర్పడుచున్నది.

**సమాసములు :**

**వైదర్భీ :** విదర్భేషు భవా=వైదర్భీ।

**దర్భాగ్రాభమతిః :** దర్భస్య అగ్రం=దర్భాగ్రం, దర్భాగ్రస్య ఆభేవ యస్యాస్సా=దర్భాగ్రాభా, దర్భాగ్రాభామతిః యస్యాస్సా=దర్భాగ్రాభమతిః।

**జమ్భారిత్వం :** జమ్భస్య అరిః = జమ్భారిః, జమ్భారేః భావః= జమ్భారిత్వం, తత్=జమ్భారిత్వం।

**కరామ్భోజాత్ :** కరః అమ్భోజమివ=కరామ్భోజం, తస్మాత్ కరామ్భోజాత్।

దమోృలి పరిరమ్భిణః : దమోృలిం పరిరమ్భత ఇతి=దమోృలి పరి రమ్భీ,తస్య=దమోృలి పరిరమ్భిణః।

**భావము :**

కుశాగ్రబుద్ధిగల దమయన్తి, వజ్రాయుధమును ధరించిన (వజ్రరేఖను ధరించిన) హస్తపద్మమునుఁజూచి నీయందు ననగా నలుడవైన నీయందు నింద్రత్వమును ఊహించుచున్నది. "వజ్రహస్తః పురన్దరః" యను శ్రుతి ననుసరించి యింద్రుడు వజ్రహస్తుడు; చక్రవర్తి చిహ్నమైన వజ్రరేఖను హస్తమునందు ధరించుటవలన నలుడును వజ్రహస్తుఁడు. కాన నలునియందు నింద్రత్వ సంభావన సముచితమని యాశయము. ॥71॥

**శ్లో. అనన్యసాక్షికాః సాక్షాత్తద్వ్యాఖ్యాయ రహః క్రియాః।**
**శఙ్కాతఙ్కం నుదైతస్యా యదిత్వం తత్త్వనైషధః॥ 72**

ప. వి.—అనన్యసాక్షికాః - సాక్షాత్ - తత్ - వ్యాఖ్యాయ - రహః క్రియాః - శఙ్కాతఙ్కం - నుద - ఏతస్యాః - యది - త్వం - తత్త్వనైషధః.

అర్థము: త్వం=నీవు, యది తత్త్వనైషధః = సత్యమైన నలుడవైనచో, తత్=అప్పుడు, అనన్యసాక్షికాః=ఇతరులెవ్వరును జూడనటువంటి, రహః క్రియాః=చుమ్బనము ఆలిఙ్గనము మున్నగు రహస్య వ్యాపారములను, సాక్షాత్=ఆమెయొక్క సమక్షమున, వ్యాఖ్యాయ=వివరించి ఏతస్యాః=ఈమెయొక్క, శఙ్కా తఙ్కం; శఙ్కా=సందేహము నకు సంబంధించిన, ఆతఙ్కం=భయమును, నుద=తొలగింపుము. మీకిద్దఱికే తెలియఁదగిన రహస్య వ్యాపారములనునీవు చెప్పినచో నప్పుడీ దమయన్తి నిన్ను నలుడని నిర్ణయించుకొనును. కానిచో, నీయెడ నలత్వబుద్ధి యీామెకు కలుగదు. ॥72॥

**సమాసములు :**

**అనన్యసాక్షికాః :** అన్యేసాక్షిణః యాసాస్తాః = అన్యసాక్షికాః, అన్య సాక్షికాః నభవన్తీతి = అనన్యసాక్షికాః।

**రహఃక్రియాః :** రహసిక్రియాః = రహః క్రియాః।

**శఙ్కాతఙ్కమ్ :** శఙ్కాయాః ఆతఙ్కః = శఙ్కాతఙ్కః, తం = శఙ్కాతఙ్కమ్।

**తత్త్వనైషధః :** తత్త్వం నైషధః = తత్త్వనైషధః।

**భావము :**

ఓ రాజా! నీవు నిజమైన నలుడవైనచో, నితరులెవ్వరుఁ జూడని, మీ యిరువురి యొక్క రహస్య వ్యాపారములైన, చుమ్బనాలిఙ్గనాదులను నామె యెదుట వివరించి యా దమయన్తికి నీవు మాయా నలుఁడవనెడి సందేహమునుఁ దొలగింపుము. ॥72॥

**శ్లో.** **ఇతి తత్స్వప్రయుక్తార్థాం నిహ్నుతీ కృతకైతవాత్।**
**వాచమాకర్ణ్య తద్భావే సంశయాలుః శశంససః॥ 73**

ప. వి. ఇతి - తత్స్వప్రయుక్తార్థాం - నిహ్నుతీకృతకైతవాత్ - వాచం - ఆకర్ణ్య - తద్భావే - సంశయాలుః - శశంస - సః -

అర్థము: ఇతి = ఇట్లు, తత్స్వప్రయుక్తార్థామ్: తత్ = ఆ కలచే, స్వప్రయుక్త = స్వర్గమునుండి వచ్చుట, స్వర్ణ పద్మము నొసంగుట, వజ్రమును ధరించుట మున్నగు వానివలనఁ గల్గిన సందేహమునుఁ దొలగించుటకై, సమయమున, చక్కగాఁ జెప్పఁబడిన వృత్తాన్తముగలదై, ''స్వప్రయుక్తత్వ'' మనెడి పాఠమున, స్వప్రయుక్తత్వ = యుక్తియుక్తమైన ప్రయోగముచే, నిహ్నుతీకృతః = కప్పిపుచ్చఁబడిన యనగా-నవ్వు మున్నగు వికారములేక కప్పిపుచ్చఁబడిన, కైతవాం = కపటముగల్గిన, యనగా వెల్లడింపఁబడని నిగూఢాశయము గల్గిన, వాచం = మాటను,

ఆకర్ణ్య=విని, సః=ఆ నలుఁడు, తద్భావే, తత్=ఆ దమయన్తి యొక్క, భావే=అభిప్రాయమందు, సంశయాలుః=ఈమె నిజముగా నన్ను నింద్రుడని సంశయించి, చుమ్బనము మున్నగు వానిని చేయుట లేదా యని శంకించు చున్నవాడై, శశంస=చెప్పెను. సందేహమును నివారించెడి రహస్య విషయములనుఁ జెప్పెనని యర్థము. దీనిచే కళ యొక్క మాటల నేర్పుచే, రాజు పరాజితుడాయెనని సూచితము.

**సమాసములు ;**

**తత్సుప్రయుక్తార్థాం :** తయా సుప్రయుక్తః=తత్సుప్రయుక్తః, తత్సుప్రయుక్తః అర్థః యస్యాం సా=తత్సుప్రయుక్తార్థా, తాం=సుప్రయుక్తార్థామ్।

**నిహ్నుతీకృత కైతవాత్ :** అనిహ్నుతం నిహ్నుతం సమ్పద్యమానం కృతమ్=నిహ్నుతీకృతమ్, నిహ్నుతీకృతకైతవం యస్యాం సా=నిహ్నుతీకృత కైతవా, తాం=నిహ్నుతీకృతకైతవామ్।

**భావము ;**

ఇట్లు కళ, నలుడు స్వర్గమునుండి వచ్చుట, స్వర్ణపద్మమును దమయన్తి కొసంగుట, వజ్రమును ధరించుట మున్నగు వానిచే నతని యందుఁ గల్గిన మాయేన్ద్రత్వ సంశయమును వారించుటకై సమయమునకుఁ జక్కగా విషయములనుఁ జెప్పినదై, హాస్యములు మున్నగునవి లేక గూఢాభిప్రాయమునుఁ గప్పి పుచ్చుచున్నదై చెప్పుచున్న మాటను నలుడు విని, యీ దమయన్తి సత్యముగనే తన్ను నింద్రుడని సందేహించి చుమ్బనాదుల నిచ్చుట లేదాయని శంకించుచున్న వాడై, దమయన్తియొక్క సందేహమునుఁ దీర్చుటకై తనతో నామె కేర్పడిన రహస్య వ్యాపారములనుఁ జెప్పదొడగెనని యాశయము. ॥73॥

శ్లో. **స్మరసి ఛద్మనిద్రాలుర్మయా నాభౌ శయార్పణాత్।**
**యదానన్దోల్లసల్లోమా పద్మనాభీ భవిష్యసి॥** 74

ప. వి. స్మరసి - ఛద్మనిద్రాలుః - మయా - నాభౌ - శయార్పణాత్ - యత్ - ఆనన్దోల్లసల్లోమా - పద్మనాభీ భవిష్యసి -

అర్థము: హే ప్రియే = ఓ ప్రియురాలా!, ఛద్మనిద్రాలు:, ఛద్మ = కపటముతో నిద్రాలుః = నిద్రించిన నీవు, మయా = నాచేతననగా నలుని చేత, నాభౌ = బొక్కిలియందు, శయార్పణాత్, శయ = చేతిని, అర్పణాత్ = ఉంచుట వలన (కోకముడిని విప్పుటకై యని యర్థము) ఆనన్దోల్లసల్లోమా: ఆనన్ద = సంతోషముతో, ఉల్లసత్ = పైకి నిక్కిన, లోమా = రోమములు గలదానవై యనగా పులకములు గలదానవై, యత్ = ఎందువలన, పద్మనాభీ భవిష్యసి = (పద్మమువంటి నాచేయి బొక్కిలిపై నుండుట వలన) పద్మమును బొక్కిలి యందుఁ గల్గిన దానవగుచున్నావో, (పులకములు, పద్మమునకుండెడి ముండ్లవలె నుండుట వలన హస్తమునకు పద్మత్వము సరిపడినదని యర్థము. పద్మనాభుడనగా విష్ణువు. అతడును శేషశయనమునందు కపటనిద్రనుఁ గల్గియుండును) తత్ = దానిని, స్మరసి = స్మరించుచున్నావుగదా!.

**సమాసములు ;**

**ఛద్మనిద్రాలుః** : ఛద్మనా నిద్రాలుః = ఛద్మనిద్రాలుః।

**శయార్పణాత్** : శయస్య అర్పణం, శయార్పణం, తస్మాత్ = శయార్మణాత్।

**ఆనన్దోల్లసల్లోమా** : ఆనన్దేన ఉల్లసన్తి = ఆనన్దోల్లసన్తి, ఆనన్దోల్లసన్తి లోమాని యస్యాస్సా = ఆనన్దోల్లసల్లోమా।

**పద్మనాభీ భవిష్యసి** : పద్మం నాభీ యస్యాస్సా = పద్మనాభిః, పద్మనాభిః సమ్పద్యమానా భవిష్యసి = పద్మనాభీ భవిష్యసి।

**భావము ;**

ఇది మొదలియిరువది శ్లోకములతో దమయన్తితో నలుని రహస్య చేష్టితములు వర్ణింపఁబడుచున్నవి.

ఓ ప్రియురాలా! కపటనిద్రనుఁ బూనిన నీవు, నలుఁడనైన నేను నీ కోక ముడిని విప్పుటకై, నా చేతిని నీపొక్కిలిపై నుంచుటవలన నానందముతో నీ శరీరమున పులకములు పొడమినవి. మఱియుఁ బద్మమువంటి నాచేయి నీ నాభినిఁదాకి యుండుటవలనను, పద్మమున కుండెడి కంటకములవలె నీ శరీర మందలి పులకము లుండుటవలనను, నీవు పద్మనాభివి కాఁబోవుచుంటివి. ఆ విషయమును నీవు స్మరించుచున్నావా? మఱియు పద్మనాభుడు విష్ణువు కపట నిద్ర గలవాడు. శయనైకాదశి నుండి యుత్థానైకాదశి వరకును నా విష్ణువు నిద్రించునని పురాణవచనము. ॥74॥

**శ్లో. జానాసి హ్రీభయ వ్యగ్రా యన్నవే మన్మథోత్సవే।**
**సామిభుక్తైవ ముక్తాసి మృద్వి! ఖేద భయాన్మయా॥ 75**

ప. వి. జ్ఞానాసి - హ్రీభయవ్యగ్రా - యథో - నవే - మన్మథోత్సవే - సామి భుక్తా - ఏవ - ముక్తా - అసి - మృద్వి - స్వేదభయాత్ - మయా-

అర్థము: హే మృద్వి = ఓ కోమలాఙ్గీ! నవే = నూతనమైన, మన్మథోత్సవే = కామోత్సవమునందు, అనగా ప్రథమ సంభోగమునందు, హ్రీభయవ్యగ్రా:, హ్రీ = సిగ్గుచేతను, భయ = భయముచేతను, వ్యగ్రా = కలతఁజెందిన దానవైన నీవు, ఖేదభయాత్: ఖేద = సంభోగ శ్రమవలనఁ గల్గిన కష్టమువలని, భయాత్ = భయమువలన ననగా కోమలాఙ్గివగుటవలన నాబాధను సహింపఁజాలవనెడి భయముతో, మయా = నాచే, సామి భుక్తైవ; సామి = అర్ధభాగము, భుక్తైవ = అనుభవింపఁబడిన దానివై ముక్తాఽసి = విడువఁబడిన దానవగుచున్నావు. అట్లు చేయనిచో, నీకు సంభోగమందు రుచియేర్పడి యుండెడిది.

రతిరహస్యమునందు -

సహసావాప్యుపక్రాన్తా। కన్యాఖేదమవిన్దత।
భయాచ్చిత్తసముద్వేగం సద్యద్వేషం చ గచ్ఛతి॥
సా ప్రీతియోగమప్రాప్య బలోద్వేగేన దూషితా।
పురుషద్వేషిణీ వాస్యాత్ సుప్రీతావా తతోఽన్యథా॥

ఆ. సంభోగకాలమున ఖేదపఱుచఁబడిన కన్య పురుషుని ద్వేషింప వచ్చును. కాన నట్టితఱి యా కన్యను వదలిపెట్టవలయునని చెప్పఁబడి నది. కాన, తత్ = దానిని, జానాసి = స్మరింతువా?

**సమాసములు :**

హ్రీభయవ్యగ్రా : హ్రీశ్చ, భయం చ = హ్రీభయే, హ్రీభయోః వ్యగ్రా = హ్రీభయవ్యగ్రా।
మన్మథోత్సవే : మన్మథస్య ఉత్సవః = మన్మథోత్సవః. తస్మిన్ = మన్మథోత్సవే।
సామి భుక్తా : సామి, భుక్తా = సామిభుక్తా।
ఖేదభయాత్ : ఖేదాత్ భయం = ఖేదభయం, తస్మాత్ = ఖేదభయాత్

**భావము :**

సుకుమార శరీరముగల యో దమయన్తీ! ప్రథమ సంభోగమునందు సిగ్గుచేతను, భయము చేతను, కలత జెందిన నిన్ను, సురతమువలని శ్రమ నీకుఁ గల్గుననెడి భయముతో, సగపాలు, సంభోగించి, వదలబెట్టితిని. దానిని నీవు స్మరింతువా! ॥ 75 ॥

శ్లో. స్మర జిత్వాఽఽజిమేత స్త్వాం కరే మత్పదధావిని।
అఙ్గులీ యుగయోగేన యదాశ్లిషం ఘనే - జనే॥ 76

ప. వి. స్మర - జిత్వా - ఆజిమ్ - ఏతః - త్వాం - కరే - మత్పదధావిని - అఙ్గులీయుగయోగేన - యత్ - ఆశ్లిషం - ఘనే - జనే॥

అర్థము. హే ప్రియే = ఓ ప్రియురాలా! ఆజిం = యుద్ధమును, జిత్వా = జయించి, త్వాం = నిన్ను, అనగా నీ సమీపమును గుఱించి, ఏతః = వచ్చితిని. కరే = నీయొక్క హస్తము, మత్పదధావిని సతి = నా పాదములనుఁ గడుగుటకు ప్రవర్తింపగా, ననగా నా పాదమునుఁ దాకగనే, ఘనే =

అధికమైన, జనే = జనమునందు, అనగా నన్ను దర్శించుటకై వచ్చిన జనము నందు, అనగా పెక్కు జనులమధ్య, అఙ్గులీయుగ యోగేన, అఙ్గులీయుగ = నా కాలివేళ్ళ జంట యొక్క సంబంధముచే నీ చేతి వ్రేళ్ళ జంటను గట్టిగా జోడించుటచే నవగా నా కాలి వ్రేళ్ళ జంటచే నీ చేతి వ్రేళ్ళనుగట్టిగా నొక్కుటచే, యత్ = ఎందువలన, ఆశ్లిష్టమ్ = కౌగలించు కొంటినో, తత్ = దానిని, స్మర = జ్ఞప్తి పఱచుకొనుము.

సమాసములు :

మత్పదధావిని : మమపదే = మత్పదే, మత్పదే ధావతీతి = మత్పద ధావీ, తస్మిన్ = మత్పదధావిని।
అఙ్గులీయుగ యోగేన : అఙ్గుల్యోః యుగమ్ = అఙ్గులీయుగమ్, అఙ్గులీ యుగస్య యోగః = అఙ్గులీయుగ యోగః, తేన = అఙ్గులీయుగయోగేన।

భావము :

ఓ ప్రియురాలా! యుద్ధమున జయించి నీ యొద్దకు నేను వచ్చితిని. అప్పుడు నీవు నీ హస్తముతో నా పాదములను గడుగుటకు ప్రవర్తింపగా నన్ను దర్శింప వచ్చిన యధికమైన జనుల మధ్యమున నిన్ను గౌగలించుట యుచితము కాదని భావించి నాకాలి వ్రేళ్ళ జంటచే నీ చేతివ్రేళ్ళను జోడించి గట్టిగా నొత్తుటచే నేను నిన్ను కౌగలించుకొనిన విషయమును స్మరించుము. ॥76॥

శ్లో. వేత్థ మానేఽపి మత్త్యాగదూనా త్వం మాఞ్చ తన్మిథః।
మద్దృష్టాఽలిఖ్య పశ్యన్తీ వ్యవధారేఖయాన్తరా॥ 77

ప. వి. వేత్థ - మానే - అపి - మత్త్యాగదూనా - త్వం - మాం - చ - తత్ - మిథః। మద్దృష్టా - అలిఖ్య - పశ్యన్తీ - వ్యవధాః - రేఖయా - అన్తరా.

అర్థము. మానేఽపి = ప్రణయకోపము వచ్చినను, మత్త్యాగదూనా; మత్ = నాయొక్క, త్యాగ = విరహముచే, దూనా = పరితపించుచున్న నీవు,

మిథః = రహస్యమున, స్వం = తన్ను. మాం = నన్ను అనగా నలుని, ఆలిఖ్య = చిత్రమందు వ్రాసి, పశ్యన్తీ = చూచుచున్నదానవై, మద్దృష్టా; మత్ = చిత్రమందలి నాచే, దృష్టా = చూడఁబడినదై, అన్తరా = చిత్రమున, వ్రాయఁబడిన మా యిరువురి మధ్య, రేఖయా = కుంచెతో క్రొత్త గీతను గీయుటచే నవగా నా దర్శనమున కవరోధమును గల్గించుటకని యర్థము. యత్ = ఎందువలన, వ్యవధాః = వ్యవధానమునుఁ గావించితివి. వ్యవధానము గావించి కోపించితివని యర్థము. తత్ = దానిని, వేత్థ = స్మరింతువా!

సమాసములు ;

మత్త్యాగదూనా : మమత్యాగః = మత్త్యాగః, మత్త్యాగేనదూనా = మత్త్యాగదూనా।
మద్దృష్టా : మయాదృష్టా = మద్దృష్టా।

భావము :

ఓ ప్రియురాలా! ప్రణకలహ మందును నా విరహముచే పరితపించుచున్న నీవు రహస్యమున నిన్ను, నలుడనగు నన్ను చిత్తరువున వ్రాసి దానినిఁ జూచుచుండగా, నాచేఁ జూడఁబడినదానవై ; మన యిరువురి చిత్తరువుల మధ్య నా దర్శనము నవరోధించుటకై విరహ సూచకముగా నొక రేఖనుఁ గుంచెతో గీచి మన చిత్రముల కెడము గావించి, నీ కోపమునుఁ బ్రకటించుకొంటివి. దానిని నీవు స్మరించుచున్నావా? ॥77॥

శ్లో. ప్రస్మృతం తత్ త్వయా తావత్ యన్మోహన విమోహితః।
అతృప్తోఽధరపానేషు రసనామపిబం తవ॥ 78

ప.వి. ప్రస్మృతం - తత్ - త్వయా - తావత్ - యత్ - మోహన విమోహితః - అతృప్తః - అధరపానేషు - రసనామ్ - అపిబం - తవ-

అర్థము. హే ప్రియే = ఓ ప్రియురాలా!, మోహన విమోహితః. మోహన = సంభోగమందు విమోహితః = మోహముఁ జెందిన మనస్సు గల్గిన,

అహమ్ = నేను, అధరపానేషు = అధరమును బానము చేయు సమయముల యందును, నవగా చుంబనముల యందును, అతృప్తః = అంతటితో దనివి తీరనివాడనై, యత్ = ఎందువలన, రసనామ్ = నీ నాలుకను, అపిబమ్ = పానము గావించితినో, తత్ = అది, తావత్ = అంతయు, త్వయా = నీచే, ప్రస్మృతమ్ = స్మరింపఁబడినదా!.

సమాసములు :

మోహన విమోహితః : మోహనేన విమోహితః = మోహన విమోహితః।

అతృప్తః : న తృప్తః = అతృప్తః।

అధరపానేషు : అధరస్యపానాని, అధరపానాని. తేషు = అధరపానేషు।

భావము :

సంభోగమునందు మోహముఁ జెందినను. నీ యధరమునుఁ బానము గావించినను తనివిఁ జెందనిఁవాడనై నీ నాలుకను నాస్వాదించితిని దాని నంతటిని, నీవు స్మరించుచున్నావుగదా. ॥78॥

శ్లో. త్వత్కుచార్ద్రి నఖాఙ్కస్య ముద్రామాలిఙ్గనోత్థితామ్।
స్మరేః స్వహృది యత్స్మేరః సఖీం శిల్పం తథా బ్రువమ్॥79॥

ప.వి. త్వత్కుచార్ద్రి నఖాఙ్కస్య - ముద్రామ్ - ఆలిఙ్గనోత్థితామ్ - స్మరేః - స్వహృది - యత్ - స్మేరః - సఖీం - శిల్పం - తథా - అబ్రువమ్-

అర్థము. హే ప్రియే = ఓ ప్రియురాలా!, స్వహృది; స్వ = నలుడనైన నాయొక్క హృది = హృదయమందు, అనగా వక్షఃస్థలమునందు, ఆలిఙ్గనోత్థితామ్ ఆలిఙ్గన = కౌగలింపుచే, ఉత్థితామ్ = సంక్రమించిన, త్వత్కుచార్ద్రి నఖాఙ్కస్య; త్వత్ = నీయొక్క, కుచ = స్తనముల పైన, ఆర్ద్రినఖాఙ్కస్య; ఆర్ద్రి = ఎండని, అనగా నప్పుడే చేసిన, నఖాఙ్కస్య = నఖ

క్షతముయొక్క, ముద్రామ్ = ఎఱ్ఱని గుర్తును, స్మేరః = మందహాసము గావించుచున్న వాఁడవై, సఖీం = నీ చెలికత్తెనుఁగూర్చి, తవ = నీ యొక్క, శిల్పం = చిత్రకారిణియొక్క నైపుణ్యమును, యత్ = దేనిని, అబ్రువమ్ = చెప్పితినో, తత్ = దానిని, స్మరేః = స్మరింతువా ?.

**సమాసము :**

త్వత్కుచార్ద్రనఖాఙ్కస్య: తవకుచౌ = త్వత్కుచౌ, నఖస్యఅఙ్కః = నఖాఙ్కః, ఆర్ద్రశ్చాసౌనఖాఙ్కశ్చ = ఆర్ద్రనఖాఙ్కః, త్వత్కుచయో రార్ద్రనఖాఙ్కః = త్వత్కుచార్ద్రనఖాఙ్కః; తస్య = త్వత్కుచార్ద్ర నఖాఙ్కస్య ।

ఆలిఙ్గనోత్థితామ్ ఆలిఙ్గనేన ఉత్థితా = ఆలిఙ్గనోత్థితా, తాం = ఆలిఙ్గ నోత్థితామ్ ।

స్వహృది : స్వస్యహృత్ = స్వహృక్, తస్మిన్ = స్వహృది ।

**భావము :**

ఓ ప్రియురాలా! నా వక్షఃస్థలమును నీవు ఆలిఙ్గనము గావించుటచే సంక్ర మించినట్టి నీ స్తనములపై నారిపోని నఖక్షతముయొక్క ఎఱ్ఱని గుఱ్ఱును చిఱునగవుతో నీచెలికత్తెకుఁజూపి, నీ శిల్ప నిర్మాణ చాతురినిఁగూర్చి చెప్పితిని. దానిని నీవు స్మరింతువా ?. ॥79॥

శ్లో. త్వయాఽన్యాః క్రీడయన్మధ్యే మధుగోష్ఠిరుషేషితః ।
వేత్సి తాసాం పురోమూర్ధ్నా త్వత్పాదే యత్కిలాన్థలమ్ 80

ప.వి. త్వయా - అన్యాః - క్రీడయన్ - మధ్యే మధుగోష్ఠిరుషా - ఈషితః - వేత్సి - తాసామ్ - పురః - మూర్ధ్నా - త్వత్పాదే - యత్ - కిల - అన్థలమ్ ॥

అర్థము: **మధ్యే మధుగోష్ఠి**=మద్యపాన గోష్ఠియొక్క మధ్య, **అన్యాః**=ఇతరులైన, స్త్రీలను, క్రీడయన్=పరిహాసములతో వినోదపఱచుచున్న నేను, **త్వయం**=నీచే, రుషా=రోషముతో, **ఈక్షితః**=చూడఁబడినవాడనై, తాసాం=వారియొక్క, పురః=ఎదుటనే, **మూర్ధ్నా**=నాతలంచే, **త్వత్పాదే**=నీ పాదమునందు, **అస్ఖలమితి యత్**=పడితిననునదేది గలదో, **తత్**=దానిని, **వేత్స**=స్మరింతువా ? ॥

**సమాసములు:**

మధ్యేమధుగోష్ఠి: మధునః గోష్ఠీ=**మధుగోష్ఠీ**, మధుగోష్ఠ్యాః మధ్యే=మ**ధ్యే**మధుగో**ష్ఠి**.

**భావము;**

మద్యపానగోష్ఠియందు నితరస్త్రీలతో పరిహాసములాడుచున్న నన్ను నీవు రోషముతోఁజూచితివి. అప్పుడా స్త్రీలయెదుట నాతలతో నీ పాదములపైఁబడి నిన్నుఁబ్రసన్నురాలనుఁగావింపఁబ్రయత్నించితివి. దానిని నీవు స్మరింతువా? ॥80॥

శ్లో. **వేత్థ మయ్యాగతే ప్రోష్య యస్యాం పశ్యతి హార్దిని ।**
**అచుమ్బీరాలి మాలిజ్గ్య తస్యాం కేలిముదా కిల॥** 81

**ప.వి.** వేత్థ - మయి - ఆగతె - ప్రోష్య - యస్యాం - పశ్యతి - హార్దిని - **అచుమ్బీః** - **ఆలిమ్** - **ఆలిఙ్గ్య** - తస్యామ్ - **కేలిముదా** - **కిల** -

**అర్థము:** హే ప్రియే=ఓప్రియురాలా!, **హార్దిని !**=ఓ యనురాగముగ**లదానా!** **ప్రోష్య**=గ్రామాన్తరమునకుఁబోయి, ఆగ**తే**=మఱలివచ్చిన, మయి=నలుడనైన నేను, **త్వామ్**=నిన్ను,పశ్యంసతి=చూచుచుండగా,**ఆలిమ్**=చెలికత్తెను, **ఆలిఙ్గ్య**=కౌగలించి, **కేలిముదా**=ఆటలయందలి సం**తోష**ముచే, తస్యామ్=ఆ చెలికత్తెయందు, ననగా నామెయొక్క కపోలము**నందు**, యత్కిం**చ**=చెలికత్తె నాలింగనముగావించుట, ముద్దిడుటకొనుట, యనునెపముతో, **అచుమ్బీః**=నన్ను ముద్దిడుకొంటివి. **తత్**=**దానిని,** **వేత్థ**=స్మరింతువా ?

సమాసములు:

హే హార్దిని: హృదయస్యకర్మ హార్దం = హార్దమస్యాః అస్తీతి = హార్దినీ తస్యాః సంబుద్ధిః = హే హార్దిని !
కేలిముదా: కేలాముత్ = కేలిముత్, తయా = కేలిముదా !

భావము:

ఓ ప్రియురాలా ! ఓ అనురాగిణి ! నేను గ్రామాన్తరమునకు వెళ్ళి తిరిగి వచ్చి నిన్నుఁజూడగనే, నీవు చెలికత్తెనుఁగౌగలించుకొని యాటల యందలి సంతోషముతో నీవు ఆ చెలికత్తెయొక్క చెక్కిళ్ళయందు నామెను ముద్దిడు నెపముతో నన్ను ముద్దిడుకొంటివి. దానిని నీవు స్మరింతువా ?. ॥81॥

శ్లో. జాగర్తి తత్ర సంస్కారః స్వముఖాద్భవదాననే ।
నిక్షిప్యాఽయాచిషం యస్త్వాం న్యాయాత్తాంబూలఫాలికాః॥ 82

ప.వి. జాగర్తి - తత్ర - సంస్కారః - స్వముఖాత్ - భవదాననే - నిక్షిప్య- అయాచిషం - యః - త్వాం - న్యాయాత్ - తాంబూల ఫాలికాః.

అర్థము: హే ప్రియే = ఓప్రియురాలా ! స్వముఖాత్ = నానోటినుండి, భవదాననే = నీముఖమునందు, తామ్బూల ఫాలికాః; తామ్బూల = తామ్బూలము యొక్క, ఫాలికాః = ఖండములను, అనగా వక్కపొడి మున్నగు వానితోఁగూడినదై, నాచే నమలఁబడిన తామ్బూలపు ఖండములను నిక్షిప్య = ఉంచి, త్వాం = నిన్ను "తాః" అను పాఠమున ,తాః = ఆ తామ్బూలపు ఖండములను, న్యాయాత్ = కుదువఁబెట్టిన ద్రవ్యము మరల నిచ్చుట యను ధర్మము ననుసరించి, యత్ అయాచిషమ్ = యాచించితి ననునదేదిగలదో. తత్ర = ఆ యాచనయందలి, సంస్కారః = భావనా జనితమైన స్మృతి విశేషము, జాగర్తి = ఉత్థితమైయున్నదా ?

సమాసములు :

స్వముఖాత్: స్వస్యముఖం = స్వముఖం, తస్మాత్ = స్వముఖాత్ ।

భవదాననే: భవత్యాః ఆననమ్, భవదాననమ్, తస్మిన్ — భవదాననే।
తామ్బూలఫాలికాః : తామ్బూలస్య ఫాలికాః తామ్బూలఫాలికాః,
తాః — తామ్బూలఫాలికాః ।

భావము :

ఓ ప్రియురాలా ! నేను నమలిన తామ్బూల ఖండములను నీ నోటనుంచి వెడవ కుదువఁబెట్టిన ద్రవ్యమును కుదువఁబెట్టినవాడు, తిరిగి యీయమని యడిగిన ధర్మము ననుసరించి నేను నీ నోటనుంచి తామ్బూల ఖండమును మఱల నాకీయ మని ప్రార్థించిన విషయము నీకు జ్ఞప్తియందున్నదా ?. ॥82॥

శ్లో. చిత్తే తదస్తి కచ్చిత్తే నఖజం మయి యత్ క్రుధా ।
ప్రాగ్భావాధి గమాఽఽగః స్థే త్వయా శమ్బాకృతం క్షతమ్॥ 83

ప.వి. చిత్తే - తత్ - అస్తి - కచ్చిత్ - తే - నఖజమ్ - మయి - యత్ - క్రుధా - ప్రాగ్భావాధిగ మాగఃస్థే - త్వయా - శమ్బాకృతమ్ - క్షతమ్-

అర్థము: హే ప్రియే — ఓ ప్రియురాలా ! మయి — నలుఁడనైననేను, ప్రాగ్భావాధి గమాఽఽగఃస్థే; ప్రాక్ — నీకంటెముందే, భావ — రేతస్సుపడునప్పటి యానందమును, అధిగమ — పొందుటయనెడి, ఆగః — అపరాధమునందు, స్థే సతి — ఉండగా, నందువలన నీ సుఖ లాభమునకు ప్రతిబంధ మేర్పడుట వలన నపరాధమని యర్థము. త్వయా — నీచే, క్రుధా — కోపముతో యత్ — ఏ, నఖజం — గోటివలనఁగల్గించఁబడిన, క్షతం — గాయము, శమ్బాకృతమ్ — రెట్టింపుగాఁజేయఁబడినది. తత్ — ఆ శమ్బాకరణము, తే — నీయొక్క, మనసి — చిత్తమునందు, అస్తి కచ్చిత్ —, ఉన్నదాయేమి ?.

సమాసము :

నఖజం: నఖాత్ జాయత ఇతి — నఖజమ్
ప్రాగ్భావాధిగమాగఃస్థే: ప్రాక్ భావః — ప్రాగ్భావః, ప్రాగ్భావస్య అధిగమః

ప్రాగ్భావాధిగమః, ప్రాగ్భావాధిగమ ఏవ ఆగః = ప్రాగ్భావాధిగమాగః
ప్రాగ్భావాధిగమాగసి తిష్ఠతీతి = ప్రాగ్భావాధి గమాగస్థః, తస్మిన్ =
ప్రాగ్భావాధిగమాగః స్థే ।

భావము :

ఓ ప్రియురాలా ! నీ కంటెముందే నాకు రేతస్సు పడిపోవుటవలన నీకు సుఖము లభింపనందువలన నీవు కోపముతో నన్ను గోరుతో గిచ్చి రెండింతలు గాయపఱచితివి. భూమిని నేరుగను, తలక్రిందులుగను దున్నినట్లు నన్ను గోటితో గాయపఱచితివి. ఆ విషయమును నీవు స్మరించుచున్నావా ?. ॥83॥

శ్లో. స్వాదిగ్వినిమయేనైవ నిశి పార్శ్వ వివర్తినోః ।
స్వప్నేష్వప్యస్త వైముఖ్యే సఖ్యే సౌఖ్యం స్మరావయోః॥ 84

ప.వి. స్వాదిగ్వి నిమయేన - ఏవ - నిశి - పార్శ్వే వివర్తినోః - స్వప్నేషు - అపి-
అస్త వైముఖ్యే - సఖ్యే - సౌఖ్యమ్ - స్మర - ఆవయోః —

అర్థము: హే ప్రియే = ఓ ప్రియురాలా !, నిశి = రాత్రియందు, స్వాదిగ్వినిమయేనైవ; స్వాదిక్ = తమ తమ శయన స్థానములయొక్క, వినిమయేనైవ = మార్చుకొనుటచే తనే యనగా నీవు పరుండెడి స్థలమునకు నేను, నేను పరుండెడి స్థలమునకు నీవును పోవుటచే, తమస్థానములను మార్చుకొనక, యెదురెదురుగా పరుండినచో, ప్రక్కకుదిరిగినపుడు, ఒకరిముఖము, మఱియొకరికి కానరాక పోవచ్చునని యర్థము. పార్శ్వే వివర్తినోః, పార్శ్వే = ప్రక్కలయందు, అనగా కుడియెడమ ప్రక్కలయందు, వివర్తినోః = పొరలుచున్న, నీకును నాకును, స్వప్నేషు = నిద్రలయందును, అస్త వైముఖ్యే; అస్త = తొలగిన, వైముఖ్యే = వైముఖ్యముగల్గిన, సఖ్యే = చెలిమియందలి, సౌఖ్యం = సుఖమును, స్మర = స్మరింపుము.

**సమాసములు :**

స్వదిగ్వినిమయేన: స్వయోః దిశౌ = స్వదిశౌ, స్వదిశోః వినిమయః = స్వదిగ్వినిమయః, తేన = స్వదిగ్వినిమయేన ।

పార్శ్వవివర్తినోః: పార్శ్వయోః వివర్తేతే ఇతి = పార్శ్వవివర్తినౌ, తయోః = పార్శ్వవివర్తినోః ।

అస్తవైముఖ్యే: అస్తం వైముఖ్యమ్ యస్మిన్‌తత్ = అస్తవైముఖ్యమ్, తస్మిన్ = అస్తవైముఖ్యే ।

సౌఖ్యమ్: సుఖినః భావః సౌఖ్యమ్, తత్ = సౌఖ్యమ్ ।

**భావము :**

ఓ ప్రియురాలా ! రాత్రియందు పడకలో నొండొరుల స్థలములను మార్చుకొనుటచేతనే ! కుడి ఎడమ ప్రక్కలకుఁబొరలుచున్న నీకును, నాకును నిద్రలయందును నొండొరులకు వైముఖ్యములేని యనగా సమ్ముఖత్వము గల్గిన మన చెలిమి యందలి సౌఖ్యమును స్మరింపుము. ॥84॥

శ్లో. **క్షణం ప్రాప్య సదస్యేవ నృణాం విమనితేక్షణామ్ ।**
**దర్శితాఽఽధర మద్దంశా స్మరయన్మామ తర్జయః. ॥85॥**

ప. వి. క్షణమ్ - ప్రాప్య - సదసి - ఏవ - నృణామ్ - విమనితేక్షణమ్ - దర్శితాధర మద్దంశా - స్మర - యత్ - మామ్ - అతర్జయః -

**అర్థము :** హే ప్రియే = ఓ ప్రియురారాలా! సదస్యేవ = సభయందే, యనగా చెలికత్తెలేర్పఱచిన నాట్య గాన సభలయందే, నృణాం = సఖీజనుల యొక్క, విమనితేక్షణం = విమనిత = నృత్యాదుల యందాసక్త చిత్తులగుటచే, వేఱుచోట నాసక్తి లేని మనస్సుగల, ఈక్షణ = దృష్టిగల, క్షణమ్ = అవసరమును, ప్రాప్య = పొంది, దర్శితాఽధర మద్దంశా, దర్శిత = చూపఁబడిన, అధర = పెదవియందలి, మద్దంశా = నాయొక్క దన్తక్షతము గలదానవై, యత్ = ఎందువలన, మామ్ = నన్ను, అతర్జయః = బెదిరించితివో, తత్ = దానిని, స్మర = స్మరింపుము.

సమాసములు ॥

విమసితేక్షణమ్: విమసితాని, ఈక్షణాని యస్మిన్ సః = విమసితేక్షణః, తమ్ = విమసితేక్షణమ్ ।

దర్శితాఽధర మద్దంశా: మమ దంశః = మద్దంశః, అధరే మద్దంశః = అధర మద్దంశః, దర్శితః, అధర మద్దంశః యయా సా = దర్శితాధర మద్దంశా.

భావము ;

ఓ ప్రియురాలా! చెలికత్తెలేర్పఱచిన నాట్యగాన సభయందు నా చెలికత్తెలు నాట్యాదుల యందాసక్తి గల్గి యితర విషయముల వదలి పరాకుఁజెంది యుండగా నట్టి యవసరమున నీవు, నేను గావించిన యధరక్షతముఁజూపి నన్ను బెదరించితివి. దానిని స్మరింపుము. ॥౮౫॥

శ్లో. తామ్బూలదానం సంన్యస్త కరజం కరపఙ్కజే ।
న మమ స్మరసి ప్రాయస్తవ నైవ స్మరామి తత్ ॥86॥

ప. వి. తామ్బూల దానమ్ - సంన్యస్త కరజం - కరపఙ్కజే - న - మమ - స్మరసి - ప్రాయః - తవ - న - ఏవ - స్మరామి - తత్ -

అర్థము : హే ప్రియే = ఓ ప్రియురాలా! తవ = నీయొక్క, కరపఙ్కజే = హస్తపద్మము నందు, ప్రాయః = అధికముగా, సంన్యస్తకరజం: సంన్యస్త = చక్కగా సంచఁబడిన, కరజమ్ = గోళ్ళుగల్గిన అనగా రెండు గోళ్ళచేఁజేయఁబడిన మెత్తని గిల్లుడు కల్గిన, మమ = నాయొక్క యనగా నేను గావించిన, తామ్బూల దానం = తామ్బూలము నొసంగుటను, న స్మరసి = స్మరింపవా? తవ = నీకును, అనగా నీవు గావించిన, తత్ = ఆ గోళ్ళ గిల్లుడు గల్గిన తామ్బూలదానమును నైవ స్మరామి = స్మరించనా యేమి? తప్పక యుభయులము స్మరింతుమని యర్థము.

సమాసములు

తాబ్బూల దానమ్ : తామ్బూలస్య దానమ్, తత్ = తామ్బూలదానమ్,
సంన్యస్త కరజమ్ : సంన్యస్తః కరజః యస్య తత్ = సంన్యస్తకరజమ్
తత్ = సంన్యస్త కరజమ్ ।
కరపఙ్కజే : కరః పఙ్కజమివ = కరపఙ్కజమ్, తస్మిన్ = కర
పఙ్కజే ।

భావము :

ఓ ప్రియురాలా ! నేను పెక్కు మారులు నీ చేతినిఁ గిల్లి తామ్బూలమును నీకిచ్చియున్నాను. నీవును నట్లే నా చేతినిఁగిల్లి పెక్కుమారులు తామ్బూలము నిచ్చియుంటివి. మనముభయులము దీనిని స్మరింపమా ? తప్పక స్మరింతుమని యర్థము. ॥87॥

శ్లో. తదద్యేహి మృషోద్యం మాం హిత్వా యచ్ఛ గతా సఖీః ।
తత్రాఽపి మే గతస్యాగ్రే లీలయైవాచ్ఛిన స్తృణమ్. 88

ప. వి. తత్ - అద్యేహి - మృషోద్యమ్ - మామ్ - హిత్వా - యత్ - చ-
గతా - సఖీః - తత్ర - అపి - మే - గతస్య - అగ్రే - లీలయా-
ఏవ - అచ్ఛినః - తృణమ్ -

అర్థము: హే ప్రియే = ఓ ప్రియురాలా ! మృషోద్యమ్ = నీకేదో యిష్టముకాని పనినిఁజేసి చేయలేదని చెప్పుచున్న, మామ్ = నన్ను, హిత్వా = వదలి, సఖీః = చెలికత్తెలను, గతా = పొందితివి, తత్రాఽపి = ఆ చెలికత్తెల యొద్దకును, గతస్య = వెళ్ళిన, మే = నాయొక్క, అగ్రే = ఎదుట, లీలయైవ = వినోదము చేతనే, యత్ = ఎందువలన, తృణమ్ = ఎండిన గడ్డిపోచను, అచ్ఛినః = తుంచితివి. బాలురు ఒండొరుల స్నేహమునకు విచ్ఛేదమును సూచించుటకై గడ్డిపోచను తుంచెదరు. ఆ రెండు తునుక లెట్లు తెగిపోయినవో, అట్లే మనమును చాలకాలము తెగిపోయి యుంచెద మని యది సూచించును. తత్ = ఆ పనిని, అద్యేహి = స్మరింపుము.

భావము ;

ఓ ప్రియురాలా! నీకేదియో యిష్టము కాని పనినిఁగావించి, కావింపలేదని చెప్పుచున్న నన్ను వదలి నీవు చెలికత్తెల యొద్దకు వెళ్ళితివి. అప్పుడా చెలికత్తెల యొద్దకును నేను వచ్చితిని. ఆ సమయమున నీవు నాయెదుట ఎండిన గడ్డిపోచను తుంచి మన యిరువురికిఁదెగిపోయినట్లు సూచించితివి. దానిని స్మరింపుము. ॥88॥

శ్లో. స్మరసి ప్రేయసి! ప్రాయో తద్ద్వితీయ రతాసహా ।
శుచిరాత్రీ త్యుపాలబ్ధా త్వం మయా పికనాదినీ. ॥89॥

ప. వి. స్మరసి - ప్రేయసి - ప్రాయః - తత్ - ద్వితీయరతాసహా - శుచి రాత్రీ - ఇతి - ఉపాలబ్ధా - త్వమ్ - మయా - పికనాదినీ -

అర్థము: హే ప్రేయసి = మిక్కిలి ప్రియమైన ఓ దమయన్తీ! ద్వితీయరతాఽసహా ద్వితీయ = రెండవదైన, రత = సురతమునకు, అసహా = అసక్తురాలవై, పక్షాన్తరమున - కొలది పరిమితి గలిగి యుండుటచే, నొక తడవ సంభోగము చేయుట చేతనే ముగిసి నందువలన; జాలనిదియు, పికనాదినీ = కోకిలవలె మాట్లాడునదియు, పక్షాన్తరమున - కోకిలధ్వని గల్గినదియునగు, త్వమ్ = నీవు, ప్రాయః = అధికముగా, మయా = నాచేత; శుచిరాత్రీతి = గ్రీష్మ కాలవు రాత్రివని చెప్పఁబడి, ఉపాలబ్ధా = నిందింపఁబడితివి, తత్ = దానిని, స్మరసి = స్మరింతువా?.

సమాసములు ;

హే ప్రేయసి : అత్యన్తమ్ ప్రియా = ప్రేయసీ, తస్యాః సంబుద్ధిః = హే ప్రేయసి !

ద్వితీయ రతాఽసహా : ద్వితీయమ్ చ తత్ రతమ్ చ = ద్వితీయరతమ్, న సహా = అసహా, ద్వితీయ రతే, అసహా = ద్వితీయరతాఽసహా ।

శుచిరాత్రీ : శుచేః రాత్రీ = శుచిరాత్రీ ।

పికనాదినీ : పికవత్ నదతీతి = పికనాదినీ, పక్షాన్తరమున - పికస్య నాదః = పికనాదః, పికనాదః అస్యాః అస్తీతి = పికనాదినీ ।

**భావము ;**

**మిక్కిలి ప్రియురాలివైన యో దమయన్తీ? నేను నీతో నొకతడవ సంభోగించి తృప్తి కలుగనందువలన రెండవతూరి సంభోగమున కుద్యమింపగా నీవు దుర్బలురాలవై దానిని సహింప లేకపోతివి. అప్పుడు నేను నిన్ను శుచి రాత్రివి - యనగా గ్రీష్మర్తువునాటి రాత్రివని నిందించితిని. గ్రీష్మర్తువునాటి రాత్రియొక్క పరిమితి చాల తక్కువ. దాని కాలము ఒక సంభోగమునకే చాలును. రెండవ సంభోగమున కుపక్రమించినచో, దెల్లవారును. అది యెట్లొక సంభోగమునకు సరిపడెడు వ్యవధి గల్గినదో, యట్లే నీవును నొక సంభోగమునకే చాలి రెండవ సంభోగమున కలసిపోతివి. నీవును గ్రీష్మర్తువునందలి కోకిల మధురనాదము గల్గినట్లు మధుర సంభాషణముచే మధుర ధ్వని గల్గినదానవు. ఇట్లు పికనాదము గల్గిన నీవు పైవిధముగా శుచిరాత్రివిగా ననగా గ్రీష్మర్తువునాటి రాత్రివిగా నిందింపఁబడితివి. ఈ విషయమును నీవు స్మరింతువా?.**

ఇచ్చట గ్రీష్మర్తువునందు కోకిలధ్వని చెప్పఁబడినది. కోకిల వసంతమునందుఁ గూయునేకాని గ్రీష్మమునందు గూయదుకదా! ఇది యెట్లు సరిపడునని సంశయము రావచ్చును. దానికిట సమాధాన మొసంగఁబడుచున్నది- గ్రీష్మ కాలపు రాత్రియందు వసన్తకాల సమాప్తి యగుటనుఁ బట్టి వసన్త గ్రీష్మ సంధి కాలముగా దీనిని గ్రహింపవచ్చును. లేదా "మయాపికనాదినీ" యను మూలమున, మయా-అపికనాదినీ- యని పదవిభాగము గావించి పిక భిన్నములగు సారికాది పక్షులవలె భాషించు దానినిగఁ జెప్పవచ్చును. లేదా గ్రీష్మమునకు తర్వాత వర్షర్తువు సన్నిహితమై యుండుటచే "మయాపికనాదినీ" యను మూలమున మయా + అపి + కనాదినీ-యను పదవి విభాగము వలన క శబ్దమునకు జలమర్థము కాన "కనాదినీ" యనగా రానున్న వర్షర్తువు నందలి జలము యొక్క ధ్వనివంటి ధ్వని కలదానవని యర్థము జెప్పవలయును. "పికనాదినీ" అనునది "పికనాదిని"గనో, అపికనాదినిగనో, కనాదినిగనో విభజించి గ్రీష్మర్తు రాత్రియని నేర్పడిన యనుపపత్తినిఁ బరిహరించు కొనవలయును. 74

శ్లో. భుఞ్జానస్య నవం నిమ్బం పరివేవిషతీ మధౌ।
సపత్నీష్వపి యే రాగం సమ్భావ్య స్వరుషః స్మరేః॥ 90

ప. వి. భుఞ్జానస్య - నవం - నిమ్బమ్ - పరివేవిషతీ - మధౌ - సపత్నీషు - అపి - యే - రాగమ్ సమ్భావ్య - స్వరుషః - స్మరేః -

అర్థము: హే ప్రియే = ఓ ప్రియురాలా! పరివేవిషతీ = పరివేషణమును ననగా వడ్డనను జేయుచున్న నీవు, మధౌ = వసంతకాలమునందు, నవమ్ = క్రొత్తదైన యనగా నప్పుడే యుద్భవించుటవలన గోమలమైన, నిమ్బం = వేపాకును, ననగా దానితో జేయబడిన పచ్చడిని, భుఞ్జానస్య = తినుచున్న, మే = నాకు, సపత్నీషు అపి = ఇతర భార్యల యందును ననగా నీ సవతులయందును, లేదా భుఞ్జానస్య = తినుచున్న, మే = నాకు, మధౌసత్యపి = తేనెయున్నను, నవం = నూతనమైన, నిమ్బం = వేప పచ్చడిని, పరివేవిషతీ = వడ్డించుచున్న నీవు, సపత్నీష్వపి = సవతులయందును, మే = నాయొక్క, రాగం = అనురాగమును, సమ్భావ్య = కల్పించి, లేదా యూహించి,

"వసన్తే భ్రమణం పథ్యమథవా నిమ్బభోజనమ్।
అథవా యువతీ భార్యా అథవా వహ్నిసేవనమ్॥"

అను వైద్య శాస్త్రము ననుసరించి వసన్తమున నన్ను వేపపచ్చడిని దినిన వానినిగా జూచి, తక్కిన పడుచు భార్యలయందు దన్ను జేర్చుకొని నట్లుగా భావించియో లేదా చక్కెరతో జేసిన కుడుములు మున్నగు రుచికరములగు పిండివంటలున్నను, చేదైన వేపపచ్చడి యందతని కెప్పుడభిరుచి గల్గినదో, అప్పుడు మంచి యందగత్తెనగు నేనున్నను నన్ను వదలి నాకంటెను హీనలైన సవతులయందు వీనికి ననురక్తి యసంభవము గాదని భావించి యట్లు చేసితివని యర్థము. స్వరుషః = ఆ తరుణమున తనయొక్క కోపములను, స్మరేః = స్మరింతువా?.

**సమాసములు :**

సపత్నీషు : సమానః పతిః యాసాం తాః = సపత్న్యః, తాసు = సపత్నీషు।

స్వరుషః : స్వస్యాః రుషః = స్వరుషః, తాః = స్వరుషః।

**భావము :**

వడ్డించుచున్న నీవు వసన్తకాలమునందు వైద్యశాస్త్రము ననుసరించి వడ్డించిన వేపకూరను, లేదా వేపపచ్చడినిఁ దినుచున్న నాకు తనకంటె నందచందములలో తక్కువ యైన సవతులయందనురాగముండునని నీవు యూహించి నాపైఁ జూపిన కోపములను స్మరింతువా? అనగా మధుర పదార్థము లున్నను వానినిఁ బుచ్చుకొనక చేదైన వేపపచ్చడినిఁ దినుచున్న నన్నుఁ గాంచి, నీవు అందగత్తెనగు నేనున్నను మధుర పదార్థమును వదలి చేదైన వేపపచ్చడి నితడు తినుచున్నట్లు నాకంటె నందమున హీనలైన సవతుల యందును నితని కనురాగము గల్గుట యసంభవము గాదని'' యూహించి నాపై రోషములనుఁ జూపితివి. అ రోషముల నిప్పుడు నీవు స్మరింతువా? యని యాశయము.

లేదా వసంతమునందు నూతనముగా నుద్భవించిన యాకులు పూలు గల్గిన వేపకూరనుఁ దినుచున్ననాకు, సవతులపై ననురాగముండునని యూహించి, మాటిమాటికి నా వేపకూరనే నాకు భోజనమునకు వడ్డించుచు, భోజనపాత్రకుఁ జుట్టును దానినిఁ జల్లుచు నీ కోపములనుఁ బ్రకటించితివి. వానిని నీవు స్మరింతువా? మిక్కిలి తియ్యనైనట్టి చక్కెరతోఁజేసిన పిండి వంటలున్నను నితనికి మిక్కిలి చేదైన వేపకూరయందెప్పుడు అభిరుచి యున్నదో, అప్పుడు నాకంటె నందచందములలో హీనలైన సవతుల యందును వీని కనురాగముండునని భావించి పలుమాఱులు వేపకూరనే నాకు వడ్డించి నీ కోపములను నాపైఁ బ్రకటించితివి. వానిని స్మరింతువా? యని యాశయము. ॥90॥

7)

శ్లో. స్మర శార్కర మాస్వాద్య త్వయా రాద్ధమితి స్తువన్।
స్వనిన్దారోష రక్తాత్తు యదభైషం తవాధరాత్॥ 91

ప. వి. స్మర - శార్కరం - ఆస్వాద్య - త్వయా - రాద్ధం - ఇతి - స్తువన్ - స్వనిన్దారోష రక్తాత్ - తు - యత్ - అభైషమ్ - తవ - అధరాత్।

అర్థము: హే ప్రియే = ఓ ప్రియురాలా! త్వయా = నీచే, రాద్ధం = వండి సిద్ధము చేయఁబడిన, శార్కరమ్ = చక్కెరతోఁ చేయఁబడిన పిండివంటను, ఆస్వాద్య = ఆస్వాదించి, స్తువన్ = ఇది యన్నిటికంటెను అధికమైన రుచిగల్గి యున్నదని మెచ్చుచున్న నేను, స్వనిన్దారోషరక్తాత్; స్వ = పెదవియైన తానుగూడ పన్నిండిటిలోఁ జేరి యున్నందువలన, నా పెదవి తనకును నింద యేర్పడినదని, రోష = రోషముచే, రక్తాత్ = ఎఱ్ఱనైన, తవ = నీయొక్క, అధరాత్ = పెదవివలన, యత్ = ఎందువలన, అభైషమ్ = భయపడితినో, తు = దానిని, స్మర = స్మరింపుము.

## సమాసములు :

**శార్కరమ్** : శర్కరాయాః వికారః = శార్కరమ్, తత్ = శార్కరమ్.
**స్వనిన్దారోషరక్తాత్** : స్వస్యనిన్దా = స్వనిన్దా, స్వనిన్దయారోషః = స్వనిన్దా రోషః. స్వనిన్దారోషేణ రక్తః = స్వనిన్దారోషరక్తః, తస్మాత్ = స్వనిన్దారోషరక్తాత్।

## భావము :

ఓ ప్రియురాలా! నీవు చక్కెరతో నిర్మించిన పిండి వంటనుఁదిని యిది యన్నిటి కంటెను మిక్కిలి రుచిగా నున్నదని మెచ్చుచుంటిని. అప్పుడు నీ పెదవి దానిని విని తానుగూడ పన్నిండిలోఁ జేరి యున్నందువలన తానును రుచి లేనిదిగాఁ జెప్పఁబడినట్లు భావించి యా నిందవలని రోషముతో నెఱ్ఱఁబడినట్లు గానవచ్చుచుండినది. దానిని నేనుఁజూచి భయపడితిని. ॥91॥

శ్లో॥ ముఖాదారభ్య నాభ్యన్తం చుమ్బం చుమ్బం న తృప్తవాన్।
న ప్రాపం చుమ్బితుం యత్తే ధన్యా తచ్చుమ్బతు స్మృతిః॥ 92

ప. వి. ముఖాత్ - ఆరభ్య - నాభ్యన్తమ్ - చుమ్బమ్ చుమ్బమ్ - న - తృప్తివాన్ - ప్రాపమ్ - చుమ్బితుమ్ - యత్ - తే - ధన్యా - తత్-చుమ్బతు - స్మృతిః।

అర్థము: హే ప్రియే = ఓ ప్రియురాలా! ముఖాత్ = ముఖము నారంభించి, నాభ్యన్తమ్ = పొక్కిలి వఱకును, చుమ్బమ్ చుమ్బమ్ = ముద్దిడుకొని, ముద్దిడుకొని, న తృప్తవాన్ సన్ = తృప్తిఁ బొందని వాడ నగుచు, తే = నీయొక్క, యత్ = రతిగృహరూపమైన యవయవమును, చుమ్బితుమ్ = ముద్దిడుకొనుటకు, న ప్రాపమ్ = నీవు చేతులతో నడ్డగించుట వలననో, మూయుటవలననో, యవకాశమునుఁ బొందక పోతిని, తత్ = ఆ రతిగృహరూపమైన యంగమును, ధన్యాః = భాగ్యముగల్గిన, స్మృతిః = నీయొక్క స్మృతి, చుమ్బతు = స్పృశించునుగాత. అనగా నా యంగము నీ స్మృతికి విషయమగునుఁగాత. అట్లు ముద్దిడుకొనఁబడని యా యంగమును స్మరించుమని యర్థము. చక్రవర్తినైననను నాకు, ఆ రతిమన్దిరమును ముద్దిడ యోగ్యత లేక పొయినది. కాని భాగ్యము గల్గిన నీ స్మృతి, యెట్టి యవరోధములు లేకుండ దానిని ముద్దిడుకొనఁ గల్గినది. అనగా విషయముఁ జేసికొనగల్గినదని యర్థము.

**సమాసములు :**

**నాభ్యన్తమ్** : నాభిః అన్తే యస్యతత్ = నాభ్యన్తమ్, తత్ = నాభ్యన్తమ్ ।

**భావము :**

ఓ ప్రియురాలా! నీ ముఖము నారంభించి పొక్కిలి వరకును గల యవయవములను పలు మాఱులు ముద్దిడి ముద్దిడి తృప్తిఁబొందనివాడనై, నీ రతి గృహమగు నవయవమును ముద్దిడు కొనుటకుఁ బ్రయత్నించితిని. కాని నీవు

చేతులతో సర్దగించుట వలననో, మూయుట వలననో దానిని ముద్దిడ నవకాశము నాకుఁగలుగలేదు. ఆ యంగమునుఁ జుమ్బనము గావించుట కనగా స్పృశించుట కవకాశము నీ స్మృతి కున్నది. కాన నది భాగ్యముగలది. అట్టి నీ స్మృతి యా రతి మందిరమగు నవయవమునుఁ జుమ్బనముఁ జేయునుగాత. అనగా విషయ ముగఁజేసికొనుగాతయని యర్థము. చక్రవర్తినైనను నాకే యా యజ్గము ముద్దిడు కొనుట కవకాశము లేకపోయినది. కాని నీ స్మృతులకా యవకాశము లభించినది. కాననది ధన్యయైనది. అతిరాగముతో నీ రతిమన్దిరమును ముద్దిడుకొనుటకై యారంభించిన నాకు నీ వవకాశమీయ లేదు. కాన దానిని స్మరింతువా? యని యాశయము. ముఖము - కన్నులు - స్తనములు - బాహుమూలము - నాభిమూలము - స్మరమన్దిరము అను నీ యవయవములు చుమ్బన స్థానములు ॥92॥

శ్లో॥ **కమపి స్మరకేళిం తం స్మర యత్ర భవన్నితి।**
**మయా విహిత సమ్బుద్ధిర్వ్రీడితా స్మితవత్యసి॥ ॥93॥**

ప. వి. కమ్ - అపి - స్మరకేళిమ్ - తమ్ - స్మర - యత్ర - భవన్ - ఇతి - మయా - విహిత - సమ్బుద్ధిః - వ్రీడితా - స్మితవతీ - అసి .

అర్థము: హే ప్రియే = ఓ ప్రియురాలా! కమపి = అనిర్వచనీయమైన, తమ్ = అతిశయమగు నానంద మొసంగెడి, స్మరకేళిమ్ = కామకేలిని నవగా విపరీత సురతమును ననగా పురుషాయితమును, స్త్రీ పురుషుని వలె సంభోగమునందు వ్యవహరించు నట్టి వ్యాపారమును, స్మర = స్మరించుము. యత్ర = ఏ కామక్రీడయందు, మయా = నాచేత, "హే భవన్ = ఓ పూజ్యుడా', ఇతి = అని, విహితసమ్బుద్ధిః =, విహిత = చేయఁబడిన, సమ్బుద్ధిః = పిలుపు గల్గిన దానవై యనగా పురుషుని వలె నాచరించుటవలన "భవన్" యని పుంలిఙ్గ నిర్దేశము తోఁగూడిన పిలుపు గల దానవై (త్వం = నీవు) వ్రీడితా = సిగ్గుపడినదానవై, స్మితవతీ = (తన నేర్పునుఁజూపుటవలనఁ గల్గిన సంతోషమువలన) మందహాసము గావించిన దానవుగా, అసి = అగుచున్నావు. పురుషాయితత్వము వలన సిగ్గు, సంతోషము వలన చిరునవ్వు కలిగినవని యర్థము.

**సమాసములు :**

**స్మరకేలిమ్ :** స్మరస్యకేలిః = స్మరకేలిః, తామ్ = స్మరకేలిమ్ ।

**విహిత సముద్బుద్ధిః :** విహితా సముద్బుద్ధిః యస్యాస్సా = విహిత సముద్బుద్ధిః ।

**వ్రీడితా :** వ్రీడా అస్యాః సఞ్జాతేతి = వ్రీడితా ।

**స్మితవతీ :** స్మితమస్యాః అస్తీతి = స్మితవతీ ।

**భావము :**

ఓ ప్రియరాలా! చెప్పశక్యముగాని మహానందము నొసంగునట్టి విపరీత సురతమనెడి కామకేలిని స్మరింపుము. ఆ కామకేలి యందు నేను నిన్ను పుంలిఙ్గ నిర్దేశముతో "హే భవన్" యని పిలిచితిని. నీవు పురుషునివలె నాచరించు చుండుట వలన నట్లు నిన్నుఁబిలిచితిని. అట్లు కానిచో నిన్ను 'హే భవతి" యని స్త్రీలింగముతో బిలువ వలసి యుండెడిది. అప్పుడు నీవు నీ పురుషాయితత్వము నకు సిగ్గు బడిన దానవై, సంతోషము వలన మందహాసము గావించితివి ॥93॥

**శ్లో. నీలదా చిబుకం యత్ర మదార్ద్రేన శ్రమామ్బునా ।**

**స్మర హారమణౌ దృష్టం స్వమాస్యం తత్క్షణోచితమ్॥ ॥94॥**

ప. వి. నీలత్ - ఆచిబుకం - యత్ర - మదార్ద్రేన - శ్రమామ్బునా - స్మర - హారమణౌ - దృష్టమ్ - స్వమ్ - అస్యమ్ - తత్క్షణోచితమ్ -

అర్థము: హే ప్రియే = ఓ ప్రియురాలా! యత్ర = ఏ విపరీత సురత కాలము నందు, మదార్ద్రేన = కపోలములయందు వ్రాయఁబడిన పత్త్రి భంగములయొక్క కస్తూరిచే కాలుష్యము నొందిన; శ్రమామ్బునా = స్వేదజలముచే, ఆచిబుకమ్ = గడ్డము వరకును, నీలత్ = నీలముగా నున్న, అందువలననే, గడ్డము మొలచిన దానివలెఁగాన వచ్చుచున్న, తత్క్షణోచితమ్, తత్క్షణ = ఆ విపరీతసురత కాలము నందు, ఉచితమ్ = తగిన (ఆ విపరీత సురతమందు, నీవు నాపై నుండుటచే నీ కణతల

నుండి జారెడి, పత్రభంగముల యొక్క, కస్తూరి మున్నగు వానితో మిలితములైన చెమట నీరు ద్రవముగా నుండుటచే దిగువకు స్రవించుట వలన నది నీ చెంపలకును గడ్డమునకు నంటినదై పురుషునికిఁదగిన మీసము వలెను గడ్డము వలెను నుండినదని యర్థము, స్వమ్ = తనదైన, అస్యమ్ = మోము, హారమణౌ = హారమందున్న రత్నమునందు (క్రిందనున్న నాచే) దృష్టమ్ = చూడఁబడినది. స్మర = దీనిని స్మరింపుము.

**సమాసములు :**

**నీలత్** : నీలంభవతీతి = నీలత్, లేదా నీలమివ ఆచరతీతి = నీలత్ ।

**ఆచిబుకమ్** : చిబుకమభివ్యాప్య = ఆ చిబుకమ్ ।

**మదాత్తేన** : మదేస అత్తమ్ = మదాత్తమ్, తేన = మదాత్తేన,

**తత్క్షణోచితమ్** : సచాఽసౌక్షణశ్చ = తత్క్షణః, తత్ క్షణస్య ఉచితమ్ = తత్క్షణోచితమ్ ।

**భావము :**

ఓ ప్రియురాలా! ఆ విపరీత సురతమందు నీ కణతలపై వ్రాయఁబడిన మకరికాది పత్రముల యొక్క కస్తూరి మున్నగు వానితోఁగూడిన చెమట నీరు స్రవించుటచే గడ్డము వరకును నీ ముఖము నల్లఁబడినదై, పురుషాయితము గావించు నీ ముఖమున మొలచిన మీసమువలెను గడ్డము వలెను నుండి యా సమయమునకు తగిన పురుషవేషమును నీ ముఖమున కొసంగినది. నేను దిగువ నుండుటచే, ఆ ముఖమును హారమునందలి రత్నమధ్యమునఁ జూడ గల్గితిని. దీనిని నీవు స్మరింపుము. ॥94॥

**శ్లో. (స్మర తన్నఖమత్రోరౌ కస్తేధా(దా)దితి తేమృషా ।**
**హ్రీ దైవతమలుమ్పం యద్వ్రతం రతపరోక్షణమ్ ॥)**

ప. వి. స్మర - తత్ - నఖమ్ - అత్ర - ఊరౌ - కః - తే - అధాత్ - (అదాత్) - ఇతి - తే - మృషా - హ్రీదైవతమ్ - అలుమ్పమ్ - యత్ - వ్రతమ్ - రతపరోక్షణమ్ -

అర్థము: అహమ్ = నేను, అత్ర = ఈ, తవ = నీయొక్క, ఊరౌ = తొడ యందు, కః = ఎవ్వడు, నఖమ్ = గోటిని, అదాత్ = ఇచ్చెను. అనగా నఖక్షతము గావించెను. ఇతి = అని, మృషా = అసత్యమును. (చెప్పుచున్న వాడనై) హ్రీదైవతమ్; హ్రీ = సిగ్గే, దైవతమ్ = అధిదేవతగాఁ గల్గిన, రతపరోక్షణమ్ = సంభోగమును దూరము గావించెడి బ్రహ్మచర్య రూపమైన సురత ప్రతిబంధకమగు, వ్రతమ్ = వ్రతమును, యత్ = ఎందువలన, అలుమ్పమ్ = లోపింపఁజేసితినో, తత్ = దానిని, స్మర = స్మరింపుము. పరపురుషుని తోటి సంబంధ మేర్పడిన దను సందేహముఁగల్గించుటకై యసత్యముఁజెప్పి మఱియొక రసము నుత్పవింపఁజేసి లజ్జచే నేర్పడిన సురతవైముఖ్యమునెట్లు తొలగించితినో, దానిని స్మరింపుము. వ్రతమెప్పుడును, దేవతతోఁగూడినదిగాన నిటు హ్రీదైవతమని చెప్పఁబడినది.

## సమాసములు :

హ్రీదైవతమ్ : హ్రీః దైవతమ్ యస్యతత్ = హ్రీదైవతమ్ ।
**రతపరోక్షణమ్** : రతమ్ పరోక్షయతీతి = రత పరోక్షణమ్, తత్ = రతపరోక్షణమ్ ।

## భావము :

నీ తొడపై నెవ్వడు గోట గాయపఱచెనని నేనసత్యముఁజెప్పుచు సిగ్గునే దేవతగాగల్గిన సురతమును దూరము గావించెడి బ్రహ్మచర్య వ్రతమును లోపింపఁ జేసితిని. పరపురుష సంపర్క సంశయమునుఁగల్గించుటకై యసత్యముఁ జెప్పి దానిచే మఱియొక రసము నుత్పవింపఁజేసి, లజ్జవలన నీయెడ నేర్పడిన సంభోగ వైముఖ్యమునుఁదొలగించితిని. దానిని స్మరింపవా ?

ఈ శ్లోకము ప్రక్షిప్తముగాన మల్లినాథసూరి వ్యాఖ్యానించలేదు. నారాయణభట్టు వ్యాఖ్యానించుట వలన నిందుఁ జేర్పఁబడినది.

శ్లో. వనకేలౌ స్మరాశ్వత్థదలం భూపతితం ప్రతి ।
దేహి మహ్య ముదస్యేతి మద్గిరా వ్రీడితాసియత్॥ 95

ప.వి. వనకేలౌ - స్మర - అశ్వత్థదలమ్ - భూపతితమ్ - ప్రతి - దేహి - మహ్యమ్ - ఉదస్య - ఇతి - మద్గిరా - వ్రీడితా - అసి - యత్-

అర్థము: కించ = మఱియు, హే చారుశీలే = ఓ మంచినడవడికగలదానా! వనకేలౌ = ప్రమదవనమునందు విహరించునపుడు, భూపతితమ్ = చెట్టునుండి భూమిపైఁబడిన, అశ్వత్థదలమ్ ప్రతి = రాగియాకును(గూర్చి, ఉదస్య = ఎత్తి, మహ్యమ్ = నాకు (నలునకు)దేహి = ఇమ్ము, ఇతి = అనెడి, మద్గిరా = నా మాటచే, యత్ = ఎందువలన, వ్రీడితా = సిగ్గుపడిన దానవుగా, అసి = అగుచున్నావో, తత్ = దానిని స్మరింపుము. వరాఙ్గము రావియాకువలె నుండుటచే, దానినిమ్మని యడుగుట, రహస్యాఙ్గము నిమ్మనెడి యభిప్రాయమును సూచించును. అందువలన నామె సిగ్గుపడినదని యర్థము. సాముద్రిక శాస్త్రమందు--

"అశ్వత్థ దళసఙ్కాశం గుహ్యం గూఢమనిశ్చితమ్।
య్యస్యాః సా సుభగాకన్యా పూర్వపుణ్యైరవాప్యతే॥"

యని రాగియాకువంటి వరాఙ్గముగల కన్య సౌభాగ్యవస్తురాలు. అట్టి కన్య పూర్వపుణ్యముల చేతనే లభ్యమగునని చెప్పఁబడినది.

**సమాసములు :**

వనకేలౌ : వనేకేలిః = వనకేలిః, తస్మిన్ = వవకేలౌ।

అశ్వత్థదలమ్: అశ్వత్థస్యదలమ్ = అశ్వత్థదలమ్, తత్ = అశ్వత్థదలం।

భూపతితమ్ : భువిపతితమ్ = భూపతితమ్, తత్ = భూపతితమ్।

మద్గిరా : మమ గీః = మద్గీః, తయా = మద్గిరా।

**భావము :**

ఓ సౌశీల్యవతీ! మనము ప్రమదవనమునందు విహరించునపుడు రావి చెట్టు నుండి భూమిపైఁ బడిన రావియాకు నెత్తి యిమ్మని నిన్నడుగగా నీవు

నామాటచే సిగ్గు పడితివి. (ఏలయనగా నా యాకు నీ వరాజ్ఞము నాకృతి యందుం డుట వలస దానినిమ్మని యడుగుటను, వరాజ్ఞము నిమ్మనెడి యభిప్రాయము గల్గినదిగా భావించి సిగ్గుపడితివి.) దానిని నీవు స్మరింతువా? ॥95॥

శ్లో. ఇతి తస్యా రహస్యాని ప్రియే శంసతి సాఽన్తరా।
పాణిభ్యాం పిదధే తస్యాః శ్రవసీ హ్రీవశీకృతా॥ 96

ప. వి. ఇతి - తస్యాః - రహస్యాని - ప్రియే - శంసతి - సా అన్తరా - పాణిభ్యామ్ - పిదధే - తస్యాః - శ్రవసీ - హ్రీవశీకృతా.

అర్థము: ప్రియే = ప్రియుండైన నలుండు, తస్యాః = ఆ దమయన్తియొక్క, రహస్యాని = ఏకాంతమందలి చేష్టలను, ఇతి = ఇట్లు, శంసతి సతి = చెప్పగా, సా = ఆ దమయన్తి హ్రీవశీకృతా; హ్రీ = సిగ్గునకు, వశీకృతా = స్వాధీనయై, అన్తరా = మాటలమధ్య, తస్యాః = చెలికత్తెయైన కళయొక్క, శ్రవసీ = చెవులను రెంటినీ, పాణిభ్యామ్ = తన చేతులతో, పిదధే = మూసినది, ఇంక దీనికంటె నధికముగా రహస్యములనుం జెప్పినచో వాని నీమె వినరాదనెడి తలంపుతో నట్లు దమయన్తి చేసినదని యర్థము.

**సమాసములు :**

**హ్రీవశీకృతా :** అవశా వశాసమ్పద్య మానాకృతా = వశీకృతా హ్రియః వశీకృతా = హ్రీవశీకృతా।

**భావము :**

ప్రియుండైన నలుండు ఇట్లు దమయన్తియొక్క రహస్య విషయములనుం జెప్పుచుండగా నామె సిగ్గుపడినదై యింకనుం జెప్పంబోవు రహస్యములనుం విననకుండుటకై తన చెలికత్తెయగు కళయొక్క చెవులను మూసినది. ॥96॥

శ్లో. కర్ణౌ పీడయతీ సఖ్యా వీక్ష్య నేత్రాసితోత్పలే।
అప్యసాదయతాం భైమీకరకోకనదౌ ను తౌ॥ 97

ప. వి. కర్ణౌ - పీడయతీ - సఖ్యాః - వీక్ష్య - నేత్రాసితోత్పలే - అపి -అసాదయతామ్ - భైమీకరకోకనదౌ - ను - తౌ.

అర్థము: సఖ్యాః = చెలికత్తెయగు కళయొక్క, నేత్రాసితోత్పలే; నేత్ర = కన్నులనెడి, అసితోత్పలే = నల్లకలువలు, కర్ణౌ = ఆమెయొక్క రెండు చెవులను, పీడయతీ = పీడించువానినిగా, వీక్ష్య = చూచి, భైమీకరకోకనదే, భైమీ = దమయన్తియొక్క, కర = రెండు చేతులనెడి, కోకనదేః = ఎఱ్ఱకలువలుగూడ, తౌ = ఆ చెవులను, ఆసాదయతాం స = అసూయతోఁ గూడినవై పీడింపవాయేమి! తప్పక పీడించును.

**సమాసములు :**

**నేత్రాసితోత్పలే :** అసితేచ తే ఉత్పలేచ = అసితోత్పలే, నేత్రే ఏవ అసితోత్పలే = నేత్రాసితోత్పలే, తే = నేత్రాసితోత్పలే।
**భైమీకరకోకనదే :** కరావేవ కోకనదే = కరకోకనదే, భైమ్యాః కరకోకనదే = భైమీకరకోకనదే।

**భావము :**

చెలికత్తెయగు కళయొక్క కన్నులనెడి కలువలు, ఆమె రెండు చెవులనుఁ బీడించుటఁగాంచి, దమయన్తి యొక్క రెండు చేతులనెడి యెఱ్ఱకలువలు గూడ నామె చెవులను పీడింపఁబోయినవా యనునట్లుండెను. దమయన్తి రహస్యములను వినకుండఁజేయుటకై పైవిధముగా చెలికత్తెయొక్క చెవులను మూయగా నప్పటి విషయము నిట కవి వర్ణించుచున్నాడు. చెలికత్తెయొక్క కన్నులు నల్లకలువలవలె వెడల్పుగనుఁ బొడవుగను నుండి చెవులనంటియున్నవి. అందువలన నవి యామెయొక్క చెవులనుఁ బీడించినట్లు భావింపఁబడినది. నల్లకలువలామె యొక్క చెవులనుఁ బీడించినపుడు ఎఱ్ఱకలువ లేల

పీడింపరాదను భావముతో నా దమయన్తి యొక్క రెండు చేతులనెడి యెత్తికలు వలు గూడ నామె చెలికత్తెయొక్క చెవులను మూసినపుడు పీడింపఁబోయినవో యనునట్లుండెనని యాశయము. ॥97॥

**శ్లో. తత్ప్రవిష్టం సఖీకర్ణౌ పత్యురాలపితం హ్రియా।**
**పిదధావివ వైదర్భీ స్వరహస్యాభిసన్ధినా॥ 98**

ప. వి. తత్ - ప్రవిష్టం - సఖీకర్ణౌ - పత్యుః - ఆలపితం - హ్రియా - పిదధౌ - ఇవ - వైదర్భీ - స్వరహస్యాభిసన్ధినా.

అర్థము: వైదర్భీ = దమయన్తి, సఖీకర్ణౌ; సఖీ = చెలికత్తెయగు కళయొక్క కర్ణౌ = చెవులను, ప్రవిష్టం = ప్రవేశించిన, పత్యుః = భర్తయైన, నలునియొక్క, తత్ = పూర్వముఁ జెప్పఁబడిన, ఆలపితం = తన రహస్య సంభాషణమును, హ్రియా = సిగ్గుచే, స్వరహస్యాభిసంధినా; స్వ = తనదైన, రహస్య = రహస్యపు వ్యాపారమును, అభిసంధినా = దాచవలెననెడి యభిప్రాయముతో, పిదధౌ = మూసెను. ఎవడైనను దాచఁదగిన ద్రవ్యమును పెట్టెయందుంచి దానికి వెలుపలఁ దెలియకుండుటకై మూతలో భద్రముచేయునో యట్లే యీమెయు గావించెనని యర్థము.

**సమాసములు ;**

**సఖీకర్ణౌ** : సఖ్యాః కర్ణౌ = సఖీకర్ణౌ। తౌ = సఖీకర్ణౌ।
**స్వరహస్యాభిసన్ధినా** : స్వస్యరహస్యం = స్వరహస్యం, స్వరహస్యస్య అభిసంధిః = స్వరహస్యాభిసంధిః, తేన = స్వరహస్యాభిసంధినా।

**భావము ;**

ఆ దమయన్తి చెలికత్తెయైన కళయొక్క చెవులలోఁబడిన, భర్తచెప్పిన తన రహస్య వ్యాపారమునకు సంబంధించిన సంభాషణమును, సిగ్గుచే బయటికి రానీయక యామె చెవులను మూసెనో యనునట్లుండెను. ॥98॥

శ్లో. **సమాలోక్య ప్రియాకేలిం నలే సోల్లుణ్ఠహాసిని।**
**ఆరాత్తత్త్వ మబుద్ధ్వాఽపి సఖ్యః సిస్మియిరేపరాః** 99

ప. వి. సమాలోక్య - ప్రియాకేలిమ్ - నలే - సోల్లుణ్ఠహాసిని - ఆరాత్ - తత్త్వమ్ - అబుద్ధ్వా - అపి - సఖ్యః - స్మికియిరే - అపరాః -

అర్థము: తమ్ = ముందుఁ జెప్పఁబడిన, ప్రియాకేలిమ్; ప్రియా = ప్రియురాలి యొక్క, కేలిమ్ = ఆటను ననగాఁజెలికత్తెయొక్క చెవులను మూయుట యను వినోద కార్యమును, ఆలోక్య = చూచి, నలే = నలుఁడు, సోల్లుణ్ఠ హాసిని సతి = పరిహాసముతో నవ్వఁగా, ఆరాత్ = దూరమునుండి, అపరాః = కళకంటె భిన్నలైన చెలికత్తెలు, తత్త్వమ్ = యథార్థమైన విషయమును, అబుద్ధ్వాఽపి = తెలియకయు, సిస్మియిరే = నవ్విరి వారికి విషయముఁ దెలియక పోయినను నలుఁడు నవ్వినందువలన నవ్విరని యర్థము.

**సమాసములు ;**

**ప్రియాకేలిమ్:** ప్రియాయాః కేలిః = ప్రియాకేలిః, తమ్ = ప్రియా కేలిమ్।

**సోల్లుణ్ఠహాసిని :** సోల్లుణ్ఠమ్ హసతీతి = సోల్లుణ్ఠహాసీ, తస్మిన్ = సోల్లుణ్ఠహాసిని।

**అబుద్ధ్వా :** న బుద్ధ్వా = అబుద్ధ్వా।

**భావము :**

ముందు చెప్పిన దమయన్తియొక్క యాటలను, అనగా చెలికత్తె యొక్క చెవులను మూయుట మున్నగు వినోదములఁజూచి, నలుడు నవ్వగా, దూరము నందున్న యితర సఖులు గూడ నా విషయమునుఁ దెలుసుకొనకయే నవ్విరి. ॥99॥

శ్లో. దమ్పత్యోరుపరి ప్రీత్యా సాధరాప్సరసస్తయోః।
వవృషుః స్మిత పుష్పాణి సురభీణి ముఖానిలైః॥ 100

ప. వి. దమ్పత్యోః - ఉపరి - ప్రీత్యా - తాః - ధరాప్సరసః - తయో -
వవృషుః - స్మిత పుష్పాణి - సురభీణి - ముఖానిలైః.

అర్థము: తాః = ముందుఁ జెప్పబడిన, ధరాప్సరసః = మాలోకపుటప్సరసలతో
సమానులైన చెలికత్తెలు, దమ్పత్యోః = భార్యాభర్తలైన, తయోః = ఆ
దమయన్తీ, నలులయొక్క, ఉపరి = పైన, ప్రీత్యా = ప్రేమచే ననగా
సంతోషముచే ననగా వారి వ్యాపారమునుఁ జూచుటవలని యానన్దముచే,
ముఖానిలైః = నిట్టూర్పు గాలులచే, సురభీణి = పరిమళములు గల్గిన,
స్మిత పుష్పాణి = చిఱునగవులనెడి పుష్పములను, వవృషుః = వర్షించిరి.
చెలికత్తెలు వారిఱువురిని చిఱునగవులతోఁ జూచిరని యర్థము.

**సమాసములు :**

దమ్పత్యోః : జాయా చ పతిశ్చ = దమ్పతీ, తయోః = దమ్పత్యోః ।
స్మితపుష్పాణి: స్మితాన్యేవ పుష్పాణి, స్మిత పుష్పాణి; తాని = స్మిత
పుష్పాణి ।

**భావము :**

భూలోకపుటప్సరసలైన యా చెలికత్తెలు దమ్పతులగు నా నందమ
యన్తుల చేష్టలనుఁజూచుటచే నానందించిన వారలైఁతమ నిట్టూర్పుగాడ్పులచే పరి
మళించు చిఱునగవులనెడి పూవులను వర్షించిరి. అనగా చెలికత్తెలు వారిఱువురిని,
చిఱునగవుతోఁగాంచిరని యాశయము. ॥100

శ్లో. తదాస్యహసితాజ్జాతం స్మితమాసామభాసత ।
ఆలోకాదివ శీతాంశోః కుముదశ్రేణి జృమ్భణమ్ ॥ 101

ప.వి. తదాస్య హసితాత్ - జాతమ్ - స్మితమ్ - ఆసామ్ - అభాసత - ఆలోకాత్ - ఇవ - శీతాంశోః - కుముదశ్రేణి జృమ్భణమ్ -

అర్థము: తదాస్య హసితాత్; తత్ = నలునియొక్క, ఆస్య = ముఖమునందలి, హసితాత్ = నవ్వువలన, జాతమ్ = ఏర్పడిన, స్మితమ్ = చిఱునగవు, శీతాంశోః = చంద్రునియొక్క, ఆలోకాత్ = వెలుగువలన, జాతమ్ = ఏర్పడిన, కుముదశ్రేణి జృంభణమివ; కుముదశ్రేణి = కలువల పఙ్క్తులయొక్క, జృంభణమివ = వికాసమో యనునట్లు, అభాసత = ప్రకాశించినది.

సమాసములు :

తదాస్యహసితాత్: తస్య ఆస్యమ్ = తదాస్యమ్, తదాస్యస్యహసితమ్ = హసితమ్, తస్మాత్ = తదాస్యహసితాత్ ।
కుముదశ్రేణి జృంభణమ్: కుముదానామ్ శ్రేణిః = కుముదశ్రేణిః, కుముదశ్రేణేః - జృంభణమ్ = కుముదశ్రేణీ జృంభణమ్ ।

భావము :

నలుని మోమునందలి నవ్వునుఁజూచి చెలికత్తెలు గావించిన చిఱునగవు చంద్రకాన్తిచే కలువలపఙ్క్తుల వికాసమువలె శోభించినది. ॥101॥

శ్లో. ప్రత్యభిజ్ఞాయ విజ్ఞాఽథ స్వైరం హాస వికస్వరమ్ ।
సఖ్యాస్తాసు స్వపక్షాయాః కలాజాత బలాఽజని ॥ 102

ప.వి. ప్రత్యభిజ్ఞాయ - విజ్ఞా - అథ - స్వైరమ్ - హాసవికస్వరమ్ - సఖ్యాః - తాసు - స్వపక్షాయాః - కలా - జాతబలా - అజని -

అర్థము: అథ = చెలికత్తెలు నవ్విన పిదప, విజ్ఞా = మిక్కిలి చతురురాలైన, కలా = కలయను చెలికత్తె, తాసు = స్మితమును గావించిన చెలికత్తెల మధ్య, స్వపక్షాయాః = తనకు సహాయమైన, అనగా తనకు స్నేహితు

రాలైన, సఖ్యాః = ఒకానొక చెలికత్తెయొక్క, హాసవికస్వరమ్; హాస = నవ్వుతో, వికస్వరమ్ = వికాసము నొందిన, స్వరమ్ = ధ్వనిని, ప్రత్యభిజ్ఞాయ = గుర్తించి, జాతబలా; జాత = ఉత్పన్నమైన, బలా = సామర్థ్యముగల్గినదిగా, అజని = ఏర్పడినది.

**సమాసములు :**

హాసవికస్వరం: హాసేనవికస్వరః, హాసవికస్వరః, తమ్ = హాసవికస్వరమ్।

జాతబలా : జాతం బలం యస్యాస్సా = జాతబలా ।

**భావము :**

ఇట్లు చెలికత్తెలు నవ్విన పిదప మిక్కిలి నేర్పరియైన కళ, నవ్వినట్టి యా చెలికత్తెలమధ్య తనకు చెలికత్తె యగు నొకానొకతెయొక్క నవ్వుచే నామె యొక్క కంఠధ్వనిని గుర్తించి, దమయన్తి మూసినట్టి తన చెవులను విడిపించుకొను విషయమున శక్తిని బొందినదైనది. ॥102॥

శ్లో. సాஉహూయోచ్చైరథో చేతామేహి స్వర్గేణ వఞ్చితే ।
పిబ వాణీః సుధావేణీర్నృప చన్ద్రాస్య సున్దరీ ॥ 103

ప.వి. సా - ఆహూయ - ఉచ్చైః - అథ - ఊచే - తామ్ - ఏహి - స్వర్గేణ - వఞ్చితే - పిబ - వాణీః - సుధావేణీః - నృపచన్ద్రాస్య - సున్దరీ.

**అర్థము:** అథ = ఇట్లు స్వరమును గుర్తించినపిదప, సా = ఆ కళ, తామ్ = ఆ చెలికత్తెను, ఉచ్చైః = బిగ్గఱగా, ఆహూయ = పిలచి, స్వర్గేణ = స్వర్గసుఖముచే, వఞ్చితే = మోసగింపఁబడిన దానవైన, సుందరి = ఓ యందగత్తె! ఏహి = రమ్ము, నృపచన్ద్రాస్య = రాజచన్ద్రునియొక్క, వాణీః = వాగ్రూపములైన, సుధావేణీః = అమృత ప్రవాహములను, పిబ = యథేచ్ఛగా పానముఁ జేయుము. ఇతి = అని, ఊచే = చెప్పెను. స్వర్గమందు చన్ద్రునుండి వెల్వడిన యమృతమునకు సాటియైనట్టి, రాజ

చన్ద్రిముఖమునుండి వెల్వడిన మాటలనెడి యమృత ప్రవాహమునుఁబానము గావించి స్వర్గసుఖమనుభవింపుమని యర్థము.

**సమాసములు :**

సుధావేణీః : సుధాయాః వేణ్యః = సుధావేణ్యః, తాః=సుధావేణీః ।
నృపచన్ద్రస్య: నృప ఏవ చన్ద్రః=నృప చన్ద్రః, తస్య నృపచన్ద్రస్య ।

**భావము :**

ఇట్లు చెలికత్తెయొక్క కణ్ఠధ్వనిని గుర్తించిన పిదప, కళ, యాచెలికత్తెను, బిగ్గరగాఁబిలచి "నీవు స్వర్గసుఖమునుఁగల్గించెడి నలుని మాటలను వినక పోవుటచే స్వర్గమునుఁబోగొట్టుకొనిన దానవైతివి. కాననో సుందరీ ! రమ్ము, రాజచన్ద్రుఁడైన నలునియొక్క ముఖమునుండి వెల్వడు వాక్య సుధా ప్రవాహము ననుభవించి స్వర్గసుఖము ననుభవింపుము." అని పలికెను. 108

శ్లో. సాఽశృణోత్తస్య వాగ్భాగమనత్యాసత్తిమత్యపి ।
కల్పగ్రామాల్ప నిర్ఘోషం బదరీవ కృశోదరీ ॥ 104

ప.వి. సా - అశృణోత్ - తస్య - వాగ్భాగమ్ - అనత్యాసత్తిమతీ - అపి - కల్పగ్రామాల్ప నిర్ఘోషమ్ - బదరీ - ఇవ - కృశోదరీ ॥

అర్థము: కృశోదరీ=పలుచని యుదరముగల్గిన, సా=ఆ పిలువఁబడిన, చెలికత్తె, అనత్యాసత్తిమతీ అపి; అనతి=తక్కువైన, ఆసత్తిమత్యపి=సామీప్యముగలదైనను ననగా కొంచెము దూరమువందున్నదైనను, తస్య=ఆ నలునియొక్క, వాగ్భాగమ్=తర్వాతఁజెప్పిన వాక్యముల యంశమును, కల్పగ్రామాల్ప నిర్ఘోషమ్; కల్పగ్రామస్య=బదరికాశ్రమమునకు సమీపము నందున్న కల్పమను గ్రామముయొక్క, అల్ప=కొంచెమైన, నిర్ఘోషమ్= ధ్వనిని; బదరీవ=బదరికాశ్రమ మందలి జనమువలె, అశృణోత్= వినెను. సమీపమునందున్న గ్రామముల యందలి యొండొరుల సల్లాపములు వినఁబడుచుండును. ఆ విధముగనే చెలికత్తె నలుని వాక్యములను వినినదని యర్థము.

సమాసములు :

వాగ్భాగమ్ :వాచాం భాగః=వాగ్భాగః, తమ్=వాగ్భాగమ్ ।
అనత్యాసత్తిమతీ: అత్యన్తమాసత్తిః=అత్యాసత్తిః, అత్యాసత్తిః అస్యాః అస్తీతి=అత్యాసత్తిమతీ, న అత్యాసత్తిమతీ=అనత్యాసత్తిమతీ ।
కల్పగ్రామాల్ప నిర్ఘోషమ్: కల్ప ఇతి గ్రామః, కల్పగ్రామః, అల్పశ్చాసౌ నిర్ఘోషశ్చ అల్పనిర్ఘోషః, కల్పగ్రామస్య అల్పనిర్ఘోషః = కల్పగ్రామాల్ప నిర్ఘోషః, తమ్=కల్పగ్రామాల్ప నిర్ఘోషమ్ ।
కృశోదరీ : కృశముదరమ్ యస్యాస్సా=కృశోదరీ ।

భావము :

కృశోదరి యగు నా పిలువఁబడిన చెలికత్తె, కొంతదూరమునందున్నను నలుని వాక్యముల యంశమును, బదరికాశ్రమ మందలి జనము, దానికి కొంచెము సమీపమందున్న కల్పమను పేరుగల గ్రామము నందలి మునుల కలకలధ్వనిని వినునట్లు, వినినది. కల్పగ్రామమున మునుల సల్లాపధ్వనిని, బదరికాశ్రమ వాసులకు వినఁబడునని వాడుక యచ్చటఁగలదు. ఏలయనగా నా గ్రామము బదరికాశ్రమమునకుఁగొంచెము దూరమున నుండును. ॥104॥

శ్లో. అథ స్వపృష్ఠనిష్ఠాయాః శృణ్వన్త్యాః నైషధాభిధాః ।
నలమౌళిమణౌ తస్యా భావమాకలయత్ కలా ॥ 105.

ప.వి. అథ - స్వపృష్ఠనిష్ఠాయాః - శృణ్వన్త్యాః - నైషధాభిధాః - నలమౌళి మణౌ - తస్యాః - భావమ్ - ఆకలయత్ - కలా.

అర్థము. అథ=చెలికత్తెను పిలిచిన పిదప, కలా=కళ, స్వపృష్ఠనిష్ఠాయాః; స్వ=తన యొక్క, పృష్ఠ=వెనుక భాగమునందు, నిష్ఠాయాః= నిలిచియున్న అనగా చెవులను మూయుటకై కల యొక్క వెనుక భాగమున నిలఁబడియున్న, నైషధాభిధాః; నైషధ=నలుని యొక్క,

అభిధాః = మాటలను, శృణ్వన్త్యాః = వినుచున్న, తస్యాః = ఆ దమయన్తి యొక్క, భావమ్ = కోపాది భావమును, నలమౌలిమణౌ:, నల = నలునియొక్క, మౌలి = కిరీటమందలి, మణౌ = రత్నమందు, ఆ కల యత్ = చూచెను. ముందుండుట వలన నా మౌలిరత్నమందు ప్రతిబింబించుటచే దమయన్తి యొక్క కోపాదిభావములు కానవచ్చినవని యర్థము.

సమాసములు :

స్వపృష్ఠనిష్ఠాయాః : స్వస్యాః పృష్ఠః = స్వపృష్ఠః, స్వపృష్ఠే నిష్ఠా యస్యాస్సా = స్వపృష్ఠనిష్ఠా, తస్యాః = స్వపృష్ఠనిష్ఠాయాః।

నైషధాభిధాః : నైషధస్య అభిధాః = నైషధాభిధాః, తాః = నైషధాభిధాః।

నలమౌలిమణౌ : నలస్య మౌలిః = నలమౌలిః, నలమౌలౌ మణిః = నలమౌలిమణిః, తస్మిన్ = నలమౌలిమణౌ।

భావము ;

చెలికత్తెను పిలిచిన పిదప, కళ తన వెనుక నిలచి నలుని మాటలను వినుచున్న యా దమయన్తి యొక్క కోపాది భావమును నలుని కిరీటమందలి ప్రతిబింబమునఁ జూచినది. ॥105॥

శ్లో. ప్రతిబింబేక్షితైః సఖ్యా ముఖాకూతైః కృతానుమా।
తద్వ్రీడాద్యను కుర్వాణా శృణ్వతీచాన్వమాయి సా॥ 106.

ప. వి. ప్రతిబిమ్బేక్షితైః – సఖ్యాః - ముఖాకూతైః - కృతానుమా - తద్వ్రీడాది - అనుకుర్వాణా - శృణ్వతీ - చ - అన్వమాయి - సా।

అర్థము. సా = ఆ కల, ప్రతిబిమ్బేక్షితైః; ప్రతిబిమ్బ = నలుని కిరీటము యొక్క రత్నముల యందలి ప్రతిబింబమునందు, ఈక్షితైః = చూడఁబడిన; సఖ్యాః = దమయన్తి యొక్క, ముఖాకూతైః; ముఖ = మోము

నందలి, ఆకూతైః = లజ్జా రోషాదులను వెల్లడిఁ జేసెడి యాకృతులనెడి లింగములచే, కృతానుమా; కృత = చేయఁబడిన, అనుమా = "దీనిని దీనిని, ఇతడు చెప్పుచున్నాడ" నెడి యనుమానము గల్గినదై, (అనగా దమయన్తి చెవులను మూయుటవలన వినుటకు శక్తి లేనందు వలననని యర్థము) (కావుననే) తద్వ్రీడాది; తత్ = ఆ దమయన్తి యొక్క, వ్రీడాది = సిగ్గు మున్నగు వానిని, అనుకుర్వాణా = అనుకరించు చున్నదై యనగా దమయన్తి ననుకరించుటచేఁ దానును నట్టి భావములనుఁ బ్రకటించుచున్నదై, శృణ్వతీవ = సాక్షాత్తుగా వినుచున్నదో యనునట్లు, చెవులు మూయఁబడినను నలుని మాటను స్పష్టముగా వినుచున్నదో యనునట్లు, అన్వమాయి = నల దమయన్తులచేత నూహింపఁబడినది.

సమాసములు :

ప్రతిబిమ్బేక్షితైః : ప్రతిబింబే ఈక్షితాని = ప్రతిబిమ్బేక్షితాని, తైః = ప్రతిబిమ్బేక్షితైః।

ముఖాకూతైః : ముఖస్య ఆకూతాని = ముఖాకూతాని, తైః = ముఖాకూతైః।

కృతానుమా : కృతా అనుమాయయా సా = కృతానుమా।

తద్వ్రీడాది : తస్యాః వ్రీడా, తద్వ్రీడా, తద్వ్రీడా ఆదియస్యతత్ = తద్వ్రీడాది.

భావము ;

ఆ కళ నలుని కిరీటపు రత్నమందలి దమయన్తి ప్రతిబింబమునందు, దమయంతియొక్క ముఖమునందలి లజ్జను, రోషము మున్నగు లింగములచే నలుదేమేమి చెప్పుచున్నాడో యా విషయముల నూహింపఁ గల్గినందువలన నామె చెవులను మూసినందువలన నేమియుభంగము కలుగలేదు. అందు వలననే దమయన్తికిఁ గల్గిన లజ్జను చిఱునగవు మున్నగు వాని ననుకరించుచున్నదై నలుడు చెప్పెడి మాటలను సాక్షాత్తుగా వినుచున్నదో యనునట్లు వ్యవహరించు చున్నదిగా నలదమయన్తులచే నూహింపఁబడినది. ॥106॥

శ్లో. కారఙ్కారం తథాऽऽకారమూచే సా శృణవన్తమామ్।
మిథ్యా వేత్థ గిరశ్చే తద్వ్యర్థాః స్యుర్మమ దేవతాః॥ 107

వ.వి. కారఙ్కారమ్ - తథా - ఆకారమ్ - ఊచే - సా - అశృణవన్తమామ్ - మిథ్యా - వేత్థ - గిరః - చేత్ - తత్ - వ్యర్థాః - స్యుః - మమ - దేవతాః -

అర్థము. సా = ఆ కళ, తథాऽऽకారమ్ = ముందు చెప్పఁబడిన యాకారమును, కారమ్ కారమ్ = చేసి చేసి, అశృణవన్తమామ్ = నీవు చెప్పినదానినంతటిని నేను చక్కఁగా వింటిని. ఇతి = అని, ఊచే = చెప్పెను. గిరః = నేను చక్కఁగా వింటినను మాటలను, మిథ్యా = అసత్యముగా. వేత్థచేత్ = తెలిసికొంటివో, తత్ = అప్పుడు, మమ = నాయొక్క, దేవతాః = దేవతలు, నేను కొలిచెడి దేవతలు, వ్యర్థాః స్యుః = నిష్ఫలమైన యుపాసన గలవారగుదురు (విశిష్టార్థ సాధకులయ్యెదరు).

సమాసములు ;

కారఙ్కారమ్ : కృత్వా కృత్వా = కారఙ్కారమ్।
వ్యర్థాః : విగతః అర్థః యాభ్యస్తాః = వ్యర్థాః। పక్షాన్తరమున - విశిష్టః అర్థః యాసామ్ తాః = వ్యర్థాః।

భావము:

ఆ కళ యా విధముగా ననుకరణరూపమైన యాకారమునుఁ జేసి చేసి చివరకు నలుడు చెప్పుచున్న విషయము నంతటినిఁ జక్కఁగా వింటినని చెప్పెను. దమయన్తి చెవులు మూసినను తాను వినఁగల్గితినని యర్థము. నేను చక్కఁగా వింటినను మాటలసత్యములైనచో నేను గావించెడి దేవతోపాసన వ్యర్థములే యగుచున్నవి (విశిష్టార్థ సాధకములగుచున్నవి). ॥107॥

శ్లో. మత్కర్ణ భూషణానాన్తు రాజన్! నిబిడపీడనాత్,
వ్యథిష్యమాణ పాణీస్తే నిషేద్ధుముచితా ప్రియా॥ 108

ప. వి. మత్కర్ణభూషణానామ్ - తు - రాజన్ - నిబిడపీడనాత్ - వ్యథిష్యమాణ
పాణిః - తే - నిషేద్ధుమ్ - ఉచితా - ప్రియా.

అర్థము. తు = కాని, రాజన్ = ఓ మహారాజా!, మత్కర్ణభూషణానామ్; మత్ = నాయొక్క, కర్ణ = చెవుల యందలి, భూషణానామ్ = ఆభరణములను, నిబిడ = గట్టిగా, పీడనాత్ = నలువుటవలన ననగాఁ జెవులను మూయుటకై గట్టిగాబట్టుకొనుట వలననని యర్థము; వ్యథిష్యమాణపాణిః వ్యథిష్యమాణ = బాధపడఁబోవుచున్న, పాణిః = హస్తములు గల్గిన, నీకు, ప్రియా = ప్రియురాలగు, దమయన్తి, నిషేద్ధుమ్ = చెవులను మూయుట నుండి నివారించుటకు, ఉచిత = తగినది.

సమాసములు :

మత్కర్ణభూషణానామ్ : మమ కర్ణౌ = మత్కర్ణౌ, మత్కర్ణయోః భూషణాని = మత్కర్ణ భూషణాని, తేషామ్ = మత్కర్ణ భూషణానామ్।
నిబిడ పీడనాత్ : నిబిడమ్ పీడనమ్ = నిబిడపీడనమ్, తస్మాత్ = నిబిడ పీడనాత్।
వ్యథిష్యమానపాణిః : వ్యథిష్యమాణౌ పాణీ యస్యాస్సా = వ్యథిష్యమాణపాణిః।

భావము ;

ఓ రాజా! నన్ను నీవు చెప్పెడి మాటలు వినకుండఁ జేయుటకు నా చెవులను మూయుచు, దాని యందలి భూషణములను గట్టిగా నలువుట వలన నామెకు నొప్పిఁ గలుగకుండఁ జేయుటకై నీవామెను నా చెవులను మూయనీయక నివారించుము. నేను మీ రహస్యము నంతటిని వింటిని కాన నిఁకఁ జెవులను మూయుటచే చేతుల నొప్పియే గాని వేఱు ప్రయోజనము లేదని యాశయము. ॥108॥

శ్లో. ఇతి సా మోచయాఞ్చక్రే కర్ణౌసఖ్యాః కరగ్రహాత్ ।
పత్యురాశ్రవతాం యాన్త్యా ముధాఽఽయాస నిషేధినః ॥109॥

ప. వి. ఇతి - సా - మోచయాఞ్చక్రే - కర్ణౌ - సఖ్యాః - కరగ్రహాత్ - పత్యుః - ఆశ్రవతామ్ - యాన్త్యాః - ముధాఽఽయాస నిషేధినః ।

ఆర్థము: సా = ఆ కళ, ఇతి = ఇట్లు, మాటలనేర్పుచే, ముధాఽఽయాస నిషేధినః; ముధా = వ్యర్థమైన, ఆయాస = పరిశ్రమను, నిషేధినః = వారించుచున్న, అనగా విషయము నంతటిని కళ తెలిసికొని నందువలన నిక నామెను వినకుండునట్లు చేయుటకై చెవులను మూయుట వ్యర్థప్రయాస మని, వారించుచున్న, పత్యుః = భర్తయగు నలునకు, ఆశ్రవతామ్ = చెప్పిన మాటను నెరవేర్చునదిగా నుండుటను, యాన్త్యాః = పొందుచున్న యనగా భర్తయొక్క యాజ్ఞచే చెవులను వదలు చున్న, సఖ్యాః = చెలికత్తెయగు దమయన్తి యొక్క, కరగ్రహాత్ = చేతుల పట్టునుండి, కర్ణౌ = కళ యొక్క రెండు చెవులును, మోచయాఞ్చక్రే = విడిపింపఁ జేసెను.

సమాసములు ;

కరగ్రహాత్ : కరయోః గ్రహః = కరగ్రహః, తస్మాత్ = కరగ్రహాత్ ।
ఆశ్రవతామ్ : ఆశ్రవస్య భావః = ఆశ్రవతా, తామ్ = ఆశ్రవతామ్ ।
ముధాఽఽయాస నిషేధినః : ముధా ఆయాసః = ముధాఽఽయాసః, ముధాఽఽయాసమ్ నిషేధతీతి = ముధాఽఽయాస నిషేధీ, తస్య = ముధాఽఽయాసనిషేధినః ।

భావము :

ఆ కళ, యివ్విధముగా మాటల చాతుర్యముచే విషయము తెలిసి పోయి నందువలన వ్యర్థముగా చెవులను మూసెడి శ్రమను నిషేధించుచున్న భర్తయగు నలుని మాట నాచరించుచున్న యా దమయన్తి చేతులయందుఁబట్టఁబడిన తన యొక్క చెవులను విడిపింపఁ జేసికొనినది. ॥109॥

శ్లో. శ్రుతిసంరోధజ ధ్వానస న్తతిచ్ఛేదతాలతామ్ ।
జగామ ఝటితి త్యాగస్వన స్తత్కర్ణయో స్తతః ॥ ॥109

ప. వి. శ్రుతిసంరోధజధ్వానస న్తతిచ్ఛేదతాలతామ్ - జగామ - ఝటితి - త్యాగస్వనః - తత్కర్ణయోః - తతః.

అర్థము : తతః = చెవులను విడిపించుకొనిన పిదప, తత్కర్ణయోః, తత్ = ఆకళయొక్క, కర్ణయోః = చెవులయందు, ఝటితి = శీఘ్రముగా, త్యాగస్వనః = విడుచుట వలన నేర్పడిన ధ్వని, ప్రవిష్టః = ఆమె చెవులను ప్రవేశించినదై, శ్రుతిసంరోధజధ్వాన స న్తతిచ్ఛేదతాలతామ్; శ్రుతి = చెవులను, సంరోధజ = మూయుటవలననేర్పడిన; ధ్వానసంతతి = శబ్దపరంపరయొక్క, యనగా "ధుం-ధుమి" త్యాది శబ్దపరమ్పరయొక్క, ఛేద = విరామమునందు, తాలతామ్ = పాటలు మున్నగు క్రియలను సమాప్తి చేసెడి కాలమందలి మౌనముగా నుండుటను, జగామ = పొంచెను.

సమాసములు :

శ్రుతి సంరోధజ ధ్వానస న్తతిచ్ఛేదతాలతామ్ : శ్రుత్యోః సంరోధః = శ్రుతిసంరోధః, శ్రుతిసంరోధాత్ జాయ న్త ఇతి = శ్రుతిసంరోధజాః, శ్రుతి సంరోధజాశ్చతే ధ్వానాశ్చ = శ్రుతి సంరోధజధ్వానాః, శ్రుతిసంరోధజధ్వానానామ్ స న్తతిః = శ్రుతిసంరోధజధ్వాన స న్తతిః, శ్రుతిసంరోధజధ్వాన స న్తతేః ఛ్ఛేదః = శ్రుతిసంరోధజధ్వాన స న్తతిచ్ఛేదః, శ్రుతి సంరోధజధ్వానస న్తతిచ్ఛేదేతాలః = శ్రుతిసంరోధజధ్వాన స న్తతిచ్ఛేద తాల = శ్రుతిసంరోధజధ్వాన స న్తతి చ్ఛేదతాలస్యభావః, తాం = శ్రుతిసంరోధజధ్వాన స న్తతి చ్ఛేద తాలతామ్ ।

త్యాగస్వనః : త్యాగస్యస్వనః - త్యాగస్వనః ।

తత్కర్ణయోః : తస్యాః కర్ణౌ = తత్కర్ణౌ, తయోః = తత్కర్ణయోః ।

భావము :

ఇట్లు చెలికత్తెయగు కళయొక్క చెవులను విడిపింపఁజేసిన పిదప, నామె యొక్క చెవులయందు వెలుపలి శబ్దము వెంటనే ప్రవేశించినది. ఆ శబ్దము చెవు

లను మూయుట వలనఁగల్గిన శబ్దపరమ్పరయొక్క విరామమందలి తాలముగా నేర్పడినవి. పాటలు ముగియునపుడు చివర నా గానక్రియకు సమాప్తికాలమునందు దానికి సమాన రూపమైన తాలమెట్లుండునోయట్లే, కర్ణములు మూయుటవలన నేర్పడి యుండిన ధ్వని సన్తతి, కర్ణములనుఁదెఱువగనే వెలుపలి శబ్దముచే విచ్ఛేదముఁబొందుటవలన నా విచ్ఛేదమందలి తాలముగా నది యుండినదని యర్థము. ॥110॥

శ్లో. సాఽపసృత్య కియద్దూరం ముముదే సిష్మియే తతః ।
ఇదఞ్చతాం సఖీమేత్య యయాచే కాకుభిః కలా ॥ 111

ప.వి. సా - అపసృత్య - కియత్ - దూరమ్ - ముముదే - సిష్మియే - తతః - ఇదమ్ - చ - తామ్ - సఖీమ్ - ఏత్య - యయాచే-కాకుభిః - కలా.

అర్థము: తతః = విముక్తి పొందిన పిదప, సా = ఆ, కలా = కళ, కియత్ = కొంచెము, దూరమ్ = దూరమునకు, అపసృత్య = తొలగి, ముముదే = (తన యుక్తి ఫలించినందువలన) సంతోషించినది. (కావుననే) సిష్మియేచ = నవ్వినది. కిఞ్చ = మఱియు, తామ్ = పూర్వము పిలువఁబడిన, సఖీమ్ = చెలికత్తెను, ఏత్య = పొంది, కాకుభిః = ఊరడింపును సూచించెడి వికృత ధ్వనులచే, ఇదమ్ = చెప్పఁబోవు విషయమును, యయాచే = ప్రార్థించెను.

భావము :

విముక్తి నొందిన పిదప నా కళ, కొంతదూరము పోయి, తన నేర్పరితనము ఫలించినందులకు సంతోషించినది. కావుననే మందహాసమును గూడఁ జేసినది. మఱియు తొలుతఁ దాను బిలచిన, తన పక్షమునకుఁజెందిన చెలికత్తెను నమీపించి యనునయమును, దైన్యమును సూచించెడి వికృత స్వరముతోఁ బ్రార్థించినది. ॥111॥

శ్లో. అభిధాస్యే రహస్యం తత్ యదశ్రావి మయాఽనయోః ।
వర్ణయాఽఽకర్ణితం మహ్యమేహ్యాలి వినిమీయతామ్ ॥ 112

ప.వి. అభిధాస్యే - రహస్యమ్ - తత్ - యత్ - అశ్రావి - మయా - అనయోః-
వర్ణయా - ఆకర్ణితమ్ - మహ్యమ్ - ఏహి - ఆలి - వినిమీయతామ్.

అర్థము: హే ఆలి ! = ఓ చెలికత్తె ! ఏహి = రమ్ము, అనయోః = ఈ దమయన్తీ నలులయొక్క, యత్ = ఏ, రహస్యమ్ = గోప్యము చేయఁదగిన విషయము, మయా = నాచే, అశ్రావి = వినఁబడినదో, తత్ = దానిని, అభిధాస్యే = నీకుఁజెప్పఁగలను. ఆకర్ణితమ్ = నీచే వినఁబడిన రహస్యమును, మహ్యమ్ = కళయైన నాకు. వర్ణయ = వర్ణింపుము. వినిమీయతామ్ = ఒండొరుటచే, వినఁబడిన విషయము మార్చుకొనఁబడసిమ్ము, అనగా నీకుఁదెలిసిన విషయమును నాకును, నాకుఁదెలిసిన విషయమును నీకును తెలుపు కొనెదము.

భావము :

ఓసఖీ ! రమ్ము, ఈ దమయన్తీ నలులకు సంబంధించిన రహస్యవిషయమును దేనిని నేను నా చెవులను మూయుటకు ముందు వింటినో, దానిని నీకుఁజెప్పగలను. నీవు వినిన విషయమును వనగా రహస్యమును నాకుఁజెప్పుము. ఒండొరులు వినిన విషయము నొండొరులకుఁజెప్పుకొనెదము. ॥112॥

శ్లో. వయస్యాభ్యర్థనేనాస్యాః ప్రాక్కూటశ్రుతినాటనే ।
విస్మితౌ కురుతః స్మైతౌ దమ్పతీ కమ్పితం శిరః ॥ 113

ప.వి. వయస్యాభ్యర్థనేన-అస్యాః-ప్రాక్-కూటశ్రుతినాటనే-విస్మితౌ-కురుతః-స్మ-ఏతౌ-దమ్పతీ-కమ్పితమ్-శిరః.

అర్థము: వయస్యాభ్యర్థనేన; వయస్యా = తనపక్షమందలి చెలికత్తెయొక్క, అభ్యర్థనేన = ప్రార్థనచేవనగా నొండొరులు వినిన సంగతిని నొండొరు

లకుఁజెప్పుకొనెదమను ప్రార్థనచే, అస్యాః = ఈ కళయొక్క, ప్రాక్ = పూర్వము అనగాఁజెవులను మూసిన సమయమునందు, కూటశ్రుతినాటనే; కూట = అసత్యమైన, శ్రుతి = "నేనంటిని వింటి"నను భావమును వ్యక్తపఱచుట యందు, విస్మితౌ = ఆశ్చర్యముతోఁగూడిన, దమ్పతీ = భార్యాభర్తలైన, ఏతౌ = ఈదమయన్తీ నలులు, శిరః = తమ తమ తలను, కమ్పితమ్ = కదలింపఁబడిన దానినిగా, కురుతః స్మ = చేయుచునుండిరి. మెల్లమెల్లగా తలనాడించిరని యర్థము.

**సమాసములు :**

కూటశ్రుతినాటనే: శ్రుతేః నాటనమ్ = శ్రుతినాటనమ్, కూటంచతత్ శ్రుతి నాటనం చ = కూటశ్రుతినాటనమ్, తస్మిన్ = కూటశ్రుతినాటనే ।

దమ్పతీ : జాయాచ పతిశ్చ = దమ్పతీ ।

**భావము :**

చెలికత్తెతో "నొండొరులు వినిన విషయము నొండొరులకుఁజెప్పుకొనెదమనెడి" యొప్పందముతోఁగూడిన ప్రార్థనచేఁజెవులు మూయఁబడిన సందర్భమున, కళ తాను వినుట కవకాశము లేక పోయినను నన్నింటి వింటినను నసత్యపు శ్రుతినభినయించుటచే నాశ్చర్యము బొందిన దమ్పతులైన నలదమయన్తులు, మెల్లమెల్లగాఁదలలను కదలించుచుండిరి. ॥113॥

శ్లో. తథాఽఽలిమాలపన్తీం తామభ్యధాన్నిషధాధిపః ।
ఆస్వ తద్వఞ్చితౌ స్వశ్చేన్మిథ్యాశపథ సాహసాత్॥ 113

ప.వి. తథా - ఆలిమ్ - ఆలపన్తీమ్ - తా - అభ్యధాత్ - నిషధాధిపః - ఆస్వ - తద్వఞ్చితౌ - స్వః - చేత్ - మిథ్యాశపథసాహసాత్ ॥

అర్థము: నిషధాధిపః = నిషధదేశపు ప్రభువైన నలమహారాజు, ఆలిమ్ = పిలువఁబడిన తన పక్షపు చెలికత్తెనుఁగూర్చి, తథా = ఆ విధముగా ననగా

నొండురులు విసిన విషయమును నొండొరులకు(జెప్పు కొనెదమను నొడం బడిక ప్రకారము, ఆలపన్తీమ్ = సంభాషించుచున్న, తామ్ = ఆ కళను, అభ్యధాత్ = పలికినది. ఏమనగా - (హేధూర్తే = ఓ దుష్టురాలా) మిథ్యా శపథసాహసాత్ "వ్యర్థాః స్యుః మమదేవతాః" అని యసత్యపు శపథ మనెడి సాహసమున, వఞ్చితాః = మోసగింప(బడినవారలముగా, చేత్ స్వః = ఉంటిమో, తత్ = అప్పుడు, అస్స్వ = ఉండుము. దీనికై నిన్ను(దగిన విధముగా దండింప(గలను. నీవెక్కడికి(బోయెదవని యర్థము.

**సమాసములు :**

నిషధాధిపః : నిషధానామధిపః = నిషధాధిపః ।
మిథ్యాశపథ సాహసాత్ : మిథ్యైవ శపథః = మిథ్యాశపథః, మిథ్యాశపథ ఏవ సాహసమ్ = మిథ్యాశపథసాహసమ్; తస్మాత్ = మిథ్యాశపథసాహసాత్ ।

**భావము :**

ఆ నలమహారాజు తొలుత(గళచే(బిలువ(బడిన తన పక్షమునకు (కళ యొక్క పక్షమునకు)(జెందిన చెలికత్తెను(గూర్చి యా ప్రకారముగా ననగా "నొండురులు వినిన విషయము నొండొరులకు(జెప్పుకొనెదము". అను నొదం బడిక ప్రకారము మాటలాడుచున్న యా కళనుద్దేశించి చెప్పెను. ఏమనగా - ఓ దుష్టురాలా! "వ్యర్థాః స్యుః మమదేవతాః" యని యసత్యపు శపథములనెడి నీ సాహసమువలన మేము వఞ్చితులమైతిమి. ఉండుము. నీకీ యసత్యమునకు( దగిన దండనమును విధింతును. నీవెక్కడికి వెళ్ల(గలవు. ॥115॥

శ్లో. ప్రత్యలాపీత్ కళాపీమం కలఙ్కః శఙ్కితః కుతః ? ।
ప్రియా పరిజనోక్తస్య త్వయైవాద్య మృషోద్యతా ॥ 115

ప.వి. పత్యలాపీత్ - కళా - అపి - ఇమమ్ - కలఙ్కః - శఙ్కితః - కుతః - ప్రియా పరిజనోక్తస్య - త్వయా - ఏవ - అద్య - మృషోద్యతా.

అర్థము: కలాఽపి = కళయు, ఇమమ్ = ఈ నలమహారాజు నుద్దేశించి, ప్రత్యలాపీత్ = ఉత్తరమొసగెను. హేరాజన్ = ఓ రాజా!, త్వయా = నీచే, అద్య = నేడే (అనగా నింతకు పూర్వమెప్పుడునుగాదు) ప్రియా పరిజనోక్తస్య; ప్రియా = ప్రియురాలగు దమయన్తియొక్క, పరిజన = చెలికత్తెలు మున్నగువారిచే, ఉక్తస్య = చెప్పఁబడినమాటకు, మృషోద్యతా = అసత్యవాదిత్వమనెడి, కలఙ్కః = అపవాదము, కుతః = ఎందువలన, శఙ్కితః = సందేహింపఁబడినది. నీ ప్రియురాలగు దమయన్తి యెల్లప్పుడు సత్యవాదిని యగుటవలన నామె పరిజనముగూడ సత్యవాదియే యగునుగావ వారిపై నసత్యవాదిత్వము నారోపించుట యుచితముగాదని యర్థము. ఆమెరాత్రి జరిగిన విషయమును జరుగలేదని యపలాపముచేసినట్లు ఆమెకు పరిజనమగు మేమును నా విధముగనే వ్యవహరించుట దోషముగాదని గూఢాభిప్రాయము.

సమాసములు :

ప్రియాపరిజనోక్తస్య: ప్రియాయాః పరిజనః = ప్రియాపరిజనః, ప్రియాపరిజనేన, ఉక్తమ్ = ప్రియాపరిజనోక్తస్య, తస్య = ప్రియాపరిజనోక్తస్య

భావము :

కళయు రాజునుఁగూర్చి యుత్తర మొసగినది. ఓ రాజా ! నీవు ఈనాడే నీ ప్రియురాలి పరిజనమగు మాపై నసత్యవాదిత్వము నారోపించితివి. ఇది యెట్లు సంభవించును ? నీ ప్రియురాలగు దమయన్తి యెల్లప్పుడును సత్యవాదిని యగుటవలన నామెయొక్క పరిజనమగు మేమసత్య వాదినులమగుట యసంభవము. మీ ప్రియురాలు, రాత్రి జరిగిన మీ విషయమును జరుగనట్లు, అపలావముచేసినట్లే యీమెకు పరిజనమగు మేము గూడ నావిధముగ వ్యవరించుట దోషము కాదని గూఢాభిప్రాయము. ॥115॥

శ్లో. సత్యం ఖలు తదాఽక్రోశం పరం ధుముధుమారవమ్ ।
శృణోమీత్యేవ చావోచం న తు త్వద్వాచమిత్యపి ॥ 116

ప.వి. సత్యమ్ - ఖలు - తదా - అశ్రౌషమ్ - పరమ్ - ధుముధుమారవం - శృణోమి - ఇతి - ఏవ - చ - అవోచమ్ - న - తు - త్వద్వాచమ్ - ఇతి - అపి.

అర్థము: అథవా = లేదా, తదా = పూర్వము చెప్పిన శపథముకంటె పూర్వము చెవులను మూసిన సమయమునందు, పరమ్ = కేవలము, ధుముధుమారవమ్ = "ధుమ్‌ధుమ్" అనెడి లోపలి శబ్దమును, సత్యంఖలు = సత్యముగనే, అశ్రౌషమ్ = వింటిని, చ = మఱియు, "శృణోమీత్యేవ" "అశృణవస్తమామ్" అనుశ్లోక వాక్యముచే ఆ శబ్దమును వినుటను, గుఱించియే, అవోచమ్ = చెప్పితిని, అపి తు = కాని, త్వద్వాచమ్ = నీ మాటను, (చక్కగా వింటినని) ఇతి = అని, న = లేదు, అనగా చెప్ప లేదు. నేనెందువలన "శృణోమి"యని చెప్పితివో. అందువలన నిచ్చట ననత్యదోషము లేదు. శబ్దమును వినుట సత్యమే గదా.

సమాసములు :

ధుముధుమారవమ్ : "ధుమ్‌ధుమ్" ఇతి ఆరవః = ధుముధుమారవః, తం = ధుముధుమారవమ్ ।

భావము :

"వ్యర్థాస్యుర్మమదేవతాః" యని శపథము చేయుటకంటెఁబూర్వమునందుఁ జెవులను మూయుసమయమునందు, నాంతరంగికమైన "ధుముధుమ్" శబ్దమును సత్యముగనే వింటిని. మఱియు "అశృణవన్తమ్" అనెడి శ్లోక భావముచే కేవలము వినుచున్నాననియే చెప్పితిని. నీ మాటను వింటినని చెప్పలేదు. "విను చున్నా"నని చెప్పితిని కాన నిచ్చట ననత్యమేమున్నది. శబ్దశ్రవణము సత్యమేకదా ! ॥116॥

శ్లో. అమన్స్యే దేవ ! తేన త్వాం తద్వైయర్థ్యం నమర్థయే ।
శపథః కర్కశోదర్కః సత్యం సత్యోఽపి దైవతః ॥ 117

ప.వి. అమన్స్యే-దేవ!-తేన-త్వాం-తద్వైయర్థ్యం-సమర్థయే-శపథః - కర్కశో దర్కః-సత్యమ్-సత్యః-అపి-దైవతః.

అర్థము: దేవ!—ఓ రాజా! తేన — "వ్యర్థాఃస్యుర్మమదేవ!తాః" ఇత్యాదిగ ముందుఁజెప్పఁబడిన వాక్యముచే, "హే దేవ—ఓ ప్రభూ!" అని నిన్ను, ఆమన్త్ర్య—అనునయముతోఁబిలచి "తాః అశృణవ న్తమామ్" ఇత్యాది వచనములసత్యములని చెప్పి "అశృణవ న్తమామ"ను శపథ వాక్యమునకు వ్యర్థత్వమనగా నసత్యత్వమును లేదా నేనువినిన "ధుమ్ధుమాది శబ్దములు' వ్యర్థములు, అనగా డిత్థడవిత్థాది శబ్దములవలె నర్థశూన్యములుగా, సమర్థయే—సిద్ధాన్త పఱచుచున్నాను. అనగా "వ్యర్థాఃస్యుర్మమదేవతాః" యనెడి తొలుత "వ్యర్థాఃస్యుఃమమదేవతాః "యను విభాగముతో నా దేవతోపాసనలన్నియు వ్యర్థములగునని శపథముచేసిన కళ, యిప్పుడు "వ్యర్థాఃస్యుఃమమదేవ! తాః"యని విభాగము చేసి, హే దేవ—ఓ నల మహారాజా! అశృణవ న్తమాం" అని చెప్పిన, తాః — ఆ మాటలు లేదా ధుముధుమాది ధ్వనులు, వ్యర్థాః — నిరర్థకములని, సమర్థయే—సిద్ధాన్త పఱచుచున్నానని పదవిభాగమున మార్పుచేసి తాను శపథము చేయలేదని చెప్పినది. శపథముగావించినచో మన్వాదులు చెప్పిన ప్రకారము దోషమేర్పడునని నాకుఁదెలుసును. కాని నేను శపథము చేసినట్లు తనకు భ్రాన్తి గలిగినది. తథా—అది యుక్తమే. దైవతః— దేవత నుద్దేశించి, చేయఁబడిన, సత్యోఽపి—యథార్థమైన, శపథః— శపథము, సత్యమ్—నిశ్చయముగా, కర్కశోదర్కః, కర్కశ — కఠినమైన, ఉదర్కః—ఉత్తర ఫలముగల్గినది, శోచనీయమైన పరిణామము గల్గినదని యర్థము.

"సత్యేనాఽపి శపేద్యస్తు దేవాగ్ని గురుసన్నిధౌ।

తస్య వైవస్వతో రాజా ధర్మస్యార్థం నికృన్తతి"యని మనువు వచనము, పై విషయమునకుఁబ్రమాణము.

సమాసములు :

తద్వైయర్థ్యమ్: వ్యర్థస్యభావః — వైయర్థ్యమ్, తస్యవైయర్థ్యమ్— తద్వైయర్థ్యమ్, తత్ —తద్వైయర్థ్యం।

కర్కశోదర్కః : కర్కశః ఉదర్కః యస్య సః = కర్కశోదర్కః ।
దైవతః : దేవతాముద్దిశ్య కృతః = దైవతః ।

**భావము :**

ఓ రాజా ! "వ్యర్థాఃస్మ్యర్మమ దేవ! తాః" యనునెడ హేదేవ! మమ = నాయొక్క, తాః = ఆ మాటలు, వ్యర్థాః, న్యః = అసత్యములగుచున్నవి. అనగా నిన్ను సంబోధించి "అశృణవన్తమామ్" ఇత్యాదివచనము అసత్యత్వమునుఁ బొందుచున్నది. లేదా తాను వినినట్టి "ధుమ్ధుమ్" అది శబ్దములు "డిత్థడవిత్థాది శబ్దములవలె నర్థరహితములైనవి. కాన వానిని వినుట నిరర్థకమని "వ్యర్థాఃస్యుః మమ దేవ! తాః" యను నా వచనమున కర్థముగా నేను స్మరించుచున్నాను. శపథము గావించినచో మన్వాదులు చెప్పిన దోషమేర్పడునని తెలిసిన నేను శపథము చేయలేను. కాని నేను శపథము గావించినట్లు దేవరవారికి భ్రాన్తిగల్గినది. దేవతలనుద్దేశించిఁ జేసిన శపథము యథార్థమైనను కఠిన ఫలము నొసంగుననుట పత్యము. అట్టి శపథము గావించిన వారి పుణ్యము సగపాలు యముడు ఖండించునని మనువు చెప్పియున్నాడు. ॥117॥

శ్లో. అసమ్భోగ కథారమ్భైర్వఞ్చయేధే కథం ను మామ్ ।
హన్త! నేయ మనర్హాస్త్రీ యత్తు విప్రలభే యువామ్॥ 118

ప.వి. అసమ్భోగకథారమ్భైః - వఞ్చయేధే - కథం - ను - మాం - హన్త! - న - ఇయం - అనర్హాస్త్రీ - యత్ - తు - విప్రలభే - యువామ్.

అర్థము: యువామ్ = మీరిఋవురు, అనగా దమయన్తీ నలులు : అసమ్భోగకథారమ్భైః = అసమ్భోగ = సంభోగ చిహ్నములున్నను, "దమయన్తి నన్ను ముట్టలేదని నలుఁడవైన నీవును, నలుడు నన్ను ముట్టుట లేదని దమయన్తి వైన నీవును చెప్పునట్టి సంభోగరహితములైన విషయము లనుఁజెప్పెడి మాటలయొక్క యారంభవులచేత, మామ్ = కళనైన నన్ను, కథంను = ఏ విధముగా, వఞ్చయేధే = వంచింతురు?, తు = కాని, యువామ్ = మిమ్ములనిద్దఱిని, విప్రలభే = నేను వంచింతును. ఇతియత్ = అనుట యేది గలదో, సా = ఆ వంచన, అనర్హాస్త్రీ హన్త! = అయుక్త

మైనదా యేమి ? నన్ను వంచించుట మీ యిరువురికిని తగినది. మిమ్ము నను నేను వంచించుట యయుక్తము. ఇది యాశ్చర్యకరము.

"యత్తు విప్రలభేయువామ్" అనునెడ 'యత్తు' స్థానమున "యన్న"యను పాఠముననుసరించినచో-అనర్థస్త్రీ = దాసియగుటవలన నయోగ్యురాలైన,సా= ఆ, ఇయమ్ = ఈ కళనైన నేను వంచకులగు మిమ్ముల నిద్దఱిని నెందువలన వంచించలేదో, దానినిఁగూర్చి మీరేమి భావింతురు ? "శఠేశాఠ్యం సమాచరేత్" యనునీతి ననుసరించి వంచకుల విషయమున వంచనయే తగినది గదా !

**సమాసములు ;**

అసంభోగ కథారమ్భైః : అవిద్యమానః, సంభోగః యాసు తాః = అసమ్భోగాః, అసమ్భోగాశ్చతాః కథాశ్చ = అసంభోగకథాః, అసమ్భోగ కథానామారమ్భాః, అసమ్భోగ కథారమ్భాః, తైః = అసమ్భోగ కథారమ్భైః ।

అనర్థస్త్రీ : న అర్థస్త్రీ = అనర్థస్త్రీ ।

**భావము :**

నేను అసత్యపు శపథములచే మిమ్ములవంచించుటయందు దోషములేదు. ఏలయనగా - దమయన్తి నలులగు మీరిరువురు, సంభోగ చిహ్నములను వహించియు, "దమయన్తి నన్ను ముట్టుటలే"దని నలుడవైననీవును, "నలుడు నన్ను ముట్టుటలే"దని దమయన్తివైన నీవును నొండొరులపై, సంభోగరాహిత్యమును వెల్లడిచేయు మాటలచే కళయైననన్నెట్లు వంచింతురు? కాని మిమ్ముల నిరువురిని నేను వంచించుచున్నానని చెప్పుచున్నారు. కాని ఈ నా వంచనయెట్లు అయుక్తము? మీరు నన్ను వంచించుట యుక్తము. నేను మిమ్ములను వంచించుట యుక్తముగాద నుట యాశ్చర్యకరము. లేదా "యత్తు"నకు బదులు"యన్న"యను పాఠము ననుసరించినచో దాసియగుటవలన ననర్హురాలనను కళనైననేను, నన్ను వంచించెడి మిమ్ములనేల వంచింపలేదో దానినిఁగూర్చియేమి భావింతురు ?" "వంచకుని యందు వంచనయే సముచితమ"ను నీతి ననుసరించి మీయెడ వంచనయే సముచితముగదా. ॥118॥

శ్లో. కర్ణే కర్ణే తతస్సఖ్యౌ శ్రుతమాచఖ్యతుర్మిథః ।
ముహుర్విస్మయమానే చ స్మయమానే చ తే బహు ॥ 119

ప.వి. కర్ణే - కర్ణే - తతః - సఖ్యౌ - శ్రుతమాచఖ్యతుః - మిథః - ముహుః - విస్మయమానే - చ - స్మయమానే - చ - తే - బహు .

అర్థము: తతః = తర్వాత, తే = ఆ, సఖ్యౌ = చెలికత్తెలిఋవురు అనగాకళయు, నామెకు సహాయురాలును, ముహుః = పలుమాఱులు, విస్మయమానే = ఆశ్చర్యపడుచును, తథా = అట్లే, స్మయమానే = చిఱునగవు నవ్వుచును, శ్రుతమ్ = వినఁబడినట్టి, ముందుఁజెప్పఁబడిన రహస్యమును, మిథః = ఒండొరులకు, కర్ణే కర్ణే = ఒండొరుల చెవులయొద్ద ముఖముఁబెట్టి నిశ్శబ్దముగా, బహు = చాలకాలము, అచఖ్యతుః = చెప్పుకొను చుండిరి.

భావము:

తర్వాత కళయు నామెకు సహాయురాలైన చెలికత్తెయు పలుమాఱులాశ్చర్యముఁజెందుచును, మందహాసములనుఁగావించుచును, ముందుఁజెప్పఁబడిన రహస్యవిషయముల నన్నింటి నొండొరులకుఁజెవులయొద్ద ముఖముంచి నిశ్శబ్దముగాఁజాలకాలముఁజెప్పుకొనుచుండిరి. ॥119॥

శ్లో. అథాఽఽఖ్యాయి కలాసఖ్యా కుప్య మే దమయన్తి! మా ।
కర్ణాద్ద్వితీయతోఽప్యస్యాః సజ్గోప్యైవ యదబ్రువమ్ ॥ 120

ప.వి. అథ - ఆఖ్యాయి - కలాసఖ్యా - కుప్య - మే - దమయన్తి - మా - కర్ణాత్ - ద్వితీయతః - అపి - అస్యాః - సజ్గోప్య - ఏవ - యత్ - అబ్రువమ్ ॥

అర్థము: అథ = ఇట్లొండొరులు చెప్పుకొనిన పిదప, కలాసఖ్యా = కళయొక్క చెలికత్తెచే. ఆఖ్యాయి = చెప్పఁబడినది. ఏమనగా- హే దమయన్తి! = ఓ దమయన్తీ ! మే = నాకై మాకుప్య = కోపింపకుము. యత్ = ఏల

యనగా, ద్వితీయాత్ = రెండవదైన, కర్ణాదపి = చెవివలనను, సఙ్గోప్య = దాచి, అస్యా ఏవ = ఈకళకే, అబ్రువమ్ = ఈ రహస్యముఁజెప్పితిని ॥

సమాసములు :

కలాసఖ్యా : కలాయాః సఖీ = కలాసఖీ, తయా = కలాసఖ్యా.

**భావము :**

ఇట్లు చెలికత్తె లిరువురు మాట్లాడినపిదప కళయొక్క చెలికత్తె యిట్లు చెప్పినది. ఓ దమయన్తీ ! నాకై నీవు కోపపడకుము. రెండవ చెవికిఁగూడఁ దెలియనీయక మఱుగుపఱచి ఈ కళకు నేను రహస్యముఁజెప్పితిని. కాన నితరు లెవ్వరికినిది తెలియదు. ॥120॥

శ్లో. **మిథః ప్రియామథాచష్ట దృష్టం కపటపాటవమ్ ।**
**వయస్యయోరిదం తస్మాన్మా సఖీష్వేవ విశ్వసీః ॥ 121**

ప.వి. మిథః - ప్రియామ్ - అథ - ఆచష్ట - దృష్టమ్ - కపటపాటవః - వయస్యయోః - ఇదమ్ - తస్మాత్ - మా సఖీషు - ఏవ - విశ్వసీః.

అర్థము: అథ = కలానఖుల సంభాషణమైన పిదప, ప్రియః = ప్రియుడైన నల మహారాజు, ప్రియా = ప్రియురాలగు దమయన్తినిఁగూర్చి, ఆచష్ట = చెప్పెను-ఏమనగా- హే ప్రియే = ఓ ప్రియురాలా ! వయస్యయోః = చెలికత్తెలైన, కళయొక్కయు, నామెయొక్కచెలికత్తెయొక్కయు, ఇదం = నీ యెదుటజరిగిన, కపటపాటవమ్ = మోసమందలి నేర్పు, దృష్టమ్ = చూడఁ బడినదిగదా!, తస్మాదేవ = అందువలననే, సఖీషు = చెలికత్తెలయందు, మా విశ్వసీః = విశ్వాసము నుంచుకుము. అనగా నా యెడనే విశ్వాస ముంచుమని యర్థము.

సమాసములు ;

కపటపాటవమ్ : పటోర్భావం = పాటవమ్, కపటస్యపాటవమ్ = కపటపాటవమ్ ।

భావము ;

కళయును, నామెకు సహాయురాలగు చెలికత్తెయునుఁ బై విధముగా సంభాషించిన పిదప; ప్రియుడైన నలుఁడు ప్రియురాలైన దమయన్తినిఁగూర్చి యిట్లు చెప్పెను. ఏమనగా-నీ యెదుట కళయు దానియొక్క చెలికత్తెయుఁజేసిన మోసమునందలి నేర్పునుఁజూచితివిదిగదా! కావున నెప్పుడును చెలికత్తెలయెడ విశ్వాసముంచకుము. ॥121॥

శ్లో. ఆలాపి కలయాఽపీయం పతిర్నాలపతి క్వచిత్ ।
వయస్యోఽసౌ రహస్యం తత్ సభ్యే విస్రభ్యమీదృశీ॥ 122

ప.వి. ఆలాపి - కలయా - అపి - ఇయమ్ - పతిః - న - ఆలపతి - క్వచిత్ - వయస్యః - అసౌ - రహస్యమ్ - తత్ - సభ్యే - విస్రభ్యమ్ - ఈదృశి

అర్థము: కలయాఽపి = కళచేతను, ఇయమ్ = ఈ దమయన్తి ఆలాపి = చెప్పబడినది. ఏమనగా - హే దమయన్తీ! = ఓ దమయన్తీ!, అసౌ = ఈ, పతిః = నీయొక్క భర్తయగు నలుఁడు, క్వచిత్ = ఎక్కడను, నాఽలపతి = (దాచఁదగిన రాత్రి విషయమును) చెప్పడు. (కావుననే), ఈదృశీ = ఇటువంటి, సభ్యే = సభ్యత గల్గిన యనగా సజ్జనులైన, వయస్యే = చెలికత్తెలిఱువురికి, తత్ = ముందుఁజెప్పిన, రహస్యమ్ = గోప్యమైన విషయము, విస్రభ్యమ్ = నమ్మి చెప్పఁదగినది. ఇచ్చట విపరీత లక్షణచే-అసౌ = ఈ, తే = నీయొక్క, పతిః = భర్తయగు నలుఁడు అంతటను నీయొక్క రహస్యమునుఁజెప్పును. కావుననే యిట్టి చెలికత్తెలను నమ్మరాదు.

భావము :

కళయు, దమయన్తినిగూర్చిఁజెప్పినది. ఓ దమయన్తీ! నీ భర్తయగు నలమహారాజు ఎచ్చటను రాత్రియందు జరిగిన నీయొక్క రహస్య విషయమునుఁజెప్పడు. కావుననే సజ్జనులైన యిట్టి చెలికత్తెలనుద్దేశించి రహస్య విషయములను నమ్మి చెప్పవచ్చును. విపరీతలక్షణచే-ఓ దమయన్తీ! నీ భర్తయంతటను

నీ రహస్యమును(జెప్పుచున్నాడు. కావుననే యిట్టి చెలికత్తెలయందు విశ్వాస మొంచరాదు. ॥122॥

శ్లో. ఇతివ్యత్తిష్ఠమానాయాం తస్యామూచే నలః ప్రియామ్ ।
భణ భైమి ! బహిః కుర్వే దుర్వినీతే ! గృహాదమూ ॥ 123

ప.వి. ఇతి - వ్యత్తిష్ఠమానాయామ్ - తస్యామ్ - ఊచే - నలః - ప్రియామ్ - భణ - భైమీ - బహిః - కుర్వే - దుర్వినీతే - గృహాత్ - అమూ -

అర్థము: తస్యామ్ = ఆ కళ, ఇతి - ఇట్లు, వ్యత్తిష్ఠమానాయామ్ = విరోధమును గల్పించుచుండగా, అనగా - సమానమగు భావముతోడనే విరోధివలె వ్యవహరింప(దొడగగా, నలః = నలమహారాజు, ప్రియామ్ = దమయన్తి, నుద్దేశించి, ఊచే = చెప్పెను. ఏమనగా - హేభైమి = ఓ దమయన్తీ !, దుర్వినీతే = వినయరహితలైన, అమూ = చెలికత్తెలగు వీరిద్దఱిని గృహాత్ = ఇంటినుండి, బహిః = వెలుపలికి, కుర్వే = గెంటుదునా ?, భణ = చెప్పుము. అనగా నాదేశింపుమని యర్థము.

భావము :

ఆ కళ యీ విధముగా నొక్క భావముతోడనే, విరోధము నాచరించు చుండగా అనగా విరోధినివలె వ్యవహరించు చుండగా-నలమహారాజు ప్రియురాలగు దమయన్తి నుద్దేశించి చెప్పెను - ఏమనగా - ఓ దమయన్తీ ! దుర్వినయము గావించెడి యీ చెలికత్తెలనిద్దఱిని నింటినుండి గెంటెదను. అనుమతి నొసంగుము - ॥123॥

శ్లో. శిరః కమ్పానుమత్యాఽథ సుదత్యా ప్రేరితః ప్రియః ।
చులకం తుచ్ఛముత్సర్ప్య తస్యాః సలిలమక్షిపత్ ॥ 124

ప. వి. శిరః - కమ్పానుమత్యా - అథ - సుదత్యా - ప్రేరితః - ప్రియః - చులుకమ్ - తుచ్ఛమ్ - ఉత్సర్ప్య - తస్యాః - సలిలమ్ - అక్షిపత్ -

అర్థము: అథ = నలుడు పై విధముగా( జెప్పిన పిదప, సుదత్యా = మంచి దన్తములు గల్గిన దమయన్తిచే, శిరకమ్పానుమత్యా; శిరః కమ్ప =

తలను కొంచెమాడించుట యనెడి, యనుమత్యా = అంగీకారముచే ననగా౯ జెలికత్తెలను వెలుపలికి గెంటెడి విషయమునందు సమ్మతిని౯ సూచించుటచే, ప్రీణితః = సంతోషపెట్ట౯బడిన, ప్రియః = కాన్తుడైన నలు౯డు, తుచ్ఛమ్ = రిక్తమైన యనగా జలశూన్యమైన, చులుకమ్ = అరచేలని, ననగా దోసిలిని, ఉత్క్షిప్య = పైకెత్తి, తస్యాః = ఆ కళకు౯బైన, సలిలం = నీటిని, అక్షిపత్ = చల్లెను.

సమాసములు :

శిరః కమ్పానుమత్యా : శిరసః కమ్పః = శిరఃకమ్పః, శిరః కమ్ప ఏవ అనుమతిః = శిరః కమ్పానుమతిః తయా = శిరః కమ్పానుమత్యా।
సుదత్యా : శోభనాః దన్తాః యస్యాస్సా = సుదతీ, తయా = సుదత్యా।

భావము :

నలు౯డు మాటలాడిన పిదప, దమయన్తి తన తలనూపి, చెలికత్తెలను వెలుపలికి గెంటివేయుట కనుమతి నొసంగినది. దాని వలన నలుడు సంతోషించిన వాడై, తన శూన్య హస్తములను జోడించి దోసిలిగా౯జేసి దానియందు జలమును రప్పించి యా కళపై౯ జల్లెను. ॥124॥

శ్లో. తచ్చిత్రదత్త చిత్తాభ్యాముచ్చైః సిచయసేచనమ్।
తాభ్యామలమ్భి దూరేఽపి నలేచ్ఛాపూరిభిర్జలైః॥ 125

ప. వి. తచ్చిత్రదత్తచిత్తాభ్యాం - ఉచ్చైః - సిచయసేచనమ్ - తాభ్యామ్ - అలమ్భి - దూరే - అపి - నలేచ్ఛాపూరిభిః - జలైః.

అర్థము: తచ్చిత్రదత్త చిత్తాభ్యామ్, తత్ = ఆ, చిత్ర = (రిక్తహస్తములనుండి జలమును గల్పించి చల్లుటయను) ఆశ్చర్యమునందు, దత్త = ఈయ౯బడిన చిత్తాభ్యామ్ = మనస్సులు గ్గలిగిన, (అందువలననే బయటికి వెళ్ళడము మఱచిన) తాభ్యామ్ = ఆ యిరువురి చెలికత్తెలచే, దూరేఽపి = దూరము నందున్నను, నలేచ్ఛా పూరిభిః = నింపుచున్న, జలైః = ఉదకములచే, ఉచ్చైః = అధికముగా, సిచయసేచనమ్; సిచయ = వస్త్రమును, సేచనమ్ = తడుపుట, అలమ్భి = పొంద౯బడినది.

సమాసములు :

తచ్చిత్రదత్త చిత్తాభ్యామ్ : తచ్చతత్ చిత్రంచ = తచ్చిత్రమ్, తచ్చిత్రే దత్తమ్. చిత్తం యాభ్యాం తే = తచ్చిత్రదత్తచిత్తే, తాభ్యామ్ = తచ్చిత్ర దత్త చిత్తాభ్యామ్।

సిచయసేచనమ్ : సిచయస్య సేచనమ్ = సిచయసేచనమ్।

నలేచ్ఛాంపూరిభి : నలస్య ఇచ్ఛా = నలేచ్ఛా. నలేచ్ఛాం పూరయ స్తీతి = నలేచ్ఛా పూరిణీ, తైః = నలేచ్ఛాపూరిభిః।

భావము :

శూన్య హస్తములయందు నీటిని గల్పించుట యను నా యద్భుతములచే నాకర్షింపబడిన మనస్సులుగల యా చెలికత్తెలిద్దఱును దూరమందున్నను, వరుణుని వరముచే నా నలుని కోరికను దీర్చెడి యాయుదకములు వారిపైఁ బడి వారి వస్త్రములనుఁ దడిపినవి. ॥125॥

శ్లో. వరేణ వరుణస్యాయం సులభై రమ్భసాం భరైః।
ఏతయోః స్తిమితీచక్రే హృదయం విస్మయైరపి॥ 126

వ. వి. వరేణ - వరుణస్య - అయమ్ - సులభైః - అమ్భసామ్ - భరైః - ఏతయోః - స్తిమితీచక్రే - హృదయమ్ - విస్మయైః - అపి.

అర్థము: అయమ్ = ఈ నలమహారాజు, వరుణస్య = జలాధిపతియగు వరుణుని యొక్క వరేణ = వరదానముచే, సులభైః = సుఖముగా లభించెడి, అమ్భసామ్ = ఉదకముల యొక్క, భరైః = ప్రవాహములచేతను, తథా = అట్లే, విస్మయైరపి = శూన్యహస్తములనుండి నీటిని వెప్పించుట వలని యద్భుత రసములచేతను, ఏతయోః = ఈ చెలికత్తెలయొక్క, హృదయమ్ = వక్షఃస్థలమును (చిత్తమును) స్తిమితీ చక్రే = తడిపెను. (స్థిరపరచెను)

వి. "హృదయమును స్తిమిత పరచెను" అనునెడ స్తిమిత హృదయ శబ్దములు రెండును విశేషణ విశేష్యభావముచే నర్థద్వయమునుఁ జెప్పుటవలన ప్రకృతశ్లేష.

సమాసములు :

సులభైః : సుఖేనలబ్ధుం శక్యాః=సులభాః, తైః=సులభైః।
స్తిమితీ చక్రే : అస్తిమితం స్తిమితం సమ్పద్యమానం చక్రే=స్తిమితీ చక్రే।

భావము :

ఈ నలమహారాజు జలాధిపతియగు వరుణుఁడొసంగిన వరము యొక్క మహిమచే, సుఖముగా లభించెడి యుదకములచేతను, శూన్య హస్తముల నుండి వెడలిన యుదకముల, జూచుటచేఁ గల్గిన యద్భుత రసములచేతను ఈ చెలి కత్తెల హృదయము ననగా వక్షఃస్థలమును, మనస్సును స్తిమితము గావించెను. అనగా నీటిచే తొమ్మను దడిపెను. ఆశ్చర్యరసముచే మనస్సును నిశ్చలము గావించెను. ॥126॥

(యుగ్మమ్)

శ్లో. తేనాపి నాపసర్పన్త్యా దమయన్తీమయం తతః।
హర్షేణాదర్శయత్ పశ్య నన్విమే తన్వి! మే పురః॥ 127
క్లిన్నీకృత్యాఽమ్భసా వస్త్రం జైన ప్రవ్రజితీ కృతే।
సఖ్యౌ సక్షౌమభావేఽపి నిర్విఘ్న స్తనదర్శనే॥ 128

ప. వి. తేన - అపి - న - అపసర్పన్త్యా - దమయన్తీమ్ - అయమ్ - తతః - హర్షేణ - అదర్శయత్ - పశ్య - నను - ఇమే - తన్వి! - మే - పురః 127

క్లిన్నీకృత్య - అమ్భసా - వస్త్రమ్ - జైనప్రవ్రజితీకృతే - సఖ్యౌ - సక్షౌమభావే - అపి - నిర్విఘ్న స్తనదర్శనే.

అర్థము: తతః=నీటితోఁదడిపినపిదప, అయమ్=ఈ నలుడు, నను తన్వి!=ఓ కృశాంగీ!, అమ్భసా=ఉదకముచే, వస్త్రమ్=వస్త్రమును, క్లిన్నీ కృత్య=తడిపి, సక్షౌమభావేఽపి=పట్టువస్త్రముతోఁ గప్పఁబడినను, నిర్విఘ్న స్తన దర్శనే; నిర్విఘ్న=అడ్డములేక యనగా కప్పులేక, స్తన

దర్శనే=స్తనములను, గనుపఱచెడి యనగా - శుభ్రమైనట్టి. తడసిన వలువచేఁ గప్పఁబడినను నా వలువ పలుచని దైనందువలన, శరీరమందలి, సకలావయవములు, కానవచ్చుటవలన, (కావుననే) జైన ప్రవ్రజతీ కృతే=దిగంబరలైన జైనసన్న్యాసినులుగాఁ జేయఁబడినను, న అపసర్పన్త్యౌ=తొలగిపోనటువంటి, మే=నాయొక్క, పురః=ఎదుట నున్నట్టి, ఇమే=ఈచెలికత్తెలను, పశ్య=చూడుము. ఇతి=ఇట్లు, హర్షేణ=స్తనాదులనుఁ జూచుటవలని యానన్దముతో, దమయన్తీమ్=దమయ నినిఁ గూర్చి, అదర్శయత్=వ్రేలితోఁ జూపెను. ఈ ఘటనచే సిగ్గుపడినట్టి యా చెలికత్తెలిద్దఱు నింటినుండి వెడలిపోఁగలరనెడి భావనయు, దానిచే, దమయన్తి ననుభవింపఁగోరికయు. నలునకున్నట్లు సూచితములు.

సమాసములు :

క్లిన్నీకృత్య: అక్లిన్నం క్లిన్నం సమ్పద్యమానం కృత్వా=క్లిన్నీకృత్య
జైనప్రవ్రజతీ కృతే :అప్రవ్రజత్యౌ, ప్రవ్రజత్యౌ, సమ్పద్యమానేకృతే, ప్రవ్రజతీ కృతే, జైనానాం ప్రవ్రజతీకృతే, జైనప్రవ్రజతీకృతే, తే=జైనప్రవ్రజతీ కృతే।

సక్షౌమ భావే : క్షౌమస్యభావః=క్షౌమభావః, క్షౌమభావేన, సహవర్తేతే ఇతి=క్షౌమస్య భావే, తే=సక్షౌమభావే।

నిర్విఘ్న స్తనదర్శనే : స్తనయోః దర్శనమ్=స్తనదర్శనమ్, నిర్విఘ్నం, స్తన దర్శనం యయోస్తే=నిర్విఘ్న స్తన దర్శనే, తే = నిర్విఘ్న స్తనదర్శనే ।

భావము :

ఇట్లు నీటితోఁదడిపిన నలుడు, దమయన్తిఁ బిలిచి, యో కృశాఙ్గీ! నీటిని బొమ్మలపైఁ జల్లుటవలన దానికిఁ గప్పుగానున్న పలుచని పట్టు వలువ తడిపినందువలన, లోన నున్న స్తనములనుఁ జక్కఁగాఁ జూపుచు దిగమ్బర సన్న్యాసినులవలెఁ జేయఁబడినను, తొలగిపోక, నా యెదుటనున్న యీ చెలికత్తెలనుఁ జూడుమని వ్రేలితోఁ జూపెను. ఇట్లుచేయుటచే సిగ్గుపడి యా చెలికత్తెలిరువురును గృహమునుండి వెడలిపోగలరనియు నప్పుడు దమయన్తిని సంభోగింప వచ్చుననియు నలుని గూఢాశయమిట సూచితము. ॥127 - 128॥

శ్లో. అమ్భునః శమ్బరత్వేన మాయైవా విరభూదియమ్।
యత్పటావృత మప్యఙ్గ మనయోః కథయత్యదః॥ 129

ప.వి. అమ్భునః - శమ్బరత్వేన - మాయా - ఏవ - ఆవిరభూత్ - ఇయమ్-
యత్ - పటావృతమ్ - అపి - అఙ్గమ్ - అనయోః కథయతి -అదః.

అర్థము: అదః = ఈ నలుడు చల్లిన యీ యుదకము, పటావృతమపి, పట =
వస్త్రముతో, ఆవృతమపి = కప్పబడినదైనను, అనయోః = ఈ చెలికత్తెల
యొక్క, అఙ్గమ్ = స్తనములు మున్నగు రహస్యావయవములను,
యత్ = ఎందువలన, కథయతి = ప్రకటించుచున్నదో, ఇయమ్ = వలు
వతోఁ గప్పఁబడినను యవయవములనుఁ బ్రకటించెడి యీదశ, అమ్భు
నః = ఉదకమునకు, శమ్బరత్వేన = శమ్బరమను మాఱుపేరుండుట
చేతను, (శంబరాసురత్వము చేతను) నేర్పడిన, మాయైవ = మాయయే,
శాంబరమాయయే, ఆవిరభూత్ = ప్రకటితమైనది. అట్లుకానిచో, నగ్నులు
అనగా బెసమొలలుకాని యీ చెలికత్తెలయొక్క స్తనాదులెట్లు కానవచ్చును.

సమాసములు :

శమ్బరత్వేన : శమ్బరస్యభావః = శమ్బరత్వమ్, తేన = శమ్బరత్వేన.
పటావృతమ్ : పటేన ఆవృతమ్ = పటావృతమ్।

భావము :

నలుడు వెదజల్లిననీరు వస్త్రాదులతోఁ గప్పఁబడినదైనను, నీచెలికత్తెల స్తనా
దులగు నిగూఢావయవములనుఁ గన్పరచుటవలన నిది శమ్బర మాయగా భావింప
దగియున్నది. ఏలయనగా జలమునకు శమ్బరమనియు నామముగలదు. అందు
వలన నిది శమ్బరమనియు శమ్బరాసురుడనియు గ్రహింపఁదగినది. శమ్బరా
సురుడు మాయలనుఁ బన్నువాడుగాన, నాతని మాయ శామ్బరిమాయ యని చెప్పఁ
బడును. కప్పఁబడిన స్తనాద్యవయవములు శమ్బరమనఁబడు జలమును, జల్లు
టచేఁ బయట పడుట శామ్బరి మాయగా ననగా జలసంబంధమగు మాయగను,
శంబరాసురుని మాయగ నగుచున్నది. ఆ మాయ చేతనే వస్త్రముతోఁ గప్పఁబడిన

స్తనాదులు ప్రకటితములైనవని జలమునకు శమ్బరశబ్ద వాచ్యత్వమునుఁబట్టి కల్పితము. అనగా నుదకములనుఁ జల్లుటవలన పలుచని వలువ తడిసినది. అందువలన లోనున్న స్తనములు కనఁబడఁదొడగినవని యాశయము. ॥129॥

శ్లో. వాససో౽వా౽మ్బరత్వేన దృశ్యతేయ ముపాగమత్।
చారు హారమణి శ్రేణి తారవీక్షణ లక్షణా॥ 130

ప.వి. వాససః - అమ్బరత్వేన - దృశ్యతా - ఇయమ్ - ఉపాగమత్ - చారు హారమణి శ్రేణితారవీక్షణ లక్షణా.

అర్థము: వా = లేదా, చారుహారమణి శ్రేణి తార వీక్షణ లక్షణా; చారు = మనోహరములైన, హారమణిశ్రేణి = హారములయందలి మణులవరుసలనెడి, తార = నక్షత్రములయొక్క, వీక్షణ = దర్శనమనెడి, లక్షణా = లక్షణముగల్గిన, ఇయం = ఈ, దృశ్యతా = స్తనాదులను దర్శించు యోగ్యతయు, (ఆకాశరూపముతో దర్శించు యోగ్యతయు) వాససః = వస్త్రమునకు, అమ్బరత్వేన = వస్త్రముగ నుండుటచేతను, (ఆకాశముగా నుండుటచేతను) ఉపాగమత్ = సంభవించినది.

సమాసములు :

అమ్బరత్వేన : అమ్బరస్య భావః = అమ్బరత్వమ్, తేన = అమ్బరత్వేన।
దృశ్యతా : ద్రష్టుం యోగ్యం, = దృశ్యం, దృశ్యస్య భావః = దృశ్యతా।
చారుహారమణి శ్రేణి తార వీక్షణ లక్షణా : మణీనాం శ్రేణయః = మణిశ్రేణయః, హారేషు మణిశ్రేణయః = హారమణి శ్రేణయః, చారవశ్చ తే హారమణి శ్రేణయశ్చ = చారుహారమణి శ్రేణయః, చారుహారమణిశ్రేణయ ఏవ తారాః = చారుహారమణి శ్రేణితారాః, చారుహారమణిశ్రేణి తారానామ్, వీక్షణమ్, లక్షణం యస్యాస్సా = చారుహారమణి శ్రేణి తారావీక్షణ లక్షణా।

భావము :

ముత్తెపు హారములయందలి మనోహరములగు రత్నపు వరుసలనెడి నక్షత్రములను దర్శించుటయే స్వరూపముగాగల్గిన యీ దృశ్యత్వము అనగా స్తనా

ద్యవయవములను చూచెడి యర్హతయు, ఆకాశరూపముతో దర్శన యోగ్యతయు వస్త్రమునకు - అంబరత్వముండుటచేతను (ఆకాశత్వముండుట చేతను) సంభవించినది. అంబరమున - ననగా శరీరమునకుఁ గట్టుకొనిన వక్షః స్థలమునుఁ గప్పిన వస్త్రముపై నుదకములు పడుటవలన వక్షః స్థలము నలంకరించిన ముక్తాహారము నందలి రత్నావళులనెడి నక్షత్రములను దర్శించుటయే స్తనాది దర్శన యోగ్యతయు, ఆకాశరూపముతో, దర్శన విషయత్వము నగుచున్నది. వస్త్రము - అంబరముగను ననగా వస్త్రముగను, నాకసముగను నైనదని యర్థము. అంబరమునందు ననగా నాకసమందు నక్షత్రములు కనబడునట్లు అంబరమునందు ననగా వస్త్రమునందు ననగా వారిపైటలయందు లోనున్న ముక్తాహారమునందలి రత్నరాజములు కనఁబడినవి. ॥130॥

శ్లో. తే నిరీక్ష్య నిజావస్థాం హ్రీణే నిర్యయయతుస్తతః।
తయోర్వీక్షారసాత్ సఖ్యః సర్వానిశ్చ్రక్రముః క్రమాత్॥ 131

ప.వి. తే - నిరీక్ష్య - నిజావస్థామ్ - హ్రీణే - నిర్యయయతుః-తతః -తయోః- వీక్షారసాత్ - సఖ్యః - సర్వాః - నిశ్చ్రక్రముః - క్రమాత్.

అర్థము: తే = ఆచెలికత్తెలిరువురు, నిజావస్థాం = జలముతోఁదడుపుటవలనగోప్యములగు స్తనాద్యవయవములు బయటఁబడుటయను, తమయొక్క దశను, నిరీక్ష్య = చూచి, హ్రీణే = సిగ్గుచెందినవారై, తతః = ఆ యింటినుండి, నిర్యయయతుః = వెడలిపోయిరి. తతః = తర్వాత, తయోః = కళ యొక్కయు, ఆమె చెలికత్తె యొక్కయు, వీక్షారసాత్ = దర్శనాభిలాష వలన, సర్వాః = సకలులైన, సఖ్యః = తక్కిన చెలికత్తెలు క్రమాత్ = క్రమము ననుసరించి ఒక్కొక్కరుగా, నిశ్చ్రక్రముః = బయలువెడలిరి.

సమాసములు :

నిజావస్థామ్: నిజాచ సా అవస్థా చ = నిజావస్థా తామ్ = నిజావస్థామ్।
వీక్షారసాత్ : వీక్షాయాం రసః = వీక్షారసః, తస్మాత్ = వీక్షారసాత్।

భావము :

ఆ చెలికత్తెలిరువురు నలుఁడు చల్లిన నీటిచే తడిసినవారై యందువలన

తమ రహస్యావయవములు బయటపడుటయను తమదశను జూచి సిగ్గు జెందిన వారై యా యింటినుండి వెడలిపోయిరి. తర్వాత వారిఇవురిని జూడ గోరికతో తక్కిన సఖులందఱు నొక్కొక్కరుగా బయలు వెడలిపోయిరి. ॥ 31॥

శ్లో. తా బహిర్భూయ వైదర్భీ మూచుర్నీతా వధీతిని।
ఉపేక్ష్యే తే పునః సఖ్యౌ మర్మజ్ఞే నాఽధు నాప్యమూ॥ 132

ప.వి. తాః - బహిర్భూయ - వైదర్భీమ్ - ఊచుః - నీతౌ - అధీతిని - ఉపేక్ష్యే - తే - పునః - సఖ్యౌ - మర్మజ్ఞే - న - అధునా - అపి - అమూ।

అర్థము: తాః = ఆ చెలికత్తెలు, బహిర్భూయ = వెలుపల నుండి, వైదర్భీమ్ = దమయన్తిని ఊచుః = చెప్పిరి. ఏమనగా = హే నీతా అధీతిని! = ఓ నీతి శాస్త్రాధ్యయన పరురాలా!, అమూ = ఈ, మర్మజ్ఞే = మీ మర్మములను తెలిసికొనిన, సఖ్యౌ = చెలికత్తెలగు కళయు, నామెకు సహాయురాలైన మతియొక సఖియు, అధునాఽపి = ఇప్పుడును, తే = నీకు, నైవ ఉపేక్ష్యే = ఉపేక్షింపదగినవారుకారు. "మర్మజ్ఞం న ప్రకోపమేత్" అను నీతి ననుసరించి శీఘ్రమే వెళ్ళి ఊరడింపదగినవారు. అట్లుకానిచో నీ యొక్క రహస్య మంతయు బయటబడును.

సమాసములు :

బహిర్భూయ : బహిః భూత్వా = బహిర్భూయ।

అధీతిని : అధీతమస్యాః అస్తీతి = అధీతినీ, తస్యాః సంబుద్ధిః = హే అధీతిని।

ఉపేక్ష్యే : ఉపేక్షితుమ్ యోగ్యే - ఉపేక్ష్యే।

మర్మజ్ఞే : మర్మ జానీత ఇతి = మర్మజ్ఞే।

భావము :

ఆ చెలికత్తెలిఇవురు బయటకువచ్చి దమయన్తింగూర్చిచెప్పిరి. ఏమనగా- "ఓ నీతి శాస్త్రమును జదివిన దమయన్తీ! ఈ యిద్దఱును నీ యొక్క రహస్యమును తెలిసిన చెలికత్తెలు కాన వీరినిద్దఱిని - అనగా కళను, ఆమెకు సహాయు

రాలగు పక్షియొక్క చెలికత్తెను ఉపేక్షింపక ముందుపలెనే యుంచుకొనుము. రహస్యమునుఁ దెలిసిన చెలికత్తెలను విడువరాదు. కావున శీఘ్రముగా వెళ్ళి వారి నూరడింపుము. అట్లుగానిచో వారు నీ రహస్యమును బయలుఁబెట్టగల"రని చెప్పిరి 132

శ్లో. ఉచ్చైరూచేఽథ తా రాజా సఖీయ మిదమాహ వః।
శ్రుతం మర్మ మమైతాభ్యాం దృష్టం మర్మమయా తయోః॥133

ప.వి. ఉచ్చైః - ఊచే - అథ - తాః - రాజా - సఖీ - ఇయం - ఇదమ్ - ఆహ - వః - శ్రుతం - మర్మ - మమ - ఏతయోః.

అర్థము: అథ = చెలికత్తెలు చెప్పిన మాటలు వినిన పిదప, రాజా = నలమహారాజు, తాః = ఆ చెలికత్తెలను, ఉచ్చైః = (వారు దూరము వాపోయి యుండుటవలన) బిగ్గరగా, ఊచే = చెప్పెను. కిమితి = ఏమనగా - ఏతాభ్యాం = ఈ కళచేతను, నామెయొక్క చెలికత్తె చేతను, మమ = నా యొక్క, మర్మ = రహస్యము, శ్రుతం = వినఁబడినదేకాని చూడఁబడలేదు. మయా = దమయన్తినైననాచేత, ఏతయోః = ఈ కళా తత్సఖులయొక్క, మర్మ = రహస్యము, దృష్టం = చూడఁబడినది. అనగా తడిసినవారి వలువలనుండి చూడఁబడినదని యర్థము. వినిన దానికంటె చూచినది చాలనమ్మఁదగినది కాన నేనును చూచినట్టి వారి రహస్యమును వెల్లడి పఱుచఁగలనని యర్థము.

భావము :

సఖులు చెప్పిన మాటలను వినిన పిదప, నలుడానఖులనుఁగూర్చి బిగ్గరగాఁ జెప్పెను. ఏమనగా-మీయొక్క చెలికత్తెయగు నీ దమయన్తి యీ విధముగాఁ జెప్పుచున్నది. ఏ విధముగాననగా-"ఈ కళయును నామెయొక్క చెలికత్తెయు నా రహస్య విషయమును వినినవారేగాని చూచినవారుగారు.దమయన్తినైన నేనో వీరి రహస్యమునుఁగంటితోనే చూచితిని. వీరి వస్త్రములు తడిసినప్పుడు వాని నుండి వీరి రహస్యావయవములు బయటఁబడగా నేను గాంచితిని. వినుటకంటెను చూచుటయే బలీయమైనది. కాన నేను చూచిన వారి రహస్యము నంతటిని బయటఁ బెట్టగలన"ని. ॥133॥

శ్లో. మద్విరోధితయోర్వాచి న శ్రద్ధాతవ్యమేతయోః ।
అభ్యషిఞ్చదిమే మాయా మిథ్యా సింహాసనే విధిః ॥ 134

ప.వి. మద్విరోధితయోః-వాచి-న-శ్రద్ధాతవ్యం - ఏతయోః - అభ్యషిఞ్చత్ - ఇమే - మాయా మిథ్యా సింహాసనే - విధిః.

అర్థము: కిఞ్చ=మఱియు, హే సఖ్యః = ఓ చెలికత్తెలారా !, మద్విరోధితయోః, మత్=దమయన్తితోడ, విరోధితయోః = ఏర్పడిన వైరము గల్గిన అనగా బహిష్కరణము నను మోదించుట మున్నగు వానివలన విరోధమును వహించిన, ఏతయోః=ఈ యిఱువురి చెలికత్తెలయొక్క, వాచి= మాటయందు, నశ్రద్ధాతవ్యం = విశ్వసింపరాదు. తథాహి = అది యుక్తమే. ఇమే=వీరినిద్దఱిని, విధిః=బ్రహ్మ, మాయామిథ్యా సింహాసనే; మాయా=కపటము, మిథ్యా=కల్ల అను వీనియొక్క, సింహాసనే= సింహాసనమునందు. అభ్యషిఞ్చత్ = జలవర్షణముచే, నభిషేకము గావించెను. అనగా మిథ్యాకపటములకు నిధులుగా వీరిని బ్రహ్మ కల్పించెనని యర్థము. కాన నా విషయమునందు నసత్యాచరణమునకు, నన్ని విధములలోను, నవకాశ ముండుట వలన వీరియొక్క యసత్యప్రలాపము నమ్మఁదగినది కాదని యర్థము.

సమాసములు ।

మద్విరోధితయోః : విరోధినః భావః=విరోధితా, మయా విరోధితా. యయోస్తే=మద్విరోధితే, తయోః=మద్విరోధితయోః ।

శ్రద్ధాతవ్యం : శ్రద్ధాతుం యోగ్యం=శ్రద్ధాతవ్యం ।

మాయామిథ్యాసింహాసనే: మాయామిథ్యా చ=మాయామిథ్యా, మాయామిథ్యా సింహాసనం=మాయామిథ్యా సింహాసనం, తస్మిన్ = మాయామిథ్యాసింహాసనే ।

భావము :

ఓ చెలికత్తెలారా ! దమయన్తితో వైరముఁబెట్టుకొనిన యీ యిఱువురి చెలికత్తెల మాటలయందు మీరు విశ్వాసముంచవలదు. అది యుక్తమే. బ్రహ్మ

యీ యిద్దఱి చెలికత్తెలను, కపటమును, అసత్యముననెడి వానియొక్క సింహాసనములయందు జలమును వర్షించి యభిషేకము గావించెను. అనగా కపటమునకు నసత్యమువకును, నిధులుగా సృజించెను. కాన నా విషయమున వీరి కసత్య ప్రవృత్తి భావింపఁబడుటవలన వీరి యసత్యవచనముల నమ్మవలదు. ॥134॥

శ్లో. ధౌతేఽపి కీర్తిధారాభిశ్చరితే చారుణీ ద్విషః।
మృషామషీలవైర్లక్ష్మ లేఖితుంకే న శిల్పినః॥ 135

ప.వి. ధౌతే - అపి - కీర్తిధారాభిః - చరితే చారుణి - ద్విషః - మృషామషీ లవైః - లక్ష్మ - లేఖితుం - న - శిల్పినః.

అర్థము: కీర్తిధారాభిః = కీర్తి ప్రవాహములచే, ధౌతే = పరిశుద్ధమైన, (కావుననే) చారుణ్యపి = మనోహరమైనను, ద్విషః = శత్రువుయొక్క, చరితే = చరిత్రమునందు, మృషామషీలవైః; మృషా = అసత్యమనెడి, మషీ = సిరాయొక్క, లవైః = బిందువులచే, లక్ష్మ = కలంకమును, లేఖితుం = వ్రాయుటకు, కే = ఎవ్వరు, న శిల్పినః = శిల్పమందు నేర్పరులు కారు ? కాని యందఱుచు సమర్థులేయని యర్థము. నా పరిశుద్ధమైన చరిత్రమందును వీరు, అసత్యపు కలఙ్కమునుఁగల్పింతురని యర్థము.

సమాసములు :

కీర్తిధారాభిః: కీర్తయ ఏవ ధారాః = కీర్తిధారాః, తాభిః = కీర్తి ధారాభిః। మృషామషీలవైః : మృషైవమషీ = మృషామషీ, మృషా మష్యాః లవాః = మృషామషీలవాః, తైః = మృషామషీలవైః
శిల్పినః: శిల్పమేషా మస్తీతి = శిల్పినః।

భావము :

కీర్తి ప్రవాహములచేఁ బరిశుద్ధమై మనోహరమైనను, శత్రువుయొక్క స్వభావమునందు నసత్య మనెడి సిరాయొక్క బిన్దువులచేఁగలఙ్కమునుఁగల్పించి వ్రాయుటకెవ్వరు సమర్థులుకారు. అనగా నందఱును సమర్థులే. నాయొక్క పరిశుద్ధ చరిత్రమునందు వీరిఱువురు నసత్యపు కలఙ్కమును దప్పక కల్పింతురని యాశయము.

శ్లో. తే సఖ్యావాచచక్షాతే న కిఞ్చిద్ బ్రూవహే బహు ।
వక్ష్యావ స్తత్పరం యస్మై సర్వా నిర్వాసితా వయమ్ ॥ 136

ప.వి. తే - సఖ్యౌ -ఆచచక్షాతే - న - కిం - చిత్ - బ్రూవహే - బహు - వక్ష్యావః - తత్ - పరం - యస్మై - సర్వాః - నిర్వాసితాః - వయమ్ -

అర్థము: తే = ఆ; సఖ్యౌ = కళయు, నామెయొక్క సఖియు, ఆచచక్షాతే = చెప్పిరి, ఏమనగా-బహు = అధికముగా, కిఞ్చిత్ = ఏమియు, న బ్రూవహే = చెప్పము, పరం = కేవలము, తత్ = ఆ ప్రయోజనమునే, వక్ష్యావః = చెప్పఁగలము. యస్మై = ఏ ప్రయోజనమునకై, వయం = చెలికత్తెలమైనమేము, సర్వాః = అందఱము, నిర్వాసితాః = ఇంటి నుండి తొలగింపఁబడితిమి. సంభోగము కొఱకే, మీరిద్దఱు ననగా దమయన్తీ నలులు మమ్ములనందఱిని యింటినుండి వెడలఁగొట్టిరని యంతటఁజెప్పగలమని యాశయము.

భావము :

ఆ కళయు, నామెయొక్క చెలికత్తెయు నిట్లు చెప్పిరి. ఏమనగా - మేము అధికముగా నేమియుఁజెప్పము. కాని మమ్ములనందఱిని వే ప్రయోజనమునకై యింటినుండి తొలగించితిరో, దానినిఁగూర్చి మాత్రమంతటఁజెప్పఁగలము. అనగా మీరు సురతమునకై మమ్ములనందఱిని వెడలఁగొట్టితిరి. ఆ విషయమునే మేమందఱికిని చెప్పఁగలము. ॥136॥

శ్లో. స్థాపత్యైర్న స్మ వి త్తస్తే వర్షీయ స్త్వచలత్కరైః ।
కృతామపి తథావాచి కరకమ్పేన వారణమ్ ॥ 137

ప.వి. స్థాపత్యైః - న - స్మ - విత్తః - తే - వర్షీయ స్త్వచలత్కరైః - కృతామ్ - అపి - తథావాచి - కరకమ్పేన - వారణమ్ ॥

అర్థము: తే = ఆ కళయు, నామెయొక్క చెలికత్తెయు, వర్షీయస్త్వచలత్కరైః; వర్షీయస్త్వ = ముదుసలితనముచే, చలత్ = వణకుచున్న, కరైః = హస్తములు గల్గిన, స్థాపత్యైః = కంచుకులచే, కరకమ్పేన = చేతు

లనుఁగదలించుటచే, కృతామపి = చేయఁబడినను, తథావాచి = అట్టి వాక్య ప్రయోగమందు. వారణామ్ = వలదనెడి నివారణను, న విత్తః స్మ = తెలిసికొనలేక పోతిమి. ఏలయనగా-వలదని కంచుకులు చేతినిఁ గదలించినను, ననగా హస్తమును కంపింపఁజేసినను వారు వృద్ధులగుట వలన, వార్ధక్యముచే వారికిఁజేతులు కమ్పించియుండునని భ్రాన్తి మాకుఁ గలిగినదని యర్థము.

**సమాసములు :**

స్థాపత్యైః: స్థానాం పతయః = స్థపతయః, స్థపతఏవ స్థాపత్యాః, తైః, = స్థాపత్యైః ।

వర్షీయస్త్వచలత్కరైః : వర్షీయసో భావః వర్షీయస్త్వమ్, వర్షీయస్త్వేన చలన్తః కరాః యేషాం తే = వర్షీయస్త్వచలత్కరాః, తైః = వర్షీయస్త్వచలత్కరైః ।

తథావాచి : తథాచసావాక్చ = తథావాక్, తస్యామ్ = తథావాచి ।

కరకమ్పేన = కరయోః కమ్పః = కరకమ్పః, తేన = కరకమ్పేన।

**భావము :**

ఆ కళయు నామెయొక్క చెలికత్తెయు, వృద్ధులైన కంచుకులు దమయన్తీ నలుల సురతమునకనువుగా చేతుల కంపింపఁజేసి యచ్చట నుండ వలదని వారించి నను దానిని గ్రహింపలేక పోయిరి. ఏలయనగా-ఆ కంచుకుల చేతులలోని కదలిక వారు వృద్ధులగుటవలన, వారి వార్ధక్యముచే, నేర్పడిన వణకుగా భ్రమపడిరి. అందువలనఁదెలిసికొనలేక పోయిరి. ॥137॥

శ్లో. **అపయాతమితో ధృష్టే ! ధిగ్వామశ్లీలశీలతామ్ ।**
**ఇత్యుక్తే చోక్తవన్తశ్చ వ్యతిద్రాతే స్మ తే భియా ॥ 138**

ప.వి. అపయాతమ్ - ఇతః - ధృష్టే - ధిక్ - వామ్ - అశ్లీలశీలతామ్ - ఇతి - ఉక్తే - చ ఉక్తవన్తః - చ - వ్యతిద్రాతే - స్మ - తే - భియా -

అర్థము: హే ధృష్టే = ఓ గడుసుగత్తెలారా ! ఇతః = ఇక్కడనుండి అప యాతమ్ = తొలగిపొండు, వామ్ = మీయొక్క, అశ్లీలశీలతాం = గ్రామ్య

సంభాషణ స్వభావముసు(గూర్చి, ధిక్ = ధిక్కారము అనగా నిందిం తుము. ఇతి = అని, ఉక్తే = కంచులచుచే(జెప్ప(బడిన, యనగా బెది రింప(బడిన, తే = ఆ యిఱువురు చెలికత్తెలును, భియా = భయముతో, (తథా ఇతి = అట్లేయని) (ఇత్థం = ఇట్లు) ఉక్తవన్తశ్చ = చెప్పిన అనగా బెదరించిన, తే = ఆ కంచుకులును, భియా = రాజదమ్పతుల క్రోధభయముచే, వ్యతిద్రాతే స్మ = పరుగిడు చుండిరి. "తే" యనునది స్త్రీలింగమున ద్వివచనము, పుంలింగమున బహువచనముగా తచ్ఛబ్దమున కగుచున్నది. కాన, తే = ఆ చెలికత్తెలిఱువురును, తే = ఆ కంచుకు లందఱును, వ్యతిద్రాతే స్మ = పరుగిడు చుండిరి. ఇచ్చట "వ్యతిద్రాతే" యని ప్రథమ పురుషముయొక్క ద్వివచనమునందును బహువచనము నందును సమానరూపము. చెలికత్తెల పక్షమున ద్వివచముగను, కంచు కుల పక్షమున బహువచనముగను భావింప(దగినది ॥

సమాసములు :

అశ్లీలశీలతామ్: అశ్లీలం శీలం యయోస్తే = అశ్లీలశీలే, అశ్లీలశీలయోః భావః = అశ్లీలశీలతా, తామ్ = అశ్లీలశీలతామ్ ।

భావము :

"ఓ గడుసుగత్తెలారా ! ఇక్కడనుండి మీరు తొలగిపొండు." మీ యొక్క యసహ్య సంభాషణమునకు ధిక్కారము" అని కంచుకులచే బెదరింప( బడిన, యాకళయు, నామెయొక్క చెలికత్తెయు, కంచుకులు కొట్టెదరను భయ ముతో నట్లేయని మారువలుకక యచ్చటనుండి పరుగిడిపోయిరి. ఆ విధముగా వారిని బెదరించిన కంచుకులును, రాజదమ్పతులకు(గోపము గలుగుననెడిభయము తోడను, రాజభవనముయొక్క రక్షణ కొఱకును(బరుగిడి పోయిరి. ॥138॥

శ్లో. ఆహ స్మ తద్గిరా హ్రీణాం ప్రియాం నతముఖీం నలః ।
ఈదృక్ భణ్డసఖీకాఽపి నిస్త్రపా న మనాగపి ॥ 139

ప.వి. ఆహ - స్మ - తద్గిరా - హ్రీణామ్ - ప్రియామ్-నతముఖీమ్ - నలః - ఈ దృక్భణ్డసఖీకా - అపి - నిస్త్రపా - న - మనాక్ - అపి.

అర్థము: అథ = పిదప, నలః = నలమహారాజు, తద్గిరా, తత్ = ఆ కళ యొక్కయు నామె చెలికత్తె యొక్కయు, గిరా = మాటచే, "వక్ష్యావః తత్పరమ్" అని, వారి రహస్యమును వెల్లడి చేయఁగలమనెడి మాటచే నని యర్థము. హ్రీణామ్ = సిగ్గుపడిన (కావుననే) నతముఖీమ్; నత = వంగిన, ముఖీమ్ = మోముగల్గిన, ప్రియామ్ = ప్రియురాలగు దమయన్తిని, ఆహస్మ = చెప్పెను. "ఏమనగా - ఈదృగ్భణ్డ సఖీకాఽపి ఈదృక్ = ఇటువంటి, భణ్డ = సిగ్గులేని, సఖీకాఽపి = చెలికత్తెలనుఁగల్గియు, త్వమ్ = నీవు, మనాగపి = కొంచెమైనను, నిస్త్రపా = సిగ్గులేని దానవుగా, నఅసి = కావు. ఎవరికి చెలికత్తెలు సిగ్గులేక యుందురో, వారును సిగ్గులేనివారుగా నుండుట సహజము. కాని నీ విషయమునందది వర్తింపలేదు. కాన నీ శీలము గొప్పదని యర్థము.

సమాసములు :

తద్గిరా : తయోః గీః = తద్గీః, తయా = తద్గిరా।
నతముఖీమ్ : నతం ముఖం యస్యాసామ్ = నతముఖీ, తామ్ = నతముఖీమ్।
ఈదృక్ భణ్డ సఖికా : ఈదృశౌ భణ్డే సఖ్యౌ యస్యాస్సా = ఈదృగ్భండసఖీకా।
నిస్త్రపా : నిర్గతా త్రపా యస్యాస్సా = నిస్త్రపా।

భావము :

తర్వాత నలుడు "వక్ష్యావస్తత్పరమ్" (20-136) యని మీ రహస్యమును బయటఁబెట్ట గలమనెడి మాటచే సిగ్గుపడి తలను వంచియుండిన, ప్రియురాలగు దమయన్తినిఁ గూర్చి చెప్పెను. ఏమనగా- "ఇట్టి సిగ్గులేని చెలికత్తెలు నీకుండినను, నీవు సిగ్గులేని దానవుగా లేవు. అనగా మిక్కిలి సిగ్గు గల్గియున్నావు. లోకమున సిగ్గులేని చెలికత్తెలుఁ గలవారికిఁ గూడ సిగ్గు ఉండదు. కాని నీ విషయమున నది వర్తింపలేదు. కాన నీ శీలము చాల పరిశుద్ధమైనది." ॥139॥

శ్లో. అహో నాఽపత్రపాకం తే జాతరూప మిదం ముఖమ్।
తానాఽతి పార్జనేఽపి స్యాదితో దుర్వర్ణనిర్గమః॥ 140

ప. వి. అహో - న-అపత్రపాకమ్ - తే - జాతరూపమ్ - ఇదమ్ - ముఖమ్-
న - అతితాపార్జనే - అపి - స్యాత్ - ఇతః - దుర్వర్ణ నిర్గమః.

అర్థము. జాతరూపం; జాత = కల్గిన, రూపం = సౌందర్యముతోఁగూడిన, పసిడితో సమానమైన, పక్షాన్తరమున - పసిడియేయైన, ఇదం = ఈ కానఁబడు, తే = నీయొక్క, ముఖం = మోము, నా పత్రపాకం = సిగ్గు లేనిదికాని "లజ్జారూపం కులస్త్రీణాం" అను నీతిశాస్త్రము ననుసరించి సిగ్గుతోఁ గూడిన నీమోము మిక్కిలి సౌందర్యము గలదిగా నేర్పడినదని యర్థము. పక్షాన్తరమున - నా పత్రపాకం = (న-అపత్ర-పాకం); పత్ర = మల్లుటీయుట కనుగుణముగాఁ గూచిగఁ జేయఁబడిన, లేదా పత్ర = పాత్ర విశేషమునందు, అనగా కఱఁగించుటకై యుపయోగపడు మట్టిపాత్ర యందు పాక = కఱఁగించుట యనగా శుద్ధిపఱచుటకై చేసెడి పాకను లేకపోవుటచే అపత్రపాకమైనదిగా (గా) నటువంటి యనగా న - అపత్రపాకమైన, యనగా పత్రపాకముచే పరిశుద్ధమే యైన, అతి తాపార్జనేఽపి; అతి తాప : సఖులు గావించిన పరిహాసాదులవలని లజ్జచే తాపమును (వేడిమిని) పీడను, అర్జనేఽపి = పొందినను, పక్షాన్తర మున - మిక్కిలి దాహకారణమున్నను, ఇతః = ఈ రమ్యమగు వర్ణము (రంగు - అక్షరము) గలముఖము నుండియు (సువర్ణము నుండియు) దుర్వర్ణ నిర్గమః. దుర్వర్ణ = కఠినవచనము యొక్కయు, నల్లదనము యొక్కయు, నిర్గమః = వెలుపలికి వచ్చుట, నస్యాత్ = అగుటలేదు. అహో = ఆశ్చర్యము. చెలికత్తెలు గావించిన ప్రేలల దుఃఖముచేఁ దాపముఁ జెందినను, నోటినుండి, కఠినమైన మాట రాలేదనుట యాశ్చర్యము.

వి. మిక్కిలిఁ దాపముఁ బొందినను సువర్ణమునుండి దుర్వర్ణము (నలుపువన్నె) వెడలిపోలేదనుట విరుద్ధము. దానికి - చెలికత్తెల పరిహాసముచే మిక్కిలి తాపముఁ బొందినను సువర్ణమునుండి యనగా సువర్ణ సదృశమగు దమ యన్తి మోమునుండి యనగా నోటినుండి దుర్వర్ణము - అనగా కఠిన వచనము వెలువడ లేదనెడి యర్థాన్తరముచేఁ బరిహారముగాన విరోధాభాసా లఙ్కారము.

**సమాసములు :**

నాఽపత్రపాకం: అపగతా త్రపా యస్య తత్ = అపత్రపాకం, న అపత్రపాకమ్ = నాపత్రపాకం, పక్షాన్తరమున- పత్రేపాకః యస్య తత్ = పత్రపాకం, న పత్రపాకం = అపత్రపాకమ్, అపత్రపాకం సఖవతీతి = నాపత్రపాకమ్।

అతితాపార్జనే : **అత్యన్తం తాపః = అతితాపః, అతితాపస్య ఆర్జనం = అతితాపార్జనం, తస్మిన్ = అతి తాపార్జనే।**

దుర్వర్ణనిర్గమః : **దుష్టః వర్ణః = దుర్వర్ణః,** దుర్వర్ణస్యనిర్గమః = దుర్వర్ణనిర్గమః।

**భావము :**

చక్కని సౌందర్యము గల్గినదై సువర్ణమైన యనగా సువర్ణముతో సమానమైన నీముఖము నాపత్రపాకమై యనగా లజ్జతోఁ గూడినదై, "లజ్జారూపం కుల స్త్రీణాం" యనునీతి చొప్పున మిక్కిలి సౌందర్యము గలదిగా నేర్పడినది. సువర్ణపక్షమున - సువర్ణము, నాపత్రపాకమై యనగా పత్రమందు ననగా మట్టి పాత్రమునందు శుద్ధినిఁ బొందుటకై పాకము నొందనదైనను; సఖీ పరిహాసములచే నీముఖము మిక్కిలి తాపము నొందినదైనను, శోభనవర్ణముతోడ ననగా చక్కని వన్నెతోఁగూడిన సువర్ణమునుండియు, చక్కని యక్షరములతోఁగూడిన నీ ముఖమునుండియు దుర్వర్ణము- అనగా నల్లని వన్నెయు, కఠినమగు నక్షరములును వెడలక పోవుట యాశ్చర్యకరము. అధికముగాఁ గాల్చిన బంగారునుండి నలుపువన్నె యనెడి దోషము తొలగవలయును. అది తొలగక పోవుట యాశ్చర్యము. అట్లే చెలికత్తెలచే పరిహాసవచనములతో మిక్కిలి పీడింపఁబడినను నీయొక్క ముఖమునుండి యనగా నోటినుండి కఠినాక్షరములు రాక పోవుటయు నాశ్చర్యము. అనగా సిగ్గుతోఁగూడిన నీముఖము జాతరూపము- అనగా సౌందర్యవంతము. (సువర్ణము) శుద్ధికై మట్టిపాత్రము నందుఁ బొందింపఁబడినను సువర్ణమునుండి దుర్వర్ణము అనగా నలుపుతొలగక పోవుట యాశ్చర్యము. అట్లే చెలికత్తెల పరిహాసముచే పీడింపఁబడిన నీయొక్క ముఖమునుండి దుర్వర్ణము అనగా కఠిన వచనము వెడలకుండుటయు నాశ్చర్యము. ముఖము నాపత్రపాకమై

యనగా లజ్జతోఁ గూడినదై జాతరూపము అనగా సౌందర్యవంతము (సువర్ణము) ముతక బంగారము సాపత్రపాక మై యనగా మట్టిపాత్ర మందు పక్వముచేయఁబడినదై జాతరూపము శుద్ధసువర్ణము అనగా నపరంజి - దమయన్తికి, అత్తతాపార్జన మున్నను ననగాఁ జెలిక త్తెలుగావించిన పరిహాసాదులచే మిక్కిలిపీడయున్నను నామె ముఖమునుండి దుర్వర్ణ నిర్గమము అనగా చెడ్డమాట వెడలక యుండుట యాశ్చ ర్యము. పీడింపఁబడిన వ్యక్తి బాధవలన దూషించుట సహజముకదా. కాని యామె కెంత బాధ గల్గినను నామె చెలికత్తెల నేమియు దూషింపలేదు. అట్లే మట్టి పాత్రమునందుఁ బాకము నొందిన బంగారును మఱల నగ్నియందధికముగాఁ గాల్చినను దానినుండి దుర్వర్ణ నిర్గమము, అనగా దోషము తొలగకపోవుటయు నాశ్చర్యము. చెలులు గావించిన పరిహాసాదులచే నెంత బాధ గల్గినను దమయన్తి తననోటినిఁ దెఱచి యొకమాటనుఁగూడఁ జెప్పలేదని యనగా దూషింపలేదని సారాంశము. ॥140॥

శ్లో. తామథైష హృది న్యస్య దదౌ తల్పతలే తనుమ్।
నిమీల్య చ తదీయాఙ్గ సౌకుమార్య మసిస్వదత్॥ 141

వ. వి. తామ్ - అథ - ఏషః - హృది - న్యస్య - దదౌ - తల్పతలే - తనుమ్ - నిమీల్య - చ - తదీయాఙ్గసౌకుమార్యమ్ - అసిస్వదత్.

అర్థము. అథ = పై విధముగా సంభాషించిన పిదప, ఏషః = ఈ నలుడు, తాం = ప్రియురాలగు దమయన్తిని, హృది = ఱొమ్మునందు, న్యస్య = ఉంచుకొని, తల్పతలే = పడకపై, తనుం = దేహమును, దదౌ = ఉంచెను. అనగాఁ బరుండెను. తథా = అట్లే, నిమీల్య = ఆనన్దానుభూతిచే (గన్నులను మూసి, తదీయాఙ్గ సౌకుమార్యమ్, తదీయ = దమయన్తికి సంబంధించిన, అఙ్గ = శరీరముయొక్క, సౌకుమార్యమ్ = మెత్తఁదన మును, అసిస్వదచ్చ = అనుభవించెను.

సమాసములు :

తల్పతలే : తల్పస్య తలమ్ = తల్పతలమ్, తస్మిన్ = తల్పతలే,
తదీయాఙ్గ సౌకుమార్యమ్ : తస్యాః అఙ్గమ్ = తదీయాఙ్గమ్, సుకుమా

రస్య భావః = సౌకుమార్యమ్, తదీయాఙ్గస్య సౌకుమార్యమ్ = తదీయాఙ్గ సౌకుమార్యమ్।

**భావము ;**

పై విధముగా సంభాషించిన పిదప, నీ నలుడు ప్రియురాలగు దమయన్తిని దన తొమ్ము పైనానించుకొని సెజ్జపై పరుండెను. అట్లే యామెయొక్క సుకుమార శరీర స్పర్శచేఁ గల్గిన యానందానుభూతి వలనఁ గన్నులను మూసి యామె శరీరముయొక్క సౌకుమార్యము ననుభవించెను. ॥141॥

శ్లో. న్యస్య తస్యాః కుచద్వంద్వే మధ్యేనీవి నివేశ్య చ।
స పాణిః సఫలం చక్రే తత్కరగ్రహణశ్రమమ్॥ 142

ప. వి. న్యస్య - తస్యాః - కుచద్వన్ద్వే - మధ్యేనీవి - నివేశ్య - చ - సః - పాణేః - సఫలం - చక్రే - తత్కరగ్రహణశ్రమమ్.

అర్థము: సః = ఆ నలుఁడు, తస్యాః = ఆ దమయన్తియొక్క, కుచద్వన్ద్వే = చనుదోయిపై, న్యస్య = చేతినుంచి, మధ్యేనీవి = కోక ముడి నడుమ, నివేశ్య = హస్తమునుఁ జొనిపి, పాణేః = తన హస్తమునకు, తత్కరగ్రహణశ్రమమ్; తత్ = ఆ దమయన్తియొక్క, కరగ్రహణ = పాణిగ్రహణము వలని, శ్రమం = ఆయాసమును, సఫలం = సార్థకముగా, చక్రే = చేసెను. ప్రియురాలి స్పర్శ యట్టిదానికంతటి మహాఫలమని యర్థము.

**సమాసములు ;**

కుచద్వన్ద్వే : కుచయోః ద్వన్ద్వం = కుచద్వన్ద్వం, తస్మిన్ = కుచద్వన్ద్వే।

మధ్యేనీవి : నీవ్యాః మధ్యే = మధ్యేనీవి।

సఫలమ్ : ఫలేన సహ వర్తత ఇతి = సఫలమ్।

తత్కరగ్రహణశ్రమమ్ : తస్యాః కరః = తత్కరః, తత్కరస్య గ్రహణమ్ = తత్కరగ్రహణమ్, తత్కర గ్రహణే శ్రమః = తత్కర గ్రహణ శ్రమః, తం = తత్కరగ్రహణశ్రమమ్।

భావము ;

ఆ నలుడు దమయన్తి చనుదోయిపై హస్తముంచి పిదప చీరముడిలోనికి హస్తమునుఁ జొనిపి, తన హస్తము దమయన్తి పాణిగ్రహణము చేసిన పరిశ్రమను సఫలపఱచెను. ॥142॥

శ్లో. స్థాపితా ముపరి స్వస్య తాం ముదా ముముదే వహన్।
తదుద్వహనకర్తృత్వ మాచష్టే స్పష్టమాత్మనః॥ 143

ప.వి. స్థాపితామ్ - ఉపరి - స్వస్య - తాం - ముదా - ముముదే - వహన్ - తదుద్వహనకర్తృత్వమ్ - ఆచష్టే - స్పష్టమ్ - ఆత్మనః.

అర్థము: ముదా = సంతోషముతో, స్వస్య = తనయొక్క, ఉపరి = బొమ్మునందు, స్థాపితామ్ = ఉంచుకొనఁబడిన, తాం = ఆ ప్రియురాలిని, వహన్ = మోయుచు, ముముదే = (నలుడు) సంతోషించెను. తథా = అట్లు, ఆత్మనః = తనకు, తదుద్వహన కర్తృత్వమ్; తత్ = ఆమెయొక్క, ఉద్వహన = (మోయుటయందు) వివాహమునందు, కర్తృత్వమ్ = కర్తగానుండుటను, స్పష్టమ్ = స్ఫుటముగా ఆచష్ట = చెప్పెను. వివాహముఁ జేసికొనని వానికిట్లు, తన బొమ్మపై నామెను మోయుట కర్తృత లేదుగదా-

సమాసములు ;

తదుద్వహన కర్తృత్వమ్ : తస్యాః ఉద్వహనమ్ = తదుద్వహనమ్, తదుద్వహనేకర్తా = తదుద్వహనకర్తా, తదుద్వహనకర్తుః భావః = తదుద్వహన కర్తృత్వమ్, తత్ = తదుద్వహన కర్తృత్వమ్।

భావము ;

ఆ నలుడు సంతోషముతో తన బొమ్మపైఁ బ్రియురాలిని మోయుచు నానన్దము నొందెను. అట్లు తనపై నామెను మోయుచు నామెనుఁ బరిణయమాడుటలోఁ దన యధికారమును స్పష్టపఱచెను. వివాహముఁ జేసికొనని వానికట్లామెనుఁ దన బొమ్మపై మోయుట కర్తృత లేదుగదా! ॥143॥

శ్లో. స్విద్యత్కరాఙ్గులీలు ప్త కస్తూరీ లేపముద్రయా।
పూత్కార్యపీడితౌ చక్రే స సఖీషు ప్రియా స్తనౌ॥ 144

ప.వి. స్విద్యత్కరాఙ్గులీ లుప్త కస్తూరీ లేప ముద్రయా - పూత్కార్యపీడితా- చక్రే - సః - సఖీషు - ప్రియా స్తనౌ.

అర్థము: సః = ఆ నలుడు, ప్రియా స్తనౌ = ప్రియురాలగు దమయన్తియొక్క చనుదోయిని, స్విద్యత్కరాఙ్గులీలు ప్తకస్తూరీ లేపముద్రయా; స్విద్యత్ = చెమర్చిన, కరాఙ్గులీ = చేతివ్రేళ్ళచే, లుప్త = లోపించిన, కస్తూరీ = కస్తూరియొక్క, లేప = లేపముయొక్క, ముద్రయా = చిహ్నముచే, సఖీషు = చెలికత్తెలమధ్య, పూత్కార్యపీడితా; పూత్కార్య = 'పూ' యను నోటి గాలిచే ననగా "పూ" యని యూదుటచే బోగొట్టఁబగిన, పీడితా = నొప్పిగల వానినిగా, చక్రే = చేసెను.

సమాసములు :

స్విద్యత్కరాఙ్గులీలు ప్తకస్తూరీలేపముద్రయా: స్విద్యన్త్యశ్చతాః కరాఙ్గుల్యశ్చ = స్విద్యత్కరాఙ్గుల్యః, స్విద్యత్కరాఙ్గులీభిః లుప్తః = స్విద్యత్కరాఙ్గులీ లుప్తః, కస్తూర్యాః లేపః = కస్తూరీలేపః, స్విద్యత్కరాఙ్గులీలు ప్తశ్చాసౌ కస్తూరీలేపశ్చ = స్విద్యత్కరాఙ్గులీ లుప్త కస్తూరీ లేపః, స్విద్యత్కరాఙ్గులీలుప్త కస్తూరీ లేపస్యముద్రా = స్విద్యత్కరాఙ్గులీలు ప్త కస్తూరీ లేపముద్రా, తయా = స్విద్యత్కరాఙ్గులీ లుప్త కస్తూరీలేప ముద్రయా।

పూత్కార్యపీడితా : పూత్కర్తుం యోగ్యం = పూత్కార్యమ్, పూత్కార్యమ్ పీడితమ్ యయోస్తౌ, పూత్కార్య పీడితా।

ప్రియా స్తనౌ : ప్రియాయాః స్తనౌ = ప్రియా స్తనౌ, తౌ = ప్రియా స్తనౌ।

భావము :

ఆ నలమహారాజు, ప్రియురాలగు దమయన్తి చనుదోయిపైనఁగస్తూరితో వ్రాయఁబడిన మకరికాది పత్రావళిఁ జెమర్చిన తన చేతి వ్రేళ్ళతో స్తనములను

మర్దించుట వలనఁ దుడిపివైచెను. అనగా నలుడు దమయన్తి చనుదోయినిఁదాక గనే యతనియందు సాత్త్వికభావమగు స్వేదముదయించినదని యర్థము. అట్లతడు స్తన మర్దనము చేయుటవలన నామెకు బాధ యేర్పడగా చెలికత్తెలు, ఆ చనుదోయిపై "ఫూ"యని నోటిగాలిఁ దాకించి యా బాధకువశాన్తినిఁ గల్పించుటకు యత్నించిరి. ॥144॥

శ్లో. తత్కుచే నఖమారోప్య చమత్కుర్వ న్తయేక్షితః।
సోఽవాదీత్తాం హృదిస్థం తే కిం మామభినదేష నః ॥ 145

ప.వి. తత్కుచే - నఖమ్ - ఆరోప్య - చమత్కుర్వన్ - తయా - ఈక్షితః - నః - అవాదత్ - తాం - హృదిస్థం - తే - కిమ్ - మామ్ - అభినత్ - ఏషః - న.

అర్థము: నః = ఆ నలుఁడు. తత్కుచే; తత్ = ఆ దమయన్తియొక్క, కుచే = స్తనమందు, నఖమ్ = గోటిని, ఆరోప్య = నాటి, చమత్కుర్వన్ = తానే యాశ్చర్యములో గగుర్పాటు నొందుచున్నవాడై. తయా = ఆ దమయన్తిచే. ఈక్షితః = చిఱునగవుతోఁ జూడబడిన వాడునునై, ఏషః = ఈ, నఖః = గోరు, తే = నీయొక్క, హృదిస్థం = హృదయము నందున్న, మామ్ = నలుఁడనైన నన్ను, నాఽభినత్ కిం? = ఛేదించి గాయ పఱచలేదా యేమి? కాని ఛేదించి గాయపఱచినది. కానిచో, నాశరీరమందు గగుర్పాటెట్లేర్పడినదని, తామ్ = ఆ దమయన్తిని, అవాదీత్ = పలికెను.

వి. ఇచ్చట దమయన్తీ కుచమునందున్న నఖక్షతము, నలుని హృదయము నందు గగుర్పాటును గల్గించుటవలన కార్యకారణములకు సమాన దేశత్వము లేక పోవుటయను లక్షణముగల్గిన అసఙ్గత్యలఙ్కారము.

సమాసములు :

తత్కుచే ; తస్యాః కుచః = తత్కుచః, తస్మిన్ = తత్కుచే ।
హృదిస్థం ; హృదితిష్ఠతీతి = హృదిస్థః, తం = హృదిస్థమ్ ।

భావము :

ఆ నలుడు దమయన్తి యొక్క స్తనముపై గోటిని నాటి, తానే యాశ

ర్యముతో గగుర్పాటు పడుచు దమయన్తి తన్ను మందహాసముతోఁజూడగా- "ఈ గోరు హృదయమందున్న నలుఁడనైన నన్ను గాయపరచదా యేమి? తప్పక గాయపఱచును. కానిచో నాశరీరమునందు గగుర్పాటు వలని రోమాఞ్చము లెట్లేర్పడినవని" యా దమయన్తికిఁజెప్పెను. ॥145॥

శ్లో. అహో! అనౌచితీయం తే హృది శుద్ధేప్యశుద్ధవత్ ।
అఙ్కః ఖలైరివాఽకల్పి నఖైస్తీక్ష్ణముఖైర్మమ॥ 146

ప. వి. అహో - అనౌచితీ - ఇయం - తే - హృది - శుద్ధే - అపి - అశుద్ధవత్ - అఙ్కః - ఖలైః - ఇవ - అకల్పి - నఖైః - తీక్ష్ణముఖైః - మమ.

అర్థము : హే ప్రియే = ఓ ప్రియురాలా!, తీక్ష్ణముఖైః, తీక్ష్ణ = వాడిమిగల, ముఖైః = వాక్కులుగల్గిన, ఖలైరివ = దుష్టులవలె, తీక్ష్ణముఖైః, తీక్ష్ణ = వాడిమిగల్గిన, ముఖైః = కొనలుగల్గిన, మమ = నాయొక్క, నఖైః = గోళ్ళచే, శుద్ధేఽపి = దోషములేనిదైనను, తే = నీయొక్క, హృది = హృదయమందు, అనగా తొమ్మ్మపైని స్తనమునందు, అశుద్ధవత్ = శుద్ధముకానిదాని యందువలె, అఙ్కః = కలఙ్కము (చిహ్నము) అకల్పి = కల్పింపఁబడినది. అహో = కష్టము. ఇయం = ఈ దోషారోపణ, అనౌచితీ = అయుక్తముగా నైనది.

సమాసములు :

అనౌచితీ ; ఉచితస్య భావః = ఔచితీ, న ఔచితీ = అనౌచితీ ।
అశుద్ధవత్ ; నశుద్ధమ్ = అశుద్ధమ్, అశుద్ధే ఇవ = అశుద్ధవత్ ।
తీక్ష్ణముఖైః ; తీక్ష్ణం ముఖం యేషాంతే = తీక్ష్ణముఖాః, తైః = తీక్ష్ణముఖైః ।

భావము :

ఓ ప్రియురాలా! తీక్ష్ణముఖములుగల అనగా క్రూరవచనములుగల దుష్టులు దోషము లేని వారిపై కళఙ్కము నారోపించునట్లు తీక్ష్ణ ముఖములు గల యనగా వాడిమిగల కొనలుగల్గిన నాగోళ్ళు దోషములేని నీ స్తనములపైఁగలఙ్కమునుఁ గల్పించినవి. ఇట్లు దోషములేని వానిపైఁ గలఙ్కమునుఁ గల్పించుట యాశ్చర్యకరము. కాని యిది తగదు.

శ్లో. యచ్చుమ్బతి నితమ్బోరు యదాలిఙ్గతి చ స్తనౌ।
భుఙ్క్తే గుణమయం తత్తే వాసః శుభదశోచితమ్॥ 147

ప.వి. యత్ - చుమ్బతి - నితమ్బోరు - యత్ - ఆలిఙ్గతి - చ - స్తనౌ -
భుఙ్క్తే - గుణమయం - తత్ - తే - వాసః - శుభదశోచితమ్.

అర్థము: హే ప్రియే = ఓ ప్రియురాలా! గుణమయం = సన్నని నూలుచే నేయబడిన, (సౌశీల్యము మున్నగు గుణములతోఁ గూడిన) తే = నీయొక్క, వాసః = వస్త్రముఁ కానొక పురుషుడు) నితమ్బోరు = రెండు కటి పశ్చాద్భాగములను, రెండు తొడలను, యత్ = ఎందువలన, చుమ్బతి = తాకుచున్నదో (రెండు పెదవులతోఁ బట్టుకొనునో) యచ్చ = ఎందువలననో, స్తనౌ = స్తనములను, ఆలిఙ్గతి = ఆవరించుచున్నదో, (కౌగలించుకొనునో) తత్ = అందువలన, శుభదశోచితమ్; శుభ = రమ్యములైన, దశా = అంచులలోని నూలుదారమును, (జ్యోతిశ్శాస్త్ర ప్రసిద్ధములైన శుక్రాది శుభ గ్రహముల దశలను) ఉచితమ్ = తగిన విధముగా, భుఙ్క్తే = అనుభవించుచున్నారు. ఒక పక్షమున స్పర్శరూపమగు భోగమునుఁ జేయును. ఏలయనగా - చక్కటి యంచుగల వస్త్రము నీకిష్టమైనందువలన దానిని ధరించుటచే నని యర్థము. పక్షాన్తరమున - భోగరూపమైన సుఖము ననుభవించుచున్నాడు. శుభగ్రహముల దృష్టి లేనిచో నీయొక్క నితమ్బము మున్నగు నవయవముల స్పృశించు భోగము లభింపదు. శుభ గ్రహదశయందు మానవుడు శుభఫలము ననుభవించునని జ్యోతిశ్శాస్త్రము.

సమాసములు :

నితమ్బోరు : నితమ్బౌ చ ఊరూచ ఏషాః సమాహారః నితమ్బోరు, తత్ = నితమ్బోరు।

గుణమయం : గుణైః ప్రచురః గుణమయం।
శుభదశోచితమ్ : శుభాశ్చతాః దశాశ్చ, శుభదశాః, శుభదశానాముచితమ్ = శుభదశోచితమ్।

భావము :

ఓ ప్రియురాలా! నన్నని నూలుచే చేయబడిన, నీయొక్క వస్త్రము నీ నితంబములను తొడలను నెందువలన దాకుచున్నదో, మఱియు నెందువలన నీ స్తనములను స్పృశించుచున్నదో, అందువలన నందములైన యంచులకుఁదగినట్లు స్పర్శరూపమగు భోగమునుఁ జేయుచున్నదని వస్త్రపక్షమున భావము.

పక్షాంతరమున - సౌశీల్యాది గుణములతోఁ గూడిన యొకానొక పురుషుడు నీ నితంబములను రెంటిని, నీతొడలను రెంటిని నెందువలన ముద్దిడుకొనుచున్నాడో మఱియు నెందువలన నీ స్తనములనుఁ గౌగిలించుకొను చున్నాడో, యందువలన, జ్యోతిశాస్త్రమునందుఁ బ్రసిద్ధములైన శుభగ్రహములగు శుక్రాదుల దశలకుఁదగిన విధముగా సురతరూపమగు భోగమననుభవించును. శుభగ్రహముల దృష్టిలేనిచో నీయొక్క నితమ్బాద్యవయవములగు స్పృశించెడి భోగముననుభవింపఁడుగదా! శుభగ్రహదశలయందు జనము శుభఫలమునుఁ బొందునని జ్యోతిశ్శాస్త్ర సిద్ధాంతము" అని పురుష పక్షమున భావము. ॥142॥

శ్లో. లీన చీనాంశుకం స్వేది దరాలోక్యం విలోకయన్।
తన్నితమ్బం సనిశ్శ్వస్య నినిన్ద దినదీర్ఘతామ్॥ 148

ప.వి. లీనచీనాంశుకం - స్వేది - దరాలోక్యం - విలోకయన్-తన్నితమ్బం - సః - నిఃశ్వస్య - నినిన్ద - దినదీర్ఘతామ్.

అర్థము: సః = ఆ నలుఁడు, స్వేది = చెమటగల్గిన కావుననే, లీన చీనాంశుకం, లీన = నితమ్బముతోనంటుకొని యొక్కటిగా నేర్పడిన, చీనాంశుకం = చీనదేశపు పట్టు వస్త్రము గల్గిన, (కావుననే) దరాలోక్య, దర = కొంచెము ఆలోక్యం = చూడఁదగిన, తన్నితమ్బం, తత్ = ఆ దమయన్తి యొక్క, నితమ్బం = నితమ్బప్రదేశమును, విలోకయన్ = చూచుచు, దినదీర్ఘతామ్, దిన = పగటియొక్క, దీర్ఘతామ్ = పొడవును, నినింద = నిందించెను. పగలు సురతము నిషిద్ధముకాన దానిని చేయఁజాలక పోయినందువలనఁ బగలుగడచుట నభిలషించెను.

సమాసములు :

లీనచీనాంశుకం : చీనానామంశుకం = చీనాంశుకమ్, లీనం చీనాంశు

కం యస్మిన్ తత్ = లీన నీరాంశుకం, తత్ = లీన నీనాంశుకమ్।
స్వేది : స్వేదః అస్యఅస్తీతి = స్వేది, తత్ = స్వేది.
దరాలోక్యం : ఆలోకయితుం యోగ్యం = ఆలోక్యం, దరమాలో క్యం, దరాలోక్యం, తత్ = దరాలోక్యం।

**భావము :**

ఆ నలుడు, చెమటచేఁ దడిసి. నితంబమున కంటుకొని పోయినదై కొంచిగాఁ గానవచ్చెడి యా దమయన్తియొక్క నితమ్బమునుఁ జూచుచు నామెను సంభోగింపఁగోరెను. కాని పగలు పొడవుగా నుండిపోవుటవలన, పగటియందు సురతము నిషేధింపఁబడుటచే పగటియొక్క పొడవును నిందించుచు నెప్పుడు పగలు గడచునా యని నిరీక్షించుచుండెను. ॥148॥

శ్లో. దేశమేవ దదంశాసౌ ప్రియాదన్తచ్ఛదాన్తికమ్।
చకారాఽధరపానస్య తత్రైవాలీక చాపలమ్॥ 149

ప. వి. దేశమ్ - ఏవ - దదంశ - అసౌ - ప్రియాదన్తచ్ఛదాన్తికమ్ - చకార - అధరపానస్య - తత్ర - ఏవ - అలీకచాపలమ్.

అర్థము. అసౌ = ఈ నలుఁడు, ప్రియాదన్తచ్ఛదాన్తికమ్; ప్రియా = ప్రియురాలియొక్క, దన్తచ్ఛద = పెదవియొక్క, అంతికమ్ = సమీప మందలి, దేశమేవ = స్థానమునే యనగా గడ్డమునే, దదంశ = కొఱికెను. తథా = అట్లే, తత్రైవ = అచ్చటనే, కొఱికిన ప్రదేశమందే, అధరపానస్య; అధర = పెదవియొక్క, పానస్య = పానమునకు, అలీకచాపలమ్; అలీక = నిరర్థకమైన, చాపలమ్ = చాపల్యమును నవగా నా ప్రదేశము నందే చుమ్బన కాలము నందేర్పడు ధ్వనివంటి ధ్వనిని, చకార = చేసెను. చుమ్బనము రతికి నుద్దీపకమగుట వలనను వది రతికి అంగ మగుట వలనను, పగలు సురతక్రీడ నిషిద్ధమగుటవలనను నట్లే "రతి కాలే ముఖంస్త్రీణాం శుద్ధ మాఖేటకే శునామ్" అను స్మృతి ననుసరించి రతికాలమందు స్త్రీలకు నోరు శుద్ధముగనుండుటవలనను, మఱియొక

కాలమునందది లేకపోవుటవలనను పెదవినిఁ జుమ్బనముఁ జేయలేదని యర్థము.

**సమాసములు :**

ప్రియాదన్తచ్ఛదాన్తికం : ప్రియాయాః దన్తచ్ఛదః = ప్రియాదన్తచ్ఛదః, ప్రియాదన్తచ్ఛదస్య అన్తికః = ప్రియాదన్తచ్ఛదాన్తికః, తం = ప్రియాదన్తచ్ఛదాన్తికమ్।

అధరపానస్య : అధరస్యపానం = అధరపానం, తస్య = అధరపానస్య।

అలీకచాపలమ్ : చపలస్య కర్మ = చాపలమ్, అలీకం చ తత్, చాపలం చ = అలీకచాపలమ్, తత్ = అలీక చాపలమ్।

**భావము ;**

ఈ నలుఁడు ప్రియురాలి పెదవికి సమీపమందలి గడ్డముచే కొఱికెను. ఆ ప్రదేశమందే యధరపానమునకై నిరర్థకమైన ప్రయాస ననుభవించెను. పగటియందు సురతము నిషేధించుట వలనను, సురతకాలమందే స్త్రీలకు నోరు పరిశుద్ధమని శాస్త్రముండుట వలనను సురతేతరకాలమందు పరిశుద్ధముకానందు వలనను నలుడు దమయన్తి పెదవినిఁ జుమ్బనము చేయలేదు. ఏలయనగా- నా సమయమునందు నామెయొక్క పెదవి పరిశుద్ధముగాదు. ॥149॥

శ్లో. న క్షమే చపలాపాఙ్గి! సోఢుం స్మరశరవ్యథామ్।
తత్ ప్రసీద ప్రసీదేతి స తాం ప్రీతామకోపయత్॥ 150

ప. వి. న - క్షమే - చపలాపాఙ్గి - సోఢుం - స్మరశరవ్యథామ్ - తత్ - ప్రసీద - ఇతి - సః - తాం - ప్రీతామ్ - అకోపయత్-

అర్థము. హే చపలాపాఙ్గి! = ఓ చంచలాక్షీ! స్మరశరవ్యథామ్; స్మర = మన్మథునియొక్క, శర = బాణముంవలని, వ్యథామ్ = దుఃఖమును, సోఢుం = ఓర్చుటకు, నక్షమే = శక్తుఁడనుకాను, తత్ = అందువలన, ప్రసీద, ప్రసీద = ప్రసన్నవు కమ్ము, ప్రసన్నవుకమ్ము, అనగా సురతమునకై దయఁజూపుమని యర్థము - ఇతి = ఇట్లు. ఉక్త్వా = చెప్పఁబడినదై, ప్రీతామపి = సంతోషించిన దైనను, తాం = ఆ ప్రియురాలిని, అకోప

యత్ = కోపింపఁజేసెను. పగలు సంభోగము నిషిద్ధముకాన దానినిఁ గోరుటచే నామెకు కోపము వచ్చినదని యర్థము.

సమాసములు :

చపలాపాఙ్గీ : చపలే అపాఙ్గే యస్యాస్సా = చపలాపాఙ్గీ, తస్యాః సంబుద్ధిః = చపలాపాఙ్గి!
స్మరశరవ్యథామ్ : స్మరస్యశరాః – స్మరశరాః, స్మరశరైః వ్యథా = స్మరశరవ్యథా, తాం = స్మరశరవ్యథామ్।

భావము :

ఓ చపలాక్షి! మన్మథ బాణములవలని బాధను సహింపలేకయున్నాను. కావున ప్రసన్నురాలవై సురతమునకు దయనుఁజూపుము. అని చెప్పి యామెనుఁ బరిహాసాదులచే సంతోషపఱచినను, పగలు సురతము నిషిద్ధముకాన నాకోరిక చే, నామెను కోపింపఁజేసెను. ॥150॥

శ్లో. నేత్రే తే నిషధ నాథస్య ప్రియాయా వదనామ్బుజమ్।
తత స్తనతటౌ తాభ్యాం జఘనం ఘనమీయతుః॥ 151

ప. వి. నేత్రే - నిషధనాథస్య - ప్రియాయాః - వదనామ్బుజమ్ - తతః - స్తనతటౌ - తాభ్యాం - జఘనం - ఘనం - ఈయతుః -

అర్థము: నిషధనాథస్య = నలునియొక్క, నేత్రే = కన్నులు, ప్రియాయాః = ప్రియురాలియొక్క, వదనామ్బుజం = ముఖపద్మమును, ఈయతుః = పొందినవి. తతః = తర్వాత, స్తనతటౌ = స్తనముల పరిసరములను, ఈయతుః = పొందినవి, తాభ్యాం = ఆ స్తనతటములనుండి, ఘనం = గట్టిదైన, జఘనం = నితమ్బమును, ఈయతుః = పొందినవి. అతడు కామపీడితుఁ డగుటవలన నీవిధముగా నేత్రములు పెక్కులగు నవయవములపై బడినవని యర్థము.

వి. నేత్రములు పెక్కుస్థానముల యందు క్రమముగా లగ్నములైనట్లు చెప్పుటవలన పర్యాయాలఙ్కారము.

భావము :

నిషధదేశపు ప్రభువగు నలునియొక్క కన్నులు కామపీడితములై తొలుత ప్రియురాలి ముఖకమలమును, తర్వాత నామెయొక్క స్తనప్రదేశములను తర్వాత నామెకు సంబంధించిన గట్టి నితంబమునుఁ బొందినవి. ॥151॥

శ్లో. ఇత్యధీరతయా తస్య హఠవృత్తి విశఙ్కినీ ।
ఝటిత్యుత్థాయ సోత్కణ్ఠ మసావన్వసరత్ సఖీః॥ 152

వ. వి. ఇతి - అధీరతయా - తస్య - హఠవృత్తి విశఙ్కినీ - ఝటితి - ఉత్థాయ - సోత్కణ్ఠం - అసౌ - అన్వసరత్ - సఖీః -

అర్థము. ఇతి = ఇట్లు చెప్పఁబడిన, తస్య = ఆనలునియొక్క. అధీరతయా = కామ చాంచల్యముచే, హఠవృత్తివిశఙ్కినీ, హఠవృత్తి = అతనియొక్క బలాత్కారపు ప్రవర్తనను, విశంకినీ = సందేహించుచున్న, అసౌ = ఈదమయన్తి, ఝటితి = వెంటనే, ఉత్థాయ = లేచి, యనగా నలుని వక్షఃస్థలమునుండి లేచి, సోత్కణ్ఠమ్ = ఆవేశముతోఁ గూడినదై, సఖీః = చెలికత్తెలను, అన్వసరత్ = అనుసరించెను.

సమాసములు :

అధీరతయా : ధియం రాతీతి = ధీరః, ధీరస్య భావః = ధీరతా, న ధీరతా = అధీరతా, తయా = అధీరతయా।

హఠవృత్తి విశఙ్కినీ : హఠాచ సావృత్తిశ్చ = హఠవృత్తిః, హఠవృత్తిమ్ విశఙ్కత ఇతి = హఠవృత్తి విశఙ్కినీ।

సోత్కణ్ఠమ్ : ఉత్కణ్ఠయా సహితమ్ యథాతథా = సోత్కణ్ఠమ్।

భావము :

ఇట్లు తన ప్రియుడగు నలుని కామచాంచల్యము ననునరించి యతడు సురతమునకై తన్ను బలాత్కరించునేమో యని సంశయించుచు, దమయన్తి వెంటనే యాతని వక్షఃస్థలము నుండిలేచి యుత్కణ్ఠతోఁ గూడినదై చెలికత్తెలను వెంబడించినది. ॥152॥

శ్లో. న్యవారీవ యథాశక్తి స్పన్దం మన్దం వితన్వతా।
భైమీ కుచ నితమ్బేన నలసంభోగలోభినా॥ 153

ప. వి. న్యవారి - ఇవ - యథాశక్తి - స్పన్దం - మన్దం - వితన్వతా - భైమీ-
కుచనితమ్బేన - నలసంభోగలోభినా -

అర్థము. భైమీ = దమయన్తి, నల సంభోగలోభినా; నల = నలునియొక్క,
సంభోగ = సంభోగమునకు, లోభినా = కాంక్షగల్గిన, స్పన్దం = నడకను,
మన్దం = కొలదిగా, వితన్వతా = చేయుచున్న - యనగా నడకను ప్రతి
బంధించుచున్న, కుచనితమ్బేన; కుచ = స్తనద్వయముచేతను, నిత
మ్బేన = జఘనద్వయము చేతను. యథాశక్తి = శక్తికొలది, న్యవారీవ =
అడ్డగింపఁబడినదో యనునట్లుండినది.

**సమాసములు :**

యథాశక్తి : శక్తి మనతిక్రమ్య = యథాశక్తి ।

కుచనితమ్బేన: కుచౌచ, నితమ్బౌచ అవయోః సమాహారః = కుచని
తమ్బం, తేన = కుచనితమ్బేన।

నలసంభోగలోభినా : నలస్య సమ్భోగః = నలసమ్భోగః, నలసమ్భోగే
లోభః అస్య అస్తీతి = నలసంభోగలోభీ, తేన = నలసమ్భోగలోభినా ।

**భావము :**

ఆ దమయన్తి, నలుని సమ్భోగము గోరుచున్న యనగా మర్దన స్పర్శన
ములు మున్నగు సంభోగమునుఁగోరుచున్న తన స్తనద్వయముచేతను, నితమ్బ
ద్వయముచేతను, యథాశక్తి మందగింపఁబడిన నడక గల్గిన దాయెనో యనునట్లు
మెల్లగ నడువసాగెను. అనగా స్తన జఘనములు పెద్దవిగా నుండుటవలన వాని
భారముచే నామె నడువఁజాలక పోవుట యేర్పడినది. కాని మర్దన స్పర్శనాది
రూప సంభోగములపై నామెయొక్క స్తనజఘనముల కాశయుండుటవలననవి
యందులకై యామెయొక్క నడకను మందగింపఁజేసినవో యనునట్లు ఆమె
మెల్లగా నడువ సాగిన దని యాశయము. ॥152॥

శ్లో. అపి శ్రోణిభరస్వైరాం ధర్తుం తామశకన్న సా ।
తదఙ్గసఙ్గజస్తమ్భో గజస్తమ్భోరుదోరపి ॥ 153

ప.వి. అపి - శ్రోణిభరస్వైరా - ధర్తుం - తామ్ - అశకత్ - న - సా-
తదఙ్గసఙ్గజస్తమ్భః - గజస్తమ్భోరుదోః - అపి.

అర్థము: సః = ఆ నలుఁడు, గజస్తమ్భోరుదోరపి; గజ = ఏనుగులను, (గట్టెడి, స్తమ్భ = స్తంభములవలె, ఉరు = గొప్పవైన, దోరపి = భుజములుగల వాడైనను, తదఙ్గసఙ్గజస్తమ్భః; తత్ = ఆ దమయన్తియొక్క, అఙ్గ = దేహముయొక్క, సఙ్గజ = స్పర్శమువలనఁగల్గిన, స్తమ్భః = కదలిక లేక పోవుటయనెడి సాత్త్వికభావము గల్గిన వాడై, శ్రోణిభరస్త్వైరాం; శ్రోణిభర = నితమ్బముల భారముచే, స్త్వైరాం = మందగమనముగల్గిన, తామ్ = ఆ దమయన్తిని, ధర్తుం = పట్టుకొనుటకు, ననగా నడ్డగించుటకు, నాఽశకత్ = సమర్థుఁడుకాలేదు. ఏలయనగా - పనిలేనివానికి, సహకారి సమ్పదయున్నను ప్రయోజనములేదు. అనగా నతని భుజబలాదులతడు పనిలేనివాడగుటవలన దమయన్తిని నిరోధించుటకు సహాయపడ లేదని యర్థము.

సమాసములు :

శ్రోణిభరస్త్వైరాం : శ్రోణ్యోః భరః = శ్రోణిభరః, శ్రోణిభరేణ స్త్వైరా = శ్రోణిభరస్త్వైరా, తాం = శ్రోణిభరస్త్వైరాం ।

తదఙ్గసఙ్గజస్తమ్భః: తస్యాః అఙ్గం = తదఙ్గం, తదఙ్గస్యసఙ్గః = తదఙ్గసఙ్గః, తదఙ్గసఙ్గాత్ జాయత ఇతి = తదఙ్గసఙ్గజః । తదఙ్గసఙ్గజశ్చాసౌ స్తమ్భశ్చ = తదఙ్గసఙ్గజస్తమ్భః ।

గజస్తమ్భోరుదోః: గజస్య స్తమ్భౌ = గజస్తమ్భౌ, గజస్తమ్భావివఉరు దోషౌయస్య సః = గజస్తంభోరుదోః ।

భావము :

ఆ నలుఁడు, ఏనుగులనుఁగట్టెడి స్తంభములవలె గొప్పవైన భుజములు గల్గిన వాడైనను నాదమయన్తియొక్క శరీరస్పర్శచే కదలికలేకపోవుట యనెడి "స్తంభ" మను సాత్త్వికభావము గల్గినవాడై, యనగా కదలలేనివాడై, జఘన భారముచే మందగమనము గల్గినదైనను, నాదమయన్తి నడ్డగింపలేకపోయెను. పనిలేనివానికి బలము మున్నగు సహాయ సంపదయున్నను నవి యుపయోగపడవని యాశయము. ॥154॥

శ్లో. ఆలిఙ్గాలిఙ్గ తన్వంగి! మామిత్యర్థగిరం ప్రియమ్ ।
స్మిత్వా నివృత్య పశ్యన్తీ ద్వారపారమగాదసౌ ॥ 154

ప.వి. ఆలిఙ్గ — ఆలఙ్గ - తన్వఙ్గి - మామ్ - ఇతి - అర్ధగిరం - ప్రియమ్ - స్మిత్వా - నివృత్య - పశ్యన్తీ - ద్వారపారమ్ - అగాత్ - అసౌ.

అర్థము: అసౌ = ఈ దమయన్తి, తన్వఙ్గీ = ఓ కృశాఙ్గీ ! మామ్ = నలుడనైన నన్ను, ఆలిఙ్గ = కౌగిలించుకొనుము, ఆలిఙ్గ = కౌగలించుకొనుము, ఇతి = ఇట్లు, అర్ధగిరం = ఇతరులు వినెదరను భయముతో మాటయందు సగపాలే గల్గిన, ప్రియం = ప్రియుడగు నలుని, స్మిత్వా = మందహాసము గావించి, నివృత్య = వెనుకకు మఱలి, పశ్యన్తీ = చూచుచున్నదై, ద్వారపారం; ద్వార = ద్వారము యొక్క, పారం = అవలిభాగమును, అగాత్ = పొందెను. ద్వారమును దాటెనని యర్థము.

సమాసములు :

అర్థగిరం : అర్ధాగీః యస్యసః = అర్ధగీః, తం = అర్ధగిరం।

ద్వారపారం : ద్వారస్యపారం = ద్వారపారం । తత్ = ద్వారపారం ।

భావము :

అట్లు దమయన్తి మందగమనము చేయుచుండగా, నలుడామెను సంబోధించి, యోకృశాఙ్గీ ! నన్నుఁగౌగలించుకొనుము. కౌగలించుకొనుము. యని యితరులు విందురనెడి భయముచే సగము స్పష్టముగా వినఁబడునట్లు పలికెను. అప్పుడా దమయన్తి మందహాసము గావించి వెనుకకు మఱలి చూచుచు ద్వారమును దాటి పోయినది. ॥155॥

శ్లో. ప్రియస్యాఽప్రియమారభ్య తమన్తర్దూనయాఽనయా ।
శేకే శాలీనయాఽఽలిభ్యో న గన్తుం న నివర్తితుమ్ ॥ 155

ప.వి. ప్రియస్య - అప్రియం - ఆరభ్య - తమ్ - అన్తః - దూనయా - అనయా - శేకే - శాలీనయా - ఆలిభ్యః - న - గన్తుం - న - నివర్తితుమ్.

అర్థము: ప్రియస్య = ప్రియుడగు నలునకు, అప్రియం = అతిక్రమించుటయను ననిష్ట కార్యమును, ఆరభ్య = కావించి, తమ్ = ఆ యప్రియమునుఁగూర్చి, అంతః = లోపల, దూనయా = దుఃఖించిన, శాలీనయా = సిగ్గుపడిన, అనయా = ఈ దమయన్తిచే, ఆలిభ్యః = చెలికత్తెలనుండి, గన్తుమపి = వెళ్లుటకును, నశేకే = శక్యమనుగాలేదు. తథా = అట్లే, నివర్తితుం =

మఱలుటకునుఅనగా ప్రియునివద్దకుఁ దిరిగివచ్చుటకునునశేక = శక్యముగా లేదులోవలదుఃఖముండుటవలనచెలికత్తెలనుండివెడలిపోవుటకును,సిగ్గువలన ప్రియునియొద్దకు మఱలవచ్చుటకు నామె శక్తురాలుకాలేదని యర్థము.

**సమాసములు :**

అప్రియం : న ప్రియం = అప్రియం, తత్ = అప్రియం

**భావము :**

ప్రియుఁడగు నలునకు మాటను వినకపోవుటయను నతిక్రమణ రూపమగు నసిష్టమునుఁ గావించిన దమయన్తి, దానిచే నంతరంగమున దుఃఖించినదై, గడుసుతనములేని యామె చెలికత్తెలనుండి వెడలిపోఁజాలక పోయినది. అట్లే సిగ్గుచే భర్తయొద్దకు మఱలిరాలేక పోయినది. ॥156॥

**శ్లో.** అకథయదథ వన్దిసున్దరీ ద్వాః
సవిధముపేత్య నలాయ మధ్యమహ్నః।
జయనృప! దినయౌవనోష్మ తప్తా
ప్లవనజలాని పిపాసతి క్షితిస్తే॥ 157

ప వి. అకథయత్ - అథ - వన్దిసున్దరీ - ద్వాః-సవిధం - ఉపేత్య-నలాయ - మధ్యమ్ - అహ్నః - జయ - నృప! - దినయౌవనోష్మతప్తా - ప్లవన జలాని - పిపాసతి - క్షితిః - తే.

అర్థము: అథ = దమయన్తి వెడలిపోయిన పిదప, వన్దిసున్దరీ = ఒకానొక వైతాళికురాలు, ద్వాఃసవిధం = ద్వారముయొక్క సమీపమును, ఉపేత్య = పొంది, నృప = ఓ రాజా! జయ = అందఱిని మించి వర్తింపుము. అహ్నః = దినముయొక్క, మధ్యం = మధ్యభాగము, అనగా మధ్యాహ్నము (వచ్చినది) కావుననే, దినయౌవనోష్మతప్తా, దిన = పగటియొక్క, యౌవనం = తారుణ్యముయొక్క, అనగా పూర్ణావస్థయొక్క, ఊష్మ = వేడిమిచే, తప్తా = కాల్పఁబడిన, క్షితిః = భూమి, తే = నీయొక్క, ప్లవన జలాని = స్నానజలములను, పిపాసతి = పానముఁజేయఁ గోరుచున్నది తాపము దాహమునకు కారణముగదా! ఇతి = అని, నలాయ = నలునికై, అకథయత్ = చెప్పినది. మధ్యాహ్నవు స్నానమునకు సమయమాసన్నమైనదని యాశయము.

**సమాసములు :**

వన్దిసున్దరీ : వన్దినాం సున్దరీ = వన్దిసున్దరీ।

ద్వాఃసవిధం : ద్వాఃసవిధః, = ద్వాఃస్సవిధః। తం = ద్వాఃసవిధం॥

దినయౌవనోష్మతప్తా : దినస్య యౌవనం = దినయౌవనం, దినయౌవనస్య ఊష్మా = దినయౌవనోష్మా, దినయౌవనోష్మణా తప్తా = దినయౌవనోష్మతప్తా।

ప్లవనజలాని : ప్లవనస్య జలాని = ప్లవన జలాని, తాని = ప్లవనజలాని।

**భావము :**

తర్వాత దమయన్తి వెడలిపోగనే, వైతాలికురాలు ఒక్కతె, ద్వారము కడకు వచ్చి ఓ రాజా! జయము. మధ్యాహ్న కాలము సమీపించినది. ఈ మధ్యాహ్నముయొక్క వేడిమిచేత భూమి తాపముఁజెందినదై నీ స్నాన జలములనుఁ ద్రాగఁగోరుచున్నది. అనగా నీవు మధ్యాహ్నస్నానమునుఁ జేయుమని యాశయము. ॥157॥

శ్లో. **ఉపహృత మధిగఙ్గమమ్బు కమ్బు**
**చ్ఛవి తవ వాఞ్ఛతి కేశభఙ్గిసఙ్గాత్ ।**
**అనుభవితు మనంతరం తరఙ్గాఽ**
**సమశమన స్వస్సృమిశ్ర భావశోభామ్॥** 158

వ.వి. ఉపహృతమ్ - అధిగఙ్గమ్ - అమ్బు - కమ్బుచ్ఛవి - తవ - వాఞ్ఛతి - కేశభఙ్గిసఙ్గాత్ - అనుభవితుమ్ - అనన్తరం - తరఙ్గాఽసమశమన స్వస్సృమిశ్ర భావశోభామ్.

అర్థము: కిఞ్చ = మఱియు, కమ్బుచ్ఛవి; కమ్బు = శంఖమువంటి, ఛవి = తెల్లని కాంతిగల్గిన, అధిగఙ్గమ్ = గంగనుండి, ఉపహృతమ్ = తేఁబడిన యనగా కలశములతో గంగానదినుండి, తేఁబడిన, అమ్బు = ఉదకము, తవ = నీయొక్క, కేశభఙ్గిసఙ్గాత్, కేశ = కురులయొక్క, భఙ్గి = వంపుతిరిగిన చుట్టలయొక్క, సఙ్గాత్ = స్పర్శనుండి, అనంతరం = పిదప, తరఙ్గాఽసమశమనస్వస్సృమిశ్రభావశోభామ్; తరఙ్గాఽసమ = అలలతోమిట్టపల్లములు

గానైన, శమనస్వస్రు = యముని చెల్లెలగు మిక్కిలి నల్లనైన యమునా నదియొక్క, మిశ్రభావ = కలయిక చేత నేర్పడిన, శోభామ్ = సౌంద ర్యమును, అనుభవింతుం = పొందుటకు, వాఞ్ఛతి = కోరుచున్నది. శుభ్రములైన గంగాజలముల మధ్య వంపులు తిరిగిన నల్లని కురులను ముంచి స్నానము గావింపుము. మిక్కిలి శుభ్రములైన గంగాజలము లకు మిక్కిలి నల్లనైన నీకురులతో సంబంధమేర్పడినచో, ప్రయాగ క్షేత్ర మందు గంగాయమునలు కలియుట వలని శోభ యేర్పడునని యర్థము.

వి. స్వచ్ఛములగు గంగాజలములతోఁ గలసిన నీకురులు, స్వచ్ఛములగు గంగా జలములతోఁ గలసిన నల్లని యమునానదియొక్క శోభను వహించునని గంగా యమునల శోభను పైకురుల యందారోపించుట వలన నిదర్శనాల ఙ్కారము.

**సమాసములు :**

అధిగఙ్గమ్ : గఙ్గాయామ్ = అధిగఙ్గమ్।

కమ్బుచ్ఛవి : కమ్బునః ఛవిరివ ఛవిః యస్యతత్ = కమ్బుచ్ఛవి।

కేశభఙ్గిసఙ్గాత్ : కేశానాంభఙ్గయః = కేశభఙ్గయః, కేశభఙ్గీనాం సఙ్గం = కేశభఙ్గిసఙ్గః, తస్మాత్ = కేశభఙ్గిసఙ్గాత్।

తరఙ్గాఽసమశమనస్వస్రుమిశ్రభావశోభామ్ : తరఙ్గైరసమా = తరఙ్గాఽసమా, శమనస్య స్వసా = శమనస్వసా, తరఙ్గాఽసమా చ సా శమనస్వసా చ = తరఙ్గాఽసమశమన స్వసా, తరఙ్గాఽసమశమన స్వస్రా మిశ్రభావః = తరఙ్గాఽసమశమనస్వస్రు మిశ్రభావః, తరఙ్గాఽసమశమన స్వస్రుమిశ్రభావస్యశోభా, తరఙ్గాఽసమశమన స్వస్రుమిశ్రభావ శోభా, తాం = తరఙ్గాఽసమశమనస్వస్రు మిశ్రభావశోభామ్।

**భావము :**

మఱియు శంఖమువంటి తెల్లని కాన్తిగల్గిన గంగనుండి కలశములతో నుదకములు తేఁబడియున్నవి. అవి నీ యొక్క వంపులు తిరిగిన నల్లని వెండ్రుకల సంబంధమునుఁ బొందిన పిదప, అలలతో మిట్టపల్లములైన మిక్కిలి నల్లని యమునా నదియొక్క శోభను వహింప గోరుచున్నవి.

అనగా శుభ్రములైన గంగాజలముల మధ్య వంపులు తిరిగిన నీకురులను ముంచి స్నానము గావింపుము. ఆ తెల్లని గంగాజలములతో, నీ నల్లని కురులకు సంబంధమేర్పడగనే ప్రయాగక్షేత్రమందు గంగాయమునలు కలియుటచే నేర్పడెడి శోభ సంభవించును. ప్రయాగక్షేత్రమందు గంగా యమునలు కలియును. అందు గంగ తెల్లగను, యమున నల్లగను ప్రత్యే కముగా, గానవచ్చును. గంగానది యడుగుననే సరస్వతీ నదియు ప్రవ హించును. ఇట్లు మూడునదులు నిచ్చట కలియుటచే నీనదుల కూడలికి 'త్రివేణీ సంగమ'మనియు పేరుగలదు. ॥158॥

శ్లో. తపతి జగత ఏవ మూర్ధ్ని భూత్వా
రవిరధునా త్వ మివాద్భుత ప్రతాపః।
పురమథనముపాస్య పశ్యపుణ్యై
రధరితమేన మనన్తరం త్వదీయైః॥ 159

ప.వి. తపతి - జగతః - ఏవ - మూర్ధ్ని - భూత్వా - రవిః - అధునా - త్వమ్ - ఇవ - అద్భుత ప్రతాపః - పురమథనం - ఉపాస్య - పశ్య- పుణ్యైః - అధరితమ్ - ఏనమ్ - అనన్తరం - త్వదీయైః.

అర్థము: త్వమివ = నీవలె, అద్భుత ప్రతాపః = అబ్బురము గొల్పెడి ప్రతాపము (పరాక్రమము) వేడిమి గల్గిన, రవిః = సూర్యుడు, అధునా = ఇప్పుడు, జగతః = ప్రపఞ్చము యొక్క, మూర్ధ్న్యేవ = తలయందే, (ఆకసము యొక్క పైభాగమునందే) భూత్వా = ఉండి, తపతి = (దుర్జనులను శాసించుచున్నాడు) సంతాపమును గల్గించుచున్నాడు, అనన్తరం = స్నానము గావించిన పిదప, పురమథనం = శివుని, ఉపాస్య = పూజించి, త్వదీయైరేవపుణ్యైః = నీ పూజాపుణ్యముచేతనో యనునట్లు, అధరి తం = తలపైనుండి దిగువకు బడద్రోయబడిన (మధ్యాహ్నము గడచు టచే దిగువకుబోయిన) ఏనం = ఈ సూర్యుని, పశ్య = చూడుము. నమస్కరించుటకై చూడుమని యర్థము. శివుని యనుగ్రహమువలన సూర్యుని మించిన ప్రతాపవంతుడవు కాగలవు.

**సమాసములు :**

అద్భుతప్రతాపః : అద్భుతః ప్రతాపః యస్యసః = అద్భుతప్రతాపః।
పురమథనం : పురాణాం మథనం యేన సః = పురమథనః, తం = పురమథనం।
త్వదీయైః: తవ ఇమాని = త్వదీయాని, తైః = త్వదీయైః।

**భావము :**

నీవలె నబ్బురము గొల్పెడి ప్రతాపముతోఁ గూడిన ప్రతాపము గల్గిన అనగా పరాక్రమము గల్గిన వాడును, వేడిమిగల్గిన వాడును, నగు సూర్యుడు ఇప్పుడు ప్రపఞ్చముయొక్క తలపైననే - ఆకసముయొక్క పైభాగముననే యుండి సంతాపమును గల్గించుచున్నాడు. అనగాఁ (దుష్టులను శాసించుచున్నాడు) ప్రపఞ్చమునకు వేడి నొసంగుచున్నాడు. కాన నీవు స్నానము గావించిన పిదప శివునిఁ బూజించుము. నీ పూజా పుణ్యములచేతనో యనునట్లు తలపై భాగము నుండి పడత్రోయఁబడిన యనగా మధ్యాహ్నము గడచిన పిదపఁ గ్రిందికి దిగిన యీ సూర్యునిఁ జూచి ప్రణమిల్లుము. శివుని ప్రతాపముచే సూర్యుని మించిన ప్రభావము గల్గిన వాడవుగా కమ్ము. ॥159॥

శ్లో. అనన్దం హరమాహరన్నివ హరధ్యానార్చనా దిక్షణ
స్యాసత్తావపి భూపతిః ప్రియతమా విచ్ఛేద ఖేదాలసః ।
పక్షద్వారదిశం ప్రతి ప్రతిముహుర్ద్రాజ్నిర్గత ప్రేయసీ
ప్రత్యావృత్తిధియా దిశన్ దృశమసౌ నిర్గన్తుముత్తస్థివాన్ ॥169

ప.వి. అనన్దమ్ - హరమ్ - ఆహరన్ - ఇవ - హరధ్యానార్చనాదిక్షణస్య - ఆసత్తౌ - అపి - భూపతిః - ప్రియతమా విచ్ఛేద ఖేదాలసః - పక్షద్వారదిశం - ప్రతి - ప్రతి ముహుః - ద్రాజ్ నిర్గతప్రేయసీ ప్రత్యావృత్తిధియా - దిశన్ - దృశమ్ - అసౌ - నిర్గన్తుమ్ - ఉత్తస్థివాన్.

అర్థము: హరధ్యానార్చనాదిక్షణస్య; హర = శివునియొక్క, ధ్యాన = చింతన, అర్చనాది = పూజా మున్నగు వానియొక్క, క్షణస్య = సమయమునకు, ఆసత్తావపి = సామీప్యమున్నను ననగా నవి సమీపమునందున్నను, ప్రియతమా విచ్ఛేద ఖేదాలసః; ప్రియతమా = మిక్కిలి ప్రియురాలైన పమ

యన్తి తోటి, విచ్ఛేద = వినియోగమువలని, ఖేద = కష్టముతో, అలసః = జడత్వముఁ బొందిన వాడై యనగా కర్తవ్యజ్ఞానము లేని వాడైన, అసౌ = ఈ, భూపతిః = నలమహారాజు, ద్రాఙ్నిర్గతప్రేయసీ ప్రత్యావృత్తిధియా; ద్రాక్ = వెంటనే, నిర్గత = వెడలిపోయిన, ప్రేయసీ = ప్రియురాలగు, దమయన్తియొక్క, ప్రత్యావృత్తి = మఱల వచ్చువనెడి, ధియా = భావముతో, పక్షద్వారదిశం ప్రతి = ప్రక్కనున్న ద్వారము నుద్దేశించి, ప్రతిముహుః = మాటిమాటికి, దృశం = దృష్టిని, దిశన్ = పెట్టుచు, హఠం = బల పూర్వకముగా, ఆనందం = ప్రియురాలి సమాగమముతోటి సంతోషమును, ఆహరన్నివ = తెచ్చుకొనుచున్నాడో, యనునట్లు, నిర్గన్తుం = ఇంటినుండి వెళ్ళుటకు, ఉత్తస్థివాన్ = పడకనుండి పైకి లేచెను.

హరధ్యానార్చనాదిక్షణస్య : ధ్యానం చ, అర్చనం చ = ధ్యానార్చనే, ధ్యానార్చనే ఆదియస్య సః = ధ్యానార్చనాదిః, ధ్యానార్చనాదేః క్షణః = ధ్యానార్చనాదిక్షణః, హరస్య ధ్యానార్చనాదిక్షణః = హరధ్యానార్చనాది క్షణః, తస్య = హరధ్యానార్చనాదిక్షణస్య।

ప్రియతమా విచ్ఛేద ఖేదాలసః : అత్యంతం ప్రియా = ప్రియతమా, ప్రియతమాయాః విచ్ఛేదః = ప్రియతమా విచ్ఛేదః, ప్రియతమావిచ్ఛేదేన ఖేదః = ప్రియతమా విచ్ఛేదఖేదః, ప్రియతమా విచ్ఛేద ఖేదేన అలసః = ప్రియతమా విచ్ఛేద ఖేదాలసః।

పక్షద్వారదిశం : పక్షేద్వారం = పక్షద్వారం, పక్షద్వారస్య దిక్, పక్ష ద్వారదిక్, తాం = పక్షద్వారదిశమ్।

ప్రతిముహుః : ముహుః ముహుః = ప్రతిముహుః।

ద్రాఙ్నిర్గతప్రేయసీ ప్రత్యావృత్తిధియా : ద్రాక్‌నిర్గతా = ద్రాఙ్నిర్గతాః, ద్రాఙ్నిర్గతాచసా ప్రేయసీచ = ద్రాఙ్నిర్గతప్రేయసీ, ద్రాఙ్నిర్గతప్రేయస్యాః ప్రత్యావృత్తిః = ద్రాఙ్నిర్గతప్రేయసీ ప్రత్యావృత్తిః, ద్రాఙ్నిర్గతప్రేయసీ ప్రత్యావృత్తేః ధీః = ద్రాఙ్నిర్గతప్రేయసీ ప్రత్యావృత్తిధీః, తయా = ద్రాఙ్నిర్గతప్రేయసీ ప్రత్యావృత్తి ధియా।

**భావము :**

శివపూజా సమయ మేతెంచినను ప్రియురాలి వియోగ ఖేదముచే కర్తవ్యము లకు వైముఖ్యమునొందిన నలమహారాజు, అప్పుడే వదలిపోయిన ప్రియురాలిని మఱలివచ్చునను భావముతో, ప్రక్కనున్న ద్వారమువైపు వలుమాఱులు చూచుచు బలవూర్వకముగా ప్రేయసీ సమాగమమువలని యానన్దమునుఁగొని తెచ్చుకొను చున్నాడోయనునట్లు ఇంటినుండి బయలు వెడలుటకు సెజ్జనుండి లేచెను. ॥160॥

శ్లో. శ్రీహర్షం కవిరాజరాజి మకుటాలఙ్కారహీరః సుతం
శ్రీహీరః సుషువే జితేన్ద్రియచయం మామల్లదేవీచ యమ్
అన్యాఽక్షుణ్ణరస ప్రమేయభణితౌ వింశస్తదీయే మహా
కావ్యేఽయం వ్యగలన్నలస్య చరితేసర్గో నిసర్గోజ్జ్వలః॥ 161

ప.వి. శ్రీహర్షమ్ - కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః - సుతమ్ - శ్రీహీరః - సుషువే - జితేన్ద్రియచయమ్- మామల్లదేవీ - చ - యమ్- అన్యాక్షుణ రస ప్రమేయభణితౌ - వింశః - తదీయే - మహాకావ్యే - అయమ్- వ్యగలత్ - నలస్య - చరితే - సర్గః - నిసర్గోజ్జ్వలః.

అర్థము: కవిరాజరాజిమకుమలఙ్కారః; కవిరాజ = కవి శ్రేష్ఠులయొక్క; రాజి = పఙ్క్తిలో, మకుట = శ్రేష్ఠమైన వారికి, అలఙ్కార = భూషణ మైన, హీరః = వజ్రమైన, శ్రీహీరః = శ్రీహీరుడు, జితేన్ద్రియచయమ్; జిత = జయింపఁబడిన, ఇన్ద్రియ చయమ్ = ఇన్ద్రియముల సమూహము గల్గిన, శ్రీహర్షమ్ = శ్రీశ్రీ హర్షుఁడను పేరుగల, య = ఏ, సుతమ్ = కుమారుని, సుషువే = ఉత్పత్తిగావించెనో, మామల్లదేవీ చ = మామల్ల దేవి యను తల్లియు, యమ్ = ఏకుమారుని, సుషువే = కనెనో, అన్యాక్షుణ్ణ, రస ప్రమేయభణితౌ; అన్య = ఇతరులచే అక్షుణ్ణ = స్పృశింపఁబడని, రస = శృఙ్గారాది రసములు, ప్రమేయ = విషయములతోఁగూడిన, భణితౌ = వాక్యములు గల్గిన, తదీయే = ఆ శ్రీహర్షునకు సంబంధించిన, మహాకావ్యే = మహాకావ్యమగు, నలస్య = నలునియొక్క. చరితే = చరిత్రయందు, నిసర్గోజ్జ్వలః = స్వభావముతో ప్రకాశించునట్టి, అయమ్ = ఈ, వింశః = ఇఱువదియైన, సర్గః = సర్గ, వ్యగలత్ = కడచినది.

సమాసములు :

అన్యాఽక్షుణ్ణ రసప్రమేయ భణితౌ : అన్యైః అక్షుణ్ణాః = అన్యాక్షుణ్ణాః, అక్షుణ్ణాః రసాః ప్రమేయాః యాను తాః = అన్యాఽక్షుణ్ణరసప్రమేయాః, అన్యాఽక్షుణ్ణ రసప్రమేయాః భణితయః యస్మిన్ తత్ = అన్యాక్షుణ్ణ రస ప్రమేయ భణితి, తస్మిన్ = అన్యాఽక్షుణ్ణరసప్రమేయభణితౌ, తక్కిన వానిని వెనుకటి సర్గలయందువలెఁ జూచుకొనవలయును. భావము గూడ పూర్వమువలె గ్రహింపవలయును. ॥161॥

ఇతి

శ్రీమదాత్రేయ గోత్ర శ్రీమదుదాలి నృసింహశాస్త్రి
తనూజ విక్రమ సింహపురీ వేద సంస్కృత కలాశాలా
భూతపూర్వ ప్రధానోపాధ్యాయ
శ్రీ సుబ్బరామశాస్త్రి
విరచితమగు
నైషధాన్వి వాఖ్యాతు
వింశ సర్గ
సమాప్తము
శమ్.

# శ్రీ హర్ష నైషధము
## ఆంధ్ర వ్యాఖ్య
## ఏకవింశ సర్గ

శ్లో. తం విదర్భరమణీమణిసౌధా దుజ్జిహాన మనుదర్శిత సేవైః
అర్పణా న్నిజకరస్య నరేన్ద్రై రాత్మనః కరదతా పున రూచే॥ 1

ప. వి. తం - విదర్భరమణీ మణి సౌధాత్ - ఉజ్జిహానం- అనుదర్శిత సేవైః -
అర్పణాత్ - నిజకరస్య - నరేన్ద్రైః - ఆత్మనః - కరదతా - పునః -
ఊచే.

అర్థము. విదర్భరమణీ మణిసౌధాత్, విదర్భరమణీ = దమయన్తియొక్క, మణి
సౌధాత్ = రత్నపుమేడనుండి, ఉజ్జిహానం = వెడలుచున్న, తమ్ = ఆ
నలుని,అను = ఉద్దేశించి, దర్శిత సేవైః, దర్శిత = చూపబడిన, సేవైః =
సేవలుగల, నరేన్ద్రైః = సామన్తరాజులచేత, నిజకరస్య = తమ కర
మును, అర్పణాత్ = ఇచ్చుటవలన. అనగా మెట్లనుండి దిగు సమయమున
తమ హస్తములను బట్టుకొనుట కిచ్చుటవలన, ఆత్మనః = తనకు, కర
దతా = కప్పము చెల్లించుట (హస్తము నిచ్చుట) పునః = మరల,
ఊచే = చెప్పబడినది. కప్పము చెల్లించుటచేతనే వారికి కరదత్వమున్నను,
మరల మెట్లనుండి దిగుటకు బట్టుగా కరమును (హస్తమును, కప్పమును)
ఇచ్చుటవలన కరదత్వ మేర్పడినదని యర్థము. అనగా కరదానమునందు
బునరుక్తి యేర్పడినదని యర్థము. దీనివలన నలునకు చక్రవర్తిత్వము
సూచితము.

సమాసములు :

విదర్భరమణీ మణిసౌధాత్ : విదర్భాణాం రమణీ = విదర్భరమణీ, మణిమయ శ్చాసౌ సౌధశ్చ = మణిసౌధః, విదర్భరమణ్యాః మణి సౌధః = విదర్భరమ ణీమణిసౌధః, తస్మాత్ = విదర్భరమణీమణిసౌధాత్.
దర్శితసేవైః : దర్శితా సేవా యైస్తే = దర్శితసేవాః, తైః = దర్శిత సేవైః.
నిజకరస్య : నిజశ్చా సౌకరశ్చ = నిజకరః, తస్య = నిజకరస్య.
నరేన్ద్రైః : నరాణా మిన్ద్రాః = నరేన్ద్రాః, తైః = నరేన్ద్రైః.
కరదతా : కరం దదతీతి = కరదాః, కరదానాం భావః = కరదతా.

భావము :

దమయన్తియొక్క రత్నపుమేడనుండి వెడలి వచ్చుచున్న యా నలు నుద్దే శించి, యంతఃపురద్వారమువద్ద సామన్తరాజులు వన్దనాది సేవలను గావించి, నల మహారాజు మేడనుండి దిగునపుడు, ఆయనకు బట్టుగా తమకరమును (హస్తము లను, కప్పమును) అందించినవారై మరల కరదులైరి. అనగా కప్పము గట్టిన వారైరి. సాధారణముగా కప్పముకట్టుచే కరదులైన రాజులు తమకరములను (హస్తములను) నలుని కందించుటవలన మరల కరదులైరని యాశయము. దీనివలన నలునకు చక్రవర్తిత్వము సూచితము.

శ్లో. తస్య చీనసిచయైరపి బద్ధా పద్ధతిః పదయుగాత్ కఠినేతి।
తం వ్యధత్త శిరసాం ఖలు మాల్యై రాజరాజి రభితః
ప్రణమన్తీ॥ 2

ప. వి. తస్య - చీనసిచయైః - అపి - బద్ధా - పద్ధతిః - పదయుగాత్ - కఠినా - ఇతి - తం - వ్యధత్త - శిరసాం - ఖలు - మాల్యైః - రాజరాజిః - అభితః - ప్రణమన్తీ.

అర్థము. రాజరాజిః = సామన్తరాజులవరుస, అభితః = అంతట, ప్రణమన్తీ = భూమిపై శిరస్సును వంచి వన్దనమాచరించుచున్నదై, చీనసిచయైః = చీనాదేశపు వస్త్రములతో, బద్ధాపి = కట్టబడినను, పద్ధతిః = మార్గము,

తస్య = ఆనలునకు, కఠినేతి = కఠినమను కారణమువలన, తాం = ఆ మార్గమును శిరసాం = తలలయొక్క, మాల్యైః = పుష్పమాలికలచేత, వ్యధత్త ఖలు = కప్పినదో యనునట్లుండెను. పాదములకంటెను భూమి కఠినముగా నుండుటవలన నచ్చట పాదము లుంచినచో నలునకు నొప్పి కలుగునని భావము.

**సమాసములు :**

చీనసిచయైః : చీనానాం నిచయాః = చీనసిచయాః, తైః = చీనసిచయైః, పదయుగాత్ = పదయోః యుగం = పదయుగం, తస్మాత్ = పద యుగాత్.

రాజరాజిః : రాజ్ఞాం రాజిః = రాజరాజిః.

**భావము :**

సామంతరాజుల వరున నలునిమార్గమునందు నేలవరకు తలను వంచి నమస్కరించుచున్నపై యామార్గము చీనాదేశపు వస్త్రములతో గప్పబడినను నలుని పాదములకు కఠినముగా నుండునను కారణముచే దమతలలలోని పుష్ప మాలికలచే దానిని గప్పినదో యనునట్లుండెను. నలుని పాదములకంటెను భూమి కఠినముకాన దానిపై పాదము లుంచినచో నొప్పి యేర్పడునని యభిప్రాయము.

శ్లో. ద్రాగుపాహ్రియత తస్య నృపై

స్తద్దృష్టిదాన బహుమానకృతార్థైః

స్వస్వదేశ్య మథ రత్న మపూర్వం

యత్నకల్పితగుణాధికచిత్రమ్. 3

ప. వి. ద్రాక్ - ఉపాహ్రియత - తస్య - నృపైః - తద్దృష్టిదానబహుమాన కృతార్థైః - స్వస్వదేశ్యమ్ - అథ - రత్నం - అపూర్వం - యత్న కల్పిత గుణాధిక చిత్రం.

అర్థము. అథ = నమస్కరించిన పిదప, తస్య = ఆ నలునియొక్క, దృష్టిదాన బహుమానకృతార్థైః, దృష్టిదాన = చూపునిచ్చుట యనగా చూచుట యను,

బహుమాన = గౌరవముచే, కృతార్థైః = కృతకృత్యులైన, నృపైః =
రాజులచే, స్వస్వదిశ్యం, స్వస్వ = తమకు తమకు సంబంధించిన,
దిశ్యం = దిక్కులయందు గలిగిన యనేక దేశములయందు సంభవించిన,
యత్నకల్పితగుణాధికచిత్రం, యత్న = ప్రయత్నముతో, కల్పిత =
సానబెట్టుట మున్నగువానిచే చేయబడిన, గుణ = గుణములతో అనగా కాన్తి
మున్నగు గుణములతో, అధికవిచిత్రం = శ్రేష్ఠము సద్భుతమునైన,
అపూర్వం = మున్నెన్నడును చూడబడని, రత్నం = మణి, తస్య = ఆ
నలునికి, ద్రాక్ = వెంటనే యనగా తమ్ము దాటిపోవుననెడి తొందరతో,
ఉపాహ్రియత = బహూకరింపబడెను.

సమాసములు :

తద్దృష్టిదానబహుమానకృతార్థైః : తస్య దృష్టిః = తద్దృష్టిః, తద్దృష్టేః
దానం = తద్దృష్టిదానం, తద్దృష్టిదానమేవ బహుమానం = తద్దృష్టిదాన
బహుమానం, తద్దృష్టిదానబహుమానేన కృతార్థాః = తద్దృష్టిదానబహు
మానకృతార్థాః, తైః = తద్దృష్టిదానబహుమానకృతార్థైః.

స్వస్వదిశ్యం : స్వే స్వే చ = స్వస్వాః, స్వస్వేషాం దిశః = స్వస్వ
దిశః, స్వస్వదిక్షు భవం = సస్వదిశ్యం.

అపూర్వం : పూర్వం న భవతీతి = అపూర్వం.

యత్నకల్పితగుణాధికచిత్రం : యత్నేన కల్పితాః = యత్నకల్పితాః,
యత్నకల్పితాశ్చ తే గుణాః = యత్నకల్పితగుణాః, యత్నకల్పితగుణైః
అధికం చ తత్ చిత్రం చ = యత్నకల్పితగుణాధికచిత్రమ్.

**భావము:**

అట్లు సామన్తరాజులు నమస్కరించినపిదప నానలుని దృష్టి తమయెడ
ప్రసరించుటచేతను బహుమానముచే కృతార్థులైనపిదప నారాజులు, మిక్కిలి
యత్నముతో మెరుగుపెట్టుటచే నేర్పడిన తళతళకాంతులచే మిక్కిలి శ్రేష్ఠములును
నాశ్చర్యకరములునైన యపూర్వములు రత్నములను శీఘ్రముగా ననగా నా
నలమహారాజు తమ్ము దాటిపోగలడను తొందరతో నానలునకు బహూకరించిరి.

శ్లో. అఙ్గులీచలన లోచనభఙ్గిభ్రూతరఙ్గ వినివేదితదానమ్,
రత్న మన్యనృపఢౌకిత మన్యే తత్ప్రసాద మలభ న్త
నృపా స్తత్॥ 4

ప. వి. అఙ్గులీచలన లోచనభఙ్గి భ్రూతరఙ్గ వినివేదితదానం - రత్నం-అన్యనృప ఢౌకితం - అన్యే - తత్ప్రసాదం - అలభ న్త - నృపాః - తత్.

అర్థము: అన్యే = ఇతరులైన, నృపాః = రాజులు, అఙ్గులీచలనలోచనభఙ్గి భ్రూతరంగ వినివేదితదానం, అఙ్గులీచలన = వ్రేళ్ళను గదెలించుట, లోచన భఙ్గి = కనుసంజ్ఞలు, భ్రూతరఙ్గ = కనుబొమ్మలను కదలించుట, యను వీనిచే, వినివేదిత = తెలుపబడిన, దానం = దానముగలిగిన, అన్యనృపఢౌకితం, అన్యనృప = ఇతరరాజులచే, ఢౌకితం = తేబడిన, తత్ = ముందుచెప్పబడిన, రత్నమ్ = రత్నమును, తత్ప్రసాదమ్, తత్ = ఆ నలునియొక్క, ప్రసాదం = అనుగ్రహముగా, అలభ న్త = పొందిరి. ఒకరొసంగిన రత్నమును మరియొకరికి నలమహారా జొసంగెనే కాని దానిని బొక్కసము నందు ఉంచుకొనలేదు. కాన దీనివలన నతని దాతృత్వము అనుచరులను సంతోషపరచుట యుక్తాయు క్త పరిజ్ఞానము మున్నగు గుణములు సూచితములైనవి.

సమాసములు :

అఙ్గులీచలన లోచనభఙ్గి భ్రూతరఙ్గ వినివేదిత ధానమ్ :
అఙ్గులీనాం చలనం = అఙ్గులీచలనం, లోచనానాం భఙ్గిః = లోచనభఙ్గిః, భ్రువాం తరఙ్గాః = భ్రూతరఙ్గాః. అఙ్గులీచలనం చ, లోచనభఙ్గిశ్చ భ్రూతరఙ్గాశ్చ = అఙ్గులీచలన లోచనభఙ్గి భ్రూతరఙ్గాః, అఙ్గులీచలన లోచనభఙ్గి భ్రూతరఙ్గైః వినివేదితం దానం యస్య తత్ = అఙ్గులీచలన లోచనభఙ్గి భ్రూతరఙ్గ వినివేదితదానం, తత్ = అఙ్గులీచలనలోచనభఙ్గి భ్రూతరఙ్గ వినివేదితదానం.
అన్యనృపఢౌకితం-అన్యే చ తే నృపాశ్చ = అన్యనృపాః. అన్యనృపైః ఢౌకితం = అన్యనృపఢౌకితం.
తత్ప్రసాదం-తస్య ప్రసాదః = తత్ప్రసాదః, తత్ = తత్ప్రసాదం.

**భావము :**

రాజులితరులు సమర్పించిన రత్నములను నలమహారాజు వ్రేలితోడను నేత్రములతోడను కనుబొమలతోడను సైగలు చేయుచు నాశ్రితులగు రాజులకు తన యనుగ్రహరూపముగా నొసంగెను. అనగా నొకళ్ళిచ్చిన రత్నములను మరియొకళ్లకిచ్చెనే గాని తాను స్వీకరించుటకాని బొక్కసమందు దాచుటకాని చేయలేదు. ఇది యానలుని దాతృత్వమునకును నాశ్రితపోషణకును వివేకమునకును నిదర్శనము.

శ్లో. తానసౌ కుశల సూనృత సేకైః తర్పితా నథ పితేవ విసృజ్య।
అస్త్రశస్త్రఖురలీషు వినిన్యే శైష్యకోపనమితా నమితౌజాః॥ 5.

ప.వి. తాన్ - అసౌ - కుశలసూనృతసేకైః - తర్పితాన్ - అథ-పితా-ఇవ - విసృజ్య-అస్త్ర శస్త్ర ఖురలీషు-వినిన్యే-శైష్యకోపనమితాన్-అమితౌజాః.

అర్థము: అథ = కానుకలు పుచ్చుకొనుట యిచ్చుట పూర్తియైన పిదప, అమితౌజాః, అమిత = అధికమైన, ఓజాః = ప్రతాపము గల్గిన, అసౌ = ఈ నలుడు, కుశల సూనృత సేకైః, కుశల = క్షేమమును గూర్చి యడుగుట, సూనృత = సత్యములైన ప్రియవచనము లనెడి యమృతములయొక్క; సేకైః = వర్షములచే, తర్పితాన్ = తృప్తిబొందింపబడిన, తాన్ = ఆ రాజులను, విసృజ్య = వెడల ననుజ్ఞ నొసగి, శైష్యకోపనమితాన్, శైష్యక = శిష్యభావముచే, ఉపనమితాన్ = వచ్చేసిన, యనగా యుద్ధశిక్షకై వచ్చేసిన రాజులను, పితేవ = తండ్రివలె, అస్త్రశస్త్రఖురలీషు, అస్త్ర = ధనుర్విద్యలయందును, శస్త్ర = ఖడ్గవిద్యలయందును, ఖురలీషు = వాని ప్రయోగములయందును వ్యాయామములయందును, వినిన్యే = శిక్షణ నొసంగెను.

**సమాసములు :**

కుశలసూనృతసేకైః-కుశలం చ సూనృతం చ = కుశలసూనృతే, కుశల సూనృతాభ్యాం సేకాః = కుశలసూనృతసేకాః, తైః = కుశల సూనృతసేకైః.

అస్త్రశస్త్రఖురలీషు - అస్త్రం చ శస్త్రం చ ఖురలీ చ = అస్త్రశస్త్ర

ఖురల్యాః, తాసు = అస్త్రశస్త్రఖురలీషు.

శైష్యకోపనమితాన్ - శిష్యాణాం భావః శైష్యకం, శైష్యకేణ ఉపన మితాః = శైష్యకోపనమితాః, తాన్ = శైష్యకోపనమితాన్.

అమితౌజాః : న మితం = అమితం, అమితం ఓజః యస్యసః = అమితౌజాః.

భావము :

ఇట్లు కానుకలను పుచ్చుకొనుట యాప్తుల కిచ్చుకొనుట యను కార్యము పూర్తినొందగనే యపరిమితమగు ప్రతాపముగల నలమహారాజు, కుశల ప్రశ్నల చేతను సత్యములగు ప్రియవచనములచేతను సంతోషపఱపబడిన యారాజుల నందఱిని వీడ్కొలిపి, తనయొద్ద ధనుర్విద్యాదులను నేర్వ, శిష్యభావమును వహించి వచ్చిన రాజులకు తండ్రివలె నా ధనురాది విద్యలయందు శిక్షణ నొసంగెను,

శ్లో. మర్త్యదుష్ప్రచర మస్త్రవిచార శ్చారుశిష్యజనతా మనుశిష్య।
స్వేదబిన్దుకితగోధిరధీరం స శ్వస న్నభవ దాప్లవనేచ్ఛుః ॥ 6.

ప.వి. మర్త్యదుష్ప్రచరమ్ - అస్త్రవిచారం - చారు - శిష్యజనతామ్ - అను శిష్య - స్వేదబిన్దుకితగోధిః - అధీరం - సః - శ్వసన్ - అభవత్ - ఆప్లవనేచ్ఛుః.

అర్థము: సః = ఆ నలుడు, మర్త్యదుష్ప్రచరమ్, మర్త్య = మానవలోకమునందు, దుష్ప్రచరమ్ = ప్రచారములేని, అస్త్రవిచారం = అస్త్రబోధనను. శిష్య జనతామ్ = శిష్యజన సమూహమునకు, చారు = చక్కగా, అనుశిష్య = బోధించి, స్వేదబిందుకితగోధిః, స్వేద = చెమటచే, బిందుకిత = బిందువులు గలదిగా జేయబడిన, గోధిః = నొసలుగలవాడై, అధీరమ్ = చంచలముగా, శ్వసన్ = శ్రమచే దీర్ఘములగు నిట్టూర్పులను వదలుచు, ఆప్లవనేచ్ఛుః, ఆప్లవన = స్నానమునందు, ఇచ్ఛుః = కోరిక గలవాడుగా, అభవత్ = ఆయెను.

సమాసములు :

మర్త్యదుష్ప్రచరమ్: మర్త్యేషు దుష్ప్రచరః = మర్త్యదుష్ప్రచరః, తమ్ = మర్త్యదుష్ప్రచరమ్.

అస్త్రవిచారం : అస్త్రాణాం విచారః — అస్త్రవిచారః, తమ్ — అస్త్ర విచారం.

శిష్యజనతామ్ : శిష్యా ఏవ జనాః — శిష్యజనాః శిష్యజనానాం సమూహః — శిష్యజనతా, తాం — శిష్యజనతామ్.

స్వేదబిన్దుకితగోధిః : స్వేదస్య బిన్దవః అస్య సఞ్జాతా ఇతి — స్వేదబిన్దుకితః, స్వేదబిన్దుకితః గోధిః యస్య సః — స్వేదబిన్దుకితగోధిః.

అధీరం : న ధీరం — అధీరం.

ఆప్లవనేచ్ఛః : ఆప్లవనే ఇచ్ఛా యస్య సః — ఆప్లవనేచ్ఛః.

**భావము :**

ఆ నలుడు మానవ లోకములయందు వ్యాప్తినొందని యస్త్రవిద్యను శిష్యులగు రాజసమూహమునకు చక్కగా నేర్పి దానివలని శ్రమచే చెమట బొట్లతో గూడిన నొసలు గలవాడై యాశ్రమచే నిట్టూర్పులను విడుచుచు స్నానము చేయగోరెను.

శ్లో. యక్షకర్దమమృదూన్మృదితాఙ్గం ప్రాక్కురంగమదమీలితమౌలిమ్
గన్ధవార్భిరనుబన్ధితభృఙ్గై రఙ్గనాః సిషిచురుచ్చకుచాస్తమ్॥ 7.

ప.వి. యక్షకర్దమ పృదూన్మృదితాఙ్గం - ప్రాక్ - కురఙ్గమదమీలితమౌలిం - గన్ధవార్భిః - అనుబన్ధితభృఙ్గైః - అఙ్గనాః - సిషిచుః - ఉచ్చకుచాః - తమ్.

అర్థము: ఉచ్చకుచాః — ఉన్నతములైన స్తనములు గలిగిన, అఙ్గనాః — స్త్రీలు, ప్రాక్ — తొలుత, యక్షకర్దమమృదూన్మృదితాఙ్గం, యక్షకర్దమ — కర్పూరాదుల మిశ్రమమై, సువాసన గల్గిన స్నానచూర్ణముచే, మృదు — మెత్తగా, ఉన్మృదిత — నలుగుబెట్టబడిన, అఙ్గం — దేహము గల్గిన వాడును, కురఙ్గమద మీలితమౌళిం, కురఙ్గమద — కస్తూరిచే, మీలిత — సంబంధము నొందింపబడిన, యనగానంటబడిన, మౌలిం — శిరస్సు గల్గిన, తం — ఆ నలుని, అనుబన్ధితభృఙ్గైః, అనుబంధిత — సువాసనకు వెంబడింపబడిన, భృఙ్గైః — తుమ్మెదలుగలిగిన, గన్ధవార్భిః — సువాసన గల యుదకములచే, సిషిచుః — స్నానము గావించిరి.

**సమాసములు :**

యక్షకర్దమ మృదూన్మృదితాఙ్గం : యక్షకర్దమేన మృదు ఉన్మృదితం అఙ్గం యస్య సః = యక్షకర్దమ మృదూన్మృదితాఙ్గః, తం = యక్షకర్దమ మృదూన్మృదితాఙ్గం।

కురఙ్గమదమీలితమౌళిమ్ : కురఙ్గస్య మదః = కురఙ్గమదః, కురఙ్గమదేన మీలితః మౌలిః యస్య సః = కురఙ్గమద మీలితమౌలిః, తం = కురఙ్గ మదమీలిత మౌలిమ్.

గన్ధవార్భిః - గన్ధయుక్తాని వారీణి = గన్ధవారిణి.

తైః = గన్ధవార్భిః

అనుబన్ధిత భృఙ్గైః : అనుబన్ధితాః భృఙ్గాః యేషు తాని = అనుబన్ధిత భృఙ్గాని, తైః = అనుబన్ధిత భృఙ్గైః।

ఉచ్చకుచాః : ఉచ్చాః కుచాః యాసాం తాః = ఉచ్చకుచాః.

**భావము ;**

ఉన్నత స్తనములు గల స్త్రీలు తొలుత సువాసనగలిగిన స్నానచూర్ణముతో నానలుని శరీమునకు మెత్తగా నలుగుపెట్టి, కస్తూరిచే తలనంటి, పరిమళముచే దుమ్మెదలవలన వెంబడింపబడిన సువాసనగల యుదకములచే నానలమహా రాజును స్నానము చేయించిరి.

**శ్లో.** భూభృతం పృథుతపోఘన మాప్త
స్తం శుచిః స్నపయంతి స్మ పురోధాః।
సన్దధ జ్జలధరస్ఖలదోఘా
స్తీర్థవారిలహరీ రుపరిష్టాత్॥ 8

ప.వి. భూభృతం - పృథుతపోఘనం - ఆప్తః - తం - శుచిః - స్నపయంతి - స్మ - పురోధాః - సన్దధత్ - జలధరస్ఖల దోఘాః - తీర్థవారిలహరీః - ఉపరిష్టాత్.

**అర్థము:** ఆప్తః = విశ్వాసముగల, శుచిః = పరిశుద్ధుడైన, పురోధాః = పురోహితుడు, జలధరస్ఖలదోఘాః, జలధర = జలపూరితమైన, కలశమునుండి, స్ఖలత్ = పడుచున్న, ఓఘాః = ప్రవాహము గల్గిన, తీర్థవారిలహరీః, తీర్థ = గంగాది తీర్థములలోని, వారి = ఉదకములయొక్క, లహరీః =

అలలను అనగా ధారలను, ఉపరిష్టాత్ = త పైన, సన్దధత్ సన్ = సంధింపచేయుచు, అనగా వర్షింపచేయుచు, పృథుతపోఘనం, పృథు = అధికమైన, తపః = తపముచే, ఘనం = సంపూర్ణుడైన, తం = ఆ మహారాజును, స్నపయతి స్మ = స్నానము గావించుచుండెను.

పక్షాన్తరమున - ఆప్తః = వచ్చినట్టి, శుచిః = ఆషాఢమాసము, జలధర స్ఖలదోఘాః, జలధర = మేఘములనుండి, స్ఖలత్ = పడుచున్న, ఓఘాః = ప్రవాహము గలిగిన, తీర్థవారి - లహరీః = పవిత్రములగు జల ప్రవాహములను, ఉపరిష్టాత్ = తలపై, సన్దధత్ సన్ = సంధింపచేయుచు అనగా వర్షింపచేయుచు, పృథుతపోఘనం, పృథు = పృథుమహారాజు యొక్క, తపః = తపో మహిమచే, ఘనం = దృఢమైన, తం = ఆ ప్రసిద్ధమైన, భూభృతం = భూమిని ధరించెడి హిమాలయాది పర్వతములను, స్నపయతి స్మ = తడుపుచుండెను స్త్రీలు సామాన్య జలములతో పురోహితుడు మన్త్రసహిత జలము చేతను నాసలమహారాజును స్నానము చేయించిరి. ఇచ్చట రెండవ యర్థము ప్రకృతార్థమునందు బర్యవసానము నొందకుండుటవలన నుపమాధ్వని.

**సమాసములు :**

భూభృతం : భువం బిభర్తీతి = భూభృత్, తం = భూభృతం।

పృథుతపోఘనం : పృథు చ తత్ తపశ్చ = పృథుతపః, పృథుతపసా ఘనః = పృథుతపోఘనః, తం = పృథుతపోఘనం, పక్షాన్తరమున, పృథోః తపః = పృథుతపః, పృథుతపసా ఘనః = పృథుతపోఘనః, తం = పృథుతపోఘనం।

జలధరస్ఖలదోఘా : జలధరేభ్యః స్ఖలన్తః = జలధరస్ఖలన్తః, జలధర స్ఖలన్తః ఓఘాః యాసాం తాః = జలధరస్ఖలదోఘాః।

తీర్థవారిలహరీః : తీర్థానాం వారీణి = తీర్థవారీణి, తీర్థవారీణాం లహర్యః = తీర్థవారి లహర్యః, తాః = తీర్థవారిలహరీః।

**భావము :**

ఆప్తుడును పవిత్రుడును నగు పురోహితుడు జలపూర్ణములగు కలశముల

నుండి, పడుచున్న గంగాది తీర్థ జలములను నానలుని శిరముపై బోయుచు గొప్ప తపముచే ఘనుడైన యా నలమహారాజును స్నానము గావింపఁజేసెను. పక్షాన్తరమునః- ఏతెంచిన యాషాఢమాసము మేఘమునుండి పడుచున్న ప్రవాహముగల పవిత్ర జలధారలచే పృథుమహారాజుయొక్క తపోమహిమచే స్థిర పరచబడిన హిమాలయాది పర్వతములను దడుపుచుండెను. ఈ రెండర్థములకును నౌపమ్యము గమ్యమాన మగుచున్నది.

శ్లో. ప్రేయసీ కుచవియోగ హవిర్భు
గ్జన్మ ధూమవితతీ రివ బిభ్రత్।
స్నాయినః కరసరోరుహయుగ్మం
తస్య గర్భధృతదర్భ మరాజత్॥ 9

ప.వి. ప్రేయసీ కుచ వియోగ హవిర్భుగ్జన్మధూమవితతీః - ఇవ - బిభ్రత్ - స్నాయినః - కరసరోరుహయుగ్మం - తస్య - గర్భధృతదర్భం - అరాజత్.

అర్థము: స్నాయినః = మన్త్రజలముతోస్నానముగావించుచున్న, గర్భధృతదర్భమ్ గర్భ = లోపలఅనగా నరచేతియందు, ధృత = ధరింపబడిన, దర్భమ్ = దర్భలుగలిగిన, (స్నానకాలమునందు దర్భలను ధరించుట శాస్త్రవిహితము) లేదా, స్నాయినః = స్నానము గావించిన, తస్య = ఆ నలునియొక్క, గర్భధృతదర్భమ్, గర్భ = నడిమిప్రేలికిని చిటికెనప్రేలికిని మధ్యనున్న ప్రేలిచే అనగా ననామికచే, ధృత = ధరింపబడిన, దర్భమ్ = దర్భలు గలిగిన, కరసరోరుహయుగ్మం, కరసరోరుహ = పాణిపద్మముల యొక్క, యుగ్మమ్ = జంటను, ప్రేయసీకుచవియోగ హవిర్భుగ్జన్మ ధూమవితతీః, ప్రేయసీ = ప్రియురాలగు దమయన్తియొక్క, కుచ = స్తనములయొక్క, వియోగ = విరహమువలని, హవిర్భుక్ = అగ్నినుండి, జన్మ = ఉద్భవించిన, ధూమవితతీః = ధూమసమూహములను, బిభ్రదివ = ధరించుచున్నదో యనునట్లు, అరాజత్ = ప్రకాశించినది. కొత్తగా తెచ్చిన దర్భలు శ్యామలవర్ణములై యుండుటచే వానికి పొగతో పోలిక సరిపడినది.

సమాసములు :

ప్రేయసీకుచ వియోగహవిర్భుగ్జన్మ ధూమవితతీః : అత్యన్తమ్

ప్రియా=ప్రేయసీ ప్రేయస్యాః కుచౌ = ప్రేయసీకుచౌ. ప్రేయసీ కుచయోః వియోగః=ప్రేయసీకుచవియోగః, ప్రేయసీ చవియోగాత్ హవిర్భుక్ = ప్రేయసీకుచవియోగహవిర్భుక్, ప్రేయసీకుచవియోగహవి ర్భుజః జన్మ యేషాం తే = ప్రేయసీకుచవియోగహవిర్భుగ్జన్మానః, ప్రేయసీకుచవియోగహవిర్భుగ్జన్మానశ్చ తే ధూమాశ్చ=ప్రేయసీ కుచ వియోగహవిర్భుగ్జన్మధూమాః, ప్రేయసీకుచవియోగ హవిర్భుగ్జన్మ ధూమానామ్ వితతయః=ప్రేయసీ కుచ వియోగహవిర్భుగ్జన్మధూమ వితతయః, తాః=ప్రేయసీ కుచ వియోగహవిర్భుగ్జన్మధూమవితతీః.

కరసరోరుహయుగ్మమ్ : కరావేవ సరోరుహౌ=కరసరోరుహౌ, కర సరోరుహయోః యుగ్మమ్=కరసరోరుహయుగ్మమ్.

గర్భధృతదర్భం : గర్భే ధృతాః=గర్భధృతాః, గర్భధృతాః దర్భాః యస్య తత్=గర్భధృతదర్భమ్.

భావము :

స్నానము గావించునపు డానలుడు శాస్త్రముననుసరించి, తన యరచేతి యందు దర్భలనుధరించి యుండెను. లేదా తన యనామిక యనబడు వ్రేలియందు ననగా మధ్యవ్రేలికిని చిటికెన వ్రేలికిని నడుమనున్న వ్రేలియందు దర్భలను ధరించియుండెను. అట్లు దర్భలతో గూడిన యానలుని హస్తయుగ్మము ప్రేయసియగు దమయన్తియొక్క స్తనములతో నేర్పడిన వియోగాగ్ని నుండి యుద్భవించిన ధూమసంతతిని వహించుచున్నదో యనునట్లుండెను. పచ్చిదర్భలు శ్యామవర్ణములు గలిగి యుండుటచే నవి పొగవలె గానవచ్చినవని యర్థము. దమయన్తి వెడలిపోయినందువలన నామెయొక్క స్తనములతో హస్తమునకు వియోగమని భావము.

శ్లో. కల్ప్యమాన మమునాఽఽచమనార్థమ్
గాఙ్గ మమ్బు చులకోదరచుమ్బి ।
నిర్మలత్వమిలితప్రతిబిమ్బామ్
ద్యామయచ్ఛ దుపనీయ కరేణ॥ 10

వ.వి. కల్ప్యమానం - అమునా - ఆచమనార్థం - గాఙ్గం - అమ్బు - చులకో

దరచుమ్బి - నిర్మలత్వమిలిత ప్రతిబింబామ్ - ద్యామ్ - ఆయచ్ఛత్ - ఉపనీయ - కరే - ను.

అర్థము: అమునా = ఈ నలునిచే, ఆచమనార్థమ్ = ఆచమనముకై, కల్ప్యమానమ్ = గ్రహింపబడుచున్న (కావుననే) చులకోదరచుమ్బి. చులక = అరచేతియొక్క, ఉదర = మధ్యభాగమును, చుమ్బి = తాకుచున్న, గాఙ్గమ్ = గంగానదికి సంబంధించిన, అమ్బు = ఉదకము, నిర్మలత్వమిలితప్రతిబిమ్బామ్, నిర్మలత్వ = శుద్ధముగా ఉండుటవలన, మిలిత = లగ్నమైన, ప్రతిబిమ్బామ్ = ప్రతిబిమ్బము గలిగిన, ద్యాం = ఆకసమును (స్వర్గమును), కరే = హస్తమునందు, ఉపనీయ = తెచ్చి యుంచుకొని, అయచ్ఛత్ ను = ప్రజలకు సమర్పించినదా యేమి?

సమాసములు ;

ఆచమనార్థం : ఆచమనాయ = ఆచమనార్థం.

గాఙ్గమ్ : గంగాయాః ఇదం = గాఙ్గమ్.

చులకోదరచుమ్బి : చులకస్య ఉదరం = చులకోదరం, చులకోదరం చుమ్బతీతి = చులకోదరచుమ్బి.

నిర్మలత్వమిలిత ప్రతిబిమ్బాం : నిర్మలస్య భావః = నిర్మలత్వం. నిర్మలత్వేన మిలితః = నిర్మలత్వమిలితః, నిర్మలత్వమిలితః ప్రతిబిమ్బః యస్యాస్సా = నిర్మలత్వమిలితప్రతిబిమ్బా, తాం = నిర్మలత్వమిలిత ప్రతిబిమ్బామ్.

భావము :

ఈ నలు డాచమనమునకై యరచేతియందుంచుకొనిన గంగాజలమునందు, నిర్మలత్వముచే ప్రతిఫలించిన యాకసమును (స్వర్గమును) హస్తమందుంచుకొని ప్రజల కిచ్చెనేమో యనునట్లు ఉండెను.

శ్లో. ముక్తమాప్య దమనస్య భగిన్యా భూమి
రాత్మదయితమ్ ధృతరాగా।
అఙ్గ మఙ్గమను కిమ్ పరిరేభే తమ్ మృదో
జలమృదు గృహాయా శమ్ ॥ 11

ప.వి. ముక్తమ్ - ఆప్య - దమనస్య - భగిన్యా - భూమిః - ఆత్మదయితమ్ - ధృతరాగా - అఙ్గమ్ - అఙ్గమ్ - అను - కిమ్ - పరిరేభే - తమ్ - మృదః - జలమృదు - గృహయాళుమ్.

అర్థము: భూమిః = బొట్టునకై తీసుకొనబడిన ఎఱ్ఱమట్టి. దమనస్య = దమనుని యొక్క, భగిన్యాః = చెల్లెలగు దమయన్తిచే, ముక్తం = స్నానమునకై విడువబడిన, మృదః = తిలకమునకై మృత్తికను, గృహయాళుమ్ = గ్రహించుచున్న, ఆత్మదయితం, ఆత్మ = తనయొక్క, దయితం = భర్తయగు ననగా భూమికి పతియై తనకు భర్తయైన యనగా మృత్తికకు భర్తయగు, తం = ఆనలమహారాజును, ఆప్య = పొంది, ధృతరాగా, ధృత = ధరింపబడిన, రాగా = స్వభావసిద్ధమైన మంటియొక్క యెఱ్ఱని వన్నెను, అనురాగమును గలిగినదై, జలమృదు; జల = స్నానజలముచే, మృదు = మెత్తనైన, అంగం అంగం = నొసలు మున్నగు నవయవములను, అను = లక్ష్యమునందుంచుకొని, పరిరేభే కిం = కౌగలించుకొనినదా యేమి ? లోకమున సవతికి దూరముగా నున్న ప్రియుని మరి యొక సవతి కౌగలించుకొనునుగదా!

సమాసములు :

ఆత్మదయితం : ఆత్మనః దయితః = ఆత్మదయితః, తం = ఆత్మదయితమ్।

ధృతరాగా : ధృతః రాగః యయా సా = ధృతరాగా।

జలమృదు : జలేన మృదు = జలమృదు, తత్ = జలమృదు।

భావము :

"విప్రాః గౌరమృదః ప్రోక్తాః క్షత్రా రక్తాః ప్రకీర్తితాః" అను స్మృతి ననుసరించి బ్రాహ్మణులకు తెల్లని మట్టియు, క్షత్రియుల కెఱ్ఱనిమట్టియు తిలకములుగ ధార్యములు. ఆ దమయన్తి నలుని స్నానమునకై విడిచిపెట్టగా, నానలుడు తిలకమునకై శాస్త్రప్రకార మెఱ్ఱని మట్టిని బుచ్చుకొనుచుండెను. అపుడా ఎఱ్ఱని మట్టిరూపముననున్న భూమియను నలునిభార్య, నలుడు సవతికి దూరముగానుండుట

వలన నెఱ్ఱని మట్టిరూపమున తన ప్రియుడును స్నానముచే మెత్తబడిన యవయవములుగలవాడును నగు నానలుని నొసలు మున్నగు నవయవములను గుఱియందుంచుకొని కౌగలించుకొనెను. నలుడు స్నానమునకు బోవుటవలన దమయన్తికి దూరస్థుడాయెను. అతడు భూపతి యగుటవలన భూమియు నతనికి భార్యయైనది. అందువలన భూమి దమయన్తికి సవతియైనది. స్నానకాలమందు సవతియగు దమయన్తి నలునికి దగ్గరలేనందున నలునికి మరోభార్యయైన భూమికి నలునిపై యనురాగ మేర్పడినది. అందువలన నాభూమి యెఱ్ఱని మట్టిరూపమున నుండి, యతడు స్నానముచేసిన పిదప మెత్తబడిన నొసలు మున్నగు నాతని యవయవముల నన్నింటిని, తిలకరూపమున గౌగలించుకొనినదని యర్థము. అనగా నాతడు జలకములాడి యెఱ్ఱని మట్టితో తన శరీరమునందు తిలకముల దిద్దుకొనెననియు నది ఎఱ్ఱనివన్నెగల భూకాంత భర్తయగు నలుని గౌగలించుకొనిన ట్లుండెననియు భావము.

శ్లో. మూలమధ్య శిఖరక్రమవేధః శౌరి శమ్భుకరకాఙ్ఘ్రిశిరః స్థైః।
తస్య మూర్ధ్ని చకరే శుచిదర్భైర్వారి వాన్తమివ గాఙ్గతరఙ్గైః॥

ప.వి. మూలమధ్య శిఖరక్రమవేధః శౌరి శమ్భుకరకాఙ్ఘ్రిశిరస్థైః - తస్య - మూర్ధ్ని - చకరే - శుచి - దర్భైః - వారి - వాన్తం - ఇవ - గాఙ్గతరఙ్గైః

అర్థము: మూలమధ్య శిఖరక్రమవేధః శౌరి శమ్భుకరకాఙ్ఘ్రి శిరస్థైః, మూల = దర్భలయొక్క మొదళ్ళయందు, మధ్య = వాని నడిభాగమునందును, శిఖర = కొనలయందును, క్రమ = క్రమముగా నున్న, వేధః = బ్రహ్మయొక్కయు, శౌరి = విష్ణువుయొక్కయు, శమ్భు = శివునియొక్కయు, కరక = కమండలునందును, అఙ్ఘ్రి = పాదములయందును, శిరస్థైః = శిరము నందునున్నట్టి, గాఙ్గ = గంగానదికి సంబంధించిన, తరఙ్గైః = అలలచే, వాన్తమివ స్థితం = వెదలింపబడినదో యనునట్లున్న, శుచి = నిర్మలమైన, వారి = గంగాజలము, దర్భైః = దర్భలచే, తస్య = ఆ నలునియొక్క, మూర్ధ్ని = శిరముపై, చకరే = చల్లబడినది. నలుడు దర్భలకొనల నంటిన జలముచే "ఆపోహిష్ఠామ యో భువః" యను మన్త్రమును పఠించుచు, మన్త్రస్నానమును గావించెనని యర్థము.

సమాసములు :

మూలమధ్యశిఖరస్థితవేధఃశౌరిశమ్భుకరకాఙ్ఘ్రిశిరస్థైః :

మూలశ్చ మధ్యశ్చ శిఖరం చ = మూలమధ్య శిఖరాణి, మూలమధ్య శిఖరేషు స్థితాః = మూలమధ్యశిఖరస్థితాః, వేధాశ్చ శౌరిశ్చ శమ్భుశ్చ = వేధః శౌరిశమ్భవః, మూలమధ్యశిఖరస్థితాశ్చ తే వేధఃశౌరిశమ్భవశ్చ = మూలమధ్యశిఖరస్థితవేధః శౌరిశమ్భవః, కరకా చ అఙ్ఘ్రిశ్చ శిరశ్చ = కరకాఙ్ఘ్రిశిరాంసి, మూలమధ్యశిఖరస్థితవేధః శౌరిశమ్భూనాం కరకాఙ్ఘ్రిశిరాంసి = మూలమధ్య శిఖరస్థితవేధః శౌరిశమ్భుకరకాఙ్ఘ్రిశిరాంసి, మూలమధ్య శిఖరస్థితవేధః శౌరిశమ్భుకరకాఙ్ఘ్రిశిరస్సు తిష్ఠన్తీతి = మూలమధ్య శిఖరస్థితవేధః శౌరిశమ్భుకరకాఙ్ఘ్రిశిరస్థాః, తైః = మూలమధ్య శిఖరస్థితవేధః శౌరిశమ్భుకరకాఙ్ఘ్రిశిరస్థైః.

గాఙ్గతరఙ్గైః : గంగాయాం భవాః = గాఙ్గాః, గాఙ్గాశ్చ తే తరఙ్గాశ్చ = గాఙ్గతరఙ్గాః, తైః = గాఙ్గతరఙ్గైః.

భావము :

దర్భలకు మూలమునందు బ్రహ్మయు, మధ్యభాగమునందు విష్ణువును, కొనలయందు శివుడును నుందురని "కుశమూలే స్థితో బ్రహ్మా కుశమధ్యే తు కేశవః కుశాగ్రే శంకరం విద్యాత్ త్రయో దేవాః కుశస్థితాః" యను స్మృతి ననుసరించి తెలియుచున్నది. బ్రహ్మ కమణ్డలునందును, విష్ణుపాదమునందును శివుని శిరమునందును గఙ్గాజల ముండును. నలుడు "ఆపోహిష్ఠామయో భువః" అను మన్త్రమును జపించుచు పవిత్రమగు గఙ్గోదకమును తలపై దర్భలతో జల్లుకొనుచు మన్త్రస్నానము గావించెనని యర్థము.

శ్లో. ప్రాణ మాయతవతో జలమధ్యే
మజ్జమాన మభజ న్ముఖమస్య।
ఆపగా పరిబృఢోదరపూరే
పూర్వకాల ముషితస్య సుధాంశోః ॥

ప.వి. ప్రాణం - ఆయతవతః - జలమధ్యే - మజ్జమానం - అభజత్ - ముఖమ్ - అస్య - ఆపగాపరిబృఢోదరపూరే - పూర్వకాలమ్ - ఉషితస్య - సుధాంశోః.

అర్థము: జలమధ్యే = ఉదకములమధ్య, ప్రాణం = ప్రాణమును, ఆయత వతః = పొడిగించిన, అనగా ప్రాణాయామము గావించిన, అస్య = ఈ నలునియొక్క, ముఖం = మోము, పూర్వకాలం = పూర్వకాలమున, ఆపగా పరిబృఢోదరపూరే, ఆపగా = నదులకు, పరిబృఢ = భర్తయగు సముద్రునియొక్క, ఉదరపూరే = గర్భమందలి ప్రవాహమధ్యమునందు, ఉషితస్య = నివసించిన, సుధాంశోః = చంద్రునియొక్క, మహి మానం = సౌందర్యమును, అభజత = పొందినది. సముద్రమధ్యమందలి చంద్రుని శోభ నతనిముఖము వహించినదని యర్థము.

సమాసములు :

జలమధ్యే : జలానాం మధ్యః = జలమధ్యః తస్మిన్ = జలమధ్యే।
ఆపగాపరిబృఢోదరమధ్యే : అపాం సమూహః ఆపం. ఆపేన గచ్ఛ తీని ఆపగాః, ఆపగానాం పరిబృఢః = ఆపగాపరిబృఢః, ఆపగా పరి బృఢస్య ఉదరం = ఆపగాపరిబృఢోదరం. ఆపగా పరిబృఢోదరస్యమధ్యః = ఆపగాపరిబృఢోదరమధ్యః, తస్మిన్ = ఆపగాపరిబృఢోదరమధ్యే.
పూర్వకాలం : పూర్వశ్చాసౌ కాలశ్చ = పూర్వకాలః, తం = పూర్వ కాలమ్.

భావము :

నీటిలోపల ప్రాణాయామమును గావించిన యానలుని ముఖము పూర్వ కాలము సముద్రము లోపలనున్న చంద్రుని సౌందర్యమును వహించినది.

శ్లో. మర్త్యలోకమదనః సదృశత్వం బిభ్రదభ్రవిశదద్యుతితారమ్।
అమ్బరం పరిదధే విధుమౌలేః స్పర్ధయేవ దశదిగ్వసనస్య॥14

ప.వి. మర్త్యలోకమదనః - సదృశత్వం - బిభ్రత్ - అభ్రవిశదద్యుతితారం - అమ్బరం - పరిదధే - విధుమౌలేః - స్పర్ధయా - ఇవ - దశదిగ్వ సనస్య.

అర్థము: మర్త్యలోకమదనః, భూలోకమునకు మన్మథుడైన నలుడు, దశదిగ్వ సనస్య, దశ = పదియైన, దిక్ = దిక్కులనే, వసనస్య = వస్త్రముగా

గలిగిన, అనగా దిగంబరుడైన, విధుమౌలేః = చన్ద్రశేఖరుడైన శివుని యొక్క, స్పర్ధయేవ = సామ్యము నొందుటకైన కయ్యము చేతనో యనునట్లు, (అనగా మదనునకు మదనారితో కయ్యము యుక్తముకదా!), సదశత్వం = బద్దెలతో గూడియుండుటను, ఆకాశపక్షమున, సదశత్వం = పదిదిక్కులతో గూడియుండుటను, బిభ్రత్ = ధరించుచు, (తథా = అట్లే), అభ్రవిశదద్యుతి; అభ్ర = శరన్మేఘమువలె, విశద = నిర్మలమైన, ద్యుతి = కాంతి గలిగిన, లేదా, అభ్ర = అభ్రమనెడి తెల్లని దాతువువంటి, విశద = నిర్మలమైన, ద్యుతి = కాంతిగలిగిన, తారం = పెద్దదియు లేదా మిక్కిలి సూక్ష్మమైనదియును, పక్షాంతరమున అభ్రవిశదద్యుతితారం- అభ్ర = మేఘములయందు, విశత్ = ప్రవేశించినవియు, (కావుననే) అద్యుతి = కాంతిలేనివినగు, తారం = నక్షత్రములు గలిగిన, అమ్బరం = వస్త్రమును, (ఆకాశమును) పరిదధే = ధరించెను.

సమాసములు ॥

మర్త్యలోకమదనః : మర్త్యానాం లోకః = మర్త్యలోకః, మర్త్యలోకస్య మదనః = మర్త్యలోకమదనః।

సదశత్వం : దశాభిః సహ వర్తత ఇతి = సదశం, సదశస్య భావః = సదశత్వం, తత్ = సదశత్వం, పక్షాంతరమున దశభి స్సహ వర్తత ఇతి = సదశం, సదశస్య భావః = సదశత్వం, తత్ = సదశత్వమ్

అభ్రవిశదద్యుతి : విశదా చ సా ద్యుతిశ్చ = విశదద్యుతిః, అభ్రస్యేవ విశదాద్యుతిః యస్య తత్ = అభ్రవిశదద్యుతి. తత్ = అభ్రవిశదద్యుతి.

అభ్రవిశదద్యుతితారం : అభ్రం విశన్తీతి = అభ్రవిశన్త్యః, అవిద్యమానాః ద్యుతయః యాసాం తాః = అద్యుతయః, అద్యుతయశ్చ తాః తారాశ్చ = అద్యుతితారాః అభ్రవిశన్త్యః అద్యుతితారాః యస్మిన్ తత్ = అభ్రవిశదద్యుతితారం, తత్ = అభ్రవిశదద్యుతితారం,

విధుమౌలేః : విధుః మౌలౌయస్య సః = విధుమౌలిః, తస్య = విధుమౌలేః।

దశదిగ్వసనస్య : దశ చ తే దశశ్చ = దిశదిశః, దశదిశః ఏవ వసనం యస్య సః = దశదిగ్వసనః, తస్య = దశదిగ్వసనస్య.

భావము :

మానవలోకమునకు మన్మథుడైన యానలమహారాజు పదిదిక్కులనే వస్త్రముగా గలిగిన యనగా దిగంబరుడైన శివునితో సామ్యమునందలి కయ్యముచేతనో యనునట్లు (అనగా తాను భూలోకమున మన్మథుడగుటవలన మన్మథారి యనగా మన్మథునకు శత్రువైనట్టి శివునితో కయ్యముచేతనో యనునట్లు) సదశమైన యనగా బద్దెలతో గూడినదియు పదిదిగ్విభాగములతో గూడినదియును, అట్లే శరన్మేఘమువంటి నిర్మలకాంతిని గలిగినదియు, గొప్పది యును, లేదా సూక్ష్మమైనదియును పక్షాంతరమున - మేఘములయందు ప్రవేశిం చుటవలన కాంతిలేని నక్షత్రములు గలదియునగు వస్త్రమును (ఆకసమును) ధరించెను. అనగా శివుడు దిగంబరుడగుటవలన నతనివస్త్రము పది దిగ్విభాగ ములతో గూడిన యాకాశమగుచున్నది. కాన శివునివస్త్రమగు నాకసమునందు కాంతిరహితములగు నక్షత్రము లున్నవి. ఈనలునివస్త్రము దశలతో ననగా బద్దెలతోగూడి శారదమేఘములవలె పలుచనై ప్రకాశించుచుండునని సారాంశము;

శ్లో. భీమజామనుచలత్ప్రతివేలం సంయియత్సు రివ రాజనరేన్ద్రః
ప్రావవార హృదయం స సమన్తాదుత్తరీయ పరివేషమిషేణ ॥

ప.వి. భీమజాం - అనుచలత్ - ప్రతివేలం - సంయియత్సుః - ఇవ - రాజ నరేన్ద్రః - ప్రావవార - హృదయం - సః - సమన్తాత్ - ఉత్తరీయ - పరివేషమిషేణ.

అర్థము: రాజనరేన్ద్ర = రాజులలో శ్రేష్ఠుడైన, సః = ఆ నలమహారాజు, ప్రతివేలం ప్రతిక్షణమునందును, భీమజాం = తనప్రియురాలగు దమయన్తిని. అను చలత్ = అనుసరించి నడుచుచున్న, హృదయం = వక్షమును(మనస్సును). సంయియత్సు రివ = బంధింపగోరెనో యనునట్లున్నవాడై (అనగా తన హృదయము తనను వదలిపోవుట తగదుగదా), ఉత్తరీయపరివేషమిషేణ, ఉత్తరీయ = పై వస్త్రమును, పరివేష = ఒొమ్ముపై చుట్టుట యను, మిషేణ = నెపముచే, సమంతాత్ = అంతట, ప్రాపవార = కప్పెను.

సమాసములు :

భీమజామ్ : భీమాత్ జాయత ఇతి = భీమజా, తాం = భీమజామ్‌।

ప్రతివేలం ; వేలాయాం వేలాయాం = ప్రతివేలం।
సంయియత్సుః : సంయన్తు మిచ్ఛుః = సంయియత్సుః।
రాజనరేన్ద్రః : నరాణాం ఇన్ద్రః = నరేన్ద్రః, రాజ్ఞాం నరేన్ద్రః = రాజ నరేన్ద్రః।
ఉత్తరీయ పరివేషమిషేణ : ఉత్తరీయస్య పరివేషః = ఉత్తరీయ పరివేషః, ఉత్తరీయ పరివేషస్య మిషః = ఉత్తరీయ పరివేష మిషః తేన = ఉత్తరీయ పరివేష మిషేణ.

**భావము :**

రాజులలో శ్రేష్ఠుడైన యానలుడు, ప్రతిక్షణమునందును ప్రియురాలగు దమయన్తిని వెంబడించుచున్న తన హృదయమును (తన మనస్సును) బంధింప గోరికగలవాడో యనునట్లు తన యుత్తరీయముయొక్క పరివేషమను నెపముతో బంధించెను. తన హృదయము తన్ను వదలిపోవుట యుక్తము కాదుగదా!

శ్లో. స్నానవారి ఘటరాజదురోజా గౌరమృత్తిలక బిన్దుముఖేన్దుః।
కేశశేషజలమౌక్తికదన్తా తం బభాజ సుభగాఽప్లవనశ్రీః॥ 16

వి. స్నానవారిఘటరాజదురోజా - గౌరమృత్తిలక బిన్దుముఖేన్దుః - కేశశేష జలమౌక్తికదన్తా - తం - బభాజ - సుభగా - ఆప్లవనశ్రీః.

అర్థము: స్నానవారి ఘటరాజదురోజా, స్నాన = స్నానమునకు సంబంధించిన, వారిఘట = నీటికుండలచే. రాజత్ = శోభించు, ఉరోజా = చనుదోయి గలదియు, గౌరమృత్తిలక బిన్దుముఖేన్దుః, గౌర = తెల్లని, మృత్ = మట్టిచే రచింపబడిన, తిలకబిందు = బొట్టనెడి, ముఖేన్దుః = ముఖచంద్రుని గలిగిన, కేశశేషజలమౌక్తికదన్తా, కేశ = కురులయందు, శేష = మిగిలిన, జలమౌక్తిక, నీటిబొట్టులనెడి, దన్తా = దన్తములుగలిగిన సుభగా = నలుని శరీరస్పర్శచే, రమ్యమైన, ఆప్లవనశ్రీః, ఆప్లవన = స్నానముయొక్క, శ్రీః — శోభ, తం = ఆనలుని, బభాజ = పొందినది.

**సమాసములు :**

స్నానవారిఘటరాజదురోజా : వారిణః ఘటౌ = వారిఘటౌ, స్నానస్య వారిఘటౌ = స్నానవారిఘటౌ, స్నానవారిఘటావేవ రాజన్తౌ ఉరోజౌ యస్యాస్సా = స్నానవారిఘటరాజదురోజా.

గౌరమృత్తిలకబిన్దుముఖేన్దు : గౌరా చ సా మృచ్చ = గౌరమృత్, గౌరమృదా తిలకబిన్దుః = గౌరమృత్తిలకబిన్దుః, గౌరమృత్తిలకబిన్దురేవ ముఖేన్దుః యస్యాస్సా = గౌరమృత్తిలకబిన్దుముఖేన్దుః.

కేశశేషజలమౌక్తికదన్తా : కేశేషు శేషాణి = కేశశేషాణి, జలాన్యేవ మౌక్తికాని = జలమౌక్తికాని, కేశశేషాణి చ తాని జలమౌక్తికాని చ = కేశశేషజలమౌక్తికాని, కేశశేషజలమౌక్తికాన్యేవ దన్తాః యస్యాః సా = కేశశేషజలమౌక్తికదన్తా।
ఆప్లవనశ్రీః : ఆప్లవనస్య శ్రీః = ఆప్లవనశ్రీః।

**భావము :**

స్నానకలశము లనెడి శోభించు స్తనములు గలదియు, తెల్లని మట్టితో దిద్దబడిన బొట్టనెడి ముఖచంద్రుని గలదియు, స్నానము చేయునపుడు కురుల యందు నిలిచిన నీటిబొట్టు లనెడి దన్తములు గలదియు నలుని శరీరస్పర్శచే సౌభాగ్యముతో గూడినదియు, నగుస్నానలక్ష్మి యను స్త్రీ యానలుని సేవించెను.॥16॥

శ్లో. శ్వైత్యశైత్య జలదైవతమన్త్ర
స్వాదుతాప్రముదితాం చతురక్షీమ్।
వీక్ష్య మోఘధృత సౌరభలోభం
ఘ్రాణమస్య సలిలఘ్రమివాభూత్ ॥ 17

ప. వి. శ్వైత్య శైత్య జలదైవత మన్త్ర స్వాదుతా ప్రముదితాం - చతురక్షీం - వీక్ష్య - మోఘధృతసౌరభలోభం - ఘ్రాణం - అస్య - సలిలఘ్రమ్ - ఇవ - అభూత్.

అర్థము: అస్య = ఈ నలునియొక్క, ఘ్రాణం = ముక్కు, చతురక్షీం = కన్ను, చర్మము, చెవి, నాలుక యను నాలుగింద్రియముల సమూహమును, శ్వైత్యశైత్యజలదైవతమన్త్ర స్వాదుతాప్రముదితాం శ్వైత్య = జలము తెల్లదగుటవలన నందలి తెల్లదనముచేతను, శైత్య = జలమునందలి శీత స్పర్శచేతను, జలదైవత మన్త్ర = జలమును దేవతగా గలిగిన "ఋతఞ్చ చ సత్యఞ్చాభిధ్యాయ త్తపసః" యను మన్త్రమును వినుటచేతను స్వాదుతా = జలమందలి తియ్యదనముచేతను, ప్రముదితాం = సంతోషము చెందినదానినిగా. వీక్ష్య = చూచి, అనగా కన్ను జలమునందలి తెల్లదనము చేతను, చర్మము జలమందలి చల్లదనముచేతను, కర్ణము స్నానకాల మందలి జలదేవతాకమన్త్రము వినుటచేతను, నాలుక జలమందలి మాధు ర్యముచేతను దనివి చెందినవిగా జూచియో యనునట్లు, మోఘధృత సౌరభలోభం, మోఘ = వ్యర్థముగా ధృత = వహించబడిన, సౌరభ లోభం = పరిమళమందలి యాశగలిగినదై, సలిలఘ్రమివ = నీటిని మూర్కొనుచున్నదో యనునట్లు, అభూత్ = అయినది. అఘమర్షణసూక్తము లను బఠించుచు నానలమహారాజు నీటిని మూర్కొనుచుండెనని యర్థము.

**సమాసములు :**

శ్వైత్యశైత్య జలదైవతమన్త్రస్వాదుతా ప్రముదితాం: శ్వేతస్య భావః = శ్వైత్యం, శీతస్య భావః = శైత్యం, జలం దైవతం యేషాం తే = జలదేవతాః, జలదేవతాశ్చ తే మన్త్రాశ్చ = జలదేవత మన్త్రాః, జలదేవత మన్త్రాణాంస్వాదుతా = జలదేవతమన్త్రస్వాదుతా, శ్వైత్యం చ శైత్యంచ జల దేవతమన్త్రస్వాదుతా చ = శ్వైత్యశైత్యజలదేవత మన్త్రస్వాదుతాః, శ్వైత్యశైత్య జలదేవతమన్త్రస్వాదుతాభిః ప్రముదితా = శ్వైత్యశైత్య జలదేవతమన్త్రస్వాదుతా ప్రముదితా. తాం = శైత్యశైత్య జలదేవత మన్త్రస్వాదుతా ప్రముదితాం.

చతురక్షీం : చతుర్ణాం అక్షాణాం సమాహారః = చతురక్షీ, తాం = చతురక్షీం।

మోఘధృతసౌరభలోభం : సురభేః భావః = సౌరభం, సౌరభేః లోభః = సౌరభలోభః, మోఘం ధృతః = మోఘధృతః, మోఘధృతః సౌరభలోభః యస్య తత్ = మోఘధృతసౌరభలోభమ్.

సలిలఘ్రమ్ : సలిలం జిఘ్రతీతి = సలిలఘ్రమ్.

**భావము :**

ఆనలుని ఘ్రాణేంద్రియము అనగా ముక్కు, తక్కిన కన్ను, చర్మము, చెవి. నాలుక యను నాలుగింద్రియములును వరుసగా నీటియందలి తెల్లదనముచేతను, నీటి యందలి చల్లదనముచేతను, జలదేవతాక మన్త్ర శ్రవణముచేతను, జలమందలి మాధుర్యముచేతను, తనివినొంది యుండుటను అనగా కన్ను నీటియందలి తెల్లదనమును చూచుటచేతను, చర్మము జలమందలి చల్లదనముచేతను, చెవి జలదేవతాక మగు మన్త్రములను వినుటచేతను, నాలుక జలమందలి మధుర రసముచేతను తనివి నొందియుండుటను గాంచియో యనునట్లు, తానుగూడా వ్యర్థముగా మరియొక వస్తువుయొక్క పరిమళమును మూర్కొనవలయునను లోభము గల్గినదై, నలుడు అఘమర్షణమన్త్రము జపించుచు స్నానమాడునపుడు ఆస్నానజలములను నాఘ్రాణించుచున్నది. ఘ్రాణము గంధము నాఘ్రాణించవలయునేకాని జలరూప మగు ద్రవ్యము నాఘ్రాణింప సమర్థముగాదు. తక్కిన చక్షురాదీంద్రియము లెట్లు జలమందలి శుక్లరూపమును, జలమందలి శీతస్పర్శను, జలదేవతాక మగు మన్త్రశ్రవణమును, జలమందలి మధుర రసమును గ్రహించునో యట్లే ఘ్రాణేంద్రియము గంధమును గ్రహింపవలయును. కాని యాగన్ధగ్రహణమున కట నవకాశము లేనందువలన ఘ్రాణము కేవలజలమునే యాఘ్రాణించు చుండినదని యాశయము.

శ్లో. రాజ్ఞి భానుమదుపస్థితయేఽస్మి న్నా త్త మమ్బు కిరతి స్వకరేణ।
భ్రాన్తయః స్ఫురతి తేజసి చక్రు స్త్వష్టృతర్కు చలదర్క వితర్కమ్॥ 18

ప. వి. రాజ్ఞి - భానుమదుపస్థితయే - అస్మిన్ - ఆత్తం - అమ్బు - కిరతి - స్వకరేణ - భ్రాన్తయః - స్ఫురతి - తేజసి - చక్రుః - త్వష్టృతర్కు చలదర్క వితర్కమ్.

అర్థము: అస్మిన్ = ఈనలమహారాజు, భానుమదుపస్థితయే; భానుమత్ = సూర్యునియొక్క, ఉపస్థితయే = ఉపాసనకై, ఆత్తం = గ్రహించబడిన, అర్ఘ్యమునకు సంబంధించిన, లేదా అర్ఘ్యముతర్వాతి క్రియకు సంబంధించిన అనగా "అసా వాదిత్యో బ్రహ్మ" యను మన్త్రముతో గూడిన, అంబు = ఉదకమును, తలచుట్టు తనచేతితో ప్రకాశించెడి సూర్యకాంతి యందు బొట్లుగా పడునటు చల్లుకొనగా, భ్రాన్తయః = వెదచల్లిన నీటియొక్క ప్రదక్షిణపు పరిభ్రమణములు, త్వష్టృతర్కు చలదర్కవితర్కమ్, త్వష్టృ = లోకమును సృజించెడి బ్రహ్మయొక్క, తర్కు = సానబెట్టెడి చక్రమునందు, చలత్ = కదలుచున్న, అర్క = సూర్యుని విషయమైన, యనగా సానబెట్టునపుడు తిరుగుచున్నవాడును నంతట నిప్పురవ్వలను వెదజల్లు చున్నవాడునునగు సూర్యు డనెడి, వితర్కం = సందేహమును లేదా ఊహను, చక్రుః = కలిగించినవి.

వి. సూర్యోపాసనకై తీసుకొనిన జలమును తలచుట్టు ప్రకాశించెడి సూర్య ప్రభకు మధ్య బొట్టులు పడునట్లుగా చల్లగా నాయుదకముతో గూడిన ప్రదక్షిణ ప్రభ్రమణములు విశ్వకర్మ సానబెట్టెడి చక్రమునందు కదలుచును తిరుగుచును, నంతట కాంతికిరణములను విరజిమ్ముచున్న సూర్యు డనెడి భావమును గల్గించినందు వలన నిట నుత్ప్రేక్ష.

సమాసములు :

భానుమదుపస్థితయే : భానవః అస్య అస్తీతి = భానుమత్, భానుమతః ఉపస్థితిః = భానుమదుపస్థితిః, తస్యై = భానుమదుపస్థితయే.

త్వష్టృతర్కుచలదర్క వితర్కమ్: త్వష్టుః తర్కుః = త్వష్టృతర్కుః, తష్టృతర్కౌ చలన్ = త్వష్టృతర్కు చలన్, త్వష్టృతర్కు

చలం శ్చాసౌ అర్కాశ్చ = త్వష్టృతర్కుచంచదర్కాః. త్వష్టృతర్కుచలదర్కస్య వితర్కాః = త్వష్టృతర్కుచలదర్కవితర్కాః. తం = త్వష్టృతర్కుచలదర్కవితర్కమ్.

**భావము :**

ఈ నలమహారాజు సూర్యోపాసనకై గ్రహించిన యర్ఘ్యజలమును తల చుట్టు ప్రకాశించు సూర్యకాంతి మధ్య బిందుక్రమముగా పడునట్లు తన చేతితో "అసావాదిత్యో బ్రహ్మ అహం బ్రహ్మాస్మి" అను మంత్రమును జపించుచు చల్లుకొనెను. అప్పుడా యుదకముయొక్క ప్రదక్షిణపు భ్రమణములు, విశ్వకర్మ సూర్యునికి సానబెట్టెడి చక్రమునందు నొరిపిడి చేయుటవలన భ్రమించుచు నంతట పడుచున్న కాన్తికణములు గల్గిన యాసూర్యుడనెడి సందేహమును గల్గించినవి. తలచుట్టును ప్రకాశించెడి సూర్యప్రభలో పడునట్లు ప్రదక్షిణముగా నానలుడు, చల్లుకొనిన నీటి బిందువుల భ్రమణమును చూచుట వలన విశ్వకర్మ సూర్యుని మరల సానబెట్టెడి చక్రమందుంచి పదనుబెట్టుచున్నాడా యేమి? కావుననే యణురూపములైన కణములు పడుచున్నవని జనమునకు భావ మేర్పడినది. లేదా సూర్యోపాసనకై యానలుడు జలమును దీసికొని తన తలచుట్టును వెదజల్లుకొనుచు తన శరీరపు కాంతిప్రవాహ మధ్యమునందున్న యానలుడు సానబెట్టెడి చక్రమున భ్రమించెడి సూర్యు డనెడి భావనను కలిగించెను. రాజు తాను గైకొనిన జలమును బైకి చల్లగా దానియందు ప్రతిఫలించిన సూర్యకాన్తియందు కల్గిన భ్రమణములు విశ్వకర్మయొక్క శాణచక్రము నందు కదలుచున్న సూర్యుడనెడి భావనను కల్గించినదని యర్థము. పైకి వెదచల్లిన యుదకములు భ్రమించుచు దిగువ పడుచున్నవి. ఆ యుదకముల యందు ప్రతిఫలించిన తేజస్సునందును భ్రమణములు గలుగుచున్నవి. కాన నావిధముగా నిట నుత్ప్రేక్ష. అర్ఘ్య ప్రదానమును సూర్యోపాసనమును జేసెనని సారాంశము. "స్ఫురితతేజసి" యని సమస్త వస్త్రములతో గూడిన పాఠమునందు నది నలునికి విశేషణముగా నుండును. ప్రకాశించెడి తేజస్సుగల్గిన రాజునందు నని యర్థము.

గమనిక: ఈ శ్లోకమును ప్రకాశవ్యాఖ్యాకారుడగు నారాయణభట్టు పరిగ్రహించి నందువలన నాతని వ్యాఖ్య ననుసరించి టీక వ్రాయబడినది.

శ్లో. సమ్యగస్య జపతః శ్రుతిమన్త్రాః సన్నిధాన మభజన్త కరాబ్జే,
శుద్ధబీజ విశదస్ఫుటవర్ణాః స్ఫాటికాక్ష వలయచ్ఛలభాజః 1॥

ప. వి. సమ్యక్ - అస్య - జపతః - శ్రుతిమన్త్రాః - సన్నిధానం - అభజన్త - కరాబ్జే - శుద్ధబీజవిశదస్ఫుటవర్ణాః - స్ఫాటికాక్షవలయచ్ఛలభాజః.

అర్థము: శుద్ధబీజవిశదస్ఫుటవర్ణాః, శుద్ధ = ఆగమములయందు చెప్పబడినట్లు ఉచ్చరించుటవలన దోషములు లేని, బీజ = వహ్నివరుణులు మొదలగు దేవతలకు సంబంధించిన మూలమన్త్రములు గల విశద = నిర్మలము లైన, స్ఫుట = స్పష్టములైన, వర్ణాః = అక్షరములుగల, శ్రుతి మన్త్రాః = గాయత్రి మున్నగు వైదిక మన్త్రములు, శుద్ధబీజ = దోషములేని బీజములు గల్గినదియు, వనగా పూసలుగలదియు, స్ఫుటవర్ణ = ఉజ్జ్వలమగు కాంతి విశేషము గలదియునగు, స్ఫాటికాక్ష వలయచ్ఛలభాజః, స్ఫాటిక = స్ఫటికమయమైన, అక్షవలయ = జపమాలికయొక్క ఛల = నెపమును, భాజః = పొందినవియునై, సమ్యక్ = చక్కగా జపతః = జపము చేయుచున్న, అస్య = ఈ నలునియొక్క, కరాబ్జే, కర = హస్తమనెడి, అబ్జే = పద్మమునందు, సన్నిధానం = సాన్నిధ్యమును, అభజన్త (ఇవ) = పొందినవో యనునట్లుండినవి.

సమాసములు :

శ్రుతిమన్త్రాః : శ్రుతేః మన్త్రాః = శ్రుతిమన్త్రాః, కరాబ్జే - కర ఏవ అబ్జం = కరాబ్జం, తస్మిన్ = కరాబ్జే.
శుద్ధ బీజ విశదస్ఫుట వర్ణాః : శుద్ధాని బీజాని యేషు తే = శుద్ధబీజాః, విశదాః స్ఫుటాః వర్ణాః యేషు తే = విశదస్ఫుట వర్ణాః, శుద్ధబీజాశ్చ తే విశదస్ఫుట వర్ణాశ్చ = శుద్ధబీజవిశదస్ఫుట వర్ణాః;
స్ఫాటికాక్ష వలయచ్ఛలభాజః : స్ఫటికస్య వికారః = స్ఫాటికం, అక్షాణాం వలయం = అక్షవలయం, స్ఫాటికం చ తత్ అక్షవలయం

చ = స్ఫాటికాక్షవలయం, స్ఫాటికాక్షవలయస్య ఫలః = స్ఫాటికాక్ష వలయచ్ఛలః, స్ఫాటికాక్ష వలయచ్ఛలం భజన్తీతి = స్ఫాటికాక్షవలయ చ్ఛలభాజః.

భావము :

ఆగమముల యందు చెప్పిన ప్రకార ముచ్చరించుట వలన నిర్దోషములైన వహ్నివరుణాది దేవతాకములగు మూలమన్త్రములు గల్గి, విశదములును స్పష్టములును నగు నక్షరములను గల్గిన వేదోక్తములగు గాయత్ర్యాది మన్త్రములు, శుద్ధములగు బీజములను గల్గినవై విశదములును నుజ్జ్వలములు నగు కాంతిగల్గిన స్ఫటిక జపమాలయొక్క నెపమును పొందినవై చక్కగా జపము చేయుచున్న నలుని పాణిపద్మమును బొందినవని భావము.

శ్లో. పాణిపర్వణి యవః పునరాఖ్య
ద్దేవ తర్పణ యవార్పణ మస్య।
న్యుప్యమాన జలయోగితిలౌఘైః
స ద్విరుక్త కర కాలతిలోఽభూత్॥ 19

వ. వి. పాణిపర్వణి - యవః - పునః - ఆఖ్యత్ - దేవతర్పణ యవార్పణం - అస్య - న్యుప్యమానజలయోగితిలౌఘైః - సః - ద్విరుక్తకరకాల తిలః - అభూత్.

అర్థము: అస్య = ఈ నలునియొక్క, పాణిపర్వణి, పాణి = హస్తముయొక్క, పర్వణి = కణుపునందు, యవః = యవధాన్యపుటాకారముగల రేఖ, దేవతర్పణ యవార్పణం, దేవ = దేవతలకు సంబంధించిన, తర్పణ = తర్పణక్రియయందు, యవార్పణం = యవధాన్యము నర్పించుటను, పునరాఖ్యత్ = పునరుక్తము గావించినది. అనగా మాటి మాటి కర్పించినదని యర్థము. అనగా హస్తమునందలి యవరేఖచేతనే యవధాన్య మర్పింపబడగా, మరల యవధాన్య మర్పించుటవలన పునరుక్తి యేర్పడినదని యర్థము. తథా = అట్లే, సః = ఆనలుడు, న్యుప్యమానజలయోగి తిలౌఘైః, న్యుప్యమాన = పితృదేవతల కొసంగబడిన, జల = ఉదకముతో, యోగి = కలసిన; తిల = నువ్వులయొక్క, ఓఘైః = సమూహ

ములతో, ద్విరుక్తకరకాల తిలః, ద్విరుక్త = పునరుక్తమైన, యనగా, రెట్టింపు గావింపబడిన, కర = చేతియందలి, కాలతిలః = నల్లనినువ్వువంటి రేఖగలదిగా, ఆభూదివ = ఆయెనో యనునట్లుండెను. నలుడు దేవతలకును పితరులకును తర్పణము గావించెనని యర్థము. భాగ్యవంతుల హస్తమునందు యవాకారపు రేఖలును తిలాకారపు రేఖలునుండునని సాముద్రికశాస్త్రము చెప్పుచున్నది.

**సమాసములు :**

పాణిపర్వణి : పాణేః పర్వ = పాణిపర్వ, తస్మిన్ = పాణిపర్వణి।

దేవతర్పణ యవార్పణం : దేవేభ్యః తర్పణం = దేవతర్పణం, దేవ తర్పణస్య యవాః = దేవతర్పణయవాః, దేవతర్పణయవానాంఅర్పణం = దేవతర్పణయవార్పణం, తత్ = దేవతర్పణ యవార్పణం.

న్యుప్యమాన జలయోగి తిలౌఘైః: న్యుప్యమానాని చ తాని జలాని చ = న్యుప్యమాన జలాని, న్యుప్యమానజలైః యుజ్యన్త ఇతి = న్యుప్యమాన జలయోగినః, తిలానాం ఓఘాః = తిలౌఘాః, న్యుప్యమాన జలయోగినశ్చ తే తిలౌఘాశ్చ = న్యుప్యమాన జలయోగితిలౌఘాః, తైః = న్యుప్యమాన జలయోగితిలౌఘైః.

ద్విరుక్తకరకాలతిలః: కాలశ్చాసౌ తిలశ్చ = కాలతిలః, కరేకాలతిలః = కరకాలతిలః, ద్విరుక్తః కరకాల తిలః యస్య సః = ద్విరుక్తకరకాలతిలః.

**భావము :**

ఈ నలుని హస్తముయొక్క కణుపునందున్న యవరేఖ దేవతలకు చేసెడి యవతర్పణమును పునరుక్తము గావించినది. చేతియందలి యవరేఖచే యవతర్పణము చేసెను. పిదప యవధాన్యముచేతను యవతర్పణము గావించెను. కాన రెండువిధములుగా యవతర్పణము గావించుటవలన పునరుక్తియైనది. అట్లే యానలుడు పితరుల కొఱకుంగెడు తిలతర్పణముచే హస్తమునందలి తిలరేఖచే పునరుక్తి యేర్పడినది. అనగా నతడు స్వయముగా జేసిన తిలల తర్పణముతో హస్తమునందలి తిలరేఖకు పునరుక్తి యేర్పడినదని భావము. హస్తమందు యవరేఖయు తిలరేఖయు భాగ్య సూచకములని సాముద్రికశాస్త్రవేత్తలు చెప్పుదురు.

శ్లో. పూతపాణి చరణః శుచినోచ్చై రధ్వనాఽనితర పాదహతేన।
బ్రహ్మచారి పరిచారి సురార్చావేశ్మ రాజఋషి రేష వివేశ॥20

ప. వి. పూతపాణి చరణః - శుచినా - ఉచ్చైః - అధ్వనా - అనితరపాదహతేన- బ్రహ్మచారి పరిచారి సురార్చావేశ్మ - రాజఋషిః - ఏషః వివేశ.

అర్థము: ఏషః = ఈ, రాజఋషిః = ఋషితుల్యుడగు రాజు, పూతపాణి చరణః, పూత = కడుగుటచే పరిశుద్ధమైన, పాణిచరణః = హస్తములు పాదములు గలిగిన వాడగుచు, అనితరపాదహతేన = బ్రహ్మచారికంటె భిన్నులగువారి పాదములతో త్రొక్కబడని, కావుననే, శుచినా = శుద్ధమైన, అధ్వనా = మార్గముతో ననగా సాధనముతో, బ్రహ్మచారి పరిచారి సురార్చావేశ్మ; బ్రహ్మచారి = బ్రహ్మచారిని, పరిచారి = పరిచారకుడుగా గలిగిన సురార్చావేశ్మ = దేవతార్చన గృహమును, వివేశ = ప్రవేశించెను.

**సమాసములు :**

పూతపాణిచరణః : పాణీ చ చరణౌ చ = పాణిచరణం, పూత పాణిచరణం యస్య సః = పూతపాణిచరణః.

అనితరపాదహతేన : ఇతరేషాం పాదాః = ఇతరపాదాః, ఇతరపాదైః హతః = ఇతర పాదహతః, ఇతరపాదహతో న భవతీతి = అనితర పాదహతః, తేన = అనితర పాదహతేన.

బ్రహ్మచారి పరిచారి సురార్చావేశ్మ : బ్రహ్మ చరతీతి = బ్రహ్మచారీ. బ్రహ్మచార్యేవ పరిచారీ యస్మిన్ తత్ = బ్రహ్మచారి పరిచారి. సురేభ్యః అర్చా = సురార్చా, సురార్చాయాః వేశ్మ = సురార్చావేశ్మ, బ్రహ్మచారి పరిచారి చ తత్ సురార్చావేశ్మ చ = బ్రహ్మచారిపరిచారి సురార్చావేశ్మ, తత్ = బ్రహ్మచారి పరిచారి సురార్చావేశ్మ.

రాజఋషిః : రాజా చాసౌ ఋషిశ్చ = రాజఋషిః.

**భావము :**

రాజర్షియైన నలుడు కడుగుకొనుటచే పవిత్రములైన కాలుసేతులు గలవాడై బ్రహ్మచారులకంటె నితరులు నడువని పరిశుద్ధమైన మార్గముతో బ్రహ్మ

చర్మము నవలంబించిన వారినే పరిచారకులుగా గలిగిన యున్నతమైన దేవపూజా మందిరమును ప్రవేశించెను.

శ్లో. క్వాఽపి యన్నభసి ధూపజధూమై
ర్మేచకాగురుభవై ర్భ్రమరాణాం,
భూయతే స్మ సుమనస్సు మన
స్రగ్దామధామ పటలే పటలేన॥ 21

ప. వి. క్వ - అపి - యన్నభసి - ధూపజధూమైః - మేచకాగురుభవైః - భ్రమరాణాం - భూయతే - స్మ - సుమనస్సుమనస్రగ్దామధామపటలే - పటలేన.

అర్థము: యన్నభసి, యత్ = ఏ దేవపూజామందిరముయొక్క, నభసి = మధ్యనున్న శూన్యస్థలమునందు, క్వాఽపి = ఒకచోట, సుమనస్సుమనస్రగ్దామధామ పటలే, సుమనః = మాలతు అనెడి, సుమనః = పుష్పముల యొక్క, స్రగ్దామ = మాలికా సమూహముచే నిర్మింపబడిన, ధామ = గృహాకారపు రచనావిశేషముయొక్క, పటలే = ప్రాంతమందు, మేచకాగురుభవైః, మేచకాగురు = కాలాగురునుండి, భవైః = ఉత్పన్నములైన, ధూపజధూమైః, ధూపజ = ధూపమునుండి యేర్పడిన, ధూమైః = పొగలచేత, భ్రమరాణాం = తుమ్మెదలయొక్క, పటలేన = సమూహముచే, భూయతే స్మ = ఉండును (యేర్పడినది). అనగా పూలపందిరులపై తుమ్మెద లుండవలయును కావున ధూపము వలన కలిగిన పొగతే తుమ్మెదల సమూహములుగా నేర్పడినవని యర్థము.

సమాసములు :

యన్నభసి : యస్మిన్ నభః = యన్నభః, తస్మిన్ = యన్నభసి.

ధూపజధూమైః : ధూపాత్ జాయన్త ఇతి = ధూపజాః, ధూపజాశ్చ ధూమాశ్చ = ధూపజధూమాః, తైః = ధూపజధూమైః.

మేచకాగురుభవైః : మేచకాశ్చాసౌ అగురుశ్చ = మేచకాగురుః, మేచకాగురోః, సంభవః యేషాం తే = మేచకాగురుభవాః, తైః = మేచకాగురుభవైః.

సుమనస్సుమనస్రగ్దామధామ పటలే : సుమనసాం సుమనాంసి = సుమనస్సుమనాంసి, సుమనస్సుమనసాం స్రక్ = సుమనస్సుమనస్రక్. సుమనస్సుమనస్రజః దామాని = సుమనస్సుమనస్రగ్దామాని, సుమనస్సుమనస్రగ్దామ్నాంధామ = సుమనస్సుమనస్రగ్దామధామః సుమనస్సుమనస్రగ్దామధామ్నాం పటలం = సుమనస్సుమనస్రగ్దామధామ పటలం, తస్మిన్ = సుమనస్సుమనస్రగ్దామధామ పటలే.

భావము :

ఆ దేవ పూజమందిరములోని మధ్య దేశమందలి శూన్యభాగమున నొక కోట జాతిపూలతో నిర్మితమగు గృహమువంటి కట్టడము గలదు. దాని సమీప ప్రదేశమున దేవుని కొనంగెడి కృష్ణాగురు ధూపము వలని పొగలు తుమ్మెదల పిండుగా నేర్పడినది. పూలపైన తుమ్మెదలుండుట సహజము. ఇట ధూపము వలని పొగయే యాతుమ్మెదల పిండుగా నేర్పడినదని భావము.

శ్లో. సాఙ్కారేవ రుచిపీతతమా యైర్యైః
  పురాస్తి రజనీ రజనీవ।
తే ధృతాని తరితుం త్రిదశేభ్యః
  యత్ర హోమలతికా ఇవ దీపాః॥ 22

ప. వి. సాఙ్కారా - ఇవ - రుచిపీతతమా - యైః - యైః - పురా - అస్తి - రజనీ - రజనీ - ఇవ - తే - ధృతాని - తరితుం - త్రిదశేభ్యః - యత్ర- హోమలతికాః - ఇవ - దీపాః.

అర్థము: రజనీ = రాత్రి, యైః = ఏ దీపములచే, రుచిపీతతమా, రుచి = కాంతులచే, పీత = పానము చేయబడిన, అనగా నాశము చేయబడిన, తమా = చీకటి గల్గినదై, సాఙ్కారా, ఇవ = తేజస్సుయొక్క అఙ్కారముతో గూడినదో యనునట్లు, పురా = పూర్వము, అస్తి = ఉండెనో, రజనీ = రాత్రియే, యైశ్చ = యేదీపములతో, రుచిభిః = కాంతులచే, పీతతమా = మిక్కిలి పసుపువన్నె గల్గినదై, సాఙ్కారా = దీపములనడి యఙ్కారములతో కూడినదై, రజనీవ = పసుపువలె, పురా = పూర్వము, అస్తి =

ఉండెనో, హేమలతికా ఇవ = బంగారుతీగవలె నున్న, తే = పూర్వము చెప్పబడిన, దీపాః = వెలుగువత్తులు, యత్ర = ఏ దేవపూజాగృహమందు, త్రిదశేభ్యః = దేవతలకు, వితరితుం = ఇచ్చుటకు, భృతాః = పరిచారకులచే స్థాపింపబడినవి.

**సమాసములు :**

సాఙ్కురా : అఙ్కురైః స్సహ వర్తత ఇతి = సాఙ్కురా.

రుచిపీతతమా : రుచ్యా పీతం = రుచిపీతం, రుచిపీతం తమః యస్యాస్సా = రుచిపీత తమా.

హేమలతికాః : హేమమయ్యః లతికాః = హేమలతికాః.

**భావము:**

రాత్రి యేదీపములచే నాశము గావింపబడిన చీకటిని గలిగియుండినదై తేజస్సుయొక్క మొలకలతో గూడినదిగా తొలుత నుండినదో ఆ రాత్రియే దీపములకాంతులచే మిక్కిలి పసుపువన్నెగలదై దీపాఙ్కురములతో గూడినదై పసుపువలె పూర్వముండినదో తరువాత బంగరుతీగలవలె నున్న యాదీపవు వత్తులు ఆదేవ పూజామందిరమందు దేవతల కర్పించుటకై పరిచారకులచే స్థాపింపబడినవి. దీపములు రాత్రిప్రారంభమునం దుంచబడగా కేవలము తేజస్సుయొక్క మొలకలుగను, తర్వాత కొంతకాలమునకు పసుపువన్నెను బొంది పసుపువలెను, తర్వాత నింకను ప్రొద్దు గడవగా బంగరు తీగలు వలెను ప్రకాశించుచుండినవి. అట్టిదీపములను పరిచారకులు దేవపూజామందిరమునందు స్థాపించిరని యాశయము.

శ్లో. యత్ర మౌక్తికమణే ర్విరహేణ
ప్రీతికామధృతవహ్నిపదేన ।
కుఙ్కుమేన పరిపూరితమన్తః
శుక్తయః శుశుభిరేఽనుభవన్త్యః ॥ 23

ప.వి. యత్ర - మౌక్తికమణేః - విరహేణ - ప్రీతికామ ధృతవహ్నిపదేన - కుఙ్కుమేన - పరిపూరితం - అన్తః - శుక్రయః - శుశుభిరే - అనుభవన్త్యః.

అర్థము: యత్ర = ఏదేవమందిరమునందు, మౌక్తికమణేః = ముత్తెముయొక్క, విరహేణ = విరహముచే, ప్రీతికామధృత వహ్నిపదేన; ప్రీతి = ప్రీతిచే,

కామ = అధికముగా, ధృత = కల్పింపబడిన, వహ్ని = అగ్నియొక్క, పదేన = దహింపజేయుట యను నధికారము గల్గిన, లేదా చిహ్నము గల్గిన, కుఙ్కుమేన = కుంకుమపూవుచే, పరిపూరితం = నింపబడిన, అన్తః = మధ్యభాగమును, అనుభవన్త్య = వహించెడి, శుక్తయః = ముత్తెపు చిప్పలు, శుశుభిరే = శోభించినవి. వియోగినులగు స్త్రీలు విరహాగ్నిచే దహింపబడిన హృదయము ననుభవింతురు. కుంకుమపూలతో గూడిన ముత్తెపుచిప్పలు వియోగినులుగా వర్ణింపబడుచున్నవి. లేదా, మౌక్తిక మణేః = ముత్తెపుమణియొక్క, విరహేణ = లేమిచే, ఉపలక్షితాః = సూచితములగు ముత్తెపుచిప్పలు (కుంకుమము కామోద్దీపమునకు కారణ మగుటచే నే ప్రీతిగలదో అట్టి), ప్రీతికామ ధృతవహ్నిపదేన; ప్రీతి = ప్రీతితోకూడిన, కామ = మన్మథునిచే, ధృత = ఒసంగబడిన, వహ్ని పదేన = దాహకత్వాదిరూపమగునగ్నిచిహ్నమును గలిగిన, కుఙ్కుమేన = కుఙ్కుమపూవుతో, పరిపూరితం = నింపబడిన, అంతః = లోపలి భాగమును, అనుభవన్త్యః = వహించెడి, శుక్తయః = ముత్తెపుచిప్పలు, శుశుభిరే = శోభించినవి. ప్రీతిగలవాడు కొంచెము స్థానము నొసంగును. ముత్తెపుచిప్పలు పరిశుద్ధమైన కుంకుమపూవుతో నుపలక్షితములై, మౌక్తికమణి విరహముచే నిండిన మధ్యభాగమును వహించుచున్నవో యనునట్లు శోభించినవి. "ప్రీతికామధృత వహ్నిపదేన" యను పాఠమున తనకుద్దీపకమగుటవలన ప్రీతిచెందిన కామునిచే చేతిలో పొందబడిన యగ్నియొక్క చిహ్నమగు దాహకత్వము గల్గిన యని కుంకుమమునకు విశేషణముగా నర్థము చెప్పవలయును. ముక్తాఫలము పుట్టుటకు కారణము లైన ముత్తెపుచిప్పలు పుత్రులు లేనిచో తల్లులెట్లు హృదయమున దాహమునొందుదురో అట్లే కుంకుమరూపమైన యంతర్దాహమును వహించిశోభించినవనికాని యర్థము.

**సమాసములు :**

మౌక్తికమణేః : మౌక్తిక మితి మణిః = మౌక్తికమణిః, తస్య = మౌక్తిక మణేః.

ప్రీతికామధృతవహ్నిపదేన : కామం ధృతం = కామధృతం, ప్రీత్యా కామధృతం = ప్రీతికామధృతం, వహ్నేః పదం = వహ్నిపదం, ప్రీతికామ ధృతం వహ్నిపదం యేన తత్ = ప్రీతికామధృతవహ్నిపదం, తేన = ప్రీతికామధృతవహ్నిపదేన.

భావము :

దేవపూజాగృహమందు, మిక్కిలి ప్రియుడైన ముత్తెమనెడి పుత్రుడు లేనందువలన, అనగా పుత్రవిరహముచే ప్రేమతో చక్కగా (లేదా మన్మథుని ద్వారా, ఈయబడిన యగ్నివంటి కుంకుమతో నిండిన హృదయము - మధ్య భాగము గల్గి) ముత్తెపుచిప్పలు శోభించుచుండినవి. లేదా మౌక్తికమణియను ప్రియమైన పుత్రుని వియోగముచే గూడిన ముత్తెపుచిప్పలు వహ్నిరూపమైన కుంకుమపూవుతో లోన నలదబడినవై వియోగదుఃఖాగ్నిని ప్రకటించుచుండినవి. తల్లులు మిక్కిలి ప్రియమైన పుత్రునియొక్క విరహముచే నాపుత్రునియందలి ప్రేమవలన నాతని వియోగ వహ్నితో హృదయమున మండుచు, నెట్లు బాధ నొందుదురో అట్లే తనయం దుద్భవించిన పుత్రునివంటి ముత్తెము లేనందువలన నిప్పువంటి కుంకుమతో నిండిన మధ్యభాగము గల్గిన ముత్తెపుచిప్పలు లోన దాహమును వహించినవై శోభించుచుండినవి. పూజాగృహమునం దలంకారముగా ముత్తెపుచిప్పల కుంకుమము నలదు నాచారము కొన్నిదేశములయం దున్నది.

గమనిక : ఈ శ్లోకమును ప్రకాశకారుడు గ్రహించుటవలన నాతని వాఖ్య ననుసరించి యిట టీక వ్రాయబడినది.

శ్లో. అఙ్కచుమ్బిఘనచన్దనపఙ్కం యత్ర గారుడశిలాజమమత్రం।
ప్రాప కేలికవలీభవదిన్దోః సింహికాసుతముఖస్య సుఖాని॥ 23

ప. వి. అఙ్కచుమ్బి ఘనచన్దనపఙ్కం - యత్ర - గారుడశిలాజం - అమత్రం - ప్రాప - కేలికవలీభవదిన్దోః - సింహికాసుతముఖస్య - సుఖాని.

అర్థము: యత్ర = ఏదేవ పూజాగృహమందు, గారుడశిలాజం = మరకతమణితో నిర్మితమైన, అమత్రం = పాత్రము, అఙ్కచుమ్బిఘనచన్దనపఙ్కం, అఙ్క = ఒడిని - దేవమందిర మధ్యను, చుమ్బి = స్పృశించు, ఘన =

దట్టమైన, చన్దనపఙ్కం = చన్దనలేపమును గల్గినదై, కేలికవలీభవదిందోః, కేలి = ఆటచే, కవలీభవత్ = కబలితమగుచున్నయనగా మ్రింగబడుచున్న ఇందోః = చంద్రుడు గలిగిన, సింహికాసుతముఖస్య, సింహికాసుత = రాహువుయొక్క, ముఖస్య = నోటియొక్క, సుఖాని = ఆనందములను, ప్రావ = పొంపెను. అనగా రాహువుముఖముతో పోలికను వహించెనని యర్థము. చంద్రుడును చన్దనలేపమును తెల్లదనమును చల్లదనమును గలిగియుండుటవలనను రాహువును గారుడమణిపాత్రమును గుండ్రము గను నలుపుగను నుండుటవలనను వీనికి సామ్యము ఈదేవగృహము నందు చన్దనముతో నిండిన మరకతమణిమయపాత్రములు గలవని యర్థము.

**సమాసములు :**

అఙ్కచుమ్బి : అఙ్కం చుమ్బతీతి = అఙ్కచుమ్బి.

ఘనచన్దనపఙ్కం : చన్దనస్య పఙ్కః = చందనపఙ్కః, ఘనః చన్దన పఙ్కః యస్మిన్ తత్ = ఘనచన్దనపఙ్కం.

గారుడశిలాజమ్ : గరుడస్య ఇయం = గారుడీ, గారుడీ చ సా శిలా చ = గారుడశిలా. గారుడ శిలాయాః జాయత ఇతి = గారుడశిలాజం.

కేలికవలీభవదిన్దోః : అకవలిః కవలి స్సమ్పద్యమానఃభవన్ = కవలీ భవన్, కేలేః కవలీభవన్ = కేలికవలీభవన్, కేలికవలీభవన్ ఇన్దుః యస్య తత్ = కేలికవలీభవదిన్దుః, తస్య = కేలికవలీభవదిన్దోః.

సింహికాసుతముఖస్య ; సింహికాయాః సుతః = సింహికాసుతః, సింహికాసుతస్య ముఖం = సింహికాసుతముఖం. తస్య = సింహికాసుత ముఖస్య.

**భావము :**

ఆ దేవపూజామందిరమందు నొక గిన్నె దట్టమైన చన్దనలేపముతో గూడినదై మధ్యభాగమునం దుండినది. అది లీలతో చన్ద్రుని మ్రింగెడి రాహువు ముఖముయొక్క సామ్యమును బొందినది. చన్దనము తెల్లగ నుండుటవలన చన్ద్రునివలెను, మరకతమణిపాత్రము నల్లగ నుండుటవలన రాహువువలెను నుండినదని యాశయము.

శ్లో. గర్భ మైణమదకర్దమసాన్ద్రం
భాజనాని రజతస్య భజన్తి।
యత్ర సామ్య మగమ న్నమృతాంశో
రఙ్కరఙ్కు కలుషీకృత కుక్షేః ॥ 24

ప. వి. గర్భం - ఐణమదకర్దమ సాన్ద్రం - భాజనాని - రజతస్య - భజన్తి - యత్ర - సామ్యం - అగమత్ - అమృతాంశోః - అఙ్కరఙ్కు కలుషీ కృతకుక్షోః.

అర్థము: యత్ర = ఏ దేవతా పూజాగృహమందు, రజతస్య = వెండియొక్క, భాజనాని = పాత్రములు, ఐణమద కర్దమసాన్ద్రం, ఐణమద = కస్తూరి యొక్క, కర్దమ = లేపముతో, సాన్ద్రం = నిండిన, గర్భం = మధ్య భాగమును, భజన్తి = పొందుచున్న, అఙ్కరఙ్కుకలుషీకృతకుక్షోః, అఙ్క = వడియందలి, రఙ్కు = జింకచే, కలుషీకృత = మలినము గావించబడిన, కుక్షేః = ఉదరము కలిగిన, అమృతాంశోః = చంద్రుని యొక్క, సామ్యం = పోలికను, అగమన్ = పొందినవి, వెండిగిన్నెలు తెల్లగను గుండ్రముగ నుండుటవలన చంద్రుని బోలుచున్నవి. కస్తూరి లేపము నల్లగా నుండుటవలన నొడియందలి జింకను బోలుచున్నవి. దేవ పూజామందిరమునందు, వెండిపాత్రలు నూరిన చందనముతో గూడి యున్నవని యర్థము.

**సమాసములు :**

ఐణమదకర్దమ సాన్ద్రం : ఏణస్య అయం = ఐణః, ఐణశ్చాసౌ మదశ్చ = ఐణమదః ఐణమదస్య కర్దమః = ఐణమద కర్దమః, ఐణ మద కర్దమేన సాన్ద్రః = ఐణమదకర్దమ సాన్ద్రః, తం = ఐణమదకర్దమ సాన్ద్రమ్.

అఙ్కరఙ్కు కలుషీకృతకుక్షేః : అఙ్కే రఙ్కుః = అఙ్కరఙ్కుః, అకలుషం కలుషం సమ్పద్యమానం కృతం = కలుషీకృతం, అఙ్క రఙ్కునా కలుషీకృతం = అఙ్కరఙ్కుకలుషీకృతం, అఙ్కరఙ్కు కలుషీకృతం కుక్షి యస్య సః = అఙ్కరఙ్కుకలుషీకృత కుక్షిః, తస్య = అఙ్కరఙ్కుకలుషీకృత కుక్షేః.

**భావము :**

ఆ దేవపూజాగృహమందు వెండిగిన్నెలు కస్తూరీలేపములతో గూడినవై యొడియందు జింకచే మాలిన్యము బొందిన యుదరము గలిగిన చంద్రుని పోలిక ను వహించినవి. వెండిగిన్నెలు తెల్లగా గుండ్రముగా నుండుటవలన చంద్రుని వలె, నందలి కస్తూరీలేపము నల్లగా నుండుటవలన నొడియందలి జింకవలె నుండిన వని యర్థము.

శ్లో. ఉజ్జిహాన సుకృతాఙ్కురశఙ్కా
యత్రధర్మగహనే కిల తేనే ।
భూరిశర్కర కరమ్భవలీనా
మాలిభిః సుగతసౌధసఖానామ్ ॥ 25

ప. వి. ఉజ్జిహాన సుకృతాఙ్కుర శఙ్కా - యత్ర - ధర్మగహనే - కిల - తేనే - భూరిశర్కర కరమ్భవలీనాం - ఆలిభిః - సుగతసౌధసఖానామ్.

అర్థము: ధర్మగహనే, ధర్మ = పుణ్యముచే, గహనే = నిండినట్టి, యనగా పెక్కు విధములగు ధర్మముల యనుష్ఠానములతో నిండిన, పక్షాన్తరమున ధర్మగహనే = ధర్మారణ్యమైన యేదేవ పూజామందిరమునందు, సుగత సౌధసఖానాం, సుగత = బుద్ధునియొక్క, సౌధ = భవనమునకు, ననగా తెల్లని చైత్యములకు, సఖానాం = సమానములైన, భూరిశర్కర కరమ్భబలానాం, భూరి = అధికములైన, శర్కర = పంచదారగలిగిన, కరమ్భ = పెరుగుతో కలిసిన పేలా లనెడి, బలీనాం = నైవేద్యముల యొక్క, ఆలిభిః = వరుసలచే, ఉజ్జిహాన సుకృతాఙ్కురశఙ్కా, ఉజ్జిహాన = పైకి వచ్చుచున్న, సుకృతాఙ్కుర = పుణ్యపు మొలకలయందు, శఙ్కా = సందేహము, తేనే = విస్తరింప జేయబడినది. కిల = నిశ్చయము.

**సమాసములు :**

ఉజ్జిహాన సుకృతాఙ్కురశఙ్కా : సుకృతస్య అఙ్కురాః = సుకృతాఙ్కురాః, ఉజ్జిహానాశ్చ తే సుకృతాఙ్కురాశ్చ = ఉజ్జిహాన సుకృతాఙ్కురాః, ఉజ్జిహాన సుకృతాఙ్కురాణాం, శఙ్కా = ఉజ్జిహాన సుకృతాఙ్కురశఙ్కా.

ధర్మగహనే : ధర్మేణ గహనం = ధర్మగహనం, తస్మిన్ ధర్మగహనే, పక్షాంతరమున, ధర్మస్య గహనం = ధర్మగహనం, తస్మిన్ = ధర్మగహనే.

భూరిశర్కరకరమ్భబలీనాం : భూరయః శర్కరాః యేషు తే = భూరిశర్కరాః, భూరిశర్కరాశ్చ తే కరమ్భాశ్చ = భూరిశర్కరకరమ్భాః, భూరిశర్కరకరమ్భా ఏవ బలయః = భూరిశర్కరకరమ్భబలయః. తేషాం = భూరిశర్కరకరమ్భబలీనాం.

సుగతసౌధసఖానాం : సుగతానాం సౌధాః = సుగతసౌధాః, సుగతసౌధానాం సఖాయః = సుగతసౌధ సఖాః, తేషాం = సుగతసౌధసఖానాం.

భావము :

పెక్కు విధములగు ధర్మముల యనుష్ఠానములతో నిండినదియు, లేదా ధర్మారణ్యమే అయిన యాదేవ పూజామందిరమునందు బౌద్ధచైత్యములకు సమానములైనట్టి మెండువంచదారతో మిశ్రితములైన పెరుగుతోగూడిన పేలపిండి బలుల వరుసలు, పైకి పెరుగుచున్న పుణ్యాఙ్కురములనెడి సంశయమును వర్ధిల్లజేసినవి. మామిడిచెట్ల యడవియందు మామిడి మొలకలు పెరుగునట్లు ధర్మారణ్యమునందు ధర్మాఙ్కురములు పెరిగినవని యర్థము. అనగా నాదేవ పూజామందిరమునందు ఖండచదారతో గూడిన పెరుగుతో గలిపిన పేలపిండి యొక్క బలులు దేవతల కొసంగబడినవని యాశయము.

శ్లో. ఖర్వ మాఖ్య దమరౌఘ నివాసం
పర్వతం క్వచన చమ్పక సమ్పత్ ।
మల్లికాకుసుమరాశి రకార్షీత్
యత్ర చ స్ఫటికసాను మనుచ్చమ్ ॥ 26

వ. వి. ఖర్వమ్ - ఆఖ్యత్ - అమరౌఘ నివాసం - పర్వతం - క్వచన - చమ్పక సమ్పత్ - మల్లికా కుసుమరాశిః - అకార్షీత్ - యత్ర - స్ఫటికసానుం - అనుచ్చమ్.

అర్థము: యత్ర = ఏ దేవ పూజామందిరమునందు, క్వచన = ఒక ప్రదేశమున, చమ్పక సమ్పత్, చమ్పక = బంగారువన్నెగల చంపక పుష్పముల యొక్క, సమ్పత్ = సమృద్ధి, లేదా రాశి, అమరౌఘనివాసం, అమరౌఘ = దేవతా సమూహముయొక్క, నివాసం = ఉనికిపట్టైన, పర్వతం = సుమేరుపర్వతమును, ఖర్వం = కురుచనిదిగ, ఆఖ్యత్ = చెప్పినది, తథా = అట్లే, మల్లికాకుసుమరాశిః, మల్లికాకుసుమ = మల్లెపూల యొక్క, రాశిః = రాశి, స్ఫటికసానుం = కైలాసపర్వతమును. అనుచ్చం = ఎత్తులేనిదానినిగ, అకార్షీత్ = చేసెను

సమాసములు :

అమరౌఘనివాసం : అమరాణాం ఓఘః = అమరౌఘః. అమరౌఘస్య నివాసః = అమరౌఘనివాసః, తం = అమరౌఘనివాసం.
చమ్పకసమ్పత్ : చమ్పకానాం సమ్పత్ = చమ్పక సమ్పత్.
మల్లికాకుసుమరాశిః : మల్లికా ఇతి కుసుమాని = మల్లికాకుసుమాని. మల్లికాకుసుమానాం రాశిః = మల్లికాకుసుమరాశిః.
స్ఫటికసానుం : స్ఫటికాః సానౌ యస్య సః = స్ఫటికసానుః, తం = స్ఫటికసానుః.
అనుచ్చం : న ఉచ్చః = అనుచ్చః. తం = అనుచ్చమ్.

భావము :

ఆ దేవపూజాగృహమం దొకవైపు చమ్పకపుష్పముల రాశి యున్నది. అది దేవతల కునికిపట్టైన మేరుపర్వతమును కురుచపరిచినది. అనగా నది మేరుపర్వతమును మించి యెత్తుగానున్నది. చంపకపుష్పములు బంగారువంటి పసుపు వన్నెను గలిగినవి గాన మేరుపర్వతము స్వర్ణమయముగాన నాపర్వతమును నీపూలరాశి మించియున్నదని చెప్పబడినది. అట్లే యాపూజామందిరమునందు మరియొకవైపున మల్లెపూలరాశి యున్నది. అది తెల్లని కైలాస పర్వతమునకు నెత్తును తగ్గించినది. అనగా నాపర్వతమును మించి యౌన్నత్యమును గలిగియున్నదని యర్థము. ॥26॥

శ్లో. స్వాత్మనః ప్రియమపి ప్రతి గుప్తిం
కుర్వతీ కులవధూమవజజ్ఞే ।
హృద్యదైవతనివేద్యనివేశాత్
యత్ర భూమి రవకాశదరిద్రా ॥ 27

ప. వి: స్వాత్మనః - ప్రియమ్ - అపి - ప్రతి - గుప్తిం - కుర్వతీ-కులవధూం-అవజజ్ఞే - హృద్యదైవతనివేద్యనివేశాత్ - యత్ర - భూమిః - అవకాశదరిద్రా.

అర్థము: యత్ర = ఏ దేవపూజాగృహమందు, భూమిః = భూమి, అనగా దేవపూజామందిరమందలి స్థలము, హృద్యదైవత నివేద్యనివేశాత్; హృద్య = మనోహరములగు, దైవత = దేవతలకు సంబంధించిన, నివేద్య = బలులను, నివేశాత్ = ఉంచుటవలన, అవకాశదరిద్రా = స్థలము లేనిదై యనగా నెవ్విధముగను దృష్టికి గోచరించని దగుచు, స్వాత్మనః = తనకు (భూమికి), ప్రియం ప్రత్యపి = భర్తయగు నలు ముద్దేశించియు, గుప్తిం = తన శరీరమును మరుగుపరుచుకొనుటను, కుర్వతీ = చేయుచు, కులవధూం = మంచి వంశమున జన్మించిన వధువును, అవజజ్ఞే = తిరస్కరించినది - అనగా మించినదని యర్థము. కులస్త్రీ తన భర్త నుద్దేశించియు లజ్జాతిశయమువలన తన శరీరమును దాచుకొనును. అట్లే యా భూమియు కులస్త్రీకి సమానముగా నుండినదని యర్థము. పెక్కు నైవేద్యము లాపూజామందిరమునందు పరుచబడినవి, అందువలన, నేల కానరాలే దని సారాంశము.

సమాసములు :

కులవధూం : కులే వధూః = కులవధూః, తాం = కులవధూం.

హృద్యదైవత నివేద్య నివేశాత్ : దేవతానాం ఇమాని దైవతాని, నివేదయితుం అర్హాణి = నివేద్యాని, దైవతాని చ తాని నివేద్యాని = దైవత నివేద్యాని. హృద్యాని చ తాని దైవతనివేద్యాని చ = హృద్యదైవత నివేద్యాని. హృద్యదైవత నివేద్యానాం నివేశః = హృద్యదైవత నివేద్య నివేశః, తస్మాత్ = హృద్యదైవత నివేద్యనివేశాత్.

అవకాశదరిద్రా : అవకాశే దరిద్రా = అవకాశదరిద్రా.

భావము :

ఆ దేవపూజామందిరమందలి భూమిపై దేవతలకై మనోజ్ఞములగు పెక్కు నైవేద్యము లుంచబడుటవలన నందలి స్థలము ఆ నైవేద్యములకు సరిపోయి యుంచుకైనను కానరాక పోయినది. అందువలన భూమి యనెడి పడతి తనకు భర్తయగు నలు నుద్దేశించియు తన శరీరమును గప్పివుచ్చుకొని కానరాకుండ జేయుచు కులస్త్రీని సైతము తిరస్కరించినదో యను నట్లుండినది. కులస్త్రీ తన భర్త నుద్దేశించియు లజ్జావశమువలన తన శరీరమును మరుగుపరుచుకొనును. అవ్విధముగనే భూమియు కులవధువునకు సాటిగా నుండినది. అనగా నా పూజా మందిరమంతయు దేవతానైవేద్యములతో నిండిపోయినదని యాశయము. ॥27॥

శ్లో. యత్ర కాన్తకరపీడిత నీలగ్రావరశ్మిచికురాసు విరేజుః ।
గాత్రమూర్ధ విధుతే రనుబిమ్బాత్ కుట్టిమక్షితిషు కుట్టమితాని ॥28

ప. వి. యత్ర - కాన్తకరపీడితనీలగ్రావరశ్మిచికురాసు - విరేజుః - గాత్రమూర్ధవిధుతేః - అనుబిమ్బాత్ - కుట్టిమక్షితిషు - కుట్టమితాని.

అర్థము: యత్ర = ఏ దేవపూజాగృహమందు, కాన్తకరపీడితనీలగ్రావరశ్మిచికురాసు; కాన్త = ప్రియునియొక్కయు, చన్ద్రకాన్తమణియొక్కయు, కర = హస్తముచేతను, కిరణముచేతను, పీడిత = గట్టిగా లాగి నలువుట వలనను, స్పర్శముచే వికారము బొందింపబడినవియును ననగా మరియొక వర్ణమును బొందింప బడినవియునునగు, నీలగ్రావ = ఇంద్ర నీలమణులయొక్క, రశ్మి = కిరణములనెడి, చికురాసు = కురులు గల్గిన, కుట్టిమక్షితిషు = మణి బద్ధభూములయందు, గాత్రమూర్ధవిధుతేః, గాత్ర = గాయకుని యొక్క, మూర్ధ = తలయొక్క, విధుతేః = విదిలింపుయొక్క, అనుబింబాత్ = ప్రతిబింబమువలన, కుట్టమితాని = తలను కదిలించుట మున్నగు శృఙ్గార చేష్టలు, విరేజిరే = ప్రకాశించినవి. "సమ్మర్దేఽపి సుఖాధిక్యం రతా కుట్టమితం మతం" అని చెప్పిన చొప్పున రతియందు జరుగు స్తనాద్యవయవసమ్మర్దము మున్నగు దానివలన కలిగెడి సుఖాతిశయమే కుట్టమితమని చెప్పబడును. భరతమునియు "కేశస్తనాధరాది గ్రహణేఽపి హర్షసంభ్రమోత్పన్నం కమ్పనం కుట్టమితం ఇతి విజ్ఞేయం

విశేషం సుఖం విదుః." అని, కురులను, చనుగవను, అధరము మున్నగు వానిని బట్టినను దానివలన కల్గు హర్షసంభ్రమముంచే సుద్భవిల్లు విశేషసుఖ రూపమైన శిరఃకంపనము కుట్టమితమని చెప్పెను. అనగా పూజాగృహ మందలి నేలయందు మణులు పొదగబడి నవనియు నందు గాయకు లున్నా రనియు నర్థము.

సమాసములు :

కాన్తకరపీడితనీలగ్రావరశ్మిచికురాసు : కాన్తస్య కరః = కాన్తకరః, కాన్తకరేణ పీడితాః = కాన్తకరపీడితాః, నీలాశ్చ తే గ్రావాణశ్చ = నీలగ్రావాణః, కాన్తకరపీడితాశ్చ తే నీలగ్రావాణశ్చ= కాన్తకరపీడిత నీలగ్రావాణః, కాన్తకరపీడితనీలగ్రావ్ణాం రశ్మయః = కాన్తకరపీడితనీలగ్రావరశ్మయః, కాన్తకరపీడిత నీలగ్రావరశ్మయ ఏవ చికురాః యాసాం తాః = కాన్తకరపీడిత నీలగ్రావరశ్మి చికురాః, తాసు = కాన్తకరపీడిత నీలగ్రావరశ్మి చికురాసు.

గాత్పమూర్ధ విధుతేః : గాతుః మూర్ధా = గాతృమూర్ధా, గాతృ మూర్ధ్న విధుతిః = గాతృమూర్ధ విధుతిః, తస్యాః = గాతృమూర్ధ విధుతేః.

కుట్టిమక్షితిషు : కుట్టిమాశ్చ తాః క్షితయశ్చ = కుట్టిమక్షితయః, తాసు = కుట్టిమక్షితిషు.

భావము;

ఆ దేవ పూజామందిరము నందు ప్రియుని యొక్కయు (చన్ద్రకాంత మణి యొక్కయు) హస్తముచేతను, (కిరణముచేతను) గట్టిగా లాగుటచే పీడింపబడిన వియు, స్పర్శచే వికారమును (అనగా మరియొక వన్నెను) పొందింపబడినవియును నగు నిన్ద్రనీలమణులయొక్క కిరణములనెడి కురులుగల మణినిబద్ధ భూముల యందు గాయకుడు పాడుచుండుటచేత నేర్పడు శిరఃకంపములు ప్రతిబింబించుట వలన నవి భూదేవియొక్క కుట్టమితము లనబడు శృఙ్గార చేష్టలుగా శోభించినవి. అనగా గాయకులు గానముచేయుచు తలల నాడించుచుండిరి. అపుడు వారి ప్రతిబింబములు మణిభూములపై బడి, ప్రియుడు దన్తక్షతనఖక్షతములను గాని

చుమ్బనమునుకాని చేయుట కుపక్రమించునపుడు ప్రేయసి తలను విదిలించి యెట్లు వలదని వారించుచున్నదో అట్లే చన్ద్రకాన్తాది మణులతో గప్పబడిన భూమి యనెడి ప్రియురాలు ఇన్ద్రనీలమణుల కిరణములనెడి కురులతో తలను విదిలించుచు వారించు చుండినది. దేవపూజా గృహమందు గాయకులు తలల నూపుచు గానము చేయుచుండిరి. అచటినేల మణులతో బొదుగబడి యుండినదని భావము.॥28॥

శ్లో. నైకవర్ణమణిభూషణపూర్ణే
స క్షితీన్దు రనవద్యనివేద్యే
అధ్యతిష్ఠ దమలం మణిపీఠం
తత్ర చిత్రసిచయోచ్చయచారౌ॥ 29

ప. వి. నైకవర్ణమణిభూషణపూర్ణే - సః-క్షితీన్దుః- అనవద్యనివేద్యే-అధ్యతిష్ఠత్-అమలం - మణిపీఠం - తత్ర - చిత్రసిచయోచ్చయ చారౌ.

అర్థము: క్షితీన్దుః = భూలోకచన్ద్రుడగు, సః = ఆ నలుడు, నైకవర్ణమణి భూషణపూర్ణే, నైకవర్ణ = పెక్కువర్ణములు గల, మణిభూషణ = రత్న భూషణములతో, పూర్ణే = నిండిన, అనవద్యనివేద్యే, అనవద్య = నిర్దోషములైన, నివేద్యే = నైవేద్యముగల్గిన, తథా = అట్లే, చిత్రసిచయోచ్చయ చారౌ, చిత్ర = నానావిధములైన, సిచయ = వస్త్రముల యొక్క, ఉచ్చయ = సమూహముచే, చారౌ = మనోహరమగు, తత్ర = ఆ దేవపూజా గృహమందు, అమలం = నిర్మలమగు, మణి పీఠం = రత్నమయమగు నాసనమును, అధ్యతిష్ఠత్ = అధిష్ఠించెను. అనగా దేవపూజకై కూర్చుండెనని యాశయము.

సమాసములు :

నైకవర్ణమణి భూషణపూర్ణే : న ఏకః = నైకః, నైకః వర్ణః యేషాం తే = నైకవర్ణాః, నైకవర్ణాశ్చ తే మణయశ్చ = నైకవర్ణమణయః, నైకవర్ణమణీనాం భూషణాని = నైకవర్ణమణి భూషణాని, నైకవర్ణ మణి భూషణైః పూర్ణం = నైకవర్ణమణి భూషణపూర్ణం, తస్మిన్ = నైకవర్ణ మణి భూషణపూర్ణే.

క్షితీన్దుః : క్షితేః ఇన్దుః = క్షితీన్దుః.

అనవద్యనివేద్యే : న అవద్యం = అనవద్యం, అనవద్యం నివేద్యం యస్మిన్ తత్ = అనవద్య నివేద్యం, తస్మిన్ = అనవద్యనివేద్యే.

మణిపీఠం: మణేః పీఠం = మణిపీఠం, తం = మణిపీఠం.
చిత్రనిచయోచ్చయచారౌ: చిత్రాశ్చ తే నిచయాశ్చ = చిత్ర నిచయాః, చిత్రనిచయానాముచ్చయః = చిత్రనిచయోచ్చయః చిత్రని. చయోచ్చయేన చారు=చిత్రని చయోచ్చయ చారు. తస్మిన్ = చిత్రని చయోచ్చయ చారౌ.

**భావము :**

భూలోకచన్ద్రుడగు నలమహారాజు వివిధవర్ణములుగల మణులతో నిర్మితమగు నాభరణములతో నిండినదియు, నిర్దోషములగు వైవేద్యములు గలదియు నానావిధములగు వస్త్రసమూహములతో మనోజ్ఞమైనదియు నగు నాపూజాగృహ మందు నిర్మలమగు రత్నపీఠము నధిష్ఠించెను. ॥29॥

శ్లో. సమ్య గర్చతి నలే ర్క మతూర్ణం
భక్తిగన్ధి రమునా౽కలి కర్ణః
శ్రద్దధాన హృదయం ప్రతి చాన్తః
సామ్బమమ్బరమణి ర్నిరచైషీత్ ॥ 30

ప. వి. సమ్యక్ - అర్చతి - నలే - అర్కమ్ - అతూర్ణం - భక్తిగన్ధిః - అమునా - అకలి - కర్ణః - శ్రద్దధానహృదయం - ప్రతి - చ - అన్తః - సామ్బం - అమ్బరమణిః - నిరచైషిత్.

**అర్థము:** నలే=నలుడు, అతూర్ణం=మెల్లగా ననగా నేకాగ్రముగా, సమ్యక్= చక్కగా, అర్కం=సూర్యుని, అర్చతి సతి=పూజింపగా, అమునా= ఈ సూర్యునిచే, కర్ణః=రాధేయుడు, భక్తిగంధిః, భక్తి=భక్తియొక్క, గన్ధిః = లేశముగలవాడుగా, అకలి=నిశ్చయింపబడెను. అమ్బర మణిః= ఆకాశమునకు రత్నమైన సూర్యుడు, సామ్బం =సామ్బుడను కృష్ణుని పుత్రుని, ప్రతి చ =ఉద్దేశించియు, అంతః=హృదయమునందు, శ్రద్దధానహృదయం, శ్రద్దధాన=భక్తిగలిగిన, హృదయం = మనస్సు గలవానిగా, నిరచైషిత్ = నిశ్చయించెను. సామ్బుడు కేవలము భక్తుడే గాని యారాధకుడు కాదు. కర్ణుని కంటెను సామ్బుని కంటెను నలుడే మిక్కిలి భక్తుడని నిశ్చయించెను. "యావ న్న దీయతే చార్ఘ్యం

భాస్కరాయ మహాత్మనే" యని చెప్పిన చొప్పున సూర్యుని కర్ఘ్య మీయక ఇతర దేవతలపూజ నిషిద్ధము గాన నలుడు తొలుత సూర్యుని పూజించెనని యర్థము.

**సమాసములు :**

అతూర్ణం : న తూర్ణం = అతూర్ణం.
భక్తిగన్ధిః : భక్తేః గన్ధః అస్యాస్తీతి = భక్తిగన్ధిః.
శ్రద్దధాన హృదయం : శ్రద్దధానం హృదయం యస్య సః = శ్రద్ధ ధానహృదయః, తం = శ్రద్దధానహృదయం.
అమ్బరమణిః : అమ్బరస్య మణిః = అమ్బరమణిః.

**భావము :**

నలుడు మెల్లగా నేకాగ్రచిత్తముతో చక్కగా సూర్యుని పూజింపగా, సూర్య పుత్రుడగు కర్ణుడు అల్పభక్తి గలవా డాయెను. సూర్యుని పుత్రుడగు కర్ణునికంటెను నలునిపూజ యతిశయించెనని యర్థము. అట్లే యాసూర్యుడు కృష్ణపుత్రుడగు సాంబుని గూర్చియు నతడు భక్తుడే కాని యర్చకుడు కాడని నిశ్చయించెను. కర్ణునికంటెను సాంబునికంటెను నలుడే పరమభక్తుడనినిశ్చయించెను. ॥30॥

శ్లో. తత్తదర్యమ రహస్య జపేషు
ప్రజ్ఞయ శ్శయమముష్య బభాజ
రక్తిమానమివ శిక్షితు ముచ్చై
రక్తచన్దన జబీజ సమాజః ॥ 31

ప. వి. తత్తదర్యమరహస్యజపేషు - ప్రజ్ఞయః - అముష్య - బభాజ - రక్తిమానం - ఇవ - శిక్షితుం - ఉచ్చైః - రక్తచన్దన జ బీజ సమాజః.

అర్థము: తత్తదర్యమరహస్యజపేషు, తత్తత్ = ఆయాశ్రౌతస్మార్తములగు. అర్యమ = సూర్యునియొక్క, రహస్య = మన్త్రములయొక్క, జపేషు = జపములయందు, ప్రజ్ఞయః = జపమాలాస్వరూపముగల్గిన, రక్తచన్దనజ బీజ సమాజః, రక్తచన్దనజ = ఎఱ్ఱచందన వృక్షమున బుట్టిన, బీజ = పూసలయొక్క, సమాజః = సమూహము, ఉచ్చైః = అధికముగా, రక్తిమానం = ఎఱ్ఱదనమును, శిక్షితుమివా = నేర్చుటకోయనునట్లు, అముష = ఈ నలునియొక్క, శయం = హస్తమును, బభాజ = పొందినది. నలుని హస్తము నైసర్గికముగానే ఎఱ్ఱగనుండుట వలన దానినుండి యెఱ్ఱదనమును నేర్చుటకో యనునట్లు చన్దనపు పూసలతో చేయబడిన జపమాల యాతని హస్తమును సేవించిన దని యర్థము.

**సమాసములు :**

తత్తదర్యమరహస్యజపేషు : అర్యమ్ణః రహస్యాని = అర్యమ రహస్యాని, తాని చ తాని చ ఆర్యమ రహస్యాని, తత్తదర్యమరహస్యానాం జపాః = తత్తదర్యమరహస్య జపాః, తేషు = తత్తదర్యమ రహస్య జపేషు.

రక్తచన్దనజ బీజ సమాజః : రక్తచన్దనాత్ జాయన్త ఇతి = రక్త చన్దన జాని. రక్తచన్దన జాని చ తాని బీజాని చ = రక్తచన్దనజబీజాని. రక్తచన్దనజ బీజానాం సమాజః = రక్తచన్దజబీజసమాజః.

**భావము:**

శ్రౌతస్మార్తములగు సూర్యమంత్రములయందు జపమాలికారూపమున నెఱ్ఱచెందనపు పూసల సమాజము శిష్యసమాజమువలె నధికముగా నెఱ్ఱదనమును నేర్చుకొనుటకో యనునట్లు ఎఱ్ఱని యానలుని హస్తమును జేరినది.

శ్లో. **హేమనామకతరుప్రసవేన త్ర్యమ్బక స్తదుపకల్పితపూజః ।**
**ఆత్తయా యుధి విజిత్య రతీశం రాజితః కుసుమకాహలయేవ॥**

వ.వి. హేమనామకతరుప్రసవేన - త్ర్యమ్బకః - తదుపకల్పితపూజః - ఆత్తయా - యుధి - విజిత్య - రతీశం - రాజితః - కుసుమ కాహలయా - ఇవ.

అర్థము: హేమనామక తరుప్రసవేన, హేమనామకతరు = ఉమ్మెత్తచెట్టు యొక్క, ప్రసవేన = పుష్పముచే, తదుపకల్పిత పూజః, తత్ = ఆ నలునిచే, ఉపకల్పిత = చేయబడిన, పూజః = పూజగల్గిన, త్ర్యంబకః = ముక్కంటి, రతీశం = రతిపతియగు కాముని, యుధి = యుద్ధమునందు, విజిత్య = జయించి, ఆత్తయా = బలవంతముగా దీసి కొనబడిన, కుసుమకాహలయా ఇవ, కుసుమ = ఉమ్మెత్తపూ వనెడి, కాహలయా ఇవ = కాహలవాద్యముచేతనో యనునట్లు, రాజితః = శోభించెను. స్మరునకు బాణములు పుష్పము లగుటవలన వాద్యములు నైతము పుష్పమయముగా నుండుట యుచితము. ఓడిపోయిన మన్మథుని నుండి బలవంతముగా గైకొనబడిన పుష్పరూప మగు కాహలవాద్యముచే శివుడు శోభించెనని యర్థము. లోకమునం దెవ్వరైనను శత్రువును

జయించి బలవన్తముగా నతని శస్త్రములను వాద్యములను గైకొని యెట్లు శోభించునో యట్లే శివుడును శోభించెనని యర్థము. సౌందర్యమునందు తనకుపోటీ యగుటచేతను, తాను శివభక్తు డగుటచేతను, మన్మథుడు శివునికివిరోధి యగుటవలనను తనకును తనస్వామియగు శివునికిని విరోధి యగు కాముని యుద్ధమునందు జయించి, యాతని యొద్దనుండి నలునిచేత బలవంతముగా గైకొనబడిన కుసుమకాహలమువలె నుండు నుమ్మెత్త పూవుచే బహూకృతుడైన తరువాత దానిచేతనే పూజింపబడినవాడై, యా శివుడు శోభించెనని యర్థము. సేవకుడు తనకును తనయజమానునకును, విరోధియగువానిని యుద్ధమునందు జయించి యాతని శస్త్రమును వాదిత్రములను బలవంతముగా లాగికొని తన యజమానునకు బహూక రించును. వానిచేత నాయజమానుడు శోభించును. శివునికి మిక్కిలి యిష్టమైన నుమ్మెత్తపూవుచే నలుడు శివుని పూజించెనని యర్థము.

గమనిక: ఈశ్లోకమును ప్రకాశకారుడు వ్యాఖ్యానించినందువలన దానిననుసరించి దీనికి టీక వ్రాయబడినది.

సమాసములు :

హేమనామకతరుప్రసవేన : హేమ ఇతి నామ యస్య సః = హేమ నామకః, హేమనామక శ్చాసౌ తరుశ్చ = హేమనామకతరుః; హేమ నామకతరోః ప్రసవః = హేమనామకతరుప్రసవః; తేన = హేమనామక తరుప్రసవేన.

త్ర్యమ్బకః : త్రీణి అమ్బకాని యస్య సః = త్ర్యమ్బకః.

తదుపకల్పితపూజః : తేన కల్పితా = తదుపకల్పితా పూజా యస్య సః = తదుపకల్పితపూజః.

కుసుమకాహలయా : కుసుమేవ కాహలా = కుసుమకాహలా, తయా = కుసుమకాహలయా.

భావము :

ఉమ్మెత్తపూవులచే పూజింపబడిన శివుడు మన్మథుని యుద్ధమునం దోడించి యతనివద్దనుండి, బలవన్తముగా లాగికొనబడిన, యుమ్మెత్తపూ వనెడి కాహల

వాద్యముతో శోభించెను. పుష్పములే యాయుధముగా గల్గిన మన్మథునికి కాహలాదివాద్యములు సైతము పుష్పమయములుగా నుండుట యుచితమేగదా! శత్రువునోడించిన వ్యక్తి యాశత్రువునకు జెందిన వాద్యాదులతో నెట్లుశోభించునో యట్లే నతడు సౌందర్యమున తనకెదురైన మన్మథుని యుద్ధమున జయించి యాతనియొద్దనుండి బలవన్తముగా లాగికొనిన యుమ్మెత్తపూ వనెడి కాహల వాద్యము నాశివునకు బహూకరించి దానితో నాతనికి పూజ గావింపగా నాపరమ శివుడు మిక్కిలి శోభించెనని యర్థము. సేవకుడు తనకు తన యజమానునకును శత్రువైనవానిని యుద్ధమున జయించి, యాశత్రువుకు జెందిన శస్త్రవాద్యాదులను బలవంతముగా లాగికొని తన యజమానునకు బహూకరించును. దానిచే యజమానుడు శోభించును. అట్లే యిట శివుడును నలు డొసంగిన ఉమ్మెత్త పూవుతో శోభించెనని యాశయము.

శ్లో. అర్చయన్ హరకరం స్మితభాజా నాగకేసరతరోః ప్రసవేన ।
స్సోఽయ మాపయ దతిర్యగవాగ్దిక్పాలపాణ్డురకపాలవిభూషామ్॥

ప.వి. అర్చయన్ - హరకరం - స్మితభాజా - నాగకేసరతరోః - ప్రసవేన - సః - అయం - ఆపయత్ - అతిర్యగవాగ్దిక్పాలపాణ్డురకపాల విభూషామ్.

అర్థము: సః = ఆ, అయం = పూజానిరతిగల నలుడు, స్మితభాజా = చిరు నగవును ననగా వికాసమును వహించిన, నాగకేసరతరోః = నాగకేసర వృక్షముయొక్క, ప్రసవేన = పుష్పములతో, హరకరం = శివునియొక్క హస్తమును, అర్చయన్ = పూజించుచు, అతిర్యగవాగ్దిక్పాలపాణ్డురక పాలవిభూషాం, అతిర్యగవాగ్దిక్పాల = అడ్డముగానున్న తూర్పు మున్నగు నెనిమిది దిక్కులకును, నట్లే దిగువనున్న యవాగ్దిక్కునకును, భిన్నమైన యూర్ధ్వదిక్కునకును పాలకుడగు బ్రహ్మయొక్క, పాణ్డుర = తెల్లని, కపాల = చర్మరహితమగు కపాలముయొక్క, విభూషాం = శోభను, ఆపయత్ = పొందించెను. తన పుత్రికయగు సంధ్యను కామించి వెంట పడిన బ్రహ్మయొక్క ఐదవశిరమును ఖండించెను. తర్వాత బ్రహ్మవధ వదలని పాపమునకు ప్రాయశ్చిత్తమునకు జేయగోరిన శివుడు భిక్షకై

యాకపాలమును హస్తమున ధరించెను. నాగకేశరపుష్పముకూడ యా కపాలమువలె తెల్లగా నుండుటవలన నది నలుడు గావించెడి శివపూజ యందు బ్రహ్మకపాలముతో సమానముగా ప్రకాశించినది.

సమాసములు :

హరకరం : హరస్య కరః = హరకరః, తం = హరకరం.
స్మితభాజా : స్మితం భజతీతి = స్మితభాక్, తేన = స్మితభాజా;
నాగకేసరతరోః : నాగకేసర ఇతి తరుః = నాగకేసరతరుః, తస్య = నాగకేసరతరోః.

అతిర్యగవాగ్దిక్పాలపాణ్డురకపాలవిభూషాం : తిర్యక్చ అవాక్చ = తిర్యగవాచౌ, తిర్యగవాచౌన భవతీతి = అతిర్యగవాగ్దిక్, అతిర్యగవాగ్దిశః పాలః = అతిర్యగవాగ్దిక్పాలః, పాణ్డుర శ్చాసౌ కపాలశ్చ = పాణ్డుర కపాలః, అతిర్యగవాగ్దిక్పాలస్య పాణ్డురకపాలః = అతిర్యగవాగ్దిక్పాల పాణ్డురకపాలః, అతిర్యగవాగ్దిక్పాల పాణ్డురకపాలస్య విభూషా, = అతిర్యగవాగ్దిక్పాల పాణ్డుర కపాల విభూషా, తాం = అతిర్యగవాగ్దిక్పాల పాణ్డుర కపాల విభూషాం.

భావము :

ఆ విధముగా పూజాసక్తుడగు నలుడు వికసించిన నాగకేసరపుష్పముతో శివుని హస్తమును పూజించుచు నడ్డముగానున్న ఎనిమిది దిక్కులకంటెను దిగువ నున్న పాతాలదిశకంటెను భిన్నమైన యూర్ధ్వదిశకు పాలకుడైన బ్రహ్మ యొక్క తెల్లని కపాలముయొక్క శోభను నా పుష్పమును పొందించెను. తూర్పు మున్నగు నెనిమిది దిక్కులకును పాతాళదిక్కునకును పాలకులు వేరు. ఊర్ధ్వదిశకు పాలకుడు బ్రహ్మయని ప్రసిద్ధి. కావున నతడు అతిర్యగవాగ్దిక్పాలు డని ఇట చెప్పబడెను.

శ్లో. నీలనీరరుహ మాల్యమయీం స
న్న్యస్య తస్య గలనాల విభూషాం।
స్ఫాటికీమపి తనూం నిరమాసీ
న్నీలకణ్ఠ పదసాన్వయతాయై ॥ 33

ప. వి. నీలనీరరుహమాల్యమయీం - సః - న్యస్య - తస్య - గలనాల విభూషాం - స్ఫాటికీం - అపి - తనూం - నిరమాసీత్ - నీలకణ్ఠపద సాన్వయతాయై.

అర్థము: సః = ఆ నలుడు, తస్య = ఆ శివునికి, నీలనీరరుహ మాల్యమయీం; నీలనీరరుహ = నల్లకలువలయొక్క, మాల్యమయీం = మాలారూప మైన, గలనాల విభూషాం, గలనాల = కంఠనాలమునకు, విభూషాం = భూషణమును, న్యస్య = సమర్పించి, స్ఫాటికీమపి = స్ఫటికమైన దయ్యును, తనూం = ఆ శివుని శరీరమును, నీలకణ్ఠ పదసాన్వయతాయై, నీలకణ్ఠపద = శివునికి ప్రసిద్ధమైన "నీలకణ్ఠ" యను సంజ్ఞను చెప్పెడి పదమునకు, సాన్వయతాయై = అన్వయము కుదురుటకు, అనగా నల్లని కంఠము గలవాడను నర్థ మేర్పడుటకు, నిరమాసీత్ = కల్పించెను.

సమాసములు :

నీలనీరరుహమాల్యమయీం : నీరే రోహ న్తీతి = నీరరుహాణి, నీలాని చ తాని నీరరుహాణి చ = నీల నీరరుహాణి. నీలనీరరుహాణాం మాల్యం = నీలనీరరుహమాల్యం, నీలనీరరుహమాల్యస్య వికారః = నీలనీరరుహ మాల్యమయీ, తాం = నీలనీరరుహమాల్యమయీమ్.

గలనాలవిభూషాం : గలస్య నాలః = గలనాలః, గలనాలస్య విభూషేవ విభూషా = గలనాల విభూషా. తాం = గలనాల విభూషాం.

స్ఫాటికీం : స్ఫటికస్య వికారః = స్ఫాటికీ, తాం = స్ఫాటికీం.

నీలకణ్ఠపద సాన్వయతాయై : నీలః కణ్ఠః యస్య సః = నీలకణ్ఠః నీలకణ్ఠ ఇతి పదం = నీలకణ్ఠ పదం, అన్వయేన సహ వర్తత ఇతి = సాన్వయః, సాన్వయస్య భావః = సాన్వయతా, నీలకణ్ఠ పదస్య సాన్వయతా = నీలకణ్ఠ పదసాన్వయతా, తస్యై = నీలకణ్ఠ పదసాన్వయ తాయై.

భావము :

ఆ నలమహారాజు ఆ శివునికి నల్లకలువలమాలికను కణ్ఠదేశమునకు భూషణముగా నుంచి యాతని స్ఫటికకాన్తి గలిగిన శరీరమున నీలకణ్ఠయను

నంజ్ఞకు నన్వయ మేర్పడునట్లు గావించెను. నీలములైన కలువలమాల యాతని కంఠము నం దుంచుటవలన నతనికి నీలకంఠత్వ మేర్పడి యాతని కాపేరు సార్థకమైనదని యాశయము.

శ్లో. ప్రీతి మేష్యతి కృతేన మమేదృ
క్కర్మణా పురరిపు ర్మదనారిః ।
తత్పురః పురమతోఽయ మధాక్షీత్
ధూపరూపమథ కామశరఞ్చ॥ 34

ప. వి. ప్రీతిం - ఏష్యతి - కృతేన - మమ - ఈదృక్కర్మణా - పురరిపుః - మదనారిః - తత్పురః - పురం - అతః - అయం - అధాక్షీత్ - ధూప రూపమ్ - అథ - కామశరం - చ.

అర్థము: పురరిపుః = త్రిపురములకు శత్రువైన, మదనారిః = మన్మథుని శత్రువైన శివుడు, కృతేన = చేయబడిన, మమ = నాయొక్క, ఈదృక్కర్మణా = ఇటువంటి సాంబ్రాణిని నిప్పున పడవేయుట యను త్రిపుర దాహముచేతను, కర్పూరమును వెలిగించుట యను మన్మథదహనము చేతను, ప్రీతిం = సంతోషమును, ఏష్యతి = పొందగలడు. అతః = ఇందు వలననే, అయం = ఈనలుడు, తత్పురః, తత్ = ఆ పురారియొక్కయు, మన్మథారియొక్కయు, పురః = ఎదుట క్రమముగా, ధూపరూపం = ధూపమను నెపముగలిగిన, పురం = సాంబ్రాణిని (రాక్షసుల పట్టణమును) అథ = పిదప, కామశరం చ = కర్పూరమును (మన్మథబాణమును) అధాక్షీత్ = కాల్చెను. నలుడు ధూపమును వేసెనని, కర్పూరమును వెలిగించెనని యర్థము.

**సమాసములు :**

ఈదృక్కర్మణా : ఈదృక్ చ తత్ కర్మ చ = ఈదృక్కర్మ, తేన = ఈదృక్కర్మణా.

పురరిపుః : పురాణాం రిపుః = పురరిపుః.

మదనారిః : మదనస్య అరిః = మదనారిః.

తత్పురః : తస్య పురః = తత్పురః.

ధూపరూపం : ధూపస్య రూపం యస్య సః — ధూపరూపః, తం— ధూపరూపమ్.

కామశరం : కామస్య శరః, తం—కామశరమ్.

**భావము :**

త్రిపురారియు మదనారియు నగు శివుడు కాజేసిన సాంబ్రాణియొక్క పొగవేత యను త్రిపురదాహముచేతను, కర్పూరము వెలిగించుట యను మన్మథ దాహముచేతను ప్రీతిజెందునను కారణమువలన నీనలుడు పొగయను నెపముగల సాంబ్రాణిని (త్రిపురములను), తర్వాత కర్పూరమను నెపముగల మన్మథ బాణమును తగులబెట్టెను. అనగా నలమహారాజు శివునకు ధూపమువైచి కర్పూరమును వెలిగించెనని యాశయము. ॥34॥

శ్లో. తన్ముహూర్తమపి భీమతనూజావిప్రయోగ మసహిష్ణు రివాయం
శూలిమౌలిశశిభీతతయాఽభూత్ ధ్యానమూర్ఛననిమీలితనేత్రః॥

ప.వి. తన్ముహూర్తం - అపి - భీమతనూజావిప్రయోగమ్ - అసహిష్ణుః - ఇవ - అయం - శూలమౌలిశశిభీతతయా - అభూత్ - ధ్యానమూర్ఛన నిమీలిత నేత్రః.

అర్థము: అయం— ఈనలుడు, తన్ముహూర్తమపి — ఆముహూర్తమునందును, శూలిమౌలిశశిభీతతయా, శూలి — పూజింపబడు శివునియొక్క, మౌలిశశి— శిరోభూషణమగు చన్ద్రునియొద్దనుండి, భీతతయా— భయపడుటచే అనగా విరహబాధను కలిగించునని భయపడుటచే, భీమతనూజా విప్రయోగం, భీమతనూజా— దమయన్తియొక్క, విప్రయోగం— వియోగమును, అసహిష్ణురివ—సహింపలేనివాడో యనునట్లు, ధ్యాన మూర్ఛన నిమీలితనేత్రః; ధ్యాన—హృదయమున దేవతామూర్తిని జంతించుటయను, మూర్ఛన—సమస్తములగు నింద్రియార్థము లుపర మించుట యను మూర్ఛనచే, నిమీలిత— మూయబడిన, నేత్రః— కన్నులుగలవాడుగా, అభూత్—ఆయెను. ధూపమును వైచిన విదప శివుని ధ్యానించెనని యర్థము.

సమాసములు :

తన్ముహూర్తమ్ : స చాసౌ ముహూర్తశ్చ = తన్ముహూర్తః, తం = తన్ముహూర్తమ్.

భీమతనూజావిప్రయోగమ్ : భీమస్య తనూజా = భీమతనూజా, భీమతనూజాయాః విప్రయోగః = భీమతనూజావిప్రయోగః, తం = భీమతనూజావిప్రయోగమ్.

శూలిమౌలిశశిభీతతయా : శూలినః మౌలిః = శూలిమౌలిః, శూలిమౌలౌ శశీ = శూలిమౌలిశశీ, శూలిమౌలిశశినః భీతః = శూలిమౌలిశశిభీతః, శూలిమౌలిశశిభీతస్యభావః = శూలిమౌలిశశిభీతతా, తయా = శూలిమౌలిశశిభీతతా, తయా.

ధ్యానమూర్ఛననిమీలితనేత్రః : ధ్యానమేవ మూర్ఛనం = ధ్యానమూర్ఛనం, ధ్యానమూర్ఛనేన నిమీలితే నేత్రే యస్య సః = ధ్యానమూర్ఛననిమీలితనేత్రః.

భావము ;

ఈ నలుడు పూజచేసెడి కొలదికాలమునందును శివునిశిరమందలి చంద్రుని వలన భయమునంది దమయన్తితో వియోగమును సహింపలేడో యనునట్లు దేవతామూర్తిని చింతించుటయనెడి ధ్యానరూపమగు మూర్ఛతో కన్నులు మూసుకొనినవాడై యుండెను. మూర్ఛయందు నింద్రియము లన్నియు తమతమ వ్యాపారముల నుడిగి యుండును. అట్లే ధ్యానమునందు నట్టిస్థితి యుండును. అనగా దేవునికి ధూపమును సమర్పించినపిదప శివుని ధ్యానింపమొదలిడెనని యాశయము.

శ్లో. దణ్డవత్ భువి లుఠన్ స ననామ
త్ర్యమ్బకం శరణభాగివ కామః।
ఆత్మశస్త్ర విశిఖాసన బాణాన్
న్యస్య తత్పదయుగే కుసుమాని॥

ప.వి. దణ్డవత్ - భువి - లుఠన్ - సః - ననామ - త్ర్యమ్బకం - శరణభాక్ - ఇవ - కామః - ఆత్మశస్త్రవిశిఖాసనబాణాన్ - న్యస్య - తత్పదయుగే - కుసుమాని.

అర్థము: ఆత్మశస్త్రవిశిఖాసన బాణాన్, ఆత్మ = తనయొక్క, శస్త్ర = ఆయుధములగు, విశిఖాసన = ధనస్సును, బాణాన్ = బాణములగు, కుసుమాని =

పుష్పములను, తత్పదయుగే, తత్ = ఆ శివునియొక్క, పదయుగే = పాదములజంటయందు, న్యస్య = ఉంచి. శరణభాక్ = ఆశ్రయమును కోరిన, కామ ఇవ = మన్మథుడువలె, సః = ఆనలుడు, దణ్డవత్ = కొయ్యవలె, భువి = భూమియందు, లుఠన్ = పొరలుచు, త్ర్యమ్బకం = శివుని, ననామ = నమస్కరించెను.

సమాసములు :

దండవత్ : దణ్డ ఇవ = దణ్డవత్.
శరణభాక్ : శరణం భజతీతి = శరణభాక్.
ఆత్మశస్త్రవిశిఖాసనబాణాన్ : ఆత్మనః శస్త్రాణి = ఆత్మశస్త్రాణి, విశిఖానాం ఆసనం = విశిఖాసనం, విశిఖాసనం చ బాణాశ్చ = విశిఖాసన బాణాః, ఆత్మశస్త్రాణ్యేవ విశిఖాసనబాణాః = ఆత్మశస్త్రవిశిఖాసనబాణాః, తాన్ = ఆత్మశస్త్రవిశిఖాసనబాణాన్.
తత్పదయుగే : పదయోః యుగం పదయుగం, తస్య పదయుగం = తత్పదయుగం, తస్మిన్ = తత్పదయుగే.

భావము:

ఆ నలుడు తనకు సంబంధించిన యాయుధములైన ధనుర్బాణరూపములగు పూలను శివుని పాదముల యందుంచి శరణుజొచ్చిన మన్మథుడువలె దండా కారముగ భూమిపైబడి శివునికి వందనమాచరించెను.

శ్లో. త్ర్యమ్బకస్య పదయోః కుసుమాని
న్యస్యసైష నిజశస్త్రనిభాని
దణ్డవద్భువి లుఠన్ కిముకామ
స్తం శరణ్య ముపగమ్య ననామ ॥ 37

ప. వి. త్ర్యమ్బకస్య - పదయోః - కుసుమాని - న్యస్య - సః - ఏషః - నిజశస్త్ర నిభాని - దణ్డవత్ - భువి - లుఠన్ - కిము - కామః - తః - శరణ్యం - ఉపగమ్య - ననామ.

అర్థము: సః = ఆ ప్రసిద్ధుడైన, ఏషః = ఈ, కామః = మన్మథుడు, నిజశస్త్ర నిభాని, నిజ = తనవైన, శస్త్ర = ఆయుధములతో, నిభాని = సమానము లైన, కుసుమాని = పుష్పములను, త్ర్యమ్బకస్య = ముక్కంటియొక్క,

పదయోః = పాదములయందు, న్యస్య = సమర్పించి, భువి = భూమి యందు, దణ్డవత్ = దణ్డమువలె, లుఠన్ = పడుచు, శరణ్యం = రక్షకుడైన, త్ర్యమ్బకం = ముక్కంటిని, ఉపగమ్య = పొంది, ననామ కిము = నమస్కరించెనా యేమి?

**సమాసములు :**

త్ర్యమ్బకస్య : = త్రీణి అమ్బకాని యస్య సః = త్ర్యమ్బకః, తస్య = త్ర్యమ్బకస్య.

నిజశస్త్రనిభాని : నిజాని చ తాని శస్త్రాణి చ = నిజశస్త్రాణి నిజశస్త్రైః సదృశాని = నిజశస్త్రనిభాని. తాని = నిజశస్త్రనిభాని.

దణ్డవత్ : దండ ఇవ = దణ్డవత్.

శరణ్యం : శరణే సాధుః = శరణ్యః, తం = శరణ్యం.

:

ప్రసిద్ధుడైన కాముడు తన యాయుధములతో సమానములైన పుష్పములను ...టి యొక్క పాదములయందు సమర్పించి భూమియందు దండముతో ...గా తన శరీరమును బడవైచుచు రక్షకుడైన శివుని బొంది నమస్క... మేమి ?

**వ్యాపృతస్య శతరుద్రియ జప్తౌ పాణిమస్య నవపల్లవలీలం ।**
**భృఙ్గ భఙ్గిరివ రుద్రపరాక్షశ్రేణి రాశ్రయత రుద్రపరస్య ॥ 38**

వ్యాపృతస్య - శతరుద్రియజప్తౌ - పాణిం - అస్య - నవపల్లవలీలం - భృఙ్గభఙ్గిః - ఇవ - రుద్రపరాక్షశ్రేణిః - ఆశ్రయత - రుద్రపరస్య.

రుద్రపరస్య = శివునియందు నాసక్తి కలిగిన (కావుననే) శతరుద్రియ జప్తౌ; శతరుద్రియ = శతరుద్రులను దేవతలుగా గలిగిన మన్త్రవిశేషమును, జప్తౌ = జపించుట యందు, వ్యాపృతస్య = ఆసక్తి కలిగిన, అస్య = నలుని యొక్క, నవపల్లవలీలం; నవపల్లవ = క్రొంజిగురువంటి, లీలం = విలాసము గల్గిన, పాణిం = హస్తమును, రుద్రపరాక్షశ్రేణిః; రుద్ర = రుద్రశబ్దమునుండి, పర = పైనున్న, పైనుచ్చరించ బడుచున్న, అక్ష = అ మొదలు క్షవరకు నున్న యక్షరములకు, నవగా రుద్రాక్షములకు, లేదా, రుద్రపర = శివ భక్తులయొక్క, అక్ష = రుద్రాక్షమాలల

యొక్క, శ్రేణిః = పంక్తి, భృఙ్గ భఙ్గీ రివ, భృఙ్గ = తుమ్మెదలయొక్క, భఙ్గీ రివ = పంక్తివలె, ఆశ్రయత = ఆశ్రయించినది.

**సమాసములు :**

శతరుద్రియ జప్తౌ : శతం రుద్రాః దేవతా అస్య = శతరుద్రియః, శతరుద్రియస్య జప్తిః = శతరుద్రియ జప్తిః, తస్యాం = శతరుద్రియజప్తౌ.
నవపల్లవలీలాం : నవ శ్చాసౌ పల్లవశ్చ = నవపల్లవః, నవపల్లవస్య లీలా = నవపల్లవలీలా. తాం = నవపల్లవలీలాం.
భృఙ్గభఙ్గీః: భృఙ్గాణాం భఙ్గీః = భృఙ్గభఙ్గీః.
రుద్రపరాక్షశ్రేణిః : రుద్రాత్ పరే = రుద్రపరే, రుద్రపరే తే అక్షాశ్చ = రుద్రపరాక్షాః, రుద్రపరాక్షాణాం శ్రేణిః = రుద్రపరాక్షశ్రేణిః.
రుద్రపరస్య : రుద్రే పరః = రుద్రపరః, తస్య = రుద్రపరస్య.

**భావము :**

ఈ నలమహారాజు శివపరాయణుడు. అందువలననే శతరుద్రియ జపమునందు ఆసక్తి కలిగిన యానలుని యొక్క క్రొంజిగురు వంటి విలాసము గల హస్తమును రుద్రశబ్దము తరువాత యక్షరముల యొక్క యనగా రుద్రాక్షముల యొక్క, పంక్తి లేదా శివభక్తులయొక్క జపమాల పఙ్క్తి తుమ్మెదల పఙ్క్తివలె నాశ్రయించినది. అనగా నతడు రుద్రాక్షమాలను గైకొని శతరుద్రియ మంత్రమును జపింప దొడంగెనని యర్థము.

శ్లో. ఉత్తమం స మహతి స్మ మహీభృత్
పూరుషం పురుష సూక్తవిధానైః।
ద్వాదశాఽపి చ స కేశవ మూర్తీ
ర్ద్వాదశాక్షర ముదీర్య వవన్దే ॥ 39

ప.వి. ఉత్తమం-సః-మహతి-స్మ-మహీభృత్-పూరుషం-పురుషసూక్తవిధానైః-ద్వాదశ-అపి-చ-సః-కేశవమూర్తీః-ద్వాదశాక్షరం-ఉదీర్య-వవన్దే.

అర్థము: సః = పూజాసక్తిగలయా, మహీభృత్ = నలమహారాజు, ఉత్తమం = ఉత్తముడైన, పూరుషం = పురుషుని అనగా పురుషోత్తముని, అనగా విష్ణువును, పురుషసూక్త విధానైః = సహస్రశీర్షాపురుషః ఇత్యాదిపురుష సూక్తమన్త్ర విధులచే, మహతి స్మ = పూజించు చుండెను. తథా =

అర్లే, సః = ఆ నలుడు, ద్వాదశాక్షరం = "ఓం నమో భగవతే వాసుదేవాయ" అను పండ్రెండు అక్షరములు గల మన్త్రమును, ఉదీర్య = పలికి, ఉచ్చరించి, కేశవస్య = నారాయణుని యొక్క, ద్వాదశాఽపి చ = పండ్రెండైన, మూర్తీః = కేశవనారాయణాదులగు పండ్రెండు దేహములను, వవన్దే = స్తుతించెను.

సమాసములు :

మహీభృత్ : మహీం బిభర్తీతి = మహీభృత్.
పురుషసూక్తవిధానైః ; పురుషసూక్తస్య విధానాని = పురుషసూక్త విధానాని, తైః = పురుషసూక్త విధానైః.
కేశవమూర్తీః : కేశవస్య మూర్తయః = కేశవమూర్తయః, తాః = కేశవమూర్తీః.
ద్వాదశాక్షరం : ద్వాదశ అక్షరాణి యస్య సః = ద్వాదశాక్షరాణి, తం = ద్వాదశాక్షరం.

భావము :

పూజాసిరతుడగు నలమహారాజు పురుషోత్తముడగు విష్ణుని పురుషసూక్తవిధులతో గొలిచెను. అట్లే యా నలమహారాజు "ఓం నమో భగవతే వాసుదేవాయ" యని పండ్రెండక్షరములుగల ద్వాదశాక్షరమన్త్రము నుచ్చరించి నారాయణుని యొక్క కేశవాది ద్వాదశ శరీరములను స్తుతించెను.

శ్లో. మల్లికా కుసుమ డుణ్డుభకేన
స భ్రమీవలయితేన కృతే తమ్
ఆసనే విహిత మైక్షత సాక్షాత్
కుణ్డలీన్ద్ర తను కుణ్డల భాజమ్ ॥ 40

ప. వి. మల్లికా కుసుమ డుణ్డుభకేన - సః - భ్రమీవలయితేన - కృతే - ఆసనే - నిహితం - ఐక్షత - సాక్షాత్ - కుణ్డలీన్ద్రతనుకుణ్డల భాజమ్,

అర్థము. సః = ఆ నలుడు, భ్రమీవలయితేన, భ్రమీ = చక్రాకారముగా, వలయితేన = చుట్టబడిన, మల్లికా కుసుమడుణ్డుభకేన, మల్లికాకుసుమ = మల్లెపూలచే కట్టబడిన, డుణ్డుభకేన = నీటిపాము వంటి మాలచే, కృతే = చేయబడిన, ఆసనే = పీఠమునందు, నిహితం = ఉంచబడిన, కుణ్డలీన్ద్ర తను కుణ్డలభాజం; కుణ్డలీన్ద్ర = శేషసర్పము యొక్క, తను = శరీరము యొక్క, కుణ్డల = వలయమును, యః = ఎవ్వడు, భాజం = ఆశ్రయించుచున్నాడో, అనగా పాలకడలి యందు శేషశాయి రూపముతో నధిష్ఠించుచున్నాడో, తం = ఆనారాయణుని, సాక్షాత్ = ధ్యానయోగముతో ప్రత్యక్షముగా, ఐక్షత = చూచెను.

సమాసములు :

మల్లికాకుసుమదుఙ్ఘభకేన : మల్లికాయాః కుసుమాని = మల్లికాకుసుమాని, మల్లికాకుసుమానాం దుఙ్ఘభకః = మల్లికాకుసుమదుఙ్ఘభకః, తేన = మల్లికాకుసుమదుఙ్ఘభకేన.
భ్రమీవలయితేన : భ్రమ్యా వలయితః = భ్రమీవలయితః, తేన = భ్రమీవలయితేన.
కుణ్డలీన్ద్రితనుకుణ్డలభాజం : కుణ్డలీన్ద్రస్య తనుః = కుణ్డలీన్ద్రతనుః, కుణ్డలీన్ద్రతనోః కుణ్డలం = కుణ్డలీన్ద్రతనుకుణ్డలం, కుణ్డలీన్ద్రతనుకుణ్డలం భజతీతి = కుణ్డలీన్ద్రతనుకుణ్డలీభాక్, తం = కుణ్డలీన్ద్రతనుకుణ్డలభాజం.

భావము :

ఆ నలమహారాజు చక్రాకారముతో చుట్టబడిన, మల్లెపూలతో కట్టబడిన నీటిపాముvంటి యాకారముగల మాలచే, నిర్మించబడిన పీఠమునందు స్థాపించబడిన శేషసర్పముయొక్క శరీరపు వలయమును పాలకడలియందు శేషశాయి రూపముచే నధిష్ఠించెనో, అట్టి నారాయణుని ప్రత్యక్షముగా ధ్యానయోగముతోఁ జూచెను.

శ్లో. మేచకోత్పలమయీ బలిబన్ధో స్తద్బలిస్రగురసి స్ఫురతి స్మ।
కౌస్తుభాఖ్యమణికుట్టిమవాస్తుశ్రీకటాక్షవికటాయితకోటిః॥ 41

ప.వి. మేచకోత్పలమయీ - బలిబన్ధోః - తద్బలిస్రక్ - ఉరసి - స్ఫురతి - స్మ - కౌస్తుభాఖ్యమణికుట్టిమవాస్తుశ్రీకటాక్షవికటాయితకోటిః.

అర్థము. బలిబన్ధోః = బలి యను రాక్షసుని బంధించిన విష్ణువుయొక్క, ఉరసి = వక్షఃస్థలమునందు; కౌస్తుభాఖ్యమణికుట్టిమవాస్తు శ్రీకటాక్షవికటాయితకోటిః: కౌస్తుభాఖ్య = కౌస్తుభమను పేరుగల, మణికుట్టిమ = రత్ననిబద్ధభూమిని, వాస్తు = నివాసముగాగల్గిన; శ్రీ = లక్ష్మియొక్క, కటాక్ష = కడగంటిచూపుచే, వికటాయిత = వృద్ధినొందిన, కోటిః = ప్రాంతముగల్గిన, మేచకోత్పలమయీ; మేచకోత్పల = నల్లకలువయొక్క, మయీ = రూపముగల్గిన యనగా నల్లగలువలచే గూర్చబడిన తద్బలిస్రక్, తత్ = ఆనలునియొక్క, బలిస్రక్ = పూజామాల యనగా నలు డొసంగిన పూజామాల, స్ఫురతి స్మ = శోభించినది.

సమాసములు :

మేచకోత్పలమయీ : మేచకాని చ తాని ఉత్పలాని = మేచకోత్పలాని, మేచకోత్పలానాం వికారః = మేచకోత్పలమయీ, తాం = మేచకోత్పలమయీం.

బలిబన్ధుః : బలేః బన్ధుః = బలిబన్ధుః

తద్బలిస్రక్ : బలేః స్రక్ = బలిస్రక్, తస్య బలిస్రక్ = తద్బలిస్రక్.

కౌస్తుభాఖ్యమణికుట్టిమ వాస్తుశ్రీకటాక్షవికటాయితకోటిః : కౌస్తుభ ఇతి ఆఖ్యా యస్య సః = కౌస్తుభాఖ్యః, కౌస్తుభాఖ్య శ్చాసౌ మణిశ్చ = కౌస్తుభాఖ్యమణిః, కౌస్తుభాఖ్యమణేః కుట్టిమః = కౌస్తుభాఖ్యమణికుట్టిమః, కౌస్తుభాఖ్యమణికుట్టిమం వాస్తు యస్యాః సా = కౌస్తుభాఖ్యమణి కుట్టిమవాస్తు, కౌస్తుభాఖ్యమణికుట్టిమవాస్తు శ్చాసౌ శ్రీశ్చ = కౌస్తుభాఖ్య మణికుట్టిమవాస్తుశ్రీః, కౌస్తుభాఖ్యమణికుట్టిమవాస్తుశ్రియః కటాక్షః = కౌస్తుభాఖ్యమణికుట్టిమవాస్తుశ్రీకటాక్షః, కౌస్తుభాఖ్యమణికుట్టిమవాస్తుశ్రీ కటాక్షేణ వికటాయితాః కోటయః యస్య సః = కౌస్తుభాఖ్య మణికుట్టిమ వాస్తుశ్రీ కటాక్షవికటాయితకోటిః.

భావము :

బలి యను రాక్షసుని బంధించిన విష్ణువుయొక్క వక్షఃస్థలమునందు కౌస్తుభమనెడి మణినిబద్ధభూమియందు నివసించు లక్ష్మియొక్క కడకంటిచూపులచే వైశాల్యము నొందింపబడిన యంచులుగల్గిన నల్లకలువలచే గూర్చబడినట్టి యా నలునియొక్క పూజామాల శోభించినది. యనగా నావిష్ణువు వక్షఃస్థలమునందలి కౌస్తుభమణిపై లక్ష్మి యధిష్ఠించియున్నది. ఆమెయొక్క నేత్రములు నల్ల కలువలకాంతిని కల్గినవి. కాన నట్టి యామెయొక్క కటాక్షకాంతులు విష్ణువక్షః స్థలముపై నుంచబడిన నల్లకలువలమాలపై బడగా వానియంచులు విస్తరించినవని యర్థము.

శ్లో. స్వర్ణకేతకశతాని చ హేమ్నః
పుణ్డరీకఘటనాం రజతస్య ।
మాలయాఽరుణమణేః కరవీరం
తస్య మూర్ధ్ని పునరుక్త మకార్షీత్ ॥ 42

ప.వి. స్వర్ణకేతకశతాని - చ - హేమ్నః - పుణ్డరీకఘటనాం - రజతస్య - మాలయా - అరుణమణేః - కరవీరం - తస్య - మూర్ధ్ని - పునరుక్తం - అకార్షీత్.

అర్థము. సః = ఆ నలుడు, తస్య = ఆవిష్ణువుయొక్క, మూర్ధ్ని = శిరముపై, హేమ్నః = బంగారుయొక్క, మాలయా = మాల్యముచే, ననగా

స్వర్ణముచే నిర్మించిన పుష్పమాల నర్పించుటచే నని యర్థము. స్వర్ణకేతక శతాని; స్వర్ణ = బంగారుచాయ గల్గిన, కేతక = మొగలిపూలయొక్క, శతాని = వందలను, రజతస్య = వెండియొక్క, మాలయా = మాలచే, వెండిచే చేయబడిన మాల నర్పించుటచే నని యర్థము. పుణ్డరీక ఘటనాం, పుణ్డరీక = తెల్లదామరలయొక్క, ఘటనాం = కూర్పును, అనగా శ్వేతపద్మముల మాల నర్పించుట యనియర్థము. అరుణమణేః = పద్మరాగములయొక్క, మాలయా = మాలచే, కరవీరం = ఎఱ్ఱగన్నేరు పూలమాల నర్పించుట యని యర్థము. పునరుక్తం = రెట్టింపును, అకార్షీత్ = చేసెను.

సమాసములు :

స్వర్ణకేతకశతాని : స్వర్ణవర్ణాని చ తాని కేతకాని = స్వర్ణకేతకాని, స్వర్ణకేతకానాం శతాని = స్వర్ణకేతకశతాని.

పుణ్డరీకఘటనాం : పుణ్డరీకాణాం ఘటనా = పుణ్డరీకఘటనా, తాం = పుణ్డరీకఘటనాం.

అరుణమణేః: అరుణ శ్చాసౌ మణిశ్చ = అరుణమణిః, తస్య = అరుణ మణేః.

పునరుక్తం : పునరుక్తాని చ పునరుక్తా చ పునరుక్తం చ = పునరుక్తం, తత్ = పునరుక్తం.

భావము :

ఆ నలమహారాజు విష్ణువుశిరముపై బంగారుతోగూర్చిన మాలనువైచుటచే బంగారుచాయగలిగిన మొగలిపూలమాలను పునరుక్తము గావించెను. బంగారుతో గూర్చిన మాలను వైచుటచేతనే కార్యము పూర్తియైనపుడు మరల బంగారు వన్నెగల మొగలిపూలమాలను వైచుట వ్యర్థముగదా? అందువలన నది పునరుక్త మైనది. అట్లే వెండితో గూర్చిన మాల నావిష్ణుని శిరమునవైచి మరల తెల్లదామర పూలమాలను గూడ వైచెను. అదియు పునరుక్తమైనది. అట్లే పద్మరాగమణుల మాలను వైచి మరల నెఱ్ఱగన్నేరు పూలమాలను వైచుటయు పునరుక్తమైనది. కాని ఈపునరుక్తి దోషజనకము గాదు. మఱేమనగా దానికి సాద్గుణ్యమునే

కలిగించును. అచ్చపు బంగారుమాలతోడను వెండిమాలతోడను అచ్చపు పద్మరాగములమాలతోడను పూజించుటయేగాక నానావర్ణములుగల పుష్పమాలల తోడను బూజించెనని యాశయము.

శ్లో. నాల్పభక్తబలి రన్ననివేద్యై
 స్తస్యహారిణమదేన స కృష్ణః।
శఙ్ఖ చక్రజలజాతవదర్చః
 శఙ్ఖచక్రజల పూజనయాఽభూత్॥ 43

ప. వి. నాల్పభక్తబలిః-అన్ననివేద్యైః - తస్య - హారిణమదేన - సః-కృష్ణః - శఙ్ఖచక్రజలజాతవదర్చః - శఙ్ఖచక్రజలపూజనయా - అభూత్-

అర్థము: సః = ఆ భగవంతుడగు నారాయణుడు, తస్య = ఆ నలునియొక్క, అన్ననివేద్యైః = అన్నములనెడి నైవేద్యములతో, నాల్పభక్తబలిః, నాల్ప = అధికమైన, భక్తబలిః = అన్ననివేదనము గలవాడై, పక్షాన్తరమున నాల్పభక్తబలిః, నాల్పభక్త = అధికభక్తి గలిగిన, బలిః = బలి యను రాక్షసుడుగా, అభూత్ = ఆయెను. తస్య = అతనికి, హారిణమదేన = కస్తూరి నర్పించుటచే, కృష్ణః = నలుపువన్నెగలవాడు గను, పాపముల నాకర్షించువాడుగను, అభూత్ = ఆయెను. తథా = అట్లే, శఙ్ఖ చక్రజలపూజనయా; శఙ్ఖ = దక్షిణావర్తము మున్నగు పెక్కుశఙ్ఖముల యొక్క, చక్ర = సమూహమందలి, జల = ఉదకము లతో, పూజనయా (ఇవ) = పూజించుట చేతనో యనునట్లు, శఙ్ఖచక్రజల జాతవదర్చః, శఙ్ఖ = పాంచజన్య మనెడి శఙ్ఖము, చక్ర = సుదర్శన మనెడి చక్రము, జలజాతవత్ = పద్మము అను నివి గల్గిన, అర్చః = ప్రతిమయు పూజయు గలవాడుగా, అభూత్ = ఆయెను.

సమాసములు :

నాల్పభక్తబలిః : న అల్పం = నాల్పం, నాల్పం చ తత్ భక్తం చ = నాల్పభక్తం, నాల్పభక్తమేవ బలిః = నాల్పభక్తబలిః, పక్షాంతరమున, న అల్పః = నాల్పః. నాల్ప శ్చాసౌ భక్తశ్చ = నాల్పభక్తః, నాల్పభక్తః బలిః యస్య సః = నాల్పభక్తబలిః.

అన్ననివేద్యైః : నివేదితుం యోగ్యాని = నివేద్యాని, అన్నస్య నివేద్యాని అన్ననివేద్యాని, తైః – అన్ననివేద్యైః.
హారిణమదేన : హరిణస్య అయం = హారిణః, హారిణ శ్చాసౌ మదశ్చ = హారిణమదః, తేన = హారిణమదేన.
శఙ్ఖచక్ర జలజాతవదర్చః: శఙ్ఖశ్చ చక్రంచ జలజాతంచ = శఙ్ఖ చక్ర జలజాతాని, శఙ్ఖచక్రజలజాతాని అస్యాః సన్తీతి = శఙ్ఖచక్రజలజాతవతీ, శఙ్ఖచక్రజలజాతవతీ అర్చా యస్య సః = శఙ్ఖజలజాతవదర్చాః.
శఙ్ఖచక్రజల పూజనయా : శఙ్ఖానాం చక్రం = శఙ్ఖచక్రః, శఙ్ఖచక్రే జలం = శఙ్ఖ చక్రజలం, శఙ్ఖ చక్రజలేన పూజనా = శఙ్ఖ చక్రజల పూజనా, తయా = శఙ్ఖ చక్రజలపూజనయా.

**భావము :**

పూజ్యుడగు నారాయణుడు, అన్నములనెడి నైవేద్యముల చేతనో యనునట్లు, నధికమగు నన్నబలిని గలవాడుగను (నధికభక్తి సంపన్నుడైన బలియను రాక్షసుని గలవాడుగను) నాయెను. అట్లే దక్షిణావర్తాది వివిధ శఙ్ఖ సమూహములయందలి జలముచే బూజచేయుటచేతనో యనునట్లు పాంచజన్యమను శంఖమును సుదర్శనమను చక్రమును, పద్మమును వహించిన ప్రతిమగలవాడుగను, వాని పూజగల వాడుగను నానలు డుండెను.

శ్లో. రాజ్ఞి కృష్ణలఘు ధూపజధూమాః
పూజయత్యహిరిపుధ్వజ మస్మిన్।
నిర్యయు ర్భవధృతా భుజగాభీ
దుర్యశోమలినతా ఇవ జాలైః ॥ 44

ప. వి. రాజ్ఞి - కృష్ణలఘుధూపజధూమాః - పూజయతి - అహిరిపుధ్వజం - అస్మిన్ - నిర్యయుః - భవధృతాః -భుజగాః - భీదుర్యశోమలినతాః - ఇవ - జాలైః.

అర్థము: అస్మిన్ – ఈ, రాజ్ఞి = నలమహారాజు, అహిరిపుధ్వజం; అహిరిపు = సర్పశత్రువగు గరుడుని, ధ్వజం = చిహ్నముగా గలిగిన విష్ణువును, పూజయతి సతి = పూజింపగా, భీదుర్యశోమలినతాః, భీ = గరుడుని

వలన భయముచే నేర్పడిన, దుర్యశః = పిరికితనమువలని యపకీర్తిచే, మలినతాః = మాలిన్యము బొందింపబడి, భవధృతాః = శివునిచే ధరింపబడిన, భుజగా ఇవ = వాసుకి మొదలగు సర్పములో యనునట్లు, కృష్ణలఘుధూపజధూమాః, కృష్ణ = నల్లనైన, లఘు = అగురుల యొక్క, ధూపజధూమాః, ధూపజ = ధూపమునుండి యుద్భవించిన, ధూమాః = పొగలు, జాలైః = రంధ్రములచే, నిర్యయుః = వెల్వడినవి. శివుని శరీరమునందు భూషణములుగా ధరింపబడినవై శుభ్రములుగా నున్న సర్పములు, నలునిచే పూజింపబడు నారాయణుని ధ్వజమందలి గరుడుని జూచుటవలన భయముచే మలినతను వహించినవై, ధూపముల వలన నుద్భవించు నల్లనిపొగగా వెలుపలికి వచ్చినవని యర్థము.

సమాసములు :

కృష్ణలఘు ధూపజధూమాః : కృష్ణాశ్చ తే లఘవశ్చ = కృష్ణలఘవః, ధూపాత్ జాయన్తే ఇతి ధూపజాః, కృష్ణలఘూనాం ధూపజాః = కృష్ణలఘుధూపజాః, కృష్ణలఘుధూపజాశ్చ తే ధూమాశ్చ = కృష్ణలఘు ధూపజధూమాః.

అహిరిపుధ్వజం: అహీనాం రిపుః = అహిరిపుః, అహిరిపుః ధ్వజే యస్య సః = అహిరిపు ధ్వజః, తం = అహిరిపు ధ్వజం.

భవధృతాః : భవేన ధృతాః = భవధృతాః.

భీర్యశోమలినతాః : దుష్టం చ తత్ యశశ్చ = దుర్యశః, భీరేవ దుర్యశః = భీదుర్యశః, భీదుర్యశసా మలినతాః = భీదుర్యశో మలినతాః.

భావము :

ఈ నలమహారాజు విష్ణువును బూజించుచుండగా అతని ధ్వజమందలి గరుడుని వలని భయమనెడి యపవాదముచే నల్లబడినవియు శివునిచే నాభరణములుగా గ్రహించబడినవియు నగువాసుకి ప్రభృతులు శుభ్రసర్పములవలె కాలాగురు ధూపములచే నుద్భవిల్లిన ధూమములచే గవాక్షరన్ధ్రముల నుండి వెలువడినవి. శివుని శరీరమందు భూషణములుగా దొడుగబడి సర్పములు స్వభావముచే

గల్గిన భయముచే మాలిన్యము నొందినవో యనునట్లు ధూపములవలన నుద్భవిల్లిన నల్లని ధూమములుగా వెలుపలికి వెడలినవి.

శ్లో. అర్ఘనిఃస్వమణిమాల్యవిమిశ్రైః
స్మేరజాతి మయదామ సహస్రైః
తం పిధాయ విదధే బహురత్న
క్షీర నీరనిధి మగ్నమివైషః ॥ 45

ప. వి. అర్ఘ్యనిఃస్వమణిమాల్యై విమిశ్రైః- స్మేరజాతిమయదామసహస్రైః, - తం - పిధాయ - విదధే - బహురత్నక్షీరనీరనిధిమగ్నం - ఇవ - ఏషః.

అర్థము: ఏషః = ఈ నలుడు, అర్ఘనిఃస్వమణిమాల్య విమిశ్రైః; అర్ఘ = వెలచే, నిఃస్వ = దరిద్రములైన యనగా నమూల్యములైన, మణి = రత్నములయొక్క, మాల్య = హారములతో, విమిశ్రైః = కూడినట్టి, స్మేరజాతిమయదామసహస్రైః, స్మేర = వికసించిన, జాతిమయ = మాలతీపూలయొక్క, దామ = మాలలయొక్క, సహస్రైః = వేలచే, తం = ఆశ్రీమహావిష్ణువును, పిధాయ = కప్పి, బహురత్నక్షీరనీరనిధిమగ్నం; బహు = పెక్కులైన,రత్న = రత్నములయొక్క,క్షీరనీరనిధి = పాలకడలియందు, మగ్నమివ = మునిగినవానివలె, విదధే = చేసెను. ఇచట పాలయొక్క స్థానమున తెల్లని మాలతీ కుసుమమాలికలు, రత్న స్థానమున మణి మాలలను గ్రహింపవలయును.

సమాసములు :

అర్ఘనిఃస్వమణిమాల్యవిమిశ్రైః : నిర్గతం స్వం యేభ్య స్తాని = నిఃస్వాని, అర్ఘేణ నిఃస్వాని = అర్ఘనిఃస్వాని, మణి మయాని చ తాని మాల్యాని = మణిమాల్యాని,అర్ఘనిఃస్వాని చ తాని మణిమాల్యాని చ = అర్ఘనిఃస్వ మణిమాల్యాని; అర్ఘనిఃస్వ మణిమాల్యైః విమిశ్రాణి = అర్ఘనిఃస్వమణిమాల్యవిమిశ్రాణి, తైః = అర్ఘనిఃస్వ మణిమాల్య విమిశ్రైః.

స్మేరజాతిమయదామ సహస్రైః - జాతిభిః ప్రచురాణి = జాతిమయాని,

స్మేరాణి చ తాని జాతిమయాని చ = స్మేరజాతిమయాని, స్మేరజాతిమయాని చ తాని దామాని చ = స్మేరజాతిమయదామాని, స్మేరజాతిమయదామ్నాం సహస్రాణి = స్మేరజాతి మయ దామసహస్రాణి, తైః = స్మేరజాతిమయ దామ సహస్రైః.

బహురత్నక్షీరనీరనిధిమగ్నం: నీరాణాం నిధిః = నీరనిధిః క్షీరాణాం నీరనిధిః = క్షీరనీరనిధిః, బహూని చ తాని రత్నాని చ = బహురత్నాని, బహురత్నానాం క్షీరనీరనిధిః = బహురత్నక్షీరనీరనిధిః, బహురత్నక్షీర నీరనిధౌ మగ్నః = బహురత్నక్షీరనీరనిధి మగ్నః, తం = బహురత్న క్షీరనీరనిధిమగ్నం.

**భావము :**

ఈ నలమహారాజు వెలలేని రత్నములతో గూడిన, వికసించిన మాలతీ కుసుమ మాలికల వేలచే ఆ మహావిష్ణువును కప్పి బహురత్నములు గల క్షీర సాగరమందు ముంచెనో యనునట్లుండెను.

శ్లో. అక్షసూత్రగతపుష్కరబీజ
శ్రేణి రస్యకరసఙ్కర మేత్య,
శౌరి సూక్తజపితుః పునరాపత్
పద్మ సద్మ చరవాసవిలాసమ్॥ 46

ప. వి. అక్షసూత్రగతపుష్కర బీజశ్రేణిః - అస్య - కరసఙ్కరం - ఏత్య - శౌరిసూక్తజపితుః - పునః - ఆపత్ - పద్మసద్మచిరవాస విలాసమ్.

అర్థము: అక్షసూత్రగతపుష్కరబీజశ్రేణిః, అక్షసూత్ర = జపమాల యందు, గత = పొందిన, పుష్కరబీజ = పద్మబీజములయొక్క, శ్రేణిః = పఙ్క్తి, శౌరిసూక్త జపితుః; శౌరిసూక్త = పురుష సూక్తమును, జపితుః = జపించెడు, అస్య = ఈ నలుని యొక్క, కరసఙ్కరం, కర = హస్తముతో, సఙ్కరం = సంబన్ధమును, ఏత్య = పొంది, పునః = మరల, పద్మసద్మ చిరవాస విలాసం; పద్మ = పద్మమనెడి, సద్మ = ఇంట, చిరవాస = చాలాకాలము వసించుటయొక్క, విలాసం =

శోభను, అపత్ = పొందెను. నలుని హస్తము పద్మముతో సమానము గాన నా హస్తమును పొందుట వలన చిరకాలవాసపు విలాసమును బొందెనని యర్థము.

సమాసములు :

అక్షసూత్రగతపుష్కరబీజశ్రేణిః : అక్షాణాం సూత్రం = అక్షసూత్రం, అక్షసూత్రం గతాని = అక్షసూత్ర గతాని, పుష్కరాణాం బీజాని = పుష్కరబీజాని, అక్షసూత్ర గతాని చ తాని పుష్కరబీజాని చ = అక్షసూత్ర గతపుష్కరబీజాని, అక్షసూత్రగతపుష్కర బీజానాం శ్రేణిః = అక్షసూత్ర గత పుష్కర బీజశ్రేణిః.
కరసజ్కారం : కరేణ సజ్కారః = కర సజ్కారః, తం = కరసజ్కారం.
శౌరిసూక్త జపితుః : శౌరేః సూక్తం = శౌరిసూక్తం, శౌరిసూక్తస్య జపితా = శౌరిసూక్త జపితా. తస్య శౌరిసూక్త జపితుః.
పద్మ సద్మ చిరవాస విలాసం : పద్మమేవ సద్మ = పద్మ సద్మ పద్మసద్మని చిరం వాసః = పద్మసద్మచిరవాసః, పద్మ, సద్మ చిరవాసస్య విలాసః = పద్మసద్మచిరవాసవిలాసః, తం = పద్మసద్మచిరవాస విలాసం.

భావము :

ఆనలుని జపమాలయందు గూర్చబడిన, పద్మబీజముల పఙ్క్తి, పురుష సూక్తమును జపించెడి యానలుని హస్తమును బొందినదై, మరల పద్మమనెడి గృహమునందు నివసించెడి శోభను బొందినది. పద్మబీజములు పద్మమునం దుండుట సహజము. ఇవు రవి జపమాలయందు గూర్చబడినవై నలుని హస్త పద్మమును జేరినవి. కాన మరల నలుని హస్తమనెడి పద్మమునందు వానికి వాసమేర్పడినదని యాశయము.

శ్లో. కైటభారిపదయో ర్నతమూర్ధ్నా
సజ్జితా విచికిల స్రగనేన ।
జహ్నుజేవ భువనప్రభుణాఽభూత్
సేవితానునయతాఽఽయతమానా ॥ 47

ప.వి. కైటాభారిపదయోః - నత మూర్ధ్నా. సజ్జితా - విచికిలస్రక్ - అనేన - జహ్నుజా - ఇవ - భువనప్రభుణా - అభూత్ - సేవితా - అనునయతా - ఆయతమానా.

అర్థము: నతమూర్ధ్నా, నత = వంగిన, మూర్ధ్నా = తలగల్గిన, అనునయతా = స్తుతులచే భగవంతుని ప్రసన్నపరచుచున్న, భువనప్రభుణా =

భూలోకమున ప్రభువైన, అనేన = ఈనలునిచే,(భగీరథునిచేతను, లేదా జలమునకు ప్రభువైన వరుణునిచేతను, కైటభారిపదయోః, కైటభారి = విష్ణువుయొక్క, పదయోః = పాదములయందు, సఙ్జితా = సమర్పింపబడిన,(ఆసఙ్జితా = ఆసక్తినిపొందింపబడిన అనగా విష్ణుపాదములయందు జన్మించుటవలన భక్తి గలిగిన), ఆయతమానా; ఆయత = పొడవైన, మానా = కొలతగల, (భూమియందు వెడలుటకు ప్రయత్నము గల్గిన) (లేదా ఆయత = పొడవైన, మానా = అసూయను క్రోధమును గలిగిన) సేవితా = సుగంధద్రవ్యములతో నారాధింపబడిన (మూడులోకములయందలి జనులచే పూజింపబడిన) విచికిలస్రక్ = మల్లెపూలమాల. జహ్నుజేవ = గఙ్గవలె, అభూత్ = అయ్యెను.

**సమాసములు :**

కైటభారిపదయోః : కైటభస్య అరిః = కైటభారిః, కైటభారేః పదే = కైటభారిపదే, తయోః = కైటభారిపదయోః.
నతమూర్ధ్నా : నతం మూర్ధ యస్య సః = నతమూర్ధా, తేన = నతమూర్ధ్నా.
విచికిలస్రక్ : విచికిలానాం స్రక్ = విచికిలస్రక్.
జహ్నుజా : జహ్నోః జాయత ఇతి = జహ్నుజా.
భువనప్రభుణా : భువనానాం ప్రభుః = భువనప్రభుః, తేన = భువనప్రభుణా.
ఆయతమానా : ఆయతః మానః యస్యాః సా = ఆయతమానా.

**భావము :**

భగవంతుని ప్రణామము గావించుటకై తలను వంచి స్తోత్రములతో భగవంతుని ప్రసన్నపరచుచున్న భువనప్రభువు అనగా భూలోకనాథుడగు నలునిచే మల్లెపూలమాల దేవతాగృహమందలి విష్ణువుయొక్క పాదములయందు సమర్పించబడినది. గంగయొక్క పక్షమున. భువనప్రభువుచే అనగా భూలోక ప్రభువైన భగీరథునిచే యాగంగ విష్ణుపాదమును పొందింపబడినది. మరియు నాగంగ భువనప్రభువుచే ననగా నుదకములకు రాజైన వరుణునిచే విష్ణుపాదమును పొందింపబడినది.

ఆయతమానమైన అనగా పొడవైన కొలతగలిగిన యనగా సుదీర్ఘమైన లేదా భూమికి వెడలుటకు యత్నముచేయుచున్న, లేదా ఆయతమగు మానము గలిగిన అనగా దీర్ఘమైన యీర్ష్యను క్రోధమును వహించిన; సేవితమైన యనగా

నారాధింపబడిన, మరియొకవక్షమున సుగన్ధములచే నాదరింపబడిన, పశ్చాన్త రమున మూడులోకములయందలి జనులచే బూజింపబడిన యాదేవగృహమునందు మల్లెపూలమాల గంగవలె శోభించినది.

యుగ్మము

శ్లో. స్వానురాగ మనఘః కమలాయాం
సూచయన్నపి హృదిన్యసనేన
గౌరవం వ్యధితవాగధిదేవ్యాః
శ్రీగృహోర్ధ్వ నిజకణ్ఠనివేశాత్ ॥ 48

శ్లో. ఇత్యవేత్య వసునా బహునాఽపి
ప్రాప్నువన్నముద మర్చనయా సః ।
సూక్తిమౌక్తిక మయైరథ హారై
ర్భక్తిమైహత హరేరుపహారైః ॥ 49

ప.వి. స్వానురాగం - అనఘః - కమలాయాం - సూచయన్ - అపి - హృది- న్యసనేన - గౌరవం - వ్యధిత - వాగధిదేవ్యాః - శ్రీగృహోర్ధ్వ నిజకణ్ఠనివేశాత్ - ఇతి - అవేత్య - వసునా - బహునా - అపి - ప్రాప్నువన్ - న ముదం - అర్చనయా - సః - సూక్తిమౌక్తిక మయైః - అథ - హారైః - భక్తిం - ఐహత - హరేః - ఉపహారైః.

అర్థము. అనఘః = పాపములేని విష్ణువు, హృది = వక్షఃస్థలమునందు, న్యసనేన = ఉంచుటచే, అనగా లక్ష్మినుంచుటచే, కమలాయాం = లక్ష్మియందు, స్వానురాగం = తనయొక్క ప్రేమను, సూచయన్నపి = ప్రకటించుచున్నను, శ్రీగృహోర్ధ్వనిజకణ్ఠనివేశాత్, శ్రీ = లక్ష్మికి. గృహ = నివాసభూతమగు తనవక్షఃస్థలమునకంటెను, ఊర్ధ్వ = పైనున్న, నిజ = తనదగు, కణ్ఠ = కణ్ఠమునందు, నివేశాత్ = ఉంచుటవలన, వాగధిదేవ్యాః, వాక్ = విద్యలకు, అధిదేవ్యాః = అధిదేవతయగు సరస్వతికి, గౌరవం = పూజను అనగా లక్ష్మికంటె నధికముగా నాదరమును, వ్యధిత = ఉంచెను.

సః = అనలుడు, ఇతి = ముందు చెప్పిన విధముగా విష్ణువుయొక్క అభిప్రాయమును, అవేత్య = తెలిసికొని, బహునా = అధికమైనట్టి,

వసునా = ధనముచే అనగా లక్ష్మీరూపములగు రత్నాదులచే (లక్ష్మిచే); విహితయా = చేయబడిన, అర్చనయా (అపి) = పూజచేతను, ముదం = సంతోషమును, న ప్రాప్నువన్ = పొందనివాడై, అథ = పిదప, సూక్తి మౌక్తిక మయైః; సూక్తి = రసవన్తములైన పదములచే గూర్చబడిన, స్తోత్రములనెడి, మౌక్తిక మయైః = ముత్తెముల సమూహరూపములగు, హారైః = (సరస్వతికి) హారరూపములైన కానుకలచే, హరేః = విష్ణువునకు, భక్తిం = ఐకాన్తికమగు సేవను, ఐహత = కోరెను. విష్ణువు లక్ష్మికంటెను సరస్వతికి నధికమగు గౌరవమును జూపెను. ఇందువలన సరస్వతిని అనగా స్తోత్రములను సాధనముగా నుంచుకొని చేసెడి యర్చన చేతనే యధికమగు భక్తి ప్రదర్శితమగునని తలంచి నలుడు సరస్వతీ మయములగు సూక్తములచే విష్ణువును బూజించెనని యర్థము.

సమాసములు :

స్వానురాగం : స్వస్య అనురాగః = స్వానురాగః. తం = స్వానురాగం.

వాగధిదేవ్యాః : వాచాం అధిదేవీ = వాగధిదేవీ, తస్యాః = వాగధి దేవ్యాః.

శ్రీగృహోర్ధ్వనిజకణ్ఠనివేశాత్ : శ్రియః గృహం = శ్రీగృహం, శ్రీగృహాత్ ఊర్ధ్వః = శ్రీగృహోర్ధ్వః, నిజశ్చాసౌ కణ్ఠశ్చ = నిజకణ్ఠః, శ్రీ గృహశ్చాసౌ నిజకణ్ఠశ్చ = శ్రీగృహోర్ధ్వనిజకణ్ఠః, శ్రీగృహోర్ధ్వనిజకణ్ఠే నివేశః = శ్రీగృహోర్ధ్వనిజకణ్ఠనివేశః తస్మాత్ = శ్రీగృహోర్ధ్వనిజకణ్ఠనివేశాత్.

సూక్తిమౌక్తికమయైః : సూక్తయ ఏవ మౌక్తికాని = సూక్తి మౌక్తికాని, సూక్తిమౌక్తికానాం వికారాః = సూక్తిమౌక్తిక మయాః, తైః = సూక్తిమౌక్తిక మయైః.

భావము :

విష్ణువు లక్ష్మిని తన వక్షఃస్థలము నందుంచుకొనుటచే నామెయందను రాగము జూపుచున్నను, ఆలక్ష్మీదేవికి నివాసస్థలమైన తన వక్షఃస్థనమునకంటెను పైనున్న తనకణ్ఠభూమియందు సరస్వతిని (వాక్కును) ఉంచుకొనుటవలన నా

సరస్వతీదేవికే గౌరవాధిక్యమును ప్రదర్శించెను. అనలుడు వైవిధముగా విష్ణువు యొక్క యాశయమును గ్రహించి యధికమైన రత్నాదిరూపమగు ధనముతో (లక్ష్మితో) చేయబడినపూజచేతను ప్రీతినిబొందక పిదప రసవస్తువులగుపదము లచేగూర్చబడిన స్తోత్రము లనెడి ముత్తెంపు హారరూపములగు కానుకలచే నారాయణున కైకాన్తిక సేవను జేయుటకు గోరెను. అనగా నాస్తోత్రముల విష్ణువు నందు భక్తిని దర్శింపగోరెనని యర్థము విష్ణువు లక్ష్మికంటెను సరస్వతికే యధికమగు గౌరవము నిచ్చుటచే నాసరస్వతీరూపములగు స్తోత్రములనెడి సాధనములతో నావిష్ణువునర్చించినచో నధికభక్తి ప్రదర్శితమగునని భావించి, ఆ సరస్వతీమయములగు స్తుతులచే నావిష్ణువు నర్చించెనని యాశయము.

శ్లో. దూరతస్స్తుతి రవాగ్విషయ స్తే
 రూప మస్మదభిధా స్తవ నిన్దా ।
 తత్ క్షమస్వ యదహో ప్రలపా
 మీత్యుక్తపూర్వమయ మేత దవోచత్ ॥ 50

ప.వి. దూరతః - స్తుతిః - అవాగ్విషయః - తే - రూపం - అస్మదభిధాః - తవ - నిన్దా - తత్ - క్షమస్వ - యత్ - అహం - ప్రలపామి - ఇతి - ఉక్తపూర్వం - అయం - ఏతత్ - అవోచత్.

అర్థము: హేభగవన్!— ఓభగవంతుడా! తే—నీయొక్క, రూపం—స్వరూపము, అవాగ్విషయః—మాటలకు విషయముకాదు. "యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ" యను శ్రుతి ననుసరించి యాభగవన్తుని స్వరూపము వాక్కులకు గోచరము గాదు. స్తుతిః—ఆభగవన్తుని కొనియాడుట, దూరతః—అసాధ్యము. నీస్వరూపము వాక్కుల కతీతమైనపుడు నీస్తుతి ఎట్లు సాధ్య మగును. కాన,అస్మదభిధాః—మామాటలు అనగా మేముచేసెడి స్తుతులు,తవ—నీకు, నిన్దా—దూషణ మగుచున్నది. పెక్కుగుణములుగల నిన్ను కొలదిపాటి గుణములను వెల్లడిచేయు మాటలతో నుతించుట, వాక్కులకు గోచరముకాని నిన్ను వాక్కులతో వర్ణించుట దూషణమే యగునని యర్థము. కావుననే, అహం — నేను, అనగా నలుడను, యత్ — దేనిని, ప్రలపామి — వదరుచున్నానో,

తత్ = దానిని, క్షమస్వ = క్షమించుము. ఇత్యుక్తి పూర్వం = అను నీ మాటను పూర్వ ముందునట్లుగా, అయం = ఈ నలుడు, ఏతత్ = చెప్పబోవు విషయమును, అవోచత్ = పలికెను.

సమాసములు :

అవాగ్విషయః వాచాం విషయః = వాగ్విషయః, వాగ్విషయో న భవతీతి = అవాగ్విషయః,
అస్మదభిధాః అస్మాకం అభిధాః = అస్మదభిధాః.
ఇత్యుక్తిపూర్వః : ఇతి ఉక్తిః పూర్వం యస్మిన్ కర్మణి యద్యథా భవతి తథా = ఇత్యుక్తి పూర్వం.

భావము :

ఓభగవంతుడా! నీస్వరూపము "యతో వాచో నివర్తన్తే" ఇత్యాది శ్రుతి ననుసరించి మాటలకందనిది. ఇక నిన్ను గొనియాడుట యెట్లు సాధ్యము. కావున మానుడివచనము లన్నియు నీకు నిందయే యగుచున్నవి అనన్తగుణసంపన్నుడ వైన నిన్ను స్వల్పగుణములను మాత్రమే ప్రకటించెడి మామాటలతో నుతించుట దూషణమే యగును. కావున నేను చాపల్యముతో చెప్పిన నా వచ్చుబోతు మాటలను మన్నింపుము. అని చెప్పుచు నలుడు చెప్పబోవుచున్నాడు.

శ్లో. స్వప్రకాశ జడ ఏష జనస్తే
వర్ణనం యదభిలష్యతి కర్తుం ।
నన్వహర్పతిమహః ప్రతి స స్యా
న్న ప్రకాశనరస స్తమసః కిమ్ ॥ 51

ప.వి. స్వప్రకాశ! జడఃఏషః - జనః - తే - వర్ణనం - యత్ - అభిలష్యతి - కర్తుం - నను - అహర్పతిమహః - ప్రతి - సః - స్యాత్ - న - ప్రకాశనరసః - తమసః - కిమ్.

అర్థము: హే స్వప్రకాశ! = స్వయముగా ప్రకాశించునట్టి ఓ భగవంతుడా! "ఏష ఆత్మా స్వప్రకాశః" యను వేదాన్త వచనము ననుసరించి భగవన్తుడు స్వయంప్రకాశుడని తెలియుచున్నది. జడః = మూఢమైన యనగా నవిద్యతో నావరింపబడిన, ఏష జనః = ఈజనము, తే = జ్ఞాన స్వరూపుడవైన నీ యొక్క, వర్ణనం = వర్ణించుటను, కర్తుం = చేయుటకు, యత్ = ఎందువలన

అభిలష్యతి = కోరుచున్నదో, నను = ఓమహావిష్ణూ! సః = ఆ యభిలాష, అహర్పతిమహః ప్రతి,అహర్పతి = సూర్యునియొక్క, మహః ప్రతి = వెలుతురునుద్దేశించి, తమసః = చీకటికి, ప్రకాశనరసః = తానువెలుగొందవలయు ననెడి కోరిక, న స్యాత్ కిం? = కాదా యేమి? తప్పక యగునని యర్థము. స్వయంప్రకాశకుడవైన నిన్ను వర్ణించెడి జడుడనగు నాయొక్క కోరిక, బహిరంగ ప్రకాశము గల్గిన సూర్యుని ప్రకాశపరుచుటకై చీకటి యొక్క కోరికవలె రాణింపదు. తేజస్సుచే నశింపదగిన చీకటి తేజోమయుడగు సూర్యునకెట్లు ప్రకాశమును కలిగింప జాలదో యట్లే నీ యొక్క స్వయం ప్రకాశముచే నశింపదగు జడత్వముగల్గిన నేను నావర్ణనములతో నిన్ను ప్రకాశింప జేయజాలనని యర్థము.

సమాసములు :

స్వప్రకాశ!-స్వేన ప్రకాశః యస్య సః = స్వప్రకాశః. తస్య సంబుద్ధి స్వప్రకాశ!
అహర్పతిమహః- అహ్నః పతిః = అహర్పతిః, అహర్పతేః మహః = అహర్పతి మహః.
ప్రకాశనరసః ప్రకాశనే రసః = ప్రకాశనరసః

భావము :

స్వప్రకాశ శీలుడవగు భగవంతుడా! అవిద్యారూపమగు నావరణముతో గూడి జడుడైన యీతడు నీగుణవర్ణనము చేయగోరుట సూర్యు నుద్దేశించి యంధకారము తాను ప్రకాశింపగోరుట వంటిది. లేదా సూర్యునకు దివిటీపట్టుట వంటిది. అనగా తేజస్సుతో నశించెడి చీకటి తేజోరాశియగు సూర్యునెదుట ప్రకాశింపగోరుట వ్యర్థముగదా! అవిధముగనే భగవంతుని స్వప్రకాశముచే నశింపదగిన జడత్వము గల వ్యక్తి ఆ స్వయంప్రకాశుని గూర్చి ప్రకాశనాత్మకమగు వర్ణనము చేయుట పోలియున్నది.

శ్లో. మైవ వాఙ్మనసయో ర్విషయోఽభూ
స్త్వాం పునర్న కథ ముద్దిశతాం తే ।
ఉత్కచాతకయుగస్య ఘన స్స్యాత్
తృప్తయే ఘనమనాప్నువతోఽపి॥ 62

ప వి  మా - ఏవ - వాఙ్మనసయోః - విషయః - భూః - త్వాం - పునః - స - కథం-ఉద్దిశతాం - తే-ఉత్కచాతకయుగస్య - ఘనః - స్యాత్ - తృప్తయే - ఘనం - అనాప్నువతః - అపి.

అర్థము: హేవిష్ణో! = ఓవిష్ణూ! వాఙ్మనసయోః, వాక్ = వచనమునకు, మనసయోః = చిత్తమునకు, విషయః = గోచరుడవుగా, మైవ భూః = కావలదు, పునః = కాని, త్వాం=నిన్ను, కథం = ఎట్లు,సఉద్దిశతాం=చూడము. అనగా నిన్ను గురించి ఎట్లు ప్రవర్తింపమని యర్థము. తథాహి = అది యుక్తమే. ఘనం = మేఘమును, అనాప్నువతోఽపి = దూరమునం దుండుటవలన పొందక పోయినను, ఉత్కచాతకయుగస్య, ఉత్క = మేఘమునకై యుత్కంఠగల్గిన, చాతకయుగస్య = చాతక పక్షులజంటకు, తృప్తయే = తృప్తికై, యనగా జలమొసంగి ప్రీతి కలిగించుటకు, ఘనః = మేఘము స్యాత్ = స్వయముగనే ప్రవర్తించును. చాతకముల జంటకు గోచరముగాని మేఘ మెట్లు స్వయముగనే వాని తృప్తికై ప్రవర్తించునో, అట్లే అవాఙ్మనస గోచరుడవగు నీవు నా తృప్తికై ప్రవర్తింతువు. కావున నేను నిన్ను వర్ణించుటనుండి విరమించను.

సమాసములు :

వాఙ్మనసయోః -వాక్ చ మనశ్చ = వాఙ్మనసే, తయోః = వాఙ్మనసయోః.

ఉత్కచాతకయుగస్య - ఉత్కౌ చ తౌ చాతకౌ = ఉత్కచాతకౌ, ఉత్కచాతకయోః యుగం = ఉత్కచాతకయుగం, తస్య = ఉత్కచాతకయుగస్య

అనాప్నువతః -న అప్నువన్ = అనాప్నువన్,తస్య =అనాప్నువతః.

భావము :

ఓవిష్ణూ! వాక్కునకును మనస్సునకును నీవు గోచరము గావలదు. కాని వాఙ్మనస్సులు రెండును నిన్నేల యుద్దేశించి ప్రవర్తింపవు. అది యుక్తమే. దూరమునం దుండుటవలన మేఘమును పొందలేక పోయినను ఆమేఘమునకై యుత్కంఠగలిగిన చాతకపక్షుల జంటకు జలమొసంగి తృప్తికలిగించుటకై

మేఘమే తనంతటతానే వానితృప్తికై ప్రవర్తించును. కాన నాచాతకముల జంటకు గోచరము కాకపోయినను మేఘమెట్లు తనంతట తానే వాని తృప్తికై ప్రవర్తించునో, అట్లు సాజ్జనసులకు గోచరము కాకపోయినను నీవు స్వయముగనే నాతృప్తికై ప్రవర్తింతువు. కాన నిన్ను వర్ణించునట్టి ప్రయత్నమును నేను మానను.

శ్లో. ఛద్మమత్స్యవపుష స్తవ
పుచ్ఛాస్ఫాలనా జ్జల మివోద్ధృతమబ్ధేః
శ్వైత్య మేత్య గగనాఙ్గణసఙ్గా
దావిర స్తి విబుధాలయ గఙ్గా॥ 53

ప. వి. ఛద్మమత్స్యవపుషః - తవ - పుచ్ఛాస్ఫాలనాత్ - జలం - ఇవ - ఉద్ధృతం - అబ్ధేః - శ్వైత్యం - ఏత్య - గగనాఙ్గణసఙ్గాత్ - ఆవిః - అస్తి - విబుధాలయ గఙ్గా.

అర్థము: హేవిష్ణో! = ఓవిష్ణూ! ఛద్మమత్స్యవపుష, ఛద్మ = కపటముతో, మత్స్య = చేపయొక్క, వపుషః = శరీరముగల, తవ = నీయొక్క, పుచ్ఛ = తోకయొక్క, ఆస్ఫాలనాత్ = దెబ్బవలన, అబ్ధేః = సముద్రమునుండి, ఉద్ధృతం = పైకివిసరబడిన, జలం = జలము, గగనాఙ్గణ సఙ్గాత్, గగన = ఆకసముయొక్క, అఙ్గణ = ముంగిలి తోటి, సఙ్గాత్ = సంబంధమువలన, శ్వైత్యం = తెల్లదనమును, ఏత్య = పొంది, విబుధాలయగఙ్గా, విబుధాలయ = స్వర్గమందలి, గఙ్గా = గఙ్గ, ఆవిరస్తీవ = ఉద్భవించుచున్నదో యనునట్లున్నది. నీలవర్ణములు గల సముద్రజలములు ఆకసమందలి వెలుగును దాకినందు వలననో యనునట్లు తెల్లనివిగా గావవచ్చుచున్నవని యర్థము.

సమాసములు :

ఛద్మమత్స్యవపుషః :- మత్స్యస్య వపుః = మత్స్యవపుః, ఛద్మనా మత్స్యవపుః యస్య సః = ఛద్మ మత్స్య వపుః, తస్య = ఛద్మమత్స్య వపుషః.

పుచ్ఛాస్ఫాలనాత్ : పుచ్ఛస్య ఆస్ఫాలనం = పుచ్ఛాస్ఫాలనం, తస్మాత్ = పుచ్ఛాస్ఫాలనాత్.

శ్వైత్యం : శ్వేతస్య భావః = శ్వైత్యం, తత్ = శ్వైత్యం.

గగనాఙ్గణ సఙ్గాత్ : గగనస్య అఙ్గణం = గగనాఙ్గణం, గగనాఙ్గణస్య సఙ్గః = గగనాఙ్గణసఙ్గః, తస్మాత్ = గగనాఙ్గణ సఙ్గాత్.

విబుధాలయగఙ్గా : విబుధానాం ఆలయః = విబుధాలయః, విబుధాలయే గఙ్గా = విబుధాలయ గఙ్గా.

**భావము :**

ఓ విష్ణూ ! వేదముల నపహరించిన సోమకాసురుని సంహరించుట యను వ్యాజముతో మత్స్య దేహము నెత్తి తోకతో గొట్టగనే సాగరమునుండి పైకి వెదజల్లబడిన నీరు ఆకసమునంటి తెల్లదనము నొంది స్వర్గలోకమందలి గంగా నదిగా నుద్భవించినదో యను నట్లున్నది.

శ్లో. భూరి సృష్టి ధృత భూవలయానాం
పృష్ఠసీమని కిణైరివ చక్రైః।
చుమ్బితాఽవతు జగత్ క్షితి రక్షా
కర్మఠస్య కమఠ స్తవ మూర్తిః॥ 54

ప. వి. భూరిసృష్టి ధృత భూవలయానాం - పృష్ఠసీమని - కిణైః - ఇవ - చక్రైః - చుమ్బితా - అవతు - జగత్ - క్షితిరక్షాకర్మఠస్య - కమఠః - తవ - మూర్తిః.

అర్థము: హే భగవన్ = ఓ భగవన్తుడా ! పృష్ఠసీమని = వీపుమీద, భూరిసృష్టి ధృత భూవలయానాం, భూరి = (ప్రతి కల్పమునందు క్రొత్తసృష్టిని జేయుట వలన) పెక్కులగు, సృష్టి = సృజించు కార్యముల యందు, ధృత = వహింప బడిన, భూవలయానాం = భూమణ్డలముల యొక్క, కిణైరివ = మాటి మాటికి మోయుటచే నేర్పడిన యొరిపిడి వలని మచ్చలో యనునట్లున్న, చక్రైః = చక్రాకారపు గుర్తులచే, చుమ్బితా = ఆ యా స్థానముల యందుదాక బడినదై, క్షితిరక్షా కర్మఠస్య, క్షితి = భూమిని, రక్షా = రక్షించు విషయమున, కర్మఠస్య = సమర్థుడైన,

తవ = నీకు సంబంధించిన, కమఠస్య = కూర్మము యొక్క, మూర్తిః = శరీరము, జగత్ = లోకమును, అవతు = రక్షించుగాత.

సమాసములు :

భూరిసృష్టి ధృత భూవలయానాం : భూరయశ్చ తాః సృష్టయశ్చ = భూరిసృష్టయః, భువాం వలయాః = భూవలయాః, భూరిసృష్టిషు ధృతాః = భూరిసృష్టి ధృతాః, భూరిసృష్టి ధృతాశ్చ తే భూవలయాశ్చ = భూరిసృష్టి ధృతభూవలయాః, తేషాం = భూరిసృష్టిధృత భూవలయానాం.
పృష్ఠసీమని : పృష్ఠస్య సీమ = పృష్ఠసీమ, తస్మిన్ = పృష్ఠసీమని.
క్షితిరక్షా కర్మఠస్య : క్షితేః రక్షా = క్షితిరక్షా, క్షితిరక్షాయాం కర్మఠః = క్షితిరక్షా కర్మఠః, తస్య క్షితిరక్షా కర్మఠస్య.

భావము :

ఓ భగవన్తుడా ! ప్రతికల్పమునందు పెక్కు నూతన సృష్టులు చేయుట వలన నా యా సృష్టులయందు నిర్మింప బడిన భూవలయములను వీపున మోయుటచే వాని యొరిపిడి వలని గాయపు మచ్చలనెడి చక్రాకారపు చిహ్నములచే నందందు దాక బడినదియు భూరక్షణయందు సమర్థత గలదియు నగు నీ కూర్మావతార మంపలి శరీరము భూమిని రక్షించుగాత.

శ్లో. దిక్షు యత్ఖుర చతుష్టయ ముద్రా
మభ్యవైమిచతురోఽపి సముద్రాన్।
తస్య పౌత్రివపుష స్తవ దంష్ట్రా
తుష్టయేఽస్తు మమవాస్తు జగత్యాః॥ 55

ప. వి. దిక్షు - యత్ఖుర చతుష్టయముద్రామ్ - అభ్యవైమి - చతురః - అపి - సముద్రాన్ - తస్య - పౌత్రివపుషః - తవ - దంష్ట్రా - తుష్టయే - మమ - వాస్తు - జగత్యాః.

అర్థము: హే విష్ణో ! - ఓ విష్ణూ !, దిక్షు = నాలుగు దిక్కులయందు, చతురః నాలుగు, సముద్రానపి = సముద్రములను సైతము, యత్ఖుర చతుష్టయ ముద్రాం, యత్ = ఏ వరాహమూర్తి యొక్క, ఖురచతుష్టయ =

నాలుగు గిట్టలయొక్క, ముద్రాం = గుర్తులుగా అనగా గిట్టలవలన నేర్పడిన గుంటలుగా, అభ్యవైమి = తెలుసుకొనుచున్నానో; తస్య = ఆ, పౌత్రివపుషః = వరాహమూర్తి గల్గిన, తవ = నీ యొక్క, జగత్యాః = భూమికి సంబంధించిన, వాస్తు = నివాసస్థలము, రసాతలమునుండి పైకెత్తి కోరపై భూమిని స్థాపించుకొనుటచే నివాసస్థలమైన, దంష్ట్రా = నీ విశాలమైన దన్తము, మమ = నాకు, తుష్టయే = కోరికతీరుట వలన కలిగిన సంతోషమునకై, అస్తు = అగునుగాత.

సమాసములు :

యత్ఖుర చతుష్టయముద్రాం : ఖురాణాం చతుష్టయం = ఖురచతుష్టయం, యస్య ఖుర చతుష్టయం = యత్ఖుర చతుష్టయం, యత్ఖుర చతుష్టయస్య ముద్రా = యత్ఖుర చతుష్టయ ముద్రా, తాం = యత్ఖుర చతుష్టయ ముద్రాం.

పౌత్రివపుషః : పోత్రిణః ఇదం = పౌత్రి; పౌత్రి వపుః యస్య సః = పౌత్రివపుః, తస్య = పౌత్రివపుషః.

భావము :

ఓ విష్ణూ ! నాలుగు దిక్కుల యందు నున్న నాలుగు సముద్రములు వరాహమూర్తిపైన నీ నాలుగు పాదములలోని గిట్టల త్రొక్కిడిచే నేర్పడినవని నాకు తెలియును. అట్టి వరాహమా ! నీ యొక్క కోర భూదేవి నివాస స్థలము. ఏలయనగా నా భూమిని రసాతలము నుండి పైకి దీసి నీ కోరపై నుంచుకొంటివి. అట్లుంచుకొనుట వలన నీ కోర భూదేవతకు నెలవైనది. అట్టి నీ కోర యనబడు విశాలదన్తము నా కోరికలను తీర్చి నన్ను ప్రీతుని చేయుగాత.

శ్లో. ఉద్ధృతిస్థల దిలాపరిరమ్భా
ల్లోమభిర్బహిరితై ర్బహుదృష్టైః ।
బ్రాహ్మ మణ్డ మభవ ద్బలినీపం
కేలికోల తవ తత్ర న మాతుః. 56

ప. వి. ఉద్ధృతి స్ఖలదిలా పరిరమ్భాత్ - లోమభిః - బహిరితైః - బహుదృప్తైః -
బ్రాహ్మం - అణ్డం - అభవత్ - బలినీపం - కేలికోల - తవ - తత్ర - న-మాతుః.

అర్థము: హే కేలికోల !—లీలకై వరాహముగా నవతరించిన ఓ భగవన్తుడా ! తత్ర—ఆ బ్రహ్మాణ్డ మందు, న మాతుః — పట్టనటువంటి, తవ— నీ యొక్క, ఉద్ధృతి స్ఖలదిలా పరిరమ్భాత్, ఉద్ధృతి — జలము నుండి పైకెత్తిన సమయము నందు, స్ఖలత్ — జారుచున్న, ఇలా — భూమి యొక్క, పరిరమ్భాత్—ఆలింగనము వలన, బహుహృష్టైః, బహు — అధికముగా, హృష్టైః—నిక్కపొడుచుకొని, బహిః — బ్రహ్మాణ్డమునకు వెలుపలి ప్రదేశమునకు, ఇతైః—పొందిన, లోమభిః — వెంట్రుకలచే, బ్రాహ్మం — బ్రహ్మకు సంబంధించిన, అణ్డం — అణ్డము, అనగా బ్రహ్మాణ్డము, బలినీపం (ఇవ) — పూజకై యవసరమగు కడిమిపూవో యనునట్లు, అభవత్ — ఆయెను.

సమాసములు :

ఉద్ధృతి స్ఖలదిలా పరిరమ్భాత్ : ఉద్ధృతా చ సా స్ఖలన్తీ చ— ఉద్ధృత స్ఖలన్తీ,ఉద్ధృతస్ఖలన్తీచ సా ఇలా—ఉద్ధృతిస్ఖలదిలా,ఉద్ధృతిస్ఖల దిలాయాః పరిరమ్భః — ఉద్ధృతిస్ఖలదిలా పరిరమ్భః, తస్మాత్—ఉద్ధృతిస్ఖలదిలా పరిరమ్భాత్.

బహుహృష్టైః : బహు హృష్టాని — బహుహృష్టాని, తైః — బహుహృష్టైః.

బ్రాహ్మమ్ : బ్రహ్మణః ఇదం—బ్రాహ్మమ్.

బలినీపం : బలేః నీపం — బలినీపం.

కేలికోలః : కేలేఃకోలం—కేలి కోలః, తస్య సంబుద్ధిః — హేకేలికోల.

భావము :

విలాసముగా వరాహావతారమెత్తిన ఓ భగవన్తుడా ! నీ శరీరము చాలా పెద్దదిగా నుండుటవలన నా బ్రహ్మాండ మందు బట్టనటువంటిదై నీవు గావించిన యుద్ధరణక్రియ యందు అనగా భూదేవిని పాతాళము నుండి పైకి తెచ్చెడి క్రియ

యందు జారిపోవుచున్న యా భూదేవిని జారిపోనీయక గట్టిగా కౌగిలించుకొనుట వలన (పట్టుకొనుట వలన) మిక్కుటముగా నుప్పొంగినవై బ్రహ్మాండమునకును వెలుపలికిని చొచ్చుకొని వచ్చినట్టి పులకములచే నాబ్రహ్మాణ్డము నీ యొక్క పూజార్థమైన కడిమి పూవువలె నైనది.

శ్లో. దానవౌఘ గహనప్రభవ స్త్వం
సింహ! మామవ రవై ర్ఘనఘోరైః।
వైరిదారిదివిషత్సుకృతాస్త్ర
గ్రామసమ్భవ భవన్మనుజార్ధః॥ 57

ప. వి. దానవౌఘ గహనప్రభవః - త్వం - సింహ! - అవ - రవైః - ఘన ఘోరైః - వైరిదారి దివిషత్సుకృతాస్త్ర గ్రామసమ్భవ భవన్మనుజార్థః.

అర్థము. హేసింహ! = ఓ నారసింహమూర్తిని ధరించిన విష్ణూ! దానవౌఘ గహనప్రభవః, దానవ = రాక్షసులయొక్క, ఓఘ = సమూహ మనెడి, గహన = అరణ్యమందు, అనగా వెక్కుదానవులకు అధిపతి యగు హిరణ్యకశిపు వంటి వారనెడి యరణ్యమునందు అనగా హింసా స్వభావము గలిగిన రాక్షసుల సమూహముచే నధిష్ఠింపబడుట వలన చొరరాని యరణ్యమందు, ప్రభవః = ఉత్పత్తి గల్గిన, (దీనిచే సింహ శరీరధారణమున కౌచిత్యము తెలుపబడితది. ఏలయనగా సింహము వన మందు జన్మించునుకదా) తథా = అట్లే, వైరిదారిదివిషత్సుకృతాస్త్ర గ్రామసంభవభవన్మనుజార్థః, వైరి = శత్రువులను, దారి = నాశము చేసెడి, దివిషత్ = దేవతలయొక్క, సుకృత = పుణ్యము లనెడి, అస్త్ర = ఆయుధములయొక్క, గ్రామ = సమూహమనెడి, గ్రామ = గ్రామమునందు, సంభవ = ఉత్పత్తి కలిగినదై, భవన్ = అగుచున్న, మనుజ = నరాకారమనెడి, అర్థః = సగపాలుగలిగిన, (ఇట్లు చెప్పుటచే దేవతల కుపకరించెడి నరుడుగా జన్మించుట కౌచిత్యము చెప్ప బడి నట్లాయెను. ఏలయనగా నరుడు గ్రామమునందు జన్మించునుగదా!) త్వం = నీవు, ఘనఘోరైః, ఘన = నిరంతరములును, ఘోరైః = భయఙ్కరములునగు, రవైః = గర్జనధ్వనులచే, మాం = నన్ను, అవ = రక్షింపుము.

**సమాసములు :**

దానవౌఘగహనప్రభవః : దానవానాం ఓఘః = దానవౌఘః, దానవౌఘ ఏవ గహనం = దానవౌఘగహనం, దానవౌఘగహనం ప్రభవః యస్య సః = దానవౌఘగహనప్రభవః.

వైరిదారి దివిషత్సుకృతాస్త్ర గ్రామసంభవ భవన్మనుజార్థః : వైరిణః దారయన్తీతి = వైరిదారీణి, దివిషతాం సుకృతాని = దివిషత్సుకృతాని, వైరిదారీణి చ తాని దివిషత్సుకృతాని చ = వైరిదారి దివిషత్సుకృతాని, వైరిదారి దివిషత్సుకృతాన్యేవ అస్త్రాణి = వైరిదారి దివిషత్సుకృతాస్త్రాణి, వైరిదారి దివిషత్సుకృతాస్త్రాణాం గ్రామ ఏవ గ్రామః వైరిదారి దివిషత్సుకృతాస్త్ర గ్రామః, వైరిదారి దివిషత్సుకృతాస్త్ర గ్రామాత్ సంభవః యస్య సః = వైరిదారి దివిషత్సుకృతాస్త్ర గ్రామసమ్భవః, వైరిదారి దివిషత్సుకృతాస్త్ర గ్రామ సంభవ శ్చాసౌ భవంశ్చ = వైరిదారి దివిషత్సుకృతాస్త్ర గ్రామసంభవ భవన్, మనుజ ఏవ అర్థం యస్య సః = మనుజార్థః, వైరిదారి దివిషత్సుకృతాస్త్ర గ్రామసంభవం శ్చాసౌ మనుజార్థశ్చ = వైరిదారి దివిషత్సుకృతాస్త్ర గ్రామసంభవ భవన్ మనుజార్థః.

**భావము :**

ఓ నృసింహమూర్తివగు విష్ణూ! రాక్షసుల మూకయనెడి చొరరాని యడవి యందు జన్మించిన సింహమా! శత్రువులను సంహరింపగల దేవతల పుణ్యము లనెడి యాయుధగ్రామము లనెడి గ్రామమునందు జన్మించిన మానవ శరీరము నందలి యర్థభాగమును ధరించిన నీవు నిరన్తరములును భయఙ్కరములునగు గర్జనధ్వనులచే నన్ను కావుము.

శ్లో. దైత్యభర్తు రుదరాన్తు నివిష్టాం
శక్రసమ్పద మివోద్ధరత స్తే।
పాతు పాణి సృణిపంచకమస్మాం
శ్ఛిన్నరజ్జువి భలగ్నతద స్త్రామ్॥ 58

ప. వి. దైత్యభర్తుః - ఉదరాన్ధునివిష్టాం - శక్రసమ్పదం - ఇవ-ఉద్ధరతః - తే - పాతు - పాణిసృణిపంచకం - అస్మాన్ - ఛిన్నరజ్జునిభలగ్న తదస్త్రిమ్.

అర్థము: హే నరసింహ = ఓ నరసింహా! దైత్యభర్తుః = రాక్షసుల పాలించెడి హిరణ్యకశిపునియొక్క, ఉదరాన్ధునివిష్టాం, ఉదర = బొజ్జ యనెడి అన్ధు = బావియందు, నివిష్టాం = మునిగియున్న, శక్రసమ్పదం = ఇన్ద్రుని సమ్పదను, ఉద్ధరతః = వెలికి దీయుచున్న, తే = నీయొక్క, ఛిన్నరజ్జునిభలగ్న తదస్త్రిం, ఛిన్న = తెగిన, రజ్జు = దారముతో, నిభ = సమానములైన, లగ్న = తగిలిన, తత్ = ఆ హిరణ్యకశిపునియొక్క, అస్త్రిం = పేగులుగల్గిన, పాణిసృణి పంచకం, పాణి = హస్తముయొక్క, సృణి = గోరులయొక్క, పంచకం = ఐదు, అస్మాన్ = మమ్ములను, పాతు = కాచునుగాత.

సమాసములు :

దైత్యభర్తుః : దైత్యానాం భర్తా = దైత్యభర్తా, తస్య = దైత్యభర్తుః.
ఉదరాన్ధునివిష్టాం : ఉదరమేవ అన్ధుః = ఉదరాన్ధుః, ఉదరాన్ధౌ నివిష్టా = ఉదరాన్ధునివిష్టా, తాం = ఉదరాన్ధునివిష్టాం.
శక్రసమ్పదం : శక్రస్య సమ్పత్ = శక్రసమ్పత్, తాం = శక్రసమ్పదం.
పాణిసృణిపంచకం: పాణేః సృణయః = పాణిసృణయః, పాణిసృణీనాం పంచకం = పాణిసృణిపంచకం.
ఛిన్నరజ్జునిభలగ్నతదస్త్రిం : ఛిన్న శ్చాసౌ రజ్జుశ్చ = ఛిన్నరజ్జుః ఛిన్నరజ్జునా సదృశం = ఛిన్నరజ్జునిభం, తస్య అస్త్రిం = తదస్త్రిం, లగ్నం చ తత్ తదస్త్రిం చ = లగ్నతదస్త్రిం. ఛిన్నరజ్జునిభం లగ్నతదస్త్రిం యస్మిన్ తత్ = ఛిన్నరజ్జునిభలగ్నతదస్త్రిం.

భావము :

ఓనరసింహా! రాక్షసరాజగు హిరణ్యకశిపుని యుదర మనెడి బావియందు మునిగియున్న ఇంద్రునిసంపదను వెలికి దీయుచున్నట్లున్న నీయొక్క హస్తము

లోని యంకుశములతో సమానములైనవై తెగిన దారములవలె దగులొగ్గానిన పేగులతో కూడినట్టి నీచేతిగోళ్ళయొక్క యైపనెడి సంఖ్య నన్ను కాచును గాత. బావిలో చేంత్రాటితో వెగిపడిన పాత్ర మున్నగువానిని నంకుశమువలె వంపులు తిరిగిన పాతాళభేది మున్నగు సాధనములతో వెలికిదీయునట్లు, హిరణ్యకశిపుని యుదరమనెడి బావియందు మునిగియున్న యింద్రసంపదను పేగులనెడి దారములతో నృసింహస్వామి తనగోరులనెడి పాతాళభేదిసాధనములతో వెలికితీసెనని యర్థము.

శ్లో. స్వేన పూర్యత ఇయం సకలాశా
భో! బలే! న మమ కిం భవతేతి।
త్వం వటుః కపట వాచి పటీయాన్
దేహి వామన! మనః ప్రమదం నః॥ 59

ప.వి. స్వేన - పూర్యతే - ఇయం - సకలాశా - భోః - బలే - న - మమ - కిం - భవతా - ఇతి - త్వం - వటుః - కపటవాచి - పటీయాన్ - దేహి - వామన - మనః ప్రమదం - నః.

అర్థము: భోః = ఓ, బలే! = బలియను రాక్షసరాజా! భవతా = నీచే, ఇయం = ఈ, సకలాశా = సకల = సమస్త లోకముల యొక్క, ఆశా = కోరిక, స్వేన, ధనముచే. ననగా ధనము నొసంగుటచే. పూర్యతే = నింప బడుచున్నది. మమ = నాయొక్క, ఆశా = కోరిక, కిం న పూర్యతే = నింపబడదా యేమి? పక్షాన్తరమున, భో బలే! = ఓ బలి చక్రవర్తీ! భవతా = నీచే, ఇయం = ఈ, సకలా = సమస్తమైన, ఆశా = దిక్కు, స్వేన = తనదగు, బలేన = శక్తిచే, పూర్యతే = వ్యాపింపబడుచున్నది. మమ = నాయొక్క, ఆశా = దిక్కు, కిం పూర్యతే = పూరింప బడు చున్నదా యేమి? పూరింపబడదని యర్థము, నాయొక్క వైకుంఠలోకమును వ్యాపించుటయందు నీకు సామర్థ్యము లేదని యర్థము లేదా! మమ కిం = నాకేమి ప్రయోజనము. అంతటితో నాకు ప్రయోజన మేమున్నది? కావున నీకు సర్వదిక్కులయందు నధికార మేర్పడినచో నాకు లాభము కాని హానికాని లేదు. హే వామన! = పొట్టి శరీరముగల వామన స్వామీ! ఇతి = ఇటువంటి, కపటవాచి = కపటవచనమునందు, పటీ

యాన్ = సమర్థుడైనటువంటి, వటుః = బాల్బ్రహ్మచారియగు, త్వం = నీవు, నః = మాయొక్క, మనసః = మనసునకు, ప్రమదం = సంతోషమును, అనగా ఇష్ట సంపాదనముతో సంతోషమును. దేహి = కల్పింపుము.

సమాసములు :

సకలాశా : సకలానాం ఆశా = సకలాశా

కపటవాచి : కపటయుక్తావాక్ = కపటవాక్, తస్యాం = కపటవాచి,

భావము :

ఓ బలిచక్రవర్తీ! నీవు సకలజనులయొక్క మనోరథముల ధనము నొసంగి తీర్చుచున్నావు. నామనోరథమును తీర్చవా యేమి. అనగా తప్పక తీర్చగలవని యర్థము. పక్షాన్తరమున ఓ రాజా! నీవు నీసామర్థ్యముచే దిక్కుల నన్నింటిని నింపుచున్నావు. కాని నాయొక్క దిక్కగు వైకుంఠమును నింపగలవా? నింపలేవు. దానిని వ్యాపించుటకు తగిన సామర్థ్యము నీకు లేదు. లేదా ఆవిష యమువలన నాకేమి ప్రయోజనము. నేను మూడడుగుల భూమినే కోరుచున్నాను. దానికంటె నధికమగు భూమితో నాకేమి ప్రయోజనము! కావున నీకు సకల దిక్కులయందు నధికారమున్నచో నాకు లాభముకాని నష్టముకాని లేదు. ఇట్లే విధమగు కోరికలేక పోయినను కపటపుకోరికను వెలిబుచ్చుటయందు సమర్థుడవగు బాల్బ్రహ్మచారియైన నీవు మాకోరికలను నెరవేర్చి మామనస్సునకు సంతోషమును చేకూర్చుము.

శ్లో. దానవారిరసికాయ విభూతేః

వశ్మి తేఽస్మి సుతరాం ప్రతిపత్తిమ్।

ఇత్యుదగ్ర పులకం బలినోక్తం

త్వాం నమామి కృతవామనమాయమ్. 60

ప. వి. దానవారిరసికాయ - విభూతేః - వశ్మి - తే - అస్మి - సుతరాం - ప్రతిపత్తుం - ఇతి - ఉదగ్రపులకం - బలినా - ఉక్తం - త్వాం - నమామి - కృతవామన మాయమ్.

అర్థము: హే వామన! = ఓ వామనస్వామీ! అస్మి = నేను, దానవారిరసికాయ, దాన = త్యాగమునకు సంబంధించిన, వారి = నీటికి. అనగా దాన సఙ్కల్పమునకు సంబంధించిన యుదకముపై, రసికాయ = అనురాగము గలిగిన అనగా ప్రతిగ్రహమును గోరునట్టి తే = నీ యొక్క, విభూతేః = సంపదకు, సుతరాం = అధికమైన, ప్రతిపత్తిం = దానమును వశ్మి = కోరుచున్నాను. పక్షాన్తరమున, హే వామన! = ఓవామనస్వామీ! దానవారిః, దానవ = రాక్షసులకు, అరిః = శత్రువుగా, అసి = అగు చున్నావు. అనగా సాక్షాత్ విష్ణువుగా నున్నావు. (కావుననే)అస్మి = నేను, తే = నీయొక్క, కాయవిభూతేః = శరీరవైభవమునకు, అనగా త్రివిక్రమమూర్తిని గ్రహించుటవలన నేర్పడిన శరీరవైభవముయొక్క, సుతరాం = మిక్కిలి, ప్రతిపత్తిం = జ్ఞానమును, వశ్మి = కోరుచున్నాను. లేదా నీస్వరూపమును తెలియ కోరికను దర్శింతును. ఇతి = ఇట్లు, ఉదగ్రపులకం, ఉదగ్ర = భక్త్యతిశయముచే నధికముగా నిక్కపొడుచు కొనిన, పులకం = రోమాంచములు గలిగినట్లుగా, బలినా = బలిచక్రవర్తి చేత, ఉక్తం = చెప్పబడిన, కృతవామన మాయం, కృత = చేయబడిన వామన = వామనాకారమును ధరించుటయనెడి, మాయం = కపటముగల. త్వాం = నిన్ను, నమామి = నమస్కరింతును.

సమాసములు :

దానవారిరసికాయ : దానార్థం వారి = దానవారి, దానవారిణః రసికః = దానవారి రసికః, తస్మై = దానవారి రసికాయ, పక్షాన్తరమున

దానవారిః : దానవానాం అరిః = దానవారిః.

కాయవిభూతేః : కాయస్య విభూతిః = కాయవిభూతిః, తస్యాః = కాయ విభూతేః.

ఉదగ్రపులకం : ఉదగ్రాః పులకాః యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = ఉదగ్రపులకం.

కృతవామన మాయం : వామన ఇతి మాయా = వామనమాయా, కృతా వామనమాయా యేన సః = కృతవామనమాయః, తం = కృతవామన మాయం.

భావము :

ఓ వామనా! నేను దానోదకములను గోరునట్టి నీకు నాసంపద నెక్కువగా నీయగోరుచున్నాను. పక్షాన్తరమున:- ఓ వామనా! నీవు దానవులకు శత్రువైన శ్రీమహావిష్ణువుగా నున్నావు. కావున నేను విక్రమావతారము నెత్తుటచే గలుగు నీ శరీర వైభవమును గూర్చిన జ్ఞానమును ఎక్కువగా గోరుదును. ఇట్లు పులక ములు నిక్కబొడుచుకొనునట్లు, బలిచక్రవర్తిచే చెప్పబడిన మరుగుజ్జు మాయను వహించిన నిన్ను నమస్కరింతును.

శ్లో. భోగిభిః క్షితితలే దివి వాసం
బన్ధ మేష్యసి చిరం ధ్రియమాణః
పాణి రేష భువనం వితరేతి
ఛద్మ వాగ్భి రవ వామన విశ్వమ్॥ 61

ప. వి. భోగిభిః - క్షితితలే - దివి - వాసం - బన్ధం - ఏష్యసి - చిరం - ధ్రియమాణః - పాణిః - ఏషః - భువనః - వితర - ఇతి - ఛద్మ - వాగ్భిః - అవ - వామన - విశ్వమ్.

అర్థము:- హే బలే! = ఓ బలిచక్రవర్తీ! క్షితితలే! భూలోకమునందుగాని, దివి వా = స్వర్గమునందుకాని చిరం = చాలాకాలము, ధ్రియమాణః = ఉంటున్న, (త్వాం = నీవు) భోగిభిః = సుఖముగల్గిన, (జనులతో) వసం = ఉనికిని, తథా = అట్లే, బంధం = స్నేహబంధమును, ఏష్యసి = పొందగలవు. ఏలయనగా నా హస్తమున దానోదకమును విడిచితివి. (కావుననే) ఏషః = ఈ, పాణిః = హస్తము, (మయా = నాచేత, ప్రసారితః = చాప బడినది.) భువనం = దానజలమును, వితర = ఇమ్ము, పక్షాన్తరమున, హే బలే = ఓబలిచక్రవర్తీ! దివి = స్వర్గమునందు, అనగా స్వర్గసమానముగు మిక్కిలి రమణీయ ప్రదేశమైన, క్షితితలే = రసాతలమునందు, చిరం = చాలాకాలము, (వ్యాపించి) ధ్రియమాణః = ఉన్నటువంటి, త్వాం = నీవు, భోగిభిః = సర్పములతో, వాసం = నివాసమును, బంధం = బంధనమును, ఏష్యసి = పొందగలవు,

ఏషః = ఈ, పాణిః = హస్తము, (మయా = నాచేత, ప్రసారితః = చాపబడినది) భువనం = (ఇంద్రునినుండి బలవంతముగా గ్రహింపబడిన) లోకమును (కావుననే యతనికి జెందవలసిన దానిని) వితర = ఇమ్ము. హే వామన = ఓ వామనస్వామీ!, ఇతి = ఇట్లు, ఛద్మవాగ్భిః = కపట వచనములతో, విశ్వం = ప్రపంచమును, అవ = కావుము.

సమాసములు :

భోగిభిః : భోగః ఏషా మస్తీతి = భోగినః, తైః = భోగిభిః.
క్షితితలే : క్షితేః తలం = క్షితితలం, తస్మిన్ = క్షితితలే.
ఛద్మవాగ్భిః : ఛద్మ యుక్తాః వాచః = ఛద్మవాచః, తాభిః = ఛద్మవాగ్భిః.

భావము :

ఓ బలి చక్రవర్తీ! భూలోకము నందు కాని స్వర్గలోకము నందు కాని చాలాకాలముండి నీవు సుఖము ననుభవించెడి జనులతోడ నివాసమును, స్నేహ బంధమును బొందగలవు. ఏలయనగా నీవు నా చేత దానోదకమును వదలితివి గదా! కావున ఈ నాహస్తమును జాచితిని. దానోదకమును వదలుము. మఱియు ఓ బలి చక్రవర్తీ! స్వర్గముతో సమానమైన రసాతలమందు చిరకాల మున్న నీవు సర్పములతోడ వాసమును బంధమును బొందగలవు. ఈ హస్తము చాప బడినది. ఇంద్రుని నుండి బలవంతముగా గైకొనబడినందువలన మరల నతనికే చెందవలసిన లోకమును సమర్పింపుము. అని యివ్విధముగా కపట వచనములతో ప్రపంచమును రక్షింపుము.

శ్లో. ఆశయస్య వివృతిః క్రియతే కిమ్
దిత్సురస్మి హి భవచ్ఛరణేభ్యః।
విశ్వమి త్యభిహితో బలినాఽస్మాన్
వామన! ప్రణత పావన! పాయాః॥ 62

ప. వి. ఆశయస్య - వివృతిః - క్రియతే - కిం ? దిత్సుః - అస్మి - హి - భవచ్ఛరణేభ్యః -

విశ్వం - ఇతి - అభిహితః - బలినా - అస్మాన్ - వామన ! ప్రణత పావన ! పాయాః.

**అర్థము:** హే వామన ! = ఓ వామన స్వామీ !, ఆశయస్య = పుచ్చుకొనెదనని చెప్పు నీ యభిప్రాయమునకు, వివృతిః = వివరణము, కిం = ఏల ? క్రియతే = చేయబడును. హి = ఏలయనగా ? భవచ్చరణేభ్యః = నీ పాదములకై, యనగా మిక్కిలి పూజ్యుడవైన నీకై, విశ్వం = సర్వమును, దిత్సుః = నేనుగనే ఈయగోరిన వాడనుగా, అస్మి = అగుచున్నాను. మరియు, హే వామన ! = ఓ వామనస్వామీ !, శయస్య = హస్తమునకు, ఆ = చక్కని, వివృతిః = చాచుట, కిం ? = ఎట్లు, క్రియతే = దానమును పుచ్చుకొనుటకు నీచే చేయబడు చున్నది. హి = ఏలయనగా ? భవతః = నీ యొక్క, చరణేభ్య ఏవ = మూడు పాదముల కొఱకే, విశ్వం = ప్రపంచమును, దిత్సుః = ఈయగోరిన వాడనుగా, అస్మి = అగుచున్నాను. హే ప్రణతపావన ! = ఓ భక్తజనుల చిత్తమును శోధించువాడా ! వామన ! = వామన బ్రహ్మచారీ ! ఇతి = ఇట్లు, బలినా = బలి చక్రవర్తిచే, అభిహితః = చెప్పబడిన, త్వం = నీవు అస్మాన్ = మమ్ములను, పాయాః = రక్షింపుము.

**సమాసములు ;**

దిత్సుః : దాతుం ఇచ్ఛుః = దిత్సుః.

భవచ్చరణేభ్యః : భవతః చరణాః = భవచ్చరణాః, తేభ్యః = భవచ్చరణేభ్యః.

ప్రణతపావన : ప్రణతాన్ పావయతీతి = ప్రణతపావనః, తస్య సంబుద్ధిః = హే ప్రణతపావన.

**భావము ;**

ఓ వామన స్వామీ ! నేనిచ్చిన దానిని తాము పుచ్చుకొను విషయమున నభిలాషకు వివరణము చెప్పనవసరము లేదు. ఏలయనగా పూజ్యులైన తమకు నా సమస్తైశ్వర్యముల నొసంగ గోరితిని. మరియు నో వామనప్రభూ ! నేనిచ్చిన

వాటిని గ్రహించుటకు మీరెట్లు చేతులు చాచెదరు ! ఏలయనగా నేను మీ మూడు పాదములకై సర్వము నీయగోరితిని. కాని చేతులకు గాదు. ఓ భక్తజన చిత్త శోధకా ! వామనా ! యని యీ విధముగా బలిచే చెప్పబడిన నీవు మమ్ములను రక్షింపుము.

శ్లో. క్షత్ర జాతిరుదియాయ భుజాభ్యాం
యా తవైవభువనం సృజతః ప్రాక్।
జామదగ్న్య వపుష స్తవ తస్యా
స్తౌలయార్థ ముచితౌ విజయేతామ్.॥ 63

ప. వి. క్షత్ర జాతిః - ఉదియాయ - భుజాభ్యాం - యా - తవ - ఏవ - భువనం - సృజతః - ప్రాక్ - జామదగ్న్యవపుషః - తవ - తస్యాః - తౌ - లయార్థం - ఉచితౌ - విజయేతామ్.

అర్థము: హే విష్ణో ! = ఓ విష్ణూ !, ప్రాక్ = పూర్వము, భువనం = ప్రపంచమును, సృజతః = సృజించుచున్న, తవైవ = నీ యొక్కయే, బాహుభ్యాం = బాహువుల నుండి, యా = ఏ, క్షత్ర జాతిః = క్షత్రియ సమూహము, ఉదియాయ = ("బాహూ రాజన్యః కృతః" యను శ్రుతి ననుసరించి) ఉద్భవించెనో, తస్యాః = ఆ క్షత్రియ జాతికి, లయార్థం = నాశము కొఱకు, జామదగ్న్యవపుషః, జామదగ్న్య = పరశురాముడే, వపుషః = దేహముగా గల్గిన, తవ = నీ యొక్క, భుజౌ = బాహువులు, విజయేతాం = అన్నింటిని మించి యుండునుగాత.

సమాసములు;

క్షత్ర జాతిః : క్షత్రాణాం జాతిః = క్షత్రజాతిః.
జామదగ్న్య వపుషః : జామదగ్న్యః వపుః యస్యసః = జామదగ్న్య వపుః, తస్య = జామదగ్న్య వపుషః.
లయార్థం : లయాయ = లయార్థం.

భావము :

ఓ విష్ణూ ! లోకమును సృజించెడి నీ యొక్క భుజములనుండియే క్షత్రియ జాతి యుద్భవించినది. "బాహూ రాజన్యః కృతః" యను శ్రుతి దానికి

ప్రమాణము. అట్టి క్షత్రియ జాతి వినాశమునకును భుజములే తగిన స్థానములు. కార్యము కారణమునందే లయించును. ఇట్లు కారణలయమే కార్యనాశ మనబడును. "నాశః కారణలయః" యను సాంఖ్య సిద్ధాన్తము ననుసరించి కార్యము తన కారణము నందే లీనమగునని తెలియుట వలన కార్యమైన క్షత్రియ జాతికి నీ భుజములే కారణములగుట వలన నాక్షత్రియ జాతి నీ భుజములయందే లీనమగుట యుచితమని భావము. కావున నట్టి భుజములు సర్వము నతిశయించి యుండును గాత.

శ్లో. పాంసులా బహుపతి ర్నియతం యా
వేధసాఽరచి రుషా నవఖణ్డా।
తాం భువం కృతవతో ద్విజభుక్తాం
యుక్తకారితరతా తవ జీయాత్॥ 64

ప. వి. పాంసులా - బహుపతిః - నియతం - యా - వేధసా - అరచి - రుషా - నవఖణ్డా - తాం - భువం - కృతవతః - ద్విజభుక్తాం - యుక్తకారితరతా - తవ - జీయాత్.

అర్థము: హే జామదగ్న్య ! = ఓ విష్ణూ !, పాంసులాం = ధూళితో గూడినదియు, స్వేచ్ఛాచారిణియును, బహుపతిః = పెక్కుమందిని భర్తగా గలదియును, యా = ఏ భూమి, వేధసా = బ్రహ్మచే, నియతం = నిశ్చయముగనే, రుషా = కోపముతో, నవఖణ్డా = తొమ్మిదితునుకలు గలది గాను, తొమ్మిది ద్వీపములు గలదిగను, అరచి = చేయబడినదో, భారతాది ద్వీపభేదముతో తొమ్మిది ద్వీపములు గలదిగను, రోషముచే భేధించుటచే తొమ్మిదిగా విభజింప బడినదిగను భూమి చేయబడినదో యని యర్థము, తాం = ఆ భూమిని (ఒకస్త్రీని) ద్విజైః = కశ్యపుడు మున్నగు బ్రాహ్మణులచే, మాంసమును దినెడి పక్షులచేత, భుక్తాం = భోగింప బడిన దానిని గను, (తినబడిన దానిని గను) కృతవతః = చేసిన, తే = నీ యొక్క, యుక్తకారితరతా = మిక్కిలి యుక్తము చేయు స్వభావము, జీయాత్ = జయించును గాత.

సమాసములు :

పాంసులా : పాంసుం లాతీతి = పాంసులా.

బహుపతిః : బహవః పతయః యస్యాః స్సా = బహుపతిః.

నవఖణ్డా : నవ ఖణ్డాని యస్యాః స్సా = నవఖణ్డా

ద్విజభుక్తాం : ద్విజైః భుక్తా=ద్విజభుక్తా, తాం = ద్విజభుక్తాం.

యుక్తకారితరతా : యుక్తం కరోతి ఇతి = యుక్తకారీ, అత్యన్తం యుక్తకారా = యుక్తకారి తరః, యుక్తకారితరస్య భావః = యుక్తకారి తరతా.

భావము :

ఓ పరశురామ స్వరూపుడవైన విష్ణూ! ధూలితో గూడినదియు స్వేచ్ఛా చారిణియునై పెక్కండ్రు భర్తలు గల్గినదై యున్న యీ భూమిని బ్రహ్మ రోషముతో భారతాది నవఖండములు గలదిగా విభజించెను. అనగా తెగగొట్టి తొమ్మిది ముక్కలు గలదిగా గావించెను. ఆ భూమిని (ఒకానొక స్త్రీని) ద్విజులచే ననగా కశ్యపాది బ్రాహ్మణుల చేతను మాంసమును దినెడు పక్షులచే క్రమముగా భోగింపబడిన దానినిగను, తినబడిన దానినిగను, చేసినట్టి, నీయతిశయితమగు యుచిత క్రియాకారిత్వము జయించును గాత. సకల క్షత్రియులను నాశము గావించి జయించిన భూమిని బ్రాహ్మణులకు స్వాధీనపరుచుట యుక్తమగుటవలన, పెక్కండ్రు జారులచే ననుభవించబడిన స్త్రీని భర్త ముక్కలుముక్కలుగా గోసి పక్షులచే దినిపించుటయు యుక్తము గాన బైవిధముగా చెప్పబడినదని యర్థము

శ్లో. కార్తవీర్యభిదురేణ దశాస్యే
రైణుకేయ భవతా సుఖనాశ్యే ।
కాలభేదవిరహాదసమాధిం
నౌమి రామ పునరుక్తమహం తే ॥ 65

ప. వి. కార్తవీర్యభిదురేణ - దశాస్యే - రైణుకేయ - భవతా - సుఖనాశ్యే - కాలభేదవిరహాత్ - అసమాధిం - నౌమి - రామపునరుక్తం - అహం - తే.

అర్థము: హేరైణుకేయ = ఓ రేణుకాపుత్ర! పరశురామా! కార్తవీర్యభిదురేణ, కార్తవీర్య = కార్తవీర్యార్జునకు, భిదురేణ = నాశకుడైన, భవతా =

నీచేత, దశాస్యేఽపి = రావణుడును, సుఖనాశ్యే సతి = సుఖముగా చంపదగినవాడుగా నుండగా, అనగా రావణుని జయించిన కార్తవీర్యుని జయించినవానికి రావణుని జయించుటలో కష్ట మేమున్నది.? కష్టము లేదని యర్థము. శ్రీరామచంద్రుడును, పరశురాముడును నొక్క త్రేతా యుగమునందే యవతరించుటవలన వారిరువురును సమకాలికులగుటవలన నా పరశురామునికిని రావణ సంహారావకాశము కలదని యర్థము. అసమాధిం = సమాధానములేని అనగా సిద్ధాన్తములేని, తే = నీకు, కాలభేద విరహాత్ = కాలభేదము లేమి చేత, రామేణ = దశరథపుత్రుడగు రామునిచే నేర్పడిన, పునరుక్తిం = రామనామమును మరల చెప్పుటను, నౌమి = నమస్కరింతును. పునరుక్తికి యుగభేదముకాని కార్యభేదముకాని పరిహారము. కాని యిచ్చట నొక్క త్రేతాయుగమునందే, రావణవధ రూపమగు కార్యము నొక్కడే చేయగలిగినను మరం దశరథపుత్రుడగు రాముడుగా నవతరించుటవలన నతనితో నీకు పునరుక్తి వారింప శక్యము కాదు. అట్లు అవతారమునందు పునరుక్తికారణము తర్కింపశక్యము కాదు. అట్టి మహిమాన్వితమగు రామపునరుక్తికి వందనము లర్పింతునని యర్థము.

సమాసములు :

కార్తవీర్యభిదురేణ : కార్తవీర్యస్య భిదురః = కార్తవీర్యభిదురః, తేన = కార్తవీర్యభిదురేణ.

దశాస్యే : దశ ఆస్యాని యస్య సః = దశాస్యః = తస్మిన్ దశాస్యే.

సుఖనాశ్యే : నాశయితుం యోగ్యః = నాశ్యః, సుఖం నాశ్యః = సుఖనాశ్యః, తస్మిన్ = సుఖనాశ్యే.

కాలభేదవిరహాత్ : కాలస్య భేదః కాలభేదః, కాలభేదస్య విరహః = కాలభేదవిరహః, తస్మాత్ = కాలభేదవిరహాత్.

అసమాధిం : అవిద్యమానః సమాధిః యస్యాః సా = అసమాధిః తాం = అసమాధిం,

రామపునరుక్తిం : పునః ఉక్తిః = పునరుక్తిః = రామపునరుక్తిః, తాం రామపునరుక్తిమ్.

**భావము :**

ఓ పరశురామా! కార్తవీర్యార్జునుని నాశము చేసిన నీకు ఆ కార్తవీర్యార్జునునిచే ఓడింపబడిన రావణాసురుని సంహరించుటలో కష్టము లేదు. ఏలయనగా ఒక్క త్రేతాయుగమునందే, కార్తవీర్యార్జునుని సంహరించిన పరశురాముడవగు నీవును, రావణుని సంహరించిన దశరథపుత్రుడగు శ్రీరామచంద్రుడును నవతరించితిరి. మీయిరువురియందు నొక్క రాముడే యనగా పరశురాముడవైన నీవే రావణుని సంహరింపగలిగి యుండగా మరియొక రాముడు అనగా దశరథ రాము డవతరించి యారావణాసురుని సంహరించెను. కాన నొక రామునితో నెరవేర్ప సాధ్యమైన కార్యమున కిద్దరురాములు అవతరించుటవలన నిట రామ పునరుక్తి యేర్పడినది. ఈ పునరుక్తికి సమాధానమే లేదు. కాన నట్టి రామ పునరుక్తికి వందనము. పై పునరుక్తికి కాలభేదము చేతను కార్యభేదము చేతను సమాధాన మొసంగవచ్చును. కాని ఇట వీరిరువురును త్రేతాయుగమునందే యవతరించుటవలన కాలభేదము దుష్టసంహారమను కార్యమును జేయుటవలన కార్యమునందును భేదములేదు. రెండును అనగా పరశురామ రామావతారములు రెండును రామావతారములుగనే యున్నవి. కావున పునరుక్తికి సమాధానము లేక యున్నది. స్వతంత్రేచ్ఛ గలిగిన భగవన్తునిగూర్చి మీరేల రెండుమారులు రాముడుగా నవతరించితిరని ప్రశ్నించుటకు మన కర్హత లేదు. భగవంతునికి దన యిచ్ఛవచ్చినట్లు చేసికొనుటకు సర్వాధికారములు కలవు. కాని పరశురాముని యందు మానవత్వముతోబాటు దేవత్వముగూడ నున్నది. కాన దేవతలచేత వధింప బడనివిధముగా బ్రహ్మవలన వరమును బొందిన రావణాసురుని దేవత్వముగల పరశురాముడు సంహరింపశక్తుడు కాలేదు. దశరథపుత్రుడగు శ్రీరామచంద్రు నందు మానవత్వముండుటవలన నతడు రావణుని సంహరింప గలిగెను. అందు వలన నిరువురు నొక్క యుగమం దవతరించినను దేవత్వధర్మముగల పరశు రామునికి సాధ్యముకాని రావణవధ, కేవల మానవత్వమే గలిగిన శ్రీరామచంద్రు నికి సాధ్యమైనది. అందువలన రామపునరుక్తి లేదని చెప్పవచ్చును. ఈశ్లోకము ప్రకాశకారుని మతము ననుసరించి పరశురామ స్తుతిపరముగను సుధావబోధాకారుని మతము ననుసరించి శ్రీదశరథరాముని స్తుతిపరముగను తెలియుచున్నది.

శ్లో. హస్తలేఖ మసృజత్ ఖలు జన్మ
స్థానరేణుక మసౌ భవదర్థమ్ ।
రామః రామ మధరీకృతతత్త
ల్లేఖకః ప్రథమమేవ విధాతా॥

ప. వి. హస్తలేఖ - అసృజత్ - ఖలు - జన్మస్థానరేణుకం - అసౌ - భవదర్థం - రామ! రామం - అధరీకృతతత్తల్లేఖకః - ప్రథమం - ఏవ - విధాతా.

అర్థము: రామ! = ఓ దశరథరామా! అధరీకృత తత్తల్లేఖకః, అధరీకృత = తిరస్కరింపబడిన, తత్తల్లేఖకః, తత్తత్ = ఆయా, లేఖకః = లిపి కర్తలు గలిగిన, ఇంద్రాది దేవతలు గలిగిన, అసౌ = ఈ, విధాతా = బ్రహ్మ, భవదర్థం = నీవంటి ఉత్తమశిల్పమును నిర్మించుటకు, ప్రథమమేవ = తొలుతనే, జన్మస్థాన రేణుకం, జన్మస్థాన = పుట్టుకకు స్థానమైన రేణుకం = జమదగ్ని భార్యయైన రేణుకను గలిగిన, రామం = పరశురాముని, హస్తలేఖం = అభ్యాసమునకైన నమూనా శిల్పమును, అసృజత్ = సృజించెను. ఖలు = నిశ్చయము. ఉత్తమశిల్పరచనకు నైపుణ్యమును సంపాదించుటకై తొలుత నిర్మించెడి నమూనా శిల్పమును హస్తలేఖ మందురు. దీనిచే పరశురాముని కంటె దశరథరామున కుత్కర్ష మేర్పడుచున్నది.

సమాసములు:

హస్తలేఖం: హస్తస్య లేఖః = హస్తలేఖః, తం = హస్తలేఖం.

జన్మస్థానరేణుకం : జన్మనః స్థానం = జన్మస్థానం, జన్మస్థానం రేణుకా యస్య సః = జన్మస్థాన రేణుకః, తం = జన్మస్థానరేణుకం

భవదర్థం : భవతే = భవదర్థం.

అధరీకృతతత్తల్లేఖకం : అనధరః అధరః సమ్పద్యమానః కృతః = అధరీకృతః, తే చ తే లేఖకాః = తత్తలేఖకాః.అధరీ కృతాః తత్తల్లేఖకాః యేన సః = అధరీకృతతత్తల్లేఖకాః

**భావము :**

ఓ దశరథరామా! బ్రహ్మ సుగ్రీవాది రూపములతో యాయాప్రసిద్ధులగు లిపి కర్తలను నింద్రాది దేవతలను భూమియం దవతరింపజేసినవాడై నీ యొక్క లోక కళ్యాణ కరమగు నుత్తమ రూపశిల్పమును నిర్మించుటకై తొట్టతొలుత రేణుకాగర్భ సంజాతుడగు పరశురాముని హస్తలేఖముగా వనగా నీరూపశిల్పము నలవరుచు కొనుటకై యవసరమగు నమూనాగా నిర్మించి పిదప నీ దివ్యమంగళ రూపమును సృజించెను. ఇట్లు చెప్పుటచే పరశురాముని కంటెను శ్రీరామచంద్రుని కుత్కర్ష మేర్పడినది.

శ్లో. ఉద్భవాజతనుజాదజ! కామం
విశ్వభూషణ! న దూషణ మత్ర
దూషణప్రశమనాయ సమర్థం
యేన దేవ తవ వైభవమేవ. 67

ప. వి. ఉద్భవ! అజతనుజాత్ - అజ! కామం - విశ్వభూషణ - న - దూషణం- అత్ర - దూషణ ప్రశమనాయ - సమర్థం - యేన - దేవ - తవ - వైభవం - ఏవ.

అర్థము: అజ! పుట్టుక లేని యో విష్ణూ! అజ తనుజాత్, అజ = అజుడను రఘు పుత్రునికి, తనుజాత్ = పుత్రుడైన దశరథునుండి, కామం = స్వేచ్ఛతో, ఉద్భవ = పుట్టుము, హే విశ్వభూషణ! = ఓ ప్రపంచమున కలంకార భూతుడా!. అత్ర = ఈ విషయమున, అనగా జన్మములేని నీవు అజుని పుత్రుడగు దశరథునకు జన్మించు విషయమున, దూషణం = అసంగతి రూప దోషము, న = లేదు, ఏలయనగా, యేన = ఏ కారణముచేత, హేదేవ! = ఓ స్వామీ! తవ = నీయొక్క, వైభవమేవ = ఐశ్వర్యమే యనగా ప్రభావమే, దూషణప్రశమనాయ, దూషణ = అసాంగత్య దోషముయొక్క ప్రశమనాయ, శాన్తికై, పక్షాన్తరమున, దూషణుడను రాక్షసుని వినాశనమునకై, సమర్థం = శక్తిగలదిగా, (భరతి = అగు చున్నది) నీవు స్వయముగనే జన్మము లేనందువలన నజుడవు. అజ పుత్రుడగు దశరథునకు జన్మించితివి. ఇందు నజుడెవ్వడో యతడెట్లు

జన్మించును? ఎవ్వని తాత యనగా పితామహుడు అజుడగుట వలన జన్మరహితుడై యున్నాడో అతనికి పుత్రు డెట్లుద్భవించును? అట్టిపుత్రుని నుండి నీకు జన్మ మెట్లేర్పడును? ఇవి మున్నగు దోషములు నీకు లేవు. ఏల యనగా నీవు దూషణనాశమునకే జన్మించితివి. మరియు, నజుడను పితామహునినుండి అజపౌత్రుడు పుట్టుటలోను దోషము లేదు. ఏల యనగా? ఉభయులును అజుడను రాజునకు జన్మించిరి.

**సమాసములు :**

అజతనుజాత్ : తనోః జాయత ఇతి తనుజః, అజస్య తనుజః = అజ తనుజః, తస్మాత్ = అజతనుజాత్.

విశ్వ భూషణ : విశ్వస్య భూషణం = విశ్వభూషణం, తస్య సం బుద్ధిః = విశ్వ భూషణ !

దూషణ ప్రశమనాయ : దూషణస్య ప్రశమనం = దూషణప్రశమనం, తస్మై = దూషణప్రశమనాయ.

వైభవం : విభోర్భావః = వైభవం.

**భావము :**

జన్మ రహితుడవైన యో విష్ణూ! అజమహారాజునకు పుత్రుడైన దశరథునకు నీవు స్వేచ్ఛతో జన్మింతువు. ఓ జగద్భూషణా! (ఇట్లు జన్మము లేనందు వలన) అజుడవైన నీవు అజుని పుత్రుడగు దశరథునికి బుట్టుట యందు నసంగతి రూపమగు దోషము లేదు. ఏలయనగా? నో స్వామీ! నీ ప్రభావమే యీ యసఙ్గతి దోషమును హరించును. దూషణుడను రాక్షసుని నాశము గావించును. నీవు స్వయముగా నజుడవై యజుని పుత్రునకు బుట్టుచున్నావు. ఎవ్వ డజుడో యనగా జన్మరహితుడో అతడెట్లు జన్మించును! ఎవ్వని పితామహుడు కూడా నజుడో యనగా జన్మరహితుడో, యతనికెట్లు పుత్రు డుదయించును? అట్టి పుత్రునుండి నీ కెట్లు జన్మము? ఇవి మున్నగు దోషములు లేవు. ఏల యనగా? నీవు దూషణ నాశము కొఱకే జన్మించితివి. మఱియు నజుడను పితామహు నుండి అజపౌత్రు డుదయించుటలో దూషణము లేదు. ఏలయనగా? నుభయులును అజుడను రాజునకు జన్మించిన వారు గదా!

శ్లో. నో దదాసి యది తత్వధియం మే
యచ్ఛమోహమపి తం రఘువత్స।
యేన రావణ చమూ ర్యుధి మూఢా
త్వన్మయంజగ దపశ్య దశేషమ్॥ 68

ప. వి. నో - దదాసి - యది - తత్వ ధియం - మే - యచ్ఛ - మోహం - అపి - తం - రఘువత్స - యేన - రావణచమూః - యుధి - మూఢా - త్వన్మయం - జగత్ - అపశ్యత్ - అశేషమ్.

అర్థము: హే రఘువత్స ! = ఓ శ్రీరామ చన్ద్రా ! ఓ విష్ణూ !, మే = నాకు, తత్వధియం, తత్వ = బ్రహ్మ మందలి, ధియం = జ్ఞానమును, అనగా, మోక్ష సాధనమగు జ్ఞానమును, నో దదాసి యది = (అజ్ఞానముచే నావృతుడగుట వలన) ఈయనిచో, (తర్హి = అపుడు) యేన = ఏ మోహముచే, యుధి = యుద్ధము నందు, రావణ చమూః = రావణాసురుని సేన, మూఢా = భ్రాన్తి నొందినదై, అశేషం = సకలమైన, జగత్ = ప్రపంచమును, త్వన్మయం = నీ స్వరూపముగా అనగా రామమయముగా, అపశ్యత్ = చూచెనో, తం = ఆ, మోహమపి = భ్రమ జ్ఞానము నైనను, మే = నాకు, యచ్ఛ = ఇమ్ము, దాని చేతనే నేను కృతార్థుడను కాగలను.

సమాసములు :

తత్వధియం : తస్య భావః = తత్త్వం, తత్త్వస్య - ధీః = తత్త్వధీః, తాం = తత్త్వధియం.

రఘువత్స : రఘూణాం వత్సః = రఘువత్సః, తస్యసంబుద్ధిః = రఘువత్స!

రావణ చమూః : రావణస్య చమూః = రావణ చమూః.

అశేషం : అవిద్యమానః శేషః యస్య తత్ = అశేషమ్.

భావము:

ఓ రఘునందనా ! విష్ణుస్వరూపా ! ముక్తికి సాధనమగు తత్త్వ జ్ఞానమును నీవు నా కొసంగక పోయినచో యుద్ధమునందు రావణుని సేన

భ్రాన్తిచెంది సమస్త ప్రపంచమును నీ యొక్క స్వరూపముగా ననగా రామ మయముగా జూచినదో యట్టి భ్రాన్తినైనను నాకొసంగుము. దానిచేతనే నేను కృతార్థుడను కాగలను.

శ్లో. ఆజ్ఞయా చ పితు రజ్ఞభియా చ
శ్రీ రహీయత మహీప్రభవా ద్వి:
లఙ్ఘితశ్చ భవతా కిము న ద్వి
ర్వారి రాశి రుదకాఙ్కగలఙ్క:. 69

ప. వి. ఆజ్ఞయా - చ - పితు: - అజ్ఞభియా - చ - శ్రీ: - అహీయత - మహీ ప్రభవా - ద్వి:, లఙ్ఘిత: - చ - భవతా - కిం - ఉ - న - ద్వి: - వారి రాశి: - ఉదకాఙ్కగలఙ్క:.

అర్థము: హే రామ ! = ఓ రామా !, భవతా = నీచే, పితు: = తండ్రియైన దశరథుని యొక్క, ఆజ్ఞయా = ఆదేశముచే, అనగా "అడవికి బొమ్ము" నెడి యాదేశముచే, అజ్ఞభియా, అజ్ఞ = అసత్యములను నపవాదముల నారోపించెడి మూర్ఖుల నుండి, భియా చ = భయము చేతను, మహీ ప్రభవా, మహీ = భూమియే, ప్రభవా = ఉత్పత్తి స్థానముగా గలిగిన, శ్రీ: = రాజ్యలక్ష్మియు, లక్ష్మియొక్క యంశమం దుద్భవించిన భూ పుత్రికయగు సీతయు, ద్వి: = రెండు మాఱులు, అహీయత = విడువబడినది. తండ్రి యాజ్ఞను పరిపాలించుటకై యడవికి వెళ్ళుట వలన రాజ్యలక్ష్మి విడువ బడినది. మూర్ఖ జనుల యపవాద భయముచే సీత విడువబడినదని యర్థము; తథా = అట్లే, ఉదకాఙ్కగలఙ్క:, ఉదక = నీటి యొక్క, అఙ్క = సమీపమును, గ = పొందిన, లఙ్క: = లఙ్కానగరము గలిగిన, వారిరాశి: = సముద్రము, అరి రాశిర్వా = రావణాది శత్రు సమూహమును, ద్వి: = రెండుమాఱులు, నలఙ్ఘితశ్చకిము = లంఘింప బడలేదా యేమి ? ఓడింప బడలేదా యేమి? కాని లంఘింప బడినది. ఓడింప బడినదని యర్థము. కావుననే సత్య సంధుడవును జితేన్ద్రియుడవును గొప్ప ప్రభావము గలవాడవగు నిన్ను నమస్కరింతునని యర్థము.

**సమాసములు :**

అజ్ఞభియా : అజ్ఞేభ్యః భీః = అజ్ఞభీః, తయా = అజ్ఞభియా.
మహీప్రభవా : మహీ ప్రభవః యస్యాః సా = మహీప్రభవా.
వారి రాశిః : వారిణాం రాశిః = వారి రాశిః.
అరి రాశిః : అరీణాం రాశిః = అరిరాశిః.
ఉదకాఙ్కగలఙ్కః : ఉదకస్య అఙ్కః = ఉదకాఙ్కః, ఉదకాఙ్కం గచ్ఛతి ఇతి = ఉదకాఙ్కగా, ఉదకాఙ్కగా లఙ్కా యస్య సః = ఉదకాఙ్కగలఙ్కః.

**భావము :**

ఓ విష్ణూ ! ఓ శ్రీరామా ! నీవు వనమునకు పొమ్మనెడి తండ్రి యాజ్ఞ చేతను మూర్ఖుల వలని యపవాద భయము చేతను, రెండు మాటులు రాజ్య లక్ష్మిని, లక్ష్మియొక్క యంశమునందుద్భవించిన భూ పుత్రికయగు సీతను గోల్పోతివి. అట్లే, జలమునకు సమీపము నందున్న లంకా నగరముతో గూడిన వారిరాశిని అనగా సముద్రమును రావణాది శత్రు సమూహమును క్రమముగా దాటితివి. ఓడించితివి. అట్టి సత్యసంధుడవును ఇంద్రియ నిగ్రహమును గావించిన వాడవును మహా ప్రభావశాలివియు నగు నీకు వన్దనములు.

శ్లో. కామదేవ విశిఖైః ఖలు నేశం
మార్పయ జ్జనక జామితి రక్షః।
దైవతా దమరణే వరవాక్యం తథ్యయత్
స్వ మపునా ద్భవ దస్త్రైః ॥

ప. వి. కామదేవ విశిఖైః - ఖలు - నేశం - మా - అర్పయత్ - జనకజాం - ఇతి - రక్షః - దైవతాత్ - అమరణే - వరవాక్యం - తథ్యయత్ - స్వం - అపునాత్ - భవదస్త్రైః.

అర్థము: హే రామ ! = ఓ శ్రీరామచన్ద్ర! జనకజాం = సీతను, అర్పయత్ = ఇచ్చుచున్న అనగా రామునకు దిరిగి యిచ్చుచున్న, రక్షః = రాక్షసుడను, అహం = నేను, కామదేవవిశిఖైః, కామదేవ = దేవతా స్వరూపుడగు మన్మథుని యొక్క, విశిఖైః = బాణములచే, మా ఖలు నేశం = నాశము

జెందును. అట్లు నశించినచో బ్రహ్మవరము అసత్యమగును. ఇతి = ఇట్లు, (విచిన్త్య=ఆలోచించి) దైవతాత్ = దేవతవలన, అమరణే = మరణించనిచో, అనగా మరణాభావ విషయమున, వరవాక్యం = "నీకు దేవతనుండి మరణము గలుగద"ని బ్రహ్మ పూర్వము రావణున కొసంగిన వరమునకు సంబంధించిన మాటను, తథ్యయత్ = సత్యము గావించు చున్న, రక్షః = రాక్షసుడగు రావణుడు, భవదస్త్రైః,భవత్ = మానవదేహమును ధరించిన నీయొక్క, అస్త్రైః = బాణములచే, స్వం = తన్ను, అపునాత్ = పవిత్రము గావించెను. నీ బాణముచే తన్ను చంపించు కొని పవిత్రత చెందెనని యర్థము. పవిత్రపరచుకొనెనని చెప్పుట వలన కామ బాణము వలన మరణించినచో తనకు అపవిత్రత యేర్పడు నని సూచింపబడినది. కామబాణము వలన మరణమొక్కటే యేర్పడును. నీ బాణము వలననో పాపము నశించి సంసార విముక్తియు గలుగునని యర్థము.

**సమాసములు :**

కామదేవ విశిఖైః : కామ ఇతిదేవః = కామదేవః, కామదేవస్యవిశిఖాః = కామదేవవిశిఖాః, తైః = కామదేవవిశిఖైః,

జనకజాం : జనకాత్ జాయత ఇతి = జనకజా. తాం = జనకజాం.

అమరణే : మరణస్య అభావః = అమరణం, తస్మిన్ = అమరణే,

వరవాక్యం : వరస్య వాక్యం = వరవాక్యం.

తథ్యయత్ : తథ్యం కుర్వత్ = తథ్యయత్.

భవదస్త్రైః : భవతః అస్త్రాణి = భవదస్త్రాణి, తైః = భవదస్త్రైః.

**భావము :**

ఓ రామా! ఓ విష్ణూ! సీతను రామునికై తిరిగి యిచ్చుచున్న రాక్షసు డనగు నేను దేవతాస్వరూపుడగు మన్మథుని బాణములచే మరణింపరాదు. అట్లు నేను మరణించినచో దేవతల వలన నాకు మరణము కలగదని బ్రహ్మయొక్క వరప్రదానవచనము అసత్యము కాగలదు.కావన బ్రహ్మవరమును సత్యముగావించు చున్న నేను మానవదేహమును ధరించిన నీయొక్క బాణములచేతనే మరణమును

బొంది పవిత్రతను బొందితిని. అట్లుగాక మన్మథ బాణములవలన మరణించి యున్నచో నపవిత్రత యేర్పడెడిది. కామబాణముల వలన కేవలము మరణమే కలుగును. నీబాణముచే మరణించినచో నాపాపములు నశించి సంసారమునుండి విముక్తి యేర్పడునని యాశయము.

శ్లో. తద్యశో హసతి కమ్బుకదమ్బం
శమ్బుకస్య న కిమమ్బుధిచుమ్బి ।
నామశేషిత ససైన్యదశాస్యా
దస్తమాప యదసౌ తవ హస్తాత్. 71

ప. వి. తత్ - యశః - హసతి - కమ్బు కదమ్బ - శమ్బుకస్య - న - కిం - అమ్బుధి చుమ్బి - నామశేషితససైన్యదశాస్యాత్ - అస్తమ్ - ఆప - యత్ - అసౌ - తవ - హస్తాత్.

అర్థము : హే రామ! = ఓ శ్రీరామచన్ద్రా! ఓ విష్ణూ!, నామశేషితససైన్యదశాస్యాత్, నామ = పేరుమాత్రమే, శేషిత = శేషముగా గలిగినవాడుగా జేయబడిన, ససైన్య = సేనతో గూడిన, దశాస్యాత్ = రావణుడు గలిగిన, తవ = నీయొక్క, హస్తాత్ = చేతినుండి, అసౌ = ఈ శమ్బుకుడు, యత్ = ఎందువలన, అస్తం = నాశమును (బొందెనో) శమ్బుకస్య = శమ్బుకుడను పేరుకలిగిన శూద్రమునికి, అమ్బుధిచుమ్బ = సాగర పర్యంతము వ్యాపించు, తత్ = ముందుచెప్పబడిన, యశః = కీర్తి, కమ్బు కదమ్బం, కమ్బు = శంఖములయొక్క, కదమ్బం = సమూహమును, న హసతి కిం = పరిహసింపదా యేమి? తప్పక పరిహసించునని యర్థము. అనగా కీర్తియొక్క తెల్లదనము శంఖముల తెల్లదనము నతిశయించి యున్నదని యర్థము. ఎవ్వని హస్తము వలన బ్రహ్మవంశమునబుట్టినట్టి, మూడులోకములను జయించినట్టి రావణుడు వినాశము నొందెనో అతని హస్తమువలన శూద్రకులమున బుట్టిన శమ్బుకముని వినాశము జెందుట యాతనికి గొప్ప సౌభాగ్యమని యర్థము.

**సమాసములు :**

కమ్బుకదమ్బం : కమ్బూనాం కదమ్బః = కమ్బు కదమ్బః, తం = కమ్బు కదమ్బం.

అమ్బుధి చుమ్బి : అమ్బుధిం చుమ్బతీతి = అమ్బుధిచుమ్బి

నామశేషిత ససైన్య దశాస్యాత్ : నామ శేషః యస్య సః = నామ శేషః, నామశేషః కృతః = నామశేషితః, సైన్యేన సహ వర్తత ఇతి = ససైన్యః, ససైన్యశ్చాసౌ దశాస్యశ్చ = ససైన్య దశాస్యః, నామ శేషితః ససైన్య దశాస్యః యేన సః = నామశేషిత ససైన్య దశాస్యః, తస్మాత్ = నామశేషిత ససైన్య దశాస్యాత్.

**భావము :**

ఓ రామా! విష్ణుస్వరూపా! రావణాసురుని సైన్యముతో గూడ నామావశేషము దేనిచే గావించితివో అట్టి నీ హస్తమువలన నాశము గావింపబడిన శమ్బుకుడు అను శూద్రముని యొక్క తెల్లని కీర్తి సముద్రము పర్యంతము వ్యాపించినదై యందలి శంఖసమూహముల తెల్లదనమును పరిహసింపదా? తప్పక పరిహసించును. ఏ నీ హస్తము వలన బ్రహ్మకులము నందు జన్మించినట్టి మూడు లోకములను జయించిన రావణాసురుడు నాశము చేయబడెనో, అట్టి హస్తము వలన శూద్ర కులమునందు జన్మించిన శమ్బుకముని నాశము చేయబడుట యాతని మహాభాగ్య విశేషమే కదా!

శ్లో. మృత్యు భీతికర పుణ్య జనేన్ద్రి
త్రాసదానజ ముపార్జ్య యశ స్తత్
హ్రీణవానసి కథన్న విహాయ
క్షుద్రదుర్జన ధియా నిజదారాన్ ॥

ప. వి. మృత్యు భీతికర పుణ్య జనేన్ద్రి త్రాస దానజం - ఉపార్జ్య - యశః - తత్ - హ్రీణవాన్ - అసి - కథం - న - విహాయ - క్షుద్ర దుర్జన ధియా - నిజ దారాన్.

అర్థము: మృత్యు భీతికర పుణ్య జనేన్ద్ర త్రాసదానజం, మృత్యు = మృత్యువునకు, అనగా యమునకు, భీతి = భయమును, కర = చేయునట్టి, పుణ్యజన = రాక్షసులకు, ఇంద్ర = ప్రభువైన రావణాసురునకు, త్రాస = మరణము వరకును భయమును, దానజం = కల్పించుట వలన ఏర్పడినట్టి, తత్ = ఆ మిక్కిలి ప్రసిద్ధి నొందినయనగా మూడు లోకముల యందును గానము చేయబడునట్టి, యశః = కీర్తిని, ఉపార్జ్య = సంపాదించి, క్షుద్ర దుర్జన భియా, క్షుద్ర = అల్పులైన, దుర్జన = దుష్టుల వలని, భియా = భయముచే, అనగా పామర జనము వలని అపవాద భయముచే, నిజ దారాన్, నిజ = తనయగు, దారాన్ = భార్యను, అనగా ప్రియురాలైన సీతను, విహాయ = వదలి, కథం = ఎట్లు, న హ్రీణవానసి = సిగ్గుపడవు. తప్పక సిగ్గుపడ వలసినది.

సమాసములు :

మృత్యుభీతికర పుణ్య జనేన్ద్ర త్రాసదానజం : మృత్యోః భీతిః = మృత్యుభీతిః, మృత్యుభీతిం కరోతీతి = మృత్యుభీతి కరః, పుణ్య జనానాం ఇన్ద్రః = పుణ్యజనేన్ద్రః, మృత్యుభీతికర శ్చాసౌ పుణ్య జనేన్ద్రశ్చ = మృత్యుభీతికర పుణ్యజనేన్ద్రః, మృత్యుభీతికర పుణ్య జనేన్ద్రస్య త్రాసః = మృత్యుభీతికర పుణ్యజనేన్ద్రత్రాసః, మృత్యు భీతికర పుణ్యజనేన్ద్ర త్రాసస్య దానం = మృత్యుభీతికర పుణ్యజనేన్ద్ర త్రాసదానం, మృత్యుభీతికర పుణ్యజనేన్ద్ర త్రాసదానాత్ జాయత ఇతి = మృత్యుభీతికర పుణ్యజనేన్ద్ర త్రాసదానజం, తత్ = మృత్యుభీతికర పుణ్యజనేన్ద్ర త్రాసదానజం.

క్షుద్ర దుర్జనభియా : క్షుద్రాశ్చ తే దుర్జనాశ్చ = క్షుద్రదుర్జనాః, క్షుద్రదుర్జనేభ్యః భీః = క్షుద్రదుర్జనభీః, తయా క్షుద్రదుర్జనభియా.

నిజదారాన్ : నిజాశ్చ తే దారాశ్చ = నిజదారాః, తాన్ = నిజదారాన్.

భావము :

యమునివలన లోకములన్నియు భయము జెందును. అట్టి యమునకును

భయము గలిగించునట్టి రాక్షసరాజగు రావణాసురునకును భయము గల్పించుట వలన గొప్పకీర్తిని గడించితివి. మూడులోకముల చేతను పొగడబడుచున్న యట్టి కీర్తిని గడించిన నీవు అల్పులైన జనులవలని యపవాదమునుండి భయపడి ప్రియమైన భార్యయగు సీతను బరిత్యజించి ఎట్లు సిగ్గుపడక యున్నావు? తప్పక యీ పనికి నీవు సిగ్గుపడవలయును. అధిక మానవతి యగు సీతను అపహరించిన రావణుని సంహరించితివి. లోకాపవాద భయమువలన నామెను పరిత్యజించితివి. ఇటువంటి శూరుడును అభిమానియు, లోకాపవాద భీరువును లోకమునం దెవ్వడును లేడని యాశయము.

గమనిక :- ఈ శ్లోకమును నారాయణ పండితుడు వ్యాఖ్యానించుట వలన దానిని అనుసరించి యిది వ్యాఖ్యాతమై యిట చేర్చబడినది.

శ్లో. ఇష్టదార విరహౌర్వ పయోధి
స్త్వం శరణ్య శరణం స మమైధి
లక్ష్మణ క్షణ వియోగ కృశానౌ
య స్స్వజీవిత తృణాహుతియజ్వా॥ 72

ప. వి. ఇష్టదారవిరహౌర్వపయోధిః - త్వం - శరణ్య - శరణం - సమం - ఏధి - లక్ష్మణక్షణవియోగ కృశానౌ - యః - స్వజీవితతృణాహుతి యజ్వా.

అర్థము: శరణ్య = ఓ ఆశ్రిత రక్షకా ! రామా !, యః = ఏ, త్వం = నీవు, లక్ష్మణక్షణవియోగకృశానౌ, లక్ష్మణ = సోదరుడగు లక్ష్మణుని యొక్క, క్షణవియోగ = అత్యల్పకాలపు విరహమనెడి, కృశానౌ = అగ్ని యందు; స్వజీవిత తృణాహుతి యజ్వా, స్వ = తనదగు, జీవిత = జీవిత మనెడి, తృణ = గడ్డిపోచను, ఆహుతిదాన = ఆహుతిగా నొసంగుటచే అనగా హోమము చేయుటచే, యజ్వా = యాగము చేసినవాడవుగా (ఆసీః = అయితివి) సరయూ నది జలముల యందు మునిగి దేహత్యాగము గావించిన లక్ష్మణునియొక్క క్షణకాల వియోగమును గూడ సహింప జాలక నీవు నీ జీవితమును బరిత్యజించి

తివి. అట్టి, ఇష్టదార విరహౌర్వ పయోధిః, ఇష్టదార = ప్రియురాలగు భార్యయొక్క, విరహౌర్వ=వియోగమనెడి బడబాగ్నికి, పయోధిః = సముద్రమైన, త్వం=నీవు, మమ=నాకు, శరణం = రక్షకుడవుగా, ఏధి = ఉండుము. ప్రియురాలి స్నేహము కంటెను సోదరస్నేహమే గొప్పదని యర్థము.

**సమాసములు :**

ఇష్టదార విరహౌర్వ పయోధిః : ఇష్టాశ్చ తే దారాశ్చ= ఇష్టదారాః, ఇష్టదారాణాం విరహః = ఇష్టదార విరహః, ఇష్టదార విరహ ఏవ ఔర్వః = ఇష్టదార విరహౌర్వః, ఇష్టదార విరహౌర్వస్య పయోధిః = ఇష్టదార విరహౌర్వ పయోధిః.

హే శరణ్య : శరణే సాధుః = శరణ్యః, తస్య సంబుద్ధిః = హే శరణ్య !

లక్ష్మణ క్షణ వియోగ కృశానౌ : క్షణం వియోగః=క్షణవియోగః, లక్ష్మణస్య క్షణవియోగః = లక్ష్మణ క్షణ వియోగః, లక్ష్మణ క్షణ వియోగ ఏవ కృశానుః=లక్ష్మణ క్షణ వియోగ కృశానుః, తస్మిన్= లక్ష్మణ క్షణ వియోగ కృశానౌ.

స్వజీవిత తృణాహుతి యజ్వా : స్వస్య జీవితం = స్వజీవితం, స్వ జీవితమేవ తృణం = స్వ జీవిత తృణం, స్వ జీవిత తృణస్య ఆహుతిః=స్వజీవిత తృణాహుతిః, స్వ జీవిత తృణాహుతేః యజ్వా= స్వ జీవిత తృణాహుతి యజ్వా.

**భావము :**

ఓ ఆశ్రిత రక్షకా ! శ్రీరామా ! సోదరుడైన లక్ష్మణుని యొక్క క్షణకాల వియోగమును భరింపలేక పోతివి. అతని వియోగాగ్ని యందు నీ యొక్క జీవితమను గడ్డిపోచను హోమము గావించి యాజ్ఞికుడ వైతివి. సరయూ నది యందు మునిగి లక్ష్మణుడు దేహమును బరిత్యజించెను. అపుడు శ్రీరామచంద్రుడు సోదరుడగు నా లక్ష్మణుని క్షణిక వియోగమును కూడా దాళజాలక తన జీవితమును కూడా పరిత్యజించెను. ఆ గాథ యిట యనుసంధేయము.

ప్రియురాలి విరహమను బడబాగ్నికి సముద్రమైన నీవు అనగా ప్రియురాలి విరహమునకు కుమిలెడి నీవు నాకు రక్షకుడవై యుండుము. ప్రియురాలి స్నేహము కంటెను సోదర స్నేహము గొప్పదని భావము.
ఇచ్చట పురాణ గాథలు.

1. రావణుడు సీతనపహరించిన పిదప లంకయందు యుద్ధముజరుగు సమయమున, మేఘనాథుని బాణముతో లక్ష్మణుడు మూర్ఛజెందెను. మూర్ఛజెందిన లక్ష్మణుని గాంచి రాముడును నాతనివిరహమును సహింపజాలక మూర్ఛ నొందెను. ఇది వాల్మీకి రామాయణమునందు యుద్ధకాండమున గలదు.

2. లేదా రామావతారము ముగియు సమయమునందు నారామునియొద్దకుకి కాలపురుషుడు ఋషి వేషమును ధరించివచ్చి యాతనితో నేకాన్తమునందు సంభాషింపగోరెను. దానికి రాము డంగీకరించి ద్వారమునందు లక్ష్మణునుంచి తమ యేకాన్త సంభాషణకాలమం దెవ్వరు వచ్చినను లక్ష్మణునికి మరణదండన విధింపబడునని చెప్పెను. ఇవ్విధముగా శ్రీరాముడు శాసించి ఋషిరూపమును ధరించిన కాలునితో నేకాన్త భవనమునందు సల్లాపము జేయుచుండగా దుర్వాస మహర్షి వచ్చి రాముని గలియ గోరెను. రాముని గలియనీయనిచో రఘువంశ మంతయు నశించునట్లు శాపమిత్తు ననెను. అపుడు లక్ష్మణుడు దాని నాలోచించి దుర్వాసుని లోపలికి పంపనిచో రఘువంశమంతయు నశించును. అతనిని నాలోపలి బంపిన నానొక్కడే నశించును. తక్కిన రఘువంశస్థు లందరును జీవింపగలరని భావించి యాతనిని లోపలికి బంపి తాను శ్రీరామచంద్రుడు విధించిన శాసనమును బరిపాలించుటకై సరయూనదియందు మునిగి ప్రాణత్యాగము గావించుకొనెను. అపు డతని విరహమును దాళజాలక శ్రీరామచంద్రుడు పరమధామమునకు బయనించెను. ఈకథ వాల్మీకిరామాయణమునందలి యుత్తరకాండయందు లభించుచున్నది.

శ్లో. క్రౌఞ్చ దుఃఖమపి వీక్ష్య శుచా యః
శ్లోకమేక మసృజత్ కవి రాద్యః ।
స త్వదుత్థకరుణః ఖలు కావ్యం
శ్లోకసింధు ముచితం ప్రబబంధ ॥ 73

ప. వి. క్రౌఞ్చదుఃఖం - అపి - వీక్ష్య - శుచా - యః - శ్లోకం - ఏకం - అసృజత్ - కవిః-ఆద్యః - సః - త్వదుత్థకరుణః - ఖలు - కావ్యం - శ్లోకసింధుం - ఉచితం - ప్రబబంధ.

**అర్థము:** హేరామ! = ఓరామా!, విష్ణో! = ఓవిష్ణుస్వరూపా!, యః = ఏ, **ఆద్యః** = మొట్టమొదటి, కవిః = కవియైన వాల్మీకి మహర్షి, క్రౌంచ దుఃఖం, క్రౌఞ్చ = కామపరవశములగు క్రౌంచపక్షుల జంటలో నొక్క దానిని వేటగాడు జంపగా జీవించియున్న మరియొక పక్షియొక్క, దుఃఖం = శోకమును, వీక్ష్యాఽపి = చూచియు, శుచా = శోకముచే, ఏకం = ఒక్కటైన, (అముం = ఈ) శ్లోకం = శోకమునుండి యుద్భవించుటవలన శ్లోకమైనట్టి పద్యమును, అసృజత్ = రచించెనో, సః = ఆ యాదికవి, త్వదుత్థకరుణః, త్వత్ = నీవలన, ఉత్థ = ఉద్భవించిన, కరుణః = దయగలిగినవాడగుచు, ఉచితం ఖలు = యోగ్యమే అయిన, శ్లోకసింధుం = శ్లోకములకు సముద్రమే అయిన అనగా నిరువదినాలుగు వేలు శ్లోకములు గల్గిన, కావ్యం = రామాయణకావ్యమును, ప్రబబంధ = రచించెను.

**సమాసములు :**

క్రౌఞ్చదుఃఖం : క్రౌఞ్చస్య దుఃఖం = క్రౌఞ్చదుఃఖం, తత్ = క్రౌఞ్చదుఃఖం.

త్వదుత్థకరుణః : త్వత్ ఉత్థా కరుణా యస్య సః = త్వదుత్థకరుణః

శ్లోకసింధుం : శ్లోకానాం సిన్ధుః = శ్లోకసింధుః, తం = శ్లోకసింధుం.

**భావము :**

ఓరామా! ఓ విష్ణూ! ఆదికవి యగు వాల్మీకిమహర్షి, క్రౌఞ్చపక్షుల జంటలో నొకపక్షిని బోయవాడు జంపగా శేషించిన మరియొకపక్షియొక్క దుఃఖమును జూచి శోకముతో.

"మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమ శ్శాశ్వతీ స్సమాః ।
యత్క్రౌఞ్చమిథునా దేక మవధీః కామమోహితమ్ ॥

అను, శోకమునుండి యుద్భవించుటచే, శ్లోకమైన యొకపద్యమును రచించెను. ఆ యాదికవి సీతావియోగ దుఃఖపీడితుడవైన నీవలన నుద్భవించిన కరుణరసము గల్గినవాడై, దానికి తగినట్టి శ్లోకసముద్రమగు రామాయణకావ్యమును రచించెను. మిక్కిలి క్షుద్రమగు పక్షికై యొకశ్లోకమును రచించినపుడు పురుషోత్తముడవైన నీవలనిశోకముచే నరువదినాలుగువేల శ్లోకములచే గూడుట వలన సముద్రముతో సమానమైన రామాయణమహాకావ్యమును రచించుట సముచితమని, తలంచి దానిని రచించెను.

వాల్మీకిమహర్షి స్నానార్థమై తమసానదికి బోగా నానదిగట్టున చెట్టుపై క్రౌంచపక్షుల జంట కామపరవశమై యుండినది. అపుడు బోయవాడొకడు ఆపక్షులలో మగపక్షిని జంపెను. అందువలన జీవించియున్న యాడపక్షి విలపింప దొడగెను. ఆదృశ్యమును జూచిన వాల్మీకిమహర్షియు శోకపరవశు డాయెను. అపు డాతనినోట నప్రయత్నముగా "మానిషాద" యిత్యాదిగా బైశ్లోకము ఒకటి వెలువడినది. దాని యర్థములు.

1. హే నిషాద! = ఓ బోయవాడా! త్వం = నీవు, శాశ్వతీః = శాశ్వతములైన, సమాః = సంవత్సరములు, ప్రతిష్ఠాం = ప్రతిష్ఠను, మా గమః = పొందవు. యత్ = ఏల యనగా, క్రౌఞ్చమిథునాత్ = క్రౌంచపక్షుల జంటనుండి, కామమోహితం = కామపరవశమైన మగపక్షిని, ఏకం = ఒకదానిని, అవధీః = చంపితివో.

2. మానిషాద!, మా = లక్ష్మికి, నిషాద = నివాసస్థానుడా, ఓ రామా! = త్వం = నీవు, శాశ్వతః = శాశ్వతములైన, సమాః = సంవత్సరములు, ప్రతిష్ఠాం = ప్రతిష్ఠను, అగమః = పొందితివి. యత్ = ఏలయనగా, క్రౌంచమిథునాత్ = రాక్షసుల జంటనుండి యనగా మండోదరీ రావణుల జంటనుండి, కామమోహితం = కామముతో మోహముజెందిన ఏకం = ఒకడగురావణుని, అవధీః = పరిమార్చితివో.

ఇది రామాయణ మహాకావ్యమునకే యాదిమశ్లోకము. దీనికి పూర్వము వేదములలోని యనుష్టుప్ ఛందములోని బంధములో యుండినవి. ఈ శ్లోకము తోడనే లౌకికఛందములలో గ్రన్థనిర్మాణము ప్రారంభమైనది. కావుననే రామాయణ మాదికావ్య మనియు దాని కర్తయగు వాల్మీకి ఆదికవి యనియు

చెప్పబడుచున్నవి. కావుననే "నిషాద విద్ధాణ్డజ దర్శనోత్థః శ్లోకత్వ మాపద్యత యస్య శోకః" యని బోయవాడు కొట్టిన పక్షిని జూచుట వలన కలిగిన శోకమే శ్లోకమైనదనియు, "క్రౌఞ్చద్వన్ద్వ వియోగోత్థః శోకః శ్లోకత్వమాగతః" అనియు చెప్పుదురు.

శ్లో. విశ్రవః పితృకయాప్తు మనర్హం
సశ్రవస్త్వ మనయేత్యుచితజ్ఞః ।
త్వం చకర్తిథ న శూర్పణఖాయా
లక్ష్మణేన వపుషా శ్రవసీ వా ॥ 74

వ. వి. విశ్రవః-పితృకయా - ఆప్తుం - అనర్హం - సశ్రవస్త్వం - అనయా - ఇతి - ఉచితజ్ఞః - త్వం - చకర్తిథ -న-శూర్పణఖాయాః -లక్ష్మణేన - వపుషా - శ్రవసీ - వా.

అర్థము: హేరామ! = ఓరామా!, విష్ణో! = ఓ విష్ణూ!, విశ్రవః, పితృకయా, విశ్రవః = విశ్రవుడను ముని, (చెవులు లేని వానిని) పితృకయా = తండ్రిగా గల్గిన, అనయా = ఈ శూర్పణఖచే, సశ్రవస్త్వం = చెవులతోగూడియుండుటను, ఆప్తుం = పొందుటకు; అనర్హం = తగదు, ఇతి = అని, ఉచితజ్ఞః = ఉచితజ్ఞుడవైన, త్వం = నీవు, లక్ష్మణేన = లక్ష్మణరూపమైన, వపుషా = తన శరీరముచే, ననగా, నొక్క విష్ణువే తన్ను నాలుగు విధములుగా విభజించి రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల రూపముతో నవతరించెనని యర్థము, శూర్పణఖాయాః = శూర్పణఖ యను రావణుని చెల్లెలగు రాక్షసియొక్క, శ్రవసీ = చెవులను, కిం వా న చకర్తిథ = ఏల కోయవు? అనగా తప్పక కోసితివని యర్థము.

**సమాసములు :**

విశ్రవః పితృకయాః: విశ్రవాః పితా యస్యాః సా = విశ్రవః పితృకా, తయా = విశ్రవఃపితృకయా, పక్షాన్తరమున, విగతే శ్రవసీ యస్యాసః విశ్రవః, విశ్రవాః పితాయస్యాసా = విశ్రవః పితృకా, తయా = విశ్రవః పితృకయా.

అనర్హం : న అర్హం = అనర్హం.

సశ్రవస్త్వం : సహ శ్రవసీ యస్యాః సా = సశ్రవాః, సశ్రవసః భావః = సశ్రవస్త్వం.
ఉచితజ్ఞః : ఉచితం జానాతీతి = ఉచితజ్ఞః.

**భావము :**

ఓ రామా! విశ్రవుడను మహర్షికి పుత్రికయు (చెవులులేనివాని పుత్రికయు) అగు శూర్పణఖకు సశ్రవస్త్వము అనగా చెవులుండుట తగదని భావించి యుచితజ్ఞుడైన నీవు లక్ష్మణరూపమగు నీదేహముతో రావణుని చెల్లెలగు శూర్పణఖయొక్క చెవులను గోసితివి గదా! ఒక్క విష్ణువే తన్ను నాలుగు భాగములు గావించుకొని రామలక్ష్మణభరత శత్రుఘ్న రూపములతో నవతరించి నందువలన లక్ష్మణుని దేహముగూడ రాముని దేహమే యగుచున్నది.

శ్లో. తే హరన్తు నిర్ఋతి వ్రతతిం మే
యైస్సకల్ప విటపీ తవ దోర్భిః ।
ఛద్మ యాదవతనో రుదపాటి
స్పర్ధమాన ఇవ దానమదేన॥ 75

ప. వి. తే - హరన్తు - నిర్ఋతివ్రతతిం - మే - యైః - సః - కల్పవిటపీ - తవ - దోర్భిః - ఛద్మ యాదవతనోః - ఉదపాటి - స్పర్ధమానః - ఇవ - దానమదేన.

అర్థము: హే విష్ణో! = ఓవిష్ణూ, కృష్ణా!, ఛద్మయాదవతనోః, ఛద్మ = కపటముతో, యాదవ = యదువంశమునం దుద్భవించిన కృష్ణరూపమైన, తనోః = శరీరముగల (స్వభావముగా భగవన్తుడు నిరాకారుడు గాన లీలచే యాదవ శరీరమును స్వీకరించెనని యర్థము), తవ = నీయొక్క, యైః = ఏ, దోర్భిః = నాలుగు భుజములతో, దానమదేన = లోకముల యిష్టముల నొసంగుటవలన గల్గిన గర్వముచే, స్పర్ధమానఇవ = కలహించుచున్నదో యనునట్లున్న, సః = అప్రసిద్ధమైన, కకల్పవిటపీ = కల్పవృక్షము, ఉదపాటి = (నీబాహువులతో కలహించుటతలని యహఙ్కారమును తొలగించుటకై) పెకలింపబడినది. తే = అటువంటి

నీబాహువులు, మే = నాకుసంబంధించిన, నిర్ ఋతి వ్రతతిం, నిర్ ఋతి = అలక్ష్మియనెడి, వ్రతతిం = తీగెను, హరన్తు = తొలగించునుగాత, "దురితవ్రతతిం" అనుపాఠముకూడ కలదు. ఇదియే సరియైనది. దురిత వ్రతతిం, దురిత = పాపమనెడి, వ్రతతిం = తీగెను, హరంతు = నాశము చేయునుగాత. గొప్పవృక్షమునే నశింపచేయు శక్తిగలిగిన నీబాహువులకు దీగెను త్రుంచుట యొక లెక్కలోనిదిగాదు గదా! కృష్ణుడు కల్ప వృక్షమును పెకలించిన కథ హరివంశము నందున్నది.

**సమాసములు :**

నిర్ ఋతి వ్రతతిం : నిర్ ఋతి రేవ వ్రతతిః = నిర్ ఋతివ్రతతిః, తాం = నిర్ ఋతి వ్రతతిం.

కల్పవిటపీ : కల్ప ఇతి విటపీ = కల్పవిటపీ,

దానమదేన : దానస్య మదః = దానమదః, తేన = దానమదేన,

**భావము:**

ఓ విష్ణుస్వరూపుడవైన శ్రీకృష్ణా! స్వభావముగా నిరాకారుడవైనను లీలకై యదువంశమందలి శ్రీకృష్ణదేహమును ధరించిన నీ నాలుగు భుజములతో లోకముల యభీష్టములను తీర్చుటవలని యహంకారముచే గలహించుచున్నదో యనునట్లున్న యా ప్రసిద్ధమగు కల్పవృక్షమునట్టి బాహువులతో పెకలించివైచితివి. అట్టి నీ భుజములు నాపాపమనెడి తీగెను నశింపచేయునుగాత. వృక్షమునే పెకలించిన నీకు తీగెను పెకలించి వేయుట మిక్కిలి సులభమేకదా!

శ్లో. బాలకేలిషు తదా యదలాపీః

కర్పరీభి రభిహత్య తరఙ్గాన్

భావి బాణభుజ భేదనలీలా

సూత్రపాత ఇవ పాతు తదస్మాన్. 70

ప. వి. బాలకేలిషు - తదా - యత్ - అలాపీః - కర్పరీభిః - అభిహత్య - తరఙ్గాన్ - భావి బాణ భుజ భేదన లీలా సూత్రపాతః - ఇవ - పాతు - తత్ - అస్మాన్.

**అర్థము :** హేవిష్ణో! = ఓవిష్ణూ, హేకృష్ణ! = ఓశ్రీకృష్ణా!, తదా = ఆ చిన్ననాటి, బాలకేలిషు = శిశువుగా నీవు ఆడిన యాటలయందు, కర్పరీభిః = కుండ పెంకులచే, అభిహత్య = కొట్టి, తరఙ్గాన్ = (యమునయందు) అలలను, యత్ = ఎందువలన, అలావీః = త్రుంచితివో, అనగా యమునా జలములలో పెంకులు పరవైచి వానిని అలలుగా త్రుంచితివో (ఈవిధముగా పిల్లలు చేయుట ప్రసిద్ధము). భావిబాణభుజభేదన లీలాసూత్రపాత ఇవ, భావి = జరుగగల, బాణ = బాణాసురుడనెడి రాక్షసరాజుయొక్క, భుజ = వేయి భుజములను, భేదన = త్రుంచుటయను, లీలా = ఆటకు, సూత్రపాత ఇవ = మొదటి సూచనవలె నున్న, తత్ = ఆతరఙ్గఖణ్డనము, అస్మాన్ = ప్రకృతి వర్గముతో గూడిన నన్ను, పాతు = రక్షించుగాత, లోకమున బండి వగైరాలను జేసెడి వ్రడంగులు కొయ్యలను బడవేయుటకు ముందు వానిపై నల్లదారముతో గీతలు వేసుకొనెదరు. ఆ విధముగా నట నాటలకు గీతలు వేయబడినవని యర్థము.

**సమాసములు :**

బాలకేలిషు : బాలస్య కేలయః = బాలకేలయః, తాసు = బాలకేలిషు.

భావి బాణ భుజభేదన లీలాసూత్రపాతః : బాణస్య భుజాః = బాణభుజాః, బాణభుజానాం భేదనం = బాణభుజభేదనం; బాణభుజభేదన మేవ లీలా = బాణభుజభేదనలీలా, భావినీ చ సా బాణభుజభేదనలీలా చ = భావిబాణభుజ భేదనలీలా, సూత్రస్య పాతః = సూత్రపాతః, భావిబాణ భుజభేదనలీలాయాః సూత్రపాతః = భావి బాణ భుజభేదన లీలాసూత్రపాతః.

**భావము :**

ఓ కృష్ణా! చిన్ననాటి యాటలయందు, కుండ పెంకులచే, యమునలోని యలలను గొట్టి వానిని చిన్న చిన్న ముక్కలు గావించితివి. అది భవిష్యత్తునందు నీవు బాణాసురుడను రాక్షసరాజుయొక్క వేయిభుజములను తెగనరుకుట యను నాటకు మొదటి సూచనము. అట్లు నీవు అలలను త్రుంచుట ప్రజలతో గూడిన నన్ను గాచునుగాత.

శ్లో. కర్ణశక్తి మఫలాం ఖలు కర్తుం
సజ్జితార్జున రథాయ నమస్తే ।
కేతనేన కపినోరసి శక్తిం
లక్ష్మణంకృతవతా హృతశల్యమ్॥ 77

ప. వి. కర్ణశక్తిం - అఫలాం - ఖలు - కర్తుం - సజ్జితార్జునరథాయ - నమః - తే - కేతనేన - కపినా - ఉరసి - శక్తిం - లక్ష్మణం - కృతవతా - కృతశల్యం.

అర్థము : హేవిష్ణో! కృష్ణ!=విష్ణువైన శ్రీకృష్ణభగవానుడా!;ఉరసిశక్తిం,ఉరసి =రొమ్మునందు, రావణుడు ప్రయోగించిన, శక్తిం =శక్త్యాయుధము గల్గిన,లక్ష్మణం=లక్ష్మణుని.హృతశల్యం =గంధమాదనపర్వతముతో బాటు తెచ్చిన విశల్యకరణి యను నోషధిచే తొలగింపబడిన,శక్తిశేలమను నస్త్రము గలిగిన వానినిగా, కృతవతా= చేసిన. కపినా = వానరుడగు హనుమన్తుడను,కేతనేన=ధ్వజముచే అనగారధ్వజమగు హనుమన్తునిచే ఖలు = నిశ్చితముగా, కర్ణశక్తిం = కర్ణుని యొక్క సామర్థ్యమనెడి కానూనామకమగు నస్త్రవిశేషమును, అఫలాం = వ్యర్థమైన దానినిగా కర్తుం = చేయుటకు. సజ్జితార్జున రథాయ, సజ్జిత = జోడింపబడిన అర్జున రథాయ =అర్జునుని రథము గల్గిన, తే =అర్జునసారథివైన నీ కొఱకు, నమః=వన్దనము.

సమాసములు :

కర్ణశక్తిం : కర్ణస్య శక్తిః =కర్ణశక్తిః, తాం=కర్ణశక్తిం.

అఫలాం : అవిద్యమానం ఫలం యస్యాః సా = అఫలా, తాం = అఫలాం.

సజ్జితార్జునరథాయ : అర్జునస్య రథః = అర్జునరథః, సజ్జితః అర్జున రథః యేనసః = సజ్జితార్జునరథః, తస్మై = సజ్జితార్జునరథాయ.

ఉరసిశక్తిం : ఉరసి శక్తిః యస్య సః = ఉరసిశక్తిః, తం=ఉరసి శక్తిం.

హృతశల్యం: హృతం శల్యం యస్మాత్ సః = హృతశల్యః, తం = హృతశల్యం.

**భావము :**

ఓ కృష్ణా ! లక్ష్మణుని రొమ్మున శక్తిశేలమను నాయుధమును రావణుడు ప్రయోగించగా దానిని గంధమాదన పర్వతము తోడ తెచ్చిన విశల్య కరణి యను నోషధిచే హనుమన్తుడు తొలగించెను. అట్టి హనుమన్తుడను ధ్వజముతో నిశ్చయముగనే కర్ణుని కాసూ నామకమగు నస్త్రమును విఫలము గావించుటకై యర్జునుని రథమును సిద్ధపరచిన పార్థసారథివైన నీకు వన్దనము. రామావతార మందు రావణుడు ప్రయోగించిన శక్తిశేల మను నాయుధముచే మృత ప్రాయుడైన లక్ష్మణ స్వామిని హనుమన్తుడు జీవింప జేసెను. అట్టి హనుమన్తుని సామర్థ్యమును అనగా శక్తిశేలాయుధమును తొలగించుట యందలి సామర్థ్యము మును నీ వెఱింగితివి. ఇపుడు కృష్ణావతారమందును దానిని స్మరించి, కర్ణుడు ప్రయోగించిన శక్త్యాయుధమును విఫలము గావించుటకు ఆ హనుమన్తునే నీవు అర్జునుని ధ్వజమందు నెలకొల్పితివి. అట్టి యుద్ధ కుశలుడవైన నీకు వన్దనమని యాశయము.

శ్లో. నాపగేయ మనయ స్సశరీరం
 ద్యాంవరేణ నితరామపి భక్తం
 మా స్మ భూత్ సురవధూ సురతజ్ఞో
 దివ్యపి వ్రతవిలోపభియేతి ॥ 78

ప. వి. న - ఆపగేయం - అనయః - స శరీరం - ద్యాం - వరేణ - నితరాం- అపి - భక్తం - మా - స్మ - భూత్ - సురవధూసురతజ్ఞః - దివి - అపి - వ్రతవిలోపభియా - ఇతి.

అర్థము: హే విష్ణో ! కృష్ణ ! = విష్ణు స్వరూపుడవైన ఓ కృష్ణా !, వ్రతవిలోప భియా, వ్రత = అజన్మ బ్రహ్మచర్య నియమమునకు, విలోప = భంగము వలని, భియా = భయముచే, భీష్ముడు యావజ్జీవము బ్రహ్మ చారిగ నుండ సంకల్పించెను. అందువలన దేవతాస్త్రీలచే తన బ్రహ్మ

చర్యమునకు భంగము కలుగునను భయముతో, దివ్యపి = స్వర్గము నందును, సురవధూసురతజ్ఞః, సురవధూ = దేవతాస్త్రీల యొక్క, సురత = సంభోగమును, జ్ఞః = తెలిసినవాడుగా, మా స్మ భూత్ = కారాదు, ఇతి = అని, (ఇట్లు) (విచార్య = విచారించి) నితరాం = మిక్కిలి, భక్తం = అనురాగము గలవాడును, సేవకుడును అగు, ఆప గేయం = గంగాపుత్రుడైన భీష్ముని, వరేణ = "శరీరము తోడనే స్వర్గమునకు బొమ్ము" అని వరమొసంగుటచే, సశరీరం = దేహ సహితుని గనే, ద్యాం = స్వర్గమును, నానయ = పొందింప లేదా? కాని స్వర్గ మున కంటెను శ్రేష్ఠమైన మోక్షమునే పొందించితివి. కాన నీకు భక్తుల యెడ నభిమాన మపూర్వమైనది.

సమాసములు :

ఆపగేయం : అపాం సమూహః = ఆపం, ఆపేన గచ్ఛతీతి = ఆపగా, అపగాయాః అపత్యం పుమాన్ = ఆపగేయః, తం = ఆపగేయం.

సశరీరం : శరీరేణ సహవర్తత ఇతి = సశరీరః, తం = సశరీరం.

సురవధూసురతజ్ఞ : సురాణాం వధ్వః = సురవధ్వః. సురవధూనాం సురతం = సురవధూసురతం, సురవధూసురతం జానాతీతి = సుర వధూ సురతజ్ఞః.

వ్రత విలోపభియా : వ్రతస్య విలోపః = వ్రతవిలోపః, వ్రత విలోపాత్ భీః = వ్రత విలోపభీః, తయా = వ్రత విలోపభియా.

భావము :

ఓ కృష్ణా! ఆ జన్మ బ్రహ్మచర్య నియమమునకు భంగము గలుగునను భయముతో స్వర్గమునందును దేవతాస్త్రీల సంభోగమును భీష్ముడు చేయరాదని యాలోచించి తన యెడ మిక్కిలి భక్తుడు తనకు సేవకుడును నగు నాగంగా పుత్రుడైన భీష్ముని సశరీరముగా స్వర్గము నేగుటకై వర మొసంగి యాతని నావిధముగనే స్వర్గమునే గాదు స్వర్గమున కంటెను శ్రేష్ఠమైన మోక్షధామమునే పొందించితివి. కాన నీ భక్తవాత్సల్య మెనలేనిది.

శ్లో. ఘాతితార్కసుత కర్ణదయాలు

ర్జైత్రితేన్దు కుల పార్థ కృతార్థః

అర్ధ దుఃఖ సుఖ మభ్యనయ స్త్వం

సాశ్రు భాను విహస ద్విధునేత్రః ॥ 79

ప. వి. ఘాతితార్కసుతకర్ణదయాలుః - జైత్రితేన్దుకులపార్థకృతార్థః - అర్ధ దుఃఖ సుఖం - అభ్యనయః - త్వం - సాశ్రుభాను విహసద్విధునేత్రః.

అర్థము: ఘాతితార్క సుత కర్ణదయాలుః, ఘాతిత = అర్జునునిచే చంపబడిన, అర్కసుత = సూర్యపుత్రుడగు కర్ణుని యందు, దయాలుః = దయగల వాడవును, కావుననే, (సూర్యరూపమగు దక్షిణ నేత్రమున బాష్పము గలవాడవును) తథా = అట్లే, జైత్రితేన్దుకృతపార్థకృతార్థః, జైత్రితః = జయశీలుడుగా చేయబడిన, ఇందుకుల = చంద్రవంశజుడైన. పార్థ = అర్జునునిచే, కృతార్థః = సఫలమైన కోరిక కలవాడవును, అనగా తన యవతారమునకు ప్రయోజనమైన భూభార విమోచనము గలవాడవు నని యర్థము, (కావుననే చన్ద్ర రూపమగు వామ నేత్రమున విహసి తత్వము గలవాడవు నని యర్థము.) కాన క్రమముగా, సాశ్రుభాను విహసద్విధునేత్రః. సాశ్రు = కన్నీటితో గూడిన, భాను = సూర్యుని, విహసత్ = నవ్వుచున్న, విధు = చంద్రుని, నేత్ర = నేత్రములుగా గలిగిన, (సూర్య చంద్రులు విష్ణువునకు నేత్రములని చెప్పబడినవి.) త్వం = నీవు, అర్ధ దుఃఖ సుఖం = అర్ధ దుఃఖమును, అర్ధసుఖమును, అభ్యనయః = అభినయించితివి.

సమాసములు :

ఘాతితార్కసుత కర్ణదయాలుః : అర్కస్య సుతః = అర్కసుతః, అర్కసుత శ్చాసౌ కర్ణశ్చ = అర్కసుత కర్ణః, ఘాతితః అర్కసుత కర్ణః యేన సః = ఘాతితార్కసుతకర్ణః, ఘాతితార్కసుతకర్ణే దయాలుః = ఘాతితార్కసుత కర్ణదయాలుః.

జైత్రితేన్దుకుల పార్థకృతార్థః : జేతా కృతః = జైత్రితః, ఇందోః

కులం యస్య సః = ఇందుకులః, జైత్రితశ్చాసౌ ఇన్దుకులశ్చ=జైత్రితేన్దుకులః, పృథాయాః అపత్యం పుమాన్ పార్థః. జైత్రితేన్దుకులశ్చాసౌ పార్థశ్చ=జైత్రితేన్దుకుల పార్థః, జైత్రితేన్దుకుల పార్థేన కృతః అర్థః =యస్య సః=జైత్రితేన్దుకుల పార్థ కృతార్థః.

అర్ధ దుఃఖ సుఖం : దుఃఖం చ సుఖం చ = దుఃఖ సుఖం, దుఃఖ సుఖస్య అర్ధం=అర్ధ దుఃఖ సుఖం.

సాశ్రుభానువిహసద్విధు నేత్రః : అశ్రుభిః సహ వర్తత ఇతి = సాశ్రుః, సాశ్రుశ్చాసౌ భానుశ్చ = సాశ్రుభానుః, విహసంశ్చాసౌ విధుశ్చ=విహసద్విధుః, సాశ్రుభానుశ్చ విహసద్విధుశ్చ = సాశ్రుభాను విహసద్విధూ, సాశ్రుభాను విహసద్విధూ నేత్రే యస్య సః = సాశ్రుభాను విహసద్విధు నేత్రః.

**భావము :**

శ్రీమహా విష్ణువునకు సూర్య చంద్రులు నేత్రములు. అందు సూర్యుడు కుడినేత్రము. ఎడమ కన్ను చంద్రుడు. సూర్యుని పుత్రుడగు కర్ణుని అర్జునుడు వధించుట వలన నతనియందు దయకలిగిన శ్రీకృష్ణునకు కుడికంట బాష్ప మేర్పడినది. కుడికన్ను సూర్యుడగుట వలన సూర్యుని పుత్రునిపై గలిగిన దయచే గన్నీరు ఆ కంటనే యేర్పడుట సముచితమైనది. చన్ద్ర వంశస్థుడగు నర్జునుడు తన యవతారమునకు ప్రయోజనమైన భూ భారవిముక్తికై శ్రీకృష్ణునకు దుష్టవధ యందు దోడ్పడుట వలన చన్ద్రరూపమగు నెడమకంట నవ్వు కల్గినది. ఇట్లు కుడికంట దుఃఖమును నెడమకంట సుఖమును గలిగిన నీ వొక్కడవే సగపాలు దుఃఖమును సగపాలు సుఖమును నభినయించితివి. వాస్తవముగా నీవు క్రియారహితుడవు. కాన నీకు నేలాంటి క్రియలును లేవు. నీ యెడ గానవచ్చెడి క్రియలన్నియు నభినయాత్మకములని సూచితము.

శ్లో. ప్రాణవ త్ప్రణయిరాధః నరాధా
పుత్రశత్రుసఖతా సదృశీ తే ।
శ్రీప్రియస్య సదృశేవ తవ శ్రీ
వత్సమాత్మహృది ధర్తు మజస్రమ్ ॥

ప. వి. ప్రాణవత్ప్రణయిరాధ! న - రాధాపుత్రశత్రుసఖతా - సదృశీ - తే - శ్రీప్రియస్య - సదృక్ - ఏవ - తవ - శ్రీవత్సం - ఆత్మహృది - ధర్తుం - అజస్రమ్.

అర్థము: ప్రాణవత్ప్రణయిరాధ!, ప్రాణవత్ = ప్రాణముతో సమానమైన, ప్రణయి = ప్రియురాలగు, రాధ! = రాధనుగల యోకృష్ణా!, తే = నీకు, రాధాపుత్రశత్రుసఖతా. రాధా = అతిరథుడను సూతుని భార్యయనెడి వృన్దావనేశ్వరియైన శ్రీరాధకు, పుత్ర = పుత్రుడైన కర్ణుడును (మరి యొకడును) నగువానికి, శత్రు = శత్రువైన యర్జునునికి, సఖతా = మిత్రుడుగా నుండుట, న సదృశీ = యుక్తముకాదు. పుత్రశత్రువునకు శత్రువుగా నుండుటయే సముచితము. (కాని) శ్రీప్రియస్య, శ్రీ = లక్ష్మిని, ప్రియస్య = భార్యగా గలిగిన, తవ = నీకు, ఆత్మహృది = తనవక్షఃస్థలమునందు, అజస్రం = ఎల్లపుడు, శ్రీవత్సం = వెంట్రుకల సుడియొక్క రూపముననుండెడి గుర్తును, పక్షాన్తరమున, శ్రీవత్సం, శ్రీ = లక్ష్మియొక్క వత్సం = పుత్రుని, ధర్తుం = గ్రహించుట, సదృక్ = తగినదే. రాధా ప్రియునకు రాధాసుతశత్రువునందు చెలిమి యనుచితము. శ్రీప్రియునకు హృదయమున శ్రీవత్సమును అనగా శ్రీవత్సమను చిహ్నమును శ్రీయొక్క పుత్రుని ధరించుట సముచితము.

సమాసములు :

ప్రాణవత్ప్రణయిరాధ : ప్రాణతుల్యా ప్రణయినీ రాధా యస్య సః = ప్రాణవత్ప్రణయి రాధః, తస్య సంబుద్ధిః = ప్రాణవత్ప్రణయిరాధ!

రాధాపుత్రశత్రుసఖతా: రాధాయాః పుత్రః = రాధాపుత్రః, రాధాపుత్రస్య శత్రుః = రాధాపుత్రశత్రుః, రాధాపుత్ర శత్రోః సఖా = రాధాపుత్రశత్రు సఖా, రాధాపుత్ర శత్రుసఖస్య భావః = రాధాపుత్రశత్రుసఖతా.

శ్రీప్రియస్య : శ్రియః ప్రియః = శ్రీప్రియః, తస్య = శ్రీప్రియస్య.

ఆత్మహృది : ఆత్మనః హృత్ = ఆత్మహృత్, తస్మిన్ = ఆత్మహృది.

భావము :

హే కృష్ణా! ప్రాణతుల్యమగు రాధను ప్రేయసిగా గలవాడా! నీకు, ఆ రాధకు పుత్రుడైన కర్ణునికి శత్రువగు నర్జునునితో జెలిమి చేయుట తగదు. రాధ

నీకు ప్రేయసిగాన నామె పుత్రునికి శత్రువైనవానితో చెలిమి తగదని యర్థము. పుత్రశత్రునితో వైరమే యుక్తము. కాని యిట నిద్దరు రాధలు గలరు. అందు శ్రీకృష్ణుని ప్రాణేశ్వరి గోపికయగు రాధ. కర్ణుని పెంచినది దాశజాతికి చెందిన రాధయని గ్రహింపవలయును. లక్ష్మికి ప్రియుడవైన నీవు నీహృదయముపై నెల్లప్పుడు శ్రీవత్సమును అనగా శ్రీవత్సమనెడి రోమముల సుడిని శ్రీకి పుత్రుని ధరించుట యుక్తము.

శ్లో. తావకాపరతనోః సితకేశ స్త్వం
హలీ కిల స ఏవ చ శేషః ।
సాధ్వసావవతర స్తవ ధత్తే
తజ్జర చ్ఛికుర నాల విలాసః ॥ 81

ప. వి. తావకాపరతనోః సితకేశః, - త్వం - హలీ - కిల - సః - ఏవ - చ - శేషః - సాధు - అసౌ - అవతరః - తవ - ధత్తే - తజ్జరచ్ఛికురనాల విలాసః.

అర్థము: హే కృష్ణ! = ఓ కృష్ణా!, హలీ = నాగలిని ధరించెడి బలభద్రుడు, స ఏవ చ = అతడే, శేషః = అనంతుడైన (నీవే) అనగా శేషావతార రూపమైన బలరాముడు నీవే. నీకంటె అతడు భిన్నుడుకాడు. నీవు బలభద్రుడు అతడే శేషుడు. లేదా నీకంటే బలభద్రుడు భిన్నుడు కాడు. బలరామునకంటె శేషుడును భిన్నుడు కాడు. ఏల యనగా శరీర సంబన్ధమువలన ముదుసలితనముచే తెల్లబడిన వెంట్రుకల నతడు కలిగి యున్నాడని యాగమమందు చెప్పబడుచున్నది. "ఉజ్జహారాఽఽత్మనః కేశౌ సితకృష్ణౌ తతః ప్రభుః" అని విష్ణుపురాణవచనము. తావకాపరతనోః, తావక = నీదైన, అపర = సాటిలేని, యనగా సర్వశ్రేష్ఠమైన, తనోః = నీకు సంబంధించిన సాత్వికమూర్తికి సంబంధించిన, సితకేశః = తెల్లని కేశములుగలిగిన, హలీ = బలభద్రుడు, నీ యంశావతారరూపమైనవాడు. అసౌ = ఈబలరాముడు, త్వం కిల = నీవే, ఏలయనగా నీయవయవమైన ధవళకేశముగల శరీరముయొక్క రూపమే యా బలరాముడు. లేదా,

స ఏవ చ = ఆబలరాముడే, శేషః = శేషనాగుడు, అసౌ = ఈశేషనాగ రూపమగు, అవతరః = శరీరము, తజ్జరచ్ఛికురనాలవిలాసం, తత్ = నీదగు మరియొక శరీరముయొక్క, జరత్ = వార్ధకముచే తెల్లగా చేయబడిన, చికుర = వెంట్రుకలయొక్క, నాల = కాడయొక్క, విలాసం = పోలికను, సాధు = చక్కగా, ధత్తే = ధరించుచున్నది. మిక్కిలి తెల్లనైన బలరాముడు, నీదగు మరియొక శరీరముయొక్క తెల్లనివెంట్రుకల మూర్తిగానున్నాడు. శేషనాగుడుకూడా పొడవును తెలుపును గలిగియుండుటవలన వార్ధకముచే తెల్లనివై పొడవైన వెంట్రుకలుగల మూర్తియొక్క పోలికను ధరించుట యుక్తమే. కారణ గుణములు కార్యమందు గుణముల నుత్పత్తిజేయును గదా! మరియు బలరాముడు అంశావతారమనియు చెప్పబడెను. లేదా ఇచ్చట తెల్లని వెంట్రుక సహజమే కావచ్చును. వార్ధకమువలన కలుగదు. నిత్య యువకుడైన హరికి వార్ధకము లేదని పురాణప్రసిద్ధి.

వాస్తవములో విష్ణుపురాణవచనమగు "ఉజ్జిహీ రాత్మనః కేశౌ సితకృష్ణౌ తతః ప్రభుః" అనునెడ కేశౌ, క = బ్రహ్మ సుఖమునకు, ఈశౌ = సుఖరూపులని యర్థము. సితకృష్ణౌ యనునెడ ప్రకాశశీలమగుటవలన సత్త్వము సితశబ్దమునకర్థము; మోహకారణ మగుటవలన తమస్సు కృష్ణశబ్దమున కర్థము. సత్త్వతమోగుణాత్మక ములగు నీయవతారములు రెండును భూభారమును తొలగించుటకై ప్రభువగు నాదినారాయణుడు తననుండి యావిర్భవింపచేసెనని విష్ణు పురాణవచనమునకర్థము. "కృష్ణస్తు భగవాన్ స్వయం" అను భగవ ద్వచనముచే శ్రీకృష్ణుడు లీలాశరీరమును ధరించిన పరబ్రహ్మయే. "సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః" యను వచనము ననుసరించి యాకృష్ణభగవానున కందరును సమానులే. అతనికి శత్రువులు కాని మిత్రులు కాని లేరు. బలభద్రుడుగూడ నవతారమే. "రామో రామశ్చ రామశ్చ" యని ముగ్గురు రాములలో నత డొక్కడు. అట్లుకానిచో బలభద్రుడు తెల్లగా నుండుటవలన సత్త్వమూర్తిగను కృష్ణుడు నల్లగానుండుటవలన తమోమూర్తిగను పరిగణింపబడవలసి

వచ్చును. కాని యట్లులేదు. ఏలయనగా బలభద్రుడు తమఃప్రధానుడుగను కృష్ణభగవానుడు సత్త్వప్రధానుడుగను పరిగణింపబడుచున్నారు. కాన హేకృష్ణ! = ఓకృష్ణా, హలీ = నాగలినిధరించిన బలరాముడు, స ఏవ = శేషుడును ననన్తుడునని చెప్పబడునట్టి నీవే యగుచున్నావు. యతః = ఏలయనగా, తావకాపరతనోః, నీదగు మరియొక శరీరము యొక్క సంబంధమునుబట్టి (జరసా = ముదుసలితనముచే) సితకేశః = తెల్లనివెంట్రుకలు గలవాడని పురాణవచనము. కావుననే తజ్జరచ్చికురనాల విలాసః, తత్ = నీకుసంబంధించిన మరియొక శరీరమునకు, జరత్ = ముదుసలితనముచే తెల్లబరచబడిన, చికురనాల = కేశదండముయొక్క, విలాసః = వర్ణసామ్యమును, సాధు = చక్కగా, ధత్తే = ధరించు చున్నాడు. మిక్కిలి తెల్లనైన బలభద్రుడు నీకు మరియొకదేహమై తెల్లని వెంట్రుకలుగలవాడుగా ప్రకాశించుచున్నాడని యర్థము. (కాన) అసౌ = ఇతడు, తవ = నీయొక్క, అవతరః = అవతారము.

**సమాసము :**

తావకాపరతనోః : తవ ఇయం = తావకీ, అపరా చ సా తనుశ్చ = అపరతనుః, తావకీ చ సా అపర తనుశ్చ = తావకాపరతనుః, తస్యాః = తావకాపరతనోః.

సితకేశః : సితాః కేశాః యస్య సః = సితకేశః

హలీ: హలః అస్యాస్తీతి = హలీ.

తజ్జరచ్చికురనాలవిలాసః : జరం శ్చాసౌ చికుర నాలశ్చ = జరచ్చికుర నాలః, తస్య జరచ్చికురనాలః = తజ్జరచ్చికురనాలః, తజ్జరచ్చికురనాలస్య విలాసః = తజ్జరచ్చికురనాలవిలాసః, తం = తజ్జరచ్చికురనాల విలాసః.

గమనిక:- ఈశ్లోకమును నారాయణభట్టు ఆదరించుటవలన నాతని వ్యాఖ్య నను సరించి వివరించబడినది. కాన ప్రక్షేపకము.

**భావము :**

ఓ కృష్ణా! శేషావతారుడగు బలభద్రుడును నీవును భిన్నులుకారు. ఒక్కరే యగుదురు. అతడు నీకు వేరు శరీరము. నీకు మరియొక యవతారము. కాని

ముదుసలి తనముతో తెల్లబడిన వెంట్రుక లాతని శరీరమున కేర్పడినవి. తక్కిన యంశములు అర్థమునందే వివరించబడినవి.

శ్లో. హృద్య గన్ధవహ భోగవతీశః
శేషరూపమపి బిభ్ర దశేషః ।
భోగభూతి మదిరారుచిరశ్రీ
రుల్లస త్కుముద బన్ధురుచి స్త్వమ్ ॥ 81

ప.వి. హృద్య గన్ధవహ! - భోగవతీశః - శేషరూపం - అపి - బిభ్రత్ - అశేషః - భోగభూతిమదిరారుచిరశ్రీః, ఉల్లసత్కుముదబన్ధురుచిః - త్వం.

అర్థము: హృద్యగన్ధవహ! హృద్య = మనోజ్ఞమైన, గంధ = పరిమళమును, వహ ! = వహించువాడా! భోగవతీశః, భోగవతీ = సుఖభోగములు, గలిగిన రేవతికి, ఈశః = భర్తయు, భోగభూతి మదిరారుచిరశ్రీః, భోగ = పుష్పమాలలను, చందనము మున్నగువానిని ధరించుట, భూతి = ఐశ్వర్యము అనగా నాభరణాదిధారణరూపమగు సమృద్ధి, మదిరా = మద్యపానము అనువానిచే, రుచిర = మనోహరమగు, శ్రీః = శోభగలిగిన, లేదా, భోగ = సంభోగముయొక్క, భూతి = సమృద్ధిని గలిగించెడి, మదిరా = మద్యముచే, రుచిర = మనోజ్ఞమైన, శ్రీః = శరీరశోభ గలిగిన (అనగా మద్యపానముచే కన్నులెఱ్ఱబడుట మున్నగునవి గలుగునని యర్థము), ఉల్లసత్కుముదబన్ధురుచిః, ఉల్లసత్ = శోభించు, కుముద బన్ధు = చన్ద్రునియొక్క, రుచిః = కాంతి గలిగిన, అనగా చన్ద్రునివంటి తెల్లనికాన్తి గలిగిన, త్వం = నీవు, శేషరూపం = శేషనాగుని శరీరమును, బిభ్రదపి = ధరించియు, అశేషః = శేషుడవుగావు. శేషనాగునికంటె భిన్నుడవు. శేషుడు శేషనాగునికంటె భిన్నుడెట్లగునని విరోధము. కాన, అశేషః = సమస్తమైన వాడవు. అనగా సర్వస్వరూపుడవు. అని విరోధ పరిహారము.

మరియు, హేవిష్ణో! = ఓవిష్ణు స్వరూపుడవైన బలరామస్వామీ, హృద్యగంధవహ!, హృద్య = (ఆహారముగా) హృదయము లోపల నున్న, గంధవహ! = గాలిగలవాడా! (సర్పములకు గాలియే యాహారము

గదా) భోగవతీశ!, భోగవతీ = పడగగలిగిన నాగయువతికి, ఈశ = భర్తయగు శేషుడా!, లేదా భోగవతీ = పాతాళగంగకు, ఈశః = అధిపతియగు శేషుడు, పాతాళమునకు శేషనాగు డధిపతి కాన పాతాళగంగకు నధిపతియని యర్థము. లేదా "హృద్యగన్ధవహ భోగవతీశః" అని సమస్త పదముగ గ్రహించినచో, హృద్యగన్ధవహ = హృదయదేశమున నాహారముగా నుంచుకొనిన గాలిగలిగిన, భోగవతీశః = నాగస్త్రీలకు భర్తయైన వాడును, భోగభూతి మదిరారుచిరశ్రీః, భోగ = పడగలయొక్క, భూతిమత్ = అధిక్యముగల (వేయి పడగలు గలిగియుండుటచేనని యర్థము.) ఇరా = భూమిచే, వనగా దలంపైనున్న భూమిచే, రుచిర = మనోహరమగు. శ్రీః = శోభగలవాడును, ఉల్లసత్కుముద బంధురుచిః, ఉల్లసత్ = విలసిల్లు, కుముద = కుముదుడను సర్పమునందును, బంధు = చుట్టమునందు, రుచిః = ప్రీతిగలిగిన, త్వం = నీవు శేష = అనంతునియొక్క, రూపం = శరీరమును, బిభ్రదపి = ధరించియు, అశేషః = ఎల్లలేని వాడవుగా (అసి = అగుచున్నావు). అనన్తనాగస్వరూపుడగు బలరామస్వామియు దశావతారములయందు జేరినందున వతడును నీవే, ఏలయనగా విష్ణువు సర్వాత్మకుడు గదా!

**సమాసములు :**

హృద్యగన్ధవహ : హృద్యశ్చాసౌ గన్ధశ్చ = హృద్యగన్ధః, హృద్యగన్ధం వహతీతి = హృద్య గన్ధవహః, తస్య సంబుద్ధిః = హృద్యగన్ధవహ !, పక్షాన్తరమున హృద్యః గన్ధవహః యస్య సః = హృద్యగన్ధవహః, తస్య నంబుద్ధిః = హే హృద్యగన్ధవహ!

భోగవతీశః : భోగః అస్యాస్తీతి = భోగవతీ, భోగవత్యాః ఈశః = భోగవతీశః.

శేషరూపం : శేషస్య రూపం = శేషరూపం తత్ = శేషరూపం..

అశేషః : నశేషః = అశేషః.

భోగభూతి మదిరా రుచిర శ్రీః : భోగశ్చ భూతిశ్చ మదిరా చ = భోగభూతి మదిరాః, భోగభూతి మదిరాభిః రుచిరా శ్రీః యస్య సః = భోగభూతిమదిరా రుచిర శ్రీః. పక్షాన్తరమున, భోగస్య భూతిః =

భోగ భూతిః, భోగ భూతేః మదిరా = భోగభూతిమదిరా, భోగ భూతి మదిరాయా రుచిరా శ్రీః యస్య సః = భోగ భూతి మదిరారు చిరశ్రీః.

పక్షాన్తరమున : భోగానాం భూతిః = భోగభూతిః, భోగభూతిః అస్యాస్తీతి = భోగభూతిమాన్, ఇరయా రుచిరా శ్రీ యస్య సః = ఇరా రుచిరశ్రీః, భోగభూతిమాం శ్చాసౌ ఇరారుచిర శ్రీశ్చ భోగభూతి మదిరా రుచిర శ్రీః.

ఉల్లసత్కుముద బన్ధురుచిః : కుముదానాం బన్ధుః = కుముదబన్ధుః, రుచిః = కుముద బన్ధురుచిః, ఉల్లసన్తీ కుముద బన్ధురుచిరివ రుచిః యస్య సః = ఉల్లసత్కుముదబన్ధురుచిః, పక్షాన్తరమున, కుముదశ్చ బన్ధుశ్చ = కుముద బన్ధూ. కుముద బన్ధ్వోః రుచిః = కుముదబన్ధురుచిః. ఉల్లసన్తీ కుముద బన్ధురుచిః యస్య సః = ఉల్లసత్కుముద బన్ధురుచిః.

భావము :

మనోజ్ఞమగు చన్దన పరిమళమును ధరించువాడా! ఓ బలరామస్వామీ! సుఖభోగములకు పరిచితురాలగు రేవతికి భర్తగను స్రక్చన్దనాదుల చేతను నాభర ణాది ధారణరూపమగు నైశ్వర్యము చేతను మద్యపానముచేతను రమ్యమగు సౌందర్యము గలవాడుగను, లేదా సంభోగసమృద్ధికి కారణమగు మద్యపానముచే నెఱ్ఱబారిన కనులు మున్నగువాని శోభగలవాడుగను చంద్రునివంటి కాన్తిగలవాడు గను నున్న నీవు శేషనాగుని దేహమును ధరించుచున్నను నీవు శేషనాగుడవుకావు. కాని అశేషుడవు. సర్వస్వరూపుడవు. అని బలరామపక్షమున భావము.

మరియు ఓ విష్ణూ! సర్పములు గాలిమేతలు గాన నాగాలిని నాహారముగా లోన నుంచుకొనిన వాడా! నాగవనితకు భర్తయైన వాడా! లేదా పాతాళమున కధిపతి యగుటచే పాతాలగంగకు నధిపతియైనవాడా! పడగల యొక్క నాధిక్యమున ననగా వేయి పడగలను గలిగి వానిక్రిందనున్న భూమిచే శోభించు మనోహరమగు గాంతి గలిగిన వాడవును కుముదుడను సర్పమందును చుట్టమునందును ప్రీతిగలిగిన నీవు శేషుని రూపమును ధరించుచున్నను నశేషుడ వగుచున్నావు. అనగా నెల్లలేనివాడ వగుచున్నావు. శేషనాగుని యవతారమని

చెప్పబడు బలరామస్వామి దశావతారముల యందు చేరుటచే నతడును నీవే. ఏలయనగా విష్ణువు సర్వాత్మకుడు గదా!

శ్లో. రేవతీశ! సుషమా కిలనీల
స్యామ్బరస్య రుచిరా తనుభాసా ।
కామపాల! భవతః కుముదావి
ర్భావభావిత రుచే రుచితైవ॥ 82

ప. వి. రేవతీశ! సుషమా - కిల - నీలస్య - అమ్బరస్య - రుచిరా - తనుభాసా - కామపాల - భవతః - కుముదావిర్భావభావితరుచేః - ఉచితా - ఏవ -

అర్థము : రేవతీశ!, రేవతీ - రేవతీ దేవికి, ఈశ! = భర్తయైనవాడా!, కామపాల! = కామపాలు డనబడు బలరామస్వామీ!, కుముదావిర్భావ భావితరుచేః, కు = భూమికి, ముత్ = ప్రీతిని, ఆవిర్భావ = ఉత్పత్తి గావించుటకు, అనగా భూ భారమును తొలగించి యా భూమికి సంతోష మును గలిగించుటకని యర్థము. లేదా, కుముద = కుముదుడను పేరు గల నాగునకు, ఆవిర్భావ=ఆవిర్భవించుటకై, భావిత = చేయబడిన, రుచేః = కోరికగలిగిన, బలరామస్వామి అనంత నాగరూపుడగుటచే కుముదుడును ననంతునకు సజాతీయు డగుటచే, మైత్రీ సంబన్ధము వలననని యర్థము. భవతః = నీయొక్క, తనుభాసా = శుభ్రమైన శరీర కాంతిచే నీలస్య = నల్లని, అమ్బరస్య = వస్త్రముయొక్క, రుచిరా = అందమైన. సుషమా = శోభ, ఉచితైవ = తగినదిగనే, (జాతా = ఏర్పడినది.) తెలుపు నలుపు వన్నెలు కలిసినచో శోభాధిక్యమేర్పడుట వలన శరీరము యొక్క తెల్లని కాన్తిచే నల్లని కలుపకు శోభ మిక్కిలి తగియున్నది.

మఱియు, రేవతీశ! = రేవతీ నక్షత్రమునకు భర్తయైనట్టి, కామ పాల! = మన్మథోద్దీపకుడగు చంద్రా!, కుముదావిర్భావ భావిత రుచేః, కుముద = కలువల యొక్క, ఆవిర్భావ = వికాసమునకై, భావిత = ఏర్పడిన, రుచేః = కాన్తిగలిగిన, భవతః = నీయొక్క, తనుభాసా =

దేహకాన్తిచే, నసగా వెన్నెలచే, నీలస్య = నీలమైన, అమ్బరస్య = ఆకసముయొక్క, రుచిరా = అందమైన, సుషమా = శోభ, ఉచితైవ = యుక్తముగనే (జాతా = ఏర్పడినది), నీలమైన యాకసము నందు తెల్లని కాంతిగల చన్ద్రుడు చక్కగా గానవచ్చునని యర్థము.

సమాసములు :

రేవతీశ : రేవత్యాః ఈశః = రేవతీశః, తస్య సంబుద్ధిః = హే రేవతీశ!,
తనుభాసా : తనోః భాః = తను భాః, తేన = తనుభాసా.
కుముదావిర్భావ భావిత రుచేః : కోః ముత్ = కుముత్, కుముదః ఆవిర్భావః = కుముదావిర్భావః, కుముదావిర్భావేన భావితా రుచిః యస్య సః = కుముదావిర్భావ భావిత రుచిః, తస్య = కుముదావిర్భావ భావిత రుచేః. పక్షాన్తరమున, కుముదానాం ఆవిర్భావః = కుముదా విర్భావః, కుముదావిర్భావాయ భావితా రుచిః యస్య సః = కుముదా విర్భావ భావిత రుచిః, తస్య = కుముదావిర్భావ భావిత రుచేః.

భావము :

ఓ రేవతీకాంతుడైన బలరామస్వామీ! కామపాలుడ వను నామాన్తరము గలవాడా! భూ భారమును దొలగించి భూమికి సంతోషమును సమకూర్చుటకై లేదా కుముదుడను నాగు డావిర్భవించుటకై వాంఛించిన బలరామస్వామి యనన్త నాగ స్వరూపుడగుట వలనను కుముదుడు అనంతునకు సజాతీయుడగుట వలన మైత్రీ సంబంధము వలన శరీరకాంతిచే వనగా తెల్లని కాంతిచే నీల వర్ణము గల వస్త్రము యొక్క మనోజ్ఞమగు శోభయను గుణముగా నేర్పడినదని యర్థము. తెలుపు నలుపు వన్నెల కలయికచే శోభాతిశయ మేర్పడుట వలన బలరామ స్వామి యొక్క తెల్లని శరీరకాంతిచే నల్లని వలువ యొక్క శోభ మిక్కిలి యానుగుణ్యము నొందినదని యర్థము.

చన్ద్రపక్షమున- రేవతీ నక్షత్రమునకు భర్తవైన చన్ద్రా! మన్మథోద్దీపకా! కలువలను వికసింప చేయుటకై కాంతిని గలిగిన నీదేహకాంతితో నసగా నీ వెన్నెలతో నల్లని యాకసమున శుభ్రకాంతికల చంద్రుడు రమ్యముగా గాన వచ్చును.

ఏక చిత్తతతి రద్వయవాది
న్నత్రయీ పరిచితోఽథ బుధ స్త్వమ్ ।
పాహి మాం విధుత కోటి చతుష్కః
పంచబాణ విజయీ షడభిజ్ఞః ॥ 83

తత్ర మారజయిని త్వయి సాక్షా
త్కుర్వతి క్షణికతాత్మనిషేధౌ ।
పుష్పవృష్టి రపత త్సురహస్తా
త్పుష్పశస్త్ర శరస న్తతి రేవ ॥ 84

తావకే హృది నిపాత్య కృతేయం
మన్మథేన దృఢధైర్యతనుత్రే ।
కుణ్ఠనా దతి తమాం కుసుమానాం
చత్రమిత్రత ముఖత్రైవ శరాణామ్ ॥ 85

య త్తవ త్తవ విధౌ విధిరా స్తే
చాతురీం చరతి తచ్చతురాస్యః ।
త్వయ్యశేషవిధి జాగ్రతి శర్వః
సర్వ విద్భవ వతయా శితికణ్ఠః ॥ 86

ధూమవ త్కలయతా యుధి కాలం
మ్లేచ్ఛ కల్పశిఖినా కరవాలం ।
కల్కినా దశతయం మమ కల్కం
త్వం వ్యదస్య దశమావతరేణ ॥ 87

దేహినేవ యశసా భ్రమతోర్వ్యాం
పాణ్డురేణ రణరేణుభి రుచ్చైః ।
విష్ణునా జనయితు ర్భవతా భూ
న్నామ విష్ణు యశస శ్చ పదర్థమ్ ॥ 88

స_న్త మద్వయమయేఽధ్వని దత్తా
    త్రేయ మర్జున యశోర్జున నీరమ్ ।
నౌమి యోగజనితానఘసంజ్ఞం
    త్వామలర్క భవమోహ తమోర్కమ్ ॥ 89

భానుసూను మనుగృహ్య జయ త్వం
    రామమూర్తిహతవృత్రహపుత్రః ।
ఇన్ద్రినన్దనసపక్షమపి త్వాం
    నౌమి కృష్ణనిహతార్కతనూజమ్ ॥ 90

వామనాదణుతమా దనుజీయా
    స్త్వం త్రివిక్రమ తనూభృతదిక్కః ।
పీతహింసనకథా దథ బుద్ధాత్
    కల్కినా హతసమస్తః నమస్తే ॥ 91

మాం త్రివిక్రమ పునీహి పదే తే
    కిం అగన్నజని రాహు రుపానత్ ।
కిం ప్రదక్షిణనకృద్ భ్రమపాశం
    జాంబవా నదిత తే బలిబన్ధే ॥ 92

ప. వి. ఏకచిత్తతతిః - అద్వయవాదిన్ - న - త్రయీపరిచితః - అథ - బుధః - త్వమ్ - పాహి - మాం - విధుతకోటిచతుష్కః - పంచబాణ విజయీ - షడభిజ్ఞః.

అర్థము: నాలుగు శ్లోకములతో బుద్ధుని వర్ణించుచున్నాడు. హేఅద్వయవాదిన్ = ఘటపటాదిభేదములకు అసత్యత్వమును ప్రతిపాదించుటచే నొక్క జ్ఞానాకారతకే సత్యత్వము నంగీకరించుటవలన నద్వైతమును వాదించువాడా!, ఏకచిత్తతతిః =, ఏక = ఒక్కటేయైన, చిత్తతతిః = (దీపజ్వాలలు క్షణక్షణము పుట్టి నశించుచు పెక్కులుగా నున్నను జూచెడివారికి అవి యొక్కదీపజ్వాలగా నెట్లు కానవచ్చునో, అట్లే, ప్రతిక్షణము

జ్ఞానములు పుట్టుచు నశించుచున్నను నవి దీపకలికవలె నొక్కటిగా గానవచ్చుచున్నది) జ్ఞానసంతతి గల్గినవాడా!, తథా = అట్లే, న త్రయీ పరిచితః = వేదప్రామాణ్యము నంగీకరించనందువలన మూడువేదములతో పరిచయము లేనివాడా! అనగా సర్వము క్షణికమైనందువలన ధర్మాఽధర్మవ్యవస్థ తొలగిపోయినది. అందువలన వేదములతో బనిలేదని యర్థము. కావుననే, బుధః = పండితుడు, పండితుడు కానివానికి వేదాదులను దూషింపగల బుద్ధి గలుగదుగదా! అత్రయీ పరిచితుడైనను బుధుడని చెప్పుట విరుద్ధము. మూడువేదములను తెలియనివాడు పండితుడు కాజాలడుగదా! కాన విరోధాభాసము. మఱియు నెవ్వడు పండితుడై "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" యని తలంచుచు వేదత్రయితో పరిచయములేనివా డనుటయు విరుద్ధము. వేదాన్తులు వేదప్రామాణ్యము నంగీకరించిరికదా! మరియు అద్వయవాదమువలన "ద్విత్వసంఖ్య"ను సైతము నంగీకరింపడు. అది యుక్తమే అట్లే మాధ్యమికులనెడివారును కొలదిపాటి భేదముచే బౌద్ధసిద్ధాన్తమునే యనుసరింతురు. "నసత్ - నాఽసత్ - నసదసత్, నచాప్యనుభయమ్" అనుకోటిచతుష్టయమునుండి విడుపబడివతత్త్వమునే మాధ్యమికు లంగీకరింతురు. కాన, విధుత కోటిచతుష్కః, విధుత = (అనిర్వచనీయ ప్రపంచ వాదిత్వమునుండి) నిరాకరింపబడిన సదసద్వైలక్షణ్యారూపమగు, కోటిచతుష్కః = పైన చెప్పబడిన నాలుగు కోటులుగల్గిన, మరియు నద్వయవాదియగుట ద్విత్వము నిషేధింపబడినట్లు, త్రిత్వచతుష్టములును నిషిద్ధములే. పంచబాణవిజయీ, పంచబాణ = మన్మథుని, విజయీ = జయించినవాడును, అనగా విరక్తుడగుటవలనను, దిగమ్బరుడగుటవలనను మన్మథుని జయించినవాడై మారజిత్తని వ్యవహరింపబడుచున్నాడు. లేదా, పంచబాణ = "పంచ" యనుసంఖ్యను జెప్పెడి శబ్దమును, విజయీ = జయించినవాడు, అనగా సహించనివాడును ఏలయనగా నెవ్వడుపైన జెప్పబడిన కోటిచతుష్టయములోని చతుష్ట్వమును సహింపడో, యతడు పంచత్వమును సహింపడని యర్థము. షడభిజ్ఞః = ఆరింటిని తెలిసినవాడును, అనగా 1. దివ్యచక్షుః శ్రోత్ర, 2. పరిచితజ్ఞాన, 3. పూర్వ

నివాసానుసరణ, 4. ఆత్మజ్ఞాన, 5. ఆకాశగమన, 6. కాయవ్యూహ సిద్ధులను నాఅని యర్థము. లేదా 1. జ్ఞాన, 2. శీల, 3. క్షమా, 4. వీర్య 5. ధ్యాన, 6. ప్రజ్ఞలనెడి యర్థము. లేదా 1. దేశాదివ్యవహిత వస్తు దర్శన, 2. దేశాదివ్యవహితశబ్దశ్రవణ, 3. అతీతజన్మస్థితిస్మరణ, 4. పరిచితజ్ఞాన, 5. అవిద్యాఽస్మితాఽరాగద్వేషాభినివేశరూపపంచక్లేశ. 6. అణిమాదిసిద్ధు లనెడి యారని యర్థము. అనగా ఈయారింటియొక్క యభిజ్ఞలు గలవాడని యర్థము. వేదము ననుసరించెడి దైత్యులచే తిరస్కరింపబడిన దేవతలు బ్రహ్మను శరణుబొందిరి. బ్రహ్మచే ప్రసన్నత నొందింపబడిన నారాయణుడు బుద్ధనిరూపముతో నవతరించి యాదైత్యుల బుద్ధిని వేదార్థములనుండి తొలగించి బౌద్ధమతము నుపదేశించెను. అందువలన వారు దేవతలచే జయింప శక్యులైరి. కావుననే వీరిమతముయొక్క పరిభాషతోడనే స్తుతి చేయబడినది. "పరిచితాధ బుధ స్త్వం" అను పాఠమునందు "న" యను పదమును వేఱుగావించి "త్వయా వేదత్రయీ న పరిచితా" నీచే వేదత్రయ మభ్యసింపబడలేదు. కావ నీచే వేదత్రయమందును ప్రామాణ్య మంగీకరింపబడలేదు. కాని నీవు పండితుడవు. వేదప్రామాణ్య మంగీకరించనివాడు పండితుడెట్లగునని విరోధము.

"పరిచితాధ్వబుధః" యను పాఠమున త్రయీపరిచితులగు వైదికులమార్గమునందు నీవు పండితుడవు కావు. అవైదికమార్గమునే తెలిసినవాడవని యర్థము. అటువంటి త్వం = నీవు మాం = నన్ను. పాహి = కావుము.

సమాసములు :

ఏకచిత్త తతిః : చిత్తానాం తతిః = చిత్తతతిః, ఏకైవచిత్తతతిః యస్య సః = ఏకచిత్త తతిః.

అద్వయ వాదిన్ : న ద్వయం అద్వయం, అద్వయం వదతీతి = అద్వయవాదీ, తస్య సంబుద్ధిః = అద్వయ వాదిన్.

త్రయీ పరిచితః : త్రయ్యాః పరిచితః = త్రయీ పరిచితః.

విధుత కోటి చతుష్కః : కోటీనాం చతుష్కం = కోటిచతుష్కం, విధుతం కోటిచతుష్కం యేన సః = విధుత కోటి చతుష్కః.

పంచ బాణ విజయీ : పంచ బాణాః యస్య సః = పంచబాణః, పంచ బాణస్య విజయః అస్య అస్తీతి = పంచ బాణ విజయీ.

షడభిజ్ఞః : షట్ అభిజ్ఞాః యస్య సః = షడభిజ్ఞః.

**భావము :**

లోకమున ఘటపటాదిభేదము లసత్యములు. లోకమంతయు విజ్ఞాన స్వరూపము. అది క్షణికము కాన పూర్వ పూర్వ విజ్ఞానములు ఉత్తరోత్తర విజ్ఞానములను గల్గించుచు నశించు చుండును. అట్టి విజ్ఞాన సన్తతియే సత్యమైనది. ఆ విజ్ఞాన మాలయవిజ్ఞానమని ప్రవృత్తివిజ్ఞానమని ఇటు తెఱంగులు గల్గి యున్నది. అన్తరంగమునకు సంబంధించినది ఆలయవిజ్ఞానమనియు బహి రంగములగు ఘటాపటాదులకు సంబంధించినది ప్రవృత్తి విజ్ఞాన మనియు చెప్ప బడును. ఇట్లు సర్వము నొక్క విజ్ఞాన సన్తతి స్వరూప మగుటవలన నద్వయ వాదియగు నో బుద్ధా! నీవు పండితుడవైనను వేదముతో పరిచయము లేని వాడవు. అనగా వేదప్రామాణ్య మంగీకరించని వాడవు. " సత్ - నాసత్ - న సదసత్ - న చాప్యనుభయాత్మకం-'' అను కోటిచతుష్టయమును నిరసించిన వాడవు. విరక్తుడును దిగమ్బరుడునై యుండుటవలన పంచబాణుడైన మన్మథుని జయించి మారజిత్తు వైతివి. పైన చెప్పబడిన వివిధములగు నాఱు నభిజ్ఞలను గలిగిన వాడవగుట వలన షడభిజ్ఞుడ వగుచున్నావు. అట్టి నీవు నన్ను రక్షింపుము.

ప. వి. తత్ర - మారజయిని - త్వయి - సాక్షాత్కుర్వతి - క్షణికతాత్మ నిషేధౌ - పుష్పవృష్టిః - అపతత్ - సురహస్తాత్ - పుష్పశస్త్రశరస న్తతిః - ఏవ -

అర్థము: తత్ర = ఆ బుద్ధావతారమున. మారజయిని = సౌందర్యము చేతను, జితేన్ద్రియత్వము చేతను మన్మథుని జయించిన, త్వయి-నీ యెడ, క్షణిక తాత్మ నిషేధే, క్షణికతా = "సర్వం క్షణికం సత్త్వాత్'' అని సర్వ వస్తువులకు క్షణికత్వము, ఆత్మనిషేధే = సమనస్కములగు నిన్ద్రియము

లచే గలిగిన నీలము పీతము మున్నగు నాకారములు గలిగినట్టి సవికల్ప నిర్వికల్పకవాసనలచే నుపబృంహితములగు చిత్తులయొక్క యనగా విజ్ఞానములయొక్క సంతతియే యాత్మ. భూతములే చేతనత్వము నొందును. నిత్యమైనది మరొక్క టేదియును లేదనియెడు నాత్మ నిషేధమును అనగా తన దర్శనము ననుసరించి సర్వ భావములకును క్షణికత్వమును నైరాత్మ్యమును, సాక్షాత్కుర్వతి సతి = సమాధిచే ప్రత్యక్షము చేసుకొనగా, పుష్పశస్త్రశరసంతతిః. పుష్పశస్త్ర=పూవిలు తుని యొక్క, శరసంతతిః=బాణ పరమ్పర, సురహస్తాత్ =దేవతల హస్తమునుండి, పుష్పవృష్టిః=పూల వానగా, అపతత్ = పడినది. బలవన్తుడగు శత్రునిపై నాయుధములు పడును. మన్మథుడు గూడ బుద్ధుడవును మారజిత్తువునైన నీవలన భయము చెందినవాడు. అతని హస్తము నుండి భయముచే పుష్పరూపబాణపరంపర పడినది. అది దేవతల హస్తము నుండి పుష్పవృష్టి వలె నున్నది. మన్మథుడు దేవత్వము గల వాడుగాన అతని పుష్పవృష్టియు దేవతల పుష్పవృష్టిగా లెక్కింపదగినది. ఇచట బుద్ధుడు లోకోత్తరమగు విషయమును సమాధియన్దు ప్రత్యక్ష గోచరము గావించుకొని నందువలన నతనిపై అభినందనముతో దేవతలు పుష్పవృష్టిని కురిపించుట సముచితము.

సమాసములు :

మారజయిని : మారం జయతీతి = మారజయీ, తస్మిన్ = మార జయిని.

క్షణికతాత్మనిషేధౌ: క్షణికస్య భావః = క్షణికతా, ఆత్మనః నిషేధః = ఆత్మనిషేధః, క్షణికతా చ ఆత్మనిషేధశ్చ = క్షణికతాత్మ నిషేధౌ.

పుష్పవృష్టిః : పుష్పాణాం వృష్టిః = పుష్పవృష్టిః.

సురహస్తాత్ : సురాణాం హస్తః = సురహస్తః, = తస్మాత్ సుర హస్తాత్.

పుష్పశస్త్రశరసంతతిః : పుష్పాణి శస్త్రాణి యస్య సః = పుష్ప

శస్త్రః, పుష్పశస్త్రస్య శరాః = పుష్పశస్త్రశరాః, పుష్పశస్త్ర శరాణాం సన్తతిః = పుష్పశస్త్రశర సన్తతిః.

**భావము :**

బుద్ధావతారమున నీవు సౌందర్యము చేతను జితేన్ద్రియత్వము చేతను మన్మథుని జయించితివి. అట్టి నీవు సత్తైన యీ ప్రపంచము నంతటిని క్షణికము గను నాత్మరహితముగను ప్రత్యక్షము గావించు కొంటివి. అట్టి లోకోత్తర కార్యమును సాధించుట వలన నిన్ను గాంచి మన్మథుడు భయపడి యుండెను. అతడు విడుచునట్టి పూలవానను దేవతలే నిన్ను అభినందించుచు నీపై వదిలిరి.

ప. వి. తావకే - హృది - నిపాత్య - కృతా - ఇయం - మన్మథేన - దృఢ ధైర్య తనుత్రే - కుంతనాత్ - అతితమాం - కుసుమానాం - ఛత్ర మిత్రముఖతా - ఏవ - శరాణామ్.

అర్థము: మన్మథేన = మన్మథునిచే, దృఢధైర్య తనుత్రే, దృఢ = భేదింప సాధ్యము కాని, ధైర్య = ధైర్యమనెడి, తనుత్రే = కవచము గలిగిన, తావకే = నీకు సంబంధించిన. హృది = హృదయమందు, వక్షస్సునందు, నిపాత్య = బాణములను పడవైచి, అనగా గట్టిదెబ్బ తగులునట్లుగా బడవైచి, కవచము గట్టిదగుట వలననే మిక్కిలి మొక్కవోవుటవలన వానికొనలు తునిగి పోవుటచే, కుసుమానాం శరాణాం = పుష్పరూపము లగు తన బాణములకు, ఇయం = ఈః, ఛత్ర మిత్రముఖతా, ఛత్ర = గొడుగుతో, మిత్ర = తుల్యములైన, ముఖతా = కొనలు గలిగియుండుట యనగా సూదివంటి కొనలనువ దలింప చేయుటచే, గొడుగుతో సమానమైన గుండ్రనిముఖములు గలిగియుండుట, కృతా = చేయబడినది. గట్టి కవచముపై ప్రయోగింపబడిన బాణము మొక్కపోయినదై గొడుగు వంటి గుండ్రనికొనను కలిగినదగును. మన్మథుని బాణములు బాణము లగుట వలన పూర్వము సూదివంటి కూచిమొనలు గలిగి యుండినవి. ఇపుడో నీధైర్యకవచము పైబడి మిక్కిలి మొక్కవోపుటవలన యాపుష్పరూపములగు బాణముల కొనలు గొడుగువలె గుండ్రములైనవి. వికసించిన పుష్పములు గొడుగువలె కానబడును గదా! అవి ఛత్రాకార

ముగా నుండుట వలన సుఖప్రదములే కాని దుఃఖప్రదములు కావు. అట్లే కామ బాణములు కూడా నీ హృదయమునకు సనిర్వాపకములే యైనవి. కాని వానిని జయింప శక్తములు గాలేవు. ఇట్టి జితేన్ద్రియు దెవ్వడును లేడు. అని యర్థము.

**సమాసములు :**

తావకే : తవ ఇదం = తావకం, తస్మిన్ = తావకే.

దృఢధైర్యతనుత్రే : దృఢం చ తత్ ధైర్యం చ = దృఢధైర్యం, దృఢధైర్యమేవ తనుత్రం = దృఢధైర్యతనుత్రం, తస్మిన్ = దృఢధైర్య తనుత్రే.

ఛత్రమిత్ర ముఖతా : ఛత్రేణ మిత్రం ముఖం యస్య సః = ఛత్ర మిత్ర ముఖం, ఛత్రమిత్ర ముఖస్య భావః = ఛత్రమిత్ర ముఖతా.

**భావము :**

ఓ బుద్ధభగవానుడా! మన్మథుడు భేదింప శక్యముగాని గట్టి కవచముతో నీహృదయమున. (వక్షఃస్థలముపైన) బాణములను గట్టిదెబ్బతగులునట్టు ప్రయోగించి కవచముయొక్క గట్టితనముచే నవి మొక్కవోవుటవలన నా పుష్ప బాణములకు గొడుగుతో సమానమైన గుండ్రని కొనలు యేర్పడినవి. పూర్వ మీ పుష్పబాణములు గూడా నితర బాణములవలె కూచికొనలు గలిగియుండినవి. ఇప్పు డవి నీధైర్యకంచుకముపై బడి మొనలు పోగొట్టుకొనినవై గొడుగువలె గుండ్రని మొనలు గలిగివిగా నేర్పడినవి. పూచినపూలు గుండ్రములైన మొనలు గలిగినవై గొడుగలు వలె నుండును. మఱియు గొడుగువలె నవి నీడనొసంగుట వలన నీకు సుఖప్రదములేకాని దుఃఖప్రదములు గావనియు నర్థము. అట్లే ఆ యామన్మథబాణములు గూడ నీహృదయమును జయింపలేక పోయినవనియు నర్థము. ఇటువంటి జితేన్ద్రియుడెవ్వడును లేడని యర్థము. అట్టి నీకు వందనములని భావము.

ప. వి. యత్ - తవ - స్తవవిధౌ - విధిః - ఆస్యే - బాతురీం - చరతి - తత్ - చతురాస్యః - త్వయి - అశేషవిధి, జాగరి - శర్వః - సర్వవిద్బు వతయా - శితికణ్ఠః.

అర్థము: విధిః = బ్రహ్మ, తవ = నీయొక్క, స్తుతివిధౌ = స్తోత్రముచేయు విషయమున, చాతురీం = నేర్పును, యత్ = ఎందువలన, చరతి = పొందునో, తత్ = అందువలననే, చతురాస్యః = చాతుర్యముతో, గూడిన ముఖములు గలవాడుగ నున్నాడు. కాని నాలుగు ముఖములు గలిగియుండుటవలన జతురాస్యుడు కాడు. తథా = అట్లే, శర్వః = శివుడు, త్వయి = బుద్ధుదవగు నీవు, అశేషవిది = సర్వజ్ఞుడవుగా. జాగ్రతి సతి = వెలసియుండగా, సర్వవిద్ధ్రువతయా = (బుద్ధుని గుణమైన సర్వజ్ఞత్వమును తనయెడ నారోపించుకొనుట యను కలఙ్కముచే) సర్వజ్ఞబ్రువుడగుటవలన, శితికణ్ఠః = నీలకణ్ఠుడుగా యనగా కాలకూట విషభక్షణముచే గాకపై కలఙ్కముచే నీలకణ్ఠుడుగా (జాతః = ఏర్పడెను); సర్వజ్ఞత్వ విషయమున నీతో బోటీని బెట్టుకొనుటవలన మూడులోకముల యందును శివున కపకీర్తియేర్పడినదని యర్థము. బ్రహ్మకంటెను శివునికంటెను నీవే సర్వజ్ఞుడవును పరమ పురుషుడవునునై యున్నావు.

**సమాసములు :**

స్తవవిధౌ : స్తవస్య విధిః = స్తవవిధిః, తస్మిన్ = స్తవవిధౌ.
చాతురీం : చతురస్య భావః = చాతురీ, తాం = చాతురీం.
చతురాస్యః : చతురాణి ఆస్యాని యస్య సః = చతురాస్యః.
అశేషవిది : అశేషం వేత్తీతి = అశేషవిత్, తస్మిన్ = అశేషవిది.
సర్వవిద్ధ్రువతయా : సర్వం వేత్తీతి = సర్వవిత్, సర్వవిత్ ఇత్యుచత ఇతి = సర్వవిద్ధ్రువః, సర్వవిద్ధ్రువస్య భావః = సర్వవిద్ధ్రువతా, తయా = సర్వవిద్ధ్రువతయా.

**భావము :**

ఓ బుద్ధభగవానుడా! బ్రహ్మనిన్ను స్తుతి జేయుటయందు చాతుర్యమును జూపుటవలననే చతురములగు నాస్యములు గలవా డాయెను. అనగా నేర్పుగల ముఖములు గలవాడయెను అని యర్థము. కాని చతుర్ముఖములు గల్గియుండుటవలన జతురాస్యుడు కాలేదు. అట్లే సర్వజ్ఞుడవైన నీవు వెలసి యుండగా శివుడు నీతో సర్వజ్ఞతావిషయమునందు బోటిపడుటవలన నీలకణ్ఠుడై యనగా కాలకూట

విషమును దినుటచే నీలకణ్ఠుడుగాక యీ పోటీపడుటవలని కలఙ్కముచే నీలకణ్ఠుడై సర్వజ్ఞబ్రువుడుగా జెప్పబడుచు శితికణ్ఠుడుగా నేర్పడెను.

ప. వి. ధూమవత్ - కలయతా - యుధి - కాలం - మ్లేచ్ఛకల్పశిఖినా - కరవాలం - కల్కినా - దశతయం - మమ - కల్కం - త్వం - వ్యుదస్య - దశమావతరేణ.

అర్థము: ఈరెండు శ్లోకములతో గల్కిని స్తుతి చేయుచున్నాడు.

త్వం = నీవు, ధూమవత్ = పొగవలె, కాలః = నల్లని, కరవాలం = కత్తిని, యుధి = మ్లేచ్ఛులతో నేర్పడిన యుద్ధమునందు, కలయతా = ధరించెడి లేదా మృత్యురూపమైన ఖడ్గమును పొగవలె ధరించెడి, కావుననే, మ్లేచ్ఛకల్పశిఖినా, మ్లేచ్ఛ = పాపులవంటిమ్లేచ్ఛులకు, లేదా మ్లేచ్ఛులతో సమానులైనవారికి, కల్పశిఖినా = ప్రలయకాలాగ్నియైన, కల్కినా = పదియవ యవతారమైన కల్కిచే, మమ = నాయొక్క, దశతయం = పది యవయవములుగలిగిన, కల్కం = పాపమును (పంచ జ్ఞానేన్ద్రియములవలనను పంచకర్మేన్ద్రియములవలనను గల్గుటవలన పాపమునకు పదియవయములని యర్థము) వ్యుదస్య = తొలగింపుము. మరియు ఎవ్వడు తానే కల్కియో యనగా పాపము గలవాడో అత డెట్లు ఇతరుల పాపమును దొలగించును? కల్కి యనగా విష్ణువుగాన పరిహారము. "మ్లేచ్ఛకల్పశిఖినా" యని యవతారప్రయోజనము చెప్ప బడినది.

సమాసములు :

ధూమవత్ : ధూమ ఇవ = ధూమవత్.

మ్లేచ్ఛ కల్ప శిఖినా : మ్లేచ్ఛానాం కల్పశిఖ = మ్లేచ్ఛకల్పశిఖీ, తేన = మ్లేచ్ఛకల్పశిఖినా.

కల్కినా : కల్క మస్యాస్తీతి = కల్కీ, తేన = కల్కినా

దశతయం : దశ అవయవాః యస్య తత్ = దశతయం, తమ్ = దశతయం.

దశమావతరేణ : దశమశ్చాసౌ అవతరశ్చ = దశమావతరః, తేన = దశమావతరేణ

భావము :

ఓ భగవానుడా! నీవు పొగవంటి ఖడ్గమునుగాని, మృత్యువు వంటి ఖడ్గమును కాని మ్లేచ్ఛుల తోటి యుద్ధమున ధరించినవాడవై యామ్లేచ్ఛులను గాని, యామ్లేచ్ఛులవంటి పాపులకు గాని, లేదా యామ్లేచ్ఛులకంటె నీచులైన వారికి గాని ప్రలయకాలవహ్నివై కల్కి యనెడి పదియవ యవతారము నెత్తితివి. అట్టి యవతారము నెత్తిన నీవు నాదశవిధ పాపములను సమూలముగా తొలగింపుము. ఆదశవిధములగు పాపము లేవనగా అందు మూడు కాయికములు: 1. దానము చేయబడిన వస్తువును స్వీకరించుట, 2. యాగేయ పశుహింసకంటె భిన్నమైన హింస, 3. పరస్త్రీగమనము; అందు వాచికములు నాలుగు విధములు: 1. కాఠిన్యము, 2. అసత్యము, 3. పైశున్యము, 4. అసంబద్ధ ప్రలాపము; అందుమానసములు మూడు విధములు గల్గియున్నవి: 1. పరద్రవ్య గ్రహణేచ్ఛ, 2. పరానిష్టచిన్త, 3. వ్యర్థముగా ఇరులపై దోషారోపణ, ఇవి యన్నియు గలసి పది విధములు.

లేదా ఐదు జ్ఞానేంద్రియముల చేతను, నైదు కర్మేన్ద్రియముల చేతను నేర్పడు పది పాపములు. లేదా! పదిమాసములు గర్భమునందుండుటవలన ప్రతి మాసమునం దేర్పడినట్టి పాపముల సమూహము.

ప. వి. దేహినా - ఇవ - యశసా - భ్రమతా - ఉర్వ్యాం - పాణ్డురేణ - రణ రేణుభిః - ఉచ్చైః - విష్ణునా - జనయితుః - భవతా - అభూత్ - నామ - విష్ణుయశసః - చ - సదర్థమ్.

అర్థము : విష్ణుయశసః = ఆ పేరు గల్గిన, జనయితుః = తండ్రికి, నామ = విష్ణువనెడి పేరు, రణరేణుభిః = యుద్ధమందలి ధూళులచే, ఉచ్చైః = అధికముగా, పాణ్డురేణ = తెల్లనైన, తథా = అట్లే, ఉర్వ్యాం = భూమి యందు, భ్రమతా = దుష్ట శిక్షణకై తిరుగుచున్న, విష్ణునా = వ్యాప కత్వము గల విష్ణువను పేరుగల, దేహినా = శరీరమును ధరించిన, యశ సేవ = కీర్తిరూపముగల నీచే, విష్ణుయశసః = విష్ణుయశుడను నీతండ్రియొక్క, నామ = పేరు, సదర్థం = చక్కని, అన్వయము గలిగినదిగా ననగా సార్థకముగా నైనది.

**సమాసములు :**

దేహినా : దేహః అస్య అస్తీతి దేహీ, తేన = దేహినా.

విష్ణుయశసః : విష్ణుయశః యస్య సః = విష్ణుయశాః. తస్య = విష్ణుయశసః.

రణరేణుభిః : రణస్య రేణవః = రణరేణవః, తైః = రణరేణుభిః.

సదర్థం : సన్ అర్థం యస్య తత్ = సదర్థం.

**భావము :**

ఓకల్కి భగవానుడా! నీవు విష్ణుయశుడను వాని పుత్రుడవు. నీవలన నతనిపేరు సార్థకమైనది. ఏలయనగా నీవు యుద్ధరేణువులచే తెల్లబడినవాడై దేహమును దాల్చినవిష్ణువైన యనగా వ్యాపకమైన కీర్తియొక్క రూపమును గల్గినవాడవు. మరియు దుష్టశిక్షణకై భూమియందు గ్రుమ్మరుటచేతను విష్ణువై యనగా వ్యాపకుడవైతివి. అట్టి నీచే విష్ణుయశుడను నీతండ్రియొక్క పేరు నీచే వ్యాపకమగు కీర్తిగలవాడను నర్థ మేర్పడుటచే నన్వర్థమైనది.

ప. వి. సన్తమ్ - అద్వయమయే - అధ్వని - దత్తాత్రేయమ్ - అర్జునయశోఽర్జనబీజం - నౌమి - యోగజనితానఘసంజ్ఞం - త్వాం - అలర్కభవమోహతమోఽర్కం.

అర్థము: అద్వయమయే = అద్వైతరూపమైన, అధ్వని = మార్గమునందు, అనగా ఐకాత్మ్యవాదమునందు, సన్తం = ఉన్నటువంటి, (తథా = అట్లే) అర్జునయశోఽర్జనబీజం, అర్జున = కార్తవీర్యార్జునునకు, యశః = కీర్తిని అర్జన = సంపాదించుటకు, బీజం = మూలమైన, (కార్తవీర్యునిచే నుపాసింపబడిన దత్తాత్రేయస్వామి అతనికి లోకవ్యాపకమగు కీర్తి కలుగునని వర మిచ్చెను), యోగజనితానఘసంజ్ఞం, యోగ = అష్టాంగ యోగముచే, జనిత = ఏర్పడిన, అనఘ = పాపములేనివాడను, సంజ్ఞం = పేరుగలిగిన, అలర్కభవమోహతమోఽర్కం, అలర్క = శత్రుధ్వజ మదాలసాపుత్రుడైన అలర్కుడను రాజునకు, భవమోహ = సంసారమోహమనెడి, తమః = చీకటికి, అర్కం = సూర్యుడునైన,

దత్తాత్రేయం = దత్తాత్రేయుడవైన, త్వాం = నిన్ను, నౌమి = నమస్కరింతును.

**సమాసములు :**

అద్వయమయే : అవిద్యమానం ద్వయం యస్మిన్ సః = అద్వయః, అద్వయస్య వికారః = అద్వయమయః. తస్మిన్ = అద్వయమయే.

అర్జునయశోఽర్జనబీజం : అర్జునస్య యశః = అర్జునయశః. అర్జున యశసః = అర్జనం = అర్జునయశోఽర్జనం, అర్జునయశోఽర్జనస్య బీజం = అర్జునయశోఽర్జనబీజం, తత్ = అర్జునయశోఽర్జనబీజం.

యోగజనితానఘసంజ్ఞం : యోగేన జనితా = యోగజనితా. అనఘ ఇతి సంజ్ఞా = అనఘసంజ్ఞా, యోగజనితా అనఘసంజ్ఞా యస్య సః = యోగజనితానఘసంజ్ఞః, తం = యోగజనితానఘసంజ్ఞమ్.

అలర్కభవమోహతమోఽర్కమ్ : భవే మోహః, = భవమోహః, అలర్కస్య భవ మోహః = అలర్కభవమోహః, అలర్కభవమోహ ఏవ తమః = అలర్క భవమోహతమః, అలర్కభవమోహతమసః అర్కః = అలర్కభవమోహ తమోఽర్కః, తం = అలర్కభవమోహతమోఽర్కం.

**భావము :**

జీవాత్మ పరమాత్మల కభేదము జెప్పెడి యద్వైత మార్గము నందున్న వాడును కార్తవీర్యార్జునకు జగద్వ్యాపకమగు కీర్తి గలుగునట్లు వరమొసంగిన వాడును నష్టాంగయోగాభ్యాసముచే బాపములు దొలగుట వలన దేవతలచే "అనఘు" డను పేరు పొందినవాడును శత్రుధ్వజ మదాలసాపుత్రుడగు నలర్కునకు సంసార మోహాన్ధకారమును దొలగించుటకు సూర్యునివంటి వాడును నగు దత్తాత్రేయుడవైన నీకు వందనము. పై దత్తాత్రేయ స్వామికథ పురాణ ప్రసిద్ధము.

ప. వి. భాను సూనుమ్ - అనుగృహ్య - జయ - త్వం - రామమూర్తిహత వృత్రహ పుత్రః, ఇన్ద్రనన్దన సమక్షమ్-అపి - త్వాం - నౌమి -కృష్ణ-నిహతార్క తనూజమ్.

అర్థము: హే విష్ణో ! = ఓ విష్ణూ !, భాను సూనుం = సూర్యుని పుత్రుడగు సుగ్రీవుని, అనుగృహ్య = అనుగ్రహించి, యనగా వాని యపహరించిన యతని భార్యయగు తారను మరల నతని కొసంగి రాజ్యాభిషేకము ద్వారా, కృతార్థుని గావించి, రామమూర్తిహత వృత్రహ పుత్రః, రామ మూర్తి = రామావతారముచే, హత = చంపబడిన, వృత్రహ పుత్రః = ఇన్ద్రపుత్రుడగు వాలిని గల్గిన, త్వం = రాముడవైన నీవు, జయ = అంతటిని మించి వర్ధిల్లుము. కాన నీవు వన్దనీయుండవు. తథా = అట్లే, కృష్ణ ! = కృష్ణావతారమెత్తిన యో భగవానుడా !, ఇన్ద్రనన్దన సపక్షం, ఇన్ద్రనన్దన = ఇంద్రుని పుత్రుడైన యర్జునునికి, సపక్షం = మిత్రుడును, (కావుననే) నిహతార్కతనూజం, నిహత = చంపబడిన, అర్క తనూజం = సూర్యపుత్రుని గల్గిన, త్వాం = నిన్ను, నౌమి = నమస్కరింతును. ఎవ్వడు భానుపుత్రుని అనుగ్రహించునో అత డెట్లు భాను పుత్రునికి మారకు డగును ? గాన విరోధము. ఇంద్ర పుత్రుని జంపినవాడు ఇంద్ర పుత్రునికి మిత్రు డెట్లగును ? ఇందును విరోధము. కాని యింద్రుని పుత్రులలో నొక్కడు అనగా నర్జునుడు యనుగ్రహింపదగినవాడు. మరియొకడు అనగా వాలి శిక్షింపదగినవాడు. అట్లే సూర్యపుత్రులలో నొక్కడగు సుగ్రీవుడు అనుగ్రహింపదగినవాడు, మరియొకడగు కర్ణుడు శిక్షింపదగినవాడు. కాన నీ విధముగా నతని పుత్రులలో నొక్కడు నిగ్రహింప దగిన వాడుగను మరియొక డనుగ్రహింప దగిన వాడుగ నుండుట వలన అందులో నొక్కరి సంహారము రామావతార మందును, మరియొకరి సంహారము కృష్ణావతారము నందును జరుగుట చేతను విరోధ పరిహారము. ఇట్టి విరుద్ధ చరిత్రమును గలిగియుండుట వలన నీవు తెలియ శక్యము కాని పరమ పురుషుడవై యున్నావు.

సమాసములు :

భాను సూనుం : భానోః సూనుః = భాను సూనుః, తం = భాను సూనుం.

రామ మూర్తిహత వృత్రహ పుత్రః : రామస్య మూర్తిః = రామ మూర్తిః, రామమూర్త్యా హతః = రామ మూర్తిహతః, వృత్రం

హన్తీతి = వృత్రహా, తస్య పుత్రః = వృత్రహ పుత్రః, రామమూర్తిహతః వృత్రహ పుత్రః యేన సః = రామ మూర్తిహత వృత్రహపుత్రః.

ఇన్ద్రనన్దన సపక్షం : ఇన్ద్రస్య నన్దనః = ఇన్ద్రనన్దనః, ఇన్ద్ర నన్దనస్య సపక్షం = ఇన్ద్ర నన్దనస్య సపక్షః = ఇన్ద్రనన్దన సపక్షః, తం = ఇన్ద్ర నన్దన సపక్షం.

నిహతార్క తనూజం : అర్కస్య తనూజః = అర్కతనూజః, నిహతః అర్కతనూజః యేన సః = నిహతార్క తనూజః, తం = నిహతార్క తనూజం.

**భావము :**

పై విధముగా దశావతారములను వర్ణించినపిదప భక్త్యతిశయముచే మరల త్రివిక్రమ హరిహర బాలముకున్దాదులను నిరువదినాలుగు శ్లోకములచే వర్ణించు చున్నాడు. ఓ విష్ణూ! సూర్యుని పుత్రుడైన సుగ్రీవునికై వాలిని వధించి యత డపహరించిన సుగ్రీవుని భార్యయగు తారను మరల నొసంగి యాతనికి రాజ్యా భిషేకము గావించి యనుగ్రహించితివి. ఈవిధముగా నీవు రామావతారమందు గావించితివి. ఈవిధముగా శిష్టరక్షణమును దుష్టశిక్షణమును గావించి యందరిని మించిన యోరామా! నీవు వర్ధిల్లుము, నీకు వన్దనము.

ఓ కృష్ణా! నీవు ఇంద్రునిపుత్రునకు మిత్రుడవై యుండియు నా యింద్ర పుత్రునే వధించితివి. ఇట్లే సూర్యునిపుత్రుని అనుగ్రహించియు నాసూర్యపుత్రునే నిగ్రహించితివి. ఇవి నీయెడ విరుద్ధములు. కాని యింద్రుని పుత్రుడైన యర్జును నకును నీవుమిత్రుడవుగా నుండినను దీనికి పూర్వమైన రామావతారమునందునింద్రుని పుత్రుడైన వాలిని వధించితివి. కాన యుగభేదము చేతను నవతారభేదముచేతను విరోధపరిహారము. అట్లే సూర్యపుత్రుడైన సుగ్రీవు ననుగ్రహించియు నాసూర్య పుత్రుడైన కర్ణుని నిగ్రహించితివి. కాన నీవిరోధము సైతము అవతారభేదముచే పరిహృతము. ఇట్టి విరుద్ధచరితములు గలిగియుండుటవలన నీవెవ్వరికిని తెలియ శక్యముకాని పరమపురుషుడవు. కాన నీకు వన్దనములు.

ప. వి. వామనాత్ - అణుతమాత్ - అనుజీయాః - త్వం - త్రివిక్రమతనూభృత దిక్కః, - వీతహింసన కథాత్ - అథ - యుద్ధాత్ - కల్కినా - హత సమస్త - నమః - తే.

అర్థము: హేవిష్ణో! = ఓవిష్ణూ!, అణుతమాత్ = మిక్కిలి కురుచనైన, వామనాత్ = వామనావతారమునకంటె, అను = వెనుక, త్రివిక్రమతనూభృతదిక్కః, త్రివిక్రమ = త్రివిక్రమావతారము యొక్క, తనూ = శరీరముచే, భృత = నింపబడిన, దిక్కః = దిక్కులు గలిగిన, త్వం = నీవు, జీయాః = అందరిని మించి వర్ధిల్లుము. (తథా = అట్లే,) వీతహింసనకథాత్, వీత = తొలగిన, హింసనకథాత్ = జంతుహింసకు సంబంధించిన వార్త గలిగిన, బుద్ధాత్ = బుద్ధుని వలనను, కల్కినా = పదియవ యవతారమగు కల్కి చేతను, హతసమస్త, హత = చంపబడిన, సమస్త = కలిమలముచే దూషింపబడిన సమస్త ప్రాణి సమూహము గల్గిన విష్ణూ!, తే = నీకు, నమః = వందనము.

సమాసములు :

అణుతమాత్ : అత్యన్తం అణుః = అణుతమః, తస్మాత్ = అణుతమాత్.

త్రివిక్రమతనుభృతదిక్కః : త్రయః విక్రమాః యస్య సః = త్రివిక్రమః, త్రివిక్రమస్య తనూః = త్రివిక్రమతనూః, త్రివిక్రమతన్వా భృతాః దిశః యస్య సః = త్రివిక్రమతనూభృతదిక్కః.

వీతహింసనకథాత్ : హింసనస్య కథా = హింసనకథా, వీతా హింసనకథా యస్మాత్సః = వీతాహింసనకథః, తస్మాత్ = వీతహింసనకథాత్.

హతసమస్త : హతం సమస్తం యేన సః = హతసమస్తః, తస్య సంబుద్ధిః = హతసమస్త!

భావము :

మిక్కిలి కురుచనైన శరీరము గల వామనావతారమునకు తర్వాత త్రివిక్రమావతారమెత్తి యా శరీరముచే సమస్త దిక్కులను వ్యాపించిన వాడవై యందరిని యతిశయించిన నీవు వర్ధిల్లుము. అట్లే జంతుహింసకు సంబంధించిన వార్తయేలేని బుద్ధావతారము వలనను, తర్వాతి దశమావతారమగు కల్కిచేతను కలిమలముచే దూషింపబడిన సమస్త ప్రాణికూటమును హింసించిన వాడవైన నీకు వందనము. ఎవడు చాలా కుఱుచని శరీరము

గలవాడో యతడెట్లు దిక్కులన్నింటిని తన శరీరముతో వ్యాపించును? అట్లే ఎవ్వడు హింసాకథ లేనివాడో యతడెట్లు కలిమలదోషగ్రస్తమగు ప్రాణి సంఘమును వధింపగలడు? అని విరోధము. కాని యవతార భేదముచే పరిహారము. ఎవరికిని తెలియ సాధ్యము కాని చరిత్ర కలవాడవు నీవని యర్థము. ఇచట వామనావతారము త్రివిక్రమావతారము వర్ణింప బడినవి.

వ. వి. మాం - త్రివిక్రమ - పునీహి - పదే - తే - కిం - లగన్ - అజని- రాహుః - ఉపాసత్ - కిం-ప్రదక్షిణకృత్-భ్రమపాశం - జామ్బవాన్- అదిత - తే-బలిబంధే.

అర్థము: హే త్రివిక్రమ! = ఓ త్రివిక్రమా!, (త్వం = నీవు) మాం = నన్ను, పునీహి = పవిత్రపఱుచుము. తథా = అట్లే, తే = నీయొక్క, పదే = (గగనమును వ్యాపించిన పైకెత్తబడిన) పాదమునందు, లగన్ = తగుల్కొనినవాడుగా, రాహుః = నక్షత్రమాలకు మధ్యనున్న నల్ల రాహువు, ఉపాసత్ = పాదరక్షగా, అజని కిం = ఏర్పడెనా యేమి? ఇంతటిగొప్ప శరీరమును ధరించెను. ఏలయనగా దానిపాదముయొక్క స్థానమునందు ఆకాశమందున్న యంతటి రాహువుపాదరక్ష యాయెను. (తథా = అట్లే) ప్రదక్షిణకృత్, ప్రదక్షిణ = (భగవన్తునికి గావించెడి షోడశోపచారములలో పదునైదవదగు) నుపచారమును, కృత్ = కావించెడి, జామ్బవాన్ = ఎలుగుబంట్లరాజును బ్రహ్మావతారమునగు జాంబవతుడు, బలిబంధే = బలిబంధనమును నిమిత్తము గావించుకొని, తే = నీకు, భ్రమపాశం = భ్రమ = పరిభ్రమణరూపమైన, పాశం = వలయాకారపు కట్టుత్రాటిని, అదితకిం = ఇచ్చెనా యేమి? ఒకరిని మరియొకడు బంధింపబూనినప్పుడు మరియొక డతనికి కట్టుత్రాటి నిచ్చును. ఇచ్చట భగవన్తుడు, బలికి వాగ్బంధమునే గావించెను. కాని రజ్జుబంధనము గావింపలేదు. అయినను లోకమునందు "బద్ధు" డనెడి ప్రసిద్ధివలన బన్ధనశబ్దభలమువలన కవి పాశశబ్దమును ప్రయోగించెను. జామ్బవన్తుడపుడు త్రివిక్రమునకు షోడశోపచారపూజను గావించెను అని ప్రసిద్ధి. అందులో ప్రదక్షిణము పదునైదవ

యుపచారము. అది వర్తులముగా భ్రమణాకారవు రజ్జువునిచ్చెనా యని భావింపబడినది.

సమాసములు :

త్రివిక్రమ : త్రయః విక్రమాః యస్య సః = త్రివిక్రమః, తస్య సంబుద్ధిః = హేత్రివిక్రమ.
ప్రదక్షిణనకృత్ : ప్రదక్షిణనం కరోతీతి = ప్రదక్షిణనకృత్.
బలిబన్ధే : బలేః బన్ధః = బలిబన్ధః, తస్మిన్ = బలిబన్ధే.

భావము:

ఓ త్రివిక్రమా! నన్ను పవిత్రుని గావింపుము. నీపాదము పైకెత్తబడినదై యాకాశమునంతయు వ్యాపించగా నక్షత్ర మండలమునందు తమోగ్రహమైనందు వలన, నల్లగనున్న రాహువు నల్లని నీపాదుకగా నేర్పడెనా యేమి? స్వామీ! నీవెంతటి గొప్పశరీరము నెత్తితివో! కానిచో రాహువంతటివాడు నీకు పాదరక్షగా నేర్పడునా? రాహువెట్లు నలుపో పాదరక్షయు నలుపుగదా! మఱియు నాసమయమునందు బ్రహ్మావతారమై నెలుగుబంట్లకురాజైన జాంబవన్తుడు నీకు షోడశోపచార పూజ చేయుటకు మొదలిడి పదునైదవ యుపచారమైన యాత్మ ప్రదక్షిణమును చేయగా దొడంగెను. వర్తులముగా దనచుట్టు తాను తిరుగుట యను నా ప్రదక్షిణము బంధనపాశము వలె నుండగా నా ప్రదక్షిణమునే నీకు బలిని బంధింప పాశము నొసంగెనా? యని భావింప బడినది. త్రివిక్ర మావతారకాలమునందు జాంబవన్తుడు త్రివిక్రమునికి షోడశోపచార పూజను సల్పెనని ప్రసిద్ధి.

గమనిక: 83 మొదలు 92 వరకును గల శ్లోకములు నారాయణభట్టుచే వ్యాఖ్యాతములు. అందువలన నవి యిట చేర్పబడి యాతని వ్యాఖ్య ననుసరించి వివరింప బడినవి.

శ్లో. అర్ధచక్రవపుషార్జున బాహూన్
యోఽలునాత్ పరశునాఽథ సహస్రమ్।
తేన కిం సకల చక్ర వితానే
బాణబాహు విచయేఽఇచ్ఛతి చిత్రమ్. 93

ప. వి. అర్ధచక్రవపుషా - అర్జున బాహూన్ - యః - అలునాత్ - పరశునా - అథ - సహస్రమ్ - తేన - కిం - సకలచక్రవితానే - బాణబాహునిచయే - అశ్నుతి - చిత్రమ్.

అర్థము : హే విష్ణో!—! ఓ విష్ణూ! యః — ఎవడు, నీయొక్క యవతారమో, సః — ఆ పరశురాముడు, అర్ధచక్ర వపుషా — అర్ధ చక్రము వంటి యాకారము గలిగిన, పరశునా — గొడ్డలిచే, సహస్రం — వేయి సంఖ్యలు గల, అర్జున బాహూన్, అర్జున — కార్తవీర్యార్జునుని యొక్క, కడిమి చెట్టుయొక్క, బాహూన్ — భుజములను, అథ — సమగ్రముగా. అలునాత్ — నరికెను, అథ — పిదప, తేన — ఆ, భవతా — కృష్ణావతార మెత్తిన నీచేత, సకల చక్ర విలూనే, సకల — పూర్ణమైన, చక్ర — చక్రాయుధముచే, విలూనే — తెగగొట్టబడిన, బాణబాహునిచయే, బాణ — బాణాసురునియొక్క, బాహు — భుజములయొక్క, నిచయే — సమూహమునందు, (బాణ గోరంటచెట్టుయొక్క) బాహు — భుజముల వంటి కొమ్మలయొక్క, నిచయే — సమూహమునందు, చిత్తం — జనుల చిత్తము, కిం — ఏమి? చిత్రం — ఆశ్చర్యమును, అశ్నుతి — పొందును. ఇందు ఆశ్చర్యము లేదు. కడిమి చెట్టు కొమ్మలు తెగగొట్టినవాడు గోరింట కొమ్మల తెగగొట్టినచో నాశ్చర్యము లేదు. కడిమి కొమ్మలు పెద్దవి, గోరంట కొమ్మలు చిన్నవి; గాన పెద్దవానివే తెగగొట్టిన వాడు చిన్నవాసిని తెగగొట్టలేడా? యని యర్థము.

సమాసములు :

అర్ధచక్రవపుషా : చక్రస్య అర్ధం — అర్ధచక్రం, అర్ధచక్రం — వపుః యస్య సః — అర్ధ చక్ర వపుః, తేన — అర్ధ చక్రవపుషా.

అర్జున బాహూన్ : అర్జునస్య బాహవః — అర్జునబాహవః, తాన్ — అర్జున బాహూన్.

సకలచక్ర విలూనే : సకలం చ తత్ చక్రం చ — సకలచక్రమ్. సకలచక్రేణ విలూనః — సకలచక్ర విలూనః, తస్మిన్ — సకలచక్ర విలూనే.

బాణ బాహు నిచయే : బాణస్య బాహవః = బాణబాహవః, బాణబాహూనాం నిచయః, బాణబాహునిచయః, తస్మిన్ = బాణబాహునిచయే.

భావము :

ఓ విష్ణూ! నీవే మఱియొక యవతారమైన పరశురామస్వామివై అర్ధచక్రాకారవు గండ్రగొడ్డలిచే కార్తవీర్యార్జునునియొక్క వేయిభుజములను దెగగొట్టగా పూర్ణమైన, చక్రాయుధము బాణాసురుని భుజసమూహమును నరకుట యందు ఆశ్చర్య మేమున్నది? పరశురాముడు అర్ధచక్రముతో కార్తవీర్యార్జునుని వేయి భుజములను దెగగొట్టెను. మరియు కడిమిచెట్టుయొక్క వేయి కొమ్మలను దెగగొట్టెను. కృష్ణభగవానుడు పూర్ణచక్రముతో బాణాసురుని భుజ సమూహము ననగా కొన్ని భుజములను దెగగొట్టెను. మరియు గోరంట చెట్టు యొక్క కొమ్మల సమూహము ననగా గొన్ని కొమ్మలను దెగగొట్టెను. కాన నిట నేమి యాశ్చర్యము లేదని యాశయము.

శ్లో. పాఞ్చజన్య మధిగత్య కరేణా
పాం చ జన్య మసురానివ వక్షి
చేతనాః స్థ కిల పశ్యత కిం నా
చేతనోఽపి మయి ముక్తవిరోధః 94

ప. వి. పాఞ్చజన్యం - అధిగత్య - కరేణ - అపాం - చ - జన్యం - అసురాన్ - ఇవ - వక్షి - చేతనాః - స్థ - కిం - పశ్యత - కిం-న- అచేతనః - అపి - మయి - ముక్తవిరోధః.

అర్థము : హే విష్ణో! = ఓ విష్ణూ!, కరేణ = ఎడమ చేతితో, పాఞ్చజన్యం = పాంచజన్యమనెడి శంఖమును, (దక్షిణేన)కరేణ = కుడిచేతితో, అపాం = ఉదకములకు, జన్యం = ఉత్పన్నమైన పద్మమును, అధిగత్య = పొంది, అనగా ధరించి, అసురాన్ = రాక్షసుల నుద్దేశించి, వక్షీవ = చెప్పుచున్నావో యనునట్లున్నావు. ఏమి యనగా, హే అసురాః = ఓ రాక్షసులారా!, చేతనాః = చైతన్య వస్తువులుగా, స్థ = ఉన్నారు, (కావుననే) పశ్యత = చూడుడు, అచేతనోఽపి = జడమైనను పాఞ్చజన్యః =

పాఞ్చజన్యమను శంఖము, అపాంచజన్యః = ఉదకముల కుత్పన్నమైన పద్మము. మయి = నాయెడ, ముక్తవిరోధః, ముక్త = విడువబడిన, విరోధః = వైరము గల్గినదిగా, న కిం = ఉండలేదా యేమి? కావున నచేతనములగు పాంచజన్యములు మున్నగునవి విరోధము లేక యుండగా మీరును ననగా చైతన్యము గల్గిన మీరును నాయెడ వైరము లేక యుండుడు. అట్లు కానిచో చేతనుడగు శంఖాసురునికి వలె మీకును మరణ మేర్పడ గలదు.

సమాసములు ;

పాఞ్చజన్యం : పఞ్చజనే భవః = పాఞ్చజన్యః, తమ్ = పాఞ్చజన్యం.
అచేతనః : న చేతనః = అచేతనః.
ముక్తవిరోధః : ముక్తః విరోధః యేన సః = ముక్తవిరోధః.

భావము :

ఓ విష్ణూ ! ఎడమచేత పాంచజన్యమను శంఖమును, కుడిచేత నుదకముల యందు ఉద్భవించిన పద్మమును నీవు ధరించి, రాక్షసులను గూర్చి యిట్లు చెప్పబోవుచున్నట్లున్నావు. ఎట్లనగా - ఓ రాక్షసులారా ! మీరు చైతన్య వస్తులుగా నున్నారు. కావుననే చూడుడు. చైతన్యము లేని పాంచజన్య మనెడి శంఖము ఉదకముల యందు బుట్టినందు వలన అపాంచజన్యమైన పద్మము నావిషయమున వైరము లేక యున్నవి. ఇక చైతన్యము గల మీరును వానివలె విరోధములేక యుండుడు. అట్లు లేక విరోధమును వహించినచో చేతనులగు శంఖాసురుడు మున్నగు వారికి బట్టిన గతియే మీకును బట్టును. అనగా మరణము గలుగునని యాశయము.

శ్లో. తావకోరసి లసద్వనమాలే
శ్రీఫలద్విఫల శాఖికయేవ
స్థీయతే కమలయా త్వదజస్ర
స్పర్శకణ్టకితయోత్కచయా చ

వ. వి. తావకోరసి - లసద్వనమాలే - శ్రీఫల ద్విఫల శాఖికయా - ఇవ - స్థీయతే-కమలయా - త్వదజస్ర స్పర్శ కణ్టకితయా- ఉత్కుచయా-చ.

**అర్థము:** హే నారాయణ = ఓ నారాయణా !, త్వదజస్రస్పర్శకణ్టకితయా, త్వత్ = నీయొక్క, అజస్ర = నిరంతరపు, స్పర్శ = స్పర్శచే, కణ్టకితయా = సాత్విక భావముచే పులకలు గల్గినదియు (కణ్టకములతో గూడినదియును) తథా = అట్లే, ఉత్కుచయా, ఉత్ = ఉన్నతములైన కుచయా = చనుగవగలిగిన, కమలయా = లక్ష్మిచే, లసద్వనమాలే, లసత్ = శోభించెడి, వనమాలే = అరణ్య కుసుమమాలయును (వన పంక్తియును) కలిగిన, తావకోరసి, తావక = నీకు సంధించిన, ఉరసి = వక్షఃస్థలము నందు, శ్రీఫల ద్విఫల శాఖికయా ఇవ, శ్రీఫల = బిల్వ వృక్షము యొక్క, ద్విఫల = రెండు పండ్లు కల్గిన, శాఖికయా ఇవ = కొమ్మచేతనో యనునట్లు, స్థీయతే = ఉండబడుట (ఏర్పడు చున్నది.)

**సమాసములు :**

తావకోరసి : తవ ఇదం = తావకం, తావకం చ తత్ ఉరశ్చ = తావకోరః, తస్మిన్ = తావకోరసి.

లసద్వనమాలే : వనస్య మాలా = వనమాలా, లసన్తీ వనమాలా యస్మిన్ తత్ = లసద్వనమాలం, తస్మిన్ = లసద్వనమాలే.

శ్రీఫల ద్విఫలశాఖికయా : ద్వే చ తే ఫలే చ = ద్విఫలే, శ్రీఫలస్య ద్విఫలే యస్యాం సా = శ్రీఫల ద్విఫలా, శ్రీఫలద్విఫలా చ సా శాఖికా చ = శ్రీఫలద్విఫలశాఖికా, తయా = శ్రీఫల ద్విఫల శాఖికయా.

త్వదజస్ర స్పర్శ కణ్టకితయా : అజస్రం స్పర్శః = అజస్ర స్పర్శః, తవ అజస్ర స్పర్శః = త్వదజస్ర స్పర్శః, త్వదజస్ర స్పర్శేన కణ్టకా అస్య సఞ్జాతా ఇతి = త్వదజస్ర స్పర్శ కణ్టకితా, తయా = త్వదజస్ర స్పర్శ కణ్టకితయా.

**భావము :**

ఓ నారాయణా ! నీవు నిరంతరము తాకుటవలన పులకములతో గూడినదియు (కణ్టకములతో గూడినదియు) నగు లక్ష్మి యున్నత స్తనములు గలదై

వనమాలతో గూడిన నీ వక్షఃస్థలముపై నుండుట గాంచినచో రెండు ఫలములతో గూడినదై వనమాల మధ్యనున్న బిల్వపు కొమ్మ వలె శోభించు చున్నది. ఉన్నత స్తనములతో గూడిన యామెయొక్క శరీరము రెండు ఫలములతో గూడిన బిల్వపు కొమ్మగను, నీ కణ్ఠములోని వనమాల వనపంక్తిగను భావింప బడినవి. శరీరమందలి రోమాంచములు బిల్వశాఖ యందలి కణ్టకములుగను భావింప బడినవి.

శ్లో. త్యజ్యతే న జలజేన కరస్తే
శిక్షితుంసుభగ భూయ మివోచ్చైః।
ఆననఞ్చ నయనాయిత బిమ్బః
సేవతే కుముదహాసకరాంశుః ॥ 96

ప. వి. త్యజ్యతే - న - జలజేన - కరః - తే - శిక్షితుం - సుభగభూయం - ఇవ - ఉచ్చైః, - ఆననం - చ - నయనాయిత బిమ్బః, - సేవతే - కుముదహాస కరాంశుః.

అర్థము: హేవిష్ణో! = ఓ విష్ణూ!, జలజేన = పద్మముచే, ఉచ్చైః = గొప్పదైన సుభగభూయం = సౌభాగ్యమును అనగా కోమలత్వరక్తత్వాది రూపమగు సౌభాగ్యమును, శిక్షితుమివ = నేర్చుకొనుటనో యనునట్లు, తే = నీయొక్క, కరః = హస్తము, నత్యజ్యతే = విడువబడుటలేదు. (తథా = అట్లే) నయనాయితబిమ్బః, నయన = నీయొక్క, ఎడమనేత్రముగా, ఆయిత = ఆచరించెడి, బిమ్బః = మండలము గలిగిన, కుముద హాస కరాంశుః, కుముద = కలువలకు, హాస = నవ్వును, అనగా వికాసమును, కర = చేయునట్టి, అంశుః = కిరణములు గల్గిన చంద్రుడు, ఉచ్చైః = గొప్పదైన, సుభగభూయం = సౌభాగ్యమును, శిక్షితుమివ = నేర్చుటకో యనునట్లు, ఆననఞ్చ = ముఖమును, సేవతే = ఆశ్రయించు చున్నాడు. పద్మము సౌకుమార్యము మున్నుగ సౌభాగ్యమును, చంద్రుడు కళఙ్కరాహిత్యము మున్నుగ సౌభాగ్యమును నేర్చుటకో యనునట్లు నీహస్తమును, నీముఖమును సేవించుచున్నారు. గురుసేవ వలననే విద్య లభించును గదా!

సమాసములు :

సుభగభూయం : సుభగస్య భావః = సుభగ భూయం, తత్ = సుభగ భూయం.

నయనాయిత బిమ్బః : నయన మివ ఆచరితః = నయనాయితః, నయనాయితః బిమ్బః యస్యసః = నయనాయిత బిమ్బః,

కుముదహాస కరాంశుః : కుముదానాం హాసః = కుముదహాసః, కుముదహాసం కుర్వ న్తీతి = కుముద హాస కరాః, కుముదహాసంకరాః అంశవః యస్య సః = కుముదహాసకరాంశుః,

భావము ;

ఓ విష్ణూ! పద్మము కోమలత్వము రక్తత్వము మున్నగు సౌభాగ్యమును నేర్చుటకు నీచేతిని విడచుటలేదు. నీయెడమకన్నుగా నాచరించునట్టి మండలము గల్గిన చంద్రుడు నిష్కళంకత్వము మున్నగు సౌభాగ్యమును నేర్చుటకై నీముఖమును సేవించుచున్నాడు.

శ్లో. యే హిరణ్య కశిపుం రిపు ముచ్చైః
రావణం చ కురువీర చయం చ ।
హ న్త హ న్తు మభవం స్తవ యోగా
స్తే నరస్య చ హరేశ్చ జయ న్తి ॥ 97

ప.వి. తే - హిరణ్యకశిపుం - రిపుం-ఉచ్చైః - రావణం -చ- కురువీరచయం - చ - హ న్త హ న్తుం - అభవన్ - తవ - యోగాః - తే - నరస్య-చ - హరేః - చ - జయ న్తి.

అర్థము: హేవిష్ణూ!= ఓవిష్ణూ!, ఉచ్చైః = గొప్పవాడైన, రిపుం- శత్రువైన, హిరణ్యకశిపుం= హిరణ్యకశిపుడను రాక్షసరాజును, రావణంచ= రావణాసురుని, కురువీరచయం చ, = దుర్యోధనుడు మున్నగు కౌరవులసంఘమును. హన్తుం= చంపుటకు, (క్రమేణ) = వరుసగా, నరస్య చ = మనుష్యునియొక్కయు, హరేశ్చ= సింహముయొక్కయు, మనుష్యాకార సింహాకారముల యొక్కయని యర్థము. నరస్య చ= మనుష్యాకారము

గల రామునియొక్కయు, హరేశ్చ = వానరరాజగు సుగ్రీవుని యొక్కయు, నరవానరులయొక్క యని యర్థము. (తథా = అట్లే) నరస్య చ = అర్జునునియొక్కయు, హరేశ్చ = కృష్ణునియొక్కయు, నర నారాయణులయొక్క యని యర్థము. యే = ఏ, యోగాః = సంబంధ విశేషములు గలవో, దేహముతోడను, వ్యక్తిత్వముతోడను, నేర్పడిన కలయికలేవి, అభూవన్ = కలవో, హన్త = సంతోషము, తవ = నీ యొక్క, తే = అవి, జయన్తి = అన్నింట నతిశయించి యున్నవి. కాన వానికి వన్దనములు. అందు హిరణ్యకశిపుని వధించినపుడు నరసింహులకు శరీరసంయోగము. రావణ సంహారమందు రామ సుగ్రీవులనెడి నరవానర వ్యక్తులకు సంయోగము, కురువీరసంఘమును సంహరించుటయందు నర నారాయణులను వ్యక్తులకు సంయోగము.

**సమాసములు :**

కురువీరచయం : కురవశ్చ తే వీరాశ్చ = కురువీరాః, కురువీరాణాం చయః = కురువీర చయః, తం = కురువీర చయం.

**భావము :**

ఓ విష్ణూ! గొప్పశత్రువైన హిరణ్యకశిపుని, రావణాసురుని, దుర్యోధనాది కురువీరసంఘమును చంపుటకు క్రమముగా మనుష్యునియొక్కయు సింహము యొక్కయు నరవానరుల యొక్కయు అనగా రామునియొక్కయు సుగ్రీవుని యొక్కయు నరనారాయణులయొక్కయు, ననగా నర్జునకృష్ణులయొక్క దైహికములును వైయక్తికములునగు సంయోగము లేవి యేర్పడినవో ఆ నీ యొక్కసంయోగములు అన్నింటిని అతిశయించి జయించుచున్నవి. అట్టి సంయోగములకు వందనము.

శ్లో. కేయ మర్ధభవతా భవతోహో
మాయినా నను భవః సకల స్త్వమ్ ।
శేషతా మపి భజన్త మశేషం
వేదవేదనయనో హి జనస్త్వామ్ ॥ 98

ప. వి కా - ఇయం - అర్ధభవతా - భవతా-ఊహే-మాయినా- నను -భవః - సకలః - త్వమ్ - శేషతాం - అపి - భజన్తం - అశేషం - వేద - వేదనయనః - హి - జనః - త్వాం.

అర్థము: హే విష్ణో! = ఓవిష్ణూ!, మాయినా = మాయ గలిగిన, భవతా = నీచే, కా = ఎటువంటి, అనగా విచిత్రమైన, ఇయం = ఈ. అర్ధభవతా = భవుని యొక్కయు భవముయొక్కయు అనగా శివునియొక్కయు సంసారము యొక్కయు నర్ధభాగముగా నుండుట, లేదా, అర్ధ = అర్ధభాగము, భవతా = శివుని గలిగియుండుట అనగా హరిహరత్వము, అర్ధ సంసారత్వము, ఊహే = వహింపబడినది. (ఇది యుక్తముగాదని యర్థము) హి = ఏల యనగా, నను = ఓయీ! సకలః = సంపూర్ణుడైన. భవః = శివుడు, సంసారము, త్వం = నీవే, (తథా = అట్లే), వేద నయనః = వేదములనే నేత్రములుగా కల్గిన అనగా వేదమును నేర్చినట్టి జనః = జనము, శేషతామపి = అనన్తనాగత్వమును, ఉపయుక్తమైన దానికి మిగులుగా నుండుటను, భజన్తమపి = పొందుచున్నను, త్వాం = నిన్ను. అశేషం = శేషనాగునికంటె భిన్నునిగను, సర్వమునైనవానినిగను. వేద = తెలియుచున్నది. "పురుష ఏవేదగ్ం సర్వం" మున్నగు శ్రుతులే దీనికి ప్రమాణము.

**సమాసములు :**

అర్ధభవతా: భవస్య అర్ధం = అర్ధభవః, అర్ధభవస్య భావః = అర్ధభవతా, లేదా అర్ధః భవః యస్యసః = అర్ధభవః, అర్ధభవస్య భావః = అర్ధభవతా.

శేషతాం : శేషస్య భావః = శేషతా, తాం = శేషతామ్.

అశేషం : న శేషః = అశేషః, తం = అశేషం

వేదనయనః : వేదః నయనం యస్య సః = వేదనయనః

**భావము :**

ఓ విష్ణూ! మాయావి యగు నీవు ఎంత విచిత్రమైన అర్ధభవతను వహించితివి? అనగా శివుని సగపాలును సంసారపు సగపాలును లేదా సగము శివుని కలిగియుండుటను ననగా హరి హరుడుగా నుండుటను సగము సంసారము గల్గి

యుండుటను వహించితివి. ఇది యుక్తముగాదు. ఏలయనగా ఓ విష్ణూ! సంపూర్ణ మైన శివుడును సంపూర్ణమైన సంసారమును నీవే! అట్లే వేదమునే నేత్రముగా గలిగిన జనము అనగా వేదమును నేర్చిన జనము నిన్ను శేషునిగను ననగా ననన్త నాగునిగను (శేషమైన వానినిగను)నున్న నిన్నునశేషునిగను ననగా సర్వస్వరూపుని గను (శేషముకాని వానినిగను) తెలిసికొను చున్నది. "పురుష ఏ వేదగ్ం సర్వం'' అను శ్రుతియు నీ సర్వమంతయు పురుష స్వరూపముగా జెప్పుచున్నది.

శ్లో. ప్రాగ్భవై రుదగుదగ్భవగుమ్భా
న్ముక్తియుక్తి విహతా విహతావత్ ।
నాఽపరః స్ఫురతి కస్యచనాఽపి
త్వత్సమాధి మవధూయ సమాధిః ॥ 99

ప. వి. ప్రాగ్భవైః, ఉదగుదగ్భవగుమ్భాత్, ముక్తి యుక్తివిహతౌ, ఇహ - తావత్ - న-అపరః - స్ఫురతి - కస్యచన - అపి - త్వత్సమాధిం - అవధూయ - సమాధిః.

అర్థము : హే విష్ణో? = ఓ విష్ణూ, ప్రాగ్భవైః = పూర్వ పూర్వ జన్మములయం దార్జించిన కర్మములచే, ఉదగుదగ్భవగుమ్భాత్, ఉదగుదక్ = ఉత్త రోత్తములగు, భవ = జన్మములయొక్క, గుమ్భాత్ = సమ్పాదనము వలన, అనగా జన్మ పరంపరల నెత్తుట వలన నని యర్థము. ఇహ = ఈ సంసారమునందు, ముక్తి యుక్తి విహతౌ, ముక్తి = మోక్షముయొక్క, యుక్తి = ప్రాప్తికి, విహతౌ = విఘ్న విషయము నందు, అనగా కర్మ క్షీణించి నందువలన నాత్యంతిక దుఃఖనివృత్తి యన బడునట్టిదియు లేదా యవిద్యానాశరూపమగు మోక్షమునకు ప్రతిబన్ధ మేర్పడినచో నని యర్థము. త్వత్సమాధిం, త్వత్ = నీ యొక్క, సమాధిం = ధ్యానమును, అవధూయ = వదలి, కస్య చనఅపి = ఏయా చార్యునకును, అపరః = మరియొక, సమాధిః = సమాధానము, న స్ఫురతి = తోచదు. పూర్వ పూర్వ జన్మముల యందు సంపాదించిన కర్మలచే నుత్తరోత్తర జన్మములు గలుగుట వలన మోక్షమునకు భంగము గలుగుచున్నది. ఆ జన్మల యందు, నిన్ను ధ్యానించినచో నీ దర్శనము గలిగి దానిచే

పూర్వ కర్మలు నశింపగా జీవుడు మోక్షము బడయునని తత్త్వవేత్తల సిద్ధాంతము. "ఛిద్యతే హృదయ గ్రన్థిః" యని శాస్త్రము గూడా నట్లే చెప్పుచున్నది.

సమాసములు :

ప్రాగ్భవైః : ప్రాగ్ భవన్తీతి = ప్రాగ్భవాః
ఉదగుదగ్భవ గుమ్ఫాత్ : ఉదఙ్చశ్చ ఉదఙ్చశ్చ = ఉదగుదఙ్చః, ఉదగుదక్షు భవాః = ఉదగుదగ్భవాః. ఉదగుదగ్భవానాం గుమ్ఫః = ఉదగుదగ్భవ గుమ్ఫః, తస్మాత్ = ఉదగుదగ్భవగుమ్ఫాత్.
ముక్తి యుక్తి విహతౌ : ముక్తేః యుక్తిః = ముక్తి యుక్తిః, ముక్తి యుక్తేః విహతిః = ముక్తియుక్తి విహతిః, తస్యాం = ముక్తియుక్తి విహతౌ.
త్వత్సమాధిం : తవ సమాధిః = త్వత్సమాధిః, తం = త్వత్సమాధిం.

భావము :

ఓ విష్ణూ ! పూర్వ పూర్వ జన్మముల యందు దార్జించిన కర్మములచే నుత్తరోత్తర జన్మము లేర్పడు చున్నవి. కాన నీ సంసారము నందు ముక్తి ప్రాప్తికి భంగ మేర్పడినపుడు, నిన్ను ధ్యానించుట తప్ప మరియొక మార్గ మెవనికిని లేదు. మోక్ష మనునది సకల దుఃఖముల వినాశ మనియు లేదా అజ్ఞాన వినాశమనియు చెప్పబడుచున్నది. పూర్వ పూర్వ జన్మముల యందలి కర్మములచే నుత్తరోత్తర జన్మము లేర్పడునపుడు ముక్తికి భంగము కలుగును. కాన నట్టి సందర్భమున నిన్ను ధ్యానించి నీ సాక్షాత్కారము బడసినచో నాకర్మ యంతయు క్షీణమై జీవుడు ముక్తిని బొందునని తత్త్వజ్ఞుల సిద్ధాంతము. కావుననే "ఛిద్యతే హృదయ గ్రన్థిః" యని శాస్త్రము చెప్పుచున్నది.

శ్లో. ఊర్ధ్వదిక్కదలనాత్ ద్విరకార్షీః
కిం తనుం హరి హరీ భవనాయ।
కించ తిర్యగభినో నృహరిత్వే
క స్స్వత స్త్రి మను నన్వనుయోగః ॥ 100

ప. వి. ఊర్ధ్వదిక్క - దలనాత్ - ద్విః - అకార్షీః - కిం - తనుం - హరి హరీ భవనాయ - కిం - చ - తిర్యక్ - అభినః - నృహరిత్వే - కః - స్వతన్త్రిం - అను - సను - అనుయోగః.

అర్థము: హే విష్ణో ! = ఓ విష్ణూ !, హరి హరీ భవనాయ, విష్ణు శంకరుల మిళిత మగు శరీరమును బరిగ్రహించుటకై, ఊర్ధ్వదిక్క = పైదిక్కు గలిగిన, యనగా పై భాగము గలిగిన, అనగా కాలినుండి తలవరకును నెడమ ప్రక్కకును కుడిప్రక్కకును, దలనాత్ = సగము సగముగా విభాగము వలన ననగా నొక్కదేహమునే పైనుండి క్రిందివరకును విభజించుట వలన, కిం = ఏల, తనుం = శరీరమును, ద్విః = రెండుగా, అనగా సంపూర్ణ దక్షిణ భాగమందు హరి రూపము గలదిగను, సంపూర్ణ వామ భాగమునందు హరరూపము గలదిగను, అకార్షీః = చేసితివి. అనగా హరిహర రూపమును ధరించుటకు ఎట్లు పాదముల నుండి తలవరకును శరీరమును విభజించితివని యర్థము. మరియు నెందులకు, నృహరిత్వే = నరసింహభావమునందు, తనుం = శరీరమును, తిర్యక్ యథా తథా = అడ్డముగా, అభినః = భాగించితివి, కంఠమునకు దిగువభాగమును నరరూపముగను పైభాగమును, సింహరూపమును, విభజించితివి. సను = ఓ విష్ణూ ! స్వతన్త్రిడైన పురుష శ్రేష్ఠుడవైన నిన్ను, అను = ఉద్దేశించి. కః = (ముందు చెప్పినట్టి) ఏమి ?, అనుయోగః = ప్రశ్న, స్వతన్త్రేచ్ఛ గలిగిన పరమేశ్వరుని విషయమున ఏల యిట్లు చేసితివి ? ఏల యిట్లు చేయకపోతివి ? అని ప్రశ్న తగదు. అతడు స్వేచ్ఛతో తాను కోరిన దానిని జేసికొనగలడు. కాన నతని విషయమున నెవ్వనికిని నెటువంటి ప్రశ్నకును నవకాశము లేదని యర్థము.

సమాసములు :

ఊర్ధ్వదిక్కదలనాత్ : ఊర్ధ్వా దిక్ యస్య తత్ = ఊర్ధ్వదిక్కం, ఊర్ధ్వ దిక్కం చ తత్ దలనం చ = ఊర్ధ్వ, దిక్కదలనం, తస్మాత్ = ఊర్ధ్వదిక్కదలనాత్.

హరి హరీ భవనాయ : హరిశ్చ హరశ్చ = హరి హరౌ. హరిహరయోః భవనం = హరిహరీ భవనం, తస్మై = హరి హరీ భవనాయ.

నృహరిత్వే : నా చాసౌ హరిశ్చ = నృహరిః, నృహరేః భావః = నృహరిత్వం, తస్మిన్ = నృహరిత్వే.

భావము :

ఓ విష్ణూ! హరి హరుడవగుటకై నీ శరీరమును పాదములనుండి తల వరకును నిలువుగా కుడియెడమ భాగము లేర్పడునట్లు, రెండుగా విభజించితివి. ఇట్లేల విభజించితివి? నీవు నరసింహరూపమును ధరించునపుడు అడ్డముగా శరీరమును విభజించి కంఠమునకు దిగువ నరరూపమును, కంఠమునకు పైన సింహరూపమును ధరించితివి. అట్లే యిచ్చటను చేయరాదా? ఓ విష్ణూ! స్వతంత్రుడవైన పురుషోత్తముడవగు నిన్ను గూర్చి యిట్లెవ్వరు ప్రశ్నింప గలరు? స్వతంత్రేచ్ఛగల పరమేశ్వరుడవగు నీవిషయమున నిట్టి ప్రశ్నలు తగవు. నీవు స్వేచ్ఛతో నిష్టమైన పనిని జేసికొనగలవు. కాన నీ విషయమున నెవ్వనికిని నెట్టి ప్రశ్నను జేయుటకు నవకాశము లేదని యాశయము.

శ్లో. ఆప్తకామ! సృజసి త్రిజగత్ కిం?
కిం భినత్సి యది నిర్మితమేవ
పాసి చేద మవతీర్య ముహుః కిం?
స్వాత్మనాఽపి యదవశ్యవినాశ్యం ॥ 101

ప. వి. ఆప్తకామ! - సృజసి - త్రిజగత్ - కిం? - భినత్సి - యది - నిర్మితం - ఏవ - పాసి - చ - ఇదం - అవతీర్య - ముహుః - కిం - స్వాత్మనా - అపి - యత్ - అవశ్య వినాశ్యం.

అర్థము : ఆప్తకామ! = కోరికలను దీర్చుకొనినవాడా!, విష్ణో = ఓ విష్ణూ!, (అత ఏవ = కావుననే నీకు కార్యముల వలని ప్రయోజన మేమియును లేదు) కిం = ఏల, త్రిజగత్ = మూడు లోకములను, సృజసి = సృజింతువు. ఆప్తకామునకు నేలాటి ప్రయోజనము లేనందువలన నిది వ్యర్థమని యర్థము. యది నిర్మితమేవ = ఒకవేళ సృజింప బడినదే యైనను, కిం = ఏల, భినత్సి = నాశము చేయుదువు? యత్ = ఎందు

వలన, నా మూడు లోకములు, స్వాత్మనాపి = స్వయముగను, అవశ్య వినాశ్యమేవ = తప్పక నశింప దగినదేనా?, ఇదం = ఈ మూడులోకములను, ముహుః = పలుమాఱులు, అవతీర్య = మత్స్యాది రూపములతో నవతరించిన వాడవై, కిం = ఏల, పాసి చ = రక్షింతువు. అవశ్యము నాశము చేయవలసిన దానిని రక్షించుట యెందులకు? నీవే బ్రహ్మ విష్ణు రుద్రాది రూపములతో ప్రపంచమును సృజింతువు, పాలింతువు, సంహరించెదవని యర్థము. నీవు స్వతంత్రేచ్ఛుడవు గాన నిన్ను ప్రశ్నింప దగదని యర్థము.

సమాసములు :

ఆప్తకామ : ఆప్తాః కామాః యేన సః = ఆప్తకామః, తస్యసంబుద్ధిః = ఆప్తకామ!,
అవశ్య వినాశ్యం : వినాశయితుం యోగ్యం = వినాశ్యం, అవశ్యం వినాశ్యం = అవశ్యవినాశ్యం.

భావము

సమస్త వాంఛలను దీర్చుకొన్న ఓ భగవానుడా! నీకే కార్యముల చేతను నేలాంటి ప్రయోజనము లేదు. కాని నీవేల మూడు లోకములను సృజింతువు. ఒకవేళ నీవు ఆవిధముగా సృజించినను వానినేల నాశము గావింతువు? ఏమి? ఈ మూడు లోకములు గూడా నావిధముగనే నశింపదగినవేనా? అట్లైనచో నీవు మాటిమాటికి మత్స్యాద్యవతారములనెత్తి యేలదీనిని రక్షించుచున్నావు? అవశ్యము నశింపవలసిన లోకములను సృజించుట వ్యర్థముకదా! అయిననూ నీవు స్వతంత్రేచ్ఛ గలవాడవు గాన నిన్ను ప్రశ్నింప మాకర్హత లేదు.

శ్లో. జాహ్నవీ జలజ కౌస్తుభ చన్ద్రిన్
పాదపాణి హృదయేక్షణ వృత్తీన్ ।
ఉత్థితాబ్ధి సలిలాత్ త్వయి లోలా
శ్రీః స్థితా పరిచితాన్ పరిచిన్త్య॥ 102

ప. వి. జాహ్నవీ జలజ కౌస్తుభ చన్ద్రాన్ - పాదపాణి హృదయేక్షణ వృత్తీన్ - ఉత్థితా - అబ్ధి సలిలాత్ - త్వయి - లోలా - శ్రీః - స్థితా - పరిచితాన్ - పరిచిన్త్య.

అర్థము : హే విష్ణో! = ఓ విష్ణూ!, అబ్ధి సలిలాత్ = సముద్ర జలమునుండి, ఉత్థితా = ఉద్భవించిన, లోలా = చపలురాలైన, శ్రీః = లక్ష్మి, పాదపాణి హృదయేక్షణ వృత్తీన్, పాద = పాదములయందు, పాణి = హస్తములయందును. హృదయ = వక్షఃస్థలము నందును, ఈక్షణ = కన్నులయందును, వృత్తీన్ = క్రమముగా నునికి గలిగిన, జాహ్నవీ జలజ కౌస్తుభ చన్ద్రాన్, జాహ్నవీ = గంగయు, జలజ = పద్మమును, కౌస్తుభ = కౌస్తుభ మణియు, చన్ద్రాన్ = చన్ద్రుడు ననెడి, పరిచితాన్ = పరిచయము గలిగినవారిని అనగా సముద్రమునందు నందఱు నివాసము చేసి యుండుట వలన బరిచయము ప్రణయము గలిగినట్టివారి నని యర్థము. పరిచిన్త్య (ఇవ) పర్యాలోచించియో యనునట్లు, త్వయి = నీయెడ స్థితాకిం = ఉన్నదా యేమి? అనగా స్థిరముగా నున్నదా యని యర్థము. గంగ మున్నగువానికి నెలవైన నీకు వందనమని యర్థము.

సమానములు:

జాహ్నవీజలజ కౌస్తుభచన్ద్రాన్ : జాహ్నవీ చ, జలజం చ, కౌస్తుభంచ, చన్ద్రశ్చ = జాహ్నవీ జలజ కౌస్తుభ చన్ద్రాః, తాన్ = జాహ్నవీ జలజ కౌస్తుభ చన్ద్రాన్.

పాదపాణి హృదయేక్షణ వృత్తీన్ : పాదశ్చ పాణిశ్చ హృదయం చ ఈక్షణం చ = పాదపాణి హృదయేక్షణం, పాదపాణి హృదయేక్షణే వృత్తిః యేషాం తే = పాదపాణి హృదయేక్షణ వృత్తయః, తాన్ = పాదపాణి హృదయేక్షణ వృత్తీన్.

అబ్ధిసలిలాత్ : అబ్ధేః సలిలం = అబ్ధిసలిలం, తస్మాత్ = అబ్ధిసలిలాత్.

భావము :

ఓ విష్ణూ! సముద్ర జలము నుండి యుద్భవించినట్టి లక్ష్మి యెచ్చటను నిలకడలేనట్టి చపలురాలైనను నీపాదమునందు నెలకొనిన గంగను, హస్తము

నందు నెలకొనిన పద్మమును, వక్షఃస్థలమునందు నెలకొనిన కౌస్తుభమణిని, కన్నులయందు నెలకొనిన చంద్రుని బర్యాలోచించి వారందఱు సముద్రమునందు తనతో నొకచోట వాసము గలిగి యుండుట వలన నేర్పడిన పరిచయమును ప్రణయమును బురస్కరించుకొని నీయెడ వింకద గలిగి స్థిరముగా నిలచినది. అట్టి గంగాదులకు ఆశ్రయమైన నీకు నమస్కారము.

శ్లో. వస్తు వాస్తు ఘటతే న భిదానాం
యౌక్తనైక విధ బాధ విరోధైః ।
త త్త్వ దీహిత విజృమ్భిత త త్త
ద్భేద మేత దితి త త్త్వనిరుక్తిః॥ 103

ప. వి. వస్తు - వాస్తు - ఘటతే - న - భిదానాం - యౌక్తనైకవిధబాధ విరోధైః - తత్ - త్వదీహితవిజృమ్భిత త త్తద్భేదం - ఏతత్ - ఇతి- త త్త్వ నిరుక్తిః.

అర్థము : హే విష్ణో! = ఓ విష్ణూ!, యౌక్తనైక విధబాధ విరోధైః-యౌక్త= యుక్తిచే నేర్పడునవియును, నైకవిధ = పెక్కువిధములగు, బాధ = ప్రతిబంధములు, విరోధైః = విరోధములనెడి కారణములచే. వస్తు = ఘటపటాది రూపమగు పదార్థ జాతము, భిదానాం = భేదములకు, వాస్తు = ఆశ్రయముగా, న ఘటతే= కుదురదు. తత్= అందువలన, ఏతత్ = ఈ ఘటపటాది రూపమైన పదార్థసమూహము, త్వదీహిత విజృమ్భిత త త్తద్భేదం, త్వత్ = నీయొక్క, ఈహిత = కోరిక యొక్క, విజృమ్భిత= వెల్లడి బొందిన, త త్తత్ = ఆయా, భేదం = తారతమ్యము గలిగినది యనగా ఘటపటాది రూపమైన విశేషమును గలిగినది. ఇతి = ఇవ్విధముగా, త త్త్వనిరుక్తిః, త త్త్వ=యథార్థము నకు, నిరుక్తిః= నిర్వచనము.

సమాసములు :

యౌక్తనైకవిధ బాధవిరోధైః: యుక్త్యా సిద్ధాః = యౌక్తాః, న ఏక విధాః = నైకవిధాః, యౌక్తాశ్చనైకవిధాశ్చ= యౌక్తనైకవిధాః, యౌక్త

నైకవిధాశ్చ బాధాశ్చ విరోధాశ్చ = యౌక్తనైకవిధ బాధవిరోధాః, తై = యౌక్తనైకవిధ బాధవిరోధైః.

త్వదీహిత విజృమ్భిత తత్తద్భేదం : తవ ఈహితం = త్వదీహితం, త్వదీహితేన విజృమ్భితః = త్వదీహిత విజృమ్భితః, స చ స చ భేదః = తత్తద్భేదః, త్వదీహిత విజృమ్భితః తత్తత్ భేదః యస్యతత్ = త్వదీహిత విజృమ్భిత తత్తద్భేదమ్.

తత్త్వనిరుక్తిః : తస్య భావః = తత్త్వం, తత్త్వస్య నిరుక్తిః = తత్త్వ నిరుక్తిః.

**భావము :**

లోకమున ఘటము పటము మున్నగు వస్తువులన్నియు నొక్కమూల పదార్థమునుండి యుద్భవించినను పెక్కువిధములగు భేదముల కాశ్రయములుగా నున్నవి. ఇది తగదు ఇట్లగుచుచో వీనికి యుక్తులతో పెక్కురకములగు బాధలు విరోధములు సంభవించుచున్నవి. కాన నవి యన్నియు నీకోరికచే నుద్భవించిన యాయాభేదములతో గూడియున్నవి. ఇదియే దీనికి నిజమైన నిర్వచనము. మట్టితో చేయబడిన కుండ మట్టిగనే యున్నట్లు ఒక్క మూలపదార్థము నుండి యుద్భవించినది యొక్కవిధముగనే యుండదగును. కాని యట్లుండక భిన్నముగ నున్నచో యుక్తులతో జెప్పబడు బాధలు విరోధములు పెక్కులేర్పడును. అట్లే యొక్క మూలకారణమునుండి భిన్నములగు వస్తువు లుద్భవించినచో నపుడు తేజస్సునుండి వేడిగల్గునట్లు చల్లదనము గూడా గలుగవలయును గదా! కాన నీ విధములగు యుక్తిసిద్ధములగు విరోధము లేర్పడును. కాన ఘట పటాదులకు గానవచ్చెడి పరస్పర భేదములు సత్యములు గావు. అవి నీయిచ్ఛచే ప్రేరితమగు మాయతో భాసించుచున్నవి. కాన నీవు ఒక్కడవే యీసమస్తమైన వస్తుజాతమనునదియే తత్త్వనిర్వచనమని యర్థము.

శ్లో. వస్తు విశ్వముదరే తవ దృష్ట్వా
బాహ్యవత్ కిం మృకణ్డతనూజః ।
స్వం విమిశ్రముభయం న వివిఞ్చన్
నిర్యయౌ స కతర స్త్వమవైషి॥ 104

ప. వి. వస్తు - విశ్వం - ఉదరే - తవ - దృష్ట్వా - బాహ్యవత్ - కిం - మృకణ్డతనూజః - స్వం - విమిశ్రం - ఉభయం - న వివిఞ్చన్ = నిర్యయౌ - సః - కతరః - త్వం - అవైషి.

అర్థము: హేవిష్ణో! — ఓవిష్ణూ!, మృకణ్డతనూజః — మృకణ్డ మహర్షిపుత్రుడగు మార్కణ్డేయమహర్షి, తవ — నీయొక్క, ఉదరే — బొజ్జయందు, బాహ్యవత్ — వెలుపలి ప్రపంచమందున్న వస్తుసమూహమువలె, విశ్వం — సమస్తమైన, వస్తు — పదార్థమును, దృష్ట్వా — చూచి, ఉభయం — వెలుపలి వస్తుసమూహము లోపలి వస్తుసమూహమునను రెంటిని, విమిశ్రం — విశేషముతో గూడిన దానినిగా ననగా నొకప్రకారముగా గూడినదానినిగా నని యర్థము. అనగా నొక్క యుదరమునందు వెలుపలి పదార్థములును లోపలి పదార్థములును నుండునట్లు తెలియుటవలన విభిన్నముగా గానరాని, స్వం — తనను. నవివిఞ్చన్ — వివేచించుట కశక్తుడై, అనగా వెలుపల నున్న నేనెవ్వడు లోపలనున్న నేనెవ్వడు అని అవి భిన్నముగా తెలియనశక్తుడై, నిర్యయౌ కిల — ఉదరమునుండి వెలుపలికి వచ్చెను. సః — అట్టి మార్కండేయుడు, కతరః — ఎవ్వడు? అనగా వెలుపల నున్నచో వాడెవ్వడు? లోపలనున్నచో వాడెవ్వడు? ఇతి — అని, త్వం — నీవే, అవైషి — తెలుసుకొనుచున్నావు, ఏల యనగా. నీవు సర్వజ్ఞుడవు. మరి యొక్కడు దానిని తెలిసికొనజాలడని యర్థము.

**సమాసములు :**

బాహ్యవత్ : బహిర్భవం — బాహ్యమ్, బాహ్యమివ — బాహ్యవత్.
మృకణ్డుతనూజః : మృకణ్డోః తనూజః — మృకణ్డు తనూజః.

**భావము :**

ఓ విష్ణూ ! మార్కండేయుడు నీయుదరమును ప్రవేశించి ఇచ్చట గూడ వెలుపల గానవచ్చెడి మూడు లోకములను గాంచి యావెలుపలి ప్రపంచము లోపలి ప్రపంచము రెండును నొక్కచోట నుండుట వలన ననగా నొక్క యుదరము నం దుండుట వలన, నారెంటికిని వ్యత్యాసమును గ్రహింపజాలక పోయెను. అపుడు వెలుపల సంచరించుచు నుదరమును ప్రవేశించిన నేనెవ్వడను? పూర్వమే యుదరమందున్న నేనెవ్వడను అని భేదమును నీమాయ తన్ను గమ్ముటచే నరయ జాలక వెలుపలికి వచ్చెను. నీవు మాయా బాలకుడవై

నిట్టూర్పుచే మార్కండేయమునిని నీ యుదరము లోనికి ప్రవేశపెట్టి యతని యుదరమునందు మూడులోకములను జూపి నోటి నుండి మెల్లగా వానిని వెలుపలికి రప్పించితివి. ఆ మార్కండేయుడు వెలుపలి వాడా? లేక లోపలివాడా? యను విషయమును నీవే యరుయగలవు. ఈ కథ హరివంశమునం దున్నది.

శ్లో. బ్రహ్మణోఽస్తు తవ శక్తి లతాయాం
మూర్ధ్ని విశ్వ మథ పత్యురహీనాం
బాలతాం కలయతో జఠరే వా
సర్వథాఽపి జగతా మవలమ్బః ॥ 105

ప. వి. బ్రహ్మణః - అస్తు - తవ - శక్తిలతాయాం - మూర్ధ్ని - విశ్వం - అథ - పత్యుః - అహీనాం - బాలతాం - కలయతః - జఠరే - వా - సర్వథా - అపి - జగతాం - అవలమ్బః.

అర్థము: హే విష్ణో! = ఓ విష్ణూ!, విశ్వం = ప్రపంచము, బ్రహ్మణః = పరబ్రహ్మ రూపుడైన, తవ = నీయొక్క, శక్తిలతాయాం, శక్తి = మాయ యనెడు, లతాయాం = తీగెయందు, అస్తు = ఫలరూపముగా నుండుగాక, అథ = లేదా, అహీనాం = సర్పములకు, పత్యుః = ప్రభువడైన, అనన్త నాగరూపుడవైన, తవ = నీయొక్క, మూర్ధ్ని = శిరస్సునందు, అస్తు = ఉండును గాక, వా = లేదా, బాలతాం = శిశుత్వమును, కలయతః = వహించిన యనగా, వటపత్రశాయిగా బాలకుడవైన, తవ = నీయొక్క, జఠరే = ఉదరము నందు, అస్తు = ఉండును గాక, జగతాం = లోకములకు, సర్వథా = అన్ని విధములుగా, అవలమ్బః = ఆశ్రయముగా త్వం = నీవు, అసి = అగుచున్నావు. (కావున) తుభ్యం = నీకై, నమః = వందనము.

**సమాసములు :**

శక్తిలతాయాం : శక్తి రేవ లతా = శక్తిలతా, తస్యాం = శక్తిలతాయాం.

బాలతాం : బాలస్య భావః = బాలతా, తాం = బాలతాం.

**భావము :**

ఓ విష్ణూ! ప్రపంచము పరబ్రహ్మ స్వరూపుడవైన నీయొక్క మాయ యనెడి తీగెయందు బందుగా నుండును గాత. లేదా సర్పములకు పాలకుడవైన యనన్త నాగరూపుడవైన నీశరీరముపై నుండును గాత, లేదా వటపత్రశాయివై బాల్యమును వహించిన నీయొక్క యుదరమునందు నెలకొనును గాత. అన్ని విధములుగా ప్రపంచమునకు నీవే యేదుగడవు.

శ్లో. ధర్మబీజ సలిలా సరిదఙ్ఘ్రి
వర్థమూల మురసి స్ఫురతి శ్రీః ।
కామదైవత మపి ప్రసవ స్తే
బ్రహ్మ ముక్తిదమపి స్వయమేవ ॥ 106

ప. వి. ధర్మబీజ సలిలా - సరిత్ - అఙ్ఘ్రి - అర్థమూలం - ఉరసి - స్ఫురతి - శ్రీః - కామదైవతం - అపి - ప్రసవః - తే - బ్రహ్మ - ముక్తిదం - అపి - స్వయమ్ - ఏవ.

అర్థము: హే విష్ణో! = ఓ విష్ణూ!, ధర్మబీజ సలిలా, ధర్మ = చతుర్వర్గముల యందు మొదటిదైన ధర్మమునకు, బీజ = కారణమగు, సలిలా = ఉదకము గలిగిన, సరిత్ = గంగానది, తే = నీయొక్క, అఙ్ఘ్రి = పాదమునందు, స్ఫురతి = విలసిల్లు చున్నది. అర్థమూలం, అర్థ = అర్థమైన రెండవ చతుర్వర్గమునకు, మూలం = కారణమైన, శ్రీః = లక్ష్మి, (తవ = నీయొక్క) ఉరసి = వక్షఃస్థలము నందు, స్ఫురతి = ప్రకాశించు చున్నది. కామదైవతమపి, కామ = కామమనెడి మూడవ చతుర్వర్గమునకు, దైవతం = అధిష్ఠాన దేవతయగు మన్మథుడును, తే = (యదువంశము నందు అవతరించిన శ్రీకృష్ణుడవైన) నీకు, ప్రసవః = పుత్రుడైన ప్రద్యుమ్నుడు. ముక్తిదం = ముక్తియనెడు నాల్గవ పురుషార్థము నిచ్చెడి, బ్రహ్మ = పరమాత్మయు, స్వయమేవ = తానే, అసి = అగుచున్నావు.

సమాసములు :

ధర్మబీజసలిలా : ధర్మ ఏవ బీజం = ధర్మబీజం, ధర్మబీజం సలిలం యస్యాస్సా = ధర్మబీజసలిలా.

అర్థమూలం : అర్థస్య మూలం = అర్థమూలం

కామదైవతం : కామస్య దైవతం = కామదైవతం.

ముక్తిదం : ముక్తిం దదాతీతి = ముక్తిదం.

**భావము :**

ఓ విష్ణూ! ధర్మార్థకామమోక్షము లనెడి చతుర్వర్గములలో మొదటిది ధర్మము. దానికి మూల భూతములగు నుదకములు గల గంగానది నీపాదమునం దున్నది. ఆ చతుర్వర్గములో రెండవది యర్థము. అనగా ధనము. దానికి మూల భూతమగు లక్ష్మి నీ వక్షఃస్థలమునం దున్నది. ఆ చతుర్వర్గమునందు మూడవది కామము. దాని కధిష్ఠానదేవతయగు మన్మథుడు నీ పుత్రుడు. ఆ చతుర్వర్గ ములో నాలుగవది మోక్షము. దాని నొసంగెడి పరబ్రహ్మము నీవే యగు చున్నావు. కాన ధర్మార్థ కామమోక్షము లనెడి నాలుగు పురుషార్థములు నీయందే విరోధము లేక నెలకొని యున్నవి. కాన పురుషార్థములను నాల్గింటిని కోరువానికి నీవే సేవింప దగినవాడవు.

శ్లో. లీలయాఽపి తవ నామ జనా యే
గృహ్ణతే నరకనాశకరస్య ।
తేభ్య ఏవ నరకైరుచితా భీ
స్తేతు బిభ్యతు కథం నరకేభ్యః ॥ 107

ప. వి. లీలయా - అపి - తవ - నామ - జనాః - యే - గృహ్ణతే - నరక నాశకరస్య - తేభ్యః - ఏవ - నరకైః - ఉచితా - భీః - తే - తు - బిభ్యతు - కథం - నరకేభ్యః.

అర్థము: హే విష్ణో! = ఓ విష్ణూ!, యే = ఏ, జనాః = జనులు, నరకనాశక రస్య, నరక = రౌరవాది నరకమునకు (నరకాసురునకు) నాశ = వినాశమును, (మరణమును) కరస్య = చేయునట్టి, తవ = నీయొక్క,

నామ = పేరును, లీలయాఽపి = లీలతో నైనను, గృహ్ణతే = గ్రహించు చున్నారో, అనగా అప్రయత్నముగా బలుకు చున్నారో యని యర్థము. తేభ్య ఏవ = వారి నుండియే, నరకైః = నరకములచే, భీః = భయము. ఉచితా = తగినది. ఏల యనగా వారు నరకనాశకరుని నామమును బేర్కొనిరి కదా!, తేతు = అటువంటి జనులు, నరకేభ్యః = నరకముల నుండి, కథం = ఎట్లు, బిభ్యత = భయపడెదరు? భయపడ నవసరము లేదని యర్థము.

శ్లో. "సాఙ్కేత్యం పారిహాస్యం వా స్తోభం హేలనమేవ వా ।
వైకుణ్ఠనామగ్రహణం అశేషాఘహరం విదుః"

అని శ్రీమద్భాగవతవచనము.

**సమాసములు :**

నరకనాశకరస్య : నరకస్య నాశః = నరకనాశః, నరకనాశం కరోతీతి = నరకనాశకరః, తస్య నరకనాశకరస్య.

**భావము :**

ఓ విష్ణూ ! ఏ జనులు రౌరవాది నరకములను (నరకాసురుని) నాశము గావించిన నీపేరును నప్రయత్నముగ నైనను గ్రహించుచురో అట్టివారి నుండియే నరకమునకు భయము తగినది. ఏలయనగా వారు నరకనాశకరుని నామమును గ్రహించిరి. అట్టివారు నరకముల నుండి యేల భయపడవలెను. అనగా భయపడ నవసరము లేదని యర్థము.

శ్లో. మృత్యుహేతుషు న వజ్ర నిపాతాత్
భీతి మర్హతి జన స్త్వయి భక్తః ।
య త్తదోచ్చరతి వైష్ణవకణ్ఠా
న్నిష్ప్రయత్నమపి నామ తవ ద్రాక్ ॥ 108

ప. వి. మృత్యుహేతుషు - న - వజ్రనిపాతాత్ - భీతిం - అర్హతి - జనః - త్వయి - భక్తః - యత్ - తదా - ఉచ్చరతి - వైష్ణవకణ్ఠాత్ - నిష్ప్రయత్నం - అపి - నామ - తవ - ద్రాక్.

అర్థము: హే విష్ణో ! = ఓ విష్ణూ !, త్వయి = నీయెడ, భక్తః = సేవానురక్తిగల, జనః = జనము, మృత్యుహేతుషు = మృత్యువునకు కారణములైనవాని మధ్య ప్రధానమగు, వజ్రనిపాతాదపి = వజ్ర నిపాతనమునుండియు భీతిం = భయమును, లబ్ధుం = పొందుటకు, నార్హతి = తగడు. (ఏల యనగా) యత్ = ఏకారణము వలన, తదా = వజ్రమును పడవేయు సమయము నందు, వైష్ణవకణ్ఠాత్, వైష్ణవ = విష్ణుభక్తునియొక్క, కంఠాత్ = కంఠము నుండి, తవ = నీయొక్క, నామ = పేరు, నిష్ప్రయత్నమపి = ప్రయత్నము లేకయు, ఎల్లపుడును నామోచ్చారణము జేయ గలిగిన యభ్యాసముచే ప్రయత్నము లేకయే, ద్రాక్ = శీఘ్రముగనే, ఉచ్చరతి = వెలువడును. అదియే వజ్రపాతము వలని భయమును వారించును. అభిప్రాయము లేక విష్ణు నామోచ్చారణము గావించినను మృత్యు భయము దొలగునని యర్థము

సమాసములు :

మృత్యుహేతుషు : మృత్యోః హేతవః = మృత్యుహేతవః, తేషు = మృత్యుహేతుషు.

వజ్రనిపాతాత్ : వజ్రస్య నిపాతః = వజ్రనిపాతః, తస్మాత్ = వజ్ర నిపాతాత్.

వైష్ణవకణ్ఠాత్ : విష్ణోః అయం = వైష్ణవః, వైష్ణవస్య కణ్ఠః = వైష్ణవ కణ్ఠః, తస్మాత్ = వైష్ణవకణ్ఠాత్.

నిష్ప్రయత్నం : నిర్గతః ప్రయత్నః యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = నిష్ప్రయత్నమ్.

భావము :

ఓ విష్ణూ ! నీ భక్తుడు మృత్యు కారణముల యందు ముఖ్యమైన వజ్ర పాతము వలనను భయపడ నవసరము లేదు. ఏలయనగా ఆ వజ్రపాత సమయము నందు విష్ణుభక్తుడైన యతనియొక్క కణ్ఠమునుండి నీ నామ మెల్లపుడు నుచ్చరించుట వలని యభ్యాసముచే ప్రయత్నములేకయే శీఘ్రముగా వెల్వడును. అదియే వజ్రపాతమును వారించును. అబుద్ధిపూర్వకముగను విష్ణునామము నుచ్చరించినను నదియు మృత్యుభయమును తొలగించునని యాశయము.

శ్లో. సర్వథాఽపి శుచిని క్రియమాణే
మన్దిరోదరే ఇవాఽవకరా యే ।
ఉద్భవన్తి భవిచేతసి తేషాం
శోధనీ భవదనుస్మృతిధారా ॥ 109

ప. వి. సర్వథా - అపి - శుచిని - క్రియమాణే - మన్దిరోదరే - ఇవ - అవకరాః - యే - ఉద్భవన్తి - భవిచేతసి - తేషాం - శోధనీ - భవదనుస్మృతిధారా.

అర్థము : హే విష్ణో! — ఓవిష్ణూ!, సర్వథాఽపి — అన్నివిధములుగను చీపురుకట్ట వలన నూడ్చుట మున్నగు వానిచేతను, నలఙ్కారణాది పరిష్కారముచేతను, (కామాద్యరి షడ్వర్గము చేతను), రుచిని = నిర్మలమైనదిగను (శుద్ధమైనదిగను) క్రియమాణేఽపి — చేయబడుచున్నను, భవిచేతసి, భవి — సంసారుల యొక్క, చేతసి — మనస్సునందు, మన్దిరోదరే ఇవ — గృహమధ్యమునందు వలె, అవకరాః — సఙ్కరములు అనగా చీపురుకట్ట యందలి ధూళిపాతములు, (రాగాదులు, మాలిన్యములు) ఉద్భవన్తి — పుట్టుచున్నవి. భవదనుస్మృతిధారా, భవత్ — నీయొక్క, అనుస్మృతి — చింతన యొక్క, ధారా — పరమ్పర, శోధనీ — ఊడ్చెడి చీపురువలె పరిశుద్ధి గావించినది.

**సమాసములు :**

మన్దిరోదరే : మన్దిరస్య ఉదరం — మన్దిరోదరం, తస్మిన్ — మన్దిరోదరే.
భవిచేతసి : భవః ఏషా మస్తీతి — భవినః, భవినాం చేతః — భవిచేతః, తస్మిన్ — భవిచేతసి.
భవదనుస్మృతిధారా : భవతః అనుస్మృతిః — భవదనుస్మృతిః, భవదనుస్మృతేః ధారా — భవదనుస్మృతిధారా.

**భావము :**

ఓ విష్ణూ! అన్ని విధములలోను ఊడ్చెడి చీపురుకట్టల చేతను కడుగుట,

యలుకుట మున్నగు పరిష్కారములతోడను (కామాద్యరి షడ్వర్గజయముచే) నిర్మలము గావింపబడినదియు, (శుద్ధముగావింపబడినదియు)నైనను సంసారుల మనస్సునందు గృహమధ్యమందువలె చీపురుకట్ట మున్నగువానినుండి రాలిన దుమ్ము మున్నగు మాలిన్యములు (రాగద్వేషాదులు) కలుగుచునే యుండును. కావున నీస్మృతి పరమ్పరయే వానిని శోధించునట్టిది.

శ్లో. అస్మదాద్యవిషయేఽపి విశేషే
రామనామ తవ ధామ గుణానామ్ ।
అన్వబన్ధి భవతైవ తు కస్మా
దన్యథా నను జనుస్త్రితయేఽపి ॥ 110

ప. వి. అస్మదాద్యవిషయే - అపి - విశేషే - రామనామ - తవ - ధామ - గుణానాం - అన్వబంధి - భవతా - ఏవతు - కస్మాత్ - అన్యథా - నను - జనుః - త్రితయే - అపి.

అర్థము : హే విష్ణో = ఓ విష్ణూ!, విశేషే = తారతమ్యము అనగా నీ నామములయందు దేనికి ఉత్కర్ష మున్నగు విషయము, అస్మదాద్య విషయేఽపి అస్మదాది = మాబోట్లకు, అవిషయేఽపి = గోచరము కాకపోయినను, తవ = నీయొక్క, రామనామ = రామ యను నామధేయము. గుణానాం = ఉత్కర్షాది గుణములకు, ధామ = స్థానము, (ఇతి మన్యతే = అని తలంపబడుచున్నది) అన్యథా తు = అట్లు కానిచో అనగా నీరామ నామము గుణధామము కానిచో, నను = ఓ నారాయణా!, జనుస్త్రితయేఽపి = మూడు జన్మల యందును, అనగా పరశురాము దాశరథి బలరాము లనెడి మూడుజన్మలయందును, భవతైవ = నీచేతనే, కస్మాత్ = ఎందువలన అన్వబంధి = రామ యనెడి పేరే ఆవృత్తి చేయబడినది. మూడు అవతారములయందును రామ యను నామము గ్రహింపబడుటవలన నదియే నీకు మిక్కిలి ప్రియమని యజ్ఞానులమగు మేమును తెలిసికొనుచున్నాము. కాన నీ నామములలో రామనామమే శ్రేష్ఠమని యర్థము.

**సమాసములు :**

ఆస్మదాద్యవిషయే : వయం ఆదిః యేషాం తే = అస్మదాదయః, న విషయః = అవిషయః, అస్మదాదీనాం అవిషయః, = అస్మదాద్యవిషయః. తస్మిన్ = అస్మదాద్యవిషయే.

రామనామ : రామ ఇతి నామ = రామనామ.

జనుస్త్రితయే : త్రయః అవయవాః యస్య తత్ = త్రితయం. జనుషాం త్రితయం = జనుస్త్రితయం, తస్మిన్ = జనుస్త్రితయే.

**భావము :**

ఓ విష్ణూ! నీ నామములోని తారతమ్యము నావంటి మూఢులకు గోచరము కాకపోయినను, ఆ వేలకొలది నామముల మధ్య రామనామమే యుత్కృష్టమగు స్థానమని తలంపబడుచున్నది. అట్లు కానిచో ఓ నారాయణా! పరశురామ రఘురామ బలరామావతారములలో మూడింటియందును రామ యను నామమే మాటి మాటికి నావృత్తిచేయ్యబడినది. మూడవతారములయందు నీవు రామనామమునే గ్రహించుటవలన నిదియే నీకు మిక్కిలి ప్రియమని నావంటి మూఢులము సైతము గ్రహించుచున్నాము. కాన నీ నామములలో రామనామమే శ్రేష్ఠమనుట నిశ్చయము.

శ్లో. భక్తిభాజ మనుగృహ్య దృశా మాం
భాస్కరేణ కురు వీత తమస్కమ్।
అర్పితేన మమ నాథ! న తాపం
లోచనేన విధునా విధునాఽసి ॥ 111

ప. వి. భక్తిభాజం - అనుగృహ్య - దృశా - మాం - భాస్కరేణ - కురు - వీతతమస్కం - అర్పితేన - మమ - నాథ - న - తాపం - లోచనేన- విధునా - విధునాసి.

అర్థము : నాథ! = ఓ ప్రభూ!, హే విష్ణో! = ఓ విష్ణూ!, భక్తిభాజం = భక్తి గలిగిన సేవకుడనగు, మాం = నలుదైన నన్ను, అనుగృహ్య = అనుగ్రహించి, భాస్కరేణ = సూర్యుడనెడి, దృశా = కంటిచేత, అనగా సూర్యుడనెడి

దక్షిణనేత్రముచేత, వీతతమస్కం, వీత = తొలగిపోయిన, తమస్కం = తమోగుణరూపమైన మూఢత్వము గలిగిన వానినిగను (చీకటి గలిగిన వానినిగను), కురు = చేయుము. తథా = అట్లే, అర్పితేన = నాపై నుంచిన, విధునా = చంద్రుడనెడి, లోచనేన = వామ నేత్రముచే, మమ = నాయొక్క, తాపం = ఆధ్యాత్మికాది తాపత్రయమును, విధునాని = తొలగింపవా యేమి? తప్పక తొలగింతువని యర్థము. సూర్యునిచే చీకటిని, చంద్రునిచే తాపమును తొలగించుట సులభమే కదా?

**సమాసములు :**

భక్తిభాజం : భక్తిం భజతీతి = భక్తిభాక్, తం = భక్తిభాజం.
వీతతమస్కం : వీతం తమః యస్య సః = వీతతమాః, తం = వీత తమస్కమ్.

**భావము :**

ఓ ప్రభూ! ఓ హరీ! భక్తిగలిగిన సేవకుడనైన నన్ను అనుగ్రహించి సూర్యుడనెడి దక్షిణనేత్రముచే నా తమోగుణమును (చీకటిని) తొలగింపుము. అట్లే చంద్రుడనెడి వామనేత్రమును నాపై నుంచి నాయొక్క ఆధ్యాత్మికమును, నాధిదైవికమును, నాధిభౌతికమునగు సంతాపమును తొలగింపుము.

శ్లో. లజ్జయ న్నహరహ ర్భవదాజ్ఞా
మస్మి హా! విధినిషేధమయీం యః।
దుర్లభం స తపసాఽపి గిరైవ
త్వత్ప్రసాదమహ మిచ్ఛు రలజ్జః ॥ 112

వ. వి. లజ్ఞయన్ - అహరహః - భవదాజ్ఞాం - అస్మి - హా - విధినిషేధ మయీం - యః - దుర్లభం - సః - తపసా - అపి - గిరా - ఏవ - త్వత్ప్రసాదం - అహం - ఇచ్ఛుః - అలజ్జః.

అర్థము : హే విష్ణూ! = ఓ విష్ణూ, యః = ఏ, అహం = నేను అనగా, నలుడను అహరహః = ప్రతిదినము, విధి నిషేధమయీం, విధిః = "వసన్తే వసన్తే జ్యోతిష్టోమేన యజేత" ఇత్యాదిగా విధింపబడిన జ్యోతిష్టోమాది యాగములను, నిషేధ = "న సురాం పిబేత్, న కలఞ్జమ్ భక్షయేత్" ఇత్యాదిగా నిషేధింపబడిన, సురాపానము కలఞ్జ భక్షణము అనెడి,

మయీం = తద్రూపమైన, భవదాజ్ఞాం = నీయొక్క యాజ్ఞను (శ్రుతి స్మృతీ మమైవాజ్ఞే యను వచనము ననుసరించి యారెండును భగవంతుని యాజ్ఞలు), లఙ్ఘయన్ = అతిక్రమించుచు, అస్మి = ఉన్నాను. హా = కష్టము, సః = ఆవిధముగా నీ యాజ్ఞ నుల్లంఘించిన, అహం = నేను, అనగా నలుడను, అలజ్జః = సిగ్గులేనివాడనై, గిరైవ = మాటచేతనే, అనగా "నన్ననుగ్రహింపుము, నన్ననుగ్రహింపుము" అనెడి మాట చేతనే, తపసాఽపి = తపము చేతనే, దుర్లభం = పొందశక్యముకాని, త్వత్ప్రసాదం = నీ యనుగ్రహమును, ఇచ్ఛుః = కోరుచున్నవాడనుగా, అస్మి = అగుచున్నాను.

సమాసము :

భవదాజ్ఞాం : భవతః ఆజ్ఞా = భవదాజ్ఞా, తాం = భవదాజ్ఞాం.
విధి నిషేధ మయీం : విధిశ్చ, నిషేధశ్చ = విధినిషేధౌ, విధినిషేధయోః రూపం యస్యాః స్సావిధి నిషేధ మయీ, తాం = విధినిషేధ మయీం.
దుర్లభం : దుఃఖేన లబ్ధుం శక్యః = దుర్లభః, తం = దుర్లభం.
త్వత్ప్రసాదం : తవ ప్రసాదః = త్వత్ప్రసాదః, తం = త్వత్ప్రసాదం.
అలజ్జః ; అవిద్యమానా లజ్జా యస్య సః = అలజ్జః.

భావము :

నేను ప్రతిదినము "ప్రతిదినము జ్యోతిష్టోమము జేయవలయును" అను విధాన రూపమైనదియు "సురాపానము చేయరాదు. కలఞ్జ భక్షణము చేయ రాదు "అనెడి నిషేధ రూపమైనదియు నగు నీ యాజ్ఞ నుల్లంఘించి యున్నాను. అది మిక్కిలి కష్టమైన విషయము. అట్టి నేను సిగ్గులేని వాడనై "నన్ననుగ్రహింపుము, నన్ననుగ్రహింపుము" అనెడి మాటచేతనే, తపస్సు మున్నగువానిచేత సైతముదుర్లభమైన నీయనుగ్రహమునుకోరుచున్నాను.కావున నన్ననుగ్రహింపుము.

శ్లో. విశ్వరూప ! కృతవిశ్వ ! కియత్తే
వైభవాద్భుతమణౌ హృది కుర్వే
హేమ నహ్యతి కియ న్నిజచీరే
కాఞ్చనాద్రి మధిగత్య దరిద్రః ॥ 113

ప. వి. విశ్వరూప ! - కృతవిశ్వ ! - కియత్ - తే - వైభవాద్భుతం - అణౌ - హృది - కుర్వే - హేమ - నహ్యతి - కియత్ - నిజచీరే - కాఞ్చనాద్రిం - అధిగత్య - దరిద్రః.

అర్థము: విశ్వరూప ! "సర్వం ఖల్విదం బ్రహ్మ" యను శ్రుతి ననుసరించి సర్వస్వరూపుడా ! కృతవిశ్వ = "యతో వా ఇమాని భూతాని జాయన్తే" ఇత్యాది శ్రుతి ననుసరించి, కృత = చేయబడిన, యనగా సృజింపబడిన, విశ్వ = ప్రపంచము గలవాడా! అణౌ = మిక్కిలి సూక్ష్మమైన, హృది = నాయొక్క హృదయమునందు, తే = నీ యొక్క, వైభవాద్భుతం, వైభవ = సామర్థ్యము యొక్క, అద్భుతం = ఆశ్చర్యస్వరూపమును, కియత్ = ఎంత, కుర్వే = ఉంచగలను. నాహృదయము చాలా చిన్నది. గాన దాని యందింకను స్వల్ప పరిమితి గలదానినే భరించ గలనని యర్థము. తథాహి = అదియుక్తమే కదా ! దరిద్రః = ధనములేనివాడు (మిక్కిలి యాశతో), కాంచనాద్రిం = బంగారు కొండను, అధిగత్య = పొంది, నిజచీరే, నిజ = తనదైన, చీరే = వస్త్రమందు, కియత్ = ఎంత పరిమితి గల, హేమ = బంగారమును, నహ్యతి = ముడివేయగలడు అనగా కొలది పరిమితిగల బంగారునే ముడి వైచుకొనగలడు. చిన్న వస్త్రమందు మిక్కుటముగా బంగారునే గట్టుట యెంత శక్యము గాదో యట్లే సకలగుణవర్ణనాభిలాషయుండియు శక్తి లేనందువలన నీ గుణముల నెంత వర్ణింప గలనని యర్థము.

**సమాసములు :**

విశ్వరూప : విశ్వం రూపం యస్య సః = విశ్వరూపః, తస్య సంబుద్ధిః = హే విశ్వరూప !

కృతవిశ్వ : కృతం విశ్వం యేన సః = కృతవిశ్వః, తస్య సంబుద్ధిః = హే కృతవిశ్వ !
వైభవాద్భుతం : విభో ర్భావః = వైభవం, వైభవస్య అద్భుతం = వైభవాద్భుతం.
నిజచీరే : నిజం చ తత్ చీరం చ = నిజచీరం, తస్మిన్ = నిజచీరే.
కాఞ్చనాద్రిం : కాఞ్చన మయః అద్రిః = కాఞ్చనాద్రిః, తం = కాఞ్చనాద్రిం.

**భావము :**

ఓ సర్వస్వరూపా ! ప్రపంచమును సృజించిన వాడా ! అణురూపమైన నాహృదయము నందు నీ సామర్థ్యము యొక్క యద్భుతస్వరూపము నెంత బట్టింప గలను ! స్వల్పపరిమితిగల నా హృదయమున పరిమితియేలేని శక్తికి సంబంధించిన యాశ్చర్యరూపమును నేను వట్టింప సమర్థుడను గాను. అది యుక్తమే. దరిద్రుడు గొప్పకోరికతో బంగారు కొండకు పోయినను నెంత బంగారమును తన వస్త్రము నందు గట్టుకొని తేగలడు ! ఆ వస్త్రమందు గొంది బంగారునే కట్టి తేగలడు. ఆ వస్త్రమందు కొండంతబంగారు నెట్లు తేలేడో అట్లే నాకు నీ సకల గుణములను వర్ణింపగోరిక యున్ననూ నంతటి సామర్థ్యము లేనందువలన నెంత వర్ణింప గలను. కొందిగనే వర్ణింపగలనని యర్థము.

శ్లో. ఇత్యుదీర్య స హరిం ప్రతి సమ్ప్ర
జ్ఞాతవాసితతమః సమపాది।
భావనా వశ విలోకిత విష్ణౌ
ప్రీతిభక్తిసదృశాని చరిష్ణుః ॥ 114

ప. వి. ఇతి - ఉదీర్య - సః - హరిం - ప్రతి - సమ్ప్రజ్ఞాతవాసితతమః - సమపాది - భావనావశవిలోకితవిష్ణౌ - ప్రీతి భక్తి సదృశాని - చరిష్ణుః.

**అర్థము:** సః = ఆ నలుడు, ఇతి = ముందు వర్ణించిన విధముగా, హరిం ప్రతి = విష్ణువు నుద్దేశించి, ఉదీర్య = చెప్పి, యనగా స్తుతి జేసి, సమ్ప్రజ్ఞాత వాసిత తమః, సమ్ప్రజ్ఞాత = సాకార ధ్యానముచే, వాసితతమః,

మిక్కిలి యుద్భవించిన భావన గల్గినవాడై, అనగా అధికముగా తన్మ యత్వము బొందినవాడై, భావనావశవిలోకిత విష్ణౌ, భావనావశ = సంస్కారపాటవము చేతగాని, ధ్యానప్రభావము చేతగాని, విలోకిత = చూడబడిన. విష్ణౌ = నారాయణుని యందు, ప్రీతిభక్తి సదృశాని, ప్రీతి = అనురాగమునకును. భక్తి = భక్తికిని, సదృశాని = తగినట్టి యానంద బాష్పములను విడుచుట నాట్యము చేయుట, పాట బాడుట మున్నగువానిని, చరిష్ణుః = చేయునట్టి స్వభావము గలవాడుగా, సముపాది = చేయబడెను.

**సమాసములు :**

సమ్ప్రజ్ఞాతవాసిత తమః : సమ్ప్రజ్ఞాతేన అత్యన్తం వాసితః = సమ్ప్రజ్ఞాతవాసిత తమః.

భావనావశవిలోకితవిష్ణౌ : భావనాయాః వశః = భావనావశః, భావనా వశేన విలోకితః = భావనా వశవిలోకితః, భావనావశవిలోకిత శ్చాసౌ విష్ణుశ్చ = భావనావిలోకితవిష్ణుః, తస్మిన్ = భావనావశవిలోకిత విష్ణౌ.

ప్రీతిభక్తి సదృశాని : ప్రీతిశ్చ భక్తిశ్చ = ప్రీతి భక్తీ, ప్రీతిభక్త్యోః సదృశాని = ప్రీతిభక్తి సదృశాని, తాని = ప్రీతిభక్తిసదృశాని.

**భావము :**

ఆ నలు డీవిధముగా విష్ణువును నుతించి సమ్ప్రజ్ఞాత మను సాకారధ్యానముచే ననగా నాకృతితో గూడిన దేవతామూర్తిని ధ్యానించుటచే మిక్కిలి తన్మయత్వము నొందినవాడై సంస్కారపాటవముచేతను ధ్యానప్రభావముచేతను విష్ణువును సాక్షాత్కరించుకొనెను. పిదప నావిష్ణువువిషయమున ప్రేమానురాగాలకు తగిన విధముగా నానందబాష్పములను విడుచుట నాట్యము చేయుట పాటపాడుట మున్నగువానిని జేయ నుపక్రమించెను.

శ్లో. విప్రపాణిషు భృశం వసువర్షీ
పాత్రసాత్కృత పితృక్రతు కవ్యః ।
శ్రేయసా హరిహరౌ ప్రతిపూజ్య
ప్రహ్వ ఏష శరణం ప్రవివేశ ॥ 115

ప. వి. విప్రపాణిషు - భృశం - వసువర్షీ - పాత్రసాత్కృత పిత్ర్యక్రతు కవ్యః- శ్రేయసా - హరిహరౌ - ప్రతిపూజ్య - ప్రహ్వః - ఏషః - శరణం- ప్రవివేశ.

**అర్థము:** ఏషః = ఈనలుడు, విప్రపాణిషు = బ్రాహ్మణహస్తముల యందు, భృశం = మిక్కిలి, వసువర్షీసన్, వసు = ధనమును, వర్షీసన్ = వర్షించినవాడై, పాత్రసాత్కృత పిత్ర్యక్రతు కవ్యః, పాత్ర = అర్హతగల సత్పాత్రయందు, సాత్కృత = ఈయబడిన, పిత్ర్యక్రతు = శ్రాద్ధము యొక్క, కవ్యః = అన్నము గలిగినవాడై, యనగా నిత్యశ్రాద్ధము ననుష్ఠించినవాడై, శ్రేయసా = శ్రేష్ఠమైనపదార్థముతో, హరిహరౌ = హరిహరులను అనగా విష్ణువును శివుని, ప్రతిపూజ్య = ఆరాధించి. ప్రహ్వః = ఆ యిరువురిపాదములపై వంగినవాడై, శరణం = ఇంటిని, ప్రవివేశ = ప్రవేశించెను- అనగా భోజనగృహమును ప్రవేశించెను.

**సమాసములు :**

విప్రపాణిషు : విప్రాణాం పాణయః = విప్రపాణయః, తేషు = విప్రపాణిషు.

వసువర్షీ : వసూని వర్షతీతి = వసువర్షీ.

పాత్రసాత్కృత పిత్ర్యక్రతుక్రవ్యః : పాత్రే సాత్కృతం = పాత్రసాత్కృతం, పిత్రే క్రతుః పిత్ర్యక్రతుః, పిత్ర్యక్రతోః కవ్యం = పిత్ర్యక్రతుకవ్యం. పాత్ర సాత్కృతం పిత్ర్యక్రతు కవ్యం యేన సః = పాత్రసాత్కృత పిత్ర్యక్రతు కవ్యః.

హరిహరౌ : హరిశ్చ హరశ్చ = హరిహరౌ, తౌ = హరిహరౌ.

**భావము :**

ఈ నలమహారాజు బ్రాహ్మణుల హస్తము లందధికముగా ధన మొసంగినవాడై సత్పాత్రకొసంగిన నిత్యశ్రాద్ధాన్నము గలవాడై శ్రేష్ఠమైన వస్తువులతో హరిహరులను పూజించి వినయముతో వారిపాదములకు మ్రొక్కి పిదప భోజన గృహమును ప్రవేశించెను.

శ్లో. మాధ్యందినా దనువిధే ర్వసుధా వివస్వా
నాస్వాదితామృతమయౌదన మోదమానః ।
ప్రాఞ్చం స చిత్ర మవిదూరితవైజయన్తం
వేశ్మాచలం నిజరుచీభి రలఙ్చకార ॥ 116

ప. వి. మాధ్యందినాత్ - అను - విధేః - వసుధావివస్వాన్ - ఆస్వాదితామృత మయౌదనమోదమానః - ప్రాఞ్చం - సః - చిత్రం - అవిదూరితవైజయన్తం - వేశ్మాచలం - నిజరుచీభిః - అలఙ్చకార.

అర్థము: వసుధా వివస్వాన్, వసుధా = భూలోకమునకు, వివస్వాన్ = సూర్యుడైన, సః = ఆ నలుడు, మాధ్యందినాత్ = మధ్యాహ్నకాలమందు చేయదగిన, విధేః = దేవతార్చనాది నిత్య కార్యమున కంటె, అను = వెనుక, పంచమహాయజ్ఞముల ననుష్ఠించిన పిదప, ఆస్వాదితామృత మయౌదనమోదమానః. ఆస్వాదిత = భుజింపబడిన, అమృతమయ = అమృత స్వరూపమైన, ఓదన = అన్నముచే, మోదమానః = సంతోషించు చున్నవాడై, ప్రాఞ్చం = తూర్పు నందున్న, అనగా ప్రధానభవనమునకు తూర్పుభాగము నందున్న (శయన గృహము ప్రధానభవనమునకు తూర్పున నుండవలయునని శాస్త్రము). చిత్రం = ఆశ్చర్యకరమైన, అవిదూరిత వైజయన్తం, అవిదూరిత = సమీపముగా నున్నట్లు చేయ బడిన, వైజయన్తం = ఇన్ద్రభవనము కలిగిన, అనగా మిక్కిలి యున్నత మైన యని యర్థము. వేశ్మాచలం, వేశ్మ = భవనమనెడి, అచలం = పర్వత మును, నిజరుచీభిః, నిజ = తనదైన, రుచీభిః = కాంతులచే, అలఙ్చ కార = అలంకరించెను. సూర్యుడో మధ్యాహ్నమునకు, తరువాత పడమట దిక్కు నందున్న అస్తాచలమునే అలంకరించును. ఈ భూలోక సూర్యుడగు నలుడు మధ్యాహ్నము తరువాతను పూర్వాచలమునే యలంక రించు చున్నా డనుట యాశ్చర్యము.

**సమాసములు :**

మాధ్యందినాత్ : మధ్యం దినస్య అయం = మాధ్యందినః, తస్మాత్ = మాధ్యందినాత్.

వసుధా వివస్వాన్ : వసుధాయాః వివస్వాన్ = వసుధావివస్వాన్.

ఆస్వాదితామృత మయౌదన మోదమానః : అమృతస్య వికారః = అమృతమయం. అమృతమయం చ తత్ ఓదనశ్చ = అమృతమయౌదనం, ఆస్వాదితం చ తత్ అమృతమయౌదనంచ = ఆస్వాదితామృత మయౌదనం, ఆస్వాదితామృత మయౌదనేన మోదమానః = ఆస్వాదితామృత మయౌదనమోదమానః.

అవిదూరితవైజయన్తం : న విదూరితః = అవిదూరితః, అవిదూరితః వైజయన్తః యేన సః = అవిదూరిత వైజయన్తః, తం = అవిదూరిత వైజయన్తం.

వేశ్మాచలం : వేశ్మైవ అచలః = వేశ్మాచలః, తం = వేశ్మాచలం.

నిజరుచిభిః : నిజాశ్చ తాః రుచయశ్చ = నిజరుచయః, తాభిః = నిజరుచిభిః.

**భావము :**

భూలోకసూర్యుడగు నలమహారాజు మధ్యాహ్నకాలమందు నెరవేర్చదగిన దేవార్చనాది నిత్యకృత్యములు చేసినపిదప ననగా పంచమహాయజ్ఞముల నాచరించిన పిదప నమృతముతో సమానమగు నన్నమును భుజించి సంతుష్ట చిత్తుడై ప్రధానభవనమునకు తూర్పువైపున నున్నదియు నాశ్చర్యము గొల్పునది యునై మిక్కిలి యెత్తుగా నుండుటవలన సమీపమునకు దేబడిన వైజయన్తమనెడి ఇంద్రభవనము గలిగిన శయనభవన మనెడి పర్వతమును తనకాంతులచే నలంకరించెను. సూర్యుడు మధ్యాహ్నమునకు పిదప పడమటనున్న యస్తాచలమునే యలఙ్కరించును. ఈ భూలోకసూర్యుడో మధ్యాహ్నమునకు తరువాత తూర్పు యందలి యుదయాచలమునే యలఙ్కరించుచున్నా డనుట యాశ్చర్యకరము. అనగా నిత డెల్లప్పుడు నుదయదశయందే యున్నాడని యాశయము.

శ్లో. భీమాత్మజాఽపి కృతదైవత భక్తిపూజా
పత్యౌ చ భుక్తవతి భుక్తవతీ తతోఽను ।
తస్యాఙ్క మఙ్కరిత తత్పరిరిప్సమధ్య
మధ్యాస్త భూషణ భరాతితరాలసాఙ్గీ ॥ 117

ప. వి. భీమాత్మజా - అపి - కృతదైవతభక్తిపూజా - పత్యౌ - చ-భుక్తవతి-భుక్తవతీ - తతః - అను - తస్య - అఙ్కం - అఙ్కురితతత్పరిరిప్స మధ్యం - అధ్యాస్త - భూషణభరాతితరాలసాఙ్గీ.

అర్థము: తతః అను = భర్తయగు నలుడు భుజించినపిదప, లేదా భర్త శయన గృహము నలఙ్కరించినపిదప, భూషణభరాతితరాలసాఙ్గీ భూషణభరం = ఆభరణభారముచే, అతితర = మిక్కిలి, అలస = మందమైన, అఙ్గీ = దేహముగల్గిన, భీమాత్మజాపి = దమయన్తియు, కృతదైవతభక్తిపూజా, కృత = చేయబడిన, దైవత = దేవతలకు, భక్తి = భక్తితోకూడిన, పూజా = పూజగలిగినదై, పత్యౌ = భర్తయగు నలుడు. భుక్తవతి సతి = భుజింపగా, భుక్తవతీ = భుజించినదై, అఙ్కురితతత్పరి రిప్సమధ్యం, అఙ్కురిత = ఉద్భవించిన, తత్ = ఆదమయన్తియొక్క, పరిరిప్స = ఆలింగనమునకై గోరిక కలిగిన, మధ్యం = నడుము గలిగిన, తస్య = ఆనలునియొక్క, అఙ్కం = ఒడిపై, కూర్చుండెను.

సమాసములు :

భీమాత్మజా : భీమస్య ఆత్మజా = భీమాత్మజా.

కృతదైవతభక్తిపూజా : భక్త్యా పూజా = భక్తిపూజా, దైవతేభ్యః భక్తిపూజా = దైవతభక్తిపూజా, కృతా దైవతభక్తిపూజా యయా సా = కృతదైవత భక్తిపూజా.

అఙ్కురిత తత్పరిరిప్సమధ్యం: పరిరబ్ధు మిచ్ఛా = పరిరిప్సా, తస్యాః పరిరిప్సా = తత్పరిరిప్సా, అఙ్కురితా తత్పరిరిప్సా యస్య సః = అఙ్కురితతత్పరిప్సమధ్యః, తం = అఙ్కురిత తత్పరిరిప్సమధ్యమ్.

భూషణభరాతితరాలసాఙ్గీ : భూషణానాం భరః = భూషణభరః, భూషణభరేణ అతితరాం అలసం అఙ్గం యస్యాః సా = భూషణభరాతి తరాలసాఙ్గీ.

భావము :

భర్తయగు నలుడు భుజించిన పిదప, లేదా శయనమందిరము నలఙ్కరించినపిదప నాభరణముల భారముచే మిక్కిలి మాంద్యమునొందిన దేహముగల

దమయన్తియు తాను దేవతలకు భక్తితో బూజసలిపినపై గౌగిలింపగోరిక గల్గిన నడుముగల యానలుని యొడియందు గూర్చుండినది.

శ్లో. తామన్వగా దశితబిమ్బవిపాకచఞ్చోః

స్పష్టం శలాటుపరిణ త్యుచితచ్ఛదస్య।

కీరస్య కాపి కరవారిరుహే వహన్తీ

సౌన్దర్యపుఞ్జమివ పఞ్జరమేక మాలీ ॥ 118

ప. వి. తాం - అన్వగాత్ - అశితబిమ్బవిపాక చఞ్చోః - స్పష్టం - శలాటు పరిణత్యుచితచ్ఛదస్య - కీరస్య - కా-అపి - కరవారిరుహే - వహన్తీ- సౌన్దర్యపుఞ్జమ్ - ఇవ - పఞ్జరం - ఏకం - ఆలీ.

అర్థము : అశిత బిమ్బ విపాకచఞ్చోః, అశిత = తినబడిన, బిమ్బ = దొండ పండుయొక్క, విపాక = పరిణామమువలె నెఱ్ఱనైన, చఞ్చోః = ముక్కుకల్గినట్టి యనగా నెఱ్ఱనిముక్కు గల్గిన, తథా = అట్లే, స్పష్టం = స్పష్టముగా, శలాటుపరిణత్యుచితచ్ఛదస్య, శలాటు = కాయయొక్క, పరిణతి = పండుటకు, ఉచిత = తగినట్టి, ఛదస్య = ఱెక్కలు గల్గిన, కీరస్య = చిలుకయొక్క, సౌన్దర్యపుఞ్జమివ = సౌందర్యరాసివలెనున్న, ఏకం = ఒక, పఞ్జరం = పఞ్జరమును, కరవారిరుహే, కర = హస్త మనెడి, వారిరుహే = పద్మమునందు, వహన్తీ = వహించుచున్న, కాఽపి = ఒకానొక, ఆలీ = చెలికత్తె, తాం = ఆదమయన్తిని, అన్వగాత్ = వెంబడించినది.

సమాసములు :

అశితబిమ్బ విపాకచఞ్చోః : అశితం చ తత్ బిమ్బం చ = అశిత బిమ్బం, అశితబిమ్బస్య విపాకః, అశితబిమ్బవిపాకః, అశితబిమ్బ విపాక ఇవ చఞ్చుః = అశితబిమ్బవిపాక ఇవచఞ్చుః. తస్య = అశితబిమ్బ విపాక చఞ్చోః.

శలాటు పరిణత్యు చితచ్ఛదస్య : శలాటునః పరిణతిః = శలాటు పరిణతిః, శలాటుపరిణతేః ఉచితౌ ఛదౌ యస్య సః = శలాటు పరిణత్యుచితచ్ఛదః, తస్య = శలాటుపరిణత్యుచితచ్ఛదస్య.

కరవారిరుహే : కర ఏవ వారిరుహం = కరవారిరుహం, తస్మిన్ = కరవారిరుహే.

సౌన్దర్యపుఞ్జమ్ : సౌన్దర్యస్య పుఞ్జః = సౌన్దర్య పుఞ్జః, తం = సౌన్దర్యపుఞ్జం.

**భావము :**

పండుబారి తినబడిన దొండపండువలె నెఱ్ఱని ముక్కును, పండనికాయ వంటి ఆకుపచ్చని వన్నెగల రెక్కలను గలిగిన చిలుకతో గూడినట్టి సౌందర్య పుఞ్జమో యనదగియున్న పఞ్జరమును కేలుదమ్మియందు బూనిన చెలికత్తె యొక్కతె యాదమయన్తిని వెంబడించినది.

శ్లో. **కూజా యుజా బహులపక్షశితిమ్ని సీమ్నా**
**స్పష్టం కుహూపదపదార్థమిథోఽన్వయేన ।**
**తిర్యగ్ధృత స్ఫటికదణ్డక వర్తినైకా**
**తా మన్వవర్తత పికేన మదాధికేన ॥** 119

ప. వి. కూజాయుజా - బహులపక్షశితిమ్ని - సీమ్నా - స్పష్టం - కుహూపద పదార్థమిథోఽన్వయేన - తిర్యగ్ధృతస్ఫటికదణ్డకవర్తినా - ఏకా - తాం - అన్వవర్తత - పికేన - మదాధికేన.

అర్థము : కూజాయుజా, కూజా = కూతతో, యుజా = కూడినట్టి, బహులపక్షశితిమ్ని; బహులపక్ష = కృష్ణపక్షముయొక్క శితిమ్ని = నలుపునందు, సీమ్నా = ఎల్లయైనట్టి అనగా మిక్కిలి నల్లనైన యని యర్థము. (కావుననే) కుహూ పద పదార్థ మిథోన్వయేన, కుహూపద = కోకిల యొక్క కూతయైన కుహూ పదమునకును, పదార్థ = కుహూ పదమునకర్థమైన యమావాస్యకును, మిథః = పరస్పరము, అన్వయేన = అన్వయము గలిగిన యనగా కుహూకుహూయని ధ్వని చేయునదియును అమావాస్యవలెనట్టి నలుపువన్నె గలదియును, తిర్యగ్ధృత స్ఫటిక దణ్డక వర్తినా, తిర్యక్ = అడ్డముగా, ధృత = ధరింపబడిన. స్ఫటికదణ్డక = స్ఫటికపు చిన్న దండమునందు, వర్తినా = ఉన్నట్టి,

మదాధికేన = మిక్కిలి మదము కగిన, పికేన = కోకిలచే, (ఉపలక్షితా = గుర్తింపబడిన) కోకిల హస్తమునందు కలిగిన, ఏకా = ఒక, (ఆలీ = చెలికత్తె) తాం = ఆ దమయన్తిని, అన్వవర్తత = వెంబడించినది.

**సమాసములు :**

కూజాయుజా : కూజయా యుజ్యత ఇతి = కూజాయుక్, తయా = కూజాయుజా.

బహులపక్షశితిమ్ని : బహులశ్చాసౌ పక్షశ్చ = బహుల పక్షః, బహుల పక్షస్య శితిమా, = బహులపక్ష శితిమా, తస్మిన్ = బహులపక్షశితిమ్ని.

కుహూ పద పదార్థ మిథోఽన్వయేన : పదం చ పదార్థశ్చ = పద పదార్థౌ. 'కుహూ' ఇతి పద పదార్థౌ = కుహూ పద పదార్థౌ, కుహూ పద పదార్థయోః మిథః అన్వయః యస్మిన్ సః = కుహూ పద పదార్థ మిథోఽన్వయః, తేన = కుహూ పద పదార్థ మిథోఽన్వయేన.

తిర్యగ్ధృత స్ఫటిక దణ్డక వర్తినా : అల్పో దణ్డః దణ్డకః, స్ఫటిక మయ శ్చాసౌ దణ్డకశ్చ = స్ఫటికదణ్డకః, తిర్యక్ ధృతశ్చాసౌ స్ఫటికదణ్డకశ్చ = తిర్యగ్ధృతస్ఫటికదణ్డకః, తిర్యగ్ధృతస్ఫటిక దణ్డకే వర్తత ఇతి = తిర్యగ్ధృతస్ఫటికదణ్డకవర్తీ. తేన = తిర్యగ్ధృత స్ఫటిక దణ్డక వర్తినా.

మదాధికేన : మదః అధికః యస్య సః = మదాధికః. తేన = మదాధికేన.

**భావము :**

తరువాత దమయన్తిని కోకిల నెత్తుకొనిన చెలికత్తె వెంబడించినది. ఆ కోకిల కుహూ కుహూ అని కూయునదియు, కృష్ణ పక్షపు నలుపునకు పరమా వధియు నవగా మిక్కిలి నల్లనైనదియు, స్పష్టముగా కుహూ పదములకును నవగా కుహూ ధ్వనులకును, కుహూ పదార్థమైన యమావాస్యకును పరస్పరాన్వయము గలదియునై యున్నది. అనగా తాదాత్మ్యము గలదియును నవగా నొక్క కుహూ పదమే కోకిల ధ్వనిని జెప్పుచున్నది, ఆ కుహూ పదమే యమావాస్యను చెప్పుచున్నది. ఇట్లా రెంటి కొక్కటే పదము వాచకమగుట వలన తాదాత్మ్య

మేర్పడినది. కోకిలయందు కుహూధ్వని యున్నది. దానితోపాటు కుహూ పదార్థమగు నమావాస్యవంటి నలుపు వన్నె యున్నది. అమావాస్యయు కృష్ణ పక్షమునకు కడపటి యెల్ల యగుచున్నది. కాన కుహూ కుహూయని ధ్వని చేయుచున్నదై యమావాస్యవలె దట్టమైన నలుపువన్నె వహించి, యున్నది. మరియు నాకోకిల యడ్డముగా నుంచబడిన స్ఫటిక దండముపై యున్నది. ఇంకను నది మిక్కిలి నుడించి యున్నది. అట్టి కోకిలను హస్తమున బట్టుకొనిన చెలికత్తె యా దమయన్తిని వెంబడించినది.

శ్లో. శిష్యాః కలావిధిషు భీమభువో వయస్యా
వీణామృదు క్వణన కర్మణి యాః ప్రవీణాః ।
ఆసీన మేన ముపవీణయితుం యయు స్తా
గన్ధర్వ రాజతనుజా మనుజాధిరాజమ్ ॥ 120

ప. వి. శిష్యాః - కలావిధిషు - భీమభువః - వయస్యాః - వీణామృదుక్వణన కర్మణి - యాః - ప్రవీణాః - ఆసీనం - ఏనం - ఉపవీణయితుం - యయుః - తాః - గన్ధర్వరాజతనుజాః - మనుజాధిరాజమ్.

అర్థము: వీణామృదు క్వణన కర్మణి, వీణా = వీణను, మృదు = కోమలముగా, క్వణన = వాదించుటయను, కర్మణి = కార్యమందు, ప్రవీణాః = నిపుణులైన, గన్ధర్వరాజు తనుజాః = గన్ధర్వరాజ కన్యకలు, కలావిధిషు = నృత్యగీతాదికలా విద్యలయందు, భీమభువః = దమయన్తికి, శిష్యాః = శిష్యురాండ్రునై, వయస్యాః = చెలికత్తెలుగా, అభవన్ = ఉండిరి. తాః = అట్టి, గన్ధర్వరాజ తనుజాః = గన్ధర్వరాజుయొక్క కన్యకలు, ఆసీనం = కూర్చుండిన, ఏనం = ఈ, మనుజాధిరాజం = నరులకు రాజైన నలుని, ఉపవీణయితుం = వీణచే గానము చేయుటకు, యయుః = వెళ్ళిరి.

సమాసములు :

కలావిధిషు : కలాయాః విధయః = కలావిధయః, తేషు = కలావిధిషు.

వీణామృదు క్వణన కర్మణి : మృదు యథా తథా క్వణనం = మృదు క్వణనం, వీణాయాః మృదు క్వణనం = వీణామృదు క్వణనం, వీణామృదు క్వణనమేవ కర్మ = వీణామృదు క్వణన కర్మ, తస్మిన్ = వీణామృదు క్వణన కర్మణి.

గన్ధర్వ రాజ తనుజాః : గన్ధర్వాణాం రాజా = గన్ధర్వ రాజః. గన్ధర్వ రాజస్య తనుజాః = గన్ధర్వ రాజ తనుజాః.

మనుజాధిరాజః మనుజానాం అధిరాజః = మనుజాధి రాజః. తం = మనుజాధిరాజం.

**భావము :**

వీణను కోమలముగా వాదించెడు కార్యమందు నిపుణలైన గన్ధర్వరాజ పుత్రికలు నాట్య గాన కలా విద్యాభ్యాసమందు దమయన్తికి శిష్యురాండ్రుగా నుండి చెలికత్తెలైరి. అట్టిగన్ధర్వరాజ పుత్రికలు ఆసీనుడైయున్న నలమహారాజు నొద్ద వీణతో గానము చేయుటకై వెడలిరి.

శ్లో. తాసా మభాసత కురఙ్గదృశాం విపఞ్చీ
కించిత్ పురః కలిత నిష్కల కాకలీకా ।
భైమీ తథా మధుర కణ్ఠలతోపకణ్ఠే
శబ్దాయితుం ప్రథమ మప్రతిభావతీవ ॥ 121

ప. వి. తాసాం - అభాసత - కురఙ్గదృశాం - విపఞ్చీ - కించిత్ - పురఃకలిత నిష్కల కాకలీకా - భైమీ తథామధురకణ్ఠలతోపకణ్ఠే - శబ్దాయితుం - ప్రథమం - అప్రతిభావతీ - ఇవ.

అర్థము: కురఙ్గదృశాం = మృగాక్షులగు, తాసాం = ఆ గన్ధర్వరాజ పుత్రికల యొక్క, విపఞ్చీ = వీణ, కించిత్ = కొంచెము, పురఃకలిత నిష్కల కాకలీకా, పురః = తొలుత, కలిత = స్వీకరింప బడిన, నిష్కల = విశేషములేని యనగా సామాన్యమైన, కాకలీకా = మధురమును

నస్ఫుటమునగు ధ్వని గలిగినదై, భైమీ తథామధురకణ్ఠలతోపకణ్ఠే.

భైమీ = దమయన్తియొక్క, తథా = అటువంటి, మధుర = మనోహర మైన, కణ్ఠలతా = కణ్ఠస్వర సంతతియొక్క, ఉపకణ్ఠే = సమీపమందు, శబ్దాయితుం = సంగీతరూపమగు శబ్దమును జేయుటకు, ప్రథమం = మొదటి, అప్రతిభావతీవ = ప్రతిభలేనిదానివలె, అభాసత = భాసించినది.

**సమాసములు :**

కురఙ్గదృశాం : కురఙ్గస్య దృశావివ దృశౌ యాసాం తాః = కురఙ్గ దృశాః, తాసాం = కురఙ్గదృశాం.

పురః కలిత నిష్కల కాకలీకా : పురః కలితా = పురః కలితా, నిష్కలా చ సా కాకలీచ = నిష్కల కాకలీ, పురః కలితా నిష్కల కాకలీ యస్యాః సా = పురః కలిత నిష్కలం కాకలీకా.

భైమీతథా మధుర కణ్ఠలతోపకణ్ఠే : తథా మధురా చ సా కణ్ఠలతా చ = తథామధుర కణ్ఠలతా, భైమ్యాః తథామధుర కణ్ఠలతా = భైమీ తథామధురకణ్ఠలతా, భైమీతథామధుర కణ్ఠలతాయాః ఉపకణ్ఠః = భైమీతథామధురకణ్ఠలతోపకణ్ఠః, తస్మిన్ = భైమీ తథామధుర కణ్ఠలతోపకణ్ఠే.

అప్రతిభావతీ : ప్రతిభా అస్యాః అస్తీతి = ప్రతిభావతీ, న ప్రతి భావతీ = అప్రతిభావతీ.

**భావము :**

ఆ లేడికన్నులుగల గన్ధర్వరాజపుత్రికల వీణ కొంచెము తొలుత సాధారణమైన మధురస్వరము కలిగినదై దమయన్తియొక్క యంతటి మధుర మగు కణ్ఠస్వరసన్తతి యెదుట సఙ్గీతరూపమగు శబ్దమును జేయుటకు, తొలుత ప్రతిభలేనిదిగా నుండినది. విద్యాధికుల సమక్షము నందు అల్పవిద్యులయొక్క కణ్ఠము స్ఫురించదు. కాన నిది యుచితమనియే యాశయము.

శ్లో. సా యద్ధృతాఽఖిల కలాగుణ భూమ భూమీ
భైమీతులాధిగతయే స్వరసజ్గతాఽఽసీత్।
తం ప్రాగసా వవినయం పరివాద మేత్య
లోకేఽధునాఽపి విహితా పరివాదినీతి ॥ 122

ప. వి. సా - యత్ - ధృతాఖిలకలాగుణభూమభూమీభైమీతులాధిగతయే - స్వరసజ్గతా - ఆసీత్ - తం - ప్రాక్ - అసౌ - అవినయం-పరివాదం- ఏత్య - లోకే - అధునా - అపి - విహితా - పరివాదినీ - ఇతి.

అర్థము: సా = ఆ గన్ధర్వ రాజ పుత్రికల వీణ, ధృతాఖిల కలాగుణభూమభూమీ భైమీతులాధి గతయే, ధృతా = వహింపబడిన, అఖిల = సమస్తములగు, కలా = నృత్యగీతాది విద్యల యొక్క, గుణ = సౌశీల్య సౌందర్యాది గుణముల యొక్కయు, భూమ = ఆధిక్యమునకు, భూమీ = స్థానమైన భైమీ = దమయన్తి యొక్క, తులా = సామ్యమును, అధిగతయే =, పొందుటకై, యత్ = ఎందువలన, స్వరసజ్గతా, స్వర = ధ్వనితో, సజ్గతా = కూడినదగును, మరియు, స్వరసం = స్వయముగా ననురాగమును, గతా = పొందినదిగా, ఆసీత్ = ఆయెనో, అసౌ = ఈ వీణ, ప్రాక్ = పూర్వము, తం = అటువంటి దమయన్తీ సామ్యమును బొంద గోరిక యనెడి, అవినయం = వినయ రాహిత్యమును, అనగా అహంకార మనెడి, పరివాదం = నిందను,ఏత్య = పొంది, అధునాఽపి = ఇప్పుడును, లోకే = ప్రపంచమునందు. పరివాదినీతి = పరివాదము గలదనియు, "పరివాదిని" యనియు పిలువబడినదిగను విహితా = చేయబడినది.

**సమాసములు :**

ధృతాఖిలకలాగుణభూమభూమీభైమీతులాధిగతయే : గుణానాం భూమా = గుణభూమా, కలాశ్చ గుణభూమా చ = కలాగుణ భూమానః, అఖిలాశ్చ తే కలాగుణ భూమానశ్చ = అఖిల కలాగుణ భూమానః, ధృతాశ్చ తే అఖిలకలాగుణభూమానశ్చ = ధృతాఖిల కలాగుణ భూమానః, ధృతాఖిల కలాగుణభూమ్నాం భూమీ = ధృతాఖిల కలా

గుణ భూమ భూమీ, ధృతాఖిల కలాగుణ భూమ భూమీ చ సా భైమీ చ = ధృతాఖిల కలాగుణభూమభూమీభైమీ, ధృతాఖిలకలా గుణ భూమభూమీభైమ్యా తులా = ధృతాఖిలకలాగుణభూమభూమీ భైమీతులా, ధృతాఖిలకలాగుణభూమభూమీ భైమీతులాయాః అధిగతిః = ధృతాఖిలకలాగుణభూమభూమీభైమీతులాధిగతిః, తస్యై = ధృతాఖిల కలాగుణభూమభూమీభైమీతులాధిగతయే.

స్వరసంగతా : స్వరేణ సంగతా = స్వరసంగతా. పక్షాన్తరమున, స్వరసం గతా = స్వరసంగతా.

అవినయం : న వినయః = అవినయః, తం = అవినయం.

పరివాదినీ : పరివాదః అస్యాః అస్తీతి = పరివాదినీ.

**భావము :**

ఆ గన్ధర్వరాజపుత్రికల వీణ సకల కళలకు గుణాతిశయములకు స్థానమైన దమయన్తితోటి సామ్యమును బొందుటకై యనగా దమయన్తీకణ్ఠస్వరముతో సమానమైన స్వరమును బొందుటకై స్వరములతో గలిసినదిగ నైనది. మరియు తానే యనురాగమును వహించినది. కాన నీవీణ పూర్వము దమయన్తితోటి సామ్యమును గోరుటయను నవినయమును అనగా నహంకారమును వహించినందు వలని పరివాదమును అనగా నిందను పొంది యిప్పటికిని (పరివాదః అస్యాః అస్తీతి) (నింద దీనికి గలదని) వ్యుత్పత్తిచే పరివాదిని యని చెప్పబడుచున్నది. మరియు వీణకు పరివాదిని యను పేరు గలదు. అట్టి పేరుండుట వలన నైవర్ణ్యకవకాశము కలిగినదని యాశయము.

శ్లో. నాదం నిషాదమధురం తత ముజ్జగార
సాఽభ్యాస భా గవనిభృత్కులకుఞ్జరస్య ।
స్తమ్భేరమీవ కృతసప్తశ్రుతిమూర్ధకమ్పా
వీణావిచిత్రకరచాపల మాభజన్తీ ॥ 123

ప. వి. నాదం - నిషాదమధురం - తతం - ఉజ్జగార - సా - అభ్యాసభాక్ - అవనిభృత్కుల కుఞ్జరస్య - స్తమ్భేరమీ - ఇవ - కృతసప్తశ్రుతి మూర్ధకమ్పా - వీణావిచిత్రకర చాపలమ్- ఆభజన్తీ.

అర్థము: సా = ఆ (గన్ధర్వ రాజపుత్రికలచే స్వరసమ్మేళనము బొందింపబడిన) పీణ, అవనిభృత్కులకుఞ్జరస్య, అవనిభృత్కుల = రాజవంశమునకు, కుఞ్జరస్య = శ్రేష్ఠుడైన నలునియొక్క, పక్షాన్తరమున, అవనిభృత్కుల = పర్వతసమూహమునందు, కుఞ్జరస్య = ఏనుగుయొక్క, అభ్యాసభాక్, అభ్యాస = సమీపమును, భాక్ = పొందిన, సా = అటువంటి, కృతసశ్రుతిమూర్ధకమ్పా, కృత = చేయబడిన, సశ్రుతి = ఇరువదిరెండు శ్రుతులతోగూడిన, షడ్జములయొక్క, మూర్ధ = నాదప్రాంతమందలి, కమ్పా = కమ్పితస్వరముగల్గిన, లేదా సశ్రుతి = అర్థ్వనిని శ్రవణము గావించెడి జనులయొక్క, మూర్ధ = శిరస్సుయొక్క, కమ్పా = కదలిక గలిగిన, పక్షాన్తరమునందు, కృత = చేయబడిన, సశ్రుతి = రెండుచెవులతో గూడిన, మూర్ధ = శిరస్సుయొక్క, కమ్పా = కదలిక గలిగిన, (తథా = అట్లే) విచిత్రకరచాపలం, విచిత్ర = నానావిధములు కలిగిన, కర = హస్తముయొక్క, చాపల్యం = చాంచల్యమును, అనగా చేతివ్రేళ్ళను కదిలించుటచే ద్రుతవాదనరూపమగు చాంచల్యమును, పక్షాన్తరమున, విచిత్ర = మనోహరమైన, కర = తొండముయొక్క, చాపలం = ఇటునటు కదిలించెడి చాంచల్యమును, ఆభజన్తీ = చక్కగ బొందుచున్న, స్తమ్బేరమీవ = ఆడఏనుగువలె, నిషాదమధురం, నిషాద = నిషాదమను స్వరవిశేషముచే, (ఈస్వరము గజమునుండి యేర్పడినది.) మధురం = రమ్యమును, తతం = బిగ్గరగను, నాదం = ధ్వనిని(బృంహణమును) ఉజ్జగార = ప్రకటించినది. ఒకపక్షమున సంవాదమందలి నేర్పుచేతను, మరియొక పక్షమున గజము నిషాదమును పలుకుటవలన నని యర్థము.

**సమాసములు :**

నిషాదమధురం : నిషాదేన మధురః = నిషాదమధురః, తం = నిషాదమధురం.

అభ్యాసభాక్ : అభ్యాసం భజతీతి = అభ్యాసభాక్.

అవనిభృత్కులకుఞ్జరస్య : అవనిం బిభర్తీతి = అవనిభృతః, అవనిభృతాం కులం = అవనిభృత్కులం, అవనిభృత్కులే కుఞ్జరః = అవనిభృత్కులకుఞ్జరః, తస్య = అవనిభృత్కులకుఞ్జరస్య.

కృత సశ్రుతిమూర్ధకమ్పా : శ్రుతిభిః సహితాః = సశ్రుతయః, సశ్రుతీనాం మూర్ధా = సశ్రుతిమూర్ధా, సశ్రుతి మూర్ధని కమ్పః = సశ్రుతి మూర్ధ కమ్పః, కృతః సశ్రుతి మూర్ధ కమ్పః యయా సా = కృత సశ్రుతి మూర్ధకమ్పా, యద్వా, - శ్రుతిభ్యాం సహితః = సశ్రుతిః, సశ్రుతి శ్చాసౌ మూర్ధా చ = సశ్రుతిమూర్ధా, సశ్రుతి మూర్ధ్నః కమ్పః = సశ్రుతి మూర్ధకమ్పః, కృతః సశ్రుతి మూర్ధకమ్పః యయా సా = కృత సశ్రుతి మూర్ధ కమ్పా.

విచిత్రకరచాపలం : కరస్య చాపలం = కరచాపలం, విచిత్రం చ తత్ కరచాపలం చ = విచిత్ర కరచాపలం. తత్ = విచిత్ర కర చాపలమ్.

**భావము :**

ఆ వీణ గంధర్వరాజపుత్రికలచే స్వరములతో గూర్చబడి రాజవంశము నందు శ్రేష్ఠుడైన నలునియొక్కయు పర్వత సమూహమందలి యేనుగు యొక్కయు సమీపమును బొందియున్నది. పిదప నిరువదిరెండు శ్రుతులతో గూడిన షడ్జముల యొక్క నాద ప్రాన్తమునందు కమ్పము జేసినదై, లేదా దాని ధ్వనిని వినెడి శ్రోతల శిరములను గమ్పము కలిగించినదై, లేదా రెండు చెవులతో గూడిన తలను కంపమును అనగా నూచుటను, అనగా నీ వీణా ధ్వనిని రెండు చెవులతోడను శ్రోతలు వినుచు తలలు నూచునట్లు చేసినది. మఱియు వీణా వాదనకాలమందు హస్తములయందు నానా విధములగు చలనములవలన అనగా చేతి వ్రేళ్ళను గదలించుటవలన ద్రుతవాదనరూపమగు చలన మేర్పడుచున్నది. మఱియు గజపక్షమున మనోహరమగు తొండపు కదలికలు గలుగుచున్నవి. వానితో గూడిన యాడయేనుగు వలె నావీణ మధురముగను బిగ్గరగను ధ్వనిని (బృంహణమును) నావిష్కరించినది. అనగా నా గన్ధర్వరాజ పుత్రికలు నిషాద స్వరమున వీణాలాపము గావించిరని యాశయము.

మఱియు షడ్జాది స్వరములకు మిక్కిలి సూక్ష్మాంశములు శ్రుతులని చెప్పబడును. అందు షడ్జమందు 4, ఋషభమందు 3, గాంధారమందు 2, మధ్యమమునందు 4, పంచమమునందు 4, ధైవతమందు 3, నిషాధమందు 2, అని

శ్రుతుల సంఖ్య. ఇవి యన్నియు కలిసి (4 + 3 + 2 + 4 + 4 + 3 + 2 = 22) యిరువదిరెండు శ్రుతులేర్పడినవి.

మరియు

షడ్జం మయూరో వదతి గావ స్త్వృషభ భాషిణః,
అజావికం తు గాన్ధారం క్రౌఞ్చః క్వణతి మధ్యమమ్
పుష్పసాధారణే కాలే పికః కూజతి పఞ్చమమ్
ధైవతం హ్రేషతే వాజీ నిషాదం బృంహతే గజః"

అని షడ్జస్వరమును నెమళ్ళు, ఋషభస్వరమును గోవులును, గాన్ధారస్వరమును మేకలు గొఱ్ఱెలు, మధ్యమ స్వరమును క్రౌఞ్చ పక్షులును, పఞ్చమ స్వరమును వసన్తఋతువునందు కోకిలయు, ధైవత స్వరమును గుఱ్ఱములును, నిషాద స్వరము నేనుగులును పలుకునని చెప్పబడియున్నది.

శ్లో. ఆకృష్య సార మఖిలం కిము వల్లకీనాం
తస్యామృదుస్వర మసర్జి నకణ్ఠనాలమ్
తేనా న్తరం తరలభావ మవాప్య వీణా
హ్రీణా న కోణ మముచత్ కిము వా లయేషు ॥ 124

ప. వి. ఆకృష్య – సారం - అఖిలం - కిము - వల్లకీనాం - తస్యాః - మృదుస్వరం - అసర్జి - న - కణ్ఠనాలమ్ - తేన - అన్తరం - తరల భావం - అవాప్య - వీణా - హ్రీణా - న - కోణం - అముచత్ - కిమ్ - ఉ - వా - లయేషు.

అర్థము : వల్లకీనాం = వీణెలయొక్క, అఖిలం = సమగ్రమైన, సారం = ముఖ్యమైన యంశమును, ఆకృష్య = సంగ్రహించి, మృదుస్వరం = కోమలమగు స్వరముగల, ఆదమయన్తియొక్క, కణ్ఠనాలం = కణ్ఠము యొక్క కాడను,, నాసర్జి కిము = సృజింప లేదా యేమి? కాని యట్టి దానినే సృజించెను. అట్లుకానిచో వీణాధ్వని కంటెను దమయంతియొక్క కణ్ఠధ్వని కంతటి మాధుర్య మెట్లుకలుగును. తేన = ఆ కారణము చేత,

ఆన్తరం = లోపలనున్న, తరలభావం = ధ్వనియొక్క చాంచల్యమును అనగా సర్వసారమును లాగివేయుటచే శూన్యమైన లోపలిభాగమును కలిగియుండుటను, పక్షాన్తరమున, ఆన్తరం = మనస్సునకు సంబంధించిన, తరల భావం = చాంచల్యమును, అవాప్య = పొంది, వీణా = వీణ, హ్రీణా = సిగ్గుపడినదై, లయేషు = సామ్యమునందు. అనగా లయకాలమందు, పక్షాన్తరమున, ఆలయేషు = గృహములయందు, కోణం = వీణను వాదించెడి నక్కిని, ఇంటియొక్క మూలను, నాము చత్ కిమ్ = విడువ లేదా యేమి? సారము లేని మనుష్యుడు గూడా మనస్సునందు చాంచల్యము నొంది సిగ్గుపడినవాడై బయటకి రాక యింటియం దొక మూల యెట్లుండునో యట్లే వీణెయు నుండినదని యర్థము.

**సమాసములు :**

మృదుస్వరం : మృదు శ్చాసౌ స్వరశ్చ = మృదుస్వరః, తం = మృదుస్వరమ్.

కణ్ఠనాలం : కణ్ఠస్య నాలం = కణ్ఠనాలం, తత్ = కణ్ఠనాలమ్.

ఆన్తరం : అన్తః భవః = ఆన్తరః, తమ్ = ఆన్తరమ్.

తరలభావమ్ : తరలస్య భావః = తరలభావః, తం = తరలభావమ్.

**భావము :**

బ్రహ్మ వీణె లన్నింటియొక్క సారమును గ్రహించి యీ దమయన్తి కణ్ఠనాలమును సృజించెనా యేమి? అట్లు కానిచో వీణాధ్వనికంటెను నామెయొక్క కణ్ఠధ్వనికంతటి మాధుర్య మెట్లు కలిగినది? దానిచేతనే లో సారము తొలగి నందువలన నావీణెధ్వని చాంచల్యమును (మనుష్యుడు లోన సారము లేనందువలన చిత్తచాంచల్యమును బొంది సిగ్గుపడినవాడై, సామ్యమునందు అనగా లయకాలము నందు నిండ్లయందు కోణము ననగా వీణను వాదించెడి నక్కిని (ఇంటనొక మూలను) విడుచుటలేదు. వీణె సిగ్గువడినదై కోణము నాశ్రయించినది. అనగా వీణెను వాదించెడి నక్కిని ఆశ్రయించినదని యర్థము. లోన సారము లేనివాడు

చాంచల్యము నొంది సిగ్గుపడి కోణము నాశ్రయించె ననగా నింట నొకమూలనుండి బయటకి రాకయుండెననియు నాశయము.

శ్లో. తద్దమ్పతిశ్రుతిమధూ న్యథ చాటుగాథాః
వీణా స్తథా జగు రతిస్ఫుటవర్ణ బన్ధమ్ ।
ఇత్థం యథా వసుమతీ రతిగృహ్యా క స్తాః
కీరః కిరన్ ముద ముదీరయతి స్మ విశ్వాః ॥ 125

ప. వి. తద్దమ్పతిశ్రుతిమధూని - అథ - చాటుగాథాః - వీణాః - తథా - జగుః - అతిస్ఫుటవర్ణబన్ధమ్ - ఇత్థం - యథా - వసుమతీరతిగృహ్యకః - తాః - కీరః - కిరన్ - ముదం - ఉదీరయతి - స్మ - విశ్వాః.

అర్థము : అథ = తర్వాత, అనగా ముందు వర్ణింపబడిన మధురధ్వని వెల్వడిన పిదప. వీణాః = వీణెలు, తద్దమ్పతిశ్రుతిమధూని, తద్దమ్పతి = ఆ భార్యాభర్తలగు దమయన్తీనలులయొక్క, శ్రుతి = చెవులకు, మధూని = తేనెవంటి, చాటుగాథాః = ప్రియగీతములను, అతిస్ఫుటవర్ణబంధం, అతిస్ఫుట = మిక్కిలి స్పష్టములైన, వర్ణబన్ధం = అక్షరవిన్యాసములు గలుగునట్లు, తథా = అట్లు, జగుః = పాడినవి. యథా = ఏ విధముగా, వసుమతీరతిగృహ్యకః, వసుమతీరతి = భూలోకరతీదేవి యగు దమయన్తికి, గృహ్యకః = పఞ్జరము నందుంచబడినదైన, కీరః = చిలుక, ముదం = అచ్చటి జనులకు ప్రీతిని, కిరన్ = కలిగించుచు, ఇత్థం = చెప్పబోవునట్లు, విశ్వాః = సమస్తములగు, చాటుగాథాః = వర్ణనాగీతములను, ఉదీరయతి స్మ = ఉచ్చరించుచుండినది.

**సమాసములు :**

తద్దమ్పతి శ్రుతి మధూని : జాయా చ పతిశ్చ = దమ్పతీ, తౌ చ దమ్పతీ చ = తద్దమ్పతీ, తద్దమ్పత్యోః శ్రుతీ = తద్దమ్పతిశ్రుతీ, తద్దమ్పతిశ్రుత్యోః మధూని = తద్దమ్పతిశ్రుతి మధూని.

చాటుగాథాః : చాటవశ్చ తాః గాథాశ్చ = చాటుగాథాః, తాః = చాటుగాథాః.

అతిస్ఫుటవర్ణబన్ధమ్ : అత్యన్తం స్ఫుటః = అతిస్ఫుటః. వర్ణానాం బంధః = వర్ణబన్ధః, అతిస్ఫుటః వర్ణబన్ధః యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = అతిస్ఫుటవర్ణబన్ధమ్.

వసుమతీరతిగృహ్యాకః : వసుమత్యాం రతిః = వసుమతీరతిః, వసుమతీ రతేః గృహ్యాకః = వసుమతీగృహ్యాకః.

భావము :

పూర్వము చెప్పినవిధముగా వీణనుండి మధురధ్వని వెలువడినపిదప, నచ్చటి వీణలు దంపతులగు నా దమయన్తీనలుల చెవులకింపు గూర్చునట్టి ప్రియ గీతములను స్పష్టములగు వర్ణవిన్యాసములు గలుగునట్లు చక్కగా పాడిరి. అందు వలన భూలోకమునకు రతీదేవియగు దమయన్తిచే నింట బంజరమందుంచబడిన చిలుక యచ్చటి జనులకు ప్రీతిగొల్పుచు, చెప్పబోవునట్లు సమస్తములగు ప్రియ గీతముల నుచ్చరించుచుండినది.

శ్లో. అస్మాక ముక్తిభి రవైష్యథ ఏవ బుద్ధే
ర్గాధం యువా మతిమతీ! స్తుమహే తథాఽపి ।
జ్ఞానం హి వాగవసరా వచనా ద్భవద్భ్యా
మేతావద ప్యనవధారితమేవ న స్యాత్ ॥ 126

ప. వి. అస్మాకం - ఉక్తిభిః - అవైష్యథః - ఏవ - బుద్ధేః - గాధం-యువాం- మతీ - స్తుమహే - తథాఅతి - అపి - జ్ఞానం - హి - వాగవసరాఽ వచనాత్ - భవద్భ్యామ్ - ఏతావత్ - అపి-అనవధారితమ్ - ఏవ -న- స్యాత్.

అర్థము : అతిమతీ, అతి = అధికమైన, మతీ = బుద్ధిగల్గిన దమయన్తీ నలులారా! (కావుననే) అవైష్యథః = తెలుసుకొనగలరని యర్థము, యువాం = మీరిరువురు, అస్మాకం = మాయొక్క, ఉక్తిభిరేవ = మాటలచేతనే, మేముగా గావించిన మీయొక్క స్తుతులచేతనే యని యర్థము, బుద్ధేః = మాజ్ఞానముయొక్క, గాధం = లోతులేని తనమును, అనగా నగమ్భీరత్వ మును ననగా స్థూలబుద్ధిత్వమును, అవైష్యథ = అరయగలరు.

తథాఽపి = అయినను, స్తుమహే = స్తుతిజేసెదము. హి = ఏలయనగా, భవద్భ్యామ్ = మీరిరువురిచే, వాగవసరాఽవచనాత్, వాగవసర = మాట చెప్పుటకు తగినసమయమందు ననగా మీగుణాతిశయమును దగినవిధము గా వర్ణించుట కవసరము న్నను, అవచనాత్ = ఆవిధముగా వర్ణనము జేయనందువలన, ఏతావదపి = ఇంత స్వల్పమైనను, జ్ఞానం = మా యొక్క బుద్ధి, అనవధారితమేవ = మీకు తెలియబడనిదిగానే, న స్యాత్ = కారాదు. మఱేమనగా తెలియబడినదిగానే కావలయును యని యర్థము. మీయొక్క గుణాతిశయమే బుద్ధిహీనులమైనను మమ్ములను స్తుతిజేయ ప్రోత్స హించుచున్నది కాన లోతులేని మతి గల్గిన మేము మిమ్ములను స్తుతించు చున్నాము. ఇందువలనను ఈ స్తుతిచేతనే మాతెలివి యెంతటిదై నదియు మీరు గ్రహింపగలరని యాశయము.

**సమాసములు :**

అగాధం : న గాధః = అగాధః, తం = అగాధం.

అతిమతీ : అత్యధికా మతిః యయో స్తౌ = అతిమతీ.

వాగవసరాఽవచనాత్ : వాచః అవసరః = వాగవసరః, వాగవసరే అవచనం = వాగవసరాఽవచనం, తస్మాత్ = వాగవసరాఽవచనాత్.

అనవధారితం : న అవధారితం = అనవధారితం.

**భావము :**

గొప్ప బుద్ధి గలిగిన దమయన్తీ నలులారా ! మీరు మేము గావించిన స్తుతుల చేతనే మా బుద్ధియొక్క లోతులేని తనమును ననగా నగమ్భీరత్వమును తెలిసికొనగలరు. అయినను మేము మిమ్ములను స్తుతించెదము. ఏల యనగా, మీ గుణాతిశయమును వర్ణించుటకు దగిన సమయమున్నను వర్ణింపకుండుటవలన మా బుద్ధియొక్క కొలదిపాటితనము నిశ్చితము కాకపోదు. కాని తప్పక నిశ్చితమే యగును. మీ యిరువురి గుణాతిశయమే బుద్ధిహీనుల మగు మమ్ములను ప్రోత్సహించుచున్నది. కాన లోతులేని బుద్ధిగలవారమైనను మేము మిమ్ములను స్తుతి జేయుదుము. ఈ స్తుతి చేతనే మా జ్ఞాన మెంతయని తెలిసికొనుటకు మీకు అవకాశ మేర్పడును.

శ్లో. భూభృద్భవా ఙ్కభువి రాజశిఖామణేః సా
త్వఞ్చాప్యస్య భోగసుభగస్య సమః క్రమోఽయం
యన్నాకపాలకలనాకలితస్య భర్తు
రత్రాపి జన్మని సతీ భవతీ స భేదః ॥ 127

ప. వి. భూభృద్భవా - అఙ్కభువి - రాజశిఖామణేః - సా - త్వం - చ - అస్య - భోగసుభగస్య - సమః - క్రమః - అయమ్ - యత్ - నాకపాల కలనాకలితస్య - భర్తుః - అత్ర - అపి - జన్మని - సతీ - భవతీ - సః - భేదః.

అర్థము: హేదమయన్తి! = ఓదమయన్తీ! భూభృత్ = హిమాలయ పర్వతము నుండియు (భీమరాజునుండియు) భవా = ఉద్భవించిన, సా = ఆపార్వతియు, త్వం చ = నీవును, భోగసుభగస్య, భోగ = సర్పశరీరములచే, పుష్ప మాలలు చన్దనము మున్నగువానిచే, సుభగస్య = సున్దరుడైన రాజశిఖా మణేః, రాజ = చన్ద్రుడు, శిఖామణేః = శిరోభూషణముగా గల్గినశివుని యొక్కయు, రాజ = రాజులకు, శిఖామణేః = చూడామణియైన యనగా రాజశ్రేష్ఠుడైన, అస్య = ఈశివునకు, ఈ నలునకు, అఙ్కభువి = ఒడి యందు, (వర్తతే = ఉన్నది, వర్తసే = ఉన్నావు) అయం = ఈ, క్రమః = పద్ధతి, సమః = నీకు పార్వతితోడి సమానము, పరన్తు = కాని భవతీ = నీవు, అత్రాపి = పూర్వజన్మమందేగాక యీజన్మమందును, నాకపాలకలనాకలితస్య, నాకపాల = స్వర్గపాలకుడగు నింద్రునియొక్క, కలనా = సాదృశ్యముతో లేదా అంశముగా నున్నవాడుగా, కలితస్య = తెలియబడిన యనగా నింద్రునకు సమానుడైన, భర్తుః = భర్తయగు నలు నకు, సతీ = సంబంధించిన దాన వగుచు, యత్ = ఎందువలన, సతీ = పతివ్రతగనే, వర్తసే = ఉన్నావో, (పార్వతియో) అత్ర = ఈ, జన్మని = జన్మమునందు, నాకపాలకలనాకలితస్య = కపాల ధారణచే గూడనివాడుగా తెలియబడని యనగా కపాలధారణచే గూడినవాడుగా తెలియబడిన - (న-అకపాల కలనా కలితస్య, యనునెడ న కపాలః = అకపాలః, న అకపాలః = నాకపాలః యని నఙ్ద్వయముతో విగ్రహ

మును జెప్పకొనవలయును.) అనగా బ్రహ్మకపాలమును జేపట్టినవాడుగా ప్రసిద్ధుడైన, భర్తుః = భర్తయగు శివునకు, (సమ్బన్ధినీ) సతీ = సంబంధించి నదగుచు, యత్ = ఎందువలన, అసతీ = సతికంటె భిన్నురాలుగా (వర్తతే = ఉన్నది) సః = ఆ విధముగా జెప్పబడినదే, భేదః = పార్వతికిని నీకును గల భేదము. దుర్గపూర్వజన్మమందు దక్షకన్యయై సతీనామముతో ప్రసిద్ధురాలై యుండినది. ఇపుడు హిమాలయుని కన్యయై పార్వతి యను పేర తెలియబడినదై (అసతియై) సతీనామములేనిదై యున్నది. నీవో ఈ జన్మమందును పాతివ్రత్యముతో సతిగా (పతివ్రతగా) ప్రసిద్ధి నొందితివి. ఇదియే నీకును పార్వతికిని గల భేదము.

సమాసములు ;

భూభృద్భవా ; భువం బిభర్తీతి = భూభృత్, భూభృతః భవతీతి = భూభృద్భవా.

అఙ్కభువి : అఙ్క ఏవ భూః = అఙ్కభూః, తస్యాం = అఙ్కభువి.

రాజశిఖామణేః : శిఖాయాం మణిః = శిఖామణిః, రాజా శిఖామణిః యస్యసః = రాజశిఖామణిః, తస్య = రాజశిఖామణేః పక్షాన్తరమున, రాజ్ఞాం శిఖామణిః = రాజశిఖామణిః, తస్య = రాజశిఖామణేః,

భోగసుభగస్య;భోగేన సుభగః = భోగసుభగః, తస్య = భోగసుభగస్య.

నాకపాలకలనాకలితస్య ; నాకస్య పాలః = నాకపాలః, నాకపాలస్య కలనా = నాకపాలకలనా, నాకపాల కలనయా కలితః = నాకపాలకలనాకలితః, తస్య = నాకపాలకలనాకలితస్య. పక్షాన్తరమున, న + అ + కపాలకలనాకలితస్య, కపాలస్య కలనా = కపాలకలనా, కపాలకలనయా కలితః = కపాలకలనాకలితః, న కపాల కలనా కలితః = అకపాలకలనాకలితః, న అకపాల కలనా కలితః = నాకపాల కలనా కలితః, తస్య నాకపాల కలనా కలితస్య.

భావము ;

ఓ దమయన్తీ! హిమాలయపుత్రికయగు నాపార్వతియు భీమ నృపాలుని పుత్రికయగునీవును, నాభరణమగు సత్ప్రశరీరములచేతను, పుష్పమాలాది

భోగములచేతను సుందరుడును, చంద్రుని శిరోభూషణముగా దాల్చినవాడును రాజులలో శ్రేష్ఠుడైనవాడునగు శివునకును నలునకును నొడియం దున్నారు. అనగా పార్వతి శివుని వడియం దున్నది. నీవు నలుని యొడియం దున్నావని యర్థము. ఈ విధముగా తమతమ భర్తల యొడియం దుండుట మీయిరువురికిని సమానమే. కాని నీవు పూర్వజన్మమందేగాక ఈజన్మమందును వింద్రునితో సమానుడగు భర్తయైన నలునకు సంబంధించిన దానవై సతిగనే యనగా పతివ్రతగనే యున్నావు. పార్వతియా బ్రహ్మకపాలమును చేపట్టినవాడుగా ప్రసిద్ధినొందిన భర్తయగు శివునకు సంబంధించినదై యుండుచు అసతిగనే అనగా పతివ్రత గాకయే (సతీదేవి గాకయే) యున్నది. ఇదియే నీకును పార్వతికిని గల భేదము. దుర్గ పూర్వజన్మమందు దక్షకన్యయై 'సతీ' నామముతో ప్రసిద్ధినొందియుండినది. ఆమె హిమాలయ పుత్రికయై యిపుడు పార్వతియను నామముచే తెలియబడినదై 'యసతి' యైనది, అనగా అపతివ్రత యైనది. అనగా సతీనామమును పరిత్యజించినది. నీవో ఈజన్మమందును పాతివ్రత్యముచే సతిగనే యున్నావు. ఇదియే నీకును పార్వతికిని గల భేదము.

శ్లో. ఏషా రతిః స్ఫురతి చేతసి కస్య యస్యాః
సూతే రతిం ద్యుతి రథ త్వయి వాఽఽతనోతి।
త్రైయక్ష వీక్షణఖిలీకృతనిర్జరత్వ
సిద్ధాయురధ్వ మకరధ్వజ సంశయం కః॥ 128.

ప. వి. ఏషా - రతిః - స్ఫురతి - చేతసి - కస్య - యస్యాః - సూతే - రతిం - ద్యుతిః - అథ - త్వయి - వా - ఆతనోతి - త్రైయక్ష వీక్షణ ఖిలీకృత నిర్జరత్వ సిద్ధాయురధ్వమకరధ్వజసంశయం - కః.

అర్థము; హే నల! = ఓ నలమహారాజా!, ఏషా = ఈ దమయన్తి, కస్య = ఎవనియొక్క, మనసి = మనస్సునందు, రతిః = మన్మథుని భార్యయగు రతీదేవి యని, స్ఫురతి = ప్రకాశించును? కాని ఎవని మనసువందును ప్రకాశింపదు. (ఏలయనగా) యస్యాః = ఏదమయన్తియొక్క, ద్యుతి రేవ = శరీరకాన్తియే, రతిం = అనురాగమును, (మన్మథుని భార్యయగు రతీదేవిని) సూతే = కలిగించును. ఎవతె యొక్క దేహకాంతి రతిని

గల్గించునో యామె ఏవిధముగనూ రతి కానేరదని భావము, కః = ఎవ్వడు, త్వయి = నలుడవైన నీవిషయమునందు, త్రైయక్ష వీక్షణ ఖిలీకృత నిర్జరత్వ సిద్ధాయురధ్వమకరధ్వజ సంశయం, త్రైయక్ష = ముక్కంటికి సంబంధించిన, వీక్షణ = దృష్టిచే, ఖిలీకృత = నాశముచేయబడిన, నిర్జరత్వ = దేవత్వముచే. సిద్ధ = ప్రసిద్ధమైన, ఆయుః = జీవించుకాలమునకు, అనగా నమరత్వరూపమైన దీర్ఘజీవమునకు సంబంధించిన, అధ్వ = మార్గముగల, మకరధ్వజ = మన్మథునియొక్క, సంశయం = సందేహమును, అనగా మన్మథుడనెడి భ్రాన్తిని, ఆతనోతి = కలిగించును అనగా విస్తరింపచేయును. ఎవ్వడును విస్తరింప జేయడని యర్థము. మన్మథుడు దేవతాత్వము గలిగియున్నందువలన నమరుడైనను శివుని నేత్రాగ్నిచే దగ్ధుడై మృతినొందెను. కాన నతడు జీవించునను విషయమున సందేహము లేనందువలన నితడు మన్మథుడా కాడా యను సంశయము గలుగు నవకాశము లేదు. కాన మీరిరువురు రతికాములకంటెను మనోహరమగు శోభను కల్గిన వారని తాత్పర్యము.

## సమాసములు :

త్రైయక్ష వీక్షణఖిలీకృతనిర్జరత్వసిద్ధాయురధ్వమకరధ్వజ సంశయం : త్రీణి అక్షిణి యస్య సః = త్ర్యక్షః, త్ర్యక్షస్య ఇదం = త్రైయక్షం, త్రైయక్షంచ తత్ వీక్షణం చ = త్రైయక్షవీక్షణం, నిర్జరస్య భావః = నిర్జరత్వం, అఖిలీకృతః ఖిలీకృత స్సమ్పద్యమానః కృతః = ఖిలీకృతః, త్రైయక్షవీక్షణేన ఖిలీకృతః = త్రైయక్ష వీక్షణ ఖిలీకృతః ఆయుషః అధ్వా = ఆయురధ్వా, నిర్జరత్వేన సిద్ధః = నిర్జరత్వసిద్ధః, నిర్జరత్వ సిద్ధశ్చాసౌ ఆయురధ్వా చ = నిర్జరత్వ సిద్ధాయురధ్వా, త్రైయక్ష వీక్షణ ఖిలీకృతః నిర్జరత్వ సిద్ధాయురధ్వా యస్య సః = త్రైయక్ష వీక్షణ ఖిలీకృత నిర్జరత్వ సిద్ధాయురధ్వా, త్రైయక్షవీక్షణ ఖిలీ కృత నిర్జరత్వ సిద్ధాయురధ్వా చాసౌ మకరధ్వజశ్చ = త్రైయక్ష వీక్షణ ఖిలీ కృత నిర్జరత్వ సిద్ధాయురధ్వ మకరధ్వజః, త్రైయక్షవీక్షణఖిలీకృత నిర్జరత్వ సిద్ధాయురధ్వ మకరధ్వజస్య సంశయః = త్రైయక్షవీక్షణ ఖిలీ

కృత నిర్జరత్వ సిద్ధాయుర్ధ్వ మకరధ్వజ సంశయః, తం = త్రైయక్ష
వీక్షణ ఖిలీకృత నిర్జరత్వ సిద్ధాయురధ్వ మకరధ్వజసంశయం.

భావము:

నలమహారాజా! ఈదమయన్తి యెవరి హృదయమున రతీదేవిగా స్ఫురిం చును. కాని యెవరి హృదయమందును స్ఫురింపదు. ఏలయనగా దమయన్తియొక్క శరీరకాంతి రతిని-అనగా ననురాగమును గల్గించునో యామె యేవిధముగా రతి కాగలదు? ఏవిధముగను రతి కాజాలదు. అట్లే, ఎవరు నీవిషయమున ముక్కంటి మూడవకంటితో భస్మమైన మన్మథుని భ్రాన్తిని కల్గియుండును? అమరుడైనను మన్మథుడు ముక్కంటియొక్క మూడవ కంటిలోని చిచ్చుచే దగ్ధుడై మరణిం చెను. మృతుడు బ్రతకజాలడు కాన నీయెడ నెవ్వరికిని మన్మథుడను సంశయ మేర్పడదు. దమయన్తియొక్క శరీరకాంతి యనెడి యామె పుత్రిక రతిని గల్గించినందువలన నారతీదేవి దమయన్తికి దౌహిత్రురాలగును గాని దమయన్తి కానేరదని యర్థము. మన్మథు డమరుడైనందున దానిచే నేర్పడిన దీర్ఘజీవన కాలమున్నను నాతడు ముక్కంటి మూడవకంటిచే దగ్ధుడై మృతుడైనందువలన నిన్ను ఆమన్మథుడని యెవ్వడును భ్రాన్తిపడడు. కాన దమయన్తియు నీవును రతి మన్మథులకంటెను మిక్కిలి సౌందర్యవంతులని యాశయము.

శ్లో. ఏతాం ధరామివ సరిచ్ఛవిహారి హారా
ముల్లాసిత స్త్వమిద మానన చన్ద్రభాసా।
బిభ్ర ద్విభాసి పయసామివ రాశి ర న్త
ర్వేది శ్రియం జనమనః ప్రియమధ్యదేశామ్ ॥ 129

ప. వి. ఏతాం - ధరాం - ఇవ - సరిచ్ఛవిహారిహారామ్ - ఉల్లాసితః - త్వమ్- ఇదం - ఆనన చన్ద్రభాసా-బిభ్రత్ - విభాసి - పయసామ్- ఇవ-రాశిః- అన్తర్వేదిశ్రియం - జనమనః ప్రియమధ్యదేశామ్.

అర్థము: హే రాజన్! = ఓ రాజా! త్వం = నీవు, సరిచ్ఛవిహారిహారాం, సరిత్ = నదివంటి, ఛవి = తెల్లనికాన్తిచే, హారి = మనోహరమగు, హారాం = ముక్తాహారము గలిగిన, పక్షాంతరమున, సరిత్ = నదులనే, ఛవి =

కాన్తిచే, హారి = మనోహరములగు, హారాం = ముత్తెంపు సరములుగా గల్గిన, అన్తర్వేది శ్రియం, అన్తర్వేది = వేదికయొక్క మధ్యభాగమువలె మిక్కిలి కృశించిన, శ్రియం = శోభ కలిగిన, లేదా-అన్తః = శరీర మధ్య మందు, వేది = ఒకనొక పురుషయొక్క, శ్రియం = శోభవంటి శోభ కలిగిన (కుమార సంభవమందును - "మధ్యేన సా వేది విలగ్న మధ్యా" యని ప్రయోగింపబడినది.) పక్షాన్తరమునందు - అన్తర్వేది శ్రియం, అన్తర్వేది = గంగా యమునా సఙ్గమ స్థానముతోటి, శ్రియం = శోభగలిగిన. తథా = అట్లే, జనమనః ప్రియమధ్య దేశాం, జన = జనుల యొక్క, మనః = మనస్సునకు, ప్రియ = ఇష్టమైన. మధ్యదేశాం = నితంబప్రదేశము గలిగిన, పక్షాన్తరమున-జనమనః ప్రియమధ్యదేశాం, జన = జనులయొక్క మనః = మనస్సునకు, ప్రియ = హర్షమును గొల్పు, మధ్యదేశాం = విన్ధ్య హిమాచలముల మధ్యనున్న భూభాగము గల్గిన, (విన్ధ్య హిమాచలములకు మధ్యనున్నదియు, కనఖలక్షేత్రమునకు దూర్పున నున్నదియు, ప్రయాగకు బడమట నున్నదియు నగు ప్రదేశము మధ్యదేశ మనబడును.) ఏతాం = ఈ దమయన్తిని, ధరామివ = భూమిని వలె, బిభ్రత్ = ఒడియం దుంచుకొనిన, యస్యాః = ఏ దమయన్తి యొక్కయు, ధరాయాశ్చ = భూమి యొక్కయు, ఆననచన్ద్రభాసా = ఆననచన్ద్ర = చన్ద్రుని వంటి ముఖము యొక్కయు, ముఖమనెడి చన్ద్రుని యొక్కయు, భాసా = కాన్తిచే, ఉల్లాసితః = హర్షమును బొందింపబడిన (వృద్ధిని బొందింప బడిన) పయసాం = ఉదకముల యొక్క, రాశిరివ = రాశియైన సముద్రునివలె, విభాసి = ప్రకాశించు చున్నావు. సముద్రుడు చన్ద్రికాన్తితో వర్ధిల్లుననుట ప్రసిద్ధము గదా!

**సమాసములు :**

సరిచ్ఛవిహారిహారామ్ : సరిత ఇవ ఛవిః = సరిచ్ఛవిః, సరిచ్ఛావా హారీ = సరిచ్ఛవిహారీ, సరిచ్ఛవిహారీ హారః యస్యా స్సా = సరిచ్ఛ విహారి హారా, తాం = సరిచ్ఛవిహారి హారాం లేదా, సరిత ఏవ ఛవిహా

రిణః = సరిచ్ఛవిహారిణః, సరిచ్ఛవిహారిణః హారాః యస్యాస్సా = సరిచ్ఛవిహారిహారా, తామ్ = సరిచ్ఛవిహారిహారామ్.

అన్తర్వేదిశ్రియమ్ : వేద్యామన్తః = అన్తర్వేది, అన్తర్వేదివత్ శ్రీః యస్యాస్సా = అన్తర్వేదిశ్రీః, తాం = అన్తర్వేదిశ్రియం. లేదా, అంతః వేదే శ్రీ రివ శ్రీః యస్యాస్సా = అన్తర్వేది శ్రీః, తాం = అన్తర్వేది శ్రియం.

జనమనఃప్రియమధ్యదేశాం : జనానాం మనాంసి = జనమనాంసి, జనమనసాం ప్రియః = జనమనః ప్రియః, మధ్యశ్చాసౌ దేశశ్చ = మధ్యదేశః, జనమనః ప్రియః మధ్యదేశః యస్యాస్సా = జనమనః ప్రియమధ్యదేశా. తాం = జనమనః ప్రియమధ్య దేశామ్.

ఆనన చన్ద్రభాసా : ఆననం చన్ద్ర ఇవ = ఆనన చన్ద్రః, యద్వా, ఆననమేవ చన్ద్రః = ఆనన చన్ద్రః, ఆనన చన్ద్రస్య భాః = ఆనన చన్ద్రభాః, తయా = ఆననచన్ద్రభాసా.

**భావము :**

ఓ రాజా! నీవు నదివంటి తెల్లనికాంతిచే మనోహరమగు హారముగలదియు లేదా నదులనెడి మనోజ్ఞములగు ముత్తెపు సరములు గలదియు, వేదిమధ్యవలె మిక్కిలి కృశించిన శోభ గలదియు లేదా శరీరమధ్యమందు వేదియనెడి పురుషుని యొక్క సౌందర్యము వంటి సౌందర్యము గలదియు, లేదా అన్తర్వేదియను పేరుగల గంగాయమునలసంగమస్థానముతోటి శోభ గలదియు, జనుల మనస్సులకు హర్షము చేకూర్చు వింధ్య హిమాచలమధ్యభూమిగలదియు నగు దమయన్తిని, భూమినివలె నొడియందుంచుకొనుచు దమయన్తి యొక్క చంద్రుని వంటి ముఖమునకు సంబంధించిన కాంతిచేతను, భూమికి సంబంధించినట్టి చన్ద్రుడనెడి ముఖముయొక్క కాన్తిచేతను సంతోషమును (పొంగును) పొందింప బడినవాడవై సముద్రమువలె శోభించుచున్నావు. చన్ద్రునికాంతిచే సముద్రము పొంగుట ప్రసిద్ధము గదా! ఇచ్చట దమయన్తివరమగునట్టి భూమిపరమగునట్టి యర్థములతో తగురీతిగా నన్వయింప బడినది.

శ్లో. దత్తే జయం జనితపత్ర నివేశనేయం
సాక్షీకృతేన్దు వదనా మదనాయ తన్వీ
మధ్యస్థ దుర్బల తమత్వ ఫలం కిమేతత్
భుక్తి ర్యదత్ర తవ భర్త్సిత మత్స్యకేతోః ॥ 130

ప. వి దత్తే - జయం - జనితపుత్రనివేశనా - ఇయం - సాక్షీకృతేన్దువదనా - మదనాయ - తన్వీ - మధ్యస్థ దుర్బలతమత్వ ఫలం - కిం - ఏతత్ - భుక్తిః - యత్ - అత్ర - తవ - భర్త్సితమత్స్యకేతోః.

అర్థము ; హే మహారాజ! = ఓమహారాజా!, జనితపత్రనివేశనా, జనిత = (చెలికత్తెలచే) వ్రాయబడిన, పత్ర = కస్తూరి మున్నగువానిచే కల్పింపబడిన మకరపత్రపు తీగెలవంటి తిలకములయొక్కయు, జయసూచకములగు పత్రములయొక్కయు, నివేశనా = రచనగలదియు, తథా = అట్లే, సాక్షీకృతేన్దువదనా సాక్షీకృత = కన్నులతో గూడినదిగా జేయబడిన, ఇందు = చంద్రుడనెడి, వదనా = ముఖముగలదియు, చన్ద్రుని నేత్రములు గలవానినిగా జేయనిచో ముఖమున నేత్రములయునికి తగదుగదా! పక్షాన్తరమున, సాక్షీకృత = సాక్షాత్తుగా ద్రష్టలుగా ననగా జూచెడివారుగా జేయబడిన, ఇందువదనా = చంద్రముఖులగు చెలికత్తెలను గలదియు (మన్మథుని జయవిషయమునందు దమయన్తికి చెలికత్తెలే సాక్షులై యున్నారు. దమయన్తియందు నలుడు కామముచే వశ్యుడగుట వారిచేతనే చూడబడినదని యర్థము.) లేదా-సాక్షీకృత = ద్రష్టగా జేయబడిన, ఇన్దువదనా = చంద్రునివలె సుందరమగు తన ముఖము గల్గినదియు (నలుని మన్మథుడుజయించు విషయమున దమయన్తియొక్క ముఖచంద్రుడే సాక్షి)నగు ఇయం = ఈయెదుటనున్న, తన్వీ = కృశాంగియగు, (దమయన్తి)పక్షాన్తరమున-ఇయం = ఈ, తన్వీ = సూక్ష్మమైన విచారప్రణాలియు,మదనాయ = మన్మథునికై, జయం = విజయమును,దత్తే = ఇచ్చుచున్నది, మన్మథునిచే నిన్ను జయింపబడినవానిని గావించుచున్నదని యర్థము. పక్షాన్తరమున - నలునికిని మన్మథునికిని వివాదమేర్పడినవుడు కామునికే విజయము నొసంగుచున్నది. అనగా దమయన్తి విష

యమున మన్మథుడు నలుని జయించెనని యర్థము. తథాऽపి = అయినను, భర్త్సిత మత్స్యకేతోః, (సౌందర్యముచే,) భర్త్సిత = బెదిరింపబడిన మత్స్యకేతోః = మన్మథుని గలిగిన, పక్షాన్తరమున - భర్త్సిత = బలముతో బెదిరింపబడిన, మత్స్యకేతోః = మన్మథుని గలిగిన, తవ = నీకు, అత్ర = ఈ దమయన్తియందును, భూమి - యందును, యత్ = ఎందువలన, భుక్తిః = సురతభోగము, పక్షాన్తరమున, బలమువలన శత్రువునుండి బట్టుకొని తాను ఉపభోగించుట, తదేతత్ = అట్టిదైన యిది, మధ్యస్థ దుర్బల తమత్వఫలం, మధ్యస్థ = నడుమనున్నవాని, దుర్బలతమత్వ = మిక్కిలి బలహీనత్వముయొక్కయు, పక్షాన్తరమున - మధ్యస్థ = విచారించెడివారికి, దుర్బలతమత్వ = (బాధనొసంగుటయందు శక్తిలేకయుండుటచే) మనోదౌర్బల్యమునకు. ఫలంకిం? = పరిణామమాయేమి? దమయన్తియొక్క నడుము మిక్కిలిసన్నముగ నుండుటయే మిగుల సుందరుతవైన నీకు భోగమున నుపయోగపడును. అట్లుకానిచో నోడింపబడిన నీవు వివాదగ్రస్తమైన ఈస్థలము నెట్లనుభవింపగలరని యర్థము. పక్షాంతరమున జయపత్రమునందు సాక్షులున్నను మరియొకడు బలముతో విజయవంతుని దిరస్కరించి యనుభవించుటలో సభ్యుల మనోదౌర్బల్యమే కారణమగుచున్నదని యర్థము.

భావము :

ఓ మహారాజా! ఆదమయన్తి నిన్ను జయించునట్లు మన్మథుని జేయుచున్నది. ఎట్లనగా నామె చెలికత్తెలు కస్తూరి మున్నగువానిచే వ్రాసిన మకరికాది పత్రములనెడి జయసూచకములగు పత్రములను (కాగితములను) గల్గియున్నది. అందు చన్ద్రముఖులగు చెలికత్తెలను సాక్షులుగా చేసినది. మన్మథ విజయము విషయమున చెలికత్తెలే సాక్షులై యున్నారని యర్థము. ఏలయనగా! దమయన్తియందు నలుడు కామపారవశ్యము నొందిన విషయమును నాచెలికత్తెలే చూచియున్నారు. మఱియు నాదమయన్తియొక్క ముఖచంద్రుడు కూడా నీవిషయమున సాక్ష్యము వహించియున్నాడు. ఈకృశాంగియైన దమయన్తియు ఈసూక్ష్మమైన విచారణప్రణాళియు మన్మథునకు నిన్నుద్దేశించి జయము నొసంగుచున్నవి. కాని నీవు ఆమన్మథుని సౌందర్యముచే తిరస్కరించినవాడవై (బలపరాక్రమములచే

బెదిరించినవాడవై) ఆదమయన్తియందు సురతసంభోగమును గావించుట మధ్యస్థ దుర్బలతమత్వమునకు ఫలము. అనగా నడుమునందున్న కృశత్వమనెడి దౌర్బల్యమునకు ఫలము. "కృశాంగీ మైథునప్రియా"యని చెప్పిన చొప్పున కృశించిన నడుముగల యాదమయన్తి యానలునకు సంభోగమునందు సుఖము నొసంగుచున్నది.

పక్షాన్తరమున బలముచే శత్రువునుండి లాగికొనిన భూమి ననుభవించుటయు మధ్యస్థ దుర్బలతమత్వఫలమే. అనగా మధ్యస్థులైనవారు భూమి నక్రమముగా నాక్రమించినవారిని శిక్షింప సమర్థులు కానందువలన వారి దౌర్బల్యమున కది ఫలమగుచున్నది. అనగా భూమి నాక్రమించి యుపయోగించుకొనుట మధ్యస్థుల దౌర్బల్యముచేతనే యేర్పడుచున్నది. అనగా దమయన్తినడుము మిక్కిలి కృశించి రమ్యముగా నుండుటయే యతిసుందరుడవైన నీకు భోగమునకు సాధనమైనది. అట్లుకానిచో నోడిపోయిన నీవు వివాదగ్రస్త భూమివంటి యాదమయన్తి నెట్లు భోగింపగలవు. మఱియు జయపత్రమునందు సాక్షులున్నను విజయము నొందిన వానిని దిరస్కరించి భూమిని లాగికొని యనుభవించుటలో మధ్యస్థులను సభ్యుల మనోదౌర్బల్యమే కారణము,

శ్లో. చేతోభవస్య భవతీ కుచపత్రరాజ
ధానీయ కేతు మకరాననురాజధానీ
అస్యాం మహోదయమహస్స్పృశి మీనకేతోః
కే తోరణం తరుణి న బ్రువతే భ్రువౌ తేః 131

ప. వి. చేతోభవస్య - భవతీ - కుచపత్రరాజధానీయకేతుమకరా - నను - రాజధానీ - అస్యాం - మహోదయ మహస్స్పృశి - మీనకేతోః - కే - తోరణం - తరుణి! - న - బ్రువతే - భ్రువౌ - తే.

అర్థము! నను = ఓదమయన్తీ! కుచపత్రరాజధానీయ కేతుమకరా, కుచ = స్తనముల యందు, పత్ర = తిలకములను వ్రాయుటయే, రాజధానీయ = రాజునకు నివాసమైన నగరమునకు సంబంధించిన, కేతుః = ధ్వజమైన, మకరః = మకరము గల్గిన, భవతీ = నీవు, చేతోభవస్య = మన్మథునకు, రాజధానీ = రాజునకు ప్రధాననగరివి. (రాజధానీనగరమందే రాజులు

తమకు తమకు సంబంధించిన యసాధారణ చిహ్నములతో గూడిన ధ్వజ ములను స్థాపింపవలయును గాన మన్మథుడను రాజుయొక్క ముఖ్యచిహ్న మగు మకరము అతని రాజధానులగు నీ స్తనములయందు చిత్రింపబడి నదై ప్రకాశించుచున్నదని యర్థము)

తరుణి! = ఓయువతీ!. కే జనాః = ఏ జనులు, మీనకేతోః = మన్మథుని యొక్క, మహోదయ మహస్పృశి, మహోదయ = రాజ్యప్రాప్తి యనెడి, మహ = ఉత్సవమును, స్పృశి = తాకునట్టి, అస్యాం = రాజధానివైన నీ యందు, తే = నీయొక్క, భ్రువౌ = కనుబొమ్మలను రెండిని, తోర ణం = నగరమునకు వెలుపలి ద్వారమునకు సగవు నెలవంకవలె వంపుగా నమర్చెడి కొయ్యగా, న బ్రువతే = చెప్పరు. కాని అందఱును చెప్పెదరు.

**సమాసములు :**

చేతోభవస్య : చేతసః భవతీతి = చేతోభవః, తస్య = చేతోభవస్య.

కుచపత్రరాజధానీయ కేతుమకరా: కుచయోః పత్రం = కుచపత్రం, కుచపత్రమేవ రాజధానీ యః కేతుః = కుచపత్రరాజధానీయకేతుః, కుచపత్రరాజధానీయ కేతుః మకరః యస్యాస్సా = కుచపత్రరా..ధా..య కేతుమకరా.

రాజధానీ : రాజానః ధీయన్తే అస్మిన్నితి = రాజధానీ.

మహోదయమహస్పృశి : మహాంశ్చాసౌ ఉదయశ్చ = మహో దయః, మహోదయ ఏవ మహః = మహోదయమహః, మహోదయ మహం స్పృశతీతి = మహోదయమహస్పృక్, తస్యాం = మహోదయ మహస్పృశి.

మీనకేతోః : మీనః కేతౌ యస్య సః = మీనకేతుః, తస్య = మీనకేతోః.

**భావము :**

ఓదమయన్తీ! నీచనుకోయిపైన మకరికాపి పత్రరచనయే రాజధానియగు నగరమునందుంచదగిన ధ్వజస్థానమందలి మకరముగా గల్గిన నీవు మన్మథునకు రాజధానియైన నగరివి. ఓ తరుణీ! మన్మథునకు రాజ్యప్రాప్తి యనెడి యౌన్నత్య మునకు సంబంధించిన యుత్సవమును దాకెడి యనగా నాయుత్సవమునకు సంబం

ధించిన రాజధానివైన నీయొక్క కనుబొమలను నగరపు వెలుపలి ద్వారమునం దుంచెడి యర్ధచంద్రాకారముగ వంపుగల కొయ్యగా నెవ్వరు చెప్పరు? అందరును చెప్పగలరని యాశయము.

శ్లో. అస్యా భవన్త మనిశం భవత స్తథైనాం
కామశ్శ్రమం న కథ మృచ్ఛతు నామ గచ్ఛన్,
ఛాయైవ వా మథ గతాఽఽగత మాచరిష్ణోః
తస్యాధ్వజశ్రమహరా మకరధ్వజస్య॥ 132

ప, వి. అస్యాః - భవన్తం - అనిశం - భవతః - తథా - ఏనాం - కామః - శ్రమం - న - కథం - ఋచ్ఛతు - నామ - గచ్ఛన్ - ఛాయా - ఏవ వామ్ - అథ - గతాఽఽగతమ్ - ఆచరిష్ణోః - తస్య - అధ్వజశ్రమ హరా - మకరధ్వజస్య.

అర్థము; హేమహారాజ! = ఓ మహారాజా, కామః = మన్మథుడు, అస్యాః = ఈ దమయన్తియొక్క, (సకాశాత్ = సమీపమునుండి) భవన్తం = నిన్ను, తథా = అట్లే, భవతః = నీయొక్క, (సకాశాత్ = సమీపము నుండి) ఏనాం = ఈ దమయన్తిని, అనిశం = ఎల్లపుడు, గచ్ఛన్ = గమనాగమనములు గావించుచు, కథం = ఎట్లు, శ్రమం = ఆయాసమును, న ఋచ్ఛతునామ = పొందదు? తప్పక పొందు ననియే యర్థము. అథ = లేదా, గతాఽఽగతం = గమనాగమనములను, ఆచరిష్ణోః = చేయుచున్న, తస్య = ఆ, మకరధ్వజస్య = మన్మథునకు, వాం = మీయిరువురియొక్క, ఛాయైవ = నీడయే, అధ్వజశ్రమహరా, అధ్వజ = మార్గమందు గలిగిన, శ్రమ = పరిశ్రమను, హరా = హరించునదిగా, భవతి = ఉండును. నీడ నిండుగా నున్న మార్గమునందు తాకపోకలు గావించెడి బాటసారులకు మార్గాయాసముండ దని యర్థము. దమయన్తియొక్క కామము నలునియందును నలుని కామము దమయన్తియందున్నది గాని మరియొకచోట లేదని భావము.

సమాసములు :

గతాఽఽగతం : గతేన యుక్తం ఆగతం = గతాఽఽగతం.

అధ్వజశ్రమహరా : అధ్వని జాయత ఇతి = అధ్వజః, అధ్వజ శ్చాసౌ

శ్రమశ్చ = అధ్వజశ్రమః, అధ్వజశ్రమం హరతీతి = అధ్వజశ్రమహరా.
మకరధ్వజస్య : మకరః ధ్వజః యస్య సః = మకరధ్వజః, తస్య = మకరధ్వజస్య.

**భావము :**

ఓ నలమహారాజా! మన్మథుడు (కామము) దమయన్తియొద్దనుండి నీ యొద్దకును నీయొద్దనుండి దమయన్తి యొద్దకును రాకపోకలు గావించుటవలన నేల బడలికనుపొందడు? తప్పక పొందుననియే యర్థము. ఆవిధముగా మీ యిరువురి మధ్య రాకపోకలు గావించెడి యామన్మథునకు మీయిరువురి నీడ యాబడలికను హరింపగలదిగా నున్నది. అనగా దమయన్తికి కామము నీపైనను నీకు కామము దమయన్తిపైనను నున్నదేగాని మరియొండు చోట లేదని భావము.

శ్లో. స్వేదప్లవప్రణయినీ తవ రోమరాజీ
రత్యై య దాచరతి జాగరిత వ్రతాని
అథాపి తేన నరనాథ మధూత్థసాన్ద్ర
మగ్నాసమేషు శరకేశరదన్తురాజ్ఞః॥ 133

ప. వి. స్వేదప్లవప్రణయినీ - తవ - రోమరాజః - రత్యై - యత్ - ఆచరతి - జాగరితవ్రతాని - అథాపి - తేన - నరనాథ - మధూత్థసాన్ద్రమగ్నా సమేషుశరకేశరదన్తురాజ్ఞః.

అర్థము: నరనాథ! = ఓనలమహారాజా!, స్వేదప్లవప్రణయినీ, స్వేద = చెమట యందు, ప్లవ = స్నానము గావించుటలో, ప్రణయినీ = ఆసక్తిగలిగిన, తవ = నీయొక్క, రోమరాజిః = రోమములసమూహము, రత్యై = సురతమునకై, జాగరితవ్రతాని, జాగరిత = జాగరణములనెడి (మైకినిక్క పొడుచుకొనుట యనెడి) వ్రతాని = వ్రతములను, యత్ = ఎందువలన, ఆచరతి = ఆచరించుచున్నదో, (పుష్పవతియగు స్త్రీ యెట్లు శుద్ధస్నానము గావించినదై భర్తను సంతోషపరచుటకు జాగరితములనెట్లు చేయునో అట్లని యర్థము) తేన = ఆ వ్రతాచరణముచే, మధూత్థసాన్ద్రమగ్నసమేషు శరకేశరదన్తురాజ్ఞః, మధు = తేనెయొక్క, అనగా బాణములనెడి పుష్పముల సారముయొక్క, ఉత్థ = ఉద్గమముచే, సాన్ద్ర = గాఢము

లైన, మగ్న = నీశరీరము నందు లోపల ప్రవేశించిన, అసమేషు = మన్మ
థునియొక్క, శర = కుసుమరూపములగు బాణములయొక్క, కేశర =
కేసరములచే, దన్తుర = వ్యాప్తమైన. లేదా మిట్టపల్లములుగల, అఙ్గః =
దేహముగల్గిన వాడవువలె, ఆభాసి = ప్రకాశించుచున్నావు.

**సమాసములు :**

స్వేదప్లవప్రణయినీ : స్వేదే ప్లవః = స్వేదప్లవః, ప్రణయః అస్యాః
అస్తీతి = ప్రణయినీ, స్వేదప్లవే ప్రణయినీ = స్వేదప్లవ ప్రణయినీ.

రోమరాజః : రోమ్ణాం రాజిః = రోమరాజిః.

జాగరితవ్రతాని : జాగరితాన్యేవ వ్రతాని = జాగరితవ్రతాని,
తాని = జాగరితవ్రతాని.

నరనాథ : నరాణాం నాథః = నరనాథః, తస్య సంబుద్ధిః = హేనరనాథ.

మధూత్థసాన్ద్రమగ్నాసమేషుశరకేశరదన్తురాఙ్గః : మధునః ఉత్థః =
మధూత్థః, మధూత్థేన సాన్ద్రాః = మధూత్థసాన్ద్రాః. మధూత్థ
సాన్ద్రాశ్చ తేమగ్నాశ్చ = మధూత్థ సాన్ద్రమగ్నాః, అసమాః ఇషవః యస్య
సః = అసమేషుః, అసమేషోః శరాః = అసమేషుశరాః, మధూత్థ సాన్ద్ర
మగ్నాశ్చ తే అసమేషుశరాశ్చ = మధూత్థ సాన్ద్రమగ్నాసమేషుశరాః,
మధూత్థసాన్ద్ర మగ్నాసమేషు శరాణాం కేశరాః = మధూత్థసాన్ద్ర మగ్నా
సమేషు శరకేశరాః, మధూత్థసాన్ద్ర మగ్నాసమేషు శరకేశరైః దన్తురాణి
అఙ్గాని యస్య సః = మధూత్థసాన్ద్ర మగ్నాసమేషు శరకేశర దన్తురాఙ్గః.

**భావము :**

ఓ రాజా! స్వేదజలమునందు జలకములాడ ప్రీతిగలిగిన నీరోమపఙ్క్తి,
సురతమునకై జాగరణములు(నిక్కబొడుచుకొనువిధముగా జేయుట)యనెడివ్రతము
లను జేయుచున్నది. పుష్పవతియగు స్త్రీ యేవిధముగా శుద్ధస్నానముగావించినదై
భర్తను సంతోషపెట్టుటకై జాగరితములను వ్రతములను జేయునో ఆ విధముగా
వ్రతాచరణముచే బాణములనెడి పుష్పసారమునకు సంబంధించిన, బైబైకి నిక్కినవై
గాఢములును నీదేహమున లోనికి జొరబడినవియును పుష్పసారము దిగుటచే
గట్టిగ గుచ్చుకొనినవియునగు పుష్పబాణములయొక్క కేసరములచే మిట్టపల్ల

ములను బొందిన యవయవములు గలవాడుగా బ్రకాశించుచున్నావు. దమయన్తి యొక్క సమ్పర్కమువలన సాత్త్వికభావ ముదయించుటచే రోమాంచములతో గూడిన దేహముగలవాడవై చెమర్చిన దేహముగలవాడుగా నున్నావు. అనగా ఓరాజా! నీచెమటనీట జలకములాడుటకు ప్రీతిగలిగిన నీరోమరాజి నుద్యతమునకై జాగరణము అనెడివ్రతములను, పుష్పవతియగు స్త్రీ శుద్ధస్నానము గావించినదై భర్తను సంతోషపరచుటకై యెట్లు ఆచరించునో అట్లు, ఆచరించుచున్నది. ఆ వ్రతము నాచరించుటచే మన్మథుడు ప్రయోగించిన పుష్పబాణములు పైనబడుట వలన పుష్పరూపమగు నాశరములనుండి వెలుపలికి వచ్చిన తేనెచే దట్టములును లోనికి గాఢముగా జొచ్చుకొనిపోయిన యా బాణములనెడి పుష్పముల కేసరములచే నీయవయవములు మిట్టపల్లములైనవి. అట్టి అవయవములు గలవాడుగా నీవు శోభించుచున్నావు. దమయన్తీ సమ్పర్కముచే నీదేహమున పులకములు స్వేదాది సాత్త్వికభావము లుదయించినవని యాశయము.

శ్లో. ప్రాప్తా తవాఽపి నృప జీవితదేవతేయం
ఘర్మామ్బుశీకరకరమ్బన మమ్బుజాక్షీ ।
తే తే యథా రతిపతేః కుసుమాని బాణాః
స్వేద స్తథైవ కిము తస్య శరక్షతాస్రమ్ ॥ 134

ప. వి. ప్రాప్తా - తవ - అపి - నృపజీవితదేవతా - ఇయం - ఘర్మామ్బుశీకర కరమ్బనమ్-అమ్బుజాక్షీ - తే-తే - యథా - రతిపతేః - కుసుమాని- బాణాః - స్వేదః - తథా-ఏవ - కిమ్ - ఉ - తస్య -శరక్షతాస్రమ్.

అర్థము : హే నృప! = ఓ నలమహారాజా! తవ = నీయొక్క, జీవిత దేవతా, జీవిత = జీవనమునకు, దేవతా = అధిదేవతయగు, అమ్బుజాక్షీ = తమ్మికంటియైన,ఇయ మపి = ఈదమయన్తియు,ఘర్మామ్బుశీకరకరమ్బ నం, ఘర్మామ్బు = వేడినీటియొక్క అనగా చెమటయొక్క, శీకర = తుంపురులచే, కరమ్బనం = కలయికను, ప్రాప్తా = పొందినది. అనగా సాత్త్వికభావ ముదయించుటవలన స్వేదముచే దడిసిన నొడలు గలిగినదాయెనది యర్థము, రతిపతేః = మన్మథునియొక్క, తే తే =

ఆయా ప్రసిద్ధములగు, బాణాః యథా = శోషణములనియు సమ్మోహనము లనియు నేబాణములుగ ౹వో వానివలె, కుసుమాని = పద్మములుమున్నగు పుష్పములు (అ) భవన్ = అయినవి) తథైవ = అవిధముగనే, స్వేదః = చెమట నీరు, తస్య = ఆ కామునియొక్క, శరక్షతాస్రం కిం?, శర = బాణములయొక్క, క్షత = గాయములనుండి వెల్వడిన, అస్రం కిము = నెత్తురా యేమి! అది యుక్తమే. సుకుమారములగు పుష్పములు మన్మథుని వాడి బాణములుగా గలిగినపుడు, రక్తవర్ణముకాని స్వేదజలముగూడా ఆమన్మథుని బాణములవలన దెబ్బలనుండి వెల్వడు నెత్తురుగాదగినదే. ఏలయనగా దైవప్రభావ మంతటను సమానమేగదా.

**సమాసములు :**

జీవిత దేవతా : జీవితస్య దేవతా = జీవిత దేవతా.

ఘర్మామ్బుశీకరకరమ్బనం : ఘర్మస్య అమ్బు = ఘర్మామ్బు, ఘర్మామ్బునః శీకరాః = ఘర్మామ్బు శీకరాః, ఘర్మామ్బు శీకరైః కరమ్బనం = ఘర్మామ్బుశీకరకరమ్బనం, తత్ = ఘర్మామ్బు శీకర కరమ్బనం.

రతిపతేః : రతేః పతిః = రతిపతిః, తస్య రతిపతేః.

శరక్షతాస్రమ్ : శరాణాం క్షతాని = శరక్షతాని. శరక్షతానాం అస్రమ్ = శరక్షతాస్రమ్.

**భావము :**

ఓ నలమహారాజా ! నీ జీవితేశ్వరి యైన తమ్మికంటి యైన యీ దమయన్తియు స్వేదోదకముల మిశ్రణమును బొందినది. అనగా సాత్త్వికభావ ముదయించుట వలన స్వేద జలమునందు తడిసినదై యున్నదని యర్థము. మన్మథునికి సంబంధించిన శోషణములు సమ్మోహనములవి చెప్పబడు బాణములుగా కమలములు మున్నగు పుష్పము లెట్లాయెనో అట్లే స్వేదజలము గూడా బాణముల వలని గాయముల నుండి స్రవించు రక్తముగ గూడా గాదగును. రెండు విధములలోను దైవప్రభావము సమానమే గదా.

శ్లో. రాగం ప్రతీత్య యువయో స్తమిమం ప్రతీచీ
భానుశ్చ కిం ద్వయ మజాయత ర క్త మేతత్।
తద్వీక్ష్య వాం కిమిహ కేలిసరిత్సరోజైః
కామేషుతోచితముఖత్వ మధీయమానమ్ ॥ 135

వ. వి. రాగం - ప్రతీత్య - యువయోః - తమ్-ఇమం - ప్రతీచీ - భానుః - చ - కిం - ద్వయం - అజాయత - రక్తం - ఏతత్ - తత్ - వీక్ష్య - వాం - కిం - ఇహ - కేలిసరిత్సరోజైః - కామేషుతోచిత ముఖత్వమ్ - అధీయమానమ్.

అర్థము: హే రాజన్ ! = ఓ రాజా, ! ప్రతీచీ = పడమటి దిక్కు, భానుశ్చ = సూర్యుడును. ఏతత్ ద్వయం = ఈ రెండును, యువయోః = మీ యిరువురి యొక్క, తం = ముందు చెప్పబడిన స్వేదాది సాత్త్విక భావములచే సూచింప బడిన, ఇమం = ఈ కానవచ్చెడి, రాగం = అనురాగమును, ప్రతీత్య = ప్రత్యక్షముగా తెలుసుకొని, రక్తం = రక్తవర్ణము గలవిగాను, (అనురాగము గలవిగను) అజాయత కిం = ఏర్పడెనా యేమి ? ఒకనొకరగు స్త్రీ పురుషుల సంభోగానురాగమును జూచి మరియొక స్త్రీ పురుషులకు నట్టి యనురాగము తఱచు కలుగుట యనుభవ సిద్ధము కదా. దివా సంభోగము శాస్త్ర నిషిద్ధముగాన దమయన్తీ నలుల యత్యధిక సంభోగాభిలాషను జూచుట వలన దయతో తాన స్తమించుట ద్వారా రాత్రినిదేవలయు నను నభిప్రాయముచే సూర్యుడు రక్తవర్ణు డాయెను అని యర్థము. (తథా = అట్లు) ఇహ = ఈ సమయము నందు, కేలి సరిత్స రోజైః, కేలి సరిత్ = నీ క్రీడానది యొక్క, సరోజైః = కమలముల చేత, తత్ = ఆ, ద్వయం = పడమటి దిక్కును సూర్యుడు నను నారెంటిని, వాం = మీ ఇద్దరిని, వీక్ష్య = చూచి, అనగా పడమట నున్న సూర్యు న స్తమింప నున్నవానిని గాను, మీ యిద్దరిని సంభోగాభిలాషగల వారిగను జూచి, కామేషుతోచితముఖత్వం, కామ = మన్మథునియొక్క, ఇషుతా = బాణముగా నుండుటకు, ఉచిత = తగిన, ముఖత్వం = ముఖమును అనగా కొనను గలిగియుండుటను, అధీయమానం = అభ్యాయనము

చేయబడుచున్నదిగా, వర్తతే కిం? = ఉన్నవా యేమి? కమలములు ముకుళించినచో నవు తవి కూడియైన కొనలు గలిగిన మొగ్గలు నేర్పడి మన్మథునకు పదునైన బాణములుగా నుండుటకు తగియుండునని యర్థము. అనగా దమయన్తీనలుల సంభోగకాలమందు మన్మథునకీ బాణము లాయత్తపరుచబడుచుండినవని యర్థము. సాయంకాల మేర్పడగనే పడమటి దిక్కును సూర్యుడును నెఱ్ఱబారిరి. కమలములు ముకుళించినవి. ఇక రాత్రి శీఘ్రముగనే యేతెంచుచున్నది. ఇక మీరు బాధపడవలసిన యవసరము లేదని యర్థము.

**సమాసములు ;**

కేలిసరిత్సరోజైః: కేలేః సరిత్ = కేలిసరిత్, కేలిసరితః సరోజాని = కేలిసరిత్సరోజాని. తైః = కేలిసరిత్సరోజైః.

కామేషుతోచితముఖత్వం : కామస్య ఇషవః = కామేషవః, కామేషూణాం భావః = కామేషుతా, కామేషుతాయాః ఉచితం = కామేషుతోచితం, కామేషుతోచితం ముఖం యేషాం తాని = కామేషుతోచితముఖాని, కామేషుతోచితముఖానాం భావః = కామేషుతోచితముఖత్వం.

**భావము ;**

ఓ రాజా! పడమటిదిక్కును సూర్యుడును అను నీరెండును పూర్వము చెప్పబడిన స్వేదాదులచే సూచితమగు మీయిరువురి అనురాగమును ప్రత్యక్షముగా జూచి రక్తవర్ణము గలవిగను అనురాగముగలవిగను నైనవాయేమి? ఒరుల యనురాగమును జూచిన స్త్రీ పురుషులు తామును అనురక్తులగుట సహజము. కాన నిట ప్రతీచి (పడమట)యను స్త్రీకిని సూర్యుడను పురుషునకును దమయన్తీనలుల యనురాగదర్శనముచే ననురాగమేర్పడినదా యని భావింపబడినది. ఇచ్చట ననురాగ మనగా సాయంకాలపు టరుణవర్ణమని యర్థము. అందువలన పగలు సంభోగము నిషిద్ధముగాన దమయన్తీనలులయొక్క మిక్కుటమగు సంభోగాభిలాషను జూచి సూర్యుడు దయతో తానస్తమించుటచే రాత్రిని దేవలయునని యభిప్రాయము జెంది రక్తవర్ణుడాయెనా యని యర్థము. ఈ విధమగు నభిప్రాయముతో సూర్యుడస్తమించుటను గ్రహించిన నీక్రీడానదియందలి కమలములు ముకుళించుచు, వారి యిరువురి సంభోగకాలమునకు చక్కగా

మన్మథుని కుపయోగపడుటకై కూచియైన కొనలు గలిగిన మొగ్గలుగా నేర్పడి పదునైన బాణములుగా నైయున్నవా- అనిభావింపదగియున్నవి. సాయంకాల మేర్పడుటవలన పతిచియు సూర్యుడును నెట్టిబారిరి. కమలములు ముకుళించు కొనినవి. రాత్రి త్వరలో వచ్చుచున్నది. కాన మీరు బాధపడనవసరములేదని యాశయము.

శ్లో. అన్యోన్యరాగవశయో ర్యువయో ర్విలాస
స్వచ్ఛన్దతాచ్ఛి దపయాతు తదాలివర్గః ।
అత్యాజయన్ నిచయ మాజి మకారయన్
వా దన్తైర్నఖై శ్చ మదనో మదనః కథం స్యాత్ ॥

ప. వి. అన్యోన్యరాగవశయోః-యువయోః-విలాసస్వచ్ఛన్దతాచ్ఛిత్-అపయాతు-తత్-ఆలివర్గః,-అత్యాజయన్-నిచయం-ఆజిం- అకారయన్-వా-దన్తైః-నఖైః-చ-మదనః-మదనః-కథం-స్యాత్.

అర్థము : హేదమయన్తీ నలౌ = ఓదమయన్తీనలులారా!, తత్ = అందువలన, అనగా మీకిద్దరికిని నుత్కటమగు సంభోగాభిలాష యుండుటవలన, అన్యోన్యరాగవశయోః, అన్యోన్య = ఒండొరులయందు, రాగ = నురతాభిలాషకు, వశయోః = ఆధీనులైన, యువయోః = మీయిరువురి యొక్క, విలాసస్వచ్ఛన్దతాచ్ఛిత్, విలాస = సురతక్రీడయొక్క, స్వచ్ఛన్దతా = స్వేచ్ఛను, ఛిత్ = హరించెడి, ఆలివర్గః = చెలికత్తెలసంఘము, అపయాతు = తొలగిపోవునుగాత. తథాహి = అది యుక్తమే, మదనః = మన్మథుడు, నిచయం = (దమ్పతులగు మీ యిరువురి యొక్క) వస్త్రమును, అత్యాజయన్ = (మీ చేతనే యొకరి వస్త్రమును ఒకరిచే)విప్పింపక, వా = లేదా, దన్తైః = దన్తములచేతను, నఖైశ్చ = గోరుల చేతను, ఆజిం = ఒండొరులను గాయపఱచు కొనుట మున్నగు యుద్ధమును, అకారయన్ = చేయింపక, మదనః = సురత వ్యాపారము నందు మదమును (మోహమును) గల్గించు వాడుగా, కథం = ఎట్లు, స్యాత్ = అగును. ఏ విధముగను గానేరడని యర్థము.

**సమాసములు :**

అన్యోన్యరాగవశయోః : అన్యోన్యయోః రాగౌ = అన్యోన్యరాగౌ, అన్యోన్య రాగయోః వశౌ = అన్యోన్య రాగవశౌ, తయోః = అన్యోన్య రాగవశయోః.

విలాస స్వచ్ఛన్దతాఛిత్ : విలాసే స్వచ్ఛన్దతా = విలాసస్వచ్ఛన్దతా, విలాస స్వచ్ఛన్దతాం ఛినత్తీతి = విలాస స్వచ్ఛన్దతాఛిత్.

ఆలివర్గః : ఆలీనాం వర్గః = ఆలివర్గః.

అత్యాజయన్ : న త్యాజయన్ = అత్యాజయన్.

అకారయన్ : న కారయన్ = అకారయన్

మదనః : మదయతీతి = మదనః.

**భావము :**

ఓ దమయన్తీ నలులారా ! మీకిరువురికిని మిక్కుటముగా సురతాభిలాష యుండుటవలననే మీసురత క్రీడ యొక్క స్వేచ్ఛకు భంగము కలిగించెడి యీ మీ చెలికత్తెల సంఘము ఇటనుండి తొలగవలయును. మదనుడు దమ్పతుల యొక్క పలువలను వారిచేతనే విప్పింపక వారి మధ్య దంతములతోడను నఖములతోడను యుద్ధము కల్పింపకయే మదను డెట్లగును ? మదనుడనగా "మదయతీతి" నిర్వచనముచే మదమును గల్గించు వాడు అని యర్థము. కాన మదనుడట్లు మీకు మోహము గల్పించియే సార్థకనామము గలవాడగునని యాశయము.

శ్లో. ఇతి పఠతి శుకే మృషా యయుస్తా
బహు నృపకృత్య మవేత్య సాన్ధివేలం ।
కుపిత నిజసఖీ దృశాఽర్ధ దృష్టాః
కమలతయేవ తదా నికోచవత్యః ॥ 137

వ. వి ఇతి-పఠతి-శుకే - మృషా - యయుః-తాః-బహునృపకృత్యం-అవేత్య-సాన్ధివేలం - కుపితనిజసఖీదృశా - అర్ధదృష్టః - కమలతయా - ఇవ - తదా - నికోచవత్యః.

అర్థము: ఇతి = ఈ విధముగా, శుకే = చిలుక, పఠతి సతి = పలుకగా, గంధర్వ రాజపుత్రికల వీణాగానానువాదము ననుసరించి స్పష్టముగా నుచ్చరింపగా, తదా = ఆ సంధ్యాకాలమందు, కమలతయా ఇవ = తమ ముఖములు పద్మములుగా నుండుట చేతనో యనునట్లు, నికోచవత్యః = సంధ్యాకాలం మాసన్నమగుటచే ముడుచుకొనుటయు సంభోగ ప్రసఙ్గముచే లజ్జవలసి సంకోచము గలవో యనునట్లున్న. తాః = ఆ చెలికత్తెలును, ఆ గన్ధర్వ రాజ పుత్రికలును, మృషా = అసత్యముగా, కుపిత నిజ సఖీదృశా, కుపిత = కోపించిన, నిజ తమయొక్క, సఖీ = చెలికత్తెయైన దమయన్తియొక్క. దృశా = నేత్రముతో, అర్ధదృష్టాః = కొంచెము చూడబడినవారై, కోపమనెడి నెపముచే కొద్దిగా జూడబడినవారై, సాన్ధివేలం = సంధ్యాకాలమందు గలిగిన, బహునృపకృత్యం, బహు = పెక్కైన, నృప = రాజుయొక్క, కృత్యం = కార్యమును, అనగా సంధ్యోపాసనాది కార్యములను, అవేత్య = తెలిసికొని. యయుః = (అచ్చటినుండి) వెడలిరి

సమాసములు :

బహునృపకృత్యం : నృపస్య కృత్యం = నృపకృత్యం, బహు చ తత్ నృపకృత్యం చ = బహునృపకృత్యం, తత్ = బహునృపకృత్యం.
కుపితనిజసఖీదృశా : నిజా చ సా సఖీ చ = నిజసఖీ, కుపితా చ సా నిజసఖీ చ = కుపితనిజసఖీ, కుపితనిజసఖ్యాః దృక్ = కుపితనిజసఖీ దృక్, తయా = కుపితనిజసఖీదృశా.
అర్ధదృష్టాః : అర్ధం దృష్టాః = అర్ధదృష్టాః.
కమలతయా : కమలస్య భావః = కమలతా, తయా = కమలతయా.
నికోచవత్యః: నికోచః ఆసా మస్తీతి = నికోచవత్యః.

భావము :

ఈ విధముగా చిలుక గన్ధర్వరాజపుత్రికలయొక్క వీణానాదము ననుసరించి క్రమముగా నుచ్చరించినది. అవుడు సంధ్యాకాల మేర్పడుటవలన, పద్మములగుట

జేతనో యనునట్లు, చెలికత్తెలమోములు సంకోచముల జెందినవి. ఒక పక్షము నందవి పద్మముంగుటవలన సూర్యకాంతి లేనందువలన ముడుచుకొనినవి. మరియొక పక్షమున దమయన్తీ నల సంభోగప్రసక్తివలన వారి ముఖములు సిగ్గుచే సంకోచము నొందినవి. ఆతరుణమునం దాచెలికత్తెల్చు దమయన్తిని నలునియొద్ద నొక్కతెగా వదలిపోవుచుండిరి. అందువలన నామె తన సిగ్గును గప్పిపుచ్చుకొనుటకై చెలికత్తెలు మున్నగు వారిపై మిథ్యాకోపము ననగా కృత్రిమకోపమును వహించి యర్ధదృష్టితో వారిని అనగా నాగన్ధర్వరాజ పుత్రిక లగు చెలికత్తెలను జూచుచుండినది. అది సంధ్యాకాల మగుటవలన నలమహారాజునకు సంధ్యోపాసనాది కార్యము లుండునని తెలిసికొని యా చెలికత్తెలు మున్నగు వా రా ప్రదేశము నుండి నిర్గమించిరి.

శ్లో. అకృత పరభృతః స్తుహి స్తుహీతి
శ్రుతవచనస్రగనూక్తి చుఞ్చు చఞ్చుమ్
పఠితనలనుతిం ప్రతీవ కీరం
తమివ నృపం ప్రతి జాతనేత్రరాగః ॥ 138

వ. వి. అకృత - పరభృతః - స్తుహి-స్తుహి- ఇతి-శ్రుతవచనస్రగనూక్తి చుఞ్చు చఞ్చుమ్ - పఠితనలనుతిం - ప్రతి - ఇవ - కీరం - తం - ఇవ నృపం - ప్రతి - జాతనేత్రరాగః

అర్థము: పరభృతః = చెలికత్తెలు తెచ్చిన కోకిల, నృపం = రాజైన, తం = ఆ నలుని, ప్రతి = ఉద్దేశించి, జాతనేత్రరాగః, జాత = ఉత్పన్నమైన, నేత్ర = కన్నులయందలి, రాగ ఇవ = రక్తవర్ణము (అనురాగము) కలిగినదో యనునట్లున్నదై, శ్రుతవచనస్రగనూక్తి చుఞ్చుచఞ్చుం, శ్రుత = తనచే వినబడిన, వచనస్రక్ = వాక్యపరమ్పరయొక్క, అనూక్తి = అనువాదముతో, చుఞ్చు = ప్రసిద్ధిగలిగిన, చఞ్చుం = ముక్కులపుటములు గలిగినదియు, తథా = అట్లే, పఠితనలనుతిం, పఠిత = ఉచ్చరించబడిన, నలనుతిం = నలునిస్తుతి గలిగిన, కీరంప్రతీవ = చిలుక నుద్దేశించియో యనునట్లు, "స్తుహిస్తుహి" = నుతింపుము నుతింపుము, ఇతి = అని,

ధ్వనిని, అకృత = చేసినది. కోకిల రాజుకై, మిక్కిలి యనురాగమును వహించినందువలన, నలుని నుతించు విషయమున విరమించిన చిలుక నుద్దేశించి "స్తుతింపుము స్తుతింపుము" అని సహజధ్వనితో బలికి ప్రోత్స హించె నని యర్థము.

సమాసములు :

శ్రుతవచనస్రగనూక్తి చుఞ్చుచఞ్చుం: వచనానాం స్రజః = వచనస్రజః, శ్రుతాశ్చ తాః వచనస్రజశ్చ = శ్రుతవచనస్రజః. శ్రుతవచనస్రజాం అనూక్తిః శ్రుతవచనస్రగనూక్తిః, శ్రుతవచనస్రగనూక్త్యా విత్తే = శ్రుత వచనస్రగనూక్తిచుఞ్చు, శ్రుతవచనస్రగనూక్తివిత్తే చఞ్చూ యస్య సః = శ్రుతవచనస్రగనూక్తిచుఞ్చుచఞ్చుః, తం = శ్రుత వచనస్రగనూక్తి చుఞ్చుచఞ్చుం.

పతితనలనుతిం : నలస్య నుతిః = నలనుతిః, పతితా నలనుతిః యేన సః = పతితనలనుతిః, తం = పతితనలనుతిమ్.

జాతనేత్రరాగః : నేత్రయోః రాగః = నేత్రరాగః, జాతః నేత్రరాగః యస్య సః = జాతనేత్రరాగః.

భావము :

చెలికత్తె తెచ్చిన కోకిల, రాజుయొక్క పరమసున్దరాకృతిని జూచి నేత్ర ములయందు తనకు సహజమగు నెఱ్ఱతనమును (అనురాగమును) వహించినదై, రాజును స్తుతించుటయందు చిలుకను ప్రేరేపింప దలచినది. దానికి పూర్వ మా చిలుక యితరులవలన దా వినిన వాక్యపరమ్పరల ననువదించుటచే ఖ్యాతినొందిన ముక్కుపుటములుగల దానియొక్క సామర్థ్యమును గ్రహించినదై, తత్పూర్వము రాజస్తుతినిబఠించి విరమించిన యాచిలుకను "స్తుహి స్తుహి" (నుతింపుము నుతింపుము)అని మరల ప్రేరేపించెనని యాశయము.

శ్లో. తుఙ్గప్రాసాదవాసా దథ భృశకృశతా మాయతీం కేలికుల్యా
మద్రాక్షీ దర్కబిమ్బప్రతికృతిమణినా భీమజా రాజమానామ్,
వక్రం వక్రం వ్రజన్తీం ఫణియువతిరితి త్రసన్నుభి ర్వ్యక్తముక్తా
న్యోన్యం విద్రుత్య తీరే రథపదమిథునైః సూచితా
మార్తిరుత్యా॥ 139

వ. వి. తుఙ్గప్రాసాదవాసాత్ - అథ - భృశకృశతాం - ఆయతీం - కేలికుల్యాం - అద్రాక్షీత్ - అర్కబిమ్బప్రతికృతి మణినా - భీమజా - రాజమానామ్- వక్రం - వక్రం - వ్రజన్తీం - ఫణియువతిః - ఇతి - త్రస్నుభిః - వ్యక్తముక్తాన్యోన్యం - విద్రుత్య - తీరే - రథపదమిథునైః - సూచితాం - ఆర్తిరుత్యా.

అర్థము: అథ = కోకిల పలికిన పిదప, భీమజా = దమయన్తి, తుఙ్గప్రాసాదవాసాత్, తుఙ్గ = ఎత్తైన, ప్రాసాద = మేడయందు, వాసాత్ = నివాసమువలన, భృశకృశతాం, భృశ = మిక్కిలి, కృశతాం = క్షీణత్వమును, ఆయతీం = పొందుచున్న, (విశాలమైన వస్తువుగూడా ఎత్తైన మేడనుండి చూచెడి దమయన్తి దృష్టికి మిక్కిలి సన్నమైనదిగనే కన్పించుచున్నదని యర్థము) తథా = అట్లే, అర్కబిమ్బ ప్రతికృతిమణినా, అర్కబింబ = అస్తమింపనున్నదై కొంచెము యెఱ్ఱదనము గలిగిన సూర్యబిమ్బము యొక్క, ప్రతికృతి = ప్రతిబిమ్బమనెడి యనగా చెప్పబోవు కాలువనీటి యందలి ప్రతిబింబ మనెడి, మణినా = రత్నముచే ననగా, పెద్దదైన పద్మరాగమణిచే, రాజమానాం = ప్రకాశించుచున్నదియు, వక్రం వక్రం = వంకరవంకరగా, వ్రజన్తీం = ప్రవహించుచున్నదియు (కావుననే) ఫణియువతి రితి = ఒకానొక నాగయువతి యని, త్రస్నుభిః = భయపడుచున్న, రథపదమిథునైః, రథపద = చక్రవాకములయొక్క, మిథునైః = జంటలచే, వ్యక్తముక్తాన్యోన్యం, వ్యక్త = స్ఫుటముగా, ముక్త = విడువబడిన, అన్యోన్యం = ఒండొరులు గలుగునట్లుగా, తీరే = ఆకాలువ యొక్క యొక్కొక్కగట్టునందు, విద్రుత్య = పరుగిడి, ఆర్తిరుత్యా, ఆర్తి = పీడవలని, రుత్యా = దుఃఖధ్వనిచే, ననగా రాత్రివచ్చుటవలని విరహచింతచే నేర్పడిన దీనస్వరముతో, సూచితాం = సూచింపబడిన, కొంచెము చీకటి వచ్చుటచే స్పష్టముగా గానరాక పోయినను, చక్రవాకముల దీనారావములచే తెలియబడిన, కేలికుల్యాం = క్రీడానదిని, అద్రాక్షీత్ = చూచెను.

సమానములు :

తుఙ్గప్రాసాదవాసాత్: తుఙ్గశ్చాసౌ ప్రాసాదశ్చ = తుఙ్గప్రాసాదః, తుఙ్గప్రాసాదేవాసః = తుఙ్గప్రాసాదవాసః, తస్మాత్ = తుఙ్గప్రాసాదవాసాత్,

భృశకృశతాం: భృశం కృశతా = భృశకృశతా, తాం = భృశకృశతామ్
కేలికుల్యాం ; కేలేః కుల్యా = కేలికుల్యా, తామ్ = కేలికుల్యామ్.
అర్కబిమ్బప్రతికృతిమణినా : అర్కస్య బిమ్బః = అర్కబిమ్బః, అర్కబిమ్బస్య ప్రతికృతిః = అర్కబిమ్బప్రతికృతిః, అర్కబిమ్బ ప్రతికృతిరేవమణిః = అర్కబిమ్బప్రతికృతిమణిః, తేన = అర్కబిమ్బ ప్రతికృతిమణినా.

ఫణియువతిః : ఫణినాం యువతిః = ఫణియువతిః.
వ్యక్తముక్తాన్యోన్యం ; వ్యక్తం ముక్తం అన్యోన్యం యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = వ్యక్తముక్తాన్యోన్యమ్.
రథపదమిథునైః: రథపదానాం మిథునాని = రథపదమిథునాని, తైః = రథపదమిథునైః.
ఆర్తిరుత్యా ; ఆర్తేః రుతిః = ఆర్తిరుతిః, తయా = ఆర్తిరుత్యా.

**భావము :**

కోకిల పలికిన పిదప దమయన్తి మేడపైభాగమునుండి యొకక్రీడానదిని చూచినది. ఆనది మిక్కిలి విశాలముగ నున్నను, చాల యెత్తైన మేడపైనుండి చూచుటవలన, నాదమయన్తి కన్నులకు చాలా సన్ననైనదిగా గానబడుచున్నది; స్థూలమైన దేదైనను దూరమునుండి చూచినచో సన్నగనే కనబడును కదా. మరియు నాక్రీడానదియందు, సూర్యబింబము ప్రతిబింబించినదై గొప్ప పద్మరాగ మణివలె శోభించుచున్నది. ఆనది వంకరవంకరగా పారుటవలన నొకానొక నాగ యువతివలె నున్నదై దానినిచూచు చక్రవాకముల జంటలకు భయము గల్గించు చున్నది. అట్టి చక్రవాకములు రాత్రి సమీపించుటవలన నొండొంటిని వీడి ఆక్రీడా నదియొక్క యిరుగట్టులలో నొక్కొక్కగట్టున నొక్కొక్కటిగ వసించుచు రాత్రి సమీపించు కొలది ప్రబలమగుచున్న వియోగదుఃఖమునొంది పరుగిడుచు దీనస్వరమున కేకలు వేయుచున్నవి. చీకటి మసకలయందు ఆక్రీడానది చక్కగా గానరాకపోయినను, ఆచక్రవాకపు దీననాదముచే తెలియతగియున్నది. అట్టి క్రీడా నదిని దమయన్తి గాంచెనని యాశయము.

శ్లో. అథ రథచరణౌ విలోక్య రక్తా
వతివిరహాసహతాఽహతా వివాస్రైః।
అప త మకృత పద్మసుప్తికాలం
శ్వసనవికీర్ణసరోజసౌరభం సా॥ 140

ప. వి. అథ - రథచరణౌ - విలోక్య - రక్తౌ -అతివిరహా సహతాఽఽహతౌ- ఇవ - అస్రైః - అపి - తమ్ - అకృత - పద్మసుప్తికాలం - శ్వసన వికీర్ణసరోజసౌరభం - సా.

అర్థము, అథ = క్రీడానదిని చూచిన పిదప, సా = ఆదమయన్తి, రథచరణౌ = చక్రవాకముల జంటలు, అతివిరహాసహతాఽఽహతావివ, అతివిరహ = మిక్కిలివిరహమును, అసహతా = సహింపజాలక పోవుటచే, ఆహతౌ ఇవ = దెబ్బతినినవో యనునట్లున్నవియు, ననగా కామబాణములచే, గొట్టబడినందువలన భయము జెందినవో యనునట్లున్నవియు రెండుగా వీడిపోయినవియును కావుననే, అస్రైరివ = నెత్తురులచే, రక్తౌ = ఎఱ్ఱనివన్నెను బొందినవియు, ననురాగము జెందినవిగ నున్నవానినిగా, విలోక్య = చూచి, తం = అసమీపించుచున్న, పద్మసుప్తికాలం, పద్మ = కమలముల యొక్క, సుప్తికాలం = నిద్రించుసమయమును అనగా ముకుళించు సమయమగు సాయంకాలమును, శ్వసనవికీర్ణసరోజసౌరభం, శ్వసన = గాలిచే, వికీర్ణ = వెదజల్లబడిన, సౌరభం = పరిమళము గలదానినిగా, అకృత = చేసినది. ఆసంధ్యాకాలమునందు పద్మములు ముకుళించుకొని పోవుటవలన, వానిపరిమళము లభింపకపోయినను, దమయన్తి తాను పద్మినీజాతికి చెందినదగుటవలన నామె నిఃశ్వాసములు పద్మసుగంధములుగా నుండుటవలన నామెనిట్టూర్పులే యాపద్మపరిమళమును విస్తరింప చేయుచుండినదని యర్థము.

సమాసములు :

అతివిరహాసహతాహతౌ : అత్యన్తం విరహః = అతివిరహః, సహేతే ఇతి = సహౌ, సహయోః భావః = సహతా, న సహతా = అసహతా, అతివిరహస్య అసహతా = అతివిరహాసహతా, అతివిరహాసహతయా

అహతౌ = అతివిరహా సహతావతౌ, తౌ = అతివిరహాసహతాహతౌ.

పద్మసుప్తికాలం : పద్మానాం సుప్తిః = పద్మసుప్తిః, పద్మసుప్తేః కాలః = పద్మసుప్తికాలః. తం = పద్మసుప్తికాలం.

శ్వసనవికీర్ణసరోజసౌరభమ్ : శ్వసనేన వికీర్ణం = శ్వసనవికీర్ణం, సరోజానాంసౌరభం = సరోజసౌరభం. శ్వసనవికీర్ణం సరోజసౌరభం యస్మిన్ సః = శ్వసన వికీర్ణసరోజ సౌరభః, తం = శ్వసన వికీర్ణసరోజ సౌరభమ్.

**భావము :**

ఆ క్రీడానదిని జూచిన పిదప దానిగట్టున రాత్రియంతయు నొండొరుల వియోగమును నోర్వజాలనివై, మన్మథ బాణముల దెబ్బలచే రెండుగా విడిపోయి నవై ఆ దెబ్బలవలని రక్తముచేతనో యనునట్లు, రక్తవర్ణములును, నొండొంటిపై ననురక్తములును నైయున్న చక్రవాకముల జంటను గాంచి దమయన్తియావక్షు లపై దయతో తాను విషణ్ణురాలై దీర్ఘములగు నిఃశ్వాసములను విడిచినది. అది సాయంకాలమగుట వలన పద్మములు ముకుళించుటచే వాని పరిమళములు ఆగి పోయినను పద్మినీజాతికి చెందిన దమయన్తి విడిచిన నిట్టూర్పులనుండి పద్మగంధ ములు చుట్టును వ్యాపింప దొడగినవి.

శ్లో. అఖిలపతి పతిం ప్రతి స్మ భైమీ
సదయ విలోకయ కోకయో రవస్థామ్ ।
మమ హృదయ మిమౌ చ భిన్దతీ హా
క ఇవ విలోక్య నరో న రోది తీమామ్ ॥ 141

వ. వి. అఖిలపతి - పతిం - ప్రతి - స్మ - భైమీ - సదయ - విలోకయ - కోకయోః - అవస్థామ్ - మమ - హృదయం - ఇమౌ - చ - భిన్దతీ- హా - కః - ఇవ - విలోక్య - నరః - న - రోదితి - ఇమామ్.

అర్థము: భైమీ = దమయన్తి - పతింప్రతి = భర్తయగు నలు నుద్దేశించి, అఖిల పతి స్మ = పలుకుచుండెను. ఏమనగా, హే సదయ = ఓదయగలవాడా!, కోకయోః = చక్రవాకముల యొక్క, అవస్థాం = కష్టదశను, విలోకయ = చూడుము, మమ = నాయొక్క, హృదయం = వక్షఃస్థల

మును, ఇమౌ = ఈ చక్రవాకములు, భిన్దన్తీ = వగులగొట్టుచున్నవియు (వియుక్తము గావించునవియు) నగు ననగా వీనిదుఃఖమును చూచుటవలన నాహృదయము పగులుచున్నట్లున్నది. మఱియు నాకును వియోగమును గల్పించుచున్నట్లున్నదని యర్థము. ఇమాం = ఇట్టి వియోగదశను, విలోక్య = చూచి, హా = కష్టము. క ఇవ నరః = ఏమనుష్యుడు, నరోదితి = దుఃఖించడు. తప్పక దుఃఖించునని యర్థము. నీవు దయాలువుగాన నీకును దుఃఖము గలుగునని నేను తలంతును.

**సమాసములు :**

హే సదయ: దయయా సహ వర్తత ఇతి = సదయః, తస్య సంబుద్ధిః = హే సదయ!.

**భావము :**

దమయన్తి భర్తయగు నలు నుద్దేశించి యిట్లు పలుకుచున్నది. ఓ దయాలూ! చక్రవాకములకు వియోగము వలన గలిగిన యీ దుర్దశను గాంచుము. నావక్షఃస్థలమును పగులగొట్టుచున్నదియును (వియుక్తము గావించునదియును) నగు వీని దుర్దశను గాంచి అయ్యో! ఏ మనుష్యుడు దుఃఖింప కుండును? అనగా మనుష్య లందరును దుఃఖింతురు. నీవు దయాలువు గాన నీవును దుఃఖింతు వని నేను తలంతును.

శ్లో. కుముద ముదేష్యతీ మసోఢా రవి
రవిలమ్బితు కామతా మతాసీత్।
ప్రతితరు విరువన్తి కిం శకున్తాః
స్వహృది నివేశిత కోకకాకు కున్తాః ॥ 132

ప. వి. కుముదం - ఉదేష్యతీమ్- అసోఢా - రవిః - అవిలమ్బితుకామతాం - అతాసీత్ - ప్రతితరు - విరువన్తి - కిం - శకున్తాః-స్వహృది - నివేశిత కోకకామకున్తాః.

అర్థము: రవిః = సూర్యుడు, ఉదేష్యతీం - ఉదయింపనున్న - కుముదముదం, కుముద = కలువల యొక్క, ముదం = వికాసరూపమైన సంతోషమును,

అసోఢా = సహింపని వాడగుచు, అవిలమ్బితు కామతాం, అవిలమ్బితు = శీఘ్రముగా న స్తమించుటకు, కామతాం = కోరికకలిగి యుండుటను, ఆతానీత్ = కావించు కొనెను. లోకమునం దొరుల యభ్యుదయమును జూచి యోర్వజాలనివారు ఆస్థానమునుండి శీఘ్రముగా వెడలగోరెదరు గదా! తథా = అట్లే, ప్రతితరు = ప్రతివృక్షము నందును, శకున్తాః = పక్షులు, స్వహృది = తమ తమ గుండెల యందు, నివేశితకోక కాకు కున్తాః, నివేశిత = ప్రవేశ పెట్టబడిన, కోక = చక్రవాకముల యొక్క, కాకు = వియోగము వలన గలిగిన దీనాలాపము లనెడి, కున్తాః = బల్లెములు గలవై, విరువన్తి కిం? = శబ్దించు చున్నవా యేమి?

**సమాసములు :**

కుముదముదం : కుముదానాం ముత్ = కుముదముత్, తాం = కుముదముదం.

అసోఢా : సహత ఇతి = సోఢా, న సోఢా = అసోఢా.

అవిలమ్బితుకామతాం : అవిలమ్బితుం కామః యస్య సః = అవిలమ్బితుకామః, అవిలమ్బితు కామస్య భావః = అవిలమ్బితుకామతా, తాం = అవిలమ్బితుకామతాం.

ప్రతితరు : తరుం తరుం ప్రతి = ప్రతితరు.

స్వహృది : స్వస్య హృత్ = స్వహృత్, తస్మిన్ = స్వహృది.

నివేశితకోకకాకుకున్తాః : కోకానాం కాకవః = కోకకాకవః, కోకకాకవ ఏవ కున్తాః = కోకకాకుకున్తాః, నివేశితాః కోకకాకుకున్తాః యేషాం తే = నివేశితకోకకాకు కున్తాః.

**భావము :**

సాయంకాలము కాగనే కలువలు వికాసమనెడి యానందమును అనుభవింప బోవుచున్నవి. సూర్యుడు వాని యానందమును సహింప జాలక పోయెనో యనునట్లు శీఘ్రముగ నస్తమింపగోరికను ప్రదర్శించెను. లోకమునం దొరుల యానందమును సహింపలేనివాడు శీఘ్రముగా నాస్థలమును వదలి వెడలిపోవ తొందర పడుచుండుట ప్రసిద్ధమే కదా! అట్లే చెట్టు చెట్టున నివసించు పక్షులు

చక్రవాకముల వికారధ్వనులనెడి బల్లెములచే గుండెల యందు బొడువబడినవో యనునట్లు శబ్దించుచున్నవా యేమి ?

శ్లో. అపి విరహ మనిష్ట మాచరన్తా
వధిగమ పూర్వక పూర్వ సర్వచేష్టౌ।
ఇద మహహ ! నిదర్శనం విహఙ్గౌ
విధివశచేతన చేష్టితానుమానే ॥ 143

ప. వి. అపి - విరహామ్- అనిష్టమ్ - ఆచరన్తౌ - అధిగమపూర్వకపూర్వ సర్వచేష్టౌ - ఇదమ్- అహహ ! నిదర్శనం - విహఙ్గౌ - విధివశచేతన చేష్టితానుమానే.

అర్థము: (హే నాథ ! = ఓ నాథుడా !) అధిగమపూర్వకపూర్వసర్వచేష్టౌ, అధిగమ = వియోగ దుఃఖము యొక్క జ్ఞానము, పూర్వక = ఆదియందు గల్గిన, పూర్వ = ముందటి, సర్వచేష్టౌ = సమస్తదుఃఖము గలిగిన, అనిష్టం = ఇష్టముకాని, విరహం = వియోగమును, ఆచరన్తౌ = ఆచరించుచున్న, బ్రహ్మకల్పిత నియమమునను సరించి చిరకాల మాచరించు చున్నట్టి, యని యర్థము. విహఙ్గౌ = చక్రవాక పక్షులు, విధివశచే తన చేష్టితానుమానే, విధివశ = దైవాధీనమైన, చేతన = జన్తువులయొక్క, చేష్టిత = ఆచరణను గూర్చిన, అనగా ప్రాణులుచేయు పనులు దైవాధీనము లనెడి, అనుమానే = కార్యము వలన కారణ మూహింపబడుట యను విషయమునందు, ఇదమ్ = ఇదియే, నిదర్శనం = దృష్టాన్తము, అహహ ! = కష్టము. లేదా ఆశ్చర్యము. ఇది యుక్తమే. లోకమునందు ప్రాణులన్నియు దైవాధీనములుగనే హితమైనను లేదా హితము గాకపోయినను సమస్తకార్యవర్గమును కోరియో కోరకయో చేయుటకు ప్రేరేపించబడుచున్నవి. అందువలన విరహాలు తమ కహితమని తెలిసియు చక్రవాకముల జంట తాముగనే దాని నాచరించుచున్నవి గాన నవియే ఈ విషయమునకు దృష్టాన్తమని యర్థము.

**సమాసములు :**

అనిష్టం : న ఇష్టః = అనిష్టః, తం = అనిష్టం.

అధిగమపూర్వకపూర్వసర్వ చేష్టౌ : అధిగమః పూర్వం యాసాం తాః = అధిగమ పూర్వకాః, సర్వాశ్చ తాః చేష్టాశ్చ = సర్వచేష్టాః, పూర్వాశ్చ తాః సర్వచేష్టాః = పూర్వసర్వచేష్టాః, అధిగమపూర్వకాః పూర్వసర్వచేష్టాః యయోఃతౌ = అధిగమపూర్వక పూర్వసర్వచేష్టౌ.

విధివశచేతనచేష్టితానుమానే : చేతనానాం చేష్టితాని = చేతనచేష్టితాని, విధేః వశాని = విధివశాని, విధివశాని చ తాని చేతనచేష్టితాని = విధివశ చేతనచేష్టితాని. విధివశచేతన చేష్టితానాం అనుమానం = విధివశచేతన చేష్టితానుమానం, తస్మిన్ = విధివశచేతనచేష్టితానుమానే.

**భావము :**

వియోగమువలని కష్టములను తొలుత తెలుసుకొనియు తాము విరహము నకు సంబంధించిన సకల చేష్టలను నాచరించుచు, తమకు ప్రియముకాని విరహమును విధియొక్క నియమమునను సరించిచిరకాలము పాలించుచున్నవి ఈ చక్రవాకములు. ప్రాణుల కార్యములన్నియు దైవాధీనములు, వారి కిష్టమైనను ఇష్టము కాకపోయి నను పూర్వజన్మమందలి కర్మమువలననే వారికి విషయములయందలి ప్రయత్నము కలుగుచున్నది. వీరికిట్లు కలుగుచున్న ప్రవృత్తియనెడి కార్యములచే దానికి కారణ. ముతైన పూర్వజన్మకర్మలు ఊహింపబడును. కాన నీ సిద్ధాన్తవిషయమునందు నీ చక్రవాకముల జంటయే నిదర్శనము. విరహము తమ కనిష్టమని తెలిసియు నవి యా విరహమును తాముగనే యాచరించు కొనుచున్నవి. అది యనిష్టమని తెలిసి నవుడవి దానిని పరిహరించుకొనవచ్చునుగదా! కాని యవి యావిధముగా జేయలేకపోవుటకు కారణము వాని పూర్వజన్మమందలి కర్మయే యగుచున్నది ఆకర్మకు వశమై యవి యావిరహబాధ ననుభవింపవలసినవే యగుచున్నవి.

శ్లో. అఙ్ఘ్రిస్థాణిమేష్టకావినరణైః శోణే కృపాణః స్ఫుటం
కాలో౽యం విధినా రథాఙ్గమిథునం విచ్ఛేత్తు మన్విచ్ఛతా ।
రశ్మిగ్రాహి గరుత్మదగ్రజ సమారబ్ధావిరామ భ్రమౌ
దణ్డభ్రాజిని భానుశాణవలయే సంసజ్య కిం తిజ్యతే. ॥ 144

ప. వి. అఙ్ఘ్రిస్థారుణిమేష్టకావిసరణైః - శోణే - కృపాణః - స్ఫుటం - కాలః- ఆయం - విధినా-రథాఙ్గమిథునం - విచ్ఛేత్తుం - అన్విచ్ఛతా - రశ్మిగ్రాహిగరుత్మదగ్రజసమారబ్ధావిరామభ్రమౌ - దణ్డభ్రాజిని - భానుశాణవలయే - సంసజ్య - కిం - తిజ్యతే.

అర్థము: (హే ప్రియతమ! = ఓ ప్రియతమా!) రథాఙ్గమిథునం = చక్రవాకముల జంటను, విచ్ఛేత్తుం = విడదీయుటకును, విశేషముగా చీల్చుటకును, అన్విచ్ఛతా = కోరుచున్న, విధినా = బ్రహ్మచే, అయం = ఈ, కాలః = సాయంకాలస్వరూపము గలదియు నల్లనివన్నెగలదియునగు, కృపాణః = కత్తి, అఙ్ఘ్రిస్థారుణిమేష్టకావిసరణైః, అఙ్ఘ్రిస్థ = పాదములయందున్న, కిరణములయందున్న, అరుణిమ = ఎఱ్ఱదనము లనెడి, ఇష్టకా = ఇటుకల చూర్ణముయొక్క, విసరణైః = విసరడముచే, శోణే = ఎఱ్ఱనైన, రశ్మిగ్రాహి గరుత్మదగ్రజ సమారబ్ధావిరామ భ్రమౌ, రశ్మి = గుఱ్ఱపుపగ్గములను, గ్రాహి = పట్టునట్టి, గరుత్మదగ్రజ = గరుడుని యన్నయైన యరుణునిచే, సమారబ్ధ = ప్రారంభింపడిన, అవిరామ = విశ్రాంతిలేని, భ్రమౌ = భ్రమణము గలిగిన (తథా = అట్లే) దణ్డభ్రాజిని, దణ్డ = సూర్యునిపారిపార్శ్వకునిచేతను, (సానయందలి గుండ్రపు కొయ్యచేతను) భ్రాజిని = శోభించెడి, భానుశాణవలయే, భాను = సూర్యుడనెడి, శాణవలయే = సానబెట్టు చక్రమందు, సంసజ్య = ఎక్కించి, స్ఫుటం = స్పష్టముగా, తిజ్యతే కిం? = పదునుబెట్టబడుచున్నదా యేమి? సానబెట్టెడివాడు, యిటుకల పొడిని తడవతడవకు జల్లి కత్తులను పదునుపెట్టుట లోకప్రసిద్ధము.

**సమానములు :**

అఙ్ఘ్రిస్థారుణిమేష్టకావిసరణైః : అఙ్ఘ్రి తిష్ఠన్తీతి = అఙ్ఘ్రిస్థాః, అఙ్ఘ్రిస్థాశ్చ తే అరుణిమానశ్చ = అఙ్ఘ్రిస్థారుణిమానః, అఙ్ఘ్రిస్థారుణిమాన ఏవ ఇష్టకానాం విసరణాని = అఙ్ఘ్రిస్థారుణిమేష్టకావిసరణాని, తైః = అఙ్ఘ్రిస్థారుణిమేష్టకావిసరణైః.

రథాఙ్గమిథునం ; రథాఙ్గయోః మిథునం = రథాఙ్గమిథునం, తత్ = రథాఙ్గమిథునం.

రశ్మిగ్రాహిగరుత్మదగ్రజసమారబ్ధావిరామభ్రమౌ : రశ్మీన్ గృహ్ణాతీతి = రశ్మిగ్రాహీ, గరుత్మతః అగ్రజః = గరుత్మదగ్రజః, రశ్మిగ్రాహి చాసౌ గరుత్మదగ్రజశ్చ = రశ్మిగ్రాహిగరుత్మదగ్రజః, రశ్మిగ్రాహిగరుత్మదగ్రజేనసమారబ్ధా = రశ్మిగ్రాహిగరుత్మదగ్రజసమారబ్ధా, అవిద్యమానః విరామః యస్యాస్సా = అవిరామా, అవిరామా చ సా భ్రమిః = అవిరామభ్రమిః, రశ్మిగ్రాహిగరుత్మదగ్రజసమారబ్ధాఅవిరామభ్రమి, యస్యాస్సా = రశ్మిగ్రాహిగరుత్మదగ్రజసమారబ్ధావిరామభ్రమిః తస్మిన్ = రశ్మిగ్రాహిగరుత్మదగ్రజసమారబ్ధావిరామభ్రమౌ.

దణ్డభ్రాజిని : దణ్డేన భ్రాజతీతి = దణ్డభ్రాజీ, తస్మిన్ = దణ్డభ్రాజిని.

భానుశాణవలయే : శాణ ఏవ వలయః = శాణవలయః, భానురేవ శాణవలయః = భానుశాణవలయః, తస్మిన్ = భానుశాణవలయే.

**భావము :**

ఓ ప్రియతమా! చక్రవాకములజంటను వియుక్తములను గావించుటకును (తెగగొట్టుటకును) ఈసాయంకాలరూపము కలిగినదియు (నల్లనైనదియు) నగు కత్తి పాదములయందును (కిరణములయందును) నున్నట్టి యెఱుపువన్నెలనెడి యిటుకలపొడిని జల్లుటచే నెఱ్ఱనైనట్టివాడును, (వనగా పదనుపెట్టుటకై సానపైన నిటుకలపొడిని చల్లుట (పసిద్ధము) గాన సారథియై పగ్గము పట్టుచున్న యరుణుచే ప్రారంభింపబడిన, విరామము లేని సంచారము (భ్రమణము-చుట్టుట) గల్గినవాడును నాయరుణుని పారిపార్శ్వికుడుగా గల్గినవాడును (సానకు సంబంధించిన గుంత్రపుకొయ్యతోగూడినవాడును) నగు సూర్యుడనెడి శాణచక్రమునందు నెక్కించి పదును పెట్టబడుచున్నదా యేమి? సాయంకాలమను కాలఖడ్గము కిరణములనెడి పాదముల యెఱ్ఱదనమను నిటుకలపొడిని చల్లి సూర్యుడనెడి సానయందు బదను బెట్టబడుచున్నదా యేమియని సారాంశము.

శ్లో॥ ఇతి స విధుముఖీ ముఖేన ముగ్ధా
లపితసుధాసవమర్పితం నిపీయ
స్మితశబలవలన్ముఖోఽవదత్తాం
స్ఫుట మిద మీదృశ మీదృశం యథాత్థ॥ 146

ప. వి. ఇతి - సః - విధుముఖీముఖేన - ముగ్ధాలపిత సుధాసవం - అర్పితం - నిపీయ - స్మితశబలవలన్ముఖః. - అవదత్ - తాం - స్ఫుటం - ఇదం - ఈదృశం-ఈదృశం — యథా - ఆత్థ.

అర్థము; సః — ఆ నలుడు, ఇతి — ఇవ్విధముగా, విధుముఖీముఖేన, విధుముఖీ — చంద్రముఖియగుదమయన్తి యొక్క. ముఖేన — ముఖముచే, అర్పితం — సమర్పించబడిన, ముగ్ధాలపితసుధాసవం, ముగ్ధ — మనోహరములగు, ఆలపిత — మాటలనెడి, సుధా — అమృతమువలె రుచి గలిగిన, ఆసవం — మద్యమును, నిపీయ — చక్కగావిని, స్మితశబలవలన్ముఖః, స్మిత — చిరునగవుతో, శబల — చిత్రవర్ణముగలిగిన, వలత్ — ఉత్తరము చెప్పుటకై కదిలెడి, ముఖః — మోముగలవాడై, తాం — ఆ దమయన్తి నిగూర్చి, అవదత్ — పలికెను. ఏమనగా, (హే ప్రియే! — ఓ ప్రియురాలా) యథా — ఎట్లు, ఆత్థ — చెప్పుచున్నావో. ఈదృశం — ఇటువంటి. ఇదం — ఈమాట, ఈదృశం — ఇటువంటిదే, స్ఫుటం — స్పష్టము.

**సమాసములు :**

విధుముఖీముఖేన ; విధోః ముఖమివ ముఖం యస్యాః సా — విధుముఖీ, విధుముఖ్యాః ముఖం — విధుముఖీముఖం, తేన — విధుముఖీముఖేన.
ముగ్ధాలపిత సుధాసవం : ముగ్ధాని చ తాని ఆలపితాని చ — ముగ్ధాలపితాని, ముగ్ధాలపితాన్యేవ సుధా — ముగ్ధాలపితసుధా, ముగ్ధాలపితసుధైవ ఆసవః — ముగ్ధాలపిత సుధాసవః, తం — ముగ్ధాలపిత సుధాసవం.
స్మితశబలవలన్ముఖః : స్మితేన శబలం — స్మితశబలం, స్మితశబలం చ తత్ వలచ్చ — స్మితశబలవలత్, స్మితశబలవలత్ ముఖం యస్య సః — స్మితశబల వలన్ముఖః.

**భావము :**

ఆ నలమహారాజు చన్ద్రవదనయగు దమయన్తి చెప్పిన రమ్యమైనయమృతమువంటిమాటలనెడి మద్యమును పానము గావించి, చిరునగవుచే రంజితమైన మోము గలవాడై ఇట్లు మాట్లాడెను. కాముకులు కామినులు తమనోటినుండి యొసంగిన

మద్యమును శ్రద్ధతో పానముచేసి, ముఖమును తిప్పినవారై, నవ్వుచు కొంచెముగా నెట్లు మాట్లాడెదరో ఆవిధముగా నితడు మాట్లాడెనని యర్థము. అదేమనగా ఓ ప్రియురాలా! ఏవిధముగా నీవు చెప్పితివో యది యావిధముగనే యున్నది. ఇదిస్పష్టము. అని యామె వచనము నామోదించెను.

శ్లో. స్త్రీపుంసౌ ప్రవిభజ్య జేతు మఖిలా వాలోచితౌచిత్యయోః
నమ్రాం వేద్మి రతిప్రసూన శరయో శ్చాపద్వయీం త్వద్భ్రువౌ।
త్వన్నాసాచ్ఛలనిహ్నుతాం ద్వినలికీం నాలీకముక్త్యైషిణోః
త్వన్నిశ్వాసలతే మధుశ్వస నజం వాయవ్యమస్త్రం తయోః॥

ప. వి. స్త్రీపుంసౌ - ప్రవిభజ్య - జేతుం - అఖిలౌ - ఆలోచితౌచిత్యయోః - నమ్రాం - వేద్మి - రతిప్రసూనశరయోః - చాపద్వయీం-త్వద్భ్రువౌ-త్వన్నాసాచ్ఛలనిహ్నుతాం - ద్వినలికీం - నాలీకముక్త్యైషిణోః - త్వన్నిశ్వాసలతే - మధుశ్వసనజం - వాయవ్యం - అస్త్రం - తయోః.

అర్థము: (హేప్రియే = ఓ ప్రియురాలా!) త్వద్భ్రువౌ = నీవంకర తిరిగిన కనుబొమ్మలు రెండును, అఖిలౌ = సమస్తమునైన, స్త్రీపుంసౌ = స్త్రీజాతిని పురుషజాతిని, ప్రవిభజ్య = చక్కగా విభజించి, అనగా రతియొక్క యంశమునకు స్త్రీలనియు, మన్మథుని యంశమునకు పురుషులనియు, విభజించి యని యర్థము. జేతుం = (అస్త్రీపురుషులను) స్వాధీనులను గావించు కొనుటకు, ఆలోచితౌచిత్యయోః, ఆలోచిత = ఆలోచింపబడిన, ఔచిత్యయోః = యుక్తి యుక్తత్వము గలిగిన, రతిప్రసూనశరయోః, రతి = రతీదేవికిని, ప్రసూన శరయోః = పుష్పబాణుడగు మన్మథునకును, నమ్రాం = గురిపెట్టి లాగుటచే వంకరయైన, చాపద్వయీం = విండ్లజంటనుగా, వేద్మి = తెలిసికొను చున్నాను. నాలీకముక్త్యైషిణోః, నాలీక = తుపాకులను లేదా = తుపాకి గుండ్లను, ముక్తి = విడుచుటను, ఏషిణోః = కోరుచున్న, తయోః = ఆ రతీమన్మథులకు, త్వన్నాసాచ్ఛల నిహ్నుతాం, త్వత్ = నీయొక్క, నాసా = ముక్కుల జంటయొక్క, ఛల = నెపముతో, నిహ్నుతాం = కప్పిపుచ్చబడిన

దానిని, ద్వినలికీం = రెండు గుండ్లను వదిలెడి తుపాకిగా, వేద్మి = తెలుసుకొందును, తథా = అట్లే, త్వన్నిశ్శ్వాసలతే, త్వత్ = నీయొక్క, నిశ్శ్వాస = నిట్టూర్పులజంట యనెడి, లతే = తీగెలు, అనగా నిట్టూర్పుల ప్రవాహము యొక్క జంట, తయోః = ఆ రతీమన్మథులకు, మధుశ్వసనజం, మధు = వసంతకాలమందలి, శ్వసన = గాలివలన అనగా మలయ మారుతము వలన, జం = కలిగిన, వాయవ్యం = వాయుదేవతాకమగు, అస్త్రం = ఆయుధముగా, వేద్మి = తెలుసుకొనుచున్నాను. కామము నుద్దీపింప చేయుటలో నీవు చాలా సమర్థురాలవని యర్థము.

సమాసములు :

స్త్రీపుంసౌ : స్త్రీ చ పుమాంశ్చ = స్త్రీ పుంసౌ.
ఆలోచితౌచిత్యయోః : ఉచితస్య భావః = ఔచిత్యం, ఆలోచితం ఔచిత్యం యయో స్తౌ = ఆలోచితౌచిత్యౌ, తయోః = ఆలోచితౌచిత్యయోః.
రతిప్రసూనశరయోః : ప్రసూనం శరః యస్య సః = ప్రసూనశరః, రతిశ్చ ప్రసూనశరశ్చ = రతిప్రసూనశరౌ, తయోః = రతిప్రసూనశరయోః.

చాపద్వయీం : చాపయోః ద్వయీ = చాపద్వయీ, తాం = చాపద్వయీమ్.
త్వద్భ్రువౌ : తవ భ్రువౌ = త్వద్భ్రువౌ, తౌ = త్వద్భ్రువౌ.
త్వన్నాసాచ్ఛలనిహ్నుతాం : తవ నాసా = త్వన్నాసా, త్వన్నాసయోః ఛలం = త్వన్నాసాచ్ఛలం, త్వన్నాసాచ్ఛలేన నిహ్నుతా = త్వన్నాసాచ్ఛలనిహ్నుతా, తాం = త్వన్నాసాచ్ఛలనిహ్నుతాం.
ద్వినలికీం : ద్వయోః నలకయోః సమాహారః = ద్వినలికీ, తాం = ద్వినలికీం.
నాలీకముక్త్యేషిణోః : నాలీకస్య ముక్తిః = నాలీకముక్తిః, నాలీకముక్తేః ఈషిణే = నాలీకముక్త్యేషిణే, తయోః = నాలీకముక్త్యేషిణోః.
త్వన్నిశ్శ్వాసలతే : తవ నిశ్శ్వాసౌ = త్వన్నిశ్శ్వాసౌ, త్వన్నిశ్శ్వాసావేవ లతే = త్వన్నిశ్శ్వాలతే, తే = త్వన్నిశ్శ్వాసలతే.

మధుశ్వసనజం : మధోః శ్వసనః = మధుశ్వసనః, మధుశ్వసనాత్ జాయత ఇతి = మధుశ్వసనజః, తత్ = మధుశ్వసనజమ్.

వాయవ్యమ్ : వాయుః దేవతా అస్య ఇతి = వాయవ్యం, తత్ = వాయవ్యమ్.

**భావము :**

ఓ ప్రియురాలా! లోకమునందు సకలురగు స్త్రీలను సకలురగు పురుషులను రతియొక్క యంశమందు స్త్రీలను, మన్మథాంశమందు పురుషులను విభజించి స్వాధీనపరుచుకొనుటకు యుక్తి నాలోచించి గురిపెట్టి వంకరగా జేయబడిన విల్లులుగా నీరెండు కనుబొమ్మలను గ్రహించుచున్నాను. తుపాకిగుండ్లను విడువ గోరిన యీరతీమన్మథుం కిఋవురికిని నీరెండు ముక్కులను రెండు గుండ్లు పారెడు తుపాకిగా భావింతును. ఆ విధముగనే నీయొక్క రెండు నిట్టూర్పులనెడు తీగెలు అనగా నిట్టూర్పుల ప్రవాహములు ఆ రతీమన్మథులకు వసంతకాలపు మలయమారుతమువలన గల్గిన వాయవ్యాస్త్రములుగను భావింతును. కామోద్దీపన మునందు నీవు మిక్కిలి నిపుణురాలవని యాశయము.

శ్లో. పీతో వర్ణగుణ స్తవాతిమధురః కాయోఽపి సోయం యథా
యం బిభ్రత్ కనకం సువర్ణమితి కైరాదృత్య నోత్కీర్త్యతే
కా వర్ణాన్తర వర్ణనా ధవలిమా రాజైవ రూపేషు యః
తద్యోగాదపి యావదేతి రజతం దుర్వర్ణతా దుర్యశః ॥ 147

ప. వి. పీతః - వర్ణగుణః - తవ - అతిమధురః - కాయః - అపి - సః - అయం - యథా - యం - బిభ్రత్ - కనకం - సువర్ణం - ఇతి - కైః - ఆదృత్య - న - ఉత్కీర్త్యతే - కా - వర్ణాన్తరవర్ణనా - ధవలిమా - రాజా - ఏవ - రూపేషు - యః - తద్యోగాత్ - అపి - యావత్ - ఏతి - రజతం - దుర్వర్ణతాదుర్యశః.

అర్థము: (హే ప్రియే! = ఓ ప్రియురాలా!) సః = ప్రసిద్ధుడైన, అయం = ఈ, పీతః = పసుపుపచ్చని, వర్ణ = రంగుయొక్క, గుణః = స్వభావము, అతిమధురః = మిక్కిలిరమణీయము, యథా = ఎట్లనగా, యం = ఏ పసుపువన్నెను, బిభ్రత్ = ధరించిన, కనకం = బంగారు, కైః = ఎవ్వరిచే,

సువర్ణమితి = శోభనమగు వర్ణముగలదియని. ఆదృత్య = ఆదరించి, పట్టువదలచే, సోత్కీర్త్యతే = గట్టిగా మెచ్చబడడు అనగా యందరి చేతను మెచ్చబడునని యర్థము. (తథా = అట్లే) తవ = నీయొక్క, కాయేఽపి = దేహమందును, (అస్తి = ఉన్నది)కావుననే మిక్కిలి రమణీ యమని భావింతును. వర్ణాన్తర = పీత శుక్లవర్ణములకంటె భిన్నములైన. నీలాదివర్ణములయొక్క, వర్ణనా = ప్రశంస, కా? = ఎట్టిది? అనగా దూరమునందు ఉంచదగినదని యర్థము. యః = ఏ, ధవలిమా = తెలుపు వన్నె, రూపేషు = రంగులయందు, రాజైవ = రాజుగనే, యనగా శ్రేష్ఠ మైనదిగనే యేర్పడినదై, యనగా మరియొక వర్ణముతో గలయిక లేనందు వలనను వర్ణములలో తొలుత జెప్పబడినందువలనను శ్రేష్ఠముగా నేర్పడినదై, తద్యోగాదపి, తత్ = తెల్లదనముయొక్క, యోగాదపి = సంబంధమువలనను, రజతం = వెండి, యావత్ = పూర్తిగా, దుర్వర్ణతా దుర్యశః. దుర్వర్ణతా = దోషయుక్తమైన రంగును గలిగియుండుటవలన, దుర్యశః = అపకీర్తిని (దుర్వర్ణమను పేరుగలని యపకీర్తిని) ఏతి = పొందుచున్నది.

## సమాసములు :

వర్ణగుణః : వర్ణస్య గుణః = వర్ణగుణః.

అతిమధురః : అత్యన్తం మధురః = అతిమధురః.

సువర్ణమ్ : శోభనః వర్ణః యస్య తత్ = సువర్ణం.

వర్ణాన్తరవర్ణనా : అన్యే వర్ణాః = వర్ణాన్తరాణి, వర్ణాన్తరాణాం వర్ణనా = వర్ణాన్తరవర్ణనా.

తద్యోగాత్ : తస్య యోగః = తద్యోగః, తస్మాత్ = తద్యోగాత్.

దుర్వర్ణతాదుర్యశః : దుష్టః వర్ణః యస్య తత్ = దుర్వర్ణమ్, దుర్వర్ణస్య భావః = దుర్వర్ణతా, దుర్వర్ణతాయాః దుర్యశః = దుర్వర్ణతా దుర్యశః, తత్ = దుర్వర్ణతా దుర్యశః.

26)

**భావము :**

ఓ ప్రియురాలా! ఆ ప్రసిద్ధమగు పసుపువన్నె చాల మనోహరమైనది. ఆ పసుపువన్నెను ధరించినందు వలననే బంగారు జనులందరిచేతను సువర్ణమని పొగడబడుచున్నది. ఆవన్నె నీ దేహమందున్నది. గాన నీదేహము సైతము మిక్కిలి మధురమైనది. పసుపువన్నెను తెలుపువన్నెను వదలి తక్కిన నలుపు మున్నగు వన్నెలను వర్ణింప నవసరములేదు. తెలుపువన్నె వన్నెలయందంతట శ్రేష్ఠమైనది. ఇది యే వన్నెతోడను మిశ్రణమును బొందదు. మరియు వర్ణములలో దొలుత పేర్కొనబడియున్నది అట్టి తెలుపువన్నెను వహించియు వెండి దుర్వర్ణమను నపఖ్యాతిని ననగా హీనమైన వన్నెగలదని యపయశమును బొందినది. అందువలన తెలుపువన్నెయు హీనమైనది. ఒక్క పసుపువన్నెయే శ్రేష్ఠమైనది. ఏలయనగా నది బంగారునందున్నదై దానికి సువర్ణమను పేరు నేర్పరచినది. ఆ పసుపువన్నెయే నీదేహమునందుండుటవలన, నీదేహముగూడ సువర్ణమువంటిదై మిక్కిలిమధురమైయున్నదని యాశయము. ఆ తెలుపువన్నె రంగులలో శ్రేష్ఠమైనను దానిని గలిగియుండుటవలన వెండి దుర్వర్ణమను నపకీర్తిని బొందుట వలన నావర్ణము పసుపువన్నెకంటెను హీనమని సారాంశము.

శ్లో. ఖణ్డక్షోద మృదిస్థలే మధుపయః కాదంబినీ తర్పణాత్
కృష్టే రోహతి దోహదేన పయసా పిణ్డేన చేత్ పుణ్డ్రికః ।
స ద్రాక్షాద్రవసేచనై ర్యది ఫలం ధత్తే తదా త్వద్గిరా
ముద్దేశాయ తతో౽ప్యుదేతి మధురాధార స్తమప్రత్యయః ॥148

ప. వి. ఖణ్డక్షోదమృది - స్థలే - మధుపయః కాదమ్బినీ తర్పణాత్ - కృష్టే- రోహతి - దోహదేన - పయసా - పిణ్డేన - చేత్ - పుణ్డ్రకః - సః - ద్రాక్షాసవసేచనైః-యది - ఫలం - ధత్తే - తదా-త్వద్గిరాం-ఉద్దేశాయ - తతః - అపి - ఉదేతి - మధురాధారః - తమప్రత్యయః.

అర్థము: మధుపయః కాదమ్బినీతర్పణాత్, మధు = తేనెలనెడి, పయః = ఉదకములుగల, కాదమ్బినీ = మేఘపఙ్క్తియొక్క, తర్పణాత్ = ఆప్యాయనముగా నుదకమును వర్షించిన పిదప, కృష్టే = మరల నాగలిచే దున్నగా,

(ముందు దున్నినను వర్షము వచ్చిన పిదప మరల దున్నుట ప్రసిద్ధము) ఖణ్డక్షోదమృది, ఖణ్డ = మట్టిపెళ్ళలయొక్క, క్షోద = చూర్ణమనెడి, మృది = మట్టిగలిగిన, స్థలే = పొలమునందు, పిండేన = పాకవిశేషముచే, ముద్దయై గట్టిపడిన, పయసా = పాలనెడి, దోహదేన = అకాలమున చెట్లు వగైరాలను గాయునట్లు చేసెడి సంస్కారముచే, పుణ్డ్రకః = చెఱుకు, రోహతి యది = మొలచినచో, తదా = అప్పుడు, తతోఽపి = ఆచెఱుకు పండుకంటెను, త్వద్గిరాం = నీమాటలకు, ఉద్దేశాయ = అతిశయమును, జూపుటకై, మధురాధారః, మధుర = మధురమను శబ్దమును, ఆధారః = ప్రకృతిగా గలిగిన, తమప్ప్రత్యయః = అతిశయార్థమగు తమప్ప్రత్యయము, ఉదేతి = ఏర్పడుచున్నది, ఊహింపబడెడి యట్టి చెఱకు పండు కంటెను నీవాక్కు మధురతమము. అనగా మిక్కిలి తియ్యనైనదని యర్థము.

**సమాసములు :**

ఖణ్డక్షోదమృది : ఖణ్డస్య క్షోదః = ఖణ్డక్షోదః, ఖణ్డక్షోద ఏవ మృత్ యస్మిన్ తత్ = ఖణ్డక్షోదమృత్, తస్మిన్ = ఖణ్డమృది.

మధుపయః కాదమ్బినీ తర్పణాత్ : మధూన్యేవ పయాంసి యస్యాస్సా = మధుపయసీ, మధుపయస్యేవ కాదమ్బినీ = మధుపయః కాదమ్బినీ, మధుపయః కాదమ్బిన్యాః తర్పణం = మధుపయః కాదమ్బినీ తర్పణం, తస్మాత్ = మధుపయఃకాదమ్బినీతర్పణాత్.

ద్రాక్షాద్రవసేచనైః : ద్రాక్షాయాః ద్రవాః = ద్రాక్షాద్రవాః, ద్రాక్షాద్రవైః సేచనాని = ద్రాక్షాద్రవసేచనాని, తైః = ద్రాక్షాద్రవసేచనైః.

త్వద్గిరామ్ : తవ గిరః = త్వద్గిరః, తాసాం = త్వద్గిరాం.

మధురాధారః : మధురః (ఇతి శబ్దః) ఆధారః యస్య సః = మధురాఽధారః.

తమప్ప్రత్యయః : తమప్ ఇతి ప్రత్యయః = తమప్ప్రత్యయః.

**భావము :**

తేనె యనెడి యుదకములతో గూడిన మేఘపఙ్క్తి వర్షించిన పిదప నాగ లిచే మరల దున్ని యందలి మట్టిగడ్డలను బొడి గావించి, యాపొలమందు కాచుటచే ముద్దయై గట్టిపడిన పాలనెడి సత్తు నొసగెడిదియు సకాలమునందు వృక్షములను గాచునట్లు చేసెడిదియు నగు దోహద ద్రవ్యముచే చెఱుకును మొలపించి దానిని ద్రాక్షారసముతో బడిపినచో నేర్పడిన దానిపండు కంటెను నీమాటల యాధిక్యమును జెప్పుటకు మధురతమశబ్దము తగినదిగా సంభవించును. పై విధముగా నూహింపబడిన చెఱకుపండు కంటెను నీవాక్కు మిక్కిలి తియ్యనైనదని యాశయము.

శ్లో. **ఉన్మీలద్గుడపాకతన్తులతయా రజ్జ్వా భ్రమీ రర్జయన్**
**దానాన్తశ్రుతశర్కరాచల మథ స్స్వేనామృతాన్ధా స్స్మరః ।**
**నవ్యా మిక్షురసోదధే ర్యది సుధా ముత్థాపయేత్ సా భవ**
**జ్జిహ్వాయాః కృతి మాహ్వయేత పరమాం మత్కర్ణయోః పారణామ్॥ 149**

ప. వి. ఉన్మీలద్గుడపాకతన్తులతయా - రజ్జ్వా - భ్రమీః - అర్జయన్ - దానాన్తశ్రుతశర్కరాచలమథః - స్వేన - అమృతాన్ధాః - స్మరః - నవ్యాం - ఇక్షురసోదధేః - యది - సుధాం - ఉత్థాపయేత్ - సా - భవజ్జిహ్వాయాః - కృతిం - ఆహ్వయేత - పరమాం - మత్కర్ణయోః - పారణామ్.

అర్థము: హే ప్రియతమే! = ఓ మిక్కిలి ప్రియమైనదానా! అమృతాన్ధాః, అమృత = అమృతమే, అన్ధాః = అన్నముగా గలిగిన, స్మరః = మన్మథుడు, స్వేన = స్వయముగనే, (అనగా నితరసాహాయ్యములేక, అట్లగుచో సంతోషహేతువుగాదని యర్థము) ఉన్మీలద్గుడపాకతన్తులతయా, ఉన్మీలత్ = ప్రకటమగుచు నేర్పడుచున్న, గుడ = చెరుకురస వికారముయొక్క, పాక = నిప్పుపై బెట్టి యుడికించుటవలన, నేర్పడిన, తన్తులతయా = దారములుగలిగియుండుట యనెడి, రజ్జ్వా = పగ్గముచే, ననగా చెరుకురసమును వండుటవలన నేర్పడిన దారములనెడి పగ్గములచే, దీనీన్తశ్రుతశర్కరాచలమథః, దాన = తులాపురుషాదిదానములయొక్క,

అంతః = మధ్యే, శ్రుత = శాస్త్రములయందు వినబడిన, శర్కరాచల = చక్కెరకొండ యనెడి, మథః = కవ్వముయొక్క, భ్రమీః = చుట్లను, అర్జయన్ = లాగుటచే గలిగించుచు, ఇక్షురసోదధేః, ఇక్షురస = చెరుకు రసపు, ఉదధేః = కడలినుండి, నవ్యాం = (దేవాసురులు సంపాదించిన యమృతముకంటెను) క్రొత్తదైన, సుధాం = అమృతమును, యది ఉత్తాపయేత్ = పైకితెచ్చినచో, తదా = అప్పుడు, సా = ఆయమృతము, మత్కర్ణయోః = నా చెవులకు, పరమాం = శ్రేష్ఠమైన, పారణాం = తృప్తి హేతువైన, భవజ్జిహ్వాయాః = నీ నాలుకయొక్క, కృతిం = కార్యమైన వాక్కును, ఆహ్వయేత = పోటిగా పిలుచును గాత.

**సమాసములు :**

ఉన్మీలద్గుడపాకతన్తులతయా : గుడస్య పాకః = గుడపాకః, తన్తూన్ లాతీతి = తన్తులం, తన్తులస్య భావః = తన్తులతా, గుడపాకస్యతన్తులతా = గుడపాకతన్తులతా. ఉన్మీలన్తి చ సా గుడపాకతన్తులతా చ = ఉన్మీలద్గుడ పాకతన్తులతా, తయా = ఉన్మీలద్గుడపాకతన్తులతయా.

దానాన్తః శ్రుతశర్కరాచలమథః: దానానాం అన్తః = దానాన్తః, దానాన్తః శ్రుతః = దానాన్తః శ్రుతః, శర్కరాణాం అచలః = శర్కరాచలః, దానాన్తః శ్రుతశ్చాసౌ శర్కరాచలశ్చ = దానాన్తః శ్రుతశర్కరాచలః, దానాన్తః శ్రుతశర్కరాచల ఏవ మన్థాః = దానాన్తః శ్రుతశర్కరాచల మన్థాః, తస్మాత్ = దానాన్తః శ్రుతశర్కరాచలమథః.

అమృతాన్ధాః : అమృత మన్ధః యస్య సః = అమృతాన్ధాః.

ఇక్షురసోదధేః : ఇక్షోః రసః = ఇక్షురసః, ఇక్షురసస్య ఉదధిః = ఇక్షుర సోదధిః, తస్మాత్ = ఇక్షురసోదధేః.

భవజ్జిహ్వాయాః : భవత్యాః జిహ్వా = భవజ్జిహ్వా. తస్యాః = భవజ్జిహ్వా యాః.

మత్కర్ణయోః : మమ కర్ణౌ = మత్కర్ణౌ, తయోః = మత్కర్ణయోః.

**భావము :**

ఓ ప్రేయసీ! అమృతమునే యాహారముగా గల్గిన మన్మథుడు స్వయముగా చెఱకుపాలనుండి యుద్భవించిన బెల్లమును వండుటచే నేర్పడిన దాని దారములనెడి కవ్వపుత్రాడుచే, మహాదానములమధ్య ప్రసిద్ధినొందినదై దానము జేయుటకై కొంతంతరాశిగా జేయబడిన చక్కెరయను కవ్వముయొక్క చుట్లను, అనగా చుట్టుచుట్టు తిరగడములను చేయుచు ననగా నాచక్కెరకొండయను కవ్వముచే చిలకడమును చేయుచు, దేవాసురులు చిలికితెచ్చిన యమృతమునకంటెను, భిన్నమైన నూతనమగు నమృతము తెచ్చినచో నపుడాయమృతము నాచెవులకింపైన నీనాలుకనుండి వెల్వొడువాణిని బోటికి బిలువగలదు. అమృతమును త్రావిన మన్మథుడు చిలుకువాడు, బెల్లపుపాకరసమునుండి వెల్వడిన దారముతో నేర్పడినవే కవ్వపుదారములు; శాస్త్రములయందు మహాదానములలో నొక్కటిగా ప్రసిద్ధి బొందిన చక్కెరకొండయే కవ్వము. వీనిచే నేర్పడిన అమృతము అనగా నూతనమగు నమృతము నాచెవులకు హాయినిగూర్చు నీపలుకులను కయ్యమునకు బిలుచును. మధురద్రవ్యములచే నేర్పరచబడిన వస్తువు మిక్కిలి మధురముగా నుండును. కాన నీ విధముగా మధురద్రవ్యములనెడు సాధనములచే గల్పింపబడిన యమృతము నీమాటలతో పోలికను వహించును కాని మరి యింకొకటేదియు నీమాటలతో బోలికను వహింపదని యాశయము.

శ్లో. ఆస్యే యా తవ భారతీ వసతి తల్లీలారవిన్దోల్లస
ద్వాసే తత్కలవైణనిక్వణ మిలద్వాణీ విలాసామృతే।
తత్కేలి భ్రమణార్హ గైరికసుధా నిర్మాణ హర్మ్యాధరే
తన్ముక్తామణిహార ఏవ కిమయం దన్తస్రజా రాజతః॥ 150

ప. వి. ఆస్యే - యా - తవ - భారతీ - వసతి - తల్లీలారవిన్దోలసద్వాసే - తత్కలవైణనిక్వణమిలద్వాణీవిలాసామృతే - తత్కేలిభ్రమణార్హ గైరిక సుధానిర్మాణ హర్మ్యాధరే - తన్ముక్తామణిహారః - ఏవ - కిమ్- అయం - దన్తస్రజా - రాజతః.

అర్థము; హేప్రియే! = ఓప్రియురాలా!, తల్లీలారవిన్దోలసద్వాసే, తత్ = ఆ భారతియొక్క, లీలారవిన్ద = చేతియందున్న కేలిపద్మముయొక్క, ఉల్ల

సత్ = ప్రసరించెడి, వాసే = పరిమళముగల్గిన, ఆమె పద్మినీజాతికి చెందినదగుటవలన పద్మగంధము గల్గిన యని యర్థము. (తథా = అట్లే) తత్కలవైణనిక్వణమిలద్వాణీవిలాసామృతే, తత్ = ఆభారతియొక్క, కల = మధురమును నస్ఫుటమునైన, వైణ = వీణకు సంబంధించిన, నిక్వణ = నాదరూపముగా, మిలత్ = సంబంధించిన, వాణీ = సరస్వతి యొక్క, విలాస = వక్రోక్తి మున్నగు పలువిధములైన వాగ్వైచిత్ర్య మనెడి, అమృతే = అమృతముగలిగిన. తత్కేలి భ్రమణార్హగైరికసుధా నిర్మాణహర్మ్యాధరే, తత్ = ఆభారతియొక్క, కేళిభ్రమణ = విలాస గమనమునకు, అర్హ = తగిన, గైరిక = ఎఱ్ఱనిధాతువుచే రంజింపబడిన, సుధా = తెల్లదనమునకు సాధనమగు ద్రవ్యముచే, నిర్మాణ = చిత్రాది రచన గలిగిన, హర్మ్య = మేడ యనెడి, అధరే = పెదవిగలిగిన, తవ = నీయొక్క, ఆస్యే = ముఖమునందు, యా = ఏభారతి, వసతి = ఉన్నదో, దన్తస్రజౌ = నీనోట రెండుదంతపు పఙ్క్తులు, రాజతః = శోభించుచున్నవో, అయం = ఈ, తన్ముక్తామణిహారః, తత్ = ఆభారతి యొక్క, ముక్తామణిహార ఏవ = ముత్తెములహారమే. కిం = ఏమి? ఆగునా యేమి? యని యర్థము.

సమాసములు ;

తల్లీలారవిన్దోల్లసద్వాసే : లీలాయాః అరవిన్దం = లీలారవిన్దం, తస్యాః లీలారవిన్దం = తల్లీలారవిన్దం, తల్లీలారవిన్దే ఉల్లసన్ వాసః యస్మిన్ సః = తల్లీలారవిందోల్లసద్వాసః, తస్మిన్ = తల్లీలారవిందోల్లసద్వాసే. తత్కలవైణ నిక్వణ మిలద్వాణీవిలాసామృతే: వీణాయాః అయం = వైణః, వైణశ్చాసౌ నిక్వణశ్చ = వైణనిక్వణః, కలశ్చాసౌ వైణనిక్వణశ్చ = కలవైణనిక్వణః, తస్యాః కలవైణనిక్వణః = తత్కలవైణ నిక్వణః, వాణ్యాః విలాసః = వాణీవిలాసః. వాణీవిలాస ఏవ అమృతం = వాణీవిలాసామృతం, తత్కలవైణ నిక్వణ ఏవ మిలద్వాణీవిలాసామృతం యస్మిన్ సః = తత్కలవైణ నిక్వణమిలద్వాణీవిలాసామృతః, తస్మిన్ = తత్కలవైణ నిక్వణమిలద్వాణీ విలాసామృతే.

తత్కేలి భ్రమణార్హగైరికసుధానిర్మాణహర్మ్యాధరే : కేల్యాః భ్రమణం = కేలిభ్రమణం, తస్యాః కేలిభ్రమణం = తత్కేలిభ్రమణం, తత్కేలిభ్రమణస్య అర్హం = తత్కేలిభ్రమణార్హం, గైరికేణ రఞ్జితా సుధా = గైరికసుధా, గైరికసుధయా నిర్మాణం యస్మిన్ తత్ = గైరికసుధానిర్మాణం. గైరికసుధానిర్మాణం చ తత్ హర్మ్యం చ = గైరికసుధానిర్మాణహర్మ్యం, తత్కేలిభ్రమణార్హం చ తత్ గైరికసుధానిర్మాణహర్మ్యం చ = తత్కేలిభ్రమణార్హగైరికసుధానిర్మాణహర్మ్యం, తత్కేలిభ్రమణార్హగైరికసుధానిర్మాణహర్మ్యమేవ అధరః = తత్కేలిభ్రమణార్హగైరిక సుధానిర్మాణహర్మ్యాధరః, తస్మిన్ = తత్కేలిభ్రమణార్హగైరిక సుధానిర్మాణహర్మ్యాధరే.

తన్ముక్తామణిహారః : ముక్తామణీనాం హారః = ముక్తామణిహారః, తస్యాః ముక్తామణిహారః = తన్ముక్తామణిహారః
దన్తస్రజౌ : దన్తానాం స్రజౌ = దన్తస్రజౌ.

భావము :

ఓ ప్రియురాలా! భారతియొక్క హస్తమందలి విలాసపద్మమునుండి వెల్వడు గంధమువంటి గంధము గలవియు, నట్లే భారతియొక్క, యవ్యక్త మధురమగు వీణానాదముతో గూడిన వక్రోక్తిమున్నగు వివిధవాగ్వైచిత్ర్యము లనెడి యమృతముల కిరవును, గైరికమను నెఱ్ఱని ధాతువుచే రంజింపబడిన సుధ యను సున్నమువంటి తెల్లనిపదార్థముచే రంజింపబడిన చిత్తరువులతో శోభించు భవనమనెడి యధరముగలిగిన నీముఖమునందు భారతి వసించుచున్నది. నీనోట శోభించు దన్తమాలికలు రెండును నాభారతికి ముక్తామణులతో గట్టబడిన హారములు గాదా యేమి? తప్పక ముక్తామణిహారమే కాదగును. అనగా నాదన్తముల వరుస ముక్తామణిహారమువలె ప్రకాశించుచున్నదని యర్థము. సరస్వతీ వీణానాదముతో సమానముగా నీవాణియున్నదని యర్థము. ఇచ్చట వాణీవర్ణనము ప్రకృతము. దమయన్తి పెదవులయందలి పద్మగంధములతో నామెముఖమునందు భారతీనివాసము ఊహింపబడుచున్నది.

శ్లో. వాణీమన్మథ తీర్థముజ్జ్వల రసస్రోతస్వతీ కాపి తే
ఖణ్డః ఖణ్డ ఇతీదమీయపులినస్యాలప్యతే వాలుకా
ఏతత్తీరమృదైవ కిం విరచితాః పూతాసితా శ్చక్రికాః ?
కిం పీయూష మిద మ్పయాంసి? కిమిదం తీరే తవై వాధరౌ॥ 151

వ. వి. వాణీ - మన్మథతీర్థం - ఉజ్జ్వలరసస్రోతస్వతీ - కా - అపి - తే - ఖణ్డః - ఖణ్డః - ఇతి - ఇదమీయపులినస్య - ఆలప్యతే - వాలుకా - ఏతత్తీరమృదా - ఏవ - కిం - విరచితాః - పూతాః - సితాః - చక్రికాః - కిం - పీయూషం - ఇదమ్పయాంసి - కిం - ఇదం తీరే - తవ - ఏవ - అధరౌ.

అర్థము: హే ప్రియే = ఓ ప్రియురాలా !. తే = నీయొక్క, వాణీ = వాక్కు, కాఽపి = వర్ణింప శక్యము కానందువలన లోకోత్తరమైనది. (మఱియు) ఉజ్జ్వల రసస్రోతస్వతీ, ఉజ్జ్వలరస = శృంగారరసమునకు సంబంధించిన, స్రోతస్వతీ = నదియు నగుచున్నది. మఱియు (నిర్మలోదకములు గల్గినదియు నగుచున్నది) (కావుననే) మన్మథతీర్థం, మన్మథ = కామమునకు, తీర్థం = కారణము, అనగా కామోద్దీపనము చేయునది. మఱియు, మన్మథ = మన్మథుడు దిగుటకు, తీర్థం = మెట్లపరుస, తథా = అట్లే, ఖణ్డః ఖణ్డః = చెఱకురసము నుండి యుత్పన్నమైన ఖణ్డశర్కర, ఇదమీయ పులినస్య, నదికి సంబంధించిన ఇసుకదిబ్బ యొక్క, వాలుకా = ఇసుక, ఇతి = అని, ఆలప్యతే = చెప్పబడుచున్నది, తథా = అట్లే, పూతాః = పవిత్రములైన, సితాః = తెల్లనైన, చక్రికాః = చక్కెరతో చేయబడిన చక్రములు, ఏతత్తీరమృదైవ, ఏతత్ = ఈ నదియొక్క, తీర మృదైవ = గట్టుసందలి మట్టిచేతనే, విరచితాః కిం? = చేయబడినవా యేమి ? (తథా = అట్లే) పీయూషం = అమృతము, ఇదమ్పయాంసి కిం ? = ఈ నదియొక్క యుదకములా ?, తథా = అట్లే, తవ = నీ యొక్క, అధరౌ = పెదవులు, ఇదం తీరే కిం? = ఈ నదియొక్క రెండు గట్టులా యేమి ? శృఙ్గార రసప్రధానమైన కామోద్దీపనము గావించెడి నీవాణి మిక్కిలి మధురమైనదని యర్థము.

**సమాసములు :**

మన్మథతీర్థం : మన్మథస్య తీర్థం = మన్మథతీర్థమ్.

ఉజ్జ్వలరసస్రోతస్వతీ : ఉజ్జ్వల ఇతి రసః = ఉజ్జ్వలరసః, ఉజ్జ్వల రసస్య స్రోతస్వతీ = ఉజ్జ్వలరసస్రోతస్వతీ. ఉజ్జ్వల శ్చాసౌ రసశ్చ = ఉజ్జ్వలరసః, ఉజ్జ్వలరసస్య స్రోతస్వతీ = ఉజ్జ్వల రసస్రోతస్వతీ.

ఇదమీయపులినస్య : అస్యాః ఇదం = ఇదమీయం, ఇదమీయం చ తత్ పులినం చ = ఇదమీయ పులినం, తస్య = ఇదమీయ పులినస్య.

ఏతత్తీరమృదా : ఏతస్యాః తీరం = ఏతత్తీరం, ఏతత్తీరస్య మృత్ = ఏతత్తీరమృత్, తయా = ఏతత్తీరమృదా.

ఇదంపయాంసి : అస్యాః పయాంసి = ఇదంపయాంసి.

ఇదంతీరే : అస్యాః తీరం = ఇదంతీరం, తస్మిన్ = ఇదంతీరే.

**భావము :**

ఓ ప్రియురాలా ! నీ వాక్కు వర్ణింప శక్యముకాని లోకోత్తరమైనదియు వర్ణింప శక్యము కానిదియు నగు శృఙ్గార రస సమ్బన్ధము గలదిగను, నిర్మల జలములు గల్గినదిగను నున్నది. కావుననే యీ నది మన్మథుని మూలమైనది (కామోద్దీపనము గలది). మఱియు మన్మథుడు దిగుటకై యేర్పడిన మెట్లవరుస గలిగినది. చెఱకుపాలతో జేయబడిన ఖండశర్కర యీ నది యొక్క యిసుక దిబ్బలకు జెందిన యిసుకయని చెప్పబడును. అట్లే నిర్మలములైన తెల్లనివన్నె గలిగిన చక్కెరతో జేసిన చక్కెరములు ఈ నది గట్టునందలి తెల్లని మట్టితో చేయబడినవా యేమి ? అట్లే నీ యొక్క రెండు పెదవులును నీ నది యొక్క రెండు గట్టులా యేమి ? అనగా శృఙ్గార రస ప్రధానమై, కామోద్దీపనము గావించెడి నీ వాణి మిక్కిలి మధురమైనదని యర్థము.

శ్లో. పరభృత యువతీనాం సమ్యగాయాతి గాతుం
న తవ తరుణి! వాణీయం సుధాసింధువేణీ ।
కతి న రసికకణ్ఠే కర్తు మభ్యస్యతేఽసౌ
భవదుపవిపినామ్రే తాభి రామ్రేడితేన ॥ 152

ప. వి. పరభృతయువతీనాం - సమ్యక్ - ఆయాతి - గాతుం - న - తవ - **తరుణి!** - వాణీ-ఇయం - **సుధాసింధు**వేణీ - కతి - న - రసికకణ్ఠే - కర్తుం - అభ్యస్యతే - అసౌ - భవదుపవిపినామ్రే - తాభిః-ఆమ్రేడితేన.

**అర్థము:** తరుణి! = ఓపడతీ!, సుధాసింధువేణీ, సుధాసింధు = పాలకడలి యొక్క, వేణీ = ప్రవాహరూపమైన, తవ = నీయొక్క, **ఇయం** = ఈ, యుచ్చరించబడుచున్న, వాణీ = వాక్కు, పరభృతయువతీనాం, కోకిల తరుణులకు, సమ్యక్ = చక్కగా, గాతుం = పాడుటకు, (భాషించుటకు) **న ఆయాతి** = రాదు, కోకిలయు ఇటువంటి మధురస్వరము లేనందువలన, నీయెదుట **పాడుటకు** సిగ్గుపడునని యర్థము. అతః = ఇందువలన, తాభిః = ఆకోకిలచే, భవదుపవిపినామ్రే, భవత్ = నీయొక్క, **ఉపవిపిన** = ఉపవనమందలి, ఆమ్రే = మామిడిచెట్టునందు (ఉండి) అసౌ = **నీవాక్కు**, రసికకణ్ఠే, రసిక = రసాంజ్కారములచే, నతిమధుర మైన నాకును నిట్టివాక్కు గలుగవలయునని యభిలాషతో గూడిన, కణ్ఠే = కణ్ఠమునందు, (కణ్ఠధ్వనియందు) కర్తుం = చేయుటకు, ఆమ్రేడితేన = రెండు**మూ**డుమాటులు ఘోషించుటచే, కతి = ఎన్నిమారులు, **నాభ్యస్యతే** = నేర్వబడుటలేదు? అనగా పెక్కుమాటులు నేర్వబడుచు**నే** యున్నది. అయినను ఇప్పటికిని ఆకోకిలలకు నీవాక్కు **పట్టుబడలేదు.** **కోకిల**ధ్వని కంటెను నీవాక్కు మిక్కిలి మధురమని యర్థము. గురు గృహమునందు బ్రహ్మచర్యము నవలంబించి విద్యనభ్యసించుట శాస్త్రీయ మని సూచించుటకు "పరభృత" పదము. పురుషులకంటెను స్త్రీలకు నందులో**ను** విశేషించి యువతులకు కణ్ఠస్వరము మధురమని సూచించు టకును "యువతి" పదము ప్రయోగింపబడినవి.

**సమాసములు :**

పరభృతయువతీనాం : పరేణ భృతాః = పరభృతాః, పరభృతానాం యువతయః = పరభృతయువతయః, తాసాం = పరభృతయువతీనాం.

సుధాసింధువేణీ : సుధాయాః సిన్ధుః = సుధాసిన్ధుః, సుధాసిన్ధోః వేణీ = సుధాసిన్ధువేణీ.

రసికకణ్ఠే : రసికాశ్చాసౌ కణ్ఠశ్చ = రసికకణ్ఠః, తస్మిన్ = రసికకణ్ఠే.
భవదుపవిపినామ్రే : భవత్యాః ఉపవిపినం = భవదుపవిపినం, భవదుప విపినస్య ఆమ్రం = భవదుపవిపినామ్రం, తస్మిన్ = భవదుపవిపినామ్రే.

**భావము :**

ఓ యువతీ! అమృతసాగరముయొక్క ప్రవాహరూపమైన నీయీవాక్కు కోకిలయువతులకు చక్కగా బట్టుపడలేదు. అవి నీయెదుట పాడుటకు సిగ్గుపడు చున్నవి. ఆకోకిలలు నీయుద్యానపు మామిడిచెట్టునందుండి తమకు నీవంటివాణి సిద్ధింపవలయునని యభిలాషతో గూడిక తమతమ కణ్ఠముతో రెండుమూడు మాఱులు పలుకుచు పెక్కుమారులు నీవాణిని నేర్చుకొనుచున్నవి. అయినను ఇప్పటికిని ఆకోకిలలకు నీవాక్కు పట్టుపడలేదు.

శ్లో. ఊర్ధ్వస్తే రదనచ్ఛదః స్మరధను ర్బంధూకమాలామయం
మౌర్వీ తత్ర తవాధరాధర తటాఽధః సీమరేఖాలతా ।
ఏషా వాగపి తావకీ నను ధనుర్వేదః ప్రియే మాన్మథః
సోఽయం కోణధనుష్మతీభి రుచితం వీణాభి రారభ్యతే ॥ 153

ప. వి, ఊర్ధ్వః - తే - రదనచ్ఛదః - స్మరధనుర్బంధూకమాలామయం - మౌర్వీ - తత్ర - తవ - అధరాధరతటాఽధస్సీమ రేఖాలతా - ఏషా - వాక్ - అపి - తావకీ - నను - ధనుర్వేదః - ప్రియే - మాన్మథః - సః - అయం - కోణధనుష్మతీభిః - ఉచితం - వీణాభిః - ఆరభ్యతే.

అర్థము : హేప్రియే = ఓ ప్రియురాలా! తే = నీ యొక్క, ఊర్ధ్వః = పైనున్న, రదన చ్ఛదః = పెదవి, బంధూకమాలామయం, బంధూకమాలా = దాసానిపూవురూపమునన్నున్న - అనగా కొంచెము వంకరగానున్న దాసా నిపూవువంటి, స్మరధనుః = మన్మథుని విల్లు. (తథా = అట్లే,) తత్ర = ఆ మన్మథుని ధనుస్సు నందు, తవ = నీయొక్క, అధరాధరతటాఽధస్సీ మరేఖాలతా, అధరాధర = క్రింది పెదవియొక్క తట = ప్రదేశము నకు, అధః = దిగువనున్న యెల్లయందలి, రేఖాలతా = తీగెవంటి గీత, మౌర్వీ = అల్లెత్రాడు; ఏషా = ఈ వినబడుచున్న, తావకీ = నీకు సంబ

ధించిన, వాగపి = వాణియు, అను = నిశ్చయముగా, మాన్మథః = మన్మథునకు సమ్బన్ధించిన యనగా కామాద్వైతమును బోధించెడి, ధనుర్వేదః = ధనుర్వేదము, అయం = ఈ ధనుర్వేదము, కోణధనుష్మతీభిః = వీణను వాయించెడి నక్కియనబడు వింటివంటిదానితో కూడిన, వీణాభిః = వీణెలతో, ఆరభ్యతే = అభ్యసింపబడుచున్నది. ఇతి = ఇది, ఉచితం = యుక్తము.

**సమాసములు :**

రదనచ్ఛదః : రదనయోః ఛదః = రదనచ్ఛదః

స్మరధనుః: స్మరస్య ధనుః = స్మరధనుః.

బంధూకమాలామయం : బంధూకానాం మాలా = బంధూకమాలా, బంధూకమాలాయాః వికారః = బంధూకమాలామయం.

అధరాధరతటాధస్సీమరేఖాలతా : అధరశ్చాసౌ అధరశ్చ = అధరాధరః, అధరాధరస్య తటః = అధరాధరతటః, అధరాధరతటస్య అధస్సీమా = అధరాధరతటాధస్సీమా, అధరాధరతటాధస్సీమాయాః రేఖా = అధరాధరతటాధస్సీమారేఖా. అధరాధరతటాధస్సీమారేఖైవ లతా = అధరాధరతటాధస్సీమారేఖాలతా.

తావకీ : తవ ఇయం = తావకీ.

మన్మథః : మన్మథస్య అయం = మాన్మథః.

కోణధనుష్మతీభిః : కోణశ్చ ధనుశ్చ = కోణధనుషీ. కోణధనుషీ ఆసాం అస్తీతి = కోణధనుష్మత్యః, తాభిః = కోణధనుష్మతీభిః.

**భావము :**

ఓ ప్రియురాలా ! నీ పై పెదవి దాసాని పూలమాలయగు మన్మథచాపము దాసానిపూవు వంకరగా నుండుటవలన మన్మథుని విల్లువలె నుండునని యర్థము. ఆ మన్మథుని విల్లునందు నీ క్రింది పెదవికి దిగువనున్న ప్రదేశమున తీగవంటి యొక్క రేఖయే యల్లెత్రాడు, నీవాణి నిశ్చయముగా కామాద్వైతమును ప్రతిపాదించెడి ధనుర్వేదము. అధనుర్వేదము వీణెను వాదించెడి నక్కియనబడు విల్లువలెనుండుదాని వలన నేర్పపబడుట యుక్తమే కాని యిప్పటికిని యాధనుర్వేద

మా వీణెలకలవడలేదు. నీవాణి వీణానాదము కంటెను మిక్కిలి మధురమైనది. ధను ర్వేదము ధనుస్సును ధరించినవారిచేత నేయభ్యసింపబడుచుండుటయనునదియుక్తము కానియది స్వయముగా బట్టబడనిచో దాని నభ్యసించుట యుక్తమని భావము.

శ్లో. స గ్రామ్యః స విదగ్ధ సంసది సదా గచ్ఛ త్యపాఙ్క్తేయతాం
తచ్చ స్పృష్టమపి స్మరస్య విశిఖా ముగ్ధే విగానోన్ముఖాః
యః కిం మధ్వితి నాధరం తవ కథం హేమేతి న త్వద్వపుః
కీదృజ్ నామ సుధేతి పృచ్ఛతి న తే దత్తే గిరం చోత్తరమ్॥154

ప. వి. సః - గ్రామ్యః - సః - విదగ్ధసంసది - సదా - గచ్ఛతి - అపాఙ్క్తేయతాం - తత్ - చ - స్పృష్టం- అపి - స్మరస్య - విశిఖా - ముగ్ధే- విగానోన్ముఖాః - యః - కిం - మధు - ఇతి - న - అధరం - తవ - కథం - హేమ - ఇతి - న- త్వద్వపుః - కీదృక్ - నామ - సుధా- ఇతి - పృచ్ఛతి - న - తే - దత్తే - గిరం - చ - ఉత్తరం.

అర్థము: ముగ్ధే = ఓ సుందరీ !, యః = ఏ పురుషుడు, మధు = తేనె లేక మద్యము అనునది, కిం = ఎట్టిది, అని, పృచ్ఛతి = అడుగుచున్నవాని విషయమున, తవ = నీయొక్క, అధరం = క్రిందిపెదవియే మధువని, ఉత్తరం = సమాధానమును, న దత్తే = ఇయ్యడో, సః = ఆ పురుషుడు, గ్రామ్యః = పామరుడైనవాడు, అనగా చాతుర్యము లేనివాడు, (నీ నగర మున నివసింపదగినవాడు కాడు) (తథా = అట్లే) హేమ = బంగారు, కథం = ఎట్టిది, ఇతి = అని, పృచ్ఛతి = అడుగుచున్న జనము విషయము నందు, యః = ఎవడు, త్వద్వపుః = నీ శరీరమే బంగారు, ఇతి = అని ఉత్తరం = సమాధానమును, న దత్తే = ఈయడో, సః = ఆ జనము విదగ్ధ సంసది = పండితుల సభయందు, సదా = ఎల్లపుడు. అపాఙ్క్తేయతాం = పంక్తినుండి వెలివేయదగియుండుటను, యాతి = పొందు చున్నాడు. పండితుల పంక్తియందు గూర్చొనుట కతడు దగడని యర్థము. (తథా = అట్లే) సుధా నామ = ప్రసిద్ధమగు నమృతము, కీదృక్ = ఎట్టిది, ఇతి = అని, పృచ్ఛతి = ప్రశ్నించువాని విషయము నందు, యశ్చ = ఎవడు, తే = నీయొక్క, గిరం = వాణిని, ఉత్తరం =

శ్లో. మధ్యే బద్ధాణిమా యత్ సగరిమమహిమ శ్రోణి వక్షోజయుగ్మా
జాగ్రచ్చేతో వశిత్వా స్మితధృత లఘిమా మాం ప్రతీశిత్వ మేషి
సూక్తౌ ప్రాకామ్య రమ్యా దిశి విదిశి యశోలబ్ధకామావసాయా
భూతీ రష్టావపీశ స్తదదితముదితః స్వస్య శిల్పాయ తుభ్యమ్
155

ప. వి. మధ్యే - బద్ధాణిమా - యత్ - సగరిమమహిమ శ్రోణి వక్షోజయుగ్మా -
జాగ్రచ్చేతో వశిత్వా - స్మితధృత లఘిమా - మాం - ప్రతి -
ఈశిత్వం - ఏషి - సూక్తౌ - ప్రాకామ్య రమ్యా - దిశి - విదిశి -
యశోలబ్ధకామావసాయా - భూతీః - అష్టౌ - అపి - ఈశః - తత్ -
అదిత - ముదితః - స్వస్య - శిల్పాయ - తుభ్యం.

అర్థము : హే ప్రియే! = ఓ ప్రియురాలా!, త్వం = నీవు, యత్ = ఎందువలన,
మధ్యే = ఉదరముపైన, బద్ధాణిమా, బద్ధ = ధరింపబడిన, అణిమా =
అధికమైన సూక్ష్మత్వము గలిగిన యనగా కృశోదరీత్వము గల్గిన దానవు.
(తథా = అట్లే) సగరిమ మహిమ శ్రోణి వక్షోజయుగ్మా, సగరిమ
మహిమ = గురుత్వముతోడను అనగా భారము తోడను, గొప్పతనము
తోడను గూడిన, శ్రోణి = నితమ్బ ప్రదేశము, వక్షోజ యుగ్మం =
చనుదోయి గలదానవు, తథా = అట్లే, జాగ్రచ్చేతోవశిత్వా, జాగ్రత్ =
స్ఫురించెడి, చేతః = మనస్సునందలి. వశిత్వా = ఇంద్రియ వశిత్వము,
అనగా జితేన్ద్రియత్వము గల్గినదానవు అనగా పతివ్రతవు. తథా = అట్లే.
స్మితధృత లఘిమా, స్మిత = చిరునగవునందు, ధృత = ధరింపబడిన,
లఘిమా = అల్పత్వము గలదానవు, తథా = అట్లే, మాం = నలుడనైన
నన్ను, ప్రతి = ఉద్దేశించి, ఈశిత్వం = ప్రభుత్వమును, అనగా ప్రాణేశ్వ
రీత్వమును, ఏషి = పొందుచున్నావు. తథా = అట్లే, సూక్తౌ = మాటల
నేర్పరితనమునందు, ప్రాకామ్యరమ్యా; ప్రాకామ్యం = అధిక్యముచే,
రమ్యా = రమ్యతగలదానవు, అనగా వక్రోక్తిమున్నగు పలువిధములగు
మాటలను వాడుటలో నేర్పరివని యర్థము. తథా = అట్లే, దిశి = తూర్పు
మున్నగు దిక్కుల యందును, విదిశి = ఆగ్నేయము మున్నగు విదిక్కుల

యంపను. యశోలబ్ధకామావసాయా, యశః = సౌందర్యము మున్నగు వానివలని కీర్తిచే, లబ్ధ = పొందబడిన, కామ = యథేచ్ఛగల, అవసాయా = వ్యాప్తిగలదానవు, తత్ = అందువలన, ముదితః = నిన్ను సృజించి నీ సౌందర్యాదులచే హర్షించిన, ఈశః = శివుడు, అష్టౌఅపి = ఎనిమిదైన, భూతీః = తనయణిమాద్యైశ్వర్యములను, స్వస్య = తనయొక్క, శిల్పాయ = నిర్మాణమైన, తుభ్యం = నీకై, అదిత = ఇచ్చెను.

సమాసములు :

బద్ధాణిమా : బద్ధః అణిమా యయా సా = బద్ధాణిమా.

సగరిమ మహిమ శ్రోణివక్షోజ యుగ్మా : గరిమా చ మహిమా చ = గరిమమహిమానౌ, గరిమ మహిమభ్యాం సహ వర్తేతే ఇతి = సగరిమ మహిమనీ, వక్షోజయోః యుగ్మం = వక్షోజ యుగ్మం, శ్రోణిశ్చ వక్షోజ యుగ్మం చ = శ్రోణి వక్షోజ యుగ్మే, సగరిమమహిమనీ శ్రోణి వక్షోజ యుగ్మే యస్యాః సా = సగరిమమహిమ శ్రోణి వక్షోజ యుగ్మా.

జాగ్రచ్చేతోవశిత్వా : చేతసి వశిత్వం = చేతోవశిత్వం, జాగ్రత్ చేతో వశిత్వం యస్యాః సా = జాగ్రచ్చేతోవశిత్వా.

స్మిత ధృత లఘిమా : స్మితే ధృతః = స్మితధృతః, స్మితధృతః లఘిమా యస్యాః సా = స్మితధృత లఘిమా.

ఈశిత్వం : ఈశః అస్యాస్తీతి = ఈశీ, ఈశినః భావః = ఈశిత్వం, తత్ = ఈశిత్వం,

సూక్తౌ : శోభనా ఉక్తిః = సూక్తిః, తస్యాం = సూక్తౌ,

ప్రాకామ్యరమ్యా : ప్రకామస్య భావః = ప్రాకామ్యం, ప్రాకామ్యేన రమ్యా = ప్రాకామ్యరమ్యా.

యశోలబ్ధ కామావసాయా : యశసా లబ్ధః = యశోలబ్ధః, కామం అవసాయః = కామావసాయః, యశోలబ్ధః కామావసాయః యస్యాః సా = యశోలబ్ధ కామావసాయా.

భావము :

ఓ ప్రేయసీ! నీవు ఉదరప్రదేశమున కృశిత్వమును ధరించి కృశోదరివి. పిఱుఁదులయందు భారమును, చనుదోయియందు వలుపతనమును వహించితివి. అట్లే మనస్సునందు నింద్రియనిగ్రహమును వహించిన పతివ్రతవు. అట్లే చిరునగవు నందు చురుకుతనమును వహించితివి. మరియు నాయెడ స్వామిత్వమును వహించితివి. అట్లే మాటలనేర్పరితనము నందు అనగా వక్రోక్తి మున్నగు నానా విధములగు వచనచాతురిని ప్రయోగించుటలో మిక్కిలి నేర్పైనదానవు. తూర్పు మున్నగు దిక్కులయందును ఆగ్నేయము మున్నగు మూలలయందును నీయందలి సౌందర్యము మున్నగువానికి సంబంధించిన కీర్తి ప్రసరించుటచే యథేచ్ఛమైన వ్యాప్తిగలదానవు. అందువలన నిన్ను సృజించి నీసౌందర్యాదులను గాంచి హర్షించిన యీశ్వరుడు, తనవగు నణిమాద్యష్టైశ్వర్యములను తనశిల్పమైన నీకై యొసంగెను. కామావసాయమను నదియు నొకసిద్ధి యని చెప్పెదరు.

శ్లో. త్వద్వాచః స్తుతయే వయం న పటవః పీయూషమేవ స్తుమః
తస్యార్థే గరుడామరేన్ద్రసమరః స్థానే స జానేఽజని ।
ద్రాక్షాపానకమాన మర్దన సృజా క్షీరే దృథావజ్ఞయా
యస్మిన్నామ ధృతోఽనయా నిజపదప్రక్షాలనానుగ్రహః ॥156

ప. వి. త్వద్వాచః - స్తుతయే - వయం - న - పటవః - పీయూషమ్ - ఏవ - స్తుమః - తస్య - అర్థే - గరుడామరేన్ద్రసమరః - స్థానే - సః - జానే - అజని - ద్రాక్షాపానకమాన మర్దనసృజా - క్షీరే - దృథా వజ్ఞయా - యస్మిన్ - నామ - ధృతః - అనయా - నిజపదప్రక్షాలనానుగ్రహః.

అర్థము: హే ప్రియే = ఓ ప్రియురాలా!, వయం = నలుడు మున్నగు వారలము, త్వద్వాచః = నీమధురమైన వాక్కులను, స్తుతయే = పొగడుటకు, న పటవః = సమర్థులముకాము. (అందువలన) పీయూషమేవ = అమృతమునే,

స్తుమః = శ్లాఘింతుము, తస్య = ఆ యమృతముయొక్క, అర్థే = నిమిత్తమునందు, గరుడామరేన్ద్రసమరః, గరుడ = గరుడునికిని, అమరేన్ద్ర = ఇంద్రునకును, సమరః = యుద్ధము, అజని = ఏర్పడినది. (తత్ = అది) స్థానే = యుక్తము, (అని) జానే = తెలుసుకొనుచున్నాను. ద్రాక్షాపానకమానమర్దనసృజా, ద్రాక్షాపానక = పండినద్రాక్షపండ్లతో జేసిన పానకముయొక్క, మాన = మాధుర్యాధిక్యము అనెడి యహంకారమును, మర్దన = మర్దించుటను ననగా ఖండించుటను, సృజా = చేసెడి, క్షీరే = పాలయందు, దృఢావజ్ఞయా, దృఢ = దృఢమైన, అవజ్ఞయా = అనాదరము గలిగిన, అనయా = ఈ నీవాక్కుచే. యస్మిన్ = ఏ యమృతమునందు, నిజపదప్రక్షాలనానుగ్రహః, నిజపద = తనపాదములను, ప్రక్షాలన = కడుగుటచే, అనుగ్రహః = ప్రసాదము, ధృతో నామ = వహింపబడినదని భావింతును. మఱియు, యస్మిన్ = ఏ యమృతమునందు, అనయా = నీవాక్కుచే, నిజపదప్రక్షాళనానుగ్రహః, నిజ = తనదగు, పద = సుప్తిఙన్త రూపపదములను, ప్రక్షాలన = కడుగుటకు, అను = విదప, గ్రహః = గ్రహణము, ధృతో నామ = చేయబడినదై యున్నది. అమృతమునందు గడుగుటచేతనే దోషము లేకయు మధురముగను మాట్లాడుచున్నావని యర్థము. ద్రాక్షాపానకమునకంటెను, పాలకంటెను, నీవాణి మిక్కిలి తియ్యనిదని యర్థము. ప్రభువునకెవ్వనియెడ ననుగ్రహ మధికముగ నుండునో యతడే ప్రభువుయొక్క పాదముల నెట్లుకడుగునో యావిధముగనమృతమునందు నీవాణి పదములను గడుగుకొనినదని యర్థము.

**సమాసములు :**

త్వద్వాచః : తవ వాక్ = త్వద్వాక్, తస్యాః = త్వద్వాచః.

గరుడామరేన్ద్రసమరః : అమరాణాం ఇన్ద్రః = అమరేన్ద్రః, గరుడశ్చ అమరేన్ద్రశ్చ = గరుడామరేన్ద్రౌ, గరుడామరేన్ద్రయోః సమరః = గరుడామరేన్ద్రసమరః.

ద్రాక్షాపానకమానమర్దనసృజా : ద్రాక్షాయాః పానకం = ద్రాక్షాపానకం, ద్రాక్షాపానకస్య మానః = ద్రాక్షాపానకమానః, ద్రాక్షాపానకమానస్య మర్దనం = ద్రాక్షాపానకమానమర్దనం, ద్రాక్షాపానకమానమర్దనం సృజతీతి = ద్రాక్షాపానకమానమర్దనసృక్, తయా = ద్రాక్షాపానకమానమర్దనసృజా.

దృఢావజ్ఞయా : దృఢా చ సా అవజ్ఞా చ = దృఢావజ్ఞా, తయా = దృఢావజ్ఞయా.

నిజపదప్రక్షాలనానుగ్రహః : నిజే చ తే పదే చ = నిజపదే, నిజాని చ తాని పదాని చ = నిజపదాని, నిజపదానాం ప్రక్షాలనం = నిజపదప్రక్షాలనం, నిజపదప్రక్షాలనమేవ అనుగ్రహః = నిజపదప్రక్షాలనానుగ్రహః, నిజపదప్రక్షాలనాత్ అనుగ్రహః = నిజపదప్రక్షాలనానుగ్రహః.

భావము;

ఓ ప్రేయసీ! నలుడు మున్నగు మేమందరము నీ వాక్కును ప్రశంసింప సమర్థులము కాము, కాన నమృతమునే ప్రశంసించెదము. ఆ యమృతము కొఱకు గరుడునకును దేవేన్ద్రునికిని యుద్ధము జరిగినది. అది యుక్తమే ననియే మేము తెలుసుకొనుచున్నాము. నీ వాక్కు ద్రాక్షాపానకము యొక్క యహంకారమును మర్దించునది. దానికి పాలయందు ననాదరము దృఢమైనది. అనగా నది పాలను లెక్కింపదు. అట్టి నీవాక్కు తన పదములను అనగా తన పాదములను (తన శబ్దములను) ఆ యమృతమునందు కడిగి యనుగ్రహము నొసంగినది. అనగా తన పాదములను గడిగి ప్రసాద మొసంగినది. అట్లే యా యమృతము నందు తన సుబన్తతిఙన్త పదములను కడిగిన పిదప వానిని గ్రహించినది. ఎవడు ప్రభువుయొక్క యనుగ్రహపాత్రుడో యతడే యాప్రభుని పదములను గడుగును గదా!

శ్లో. శోకశ్చేత్కోకయోస్త్వాం సుదతి! తుదతి తద్వ్యాహరాజ్ఞాకరస్తే
గత్వా కుల్యామనస్తం వ్రజతు మనునయే భానుమేతజ్జలస్థమ్।
బద్ధేయద్వ్యఞ్జలావప్యనునయవిముఖః స్యాన్మయైకగ్రహోఽయం
దత్త్వైవాభ్యాం తదమ్భోఽఞ్జలిమివహ భవతీం పశ్య మామేష్యమాణమ్॥ 157

ప. వి. శోకః - చేత్ - కోకయోః - త్వాం - సుదతి! - తుదతి - తత్ - వ్యాహర - ఆజ్ఞాకరః - తే - గత్వా - కుల్యాం - అస్తం - వ్రజితుం - అనునయే - భానుం - ఏతజ్జలస్థం - బద్ధే - యది - అఞ్జలౌ - అపి - అనునయ విముఖః - స్యాత్ - మయా - ఏక గ్రహః - అయం దత్వా - ఏవ-ఆభ్యాం - తత్ - అమ్బ్వోఽఞ్జలిం - ఇహ - భవతీం - పశ్య - మాం - ఏష్యమాణం.

అర్థము: హే సుదతి! = ఓ యందములైన దన్తములు గలదానా!, కోకయోః = చక్రవాకముల యొక్క, శోకః = విరహము వలని దుఃఖము, త్వాం = నిన్ను, తుదతి చేత్ = పీడించు చున్నచో, తత్ = అపుడు, వ్యాహర = చెప్పుము, ఏమనగా, తే = నీ యొక్క, ఆజ్ఞాకరః = ఆదేశమును చేసెడి (అహం = నేను) కుల్యాం = కాలువను గూర్చి, గత్వా = పోయి, ఏత జ్జలస్థం = ఈ కాలువ నీట ప్రతిబింబించిన, భానుం = సూర్యుని, అస్తం = అస్త భిన్నమును, వ్రజితుం = పొందుటకు, అనగా నస్తాద్రిని బొందకుండుటకు, అనునయే = వినయముతో ప్రార్థింతును. నీవు అస్త మించినచో = చక్రవాకములకు పరస్పర వియోగము తప్పక కలుగును. కాన నస్తమింపవలదని వినయముతో ప్రార్థింతునని యర్థము. యది = ఒకవేళ, మయా = నలుడనగు నాచే, అఞ్జలౌ = ప్రార్థనకు, దోసిలి, బద్ధేఽపి = బంధింపబడినను. ఏకగ్రహః = ఒక విషయమునందే పట్టుదల గల్గిన యనగా తన పట్టుదలను వదలని వాడును, ఏకగ్రహః = చన్ద్రిడు మున్నగు గ్రహములయందు ముఖ్యుడైనవాడునగు, అయం = ఈ సూర్యుడు, అనునయవిముఖః = నాప్రార్థనకు పెడ ముఖము గలవాడుగా, స్యాత్ యది = అయినచో, అనగా నాప్రార్థనను లెక్కింపక యస్తాచలమునకు వెడలినచో, ఇహ = ఈసాయంకాలమందు, అమ్బ్వోఞ్జలిం, అమ్బుః = ఉదకముయొక్క, అఞ్జలిం = దోసిలిని, ఆభ్యాం = ఈ చక్రవాకములకై, దత్వా = ఇచ్చి. (ప్రార్థనను దిరస్క రించిన సూర్యున కీయక) భవతీం = నిన్ను గూర్చి, ప్రత్యేష్యమాణం = తిరిగివచ్చుచున్న, మాం = నలుడనైన నన్ను, పశ్య = చూడుము,

సాయంసంధ్య నుపాసించుటకై మఱియొక విధముగా వెలుపలికి వెడలుట కనుమతి నభ్యర్థించెనని యర్థము.

**సమాసములు:**

కోకయోః : కోకశ్చ కోకీ చ = కోకౌ, తయోః = కోకయోః.

ఆజ్ఞాకరః : ఆజ్ఞాం కరోతీతి = ఆజ్ఞాకరః.

అనస్తం : న అస్తః = అనస్తః, తం అనస్తమ్.

ఏతజ్జలస్థమ్ : ఏతచ్చ తత్ జలం చ = ఏతజ్జలం, ఏతజ్జలే తిష్ఠతీతి = ఏతజ్జలస్థః, తం = ఏతజ్జలస్థమ్.

అనునయవిముఖః : అనునయే విముఖః = అనునయవిముఖః.

ఏకగ్రహః : ఏకః గ్రహః యస్య సః = ఏకగ్రహః, ఏకశ్చాసౌ గ్రహశ్చ = ఏకగ్రహః.

**భావము :**

ఓ సుదతీ! సూర్యాస్తమయముచే నేర్పడు చక్రవాకముల విరహదుఃఖము నిన్ను బీడించినచో నప్పుడు చెప్పుము. నీ యాదేశమును బాలించెడి నేను కాలువను అనగా కృత్రిమనదిని గూర్చి పోయి, యా నదియందు ప్రతిబింబించిన సూర్యుని అస్తమింపకుండుటకై వినయముతో బ్రార్థింతును. ఒకవేళ నేనట్లు ప్రార్థించినను నతడు ఏకగ్రహుడై యనగా నొక్కపట్టుదలను వహించిన (ముఖ్యగ్రహుడైన) ఈ సూర్యుడు నా ప్రార్థనకు విముఖుడై యస్తాద్రిని బొందినచో నప్పుడు, ఈ సాయంకాలమునందు జలాఞ్జలిని నా ప్రార్థనను వినని సూర్యునకై యొసంగక, యీ చక్రవాకములకే యొసంగి నీ యొద్దకు మఱలి వచ్చెడి నన్ను గాంచుము. అని నలుడు దమయన్తికి జెప్పి సాయంసంధ్య నుపాసించుటకు భంగ్యంతరముతో వెలుపలికి బోవుట కనుమతికై దమయన్తిని గోరెనని యాశయము.

శ్లో. తదానన్దాయ త్వత్పరిహసితకన్దాయ భవతీ
నిజాలీనాం లీనాం స్థితిమిహ ముహూర్తం మృగయతామ్
ఇతి వ్యాజాత్ కృత్వాఽఽలిషువలిత చిత్తాం సహచరీం
స్వయం సోఽయం సాయన్తనవిధి విధిత్సు ర్బహి రభూత్॥158

ప. వి. తత్ - ఆనన్దాయ - త్వత్పరిహసితకన్దాయ - భవతీ - నిజాలీనాం - లీనాం - స్థితిం - ఇహ - ముహూర్తం - మృగయతాం - ఇతి - వ్యాజాత్ - కృత్వా - ఆలిషు - వలిత చిత్తాం - సహచరీం - స్వయం - సః - అయం - సాయన్తన విధి విధిత్సుః - బహిః - అభూత్ -

**అర్థము :** హే దమయన్తి! = ఓ దమయన్తీ!, తత్ = అందువలన, ననగా నావిధముగా నూర్యానునయము గావింపవలసియుండుటవలన, భవతీ = నీవు, త్వత్పరిహసితకన్దాయ, త్వత్ = నీయొక్క, పరిహసిత = పరిహాసమే, కందాయ = మూలముగా గల, ఆనందాయ = సంతోషమునకై, ఇహ = ఈ మేడయందే, నిజాఽఽలీనాం, నిజ = తవ, ఆలీనాం = చెలికత్తెలకు, లీనాం = గూఢమైన, స్థితిం = ఉనికిని, ముహూర్తం = కొలదికాలము, మృగయతాం = వెదకవలసినది, ఇతి = ఇట్లు, వ్యాజాత్ = నెపమువలన, సహచరీం = దమయన్తిని, ఆలిషు = చెలికత్తెలవిషయమునందు, వలితచిత్తాం, వలిత = ఆసక్తమైన, చిత్తాం = మనస్సు గలదానినిగా, కృత్వా = చేసి, సః = ఆ, అయం = ఈ నలుడు, స్వయం = తాను, సాయన్తనవిధివిధిత్సుః, సాయన్తన = సాయంకాలపు, విధి = సంధ్యోపాసనాదికమును, విధిత్సుః = చేయగోరినవాడై, బహిః = వెలుపలికి, అనగా నాభవనమునుండి వెడలినవాడుగా అభూత్ = ఆయెను.

**సమాసములు :**

త్వత్పరిహసితకన్దాయ : తవ పరిహసితం = త్వత్పరిహసితం, త్వత్పరిహసితం కన్దః యస్య సః = త్వత్పరిహాతకన్దః, తస్మై = త్వత్పరిహసితకన్దాయ.

నిజాఽఽలీనాం : నిజాశ్చ తాః ఆల్యశ్చ = నిజాఽఽల్యః. తాసాం = జాలీనాం.

వలితచిత్తాం : వలితాం చిత్తం యస్యాః సా = వలిత చిత్తా, తాం = వలితచిత్తాం.

సాయన్తన విధి విధిత్సుః : సాయం భవః = సాయన్తనః, సాయన్తన

శ్చాసౌ విధిశ్చ = సాయన్తన విధిః, విధాతు మిచ్ఛుః = విధిత్సుః,
సాయన్తన విధేః విధిత్సుః = సాయన్తన విధి విధిత్సుః.

**భావము :**

ఓ దమయన్తీ! ఆ విధముగా సూర్యప్రార్థనను జేయవలసియుండుట వలన నీవు నీ పరిహాసము వలని యానందమునకై, యీ మేడయందే యొకచోట నీ చెలికత్తెలకు గానరాక దాగియుండుటకు స్థలము నన్వేషింపుము. అని ఆనెపముతో దమయన్తిని, చెలికత్తెల విషయము నం దాసక్తురాలిని గావించి యా నలుడు సాయంకాలపు సంధ్యోపాసనాదివిధులను నిర్వహించుటకై యా మేడ నుండి వెలుపలికి వెడలెను.

శ్లో. శ్రీహర్షం కవిరాజ రాజి ముకుటాలఙ్కార హీరస్సుతం
శ్రీహీరః సుషువే జితేన్ద్రియ చయం మామల్లదేవీ చ యం
తస్యాఽగా దయమేక వింశ గణనః కావ్యేతి నవ్యే కృతౌ
భైమీ భర్తృచరిత్ర వర్ణనమయే సర్గో నిసర్గోజ్జ్వలః॥ 159

వ. వి. శ్రీహర్షం - కవిరాజరాజి ముకుటాలఙ్కార హీరః - సుతం - శ్రీహీరః - సుషువే - జితేన్ద్రియ చయం - మామల్లదేవీ - చ - యం - తస్య - అగాత్ - అయం - ఏకవింశగణనః - కావ్యే - అతినవ్యే - కృతౌ - భైమీభర్తృ చరిత్ర వర్ణన మయే - సర్గః - నిసర్గోజ్జ్వలః.

అర్థము : కవిరాజరాజిముకుటాలఙ్కారహీరః, కవిరాజ = కవిశ్రేష్ఠుల యొక్క, రాజి = పఙ్క్తిలో, ముకుట = శ్రేష్ఠులైన వారికి, అలఙ్కార = భూషణమైన, హీరః = వజ్రమణియైన, శ్రీహీరః = శ్రీహీరుడు, జితేన్ద్రియ చయం = జయింపబడిన యింద్రియ సమూహము గల్గిన, శ్రీహర్షం = శ్రీహర్షుడను పేరుగల, యం = ఏ, సుతం = కుమారుని, సుషువే = ఉత్పత్తి గావించెనో, మామల్లదేవీ చ = మామల్లదేవియను తల్లి, యంచ = ఏ, సుతం = కుమారుని, సుషువే = కనెనో, తస్య = ఆ శ్రీహర్షునికి సంబంధించిన, భైమీభర్తృచరిత్రవర్ణనమయే, భైమీభర్తృ = దమయన్తి భర్తయగు నలుని యొక్క, చరిత్ర =

చరిత్రమునకు, వర్ణనమయే = వర్ణనరూపమైన, అతినవ్యే = మిక్కిలి నూతనమైన, కావ్యే = కావ్యరూపమైన, కృతౌ = కృతియందు, ఏకవింశ గణనః, ఏకవింశ = ఇరువదొకటియని, గణనః = లెక్కగలిగిన, నిసర్గోజ్జ్వలః = స్వభావరమ్యమైన, సర్గః = సర్గము, అగాత్ = గడచినది.

**సమాసములు :**

ఏకవింశగణనః : ఏకవింశతిః గణనా యస్య సః = ఏకవింశ గణనః.

భైమీభర్తృచరిత్రవర్ణనమయే : భైమ్యాః భర్తా = భైమీభర్తా, భైమీ భర్తుః చరిత్రం = భైమీభర్తృ చరిత్రం, భైమీభర్తృ చరిత్రస్య వర్ణనం = భైమీభర్తృచరిత్ర వర్ణనం, భైమీభర్తృచరిత్ర వర్ణనం రూపం యస్య తత్ = భైమీభర్తృచరిత్రవర్ణనమయం, తస్మిన్ = భైమీభర్తృ చరిత్రవర్ణనమయే.

తక్కిన విగ్రహ భావాదులు పూర్వసర్గాంత్య శ్లోకములకువలె జూచు కొన వలయును.

ఇతి

శ్రీ మదాత్రేయగోత్ర శ్రీ మదుదాలినృసింహశాస్త్రితనూజ

విక్రమసింహపురీ వేద సంస్కృత కళాశాలా

భూత పూర్వ ప్రధానోపాధ్యాయ

శ్రీ సుబ్బరామశాస్త్రివిరచితమగు

నైషధాంధ్ర వ్యాఖ్యకు

ఏకవింశ సర్గ

సమాప్తమ్

# శ్రీహర్షనైషధము

## ఆంధ్రవ్యాఖ్య

## ద్వావింశసర్గ

శ్లో. ఉపాస్య సాన్ధ్యం విధి మన్తిమాశా
రాగేణకాన్తాధర చుమ్బిచేతాః।
అవాప్తవాన్ సప్తమభూమిభాగే
భైమీధరం సౌధ మసౌ నరేన్ద్రః॥ 1

ప. వి. ఉపాస్య - సాన్ధ్యం - విధిం - అన్తిమాశారాగేణ - కాన్తాధరచుమ్బిచేతాః - అవాప్తవాన్ - సప్తమభూమిభాగే - భైమీధరం - సౌధం - అసౌ - నరేన్ద్రః.

అర్థము: అసౌ = ఈ, నరేన్ద్రః = నలమహారాజు, అన్తిమాశారాగేణ, అన్తిమాశా = సాయంసంధ్యకు సంబంధించినందువలన కడపటిదికైన పడమటిదిక్కుయొక్క, రాగేణ = ఎఱ్ఱనివన్నె యనెడు కారణముచే, కాన్తాధరచుమ్బిచేతాః, కాన్తా = ప్రియురాలియొక్క, అధర = క్రిందిపెదవిని, చుమ్బి = స్మరించు, చేతాః = మనసు గలవాడై, యనగా సంధ్యారాగముతో సమానవర్ణముగల దమయన్తియొక్క క్రిందిపెదవిని స్మరించుచున్నవాడై, యామెయొక్క వియోగమునకు చాలజాలనందువలన బయట నుండుట కసమర్థుడై యామె యున్నటువంటి, సప్తమభూమిభాగే = ఏడవ కక్ష్యయందున్న, భైమీధరం, భైమీ = దమయన్తియొక్క, ధరం = పర్వతరూపమైన, సౌధం = మేడను, సాంధ్యం = సంధ్యాకాలమునకు సంబంధించిన, విధిం = క్రియను, ఉపాస్య = ఉపాసించి, అవాప్తవాన్ = పొందెను.

**సమాసములు :**

సాన్ధ్యం : సంధ్యాయాం భవః = సాన్ధ్యః, తం = సాన్ధ్యం.
అన్తిమాశారాగేణ : అన్తిమా చ సా ఆశా చ = అన్తిమాశా, అన్తిమాశాయాః రాగః = అన్తిమాశారాగః, తేన = అన్తిమాశారాగేణ.
కాన్తాధరచుమ్బిచేతాః : కాన్తాయాఃఅధరః = కాన్తాధరః, కాన్తాధరంచుమ్బతీతి = కాన్తాధరచుమ్బి, కాన్తాధరచుమ్బి చేతః యస్య సః = కాన్తాధరచుమ్బిచేతాః.
సప్తమభూమిభాగే : భూమేః భాగః = భూమిభాగః, సప్తమ శ్చాసౌ భూమిభాగశ్చ = సప్తమభూమిభాగః, తస్మిన్ = సప్తమభూమిభాగే.
భైమీధరం : భైమ్యాః ధరః = భైమీధరః, తం = భైమీధరమ్.
నరేన్ద్రః : నరాణా మిన్ద్రః = నరేన్ద్రః, తం = నరేన్ద్రమ్.

**భావము :**

ఈ నలమహారాజు పడమటిదిక్కునందలి సంజకెంజాయను జూచుటవలన నట్టి కెంజాయగలిగిన ప్రియురాలియొక్క పెదవిని స్మరించుచు దానిని పానము చేయగోరి, తొలుత సాయంకాలపుసంధ్యను నెరవేర్చినవాడై యాదమయన్తి యొక్క యెడబాటును సైప నశక్తుడై యేదవయంతస్తునందామె నివసించుచున్న మేడను ప్రవేశించెను.

శ్లో. ప్రత్యుద్వ్రజన్త్యా ప్రియయా విముక్తం
పర్యఙ్క మఙ్కస్థిత సజ్జశయ్యమ్ ।
అధ్యాస్యతా మప్యధివాస్య సోఽయం
సన్ధ్యా ముపశ్లోకయతి స్మ సాయమ్ ॥ 2

ప. వి. ప్రత్యుద్వ్రజన్త్యా - ప్రియయా - విముక్తం - పర్యఙ్కం - అఙ్కస్థిత సజ్జశయ్యమ్ - అధ్యాస్యతామ్ - అపి - అధివాస్య - సః - అయం - సన్ధామ్ - ఉపశ్లోకయతి - స్మ - సాయమ్.

అర్థము: సః = ఆ, అయం = ఈనలుడు, ప్రత్యుద్వ్రజన్త్యా = తన నెదురొ్కనుచున్న, ప్రియయా = ప్రియురాలగు దమయన్తిచే, విముక్తం = విడువబడి

నదియు, అఙ్కస్థితసజ్జశయ్యం, అఙ్క = మధ్యభాగమునందు, స్థిత = ఉంచబడి,సజ్జ = సిద్ధమైన, శయ్యం = పడక గలిగిన, పర్యఙ్కం = మంచమును, అధ్యాస్య = ఎక్కి, అనగా అధిష్ఠించి, తామపి = ఆదమయన్తినిసైతము, అధివాస్య = కూర్చుండబెట్టి,సాయం = సాయంకాలమునకుసంబంధించిన, సంధ్యాం = రేయింబవళ్ళకు సంబంధించిన సంధి ముహూర్తమును, ఉపశ్లోక యతి స్మ = స్తుతించుచుండెను.

**సమాసములు :**

అఙ్కస్థితసజ్జశయ్యం : అఙ్కే స్థితా = అఙ్కస్థితా, అఙ్కస్థితా చ సా సజ్జా చ = అఙ్కస్థితసజ్జా, అఙ్కస్థితసజ్జా శయ్యా యస్య సః = అఙ్కస్థితసజ్జశయ్యః, తమ్ = అఙ్కస్థితసజ్జశయ్యమ్.

**భావము :**

ఈ నలమహారాజు తనకు మర్యాద జేయుటకై ఎదురువచ్చుచున్న ప్రియురాలగు దమయన్తిచే విడువబడినదియును, మధ్యభాగమునందు పరచిన పడక గలదియునగు మంచమున తాను గూర్చొని తన ప్రక్క ప్రియురాలగు దమయన్తిని సైతము కూర్చుండ బెట్టుకొని సాయంకాలపు రేయింబవళ్ళ సంధిముహూర్తమును స్తుతి జేయుచుండెను.

శ్లో. విలోకనేనానుగృహాణ తావ
ద్దిశం జలానా మధిపస్య దారాన్ ।
అఙ్గాలి లాక్షాపయసేవ యేయ
మపూరి పఙ్కైరివ కుఙ్కుమస్య. ॥ 3

ప. వి. విలోకనేన - అనుగృహాణ - తావత్ - దిశం - జలానాం - అధిపస్య- దారాన్ - అఙ్గాలి - లాక్షాపయసా - ఇవ - యా - ఇయం -అపూరి - పఙ్కైః - ఇవ - కుఙ్కుమస్య.

అర్థము: హే ప్రియే! = ఓ ప్రియురాలా! త్వం = నీవు,జలానామ్ = ఉదకములకు, అధిపస్య = ప్రభువైన వరుణునియొక్క, దారాన్ = భార్యయైన, దిశం = పడమటిదెసను, విలోకనేన = చూచుటచే, అనుగృహాణ

తావత్ = ముందు అనుగ్రహించుము, తొలుత జూచి యనుగ్రహించుము. తరువాత వర్ణనతో యనుగ్రహింపుము. లేదా ఎంతకాలములోపల జంద్రోదయాదులచే తూర్పునందు సౌందర్య మేర్పడునో, అంతలోపల సంధ్యారాగముచే సౌందర్యమును వహించిన పడమటిదిక్కును జూడుమని గాని తావత్ శబ్దార్థము. "లడయో రభేదః" యను న్యాయము ననుసరించి "జలానాం" అనునది "జడానాం" యను మార్పు పొందగా జడుల కధిపతి యైన వరుణుని భార్య దుఃఖించుచున్నది. అట్టి దుఃఖితురాలగు నామెను గాంచి యోదార్చుమని యర్థము. యా = ఏ, ఇయం = ఈపడమటిదెస, లాక్షాపయసా = లత్తుకరసముచే, అక్తాలీవ = కడుగబడినదో, యను నట్లున్నది. (తథా = అట్లే) కుఙ్కుమస్య = కుఙ్కుమ పువ్వుయొక్క, పఙ్కైః = అడుసులచే, అపూరీవ = నింపబడినదో యనునట్లున్నది. ఈ విధముగా నెఱ్ఱనివన్నెగలదిగా గనబడుచున్నది. కాన రమ్యమైన యీ పడమటిదిక్కును జూడుమని యర్థము.

**సమాసములు :**

లాక్షాపయసా : లాక్షాయాః పయః = లాక్షాపయః, తేన = లాక్షా పయసా.

**భావము :**

ఓప్రేయసీ! నీవు జలాధిపతియగు (జడాధిపతియగు) వరుణునిభార్యయైన పడమటిదిక్కును దొలుత జూచి యనుగ్రహింపుము. పిదప దానిని వర్ణించి యనుగ్రహింపుము. (జడుల కధిపతియగు వానికి భార్యయై దుఃఖించుచున్న యామెను జూచి యోదార్చుమనియు నర్థము)ఈపడమటిదిక్కు సంధ్యారాగముచే నెఱ్ఱనైనదై లత్తుకరసముచే గడుగబడినదిగను, కుఙ్కుమపఙ్కముచే నింపబడినదిగను, గాన వచ్చుచున్నది. కాన నది మిక్కిలి రమణీయమై యున్నది. అందువలన తొలుత దీనిని జూడుము. తర్వాత చంద్రోదయాదులచే శోభనొందెడి తూర్పుదెసను జూడ వచ్చునని యాశయము.

శ్లో. ఉచ్చైస్తరా దమ్బరశైలమౌలే
శ్చ్యుతోరవి ర్గైరికగణ్డశైలః ।
తస్యైవ పాతేన విచూర్ణితస్య
సన్ధ్యారజోరాజి రిహోజ్జిహీతే. ॥ 4

ప. వి. ఉచ్చైస్తరాత్ - అమ్బరశైలమౌలేః -చ్యుతః -రవిః - గైరికగణ్డశైలః- తస్య - ఏవ - పాతేన- విచూర్ణితస్య-సన్ధ్యారజోరాజిః - ఇహ-ఉజ్జిహీతే.

అర్థము: హే ప్రియే!= ఓ ప్రియురాలా! రవిః= సూర్యుడనెడి, గైరికగణ్డశైలః. గైరిక = గైరికమనెడి ధాతువునకు సంబంధించిన, గణ్డశైలః = కేవల శిలాపర్వతము లేదా పెద్దబండ, ఉచ్చైస్తరాత్ = మిక్కిలి యెత్తైనట్టి, అమ్బరశైలమౌలేః, అమ్బరశైల = ఆకాశమనెడి పర్వతముయొక్క, మౌలేః = శిఖరమునుండి, చ్యుతః = విడువబడినది, పాతేన = అట్లు పడుటచే, విచూర్ణితస్య = పొడిగా జేయబడిన, తస్యైవ = ఆపెద్దబండకు సంబంధించిన, సంధ్యారజోరాజిః, సంధ్యా = సంధ్యయనెడి, రజోరాజిః, రజ = పొడియొక్క, రాజిః = వర్గ్కి, ఇహ = ఈసాయంకాలమందు, లేదా పడమటివైనయందు, ఉజ్జిహీతే = పైకి ప్రసరించుచున్నది. అస్తమయ కాలమందు సూర్యుడెఱ్ఱగా నుండుటవలనను, నతడు ఆకాశమనెడి పర్వతము నుండి పడుటవలనను నతనికి గణ్డశైలత్వ మేర్పడినది. ఎత్తైన ప్రదేశము నుండి క్రిందపడిన పెద్దశిల చూర్ణమగుచున్నది. చూర్ణమైన దానిధూలి పైకి ప్రసరించుచున్నది. ఆధూలియే సంధ్యారాగమై పైకి ప్రసరించుచున్నదని యర్థము.

సమాసములు :

ఉచ్చైస్తరాత్ : అత్యన్త ముచ్చైః= ఉచ్చైస్తరః, తస్మాత్ = ఉచ్చైస్తరాత్.

అమ్బరశైలమౌలేః : అమ్బరమేవ శైలః= అమ్బరశైలః, అమ్బరశైలస్య మౌలిః= అమ్బరశైలమౌలిః, తస్మాత్ = అమ్బరశైలమౌలేః.

గైరికగణ్డశైలః : గైరికస్య గణ్డశైలః= గైరికగణ్డశైలః.

సంధ్యారజోరాజిః : రజసాం రాజిః = రజోరాజిః, సంధ్యైవ రజోరాజిః = సంధ్యారజోరాజిః.

**భావము :**

ఓప్రియురాలా! సూర్యు డనెడి గైరిక ధాతువునకు జెందిన యొక పెద్దశిలయాకసమనెడి పర్వతశిఖరమునుండి దిగువబడినదై చూర్ణమై పోయినది. ఆ చూర్ణమే పడమటిదెసయందు సంధ్యారాగమై పైకి ప్రసరించుచున్నది.

శ్లో. అస్తాద్రిచూడాలయ పక్కణాలి
చ్చేకస్య కిం కుక్కుట పేటకస్య ।
యామాన్తకూజోల్లసితైః శిఖౌఘైః
దిగ్వారుణీ ద్రాగరుణీ కృతేయమ్ ॥ 5

ప. వి, అస్తాద్రిచూడాలయ పక్కణాలిచ్చేకస్య - కిం - కుక్కుటపేటకస్య - యామాన్త కూజోల్లసితైః-శిఖౌఘైః - దిక్-వారుణీ - ద్రాక్-అరుణీ కృతా - ఇయమ్.

అర్థము: హేప్రియే = ఓప్రియురాలా!, అస్తాద్రి చూడాలయ పక్కణాలిచ్చేకస్య = అస్తపర్వతపు శిఖరమందలి శబరవాటికలయందు ఆసక్తిగల; కుక్కుట పేటకస్య, కుక్కుట = కోళ్ళయొక్క, పేటకస్య = సమూహముయొక్క, యామాన్తకూజోల్లసితైః, యామాన్త = జాముముగియునప్పటి, కూజా = కూతవలన, ఉల్లసితైః = ప్రకాశించెడి యనగా కొంచె మెత్తైనవై దాసాని పూవులతో సమానముగా ప్రకాశించెడి, శిఖౌఘైః, శిఖా = తలయందున్న యెఱ్ఱని కేసరములయొక్క, ఓఘైః = సమూహములచే, ఇయం = ఈ, వారుణీ = వరుణునికి సంబంధించిన, దిక్ = దెస, ద్రాక్ = వెంటనే, అరుణీకృతా కిం? = ఎఱ్ఱనిదిగా జేయబడినదా యేమి?

**సమాసములు :**

అస్తాద్రిచూడాలయపక్కణాలిచ్చేకస్య : అస్తాద్రేః చూడా = అస్తాద్రిచూడా, అస్తాద్రిచూడా ఆలయః యస్య సః = అస్తాద్రిచూడాలయః, అస్తాద్రిచూడాలయశ్చాసౌ పక్కణశ్చ = అస్తాద్రిచూడాలయపక్కణః,

అస్తాద్రిచూడాలయపక్కణస్య ఆలిః = అస్తాద్రిచూడాలయపక్కణాలిః, అస్తాద్రిచూడాలయపక్కణాలౌ ఛేకః = అస్తాద్రిచూడాలయపక్కణాలి చ్ఛేకః, తస్య = అస్తాద్రిచూడాలయపక్కణాలి చ్ఛేకస్య.

కుక్కుటపేటకస్య : కుక్కుటానాం పేటకం = కుక్కుటపేటకం, తస్య = కుక్కుటపేటకస్య.

యామాన్తకూజోల్లసితైః : యామస్య అన్తః = యామాన్తః, యామాన్తస్య కూజాః = యామాన్తకూజాః, యామాన్తకూజయా ఉల్లసితాః = యామాన్తకూజోల్లసితాః, తైః = యామాన్తకూజోల్లసితైః.

శిఖౌఘైః : శిఖానాం ఓఘాః = శిఖౌఘాః, తైః = శిఖౌఘైః.

వారుణీ : వరుణస్య ఇయం = వారుణీ.

అరుణీకృతా : అనరుణా అరుణా సమ్పద్యమానా కృతా = అరుణీ కృతా.

**భావము :**

ఓ ప్రియురాలా! అస్తపర్వతశిఖరమున నెలకొనిన శబరవాటికలయందు ఆసక్తిగల కోళ్ళు జాముముగియునపుడు ప్రకృతము సాయంకాలమునందు కూయునపుడు నిక్కబెట్టబడిన నెత్తిపైని యెఱ్ఱనిజూలుచే పడమటిదిక్కును వెంటనే యెఱ్ఱబరుచుచున్నవి. సూర్యుడస్తమించు సమయమునందు అస్తాద్రియందు నెల కొనిన శబరవాటికయందున్న కోళ్ళగుంపు నాలవజాము ముగియుటవలన తమతలల పైని యెఱ్ఱనిజుట్టును నిక్కించి కూయుచుండగా వాని యెఱ్ఱనిజూలుచే పడమటివెస యెఱ్ఱబారుటయే సంధ్యారాగముగా భావింపబడినది.

శ్లో. పశ్య ద్రుతాస్తంగతసూర్యనిర్య
త్కరావలీహైఙ్గులవేత్రయాఽత్ర ।
నిషిధ్యమానాఽహని సంధ్యయాఽపి
రాత్రిప్రతీహారపదేఽధికారమ్ ॥ 6

ప. వి. పశ్య - ద్రుతాస్తంగతసూర్యనిర్యత్కరావలీహైఙ్గులవేత్రయా - అత్ర - నిషిధ్యమానాఽహని - సన్ధ్యయా-అపి, రాత్రి ప్రతీహారపదే - అధికారమ్.

**అర్థము:** ద్రుతాస్తంగత సూర్యనిర్యత్కరావలీ హైఙ్గులవేత్రయా, ద్రుత = శీఘ్రముగా, అస్తంగత = అస్తమించిన, సూర్య = సూర్యునినుండి, నిర్యత్ = వెల్వడు, కరావలీ = కిరణపరమ్పరయనెడి. హైఙ్గుల = హింగులమనెడి వస్తువుచే రంగువేయఁబడిన, వేత్రయా = బెత్తముగల్గిన, సంధ్యయా = సంధ్యచే, అత్ర = ఈ సాయంకాలమందు, నిషిధ్యమానాహని; నిషిధ్యమాన = నిషేధింపబడుచున్న, అహని = పగలు గలిగిన. రాత్రిప్రతీహారపదే, రాత్రి = చంద్రుని భార్యయైన రాత్రియనెడి నాయికకు సంబంధించిన, ప్రతీహార = ద్వారపాలకునియొక్క, పదే = స్థానమందు, అధికారమపి = అధికారమును సైతము, పశ్య = చూడుము.

**సమాసములు :**

ద్రుతాస్తంగతసూర్యనిర్యత్కరావలీహైఙ్గులవేత్రయా : ద్రుతం = అస్తంగతః = ద్రుతాస్తంగతః, ద్రుతాస్తంగతశ్చాసౌ సూర్యశ్చ = ద్రుతాస్తంగతసూర్యః. ద్రుతాస్తంగతసూర్యాత్ నిర్యన్తః = ద్రుతాస్తంగతసూర్యనిర్యన్తః, ద్రుతాస్తంగతసూర్యనిర్యన్తశ్చ తే కరాశ్చ = ద్రుతాస్తంగతసూర్యనిర్యత్కరాః, ద్రుతాస్తంగతసూర్యనిర్యత్కరాణాం ఆవలీ = ద్రుతాస్తంగతసూర్యనిర్యత్కరావలీ, హింగులయారక్తం = హైఙ్గులం, హైంగులం చ తత్ వేత్రం చ = హైఙ్గులవేత్రం, ద్రుతాస్తంగతసూర్యనిర్యత్కరావల్యేన హైఙ్గులవేత్రం యస్యాః సా = ద్రుతాస్తంగతసూర్యనిర్యత్కరావలీ హైఙ్గులవేత్రా, తయా = ద్రుతాస్తంగతసూర్యనిర్యత్కరావలీహైఙ్గులవేత్రయా.

నిషిధ్యమానాహని : నిషిధ్యమానః అహః యస్మిన్ తత్ = నిషిధ్యమానాహః, తస్మిన్ = నిషిధ్యమానాహని.

రాత్రిప్రతీహారపదే : రాత్రేః ప్రతీహారః = రాత్రిప్రతీహారః, రాత్రిప్రతీహారస్య పదం = రాత్రిప్రతీహారపదం, తస్మిన్ = రాత్రిప్రతీహారపదే.

**భావము :**

సూర్యుఁడస్తమించగనే వెల్వడునట్టి కెంజాయగల కిరణములు హింగుళమను ద్రవ్యముచే రంగువేయబడిన బెత్తములవలె నున్నవి. అట్టి బెత్తములను

చేయూనిన సంధ్య, చంద్రుని భార్యయగు రాత్రియనెడి నాయికకు పగటిని ప్రవేశింపనీయక నిషేధించెడి ద్వారపాలకురాలుగా నియమింపబడినది. స్త్రీలకు స్త్రీయే ద్వారపాలికగా నియమింపబడుట యుక్తముగదా! ద్వారపాలికకు చేత బెత్తముండునుకదా? కాన సంధ్యయను స్త్రీ రాత్రినాయికకు ద్వారపాలికయొక్క యధికారమును వహించి సూర్యకిరణమనెడి యెఱ్ఱనిబెత్తము చేబూని తన నియోగమును నిర్వహించుచున్నదని యర్థము. "తిర్యక్కర" యను పాఠాన్తరము ననుసరించినచో అడ్డముగానున్న కిరణములని యర్థము. సూర్యకిరణములు సాయంకాలమున నడ్డముగానుండుట ప్రసిద్ధము. బెత్తముకూడా నెవరినిలోనికి రానీయక యడ్డముగా బెట్టబడును. అనగా సూర్యు డస్తమించెను. పగలు గడచినది. రాత్రి యేతెంచినది అని సూచితము.

శ్లో. మహానటః కిం ను పభానురాగే
సంధ్యాయ సంధ్యాం కునటీమపీశాం ।
తనోతి తన్వా వియతాఽపి తార
శ్రేణిస్రజా సాంప్రత మఙ్గహారమ్॥ 7

ప. వి. మహానటః - కిం - ను - సభానురాగే - సంధ్యాయ - సంధ్యాం - కునటీం - అపి-ఈశాం - తనోతి - తన్వా - వియతా - అపి - తార శ్రేణిస్రజా - సాంప్రతం - అఙ్గ - హారమ్.

అర్థము: అఙ్గ = ఓ ప్రియమైన దమయన్తీ! మహాన్ = సంధ్యోపాసనాదులయందు మిక్కిలి శ్రేష్ఠమును, అటః = నడచుచున్న సాయంకాలము, లేదా, మహానటః, మహా = గొప్పవాడగు పరమేశ్వరుడే, నటః = నటుడుగా గలిగిన, (సాయంకాలమువందు శివుడు నృత్యము చేయునుగదా!) సః = ప్రకృతమైన సాయన్తనసంధ్యాకాలము, భానురాగే, భాను = సూర్యునికి, రాగే సతి = ఎఱ్ఱదన మేర్పడగా (అస్తమయమైన పిదప సూర్యుని ఎఱ్ఱదనము మాత్రమే మిగిలియుండగా కొంచెము పసుపువన్నెయు నెఱుపువన్నెయు గలిగిన) సంధ్యాకాల మనెడి, కునటీం = మనశ్శిలారూపము గలిగిన, (తథా = అట్లే) ఈశా మపి = తన కాలునికి(కాలమునకు) స్వామినియును

మరియును పితృదేవతలకు దల్లిగను బ్రహ్మకు దేహముగను నుండుట వలన దేవతారూపముగలదియును (సమృద్ధిగలదియును) నగు నా సంధ్యను, సంధ్యాయ = చక్కగా ధ్యానించి లేదా ఆలోచించి, సాంప్రతమ్ = ఇపుడు, తన్వా = కృశించిన, (కొంచెము వెలికివచ్చుట చేతగాని సంధ్యారాగముచే గప్పబడిన కాంతిగలిగియుండుటచేతకాని) వియతాపి = గగనరూపముగలదియును ననగా గగనము నంతటిని వ్యాపించినదియును లేదా, అవియతా, ఆ = సమగ్రముగా వ్యాపింపబడిన, వియతా = ఆకసము గలదియునునసు, తారశ్రేణిస్రజా, తారశ్రేణి = నక్షత్రపంక్తి యనెడి, స్రజా = పుష్పమాలచే, హారం = హారమును, తనోతి కిం ను = రచించుచున్నదా యేమి? లేదా, తారశ్రేణిస్రజా, తార = శుద్ధములగు మౌక్తికములయొక్క, శ్రేణి = పఙ్క్తిగలిగిన, స్రజా = మాలచే, సంధ్యా = సంధ్యాకాలము, సంధ్యాయ = హారము చేయుట యుక్తమని ఆలోచించి, నక్షత్రపరంపరనే, హారం = హారముగా, తనోతి కిం ను = చేయుచున్నదా యేమి? అనగా సంధ్యా రాగము కొంచెము మిగిలియున్నదని యర్థము. ముత్తెములతో సమానము లగు నక్షత్రములు కొంచెము కనబడజొచ్చిన వని యర్థము. సన్నని నక్షత్రములచే గూడిన గగనముచే హారము చేయునట్లున్నదని గాని యర్థము. ఇటువంటి సంధ్యను గాంచి యూరక యుండలేదు. మఱేమనగా నౌచిత్యము ననుసరించి విశిష్టమగు నక్షత్రపఙ్క్తియనెడి మాలచే హార మునుగూడ జేయుచున్నదని గాని "అపి" శబ్దార్థము. మఱియు, సః = ఆప్రసిద్ధుడగు, మహానటః = తాండవనృత్తమును చేయునట్టి శివుడు, భానురాగే సతి = సూర్యునికి నెఱ్ఱదన మేర్పడగా ననగాసూర్యునియొక్క, నర్ధభాగమ స్తమింపగా నా సంధ్యాసమయమందు మనశ్శిలతో సమానమగు రంగుగలదియు కొలదికాలమే యుండుటవలన, కునటీం = కుత్సిత నర్తకీ రూపముగల, ఈశాం = దేవియగు, సంధ్యాం = సంధ్యను, సంధ్యాయ = చక్కగా ధ్యానము గావించి, యనగా సాయంసంధ్యావందనమును గావించి యెనిమిది విధములగు మూర్తులందు తారాపంక్తియే మాలగా గలిగిన యా మూర్తమైన గగనరూపమైన మూర్తితో నిపుడు సంధ్యా

స్పందనము గావించి విదప, అఙ్గహారం = ముఖము, హస్తములు, ప్రక్కలు మున్నగు నవయవములను తాలమునకు సమానముగా, తనోతి కిం = విసురుచున్నాడాయేమి? యని యర్థము. అమూర్తమగు నాకసము నఙ్గహారముగా జేయుట చిత్రముకాన నీవిరోధమును 'అపి' శబ్దము సూచించుచున్నది. కేవలము చంద్రుడు సర్పములు మున్నగువానితో భూషింపబడిన శరీరముతో యఙ్గహారము చేయుటలేదు. మరేమనగా నష్ట మూర్తులలో నొక్కటైన గగనమూర్తితోడను నఙ్గహారము చేయుచున్నా డనెడి సముచ్చయార్థము కాని అపిశబ్దమునకు చెప్పవలయును. ఈశ్వరుడు సాయంకాలమునందు నృత్యము చేయును. భానురాగే = సూర్యునికెంజాయ వ్యాపింపగా మనశ్శిలతో సమానమగు రంగుగల, సంధ్యామపి = సంధ్యా రూపమును గలిగిన, ఈశాం = తన సహచరియగు పార్వతిని, సంధ్యాయ = ఆలోచించి విశిష్టమైన గగనరూపమగు దేహముతోడనే నఙ్గ హారముగను గావించుచున్నాడు. పార్వతియెదుట కూడా శివుడు నాట్యము చేయును. మరియు, మహాన్ = మిక్కిలిప్రవీణత గలిగిన, నటః = నటుడు, కునటీం = అసమర్థురాలగు నటిని, సంధ్యాం = వయస్సంధి యందున్న దానిని లేదా రసభావములసంధి యందున్నదానిని లేదా రసభా వముల నెఱింగినదానిని, సభానురాగే = సభయొక్క, యనురాగమందు ననగా సభారంజనమునందు, ఈశాం = సమర్థమైనదానినిగా సంధ్యాయ = ఆలోచించి, వియతా = ఆకసముతో సమానముగా నతివిశాలమైన, తార శ్రేణిస్రజా = మిక్కిలిశుద్ధములగు ముత్తెముల పరంపరయొక్క, రూపము గలిగిన మాలతో గూడిన, తన్వా = శరీరముతో నఙ్గహారమును, తనోతి = చేయుచున్నాడు. (ఇది) అసాంప్రతం కిం? = అయుక్తమా యేమి? కాని యది యుక్తమే. ఏలయనగా రసభావములను గల్గించెడి యామెచే సభా రంజన మేర్పడినను నాట్యమందలి నేర్పుచేతను చక్కగా రంజన మేర్పడుటకు స్వయముగా నఙ్గహారమును జేయుట యుక్తమేగదా! మఱియు మహానర్తకుడు, సంధ్యాం = వయస్సంధియందుగాని రసభావసంధియందు గాని, యున్నదియును నష్టై సమృద్ధిగలదియును నగు స్త్రీని, కునటీం = నాట్యముతెలియనిదానినిగా, సంధ్యాయ = తెలిసికొని, సభానురాగే =

సభారంజనమును నిమిత్తముగావించుకొని విశిష్టమగు, తన్వా = దేహముతో తాను, అఙ్గహారం = అఙ్గవిన్యాసమును, తనోతి = చేయుట యనునది, అసాంప్రతం కిం ను = అయుక్తమా యేమి? కాని అయుక్తము గాదు. కాని యామెకు నాట్యకౌశలము లేనందువలన సభను రంజింపజేయుట యందు సామర్థ్యములేదు గాన సభను రంజింపచేయుటకై స్వయముగనే నేర్పుతో నాట్యము గావించుట యుక్తమే గదా!

మఱియు

మహాన్ = అతిసమృద్ధిగల మరియొకడు, అటః = అంతట దిరుగుచున్న, చపలుడగు విటుడై, కునటీమపి = నృత్యవిద్యయందు నేర్పులేనిదైనను, భానురాగే, భా = శరీరకాంతిచే, అనురాగే = అనురంజన విషయమందు, ఈశాం = సౌందర్యాతిశయము చేతనే రంజింపజేయుటయందు సమర్థురాలైన దానినిగను, సంధ్యాం = బాల్యయౌవనవయస్సుల సంధియందున్న దానినిగను లేదా రసభావసంధియందున్న దానినిగను, లేదా రసభావములను దెలిసిన దానినిగను, సంధ్యాయ = దేహకాంతిచే రంజింపచేయగలిగినపుడు కునటిని సైతము రసభావములను దెలిసిన దానినిగను నమ్ప్రున్నరాలుగను నాలోచించి, యామె శరీరము గగనమువలె విస్తీర్ణముగా నుండుటవలన, తారశ్రేణిస్రజా = శుద్ధములగు ముత్తెముల మాలచే, హారం = హారమును, తనోతి = ఆమెయందనురక్తుడై యిచ్చుచున్నాడని యర్థము. ఈవిధముగా పెక్కు విధములగు నన్వయములున్నవి. వానిని పండితు లూహించుకొన వలయును.

## సమాసములు :

మహానటః : మహాంశ్చాసౌ నటశ్చ = మహానటః.

అటః : అటతీతి = అటః.

సభానురాగే: సభాయాః అనురాగః = సభానురాగః. తస్మిన్ = సభానురాగే

భానురాగే : భానోః రాగః = భానురాగః, తస్మిన్ = భానురాగే. లేదా భయా అనురాగః = భానురాగః, తస్మిన్ = భానురాగే.

సంధ్యామ్ : సంధౌ భవా = సంధ్యా, తాం = సంధ్యామ్.

కునటీం : కుత్సితా చ సా నటీ చ = కునటీ, తాం = కునటీమ్.

తారశ్రేణిస్రజా : తారాణాం శ్రేణిః = తారశ్రేణిరేవ స్రక్ = తారశ్రేణి స్రక్, తయా = తారశ్రేణిస్రజా.
అసాంప్రతం : న సాంప్రతం = అసాంప్రతం.
అఙ్గహారం : అఙ్గానాం హారః = అఙ్గహారః, తం = అఙ్గహారం.

**భావము :**

ఇపుడు సంధ్యయొక్కయు నక్షత్రములయొక్కయు సంయోగమును కవి వర్ణించుచున్నాడు. ఓ ప్రేయసీ! సంధ్యోపాసనాదులకు ప్రశస్తమై గమన శీలముగల యీసాయంకాలము లేదా మహానటుడగు శివునితో గూడిన యీసాయం సంధ్యాకాలము, అస్తమయముకాగనే సూర్యునియెఱ్ఱదనము శేషించి యుండగనే నించుక యెఱ్ఱదనము నించుక పసుపువన్నెగలిగిన మనశ్శిలారూపమును వహించిన దానినిగను తనకాలునకు యజమానురాలుగను "సాయం సంధ్యా పితృప్రసూః" అనిచెప్పిన చొప్పున పితృదేవతలకు తల్లిగను బ్రహ్మకుదేహముగను నైనదానిని గను మరియు నైశ్వర్యసమ్పన్నమైనదానినిగను సంధ్యాకాన్తిని జక్కగా నాలోచించి యిప్పుడు కొంచెము వెలికివచ్చుట చేతగాని లేదా సంధ్యారాగముచే మరుగుపడిన కాంతిని గల్గియుండుటచేతగాని కొంచెము కొంచెము గానవచ్చెడిదియు నాకసము నంతటిని వ్యాపించినదియు నగు నక్షత్రపరమ్పరయనెడి పుష్పమాలచే హారము చేయుచున్నదా యేమి? అనగా సాయంకాలము హారమును జేయుచున్నదా యేమి? సాయంకాలమున శివుడు తాండవము చేయుట ప్రసిద్ధముగదా, సాయంసంధ్య, యస్తమించు సూర్యరాగముచే నించుక పసుపు నించుక యెఱుపునగు వన్నెల నలదుకొని కాలమునకు నీశ్వరియు పితృదేవతలకు తల్లియు నగుటచేతను, బ్రహ్మకు దేహమగుటచేతను దేవతాస్వరూపయై మహానటుడగు శివుని కర్ధాంగియై శివునితోడ నృత్యము చేయుచుండగా నావిషయమును గ్రహించి, సమయపురుషు డామెకు నాకసమున విస్తరించిన నక్షత్రపఙ్క్తి యనెడి పుష్పమాలచే హారమును చేయుచున్నాడా యేమి యనునట్లు సంధ్యాకాలనక్షత్రసంబంధము కానవచ్చుచున్న దని యాశయము. లేదా శుద్ధపుముత్తెముల మాలచే హారమును జేయుట యుచితమని భావించి సంధ్యాసమయము పైవిధముగా సంధ్యాదేవినిగూర్చి యాలోచించి నక్షత్ర పఙ్క్తియనెడి మాలచే గూడిన యాకసముతో హారమును జేయుచున్నదా యేమి? యనిగాని యర్థము. అనగా సంజకెంజాయకొంతశేషించి యున్నది. ముత్తెముల వంటి నక్షత్రములు కొంచెముగా గానవచ్చుచున్నవనియు నర్థము.

మఱియు ప్రసిద్ధుడును నటరాజునునగు నాతాణ్డవనృత్యము చేసెడి శివుడు సూర్యుని యర్ధభాగము నస్తమింపగనే యాసంధ్యాసమయమందు మనశ్శిలతో సమానమగు వర్ణముగల్గినదియు సంధ్యయగుట వలన కొలదికాలమే యుండుటచే, కుత్సితమగు నర్తకియొక్క రూపమును గలిగినదియునగు సంధ్యాదేవిని చక్కగా ధ్యానించి యనగా సంధ్యావన్దనము గావించి పృథివ్యాద్యష్టమూర్తులయందు తారా పజ్త్కనే మాలగా గలిగిన యాకాశమనెడి యమూర్తమగు దేహముతో నివుడు సంధ్యావన్దనము గావించిన తరువాత నఙ్గహారము ననగా హస్తములు పాదములు ప్రక్కలు మున్నగు నవయవములను నాట్యావశమున తాలమునకు సమానముగా విసురుచున్నాడా యేమి! యని యుత్ప్రేక్ష. అమూర్తమగు నాకసమును నఙ్గహార ముగా జేసికొనుట విరుద్ధమని "అపి" శబ్దము సూచించుచున్నది. లేదా కేవలము చంద్రుడును సర్పశరీరములు మున్నగు వానితో భూషింపబడిన శివుడు అఙ్గహార మును జేయుటలేదు. మఱేమనగా ఆకాశరూపమగు శరీరముతోడను నంగహారమును జేయుచున్నాడని సముచ్చయార్థముగాని చెప్పవలయును. ఈశ్వరుడు సాయంకాల మున నాట్యమును జేయును. సూర్యుని యొఱ్ఱదనమునందు మనశ్శిలతో సమాన మగు వర్ణముగలిగిన సంధ్యనుసైతము ఈశ్వరియును తనకు సహచరియగు పార్వతిగా భావించి విశిష్టమగు నాకాశరూపమగు మూర్తితోడను నఙ్గహారమును చేయుచున్నాడు. పార్వతియొక్క యెదుటను శివుడు నృత్యము చేయును.

మఱియు మిక్కిలి ప్రావీణ్యముగల నటుడు కుసటిని అనగా- నాట్య మందు చాతుర్యములేనిదైనను వయస్సంధియందున్న యువతిని లేదా రసభావసంధి యందున్న దానిని లేదారసభావముల నెరిగినదానిని కావుననే సభారంజనమందు సమర్థురాలుగా భావించి యాకాశమనెడి మిక్కిలి విశాలమగు శుద్ధములగు ముత్తెములవరుస యనెడి మాలతో గూడిన శరీరముతో నఙ్గహారమును జేయుట యనగా కాలు సేతులు మున్నగు నవయవముల నాట్యావశమున విసురుట యయుక్తమా యేమి? కాని యయుక్తము కానేరదు. ఏలయనగా రసభావాదులను గల్గించెడి యామె సభ్యులను రంజింపచేసినను నాట్య క్రియయందలి చాతుర్యముచేతను సభ్యులను రంజింపజేయుటకు తాను అఙ్గ హారముజేయుట యుక్తమనియే యర్థము.

మరియు గొప్పనటుడు వయస్సంధియందు కాని, రసభావసంధియందు కాని యున్నదియు, నైశ్వర్యవతియు నగుస్త్రీని నాట్యము తెలియనిదని తెలిసికొని

సభను రంజింపజేయుటకై విశిష్టమగు శరీరముతో స్వయముగా నంగహారము చేయుట యయుక్తమా యేమి? కాని యామెకు నాట్యచాతుర్యము లేనందువలన నాట్యముచే సభారంజనము గావించుటయందు శక్తి లేకపోవుటచే సభారంజనము నకై తానే చక్కగా నాట్యము చేయట యుక్తమనియే యర్థము.

మరియు గొప్పయైశ్వర్యమును కలిగి యత్రిప్రసిద్ధినొందిన ఒక విటుడు అంతట తిరుగుచు నతిచపలుడై నాట్యమందు నేర్పులేనిద్రైనను శరీర కాంతితో ననగా సౌందర్యాతిశయముచే ననురంజనము చేయుచు బాల్య యౌవన వయస్సులసంధియం దున్నదై, యౌవనవతియును, రసభావసంధియం దుండుట వలన రసభావముల నరసినదియునగు దానినిగా భావించి యామె తన శరీర కాంతిచేతనే యనురంజనము గావించుటవలన కునటియైనను రసభావముల నెరిం గిన దగుటవలనను సమ్పన్నురాలగుటవలనను విశాలమగు నామెయొక్క శరీ రముపై ననురక్తుడై శుద్ధములగు ముత్యములమాలచే నామెకు హారమును గూర్చు నుగదా!

ఇట్లు పెక్కువిధములగు నన్వయములను పండితులు ఊహింపవలయును.

శ్లో॥ భూషాస్థిదామ్న స్త్రుటితస్య నాట్యాత్
పశ్యోడుకోటీకపటం వహద్భిః ।
దిఙ్మణ్డలం మణ్డయతీహ ఖణ్డైః
సాయంనట స్తారకరాట్కిరీటః॥ 8

ప. వి. భూషాస్థిదామ్నః - త్రుటితస్య - నాట్యాత్ - పశ్య- ఉడుకోటీకపటం- వహద్భిః - దిఙ్మణ్డలం - మణ్డయతి - ఇహ - ఖణ్డైః - సాయంనటః - తారకరాట్కిరీటః.

అర్థము: హే భైమి!—ఓదమయన్తీ, తారకరాట్కిరీటః, తారకరాట్ = చంద్రుడే, కిరీటః—కిరీటముగా గలిగిన శివుడు, సాయంనటః = సాయంకాలపు నర్తకుడై, నాట్యాత్ = ఉద్ధతమగు నాట్యమువలన, త్రుటితస్య = తెగిన, భూషాస్థిదామ్నః, భూషా = భూషణమైన, అస్థిదామ్నః = బొమికల

మాలకు సంబంధించిన, ఖణ్డైః = తునుకలనెడి, ఉడుకోటీకపటం, ఉడు కోటీ = నక్షత్రముల కోటిసంఖ్య యనెడి, కపటం = నెపమును, వహద్భిః = వహించుచున్నవానిచే, ఇహ = ఈసాయంకాలమందు, దిఙ్మణ్డలం = దిక్చక్రమును, మణ్డయతి = అలంకరించుచున్నాడు, పశ్య = చూడుము, ఇవి నక్షత్రములు కావు. ఇవి తాణ్డవముచే తెగిన బొమికలమాల నుండి యెగిరిపోయిన ముక్కలే దిక్కులయందు శోభించుచున్నవనియర్థము. చన్ద్రునితో సమానమగు కిరీటముగల యొకనటుడు నాట్యకాలమునందు తెగిపోయిన హారమందలి ఖండములచే స్త్రీసమూహమును అలంకరించును కదా! ఇచ్చట "మణ్డయతీహ" యను పాఠమునకు బదులు "మణ్డయతీవ" అనుపాఠము ననుసరించినచో నుత్ప్రేక్షాలంకార మగును. దిక్కుల నలంకరింపక పోయినను దిక్కుల నలంకరించినట్లే చెప్పుటవలన నది యుత్ప్రేక్ష యగుచున్నది.

సమాసములు :

భూషాస్థిదామ్నః : అస్థ్నాం దామ = అస్థిదామ, భూషైవ అస్థిదామ = భూషాస్థిదామ, తస్య = భూషాస్థిదామ్నః.

ఉడుకోటీకపటం : ఉడూనాం కోటీ = ఉడుకోటీ, ఉడుకోట్యాః కపటః = ఉడుకోటీకపటః. తం = ఉడుకోటీకపటమ్.

దిఙ్మణ్డలం : దిశాం మణ్డలం = దిఙ్మణ్డలం, తత్ = దిఙ్మణ్డలం.

సాయంనటః : సాయం నటః = సాయంనటః.

తారకరాట్కిరీటః : తారకాణాం రాట్ = తారకరాట్, తారకరాట్ కిరీటం యస్య సః = తారకరాట్కిరీటః.

భావము :

ఓదమయన్తీ! చంద్రుని కిరీటముగా వహించిన శివుడు సాయంకాలపు నటుడై తన తాణ్డవమందు తెగిన యెముకలమాలనుండి యెగిరిపడినవియు, నక్షత్ర ముల కోటిసంఖ్య యనెడి నెపమును వహించిన ముక్కలచే దిక్కులను స్త్రీల

సమూహము నలంకరించుచున్నాడు. సాధారణనటుడుకూడా నాట్యసమయమందు తెగిన తనహారమునుండి యెగిరిపడిన ముత్తెములు మున్నగువాని ఖండములచే దవ సహచరులగు స్త్రీల నలంకరించును గదా!.

శ్లో. కాలః కిరాతః స్ఫుటపద్మకస్య
వధం వ్యధాద్యస్య దినద్విపస్య।
తస్యైవ సన్ధ్యారుచిరాస్రధారా
తారాశ్చ కుమ్భస్థలమౌక్తికాని॥ 9

వ. వి. కాలః - కిరాతః - స్ఫుట పద్మకస్య - వధం - వ్యధాత్ - యస్య - దినద్విపస్య - తస్య - ఏవ - సన్ధ్యా - రుచిరా - అస్రధారా - తారాః - చ - కుమ్భస్థలమౌక్తికాని.

అర్థము: హే ప్రియే! = ఓ ప్రియురాలా, కాలః = సంధ్యాకాల మనెడి, కిరాతః = బోయవాడు, మరియు, కాలః = నల్లనివాడును, లేదా మృత్యురూపమైన యముడనెడి, కిరాతః = పర్వతములయందును గొప్పయడవులయందును సంచరించెడి బోయవాడు, స్ఫుటపద్మకస్య, స్ఫుట = వికసించిన, పద్మ = కమలములు, కం = జలములు గలిగిన, మరియు, స్ఫుటపద్మకస్య స్ఫుట = ప్రకటితములగు, పద్మక = (తొండముల కొనలలోని) ఎర్రని బిందువులు కలిగిన, దినద్విపస్య, దిన = పగలనెడి, ద్విపస్య = ఏనుగు యొక్క, వధం = వధను, వ్యధాత్ = చేసెను, రుచిరా = రమ్యమైన. సంధ్యా = సంధ్య, తస్యైవ = ఆయేనుగుయొక్కయే, అస్రధారా = రక్తధార, తారాశ్చ = నక్షత్రములును, తస్యైవ = ఆయేనుగుయొక్కయే, కుమ్భస్థలమౌక్తికాని, కుమ్భస్థల = కుమ్భస్థలమునందలి, మౌక్తికాని = ముత్తెములు.

**సమాసములు :**

స్ఫుటపద్మకస్య : స్ఫుటాని పద్మాని యస్మిన్ సః = స్ఫుటపద్మకః, తస్య = స్ఫుటపద్మకస్య, లేదా, స్ఫుటాని పద్మాని యస్మిన్ తత్ = స్ఫుటపద్మం, స్ఫుట పద్మం జలం యస్మిన్ సః = స్ఫుటపద్మకః.

తస్య = స్ఫుటపద్మకస్య, లేదా, స్ఫుటాని పద్మకాని యస్మిన్ సః = స్ఫుటపద్మకః, తస్య = స్ఫుటపద్మకస్య.

దినద్విపస్య : దినమేవ ద్విపః = దినద్విపః, తస్య = దినద్విపస్య.

అస్రధారా ; అస్రాణాం ధారా = అస్రధారా.

కుమ్భస్థలమౌక్తికాని : కుమ్భ ఇతి స్థలం = కుమ్భస్థలం. కుమ్భస్థలే మౌక్తికాని = కుమ్భస్థల మౌక్తికాని.

**భావము :**

సంధ్యాకాల మనెడి కిరాతుడు లేదా నల్లని మృత్యుస్వరూపుడై కొండల యందును గొప్ప యరణ్యములయందును సంచరించెడి బోయవాడు వికసిత పద్మములతో కూడిన యుదకములుగల పగ లనెడి యేనుగును జంపగా సంధ్యారాగము దాని రక్తధారగను, నక్షత్రములు దాని కుంభస్థలమువందలి ముత్తెములుగను నేర్పడినవి.

శ్లో. సంధ్యాసరాగః కకుభో విభాగః
శివావివాహే విభునాఽయమేవ ।
దిగ్వాససా పూర్వ మవైమి పుష్ప
సిన్దూరికాపర్వణి పర్యధాయి. ॥ 10.

ప. వి. సంధ్యాసరాగః - కకుభః - విభాగః - శివావివాహే - విభునా - అయమ్ - ఏవ - దిగ్వాససా - పూర్వమ్ - అవైమి - పుష్పసిన్దూరికాపర్వణి - పర్యధాయి.

అర్థము : విభునా = ప్రభువైన శివునిచే, పూర్వం = పార్వతీవివాహకాల మందు, సంధ్యాసరాగః, సంధ్యా = సంధ్యచే, సరాగః = రక్తవర్ణము నొందిన, అయమేవ = ఈ, కకుభః = పడమటిదిక్కుయొక్క, విభాగః = ప్రదేశము, పుష్పసిన్దూరికాపర్వణి, పుష్ప = పుష్ప వర్ణముతో కూడిన, సిన్దూరికా = ఎఱ్ఱనివలువకు సంబంధించిన, పర్వణి = ఉత్సవమునందు, అనగా వివాహచతుర్థదివసమందలి పుష్పసిందూరిక యనెడి యుత్సవమునందు. పర్యధాయి = ధరింపబడినది.

యతః = ఏలయనగా, దిగ్వాససా, దిక్ = దిక్కులను, వాససా = వస్త్రముగా గలిగినశివునిచే, రక్తవస్త్రమును ధరింపవలసిన యవసరమందు ఔచిత్యము ననుసరించి రక్తవర్ణము గల దిక్ప్రదేశమే ధరింపబడినది. ఇతి = అని, అవైమి = తెలుసుకొనుచున్నాను.

సమాసములు :

సంధ్యాసరాగః: రాగేణ సహ వర్తత ఇతి = సరాగః, సంధ్యాయా సరాగః = సంధ్యాసరాగః.

శివావివాహే : శివాయాః వివాహః = శివావివాహః, తస్మిన్ = శివావివాహే.

దిగ్వాససా : దిశః వాసః యస్య సః = దిగ్వాసాః, తేన = దిగ్వాససా.

పుష్పసిన్దూరికాపర్వణి : పుష్పవర్ణయుక్తా సిన్దూరికా = పుష్పసిన్దూరికా, పుష్పసిన్దూరికా ఇతి పర్వ = పుష్పసిన్దూరికాపర్వ, తస్మిన్ = పుష్పసిన్దూరికాపర్వణి.

భావము :

శివునితో పార్వతి వివాహము జరుగుచున్న సమయమునందు, ఆవివాహమునకు నాల్గవ దినమునందు జరుపవలసిన పుష్పసిన్దూరికామహోత్సవమునందు వరుడు మొదటిదినమునందు ధరించిన వలువలను ఉతుకుటకై వదిలివేసి కౌసుమ్భవర్ణము గల వస్త్రములను ధరింపవలసివచ్చినపుడు, దిగమ్బరుడు అనగా దిక్కులనే వస్త్రముగా గల్గిన శివుడు, సంధ్యారాగముచే ఎఱ్ఱనైన పడమటిదిక్కునే వస్త్రముగా ధరించెనని నేను తలంతును. పుష్పసిందూరికలోని పుష్పములస్థానమున నక్షత్రములును, సిందూరికాస్థానమున సంధ్యారాగముతో గూడిన పశ్చిమదిశయు గ్రహింపబడినవని భావము.

శ్లో. సతీ ముమా ముద్వహతా చ పుష్ప
సిందూరికార్థం వసనే సునేత్రే ।
దిశౌ ద్విసంధీ మభిరాగశోభే
దిగ్వాససోభే కిమలమ్భిషాతామ్ ॥ 11

ప. వి. **సతీం** - **ఉమాం** - ఉద్వహతా - చ - పుష్పసిందూరికార్థం - వసనే - **సునేత్రే** - దిశౌ - ద్విసంధిం - అభిరాగశోభే - దిగ్వాససా - **ఉభే** - **కిం** - అలమ్భిషాతామ్.

**అర్థము:** హే సునేత్రే = ఓ సునయనా!, **సతీం** = దాక్షాయనియైన సతిని, **ఉమాం చ** = **పార్వతిని**, ఉద్వహతా = **వివాహమాడుచున్న** దిగ్వాససా = దిగమ్బరుడైన శివునిచే, ముందు చెప్పిన పుష్పసిందూరి కకై, ద్విసంధీమభి = రెండైన ప్రాతస్సాయంసంధ్యల నుద్దేశించి, **దిశౌ** = రెండైన తూర్పుపడమరదిక్కులు, రాగశోభే, రాగ = వర్ణముచే, **శోభే** = **శోభ** గల్గిన, ఉభే = రెండైన, వసనే = వస్త్రము లుగా, **అలమ్భిషాతాం, కిం?** = **పొందబడినవా యేమి? శివునకు పార్వతి** యొక్క రెండుజన్మలయందును, రెండువివాహములు జరిగినవి. **అరెండు** వివాహములయందును **ప్రాతస్సాయంసంధ్యలచే** రంగువేయబడిన ప్రాక్ **పశ్చి**మదిక్కులు రెండును దిగమ్బరుడగు **శివునకు** రెండువస్త్రములుగా నేర్పడినవని నేను తలంతునని యర్థము.

సమాసములు :

పుష్పసిన్దూరికార్థం : పుష్పయుక్తాసిన్దూరికా = పుష్పసిన్దూరికా, పుష్పసిన్దూరికాయై = పుష్పసిన్దూరికార్థం.
సునేత్రే : **శోభనే** నేత్రే యస్యా స్సా = సునేత్రా, తస్యా సంబుద్ధి = **హే సునేత్రే.**
ద్విసన్ధిం : ద్వయోః సన్ధ్యోః సమాహారః = ద్విసన్ధీ, **తాం** = ద్విసన్ధిం.
రాగశోభే : రాగేణ శోభా యయో స్తే = రాగశోభే.
దిగ్వాససా : దిశః వాసః యస్య సః = దిగ్వాసాః, తేన = దిగ్వాససా.

**భావము :**

ఓ సునయనా! దమయన్తీ! **శివుడు** దక్షపుత్రికయగు సతిని, తర్వాత **పార్వతిని** పరిణయమాడునపుడు రక్తసిందూరికామహోత్సవములయందు ధరింప వలసిన వస్త్రములకై ప్రాతస్సాయంసంధ్యలను రెంటి నుద్దేశించి యాదిక్కులను రెంటిని దిగమ్బరుడైన తనకు రక్తవర్ణపు **శోభ**గలిగిన రెండువస్త్రములుగా నుండ

గోరినవాడై యారెంటిని వలువలుగా సంపాదించుకొనెనా యేమి? అనగా సతీవివాహ మం దొకదిక్కును పార్వతీవివాహమునందు మఱియొకదిక్కును దిగ్వసనుడైన శివుడు పుష్పసిందూరికామహోత్సవములయందు ధరింపవలసిన వలువలుగా బొందెనా యేమి? యని యర్థము. శివుడు తొలుత సతిని బరిణయమాడెను. ఆమె, తండ్రియగు దక్షుడు గావించిన యజ్ఞమందు దేహత్యాగము గావించెను. తర్వాత పర్వతరాజగు హిమవస్తునకు బుత్రికగా జన్మించి శివుని మరల పరిణయమాడిన దను పురాణగాథ యిట అనుసంధేయము. ప్రాతస్సంధ్యయందు తూర్పుదిక్కు, సాయంసంధ్యయందు పడమటిదిక్కు అను నీరెండు సమానవర్ణమును గలిగి యుండుటవలన ప్రాతస్సంధ్యయందలి తూర్పువెసను వదలి కేవలము సాయంసంధ్య యందలి పడమటిదిశను పుష్పసిందూరికగ నెట్లు చెప్పెనను నాక్షేపమునకుసమాధాన ముగా నీశ్లోకము చెప్పబడినది. కాన శివునకు పార్వతియొక్క రెండుజన్మముల యందగి రెండువివాహములయందు జరిగిన పుష్పసిందూరికా మహోత్సవములకు రెంటికిని రెండుదిక్కులు అనగా తూర్పుపడమరలు వలువలుగా బరిగృహీతములని యాశయము.

శ్లో. ఆదాయ దణ్డం సకలాసు దిక్షు
సోఽయం పరిభ్రామ్యతి భానుభిక్షుః।
అబ్ధౌ నిమజ్జన్నివ తాపసోఽయం
సన్ధ్యాభ్రకాషాయ మధత్త సాయమ్ ॥ 12

ప. వి. ఆదాయ - దణ్డం - సకలాసు - దిక్షు - సః - అయం - పరిభ్రామ్యతి - భానుభిక్షుః - అబ్ధౌ - నిమజ్జన్ - ఇవ - తాపసః - అయం - సంధ్యాభ్రకాషాయం - అధత్త - సాయం.

అర్థము: యః = ఏ, అయం = ఈ, భానుభిక్షుః; భాను = సూర్యు డనెడి, భిక్షుః = సన్యాసి, దణ్డం = పారిపార్శ్వకు డనెడివెదురు కర్రను, ఆదాయ = తీసికొని, సకలాసు = సమస్తములగు, దిక్షు = దిక్కులయందు, పరిభ్రామ్యతి = తిరుగుచున్నాడో, సః = అటువంటి, అయం = ఈ, తాపసః = సన్యాసి, సాయం = సాయంకాలమందు, అబ్ధౌ = సముద్రమునందు, అనగా పాతాలమందు; నిమజ్జన్ = మునుగుచు అనగా ప్రవేశించుచు మఱియు

భూరిజలములుగల మడుగునందు స్నానము గావించుచు, సన్ధ్యాభ్రకాషాయం, సన్ధ్యాభ్ర=సన్ధ్యాకాలపు మేఘ మనెడి, లేదా ఆకసమనెడి, కాషాయం=కషాయ వర్ణముగల వస్త్రమును, అధత్తేవ=ధరించెనో యనునట్లున్నాడు.

**సమాసములు :**

భానుభిక్షుః : భానురేవ భిక్షుః = భానుభిక్షుః.

సన్ధ్యాభ్రకాషాయం : సంధ్యాయాం అభ్రం=సన్ధ్యాభ్రం, కషాయేణ రక్తం=కాషాయం, సన్ధ్యాభ్రమివ కాషాయం = సన్ధ్యాభ్రకాషాయం, తత్ = సన్ధ్యాభ్రకాషాయమ్.

**భావము :**

సూర్యుడనెడి సన్యాసి దండుడని చెప్పబడు తనపారిపార్శ్వకుని వెదురుకఱ్ఱగా ధరించి యన్నిదిక్కులయందును సంచరించుచు సాయంకాలమందు పడమటికడలి యను జలాశయమందు స్నానము గావించి సంధ్యారాగముచే నెఱ్ఱబారిన యాకాశమనెడి కాషాయవస్త్రమును ధరించెనో యనునట్లున్నాడు.

శ్లో. అస్తాచలే స్మి న్నికషోపలాభే
సంధ్యాకషోల్లేఖపరీక్షితో యః ।
విక్రీయ తం హేలిహిరణ్యపిణ్డం
తారావరాటా నియమాదిత ద్యౌః ॥ 13

ప. వి. అస్తాచలే - అస్మిన్ - నికషోపలాభే - సంధ్యాకషోల్లేఖపరీక్షితః - యః - విక్రీయ - తం - హేలిహిరణ్యపిణ్డం - తారావరాటాన్ - ఇయం - ఆదిత - ద్యౌః.

అర్థము: యః=ఏసూర్యుడు, అస్మిన్=ఈపడమటనున్న, నికషోపలాభే, నికషోపలం=బంగారమును పరీక్షించెడి యొరిపిడిరాతితో, ఆభే=సమానమైన. అస్తాచలే=అస్తపర్వతమునందు, సంధ్యాకషోల్లేఖపరీక్షితః, సంధ్యా=సంధ్యారాగ మనెడి, కషోల్లేఖ=ఒరిపిడిగీతచే, పరీక్షితః=పరీక్షి.

పబడెను. ఇయం = ఈ, ద్యౌః = ఆకసము, తం = ఆ, హేలిహిరణ్య పిణ్డం, హేలి = సూర్యు డనెడి, హిరణ్యపిండం = బంగారుముద్దను, విక్రీయ = అమ్మి యనగా మార్చి, తారావరాటాన్, తారా = నక్షత్రము లనెడి, వరాటాన్ = గవ్వలను. ఆదిత = పుచ్చుకొనెను. ఎరువు పసుపు వన్నెలు గల్గిన బంగారుముద్దను ఒరిపిడిరాతితో పరీక్షించుటవలన నేర్పడిన రేఖవలె సంధ్య కనబడుచున్నది. నక్షత్రములు గవ్వలవలె గానబడు చున్నది. లోకవ్యవహారము తెలియని వ్యక్తి యని సూచించుటకై "ద్యౌః" యని స్త్రీలింగనిర్దేశము. సాధారణముగా స్త్రీయమాయకత్వముచే బంగారు నిచ్చి గవ్వలను పుచ్చుకొని ధూర్తునిచే వంచింపపడుచుండును. గవ్వలతో ద్రవ్యవ్యవహారము గావించెడి దేశమునందు బంగారును సైతమిచ్చి గవ్వలు పుచ్చుకొనబడుచుండును.

సమాసములు :

అస్తాచలే ; అస్త ఇతి అచలః = అస్తాచలః, తస్మిన్ = అస్తాచలే.

నికషోపలాభే : నికషస్య ఉపలః = నికషోపలః, నికషోపలస్య ఆభేవ ఆభా యస్య సః = నికషోపలాభః, తస్మిన్ = నికషోపలాభే.

సంధ్యాకషోల్లేఖపరీక్షితః: కషస్య ఉల్లేఖః = కషోల్లేఖః, సంధ్యైవ కషోల్లేఖః సంధ్యాకషోల్లేఖః సంధ్యాకషోల్లేఖేన పరీక్షితః = సంధ్యాకషోల్లేఖ పరీక్షితః

హేలిహిరణ్యపిణ్డం : హిరణస్య పిణ్డః = హిరణ్యపిణ్డః, హేలి రేవ హిరణ్యపిణ్డః = హేలిహిరణ్యపిణ్డః, తం = హేలిహిరణ్యపిణ్డం.

తారావరాటాన్ : తారా ఏవ వరాటాః = తారావరాటాః, తాన్ = తారావరాటాన్.

భావము :

ఈసూర్యుడు అస్తాచలమనెడి ఒరిపిడి రాతియందు సంధ్యాకాల మనెడి యొరిపిడివలనిగీతచే పరీక్షింపబడెను. ఈ ఆకాశము అట్టి సూర్యుడనెడి బంగారు ముద్దను మార్చి దానితో నక్షత్రములనెడి గవ్వలను బుచ్చుకొనెను. మేలైన బంగారు ఎరువు పసుపుగ నుండును. అట్టి ఎరుపు పసుపు వన్నెగల బంగారు

ముద్దను పరీక్షించుటవలన నేర్పడిన దొరిపిడిగీటువలె సంధ్య కనబడుచున్నది. నక్షత్రములు గవ్వలవలె గానబడుచున్నవని యాశయము.

శ్లో. పచేలిమం దాడిమ మర్కబింబ
ముత్తార్య సంధ్యా త్వగివోజ్ఝితాఽస్య ।
తారామయం బీజభుజాఽదసీయం
కాలేన నిష్ఠ్యూత మివాస్థియూథమ్॥ 14

ప. వి. పచేలిమం - దాడిమం-అర్కబింబం - ఉత్తార్య - సంధ్యా - త్వక్ - ఇవ - ఉజ్ఝితా - అస్య - తారామయం - బీజభుజా - అదసీయం - కాలేన - నిష్ఠ్యూతమ్ - ఇవ -అస్థియూథమ్.

అర్థము: దాడిమబీజభుజా. దాడిమబీజ = దాడిమవిత్తనములను. భుజా = తినుచున్న, కాలేన = సమయముచే, అర్కబింబం = ఎఱ్ఱని సూర్యబింబమనెడి, పచేలిమం = చెట్టునందే పండిన దాడిమం = దాడిమపండును, ఉత్తార్య = గగనమనెడి చెట్టునుండి విత్తనమును గ్రహించుటకై కోసి, అస్య = ఈపండుయొక్క, త్వగివ = చర్మమువలె, సంధ్యా = సంధ్య, ఉజ్ఝితా = విడువబడినది. తథా = అట్లే, యనగా విత్తనములను దినిన పిదప, తారామయం = తారారూపమైన, అదసీయం = ఈ పండునకు సంబంధించిన, లేదా ఈ విత్తనములకు సంబంధించిన, అస్థియూథం = ఎముకలరాశి, నిష్ఠ్యూతమివ = వెడల్పగక్కబడినదో యనునట్లున్నది.

సమాసములు :

అర్కబింబం : అర్కస్య బిమ్బః = అర్కబిమ్బః, తం = అర్కబింబం.
తారామయం : తారాణాం వికారః = తారామయః, తం = తారామయం.
బీజభుజా : బీజం భునక్తీతి = బీజభుక్, తేన = బీజభుజా.
అదసీయం : అముష్యఅయం = అదసీయః, తం = అదసీయం.
అస్థియూథమ్: అస్థ్నాం యూథః = అస్థియూథః, తం = అస్థియూథం

భావము :

దాడిమపండుయొక్క విత్తనములను దినెడి కాలుడు, ఎఱ్ఱని సూర్యబింబమనెడి చెట్టున పండిన దాడిమపండును గగనవృక్షమున కోసి ఎత్తిని దాని

తొక్కను వదలివేయగా దానివలె సంధ్య యున్నది. మఱియు దానివిత్తనములను దినిన పిదప, నక్షత్రరూపములుగా నున్న యావిత్తనముల పలుకులు వెదజల్లఁబడినవో యనునట్లున్నవి.

శ్లో. తారాతతి ర్బీజ మివాద మాద
మియం నిరష్ఠేవి యదస్థియూథం।
తన్నిష్కలాకృత్య రవిం త్వగేషా
సంధ్యోజ్ఝితా పాకిమదాడిమం వా॥ 15

ప. వి. తారాతతిః - బీజం - ఇవ - ఆదమాదం - ఇయం - నిరష్ఠేవి - యదస్థియూథం - తత్ - నిష్కలాకృత్య - రవిం - త్వక్ - ఏషా - సంధ్యా - ఉజ్ఝితా - పాకిమదాడిమం - వా.

అర్థము: (కాలేన = కాలమనెడి, కర్త్రా = కర్తచే), రవిం = సూర్యు డనెడి, పాకిమదాడిమం = పండిన దాడిమపండును, నిష్కలాకృత్య = విత్తనములు లేనిదిగా జేయబడి, యందలి విత్తనము లనెడి సారమును గ్రహించి, త్వక్ = దానికి సంబంధించిన తొక్క, ఏషా = ఈ, సంధ్యా = సంధ్యగా, ఉజ్ఝితా వా = విడువబడినదా!, బీజాని = విత్తనములను, ఆదమాదం = తిని తిని, యదస్థియూథం యత్ = ఏసూర్యు డనెడి, పండిన దాడిమకు సంబంధించిన, అస్థియూథం = ఎముకల సమూహముగా, తారాతతిః = నక్షత్రముల సమూహము, నిరష్ఠేవి వా = ఊయబడినదా యేమి?

సమాసములు :

తారాతతిః : తారాణాం తతిః = తారాతతిః

ఆదమాదం : అత్త్వా అత్త్వా = ఆదమాదం.

యదస్థియూథం : అస్థ్నాం యూథం = అస్థియూథం, యస్య అస్థియూథం = యదస్థియూథం.

నిష్కలాకృత్య : అనిష్కలం నిష్కలం సమ్పద్యమానం కృత్వా = నిష్కలాకృత్య.

పాకిమదాడిమం: పాకిమయుక్తం దాడిమం = పాకిమదాడిమం, తత్ = పాకిమదాడిమం.

**భావము :**

కాలుడు సూర్యుడనెడి దాడిమపండును వి త్తనములను లేనిదానిని గావించి యనగా దాని విత్తనము లనెడి సారమును గ్రహించి దానితొక్కనే సంధ్యగా విడిచెనా యేమి? అట్లే యందలి విత్తనములను దిని తిని యా సూర్యుడనెడి దాడిమ పండుయొక్క యెముకల సమూహమునే నక్షత్రసమూహముగా వదలిపెట్టెనా యేమి?.

గమనిక; ఈశ్లోకము పైనిశ్లోకముయొక్క యర్థమునే గలిగియున్నదిగాన నిది ప్రక్షేపము;-

శ్లో. **సంధ్యావశేషే ధృతతాణ్డవస్య**
**చణ్డీపతేః పత్పతనాభిఘాతాత్ ।**
**కైలాసశైలస్ఫటికాశ్మఖణ్డై**
**రమణ్డి పశ్యోత్పతయాలుభి ర్ద్యౌః ॥ 15**

ప. వి. సంధ్యావశేషే - ధృతతాణ్డవస్య - చణ్డీపతేః – పత్పతనాభిఘాతాత్- కైలాసశైలస్ఫటికాశ్మఖణ్డైః - అమణ్డి - పశ్య-ఉత్పతయాలుభిః - ద్యౌః.

అర్థము: హేప్రియే = ఓప్రియురాలా!, సంధ్యావశేషే, సంధ్యా = సంధ్యావందనమునకు, అవశేషే = చివర, ధృత తాణ్డవస్య, ధృత = ధరింపబడిన, తాణ్డవస్య = తాణ్డవముగల్గిన, చణ్డీపతేః = పార్వతీపతియగు శివునియొక్క, పత్పతనాభిఘాతాత్, పత్ = పాదముయొక్క, పతన = పతనముచే నేర్పడిన, అభిఘాతాత్ = దెబ్బవలన, ఉత్పతయాలుభిః = పైకెగురునట్టి, కైలాసశైలస్ఫటికాశ్మఖణ్డైః, కైలాసశైల = కైలాస పర్వతము యొక్క, స్ఫటిక = స్ఫటికము లనెడి, అశ్మ = శిలల యొక్క, ఖణ్డైః = ముక్కలచే, ద్యౌః = ఆకసము, అమణ్డి = అలంకరింపబడినది, పశ్య = చూడుము.

**సమాసములు :**

సంధ్యావశేషే : సంధ్యాయాః అవశేషః = సంధ్యావశేషః, తస్మిన్ = సంధ్యావశేషే.

ధృతతాణ్డవస్య : ధృతం తాణ్డవం యేన సః = ధృతతాణ్డవః, తస్య = ధృతతాణ్డవస్య.

చణ్డీపతేః : చణ్డ్యాః పతిః = చణ్డీపతిః. తస్య = చణ్డీపతేః.

పత్పతనాభిఘాతాత్ : పదోః పతనం = పత్పతనం, పత్పతనేన అభిఘాతః = పత్పతనాభిఘాతః, తస్మాత్ = పత్పతనాభిఘాతాత్.

కైలాసశైలస్ఫటికాశ్మఖణ్డైః : కైలాస ఇతి శైలః = కైలాసశైలః కైలాసశైలస్య స్ఫటికాః = కైలాసశైలస్ఫటికాః, కైలాసశైలస్ఫటికా ఏవ అశ్మానః = కైలాసశై స్ఫటికాశ్మానః, కైలాసశైలస్ఫటికాశ్మనాం ఖణ్డాః = కైలాసశైలస్ఫటికాశ్మఖణ్డాః. తైః = కైలాసశైలస్ఫటికాశ్మఖణ్డైః.

ఉత్పతయాలుభిః : ఉత్పతనం శీలం యేషాం తే = ఉత్పతయాలవః, తైః = ఉత్పతయాలుభిః.

**భావము :**

ఓప్రియురాలా! సంధ్యావందనమైన పిదప తాణ్డవము చేసెడి శివుని యొక్క పాదముల దెబ్బలచే కైలాసపర్వతమందలి స్ఫటికశిలలు ముక్కలై పైకెగురుచున్నవి. వానిచే నాకస మలంకరింపబడినది. చూడుము.

శ్లో. ఇత్థం హ్రియా వర్ణనజన్మనేవ
సన్ధ్యామపక్రాన్తవతీం ప్రతీత్య ।
తారాతమోదన్తురమన్తరిక్షం
నిరీక్షమాణః స పునర్బభాషే ॥ 16

ప. వి: ఇత్థం - హ్రియా - వర్ణనజన్మనా - ఇవ - సన్ధ్యాం - అపక్రాన్తవతీం - ప్రతీత్య - తారాతమోదన్తురం - అన్తరిక్షం - నిరీక్షమాణః - సః - పునః - బభాషే.

అర్థము: ఇత్థం = ఈ విధముగా, వర్ణనజన్మనా = వర్ణించుటచే నుత్పన్నమైన, హ్రియేవ = సిగ్గుచేతనో యనునట్లు, అపక్రాన్తవతీం = దాటిపోయినదిగా, సంధ్యాం = సంధ్యను, ప్రతీత్య = నిశ్చయించుకొని, అన్తరిక్షం = ఆకసమును, తారాతమోదన్తురం, తారా = నక్షత్రముల తోడను,

తమః = చీకటితోడను, దస్తురం = కలసియున్నదానినిగా, నిరీక్ష
మాణః = చూచుచున్నవాడై, సః = ఆ నలుడు. పునః = మరల,
భైమీం = దమయన్తిని గూర్చి, బభాషే = పలికెను.

**సమాసములు :**

వర్ణనజన్మనా : వర్ణనాత్ జన్మ యస్యాః సా = వర్ణనజన్మా, తయా =
వర్ణనజన్మనా.

తారాతమోదన్తురం : తారాశ్చ తమశ్చ = తారాతమసీ, తారాత
మోభ్యాందన్తురం తారాతమోదన్తురం, తత్ = తారాతమోదన్తురం.

**భావము :**

ఇవ్విధముగా వర్ణనవలన సిగ్గుపడినదో యనునట్లు సాయంసంధ్య గడిచి
పోయినదని, నిశ్చయించుకొని, నక్షత్రముల తోడను చీకటితోడను గూడిన
యాకసమును జూచుచున్నవాడై దమయన్తిని గూర్చి నలుడు మరల జెప్పదొడగెను.

శ్లో. రామేషు మర్మవ్రణనార్తివేగాత్
రత్నాకరః ప్రాగయ ముత్పపాత।
గ్రహౌఘకిర్మీరిత మీనకమ్బ్రు
నభో న భోః కామశరాసనభ్రు ॥ 17

ప. వి. రామేషు మర్మవ్రణనార్తివేగాత్ - రత్నాకరః - ప్రాక్ - అయం -
ఉత్పపాత - గ్రహౌఘకిర్మీరితమీనకమ్బ్రు - నభః - న - భోః -
కామశరాసనభ్రు.

అర్థము : భోః కామశరాసనభ్రు ! = మన్మథుని విల్లువంటి కనుబొమ్మలు గల
యో దమయన్తీ !, రామ = శ్రీరాముని యొక్కయు, పరశురాముని
యొక్కయు, ఇషు = బాణముచే, మర్మ = మర్మస్థానమును, వ్రణన =
గాయపరచుట వలని, ఆర్తి = బాధయొక్క, వేగాత్ = అతిశయము
వలన, (తనచోట నిలువలేక భయముచే), రత్నాకర ఏవ = సముద్రుడే,
అయం = ఇతడు, ప్రాక్ = పూర్వము, ఉత్పపాత = పైకెగరెను.(కాని)
ఇదం = ఈ కనబడునట్టి, నభః = ఆకసము, న = కానేరదు, నీంజలము
లతో గూడిన రత్నగర్భుడైన సముద్రుడే ఇది. మరియు నీ సముద్రుడు

గ్రహౌఘ కిర్మీరిత మీనకమ్బు, గ్రహ = జలచరములగు జంతువుల యొక్క, ఓఘ = సమూహముచే, కిర్మీరిత = మిశ్రితమైన, మీన = చేపలు, కమ్బు = శంఖములు గల్గినది. ఆకసమో, గ్రహ = శుక్ర బృహస్పత్యాది గ్రహముల యొక్క, ఓఘ = సమూహముచే, కిర్మీరిత = మిశ్రితమైన, మీన = మీనరాశియు, కమ్బు = శంఖాకారముగా నుండెడి విశాఖా నక్షత్రమును గల్గినది.

**భావము :**

శ్రీరామచన్ద్రుడు సేతుబన్ధ సమయమునందు బాణముచే సముద్రమును భేదింప సమకట్టెను. దాని బాధచేతనే సముద్రుడు పైకెగరెను. మఱియు పంపు రాముడును తననివాసమును కల్పించుకొనుటకై సముద్రునిపై బాణమును ప్రయోగింపగా నతడు భయపడి పైకెగరెను. కాన పైన కనబడు నలుపువన్నె సముద్రునిదే కాని యాకసమునకు సంబంధించినది కాదు. సముద్రుడు పైవిధముగా పైకెగిరిపోగా నతని యడుగుననున్న రత్నములు మొసళ్ళు మున్నగునవి దిగువ భూమిపై నున్న జనులచే చూడశక్యము లగుచున్నవి. మొసళ్ళు ఎండ్రకాయలు మున్నగునవి సముద్ర జంతువులే కాని మకరాదిరాసులు కానేరవు. పైన ప్రకాశించెడి తారలు నక్షత్రములు కావు. అవి సముద్రమందలి ముత్తెములు మున్నగునవిగా నూహ్యములు.

"కామశరాసనభ్రూః" యని దీర్ఘయుక్త భ్రూశబ్దపాఠమే సాధువు. ఏల యనగా నిది ఉవఙ్ స్థానీయమైనందు వలన దీనికి నదీసంజ్ఞలేదు. కాన హ్రస్వము వచ్చుట కవకాశము లేదు. కాని "కామశరాసనభ్రు" యని హ్రస్వయుక్త పాఠము "సహైకవంశభవభ్రు" మున్నగువానితో బాటు సమర్థనీయము. లేదా శిష్టకవి ప్రయోగముగా భావింపవలయును.

**సమాసములు :**

రామేషుమర్మవ్రణనాతివేగాత్ : రామయోః ఇషూ = రామేషూ, రామేషుభ్యాం మర్మణి వ్రణనం = రామేషుమర్మవ్రణనం, రామేషుమర్మవ్రణనస్య అతివేగః = రామేషుమర్మవ్రణనాతివేగః, తస్మాత్ = రామేషుమర్మవ్రణనాతివేగాత్.

రత్నాకరః : రత్నానాం ఆకరః = రత్నాకరః.

గ్రహౌఘకిర్మీరితమీనకమ్బు : గ్రహాణాం ఓఘః = గ్రహౌఘః, మీనాశ్చ కమ్బూని చ = మీనకమ్బూని, గ్రహౌఘేన కిర్మీరితాని = గ్రహౌఘకిర్మీరితాని, గ్రహౌఘకిర్మీరితాని మీనకమ్బూని యస్మిన్ తత్ = గ్రహౌఘకిర్మీరితమీనకమ్బు.

కామశరాసనభ్రు : కామస్య శరాశనం = కామశరాసనం, కామశరాశసనమివ భ్రువౌ యస్యాః సా = కామశరాసనభ్రూః, తస్యాః సమ్బుద్ధిః = కామశరాసనభ్రు.

**భావము :**

మన్మథుని విల్లువలె వంపులు తిరిగిన కనుబొమ్మలు గల ఓ దమయన్తీ! శ్రీరామచన్ద్రుని యొక్కయో, పరశురాముని యొక్కయో బాణముచే మర్మస్థలముల యందు దెబ్బ తిని దానివలన బాధతో సముద్రుడు పైకెగిరిపోయి యాకసమాయెను. నీకగబడు నీలమైన ప్రదేశము ఆకసము కాదు. మరేమనగా సముద్రుడే. కావుననే యితడు గ్రహౌఘకిర్మీరిత మీనకమ్బుడుగా నున్నాడు. అనగా జలచరసమూహముతో గలసిన చేపలు శంఖమును గలిగి యున్నాడు. ఆకసమైనను గ్రహౌఘకిర్మీరిత మీనకమ్బుత్వ ధర్మమునకు భంగము లేదు. ఎట్లనగా - శుక్రబృహస్పత్యాది గ్రహసమూహముచే మిశ్రితమైన మీనరాశియు, శంఖాకారవు విశాఖానక్షత్రమును కల్గియున్నది. కాన పైన కానవచ్చునది సముద్రమే. అనల్లదనము సముద్ర జలమునందలి నల్లదనము. సముద్రముపై కెగిరిపోయినందువలన నందలి రత్నగ్రహాదులు దిగువభూమిపై నున్న జనులచే సుఖముగా జూడశక్యములై యున్నవి. పైన గానవచ్చెడి మకరకర్కటకాది రాసులు సముద్రమందలి మొసళ్ళు మున్నగు జంతువులే గాని రాసులు గావు. మరియు పైన గానవచ్చెడి తారలు సముద్రమందలి ముత్తెములే గాని నక్షత్రములు గానేరవు.

రావణుడు సీత నపహరింపగా నతనితో యుద్ధము గావించుటకై లఙ్కకు బోనున్న శ్రీరామచంద్రుడు త్రోవనిచ్చుటకై సముద్రముపై బాణముమ ప్రయోగించె ననెడి రామాయణగాథ యనుసంధేయము. అట్లే పరశురాముడు తాను

నివానము గల్పించుకొనుటకై సముద్రమును బాణముతో కొట్టి తటీమిపైచేసను పురాణగాథయు నిచ్చ ననునంధేయము.

కృతయుగమునందలి నలుడు, త్రేతాయుగమునందలి శ్రీరామచంద్రుడును పరశురాముడును గావించిన, సముద్రభంగవిషయమును వర్ణించుట యసఙ్గతము కాని కల్పాన్తరమందలి శ్రీహర్షుడే ద్దీనిని వర్ణించుటవలన నిది సఙ్గత మందుదు.

శ్లో. మోహాయ దేవాప్సరసాం విముక్తా
స్తారాః శరాః పుష్పశరేణ శఙ్కే ।
పఞ్చాస్యవ త్ప్రఞ్చశరస్య నామ్ని
ప్రపఞ్చవాచీ ఖలు పఞ్చశబ్దః ॥ 18

ప. వి. మోహాయ - దేవాప్సరసాం - విముక్తాః - తారాః - శరాః - పుష్పశరేణ - శఙ్కే - పంచాస్యవత్ - పఞ్చశరస్య-నామ్ని - ప్రపంచవాచీ - ఖలు - పఞ్చశబ్దః.

అర్థము: హే భైమి! = ఓదమయన్తీ!, పుష్పశరేణ = పుష్పబాణునిచే, దేవాప్సరసాం = దేవతలకును నప్సరసలకును, మోహాయ = పరస్పరప్రేమగలుగుటకై, విముక్తాః = (దేవతల పైననుండుటవలన) పైకి విడువబడిన, శుభ్రపుష్పములైన, శరాః = బాణములు, తారాః = నక్షత్రములుగా (అహం = నేను) శఙ్కే = నందేహింతును. మన్మథుడు పుష్పబాణుడైనను, నతడు పఞ్చబాణుడగుటవలన నతనికి బాణములైదేగదా. మింట తారలు అసంఖ్యాకములు గదా! కాన నతని బాణములే తారలని చెప్పనెట్లు శంకింపరాదు. ఖలు = ఏలయనగా, పఞ్చశరస్య = మన్మథుని యొక్క, నామ్ని = పేరునందలి, పంచశబ్దః = "పఞ్చ" యను శబ్దము, పంచాస్యవత్ = సింహమును చెప్పెడి పంచాస్యశబ్దమునందలి పఞ్చశబ్దమువలె "పచి విస్తారవచనే" యనెడి పచిధాత్వర్థమునను సరించి, ప్రపఞ్చవాచీ, ప్రపఞ్చ = విస్తారమును, వాచీ = చెప్పునది యగుచున్నది.

**సమాసములు :**

దేవాప్సరసాం : దేవాశ్చ అప్సరసశ్చ = దేవాప్సరసః. తాసాం = దేవాప్సరసాం.

పుష్పశరేణ : పుష్పాణి శరాః యస్య సః = పుష్పశరః, తేన = పుష్పశరేణ.

పఞ్చాస్యవత్ : పఞ్చం ఆస్యం యస్య సః = పఞ్చాస్యః, పఞ్చాస్య ఇవ = పఞ్చాస్యవత్.

పఞ్చశరస్య : పఞ్చ శరాః యస్య సః = పఞ్చశరః, తస్య = పఞ్చశరస్య.

ప్రపఞ్చవాచీ: ప్రపఞ్చం వక్తీతి = ప్రపఞ్చవాచీ.

పఞ్చశబ్దః : పఞ్చ ఇతి శబ్దః = పఞ్చశబ్దః.

**భావము :**

ఓరమయ స్త్రీ! మన్మథుడు దేవతలకును నప్సరలకును పరస్పర ప్రేమను గలుగజేయుటకై తనపుష్పము లనెడి బాణములను పైనున్న యాదేవాప్సరలపై ప్రయోగింపగా,నవి తారలుగా నున్నవని భావింతును. కాని మన్మథునికి బఞ్చబాణు డనిపేరు గదా! పఞ్చబాణు డనగా నైదుబాణములు కలవాడని యర్థము. పైనున్న తారలన్నియు నతని బాణములైనచో నతని బాణములు అయిదే గాన బైననైదే తార లుండవలయును. కాని పైనున్న తారలసంఖ్యాకములుగాన నాతని బాణము లని తారలనెట్లు చెప్పవీలగునని ప్రశ్నతగదు. ఏలయనగా మన్మథునిచెప్పెడి పఞ్చబాణమునందలి పఞ్చశబ్దమునకు నైదని యర్థముగాదు. మఱేమనగా - "పచి (విస్తారవచనే) యను ధాతువునను సరించి పఞ్చశబ్దమునకు విస్తారమని యర్థము. సింహమును జెప్పెడి పఞ్చాస్యశబ్దమునందలి "పఞ్చ" శబ్దము "ఐదు" అను సంఖ్యను జెప్పుటలేదు. అట్లు చెప్పినచో "పఞ్చాస్య" మనగా నైదుముఖ ములు గలదిగా జెప్పవలయును. అప్పుడు సింహము నైదుముఖములు గలదిగా జెప్పవలయును. కాని యదిలోకవిరుద్ధముగదా! కాన పఞ్చశబమునకు విస్తారము లేదా విశాలమని యరమును జెప్పవలయును. అట్లు చెప్పినచో, "పఞ్చాస్య" మనగా విశాలముఖము గలదని యర్థ మేర్పడును. అది సింహమునకును సరిపడును. కాన దానినను సరించి ప్రకృ తము "పఞ్చబాణ" శబ్దము నందలి పఞ్చశబ్దమునకును విస్తారమను నర్థము

జెప్పినచో "పఞ్చబాణః" అనగా విస్తారములైన బాణములుగల మన్మథుని బాణములే యాకసమున విస్తారములు. అనగా ననంఖ్యాకములగు తారలైనవను నర్థము సరిపడి పూర్వ మేర్పడిన యనుపపత్తి పరిహృతమగునని యాశయము.

శ్లో. నభోనదీకూలకులాయచక్రీ
కులస్య నక్తం విరహాకులస్య
దృశో రపాం సన్తి పృషన్తి తారాః
పతన్తి తత్స్రక్ష్యమణాని ధారాః ॥ 19

ప. వి. నభోనదీకూలకులాయచక్రీకులస్య - నక్తం - విరహాకులస్య - దృశోః - అపాం - సన్తి - పృషన్తి - తారాః - పతన్తి - తత్స్రక్ష్యమణాని - ధారాః.

అర్థము: నక్తం = రాత్రియందు, విరహాకులస్య = ఎడబాటుచే కలత పొందిన, నభోననదీకూలకులాయచక్రీకులస్య, నభోనదీ = ఆకాశగంగ యొక్క, కూల = గట్టనెడి, కులాయ = గూడునందున్న, చక్రీ = చక్రవాకస్త్రీలయొక్క, కులస్య = సమూహముయొక్క, దృశోః = నేత్రములయందలి, అపాం = జలముయొక్క, పృషన్తి = బిందువులే, తారాః = నక్షత్రములు, తత్స్రక్ష్యమణాని; తత్ = ఆతారలయొక్క స్రక్ష్యమణాని = పుణ్యము క్షీణించుటవలన, భూమికి మరలివచ్చునట్టి క్రియలు, అనగా ప్రత్యాగమనములు, ఆకన్నీళ్ళయొక్క, ధారాః = ధారలై, పతన్తి = భూమిపై బడుచున్నవి. లేదా, తత్ = ఆతారల యొక్క. స్రక్ష్యమణాని = మేషాదిరాసులయందలి, స్రక్ష్యమణములు, ధారాః = అశ్రుధారలనిగాని యర్థము.

సమాసములు :

నభోనదీకూల కులాయ చక్రీకులస్య : నభ ఏవ నదీ = నభోనదీ, నభోనద్యాః కూలం = నభోనదీకూలం, నభోనదీకూలమేవ కులాయః యస్య తత్ = నభోనదీకూలకులాయం, చక్రీణాం కులం = చక్రీకులం, నభోనదీకూల కులాయం చ తత్ చక్రీకులంచ, నభోనదీకూల కులాయ చక్రీకులం. తస్య = నభోనదీకూల కులాయ చక్రీకులస్య.

విరహాకులస్య : విరహేణ ఆకులం = విరహాకులం, తస్య = విరహాకులస్య.

తత్సంక్రమణాని : తాసాం సంక్రమణాని = తత్సంక్రమణాని.

**భావము :**

రాత్రి విరహముచే బీడితమై నాకాశగంగయొక్క తీరమునే స్థానముగా గల్గిన చక్రవాక స్త్రీలసమూహముయొక్క కన్నీటిబిందువులే భూలోకవాసులచే నక్షత్రములుగా జూడబడుచున్నవి. ఆ తారలు పుణ్యము క్షీణించుటచే భూలోకమును గూర్చి తిరిగి రావడములే యా చక్రవాకస్త్రీల కన్నీటిధార లగుచున్నవి, లేదా యాతారలు మేషాదిరాసులయందు జేయు ప్రవేశము లనెడి సంక్రమణములే యాపక్షుల కన్నీటిధార లగుచున్నవి. సూర్యాదిగ్రహములు, మేషాదిద్వాదశరాశులలో ప్రవేశించుట ప్రసిద్ధము. ఆ ప్రవేశమే సంక్రమణ మని చెప్పబడుచున్నది. అట్లే "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి" యను స్మృతి ననుసరించి పుణ్యబలముతో స్వర్గమున వికసించినవారలు పుణ్యము క్షీణించగనే మరల భూలోకమునకు వత్తురు. అట్టివారే నక్షత్రరూపములను వహించి కాన్తి రేఖతో నాకసమునుండి భూమిపై బడుచుండుటను రాత్రులందు మనము గాంచుచుందుము.

శ్లో. అమూని మన్యే మరనిర్ఝరిణ్యా
యాదాంసి గోధా మకరః కుళీరః ।
తత్పూరఖేలత్సురభీతిదూర
మగ్నా న్యధః స్పష్ట మితః ప్రతీమః ॥ 20

ప. వి. అమూని - మన్యే - అమరనిర్ఝరిణ్యాః - యాదాంసి - గోధా - మకరః-కుళీరః - తత్పూరఖేలత్సురభీతిదూరమగ్నాని - అధః - స్పష్టం - ఇతః - ప్రతీమః.

అర్థము: హే ప్రియే = ఓ ప్రియురాలా!, గోధా = ఉడుమని పేరుగల నక్షత్ర సమూహమగు గోధ, మకరః = మకరరాశికి సంబంధించిన తారాసమూహమగు మకరము, కుళీరః = కర్కటకరాశికి సంబంధించిన తారాసమూహమగు కర్కటము అను, అమూని = ప్రత్యక్షముగా గనబడునవి,

అమరనిర్ఝరిణ్యాః = దేవతానదియగు గంగకు సంబంధించిన. యాదాంసి = జలజంతువులుగా. మన్యే = తలంతును. తత్పూరఖేలత్సురభీతి దూరమగ్నాని, తత్ = దేవగంగయొక్క, పూర = ప్రవాహమునందు, ఖేలత్ ఆడుచున్న, సుర = దేవతలవలని, భీతి = భయముచే, దూర = అడుగువరకు, మగ్నాని = మునిగిన యాజన్తువులను, అధః = దిగువ భాగమున, ఇతః = ఈ భూమినుండి, స్పష్టం = స్ఫుటముగా, ప్రతీమః = తెలిసికొనెదము. మనము భూభాగమం దున్నను నదియొక్క యడుగు భాగమునందున్న యుడుము మొసలి మున్నగు జంతువులను జూడగలము. గోధాశబ్దముచే గోధాకారముగ నున్న ధ్రువమణ్డలముగాని, జ్యేష్ఠా నక్షత్రముగాని గ్రాహ్యము.

సమాసములు :

అమరనిర్ఝరిణ్యాః : అమరాణాం నిర్ఝరిణీ = అమరనిర్ఝరిణీ, తస్యాః = అమరనిర్ఝరిణ్యాః.

తత్పూరఖేలత్సురభీతిదూరమగ్నాని : తస్యాః పూరః = తత్పూరః, తత్పూరే ఖేలన్తః = తత్పూరఖేలన్తః. తత్పూరఖేలన్తశ్చ తే సురాశ్చ = తత్పూరఖేలత్సురాః, తత్పూరఖేలత్సురేభ్యః భీతిః = తత్పూరఖేలత్సురభీతిః, తత్పూరఖేలత్సురభీత్యా దూరం మగ్నాని = తత్పూరఖేలత్సురభీతిదూరమగ్నాని, తాని = తత్పూరఖేలత్సురభీతిదూరమగ్నాని.

భావము :

ఓ ప్రియురాలా! గోధ యని పేరుగల తారలను, మకరకర్కాటరాసులకు సంబంధించిన తారలను, ప్రత్యక్షదృశ్యములైన దేవగంగలోని జలజంతువులని నేను తలంతును. గోధాదిజంతువులు నీటినడుమ నుండును. నీటిపైన నుండును. ఇవి దేవగంగయందు క్రీడించు దేవతలవలన భయపడి, చాలలోతుగల నదియొక్క, యడుగుభాగమునందు మునిగి యున్నందువలన భూమిపైనున్న మనకు చక్కగా గానబడును.

శ్లో. స్మరస్య కమ్బుః కిమయం చకాస్తి
 దివి త్రిలోకీజయవాదనీయః ।
 కస్యాపర స్యోడుమయైః ప్రసూనై
 ర్వాదిత్రశక్తి ర్ఘటతే ఘటస్య॥

ప. వి. స్మరస్య - కమ్బుః - కిం - అయం - చకాస్తి - దివి - త్రిలోకీజయ వాదనీయః - కస్య - అపరస్య - ఉడుమయైః - ప్రసూనైః - వాదిత్ర శక్తిః - ఘటతే - ఘటస్య.

అర్థము: త్రిలోకీ జయవాదనీయః, త్రిలోకీ = మూడులోకముల సమూహము యొక్క, జయ = విజయమునందు, వాదనీయః = ప్రయోగింపబడగిన, స్మరస్య = మన్మథునకు సంబంధించిన, అయం = ఈ ప్రత్యక్షముగా గానవచ్చెడి విశాఖానక్షత్రరూపమైన, కమ్బుః = శంఖము. దివి = ఆకసమునందు, చకాస్తి కిమ్ = ప్రకాశించుచున్నదా యేమి? మిక్కిలి యెత్తైన ప్రదేశమునం దుంచబడిన వాద్య మంతట వినబడునని, యాకసమునందు స్థాపితమై, మూడులోకముల విజయమునకై వాదింపదగిన మన్మథునికి సంబంధించిన శంఖమా యేమి యని యర్థము. (ఏలయనగా) అపరస్య = మరియొక, కస్య = ఏ, ఘటస్య = ఘటువకు, ఉడుమయైః = నక్షత్ర రూపములగు, ప్రసూనైః = పుష్పములచే, వాదిత్రశక్తిః = వాద్య నిర్మాణము, ఘటతే = కుదురును. కుదరదు. ఏల యనగా మన్మథుని యొక్క, ధనుర్బాణములే పుష్పరూపములుగా నుండుటవలన, నతని వాద్యమే, పుష్పరూపముగా నుండునని భావించుట యుక్తముగాన తారా పుష్పరూపమైన కాముని శంఖమే గగనమందు శోభించుచున్నది. కాని యితరుని దేదియు నావిధముగా శోభించుటలేదని యర్థము.

సమాసములు :

త్రిలోకీజయవాదనీయః: త్రయాణాం లోకానాం సమాహారః = త్రిలోకీ, త్రిలోక్యాః జయః = త్రిలోకీజయః, త్రిలోకీజయేన వాదనీయః = త్రిలోకీ జయవాదనీయః.

ఉడుమయైః ఉడునాం వికారాః = ఉడుమయాని, తైః = ఉడుమయైః.
వాదిత్రశక్తిః : వాదిత్రే శక్తిః = వాదిత్రశక్తిః.

**భావము :**

మూడులోకములను మన్మథుడు జయించుటచే, నాజయమును సూచించుటకై యాతనికి సంబంధించినదియు ప్రత్యక్షదృశ్యమునగు నీ విశాఖానక్షత్ర రూపము గల్గిన, జయశఙ్ఖము మింట ప్రకాశించుచున్నదా యేమి? ఎత్తైన ప్రదేశమం దుంచబడి వాదింవబడిన, వాద్య మందఱికిని వినబడునని యాకసమందు ఉంచబడి, లోకత్రయవిజయమునకై వాదింపదగిన శంఖమే యావిశాఖా నక్షత్రము; విశాఖానక్షత్రము గూడ నాకసమునందు శంఖాకారముగా నుండును. మఱియు మన్మథునికంటె భిన్నుడైన మఱియొకనికి, నక్షత్రరూపములగు పుష్పములతో శంఖాదివాద్యనిర్మాణము సాధ్యముగాదు గదా! ఏలయనగా? మన్మథుని ధనుర్బాణములు పుష్పములై యుండుటవలన నతనికి సంబంధించిన వాద్యములను పుష్పరూపముగాభావించుట యుక్తముగాన, నాకసమునందు, తారాపుష్పరూపమగు మన్మథునిశంఖమే శోభించుచున్నదని యాశయము.

శ్లో. కిం యోగినీయం రజనీ రతీశం
యాఽజీజన త్పద్మమమూముహచ్చ ।
యోగర్ధిమస్యా మహతీమలగ్న
మిదం వదత్యమ్బరచుమ్బి శఙ్ఖమ్. ॥ 22

ప. వి. కిం - యోగినీ - ఇయం - రజనీ - రతీశం - యా - అజీజనత్ - పద్మం - అమూముహత్ - చ - యోగర్ధిం - అస్యాః - మహతీం - అలగ్నం - ఇదం - వదతి - అమ్బరచుమ్బి - శఙ్ఖం.

అర్థము: యా = ఏ, ఇయం = ఈ, రజనీ = రాత్రి, యోగినీ కిం = స్త్రీ పురుష యోగము గలదా యేమి? మఱియు, మరణోచ్చాటనములను తెలిసిన స్త్రీయా యేమి?, యా = ఎవ్వతె, రతీశం = పగలు నిర్జీవుడై యున్న మన్మథుని, అజీజనత్ = జన్మింపచేసెను. పద్మం = పద్మముల సమూహమును, అమూముహత్ = మోహముగలవిగా జేసినది. మఱియు ముదుచు

కొనిపోవునట్లు గావించినది. రాత్రి పద్మములు ముకుళించుట ప్రసిద్ధము గదా! అలగ్నం = నిరాధారమైనదియు, అమ్బరచుమ్బి = ఆకసమునంటి నదియును, కేవలము తారయే యగుటవలన, లేదా, అలగ్నం = మేషాది రాశిరూపము నొందనదియును నగు, ఇదం = ఈప్రత్యక్షదృశ్యమగు, కమ్బు = విశాఖారూపమగు శంఖము, అస్యాః = ఈరాత్రియొక్క, మహతీం = గొప్పదైన, యోగర్ద్ధిం = యోగమందలి యాధిక్యమును, వదతి = చెప్పుచున్నది.

**సమాసములు :**

యోగినీ : యోగః అస్యాః అస్తీతి = యోగినీ.

రతీశం : రతేః ఈశః = రతీశః. తం = రతీశం.

యోగర్ద్ధిం : యోగస్య ఋద్ధిః = యోగర్ద్ధిః, తాం = యోగర్ద్ధిమ్.

అలగ్నం : న లగ్నం = అలగ్నమ్.

అమ్బరచుమ్బి : అమ్బరం చుమ్బతీతి = అమ్బరచుమ్బి.

**భావము :**

ఈరాత్రి స్త్రీపురుషయోగము గల్గినందువలన యోగిని యగుచున్నది. రాత్రికాలమందే స్త్రీ పురుషయోగ మేర్పడును కాన నిది యుక్తము. మఱియు నీరాత్రి శాక్తమన్త్రసిద్ధిని బొందినదై మరణమును, భూతప్రేత పిశాచము లను నుచ్చాటనచేసెడి యోగమహిమగల స్త్రీయా యేమి? యేలయనగా, నీమె పగలు జీవరహితుడైన మన్మథుని బ్రతికింపజేసినది. పద్మములకు మోహమును గల్గించినది మన్మథుని విజృంభణము, పద్మముల మోడ్పు రాత్రియందే గదా యేర్పడును. మఱియు నెట్టి యాధారములేక యాకాశమున నెలకొనినదై, కేవ లము తారగా నున్నందున రాశిరూపమగు వ్యవహారము లేనిదై యీప్రత్యక్ష దృశ్యముగా నున్న శంఖాకృతిగల విశాఖయనెడి తారయే ఈయోగినియొక్క గొప్పయోగశక్తిని జెప్పుచున్నది. యోగశక్తి లేనిచో నిరాధారమగు శంఖము ఆకస మం దెట్లు నిలువగలదు? మరియు యోగశక్తి లేనిచో మృతుడెట్లు జీవించగలడు? మఱియు యోగశక్తి లేనియెడల పద్మములెట్లు మూర్ఛను బొందును. కాన నీ రాత్రి యోగినియని భావింపబడుచున్నదని యాశయము.

శ్లో. ప్రబోధకాలేఽహని బాధితాని
తారాః ఖపుష్పాణి నిదర్శయన్తీ ।
నిశాహ శూన్యాఽధ్వని యోగినీయం
మృషా జగద్దృష్టమపి స్ఫుటాభమ్ ॥ 23

ప. వి. ప్రబోధకాలే - అహని - బాధితాని - తారాః - ఖపుష్పాణి - నిదర్శయన్తీ - నిశా-ఆహ - శూన్యాఽధ్వని - యోగినీ - ఇయం-మృషా - జగత్ - దృష్టమ్ - అపి - స్ఫుటాభమ్.

అర్థము: హే ప్రియే ! = ఓ ప్రియురాలా !, ప్రబోధకాలే = జాగ్రదవస్థయందు, మఱియు సమ్యక్ జ్ఞానోత్పత్తి సమయమునందు, అహని = పగలునందు, బాధితాని = సూర్యకాన్తిచే దొలగిపోయిన కాన్తిగల, మఱియు భ్రాన్తి కారణము నశించుట వలన నుపపత్తిలేనివియును నగు, తారాః = నక్షత్ర రూపములగు, ఖపుష్పాణి = ఆకాశపుష్పములను, నిదర్శయన్తీ = చక్కగా జూపించుచు, మరియు దృష్టాన్తపరచుచు, శూన్యాఽధ్వని = బౌద్ధాదుల శూన్యవాది దర్శనవిషయము నందు, యోగినీ = దాని రహస్యము తెలిసినదై, యొకానొక సన్యాసిని వలె, ఇయం = ఈ, నిశా = రాత్రి, స్ఫుటాభం = స్పష్టమైన కాంతిగల్గిన యనగా స్పష్టముగా ప్రకాశించెడి, దృష్టమపి జగత్ = ప్రత్యక్షముతో తెలియబడునట్టి స్థావరజంగమ రూపమగు ప్రపంచమును, మృషా = అసత్యముగా, ఆహ = చెప్పుచున్నది. బౌద్ధాదిదర్శనమందు జ్ఞానమే బాహ్యములగు ఘటాదులగు యాకారమును వహించుననియు, జ్ఞానమున కంటె భిన్నమైనవంతయు మిథ్యయనియు చెప్పబడు చున్నది. ఆ విధముగనే ఈరాత్రియు పగలు నందు గనబడనట్టివైనను పూలతో సమానములగు నక్షత్రములను తన యోగము వలన నాకసమునందు జూపుచున్నదని భావము.

సమాసములు :

ప్రబోధకాలే : ప్రబోధస్య కాలః = ప్రబోధకాలః, తస్మిన్ ప్రబోధకాలే.
ఖపుష్పాణి : ఖస్య పుష్పాణి = ఖపుష్పాణి.

శూన్యాఽధ్వని : శూన్య శ్చాసౌ అధ్వా చ = శూన్యాఽధ్వా,తస్మిన్ = శూన్యాఽధ్వని.

స్ఫుటాభం : స్ఫుటా ఆభా యస్య తత్ = స్ఫుటాభం, తత్ = స్ఫుటాభం.

**భావము :**

ఓ ప్రియురాలా ! జాగ్రద్దశయందును, సమ్యక్ జ్ఞానోత్పత్తిసమయము నందు, అనగా పగటియందు సూర్యకాంతిచే బాధింపబడినవియు ననగా కాంతి బోగొట్టుకొనినవియును, మఱియును భ్రాంతికారణము నశించుట వలన నుపపత్తి రహితములగు నక్షత్రరూపములగు గగనపుష్పములను జక్కగా చూపుచున్న దియు, దృష్టాన్తపరచుచున్నదియును, బౌద్ధాదుల శూన్యవాదిదర్శనమునకు సంబంధించిన రహస్యములను తెలిసికొనిన యొకనొక సన్యాసినియగు నీరాత్రి చక్కగా గానవచ్చుచున్న స్థావరజంగమరూపమగు సకలప్రపంచమును నసత్యమని చెప్పుచున్నది. బౌద్ధాదిదర్శనమందు జ్ఞానమే బాహ్యములగు ఘటపటాద్యాకారములను గల్గియుండుననియు,జ్ఞానమునకంటె భిన్నమైన దంతయు మిథ్య యనియు చెప్పబడుచున్నది. అట్లే యీరాత్రి యోగినియు పగలునందు కానబడనివైనను పుష్పతుల్యములగు నక్షత్రములను తనయోగమువలన నాకసమునందు జూపుచున్నదని యాశయము.

శ్లో ఏణః స్మరేణాఙ్కమయః సపత్రా
కృతో భవద్భ్రూయుగధన్వనా యః ।
ముఖం తవేన్దౌ లసతా స తారా
పుష్పాలి బాణానుగతో గతోఽయమ్ ॥ 24

ప. వి. ఏణః - స్మరేణ - అఙ్కమయః - సపత్రాకృతః - భవద్భ్రూయుగ ధన్వనా - యః - ముఖం - తవ - ఇన్దౌ - లసతా - సః - తారా పుష్పాలి బాణానుగతః - గతః - అయమ్.

**అర్థము:** హే భైమి ! = ఓ దమయన్తీ !, తవ = నీయొక్క, ముఖే = ముఖ మనెడి, ఇన్దౌ = (ఆహ్లాదకత్వము మున్నగు గుణములు గల్గియున్నందు వలన) చంద్రుని యందు, లసతా = ప్రకాశించెడిదియు, తథా = అట్లే, భవద్భ్రూయుగధన్వనా, భవత్ = నీయొక్క, భ్రూయుగ = కను బొమ్మల జంటయే. ధన్వనా = ధనుస్సుగా గలిగిన. స్మరేణ = మన్మథునిచే యః = ఏ, అఙ్కమయః = నీ ముఖచంద్రుని యందలి కలఙ్కరూపమైన, ఏణః = జింక, సపత్రాకృతః = ఉదరమందే నిలచిన రెక్కలు గలదిగను, శరీరముయొక్క మఱియొక భాగమునుండి, వెలుపలికి గానవచ్చునదిగను, (గొట్టబడినదో) సోఽయమేవ = ఆ ఈ జింకయే, తారాపుష్పాలి బాణానుగతః, తారా = నక్షత్రరూపమైన, పుష్పాలి = పుష్పపఙ్క్తి యనెడి బాణ = బాణముతో, అనుగతః = కూడినదై, గతః = పరుగెత్తి వెడలినదై, (గగనే = ఆకసమునందు, దృశ్యతే కిం ? = చూడబడుచున్నదా యేమి ?) చంద్రుని యందు జింక యుండ వలయును. నీ ముఖము చంద్రుడుగాన దానియందును మృగము ఉండ వలయును గదా! కాని ముఖచంద్రుని యందు దామృగము లేదు. విల్లుతో గూడిన మన్మథుడు ముఖమునందు ప్రకాశించుచున్నాడు. ఆకసమందు మృగశిరయను నక్షత్రము మృగమను పేరుగలదై, బాణాకారము గు పుష్పముతో సమానమైన నక్షత్రముతో కూడి కానవచ్చుచున్నది. తొలుత నీ ముఖము నందున్న యామృగము మన్మథునిచే కొట్టబడినదై, శరీరము లోపలిచిపోయిన రెక్కలుగలదై, శరీరముయొక్క మరియొక పార్శ్వము నుండి వెలువడిన బాణముతో గొట్టబడినదై పరుగెత్తి పోయినది. అదియే ఈమృగముగా అనగా మృగశిరా నక్షత్రముగా గానవచ్చు చున్నదా యని భావింపబడుచున్నది.

**సమాసములు :**

**అఙ్కమయః :** అఙ్కస్య వికారః = అఙ్కమయః.

**సపత్రాకృతః :** పత్త్రైః సహితః = సపత్రః, సపత్రః వ్యథితః = సపత్రాకృతః.

భవదూభ్రియుగధన్వనా : భ్రువోః యుగం = భ్రూయుగం, భవత్యాః భ్రూయుగం = భవద్భ్రూయుగం, భవద్భ్రూయుగం ధనుః యస్య సః = భవద్భ్రూయుగధన్వా. తేన = భవద్భ్రూయుగధన్వనా.

తారాపుష్పాలిబాణానుగతః : పుష్పాణాం ఆలిః = పుష్పాలిః, తారా ఏవ పుష్పాలిః = తారాపుష్పాలిః, తారాపుష్పాలిరేవ బాణః = తారాపుష్పాలి బాణః, తారాపుష్పాలిబాణేన అనుగతః = తారాపుష్పాలిబాణానుగతః.

**భావము :**

ఓదమయన్తీ! అహ్లాదకత్వాదిగుణము లుండుటవలన నీముఖ మనెడి చంద్రుని యందు, కలఙ్కరూపమైన మృగము, ఆముఖచంద్రునందే యున్న కనుబొమ్మల జంటయను విల్లును ధరించిన మన్మథుడను విలుకానిచే దాని యుదర మందు తెక్కలుండి మఱియొక శరీరపార్శ్వమునుండి వెలువడునట్టి బాణముచే గొట్టబడినది. పిదప నామృగము నక్షత్రరూపమైన పుష్పపఙ్క్తియనెడి బాణముతో గూడినదై పరుగిడిపోయి యాకసమునందు మృగశిరయనెడి నక్షత్రముగా గానబడు చున్నదా యేమి? అట్లుకానిచో నీముఖమునందు అనగా ముఖచంద్రుని యందు కలఙ్కరూపమగు మృగము గానబడవలయును గదా!.

శ్లో. లోకాశ్రయో మణ్డప మాదిసృష్టి
 బ్రహ్మాణ్డమాభా త్యనుకాష్ఠ మస్య
స్వకాన్తిరేణూత్కరవాన్తిమన్తి
 ఘుణవ్రణద్వారనిభాని భాని ॥ 25

ప. వి. లోకాశ్రయః - మణ్డపం - ఆదిసృష్టి - బ్రహ్మాణ్డమ్ - ఆభాతి - అనుకాష్ఠం - అస్య - స్వకాన్తిరేణూత్కరవాన్తిమన్తి - ఘుణవ్రణద్వార నిభాని - భాని.

అర్థము: హేభైమి! = ఓదమయన్తీ!, బ్రహ్మాణ్డం = బ్రహ్మాణ్డము, ఆదిసృష్టి' ఆది = తొలుతననగా, నన్నిటికంటెను పూర్వము, సృష్టి = నిర్మాణము గల్గినది, మఱియు, ఆదిసృష్టి = చిరకాలమునందు సృజింపబడినట్టి, మణ్డపం = మణ్డపముగా, ఆభాతి = ప్రకాశించుచున్నది, (యతః =

ఏలయనగా) లోకాశ్రయః, లోక = మూడులోకములకును, ఆశ్రయః = ఆబ్రహ్మాండము ఆశ్రయమైనది. మణ్డపమును, లోకాశ్రయః, లోక = దానియందుండెడి జనులకు, ఆశ్రయః = ఆశ్రయమైనది. (కావుననే) అస్య = ఈ బ్రహ్మాణ్డమణ్డపమునకు, అనుకాష్ఠం = దీనికి సంబంధించిన యన్నిదిక్కులయందును, మఱియు దీనికి సంబంధించిన కఱ్ఱల యందు, అనగా నాకఱ్ఱలను గురిగావించుకొని, భాని = నక్షత్రములు, స్వకాన్తిరేణూత్కరవాన్తిమన్తి, స్వ = తనకు సంబంధించిన, కాన్తి రేణు = తేజః పరాగములయొక్క, ఉత్కర = సమూహముయొక్క, వాన్తి = వాన్తిని అనగా నుద్గారమును, మన్తి = కలిగిన, ఘుణవ్రణ ద్వారనిభాని, ఘుణ = ఘుణములనెడి పురుగులచే, దొలుచబడిన, వ్రణ = రంధ్రములయొక్క, ద్వారా = ముఖములతో, నిభాని = సమానములుగా (దృశ్యన్తే = కనబడుచున్నవి.)

సమాసములు :

లోకాశ్రయః : లోకానాం ఆశ్రయః = లోకాశ్రయః.

ఆదిసృష్టి : ఆదౌ సృష్టిః = ఆదిసృష్టిః

అనుకాష్ఠమ్ : కాష్ఠాను కాష్ఠాసు = అనుకాష్ఠమ్. పక్షాన్తరము

కాష్ఠే కాష్ఠే = అనుకాష్ఠమ్.

స్వకాన్తిరేణూత్కరవాన్తిమన్తి : స్వస్య కాన్తిః = స్వకాన్తిః, స్వకాన్తేః రేణవః = స్వకాన్తిరేణవః, స్వకాన్తిరేణూనాం ఉత్కరః = స్వకాన్తిరేణూత్కరః, స్వకాన్తిరేణూత్కరస్య వాన్తిః = స్వకాన్తి రేణూత్కరవాన్తిః, స్వకాన్తిరేణూత్కరవాన్తిః ఏషా మస్తీతి = స్వకాన్తి రేణూత్కరవాన్తిమన్తి.

ఘుణవ్రణద్వారనిభాని : ఘుణస్య వ్రణః = ఘుణవ్రణః. ఘుణ వ్రణస్యద్వారం = ఘుణవ్రణద్వారం, ఘుణవ్రణద్వారేణ సదృశాని = ఘుణవ్రణద్వారనిభాని.

భావము :

ఓ దమయన్తీ ! బ్రహ్మాణ్డ మన్నిటికంటె తొలుత నిర్మింపబడినదై

చిరకాలమునకు పూర్వము నిర్మింపబడిన మణ్డపమువలె శోభించుచున్నది. బ్రహ్మాణ్డము మూడులోకములకును ఆశ్రయము. మణ్డపము లోకములకు అనగా జనుల కాశ్రయము, దానినీడయందు తలదాచుకొనువారి కది యాశ్రయమే యగుచున్నది. కావుననే యీబ్రహ్మాణ్డమణ్డపమునకు సంబంధించి యన్నిదిక్కుల యందును, అన్నికఱ్ఱలయందును నక్షత్రములు స్వకాన్తిరేణువులును వెడల్గ్రక్కినవై, ఘుణములనెడి పురుగులు గావించిన రంధ్రములయొక్క ముఖములతో సమానములుగా గనబడుచున్నవి. అనగా నక్షత్రములు పురుగులు తొలచిన కొయ్యల చూర్ణముతో గూడిన కొయ్యల రంధ్రముల యగ్రభాగములవలె శోభించుచున్నవని యర్థము. జనులకు దలదాచుకొనుటకు ఎడమిచ్చెడి మణ్డపములు చాల బాతపడగా, వాని కొయ్యలయందు బురుగులు పడును. అవి తొలచిన రంధ్రముల ముఖములు, అందుండి రాలెడు కొయ్యల పొడులతో గూడినవై సుంద్రములుగను తెల్లనివిగను నుండును. వానివలె నక్షత్రములు ప్రకాశించుచున్నవని భావము.

శ్లో. శచీ సపత్న్యాం దిశి పశ్య భైమి!
శక్రేభదానద్రవనిర్ఝరస్య ।
ప్రోప్లాయతే వాసరసేతునాశా
దుచ్ఛృఙ్ఖలః పూర ఇవాన్ధకారః ॥ 26

ప. వి. శచీసపత్న్యాం - దిశి - పశ్య - భైమి - శక్రేభదానద్రవనిర్ఝరస్య - ప్రోప్లాయతే - వాసరసేతునాశాత్ - ఉచ్ఛృఙ్ఖలః - పూరః - ఇవ - అన్ధకారః,

అర్థము: హేభైమి! = ఓదమయన్తీ!. అన్ధకారః = చీకటి, శచీసపత్న్యాం. శచీ = శచీదేవికి, సపత్న్యాం = సపత్నియైన, దిశి = తూర్పుదెస యందు, వాసరసేతునాశాత్, వాసర = పగలనెడు, సేతు = అడ్డకట్ట, లేదా ఆనకట్ట, నాశాత్ = నశించుటవలన, ఉచ్ఛృఙ్ఖలః = అడ్డములేని, శక్రేభదానద్రవనిర్ఝరస్య, శక్ర = ఇంద్రునియొక్క, ఇభ = ఏనుగైన యైరావతమునకు సంబంధించిన, దానద్రవ = మదజలమునకు సంబంధించిన, నిర్ఝరస్య = ప్రవాహముయొక్క, పూర ఇవ = వెల్లువ వలె, ప్రోప్లాయతే = మిక్కిలిపొంగుచున్నది. త్వం = నీవు, పశ్య = చూడుము.

**సమాసములు :**

శచీసపత్న్యాం : సమానః పతిః యస్యాః సా = సపత్నీ, శచ్యాః సపత్నీ = శచీసపత్నీ, తస్యాం = శచీసపత్న్యాం.

శక్రేభదానద్రవనిర్ఝరస్య: శక్రస్య ఇభః = శక్రేభః, దానమేవ ద్రవః = దానద్రవః. శక్రేభస్య దానద్రవః = శక్రేభదానద్రవః, శక్రేభదానద్రవస్య నిర్ఝరః = శక్రేభదానద్రవనిర్ఝరః, తస్య = శక్రేభదానద్రవనిర్ఝరస్య.

వాసరసేతునాశాత్ : వాసర ఏవ సేతుః = వాసరసేతుః, వాసరసేతోః నాశః = వాసరసేతునాశః, తస్మాత్ = వాసరసేతునాశాత్.

ఉచ్ఛృఙ్ఖలః : ఉద్గతా శృఙ్ఖలా యస్మాత్ సః = ఉచ్ఛృఙ్ఖలః.

**భావము :**

ఓ దమయన్తీ! చీకటి, తూర్పుదిక్కునందలి పగలనెడి యానకట్ట తొలగిపోగా ననగా సూర్యకాన్తియనెడి యవధి తొలగిపోగా, నడ్డములేనిదై, యింద్రుని యైరావతమనెడి యేనుగునకు సంబంధించిన మదజలప్రవాహముయొక్క వెల్లువవలె తూర్పున పొంగుచున్నది. నీవు చూడుము.

శ్లో. రామాలిరోమావలిదిగ్విగాహి
ధ్వాన్తాయతే వాహన మన్తకస్య ।
యద్వీక్ష్య దూరాదివ బిభ్యతః స్వా
నశ్వాన్ గృహీత్వా పసృతో వివస్వాన్॥ 27

ప. వి. రామాలిరోమావలిదిగ్విగాహి - ధ్వాన్తాయతే - వాహనం - అన్తకస్య - యత్ - వీక్ష్య - దూరాత్ - ఇవ - బిభ్యతః - స్వాన్ - అశ్వాన్ - గృహీత్వా-అపసృతః - వివస్వాన్.

అర్థము: రామాలిరోమావలిదిగ్విగాహి, రామ = శ్రీరామునియొక్క, ఆలి = సేతువును, రోమావళి = నూగారుగా గల్గిన, దిక్ = దక్షిణదిక్కును, విగాహి = వ్యాపించిన, అన్తకస్య = యమునియొక్క, వాహనం = వాహనమైనమహిషమే. ధ్వాన్తాయతే = చీకటిగా నాచరించుచున్నది. వివస్వాన్ = సూర్యుడు, యత్ = ఏ యముని వాహనమును, దూరాత్ =

దూరమునుండి, వీక్ష్య = చూచి, బిభ్యతః = (మహిషముతోటి సహజ వైరము వలన) భయపడుచున్న, స్వాన్ = తనవియైన అశ్వాన్ = గుఱ్ఱములను, గృహీత్వా = తీసుకొని, అపసృత ఇవ = తొలగి పరుగిడి పోయెనో యనునట్లున్నాడు. అనగా దక్షిణదిక్కునందలి చీకటి యమ వాహనమగు మహిషమువలె శోభించుచున్నదని యర్థము.

సమాసములు :

రామాలిరోమావలిదిగ్విగాహి : రామస్య ఆలిః = రామాలిః, రోమ్ణాం అవలిః = రోమావలిః, రామాలిరేవ రోమావలిః యస్యాస్సా = రామాలిరోమావలిః, రామాలిరోమావలిశ్చాసౌ దిక్చ = రామాలిరోమావలి దిక్, రామాలిరోమావలిదిశః విగాహత ఇతి = రామాలిరోమావలిదిగ్విగాహి.

ధ్వాన్తాయతే : ధ్వాన్తమివ ఆచరతి = ధ్వాన్తాయతే.

భావము :

శ్రీరామచంద్రుని సేతువునే రోమావళిగా గల్గిన దక్షిణదిక్కును జొచ్చుకొనిన యముని వాహనమగు మహిషమే చీకటిగా నాచరించుచున్నది. సూర్యుడా మహిషవాహనమును జూచి దానితో సహజవైరము గలిగియుండుటచే భయపడుచున్న తనవాహనములగు గుఱ్ఱములను తొలగించుకొని పరుగిడి పోవుచున్నాడని యాశయము.

శ్లో. ఏకం మహాకాలఫలం కిలాసీ
త్ప్రత్యగ్గిరేః సానుని భానుబిమ్బమ్ ।
భిన్నస్య తస్యైవ దృషన్నిపాతా
ద్బీజాని జానామితమాం తమాంసి ॥ 28

ప. వి. ఏకం - మహాకాలఫలం - కిల - ఆసీత్ - ప్రత్యగ్గిరేః - సానుని - భానుబిమ్బమ్ - భిన్నస్య - తస్య - ఏవ - దృషన్నిపాతాత్ - బీజాని - జానామితమాం - తమాంసి.

అర్థము: భానుబిమ్బం = సూర్యబింబమును, ప్రత్యగ్గిరేః = పడమటిపర్వతము యొక్క, సానుని = చరియయందలి, ఏకం = ఒక్కటైన, మహాకాల

ఫలం = మహాకాలముయొక్క ఫలమగు, కింపాకఫలముగా, మన్యే = తలంతును, తథా = అట్లే, అది మిక్కిలి పండినందువలన దొడిమ వీడి యెత్తైన ప్రదేశము నుండి, దృషన్నిపాతాత్ = పడమటిపర్వతపుశిలపై బడుటవలన, భిన్నస్య = పగిలిన, తస్యైవ = ఆపండుయొక్కయే, బీజాని = నల్లనివిత్తనములను, తమాంసి = చీకట్లుగా, జానామితమాం = మిక్కిలి తెలిసికొందును.

**సమాసములు :**

మహాకాలఫలం : మహాంశ్చాసౌ కాలశ్చ = మహాకాలః, మహాకాలస్య ఫలం = మహాకాలఫలమ్. పక్షాన్తరమున - మహాకాల ఇతి ఫలం = మహాకాలఫలం.

ప్రత్యగ్గిరేః: ప్రతీచః గిరిః = ప్రత్యగ్గిరిః, తస్య = ప్రత్యగ్గిరేః.

భానుబిమ్బం : భానోః బిమ్బం = భానుబిమ్బం.

దృషన్నిపాతాత్ : దృషతి నిపాతః = దృషన్నిపాతః, తస్మాత్ = దృషన్నిపాతాత్.

జానామితమాం ; అతిశయేన జానామి = జానామితమాం.

**భావము :**

సూర్యబింబమును, పడమటనున్న యస్తపర్వతముయొక్క చరియయందు కాలవశముచే బండినట్టి యసంఖ్యాకములగు మన్వన్తరాదులచే విపులమైనట్టి మహాకాలముయొక్క ఫలమని తలంతును. యుగమన్వన్తరాద్యవాన్తరకాలములు సూర్యచలనములచే నేర్పడి గణింపబడుచున్నవి. కాన నామహాకాలమునకు ఫలము సూర్యుడగుచున్నాడు. మఱియు మహాకాలమని వృక్షమునకును పేరు. దీనినే కింపాకమనియు జెప్పుదురు. ఇది కొండలు మున్నగు రాతినేలపై మొలచి నిమ్మపండువలె గుండ్రముగా నుండును. దీనికి విత్తనములు నల్లగ నుండును. గ్రహబాధలు తొలగుటకై యీఫలమును గృహద్వారములకు గట్టుకొనెదరు. మఱియు సూర్యబింబ మనెడి యీపండు చక్కగా బండి తొడిమ వీడి, పడమటి కొండయందలి శిలపై బడుటవలన బగిలినది. దాని నల్లనివిత్తనములనే చీకట్లుగా తలంతును. ఇతరదిక్కులకంటె పడమటిదిక్కునందు చీకట్లు తక్కువ. ఏల

యనగా నాదిక్కునందు సంధ్యాకాంతు లుండును. కాన దానిని సూచించుటకై మహాకాలఫలముయొక్క నల్లని వి త్తనములుగా చీకట్లు చెప్పబడినవి. అవి త్తనములనే చీకట్లుగా జెప్పుటవలన బదమటి వైపునం దల్పాంధకారము వ్యాపించినదని సూచితము. అవి తమోబీజములు గాన తమః ప్రారంభమును సూచించును. ఆతమస్సు నకంటెను బీజరూపములగు తమస్సులు తక్కువ యని సూచితము.

శ్లో. పత్యు ర్గిరీణా మయశః సుమేరు
ప్రదక్షిణా ద్భాస్వదనాదృతస్య ।
దిశ స్తమ శ్చైత్రరథాన్యనామ
పత్రచ్ఛటాయా మృగనాభిశోభి ॥ 29

ప. వి. పత్యుః - గిరీణాం - అయశః - సుమేరుప్రదక్షిణాత్ - భాస్వదనాదృతస్య - దిశః - తమః - చైత్రరథాన్యనామపత్రచ్ఛటాయాః - మృగనాభిశోభి.

అర్థము: చైత్రరథాన్యనామ పత్రచ్ఛటాయాః, చైత్రరథ = కుబేరుని వనమనెడి, అన్యనామ = వేరొక పేరుగల, పత్రచ్ఛటా = పత్రావళి గలిగిన, దిశః = ఉత్తరదిక్కుయొక్క, మృగనాభిశోభి, మృగనాభి = (మకరికాది పత్రావళులను రచించుటకు సాధనమైన (కస్తూరివలె, శోభి = శోభించు, తమః = నల్లని చీకటి, సుమేరుప్రదక్షిణాత్, సుమేరు = మేరుపర్వతమును, ప్రదక్షిణాత్ = ప్రదక్షిణము చేయుటవలన, భాస్వతా = సూర్యునిచే, అనాదృతస్య = అవమానింపబడిన, గిరీణాం = పర్వతములకు, పత్యుః = పాలకుడగు హిమగిరియొక్క, అయశః = అపకీర్తియే, హిమగిరి పర్వతరాజైనను నతనిని వదలి సూర్యుడు మేరుపర్వతమును ప్రదక్షిణము చేయుటవలన నాయవమానము వలని యపకీర్తియే యిచ్చట చీకటి యని యర్థము.

సమాసములు :

అయశః : న యశః = అయశః.

సుమేరుప్రదక్షిణాత్ : సుమేరోః ప్రదక్షిణః = సుమేరుప్రదక్షిణః.
తస్మాత్ = సుమేరుప్రదక్షిణాత్.

భాస్వదనాదృతస్య : న ఆదృతః = అనాదృతః. భాస్వతా అనాదృతః = భాస్వదనాదృతః తస్య = భాస్వదనాదృతస్య.
చైత్రరథాన్యనామపత్రచ్ఛటాయాః : చైత్రరథమితి అన్యం నామ యస్యాః సా = చైత్రరథాన్యనామా, పత్రాణాం ఛటా=పత్రచ్ఛటా. చైత్రరథాన్యనామా చ సా పత్రచ్ఛటా చ = చైత్రరథాన్యనామ పత్రచ్ఛటా, తస్యాః = చైత్రరథాన్యనామపత్రచ్ఛటాయాః.
మృగనాభిశోభి : మృగనాభివత్ శోభత ఇతి = మృగనాభిశోభి.

**భావము :**

కుబేరుని వనమునకు చైత్రరథమని పేరు. చైత్రరథమునకే పత్రావలియను మరియొక పేరు గలదు. ఆ పత్రావలికి సంబంధించిన దిక్కు ఉత్తరము. పత్రావలి యనగా స్తనములు మున్నగు నవయవములపై వ్రాయబడు మకరికాది పత్రావలియే, ఆ పత్రాలించనకు సాధనమైన కస్తూరి యాదిక్కునందలి హిమాలయపర్వతము నందలి కస్తూరిమృగములనుండి లభించును. కాన నాకస్తూరి యుత్తరదిక్కునకు సంబంధించినదిగా భావించబడినది. ఆకస్తూరివలె మిక్కుటమగు దిక్కునందలి చీకటి, పర్వతరాజగు హిమాచలమును దిరస్కరించి మేరుపర్వతమును సూర్యుడు ప్రదక్షిణము గావించుటవలన హిమగిరి కేర్పడిన యపయశస్సు. హిమగిరి గొప్పదైనచో సూర్యుడు దానిని దిరస్కరించి మేరుపర్వతమునకు ప్రదక్షిణ మేల చేయును. కావున మేరుపర్వతమే గొప్పది. హిమగిరి దానికంటెను హీనమైనది. కాన దీనివలన యపయశస్సే హిమగిరి కేర్పడి యదియే యాదిక్కునందలి తమస్సుగా వ్యవహరింనబడుచున్నదని యాశయము.

శ్లో. ఊర్ధ్వం ధృతం వ్యోమ సహస్రరశ్మే
ర్దివా సహస్రేణ కరై రివాసీత్ ।
ఏత త్తదేవాంశుమతా వినేదం
నేదిష్ఠతామేతి కుత స్తమిస్రమ్ ॥ 30

ప. వి. ఊర్ధ్వం - ధృతం - వ్యోమ - సహస్రరశ్మేః - దివా - సహస్రేణ - కరైః - ఇవ - ఆసీత్ - ఏతత్ - తత్ - ఏవ - అంశుమతా - వినా - ఇదం - నేదిష్ఠతాం - ఏతి - కుతః - తమిస్రమ్.

అర్థము: యత్ = ఏ, వ్యోమ = నల్లని యాకసము, దివా = పగలు, సహస్ర రశ్మేః = వేయి కిరణములు గలిగిన సూర్యునియొక్క, సహస్రేణ = వేయియైన, కరైః = కిరణముల చేతను, హస్తముల చేతను, ఊర్ధ్వం = పైని యున్నతమగు దేశమునందు, ధృతమివ = ధరింపబడినదో యనునట్లు, తదేవ = అదియే, ఇదం = ఈ నల్లని యాకసము, అంశుమతా వినా = సూర్యుడులేక సాయంకాలమునందు, పతత్ = పడుచు, నేదిష్ఠతాం = మిక్కిలి దగ్గరగ నుండుటను, ఏతి = పొందుచున్నది. తమిస్రం = చీకటి, కుతః = ఎక్కడిది. చీకటి యనునదేదియు లేదు. సాయంకాలము ఆకసమును మోయునట్టి సూర్యుడు లేనందువలన నాయాకసమే క్రిందికి జారి మనకు దగ్గరకు వచ్చినదని యర్థము.

**సమాసములు :**

సహస్రరశ్మేః : సహస్రం రశ్మయః యస్య సః = సహస్రరశ్మిః, తస్య = సహస్రరశ్మేః.

అంశుమతా : అంశవః అస్య సన్తీతి = అంశుమాన్, తేన = అంశుమతా.

నేదిష్ఠతాం : అతిశయేన అంతికం = నేదిష్ఠం, నేదిష్ఠస్య భావః = నేదిష్ఠతా, తాం = నేదిష్ఠతామ్.

**భావము :**

నల్లని యాకసము పగలు వేయికిరణములు (వేయిచేతులు) గల సూర్యునిచే బైకి బట్టబడి యుండినది. ఆ సూర్యుడస్తమించుట వలన సాయంకాలమందు దానిని బైకి బట్టువాడు లేనందువలన నది దిగువకు జారుచు మనకు చాల దగ్గరయైనది. కాన మనకు సమీపమున జారిపడిన యాకసమే చీకటి కాని చీకటి యని మఱియొకటి లేదు.

శ్లో. ఊర్ధ్వార్పితన్యుబ్జకటాహకల్పే
యద్వ్యోమ్ని దీపేన దినాధిపేన ।
న్యధాయి తద్ధూమమిలద్గురుత్వం
భూమౌ తమః కజ్జల మస్థలత్కిమ్ ॥ 31

ప. వి. ఊర్ధ్వార్పితన్యుబ్జకటాహకల్పే - యత్ - వ్యోమ్ని - దీపేన - దినాధిపేన - న్యధాయి - తత్ - ధూమమిలద్గురుత్వం - భూమౌ - తమః - కజ్జలం - అస్ఖలత్ - కిమ్.

అర్థము: (విధినా = దైవముచేత) ఊర్ధ్వార్పితన్యుబ్జ కటాహకల్పే, ఊర్ధ్వ = (సూర్యు డనెడి దీపమునకు) పైన, అర్పిత = ఉంచబడిన, న్యుబ్జ = క్రింది ముఖముగా నున్న, కటాహ = గంగాళముతో, కల్పే = సమానమైన, వ్యోమ్ని = ఆకసమందు, దినాధిపేన = పగటికి ప్రభువైనట్టి సూర్యుడనెడి దీపముచే, యత్ = ప,కజ్జలం = దీపపుమసి, న్యధాయి = ఉంచబడినదో, తత్ = ఆ దీపపుమసియే, తమః = చీకటిగా, ధూమమిలద్గురుత్వం, ధూమ = క్రమముగా నుత్పన్నమగు బాహుళ్యముచే. మిలత్ = పొందిన, గురుత్వం = (పడుటకు కారణమైన) భారమును గలిగినదై, భూమౌ = భూమిపై, అస్ఖలత్ కిం = జారిపడినదాయేమి ?

సమాసములు :

ఊర్ధ్వార్పితన్యుబ్జకటాహకల్పే : ఊర్ధ్వం అర్పితః = ఊర్ధ్వార్పితః, న్యుబ్జ శ్చాసౌ కటాహశ్చ = న్యుబ్జకటాహః, ఊర్ధ్వార్పిత శ్చాసౌ న్యుబ్జ కటాహశ్చ = ఊర్ధ్వార్పితన్యుబ్జకటాహః, ఊర్ధ్వార్పితన్యుబ్జకటాహేన తుల్యః = ఊర్ధ్వార్పితన్యుబ్జకటాహకల్పః, తస్మిన్ = ఊర్ధ్వార్పితన్యుబ్జ కటాహకల్పే.

దినాధిపేన : దినస్య అధిపః = దినాధిపః, తేన = దినాధిపేన.

ధూమమిలద్గురుత్వం : బహో ర్భావః = భూమా, భూమ్నా మిలత్ = భూమమిలత్, గురోః భావః = గురుత్వం, భూమ మిలత్ గురుత్వం యస్య తత్ = భూమమిలద్గురుత్వమ్.

భావము :

సూర్యు డనెడి దీపమునకు పైభాగమున బోరగిల నుంచిన పెద్దగంగాళము వంటి పాత్రతో నసగా సూర్య దీపమునుండి యేర్పడు మసిని బట్టుటకై యుంచిన పెద్దగంగాళము వంటి పాత్రతో సమానమైన నల్లని యాకసమునందు సూర్యునిచే నే మసి యుంచబడినదో ఆ మసి ప్రతిదినము పెరుగుటవలన

భారమును బొందినదై భూమిపై బడినదా యేమి ? ఆ దీపపుమసియే చీకటి. కాని చీకటి యని మఱియొకటి యేదియును లేదు.

శ్లో. ధ్వాన్తైణనాభ్యా శితినామ్బరేణ
దిశః శరైః సూనశరస్య తారైః ।
మన్దాక్షలక్ష్యా నిశి మామనిన్దో
సేర్ష్యా భవాయా న్త్యభిసారికాభాః ॥ 32

ప. వి. ధ్వాన్తైణనాభ్యా - శితినా - అమ్బరేణ - దిశః - శరైః - సూనశరస్య - తారైః - మన్దాక్షలక్ష్యాః - నిశి - మామ్ - అనిన్దో - సేర్ష్యా - భవ - ఆయాన్తి - అభిసారికాభాః.

అర్థము: ధ్వాన్తైణనాభ్యా, ధ్వాన్త = చీకటి యనెడి, ఏణనాభ్యా = కస్తూరిచే, తథా = అట్లే, శితినా = నల్లనైన, అమ్బరేణ = ఆకసముచే (వస్త్రముచే), లేదా, ధ్వాన్తైణనాభ్యా = చీకటియను కస్తూరిచేతను, శితినా = నల్లని, అమ్బరేణ = ఆకసముతోడను, గూడిన, అట్లే, తారైః = నక్షత్రములనెడి, సూనశరస్య = పుష్పబాణుడైన మన్మథుని యొక్క, శరైః = బాణములతో గూడినవియు, మఱియు, తారైః = ఉజ్జ్వలములైన పుష్పములతో గూడినవియు, (తథా = అట్లే) ప్రకాశము లేనందువలన, మందాక్షలక్ష్యాః, మన్దాక్ష = మన్దములైన నేత్రములచే, లక్ష్యాః = చూడదగినవియును, మఱియు, మన్దాక్ష = సిగ్గునకు, లక్ష్యాః = విషయములైనవియును (కావుననే) అభిసారికాభాః, అభిసారికాః = అభిసారికలతో, ఆభాః = సమానములైనవియును, నగు, దిశః = దిక్కులు, అనిన్దో = చన్ద్రుడులేని, నిశి = రాత్రియందు, మాం = నన్నుగూర్చి. ఆయాన్తి = వచ్చుచున్నవి కావున, నీవుసపత్ని యనెడి భ్రాన్తితో, సేర్ష్యా = ఈర్ష్యతో గూడిన దానవుగా, భవ = కమ్ము.

సమాసములు :

ధ్వాన్తైణనాభ్యా : ధ్వాన్తమేవ ఏణనాభిః = ధ్వాన్తైణనాభిః, తయా = ధ్వాన్తైణనాభ్యా.

సూనశరస్య : సూనం శరః యస్య సః = సూనశరః, తస్య = సూనశరస్య.

మన్దాక్షలక్ష్యై : మన్దాక్షైః లక్షయితుం యోగ్యా = మన్దాక్షలక్ష్యా. పక్షాన్తరమున మన్దాక్షేణ లక్ష్యా = మన్దాక్షలక్ష్యా.

అనిన్దౌ : అవిద్యమానః ఇన్దుః యస్యాః స్యా = అనిన్దుః, తస్యాం = అనిన్దౌ.

సేర్ష్యా : ఈర్ష్యయా సహితా = సేర్ష్యా.

అభిసారికాభాః : అభిసారికాయాః ఆభేన ఆభా యాసాం తాః = అభిసారికాభాః.

భావము :

దిక్కులు చన్ద్రుడులేని రాత్రులయందు నభిసారికలవలె నన్ను అనగా నలుడనైన నన్ను నభిసరించుచున్నవి. వెన్నెల లేనపుడు స్త్రీలు అభిసరింతురు గదా! అట్లే యిచ్చట దిక్కులు వెలుగు నిచ్చెడు చంద్రుడు లేనపుడు చీకటి యేర్పడగా నా చీకటి యందు అభిసరించుచున్నవని యర్థము. దిక్కులనెడి యాయభిసారికలు తమ శరీరమునకు పరిమళమునకై చీకటియను కస్తూరి నలదు కొనుచున్నవి. ఎవ్వరికిని కానరాకుండుటకై నల్లనియాకసమను వస్త్రమును ధరించు చున్నవి. కాన్తివస్త్రములగు నక్షత్రము లనెడి మన్మథుని బాణములతో గొట్టబడి యున్నవి. అన్ని దిక్కులయందును నక్షత్రము లుదయించి యున్నవని యర్థము. ఆ యభిసారికలు నక్షత్రములనెడి పుష్పములను ధరించినవి. వెలుతురు లేకుండు వలన నాదిక్కులనెడి యభిసారికలు మందపు దృష్టులతో చూడదగియున్నవి. మఱియు సిగ్గుతో కూడియున్నవి. ఈ యభిసారికలనెడి దిక్కులు స్వైరిణులతో సమానములై యెవ్వరికిని కానరాకుండుటకై చంద్రుడు లేనట్టి రాత్రులయందు నన్నుగూర్చి యభిసరించుచున్నవి. కాన నీవు ఆ యభిసారికలను సపత్నులనెడి భ్రాన్తితో నీర్ష్యను వహింపుము. అభిసారికయు శుక్లపక్షపు రాత్రియందు తెల్లని వలువను, కృష్ణపక్షపు రాత్రియందు నల్లనివలువను ధరించును. మరియు కస్తూరి మున్నగు పరిమళవస్తములగు ద్రవ్యముల నఙ్గరాగములను గావించుకొనును. నల్లనివలువను, గూఢముగా పుష్పములను ధరించును. కామబాణపీడితయు

నగును. పై విధముగా నేర్పడి యభిసారిక కాముకు నభిసరించును అపుడు నాయిక యా యభిసారిక పై నీర్ష్యను వహించును. ఆ విధముగనే యిప్పుడు దిక్కులు అభిసారికలై నలుని అభిసరించుచున్నవి. అందువలన దమయన్తిని ఈర్ష్య వహింపుమని యా నలుడు చెప్పుచున్నాడు.

"కాన్తార్థినీ యయా యాతి సఙ్కేతం సాఽభిసారికా" యని యభిసారికా లక్షణము. "మన్దాక్షమన్దాః" యను పాఠము నీకటి యెక్కువగా నుండుట వలన మన్దదృష్టితో ననగా కొంచెపాటి దృష్టితో మెల్లగా నడచుచున్న మన్దగమన లని యర్థము.

శ్లో. భాస్వన్మయీం మీలయతో దృశం ద్రా
జ్మిథో మిలద్వ్యఞ్చల మాదిపుంసః ।
ఆచక్ష్మహే ! తన్వి ! తమాంసి పక్ష్మ
శ్యామత్వలక్ష్మవిజితేన్దులక్ష్మ ॥ 33

ప. వి. భాస్వన్మయీం - మీలయతః - దృశం - ద్రాక్ - మిథోమిల ద్వ్యఞ్చలం - ఆదిపుంసః - ఆచక్ష్మహే-తన్వి - తమాంసి - పక్ష్మశ్యా మత్వలక్ష్మవిజితేన్దులక్ష్మ.

అర్థము: హే తన్వి ! = ఓ కృశాఙ్గి !, భాస్వన్మయీం = సూర్యరూపముగల, దృశం = నేత్రమును, (అస్తమయ వ్యాజముతో) ద్రాక్ = శీఘ్రముగా, మీలయతః = మూయుచున్న, ఆదిపుంసః = ఆదిపురుషుడగు శ్రీవిష్ణువు యొక్క, మిథోమిలద్వ్యఞ్చలం, మిథః = పరస్పరమును, మిలత్ = కలియుచున్న, ద్వ్యఞ్చలం, ద్వి = రెండైన, అఞ్చలం = పైపుటమును క్రింది పుటమును గలిగిన, అనగా కన్నును మూయుటవలన రెండు రెప్పలు నొండొంటితో గలియుటచే దట్టమైన రెప్పల వెండ్రుకలుగల్గిన కావుననే, శ్యామత్వలక్ష్మవిజితేన్దులక్ష్మ, శ్యామత్వ = నలుపనెడి, లక్ష్మ = కాంతితో, విజిత = జయింపబడిన, ఇన్దులక్ష్మ = చన్ద్రునిని కలఙ్కము గల్గిన, పక్ష్మ = కన్నులయొక్క, పైరెప్పకును క్రిందిరెప్పకును సంబంధించిన రోమములనే, తమాంసి = నీకట్లుగా, ఆచక్ష్మహే = చెప్పుచున్నాము.

సమాసములు :

భాస్వన్మయీం : భాస్వతః రూపం యస్యాః సా = భాస్వన్మయీ, తాం = భాస్వన్మయీం.
మిథోమిలద్వ్యక్షిచ్ఛలం : మిథః మిలన్తౌ = మిథోమిలన్తౌ, ద్వౌ చ తౌ అక్షిచ్ఛలౌ చ = ద్వ్యక్షిచ్ఛలౌ; మిథోమిలన్తౌ ద్వ్యక్షిచ్ఛలౌ యస్య తత్ = మిథోమిలద్వ్యక్షిచ్ఛలం.
ఆదిపుంసః : ఆదౌ పుమాన్ = ఆదిపుమాన్, తస్య = ఆదిపుంసః
శ్యామత్వలక్ష్మీవిజితేన్దులక్ష్మ ; శ్యామస్య భావః = శ్యామత్వం, శ్యామత్వమేవ లక్ష్మీః = శ్యామత్వలక్ష్మీః, శ్యామత్వలక్ష్మ్యా విజితం = శ్యామత్వలక్ష్మీవిజితం, ఇన్దోః లక్ష్మ = ఇందులక్ష్మ, శ్యామత్వలక్ష్మీవిజితం ఇన్దులక్ష్మ యేన తత్ = శ్యామత్వలక్ష్మీవిజితేన్దులక్ష్మ, తత్ = శ్యామత్వలక్ష్మీవిజితేన్దులక్ష్మ.

భావము:

ఓ కృశాఙ్గీ! సూర్యు డనెడి దక్షిణనేత్రమును, అస్తమయవ్యాజమున శీఘ్రముగా మూయుచున్న యాదిపురుషుడగు శ్రీ మహావిష్ణువునకు సంబంధించిన యా దక్షిణనేత్రముయొక్క పైఱెప్పయు క్రిందిఱెప్పయు నొండింటితో నతుకుకొనుటవలన నాయతికిన వెంట్రుకలే నల్లదనమునందు, చన్ద్రికలజ్కమును జయించినవై చీకట్లుగా నేర్పడినవని మేము చెప్పుచున్నాము. సూర్యుడనెడి దక్షిణనేత్రమును మూయుటయే సూర్యాస్తమయము. అట్లు ఆకన్ను మూయబడినప్పుడు ఆకన్నుయొక్క పై ఱెప్పలకును, క్రింది ఱెప్పలకును సంబంధించిన నల్లని రోమములే చీకటైనవని భావము. శ్రీమహావిష్ణువునకు సూర్యుడు దక్షిణ నేత్రమనుట ప్రసిద్ధము.

శ్లో. వివస్వతాఽనాయిషతేవ మిశ్రాః
స్వగోసహస్రేణ సమం జనానాం ।
గావోఽపి నేత్రాపరనామధేయా
స్తేనేద మాన్ధ్యం ఖలు నాన్ధకారైః ॥ 34

ప. వి. వివస్వతా - అనాయిషత- ఇవ - మిశ్రాః -స్వగోసహస్రేణ - సమం - జనానాం - గావః - అపి - నేత్రాపరనామధేయాః - తేన - ఇదం - ఆన్ధ్యం - ఖలు - న - అన్ధకారైః.

అర్థము; వివస్వతా = సూర్యునిచే, నేత్రాపరనామధేయాః, నేత్ర = నేత్రమను, అపర = మరియొక, నామధేయాః = పేరులు గలిగిన, నేత్రరూపములగు, జనానాం = జనులయొక్క, గావోఽపి = గోవులును, స్వగోసహస్రేణ; స్వ = తనకు సంబంధించిన, గోసహస్రేణ సమం, గో = కిరణముల యొక్క, సహస్రేణ = వేయితో, సమం = కూడా, మిశ్రాః = కలసినవై, అనాయిషతేవ = కొనిపోబడినవో యనునట్లున్నవి. యస్మాత్ = ఎందు వలన, తేన ఖలు = దానిచేతనే, ఇదం = ఈ, ఆన్ధ్యం = అంధత్వము అనగా గ్రుడ్డితనము, కింతు = కాని, అన్ధకారైః = చీకట్లతో, న ఆన్ధ్యం = గ్రుడ్డితనము ఏర్పడలేదు. గోవులను మేపువాడెట్లు తనగోవులతో నితరుల గోవులనుగూడ గొనిపోవునో, అట్లే సూర్యుడు తన కిరణ సమూహము అనెడి గోవులతో నేత్రములనెడి జనులగోవులను గొనిపోవుటవలన నేదియు కానరాక యుండుటయను నన్ధత్వ మేర్పడినది గాని చీకటిచేత నంధత్వ మేర్పడలేదని భావము.

సమాసములు :

స్వగోసహస్రేణ : గవాం సహస్రం = గోసహస్రం, స్వస్య గోసహస్రం = స్వగోసహస్రం, తేన = స్వగోసహస్రేణ.

నేత్రాపరనామధేయాః : నేత్ర మితి అపరం నామధేయం యాసాం తాః = నేత్రాపరనామధేయాః.

ఆన్ధ్యం : ఆన్ధస్య భావః = ఆన్ధ్యం.

భావము :

గోశబ్దమునకు నేత్రము లనియు కిరణములనియు రెండర్థములు గలవు. కావున సూర్యుడునేత్రము లనెడి మరియొక నామము గలిగిన జనుల గోవులను కిరణములనెడి తన వేయిగోవులతో కలుపుకొని కొనిపోయెనో యనునట్లున్నది.

31)

కావుననే ప్రజలనేత్రములు పోయినందువలన సూర్యు డస్తమింపగనే యేదియు గానరాకపోవుటయను నస్థత్వ మేర్పడినది. కాని చీకటి యలముకొనుటచే నన్ధత్వము గలుగలేదని యాశయము.

శ్లో. ధ్వాన్తస్య వామోరు! విచారణాయాం
వైశేషికం చారు మతం మతం మే
ఔలూకమాహుః ఖలు దర్శనం తత్
క్షమం తమస్తత్త్వనిరూపణాయ ॥ 35

ప. వి. ధ్వాన్తస్య - వామోరు - విచారణాయాం - వైశేషికం - చారుమతం - మతం - మే - ఔలూకం - ఆహుః - ఖలు - దర్శనం - తత్ - క్షమం - తమస్తత్త్వనిరూపణాయ.

అర్థము; హే వామోరు! = ఓయందములైన యూరువులుగల దమయన్తి! ధ్వాన్తస్య = చీకటియొక్క విచారణాయాం = తత్త్వమునుగూర్చి నిరూపించు విషయమునందు (సాధర్మ్యవైధర్మ్యములంతో పదార్థముల తత్త్వనిరూపణము గావించెడి) వైశేషికం = కణాదమహర్షిప్రోక్తమగు వైశేషిక దర్శనము, చారుమతం = మంచియుపపత్తులు గల దర్శనముగా, మే = నాకు, మతం = సమ్మతమైనది. ఖలు = ఏలయనగా, (సంప్రదాయవేత్తలు) తద్దర్శనం = ఆవైశేషిక దర్శనమును, ఔలూకం = ఉలూకునకు, అనగా గుడ్లగూబకు సంబంధించిన దానినిగా, ఆహుః = చెప్పుదురు. కణాద మహర్షికి ఉలూకుడనియు పేరు గలదు, (కావుననే) తమస్తత్త్వ నిరూపణాయ, తమః = చీకటియొక్క, తత్త్వ = వాస్తవికస్థితిని, నిరూపణాయ = నిరూపించుటకు, క్షమం = ఆవైశేషికదర్శనము సామర్థ్యము గలిగినది. చీకటియందు గుడ్లగూబ సంచరించి వస్తువులను చూడగలదు. కాన నా యులూకదర్శనము తమస్తత్త్వమును నిరూపింపగలదని యాశయము.
ఔలూకం = ఉలూకమునకు అనగా గుడ్లగూబకు సంబంధించిన, దర్శనం = నేత్రము, తమస్తత్త్వనిరూపణాయ, తమః = చీకటియందున్న, ఘటపటాదుల, తత్త్వ = వాస్తవస్థితిని, నిరూపణాయ = నిరూపించుటకు, క్షమం = సమర్థమనియు నర్థము. వైశేషికమతము గూడ, ఉలూకుడను

మతియొక పేరుగల కణాదమహర్షిచే చెప్పబడినది గాన, ఔలూకదర్శన మనియు జెప్పబడుచున్నది. కాన నిది తమస్తత్త్వము నిరూపింపగల్గినట్టి దర్శనము అనిచెప్పుటవలన, "శబ్దచ్ఛల" మేర్పడినది.

వైశేషికదర్శనమందు తమస్సు భావరూపమా?లేక యభావరూపమా యని సందేహించి"భాసా మభావ ఏవ తమః"యను సూత్రమునకు విరోధము లేకుండా, వ్యోమశివాచార్యాదులు షట్పదార్థముల వైధర్మ్యమననుసరించి అభావరూపముగ తమస్సును నిరూపించిరి. శ్రీధరాచార్యులు - "ఆరోపింపబడిన భూరూపమే తమస్సు" చెప్పి తేజస్సులు లేనవుడే తమోవ్యవహార ముండుటవలన అన్ధకారజ్ఞాన మేర్పడినచో తేజోఽభావమే తమస్సని పైసూత్రవిరోధమును పరిహరించిరి. దీనిని సహించని యుదయనాచార్యులు తేజస్సుల యభావమే తమస్సని నిర్ణయించిరి. కావుననే యా యౌలూకదర్శనమైన వైశేషికశాస్త్రము తమస్తత్త్వమును నిరూపించుటకు సమర్థమని గాని యన్వయము. కటిక చీకటియున్నను ఘటాది పదార్థసమూహము నెవ్వడు చూచునని తమస్సును నిరూపించువిషయమున గ్రుడ్లగూబకన్నే యన్నిటికంటె నధికమని, మమ = నాయొక్క, మతం మతం = పలుమాటులు సమ్మతమని యర్థము. గ్రుడ్లగూబకన్నే యట్టి చీకటియందు ఘటాదులను జూడగల్గినది. ఇతరనేత్రము అట్టి చీకటియందు నన్ధత్వమునే పొందును, లేదా ఘటాదివిశేషములను చీకటియందు తెలిసికొగలిగినది గాన వైశేషిక మగుచున్నది. గాఢాంధకారమందు ఉలూకనేత్రమే ఘటాదిభేదములను తెలుసుకొనగలదు. కాన నదియే చారుమతము, అనగా చక్కని మతము. వృద్ధులసమ్మతిని తెలుపుటకే శ్లోకమునం దుత్తరార్థ మేర్పడినది. ఈ మహర్షి గుడ్లగూబవలె ధాన్యకణములను దిని జీవించుటవలన ఉలూకుడనియు కణాదుడనియు జెప్పబడుచున్నాడు.

**సమాసములు :**

హే వామోరు! : వామౌ ఊరూ యస్యాః స్సా = వామోరూః, తస్యాః స్సంబుద్ధిః = హే వామోరు.

ఔలూకం : ఉలూకేన ప్రోక్తం = ఔలూకమ్ లేదా, ఉలూకస్య ఇదం = ఔలూకం.

తమస్తత్త్వనిరూపణాయ : తమసః తత్త్వం = తమస్తత్త్వం, తమస్తత్త్వస్య నిరూపణం = తమస్తత్త్వనిరూపణం, తస్మై = తమస్తత్త్వనిరూపణాయ.

భావము :

ఓ సున్దరోరూ! తమస్స్వరూపమును నిరూపించువిషయమున వైశేషిక మతమే నాకు సమ్మతము. ఏలయనగా ఆ వైశేషికదర్శనము ఔలూకదర్శనమనియు చెప్పబడును. అనగా ఉలూకుడను మఱియొక పేరుగల కణాదమహర్షిచే ప్రోక్తమైన దర్శనమనియు, ఉలూకమునకు అనగా గ్రుడ్లగూబకు సంబంధించిన దర్శనమనియు ననగా నేత్రమనియు జెప్పబడును. కాన నది తమస్సుయొక్క తత్త్వమును నిరూపించుటకు సమర్థమైనదని యర్థము. గ్రుడ్లగూబ పగలు సూర్యకిరణముల జూడజాలక దాగి రాత్రియందు చీకటిలో సంచరించి తనకువలసిన వస్తువులను జూడగలిగియుండును గదా! కాన నాగ్రుడ్లగూబకు బేరైన ఉలూకశబ్దమును నామముగా గల మహర్షి రచించిన శాస్త్రము తమస్తత్త్వమును నిరూపించుటలో శక్తివంతమైనదని "శబ్దచ్ఛలము" నాశ్రయించి చెప్పబడుచున్నది.

శ్లో. గ్లానిస్స్పృశః స్పర్శనిషేధభూమేః
సేయం త్రిశంకో రివ సమ్పదస్య ।
న కించి దన్యత్ప్రతికౌశికీయే
దృశౌ విహాయ ప్రియ మాతనోతి ॥ 36

ప. వి. గ్లానిస్స్పృశః - స్పర్శనిషేధభూమేః - సా - ఇయం - త్రిశఙ్కోః - ఇవ - సమ్పత్ - అస్య - న కించిత్ - అన్యత్ - ప్రతి - కౌశికీయే - దృశౌ - విహాయ - ప్రియం - ఆతనోతి.

అర్థము: గ్లానిస్స్పృశః; గ్లాని = శ్రమవలని నల్లదనమును, స్పృశః = అంటునదియు, నల్లనైనదియు, మరియు చణ్డాలత్వమువలన మాలిన్యముతో గూడినదియును, మఱియు స్పర్శనిషేధభూమేః, స్పర్శనిషేధ = అభావరూపమగుటవలన, = స్పర్శాభావమునకు, భూమేః = స్థానమైనదియును, మఱియు చణ్డాలత్వముచే నస్పృశ్యమైనదియువగు, అస్య = ఈతమస్సునకు, త్రిశఙ్కోరివ = త్రిశఙ్కువునకువలె, సేయం = ఆఈ

ప్రత్యక్షముతో గ్రహింపదగిన, సమ్పత్ = ఆధిక్యముతో గూడిన స్వరూప లాభము, మఱియు, రాజ్యసమృద్ధి, కౌశికీయే = ఉలూకమునకు సంబంధించినవియును విశ్వామిత్రునికి సంబంధించినవియు నగు, దృశౌ = నేత్రములను, విహాయ = వదలి, అన్యత్ కించిత్ ప్రతి = మఱియొకదానిని దేనినిగూర్చి, ప్రియం = హితమును, నాతనోతి = చేయదు. కాని యానేత్రముల నుద్దేశించి హితమును జేయునని యర్థము. ఇంకొకదానిని దేనిని గూర్చియు హితము చేయదు. చీకటియందు గ్రుడ్లగూబయొక్క కన్నులే ఘటపటాదులను జూచునుగాన నాసంపద యానేత్రములకే హితమైనది. త్రిశంకువుయొక్క సంపద విశ్వామిత్రుని నేత్రములకే ప్రియమైనది ఇంకొకరికి ప్రియము గాదు.

**సమాసములు :**

గ్లానిస్పృశః : గ్లానిం స్పృశతీతి = గ్లానిస్పృక్, తస్య = గ్లానిస్పృశః.
స్పర్శనిషేధభూమేః : స్పర్శస్య నిషేధః = స్పర్శనిషేధః, స్పర్శనిషేధస్య భూమిః = స్పర్శనిషేధభూమిః, తస్య = స్పర్శనిషేధభూమేః.
కౌశికీయే : కౌశికస్య ఇమే = కౌశికీయే, తే = కౌశికీయే.

**భావము :**

ఈ తమస్సుయొక్క సంపద యనగా స్వరూపలాభము త్రిశఙ్కు మహారాజుయొక్క రాజ్యసమృద్ధివలె కౌశికనేత్రములకే యనగా విశ్వామిత్రుని నేత్రములకు ప్రియము గూర్చుచున్నది. కాని మరిదేనికిని ప్రియమును గూర్చుటలేదు. తమస్సు నల్లదనమును బొందుటవలన గ్లానిస్పృక్కగుచున్నది. అట్లే త్రిశంకు మహారాజు చండాలు డగుటచే మాలిన్యముతో గూడి శోభారహితుడగుటవలన, గ్లానిస్పృక్ అగుచున్నాడు. అట్లే తమస్సు స్పర్శగుణము లేనందువలన స్పర్శనిషేధభూమి యగుచున్నది. త్రిశంకువు చణ్డాలత్వముచే నస్పృశ్యు డగుటవలన స్పర్శనిషేధభూమి యగుచున్నాడు. తమస్సుయొక్క స్వరూపలాభరూపమగు సంపద కౌశికనేత్రములకే అనగా గ్రుడ్లగూబకన్నులకే ప్రియమును గూర్చుచున్నది. ఏలయనగా వంధకారమునందలి వస్తువులను అదియే చూడగలుగును. అవ్విధము గనే త్రిశఙ్కురాజ్యసమ్పద కౌశికనేత్రములకు అనగా విశ్వామిత్రుని కన్నులకే

ప్రియమును గూర్చుచున్నది. కాన తమస్సంపదకాని త్రిశంకుని నమ్పదగాని యితరమైనదానికి దేనికని ప్రియమును గూర్చదని యాశయము.

త్రిశఙ్కుకథ: వసిష్ఠమహర్షి శాపమువలన త్రిశఙ్కువు చణ్డాలుడాయెను. అప్పుడతడు యాగము గావించి సశరీరముగా స్వర్గమును బొందగోరెను. అపుడు ఋత్విక్కు లెవ్వరును ఆయజ్ఞము చేయించుటకు లభించలేదు. అందువలన నతడు వసిష్ఠునకు పరమవైరియగు విశ్వామిత్రునియొద్దకు బోయి తన కోరికను ప్రకటించెను. విశ్వామిత్రుడును నాతని గోర్కెను తీర్చెదనని ప్రతిజ్ఞగావించి యాతనిచే యాగము గావింపజేసి యతనిని స్వర్గమునకు బంపగా నతడు చణ్డాలుడగుటవలన దేవతలతనిని తలక్రిందులుగా నెట్టివేయగా నచ్చటినుండి భూమిపై బడుచున్న యాత్రిశంకుని విశ్వామిత్రుడు గాంచి స్వర్గమునకు భూమికిని మధ్య నొక నూతన స్వర్గమును సృజించుచు మధ్య బ్రహ్మచే వారింపబడినవాడై యా సృజించిన స్వర్గమందు త్రిశంకువును నెలకొనునట్లు గావించెను. దానినే ప్రజలు త్రిశఙ్కుస్వర్గ మనెదరు. అది యిప్పటికిని దక్షిణదిశయందు నాలుగునక్షత్రములతో గాలిపటమువలె కానవచ్చుచుండును.

శ్లో. మూర్ధాభిషిక్తః ఖలు యో గ్రహాణాం
తద్భాస మాస్కన్దితఋక్షశోభమ్ ।
దివాన్ధకారం స్ఫుటలబ్ధరూప
మాలోక తాలోక ములూకలోకః ॥ 37

వ. వి. మూర్ధాభిషిక్తః - ఖలు - యః - గ్రహాణాం - తద్భాసమాస్కన్దితఋక్షశోభం - దివా - అన్ధకారం - స్ఫుటలబ్ధరూపం - ఆలోకత-ఆలోకమ్ - ఉలూకలోకః.

అర్థము: యః = ఏసూర్యుడు, గ్రహాణాం = తనతోటి తొమ్మిది గ్రహములకు మధ్య, ఖలు = నిశ్చయముగా, మూర్ధాభిషిక్తః = పట్టాభిషిక్తుడైన రాజు, ఉలూకలోకః = గ్రుడ్లగూబల సంఘము. తద్భాసమాస్కన్దితఋక్షశోభం, తత్ = ఆసూర్యునియొక్క, భా = కాంతిచే, సమాస్కన్దిత = తిరస్కరింపబడిన, ఋక్ష = నక్షత్రములయొక్క, శోభం = కాంతిగలిగినదియును, స్ఫుటలబ్ధరూపం, స్ఫుట = స్పష్టముగా, లబ్ధ =

చూడబడిన, రూపం = శోభగలిగినదైనను, దివా = పగటిని, అంధ కారం = చీకటిగా, ఆలోకత = చూచినది. దినమునం దాసంఘము జూడజాలదు గాన దినమునే యంధకారముగా భావించి చూచినదని యర్థము. మఱియు, స్ఫుటలబ్ధరూపం, స్ఫుట = రాత్రియందు వ్యక్తముగా లబ్ధ = కనబడిన, రూపం = ఘటాదిరూపములుగలిగిన, అంధకార మేవ = చీకటినే, ఆలోకం = చాక్షుష ప్రత్యక్షమునకు సహకారి యగు వెలుతురుగా, ఆలోకత = చూచినది; ఇటువంటి అన్ధకారమును, స్ఫుటలబ్ధరూపం, స్ఫుట = మిక్కిలి ప్రసిద్ధమైన, శుక్లభాస్కరాత్మకము గా, లబ్ధ = పొందబడిన, రూపం = స్వరూపముగల, ఆలోకమేవ = వెలుతురుగనే, ఆలోకిత = చూచెను. అనగా నల్లని రూపముగల తమస్సును, శుక్లభాస్వరరూపముగల వెలుతురుగాజూచుట విరుద్ధమని యర్థము. మఱియు యః = ఏ, గ్రహరాజః = గ్రహములకు రాజైన సూర్యుడు, ఆస్కన్దితఋక్షశోభాం, ఆస్కన్దిత = ఆక్రమింపబడిన, ఋక్ష = నక్షత్రములయొక్క, శోభాం = శోభ కలిగిన, తద్భాసం, తత్ = అతనియొక్క (సూర్యునియొక్క), భాసం = కాన్తిని, ఉలూకలోకః = గ్రుడ్లగూబల సంఘము, దివా = పగలు, అన్ధకారం = చీకటిగా, అపశ్యత్ = చూచినది. పగలునందు సూర్యునికాంతియే తమస్సని, రాత్రియందు తమస్సే సూర్యకాంతియని చూచెనని యర్థము. సూర్యకాంతి, స్ఫుటలబ్ధరూపము అనగా స్పష్టముగా గనబడునట్టి ఘటపటాదిరూపము గలది. మఱియు నాయన్ధకారము స్ఫుటలబ్ధరూపము అనగా స్పష్టముగా నేర్పడిన స్వరూపలాభము గల్గినది. లేదా తద్భాసమాస్కన్దితఋక్షశోభం, తత్ = ఆ సూర్యునియొక్క, భా = కాంతితో, అసమాస్కన్దిత = తిరస్కరింపబడని, ఋక్ష = నక్షత్రములయొక్క, శోభం = శోభ గల్గిన, అన్ధకారం = అన్ధకారము ననిగాని యన్వయము; రాత్రియందు సూర్య కాంతి యుండదు. కాన నాసూర్యకాంతిచే దిరస్కరింపబడని నక్షత్రకాన్తి గల్గిన యంధకార ముండునని యర్థము. ఇవి మున్నగు నన్వయములు పెక్కులు ఊహ్యములు.

**సమాసములు :**

మూర్ధాభిషిక్తః : మూర్ధని అభిషిక్తః = మూర్ధాభిషిక్తః.
తద్భాసమాస్కన్దితబుధశోభం : తస్య భా = తద్భా, తద్భయా సమాస్కన్దితా = తద్భాసమాస్కన్దితా, బుధానాం శోభా = బుధశోభా, తద్భాసమాస్కన్దితా బుధశోభా యస్మిన్ తత్ = తద్భాసమాస్కన్దితబుధశోభ.
స్ఫుటలబ్ధరూపం : లబ్ధం చ తత్ రూపం చ = లబ్ధరూపం, స్ఫుటం లబ్ధరూపం యస్మిన్ తత్ = స్ఫుటలబ్ధరూపం, తత్ = స్ఫుటలబ్ధరూపం.
ఉలూకలోకః : ఉలూకానాం లోకః = ఉలూకలోకః.

**భావము :**

నవగ్రహములకును సూర్యగ్రహము నిశ్చయముగా పట్టాభిషిక్తుడు - అనగా నాగ్రహములకు రాజని యర్థము. ఆసూర్యుని కాంతివలన నక్షత్రకాంతులు తిరస్కరింపబడినవై యుండును. ఆపగలునందు ఇతరజనులచే స్పష్టముగా ఘటాదిరూపములు చూడబడినను అట్టి పగటిని గుడ్లగూబల సంఘము అంధకారముగనే భావించినది. ఆ పగటియందు వాని కేమియు కానరావు గాన నట్టిపగలు వాని కంధకారమైనదని యర్థము. రాత్రియందు చక్కగా గనబడు ఘటాది రూపములు గలిగిన యన్ధకారమునే దర్శనమునకు సహకారియగు వెలుతురుగా భావించినది. ఇటువంటి యన్ధకారమును శుక్లభాస్వరరూపముగా స్వరూపమును బొందినదానినిగా నానంఘము చూచినది. అయన్ధకారము నల్లనిదైనను శుక్లభాస్వర రూపము గలదానినిగా భావించుట విరుద్ధము. సూర్యునిచే తిరస్కరింపబడిన నక్షత్రశోభగల యాతనికాన్తిని యాయులూకసంఘము పగలు అన్ధకారముగా జూచినది. రాత్రియన్దు అన్ధకారమును వెలుతురుగను, పగటియందు సూర్యకాంతిని నంధకారముగను చూచెనని యర్థము. ఆసూర్యకాన్తి స్పష్టముగా గనబడు ఘటాది రూపములను గలిగినది. ఆ యన్ధకారము స్పష్టముగా స్వరూపలాభమును బొందిన దని యర్థము. లేదా యా యన్ధకారము రాత్రి సూర్యకాంతిచే నక్షత్రకాన్తి తిరస్కరింపబడనందువలన చక్కగా ప్రకాశించు నక్షత్రకాంతి గలిగియున్నది. లేదా రాత్రి సూర్యకాంతిచే నక్షత్రకాంతికి దిరస్కరణము లేనందువలన తమస్సుచేత నా

నక్షత్రకాంతి వర్ధిల్లినదనిగాని యర్థము చెప్పవచ్చును. ఇట్లు పలువిధములగు నన్వయములచే నర్థవిశేషము లూహ్యములని యాశయము.

శ్లో. దినే మమ ద్వేషిణీ కీదృగేషాం
ప్రచార ఇత్యాకలనాయ చారీః ।
ఛాయా విధాయ ప్రతివస్తులగ్నాః
ప్రావేశయ త్ప్రష్టుమివాన్ధకారః ॥ 38

ప. వి. దినే - మమ - ద్వేషిణి - కీదృక్ - ఏషాం - ప్రచారః - ఇతి-ఆకలనాయ - చారీః - ఛాయాః - విధాయ - ప్రతివస్తులగ్నాః-ప్రావేశయత్-ప్రష్టుం - ఇవ - అన్ధకారః.

అర్థము: అన్ధకారః = చీకటి, మమ = నాకు.ద్వేషిణి = శత్రువైన, దినే = పగటి యందు, ఏషాం = ఈవస్తువులకు, ప్రచారః = విహారము, స్నేహాది వ్యవహారము, కీదృక్ = ఎట్టిది, ఇతి = అని, ఆకలనాయ = చక్కగా తెలుసుకొనుటకై, ప్రతివస్తులగ్నాః = సమస్త పదార్థములయందు సంబద్ధములైన, ఛాయా ఏవ = నీడలనే, చారీః = గూఢార్థములను తెలుసుకొనునట్టి వారినిగా, విధాయ = చేసి(సమాగతాః = తిరిగివచ్చిన యాగూఢచారిణులను) ప్రష్టు మివ = ఆవిషయముల నడుగుటకో యనునట్లు, పునః = మరల ప్రావేశయత్ = ప్రవేశపరచెనా యేమి? అనగా తన యొద్దకు రప్పించెనా యేమి యనియర్థము. పగటియందు ప్రతివస్తువు నందును లగ్నములైన నీడలే రాత్రియందు వచ్చికలిసి, తమ ప్రభువైన యన్ధకారమును బొందినవి. రాత్రియందు వెలుతురు లేనందువలన వస్తువులనీడ యన్ధకారముతో గలసిపోవుచున్నది. దానిసమ్బన్ధమువలన గొప్ప చీకటి యేర్పడునని భావము. ఇందువలవ వస్తువులనీడగూడ తమస్సనియే తెలియవలయును. ఎవడైన నొక్కడు రాత్రియందు జనులస్థితిని తెలియ గోరికగలవాడై స్త్రీలకంతటను ప్రవేశముండుటవలన వారిని చారిణులుగా బంపి అచ్చటివిషయమును విచారించి తిరిగివచ్చిన యాస్త్రీలను ప్రశ్నించుటకు తనయొద్దకు ప్రవేశపెట్టుకొనువిధముగా నంధకారము చేసినదని యర్థము.

సమాసములు :

ప్రతివస్తులగ్నాః : వస్తుని వస్తుని = ప్రతివస్తు, ప్రతివస్తు లగ్నాః = ప్రతివస్తులగ్నాః, తాః = ప్రతివస్తులగ్నాః.

భావము;

అన్ధకారము తనకు శత్రువైన పగటియందు వస్తువులకును జనులకును నెట్టివ్యవహారము? ఎట్టిమైత్రి యున్నగు సమ్బన్ధములుండునో? తెలిసికొని వచ్చుటకై, సమస్త పదార్థములయందును సంబన్ధములై యున్న నీడలను గూఢచారిణులను గావించి పగటిని గూర్చి పంపి వృత్తాన్తములనరసి తిరిగి వచ్చినవారిని ప్రశ్నించుటకు తనయొద్దకు ప్రవేశపెట్టుకొనెనో యనునట్లున్నది. రాత్రియందు ప్రకాశము లేనందువలన వస్తువులనీడలే రాత్రియందు వచ్చి కలసి యన్ధకారముతో నేకమగును. అందువలన మహాన్ధకార మేర్పడునని యర్థము. మరియొకగ్గడును రాత్రియందు జనులస్థితిని తెలియగోరినవాడై స్త్రీలకంతట ప్రవేశముండుటవలన వారిని గూఢచారిణులు గావించి పంపి అచ్చటివిషయములను తెలిసికొని మరల వచ్చినవారిని విషయములను ప్రశ్నించుటకు తనయొద్దకు రప్పించునట్లు అంధకారముగూత చేయుచున్నదని యాశయము.

శ్లో. ధ్వాన్తస్య తేన క్రియమాణ యేత్థం
ద్విషః శశీవర్ణనయాథ రుష్టః ।
ఉద్యన్నుపాశ్లోకి జపారుణశ్రీ
ర్నరాధిపే నానునయేచ్ఛయేవ. ॥ 39

ప. వి. ధ్వాన్తస్య - తేన - క్రియమాణయా - ఇత్థం - ద్విషః - శశీ - వర్ణనయా - అథ - రుష్టః - ఉద్యన్ - ఉపాశ్లోకి - జపారుణశ్రీః - నరాధిపేన - అనునయేచ్ఛయా - ఇవ.

అర్థము: తేన = ఆనలమహారాజుచే, ఇత్థం = ఈవిధముగా, క్రియమాణయా = చేయబడుచున్న, ద్విషః = శత్రువగు, ధ్వాన్తస్య = చీకటియొక్క, వర్ణనయా = వర్ణనచె, రుష్ట ఇవ = రోషముజెందెనో యనునట్లు, జపారుణ

శ్రీః జపా = దాసానిపూవువంటి, అరుణ = ఎఱ్ఱని, శ్రీః = శోభగలిగిన వాడై, ఉద్యన్ = ఉదయించుచున్న, శశీ = చంద్రుడు, తేనైవ = ఆరాజు చేతనే, అథ = పిదప, అనునయేచ్ఛయా ఇవ = ఊరడింపగోరిక చేతనో యనునట్లు, ఉపాశ్లోకి = శ్లోకములచే స్తుతింప బారంభింపబడెను.

**సమాసములు :**

జపారుణశ్రీః : అరుణా చ సా శ్రీశ్చ = అరుణశ్రీః జపాయా ఇవ అరుణశ్రీః యస్యసః = జపారుణశ్రీః.

అనునయేచ్ఛయా : అనునయే ఇచ్ఛా = అనునయేచ్ఛా, తయా = అనునయేచ్ఛయా

**భావము :**

ఆ నలమహారాజు శత్రువగు చీకటిని ఈవిధముగా వర్ణించుటచే కోపము జెందెనో యనునట్లు దాసాని పూవువంటి యెఱ్ఱనివన్నె గలవాడై ఉదయించుచున్న చంద్రుని ఊరడించుటకో యనునట్లు శ్లోకములచే చంద్రుని స్తుతింపదొడగెను.

శ్లో. పశ్యావృతోఽప్యేష నిమేషమద్రే
రధిత్యకాభూమితిరస్కరిణ్యా ।
ప్రవర్షతి ప్రేయసి చన్ద్రికాభి
శ్చకోరచఞ్చూచులుకప్రమిన్దుః ॥ 40

ప. వి. పశ్య - ఆవృతః - అపి - ఏష - నిమేషం - అద్రేః - అధిత్యకాభూమి తిరస్కరిణ్యా - ప్రవర్షతి - ప్రేయసి - చన్ద్రికాభిః - చకోర చఞ్చూచులుకప్రమ్ - ఇన్దుః.

అర్థము: హే ప్రేయసి = ఓ ప్రేయసీ, ఏషః = ఈ, ఇన్దుః = చన్ద్రుడు, చన్ద్రికాభిః = వెన్నెలలచే, చకోరచఞ్చూచులుకప్రమ్, చకోర = చకోరముల యొక్క, చఞ్చూం = ముక్కులనెడి, చులుక = అరచేతి మట్టము గలవానిని, ప్రమ్ = నింపి, ప్రవర్షతి = చక్కగా వర్షించుచున్నాడు. ఎంత టితో చకోరముల ముక్కులవుటములు నిండునో, అంతటివెన్నెలను వర్షించుచున్నాడని యర్థము. ఎటువంటివా డనగా, అద్రేః = ఉదయాది

యొక్క, అధిత్యకాభూమి = ఊర్ధ్వశిఖర మనెడి, తిరస్కారిణ్యా = తెరచే, నిమేషం = ఱెప్పపాటుకాలము, ఆవృతోఽపిసన్ = మఱుగుపరచబడినవాడైనను, ప్రవర్షతి = అధికముగా వర్షించుచున్నాడు అను క్రియతో అన్వయము. పశ్య = చూడుము.

సమాసములు :

అధిత్యకాభూమితిరస్కారిణ్యా : అధిత్యకైవ భూమిః = అధిత్యకాభూమిః, అధిత్యకాభూమిరేవ తిరస్కారిణీ = అధిత్యకాభూమితిరస్కారిణీ, తయా = అధిత్యకాభూమితిరస్కారిణ్యా.

చకోరచఞ్చూచులుకప్రమ్ : చకోరాణాం చఞ్చ్వః = చకోరచఞ్చ్వః, చకోరచఞ్చ్వ ఏవ చులుకం = చకోరచఞ్చూచులుకం, చకోరచఞ్చూచులుకం పూరయిత్వా = చకోరచఞ్చూచులుకప్రమ్.

భావము :

ఓ ప్రేయసీ! ఈచంద్రుడు ఉదయాచలముయొక్క, పైశిఖరమనెడి తెఱచే ఱెప్పపాటుకాలము మఱుగుపడియున్నను తనవెన్నెలచే చకోరపక్షుల ముక్కులనెడి యరచేతి మట్టములు నిండునట్లు చక్కగా వర్షించుచున్నాడు చూడుము.

శ్లో. ధ్వాన్తే ద్రుమాన్తానభిసారికా స్త్వం
శఙ్కస్వ సఙ్కేతనికేతమాప్తాః ।
ఛాయాచ్ఛలా దుజ్ఝితనీలచేలా
జ్యోత్స్నానుకూలై శ్చలితా దుకూలైః ॥ 41

ప. వి. ధ్వాన్తే - ద్రుమాన్తాన్ - అభిసారికాః - త్వం - శఙ్కస్వ సఙ్కేతనికేతం - ఆప్తాః - ఛాయాచ్ఛలాత్ - ఉజ్ఝితనీలచేలాః - జ్యోత్స్నానుకూలైః - చలితాః - దుకూలైః.

అర్థము: హే ప్రియే = ఓ ప్రియురాలా, త్వం = నీవు, (చంద్రోదయముకంటె పూర్వము), ధ్వాన్తేసతి = చీకటి యేర్పడగా, ద్రుమాన్తాన్ = చెట్లయొక్క సమీపప్రదేశము అనెడి, లేదా వృక్షముల దిగువభాగము అనెడి. సఙ్కేత

నికేతం = సంభోగమునకై కాముకు డొసంగిన సఙ్కేత ప్రదేశముగా, ఆప్తాః = పొందిన, అభిసారికాః = అభిసారికలను, శఙ్కస్వ = భావింపుము. లేదా సందేహింపుము. తథా = అట్లే, ఇదానీం = ఇప్పుడు, అనగా చన్ద్రోదయముగా, ఛాయాచ్ఛలాత్, ఛాయా = చెట్లక్రిందనుండెడి నీడ యను, ఛలాత్ = వ్యాజమువలన, ఉజ్ఝితనీలచేలాః, ఉజ్ఝిత = విడువబడిన, నీల = నల్లని, చేలాః = చీరలుగలవారును, అనగా చీకటియం దెవ్వరికిని కనపడకుండుటకై దానికనుకూలముగ కట్టిన నల్లనిచీరలను విడిచినవారును తరువాత వెన్నెల వచ్చుటచే నెవ్వరికిని కానరాకుండుటకై, జ్యోత్స్నానుకూలైః = వెన్నెల కనుకూలములైన తెల్లనివన్నెగల, దుకూలైః = వలువలతో గూడిన వారునునై; చలితాః = సంభోగము గావించి యింటికి బయలుదేరిరి. త్వం = నీవు, శఙ్కస్వ = సందేహింపుము. చీకటి యుండగనే యెవ్వరికిని తెలియకుండుటకై, నల్లనివలువను ధరించి సఙ్కేత స్థానమునకు వచ్చిరి. చన్ద్రోదయము కాగనే నల్లనివలువను ధరించినచో ఎవరికంటనైనను బడెదమను భయముతో నానల్లనివలువల నక్కడనే విడిచి పెట్టి వెన్నెలతో సమానవర్ణముగల తెల్లనివలువలను ధరించి యెవ్వరికిని తెలియక మఱల వెళ్లిరని యర్థము.

## సమాసములు :

ద్రుమాన్తాన్ : ద్రుమాణాం అన్తాః = ద్రుమాన్తాః, తాన్ = ద్రుమాన్తాన్.

సఙ్కేతనికేతం : సఙ్కేతస్య నికేతః = సఙ్కేతనికేతః, తం = సఙ్కేతనికేతం.

ఛాయాచ్ఛలాత్ : ఛాయాయాః ఛలం = ఛాయాచ్ఛలం. తస్మాత్ = ఛాయాఛలాత్.

ఉజ్ఝితనీలచేలాః : నీలం చ తత్ చేలం చ = నీలచేలం, ఉజ్ఝితం నీలచేలం యాభిస్తాః = ఉజ్ఝితనీలచేలాః, తాః = ఉజ్ఝితనీలచేలాః,

జ్యోత్స్నానుకూలైః : జ్యోత్స్నాయాః అనుకూలాః = జ్యోత్స్నానుకూలాః. తైః = జ్యోత్స్నానుకూలైః.

భావము :

ఓ ప్రియురాలా ! చంద్రోదయమునకు పూర్వము చీకడి యుంటగా చెట్ల క్రింది భాగములనే సంభోగమునకై కాముకు లొసంగిన సంకేత స్థలముగా బొందిన యభిసారికలను శంకింపుము. ఇప్పుడు చంద్రోదయము కాగానే యాచెట్ల దిగువ భాగమందలి నీడలనెపముతో ముందు చీకటిలో నెవ్వరికిని కావరాకుండుటకై గట్టిన నల్లని వలువలను వదలినవారై వెన్నెలయం దెవ్వరికిని కనబడకుండుటకై వెన్నెలతో సమానవర్ణము గల్గిన తెల్లని వలువలను ధరించిన వారై సంభోగమైన విదప గృహములకు మరలుచున్నారు. దానిని భావింపుము.

శ్లో. త్వదాస్య లక్ష్మీముకురం చకోరైః
స్వకౌముదీ మాదయమాన మిన్దుం ।
దృశా నిశేన్దీవర చారుభాసా
పిబోరు రమ్భాతరుపీవరోరు ॥ 42

ప. వి. త్వదాస్య లక్ష్మీ ముకురం - చకోరైః - స్వకౌముదీం - ఆదయమానం - ఇన్దుం - దృశా - నిశేన్దీవరచారుభాసా - పిబ - ఉరు - రమ్భాతరు పీవరోరు.

అర్థము: హేరమ్భాతరు పీవరోరు !. రమ్భాతరు = అరటిచెట్టువలె, పీవర = బలిసిన, ఊరు = తొడలుగల దమయన్తీ !, (త్వం = నీవు) నిశేన్దీవర చారుభాసా. నిశా = రాత్రియందు, ఇన్దీవర = కలువలవంటి, చారు = రమ్యమైన. భాసా = కాంతి గలిగిన, దృశా = నేత్రములతో, ఉరు = ఆదరయుక్తముగా, త్వదాస్య లక్ష్మీముకురం, త్వత్ = నీయొక్క, ఆస్యలక్ష్మీ = ముఖలక్ష్మికి. ముకురం = అద్దమైనవాడై, చకోరైః = చకోరములచే, స్వకౌముదీం = తన వెన్నెలను, ఆదయమానం = త్రాగించు చున్న, ఇందుం = చంద్రుని, పిబ = ఆదరముతో చూడుము.

సమాసములు :

త్వదాస్యలక్ష్మీముకురం : తవ ఆస్యం = త్వదాస్యం, త్వదాస్యస్య లక్ష్మీః = త్వదాస్యలక్ష్మీః, త్వదాస్యలక్ష్మ్యాః ముకురః = త్వదాస్య లక్ష్మీముకురః. తం = త్వదాస్యలక్ష్మీముకురం.

స్వకౌముదీం : స్వస్య కౌముదీ = స్వకౌముదీ, తాం = స్వకౌముదీం.

నిశేన్దీవరచారుభాసా : నిశాయాం ఇన్దీవరం = నిశేన్దీవరం, చారుశ్చాసౌ భాశ్చ = చారుభాః, నిశేన్దీవరమివ చారు భాః యస్యాః స్సా = నిశేన్దీవర చారుభాః, తయా = నిశేన్దీవరచారుభాసా.

రమ్భాతరుపీవరోరు : రమ్భా ఇతి తరుః = రమ్భాతరుః, రమ్భా తరురివ పీవరౌ ఊరూ యస్యాః స్సా = రమ్భాతరు పీవరోరుః, తస్యాః స్సమ్బుద్ధిః = హేరమ్భాతరుపీవరోరు.

**భావము :**

అరటిచెట్లవంటి లావైన తొడలుగల యో దమయన్తీ! నీవు రాత్రియందు వికసించిన కలువ పూవువంటి కన్నులతో, నీ ముఖమునకు అద్దమైనవాడును చకోర పక్షులకు తన వెన్నెలను త్రాగించువాడును నగు చంద్రుని సాదరముగా జూడుము. చన్ద్రోదయము కాగనే కలువలు వికసించును గదా! దమయన్తి కన్నులు కలువల వంటివిగాన నవియు నానమయము నందు వికసించిన కలువల శోభనంది జనుల కాహ్లాదకరములై యుండుననియు, రాత్రియందలి కలువలతో సమానకాంతి గలవి యని వానిని జెప్పుటవలన బగలునందు కలువలు ముకుళించి వికాసరహితములై యుండుననియు సూచితము.

శ్లో. అసంశయం సాగరభాగుదస్థాత్
 పృథ్వీధరాదేవ మథః పురాఽయమ్ ।
అముష్య యస్మాదధునాఽపి సిందౌ
 స్థితస్య శైలాదుదయం ప్రతీమః ॥ 43

ప. వి. అసంశయం - సాగరభాక్ - ఉదస్థాత్ - పృథ్వీధరాత్ - ఏవ - మథః - పురా - అయం - అముష్య - యస్మాత్ - అధునా - అపి - సిందౌ - స్థితస్య - శైలాత్ - ఉదయం - ప్రతీమః.

అర్థము: పురా = పూర్వము, సాగరభాక్ = సముద్రము నందున్న, అయం = ఈ చంద్రుడు, మథః = కవ్వమైన, పృథ్వీధరాదేవ = మందర పర్వతము నుండియే, ఉదస్థాత్ = ఉద్భవించె ననుట, అసంశయం =

నిశ్చితము. అనగా నీ పౌరాణిక విషయము సత్యమైనదని యర్థము. యస్మాత్ = ఏలయనగా, అధునాఽపి = ఇప్పుడును అనగా అట్లు పుట్టిన పిదప గూడ, సింధౌ = సముద్రము నందున్న, తస్య = ఆ చంద్రునికి, శైలాత్ = పర్వతము నుండియే, ఉదయం = ఆవిర్భావమును, ప్రతీమః = తెలుసుకొను చున్నాము. ఈ చంద్రుడు, ప్రతిదినము సముద్రమునం దున్నను, పర్వతము నుండి యుద్భవించు స్వభావమనెడి లింగముచే సముద్ర మథనకాలము నందు దొలుత పుట్టునపుడును నితడు పర్వతము నుండియే యుద్భవించెనని నిశ్చయమని యర్థము. అనగా నుదయ పర్వత శిఖరము నితడు దాటెనని యర్థము.

**సమాసములు :**

అసంశయం : అవిద్యమానః సంశయః యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = అసంశయం.

సాగరభాక్ : సాగరం భజతీతి = సాగరభాక్.

**భావము :**

పూర్వము సముద్ర గర్భమందున్న యీ చంద్రుడు తరిగొంపయగు మందర పర్వతము నుండియే యుదయించెనని నిశ్చయముగా చెప్పగలము. ఏల యనగా-ఇప్పటికిని అనగా నావిధముగా సంభవించిన తర్వాతను సముద్రగర్భ మందున్న యీ చంద్రుడు ఉదయాచలము నుండియే ఉద్భవించు చున్నాడని తెలిసికొనుచున్నాము. అనగా ప్రతిదినము సముద్రము నందున్నను నీ చంద్రునికి ఉదయ పర్వతము నుండి యుదయించు స్వభావమనెడి లింగము ననుసరించి మొదట నుత్పత్తియైనపుడును నితడు పర్వతము నుండియే జన్మించి యుండునని యూహింతుమని భావము.

శ్లో. నిజానుజే నాతిథితా ముపేతః
ప్రాచీపతే ర్వాహనవారణేన
సిన్దూరసాన్ద్రే కిమకారి మూర్ధ్ని
తేనారుణశ్రీ రయ ముజ్జిహీతే ॥ 44

ప. వి. నిజానుజేన - అతిథితాం - ఉపేతః - ప్రాచీపతేః - వాహనవారణేన - సిన్దూరసాన్ద్రే - కిం - అకారి - మూర్ధ్ని - తేన - అరుణశ్రీః-అయం - ఉజ్జిహీతే.

**అర్థము:** నిజానుజేన, (ఒక సముద్రమందే యిద్దరు నుద్భవించుట వలన) నిజ = తనకు అనగా చన్ద్రునకు, అనుజేన = తమ్ముడైన, ప్రాచీపతేః = ఇంద్రునికి సంబంధించిన, వాహనవారణేన, వాహన = వాహనమగు; వారణేన = గజముచే, ననగా తూర్పు నందున్న ఐరావతముచే, అతిథితాం = (తూర్పున నుదయించుటచేత,) సన్నిహితుడుగ నుండుటను, ఉపేతః = పొందిన, అయం = ఈ చంద్రుడు, సిన్దూరసాన్ద్రే, సిన్దూర = సిన్దూరముచే, సాన్ద్రే = దట్టమైన, మూర్ధ్ని = శిరస్సునందు, అకారి కిం = (అన్నయనెడి గౌరవముచే) ఎక్కించుకొనబడెనా యేమి? తేన = అందుచేత, అరుణశ్రీః = ఎఱ్ఱని కాంతి గలవాడై, అయం = ఈ చంద్రుడు, ఉజ్జిహీతే కిం = ఉదయించుచున్నాడా యేమి?

**సమాసములు :**

నిజానుజేన : నిజశ్చాసౌ అనుజశ్చ = నిజానుజః, తేన = నిజానుజేన.

అతిథితాం : అతిథే ర్భావః = అతిథితా తాం = అతిథితాం.

ప్రాచీపతేః : ప్రాచ్యాః పతిః = ప్రాచీపతిః, తస్య = ప్రాచీపతేః.

వాహనవారణేన : వాహన ఏవ వారణః = వాహనవారణః, తేన = వాహనవారణేన.

సిన్దూరసాన్ద్రే : సిన్దూరేణ సాన్ద్రః = సిన్దూరసాన్ద్రః, తస్మిన్ = సిన్దూరసాన్ద్రే.

అరుణశ్రీః : అరుణా శ్రీః యస్య సః = అరుణశ్రీః.

**భావము :**

ఒక్క సముద్రమునందే చంద్రుడును నైరావతమును బుట్టిరి. అందు తొలుత చంద్రుడు పుట్టుట వలన నతనికి నైరావతము కనిష్ఠసోదరత్వమును

వహించినది. అట్లు అన్నయగు చంద్రుడు తూర్పునం దుదయించి, తన యొద్దకు వచ్చుటవలన తమ్ముడైన యైరావతము యన్నపైని భక్తితో నతనిని సిందూర మలదిన తన నెత్తిపైన నెక్కించుకొనగా నాసిందూర మంటుటవలన నాయుదయ కాలమందు చంద్రుడు దెఱ్ఱబడి యుండెనా యేమి ? యని భావింపబడు చున్నది.

శ్లో. య త్ప్రీతిమద్భి ర్వదనైః స్వసామ్యా
దచుమ్బి నాకాధిపనాయికానాం ।
తత స్తదీయాధర యావయోగా
దుదేతి బిమ్బారుణబిమ్బ ఏషః ॥ 45

ప. వి. యత్ - ప్రీతిమద్భిః - వదనైః - స్వసామ్యాత్ - అచుమ్బి - నాకాధిపనాయికానాం - తతః - తదీయాధరయావయోగాత్ - ఉదేతి - బిమ్బారుణబిమ్బః - ఏషః.

అర్థము: (గుండ్రముగా నుండుట మున్నగువానిచే) స్వసామ్యాత్ = తమతో బోలిక యుండుటవలన, ప్రీతిమద్భిః = ప్రీతిని బొందిన, నాకాధిపనాయికానాం, నాకాధిప = స్వర్గమునకు పాలకుడగు నింద్రునియొక్క, నాయికానాం = నాయికలగు నచ్చరలయొక్క, వదనైః = ముఖములచే, యత్ = ఎందువలన, అచుమ్బి = దగ్గరకు వచ్చుటవలన ముద్దిడబడెనో, తతః = అందువలన, తదీయాధరయావయోగాత్, తదీయ = ఆస్త్రీలకు సంబంధించిన, అధర = పెదవులయందలి, యావ = లత్తుక యొక్క, యోగాత్ = సమ్బన్ధమువలన, బిమ్బారుణబిమ్బః, బిమ్బ = దొండపండువంటి, అరుణ = ఎఱ్ఱని, బిమ్బః = మణ్డలము గలవాడై, ఉదేతి = ఉదయించుచున్నాడు.

సమాసములు :

ప్రీతిమద్భిః : ప్రీతిః ఏషాం అ స్తీతి = ప్రీతిమన్తి, తైః = ప్రీతిమద్భిః
స్వసామ్యాత్ : స్వైః సామ్యం = స్వసామ్యం, తస్మాత్ = స్వసామ్యాత్.
నాకాధిపనాయికానాం : నాకస్య అధిపః = నాకాధిపః, నాకాధిపస్య నాయికాః = నాకాధిపనాయికాః, తాసాం = నాకాధిపనాయికానామ్.

త్వదీయాధరయావయోగాత్ : తాసా మిమే = తదీయాః, తదీయాశ్చ తే అధరాశ్చ = తదీయాధరాః, తదీయాధరాణాం యావః = తదీయాధరయావః, తదీయాధరయావేన యోగః = తదీయాధరయావయోగః, తస్మాత్ = తదీయాధరయావయోగాత్.

బిమ్బారుణబిమ్బః : బిమ్బ మివ అరుణం = బిమ్బారుణం, బిమ్బారుణం బిమ్బం యస్య సః = బిమ్బారుణబిమ్బః.

భావము :

చన్ద్రబిమ్బము గుం్రడనితనము మున్నగు విషయములయందు ఇం్రదుని శృఙ్గారనాయికలగు నచ్చరలముఖములతో సామ్యము వహించి యున్నందువలన నాయచ్చరలముఖములు, ఆచం్రదునియందు ్రపీతివహించినవై, యాతడు తమ యొద్దకురాగనే యాతనిని ముద్దిడుకొనినవి. అందువలన వారిపెదవులకు బూయ బడిన యెఱ్ఱని లత్తుక యాచం్రదుని కంటుకొనుటవలన, నతని మణ్డలము ఉదయ కాలమునందు దొండపండువలె నెఱ్ఱనిదై శోభించుచున్నది. "వదనైః" యను బహువచనము ననుసరించి పెక్కుముఖము లొక్కకాలమునందే యాతనిని ముద్దిడుకొనినట్లు సూచితము. కాన నతని మణ్డలమునం దంతట మెండుగా లత్తుక యంటి చక్కగా నది యెఱ్ఱబారినదనియు సూచితము.

శ్లో. విలోమితాఙ్కోత్కిరణా ద్దురూహ
దృగాదినా దృశ్యవిలోచనాది ।
విధి ర్విధత్తే విధునా వధూనాం
కిమాననం కాఞ్చనసఞ్చకేన ॥ 46

ప. వి. విలోమితాఙ్కోత్కిరణాత్ - దురూహదృగాదినా - దృశ్యవిలోచనాది - విధిః - విధత్తే - విధునా - వధూనాం - కిం - ఆననం - కాఞ్చన సఞ్చకేన.

అర్థము: విధిః = ్రబహ్మ, విలోమితాఙ్కోత్కిరణాత్, విలోమిత = తనకాంతిచే తిరుగ గొట్టబడిన, అఙ్క = కలఙ్కము గలిగిన, ఉత్కిరణాత్ = ్రశేష్ఠమైన కిరణము వలనను, విలోమిత = తల్ర్కిందులుగా, లేక విపరీత

ముగా చేయబడిన, అఙ్క = నేత్రాదులను నిర్మించుటకు మిట్టపల్లము లైన, చిహ్నస్థానములను. ఉత్కిరణాత్ = చెక్కుటవలన, దురూహ దృగాదినా, దురూహ = ఊహింపశక్యములు గాని, దృగాదినా = కన్నుముక్కు మున్నగు నవయవములు గల్గిన, విధునా = చన్ద్రుడనెడి. కాఞ్చనసఞ్చకేన = పసిడిఅచ్చుచే, దృశ్యవిలోచనాది = దృశ్యము లైన కన్నులు మున్నగు నవయవములు గల్గిన, (అదృశ్యవిలోచనాది = (అచ్చుగానున్న దశలో) కానరాని కన్నులు మున్నగు నవయవములు గల్గిన) వధూనాం = స్త్రీలయొక్క, ఆననం = ముఖమును, విధత్తే కిం = చేయుచున్నాడా యేమి? బొమ్మలను జేసెడి యచ్చునందు బొమ్మకు సంబంధించిన మిట్టపల్లములు తల్క్రిందులుగానే చెక్కబడును. దాని కన్నులు మున్నగు నవయవములు స్పష్టముగా గానరావు. దానిచే బొమ్మలు చేయబడినపుడు ఆయవయవములు చక్కగా గానబడును. ఉదయించిన చంద్రుడు బంగారు అచ్చువలె నెఱ్ఱగా గనబడును. మంచి బంగారు ఎఱ్ఱనై యుండును,

సమాసములు :

విలోమితాఙ్కోత్కిరణాత్ : విలోమః కృతః = విలోమితః, విలోమితః అఙ్కః యేన సః = విలోమితాఙ్కః, విలోమితశ్చాసౌ ఉత్కిరణశ్చ = విలోమితాఙ్కోత్కిరణః, తస్మాత్ = విలోమితాఙ్కోత్కిరణాత్, పక్షాన్తరమున, విలోమితాశ్చతే అఙ్కాశ్చ = విలోమితాఙ్కాః, విలోమితాఙ్కానాం ఉత్కిరణం = విలోమితాఙ్కోత్కిరణం, తస్మాత్ = విలోమితాఙ్కోత్కిరణాత్.

దురూహదృగాదినా : దుఃఖేన ఊహితుం శక్యాః = దురూహాః, దృక్ ఆదిః యేషాం తే = దృగాదయః, దురూహాః దృగాదయః యస్మిన్ సః = దురూహదృగాదిః, తేన = దురూహదృగాదినా.

దృశ్యవిలోచనాది : విలోచనం ఆదిః యేషాం తే = విలోచనాదయః, ద్రష్టుంశక్యాః = దృశ్యాః, దృశ్యావిలోచనాదయః యస్మిన్ తత్ = దృశ్యవిలోచనాది.

కాఞ్చనసఞ్చకేన : కాఞ్చనమయ శ్చాసౌ సఞ్చకశ్చ = కాఞ్చన సఞ్చకః, తేన = కాఞ్చనసఞ్చకేన.

భావము :

బ్రహ్మ చన్ద్రుడనెడి బంగారు అచ్చుతో స్త్రీలముఖములను జేయుచున్నాడు. అతని యందలి శ్రేష్ఠమగు కిరణములవలన నందలి కలఙ్కము పరాభూతమైనది. ఆ కిరణముల వలననే యచ్చుగానున్న యాతని యందలి కన్నుముక్కు మున్నగు నవయవము లగుపడుటలేదు. మఱియు బొమ్మలు మున్నగు వానిని జేసెడి యచ్చునందు దొలుత గన్ను ముక్కు మున్నగు మిట్టపల్లములు తలక్రిందులుగా జెక్కబడును. కాన నప్పుడవి చక్కగా గనపడవు. బొమ్మయేర్పడిన పిదప, దానియందవి చక్కగా గనపడును. కాన నాచన్ద్రుడనెడి యచ్చుచే స్త్రీల ముఖమును బ్రహ్మ నిర్మించు చున్నాడని భావము. ఉదయించు చన్ద్రుడు మేలైన బంగారువలె నెఱ్ఱగా నుండును, కాన నతడు బంగారు అచ్చుతో సమానముగా నిట వర్ణింపబడెను.

శ్లో. అనేన వేధా విపరీతరూప
వినిర్మితాఙ్కోత్కిరణాఙ్గకేన
త్వదాననం దృశ్యదృగా ద్యలక్ష్య ।
దృగాది నై వాకృత సఞ్చకేన ॥ 47

ప. వి. అనేన - వేధాః - విపరీతరూపవినిర్మితాఙ్కోత్కిరణాఙ్గకేన - త్వదాననం - దృశ్యదృగాది - అలక్ష్యదృగాదినా - ఏవ - అకృత - సఞ్చకేన.

అర్థము: వేధాః = బ్రహ్మ, విపరీతరూప వినిర్మితాఙ్కోత్కిరణాఙ్గకేన, విపరీత రూప = తలక్రిందులైన యాకారము గల్గునట్లు, వినిర్మిత = నిర్మింప బడిన, అఙ్కోత్కిరణ = చిహ్నములను చెక్కుట గల్గిన, అఙ్గకేన = అవయవములు గల్గిన, అలక్ష్యదృగాదినా, అలక్ష్య = కానరాని, దృగాదినా = కన్నుముక్కు మున్నగునవిగలిగిన, సఞ్చకేన = చంద్రుడ నెడి యచ్చుచే, దృశ్యదృగాది, దృశ్య = కనబడునట్టి, దృగాది =

కన్నులు మున్నగునవి గల్గిన, త్వదాననమేవ = నీముఖమునే, అకృత = నిర్మించెను. ఇతరుల ముఖములను జేయలేదని యర్థము.

**సమాసములు :**

విపరీతరూపవినిర్మితాజ్యోత్కిరణాఙ్గకేన : విపరీతం రూపం యస్మిన్ కర్మణి తద్యథా భవతి తథా = విపరీతరూపం, అజ్యానాం ఉత్కిరణం = అజ్యోత్కిరణం, విపరీతరూపం వినిర్మితం అజ్యోత్కిరణం యస్మిన్ తత్ = విపరీతరూప వినిర్మితాజ్యోత్కిరణం, విపరీతరూప వినిర్మితాజ్యోత్కిరణం అఙ్గం యస్య సః = విపరీతరూపవినిర్మితాజ్యోత్కిరణాఙ్గకః, తేన = విపరీతరూప వినిర్మితాజ్యోత్కిరణాఙ్గకేన.

త్వదాననం : తవ ఆననం = త్వదాననం, తత్ = త్వదాననం.

దృశ్యదృగాది : దృక్ ఆదిః యేషాం తాని = దృగాదీని, దృశ్యాని దృగాదీని యస్మిన్ తత్ = దృశ్యదృగాది.

అలక్ష్యదృగాదినా : దృక్ ఆదిః యేషాం తే = దృగాదయః, న లక్ష్యాః = అలక్ష్యా, అలక్ష్యాః దృగాదయః యస్మిన్ సః అలక్ష్యదృగాదిః, తేన = అలక్ష్యదృగాదినా.

**భావము :**

బ్రహ్మ తలక్రిందులుగా చెక్కబడిన కన్ను ముక్కు మున్నగు నవయవములు గల్గినట్టిదియును, కావుననే, కానరాని కన్ను ముక్కు మున్నగు నవయవములు గల్గిన చంద్రుడనెడి యచ్చుచే కానబడెడి కన్ను, ముక్కు మున్నగు నవయవములు గలిగిన నీముఖమునే నిర్మించెను; కాని యితరులముఖములను నిర్మించలేదని యాశయము.

గమనిక. వెనుకటి శ్లోకమునందు చంద్రుడనెడి యచ్చుచే స్త్రీల ముఖమును నిర్మించెనని చెప్పగా నీశ్లోకమునందు దమయన్తి ముఖమునే నిర్మించెనని చెప్పెను. కాన నిదియే దానికిని దీనికిని యర్థభేదము. కాన నీశ్లోకము ప్రక్షేపము.

శ్లో. అస్యాః సురాధీశదిశః పురాఽఽసీత్
యదమ్బరం పీత మిదం రజన్యా।
చన్ద్రాంశుచూర్ణవ్యతి చుమ్బితేన
తేనాఽధునా నూన మలోహితాయి॥ 47

ప. వి. అస్యాః - సురాధీశదిశః - పురా - ఆసీత్ - యత్ - అమ్బరం - పీతం - ఇదం - రజన్యా - చన్ద్రాంశుర్ణవ్యతిచుమ్బితేన - తేన - అధునా - నూనం - అలోహితాయి.

అర్థము: హే భైమి! = ఓ దమయన్తీ!, అస్యాః, = ఈ, సురాధీశదిశః, సురాధీశ = సురపతియగు నిన్ద్రునియొక్క, దిశః = దిక్కునకు, యత్ = ఏ, ఇదం = ఈ, అమ్బరం = ఆకసము (వస్త్రము), పురా = పూర్వము అనగా చంద్రోదయమునకు పూర్వము, రజన్యా = రాత్రి చేతను, (పసుపుచేతను) పీతం = (నీకటి వ్యాపించుటవలన) పానము చేయబడినదిగను, పసుపువన్నె గలదిగను. ఆసీత్ = ఆయెనో చన్ద్రాంశుచూర్ణవ్యతిచుమ్బితేన, చంద్రాంశు = చన్ద్రకిరణములనెడి చూర్ణ = ఎఱ్ఱని చూర్ణములతో, వ్యతిచుమ్బితేన = స్పృశింపబడిన తేన = ఆయాకసముచే, (వస్త్రముచే) అధునా = ఇపుడు, ఆలోహితాయి = ఎఱుపువన్నెగలదిగా నగుట యేర్పడినది. నూనం = నిశ్చయము.

సమాసములు :

సురాధీశదిశః : సురాణాం అధీశః = సురాధీశః, సురాధీశస్య దిక్ = సురాధీశదిక్, తస్యాః = సురాధీశదిశః.
చన్ద్రాంశుచూర్ణవ్యతిచుమ్బితేన : చన్ద్రస్య అంశవః = చన్ద్రాంశవః, చన్ద్రాంశవః ఏవ చూర్ణాః = చన్ద్రాంశుచూర్ణాః, చన్ద్రాంశుచూర్ణైః వ్యతిచుమ్బితం = చన్ద్రాంశుచూర్ణవ్యతిచుమ్బితం, తేన = చన్ద్రాంశుచూర్ణవ్యతిచుమ్బితేన.

**భావము :**

ఓ దమయన్తీ! ఈ యిన్ద్రునికి సంబంధించిన తూర్పుదిక్కునందలి యాకసము (వస్త్రము) చన్ద్రు డుదయించుటకు పూర్వము రాత్రిచేత (పసుపు చేతను) చీకటి వ్యాపించుటవలన నదృశ్యముగను (పసుపువన్నె గలదిగను) ఉండెను. చంద్రోదయముకాగనే యా యాకసము (వస్త్రము) చన్ద్రకిరణములనెడి యెఱుపుధూలి పడుటవలన నించుక యెఱ్ఱనైనది. ఉదయచన్ద్రుని కిరణములు ఎఱ్ఱగా నుండును. కాన నాకిరణములు తగులుటచే నెఱ్ఱబారినదని యర్థము. చన్ద్రోదయమునకు పూర్వము పీతవర్ణముగనున్న యాకసము (వస్త్రము) చన్ద్రోదయమైన పిదప నెఱ్ఱబారినదని యర్థము. ఇంద్రుని స్త్రీకి పలువన్నెలుగల వలువలుండునుగదా!.

శ్లో. తానీవ గత్వా పితృలోకమేన
మరఞ్జయన్ యాని స జామదగ్న్యః ।
ఛిత్వా శిరోఽస్త్రాణి సహస్రబాహో
ర్విస్రాణి విశ్రాణితవాన్ పితృభ్యః ॥ 48

ప. వి. తాని - ఇవ - గత్వా - పితృలోకం - ఏనం - అరఞ్జయన్ - యాని - సః - జామదగ్న్యః - ఛిత్వా - శిరః - అస్త్రాణి - సహస్రబాహోః - విస్రాణి - విశ్రాణితవాన్ - పితృభ్యః.

**అర్థము:** సః = ఆ ప్రసిద్ధవీరుడైన, జామదగ్న్యః = పరశురాముడు, సహస్రబాహోః = వేయిభుజములుగల యర్జునునియొక్క, శిరః = తలను, ఛిత్వా = త్రుంచి, విస్రాణి = ఆమగంధముగల్గిన, రక్తాని = రక్తములను, పితృభ్యః = జమదగ్ని మున్నగు పితృదేవతలకై, విశ్రాణితవాన్ = ఇచ్చెను. అనగా నారక్తములచే పితృతర్పణము గావించెను. తాన్యేవ = ఆరక్తములే, పితృలోకం = పితృదేవతలలోకమైన, ఏనం = ఈ చంద్రుని, గత్వా = మన్త్రబలముతోబొంది, అరఞ్జయన్ = ఈచంద్రునికి అలదినవి. "చన్ద్రో వై పితృలోకః" యను శ్రుతి ననుసరించి చన్ద్రుడే పితృలోకమని తెలియుచున్నది. అట్లు రక్తమును బూయుటవలన నీచంద్రుడెఱ్ఱగా గనబడుచున్నాడని యర్థము.

**సమాసములు :**

పితృలోకం : పితౄణాం లోకః = పితృలోకః, తం = పితృలోకమ్.

జామదగ్న్యః : జమదగ్నేః అపత్యం పుమాన్ = జామదగ్న్యః.

సహస్రబాహోః : సహస్రం బాహవః యస్య సః = సహస్రబాహుః, తస్య = సహస్రబాహోః.

**భావము :**

గొప్పవీరుడగు పరశురాముడు వేయిబాహువులుగల కార్తవీర్యార్జునుని తలను ద్రుంచి యాహగంధముగల యాతనిరక్తముతో తనతండ్రియగు జమదగ్నిమున్నగు పితృదేవతలకు దర్పణము గావించి తనప్రతిజ్ఞను తీర్చుకొనెను. ఆ రక్తములే పితృలోకములకు మన్త్రిబలముతో బోయి పితృలోకమైన చంద్రుని కంటినవి. అందువలన చంద్రు డెఱ్ఱబారి యుదయించుచున్నాడు. పరశురాముడు తనయాశ్రమమును వదలి వెలుపలికి బోగా కార్తవీర్యార్జునుడు అతని తండ్రియగు జమదగ్నిమహర్షియొక్క తలను ఖండించెను. అతడు మరలివచ్చి తన తండ్రిని సహస్రబాహువు చంపిన విషయమును దెలిసికొని యాసహస్రబాహువును, నాతని వంశమునకు జెందిన తక్కిన క్షత్రియులను వధించి వారిరక్తముతో బితృతర్పణము చేయుటకు బ్రతిజ్ఞగావించెను. అవ్విధముగనే అతడు ఇరువదియొక్క మాఱులు క్షత్రియులను వధించి, వారిరక్తముతో పితృతర్పణము గావించుకొనె ననెడి పురాణగాథ యిట ననుసంధేయము.

శ్లో. అకర్ణనాసప్రపతే ముఖం తే
పశ్యన్న సీతాస్య మివాభిరామమ్ ।
రక్తోస్రవర్షీ బత లక్ష్మణాభి
భూతః శశీ శూర్పణఖాఃముఖాభ ॥ 49

ప. వి. అకర్ణనాసః - ప్రపతే - ముఖం - తే - పశ్యన్ - న - సీతాస్యం - ఇవ - అభిరామం - రక్తోస్రవర్షీ - బత - లక్ష్మణాభిభూతః - శశీ - శూర్పణఖాముఖాభః.

అర్థము: హేప్రపియే! = ఓప్రియురాలా?, అకర్ణనాసః = చెవులు ముక్కులు లేనట్టివాడును, అనగా స్వాభావికముగనే చెవులు ముక్కులు లేకయుండెడి

వాడును, రక్తోస్రవర్షీ, రక్త = ఎఱ్ఱనైన, ఉస్ర = కిరణములను, వర్షీ = వర్షించువాడును, తథా = అట్లే, లక్ష్మణా = మధ్యనున్న కళంకముచే, అభిభూతః = తిరస్కరింపబడినవాడును, ననగా కళంకముచే మధ్యభాగమునం దాక్రమింపబడినవాడును (కావుననే) శూర్పణఖా ముఖాభః, శూర్పణఖా = రావణుని సోదరియగు శూర్పణఖయొక్క, ముఖ = మోమువంటి, ఆభః = కాన్తిగలవాడును నగు, శశీ = చంద్రుడు, సీతాస్యమివ = సీతాదేవియొక్క ముఖమువలె, అభిరామం =, అందమైన, తే = నీయొక్క, ముఖం = మోమును, పశ్యన్నపి = చూచుచును, న త్రపతే = సిగ్గు జెందుటలేదు. సిగ్గుజెందుటకు తగిన కారణమున్నను సిగ్గుజెందుట లేదనుట చిత్రము. నీముఖమును జూచుచును ఉదయించుచునేయున్నాడు. తన్ను ప్రకాశపరుచుచున్నాడు. కావుననే, సిగ్గుపడుటలేదని తెలియుచున్నది. చెవులు ముక్కులు లేనివాడెవ్వడైనను, సిగ్గుచెందునుగదా? వీడు అట్టివాడైనను సిగ్గుజెందకపోవుట యాశ్చర్యకరమే, మరియును, శూర్పణఖాముఖాభః, శూర్పణఖా = శూర్పణఖ యొక్క. ముఖ = ముఖముయొక్క, ఆభః = కాన్తివంటికాన్తి గలవాడై, కావుననే, లక్ష్మణాభిభూతః = లక్ష్మణునిచే, తిరస్కరించబడిన వాడును రక్తోస్రవర్షీ = రక్తమనెడి కిరణమును వర్షించుచున్నవాడై, రామమభి = శ్రీరాము నుద్దేశించి, ఉన్నటువంటిదియు, అభి = భయ రహితమైనదియు నగు, సీతాస్యమివ, సీతా = సీతయొక్క, ఆస్యమివ = ముఖమువంటిదైన, తే = నీయొక్క, ముఖం = ముఖమును, పశ్యన్నపి = చూచుచును, నత్రపతే = సిగ్గుపడుటలేదు. బత = అయ్యో.

## సమాసములు :

అకర్ణనాసః : కర్ణౌ చ నాసా చ = కర్ణనాసం, అవిద్యమానం కర్ణనాసం యస్య సః = అకర్ణనాసః.

సీతాస్యం : సీతాయాః ఆస్యం = సీతాస్యం.

రక్తోస్రవర్షీ : రక్తాశ్చ తే ఉస్రాః = రక్తోస్రాః, రక్తోస్రాన్ వర్షతీతి = రక్తోస్రవర్షీ.

లక్ష్మణాభిభూతః ; లక్ష్మణేన అభిభూతః = లక్ష్మణాభిభూతః.

శూర్పణఖాముఖాభః : శూర్పణఖాయాః ముఖం = శూర్పణఖాముఖం, శూర్పణఖాముఖస్య ఆభేవ ఆభా యస్య నః = శూర్పణఖాముఖాభః.

**భావము :**

ఓ ప్రియురాలా! ఈ చన్ద్రుడు చెవులు ముక్కు మున్నగు నవయవములులేని వాడై రక్తోన్నముల ననగా నెఱ్ఱనికిరణములను వర్షించుచు (రక్తమనెడి కిరణములను వర్షించుచు) లక్ష్మచే నభిభూతుడై యనగా కళంకముచే నాక్రమింపబడిన మధ్యభాగము గల్గినవాడై (లక్ష్మణునిచే దిరస్కరింపబడినవాడై) కావుననే శూర్పణఖాముఖమువంటి కాంతికలవాడై యనగా లక్ష్మణుడు ముక్కుచెవులు కోయుటవలన నవిలేని శూర్పణఖమోమును బోలినవాడై, సీతయొక్క ముఖము వలె నందమైన నీముఖమునుచూచుచు సిగ్గుపడక యుదయించుచున్నాడు. తన్ను బహిరంగము గావించుకొనుచున్నాడు. ముక్కు చెవులు లేనివారు బయటగనబడుటకు సాధారణముగా సిగ్గుపడుదురు గదా! కాని చంద్రుడు ముక్కుచెవులు లేక పోయినను సిగ్గువడక యందరికిని కనపడుచున్నాడని భావము.

శ్లో. ఆదత్త దీప్రం మణి మమ్బరస్య
దత్వా యదస్మై ఖలు సాయధూర్తః ।
రజ్యత్తుషారద్యుతికూటహేమ
తత్పాణ్డు జాతం రజతం క్షణేన. ॥ 50

ప, వి. ఆదత్త - దీప్రం - మణిం - అమ్బరస్య - దత్వా - యత్ - అస్మై - ఖలు - సాయధూర్తః - రజ్యత్తుషార ద్యుతికుటహేమ - తత్ - పాణ్డు- జాతం - రజతం - క్షణేన.

**అర్థము:** హే భైమి! = ఓదమయన్తీ!, సాయధూర్తః, సాయం = సాయంకాలమనెడి ధూర్తః = దుష్టుడు, యత్ = ఏ, రజ్యత్తుషారద్యుతికూట హేమ, రజ్యత్ = ఉదయకాలమున ఎఱ్ఱనైన, తుషారద్యుతి = చంద్రుడనెడి, కూటహేమ = (రంగుపూయుటవలన నెఱ్ఱగా ప్రకాశించెడి) కృత్రిమమైన బంగారును, అస్మై = ఈయాకసమునకై, (మూల్యముగా), దత్వా = ఇచ్చి, దీప్రం = ప్రకాశించెడి, అమ్బరస్య = ఆకసముయొక్క, మణిం = రత్నమైన,

సూర్యుని, ఆదత్త = తీసుకొనెను. తత్ = ఆయసత్యమైన బంగారు, క్షణేన = క్షణకాలమున, పాణ్డు = తెల్లనైన, రజతం = వెండిగా, జాతం = ఏర్పడినది. దుష్టుడు వెండికి గొన్నిరసములను బట్టించి బంగారువలె గావించియిచ్చును. దానికి బదులుగా వస్త్రమందున్నను గాంతిని జిమ్మెడి రత్నమును గ్రహించును. ఉదయించిన పిదప గొన్నిక్షణములకే చంద్రుడు తనయుదయరాగమును వదలి వెండివలె దెల్లబడెనని యర్థము.

**సమాసములు :**

సాయధూర్తః : సాయ ఏవ ధూర్తః = సాయధూర్తః,
రజ్యత్తుషారద్యుతికూటహేమ : తుషారమయీ ద్యుతిః యస్య సః = తుషారద్యుతిః, రజ్యశ్చాసౌ తుషారద్యుతిశ్చ = రజ్యత్తుషారద్యుతిః, కూటం చ తత్ హేమ చ = కూటహేమ, రజ్యత్తుషారద్యుతిరేవ కూటహేమ = రజ్యత్తుషారద్యుతికూటహేమ, తత్ = రజ్యత్తుషారద్యుతికూటహేమ.

**భావము :**

ఓ దమయన్తీ! సాయంకాలమనెడి వంచకుడు ఉదయరాగముచే నెఱ్ఱగా గానవచ్చుచున్న యనగా బంగారువలె నెఱ్ఱగా గానవచ్చుచున్న మంచువెలుగుగల చంద్రుడనెడి కృత్రిమపుబంగారును నాకసమునకు వలగా నిచ్చి దానినుండి కాంతుల జిమ్మెడి యమ్బరరత్నమైన సూర్యుని బుచ్చుకొనెను. ఆయసత్యమైన బంగారు క్షణమాత్రమున తెల్లనివెండిగా నేర్పడినది. వంచకుడు కొన్ని రసాయనములను వెండికి బూసి దానిని బంగారుగా జేసి రత్నమును బుచ్చుకొనును. ఉదయమైన పిదప కొద్దిక్షణములు గడువగనే యీయుదయరాగమును వదలి చంద్రుడు వెండి వలె తెల్లబడెనని భావము.

శ్లో. అనేన నక్తం సమయేన ముక్తం
రౌప్యం లసద్బిమ్బమివేన్దుబిమ్బమ్ ।
భ్రమిక్రమా దుజ్ఝితపట్టపాత్ర
నేత్రావృతిం ముఞ్చతి శోణిమానమ్.॥ 51

ప. వి. అనేన - నక్తం - సమయేన - ముక్తం - రౌప్యం - లసద్బిమ్బం - ఇవ - ఇన్దుబిమ్బం - భ్రమిక్రమాత్ - ఉజ్ఝితపట్టసూత్రనేత్రావృతిం - ముఞ్చతి - శోణిమానం.

అర్థము: హే ప్రియే = ఓ ప్రియురాలా! రౌప్యం = వెండితో చేయబడిన, లసద్బిమ్బం, లసత్ = ప్రకాశించెడి, బిమ్బం = మణ్డలము గలిగిన, యనగా పిల్లలఆటకు సాధనమైన చెండువంటి యాకారము గలిగిన, ఇన్దుబిమ్బం = చన్ద్రబిమ్బము, భ్రమిక్రమాత్, భ్రమి = దొరలుచు పోవుటయందలి, క్రమాత్ = వరిపాటివలన, మఱియు పై ప్రదేశమునకు వెళ్ళుటవలని క్రమమువలన, ఉజ్ఝితపట్టసూత్రనేత్రావృతిం, ఉజ్ఝిత = విడువబడిన, పట్టసూత్ర = పట్టునూలునకు సంబంధించిన, నేత్ర = త్రాడిచే, ఆవృతిం = చుట్టడమనెడి రూపముగలదియు, మఱియు పట్టునూలుతో చేయబడిన వలవంటి చన్ద్రవకణము గలదియు, నక్తం సమయేన = రాత్రికాలమనెడి, బాలేన = బాలునిచే, మఱియు బాలేన = లేతదైన యనగా ప్రదోషరూపమైన నక్తంసమయేన = రాత్రిసమయముచే, ముక్తం = తిరుగుటకై చేతినుండి, విడువబడినదియును, ఉదయించినది యునై, శోణిమానం = ఎఱ్ఱదనమును, ముఞ్చతి = విడుచుచున్నది.

సమాసములు :

నక్తంసమయేన : నక్తమితి సమయః = నక్తంసమయః. తేన = నక్తం సమయేన.

లసద్బిమ్బం : లసత్ బిమ్బం యస్య తత్ = లసద్బిమ్బమ్.

ఇన్దుబిమ్బం : ఇన్దోః బిమ్బం = ఇన్దుబిమ్బం.

భ్రమిక్రమాత్ : భ్రమేః క్రమః = భ్రమిక్రమః, తస్మాత్ = భ్రమిక్రమాత్.

ఉజ్ఝితపట్టసూత్రనేత్రావృతిం : పట్టమయం చ తత్ సూత్రం చ = పట్టసూత్రం. ఉజ్ఝితం చ తత్ పట్టసూత్రం చ = ఉజ్ఝితపట్టసూత్రం, ఉజ్ఝిత పట్టసూత్రమయంచ తత్ నేత్రం చ = ఉజ్ఝిత పట్టసూత్రనేత్రం, ఉజ్ఝిత పట్టసూత్రనేత్రమేవ ఆవృతిః = ఉజ్ఝితపట్టసూత్రనేత్రావృతిః, తాం = ఉజ్ఝితపట్టసూత్రనేత్రావృతిం.

**భావము :**

ఓ ప్రియురాలా? రాత్రియనెడి బాలుడును, బాల్యముగల రాత్రియుననగా ప్రదోషము, బాలురాడెడి చెండువంటిదియును, పట్టునూలుతో చుట్టబడినదియును పట్టునూలువలవంటి యాభరణము గలదియునగు వెండితో జేయబడిన చన్ద్రబిమ్బ మును విసరగా నాచన్ద్రబిమ్బ మనెడి చెండు దొరలుటచే దానికి ఆవరణముగా నున్న పట్టునూలు వీడిపోయి, లోపలనున్న వెండిచెండు బయటపడినట్లు యాచన్ద్ర బిమ్బము పైకిపోవుటవలన, దానిచుట్టు పట్టునూలువంటి యావరణముగా నున్న యెఱ్ఱదనమును నది వదలుచున్నది. సామాన్యుల గృహములయందు బాలురచే కొయ్యతో జేసినచెండు వాడబడును. ధనికుల గృహములయందు వెండితో జేయ బడినచెండు, పట్టునూలుతొడుగు గలిగినదై బాలురచే నాడబడుచుండును. కాన పైవిధముగా నావరణముగా నున్న యెఱ్ఱదనము తొలగిపోగా చన్ద్రబిమ్బము తెల్లబడియున్నదని భావము.

శ్లో. తారాక్షరై ర్యా మసితైః కఠిన్యా
నిశాఽలిఖద్వ్యోమ్ని తమఃప్రశస్తిమ్ ।
విలుప్య తామల్పయతోఽరుణేఽపి
జాతః కరే పాణ్డురిమా హిమాంశోః ॥ 52

ప. వి. తారాక్షరైః - యాం - అసితైః - కఠిన్యాః - నిశా - అలిఖత్ - వ్యోమ్ని - తమః - ప్రశస్తిం - విలుప్య - తాం - అల్పయతః - అరుణే - అపి - జాతః - కరే - పాణ్డురిమా - హిమాంశోః.

అర్థము: నిశా = రాత్రి, అసితే = నల్లని, వ్యోమ్ని = ఆకసమనెడి కాటుకతో బూయబడిన నల్లని చెక్కపై, కఠిన్యాః = తెల్లని బలపమునకు సంబంధించిన, తారాక్షరైః = నక్షత్రములనెడి యక్షరములతో గూడిన, యాం = ఏ, తమః ప్రశస్తిం = చీకటినిగూర్చిన ప్రశంసాత్మకమగు కృతిని, అలిఖత్ = వ్రాసెను, తాం = అప్రశస్తికి సంబంధించిన లిపిని, విలుప్య = తుడిచి, అల్పయతః = తగ్గించుచున్న, హిమాంశోః = చంద్రుని యొక్క, అరుణేఽపి = ఎఱ్ఱనిదై యున్న, కరే = కిరణమునందును, హస్తమునందును, పాణ్డురిమా = తెల్లదనము, జాతః = ఏర్పడినది.

**సమాసములు**

తారాక్షరైః : తారా ఏవ అక్షరాణి = తారాక్షరాణి, తైః = తారాక్షరైః.
అసితే : న సితం = అసితం, తస్మిన్ = అసితే.
తమఃప్రశస్తిం : తమసః ప్రశస్తిః = తమః ప్రశస్తిః, తాం = తమః ప్రశస్తిం.
అల్పయతః : అల్పం కరోతీతి = అల్పయన్, తస్య = అల్పయతః.

**భావము :**

రాత్రి, నల్లనియాకాశ మనెడి తెల్లనిబలపమునకు సంబన్ధించిన యక్షరములో యనునట్లున్న నక్షత్రములచే, చీకటిని గూర్చిన ప్రశస్తిరూపమగు కావ్యమును వ్రాసెను. ఆ లిపిని దుడిపివైచి, దానిని తగ్గించుచున్న చన్ద్రుని యెఱ్ఱని కిరణమందును హస్తమందును తెల్లదనమేర్పడినది, చంద్రునికి కిరణములు పెరగగనే నక్షత్రములు తగ్గిపోవుచుండును, కాన బలపముతో వ్రాయబడిన యక్షరములను దుడుపుచున్న హస్తము, ఎఱ్ఱనిదైనను బలపపురంగువలన చెల్లబడును. చీకటి యందు నక్షత్రములు పెక్కులై ప్రకాశవన్తములుగా గానబడును. చన్ద్రుడు ఉదయించినచో నవి యల్పములై కాంతిరహితము లగును. చన్ద్రుడు తెల్లబడునని భావము.

శ్లో. సితో యదాఽత్రైవ తదాన్యదేశే
చకాస్తి రజ్యచ్ఛవి రుజ్జిహానః ।
తదిత్థ మేతస్య నిధేః కలానాం
కో వేద వా రాగవిరాగతత్త్వమ్. ॥ 53

ప. వి. సితః - యదా - అత్ర - ఏవ - తదా - అన్యదేశే - చకాస్తి - రజ్యచ్ఛవిః - ఉజ్జిహానః - తత్ - ఇత్థం - ఏతస్య - నిధేః - కలానాం - కః - వేద - వా - రాగవిరాగతత్త్వమ్.

అర్థము: (ఏషః = ఈచన్ద్రుడు) అత్ర = ఈదేశమందు, సితః = తెల్లనికాంతిగలవాడై, యదా = ఎప్పుడు, చకాస్తి = ప్రకాశించునో, తదైవ = అప్పుడే, అన్యదేశే = మఱియొకదేశమందు, రజ్యచ్ఛవిః, రజ్యత్ = రక్తమైన,

ఛవిః = కాన్తి గల్గినవాడై, ఉజ్జిహానః = ఉదయించుచు, (చకాస్తి = శోభించుచున్నాడు) ఇట్లే యిచ్చట నుదయించుచు, నెఱ్ఱనైనవాడు మఱియొక చోట తెల్లనై యుండుననియు సామర్థ్యమువలన, లభించుచున్నది. ఈదేశమందున్నవారిని గూర్చి యిప్పుడే తెల్లనివాడై కనబడును. మఱియొక ద్వీపమందున్నవాని కిప్పుడే యుదయించుచు గానబడును, తత్ = అందువలన, ఏతస్య = ఈ, కలానిధేః = కలలకునిధియగు చంద్రునియొక్క, రాగవిరాగతత్త్వం, రాగ = ఎఱ్ఱదనముయొక్కయు, విరాగ = తెల్లదనముయొక్కయు, తత్త్వం = వాస్తవికస్థితిని, ఇత్థం = ఇవ్విధముగా, కోవా వేద = ఎవ్వడు తెలుసుకొనును, అనగా నెవ్వడును తెలుసుకొనజాలడని యర్థము. ఉదయాస్తమయముల సత్యములగుటవలన దూరమందున్నవానికి నెచ్చట నెప్పుడు తొలుత నతని దర్శనమగునో, యప్పుడే యచ్చట నుదయమనియు, కావున నచ్చట రక్తత్వప్రతీతియు, మఱియొకనికి ననగా నంతకంటెను దూరమందున్నవానికి ధవళత్వప్రతీతియు గల్గుచున్నది.

సమాసములు :

అన్యదేశే : అన్యశ్చాసౌ దేశశ్చ = అన్యదేశః, తస్మిన్ = అన్యదేశే.
రజ్యచ్ఛవిః : రజ్యన్తీ ఛవిః యస్య సః = రజ్యచ్ఛవిః.
రాగవిరాగతత్త్వం : రాగశ్చ విరాగశ్చ = రాగవిరాగౌ, రాగవిరాగయోః తత్త్వం = రాగవిరాగతత్త్వమ్.

భావము :

ఈ చన్ద్రుఁడే సమయమునందు తెల్లనికాన్తిగలవాడై, యుండునో, ఆ సమయమునందే మఱియొక దేశమునందు రక్తవర్ణముగల్గి యుదయించుచుండును. ఇట్లే యీ దేశమునందు రక్తవర్ణముకల్గి ఏసమయమునందుదయించుచుండునో అప్పుడే మఱియొక దేశమందు తెల్లనివర్ణము గలిగియుండును. కావున కలానిధియగు చన్ద్రునికి నంబంధించిన రాగవిరాగముల యందలి యథార్థము నెవ్వడు తెలుసుకొనగల్గి యున్నాడు? ఎవ్వడును తెలుసుకొనలేడని యర్థము. ఉదయాస్తమయము లసత్యములు గాన నెప్పుడీ దేశమునందు తెల్లగనుండునో, అప్పుడు మఱియొకదేశమునం దుదయించుటచే నెఱ్ఱగా

నుండును. అట్లే యెప్పుడీదేశమునం దుదయించుటచే నెల్లబడి యుండునో యప్పుడే మఱియొకదేశము నందు వెల్లబడి యుండును. అట్లే చతుష్షష్టికలా కోవిదుని యొక్క యనురాగానురాగముల యందలి రహస్యము ననగా నత డెచ్చట నమరక్తుడు? ఎచ్చట ననురక్తుడను రహస్యము నెవ్వడె ట్లుతెలుసుకొనును? ఎవ్వడును తెలుసుకొన జాలడని యర్థము.

శ్లో. కాశ్మీరజై రశ్మిభి రౌపసంధ్యై
ర్మృష్టం ధృతధ్వాన్తకురఙ్గనాభి ।
చన్ద్రాంశునా చన్దనచారుణాఽఙ్గం
క్రమాత్ సమాలమ్భి దిగఙ్గనాభిః ॥ 54

ప. వి. కాశ్మీరజైః - రశ్మిభిః - ఔపసంధ్యైః - మృష్టం - ధృతధ్వాన్తకురఙ్గనాభి - చన్ద్రాంశునా - చన్దనచారుణా - అఙ్గం - క్రమాత్ - సమాలమ్భి - దిగఙ్గనాభిః.

అర్థము: దిగఙ్గనాభిః, దిక్ = దిక్కులనెడి, అఙ్గనాభిః = స్త్రీలచే, ఔపసన్ధ్యైః = సంధ్యాకాలము సమీపమునం దుద్భవించినట్టి ఎఱ్ఱని, రశ్మిభిః = కిరణము లనెడి, కాశ్మీరజైః = కుంకుమ పుష్పములచే, మృష్టం = తొలుత నలుగు బెట్టబడినదియును, (తర్వాత) ధృతధ్వాన్తకురఙ్గనాభి, ధృత = ధరింప బడిన, ధ్వాన్త = చీకటి యనియెడి, కురఙ్గనాభి = కస్తూరిగలదియు నగు, అఙ్గం = శరీరమును, చన్ద్రాంశునా = చన్ద్రకిరణ మనెడి, చన్దన చారుణా, చన్దన = చన్దనములమధ్య, చారుణా = శ్రేష్ఠమైన చన్దన ముతో, సమాలమ్భి = చక్కగా బట్టింపబడినది.

**సమాసములు :**

కాశ్మీరజైః : కాశ్మీరేషు జాయన్తఇతి = కాశ్మీరజాని, తైః = కాశ్మీరజైః.

ఔపసంధ్యైః: సన్ధ్యాయాః సమీపే = ఉపసన్ధ్యం, ఉపసన్ధ్యం భవన్తీతి = ఔపసన్ధ్యాని, తైః = ఔపసన్ధ్యైః

ధృతధ్వాన్తకురఙ్గనాభి : ధ్వాన్తమేవ కురఙ్గనాభిః = ధ్వాన్తకురఙ్గనాభిః, ధృతః ధ్వాన్తకురఙ్గనాభిః యేన తత్ = ధృతధ్వాన్తకురఙ్గనాభి.
చన్ద్రాంశునా : చన్ద్రస్య అంశుః = చన్ద్రాంశుః. తేన = చన్ద్రాంశునా.
చన్దనచారుణా : చన్దనేషు చారుః = చన్దనచారుః, తేన = చన్దనచారుణా.
దిగఙ్గనాభిః : దిశ ఏవ అఙ్గనాః = దిగఙ్గనాః, తాభిః = దిగఙ్గనాభిః.

భావము :

దిక్కులనెడి స్త్రీలు సంధ్యాకాలం సమీపమునం దుత్పాదించిన యెఱ్ఱని కిరణములనెడి కుంకుమపూలతో నలుగుపెట్టబడినదియును. తర్వాత నేర్పడిన చీకటి యనియెడు కస్తూరిని వహించినవియు నగు తమ దేహములను చన్ద్రకిరణములనెడి మెత్తైన చందనముతో చక్కగా బట్టించుకొనినవి.

శ్లో. విధి స్తుషార ర్తుదినాని కర్తం
కర్తం వినిర్మాతి తద న్తభిత్తైః ।
జ్యోత్స్నీర్న చే త్తత్ప్రతిమా ఇమా వా
కథం కథం తాని చ వామనాని ॥ 55

ప. వి. విధిః - తుషారర్తుదినాని - కర్తం కర్తం - వినిర్మాతి - తద న్తభిత్తైః - జ్యోత్స్నీః - న - చేత్ - తత్ప్రతిమాః - ఇమాః - వా - కథం - కథం - తాని - చ - వామనాని.

అర్థము: విధిః - బ్రహ్మ. తుషారర్తుదినాని, తుషారర్తు = శిశిరఋతువు యొక్క, దినాని = దినములను, కర్తం కర్తం = కోసికోసి, తద న్తభిత్తైః, తత్ = ఆ దినముల యొక్క, అన్త = మధ్యనున్న, భిత్తైః = ముక్కలతో, అనగా సారవన్తములగు ఖణ్డములతో, జ్యోత్స్నీః = వెన్నెలతో గూడిన, రాత్రులను, వినిర్మాతి = నిర్మించు చున్నాడు. న చేత్ = ఇట్లుకానిచో, ఇమాః = ఈ రాత్రులు. అనగా వెన్నెలతో గూడిన రాత్రులు, తత్ప్రతిమాః, తత్ = ఆ దినములతో, ప్రతిమాః = సమానములుగా నుండుట, అనగా చల్లదనముచేతను ప్రకాశముచేతను సమానములుగా నుండుట. కథం = ఎట్లు, తాని = ఆ, దినాని = పగళ్ళును, వామనాని = కుఱుచని

విగా అనగా కొలది పరిమితి గలిగినవిగా నుండుట, కథం వా ?=ఎట్లు సరిపడును ? కాన పగళ్ళు తక్కువ పరిమితిని రాత్రులు అధికపరిమితిని గలిగియుండుటచే శిశిరర్తుదినముల కంటెను వెన్నెలరాత్రులు మిక్కిలి ప్రకాశము గలిగియుండుట వలనను బ్రహ్మ శిశిరఋతుదినములను కోసియే వాని సారములగు ముక్కలతో, వెన్నెల రాత్రులను నిర్మించెనని యర్థము. చంద్రుని వెన్నెలచే రాత్రి చల్లగను తెల్లగనున్నది యని యర్థము.

**సమాసములు :**

తుషారర్తుదినాని : తుషారస్య ఋతుః = తుషారర్తుః, తుషారర్తోః దినాని=తుషారర్తుదినాని, తాని = తుషారర్తుదినాని.
కర్తంకర్తం : కర్త్వా కర్త్వా=కర్తంకర్తం.
తదన్తర్భిత్తైః : తేషా మన్తః=తదన్తః. తదన్తే భిత్తాని=తదన్తర్భిత్తాని, తైః=తదన్తర్భిత్తైః.
జ్యౌత్స్నైః : జ్యోత్స్నయా అన్వితాః = జ్యౌత్స్నాః, తాః = జ్యౌత్స్నైః.
తత్ప్రతిమాః : తైః ప్రతిమాః=తత్ప్రతిమాః.

**భావము :**

చలికాలమునందు ముఖ్యముగా శిశిరఋతువునందు రాత్రులు చల్లగాను పొడవుగాను, పగళ్ళు కుఱుచగాను నుండును. దానిని కవి చమత్కరించు చున్నాడు. బ్రహ్మ శిశిరఋతువునందలి పగళ్ళను కోసి కోసి ముక్కలు గావించి వానిలో సారవన్తములగు ముక్కలచే వెన్నెల రాత్రులను నిర్మించు చున్నాడు. అట్లు పగళ్ళను ముక్కలు గావించుట వలన నాఋతువునందలి పగళ్ళపరిమితి తగ్గి యవి కుఱుచనైనవి. ఆ ముక్కలను రాత్రులకు గలుపుట వలన, నావెన్నెల రాత్రులు పొడవైనవి. మఱియు నవి యా ముక్కల యందలి చల్లదనమును వహించి మిక్కిలి చల్లబడినవి. ఆ పగటి భాగముల యందలి తునుకల యందు వెలుగును తెలుపును నధికముగా నుండుటవలన వానితో నిర్మితములైన రాత్రులయందు తెల్లతనము కూడా నతిశయించి ప్రకాశ మెక్కువ యైనది.

అట్లుకానిచో శిశిరఋతువు నందలి పగళ్ళు కుఱుచగా ననగా తక్కువకాలపరిమితి గల్గినవిగాను, వెన్నెలరాత్రులు నిడివిగా ననగా నెక్కువ కాలపరిమితిని గలిగిన విగను నెక్కువ చలిగలిగినవిగను నెక్కువ ధావల్యమును గలిగినవిగ నుండుట సరిపడదు గదా! యని భావము.

శ్లో. ఇత్యుక్తిశేషే స వధూం బభాషే
సూక్తిశ్రుతాసక్తినిబద్ధమౌనాం ।
ముఖాభ్యసూయానుశయాదివేన్దౌ
కేయం తవ ప్రేయసి! మూకముద్రా॥ 56

ప. వి. ఇతి - ఉక్తిశేషే - సః - వధూం - బభాషే - సూక్తిశ్రుతాసక్తినిబద్ధ మౌనాం - ముఖాభ్యసూయానుశయాత్ - ఇవ - ఇన్దౌ - కా - ఇయం - తవ - ప్రేయసి - మూకముద్రా.

అర్థము: సః = ఆ నలుడు, ఇతి = ఇట్లు, ఉక్తశేషే = చన్ద్రవర్ణన శేషించి యుండగా, సూక్తిశ్రుతాసక్తినిబద్ధమౌనాం, సూక్తి = ప్రసాదిముమున్నగు గుణములతో గూడిన మాటలను, శ్రుత = వినుట విషయమున, ఆసక్తి = ఆదరముచే, నిబద్ధ = స్వీకరింపబడిన, మౌనాం = మౌనముగల్గిన, వధూం = దమయన్తి నుద్దేశించి బభాషే = పలికెను, ఏమనగా, హే ప్రేయసి! = ఓ మిక్కిలి ప్రియురాలా!, ఇన్దౌ = చన్ద్రుని విషయ మున, ముఖాభ్యసూయానుశయాదివ, ముఖ = చన్ద్రునితో తనముఖమున నేర్పడిన సామ్యమునకు, అభ్యసూయా = ఈసువలన గలిగిన, అనుశయా దివ = మానసద్వేషమువలననో యనునట్లు, తవ = నీకు, ఇయం = ఈ, మూకముద్రా = మూగవానికివలె వాగ్బన్ధనము, కా = ఏమి? నీముఖ ముతో సామ్యమునకై కలహించునట్టి యా చన్ద్రునిపైగినుక వహించితివో యనునట్లు ఆ చన్ద్రుని నీవు వర్ణించుటలేదు. నేనుచేయు వర్ణనను నైతు మంగీకరించుట లేదు. ఇది ఎందులకు? నలుని వర్ణనలను వినుటవలన యాదరముచే నేర్పడిన మౌనము, చన్ద్రునిపై గోపముతో నేర్పడినట్లు భావింపబడినది.

**సమాసములు :**

ఉక్తిశేషే : ఉక్తేః శేషః = ఉక్తిశేషః, తస్మిన్ = ఉక్తిశేషే.

సూక్తిశ్రుతాసక్తినిబద్ధమౌనాం : సూక్తీనాం శ్రుతం = సూక్తిశ్రుతం, సూక్తిశ్రుతే ఆసక్తిః = సూక్తిశ్రుతాసక్తిః, సూక్తిశ్రుతాసక్త్యా నిబద్ధం మౌనం యయా సా = సూక్తిశ్రుతాసక్తినిబద్ధమౌనా, తాం = సూక్తిశ్రుతాసక్తినిబద్ధమౌనాం,

ముఖాభ్యసూయనుశయాత్ : ముఖస్య అభ్యసూయా = ముఖాభ్యసూయా, ముఖాభ్యసూయాయాః అనుశయః = ముఖాభ్యసూయానుశయః, తస్మాత్ = ముఖాభ్యసూయానుశయాత్.

మూకముద్రా : మూకస్య ముద్రా = మూకముద్రా.

**భావము :**

ఆ నలుడు తాను గావించెడి చన్ద్రవర్ణన మిగిలియుండగా, తన మధురవర్ణనలు వినుటయందలి యాసక్తిచే మౌనము వహించిన దమయన్తి నిగూర్చి, - "ఓ ప్రేయసీ! చన్ద్రునివిషయమున నీవు వర్ణించుటగాని, నావర్ణనను ఆమోదించుటగాని లేక కేవలము మూగదానివలె మౌనమునేల వహించితివి? నీముఖముతో నతని సామ్యముపై నసూయచే లోన సంతాపపడుచు నిట్లు మౌనము వహించితివా?"యని ప్రశ్నించెను.

శ్లో. శృఙ్గారభృఙ్గారసుధాకరేణ
వర్ణస్రజాఽనూపయ కర్ణకూపౌ।
త్వచ్చారువాణీరసవేణితీర
తృణానుకారః కిల కోషకారః॥ 57

ప. వి. శృఙ్గారభృఙ్గారసుధాకరేణ - వర్ణస్రజా - అనూపయ - కర్ణకూపౌ - త్వచ్చారువాణీరసవేణితీరతృణానుకారః - కిల - కోషకారః.

అర్థము : హే ప్రియే = ఓ ప్రియురాలా ! (త్వం = నీవు) శృఙ్గారభృఙ్గారసుధాకరేణ, శృఙ్గార = శృఙ్గారరసమునకు సంబంధించిన, భృఙ్గార = పనిడిచెప్పునెడి, సుధాకరేణ = చంద్రునిచే, వర్ణస్రజా = వర్ణమాలతో, కర్ణకూపౌ = నాకర్ణరంధ్రములను, అనూపయ = జలముతో

నింపుము, వర్ణమాల తడిగలిగియుండుటవలన కర్ణరన్ధ్రములను జలముతో నింపగలం వనుట యుచితము. మరియు = శృఙ్గారభృఙ్గారసుధాకరేణ, శృఙ్గార = శృఙ్గారరసమునకు సంబంధించిన. భృఙ్గార = కనకకలశ మనెడి నీముఖమునందలి, సుధా = అమృతమునకు, ఆకరేణ = గనియైన, వర్ణస్రజా = తడిసిన వర్ణమాలచే, కర్ణకూపౌ = నాకర్ణ రన్ధ్రములను, అనూపయ = జలపూర్ణములు గావింపుము. ఖలు = ఏల యనగా?. కోషకారః = చెఱకుల జాతిలో నాకరకమైన చెఱకు, త్వచ్చారు వాణీరసవేణీతీరతృణానుకారః, త్వత్ = నీయొక్క, చారు = మధుర మైన, వాణీ = వక్రోక్త్యాదిరూపమైన వాక్కునకు సంబంధించిన, రస = శృఙ్గారాదిరసములయొక్క, వేణీ = ప్రవాహముయొక్క, తీర = గట్టునందలి, తృణ = గడ్డికి, అనుకారః = సమానము. అటువంటి వాణిని వినిపింపుము అని యర్థము.

**సమాసములు :**

శృఙ్గారభృఙ్గారసుధాకరేణ : శృఙ్గారస్య భృఙ్గారః = శృఙ్గార భృఙ్గారః, శృఙ్గారభృఙ్గార ఏవ సుధాకరః = శృఙ్గారభృఙ్గారసుధాకరః, తేన = శృఙ్గారభృఙ్గారసుధాకరేణ.

వర్ణస్రజా : వర్ణానాం స్రక్ = వర్ణస్రక్, తయా = వర్ణస్రజా.

కర్ణకూపౌ : కర్ణయోః కూపౌ = కర్ణకూపౌ, తౌ = కర్ణకూపౌ.

త్వచ్చారువాణీరసవేణీతీరతృణానుకారః : చారు శ్చాసౌ వాణీ చ = చారువాణీ, రసానాం వేణిః = రసవేణిః, తవ చారువాణీ, త్వచ్చారువాణీ, త్వచ్చారువాణ్యేవ రసవేణిః = త్వచ్చారువాణీరసవేణిః, త్వచ్చారువాణీ రసవేణేః తీరం = త్వచ్చారువాణీరసవేణితీరం, త్వచ్చారువాణీరసవేణితీరే తృణం = త్వచ్చారువాణీరసవేణితీరతృణం, త్వచ్చారువాణీరసవేణితీర తృణస్య అనుకారః = త్వచ్చారువాణీరసవేణీతీరతృణానుకారః.

**భావము :**

ఓ ప్రియురాలా! నీవు శృఙ్గారరసమునకు సంబంధించిన బంగారుచెంబు గానున్న చంద్రునిచే వర్ణమాలికతో నాకర్ణరన్ధ్రముంను జలపూర్ణము గావింపుము.

మఱియు శృఙ్గారరసమునకు సంబంధించిన బంగారుచెంబువంటి నీముఖము నందలి యమృతమున తడిసిన వర్ణమాలచే నాకర్ణరంధ్రములను నింపుము. ఏల యనగా? కోషకార మనెడి చెఱకు నీమధురవచనములకు సంబంధించిన శృఙ్గారరస ప్రవాహపు గట్టునందలి, గడ్డిపోచను బోలినది. అతిమధురమగు కోషకారమనెడి చెఱకుకూడ నీమధురవాణీరసప్రవాహపు తీరమందలి గడ్డినే యనుకరించుచున్నది గాని యారస ప్రవాహమును బోలుటలేదని యర్థము. అట్టిమాటను వినిపింపుము. అనగా చన్ద్రుని వర్ణింపుమని యాశయము.

శ్లో. అత్రైవ వాణీ మధునా తవాఽపి
 శ్రోతుం సమీహే మధునః సనాభిమ్ ।
ఇతి ప్రియప్రేరితయా తయాఽథ
 ప్రస్తోతు మారంభి శశిప్రశస్తిః ॥ 58

ప. వి. అత్ర - ఏవ - వాణీం-అధునా - తవ - అపి - శ్రోతుం - సమీహే - మధునః - - సనాభిమ్ - ఇతి - ప్రియప్రేరితయా - తయా - అథ - ప్రస్తోతుం - ఆరంభి - శశిప్రశస్తిః.

అర్థము: ఇతి = ఇట్లు, ప్రియప్రేరితయా, ప్రియ = ప్రియుడగు నలునిచే, ప్రేరితయా = ప్రేరేపించబడిన, తయా = ఆదమయన్తిచే, అథ = పిదప, శశిప్రశస్తిః, శశి = చన్ద్రునియొక్క, ప్రశస్తిః = మాహాత్మ్యము, ప్రస్తోతుం = వర్ణించుటకు, ఆరంభి కిం = ఆరంభింపబడినదా యేమి! (హే భైమి! = ఓదమయన్తీ!) అహం = నేను, అత్రైవ = ఈ చంద్రునివర్ణనవిషయమందే, మధునః = తేనెకు లేదా అమృతమునకు, సనాభి = సమానమైన, తవాఽపి = నీయొక్కయు, వాణీం = వాక్కును, శ్రోతుం = వినుటకు, సమీహే = కోరుచున్నాను.

సమాసములు :

ప్రియప్రేరితయా : ప్రియేణ ప్రేరితా = ప్రియప్రేరితా, తయా = ప్రియప్రేరితయా.

శశిప్రశస్తిః : శశినః ప్రశస్తిః = శశిప్రశస్తిః.

**భావము :**

ఈ విధముగా ప్రియుడగు నలునిచే, ప్రేరేపింపబడిన దమయన్తి తర్వాత చంద్రుని మహిమను వర్ణింప నారంభించినది. అపుడతడు 'ఓ దమయన్తీ! నేనీ చంద్రవర్ణనవిషయమందు అమృతమునకు సమానమగు నీవాణిని వినగోరుచున్నాను' అని అనెను.

శ్లో. పూర్వం విధు ర్వర్ధయితుం పయోధేః
శఙ్కేఽయ మేణాఙ్కమణిం కియన్తి।
పయాంసి దోగ్ధి ప్రియవిప్రయోగ
సశోక కోకీనయనే కియన్తి ॥ 59

ప. వి. పూరం - విధుః - వర్ధయితుం - పయోధేః - శఙ్కే - అయం - ఏణాఙ్కమణిం - కియన్తి - పయాంసి - దోగ్ధి - ప్రియవిప్రయోగస శోక కోకీనయనే - కియన్తి.

అర్థము: హే ప్రియ ! = ఓ ప్రియుడా !, అయం = ఈ, విధుః = చన్ద్రుడు, పయోధేః = సముద్రము యొక్క, పూరం = ప్రవాహమును, వర్ధయితుం = పెంచుటకు, ఏణాఙ్కమణిం = చన్ద్రికాన్తమణిని, కియన్తి = ఎంత ?, పయాంసి = ఉదకమును, దోగ్ధి = పిదుకును, తథా = అట్లే, ప్రియవిప్రయోగసశోక కోకీనయనే, ప్రియ = ప్రియుడగుపురుషచక్రవాకము యొక్క, విప్రయోగ = వియోగముచే, సశోక = దుఃఖముతో గూడిన, కోకీ = చక్రవాకియొక్క, నయనే = కన్నులను, కియన్తి = ఎంత, పయాంసి = జలములను, దోగ్ధి = పిదుకును, ఇతి = అని, అహం = నేను, శఙ్కే = తలంతును. (ఇతి = అని, ప్రియం = ప్రియుని, అవదత్ = పలికెను).

**సమాసములు :**

ఏణాఙ్కమణిం : ఏణః అఙ్కః యస్య సః = ఏణాఙ్కః, ఏణాఙ్కస్యాసౌ మణిశ్చ, = ఏణాఙ్కమణిః, తం = ఏణాఙ్కమణిం.

ప్రియవిప్రయోగసశోకకోకినయనే : ప్రియస్య విప్రయోగః = ప్రియ విప్రయోగః, శోకేన వర్తత ఇతి = సశోకా, ప్రియ విప్రయోగేణ సశోకా = ప్రియవిప్రయోగసశోకా, ప్రియవిప్రయోగసశోకా చ సా కోకీ చ = ప్రియవిప్రయోగసశోకకోకీ, ప్రియవిప్రయోగసశోకకోక్యాః నయనే = ప్రియవిప్రయోగసశోకకోకినయనే, తే = ప్రియవిప్రయోగ సశోకకోకినయనే.

**భావము :**

ఓ ప్రియుడా ! ఈ చంద్రుడు సముద్రప్రవాహమును పెంచుటకు, చన్ద్రకాన్తమణి నుండి ఎంత ఉదకమును విడుకును ? అట్లే ప్రియుని విరహముచే దురవిల్లు చక్రవాకి యొక్క కన్నులనుండి ఎంత కన్నీళ్ళను విడుకును ? అని తలంతును. ఇట్లు ప్రియుని గూర్చి యామె పలికినది.

**శ్లో.** **జ్యోత్స్నామయం రాత్రికలిన్దకన్యా**
**పూరానుకారేఽపసృతేఽన్ధకారే ।**
**పరిస్ఫురన్నిర్మలదీప్తి దీపం**
**వ్యక్తాయతే సైకతమన్తరీపమ్ ॥** 60

**ప. వి.** జ్యోత్స్నామయం - రాత్రికలిన్దకన్యాపూరానుకారే-అపసృతే - అన్ధకారే-పరిస్ఫురన్నిర్మలదీప్తిదీపం - వ్యక్తాయతే - సైకతం - అన్తరీపం.

**అర్థము:** హే ప్రియే ! = ఓ ప్రియురాలా ! రాత్రికలిన్దకన్యా పూరానుకారే రాత్రి = రాత్రియనెడి, కలిన్దకన్యా = యమునానదియొక్క, పూర = ఆగన్తుకమగు నతినీలప్రవాహమునకు, అనుకారే = సమానమైన యనగా నావిధముగా నల్లనైన, అన్ధకారే = చీకటి, అపసృతే సతి = తొలగిపోగా, పరిస్ఫురన్నిర్మలదీప్తిదీపం, పరిస్ఫురత్ = ప్రకాశించుచున్న, నిర్మల = నిర్మలమైన, దీప్తి = ప్రకాశముగల చంద్రుడనెడి దీపం = దీపము గలిగిన, జ్యోత్స్నామయం = వెన్నెలరూపము గలిగిన, సైకతం = తెల్లని యిసుకను గలిగిన. రాత్రియనెడి యమునయొక్క జలమధ్యమందున్న, అన్తరీపం = ద్వీపముగా, వ్యక్తాయతే = స్పష్టమగుచున్నది.

ప్రవాహమున్నపుడు కనపడక పోయినను నిపుడు కనపడుచున్నదని, (శఙ్కే = భావింతును.) చంద్రుని వెన్నెలచే సకలము తెలువుగా జేయబడినదని యర్థము.

**సమాసములు :**

జ్యోత్స్నామయం : జ్యోత్స్నాయాః వికారః = జ్యోత్స్నామయః.
రాత్రికలిన్దకన్యాపూరానుకారే : కలిన్దానాం కన్యా = కలిన్దకన్యా, రాత్రిరేవ కలిన్దకన్యా = రాత్రికలిన్దకన్యా, రాత్రికలిన్దకన్యాయాః పూరః = రాత్రికలిన్దకన్యాపూరః, రాత్రికలిన్దకన్యాపూరస్య అనుకారః = రాత్రికలిన్దకన్యాపూరానుకారః, తస్మిన్ = రాత్రికలిన్దకన్యాపూరానుకారే.
పరిస్ఫురన్నిర్మలదీప్తిదీపం : నిర్మలా చ సా దీప్తిశ్చ = నిర్మలదీప్తిః, పరిస్ఫురన్తీ నిర్మలదీప్తిః యస్య సః = పరిస్ఫురన్నిర్మలదీప్తిః, పరిస్ఫురన్నిర్మలదీప్తిరేవ దీపః యస్మిన్ తత్ = పరిస్ఫురన్నిర్మలదీప్తి దీపం.
సైకతం : సికతాః అస్మిన్ సన్తీతి = సైకతం.
వ్యక్తాయతే : వ్యక్తమివ భవతి = వ్యక్తాయతే.

**భావము :**

ఓ ప్రియురాలా! రాత్రియనెడి యమునయొక్క మిక్కిలి నల్లని ప్రవాహముతో సమానమగు నన్ధకారము తొలంగిపోగా నిర్మలకాంతిగల చన్ద్రుడే దీపముగాగల్గిన వెన్నెలయొక్కరూపముగలిగిన యిసుకతో గూడిన ద్వీపము ప్రకట మగుచున్నది. అనగా బయటపడుచున్నది. చీకటి తొలగిపోగనే, యేర్పడిన వెన్నెల నల్లని ప్రవాహము పోగనే బయటపడెడి ద్వీపమువలె గాన వచ్చుచున్నదని యాశయము.

శ్లో. హాసత్విషైవాఖిల కైరవాణాం
విశ్వం విశఙ్కేఽజని దుగ్ధముగ్ధం।
యతో దివా బద్ధముఖేషు తేషు
స్థితేఽపి చన్ద్రే న తథా చకాస్తి ॥

ప. వి. హాసత్విషా - ఏవ - అఖిలకైరవాణాం - విశ్వం - విశఙ్కే - అజని - దుగ్ధముగ్ధం - యతః - దివా - బద్ధముఖేషు - తేషు - స్థితే - అపి - చన్ద్రే - న - తథా - చకాస్తి.

అర్థము: అఖిలకైరవాణాం = సమస్తములగు కలువలయొక్క, హాసత్విషైవ, హాస = వికాసమునకు సంబంధించిన, త్విషైవ = కాన్తిచేతనే, విశ్వం = సమస్తప్రపంచము, దుగ్ధముగ్ధం, దుగ్ధ = పాలవలె, ముగ్ధం = తెల్లగను, చల్లగను, అజని = ఏర్పడినది. కాని చంద్రుని చేతనే తెల్లగను చల్లగను నైనదని నేను, న విశఙ్కే = భావింపను. యతః = ఏలయనగా? దివా = పగటియందు, తేషు = ఆ కలువలు, బద్ధముఖేషు సత్సు = ముడుచుకొనిపోయివికాసములేక యుండగా, చన్ద్రే = చన్ద్రుడు, స్థితేఽపి = ఉన్నను, విశ్వం = సమస్తప్రపఞ్చము. తథా = రాత్రియందు వలె యట్లు, న చకాస్తి = ప్రకాశించుటలేదు. కావున నీప్రపంచము కలువల వికాసకాంతి చేతనే చల్లనై తెల్లనై యున్నది. కాని చంద్రుని కాంతివలన గాదని యర్థము.

సమాసములు :

హాసత్విషా : హాసస్య త్విట్ = హాసత్విట్, తయా = హాసత్విషా.
అఖిలకైరవాణాం : అఖిలాని చ తాని కైరవాణి చ = అఖిలకైరవాణి, తేషాం = అఖిలకైరవాణాం.
దుగ్ధముగ్ధం : దుగ్ధమివ ముగ్ధం = దుగ్ధముగ్ధం.
బద్ధముఖేషు : బద్ధాని ముఖాని యేషాం తాని = బద్ధముఖాని, తేషు = బద్ధముఖేషు.

భావము :

సమస్తములగు కలువపూల వికాసకాంతిచేతనే సకలప్రపఞ్చము పాలవలె తెల్లగను చల్లగనున్నది. కాని చన్ద్రునిచేతనే యావిధముగ నుండదని నేను తలంతును. ఏలయనగా పగటియందు కలువలు ముడుచుకొని వికాసరహితములై యుండగా చంద్రుడున్నను సమస్తప్రపంచము రాత్రియందువలె చల్లగను తెల్లగను నుండుటలేదు. కాన నీప్రపంచము కలువల వికాసకాంతిచేతనే చల్లదనమును

వెల్లదనమును బొందియున్నది. కాని చంద్రునిచేత బొందియుండలేదు. అనగా కలువలవలెను పాలవలెను జల్లనిదిగను వెల్లనిదిగను వెన్నెల యున్నదని భావము.

శ్లో. మృత్యుఞ్జయస్యైష వసఞ్జటాయాం
న క్షీయతే తద్భయదూరమృత్యుః ।
నా వర్ధతే చ స్వసుధాప్తజీవ
స్రగ్వుణ్డరాహూద్భవభీ రతీవ ॥ 82

ప. వి. మృత్యుఞ్జయస్య - ఏష - వసన్ - జటాయాం - న - క్షీయతే - తద్భయదూరమృత్యుః - న - వర్ధతే - చ - స్వసుధాప్తజీవస్రగ్వుణ్డరాహూద్భవభీః - అతి - ఇవ.

అర్థము: మృత్యుఞ్జయస్య = మృత్యువును జయించిన శివునియొక్క జటాయాం = జటయందు, వసన్నేవ = వసించుచునేయున్న, ఏషః = ఈ చంద్రుడు, న క్షీయతే = క్షీణించుటలేదు. అనగా గొలది పరిమాణము గలవాడుగ నగుటలేదు. ఒక్క కలతోడనే యచ్చట నెల్లపుడు వసించుచు నాకలకంటెను దగ్గుటలేదు. మఱియు, న క్షీయతే = మరణించుటలేదు. తత్ = అందువలన వనగా మృత్యుఞ్జయునకు దగ్గరగా నుండుటవలన, భయదూరమృత్యుః, భయ = భయముచే, దూర = దూరమైన, మృత్యుః = మరణాధిదేవత గలవాడుగా నాయెను. (కాని యచ్చట నున్నను) అతీవ = మిక్కిలి, స్వసుధాప్తజీవస్రగ్ముణ్డరాహూద్భవభీః; స్వ = తన యందలి, యనగా జంద్రునందలి, సుధా = అమృతముచే, ఆప్త = పొందబడిన, జీవ = చైతన్యము గల్గిన, స్రగ్ముణ్డ = శివుని శిరము నందున్న కపాలమాల యందలి కపాలములనెడి, రాహు = రాహువు వలన, ఉద్భవ = కలిగిన, భీః = భయముగలవాడై, వర్ధతే చ న = వర్ధిల్లుటయు లేదు. శివుని శిరమందలి సజీవములగు కపాలములను జూచి రాహువులనెడి బుద్ధితో జంద్రుడు భయపడి దిగులు జెంది వర్ధిల్లుటలేదని యర్థము.

**సమాసములు :**

మృత్యుఞ్జయస్య : మృత్యుం జయతీతి = మృత్యుఞ్జయః, తస్య = మృత్యుఞ్జయస్య.

తద్భయదూరమృత్యుః : తస్మాత్ భయం = తద్భయం, తద్భయేన దూరః మృత్యుః యస్య సః = తద్భయదూరమృత్యుః.

స్వసుధాప్తజీవస్రగుమ్భణరాహూద్భవభీః : స్వస్మిన్ సుధా = స్వసుధా, స్వసుధయా ఆప్తః, జీవః యేషాం తాని = స్వసుధాప్తజీవాని. స్రజి ముణ్డాని = స్రగ్ముణ్డాని, స్వసుధాప్తజీవాని చ తాని స్రగ్ముణ్డాని చ = స్వసుధాప్తజీవస్రగ్ముణ్డాని, స్వసుధాప్తజీవస్రగ్ముణ్డాన్యేవ రాహవః = స్వసుధాప్తజీవస్రగ్ముణ్డరాహవః, స్వసుధాప్తజీవస్రగ్ముణ్డరాహుభ్యః ఉద్భవా భీః యస్య సః = స్వసుధాప్తజీవస్రగ్ముణ్డరాహూద్భవభీః.

**భావము :**

మృత్యువును జయించిన శివుని జటయందు వసించుచున్న చంద్రుడు పదునాఱవ కలగనే యుండి క్షీణించుటలేదు. అనగా నాశివుని జటయందు నిరంతరము నొక్కకలగనే యాచంద్రుదుండియు దానికంటె క్షీణింపలేదు, (మఱియు నతడు మరణించుటలేదు) ఏలయనగా నామృత్యుఞ్జయుని సమీపస్థితివలన భయముచే మృత్యుదేవత దూరమగుటవలన నది యా చంద్రుని తాకుటకును సమర్థముగాదు. కాన నాచంద్రుడు మరణించుటలేదు. కాని యతడు వర్ధిల్లుట గూడలేదు. ఏలయనగా నాచంద్రునియందలి యమృతముచే, జైతన్యము బొందిన శివుని తలయందలి కపాలమాలలోని కపాలములను గాంచి యివియన్నియు రాహువులనెడి భయముచే దిగులొందినవాడై పెరుగక ఏకకలామాత్రుడై యున్నాడు. భయము జెందినవాడు సౌఖ్యము లేనందువలన మిక్కిలి కృశించియుండును గదా!

శ్లో. త్రివిషం చకోరాయ సుధాం సురాయ
కలామపి స్వావయవం హరాయ ।
దదజ్జయత్యేవ సమస్తమస్య
కల్పద్రుమభ్రాతురకాల్ప మేతత్ ॥

ప. వి. త్విషం - చకోరాయ - సుధాం - సురాయ - కలాం - అపి - స్వావయవం - హరాయ - దదత్ - జయతి - ఏవ - సమస్తమ్ - అస్య - కల్పద్రుమభ్రాతుః - అథ - అల్పమ్ - ఏతత్.

అర్థము: చకోరాయ = చకోరపక్షులకై; స్వావయవం = తనయంశమగు, త్విషం = కాన్తిని, అనగా వెన్నెలను, సురాయ = దేవతలకై, స్వావయవం = తన యంశమగు, సుధాం = అమృతమును, హరాయ = శివునికై, స్వావయవం = తనయంశమైన. కలామపి = పదునాఱువకలను, దదత్ = ఇచ్చుచు, ఏషః = ఈచంద్రుడు, జయతి = జయించుచున్నాడు. అథాఽపి = అయినను, కల్పద్రుమభ్రాతుః, కల్పద్రుమ = కల్పవృక్షమునకు, భ్రాతుః = (దానితో నొక్కసముద్రమునందే పుట్టుటవలన,) సోదరుడగు, అస్య = ఈచంద్రునియొక్క, ఏతత్ సమస్తం = పైనచెప్పిన పరోపకారత్వమంతయు, అల్పం = స్వల్పమే. కల్పవృక్షము వస్తువులను కల్పించి యందరికి నొసఁగును. కాని యితని కాశక్తి లేనందువలన నితడు స్వల్పముగనే యిచ్చును. కాని యిట్టి పరోపకారి మరియొకడు లేడని యర్థము.

సమాసములు :

స్వావయవం : స్వస్య అవయవః = స్వావయవః, తం = స్వావయవం.
కల్పద్రుమభ్రాతుః : కల్పద్రుమస్య భ్రాతా = కల్పద్రుమభ్రాతా, తస్య = కల్పద్రుమభ్రాతుః.

భావము :

ఈచంద్రుడు తన యంశమగు వెన్నెలను చకోరపక్షులకును, తనయంశమగు నమృతమును దేవతలకును, నట్లే తనయంశమగు పదునాఱవకలను శివునకు నొసంగి యందరిని మించి వెలుగుచున్నాడు. కాని యిది యంత యధికముగాదు. ఏలయనగా నొక్క సముద్రమున పుట్టుటచే కల్పవృక్షమునకు సోదరుడైన యీ చంద్రుని కిది స్వల్పమే. కల్పవృక్షము అన్నివస్తువులను గల్పించి యందరికి నొసంగగలదు. చంద్రున కట్టిసామర్థ్యము లేనందువలన నిత డీయగలిగినది. స్వల్పమే యగుచున్నది. అయినను నితనివంటి పరోపకారి మఱియొకడు లేడు.

శ్లో. అజైక్రణనాభే ర్విషకృష్ణకణ్ఠః
సుధాప్తశుద్ధేః కటభస్మపాణ్డుః ।
అర్హన్నపీన్దో ర్నిజమౌలిధానా
న్మృడఃకలా మర్హతి షోడశీం న ॥ 64

ప. వి. అజైక్రణనాభేః - విషకృష్ణకణ్ఠః - సుధాప్తశుద్ధేః - కటభస్మపాణ్డుః - అర్హన్ - అపి - ఇన్దోః - నిజమౌలిధానాత్ - మృడః - కలాం - అర్హతి - షోడశీం - న.

**అర్థము:** అజైక్రణనాభేః, అజ్క = కల్కజమైన, ఏణ = జింకను, నాభేః = మధ్యభాగమునందు వహించిన, మఱియు, అజ్క = కలఙ్కరూపమైన, ఏణనాభిః = కస్తూరిగలిగిన, సుధాప్తశుద్ధేః, సుధా = అమృతముచే, ఆప్త పొందబడిన, శుద్ధేః = శుద్ధి లేదా తెలుపును గలిగిన, ఇన్దోః = చన్ద్రుని, విషకృష్ణకణ్ఠః, విష = విషముచే, కృష్ణ = నల్లని, కణ్ఠః = కణ్ఠముగల్గిన వాడును, కటభస్మపాణ్డుః, కటభస్మ = చితాభస్మముతో, పాణ్డుః = తెల్లనైన, మృడః = శివుడు, నిజమౌలిధానాత్, నిజ = తనదైన, మౌలి = శిరమునందు, ధానాత్ = ధరించుటవలనను, (పూజించుట వలనను) షోడశీం, కలాం = ఆచంద్రుని పదునాఱవకలను సైతము, నార్హతి = పొందనర్హుడు కాడు. (పూజింపదు) తనశిరమునందు ధరించుట వలననే, యతనికి ప్రాప్తియు, పూజయు సంభవింవగినవే. ఎవ్వడు అధికముగా బూజింపబడునో అతడు శిరమున ధరింపబడును. కాన నీచంద్రుని పదునాఱవకలను శివుడు పొందుచు దానిని పూజించుచు, దానిని యనగా నాపదునాఱవకలను పొందుచున్నాడని యర్థము. కాన దానిని పొందక పోవుటకాని, పూజింపకపోవుటగాని లేదని విరోధపరిహారము.

పైన జెప్పిన విధముగా విషకంఠత్వము, కటభస్మత్వమున శివుడు అజైక్రణనాభిత్వ సుధాత్వశుద్ధిగల చంద్రునియొక్క పదునాఱవకలను సయితము అనగా జంద్రునితోడి స్వల్పసామ్యమును సయితము పొందనర్హుడుకాడు. ఒకవేళ శివుడు చంద్రునికంటె నధికుడైనచో నవుడు అతని కలను తన శిరమున ధరింపడు, కాని దానిని ధరించెను. కాన చంద్రుడే శివునికంటె నధికుడు. శుభమునకు నశుభమునకు భేదము గొప్పదికదా. శివునికి అపకర్షకు కారణము విషము, చితా

భసముచందునకి ఉత్కర్షకు కారణము కస్తూరియు, నమృతము, కాన నిట శివునికంటె చంద్రుడే యధికుడని యేర్పడినది.

**సమాసములు :**

అఙ్కైణనాభేః : అఙ్కః ఏణః నాభౌయస్య సః - అఙ్కైణనాభిః. పక్షాంతరమున అఙ్కః ఏణనాభిః యస్య సః - అఙ్కైణనాభిః.

విషకృష్ణకంఠః : విషేణ కృష్ణః కంఠః యస్యసః = విషకృష్ణకంఠః.

సుధాప్తశుద్ధేః : సుధయా ఆప్తా శుద్ధిః యేన సః = సుధాప్తశుద్ధిః. తస్మాత్ = సుధాప్తశుద్ధేః.

కటుభస్మపాండుః : కటస్యభస్మ = కటభస్మ, కటభస్మనా పాండుః = కటభస్మపాండుః.

నిజమౌలిధానాత్ , నిజా చ సా మౌలిశ్చ = నిజమౌలిః. నిజమౌలౌ ధానం = నిజమౌళిధానం. తస్మాత్ = నిజమౌళిధానాత్.

**భావము :**

విషపానముచే నల్లకంఠము కలవాడును, చితాభస్మముతో తెల్లనివన్నె కల వాడును నగు శివుడు, తన శిరమునందు చంద్రుని ధరించుటవలన కలంకమైన హరిణమును మధ్య ధరించినవాడును, కళంకమైన కస్తూరిని ధరించినవాడును, నట్లే యమృతముచే నిర్మలత్వమును (తెల్లదనమును) పొందినవాడును నగు చంద్రునియొక్క పదునాఱవకళకును నర్హుడుకాడు. చంద్రుడు కస్తూరిని శరీర మధ్యమున ధరించియుండగా శివుడు హాలాహలవిషముతో నల్లని కంఠము ధరించి యున్నాడు. అట్లే చంద్రుడమృతముతో శుద్ధుడైయుండగా, శివుడు చితాభస్మముచే శుద్ధుడై యనగా తెల్లనై యున్నాడు. కావుననే చంద్రునియొక్క పదునాఱవకళను తలపై ధరించి (తన యున్నతమగు స్థానమునం దుంచుకొని, పూజచేయుచుండుట వలన చంద్రుని షోడశకలకుకూడ యోగ్యుడుకాడు. ఏలయనగా. తొలుత చెప్పిన హేతువులవలన. చంద్రుడు శుభుడై యుండగా, శివుడు అశుభుడై యున్నాడు. ఎప్పు డతడు చంద్రుని పదునాఱవ భాగమునకు నర్హుడుకాడో అప్పుడతడు పూర్ణచంద్రు నికి సమానముగా నుండుట కర్హు డెట్లగునని యాశయము.

శ్లో. పుష్పాయుధ స్యాస్థిభి రర్ధదగ్ధైః
సితాసిత శ్రీ రఘటి ద్విజేన్ద్రైః ।
స్మరారిణా మూర్ధని యద్ధృతోఽపి
తనోతి తత్తౌష్టిక పౌష్టికాని. ॥ 65

ప. వి. పుష్పాయుధస్య - అస్థిభిః - అర్ధదగ్ధైః - సితాసితశ్రీః - అఘటి-ద్విజేన్ద్రైః - స్మరారిణా - మూర్ధని - యత్ - ధృతః - అపి - తనోతి - తత్తౌష్టికపౌష్టికాని.

అర్థము: ద్విజేన్ద్రైః = చంద్రుడు, బ్రహ్మణా = బ్రహ్మచే, పుష్పాయుధస్య = పూవిల్తునియొక్క, అర్ధదగ్ధైః = సగముకాలిన. అస్థిభిః = ఎముకలచే, సితాసితశ్రీః = కాలనందువలన తెలుపువన్నెయు, కాలినందువలన నలుపువన్నెయు గల్గినవాడుగా, అఘటి = నిర్మింపబడెను. యత్ = ఏలయనగా, స్మరారిణా = శివునిచే, మూర్ధని = తలపై, ధృతోఽపి = ధరింపబడినను, (సమ్మానము చేయబడినను) తత్తౌష్టికపౌష్టికాని, తత్ = ఆ మన్మథునికే, తౌష్టిక = సంతోషమును కల్గించుననియును, పౌష్టికాని = అభివృద్ధిని కల్గించుననియును వానిని, తనోతి = చేయుచున్నాడా.

సమాసములు :

అర్ధదగ్ధైః : అర్ధందగ్ధాని = అర్ధదగ్ధాని, తైః = అర్ధదగ్ధైః.

సితాసితైః : సితాని చ తాని అసితానిచ = సితాసితాని, తైః = సితాసితైః,

ద్విజేన్ద్రైః : ద్విజానా మింద్రః = ద్విజేన్ద్రైః.

స్మరారిణా : స్మరస్య అరిః = స్మరారిః, తేన = స్మరారిణా.

తత్తౌష్టికపౌష్టికాని : తుష్టిః ప్రయోజనం యేషాం తాని = తౌష్టికాని, పుష్టిః ప్రయోజనం యేషాం తాని = తౌష్టికాని, పౌష్టికాని చ పౌష్టికాని చ = తౌష్టికపౌష్టికాని, తస్య తౌష్టికపౌష్టికాని = తత్తౌష్టికపౌష్టికాని తాని తత్తౌష్టికపౌష్టికాని.

**భావము :**

బ్రహ్మ, మన్మథునియొక్క సగముకాలిన ఎముకలచే, సగము కాలని ఎముకలచే చంద్రుని నిర్మించెను. కావుననే, యతడు సగముకాలిన ఎముకలవలన నలుపువన్నెను, సగముకాలని ఎముకలవలన తెలుపువన్నెను కలిగియున్నాడు. ఏలయనగా శివుడా చంద్రుని తలపై ధరించినను, సమ్మానము గావించినను, అతనికి మన్మథునికివలె హర్షమును గూర్చునవియును, నభివృద్ధిని గూర్చునవి యును కార్యములను చేయుచున్నాడు. కామారియగు శివుడు వైవిధముగా మన్మథునికే హితమును గావించుటవలన నతని యస్థులచేత నీ చంద్రుడు నిర్మింప బడెనని యర్థము. చంద్రునివలె కామోద్దీపకము మఱియొకటి లేదని యర్థము. చంద్రుడు శివునాశ్రయించియున్నను నాశివునికి శత్రువైన మన్మథునకు హితము జేయుటవలన నాచంద్రుడా మన్మథుని యెముకలచే నిర్మింపబడుట యుక్తము.

శ్లో. మృగస్య లోభాత్ఖలు సింహికాయా
స్సూను ర్మృగాఙ్కం కబలీకరోతి।
స్వస్యాఽపి దానా దము మఙ్కసుప్తం
నోజ్ఝన్ముదా తేన చ ముచ్యతేఽయమ్ ॥ 86

ప. వి. మృగస్య - లోభాత్ - ఖలు - సింహికాయాః - సూనుః - మృగాఙ్కం - కబలీకరోతి - స్వస్య - అపి - దానాత్ - అముమ్ - అఙ్కసుప్తం - న - ఉజ్ఝన్ - ముదా - తేన - చ - ముచ్యతే - అయమ్.

అర్థము: సింహికాయాః = సింహికయొక్క. సూనుః = కుమారుడగురాహువు, మృగాఙ్కం = చంద్రుని, యత్ = ఎందువలన, కబలీకరోతి = మ్రింగుచున్నాడో, తత్ = అది, అఙ్కమృగస్య = అఙ్కమృగముయొక్క లోభాత్ఖలు = తినగోరికచేతనో యనునట్లున్నదికాని, అయం = ఈ చంద్రుడు, అఙ్కసుప్తం, అఙ్క = ఒడియందు, సుప్తం = నిదురించిన మృగమును, నోజ్ఝన్ = విడువక, స్వస్యాపి = తన్నుగూడ, దానాత్ = రాహువునకిచ్చుటవలన, ముదా = ఇట్టి పుణ్యమువలని సంతోషముచే, వనగా, తనయందలి మృగమునే తినుటకు రాహువురాగా, చంద్రుడు తనయొడియం దుండుటచే తన్ను శరణము నొందినట్లున్న

మృగమును రక్షించుటకై తన్నుగూడ రాహువున కొసంగుట వలన నా రాహు వాచంద్రుని త్యాగమునకు సంతసించి, యాసంతోషముచే, తేన = ఆరాహువుచే, ముచ్యతే = ఆమృగముతోడనే విడువబడుచున్నాడు. నౌజ్ఝత్ అనుపాఠమున, తన యొడియందున్న మృగము నితడెందువలన నౌజ్ఝత్ = విడువలేదో అందువలన, అయం = ఈచంద్రుడు, ముచ్యతే = (రాహువుచే) విడువబడుచున్నాడని యర్థము.

**సమాసములు :**

మృగాఙ్కం : మృగః అఙ్కేయస్య సః = మృగాఙ్కః, తం = మృగాఙ్కం.

అఙ్కసుప్తం : అఙ్కేసుప్తః =అఙ్కసుప్తః, తం=అఙ్కసుప్తం.

**భావము :**

సింహికయొక్క కుమారుడగు రాహువు మృగాంకుడగు చంద్రుని కబళించుట, చంద్రునియందలి మృగమును తినుటకేగాని చంద్రుని తినుటకుగాదు. రాహువు సింహికాసుతుడై నందువలన సింహమగుచున్నాడు. సింహము మృగములను భక్షింపగోరును. కాన నామృగములున్న స్థలమును స్వాధీనము గావించుకొనును. ఇచట నామృగమున్న స్థలము చంద్రుడు గాన నాచంద్రునిగూడ స్వాధీనము గావించుకొని మ్రింగుచున్నది. కాని యావిధముగా చంద్రుని మ్రింగిన పిదప మరల నాతనినేల విడుచుచున్నాడనగా తనయొడియందు విశ్వసించి నిద్రించుచున్న మృగమును రక్షించుటకై తన్నుగూడ దానము గావించి యొసంగి (దాప్ లవనే యను ధాతువు ననుసరించి)దంతములచే ఖండనము చేసినను నామృగమును విడువక త్యాగము చూపిన చంద్రునిపైని సంతోషముతో నాతడు మృగముతోడ రాహువుచే విడువబడెను. శరణాగతమగు మృగమును జంపగోరిన సింహాదిక్రూరమృగములకు మృగరక్షణకై తమ శరీరము లర్పించువారి నభినందించి యాత్యాగమువలని పుణ్యముచే సింహాదు లామృగములను జంపక వదలిపెట్టుట గలదుగదా.

శ్లో. సుధాభుజో యత్పరిపీయ తుచ్ఛ
మేతం వితన్వన్తి తదర్హ మేవ।
పురా నిపీయా౽స్య పితా౽పి సిన్ధు
రకారి తుచ్ఛః కలశోద్భవేన॥ 67

ప. వి. సుధాభుజః - యత్ - పరిపీయ - తుచ్ఛమ్ - ఏతం - వితన్వన్తి - తదర్హమ్ - ఏవ - పురా - నిపీయ - అస్య - పితా - అపి-సింధుః - అకారి - తుచ్ఛః - కలశోద్భవేన.

అర్థము: సుధాభుజః = అమృతమును భుజించెడి దేవతలు, ఏనం = చంద్రుని, పరిపీయ = పూర్తిగా పానముగావించి, తుచ్ఛం = పిప్పిగా, వితన్వన్తి = చేయుచున్నారు. తత్ = అది, అర్హమేవ = తగినదే, యతః = ఏలయనగా, అస్య = ఈచంద్రునికి, పితా = తండ్రియైన, సింధురపి = సముద్రుడును, కలశోద్భవేన = కలశమునందు జన్మించిన యగస్త్యమహర్షిచే, పురా = పూర్వము, నిపీయ = పానముచేయబడి, తుచ్ఛః = పిప్పిగా, అకారి = చేయబడెను, కాన నీతని తుచ్ఛత్వము కులక్రమముగా వచ్చినదే. కలశమునుండి పుట్టినవాడు, అంతటిగొప్ప సముద్రమును దాటుట యాశ్చర్యకరము.

**సమాసములు :**

సుధాభుజః : సుధాం భుఞ్జత ఇతి = సుధాభుజః.
కలశోద్భవేన : కలశా దుద్భవః యస్య సః = కలశోద్భవః, తేన = కలశోద్భవేన.

**భావము :**

అమృతము నాస్వాదించునట్టి దేవత లీ చంద్రుని పూర్తిగా బానము గావించి పిప్పిగా జేయుట యుక్తమే.ఏల యనగా? నితని తండ్రియగు సముద్రమును పూర్వము కలశమందు బుట్టిన యగస్త్యుడు పానముగావించి పిప్పి గావించెను. కాన నీవిధముగా జేయబడుట కులక్రమాగతము. ఇట్లు ఇతనిపూర్వులు నైతము పరోపకారపరాయణులు కాన నితడు నట్టివాడుగనే యున్నాడు.

పూర్వము దేవాసురులకు యుద్ధ మేర్పడగా నాయుద్ధమందు రాక్షసులు దేవతల నోడించి సముద్రమున దాగిరి. సముద్రజలములలోనికి దేవతలు ప్రవేశింపలేకపోయిరి. ఈవిధముగా పెక్కుమాఱులు జరిగినది. దేవతలు రాక్షసుల దుష్కృత్యములకు బాధపడి యగస్త్యమహర్షికి విజ్ఞప్తిచేయగా నామహర్షి సముద్రజల మంతటిని పుక్కిటిలో నింపుకొనగా నందు దాగిన రాక్షసులు బయటపడిరి. అప్పుడు వారిని దేవతలు యుద్ధమున జంపగల్గిరి. తర్వాత నగస్త్యమహర్షి తన పుక్కిటినున్న జలముతో సముద్రమును నింపి సముద్రమును యథాప్రకారము గావించె ననెడి పురాణగాథ యిట ననుసంధేయము.

శ్లో. చతుర్దిగన్తాం పరిపూరయన్తీ
జ్యోత్స్నైవ కృత్స్నా సురసింధుబన్ధుః ।
క్షీరోదపూరోదరవాసహీన
వైరస్య మేతస్య నిరస్యతీయమ్. ॥ 68

ప. వి. చతుర్దిగన్తాం - పరిపూరయన్తీ - జ్యోత్స్నా - ఏవ - కృత్స్నా - సురసింధుబన్ధుః - క్షీరోదపూరోదరవాసహీనవైరస్యమ్ - ఏతస్య - నిరస్యతి - ఇయం.

అర్థము: చతుర్దిగన్తాం = నాలుగుదిక్కుల చెరగులను, పరిపూరయన్తీ = సాకల్యముగా వ్యాపించుచున్న, తథా = అట్లే. (తెల్లదనమువలన) సురసింధుబన్ధుః. సురసింధు = గంగానదికి, బన్ధుః = సమానమైన, కృత్స్నా = పూర్ణమైన, ఇయం = ఈ, జ్యోత్స్నైవ = వెన్నెల యొక్కటియే, క్షీరోదపూరోదరవాసహీనవైరస్యం, క్షీరోద = పాలకడలియొక్క, పూర = ప్రవాహముయొక్క, ఉదర = మధ్యభాగమునందలి, వాస = నివాసమును, హీన = విడుచుటచే నేర్పడిన, (ఏతస్య = ఈచంద్రునియొక్క,) వైరస్యం = దుఃఖమును, నిరస్యతి = పోగొట్టుచున్నది. ఈచంద్రుడు వెన్నెలయందే పాలకడలి యను బుద్ధిని వహించి తండ్రియగు సముద్రముతోటి యెడబాటువలని దుఃఖమును విడుచుచున్నాడని యర్థము. అన్నిదిశల చెరగులకు వ్యాపించిన తెల్లని వెన్నెలమధ్యనున్న చంద్రుడు పాలకడలి నడుమనున్న వానివలె శోభించుచున్నాడని యర్థము.

సమాసములు :

చతుర్దిగన్తీం : దిశా మన్తాః = దిగన్తాః, చతుర్ణాం దిగన్తానాం సమాహారః చతుర్దిగన్తీ, తాం = చతుర్దిగన్తీం.

సురసిన్ధుబన్ధుః : సురాణాం సిన్ధుః = సురసిన్ధుః, సురసింధోః బన్ధుః = సురసిన్ధుబన్ధుః.

క్షీరోదపూరోదరవాసహానవైరస్యమ్ : క్షీరోదస్య పూరః = క్షీరోద పూరః, క్షీరోదపూరస్య ఉదరం = క్షీరోదపూరోదరః, క్షీరోదపూరో దరే వాసః = క్షీరోదపూరోదరవాసః, క్షీరోదపూరోదరవాసస్య హానం = క్షీరోదపూరోదరేవాసహానం, క్షీరోదపూరోదరవాసహానస్య వైరస్యం = క్షీరోదపూరోదరవాసహానవైరస్యం, తత్ = క్షీరోదపూరోదరవాసహాన వైరస్యం.

భావము :

నాలుగుదిక్కుల యంచులను నిండుగా వ్యాపించినదియును, తెల్లదనము నందు పాలకడలిచుట్టమునగు నీవెన్నెల యొక్కటియే, చంద్రుని పాలకడలి నడుమ నివాసము దొలగినందుల కేర్పడిన దుఃఖమును తొలగింపగలదు. ఈ వెన్నెలయందే యతడు పాలకడలి యను బుద్ధిని వహించి యాపాలకడలి నడుమ నున్నవానివలె శోభించుచున్నాడని యాశయము.

శ్లో. పుత్రీ విధో స్తాణ్డవికాస్తు సిన్ధో
రశ్యా చకోరస్య దృశో ర్వయస్యా ।
తయాఽపి సేయం కుముదస్య కాపి
బ్రవీతి నామైవ హి కౌముదీతి. ॥ 69

ప. వి. పుత్రీ - విధోః - తాణ్డవికా - అస్తు - సిన్ధోః - ఆశ్యా - చకోరస్య - దృశోః - వయస్యా - తయా - అపి - సా - ఇయం - కుముదస్య - కా - అపి - బ్రవీతి - నామ - ఏవ - వా - కౌముదీ - ఇతి.

అర్థము: ఇయం = ఈవెన్నెల, విధోః = చంద్రునికి, పుత్రీ = పుత్రిక, అస్తు = అగుమగాత. ఏలయనగా వెన్నెల చంద్రునికి బుట్టినదిగదా! మఱియు నీ వెన్నెల, సింధోః = సముద్రమునకు, తాణ్డవికా = నాట్యకత్తె, లేదా

నాట్యము నుపదేశించునదిగా లేదా నటింపజేయునదిగా, అస్తు = అగును గాత. వెన్నెలచే సముద్రు దుల్లాసము జెంది యలలతో పొంగుచుండును గదా. కాన సముద్రునకే వెన్నెల మనుమరాలు అగునుగాత. లేదా, ఇయం = ఈ చంద్రునిపుత్రిక, సింధోః = సముద్రునకు, తాణ్డవికా = నర్తకిగా, అస్తు = అగునుగాత. తథా = అట్లే, చకోరస్య = చక్రవాకమునకు, అశ్యా = పానీయము, భవతు = అవునుగాత. తథా = అట్లే, దృశోః = సకలజనులకన్నులకు ప్రేమపాత్రముగా నుండుటచే, వయస్యా = చెలికత్తెగా, భవతు = అగునుగాత. తథాఽపి = అయినను, సా = ఆ, ఇయం = ఈవెన్నెల, కుముదస్య = కలువకు, కాఽపి = చెప్పసాధ్యముకాని సంబంధినిగా, భవతు = అగునుగాత, తొలుత చెప్పిన వానికన్నిటికంటెను కలువకే గొప్ప యానందమును జేకూర్చుటవలనను చెప్పసాధ్యముగాని సంబంధియగును గాత యని యర్థము. హి = ఏలయనగా? కౌముదీతి = కౌముది యనెడి, నామైవ = పేరే, "కుముదానామియం" కౌముదీ యని కలువల సంబంధమును, బ్రవీతి = చెప్పుచున్నది. ఇతరములైన వానికంటె కౌముదికి కుముదములతో విశేషసంబంధము గలదని యర్థము. ఏలయనగా కౌముదియందు కుముదములకే ప్రీతివిశేషము గూడ గలదనియు నర్థము.

**సమాసములు :**

తాణ్డవికా : తాణ్డవం కరోతి ఇతి = తాణ్డవికా.

**భావము :**

ఈవెన్నెల చంద్రునివలన బుట్టినందున నాచంద్రునికి కూతురు. సముద్రమునకు నర్తకి. నాట్యోపదేశిక. ఏలయనగా చంద్రికను జూచియె సముద్రుదుల్లాసము జెంది పొంగి నాట్యము చేయుచుండును. మఱియు నీవెన్నెల సముద్రునకు మనుమరాలు. చకోరములకు నీవెన్నెల పానీయము. సకలజనుల నేత్రములకీ వెన్నెల చెలికత్తె. అయినను నీవెన్నెలకు పూర్వము జెప్పబడినవాని కన్నిటికంటెను కలువతో ననిర్వచనీయమగు సంబన్ధము గలదు. ఏలయనగా కౌముదీ (కుముదానామియం) యను నిర్వచనమే యీవెన్నెలకు కలువలతోటి విశేషసంబంధమును జెప్పుచున్నది.

శ్లో. జ్యోత్స్నా పయః క్ష్మాతటవాస్తువస్తు
ఛ్ఛాయా చ్ఛల చ్ఛిద్రధరా ధరాయామ్ ।
అభ్రాంశు శుభ్రాంశకరాః కలఙ్క
నీల ప్రభామిశ్రవిభా విభాన్తి. ॥ 70

ప. వి. జ్యోత్స్నాపయః క్ష్మాతట వాస్తువస్తుచ్ఛాయాచ్ఛలచ్ఛిద్రధరాః - ధరాయాం - అభ్రాంశు శుభ్రాంశకరాః - కలఙ్క నీలప్రభా మిశ్రవిభాః - విభాన్తి,

అర్థము; జ్యోత్స్నాపయఃక్ష్మాతట వాస్తువస్తుచ్ఛాయాచ్ఛల చ్ఛిద్రధరాః. జ్యోత్స్నా = వెన్నెలయనెడి, పయః = ఉదకము లేదా పాలు గల్గిన, క్ష్మాతట = భూతల మనెడి, వాస్తు = వసతిగృహము గలిగిన, వస్తు = వృక్షాది పదార్థములయొక్క, ఛాయా = నీడ యనెడి, ఛల = వ్యాజము గలిగిన, ఛిద్ర = ప్రకాశములేని పదార్థముల ప్రతిచ్ఛాయల రూపములను, ధరాః = ధరించుచున్న, అభ్రాంశు శుభ్రాంశకరాః, అభ్రాంశు = చంద్రుని యొక్క, శుభ్రాంశ = తెల్లని భాగములనెడి, కరాః = కిరణములు, ధరాయాం = భూమియందు, కలఙ్కనీలప్రభామిశ్రవిభాః, కలఙ్క = చన్ద్రకలంకముయొక్క, నీలప్రభా = నల్లనికాంతులతో, మిశ్ర = కలసిన. విభాః = వెలుగుగలవై, ధరాయాం = భూమియందు, విభాన్తి = ప్రకాశించుచున్నవి. వెన్నెలచే తెల్లబడిన వస్తువులు చన్ద్రకిరణములతోనే తెల్లబడినవి. చెట్లు మున్నగువాని నీడలు చన్ద్రకలఙ్కములోని నీలకిరణములతో నల్లబడినవి. కాని యవి చెట్లు మున్నగువానివలన నేర్పడిన నీడలు కావు. కావున భూమిపై పడిన చన్ద్రకిరణములు నీలధవలములుగా శోభించుచున్నవని యర్థము.

సమాసములు :

జ్యోత్స్నాపయఃక్ష్మాతటవాస్తువస్తుచ్ఛాయాచ్ఛలచ్ఛిద్రధరాః : జ్యోత్స్నైవ పయః యస్మిన్ తత్ = జ్యోత్స్నాపయః, క్ష్మాయాః తటం = క్ష్మాతటం, జ్యోత్స్నాపయశ్చ తత్ క్ష్మాతటం = జ్యోత్స్నాపయఃక్ష్మాతటం, జ్యోత్స్నాపయఃక్ష్మాతటమేవ వాస్తు యేషాం తాని = జ్యోత్స్నాపయఃక్ష్మా

తటవాస్తూని, జ్యోత్స్నాపయఃక్ష్మాతటవాస్తూని చ తాని వస్తూని చ = జ్యోత్స్నాపయఃక్ష్మాతటవాస్తువస్తూని, జ్యోత్స్నాపయఃక్ష్మాతటవాస్తువస్తూనాం ఛాయా = జ్యోత్స్నాపయఃక్ష్మాతటవాస్తువస్తుచ్ఛాయా. జ్యోత్స్నాపయఃక్ష్మాతటవాస్తువస్తుచ్ఛాయైవ ఛలం యేషాం తాని = జ్యోత్స్నాపయఃక్ష్మాతటవాస్తువస్తుచ్ఛాయాచ్ఛలాని, జ్యోత్స్నాపయఃక్ష్మాతటవాస్తువస్తుచ్ఛాయాచ్ఛలాని చ తాని ఛిద్రాణి చ = జ్యోత్స్నాపయఃక్ష్మాతటవాస్తువస్తుచ్ఛాయాచ్ఛలచ్ఛిద్రాణి, జ్యోత్స్నాపయఃక్ష్మాతటవాస్తు వస్తుచ్ఛాయాచ్ఛలచ్ఛిద్రాణి ధర న్తీతి = జ్యోత్స్నాపయఃక్ష్మాతటవాస్తువస్తుచ్ఛాయాచ్ఛలచ్ఛిద్రధరాః,

శుభ్రాంశు శుభ్రాంశకరాః : శుభ్రాః అంశవః యస్య సః = శుభ్రాంశుః, శుభ్రాశ్చ తే అంశాశ్చ = శుభ్రాంశాః, శుభ్రాంశాశ్చ తే కరాశ్చ = శుభ్రాంశకరాః, శుభ్రాంశోః శుభ్రాంశకరాః = శుభ్రాంశు శుభ్రాంశకరాః. కలఙ్కనీలప్రభామిశ్రవిభాః : నీలాశ్చ తాః ప్రభాశ్చ = నీలప్రభాః, కలఙ్కస్యనీలప్రభాః కలఙ్కనీలప్రభాః, కలఙ్కనీల ప్రభాభిః మిశ్రాః కలఙ్కనీలప్రభామిశ్రాః, కలఙ్కనీలప్రభామిశ్రాః విభాః యేషాం తే = కలఙ్కనీలప్రభామిశ్రవిభాః.

భావము :

తెల్లని కాంతిగల చంద్రునియొక్క తెల్లనిభాగపు కిరణములు, కలఙ్కము నుండి ప్రసరించు, నీలకాంతులతో మిశ్రములైన కాంతులుగలవై, వెన్నెలయనెడి యుదకముతోనో లేదా పాలతోడనో గూడి తెల్లబడిన భూతలము నందలి చెట్లు మున్నగువాని నీడలనే నెపముగా గలిగిన ప్రకాశరహితములగు రంధ్రములను ననగా నాచెట్లు మున్నగు వాని నీడలను ధరించుచున్నవై తెల్లగను నల్లగను ప్రకాశించుచున్నవి. వెన్నెల కాయునపుడు చెట్ల క్రిందలి నీడలు నల్లగా నుండును. చెట్లు మున్నగునవి లేని భూతలము నందు అట్టినీడలు లేనందువలన దానిపై వెన్నెల పడుటవలన నట్టి స్థలములు తెల్లనివై ప్రకాశించును. ఇచ్చట కవి, నల్లగా నున్న చెట్లనీడలను చెట్లనీడలుగా జెప్పక, మఱియొక విధముగా జెప్పుచున్నాడు. చన్ద్రుని నుండి రెండువిధములైన కాంతులు భూతలముపై బడుచున్నవి. అందు గొన్ని తెల్లనివి. మఱికొన్ని నల్లనివి. తెల్లనికిరణములు కేవలము చంద్రుని నుండియే వచ్చుచున్నవి. కాని నల్లని కిరణములు ఆ చంద్రుని కలఙ్కము

నుండి వచ్చుచున్నవి. పాలవలె వెన్నెలయందు తెల్లగా గనబడు భూతల మా చంద్రుని కాంతివలన నట్లు కనబడును. ఇక చెట్ల నీడలు మున్నగువానిచే నల్లగా గనబడు భూతలము చంద్రుని కలంకమునుండి వచ్చు నల్లని కాంతులవలన నట్లు కనబడును. ఆ చెట్లనీడలనునవి ప్రకాశములేని రంధ్రములు; నీడలనునది నెపమేకాని వాస్తవము గాదు. ఆ నీడలు వెలుగుపడని రంధ్రములు. అవి చంద్రుని కలంకపు నీలకాంతులను వహించుచున్నవని యాశయము. అనగా చెట్ల నీడలని మనము చెప్పునట్టి యానలుపు గుర్తులు చన్ద్రికళంకపు నీలకాంతులని సారాంశము.

శ్లో. కియాన్ యథాఽనేన వియద్విభాగ
స్తమోనిరాసా ద్విశదీకృతోఽయమ్ ।
అద్భి స్తథా లావణసైన్ధవీభి రుల్లా
సితాభి శ్శితిరప్యకారి ॥ 71

ప. వి. కియాన్ - యథా - అనేన - వియద్విభాగః - తమోనిరాసాత్ - విశదీకృతః - అయం - అద్భిః - తథా - లావణసైన్ధవీభిః - ఉల్లాసితాభిః - శితిః - అపి - అకారి.

అర్థము: అనేన = ఈ ఉదయించిన చంద్రునిచే, తమోనిరాసాత్ = చీకటితొలగుట వలన, కియాన్ = కొంచెమైన, అయం = ఈ, వియద్విభాగః = అకాశ ప్రదేశము, యథా = ఎట్లు, విశదీకృతః = నిర్మలము గావింపబడినదో, తథా = అట్లు, ఉల్లాసితాభిః = చన్ద్రికిరణములచే నుల్లాసము పొందింపబడిన, లావణసైన్ధవీభిః = లవణసముద్రమునకు సంబన్ధించిన, అద్భిః = ఉదకములచే, కియాన్ = కొంచెమైన, అయం = ఈప్రదేశము, శితిరపి = నల్లనిదిగాను, అకారి = చేయబడినది. లేతవెన్నెలగల చంద్రుడు పూర్వాకాశమునందు వెలుగుచుండగా, నచ్చటినీకటి తొలగుటవలన నాయాకాశప్రదేశము తెల్లనగును. ఆ తూర్పునుండి తొలగిన చీకటి పశ్చిమదిక్కునందు, దట్టముగా నేర్పడుటవలన, నాపడమటనున్న యాకాశము నల్లగా నుండును. లేదా సముద్రజలము నీలముగా నుండుట వలన పూర్వాకాశ మొకతడవ చన్ద్రికాంతులతో తెల్లగా జేయబడినను

నాచన్ద్రుడు పైభాగమునకు పోవుటవలన నాపూర్వాకాశము నాసము ద్రవు నీలజలములతో మఱల నలుపుగా జేయబడినదేమో యని యర్థము.

**సమాసములు :**

వియద్విభాగః : వియతః విభాగః = వియద్విభాగః.
తమోనిరాసాత్ : తమసః నిరాసః = తమోనిరాసః, తస్మాత్ = తమోనిరాసాత్.

విశదీకృతః : అవిశదః విశదః సమ్పద్యమానః కృతః = విశదీకృతః.
లావణసైన్ధవీభిః : లవణసింధో రిమాః లావణసైన్ధవ్యః, తాభిః = లావణసైన్ధవీభిః.

**భావము :**

చంద్రు డుదయింపగనే చీకటి తొలగుటవలన పూర్వాకాశమునందలి కొలది భాగము తెల్లబఱుపబడినది. అట్లే చన్ద్రకిరణములచే వృద్ధిని బొందిన లవణసముద్రపు జలముచే నాయాకాశము నందలి కొంతభాగము నలుపుగా జేయబడినది. చంద్రుని లేత వెన్నెలలో పూర్వాకాశమందలి చీకటి తొలగుటచే నది తెల్లగా జేయబడినది. తర్వాత తొలగిపోయిన చీకటి, పదమట దట్టముగా నేర్పడుటవలన నాదిక్కునందలి యాకసము నల్లబడినది. లేదా తొలుత చన్ద్రకిరణములచే వెల్లబడిన పూర్వాకాశదేశము తర్వాత నల్లని సముద్ర జలముచే నల్లగా జేయబడినదనియు భావము.

శ్లో. గుణౌ పయోధే ర్నిజకారణస్య
న హానివృద్ధీ కథ మేతు చన్ద్రః ।
చిరేణ సోఽయం భజతే తు యత్ తే
న నిత్య మమ్భోధిరివాఽత్ర చిత్రమ్ ॥ 72

ప. వి. గుణౌ - పయోధేః - నిజకారణస్య - న - హానివృద్ధీ - కథమ్ - ఏతు - చన్ద్రః - చిరేణ - సః - అయం - భజతే - తు - యత్ - తేన - నిత్యం - అమ్భోధిః - ఇవ - అత్ర - చిత్రమ్.

**అర్థము:** చన్ద్రః = చంద్రుడు, నిజకారణస్య = తనకు మూలమైన, పయోధేః = సముద్రముయొక్క, హానివృద్ధీ = హానివృద్ధు లనెడి, గుణౌ = గుణములను, కథం = ఎట్లు, నైతు = పొందడు, కాని కార్యగుణములు కారణ గుణములచే నేర్పడుటవలన తప్పక సముద్రముయొక్క వృద్ధినాశములు చన్ద్రుని బొందుననుట యుక్తమే కాన నిట చిత్రమేమియును లేదు. కాని సోఽయం = ఆ యీచన్ద్రుడే, తే = ఆహానివృద్ధులనెడి గుణములను, యత్ = ఎందువలన, చిరేణ = చాలాకాలమునకు, భజతే = పొందు చున్నాడో, నిత్యం = ఎల్లప్పుడును, అమ్భోధిరివ = సముద్రునివలె, న భజతే = పొందక యున్నాడో, అత్ర = ఈ విషయమున, చిత్రం = ఆశ్చర్యము. తండ్రియగు సముద్రుడు ప్రతిదినము హానివృద్ధులను బొందినను పుత్రుడగు చంద్రుడు పొందకయుండుట ఆశ్చర్యము.

**సమాసములు :**

నిజకారణస్య : నిజం చ తత్ కారణం చ = నిజకారణం, తస్య = నిజకారణస్య.

హానివృద్ధీ : హానిశ్చ వృద్ధిశ్చ = హానివృద్ధీ, తే = హానివృద్ధీ.

**భావము :**

చంద్రుడు తనకు గారణభూతుడగు సముద్రునియొక్క గుణములగు హానివృద్ధుల నెట్లు పొందకయుండును? తప్పక పొందియుండవలయును. ఏల యనగా కారణగుణములు కార్యమునందు సంక్రమింపవలయును గదా! కాన చంద్రుడు తన తండ్రియొక్క హానివృద్ధుల బొందుటలో ఆశ్చర్యము లేదు. కాని చంద్రుడు హానివృద్ధులను పక్షాన్తములగు పూర్ణిమతోడను, అమావాస్యతోడను, పరిమితములగు బహుకాలములతో బొందుచుండగా సముద్రుడు ప్రతిదినమును హానివృద్ధులను బొందుచుండును. ఇదియే యాశ్చర్యకరము.

శ్లో. ఆదర్శదృశ్యత్వమపి శ్రితోఽయ
మాదర్శదృశ్యాం న బిభర్తి మూర్తిం ।
త్రినేత్రభూ రప్యయ మత్రినేత్రా
దుత్పాద మాసాదయతి స్మ చిత్రమ్ ॥ 73

ప. వి. ఆదర్శదృశ్యత్వమ్- అపి - శ్రితః - అయమ్ - ఆదర్శదృశ్యాం - న- బిభర్తి - మూర్తిం - త్రినేత్రభూః - అపి - అయమ్- అత్రినేత్రాత్ - ఉత్పాదం - ఆసాదయతి - స్మ-చిత్రం.

అర్థము: అయం = ఈ చంద్రుడు, ఆదర్శదృశ్యత్వం, ఆదర్శ = అద్దమువలె, దృశ్యత్వం = చూడదగియుండుటను, అనగా రమ్యముగా నుండుటను, శ్రితోఽపి = పొందినను, ఆదర్శదృశ్యాం, ఆదర్శ = అద్దమువలె, దృశ్యాం = రమ్యమైన, మూర్తిం = శరీరమును, న బిభర్తి = ధరించుట లేదు. అనగా నావిధముగా దృశ్యుడగుటలేదని విరోధము. కాని యద్దము వలె దృశ్యుడైనను, ఆదర్శ = దర్శతిథివరకును, అమావాస్యవరకును, అనగా నమావాస్యను వ్యాపించి, దృశ్యాం = చూడదగిన; మూర్తిం = శరీరమును, బిభర్తి = ధరించుటలేదు. అనగా నిప్పుడు, ఆదర్శ దృశ్యత్వం, ఆ = పూర్ణముగా, ఆదర్శ = అద్దమునందు. దృశ్యత్వం = కనపడియుండుటను, శ్రితోఽపి = పొందినను, దర్శమునందు (అమావాస్య యందు) కొంచెముగా కూడా కానదగియుండుటను వహింపడని చెప్పుట వలన, విరోధపరిహారము. లేదా అద్దమువలె రమణీయుడుగా నున్నను, ఆదర్శదృశ్యాం, ఆదర్శ = దర్శతిథిని అనగా నమావాస్యను అవధిగా జేసుకొని. కృష్ణచతుర్దశిని వ్యాపించి, దృశ్యాం = దృశ్యమైన, యనగా గనబడదగిన, మూర్తిం = శరీరమును, న బిభర్తి = ధరించడా యేమి? తప్పక ధరించుననియే యర్థము. చంద్రుడు కృష్ణపక్షచతుర్దశివఱకును కనపడును కదా!, తథా = అట్లే, అయం = ఈ చంద్రుడు. త్రినేత్రభూః అపి, త్రినేత్ర = త్రినేత్రునుండి, భూరపి = ఉత్పన్నుడైనను, అత్రినేత్రాత్ = త్రినేత్రుని కంటే భిన్నుడైనవానినుండి, ఉత్పాదం = ఉత్పత్తిని, ఆసాదయతి స్మ = పొందించుకొనెను. (ఇత్యేతదపి = ఇదియు) చిత్రం = ఆశ్చర్యము, త్రినేత్రునుండి పుట్టియు త్రినేత్రునుండి పుట్టలేదనుట యాశ్చర్యకరము గదా! మఱియు, త్రినేత్రభూరపి, త్రినేత్ర = ముక్కంటిని, భూఃఅపి = నివాసస్థానముగా గలవాడైనను, అత్రినేత్రాత్ = అత్రిమహర్షియొక్క నేత్రమునుండి, ఉత్పత్తిం =

జన్మమును. ఆసాదయతి స్మ = పొందెను. అని చెప్పుటవలన విరోధము నకు పరిహారము. చంద్రుడు అత్రిమహర్షినేత్రము నుండి యుత్పన్నుడని పురాణప్రసిద్ధి.

**సమాసములు :**

ఆదర్శదృశ్యత్వం : ద్రష్టుం యోగ్యః = దృశ్యః, ఆదర్శవత్ దృశ్యః = ఆదర్శదృశ్యః, ఆదర్శదృశ్యస్య భావః = ఆదర్శదృశ్యత్వం. తత్ = ఆదర్శదృశ్యత్వం.
ఆదర్శదృశ్యాం : దర్శ మభివ్యాప్య = ఆదర్శం, ఆదర్శం దృశ్యా = ఆదర్శదృశ్యా, తాం = ఆదర్శదృశ్యాం.
త్రినేత్రభూః : త్రీణి నేత్రాణి యస్య సః = త్రినేత్రః, త్రినేత్రాత్ భవతీతి = త్రినేత్రభూః, లేదా త్రినేత్రః భూః యస్య సః = త్రినేత్రభూః.
అత్రినేత్రాత్ : న త్రినేత్రం = అత్రినేత్రః, తస్మాత్ = అత్రినేత్రాత్. లేదా అత్రేః నేత్రం = అత్రినేత్రం, తస్మాత్ = అత్రినేత్రాత్.

**భావము :**

ఈ చంద్రుడు ఆదర్శమువలె (అద్దమువలె) దృశ్యుడైనను (రమ్యుడైనను) ఆదర్శదృశ్యమైనట్టి యనగా దర్శతిథికి ననగా నమావాస్యకు వ్యాపించినట్టి దృశ్యమగు శరీరమును ధరించుటలేదు. అనగా నమావాస్యయం దితడు దృశ్యుడు కాడు గదా! లేదా యద్దమువలె దృశ్యుడైనను దర్శము నవధిగావించుకొనిన కృష్ణపక్షచతుర్దశి నభివ్యాపించిన తిథులలో దర్శనీయమైన యనగా జూడదగిన మూర్తి నీతడు వహించుటలేదా! అనగా తప్పక వహించుచునేయున్నాడు. చన్ద్రుడు కృష్ణపక్షచతుర్దశివరకును కానబడునుగదా! ఈ చంద్రుడు త్రినేత్రుని వలన బుట్టి త్రినేత్రునివలన బుట్టలేదనుట విరుద్ధము. మఱియు త్రినేత్రునివలన బుట్టియు నత్రినేత్రునివలన బుట్టెననుటయు విరుద్ధము. కాన త్రినేత్రుని అనగా శివుని నివాసస్థానముగా గల్గినను అత్రినేత్రమునుండి యనగా నత్రిమహర్షినేత్రము నుండి యుద్భవించెనని చెప్పుటవలన నావిరోధములకు పరిహారము. ఈచంద్రునకు సహజసౌందర్యము, నివాసస్థానము శివుడగుటవలన మహిమ, అత్రినేత్రమునుండి పుట్టుటవలన వంశమునకు బవిత్రత యేర్పడుచున్నవి.

శ్లో. ఇజ్యేవ దేవవ్రజభోజ్యబుద్ధిః
శుద్ధా సుధాదీధితిమణ్డలీయమ్ ।
దిశాం యథా సైవ తదఙ్గ మేషా
కలఙ్క మేకం మలినం బిభర్తి ॥ 74

ప వి. ఇజ్యా - ఇవ - దేవవ్రజభోజ్యబుద్ధిః - శుద్ధా - సుధాదీధితిమణ్డలీ - ఇయం - దిశాం - యథా - సా - ఏవ-తదఙ్గం - కలఙ్కం - ఏకం - ఏషా - మలినం-బిభర్తి.

అర్థము: దేవవ్రజభోజ్యబుద్ధిః, దేవవ్రజ = దేవతలసంఘముచే, భోజ్య = భుజింపదగిన, బుద్ధిః = సమృద్ధిగలిగిన, శుద్ధా = తెల్లనైన, ఇయం = ఈ, సుధాదీధితిమణ్డలీ, సుధా = అమృతమే, దీధితి = కాంతిగా గలిగిన చంద్రునియొక్క, మణ్డలీ = మణ్డలము, ఇజ్యేవ = యాగము వలె, (శోభించును) యాగముగూడ దేవసంఘముచే భుజింపదగిన, పురోడాశాది సమృద్ధిని గలిగియుండును. తథా = అట్లే, ఏషా = ఈ చంద్రమణ్డలి, యథా = ఎట్లు, సైవ = ఆయిజ్యయే అనగా యాగమే. పూర్వోక్తములగు గుణములతో గూడినను, పశుహింసారూప మైన, అఙ్గం = కర్మసాధనమగు, మలినం = పాపహేతువును, బిభర్తి = వహించునో, తథా = అట్లే, కలఙ్కం = కలఙ్కరూప మైన, ఏకం = ఒక, మలినం = మలినాకారమును, బిభర్తి = ధరించు చున్నది. "ముధాఙ్గం" అనుపాఠమునందు, కలఙ్కం = కలఙ్కరూప మైన, ఏకం = ఒక, అఙ్గం = అఙ్గరూపమగు, మలినం = మలినమును, ముధైవ = వ్యర్థముగనే; బిభర్తి = ధరించుచున్నదని యర్థము. శుద్ధమైన చన్ద్రమణ్డలికి మాలిన్యసంబన్ధము తగదు గదా! శుద్ధమైన శ్రౌత ధర్మమునకు సాంఖ్యులు దోషము నారోపించుటవలని మాలిన్యముకూడా వ్యర్థమే.

**సమాసములు :**

దేవవ్రజభోజ్యబుద్ధిః: దేవానాం వ్రజః = దేవవ్రజః, దేవవ్రజేణ భోజ్యా బుద్ధిః యస్యాః సా = దేవవ్రజభోజ్యబుద్ధిః.

సుధాదీధితిమణ్డలీ : సుధామయీ దీధితిః యస్య సః = సుధాదీధితిః, సుధాదీధితేః మణ్డలీ = సుధాదీధితిమణ్డలీ.

**భావము :**

దేవసంఘమునకు భోజ్యమైన సమృద్ధిగల్గిన యాచన్ద్రమణ్డలి యాగమువలె శోభించుచున్నది. అనగా దేవతలు చన్ద్రుని నాహారము గావించుకొందురు. కాన చన్ద్రమణ్డలి దేవతాహారం సమృద్ధిగలది. అట్లే యాగము దేవతాహారములగు పురోడాశము మున్నగు హవ్యద్రవ్యములసమృద్ధి గలిగియుండును. కాని యాగము పూర్వము చెప్పబడిన గుణములతో గూడినను కర్మసాధనమగు పశు హింస యనెడి మలినమును ధరించుచున్నది. అట్లే చన్ద్రమణ్డలియు నన్నివిధము లలోను పరోపకారపరాయణమైనదై శుద్ధమైనదైనను శరీరమధ్యమునందు కలఙ్కమనెడి మలినమును వహించుచున్నది.

శ్లో. ఏకః పిపాసుః ప్రవహానిలస్య
చ్యుతో రథా ద్వాహనరఙ్కు రేషః ।
అస్త్యమ్బరేఽనమ్బుని లేలిహాస్యః
పిబన్నముష్యామృత బిన్దువృన్దమ్. ॥ 75

ప. వి. ఏకః - పిపాసుః - ప్రవహానిలస్య - చ్యుతః - రథాత్ - వాహన రఙ్కుః - ఏషః - అస్తి - అమ్బరే - అనమ్బుని - లేలిహాస్యః - పిబన్ - అముష్య - అమృతబిన్దువృన్దమ్.

అర్థము: ఏషః = ఈ చంద్రునియందు గానవచ్చెడిది, ప్రవహానిలస్య = ప్రవహ మనెడి వాయువునకు వాహనమైన, పిపాసుః = దాహముతో గూడిన, ఏకః = ఒక, వాహనరఙ్కుః = వాయుదేవుని రథమును లాగెడి జింక, రథాత్ = అతనిరథమునుండి, చ్యుత = జారిపడినదై, అనంబుని = ఉదకములేని, అమ్బరే = ఆకసమునందు, లేలిహాస్యః = మాటిమాటికి నాస్వాదించెడి ముఖముగలదై, అముష్య = ఈ చంద్రునియొక్క, అమృత బిన్దువృన్దం, అమృతబిన్దు = అమృతబిన్దువులయొక్క, వృన్దం = సమూహమును, పిబన్ = త్రాగుచు, అస్తి = ఉన్నది.

సమాసములు :

పిపాసుః : పాతుమిచ్ఛుః = పిపాసుః,

ప్రవహానిలస్య : ప్రవహ ఇతి అనిలః = ప్రవహానిలః, తస్య = ప్రవహానిలస్య.

వాహనరజ్జుః : వాహనభూతః రజ్జుః = వాహనరజ్జుః.

అనమ్బుని : అవిద్యమానం అమ్బు యస్మిన్ తత్ = అనమ్బు, తస్మిన్ = అనమ్బుని.

లేలిహాస్యః : లేలిహం ఆస్యం యస్య సః = లేలిహాస్యః.

అమృతబిన్దువృన్దం : అమృతస్య బిన్దవః = అమృతబిన్దవః, అమృతబిన్దూనాం వృన్దః = అమృతబిన్దువృన్దః, తం = అమృతబిన్దువృన్దం.

భావము :

ఈ చన్ద్రునియందు గానవచ్చెడి జింక యందలిదిగాదు. అది పురాణ ప్రసిద్ధములైన సప్తవాయుస్కన్ధములలో నొక్కటైన ప్రవహమనెడి వాయుస్కన్ధములోని వాయువునకు సంబన్ధించిన రథమును లాగెడి జింక; దాహము జెంది యారథమునుండి జారిపోయినదై నీరులేని యాకసమునందు తనమూతితో మాటిమాటికి నాకుచున్నదై యీచంద్రునియొక్క, యమృతబిన్దువులను పానముచేయుచు నిప్పటికి చంద్రునియందే యున్నది.కాన చన్ద్రునియందు జింక ప్రవహమను వాయువునకు వాహనమైన జింక; పైవిధముగా రథమునుండి పడిపోయి చన్ద్రమణ్డలమును జేరి యందలి యమృతబిన్దువుల ద్రాగుచున్నది. అస్తియని వర్తమానకాలిక క్రియను జెప్పుటవలన చిరకాలమునుండి రథమునుండి పడిపోయి చన్ద్రునందు నిప్పటికి నున్నదని యర్థము సూచితము. ఆకసమునందు సప్తవాయుస్కన్ధములును, అందలి ప్రవహమనెడి వాయుస్కన్ధమందు మేషాదిరాశులును ఆరాశుల యందు చన్ద్రుని యునికియు పురాణములయందు జెప్పబడినవి.

శ్లో. అస్మిఞ్ఛిశౌ న స్థిత ఏవ రఙ్కు-
ర్యూని ప్రియాభి ర్విహితోపదాఽయమ్ ।
అరణ్యసందేశ ఇవౌషధీభి
రఙ్కే స శఙ్కే విధునా న్యధాయి. ॥ 71

ప. వి. అస్మిన్ - శిశౌ - న స్థితః - ఏవ - రఙ్కుః - యూని - ప్రియాభిః - విహితోపదా - అయమ్ - అరణ్యసన్దేశః - ఇవ - ఓషధిభిః - అఙ్కే - సః - శఙ్కే - విధునా - న్యధాయి.

అర్థము: శిశౌ = బాలుడైన, యొకకలగానున్న, అస్మిన్ = ఈచంద్రునియందు, రఙ్కుః = మృగము, (ఆదశయందు) న స్థిత ఏవ = ఉండనేలేదు, ఏల యనగా బాల్యదశయందు కలామాత్రుడైన చంద్రునియం దామృగము కనబడలేదు. (కింతు = కాని) ప్రియాభిః = ప్రియురాండ్రైన, ఓషధీభిః = ఓషధులచే, యూని = యువకుడైన, అస్మిన్ = ఈచంద్రునియందు, అరణ్యసందేశ ఇవ = అరణ్యమందే దేర్పడి పంపబడినదో యనునట్లు అనగా నీప్రియురాండ్రమగు మేము నిర్జనారణ్యమునందు మృగములతోడ వసింతుము, నీవు స్వర్గమునందు సుఖముగా నుందుము, అని గూఢమగు నర్థముగల నిందాసూచకముగా పంపబడిన, రఙ్కుః = మృగము, ఉపదేవ = కానుకయో యనునట్లు, విహితా = పంపబడినదై. విధునా = చంద్రునిచే, సః = ప్రేయసీసందేశరూపముగా, అఙ్కే = ఒడియందు, న్యధాయి = ఉంచబడినది. ఇతి = అని, శఙ్కే = తలంతును, ఓషధులు వనమందు నెలవుగలవి. కాన దానికి అనుగుణముగనే, సందేశరూపమైన మృగమును తమప్రియుతగు చన్ద్రునికి గానుకగా బంపినవి.

సమాసములు :

అరణ్యసందేశః : అరణ్యే భవాః = ఆరణ్యాః, అరణ్యానాం సందేశః, ఆరణ్యసందేశః.

భావము :

చంద్రుడు బాల్యదశయందు నేకకలామాత్రుడై యుండగా నతనియందు కలఙ్కరూపమైన మృగము లేదు. ఏలయనగా నొక్క కలగల చంద్రునియం

వది కానరాదుగదా! ఆ చంద్రుడు కొన్నికలలతో పెరిగినవాడై యౌవనమును పొందగా నప్పుడు అరణ్యమందున్న యతని ప్రియురాండ్రగు నోషధు లతనికి కానుకగా మృగమును బంపినవి. అనగ నవి యరణ్యవాసమే చేయుచు చంద్రుని గూర్చి "ఓప్రియుడా! నీప్రియురాండ్రమైన మేము నిర్జనవనమున మృగములతో వాసము చేయుచున్నాము. నీవు స్వర్గమందు విజయమంది సుఖముగా నున్నావు". అని నిందాగర్భమగు సందేశముగ నీమృగమును కానుకగా నంపినవి. తర్వాత నా చంద్రు డామృగమును తన శరీరమధ్యమందు అనగా నొడియందు నుంచుకొనెనని నేను తలంతును. చంద్రుడు "ఓషధీశో నిశాంపతిః"అని చెప్పినట్లు ఓషధులకు భర్త యని ప్రసిద్ధి. కాన నా యోషధులు ప్రియుడగు చంద్రునకు బైకానుకను బంపినవని యర్థము. ఓషధులు వనవాసులుగాన తమ వనవాసమున కనుగుణముగా తమసందేశరూపమగు కానుకగా మృగమునే పంపించినవని యాశయము.

శ్లో. అస్యైవ సేవార్థ ముపాగతానా
మాస్వాదయన్ పల్లవ మోషధీనాం,
ధయ న్నముష్యైవ సుధాజలాని
సుఖం వసత్యేష కలఙ్కరఙ్కుః. ॥ 77

ప. వి. అస్య - ఏవ - సేవార్థం - ఉపాగతానాం - ఆస్వాదయన్ - పల్లవం - ఓషధీనాం - ధయన్ - అముష్య - ఏవ - సుధాజలాని - సుఖం - వసతి - ఏషః - కలఙ్కరఙ్కుః.

అర్థము; ఏషః = ఈ, కలఙ్కరఙ్కుః: కలఙ్క = కళఙ్కమనెడి, రఙ్కుః = మృగము, అస్యైవ = (విరహపీడితుడైన) ఈ చంద్రునియొక్కయే, సేవార్థం = సేవకై, ఉపాగతానాం = వచ్చినట్టి, ఓషధీనాం = ఓషధుల యొక్క, పల్లవం = చిగురుటాకులను, ఆస్వాదయన్ = తినుచు, అముష్యైవ = ఈచంద్రునియొక్కయే, సుధాజలాని = అమృతజలములను ధయన్ = పానముచేయుచు, సుఖం = సుఖముగా, వసతి = వసించు చున్నది.

**సమాసములు :**

సుధాజలాని : సుధా ఏవ జలాని = సుధాజలాని, తాని = సుధాజలాని.

కలఙ్కరజ్జుః ; కలఙ్క ఏవ రజ్జుః = కలఙ్కరజ్జుః.

భావము :

ఈచంద్రునియందలి కలఙ్కమనెడి మృగము చంద్రుని యెడబాటుచే పీడింపబడి యాతనిసేవకై వచ్చిన ప్రియురాండ్రైన యోషధులయొక్క చిగుళ్ళను తిని యాచంద్రునందలి యమృతమును పానముగావించి యాసుఖమున కలవాటుపడి యచ్చటనే యుండిపోయినది.

శ్లో. రుద్రేషు విద్రావిత మార్తమారా
 త్తారామృగం వ్యోమని వీక్ష్య బిభ్యత్ ।
మన్యే౽యమన్యః శరణం వివేశ
 మత్వేశచూడామణి మిన్దు మేణః. ॥ 78

ప. వి. రుద్రేషువిద్రావితమ్ - ఆర్తం - ఆరాత్ - తారామృగం - వ్యోమని - వీక్ష్య - బిభ్యత్ - మన్యే - అయం - అన్యః - శరణం - వివేశ - మత్వా - ఈశచూడామణిం - ఇన్దుం - ఏణః.

అర్థము; రుద్రేషు విద్రావితం, రుద్ర = దక్షయజ్ఞమందు వీరభద్రావతార మెత్తిన రుద్రునియొక్క, ఇషు = బాణముచే, విద్రావితం = తరుమబడిన, (కావుననే) ఆర్తం = పీడనుబొందిన, తారామృగం, తారా = నక్షత్రరూపమైన మృగం = మృగమును, వ్యోమని = ఆకాశమునందు, ఆరాత్ = సమీపమున, వీక్ష్య = చూచి, బిభ్యత్ = భయపడుచున్న, అయం = ఈ, అన్యః = మరియొక, ఏణః = మృగము, ఇందుం = చంద్రుని, ఈశచూడామణిం, ఈశ = శివునియొక్క, చూడామణిం = శిరోరత్నముగా, మత్వా = తెలిసికొని, శరణం = శరణమును, వివేశ = ప్రవేశించినది. శివుడు శిరమునందు ఉంచుకొనుటవలన నితడు పూజ్యుడుకాన వీరభద్రుని నుండి రక్షింపగలడని యాశయముతో మరియొకమృగము చంద్రుని శరణము బొందినదని, మన్యే = తలంతును.

సమాసములు :

రుద్రేషువిద్రావితమ్ : రుద్రస్య ఇషుః = రుద్రేషుః, రుద్రేషుణా విద్రావితః రుద్రేషువిద్రావితః, తం = రుద్రేషువిద్రావితమ్.

తారామృగం : తారైవ మృగః = తారామృగః, తం = తారామృగం.

ఈశచూడామణిం : ఈశస్య చూడామణిః = ఈశచూడామణిః, తం = ఈశచూడామణిమ్.

భావము :

దక్షయజ్ఞమున వీరభద్రావతారమెత్తిన రుద్రుని బాణముచే గొట్టబడినదై పరుగిడిపోయినట్లు బాధజెందిన నక్షత్రరూపమైన మృగమును ఆకసమున సమీపమందు జూచి భయపడుచున్న యీమరియొక మృగము రుద్రుని శిరోభూషణముగా జంద్రుని గాంచి యితడు తప్పక వీరభద్రునుండి రక్షింపగలడని యా చంద్రుని శరణు బొందెననియు నదియే నతనియందు కలఙ్కముగా నున్నదనియు నాశయము. తారామృగమును రుద్రబాణముచే తఱుమగొట్టిన విషయము కాశీఖండము మున్నగువాని యందు ప్రసిద్ధము. ఇచ్చట నీకథ మరియొక విధముగా చెప్పబడుచున్నది.

కామపీడితుడైన బ్రహ్మ తన పుత్రికయగు సరస్వతిని సంభోగింపగోరగా నామె మృగరూపమును ధరించి పరుగిడిపోయినది. అపుడు బ్రహ్మయు మృగరూపమును ధరించి యామెవెంట బడెను. ఈ బ్రహ్మయొక్క యనుచిత కార్యమునకు శివుడు గొప్పక్రోధము నొంది మృగరూపమును ధరించిన బ్రహ్మయొక్క తలను దునిమెను. అపుడాతల మృగశీర్షయను నక్షత్రముగను నతని బాణ మార్ద్రయను నక్షత్రముగను నేర్పడియున్నవి. శివుడా బ్రహ్మయొక్క కపాలమును బుచ్చుకొని తాను గావించిన బ్రహ్మహత్యాపాతకము దొలగుటకై యా కపాలమును భిక్షాపాత్రను గావించుకొనెను. ఈ కథయు కాశీఖండమందున్నది. శ్రీ శంకరాచార్యుల శివమహిమ్నస్తోత్రమందు నిది వర్ణితము.

ప్రజానాథం నాథప్రసభ మధికం స్వాం దుహితరం
గతం రోహిద్భూతాం రిరచయిషుమృగ్యస్య వపుషః
ధనుష్పాణే ర్యాతం దివమపి న పత్రాకృత మముం
త్రసన్తం తేఽద్యాఽపి త్యజతి న మృగవ్యాథరభసః ॥ శి. స్తో.

శ్లో. పృష్ఠేఽపి కిం తిష్ఠతి నాథ! నాథ!
రఙ్కు ర్విధో రఙ్కు ఇవేతి శఙ్కా ।
తత్త్వాయ తిష్ఠస్వ ముఖే స్వ ఏవం
యత్ ద్వైరథే పృష్ఠమపశ్య దస్య ॥ 79

ప. వి. పృష్ఠే - అపి - కిం - తిష్ఠతి - నాథ - నాథ! - రఙ్కుః - విధోః - అఙ్కుః - ఇవ - ఇతి - శఙ్కా - తత్త్వాయ - తిష్ఠస్వ - ముఖే - స్వే - ఏవం - యత్ - ద్వైరథే - పృష్ఠం - అపశ్యత్ - అస్య.

అర్థము: హే నాథ ! = ఓ నాథా !, విధోః = చంద్రుని యొక్క, అఙ్కు ఇవ = కళఙ్కమృగమెట్లు ఒడియందుండునో అట్లే, రఙ్కుః = ఆ మృగము, పృష్ఠేఽపి = పీపునందును, వెనుక భాగమునందును, కిం తిష్ఠతి = ఉన్నదా యేమి ? ఒకవేళ యది యుండదని నీకు సంశయమున్నచో, తత్త్వాయ = యథార్థమునకై, స్వే = తనదైన, ముఖే = ముఖవిషయమందు, తిష్ఠస్వ = (ప్రశ్నకై) లెమ్ము. యత్ = ఏ నీముఖము, ద్వైరథే = సమానమగు శోభనభిలషించుటవలన ద్విరథ సంబంధము గల ద్వన్ద్వ యుద్ధమునందు, నీముఖమువలన భంగము బొంది పరుగిడి పోవునట్టి, అస్య = ఈ చంద్రునియొక్క, పృష్ఠం = పృష్ఠభాగమును, అపశ్యత్ = చూచెను. కాన నీముఖమునే నిర్ణేతగా ప్రశ్నించుము. నలునిముఖము చంద్రుని కంటె నధికమని వేఱొక భంగిలో జెప్పబడినది.

సమాసములు :

ద్వైరథే : ద్వౌ రథౌ యస్మిన్ తత్ = ద్విరథం, ద్విరథస్య ఇదం = ద్వైరథం, తస్మిన్ = ద్వైరథే.

భావము :

ఓ నాథా ! చంద్రునియొడియందు కళఙ్కమను మృగ మెట్లున్నదో అట్లేయా చంద్రుని పృష్ఠమందును మృగ మున్నదా యేమి ? ఒకవేళ లేదని

నీకు సంశయము గల్గినచో నప్పుడు నిజము తెలిసికొనుటకు నీ ముఖమునే ప్రశ్నించుము. ఏలయనగా నీ ముఖసౌందర్యముచే భంగము బొంది పరుగిడి పోవుచున్న చంద్రుని పృష్ఠభాగమును నీముఖమే చూచినది. కాన చంద్రుని వెనుక భాగమునందు మృగ మున్నదిలేనిది నీముఖమే చెప్పగలదు. నలముఖము చంద్రుని కంటె నధికమని చెప్పుట మఱియొకభంగి ననుసరించి వర్ణనజేయ బడినది. చంద్రుడు నలుని ముఖముచే నోడిపోయినప్పుడు గదా పరుగిడిపోవును. అపుడే నలముఖమునకు చన్ద్రపృష్ఠభాగమును జూచుట కవకాశ మేర్పడును. చంద్రుని పృష్ఠభాగమును నలముఖ మెప్పుడు జూడగల్గినదో యప్పుడతడు నల ముఖముచే నోడిపోయినట్లు సిద్ధమగుచున్నదని యాశయము.

శ్లో. ఉత్తానమేవాస్య వలక్షకుక్షిం
దేవస్య యుక్తిః శశ మఙ్క మాహ ।
తేనాధికం దేవ గవేష్వపి స్యాం
శ్రద్ధాలు రుత్తానగతౌ శ్రుతాయామ్ ॥ 80

ప. వి. ఉత్తానమ్ - ఏవ - అస్య - వలక్షకుక్షిం - దేవస్య - యుక్తిః - శశమ్ - అఙ్కమ్ - ఆహ - తేన - అధికం - దేవగవేషు - అపి - స్యాం - శ్రద్ధాలుః - ఉత్తానగతౌ - శ్రుతాయామ్.

అర్థము: యుక్తిః = అర్థాపత్తి ప్రమాణము లేదా అనుమానప్రమాణము, దేవస్య = చంద్రభగవానునియొక్క, అఙ్కం = మధ్యనున్న కలంక రూపమగు, శశం = కుందేటిని, ఉత్తానం = వెల్లకిల నున్నదానినిగా, నవగా స్వర్గమున కెదురుగానుండి మనకు పృష్ఠభాగము జూపుదానినిగాను, వలక్షకుక్షిం = తెల్లని యుదరము గలదానినిగాను, ఆహ = చెప్పుచున్నది. ఒకవేళ ఈ కుందేలు మనవైపు తిరిగినదై వెల్లకిల పడక బోర్ల పడి యున్నచో, నప్పుడు మధ్యనున్న కుందేటిపొట్ట తెల్లగా నుండుటవలన చంద్రుని మధ్యభాగము గూడా తెల్లగా నుండెడిది. కాని అది యట్లు లేక నల్లగా నున్నది. కాన నాకుందేలు చంద్రుని యందు వెల్లకిల పడియున్న దని పై ప్రమాణములు చెప్పుచున్నవని యర్థము. తేన = పై విధముగా చంద్రుని యందలి శశము వెల్లకిల పడియున్నదని నిశ్చయించుటచే

(అహం = నేను) దేవగవేష్వపి = దేవతల గోవులగు కామధేనువు మున్నగువాని విషయమందును, శ్రుతాయాం = వేదముల యందు వినబడుచున్న, ఉత్తానగతౌ = వెల్లకిలపడి నడుచు విషయమునందు అధికం = పూర్వము కంటె నధికముగా, శ్రద్ధాలుః = నమ్మిక కలిగిన వానినిగా, స్యాం = కాగలను.

సమాసములు :

వలక్షకుక్షిం : వలక్షః కుక్షిః యస్య సః = వలక్షకుక్షిః, తం = వలక్షకుక్షిం.

దేవగవేషు : దేవానాం గావః = దేవగవాః, తేషు = దేవగవేషు.

ఉత్తానగతౌ : ఉత్తానా చ సా గతిశ్చ = ఉత్తానగతిః, తస్యాం = ఉత్తానగతౌ.

భావము :

అర్థాపత్తి లేదా యనుమాన మనెడి ప్రమాణము చంద్రునిమధ్య నున్న కుందేటిని వెల్లకిలపడి యున్నదానినిగా ననగా స్వర్గమున కభిముఖమైన యుదరము గలదానినిగాను, మన కగపడు వెనుకభాగముగల దానినిగాను చెప్పుచున్నది. అట్లుగాక యా కుందేలు మన కభిముఖముగా నుదరమును గల్గి వెల్లకిల పడక బోరల పడియున్నచో చన్ద్రమధ్య మందున్న దానియొక్క యుదరము తెల్లగా నుండవలయును. కాని యది నల్లగా యున్నది. అందువలన నాకుందేలు వెల్లకిల పడియున్నదే కాని బోరలపడి యుండలేదు. కాన పైని యర్థాపత్త్యాది ప్రమాణములు చెప్పువిషయము యుక్తమైనది. చంద్రునియందలి శశమెట్లు వెల్లకిల పడియున్నదో అట్లే దేవతల గోవులైన కామధేనువు మున్నగునవి గూడా స్వర్గమునందు వెల్లకిల పడియుండునని చెప్పెడి "ఉత్తానా వై దేవగవ శ్చరన్తి" యను శ్రుతియందును పూర్వముకంటె నెక్కువ నమ్మకము గల్గుచున్నదని యాశయము.

శ్లో. దూరస్థితై ర్వస్తుని రక్తనీలే
విలోక్య తే కేవలనీలిమా యత్ ।
శశస్య తిష్ఠన్నపి పృష్ఠలోమ్నాం
తన్నః పరోక్షః ఖలు రాగభాగః ॥

ప. వి. దూరస్థితైః-వస్తుని - రక్తనీలే - విలోక్యతే - కేవలనీలిమా - యత్ - శశస్య - తిష్ఠన్ - అపి - పృష్ఠలోమ్నాం - తత్ - నః - పరోక్షః - ఖలు - రాగభాగః.

అర్థము: దూరస్థితైః = దూరమందున్న ప్రేక్షకులచే, రక్తనీలే = రక్తనీలవర్ణములతో గలిసిన వస్తువునందు, కేవలనీలిమా, కేవల = రక్తభాగమును వదిలిన, నీలిమా = నలుపు. యత్ = ఎందువలన, విలోక్యతే = చూడబడుచున్నదో, తత్ = అందువలన, శశస్య = కుందేలుయొక్క, పృష్ఠలోమ్నాం = వెనుకనున్న వెంట్రుకలకు, రాగభాగః = ఎఱ్ఱని యంశము, తిష్ఠన్నపి = ఉన్నను, నః = మిక్కిలిదూరమందున్న మనకు, ఖలు = నిశ్చితముగా, పరోక్షః = కంటికి గోచరము కాదు. కాని నల్లదన మొక్కటియే కానబడును.

**సమాసములు :**

దూరస్థితైః: దూరే స్థితాః = దూరస్థితాః, తైః = దూరస్థితైః.
రక్తనీలే : రక్తం చ తత్ నీలం చ = రక్తనీలం, తస్మిన్ = రక్తనీలే.
కేవలనీలిమా : కేవల శ్చాసౌ నీలిమా చ = కేవలనీలిమా.
పృష్ఠలోమ్నాం : పృష్ఠే లోమాని = పృష్ఠలోమాని, తేషాం = పృష్ఠలోమ్నాం.
పరోక్షః : అక్ష్ణః పరస్తాత్ = పరోక్షః.
రాగభాగః : రాగస్య భాగః = రాగభాగః.

**భావము :**

దూరమందున్న ప్రేక్షకులు రక్తనీలవర్ణములుగల వస్తువును చూచునపుడు ఆవస్తువునందలి రక్తభాగమును వదిలి నీలభాగమునే చూడగలిగి యుందురు. కాన కుందేటియొక్క వెనుకభాగమునందలి వెంట్రుకలు ఎఱ్ఱనివై యున్నను దూరత్వదోషమువలన నాయెఱ్ఱదనము కనబడక యావెంట్రుకలయందలి నల్లదనమే కనబడుచుండును. కాన కుందేలు ఎఱ్ఱని పృష్ఠభాగము గలిగియున్నను నది యెఱ్ఱగా గానరాక నల్లగనే కనబడునని యర్థము. అందువలన చన్ద్రశశమునందు రక్తనీలవర్ణములు రెండున్నను నీలవర్ణమే కానబడును కాని రక్తనీలవర్ణము కానరాదు గాన నదియేల కానబడదని ప్రశ్నింపరాదని యాశయము.

శ్లో. భఙ్క్తుం ప్రభుర్వ్యాకరణస్య దర్పం
పదప్రయోగాధ్వని లోక ఏషః ।
శశో యదస్యాస్తి శశీ తతోఽయ
మేవం మృగోఽస్యాస్తి మృగీతి నోక్తః ॥ 82

ప. వి. భఙ్క్తుం - ప్రభుః - వ్యాకరణస్య - దర్పం - పదప్రయోగాధ్వని - లోకః - ఏషః - శశః - యత్ - అస్య - అస్తి - శశీ - తతః - అయం - ఏవం - మృగః - అస్య - అస్తి - మృగీ - ఇతి - న - ఉక్తః.

అర్థము: ఏషః = ఈకవిలోకము, పదప్రయోగాధ్వని, పద = సుబన్తపదముల యొక్కయు, తిఙన్తపదములయొక్క, ప్రయోగ = ప్రయోగమునకు సంబంధించిన, అధ్వని = మార్గమునందు, వ్యాకరణస్య = ప్రకృతి ప్రత్యయముల విభాగపూర్వకముగా శబ్దముల వ్యుత్పాదనము గావించెడి శాస్త్రముయొక్క, దర్పం = సకలశబ్దప్రయోగములు నాయధీనములు అనెడి గర్వమును, లేదా, వ్యాకరణస్య = (లక్షణచే) వైయాకరణుని యొక్క, అనగా సకలశబ్దప్రయోగములు వ్యాకరణాధీనము లనెడి, దర్పం = గర్వమును, భఙ్క్తుం = భంగపరుచుటకు, ప్రభుః = సామర్థ్యముగలిగినది, యత్ = ఏలయనగా! అయం = ఈచంద్రుడు, శశః = కుందేలు, అస్య = ఇతనికి, అస్తి = ఉన్నది యనెడి కారణము వలన, "శశీ" యని యెట్లు లోకముచే జెప్పపడునో, ఏవం = ఈవిధము గనే, మృగః = మృగము, అస్య = ఇతనికి, అస్తి = యున్నదను వ్యుత్పత్తి ననుసరించి, అయం = ఈచంద్రుడు "మృగీతి" "మృగీ" యని, నోక్తః = చెప్పబడలేదు. అనగా, శశః అస్య అస్తీతి వ్యుత్పత్తి యందు మతుబర్థమున "ఇని" ప్రత్యయము వచ్చి. "శశీ" యను రూప మెట్లేర్పడినదో, అట్లే యా "ఇని" ప్రత్యయమును విధించు సూత్రముచే "మృగః అస్య అస్తీతి" వ్యుత్పత్తియందు మతుబర్థమున "ఇని" ప్రత్యయము వచ్చి, "మృగీ" యను రూపమేల యేర్పడరాదు? కాని యట్లేర్పడ నందున నతివ్యాప్త్యాది దోషములుండుటవలన లోకప్రయోగము వ్యాకరణ

మూలమనుట యుక్తము గాదు. మతేమనగా కృత్తద్ధితసమాసముల జెప్పుటయు నియామకము. అందువలన లక్ష్యము నుద్దేశించి లక్షణము ప్రవర్తించునే కాని లక్షణము నుద్దేశించి లక్ష్యము ప్రవర్తించదు. కాన "ప్రయోగమూలం వ్యాకరణం" అను వాక్యము ననుసరించి వ్యాకరణము కంటె లోకమే శబ్దప్రయోగమునందు ప్రబలమైనదని యర్థము.

**సమాసములు :**

పదప్రయోగాధ్వని : పదానాం ప్రయోగః = పదప్రయోగః;, పదప్రయోగస్య అధ్వా = పదప్రయోగాధ్వా, తస్మిన్ = పదప్రయోగాధ్వని.

**భావము :**

ఈ కవిలోకమే సుప్తిఙన్తాది పదముల ప్రయోగవిషయమునందు "నాయధీనమే సకలశబ్దప్రయోగ'' మనెడి వ్యాకరణశాస్త్రముయొక్క గర్వము నణచుటకు సమర్థమైనది. అట్లు లోకము సమర్థము కానిచో "శశః అస్యాస్తీతి = శశీ" యని శబ్ద మేర్పడినట్లు "మృగః అస్యాస్తీతి = మృగీ" అనియు శబ్దము వ్యాకరణశాస్త్రము ననుసరించి యేర్పడవలయునుగదా! కాని లోకప్రయోగము లేనందువలన "మృగీ" యను శబ్ద మేర్పడలేదు. కాన ప్రయోగమూలమే వ్యాకరణశాస్త్రాధీనమే శబ్దప్రయోగ మనెడి మాట యుక్తము గాదని యాశయము.

శ్లో. యావన్త మిన్దుం ప్రతిపత్ ప్రసూతే
ప్రాసావి తావా నయ మబ్ధినాఽపి ।
తత్కాల మీశేన ధృతస్య మూర్ధ్ని
విధే రణీయస్త్వ మిహాస్తి లిఙ్గమ్ ॥ 83

ప. వి. యావన్తమ్- ఇన్దుం - ప్రతిపత్ - ప్రసూతే - ప్రాసావి - తావాన్ - అయమ్- అబ్ధినా - అపి - తత్కాలమ్-ఈశేన - ధృతస్య - మూర్ధ్ని- విధేః - అణీయస్త్వమ్- ఇహ - అస్తి - లిఙ్గమ్.

అర్థము: ప్రతిపత్ = శుక్లపాడ్యమి, యావన్తం = ఎంత పరిమితిగల, ఇందుం = చంద్రుని, ప్రసూతే = కనుచున్నదో, యనగా నుత్పత్తి చేయుచున్నదో, అబ్ధినాఽపి = సముద్రముచేతను, తావాన్ = అంత పరిమితిగల్గిన యనగా నొక కలయే గల్గిన, అయం = ఈ చన్ద్రుడు, ప్రాసావి = ఉత్పత్తి చేయబడెను. ఏలయనగా?, తత్కాలం = సముద్రమునుండి యుత్పత్తినొందు సమయమునందే, ఈశేన = శివునిచే, మూర్ధ్ని = శిరముపై, ధృతస్య = ధరింపబడిన, విధోః = చన్ద్రునకు, అణీయస్త్వం = మిక్కిలి కృశించియుండుట, ఇహ = ఒకకలను వహించువిషయమున, లిఙ్గం = జ్ఞాపకమగు హేతువుగా, అస్తి = ఉన్నది.

**సమాసములు :**

తత్కాలం : స చాసౌ కాలశ్చ = తత్కాలః, తం = తత్కాలం.

**భావము:**

శుక్లపాడ్యమి యెంత పరిమితిగల చంద్రు నుత్పత్తి జేయుచున్నదో సముద్రముగూడ నంతపరిమితిగల చంద్రునే కనియుండును. శుక్లపాడ్యమినాడు చంద్రుడొక్కకల గల్గియే యుద్భవించును. కాన సముద్రముగూడ నొక్కకల గలచంద్రునే కనియుండును. ఏలయనగా సముద్రమునుండి చంద్రు డుద్భవించు సమయమునందు శివుడు తనతలపై ధరించిన చంద్రు డొక్కకల గల్గియుండుట యే దీనికి తార్కాణము. ఒకవేళ సముద్రుడు పూర్ణచంద్రునే కనియున్నచో శివుడా పూర్ణచంద్రునే తన తలపై ధరించియుండును. కాని యావిధముగా జరుగ నందువలన పాడ్యమి యొకకలగల చంద్రునే యుత్పత్తి గావించినది. కాన సముద్రుడును నొక కలగల చంద్రునే కనెను. కాన పాడ్యమినాడు చంద్రు డుద్భవించినను వతడొక్కకలనే గలిగి యుండుటవలన కనబడడని యాశయము.

శ్లో. ఆరోప్యతే చేదిహ కేతకత్వ
మిన్దౌ దలాకారకలాకలాపే ।
తత్సంవద త్యఙ్కమృగస్య నాభి
కస్తూరికాసౌరభవాసనాభిః॥ 84

ప. వి. ఆరోప్యతే - చేత్ - ఇహ - కేతకత్వం - ఇన్దౌ - దలాకారకలా కలాపే - తత్ - సంవదతి - అఙ్కమృగస్య - నాభికస్తూరికాసౌరభ వాసనాభిః.

అర్థము : కేతకత్వం = మొగలిపూవుయొక్క ధర్మము, దలాకారకలా కలాపే = మొగలిరేకుల ఆకారముగల కలాసమూహముగల, ఇహ = ఈ, ఇన్దౌ = చంద్రునియందు, ఆరోప్యతే చేత్ = ఆరోపింపబడినచో, తత్ = అప్పుడు, అఙ్కమృగస్య = కలఙ్కముగా నున్నమృగము యొక్క, నాభికస్తూరికా = పొక్కిలియందలి కస్తూరియొక్క, సౌరభ = పరిమలరూపములగు వాసనాభిః = తావులతో, సంవదతి = సరిపడుచున్నది.

సమాసములు :

కేతకత్వం : కేతకస్య భావః = కేతకత్వం.
దలాకారకలాకలాపే : దలస్య ఆకార ఇవ ఆకారః యస్య సః = దలాకారః, కలానాం కలాపః = కలాకలాపః, దలాకారః కలాకలాపః యస్య సః = దలాకారకలాకలాపః, తస్మిన్ = దలాకారకలాకలాపే.
అఙ్కమృగస్య : అఙ్కశ్చాసౌ మృగశ్చ = అఙ్కమృగః, తస్య = అఙ్కమృగస్య.
నాభికస్తూరికాసౌరభవాసనాభిః : నాభేః కస్తూరికా = నాభికస్తూరికా, నాభికస్తూరికాయాః సౌరభాణి = నాభికస్తూరికాసౌరభాణి. నాభికస్తూరికా సౌరభాణ్యేవ వాసనాః = నాభికస్తూరికాసౌరభవాసనాః, తాభిః = నాభికస్తూరికాసౌరభవాసనాభిః.

భావము :

మొగలిరేకుల యాకారమువంటి యాకారముగల కలలసమూహముతో గూడిన చంద్రునియందు కేతకత్వమును అనగా మొగలిపూవుయొక్క ధర్మము ను ఆరోపించినచో నప్పుడు చంద్రునియందలి కలఙ్కరూపముగా నున్న మృగము యొక్క పొక్కిలియందలి కస్తూరియొక్క పరిమళములతో నాయారో పణ సరిపడియుండును. మొగలిపూవునందు కస్తూరియొక్క పరిమళముండును.

చంద్రుడు మొగలిపూవుగా నున్నచో చంద్రునియందలి కళంకమృగముయొక్క పొక్కిలియందలి కస్తూరీపరిమళములు అతనికి తావులను గూర్చుటవలన నది యుక్తమగునని యాశయము.

శ్లో. ఆసీ ద్యథా జ్యౌతిషమేవ గోలః
శశీ సమక్షం చిపిట స్తతోఽభూత్ ।
స్వర్భానుదంష్ట్రాయుగయన్త్రకృష్ట
పీయూషపిణ్యాకదశావశేషః ॥ 85

ప. వి. ఆసీత్ - యథా - జ్యౌతిషమ్- ఏవ - గోలః - శశీ - సమక్షం - చిపిటః - తతః - అభూత్-స్వర్భానుదంష్ట్రాయుగయన్త్రకృష్టపీయూషపిణ్యాకదశావశేషః.

అర్థము : ఏషః = ఈ, శశీ = చంద్రుడు, యథాజ్యౌతిషం = జ్యోతిషశాస్త్రమున ననుసరించి, యనగా గర్గాదిమునులు రచించిన గ్రహగణితశాస్త్రమున ననుసరించి, గోలః = వెలగపండువంటి గుండ్రవు వైభాగము గలవాడుగనే, ఆసీత్ = ఉండెను. (కాని) తతః = ఆ తర్వాత, కాలక్రమముగ, స్వర్భానుదంష్ట్రాయుగయన్త్రకృష్టపీయూషపిణ్యాకదశావశేషః, స్వర్భాను = రాహువుయొక్క, దంష్ట్రాయుగ = కోరలజంట యనెడి, యన్త్ర = గానుగవంటియన్త్రముచే, కృష్ట = లాగివేయబడిన, పీయూష = అమృతము గలిగిన, పిణ్యాక = పిప్పియైన తెలకపిండియొక్క, దశావశేషః = దశచేమిగిలినవాడై, చిపిటః = రసరహితపర్పటముగా, అభూత్ = అయెను. (ఇది) సమక్షం = ప్రత్యక్షమైన విషయము.

సమాసములు :

యథాజ్యౌతిషం : జ్యోతి రధికృత్య కృతో గ్రన్థః = జ్యౌతిషమ్, జ్యోతిష మనతిక్రమ్య = యథాజ్యౌతిషం.
సమక్షం : అక్ష్ణోః సమీపే = సమక్షం.
స్వర్భానుదంష్ట్రాయుగయన్త్రకృష్టపీయూషపిణ్యాకదశావశేషః : దంష్ట్రయో ర్యుగం = దంష్ట్రాయుగం, స్వర్భానోః దంష్ట్రాయుగం = స్వర్భానుదంష్ట్రాయుగమేవ యన్త్రం = స్వర్భానుదంష్ట్రాయుగయన్త్రం,

స్వర్భానుదంష్ట్రాయుగయ న్త్రేణ కృష్టం పీయూషం యస్మాత్ సః = స్వర్భానుదంష్ట్రాయుగయన్త్రకృష్టపీయూషః, స్వర్భానుదంష్ట్రాయుగ యన్త్రకృష్టపీయూష శ్చాసౌ పిణ్యాకశ్చ = స్వర్భానుదంష్ట్రాయుగ యన్త్రకృష్టపీయూష పిణ్యాకః. స్వర్భానుదంష్ట్రాయుగయన్త్రకృష్ట పీయూషపిణ్యాకస్య దశా=స్వర్భానుదంష్ట్రాయుగయన్త్రకృష్టపీయూష పిణ్యాకదశా. స్వర్భానుదంష్ట్రాయుగ యన్త్రకృష్టపీయూష పిణ్యాక దశాయాం అవశేషః = స్వర్భానుదంష్ట్రాయుగయన్త్రకృష్టపీయూష పిణ్యాకదశావశేషః.

**భావము :**

ఈ చంద్రుడు గర్గాదిమునులు రచించిన జ్యోతిశ్శాస్త్రము ననుసరించి వెలగపండువంటి గుండ్రపు పై భాగముగలిగి పూర్వ ముండెను. కాని తర్వాత కాలక్రమముగా రాహువుయొక్క కోరలజంట యనెడి గానుగచే లాగివేయబడిన యమృతమనెడి సారము గలవాడై పిప్పిగా మిగిలినవాడై యిప్పు డున్నాడు. ఇది ప్రత్యక్షమైన విషయము.

శ్లో. **అసా వసామ్యా ద్వితనోః సఖా నో**
**కర్పూర మిన్దుః ఖలు తస్య మిత్రమ్ ।**
**దగ్ధౌ హి తౌ ద్వావపి పూర్వరూపా**
**ద్యద్వీర్యవత్తా మధికాం దధాతే ॥** 86

ప. వి. అసౌ - అసామ్యాత్ - వితనోః - సఖా - నః - కర్పూరమ్ - ఇన్దుః - ఖలు - తస్య - మిత్రం - దగ్ధౌ - హి - తౌ - ద్వౌ - అపి - పూర్వ రూపాత్ - యత్ - వీర్యవత్తామ్ - అధికాం - దధాతే.

అర్థము: అసామ్యాత్ = పోలిక లేనందువలన, అసౌ = ఈ చంద్రుడు, వితనోః = శరీరములేని మన్మథునకు, సఖా = మిత్రుడు, నో (భవతి) కాడు, ఏలయనగా "వివహాహమైత్రీవైరాణి భవన్తి సమశీలయోః" అని చెప్పిన విధముగా సమానశీలురకే చెలిమితగును. ఇట మన్మథుడు అనంగుడు. చంద్రుడు సాంగుడు. కాన శరీరములేని మన్మథునకు శరీరముగల చంద్రునితో, జెలిమి పొసగదని యర్థము. కాన, ఖలు =

నిశ్చితముగా, కర్పూరం = కర్పూరమను పేరుగల, ఇందుః = చంద్రుడు, తస్య = ఆ మన్మథునకు, మిత్రం = చెలికాడు. యత్ = ఏలయనగా ? తౌ = ఆ, ద్వావపి = ఇద్దరును అనగా మన్మథుడును కర్పూరమును, దగ్ధౌ = దగ్ధులై, పూర్వరూపాత్ = పూర్వరూపము కంటెను, అనగా దగ్ధముకాని రూపముకంటెను, అధికాం = అధికమైన, వీర్యవత్తాం = శక్తిని, హి = స్పష్టముగా, దధాతే = ధరించుచున్నారు. పాకముబొందిన కర్పూరము మిక్కిలి బలముగలిగి యుండును. మన్మథుడును దాహమైన పిదప మిక్కిలి బలముగలవాడై యున్నాడు. కాన మన్మథునికిని కర్పూరమునకును మైత్రి యుక్తమే.

సమాసములు :

అసామ్యాత్ : సమయో ర్భావః = సామ్యం, న సామ్యం = అసామ్యం, తస్మాత్ = అసామ్యాత్.

వితనోః : విగతా తనుః యస్మాత్సః = వితనుః, తస్య = వితనోః.

పూర్వరూపాత్ : పూర్వం చ తత్ రూపం చ = పూర్వరూపం, తస్మాత్ = పూర్వరూపాత్.

వీర్యవత్తాం : వీర్య మనయో రస్తీతి = వీరవన్తౌ, వీర్యవతో ర్భావః = వీర్యవత్తా, తాం = వీర్యవత్తాం.

భావము :

లోకమున చంద్రుడు అనఙ్గునకు మిత్రుడని చెప్పెదరు. కాని యిది సరి కాదు. అఙ్గములులేని మన్మథునకు అఙ్గములు కల్గిన చంద్రు డెట్లు మిత్రు డగును? కాలేదని యర్థము. కాని వారిరువురికిని లోకప్రసిద్ధమగు మైత్రియో చన్ద్రశబ్దమునకు "ఘనసార శ్చన్ద్రసంజ్ఞః" యను నిఘంటువు ననుసరించి కర్పూరమని యర్థము చెప్పుటచే సరిపడును. కాన చంద్రుడనగా కర్పూరము, అనంగునకు మిత్రమని గ్రహింపవలయును. కర్పూరమును దగ్ధము గావించినచో మిక్కిలి శక్తివన్త మగును. అట్లే మన్మథుడును శివుని మూడవకంటిచే దగ్ధమైనపిదప మిక్కిలి శక్తివన్తుడుగా నున్నాడు. కాన కాలినపిదప కర్పూరమును మన్మథుడును మిక్కిలి శక్తిగలిగియుండుటచే నాసమానధర్మమును బురస్కరించుకొని వానికి

మైత్రి చెప్పబడినది. కాని చంద్రునకును మన్మథునికిని మైత్రియనుట తగదని యాశయము. అనగా చన్ద్రశబ్దమునకు కర్పూరమని యర్థమును తెలిసికొనక చంద్రుడనెడి యర్థమున భ్రమపడినవారై చంద్రునితో మన్మథునకు మైత్రి చెప్పుచుండిరి. కాని వస్తుస్థితిలో చన్ద్రశబ్దమునకు మరియొక యర్థమైన కర్పూరమునకును మన్మథునికి మైత్రిని జెప్పవలయునని సారాంశము.

శ్లో. స్థానే విధేర్వా మదనస్య సఖ్యం
స శమ్భునేత్రే జ్వలతి ప్రలీనః ।
అయం లయం గచ్ఛతి దర్శభాజి
భాస్వన్మయే చక్షుషి చాదిపుంసః ॥ 87

ప. వి. స్థానే - విధేః - వా - మదనస్య - సఖ్యం - సః - శమ్భునేత్రే - జ్వలతి - ప్రలీనః - అయం - లయం - గచ్ఛతి - దర్శభాజి - భాస్వన్మయే - చక్షుషి - చ - ఆదిపుంసః.

అర్థము: వా = లేదా, విధోః = చంద్రునికిని, మదనస్య = మన్మథునకును, సఖ్యం = చెలిమి, స్థానే = యుక్తమే, ఏలయనగా, సః = ఆ మన్మథుడు, జ్వలతి = మిక్కిలి ప్రకాశించుచున్న, శంభునేత్రే = శివునికంట, ప్రలీనః = మిక్కిలి లయించుటచే నేకత్వమునుబొంది నష్టుడాయెను. అయం = ఈచంద్రుడును, దర్శభాజి = దర్శనమును బొందిన, మఱియు, దర్శ = అమావాస్యను, భాజి = పొందిన, భాస్వన్మయే = సూర్యరూపమైన, ఆదిపుంసః = మొదటిపురుషుడైన విష్ణువుయొక్క, చక్షుషి = కంట, లయం = ఏకత్వరూపమైన వినాశమును, గచ్ఛతి = పొందుచున్నాడు. అమావాస్యయందు చంద్రుడు సూర్యుని ప్రవేశించును. కావుననే యమావాస్యకు "దర్శస్సూర్యేన్దుసఙ్గమః" యను నిఘంటువు ననుసరించి సూర్యేన్దుసఙ్గమమనియు బేరు గలదు. సూర్యుడు విష్ణుని దక్షిణనేత్రమని పురాణప్రసిద్ధి. కాన సమానులగు హరిహరుల రెండునేత్రములయందును చన్ద్రమన్మథులు లయము

బొందుటవలన నమావాస్యయందు చంద్రుడును శరీరములేనందున ననఙ్గు డగుటవలన మన్మథునితో సమానధర్మము గల్గియుండుటచే చన్ద్రమన్మథులకు మైత్రి యుక్తమే.

సమాసములు :

దర్శభాజి : దర్శం భజతీతి = దర్శభాక్, తస్మిన్ = దర్శభాజి.
భాస్వన్మయే : భాస్వతః వికారః = భాస్వన్మయః, తస్మిన్ = భాస్వన్మయే.
ఆదిపుంసః : ఆదేః పుమాన్ = ఆదిపుమాన్, తస్య = ఆదిపుంసః.

భావము :

లేదా చంద్రునకును మన్మథునకును మైత్రి యుక్తమే. ఎలయనగా మన్మథుడు మిక్కిలి జ్వలించు శివునికంట లయించెను. అట్లే యీచంద్రుడును నమావాస్యయందలి సూర్యరూపమగు విష్ణుని దక్షిణనేత్రమున లయించు చున్నాడు. సూర్యుడు చంద్రునితో గలియుటయే యమావాస్య యనబడును. కాన నీవిధముగా హరిహరుల నేత్రములయందు లయముబొందిన చంద్రమన్మథులకు సమశీలత్వ ముండుటవలన వారికి మైత్రి యుక్తమని యాశయము.

శ్లో. నేత్రారవిన్దత్వ మగాత్ మృగాఙ్కః
పురా పురాణస్య యదైష పుంసః ।
అస్యాఙ్క ఏవాఽయ మగా త్తదానీం
కనీనికేన్దిన్దిరసున్దరత్వమ్ ॥ 88

ప.వి. నేత్రారవిన్దత్వమ్ - అగాత్ - మృగాఙ్కః - పురా - పురాణస్య-యదా-ఏషః - పుంసః - అస్య-అఙ్కః - ఏవ - అయమ్ - అగాత్-తదానీం-కనీనికేన్దిన్దిరసున్దరత్వమ్.

అర్థము: పురా = పూర్వము, యదా = ఎప్పుడు, ఏషః = ఈ, మృగాఙ్కః = చంద్రుడు, పురాణస్య = ప్రాచీనుడగు, పుంసః = పురుషుడైన శ్రీవిష్ణువుయొక్క, నేత్రారవిన్దత్వం = నయనకమలముగా

నుండుటను, అగాత్ = పొందెనో, తదానీం = అపుడు, విష్ణువు నేత్రారవిందమగు, అస్య = ఈచంద్రునియొక్క, అయం = ఈ, అఙ్కఏవ = కలఙ్కమే, కనీనికేన్దిన్దిరసున్దరత్వం, కనీనికా = కంటి పాప యనెడి, ఇన్దిన్దిర = తుమ్మెదయొక్క, సున్దరత్వం = సొబగును, అగాత్ = పొందినది. "అదాత్" అను పాఠమునందు, అయం = ఈశ్రీవిష్ణువు, అస్య = ఈచంద్రునియొక్క, అఙ్క = కలఙ్క విషయమున, కనీనికేన్దిన్దిరసున్దరత్వం, కనీనికా = కంటి పాపయనెడి, ఇన్దిన్దిర = తుమ్మెదయొక్క, సున్దరత్వం = సౌన్దర్యమును, అదాత్ = ఇచ్చెను. కంటియందు పాప యుండవలయును. అరవిందమునందు తుమ్మెద యుండవలయును. కాన నీవిష్ణువు తన నేత్రారవిందమగుటవలన నాకలఙ్కమునే కంటిపాపగను తుమ్మెదగను జేసెనన యర్థము.

**సమాసములు :**

నేత్రారవిన్దత్వం : నేత్రమేవ అరవిన్దం = నేత్రారవిన్దం. నేత్రారవిన్దస్య భావః = నేత్రారవిన్దత్వం. తత్ నేత్రారవిన్దత్వం.
కనీనికేన్దిన్దిరసున్దరత్వం : కనీనికైవ ఇన్దిన్దిరం = కనీనికేన్దిన్దిరం, కనీనికేన్దిన్దిరస్య సున్దరత్వం = కనీనికేన్దిన్దిరసున్దరత్వం, తత్ = కనీనికేన్దిన్దిరసున్దరత్వం.

**భావము :**

పూర్వకాలమున మృగాఙ్కుడగు చంద్రు డెప్పుడు పురాణపురుషుడగు శ్రీవిష్ణువునకు నయనకమలముగా నేర్పడెనో యపుడే యీనేత్రారవిందమగు నీ చంద్రుని కలఙ్కమే యతని కంటిపాపయనెడి తుమ్మెదయొక్క పోలికను వహించినది. చంద్రుడు విష్ణువునకు నేత్రపద్మముకాగనే యతనియందలి కలఙ్కము ఆనేత్రమునకు కంటిపాపయనెడి తుమ్మెదగా నేర్పడినదని యర్థము. చంద్రుడు నయనకమలమైనప్పుడే ఆ నయనమున కవసరమైన పాపగాను ఆ కమల మున కవశ్యమైన తుమ్మెదగను నతని కళంక మేర్పడినదని యర్థము. కమల మున్నప్పుడు తుమ్మెదయుండును గదా.

శ్లో. దేవేన తేనైష చ కాశ్యపిశ్చ
సామ్యం సమీక్ష్యోభయపక్షభాజౌ ।
ద్విజాధిరాజౌ హరిణా శ్రితౌ చ
యుక్తం నియుక్తౌ నయనక్రియాయామ్ ॥ 89

ప. వి. దేవేన - తేన - ఏషః - చ - కాశ్యపిః - చ - సామ్యం - సమీక్ష్య - ఉభయపక్షభాజౌ - ద్విజాధిరాజౌ - హరిణా శ్రితౌ - చ - యుక్తం - నియుక్తౌ - నయనక్రియాయామ్.

అర్థము: తేన = ఆ, దేవేన = శ్రీవిష్ణువుచే, ఏషః చ = ఈచంద్రుడును, కాశ్యపిశ్చ = గరుడుడును నీఇద్దరును. సామ్యం = సమానధర్మమును, సమీక్ష్య = చూచి. నయనక్రియాయామ్ = క్రమముగా సమానమగు నేత్రక్రియయందును వాహనవ్యాపారమునందును, యత్ = ఎందువలన, నియుక్తౌ = నియమింపబడిరో, తత్ = అది, యుక్తం = తగినది. ఏలయనగా, వారిద్దరును. ఉభయపక్షభాజౌ, ఉభయపక్ష (చంద్రపక్షమున) శుక్లకృష్ణపక్షములను, భాజౌ = పొందినవారు, (గరుడపక్షమున) ఉభయపక్ష = రెండురెక్కలను. భాజౌ = పొందినవారు, మరియు, ద్విజాధిరాజౌ = (చంద్రపక్షమున) ద్విజ = బ్రాహ్మణులకు, అధిరాజౌ = రాజులు, (గరుడపక్షమున) ద్విజ = పక్షులకును, అధిరాజౌ = రాజులు, హరిణాశ్రితౌ, హరిణ = (చంద్రపక్షమున) కళంకమైన మృగముచే, ఆశ్రితౌ = ఆశ్రయింపబడినవారు, (గరుడపక్షమున) హరిణా = విష్ణువుచే, ఆశ్రితౌ = ఆశ్రయింపబడినవారలు, ఇట్లు చన్ద్రునికిని గరుడునికిని, నయనవ్యాపారమునందు ననగా చంద్రపక్షమున విష్ణువునకు నెడమకంటియొక్క కార్యమునందును, గరుడపక్షమున మోయుట యనెడి కార్యమునందును, నేర్పాటును గల్పించుటవలన నుభయులకును శబ్దసామ్యమువలన సమానవ్యాపారకల్పన సిద్ధించినదిగాన నిది యుచితమని యర్థము.

సమాసములు :

కాశ్యపిః : కశ్యపస్య అపత్యం పుమాన్ = కాశ్యపిః.

ఉభయపక్షభాజౌ : ఉభయశ్చాసౌ పక్షశ్చ=ఉభయపక్షః, ఉభయ పక్షం భజత ఇతి=ఉభయపక్షభాజౌ.

ద్విజాధిరాజౌ : ద్విః జాయన్త ఇతి=ద్విజాః, ద్విజానాం అధిరాజౌ= ద్విజాధిరాజౌ.

హరిణాశ్రితౌ : హరిణేన ఆశ్రితౌ=హరిణాశ్రితౌ.

నయనక్రియాయాం : నయనమేవ క్రియా=నయనక్రియా, తస్యాం= నయనక్రియాయాం.

**భావము :**

శ్రీ మహావిష్ణువు చంద్రుని గరుడుని సమానమైన నయనక్రియ యం దుంచుట యుక్తమైనది. అందు చంద్రుడు విష్ణువునకు నెడమకన్ను చేయునట్టి కార్యమును జేయుటవలన నయనక్రియ యం దుంచబడిన వాడాయెను. నయన మనగా నేత్రమని యర్థము గదా! అట్లే గరుడుడును విష్ణువునకు వాహనమై యాతనిని గొనిపోవుటవలన నయనక్రియయం దుంచబడిన వా డాయెను. నయన మనగా గొనిపోవుట యని యర్థము కదా! కాన నీవిధముగా నాచంద్రగరుడులను సమానవ్యాపారము నందు నియమించెను. మఱియు వారిఱువురను నుభయపక్ష ములను ననగా శుక్లకృష్ణపక్షములను రెండుఱెక్కలను గల్గియుండుట యనెడిదియు ద్విజరాజ్యత్వమును ననగా బ్రాహ్మణరాజత్వమును పక్షిరాజత్వము ననెడి దియునగు సామ్యమును వహించియున్నారు. అంతియగాక వారిరువురును హరిణా శ్రితులగుటవలన ననగా కలఙ్కమైన హరిణముచేతను ననగా జింక చేతను, హరి చేతను ననగా విష్ణువుచేతను నాశ్రయింప బడుటవలనను సామ్యమును గల్గి యున్నారు.

శ్లో. యై రన్వమాయి జ్వలన స్తుషారే
సరోజినీదాహవికారహేతోః ।
తదీయధూమౌఘతయా హిమాంశౌ
శఙ్కే కలఙ్కోఽపి సమర్థిత స్తైః ॥ 90

ప. వి. యైః - అన్వమాయి - జ్వలనః - తుషారే - సరోజినీదాహవికారహేతోః - తదీయధూమౌఘతయా - హిమాంశౌ - శఙ్కే - కలఙ్కః - అపి - సమర్థితః - తైః.

అర్థము: యైః = ఏ పండితులచే, సరోజినీదాహవికార హేతోః, సరోజినీ = తామరలకు, దాహ వికార = కమిలిపోవుటయనెడి వికారరూపమైన, హేతోః = హేతువువలన, తుషారే = మంచునందు, జ్వలనః = అగ్ని, మంచు అగ్నితోగూడినది, అది తగిలినచో దాహ మేర్పడుచున్నది. కాన అగ్నితో గూడిన ప్రదేశ మువలెనని పక్షసాధ్య హేతుదృష్టాన్తములతో, అన్వమాయి = ఊహింపబడినదో, తైః = ఆ పండితులచే, హిమాంశౌ = చంద్రుని యందున్న, కలఙ్కోఽపి = కలఙ్కముగూడా, తదీయధూమౌఘతయా, తదీయ = మంచునందలి యగ్నికి సంబంధించిన, ధూమౌఘతయా = పొగలసమూహముగా, సమర్థితః = ఊహింపబడినది. అగ్నియున్నచో పొగయుండవలయునుగదా! చంద్రుడు మంచుముద్దగాన నతనియందు ముందు చెప్పబడినవిధముగా నగ్ని యుండవలయును. అతనియందలి కలఙ్క మాయగ్నివలన నేర్పడిన పొగయేయని పండితులు ఊహించిరని నేను భావింతును.

**సమాసములు :**

సరోజినీదాహవికార హేతోః : సరోజిన్యాః దాహః = సరోజినీదాహః, సరోజినీదాహేన వికారః = సరోజినీదాహవికారః, సరోజినీదాహవికార ఏవ హేతుః = సరోజినీదాహవికార హేతుః, తస్మాత్ = సరోజినీదాహవికార హేతోః.

తదీయధూమౌఘతయా : ధూమానాం ఓఘః = ధూమౌఘః తస్య అయం = తదీయః, తదీయశ్చాసౌ ధూమౌఘశ్చ = తదీయ ధూమౌఘః, తదీయధూమౌఘస్య భావః = తదీయధూమౌఘతా, తయా = తదీయధూమౌఘతయా.

హిమాంశౌ : హిమః అంశుషు యస్య సః = హిమాంశుః, తస్మిన్ = హిమాంశౌ.

**భావము :**

మంచునకు కమలములు కమిలిపోవుటవలన, మంచువం దగ్ని యుండునని పండితు లూహించిరి. ఆపండితులే చంద్రుడును మంచుముద్ద యగుటవలన నతని

కలంకమును వతనియందున్న యగ్నివలన నుద్భవించిన ధూమసమూహముగా నూహించిరని నేను భావింతును.

శ్లో. స్వేదస్య ధారాభి రివాపగాభి
ర్వ్యాప్తా జగద్భారపరిశ్రమార్తా ।
ఛాయాపదేశా ద్వసుధా విభజ్య
సుధామ్బుధా వుజ్ఝతి స్వేదమత్ర. ॥ 91

ప. వి. స్వేదస్య - ధారాభిః - ఇవ - ఆపగాభిః - వ్యాప్తా - జగద్భారపరిశ్రమార్తా - ఛాయాపదేశాత్ - వసుధా - విభజ్య - సుధామ్బుధౌ - ఉజ్ఝతి - స్వేదం - అత్ర.

అర్థము: వసుధా = భూమి, ఛాయాపదేశాత్, ఛాయా = తనప్రతిబిమ్బ మను. అప దేశాత్ = నెపమువలన, జగద్భారపరిశ్రమార్తా. జగద్భార = భూభార వలని, పరిశ్రమ = కష్టముచే, ఆర్తా = పీడింపబడినదై, స్వేదస్య = చెమటనీటియొక్క, ధారాభిరివ = ధార లనెడి, ఆపగాభిః = నదులచే, వ్యాప్తా = నిండినదై సుధామ్బుధౌ, సుధా = అమృతములకు, అమ్బుధౌ = సాగరమైన, అత్ర = ఈచంద్రునియందు, నిమజ్జ్య = మునిగి, స్వేదం = ప్రపంచభారమువలని పరిశ్రమచే నేర్పడినబాధను, ఉజ్ఝతివ = విడుచు చున్నదో యనునట్లున్నది. అమృతసాగరమున మునిగినచో బడలిక తొలగును గదా.

సమాసములు :

ఆపగాభిః : అపాం సమూహః = ఆపం, ఆపేన గచ్ఛన్తీతి = ఆపగాః, తాభిః = ఆపగాభిః.

జగద్భారపరిశ్రమార్తా : జగతాం భారః = జగద్భారః, జగద్భారేణ పరిశ్రమః = జగద్భారపరిశ్రమః, జగద్భారపరిశ్రమేణ ఆర్తా = జగద్భారపరిశ్రమార్తా.

ఛాయాపదేశాత్ : ఛాయాయాః అపదేశః = ఛాయాపదేశః, తస్మాత్ = ఛాయాపదేశాత్.

సుధాంబుధౌ : సుధానా మంబుధిః = సుధాంబుధిః, తస్మిన్ = సుధాంబుధౌ.

**భావము :**

చంద్రునియందు కానబడెడి నల్లని మచ్చను పెక్కురు పెక్కుభంగులుగాఁ జెప్పుచున్నారు. కొందరు దానిని మృగమనియు, కొందఱు శశమనియు, కొందరు దిగువనున్న భూమియొక్క ప్రతిబింబమనియు భావించుచున్నారు. ఇచ్చట నది భూమియొక్క ప్రతిబింబమని భావింపబడి వర్ణింపబడుచున్నది. ఈ భూమి ప్రపంచభారములను మోయుటవలని యలసటచేఁ బీడింపబడినదై, యా యలనట వలన చెమర్చినదై, యా బాధనుఁ దొలగించుకొనుటకై చంద్రుడనెడి యమృత సాగరమునందు, అకలఙ్కమను నెపముచే మునిగి తన బడలికనుఁ బోగొట్టుకొను చున్నదో యనునట్లున్నది. అమృతసాగరమున మునిగినచో బడలిక తొలగును కదా. కాన చంద్రునియందలి కలంకము భూమియొక్క నీడయనియు, నా నీడ యొక్క నెపముచే, భూమియే వాస్తవముగ నాచంద్రుడనెడి యమృతంపు కడలి యందు మునిగినదనియు నాశయము.

శ్లో. మమానుమైవం బహుకాలనీలీ
నిపాతనీలః ఖలు హేమశైలః ।
ఇన్దోర్జగచ్ఛాయమయే ప్రతీకే
పీతోఽపి భాగః ప్రతిబింబితః స్యాత్ ॥ 92

**వ. వి.** మమ - అనుమా - ఏవం - బహుకాలనీలీనిపాతనీలః - ఖలు - హేమశైలః - ఇన్దోః - జగచ్ఛాయమయే - ప్రతీకే - పీతః - అపి - భాగః - ప్రతిబింబితః - స్యాత్.

**అర్థము:** హేమశైలః = పసిడికొండయైన మేరువు, ఖలు = నిశ్చయముగా, బహుకాలనీలీనిపాతనీలః — బహుకాల = సృష్టినుండి నేటివఱకును గడచిన పెక్కుకాలములందలి, నీలీ = నల్లఁదనము, నిపాత = సోకుటవలన, నీలః = నల్లనివన్నెగలదియై యున్నదని, ఏవం = ఈవిధముగా, మమ = నాకు, అనుమా = ఊహ. అనగా నీవిధముగా నేను భావింతును. అట్లు

కానిచో, ఇన్దోః = చంద్రునియొక్క, జగచ్ఛాయమయే — జగత్ = ప్రపంచముయొక్క, ఛాయమయే = ప్రతిబింబరూపమైన, ప్రతీకే = అవయవమైన కలంకమునందు, పీతః = పసుపుపచ్చని వన్నెగల పసిడికొండయొక్క, భాగః = అంశము, ప్రతిబింబితః = ప్రతిఫలించినదిగా, స్యాత్ = ఉండును. కాన నావిధముగా చంద్రునియందు మేరుపర్వతముయొక్క పసిడివన్నె కానరానందువలన నా పర్వతము, బహుకాలవశమున నల్లబడినదని యర్థము. కాన నా మేరుపర్వతము మున్నగువానితోఁ గూడిన భూమి నీలవర్ణము కాన దాని ప్రతిబింబమైన కలంకముగూడ నల్లగనే యున్నదని యర్థము.

## సమాసములు :

బహుకాలనీలీనిపాతనీలః : బహుశ్చాసౌ కాలశ్చ = బహుకాలః, బహుకాలస్యనీలీ = బహుకాలనీలీ, బహుకాలనీల్యాః నిపాతః = బహుకాలనీలీనిపాతః, బహుకాలనీలీనిపాతేన నీలః = బహుకాలనీలీనిపాతనీలః.

హేమశైలః : హేమమయః శైలః = హేమశైలః.

జగచ్ఛాయమయే : జగతాం ఛాయా = జగచ్ఛాయం, జగచ్ఛాయస్య వికారః = జగచ్ఛాయమయః, తస్మిన్ = జగచ్ఛాయమయే.

## భావము :

పసిడికొండ, నిశ్చయముగా సృష్టినుండి నేటివఱకునుఁ గడచిపోయిన సుదీర్ఘమగు కాలమునందలి మాలిన్యముచే నల్లబడిపోయినదని నాయూహ. అట్లు కానిచో, నా పసిడికొండయందలి పసిమితనము భూచ్ఛాయారూపమైన చంద్రకలంకమందు గానఁబడియెడిది. ఏలయనగా చంద్రునియందు కానబడు కలఙ్కము, సమస్త ప్రపంచములతోఁ గూడిన భూమియొక్క ప్రతిబింబమైయున్నది. అట్లగుచో నా సమస్తప్రపంచములలో పసిడికొంచగూడ చేరియున్నది. పసిడికొండ యెల్లప్పుడును పసిమివన్నెతో ప్రకాశించుచుండునుగదా. అట్టి పసిడికొండ, పసిమివన్నెను గల్గియున్నచో, దానియొక్క పసిమివన్నె భూచ్ఛాయయనెడి చంద్రకలంకమునందు కనబడవలసియుండెడిది. కాని యది యావిధముగా, గనబడనందువలన నాకొండ, బహుకాలవశముచే నేర్పడిన మాలిన్యమువలన నల్లబడి

యుండవలయును. అందువలన దాని పసిమివన్నె చంద్రకలంకమునందుఁ గన పడుటలేదని యాశయము.

శ్లో. మా౽వాప దున్నిద్రసరోజపూజా
  శ్రియం శశీ పద్మనిమీలితేజాః ।
అక్షిద్వయేనైవ నిజాఙ్కరఙ్కో-
  రలఙ్కృతస్తా మయమేతి మన్యే. ॥ 83

ప. వి. మా - అవాపత్ - ఉన్నిద్రసరోజపూజాశ్రియః - శశీ - పద్మనిమీలి తేజాః - అక్షిద్వయేన - ఏవ - నిజాఙ్కరఙ్కోః - అలఙ్కృతః - తాం - అయం - ఏతి - మన్యే.

అర్థము: శశీ = చంద్రుడు, ఉన్నిద్రసరోజపూజాశ్రియం. ఉన్నిద్ర = వికసించిన, సరోజ = పద్మములవలని, పూజా = పూజచే నేర్పడు, శ్రియం = శోభను, మా అవాపత్ = పొందడు, (యతః = ఏలయనగా?) (ఆ చంద్రుడు) పద్మనిమీలితేజా, పద్మ = పద్మములను, నిమీలి = ముడుచుకొనునట్లు చేసెడి, తేజాః = కాన్తిగలవాడు, వికసించిన కమలములను నతనిపూజకై యుపయోగించినచో నతనివెన్నెల సోకుటవలన నవి ముకుళించిపోవును. నాపూలచే బూజించుటవలని శోభ నతడు పొందజాలడని యర్థము. (కాని) నిజాఙ్కరఙ్కోః, నిజ = తనదగు, అఙ్క = ఒడియందలి, రఙ్కోః = జింకయొక్క, అక్షిద్వయేనైవ = కమలములవంటి కన్నులజంటచేతనే, అలఙ్కృతః = అలఙ్కరింపబడినవాడై, తాం = ఆశోభను, అయం = ఈ చంద్రుడు, ఏతి = పొందును. (ఇతి = అని, అహం = నేను) మన్యే = తలచెదను,

**సమాసములు :**

ఉన్నిద్రసరోజపూజాశ్రియం : ఉన్నిద్రాణి చ తాని సరోజాని చ = ఉన్నిద్రసరోజాని, ఉన్నిద్రసరోజైః పూజా = ఉన్నిద్రసరోజపూజా, ఉన్నిద్రసరోజపూజాయాః శ్రీః = ఉన్నిద్రసరోజపూజాశ్రీః, తాం = ఉన్నిద్రసరోజపూజాశ్రియం.

పద్మనిమీలితేజాః : పద్మాని నిమీలయతీతి = పద్మనిమీలి, పద్మనిమీలి తేజః యస్య సః = పద్మనిమీలితేజాః.

అక్షిద్వయేన : అక్ష్ణోః ద్వయం = అక్షిద్వయం, తేన = అక్షిద్వయేన.

నిజాఙ్కరఙ్కోః : నిజశ్చాసౌ అఙ్కశ్చ = నిజాఙ్కః, నిజాఙ్కే = రఙ్కుః = నిజాఙ్కరఙ్కుః, తస్య = నిజాఙ్కరఙ్కోః.

భావము :

చంద్రుడు, వికసితములగు పద్మములవలన నెప్పుడు పూజాశోభను బడయడు, ఏలయనగా నతనికాన్తి సోకినచో వికసితములగు పద్మములు ముకుళించి పోవునుగదా! కాని యాచంద్రుడు తనయొడియందలి జింకయొక్క కన్నులచేతనే యాశోభను బొందగలడు. ఏలయనగా యాజింకకన్నులు పద్మములను బోలి యుండునుగదా!.

శ్లో. య ఏష జాగర్తి శశః శశాఙ్కే
బుధో విధత్తే క ఇవాత్రచిత్రమ్ ।
అన్తః కిలైతత్పితు రమ్బురాశే
రాసీ త్తురఙ్గోఽపి మతఙ్గజోఽపి. ॥ 94

ప. వి. యః - ఏషః - జాగర్తి - శశః - శశాఙ్కే - బుధః - విధత్తే - కః - ఇవ - అత్ర - చిత్రమ్ - అన్తః - కిల - ఏతత్పితుః - అమ్బురాశేః - ఆసీత్ - తురఙ్గః - అపి - మతఙ్గజః - అపి.

అర్థము: యః = ఏ, ఏషః = ఈ ప్రత్యక్షదృశ్యమైన, శశః = కుందేలు, శశాఙ్కే = చంద్రునియందు, జాగర్తి = ప్రకాశించుచున్నదో, అత్ర = ఈ విషయమున, క ఇవ బుధః = ఏ పండితుడు, చిత్రం = ఆశ్చర్యమును, విధత్తే = చేయును. అనగా నెవ్వడును నాశ్చర్యము నొందడని యర్థము. కిం = ఏల యనగా? ఏతత్పితుః = ఈచంద్రునికి తండ్రియైన, అమ్బురాశేః = సముద్రముయొక్క, అన్తః = మధ్యభాగమునందు, తురఙ్గోఽపి = ఉచ్చైఃశ్రవ మనెడి గుఱ్ఱము, మతఙ్గజోఽపి = ఐరావత మనెడి

యేనుగును, ఆసీత్ = ఉండెను. ఎవనితండ్రియందు గుఱ్ఱము గజము మున్నగునవి యుండెనో అతని పుత్రునియందు కుందే లొక్కటి యుండుటలో వింతలేదని యర్థము.

**సమాసములు :**

ఏతత్పితుః : ఏతస్య పితా = ఏతత్పితా, తస్య = ఏతత్పితుః.

**భావము :**

చంద్రునియందు కుందేటియునికిని గూర్చి బుద్ధిమంతు డెవ్వడును నాశ్చర్య పడడు. ఏలయనగా నాచంద్రునికి దండ్రియగు సముద్రునియందు నుచ్చైఃశ్రవ మనెడి గుఱ్ఱము, ఐరావతమను నేనుగయు యున్నవిగదా! తండ్రియందు గొప్ప మృగములగు గుఱ్ఱము ఏనుగ యున్నప్పుడు పుత్రునియందు స్వల్పమైన కుందే లుండుటలో వింత యేమున్నదని యర్థము.

శ్లో. గౌరేప్రియే భాతితమాం తమిస్రా
జ్యోత్స్నీ చ నీలే దయితా యదస్మిన్ ।
శోభాఽఽప్తిలోభా దుభయో స్తయోర్వా
సితాసితాం మూర్తిమయం బిభర్తి ॥ 95

ప. వి. గౌరే - ప్రియే - భాతితమాం - తమిస్రా - జ్యోత్స్నీ-చ-నీలే-దయితా-యత్ - అస్మిన్ - శోభాఽఽప్తిలోభాత్ - ఉభయోః - తయోః - వాఅ సితాసితాం - మూర్తిం - అయం - బిభర్తి.

అర్థము : తమిస్రా = చీకటితో నిండిన, అస్య = ఈచంద్రునియొక్క, దయితా = ప్రియురాలగు రాత్రి, గౌరే = తెల్లని, ప్రియే = ప్రియుడగు చంద్రునివిషయమందు, భాతితమాం = మిక్కిలి ప్రకాశించుచున్నది; తథా = అట్లే, జ్యోత్స్నీ = వెన్నెలతోగూడిన తెల్లనైన, అస్య = ఈచంద్రునియొక్క, దయితా = ప్రియురాలగు రాత్రి, నీలే = నల్లనైన, అస్మిన్ = ఈ, ప్రియ = ప్రియుడగు చంద్రుని యందు, భాతితమాం = మిక్కిలి ప్రకాశించుచున్నది. వేరువేరుశోభ

లున్నప్పుడు శోభ మెండగునని యర్థము. (తస్మాత్ = అందువలన) తయోః ఉభయోః = నీకటితో గూడినదియును, వెన్నెలతో గూడినదియు నగు రాత్రుల విషయమున, (స్వస్య = తనకు) శోభాఽప్తిలోభాత్, శోభాఽప్తి = శోభను బొందించుటయందలి, లోభాఽత్ = అభిలాష వలనను, (లేదా) తయోర్వా = ఆ భార్య లిరువురికి గాని, శోభాఽప్తి హేతోః = శోభను బొందించుట యనెడి కారణము వలన, అయం = ఈ చంద్రుడు. సితాసితాం = తెలుపును నలుపును గలిగిన, మూర్తిం = శరీరమును, బిభర్తి = ధరించుచున్నాడు. నీలభాగమున వెన్నెలతో గూడిన ప్రియురాలిని, శుక్లభాగమున చీకటితోగూడిన ప్రియురాలిని ధరించుటకు నావిధమగుమూర్తిని ధరించుచున్నాడని యర్థము.

సమాసములు :

శోభాఽప్తిలోభాత్ : శోభాయాః ఆప్తిః = శోభాప్తిః, శోభాప్తౌ లోభః = శోభాప్తిలోభః, తస్మాత్ = శోభాఽప్తిలోభాత్.

భావము :

నిండుచీకటి కలిగిన రాత్రి యను ప్రియురాలు తెల్లని ప్రియుడగు చంద్రునివిషయమున మెండుగా శోభించుచున్నది. అట్లే నిండువెన్నెల గలిగిన రాత్రియను ప్రియురాలు నల్లని ప్రియుడగు చంద్రునివిషయమున పిక్కిలి ప్రకాశించుచున్నది. వన్నెలు మారినవుడు శోభ వర్ధిల్లునని యాశయము. తన ప్రియురాండ్రకు—నిండువెన్నెల గలిగినదియు, నిండుచీకటి గలిగినది యును అగు రాత్రులను ప్రియురాండ్రకు—శోభను కల్పించు విషయమున నీచంద్రుడు, తెల్లనిదియు నల్లనిదియు నగు శరీరములను ధరించుచున్నాడు. తెలుపువన్నెగల చంద్రుని వలన, నిండుచీకటి గల్గిన రాత్రికిని. నలుపువన్నె గలిగిన చంద్రునివలన నిండువెన్నెలగల రాత్రికిని శోభ యేర్పడుచున్నది. అనగా నీ చన్ద్రుడు కృష్ణపక్షపు తనతెల్లని యంశమున "తమిస్ర" యనబడు నిండు చీకటి గలిగిన రాత్రిని, శుక్లపక్షపు తన నల్లని యంశమున "జ్యోత్స్న" యనబడు నిండువెన్నెల గల రాత్రిని వహించునని యర్థము. అనగా వెన్నెలలేని రాత్రి

యందు చంద్రునకు ధావల్య మెక్కువ. వెన్నెలగల్గిన రాత్రియందా చంద్రునకు ధావల్యము తక్కువ కావున చంద్రునిలో శుక్లనీలభాగములు వర్ణితములు.

శ్లో. వర్షాతపానావరణం చిరాయ
కాష్ఠౌఘమాలమ్బ్య సముత్థితేషు ।
బాలేషు తారాకవకేష్విహైకం
వికస్వరీభూత మవైమి చన్ద్రమ్ ॥ 96

ప. వి. వర్షాతపానావరణం - చిరాయ - కాష్ఠౌఘమ్ - ఆలమ్బ్య - సముత్థితేషు - బాలేషు - తారాకవకేషు - ఇహ - ఏకం - వికస్వరీభూతం - అవైమి - చన్ద్రమ్.

అర్థము: (అహం = నేను) బాలేషు = సూక్ష్మములైన, యనగా వికసించునట్టి. ఇహ = ఈ ప్రత్యక్షముగా గానవచ్చెడివియు, చిరాయ = చాలాకాలము. వర్షాతపానావరణం, వర్షా = వర్షర్తువునందు, తప = గ్రీష్మర్తువునందు. వర్షా = జలవర్షములు, ఆతప = ఎండలు నుండగా, అనావరణం = ఆచ్ఛాదింపబడని, కాష్ఠౌఘం = దిక్కుల సమూహమనెడి కట్టెల సమూహమును (ఆలమ్బ్య = ఆధారము గావించుకొని) సముత్థితేషు = ఉద్భవించినట్టి, తారాకవకేషు, తారా = నక్షత్రములనెడి, కవకేషు = ఛత్రాకములయందు ననగా చిన్నపుట్టగొడుగులయందు అనగా నక్షత్రములయందు, వికస్వరీభూతం = వికసించిన, ఏకం = ఒక పెద్దదైన ఛత్రాకమును అనగా పుట్టగొడుగును, చంద్రం = చంద్రునిగా, అవైమి = తెలుసుకొనుచున్నాను. వర్షాకాలమందు కప్పబడనట్టివియు, నీటనిశ్చలములైనట్టివియు పిదప నెండవలన నెండినట్టి కొయ్యలపై సూక్ష్మములును స్థూలములునగు ఛత్రాకములు అనగా పుట్టగొడుగు లేర్పడుచున్నవని యర్థము. అందు నక్షత్రములు సూక్ష్మఛత్రాకములు. చంద్రుడు స్థూలఛత్రాకమని యర్థము.

సమాసములు :

వర్షాతపానావరణం : వర్షాశ్చ తపశ్చ = వర్షాతపౌ, అవిద్యమానం ఆవరణం యస్య సః = అనావరణః, వర్షాతపేషు అనావరణః = వర్షాతపానావరణః, తం = వర్షాతపానావరణం.

కాష్ఠౌఘం : కాష్ఠానాం ఓఘః = కాష్ఠౌఘః, తం = కాష్ఠౌఘం.

తారాకవకేషు : తారా ఏవ కవకాః = తారాకవకాః, తేషు = తారాకవకేషు.

**భావము :**

సూక్ష్మములైనందువలన వికసించునటువంటివియు, వర్షములయందును నెండలయందును పైకప్పులేని దిక్సమూహ మనెడి కట్టెలపై నుద్భవించినట్టి నక్షత్రములనెడి చిన్నఛత్రాకములయందు ననగా పుట్టగొడుగులయందు చిరకాలమునకుముం దుద్భవించినందువలన వికసించిన యొకస్థూలమైన ఛత్రాకముగా అనగా పుట్టగొడుగుగా చంద్రుని భావింతును.

శ్లో. దినావసానే తరణే రకస్మా
న్నిమజ్జనా ద్విశ్వవిలోచనాని ।
అస్య ప్రసాదా దుడుపస్య నక్తం
తమోవిపద్ద్వీపవతీం తరన్తి. ॥ 97

ప. వి, దినావసానే - తరణేః - అకస్మాత్ - నిమజ్జనాత్ - విశ్వవిలోచనాని - అస్య - ప్రసాదాత్ - ఉడుపస్య - నక్తం-తమోవిపద్ద్వీపవతీం-తరన్తి,

అర్థము: విశ్వవిలోచనాని, విశ్వ = ప్రపంచముయొక్క, విలోచనాని = నేత్రములు, దినావసానే = సాయంకాలమునందు, తరణేః = సూర్యునకు (ఓడకు) అకస్మాత్ = కారణములేనట్టి, నిమజ్జనాత్ = మునుకవలన, ననగా పడమటి సముద్రపునీట గ్రుంకుటవలన, నక్తం = రాత్రియందు, తమోవిపద్ద్వీపవతీం, తమః = చీకటిని నిమిత్తము గావించుకొనిన తరడిదుట మున్నగు, విపత్ = ఆపదయనెడి, ద్వీపవతీం = మహానదిని, అస్య = ఈ, ఉడుపస్య = నక్షత్రరాజైన చంద్రుడనెడి పడవయొక్క, ప్రసాదాత్ = వెలుతురనెడి యనుగ్రహమువలన,తరన్తి = దాటుచున్నారు. చంద్రుడు చీకటిని బారదోలి వెలుతురు నొసంగెనని యర్థము. రాత్రియందు ఓడ మునిగిపోయినచో పడవవలన నాయాపదనుండి మనుష్యుడు దాటి రక్షణము నొందునుగదా!

**సమాసములు ;**

దినావసానే : దినస్య అవసానం = దినావసానం, తస్మిన్ = దినావసానే.
ఉడుపస్య : ఉడూని పాతీతి = ఉడుపః, తస్య = ఉడుపస్య.
విశ్వవిలోచనాని : విశ్వేషాం విలోచనాని = విశ్వవిలోచనాని.
తమోవిపద్ద్వీపవతీం : తమ ఏవ విపత్ = తమోవిపత్, ద్వీపాః అస్యాః సన్తీతి = ద్వీపవతీ, తమోవిపదేవ ద్వీపవతీ = తమోవిపద్ద్వీపవతీ, తాం = తమోవిపద్ద్వీపవతీం.

**భావము :**

ప్రపంచముయొక్క కన్నులు సూర్యునియస్తమయమునందు (ఓడమునిగినపుడు) అనగా సూర్యుడనెడి యోడమునిగినపుడు చీకటివలని తడబాటనెడి యాపదయనెడి మహానదిని, చంద్రుడనెడి పడవయొక్క వెలుతురును ప్రసరింప చేయుట యను ననుగ్రహముచే దాటుచున్నవి. అనగా సూర్యుడనెడి నౌక మునిగి పోగనే యనగా నస్తమింపగనే సేర్పడిన చీకట్లవలన తొట్రుపాటులు మున్నగు నాపదల మహానదిని చంద్రుడనెడి పడవవలన ననగా చంద్రుని ప్రకాశమువలన ప్రపంచనయనములు దాటుచున్నవని యర్థము.

శ్లో. కిం నాక్ష్ణి నోఽపి క్షణికోఽణుకోఽయం
భానస్తి తేజోమయబిన్దు రిన్దుః ।
అత్రేస్తు నేత్రే ఘటతే యదాసీ
న్మానసేన నాశీ మహతో మహీయాన్ ॥ 98

వ. వి. కిం - న - అక్ష్ణి - నః - అపి - క్షణికః - అణుకః - అయం - భాన్ - అస్తి - తేజోమయబిన్దుః - ఇన్దుః - అత్రేః - తు - నేత్రే - ఘటతే - యత్ - ఆసీత్ - మానసేన - నాశీ - మహతః - మహీయాన్.

అర్థము: నః = మనవంటి పామరులయొక్క, అక్ష్ణి = కంటియొక్కవిషయమున, తేజోమయబిన్దుః = తేజోరూపమైన బిన్దువేయైన, అయం = ఈ, ఇన్దుః = చన్ద్రుడు, భాన్ = (వ్రేలితో కంటియంచును మడిచినచో తెల్లనిగుండ్రవు టాకారముతో) ప్రకాశించుచు, కిం = ఏల, నాస్తి =

లేదు?, కాని మనవంటివారి కన్నులయందును చన్ద్రు డున్నాడు. (పరం = కాని) ఆచన్ద్రుడు, అణుకః = సూక్ష్మమైనవాడు, క్షణికః = క్షణకాల ముండెడివాడు. అనగా నెంతకాలము కంటిని మడిచి యుంచెదమో అంత వరకే కనబడునని యర్థము; అట్లగుచో నీచంద్రునికంటె నతనికి భేద మేమనగా, అత్రేః = అత్రిమహర్షియొక్క, నేత్రే తు = నేత్రమందో, తేజోమయబిన్దుః, తేజోమయ = తేజోరూపములు గల, బిన్దుః = బిన్దువైన, అయం = ఈచంద్రుడు, మహీయాన్ = ఇతరులకంటెను గొప్పవాడు. తథా = అట్లే, నాశీ ఇతి యత్ = మాసముచే నశించెడివాడుగా నుండుటననునది యేది గలదో, తత్ = అది, ఘటతే = సరిపడుచున్నది. యతః = ఏలయనగా!, మహతః = మహానుభావుడగు అత్రియొక్క, తేజోమయబిన్దురపి = తేజోరూపమైన బిన్దువైనను నీచన్ద్రుడు, మహీ యాన్ = మహాపరిణామము గలవాడుగను, చిరకాలస్థాయియు నగు చున్నాడు, కాన మననేత్రమందలి తేజోబిన్దువునకంటెను చన్ద్రునకు వైలక్షణ్యము యుక్తమే.

సమాసములు :

తేజోమయబిన్దుః : తేజసః వికారః = తేజోమయః, తేజోమయశ్చాసౌ బిన్దుశ్చ = తేజోమయబిన్దుః.
మహీయాన్ : అతిశయేన మహాన్ = మహీయాన్.

భావము :

మహత్త్వములేని మనవంటి పామరుల నేత్రమునందు తేజోరూపమగు బిన్దువుగా నీ చన్ద్రుడు కన్నులయంచులను మడిచినచో తెల్లనిగుండ్రపుటాకారముతో ప్రకాశించుచునే యున్నాడు. కాని మనవంటి పామరులకన్నులయందు గనబడు నీ చంద్రుడు చాలాసూక్ష్మపరిమాణమును నల్పకాలస్థితిని గల్గినవాడు. అనగా కనులయంచులను మడిచి చూచినప్పుడే యతడు కనబడును. అట్లు కన్నుల యంచులను మడువనిచో గనబడడు. కాన నీ చంద్రునికిని ప్రసిద్ధచంద్రునికి ననగా నత్రిమహర్షియొక్క కన్నులయం దుద్భవించిన చంద్రునకును భేదము

న్నది. అత్రిమునియొక్క నేత్రమందు తేజోరూపమగు బిన్దువైన యీ చంద్రుడు చాలా గొప్పవాడు. అనగా నితరచంద్రులకంటెను నెక్కువ పరిమాణమును గల్గినవాడు. ఆ విధముగనే యాచంద్రుడు మాసకాలమునకు ననగా శుక్లపాడ్యమి నుండి కృష్ణచతుర్దశి వరకుండి యమావాస్యతో నశించెడివాడు. కాన నిది యుక్తము. ఏలయనగా "సర్వం హి మహతాం మహత్" అను న్యాయము నను సరించి గొప్పవారికి సంబంధించినదంతయు మిక్కిలి గొప్పగనే యుండును. కాన గొప్పవాడగు నత్రిమహామునియొక్క తేజోరూపమగు బిందువైనను నీ చంద్రుడు గొప్పవానికి సంబంధించినందువలన మహాపరిమాణము గలవాడుగను, చిరకాల స్థాయిగ నుండువాడుగను మననేత్రములలోని తేజోబిన్దురూపమగు చంద్రునికంటె నితనికి భేదము యుక్తమే యని భావము.

శ్లో. త్రాతుం పతిం నౌషధయః స్వశక్త్యా
మన్త్రైణ విప్రాః క్షయిణం న శేకుః ।
ఏనం పయోధిర్మణిభిర్న పుత్రం
సుధాప్రభావైర్న నిజాశ్రయం వా ॥ 99

వ. వి. త్రాతుం - పతిం - న - ఓషధయః - స్వశక్త్యా - మన్త్రైణ - విప్రాః - క్షయిణం - న - శేకుః - ఏనం - పయోధిః - మణిభిః - న - పుత్రం - సుధాప్రభావైః - న - నిజాశ్రయం - వా.

అర్థము: ఓషధయః = మృతసంజీవిని మున్నగు నోషధులు, స్వశక్త్యా = తమ శక్తిచే, పతిం = ఓషధులకు భర్తయైన, క్షయిణం = ప్రతిదినము కలా క్షయముగల్గిన, (క్షయరోగియైన) ఏనం = ఈ చంద్రుని, త్రాతుం = రక్షించుటకు, న శేకుః = సమర్థములు కాకపోయినవి. తథా = అట్లే, విప్రాః = బ్రాహ్మణులు, ఏనం = ద్విజరాజైన యీ చంద్రుని, మన్త్రైణ = మన్త్రములశక్తిచే, త్రాతుం = రక్షించుటకు, న శేకుః = సమర్థులు కాకపోయిరి. తథా = అట్లే, పయోధిః = సముద్రుడుగూడ, పుత్రం = పుత్రుడైన, ఏనం = ఈ చంద్రుని, మణిభిః = రోగనివారకములగు తనయందలి రత్నములచే, త్రాతుం = రక్షించుటకు, న

(శశాక) = సమర్థుడు కాలేదు. తథా = అట్లే, సుధా = అమృతము గూడ, ప్రభావైర్యా = ముదుసలితనమును మరణమును దొలగింపగల తన మహిమలచేత గూడ, నిజాశ్రయం = తనకు నాధారమగు, ఏనం = ఈచంద్రుని, త్రాతుం = రక్షించుటకు, న (శశాక) = సమర్థము కాలేదు. ఓషధులు మున్నగునవి యేవియు చంద్రుని క్షయరోగమునుండి రక్షింప జాలక పోయినవని చెప్పుటచే పూర్వకర్మవలన గల్గిన వ్యాధి మహానుభావుల చే నైతము పరిహరింప సాధ్యముకాదనియు "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" యను న్యాయముననుసరించి దానిననుభవించుట చేతనే నశింప జేయవలయుననియు సూచితము,

**సమాసములు :**

స్వశక్త్యా : స్వాసాంశక్తిః = స్వశక్తిః, తయా = స్వశక్త్యా.
క్షయిణం . క్షయః అస్య అస్తీతి = క్షయీ, తం = క్షయిణమ్.
నిజాశ్రయం : నిజశ్చాసౌఆశ్రయశ్చ = నిజాశ్రయః, తం = నిజాశ్రయం.

**భావము :**

తమకు భర్తయగు నీ చంద్రుని మృతసంజీవిని మున్నగు నోషధులు క్షయరోగమునుండి రక్షింపజాలక పోయినవి. 'ఓషధీశో నిశాంపతిః' యని చెప్పుటచే చంద్రుడు ఓషధులకు భర్తయని తెలియుచున్నది. అట్లే బ్రాహ్మణులు తమకు రాజైన యీ చంద్రుని వేదమంత్రములచే, క్షయరోగమునుండి రక్షింపజాలరైరి. 'ద్విజరాజ శ్శశధరః' యని చెప్పుటచే చంద్రుడు బ్రాహ్మణులకు రాజని తెలియు చున్నది. అట్లే సముద్రుడు తన యందలి ప్రభావవంతములగు రత్నములచే, తన పుత్రుడైన యీ చంద్రునా క్షయరోగమునుండి రక్షింపజాలక పోయెను. పయోధి గర్భమున చంద్రుడుద్భవించుటవలన, చంద్రుడు సముద్రునకుఁ బుత్రుడని తెలియుచున్నది. అట్లే జరామరణములను నివారింప శక్తిగల్గిన యమృతము గూడ తన శక్తులచే, తన కాధారమైన యీ చంద్రుని రక్షింపజాలక పోయినది. కాన పూర్వకర్మజన్యమగు వ్యాధి నెంతటి మహాత్ములునుఁ దప్పించుకొనఁజాలరని భావము.

శ్లో. మృషా విశానాథమహః సుధా వా
హరే దసౌ వా న జరావినాశౌ ।
పీత్వా కథం నాపరధా చకోరా
విధోర్మరీచీ నజరామరాః స్యుః ॥ 100

ప. వి. మృషా - నిశానాథమహః - సుధా - వా - హరేత్ - అసౌ-వా - న-జరావినాశౌ - పీత్వా - కథం - న-అపరధా - చకోరాః - విధోః - మరీచీన్ - అజరామరాః-స్యుః.

అర్థము : నిశానాథమహః; నిశానాథ = చంద్రునియొక్క, మహః = కాంతి' సుధా వా = అమృతమే యను లోకవాదము, మృషా = అసత్యమే యగును. వా = లేదా, అది సత్యమే యైనచో నప్పుడు, అసౌ = చంద్రుని తేజస్సనెడి యమృతము. జరావినాశౌ, జరా = ముసలితనమును, వినాశౌ = మరణమును. న హరేత్ = పోగొట్టదని యంగీకరింపవలెను. అపరధా = అట్లుకానిచో, ననగా చంద్రతేజస్సు, అమృతమనెడి ప్రవాదము సత్యమేయని అది జరామరణములను హరించునని యొప్పుకొనినచో నప్పుడు. చకోరాః = చక్రవాకపక్షులు, విధోః = చంద్రునియొక్క, మరీచీన్ = కిరణములను, పీత్వాఽపి = త్రాగియు, కథం = ఎట్లు, అజరామరాః = జరామరణములు లేనివి, న స్యుః = కావు.

సమాసములు :

నిశానాథమహః : నిశాయాః నాథః = నిశానాథః, నిశానాథస్య మహః = నిశానాథమహః.

జరావినాశౌ : జరా చ వినాశశ్చ = జరావినాశౌ, తౌ = జరావినాశౌ.

అజరామరాః : అవిద్యమానా జరా యేషాంతే = అజరాః. న మ్రియన్త ఇత్యమరాః, అజరాశ్చతే అమరాశ్చ = అజరామరాః.

భావము :

చంద్రుని కాంతి యమృతమనెడి ప్రవాద మసత్యముగనైన నుండవచ్చును. లేదా అది సత్యమేయైనచో అది జరామరణముల బోగొట్టదను విషయము నంగీక

రింపవలసియుండును. లేదా చంద్రుని తేజస్సు అమృతముకాదని గాని యంగీక రింపవలసియుండును. లేదా యిటువంటి అమృతముగూడ జరామరణములను హరించదని గాని యంగీకరింపవలసియుండును. అట్లుగాక, చంద్రుని తేజస్సు అమృతమే యను ప్రవాదము సత్యమే, అది జరామరణములను హరించునని చెప్పి నచో నవ్వుడు చకోరపక్షులు చంద్రకిరణములను గ్రాగియు నేల జరామరణవర్జి తములై యుండుటలేదు? కాన చంద్రతేజస్సు అమృతమనుట యసత్యమేయగును. ఒకవేళ, అది యమృతమే యైనచో దానికి జరామరణములను దొలగించుట యందు సామర్థ్యము లేదని కాని యంగీకరింపవలసియుండును. ఇది "సుధా ప్రభావై ర్న నిశాశ్రయం వా" అను పూర్వశ్లోకార్థమునకు సమాధానమని గ్రహించవలెను. అనగా, నాశ్లోకమునం దమృతము తన ప్రభావములచే తన కాశ్రయమైన చంద్రుని రక్షింపజాలకపోయినదని చెప్పబడినది. అట్లు రక్షింపఁ జాలకపోవుటకు కారణముగా నమృతము జరామరణములను దొలంగించుటయందు సామర్థ్యమిట సందేహింపఁబడినది. కాన నిది దానికి సమాధానమగును.

శ్లో. వాణీభి రాభిః పరిపక్త్రిమాభి
ర్నరేన్ద్రమానన్ద జడఞ్చకార ।
ముహూర్త మాశ్చర్యరసేన భైమీ
హైమీవ వృష్టిస్తిమితఞ్చ తం సా ॥ 101

ప. వి. వాణీభిః - అభిః - - పరిపక్త్రిమాభిః - నరేన్ద్రమ్ - ఆనన్దజడం - చకార - ముహూర్తమ్ - ఆశ్చర్యరసేన - భైమీ - హైమీ - ఇవ - వృష్టిస్తిమితం - చ - తం - సా.

అర్థము: సా = ఆ, భైమీ = దమయంతి, ఆభిః = ముందుఁ జెప్పబడిన, పరి పక్త్రిమాభిః = పరిపాకముతోఁగూడి ప్రసాదాది గుణములతో నొప్పుచున్న, వాణీభిః = వాక్కులతో, ననగా పరిణత కావ్యవచనములతో, తం = ఆ నలమహారాజును, ఆనందజడం = ఆనందపరవశునిగా, చకార = కావిం చెను. తథా = అట్లే, ముహూర్తం = స్వల్పకాలము, ఆశ్చర్యరసేన = అద్భుతరసముతో మఱియు, ఆశ్చర్య = అద్భుతమనెడి, రసేన = నీటితో హైమీ = మంచునకు సంబంధించిన, వృష్టిరివ = వర్షమువలె, భైమీ =

దమయంతి, స్తిమితం = మిక్కిలి ప్రేమవలన స్తంభమనెడి సాత్త్విక భావమునుఁ బొందినవానినిగా, చకార = చేసెను, మఱియు, తడిసిన వానినిగను, చకారం = చేసెను.

**సమాసములు :**

పరిపక్త్రిమాభిః : పరిపాకేన నిర్వృత్తాః = పరిపక్త్రిమాః, తాభిః = పరిపక్త్రిమాభిః.

ఆనందజడం : ఆనందేన జడః = ఆనన్దజడః, తమ్ = ఆనన్దజడమ్.

ఆశ్చర్యరసేన : ఆశ్చర్యమేవ రసః = ఆశ్చర్యరసః, తేన = ఆశ్చర్యరసేన.

హైమీ : హిమస్య ఇయం = హైమీ.

**భావము :**

ఆ దమయంతి పరిణతమగు కవనశక్తి గల్గిన దగుటచే ప్రసాదాది గుణయుక్తములగు తన కావ్యవచనములచే నలమహారాజును హర్షపరవశునిఁ గావించి, స్వల్పకాల మద్భుతరసముచేతను, అద్భుతరసమనెడి జలముచేతను, మంచువానవలె దమయంతి యా నలుని మిక్కిలి స్నేహమువలన స్తంభీభావము పొందినవానినిగను, తడిసినవానినిగను నెట్లుచేయునో, యట్లే యీమెయు నానలుని ఆనందజడునిగను నతిస్నేహము గలవానినిగనుఁ గావించినదని యాశయము.

శ్లో. ఇతో ముఖాద్వాగియ మావిరాసీత్
పీయూషధారామధురేతి జల్పన్ ।
అచుమ్బదస్యాః స ముఖేన్దుబింబం
సంవావదూకశ్రియ మమ్బుజానామ్ ॥ 102

ప. వి. ఇతః - ముఖాత్ - వాక్ - ఇయమ్ - ఆవిరాసీత్ - పీయూషధారామధురా - ఇతి - జల్పన్ - అచుమ్బత్ - అస్యాః - సః - ముఖేన్దుబింబం - సంవావదూకశ్రియమ్ - అమ్బుజానామ్.

**అర్థము:** హే భైమి = ఓ దమయంతీ!, ఇతః = ఈ, ముఖాత్ = నీ ముఖమునుండి, పీయూషధారామధురా, పీయూషధారా = అమృతధారవలె, మధురా =

శ్లో. ప్రియేణ సాఽథ ప్రియమేవ ముక్తా
విదర్భభూమీ పతి వంశముక్తా ।
స్మితాంశుజాలం వితతార తారా
దివః స్ఫురన్తీవ కృతావతారా॥ 103

ప. వి. ప్రియేణ - సా - అథ - ప్రియం-ఏవమ్ - ఉక్తా - విదర్భభూమీపతి వంశముక్తా - స్మితాంశుజాలం - వితతార - తారా - దివః - స్ఫురన్తీ ఇవ - కృతావతారా.

అర్థము: ప్రియేణ = ప్రియుడైన నలునిచే, ఏవం = "ఇతో ముఖాది"త్యాదిరీతితో, ప్రియం = ప్రియమును, ఉక్తా = చెప్పబడిన, విదర్భభూమీపతివంశ ముక్తా, విదర్భ భూమీపతి = విదర్భరాజగు భీమునియొక్క, వంశ = వంశ మునుండి, ముక్తా = జన్మించిన, స్ఫురన్తీ = ప్రకాశించుచున్న కాంతిగల, సా = ఆదమయన్తి, అథ = నలుడుసంభాషించినపిదప, దివః = ఆకసము యొక్క, సకాశాత్ = సమీపమునుండి పుణ్యము క్షీణించుటవలననో, లేదా స్వేచ్ఛతో కాని, కృతావతారా, కృత = చేయబడిన, అవతారా = భూమికి దిగుటగలిగిన, తారేవ = నక్షత్రమువలె, స్మితాంశుజాలం, స్మిత = చిరునగవనెడి, అంశుజాలం = కిరణసమూహమును, వితతార = ఇచ్చినది, "విదర్భభూమీపతి వంశముక్తా". విదర్భభూమీపతి = విదర్భ రాజగు భీమునియొక్క, వంశ = వంశమనెడి వెదురునం దుద్భవించిన, ముక్తా = దేవతలు ధరించెడి ముత్తెమైనదని యర్థము సూచితము.

సమాసములు :

విదర్భభూమీపతి వంశముక్తా : విదర్భాణాం భూమీపతిః = విదర్భ భూమీపతిః, విదర్భభూమీపతేః వంశ ఏవ వంశః = విదర్భభూమిపతి వంశః, విదర్భభూమిపతివంశస్య ముక్తా ఇవముక్తా = విదర్భభూమీపతి వంశముక్తా.

స్మితాంశుజాలం : అంశూనాం జాలః = అంశుజాలః, స్మితమేవ అంశుజాలః = స్మితాంశుజాలః, తం = స్మితాంశుజాలం.

కృతావతారా : కృతః అవతారః యయా సా = కృతావతారా.

**భావము :**

ప్రియునిచే నీవిధముగా జెప్పబడిన ఏదర్భరాజపుత్రీమణి వంశమనెడి వెదురునందు దుద్భవించిన ముత్తెమైనదియు నగు నా దమయన్తి దేదీప్యమానమగు కాంతిగలదై పుణ్యక్షయాదులచే నాకసమునుండి భూమికి దిగినతారవలె చిరునగ వనెడి కిరణజాలము నతని కొసంగినది. అనగా నలుని మాటలకు మందహాసము గావించినదని యర్థము.

శ్లో. స్వవర్ణనా న స్వయ మర్హతీతి
నియుజ్య మాం త్వన్ముఖ మిన్దురూపమ్ ।
స్థానేఽత్యుదాస్తే శశినః ప్రశస్తౌ
ధరాతురాసాఽహమితి స్మ సాఽఽహ ॥ 104

ప. వి. స్వవర్ణనా-న-స్వయం-అర్హతి - ఇతి - నియుజ్య-మాం - త్వన్ముఖమ్ - ఇన్దురూపం - స్థానే - అత్యుదాస్తే - శశినః - ప్రశస్తౌ - ధరాతురా సాహం - ఇతి - స్మ - సా - ఆహ.

**అర్థము:** సా = ఆదమయన్తి, ధరాతురాసాహం = భూమికి ఇంద్రుడైన నలునిగూర్చి, ఇతి = ఈవిధముగా, ఆహ స్మ = చెప్పుచుండినది. (ఏమనగా) హే ప్రియ = ఓప్రియుడా!, ఇన్దురూపం = చంద్రరూప మైన, త్వన్ముఖం = నీముఖము, స్వయం=స్వయముగా, స్వవర్ణనా = తన్ను వర్ణించుకొనుట, నార్హతీతి = తగదని, మాం = నన్ను, నియుజ్య=చంద్రస్తుతియందు నియమించి, శశినః= చంద్రునియొక్క, ప్రశస్తౌ = ప్రశంసయందు, అత్యుదాస్తే= మిక్కిలి యుదాసీనముగా నున్నది. ఏతత్ = ఇది, స్థానే= యుక్తము, "సతా మేత దకర్తవ్యం పరనిన్దాత్మనః స్తుతిః" యను వచనము ననుసరించి తన్నుదానే స్తుతిజేసి కొనుట యుక్తముగాదు. ఇంతవరకును నేను చంద్రుని వర్ణించితిని. ఇపుడు నీవు వర్ణింపుము. లేదా యూరకయుండుము అని దమయన్తి చంద్రస్తుతి యందు నలమహారాజును పరిహాసగర్భముగా ప్రేరేపించినది.

**సమాసములు :**

స్వవర్ణనా : స్వస్య వర్ణనా = స్వవర్ణనా.

త్వన్ముఖం : తవ ముఖం = త్వన్ముఖం.
ఇన్దురూపం : ఇందోః రూప మివ రూపం యస్య తత్ = ఇన్దురూపమ్.
ధరాతురాసాహం : ధరాయాః తురాసాట్ = ధరాతురాసాట్, తం = ధరాతురాసాహం.

**భావము :**

ఆదమయన్తి భూలోకమున కింద్రుడైన నలమహారాజునుగూర్చి యిట్లు చెప్పినది. ఓప్రియుడా! నీముఖచంద్రరూపమైనందువలన, చంద్రస్తుతిని నీవు గావించుట యాత్మస్తుతి యగునని భావించి చంద్రస్తుతియందు నన్ను నియమించి నీవు యూరకయుండుట యుక్తమే యగుచున్నది. ఏలయనగా సత్పురుషులు పరనిందను ఆత్మస్తుతిని చేయరని చెప్పుదురు. ఇంతవఱకును నేను చంద్రుని వర్ణించితిని. ఇప్పుడు నీవు వర్ణించుటయో లేక యూరకయుండుటయో యుక్తము. అనెడి యాశయముతో దమయంతి చంద్రస్తుతియం దానలమహారాజును నర్మగర్భముగాఁ బ్రేరేపించినది.

శ్లో. తయేరితః ప్రాణసమః సుముఖ్యా
గిరం పరీహాసరసోత్కిరాం సః।
భూలోకసారః స్మితవాక్ తుషార
భానుం భణిష్యన్ సుభగాం బభాణ ॥ 105

ప. వి. తయా - ఈరితః - ప్రాణసమః - సుముఖ్యా - గిరం - పరీహాసరసోత్కిరాం - సః - భూలోకసారః - స్మితవాక్ - తుషారభానుం - భణిష్యన్ - సుభగాం - బభాణ.

అర్థము: భూలోకసారః, భూలోక = భూలోకమునందు, సారః = శ్రేష్ఠుడైన నలమహారాజు, స్మితవాక్ = మందహాసపూర్వకమగు వచనము గలవాడై, తుషారభానుం = మంచుతోగూడిన కిరణములుగల చంద్రుని, భణిష్యన్ = వర్ణింపఁబోవుచు, తయా = ఆ, సుముఖ్యా = సుందర ముఖముగల దమయంతిచే, పరీహాసరసోత్కిరాం, పరీహాసరస = పరిహాసరసమును, ఉత్కిరాం = ప్రకటించెడి, గిరం = వాక్కును,

ఉక్తః = చెప్పబడినవాడును, ప్రాణసమః = మిక్కిలి ప్రియుడునునై, ఈరితః = చంద్రవర్ణనయందుఁ బ్రేరితుడునై, పరీహాసరసోత్కిరాం = పరిహాసరసమును వెదజల్లెడి, గిరం = వాక్కును, సుభగాం = సౌభాగ్యవతియగు దమయంతినిగూర్చి, బభాణ = పలికెను.

**సమాసములు :**

ప్రాణసమః : ప్రాణేన సమః = ప్రాణసమః.
సుముఖ్యా : శోభనం ముఖం యస్యాస్సా = సుముఖీ, తయా = సుముఖ్యా.
పరీహాసరసోత్కిరాం : పరీహాస ఏవ రసః = పరీహాసరసః, పరీహాస రసముత్కిరతీతి = పరీహాసరసోత్కిరా, తాం = పరీహాసరసోత్కిరాం.
భూలోకసారః : భూరితి లోకః = భూలోకః, భూలోకస్యసారః భూలోకసారః.

స్మితవాక్ : స్మితపూర్వా వాక్ యస్య సః = స్మితవాక్.
తుషారభానుం : తుషారా భానవః యస్య సః = తుషారభానుః, తం = తుషారభానుం.

**భావము :**

భూలోకమునందు శ్రేష్ఠుడగు నా నలమహారాజు చిరునగవుగల మాటలు గలవాడై చంద్రుని వర్ణింపబోవుచు ఆ దమయన్తిచే పరిహాసరసమును వెదజల్లు నట్టి మాటను జెప్పబడినవాడై, యామె కెక్కువప్రీతిని గల్పించుచు, చంద్రవర్ణన యందు నామెవలన బ్రేరితుడై పరిహాసరసమును వెదజల్లెడి మాటలతో నామెను గూర్చి చెప్పదొడగెను.

శ్లో. తవాననే జాతచరీం నిపీయ
గీతిం తదాకర్ణనలోలుపోఽయమ్ ।
హాతుం న జాతు స్పృహయ త్యవైమి
విధుం మృగ స్త్వద్వదనభ్రమేణ ॥

వ. వి. తవ - ఆననే - జాతచరీం - నిపీయ - గీతిం - తదాకర్ణనలోలుపః - అయమ్ - హాతుం - న - జాతు - స్పృహయతి - అవైమి - విధుం - మృగః - త్వద్వదనభ్రమేణ.

అర్థము: హే ప్రియే! = ఓ ప్రియురాలా! అయం = ఈ, మృగః = చంద్రునందలి జింక, తవ = నీయొక్క, ఆననే = ముఖమునందు, జాతచరీం = పూర్వ ముత్పన్నమైన, గీతిం = పాటను, నిపీయ = ఆదరముతో విని, (ఇదానీమపి = ఇప్పుడును) తదాకర్ణనలోలుపః, తత్ = ఆ పాటను, ఆకర్ణన = వినుటయందు, లోలుపః = ఆసక్తిగలిగినదై, త్వద్వదన భ్రమేణ, త్వత్ = నీయొక్క, వదన = ముఖమనెడి, భ్రమేణ = భ్రమతో, విధుం = చంద్రుని, జాతు = ఒకప్పుడును, హాతుం = వదిలిపెట్టుటకు, న స్పృహయతి = కోరుటలేదు. (ఇతి = అని) అవైమి = తెలుసుకొనుచున్నాను.

**సమాసములు :**

జాతచరీం : పూర్వం జాతా = జాతచరీ, తాం = జాతచరీమ్.
తదాకర్ణనలోలుపః : తస్యాః ఆకర్ణనం = తదాకర్ణనం, తదాకర్ణనే లోలుపః = తదాకర్ణనలోలుపః.
త్వద్వదనభ్రమేణ : తవ వదనం = త్వద్వదనం, త్వద్వదనస్య భ్రమః = త్వద్వదనభ్రమః, తేన = త్వద్వదనభ్రమేణ.

**భావము :**

చంద్రునియందున్న యీ జింక నీనోట బూర్వ ముద్భవించిన పాటను ననగా నీవు పాడిన పాటను విని యా పాటను మఱల వినుటకు ఆసక్తికలిగినదై నీముఖముతో చంద్రునికి మిక్కిలి పోలికయుండుటవలన చంద్రుని నీముఖముగా భ్రాంతి చెంది, దానిని విడిచిపెట్ట నెప్పుడు నిష్టపడుటలేదు. అనగా నీముఖము చంద్రునిమించి యున్నదని యాశయము.

శ్లో. ఇందోర్భ్రమే ణోపగమాయ యోగ్యే
జిహ్వే తవాఽఽస్యే విధువాస్తుమన్తం ।
గీత్యా మృగం కర్షతి బధ్నతీ తా కిం
పాశీబభూవే శ్రవణద్వయేన ॥ 107

ప. వి. ఇందోః - భ్రమేణ - ఉపగమాయ - యోగ్యే - జిహ్వే - తవ-ఆస్యే-విధువాస్తుమన్తం - గీత్యా - మృగం కర్షతి - బధ్నతీ తా - కిం-పాశీబభూవే - శ్రవణద్వయేన.

అర్థము: ఇందోః = చంద్రునియొక్క, భ్రమేణ = మిక్కిలి సామ్యముండుటచే, చంద్రుడే యిదియనెడి భ్రమతో, ఉపగమాయ = మృగమును పొందుటకై, యోగ్యే = తగినట్టి, తవ = నీయొక్క, ఆస్యే = ముఖమునందు, జిహ్వే = నాలుక, గీత్యా = పాటచే, విధువాస్తుమన్తం, విధు = చంద్రుడనెడి, వాస్తుమన్తం = వసతిగృహము గలిగిన, మృగం = జింకను, కర్షతి = లాగుచున్నది, బధ్నతీతాం = (వచ్చెడి యా మృగమును నిచ్చట నివసింపుటకు) బంధింపబోవు, శ్రవణద్వయేన = నీరెండుచెవుల చేతను. పాశీబభూవే కిం ? = పాశములుగా ననగా త్రాళ్ళుగా నేర్పడుట యైనది. నీచెవులనెడి త్రాళ్ళచే నామృగము నాకర్షింప వలయునని యర్థము. బోయెత యరణ్యమున వ్యాధగీతిచే మృగము నాకర్షించి బంధించును గదా! నీ ముఖము కళఙ్కరహితమై యమృతమునకంటెను నధికమగు మాధుర్యముగల గీతితో గూడినది. చంద్రుడో కళంకము గలవాడు. చంద్రవర్ణన సమయమునందును మధ్యమధ్య ప్రియురాలి ముఖమును వర్ణించుట యామెయందలి యనురాగాతిశయమును సూచించుచున్నది.

సమాసములు :

విధువాస్తుమన్తం : విధుః వాస్తు అస్య అస్తీతి = విధువాస్తుమాన్, తం = విధువాస్తుమన్తం.
పాశీబభూవే : అపాశేన పాశేన సమ్పద్యమానేన బభూవే = పాశీబభూవే.

శ్రవణద్వయేన : శ్రవణయోః ద్వయం = శ్రవణద్వయం, తేన = శ్రవణద్వయేన.

**భావము :**

చంద్రునితో మిక్కుటమగు సామ్యముండుటవలన భ్రమతో నీముఖము చంద్రునిమృగమును బొంద నర్హమైయున్నది. అట్టి మృగమును నీనాలుక మధుర గీతముచే నాకర్షించుగాత. మృగము గానప్రియము గాన తప్పక రాగలదు. అట్లు వచ్చెడి యామృగమును మరలిపోనీయక బంధించుటకు నీచెవులు రెండును పాశములుగా వనగా త్రాళ్ళుగా నేర్పడినవి.

గమనిక : ఈ శ్లోకము ప్రక్షిప్తమని కొంద అందురు.

శ్లో. ఆప్యాయనాద్వా రుచిభి స్సుధాంశోః
శైత్యాత్తమః కాననజన్మనో వా ।
యావన్నిశాయా మథ ఘర్మదుఃస్థ
స్తావద్వ్రజ త్యహ్ని న శబ్దపాన్థః ॥ 108

వ. వి. ఆప్యాయనాత్ - వా - రుచిభిః - సుధాంశోః - శైత్యాత్ - తమః - కానన జన్మనః - వా - యావత్ - నిశాయాం - అథ - ఘర్మదుఃస్థః - తావత్ - వ్రజతి - అహ్ని - న - శబ్దపాన్థః.

అర్థము: శబ్దపాన్థః = శబ్దమనెడి బాటసారి, నిశాయాం = రాత్రియందు, యావత్ = ఎంతదూరము, వ్రజతి = పోవునో, తావత్ = అంత దూరము, అహ్ని = పగటియందు, న వ్రజతి = పోజాలదు, యస్మాత్ = ఏలయనగా. ఘర్మదుఃస్థః ఘర్మ = (పగటియందు) వేడిమిచే, దుఃస్థః = సంతాపము జెందినవాడు కాన. పగటియందు కొంచెమే నడుచును. సుధాంశోః = చంద్రునియొక్క, రుచిభిః = అమృతరూపములగు కాంతులచే, ఆప్యాయనాద్వా = ఉజ్జీవింపజేయుట వలననో, తమఃకానన జన్మనః, తమః = చీకటియనెడి, కానన = అరణ్యమునుండి, జన్మనః = ఉత్పత్తిగలిగిన, శైత్యాద్వా = చల్లదనముచేతగాని, (బహు = ఎక్కువగా, గచ్ఛతి = పోవుచున్నది). శబ్దము రాత్రియందు స్వాభావిక

ముగా చాలాదూరము వినబడును. పగటియందు ప్రపంచకోలాహలము వలన చాలదూరము వినబడదు.

**సమాసములు :**

తమఃకాననజన్మనః : తమ ఇతి కాననం = తమఃకాననం, తమఃకాననాత్ జన్మ యస్య తత్ = తమఃకాననజన్మ, తస్మాత్ = తమఃకానన జన్మనః.

శబ్దపాన్థః : పథిగచ్ఛతీతి = పాన్థః, శబ్ద ఏవ పాన్థః = శబ్దపాన్థః.

**భావము :**

శబ్దమనెడి బాటసారి చంద్రునియొక్క యమృతమయపు కాంతులతో నాప్యాయనము బొందుటవలననో లేదా చీకటియను నడవియందు గల్గిన చల్లదనమువలననో రాత్రియందు నడిచినంతదూరమును పగటియందు సూర్యుని వేడిమిచే సంతాపమునొందినవాడై నడుచుటలేదు. రాత్రియందు చల్లదనమువలన నెక్కువదూరమును నడుచును. పగటియందు నెండవలన తక్కువదూరమును నడుచును. బాటసారియు రాత్రి చల్లదనముచే, నెక్కువదూరమును, పగలు ఎండచే తక్కువదూరమును నడుచును గదా!

శ్లో. దూరేఽపి తత్త్వావకగానపానా
ల్లబ్ధావధిః స్వాదురసోపభోగే ।
అవజ్ఞయైవ క్షిపతి క్షపాయాః
పతిః ఖలు స్వాన్యమృతాని భాసః ॥ 109

ప. వి. దూరే - అపి - తత్త్వావకగానపానాత్ - లబ్ధావధిః - స్వాదురసోపభోగేః - అవజ్ఞయా - ఏవ - క్షిపతి - క్షపాయాః - పతిః - ఖలు - స్వాని - అమృతాని - భాసః.

**అర్థము:** హే ప్రియే! = ఓ ప్రియురాలా!, ఖలు = నిశ్చయముగా, క్షపాయాః = రాత్రికి, పతిః = భర్తయగు చంద్రుడు, భాసః = కాంతులనెడి

స్వాని = తనకు సంబంధించిన, అమృతములకు, దూరేఽపి = మిక్కిలి దూరమునందున్నను, తత్తావకగానపానాత్, తత్ = ప్రసిద్ధమును మిక్కిలి మధురమునగు, తావక = నీకుసంబంధించిన, గాన = గానమును, పానాత్ = ఆదరముతో వినుటవలన, స్వాదురసోపభోగే స్వాదురస = మధురరసమును, ఉపభోగే = అనుభవించెడి విషయమున లబ్ధావధిః. లబ్ధ = పొందబడిన, అవధిః = ఎల్లగల్గినవాడై, అవజ్ఞయైన = అనుభవింపబడిన నీపాటయందలి మాధుర్యముకంటెను నల్ప మాధుర్యము కలిగియుండుటవలన యనాదరముచేతనో యనునట్లు, క్షిపతి = దిగువకు వదలివేయుచున్నాడు.

సమాసములు :

తత్తావకగానపానాత్ : తవ ఇదం = తావకం, తచ్చ తత్ తావకం చ = తత్తావకం. తత్తావకం చ గానం చ = తత్తావకగానం, తత్తావకగానస్య పానం = తత్తావకగానపానం. తస్మాత్ = తత్తావకగానపానాత్.

లబ్ధావధిః : లబ్ధః అవధిః యేన సః = లబ్ధావధిః.

స్వాదురసోపభోగే : స్వాదుశ్చాసౌ రసశ్చ = స్వాదురసః, స్వాదురసస్య ఉపభోగః = స్వాదురసోపభోగః, తస్మిన్ = స్వాదురసోపభోగే.

భావము :

ఓ ప్రియురాలా? రాత్రికి భర్తయగు చంద్రుడు దూరమందున్నను మధురమగు నీగానము నాదరముతో వినుటవన మాధుర్యాతిశయవిషయమున కడపటి యవధిని పొందినవాడై నీగానామృతముకంటెను నల్పమాదుర్యము కలిగి, యుండుటవలన తన వెన్నెలలనెడి యమృతములను ననాదరముచేతనో యనునట్లు దిగువకు వదలుచున్నాడు.

శ్లో. అస్మిన్న విస్మాపయతేఽయ మస్మాం
శ్చక్షుర్బభూ వైష యదాదిపుంసః ।
తదత్రినేత్రా దుదితస్య తన్వి!
కులానురూపం కిల రూప మస్య ॥ 110

ప. వి. అస్మిన్ - న - విస్మాపయతే - అయం - అస్మాన్ - చక్షుః - బభూవ - ఏషః - యత్ - ఆదిపుంసః - తత్ - అత్రినేత్రాత్ - ఉదితస్య - తన్వి - కులానురూపం - కిల - రూపం - అస్య.

అర్థము. హే తన్వి! = ఓసుందరీ!. ఏషః = ఈచంద్రుడు, ఆదిపుంసః = ఆదిపురుషుడగు విష్ణువునకు, చక్షుః = ఎడమకన్నుగా, బభూవేతి యత్ = ఉండెననుట యేదిగలదో, అస్మిన్ = నేత్రముగానుండు విషయమున, అయం = ఈచంద్రుడు, అస్మాన్ = మనలను, న విస్మాపయతే = ఆశ్చర్యపరచుటలేదు. కిల = ఏలయనగా?, అత్రి నేత్రాత్ = అత్రిమహర్షియొక్క కంటినుండి, ఉదితస్య = పుట్టిన, అస్య = ఈచంద్రునికి, తత్ = ఆనేత్రముగానుండుట, కులాను రూపం = వంశమునకు తగినది. నేత్రమునుండి పుట్టినవాడు, నేత్ర మగుట తగినదని యర్థము. కాని నీచంద్రుడు ఆదిపురుషుడగు విష్ణువునకు కన్నగుటలో మాకు వింతలేదు.

సమాసములు :

ఆదిపుంసః : ఆదౌ పుమాన్ = ఆదిపుమాన్, తస్య = ఆదిపుంసః.
అత్రినేత్రాత్ : అత్రేః నేత్రం = అత్రినేత్రం, తస్మాత్ = అత్రి నేత్రాత్.
కులానురూపం : కులస్య అనురూపం = కులానురూపం.

భావము :

ఈచంద్రుడు ఆదిపురుషుడగు శ్రీమహావిష్ణువునకు ఎడమకన్నుగా నుండుటలో నతడు మనకాశ్చర్యమును గల్గించుటలేదు. ఏలయనగా? అత్రిమహర్షి

నేత్రమునుండి యుద్భవించెనుగదా! అట్లునేత్రమునుండి పుట్టినవాడు విష్ణువునకు నేత్రమగుట తగినదే! అది యతని కులోచితమైన ధర్మము.

శ్లో. అభిర్మృగేన్ద్రోదరి। కౌముదీభిః
క్షీరస్య ధారాభి రివ క్షణేన ।
అక్షాలి నీలీ రుచి రమ్బరస్థా
తమోమయీయం రజనీరజక్యా ॥ 111

ప. వి. అభిః - మృగేన్ద్రోదరి! కౌముదీభిః - క్షీరస్య - ధారాభిః - ఇవ - క్షణేన - అక్షాలి - నీలీ - రుచిః - అమ్బరస్థా - తమోమయీ - ఇయం - రజనీ రజక్యా.

అర్థము: హే మృగేన్ద్రోదరి! = సింహమువంటి పలుచని యుదరముగల యో దేపయస్త్రీ! రజనీరజక్యా, రజనీ = రాత్రియనెడి, రజక్యా = చాకలి దానిచే, క్షీరస్య = పాలయొక్క, ధారాభిరివ = ధారలో యనునట్లు కనబడునట్టి, అభిః = ఈ, కౌముదీభిః = వెన్నెలలచే, అమ్బరస్థా = ఆకసమునందున్నట్టి, (వస్త్రమునందున్నట్టి) తమోమయీ = చీకటి యొక్క రూపమును గలిగిన, ఇయం = ఈ, నీలీ = కాటుకవంటి నల్లని, రుచిః = కాన్తి, క్షణేన = క్షణకాలముచే, అక్షాలి = కడిగి వేయబడినది.

కలాకోశమందు—

"తైలం ఘృతేన తచ్చోష్ణజలై ర్దుగ్ధేన కజ్జలం
నాశయే దమ్బరస్థం తు మలం క్షారేణ సోష్మణా"

అని తైలమును నేయిచేతను, నేతిని వేడినీళ్ళచేతను, కాటుకను పాలచేతను, వస్త్రమందున్న మాలిన్యమును వేడితోగూడిన చవుడు మున్నగు క్షారపదార్థము చేతను దొలగింపవలయునని చెప్పబడినది.

సమాసములు :

హే మృగేన్ద్రోదరి : మృగేన్ద్రస్య ఉదర మివ ఉదరం యస్యాః సా = మృగేన్ద్రోదరీ, తస్యాః స్సంబుద్ధిః = హే మృగేన్ద్రోదరి!
అమ్బరస్థా : అమ్బరే తిష్ఠతీతి = అమ్బరస్థా.

తమోమయీ : తమసః వికారః = తమోమయీ.

రజనీరజక్యా : రజన్యేవ రజకీ = రజనీరజకీ, తయా = రజనీరజక్యా.

**భావము :**

సింహమువంటి పలుచని యుదరముగల యోదమయస్త్రీ! రాత్రియనెడి చాకలిది క్షీరధారలవలె గనబడు వెన్నెలచే గగనమందున్నదియును (వస్త్రము నందున్నదియు) నగు చీకటియనెడి కాటుకరంగును క్షణమాత్రమున దొలగించినది. పైనచెప్పిన కలాకోశవచనము ననుసరించి కాటుకవన్నెను పాలచే దొలగింప వలయునట. కాన వెన్నెలలనెడి పాలచే నాకసమందలి చీకటియనెడి కాటుకవన్నెను రాత్రియనెడి చాకలిది శుభ్రపరచినదని యర్థము. అనగా వెన్నెల చక్కగా వ్యాపించుటచే గగనము శుభ్రమైనదని యాశయము.

శ్లో. పయోముచాం మేచకిమానముచ్చై-

రుచ్చాటయామాస ఋతుః శరద్యా ।

అపారి వామోరు! తథాఽపి కిఞ్చి-

న్న ప్రోఞ్ఛితుం లాఞ్ఛనకాలిమాఽస్య॥ 112

ప. వి. పయోముచాం - మేచకిమానం - ఉచ్చైః - ఉచ్చాటయామాస - ఋతుః - శరత్ - యా - అపారి - వామోరు! - తథా - అపి - కించిత్ - న - ప్రోఞ్ఛితుం - లాఞ్ఛనకాలిమా - అస్య.

అర్థము: హే వామోరు! = అందములైన తొడలుగల యోదమయస్త్రీ!, యా = ఏ, శరత్ = శరత్తనెడి, ఋతుః = ఋతువు, పయోముచాం = వర్షర్తుమేఘములయొక్క, ఉచ్చైః = అధికమైన, మేచకిమానం = నల్లదనమును, ఉచ్చాటయామాస = తొలగించినదో, తయాఽపి = (నల్లదనమును తొలగించుటయందు సామర్థ్యము గలిగిన) ఆ శరదృతువుచేతను, అస్య = ఈచంద్రునియొక్క, లాఞ్ఛనకాలిమా = కలఙ్కరూపమైన నల్లదనము, కించిత్ = కొంచెమైనను ప్రోఞ్ఛితుం = తుడిచివేయుటకు, నాపారి = శక్యము కాలేదు. శరదృతువుచే నిర్మలమగు చంద్రునియందు నల్లనికలఙ్కము మిక్కిలి శోభించుచున్నదని యర్థము.

**సమాసములు :**

పయోముచాం : పయాంసి ముఞ్చన్తీతి = పయోముచః, తేషాం = పయోముచామ్.

హేవామోరు : వామౌ ఊరూ యస్యా స్సా = వామోరూః, తస్యా స్సంబుద్ధిః = హేవామోరు.

లాఞ్ఛనకాలిమా · లాఞ్ఛనమేవ కాలిమా = లాఞ్ఛనకాలిమా.

**భావము :**

ఓ వామోరూ! శరదృతువు మేఘములయొక్క యతిశయించిన వర్షకాలపు నల్లదనమును తొలగించినది. కాని యిట్లు నల్లదనమును దొలగించుటయందు శక్తిగల యాశరత్తు ఈచంద్రునియొక్క కలఙ్కరూపమైన నల్లదనమును దొలగింపలేక పోయినది. అనగా శరదృతువుచే నిర్మలమగు చంద్రునియందు కలఙ్కము చక్కగా శోభించుచున్నదని యర్థము.

శ్లో. ఏకాదశైకాదశరుద్రమౌలీ
నస్తం యతో యాన్తి కలాః కిమస్య ।
ప్రవిశ్య శేషాస్తు భవన్తి పఞ్చ
పఞ్చేషు తూణీమిషవోఽర్ధచన్ద్రాః ॥ 113

ప. వి. ఏకాదశ - ఏకాదశరుద్రమౌలీన్ - అస్తం - యతః - యాన్తి - కలాః - కిం - అస్య. - ప్రవిశ్య - శేషాః - తు - భవన్తి - పఞ్చ - పఞ్చేషు తూణీం - ఇషవః - అర్ధచన్ద్రాః.

అర్థము; అస్తం = అస్తపర్వతమును, యతః = పొందుచున్న, అస్య = ఈ చంద్రునియొక్క, ఏకాదశ = పదునొకండగు, కలాః = కలలు, ఏకాదశరుద్రమౌలీన్ = పదునొకండురుద్రుల శిరములనుగూర్చి, యాన్తి = పోవుచున్నవి. శేషాః = మిగిలిన, పఞ్చతు = ఐదుకలలలో, పఞ్చేషుతూణీం, పఞ్చేషు = మన్మథునియొక్క, తూణీం = అంబులపొదిని, ప్రవిశ్య = ప్రవేశించి, అర్ధచన్ద్రాః = అర్ధచంద్రాకారములైన, ఇషవః = బాణములుగా భవన్తి = అగుచున్నవి.

**సమాసములు :**

ఏకాదశరుద్రమౌలీన్ : ఏకాదశ చ తే రుద్రాశ్చ = ఏకాదశరుద్రాః, ఏకాదశరుద్రాణాం మౌలయః = ఏకాదశరుద్రమౌలయః, తాన్ = ఏకాదశ రుద్రమౌలీన్.

పఞ్చేషుతూణీం : పఞ్చ ఇషవః యస్య సః = పఞ్చేషుః, పఞ్చేషోః తూణీ = పఞ్చేషుతూణీ, తాం = పఞ్చేషుతూణీం.

**భావము :**

అస్తమించెడి యీచంద్రునియొక్క పదునొకండు కలలు, పదునొకండు రుద్రుల శిరములను బొందుచున్నవి. తక్కిన ఐదు కలలును నర్ధచంద్రాకారపు బాణములై పంచబాణునియొక్క యంబులపొదిని పొందుచున్నవి.

శ్లో. నిరంతరత్వేన విధాయ తన్వి
తారాసహస్రాణి యది క్రియేత ।
సుధాంశు రన్యః సకలఙ్కముక్త
స్తదా త్వదాస్యశ్రియ మాశ్రయేత ॥ 114

ప. వి. నిరంతరత్వేన - విధాయ - తన్వి - తారాసహస్రాణి - యది - క్రియేత - సుధాంశుః - అన్యః - సః - కలఙ్కముక్తః - తదా - త్వదాస్యశ్రియం - ఆశ్రయేత.

అర్థము: హేతన్వి! = ఓసుందరీ!, తారాసహస్రాణి = వేలకొలంది నక్షత్రములను, నిరన్తరత్వేన విధాయ = ఒండొంటికి సందులేనట్లు చేర్చి యొకటిగ జేసి, అన్యః = మరియొక, సుధాంశుః = చంద్రుడు, యది క్రియేత = చేయబడినచో, తదా = అవుడు, సః = ఆచంద్రుడు, కలఙ్కముక్తః = (నక్షత్రములకు కలఙ్కము లేనందువలన) కలఙ్కముచే విడుపబడినవాడై, త్వదాస్యశ్రియం. త్వదాస్య = నీముఖముయొక్క, శ్రియం = శోభను. ఆశ్రయేత = ఆశ్రయించును.

**సమాసములు :**

నిరన్తరత్వేన : నిర్గతం అన్తరం యేభ్య స్తాని = నిరన్తరాణి, నిరన్తరాణాం భావః = నిరన్తరత్వం, తేన = నిరన్తరత్వేన.

తారాసహస్రాణి : తారాణాం సహస్రాణి = తారాసహస్రాణి.
కలఙ్కముక్తః : కలఙ్కాత్ ముక్తః = కలఙ్కముక్తః.
త్వదాస్యశ్రియం: తవ ఆస్యం = త్వదాస్యం, త్వదాస్యస్య శ్రీః = త్వదాస్యశ్రీః, తాం = త్వదాస్యశ్రియం.

**భావము :**

ఓసుందరీ! వేలకొలది నక్షత్రములను సందులేకుండునట్లు గావించి యొకటిగగూర్చి, మరియొక చంద్రుడుగా గావించినచో నప్పుడు కలంకములేని యా చంద్రుడు నీముఖశోభను బొందగలడు. నక్షత్రములకు కలఙ్కములేనందున వానితో నిర్మింపబడిన చంద్రుడును కలఙ్కరహితుడే యగునుగదా!,

**శ్లో.** యత్పద్మమాదిత్సతవాఽఽననీయాం
కురఙ్గలక్ష్మాచమృగాక్షి!లక్ష్మీం ।
ఏకార్థలిప్సాకృత ఏష శఙ్కే
శశాఙ్కపఙ్కేరుహయోర్విరోధః ॥ 115

ప. వి. యత్ - పద్మం - ఆదిత్స - తవ - ఆననీయాం - కురఙ్గలక్ష్మా - చ - మృగాక్షి - లక్ష్మీం - ఏకార్థలిప్సాకృతః - ఏషః - శఙ్కే - శశాఙ్కపఙ్కేరుహయోః - విరోధః.

అర్థము: హేమృగాక్షి = లేడికన్నులువంటి కన్నులుగల యోదమయన్తీ, యత్ = ఏపద్మము, తవ = నీయొక్క, ఆననీయాం = ముఖమునకు సంబంధించిన లక్ష్మీం = శోభను, ఆదిత్స = గ్రహింపగోరినదో, కురఙ్గలక్ష్మా = మృగాఙ్కుడగు చంద్రుడును, తవ = నీయొక్క, ఆననీయాం = ముఖమునకు సంబంధించిన, లక్ష్మీం = శోభను, ఆదిత్సుః = గ్రహింపగోరెనో, తత్ = అందువలన, తయోః = ఆ, శశాఙ్కపఙ్కేరుహయోః = చంద్రపద్మములకు, ఏషః = ఈః, విరోధః = వైరము, ఏకార్థలిప్సాకృతః. ఏకార్థ = నీయొక్కముఖశోభయనెడి యొక అర్థమును, లిప్సా = పొందగోరికచే, కృతః = చేయబడినది. (ఇతి = అని) శఙ్కే = సందేహింతును లోకమునం దొకవస్తువునే గోరువారికి వైరము ప్రసిద్ధము. చంద్రపద్మ

ములకును వైరము ప్రసిద్ధమే. చంద్రపద్మములు రెండును ముఖశోభను గ్రహింపగోరినందువలన నారెంటికంటెను ముఖము అధికమని యర్థము.

**ససమాములు:**

ఆదిత్సు : ఆదాతు మిచ్ఛు = ఆదిత్సు.
ఆననీయాం : ఆననస్య ఇయం = ఆననీయా, తాం = ఆననీయామ్.
కురఙ్గలక్ష్మా : కురఙ్గః లక్ష్మ యస్య సః = కురఙ్గలక్ష్మా.
హే మృగాక్షి! : మృగస్య అక్షిణీవ అక్షిణీ యస్యాస్సా = మృగాక్షీ, తస్యాస్సంబుద్ధిః = హే మృగాక్షి!.
ఏకార్థలిప్సాకృతః : ఏక శ్చాసౌ అర్థశ్చ = ఏకార్థః, లబ్ధు మిచ్ఛా = లిప్సా, ఏకార్థస్య లిప్సా = ఏకార్థలిప్సా. ఏకార్థలిప్సయా కృతః = ఏకార్థలిప్సాకృతః.
శశాఙ్కపఙ్కేరుహయోః : శశాఙ్కశ్చ పఙ్కేరుహం చ = శశాఙ్కపఙ్కేరుహే, తయోః = శశాఙ్కపఙ్కేరుహయోః.

**భావము:**

ఓ మృగాక్షి! పద్మము నీముఖశోభను గ్రహింపగోరుచున్నది. అట్లే చంద్రుడును నీముఖశోభను గ్రహింపగోరుచున్నాడు. కాన పద్మచంద్రులకు వైరము ఒక్కవస్తువును గ్రహింపవలయుననెడి కోరికచే నేర్పడినదని నేను తలంతును. ఒక్కవస్తువునే కోరువారికి వైరము ప్రసిద్ధముగదా! పద్మచంద్రులకును వైరము ప్రసిద్ధమే. ఆవైరమున కిదియే కారణమని నాతలంపు. అనగా పద్మచంద్రులకంటెను నీముఖము అధికమని సారాంశము.

శ్లో. లబ్ధం న లేఖప్రభుణాఽపి పాతుం
పీత్వా ముఖేన్దోరధరామృతం తే ।
నిపీయ దేవైర్విఘసీకృతాయాం
ఘృణాం విధోరస్య దధే సుధాయామ్ ॥ 116

ప. వి. లబ్ధం - న - లేఖప్రభుణా - అపి - పాతుం - పీత్వా - ముఖేన్దోః - అధరామృతం - తే - నిపీయ - దేవైః - విఘసీకృతాయాం - ఘృణాం - విధోః - అస్య - దధే - సుధాయాం.

అర్థము: హే ప్రియే! = ఓ ప్రియురాలా!, (అహం = నేను) దేవైః = దేవతలచేత, విఘసీకృతాయాం = నిశ్శేషముగా త్రాగి మిగిలింపబడినట్టి, అస్య = ఈచంద్రునియొక్క, సుధాయాం = ఉచ్ఛిష్టమైన అమృతమునందు. లేఖప్రభుణాపి = దేవతల ప్రభువగు నింద్రునిచేతను, పాతుం = పానము చేయుటకు, న లబ్ధం = లభించనటువంటి, తే = నీయొక్క, ముఖేన్దోః = ముఖచంద్రునియొక్క, అధరామృతం = పెదవియందలి యమృతమును, నిపీయ = పానము గావించి, ఘృణాం = జుగుప్సను, అనగా ఏవగింపును, దధే = వహింతును.

**సమాసములు ;**

లేఖప్రభుణా : లేఖానాం ప్రభుః = లేఖప్రభుః, తేన = లేఖప్రభుణా.
ముఖేన్దోః : ముఖమిందు రివ = ముఖేన్దుః, తస్య = ముఖేన్దోః.
అధరామృతం : అధరస్య అమృతం = అధరామృతం, తత్ = అధరామృతం.

విఘసీకృతాయాం : అవిఘసః విఘసః సమ్పద్యమానః కృతా, విఘసీకృతా, తస్యాం = విఘసీకృతాయామ్.

**భావము ;**

ఓ ప్రియురాలా! నీవు స్వయంవరకాలమందు వరించనందువలన ఇంద్రునికైనను నీ ముఖ చంద్రుని యధరామృతము దుర్లభమైనది. అట్టి నీ ముఖ చంద్రుని యధరామృతమును గ్రోలినట్టి నేను దేవతలందరు పానము గావించి మిగిల్చినట్టి యుచ్ఛిష్టమగు చంద్రుని పానముచేయుట ప్రసిద్ధము. అనగా చంద్రుని యమృతముకంటెను నీముఖచంద్రుని యధరామృతము శ్రేష్ఠమన్న యాశయము.

శ్లో. ఏనం స బిభ్ర ద్విధుముత్తమాంగే
గిరీన్ద్రపుత్రీపతి రోషధీశం।
అశ్నాతి ఘోరం విష మబ్ధిజన్మ
ధత్తే భుజఙ్గఞ్చ విముక్తశఙ్కః॥ 117

ప. వి. ఏనం - సః - బిభ్రత్ - విధుం - ఉత్తమాంగే - గిరీన్ద్రపుత్రీపతిః - ఓషధీశమ్ - అశ్నాతి - ఘోరం - విషం - అబ్ధిజన్మ - ధత్తే - భుజఙ్గం - చ - విముక్తశఙ్కః.

అర్థము: సః = ఆ. గిరీన్ద్రపుత్రీపతిః. గిరీన్ద్రపుత్రీ = పర్వతరాజ పుత్రికయగు పార్వతియొక్క, పతిః = భర్తయైన శివుడు, ఏనం = ఈ, ఓషధీశం = ఓషధులకు భర్తయగు. విధుం = చంద్రుని, ఉత్తమాఙ్గే = శిరమునందు, బిభ్రత్ = వహించుచు, అబ్ధిజన్మ = సముద్రమున బుట్టిన, ఘోరం = భయఙ్కరమైన, విషం = విషమును అనగా, హాలాహలమును, అశ్నాతి = తినుచున్నాడు, విముక్తశఙ్కః. విముక్త = విడువబడిన, శఙ్కః = భయము గల్గినవాడై, భుజఙ్గం చ = వాసుకిసర్పమును సైతము, ధత్తే = ధరించుచున్నాడు.

**సమాసములు :**

గిరీన్ద్రపుత్రీపతిః : గిరీణాం ఇన్ద్రః = గిరీన్ద్రః, గిరీన్ద్రస్య పుత్రీ = గిరీన్ద్రపుత్రీ. గిరీన్ద్రపుత్ర్యాః పతిః = గిరీన్ద్రపుత్రీపతిః.
ఓషధీశం : ఓషధీనా మీశః = ఓషధీశః, తం = ఓషధీశం.
అబ్ధిజన్మ : అబ్ధేః జన్మ యస్య తత్ = అబ్ధిజన్మ, తత్ = అబ్ధిజన్మ.
విముక్తశఙ్కః : విముక్తాశఙ్కా యస్మాత్సః = విముక్తశఙ్కః.

**భావము :**

పర్వతరాజపుత్రికకు భర్తయగు నాశివుడు ఓషధులకు రాజగు నీచంద్రుని శిరమున దాల్చియు, సముద్రమం దుద్భవించిన ఘోరమగు హాలాహల విషమును దినుచున్నాడు. ఎట్టిభయములేక సర్పరాజగు వానుకిని భూషణముగా ధరించి

యున్నాడు. ఓషధీశుని శిరమున ధరించుటవలననే యెట్టిభయములేక విషమును దినుచున్నాడనియు సర్పమును ధరించు చున్నాడనియు నుత్ప్రేక్ష.

శ్లో. నాఽస్య ద్విజేన్ద్రస్య బభూవ పశ్య
దారాన్ గురో ర్యాతవతోఽపి పాతః।
ప్రవృత్తయోఽప్యాత్మమయప్రకాశాన్
న హ్యన్తి న హ్యన్తిమదేహమాప్తాన్ ॥ 118

ప. వి. న - అస్య - ద్విజేన్ద్రస్య - బభూవ - పశ్య - దారాన్ - గురోః - యాతవతః - అపి - పాతః - ప్రవృత్తయః - అపి - ఆత్మమయ ప్రకాశాన్ - నహ్యన్తి - న - హి - అన్తిమదేహం - అప్తాన్.

అర్థము: ద్విజేన్ద్రస్య=ద్విజరాజగు, అస్య=ఈచంద్రునికి, గురోః=గురువైన, బృహస్పతియొక్క, దారాన్=భార్యను, యాతవతోఽపి=పొందిననున గురుతల్పమును బొందినను, పాతః=స్వర్గమునుండి పతనము, మరియు పాతిత్యము, న బభూవ = కలుగలేదు, పశ్య = చూడుము, ఇది ఆశ్చర్యము. లేదా యిది యుక్తమే. ప్రవృత్తయోఽపి=ధర్మాధర్మము లను మూలములుగా గల్గిన ప్రయత్నములు గూడ, ఆత్మమయప్రకాశాన్, ఆత్మమయ = ఆత్మస్వరూపమే, ప్రకాశాన్ = ప్రకాశముగా గలిగిన యనగా ఇతరప్రకాశముల నపేక్షింపని స్వప్రకాశరూపులను లేదా పరమాత్మయే ప్రకాశముగా గలిగినవారిని, అనగా పరమాత్మస్వరూప మున కంటె భిన్నమైన ప్రకాశము నరయని వారిని, అనగా స్వప్రకాశాత్మ వాదులగు బ్రహ్మజ్ఞానులను, అంతిమదేహం=తేజోరూపశరీరమును గాని, పూర్ణత్వమును గాని, ఆప్తాన్ = పొందినవారిని, మరియు వెంటనే లభ్యమగు మోక్షమును బట్టి, వెనుకటి శరీరప్రవాహములో చివరిశరీర ముకు బొందిన జీవన్ముక్తులగు పురుషులను, హి=ఎందువలన, శుభాశుభ ఫలము లనెడి బన్ధములతో, న నహ్యన్తి = బంధింపవు, కాన "తేషాం తేజోవిశేషేణ ప్రత్యవాయో న విద్యతే" యను ప్రమాణము ననుసరించి తేజోరూపుడైన చంద్రునకు పతనమేర్పడక పోవుట యుక్తమే. కాన నిట నాశ్చర్యము లేదు. చంద్రుడును నాత్మమయ ప్రకాశుడై యంతిమదేహ ప్రాప్తిచే బూర్ణత్వము నొందినవాడని యర్థము.

**సమాసములు :**

ద్విజేన్ద్రస్య : ద్విజానాం ఇన్ద్రః = ద్విజేన్ద్రః, తస్య = ద్విజేన్ద్రస్య.

ఆత్మమయప్రకాశాన్ : ఆత్మనః రూపం యస్య సః = ఆత్మమయః, ఆత్మమయః ప్రకాశః యేషాం తే = ఆత్మమయప్రకాశాః, తాన్ = ఆత్మమయప్రకాశాన్.

అన్తిమదేహం : అన్తిమ శ్చాసౌ దేహశ్చ = అన్తిమదేహః, తం = అన్తిమదేహం.

**భావము :**

ద్విజరాజగు చంద్రుడు గురుభార్యను పొందియు స్వర్గమునుండి పతనమును గాని, పాతిత్యమును గాని పొందలేదు. ఇది యాశ్చర్యకరమైన విషయము. "ద్విజేన్ద్రు" డనుటవలన ద్విజేన్ద్రు డట్టి నీచమైన పనిని జేయరాదను నర్థము సూచితము. లేదా యిది యుక్తమే. ప్రాణివర్గమునకు కలుగు ప్రయత్నములు వారి పుణ్యాపుణ్యములవలన నేర్పడుచుండును. అట్టి ప్రయత్నములవలన నేర్పడు శుభాశుభఫలములు ఆత్మమయప్రకాశము గల్గిన వారి ననగా నితరప్రకాశముల నపేక్షింపని ప్రకాశస్వరూపులైనవారై అనాదిశరీరప్రవాహములో చివరిశరీరమును బొందుటచే పూర్ణత్వమును బడసి జీవన్ముక్తులగు వారిని బంధింపనేరవు. చంద్రుడును నాత్మమయప్రకాశుడై యన్తిమ దేహమును బొంది పూర్ణత్వమును బడసినవాడు కాన వానిని గురుభార్యాగమనముగలని యధర్మము బంధింప లేదని యాశయము.

శ్లో. స్వధాకృతం తత్తనయైః పితృభ్యః
శ్రద్ధాపవిత్రం తిలచిత్ర మమ్భః ।
చన్ద్రం పితృస్థానతయోపతస్థే
తదఙ్గరోచిః ఖచితా సుధేవ ॥ 119

ప. వి. స్వధాకృతం - తత్ - తనయైః - పితృభ్యః - శ్రద్ధాపవిత్రం - తిలచిత్రం - అమ్భః - చంద్రం - పితృస్థానతయా - ఉపతస్థే - తదఙ్గరోచిః ఖచితా - సుధా - ఇవ.

అర్థము: తనయైః = పుత్రులచే, శ్రద్ధాపవిత్రం, శ్రద్ధా = పరలోకముందనెడి యాస్తికబుద్ధిచే నిచ్చుటవలన, పవిత్రం = పవిత్రమైనదియును, తిల = నల్లనువ్వులచే, చిత్రం = మిశ్రితమైనదై, పితృభ్యః = పితృదేవతలకై, స్వధాకృతం = సమర్పితమైన. యత్ = ఏ, అమ్బుం = ఉదకము, "చన్ద్రో వై పితృలోకః" యను శ్రుతి ననుసరించి, పితృస్థానతయా = పితృస్థానమగుటచే, చన్ద్రం = పితృలోకమైన చంద్రుని, ఉపతస్థే = చేరినదో, తత్ = ఆ నల్లనినువ్వులతో మిళితమైన యుదకమే, అఙ్కరోచిః ఖచితా, అఙ్క = కళంకము యొక్క, రోచిః = కాంతితో, ఖచితా = మిలితమైన, సుధేవ = అమృతమే (యైనది). నల్లనూవులే కలఙ్కము. వానితో గలిసిన యుదకమే యమృతము. కాన కలఙ్కము వేఱు కాదు, అమృతము వేఱు కాదని యర్థము.

**సమాసములు :**

స్వధాకృతం : స్వధా కృతం = స్వధాకృతం.

శ్రద్ధాపవిత్రం : శ్రద్ధయా పవిత్రం = శ్రద్ధాపవిత్రమ్.

తిలచిత్రం : తిలైః చిత్రం = తిలచిత్రం.

పితృస్థానతయా : పితుః స్థానం = పితృస్థానం, పితృస్థానస్య భావః = పితృస్థానతా, తయా = పితృస్థానతయా.

అఙ్కరోచిఃఖచితా : అఙ్కస్య రోచిః = అఙ్కరోచిః, అఙ్కరోచిషా ఖచితా = అఙ్కరోచిఃఖచితా.

**భావము :**

పుత్రులు పరలోకమున్నదనెడి యాస్తిక్యబుద్ధితో నొసంగుటచే పవిత్రమైనట్టి తిలోదకము పితృదేవతలకు సమర్పింపబడినదై, పితృలోకమైన చంద్రునితో గలియుచున్నది. ఆనల్లనువ్వులతో గూడిన యుదకమే కలఙ్కమై దానికాంతితో మిశ్రితమై యమృతమైనది. కాన నల్లనువ్వులే కలఙ్కము. వానితో గూడిన జలమే యమృతము. కాన కలఙ్కముగాని యమృతముగాని భిన్నములు కావు.

శ్లో. పశ్యోచ్చసౌధస్థితిసౌఖ్యలక్ష్యే
త్వత్కేలికుల్యామ్బుని బిమ్బమిన్దోః ।
చిరం నిమజ్జ్యేహ సతః ప్రియస్య
భ్రమేణ యచ్చుమ్బతి రాజహంసీ ॥ 120

ప. వి. పశ్య - ఉచ్చసౌధస్థితిసౌఖ్యలక్ష్యే - త్వత్కేలికుల్యామ్బుని - బిమ్బం - ఇన్దోః - చిరం - నిమజ్జ్య - ఇహ - సతః - ప్రియస్య - భ్రమేణ - యత్ - చుమ్బతి - రాజహంసీ.

అర్థము. హే ప్రియే! = ఓ ప్రియురాలా!, త్వం = నీవు, ఉచ్చసౌధస్థితసౌఖ్యలక్ష్యే, ఉచ్చ = ఎత్తైన, సౌధ = మేడయందలి, స్థితి = ఉనికివలని, సౌఖ్య = సుఖముతో, లక్ష్యే = నిర్విఘ్నముగా చూడదగిన, త్వత్కేలికుల్యామ్బుని, త్వత్ = నీయొక్క, కేలి = క్రీడార్థమైన, కుల్యా = నదిన్నుయొక్క, అమ్బుని = ఉదకమునందు, ఇందోః = చంద్రుని యొక్క, బిమ్బం = బింబమును పశ్య = చూడుము. రాజహంసీ = ఆడురాజహంస, ఇహ = ఈసరసునందలి జలమునందు, నిమజ్జ్య = మునిగి, చిరం = చాలాకాలము, సతః = లోపలనుంటున్న, ప్రియస్య = ప్రియుడైన రాజహంసయొక్క, భ్రమేణ = భ్రమతో, యత్ = ఏచంద్రబింబమును, చుమ్బతి = ముద్దిడుకొనుచున్నది.

సమాసములు :

ఉచ్చసౌధస్థితిసౌఖ్యలక్ష్యే : ఉచ్చ శ్చాసౌ సౌధశ్చ = ఉచ్చసౌధః, ఉచ్చసౌధే స్థితః = ఉచ్చసౌధస్థితః. ఉచ్చసౌధస్థిత్యా సౌఖ్యం = ఉచ్చసౌధస్థితిసౌఖ్యం, ఉచ్చసౌధస్థితిసౌఖ్యేన లక్ష్యం = ఉచ్చసౌధస్థితిసౌఖ్యలక్ష్యం, తస్మిన్ = ఉచ్చసౌధస్థితిసౌఖ్యలక్ష్యే.

త్వత్కేలికుల్యామ్బుని : కేలేః కుల్యా = కేలికుల్యా, తవ కేలికుల్యా = త్వత్కేలికుల్యా, త్వత్కేలికుల్యాయాః అమ్బు = త్వత్కేలికుల్యామ్బు, తస్మిన్ = త్వత్కేలికుల్యామ్బుని.

రాజహంసీ : హంసీనాం రాజ్ఞీ = రాజహంసీ.

**భావము :**

ఓ ప్రియురాలా! నీవు ఉన్నతమైన మేడపై నిలిచి సుఖముగా జూడదగినట్టి నీ క్రీడాసరోవరపు జలమునందు చన్ద్రబింబమును చూడుము. ఈ క్రీడా సరోవరమునందు మునిగి చాలాకాలము లోపలనున్న తన ప్రియుడగు రాజహంస యను భ్రమతో నాచన్ద్రబింబమును రాజహంసి ముద్దిడుకొనుచున్నది.

శ్లో. సౌవర్గవర్గై రమృతం నిపీయ
కృతేఽహ్ని తుచ్ఛః శశలాఞ్ఛనోఽయమ్।
పూర్ణేఽమృతానాం నిశితేఽత్ర నద్యాం
మగ్నః పునః స్యాత్ప్రతిమాచ్ఛలేన ॥ 121

ప. వి. సౌవర్గవర్గైః - అమృతం - నిపీయ - కృతే - అహ్ని - తుచ్ఛః - శశలాఞ్ఛనః - అయం - పూర్ణే - అమృతానాం - నిశి-తే - అత్ర - నద్యాం - మగ్నః - పునః - స్యాత్ - ప్రతిమాచ్ఛలేన.

**అర్థము:** సౌవర్గవర్గైః, సౌవర్గ = స్వర్గమునందు దేవతలయొక్క, వర్గైః = సమూహముచే, అమృతం = అమృతమును, నిపీయ = త్రాగి, అహ్ని = పగటియందు, తుచ్ఛః = శూన్యుడుగా, కృతః = చేయబడిన, అయం = ఈ, శశలాఞ్ఛనః = శశాఙ్కుడగు చంద్రుడు, నిశి = రాత్రియందు, తే = నీయొక్క, అత్ర నద్యాం = ఈ క్రీడా నదియందు, ప్రతిమాచ్ఛలేన = ప్రతిబింబముయొక్క నెపముతో, మగ్నః = మునిగినవాడై, పునః = మరల, అమృతానాం = జలములచేతను, అమృతములచేతను, పూర్ణః = నిండినవాడుగను, స్యాత్ = అగును (అని నేను భావింతును), పగటియందు రిక్తుడుగా జేయబడినను మరల క్రమముగా నమృతముతో నిండినవాడై, రాత్రియందు నీ క్రీడానదియందు ప్రతిబింబపు వ్యాజముచే మునిగియుండును. అనగా మరల పానము చేయుదురనెడి భయముచేతనో యనునట్లు పరుగిడి దాగి యుండుననియు నేను భావింతునని యర్థము.

**సమాసములు :**

సౌవర్గవర్గైః : స్వర్గే భవాః = సౌవర్గాః, సౌవర్గాణాం వర్గాః = సౌవర్గవర్గాః, తైః = సౌవర్గవర్గైః.

ప్రతిమాచ్ఛలేన : ప్రతిమాయాః ఛలం = ప్రతిమాచ్ఛలం, తేన = ప్రతిమాచ్ఛలేన.

**భావము :**

దేవతల బృన్దములు, అమృతమును త్రాగుటచే తుచ్ఛుడుగా నవగా పిప్పిగా చేయబడిన యీచంద్రుడు క్రీడానదియందు ప్రతిబింబమనెడి వ్యాజముతో మునిగిన వాడై మరల నమృతముంచే పూర్ణుడై యుండునని నేను భావింతును. లేదా పగలు నిస్సారముగా జేయబడినను నీచంద్రుడు మరల క్రమముగా నమృతముచే నిండినవాడై రాత్రియందు నీక్రీడానదియందు ప్రతిబింబమను వ్యాజమున మునింగిన వాడై మరల యమృతమును పానము జేయుదురేమో యను భయముచే పరుగెత్తి పోయి దాగినవాడై యుండునని నేను భావింతును.

శ్లో. సమం సమేతే శశినః కరేణ
ప్రసూనపాణావిహ కైరవిణ్యాః ।
వివాహలీలా మనయో రివాహ
మధుచ్ఛలత్యాగజలాభిషేకః ॥ 122

స. వి. సమం - సమేతే - శశినః - కరేణ - ప్రసూనపాణౌ - ఇహ - కైరవిణ్యాః - వివాహలీలాం - అనయోః - ఇవ - ఆహ - మధుచ్ఛలత్యాగజలాభిషేకః.

అర్థము: ఇహ = ఈనీయొక్క క్రీడానదియందు, కైరవిణ్యాః = కలువయొక్క, ప్రసూనపాణౌ. ప్రసూన = పుష్పరూపమైన, పాణౌ = హస్తము, శశినః = చంద్రునియొక్క, కరేణ = కిరణముతో. (హస్తముతో) సమం = కూడ, సమేతే సతి = కలియగా, మధుచ్ఛలత్యాగజలాభిషేకః. మధు = తేనెయనెడి, లేదా పుష్పరసమనెడి ఛల = వ్యాజము

గలిగిన, త్యాగజం = కన్యాదానసంకల్పోదకముచే, అభిషేకః = అభిషేకము, అనయోః = చంద్రునికిని కలువతీగెకును, వివాహలీలాం = వివాహవిలాసమును, ఆహేవ = చెప్పుచున్నదో యనునట్లున్నది, చన్ద్రకిరణములు సోకినంతటనే కలువ వికసించినది. మకరందముతో నిండినది గూడనైనది,వివాహమునం దిరువురి చేతులను కలుపుట చేతులందు దానజలాభిషేకము చేయుట జరుగును.

సమాసములు :

ప్రసూనపాణౌ : ప్రసూనం పాణౌ యస్యాః సః = ప్రసూనపాణిః, తస్మిన్ = ప్రసూనపాణౌ.

వివాహలీలాం : వివాహస్య లీలా = వివాహలీలా, తాం = వివాహలీలామ్.

మధుచ్ఛలత్యాగజలాభిషేకః : మధునః ఛలం యస్య తత్ = మధుచ్ఛలం, త్యాగస్య జలం = త్యాగజలం, మధుచ్ఛలం చ తత్ త్యాగజలం చ =మధుచ్ఛలత్యాగజలం, మధుచ్ఛలత్యాగజలస్య అభిషేకః = మధుచ్ఛలత్యాగజలాభిషేకః.

భావము :

ఈక్రీడానదియందు కలువతీగెయొక్క పూవనెడి హస్తము చంద్రుని కిరణముచేతను (హస్తముచేతను) కలియగా పుష్పరసమునెడి నెపము గలిగిన కన్యాదానసంకల్పోదకముతో, నవి తడియుట యారెంటికిని, వివాహలీలను సూచించుచున్నదో యనునట్లున్నది. వివాహకాలమున కన్యాదానము జేయునపుడు త్యాగజలము విడువబడును. ప్రకృతము కలువతీగెకు చంద్రునితో జరుపు నీవివాహమునందు కలువపూపునందలి మకరందమే త్యాగజలముగా నున్నదని యాశయము.

శ్లో. వికాసినీలాయతపుష్పనేత్రా
మృగీయ మిన్దీవరిణీ వనస్థా
విలోకతే కాన్తమిహోపరిష్టా
న్మృగం తవైషాఽఽననచన్ద్రభాజమ్ ॥ 123

ప. వి. వికాసినీలాయతపుష్పనేత్రా - మృగీ - ఇయం - ఇన్దీవరిణీ - వనస్థా - విలోకతే - కాన్తం - ఇహ - ఉపరిష్టాత్ - మృగం - తవ - ఏషా - ఆననచన్ద్రభాజమ్.

అర్థము: హే ప్రియే! = ఓ ప్రియురాలా!, ఇహ = ఈ నీ క్రీడానదియందు, వనస్థా = జలమందు నివసించునదియు, మరియు నడవియందు వసించునదియు, తథా = అట్లే, వికాసినీలాయతపుష్పనేత్రా, వికాసి = వికసించిన, నీల = నల్లని, ఆయత = విశాలమైన, పుష్ప = పూవులనెడి, నేత్రా = కన్నులు గలదియు,నట్టి పుష్పములవంటి కన్నులుగలదియునగు, ఇయం = ఈ ప్రత్యక్షదృశ్యమైన, ఇందీవరిణీ = నల్లకలువతీగె. యస్మాత్ = ఎందువలన, మృగీ = వనమందుండుటవలన వికాసినీలాయతపుష్పనేత్రములు గలిగియుండుటవలన నాడు జింకయైనచో, తత్ = అందువలన, నానల్లకలువ తీగెయొక్క రూపమునందున్న యాడుజింక, ఆననచన్ద్రభాజం, ఆనన = నీముఖమనెడి, చన్ద్ర = చంద్రుని, భాజం = పొందిన, కాన్తం = సున్దరమైన, మరియు తనకు సజాతీయమైనదియు. తనకు ప్రియమైనదియునగు, మృగం = జింకను. ఉపరిష్టాత్ = పైన, విలోకతే = చూచుచున్నది. వికసితములగు కుసుమనేత్రములు పైకి ప్రసరింపబడినవిగా గానబడును. కాన తరచుగా చంద్రునియందున్న తనప్రియుడైన మృగమును నాడు జింక చూచుచున్నదని యర్థము. నీముఖమనెడి చంద్రునియందున్నదియును నవి చంద్రుడగుటచే నచ్చట నూహింపదగినదియునగు మృగమును బైభాగమున జూచుచున్నదని యర్థము. నీవు మేడపైనున్నావు ఈ యాడుజింక దిగువనున్నది. "న స చన్ద్రభాజం" అని పదవిభాగము గావించుకొనినచో చంద్రునియందున్న తనప్రాణేశుడగు మృగమును పై ప్రదేశమున "న పశ్యతీతి న" చూడలేదనుటలేదు. అనగా తప్పక చూచుచున్నదని యర్థము. వనమందున్న యాడుజింక తననీలాయతనేత్రమును బఱచినదై, తనప్రియుడగు మృగమునకై ఇటునటు చూచుచున్నదనిగాని యర్థము.

**సమాసములు :**

వికాసినీలాయతపుష్పనేత్రా : నీలం చ తత్ ఆయతం చ = నీలాయతం. నీలాయతం చ తత్ పుష్పం చ = నీలాయతపుష్పః, వికాసి చ తత్ నీలాయత పుష్పం చ = వికాసినీలాయతపుష్పం. వికాసి నీలాయతపుష్ప మేవ నేత్రం యస్యాస్సా = వికాసినీలాయతపుష్పనేత్రా.

ఇన్దీవరిణీ : ఇన్దీవరం అస్యాః అస్తీతి = ఇందీవరిణీ.

వనస్థా : వనే తిష్ఠతీతి = వనస్థా.

ఆననచన్ద్రభాజం : ఆననమేవ చన్ద్రః = ఆననచన్ద్రః, ఆననచన్ద్రం భజ తీతి = ఆననచన్ద్రభాక్, తం = ఆననచన్ద్రభాజం.

**భావము :**

ఓ ప్రియురాలా! నీ క్రీడానదియందు జలవాసినియును ఆరణ్యవాసినియును నట్లే వికసించినదియును నీలివర్ణముగలిగి వెడల్పైనపూవనెడి కన్నులుగలదియు నగు నీనల్లకలువతీగె వైధర్మ్యములననుసరించి యాడుజింకయై నీముఖముతో సమానుడైన చంద్రునియందున్నదియును సున్దరమైనదియును తనకు సజాతీయమైనదియును తనకుప్రియుడునగు మగజింకకై పైకిచూచుచున్నదని యాశయము.

శ్లో. తపస్యతా మమ్బుని కైరవాణాం
సమాధిభఙ్గే విబుధాఙ్గనాయాః ।
అవైమి రాత్రేరమృతాధరోష్ఠం
ముఖం మయూఖస్మితచారుచన్ద్రమ్ ॥ 124

ప. వి. తపస్యతామ్ - అమ్బుని - కైరవాణాం - సమాధిభఙ్గే - విబుధాఙ్గనాయాః - అవైమి - రాత్రేః - అమృతాధరోష్ఠం - ముఖం - మయూఖస్మితచారుచన్ద్రమ్.

అర్థము: హే ప్రియే! = ఓ ప్రియురాలా, అమ్బుని = జలమునందు, (ఎల్లపుడు నివసించుటవలన) తపస్యతాం = తపస్సుచేయునట్టి, కైరవాణాం = కలువల యొక్క, సమాధేః = పగలు ముడుచుకొనిపోవుటయనెడి ధ్యానమునకు, భఙ్గే = భఙ్గమువిషయమున, విబుధాఙ్గనాయాః = అప్సరయొక్క రూపము

గల, రాత్రేః = రాత్రికి, చన్ద్రం = చన్ద్రుని, అమృతాధరోష్ఠం, అమృత = అమృతముతో గూడిన, అధరోష్ఠం = క్రిందిపెదవిగల్గిన, మయూఖస్మితచారు, మయూఖ = కిరణములనెడి, స్మిత = చిరునగవుతో. చారు = రమ్యమైన, ముఖం = ముఖముగా, అవైమి = తెలుసుకొను చున్నాను.

**సమాసములు :**

సమాధిభఙ్గే : సమాధేః భఙ్గః = సమాధిభఙ్గః. తస్మిన్ = సమాధిభఙ్గే.

విబుధాఙ్గనాయాః : విబుధానాం అఙ్గనా = విబుధాఙ్గనా, తస్యాః = విబుధాఙ్గనాయాః.

అమృతాధరోష్ఠం : అమృతమేవ అధరః ఓష్ఠః యస్య తత్ = అమృతాధరోష్ఠమ్, తత్ = అమృతాధరోష్ఠం.

**భావము :**

ఓ ప్రియురాలా! జలమందెల్లప్పుడునుండుటవలన తపస్సు చేయుచున్నట్లున్న కలువలు పగలు ముడుచుకొనిపోవుటవలన ధ్యానము గావించువానివలెనున్నవి. అవి రాత్రులందు వికసించుటవలన ధ్యానభఙ్గమును బొందినవానివలెనున్నవి. అట్లు వానికి ధ్యానభఙ్గమొనరించినది రాత్రియనెడి యప్సరస.అట్టి అప్సరసకు చంద్రుడు, అమృతంపు క్రిందిపెదవిని గలిగినదై యతని కిరణములనెడి చిరునగవుతో నందమైనట్టి ముఖముగా నున్నాడు. అని నేను భావింతును.

శ్లో. అల్పాఙ్కపఙ్కా విధుమణ్డలీయం
పీయూషనీరా సరసీ స్మరస్య ।
పానా త్సుధానామజలేఽప్యమృత్యం
చిహ్నం బిభర్త్యత్ర భవం స మీనమ్ ॥ 125

ప. వి. అల్పాఙ్కపఙ్కా - విధుమణ్డలీ - ఇయం - పీయూషనీరా - సరసీ - స్మరస్య - పానాత్ - సుధానాం - అజలే - అపి - అమృత్యం - చిహ్నం - బిభర్తి - అత్ర - భవం - సః - మీనమ్.

అర్థము: అల్పాఙ్కపఙ్కా, అల్ప = కొద్దియైన, అఙ్క = కలఙ్కమే, పఙ్కా = బురదగా గలిగినదియు, పీయూషనీరా, పీయూష = అమృతమనెడి,

నీరా = ఉదకము కలిగినదియునగు. ఇయం = ఈ, విధుమణ్డలీ = చన్ద్ర మణ్డలము, స్మరస్య = మన్మథునకు, సరసీ = విశాలమైనకొలను, (కావుననే) సః = ఆ స్మరుడు, అత్ర = ఈచంద్రుడనెడిమడుగునందు, భవం = ఉత్పన్నమైన, సుధానాం = ఈచంద్రునికి సంబంధించిన యమృతములను, పానాత్ = త్రాగుటవలన, అజలేఽపి = జలములేనట్టి ప్రదేశమునందును, అమృత్యుం = మరణరహితమైన, మీనం = మీనమనెడి, చిహ్నం = చిహ్నమును, బిభర్తి = ధరించుచున్నది. చేపలు జలములులేనిచోట చచ్చుచున్నవి. కానిమన్మథుని ధ్వజమైన చేప చనిపోవుటలేదు. అది చంద్రామృత సరస్సున బుట్టుటవలనను నెల్లప్పుడు నమృతపానము గావించుటవలన నుదకములేక పోయినను మరణములేక యున్నదని యర్థము.

సమాసములు :

అల్పాఙ్కపఙ్కా : అల్పశ్చాసౌ అఙ్కశ్చ = అల్పాఙ్కః, అల్పాఙ్క ఏవపఙ్కః యస్యాంసా = అల్పాఙ్కపఙ్కా.

విధుమణ్డలీ : విధోః మణ్డలీ = విధుమణ్డలీ.

పీయూషనీరా : పీయూషమేవ నీరం యస్యాస్సా = పీయూషనీరా.

అజలే : అవిద్యమానం జలం యస్మిత్ తత్ = అజలం, తస్మిన్ = అజలే.

భావము ;

కొలనిపాటి కలంకమనెడి యడుసుగలదియు యమృతమనెడి యుదకము గలదియునగు నీచంద్రమండలము మన్మథునకు కొలను కావుననే యామన్మథుడు ఈకొలనులో జన్మించి యమృతపానముచే నుదకములేనట్టి ప్రదేశమందును మరణమునొందక మీనమనెడి ధ్వజమును ధరించుచున్నాడు. సాధారణముగా చేప నీరులేనిచోట మరణించును. కాని యిట చంద్రామృతపానముచే నాచేప మరణించలేదని యర్థము.

శ్లో. తారాస్థిభూషాశశిజహ్నుజాభృ
చ్చంద్రాంశుపాంసుచ్ఛురితద్యుతిర్ద్యౌః ।
ఛాయాపథచ్ఛద్మఫణీన్ద్రహారం
స్వంమూర్తిమాహస్ఫుటమష్టమూర్తేః ॥ 126

ప. వి. తారాస్థిభూషా - శశిజహ్నుజాభృత్ - చంద్రాంశుపాంసుచ్ఛురితద్యుతిః - ద్యౌః - ఛాయాపథచ్ఛద్మఫణీన్ద్రహారా - స్వం - మూర్తిమ్ - ఆహ - స్ఫుటమ్ - అష్టమూర్తేః.

అర్థము తారాస్థిభూషా, తారా = నక్షత్రములనెడి. అస్థి = ఎముకలను, భూషా = భూషణముగా గలదియు, శశిజహ్నుజాభృత్, శశి = చంద్రుడనెడి, జహ్నుజాభృత్ = గంగగలదియు, (చంద్రుని గంగను గలదియు) చంద్రాంశుపాంశుచ్ఛురితద్యుతిః, చంద్రాంశు = చన్ద్రకిరణములనెడి. పాంశు = భస్మపుధూళితో, ఛురిత = వ్యాప్తమైన, ద్యుతిః = కాంతిగలది యును, ఛాయాపదచ్ఛద్మపణీన్ద్రహారా, ఛాయావథ = ఆకసమందు, దక్షిణమునుండి యుత్తరమునకు వ్యాపించిన దేవమార్గమనియు. పాలవెల్లి యనియు బిలువబడు తెల్లనిరేఖయను, ఛద్మ = నెపముగల్గిన, ఫణీన్ద్ర = వాసుకినే, హారా = హారముగాగల్గినదియునగు, ద్యౌః = ఆకసము, స్వం = తన్ను, అష్టమూర్తేః(పైవిశేషణములచే నేర్పడిన) శివునియొక్క, మూర్తిం = శరీరమునుగా, ఆహ = చెప్పుచున్నది, స్ఫుటం = స్పష్టము.

సమాసములు :

తారాస్థిభూషా : తారాఏవఅస్థీని = తారాస్థీని, తారాస్థీని భూషాః యస్యాః స్సా = తారాస్థిభూషా.

శశిజహ్నుజాభృత్ : జహ్నోః జాయతఇతి = జహ్నుజా, శశ్యేవ జహ్నుజా = శశిజహ్నుజా, శశిజహ్నుజాంబిభర్తీతి = శశిజహ్నుజాభృత్, (లేదా) శశీచజహ్నుజాచ = శశిజహ్నుజే, శశిజహ్నుజేబిభర్తీతి = శశిజహ్నుజాభృత్.

చంద్రాంశుపాంసుచ్ఛురితద్యుతిః : చన్ద్రస్యఅంశవః = చంద్రాంశవః, చంద్రాంశ ఏవ పాంసవః = చంద్రాంశుపాంసవః, చంద్రాంశుపాంసుభిః ఛురితాద్యుతిఃయస్యాః సః = చంద్రాంశుపాంసుచ్ఛురితద్యుతిః.

ఛాయాపథచ్ఛద్మఫణీన్ద్రహారా : ఛాయాయాః పన్థాః = ఛాయాపథః ఛాయాపథస్యఛద్మ యస్య సః = ఛాయాపథచ్ఛద్మా, ఫణినామిన్ద్రః = ఫణీన్ద్రః, ఛాయాపథచ్ఛద్మాచాసౌఫణీన్ద్రశ్చ = ఛాయాపథచ్ఛద్మఫణీన్ద్రః, ఛాయాపథచ్ఛద్మఫణీన్ద్రఃహారః యస్యాస్సా = ఛాయాపథచ్ఛద్మఫణీన్ద్రహారా.

అష్టమూర్తేః : అష్టౌమూర్తయః యస్యసః = అష్టమూర్తిః, తస్య = అష్టమూర్తేః.

భావము :

ఇచ్చట నాకసమును నష్టమూర్తియగు శివుని శరీరముగా వర్ణించుచున్నాడు. ఆకసము తారలనెడి యస్థులను భూషణముగా గలది. చంద్రుడనెడి గంగనుధరించినది, చంద్రుని గంగనుధరించినది. చంద్రకిరణములనెడి భస్మ ధూళితో వ్యాప్తమైనది. తెల్లని దేవమార్గమనెడి వాసుకిని హారముగాగలది. శివుడు అస్థిభూషణుడు. చంద్రుని గంగను ధరించినవాడు. భస్మమునలదుకొనిన వాడు. వాసుకిని హారముగా గలవాడు. కాన నాకసమష్టమూర్తియగు శివుని శరీరముగా తన్ను జెప్పుకొనుటయుక్తమని యాశయము.

శ్లో. ఏకైవతారామునిలోచనస్య
జాతాకిలైతజ్జనకస్యతస్య ।
తాతాధికాసమ్పదభూదియంతు
సప్తాన్వితావింశతిరస్యయత్తాః ॥ 127

ప. వి. ఏకా - ఏవ - తారా - మునిలోచనస్య - జాతా - కిల - ఏతజ్జనకస్య - తస్య - తాతాధికా - సమ్పత్ - అభూత్ - ఇయం - తు - సప్తాన్వితాః - వింశతిః - అస్య - యత్ - తాః.

అర్థము: ఏతజ్జనకస్య, ఏతత్ = ఈ చంద్రునికి, జనకస్య = తండ్రియగుననగా నుత్పాదకమగు, మునిలోచనస్య, ముని = అత్రిమహర్షియొక్క, లోచనస్య = నేత్రముయొక్క, తారాకిల = (కంటియందు) పాప, ఏకైవ = ఒక్కటిగనే, జాతా = ఏర్పడినది, అస్య = పుత్రుడైన యీ చంద్రునికి, ఇయం = ఈకానవచ్చెడి, సంపత్ = సంపద, తాతాధికా, తాత = తండ్రియగునత్రినేత్రము కంటెను, అధికా = అధికమైనది, యత్ = ఏలయనగా, అస్య = ఈ చంద్రునియొక్క, తాస్తాః = ఆ యా కంటిపాపలు, (తారలు) సప్తాన్వితాః, సప్త = ఏడుతో, అన్వితాః = కూడబడిన, వింశతిః = ఇరువది, (యగుచున్నవి). తండ్రియగు నత్రినేత్ర

మున కొకతార (కంటిపాప) యుండగా, కొడుకగు చంద్రునకు నిరువది యేడు తారలు (కంటిపాపలు) అనగా నశ్విని మొదలు రేవతివరకుగల నిరువదియేడుతారలు ఉన్నవిగాన తండ్రికంటెను కుమారుడే ఎక్కువ సంపదగలవాడాయెను అని యర్థము. దక్షప్రజాపతి తనయిరువదియేడు పుత్రికలను చంద్రునకొసంగి వివాహము గావించెనని పురాణప్రసిద్ధి.

**సమాసములు ;**

మునిలోచనస్య : మునేః లోచనం మునిలోచనం, తస్య = మునిలోచనం.

ఏతజ్జనకస్య : ఏతస్య జనకః = ఏతజ్జనకః, తస్య = ఏతజ్జనకస్య.

తారాధికా : తారాత్ అధికా = తారాధికా.

సప్తాన్వితాః : సప్తభిరన్వితాః = సప్తాన్వితాః.

**భావము :**

ఈ చంద్రునికి ప్రసిద్ధమగు నత్రిమహర్షియొక్క నేత్రము జనకమైనది. ఏలయనగా చంద్రుడత్రినేత్రము నుండి జన్మించినట్లు పురాణగాథ. కాని తండ్రి యగు నత్రినేత్రమునకొక్క తారయనగా నొక్కకంటిపాప యుండగా, కుమారుడైన చంద్రునకో ఇరువదియేడుతారలు. అనగా నశ్విని మొదలు రేవతివరకును గల నిరువదియేడుతారలు (కంటిపాపలు) ఉన్నవి. కాన తండ్రికంటెను కుమారునకే తారా సంపద యధికమని యాశయము.

శ్లో. మృగాక్షి! యన్మణ్డలమేతదిన్దోః
స్మరస్య తత్పాణ్డురమాతపత్రమ్ ।
యః పూర్ణిమానన్తరమస్య భఙ్గః
సచ్ఛత్రభఙ్గః ఖలు మన్మథస్య ॥ 128

ప. వి. మృగాక్షి - యత్ - మణ్డలం - ఏతత్ - ఇన్దోః - స్మరస్య - తత్ - పాణ్డురం - ఆతపత్రం - యః - పూర్ణిమానన్తరం - అస్య - భఙ్గః - సః - ఛత్రభఙ్గః - ఖలు - మన్మథస్య.

**అర్థము:** హే మృగాక్షి! = ఓ హరిణాక్షీ!, యత్ = ఏ, ఏతత్ = ఈ ప్రత్యక్షముగా గనబడు, ఇందోః = చంద్రునియొక్క, మణ్డలం = మండలము గలదో, తత్ = అది, స్మరస్య = మన్మథునకు, పాండురం = తెల్లనైన, ఆతపత్రం = సామ్రాజ్యసూచకమైనగొడుగు, పూర్ణమును ధవలమునగు చంద్రమండలమును చూచినచో నదికామోద్దీపకము గాన నందఱు కామవశ్యులయ్యెదరు. కాననది మన్మథునకు శ్వేతచ్ఛత్రమే కాదగినది. పూర్ణిమానన్తరం = పున్నమవిదప, అస్య = ఈ పూర్ణచంద్రుడనెడి ఛత్రమునకు, యః = ఏ, భఙ్గః = భంగముగలదో (కలాక్షయము గలదో) సః = అది, మన్మథస్య = మన్మథునకు. ఛత్రభఙ్గఃఖలు = ఛత్రమునకు భఙ్గమేగదా!, ఛత్రమునకు భంగము రాజక్షయమును సూచించును. కృష్ణపక్షమున నుద్దీపకుడగు చంద్రుడు క్షయింపగనే యతని మిత్రుడగు కామునకు క్షయమగునుగదా!

**సమాసములు :**

మృగాక్షి : మృగస్య అక్షిణీవ అక్షిణీ యస్యాస్సా = మృగాక్షీ. తస్యాః సంబుద్ధిః = హే మృగాక్షి!.

పూర్ణిమానన్తరం : పూర్ణిమాయాః అనన్తరం = పూర్ణిమానన్తరమ్.

ఛత్రభఙ్గః : ఛత్రస్య భఙ్గః = ఛత్రభఙ్గః.

**భావము :**

ఓ మృగాక్షీ! ఈ ప్రత్యక్షదృశ్యమగు చంద్రమండలము మన్మథునకు సామ్రాజ్యసూచకమగు శ్వేతచ్ఛత్రము. పూర్ణచంద్రమండలము కామోద్దీపకము గాన దానిని చూచినచో నందఱును కామవశ్యులగుదురు. అందువలన నీ చంద్రమండలము కామునకు శ్వేతచ్ఛత్రమే కాదగినది. కాని పూర్ణిమానంతరము ఛత్రమైన ఈ చంద్రునకు భఙ్గము (కలాక్షయము) కలుగును. అది మన్మథునకు ఛత్రభఙ్గమే. రాజునకు ఛత్రభఙ్గము అది అతని క్షీణతను సూచించును. ఇచ్చట పూర్ణిమ విదప కృష్ణపక్షమగుట వలన మిత్రుడగు చంద్రునకు క్షయముకలుగుటచే మన్మథునకు గూడా క్షయమే యగుచున్నది.

శ్లో. దశాననేనాఽపి జగన్తి జిత్వా
యోఽయం పురాఽపారి నజాతుజేతుమ్ ।
మ్లానిర్విధోర్మానిని! సంగతేయం
తస్య త్వదేకానన నిర్జితస్య ॥ 129

ప. వి. దశాననేన - అపి-జగన్తి - జిత్వా - యః - అయం - పురా-అపారి-న - జాతు - జేతుమ్- మ్లానిః-విధోః - మానిని - సంగతా - ఇయం-తస్య - త్వదేకాననినిర్జితస్య.

అర్థము: దశాననేనాఽపి = (దిగ్విజయమునకై బయలుదేరిన) రావణాసురుని చేతను, జగన్తి = లోకములు, జిత్వా = జయింపబడి, యః = ఏ, అయం = ఈ చంద్రుడు, పురా = పూర్వము, జాతు = ఒకప్పుడును, జేతుం = జయించుటకు, నాపారి = శక్యుడుకాలేదు, హేమానిని! = నీముఖముతో కొట్లాడెడి చంద్రుని సహింపలేని యోధమయస్త్రీ!. తస్య= ఆ చంద్రునకు, ఇయం = ఈ కనబడెడు కలఙ్కరూపమైన, మ్లానిః = లజ్జ, సంగతా = యేర్పడినది. (అదియుక్తమే). ఎవ్వడు పదిముఖములు గల రావణాసురునికి జయింపనశక్యుడో, త్వదేకాననిర్జితస్య = స్త్రీయగు నీయొక్క యొకముఖముచేతనే యోడింపబడిన, తస్య = వానికి, దాని వలన లజ్జచే మాలిన్యమేర్పడుట యుక్తమేయని యర్థము. నీముఖ మీచంద్రుని కంటె నధికమనియు నర్థము.

సమాసములు :

దశాననేన : దశ ఆననాని యస్య సః = దశాననః, తేన = దశాననేన.
మానిని: మానః అస్యాః అస్తీతి = మానినీ, తస్యాస్సంబుద్ధిః = హే మానిని!
త్వదేకాననినిర్జితస్య : ఏకం చతత్ ఆననం చ = ఏకాననం, తవ ఏకాననం = త్వదేకాననం, త్వదేకాననేన నిర్జితః = త్వదేకానన నిర్జితః. తస్య = త్వదేకానన నిర్జితస్య.

భావము :

దిగ్విజయమునకై బయలుదేరిన రావణాసురుడు, లోకములు జయించియు చంద్రుని జయింపలేకపోయెను. కాని అట్టి చంద్రుని అనగా పదిముఖములు గల

రావణునిచేత జయింప శక్యుడుకాని చంద్రుని, స్త్రీవైన నీవు ఒక్కముఖముచేతనే జయించితివి. దానివలన నతడు లజ్జపడి గ్లానిజెందెను.

గమనిక : రావణాసురుడు దిగ్విజయమునకు బయలుదేరినవాడై చంద్రుని జయింపబోగా నాచంద్రుని మంచుకిరణముల నిప్పుచే గాల్చబడినవాడై వణకుచు నతనిని జయింపకయే మరలివెళ్ళెనని శ్రీరామాయణము యొక్క యుత్తరకాండయందు జెప్పబడినది.

శ్లో. దృష్టోనిజాంతావదియన్త్యహాని
జయన్నయం పూర్వదశాం శశాఙ్కః ।
పూర్ణత్వదాస్యేన తులాం గతశ్చే
దనన్తరం ద్రక్ష్యసి భఙ్గమస్య ॥ 180

ప. వి, దృష్టః - నిజాం - తావత్ - ఇయన్తి - అహాని - జయన్ - అయం - పూర్వదశాం - శశాఙ్కః - పూర్ణత్వదాస్యేన - తులాం - గతః - చేత్ - అనన్తరం - ద్రక్ష్యసి - భఙ్గం - అస్య.

అర్థము: అయం = ఈ, శశాఙ్కః = చంద్రుడు, ఇయన్తి = ఇన్ని, అహాని = శుక్లపక్షదినములను, తావత్ = అవధిగావించుకొని, పూర్వదశాం = పూర్వ పూర్వదినములలోనిక్షీణావస్థను, జయన్ = జయించుచు, ననగా మిక్కిలి యుత్తరోత్తర దినములయందు కలావృద్ధిచే నధికుడగుచు, దృష్టః = చూడబడెను. లేదా యిన్నిదినములు జయించుచునే చూడబడెను. (ఇవ్విధముగనే) పూర్ణః = పూర్ణత్వమును బొందినవాడై, త్వదాస్యేన = నీ ముఖముతో, తులాం = సామ్యమును, (త్రాసుకొయ్యను) గతశ్చేత్ = పొందినచో, అనన్తరం = తర్వాత సమీపకాలముననే, అస్య = ఇతనికి, భఙ్గం = పరాజయమును, కలాక్షయమును, ద్రక్ష్యసి = చూడగలవు. ఉత్తమునితో స్పర్థచేయువానికి భఙ్గము తప్పదుగదా!.

సమాసములు :

పూర్వదశాం : పూర్వాచ సా దశాచ = పూర్వదశా, తాం = పూర్వదశామ్.

త్వదాస్యేన : తవ ఆస్యం = త్వదాస్యం, తేన = త్వదాస్యేన.

**భావము :**

ఈ చంద్రుడిన్ని శుక్లపక్షపు దినముల నవధిగావించుకొని పూర్వ పూర్వ దినములకంటెను ఉత్తరోత్తర దినములయందు కళావృద్ధిని బొందుచు వర్థిల్లు చున్నాడు. ఇవ్విధముగనే పూర్ణిమనాడు నిండుతనమును బొందినవాడై నీ ముఖ ముతో సామ్యమును బొందినచో తర్వాత వెంటనే కృష్ణపక్షప్రారంభమునుండి కళాక్షయ మేర్పడగా పరాజయమును గూడ బొందగలడు. ఉత్తములతో స్పర్ధ జేయువానికి పరాజయము దప్పదుగదా!.

శ్లో. క్షత్రాణి రామః పరిభూయ రామాత్
క్షత్రాత్ యథా భజ్యత స ద్విజేన్ద్రః ।
తథైవ పద్మానభిభూయ సర్వాం
స్త్వద్వక్త్రపద్మాత్ పరిభూతిమేతి ॥ 131

వ. వి. క్షత్రాణి-రామః-పరిభూయ - రామాత్-క్షత్రాత్ - యథా-అభజ్యత - సః - ద్విజేన్ద్రః - తథా - ఏవ - పద్మాన్ - అభిభూయ - సర్వాన్- త్వద్వక్త్రపద్మాత్ - పరిభూతిం - ఏతి.

అర్థము: సః ద్విజేన్ద్రః = జమదగ్నికొడుకగుటవలన మిక్కిలి ప్రసిద్ధమైన పరా క్రమముగలిగిన బ్రాహ్మణ శ్రేష్ఠుడగు, రామః = పరశురాముడు, క్షత్రాణి = సమస్త క్షత్రియులను, పరిభూయాఽపి = ఓడించియు, క్షత్రా దేవ = క్షత్రియుడేయైన, రామాత్ = శ్రీరామచంద్రునివలన, యథా = ఎట్లు, అభజ్యత = ఓడింపబడెనో, తథా = అట్లే, (అయం = ఈ, ద్విజ రాజః = ద్విజరాజగుచంద్రుడు) సర్వాన్ = సమస్తములైన, పద్మాన్ = పద్మములను, అభిభూయ = తిరస్కరించి, త్వద్వక్త్రపద్మాత్, త్వత్ = నీయొక్క, వక్త్రపద్మాత్ = ముఖపద్మమువలన, పరిభూతిం = పరాభవ మును, ఏతి = పొందుచున్నాడు. సకల క్షత్రియులకంటె శ్రీరామ చంద్రు నకెట్లు ఆధిక్యమో, అట్లే సకలపద్మములకంటెను నీముఖమునకు ఆధిక్య మని యర్థము.

**సమాసములు :**

ద్విజేన్ద్రః : ద్విజానాం ఇన్ద్రః = ద్విజేన్ద్రః.

**భావము :**

జమదగ్ని పుత్రుడగుటవలన మిక్కిలి ప్రఖ్యాతి వడసిన పరాక్రమము గల బ్రాహ్మణోత్తముడగు పరశురాముడెట్లు తొలుత క్షత్రియులనందరిని వధించి చివరన క్షత్రియుడగు శ్రీరామచంద్రునివలననే యోడిపోయెను. అట్లే ద్విజరాజగు చంద్రుడును పద్మములనన్నింటిని పరిభవించి చివరన నీముఖపద్మముచే పరాభవము పొందుచున్నాడు.

శ్లో. అన్తః సలక్ష్మీక్రియతే సుధాంశో
రూపేణ పశ్యే! హరిణేన పశ్య।
ఇత్యేషభైమీమదదర్శదస్య
కదాచిదన్తం స కదాచిదన్తః 132

ప. వి. అన్తః - సలక్ష్మీక్రియతే - సుధాంశోః - రూపేణ - పశ్యే -హరిణేన- పశ్య - ఇతి - ఏష - భైమీం - అదదర్శత్ - అస్య - కదాచిత్ - అన్తం - సః - కదాచిత్ - అన్తః.

అర్థము: హే పశ్యే = చంద్రదర్శనమునకు బూనుకొనిన ఓదమయన్తీ!, హరిణేన = పాండురవర్ణముచే, సుధాంశోః = చంద్రునియొక్క, అన్తః = అంచు, (ముందు శోభారహితమైనను నిప్పుడు) సలక్ష్మీక్రియతే = లక్ష్మీవన్తము చేయబడుచున్నది. అనగా శోభావన్తము చేయబడుచున్నది. పశ్య = చూడుము. సుధాంశోః = ఆచంద్రునియొక్క, అంతః = మధ్యభాగము. హరిణేన = కలఙ్కమైనమృగముచే, సలక్ష్మీక్రియతే = సలక్ష్మముగా ననగా సకలఙ్కముగా చేయబడుచున్నది. పశ్య = చూడుము. ఏషః = ఈ, సః = ఆనలుడు, ఇతి = ఈవిధముగా, అస్య = ఈచంద్రునియొక్క, అంతం = అంచులను, కదాచిత్ = ఒకప్పుడు, అనగా క్షణకాలము, భైమీం = దమయన్తికి, అదదర్శత్ = చూపించెను. కదాచిత్ = మరియొక క్షణకాలమున, అంతః = మధ్యభాగమును, అద

దర్శత్ = చూపించెను. వ్రేళ్ళచే చంద్రునియందు తెల్లభాగములను నల్లని భాగములను చూపుచు ఆమెతో శ్లిష్టపదములతో నాటలాడెనని మధ్య కవి వచనము. "అంతః" అనునది అకారాన్తమైనపుడు అంచులను చెప్పును. అంతర్ యని రేఫాన్తమైనపుడవ్యయమై మధ్యభాగమును చెప్పును.

**సమాసములు :**

స లక్ష్మీక్రియతే : అసలక్ష్మీః సలక్ష్మీః సమ్పద్యమానాక్రియతే = స లక్ష్మీక్రియతే. పశ్చాన్తరమున అసలక్ష్మ సలక్ష్మ సమ్పద్యమానంక్రియతే = సలక్ష్మీక్రియతే.

**భావము :**

చన్ద్రవర్ణనమునకు దొడంగిన యోదమయన్తీ! పూర్వము శోభారహితమైనను నిపుడు చంద్రునియందు పాండురవర్ణముచే శోభావన్తము చేయబడుచున్నది. అట్లే చన్ద్రమధ్యభాగము పూర్వము కళఙ్కరహితమైనను నిపుడు మృగముచే సకలంకము చేయబడుచున్నది. అనగా సలక్ష్మిగా అనగా లక్ష్మముతో (కళంకముతో) గూడినదిగా జేయబడుచున్నది. చూడుము. ఈవిధముగా నలుడు దమయన్తికి చంద్రునియందును క్షణకాలము, చంద్రుని మధ్యభాగమును క్షణకాలము వ్రేలితో జూపుచు చంద్రుని తెలుపు నలుపు భాగములను చూపుచు శ్లిష్టపదములను ప్రయోగించి యామెతో నాటలాడెను అని కవియొక్క వచనము.

శ్లో. సాగరాన్మునివిలోచనోదరా
ద్యద్ద్వయాదజని తేన కిం ద్విజః ।
ఏవమేవ చ భవన్నయం ద్విజః
పర్యవస్యతి విధుః కిమత్రిజః ॥ 133

ప. వి. సాగరాత్ - మునివిలోచనోదరాత్ - యత్ - ద్వయాత్ - అజని - తేన - కిం - ద్విజః - ఏవం - ఏవ - చ - భవన్ - అయం-ద్విజః- పర్యవస్యతి - విధుః - కిం - అత్రిజః.

అర్థము; అయం = ఈచంద్రుడు, సాగరాత్ = సముద్రమునుండియు, మునివిలోచనోదరాత్, ముని = అత్రిమునియొక్క, విలోచన = కంటియొక్క,

ఉదరాత్ = మధ్యభాగమునుండియు, ద్వయాత్ = ఈరెంటినుండియు, అజని = ఉత్పన్నుడాయెను. తేన = ఆకారణముచే (రెంటివలన జన్మించుట వలన), ద్విజః కిం = ద్విజుడాయెనాయేమి?, ఏవమేవ = ఇట్లే, ద్విజః = ద్విజుడుగా, భవన్ = అగుచు, విధుః = చంద్రుడు, అత్రిజః = అత్రి నేత్రములయందు బుట్టినవాడుగా, కిం = ఎట్లు, పర్యవస్యతి = పర్యవ సానమునొందును. మఱియు, ఎట్లు ఈవిధముగ నీతనికి ద్విజత్వమో అట్లే యితడు ద్విజుడైన అత్రిమునికి జన్మించుటవలన ద్విజుడుకాడా? మరియు నిద్దరికి జన్మించుటవలనే ముగ్గురికి జన్మించినవాడుకాడుగదా! "అత్రిజః" యనగా ముగ్గురికి జన్మించినవాడు కాడనియర్థము. ఇద్దరికి జన్మించినవాడు ముగ్గురికి జన్మించడుగదా! కాన నీతడు అత్రిజుడా యెను అని యర్థము.

సమాసములు :

మునివిలోచనాత్ : మునేః విలోచనం = మునివిలోచనం, మునివిలోచ . న్యఉదరం = మునివిలోచనోదరం, తస్మాత్ = మునివిలోచనోదరాత్న

ద్విజః : ద్విః ద్వాభ్యాంవా జాయత ఇతి = ద్విజః.

అత్రిజః : అత్రేః జాయత ఇతి = అత్రిజః. పక్షాన్తరమున, త్రిభిః జాయత ఇతిత్రిజః, నత్రిజః = అత్రిజః.

భావము :

ఈచంద్రుడు సముద్రము అత్రిమహర్షినేత్రము అను నీరెంటినుండి యుద్భ వించినందువలన ద్విజుడాయెనాయేమి? ఇట్లిద్దరికి బుట్టుటవలన ద్విజుడయ్యె, నీ చంద్రుడు అత్రిమునికి బుట్టెననుట ఎట్లుతగును? లేదా పైవిధముగా ద్విజుడైనను ద్విజుడగు నత్రిమునికి బుట్టుటవలనగూడా ద్విజుడాయెనా? లేదా యిద్దరికి బుట్టుట వలన ద్విజుడాయెనా. ముగ్గురికి బుట్టనందువలన నత్రిజుడాయెనని చెప్పబడునా? కాన చంద్రునికి ద్విజత్వము అత్రిజత్వముపై వికల్పములతో గూడినదని యాశయము.

శ్లో. తారావిహారభువి చన్ద్రిమయీం చకార
యన్మణ్డలీం హిమభువం మృగనాభివాసాం ।
తేనైవ తన్వి; సుకృతేన మతే జినస్య
స్వర్లోకలోకతిలకత్వమవాపధాతా ॥ 134

ప. వి. తారావిహారభువి - చన్ద్రిమయీం - చకార - యత్ - మణ్డలీం- హిమభువం - మృగనాభివాసాం - తేన - ఏవ - తన్వి - సుకృతేన- మతే- జినస్య - స్వర్లోకలోకతిలకత్వం - అవాప - ధాతా.

అర్థము: హే తన్వి ! = ఓసున్దరీ !, ధాతా = బ్రహ్మ, తారావిహారభువి, తారా = నక్షత్రములయొక్క, విహారభువి = విహారస్థానమైన యాకసమునందు, హిమభువం = మంచునకు స్థానమును, మృగనాభివాసాం, మృగ = జింకను, నాభి = మధ్య, వాసాం = స్థానముగల్గిన, చన్ద్రిమయీం = చన్ద్రరూపమైన, మణ్డలీం = బిమ్బమును, జినస్య = శ్రీమహావిష్ణువుయొక్క, మతేసతి = అనుమతియేర్పడగా, యత్ = ఎందువలన, చకార = చేసెనో, తేనైవ = ఆ పుణ్యముచేతనే, స్వర్లోకలోకతిలకత్వం, స్వర్లోక = స్వర్గలోకమునందలి, లోక = జనులగు దేవతలకు, తిలకత్వం = శ్రేష్ఠత్వమును, అవావ = పొందెను. మఱియు, తారావిహారభువి, తారా = బుద్ధదేవికి, విహారభువి = పూజాస్థానమునందు, హిమభువం = చల్లగానుండుట వలన, హిమగిరిరూపమున, మృగనాభివాసం, మృగనాభి = కస్తూరియొక్క, వాసం = స్థితిగలదియు, చన్ద్రిమయీం = కర్పూరరూపమైన, మణ్డలీం = కాశిని, యత్ = ఎందువలన, చకార = చేసెనో, తేన = ఆ పుణ్యముచే, జినస్యమతే = బౌద్ధదర్శనమందు, ధాతా = బ్రహ్మ స్వర్లోకలోకతిలకత్వం, స్వర్లోక = స్వర్గలోకమందలి, లోక = లోకులైన దేవతలలో, తిలకత్వం = శ్రేష్ఠత్వమును, అవాప = పొందెను, బౌద్ధులు బుద్ధదేవుని ప్రాసాదమునందు వారిపూజకై కర్పూరకస్తూరి రాశినెవ్వడు చేయునో అతడు స్వర్గలోకములమధ్య శ్రేష్ఠుడగునని చెప్పిరి. బ్రహ్మ యీ విధముగా చేసి స్వర్గలోక శ్రేష్ఠత్వమును బొందెనట,

**సమాసములు :**

తారావిహారభువి : విహారస్య భూః = విహారభూః, తారాయాః విహార భూః = తారావిహారభూః, తస్యాం = తారావిహారభువి.

చంద్రమయీం : చన్ద్రస్య వికారః = చంద్రమయీ, తాం = చన్ద్రమయీం.

హిమభువం : హిమస్య భూః = హిమభూః, తాం = హిమభువం.

మృగనాభివాసాం : మృగస్య నాభౌ వాసః యస్యాస్సా = మృగనాభి వాసా, తాం = మృగనాభివాసాం. పక్షాన్తరమున, మృగనాభేః వాసః యస్యాస్సా = మృగనాభివాసా, తాం = మృగనాభివాసాం.

స్వర్లోకలోకతిలకత్వం : స్వః లోకః = స్వర్లోకః, స్వర్లోకస్య లోకాః = స్వర్లోకలోకాః, తిలకస్య భావః = తిలకత్వం, స్వర్లోకలోకేషు తిలకత్వం = స్వర్లోకలోకతిలకత్వం, తత్ = స్వర్లోకలోకతిల కత్వం.

**భావము :**

ఓ సున్దరీ! బ్రహ్మ, నక్షత్రములు సంచారముచేయు గగనమందు చంద్ర మండలమును శ్రీమహావిష్ణువు యొక్క యాదేశము ననుసరించి నిర్మించెను. ఆ పుణ్యముచేతనే యాబ్రహ్మ స్వర్గలోకవాసులలో శ్రేష్ఠుడాయెను. ఆ చంద్రమండలము మంచునకుస్థానమై మిక్కిలి శీతలమైనది. మరియు దానిమధ్య భాగము కలఙ్కమృగమునకు వాసమైనది. పక్షాన్తరమున బ్రహ్మ బుద్ధదేవియగు తార యొక్క పూజాస్థానమునందు చల్లనైన మంచువేలను కస్తూరితో మిళితమును కర్పూరమయమునగు మండలిని నిర్మించెను. ఆ పుణ్యముచేతనే బ్రహ్మసురులలో శ్రేష్ఠుడైనట్లు బౌద్ధదర్శనమునందు జెప్పబడినది. బుద్ధభగవానుని ప్రాసాదమందు వారిపూజకై కర్పూరకస్తూరీరాశిని, జేయువాడు లోకములయందతట శ్రేష్ఠుడగు నని బౌద్ధులు తమ దర్శనమందు జెప్పిరి. బ్రహ్మ యీ విధముగాజేసి సర్వ శ్రేష్ఠత్వము బడసెనని యాశయము.

శ్లో. ఇందుంముఖాత్ బహుత్వణం తవయ ద్గృణన్తి
నైనం మృగస్త్యజతి తన్మృగతృష్ణయేవ।
అత్యేతి మోహ మహిమా న హిమాంశుబిమ్బ
లక్ష్మీవిడమ్బిముఖి! విత్తిషు పాళవీషు ॥ 135

ప. వి. ఇందుం - ముఖాత్ - బహుతృణం - తవ - యత్ - గృణన్తి - స-ఏనం - మృగః - త్యజతి - తత్ - మృగతృష్ణయా - ఇవ-అత్యేతి-మోహమహిమా - న-హిమాంశుబిమ్బ లక్ష్మివిడమ్బిముఖి - విత్తిషు-పాశవీషు.

అర్థము: హే హిమాంశుబిమ్బ లక్ష్మివిడమ్బిముఖి, హిమాంశుబిమ్బ = చంద్ర బింబముయొక్క, లక్ష్మి = శోభను, విడమ్బి = పరిహసించెడి, ముఖి = ముఖముగల యో దమయన్తీ! (పండితాః = పండితులు) ఇందుం = చంద్రుని, తవ = నీయొక్క, ముఖాత్ = ముఖమునకంటె, బహు తృణం = గడ్డిపోచకంటెను కొంచెము తగ్గని లేదా గడ్డిపోచకంటెను స్వల్పమైనదిగా, యత్ = ఎందువలన, గృణన్తి = చెప్పుచున్నారో, తత్ = అందువలన. మృగః = మృగము, ఏనం = ఈచంద్రుని, మృగతృష్ణయేవ, మృగ = మృగమునకు సంబంధించిన, తృష్ణయా ఇవ = కోమలములగు గడ్డిపోచలను తినవలెయునను యభిలాషచేతనో యనునట్లు. లేదా, బహుతృణం, బహు = అధికమైన, తృణం = గడ్డిగల వాడనను, మృగతృష్ణయాఇవ = భ్రాన్తిచేతనోయనునట్లు, నత్యజతి = విడుచుటలేదు. మృగముమెందుగానున్న గడ్డినిగాని ఆ గడ్డిగల ప్రదేశమును గాని విడువదు. అనుభవము ననుసరించి సంసారమున్నంతకాలము భ్రాన్తి యెట్లుండునని శంకింపరాదు. ఏలయనగా ? పాశవీషు = పశుసంబంధము గల్గిన. విత్తిషు = జ్ఞానముల విషయమున, మోహమహిమా = భ్రాన్తి యొక్క ఆధిక్యము, నాత్యేతి = తొలగదు. పశువులెల్లపుడును మూఢములే కాన నిప్పటికివి వానియొక్క భ్రాంతితొలగదు. కాన నీచంద్రునది విడచి పెట్టదని యర్థము.

సమాసములు :

బహుతృణం : తృణాదీషదన్యూనం = బహుతృణం, పక్షాన్తరమున, బహుతృణం యస్మాత్సః = బహుతృణః, తం = బహుతృణం, లేదా

బహూనితృణాని యస్మాత్తస్మిన్ = బహుతృణం, తం = బహుతృణం, లేదా బహుచ తత్ తృణంచ = బహుతృణం.

మృగతృష్ణయా : మృగస్యతృష్ణా = మృగతృష్ణా, తయా = మృగ తృష్ణయా.

మోహమహిమా : మోహస్య మహిమా = మోహమహిమా.

హే హిమాంశుబిమ్బలక్ష్మీవిడమ్బిముఖి : హిమాంశోః బిమ్బః = హిమాంశుబిమ్బః, హిమాంశుబిమ్బస్య లక్ష్మీః = హిమాంశుబిమ్బలక్ష్మీః, హిమాంశుబిమ్బలక్ష్మ్యాః విడమ్బి = హిమాంశుబిమ్బలక్ష్మీవిడమ్బి, హిమాంశుబిమ్బలక్ష్మీవిడమ్బిముఖం యస్యాస్సా = హిమాంశుబిమ్బ లక్ష్మీవిడమ్బిముఖీ, తస్యాః సంబుద్ధిః = హే హిమాంశుబిమ్బలక్ష్మీ విడమ్బిముఖి.

పాశవీషు : పశోరిమాః పాశవ్యః, తాసు = పాశవీషు.

భావము :

చంద్రబింబపుశోభను పరిహసించునట్టి మోముగల దమయన్తీ! పండితులు చంద్రుని నీముఖమున కంటెను నిస్సారమైనగడ్డిపోచగను లేదా, లేదా గడ్డిపోచ కంటెను హీనమైనదానినిగను చెప్పుచున్నారు. కాన మృగము లేతగడ్డిని మేయ వలయుననెడి యభిలాషచేతనో లేదా చంద్రుడు మెండైనగడ్డిగల వాడను భ్రాంతి చేతనో ఆచంద్రుని విడువక యున్నది. మృగము మెండుగడ్డినికాని, ఆ గడ్డిగల ప్రదేశముసుకాని విడువదు. అనుభవమును బట్టినచో సంసారమున్నంతవరకు భ్రాన్తి యెట్లుండునని శంకింపరాదు. పశువులకు సంబంధించిన జ్ఞానముల విషయమున బహుకాలము గడిచినను భ్రాన్త్యతిశయము తొలగదు. అవి యెప్పుడును మూఢములేకాన నెప్పటికిని వాని భ్రాన్తితొలగదు కాన నీ మృగము చంద్రుని వదలిపెట్టదని యాశయము.

శ్లో. స్వర్భానునా ప్రసభపాన బిభీషికాభి
ర్దుఃఖాకృతైనమవధూయ ముధా సుధాంశుం ।
త్వం నిహ్నుతే సితిమచిహ్నమముష్యరాగై
స్తామ్బూలతామ్రమవలంబ్య తవాధరోష్ఠం ॥ 137

ప. వి. స్వత్యాననా - ప్రసభపానబిభీషికాభిః - దుఃఖాకృతా - ఏనమ్ - అవధూయ - సుధా- సుధాంశుం - త్వం - నిహ్నుతే - సితిమచిహ్నం - అముష్య - రాగైః - తామ్బూలతామ్రమ్ - అవలమ్బ్య - తవ - అధరోష్ఠమ్.

అర్థము: హేప్రియే! = ఓప్రియురాలా! సుధా = అమృతము, ఏన = ఈ, సుధాంశుం = చంద్రుని, అవధూయ = తిరస్కరించి. అనగా వదలిబెట్టి, తవ = నీయొక్క, తామ్బూలతామ్రం = తామ్బూలముచేనెఱ్ఱని అధరోష్ఠం = క్రిందిపెదవిని, అవలమ్బ్య = ఆశ్రయించి, అముష్య = ఎఱ్ఱనియీ పెదవియొక్క, రాగైః = రక్తవర్ణములచే, సితిమచిహ్నం, సితిమ = తెల్లదనమనెడి, చిహ్నం = గుర్తుగల్గిన, స్వం = తన్ను, నిహ్నుతే = దాచుకొనుచున్నది. రాహువు తన్ను బానముచేయుననెడి భయముతో నీపెదవియనెడి మఱియొక స్థలము నాశ్రయించి రూపాంతరముతో తన్ను దాచుకొనుచున్నదని యర్థము. ఎవడైనను భయము గల్గించెడి స్థలమునువీడి మఱియొక స్థలమునకు బోయియచ్చట మరియొక రూపమును ధరించి తన్ను మరుగుపరుచుకొనునుగదా! అమృతము రాహు భయముతో చంద్రునివదలి నీపెదవియనెడి స్థలాన్తరము నాశ్రయించినది గాన నీముఖము చంద్రునికంటె నధికమని యర్థము.

సమాసములు :

ప్రసభపానబిభీషికాభిః : ప్రసభం పానం = ప్రసభపానం, ప్రసభపానేన బిభీషికాః = ప్రసభపానబిభీషికాః. తాభిః = ప్రసభపానబిభీషికాభిః.

దుఃఖాకృతా : దుఃఖం కృతం యస్యాస్సా = దుఃఖాకృతా.

సితిమచిహ్నం : సితస్యభావః = సితిమా, సితిమ్నః చిహ్నం = సితిమ చిహ్నం.

తామ్బూలతామ్రమం: తాంబూలేన తామ్రః = తాంబూలతామ్రః; తం = తాంబూలతామ్రమం,

అధరోష్ఠం : అధరశ్చాసౌ ఓష్ఠశ్చ = అధరోష్ఠః, తం = అధరోష్ఠమ్.

భావము :

ఓ ప్రియురాలా! అమృతము ఈచంద్రుని వదలిపెట్టి, తామ్బూలమువలె నెఱ్ఱనైన నీక్రిందిపెదవిని ఆశ్రయించినదై, యీపెదవియొక్క యెఱ్ఱని వెన్నెలచే తెల్లదనమనెడి గుర్తులతో గూడిన తన్ను మఱుగుపరుచుకొనుచున్నది. ఏలయనగా మాటిమాటికి రాహువు తన్ను బలవంతముగా బానముచేయుననెడి భయముతో నది దుఃఖమునొందుచున్నది. ఆభయముతో నీపెదవియనెడి యింకొక స్థలము నాశ్రయించినదై మఱియొకరూపముతో ననగా తెల్లనిరూపమును విడిచిపెట్టి ఎఱ్ఱని రూపమును వహించినదై తన్నుదాచుకొనుచున్నదని యర్థము. ఎవడైనను భయముతో గూడిన స్థానమును వదలిపెట్టి మరియొకస్థలమునకుబోయి రూపమును మార్చుకొని, తన్ను గాపాడుకొనునుగదా! మఱియు నమృతము చంద్రునివదలి నీ ముఖము నాశ్రయించుటవలన నీముఖము చంద్రునికంటెను శ్రేష్ఠమైనదని యర్థము.

శ్లో. హర్యక్షీభవతః కురఙ్గముదరే
ప్రక్షిప్య యద్వా శశం ।
జాతస్ఫీతతనోరముష్య హరితా
సూతస్య పత్న్యా హరేః
భఙ్గస్త్వద్వదనామ్బుజాదజనియ
త్పద్మాత్తదేకాకినః
స్యాదేకః పునరస్య సప్రతిభటో
యస్సింహికాయాస్సుతః॥ 137

ప. వి. హర్యక్షీభవతః - కురఙ్గమ్- ఉదరే - ప్రక్షిప్య - యత్ - వా-శశం- జాతస్ఫీతతనోః - అముష్య- హరితా - సూతస్య - పత్న్యా-హరేః- భఙ్గః - త్వద్వదనామ్బుజాత్ - అజని - యత్ - పద్మాత్ - తత్ - ఏకాకినః - స్యాత్ - ఏకః - పునః - అస్య - సః - ప్రతిభటః - యః - సింహికాయాః - సుతః

అర్థము: హే ప్రియే! = ఓ ప్రియురాలా!, కురఙ్గం = కలఙ్కరూపమైన జింకను, లేదా కుందేటిని, ఉదరే = మధ్యభాగమునందు, ప్రక్షిప్య = ఉంచుకొని, జాత స్ఫీతతనోః, జాత = ఏర్పడిన, స్ఫీత = బలిసిన, లేదా పూర్ణమైన, తనోః = శరీరముకలిగిన, హరేః = ఇంద్రునియొక్క, పత్న్యాః = భార్యయగు, హరితా = తూర్పుదిక్కుచే, సూతస్య = కనబడిన, (కావుననే) హర్యక్షీ భవతః, హరి = విష్ణువునకు, అక్షీభవతః = ఎడమకన్నుగా నేర్పడిన, లేదా కంటిపాపతో సమానమైన కళంకమును మధ్యధరించి యుదయించిన, అముష్య = ఈ చంద్రునకు, త్వద్వదనామ్బుజాత్, త్వత్ = నీయొక్క, వదనామ్బుజాత్ = ముఖమనెడి కమలమునుండి, యత్ = ఎందువలన, భఙ్గః = పరాజయము, అజని = ఏర్పడినదో, తత్ = అది, ఏకాకినః = అన్నిసమయములందు, ఒక్కటియై సహాయము లేనటువంటి, పద్మాత్ = పద్మమువలననే. (కాని మరియొక పద్మమువలనకాని యితర పద్మములచేత గాని యేర్పడదు.) ఏలయనగా నితడే పద్మములను బరాభవించును. లేదా కమలముతో సమానముగా నుండుటవలన ముఖమనెడి పద్మమువలన మఱియు పద్మసంఖ్యకల్గిన నీముఖమనెడి పద్మమువలన ఈ చంద్రునికి భఙ్గమేర్పడుటయనునదేదిగలదో అదిఒంటరియై సహాయములేనివానికే యేర్పడును. పెక్కండ్రచే నొక్కడోడింపబడుట యుక్తమేకదా!, యః = ఏ, సింహికాయాః = సింహికయొక్క, సుతః = కుమారుడగు రాహువుగలడో, సః = అతడు, ఏకః = మరియొక, ప్రతిభటః = పరాభవముచేయునట్టివాడు, ''స్మృతి''అను పాఠము ననుసరించినచో, స్మృతి = ఇపుడు, ఏకః = ఒక. ప్రతిభటః = శత్రువగురాహువున్నాడో, ఒంటరియగు నారాహువు ఏకాకియగు నీచంద్రునకు శత్రువు. కాని నీముఖపద్మము శత్రువు కాదు. ఏలయనగా పద్మసంఖ్యాకమగుటవలన నీముఖమసంఖ్యాకము. అది యొంటరియగు చంద్రునకెట్లు శత్రుత్వమును వహించును. ఏలయనగా సమానసంఖ్యలేదుగదా? "వివాహశ్చ వివాదశ్చ సమయోరేవ శోభతే" యను న్యాయమునసనుసరించి ముఖపద్మము పద్మసంఖ్యగల ముఖచంద్రునకు, ప్రతిద్వంద్వికానేరదని యర్థము. కాన నొంటరియగు చంద్రునకు నొంటరియైన రాహువే ప్రతిస్పర్థికాదగునని యర్థము.

మరియు, హరితా = పచ్చనివన్నెగలిగిన, హరేః = సింహము యొక్క, పత్న్యా = భార్యయగు నాడుసింహముచే, సూతస్య = కనబడిన, మృగం = కుందేటినికాని హరియొకమృగమునుకాని, ఉదరే = కడుపు నందు, ప్రక్షిప్య = ఉంచుకొని, యనగా భక్షించి(కావుననే)జాతస్ఫీతతనోః జాత = ఏర్పడిన, స్ఫీత = బలిసిన, తనోః = శరీరముకలిగిన (కావున), హర్యక్షీభవతః = సింహముగా నగుచున్న, అస్య = ఇతనికి, త్వద్వదనాత్ = నీముఖమువలన, భఙ్గః = పరాజయము, అజని = ఏర్పడినచో, సః = అది, ఏకాకినః = ఒక్కటేయైన, పద్మాత్ = గజమువలననే ఏర్పడిన పరాజయమగుచున్నది. సింహమునకునేనుగువలన పరాజయమెట్టిదో యట్టిదే యిదియని గొప్పయాశ్చర్యము. మఱియు, పద్మాత్ = శరభమృగము నుండి, భఙ్గః = సింహమునకు పరాజయ మనియు నర్థము. పద్మచంద్రుల కంటెను నీముఖమతిశయించినదని యర్థము.

సమాసములు :

హర్యక్షీభవతః: హరేః అక్షి = హర్యక్షి, అహర్యక్షి హర్యక్షి సమ్పద్యమానః, భవన్ = హర్యక్షీభవన్, తస్య = హర్యక్షీభవతః, పక్షాన్తరమున అహర్యక్షః హర్యక్షస్సమ్పద్యమానః భవన్ = హర్యక్షీభవన్, తస్య = హర్యక్షీభవతః

జాతస్ఫీతతనోః: స్ఫీతాచసాతనుశ్చ = స్ఫీతతనుః, జాతా స్ఫీతతనుః, యస్య సః = జాతస్ఫీతతనుః, తస్య = జాతస్ఫీతతనోః.

త్వద్వదనామ్బుజాత్ : తవవదనం = త్వద్వదనం. త్వద్వదనమేవ అమ్బుజం = త్వద్వదనామ్బుజం, తస్మాత్ = త్వద్వదనామ్బుజాత్.

భావము :

ఓ ప్రియురాలా! కలఙ్కమనెడి జింకనుగాని కుందేలునుగాని మధ్యభాగమునందుంచుకొని పూర్ణశరీరము గలవాడును, నింద్రుని భార్యయగు తూర్పుదెసచే నుత్పత్తిజేయబడిన వాడును శ్రీమహావిష్ణువునకు నెడమకన్నుగనుండెడి వాడును, లేదా కంటిపాపతో సమానమగు కలఙ్కమనెడి మృగమును వహించినవాడునునగు

ఈచంద్రునకు నీముఖపద్మము వలన భఙ్గమేర్పడుట యుక్తమే. ఏలయనగా నా భఙ్గము లేదా పరాజయము ఆ చంద్రునకొక్కటియేయగు నీముఖపద్మమువలననే యగును. కాని మతియొక పద్మముచేగాని పద్మములచేగాని యాపరాజయము సంభవింపదు. ఏలయనగా నా చంద్రుడే యట్టి పద్మములను పరాభవింపగలడు. చంద్రుని కాంతులతో పద్మములు ముకుళించునుగదా! కాని చమయనివైన నీయొక్క ముఖపద్మమో చన్ద్రకాంతిచే భఙ్గమునొందదు. పైగా నాచంద్రుడే నీముఖకాంతితో భఙ్గమునొందును. చంద్రునికంటెను నీముఖపద్మమధికముగదా! లేదా పద్మమనెడి సంఖ్యగల నీముఖపద్మమువలన నొంటరియగు చన్ద్రునకు పరాజయము సంభవించుట సముచితమే. కాని సింహికయొక్క కుమారుడగు రాహువు ఒంటరియై యుండినవాడై యితనికి ప్రతిస్పర్ధిగా నున్నాడు. ఏకాకియగు చంద్రునకు నేకాకియగు రాహువు ప్రతిస్పర్ధియగుట యుచితమే. మరియు తనకు శత్రువగు నీరాహువు వలన నితనికి మరియొక పరాభవముండుటవలన నిది కష్టమైన విషయము.

పక్షాన్తరమున - పచ్చని వన్నెగలిగిన సింహముయొక్క భార్యయగు సింహికచే ప్రసవింపబడి జింకను కాని కుందేలునుకాని పొట్టబెట్టుకొని పుష్టినొందిన శరీరము గలిగి సింహమైన యితనికి (ఈ చంద్రునకు) నీ ముఖమునుండి పరాజయమనునది కేవలము పద్మమునుండియే యనగా గజమునుండియే యగుచున్నది. సింహమునకు గజమునుండి పరాజయమెట్టిదో నీముఖమునుండి చంద్రునకేర్పడిన పరాజయముగూడ నట్టిదేయగుచున్నది. మరియు పద్మసంఖ్య గల్గినవానినుండి యొంటరియగు దానికి పరాజయము సహజమే. కాననొక్క సింహము పెక్కింటిచే నోడింపబడుట యుక్తమని యర్థము. మరియు పద్మమునుండి యనగా నెనిమిది పాదములు గల్గిన శరభమను మృగమునుండియే సింహమునకు పరాజయము. పద్మమునకంటెను చంద్రునికంటెను నీముఖ మతిశయించినదని సారాంశము.

శ్లో. యత్ప్రాజాం నయనద్వయోత్పలమయీం
వేధావ్యధాత్ పద్మభూః।
వాక్పారీణరుచిః సచేన్ముఖమయం
పద్మః ప్రియే! తావకమ్

కశ్శీతాంశురసౌ తదా? మఖమృగ
వ్యాధోత్తమాఙ్గస్థల
స్థాణుస్వస్తటినీ తటావనివనీ
వానీర వాసీ బకః ॥ 138

ప. వి. యత్పూజాం - నయనద్వయోత్పలమయీం - వేధాః - వ్యధాత్ - పద్మభూః - వాక్పారీణరుచిః - సః - చేత్ - ముఖం - అయం - పద్మః - ప్రియే - తావకం - కః - శీతాంశుః - అసౌ - తదా-మఖ మృగవ్యాధోత్తమాఙ్గస్థలస్థాణు స్వస్తటినీ తటావని వనీవానీరవాసీ-బకః.

అర్థము: హేప్రియే! = ఓప్రియురాలా!, పద్మభూః = పద్మజుడగు, వేధాః = బ్రహ్మ, నయనద్వయోత్పలమయీం, నయనద్వయ = తనరెండు కన్ను లనెడి, ఉత్పలమయీం = కలువలరూపముగల్గిన, యత్పూజాం, యత్ = ఏపద్మముయొక్క, పూజాం = పూజను, వ్యధాత్ = చేసెనో, (శ్రీ మహా విష్ణువుయొక్క పొక్కిలియందుండుటవలన పద్మభవుడగుచున్నాడు. కాన నా పద్మమునం దుద్భవించుటవలన పద్మము బ్రహ్మకు తండ్రి. కాన తండ్రియగు పద్మమునకు పితృభక్తిచే కనుగవ యనెడి కలువల జంటచే గొప్ప పూజనుగావించెను.) వాక్పారీణరుచిః, వాక్ = వాక్కునకు, పారీ ణ = అవలిగట్టునందున్న యనగా వర్ణింప సాధ్యముగాని, రుచిః = కాంతి గల్గిన, సః = ఆ, అయం = ఈ పద్మము, తావకం = నీదైన, ముఖం = ముఖముగానేర్పడినది. తర్వాత బ్రహ్మ యీపద్మమును తనకు తండ్రి యని తన కన్నులనెడి నల్లని కలువలచే బూజించుటవలన నీ యీముఖము నందలి కనుగవయనెడి నల్లకలువలు ఏర్పడినవి. ఇట్లు ఆపద్మము నీ ముఖమగుచో, తదా = అపుడు, అసౌ = ఈ, శీతాంశుః = చంద్రుడు, కః = ఎవ్వడు? ఎవ్వడునుకాడని యర్థము. నీముఖమునకు సమీపము నందు ఈ చంద్రుడు స్మరించుటకుగూడా నర్హుడుకాడు. అయిన నితడు, మఖమృగవ్యాధోత్తమాఙ్గ స్థలస్థాణు స్వస్తటినీ తటావనివనీవానీరవాసీ, మఖ = దక్షయజ్ఞమనెడి, మృగ = జింకకు, వ్యాధ = బోయవాడగు శివునియొక్క, ఉత్తమాఙ్గ = శిరమనెడి. స్థల = స్థలమునందు, స్థాణు =

నెలకొను స్వభావముగల, స్వస్త్రటినీ = ఆకాశగంగయొక్క, తట = గట్టనెడి, అవని = భూమియందలి, వనీ = గొప్పవనమందలి, వానీర = ప్రబ్బలిచెట్లయందు, వాసీ = నివసించునట్టి, బకః = కొక్కెర, "వాక్పారీణరుచిః" యనునది పద్మభవునకు విశేషణముగా గూడా నన్వయింప వచ్చును, బ్రహ్మసౌందర్యమే వాక్కునకు అతీతమైనపుడు ఆతని తండ్రి యగు పద్మముయొక్క సౌందర్యము మనస్సునకును గోచరము కాదని యర్థము. నీముఖమునకును చంద్రునకును చాల భేదము. కాన నారెంటికి సాదృశ్యమును దలంచుటగూడ యుక్తముకాదని యర్థము. చంద్రుడు మున్నగు సున్దరపదార్థములను బ్రహ్మ సృజించెను. నీముఖపద్మమో యట్టి బ్రహ్మనే సృజించెను. కాననిది దానికంటె నధికమని యర్థము. "మఖ మృగ" ఇత్యాదిచే చంద్రునకు మిక్కిలి దైన్యము సూచింపబడినది. నీ ముఖముతోడి సామ్యము బొందుటకై యతడు తపముచేయుట సూచింప బడినది. ఉత్తమస్థానమును బడయుటకై శివసన్నిధిగల్గిన నదీతీరమందలి ప్రబ్బలి చెట్లమధ్య వసించుచు నెవ్వడైనను తపము గావించును.

సమాసములు :

యత్ప్రూజాం : యస్యైః ప్రూజా = యత్ప్రూజా, తాం = యత్ప్రూజాం.

నయనద్వయోత్పలమయీం : నయనయోః ద్వయం = నయనద్వయం, నయనద్వయమేవ ఉత్పలం = నయనద్వయోత్పలం, నయనద్వయోత్పలస్య వికారః = నయనద్వయోత్పలమయీ, తాం = నయనద్వయోత్పలమయీమ్.

పద్మభూః : పద్మాత్ భవతీతి = పద్మభూః.

వాక్పారీణరుచిః : వాచః పారం = వాక్పారం, వాక్పారే భవా = వాక్పారీణా వాక్పారీణారుచిః యస్యసః = వాక్పారీణారుచిః.

తావకం : తవ ఇదం తావకం.

మఖమృగవ్యాధోత్తమాఙ్గస్థలస్థాస్ను స్వస్త్రటినీ తటావనివనీవానీర వాసీ : మఖఏవమృగః = మఖమృగః, మఖమృగస్యవ్యాధః = మఖ మృగవ్యాధః, మఖమృగవ్యాధస్య ఉత్తమాఙ్గం = మఖమృగవ్యాధోత్త

మార్గః, మఖమృగవ్యాధోత్త మార్గమేవస్థలం = మఖమృగవ్యాధోత్త మార్గ స్థలం, స్థాతుంశీలంయస్యాస్సా = స్థాస్నుః, మఖమృగవ్యాధోత్త మార్గస్థల స్థాస్నుః, స్వఃతటినీ = స్వస్తటినీ, మఖమృగవ్యాధోత్త మార్గస్థలస్థాస్ను శ్చాసౌ స్వస్తటినీ చ = మఖమృగవ్యాధోత్త మార్గస్థలస్థాస్ను స్వస్తటినీ, మఖమృగవ్యాధోత్త మార్గస్థలస్థాస్ను స్వస్తటిన్యాఃతటం = మఖమృగ వ్యాధోత్తమార్గస్థలస్థాస్ను స్వస్తటినీతటం, మఖమృగవ్యాధోత్త మార్గస్థల స్థాస్ను స్వస్తటినీ తటమేవ అవనిః = మఖమృగవ్యాధోత్త మార్గస్థల స్థాస్ను స్వస్తటినీతటావనిః, మఖమృగవ్యాధోత్తమార్గస్థలస్థాస్ను స్వస్తటి నీతటావనౌవనీ = మఖమృగవ్యాధోత్త మార్గస్థలస్థాస్ను స్వస్తటినీ తటా వనివనీ. మఖమృగవ్యాధోత్త మార్గ స్థలస్థాస్ను స్వస్తటినీ తటావనివన్యాం వానీరాః = మఖమృగవ్యాధోత్త మార్గస్థలస్థాస్ను స్వస్తటినీ తటావని వనీ వానీరాః, మఖమృగవ్యాధోత్త మార్గస్థలస్థాస్ను స్వస్తటినీ తటావని వనీ వానీరేషు వసతీతి = మఖమృగవ్యాధోత్తమార్గస్థలస్థాస్ను స్వస్తటినీ తటా వని వనీవానీరవాసీ.

**భావము :**

ఓ ప్రియురాలా! పద్మము నందుద్భవించిన బ్రహ్మ తన కనుగవయనెడి కలువలరూపము గలిగిన పూలతో పూజను తనతండ్రియగు పద్మమునకు సలి పెను. బ్రహ్మ శ్రీమహావిష్ణువుయొక్క పొక్కిలియనెడి తమ్మియందు జన్మించెను కాని నాపద్మము బ్రహ్మకు జనకమైనందువలన దండ్రియైనది. ఆ బ్రహ్మయు నా పద్మమును వాక్కునకతీతమగు కాంతిగలవారు. అట్టి పద్మము నీముఖముగా నేర్పడినది తరువాత బ్రహ్మ యాపద్మమును తన తండ్రియనెడు బుద్ధితో తనకను గవయనెడి నల్లకలువలచే పూజింపటవలన నానల్లకలువలు నీముఖమునందలి నేత్రములనెడి నల్లకలువలుగా నేర్పడినవి. అట్లు పద్మము నీముఖముగను కలువ పూలు నీకన్నులుగనునైనచో నీచంద్రుడెవ్వడు?. ఇతడెవ్వడునుకాడు. నీముఖ మునకెదుట నీచంద్రుడు స్మరించుటకును గూడ నర్హుడుకాదని యర్థము. అయినను ఇతడు యాగమనెడి జింకను తఱుముకొని పోయిన బోయవాడగు శివుని శిరము నందు నెలకొనిన యాకాశగంగయొక్క గట్టునందలి మహారణ్యములోని ప్రబ్బలి

చెట్లమధ్య నసించుచు తపము చేయునట్టి కొంగ. అనగా నీముఖముతో సామ్యము బొందుటకితడు శివుని జటాజూటమను మహారణ్యపు ప్రబ్బలి చెట్లయందు తపము గావించుచున్నాడు. చంద్రుడు శివుని తలపైననుండును గాన నిది సరిపడుచున్నది. చంద్రుడు మున్నగు సుందరవస్తువులను బ్రహ్మ సృజించెను. అట్టిబ్రహ్మకు జనకమైన పద్మమే నీముఖమైనచో వాని సౌందర్యమెంతటిదో చెప్పసాధ్యము కాదని యాశయము.

శ్లో. జాతాం శాతక్రతవ్యాం హరితి విహరతః
కాకతాలీయమస్యామ్
అశ్యామత్వైక మత్యస్థిత సకలకలా
నిర్మితేర్నిర్మలస్య
ఇన్దోరిన్దీవరాభం బలవిజయిగజ
గ్రామణీ గణ్డపిణ్డ
ద్వన్ద్వాఽపాదాన దానద్రవల వలగనా
దఙ్కమఙ్కే విశఙ్కే ॥ 139

ప. వి. జాతాం - శాతక్రతవ్యాం - హరితి - విహరతః-కాకతాలీయం-అస్యామ్ అశ్యామత్వైకమత్య స్థితసకలకలానిర్మితేః - నిర్మలస్య - ఇన్దోః - ఇన్దీవరాభం - బలవిజయి గజగ్రామణీ గణ్డపిణ్డ ద్వంద్వాఽపాదాన దానద్రవఽవలగనాత్ - అఙ్కం - అఙ్కే - విశఙ్కే.

అర్థము: అస్యాం=వ్రేలితో జూపదగిన యీముందు గనబడు, శాతక్రతవ్యాం=శతక్రతువగు నింద్రునికి సంబంధించిన, హరితి=దిక్కునందు, విహరతః=ఉదయించుచున్న, అశ్యామత్వైకమత్యస్థిత సకల కలా నిర్మితేః, అశ్యామత్వ=నల్లదనములేదను విషయమున, ఐకమత్య= అందరికి సంవాదమను విషయమున, స్థిత=ఉన్న, సకలకలా=సకలములైన పదునైదు కళలచే, నిర్మితేః=నిర్మాణము గలిగిన, నిర్మలస్య=తెల్లనైన, ఇందోః=చంద్రునియొక్క, అఙ్కే=కళఙ్కము నందు. బలవిజయి గజగ్రామణీ గణ్డపిణ్డ ద్వంద్వాఽపాదాన దానద్రవ

లవలగనాత్, బలవిజయి = బలాసురుని జయించిన యింద్రునియొక్క, గజ గ్రామణీ = గజశ్రేష్ఠమగు నైరావతముయొక్క, గణ్డ = కపోలములనెడి పిణ్డ = కుమ్భస్థలముయొక్క, ద్వంద్వ = జంటయనగా గణ్డముల జత యనెడి, అపాదాన = వెలువడు స్థానములుగల్గిన, దానద్రవ = మదజల ములయొక్క, లవ = బిన్దువులయొక్క, లగనాత్ = సంపర్కమువలన, కాకతాలీయం = ఆకస్మికమైన. ఇందీవరాభం = నల్లకలువతో సమాన ముగా, జాతం = ఏర్పడిన, అఙ్కం = కలఙ్కముగా, విశఙ్కే = సందే హింతును.

**సమాసములు :**

శాతక్రతవ్యాం : శతక్రతోః ఇయం = శాతక్రతవీ, తస్యాం = శాతక్రతవ్యాం.

కాకతాలీయం : కాకగమనమివ తాలపతనమివ = కాకతాలం, కాకతాల మివ = కాకతాలీయం.

అశ్యామత్వైకమత్యస్థితసకలాకలానిర్మితేః : నశ్యామం = అశ్యా మం, అశ్యామస్యభావః = అశ్యామత్వం, అశ్యామత్వేఐకమత్యం = అశ్యామత్వైకమత్యం, అశ్యామత్వైకమత్యేస్థితాః = అశ్యామత్వైకమత్య స్థితాః, సకలాశ్చతాః కలాశ్చ = సకలకలాః, అశ్యామత్వైకమత్య స్థితాశ్చతాః సకలకలాశ్చ = అశ్యామత్వైకమత్యస్థితసకలకలాః. అశ్యా మత్వైకమత్యస్థితసకల కలానాం నిర్మితిః = అశ్యామత్వైకమత్యస్థిత సకలకలానిర్మితిః, తస్యాః = అశ్యామత్వైకమత్యస్థిత సకలకలా నిర్మితేః.

ఇన్దీవరాభం : ఇందీవరస్య ఆభేవ ఆభా యస్య తత్ = ఇన్దీవరాభం.

బలవిజయిగజగ్రామణీ గణ్డ పిణ్డద్వంద్వాపాదానదానద్రవ లవ లగనాత్ : బలస్యవిజయీ = బలవిజయీ, గజానాం గ్రామణీః = గజగ్రామణీః, బలవిజయినః గజగ్రామణీః = బలవిజయిగజగ్రామణీః, గణ్డౌపిణ్డౌచ = గణ్డపిణ్డాః, బలవిజయిగజగ్రామణ్యాః గణ్డపిణ్డాః = బలవిజయిగజగ్రామణీ గణ్డపిణ్డాః, బలవిజయిగజగ్రామణీ గణ్డపిణ్డానాం ద్వంద్వే = బలవిజయిగజగ్రామణీ గణ్డపిణ్డద్వంద్వే. బలవిజయిగజ

గ్రామణీగణ్ణవిణ్ణ ద్వంద్వేవ అపాదానే యేషాంతే = బలవిజయిగజ గ్రామణీ గణ్ణవిణ్ణద్వంద్వాఽపాదానాః, దానస్యద్రవః = దానద్రవః, దాన ద్రవస్యలవాః = దానద్రవలవాః, బలవిజయిగజగ్రామణీ గణ్ణవిణ్ణద్వన్ద్వాఽ పాదానాశ్చతే దానద్రవలవాశ్చ = బలవిజయిగజగ్రామణీ గణ్ణవిణ్ణద్వంద్వా ఽపాదానదానద్రవలవః, బలవిజయిగజగ్రామణీ గణ్ణవిణ్ణద్వంద్వాఽపాదాన దాన ద్రవలవానాం లగనం = బలవిజయిగజగ్రామణీ గణ్ణవిణ్ణద్వంద్వాఽ పాదానదానద్రవలవ లగనం, తస్మాత్ = బలవిజయిగజగ్రామణీ గణ్ణవిణ్ణద్వంద్వాఽపాదాన దానద్రవ లవంగనాత్.

భావము :

ఈ తూర్పుదెసయం దుదయించుచున్నవాడును నల్లదనములేదను విషయ మున సకలసమ్మతిగలిగిన సకలములగు పదునైదు కలలచే నిర్మాణము గలిగిన వాడును అగు తెల్లని చంద్రునియొక్క యఙ్కమందు నింద్రుని గజములలో ప్రధానమగు నైరావతముయొక్క మదజల బిందువులు తగులుటచే నాకస్మిక ముగా నేర్పడినట్టి నల్లకలువపన్నె గల్గినదిగా నేర్పడిన మరకగా కళంకమును శంకింతును. తూర్పుదెసయందు చంద్రుడుదయించును. ఆ దెసయందే యింద్రుని గజమగు నైరావతము విహరించును. కాన నానైరావతముయొక్క మదజల బిందువులు తగులుటచే దైవికముగా నాచంద్రుని యందు మరక ఏర్పడినది. అదియే చన్ద్రకలఙ్కమని నేను శంకింతును.

శ్లో. అంశం షోడశమామనన్తి రజనీ
భర్తుః కలాంవృత్తయ ।
న్యైశనం పఞ్చదశైవ తాః ప్రతిపదా
ద్యారాకవర్ధిష్ణవః
యాశేషా పునరుద్ధృతా తిథిమ్మృతే
సా కిం హరాలఙ్కృతిః
తస్యాస్థానబిలం కలఙ్కమిహకిం
పశ్యామి సశ్యామికం ॥

ప. వి. అంశం - షోడశమ్ - ఆమనన్తి-రజనీభర్తుః - కలాం - వృత్తయన్తి - ఏనం - పఞ్చదశ - ఏవ - తాః - ప్రతిపదాద్యారాకవర్ధిష్ణవః - యా - శేషా - పునః - ఉద్ధృతా - తిథిం - ఋతే - సా - కిం - హారాలఙ్కృతిః - తస్యాః - స్థానబిలం - కలఙ్కం-ఇహ - కిం-పశ్యామి - సశ్యామికం.

అర్థము: హే ప్రియే ! = ఓ ప్రియురాలా !, లోకాః = జనులు, రజనీభర్తుః = రాత్రికి భర్తయగు చంద్రునియొక్క, షోడశం = పదునారవదైన, అంశం = భాగమును, కలాం = కళగా, ఆమనన్తి = సత్యముగా చెప్పెదరు, తాశ్చ = పదునారవ భాగములుగానున్న, ప్రతిపదాద్యారాక వర్ధిష్ణవః, ప్రతిపదాది = పాడ్యమి మొదలుగా, ఆరాక = పూర్ణిమవరకును, వర్ధిష్ణవః = వర్ధిల్లుచున్నటువంటి పదునైదు సంఖ్యలుగలకలలే, ఏనం = ఈ చంద్రుని, వృత్తయన్తి = గుండ్రమైన యాకారముగం వానినిగా జేయుచున్నవి, యాపునః = ఏపదునారవకలయో, తిథిమృతే = పదునారవతిథి లేనందువలన ప్రయోజనములేనిదై, శేషా = మిగిలినదో, సా = అదిప్రయోజనము లేనందువలన, ఉద్ధృతా = చంద్రునుండి వెలువలికి దీయబడినదై, హారాలఙ్కృతిః, హర = శివునకు, అలఙ్కృతిః = శిరోభూషణముగా, జాతా కిం = ఏర్పడినదాయేమి ? అహం = నేను, తస్యాః = వెలుపలికి దీయబడిన పదునారవకలకు, సశ్యామికం = నల్లదనముతోకూడిన, నభః = ఆకసమును, స్థానబిలం = పూర్వమాకల యుండిన స్థలముయొక్క బిలమును, ఇహ = ఈ చంద్రమండలమందలి, కలఙ్కం = కలఙ్కముగా, పశ్యామి = చూచుచున్నానాయేమి ?

సమాసములు :

రజనీభర్తుః : రజన్యాః భర్తా = రజనీభర్తా, తస్య = రజనీభర్తుః.
వృత్తయన్తి : వృత్తం కుర్వన్తీతి = వృత్తయన్తి.
పఞ్చదశ : పఞ్చసహితా దశ = పఞ్చదశ.
ప్రతిపదాద్యారాకవర్ధిష్ణవః : ప్రతిపత్ ఆదిః యస్మిన్‌కర్మణి తత్ = ప్రతిపదాది, రాకామభివ్యాప్య = ఆరాకం, ప్రతిపదాదిచ తత్ ఆరాకం

చ = ప్రతిపదాద్యారాకం. ప్రతిపదాద్యారాకం వర్ధిష్ణవః = ప్రతిపదాద్యా రాకవర్ధిష్ణవః.

హరాలఙ్కృతిః : హరస్య అలఙ్కృతిః = హరాలఙ్కృతిః.

స్థానబిలం : స్థానే బిలః = స్థానబిలః, తం = స్థానబిలం.

సశ్యామికం : శ్యామికయా సహితః = సశ్యామికః, తం = సశ్యామికం.

**భావము :**

ఓ ప్రియురాలా ! చంద్రుని పదునాఱవ భాగమును కలయని చెప్పుచున్నారు. ఆ కలలు పదునాఱు భాగములుగా నున్నవై పాడ్యమి మొదలు పూర్ణిమవఱకును నొక్కొక్క తిథియందు నొక్కొక్కకల వర్ధిల్లుటచే పెరుగుచున్నవై పదునైదుకలలచే ఈ చంద్రుని వర్తులాకృతి కలవానినిగా ననగా పూర్ణమండలము గలవానినిగా జేయుచున్నవి. అందు పదునాఱుకల పదునాఱవ తిథి లేనందువలన ప్రయోజనములేక మిగిలిపోయినదై చంద్రుని నుండి వెలుపలికి దీయబడి, శివునికి శిరోభూషణముగా జేయబడినది. ఆ పదునాఱవకలను చంద్రుని నుండి తొలగించుటచే దానివలన చంద్రుని యందు రంధ్రమేర్పడినదై దానివెనుక నున్న యాకసమే యారంధ్రమున నల్లగ గనపడుటచే నదియే చంద్రుని యందు కలఙ్కమైనదనినేను భావింతును.

శ్లో. జ్యోత్స్నామాదయతే చకోరశిశునా
ద్రాఘీయసీలోచనే ।
లిప్సుర్మూలమివోపజీవితు మితః
సన్తర్పణాత్మీకృతాత్
అఙ్కేరఙ్కమయం కరోతిచ పరి
స్పృష్టం తదేవాదృతః
త్వద్వక్త్రం నయన శ్రియాప్యనధికం
ముగ్ధే! విధిత్సుర్విధుః ॥

ప. వి. జ్యోత్స్నం - ఆదయతే - చకోరశిశునా - ద్రాఘీయసీ - లోచనే - లిప్సుః - మూలం - ఇవ - ఉపజీవితుమ్ - ఇతః - స న్తర్పణాత్మీ కృతాత్ - అఙ్కే-రఙ్కుం - అయం - కరోతి - చ - పరిస్పృష్టుం- తత్ - ఏవ - ఆదృతః - త్వద్వక్త్రం - నయనశ్రియా - అపి - అనధికం - ముగ్ధే - విధిత్సుః - విధుః.

అర్థము: హేముగ్ధే. = ఓసున్దరీ! త్వద్వక్త్రం = నీముఖము గుండ్రని తనము మున్నగు గుణములచే సమానముగానున్నను, నయనశ్రియాఽపి, నయన= నేత్రములయందలి. శ్రియాఽపి = శోభచేతను, అనధికం=అధికము కాకుండునట్లు, అనగా సమానమైనదిగా నుండునట్లు, విధిత్సుః = చేయ గోరినవాడై. ద్రాఘీయసీ = మిక్కిలి దీర్ఘములైన, లోచనే = కన్నులను, లిప్సుః = పొందగోరినవాడై, విధుః = చంద్రుడు, స న్తర్పణాత్మీకృతాత్, స న్తర్పణ = చంద్రికయను నమృతమును చక్కగా ద్రాగించుటచే, ఆత్మీకృతాత్ = వశముగావించుకొనబడిన, ఇతః = ఈచకోరబాలకుల నుండి, మూలం=తనవెన్నెలను ద్రాగించుట హేతువైన యితనికి సంబంధించిన దీర్ఘములగు రెండుకన్నులను, ఉప జీవితుమివ = తీసుకొనుటకోయనునట్లు. లేదా ఏదియో కాంచెము తనకు సంబంధించినవెన్నెలను ద్రాగించి దానినుండి నేత్రద్వయలక్ష్మిని ఐదని మూలమగు వెన్నెలయను ధనమును పెంచుకొనుటకోయనునట్లు, అయం= ఈచంద్రుడు, ఆదృతస్సన్=ఆదరముతోగూడిన వాడగుచు, అఙ్కే= మధ్య లేదా ఒడియందు, రఙ్కుం = జింకను, కరోతిచ = ఉంచు కొనుచున్నాడు. అనగా నొడియందుంచుకొని బుజ్జగించుచున్నాడు. జ్యోత్స్నం = వెన్నెలను, ఆదయతే = తినిపించుచున్నాడు. ఎందు కనగా, తత్ = మూలమైన. మిక్కిలివిశాలమైన దానికనులజంటను, పరిస్పృష్టుమివ = తనయందులగ్నము కావించుకొనుటకో యనునట్లు, అయం = ఈచంద్రుడు చకోరమును హరిణమును వంచించుచున్నాడని యర్థము. చంద్రునికంటె నీముఖము శ్రేష్ఠమని యర్థము. "పరిప్రష్టుం" యను పాఠమున—దీని నేత్రముల సౌందర్యమును బొందుటకు

ఉపాయము నడుగుటకో యనునట్లని యర్థము. "చకోరశిశునా" యని శిశు శబ్దమును ప్రయోగించుటచే సులభముగా వంచింపదగినదను నర్థము సూచితము.

**సమాసములు :**

చకోరశిశునా : చకోరస్యశిశుః = చకోరశిశుః, తేన = చకోరశిశునా.
ద్రాఘీయసీ : అత్యంతం దీర్ఘే, ద్రాఘీయసీ, తే = ద్రాఘీయసీ.
లిప్సుః : లబ్ధుం ఇచ్ఛుః = లిప్సుః.
సన్తర్పణాత్మీకృతాత్ : అనాత్మా ఆత్మా సమ్పద్యమానః కృతః = ఆత్మీకృతః. సన్తర్పణేన ఆత్మీకృతః = సన్తర్పణాత్మీకృతః, తస్మాత్ = సన్తర్పణాత్మీకృతాత్.
త్వద్వక్త్రం : తవ వక్త్రం త్వద్వక్త్రం.
నయనశ్రియా : నయనయోః శ్రీః = నయన శ్రీః, తయా = నయన శ్రియా.
అనధికం : న అధికం = అనధికం.
విధిత్సుః : విధాతుమిచ్ఛుం = విధిత్సుః.

**భావము :**

ఓసున్దరీ! నీముఖము వర్తులత్వము మున్నగు గుణములచే చంద్రునకు సమానముగా నున్నను నయనలక్ష్మితోడను దానికి సమానముగావించుటకై తనకు మిక్కిలి దీర్ఘములగు నేత్రములను సంపాదింపగోరినవాడై యాచంద్రుడు చకోర శిశువునకు చన్ద్రికామృతమును త్రాగించి దానిని వశపరచుకొనుచున్నాడు. లేదా యేదియోకొంచెము తనవెన్నెలను ద్రాగించి దానివలన దాని నేత్రముల లక్ష్మిని బొంది తనకు మూలమైన వెన్నెలయను ధనమును వర్ధిల్లజేసికొనగోరుచున్నాడు. మరియు నీచంద్రుడు ఆదరముతో గూడినవాడై తనమధ్యభాగమున లేదా ఒడి యందు జింకను ఆదరించుచున్నాడు. వెన్నెలను దినిపించుచున్నాడు. ఈవిధముగా చకోరమును జింకను వంచించుచున్నాడని యర్థము. చంద్రునికంటెను నీముఖము మిక్కిలి శ్రేష్ఠమని భావము.

41)

శ్లో. లావణ్యేన తవాస్యమేవబహునా
తత్పాత్రమాత్రస్పృశా
చంద్రః ప్రోఞ్ఛన లబ్ధతార్ధమలినే
నారమ్భి శేషేణతు ।
నిర్మాయ ద్వయమేతదప్పువిధినా
పాణీఖలుక్షాలితౌ
తల్లేశై రధునాఽపి నీరనిలయై
రమ్భోజమారభ్యతే ॥ 142

ప. వి. లావణ్యేన - తవ - ఆస్యమ్ - ఏవ - బహునా - తత్పాత్రమాత్రస్పృశా - చంద్రః - ప్రోఞ్ఛనలబ్ధతార్ధమలినేన - ఆరమ్భి - శేషేణ - తు - నిర్మాయ - ద్వయం - ఏతత్ - అప్సు - విధినా - పాణీ - ఖలు - క్షాలితౌ - తల్లేశైః - అధునా - అపి - నీరనిలయైః - అమ్భోజం - ఆరభ్యతే.

అర్థము: హేప్రియే! = ఓప్రియురాలా! బహునా = ఒకపాత్రమందు అధికముగాజేర్చిపెట్టబడిన, లావణ్యేన = అందముచే, తవ = నీయొక్క, ఆస్యమేవ = ముఖమే, ఆరమ్భి = నిర్మింపబడినది. చంద్రస్తు = చంద్రుడో, తత్పాత్రమాత్రస్పృశా, తత్ = ఆ యందముయొక్క, పాత్ర = ఆధారమగుపాత్రను, స్పృశా = తాకినయనగా నంటుకొనిన, ప్రోఞ్ఛనలబ్ధతార్ధమలినేన, ప్రోఞ్ఛన = పాత్రనుతుడుచుటచే, లబ్ధతా = ప్రాప్తియొక్క, అర్ధ = సగపాలైన, మలినేన = మాలిన్యముగల, శేషేణ = (నీముఖమునిర్మింపగా) మిగిలినభాగముచే, ఆరమ్భి = నిర్మింపబడెను. కావుననే యితడు వివిధవర్ణములతో గూడిన మండలము గలిగి శోభించున్నాడని యర్థము. విధినా = బ్రహ్మచే, ఏతత్ = ఈ, ద్వయం = రెండు, నిర్మాయ = నిర్మింపబడి, అప్సు = ఉదకములయందు, పాణీ = హస్తములురెండును, క్షాలితౌ ఖలు = కడుగబడినవో యనునట్లున్నవి.అనగా పై రెండు నిర్మించిన పిదప చేతుల కంటుకొనియున్న సౌందర్యలేపములు తొలగుటకై చేతులనుగడిగెనని యర్థము. తల్లేశైః, తత్ = ఆకడుగబడిన సౌందర్యలేపములయొక్క,

లేశైః = స్వల్పముచే, అధునాఽపి = ఇప్పటికిని, నీరనిలయైః = ఉదకములయందున్నటువంటివానిచే, అమ్భోజం = పద్మము, ఆరభ్యతే = నిర్మింపబడుచున్నది. బ్రహ్మకు పద్మమును నిర్మించుటకు బ్రయాసలేదని యర్థము. పద్మమునకంటెను చంద్రుడధికము. ఆ చంద్రునికంటెను సకలసౌందర్యములతో నిర్మింపబడుటవలన నీముఖ మధికమని భావము.

**సమాసములు :**

**తత్పాత్ర మాత్రస్పృశా :** తస్య పాత్రం=తత్పాత్రం, తత్పాత్రమేవ తత్పాత్ర మాత్రం, తత్పాత్రమాత్రం స్పృశతీతి = తత్పాత్ర మాత్ర స్పృక్, తేన=తత్పాత్రమాత్రస్పృశా.
**ప్రోఞ్ఛనలబ్ధతార్థమలినేన :** ప్రోఞ్ఛనేన లబ్ధతా = ప్రోఞ్ఛనలబ్ధతా, ప్రోఞ్ఛనలబతాయాః అర్థం మలినం యస్యసః = ప్రోఞ్ఛనలబ్ధతార్థ మలినః, తేన=ప్రోఞ్ఛన లబ్ధతార్ధ మలినేన,
**తల్లేశైః :** తస్య లేశాః =తల్లేశాః, తైః=తల్లేశైః.
**నీరనిలయైః :** నీరం నిలయః యేషాం తే = నీరనిలయాః, తైః = నీరనిలయైః.

**భావము :**

బ్రహ్మ యొక పాత్రయందు సౌందర్యమంతటిని జేర్చిపెట్టి, దానితో నీ ముఖమును నిర్మించెను. చంద్రుడో ఆ సౌందర్యముంచిన పాత్రను తోముటచే లభించిన కొలది పాటి మాలిన్యము గల్గి మిగిలి నట్టి సౌందర్యముచే నిర్మించెను. అట్టి మలినపు సౌందర్యముచే నిర్మించినందువలననే చంద్రుడు నలుపు తెలుపు వన్నెలతో గూడి చిత్రమైన మండలము గల్గియున్నాడు. బ్రహ్మ యీవిధముగా నీముఖమును చంద్రుని సృజించి యా సౌందర్య లేపములు తొలగిపోవుటకై యుదకములయిందు చేతులు గడుగు కొనెను. అట్లు కడుగుటచే నుదకముల యందు నిలిచి పోయిన సౌందర్య లేపమునకు సంబంధించి యిప్పటికిని జలముల యందు నెలకొనిన స్వల్పభాగముల చేతనే యమ్భోజము అనగా పద్మమును సృజించెను. కాన నాపద్మమును సృజించుటలో బ్రహ్మ కెట్టి శ్రమయు లేదని యాశయము.

శ్లో. లావణ్యేన తవాఖిలేన వదనం తత్పాత్ర మాత్రస్పృశా
చన్ద్రః ప్రోఞ్ఛనలబ్ధతార్ధ మలినేనారమ్భి శేషేణయః
తల్లేఖాఽపి శిఖామణిః సుషమ యాఽహఙ్కృత్య శమ్భోరభూ
దబ్జం తస్య పదం యదస్పృశదతః పద్మఞ్చ సద్మశ్రియః

ప. వి. లావణ్యేన - తవ - అఖిలేన-వదనం - తత్పాత్రమాత్రస్పృశా-చన్ద్రః - ప్రోఞ్ఛనలబ్ధతార్థమలినేన - ఆరమ్భి-శేషేణ - యః - తల్లేఖా - అపి-శిఖామణిః - సుషమయా - అహఙ్కృత్య - శమ్భోః - అభూత్ - అబ్జం - తస్య - పదం - యత్ - అస్పృశత్ - అతః - పద్మం-చ-సద్మ - శ్రియః.

అర్థము: అఖిలేన = సమస్తమైన, లావణ్యేన = సౌందర్యముచే, తవ = నీయొక్క వదనం = ముఖము, ఆరమ్భి = నిర్మింపబడినది. ఇక నీముఖ సౌందర్యమును వర్ణించుట యశక్యము గాన నదియుండనిమ్ము. తత్పాత్రమాత్రస్పృశా = ముందుచెప్పినట్టు ఆసౌందర్యముంచిన పాత్రకేయంటినట్టి, ప్రోఞ్ఛనలబ్ధతార్థమలినేన. ప్రోఞ్ఛన = తోముటచే, లబ్ధతా = ప్రాప్తిగల్గిన అర్ధమలినేన = సగపాలు మాలిన్యముగల్గిన, శేషేణ = మిగిలిన భాగముచే, యః = ఏ, చంద్రః = చంద్రుడు, ఆరంభి = నిర్మింపబడెనో, తల్లేఖాపి, తత్ = అచంద్రునియొక్క, లేఖాఽపి = పదునాఱవ భాగమైన కలయు, (కలయనుటచే కళంకము లేనందువలన) సుషమయా = పరమ శోభచే, అహంకృత్య = అచంద్రునికంటె నేనే రమణీయమైన దానినని గర్వముజెంది, శంభోః = శివునికి, శిఖామణిః = శిరోభూషణముగా, అభూత్ = ఆయెను, అబ్జం = కలువ, యత్ = ఎందువలన, తస్య = ఆ చంద్రునియొక్క, పదం = స్థానమైన జలమును, అస్పృశత్ = తాకెనో, అతః = ఇందువలన, శ్రియః = శోభకు, సద్మ = స్థానముగా, అభూత్ = ఆయెను, పద్మంచ = పద్మమును, శ్రియః = లక్ష్మికి, సద్మ = స్థానముగా, అభూత్ = ఆయెను. చంద్రకిరణ స్పర్శమువలన కలువ శోభాస్పదముగను, పద్మము లక్ష్మికి నెలవుగనైనవి. లేదా యా = ఏ, తల్లేఖాపి = ఆచంద్రకలయు, శంభోః = శివునికి, శిఖామణిః = శిరోభూషణ

ముగా, అభూత్ = అయెనో, తస్య = ఆశిరోభూషణమగు చంద్రుని యొక్క, పదం = స్థానమైన శివుని శిరము (పూజాసమయమునందు) యత్ = ఎందువలన, అబ్జం = కలువను, పద్మ ఇచ్ఛ = పద్మమును, అస్పృశత్ = తాకెనో, అతః = ఇందువలన, తత్ = ఆరెండును, శ్రియః = లక్ష్మికి, సద్మ = గృహముగా, అభూత్ = అయినవి, లేదా, తస్య = ఆ శివునియొక్క, పదం = పాదమును, యత్ = ఎందువలన, పూజాసమయమునందు కుముదము, పద్మము తాకినచో అందువలన నారెండును లక్ష్మికి స్థానములైనవి. నీముఖసౌందర్యలేశ పరంపరను స్పృశించుట చేతనే చంద్రుడు మున్నగునవి శోభనుఁ బొందినవి. కాన నీముఖసౌందర్యము వర్ణింపనలవికానిది.

## సమాసములు :

తత్పాత్రమాత్రస్పృశా : తస్య పాత్రం = తత్పాత్రం, తత్పాత్రమేవ = తత్పాత్రమాత్రం, తత్పాత్రమాత్రం స్పృశతీతి = తత్పాత్రమాత్రస్పృక్, తేన = తత్పాత్రమాత్రస్పృశా.

ప్రోఞ్ఛనలబ్ధతార్ధమలినేన : ప్రోఞ్ఛనేన లబ్ధతా = ప్రోఞ్ఛనలబ్ధతా, ప్రోఞ్ఛనలబ్ధతాయాః అర్ధం మలినం యస్య సః = ప్రోఞ్ఛనలబ్ధతార్ధమలినః, తేన = ప్రోఞ్ఛనలబ్ధతార్ధమలినేన.

## భావము :

ఓ ప్రియురాలా ! సమస్త సౌందర్యముచే నీముఖము సృజింపబడినది. కాన నీముఖసౌందర్యము వర్ణింపనలవికానిది. ఆ సౌందర్యముంచిన పాత్రనుఁ దోమగా దానికంటిన సౌందర్యలేపముచే చంద్రుడు సృజింపఁబడెను. అట్టు సౌందర్యలేశముచే నిర్మింపబడిన యా చంద్రుని పదునాఱవ కల, కళంకము లేనిదగుటవలన, కళంకముగల యీ చంద్రునికంటెను నేనే రమణీయమైనదాననని యహంకరించి, శివునికి శిరోభూషణమైనది. కలువయో చంద్రుని ప్రతిబింబస్థానమగు జలమును స్పృశించుటవలన శోభతోగూడినదాయెను. అట్లే పద్మమోలక్ష్మికి నెలవైనది.

శ్లో. సపీతేః సమ్ప్రీతే రజని రజనీశః పరిషదా
పరీతస్తారాణాం దినమణిమణి గ్రావమణికః ।
ప్రియే! పశ్యోత్ప్రేక్షా కవిభి రభిధానాయ సుశకః
సుధా మభ్యుద్ధర్తుం ధృతశశక నీలాశ్మచషకః ॥ 144

ప. వి. సపీతేః - సమ్ప్రీతేః - అజని - రజనీశః - పరిషదా - పరీతః - తారాణాం - దినమణిమణి గ్రావమణికః - ప్రియే - పశ్య - ఉత్ప్రేక్షా కవిభిః - అభిధానాయ - సుశకః - సుధామ్ - అభ్యుద్ధర్తుం - ధృత శశక నీలాశ్మ చషకః.

అర్థము: హే ప్రియే = ఓ ప్రియురాలా! సమ్ప్రీతేః = నక్షత్రములకు పరస్పర మేర్పడిన ప్రీతివలన, సపీతేః = కలసిపానము జేయుటవలన (మిత్రులు కలసిపానము చేయుదురుకదా), తారాణాం = నక్షత్రములయొక్క, పరిషదా = సంఘముచే, పరీతః = చుట్టబడిన, అయం = ఈ, రజనీశః = చంద్రుడు, దినమణి మణిగ్రావమణికః, దినమణిమణి = సూర్యకాంత మణియొక్క, గ్రావ = శిలతో చేయబడిన, మణికః = కలశమై, ప్రేత్ప్రేక్షాకవిభిః, ఉత్ప్రేక్షా = సామ్యముచే వస్త్వంతరమును భావించుట యను నుత్ప్రేక్షయొక్క విషయమున చతురులగు, కవిభిః = శ్రీహర్షాది మహాకవులనెడి, తారాపరిషదైవ = నక్షత్రసంఘముచేతనే, సుధాం = అమృతమును, అభ్యుద్ధర్తుం = ఎత్తుకొనుటకు, ధృతశశక నీలాశ్మచషకః, ధృత = ధరించబడిన, శశక = కుందేలనెడి, నీలాశ్మ = నీలమణిచే కొదుగబడిన, లేదా నీలమణిమయమైన, చషకఇవ = గిన్నెగల్గినవాడో యనునట్లు, అభిధానాయ = వర్ణించుటకై, సుశకః = సుఖముగా సాధ్యమైనవాడు. పశ్య = చూడుము.

సమాసములు :

సపీతేః : సమానా చ సా పీతిశ్చ = సపీతిః = తస్యాః సపీతేః.
రజనీశః : రజన్యాః ఈశః = రజనీశః.

దినమణిమణిగ్రావమణికః : దినమణేః మణిః = దినమణిమణిః, దినమణిమణేః గ్రావా = దినమణి మణిగ్రావా, దినమణిమణిగ్రావ్ణో మణికః = దినమణిమణిగ్రావమణికః.

ఉత్ప్రేక్షాకవిభిః : ఉత్ప్రేక్షాయాం కవయః = ఉత్ప్రేక్షా కవయః, తైః = ఉత్ప్రేక్షాకవిభిః.

ధృతశశకనీలాశ్మచషకః : అల్పః శశః = శశకః, నీలశ్చాసౌ అశ్మాచ = నీలాశ్మా, నీలాశ్మనః చషకః = నీలాశ్మచషకః, ధృతః నీలాశ్మచషకః యేన సః – ధృతశశకనీలాశ్మచషకః.

**భావము :**

ఓ ప్రియురాలా ! నక్షత్రములకు పరస్పరమైత్రి వలన మిత్రులుగానవి గావించెడి సహపానమననుసరించి యానక్షత్రములతో జుట్టును పరివేష్టింపబడిన యీ చంద్రుడు సూర్యకాంతిమణి నిర్మితమగు స్వచ్ఛమగు పాత్రముగా నిర్మింపబడెను. సామ్యముననుసరించి యొకవస్తువును మరియొకవస్తువుగా సంభావనజేయు శ్రీహర్షాదిమహాకవులచే నానక్షత్ర సంఘముచేతనే యమృతమును జైచంద్రుడనెడి పెద్దపాత్రమున ముంచుకొని యెత్తుకొనుటకై కుందేలనెడి యింద్రనీలపు గిన్నెనీతడు వహించెనో యని వర్ణించుటకై యీ చంద్రుడున్నాడు. అనగా నాచంద్రుడు అమృత పూర్ణమగు పాత్రము. దానినుండి తారలు అమృతమును ముంచి యెత్తుకొనుట కుపయోగపడు నీలమణిమయమగు గిన్నెగా నాచంద్రునందలి కుందేలనెడి అంకమగుపడుచున్నదని యాశయము.

శ్లో. అస్యం శీతమయూఖ మణ్డల గుణానాకృష్య తే నిర్మితం
శజ్కే సున్దరి। శర్వరీపరివృఢ స్తే నైష దోషాకరః।
ఆదాయేన్దుమృగాదపీహ నిహితే పశ్యామి సారం దృశౌ
త్వద్వక్త్రేసతివా విధౌ ధృతిమయం దధ్యాదనన్ధః కుతః॥

ప. వి. ఆస్యం - శీతమయూఖమణ్డలగుణాన్ - ఆకృష్య - తే - నిర్మితం - శజ్కే - సుందరి! - శర్వరీపరివృఢః - తేవ - ఏషః - దోషాకరః - ఆదాయ - ఇందుమృగాత్ - అపి - ఇహ - నిహితే - పశ్యామి -

సారం - దృశౌ - త్వద్వక్త్రే - సతి - వా - విధౌ - ధృతిం - అయం - దధ్యాత్ - అనంధః - కుతః.

అర్థము: హేసుందరీ! ఓసుందరీ, విధినా = బ్రహ్మచే, శీతమయూఖమణ్డలగుణాన్, శీతమయూఖ = చంద్రునియొక్క, మణ్డల = మణ్డలముయొక్క, గుణాన్ = గుణములను, ఆకృష్య = గ్రహించి, తే = నీయొక్క, ఆస్యం = ముఖము, యతః = ఎందువలన, నిర్మితం = నిర్మించబడినదో, తేన = ఆగుణముల యాధిక్యముచేత, శర్వరీ పరివృఢః, శర్వరీ = రాత్రికి, పరివృఢః = ప్రభువైన చంద్రుడు, దోషాకరః = దోష = దోషములకు, ఆకరః = ఉత్పత్తిస్థానము, కాని, దోషాకరః, దోషా, రాత్రిని, కరః = చేయునట్టివాడుగా, న = కానేరడు, ఇతి = అని, అహం = నేను, శఙ్కే = సందేహింతును. తథా = అట్లే, ఇందుమృగాత్ = చంద్రునిజింకనుండి, సారం = సారమైన, దృశౌ = కన్నులు, ఆదాయ = తీసుకొనబడి, ఇహ = నీముఖమునందు, నిహితే = ఉంచబడినవని (అహం = నేను) పశ్యామి = చూచుచున్నాను. త్వద్వక్త్రే = సుందరమగునీముఖము, సతి = ఉండగా, అనంధః = కన్నుగలిగిన యనగా రెంటియొక్క తారతమ్యమును విచారించుటలో నేర్పరితనము గలిగిన, అయం = ఈమృగము, విధౌ = చంద్రునియందు, ధృతిం = స్థితిని మఱియు మంచియాధారము దొరికినదను సంతోషమును, కుతోవా = ఎట్లు, దధ్యాత్ = ధరించును? కాని ధరింపదు. కాన కన్నులను పెరికివేయుటవలన గుడ్డితనము కలుగుటవలననే నీముఖసౌందర్యమును జూడనందువలనను మరియొకచోటికి వెడలజాలక పోయినందువలనను నీముఖమును వదలియిచ్చుటనే యుండిపోయినదని యర్థము. నీముఖము చంద్రునికంటె నధికము, నీనేత్రములు జింక కన్నులకంటె నధికములని యర్థము.

సమాసములు :

శీతమయూఖమణ్డలగుణాన్ : శీతామయూఖాఃయస్య సః = శీతామయూఖః, శీతమయూఖస్య మణ్డలం = శీతమయూఖమణ్డలం, శీతమయూఖ

మణ్డలస్య గుణాః = శీతమయూఖమణ్డలగుణాః, తాన్ = శీతమయూఖ మణ్డలగుణాన్.

శర్వరీపరివృఢః : శర్వర్యాః పరివృఢః = శర్వరీపరివృఢః.

దోషాకరః : దోషాణాం ఆకరః = దోషాకరః, పక్షాన్తరమున, దోషాం కరోతీతి దోషాకరః.

ఇందుమృగాత్: ఇందోః మృగః = ఇందుమృగః, తస్మాత్ = ఇందుమృగాత్.

త్వద్వక్త్రే : తవ వక్త్రం = త్వద్వక్త్రం, తస్మిన్ = త్వద్వక్త్రే.

అనన్ధః : న అన్ధః = అనన్ధః.

**భావము :**

ఓ సుందరీ! బ్రహ్మ చంద్రమండలమందలి గుండ్రనితనమును, ఆహ్లాదకత్వమును తదితరములగు గుణములను గ్రహించి నీముఖమును సృజించెను. ఇట్లు గుణములను గ్రహించి దోషముల నాచంద్రునియందే విడుచుటవలన నతడు దోషాకరుడాయెను. అనగా దోషములకు ఉత్పత్తిస్థానమాయెను. కాని, దోషా = రాత్రిని, కరః = చేయువాడను వ్యుత్పత్తిచే రాత్రినిచేయుటవలన దోషాకరుడు కాలేదు. అని నేను శంకింతును. అట్లే చంద్రునిలోని జింకయందలి శ్రేష్ఠములగు కన్నులను గ్రహించి నీముఖమునందుంచెననియు నేను తలంతును. ఏలయనగా మిక్కిలి సుందరమగు నీముఖము వెలయుచుండగా కన్నులు గల్గినదై యీచంద్రునకు నీముఖమునకును దారతమ్యమునరయుట యందు చాతుర్యముగల యీజింక చంద్రునియందు నునికిని మరియు మంచి స్థలము దొరికినదను సంతోషమునెట్లు వహించును? కావున కన్నులను బెరికివేయుటవలన గ్రుడ్డితనముగలిగి నీముఖ సౌందర్యమును జూడజాలనందువలనను మరియొక ప్రదేశమునకు బోజాలనందు వలనను నామృగమీచంద్రునియందే యుండిపోయినదని భావము.

శ్లో. శుచిరుచిముదు గణమగణనమముమతి
కలయసి కృశతను నగగనతటమను ।
ప్రతినిశ శశితల విగలదమృతభృత
రవిరథ హయచయ ఖురబిల కులమివ ॥ 146

ప. వి. శుచిరుచిమ్ - ఉడుగణం - అగణనం - అముం - అతికలయసి - కృశతను - న - గగనతటం - అను - ప్రతిని శశితల విగలదమృత భృత రవిరథహయచయ ఖురబిలకులం - ఇవ.

అర్థము: - హేకృశతను! = ఓకృశించిన శరీరముగల దమయన్తీ!, త్వం = నీవు, గగనతటమను = ఆకసపుస్థలమును గుఱివెట్టుకొని, శుచిరుచిం = స్వచ్ఛమగుకాంతిగలిగిన, తథా = అట్లే, అగణనం = వెక్కులుగా నుండుటవలన లెక్కింపశక్యముకాని, అముం = వ్రేలితో జూపదగినదై ప్రత్యక్షగోచరమగు, ఉడుగణం = నక్షత్ర సమూహమును, ప్రతినిశ శశితలవిగలదమృత భృత రవిరథ హయచయ ఖురబిలకులమివ, ప్రతినిశ = ప్రతిరాత్రియందును, శశితల = చంద్రునిదిగువభాగమునుండి, విగలత్ = స్రవించుచున్న, అమృత = అమృతముచే, భృత = నిండిన, రవిరథ = సూర్యరథముయొక్క, హయ = గుఱ్ఱములయొక్క, చయ = సమూహముయొక్క, ఖుర = గిట్టలయొక్క, బిల = రంధ్రముల యొక్క, కులమివ = సమూహమోయనునట్లు, నాతికలయసి = ఎక్కువగా లెక్కింపవా? కాని తప్పక యతిశయించినదానినిగా లెక్కింపుము. ప్రతి రాత్రియు చంద్రునినుండి పడునట్టి తెల్లని యమృతముచే నిండిన సూర్యాశ్వములకు సంబంధించిన గిట్టలరంధ్రములవలె నక్షత్రములు శోభించు చున్నవని యర్థము.

సమాసములు :

శుచిరుచిం : శుచిః రుచిః యస్య సః = శుచిరుచిః, తం = శుచిరుచిం.

ఉడుగణం : ఉడూనాం గణః = ఉడుగణః, తం = ఉడుగణం.

అగణనం: అవిద్యమానాగణనా యస్య సః = అగణనః, తం = అగణనం.

హే కృశతను! : కృశాతనుః యస్యాస్సా = కృశతనుః, తస్యాః సంబుద్ధిః = హే కృశతను.

గగనతటం : గగనస్యతటం = గగనతటం, తత్ = గగన తటమ్.

ప్రతినిశ శశితల విగలదమృతభృతరవిరథ హయచయ ఖురబిలకులమ్: నిశాయాం నిశాయాం = ప్రతినిశం, శశినః తలం = శశితలం, శశితలాత్

విగలత్ = శశితలవిగలత్, ప్రతినిశం శశితల విగలత్ = ప్రతినిశ శశి తల విగలత్, ప్రతినిశ శశితల విగలచ్చ్యుతత్ అమృతంచ = ప్రతినిశ శశితల విగలదమృతం, ప్రతినిశ శశితల విగలదమృతేన భృతాని = ప్రతినిశ శశితల విగలదమృత భృతాని, రవేఃరథః = రవిరథః, రవిరథ స్యహయాః = రవిరథహయాః, రవిరథహయానాం చయః = రవిరథ హయచయః, రవిరథహయచయస్యఖురాః = రవిరథహయచయఖురాః, రవిరథహయచయఖురాణాం బిలాని = రవిరథహయ చయ ఖురబిలాని, ప్రతినిశశశితల విగలదమృతభృతాని చ తాని రవిరథహయచయ ఖుర బిలానిచ = ప్రతినిశ శశితల విగలదమృతభృత రవిరథహయ చయ ఖుర బిలాని, ప్రతినిశ శశితల విగలదమృత భృత రవిరథహయ చయఖుర బిలానాంకులం = ప్రతినిశశశితలవిగలదమృత భృతరవిరథహయచయ ఖురబిలకులం, తత్ = ప్రతినిశ శశితల విగలదమృతభృతరవిరథహయ చయ ఖురబిలకులం.

భావము :

ఓ కృశాంగీ! ఆకసపు ప్రదేశమున తెల్లనికాంతి గల్గినదై మెండుగా నుండుటవలన లెక్కింప సాధ్యముకానిదై కేవలము వ్రేలితో జూపదగి ప్రత్యక్ష గమ్యమైయుండు నక్షత్రగణమును ప్రతిరాత్రియు చంద్రుని దిగువ భాగమునుండి స్రవించు తెల్లని యమృతముచే నిండిన సూర్యాశ్వముల గిట్టల రంధ్రముల యొక్క సమూహముగా భావింపుము. ప్రతిరాత్రియు చంద్రునినుండి స్రవించెడి తెల్లని యమృతముతోనిండిన సూర్యుని గుఱ్ఱము గిట్టల రంధ్రములు నక్షత్రముల వలె శోభించుచున్నవని భావము.

శ్లో. ఉపనతముడు పుష్పజాతమాస్తే
భవతుజనః పరిచారక స్తవాఽయం।
తిలతిలకిత పర్పటాభమిన్దుం
వితర నివేద్య ముపాస్వ పఞ్చబాణమ్ ॥ 147

ప. వి. ఉపనతమ్-ఉదుపుష్పజాతమ్ - ఆస్తే - భవతు - జనః- పరిచారకః - తవ - అయమ్- తిలతిలకిత పర్పటాభిరామమ్ - ఇన్దుం - వితర - నివే ద్యం - ఉపాస్వ - పఞ్చబాణం.

అర్థము: హేప్రియే! = ఓప్రియురాలా!, "రక్తో భౌమశ్శనిః కృష్ణః గురుః పీతః సితః కవిః" యను జ్యోతిశ్శాస్త్రవచనము ననుసరించి పెక్కువర్ణములు గలిగిన, ఉడుపుష్పజాతం, ఉడు = నక్షత్రములనెడు, పుష్పజాతం = పుష్పసమూహము, ఉపనతం = తనంతటలభ్యమై, ఆస్తే = ఉన్నది, అయం = ఈనేననెడి, జనః = జనము, తవ = కామదేవుని బూజను ప్రారంభించిన నీకు, పరిచారకః = పూజకు వలయు చందనాదులును సమకూర్చు సేవకుడుగా, భవతు = ఉండునుగాత, మరియు సంభోగకారిగను నుండుగాత. త్వం = నీవు, తిలతిలకిత పర్పటాభం, తిల = నువ్వులతో, తిలకిత = తిలకముగలదిగా జేయబడిన, పర్పట = బియ్యపుపిండితో చేయబడిన యాహార విశేషముయొక్క, ఆభం = కాంతివంటి కాంతి గలిగిన, ఇన్దుమేవ = కుఙ్కుమతోగూడిన చంద్రునే, నివేద్యం = నివేద్యముగా, వితర = కామదేవున కొసంగుము. పఞ్చబాణం = ఆకామదేవుని ఉపాస్స్వ = పూజింపుము.

సమాసములు :

ఉడుపుష్పజాతం : ఉడూన్యేవ పుష్పాణి = ఉడుపుష్పాణి, ఉడుపుష్పాణాం జాతమ్ = ఉడుపుష్పజాతమ్, తత్ = ఉడుపుష్పజాతమ్.

తిలతిలకిత పర్పటాభమ్ : తిలైః తిలకితః = తిలతిలకితః, తిలతిలకితశ్చాసౌ పర్పటశ్చ = తిలతిలకితపర్పటః, తిలతిలకిత పర్పటస్యాభేవ ఆభా యస్య తత్ = తిలతిలకిత పర్పటాభమ్, తత్ = తిలతిలకిత పర్పటాభమ్.

భావము :

ఓప్రియురాలా! "రక్తోభౌమః శనిః కృష్ణః గురుః పీతః సితః కవిః" యని యంగారకాది గ్రహములు ఎఱుపు నలుపు పసుపు తెలుపు వన్నెలు గలిగియుండుటవలన నానక్షత్రములనెడి పూలసమూహము తనయంతట నీకు లభించినది. కామదేవుని పూజను ప్రారంభించెడి నీకు చందనాది పూజాసామగ్రిని సమకూర్చెడి పరిచారకుడనై యుందును. (సంభోగకారిగను నుందును.) మధ్య నువ్వులతో కూడిన బియ్యపుపిండితో చేయబడిన ముద్దవంటి కాంతిగలిగిన యీచంద్రుని అనగా నువ్వులవలె మధ్య కలంకముతో కూడిన యీచంద్రుని కామదేవునికి నివే

శ్రీః, ప్రాప్త = పొందబడిన, సహస్రధార = వేయిధారలు కలిగిన, లోహపు కమ్ములకే నిర్మింపబడిన జలప్రవాహ మార్గములు గలిగిన, కలశ = కలశముయొక్క, శ్రీః = శోభగలవాడై ః నః = సురతమునకు ప్రక్రమింపబోవు మనకు, (ఉద్దీపకుడై) సంతుష్టయే = పరమానందము కొఱకు, అస్తు = ఉండునుగాత, మహోత్సవములయందు వేయిరంధ్రములుగల సువర్ణ కలశమున కమర్పబడిన గొట్టములనుండి ప్రవహించు జలములతో మహాభిషేకము చేయబడును. చంద్రుడనెడు సువర్ణకలశమందు రాహువుయొక్క దంతములతో పెక్కురంధ్రములు వేయబడి యున్నవి. కాగ నాచంద్రుడు ఆరంధ్రములనుండి యమృతధారలను విడుచునట్టి సువర్ణకలశముగా శోభించుచున్నాడు.

సమాసములు :

స్వర్భానుప్రతివారపారణమిలద్దన్తౌఘ యన్త్రోద్భవ శ్వభ్రాలీ పతయాలు దీధితి సుధాసారః : వారేవారే = ప్రతివారం, ప్రతివారం పారణం = ప్రతివారపారణం, స్వర్భానోః ప్రతివారపారణం = స్వర్భాను ప్రతివారపారణం, స్వర్భానుప్రతివారపారణే మిలన్ = స్వర్భానుప్రతివారపారణమిలన్, దన్తానాం ఓఘః = దన్తౌఘః, దన్తౌఘఏవయన్త్రః = దన్తౌఘయన్త్రః. స్వర్భానుప్రతివారపారణమిలంశ్చాసౌ దన్తౌఘయన్త్రశ్చ = స్వర్భానుప్రతివారపారణమిలద్దన్తౌఘయన్త్రః, స్వర్భాను ప్రతివారపారణ మిలద్దన్తౌఘయన్త్రాత్ ఉద్భవః యేషాం తాని = స్వర్భాను ప్రతివారపారణ మిలద్దన్తౌఘ యన్త్రోద్భవాని, స్వర్భాను ప్రతివారపారణ మిలద్దన్తౌఘ యన్త్రోద్భవాని చ తాని శ్వభ్రాణిచ = స్వర్భాను ప్రతివారపారణమిలద్దన్తౌఘయన్త్రోద్భవశ్వభ్రాణి, స్వర్భానుప్రతివారపారణ మిలద్దన్తౌఘ యన్త్రోద్భవశ్వభ్రాణాం అలీ = స్వర్భాను ప్రతివారపారణ మిలద్దన్తౌఘ యన్త్రోద్భవశ్వభ్రాలీ, స్వర్భానుప్రతివారపారణమిలద్దన్తౌఘ యన్త్రోద్భవశ్వభ్రాల్యాం పతయాలవః = స్వర్భాను ప్రతిపారపారణ మిలద్దన్తౌఘయన్త్రోద్భవశ్వభ్రాలీ పతయాలవః. దీధతయ ఏవసుధాః = దీధితి సుధాః, దీధితిసుధానాం ఆసారాః = దీధితిసుధాసారాః, స్వర్భాను ప్రతి

వారపారణ మిలద్దన్తౌఘ యన్త్రోద్భవ శ్వభ్రాళీ పతయాలవః దీధితిసుధా సారాః యస్యసః = స్వర్భాన్వప్రతివార పారణ మిలద్దన్తౌఘ యన్త్రోద్భవ శ్వభ్రాళీపతయాలు దీధితి సుధాసారః.

పుష్పేష్వాసనతత్ప్రియాపరిణయానన్దాభిషేకోత్సవే : ఇషూణాం ఆసనం = ఇష్వాసనం, పుష్పమేవ ఇష్వాసనం యస్య సః = పుష్పేష్వా సనః, తస్యప్రియా = తత్ప్రియా, పుష్పేష్వాసనశ్చ తత్ప్రియాచ = పుష్పేష్వాసనతత్ప్రియే, పుష్పేష్వాసనతత్ప్రియయోః పరిణయః = పుష్పేష్వాసనతత్ప్రియాపరిణయః, పుష్పేష్వానతత్ప్రియాపరిణయే ఆనన్దః = పుష్పేష్వాసనతత్ప్రియాపరిణయానన్దః, పుష్పేష్వాసన తత్ప్రియాపరిణయానన్దస్య అభిషేకః = పుష్పేష్వాసనతత్ప్రియాపరిణ యానన్దాభిషేకః, పుష్పేష్వానన తత్ప్రియాతరిణయానన్దాభిషేక ఏవ ఉత్సవః = పుష్పేష్వాసన తత్ప్రియా పరిణయానన్దాభిషేకోత్సవః, తస్మిన్ = పుష్పేష్వాసనతత్ప్రియాపరిణయానన్దాభిషేకోత్సవే.

ప్రాప్తసహస్రధారకలశశ్రీః : సహస్రంధారాః యస్య సః = సహస్ర ధారః. సహస్రధారశ్చాసౌ కలశశ్చ = సహస్రధారకలశః, సహస్రధార కలశస్య శ్రీః = సహస్రధారకలశశ్రీః, ప్రాప్తాసహస్రధారకలశ శ్రీః యేన సః = ప్రాప్తసహస్రధారకలశశ్రీః.

భావము :

ఓ ప్రియురాలా ! ప్రకాశశీలుడగు చంద్రభగవానుడు రాహువు పలుమారులు మ్రింగుటచే నతని దంతసమూహమనెడి చంద్రసాధనముచే నతనిపై వేయబడిన సహస్ర సంఖ్యాకములగు బెజ్జములయందు పడెడి యతని కాంతులనెడు యమృతసారము గలవాడై రతీమన్మథుల వివాహమువలని యానందమునకై జరుగునట్టి మహాభిషేకోత్సవమునందు వేయిబెజ్జములు వేయబడివానినుండి యుదక ధారలు వెల్వడుట కమర్పబడిన వేయిగొట్టములతో శోభించునట్టి మహాకలశము యొక్క శోభను బొంది తన్నుపాసించెడి వారికి పరమానందము గూర్చుగాత. అట్లు పూజింపబడిన చంద్రభగవానుడు సురతమునకై యుపక్రమించు మన యిరువురికిని (నలదమయన్తులకు) పరమానందము నొసంగుగాత. "ఆనందాభిషే

కోత్సవే" యని యానందవదముచేతను "తుష్టయేఽస్తు" యను నాశీస్సుచేతను గ్రన్థపరిసమాప్తి సూచితము. మహాభారతమందు వర్ణింపబడిన యుత్తరనల చరిత్రము నీరసముగా నుండుటచేతను నాయకాభ్యుదయమును జెప్పనందువలనను సహృదయాహ్లాదనమే కావ్యఫలమగుట వలనను శ్రీహర్షుడు ఉత్తర నల చరిత్ర మును వర్ణింపలేదని కొందరి యాశయము,

శ్లో. శ్రీహర్షం కవిరాజరాజి మకుటాలఙ్కార హీర స్సుతం
శ్రీహీరస్సుషువే జితేన్ద్రియచయం మామల్లదేవీ చ యమ్।
ద్వావింశో నవసాహసాఙ్క చరితే చమ్పూకృతోఽయంమహా
కావ్యే తస్య కృతౌ నలీయచరితే సర్గో నిసర్గోజ్జ్వలః ॥149

ప. వి. శ్రీహర్షం - కవిరాజరాజిమకుటాలఙ్కారహీరః - సుతం - శ్రీహీరః - సుషువే - జితేన్ద్రియచయం - మామల్లదేవీ-చ - యం - ద్వావింశః - నవసాహసాఙ్కచరితే - చమ్పూకృతః-అయం - మహాకావ్యే - తస్య - కృతౌ - నలీయచరితే - సర్గః - నిసర్గోజ్జ్వలః.

అర్థము: కవిరాజ రాజిమకుటాలఙ్కారహీరః, కవిరాజ = కవిశ్రేష్ఠులయొక్క, రాజి = పంక్తిలో, మకుట = శ్రేష్ఠమైనవారికి, అలఙ్కార = భూషణ మైన, హీరః = వజ్రమణియగు, శ్రీహీరః = శ్రీహీరుడు, జితేన్ద్రియ చయం, జిత = జయింపబడిన, ఇన్ద్రియచయం = ఇంద్రియసమూహము గల్గిన, శ్రీహర్షం = శ్రీహర్షుడను పేరుగల, యం సుతం = ఏ కుమారుని, సుషువే = ఉత్పత్తిగావించెనో, మామల్లదేవీ చ = మామల్లదేవియను తల్లియు, యం = ఏ పుత్రుని, సుషువే = కనెనో, నవసాహసాఙ్క చరితే = నవసాహసాంక చరిత్రమందు, చంపూకృతః = గద్యపద్య మయముగావించిన, తస్య = ఆ శ్రీహర్షునియొక్క, కృతౌ = కృతియైన, నలీయచరితే = నైషధీయ చరితమను, మహాకావ్యే = మహాకావ్యమందు, నిసర్గోజ్జ్వలః = స్వభావభాసురమగు, ద్వావింశః = ఇరువది రెండవ, సర్గః = సర్గ (నడిచినది).

**సమాసములు :**

ద్వావింశః : ద్వావింశతేః పూరణః = ద్వావింశః.
చంపూకృతః : చమ్వాం కరోతీతి = చమ్పుకృత్, తస్య = చమ్పూకృతః.

తక్కిన సమాసములు భావములు పూర్వశ్లోకములకువలె గ్రహించునది.

శ్రీమదాత్రేయగోత్ర శ్రీ మదుదాలినృసింహశాస్త్రితనూజ
విక్రమ సింహపురీ వేదసంస్కృత కలాశాలా
భూతపూర్వ ప్రధానోపాధ్యాయ
శ్రీ సుబ్బరామశాస్త్రి విరచితమగు
నైషధాంధ్ర వ్యాఖ్యకు
ద్వావింశ సర్గ
సమాప్తము

# అథ కవిప్రశస్తిః

శ్లో. యథా యూన స్తద్వత్ పరమరమణీయాఽపి రమణీ
కుమారాణా మన్తఃకరణ హరణం నైవకురుతే
మదుక్తిశ్చేద న్తర్మదయతి సుధీభూయ సుధియః
కిమస్యా నామస్యాదరస పురుషానాదరభరైః 1

ప. వి. యథా - యూనః - తద్వత్ - పరమరమణీయా - అపి - రమణీ
కుమారాణాః - అన్తఃకరణహరణం - న - ఏవ - కురుతే - మదుక్తిః-
చేత్ - అన్తః - మదయతి - సుధీభూయ - సుధియః - కిం - అస్యాః-
నామ - స్యాత్ - అరసపురుషానాదరభరైః -

అర్థము: యథా = ఎట్లు, పరమరమణీయాఽపి = మిక్కిలియందగత్తెయైనను,
రమణీ = యువతి, యూనః = యువకుడగు కాముకునియొక్క, అంతః
కరణహరణం, అంతఃకరణ = హృదయముయొక్క, హరణం =
ఆకర్షణను, కురుతే = చేయుచున్నదో, తద్వత్ = అట్లే, కుమారాణాం =
పాలుత్రాగుటచే తృప్తినొందిన బాలురయొక్క, అంతఃకరణహరణం =
హృదయముయొక్క హరణమును, (ఆకర్షణను) నైవకురుతే = చేయ
జాలదు, తథా = అట్లే, ఇయం = ఈ కావ్యరచనా రూపముగలిగిన, పరమ
రమణీయా = మిక్కిలి రసవంతమగు, మదుక్తిః = నారచనమైన
నైషధీయ చరితము, సుధీభూయ = అమృతముగానేర్పడి, సుధియః =
సకల ధర్మరహస్యముల నరసిన మిక్కిలి సరసుడగు పండితునియొక్క,
చేతః = మనస్సును, మదయతిచేత్ = సంతోషపరిచినచో, (తర్హి =
అప్పుడు) అస్యాః = పండితునిచే మిక్కిలి యాదరింపబడిన నా రచన
రూపమగు నైషధీయ చరితకృతికి, అరసపురుషానాదరభరైః, అరస =
రసజ్ఞులుకాని, పురుష = పురుషులయొక్క, అనాదరభరైః = తిరస్కార

సమూహములచే, కింనామస్యాత్ = ఏమియేర్పడును? ఏమియునేర్పడదు. అనియర్థము. "సుధియః" యనునెడ సుధీశబ్దము జాత్యేకవచము. ఒక్క పండితుడాదరించినను గొప్ప గౌరవమే. పెక్కండ్రు అజ్ఞులు తిరస్కరించినను హాని ఏమియులేదు.

సమాసములు :

పరమరమణీయా : పరమాచ సా రమణీయాచ = పరమరమణీయా.

అన్తఃకరణ హరణం : అన్తః కరణం = అన్తః కరణం, అన్తః కరణస్య హరణం = అన్తఃకరణ హరణం, తత్ = అన్తఃకరణహరణం.

మదుక్తిః: మమ ఉక్తిః = మదుక్తిః.

సుధీభూయ : అసుధా సుధా సమ్పద్యమానా భూత్వా = సుధీభూయ

అరసపురుషానాదరభరైః : అవిద్యమానః రసః యేషాం తే = అరసాః, అరసాశ్చ తే పురుషాశ్చ = అరసపురుషాః, అరసపురుషాణాం అనాదరాః = అరసపురుషానాదరాః, అరసపురుషానాదరాణాం భరాః = అరసపురుషానాదరభరాః, తైః = అరసపురుషానాదరభరైః.

భావము :

అతిసౌందర్యవతియైన యువతి కాముకుడగు యువకుని చిత్తమెట్లాకర్షించునో అట్లు పాలుత్రాగుటచేతనే తృప్తిచెందెడి బాలుర హృదయము నాకర్షించజాలదు. అట్లే నావచనమైన యీనైషధీయచరితము అమృతత్వము నొంది సకలదర్శనరహస్యముల నరసిన నరసుడైనయొక పండితుని హృదయము నందానందపరచినచో నట్టి నానైషధీయచరిత కృతికి రసజ్ఞులుగాని పురుషులు గావించెడి తిరస్కారపరంపరచే నేమి హాని ఏర్పడును? ఏమియు నేర్పడదని యర్థము. ఒక్కపండితుడాదరించినచో గొప్ప గౌరవమేర్పడును. పెక్కండ్రు జ్ఞానశూన్యులు గావించునట్టి తిరస్కారములు కించిత్కరములని యర్థము. కేవలము లోతునకు దిగక పైపైన నాకావ్యమును జూచువారికిందలి రసము గ్రాహ్యముగాదు. లోతునకుదిగి కావ్యమును చక్కగా పరిశీలించు పండితులకిది యమృతమగును. తదితరులకిదికాదని "సుధీభూయ" యని "చ్వి" ప్రత్యయ ప్రయోగము

శ్లో. దిశి దిశి గిరిగ్రావాణః స్వాం వమన్తు సరస్వతీం
తులయతు మిథస్తామాపాత స్ఫురద్ధ్వని డమ్బరామ్ ।
స పరమ పరః క్షీరోదన్వాన్ యదీయ ముదీర్యతే
మథితు రమృతం ఖేదచ్ఛేది ప్రమోదన మోదనమ్ ॥2

ప. వి. దిశి - దిశి - గిరిగ్రావాణః - స్వాం - వమన్తు - సరస్వతీం - తులయతు - మిథః - తామ్ - ఆపాతస్ఫురద్ధ్వనిడమ్బరామ్ - సః - పరమ్ - అపరః - క్షీరోదన్వాన్ - యదీయమ్ - ఉదీర్యతే - మథితుః - అమృతం - ఖేదచ్ఛేదిప్రమోదనం - ఓదనమ్.

అర్థము: గిరిగ్రావాణః = పర్వతశిలలు, దిశిదిశి = ప్రతిదిక్కునందును, స్వాం = తమకుసంబంధించిన, సరస్వతీం = అంతర్వాహినియగునదిని. వమన్తు = విడుచునుగాత. ఆపాతస్ఫురద్ధ్వనిడమ్బరాం, ఆపాత = సమగ్రముగాబడుటచే, స్ఫురత్ = ప్రకాశించు, ధ్వనిడమ్బరాం = శబ్దాడమ్బరముగలిగిన, తాం = ఆనదిని, మిథః = పరస్పరము, తులయతు = పోల్చుకొని సమానము గావించుకొనుగాత. మఱియు - ఆపాత స్ఫురద్ధ్వనిడమ్బరాం, ఆపాత = తొలుత ప్రారంభమునందే, స్ఫురత్ = ప్రకాశించు, ధ్వని = నదీఘోషముయొక్క, డమ్బరాం = ఆడమ్బరముగల్గిన, తాం = దానిని, తులయతు = జనము సరిపోల్చుకొనుగాత, సః = అది. పరం = కేవలము, అపరః = మరియొక లేదా సాటిలేని, క్షీరోదన్వాన్ = పాలకడలి, యదీయం = ఏపాలకడలికి సంబంధించిన, అమృతం = అమృతము, ఉదీర్యతే = ఈవిధముగా చెప్పబడుచున్నది. లేదా, ఉదీయతే = పుట్టుచున్నది. ఎట్లనగా - మథితుః = ఆపాలకడలిని చిలికినట్టి దేవాదిసమూహమునకు, ఖేదచ్ఛేది = చిలుకుటవలని కష్టమును తొలగించునది. తథా = అట్లే. ప్రమోదనం = మిక్కిలి యానందము నొసంగినది. తథా = అట్లే, ఓదనం = సిద్ధాన్నము.

మరియు, దిశిదిశి = అన్నిదిక్కులయందును లేదా అన్నిదేశముల యందును, గిరి = వాక్కునందు, అనగా వాగ్విషయమునందు, గ్రావాణః = బండలతో సమానులైన, జడులైన యితరకవులు, స్వాం = తమదియైనవాణిని. వమన్తు = వెడలగ్రక్కుదురుగాత. ఆపాత స్ఫురద్ధ్వని డమ్బరాం, ఆపాత = ప్రతిభచే, స్ఫురత్ = ప్రకాశించు, ధ్వని = ధ్వనియనుకావ్య విశేషముయొక్క, డమ్బరాం = ఆడమ్బరము గలిగిన, లేదా, ఆపాత = తొట్టతొలుతనే, స్ఫురత్ = ప్రకాశించు, ధ్వని = అనుప్రాసాదులు గలిగిన వాక్కునకు. మిథ = పరస్పరము, జనః = జనము, తులయతు = సరిపోల్చుకొనుగాత, అనగా నాకవిశక్తి యితనిశక్తివంటిది. ఇతనిశక్తి అతనిశక్తివంటిదియని సరిపోల్చుకొనునుగాత. ఇటువంటి కావ్యామృత మెవ్వనిదో వాడు పాలకడలి వంటివాడు. అతడు శ్రీహర్షకవి. అతనికి సాటియైనవాడు మరియొకడు లేడు. ఇతరకవులు పర్వతపాషాణతుల్యులు. శ్రీహర్షుడనగు నేనో పాల కడలివంటివాడను. పాలకడలి తనయందుండి నీటినిగోరిన వారికిని పాలనే యిచ్చును. మరియు లక్ష్మీకౌస్తుభసుధలచే కృతార్థపరచును. అట్లే నా కావ్యమును విచారించు వానికే చెమటను దొలగించి యానందమునొసంగెడి వచనామృతమిందు ఉద్భవించునని యర్థము.

**సమాసములు :**

గిరిగ్రావాణః : గిరేః గ్రావాణః = గిరిగ్రావాణః.
ఆపాతస్ఫురద్ధ్వనిడంబరాం : ఆపాతేన స్ఫురన్ ధ్వనిడమ్బరః యస్యాః స్సా = ఆపాతస్ఫురత్ధ్వనిడమ్బరా, తాం = ఆపాతస్ఫురద్ధ్వనిడమ్బరాం.
క్షీరోదన్వాన్ : క్షీరస్య ఉదన్వాన్ = క్షీరోదన్వాన్
యదీయం : యస్య ఇదం = యదీయమ్.
ఖేదచేది : ఖేదం ఛినత్తీతి = ఖేదచ్ఛేది.

**భావము :**

పర్వతముల యందలి బండలు అన్నిదిక్కుల యందలి తమయందున్న ద్రావకాని యగునదిని విడిచిపెట్టును గాత. భూమికి వరుసప్పుడేర్పడు

శబ్దాడమ్బరము గలిగిన యానదిని మరియొకనదితో జనము సరిపోల్చునుగాత. మరియు నారంభము నందే గొప్పఘోషగల్గిన యానదిని జనము సరిపోల్చుకొనుగాత. రెండు పక్షముల యందును నారంభముననే యది నది. ఆరంభమునందే దానికి శబ్దాడమ్బరము. చివరనది నదిగాదు. ఆ శబ్దాడంబరము ఉండదు. ఆ శ్రీహర్షకడలి సాటిలేని పాలకడలి. ఆ పాలకడలి నుండియే యీ నైషధీయచరిత మను నమృతముద్భవించినది. ఇది పాలకడలిని జిలికిన దేవతలు మున్నగువారికి శ్రమకు దొలగించును. సంతోషమును గలిగించును. సిద్ధాన్నమై యుండును.

మఱియు నన్నిదిక్కుల యందును వాగ్విషయమునందు బండలతో సమానులైన జడులగు నితరకవులు తమవాణిని వెడల గ్రక్కుదురు గాత. ప్రతిభామాత్రముచే స్ఫురించెడి ధ్వని యను కావ్య విశేషముయొక్కయు లేదా అనుప్రాసాదుల యొక్కయు శబ్దాడమ్బరముతో గూడినవాణిని జనము సరిపోల్చుకొనుదురుగాత. ఈ శ్రీహర్షమహాకవి పాలకడలివంటివాడు. తక్కిన కవులు కొండలయందలి బండలవలె జడప్రాయులు. పాలకడలి గట్టుననుండి నీటిని గోరిను వారినాకడలి పాలతో సంతోషపఱచును. పరమానందము నొసంగెడు లక్ష్మీకౌస్తుభ పీయూషములతో సఫలురగావించును. అట్లే శ్రీహర్షుడనైన నాకావ్యమును విచారించువానికి వాని శ్రమ జలమును పోగొట్టి యానందమొసంగెడి యమృతమిందుద్భవించునని యాశయము.

శ్లో. గ్రన్థగన్థిరిహ క్వచిత్ క్వచిదపి న్యాసి ప్రయత్నాన్మయా
ప్రాజ్ఞమ్మన్యమనా హఠేన పఠితీ మాఽస్మిన్ ఖలః ఖేలతు।
శ్రద్ధారాద్ధగురుశ్లథీకృత దృఢగ్రన్థిః సమాసాదయ
త్వేతత్కావ్యరసోర్మిమజ్జన సుఖవ్యాసజ్జనం సజ్జనః॥3

ప. వి. గ్రన్థగ్రన్థిః - ఇహ-క్వచిత్-క్వచిత్ - అపి - న్యాసి - ప్రయత్నాత్ - మయా - ప్రాజ్ఞమ్మన్యమనాః - హఠేన - పఠితీ - మా-అస్మిన్-ఖలః-ఖేలతు - శ్రద్ధారాద్ధగురుశ్లథీకృత దృఢగన్థిః - సమాసాదయతు - ఏతత్కావ్యరసోర్మి మజ్జన సుధావ్యాసజ్జనం - సజ్జనః.

అర్థము: ప్రాజ్ఞమ్మన్యమనాః, ప్రాజ్ఞమ్మన్య = తన్ను ప్రాజ్ఞునిగా దలంచెడి, మనాః = మనస్సుగల్గినవాడు, అస్మిన్ = ఈ కావ్యమందు, హఠేన = తనకు ప్రజ్ఞయెక్కువగా నున్నదను మొండితనముతో, పఠితీ = ఈకావ్యమును పఠించునట్టి, ఖలః = దుష్టుడు, మాఖేలతు = "దీనియందేమున్నది. దీనిని వ్యాకరింపవచ్చును" అని గర్వప్రదర్శనము చేయరాదని, ఇహ = ఈకావ్యమందు, క్వచిత్ క్వచిదపి = అక్కడక్కడ, మయా = నాచే, ప్రయత్నాత్ = బుద్ధిపూర్వకముగా, గ్రన్థగ్రన్థిః = గ్రన్థములో నర్థము కాని ముడివంటి క్లిష్టకల్పన, న్యాసి = (ఖలముఖభంగమునకై) ఉంచబడినది. "క్వచిత్ క్వచిదపి"యని చెప్పుటవలన నచ్చటచ్చట ప్రసన్నత యున్నదనియు, దానివలన దీనికి కావ్యత్వహాని లేదనియు సూచితము. శ్రద్ధారాద్ధగురుశ్లథీకృత దృఢగ్రన్థిః. శ్రద్ధా = శ్రద్ధతో, ఆరాద్ధ = దైవబుద్ధిచే బూజింపబడిన, గురు = గురువుచే, శ్లథీకృత = వదిలింపబడిన, దృఢగ్రన్థిః = గట్టిముడులు గల్గిన, యనగా సుబోధముగావింపబడిన, కఠినభాగములు గలవాడై యనగా గురుసంప్రదాయముతో దెలియబడు నర్థములు గలవాడై కావుననే గర్వముడిగిన, సజ్జనః = సాధువు, ఏతత్కావ్యరసోర్మిమజ్జనసుఖవ్యాసజ్జనం, ఏతత్ = ఈకావ్యముయొక్క, రసోర్మి = అమృతతరంగములయందు, మజ్జనం = మునుగుటవలని. సుఖ = సుఖమందలి, వ్యాసజ్జనం = విశేషమగు నాసక్తిని, సమాసాదయతు = పొందునుగాత. గురుపరంపరలేక యొకపద్యమునకు నర్థము నవగతముగాదు. కావున గురుపరంపర ననుసరించి ఈ కావ్యము పఠింపదగినదని యర్థము. ఎవడు దీనిని గురుపరంపరతో జదువునో యతడే సుఖవంతుడగునని యీ శ్రీహర్షమహాకవి యతనిని దీవించుచున్నాడు.

సమాసములు :

గ్రన్థగ్రన్థిః : గ్రన్థే గ్రన్థిః = గ్రన్థగ్రన్థిః.

ప్రాజ్ఞమ్మన్యమనాః : ఆత్మానం ప్రాజ్ఞం మన్యత ఇతి, ప్రాజ్ఞంమన్యం, ప్రాజ్ఞం మన్యం మనః యస్య సః = ప్రాజ్ఞమ్మన్యమనాః.

పఠితీ : పఠితమస్య అస్తీతి = పఠితీ.

శ్రద్ధారాద్ధగురుశ్లథీకృతదృఢగ్రన్థిః : శ్రద్ధయాఆరాద్ధః = శ్రద్ధారాద్ధః,

శ్రద్ధారాద్ధశ్చాసౌ గురుశ్చ=శ్రద్ధారాద్ధగురుః, అశ్లథాః శ్లథా సమ్పద్య మానాః కృతాః=శ్లథీకృతాః, దృఢాశ్చతే గ్రన్థయశ్చ=దృఢగ్రన్థయః శ్రద్ధారాద్ధగురుణా శ్లథీకృతాః దృఢగ్రన్థయః యస్మైనః = శ్రద్ధారాద్ధ గురుశ్లథీకృత దృఢగ్రన్థిః.

ఏతత్కావ్య రసోర్మిమజ్జన సుఖవ్యాసజ్జనం : ఏతచ్చ తత్ కావ్యం= ఏతత్కావ్యం, ఏతత్కావ్యస్యరసః = ఏతత్కావ్యరసః, ఏతత్కావ్య రసస్య ఊర్మయః = ఏతత్కావ్యరసోర్మయః, ఏతత్కావ్యరసోర్మిషు మజ్జనం = ఏతత్కావ్యరసోర్మిమజ్జనం, ఏతత్కావ్యరసోర్మిమజ్జనమేవ సుఖం=ఏతత్కావ్యరసోర్మిమజ్జనసుఖం. ఏతత్కావ్య రసోర్మిమజ్జన సుఖే విశేషేణ ఆసజ్జనం=ఏతత్కావ్య రసోర్మిమజ్జన సుఖవ్యాసజ్జనం, తత్=ఏతత్కావ్యరసోర్మి మజ్జన సుఖవ్యాసజ్జనం.

భావము :

దుష్టుడు తానుమేధావంతుడనని భావనజేయుచు గురుసేవచేయక మొండితనముగా నీ కావ్యమును చదువుచు నిందేమున్నదని నిర్లక్ష్యవైఖరితో వ్యాఖ్యానింప దొడగుచు గర్వమును ప్రకటింపకుండుటకై యీ కావ్యమునందు అచ్చటచ్చట బుద్ధిపూర్వకముగానే ఎవ్వరికిని యవగాహనము జేయసాధ్యముగాని గ్రంథ గ్రంథుల నుంచినాను. శ్రద్ధతో గురువునుబూజించి యాతనిచే నీగ్రంథగ్రంథులను సడలింపజేయుటచే యట్టి దుర్బోధములగు భాగములను సుబోధములు గావించుకొనిన సజ్జనుడు, ఈ కావ్యమందలి రసతరంగములందు మునిగి ఆ రసానుభూతి సుఖమును పొందుసుగాత. గురుపరంపరచేత శిక్షణ లేకుండ ఈ కావ్యమునందు ఒక్కపద్యమునకుగూడ అర్థమవగతము కాదు. కాన గురు పరంపరవలననే ఈకావ్యము పఠింపదగినదని గ్రహించి, ఆరీతిగ ఈకావ్యార్థమును గ్రహించి పాఠకుడు సుఖమును పొందుగాక యని కవి ఆశీర్వదించుచున్నాడు. ద్వైవిధముగా కవి చెప్పుటచేతను, నీ కావ్యమందు ప్రసాదరూప గుణములేకుండు వలనను అతిదుర్బోధముగా ఉండుటవలనను ఇది కావ్యముగాదని. శంకించెడి వారికి సమాధానమొసంగబడినది. ప్రాజ్ఞమ్మన్యుల దర్పదలనము గావించుటకును, గురు సంప్రదాయములేక అధ్యయనముచేయువారికి దీనిని దుర్బోధము చేయుటకును

దీనికి అతిగాంభీర్యమును ప్రతిపాదించి, "క్వచిత్ క్వచిత్'' అని చెప్పుటచే, కొన్ని ప్రదేశములందు మాత్రమే అట్టి గ్రంథగ్రంథులను చేర్చి తక్కిన గ్రంథము నందు అంతటను ప్రసాదగుణమునే కూర్చుటవలన దీని కావ్యత్వమునకు ఎట్టి భంగమును రాలేదని కవి అభిప్రాయము.

శ్లో॥ తామ్బూలద్వయ మాసనంచ లభతే
యః కాన్యకుబ్జేశ్వరాత్
యస్సాక్షాత్ కురుతే సమాధిషు పరం
బ్రహ్మ ప్రమోదార్ణవమ్
యత్కావ్యం మధువర్షి ధర్షిత పరా
స్తర్కేషు యస్యోక్తయః
శ్రీ శ్రీహర్షకవేః కృతిః కృతిముదే
తస్యాభ్యుదీయా దియమ్॥ 4

ప. వి. తామ్బూలద్వయమ్ - ఆసనం - చ - లభతే - యః - కాన్యకుబ్జేశ్వరాత్ - యః - సాక్షాత్ - కురుతే - సమాధిషు - పరం - బ్రహ్మ - ప్రమోదార్ణవమ్ - యత్కావ్యం - మధువర్షిధర్షిత పరాః - తర్కేషు - యస్య - ఉక్తయః - శ్రీ శ్రీహర్షకవేః - కృతిః - కృతిముదే - తస్య - అభ్యుదీయాత్ - ఇయమ్ -

అర్థము: యః = శ్రీహర్షమహాకవి, కాన్యకుబ్జేశ్వరాత్ = కాన్యకుబ్జప్రభువునుండి సకలపండితులలో నాధిక్యమును సూచించు, తామ్బూలద్వయమ్ = రెండు తాంబూలములను, ఆసనం చ = విద్వాంసులకు యోగ్యమైన ఆసనమును. లభతే = పొందుచున్నాడు, (కేవలము ఈకవి రాజపూజ్యుడేగాదు (మరేమనగా,) కింతు = కాని, యః = ఎవ్వడు, సమాధిషు = అష్టాంగ యోగములయందుకాని, ధ్యానములయందుగాని. ప్రమోదార్ణవం, ప్రమోద = పరమానందమునకు, అర్ణవం = సాగరమైన. లేదా పరమానన్ద స్వరూపమైన, పరం = వాక్కులకును మనస్సునకును గోచరముకాని, బ్రహ్మ = బ్రహ్మమును, సాక్షాత్కురుతే = ప్రత్యక్షము గావించుకొనును. (ఇతడు కేవలము బ్రహ్మజ్ఞానియేకాదు మరేమనగా,) యత్కావ్యం, యత్ = ఎవనియొక్క, కావ్యం = కావ్యము, మధువర్షి = (అతిసరసముగా

నుండుటవలన) అమృతమును వర్షించునది కాన నితడు మిక్కిలి సరసుడైన మహాకవి. (అంతియకాదు. మఱేమనగా,) తర్కేషు = తర్కశాస్త్రములందు, యస్య = ఎవనియొక్క, ఉక్తయః = మాటలు, ధర్షితపరాః, ధర్షిత = తిరస్కరింపబడిన. పరాః = ప్రతివాదులు గల్గినవి. తస్య = ఆవిద్వన్మండలచూడామణియగు, శ్రీ శ్రీహర్షకవేః, శ్రీ = సంపద్యుక్తుడైన. శ్రీహర్షకవేః = శ్రీహర్షకవియొక్క, ఇయం = ఈ, కృతిః = గ్రంథమైన నైషధీయ చరితము, కృతిముదే, కృతి = పండితులయొక్క, ముదే = సంతోషమునకై, అభ్యుదీయాత్ = కల్పాంతమువరకును అభ్యుదయముతో కూడియుండునుగాత.

**సమాసములు :**

తాంబూలద్వయం : తాంబూలస్సద్వయం = తాంబూలద్వయం, తత్ = తాంబూలద్వయం.

కాన్యకుబ్జేశ్వరాత్ : కన్యాకుబ్జమేవ = కాన్యకుబ్జకుం, కాన్యకుబ్జస్య ఈశ్వరః = కాన్యకుబ్జేశ్వరః, తస్మాత్ = కాన్యకుబ్జేశ్వరాత్.

ప్రమోదార్ణవం : ప్రమోదస్య అర్ణవః = ప్రమోదార్ణవః, తం = ప్రమోదార్ణవమ్.

యత్కావ్యం : యస్య కావ్యం = యత్కావ్యమ్.

మధువర్షి : మధువర్షతీతి = మధువర్షి.

ధర్షితపరాః : ధర్షితాః పరాః యాభిస్తాః = ధర్షితపరాః.

శ్రీ శ్రీహర్షకవేః : శ్రీయుక్తశ్చాసౌ శ్రీహర్షశ్చ = శ్రీ శ్రీహర్షః, శ్రీ శ్రీహర్ష ఇతికవిః = శ్రీ శ్రీహర్షకవిః, తస్య = శ్రీ శ్రీహర్షకవేః.

కృతిముదే : కృతినాం ముత్ = కృతిముత్, తస్యై = కృతిముదే.

**భావము :**

ఈ శ్రీహర్షమహాకవి విశిష్టపండితునకర్హమైన రెండుతాంబూలములను ఆసనమును కన్యాకుబ్జప్రభువును డి పొందును. అంతియుగాక యష్టాంగయోగములయందు నానన్దస్వరూపుడగు పరబ్రహ్మను సాక్షాత్కరించును. మఱియు నతని కావ్యము అమృతమునే వర్షించును. అంతియగాక, తర్కశాస్త్రములయందాతని వచనములు ఇతరపండితులను దిరస్కరించునవి. అట్టి శ్రీహర్షమహాకవియొక్క గ్రంథమైన ఈనైషధీయచరితము ఆకల్పము వర్ధిల్లుగాత.

* సమాప్తమ్ *